# రామావతార తత్త్వము

## (400 పేజీలుపైన)



- జనమంచి శేషాద్రి శర్మ

శ్రీః

# రామావతారతత్త్వము

## ప్రథమప్రకరణము.

ఇయ్యది

కడప మ్యునిసిపల్ హైస్కూలునందుఁ బ్రధానాంధ్రపండితుఁడగు

కావ్యస్మృతితీర్థ

జనమంచి శేషాద్రిశర్మవిరచితము.

# శుభోదంతము.

మహాశయులారా!

శ్రీరామావతారతత్త్వము ప్రథమప్రకరణమును దమ కర్పించు భాగ్యము నాకుం గల్గినది. కేవల మాపరాత్పరుని నమ్మియే యీకార్యమునకు నారంభించితిని. సత్కార్యమే యిదియైన నెఱవేఱుఁగాక యని నమ్మినాఁడను. శ్రీరామచంద్రప్రవర్తనమే సకలస్మృతుల కుదాహరణమని దృఢపఱచుటయే యీ నాముఖ్యోద్దేశము. కపటనాటకసూత్రధారులగు భక్తులు కొందఱు విచ్చలవిడిగాఁ దిరుగుచు శ్రీరామభక్తిని బోధించునట్లు నటించి పరమశివుని దూషించుచు ధనార్జనము చేయుచుండఁగా నయ్యది శ్రుతిస్మృతిపురాణేతిహాససమ్మతము కాదనియుం భగవంతుఁ డొక్కఁడయ్యుఁ బ్రకృతివిశిష్టుఁడై కార్యార్థ మాయాయిరూపములలోఁ బొడసూపుననియుం రూపవంతమగునది భక్తులకుఁ బూజార్థము కల్పితమేగాని వాస్తవము కాదనియుఁ దెలుపుటకే యీగ్రంథ మారంభించితినని విన్నవించువాఁడను. రామాయణమునఁగల విశేషార్థములం దెలుపుచు నందందు నాకుఁ దోఁచిన విశేషముల వ్రాయుచుందును. రామాయణమున నెన్నియో లోపములు కలవని కొందఱు పలుకుచుందురు. ఆప్రశ్నములకు నానేర్చుభంగి బదులు వ్రాయుదును.

ఈప్రకరణమున బాలకాండమునఁ గొంతభాగముమాత్రమే గలదు. రెండవప్రకరణమున మిగిలినభాగమును బూర్తినొందింతును. ఈగ్రంథ మంతయుం నేఁడుభాగములలో నిమిడింపఁ బ్రయత్నించితిని. ముందుముందావిషయము తెలియఁగలదు. నా కిద్దాఁకఁ బోషకులుగ నుండుఁడని కాని, చందాదారులుగ నుండుఁడని కాని యింతవఱకు నడుగకయే భగవంతునిపై భారమువైచి యిప్పని కింగడంగితిని. నాప్రారంభమునకు ధైర్యముగలిగించువారెవ్వరని యడుగం బనిలేదు. సంస్కృతాంధ్రగ్రంథోద్ధారకులై దిగంతవిశ్రాంతవిఖ్యాతివెలసి నాయం దవ్యాజప్రీతిగలిగియున్న మ. రా. శ్రీ. వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారే యని యీగ్రంథమే తెలుపుచున్నది. వారికి భగవంతుఁ డాయురారోగ్యములు ప్రసాదించుఁగాక.

వైశాఖమాసమున నన్ను రావించి మిగుల గారవించి యీశ్రీరామావతారతత్త్వమునకు మిగులఁ దోడ్పడినవారు మ. రా. శ్రీ మడిపల్లి సూర్యనారాయణమూర్తి గా.రు. వీరార్యవైశ్యులు, విద్యావినయసంపన్నులు. మిగుల

ధర్మాత్ములు. నిరంతర మన్నదానముచేయ నొకదివ్యభవనమును గట్టించియున్న వారు. నాల్గుజాతులకు నం దన్నదానము చేయఁబడును. రెండుదినములు శేషాహార్ష్యమున నివసించి కన్నులార నన్నదానము చేయఁజూచితిని. వీరు కాలస్థితిని లెక్కింపక యిరువదైదురూప్యములఁ బారితోషికముగ నిచ్చిరి. శ్రీరామచంద్రార్పణమని గ్రహించితిని. కావున వీరి నుద్ధారకులపట్టికలోఁ బ్రకటించితిని.

మఱియు, శ్రీమాన్, ఏ. టి. వి. ఆర్. నరసింహాస్వామిగారు నన్ను జూడకయున్నను శ్రీకృష్ణావతారతత్త్వమునకు మిగులఁ దోడ్పడిరి. శ్రీరామావతారతత్త్వమునకుఁ దోడ్పడుదుమని వాగ్దానమొసంగిరి. ఇట్టి భక్తులను నమ్మి యికార్యమునకు నారంభించితిని. పరాత్పరుఁడు వీరినెల్ల రక్షించుఁగాక. మఱికొందఱు మిత్రులు ప్రథమప్రకరణము ముద్రించినపిదప రమ్మని నాకువ్రాసిరి. ఇవన్నియు శుభమును సూచించుచున్నవి. సర్వేశ్వరానుగ్రహము, పెద్దలయాశీర్వాదముగలిగిన నికార్యము నెఱవేఱఁగలదు.

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్."

అన్న భగవత్ప్రతిజ్ఞను నెఱనమ్మి యికార్యమున కారంభించితినని విన్నవించువాఁడను. విశేషించి వ్రాయఁదగినవిషయము లిందుఁ గానరావు. ఇందుఁగల నాలోపములను దెలుపఁ బండితాఖండలులఁ బ్రార్థించువాఁడను. పక్షపాతమూని కువిమర్శములఁ గావింపవలదని విమర్శకాగ్రేసరుల వేఁడువాఁడను. పరులు పురికొలుపఁ దోఁచినట్లు విమర్శించువారలకు బదులువ్రాయ తలంపను. వారలకు నొకనమస్కారమొనరింతును. పరమేశ్వరుఁ డీకార్యమును నాచేతనే చేయించుఁగాతమని భక్తిమెయిఁ బ్రార్థించువాఁడను. మహోదారులు నా యీప్రయత్నమునకుఁ దోడ్పడుదురుగాక. ధనసహాయము ముఖ్యముకదా. నేనువచ్చి యడుగలేదని భావింపక యీకార్యము మీదిగనే భావించి తోడ్పడ మఱిమఱి ప్రార్థించుచున్నాఁడను.

ఇట్లు భక్తపాదసేవకుఁడు,
జనమంచి శేషాద్రిశర్మ,
కడప.

# విషయసూచిక.

## విషయావతరణిక.



## బాలకాండము.

శ్రీః.

# శ్రీరామావతారతత్త్వము.

## ధ్యానపద్ధతి.

ఉ. ఆదము మౌనివర హృదయైకవిహార మనుస్మృతిత్రయీ
వేదము జ్ఞానరూపము సువిస్తృతతేజము భూలోక సం
హ్లాదము దూరితాఘ మమరేష్టద మాశరరాజసంతతా
భేదము సరసంబునయి వెల్గెడు శ్రీపరతత్త్వ మెన్నెదన్.

చ. సమత యనంగ నెట్టి వరుసం బరికించిన లేకయుండను
త్తమతమశక్తిమించి హరిధాతృహరేంద్రమునీంద్ర పూజి
తాం, ఘ్రి మలసరోజయుగ్మయయి యాశ్రితరక్షణదీక్షఁ
బూని లో, కముల నఖండతేజమునఁ గ్రాలెడు శ్రీలలి
తాంబఁ గొల్చెదన్.

ప్రకృతియుఁ బూరుషుండు నన భాసిలు శక్తియు నిర్గు
ణుండు రూ, పకలితు లౌచు మన్ మునఁ బ్రస్తుతిఁ గాం
చిరి సీత రాముఁ డం, చకలుషవర్తనంబు మనుజాళికిఁ
బట్టుపడంగఁజేయుచో, రిక మును లెల్ల వేఁడ నురరీకృత
యజ్ఞభుగోఘభిత్తులై.

చ. కలుషములెల్లఁ బాప సురకాండవిపత్తుల నట్టె మా [illegible]
లమున విఱ్ఱవీఁగు సురవైరుల కార్యబలంబు జా [illegible]

స్తులతమధర్మవర్తనమె క్షోణిని నిల్చెడు నన్న మంచి యూ
హాలు సుజనాంతరంగముల నల్లనఁ దోఁప జనించి రిరు రున్.

మ. పరమేశుండు తలంపఁగాఁ బ్రకృతి యబ్బంగిన్ మహా
జాండముల్, తర నిర్మించు ననేకరూపములఁ ద ం
బెలుఁగన్ మునీ, శ్వరులే దేవతలేఁ ద్రిమూర్తు లనఁగా
భాసిల్లు బ్రహ్మాదులేఁ, బరికింపంగ సమర్థు లౌదు రనఁ బాపం
బండ్రు జ్ఞానాంబుధుల్. ౫

ఉ. పతియాజ్ఞం దలఁ దాల్చి యాప్రకృతి "యెబ్బంగిన్ రచిం
పంగ నం, స్తుతికర్త్రీం బగునట్లె సర మును సంక్షోభిల్లఁగాఁ
జేయు ధీ, గతి నూహించి" యటన్న నీతివెలయంగాఁ జేయ
భూపుత్త్రి యా, దితిజేశాపహృతిన్ వెతల్ గనినవృ ం
బూనె సర్వజ్ఞతన్. ౬

చ. అనలుని వమ్రిపిండు లెటులైన స్పృశింపఁగఁ జాలనట్టు లా,
జనకసుతన్ మహాప్రకృతిఁ జాలునొకో స్పృశియింప ఖు
ద్రుఁడౌ, దనుజవిభుం డదెన్న నొకదంభముగాఁ గుజ
నాళిఁ ద్రుంచు నూ, హను గ్రహియించి సీతయె తనంతనె
కన్పడె వానిచెంగటన్. ౭

మ. జానకి యొంటి నున్నదని జాల్మఁడు రావణుఁ డెంచి తిక్ష్ణ
ద్దానవరూపముం గనినఁ దా భయ మొందు నటన్నయూ.
హా న, మ్మానిని సత్త్వ భావ మణుమాత్ర మెఱుంగక
ఘోరరీతిఁగాఁ, గానఁబడంగ సీత ఖలుఁ గాలునివీటికిఁ
బుచ్చు కోరికన్. ౮

మ. తనరూపంబుగనే యెసంగ నొకకాంతన్ దానె నిర్మించి

యె, వ నికే గన్పడ కాపరాత్పరుని భావం బందు నుండె
మనం, బున నుప్పొంగెడుకోర్కి రావణుఁడు నాపూతాం
గినిం గొంచుఁ బో, యెను లంకాపురిఁ జేరఁ ద మిది
యం చెన్నంగ వాఁ డర్హుఁడే. ౯

సీ. తా సాక్షిమాత్రుఁడై తనరు నప్పరమాత్మ
ప్రకృతివశుండయి రావణుండు
జానకినిం గొంచుఁ దా నేగె ననుభావ
మగపడునట్లుగా నభినయించి
వనములఁ గ్రుమ్మరి భాస్కరసుతునితో
మైత్రిని బాటించి మ తారి
జాలు నవా లిని సారబాణంబునఁ
ద్రుంచి పావనికి సమంచితయశ
తే. మమరునట్లుగ లంకను నంపి యతని
చి శు ఁ బరీక్షించి చెలఁగు దుష్ట
రాక్షసులఁ ద్రుంచి భక్తుల రమణఁ బ్రోచి
నట్టిరాముఁడు పరమేశుఁ డద యుండు. ౧౦

క. ర ం గారా ం బవ
తరించె సంపూర్ణుఁ డగుచుఁ దత్ప్రకృతి మహా
పురుషులచరితం బియ ది
తరమే యిద్ధానఁ గల్గుతత్త్వం బరయన్. ౧౧

మ. కత యొక్కండె పఠించినంతఁ గలుగుఁ గలా ణముల్
దానియం, దతిగూఢంబుగ నుండు తత్త్వ మిదియ
ంచెంచియిద్దాని సన్మతమతారీతిని సంగ్రహింపఁద.

డ్కాఁ గ్రహింపంగ న, చు తమా ముక్తిపదంబుఁ జేకు
రెడు నోహోయంచు నెన్నఁ మునుల్. ౧౨

మ. ఇదె యిందొప్పెడు తత్త్త మంచు నొగి నెన్నే రీతులం
జక్కఁగా, మది నూహించుతఱిం బ్రమాదమున నేమా
్రంబొ మరా ద యొ, ప్పదయే దాని క్షమించి ప్రీతి
మెయి నఁ బాలింపుఁ డీజ్ఞానసం, పదఁ జెన్నారెడు ధీరు
లార! యనుచుం బ్రా ంతు భక్తు న్నతిన్. ౧౩

మ. మతవిదే షము పూని యీసుకృతినిఁ మన్నింపకే సే చ
ను, తు లేమన్నఁ గొఅంత కల్గునొకొ యంధవ్రాతమిస్సీ
యనఁ, శతపత్త్రారికి నొక్కలోటు గలదే సన్మార్గసంస్థాప
కుల్, మతిభావించినఁ జాలు నీకృపి కదే మరా ద యం
చెంచెదన్. ౧౪

ఉ. కాల మపార మం దొకటఁ గల్గరొ భక్తులు కొందఱైనాని
క్కాలమునందు లేరొకొ యఖండతరెశ రత _ మఁ సుధం
గ్రోలెడువిజ్ఞు లట్లగుటఁ గొంకొకయింతయు నొంద ం దు భ
క్తాళిని గాచు శ్రీరఘుకులాధిపు నమ్మిన లోటు గల్గునే.౧౫

## కృతిసమర్పణము.

చ. వనజదళాక్షు రాఘవుని భద్రదుఁ దోఁచినయట్లు త్రిప్పుచుఁ
జనకజ నాఁ బ్రసిద్ధిఁ గని సర ము దానె యొనర్చుచుఁ భజిం
చినసుజనాళికిం దగినసిద్ధులఁ గూర్చుచు నున్న దేవికిఁ
ఘనకరుణా కికృతిని గాన్క నొసంగెద విష్ణుమాయకున్.

## శానకీప్రార్థనము.

మ. కలరే లోకమునందు నీమహిమముల్ కాంచంగ మేషే
సము, ర్థల మంచుఁ వచియింప శక్తిగలవారుఁ బ్రహ్మ

విష్ణీశ రా, దులనిర్మించెడుమాయ నీవెకద నీ దొడ్డొల్త
సేవించి ని, స్తులమా నీచరితంబె నీకిడితి సంతోషింపు మీ
కాన్కచేన్. ౧౭

మ. పలికింపంగ సమ నీవె యగుటన్ భక్తుండనౌ నన్ను నె,
ట్టులు పల్కించితొ పల్కినాఁడ నిట నట్టుల్ దోషమో
సద్గుణం, బో లలిం జెప్పఁగఁ జాల సుంతయిన నోయురీ
కుమారీ! త దం, ఘ్రులనే నమ్మితి నన్నుఁ బ్రోవఁదగు నీకున్
దోఁచినట్లే కృపన్. ౧౮

---

## విషయావతరణిక.

శ్రీమంతంబై, ప్రణవస్వరూపమై, యఖండజ్యోతియై, కేవలోపనిషదేవ్యమై, యప్రతర్క్యమై, యనుపమానమై, నిరంజనమై, సర వ్యాప్తమై వెలయు నొకతత్త్వము గలదు. అది తీయమనియు, జననమరణశూన్యమనియు,నరూపమనియు, జ్ఞానరూపమనియు, సరసాక్షియనియు నాపరతత్త్వమునే చెప్పుదురు. సర ప్రపంచకారణకారణమనియు, నది లేనిచోటు లేదనియు, నెవరే నది యిట్టిదని నిర్ణయింపఁజాలరనియుఁ దుదకు నూహింపనుజాలరనియు మానులు నుడువుదురు. ఆతత్త్వము నిర్మలతమమఁట. ఆనందమయమఁట. నిరాకారమఁట. దానివెలుఁగు సర బ్రహ్మాండముల వెలుంగఁజేయునఁట. సరమునకు నదియే సాక్షిమాత్రమఁట. ఔరా! ఏమి దాని మాహాత్మ్యము? ఏమి యాతత్త్వముశక్తి? మనము సతముగా నూహింపనుగూడ శక్తులముకామనుట యతిశయోక్తి

కానేకాదు. ఉపనిషత్తులుకూడ "నిదమిః" యని సిద్ధాంతము చేయలేనిచో నీకఁ దత్ప్రవృత్తి యిట్టిదని మనమా నిర్ణయించువారము! దానికిఁ బుట్టుకయు విలయముకూడ లేనిచో శాశ్వతమనికదా యనవలయును. రూపవిహీనమునకు జనన మరణము లెక్కడివి? అట్టిది పదార్థ మెట్లగును? పదార్థము కానిదానికిఁ బ్రకాశ మెట్లు! జ్యోతిస్స్వరూప మనునుపనిషత్తులకు జలాంజలి యీవలయునా? అను నీమొదలగు ప్రశ్నములొకదానివెంట నొకఁడుగ బయలువెడలును. వీనికిఁదగినట్లు సమాధానము తెల్పి యొప్పించుట శక్యమా? అశక్యమే యని మాత్ర మనరాదు. శక్యమే యనియు నొక్కి వక్కాణింపరాదు. ఇవి రెండును గానిదేది? అనుమాన ప్రమాణమే. కేవలానుమాన ప్రమాణమున నిట్టివారిని నమ్మింపవచ్చునా ఆగమ ప్రమాణముకూడఁ గావలెను. ఇవి రెండును జాలునా యన్న జాలవు. ప్రత్యక్ష ప్రమాణముకూడఁ గావలెను. ఈవిషయమున నయ్యది యుండునాయన్న నించుక సంశయింపవలసినదియే. నాల్గవది యుపపత్తిప్రమాణము. ఇదియే యనుమాన ప్రమాణమునకుఁ బ్రాణస్థానము. అనుమానించి యుపపత్తిచే నిర్ణయించినఁగాని మనస్సునకు నేదియు నచ్చదు. అనుమానము జనించుటకుఁ గారణమేది? ఆగమప్రమాణము. ఎట్లు? అశనిపాతము ప్రమాదమును గలిగించును. అనుశాస్త్రము కినఁబడఁగనే యిది నిశ్చయమా యను ననుమానము జనించును. అది మనస్సును గదలించుచు నుండును. ఎప్పుడో పిడుగుపడి మృతినొందినప్రాణి కనఁబడును. అపుడీయనుమానము మఱింత మనస్సును గలఁతనొందఁజేయును. అపుడు కారణము నిర

యించుతలంపు కలుగును. దానిచే శాస్త్రమున నించుక
ప్రమాణబు కలుగును. కొంతకాల మావిషయమును
దర్శించుచుండఁగాఁ బ్రత్యక్షప్రమాణ మాతర్కమునకుఁ
దోడ్పడి హేతు విదిరైయుండు ననుజ్ఞానమును గలుగఁ
జేయును. ఆ తియందు నాగమప్రమాణమున విశా సము
మఱింత దృఢపడును. అపు డుపపత్తిని నెమకుతలంపు
హెచ్చును. అద్దానఁ గ్రమముగా శాస్త్రము ప్రమాణము.
శాస్త్రకర్తలతీంద్రియజ్ఞానసంపన్నులు. మన మల్పజ్ఞులము. అను
నీయూహాలు వెలసి రూఢమూలము లగును. పిదపఁ గొంత
కాలము శాస్త్రమును జక్కఁగాఁ బఠించి దానియ మును
బె లవలనఁ దెలిసికొని దాని ననుష్ఠానమునకుఁ దెచ్చుకొను
చుండఁగాఁ బె కాలమునకు భగవ__ మహా_ ము
సుంత గోచరించును. అది పదార్థముగాదని సకలపదా_
ములు తానే యగునని, పర కారణమని, జో తిస్స రూప
మని, ప్రపంచవిలక్షణమని, అవాఙ్మానసగోచరమని, ఉపనిష
దే ద మని, మఱియు నెన్నియో విధములఁ గొనియాడఁదగిన
దని స్పష్టమగును. ఆస్థితియం దామానవుఁ డానందసాగర
మున నోలలాడుచుండును. శాస్త్రమును దిలకించినపుడెల్ల నది
భగవత్స్వరూపమే యనియు గోచరించును. దాని యంత
గా ము సామాన్యులకు గోచరింపదని, అతీంద్రియజ్ఞానసం
పన్నులచేఁగాని యన్యులచే నది తెలిసికొనఁబడదని తోఁచును.
ఆస్థితియం దామానవోత్తముఁడు గర్వశూ నుఁడగును. ఎల్లరు
తనకంటె ను_ములని, తత్సేవచేఁ గాని తాఁ దరింపఁజాలనని
యాతఁ డెఱుంగఁగల్గును. అట్టివారే పరిపక్వమనస్కులని

కానేకాదు. ఉపనిషత్తులుకూడ "నిదమిః" త్యని సిద్ధాంతము చేయలేనిచో నిఁకఁ దత్ప్రవృత్తి యిట్టిదని మనమా నిర్ణయించువారము! దానికిఁ బుట్టుకయు విలయముకూడ లేనిచో శాశ్వతమనికదా యనవలయును. రూపవిహీనమునకు జననమరణము లెక్కడివి? అట్టిది పదార్థ మెట్లగును? పదార్థము కానిదానికిఁ బ్రకాశ మెట్లు? జ్యోతిస్స్వరూప మనునుపనిషత్తులకు జలాంజలి యీవలయునా? అను నీమొదలగు ప్రశ్నములు లోకదానివెంట నొకఁడుగ బయలువెడలును. వీనికిఁదగినట్లు సమాధానము తెల్పి యొప్పించుట శక్యమా? అశక్యమే యని మాత్ర మనరాదు. శక్యమే యనియు నొక్కి వక్కాణింపరాదు. ఇవి రెండును గానిదేది? అనుమాన ప్రమాణమే. కేవలానుమాన ప్రమాణమున నిట్టివారిని నమ్మింపవచ్చునా ఆగమ ప్రమాణముకూడఁ గావలెను. ఇవి రెండును జాలునా యన్న జాలవు. ప్రత్యక్ష ప్రమాణముకూడఁ గావలెను. ఈవిషయమున నయ్యది యుండునాయన్న నించుక సంశయింపవలసినదియే. నాల్గవది యుపపత్తిప్రమాణము. ఇదియే యనుమాన ప్రమాణమునకుఁ బ్రాణస్థానము. అనుమానించి యుపపత్తిచే నిర్ణయించినఁగాని మనస్సునకు నేదియు నచ్చదు. అనుమానము జనించుటకుఁ గారణమేది? ఆగమ ప్రమాణము. ఎట్లు? అశనిపాతము ప్రమాదమును గ ంచును. అనుశాస్త్రము కినఁబడఁగనే యిది నిశ్చయమా యను ననుమానము జనించును. అది మనస్సును గదలించుచు నుండును. ఎప్పుడో పిడుగుపడి మృతినొందినప్రాణి కనఁబడును. అపు డీయనుమానము మఱింత మనస్సును గలఁతనొందఁజేయును. అపుడు కారణము నిర

బూనియే యున్నచో దానికింగలగౌరవ మానాఁడే యూడి పోయియుండును. అరూపుఁడని, సరూపుఁడను లోనగు మాటలే జంటలు. వానిమర్యాద నివియే కాపాడెననుట యప రాధముకాదు. ఉపనిషత్తులను దూషించిన పాపము దాన రాదు. పరబ్రహ్మమునే ప్రతిపాదింపఁ గంకణముకట్టుకొన్న యుపనిషత్తులమాట యిటుండఁ గర్మపద్ధతిని బోధించువేద ములమాట యిటఁ జెప్పనేటికి? వేదములదురవస్థ యీరీతినుండ నింక స్మృతిపురాణేతిహాసముల ప్రస్తావమునకుఁ జోటెందుఁ గలదు? తెలిసియో తెలియకయో వానిని బ్రస్తావించిన నవ ని వా రెవ రుందురు? వానియం దిట్టివిశేషాంశములు గలవని చేతులు త్రిప్పినను బుద్ధిమంతులు విశ్వసింపరు. స నాదృతి పాత్రములుగాని కరచాలనములు పుంశ్చలీప్రేమవాక్కుల వంటివే యగును. ఇట్లనుటచే శ్రుతిస్మృతిపురాణేతిహాసములు నిరర్థకములని నాభావమని తలంపఁగూడదు. భగవ[illegible] ము నేవియుఁ దెలుపఁజాలవనియు నాపరతత్త్వ మవాఙ్మానసగోచర మనియు నాభావము. ఈప్రమాణములవలనిలాభము లేవనఁగా సత్కర్మముల నాచరించుచుఁ దొలుతఁ దత్ఫలములను గోరు చుండి కొంతకాలమున కవి ఫలాభిసంధిరహితములుగా నాచ రింపఁబడు ననునూహ కలుగఁగా శ్రద్ధాభక్తులతో నట్లే వాని నాచరించుచు నద్దానివలన నహంకారము తొలఁగఁ బె లం గన్నఁ బూజించుచుఁ దదుక్తుల నాలకించి యందుఁగలరహస్యా ముల నారి నాశ్రయించి యెఱుంగుచు వాని నోపినంతదనుక నాచరణమునకుఁ దెచ్చుకొనుచుఁ దనకంటెఁ బామరుల కవ్వా నిని బోధించుచు వారినాచరింపఁజేయుచుఁ గ్రమముగా భగవ

దనుగ్రహామునకుఁ బాత్రుఁడగుటయే యని యెఱుంగవల యును. తరాతఁ గలుగఁదగినజ్ఞాన ముపనిషత్తులనుండి యెఱుం గఁదగును. అవియుఁ జేయిపట్టుకొని పిలుచుకొనిపోయి యిది మోక్షస్థానమని చూపఁజాలవు. ఏల? మోక్షమునకు నొకతావు లేదు. వైకుంఠమని కొందఱు, కైలాసమని కొందఱు, సత్య లోకమని కొందఱుందురే యన్న నామాటలు వంచకులవని యెఱుంగవలయు. ఒక్కలోకమున నొక్కనగరమున నొక్క సౌధమున నొక్కచోట రమ్యరత్నఖచితసింహాసనమున నా పరమేశ్వరుం డుండునే నతఁడు మనవంటివాఁడో సుంత యుత్తముఁడో లేక యుత్తమోత్తముఁడో యగునుగాని పర తత్త్వ శబ్దవాచ్యుఁడు కాఁడు. ఈవిషయమునఁ బ్రమాణములఁ గొన్నింటిం బరిశీలింతము.

"అనేజదేకం మనసో జవీయో నైనద్దేవా ఆప్నువన్పూర్వమర్షత్,
తద్ధావతోఽన్యానత్యేతి తిష్ఠత్ తస్మిన్నపో మాతరిశ్వా దధాతి. ४
తదేజతి తన్నైజతి తద్దూరే తద్వదంతికే,
తదంతరస్య సర్వస్య తదుసర్వస్యాస్య బాహ్యతః. ५
యస్తు సర్వాణి భూతాని ఆత్మన్యేవానుపశ్యతి,
సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే. ౬
యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాభూద్విజానతః,
తత్ర కో మోహః కశ్శోక ఏకత్వమనుపశ్యతః. ౭
సపర్యగాచ్ఛుక్రమకాయమవ్రణమస్నావిరగ్ం శుద్ధమపాపవిద్ధం,
కవిర్మనీషీ పరిభూస్స్వయంభూ ర్యాథాతథ్యతోఽర్థాన్ వ్యదధాచ్ఛా శ్వతీభ్యస్సమాభ్యః." ౮

ఈశావాస్యోపనిషత్తు.

(ఆత్మత త్త్వమేకరూపముగఁ జలింపకయుండుననియు, సర్వ భూతములయందు, నేకమై యుండుననియు నాకాశమువలె సర్వ వ్యాపకమనియు, నామరూపములుగల ప్రపంచమునకు వెలుపల లోపల వ్యాపించియున్నదనియు నతనికిఁ బుణ్య పాపములు లేవనియు సర్వద్రష్ట సర్వజ్ఞుఁడు ననియు సారము.)

"స యథోర్ణనాభిస్తంతు నోచ్చరేద్యథాగ్నేః క్షుద్రా విస్ఫులింగా వ్యుచ్చ రన్త్యేవమేవాస్మాదాత్మనస్సర్వే ప్రాణాస్సర్వే లోకాస్సర్వే దేవాస్స ర్వాణి భూతాని వ్యుచ్చరంతి తస్యోపనిషత్సత్యస్య సత్యమితి ప్రాణా వై సత్యం తేషామేష సత్యమ్."

(బృహదారణ్యకము ४ అధ్యా ౧వ బ్రాహ్మణము.)

(అగ్నినుండి మిణుఁగురులు పుట్టునట్లు ఆత్మతత్త్వమునుండి యెల్ల లోకము లెల్ల దేవతలు పుట్టుదురని సారము.)

"స బ్రహ్మా సశివస్సేంద్ర స్సోఽక్షరః పరమస్స్వరాట్,
సఏవ విష్ణుస్సప్రాణ స్సకాలోఽగ్నిః స్సచంద్రమాః." ८

కైవల్యోపనిషత్తు.

(ఆపరమాత్మయే బ్రహ్మావిష్ణాదులు అదికాని దేదియు లేదని సారము.)

"తదుహోవాచ. పంచమహాభూతకారణం తటిత్కూటాభం తద్వచ్చ తుఃపీఠం, తన్మధ్యేతద్వచ్చతుః పీఠమ్. తత్త్వప్రకాశో భవతి. సోఽతిగూఢః. అవ్యక్తశ్చ, తత్ జ్ఞానప్లవాధిరూఢేన జ్ఞేయం. తద్బాహ్యాభ్యంతరలక్ష్యం. తన్మధ్యే జగల్లీనం. తన్నాదబిందుకళాతీత మఖండమండలం. తత్సగుణ నిర్గుణస్వరూపం తద్వేత్తా విముక్తః.

ఈచెప్పఁబడినదే పరమాత్మస్థానము. దాని నెఱింగినవాఁడే ముక్తుఁడు. పరమాత్మస్థాన మొకచోటుగాదని దీనిసారము.)

"అణోరణీయా న్మహతో మహీయా
నాత్మాగుహాయాం నిహితోఽస్య జంతోః,
తమక్రతుం పశ్యతి వీతశోకో
ధాతుః ప్రసాదా న్మహిమాన మీశమ్."

(అణువులలో నణువు. మహత్తులలో మహత్తు. పరతత్త్వ మని సారము.)

"యస్మాత్పరం నా పరమ స్తికించి ద్యస్మా న్నాణీయో నజ్యాయోఽస్తికశ్చిత్,
వృక్షఇవ స్తబ్ధో దివితిష్ఠ త్యే కస్తేనేదం పూర్ణం పురుషేణసర్వమ్."
తైత్తిరీయము ౧౦ ప్రశ్నము.

(దేనికన్న నుత్కృష్టముగాని యితరముగాని లేదో నణువు మహత్తు లేదో యాపరంజ్యోతియే సకలమునందు నిండియున్న దని సారము.)

"ప్రశాసితారం సర్వేషా మణీయాంస మణోరపి,
రుక్మాభం స్వప్నధీగమ్యం విద్యాత్తం పురుషం పరమ్." ౧౨౨
మనుస్మృతి. ౧౨ అధ్యా.

"కవిం పురాణ మనుశాసితార మణోరణీయాంస మనుస్మ రేద్యః,
సర్వస్యధా తారమచింత్యరూప మాదిత్యవర్ణం తమసః పరస్తాత్." ౯
భగవద్గీత. ౮ అధ్యా.

"త్వమక్షరం పరమం వేదితవ్యం త్వమస్య విశ్వస్య పరం నిధానమ్,
త్వమవ్యయశ్శాశ్వతధర్మగోప్తా సనాతన స్త్వం పురుషోమతో మే." ౧౮

"కాలోఽస్మి లోకక్షయకృత్ప్ర వృద్ధో
లోకా న్సమాహర్తు మిహ ప్రవృత్తః,
ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః." ౩౨
గీత. ౧౧ అధ్యా.

ఇట్లు ప్రమాణములను జూపఁబూనిన సకలశ్రుతిస్మృతిపురా
ణేతిహాసముల నొక్కచో వ్రాయవలసివచ్చును. స్థాలీపులాక
న్యాయము ననుసరించి యిటఁ గొన్నింటిం జూపితిని. వీనిం
బట్టి పరిశీలింపఁగా సకలమునకు హేతువు తానై తన కొక
హేత్వంతరము లేకయుండునదియే పరతత్త్వ మనియు, దాని
కంటె నల్పపదార్థముగాని యధికవస్తువుగాని లేదనియు, నది
లేనితావే లేదనియు, నది కానిదేదియు లేదనియు స్పష్ట
మయ్యెడిని. అట్టితత్త్వము నారాయణశబ్దముచేతఁగాని
శంకరశబ్దముచేతఁగాని విధాత్రునామమునఁగాని మఱేనామ
మునఁగాని పిలువవచ్చును. ఎల్లచో వ్యాపించియుండు పర
బ్రహ్మమున కొక్కలోకమే నివాసమని యదియే యుత్కృష్ట
లోకమని యొక్కనామమే యామహనీయతత్త్వమునకుఁ గల
పేరులలో శ్రేష్ఠమని తక్కంగలనామములు శ్రేష్ఠములు కావని
పలుకుట వెఱ్ఱితనమునఁగాని మఱేమగును?

వైకుంఠాదిలోకము లున్నయట్లు ప్రమాణములు కలవు
కదా యని యడుగవచ్చును. కలవనుట సత్యమే. కాని యవి
యేల కల్పింపఁబడినవో దానికారణ మరయవలయును.

"ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా"

అన్న ప్రాచీనసూక్తియు,

"న తే రూపం న చాకారో నాయుధాని న చాస్పదమ్,
తథాపి పురుషాకారో భక్తానాం త్వం ప్రకాశసే."

అన్నసూక్తియు నెల్ల రెఱింగినవియేకాని క్రొత్తవి కావు.
భక్తుఁడు ధ్యానించుటకై రూపము కల్పింపఁబడినది. నివాస
ములోనగునవియు నట్లే. సర్వవ్యాపకునిగా ధ్యానించువా

రరుదు. తొలుదొలుత ధ్యానయోగము నభ్యసించువారు భగవంతుఁడొకలోకమున నొకరమ్యహర్మ్యమున నొకదివ్యసింహాసనమున నున్నయట్లు కల్పించుకొనఁదగు. ఒక్కనామము నిష్టానుసారము కల్పించుకొనవలయు. ఆలోకమున నాయింట నాపీఠమున నానామమున నున్నవాఁడు భగవంతుఁడు కాక పోఁడు. సర్వవ్యాపకుఁడుకదా. కాని యాధ్యానమే సర్వకాలము చేయందగదు.

"సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. ౨౯
యోమాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయిపశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి సచమే న ప్రణశ్యతి. ౩౦
సర్వభూత స్థితంయోమాం భజ త్యేకత్వమాస్థితః,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే." ౩౧

గీత. ౬ అధ్యా.

అను నీభగవదుక్తిప్రకారము ధ్యానముచేయ నభ్యసింపవలయును. కనఁబడినవస్తువులెల్ల భగవన్మయములుగాఁ బరికించుటయే యాధ్యానమునకు ఫలము అట్లు సర్వవ్యాపకున కొక్కలోకమే నివాసమనియు దానిపేరే వైకుంఠమనియో కైలాసమనియో, సత్యలోకమనియో యుండుననియు, ముఖ్యస్థాన మదియే యనియుఁ గల్పించుట పరిహాసాస్పదముకాక మఱియేమగును? దృశ్యమగునదియంతయు నశ్యమేగాని స్థిరమగునదికాదు. పరమాత్మేతరమంతయు నశించునదియే యని యెఱుంగవలయు. పురాణాదులయం దచ్చోట్ల సుస్థిరలోకములు కల్పింపఁబడిన వందురేని పామరులకు శ్రద్ధాభక్తులు కుదుర

టకే యని యెఱుంగనగు. అట్లు కల్పింపఁబడకయున్న భక్తి యనునదియే నశించును.

పురాణములయాశయము లతిగూఢములు. వానిని జక్కఁగా నెఱుంగుట మహాకష్టము. ఎల్లకర్మముల కందు ఫలములు గలవు. వానివానియధికారము ననుసరించి దేవతాలోకములు ధ్యానగమ్యములుగాఁ జేయఁబడినవి. అంతియగాని యొక్కనికొఱ కన్నిపురాణములును జెప్పఁబడలేదు. ప్రతిప్రాణియు వరుసగాఁ దరించుమార్గము లాపురాణములయందుఁ జేర్కొనఁబడియుండును. కావుననే పరస్పరవిరుద్ధములుగా నున్నయట్లు తోఁపఁజేయును. పరిశీలించిన నందేదియు విరుద్ధముగా నుండునది యుండదు. ఉపనిషత్తులయందుఁ గల రహస్యములన్నియుఁ బురాణములయం దిమిడియే యుండును. అవి విధిరూపములుగా నుండును. పురాణములు కథారూపములుగ నుండును. ఉపనిషత్తులు పరిపక్వాంతఃకరణులకే పనికివచ్చును. పురాణములు పరిపక్వాపరిపక్వ జీవులకెల్లఁ బనికి వచ్చును. ఎట్టికర్మముల నాచరించినవారలకైన నందుఁ దరించు మార్గము కనఁబడును. అకారణముననే యేవిషయము ననువదించుచున్న నదియే యుత్తమోత్తమమని చెప్పఁబడియుండును. ఎవారేమార్గమున భగవంతు నారాధించిన నది యుత్తమోత్తమమే యగుననువిశ్వాసము వారికిఁ గలిగించినఁగాని యద్దాని నాచరింపరు. ఎల్లరు నొక్కమార్గమునే యవలంబించునూహ గలవార లేల కారన్న భిన్నభిన్నకర్మముల నాచరించియుండుటయే కారణము. కాఁబట్టి పురాణములన్ని కర్మ

ములకుఁ దగుమార్గములఁ దెలుపునవి యనియే దీనఁగల సారము.

పరమకారుణికుఁ డగుభగవంతుఁ డెల్లరూపములఁ దాల్పఁగలవాఁడనియు, నెల్లతావుల నుండువాఁడనియు నాత నికి విరు మగునది యేదియు లేదనియు, నొక్కతావే యా పరాత్పరునకు ముఖ్య మగుననుట మంచిదిగాదనియు, నేలోక మున నున్నయ ట్లామహనీయునిభావించి యారాధించిన నా లోకమునుండియే ప్రత్యక్షమై భక్తుల ననుగ్రహించుననియు సర నామము లాపరమేశునకుఁ జెల్లుననియు, నిశ్చలభక్తి నే నామమునఁ బిల్చినను బలుకుననియు, నొక్కనామమే యాత నికిం బ్రియమనుట పొరపాటనియు, మతధర్మములు వారివా యధికారమునకుఁ గల్పింపఁబడి యుండుననియు, నంతియకాని యన్నింటియందు గమ్యస్థాన మొక్కవిధముగనే తెలుపఁబడి యుండుననియు, నకారణమున నితరమతాచారములను, మతస్థాపకులను దూషించుట నీతిబాహ్య మనియు, వారియభి ప్రాయము లిట్టివని తెలిసికొనవలయుననియు, నదియే మంచి పద్ధతియనియు, నాస్థితియందున్న భక్తుఁ డితరుల దూషింపఁ దలంపఁడనియు మన మెఱుంగవలయును. ఈవిషయమును జక్కఁగా విమర్శించి తెలిసికొనువారలకు శివకేశవాది దేవతల యందు భేదబుద్ధి పొడమదనియే దీనిసారము. పొడము నందుఁ రేని యతనిబుద్ధి యీవిషయమును జక్కఁగా గ్రహింపలేదని యూహింపవచ్చును.

నటుఁ డొక్కొక్కతఱి నొక్కొక్కవేషమును ధరిం చును. తదుచితరీతి మెలంగును. ప్రేక్షకు లాతని దద్దోషవం

తునిగనే భావింతురు. అతనికింగల్గు సుఖదుఃఖములయందుఁ
దమరును బాల్గొందురు. అట్లే జగన్నాటకమందుఁ బరమాత్మ
కార్యముల ననుసరించి తదు రణా ముచితరూపమున నవత
రించును. పామరు లారూపమున ననుభవించుసుఖదుఃఖము
లను నిజముగా ననుభవించుచున్నవాఁడనియే భావింతురు.
కాని నిర్లిప్తుఁడని భావింపరు. యోగు లవి కల్పితములని సంభా
వింతురు. పర కర్మఫలసాక్షియని తలంతురు. ఇదియే సజ్జనులకుఁ
బామరులకుఁ గలభేదము. ఈభేదము ప్రాక్కాలమునుండి వచ్చు
చున్నదేకాని క్రొత్తదికాదు. ఇది నశించుకాలము రాదనుట
మిథ్యగాదు.

భక్తానుగ్రహార్థము భగవంతుఁ డొకరూపమునుదాల్చిన
దానినే యవతార మందురు. పైలోకమునుండి దిగుటయని
దానియర్థ మగునని కొందరందురు. ఆకొందఱే పరతత్త్వ
మున కొక్కలోకము నివాసార్థము గలదనువారని యెఱుంగ
వలయును. ఆలోక మూర్ధ్వమున నున్నదని వారియూహ.
ఊర్ధ్వాధోభాగములు సత్యములు కావని వారు నమ్మరు. ఏలోక
మున నుండువారు తమరున్నలోక మూర్ధ్వమనియు నింకొక్క
లోకము తమకుఁ గ్రిందనున్నదనియు భావింతురు. ఇట్లే యన్ని
లోకములనుండువారు నని తెలియనగు. విద్వాంసు లిట్టి భ్రాం
తికి మనసునఁ జోటీయరు. వారలే తత్త్వవేత్తలు కాఁగలరు.
ప్రాక్పశ్చిమము లెట్లు స్థిరములు కాక యాయాతావులభేదము
లుగఁ దోఁచుచుండునో ఊర్ధ్వాధోలోకము లట్టిభ్రాంతిని
గ ంచునవియని మన మెఱుంగవలయును. సకలబ్రహ్మాండములు
పరస్పరాకృష్టములై యాకాశముననే యున్నవి. అన్నియు

నిరాధారములే. పరమేశ్వరుఁడే యాధారమని కొందఱం
దురు. వారిమతమున నాకర్షణశక్తియే భగవంతుఁడని మన
మనుకొనవచ్చును. భూగోళము నాదిశేషుఁడు మోయుచున్నవాఁ
డన్నవారి మెట్టిదో పై వారి మట్టిదే యనవచ్చును. సమస్తము
నశించుకాలమున మిగిలియున్నవాఁడు శేషుఁ డనఁబడును. ఈ
యర్థమున వారివాదము సమంజసమే యగును. అట్టివాఁడు
పరమేశ్వరుఁడే. ఆతఁ డెల్లర కాధారభూతుఁడే. కాదనువా
రెవరు? ఒక్కరూపము తలపై భూమినిడుకొని మోయు
చున్నదన్న నది దురాటమనవలయు. భగవదాజ్ఞచే లోక
ములు నిలిచియున్నవన్న నొననవలయుఁగదా. ఆయా నేఁ
తత్త్వవేత్త లాకర్షణశక్తి యందురు.

"మూర్తో ధర్తా చేద్ధరిత్ర్యాస్తతోఽన్య
స్తస్యాప్యన్యోప్యేవ మత్రానవస్థా,
అంత్యే కల్ప్యాచేత్స్వశక్తిః కిమాద్యే కిన్నో
భూమేస్సాష్టమూర్తేశ్చ మూర్తిః."

అని భాస్కరాచార్యులు వ్యక్తీకరించిరికదా. సర్వశక్తు లాప
మేశ్వరునివే యన్నచో సత్యమే యని తలయొగ్గవలయు.

మానవు లుండులోకమునకే మధ్యలోక మని పేరు
స్వర్గ పాతాళము లనునవి యూర్ధ్వాధోభాగములయం దుండు
టంబట్టి యిది మధ్యమలోక మనఁబడునని కొందఱందురు. ఈ
విషయమగుచర్చ కిది చోటు గాదు. శ్రుతిస్మృతిపురాణేతి
హాసము లీమర్త్యలోకధర్మములనే విశేషించి తెలుపును. మాన
వుల నుత్తమపదము నొందఁజేయ నవి పాటుపడును. సకల
కర్మముల నాచరింపఁదగులోక మిదియే. స్వర్గాదిలోకము

యందు ననుభవింపఁబడుఫలముల కీలోకమున నొనరించిన కర్మములే కదా హేతువు లగును? ఈలోకమున ననుభవింపఁ దగుసుఖములును గొన్ని కలవు. స్వర్గాదిలోకముల ననుభవింపఁగా మిగిలినఫలముల నీలోకమున ననుభవింపవలయును. పక్షులాయాతావుల కరిగి యాహారముఁ గొని రాత్రియం దొక్కచోటఁ జేరి సుఖించుట మనము చూచుచున్నవారము. అట్లే మర్త్యలోకమున నాయాయితావుల నెన్నియో కర్మము లాచరించి తత్ఫలముల ననుభవింపఁ దగులోకమున కరిగి యందు జీవుఁ డనుభవించును. ఆలోకములకుఁ బుణ్యలోకము లనిపేరు. ఈవిషయము నీక్రింది ప్రమాణవాక్యములు దృఢపఱచుచున్నవి.

"పృథివ్యాం భారతం వర్షం కర్మభూమి రుదాహృతా,
కర్మణః ఫలభూమిశ్చ స్వర్గం చ నరకం తథా. ౨
తస్మిన్ వర్షే నరః పాపం కృత్వా పుణ్యం చ భో ద్విజాః,
అవశ్యం ఫలమాప్నోతి అశుభస్య శుభస్య చ. ౩
బ్రాహ్మణాద్యాః స్వకం కర్మ కృత్వా సమ్యక్సుసంయతాః,
ప్రాప్నువంతి పరాం సిద్ధిం తస్మిన్ వర్షే న సంశయః. ౪
ధర్మం చార్థం చ కామం చ మోక్షంచ ద్విజసత్తమాః,
ప్రాప్నోతి పురుషస్సర్వం తస్మిన్ వర్షే తు సంయతః. ౫
ఇంద్రాద్యాశ్చ సురాస్సర్వే తస్మిన్ వర్షే ద్విజోత్తమాః,
కృత్వా సుశోభనం కర్మ దేవత్వం ప్రతిపేదిరే. ౬
అన్యేఽపి లేభిరే మోక్షం పురుషాస్సంయతేంద్రియాః,
తస్మిన్ వర్షే బుధాశ్శాంతా వీతరాగా విమత్సరాః. ౭
యేఽచాపి స్వర్గే తిష్ఠంతి విమానేన గతజ్వరాః,
తేఽపి కృత్వా శుభం కర్మ తస్మిన్ వర్షే దివం గతాః. ౮

నివాసం భారతే వర్షే ఆకాంక్షంతి సదా సురాః,
స్వర్గాపవర్గఫలదే తత్ప్రాప్స్యామః కదా వయం. ౯

మునయః.

యదేతద్భవతా ప్రోక్తం కర్మ నాన్యత్ర పుణ్యదం,
పాపాయ వా సురశ్రేష్ఠ వర్జయిత్వా చ భారతం. ౧౦
తతస్స్వర్గశ్చ మోక్షశ్చ మధ్యమం తచ్చ గమ్యతే,
నవాన్యత్ర చ మర్త్యానాం భూమౌ కర్మ విధీయతే. ౧౧
తస్మాద్విస్తరతో బ్రహ్మన్నస్మాకం భారతం వద,
యది తే హి దయాస్మాసు యథావత్స్థితిరేవ చ. ౧౨

బ్రహ్మా.

తదేతద్భారతం వర్షం సర్వబీజం ద్విజోత్తమాః. ౬౬
బ్రహ్మత్వమమరేశత్వం దేవత్వం మరుతాం తథా,
మృగయక్షాప్సరోయోనిం తద్వత్సర్పసరీసృపాః. ౬౭
స్థావరాణాం చ సర్వేషా మితో విప్రాశ్శుభాశుభైః,
ప్రయాంతి కర్మభూర్విప్రా నాన్యా లోకేషు విద్యతే. ౬౮
దేవానామపి భో విప్రాస్సదైవైష మనోరథః,
భారతే భవమాప్స్యామో దేవత్వాత్ప్రచ్యుతాః క్షితౌ. ౬౯
మానుష్యం కురుతే యత్తు తన్న శక్యం సురాసురైః,
తత్కర్మనిరతైస్తైస్తు తత్కర్మక్షపణోన్ముఖైః. ౭౦
న భారతసమం వర్షం పృథివ్యామస్తి భో ద్విజాః,
యత్ర విప్రాదయో వర్ణాః ప్రాప్నువంత్యభివాంఛితం. ౭౧
ధన్యాస్తే భారతే వర్షే జాయంతే యే నరోత్తమాః,
ధర్మార్థకామమోక్షాణాం ప్రాప్నువంతి మహాఫలం. ౭౨

ప్రాప్యతే యత్ర తపసః ఫలం పరమదుర్లభం,
సర్వదానఫలం చైవ సర్వయజ్ఞఫలం తథా, 23
తీర్థయాత్రాఫలం సమ్యగ్గురుసేవాఫలం తథా,
దేవతారాధనఫలం గార్హస్థ్యే చైవ యత్ఫలం. 24
యత్ర దేవాస్సదా హృష్టా జన్మ వాంఛంతి శోభనం,
నానావ్రతఫలం చైవ నానాశాస్త్రఫలం తథా. 25
అహింసాదిఫలం సమ్యక్ఫలం సర్వాభివాంఛితం,
బ్రహ్మచర్యఫలం చైవ స్వాధ్యాయేన చ యత్ఫలం. 26
యత్ఫలం వనవాసేన సన్న్యాసేన చ యత్ఫలం,
ఇష్టాపూర్తఫలం చైవ తథాన్యచ్ఛుభకర్మణాం. 27
ప్రాప్యతే భారతే వ న చాన్యత్ర ద్విజోత్తమాః,
కశ్శక్నోతి గుణాన్వక్తుం భారతస్యాఖిలాన్ ద్విజాః." 28

బ్రహ్మపురాణము. ౨౭ అధ్యాయము.

మ___లోకమున భారతవర్ష ముత్తమో___మమని యీపై నుదహరించిన ప్రమాణము తెలుపుచున్నదికదా. ఇతరపురాణములయందుఁగూడ దీనికి విరు. ములగు ప్రమాణములు కానరావు. ఈవిషయమునే భగవంతుఁడు శ్రీకృష్ణమూర్తియు గీతాశాస్త్రమునందు మూఁడవయధ్యాయమునందు

"సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః,
అనేన ప్రసవిష్యధ్వమేష వోఽస్త్విష్టకామధుక్. 10
దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః,
పరస్పరం భావయంతశ్శ్రేయః పరమవాప్స్యథ. 11
ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః,
తైర్దత్తా న ప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః. 12

యజ్ఞశిష్టాశినస్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః,
తే త్వఘం భుంజతే పాపాః యే పచంత్యాత్మకారణాత్." ౧౩

అని యర్జునున కుపదేశించెను. యజ్ఞరూపకర్మముల నొనరించి మానవులు దేవతలను దృప్తులగునట్లు చేయవలయుననియు, దానికిం గృతజ్ఞులై దేవతలు మానవుల కష్టభోగములను సమకూర్పవలయుననియు, నాసుఖములనుమాత్ర మనుభవించుచు వారికిఁ దృప్తిచేయ నెంచకయున్నచో మానవులు కృతఘ్నులగుట దొంగలనఁబడుదురనియు, దేవతలకు యజ్ఞములచేఁ దృప్తిని గల్పించి యవలఁ దచ్ఛేషమును భుజించిన సర పాపములు తొలంగుననియు, నట్లుచేయక తామే భుజించినఁ బాపములనే యనుభవింతురనియుఁ దాత్పర్యము. దీనిచేతం గూడఁ గర్మభూమి మర్త్యలోకమే యనియు నందు భారత వర్షమేయనియు సారము. కర్షకుఁడు పొలము చక్కఁగా దున్ని పండించి యతిథులఁబోషించునట్లు మర్త్యలోకవాసులు సత్కర్మముల నాచరించి యితరలోకవాసుల సంతృప్తులనుగా నొనరింతురు. పొలము పండకయున్న నెల్లరు నన్నాతురులై క పడునట్లు మర్త్యులు కర్మముల నాచరింపకయున్న స్వర్గలోకవాసులకుఁ దేజఃపుష్టు లుండవు. వీరివలన నట్టిమహోపకారము నొందిన దేవత లాయుపకారమునకుఁ బ్రత్యుపకారము చేయుచుందురు. అనుటచే భారతవర్షము కర్మభూమియగుట నిందు జన్మించినఁగాని తరణోపాయసాధనము లగుసత్కర్మముల నాచరింప వలనుపడదు. భారతవర్షముగాక తక్కుంగలభూగోళ భాగములయందు నట్టికర్మముల నాచరింపఁగూడదా యన్న నొననవలయును. ద్వీపాంతరములయందుఁ గర్మముల కవకాశము

లేదు. ఇట్లు చెప్పుట పక్షపాతముకాదా యన్నఁ గాదనవల యును. పరమకారుణికు లగుమహర్షులు పక్షపాతముగలవా రన్నఁ బాప మొనఁగూడును. భారతవర్షవాసులే భగవత్కరు ణకుఁ బాత్రులా, తక్కినవారు కారా యని యడుగుదురేని మహామునులభావము మీకుఁ దెలియదనియే వారలకు బదు లీవలయును.

యజ్ఞాదికర్మముల నాచరింప భారతవర్షమే తగినది. తక్కినభూభాగములు కావు. ఇందే వేదములకు స్మృతులకుఁ బురాణములకు మఱియుఁగల గ్రంథరాజములకుఁ బ్రవృత్తి గలదు. తక్కినతావుల నట్లు లేదు. ఇక్కారణమున నందఱి కంటె వీ రుత్కృష్టు లనరాదు. వేదాదులకుఁ బ్రవృత్తిలేని తావుల నుండువారు భగవదనుగ్రహమునకుఁ బాత్రులుకారని యే పురాణములును దెలుపలేదు. భగవంతు నారాధించు మార్గములు వేఱువేఱుప తుల నుండును. అం దీమార్గ మీ వర్షమున కనుకూలముగా నుండును. దీ పాంతరముల వేఱు మార్గము లుండును. ఏమార్గముల ననుసరించినను భగవంతుని కృపకుఁ బాత్రులు కావచ్చును. జ్ఞానమున కెల్లరు పాత్రులే యగుదురు.

"శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప,
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే." 33

అన్నభగవదుక్తియే పైవాక్యమునకుఁ బ్రమాణ మగును. యజ్ఞముకూడఁ ద్రివర్ణములకేకాని శూద్రవర్ణమునకుఁ జెప్పఁ బడలేదు. అంతమాత్రమున వారికి లోపము కలదా. వేఱొక యజ్ఞము శూద్రులకు విధింపఁబడినది.

"వృక్షాన్ ఛిత్వా మహీం భిత్వా హత్వాశు క్రిమికీటకాన్,
కర్షకః ఖలయజ్ఞేన సర్వపాపైః ప్రముచ్యతే. ౯
యో న దద్యాద్ద్విజాతిభ్యో రాశిమూలముపాగతః,
స చోరస్స చ పాపిష్ఠో బ్రహ్మఘ్నుం తం వినిర్దిశేత్. ౧౦

పరాశరస్మృతి. ఆచారకాండము.

దేవతలను యజ్ఞములచే నారాధింపవలయును. లేకున్నఁ బాపముగలుగునని బ్రాహ్మణాదులకు విధించినట్లే శూద్రులకుఁ దమ్మాశ్రయించినవారికి రాశినుండి ధాన్య దానముచేయుటయే యొకయజ్ఞ మనఁబడుననియు దాన సకలపాపములు నశించు ననియుఁ గృషికర్మమున ననేకపాపములు గలుగుననియు నీఖల యజ్ఞము నవాని నడంచుననియుఁ దమ్మాశ్రయించినవారికి ధాన దానమున సంతృప్తిగలిగింపకయున్నను బాప మొదవు ననియుఁ బైవిధి శాసించుచున్నది. బ్రాహ్మణక్షత్రియవైశ్యు లకుఁ జెప్పఁబడినయజ్ఞము శూద్రుల కేల విధింపఁబడలేదని ప్రశ్నించుట యంతమంచిదిగాదు వారివారికిఁ దగినయట్లు కర్మములు శాసింపఁబడినవి. కాని ఫలము సమానము. బ్రాహ్మ ణుఁడు యజ్ఞముచేసి పాపనిర్ముక్తుఁ డగునట్లు ఖలయజ్ఞమున శూద్రుఁడు సకలపాపనిర్ముక్తుఁడగునని మహర్షులు విధించిరికదా. దీనఁ బక్షపాతముకలదా? ఉండిన నది శూద్రజాతియందే యన వలయు. యజ్ఞప్రవృత్తికి ఫలమేమనఁగా ద్రవ్యత్యాగమే. బహువిధశ్రమముల కోర్చి సంపాదించినధనమును సత్కార్యము నందు వ యించుట యనఁగాఁ దాత్పర్య మేమి? ధనమును దాఁచిపెట్ట వలయుననుకోరిక లేకుండఁజేయుటయు దానఁ బరుల కుపకారము గలుగునట్లు చేయుటయు నను నివిగాక

మతేమి? ద్రవాశ వదలినఁగాని భగవదనుగ్రహపాత్రుఁడు కాఁజాలఁ డనుటయే దీనినుండి నేర్చుకొనఁదగినవిషయము.

భారతవర్షవాసులకుఁ జెప్పఁబడినకర్మము లితరభూభాగవాసులకుఁ జెప్పఁబడకపోయినంతమాత్రమున వారెల్లఁ బాపాత్ములు కారు. మఱికొన్నిమార్గములు వారికిం గలవు. వానిని దప్పక యనుష్ఠించినయెడల వారును భగవంతునిప్రేమమున కర్హులే యగుదురు. సదాచారములు కర్మములు దేశకాలాదుల ననుసరించి యేర్పఱుపఁబడినవి

"యే తత్ర బ్రాహ్మణాస్సమ్మర్శినః, యుక్తా ఆయుక్తాః, అలూక్షా ధర్మకామాస్స్యుః, యథా తే తత్ర వర్తేరన్, తథా తత్ర వర్తేథాః, అథాభ్యాఖ్యాతేషు, యే తత్ర బ్రాహ్మణాస్సమ్మర్శినః, యుక్తా ఆయుక్తాః అలూక్షా ధర్మకామాస్స్యుః, యథా తే తేషు వర్తేరన్, తథా తేషు వర్తేథాః. ఏష ఆదేశః ఏష ఉపదేశః ఏషా వేదోపనిషత్ ఏతదనుశాసనం ఏవముపాసితవ్యమ్." శిక్షావల్లి.

ఒక్కధర్మమే దేశభేదములనుబట్టి మాఱుననియు నందుఁగల యార్యు లెట్టు లద్దాని నడుపవలెనో యట్లే యొనరింపవలయు ననియు నుపనిషత్తు బోధించుచున్నది. ఆర్యులనఁగా నాదేశమున సదాచారనిరతులని యర్థము. శ్రౌతకర్మముతప్పఁ దక్కుంగలకర్మము లొక్కరీతిగా నుండక మార్పునొందియుండును. కాని శ్రద్ధగా నాచరించిన ఫలము సమానమే యని యెఱుంగవలయును కావున మహర్షులతీంద్రియజ్ఞానముగలవారు కావున నాయాదేశములకుఁ దగినట్టులు ధర్మప్రవృత్తి నెఱింగించిరనియుఁ బక్షపాతముగలవారు కారనియు వారు చెప్పిన

చొప్పునఁ బ్రవర్తించుటయే యుత్తమమార్గమనియు, వారి నిందించుట స క్షేమనాశనహేతువనియు నెఱుంగందగును.

## అవతారములు.

భగవంతునియవతారము భక్తానుగ్రహార్థమే యనుట స్పష్టము. ఆరూపమే యాభగవంతుని దనరాదు. ఆ రూప మప్పటి కార్యమునకుఁ దగినది. కాని యది శాశ్వతముగా నుండునది కాదు. వరాహరూపము భగవంతుఁ డొకకార్యము నకై యంగీకరించి యప్పని కాఁగా దానిని వదలినను భక్తుఁ డారూపమున ధ్యానించినచో నాతనిధ్యానము శ్రద్ధాయుక్త మగు నేని యాసర్వేశ్వరుఁ డాతనికి నిష్టమగు నావరాహ రూపముననే దర్శన మొసంగి రక్షించును. అంతియగాని వైకుంఠమున నొక్కసౌధమున వరాహరూపమున మహావిష్ణు వుండు ననరాదు. ఈవిషయ మెల్లరకుఁ దెలిసినదియే. దీనిం బట్టియే భగవంతుఁ డెల్లరూపములుగలవాఁడనియు, నేభక్తుఁ డేరూపమున ధ్యానించిన నారూపముననే దర్శనమిచ్చు ననియు నిశ్చయింపవచ్చును. ఈసిద్ధాంతము చలించునది కాదు. ఇట్టులుండ శివకేశవులు వేఱనుట యెట్లో తెలియఁజాలకున్నాఁ డను. శివరూపము సర్వేశ్వరునకు విశేషప్రీతిప్రదము కాదేని యతఁడు సర్వేశ్వరుఁ డెట్టులగును. వైకుంఠముకాక తక్కిన లోకము లామహాత్మునకుఁ బ్రియములు కావేని సర్వసముఁ డెట్లగును? పుణ్యపాపములఫలముల ననుభవించువారి నిష్పక్షపాతదృష్టిం జూడఁడేని సర్వసాక్షి యెట్లగును? ఇట్టివాదములు చేయుచో నాపరమపురుషుని యచింత్యగుణముల క్షీణింపఁ

జేయఁబూని పాపము సంపాదించుకొనుట కాక వేఱొకమంచి ఫలము సంపాదింప నవకాశము లేదనియే యిందలిసారము.

చతుర్భుజములుగలిగి శంఖచక్రగదాపద్మములు దాల్చి పీతాంబరధారియై భగవంతుఁడు వైకుంఠమున నుండునన్న శిరసావహింపవలసినదే. కాని యాచిహ్నములుగలిగి యాలోకమున నున్నవాఁడే భగవంతుఁడన్న నంగీకరింపరాదు. ఆవాదము నిస్సారమైన దనవలయు. అట్లు బోధించువారలకు భగవంతుఁడు సర్వేశ్వరుఁ డనుదృఢజ్ఞానము లేదనియే తోఁచెడును. వైకుంఠమున నంతప్రీతియుఁ గైలాసమునఁ నప్రీతియు నాపరమేశ్వరునకు నుండునేని యతఁడు వైకుంఠమునకు మాత్రమే యధిపతి యనఁబడు భగవత్కళాలేశసంభూతుఁడగును. అంతియకాని సర్వలోకేశ్వరుఁడు కాఁడు ఇంతమాత్రమామహాత్ముని ప్రభావము నోరఁజాలమేని తత్కృపకుఁ బాత్రుల మేలాగుగా నగుదుమో యూహింపఁదరముకాదు. ఇట్టివాదములు చేయఁబూనుట భగవద్భక్తి సంపూర్ణముగఁ గుదురక యజ్ఞానము నుంతయుండిన స్థితియాటచేతనే యని కొందఱు పెద్దలు పలుకుదురు. సావధానముగా నాలోచించిన నావాక్కు సరియే యని తోఁచును. భగవంతునకుఁ బక్షపాతము దేనియందు లేదేని యొక్కరి నెక్కుడుగఁ బ్రేమించుటయు వేఱొక్కని ప్రేమింపకయుండుటయు నేల యని యడుగవచ్చును. శ్రీభాగవతమునందు

"స బ్రహ్మణస్స్వపరభేదమతి స్తవ స్యా
త్సర్వాత్మనస్సమదృశస్స్వసుఖానుభూతేః,

సంసేవతాం సురతరోరివ తే ప్రసాద
స్సేవానురూపముదయో న విపర్యయోఽత్ర." ౬

౧౦ స్కం.

అనువాక్యము కలదు. సరాత్మభూతుఁడు సమదర్శనుఁడు నిరతిశయాత్మసుఖానుభూతియు నగుపరమేశ్వరునకుఁ దనవాఁడని, పరుఁడనుభేదభావము లేదు. కాని యెవారాపరమాత్మను సత్కర్మములకు ఫలముగా సేవింతురో వారలకు నీయనుగ్రహము కల్పవృక్షముభంగి ఫలమునిచ్చును. సేవింపనివారల కది లేదు. ఇంతమాత్రమున భగవంతునకు భేదభావము కలదనరాదు. కల్పతరువు సమీపమునకుఁ బోవనివారలకు దానివలనఁ గలుగుఫలాదిలాభము లెట్లు గలుగును! చెంతకుఁరాని పై దానికి గోపము కలదనవచ్చునా?

ఈప్రమాణమునుబట్టి యించుక యోజించిన భగవంతునకు నిది నాదనునదియే లేదనియు నితరమని చెప్పఁదగినదియే యుండ నవకాశము లేదనియుఁ బోడకట్టును. వైకుంఠముపయి నభిమానము హెచ్చునుమాట యేటఁగలిసెఁగదా. శ్వేతదీప నాథునిగాఁగాని, వైకుంఠనాయకునిగఁగాని, కైలాసపతనిగాఁ గాని మఱి యే బ్రహ్మాండప్రభునిగఁగాని భావించి సేవించినఁ జాలును. ఆపరమకారుణికుఁడు వాంఛల నొసఁగుకరుణను వారిపైఁ బొలయించును ఆయారాధనము చేయునట్లు చేసిన దేది? వారిసత్కర్మమే. అది యాచరింపకుండఁ జేయున దేది? దుష్కర్మమే. వారినెల్ల సదసాక్షి గావునఁ జూచుచునే యుండును. భాగవతము ప్రమాణ మనువారలు దీనిం గాంచియైన దుర్వాదముల మానుదురుగాక.

## అవతారకారణములు.

పరసాక్షి యగుపరమేశ్వరుఁడు భక్తానుగ్రహము లోకమున నవతరించును. ఎట్టితరుణమునందు? మర్త్యలోకవాసులశక్తులు. వారలకుఁ గీడుసేయఁదలఁచురాక్షసులు చెలరేఁగుచున్నపుడును, ధర్మము నశించునపుడు, దానిమూలమున నధర్మము తలయెత్తునపుడు తనమాయ నంగీకరించును. ఆప్రకృతియొకరూపమును గల్పించును. అది యప్పటికార్యనిరహణము నందు సమర్థమై యుండును. ఈవిషయమును

"అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్,
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా. ౬
యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత,
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహం. ౭
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే." ౮

గీత. ౪ అధ్యా.

అను నీ శ్రీకృష్ణవాక్యములు స్థిరపఱచుచున్నవి.

"మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరమ్,
హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే. ౧౦
అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితం,
పరం భావమజానంతో మమ భూతమహేశ్వరం." ౧౧

౯ అధ్యా.

అను నీహరివాక్యములును సాయపడుచున్నవి.

"ఏకో దేవస్సర్వభూతేషు గూఢస్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా,
కర్మాధ్యక్షస్సర్వభూతాధివాసస్సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ."

అని శ్రుతియుఁ బైనుదాహరించిన యభిప్రాయమునకుఁ దోడ్పడుచున్నది.

కొందఱు ప్రకృతియన్న నదరిపడుదురు. ప్రకృతి నవలంబింపకయున్నచో భగవంతుఁడు కదలఁజాలఁడని వారెఱుంగరు.

"ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః,
భూతగ్రామమిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్."

౯ అధ్యా.

అను నీ గీతావాక్యము వారికి బోధింపఁగలదు. ప్రకృతిం గూడకయున్నచో దేహధారియే పరమేశ్వరుఁడు కాఁజాలఁ డన్న విషయము వారికిఁ దోఁపదొకో! వారివిషయ మట్లుండుగాక. ధర్మహాని కోరక నిర్గుణుండయ్యు సగుణుండై రూపమును దాల్చి తనమహత్త్వమును లోకులకుఁ దెలిపి యధర్మము నడంచి యారూపమును వదలును. అది కొందఱు కర్పూరూపముగా నుండును. భక్తాంతరంగములయం దారూపము సర్వదా యుండునదియే. ఆరూపములనే యవతారములందుము.

సర్వసాక్షియైనచో దుర్జనుల వధింపనేల? అది పక్షపాతము కాదా యనవచ్చును. భగవంతున కెల్లరయం దొక్కవిధమగు పక్షపాతమే (దయయే) కలదు. కాని యొక్కొక్కరియం దది వేఱువిధముగా నున్నయట్లు తోఁచును. కరుణానీరధియగు నాపరమాత్మ యెల్లరకు నుపకారమే చేయును. అది యొకానొకరియందు నపకారముగా నగునట్లు తోఁపఁజేయును. వైద్యుఁ డెల్లరోగుల కుపకారమునే చేయఁ బ్రయత్నించును.

కాని యతఁ డిచ్చునౌషధము రోగము ననుసరించి మాఱు చుండును. ఫల మెల్లర కారోగ్యము కల్గుటయేకదా. అట్లే కర్మానుసారముగా నాసరేశ్వరుఁడు కొందఱపై నాగ్రహ మును గనఁబఱచును. బాహ్యదృష్టికే యది యట్లగపడును. పరమార్థ దృష్టి కది కరుణగనే తోఁచును. హిరణ్యకశిపునందును బ్రహ్లాదునందును భగవంతునిదృష్టి సమమే. దానివలనిఫలము సమానమే. దానిని గనఁబఱచుప తిమాత్రము వేఱు. వధ రూపమున హిరణ్యకశిపుని, వరప్రదానరూపమునఁ బ్రహ్లాదుని ను రించెను. వీరిరువురు పొందుస్థాన మొక్కటియే. కావున భగవంతునకుఁ బక్షపాతము కల దనరాదు. జనకుఁడు తన యుల నందఱ నొక్కగతిఁ గాపాడును. కొందఱ దండించును. కొందఱ నూఱడించును. కొందఱ భయపెట్టును. ఏమైన నొసఁగి కొందఱ ననునయించును. రీతిభేదము లేకాని ఫల భేదము లేదు. వారివారి ప్రకృతుల ననుసరించి రీతిభేదము లవశ్యము లయ్యెను. ఒక్కపద్ధతియే యెల్లరకుఁ బనికిరాదు వారి వారికర్మములు భేదములుగానఁ దదనురూపమగుమార్గమున వారికి నుపకారముచేయఁ దగు. ఆమార్గము నెఱుంగునుగాన జనకుఁడు పుత్త్రుల నందఱ నొక్కరీతిఁగాక భిన్నరీతుల బాగు చేయును. అట్లే పరమేశ్వరుఁడు పరమకారుణికుఁడయ్యు సర జ్ఞుఁడౌట నాయాప్రాణులకుఁ గర్మానుసారముగా నొకమార్గ మును నేమకి దాన వారి ను రించును. మార్గభేదమును గను గొని పామరులు తన్మూలము నెఱుంగఁజాలక భగవంతుఁడు పక్షపాతి యందురు. అది మిగులఁ బొరపాటు. ఏయేమార్గ ముల నెవ్వరి నెప్పుడు చక్కపెట్టవలయునో పరమాత్మ యెఱుం

గునుగాని మనబోంట్లు కది తెలియఁదరమా. మన మే మార్గముల దూషించినను లెక్కగొనక యా దేవాది దేవుఁడు సమయమువచ్చినపుడు దూషకులనుగూడ ను రించును తొలుతఁ దన్ను దూషించెనని మది నెంచఁడు. తత్కర్మగతి నెఱుంగునుగాన నది యతని కర్మమే యని తలంచును. వానిని దగినమార్గమునఁ గడతేర్చును. కావున సమదర్శనుఁడు కాఁడనుట మనపాపముననే యని యొప్పుకొనక తప్పదు.

అవతారకారణములలో ధర్మసంస్థాపనము ప్రధానము. రెండవది దుష్టనిగ్రహపూర్వకశిష్టపరిపాలనము. శిష్టు లనఁగా

"న పాణిపాదచపలో న నేత్రచపలో మునిః,
న చ వాగంగచపల ఇతి శిష్టస్య లక్షణమ్."

మహాభారతము అశ్వమేధపర్వము

"ధర్మో నాభిగతో యైస్తు వేదస్సపరిబృంహణః,
తే శిష్టా బ్రాహ్మణాః ప్రోక్తా నిత్యమాత్మగుణాన్వితాః."

కూర్మపురాణము

"విశేషశబ్దనిర్దిష్టః శేషశ్శిష్టః ప్రచక్షతే,
మన్వంతరేషు యే శిష్టా ఇహ తిష్ఠంతి ధార్మికాః.
మనుస్సప్తర్షయశ్చైవ లోకసన్తానకారణాత్,
తిష్ఠంతి హ చ ధర్మార్థం తాన్ శిష్టాన్ పరిచక్షతే.
తైశ్శిష్టైః పాలితో ధర్మః స్థాప్యతే వై యుగే యుగే."

మాత్స్యపురాణము. ౧౨౦ అధ్యాయము

"ధర్మేణాధిగతో యైస్తు వేదస్సపరిబృంహణః,
తే శిష్టా బ్రాహ్మణా జ్ఞేయా శ్శ్రుతిప్రత్యక్షహేతవః." ౧౦౯

మనుస్మృతి. ౧౨ అధ్యా

శ్రుతేః ప్రత్యక్షీకరణే హేతవః యే శ్రుతిం పఠిత్వా తదర్థముప దిశంతి తే శిష్టా విజ్ఞేయాః. అని కుల్లూకభట్టు

అను ప్రమాణముల ననుసరించి శిష్టు లనఁగా వేదా ము నెఱింగి జితేంద్రియులగుచు జ్ఞానప్రధానకర్మముల నాచరించుచు నితరులకు వేదా మిట్టిదని బోధించుచు నుండువారని సారము. అట్టిశిష్టులనే భగవంతుఁడు కాపాడఁ బ్రయత్నించును. అంతియ కాని

"సావిత్ర్యాశ్చాపి గాయత్ర్యాస్సంధ్యోపాస్త్యగ్ని కార్యయోః,
అజ్ఞానాత్కృషికర్తారో బ్రాహ్మణా నామధారకాః." 3

పరాశరస్మృతి. ౮ అధ్యా.

అనెడిలక్షణములు గలవారు కారు. ధర్మసంస్థాపనము దుష్టుల నిగ్రహించి శిష్టులఁ బరిపాలించినఁగాని కానేరదు. కావునఁ దొలుదొలుత దుష్టుల నిగ్రహింపఁబూనును. దుష్టులకుఁ బరాపకారముచేయుట స్వభావకర్మము. శిష్టులకుఁ బరోపకారము చేయుట స్వభావకర్మము. ఈస్వభావములు రెండును బ్రాక్తన దుష్కృతసుకృతఫలములు.

ధర్మమును రక్షింప నిర్లిప్తుఁడయ్యు నాపరాత్పరుఁడు సాకారుఁడగునన నిఁక నాధర్మమహ ్త మిట్టిదని పొగడ నెవ రి తరము? అది నశింప సర ము నశించుననుట కిం కేయుదాహరణము కావలయు? అట్టియవతారము లనేకములు. అందు నిరువదొకండు ప్రధానములని, అందును బది ముఖ్యతమములని పె లందురు. ముఖ్యా ముఖ్య ము లనుమాటల క ము లోక మునకుఁ గల్గినయుపకారా నముగ నుండును. అంతియకాని యొక్కయవతారమునకంటె వేఱొక్కయవతారము శ్రేష్ఠమని కాదు. కార మును ననుసరించి కొన్నియవతారములు చిర కాలము లోకమున నుండును. కొన్ని యచిరకాలముననే విర

మించును. ఆయవతారములు మత్స్య, కూర్మ, వరాహ, నార సింహ, వామన, పరశురామ, శ్రీరామ, బలరామ, బుద్ధ, కల్కి నామములఁ బ్రఖ్యాతిఁగాంచినవి. బలరామస్థానమున శ్రీకృష్ణునిం జేర్చి కొందఱు దశావతారము లివి యందురు. కొందఱు శ్రీకృష్ణావతార మీదశకమునఁ జేర్పఁదగదందురు. శ్రీకృష్ణచరిత్రము నంతయుఁ బఠించిన నది దశావతారపరిగణనమునఁ జేరవనియే తోఁచును. ఇందుఁ జేరినను జేరకున్నను భగవదవతారములే కాన భేదమేమియు లేదు.

## శ్రీరామావతారము.

పరశురామావతారమున కంశావతార మనుప్రసిద్ధి కలదు. అది యుక్తముకాదని కొందఱందురు. కాని యుక్తమనియే నాభావము. అంశావతార మనఁగాఁ గారణాంశము యోగ్యమగుతనువున భగవంతునికళ ప్రవేశించి యాకార్యము తీర్చును. పిదప నాకళ స్వస్థానమును జేరును. ఒక్కయవతారము వేఱొకయవతారముచేఁ బరాభవమునొందుట సంగతము గాదు. శ్రీరామునిచేఁ బరశురాముఁడు పరాభవింపఁబడెనని రామాయణమహాకావ్యమునఁ గలదు కావునఁ బరశురామావతార మంశావతార మనఁబడునన్నపలుకు సమంచితముగనే యున్నది. పరశురామునియందు భగవత్కళ యుండఁగనే శ్రీరాముఁ డెట్లు పరాభవించెనని యడిగినయెడల నది పరాభవముకాదనియు నాకళ రాముని జేరుటకు సాధనమనియు సమాధానము. ధనుస్సంగ్రహణరూపమగు మిషచే నా తేజస్సు శ్రీరామమూర్తియందుఁ జేరెనని యెఱుంగవలయును. దుర్వారక్షత్త్రియ తేజస్సును హరించుకార్యమునకే యామునియం

దని ప్రవేశించెను. ఆకార్యము నెఱవేఱెను. కార్యాంతరము దాన సాధింపఁదగినది లేకుండెను. సమయమునకై యది వేచి యుండెను. మహత్తరదానవుల నడంపఁదగుకార్యమాసన్న మగుడు నదియేదో యొకవ్యాజమున స్థానమును గలిసెను. ఈయవతారమునఁదప్ప నిట్టికార్యము వేఱొక్కచో సాగలేదు కదా. ఇట్లన్నివిధముల నాలోచించినను బరశురామావతార మంశావతారమనియే తోఁచును. ఈవిషయమును జర్చింపఁ గూడ నిది సమయముకాదు.

వైకుంఠమును విడనాడి శ్రీమహావిష్ణువు భూలోకమున రామరూపమున నవతరించెనని కొందఱందురు. ఇట్లుచెప్పిన భగవంతుని మహత్త్వమునకు లోపముగలుగునని వారూహించినవారు కారని తోఁచెడు. శ్రీరామావతారము భూలోకమునసుండునంతదనుక వైకుంఠవాసునిగా మహర్షులుధ్యానింప ఫలము కలుగదా? ఆలోకమున సేవకులుతప్ప భగవత్సాన్నిధ్యము శూన్యముగ నున్నదియా అని యడుగువారలకు బదులేమి? దీనిసత్యమిది యని యూహింపవచ్చును. భగవంతుఁ డవతరింపఁగనే వైకుంఠమున నుదోగముకలవారుతప్ప నెవరుండరను పామరుల యాశయము పొరపాటు. సర్వవ్యాపియగు భగవంతుఁ డొక్కచో నుండువాఁడు కాఁడు. కావుననే భక్తానుగ్రహమునకై యొకరూపమున నవతరించును. సర్వలోకములలో నుండును. ఎవరేలోకమున నుండువానిగా భావింతురో లేక యేపరతభాగముననో యేవృక్షరూపముగ నున్నయట్లో ధ్యానింతురో వారల కారూపముననే తోఁచును. ద్వారకాపురవాసునిగా నొక్కఁడును, గోవర్ధనోద్ధరణముచేయుచున్న

వానిగా నింకొక్కఁడు నేకకాలమున ధ్యానించినయెడల వార
లిరువురకు నట్లే తోఁచి వారిని శ్రీకృష్ణుఁ డనుగ్రహించును.
అంతియకాని యొకొక్కలోకము నొకొక్క కాలమునఁ
బాడుపెట్టి వేఱొక్కతావున నుండఁడు. కావున శ్రీరామావ
తారమున వైకుంఠము పాడుపడియుండదు. వైకుంఠ మెందుఁ
దన్న నెందున్నయట్లు భావింతురో యందే యది యుండును.
లేదన్న నెందును లేదు. పురాణములయందు దాని కొక్క
చోటును స్థిరపఱచుట పామరులు సర్వవ్యాపకునిగా ధ్యానిం
పఁజాలరనియేకాని వేఱొక్కఁడు కాదు. కనఁబడునదియంతయు
నశించునదియేకాని స్థిరముగా నుండునది యొక్కటియు లేదు.
పర్వతములు స్థిరములుగావాయన్న మానవులదృష్టింబట్టిచూడ
స్థిరములేకాని యవి భగవంతునివలె స్థిరముగా నుండునవి
కావు. మానవులను గీటకములు చిరకాలజీవులనుగా భావిం
చును. ఏల? వానిదృష్టిచే మానవులు గొప్పవారుగాఁ గానఁ
బడుటయే యందులకుఁ గారణము. త్రిమూర్తులును శాశ్వ
తులుకారు. మహాప్రళయముదనుక నుండువారు. ఆవల నా
మూర్తిత్రయ మొక్కతేజస్సుననే చేరును. పాదరసము లేశ
ములుగానుండి యొక్కటిగా మాఱునుగదా. జలబిందువులు
వేలువేలుగానుండి మరల నొక్కటిగాఁ జేరుట కనఁబడును
గాదే. అట్లే పరరూపము లొక్కరూపముననే యంతర్భూ
తము లగును. ఈనియమము భంగము నొందునది కాదు
కావున రామావతారమున వైకుంఠమున భగవంతుఁ డుండఁ
డన్నవాదము సరియైనదికాదు. పామరుల కట్లు కల్పింపఁబడక
పోయిన శ్రీరామునియందు నెల్లవారలకు భక్తి కుదురదు

అది కుదురవలయుననియే యట్లు కల్పింపఁబడినదని యెఱుంగ వలయును.

## లోకస్థితి - రామకథాకల్పనము.

శ్రీరామావతారమునకు ముందు లోకమున జనులస్థితి యెట్లున్నదని యించుక చర్చించుట యప్రస్తుతప్రశంస కాదు. అంతియగాక ముఖ్యముకూడ నగును. ఈచర్చకు నాధారములు పురాణములు, శ్రీమద్రామాయణము లోనగునవియే. ఆకాశరామన్న పంచాంగ మన్నట్టు ఊహాలపై నూహాలు పొరలి పొరలి రాఁగా వాని నమ్మి సర్వజ్ఞులనలెఁ బ్రసంగించి యదేదో గొప్పపాండిత్య మనుకొని యున్నత్తబ్బిబ్బులగు మహాత్ముల ప్రణాళిక ననుసరింపను. ప్రాచీనుల గ్రంథములనే యాధారములుగా గ్రహించి వ్రాయుదును. కేవల మూహాలు సత్యేతరములే తఱచుగా నగును. ఒకానొకప్పు డందుఁ గొన్ని సత్యములు కావచ్చునుగాని వానినే నమ్మి వ్రాయరాదు. మన స్సునఁగలపట్టుదల సత్యమార్గమును గప్పిపుచ్చి తాఁజెప్పఁ దలంచుకొన్న మతమున కనుకూలముగా నొకయూహాను బొడమునట్లు చేయును. సత్యమార్గము నే నెమకఁ బ్రయత్నించువా రరుదుగ నుందురు. అట్టివారియూహాలుకూడ నన్నియు సరియైనవి కావనవచ్చును. ఇఁక మొండిపట్టుదలగలవారియూహాలకు సత్యమునకు నెంతదూరముండునో వేఱుగఁ జెప్పవలయునా?

కొందఱు రామాయణము కేవల కల్పితకథ యందురు. రామచంద్రుఁడే యవతరింపలేఁ డందురు. ఏదో యొకదేశమున నొక్కమహాత్మునిధర్మపత్నిని నాగరకతగల వేఱొకఁ

డపహరించికొని పోఁగా నతఁడు మరల సాధించికొని తెచ్చు
కొనెనఁట. ఆపడంతిమిన్నం గూడి సంసారయాత్ర గడపెనఁట.
ఆమహాకథ లోకప్రసిద్ధిని గాంచఁగా దానఁగలసారస్యము
నెఱింగి యెవరో యింతటిపుణ్యకథ లేకున్న లోకమునకే హాని
కల్గుననియు, మోక్ష మెల్లరకుఁ జేకూరుమార్గమే నశించు
ననియుఁ దలపోసి తరపడి రామాయణమును సంస్కృత
భాషను వ్రాసిరనియు, దీనిం బఠింప మహాఫల మబ్బుననుట
దబ్బఱయనియుఁ గొందఱు మేధాశక్తిసంపన్నులు చరిత్ర
మును దెలుపు గ్రంథములఁ బఠించి పఠించి యప్పాండిత్యబల
మున నిట్లు పలుకుదురు. వారిపలుకులు వ్రాఁతలు వేదతుల్యము
లనియు యుక్తాయుక్తములనియు నమ్మువారు కొందఱు పురాణ
ముల నితిహాసములను రామాయణమహాకావ్యమును బరిశీలింప
కయే యివన్నియుఁ దప్పులందురు. మఱికొందఱు మహనీయు
లేవో నాలుగుశ్లోకములం బఠించి తిరస్కృతవ్యాసమహర్షులై
పురాణాదులు పరస్పరవిరుద్ధములనియు, నీకారణముననే యెం
దఱో తోఁచినట్లు వ్రాసిరని తేలుచున్నదనియుఁ బలుకుదురు.
ఇంకను గొందఱు పురాణాదులలోఁ బెక్కుభాగములను వేఱు
వేఱుకాలములయందుఁ గొందఱు తోఁచినట్లు తమయాశయ
ముల కనుకూలముగాఁ జేర్చిరందురు. అది నిజమే యని
కొందఱు మహర్షితులు లు చప్పట్లఁగొట్టుచు నుపన్యసించుచు
వేదికపై నృత్యముచేయుచుండఁ బ్రేక్షకు లానందసాగరమున
నోలలాడుచు శిరఃకంపములఁ దమయాశయముల వెలిఁబుచ్చు
చుందురు. మఱియుఁ గలుగు కొంద ఱీమహారహస్యవిషయ
ముల నెల్లరకు బోధించుచుఁ బూర్వుల నిందించుచు సంతసించు

చుందురు. వీరెల్లరకు నిదియే పరమపురుషా మని తోఁచి
యుండుననుట నిస్సంశయము. వీరలకు సమాధానము చెప్పఁ
బూనుట వృథాకాలక్షేపమే కాక నిష్ఫలముకూడ నగును.
ఎన్నివిధముల బోధించినను గామిలారోగపీడితుల కెల్లవస్తువులు
పచ్చగాఁ గనఁబడినట్లు నిస్సారములుగాఁ దోఁచునే కాని యం
దిసుమంతయు సత్యముకలదని తోఁపదు. కావున నట్టివారికిం
దెలిపి యద్దానఁ గలఁగఁగలమహాకీర్తి నార్జింపఁ బూనక
పామరులకుఁ దెల్పినఁ గొంతఫలము కలుగును. దానఁ బామ
రులు భగవంతు నారాధింపఁజాలుదురు. పైవారు గ్రహింపఁ
గాని భగవంతుని సేవింపఁగాని పనికిరారు. వారట్లు భగవత్క
థల దూషించుచు నానందింపనిండు. దానఁ బురాణములు
లోనగువానికిఁ గొఱంత యావంతయు లేదు. వారికిఁ బ్రమాణ
ములగు చరిత్రగ్రంథములుకూడఁ బరస్పరవిరు ములుగనే
యుండును. ఒక్కరు వ్రాసినట్లు వేఱొక్క రావిషయమును
వ్రాయరు. కాని యాతప్పులను వారాక్షేపింపరు. ఇంతవనుక
మన దేశచరిత్రము నొక్కరీతిగా వ్రాసినవారు కనఁబడరు. ఐనను
వారినిగాని త ంథములనుగాని దూఱువారు కానరారు.
ఇట్టివారే పురాణముల నాక్షేపించువారు. కావున వారిప్రశ్న
ములను లెక్కచేయక మనము భగవత్కథలఁ జదువుకొని
యానందించు టుత్తమము. క్రమముగా వారుకూడ నీకథలఁ
బరికించి విశ్వాసవంతులై కృతార్థులగుదురుగాక!

శ్రీరామాయణము కల్పితమే యనువాద మాస్తికుల
మనస్సులను జలింపఁజేయఁజాలదు. సూర్యునిపై నుమిసినట్లు
తద్భాషణములు కొంతకాలమునకు వారిమనస్సులనే బాధింపఁ

గలవు. భగవంతుఁడే లేఁడనియు, నుండినచో నిపుడు వచ్చి మాటలాడవలయుననియు బల్లలు గ్రుద్ది యార్భటించినకొందఱు మఱికొంతకాలమునకే పరేశ్వరుఁడు కలఁడనియు, మహర్షులున్నవారనియు, వారితో మాటలాడితిమనియు, వారు తమ తపస్సులనెల్ల లోకక్షేమమునకై ధారవోయుచున్నవారనియు, నింక నెన్నియోవిధములఁ బలుకుచుండఁ దలలూచుచుండ లేదా. వారిపల్కుల నెందఱో యాదరించుచుండుట లేదా. వారు చెప్పెడియుక్తులను శిరసావహించి నమ్ముచుండుట లేదా. భగవద్భక్తులామాటలకుఁగాని యీమాటలకుఁగాని చలించుటయే లేదు. దేవుని దూషించునపుడు వారిదుష్కర్మమునకు వగచిరి. భూషించునపుడు సత్కర్మము చేయుచున్నవారని యానందించిరి ఇన్నిమార్పులుగలవారు వారేకాని భక్తులు గారు కదా. కావున శ్రీరామచంద్రునవతారము కల్పితమను వారిదుర్వాదమునకు భయంపడనక్కఱలేదు. భగవంతుఁడు ధ్యానగమ్యుఁడు కావున రామరూపమున నవతరింపకున్న నవతరించినట్లు సంభావించి యారూపమును మదినిల్పినచో దాన మేలుగలుగునేకాని హాని యేనాఁటికిఁ గలుగదు. కాఁబట్టి మనము దురావాదమని దూషింపఁబని లేదు. దానిజోలికిం బోకుంటయే మంచిది. ఐనఁ గొందఱు కిది నిజమేమో యని తోఁచును. వారు నాస్తికులు గారు. పరమాస్తికులు గారు. సంశయములు తీర్చినవారు పరమాస్తికులే యగుదురు. కాఁబట్టి యావిషయమును వ్రాయవలసివచ్చెను. సమాధానము కూడ నాయాయితావుల వ్రాయుదును మఱికొందఱు భారతమునకు ముందే రామాయణము జరిగినదనుట సత్యము కాదందురు.

కొన్ని కారణములఁబట్టి భారతమే ముందు సాగినదందురు. ఆయాక్షేపములకుంగూడ వేఱొకభాగమున సమాధానము వ్రాయుదును. ఏలయనఁగా నీసంపుటమంతయు నీచర్చలతో నిండిన శ్రీరామచరిత్రము వినుకుతూహలమున నుండుభక్తులకు నిస్పృహకల్గించినవాఁడ నగుదును. కాఁబట్టి ప్రకృతవిషయమునకే కడంగుదును.

భగవంతుఁ డవతరింపఁ దగినన్ని కారణము లుండవలయును. లోకమునఁ త్రేతాయుగాంతమున నట్టికారణము లేవియుండెనో మన మెఱుంగవలయుఁగదా. ప్రధానముగా శ్రీరామాయణము పురాణాదులఁబట్టి మనము పరికింతము.

"చతుష్పాత్సకలో ధర్మస్సత్యం చైవ కృతే యుగే,
నాధర్మేణాగమః కశ్చిన్మనుష్యాన్ ప్రతి వర్తతే. ౮౧
ఇతరేష్వాగమాద్ధర్మః పాదశ స్త్వవరోపితః,
చౌరికానృతమాయాభిర్ధర్మ శ్చాపైతి పాదశః. ౮౨
అరోగాస్సర్వసిద్ధార్థాశ్చతుర్వర్ష శతాయుషః,
కృతే త్రేతాదిషు హ్యేషామాయుర్హ్రసతి పాదశః. ౮౩
వేదోక్తమాయుర్మర్త్యానామాశిషశ్చైవ కర్మణామ్,
ఫలంత్యనుయుగం లోకే ప్రభావాశ్చ శరీరిణామ్. ౮౪
అన్యే కృతయుగే ధర్మాస్త్రేతాయాం ద్వాపరేఽపరే
అన్యే కలియుగే నృణాం యుగహ్రాసానురూపతః. ౮౫
తపః పరం కృతయుగే త్రేతాయాం జ్ఞానముచ్యతే,
ద్వాపరే యజ్ఞమేవాహుర్దానమేకం కలౌ యుగే." ౮౬

మనుస్మృతి. ౧ అధ్యా.

(కృతయుగమున శాస్త్రము నతిక్రమించి యేమియొనరించిన

నొకలాభము మానవులకుఁ గలుగదు. కాన నందు నాల్గుపాద
ములు గలదిగా నుండును. త్రేతాయుగాదులయందు నధర్మ
మున ధనవిద్యాదు లించుక లభించుకారణమున ధర్మము వరు
సగా నొక్కొక్కపాదమువంతు క్షీణించును. తొలియుగమున
మర్త్యుల కాయుస్సు నాలుగువందల సంవత్సరములు. త్రేతా
యుగాదుల నొక్కొక్కభాగము తగ్గుచుండును. కృతయుగ
మునఁ గలధర్మములు త్రేతాయుగమున నన్నియు నుండవు.
మాఱుచుండును. కృతమునఁ దపస్సే యుత్కృష్టధర్మము.
త్రేతాయుగమున నాత్మజ్ఞానము. ద్వాపరమున యజ్ఞము,
కలియుగమున దానము ననునివి ముఖ్య ధర్మములు.)

"అన్యే కృతయుగే ధర్మాస్త్రేతాయాం ద్వాపరే యుగే,
అన్యే కలియుగే నౄణాం యుగరూపానుసారతః. ౨౨
తపః పరం కృతయుగే త్రేతాయాం జ్ఞానముచ్యతే,
ద్వాపరే యజ్ఞమిత్యాహుర్దానమేవ కలౌ యుగే." ౨౩

పరాశరస్మృతి. ౧ అధ్యా.

"తపో ధర్మః కృతయుగే జ్ఞానం త్రేతాయుగే స్మృతం,
ద్వాపరే చాధ్వరః ప్రోక్తస్తిష్యే దానం దయా దమః."

బృహస్పతిస్మృతి.

ఈస్మృతులంబట్టి చక్కఁగాఁ బరీక్షించిన యుగములమార్పు
వలన మానవులకృత్యము లెట్లు మార్పునొందునో తెలియఁ
గలవు. త్రేతాయుగమున నాత్మజ్ఞానము సంపాదించుటయే
ప్రధానధర్మానుష్ఠానమని తెలిసికొంటిమి. ఇతరయుగములధర్మ
ములు చేయరాదని భావముకాదు. ప్రధానధర్మ మీయుగ
మున నిదియని సారము. త్రేతాయుగమున నాత్మజ్ఞానము.

సంపాదించుకొన మానవులు ప్రయత్నింప వలసియుండును. ఆత్మజ్ఞానము సామాన్యముగా లభించునదియా? కాదు. బహుకాలభగవద్ధ్యానసాధ్యము.

త్రేతాయుగమునందుఁ గొంతకాలము జరగఁగా నానాభాగములయందు ధర్మధ్వంసకులగు రక్కసులు బయలువెడలిరి. మానవుల భక్షింపసాగిరి. నగరములు గ్రామములు పల్లియలు నిరంతరరాక్షసబాధాధిక్యమున కోరఁజాలనివయ్యెను. మునులు కాననముల నివసించి ఫలమూలాదుల భక్షించుచు నిరంతరనియమమునఁ దపస్సొనరించువారలయ్యు వారిబాధల కోరఁజాలక

"యస్మాదేష సురేంద్రాణాం మాత్రాభిర్నిర్మితో నృపః,
తస్మాదభిభవత్యేష సర్వభూతాని తేజసా. ౫
బాలోఽపి నావమంతవ్యో మనుష్య ఇతి భూమిపః,
మహతీ దేవతా హ్యేషా నరరూపేణ తిష్ఠతి. ౮
స రాజా పురుషో దండస్స నేతా శాసితా చ సః,
చతుర్ణామాశ్రమాణాం చ ధర్మస్య ప్రతిభూః స్మృతః." ౧౭
మనుస్మృతి. ౭ అధ్యా.

అనుస్మృతిప్రకారము ధర్మరక్షకులగు రాజుల నాశ్రయించిరి. వారు తెగించియుద్ధముచేసి వారిచే నిహతులైరి. ఇట్లు మహత్తర ప్రజాపీడ భూతలమునఁ గలిగెను. ధర్మము నాచరింపఁబూనిన రక్షోబాధ కలుగుచుండెను. పతివ్రతలకష్టములు వచింప నలవిగాకయుండెను. శిశువులు కంటఁబడినంతనే రాక్షసులు కొనిపోయి భక్షించుచుండిరి. వారిపాటుచూచుచుఁ దల్లిదండ్రులు రోదనముతప్ప పితౄక్యకార్యము చేయఁజాలకయుండిరి.

మహారణ్యములయం దేమూలలయందో దాఁగియుండవలసిన యవస్థ మునులకుఁ గల్గెను. అరణ్యభాగములు విశేషభూభాగము నావరించి దుస్తరములుగా నుండెను. త్రోవలయందు వేచియుండి రాక్షసులు మానవులం గొనిపోయి భక్షించుచుండిరి. స్త్రీల నెత్తుకొనిపోవుచుండిరి. పూరుషులు భార్యలు మొఱ్ఱయిడుచుఁ బోవుచుండఁ జూచుచు నేమియుఁ జేయఁ జాలక పరితపించుచుండిరి. వారిదుఃఖముల నాలకించి ప్రతిక్రియఁ జేయఁ జింతించువారుగాని లేకయుండిరి అందందు నగరములలోఁ గొందఱు రాజులు సమర్థులున్నను వారు తమ దేశమును గాపాడుకొనుటయందే నిరంతరము కాలము గడుపఁదగువారలైరి.

యజ్ఞములు చేయఁబూనినచో దుష్టులగు రాక్షసులు రక్తమాంసములఁ గురియించి వానిఁ జెఱచుచుండిరి. తపశ్శక్తిసంపన్నులగు వారిం జంప నోడియు వారికృత్యములను బాధ చేయుచుండిరి. అఱచేతులఁ బ్రాణములుంచుకొని మునులు తత్పత్నులు తత్పుత్రులు దిన మొకయేఁడుగాఁ గాలముపుచ్చుచుండిరి దానవాంగనలు స్వేచ్ఛగాఁ దిరుగుచుఁ ద్రోవలఁ గాచియుండి రాకపోకలు చేయువారలఁ బట్టుకొని తినుచుండిరి. సుందరాకారులఁ జూచినంతన వారిం గామించుచుండిరి. వారి దయకుఁ బాత్రులుకాని పూరుషులు దండింపఁబడుచుండిరి. కొందఱు హింసింపఁబడుచుండిరి. కొందఱు రక్కసులు వికృతవేషముల జంతువుల హింసించుటయే ప్రధానకృత్యముగాఁ జేయుచుండిరి. కాననములెల్ల మానవాగమ్యములుగ నుండెను. పరోపకారము చేయఁగలవారలుండినను రాక్షసనాయకులయా

గ్రహమునకుఁ బాత్రులు కాఁజాలకయుండిరి. ఒక్కొక్క రాక్షసుఁ డొక్కొక్క భూభాగమును గైవసముచేసికొని నే చ్ఛగా నేలుచుండెను. వలసినతఱి వనితలం గొనిపోవుచుండుట వారికి స్వభావమైయుండెను.

ఇన్ని కడగండ్లుకలిగినను మహర్షులు గహనములయందాశ్రమములఁ దపోబలమునఁ గాపాడుకొనుచు సత్రయాగములనుజేయుచు శిష్యుల విజ్ఞానవంతులనుగా నొనరించుచునే యుండిరి. అనసూయ లోపాముద్ర మొదలగుసాధ్వీ మణులు పతిసేవాపరాయణత మునఁ దమ్ము రాక్షసులు కన్నెత్తియైనఁ జూడఁజాలక తిల్లుచుండఁగా నుండకపోలేదు. ఎందోతప్ప సాధారణముగా నాలోచించినఁ బురంధ్రీలలామలకు నిరంతర రాక్షసబాధలు గలుగుచునే యుండెను.

ఇట్టి మహాన పరంపరలు భూలోకమునఁ గలుగుచుండ దేవతలు వారియధిపతియగునింద్రుఁడు వారినడంపఁజాలక యజ్ఞాదిసత్కర్మములు సాగమిబలహీనులై యేకార్యము చేయఁజాలక పరితపించుచు సర్వేశ్వరుని బ్రార్థించుచుండిరి. తమ్ము రాక్షసులు బాధింపకయుండఁ గాపాడుకొనఁజాలనివారిక మానవుల కెట్లు సాయపడఁగలరు? ఏదినము రాక్షసవీరులువచ్చి తమపురములను ముట్టడింతురో యని జాగరూకులై యుండిరే కాని ఱొమ్ములపైఁ జేతులువైచుకొని హాయిగా నిద్రపోయిన వారు కారనుట సత్యము. ఇఁక నట్టి యశక్తులు మానవులకుఁ దోడ్పడి రక్కసుల నుక్కడంచుట యెక్కడ? స్వర్గమున దేవతలు భూలోకమున మానవులు రేయింబవళ్లు రక్షఃపతులను దత్సేనలను భగవంతుఁ డెప్పుఁడవతరించి వధించి మమ్ముం గాపా

డునా యని వేచియుండిరి. భగవంతుఁడు వారిదీనాలాపముల నాలకించుచునే యుండెను. కాని కాలమునకు వేచి యుండెను.

సరేశ్వరుఁడుకూడఁ గాలము నిరీక్షింపవలయునా యన్న ప్రశ్నము కొందఱుచేయుదురు వారికిఁ గాలము వేఱు భగవంతుఁడు వేఱు అనుభావము గలిగియుండవచ్చును. భగవంతుఁడు తా నాజ్ఞాపించినమార్గముల నుల్లంఘింపఁడు. భగవదాజ్ఞ లనఁగా శాస్త్రములే. ప్రాణులు తమరుచేసికొన్న కర్మముల ఫలముల ననుభవించుచుందురు. ఆయనుభవమే కాలము. అది ముగియునంతదనుక నెవరు నేమియుఁ జేయఁజాలరు. "కర్తుమకర్తు మన్యథా కర్తుం సమః పరమేశ్వరః" అన్నసూక్తి ప్రసిద్ధమే. సరేశ్వరుఁడు పూనుకొనిన దేనినైన మార్పఁగలఁడు. కాని సత్యరూపుఁడగు భగవంతుఁడు సోక్తులకు విరుద్ధముగాఁ గార్యముఁ జేయఁబూనఁడు.

"యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్. ౨౩
తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి." ౨౪

గీత. ౧౬ అధ్యా.

అనునవియే భగవదుక్తిరూపమగుశాస్త్రము. ఒకవిధమగుకర్మ మొనరింప నొకఫలము గలుగునని శాస్త్రము విధించును. ఆరీతిఁ బ్రవర్తించినవాఁ డాఫలము ననుభవింపకపోవఁడు. అట్లు వాఁడనుభవించుచుండ వానివలన నితరులకుఁ గష్టములుకలిగినను భగవంతుఁడు తత్ఫలానుభవకాలమును గుఱుచసేయఁడు

ఎవరివలననో కష్టము లనుభవింపఁదగుకర్మము నాప్రజలు చేసియుందురు. కావున నీయిరువురను సాక్షిమాత్రుఁడై చూచుచుండును. పరిపక కాలము రాఁగాఁ గర్మఫలానుభవము వారికిఁ గలుగఁజేయ దదనురూపమగు రూపమును ధరించును. కావునఁ గాలమును బ్రతీక్షించుట భగవంతునకు న్యాయ్యమే కాని యితరము కాదు.

"న హి కారణం వినా కార్యస్యోత్పత్తిః"(కారణము లేక కార్యము కలుగదు) అన్న న్యాయము ననుసరించి భగవదవతారమునకుఁ దగినన్ని కారణము లుండవలయును. మానవుల కష్టములు దేవతలయభ్యర్థనము ధర్మమునకు విచ్ఛిత్తి యనునివి హేతువులు. పరమేశ్వరుఁ డవతరించుటకుఁ దగినయదృష్టము చేసికొన్న కుటుంబము కావలయును. కరుణాశరధిని గుమారునిగాఁ గాంచఁగల్గుట మహాభాగ్యము కాదా. దానిని మించఁదగు భాగ్య ముండునా. అనేకజన్మకృతసుకృత పరిణతి కదా యాభాగ్యము. అట్టి భాగ్యముకలకుటుంబముకూడ వేచియుండెను. తాను వైకుంఠమునుండి బయలువెడలఁ దగు ముహూర్త మొక్కఁడుమాత్రమే సిద్ధము కావలసి యుండెను. దానికై పరమాత్మ కాచుకొనియుండెను.

## భగవదారాధనము.

ఇన్నియు సిద్ధమై యుండెను. ఇన్నింటికి సరియగు కారణము వేఱొండు కలదు. అదియే భగవదారాధనము. మానవ లోకమున భగవంతు నేయేచిహ్నములుగలవానిగా భక్తులారాధింపఁదలఁతురో దాని కనుగుణమగు రూపమును బరమాత్మ గ్రహించును. అంతియకాని యారూపమే యామహ

నీయమూర్తికి సమ్మతము. వేఱొకఁడు కాదనరాదు. ఏలయనఁగా నతఁడరూపుఁడు. కారణము సరూపుఁడగును. సరూపుఁడే ప్రకృతివిశిష్టుఁడనఁబడును. సగుణబ్రహ్మమనియు నాతనిం బిలుతురు. త్రిగుణవిశిష్టయే ప్రకృతి. ఆసగుణబ్రహ్మము నెల్ల రారాధింతురు. ఈయారాధన మనేకభేదములుగలది. అందు ధ్యానరూపమగునర్చనము ప్రధానము దానిఁ దెలుపుమార్గమునకే సమయాచారమనిపేరు. షట్చక్రములయందే సాభీష్టదేవతారూపమును నిలిపి ధ్యానింపుటయని దానిసారము. ఆధ్యానమున కిట్టిరూపమే యుండవలయు నను నియమము లేదు. భక్తుఁడుమనస్సంకల్పానుసారము రూపముకల్పించుకొనందగు. సర్వ రూపములుగలవాఁడా భగవంతుఁడేకదా. తేజోరూపునిగాఁగాని శంఖచక్రాద్యాయుధవిశిష్టకరచతుష్టయవిరాజితునిగాఁగాని, కపాలాదిచిహ్నముల ధరించినశంకరునిగాఁగాని, లేకసింహాసనస్థయగు పరమేశ్వరీరూపమునఁగాని, మఱియుఁదనకిచ్చవచ్చిన యితరచిహ్నములుగలరూపునిగాఁగాని ధ్యానింపవచ్చును. ఆ యర్చనమునకు వస్తువు లక్కఱలేదు. పరిశుద్ధ నిశ్చలమనస్సు మాత్రమే కావలయు. అదియున్న నితరవస్తువు లక్కఱలేదు. అదిలేకున్న నెన్నిపరికరము లున్నను ఫలములేదు. పామరులకుఁ దృష్టినిగ్రహించుపొంటె నీవస్తువులు చెప్పఁబడియెను. పరమపావనములగుపుష్పాదులం బూజించి పూజించి యామూర్తిని మదిని నిల్పి నధ్యానము చేసికొని పిదప బాహ్యపూజ మానవలయును తొలుతనే బాహ్యపూజ మానరాదు. మానసికపూజ యెల్లరకు శక్యముగాదు. బాహ్యపూజానిరతిగలిగి భగవత్కృపకు బాత్రుఁడెవ్వఁడగునో యాతఁడే మానసికారాధనమున కర్హు

డగును. అట్టివాఁడే భగవత్కారుణమునకుఁ బాత్రుఁడయె నని మన మూహింపవచ్చును. కొందఱు బాహ్య పూజయే వల దందురు. వా రలసులని చెప్పఁదగుదురు బాహ్య పూజయనఁగా విగ్రహా రాధనమని యర్థము. ఆవిగ్రహము రత్నసువర్ణరజతతామ్రాది నిర్మితము కావచ్చును. అందు త్తమోత్తమములు గలవనుట పామరుల లోభగుణమును బరీక్షించుటకే యని యెఱుంగ వలయును. అనఁగా ధనవంతుఁడు లోభియై మృత్పాషాణాది కృతవిగ్రహమును బూజింపరాదు. దరిద్రుఁడేయైన వానినే పూజింపవచ్చును. ధనవంతుఁడు రత్ననిర్మితప్రతిమను భక్తిచేఁ బూజించిన నే ఫలముకలుగునో దరిద్రుఁడు మృత్తికచే నిర్మిం చినప్రతిమను భక్తిగలిగి పూజించిన నాఫలము గలుగును. దీనఁ దేలెడి సారమేమి? ప్రతిమ ధ్యానమునకే యని భక్తిప్రధాన మనియేకదా. ఎవా నిమన స్సేయాకృతిం గోరునో యాయా కృతులని బూజింపవచ్చును. శక్తిరూపునిగాఁ బూజించినను ఫలముగలుగునా యని కొందఱు ప్రశ్నింతురు వారికి శక్తి యన్న సాధనము గలుగునుగాఁబోలు. ఒక్కరూప మాపర మాత్మకుఁ గలదని వేఱొక్కరూపము లేదనిచెప్పుట సమంజ సముకాదని ముందే వ్రాసితిని. మరల వ్రాయుట స్పష్టముగా నెల్లరకుఁ దెలియుకొఱకే యని భావింపందగు ఉపనిషదా క్యములఁ దిలకింపుఁడు.

"అశబ్దమస్పర్శమరూపమవ్యయం
తథారసం నిత్యమగంధవచ్చ యత్,
అనాద్యనంతం మహతః పరం ధ్రువం
నిచాయ్య తం మృత్యుముఖాత్ప్ర ముచ్యతే. 3 వ వల్లి.

అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో

రూపం రూపం ప్రతిరూపో బభూవ,
ఏక స్తథా సర్వభూతాంతరాత్మా
రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ. ౯

వాయుర్యథైకో భువనం ప్రవిష్టో
రూపం రూపం ప్రతిరూపో బభూవ,
ఏక స్తథా సర్వభూతాంతరాత్మా
రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ. ౧౦

సూర్యో యథా సర్వలోకస్య చక్షు
ర్న లిప్యతే చాక్షుషైర్బాహ్యదోషైః,
ఏక స్తథా సర్వభూతాంతరాత్మా
న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః. ౧౧

ఏకో వశీ సర్వభూతాంతరాత్మా
ఏకం బీజం బహుధా యః కరోతి,
తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరా
స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్. ౧౨

నిత్యో నిత్యానాం చేతనశ్చేతనానా
మేకో బహూనాం యో విదధాతి కామాన్,
తమాత్మస్థం యేనుపశ్యంతి ధీరాస్తేషాం
శాంతిశ్శాశ్వతీ నేతరేషాం." ౧౩

కఠోపనిషత్తు. ౫ వల్లి.

బహిశ్చ=స్వేనావికృత స్వరూపేణాకాశవత్. అని శంకరభాష్యము. దీనిసార మేమనఁగా నొక్కరూపమే పెక్కురూపములుగా నగునని వాస్తవమున రూపమే లేదని యెవ రీవిషయము నెఱుంగుదురో సరాంతరాత్మనుగా నాపరమాత్మను గాంతురో వారే ధను లని.)

"ఇదంవై తన్మధు దధ్యఙ్ఙాథర్వణోఽశ్విభ్యామువాచ తదేతదృషిః పశ్యన్నవోచత్ రూపగ్ంరూపం ప్రతిరూపో బభూవ తదస్య రూపం ప్రతిచక్షణాయ"............... ౧౯

బృహదారణ్యకోపనిషత్తు. ౪ అధ్యా.

"సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖం,
సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి. ౧౩
సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితం,
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ. ౧౪
బహిరంతశ్చ భూతానామచరం చరమేవ చ,
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్." ౧౫

గీతాశాస్త్రము. ౧౩ అధ్యా.

ఇట్లనేకప్రమాణములు గలవు. వీనిసార మొక్కవిధముగనే యున్నది. గ్రంథవిస్తర భీతి నింకను వ్రాయక వదలెదను. ఇంకఁ బ్రకృతి పురుషునివదలి యుండునదికాదనుటకు నొకటిరెండు ప్రమాణములు చూపెదను.

"సంయుక్తమేతత్క్షరమక్షరం చ
వ్యక్తావ్యక్తం భరతే విశ్వమీశః,
అనీశశ్చాత్మా బధ్యతే భోక్తృభావాత్
జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః." ౮

శ్వేతాశ్వతరోపనిషత్తు. ౧౦ అధ్యా.

"మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరం
అస్యావయవభూతైస్తు వ్యాప్తం సర్వమిదం జగత్." ౧౦

శ్వేతాశ్వ. ౪ అధ్యా.

"మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహం,

సంభవస్సర్వభూతానాం తతో భవతి భారత. ౩

గీత. ౧౪ అధ్యా.

"మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరం,

హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే." ౧౦

గీత. ౯ అధ్యా.

"తదేతదక్షరం బ్రహ్మ సప్రాణస్తదువాఙ్మనః,

తదేతత్సత్యం తదమృతం తద్వేద్ధవ్యం సోమ్యవిద్ధి. ౨

యస్మిన్ ద్యౌః పృథివీ చాంతరిక్షమోతం మనస్సహ ప్రాణైశ్చ సర్వైః."౫

ద్వితీయముండకోపనిషత్తు. ౨ ఖండము.

"మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ,

మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ." ౭

గీత. ౭ అధ్యా.

"మూలప్రకృతిరేవైషా సదా పురుషసంగతా,

బ్రహ్మాండం దర్శయత్యేషా కృత్వా వై పరమాత్మనే. ౫౯

ద్రష్టాసౌ దృశ్యమఖిలం బ్రహ్మాండం దేవతాస్సురా,

తస్యైషా కారణం సర్వా మాయా సర్వేశ్వరీ శివా. ౬౦

క్వాహం వా క్వ సురాస్సర్వే రమాద్యాస్సురయోషితః,

లక్షాంశేన తులామస్యా న భవామః కథంచన." ౬౧

దేవీభాగ. 3 స్కం. 3 అధ్యా.

విగ్రహార్చన మల్పఫలమే యనుట కుదాహరణములఁ గొన్నింటిని జూపెద.

"యద్వాచా నభ్యుదితం యేన వాగభ్యుద్యతే,

తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే. ౪

యన్మనసా న మనుతే యేనాహుర్మనో మతం,

తదేవ బ్రహ్మ త్వం వి నేదం యదిదముపాసతే. ౫

యచ్చక్షుషా పశ్యతి యేన చక్షూంషి పశ్యతి,
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే. ౬
యచ్ఛ్రోత్రేణ న శృణోతి యేన శ్రోత్రమిదం శ్రుతం,
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే. ౭
యత్ప్రాణేన న ప్రాణితి యేన ప్రాణః ప్రణీయతే,
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే." ౮

కేనోపనిషత్తు. ౧ ఖండము.

నారాయణవిరచిత కేనోపనిష దీపికలో

ఈశ్వరేణ వసిష్ఠం ప్రతి.

"శృణు బ్రహ్మవిదాం శ్రేష్ఠ దేవార్చనము త్తమమ్,
న దేవః పుండరీకాక్షో న చ దేవస్త్రిలోచనః.
న దేవో దేవరూపో హి న దేవశ్చిత్తరూపకః,
అకృత్రిమమనాద్యంతం దేవనం దేవ ఉచ్యతే.
ఆకారాదిపరిచ్ఛిన్నే మితే వస్తుని తత్కృతః,
అకృత్రిమమనాద్యం తం దేవనం చిచ్ఛివం విదుః.
అజ్ఞాతశివతత్త్వానామాకారాద్యర్చనం కృతం,
యోజనాధ్వన్యశక్తస్య క్రోశాధ్వా పరికల్ప్యతే."

ఇత్యాది.

"పాషాణలోకమణిమృణ్మయవిగ్రహేషు
పూజా పునర్జననభోగకరీ ముముక్షోః,
తస్మాద్యతిస్స్వహృదయార్చనమేవ కుర్యా
ద్బాహ్యార్చనం పరిహరేదపునర్భవాయ."

మైత్రేయోపనిషత్తు. ౨ అధ్యా

ఇట్లనేక ప్రమాణములను జూపవచ్చును. వీనింబట్టి పరికింపఁగాఁ బ్రకృతిపురుషులకుఁ జంద్రచంద్రికలకువలె సూర్యాతపములకు

వలె నభేదమనియు, భగవంతుని విగ్రహరూపమునఁ బూజించుట యల్పఫలము నిచ్చునదియే యనియు సర్వవ్యాపకునిగా ధ్యానించుటయే యుత్తమఫలదమనియు నది శేక ముగాని పామరులకే బాహ్యార్చనము చెప్పఁబడియెననియు మన మెఱుంగవలయును.

ప్రకృతిసహాయములేక పురుషుఁ డేకార్యము చేయఁజాలఁడు. పురుషోత్తముని సాన్నిధ్యములేక ప్రకృతి కార్యమును దేని నొనరింపఁజాలదు. పరమాత్మ సంకల్పించును. ప్రకృతి బ్రహ్మాండముల నిర్మించును. త్రిమూర్తు లనఁబడు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ప్రకృతికల్పితులు.

"కరాంగుళినఖోత్పన్ననారాయణదశాకృతిః"

అన్న ప్రమాణము న్యాయము నే తెలుపుచున్నది. భగవత్సాన్నిధ్య బలమున నామూలప్రకృతి యనేకబ్రహ్మాండకోటుల క్షణకాలమునఁ గల్పించునన నిఁక నీమూర్తులను గల్పించుట యొకయచ్చెరువా, 'శ్రీరామో లలితాంబికా' యన్న సూత్రము సత్యమే యనవలయును. ఏలయనఁగా రూపవంతమంతయుఁ బ్రకృతిమయమే. కాని తద్భిన్నమేదియుఁ గానరాదు. ప్రకృత్యతీతుఁ డొక్కఁ పరంజ్యోతియే. త్రిమూర్తు లొక్కొక్క బ్రహ్మాండమునకు వేలువేలుగనుందురు. ఇంద్రాదులు నట్లే. ప్రకృతిపురుషులనఁబడు మహామాయాపరమేశ్వరులు సకలబ్రహ్మాండములకు నిరువురే. దీనింబట్టియే వారిమహత్త్వ మెఱుంగవచ్చును. ఇట్లెన్నివిధముల నాలోచించినను బ్రకృత్యతీతుఁ డొక్కఁపరమాత్మ తప్పఁ దక్కుఁగలవారెల్లఁ దద్వశగతులే యని తేలెడిని. కావున లలితాంబయే రాముఁడను పేర లోక

సంరక్షణా మవతరించెననువాదము యుక్తయుక్తమే. మహా క్రూరరాక్షసులనెల్ల బ్రహ్మవిష్ణుశంకరులు గెలువలేక పాఱి పోవఁగా మహాకాళి యనుపేర జగదంబ యవతరించి యడంప లేదా. రావణాదిరాక్షసు లారాక్షసులలో నేపాటి?

వైకుంఠమునుండి శ్రీమహావిష్ణు వవతరించెనని యనేక గ్రంథములు నుడువుచున్నవికదా యందురేని వైకుంఠవాసియుఁ బ్రకృతివిశిష్టుఁడే కాన నావాద మీవాదము నడంపఁ జాలదు. మఱియు విష్ణుభక్తులు రాముఁడు విష్ణువని భావించి పూజించిన నేఫలముగలుగునో శక్తిభక్తులు రాముఁడు శక్త్యవతారమేయని భావించి యారాధించిన నాఫలమే కలుగును. ఎల్లరూపములుగలవాఁ డొక్కఁడే యగుట నన్నిగ్రంథములు సత్యమునే తెలుపుచున్నవని మనము గ్రహింపవలయు. ఒక్క పురాణము ప్రమాణము వేఱొక్కఁడ ప్రమాణమని వాదించుట నిస్సారవాదము. అన్నియునొక్కపరబ్రహ్మమహిమమునే మార్గ భేదములచేఁ దెలుపుచున్నవని గ్రహించువారల కేగ్రంథము కూడఁ బ్రమాణముకాదని తోఁపదు. అన్నియు సత్యములే యని తోఁచును. దుర్మతాభిమానమను గ్రుడ్డితనముగలవార లకే సకలకష్టములు కలుగును. వారింగూర్చి సాధుమతు లనుతాపము నొందవలసియే యుండు. విగ్రహారాధన మల్పఫలము నిచ్చునదియనుట నిరి వాదాంశము. అంతరారాధన మనఁగా మానసికపూజ యుత్తమఫలదము. ఐనను బామరులకు మానసికపూజ చేయుశక్తి కలుగవలయునని పెద్ద లెఱింగి విగ్రహార్చనమును గల్పించిరి. ఆపద్ధతిని బూజించి దానికి ఫలముగా

సర్వాపకునిగా భగవంతు నెఱుంగవలయుననియే పూర్వుల భావము.

ఇఁకఁ బ్రకృతము ననుసరింతును. త్రేతాయుగాంతమున మానవులచిత్తములు భయాక్రాంతములై యుండెను. ఆముష్మిక విషయమును విచారించు నవకాశమే వారికిఁ గలుగక యుండెను. ఐహికసుఖముకూడ వారికిఁ గలుగక ప్రాణరక్షణమే ప్రధానకార్యముగా నుండెను. కావున సాధారణముగా జనులెల్ల భగవదారాధనమును మానిరనవలయును. వారిమనస్సులయందు భక్తిని గుదుర్పఁజాలినమార్గము భగవంతుఁ డవతరించి వారికి దర్శన మొసంగుటయే యనవలయును. వేఱొక మార్గ మాకాలమునకుఁ జాలినది లేకుండెను. భయము తొలఁగినఁగాని శాంతి మది నెలకొనదు. అది పదిలముగా నుండినఁగాని పారమార్థికచింత కవకాశము దొరకదు. అది దొరకినఁగాని భక్తి కలుగ నవకాశ మేర్పడదు. అది యేర్పడినఁగాని భగవంతునియం దాదరముగలుగదు. అది కలిగినఁగాని యైహిక సుఖములు తుచ్ఛములనుభావము పొడసూపదు. అదిపొడసూపినఁగాని శ్ర వెలయదు అదివెలసినఁగాని యుత్తమమార్గము కనఁబడదు. అదియే భగవంతునికడకుఁ గొనిపోవునది. ఆమార్గము కనఁబడునట్లుచేయుటకే పరమాత్మ ప్రయత్నించెను. ఆప్రయత్నమే రామావతారమని యెఱుంగవలయును.

ఇది విషయావతరణిక.

# బాలకాండము.

భగవంతుఁ డవతరింపఁబూనియుండెను. దేవతలు మునులు సమయమునకై ప్రతీక్షించుచుండిరి మానవు లెప్పుడెప్పు డీ కష్టములు గట్టెక్కునా యని పరితపించుచుండిరి. ఇఁక భగవంతుఁ డవతరించుకుటుంబ మేది యని విచారింపవలయును. భూలోకమున నెన్ని యో రాజకుటుంబములు గలవు. అవన్నియు సదాచారసంపన్నములే. కాని జగన్నాథుఁడు కొడుకుగాఁ బుట్టెఁదగిన యదృష్టము చేసికొన్న మహాపతివ్రత యెవ తయో. పవిత్రచిత్తుఁ డెవఁడో యెవ రెఱుంగుదురు? ఆతల్లిదండ్రులం బోలువా రెవ రుందురు? అదృష్ట మనఁగా నట్టిది కాక మఱెట్టి దగును? ఆవంశచరిత్ర మేమన ంతరమునందును నశించునది కాదు. ఎవరిచేతను దూషింపఁబడునది కాదు వేదమువలె స్మరించువారిని బావనచిత్తులనుగా నొనరించును. ఆచరిత్ర మునే యాపత్కాలములఁ బఠింతురు. ఆపదలు తొలఁగునన్న విశ్వాసము వారికిం గలిగియుండదు. ఎన్ని తపస్సులు, ఎన్ని దానములు, ఎన్ని వ్రతములు, ఎన్ని యాత్రలు, ఎన్ని యజ్ఞములు ఇంకనుగల మహాకార్యము లెన్ని చేసినను దద ంశచరిత్రమునకు సాటియగునే. దానింబోలుభాగ్యము కలదనవచ్చునే. అట్లనుట మహాపాపమన్నఁ గాదనువా రుందురే. అది నిరుపమానయశఃకీర్తి. మహాభాగ్యవంతము. పరమపావనము. అది గలవారు ముక్తింగోరరు. అవ్యయానందము దానఁ గలుగునన్న నమ్మకము వారికిం గలదు. ఆభాగ్యము కలుగవలయునన్న నేక జన్మములనుండి వరుసగా మహాపుణ్యముల నాచరించియుండ

వలయును. భగవంతుని సేవించియుండవలయును. తత్కారుణ్య యపారముగా వారిపైఁ బ్రవహించుచుండవలయును. లేకున్న నట్టిమహాభాగ్యము కలుగదనుట నిస్సంశయము. అట్టికుటుంబము రాజవంశమున సిద్ధముగా నుండెను.

బ్రాహ్మణవంశమున నేల పుట్టరాదు? అను ప్రశ్నము వచ్చును. విప్రవంశమునఁ బుట్టి పరశురాముఁడనఁ బ్రసిద్ధిఁ గాంచి దురారగరమున విఱ్ఱవీఁగు రాజులఁ బెక్కండ్ర నుక్కడంపలేదా. అట్లే యిప్పు డేలచేయరాదనరాదు? అని ప్రశ్నింపరాదు. పరశురామావతారచరిత్రమును బరికించిన నారహస్యము బయల్పడును. లోకరక్షణక్షమము సుక్షత్రియవంశమే యనవలయు. వామనావతారమునఁ జేయఁదగు కార్యము యాచన. కావుననే కశ్యపమునివంశమున నవతరించెను. వంశాచారము ననుసరించి యాచించెను. భగవంతుఁ డేవంశమునఁ బుట్టిన నేమి? మహాకార్యమును దేనినైనఁ జేయఁజాలఁడా యనరాదు. భగవంతుని ప్రవృత్తి లోకమున కుదాహరణము కావలయుఁగదా. కులవృత్తులు భగవదంగీకృతములే యని యీవర్తనము తెలుపుచున్నది

“చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః.”

అన్న భగవదుక్తియే పైవిషయమును దృఢపఱచుచున్నది. జాతిధర్మములు సంకీర్ణములు కారాదు. ఐనచో దాన మేలు రాదు. జాతికిందగు గుణము లుండవలసినవియే. సంకీర్ణగుణములు లోకోపకారము చేయఁజాలవు.

ఏవంశమున భగవంతుఁ డవతరింప నూహించునో యావంశమునసచ్చరితులే ముందుగజన్మింతురు. వారియశస్సు ప్రపం

చమున విశేషము వ్యాపించియుండును. దానిం గాంచి యెల్ల రట్టియశస్సు నార్జింపఁగోరుదురు. అపకీర్తి లేశముకూడ నందు వ్యాపించియుండదు. లోకరక్షణకు మముగా నావంశముండును. సకలసాధులక్షణములం దిమిడియుండును. మహర్షు లావంశము నాశ్రయించియుందురు. ఆకుటుంబముచేఁ బరిపాలింపఁబడు రాజ్యమునఁ బరిశు మనస్కులే పెక్కండ్రుందురు. ఈతిబాధలు లేక యాదేశముండును. సకలదేవత లాకుటుంబము నభివృద్ధి చేయఁ బూనియుందురు. సర్వవిధములఁ బరిశుద్ధముగ నుం నఁగాని పవిత్రశబ్దవాచ్యము కాదు. బాహ్యశు యుండినట్లే యంతశ్శుద్ధియు నుండవలయును. బాహ్యశుద్ధి కొఱంతపడిన నంతశ్శు చక్కఁగాఁ గుదిరినఁ జాలును. అంతశ్శు లేక బాహ్యశు యెంతయుండినను బరమార్థమునకు లాభము లేదు. ఆరోగ్యమున కుపకరించు నేమో.

ఇట్లు సకలవిధసౌభాగ్యములు గలవంశము సూర్యవంశమైయుండెను. ఆవంశమున మనువు, ఇక్ష్వాకువు, మాంధాతృ ప్రముఖులును, దిలీపభగీరథరఘుప్రభృతులు మహావిఖ్యాతి మించువారు పెక్కండ్రు జనించిరి. ఒక్కొక్కరు బ్రహ్మాండము నేలఁగలవారే కాని సామాన్యులుగారు. అనేకయజ్ఞముల నాచరించి చాంద్రాయణాదివ్రతముల నొనరించి సకలపుణ్య నదులం గ్రుంకులిడి ధర్మమును జక్కఁగా రక్షించి దురాత్ముల శిక్షించి పక్షపాతశూన్యులై శమదమాది సుగుణభూషితులై మహోదాత్తులై సదాచారములఁ దప్పకయుండ రక్షించుచుఁ దనయులయందు రాజ్యభారము నిచ్చి మునివృత్తి గాలముం ద్రోయుచు యోగము నభ్యసించి ప్రాణములవదలి స్వర్గాది

మహాపుణ్య లోకములఁ జూఱఁగొనినవారే. అం దొక్కఁడైన
నేచ్ఛాప్రవర్తకుఁడు కానరాఁడు. ఎల్లరు శాస్త్రములకు
లోఁబడి ప్రవర్తించువారలే. యాచకులకుఁ గల్పభూజముల
వంటివారలే. మహర్షులకు సదాచారముల నేర్పఁగలవార లనఁ
దగినవారలే. పరోపకారార్థము దేహముల నర్పించువారలే.
ఇన్ని రీతుల సుప్రసిద్ధి గలవారలు పుట్టుటంబట్టియే యావంశము
త్రిలోకవిఖ్యాతిం గాంచఁజాలెను.

ఈవిషయమునుండి మనము నేర్చుకొనఁదగినవస్తు
లేవనఁగా సదాచారమనునది బాహ్యాంతరములయందు సమా
నముగానుండవలయుననియు నోపినంతదనుకఁ బరోపకారపరా
యణులము గావలయుననియు జాతియే ప్రధానమని గణింపక
సుగుణములే ప్రధానములని భావింపవలయుననియు నాయాయి
కాలములయందుఁ దాఁజేయఁదగుసత్కార్యములు సోమరితన
మూని వదలరాదనియు నైహికమునకంటె నాముష్మికము
ప్రధానమని తలంపవలయుననియు నేక్షణమున సంసారభారము
వహింపఁగలవారు దొరకిన నట్టిపుత్త్రులపై దానింబెట్టి తొలఁగి
నిశ్చింతముగా నుండవలయుననియుఁ బెద్దలతోఁ జెలిమిగలిగి
యుండఁదగుననియు దుష్టులతోడి చెలిమి హానికరమగుట దాని
మానియుండవలయుననియు గర్వములేకయుండినఁగాని ప్రసిద్ధి
రాదనియుఁ దమమనస్సునఁ జక్క నాలోచించి శాస్త్రమును
బరికించి వృద్ధులు పూజ్యులు నగువారి నడిగి యేవిషయముగాని
తెలిసికొని యారీతిఁ బ్రవర్తిల్లవలయుననియుఁ బరబుద్ధి నమ్మి
ప్రవర్తింపరాదనియుఁ గ్రూరదండనము చేయఁ దలంపరాదనియు

మనస్సున వైరాగ్యసంపద గలిగియుండవలయుననియు ముఖ్యములగు సత్ప తులు. ఇఁకఁ గథను బరిశీలింతము.

ఈవంశము కాకుత్స్థమనఁ బరఁగుచుండెను. రఘుమహారాజు కాలమునుండి రఘువంశమని పిలువఁబడుచుండెను. రఘుమహారాజు విశ్వజిద్యాగ మొనరించి సర్వస్వము ఋత్విక్కుల కొసఁగి మృత్పాత్రములఁ గాలము గడపుచుండెను. సింహాసనచ్ఛత్రచామరాదుల నెవరికి నీఁగూడదుగాన నవిమాత్రము మిగిలియుండెను. అనఁగాఁ బ్రజలకు రాజు ప్రతినిధియనియు రాజ్యపాలనోచితములగు వస్తువులపై రాజున కధికారము లేదని యెఱుంగందగు. రాజు భోగపరుఁడై స్వేచ్ఛాప్రవర్తకుఁడై ధనము వ్యయింపరాదనియుఁ దెలియందగువిషయము. రాజునకుంగలయధికారము ప్రజలకుఁ బ్రతినిధియై న్యాయముతప్పక వారిఁ బాలింపవలయును. సర్వసుఖములు తా ననుభవించుచు ధర్మమునకు హాని రాకయుండఁ గాపాడవలయును. పక్షపాతరహితుఁడై దుష్టులశిక్షింపవలయును. ఈనియమముల నేదానిని దాఁటినను నరకములపాలగుటయే గాక యీలోకమున దుర్యశముపాలగును ఈనియమములఁ బాటించు రాజు లోకమాన్యుఁడగుటకు శంకయుండునే.

"దండో హి సుమహత్తేజో దుర్ధరశ్చాకృతాత్మభిః,
ధర్మాద్విచలితం హంతి నృపమేవ సబాంధవమ్. ౨౮
తతో దుర్గంచ రాష్ట్రం చ లోకం చ సచరాచరం,
అంతరిక్షగతాంశ్చైవ మునీన్ దేవాంశ్చ పీడయేత్. ౨౯
సో ఽసహాయేన మూఢేన లుబ్ధేనాకృతబుద్ధినా,
న శక్యో న్యాయతో నేతుం సక్తేన విషయేషు చ. ౩౦

శుచినా సత్యసంధేన యథాశాస్త్రానుసారిణా,
ప్రణేతుం శక్యతే దండ స్సుసహాయేన ధీమతా. 3(
ఏవం వృత్తస్య నృపతేశ్శిలోంఛేనాపి జీవతః,
విస్తీర్యతే యశో లోకే తైలబిందురివాంభసి. 3
అతస్తు విపరీతస్య నృపతే రజితాత్మనః,
సంక్షిప్యతే యశో లోకే ఘృతబిందురివాంభసి. 3
స్వే స్వే ధర్మే నివిష్టానాం సర్వేషామనుపూర్వశః,
వర్ణానామాశ్రమాణాం చ రాజా సృష్టోభిరక్షితా." :

మనుస్మృతి. 2 అధ

ఈస్మృతివాక్యములు పైవ్రాసినయభిప్రాయమును దృఢపఱ
చున్నవి కదా. ఈవిషయము ముందుముందు రామాయణ
నుండి తేటపడఁగలదు.

ఆరఘువంశమునందు దశరథుఁడు జన్మించి రాజ్యభ
మూనెను. ఈతనితండ్రి అజమహారాజు. అజునికీర్తి లోకవ
వ్యాపింపకపోలేదు. దశరథునిచరిత్రముతోడనే రామచం
చరిత్రమునకు సంబంధముకలదు. కాన నజునిచరిత్రము రా
యణమున విశేషించి చెప్పఁబడలేదు. దశరథునిచరిత్రము
త్రము. దాని నించుకయైన వ్రాసినఁగాని రామచంద్రచరిత్ర
వ్రాయ నవకాశములేదు. కావునఁ గొంతమాత్రము
దను. అదియు రామునికథకు సంబంధించినంతయే యిటఁ
బడును.

## దశరథచరిత్రసారము.

లోకమునం దించుకయైన యపరాధము చేయ
డుండఁడు. ఉండిన నతఁడు భగవంతుఁడే యగును. భగవఁ

యందును లోకదృష్టిఁ బరికింపఁ గొన్ని లోపము లున్నయట్లు కనుపట్టును. కాని జ్ఞానదృష్టిం బరిశీలింప నవి మంచివియే యగును. అలౌకికదృష్టి యందఱకు నుండదు. కావున మానవ సామాన్యదృష్టి నవలంబించి యెవా ని చరిత్రమునందును దోషము లున్నవని నిర్ణయింపరాదు. కొన్ని సుగుణములుకూడ సమయముననుసరించియుఁ గష్టానుభవమునుబట్టియు దుర్గుణములుగాఁ గొందఱకుఁ దోఁచును. వారు నిందింతురు. కాని నిందింపరాదని మన మనరాదు. ఏలన నాకష్టానుభవము మనకు లేదు. కాఁబట్టి మనదృష్టికి వారిదృష్టికిఁ జాలభేదము గలదు. అనుకూలసమయము దొరకునేని హితమాలకించుస భావము వారికిఁ గలదేని వారలకు మెల్లగాఁ దెలుపవచ్చును. వారి కాకల్మషము తీఱియున్న వారు నంగీకరింతురు. లేదేని తిర స్కరించి తమమతమును సిద్ధాంతముచేసికొన వాదింతురు. ఆసమయమున వాదము పెంచక మన మూరకయుండవలయు. అదియే బుద్ధిమంతులలక్షణము. కావున నించుక యే లోపము లేనివారు సామాన్యదృష్టి నాలోకించిన లేరనవచ్చును.

దశరథునియందుండు సద్గుణములలో నతనియందుఁగల లోపములు లెక్కపెట్టఁదగినవికావు. మేరుపర్వతముకడఁ బరమాణువునకుఁ బరిగణనము లేనట్లే సకలసద్గుణములుగలిగి రాజచంద్రుఁడై యుండెను. చిరకాలము రాజ్యపాలనము చేసెను. పెక్కువేలయేండ్లు రాజ్యము పూజ్యభంగిఁ బాలించెను. మానవజీవితమున నింతకాలము భూమిపై నుండఁదరమా యను ప్రశ్నము కలదు. ఆప్రశ్నముచేయువారికి నచ్చఁజెప్ప టనవ సరమని వదలరాదు. ఓపినంతవట్టు సమాధానము చెప్పవల

యుండును. దానికే ప్రయత్నింతును. సాధారణముగా మనుష్యాయుస్సు నూటయిరువదేండులు. పంచదినములని జ్యోతిశ్శాస్త్రము తెలుపుచున్నది.

"సమాష్టష్టిర్ద్విఘ్నా మనుజకరిణాం పంచచ నిశాః."

అని బృహజ్జాతకము. "శతమానం భవతి" అను శ్రుతిగతిలేమి యనరాదు. శతశబ్దము విశేషవర్షపరముగాని నూఱనికాదు. ఈయాయుర్నిర్ణయము సాధారణవిషయము. బృహజ్జాతకమునందే.

"గురుశశిసహితే కుళీరలగ్నే శశితనయే భృగుజే చ కేంద్రయాతే,
భవరిపుసహజోపగైశ్చ శేషైరమితమిహాయురనుక్రమాద్విన్యాస్యాత్."
౭ అధ్యా. ౧౮ శ్లో.

అని యున్నది. అమితాయుర్దాయయోగ మీయది. ఇది సర్వసాధారణము కాదు. త్రేతాయుగమున మూడువందలయేండ్లు మానవుల కాయుస్సని నిర్ణయింపఁబడినది. ద్వాపరమున రెండువందలవత్సరములు. కలియుగమున నూఱు ఇది సాధారణనియమము. ఒకవిధమగు గ్రహసంపదయుండఁగా జన్మించినవారు చిరకాలము జీవింతురు; అమితాయుర్దాయ మనఁగాఁ బరిమితి యింత యని నిర్ణయింపరాదని య ము. అది గ్రహసన్నివేశమూలమునఁ గలుగునని యెఱుంగవలయు.

యోగశాస్త్రము ననుసరించి యాయుర్దాయ మెన్నియోకల్పములదనుకఁ బెరుగఁగలదని తెలియవలయును. అతీతానాగతజ్ఞానముకూడఁగలుగును. పాషాణములవలె నల్లే భగవజ్జ్యోతిస్స్వరూపమును జూచుచు యోగు లెంతోకాల ముందురు. అంతదనుక నీదేహమున కించుకంతయు బాధకలుగదు

యోగాభ్యాసమునఁ గలుగువిశేషములఁ గొన్నింటిం జూపె
దను పాతంజలయోగసూత్రములయం దిట్లున్నది

సూ. "పరిణామత్రయసంయమాదతీతానాగతజ్ఞానమ్." ౧౬

విభూతిపాదము 3.

ధారణధ్యానసమాధిత్రయమేకస్థలమున సంయమనము చేయు
ట దీనిచేఁ జెప్పఁబడినది. ధర్మలక్షణావస్థాపరిణామములయందు
సంయమమువలన యోగులకు నతీతానాగతజ్ఞానము కలుగును.

"కాయరూపసంయమాత్తద్గ్రాహ్యశక్తిస్తంభేచక్షు
ష్ప్రకాశసంప్రయోగేఽన్తర్ధానమ్. ౨౧
మైత్ర్యాదిషు బలాని. ౨౩
బలేషు హస్తిబలాదీని. ౨౪
ప్రవృత్త్యాలోకన్యాసాత్సూక్ష్మవ్యవహితవిప్రకృష్టజ్ఞానమ్. ౨౫
భువనజ్ఞానం సూర్యసంయమాత్. ౨౬
చంద్రే తారావ్యూహజ్ఞానమ్. ౨౭
నాభిచక్రే కాయవ్యూహజ్ఞానమ్. ౨౯
కంఠకూపే క్షుత్పిపాసానివృత్తిః. ౩౦
కూర్మనాడ్యాం స్థైర్యమ్. ౩౧
మూర్ధజ్యోతిషి సిద్ధదర్శనమ్." ౩౨

ఈమొదలగుసూత్రములకు వ్యాఖ్య వ్రాయ నిది సమయము
కాదు. మనస్సు నొక్కొక్కనాడియందు నొక్కొక్కచక్రము
నందు నిలిపిన నెన్నియో యద్భుతశక్తులు కలుగుననియే వీని
సారము. లంబికాదియోగముల నభ్యసించువారు జలములయం
దున్నను దేహమున కించుకయు బాధలేకయుందురు. ఎంత
కాలమైన నట్లే యుందురు.

"ధన్యానాం గిరికందరే నివసతాం జ్యోతిః పరం ధ్యాయతా,
మానందాశ్రుకణాన్ పిబంతి శకునా నిశ్శంకమంకేశయాః."

భర్తృహరి, వైరాగ్యశతకము.

పర్వతగుహాలయందుఁగూరుచుండి పరమాత్మను జ్యోతిస్స్వరూపునిగా ధ్యానించుచుఁ దద్గతచిత్తులై యుండఁగా వారు పాషాణములనుకొని పక్షులు నివసించి యానందాతిరేకమున వారికన్నులనుండి బాష్పకణములుపడుచుండ నేసందియములు లేక పక్షులు వానిని వర్షబిందువులని భావించి త్రాగుచుండునని భావము. అనఁగా వారట్లే కదలక యెంతయోకాల ముండఁగాఁ బక్షులు వారిని శిల లనుకొనును. పిదప గూండ్లుకట్టుకొనును. కొన్నిపాషాణసంధులయందే నివసించును. వీరు మానవులు కాదనుజ్ఞానమెంతకాలమునకు వానికిం గలుగునో మన మూహింపవలయును. అట్టివారికిఁ ద్రికాలసంధ్యావందనాదు లెట్లని ప్రశ్నింపరాదు. ఆయవస్థయందుండువారికిట్టిసామాన్య నియమములు లేవు. కర్మములకు ఫలమాయవస్థ నిచ్చుటయే కావున వారు సదా పరమాత్మనే చూచుచుండ ననేకయుగములు గడచునని యెఱుంగవలయును. మనుష్యాయుర్దాయము యోగులకుఁ గాదు. సామాన్య మానవులకని యెఱుంగువారల కీశంకలు కలుగవు యోగశాస్త్రమును మేము నమ్మమనువారికి సమాధానము చెప్పఁబూనుటకుఁ దగినంతయవివేకము నాకు లేదు. వారిని నమ్మింపఁ బ్రయత్నించుట వృథాకాలక్షేపము.

కొందఱు చిరకాలము జీవించుటయు మఱికొందఱు స్వల్పకాలముననే మృతినొందుటయు నెల్లరకుఁ గనఁబడుచున్నవిషయముకదా. అ ట్లేల కావలయును? అనఁగా సమా

ధానము. వారిప్రాపనకర్మమే యనవలయును. వేఱొకసమా ధానముకాని యుక్తిగాని యందుఁ బనికిరాదు. కర్మము నంగి కరింపనివారు మూఢులు. వారి కిది సమాధానము కాదు. ఏదియు సమాధానము కాదు. సత్కర్మములకనేకములకు ఫలమే యోగాభిరతి. అది కల్గినఁగాని చిత్తశు. కలుగదు. చిత్తశు కల్గినఁగాని భగవత్సాక్షాత్కారము కాదు. కావున నన్నింటికిఁ గర్మములు ప్రధానములు కర్మము పరమాత్మస రూపము. కర్మా చరణము నాఁబరమాత్మ నారాధించుటయే యని మన మెఱుం గందగు. మన మాచరించు సకలకర్మములందును గర్మస రూ పుఁడు సరేశ రుఁ డని తలంపవలయును. ఆభావనకలిగినవారికే కర్మములు ఫలమునిచ్చును. లేకున్న నత ల్పఫలముతో నవి విరమించును.

"కర్మణస్సుకృతస్యాహుస్సాత్త్వికం నిర్మలంఫలం,
రజసస్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసఃఫలమ్."
౧౬

గీత ౧౪ అధ్యా.

అను నీభగవ తోక్తి పైనవ్రాసినభావమును దృఢపఱచు చున్నది. సకలసత్కర్మఫలమే యోగాభ్యాసనిరతియని యిందుఁ గలసారము.

యోగాభ్యాసకుఁడు కుండలినీరూపపర దేవతాచరణ సరసిజనిర్ణేజన జలములు సుధామయములై దేహమును దడుప హాయిగా నుండును. ఏతాపము లాతనికి నంటవు.

"భుజంగాకారరూపేణ మూలాధారసమాశ్రితా,
శక్తిః కుండలినీనామ్నా బిసతంతునిభా శుభా.
మూలకందం ఫణాగ్రేణ దష్ట్వా కమలకందవత్,

మంత్రేణ పుచ్ఛం సంగృహ్య బ్రహ్మరంధ్రం సమన్వితా.
పద్మాసనగతస్స్వస్థో గుదమాకుంచ్య సాధకః,
వాయుమూర్ధ్వగతం కుర్వన్ కుంభకావిష్టమానసః.
వాయ్వాఘాతవశాదగ్నిస్స్వాధిష్ఠానగతో జ్వలన్,
జ్వలనాఘాతపవనాఘాతైరున్నిద్రితోఽహిరాట్.
రుద్రగ్రంథిం తతో భిత్వా విష్ణుగ్రంథిం భినత్త్యథ,
బ్రహ్మగ్రంథిం చ భిత్త్వైవ కమలాని భినత్తి షట్.
సహస్రకమలే శక్తిశ్శివేన సహ మోదతే,
సా చావస్థా పరాజ్ఞేయా సైవ నిర్వృతికారణమ్.''

వామకేశ్వరతంత్రము.

ఈరీతి యోగులు సుధారసపరితృప్తులై యెంతకాలమైన నుందు రనుట కే సందేహములు లేవు. నిరాహారులై పాషాణములవలె నుందురా యన్న శంక యీకాలమునఁ బెక్కండ్రకుఁ గలుగ వచ్చును. ఈకాలమున యోగులు కనఁబడకయున్నందున నిట్టి శంకలు గలుగ నవకాశము గలిగినది. కొందఱు యోగులు ముక్కు రంధ్రములు మూసి చెవుల నరికట్టి యాసీతియందు ఛాయాపటములు తీయించుకొని యోగులవలె విఱ్ఱవీఁగువా రున్నారు. అట్టి కపటయోగులమూలమున నేలాభముకలుగక విశేషించి ద్రవ్యనష్టముకూడఁ గలుగుచుండుటంబట్టి యిట్టిశం కల కవకాశ మేర్పడినది. అట్టివారిని ద్రోసిపుచ్చవలెను. ఇప్ప టికి నెందఱో మహానుభావులు యోగులు గలరు. విజితేంద్రి యులు గలరు. పర దర్శనులు కలరు. అట్టివా రుపన్యాసవేదికల పైకి రారు. కరచాలనములమూలమున లోకుల మోసపుచ్చరు. ద్రవ్యమును సంపాదింపఁగోరరు. కావున వారు యోగులవలెఁ

గనఁబడరు. వంచకులు కనఁబడినను వారియందు జనులకు
విశ్వాసము చాలకాల ముండదు. ఇట్టు లగుటంబట్టి యోగశా
స్త్రముకానితదభ్యాసకులుగాని లేరన్నయూహగలుగుటయచ్చె
రువు పుట్టింపదు. ఇఁకఁ బ్రస్తుతవిషయమును బరిశీలింతము.

దశరథమహారాజు రాజ్యమును బూజ్యభంగిఁ బరిపాలిం
చుచుండెను. చిరకాలము వయస్సు నిలిచియుండుటంబట్టి
రాజ్యభోగములనెల్ల ననుభవించెను తనసుఖములకంటెఁ దన
ప్రజలసుఖములే ప్రధానములుగా భావించువాఁడు. కావుననే
రాజశబ్దమానరపతియందు సార్థకమయ్యెను. రాజనంతమను
పేరావిషయమునకుఁ గల్గెను. ప్రాయికముగా నెల్ల దేశముల
కాపేరు రాదు. రాజువలనఁ బ్రజల కేలాటిబాధ లెప్పుడును
గల్గకయుండినఁగాని రాజనంత మనునాఖ్య రాదు. ప్రజల
యందుఁ బ్రభువునకును బ్రభువునందుఁ బ్రజలకును బ్రీతి
విశ్వాసములు దృఢమూలములై యుండవలయును. అవిరెం
డును బరస్పరము స్థిరముగా నెలకొనినఁగాని సుఖములేదు.
పితృతుల్యుఁడు రాజని ప్రజలు నమ్ముదురు. సుతతులు లని
రాజు ప్రజలఁ దలంచును. అట్టిచో నారాజ్యమే భూతలస్వర్గ
మగును. ఏకొఱంతలు గలుగవు. దశరథమహారాజు రాజ్య
మును బాలించుతఱి నారాజ్యము రాజనంతమే యయ్యెను.

## రామాయణరచనాకాలము.

ప్రధానముగా శ్రీరామచంద్రునిచరిత్రము రామాయణ
మహాకావ్యమునుండియే గ్రహింపఁదగినది. పురాణములయం
దీచరిత్ర మున్నను బ్రధానము వాల్మీకికృత కావ్యరత్నమే;
కావున దానినిర్మాణ మెప్పుడనువిషయము నించుక విమర్శింప

వలయును. గ్రంథాంతరముల ననుసరించి దీనిని జర్చించుటకంటె నమ్మహాకావ్యమునుండియే ప్రమాణములం గైకొని యించుక విమర్శించు టుచితమని నాతలంపు. కొందఱు రామావతారమునకన్న మున్నే వాల్మీకి కావ్యమును రచించె నందురు మఱి కొందఱు రామాయణము శ్రీరామునికాలమునందే రచించె నందురు. ఇంకను గొందఱు రామాయణములు పెక్కులు గలవనియు, నొక్కొక్కటి యొక్కొక్కవిధముగా నున్నదనియు, నొక్కదానియందు రామునకు బహుభార్యలు గలరని యున్నదనియుఁ గావున నివన్నియు నెవరికిఁ దోఁచినట్లు వారు కల్పించి యుందురనియుఁ బలుకుదురు. మఱియును గొందఱు వాల్మీకి ప్రోక్తరామాయణముకూడఁ బెక్కండ్రచే రచింపఁబడినభాగము లందందుఁ గలదై యున్నదందురు. వేఱొక కొందఱు కథయందుఁ బూర్వాపరవైషమ్యములు గలవనియు నడుమనడుమ నెవ రిఁదోఁచినట్లు వారు కల్పించి కథాసందర్భమున వానిం జొప్పించి రనియుఁ గాన నొక్కరిచే రచింపఁబడినది కాదనియు నందురు. ఇట్లే యనేకవిషయములను జర్చించి యేవోదోషముల నారోపింతురు. వీనికన్నిటికి సమాధానములు వ్రాయుట పనిలేనిమంగలి పిల్లితలగొఱిగినట్టిదే యగును. ఊరక వదలిన నీసంశయములు తీర్పఁజాలనన్న యపకీర్తి గల్గును. ఈరెండింటిలో రెండవదే భూషణమని నే నూహించువాఁడను. నిర్మలమగు శ్రీరామచంద్రుచరిత్రమునందు దోషముల నారోపించి వానిని జర్చించి యాకాలమును వ్యర్థముచేసి లేనిశంకలు గలిగించుకొను టుచితమా యనియు నాలోచించువాఁడను. కాని

యున్నికార్యముల నించుకించుకగాఁ జేయ దృఢనిశ్చయుఁడనైతిని. వీనినన్నింటిని మించిన యాక్షేపమొక్కఁడు కలదు.

శ్రీరామునిచరిత్రము పరమపవిత్రమనుట కేవల మనుచితమనియు సామాన్యమానవులలో నుత్తముఁడు రాముఁడనుటకంటె విశేషించి పొగడఁదగినగుణవిశేషము లాయనకడ లేవనియు నొకప్పుడు శ్రీకృష్ణమూర్తిని భగవంతుఁ డన్న నన వచ్చునుగాని రాముని భగవంతుఁ డన నవకాశమే లేదనియు వారియాక్షేపము. మఱియు నేకపత్నీవ్రతుఁ డని పొగడుదురే నట్టివా రిక్కాలమున నెందఱో కలరు. పితృవాక్యపరిపాలకుఁడు గాన స్తుతిపాత్రుఁ డందురే నట్టివారు నిక్కాలమునను గలరు. సత్యవాక్‌నిరతుఁ డన్న నట్టివారు నుండరనఁదగునా. సుహృద్రక్షణతత్పరుఁడన్న నట్టివారుండకపోరు. ఇట్టిగుణములు సామాన్యులయందును గొన్నికలవు. కావున భగవంతుఁ డన నవకాశమే లేదని వారి వాదసార మయియున్నది. వారి యాశయములన్నియుఁ జర్చింప నిట నాకు నవకాశము లేదు. దాన నించుకయుఁ బురుషార్థము లేదు. అంతియకాక కాలము దుర్వ్యయ మొనర్చినట్లుకూడ నగును. కొందఱ ఱెట్టివాదముల నాలకించి సమాధానము లేదని భావింతురు. దాన వారికిఁ గల భగవద్భక్తి తగ్గును. కావున నీచోట నించుక దానిని జర్చింప వలసి వచ్చెను. వారు ప్రధానముగా నొక్కిచెప్పువిషయమును వ్రాసి సమాధానమును వ్రాసెదను.

"తొలుత నీభూభాగమున శైవము ప్రధానమతము. శైవులే యెల్లతావుల నుండిరి. శక్తిసంపన్నులుకూడ నైరి. అందు రాక్షసు లగ్రస్థానము నాక్రమించిరి. వారు దక్షిణ

భాగమునెల్ల నావరించియుండిరి. వారి నోడింప దేవతలకు వలనుపడ దయ్యెను. దేవత లుత్తరభాగమునను విశేషించి హిమాలయమున నుండిరి. రాక్షసుల దాడి కోరcజాలక పోయిరి. క్రమక్రమముగాc బరతముల నాశ్రయింప వలసినవారైరి. ముఖ్యముగా హిమాలయమున వా రుండ వలసివచ్చెను. అందుcగూడ రాక్షసుల కవకాశ మేర్పడునా యని సంశయించుచుండిరి. ఆకాలమున మతాభిమానము హెచ్చుగా నుండెను. దానిబలముననెల్ల రొక్కటిగా నుండ నవకాశముగలిగెను. దాని నెట్లో మాయించి మతభ్రష్టులనుగా నొనరించినcగాని జయింప వలనుగాదు. అని దేవత లూహించిరి వేషాంతరముల దక్షిణభాగమునకు వచ్చిరి. యజ్ఞములు చేయసాగిరి. యజ్ఞములమూలమున సకలపురుషార్థములు కలుగునని బోధింపసాగిరి. స్త్రీలు జంతువులc జంపి వానిరక్తమున భ్రూమధ్యమునc దిలకముపెట్టిన మేలని వీరి బోధనమువలన నెఱింగిరి. ప్రతిదినము వారట్లు చేయసాగిరి. భర్తలు వారి మరల్పcజాలకపోయిరి. క్రమక్రమముగా యజ్ఞములు వృద్ధియయ్యెను. శైవమునకన్న వైష్ణవము హెచ్చని బోధింపసాగిరి. మత నియమములు కష్టముగలిగింపనట్లు నిర్ణయించిరి. అత్తరుణమున నీరామాయణాదిగ్రంథములు వ్రాయcబడినవి. వీనిని బారాయణముచేసికొనుచు వైష్ణవధర్మముల నాశ్రయించిరి. దాన బలహీనులైరి. అపుడు రాక్షసుల నవలీల నోడించిరి."

అని పలుకుచు నీవాద మనేకచరిత్రముల నాధారము కలదనియు వారు పలుకుదురు.

దీనింబట్టి యూహింపఁగా నీరామాయణాది సద్గ్రంథము లన్నియుఁ గల్పితములనియు నిట్టికథలు సాగియుండలేదనియు రామాదులు భగవంతులనుట రాక్షసులను వంచించుటకే యనియు వైష్ణవము ప్రాక్కాలమున లేదనియు రాముని యందు భగవంతుఁడని చెప్పఁదగిన గుణములుగాని యమాను షచర లుగాని లేవనియు వారి యభిప్రాయమని తేలెడిని. ఓపినంతవట్టు సమాధానము వ్రాసెదను.

యజ్ఞములు కల్పితములనుట సాహసము. వేదము యజ్ఞప్రవృత్తినే తెల్పును. వేదములు ప్రమాణములు కావను వారలకు నేదియు రుచింపదు. శైవముకూడ వారికి రుచింప కుండవలయును. శైవ మవైదికమను వాదము తుచ్ఛవాదము. వేదమున మూఁడుభాగములు శివమహిమమునే బోధించును. శ్రౌతము చిరకాలమునుండి వచ్చుచున్నది. స్మార్తకర్మముల యందు దేశభేదమున రీతిభేదము కలదుగాని శ్రౌతమున నాసేతుశీతాచల మొక్కరీతిగానే యున్నది. ప్రాచీనకాలమున యజ్ఞప్రవృత్తి సర్వత్ర సాగుచుండెను. కాలానుసారము జంతు హననము మార్పునొందునట్లు మహర్షులు చేసిరి. అది యాహార నియమము ననుసరించి చేయఁబడినది అంతియకాని దేవతలు రాక్షసులను స్త్రీహీనులనుగాఁజేసి యడంపవలయునని పన్నిన పన్నుగడగాదు. యజ్ఞము లిటీవలఁ గల్పింపఁబడినవను.టత్యంత సాహసము.

"ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః,
తైర్దత్తా న ప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః. ౧౨
యజ్ఞశిష్టాశినస్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః,

తేత్వఘం భుంజతే పాపా యే పచంత్యాత్మకారణాత్. ౧౩
అన్నాద్భవంతి భూతాని పర్జన్యా దన్నసంభవః,
యజ్ఞా ద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసము ద్భవః. ౧౪
కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవం,
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితం.” ౧౫
గీత 3 అధ్యా.

అను శ్రీకృష్ణపరమాత్మోక్తి యజ్ఞమహిమమును బోధించు చున్నది.

“మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః.”

అని మనుస్మృతి తెలుపుచున్నది. మహాయజ్ఞములు బ్రహ్మాయజ్ఞము లోనగునవి. అగ్నిష్టోమాదులు యజ్ఞము లనంబడును. యజ్ఞములే యిటీవలఁగల్పింపఁబడినవనుచో శ్రుతిస్మృతి పురాణేతిహాసములకుఁ దర్పణాంజలు లర్పింపవలయును. ఇన్నియుఁ బ్రమాణములు కానియపుడీచరిత్రగ్రంథములుమాత్రము ప్రమాణములని యేల యంగీకరింపవలయునో తెలియఁజాలకున్నాఁడను. శాసనములమూలమున వేదములకుఁ బ్రామాణా ప్రమాణ్యములు నిర్ధారణము చేయఁబూనుట ఆకాశమును జుట్టి కట్టి యంతరాళమున దాఁచిపెట్టుకొనఁ బ్రయత్నించినట్లే. ఈ వాదమలసులు చేయునది. వారలు శ్రమించి యేకార్యము చేయఁజాలరు. కానఁ గూరుచుండి యిట్టి యాకాశ రామన్న పంచాంగమును బాడుచు నానందించుచుందురు.

శ్రీరామచరిత్రము సర్వోత్కృష్టమనుటకు వాల్మీకి రచించిన కావ్యమేకాక యెన్నియో పురాణములు తెలుపుచున్నవి కావున శ్రీరామచరిత్రము సకలపురాణేతిహాస సమ్మతమగునని

యేకాని కల్పిత మనరాదు. వాల్మీకిరామాయణమున ననేక భాగము లవాంతరకల్పితము లనుటకు వారు చూపఁగలకారణము లేవియుఁ గానరావు. ఏభాగము కల్పితమో యుక్తియుక్తముగ వారును జూపఁజాలరు ఈభాగ మీకాలమున వీరిచేఁ గల్పించి యిందుఁ జేర్పఁబడినదని సహేతుకముగా వారు నిర్ణయించినది లేదు. ఏవో కొన్నికారణముల నసంగత యుక్తుల మూలమునఁ జెప్పి యిది యొకరిచేఁ జేయఁబడలేదనుట వారియసమ తనే బోధించెడు పూరా పరవైషము. లున్నవన్న వానిని సమ ంపఁజాలనిచో నాక్షేపింపవలయును. వ్యాఖ్యాతలు సయుక్తికముగా వాని స్థిరపఱచిరి. వానిఁ దెలిసికొనక తాఁబట్టిన కుందేటికి మూఁడేకాళ్లనునట్లు మొండిపట్టుదలం బూని వాదించు టుత్తమమార్గము కాదు.

రామాయణము లనేకములుగల వనువాదమును విమర్శించెదను. భాగవతాది పురాణములయందును భారతాదీతిహాసములయందును శ్రీరామచరిత్రము కలదు. ఆపై నానందరామాయణ మొక్కండు కనంబడియెడు. అధ్యాత్మరామాయణ మొక్కటి. బ్రహ్మాండపురాణాంతర్గతముగాఁ గనఁబడుచున్నది. వాల్మీకిమహాముని విరచిత మహాకావ మొక్కఁడు కనంబడుచున్నది. వీనికిం బరస్పరవైషమ్యము కలదనుట నిశ్చయము. దీనికిం గారణమేమని పరికించుట సుంత ముఖ్యమే యనవచ్చును. ఇట్లుండఁ గారణమేమి? అన్నప్రశ్నమునకు బదులు చెప్పవలసినదే. నావ్రాసినసమాధానము చాలియుండకపోవచ్చును. అంతమాత్రమున సమాధానమే లేదని యాక్షేపకులు పరిహాసింపరాదు. మఱొకరు సమాధాన మిత్తురు.

కాల మఖండము. సృష్టియు ననాదియే యనఁదగు. ప్రళయము లనేకములు. కర్మము లనాదితరం గాంచునవియే. ఈచర్చకుందిగిన వెట్టియెత్తక మానదు. కాల మిపు డారంభించెనని యింతదనుక నుండునని యెవరును జెప్పఁజాలరు. చెప్పఁబూనినవా రున్మత్తులే యనఁదగుదురు. అట్లే సృష్ట్యాదులు ననవలయు. కర్మములు నట్టివియే. ఒక్కొక్కప్రళయమున నొక్కొక్కమార్పు పొడకట్టును. సృష్టియు నట్టిదే. కాని ప్రధానవిషయమున మార్పుండదు. "ధాతా యథా పూర్వ మసృజత్" అని వేదము బోధించుచున్నదికదా. ఒక్కొక్క సృష్టియం దనేకావతారముల భగవంతుఁ డెత్తును. అందు రామావతారములఁ బెక్కుసారులు భగవంతుఁ డెత్తెను. ఒక్క తడవ నంగీకరించిన రామావతారమునకు వేఱొకసారి యెత్తిన రామావతారమున కీషత్తుగ భేదము గలుగక మానదు. ఆభేదములు పలువిధములుగ రామాయణము లున్నట్లు తోఁపింపఁజేయును. ప్రతిత్రేతాయుగమునందును రామావతారము కలదా యని కొందఱడుగుదురు. త్రేతాయుగమున రామావతార ముండును. కాని ప్రతిత్రేతాయుగమునను గలుగదు. యుగధర్మములను ముఖ్యముగాఁ గాపాడుకొఱకే యవతారములు వాని ననుసరించియుండును. ఈవిషయము వ్యాసోక్తి నుండియే మన మెఱుంగ వచ్చును.

లోకమున కుపకారము చేయుటకే రావణాదిరాక్షసులు పుట్టుదురు. భూభారము హరింపవలయునన్న నొకసంగరము కావలయును. ఇరుపక్షములవారు కలిసి పోరాడుదురు. వారి వారిపక్షముల నెందఱో చేరుదురు. ఆరణమున మరణము

గాంచఁదగువారు తత్తత్పక్షముల నభిమానముంజూపుదురు. దురాత్మకులు లేకయున్న సంగరము పొసఁగదు. పెక్కురు నశింప నవకాశ మది లేకయున్నఁ గలుగదు. భగవంతుని కార్యము నిరుదెఱఁగులవారు సాగింతురు. ఆపరమేశ రుని దృష్టి యాయిరువురయందు సమముగా వ్యాపించును. అం దొకరిపై నాగ్రహము చూపినట్లు వేఱొకరిపై ననుగ్రహము పొలయించినట్లు నటించును. ఈయిరువురఁ బుట్టునట్లుచేసిన దాపరాత్పరుఁడే. ఇట్లుగాక యున్న దురాత్ములఁ దానేల వధింప వలయును? తనచేఁ జంపఁబడినవారు పుణ్యగతికిఁ బోవుదురని తా నెఱుంగఁడా. పాపాత్ములు నరకదుఃఖముల నేల యనుభ వించునట్లు చేయక తాను వధింపవలయు? దురాత్ములప్రక్క దురాత్ములును, సన్మార్గులవంక సనులును జేరి పోరుదురు. ఈ యిరువురు లోకోపకారమునకుఁ గారణభూతులే. ఈ రెండుపక్ష ములు లోకులకుదాహరణము లగును. సన్మార్గపక్షము విజయము గాంచును. దుర్మార్గపక్షము నశించును. లోకు లాజయాపజయ ములంగాంచి ధర్మపక్షము శుభకరమనియు నధర్మపక్షము హాని కరమనియు గ్రహించి ధర్మతత్పరు లగుదురుగాక యని భగవం తుని యభిప్రాయము. ఇట్టి యుదాహరణములఁ జూపినఁగాని సామాన్యులు బాగుపడ నవకాశములేదు. కేవల తచ్చరిత్ర ములఁ దెలుపుగ్రంథములఁ బఠించుటచే నంతమేలు కలుగదు. గ్రంథపఠనము తద్దర్శనము రెండుఁ గుదిరినచో మఱింత దృఢముగా జ్ఞానముగలుగును. కావుననే మనము రావణాదుల దూషింపరాదు. వారు పుట్టకయున్న నిట్టిచరిత్రము మనకు

దొరకదు. ఈ రెండుకారణములు భగవంతునాశయానుసారమే సాగినవని మనము గ్రహింపవలయును.

రామాయణములనేకము లున్నవనుట యసంగత మనక దీర్ఘముగా నాలోచించిన వానియందుఁ గల భేదములకుఁ గారణము తేటపడును. అనేకపర్యాయములు శ్రీమహావిష్ణువు భూలోకమున నవతరించినట్లు పెక్కుపురాణములయందుఁ గలదు. వైవస్వత మన్వంతరమున నిరువదెనిమిదవ మహాయుగమున ద్రోణాచార్య సుతుండగునశ్వత్థామ వ్యాసుఁడగునని పురాణములు తెలుపుచున్నవి. ఒక్కొక్క మహాయుగమున వేదవిభాగము చేసినవారికి వ్యాసనామము కల్గును. వారెల్లర నొకరీతిగా వేదములు విభజింతురన్నవాద మసంగతము. ఆకాలమున కనురూపముగా మార్పు నొందింతురు. ఈభేదమును బాటించి యివియన్నియుఁ గల్పితములనుట సాహసముకాదా. భగవదవతారతత్త్వములను గ్రహింపఁదద్భక్తులు కానివారికిఁ దరమా. అట్టిపామరులా క్షేపించిన భక్తులేల సంశయము నొందవలయునో తోఁపకున్నది.

"హైతుకాన్ బకవృత్తీంశ్చ వాఙ్మాత్రేణాపి నార్చయేత్."

అని స్మృతి ఘోషించెడిని. హేతువాదులు భక్తిదూరులు. కపటవృత్తు లట్టివారే. వారిని స్మరింపరాదని భావము.

మఱియుఁ బ్రతిత్రేతాయుగమునం దుండుమానవులు సమానకర్మముల నొనరించినవారు కారు. ఆకాలమున నేకర్మముల నాచరించినవా రుందురో వారికిఁ దెలుపుటకుగాఁ గొన్ని విచిత్రకార్యములఁ బరమాత్మ చేయును. కావున నన్ని రామావతార చరిత్రములలో నించుకంతయు భేదము లేకుండ

వలయునన్న నియమము లేదు. ఈవిషయమును మనస్సున నునుచుకొనిన నీయాక్షేపములు చేయు నవకాశమే దొరకదు. పెక్కుసారులు రామావతారముల శ్రీమన్నారాయణమూర్తి యంగీకరించెనని యధ్యాత్మరామాయణమునఁ గల యీ భాగము తెలుపుచున్నది.

"అన్యత్కించిత్ప్రవక్ష్యామి శ్రుత్వా మాం నయ కాననం,
రామాయణాని బహుశశ్శ్రుతాని బహుభిర్ద్విజైః.
సీతాం వినా వనం రామో గతః కిం కుత్రచిద్వద,
అత స్త్వయా గమిష్యామి సర్వథా త్వత్సహాయినీ."

అయోధ్యాకాండము ౪ సర్గము

ఎన్నియో మన ంతరములు గడచెను. ఇట్టియవతారము లెన్నియో గడచెను. ఇంక నెన్నియో రానున్నవి. ఒక్కరీతిగా నన్నియు నుండవు ఇంచుక భేదముగలుగుట మహాపరాధ మన రాదు. పరస్త్రీవాంఛ కుటుంబహాని నాపాదించును. సోదర ద్రవ్యాపహారణము వినాశకరము. అను మొదలగునీతు లేకాల మున లోకులకుఁ దెలుపవలసియుండునో యాకాలమున రావ ణాసురుఁ డుదయించును. పితృవాక్య పరిపాలనము యశోవృద్ధుల నాపాదించును. ఆశ్రితరక్షణ మనంత పుణ్య ఫలప్రదము అను నీమొదలగునీతులఁ దెలుపుటకే శ్రీరామావతారమని మన మూహింపవలయును. ఈనీతులే యేమన ంతరమహాయుగములఁ గొఱవడునో అపుడే శ్రీరామావతారసమయ మనుట మన మెఱుంగఁదగు. అట్టితరుణములయం దాప్రజాసముదాయము ననుసరించి శ్రీరామచరిత్రమున నించుకమార్పు లుండును. వానింబట్టి రామావతారమే యబద్ధమనికాని, యనేకులు

రామాయణములు వ్రాసి యందందుఁ జేర్చిరని కాని నిరచనము చేయుట కేవల సాహసము. ఇట్టి నిరచనములవలన శ్రీరామ చరిత్రమునకు లోపము సుంతయు రాకుండుటయే మఱింత శ్రీరామభక్తి లోకులకు దృఢపడును. కావున భగవద్భక్తి గలవా రిట్టి యల్పవిషయములయందు మనస్సు చొప్పింపక శ్రీరామచంద్రమూర్తి నాదిదైవముగా నారాధింపవలయును. ఇంక నీవిషయమును గూర్చి వ్రాయక విషయాంతరమును విమర్శింతును. రామాయణతత్త్వమునఁ బెక్కుతావుల నీవిషయము విమర్శింపఁబడియుండును. కావున నిట మానుదును.

శ్రీరామజననమునకు మున్నే వాల్మీకి రామాయణ కావ్యమును రచించెనని కొందఱందు రని వ్రాసితినిగదా. దాని నించుక విమర్శింపఁ దలంచితిని. ఇందే గూర్చి వ్రాయుదు

"నారదం పరిపప్రచ్ఛ వాల్మీకిర్మునిపుంగవమ్,
కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్."

బా. ౧ సర్గము.

అని రామాయణమునఁ గలదు. అస్మిన్ = భూలోకము నందు, సాంప్రతమ్=ఈకాలమునందు అని యర్థము. వాల్మీకి ముని త్రికాలజ్ఞుఁడగు నారదమునిం గాంచి భూలోకమున నిక్కాలమున సకలసద్గుణవంతుం డెవ్వఁడని ప్రశ్నించెను. నారదముని శ్రీరామచంద్రుని చరిత్రమును సంగ్రహించి తెలి పెను. అందు

"రామస్సీతామనుప్రాప్య రాజ్యం పునరవాప్తవాన్."

అనునంతదనుక నిట్లు బోధించి

"అశ్వమేధశతైరిష్ట్వా తథా బహుసువర్ణకైః,
గవాం కోట్యయుతం దత్వా బ్రహ్మలోకం ప్రయాస్యతి.
రాజవంశాన్ శతగుణాన్ స్థాపయిష్యతి రాఘవః,
చాతుర్వర్ణ్యం చ లోకేఽస్మిన్ స్వే స్వే ధర్మే నియోక్ష్యతి.
దశ వర్షసహస్రాణి దశ వర్షశతాని చ,
రామో రాజ్యముపాసిత్వా బ్రహ్మలోకం గమిష్యతి."

ఈభాగము నిట్లు తెలిపెను.

రామచంద్రుఁ డగ్నిపరిశుద్ధయగు సీతను మరలఁ బరిగ్రహించి రాజ్యము నొందెను. అశ్వమేధము లనేకము లొనరించి బ్రహ్మలోకమునకుఁ బోవఁగలఁడు. రాజవంశములఁ బెక్కింటిని స్థాపింపఁగలఁడు. నాల్గుజాతులవారిని స్వస్వధర్మములయందు నిలుపఁగలఁడు. పెక్కేండ్లు రాజ్యమును బాలించి బ్రహ్మలోకము నొందఁగలఁడు అని; ఈభాగమునుబట్టి యాలోచింపఁగా రావణవధానంతరము శ్రీరామమూర్తి యయోధ్యకు వేంచేసి పట్టాభిషిక్తుఁడై రాజ్యమును బరిపాలించుచుండు తఱి వాల్మీకి ప్రశ్నించినట్లు నారదుఁడు కథనంతయును దెలిపి ముం దిట్లు చేయఁగలఁడనియు బోధించెనని తేలెడిని.

ఇంత విచిత్రచరిత్రము సాగుచుండ వాల్మీకి కేల తెలియ లేదని కాని నారదు నేల యడిగెనని కాని ప్రశ్నింపరాదు. మహోత్తర తపోనిష్ఠనున్న వాల్మీకి మునివర్యునకు లోకవృత్తాంతము తెలిసియుండదన్న నందు విచిత్ర మేమియు లేదు. ప్రపంచవార్తలను మహర్షులకుం గడుదవ్వు. సర్వకాలసర్వావస్థలయందును భగవద్ధ్యానపరాయణత్వము వహించినవారికిఁ బ్రపంచముతోఁటి పనియే లేదు. తపశ్చర్య పూర్తికాఁగా లోకోపకారము చేయఁ

బూనియే త్రిలోకములయందుఁ గ్రుమ్మరుచుండు నారదముని వాల్మీకికడకుఁ బోయెను. "నానృషిఃకురుతే కావ్య"మ్మనున్యాయము ననుసరించి నిరుపమానపరమపావనశ్రీరామచరిత్రము లోకమునఁ గావ్యరూపమున వెలయఁగలభాగ్యము సమీపించెను. కావుననే యామహాభాగ్యమే వాల్మీకిం బురికొలుపఁగా నమ్ముని నారదమహర్షిం గాంచి పూజించి పైవిధముగాఁ బ్రశ్నించెను. ఈవిషయమును దివ్యజ్ఞానమున మున్నే యెఱింగిన నారదముని కరము హర్షించి శ్రీరామావతారమును దెలుపుచుఁ దచ్చరిత్రమును దత్కాలమున జరగుచున్నదనుకఁ దెల్పెను. అంతియకాక యిఁకముందేమి భగవంతుఁడు చేయఁబూనెనో దానింగూడ సంగ్రహించి తెలిపెను. వాల్మీకి తదుపదేశమునఁ బ్రోత్సాహితుఁడై భగవచ్చరిత్రమును రచింపఁబూనెను. ఆయూహకలుగ నారదముని వాల్మీకిమునిచేఁ బూజించి తావచ్చినపని ఫలించెనన్న యానందమున నతని వీడ్కొని తనదారింబోయెను. పిదప వాల్మీకి గంగానదికిఁ జెంతనున్న తమసానదీతీరమునకుఁ బోయెను.

భరద్వాజుఁడనుశిష్యుఁడు కూడరాఁగా నానదీతీరమును జేరి నిర్మలములగు తత్సలిలములఁ గాంచి వత్సా! ఈతీ మును గంటివా *సజ్జనుని మనస్సువలెఁ బంక (పాప) రహితమై ప్రసన్నమై రమ యముగా నున్నది. (ఈతీ మనఁగా నదిలోనికిందిగుటకుగా నేర్పఱచినచోటు. ఘట్టమనియు ననవచ్చును.)

---

*రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్యమనో యథా=అని మూలము. సన్మనుష్యచిత్తస్య కామాదిదోషరాహిత్యేన నిత్యం ప్రసన్నత్వాత్సాదృశ్యమ్. అని మహేశ్వరతీర్థులు.

వత్సా! కలశము నిచ్చటనునిచి వల్కలము నిమ్ము. గంగ చెంత నే యున్నది. కాల మతిక్రమింపయుండ నీయుత్తమతమసానదీ తీ మున నే స్నానముచేసెదను. నీవు నిం దేస్నానముచేయు మని యెను. అంత శిష్యుఁడు వల్కలముల నొసంగెడు వాని నందు కొని తాను జితేంద్రియుం డయ్యుననుష్ఠానమునకు నర్హ్యమగు స్థల మెందుఁగలదని యవ నమున నించుక తిరిగెను. వాల్మీకి తపశ్శక్తిచే శాపం బొసంగను మరలింపను గూడ సమర్థుఁడు. అట్టి మునివరుఁడు తిరుగునపుడు తత్తీ మునకుఁ జెంత నే రెండు పిట్టలు ప్రేమాతిరేకమునఁ గవఁగూడి మధురనినదములు చేయుచుఁ దిరుగుచుండెను. వాని విహరణము మనోహరముగ నుండెను. అంతలో నొకబోయవాఁడు వచ్చెను. వైరనిల యుఁడు నాతఁడు వాల్మీకి చూచుచుండఁగనే పాపనిశ్చయుఁడు గాన ముని చూచిన నేమగునో యనియైనఁ జంకక పోతుపిట్టను దెగనేసెను అదియు నేలంగూలి విలవిలఁ దన్నుకొనుచు దేహమెల్ల రక్తసిక్తముకాఁగా మహాపదం బొందుచుండెను. దానిపాటు గని యాయాఁడుఁబులుగు తనవాంఛ నశించుటకుఁ బరితపించుచుఁ బెనిమిటిపాటుం గాంచి దీనముగాఁ గూయ సాగెను.

పరమధార్మికుఁ డగుముని నిషాదుఁ డొనరించిన యకార మునకుఁ జాలినొందెను. ఆపక్షిని గాంచి దురంత వ్యథాకులమానసుండయ్యెను. కరుణ యామునిని బురికొల్పెను. కావున నాకిరాతునిం గాంచి

"మా నిషాద ప్రతిష్ఠాం త్వమగమశ్శాశ్వతీస్సమాః,
యత్క్రౌంచమిథునాదేకమవధీః కామమోహితమ్."

ఓయీ కిరాతుఁడా! క్రీడించుచున్న యీపులుఁగుజతలో నొకదానిం బొలియఁజేసితివే. నీ వీపాపమునఁ జాలకాలము స్థితి నొందకుందువుగాక అని పలికెను. ఆపలుకు శ్లోకరూపముగా నుండెను. ఇదియేమని యమ్మునియే దానిం దలంపసాగెను. శిష్యునిం గని పులుఁగు మృతింగని శోకించుచున్న నావలనఁ బొడమిన యీవాక్యము నాలుగుపాదములు గలదిగ నున్నది. సమాక్షరములు గలవిగా నాపాదము లున్నవి. వీణ యందుఁ బాడఁదగినట్లున్నది. లయతోఁగూడినది. కావున నిది శ్లోకముగాక మఱొక్కఁడు కాదనియెను. శిష్యుఁడాశ్లోకమును గ్రహించెను. ఆవిధ మెఱిఁగి ముని సంతుష్టుండయ్యెను.

తరువాత నాతీమున స్నానముచేసి మాధ్యాహ్నిక విధుల నాచరించి యాశ్లోక ముచ్చరిల్లుట కెంతయు నచ్చెరు వందుచు దానినే తలంచుచు నాశ్రమమునకు వచ్చెను. భరద్వాజుఁడు బుద్ధిమంతులలో మేటి. కాన నాశ్లోకమును జక్కఁగా మననముచేసి మనస్సున నిలుపుకొనియెను. ఇరువురు నాశ్రమమును జేరిరి. దేవపూజాదికార్యము లొనరించి కూరుచుండి యప్రయత్నముగా బయలువెడలిన యాశ్లోకమునుగూర్చియే చింతించుచు *నితరపురాణములఁ బఠించుచుండెను.

అంతలో బ్రహ్మ యరుదెంచెను. ఆముని మనశ్చింతనంతరింపఁజేయఁ దలంచియే విరించి యట కేతెంచెను. మునియు సపర్యా విశేషములఁబరమేష్ఠిని బహూకరించెను. నిలువంబడియంజలి బంధించి వినుతించెను. ఉచితాసనంబునఁ గూరుచుండ బ్రాం

* ఉపవిష్టః కథాశ్చాన్యాశ్చకార ధ్యానమాస్థితః॥ అని మూలము.

చెను. విధియు మునిని గూరుచుండ నియోగించెను. కూరుచుండి యానిషాదుని దుర్వర్తనము పిట్టలకష్టమును దలంచుచు నాశ్లోకమును మనస్సునఁబఠించెను. ఆవిధమెఱింగి బ్రహ్మా! యోహూ! నాయనుమతిచే సరసతి యితనినాలుకనుండి శ్లోకరూపంబున నావిర్భవించు టెఱుంగఁడు. కాననే యిట్లు దానినే చింతించుచున్నవాఁడు. దీనిస రూపంబెఱిఁగించెద. అని నవ్వుచు నతనికిట్లులనియెను. మునివర్యా! శ్లోకమే నీవు రచించితివి విచారింపవలదు నీచేతఁ బ్రబంధరూపముగా శ్రీరామచరితమును లోకమున వ్యాపింపఁజేయవలయునని నేను సంకల్పించుటచేతనే "మానిషాద" యనునీశ్లోకరూపమున సరసతి ప్రవర్తించినది. ఇట్టి శ్లోకములచేతనే రామచంద్రచరిత్రమును నీవే రచింపుము. ఇకార్యమునకు నీవే తగినవాఁడవు. రామచంద్రుఁడు మహాత్ముఁడుగానఁ దద్వృత్తమును నారదుఁ డెట్లు తెలిపెనో యట్లే రచింపుము. శ్రీరామలక్ష్మణులయొక్కయు రాక్షసులయొక్కయు సీతాదేవియొక్కయుఁ బ్రకాశములు రహస్యములునగు వివిధవిధచరితములు నీకుఁ దెలియఁగలవు. నారదుఁ డెఱిఁగింపనివిషయములును నీకుఁ దేటపడును ఈకావ్యనిర్మాణమున నీవాక్కొక్కచోటనైనను దుష్టముగాని యనృతముకాని కాదు. పరమపావనచరిత్రము కానదానిని శ్లోకరూపమున నియమింపుము. శాశ్వతముగా నది యుండఁగలదు. ఈమహాకావమెంతకాలముండునో యంతదనుక నాచే నిర్మింపబడిన యూర్ధ్వాధోలోకములయం దప్రతిహతగతిచే నీవు సంచరించుచుఁబిదప సత్యలోకమునకు రాఁగలవు. నన్నుంగూడి ముక్తి నొందుదువు. అని పలికి బ్రహ్మ యంతర్హితుం డయెను.

పిదప వాల్మీకిశిష్యు లెల్ల రాశ్లోకమును బలుసారులు పాడుచు నచ్చెరువందుచుండిరి. మనగురువు క్రౌంచవిషయక శోకమున దీనిని నాలుగుపాదములతోఁ బాడుటంజేసి యాశ్లోకమే శ్లోకముగ నయ్యె నేమో యని యొండొరులతోఁ జెప్పుకొనసాగిరి. మునియు భగవంతుఁ డగు రాముని దలంచుచు రామాయణం బనుకావ్యమంతయు రచింతునని నిశ్చయించుకొనెను. రససాంద్రముగా వృత్తబ ముగా ద్రాక్షాదిపాకయుతముగా నర్థవిశేషోపబృంహితముగా సులలితపదమిళితంబుగా ననేకశ్లోకములచే రామునిమహితచరితమును వర్ణించుచు నాకావ్యమును రచించెను. తారచించిన యాయుత్తమకావ్యమును శిష్యులకుఁ దెలిపెను. ఈకావ్యమును జక్కఁగా విని గ్రహింపుఁడని వారలకు బోధించెను.

ఆవాల్మీకి రామాయణము రచించుతఱి నారదునివలన నెంత వినియుండెనో యంతకంటె నెక్కువగ రచింపఁ దలంపుగొనియెను. కావున నియతుఁడై తన కాచరితమెల్లఁ దెలియఁ దగుప తి నాలోచించుచు విధివిహితముగా నాచమించి ప్రాఙ్ముఖములుగా మొనలుండ దర్భల నెలకొలిపి గురుధ్యానము చేసి బ్రహ్మప్రసాదంబుఁబడయఁగోరి రామవృత్తమును మది వెదకెను. పరమేష్ఠియనుగ్రహమున రామలక్ష్మణజానకీదశరథాదులకుఁ గలిగినవృత్తాంతమంతయు వారు వేడుకకై మాటలాడిన జాడలు మఱియుం దక్కినచేష్టితములు వాల్మీకికిఁ దెల్లముగాఁ గనఁబడెను. పురవరమున రాముఁడు జానకీసహితుఁడై యున్న యప్పటిచరితముకాక సీతాసహితుఁడై లక్ష్మణునింగూడి యడవిలోఁ దిరుగుకాలమున సాగినదంతయుఁ దెలియవచ్చెను. తెలి

సినదంతయుఁ గన్నులయెదుట నిలిచినట్లే యుండెను. కావున మహానందమున నామునిసంక్రందనుండు కావ్యము రచింపఁ బూనెను. అందు కామముల నప్రధానములుగను, ధర్మ మోక్షముల మిగుల విస్తరిల్లునట్లు కామంబు నాపాదించుగుణంబులఁ బ్రతిపాదించుచు సరశ్రుతిమనోహరముగా నామూలాగ్రము రచించెను. రామచంద్రునిపట్టాభిషేకముదనుక సాగిన కథను రచించి *పిదప రామమూర్తి చేయఁబూనినకార్యములన్నియు నుత్తరకాండమున నిబంధించెను. [1] ఇట్లు శ్రీరామచంద్రుఁడు రాజ్యము బరిపాలించుచుండఁగా వాల్మీకిముని రామాయణమును రచించెను.

మహనీయులారా! ఈచరిత్రమును దిలకించినచో రామాయణమును వాల్మీకిముని యెప్పుడు రచించెనో తేటపడఁగలదు. రావణవధానంతరము పట్టాభిషిక్తుఁడై రాజ్యమును రామచంద్రమూర్తి పాలించుచుండఁగా నీకావ్యము రచించెననియు, బ్రహ్మవరప్రభావమున నిఁకముందు రాముఁడు చేయఁగలకార్యములఁ దెలిసికొని వాని నుత్తరకాండమున రచించెననియు స్పష్టమగును. రామావతారమునకుఁ బూర్వమే ముని కావ్యము రచించెనను వాదము నిస్సారము. ఈచరిత్రమును వ్రాయుట యీవాదమునఁగలసత్యము తేటపడంగల దనుటకే యని యూహింపుఁడు.

## శ్రీరామచంద్రగుణసంపత్తి.

ఏకపత్నీవ్రతాదిగుణములు సాధారణముగా నాలోచిం

---

* అనాగతం చ యత్కించిద్రామస్య వసుధాతలే = అని మూలము.

1 ప్రాప్తరాజ్యస్య రామస్య చకార చరితం మునిః=అని మూలము.

చిన లోకమునం గొందఱు కుందురుగాన రామమూర్తి భగవంతుఁ డనరాదన్న వారివాదమునకు సమాధానము వ్రాయవలసియున్నది. దీనింగూర్చి వ్రాయునపు డెన్నిపురాణముల నుండియో శ్లోకము లుదాహరింపవచ్చును. కాని యది పాఠకులకు శ్రమమును గల్గించును. భక్తిహీనుల కవి పనికిరావు. భక్తికలవారల కవి యక్కఱలేదు. ఐన వానిం దడవక సమాధానము వ్రాసెదను. రామావతారమునకుఁ గారణము లోకమున నంతరించుచునట్లున్న సుగుణముల వృ చేయుటయే యని యూహింపవలయును సత్యవాక్యపరిపాలనము, పితృవాక్పాలనము, సోదరప్రీతి, ప్రజాక్షేమపరీక్షణము లోనగుసద్గుణములు గలిగి శ్రీరామమూర్తి లోకుల కుదాహరణభూతుఁడై యుండువాఁడు. లోకము శ్రీరామునిప్రవృత్తినిబట్టి తమప్రవర్తనమును జక్కఁబఱచుకొనుచుండిరి. ధర్మరక్షణముకొఱకుఁ బాటుపడుటయే రాజలక్షణమని శ్రీరాముఁడు తనప్రవృత్తి చేఁ దెలియఁజేసెను. "లోకాపవాదాచ్చ య" న్మనునీతిని లోకులకు స్పష్టపఱచుటకే నిండుచూలాలిని బరమసాధ్వి నగ్నిపరిశుద్ధ భూతనయను వదలివేసెను. ధర్మసంస్థాపనమున కవతరించె ననుట కింక నేమియుదాహరణములు కావలయునో తోఁపకయున్నది. "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే." అన్నభగవత్ప్రతిజ్ఞను రామావతారము సా కముచేయలేదా. తపశ్చరణమున బద్ధాదరు లగుమునులను బాధించుదుష్టమతుల సంహరించుట భగవల్లక్షణము కాదా. యజ్ఞధ ంస మొనరించు వారిని గూల్చుట పరమేశ్వరప్రవృత్తి కాదా. శరణుచొచ్చిన వాని శత్రుసోదరుని గాపాడవలదని యెందఱు తెలిపిన నాల

కింపక యాదరించి యభయదానముచేయుట యీశ్వరప్రవ ర్తనముకాదా. దుర్జనులు నన్యాయపథమున వెడల నడచి తద్బాధ్యం గొని యొడ లెఱుంగక యెదురులేక మలయుచున్నవాని దండించుట విష్ణుకృత్యముకాదా. స్వర్గాదిలోకముల మాని తనను దర్శించి ప్రాణములు వదలంబూనియున్న స్త్రీపురుషుల మునివృత్తి నున్నవారికి ముక్తి నొసంగుట పరబ్రహ్మనియమము కాదా. అతినింద్యమగు పౌరోహిత్యముంగొని తన్నుఁ గాంచ సూర్యవంశము నాశ్రయించియున్న బ్రహ్మజ్ఞానసంపన్నుల నాదరించుట పరమాత్మతత్త్వ చిహ్నముకాదా. తన్నే నమ్మియున్న నెల్లజంతువులఁ దనతోడఁ బిలుచుకొని పరమపదము నకుంబోవుట కరుణామయుండగు భగవంతు నాశయముకాదా. ఇట్టి వెన్నియో శ్రీరామచరిత్రమునుండి కనఁదగియుండఁగా శ్రీరామచంద్రుఁడు మానవశ్రేష్ఠుఁ డనఁదగుఁగాని పరమాత్మ యనఁదగఁడనుట సాధువాదమేగా నగునో యించుకంతయుఁ దోఁపకయున్నది అట్టి పట్టుపలగలసోదరుల నెట్లు రామభక్తులనుగాఁ జేయుటో తెలియరాకున్నది.

సకలసద్గుణములు శ్రీరామమూర్తియందు వెలసియున్నవని శ్రీరామాయణము తెలుపుచున్నది. శాస్త్రవిరహితమగు మార్గము నెద్దాని నామహనీయమూర్తి యవలంబింపలేదని స్పష్టపఱచుచున్నది. కృపానీరధి దాశరథియని తేటపఱచుచున్నది మహర్షిసంస్తూయమానచరిత్రుఁడని బోధించుచున్నది అఖండతేజోవిరాజితుఁడని వెల్లడించుచున్నది. రామాయణము పురాణములు లోనగునవన్నియు నసత్యములన్నచో వారివాదమే తుచ మనవచ్చును. రామావతారమే లేదన్నచో

మీకు జ్ఞానమే శూన్య మనవచ్చును. కావున వృథావాదురాగ్రహములకుఁ బూనక శ్రీరామచంద్రపాదారవిందముల భజించి కృతార్థులరగుఁడని వారిని మఱియొకసారి వేఁడుకొనియెదను. భగవంతు నాశ్రయింపఁ బూనకుండఁజేయ నెన్నియో యంతరాయములు గలుగుఁగాన వానికి లోఁబడక యుండుఁడని వారి నింకొక్కసారి ప్రార్థించుచున్నాఁడను.

## విచిత్రవాదము.

మహనీయులు కొందఱు శ్రీరామమూర్తి కొక్క భూతనయయే భార్యకాదనియు, బహుభార్యలు కలరనియు నీవిషయము వాల్మీకిరామాయణముననే కలదనియు నది ప్రమాణముగా నంగీకరించువారిద్దాని నంగీకరింపకుండ నవకాశము కలదా యనియుఁ బ్రశ్నింతురు.

"పితుర్నిదేశం నియమేన కృత్వా వనాన్నివృత్తశ్చరితవ్రతశ్చ,
స్త్రీభిస్తు మన్యే విపులేక్షణాభిస్త్వం రంస్యసే వీతభయః కృతార్థః." ౧౮

సుందరకాం. ౨౮ సర్గము.

సీతాదేవి రాక్షసాంగనలు రావణుని యనుమతింగొని తన్నుఁ బెక్కుభంగుల రావణు నంగీకరింపుమని నయభయంబులఁ బ్రోత్సహింపఁగా వగచి వగచి తల్లడిల్లుచుండెను. శ్రీరామగుణగణముల లెక్కించుచుఁ దనదుస్థితిం దలంచుకొనుచు దుఃఖసాగరమున మునుంగుచుండెను. త్రిజట యనురాక్షసాంగన యత్తఱి నిదురించుచు నొకస్వప్నముం గాంచి లేచి సీతను భయపెట్టుచు రాక్షసేశునకు లోఁబడి వర్తింపుమని హెచ్చరించు రక్కసులం బిల్చి తనస్వప్నమును వినిపించెన

వారందులకు తినొంది సీతయే తమ్ము రక్షింపఁగలదని నమ్మి తమ ప్రయత్నమును మానిరి.

సీత యావిధ మెఱుంగదు. దుఃఖములో మునుంగుచు శ్రీరాముం దలంచి నే నిందు రాక్షసులచే వధింపఁబడనుండఁగా నెఱుంగవుకదా. జీవలోకమునకు హితుఁడవు. ప్రియుఁడవు. అట్లయు నిట్టి దుఃస్థితియందున్న నెఱుంగజాలక యున్నావే యని పరిదేవనముచేసెను. ఆస్థితియందున్న సీతాదేవికి బ్రదుకునం దాశ వదలెను. రాముని రాక మిథ్య యనియే తోఁచెను. రెండునెలలు తనయాయుశ్శేష మనుతలంపు గల్గెను. ఆవెంటనే తనను విశసించి వారు భక్షింతురనియే స్ఫురించెను. తాఁబూనినవ్రతము నిష్ఫలమయ్యె ననునూహ కలిగెను. అత్తటి నీమాట చెప్పెను. దీనియ మిది. "రామచంద్రా! తంద్రియానతినియమమున నిర హించి (కొలంతలేక యుండ నిర హించి) ఆచరింపఁబడిన వన్య వృత్తికలవాఁడవై యడవినుండి మరలి (పురికిం జని యని భావము) వనవాస భయము లేనివాఁడవై నిష్పన్నసర పురుషార్థుఁడవై విశాల నయనములుగల స్త్రీలం బెండ్లియాడి విహరింపఁగలవు." "మది నాశేన పునర్భహీ రూఢా రంస స ఇతి భావః" అని వ్యాఖ్య. నేనిందు నశింపఁగా మరలఁ బెక్కండ్రవనితామణులం బెండ్లియాడఁగలవని భావము.

తనకు మరణము సమాసన్నమని యెఱింగి తద వ్యథచేతను శ్రీరామునందుఁ గలప్రీతిచేతను మనస్సు కలఁత నొందఁగా నిట్లనెను. సామాన్యముగా ౘలచిత్తము తా మృతి నొందినపిదప నెందఱో భార్యలు కాఁగలరు. వారదృష్టముగల.

వారు. నే నదృష్టహీనురాలను. అనుమాహ కలదిగ నుండును. మరణావసానాయమున నున్నసీతచిత్తము సుస్థిరముగా నుండు నని మన మూహింపరాదు. తనభర్త తనతోడ మృతినొందు ననికాని బ్రదికినను బెండ్లియాడఁడనికాని యే స్త్రీయును వలం పదు. రామా! నీవు రాజాధిరాజవు. నిన్నెందఱో వలఁతురు. వారు భాగ్యముగలవారు. నేనే నిర్భాగ్యురాల నన్నయూహయే జానకి కత్తరుణమునఁ గలిగియుండును. దీనిచే రాముఁడు బహుభార్యలు గలవాఁడని యెట్లు తేలునో యెఱుంగఁజాల కున్నాను. రామచంద్రుఁడు పెండ్లియాడునో మానునో సీత కెట్లు తెలియును. ఒక్కతెనే పెండ్లియాడునో పెక్కండ్రనో యామె యెట్లు చెప్పఁగలదు? దానింబట్టి రామున కయో ధ్యలోఁ బెక్కండ్రు భార్యలున్నవారని సిద్ధాంతముచేయ నెట్లు వలనుపడును? వారు రామాయణము ననుసరించి రాము నకు బహుభార్యలుగలరని సాధించునెడల ముందుగాని వెనుకఁగాని వారిప్రస్తావము కనఁబడవలదా. రామాయణమున నట్టివార్తకవకాశముగలదా. ఈయాకాశరామన్నపంచాం గము నిష్ఫలమైనది ఇట్టి వట్టిమాటలచే రామునకుఁ బెక్కండ్రు సతులు గలరని సాధింప నెవారికి శక్యమే కాదు. వివాహ వార్తకాని సీతను వనములకుఁ బంపినతరాత వారుండినట్లు కాని రామాయణమునఁ గానరాదు. "వీతభయః" అన్నపద మునుబట్టి సీతయుండఁగా నామెకు భయంపడుచుండెననియుఁ దనకు మృతిగలుగఁగా నిఁక నాభయము లేదుగాని విచ్చల విడిఁ దిరుగుమా యని సీత చెప్పెననియు నొకయ ముష్క గల్పించి సీతచే దెబ్బలు తినుచు రాముఁ డుండెనని సిద్ధాఁ

తము చేయఁబూనుదురు కాఁబోలును! సెబా సనవచ్చు. ఇట్టి పాండిత్యము సంపాదించుట కెంతో ప్రయాసపడ నక్కఱ లేదు. రామాయణమునుండి యిట్టియ మును గ్రహించుట మక్కాకుఁబోయి యొకసాహేబు కుక్కమలము ప్రసాదమని తెచ్చినట్టిదే యగును. ఇది యిహపరబాధకము.

మహాశయులారా! ఇంక నిట్టి వెన్నియో యాక్షేపములు గలవు. వాని నిం దే చర్చింపఁబూనిన నీసంపుటమంతయు నిండిపోవును. శ్రీరామచంద్రు చరిత్రముఁ జదువ నుంకించు భక్తులకు వెగటుగల్గించును. అది నా యీప్రయత్నమునకు బాధకము. కాన మానితిని. ఆ యాయితావులఁ జర్చించి వ్రాయుదును. ఇచ్చోటమాత్రము వ్రాయక విరమించితిని. రామాయణమునకంటె భారతచరిత్రమే ముం దనువాద మొకండు కలదు. అదియుఁ జర్చింపఁదగినవిషయమే. దానిచర్చయుఁ గొన్నిపుటలు నింపినఁగాని పూర్తినొందదు. కావున దాని నిట మాని వేఱొకసంపుటమునఁ జర్చించి సమాధానము వ్రాయుదును. ఈచర్చకుఁ బూనినపు డేయేశంకలఁ దెలిపితినో వానికిఁ దగుసమాధానములుకూడ నాయాయిస్థలముల వ్రాయుదును. ఇఁక దశరథునిచరిత్రమును వ్రాయుదును. దశరథుఁడు పెక్కువేలయేండ్లు రాజ్యమును భాలించె నని వ్రాయుచు నారంభించినచర్చ యనేకావాంతరవిషయములతో నింతదనుక వచ్చెను. మరల నామహారాజుచరిత్రమును వ్రాసెదను. దానికిఁ బూర్వరంగముగా వాల్మీకిరామాయణమును శోధించినపద్ధతిఁగల శిష్టభాగమును వ్రాసెదను.

శ్రీరాముఁడు రాజ్యమును పాలించుచుండఁగా నామహనీయమూర్తిచరిత్రమును శబ్దార్థాలంకారములతో మనోహరమగునట్లు బ్రహ్మయిచ్చినవరమునఁ గలిగినదివ్యజ్ఞానమునఁ గావ్యనిర్మాణశక్తి యలవడఁగా నావాల్మీకి పరమభక్తిపరిపూర్ణహృదయుఁడై యించుకేని వదలక రచించెను. ఆమహాకావ్య *మిరువదినాలుగువేలశ్లోకములు గలది. అయిదువందలసర్గములుగలది. ఆఱుకాండములుగ విభక్తమైనది. ఉత్తరకాండమని మఱియొకభాగము గలదు. పట్టాభిషేకపర్యంత మాఱుకాండములుగను, బిదప జరగినవృత్తాంతములంగూర్చి యుత్తరకాండముగను రచించెను. ఆయుత్తరకాండము రెండుగ విభక్తమగు. అశ్వమేధముచేసినదనుక నొకభాగము, ఆపిదప భూజాతభూప్రవేశము చేసినంతదనుకఁ గలకథను, ఆమీఁద సాగినకథను గలిపి యొకభాగము. ఈవిభాగము కొందఱుమతము. ఉత్తరకాండ మనునదియే వాల్మీకిమతము.

"తథా సర్గశతాన్ పంచషట్కాండాని తథోత్తరం,
కృత్వాపి తన్మహాప్రాజ్ఞస్సభవిష్యం సహోత్తరమ్.

అనునదియే రామాయణమునఁ గనఁబడు. ఇట్టి మహాకావ్యమును రచించి యిఁక దీనిఁ బఠింపఁజాలువాఁ డెవ్వఁడో యని యాలోచింపసాగెను. తగినశిష్యుఁడు దొరకినఁగాని వీనిని వ్యాపింపఁజేయ నవకాశము లేదనియు విచారించుచుండెను. పరిశుద్ధాంతఃకరణమున నమ్ముని యాలోచింపఁదొడఁగెను.

---

* శ్లోకమనఁగా ముప్పదిరెండక్షరములు గలదియని యర్థము. గ్రంథసంఖ్య యీనియమము ననుసరించి యిరువదినాలుగువేల శ్లోకపరిమితమై యుండవలయు. ఇది ప్రాచీనుల యాశయము.

ఆతరుణమున నాయాశ్రమమునఁ గుశలవు లనువా
రి ఉండిరి. వారు లేఁతప్రాయముగలవారలయు మునా
శ్రమస్థితినిబట్టి మునివేషంబులనే యుండిరి. కావున వారు
భగవదిచ్ఛ తమ్ముం బురికొల్పఁగా మునీంద్రుం గాంచి మహాత్మా!
మే మా కావ్యమును బఠింతుము. నేర్పుఁడని రామాయణము
నిమ్మని మునియడుగులఁ గొల్చుచుండిరి. వా రి ఉ గురుసేవ
చేయుపద్ధతిఁ జక్కఁగా నెఱింగినవారు, విదా పాటవము గల
వారను ప్రసి  నొందినవారు. సోదరులు. కావున వారికంఠ
స రము లొక్క తెఱంగుగానుండి మిగుల మనోహరమై యుం
డెను. అందే వారుండుటం జేసి యమ్మునిప్రీతికిఁ బాత్రులైరి.
కావుననే యాబాలకుల నుపదేశార్హులనుగా భావించెను.

కుశలవులకు ధారణాశక్తి మిక్కిలి యుండెను. వేద
వేదాంగములయందు మంచిపాండిత ముండెను. కావునవారిం
గాంచి నేర్పఱియగు నమ్ముని *వేదా ంబును స్పష్టముగా నెఱిఁ
గింపఁగోరి శిష్యులనుగా గ్రహించెను. తొలుత నమ్ముని వారిరు
వురకు శ్రీరామునిచరితమును దెలుపునదియు, [1] విశేషించి
పరమపావనమగు సీతాదేవిచరిత్రమును వ కరించునదియు
రావణవధము గలదియునయి తా రచియించియున్న రామా
యణమును బోధించెను. వారును జక్కఁగా గ్రహించిరి.
అంతియకాక చదువుటకుఁ బాడుటకు మధురమై త్రశ్ర
మని, చతురశ్రమని, మిశ్రమని తెలుపంబడిన ప్రమాణములు

* వేదోపబృంహణార్థాయ = అని మూలము. 1 కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్ = ౨. బా, ౪ సర్గము.

మూఁడింటితోఁ గూడి సొంపుగనుండుచు షడ్జాదులగు నేడు స్వరజాతులు గలదగుచుఁ దంత్రీలయములఁ గూడినదై శృంగార కారుణ్య హాస్య వీరభయానకరసములను వెదఁజల్లుచు రౌద్రాది రసభరితమైయున్న యాయుత్తమకావ్యమును వారు పాడిరి. ఆయన్నదమ్ములు గానశాస్త్రవిశారదులు. షట్ప్రముఖస్వరములు పూర్ణముగాఁ దెలియునట్లు విపంచినివాయింపను మంద్రాదులగు స్వరస్థానత్రితయమునందుఁ బ్రవీణులు. వారికంఠనాదము లొక్కరీతిగా నుండును. గంధర్వులు మానవరూపమును ధరించినట్లుండువారు. నాటకలక్షణముల నెఱింగినవారు. బింబప్రతిబింబనాయము ననుసరించి రాముని దేహమునుండి గలిగినవారుగాన రామునాకారవిశేషచిహ్నములుగలవారు. కావున నామహాకావ్యమును శాస్త్రప్రకారము గానముచేసిరి. వారి వర్తనము లనిందితములు. కావుననే వారమ్మహాకావ్యమును సరసము వాచోవిధేయముగా నొనరించిరి * ఉత్తమము ధర్మయుక్తము పూర్వవృత్తాంతకథనరూపము నగునాకావ్యమును ఋషులును బ్రాహ్మణులును నదితరసాధువులను గూడియుండు సభలయందుఁ జక్కఁగాఁ గానముచేసిరి. అందొక్కభాగమైన విడువఁబడక యుండెను. ఉపదేశమును సుంతయు వ్యర్థము చేయలేదు.

శ్రీరామమూర్తి యశ్వమేధము చేయుచుండఁగా వచ్చి మహామునులా యజ్ఞక్రియలు విధిమంతములుగా నెఱవేర్చి సుఖాసీనులై యుండఁగా నాకుశలవులువచ్చి యాసభలో నిక్కావ్యమును బాడిరి. దాని నాలకించి వారెల్ల సాధుసాధ్వ

* ధర్మ్యమాఖ్యానము త్తమమ్=అని మూలము.

వనుభాషణముల దమయానందమును దెలిపి మెచ్చుకొనిరి. తన్మయులై వారు గానము చేయుచుండఁగా నది మానుల హృదయముల నానందసాగరమున నోలలాడించెను. వారు మెచ్చుకొనుకొలందిని బాలురకు నుత్సాహము హెచ్చెను. ఆసభనుండి యొక్కముని లేచి యొకకలశమును బారితోషికముగా నిచ్చెను. గానశాస్త్రవిశారదుఁ డనుయశము గాంచిన మరియొకముని ప్రసన్నుఁడై యొకవల్కలము నిచ్చెను. కృష్ణాజినము లోనగువానిని గొందఱు కానుకఁగా నిచ్చిరి. మహర్షులు మీరు "దీర్ఘాయుష్మంతులరు గండు"అని యాశీర్వదించిరి. ఇది కావ్యలక్షణాదులం దెలియఁగోరుకవులకు నాధారము. వాల్మీకిముని విరచితము. ఇట్టి మహాకావ్యమును సమగ్రముగా వీరు గానము చేసిరి. ఇది మిక్కిలి యాశ్చర్యకరము. ఓబాలకులారా! సకలగీతవిశారదులరు. ఆయుర్వృద్ధి నొసంగుచు నభ్యుదయకారణంబగుచు నొప్పు నీపవిత్రకావ్యమును జక్కఁగాఁ బాడితిరని జనులెల్లఁ బొగడిరి. ఆయాయితావుల నీవార్తనే చెప్పుకొనసాగిరి.

ఒకానొకదినమున భరతునిమూలమున గాయకులగు నాకుశలవులను శ్రీరామచంద్రుఁడు కనుంగొనెను. తనగృహమునకు వారలం బిలువంబంచి కొనియాడెను. మఱియుఁ దాను సింహాసనాసీనుఁడై సోదరులు మంత్రులు చుట్టును గూరుచుండి యుండి వారిం బిలిపించి దేవతలరీతి నత్యద్భుత తేజమునఁ బ్రకాశించు నీయిరువురు విచిత్రపదార్థవిస్తృతం బగునాఖ్యానమును గానము చేయుదురు. మీరు వినుండని యాకుమారులం బ్రోత్సహించెను. ఇంచుకయేని లక్షణమును వీటిఁబుచ్చక వారు

గానముచేసిరి అట్టి నాసభ్యులెల్ల నిర్వచనానందమునఁ బరవశులైరి. రామచంద్రుఁడు దాని వినఁ గుతూహలచిత్తుం డయ్యెను.

మహాశయులారా! శ్రీమద్రామాయణమున నాలుగు సర్గములు సంపూర్ణములయ్యెను. ఇఁకఁ గథారంభము చేయఁ బడును. అందును కుశలవులు రామాయణకావ్యమును నేర్చుకొని దానిని సభలయందు గానముచేసి రనువిషయమునుండి కొన్నివిశేషములు తేలెడిని. వానిం దెలిపెదను. ఈకథనుబట్టి మన మాలోచించిన నంతకుఁబూర్వము శ్లోకరూపమగు శారద భూలోకమున లేదని తేలెడిని. వాల్మీకి హఠాత్తుగాఁ దనముఖమునుండి "మా నిషాద ప్రతిష్ఠాం త్వ" మ్మనుశ్లోకము పరమేష్ఠి ప్రోత్సాహమున వెలువడఁగా నచ్చెరువందెను. స్నానముచేసి యాశ్రమమునకు వచ్చెను. "ఉపవిష్టః కథాశ్చాన్యాశ్చకార ధ్యానమాస్థితః."స్థానమున కరుదెంచి పురాణపారాయణము చేసి ధ్యాననిష్ఠుఁడయ్యెను. అన్నదానింబట్టి పురాణకథ లంతకుముందే రచింపఁబడియుండెఁగదా యన్నశంక పొడమెడిని. పురాణకథలు స్మరించెననియే యర్థము చెప్పవలయును. వాల్మీకిమూలమునఁ గవిత మారంభమయ్యె నని యూహింపవలయును. కావుననే యాదికావ్య మనుపేరు దీనికి వచ్చెను. ఇంతకుముందనేకరామాయణము లున్నవని యింతకుముందే చెప్పఁబడియెఁగదా. దానింబట్టి యిది యాదికావ్యమని యెట్లు నిర్ణయింపవచ్చును? అన్నచో నవాంతరప్రళయములు గలవనియు వానిమూలమున సామాన్యసృష్టి నశించుననియు నద్దాని వెనుకనగు

సృష్టియం దీవాల్మీకిముఖమునుండి కవిత ము ప్రారంభమయె ననియు సమాధానముగ గ్రహింపవచ్చును.

"కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్."

అని బాలకాండము నాల్గవసర్గమున సప్తమశ్లోకపూర్వ భాగ ముగాఁ గనఁబడుచున్నది. ఇందొకవిశేష మున్నది. పరికింతము.

"ఇదం రామచరిత్ర ప్రతిపాదనమప్రాధాన్యేన ప్రాధా న్యేన తు సీతాచరితమేవ ప్రతిపాద్యత ఇత్యాహ కృత్స్నం సీతాయాశ్చరితమితి. కృత్స్నం రామాయణం సీతాచరిత్ర పరమ్" అని గోవిందరాజవ్యాఖ్య. వీరు 'కృత్స్నమ్'-అనుపద మును సీతాచరితపదముతో నన యించి'మహత్'అనుపదమును కావ్య ముతోనన యించిరి. ఆయన యము సమంజసమా యని యూహించెదను. సమంజసము కాదన వలనుపడదు. కానిద్రావిడ ప్రాణాయాను మన్నట్లున్నది. కృత్స్నంరామాయణంకావ్యమ్, సీతాయామహచ్చరితమ్. అనునది సమన యముగ నుండును. ఏదియెట్లున్నను సీతాచరితము ప్రధానమని తేలకమానదు. ఏల? రామావతారమువలన లోకమునకుఁ గలుగఁదగుఫల మునకు మూలాధారము సీతయే యనక తప్పునా. కావుననే "శ్రీరామో లలితాంబికా" అన్నప్రాక్తనసూక్తి విస్తరిల్లెను. భగవంతునియానతిం గైకొని సకలధర్మములను భూమిని స్థాపింప నెంచి మూలప్రకృతి ముందే భూలోకమున నవతరిం చెను. సీత యనం బరఁగెను. భూతనయ యనఁగా భూమిగన్న కూఁతురని య ముకాదు. అయోనిజ యనికదా ప్రసి. భూలోకమున నవతరించెనని భావము. పర తేశ రుఁడన్నట్లు యజ్ఞా ము హలముఖమున భూశుద్ధిచేయుచున్నతఱిఁ గనం

బడియెనఁట. అనఁగా న మేమి? జనకమహారాజుమూలమునఁ దనవిఖ్యా తకార ముసు వెల్లడిచేయఁదలంచి యచ్చో నగపడె నని భావము. అప్పటికిముందే పుట్టియుండవలయుఁగదా. జనకున కచ్చెరువుపుట్టునట్లుగాఁ గన్యారూపమునఁ గనఁబడియెను. కొందఱు భర్తకన్న భార్య పె దికాదా యని ప్రశ్నింతురు. ఆప్రశ్నము జ్ఞానమును సూచింపదు. ప్రకృతిపురుషుల కనాది త ము సి ముగనుండఁగా సీత రామునకన్నఁ బె ద్దనుట యసంగతముగాక మఱేమగును? అం దెవరు పె యని నిర్ణ యింప బ్రహ్మకే శక మా?

"మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరం,
అస్యావయవభూతైస్తు వ్యాప్తం సర్వమిదం జగత్."

శ్వేతాశ్వతరోపనిషత్తు. ౪. ౧౦ మంత్రము.

"మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహం,
సంభవస్సర్వభూతానాం తతో భవతి భారత." ౩

గీతా. ౧౪ అధ్యా.

"సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికామ్,
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్. ౭
ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః,
భూతగ్రామమిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్. ౮
మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరమ్,
హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే." ౧౦

గీత. ౯ అధ్యా.

అను నీయుపనిషత్తులు ప్రకృతిసహాయమే పురుషునకుఁ గార్య సాధనమునకు ముఖ్యమని తెల్పుచున్నవి. ప్రళయకాలమున

భూతములెల్లఁ బ్రకృతియందు విలీనములగుననియుఁ దెలిపెను. దీనిభావమేమి? సృష్టిస్థితిలయములు ప్రకృత్యధీనములే యని యుఁ, ద్రిమూర్తులు ప్రకృతిచే సృజింపఁబడినవారలనియుఁ గదా. భగవంతుఁడు సాక్షిమాత్రుఁడే యని స్పష్టమే యగును.

"న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా,
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే." ౧౪

గీత ౪ అధ్యా.

అను నీగీతావాక్యము నిర్లిప్తుఁడు భగవంతుఁడని బోధించెడిని.

రామచంద్రుఁడు సాక్షిమాత్రుఁడుగ నుండఁగా సీతానామమున నిలవెలసిన యామహాప్రకృతి రావణాదుల వధింపఁజేసి ధర్మమును వృద్ధినొందించెను. మహావిష్ణువు త్రిమూర్తులలో నొక్కఁడు. మహాలక్ష్మి యనుపేర నతని కాధారమై ప్రకృతియుండును. ప్రకృతినిర్మితులే త్రిమూర్తులు. ప్రకృతి యనఁగా భగవదిచ్ఛ అని మనము గ్రహించుచోఁ ద[illegible] ము తేటపడును. కావుననే "కృత్స్నం సీతాయాశ్చరితం మహత్". అని వాల్మీకి యొక్కఁగించెను. దీనిచేతనే సీతను రావణుఁడు దొంగిలింపఁజాలఁడనియు, నింద్రజాలము నొకదానిం గల్పించి యాక్రూరదానవుఁ డపహరించినట్లు భ్రాంతిపడ లోకుల నొనరించి తన్మూలమున నధికబలశాలియయ్యు నతఁడు పాలిసెనన్న నీతిని లోకులకుం దెల్పి యెంతటివాఁడైన నిట్టి యకార్యము చేసినఁ జావు తప్పదని నేర్పి తన యవతారమును సార్థకము చేసెనని యెఱుంగవలయును. ఈనీతి నెఱుంగవలయుననియే "సీతాయాశ్చరితం మహత్" అని వాల్మీకి బోధించెను. ఇట్టి

రహస్యము లిందందందుఁ బొడసూపును. వాని నాయాస్థలములఁ జూపుచుంతును.

"ధర్మమాఖ్యాన ముత్తమమ్." ధర్మ్యమ్మనఁగా ధర్మము నుండి విడిపోవనిది. ధర్మసమ్మతమని తాత్పర్యము. కావుననే యుత్తమము. ఏది ధర్మసమ్మతమో, ఏవిషయమునను విరుద్ధము కాదో యదియే యుత్తమమని సారము. ధర్మబోధకమనక ధర్మసమ్మతమ్మనుటచే శ్రీరామమూర్తి ధర్మ మిది యని తన ప్రవృత్తిచే నెఱింగించెను. ధర్మమును బోధింపలేదు. ఆపద యాకాలమున నక్కఱలేదు. తాను ధర్మసమ్మతముగాఁ బ్రవర్తించి యెట్టి కట్టడికాలమునఁగాని ధర్మమార్గమును విడువరాదని యెల్లరకుఁ దనప్రవర్తనమూలమున వెల్లడించెనని యెఱుంగుట శ్రేయంబు.

"రామం విద్ధి పరం బ్రహ్మ సచ్చిదానందమద్వయం,
సర్వోపాధివినిర్ముక్తం సత్తామాత్రమగోచరమ్.
ఆనందం నిర్మలం శాంతం నిర్వికారం నిరంజనమ్,
సర్వవ్యాపినమాత్మానం స్వప్రకాశమకల్మషం.
మాం విద్ధి మూలప్రకృతిం సర్గస్థిత్యంతకారిణీం,
తస్య సన్నిధిమాత్రేణ సృజామీదమతంద్రితా,
తత్సాన్నిధ్యాన్మయా సృష్టం తస్మిన్నారోప్యతేఽబుధైః.

... ... ... ...

ఏవమాదీని కర్మాణి మయైవాచరితాన్యపి,
ఆరోపయంతి రామేఽస్మిన్నిర్వికారేఽఖిలాత్మని.
రామో న గచ్ఛతి న తిష్ఠతి నానుశోచ
త్యాకాంక్షతే త్యజతి నో న కరోతి కించిత్,

ఆనందమూర్తిరచలః పరిణామహీనో
మాయాగుణానను గతోఽహి తథా విభాతి."

ఆధ్యాత్మరామాయణము ౧ సర్గము.

అను నీవాక్యములు పైవ్రాసిన నాయాశయమును దృఢపఱచు చున్నవి.

కొంద ఱీయధ్యాత్మరామాయణము బ్రహ్మాండపురాణమున నున్నదనియు విశామిత్రప్రోక్తమనియుఁ జెప్పుటంజేసి ప్రమాణము కాదందురు. బ్రహ్మాండపురాణమున నిది లేదని నేను నంగీకరించువారిలో నొకఁడను. దాన నిది కల్పితమందురుగాక. ఏమన్న నుపనిషదముచే యీరామాయణము వెల్లడించుచున్నది. కథనిమిత్తమాత్రము గ్రహించి భగవత్తత్త్వము నీయది బోధించెడిని. ఇంతకుముందే నేఁజూపిన యుపనిషద్వాక్యములఁ గలయమే యీశ్లోకములయందుఁ గలదు. "బాలాదపి సుభాషిత" మ్మని మనుస్మృతి బోధించెడిని. ఉపనిషత్తులయము నెవరుచెప్పిన నేమి? గ్రాహ్యమేలకాదు? ప్రకృతినిబద్ధమీలోకము. సగుణబ్రహ్మము ప్రకృతి వశుఁడు కాఁడా. రూపవంతమంతయుఁ బ్రకృతిమయమే.

"యచ్చ కించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా,
అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణస్థితః."

అన్నశ్రుతి భగవంతుఁడు లోపల వెలుపల నున్నవాఁడని తెలుపును. అరూపుఁడనికదా దానియము. "సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికామ్" అన్నగీతోక్తి రూపముగలదంతయుఁ బ్రకృతిమయమే అని బోధించును గదా. ఈయమే యధ్యాత్మరామాయణమునఁ గలదు. గతా

దులు ప్రమాణములగునపుడు తదముసే తెలుపునవెల్ల నేల ప్రమాణములు కావో తెలియఁజాలకయున్నాను.

ఈగ్రంథము ప్రమాణమని ఆపురాణము ప్రమాణము కాదని చేయువాదము నిస్సారము. అల్పబుద్ధులే యట్లందురు. ఈర్ష్యాళువు లగువారికల్పనలే యవి. ఏగ్రంథమైనను భగవత్తత్త్వము తెల్పుటయందు ఏకకంకణమే కాని మార్గము భేదము. శ్రోతలయధికారము ననుసరించి యాభేదము కనఁబడును. కథాభేదమునుబట్టి భగవంతునకు శక్తిలోపము కలదనవచ్చునా. అన్నిఁటిని సమన్వయము చేయునంతయోపిక లేక యాపురాణములు ప్రమాణములు కావందురు. అది యేనాఁటికి సభలో నిలువదు. ఏమతగ్రంథముకాని యొక్కతత్త్వమునే బోధించును. రీతిభేదము. అన్నింటిని సమముగా సమన్వయించవచ్చును. కాని దానికిఁ బరమతసహిష్ణుత యుండవలయు. అది లేకున్న నన్నియు విరుద్ధములుగాఁ దోఁచును. కావున బుద్ధిమంతు లాతురపడక తత్త్వ మెద్దియని యూహింపవలయును. శక్తియున్న నదరిపడి తప్పులుగా మాటలాడువారు తత్త్వమును గ్రహింప సమర్థులుకారు. కరచరణావయవవిశిష్టునిగా భగవంతుని ధ్యానింతురు కాని వారే యాతని ప్రకృతిసహితునిదియా కాదా యని యాలోచింపరు. మొండిపట్టుదలయే వారిని బలుబాములం బెట్టి మోహాంధువునఁ బడఁద్రోసినది. పాపము! వెలువడనేరక యందే తిరుగుచుఁ దత్త్వవేత్తల మనుకొనుచు నానందించుచున్నారు. సంతోషింపనిండు. "తుష్యతు దుర్జనః" అన్నన్యాయ మీనాఁటిది కాదు. కదా. వారట్లు మతముల నెన్ని యోభంగులఁ దిట్టుచు నుండ

నిండు. ఈగ్రంథమంతయు సీతయే పరాశక్తి, శ్రీరాముఁడే పరమాత్మ. అనుసూత్రముమీఁద నాధారపడియుండునని నమ్మవలయును. ఈసూత్రము నించుకంతయు నెచ్చోటనైన నతిక్రమింపదు. అట్టి ప్రకృతిపురుషులగు సీతారాములదివ్య చరిత్రము ధర్మ్యము నుత్తమముగాక మఱేమగును? ఏది ధర్మ్యమో యది యుత్తమము కాకపోవు టెట్లు? అట్టులగుటంబట్టి యిమ్మహాకావ్యము ధర్మైకనిబంధము, నుత్తమమునగు. కావున దీనింబఠించినఁ జతుర్విధపురుషార్థములు కలుగునన్న ఫలస్తుతి సమంజసమే యనఁదగు భక్తిగలిగి శ్రీసీతారాములు ప్రకృతిపూరుషులే యని తలంచుచు, లోకరక్షణము ధర్మసంస్థాపనము దుర్జనశిక్షయు నధర్మమూలచ్ఛేదము నను మహాకార్యములే వారి యవతారములకు ఫలంబులని నిశ్చయించుచు, వారిపాదారవిందముల నారాధింపవలయును. అది యొక్కటియే యీకలికాలమున ముఖ్యముగాఁ దరణోపాయము. మఱికొన్ని మార్గము లుండవచ్చును. శ్రమవిహీనమగుమార్గ మిదియే. ద్రవ్యార్జనము చేయఁ బాటుపడ నక్కఱలేదు. పరులసాయ మక్కఱలేదు. ఎందుఁగూరుచుండిన నేతత్కృత మునకు బాధ లేదు. మనస్సు నిర్మలముగా నుండుట, భక్తి యొక్కఁడు పాదుకొనుట యను నీరెండును గుదిరినఁ జాలును. ఇంతకన్న సులభమార్గము లేదన్నను సాహసము కాదు. ఇట్టి మహాఫలము లిందుఁ గ నకారణముననే యీయుత్తమకావ్య శీతభానుఁడు సాధుజనుల కాహ్లాదమును గల్గించుచు నిర్మలప్రకాశరూప సత్ఫలముల వెదఁజల్లుచు నక్షీణప్రభావమున నిరంతరము వెలుఁగొందఁజాలెను.

## రామాయణమున నన్ని వేదము లిమిడియున్నవా?

ఇఁక నీరామాయణమునఁ గలమహత్త్వము లివి యని తెల్పుచుఁ గొందఱు పల్కుమాటలకు సమాధానము వ్రాసెదను. అవి ప్రకృతోపయోగమా యన్న నౌ ననవలయును. అప్రకృతవిషయము నిందుఁ జూడ శక మేకాదు.

"వేదోపబృంహణార్థాయ తావగ్రాహయత ప్రభుః." ౬

బా. ४ స.

ఆమునిచంద్రుఁడు వేదోపబృంహణముకొఱకు వారిని శిష్యులనుగా గ్రహించెను. అనియుండుటంబట్టి యీప్రస్తావమున కిట నవకాశముకలదని యెఱుంగవలయును. ఈచర్చవలన రామాయణమున నాకు భక్తిలేదని కొందఱు దేవానాం ప్రియులు కల్పించినను సాధుమతులు గ్రహింపఁజాలకపోరు. భక్తి లేనిచో నాగ్రంథమును వ్రాయఁబూను టెట్లు? వేషప్రధానులపోకడలు లోకమును వంచింపంగలవు. కాని కొంతకాలమున కవా రివేషాభినయములు ద్రవ్యార్జనమునకనియే తెల్లమగును. మోసపోవువారు పామరులు. [illegible]రులు మోసపోవరు. ఇఁకఁ బ్రకృతమునకు వత్తును.

లోకమునఁ బొగడ్తకు నొకహద్దున్నది. మేరమీఱినచో నది తుదకు దానికున్న తొలిమర్యాద నడంచును. కావున నే మేరమీఱిన స్తుతిని ముఖస్తుతి యని స్తుతినింద యని యెన్నియో పేరులఁ బె[illegible]లు పిలుతురు. రామాయణ ముత్తమోత్తమగ్రంథమనుట నిర్వివాదాంశము పెక్కండ్రు దానినాపన్నివృత్తికొఱకుఁ బారాయణముచేయుదురు. ధర్మార్థ కామమోక్షములు లభింప నెందఱో పఠింతురు. ముఖ్యముగా

సుందరకాండమును బఠింతురు. సమగ్రముగాఁ బారాయణము. చేయువారును గలరు. దాన వారి కా వాంఛలు ఫలించుటయుఁ గలదు. ఫలింపకుండుటయుఁ గలదు. ఏలయందురేమో ఆఫలములను బొందఁదగుసుకృతము నాతఁడు చేసియుండఁడు. దాన నీపారాయణము నిష్ఫలముకాలేదా యనరాదు. పైజన్మమున కిది యుపకరించును.

"ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశు కిల్బిషః,
అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్." ౪౫ శ్లో. ౬ అధ్యా.

అన్నగీతాశాస్త్రము పైభావమును స్పష్టపఱచుచున్నది. ఒక్క జన్మముననే వాంఛలు ఫలింపవు. సల్పవాంఛలు ఫలించును. మోక్షమును గోరి పారాయణముచేసినచో నాజన్మముననే ముక్తి లభించునా. లభింపదని నీ వెట్లందువు! అనవచ్చును. ఒక్కయుదాహరణమువినుఁడు. చక్రవర్తిత మునుగోరి పారాయణము చేయవచ్చును. వాఁడు చక్రవర్తియగునా? కాఁడు. ఏల? అట్టి మహాఫలము నొందఁదగుసుకృతము నాతఁడు చేయలేదు. ఐతే యీపారాయణఫల మేమగును? పైజన్మమున నట్టి, ఫలము నొందఁదగుపుణ్యముచేయఁ బురికొల్పును. అంతియ కాని వ మెప్పటికని గాదు. కృషిచేయువాఁడు పైరుపెట్టఁ దగనికాలమున దున్ని భూమిని సారవంతముగాఁజేయ నాసారము పైసంవత్సరమునకు నుపకరించునుగదా. అట్లే యీపారాయణమున భగవంతుఁడు శ్రీరామమూర్తి సంప్రీతుఁడై యాతనిమనస్సు పరిపక్వమై పాపకార దూరమై పుణ్య కారములనొనరించునట్టి దగుఁగాక యని యాశీరదించును. అంతియకాని తాను బుణ్యముల నొనరించి యితరులకు దార

వారియండు. అట్టివారికి ముక్తి లభింపదు. ముక్తి గోరందగినది కాదు ఫలాభిసంధిరహితముగా భగవంతు నారాధించిన నదియే ముక్తినిగ ంచును మంచికృషి యపుడు ఫలము నీయకున్నను సత్కృతుల నొనరించునట్లు చేయును. కావున రామాయణ పారాయణము మహోపకార మొనరించును. పరిపకా ంతఃకర ణుండై శ్రీరాము నుపాసించి తచ్చరిత్రమును గీర్తింపవల యును. ఇది సత్సాంప్రదాయకము. అనఁగా శ్రీరామమం త్రము నుపాసించి దాని యధిష్ఠానదైవమగు భగవంతునిచరి త్రమును దెలుపు రామాయణమును పారాయణము చేయ వలయును. అట్లుచేయనిచో సంపూర్ణ ఫలము లభింపదు. భక్తి కల్గినఁ జాలదా మంత్ర మేల యందురు. భక్తియున్నచోఁ బారాయణముమాత్ర మెందులకని మరల సొకరు ప్రశ్నించిన వారేమియు బదులుచెప్పఁజాలరు. భక్తిని దృఢముగా నెల కొల్పుటకే యీమంత్రములు నీపారాయణములు నని యెఱిం గిన మేలు దురావముల కవకాశము దానఁ గలుగదు. శాస్త్రమే యిన్నిమార్గముల నుపదేశించెను. ఈమార్గములలో నొకొక్కరి కొక్కొక్కమార్గము రుచించును. దానిని బ్రధానముగా వారు భావింతురు. మంత్రము నుపాసింపక పారాయణముచేయువారిని మన మాక్షేపింపరాదు.

"న బుద్ధిభేదం జనయేదజ్ఞానాం కర్మసంగినాం,
జోషయేత్సర్వకర్మాణి విద్వాన్ యుక్తస్సమాచరన్." 3 అ. 26 శ్లో.

అను గీతాశాస్త్రమే మీఁదిభావమును స్పష్టీకరించెడిని. భక్తి యనునది యమూల్య పదార్థము అది పూర్వపుణ్యాతిరేకముచే లభించునేని యెన్నిలోపము లున్నను పామరులు భగవం తు నారాధింపవచ్చును. పండితు లట్టు లారాధింపరాదు.

"యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాంగతిం. ౨౩
తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ.
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి." ౨౪

౧౬ అధ్యా-

అను నీ గీతావాక్యము శాస్త్ర మెఱింగినవారు దాని నుల్లంఘింపరాదనియు నట్లు లొనర్చిన ఫలము లభింపదనియు స్పష్టపఱచుచున్నది. కావునఁ బండితులకుఁ బామరులకు భగవదారాధనప ద్ధతి యొక్కవిధము కాదని స్పష్టము. విచారింపఁగా శాస్త్రవిహీనపద్ధతిని దైవము నారాధించిన ఫలసి ద్ధి పూర్ణముగా లేకున్నను బరజన్మమున కా యారాధనము శాస్త్రసి ద్ధమార్గమును జూపించును. దానఁ జక్కని జ్ఞానము లభించును. దానిచే ముక్తుఁ డగునని సూచనము.

ఈరీతిగా నీ రామాయణము పారాయణమునకు నుత్తమగ్రంథమైనది. ధర్మార్థకామమోక్షసాధనమైనది. సర్వవిపన్నాశనక్షమమైనది. ఈవిషయమున మతభేదములు లేవు. శ్రీరామచంద్రుని దూషించువారెవరు లేరని నాయాశయము. ఏలన స ప్రవర్తనము ధర్మమున కనురూపముగా నుండున ట్లొనరించి తత్కాలమున వచ్చు నుపద్రవములు సైచియున్నఁ దుదకు నుత్తమయశంబు లభించు నన్న న్యాయమును బ్రకటించిన శ్రీరామచంద్రునందు ద్వేష మూనువాఁ డెవఁ డుండును? వ్రేలు మడిచి యీదోష మీసమయమున శ్రీరామమూర్తి యొనరించెనని చెప్పఁదగినదేదియేఁ గలదా? వెదకినను లేదు. సత్యము నే పల్కుచు స్మితపూర్వముగ మాటలాడుచు నెల్లరయందు

సమపక్షపాతముగలిగి మహాద్రోహ మొనరించిన శత్రువుచేతఁ జిక్కి నపుడుకూడ నిస్సహాయుఁడని కరుణించి వదలిపెట్టునంత దయాగుణముకలిగి యలరారు శ్రీరామమూర్తి నారాధింప నిచో జన్మమేల? అట్టిపరమపూరుషునిచరిత్రము నిరుపమానము. పరమపావనము నగుట యాశ్చర్యమా! ఎన్నటికిని గాదు. ఆ రామాయణము సకలమతసమ్మత మగుటయు న్యాయమే.

"గాథా అప్యత్ర గాయంతి యే పురాణవిదో జనాః,
రామే నిబద్ధతత్త్వార్థా మాహాత్మ్యం తస్య ధీమతః."

అను హరివంశవాక్యమే రామచరిత్రమునఁ గలమహిమమును దెలుపుచున్నది. కాఁబట్టి యిట్టి లోకోత్తరచరిత్రము లోకులకుఁ గానుకగా నీయఁదలంచి నారదముని వాల్మీకికిఁ దెలిపెను. దానినే ధ్యానించుచుండఁగా బ్రహ్మయు నరుదెంచి యేల సంశయింతువు. నాతలంపువలననే యీశ్లోకము నీవదనము నుండి నిర్గమించినది. ఈశాపవను వ్యాపింపఁజేయు మార్గము రామచరిత్రమే. అని యెఱింగి శ్రీరామచరిత్రము నాయనుగ్రహమున నీయెదుటజరిగినట్లు తెలియఁగలవని వరమొసంగి పోయెను. ఈ రెండువిషయములు లోకమునకు శ్రీరామచరిత్ర మత్యంతోపకారకమని వెల్లడించుచున్నవి.

కొందఱు నూత్నవైష్ణవులీరామాయణమున నాల్గువేదము లిమిడియున్నవని యుపన్యసింతురు. అది సత్యమా? ఇంచుక పరిశీలింతము. ఇమిడియున్నవన్న బాధయేమని కొందఱు ప్రశ్నింతురు కాఁబోలు. బాధలేదుకాని యెవరే నేలాగున నిమిడియున్నవో యు రింపుఁడని ప్రశ్నించిన నప్పు డూరక యుండవలసివచ్చును. ఇది దబ్బఱయని వా రూహింతురు.

వారికి ముందున్న భక్తియు నశించును. మతాంతరు లాక్షే పింతురు. ఇట్టి యసత్యములు పలుకుచున్నవా రందురు. కావున నీవిషయము పరికింప నవసరము కనదు.

"ఇదం పవిత్రం పాపఘ్నం పుణ్యం వేదైశ్చ సమ్మితం,
యః పఠేద్రామచరితం సర్వపాపైః ప్రముచ్యతే. ౯౮
ఏతదాఖ్యానమాయుష్యం పఠన్ రామాయణం నరః,
సపుత్రపౌత్రస్సగణః ప్రేత్య స్వర్గే మహీయతే." ౯౯

బాలకాం. ౧ సర్గము.

"పూయతేఽనేనేతి పవిత్రం పరిశుద్ధిసాధనమిత్యర్థః. న కేవలంపరిశుద్ధ్యా పాదకం కింతు పాపఘ్నం. పుణ్యం. పుణ్యం లాంగలజీవనమితివత్పుణ్య సాధనం. అనేన ప్రాయశ్చిత్తవ్యావృత్తిరుక్తా. త పాపమేవ నివర్తయతి. ఉక్తార్థత్రయే హేతుమాహ వేదైశ్చ సమ్మితమితి. సర్వవేదసదృశమిత్య ర్థః. ఇదం రామచరితం సంక్షేపరూపం యః పఠేత్. వేదవత్ నియమం ప్రతిదినం పఠేత్, సర్వపాపైః పూర్వోత్తరాఘైః ప్రముచ్యతే." అని గోవిందరాజవ్యాఖ్య.

విశిష్టాద్వైతవ్యాఖ్య యగుదీనిం బఠింపుఁడు. పండితోత్తము లగు పీరిభావముం బరికింపుఁడు. సర వేదములతో సమాన మని భావము. కావున నియమముగా వేదముపఠించినట్లు పారాయణముచేసిన సర పాపములు తొలంగునని దీని సారము. ఇది నారదముని వాల్మీకిమునికుపదేశించిన సంక్షేప రామాయణపారాయణఫలమని యెఱుంగవలయు.

"ఇదం పవిత్రం అంతఃకరణశోధకం పుణ్యం పుణ్యసాధనం వేదైశ్చసమ్మితం తుల్యం సర్వవేదా ప్రతిపాదకత్వాత్తుల్యత్వమ్."అని మహేశ్వరతీర్థులు.
"వేదైస్సమ్మితం సకలవేదార్థరహస్యప్రతిపాదకత్వాద్వేతతుల్యమ్." అని తిలకవ్యాఖ్య.

సకలవేదార్థప్రతిపాదకమనఁగా భావమేమి? అన్నివేదముల యందుఁగల య మంతయు నిందుఁ గలదనియా? కాదు. వేదములన్నియుఁ దెలిపిన సారతరమగు న మేదిగలదో అట్టిధర్మ మును దెలుపునది యని య ము. అంతియకాని వేఱుగాదు. ఈవ్యాఖ్యాతలయభిప్రాయము ననుసరించి వేదము లిం దిమి డింపఁ బడినవనియు, లాగినఁ బైకివచ్చుననియుఁ గాదు.

"వేదోపబృంహణార్థాయ తావగ్రాహయత ప్రభుః." ౬

బాల ౪ సర్గము.

"వేదోపబృంహణరూపప్రయోజనాయ వేదోపబృంహణరూపస్వగ్రంథ పఠనాయేత్యర్థః. ఉపబృంహణం నామ నానాశాఖానుసారేణ నిర్ణీత వేదార్థప్రతిపాదకో గ్రంథః." అని గోవిందరాజులు. "వేదోపబృంహ ణార్థాయ వేదార్థవ్యక్తీకరణాయ." అని మహేశ్వరతీర్థులు. "వేదోప బృంహణం వేదస్య తత్తదర్థే తాత్పర్యగ్రాహణం తద్రూపాయార్థాయ ప్రయోజనాయ. అనేన శ్రుతితాత్పర్యవిషయీభూతార్థప్రతిపాదక తయా ప్రామాణ్యమస్యోపాదేయత్వం సూచితమ్"అని తిలకవ్యాఖ్య."

సకలశాఖల ననుసరించి ని యింపఁబడినవేదా మును బ్రతి పాదించునది యని సారము. ధర్మము వేదనిర్ణీతము. సత్య వాక నిరతి లోనగునవియు వేదము నిర్ణయించినవియే. కావున ధర్మసత ప్రముఖముల నీమహాకావ ము బోధించును. కావున వేదారోపబృంహణమను ప్రయోజనముగలది యీరామాయణ మని నిభావము. ఈభాగమునుబట్టికూడ నిందు వేదము లన్నియు నిమిడియున్నవని తేలదు.

"వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసాదాసీ త్సాక్షాద్రామాయణాత్మనా."

అనుప్రమాణము నుదాహరించి వేదమే రామాయణ మం దురు. వేదమే రామాయణరూపమున వాల్మీకిముఖమునుండి వెలువడినదనఁగా నేవేదమని ప్రశ్నమువచ్చును. "ఏకో వేద శ్చతుర్ధా సా." అను పురాణవాక్యము ననుసరించి వేదచతు ష్టయమని సమాధానము రావచ్చును. ఎట్లో దయయుంచి తెలుపుఁడనుప్రశ్నము వచ్చును. అప్పు డాకాశమువంకఁజూచి తలపంకించి నిట్టూర్పునిగుడించి యేమో పలుక నూహించి యీసర్గమున నీశ్లోకమునందు నిన్నవయక్షరము. "అ" అను నది. ఆసర్గమున నీపదమున నిన్నవది "గ్ని" అనునది. మరల నీకాండమునువదలి యీకాండమున నీసర్గమున నీశ్లోకమున నిన్నవది "మీ" అనునది. ఇట్లే యింకొక్కచోట "ళే" కలదు. కలిసిన "అగ్నిమీళే" అనుఋగ్వేదమంత్రము. ఇట్లే త్రిప్పిత్రిప్పి యందందు వెదకిన నన్నివేదములు తేలును. అని సమాధానము చెప్పుదురు. మహానుభావా! ఇట్లే లెక్కించిన వేదములేకాదు స్మృతులు, పురాణములు, నితిహాసములు మఱియు వ్యాకరణాదిశాస్త్రములు మొదలగునవన్నియు నీ రామాయణమునుండి తేలెడిని. రామాయణమున నొక్కబాల కాండమునుండియే చూపవచ్చునుగదా. రామాయణము మాట యేటికి? పెద్దబాలశిక్ష యనుపాత్రము కలదు. అది యత్యుత్తమగ్రంథము. దానినుండియు వేదాదివిద్యల నుద్ధ రింపవచ్చునే. ఇంతశ్రమ మేల? అని మరల నొకప్రశ్నము రావచ్చును. సమాధానము నీ విందులకు యోగ్యుఁడవుకావు. గురువుమాటకు బదులుచెప్పరాదు. మాపెద్దలెల్లని ట్లుపదేశిం చిరి. కావున మా కిందు నమ్మకము గలదు. నీవు నిట్లే నమ్ము

మనునచెప్ప వేఱొక్కసమాధానము రాఁజాలదు. ఇంతకంటె నసమంజసముగుపల్కు వేఱొక్కటి యుండునా? ఇట్టిమాటల వలన లాభము కలదా?

పాఠకమహాశయులారా! చక్కఁగా వినుఁడు. రామాయణ ముత్తమోత్తమకావ్యము, సకలపాపహరము, సకలసంపత్కరము, సకలాపన్నాశనక్షమము నగును. కాని దానియందు వేదము లిమిడియున్నవనుట యతిశయోక్తికాని వేఱుగాదు. ఈవిషయమునుగుఱించి కొన్ని ప్రమాణములు చూపెదను. శ్రద్ధగాఁ జిత్తగింపుఁడు.

"ఇయం తు సంహితా బ్రాహ్మీ చతుర్వేదైశ్చ సమ్మితా." ౨౪

కూర్మపురాణము ౧ అధ్యా.

"అంశైష్షడ్భిస్సమాకీర్ణమంగైర్వేదమివాపరమ్,
పురాణం వైష్ణవం చక్రే యస్తం వందే పరాశరమ్."

విష్ణుపురాణము ౧ అధ్యా.

"తత్ర భాగవతం పుణ్యం పంచమం వేదసమ్మితమ్,
కథితం యత్త్వయా పూర్వం సర్వలక్షణసంయుతమ్."

దేవీభాగవతము. ౧ అ.

"ఇదం భాగవతం నామ పురాణం బ్రహ్మసమ్మితమ్,
ఉత్తమశ్లోకచరితం చకార భగవానృషిః." ౪౦

శ్రీభాగవతము 3 అధ్యా.

"బ్రహ్మసమ్మితం సర్వవేదతుల్యమ్" అని వ్యాఖ్య.

"పురాణం లోకతత్త్వార్థమఖిలం వేదసమ్మితమ్,
ప్రశశంస స భగవాన్ వసిష్ఠాయ ప్రజాపతిః. ౯

తత్ర వ్యాఖ్యాతం పుణ్యం వసిష్ఠో భగవానృషిః,
పౌత్రమధ్యాపయామాస శక్తేః పుత్త్రం పరాశరం.
పరాశరశ్చ భగవాన్ జాతూకర్ణ్యమృషిం పురా,
తమధ్యాపితవాన్ దివ్యం పురాణం వేదసమ్మితమ్. ౧౦
విఖ్యాపనార్థం లోకేషు బహ్వర్థం శ్రుతిసమ్మతమ్" ౧౨

బ్రహ్మాండపురాణము ౧ అధ్యా

"పురాణం నారదో పాఖ్య మేత ద్వేదార్థసమ్మితమ్,
సర్వపాప ప్రశమనం దుష్టగ్రహనివారణమ్." ౧౬

బృహన్నారదపురాణము ౧ అధ్యా.

"సారభూతం పురాణేషు కేవలం వేదసమ్మితం,
వివృతం బ్రహ్మకార్త్స్న్యం చ కృష్ణేన యత్ర శౌనక." ౫౦

బ్రహ్మవైవర్తము ౧ అధ్యా.

ఇట్లే మఱికొన్ని పురాణములనుండి ప్రమాణములను జూప వచ్చును. గ్రంథవిస్తర భీతిని మానితిని. ప్రతిపురాణమునుండి వేదముల ను రింపవచ్చునా. ఆపక్షమున వేదము లంతసులభ ములా? వేదసమ్మితమ్మనఁగా వేదతుల్య మనియే యర్థముగాని వేదయుక్తమని యర్థము చెప్పవచ్చునా. ఈవాక్యములు ప్రమా ణములు కావనవచ్చునా? ఈవాక్యమే రామాయణమునందును గలదు. ఇందే దేయర్థము గ్రహింపవచ్చునో రామాయణమునం దాయర్థమే గ్రహింపవలయుఁగాని యసంగతముగా వేదము లింబిమిడియున్నవనుట యపహాస్య భాజనము కాకపోవునా. అన్నిపురాణములను ద్రోసివేయుదము. శ్రీవైష్ణవులకుఁ బ్రాణ తుల మగు శ్రీభాగవతమునందు "బ్రహ్మసమ్మిత"మ్మని యున్నది గదా. భాగవతముచుండియు నాల్గువేదములను ద్రాడుగట్టి లాగ వచ్చునా. అందు నిమిడియుండు. నే నప్పుడు రామాయణమునఁ

గలవిశేషమేమి?-ఈవాక్యముగల పురాణముల నన్నింటినుండియు వేదము లుద్ధరిల్లునెడల వానిఁ బఠించినఁ జాలునే. వేదపాఠ మేల? వృథాయాస మనవలయుఁగదా. కావున రామాయణమున సకలవేదము లిమిడియున్న వనుమాట మధ్వ వైష్ణవజల్పితము. నియమబద్ధముగా వేదముల నాలిగింటిని వారు రామాయణమునుండి యేకాండమునుండిగాని యారంభించి ఋగ్యజుస్సామాథర్వములను రింతురేని, అవి నియమము ననఁగా గణనమున నొక్కవిధమగుసంఖ్య ను మించకయుండునేని శిరసావహింపవచ్చును. ఆకాలము వచ్చునంతదనుక మన మీవాదమసంగతముగా భావింతము. ఒక్కయక్షరమునకు వేదమునందున్నదానికిఁ బ్రతిగా రామాయణమున నీయక్షరము గ్రహింపవలయునన్నచో నది దురా దమే యగును. అప్పుడు పె బాలశిక్షనుండి యన్నివేదముల ను రింపవచ్చు నన్నవాదము నంగీకరింపవలసినదే. కొందఱు

“వేదః ప్రాచేతసాదాసీత్సాక్షాద్రామాయణాత్మనా”

అన్నవాక్యమునుండి రామాయణమున వేదము లిమిడియున్నవని యంగీకరించిన నేమి నష్టమని యడుగవచ్చును. నష్టమేమియులేదు. భక్తియంకురించి విస్తృతింగాంచఁ దగుస్థితి నున్నవారలిద్దానిం బరికించి యందవిలేకుండునేని రామభక్తిని విడనాడుదురు. అంతకంటెఁ గష్ట మాస్తికుల కేమి కావలయును? వేదముల పారాయణము చేసిన నేఫలముగలుగునో భక్తిచే రామాయణమును బారాయణముచేసిన నాఫలము గలుగునన్న శిరసావహింపవలయును. కాని యప్పుడును వేదపారాయణము చేయఁజాలనివారలకును, వేదము రానివారలకు వేదము

చదువరానివారలకు నీరామాయణపారాయణము వేదపారా యణఫలము నిచ్చు ననవలయును. ద్విజేతరులకు వేదము పఠింప నర్హముకాదని రామాయణమునందే కలదు. ఇది వర్ణ చతుష్టయవిశిష్టులకుఁ బారాయణార్హము.

"పఠన్ ద్విజో వాగృషభత్వమీయాత్
స్యాత్ క్షత్రియో భూమిపతిత్వమీయాత్,
వణిగ్జనః పణ్యఫలత్వమీయా
జ్జనశ్చ శూద్రోఽపి మహత్త్వమీయాత్." ౧౦౦. ౧ సర్గము.

"నైవాస్తి దోషో మమ నూనమత్ర
వధ్యాహమస్యాప్రియదర్శనస్య
భావం న చాస్యాహమనుప్రదాతు
మలం ద్విజో మంత్రమివాద్విజాయ." ౫. సుందర ౨౮ సర్గము.

రామాయణము ద్విజేతరులకుఁ బఠనార్హము కాదని కొందఱు మతము. గాయత్రీమంత్రసంపుటితమగుటయే యందులకుఁ గారణమని వారివాదము.

"వేదాంతగో బ్రాహ్మణస్స్యాత్ క్షత్రియో విజయీ భవేత్,
వైశ్యో ధనసమృద్ధః స్యాచ్ఛూద్రస్సుఖమవాప్నుయాత్."

అని విష్ణుసహస్రనామాధ్యాయమున ఫలస్తుతియందుఁ గనఁ బడియెడిని. పఠన్ అనఁగా శృణ్వన్ అనియు మనియుఁ జెప్పు దురు. "శృణ్వన్ రామాయణం భక్త్యా." అన్నవాక్యమే దాని కాధారము. ఏది యెట్లున్నను పైఁ జేర్కొనఁబడినరీతిని వేదము ఛందిమిడియుండలేదనుట స్పష్టము. పెద్దలెల్లనిట్లే పలుకుటకు హేతువేమనఁగా శ్రీమద్రామాయణమునందు వారికింగల తిశయమే యని మన మూహింపవలయును. ఈరామా

యణమే పర వేదములని భావించి పారాయణము భక్త్యతిరేక మున నొనరించినఁ బరమపూరుషుని యనుగ్రహమున వారు కృతార్థులగుదురనుటకు సంశయము లుండవు.

"ధ్యాయం స్తన్మయతాం యాతో భావో హి భవకారణమ్." ౪౬
శ్రీభాగవతము ౧౦స్కం. ఉత్తరభాగము. ౭౪ అధ్యా.

అనునీవాక్యమే ప్రమాణము.

"భావనామాత్రసంతుష్టహృదయః పరమేశ్వరః."

అనుప్రాచీనోక్తి యుఁ బైయాశయమునకుఁ జేయూఁత యొసం గును. కాని విమర్శింపఁబూనినపుడు వారివాదము నిలువఁజాల దని యిపుడూహింతము.

"రామాయణకథ వేదమందున్నదా?

విమర్శకాగ్రేసరులు కొందఱు రాముకథ వేదములయం దున్నదందురు. దానిచే మనవంటివారికి మఱింత హెచ్చుగా రామచంద్రునియందు భక్తి కుదురును. మహత్తరలాభమే యది యగును. అందులకు సందియమే లేదు.

"భద్రో భద్రయా సచమాన ఆగాత్స్వసారం జారో అభ్యేతి పశ్చాత్,
సుప్రకేతైర్ద్యుభిరగ్నిర్వితిష్ఠన్ రుశద్భిర్వర్ణైరభిరామమస్థాత్."

ఋగ్వేదనిరుక్తము.

ఇట్టివి మఱికొన్ని శ్రుతుల నుదాహరించి పైయర్థము స్థిరపఱతురు.
మహనీయమూర్తియగు శ్రీరామచంద్రునిపరమపవిత్ర చరిత్రమును వేదములు వినుతించుట యొకగొప్పగాదు. వేదములు వినుతింపఁజాలవనుటయే యుక్తము. భగవత్తత్త్వము

వేదములచేతను దుర్జ్ఞేయమనుట నిరి వాదాంశము. అట్టిరామ మూర్తికథను వేదములయందును గలదు. కాన కల్పితము కాదనువాదము నిరుపమానము. అస్తిమహనీయులు వందు లు. పరమభాగవతోత్తములు. ఈవాదమునం దొక్కలోపము కల దని నాయల్పబుద్ధికిం దోఁచెడిని దాఁచిపెట్టక వెలిపుత్తును.

వేదము లపౌరుషేయములనికదా ఆస్తికులవిశ్వాసము. అవి సనాతనములై యపౌరుషేయములై వెలయునపు డందుఁ ద్రేతాయుగాంతమునసాగిన శ్రీరామచరిత్ర మేలాగునఁ జేరె నను ప్రశ్నము వచ్చును. గతాగతవిషయములను శ్రుతు లుప దేశించును. కాన నర్థవాదములగుభాగములు కొన్ని కలవన వలయును. పెద్దలు దీని నంగీకరింతురు. వేదము లికాకారణ మునఁ బౌరుషేయము లనఁగూడదా యని యాక్షేపించువా రుందురు. వారికి సమాధానము చెప్పుట యెట్లని నాసంశయము. నాయాశయ మెంతనీరసమైనను వ్రాసెదను. పండితులు నాపైన గినియరాదు.

రామకృష్ణాదిశబ్దములు భగవంతునకుఁ గలవు. దశరథు నకుఁ గొడుకై యవతరించినతరాత రామనామము, దేవకీ దేవికిఁ గొడుకుగ నవతరించినపిదపఁ గృష్ణశబ్దము భగవంతు నకు రాలేదనియు నిట్టినామములు భగవంతునకుఁ గలవనియు నానామమే దాశరథికిఁ బెట్టఁబడియెననియు మనమూహింప వలయు. సర్వ శబ్దవాచ్యుఁడు కదా భగవంతుఁడు. వేదముల యందుఁ గలరామశబ్దము భద్రాదిశబ్దములు పరమపూరుషునకుఁ దత్పత్నికిఁ జెందునవియనియు వారిచరిత్రము నవి సంక్షేప రూపముగాఁ దెలిపెననియు నిందువలన రామాయణము

బాత్రుండయ్యెను. ఎవాని జన్మము కష్టమూలమో యతఁడు లోకోపకారపరాయణుం డగును. ఎవని పేరు శాశ్వతముగా లోకమున నిలుచునో యతనిజన్మము ధన్యమని పెద్దలమతము. లోకమునకు మహోపకారము సముద్రముమూలమున నొనరించెను. దుర్జనుల నెందఱనో విదేశములకుం బొఱందోలెను. మతధ్వంసకు లగువారు తనదేశమున లేక యుండఁజేసెను. కావున నట్టిసగరునిపేరు తొలుతఁ జేర్పఁబడియెనని యూహింపవలయును. ఈతనిచరిత్రము ముందు రాఁగలదు. ఎవ్వాని పేరు పరమపావనముగ లోకమున వెలయునో అట్టివారు సూర్యవంశమున విశేషించి జన్మించిరి. కావున నట్టివంశమున రామునిజననము గల్గెను. నిర్మలతమవంశమునఁగాని భగవంతుఁడు జన్మింపఁడు. దీనిచేత రామజననమునకంటె ముందే మహోత్తమపురుషులు జన్మించిరి. లోకోపకారపరాయణత మేసవంశజులకు లక్షణమని దీనినుండి మనము గ్రహింపవలయును ఈకావ్యము ధర్మార్థకామములనొసంగునది. అనఁగా నిహలోకఫలములనుగూడ నొసంగునది. ఇవి యథానుకూలముగాఁ గోరఁదగినవి. ముక్తిమాట యిట లేదనరాదు. భగవత్కథ మోక్షమునిచ్చునది యగుట సుప్రసిద్ధము. ధర్మార్థకామములు కోరిననే యొసంగుననియు మోక్షమును భక్తుఁడు కోరకయున్న భగవంతుఁడు తానే యొసఁగుననియు దీని భావము. ఈమూఁడును త్రివర్గములనంబడును. వలయునేని భక్తుఁడు కోరవచ్చును. లేకున్న నూరకయుండవచ్చును. వాంఛలు వదలినఁగాని ముక్తి చేకూరదనుట సిద్ధాంతము.

సరయూనదీతటములఁ గోసలదేశము గలదు. అందుఁ గలజనులు సంతుష్టులు. ధనధాన్య సంపన్నులుగ నుందురు. ఆ కోసలదేశ మతివిశాలము. నది కిరువైపులవ్యాపించుటంజేసి కోసలములను ప్రసిద్ధి దీనికిం గల్గెను. ఆదేశమున నయోధ్య యను పురము గలదు. లోకములయందు దానిప్రఖ్యాతి వ్యాపించెను. ఏలయనఁగా మనుజులఁ బాలించుచున్న మను వద్దానిం గట్టింపవలయునని తానె సంకల్పించి నిర్మించెను. మహాపురమనియు నది చెప్పందగినది. పండ్రెండామడలంత యాయతము గలది. మూఁడుయోజనములు దానివిస్తీర్ణము (వెడలుపు). మహాపథములు చక్కఁగాఁ దీర్చినట్లుండును. మఱియు నందలిరాజమార్గ మొక్కఁడు పెదియు ముచ్చటగాఁ దీర్చినట్లుండునదియు నైయుండును. అందుఁ బూవులు చల్లఁబడుచుండును. నీరు చల్లుచుందురు. ఆనగరమున కెంతో సొంపు నామార్గమే కూర్చుచుండును. అట్టినగరమును దశరథుఁ డను రాజలలాముఁడు పరిపాలించెను. ఆతని పాలనమున నా పె రాష్ట్రము ధర్మమున వర్ధిల్లెను. దేవేంద్రుఁడు స్వర్గమున వల్లునట్టు లాదశరథుఁ డానగరమున వెలసెను ఆనగరమున నంగడు లొకదానినొరయుచు నింకొకటి యుండక యెడ గలిగియుండును. శిల్పిజనులు పెక్కండ్రందుందురు. రాజులను స్తుతించువందిజనులు, నిద్రనుండి మేలుకొలుపు మాగధులు నెందఱో యందుఁ గలరు. ధనధాన్యరాసు లందు రక్షింపఁబడుచుండును. శత్రువులు చొర వలనుపడకయుండఁ బ్రాకారములు నాయుధములు గలవు. వనితలకు నభినయము నేర్పునట్టువులగుంపందుఁగలదు. ఉద్యానములు, మామిడితోఁటలు, విశేషించి

యందుఁ గలవు. ఆజానేయములు భద్రజాతిగలయేనుఁగులు రథములు వీరభటులతండము లందుఁ గానఁబడును. కప్పములు సమర్పింపనరుదెంచు సామంతరాజులు, బేరమునకై వచ్చిన నానాదేశవాసులగు వర్తకులు సందులేక యుందురు మణిమయగృహములు, క్రీడాపర్వతములు నందుండి యమరావతీ నగరమును స్మరింపఁజేయుచుండును. సుందరాకారముగల నారీమణు లందుందురు. సులలితవాద్యధ్వనులు సందులేక వినఁబడుచుండును. విద్వాంసులు మహావీరులు పెక్కండ్రందుఁ గనఁబడుదురు. ఆహితాగ్నులు సుగుణమణిగణాలంకృతులు వేదవేదాంగవేత్తలు సత్యపరాయణులు కేవలఋషులు మునికల్పులు నగుబ్రాహ్మణు లందు నివసింతురు. అట్టియయోధ్యాపురము భూకాంతామణి యలికమునకుఁ దిలకమువలె లలి వెలయుచుండెను.

ఇందలి విశేషములఁ దడవుదము. "మనునా మానవేంద్రేణ యా పురీ నిర్మితా స్వయమ్" అని మూలమునఁ గన్పట్టును. ధర్మాధికారి మనువనంబడును. అట్టిమనువు మనస్సున సంకల్పించియే యయోధ్యానగరమును నిర్మించెను. అనఁగా భావమేమి? భగవంతుఁ డవతరింపఁగలఁడు. అందులకు యోగముగాఁ బురియుండవలయుఁ గదా. అప్రధృష్యమహిమాంచితుఁడు కదా భగవంతుఁడు. అట్టిపరమపూరుషుఁ డుండఁదగినట్లుండవలయును. పరులచే నాక్రమింపఁబడఁగూడదు. అందు ధర్మమునకు బాధకమగున దేదియు నుండరాదు. అధర్మము నిలువ నీడయు నుండఁగూడదు. ఎల్లరు సంతోషమును గాంచఁదగుననుకూలము లుండవలయును. వర్ణధర్మము లాశ్రమధర్మ

ములు సుంతయేఁ గొంత గాంచరాదు. సత్త్వము తపస్సు లోనగునవి యుల్లసిల్లుచు నుండవలయును. ఇట్టు లుండినఁ గాని దానింగాంచి లోకులు మంచిప్రవర్తనము నేర్చుకొనఁ జాలరు. సత్త్వగుణప్రధానులు గానివారు భగవంతు నారాధింప నర్హులుకారు. కావుననే యందుఁ గలబ్రాహ్మణులు ఋషికల్పులని వాల్మీకి యెఱింగించెను. ఇతరులను బాధింపక దుష్టమృగములనే బాధించు శూరులు కలరనుట ముఖ్యముగా నెఱుంగఁదగినది.

"సూతమాగధసంబాధామ్" అనువాకముచేత నేజాతికేదివృత్తియో యద్దాని నింకొక్కరు చేయరాదనియుఁ దెలియవచ్చెడిని. అట్లుండినఁగాని నిశ్చింతముగా మానవులు జీవింపఁజాలరు. పండితుఁడు వ్యాపారము చేయుటయు వర్తకుఁడు పురోహితుం డగుటయుఁ బొసఁగనేని యావిచిత్రవృత్తి యెట్లుండునో యని వచింపవలయునా? ఎంతవనుక వృత్తి జాతినిబద్ధముగ నుండునో యంతదనుక సుఖజీవనము సాగుచుండ జనులు హాయిగా నుందురు.

"ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన,
నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమ."

అని గీతలయందుఁ బొడకట్టెడు. ఇది యర్జునుని వాక్యము గదా యందురేని

"బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ పరంతప,
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః." ४१    ౧౮ అధ్యా.

అని శ్రీహరి ప్రారంభించి నాలుగుజాతులకుఁ దగినధర్మముల బోధించి

"స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మనిరతస్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు. ౪౫
యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతం,
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః. ౪౬
శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వభావనియతం కర్మ కుర్వన్ నాప్నోతి కిల్బిషం. ౪౭
సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్,
సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః." ౪౮

అనునంతవఱకు సాభిప్రాయమును వెల్లడించెను. భగవదభిప్రాయము ప్రతిక్షణము మార్పునొందదు. ఈభావ మెఱింగియే మనువు నగరమును నిర్మించెను. కావున జాతిధర్మములకు బాధ లేకుండునట్లే నగరమును నిర్మించెనని యెఱుంగవలయును. శివ హర్మ్యము దానిప్రక్కన జంతుహింసకొఱకున్న గృహము దానియంతికమున మాంసమమ్మునంగడియు, నద్దానిచెంత సుప వారముల నమ్ముగేహము నిట్టులుండిన నెంతబాగుండునో యూహింపవచ్చును.

నగరనిర్మాణమునఁ బూరమునకు నిప్పటికింగల భేద మేమి? మనువు నిర్మించెననఁగా నెల్లరకు నిండ్లు కట్టుకొన ౕల మిచ్చెనని యర్థము కాదు. ఎవ రెవరు కాఁపురముచేయ నను వగునో యారీతి ముందే గృహములు కట్టించి తగినవారిఁ బిలిపించి యిచ్చుటయే పూర్వపుటాచారము. ఈభావము లంకాపురనిర్మాణమున స్పష్టముగాఁ జెప్పఁబడినది. నరపతి ప్రజా ప్రతినిధి యనఁగా న మిదియే. రాజ్యలాభము సామాన్యము కాదు. ఎల్లరకుఁ దనతనువు నర్పింపవలసి యుండును. ప్రాణములను దారవోసి వారలఁ గాపాడవలసి యుండును. కావునఁ

బూర మున రాజులు నగరములను ముందే నిర్మించి యందుం డఁదగినవారలం బ్రార్థించి పిలిపించి గృహముల నొసంగుచుండిరి. కావుననే యే శ్రమములు లేక వారు హాయిగా నుండి రాజాజ్ఞను భగవదాజ్ఞగా భావించుచుండిరి. "నావిష్ణుః పృథివీపతిః" అన్నమాట యాకాలమున ననుష్ఠానమున నుండెను. కావుననే

"మహతీ దేవతా హ్యేషా నరరూపేణ తిష్ఠతి."

యని మనుస్మృతి బోధించుచున్నది. ఎంతకాల మట్టిపూరాచారములు సాగుచుండెనో యంతదనుకఁ బైయభిప్రాయము రాజునందుఁ బ్రజల కుండెను "యథా రాజా తథా ప్రజాః" అన్నమాట ప్రసిద్ధమే కదా ప్రజానురాగమును గాన్కగాఁ గొన్న రాజు సకలధర్మములఁ బాలించుననుట యొకయబ్బురము కాదు.

కులభేదములు మంచివిగావనియు దానిచే నైకమత్యము చెడుననియుఁ గొందఱందురు. పర మానవసోదరత్వము చెడుటకుఁ గులభేదములే కారణమని వారియభిప్రాయము. కాని వారినిగుఱించి మనము దుఃఖింపవలసిన దేమనఁగా లోకజ్ఞానము వారికిఁ దక్కువయనియే. చక్కనిలోకానుభవము వారి కుండిన వారిట్లూహింపరు. కులభేదములమాట యటుండనిండు. ఒక్కతల్లి కడుపునఁ బుట్టినసోదరులకు నేవిషయముననేఁ గలహములు గలుగుట మనము చూచుచున్నారము. ఇట్టులుండ హేతువేమని ప్రశ్నింపుఁడు. ఏకోదరులే యైనను భిన్నభిన్నరూపములగు కర్మముల నాచరించిరి. కావున నేకమతులు కారు. అదియే విభేదకారణము. ఏకోదరులగతి యిట్టులుండ భిన్నదేశములయందుఁ బుట్టినవారికి భేదములు కలుగకయుండ నీయుప

నా పనులు చేయఁగలవా? జాతి భేదమును గలిగింపవనుట సత్యము. విశేషించి యూహించినచో జాతి భేదమును దొలఁగించును. దూరదేశమునఁ బరస్పరదర్శనము లభించుచో నొక జాతివారమని యొకయభిమానము పొడసూపును. కావున జాతి రవంతయైనను భేదభావమును బోఁగొట్టుననియే నమ్మవలయును. మహాసంగ్రామములు కలుగుటకు జాతిద్వేషము కారణమా? ధనము కారణమా ? బుద్ధిమంతులు చక్కఁగా నాలోచించినఁ దేటపడును. ప్రపంచమంతయు నైకమత్యము గలదిగా నొనరింప శక్యము కాదని యెఱింగియే యథోచితముగనైన నది చేకూరునని జాతి భగవంతునిచేఁ గల్పింపఁబడినదని యెఱుంగవలయు.

"చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః"

అన్న భగవదుక్తి యీవిషయమునే దృఢపఱచుచున్నది. ఇట్టి యనేక కారణములంబట్టి జాతిభేదము లుపకారము నొనరించునవియే యని మనమూహింపవలయును. ఎందఱు తలక్రిందులైన నవి మార్పునొందవు. పేరులు మాఱినను వానివృత్తులు మాఱవనుట సిద్ధాంతము.

ఈవిషయమును జక్క నెఱింగియే మనపూర్వులు నగరముల నిర్మించిరి. గోవుల వధించువారును వానినారాధించువారును నొక్కవీధి నున్నచో గోవధమును జూచిన వానినారాధించువారల కెట్టి యైకమత్యము వారియం దుండునో మన మూహింపవచ్చును. ఇంతమాత్రము పరిగ్రహింపక యంద ఱొకజాతిగా నున్న లోకము బాగుపడునను వారికి నించుకయు లోకానుభవము లేదనుట సత్యమునకు దూరము కాదుకదా.

సర మానవసోదరత ముపన్యాసవేదికలపై నటించుచుండును. అంతియకాని యనుష్ఠానమున విరు మగును. అది యేనాఁటికి ననుకూలింపనిమార్గము. అట్లే యెల్లరు నంగీకరించుచో ననాగరకత యంతకంటెఁ గలదేశము వేఱొకఁ డుండదు.

అట్టి యసంగతాచారములు కలుగక యుండ నయోధ్యా పురము నిర్మింపఁబడినది. దాని భావిదశ నెఱింగియే మను వాసరయూతీరమున నానగరమును నిర్మించెను. మార్గములు విశాలములుగ నుండుట యెంత శ్రేయస్కరమో వారికింగల బు విశేష మెంత శ్లాఘ్య మో వచింపఁదరమా. "వధూనాటక సంఘైశ్చ సంయుక్తాం సర్వతః పురీమ్" అనువాక మునఁ గల యుదారభావము పరికింపఁదగినది. కన్యకలకు నాటనేరుపువారు పెక్కండ్రు కలరని దానిభావము. స్త్రీవిద్య మున్నెంతబాగుగ నుండెనో మనమూహింపవచ్చును. చదువురానివారికి నభినయ నము నేర్ప శక్యము కాదుకదా. నాట్య ము నభ సించుట ధానార్జనము కొఱకుఁగాదనియు భర్తల మనస్సంతోషనిమగ్నులనుగా నొనరింపననియు నెఱుంగందగు. వీణాదివాద్య ములు నాట్యము చిత్రలేఖనము పూర ము ్రలకు ముఖ్య కళలు. చూచినంతనే ఫలకమునఁ జిత్రింపఁగలనేర్పు వారికిఁ గల్గి యుండెను.

"ఆలోకే తే నిపతతి పురా సా బలివ్యాకులా వా
మత్సాదృశ్యం విరహతనువా భావగమ్యం లిఖంతీ,
పృచ్ఛంతీవా మధురవచనాం శారికాం పంజరస్థాం
కచ్చిద్భర్తుస్స్మరసి రసికే త్వం హి తస్య ప్రియేతి.
ఉత్సంగే వా మలినవసనే సౌమ్య నిక్షిప్య వీణాం

మద్గోత్రాంకాం విరచితపదం గేయముద్గాతుకామా,
తంత్రీ మార్ద్రాం నయనసలిలైస్సారయిత్వా కథంచి
ద్భూయోభూయస్స్వయమపి కృతాం మూర్ఛనాం విస్మరంతీ." అని
మేఘసందేశము ౨ సర్గము.

పైశ్లోకములంబట్టి చూడఁగా మనోగోచరమగుదానింగూడఁ జిత్రఫలకమున లిఖించుట పూర్వమున నెల్లరకుఁ గాంతా మణుల కలవాటుపడినదే యని తెలియనగు.

నగరమున సంగీతశాలలు అభినయశాలలు ప్రజలను సంతోషింపఁజేయు నుద్దేశముననే యేర్పఱుపఁబడును. సంగీతాదులు మనశ్చింత నడంచునవియని వేఱుగఁజెప్పనక్కఱయే లేదు. అట్టివిద్యలు కళలుగూడ నిక్కాలమున నామమాత్రములుగ నున్నవనుట నిశ్చయము.

"ముక్తపుష్పావకీర్ణేన జలసిక్తేన నిత్యశః"

అనువాక్యమునఁ గలభావముం గాంచినఁ బూర్వకాలమునఁ గల సదాచారము లెట్టివో తెలియంగలవు. పురమార్గముల యందు విడిపూవులు చల్లుటయు వర్షకాలము మీఱినతఱి నీరు చల్లుటయు ననునివి పూర్వ పుటాచారములు. ఆనగరమున నెట్టియారోగ్యము వెలసియుండునో జను లెంత సంతోషము గలవారో తెలియందగును. "సువిభక్తాంతరాపణామ్" అన్న వాక్యము జూడుఁడు. ఒకయంగడికివేఱొకయంగడికి నడుమ స్థలముండును. దాన నెంతటి యనుకూలములు గలవో చెప్ప వలయునా? ఇట్టివిశేషము లాపురమున నెన్నియో గలవు. ఇవ న్నియు మనపూర్వుల సదుద్దేశములఁ దెలుపును. కొందఱివి వర్ణనము లందురు. లోకమున లేనియాచారముల నున్నట్లు

వ్రాయఁగలవారు బ్రహ్మలే యగుదురు. లేనిపదాములకుఁ బేరులు పెట్టువారు త్రికాలజ్ఞులే యగుదురు. ఏనిఘంటువు నందును లేనివస్తువులకు నామకరణము చేసినట్లు వ్రాయఁబడ లేదు. అట్టివా రున్న వారు మహర్షులే యని నమస్కరింప వచ్చును. ఈవిషయమునుబట్టి యూహించిన నగరాదినిర్మాణము నందును, నారోగ్యరక్షణమునందుఁ బ్రజానుకూలకార ముల యందు విద్యాదులయందు నెంతశ్రద్ధగలవారుగ నుండిరో తెలిసికొనవచ్చును అప్పటినుంచిమార్గము లన్నియుఁ దాఱు మాఱుగ నిపుడున్నవి. అట్టులుండియు నిప్పటివారిలోఁ గొందఱు పూరుల నాక్షేపించుచుందురు. ఇప్పటినాగరికత యనుకొనఁబడునది యప్పటి నాగరకతతోఁ బోల్పనుగూడఁ దగదని మనమెఱుంగుటయే యుత్తమము. ఇంకఁ దరాతి కథను బఠింతము.

## అయోధ్యానగరస్థితి.

* ఆ యయోధ్యానగరమును దశరథుఁడు పాలించు చుండెను. వేదములనేర్చి వానియ ములను జక్కఁగా నెఱిం గినవాఁడు ప్రజలనెల్ల సంతృప్తులనుగాఁ జేసి లోఁబఱచుకొను వాఁడు. దీర్ఘాలోచనముకలవాఁడు. పౌరులకుం గాక జానపదు లకుంగూడఁ బ్రియుఁడుగ నుండు. పూర రాజులలో నతిరథుఁ డనుపేరు తానే పొందెను. అనేకయాగములుచేసి జితేంద్రి యుఁడై ధర్మకార్యముల నాసక్తిచే నొనరించుచు మహర్షు లతో సమానుఁడై రాజర్షియే యీతఁడను విఖ్యాతిని ముల్లో కములంగాంచి బలశాలియై శత్రుసముదయము నోడించి

*బాలకాండము నాఱవసర్గము మొదలుకొని యిది వ్రాయఁబడును.

పెక్కండ్రు మిత్రులు తన్నుఁ బ్రేమింపఁగా నలరారువాఁడు. ఇక్కి వెన్నియో సద్గుణము లాతనికిం గలవు. సత్యప్రియుఁడై యానగరమును బాలించుచుండెను. ధర్మపాలకుఁ డగునారాజు చక్కఁగాఁ బాలింప నాపురము భూలోకస్వర్గ మనందగియుండెను. ఆకారణమున నందుండు ప్రజలు నిత్యసంతుష్టు లనుపేరు గాంచిరి. కావుననే ధర్మనిరతులై యుండిరి అక్కారణమున శాస్త్రముల వినఁ గుతూహలము కలిగి లోభగుణము వెదకినను లేక సత్యమును బాలించుచుఁ బరధనములను గోరక మంచి వర్తనము కలిగియుండిరి.

ఆపురమున నెవి టివేసి వెదకిన నల్పధనవంతుఁడు కాని వాంఛలు నెఱవేఱమిఁ గృశించువాఁడుగాని గోవులు ఘోటకములు ధనధాన్యములు లేనివాఁడు కాని కామాతురుఁడుగాని యొరులను బీడించువాఁడుగాని కానరాఁడు. ఎల్లరు సదాచారసంపన్నులు. మహర్షులంబోలి విమలాంతరంగులు. అంతియగాక కుండలములు ముకుటము పూలహారములు ధరింపనివా రందుఁ గానరారు. అల్పభోగముకలవాఁడు, అభ్యంగస్నానమున శుద్ధమగు నంగము లేనివాఁడు, చందన మలందనివాఁడు, కస్తూరి కుంకుమము లోనగుపరిమళద్రవ్యములచర్చలు లేనివాఁడును లేఁడు. అన్నముదొరకక చిక్కుపడువాఁడు, నన్నదానము చేయనివాఁడు, నంతఃకరణము జయింపనివాఁడు నప్పురిఁ గానరాఁడు. నిరంతరాగ్నిపూజకులు, యజ్ఞముచేయువారు, విదాధికులు నందుఁ గనఁబడుచుందురు. చోరులు వర్ణసంకరకారకులు కానరారు.

అందలివిప్రులు విధ్యుక్తకర్మముల నాచరించువారు,
తేంద్రియులు, శిష్యులకు నకృత్రిమప తిని విద్యాదానము
యువారు, జపనిరతులు, ప్రతిగ్రహమున నిష్టములేనివారు.
ల్లెలయందు నివసించువారలయందుఁగూడఁ బరీక్షించిన నాస్తి
డు, అసత్యవాది, బహుశ్రుతుఁడు కానివాఁడు, నసూయ
లవాఁడు, పురుషార్థముల నాలుగింటిని సాధింపఁజాలనివాఁడు,
పండితుఁడు కానరారు. నాలుగు వర్ణములవారును దేవతా
థులఁ బూజించుచుఁ గృతజ్ఞులయి యుందురు. స్వజాతిధర్మం
లఁ దప్పక యాచరింతురు.

ఇట్టియాకోసలరాజ్యము నయోధ్యాపురము రాజ
నానిగా మున్ను మనువు పాలించినట్లు దశరథుఁడు పాలించు
న్నందున నారాజ్యము సకలభాగ్యములతోఁ దులదూఁగుచు
ండెను. ఉత్తమజాతియందు జన్మించిన గజాశ్వములాపుర
మునఁ గనఁబడుచుండు. స్యందనములు పదాతులు నిండి
యుండ నాపురము శత్రుకరంబై యొప్పు. విచిత్రగృహము
యందుఁ జూచువారికి సంతోషము నిచ్చుచుండును.

## రాజ్యపాలనపద్ధతి.

దశరథునకు నెనమండ్రు మంత్రులు గలరు. వారెల్లఁ
గార్యనిర్ణయమునఁ బండితులు. మంత్రమున నేర్పరులు. ఎదిరి
మనమునఁ గలయభిప్రాయములను జెప్పకయున్నం జూచినంతన
యెఱుంగఁగలవారు. రాజునందుఁ బ్రీతిగలిగి యుపకారము నే
చేయుచు సకలగుణములఁ గొఱంత లేక యుండిరి. దృష్టి,
జయంతుఁడు, జయుఁడు, సిద్ధార్థుఁడు, అర్థసాధకుఁడు, అశో
కుఁడు, మంత్రపాలుఁడు, అను పేరులుగలవారు. ఎనిమిదవమంత్రి

సుమంత్రుఁడు. వసిష్ఠవామదేవు లనుమును లిరువురు పురోహితులుగా నుండిరి. వీరు కాక సుయజ్ఞుఁడు, జాబాలి, కాశ్యపుడు, గౌతముఁడు, మార్కండేయుఁడు, దీర్ఘాయువు, కాత్యాయనుఁడు ననుమహానులు మంత్రులుగను బురోహితులుగ నుండిరి. వీరెల్ల సదాసంతుష్టమానసులై కార్యసాధనమున కనియు ననృతము లాడకయుండుదురు. వారు లోకవృత్తముల నెల్లను గూఢచారులమూలమునఁ దెలిసికొనుచుందురు. పుత్త్రుఁడని యపరాధము చేసినపుడు దండింపక విడువకుందురు. వ ముగ నెవ రిని దండింపరు. కోశాగారమును రక్షించుచుఁ జతురంగబలంబులం గూర్చుచుఁ బగవాఁడైన ననపరాధియగు వాని బాధింపక రాజ్యపాలనమునఁ గడుంగడు నేర్పుగలిగి యుండిరి. * దేశకాలములను వయస్సును శక్తిని గుఱుతించి యపరాధమునకుఁ దగినట్లు మిగులఁ దీక్ష్ణముగాఁ గాని మృదువుగాఁగాని దండింతురు. ఇంద ఱిన్ని విధముల ధర్మమును గాపాడుచున్నందున నారాష్ట్రమున దుర్జనులకు నిలువఁ జోటు దొరకదయె. మోమోటమి లేక న్యాయమునే మంత్రులు రాజునకుం దెల్పుచుండిరి.

అట్టిమంత్రులం గూడి రాజు న్యాయమార్గమును గైకొని చారచక్షుస్స్ఫురణంబున మానవుల కష్టములఁ దొలఁగించి వారలకు క్షేమమును గూర్చుచు దాతయై సత్యసంధుఁడై పగవారు లేమిం జేసి నెమ్మదితో రాజ్యమేలుచుండెను. విశేషించి బుద్ధిమంతులు మిత్రులుగా నుండుటంబట్టియు మంత్రులు సర్వ

* సుతీక్ష్ణదండాస్సంప్రేక్ష్య పురుషస్య బలాబలం = ౧౧. అని మూలము.

కార్యకుశలు లగుటంబట్టియు నాతఁడొక్కకొఱంతయు లేక యుండఁ బూజ మగుమార్గమున రాజ్యమును బాలించెను. దానిచే ముల్లోకములందు నాదశరథభూజానికీర్తియు యశస్సును వ్యాపించెను.

మహాశయులారా! యిందుఁ గొన్నివిశేషములు గలవు. వానిని బరీక్షింతము. "యోఽవిత్సకలం భద్రమశ్నుతే" అన్నశ్రుతివాక్యము ననుసరించి రాజు వేదములను దదర్థముల నెఱుంగవలయును. ప్రజాసంతుష్టి తనదిగా భావింపవలయును. సర్వజనప్రియుఁడుగ నుండవలయును. ఇన్ని కలిగినను యుద్ధశూరుఁడు కానిచో నతఁడు రాజ్యమును బాలింపఁ బనికాఁడు. దేవతల నతిథుల దీనాంధబధిరకుబ్జులను సంతోషింపఁజేయవలయును. ఇన్నివిషయములయందు సమర్థుఁడైనఁగాని యాతనివిఖ్యాతి మూఁడులోకములయందు వ్యాపింపదు. "యథా రాజా తథా ప్రజాః" అన్నట్లు రాజునుబట్టి ప్రజలు వర్తింతురు. కావుననే రాజకుటుంబమెల్లరకు నుదాహరణముగా నుండవలయును. తనలోపము లిట్టివని తెలిసికొనుటకే రాజు గూఢచారుల నియమించును. వేషాంతరములూని వారు పోయి యందందుఁ దిరిగి తిరిగి యితరులు గూఢచారులు వీరని యెఱుంగనట్లు కారాంతరములఁ బ్రవర్తించుచు వార్తల నెఱిఁగి రాజునకుఁ జెప్పుచుండవలయును. ఆవార్తల నాలకించి తాను రాజ్యమున నెట్టి నియమముల నొనరించిన మేలో యూహించి యారీతిగా నొనరించుచుఁ దన్నెవ్వరైన దూషించిన నందుల కేమి కారణమని యూహించి యతఁడు దూషింపక తన్ను భూషించునట్లు చేయవలయును. అంతియకాని తన్ను

దూషించెనన్న కారణమున నాతని శిక్షింపరాదు. దుష్టుఁడై దూషించినయెడల శిక్షింపవలయును. అట్టులొనరించువాఁడే రాజ మును బాలింపనర్హుఁడు. పుణ్యాత్ముఁ డాతఁడే యగును.

"రాజా గురుర్యమశ్చైవ శాసకా ధర్మేషు యుజ్యతే,
కర్తా చ ముచ్యతే పాపాన్న స పాపేన లిప్యతే." వివాదరత్నాకరము.

"యో దండ్యాన్ దండయేద్రాజా సమ్యగ్వధ్యాంశ్చ ఘాతయేత్,
ఇష్టం స్యాత్క్రతుభిస్తేన సమాప్తవరదక్షిణైః." 3౫౯
యాజ్ఞవల్క్యస్మృతి.

రాజు జాతిధర్మములను జాగరూకుఁడై కాపాడవలయును. లేనిచో నపయశమొందును.

"కులాని జాతీశ్శ్రేణీశ్చ గణాన్ జానపదానపి,
స్వధర్మాచ్చలితాన్ రాజా వినీయ స్థాపయేత్పథి." 3౬౧ యాజ్ఞ. స్మృతి.

"రాజాత్వవహితస్సర్వానాశ్రమాన్ పరిపాలయేత్,
ఉపాయైశ్శాస్త్రవిహితైశ్చతుర్భిః ప్రకృతీస్తథా.
యోయో వర్ణోఽవహీయేత యశ్చోద్రేకమనువ్రజేత్,
తం తం దృష్ట్వా స్వతో మార్గాత్ప్రచ్యుతం స్థాపయేత్పథి."
నారదస్మృతి.

"యత్కించిత్కురుతే రాజా శుభం వా యది వాఽశుభమ్,
భృత్యాస్తదనుకుర్వంతి నర్తక్యో నర్తనం యథా." యమస్మృతి.

"జ్ఞాత్వాపరాధం దేశం చ కాలం బలమథాపి వా,
వయః కర్మ చ విత్తం చ దండ్యం దండ్యేషు కల్పయేత్." 3౬౮
యాజ్ఞ. స్మృతి.

అనుబంధం పరిజ్ఞాయ దేశకాలౌ చ తత్త్వతః,
సారాపరాధౌ చాలోక్య దండం దండ్యేషు పాతయేత్." ౧౨౬
మను. ౮ అధ్యా.

(అనుబంధమనఁగా నంతకుముం దెన్నిసారులపరాధములొనరిం చెనో ఆసంబంధమని యర్థము. సారమనఁగా నపరాధియొక్క ధనాదిశక్తియనియు నర్థము.)

"పితాచార్యస్సుహృన్మాతా భార్యాపుత్రః పురోహితః,
నాదండ్యోనామ రాజ్ఞోఽస్తి యస్స్వధర్మేన తిష్ఠతి." 8-335
మను ౮ అధ్యా

పక్షపాతము లేక దండింపవలయునని దీనినుండి కనుఁగొనవచ్చును. కాని

"అదండ్యా మాతాపితరౌ స్నాతకపురోహితౌ పరివ్రాజకవానప్రస్థౌ జన్మకర్మశ్రుతశౌచాచారవంతశ్చ ఏతే హి ధర్మప్రతికరా రాజ్ఞః ప్రబాలవృద్ధాన్తపస్వినశ్చ క్షంతవ్యః క్రోధం నియచ్ఛేత్"

(అని శంఖలిఖితవాక్యముగా వివాదరత్నాకరమునఁ బ్రకీర్ణకతరంగమున నున్నది. (దీనింబట్టి చూడఁగా మనుస్మృతినాఁటి ధర్మములమార్పు తేటపడును.) దీని కుపబలముగా

"ఆచార్యస్య పితుర్మాతుర్బాంధవానాం తథైవ చ,
ఏతేషామపరాధే తు దండో నైవ విధీయతే."

అనుకాత్యాయనస్మృతివచనము కనఁబడియెడు. మఱియు నీస్మృతియందే

"మిత్రాదిషు ప్రయుంజీత వాగ్దండం ధిక్తపస్విని,
యథోక్తం తస్య తత్కుర్యాదనుక్తం సాధుకల్పితమ్."

అని దండభేదము చెప్పఁబడినది. బృహస్పతి యింతకంటె విశేషములు కొన్ని తెల్పెను.

"స్వల్పేపరాధే వాగ్దండం దిగ్దండం పూర్వసాహసే,
మధ్యేతు రోధనం దండం రాజద్రోహే చ బంధనమ్."

అని దండభేదములు నిరూపించి చెప్పెను. ఇట్టిపద్ధతుల నెఱిం గినఁ గాని రాజునాఁబడఁడు. వేదవేదాంగముల నెఱుంగనివాఁ డెట్టిరహస్యముల నెఱుంగఁజాలఁడు. దశరథుఁడు శ్రుతిస్మృతుల నెఱింగినవాఁడుకనుకనే ప్రజాపాలనమున నించుకంతయు లోపము కలుగకయుండఁ బ్రవర్తించెను. పైనుదాహరించిన స్మృతుల ననుసరించియే ప్రవర్తించెనని రామాయణమునుండి యెఱుంగవలయును.

"న నాస్తికో నానృతకో న కశ్చిదబహుశ్రుతః"

అనుమొదలగుశ్లోకములు ప్రజలవిషయమున రామాయణ మునఁ గలవు. నగరమునందున్నవారేగాక జనపదములయం దున్నవారుకూడ విద్యావంతులనియు నందొక్కఁడైన నాస్తి కుఁడుకాని (దేవుఁడు లేఁడనువాఁడుకాని), అనృతవాదిగాని, అనేకవిషయములు పె లవలన విననివాఁడుగాని లేఁడు. ఇట్టివి మఱికొన్ని దోషములు కలవు. వానినాచరించువారు లేరు. ఈవిషయమునఁ గొన్నిమాటలు చెప్పఁదగియున్నది. ఏదేశమున నాస్తికులుందురో వారివలన విశేషించి చెడుగులు గలుగును. నాస్తికాదు లేదేశమున నుందురో ఆదేశమున స్వేచ్ఛాచారము మెండగును. అది పెంపొందకయుండఁజేయుట రాజునకుఁ బ్రధానము.

"వేశ్యాదిభవనే యస్య రాష్ట్రే భుంజీత సంయమీ,
బ్రహ్మచారీ వ్రతీ యత్ర వేశ్యాదివ షలీకృతం,
అన్నం భుంక్తే తత్ర జాయ లోకసంక్షయః.
మద్యాద్యైర్గర్హితైర్యత్ర సంకరశ్చైవ యోగినాం,
నృపరాష్ట్రభయం తత్ర కారణస్యాన్యథాగమః.
కాషాయవస్త్రభూయిష్ఠో యతివేషో యతివ్రతం,

సంగం వేశ్యాదిభిః కుర్యాత్తదా లోకభయం భవేత్.
తస్మాద్రాజా సమాచారం ధర్మాధర్మే వ్యవస్థితః,
సిద్ధాంతవేదశాస్త్రాణాం పాలనాయ నియోజయేత్."

వివాదరత్నాకరము. ప్రకీర్ణతరంగము.

సన్న్యాసులులోనగువారు దుష్టాన్నము భుజించినవారే భ్రష్టులగుదురని రాజు గారకుండరాదనియు, నట్లుండిన నాపాపము లోకనాశనహేతువగుననియుఁ గావున రాజు ఇట్టిదురితము ములు సాగకయుండ నడంపవలయుననియుఁ బైధర్మశాస్త్రము తెల్పుచున్నది. ఇకాకారణముననే జాతిధర్మముల రక్షింపవలయునని స్మృతులు ఘోషించుచున్నవి.

"శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనం,
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్." ౪౩

ఈశ్వరభావమనఁగాఁ బ్రభుశక్తిని స్పష్టముగాఁ గనఁబఱచుట-

"స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మనిరతస్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు." ౪౫ గీత. ౧౮ అధ్యా.

అని శ్రీకృష్ణపరమాత్మయు నర్జునున కుపదేశించెను. ప్రభువగుట సకలవిషయములందును గనఁబఱుపవలయునని కదా సారము. క్షత్రియుఁడు జాతిధర్మములు నాకేల యన్న నశింపవా. కావుననే దశరథుఁడు రాజ్యమేలుకాలమున నాస్తికులను మఱియు వర్ణసంకరకారులు లోనగువారి నడంచెనని దీనివలన మన మెఱుంగవచ్చును.

## మంత్రులు.

సుమంత్రాదిమంత్రులును రాజధర్మముల నెఱింగిన ప్రోడలు. వసిష్ఠుఁడు పురోహితుండయ్యు మంత్రులలోఁ బరి

గణింపఁబడువాఁడు. ధర్మసందేహములయందు రామునియనుమతి నొందియే దశరథుఁడు ధర్మమును రక్షించువాఁడు. త్రికాలవేత్తయగుమహర్షులు మంత్రులై రాజునకు సాయపడునకా లమున ధర్మమునకు సదాచారమునకుఁ గొఱంతయుండునే. ఔరా! ఆకాలమున ధర్మమునకు వృద్ధిలక్షణము లెన్నియుండినవి. కావుననే కాఁబోలు నరోగులు దృఢకాయులుగ నాకాలపుమానవు లుండిరి. స్త్రీలయందు సౌందర్యము లోపింపదని రామాయణమునఁ గలదు.

"కశ్చిన్నరో వా నారీ వా నాశ్రీమాన్నాప్యరూపవాన్,
ద్రష్టుం శక్యమయోధ్యాయాం నాపి రాజన్యభక్తిమాన్." ౧౬

రాజునందు భక్తిలేనివాఁ డొక్కఁడైన లేఁడని యిందుఁ జెప్పఁబడెను. "నావిష్ణుః పృథివీపతిః" రాజు శ్రీమహావిష్ణువే యని యర్థము. ప్రజలు రాజును భగవంతునిగా భావించువారన్న విషయము భరతఖండవాసులు మఱువరాదు.

"దుష్టస్య దండస్సుజనస్య పూజా న్యాయేన కోశస్య చ సంప్రవృద్ధిః,
అపక్షపాతోఽర్థిషు రాష్ట్రరక్షా పంచైవ యజ్ఞాః కథితా నృపాణాం. ౨౦
యత్ప్రజాపాలనే పుణ్యం ప్రాప్నువంతీహ పార్థివాః,
న తు క్రతుసహస్రేణ ప్రాప్నువంతి ద్విజోత్తమాః." ౨౧ అత్రిస్మృతి.

బ్రాహ్మణులు వేయిక్రతువులు చేసియు సత్పరిపాలకుఁ డగు రాజునకుఁ గలుగునట్టి పుణ్యమును బొందలేరని సారము. అనఁగాఁ బరార్థమై స్వార్థము త్యజించుటయే యత్యుత్తమమని దీనినుండి గ్రహింపఁదగు. ఈరీతిగా దశరథుఁడు రాజ్యమును సన్మంత్రిమునులసహాయమున నిష్పక్షపాతమతిం బాలించెనని మన మెఱింగి యట్లే స్వధర్మమును వదలక యొనరింప

వలయునని యీకథాభాగమునుండి గ్రహింపవలయును. ఇఁకఁ దరువాతికథ నాలకింపుఁడు.

## దశరథుఁడు పుత్త్రకామేష్టి చేయనెంచుట.

* ఈరీతిగా ధర్మవేత్త యగు దశరథుఁడు మహాప్రభావ సంపన్నుఁడై పుడమి నేలుచుఁ బుత్త్రనిమిత్తము ననేకవిధము లగు తపస్సులు చేయుచుండినను వంశోద్ధారకుఁ డగుకొడుకు కలుగఁడయ్యెను ఆవిషయమును గూర్చి యాలోచించుచుండఁగా నొకనాఁడు పుత్త్రార్థ మశ్వమేధము నే నేల చేయక పోయితినన్న బుద్ధి తోఁచెను. అంతట బుద్ధి సంపదగల యారాజు బుద్ధిమంతులలో మేలిబంతులనందగు మంత్రులం గూడి యాలోచించి తప్పక యీక్రతురాజము నొనరింపవలయునని నిశ్చయించి సుమంత్రుని గాంచి యారా! నీవేగి గురువులను బురోహితులను బిలుచుకొని యిప్పుడే రమ్మని యాజ్ఞ చేసెను. ఆతఁ డప్పుడే పోయి వేదములయం దారితేఱిన సుయజ్ఞుఁడు లోనగువారిని, బురోహితుఁడగు వసిష్ఠుని మఱియుంగల విప్రప్రవరులను బిలుచుకొనివచ్చెను. రాజు వారినెల్ల నారాధించి కూరుచుండఁ జేసి ధర్మార్థయుక్తము మనోహరము నగు వాక్యముతో మానివరేణ్యులారా! పుత్త్రులకొఱకు మిగుల వంత నొందుచున్న నాకు వారింగాంచి సుఖపడుమేలు కలుగలేదు. కావునఁ బుత్త్రార్థ మశ్వమేధము చేయవలయుననునూహ కలిగినది. శాస్త్రవిధానమున దానిం జేయఁగోరెదను. ఇది నాకు

* ఈభాగము బాలకాండమున నెనిమిదవ సర్గమునుండి గ్రహింపఁబడినది.

సి ంచునట్లు మీరు చేయవలయును. చక్కఁగా నాలోచించి వచింపుఁడని వేఁడుకొనియెను.

ఆరాజువాంఛితమును విని తానే యిట్లు పలికెఁగదా యని మేలుమేలని యావిప్రర్షులు పొగడిరి. ప్రమోదమున నోలలాడుచు మహీపాలకా! జన్నమునకుఁదగిన సంభారముల నన్నింటిని సేకరింప నాజ్ఞ యిమ్ము యజ్ఞాశ్వమును వదలుము. నీవాంఛితమిది ధర్మహితమాటఁ దప్పక ఫలించును. సత్పుత్త్రులం గాంతువు. అని వారు పలుకఁగా సంతోషమున విరిసిన తామరలంబోలి నేత్రములు వల్లఁగా మంత్రులం జూచి నాగురుల యాజ్ఞ రీతి సర క్రతుసంభారములఁ గూర్పుఁడు. రక్షకుల నియమించి యజ్ఞాశ్వము నధర్వుఁడులోనగు ఋత్విగ్వరులతోఁగూడ విడుపుఁడు. సరయూనదికి నుత్తర భాగమున యజ్ఞవాటిక నేర్పఱుపుఁడు. విధిననుసరించి విశేషించి శాంతి కర్మములను జేయింపుఁడు. ఈ యజ్ఞము సర్వోత్తమము. కావున నపచారంబేదియుఁ గలుగకయుండవలయును. సులభసాధ్యంబే నెల్లవారు నొనరింతురు. ఈ క్రతుస రూపము నెఱుంగు బ్రహ్మరాక్షసులు చేనియందే దేనంతరము దొరకునా యని వెదకుచుందురు. ఏమాత్రము రంధ్రము కనఁబడిన య మును బాడొనరింతురేని కర్త దాన నశించును. కావునఁ గార దక్షులరగు మీ రిద్దాని జక్కఁగా నెఱవేఱునట్టిప్రయత్నము నొనరింపుఁడు. అని రా జాజ్ఞాపింప నామాటలు విని దేవరయాజ్ఞానుసారమే యొనరింతుము. అనిపలికి తదాఙ్ఞకుఁ బరమానందభరితులైరి. విప్రప్రవరులు మేము నవహితులమై యట్లే యొనరింతుమని పలికి పనివినిరి. రాజు నంతఃపురమునకుఁ

చోయి సాధీమణులం గాంచి పుత్త్రులం బడయంగోరి యజ్ఞ మొనరింతును. కావున మీరెల్ల దీక్షఁబూనుఁడని వినిపించెను. అమృతప్రస్రవణలవలె నప్పలుకులు చెవులఁబడఁగనే మోముఁదమ్ములు మంచువదలఁగాఁ బ్రకాశించినట్లు వెలింగెను.

మతిమంతులారా! ఇద్దానినుండి యెఱుంగఁదగువిషయము లొకటి రెండు గలవు. అవి విమర్శింపక వదలఁదగినవి కావు. "గహనా కర్మణో గతిః" అన్నవాక్యము భగవత్ప్రతిపాదితము. దాని గాదన నెవరికిని దరముకాదు. దశరథున కంతకుముందేల పుత్త్రకామేష్టి చేయుబుద్ధి పుట్టలేదు? ఇంచుక యోజింపుఁడు. ఎన్నియో క్రతువు లంతకుముందే యొనరించెను. ముదుసలియై దేహము కంపమొందు నవసరమున నీయూహ యేల కలిగెనో యని యెంతయోజించినను దగినయుక్తి యొక్కటి తోఁపదు. భగవంతుఁడు భూమి నవతరించుసమయము రావలయును. రావణునివలనిబాధలు భరింపరానివి కావలయును. పతివ్రతలదుఃఖము మితిమీఱవలయును. వారి మొఱలు మూఁడులోకములఁ జీకాకుపఱుపవలయును. అప్పుడు కాని బ్రహ్మాదులు తన్నివారణోపాయ మాలోచింపరు. ఎవరెవరు రావణాసురునివలన నెట్టిబాధలు పొందవలయునో అవన్నియుఁ గావలయును. అప్పుడుగాని భగవంతుఁ డవతరింపఁడు ఆసమయమునఁగాని దశరథున కాబుద్ధి పుట్టదు. కర్మ మాసమయమున నాతని కీబుద్ధి కలుగఁజేసినది. దీనింబట్టి యాలోచింపఁగా మానవుఁడు మిగుల నస్వతంత్త్రుఁడనియుఁ గర్మ మదృశ్యరూపపాశములం దగిలించి ప్రాణుల నీడ్చుచుండుననియుఁ దేలెడిని. ఈడ్వఁబడుచుండియు మానవుఁడు తానేదో ప్రయ

త్నించినట్లు తలంచుచుండును. దీనికే యజ్ఞానమని పేరు. ఎంత కాలమున కాయజ్ఞానము తొలఁగునో యంతదనుక నీకర్మ సిద్ధాంతము పొడకట్టదు.

"యద్యహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి. ౫౯
స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపితత్." ౬౦ గీత. ౧౮ అధ్యా

కర్మమునకు సా తంత ము నీగీతావాక్యములు ప్రతిపాదించు చున్నవి. ఎవరుగాని కర్మపాశములకు బద్ధులు కాకతప్పదు. అందు జ్ఞానవంతులు

"చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః,
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తస్సతతం భవ." ౫౭ గీత ౧౮ అధ్యా.

అన్న శ్రీకృష్ణవాక్యము నాశ్రయించి కర్మము బలవ మమని యెఱింగి దాని నాశ్రయించుచుఁ దత్ఫలములను భగవంతుని యం దర్పింతురు. అపుడు వారి కహంకార ముండదు. అదియే కర్మమునకు ఫలము. ఎప్పు డాఫలముకలిగినదో భగవంతుఁ డపుడు ప్రసన్నుఁడగును. కావున మాకుఁ గర్మములతోఁ బని లేదన్నవా రెట్టివారో గీతావాక్యమే తెలుపుచున్నది. బ్రహ్మా దులుగూడఁ గర్మబద్ధులగుదురు. అనఁగాఁ దదితరులమాటఁ జెప్ప నేటికి? బుద్ధిమంతుఁడగువాఁడు కర్మమునకు లోఁబడి కర్మసిద్ధాం తముల నొదలం దాల్చి కర్మము భగవత్స్వరూపమని నమ్మి దాని నాశ్రయింపఁదగు లేనియెడల

"అథచేత్త్వమహంకారాన్నశ్రోష్యసి వినంక్ష్యసి." ౫౮ గీత ౧౮ అధ్యా

అన్న శ్రీహరివాక్యము ప్రకారము నశించును.

దశరథమహారాజుకూడ నట్టికర్మము సకాలమునఁ దనుఁ బురికొలుప నవశుఁడై పుత్త్రకామేష్టి చేయఁబూనెనని మన మెఱుంగందగు. ఈకర్మము రాజస మనంబడును.

"యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున,
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతిస్సా పార్థ రాజసీ." ౩౪ గీత ౧౮అధ్యా.

అను గీతావచనము పైదానిని దృఢపఱచుచున్నది. ముక్తిం గోరినవాఁ డొనరింపఁదగు కర్మమార్గము వేఱు. దశరథుఁ డా స్థితియందున్నవాఁడు కాఁడు. కావునఁ బుత్త్రకామేష్టి చేయఁ బూనెను.

"నాపరాధో భవేత్కష్టో యద్యస్మిన్ క్రతుసత్తమే. ౧౬
ఛిద్రంహి మృగయంతేత్ర విద్వాంసో బ్రహ్మరాక్షసాః,
నిహతస్య చ యజ్ఞస్య సద్యః కర్తా వినశ్యతి.." ౧౭

అను రామాయణవాక్యమున నొకగూఢాము కలదు. సత్కర్మముల నాచరించునపుడు కడుజాగరూకత గలిగియుండవలయు. ఏమిలోపము కలిగినను మహాకష్టములు కలుగును. "శ్రేయాంసిబహువిఘ్నాని" అన్నసూక్తి యేనాఁటికిని వ్యర్థము కాదు. మహాఫలములఁ గోరి యేకార్యము లెవ రాచరింపఁ బూనిన నాఫల మాతనికిం జెందకయుండ విఘ్నములు చేయువారు బ్రహ్మరాక్షసులు కలరు. వారెప్పుడునులోపముల నేవెదకుచుందురు. వారివలనిబాధ లంటకయుండ నుండవలయునని రామాయణము తెల్పుచున్నది. అనఁగా శ్రద్ధావంతుఁడై కర్మముల నాచరింపవలయుననియే దీనఁగలసారము. శ్రద్ధావిహీనుఁడై యేకర్మము నాచరింపరాదని మనము గ్రహింపవలయును.

"శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్త్రివిధం నరైః,
అఫలాకాంక్షిభిర్యుక్తైస్సాత్త్వికం పరిచక్షతే. ౧౭ గీత ౧౭ అధ్యా.

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరస్సంయతేంద్రియః,
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతిమచిరేణాధిగచ్ఛతి." 39. గీత 4 అధ్యా.

శ్రద్ధ యనఁగా ఆస్తిక్యబుద్ధి యనియ ము. అనఁగా భగవంతుఁ డున్నవాఁడన్న భావము దానిచే నహంకారము నశించును. అది లేకున్నఁ బనియందే కర్తృతాభిమాన మారోపించు కొనును. అది యేనాఁటికిని బనికిరాదు. కావున శ్ర కలిగి కర్మ ముల నాచరింపవలయుననియు నది లేకున్న నవి నిష్ఫలములు మాత్రమే కాక దుష్ఫలముల నొసంగుననియుఁ దెలియవల యును. బ్రహ్మరాక్షసుల కేమి మనయం దాగ్రహ మనరాదు.

"అస్మిన్ మహత్యర్ణవేంతరిక్షే భవాఅధి
నీలగ్రీవాశ్శితికంఠాశ్శర్వా అధఃక్షమాచరాః
నీలగ్రీవాశ్శితికంఠాదివగ్ రుద్రా ఉపశ్రితాః
యే వృక్షేషు సస్పింజరా నీలగ్రీవా విలోహితాః
యే భూతానామధిపతయో విశిఖాసః కపర్దినః
యే అన్నేషు వివిధ్యంతి పాత్రేషు పిబతో జనాన్
యే పథాం పథిరక్షయ ఐలభబృదాయ వ్యుధః."

అని శ్రుతి బోధించుచున్నది. అట్టిభూతములు శ్ర గలవాని చెంతకు రాఁజాలవు. ఏకర్మ మాచరించుచున్నను దానియందే మనస్సు నిలిపి చేయవలయునని దీనినుండి మనము గ్రహింప వలయును.

వసిష్ఠాదిమహర్షు లతింద్రియజ్ఞులయు నేల యాతని కీయజ్ఞముచేయఁ బ్రోత్సహింపరాదు? అన్న ప్రశ్నము కలదు. ఐహికఫలముల నొసంగుకర్మములను మహర్షులు బోధింపరు బోధించినయెడలఁ గర్తకు శ్రద్ధ తగ్గును. తానుగాఁ గోరి

యెడల శ్ర యధికమగును. అదియేకదా పరమఫలము నొసంగును. పరిశుద్ధాంతఃకరణులగు పురోహితులను సంపాదించుకొనియే సత్కర్మముల నాచరింపవలయును. లేనిచో ధనవ్యయమే ఫలముగాని వేఱుఫలము కలుగదు.

"పురోహితం ప్రకుర్వీత దైవజ్ఞముదితోదితం,
దండనీత్యాం చ కుశలమథర్వాంగిరసే తథా. 303
శ్రౌతస్మార్తక్రియాహేతోర్వృణుయాదేవ చర్త్విజః,
యజ్ఞాంశ్చైవ ప్రకుర్వీత విధివద్భూరిదక్షిణాన్." 304

యాజ్ఞవల్క్యస్మృతి. ఆచారకాండము.

పురోహితుఁ డనఁగా దృష్టాదృష్టకర్మములయందు ముందు హితము తెలుపువాఁడు. దానమానసత్కారములచేఁ దనకు సంబంధించియే యుండువాఁడని యర్థము.

విధినిషేధముల నెఱింగినపురోహితుఁడు లేకుండిన సత్కార్యములు చెడునని స్మృతులు ఘోషించుచున్నవి. పరమపవిత్రాంతఃకరణులు కావలయునని స్మృతితాత్పర్యము. అట్టివారు దొరకకయున్నచో సత్కార్యముల నాచరింపరాదు. దాన ఫలముకూడఁ గలుగదు. అంతియగాదు దుష్ఫల మొనఁగూడును. అక్షరాస్యుఁడు కానివాఁడుకూడఁ బురోహితుఁడైన నాగృహస్థుపుణ్యము వర్ణింపఁదరమా. తొలుదొలుతఁ బురోహితుని బరీక్షించి గ్రహింపవలయుంగాని దొరకినవానినెల్ల నంగీకరింపరాదు. దాన మేలు చేకూరదు. వసిష్ఠాదులు మహర్షులు కావున నారాజు మనోరథము నెఱవేర్పఁబూనిరి. ఈసర్గమునఁగల విషయములు వేదానుసారములుగా నున్నవి. ఈధర్మములు

"వేదోపబృంహణార్థాయ" అన్న రామాయణవాక్యమును సార్థకము చేయుచున్నవి. కావుననే.

"వేదః ప్రాచేతసాదాసీత్సాక్షాద్రామాయణాత్మనా."

అన్నసూక్తి యలరారెడిని. దీనింగాంచి భ్రమించి కాంబోలు మధ్వ వైష్ణవులు రామాయణమున నన్ని వేదము లున్నవందురు. వేదవిరు ములుగాని ధర్మముల నన్నింటిని రామాయణ కావ్యము తెలుపుననియే వారు గ్రహింతురుగాక. ఇంకం దరువాతికథను వ్రాయుదును.

## ఋశ్యశృంగమహర్షి చరిత్రము.

* పుత్త్రులంగోరి రాజు హయమేధము చేయంబూను టెఱింగి సుమంత్రుండు మంత్రియు సారథియు నగుటంజేసి విశేషించి చనవుకలవాండగుటంజేసి యొంటరిపాటున దశరథునితో నిట్లు పలికెను. రాజచంద్రా! అశ్వమేధము చేయందగుననిమహర్షులు వసిష్ఠాదులు నీకు హితమును దెలిపిరికదా. ఈవిషయమును మున్నే వినియున్నాండను. సర్వజ్ఞుండగు సనత్కుమారుండు నీకు సంతానముగలుగు ననువిషయమును మున్ను మునులసన్నిధి నిట్లు తెలిపెను.

కాశ్యపునికుమారుండగు విభండకునకు ఋశ్యశృంగుండనుకుమారుండు కలుగు. ఆకొడుకు నిరంతర మడవియందే పెరింగి తండ్రిని వదలకయుండును. వనముతప్ప వేఱొక్కదాని నతండెఱుంగంజాలండు. అతండు బ్రహ్మచర్యముభంగముకాంగా గృహస్థుండగును. ఆతని బ్రహ్మచర్యము రెండువిధములుగ

---

* ఈయది బాలకాండము తొమ్మిదవసర్గము మొదలుకొని పదునొకండవసర్గముదనుకం గలభాగమునుండి వ్రాయంబడును.

నుండును. కృష్ణాజినాదులను ధరించియుండునది యొకఁడు. వివాహానంతరము శాస్త్రవిహిత కాలములయందు మాత్రమే భార్యంగూడియుండునది యొకఁడు. ఈ రెండింటికిని బ్రహ్మచర్యమనియే పేరు. ఆమునిబాలకుఁ డగ్నిహోత్రునకుఁ దండ్రికిని సేవచేయుచుఁ దొలిపగు బ్రహ్మచర్యవ్రతము నవలంబించి యుండునపుడు రోమపాదుఁ డను రాజంగదేశమును బాలించుచుండును. ఆతఁడు ధర్మమునుమీఱి ప్రవర్తించినందున ననావృష్టిదోషము కలుగు. చాలకాల మది బాధించును. దానికిం జింతించి రాజు వేదవేదాంగపారంగతులగు బ్రాహ్మణులను బిలువంబంచి మీరు సర్వజ్ఞులరు. ఈయనావృష్టిదోష మెట్లు తొలఁగును? చేయందగుప్రాయశ్చిత్త మెట్టిది? సెలవిండు. అని ప్రార్థింపఁగా వారు రాజా! విభండకమునితనయుఁ డగుఋశ్యశృంగు నేయుపాయముననైన నిచటికిఁ బిలువనంపుము. సత్కరించి నీతనయ నొసంగుము. దాన నీదేశదారిద్ర్యము తొలఁగు ననిరి. రాజు నియతబ్రహ్మచారియగు నాతని నెట్లు పిలిపింపఁదగునా యని యూహించి మతిమంతుఁడగు మంత్రితో నాలోచించి బ్రాహ్మణులే యిక్కార్యమున సమర్థులని వారిం బంపఁజూచును. వా రాతనిమహత్త్వ మెఱింగినవారు కావునఁ దమ కక్కార్యమును నిర్వహింపలేమని యెఱింగించి రావించునుపాయము చెప్పఁబూని యొక్కయుపాయము గలదు. దానిం బ్రయోగించిన నాతఁడు వచ్చును. ఆతనివ్రతమునకు హాని కలుగదు. విభండకునివలనను భయము గలుగదు. ఈయనావృష్టియుఁ దొలంగునని సనత్కుమారుఁడు తెలిపెను. రాజు వారు చెప్పినట్లే రూపవతులగు వేశ్యలం బంపించి యాతని

రావింప వర్షము కురిసెను. శాంతాదేవి నాతనికిచ్చి పెండ్లి చేసెను. ఆతఁడు నీయల్లుఁడుకదా. ఆతనియనుగ్రహమున నీకు సంతానలాభము కలుగును. ఈవిషయ మాసనత్కుమారుఁడు తెలుప విన్నవాఁడనుగాన నీకుం దెలిపితిననఁగా దశరథుఁడు మంత్రిసత్తమా! ఎట్లమ్ముని నడవినుండి తోడితెచ్చిరో యెఱిం గింపుము. వినఁ గుతూహలమయె డిని. అనఁగా నతఁ డిట్లు తెలిపెను.

రాజేంద్రా! ఆవిషయమతివిచిత్రము. వినుము. రోమపా దునితో మంత్రులు పురోహితులు మఱియు నిట్లుపలికిరి ఆముని యడవియందే తిరుగుచుండును. తపము వేదాధ్యయనము కృత ములుగా భావించువాఁడు. కావునఁ బురాణేతిహాస ములంగూడ నెఱుంగఁడు. అట్టులగుట ్రలనఁగా నెవరో యేమూలమునకైన నెఱుంగఁడు. విషయసుఖమనఁగా నెట్టిదో తెలిసినవాఁడు కాఁడు. రూపరసాదులు పురుషుల నాకర్షింపఁ గలవు. తన్మూలమున నాతని నాకర్షించి తెప్పింతము. రూపగర ముగల వేశ్యలం బంపినవారు పలువిధములగు నుపాయములచే నామునిని దేఁగలరు. వారల నమ్ముని సత్కరించును. అనఁగా నమ్మునికొఱకై రాజు మంత్రుల కాజ్ఞాపింప వారట్లె వెల యాండ్రం బంపిరి.

వేశ్యలావనముంజేరి యతనిదర్శింపఁ బ్రయత్నించు చుండిరి. ఋషికుమారుఁడు వనములయందే తిరుగువాఁడు. నాగరుల చందమెట్టిదో యెఱుంగఁడు. వశీకృతేంద్రియుఁడు గాన నంతసులభముగా లోఁబడఁడు. సదా ఆశ్రమముననే యుండువాఁడగుట దర్శింప వారికి వలనుపడదు. విశేషించి

పితృశుశ్రూషాపరాయణత మున నుండును. క్రొత్తపురుషులను జూచి యెఱుంగఁడు. స్త్రీలమాట యిఁకఁ జెప్పనేల? పురగ్రామ ములయందుఁ గలపదా ముల నెఱుంగఁడు. కావున వారు శ్రమంపడి దర్శింపఁ జూచుచుండిరి.

దైవవశమున నొక్కనాఁడు ఋశ్యశృంగుఁ డావార కాంత లున్నతావున కరుదెంచెను. వానింగాంచి శృంగార వతులు గాన నాడుచుఁ బాడుచు నాతని గదియంజని విప్ర ప్రవరా! నీవెవ ఁడవు? భయంకరారణ్యమున నివసించెదవేల? ఒంటరిగాఁ దిరుగుచున్నాఁడవే. ఏటికి? తెలుపుమని యడిగిరి. మునికుమారుఁ డంతకుముం దెఱుంగని విధముగా నున్న వారిని గాంచి స్నేహముగలిగి నాతండ్రి విభండకుఁడు. నాపేరు ఋశ్యశృంగుఁడు. తపోనిష్ఠ నుండుదు. శుభదర్శనులారా! ఇక్కడికి చెంతనే నాయాశ్రమ మున్నది. మీకెల్ల సత్కార మొనరింతు అంగీకరింపుఁడు. అన వా రాతనిం గూడిపోయిరి. ముని సకలోపచారముల వారి నర్చించెను. వారవి యంగీక రించి విభండకమునివలని భయమున నందుండనోడి మహాత్మా మే మొసంగు నీపండ్లు మిగుల సారవంతములు. కైకొనుము. నీకు శుభంబగు. ఆలసింపక వీని భక్షింపుమని పలికి బిగియారఁ గౌఁగిటం జేర్చి పలువిధములగు పిండివంటల నిచ్చిన నాసా దించి యెంతబాగున్నవి? ఇవి క్రొత్తఫలములు. మాయాశ్రమమున నివిలేవు. రుచ్యములుగ నున్నవి. అని పలికి వాని నారగించెను.

అంత నావారకాంత లామునివతంసుం గాంచి మే మొకవ్రత మాచరింపఁ దలంచితిమి. కాన సెలవిండు. అని భయమునఁ బోయిరి. వారు కనఁబడకపోవఁగా నాతనిమనస్సు

కలంతనొందెను. ఒక్కచోట నుండఁజాలకపోయెను. కావున
మున్ను తా నెందు వారిం జూచెనో ఆతావునకుం బోయెను.
ఆమునిరాకం గాంచి సంతోష ముప్పొంగఁగా నెదురుగాఁ
బోయి వారకాంతలు నెయ్య ముప్పొంగ నోసాధూ! మా
యాశ్రమపదము లతిరమ్యములు. రమ్ము. చూడ బాగుండును.
మాస దేశ మదియే. అందలి ఫలమూలాదు లతిరుచ్యములు.
చక్కఁగా సత్కరింతుము అనఁగా నమ్ముని యంగీకరించెను.
మహాసంతోషమున వా రాతని గంగానదిలో సి ముగానున్న
నౌక నెక్కించి ప్రవాహామూలముననే యంగదేశమునకుం
గొనిపోయిరి. మహాత్ముఁడగు నాముని వచ్చుచుండఁగాఁ బర్జ
న్యుఁడు జగములకు నుల్లాస ముప్పతిల్లునట్లు వర్షము కురి
యించెను.

రోమపాదుఁడు వర్షముతోడ దయచేయు నామునిం
గాంచి యెదుర్కొని నమస్కరించి సకలవిధపూజలం దన్ని
వేశ్యలు తోడితెచ్చినందులకు విభండకముని కోపగింపకయుండు
నట్లు చేయ ఋశ్యశృంగునిం బ్రా ంచి యనుగ్రహామునొందెను.
పిదప నంతఃపురమునకుం గొనిపోయి దుహితయగు శాంత
నొసంగి దేశవిప్లవముతొలంగ సంతుష్టాంతరంగుఁడై యుండెను.
ఆపురమున నాముని శాంతాసహితుఁడై యుండెను. అని తెలిపి
సుమంత్రుఁడు మరల నిట్లు పలికెను.

దశరథరాజచంద్రా! సనత్కుమారునివచనము లింకనుం
గలవు. ఆలకింపుము. ఇక్ష్వాకుకులంబున శ్రీమంతుఁడగు దశరథ
మహారాజుదయించును. ఆతనికి నంగదేశపతితో మైత్రి కుదు
రును. ఆరాజునకు రోమపాదుఁ డనుకొడుకు పుట్టును. ఆతనికి

శాంత యనుకొమరిత కల్గును. దశరథుఁ డతనికడ కరిగి నేను సంతానహీనుఁడను. కాన సంతానము కలుగునట్లు శాంతా సంయుతుని ఋశ్యశృంగునిం బంపిన నమ్ముని నాయజ్ఞమును నెఱవేర్చును. కావున నాతనిం బంపుమని ప్రార్థించును. ఆరాజు నందుల కంగీకరించి మునిం బంపఁగలఁడు. పిదప దశరథుండు సంతోషమున యజ్ఞము చేయఁగలఁడు. పుత్రకామేష్టి నిర్విఘ్నముగా సాగును. పిదప వంశోద్ధారకులు మహాపరాక్రమసంపన్నులు నగుకొడుకులు నలువురు గలుగుదురు. ఈకథను పూర్వము కృతయుగమున సనత్కుమారుఁడు తెల్పెను. రాజా! పుత్రార్థివి కాన సబలవాహనుఁడవై నీవే పోయి యమ్మునిం బిలుచుకొనిరమ్మని సుమంత్రుఁడు తెలిపెను.

దశరథుఁ డామాటల నాలకించి యందులకు సమ్మతించియుఁ గులగురువగు వసిష్ఠమహామునిని వదలి వేఱొక్కని వరించుట పాడిగాదని, యాసనత్కుమారునివాక్యమా వసిష్ఠునకే యెఱిఁగించి యమ్మహాత్ము ననుమతినొంది యుచితమగురీతిఁ జేయవలయునని తలంచి వినయమున నావార్తను గులగురువునకుం దెలిపెను. ఆమహర్షియుఁ డందుల కెంతయు సంతసించి యనుమతినొసంగ నంతఃపురకాంతామణులం గైకొని మంత్రులుం గూడరాఁగా రోమపాదుని గాన నేగెను. వననదీనదములం గాంచుచుం బోయిపోయి యంగరాజ ముఁ జొచ్చి యందు రాజధానియందు నగ్నిహోత్రసంకాశుఁడై బ్రహ్మతేజంబున వెలుంగుచున్న నాఋశ్యశృంగుని దర్శించెను. రోమపాదుఁ డాతనిరాక కానందించి విశేషవిధులం బూజించెను. ఆతని నామునికిం జూపి యీతఁడు నాప్రియమిత్రుఁడు.

ఈశాంతకుం దండ్రి. యని పలుకఁగా నమ్ముని మామను సత్కరించెను. అందు నేడెనిమిదెదినములుండి తనయ ష్టముం దెలుప రోమపాదుం డావార్త యల్లునకుం దెలిపి తదను మతింబొంది ప్రయాణము సాగించెను. శాంతాయుతుండయి మునియు మామంగూడి పోయెను శుభశకునములు గనఁబడి యెను. అయోధ్యానగరమంతయు నామునిరాక నెఱింగిన మంత్రులచే నలంకరింపంబడియె. పౌరు లెదుర్కొన నెల్లరు నగరముం బ్రవేశించిరి. శాంతను ముని నంతఃపురమున నునిచి పూజించెను. ఆమహామునిరాకచే నెన్నియో శుభములుగలుగు నని యెల్లరు నమ్మిరి. కొంతకాల మాముని యందే సుఖ ముండెను.

మహాశయులారా! ఋశ్యశృంగచరిత్ర మతివిచిత్రము. దీనినిజదివినంతన యనేకసంశయములు పొడచూపును ఇంచుక సద్బుద్ధి నుపయోగించిన నవి తొలంగుటయేగాక మహానంద ముప్పతిల్లును. మునులచరిత్రము లిట్టివికదా యనియుఁ దెలి యును. పాపము! ఆమునికుమారుఁడు తండ్రినే సేవించుచు నాయడవియందే నివసించుచు లోకవృత్తాంత మేదో యెఱుంగక యుండెనఁట. ఈవిషయము వినఁగనే కూప కూర్మ న్యాయము తప్పక మదికిఁ దోఁచును. కాని యది పొరపాటని విమర్శించినతరా తఁ దెలియనగును. ఇంచుక విమర్శింతము. పురాణాదులం జదువక కేవల తపశ్చర్యయుఁ బితృసేవయు నను వానిమూలమునఁ గాలముం ద్రోయుచుండెను.

"న తేన జన్మప్రభృతి దృష్టః పూర్వం తపస్వినా,
స్త్రీ వా పుమాన్వా యచ్చాన్యత్సర్వం నగరరాష్ట్రజమ్." ౯

అను రామాయణవాక్యములం బఠించినఁ బై విషయమే స్పష్ట మే యని తోఁచును. మఱియు నితరపూరుషులంగాని స్త్రీవార్తనుగాని, జనపదనగరవృత్తాంతముగాని యాతఁ డెఱుం గఁడఁట.

"అనభిజ్ఞస్స నారీణాం విషయాణాం సుఖస్య చ,
ఇంద్రియార్థైరభిమతైర్నరచిత్తప్రమాథిభిః,
పురమానాయయిష్యామః క్షిప్రం చాధ్యవసీయతాం." ౪

అను మూలమును బరికింపుఁడు. స్త్రీవిషయముల నెఱుంగఁడు. అనఁగా స్త్రీలవార్తయే యెఱుంగఁడా. చదువు కొనినవాఁడు కాఁడా యనుప్రశ్నము రావచ్చును. "తేన పురాణేతిహాసాది ముఖేనాపి న స్త్రీస రూపం జానాతీతి భావః" అని వ్యాఖ్యాన మున నున్నది. భగవద్విషయమును మాత్రమే తెలుపు వేద భాగములను దప్ప నితరవిషయముల నాతఁ డెఱుంగఁడని భావము. పై వ్యాఖ్యానభావము చేర్పకయున్న రామాయణము నీరసముగాఁ గనఁబడును. అనేకసంశయముల కాస్పదమిచ్చును. తెనిఁగించువారు దానిం జేర్పకయున్న లాభము లేదు.

క. "చిరపాయమగుసుపాయము, నరసితిమాబుశ్యశృంగుఁ డటవీస్థలిలోఁ
దిరుగుఁ దపస్స్వాధ్యాయన, నిరతుండగుఁజూ పురాణనికరము లైనన్.
క. ఇతిహాసంబులనైనన్, మతి నెఱుఁగఁడు గాన స్త్రీల మాటయెఱుఁగఁడా
గతిశబ్దాదివిషయసం, తతిసౌఖ్యము నెఱుఁగఁడతఁడు తథ్యముసుమ్మీ."

ఆంధ్ర శ్రీమద్రామాయణము.

తర. "జననమందినదాదిగా నొకసారియేని పురంబులన్
జనపదంబులనైనఁ జూచిన జాడలేదు నెలంతలన్

వినియుంనేని నెఱుంగఁడు గ్రసునిష్ఠుఁడౌటఁ దపంబునన్
దనదునాశ్రమభూమి వీడఁడు తండ్రిఁదన్నుపసర్యలన్."

ఆంధ్రవాల్మీకిరామాయణము.

ఋ మంతు లీ పద్యములం బరికింతురుగాక. మూలరహస్యములన్నియు నాంధ్రవాల్మీకిరామాయణమునఁ గలవని, పక్షపాతమునఁ బల్కువారి స్తుతుల నవలికింప ద్రోసివైచిన నీలమున నాంధ్రవాల్మీకిరామాయణము మూలామును బోషింపఁ జాలదనుట స్పష్టము. పురాణేతిహాసములఁ బఠింప లేదని తెలిఁగించిన నుపనిషత్తులందప్ప నన్యగ్రంథముల నవలోకించినవాఁడు కాఁడనియు దానిచే లోకజ్ఞానహీనుఁ డనియు స్పష్టమగును. విమర్శకులు రసజ్ఞులు కావలయును గాని స్తుతిపాఠకులు కారాదు. కోవిదులు పరికించి సంతసించినఁ జాలును. ఏకాలముననైన సంతసించినఁ జాలును.

ఋశ్యశృంగముని పుట్టువుందొట్టి పితృసేవచేయుచు వేదాంతములం బఠించి భగవదారాధనముననే నిరతుఁడై యుండె ననిసారము. పురాణేతిహాసములం బఠింపనికారణమున లోకమున స్త్రీలసౌందర్య మిట్టిదని వారిచర లిట్టివని యెఱుఁగఁడు. నగరములఁ జనపదములం జూచినవాఁడు కాఁడు. ఐహిక జ్ఞానహీనుఁ డనియే యిటఁ గలసారము.

"యదా హి నేంద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే,
సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢస్తదోచ్యతే.
జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః,
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః.
యోగీ యుంజీత సతతమాత్మానం రహసి స్థితః,
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః. ౧

ప్రశాంతాత్మా విగతభీర్బ్ర హ్మచారివ్రతే స్థితః,
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః." ౧౪.గీత౬అధ్యా.
అను శ్రీకృష్ణవాక్యముల ననుసరించి తండ్రిచే శిక్షితుఁడై యామునికుమారుఁడు ప్రపంచజ్ఞానశూన్యుఁడై పరమేశ్వర విషయకజ్ఞాననిష్ఠుఁడై యున్నవాఁడని మన మెఱుంగవలయును. అట్టివానిని వారకాంత లెట్లుమోసపుచ్చి తెచ్చిరి?అను ప్రశ్నము రావచ్చును. సమాధానము వినుఁడు. దీనిచేతనే కర్మసిద్ధాంతము బలవత్తర మనియు నెఱుంగఁ దగియుండును.

స్త్రీరూప మతివిచిత్రము. దానిం గాంచి మోసపోవనివా రరుదు. "బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి" అన్న సూక్తి యేనాటికిని వ్యర్థముకాదు.

"స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్." ౬౦. ౧౮ అధ్యా
అన్నగీతోక్తియు సత్యము కాకపోదు. ఎట్టిజ్ఞానినైనను గర్మము వంచించును. సంసారప్రవృత్తునిగాఁ జేయనెంచిన నాకర్మము స్త్రీరూపమును గనఁబఱచి యాతనిబుద్ధి నియతిని మార్పునొందించును. ఆకర్మ మేదోకాదు. ప్రాగ్జన్మమునఁ దాఁ జేసికొనినదియే.

"అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్."
అనుప్రాచీనోక్తియుఁ గలదు కదా?

ఆమునికుమారుఁడు బ్రహ్మచర్యవ్రతమున నెంతకాలము గడుపఁదగునో యంతకాలము గడచెను. లోకమునఁ దన్మూలమున నెవ రెవరి కుపకారములు కావలయునో యవాని వాతనిచే నొడఁగూర్పఁ గర్మము సంకల్పించెను. ఆసమయముననే

అంగదేశమున ననావృష్టిబాధయు దుస్సహమయ్యెను. పురోహితుల కీమునియే స్మృతిగోచరుఁ డయ్యెను. ఇంతటి నొక్క పరా యమూకర్మము ప్రోత్సహించెనని మన మెఱుంగవలయును. కావుననే భగవంతుఁడు "గహనా కర్మణో గతిః" అని వక్కాణించెను కర్మమును వదలితిమని ప్రకృతియేమియుఁ జేయఁ జాలదనియు వాదించువా రెట్టివారైన మానవులై యుందురు. నోరెత్తి వీలుండదు "కరిష్యస్య వశోఽపి తత్" అన్న శ్రీకృష్ణునివాక్కు నాక్షేపించువా రుందురా? మూర్ఖులాక్షేపించినను వారికర్మమే యట్టి యజ్ఞానమున ముంచెనని మనము సంతసింపవలయును.

వారకాంత లంత నప్పనికిఁబూనిరి. అడవుల కరిగిరి. గంగానదీప్రాంతమున నాముని యుండునడవి యున్నదె. రూపయౌవనసంపద్ధరి తలగు నాకాంతలందుఁ జేరి విభండకముని శపించుచున్న భయమున సమయమునకు వేచియుండిరి. ఇంతలోఁ గర్మమే వారిని దోడితెచ్చినట్లు మునికుమారునిం బురికొలిపి వారిచెంతకుఁ బోవునట్లు లొనర్చెను. వారలాతనిగాంచి యెవ్వఁడవని, భయంకరాటవిలో నేలయున్నవాఁడవని ప్రశ్నింపఁ దనవిషయముం దెల్పి వారిం బ్రార్థించి పిలుచుకొనిపోయి యర్చించి కందమూలాదుల నొసంగెను. వారలందుఁ జాలనే పుండనోడి తమకు తీసికొనిపోయిన ఫలముల నొసంగిరి.

> "అస్మాకమపి ముఖ్యాని ఫలానీమాని వై ద్విజ,
> గృహాణ ప్రతిభద్రం తే భక్షయస్వ చ మా చిరం. ౧౯
> తతస్తాస్తం సమాలింగ్య సర్వా హర్ష సమన్వితాః,
> మోదకాన్ ప్రదదుస్తస్మై భక్ష్యాంశ్చ వివిధాన్ బహూన్." ౨౦

అని మూలము. వేశ్యలిచ్చినఫలములను భక్షించి వారిచ్చిన మోదకములు లోనగుపిండివంటల నాముని భక్షించెను. ఇది పూరా చారసమ్మతమాయని కొందఱు ప్రశ్నింతురు.

"శూద్రవత్స్వచ్ఛ గోపాన్నం వినా గవ్యచతుష్టయం,
తైలాజ్యగుడసంయుక్తం పక్వం వైశ్యాన్న దూష్యతి. ౪౨

లలితోపాఖ్యానము.

ఘృతం క్షీరం తథా తైలం భక్ష్యం స్నేహేన పాచితం,
గత్వా నదీతటే విప్రో భుంజీ యాచ్ఛూద్రభోజనమ్." ౧౩

పరాశరస్మృతి. ౧౧ అధ్యా.

నేయి, పాలు, తైలము, తైలపక ములగు పిండివంటలు శూద్రగృహమునుండి తీసికొనిపోయి నదీతీరమునఁ గూరుచుండి యాపత్సమయమున బ్రహ్మక్షత్రియవైశ్యుల యిండ్లకడ నవి దొరకని యప్పుడు భుజింపవచ్చును. పై శ్లోకమున నింత య ముకలదా యందు లేని.

శ్రుతి. నహం తాను పానమిత్యుచ్ఛిష్టం వై మే పీతం స్యాదితి హోవా రజస్వేదే తేష్వుచ్ఛిష్టా ఇతి, నవా అహం జీవిష్యామి మానఖాదన్నితిహో వాచ కామోమ ఉదకపానమితి.

ఏతచ్చ సర్వాన్నానుమతిశ్చ ప్రాణాత్యయే తద్దర్శనాదిత్యస్మిన్నేవ యాసికసూత్రే సమ్యఙ్మీమాంసితం.

"జీవితాత్యయమాపన్నో యోఽన్నమత్తి యతస్తతః,
లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసి. స్మృతి
ఆపద్గతస్సంప్రగృహ్ణన్ భుంజానో వా యతస్తతః,
న లిప్యేతైనసా విప్రో జ్వలనార్కసమో హి సః." ౪౧

యాజ్ఞవల్క్యస్మృతి. ప్రాయశ్చిత్తకాండము.

యస్త్వధనోఽవసన్నకుటుంబతయా ఆపద్గతోఽపి క్షత్రవృత్తిం వైశ్యవృత్తిం వా ప్రవివిక్షతిసయత స్తతో హీనహీనతరహీనత మేభ్యః ప్రతిగృహ్ణాన్ తదన్నం భుంజానోఽపి వా ఏనసా పాపేన న లిప్యతే. అని విజ్ఞానేశ్వర భట్టారకకృతమితాక్షరావ్యాఖ్య.

అను నీశ్రుతిస్మృతులననుసరించి శ్రీమాధవాచార్యులు పై యర్థమును వ్రాసిరని యెఱుంగవలయు. ఈయర్థము చెప్పనిచో,

"వరం స్వధర్మో విగుణో న పారక్యస్స్వనుష్ఠితః,
పరధర్మేణ జీవన్ హి సద్యః పతతి జాతితః." ౯౭ ౧౦ అధ్యా.

అన్న మనుస్మృతి యసంగతమగును. మఱియు

"సర్వతః ప్రతిగృహ్ణీయాద్బ్రాహ్మణస్త్వనయం గతః,
పవిత్రం దుష్యతీత్యేతద్ధర్మతో నోపపద్యతే. ౧౦౨
జీవితాత్యయమాపన్నో యోఽన్నమత్తి యతస్తతః,
ఆకాశమివ పంకేన న సపాపేన లిప్యతే. ౧౦౪ మను ౧౦ అధ్యా.
ఆరనాళం తథా క్షీరం కాందకం దధిసక్తవః,
స్నేహపక్వం చ తక్రం చ శూద్రస్యాపి న దుష్యతి. చతుర్వింశతిమతము.
మాంసం దధిఘృతం ధాన్యం క్షీరమాజ్యమథౌషధం,
గుడోరసస్తథోదశ్విద్భోజ్యాన్యేతాని నిత్యశః.
అపూపం చారనాళం చ కాందకాస్సక్తవస్తిలాః,
ఫలాని పిణ్యాకమథో గ్రాహ్యామాషధమేవ చ." ఆంగిరసుఁడు.

ఈస్మృతులంబట్టి పరిశీలింపఁగా నాపత్కాలమునందుఁ దైలపక ము శూద్రగృహమునుండి పరిగ్రహించి పోయి నదీతీరమునఁ భుజింపవచ్చునని తేలెడిని. ప్రపంచజ్ఞానశూన్యుఁడగుట నమ్ముఁ

వారిని సద తులనుగా భావించెననియు నెఱుంగందగు. ఈయ మును,

"తాని చాస్వాద్య తేజస్వీ ఫలానీతిస్మ మన్యతే,
అనాస్వాదితపూర్వాణి వనే నిత్యనివాసినా౯." ౨౧

అను నీమూలాలము సా కము చేయుచున్నది. వారిచ్చిన భక్ష్యములు ఫలములుగానే భావించెను వనముననే జన్మముండొట్టియుండినవాఁడగుట నట్లుభావించుట సహజమేకదా. నగరవాసులకంటె జానపదులు వివేకమునఁ గొంత గాంచువారనుట సుప్రసి ముగనుండఁగా వనవాసముననే కాలముంగడపు నామునిమాట వేఱుగాఁ జెప్పనేల? పూర యుగములయందుఁ గొంతదనుక మాంసభక్షణము కలదు. రాజగృహములయందు బ్రాహ్మణులు భుజించునాచారము కలదు. ఈముని విషయముననే యింత చర్చింపవలసివచ్చినది. దీనిచే నాఋశ్య శృంగునకు లౌకిక జ్ఞానము శూన్య మేయనియు నాముష్మికజ్ఞానమే కలదనియు రూఢము. దీనిచే నామునికి భ్రాంతియే కాని దూషణము కానేరదు. అట్టిమహనీయుఁడు కాఁబట్టియే తదాగమనమున ననావృష్టి దోషము తొలంగెను. ఇతరమహర్షుల కట్టిశక్తి కలదా. ఉన్నదేని వారినేల పిలువఁబంపలేదు. జితేంద్రియుఁడై స్త్రీవార్త నెఱుంగక యుండుటంబట్టియే యాఋశ్యశృంగుని యాగమనముననే పర్జన్యుఁడు వృష్టిని బ్రసాదించెనని మన మూహింపవలయును.

ఈచరిత్రమునుండి బ్రహ్మచర్యవ్రతనిష్ఠ యత్యుత్తమ మనియు, లోకవార్తావిముఖత ముముక్షకి సహాయమనియు, మనుజసంగతి ఆముష్మికమునకు దూరమనియుఁ దపస్సత్య

దయాశౌచములు ప్రధానములుగాఁ గలవారి మనస్సంకల్ప
ములు ఫలింపకపోవనియు నట్టిమహత్త్వము కోరఁదగినదనియు
మనము గ్రహింపందగు. ఇందేదియే నభ్యాసమునున్న భగవ
దనుగ్రహము నొందఁజాలుదుమనియే యటఁగలసారము. పూ
ర్వయుగములందు బ్రాహ్మణులకు క్షత్రియ వైశ్య కన్యల వివాహ
మాడు నాచారము స్మృతిసమ్మతముగఁ గలదని యెఱుంగఁదగు
విషయము. మనుస్మృతికాలమునాఁటికి శూద్రకన్యా వివాహము
కూడ ద్విజులకుఁ గలదు. కాని

"యదుచ్యతే ద్విజాదీనాం శూద్రాద్దారోపసంగ్రహః,
నైతన్మమ మతం యస్మాత్తత్రాయం జాయతే స్వయమ్." ౫౬

అని యాజ్ఞవల్క్య స్మృతి నిషేధించెను. తదాదిగా నాయాచా
రము తొలఁగెను. పూర్వకాలము వేశ్యలు నియతవ్రతలై
యుండినందుననే దేవాలయములయందు వారికిఁ బ్రవేశము
కల్పింపఁబడె ననువిషయము మన మెఱుంగవలయును. వ్యభి
చారవృత్తియే ప్రధానమైయున్నఁ బూరు లట్టిసద్వృత్తి వారి
కనుగ్రహింతురా? ఈవిషయమునఁ జర్చింపఁదగువిషయము
కలదు. కాని గ్రంథవిస్తృతి భీతి మానితిని

"గమనాయ మతిం చక్రే తంచ నిన్యుస్తదా స్త్రియః." ౭౩

అని మూలము. వారిదేశమునకు రా సమ్మతింపఁగా వా రాత
నిం దోడ్కొనిపోయిరని మూలమునఁ గలదు. నౌక నెక్కించి
తోడుకొనిపోయిరని వ్రాయుట సమంజసము. లేక యున్న
నసంగతమగును.

"గంగాయాం పూర్వస్థాపితాం నావమారోప్య ప్రవాహేణై
అంగదేశం నిన్యురితి భారతే."

అని వా ఖ ఈభావమును దెల్పకయున్న నడవులనుండి నడిపిం చుకొనిపోయిరా అను ప్రశ్నమువచ్చు.

"నావపై నెక్కించి పావనగంగను దాటించి చేర్చిరి తమజనపదమునకు"

అను నాంధ్రశ్రీమద్రామాయణము సుసంగతమే యని విమ ర్శకు లెఱుంగందగు. కువిమర్శకు లాక్షేపించినను గౌరవమే యని సంతసింపందగు.

ముని రాఁగా రోమపాదుఁ డంతఃపురమునకుం దోడు కొనిపోయి పూజించి యథావిధిగా శాంత యనుకొమరిత నొసంగి వివాహము చేసెను. విధివిహితమే యగుట నమ్మునియు నంగీకరించెను. గృహస్థులైనగాని యమ్మునివలనఁ గాఁదగు కారములు సాగవని యెఱింగినకర్మ మాతని నందుల కంగీక రింపఁజేసెను. ప్రకృతింగూడినంగాని భగవంతుఁడు జగన్నిర్మా ణాదికారములు సాగింపఁజాలనట్లు పత్నీయుక్తుండైనఁగాని మానవుఁడు పరులకు విశేషించి యుపయోగింపఁ డన్ననా యము మన మెఱుంగందగును.

దశరథుఁడు రోమపాదునికడకు రాఁగా నారాజానం దించి యతనిందోడ్కొనిపోయి ఋశ్యశృంగున కతనికినతనికిం గలసంబంధమును దెల్పెను. మునియు నాతనిం బూజించెను.

"సఖ్యం సంబంధకం చైవ తదా తం ప్రత్యపూజయత్." ౧౭

కనా పితయుఁ బితృతులుఁడు గావున నాతని గారవించెనని మన మెఱుంగవలయు. ఇట్టు లీచరిత్రము మనకు బ్రహ్మచర నియమము మహోపకారకమని, వనవాసము నిర్మలజ్ఞానసాధక మని, జితేంద్రియత ముత్తమోత్తమమని లౌకికజ్ఞానము ప్రధా నము కాదనియు దాన నాముష్మికజ్ఞానము లభింపదనియు నిష్క

ల్మషసాంతుల కసాధ్యములగు కార్యములు లేవనియు,నట్టివారిం గనినంత దేవతలు భయంపడుదురనియు మన మెఱింగి కృత కృత్యులము కావలయును. ఇఁకఁ దరాతికథ నాలకింపుఁడు.

## అశ్వమేధయాగము.

* ఋశ్యశృంగమహాముని యయోధ్యఁ జేరినతరువాత గొన్నిదినము లూరకే గడచెను. వసంతకాలము ముచ్చటగా వచ్చెను. దేవతాతేజమున విలసిల్లు నామునీంద్రునకు రాజు నమస్కరించి వంశాభివృద్ధికొఱకు సంతానముం బడయుటకై యజ్ఞముచేయ నాతని వరించెను. అమ్ముని యంగీకరించి రాజా! యాగార్హవస్తువుల సమకట్టింపుము. అశ్వమును విధిమంతముగా వదలుము. అనఁగా రాజు సుమంత్రా! విప్రోత్తములను బురోహితుఁడగు వసిష్ఠుని దరగాఁ బిలుచుకొనిరమ్మనఁగా నతఁ డట్లే చేసెను. వారిని సత్కరించి మహానుభావులారా! సంతానములేని దుఃఖములఁ గుందు నాకు నశ్వమేధ మొనరించు బుద్ధి పుట్టెను. విధివిహితముగా దాని నొనరింపఁగోరెదను. ఈ మునిని వరించి నాయభీష్టముం బడయ నెంతును. అనఁగా వసిష్ఠుఁడు లోనగువారు బాగుబాగనిరి సమ్మతిం దెలిపిరి.

అంత ఋశ్యశృంగాదు లారాజుం గాంచి యజ్ఞసంభారములం గూర్చి గుఱ్ఱమును విడువుము. సంతానార్థము హయమేధముచేయ బుద్ధిపుట్టుట న్యాయమే కావున సర్వగుణసంపన్నులగు నలువురుకొడుకులు పుట్టుదురని పలికిరి. రాజు మంత్రుల కావిధముం దెల్పి సరయువునుత్తరతీరమున య

* ఈభాగము బాలకాండమునఁ బండ్రెండవసర్గము మొదలు పన్నాల్గవసర్గముదనుకఁ గలభాగమునుండి వ్రాయఁబడునని యెఱుంగవలయు.

శాల నిర్మింపుఁడు. ఈయజ్ఞము విధితప్పక సాగవలయు. దీని యందేమేని ఛిద్రములు దొరకిన బ్రహ్మరక్షస్సులు యజ్ఞ ధ్వంస మొనరింప వేచియుందురు. కావునఁ గడుజాగరూకతతో మెలంగందగు. ఏమి యపరాధముకలిగినను గర్త నశించును జుండీ యని హెచ్చరింప మంత్రు లట్లే యొనరింతుమనిరి. విప్రప్రవరులు ననుమతులై వెడలిరి.

దశరథునాజ్ఞ మెయి సంభారములు సమకట్టిరి. మును లెల్ల రాజు నాశయము సముచితమని కొనియాడుచుఁ దమ తమకార్యములయం దప్రమత్తులై యుండిరి. యజ్ఞదర్శనము నకై వచ్చినవారలకెల్ల నివసింపఁదగు నిండ్లు కట్టింపుఁడు. ఏ విషయమునను గొఱంతలేక యుండఁ బ్రయత్నము సాగింపుఁడు. వీరు నాగరులని వీరు జానపదులని భేద మూనక యాదరమున నెల్లవారల నుచితరీతిని సత్కరింపందగు. ఏ విధమునఁ గాని యెవ రి నవమానింపరాదు. శిల్పులు లోనగువారిని దగి నట్లు గారవింపవలయు. అని యాజ్ఞాపింప మంత్రు లట్లే యొన రింతు మనిరి.

యజ్ఞవిధులఁ జక్క నిర హించు నధికారము వసిష్ఠ ముని కీఁబడియెను. మునియు సుమంత్రుని రావించి మంత్రి వరా ! ధర్మమతులగు రాజులనెల్లఁ బిలువఁబంపుము. మన దేశములంగల యన్నిజాతులవారిని బిలువంబంపుము. విశేషించి విద ద రిష్ఠుఁడగు మిథిలానాథుని జనకభూపాలుని నీవే పోయి పిలుచుకొనిరమ్ము. మనరాజునకు మిగుల నతఁడు సంబంధి యని యెఱుంగుము. తొలుదొలుత నా రాజచంద్రునిం బిలుచుకొనిరమ్ము. కాశీరాజుకూడ దశరథునకు మిత్రుఁడు.

కాన నీవే పోయి పిలుచుకొనిరమ్ము. వృద్ధుఁడు ధార్మికుఁడు మామయు నగు కేకయరాజును బుత్త్రయుతముగాఁ బిలుచుకొనిరమ్ము. అంగరాజగు రోమపాదుని గౌరవించి పిలుచుకొనిరమ్ము. తక్కుంగలరాజులకెల్ల దూతలం బంపుము. అని పలుకఁగా నాతఁడట్లే యొనరింతునని పలికి తగువారలం బంపి తాను బోఁదగుతావులకుం బయనమయ్యెను. శిల్పులందఱు రాజాజ్ఞననుసరించి తమరొనరించినకార్యములన్నియు వసిష్ఠునకుఁ జెప్పిరి.

రాజమంత్రులం గాంచి మునిపతి దానముచేయుతఱి* నాదరముతోఁ బ్రవర్తింపందగు. అనాదరముతో నీఁబడిన దానము కర్తను సంహరించును. ఇందులకు సందియములేదని ధర్మోపదేశముచేయ నెల్లరు నారీతిగాఁ బ్రవర్తింతుమనిరి. అంత నానాదేశములనుండి బహువిధరత్నాది సదస్తువులను గానుకలుగాఁ దీసికొని రాజులెల్ల రరుదెంచిరి. సకలసంభారములు సిద్ధముచేయఁబడియె ఆవిధమంతయు నెఱింగి వసిష్ఠముని రాజుకడ కేగి మహీపాలకా! కొఱంతలేక సరపరికరములు సంసిద్ధములయ్యె. కాన నీ విఁక యజ్ఞశాలం బ్రవేశింపుము. యాగశాల మిగుల రమణీయమై మనఃకల్పితమా యన్నట్టు లున్నది. అని పలుకఁగా ఋశ్యశృంగుఁడు నట్లే తెలుప శుభముహూర్తమున రాజు సకళత్రుఁడై యాగశాలం జేరెను. ఋత్విజులందఱుం జేరిరి. యజ్ఞకర్మముల నొనరింప నారంభించిరి.

---

* అవజ్ఞయా న దాతవ్యం కస్యచి ల్లయాపి వా, అవజ్ఞయా కృతం హన్యాద్దాతారం నాత్ర సంశయః. 30. అని మూలము.

శాల నిర్మింపుఁడు. ఈయజ్ఞము విధితప్పక సాగవలయు. దీని యం దేమేని ఛిద్రములు దొరకిన బ్రహ్మరక్షస్సులు యజ్ఞ ధ్వంస మొనరింప వేచియుందురు. కావునఁ గడుజాగరూకతతో మెలంగందగు. ఏమి యపరాధముకలిగినను గర్త నశించును జూడీ యని హెచ్చరింప మంత్రు లట్లే యొనరింతుమనిరి. విప్రప్రవరులు ననుమతులై వెడలిరి.

దశరథునాజ్ఞ మెయి సంభారములు సమకట్టిరి. మును లెల్ల రాజు నాశయము సముంచితమని కొనియాడుచుఁ దమ తమకార్యములయం దప్రమత్తులై యుండిరి. యజ్ఞదర్శనము నకై వచ్చినవారలకెల్ల నివసింపఁదగు నిండ్లు కట్టింపుఁడు. ఏ విషయమునను గొఱంతలేక యుండఁ బ్రయత్నము సాగింపుఁడు. వీరు నాగరులని వీరు జానపదులని భేద మూనక యాదరమున నెల్లవారల నుచితరీతిని సత్కరింపందగు. ఏ విధమునఁ గాని యెవ రి నవమానింపరాదు. శిల్పులు లోనగువారిని దగినట్లు గారవింపవలయు. అని యాజ్ఞాపింప మంత్రు లట్లే యొనరింతు మనిరి.

యజ్ఞవిధులఁ జక్క నిరహించు నధికారము వసిష్ఠ మునికిఁబడియెను. మునియు సుమంత్రుని రావించి మంత్రివరా ! ధర్మమతులగు రాజులనెల్లఁ బిలువఁబంపుము. మన దేశములంగల యన్నిజాతులవారిని బిలువంబంపుము. విశేషించి విద దరిష్టుఁడగు మిథిలానాథుని జనకభూపాలుని నీవే పోయి పిలుచుకొనిరమ్ము. మనరాజునకు మిగుల నతఁడు సంబంధి యని యెఱుంగుము. తొలుదొలుత నారాజచంద్రునిం బిలుచుకొనిరమ్ము. కాశీరాజుకూడ దశరథునకు మిత్రుఁడు.

రెక్కలు గలిగియుండెను. సామాన్యముగానుండు నాలు ప్రస్తారములకంటె మూఁడింత లెక్కుడై పదునెనిమిది ప్రస్తారములచే దగియుండెను. శాస్త్రవిహితము లైనపశు సర్పపక్షుల నాయాయి దేవతల నుద్దేశించి వానికిం గట్టిరి. పశ్వాదుల వధించుతఱి రాఁగా నశ్వమును కూర్మాదిజలచరములను, గ్రామ్య పశుసంతతిని, శాస్త్రప్రకారముగా వధకర్మమున వినియోగించిరి. మూఁడునూఱులు పశువులు, హయవర్యము యూపస్తంభములకుఁ గట్టఁబడియెను.

అప్పుడు కౌసల్య యాయశ్వమునకుఁ బ్రదక్షిణముగా వచ్చి తానును దక్కుంగలరాజపత్నులంగూడి బంగారుసూదులు మూఁడింటిచే సంతోషముప్పొంగుచుండఁ గత్తివాట్లు వేసెను. ధర్మసిద్ధిని గాంక్షించి యాకౌసల్యాదేవి స్థిరబుద్ధిగలదియై యొకరాత్రియంతయు నాయశ్వముతోఁ గూడి నివసించియుండెను. *అప్పుడు దశరథుఁడు దక్షిణ నీయవలయు నను

---

మేధే త్రైగుణ్యావిధానాత్. షట్చితయో భవంతీతి శ్రుతేః. త్రిస్తావోఽగ్నిర్భవతీత్యశ్వమేధే విజ్ఞాయత ఇతి సూత్రాచ్చ. అతఏవాష్టాదశాత్మకః అష్టాదశప్రస్తారాత్మకః. నను షట్ప్రస్తారాత్మకస్య చిత్యస్య త్రైగుణ్యావిధానే నైవాష్టాదశప్రస్తారాత్మకత్వం సిద్ధం. కింపునస్తదుపదేశేన.ఉచ్యతే. త్రిగుణ ఇత్యుక్తేపంచదశాత్మకత్వం ప్రతీయతే. తైత్తిరీయకే పంచచితయో భవంతీతి విధానాత్. తదిదం వాజసేయకపక్షావలంబనం ద్యోతయితుమష్టాదశాత్మకత్వోక్తిః" అనివ్యాఖ్య.

* హోతాధ్వర్యుస్తథోద్గాతా హస్తేన సమయోజయన్, మహిష్యా పరివృత్త్యా చ వావాతాం చ తథాపరాం. 33.అని మూలము."తథేత్యనుక్తసముచ్చయార్థః. బ్రహ్మా చేత్యర్థః. తే బ్రహ్మాదయశ్చత్వారః ప్రధానర్త్విజః" అని వ్యాఖ్య.

నియమము ననుసరించి హోతకుఁ గౌసల ను, అధ రు నకుఁ బరివృత్తిని (దాసిని) ఉద్గాతకు వావాతను (రాజు వేశ ను.) బ్రహ్మకుఁ బాలాకలిని (రాజునకుఁ బాత్రయొసంగుదానిని) దానముచేసెను. వారును విధి ననుసరించి మాత్రము పతుల వలెఁ బరిగ్రహించిరి. వారికిగాఁ గొంతమూల్యముం గైకొని మరల రాజున కియ్య వలయునన్నవిధినే యనుసరించి యప్పుడే యిచ్చివేసిరి.

జితేంద్రియుఁడును బ్రయోగకర్మధురీణుఁడునగు నధర్యుఁడు ఆయశ్వ ము నాభిక్రిందనుండు వపయనుపదా ము నెత్తి విధి ననుసరించి పచనముచేసెను. వపాహోమముచేయఁబడుచుండఁగా రాజు తనపాపములన్నియుఁ దూలఁగా శాస్త్రమునే నమ్మి దాని పొగ నాఘ్రాణించెను. తక్కిన యాయశ్వాంగముల నన్నింటిని వారు యథావిధిగా హోమముచేసిరి. అశ్వమేధమునందుఁ బశువులవలనఁ గలుగు హవిర్భాగము ప్రబ్బలి తీఁగలనల్లిన చాఁపలయందు సంస్కరింపఁదగునన్నపద్ధతి ప్రకారము సంస్కరించిరి. ఆయశ్వ మేధము మూఁడుదినములుసాగెను. చతుష్టోమము ఉ , ము. అతిరాత్రము అని యామూఁడు దినములలో నాయది పిలువంబడును. ఆమీఁద ననేకయాగములు చేయందగునట్లు విధికలదు కావున నట్లే జ్యో తిష్టోమము, ఆయురా గము, అతిరాత్రములు రెండుమాఱులును, అభిజిత్తు, విశ్వజిత్తు, అప్తోర్యామము, మహాయజ్ఞము ననువానిని గ్రమముగా నొనరించిరి.

క్రతువులన్నియు నిట్లు పూర్తికాఁగా మహాదాతయగు నాదశరథమహారాజు శాస్త్రము ననుసరించి హోతకుఁ దూర్పు

దెసఁగల దేశములను, అధ్వర్యునకుఁ బశ్చిమభాగపు దేశములను బ్రహ్మకు దక్షిణదేశములను, నుద్గాతకు నుత్తరభాగమునఁ గలదేశములను దానమిచ్చెను. ఇట్టిదానము పూర్వము బ్రహ్మదేవుఁడు తానొనరించిన యశ్వమేధమునందు నీదక్షిణ నొసంగఁదగునని విధించెను. ఆపద్ధతినే యనుసరించి దశరథుఁడు తత్క్రతుఫలాభివృద్ధికై ఋత్విగ్వరులకు దాన మిచ్చెను. నాల్గు దేశములు పరిగ్రహించిన యానలువురు ఋత్విజులును బాప విదూరుఁడైయున్న యామహీపతింగని ప్రభూ! ఈమహీమండలమును బరిపాలింప నర్హుఁడవు నీవే. మావంటివారల కీదేశములతోఁ గలపనియేమి? పరిపాలింప సమర్థులము కాము కదా. మాకాలమంతయు వేదార్థ యనాదులతోఁ గడచుచుండును. కావున భూపాలన మన నెట్టిదో యే మెఱుంగము. నీకనఁగా నది సహజము. కావున మాకిచ్చిన యీదేశములకు బదులుగా ధనమిమ్ము. ఈభూదాన మమూల్యము. కావున మూల్య మెంత యీయఁదగునని యనుమానింపకుము. ప్రతినిధిగా నెంత యిచ్చినఁ జాలును. తృప్తినొందుదుము. సువర్ణాదులలో దేని నిచ్చినను దృప్తియే. అనఁగా రాజు ప్రమోదమంది వారికి గోవులు మొదలగువాని నిచ్చి పరితృప్తులనుగా నొనరించెను. వారాధనము లోనగువస్తువులను బంచిపెట్టుఁడని వసిష్ఠునకు ఋశ్యశృంగునకు నధికారమీయ వారు చక్కఁగాఁ బంచి యిచ్చిరి.

పిదప రాజు యజ్ఞమును జూడవచ్చినవారలకెల్ల యథార్హముగా దక్షిణల నిచ్చెను. మిక్కిలి దరిద్రుఁడగు నొక విప్రుఁడు దశరథుని హస్తమునఁ గలకడియమును గోర సంత

షమున దానిం దీసియిచ్చెను. ఎల్లరకు నమస్కరించి వారిదీవ
నలు గైకొనియెను. ఆదీవన కొడుకులుగలుగ నీకేవి ప్రతిబంధ
కములో యాపాపములనెల్లఁ దొలఁగింపఁజాలును. ఇట్లు లా
దశరథుఁ డశ్వమేధమును జక్కఁగా నెఱవేర్చి ఋశ్యశృంగుని
జూచి మహాత్మా! సువ్రతుఁడవు. నావంశము వృద్ధియగుట కే
సత్కర్మము చేయఁ దగునో యద్దాని నొనరింపుమని వేఁడెను.
అమ్మునియు నందుల కంగీకరించి మహారాజా! కులోద్ధారకులగు
కొడుకులు నలువురు నీకుఁ గలుగుదురు. అట్టిలాభము నీకుఁ
గలుగ నొకయజ్ఞ మొనరింతును. ఆమాట లారాజు మనస్సున
కెంతయు హర్షమును గలిగింపఁజాలెను. కావున మరల నమ్ముని
నాతఁడు ప్రా ంచెను.

మహాశయులారా! ఈకథనుండి యనేకవిషయములు
తెలిసికొనఁదగినవి కలవు. అందేవి ముఖ్యములో వాని నించుక
విమర్శింతును. ప్రాయశః యజ్ఞాదికర్మము లైహికసుఖప్రద
ములు. కావుననే,

"మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః." ౨౮

౨. అధ్యా

అని మనుస్మృతి తెలుపుచున్నది. మహాయజ్ఞము లనఁగా బ్రహ్మ
యజ్ఞాదులనియు, యజ్ఞము లనఁగా జ్యోతిష్టోమాదు లనియు
న ము. బ్రహ్మాయజ్ఞములోనవి యైదు నహింసాప్రధాన
ములు. కావున మహాయజ్ఞములను ప్రశ్నా తికిం బాత్రము
లయ్యెను. జ్యోతిష్టోమాదులు హింసాప్రధానములు. కావున
యజ్ఞములనియే ప్రసిద్ధము లయ్యెను. కాని మహచ్ఛబ్దమును
గోల్పోయినవి. దీనింబట్టి ఫలాభిసంధిరహితకర్మము లుత్తమము

లనియును, ఫలమును గోరి చేయుకర్మము లధమములనియుఁ దేలెడిని.

"యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః,
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః. ౧౯
త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః,
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః." ౨౦ గీత. ౪ అధ్యా.

అనియు,

'యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః.' ౨౫. అధ్యా.౧౦

అనియు శ్రీకృష్ణపరమాత్మ స్పష్టముగాఁ దెలిపెను. మఱియు,

"త్రైవిద్యామాంసోమపాః పూతపాపా యజ్ఞైరిష్ట్వాస్వర్గతింతిప్రార్థయంతే,
తేపుణ్యమాసాద్య సురేంద్రలోక మశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్.
తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి,
ఏవం త్రయీధర్మమనుప్రపన్నా గతాగతం కామకామా లభంతే." ౨౦
గీత ౯ అధ్యా.

అనియు భగవంతుఁడు స్పష్టపఱచెను. కావున యజ్ఞములు కేవల మైహికఫలమును గోరి చేయునవియే కాని వేఱుగావు. కాఁబట్టియే,

"అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ,
న తు మామభిజానంతి తత్త్వేనాతశ్చ్యవంతి తే." ౨౪ అధ్యా ౯.

అని గీతాశాస్త్రమున శ్రీహరి యొఱిఁగించెను. అనఁగా య మును ఫలమునుగోరి చేయరాదనియు నట్లు చేయువారు తత్త్వ మెఱుంగరు కావున నన్నెఱుంగఁజాలక యజ్ఞఫలమును జక్కఁగాఁ బొందఁజాలరనియు సారము. బ్రహ్మాయజ్ఞాదు లైదు నుదప్పఁ దక్కుంగలయజ్ఞములు హింసాప్రధానములు కావున

నల్పఫలదములనియుఁ దాత్పర్యము. ఒకవు దైహికఫలములను గోరి చేయఁబాల్పడినను దగినబుత్విక్కులను గూర్చుకొని చేసి ననే మేలుగలుగును. లేనిచోఁ గర్తకు హాని సంభవించును.

"నిహతస్య చ యజ్ఞస్య సద్యః కర్తా వినశ్యతి"

అని రామాయణమే తెల్పుచున్నది. కావునఁ బ్రయోగవిధుల నెఱింగిన యుత్తమబ్రాహ్మణుల బుత్విజులనుగా వరించి కర్మము సాగింపవలయును. పంక్తిపావను లగువారిని బురోహితులనుగా వరింపవలయును.

"అపాంక్త్యోపహతా పంక్తిః పాఙ్చ్యతే యైర్ద్విజోత్తమైః,
తన్నిబోధత కార్త్స్న్యేన ద్విజాగ్ర్యాన్ పంక్తిపావనాన్. ౧౮౩
అగ్ర్యాస్సర్వేషు వేదేషు సర్వప్రవచనేషు చ,
శ్రోత్రియాన్వయజాశ్చైవ బ్రాహ్మణాః పంక్తిపావనాః. ౧౮౪
త్రిణాచికేతః పంచాగ్నిస్త్రిసుపర్ణష్షడంగవిత్,
బ్రహ్మదేయాత్మసంతానో జ్యేష్ఠసామగ ఏవ చ. ౧౮౫
వేదార్థవిత్ప్రవక్తా చ బ్రహ్మచారీ సహస్రదః,
శతాయుశ్చైవ విజ్ఞేయా బ్రాహ్మణాః పంక్తిపావనాః." ౧౮౬
3. అధ్యా.

అని మనుస్మృతి బోధించుచున్నది. అట్టివారిని గూర్చుకొనియే యజ్ఞముచేయ దశరథుఁ డారంభించెను. మనయింటికిఁ బలుసారులు వచ్చుచుందురనియో ఏకార్యమునకైన సాయపడుదురనియో మోమోటనొందియో యయోగ్యులను బురోహితులనుగాఁ గోరిన నాకర్మము నిరర్థకమగుటయేగాక కర్తకు హానియు సంభవించును. ఈకాలమున నీయాచారమే సాగుచున్నదనుట సర్వజన విదితమగు విషయము.

దశరథుఁడు మహాజ్ఞానసంపన్నుఁ డగువసిష్ఠమునియున్న ను ఋశ్యశృంగుని వరించెను. ఆముని శక్తి నెఱింగినవాఁడు కావున వసిష్ఠముని యంగీకరించుటయేగాక యతని నాదరించి కలిసియే కర్మములను జేయించెను. ఆకాలమున యోగ్యతను గౌరవించుపద్ధతి యెంతబాగుండెను. ఈకాలమునఁ గొందఱు కొన్నిగృహముల నాశ్రయించి వేఱెవరిని జేరనీయక సర కర్మములు తమరే చేయింపఁబూని కర్తకు హానిగల్పించుట మనము చూచుచున్నవారముకదా ? కర్తయు నాబ్రాహ్మణ బ్రువుని మాటనే యంగీకరించును. తుదకుఁ దాఁజెడును సర లుండరుగాన నేవిషయమున నెవరు పండితులో వారి నావిష యమునఁ జేయుపనికి నియోగింపవలయును.

చేయఁబూనిన దానము బహుమాన పురస్సరముగా శ్రద్ధతో నొనరింపవలయుననియు విధిలేక మనస్సులో నవ కలిగి చేయుదానము కర్తను బాధుచేయుననియు రామాయ ణము బోధించుచున్నది. దశరథుఁడు మంత్రులు లోనగు వారల కీవిషయమునే బోధించి విలాసముకొఱకుఁగాని ప్రతి గ్రహీత నవమానింపరాదనియు నద్దానఁ గర్తనగు నాకు హాని కలుగుననియు బోధించెను. దీనింబట్టి కర్త తా నొనరించు కార్యమున నెంతజాగరూకుఁడై మెలంగవలయునో తెలియఁ దగియుండును. హెచ్చరికలేక యెన్నిదానములుచేసినను దుద కుఁ గర్త ప్రాణములను దీయునని మనమెఱింగి చేయఁదలంచు కొన్నకార్యమున శక్తి ననుసరించి తగినవారిని నియోగించి శ్రద్ధకలిగి యుండవలయును. లేనిచో ధనవ్యయముమాత్రముగాక కాదు వంశనాశనము సంభవించును. ఇక్కాలమున ధర్మ

కార్యము లొనరించువారు వృద్ధికాక నశించుటకుం గలకారణ మిదియేయని చక్కఁగా నెఱుంగవలసిన విషయము.

## అన్నదానము

దశరథుని యశ్వమేధమునందు నన్నదానము చక్కఁగా సాగినది. ఎల్లవారు నన్నదానమున సంతృప్తులైరి. తాపసులు దిగంబరులు సన్న్యాసులు వృద్ధులు రోగులు స్త్రీలు బాలురు చక్కఁగాఁ దృప్తినొందిరని రామయణము తెలుపుచున్నది. అనఁగా మనవారని, పరులని, మునులని, సన్న్యాసులని, ఇంక నెన్నియోవిధములగు భేదములులేక సమానముగా నన్నదానము చేయఁబడియెననియు వృద్ధులు వ్యాధిబాధితులుకూడ భుజించిరనుటచే వారివారికిఁదగినట్లు బాధలేకుండ నన్నదానమున నేర్పాటులు చేయఁబడియెననియు దీనివలనఁ దెలిసెడిని. స్త్రీలు బాలురు ననుటచే నియమబద్ధముగా మర్యాదలోపము లేకుండ మంత్రులు తగినపద్ధతులఁ బాటించిరనియు మన మూహింపవలయును. అంతియకాక వేలువేలుతావుల భోజనమున ననుకూలపద్ధతిఁ గల్పింపఁబడియెననియుఁ మన మూహింపవచ్చును. లేకయున్న నెవరువచ్చిన వాని కన్నము పెట్టుచునుండిన శాస్త్రమర్యాద నశించెనని యూహింప నవకాశము కలదు. దిగంబరులు స్త్రీలుకూడ నొక్కచోటనే భుజించిరనుట యుంగూడ నసంగతమగును. కావున నాయాయివర్ణములవారి కాయాచోటుల మర్యాదల ననుసరించి వసతులు కల్పింపఁబడియెనని మన మూహించుట పొరపాటుగాదు. శ్రమణులనఁగా కౌ సన్న్యాసులని యర్థమగును. కాని యాయుగమున నా మ మే లేదుగావున దిగంబరులనఁగా శుకమహర్షింబోలి లోక

మ రా దలం బాటింపని మహాత్ములని య ము. బౌ శ ము
రామాయణమునఁ గలదనియు నద్దానిచే బౌ మతము ప్రాచీన
మనియుఁ గొందఱు వాదింతురు. ప్రాచీనపురాణాదులలోని
బౌ శం మునకు వేదనిందకులనియ మే కాని కపిలవస్తుపురమున
జన్మించిన శుద్ధోదనపుత్త్రుఁ డేర్పఱచినమతము కాదని యెఱుంగ
వలయు. వేదనిందకులకు బౌద్ధులనియే ప్రతీతి. దాసులు
శూద్రులుకూడఁ దృప్తినొందిరనుటచే నారాజునానతిమెయి
సాగినప తు లుత్తమో మములని యేర్పడుచున్నది. సర
జనసంతృప్తియే మహాఫలదమని మనము తెలిసికొని దీనాంధక
బధిరకుబ్జాదులకుంగూడ శ కనురూపముగా నన్నము
నొసంగి తృప్తిచేయవలయు ననునా యమును మనము నేర్చు
కొనవలయు. అన్నము పెట్టువిషయమున ముందువెనుకలం
గూర్చి పూరా చారములు మంచివికావని కొందఱు వాకొం
దురు. వారికి స్మృతులు తెలియవని యొక్కమాటయే సమా
ధానము.

"సువాసినీః కుమారీశ్చ రోగిణో గర్భిణీః స్త్రియః,
అతిథిభ్యోఽగ్ర ఏవై తాన్ భోజయేదవిచారయన్." ౧౧౪

"అదత్వా తు య ఏతేభ్యః పూర్వం భుంక్తే విచక్షణః,
సభుంజానో న జానాతి శ్వగృధ్రైర్జగ్ధిమాత్మనః" ౧౧౫ మను 3 అధ్యా

"సువాసినో నవోఢాః స్వయస్స్నుషాః దుహితరశ్చ తాః కుమారీః
గర్భిణీశ్చ" అనివ్యాఖ్య.

స్మృతులతాత్పర మిద్దానింబట్టి తెలియఁదగియుండును. పూర
పుటాచారములన నిట్టివే. అవాంతర దురాచారములకు
బూర్వులు కారకులు కారు.

ఇంక నిమి కుకులజనితులు వేదశాఖలలో దేనికిఁ జేరిన వారు? అనునది యొక ప్రశ్నము. కొందఱు ఋగ్వేద మందురు. కొందఱు యజుర్వేద మందురు. మఱికొంద ఱా రెండునుం గావు సామవేదమని పలుకుదురు. ఈమూఁడును గావధర్వ ణ వేదమని మఱికొందఱు వాకొందురు. ఋగ్వేదము మొదటివేద మనియుఁ దక్కినవానికంటె నది యుత్తమమని కొందఱు పట్టు దలంబూని మాటలాడుదురు. పాపము! వారికి వేదస రూపమే తెలియదనవచ్చును. ఒక్కదానికంటె మఱొక్కవేదము త్తమ మనుటపాపకారణములలోనొకటి 'ఏకో వేదశ్చతుర్ధా స్మృతః' అన్న నియమము వారెఱుంగవలయును. మనుష్యుల కల్పా యుస్సు కావున వేదమంతయుఁ బఠింపజాలరని మహాత్ములు నాలుగుభాగములుగ నొనరించిరి. అంతియకాని హెచ్చు తక్కువ లున్నవని తెల్పుటకుఁగాదు. "తస్య యజురేవ శిరః, ఋక్ దక్షిణః పక్షః, సామోత్తరః పక్షః" అని యుపనిషత్తు బోధించెడిని. ఈవిషయమున శ్రుతిగాని వేదముల నిందింప రాదు. దశరథుఁ డేవేదశాఖకుఁ జేరినవాఁడు? అనునది విమ ర్శనార్హము. శ్రౌతకర్మమున నాసేతుశీతాచలము భేదాచారము లుండవు. ఒక్కొక్కవేదశాఖకుం జేరినవారి కొక్కొక్కనియ మము కలదు. దాని ననుసరించి యజ్ఞవేదికలు నిర్మించుప ద్ధతి మొదలుకొని యాచారములు నియమింపఁబడినవి. వానింగాం చినఁ దత్కర్త యేవేదశాఖకుఁ జేరినవాఁడో మన మెఱుంగ వచ్చును.

పెక్కండ్రు దశరథునిది ఋగ్వేదమనియే వాదించువారు కలరు. రామాయణమునుబట్టి మన మద్దాని నెఱుంగవలసియుం

డును. అశ్వ మేధయాగఘట్టమునందుఁ గలవిషయ మిట్లున్నది. చిత మనఁగా అగ్నిస్థానీయమగు వేదిక. దానిని వేదకల్పసూత్రాదులఁ జక్కఁగా నెఱింగినఋత్విక్కులు గరుడాకారముగా నేర్పఱచిరి. బంగారుపక్షములుగలదిగా నది యొప్పెను. పదునెనిమిది ప్రస్తారములుగలదిగా నది యుండెను. కృష్ణయజుర్వేద శాఖీయులకు నైదుచితులే విధింపఁబడినవి. ఇందుఁ బదునెనిమిది చెప్పఁబడినవి. వాజసనేయకపక్షము ననుసరించి చేయఁబడినవని తెలుపుటకే పదునెనిమిదిప్రస్తారములు కలదని చెప్పఁబడినవి. అనఁగా శుక్లయజుర్వేద శాఖ దశరథునిదని దీనిచే నెఱుంగవలయును. ఋగ్యజుస్సామాథర్వణ వేదములవారు మాశాఖ మాశాఖ యని కలహింపక యూరకయుండవచ్చును. అయోధ్యాప్రాంతములయం దిప్పటికిని శుక్లయజుర్వేదమే ప్రధానముగా నున్నది. ఆదేశీయులెల్లఁ బ్రాయశః వాజసనేయక శాఖావలంబకులే యయియున్నవారు.

ఇక్ష్వాకువంశపురాజులు శుక్లయజుర్వేద శాఖకుం జేరినవారని "త్రిగుణోఽష్టాదశాత్మకః" అన్న రామాయణవాక్యమునఁ దెలియవచ్చుచున్నదని తెలిపినవారు మహానుభావులగు వ్యాఖ్యాతలే. ఇట్టితావుల నీరహస్యమును దెలిఁగించువారు పరిగ్రహింపకున్న నదేటితెలుఁగు? రహస్యములు రహస్యములుగానే యుంచఁదగును. వానిని వెలిపుచ్చరాదన్న వాదము నిస్సారమే యని తేలును. తెనుఁగున న మెల్లఁ దెలుపకపోయిన సంస్కృతమే మేలుకదా. వ్యాఖ్యాతలయభిప్రాయము మూలకర్తలది కాకపోవచ్చునన్న వాదము తుచ్ఛము. ఎవరేయమ్మ తెల్పినను ఈయ ముమూలకర్తలది కాకపోవచ్చునుగదా యన్న

నోరుమూసికొని యూరకుండవలసిన దేగాని మఱేమియుఁ బలుక నవకాశమే లేదు. రామాయణమున నన్నిమహిమనులుగలవని వ్యాఖ్యాతలయనుగ్రహముననే తెలియవచ్చెను. వారిభావముల ననుసరించి యోపినంతదనుకఁ దెనిఁగింపవలయుఁగాని యూరక యాక్షేపించుట సమంజసముకాదు. మూలానుసారముగా నెవరికెట్లు కావలసిన నట్లు ము చెప్పుకొనుట కనుకూలముగా "నారదం పరిపప్రచ్ఛుండును, వాల్మీకిర్మునిపుంగవుండును, కోశస్మిన్ సాంప్రతుండు" అని వ్రాసిన బాగుండునని కాఁబోలు వారిభావము. ఔరా! ఎంతబాగున్నది. రహస్యములను వెలిపుచ్చినఁ గొంపలుమునుఁగునని భయంపడువారు కొందఱు. వారిని బ్రోత్సహించువారు కొందఱును, వారిని స్తుతించువారు మఱికొందఱునుగాఁగా రామాయణా ము మహారహస్య మని లోకు లెఱింగి కృతార్థులగుదురు కాఁబోలును. కవి తెనిఁగించు నపుడు మూలా మును విస్తరించి యందుఁగలవిశేషాంశములను దనకుఁ జేతనైనయంతదనుకఁ దేటగఁ గవి సమయముల నుల్లంఘింపక తెలుపవలయును. లేకున్న నూరకయుండుటయే యుక్తమము.

సీ. "...కనకపక్షములఁ గ్రాలి యాఱు
ప్రస్తారములకన్న భావింపఁ ద్రిగుణమై
యష్టాదశాత్మకమై చెలంగె
జననాథుఁ డతఁడు వాజసనేయశాఖకుఁ
జేరియుండుట నట్లు చేయఁబడియె." ఆంధ్రశ్రీమద్రామాయణము.

సీ. "...అదిగరుడాకృతి హైమపక్ష
యుక్తమై త్రిగుణమై యొప్పి యష్టాదశా
త్మకమయి రాజిల్లె...... ....."

ఆంధ్రవాల్మీకిరామాయణము.

రసజ్ఞులందలిసారస్యమును గ్రహింతురు. పక్షపాతమతు లేమన్న నూరకుండుటయే మంచిది. "కాలోహ్యయం నిరవధిర్విపులా చ పృథ్వీ" అన్ననాయము ప్రసిద్ధమేకదా.

ఇట్టులాదశరథమహారాజు శుక్లయజుశ్శాఖావలంబకుఁడు కావున నాశాఖకు విధించినట్లే పదునెనిమిది ప్రస్తారములుకలదిగా వేదికను నిర్మించి యాగమారంభించిరని యెఱుంగవలయు. చిత మనఁగా నగ్ని. ఐన నగ్న్యాధారభూతమగు ప్రదేశమనియే యిట గ్రహింపవలయును.

## యజ్ఞస్వరూపము

"నియుక్తాస్తత్ర పశవస్తత్తదుద్దిశ్య దైవతమ్,
ఉరగాః పక్షిణశ్చైవ యథాశాస్త్రం ప్రచోదితాః. 30
శామిత్రే తు హయస్తత్ర తథా జలచరాశ్చ యే,
ఋత్విగ్భిస్సర్వమేవైతన్నియుక్తం శాస్త్రతస్తదా. 31
పశూనాం త్రిశతం తత్ర యూపేషు నియతం తదా." 32

అని రామాయణమునఁ గనఁబడియెడిని. దీనింబట్టి క్రతుస్వరూపము నించుక విచారింపఁదగు. వసిష్ఠాదిమహర్షులు విప్రోత్తములు. వారెట్లు హింసింపఁబూనిరను ప్రశ్నము రావచ్చును. ఈయజ్ఞము క్షత్రియోచితము. ఋత్విక్కులు నాకాలమున మాంసభక్షకులు. జాతుచితమాంసము విధింపఁబడియెను. త్రేతాయుగమునందు విప్రులకు మేధ్యపశుమాంసభక్షణము కలదు. కావున యజ్ఞముకూడఁ బశుహింసారూపమైనదియే యని భావింపవలసియున్నది.

"యదన్నం పురుషో భుంక్తే తదన్నం తస్య దేవతాః"

అన్నసామాన విధి ప్రసిద్ధమే. ఏయాహార మేజాతికి విహితమో ఆయన్నమే యతని దేవతలకుఁ బ్రీతియని తా

ర్ము. హింసాప్రధానము యజ్ఞస్వరూపమని తేలెడిని. జలచరములుకూడ యజ్ఞార్హములు కొన్నిగలవు. మొత్తముమీఁద మూఁడువందలపశువులు లోనగుప్రాణులు హింసింపఁబడినవి. ఇది హింస యనఁబడునా లేదా అన్నచో హింస కాదనవలయు ననువాదము సాధారణము.

"యజ్ఞార్థం బ్రాహ్మణైర్వధ్యాః ప్రశస్తా మృగపక్షిణః,
భృత్యానాం చైవ వృత్త్యర్థమగస్త్యో హ్యాచరత్పురా. ౨౨
బభూవుర్హి పురోడాశా భక్ష్యాణాం మృగపక్షిణాం,
పురాణేష్వపి యజ్ఞేషు బ్రహ్మక్షత్రసవేషు చ. ౨౩
యజ్ఞాయ జగ్ధిర్మాంసస్యేత్యేష దైవో విధిస్స్మృతః,
అతోఽన్యథా ప్రవృత్తిస్తు రాక్షసో విధిరుచ్యతే. ౩౧
క్రీత్వా స్వయం వాప్యుత్పాద్య పరోపకృతమేవ వా,
దేవాన్ పితౄంశ్చార్చయిత్వా ఖాదన్మాంసం న దుష్యతి. ౩౨
నాద్యాదవిధినా మాంసం విధిజ్ఞోఽనాపది ద్విజః,
జగ్ధ్వా హ్యవిధినా మాంసం ప్రేత్య తైరద్యతేఽవశః. ౩౩
కుర్యాద్ఘృతపశుం సంగే కుర్యాత్పిష్టపశుం తథా,
నత్వేవ తు వృథా హంతుం పశుమిచ్ఛేత్కదాచన. ౩౭
యావంతి పశురోమాణి తావత్కృత్వోహ మారణం,
వృథా పశుఘ్నః ప్రాప్నోతి ప్రేత్య జన్మని జన్మని. ౩౮
యజ్ఞార్థం పశవస్సృష్టాః స్వయమేవ స్వయంభువా,
యజ్ఞస్య భూత్యై సర్వస్య తస్మాద్యజ్ఞే వధోఽవధః. ౩౯
ఓషధ్యః పశవో వృక్షాస్తిర్యంచః పక్షిణస్తథా,
యజ్ఞార్థం నిధనం ప్రాప్తాః ప్రాప్నువంత్యుత్సృతీః పునః. ౪౦
మధుపర్కే చ యజ్ఞే చ పితృదైవతకర్మణి,
అత్రైవ పశవో హింస్యా నాన్యత్రేత్యబ్రవీన్మనుః. ౪౧

ఏష్వర్థేషు పశూన్ హింసన్ వేదతత్త్వార్థవిద్ద్విజః,
ఆత్మానం చ పశుం చైవ గమయత్యుత్తమాం గతిమ్. ౪౨

గృహే గురావరణ్యే వా నివసన్నాత్మవాన్ ద్విజః,
నావేదవిహితాం హింసామాపద్యపి సమాచరేత్. ౪౩

యా వేదవిహితా హింసా నియతాస్మింశ్చరాచరే,
అహింసామేవ తాం విద్యాద్వేదాద్ధర్మో హి నిర్బభౌ. ౪౪

నాకృత్వా ప్రాణినాం హింసాం మాంసముత్పద్యతే క్వచిత్,
న చ ప్రాణివధః స్వర్గ్యస్తస్మాన్మాంసం వివర్జయేత్. ౪౫

న భక్షయతి యో మాంసం విధిం హిత్వా పిశాచవత్,
స లోకే ప్రియతాం యాతి వ్యాధిభిశ్చ న పీడ్యతే. ౫౦

స్వమాంసం పరమాంసేన యో వర్ధయితుమిచ్ఛతి,
అనభ్యర్చ్య పితౄన్ దేవాంస్తతోఽన్యో నాస్త్యపుణ్యకృత్. ౫౧

వర్షే వర్షేఽశ్వమేధేన యో యజేత శతం సమాః,
మాంసాని చ న ఖాదేద్యస్తయోః పుణ్యఫలం సమం. ౫౩

ఫలమూలాశనైర్మేధ్యైర్మున్యన్నానాం చ భోజనైః,
న తత్ఫలమవాప్నోతి యన్మాంసపరివర్జనాత్. ౫౪

న మాంసభక్షణే దోషో న మద్యే న చ మైథునే,
ప్రవృత్తిరేషా భూతానాం నివృత్తిస్తు మహాఫలా." ౫౬

మనుస్మృతి. ౫ అధ్యా.

ఈప్రమాణములంబట్టి యాలోచింపఁగా దేవపితృకార్యములయందుఁ బశుహింస హింసకాదనియు నాకారములయందు శాస్త్రోక్త పశువులవధించుట పాపకార్యము కాదనియు, మాంసమం దాశచేత వధింపరాదనియు వధకర్మములేక మాంసముదొరకదు. ప్రాణివధము స్వర్గసాధనము కాదనియుఁ, గావున మాంసమును మానవలయుననియు ననఁగా దేవపితృ

కార్యములుకానియితరకార్యములందనియుదీనిసారము. మాంస భక్షణము దోషముకాదు కాని మానినచో మహాఫలము గలుగుననియుఁ దేలెడిని. నూఱుసంవత్సరములు ప్రతివత్సరమును దప్పక యశ్వమేధమును జేసిన నెంతపుణ్యమో మాంసాహారమును మానినయెడల నంతపుణ్యము కలుగును. పరిశుద్ధములగు ఫలమూలములను, దృణధాన్యము లోనగుమునన్నమును భుజించుచు నుండువాఁడు మాంసమును వదలినవాని పుణ్యము నొందఁజాలఁడు. అనఁగా మాంసాహారమును మానుటయే యత్నమమని సారము. మాంసాహారము సురాపానము రతి యనునవి భూతప్రవృత్తులు. వాని మానినచో నింత యని నిర్ణయింపరానియంతపుణ్యము లభించునని తాత్పర్యము. దీనింబట్టి పరిశీలింపఁగా దేవపితృకార్యములయందుఁ జేయు పశుహింస పాపకార్యముకాదని కనఁబడును. కాని మనుస్మృతిహృదయము మాంసభక్షణము మానుటయే మహాఫలమని కొందఱచోట దేవపితృకార్యములయందుఁ గాక తక్కినకార్యములలో మాంసవర్జనము మమని మనుస్మృతి తాత్పర్యమని పలుకుదురు. కాని పాపకార్యప్రవృత్తిని దెలుపు విధులకంటెఁ దన్నివృత్తిని బోధించువిధులే ప్రమాణములనుట పై లెక్కించిన విషయము.

"నాత్మార్థం పాచయేదన్నం నాత్మార్థం పాచయేత్పశూన్,
దేవార్థే బ్రాహ్మణార్థే వా హన్యాన్నైవ్యపశూన్ ద్విజః." 

అను పురాణవచనముకూడ మాంసభక్షణసమ్మతవాదుల కనుకూలముగాఁ గనుపట్టెడిని. ఐనను నివృత్తిశాస్త్రమే ప్రమా

ణము. ఏలనఁగా నూఱశ్వమేధములు ప్రతివత్సరముచేసిన నేపుణ్యమో మాంసమును వదలిన నాపుణ్యము కలుగునని మనుస్మృతియందే యుండుటంజేసి యజ్ఞకార్యమునందు మాంస భక్షణము విహితమనుట సామాన్య విధియనియుఁ దన్నిషేధము విశేషవిధియనియు స్పష్టమగుచున్నది. మాంసభక్షణము వలయునేని దేవపితృకార్యములందే చేయుఁడని స్మృతి యను యుచ్చుచున్నది. అనఁగా సర్వకాలము చేయుచున్న దురభ్యాసమును దగ్గించుటకే యీప్రయత్నమని మన మూహింపవలయును. మనుస్మృతియందే యిట్లుండఁ దక్కినస్మృతులయందింతకంటె నెక్కుడుగా మాంసభక్షణము నిషేధింపఁబడినది.

“తపః పరం కృతయుగే త్రేతాయాం జ్ఞానముచ్యతే,
ద్వాపరే యజ్ఞమేవాహుర్దానమేకం కలౌ యుగే.” ౮౬. మను. ౧ అధ్యా

అని మనుస్మృతి బోధించెను. యజ్ఞప్రధానయుగము ద్వాపరమనియే. త్రేతాయుగమున యజ్ఞము చేయరాదనికాదు. ప్రధానముకాదని మనుస్మృతి శాసించుచున్నది. దీనింబట్టి రాను రాను మాంసభక్షణమునకు సంకోచతము నెఱుంగవచ్చును. కలియుగమున నించుకంతయు హింసలేని దానమొక్కటియే ప్రధానమనుటచే హింసాకర్మము కలియుగమునఁ బనికిరాదనియేకదా. అనఁగా యజ్ఞము హింసాకర్మము కావున నది పనికిరాదని తేలెడిని. అన్నియుగములకుఁగాక కలియుగమునకు “దానమేకమ్” అనుటచే దానమొక్కటియే ఫలదమని యేర్పడుచున్నది. దీనిచేతనే యజ్ఞము నిషేధింపఁబడదు. దాన మధిక ఫలదమన్న ననవచ్చునుగాని యజ్ఞము త్యాజ్యమని తేలదు.

“సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః,
అనేన ప్రసవిష్యధ్వమేష వోఽస్త్విష్టకామధుక్.” ౧౦

దేవా భావయతానేన తే దేవా భావయంతు వః,
పరస్పరం భావయంతశ్శ్రేయః పరమవాప్స్యథ. ౧౧
ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః,
తైర్దత్తా నప్రదాయైభ్యో యో భుంక్తే _ స ఏవ సః." ౧౨. 3 అధ్యా.
అన్నయీభగవద్గీతావాక్యములు పైభావమును సా కము చేయుచున్నవి. కాని యీయజ్ఞము హింసాసహితముకాఁగూడదని

"యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః." ౨౫.అధ్యా.౧౦
అన్నగీతోక్తియే స్పష్టము చేయుచున్నది. దాపరాంతముననే హింసాప్రధానయజ్ఞములు నిషేధింపఁబడియెనని యీగీతా శాస్త్రమునుబట్టి మన మూహింపవలయును. ఇంకను బురాణములఁ బరికింతము.

త్రేతాయుగమున మున్నొక్కసారి దేవేంద్రుఁడు యజ్ఞము చేయ నారంభించెను. దేవతలెల్లరుం గూడిరి. ఆయశ్వమేధము సాగుతఱి మహర్షు లరుదెంచిరి. పశువులు వధింపఁబూని యుండిరి. ఋత్విజులు తమకార్యములయందుఁ గడుజాగరూకులై యుండిరి. సామగానము మిన్నుముట్టుచుండెను. పవిత్ర పశువులు వధింపఁ గత్తు లూనియుండిరి. బ్రాహ్మణులెల్లరు పశువధమునఁ దమకుఁగల సామ మును జూపసి ముగ నుండిరి.

"అధ్వర్యవః ప్రేషకాలే వ్యగ్రితా వై మహర్షయః.
మహర్షయస్తు తాన్ దృష్ట్వా దీనాన్ పశుగణాంస్తదా,
పప్రచ్ఛురింద్రం సంభూయ కోఽయం యజ్ఞవిధిస్తవ. ౧౬
అధర్మో బలవానేష హింసా ధర్మేప్సయా తతః,
తతః పశువధస్త్వేష తవ యజ్ఞే సురోత్తమ. ౧౭

అధర్మో ధర్మఘాతాయ ప్రారబ్ధః పశుహింసయా,
నాయం ధర్మో హ్యధర్మోయం న హింసా ధర్మ ఉచ్యతే. ౧౮

ఆగమేన భవాన్ యజ్ఞం కరోతు యది హేచ్ఛతి,
విధిదృష్టేన యజ్ఞేన ధర్మేణావ్యపనేతుసా. ౧౯

యజ్ఞబీజైస్సురశ్రేష్ఠ యేష హింసా న విద్యతే,
త్రివర్షం పరమం కాలముషితైరప్రరోహిభిః. ౨౦

ఏవధర్మో మహాప్రాజ్ఞ విరించివిహితః పురా,
ఏవం విశ్వభుగింద్రస్తు ఋషిభిస్తత్త్వదర్శిభిః. ౨౧

తదా వివాదస్సుమహానింద్రస్యాసీన్మహార్షిభిః,
జంగమస్థావరైః కైర్వా యష్టవ్యమితి చోచ్యతే. ౨౨

తే తు ఖిన్నా వివాదేన తత్త్వముక్త్వా మహర్షయః,
సంధాయ వాక్యమింద్రేణ పప్రచ్ఛుః ఖేచరం వసుం. ౨౩

మహాప్రాజ్ఞ కథం దృష్టస్త్వయా యజ్ఞవిధిర్నృప,
ఔత్తానపాదే ప్రబ్రూహి సంశయం నో నుద ప్రభో. ౨౪

శ్రుత్వా వాక్యం వసుస్తేషా మవిచార్య బలాబలం,
వేదశాస్త్రమనుస్మృత్య యజ్ఞతత్త్వమువాచ హ. ౨౫

యథోపనీతైర్యష్టవ్యమితి హోవాచ పార్థివః,
యష్టవ్యం పశుభిర్మేధ్యైరథ బీజైః ఫలైరపి. ౨౬

హింసాస్వభావో యజ్ఞస్య ఇతి మే దర్శనాగమా,
యథాహ దేవతా మంత్రా హింసాలింగా మహర్షిభిః. ౨౭

దీర్ఘేణ తపసా యుక్తైర్దర్శనైస్తారకాదిభిః,
తత్ప్రామాణ్యాన్మయా చోక్తం తస్మాత్సప్రాప్తమర్హథ. ౨౮

యది ప్రమాణం తా ౯వ మంత్రవాక్యాని వై ద్విజాః,
తథా ప్రవర్తతాం యజ్ఞో హ్యన్యథా హోనృతం వచః. ౨౯

ఏవం కృతోత్తరా_ వై యుక్తాత్మానస్తపోధనాః,

అవశ్యభావితం దృష్ట్వా తమధో వాగ్యతాఽభవత్. 30
ఇత్యుక్తమాత్రే నృపతిః ప్రవివేశ రసాతలం,
ఊర్ధ్వచారీ వసుర్భూత్వా రసాతలచరోఽభవత్. 31
వసుధాతలవాసీ తు తేన వాక్యేన సోఽభవత్,
ధర్మాణాం సంశయచ్ఛేత్తా రాజా వసురధో గతః. 32
తస్మాన్న వాచ్యమేకేన బహుజ్ఞేనాపి సంశయే,
బహుద్వారస్య ధర్మస్య సూక్ష్మా దూరతరా గతిః. 33
తస్మాన్న నిశ్చయాద్వక్తుం ధర్మశ్శక్యస్తు కేనచిత్,
దేవానృషీనుపాదాయ స్వాయంభువమృతే మనుం. 34
తస్మాదహింసా ధర్మస్య ద్వారముక్తం మహర్షిభిః,
ఋషికోటిసహస్రాణి స్వతపోభిర్దివం యయుః. 35
తస్మాన్న దానం యజ్ఞం వా ప్రశంసంతి మహర్షయః,
ఉంఛమూలఫలం శాకముదపాత్రం తపోధనాః." 36

బ్రహ్మాండపురాణము 30. అధ్యా. అనుషంగపాదము.

అ ... టె మునులువచ్చి దుఃఖమునఁ గన్నీరువదలుచున్న పశువులం గాంచి కరుణ మనంబులఁ దొంగలింప నిదియేటివిధి? హింసాకర్మ మాయజ్ఞము? ధర్మమును బాడుచేయఁబూనితివా యీపశుహింసమూలమున? ఇది ధర్మముకాదు. ఇంకేమన నధర్మమే. విధివిహితములగు ధాన ములచేత యజ్ఞముచేయుము. వానిమూలమున హింసాదోషము రాకుండవలయును. మూఁడు సంవత్సరములు దాఁచిపెట్టిన ధాన్యమున నంకురోత్పాదనశక్తి నశించును. అవియే యజ్ఞార్హములగును. అంత నింద్రుఁడు మహర్షులతోఁ గలహించెను. వసువు ధర్మాళి నెఱుంగునుగాన నాతని నడిగెను. ఆతఁ డింద్రునిపక్షముననే తనభావమును దెలిపెను. వేదాభిప్రాయము హింసాకర్మమే యజ్ఞమనిరి. ఆపాపమున

నావసు వధోలోకమునఁ బడియెను. ఎవరుగాని సరజ్ఞులవలె ధర్మనిర్ణయము చేయరాదు అని పురాణశ్లోకసారము.

దీనింబట్టి పరిశీలింపఁగాఁ త్రేతాయుగమునందే యమునఁ బశువధము దోషమని మహర్షులమతమైనట్లు కనఁబడియెడు. దశరథునకుఁ బశువధము పాపములేదు. క్షత్రియులకు మాంసభక్షణము విధివిహితమే. క్షత్రియవిహిత మాంసజాతులయందుఁ గొన్నిమాత్రమే విప్రులకు నాకాలమునందు భక్షణార్హములు. ఇపు డీచర్చ వసిష్ఠాదు లెట్లు పశువులను హింసించిరనియే కాని వేఱుగాదు. ఇఁక నీసందర్భమున నీకాలమున యజ్ఞప్రవృత్తి విచారింతము. ఇపుడును యజ్ఞము పశుహింసతోనే సాగుచున్నది. కలియుగమున యజ్ఞప్రవృత్తికి హేతువే కానరాదనువారు కొందఱు గలరు. నిషేధమే కానరాదని కొందఱందురు. "దానమేకం కలౌ యుగే" అను దానిచేతనే నిషేధింపఁబడెనని కొందఱనఁగా మఱికొందఱు కల్పసూత్రములను బఠించి యజ్ఞమునఁ జేయునది హింసయే కాదందురు. మాంసభక్షణము కలియుగమున బ్రాహ్మణులకు నిషేధింపఁబడినది. కావున హింసాప్రధానయజ్ఞము పనికిరాదనుమాట తెలియఁదగదాయన్న దేవతోద్దేశముగాఁ జేయునది హింసకాదన్న వాక్యమునే ప్రమాణముగాఁ జూపుదురు. అటులైనచో శ్రాద్ధములయందేల మాంసము నుపయోగింపరాదు? దైవపితృకార్యములయందుఁ జేయుహింస హింస కాదనికదా యున్నది అని యడుగఁగా వపాహోమము పుణ్యమన్న వేదమంత్రమును బఠించి యజ్ఞము చెప్పుదురు. దీనింబట్టి చూడఁగాఁ దమరొనరించుకార్యము మంచిదా కాదా యన్న

చింతయే వారికి లేదనియుఁ దమమాటను జెల్లించుకొనుటయే వారికి ముఖ్యమనియుఁ దేలుచున్నది. ఈవాదములను దూరముగా నెట్టి మనము నిర్ణయించుకొనఁదగినవిషయ మేమనఁగా నీక్రింద వ్రాయఁబూనినదియే.

స్మృతులు శ్రుత్యర్థమును గైకొని దేశకాలముల ననుసరించి ధర్మమును విధించును. శ్రుతివిరోధముగా స్మృతి తెలుపదు. ఏకాలమున వేదమునఁగలభావ మెంతదనుకఁ బరిగ్రహించిన మేలో యనియే మహర్షు లూహించి విధుల నియించిరి. పురాణములు భారతేతిహాసము నీలాగే నిర్ణయించినవి. స్మృతిసహాయము లేక వేదమునే యనుసరించిన వ్యవహారమే సాగదు. స్మృతులకంటె వేద ముత్తమోత్తమము కావున మేము స్మృతుల ననుసరింపమని వాదింతురేని వేదము ననుసరించి మేనమామకుమారుఁడు గతించిన నాశౌచ మెన్ని దినము లుండవలయునని యడిగిన నోరుమూయవలసివచ్చును. కావున లోకవ్యవహారము స్మృతిసహాయములేక సాగదు. ఒక్కయుగమున మాంసభక్షణమున కనుజ్ఞయిచ్చి కాలాంతరమున వలదన్ననియమములను స్మృతులే యేర్పఱచును. కాని వేదముకాదు. కావున నీకాలమున నింతమాత్రమే శ్రుతము ననుసరించవలయునని స్మృతిపురాణాదులు నిర్ణయించినపుడు మనము దానినే యనుసరింపవలయునుగాని యంతకుముందు వాడుకలోనుండు నాచారములను దెలుపు వేదభాగమును గాని స్మృతులనుగాని మనము ప్రమాణముగాఁ జూపరాదు.

విప్రుఁడు నాల్గుజాతులలో వివాహము చేసికొనవచ్చు నని మనుస్మృతి పలుకుచుండఁగా

"యదుచ్యతే ద్విజాదీనాం శూద్రాద్దారోపసంగ్రహః,
నైతన్మమమతం యస్మాత్తత్రాత్మా జాయతే స్వయమ్."

అని యాజ్ఞవల్క్యస్మృతి నిషేధించెను. ఇపుడు మనుస్మృతి ననుసరించి నాల్గుజాతులలో వివాహము చేసికొనవచ్చునందురా? కూడదందురా? యాజ్ఞవల్క్యస్మృతి వచ్చినపిదప నాయాచారము నిషేధింపఁబడినదని మన మూహింపవలయుఁగదా. మనుస్మృతివచనము ప్రమాణముగాఁ జూపరాదు. ప్రాచీనస్మృతి కదాయన్న మాంసభక్షణమునకు మనుస్మృతి యవకాశమిచ్చుచున్నది. కావున బ్రాహ్మణులు విహితమని యేల భక్షింపరాదో తెలియఁజాలకున్నాఁడను. అట్లే మాంసాహారమున కనుజ్ఞగలకాలమునఁ గలవాక్యముల నుదాహరించి యజ్ఞమునఁ బశువధము శాస్త్రసమ్మతమనుట సమంజసముకాదు. కావునఁ గలికాలమునందుఁ బంచమహాయజ్ఞములే చాలును. యజ్ఞముల ఫలము నాశించువారు ఫలమూలాదులతోఁ జేయుట మంచిది. వేదము ప్రమాణముకాదా యని ప్రశ్నము చేయుదురేని, యట్టివారికి మొండిపట్టువలయే ప్రధానముకాని సాధుతాసాధుతల మెక్కుడు లేదనవలసివచ్చును. శ్రుతిస్మృతులకు విరోధము పొసఁగినచో వేదమే ప్రమాణమన్నవాక్యము నే నెఱుంగకపోలేదు. సత్యమార్గ మిది యని నాకుం దోఁచినదానిని మోమోటమి మాని యిట వ్రాసితిని. సాధుమతు లాలోచించి నిర్ణయించుకొందురుగాక యని వేఁడుచున్నాఁడను. ఇఁక నీవిషయమును వదలి మఱియొకవిషయమును జర్చింతును.

## ఋత్విక్షణాలు.

దశరథుఁడు యజ్ఞము పూర్తికాఁగాఁ బ్రధానులగు నలుగురుఋత్విజులకు నాల్గుదెసలనుండు దేశముల నొసంగెను.

అది విధివిహితము. వారెల్ల మహర్షులు. దేశములఁ బరిగ్రహించి రాజా! మేము మునులము. రాజ పాలనమున నసమర్థులము. వేదాధ్యయనాదులతోఁ గాలమును బుచ్చువారము. కావున నీవే యీపనికి వలంతివి. మాకేదో దక్షిణ యిచ్చి దీనిం గ్రహింపుమనిరి. వారలమాటలు సత్యములు కావున రాజు వారి కిచ్చువచ్చినంతదక్షిణల నొసంగి మరల దేశములఁ బరిగ్రహించెను. అను నీభాగము నించుక విమర్శింపఁదగియున్నది. ఇందుఁగలవిషయములు కొన్ని పరిహాసభాజనములుగాఁ దోఁచును. కాని విమర్శించినపుడు విశేషాంశము లందు నిమిడియున్నవని తోఁచును.

"హోతాధ్వర్యుస్తథోద్గాతా హస్తేన సమయోజయన్,
మహిష్యా పరివృత్త్యా చ వావాతాంచ తథాపరామ్." 33

అని రామాయణమునం దున్నది. రాజు హోతకు అధ్వరునకు, బ్రహ్మకు, నుద్గాతకు దక్షిణగా రాజపత్నిని, బరివృత్తిని, వావాతను, పాలాకలిని నొసంగఁగా వారు పతులవలెనే వారిని బరిగ్రహించిరని మూలము తెల్పుచున్నది. అశ్వమేధమునం దిట్లు దానముచేయవలయు ననువిధి కలదు. ఆరీతిగా నారాజు సంశయింపక యొసంగెను. హోత రాజమహిషిని భర్తవలెనే పరిగ్రహించెను. దీనింబట్టి యాలోచింపఁగాఁ గర్తయగు దశరథుఁడు హోత్రయు నిర్మలతమాంతఃకరణులనియు, వేదమును నమ్మి దానియాజ్ఞను శిరసావహించి యందేమాత్రము సంశయములేక నాచరించిన సుమపురుషాముగల దనువిశ్వాసము కలవారనియుఁ గనబడియెడు. మహారాజు భార్యను హోతకు దానముగ నిచ్చుట యన నెంతటికార్యమో పరిగ్రహించువాఁ

డెంతవిజితేంద్రియుం డనువిశ్వాస మారాజునకుం గలదో యోజించినఁ దోఁపకుండెడు. అహల్యతయు మూలమ్ము సుంత పరిగ్రహించి మరల నామె నొసంగవలయునని సూత్రము తెలుపుచున్నది.

"పశ్చాత్ప్రతినిధిద్రవ్యదానేన నివర్త్యేరన్"

తదుక్తప్రకార మాబుత్విజులు దక్షిణల గ్రహించి వారిని మరల రాజున కొసంగిరి. అనుపూర్వాచారమును బరిశీలింపక యూరకే యాక్షేపింపరాదు. దీనిచే వారికి వేదమునందు విశ్వాసము ఋత్విగితతియందు సద్భావముఁ గలదనియు వారట్లు ప్రవర్తించినందున నేలాటియనాచారములు కలుగకయుండె ననియు వారిమనస్సులు వేదైకశరణములై యుండెననియు విషయాభిలాష లేశమైనను వారికి లేవనియు మనకుఁ దోఁపక మానవు. ఎంతటిజితేంద్రియులు? ఎంతటి శ్రద్ధాళువులు? ఈఘనరామాయణమును దెనిఁగించువారు కడుజాగరూకులై మెలంగవలయు. విపరీతార్థము తోఁపకయుండ వ్రాయవలయును. పూర్వాచారములయందు లోపమున్నట్లు సుంతయుఁ దెలియనీయరాదు. అట్లు లేకయున్న నదేటితెలుఁగు? రాజపత్ని నొసంగ నాహోత పరిగ్రహించెను. అని వ్రాసి యూరకయున్న నసంగతముగ నుండదా. ప్రతినిధి ద్రవ్యముంగొని మరల నొసంగిరని తెలిపిన నట్టివిపరీతార్థము తోఁపకయుండునుగదా.

సీ. మహిషి వావాత నుమతియుఁ బాలాకలిఁ
బరివృత్తిని నొసంగె స్పర్శనముగ
నంత వాజిపమను నగ్నిలో వేల్వ"

అని ఆంధ్ర వాల్మీకిరామాయణము.

వ. "క్రమంబునఁ బ్రతిగ్రహించి భర్తయుం బోలె హస్తగ్రహణంబుఁ గావించి యద్దశరథునివలనఁ దత్పతినిధిద్రవ్యంబుఁ గొని క్రమ్మఱ నతని కొసంగిరి."
గోపీనాథరామాయణము.

తే. "నల్వురను హస్తములచేత సాధులవలె
నంత యాజకు లర్థంబు నధిపువలనఁ
గైకొనుచు వారి నిచ్చిరి కడురయమున" ఆంధ్రశ్రీమద్రామాయణము.

ఆంధ్రవాల్మీకిరామాయణమున నీయ ము స్పష్టముగామి నది యసంగతా మును దోఁపఁ జేయుచున్నది. విమర్శకులు పక్షపాతమున నద్దానినే బలే యని మెచ్చుకొన్నను సరసకవిపండితులు రసవిహీనమని యీభాగమును గాంచి యనక మానరు కదా. పై య మును దెలుపకయుంట గొప్పలోపమే యన వలయు. ఇంతకంటె నెక్కుడు వ్రాయరాదు.

రాజ్యములు కరగతములు కాఁగా వానిని దక్షిణ యించుకయే నిమ్మని మరల నిచ్చివేసిరి. అన్నవిషయమును బరికింపఁగా నాకాలపుబ్రాహ్మణుల మనోభావములు స్మృతిసమ్మతములుగా నున్నవని స్పష్టమయె డిని

"అద్రోహేణైవ భూతానామల్పద్రోహేణ వా పునః,
యా వృత్తిస్తాం సమాస్థాయ విప్రో జీవేదనాపది. ౨
యాత్రామాత్రప్రసిద్ధ్యర్థం స్వైః కర్మభిరగర్హితైః,
అక్లేశేన శరీరస్య కుర్వంతి ధనసంచయమ్. ౩
ఋతామృతాభ్యాం జీవేత్తు మృతేన ప్రమృతేన వా,
సత్యానృతాభ్యామపి వా న శ్వవృత్త్యా కదాచన. ౪
ఋతముంఛశిలం జ్ఞేయమమృతం స్యాదయాచితం,
మృతం తు యాచితం భైక్షం ప్రమృతం కర్షణం స్మృతం. ౫

సత్యానృతం తు వాణిజ్యం తేన చైవాపి జీవ్యతే,
సేవా శ్వవృత్తిరాఖ్యాతా తస్మాత్తాం పరివర్జయేత్.
కుసూలధాన్యకో వా స్యాత్కుంభీధాన్యక ఏవ వా,
త్ర్యహైహికో వాపి భవేదశ్వస్తనిక ఏవ వా. ౭
చతుర్ణామపి చైతేషాం ద్విజానాం గృహమేధినాం,
జ్యాయాన్పరః పరో జ్ఞేయో ధర్మతో లోకజిత్తమః." ౮

మనుస్మృతి. ౪. అధ్యా.

"కుసూలకుంభీధాన్యో వా త్ర్యాహికోఽశ్వస్తనోఽపి వా,
జీవేద్వాపి శిలోంఛేన శ్రేయానేషాం పరః పరః. ౧౨౮
న స్వాధ్యాయవిరోధ్యర్థమీహేత న యతస్తతః,
న విరుద్ధప్రసంగేన సంతోషీ చ భవేత్సదా. ౧౨౯
రాజేఽంతేవాసిశిష్యేభ్యస్సీదన్నిద్ధనం క్షుధా,
దంభిహైతుకపాషండిబకవృత్తీంశ్చ వర్జయేత్." ౧౩౦

యాజ్ఞవల్క్యస్మృతి. ఆచారకాండము.

ఇట్టే యెన్నియో స్మృతులయందుఁ గలవు. ఈస్మృతులన్నియు నాకాలపు టాచారములను సంతృప్తిని బహూకరించుచున్నవి. అట్టివారు కనుకనే రాజచూడామణి భార్యను దానమిచ్చి నిస్సంశయుఁ డయ్యెను. సంతృప్తి యెంతటిసుగుణము. దాన నెంత సుఖము కల్గునో యది యనుభవైకవేద్యముగాని మాటలఁ బలుకరానిదగును. అట్టికాలము మరల వచ్చుఁగాక యని దైవమును బ్రార్థింపవలయును. ఇట్టు లీభాగమునుండి యనేక నీతులను గ్రహింపందగు. గ్రంథవిస్తరభీతి నింకను దెలుపఁదగు వాని వదలితిని. ఇఁకఁ దరువాతికథను వ్రాయుదును.

## దేవతలు శ్రీమహావిష్ణువును బ్రార్థించుట.

* దశరథునిప్రార్థనానంతర మాబుుశ్యశృంగముని బుుత్విక్కులలో మేటి కావున ముహూర్తమాత్రము మనస్సున నీరాజునకే కర్మమూలమునఁ బుత్త్రులు కలుగుదురని ధ్యానించి వేదవేత్త కావునఁ దగినకర్మము నెఱింగి సంతానప్రతిబంధము నుపోలఁగింపఁజాలిన యొకయాగమును గావింతును. దాన నీకు సంతతి కలుగును. అది యథర్వశిరోమంత్రములచే నొనరింపందగినది. అని పలికి యగ్నియందు హోమముచేయ నారంభించెను. తగినయాజకుఁడు వీరవంతము లగు వేదమంత్రములు కూడినపుడాకర్మము సఫలముగాక మానదు. యాజకుఁడు తగినవాఁడనఁగాఁ దపోవ్రతనిష్ఠుఁడు కాకపోయినయెడల నాకర్మము నిష్ఫలమగును. కావునఁ గర్త తగినసభ్యుల సంపాదించుకొనవలయును.

"శ్రుతాధ్యయనసంపన్నా ధర్మజ్ఞాస్సత్యవాదినః,
రాజ్ఞా సభాసదః కార్యా రిపౌ మిత్రే చ యే సమాః."

యాజ్ఞవల్క్యస్మృతి. వ్యవహారకాండము.

ఈమొదలగుస్మృతివచనములు పైయమును స్పష్టము చేయుచున్నవి. కావున బుుశ్యశృంగముని యజ్ఞము చేయ నారంభించెను. పుత్త్రోత్పత్తి యగును కావున నిదియే సమయమని దేవతలు త్వరపడవలసివచ్చెను.

అంతట దేవగంధర్వసిద్ధులు బ్రహ్మాది మహర్షులు నాయాగమునఁ దమతమహవిర్భాగములఁ గైకొన నొక్కచోటిగా నందుఁగూడిరి. వారితరులకుఁ గనఁబడరు. అప్పుడు దేవతలు

* ఈభాగము బాలకాండము పదునైదవసర్గమునుండి గ్రహింపఁబడినది.

బ్రహ్మదేవునితో నిట్లు పల్కిరి. సృష్టికర్తయగుటఁ గార్యభార మాతఁడె యుంగును. మహానుభావా! నీవరములమహత్త్వమునం గ్రొవ్వి రావణాసురుఁడు ప్రతిహతముగాని పరాక్రమమున మమ్ము బాధించుచున్నవాఁడు. వానిని శిక్షింప మేము శక్తులముగాక బాధలంగుడుచుచున్నవారము. పూర్వము నీవాతనియందు దయగలిగి మాచే నెవరిచేతను జావు కలుగకయుండ వరమిచ్చితివి. నీవరమును సమ్మానించుచు వానిబాధల ననుభవించుచున్నవారము. వానిబాధల నిన్ని యని వివరింపఁజాలము. ఇంద్రపదవినే యపహరింపఁజూచుచున్నాఁడు. సూర్యచంద్రు లాతనికి భయపడుదురన నిఁక నితరులమాట యేటికి? వానిబాధ ముల్లోకములకు దుర్భరముగా నున్నది.. కావున వానిని బోడవడంచు నుపాయము నీవే యాలోచింపవలయు నని ప్రార్థించిరి.

బ్రహ్మయు వారిమాటల విని యందుఁ గలసత్యము నెఱింగి యోజించి దురాత్ముఁడగు రావణుం జంపుట కొకయుపాయము స్ఫురించెను. గంధర్వులు యక్షులు దేవదానవరాక్షసాదులు నన్నుఁ జంపఁదగుశక్తులు కాకయుండ వరమిమ్మని వాఁడు నన్నడిగెను. అట్లే యగునంటిని. కాని వరమడుగు కాలమున మానవులవలనఁ జావులేకుండ నడిగినఁ దన కవమతి యని కాఁబోలు మానవులపే రెత్తఁడయ్యెను. కాన వానిఁ జంప మానవుఁడే సమర్థుఁడుగాని వేఱొకండు లేఁడు. ఆమాటల కాయమర్త్యులు కరము హర్షించిరి.

దేవతలు రావణసంహారము నపేక్షించుట యెఱింగి సర్వ వ్యాపకుఁడు గావున మహాద్భుతతేజస్సు వెలయ శంఖచక్ర

గదాపద్మముల ధరించి భూభారహరణమును జేయఁబూనినవాఁడు కావున నందుల కదియే సమయమగుట నారాయణమూర్తి యచ్చటికి విజయంచేసెను. అందుఁగల బ్రహ్మదేవుని గలిసి ప్రయత్నమున నుండఁగా దేవత లరుదెంచి నమస్కరించి విష్ణుమూర్తిని బెక్కుభంగుల నుతించి యిట్లు వేఁడిరి. మహానుభావా! లోకహితముచేయ నెప్పుడును సిద్ధముగా నుండువాఁడవు. అట్టి నిన్నుఁ దత్కార్యమున కిపుడు ప్రోత్సహించుచున్నారము. ఆలకింపుఁడు. అయోధ్యా పతి దశరథుఁడు ధర్మజ్ఞుఁడు. మహాదాత. మహర్షివలెఁ దేజశ్శాలి. ఆతనిభార్య లు మూవురు గలరు. *హ్రీ శ్రీకీర్తులతో పాటియగువారు కావున నీరూపమును నాల్గుభాగములుగ నొనరించుకొని నలువురకొడుకులుగా వారికడుపులఁబుట్టుము. మహాత్మా! నీవు మానవరూపమెత్తి వీర్య బలోద్రిక్తుఁడగు లోకకంటకుని దేవతావధ్యుని రణరంగమునఁ బొలియింపుము. వాఁడు మమ్మెల్లఁ బీడించుచున్న వాఁడు. నందనవనమునఁ గ్రీడించు గంధర్వ దంపతులను మహర్షులను దేవతాకాంతలం బలుబాములఁ బెట్టుచున్న వాఁడుకనుక వెనుకముందు లాలోచింపక వానిం జంపందగును. మహాత్మా! నిన్ను శరణుచొచ్చితిమి. మాకెల్ల నీవుకదా పరమగతివి. జనానుఁడవుకాదా. కావున మమ్ము రక్షింప దుర్జనుల శిక్షింప భూలోకమున నవతరింప నంగీకరింపుమని ప్రార్థించిరి.

శ్రీవిష్ణుమూర్తి వారినెల్లరం గని దేవతలారా! ఇఁక భయ ముడుగుఁడు. మీకు మేలు గలుగును. క్రూరుఁడు దురా

* తస్య భార్యాసు తిసృషు హ్రీశ్రీకీర్త్యుపమాసు చ. అని మూలము. హ్రీశ్రీకీర్తయో దక్షకన్యాః. అని వ్యాఖ్య.

త్ముఁడు సాధుభయంకరుఁడు నగు రావణుని సపుత్త్రమిత్త్రబాంధవ జ్ఞాతిమంత్రి ప్రకృతిగణుని వధించి మర్త్య లోకమునఁ బదునొకండు వేలయేండ్లుండును.పృథివిని బాలింతును. మహాత్ముఁడగు నావిష్ణు విట్లుపలికి మానవలోకము దనజన్మమునకుఁ దగినదని తలంచెను. తనను నాలుఁగుభాగములుఁగ విభజించుకొని దశరథునకుఁ బుత్త్రత మునొంద సమ్మతించెను. ఆవాగ్దానమున కానందించి యందుండువారెల్ల నావిష్ణుమూర్తిని వినుతించిరి. ఆదానవుని పరాక్రమమును వానివలన బాధల నెవ రెవ రు గుడుచుచున్నవారో వారిని దెలిపి వానిం బొడవడంగించి మాకష్టములందీర్చి యథాపూర ముగా నీలోకమును జేరుము అని ప్రార్థించిరి.

మహామతులారా! ఈభాగమునఁ గొన్నివిశేషములు గలవు. వాని నాలకింపుఁడు. ఋశ్యశృంగమహాముని తనవాగ్దానమును నిరహింపంబూని ధ్యానించెను. అనఁగా మనస్సునేకాగ్రముగఁజేసి యేవిధిగా నీకార్యము నిరహించిన ఫలవంతమగునని యోజించెనని భావము

"తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః,
ఉపవిశ్యాసనే యుంజ్యాద్యోగమాత్మవిశుద్ధయే." ౧౨. గీత ౬ అధ్యా.

అన్న భగవదాజ్ఞ మే యిటఁ బ్రమాణము. అనఁగాఁ దనమదినుపాస్య దేవతయందుఁ జేర్చెననియే దీనిసారము.

"ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్,
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూతమకల్మషమ్." ౨౭. గీత ౬ అధ్యా.

అనుపద్ధతి ననుసరించి మనశ్శాంతము కలిగినఁగాని సుఖము నొందఁడనఁగా నిశ్చింతుఁడు కాఁడని భావము. ఇట్టులు క్షణమాత్ర మాలోచించి సిద్ధతపస్కుఁడు గావున నారాజు కర్త

మీసంతానవిషయమున విముఖముగా నున్నందున దానిని సమ్ముఖముగా నొనరింపఁదగుప తి తోఁపఁగా నిఁక నీకు సంతానము కలుగును. అని మాటయిచ్చి తదుపయు_ మగు నొక హోమము చేయఁబూనెనని య ము. దీనికే ఆకర్షణప్రయోగ మందురు. అ ష్టదేవత నాకర్షించుబీజములు సంపుటీకరణములుగా నొనరించి ధ్యా నించెను. మంత్రమునఁగల బీజముల కొక్కొక్క దేవత యుండును. వానినిగూర్చుటలో నవియన్నియు మిగుల వీర్య వంతములై తమయధిష్ఠానదేవత నాకర్షించును. అనఁగా భ క్తునిధ్యా నము మంత్ర దేవత కిచ్చోటఁ దనభ క్తుఁ డున్నవాఁడని తెలిసికొనునట్లు చేయును. ఉపాసకుఁడు దృఢభ క్తుఁడు కానిచోఁ జిరకాలమునకుఁగాని యా తపస్సు సి ంపదు. అనఁగా నా దేవతకుఁ దెలియఁ జేయఁజాలదు. భ_ దృఢతం గాంచునేని శీఘ్రంబ యా దేవత వీనిని స్మరించునట్లు చేయును. ఈ కార్య మే ధ్యానమునకు ఫలము. ఈ ధ్యానము మనస్సు స్థితినిబట్టి యుండును. యోగము నభ సించి చంచలతంబాసియుండు మనస్సుగలవానిధ్యా నము శీఘ్రమే ఫలమొసంగును. అనఁగా నాయ ష్టదేవత కీవా_ర్త నెఱిఁగించును.

"యత్ర యత్ర రఘునాథకీర్తనం తత్ర తత్ర కృతమ స్తకాంజలిం,
బాష్పవారిపరిపూర్ణలోచనం మారుతిం నమత రాక్షసాంతకమ్."

అనఁగా న మేమి. దృఢభ_క్తిగలిగి రామరూపునిగా భగవంతుని ధ్యానించినఁ దద్భ_కి మెచ్చి సపరివారుఁడై యారామరూపమునఁ బరమేశ రుఁ డందుండుననికదా సారము. ఈయాకర్షణప్రయోగమే తపస్సని ప్రాయశః వ్యవహరింపఁబడుచున్నది. భగవంతుఁడు భ క్తులకుఁ బ్రత్యక్షమయ్యెననఁగా న మేమి?

ఏపనితోఁ బని వచ్చినాఁడనియా! కాదు. మంత్రబీజాకృష్టుఁడై భక్తునివాంఛలం దీర్ప నరుదెంచెననికదా సారము. హోమము చేయువేళ యనఁగా నా దేవతకుఁ బ్రీతికరములగు వస్తువుల నగ్నిముఖమున సమర్పించుట యని భావము. దాన సంప్రీతుఁడై శ్రీనారాయణమూర్తి యట కేతెంచెనని ప్రకృత కథావిషయము. అంతియకాని హవిర్భాగములు దేవత లెట్లు తీసికొందురో చూచిపోవుదమని కాని నాకు నించుక దొరకునేమోయని యాశపడికాని కాదు.

మునిభావశక్తి యాకర్షింపఁగా ననఁగా శ్రీమన్నారాయణరూపమున నాముని మనస్సు నేకాగ్రముచేసి తనపై నిలుపఁగా నాతనియెడం బ్రసన్నుఁడై యచ్చట కరుదెంచెననియే యిటఁగలసారము. అట్లుగాకయున్న నాయజ్ఞస్థలమునకు వచ్చుట కవకాశమే లేదు. దేవత లంతకుఁ బూర్వము ప్రాపింపలేదు. భూభారము హరింపఁ దనకుఁదానే యరుదెంచె నందురేని ఆచోటికి రానక్కఱలేదు. మునికిం బ్రత్యక్షమయ్యెనని భావము. అందఱేల చూడఁజాలకపోయిరన్న ప్రశ్నము చేయువారున్నచో వారికి యుక్తాయుక్తపరిజ్ఞానము లేదనుటయే సమాధానము. భక్తునకుం బ్రత్యక్షము కాఁగా నెల్లరుం జూచి మాటలాడిరని యెందును లేదు. ఆరూప మాతని కొక్కనికే కనఁబడెను. దేవత లట్లే యదృశ్యులై యున్నవారు గావునఁ దఱచుగా నామహాత్ముని దర్శించువారు గావున బ్రహ్మానుగ్రహమును ముందు పొంది ప్రాపింపఁజాలిరి.

దేవతలు రావణుబాధలం దెల్పుకొనిరి. అందు ముఖ్యముగా

"ఋషయశ్చ తతస్తేన గంధర్వాప్సరసస్తథా,
క్రీడంతో నందనవనే క్రూరేణ కిల హింసితాః." ౨౨

అని విన్నవించిరి. ఎప్పుడుగాని స్త్రీలకు బాధ కలిగించినఁగాని భగవంతునకుంగూడ నాగ్రహము కలుగదు. ఏలయనఁగా విహరించుదంపతుల హింసించుట మహాధర్మము. అద్దానిం గాంచిన మానవులును దెగింతురు. భగవంతుఁడధర్మవిచ్ఛేదకుఁడు. కావున నిఁక నాదేవున కాగ్రహము కలుగదా. ఇందొక్క రహస్య మున్నదని యూహింపవచ్చును. రావణుని దుశ్చేష్టితము లనేకము లున్నను స్త్రీలను జెఱఁబెట్టెననుట యొకటియు దంపతుల హింసించెనను టొకటియు భగవంతుని కాగ్రహము గల్గింపఁ బ్రధానములు. సంసారమూలము స్త్రీలవలననే నిలిచియున్నది. అనఁగా సంసారవృక్షమునకు మూలములు స్త్రీలని యూహింపవలయును. మూలమున కించుక కీడుకలిగినచో నావృక్షమెల్ల నశించును. అట్టి స్త్రీలకు నపకారము కల్గించిన వారివృత్తి చెడును. వృత్తి నశింపఁగా నాకులమెల్ల దుర్వృత్తికిం బాలగును. దాన ధర్మము నశించును. సదాచారములు నిర్మూలములగును. అంతటి మహాపాపకారమునకు భగవంతుఁ డోరఁగలఁడా. కావుననే దేవత లావాక్యమునే తెల్పిరి దాన భగవంతుఁ డింక నవతరింపక యాలసింపరాదని తలంచెను.

"అధర్మాభిభవాత్కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః,
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః. ౪౧
సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ,
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః. ౪౨

అన్న యర్జునుని ప్రశ్నము పై యర్థమునే తెలుపుచున్నది. ఇవి

భగవదాజ్ఞ ములా యన్న నిందఁగల యాక్షేపముల నంగీకరించెను. కావుననే శ్రీకృష్ణుఁడు నీప్రశ్నము మంచిదికాదని యాక్షేపింపకుండుటయే యంగీకరించిన ట్లూహింపవలయును.

"అపత్యం ధర్మకార్యాణి శుశ్రూషారతిరుత్తమా,
దారాధీనస్తథాస్వర్గః పితౄణా మాత్మనశ్చహ." ౨౮
మను ౯ అధ్యా.

ఈస్మృతివాక్యమే స్త్రీమూలము ధర్మమని తేటపఱచుచున్నది. కావుననే

"నారీషు నిత్యం శుచిభూషితాసు పతివ్రతాసు ప్రియవాదినీషు
అముక్తహస్తాసు ప్రజాన్వితాసు సుగుప్తభాండాసు బలిప్రియాసు,
సుశ్లిష్టవేశ్మాసు జితేంద్రియాసు కలివ్యపేతాసు విలోలుపాసు
ధర్మావ్యపేతాసు దయాన్వితాసు స్థితా సదాహం జగతాం విధాత్రి."

అని మహాభారతమునఁ బృథీ లక్ష్మీసంవాదమునందు శ్రీవిష్ణువాక్యము కనఁబడియెడు. సదాచారసంపత్తి లోనగుసద్గుణములు కలవారలగు లయందు నేను నివసింతునని భగవంతుఁడు చెప్పెను. అట్టి కులకాంతల కపకారముచేయుట మహాపాపకార మేయగు.

ఏకాలమునందును గులధర్మము లెల్ల గృహిణ్యాధీనములై యుండును. అట్టి కులకాంత లపవిత్రలగుదురేని కులమెల్ల నపవిత్రమగును. కావుననే స్త్రీరక్షణము ప్రధానమని స్మృతులు బోధించుచున్నవి.

"ఇమం హి సర్వవర్ణానాం పశ్యంతో ధర్మముత్తమం,
యతంతే రక్షితుం భార్యాం భర్తారో దుర్బలా అపి. ౬
స్వాం ప్రసూతిం చరిత్రం చ కులమాత్మాన మేవ చ,

స్వం చ ధర్మం ప్రయత్నేన జాయాం రక్షన్ హి రక్షతి. ౬

అర్థస్య సంగ్రహే చైనాం వ్యయే చైవ నియోజయేత్,

శౌచే ధర్మేఽన్నపంక్త్యాం చ పారిణాహ్యస్య వేక్షణే." ౧౧. శ్లో ౯ అ.

(శయ్యాసనాదిగృహోపకరణములు పారిణాహ్యము లనఁబడును.)

అని మనుస్మృతి తెల్పుచున్నది. పర ధికారముల నొసంగి వారిశీలమును గాపాడుఁడని స్మృతులు ఘోషించుచున్నవి. కావున పర ధర్మములు స్త్రీసత్ప్రవర్తనాయత్తములు. పరా ధర్మములు స్త్రీదుష్ప్రవర్తనాయత్తములు. కావున భగవంతు నితో నట్టి స్త్రీలమర్యాద పాడొనరించెనని దేవతలు విన్న వించిరని యెఱుంగవలయును.

దేవతలప్రార్థనము నంగీకరించి భగవంతుఁడు మానవ రూపమును దాల్తునని వాగ్దానముచేసెను. అంతియకాక క్రూరుఁడు దుర్మతియు దేవర్షిభయంకరుఁడు నగు రావణుని జంపి పదునొకండువేలయేండ్లు భూలోకమున నుందుననియు మాటయిచ్చెను.

"దశవర్షసహస్రాణి దశవర్షశతాని చ,

వత్స్యామి మానుషేలోకే పాలయన్ పృథివీమిమాం." ౨౯

అని మూలము. ఈవాగ్దానము ప్రార్థనాంతర్యాతము కాదు. తానై చేసినది. ఏల?

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం,

ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే."

అన్నశపథమును సార్థకముచేయుటకే యని సమాధానము. ఇందుగల మొదటిరెండుకారణములకు నిన్నివేలయేండ్లుండ నక్కఱలేదు. ధర్మసంస్థాపనమునకే యింతకాలము పృథివియం

యుండవలయును. ఈవిషయమున నాలుగుమాటలు వ్రాయవలసియున్నది. మాన వలనుపడదు. కాన వ్రాసెదను.

త్రేతాయుగాంతమున ధర్మములు తాఱుమాఱయ్యెను. వేదశాస్త్రపఠనముననే కాలము గడపుచుండిరి. మీఁదు మిక్కిలి రాక్షసులబాధ లెక్కుడయ్యెను. కావున నధర్మము విషయములయందు వృద్ధియయ్యెను. రాక్షసులు పరపత్నుల నెత్తుకొనిపోవుట యాచారమయ్యెను. కొందఱుస్త్రీలు సేచగాఁ దిరుగుచుఁ బురుషులఁ గామించుచుండిరి. పురుషులందుల కంగీకరింపక యున్న వారిని దమవారిమూలమున వధింపఁ బ్రయత్నించుచుండిరి. కులకాంతలమర్యాద నిలుచుట కష్టమయ్యెను. స్త్రీలే యాచారము రూపుమాపుటకును, అభివృద్ధి చేయుటకును మూలమని యెఱుంగఁదగినవిషయము. ఆ స్త్రీలకడ సత్ప్రవర్తన మడుగంటెను. కులకాంతలు బయటఁ దిరుగ నోడుచుండిరి. మనుష్యభక్షకు లడవులనుండి మునులను దత్కుమారులను హింసించుచుండిరి. మహాతపస్సంపన్నులొక్కకొందఱే యడవుల నుండఁగలిగిరి. కొందఱు రక్కసుల కంటఁబడక యెందో దాఁగియుండిరి. ఇట్టి యిక్కట్టులందు సదాచారము నిలువ నవకాశముకలదాయన్న లేదనవలసినదే కదా. ఇట్లు తాఱుమాఱగుచున్న సదాచారమును శ్రీరామావతారమున భగవంతుఁడు నిలుపవలయునుగదా.

లోకమున విధుల నుపదేశింపవచ్చును. ఉపదేశింపక ప్రవర్తనమునఁ గనఁబఱచి లోకులను వాని ననుసరించునట్లు చేయుట మిక్కిలి కష్టము. నశించుచున్న సదాచారమును స్వప్రవర్తనరూపమున నిలుపుటకే రామావతారమున నన్ని.

యేండ్లు భూతలమున నివసింతునని వాగ్దానము చేసెను. పదు నొకండుసంఖ్య లో విశేషా ము గలదు. అది శివప్రియమైనది. శివుఁడు మృత్యుంజయుఁడు అధర్మరూపరాక్షసాకారమును ధ్వంసము చేయవలయునన్న భగవంతుఁడు మృత్యుంజయరూప మును దాల్చెను. కరుణానిధియగు భగవంతుఁ డీయధర్మధ్వంస మున నాగ్రహ మూనవలసెను. ఏకాదశసంఖ్య యేవిషయమునఁ జూచినను లయకర్తను దెలుపుచున్నది. పదునొకండు వేల యేండ్లు దీక్షఁబూనినఁగాని యకార్యము నెఱవేఱదయెను. ఈకారణముననే పదునొకండు వేలయేండ్లుందునని హరి వాగ్దా నము చేసెను.

శంకరుఁడు రాముని ధ్యానించును. రాముఁడు శివుని ధ్యానించును. ఈయిరువురు నొక్కయంశముగలవారలే. కావు ననే శ్రీరాముఁడు పదునొకండు వేలవత్సరములు కర్మభూమి యగు భూలోకముననుండి శివు నుపాసించి లోకమునఁ గల దుష్టులసంహరించి శిష్టులం బరిపాలించి యనాచారముల రూపు మాపి సదాచారముల నెలకొల్పి స ధామమునకు వేంచేసెనని యే యిందుఁగలసారము. కొంద ఱిద్దానికంగీకరింపరని నేనెఱుం గుదును. రామతారకమంత్రోపాసకుఁడు శంకరుఁడన్న వారికిఁ బరమానందము. శివతారకమంత్రోపాసకుఁడు రాముఁడన్న వారికిఁ దలనొప్పి కలుగును. ఏలయన వారిమనమున శివకేశవు లొక్కభగవందశమునఁ బుట్టినవారు కాదనియు విష్ణు వందఱి కంటె నుత్కృష్టుఁడనియు నొకభావము నాటుకొన్నది. కావున వారల కీమాట యసహ్యమే. శివుఁడు రాము నుపాసించెనని రామాయణమునఁ గానరాదు. ఇతరపురాణములయందే యది.

కలదు, కొన్ని తామసపురాణము లని యందురు. అట్టి తామస పురాణములయందుఁ గలదాని నమ్ము టెట్లో తెలియరాదు. శివుఁడు రామభక్తుఁ డన్నమాట నాతామసపురాణములనుండి పరిగ్రహించినపుడు రాముఁడు శంకరలింగప్రతిష్ఠ నొనరించి పాపములు పోఁగొట్టుకొనె నన్నకథ యేల యంగీకరింపరాదో తెలియరాకున్నది. రామాయణమును మాత్ర మనుసరించిన నీ రెండును గానరావుకదా. ఏది యెట్లులున్నను వారిరువురును భగవదంశసంభూతులే యనుట సిద్ధాంతము. ఈవిషయ మాయాయితావులఁ దెలుపుదును.

ఏకాదశితిథి యుపవాసదినము. ఏల? ఆపక్షమునఁ దాను జేసిన జ్ఞానాజ్ఞానకృతపాపములను రూపుమాపుటకే యుపవాస ముండుట. అనఁగా నేకాదశి యుపవసించి భగవంతు నాదిన మున నేకాగ్రమనమున ధ్యానించి యీపదునైదుదినముల లోనేఁ జేసినపాపములఁ బోడవడంపుచూ యని ప్రాంపవల యును. అట్లులేకున్న నాయుపవాసము నిష్ఫలము. దేహశోష ణము మాత్రమే యందులకు ఫలముకాదు. స్త్రీలు ఋతుదర్శన దినముమొదలుకొని పదునొకండవదినము భర్తృసంగతికిం బని కిరారు.

"ఋతుస్వాభావికా స్త్రీణాం రాత్రయష్షోడశస్మృతాః,
తాసామాద్యాశ్చతస్రస్తు నింద్యా ఏకాదశీ చ యా."

అని జ్యోతిశ్శాస్త్రము తెలుపుచున్నది. అనఁగా నేకాదశితిథినాఁ డని కాదు. ఆపదునాఱుదినములలోఁ బదునొకండవదినమని భావము. ఏకాదశరుద్రులనుట సుప్రసిద్ధము. కాన నాయేకాద శసంఖ్య నియమమును దెల్పుచున్నది. ఏకాదశి హరిదినము కదా. అది యెట్లు శివతిథియగునని కొందఱు ప్రశ్నింతురు.

పాపము! వారి కీతుచ్ఛమతద్వేషము వదలలేదు. పాపధ్వంసము చేయఁబూనుటకుఁ దగినదని వారు గ్రహించిన నీబాధ తొలంగును. కొందఱేకాదశి యుపవసించి సంధ్యావందనాదినిత్యకర్మముల మానుదురు. వారి కీయుపవాసము విడంబనామే యనియు భగవదారాధనమునకుఁ దప్ప నితరకార్యముల నుపయోగింపరాదనువిధి తెలియదనియు నూహింపవలయును. ఇట్టియాచారములవలెఁ దోఁచు ననాచారము లెన్నియో గలవు. వానిని రూపుమాపినఁగాని మతద్వేషము లంతరింపవు. మతాభిమానము ముఖ్యముకాని పరమతద్వేషము పనికిరాదుగదా. ఇక్కాలమునఁ బరమతద్వేషమే యధికము. దానఁ గలుగు లాభము సకీయోత్తమపురుషార్థధ్వంసమే తనమేలు పోవుటకైన నంగీకరింతురుగాని పరమతద్వేషమును మానరు. ఇంత కన్నఁ గలిమాహాత్మ్యము మఱేమి కావలయును?

పదునొకండువేలయేండ్లుండుటకు మఱొకకారణము కూడఁ గలదనవచ్చును లవణాసురసంహారము రావణవధానంతరము చాలకాలమున కయ్యెను. ఏప్రాణికిఁగాని కర్మము మృత్యువును దగ్గఱకుఁజేర్చును. ఏదో యొకనిమిత్తమున నాప్రాణి మృతినొందును. లవణాసురుఁడు దుష్టుఁడని యంతకు ముందు శ్రీరామచంద్రునకుఁ దెలియదా. కాలము రావలయునుగదా.

"లోకానామంతకృత్కాలః కాలోన్యః కలనాత్మకః"

అన్న సౌరోపనిషత్తు,

కాలః కలయతామహం." గీత.

"కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః

ఋతేఽపి త్వాం నభవిష్యంతి సర్వేయేఽవస్థితాః ప్రత్యనీకేషుయోధాః."
3.అ. అధ్యా. ११.

అన్న గీతోక్తులును వైభావమును దృఢపఱచుచున్నవి. ఆ కాలము నిరీక్షించియే తనయవతారమును సమాప్తినొందింపక యుండెననియు నొకకారణము. నాబోంటికిఁ దెలియని యిట్టి కారణము లనేకము లుండవచ్చును. వానినెల్లఁ బ్రాజ్ఞులగు పాఠకమహాశయు లూహించుకొందురుగాక. ఇఁక నీవిషయమును వదలుచు నొక్కవిషయమును వ్రాసెదను. దేవతలు భగవంతుని వేఁడుచు దశరథుని వర్ణించి యాతనికి మూవురు భార్యలు గలరు. వారు పతివ్రతలు. దక్షకన్యకలగు హ్రీశ్రీకీర్తులతోఁ బోల్పఁదగినవారని విన్నవించిరి. దీనింబట్టిచూడఁగా భగవంతుఁడు సదాచారసంపత్తిగల స్త్రీలయం దుదయింప నంగీకరించునని తేలెడిని.

"ఫలం త్వనభిసంధాయ క్షేత్రిణాం బీజినాం తథా,
ప్రత్యక్షం క్షేత్రిణామర్థో బీజాద్యోనిర్గరీయసీ."
గి.అ.
మను. ౯ అధ్యా.

అను నీస్మృతివాక్యము పైనివ్రాసిన యభిప్రాయమును దృఢపఱచుచున్నది. "హ్రీశ్రీకీర్త్యుపమాసు చ" అనుచోఁ గౌసలాదులు మూవురును బతివ్రతాతిలకములకు సద్గుణములని శాస్త్రము విధించినగుణములు కలవారని స్పష్టమగుచున్నది. సిగ్గు, సంపద, దానార్జితకీర్తి యనునివి మూఁడే ప్రధానగుణములు. "అనఘా భూషణం పుంసాం క్షమాలజ్జేవ యోషితామ్"అను నీతిశాస్త్రము ననుసరించి సిగ్గువలనఁ బరపురుషులతోసంభాషణవర్జనము, సంపదవలన యాచ్ఞాభావము, కీర్తివలనఁ బరోపకారబుద్ధియు నలవడుచున్నవి. తక్కినసద్గుణములన్నియు నిం

ర్థాతములగును. కావునఁ బతివ్రతాశిరోమణులగు మూవురు భారలయందు నాలుగురూపములుగా నవతరింపుమని దేవతలు ప్రార్థించిరని యెఱుంగందగు. కైక యపరిశుద్ధురాలు కాదనియు దైవప్రేరణముననే రాము నడవులకుం బంపెననియుఁ బతివ్రతయే యనియు నామెమూలముననే లోకములకుఁ మూఁడింటికి మహోపకారము కలిగెననియు మన మెఱుంగవలయును. ముందుముందు రామాయణకథ ననుసరించి కైక దూషింపఁదగినదని తోఁచును. అట్లు భావింపరాదనియుఁ దక్కుంగల భారలకన్న నాకైకయే దేవకార్యమునకు మిక్కిలిసాయముగావించెననియు, నదియే భగవదుద్దేశమనియు మన మూహింపవలయునని యీ దేవతాప్రార్థనము మనల హెచ్చరించుచున్నది. ఈవిషయము ముఖ్యముగా మఱువరాదు. లేకయున్న శ్రీరామభక్తిభరితాంతఃకరణుఁ డగుభరతుఁ డాకైకకుఁ గుమారుఁ డగునా? ఇంతమాత్రమైన మన మూహింపవలదా. దేవతలు తెలియక ప్రార్థించినను సర్వజ్ఞుఁడగు భగవంతుఁ డందుల కంగీకరించునా. దీనింబట్టి దశరథునికుటుంబము సర్వవిధములఁ బరికించినఁ బరమపవిత్రమైనదని స్పష్టమయ్యెడిని. అట్టి పరమపావనకుటుంబమునందు భగవంతుఁడు రామరూపమున నవతరింప నూల్కొనెను. కొందఱు రామావతారమున వైకుంఠము పాడుపడె నందురు. అది వారిభావమున రాముని స్తుతించినట్లగుననియే. కాని దాన భగవన్మహత్త్వమునకే లోపము వాటిల్లును. సర్వవ్యాపకుఁడగు శ్రీమన్నారాయణమూర్తి వైకుంఠమునను మర్త్యమున నొక్కసారి యుండఁజాలఁడనుట యంగీకరింపఁ

దగినది కాదు. ఈరెండుతావులన నననేల? ఎల్లతావుల నిండి యుండఁజాలును. ఇఁకఁ దరువాతికథను బఠింతము.

## పాయసప్రదానము.

* అట్లు శ్రీమన్నారాయణమూర్తి దేవతలచే మానుష రూపమును గైకొనం బగుననినియోగింపఁబడి సర్వజ్ఞుఁడయ్యును దేవతలయందుఁ గలమర్యాదపెంపున విన సొంపగుమాటలతో నో దేవతలారా! సర లోకకంటకుఁడగు రావణు నేయుపాయ మునఁ జంపవచ్చును? తెలుపుఁడు. అని యడుగఁగా వారలా మహాత్మునిం గాంచి దేవాదిదేవా! మానవరూపమున నాతనిం బొలియింపుము అని యతనితపస్సు, బ్రహ్మావరము లిచ్చుట, నరవానరులను వాఁడపుడు స్మరింపకయుండుటయును దెలు పుచు,†నావరగర మున నిఱ్ఱవీఁగి ముల్లోకములను బాధించుచు విశేషించి స్త్రీలను బలిమి గైకొనిపోవుచున్నాఁడు. కావున వానికి మానవులవలననే మృతిగలుగును. అని విన్నవింపఁగా పరాత్ముఁడగు నామహావిష్ణువు మానవరూపమునఁ దా నవత రింప నిచ్ఛగించి దశరథుని దండ్రిగా భావించెను. బ్రహ్మతోఁ దనపూన్కిం దెలిపి యుతర్ధానమొందెను.

ఆసమయముననే దశరథుఁడు పుత్త్రకామేష్టిని జేయు చుండెను. ఇట్లు యజించునా యవనీపతి యాహవనీయా నుండి యొకమహాభూత మావిర్భవించెను. అత్యద్భుతముగా నది యుండెను. మిగులఁ దేజస్సువెలయ రక్తకృష్ణవస్త్రములఁ

---

* ఈయది బాలకాండము పదునాఱవసర్గము దాని తర్వాతిసర్గము ననుసరించి వ్రాయఁబడును. † "ఉత్సాదయతి లోకాన్ త్రీన్ స్త్రియశ్చాప్యపకర్షతి." ఇ. అని మూలము.

దాల్చి ముఖము రక్తవర్ణముగఁ గనంబడఁగా దుందుభిధ్వని వంటి కంఠధ్వని వినంబడుచుండఁగా మహత్తరాకారముతో మండుచున్నయగ్నియా యనందగిన ప్రకాశముతో నావ్యా ఘ్ర వెలయుచుండెను. ఆవ్యాఘ్రచర్మము హస్తమున నొక పాత్రము కనుపట్టెను. అది చాల సొగసుగానుండెను. అది మాయామయంబో యన్నట్లుండెను. * ఆసంపుటమునకు వెండిమూఁత యుండెను. అతివిచిత్రముగా నది పుటముపెట్టిన బంగారుపాత్రముగనుండి దివ్యపాయసపూర్ణమై పెద్దిగాఁ గనుపట్టెను. ప్రియురాలినివలె రెండుబాహువులచే దానింబట్టు కొని యామహాపురుషుఁడు వెడలివచ్చి దశరథునిం జేరవచ్చి రాజేంద్రా! ఈవచ్చిన నన్ను సకలప్రజాపాలకుఁడు పురుషో త్తమునివలన సంభవించినవానింగా నెఱుంగుము. అనఁగానే రాజు చేతులు జోడించి † యోభగవంతుఁడా! నీకు సాగతంబగుఁ గాక. నేను నీయాజ్ఞ మెయిఁ జేయవలసినపని యేది? అని వేఁడఁ గా నాప్రాజాపత్య పురుషుఁడు మరల నాదశరథునితో మహీ పాలకా! నీవు చక్కఁగా దేవతల నారాధించితివి. కావున నీ కీపాయసము పంపఁబడినది. ఈపాయసము ప్రజాపాలక వినిర్మి తము. సంతానప్రదము. ధనారోగ్య ప్రదము నగును. కావున నీ విద్దానిం బరిగ్రహింపుము. ‡ దీనిని బ్రీతిమీఱు సజాతీయ

* తప్తజాంబూనదమయీం రాజతాంతపరిచ్ఛదాం, దివ్యపాయససంపూర్ణాం పాత్రీం పత్నీమివ ప్రియామ్. ప్రగృహ్య విపులాం దోర్భ్యాం స్వయం మాయామయీమివ. ౧౫. అని మూలము.

† భగవన్ స్వాగతం తేఽస్తు కిమహం కరవాణి తే అనిమూలము.

‡ భార్యాణామనురూపాణా మశ్నీతేతి ప్రయచ్ఛ వై, తాసు త్వం

లగుభార్యలకు భుజింపుఁడీ యని తెలిపి యొసంగుము. ఏవాంఛితముఁగోరి దేవతల నారాధించితివో యాకోరిక ఫలించును. నీకు సంతానము కలుగును. అని యామహాపురుషుఁడు తెలుపఁగా నావృ రాజు పరమానందపరిపూర్ణహృదయుఁడై దేవతాప్రదత్తము దేవాన్నమున నిండియున్నదియునగు నాబంగరుపాత్రమును బరిగ్రహించి యచ్చెరువును గలిగించుచుఁ బ్రియముగాఁ జూడఁదగియున్న యాభూతమునకు నమస్కరించి ప్రదక్షిణముచేసెను పెన్నిధిఁగన్న దరిద్రుఁడువలె నా పాయసపాత్రముం గైకొని మహానంద మందెను. ఆమహావ్యక్తియుఁ దనపని నెఱవేర్చి యందఱుం గాంచి యచ్చెరువందఁగా నాయగ్నియందే యంతర్హితమయ్యెను.

అత్తఱి నారాజు నిష్కళంక కిరణవిరాజితుండగు శరద్రాకానిశాకరునిచందమునఁ దల్లాభమున వెలింగెను వెంటనే యంతఃపురమువలె నాశాలయందే నిర్మింపఁబడియున్న భాగమునకుం బోయి కౌసల్యాదేవిం గాంచి దేవీ ! నాకుఁ బుత్రోత్పత్తిభాగ్యమును బ్రసాదించు నీపాయసపాత్రమును బరిగ్రహింపుము. అని పలికి * సత్సంతానమును బడయఁగోరి యప్పా

---

ప్రాప్స్యసే పుత్రాన్ యదర్థం యజసే నృప. ౨౦. అని మూలము. తత్రైవాంతరధీయత. ౨౪. అని మూ.

* కౌసల్యాయై నరపతిః పాయసార్ధం దదౌ తదా, అర్ధాదర్ధం దదౌ చాపి సుమిత్రాయై నరాధిపః, కైకేయ్యై చావశిష్టార్ధం దదౌ పుత్రార్థకారణాత్. ప్రదదౌ చావశిష్టార్ధం పాయసస్యామృతోపమమ్. అనుచింత్య సుమిత్రాయై పునరేవ మహీపతిః. ౨౮ అని మూ. ''అర్ధశబ్దోఽత్ర సమప్రవిభాగపరః. అనుచింత్య కైకేయ్యా అపి సుమిత్రాయా అధికాంశభాక్త్వం

యసమునందు సగము కౌసల్య కిచ్చెను. మిగిలియున్న యాసగ
ములో సగము (అనగా పూర్ణపాయసమునందు నాల్గవభాగము
ను) సుమిత్ర కొసంగెను. సుమిత్రకు నొసంగఁగా మిగిలిన
పాయసమునందు సగము కైకేయి కొసంగెను. మిగిలియున్న
భాగ మనఁగా నెనిమిదవపాలు మరలఁ గైకకే యిచ్చినయెడల
నదియును సుమిత్రయొను భాగమున సమానతను గాంతు
రనియు సుమిత్ర కైకకంటెఁ బెద్దదాన నిం చుక యెక్కుడు
భాగము గ్రహింప నర్హురాలనియు విచారించి యమృత
ముతో సమానమగు పాయసమునవశేష్టభాగమును సుమిత్రకే
యిచ్చెను. ఇట్లు రాజు యుక్తముగనే పంచి యీయఁగా
నాకాంతామణులు దానిం గైకొని మనస్సులు ప్రమోదనిమగ్న
ములు కాఁగాఁ దమజ్యేష్ఠత మధ్యత కనిష్ఠతము లాలోచించి
మర్యాదకు భంగముకాని మనశ్శంకలుగాని కలుగకయుండు
నట్లు పంచియిచ్చినందున నాథుఁడు తమ్ము గౌరవించెననియే
సంభావించిరి. పిదప నాపురంధ్రీలలామలు భర్త ప్రసాదించిన
యాదివ్యపాయసమును వేఱువేఱ భక్తిమెయి భుజించి యగ్ని
సూర్య లంబోలు తేజంబున రాజిల్లుచుఁ * గొంతకాలమునకు
గర్భములను ధరించిరి. రాజు పత్నీత్రయము గర్భము ధరించు

---

విచార్య. అత్ర కౌసల్యాయాస్సుమిత్రాకైకేయీభ్యాం అధికాంశదానే
జ్యేష్ఠాత్వం సుమిత్రాయాః పాదోనార్ధాంశదానే మధ్యమాత్వం కైకేయ్యాః
ప్రేమాస్పదత్వేఽపి కనిష్ఠాత్వమష్టమాంశదానే కారణం. వల్లభాయాం
సంభోగకర్మణి పక్షపాతః. న ధర్మ్యవిభాగకర్మణి. అతోఽనేన భరత
శత్రుఘ్నా పాదస్యార్థం." అని వ్యాఖ్య.

* చిరేణ గర్భాన్ ప్రతిపేదిరే తదా అని మూ.

టుంజేసి స్వచిత్తుండై యింద్రుఁడు దేవతాగణపూజితుఁ
వెలుంగునట్లు హర్షమున నోలలాడుచుండెను.

దేవతలు స్వాంశముల వానరప్రముఖులం బుట్టించుట.

శ్రీమహావిష్ణువు సకలవిధములఁ బావనచిత్తుండగు
రథునకుఁ బుత్త్రుఁడై యుండుట కంగీకరింపఁగా బ్రహ్మదేవుఁ
భావికార విదుఁడు గావున దేవతలం గాంచి యిట్లు పలికెఁ
భగవంతుఁడు మాటతప్పఁడు. కావున మనుజుఁడై య
తరించి దుష్టావళిఁ జంపును. కావున నాపరమేశ్వరున
దోడుపడుటకు బలముగలిగి కపటాత్ములగుదానవులతోఁ బో
డఁదగిన కామరూపములుగలిగి వెలయువారిని మీరు సా
ములం బుట్టింపుఁడు. వారు విచిత్రశక్తులు గావలయున
అంతియగాక సర విధముల భగవత్కార్యము నిర హింపఁదగి
వారుగా నుండవలయును. మరణదూరులును గావలయున
అచ్చరమిన్నలయందు గంధర కాంతలయందు మఱియు
బెక్కండ్రయందుఁ బుత్త్రులను సర ప్రకారముల మిమ్ముంబోలి
వారిని వానరరూపములఁ బుట్టింపుఁడు.

నామాట వినుఁడు. మున్నే భల్లూకరూపుఁడగు జాం
వంతుని నే సృజించియున్నాఁడను. అతఁడు నే నావులింపఁగా
దనంతనె వెడలెను. అని పరమేష్ఠి పలుకఁగాఁ దదాజ్ఞం దై
వానరాకారుల సర విధప్రసిద్ధులఁ దనయులను వారు సృజించి
మహానుభావులగు ఋషులు సి విద్యాధరాదులు మహావీరులగ
వానరులం గ ంచిరి. అంత దేవేంద్రుఁడు మహేంద్రాదితుల
ధృతిమంతుని వానరచక్రవర్తిని నప్రతిహతపరాక్రముని
గాంచెను. సూర్యుఁడు శత్రుసూదనుండగు వానరవర్యుని

సుగ్రీవునిం గల్పించెను. బృహస్పతియు మహాబు శాలియగు తారుఁడనువానరునిం బ్రభవించెను. కుబేరుఁడును గంధమాదనుని శ్రీమంతుని వెలయించెను. విశ కర్మయు సర కార్య నిర్మాణకుశలుని నలుని గల్పించెను. అగ్నియు నీలుని వెలయించెను. వాఁ డధిక తేజశ్శాలి యై వెలిం గెను. అశి దేవతలు మనస్సుచేతనే మైందది విదులను గాంచఁజాలిరి. వరుణుండు సుషేణునిని, పర్జన్యుఁడు శరభుని, వాయుదేవుఁడు శ్రీమంతుని హనుమంతుని సృజించిరి. హనుమంతుని దేహము వజ్ర తుల ము. వేగమున నాబాలుఁడు గరుడుని మించఁజాలెను. మహాబు మంతుఁడుగూడ నయ్యెను. వీరుగాక యెంతటో వానరులు దేవతాంశముల నెగడిరి. మహాపౌరుషముగలిగి వారెల్లఁ బ్రఖ్యాతులైరి. పర తములం బెకలించువారిని దేవతలు మానసముననే కల్పించిరి ముఖముమాత్రము వానర ముఖముగా నుండెను. తక్కుంగలశరీరము పితృతుల ముగానే యుండును. కోఁతుల కొండముచ్చులు లోనగు వనచరజాతులం గలిగి వారెల్ల భావిభగవత్కార మును నెఱవేర్ప వేచియుండిరి. వారికి నఖములు, దంష్ట లు, వృక్షములు, పాషాణములే యాయుధములుగా నమరెను. శస్త్రాస్త్రములఁ బ్రయోగింప నుపసంహరింప నెఱుంగుదురు. ఎట్టి మృగములనైనఁ జించి చెండాడఁగలుగుదురు. వారి కన్ని శక్తులు గలవు. అవి యివి యననేల? ఎట్టిఘనకార్యమైనఁ జేయంజాలుదురు. వారిసంఖ్య యసంఖ్యయే యనవలయు. లెక్కింప నేరికేఁ దరముగాదు. వారు పర తముల నడవులను నివాసముగా భావించిరి. వాలి వానర రాజు. సుగ్రీవుఁడు యువరాజు. నలుఁడు నీలుఁడు హనుమం

తుఁడు ననువారు మంత్రులుగ నుండఁ దక్కినవానరజాతులెల్ల వీరి నాశ్రయించిరి. మహాపరాక్రమశాలి యగువాలి వారినెల్ల సక్రమముగాఁ బాలించుచుండెను. వారి దేహములు వేలు వేలుగుఱుతులు గలిగియుండెను. వారింగాంచినవారు మేఘములనియో పర్వతములనియో తలంచుచుండిరి. వారెల్ల శ్రీరామమూర్తికిం గలుగంగలకార్యమునకుఁ దోడ్పడువారలనియే మన మూహింపవలయును.

మహాశయులారా! ఈయాఖ్యానమువలన భగవదవతారమునకు ముందు జరగవలసినకార్యములు సాగెననియు నా మహాప్రభు వెప్పు డవతరించునా యని యెల్లరు వేచియున్నవారనియుఁ దెలియఁగలదు. కావున నిందు విశేషాంశము లుండక యుండునా. కొన్నింటిం బరిశీలింతము. భగవంతుఁడు మానవాకృతిం బూన నంగీకరించినను దేవత లంకను దమకుంగలబాధలం దెల్పుకొనుచుఁ బలకాంతలఁ జెఱఁగొనిపోవుచున్నాఁడని విన్నవించిరి. తక్కినదుష్కార్యములకంటె నీయది మహాదుష్కార్య మని దీనింబట్టి మన మూహింపవలయు. ఏలయనఁగా ధనాదులకంటె మనస్సును బాడుచేయునది స్త్రీసంగ్రహణమే. స్త్రీలను జెఱఁబట్టుచుండఁగాఁ బతియేని బంధువులేని కాంచినచోఁ దమప్రాణములనైన లెక్కింపక తత్ప్రతిక్షణప్రయత్నమున బద్ధాదరు లగుదురు. "యతంతే రక్షితుం భార్యాం భర్తారో దుర్బలా అపి" అన్నన్యాయము స్మృతిసమ్మతముకదా.

హోమకుండమునుండి ప్రాజాపత్యపురుషుఁడు పాయసపాత్రమును బట్టుకొని వెడలివచ్చె ననువిషయమును బఠించి కొందఱు పరిహసింతురు. ఇది యపూర్వమందురు. కావున

హాయా క్షేపము క్రమముగాదని చెప్పందగును. తపస్సనునది ఘంటువులయం దున్నయ ట్లెఱుంగు నీకాలపుఁబ్రజల కది విరు ముగ నసంగతముగను దోఁచుట న్యాయము. తపస్స నఁగా నెట్టిదో యెఱింగినవారల కిది సహజముగనే యుండును. సమాధాన మేమనఁగా దశరథునిపురోహితుఁ డగుఋశ్య శృంగముని భగవంతుని ధ్యానించి తపశ్శక్తి నొడ్డి హోమము చేసెను. అనఁగా భగవన్మంత్రమునం దాకర్షణబీజమును గూర్చి ధ్యానించెను. తత్ప్రతికరపదాముల హోమము చేయం బూనెను. ఆకర్షణబీజము మునిధ్యానశక్తికలిమిని భగవంతుని బురికొలిపెను. అనఁగాఁ దచ్ఛక్తి ప్రహరి మెచ్చెనని భావము. ప్రత్యక్షము కావలయునుగదా. భగవంతునకుఁ దేజోరూపము హితము "ధ్యేయస్సదా సవితృమండలమధ్యవర్తీ నారాయ ణస్సరసిజాసనసన్నివిష్టః" అని ప్రసిద్ధి కలదు. సూర్య మండల మనఁగాఁ దేజోగోళము. "తేజసాం గోళకస్సూర్యో గ్రహర్క్షా ణ్యంబుగోళకాః" అని జ్యోతిశ్శాస్త్రము తెలుపుచున్నది. "జ్యోతిః పరం ధ్యాయతామ్" అని భర్తృహరియుఁ దెల్పెను.

"తస్య మధ్యే మహానగ్నిర్విశ్వార్చిర్విశ్వతోముఖః,
సోఽగ్రభుగ్విభజన్ తిష్ఠన్నాహార మజరః కవిః,
తిర్యగూర్ధ్వమధశ్శాయీ రశ్మయస్తస్య సంతతా.
తస్య మధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వావ్యవస్థితః,
నీలతోయదమధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా."

అని శ్రుతి తెల్పుచున్నది. జ్యోతిస్స్వరూపునిగా యోగులు ధ్యానింతురు. కావునఁ దేజస్స్వరూపమున నగ్నినుండి వెలువడె నని సారము. "అగ్నిముఖా వై దేవాః" అన్నశ్రుతి ననుసరించి

యగ్నిమూలమునఁ దృప్తుఁడై భగవంతుఁ డారూపముననే ప్రత్యక్షమయెను. ఏదేవత కేపదార్థ మొసంగిన నగ్నియందే వేల్తురు. ఏల? భగవంతుఁడు తేజోరూపుఁడు. కావుననే యారూపముగా ధ్యానించి యందువైచిన నామహనీయుఁడు సంతుష్టినొందెన నెల్లభూతములు సంతుష్టినొందుననియే దీని సారము. "యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ" అన్నయట్లు ఋశ్యశృంగముని నేరూపమున నుపాసించెనో యారూపమే ప్రత్యక్షమయ్యెనని మన మూహింపవలయు.

"ప్రాజాపత్యం నరం విద్ధి మామిహాభ్యాగతం నృప."

అని మూలమునఁ గలదు. విష్ణుసంభూతునిగా నన్నెఱుంగుము. ఇక్కడికి వచ్చితిని. అని యావ ... యెఱింగించెను. అనఁగా భగవంతు నెవ ని నుపాసించితివో ఏవాంఛను ఫలింపఁజేయఁ గోరితివో తదనురూపమగు దేహముననే వచ్చితిననియే యీ పలుకులఁగల సారము. అని పలుకఁగా రాజు ప్రీతుఁడై నేఁ. జేయఁదగుపని యేది? అని యడిగెను.

"రాజన్నర్చయతా దేవానద్య ప్రాప్తమిదం త్వయా"

ఏవాంఛితమును గోరి దేవతల నారాధించితివో ఆకోర్కులు తీఱ నీ కీపాయసము పంపఁబడినది. అని బదులుచెప్పెను అ ... నుండి వెడలుపదార్థము పాయసముగా నుండవలసినదేకదా. కావుననేపాయస మిదిగో కైకొమ్మని బదులుచెప్పెను. అంతతో నూరకయుండక దాని నుపయోగించువిధిని దెల్పెను. "భార్యాణామనురూపాణా మశ్నీతేతి ప్రయచ్ఛ వై" అన్నవాక్యమున మంచియర్థము కలదు. అనురూప లనఁగా కులగుణరూపముల యందు సమానలని భావము.

"అసపిండా చ యా మాతురసపిండా చ యా పితుః,
సా ప్రశస్తా ద్విజాతీనాం దారకర్మణి మైథునే. ౫
మహాంత్యపి సమృద్ధాని గోజావిధనధాన్యతః,
సంబంధే దశైతాని కులాని పరివర్జయేత్. ౬
హీనక్రియం నిష్పురుషం నిశ్ఛందో రోమశార్శసం,
క్షయ్యామయావ్యపస్మారిశ్విత్రికుష్ఠికులాని చ. ౭
నోద్వహేత్కపిలాం కన్యాం నాధికాంగీం న రోగిణీం,
నాలోమికాం నాతిలోమాం న వాచాటాం న పింగళామ్. ౮
యస్యాస్తు న భవేద్భ్రాతా న విజ్ఞాయేత వా పితా,
నోపయచ్ఛేత తాం ప్రాజ్ఞః పుత్రికాధర్మశంకయా. ౧౧
సవర్ణాగ్రే ద్విజాతీనాం ప్రశస్తా దారకర్మణి,
కామతస్తు ప్రవృత్తానామిమాస్స్యుః క్రమశో వరాః." ౧౨
మను. 3 అధ్యా.

"అవిప్లుతబ్రహ్మచర్యో లక్షణ్యాం స్త్రియముద్వహేత్,
అనన్యపూర్వికాం కాంతామసపిండాం యవీయసమ్. ౫౨
అరోగిణీం భ్రాతృమతీమసమానార్షగోత్రజామ్,
పంచమాత్సప్తమాదూర్ధ్వం మాతృతః పితృతస్తథా. ౫౩
దశపూరుషవిఖ్యాతాచ్ఛ్రోత్రియాణాం మహాకులాత్,
స్ఫీతాదపి న సంచారిరోగదోషసమన్వితామ్. ౫౪
ఏతైరేవ గుణైర్యుక్తస్సవర్ణశ్శ్రోత్రియో వరః,
యత్నాత్పరీక్షితః పుంస్త్వే యువా ధీమాన్ జనప్రియః." ౫౫
యాజ్ఞవల్క్యస్మృతి. ఆచారకాండము.

అను నీమొదలగుస్మృతుల ననుసరించి కు[illegible]మములు లేక
సమానవర్ణముగల కన్య నితరుని ముందే పెండ్లియాడక యున్న

దానినిగాఁ బరీక్షించి వివాహము చేసికొనవలయు నన్న యాచారము ననుసరించి పెండ్లియాడినభార్యల కిమ్మని హెచ్చరించెను. దశరథునకుఁ బెక్కండ్రు భార్యలు గలరు. అందు సమానకులజనితలు మువ్వురు. కావున భార్యల కిమ్మన్న నితరపత్నుల కిచ్చునేమో యని సంశయించియే భగవంతుఁడు అనురూపపత్నుల కిమ్మని యాజ్ఞాపించెను. కులగుణశీలములఁ బరీక్షింపక రూపధనాదులం గాంచి యాసపడి పెండ్లియాడరాదనియు నట్లు వివాహమాడియున్నచో వారికిం గలిగినకొడుకులవలనఁ దలిదండ్రులకు నిహపరసుఖములు కలుగవనియు మన మీసంవాదమునుండి యెఱుంగవలయును. సమానకులజనితలు రూపగుణశీలములుగలవారుగ నున్ననే పెండ్లియాడవలయునని భగవంతుఁడు శాసించెను. కుష్ఠాదిరోగములు కులక్రమాగతములు. కొంతకాలమునకైన సంక్రమించును. అట్టికన్యలఁ బెండ్లియాడరాదు. రూపమును గాంచి మోసపోయినచోఁ దత్సంతానము దుష్టమగును. నిర్మలాంతఃకరణ మాసంతతి కలవడదు. అంతఃకరణశు ద్ధిలేకయున్న భగవద్భక్తి కందుఁ జోటులేదు. కావున నట్టివారిని బెండ్లియాడిన జాతిగౌరవము నశించుననియుఁ గాన దానిని మానవలయుననియే యీయుపదేశమున గ్రహింపఁదగు విషయము.

"దేవదత్తాం హిరణ్మయీమ్"

అన్నమాటయం దొక్కవిశేషము కలదు. దేవతాప్రసాద మిది అని చెప్పి భార్యల కిమ్ము. అనఁగా వారి కిది మానవకల్పితము కాదు. భగవంతుఁ డనుగ్రహించె నను విశ్వాసము భ_ కలిగిన గాని ఫలింపదని భావము.

"సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే,
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ ఉచ్యతే. ౨౬
యజ్ఞే తపసి దానే చ స్థితిస్సదితి చోచ్యతే,
కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే. ౨౭
అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్,
అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ." ౨౮

గీత. ౧౭ అధ్యా.

అను శ్రీకృష్ణోక్తియు నిదియు నొక్కటియేకదా. శ్రద్ధావిరహితముగా నొనరించిన కార్యము నిష్ఫలమగుననియు నట్లుగాక యుండ శ్రద్ధాభక్తులుగలిగి యీపాయసమును భగవంతుఁడనుగ్రహించెనని భావించి పుచ్చుకొన్న సత్ఫలము నొసంగుననియు మనము నేర్చుకొనవలయును. విశేషించి స్త్రీలకీబుద్ధి గలిగింపవలయును. ఏలయనఁగా సకలధర్మాధారముకదా కళత్రము. కులాచారములెల్లఁ దదధీనములు. కావునఁ బురుషులు స్త్రీలొనరించు వ్రతములను భంగపఱుపక సాగనిచ్చుచుండవలయును. వారికి స్వభావముగాఁ గలిగినభక్తిని బాడుచేయక యుండుటయే పురుషులకుం గర్తవ్యమని దీనినుండి తేలిననీతి.

"తత్రైవాంతరధీయత" ఈపాయసము నొసంగి యాయగ్నియందే యంతర్ధానమయ్యెను. అనఁగాఁ జర్మచక్షుస్సులకుం గానరాకపోయెనని భావము. తేజస్సున నాతేజస్సు విలీనమయ్యెను. జ్ఞానులకు సర్వకాలము భగవంతుని జ్యోతీరూపము కనఁబడుచునే యుండును.

"న తు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా,
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్." ౮ అధ్యా. ౧౧.

అన్నగీతోక్త యీయము మును దృఢపఱచుచున్నది. అట్టి దశరథునిసౌధము విశేషించి ప్రకాశించెనని రామాయణమున నున్నది.

"తస్యాంతఃపురమాబభౌ,
శారదస్యాభిరామస్య చంద్రస్యేవ నభోఽంశుభిః." ౨౫

భగవంతుని తేజస్సాయంతఃపురమున విశేషించి నిలిచెనని సారము లోకమున సత్కార్యము లొనరించుచుఁ జక్కని యాలోచనము చేయుచుండువానిమోము చక్కఁగా వెలుంగును. క్రొత్తతేజ స్సందుఁ బ్రవేశించును దుష్కార్యముల నొనరించుచు దురాలోచనలు చేయుచుండిన కొలంది నాతని మోమునఁ గలతేజస్సు క్రమముగా క్షీణించుచుండును. ఈయది యెల్లరకుఁ దెలిసినవిషయమే. కారణ మేమనఁగా భగవచ్చింత చేయుచున్నకొలంది నాభగవంతునిప్రేమము తేజోరూపమున నాతనువునం దెక్కువగాఁ జొరఁబడును. దుశ్చింతలు చేయు కొలంది నున్నది వెడలిపోవును కొండఱ కున్నట్లుండి మోము వెలవెలఁబాఱును. వానికి మరణ మాసన్నమగునని యెఱుంగ వలయును. లేదా సిరి తొలంగును. కావున మానవులు మంచి సంకల్పములు గలవారుగా నుండవలయుననియే యిందుండి తేలుచున్న సారము.

పాయసవిభాగమునుగుఱించి నాలుగుమాటలు వ్రాయ వలయును. దశరథుఁడు సమానకులమున మువ్వురఁ బెండ్లి యాడెను. సంతానార్థ మే యీమువ్వురను వరుసఁగా వివాహము చేసికొనెను. కడపట కైకను బెండ్లియాడెను. వృద్ధుఁడగుటకు సిద్ధముగానున్న యారాజునకుఁ దనకన్య నీయఁగోరి కేకయ

భూపతి యీకనకకు జనించినపుత్త్రునకే రాజ మీయ
వాగ్దాన మొసంగిన నిత్తునని యడిగెను. ముందటి యిరువురకు
నిక సంతానము కలుగదన్నవిశ్వాసము కలవాఁడుకావున నట్లే
యని వాగ్దాన మొసంగెను. ఆమెకును గలుగలేదు. కావున
మూవురయందును సంతానము కలుగునన్నయాశ మానెను.
భగవదనుగ్రహమున నీపాయసము లభించెను. ఇపు డిద్దాని
నొసంగుటలోఁ బక్షపాతముచూప నవసరము లేదు. పక్షపాతము
లేనిచో జ్యేష్ఠపత్నికే యేల యీయరాదని ప్రశ్నింపరాదు.
భగవదాజ్ఞయు "నీసవర్ణలగుపత్నులకి" మ్మనియేకదా భార్యల
కని బహువచనముగా నాజ్ఞాపించుటంజేసి మూవురకు నీవలసి
వచ్చెను. క్రమముగాఁ బెద్దభార్యకుఁ దొలుత నొసంగెను.
అ మిచ్చుటకు జ్యేష్ఠాత మే కారణము. రెండవసారి సుమి
త్రకే యిచ్చుటకు మధ్యమాత ము కారణము. మూఁడవభార
కంటె రెండవభార కధికాంశ మీయఁదగినదే. మిగిలిన
భాగము అధికప్రేమాస్పదురాలయినను కైకకిచ్చుటకుఁ గని
ష్ఠాత మే కారణము. ఈపాయసప్రదాన మాదశరథుఁడు
బుద్ధిపూర్వకముకాక కాఁగలపుత్త్రోత్పత్తి కనురూపముగా
భగవంతుని యిచ్ఛానుసారమే జరగెనని మన మెఱుంగవల
యును. దీనిచేతఁ జిన్నిభార్య యగుకైక యించుకయు భర్తృ
యందసూయకలది కాదయ్యెను. ఏల? పతివ్రత యగుటచేతనే.
ఈభావము మదినిల్పుకొనినఁగాని ముందు కైకను దూషింపక
యుండ వలనుపడదు.

* "తా స్త్వేతత్పాయసం ప్రాప్య నరేంద్రస్యోత్తమా స్త్రియః,
సమ్మానం మేనిరే సర్వాః ప్రహర్షోదితచేతసః." 30

తతస్తు తాః ప్రాశ్య తదుత్తమస్త్రియో మహీపతేరుత్తమపాయసంపృథక్,
హుతాశనాదిత్యసమానతేజసశ్చిరేణ గర్భాన్ ప్రతిపేదిరే తదా''. ౩౦

అన్నమూలమే పైనవ్రాసినభావమును దృఢపఱచుచున్నది. 'ఉత్తమాస్త్రియః' అనుటచేతనే పతియించుకంతయేని దుర్భావములేనివారని తెలియనయ్యెడిని. భక్తిభావమున వారద్దానిం బరిగ్రహించి తేజస్సు మిగుల వృద్ధికాఁగాఁ జిరకాలమునకు గర్భములఁ దాల్చిరి. చాలకాలమున కనుపదమున విశేషమొండు కలదు. పరమపవిత్రమగు నాపాయసము భక్షించుటచేత గర్భదోషము లనఁగా సంతానప్రతిబంధకములు తొలంగనవల ఋతుకాలములయందుఁ బతిసంగతిం గాంచిరని యాపదము తెలుపుచున్నది.

వానరోత్పత్తినిగుఱించి కొలఁదిపంక్తులు వ్రాయుదును.

''వృద్ధాంశ్చ నిత్యం సేవేత విప్రాన్ వేదవిదశ్శుచీన్,
వృద్ధసేవీ హి సతతం రక్షోభిరపి పూజ్యతే. ౩౮
తేభ్యోఽధిగచ్ఛేద్వినయం వినీతాత్మాపి నిత్యశః,
వినీతాత్మాపి నృపతి ర్న వినశ్యతి కర్హిచిత్. ౩౯
బహవోఽవినయాన్నష్టా రాజానస్సపరిచ్ఛదాః,
వనస్థా అపిరాజ్యాని వినయాత్ప్రతిపేదిరే. ౪౦ మను. ౭ అధ్యా
సమంత్రిణః ప్రకుర్వీత ప్రాజ్ఞాన్ మౌలాన్ స్థిరాన్ శుచీన్,
తైః సార్థం చింతయేద్రాజ్యం విప్రేణాథ తతస్స్వయం''. యాజ్ఞవల్క్యము.

అన్నస్మృతుల ననుసరించి రాజు ససహాయుఁడై చక్కఁగాఁ బ్రవర్తింపవలయునన్నశాస్త్రమును సార్థకముచేయుటకై భగవత్కింకరులు దేవతాంశములవలనఁ బుట్టిరి. రావణవధము మానవ వానరమూలముననే కావలయుఁగాన వానరజాతుల

ధ్యంబే సేవకులెల్ల నుదయించిరి. ఎల్లరు దేవతాంశములఁ బుట్టిన వారలే. మహాసత్త్వసంపన్నులే. కాని వానరములు. లోకమున న్యాయమార్గమునఁ బ్రవర్తించువా రెంతయల్పసహాయసంపన్నులైనను మహాకార్యముల సాధింపఁగల రన్నన్యాయమును సాక మీవానరుల సాయమున నగును. ఈనీతిని వెల్లడించుటకే భగవంతుఁడు వానరుల సాయమును బొందెను. రామావతారమున నీతిశాస్త్రవిషయములెల్ల సప్రవృత్తిని దెలుపఁబూనెఁగదా. బ్రహ్మాదిదేవతలెల్ల సాంశముల నొక్కొక్కరిని బుట్టించిరి. వారెల్ల వానరాకారులుగాఁ గనఁబడుచున్నను దేవతాప్రకృతులుగ నుండిరి. శస్త్రాస్త్రవిదాసంపన్నులే. కాని యాకృతింబట్టి వారవానియుద్ధరంగముల నుపయోగింపలేదు. వారియుత్పత్తులు సాధారణముగా నమ్మఁదగనివిగఁ దోఁచును. ఏలన మానవబుద్ధులు దేవతారహస్యములఁ గనుగొనఁజాలవు కదా. కావున మానవులు తమకు శక్యముగానివన్నియు నసంగతములను నలవాటుగలవారు. బ్రహ్మ యావులించిన జాంబవంతుఁడు జనించెను. అనఁగానే పెక్కండ్రు నవ్వుదురు. కాని సృష్టికర్తకుంగలశక్తి యెట్టిదని నిర్ణయింప వీరికి శక్తిచాలదు. సంకల్పమాత్రమున బ్రహ్మాండములగుచుండ నొకభల్లూకాకారమును బడయుట యొకయబ్బురముకాదు. ప్రయత్నించినచో మానవులు పరలోకవృత్తాంతములం గనుఁగొందురని యోగశాస్త్రము తెలుపుచున్నది మహర్షు లతీంద్రియజ్ఞానసంపన్నులనుట కలికాలధర్మములఁ బురాణములలోఁ జొప్పించియుండుటయు నది యనుభవమున నిపుడు సత్యములగుచుండుటయుం బరికించిన వారిశక్తి యెట్టిదో తెలియఁగలదు. ఇఁక

దేవతలశక్తి యెన్నిమడుంగు లెక్కుడుగనుండునో మనము నిర్ణయింపఁజాలము. మనకుఁ గలశక్తింబట్టి సర వృత్తాంతముల నిర్ణయింపఁబూను టపహాస్యమే.

ఇందు గోవిందరాజులు "రుద్రో బ్రహ్మణా నియుక్తోఽపి రక్షఃపక్షపాతితాం న్న కంచన సృష్టవాన్" అని వ్రాసిరి. దీనికి మూలము కానరాదు. బ్రహ్మ నియోగించినట్లు శంకరుఁ డూర కున్నయట్లు రామాయణమున నాధారము లేనపుడు వ్రాయుట మతాభిమానావేశముచేతనే యని యూహింపవలసియున్నది. రక్షఃపక్షపాతిత్వము బ్రహ్మకే కలదని రావణవర ప్రదానమే తెల్పుచుండఁగా నీశ్వరునకుం గలదనుట కేవల శివదూషణ పరత్వముననేకాక మఱేమగును? పురాణాంతరములం గలదం దురే నట్టిరక్షఃపక్షపాతి నారాధించి శ్రీరామచంద్రుఁడు సర్వ పాపవిముక్తుఁ డయ్యెననియుఁ గలదుకదా. అపుడు శ్రీరామ పక్షపాతియునగు ననవచ్చునుగదా. మతాభిమానావేశము సత్యమునుగూడఁ గప్పిపుచ్చునేమో యని తోఁచెడిని.

ఇట్లు రావణుని వధింప దేవతలు మహాప్రయత్నమొన రించిరి. వానరజాతులయందు శ్రీరామకార్యధురంధరుల నెంద ఱనో పుట్టించిరి. వారు భావికార్యగతులంబట్టియే కాఁబోలు వాలిసుగ్రీవుల నాశ్రయించిరి. ఇంతఱ నిన్నిరీతులం గలిపినది కర్మమే యని నమ్మవలయును. ఎవ్వరెవరిచే నేయేరాక్షసులు మృతినొందవలయునో వారెల్ల శ్రీరామసేవకై కిష్కింధారాజ ధాని నాశ్రయించిరి. హనుమదాదులు మంత్రులై యుండిరి. కోట్లకొలఁదివానరు లాయాపర్వతముల నాశ్రయించియు వాలి ప్రభుత్వము నంగీకరించిరి భగవదిచ్ఛ యెట్లు ప్రసరించునో

నింబ' మన మెఱుంగవచ్చును. దానిప్రవృత్తి యెట్టిదని బ్రహ్మాదులే యెఱుంగరనియు నీగాథయే మనకుఁ దెలిపెడిని.

"న మే విదుస్సురగణాః ప్రభవం న మహర్షయః,
అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః."

గీత ౧౦ అధ్యా.

అను నీవాక్య మూలమున శ్రీకృష్ణమూర్తి తెలిపెను. దీనియందే పైనవ్రాసినభావ మిమిడియున్నదని యెఱుంగవలయును.

రామావతారమునకంటె ముందే మూలప్రకృత్యంశమున జనించిన సీతయు హనుమదాదిమహాభక్తులును సుగ్రీవాదికార నిరాహకవర్గమును భగవర్ద్శనమునకై వేచియుండిరి. మహర్షు లెప్పుడెప్పుడు పరాత్పరుఁ డనుగ్రహించి మర్త్యరూపమున వేంచేయునా యని యువిళ్లూరుచుండిరి. ఇఁకఁ గావలసిన దొక్కరామావతారమే. ఆయంశముకూడఁ గౌసల్యాదిపురంధ్రమణులగర్భగోళమున వెలయుచుండెను. సత్యముగా నాలోచించిన భగవంతుఁడు గర్భగోళమున జననదుఃఖము ననుభవించుచుండునా? ఏనాఁడును లేదు. గర్భమునను న్నయట్లు నటించెనని మన మెఱుంగవలయు. ఇఁక శ్రీరామజననమును బఠించి కృతకృతులము గావలయును. అమ్మహానుభావుని చరిత్రపఠనమునకన్న ఘనకార్యము వేఱేదియుఁ గానరాదు.

## శ్రీరామావతారము.

* దశరథునిహయమేధాదులు పుత్రకామేష్టియు విధిమంతముగా నెఱవేఱెను. దేవతలు తమహవిర్భాగములం గొని

---

* ఈభాగము బాలకాండము పదునెనిమిదవ యధ్యాయమునుండి వ్రాయఁబడినది.

తమయిరవులకుఁ బోయిరి. రాజు యజ్ఞదీక్షమాని పత్నులంగూడి సపరివారుఁడై యయోధ్యం బ్రవేశించెను. యజ్ఞమును జూడ వచ్చినరాజులెల్ల సగౌరవముగా దశరథుఁడు సాగనంపఁగాఁ దమతమరాజ్యములకుం బోయిరి. వచ్చినవారెల్ల సంతుష్టులై పోయిరి. ఋశ్యశృంగముని శాంతాదేవింగూడి దశరథసత్కృతులం గాంచి పరమప్రియంబున నాశీరదించి రోమపాదునిం గూడి పయనము సాగించెను. పరమేశానుగ్రహ మెప్పుడు కలుగునో యని పుత్త్రులకొఱకు నువిళ్లూరుచుండెను.

యజ్ఞము సమాప్తినొంది యాఱుఋతువులు గతించెను. పండ్రెండవమాసము చైత్రమనునదియే యయ్యెను. ఆమాసమున శుక్లపక్షమున నవమీతిథియందుఁ బునర సు వనుపేరుగల నక్షత్రమునందు సూర్యాంగారకగురుశుక్రశనులను నైదుగ్రహము లుచ్చరాసులయందుండఁగా గర్కాటకలగ్నమునందు బృహస్పతి చంద్రునింగూడియుండఁగా జగన్నాయకుఁడును, సర లోకనమస్కృతుఁడును, సకలశుభతమలక్షణలక్షితుఁడు నగుకుమారుని, ఇక్ష్వాకువంశవ నుని, మహాభాగ సంపన్నుని శ్రీమహావిష్ణువునం దర్ధాంశమున వెలయువానిని గౌసల ప్రసవించెను. ఆకుమారుఁడు విచిత్రతేజస్సుగలిగి వజ్రలేఖాంకితకరతలుండై యుండఁ గాంచి వజ్రధరుండగునింద్రునిగన్నయదితివలె నాకౌసల యెంతయు నానందమునఁ బ్రకాశించెను. సత పరాక్రముఁడగు నాదశరథుఁడు కైకేయియందుఁ బ్రత క్ష విష్ణు చతు భాగంబును దదీయమంగళగుణుండు నగుకొడుకుం బడసెను ఆమీఁద విష్ణువు నాల్గవయెనిమిదవ యంశములుగలిగి వీరులు సకలశస్త్రాస్త్రనిపుణులునగు నిరువురుకొడుకుల నిరువు

రను సుమిత్ర ప్రసవించెను. కైకేయికొడుకు పుష్యనక్షత్రమున మీనలగ్నమందు జనించెను. సుమిత్రకొడుకు లిరువురు నాశ్రేష యనునక్షత్రమున జన్మించిరి. వీరు కలిగినది కర్కాటకలగ్నము వందే.

ఈరీతిగా నాదశరథునకు ననురూపగుణములుగలిగి పూరాభాద్రానక్షత్రములు నాలుగు ప్రకాశించినట్లు మహాత్ము లగు నలువురుకుమారులు జనించి ప్రకాశించిరి. సకలలోకా నందకరులగువా ద్యవయించుటయు గంధరులు మృదుమధుర రవములం బాడిరి. అచ్చరలు నృత్యముచేసిరి. దేవతలదుందు భులు మొరసెను. దేవతలాయానందమున గుసుమవృష్టిం గురి యించిరి. అయోధ్యానగరమునందు జనులు క్రిక్కిఱిసియుండి యామహోత్సవమును గొనియాడిరి. ఆమహోత్సవము వర్ణనాతీ తము. ఎల్లరు సమ్మోదమునఁ దమవిద్యాచమత్కృతులం గనఁ బఱచిరి. స్తుతిపాఠకులు ప్రభువును గొనియాడిరి. కులక్రమా గతప్రవర్తనములఁగొనియాడు స్తుతిపాఠకులకుఁ బసదన మొసఁ గెను. బ్రాహ్మణులకు గోవుల నపారద్రవ్యము నొసంగెను. జాతా శౌచము దాఁటఁగా క్షత్రియోచిత త్రయోదశదినమునందు దశరథుఁడు నామకరణమహోత్సవము చేయఁబూని యక్కార మునకు సంతోషమందుచున్న వసిష్ఠమునిచేతఁ గౌసల కొడుకు నకు రాముఁడని, కైకేయి కొమరునకు భరతుఁడనియు, సుమిత్ర కొడుకులలోఁ దొలుతఁబుట్టినవానికి లక్ష్మణుఁడనియుఁ దరు వాతివానికి శత్రుఘ్నుఁడనియు నామములు పెట్టించెను. ఆమ హోమహమునఁ బౌరులకు జానపదులకుఁ గోరినవారికిఁ గోరినయ ట్లుమాల్యరత్నాదుల నొసంగెను. ఎల్లరకు నన్నదానము చేయఁ

బడియెను. రాజు విధి ననుసరించి జాతకర్మాదులనెల్లఁ జేయిం
చెను.

ఇట్టు లాకుమారులు నలువురు విధిమంత్రములగుసంస్కా
రములచే సంస్కృతులై వసిష్ఠమునియాశీఃప్రభావములఁ గడు
నలరారుచుండిరి. ఆకుమారులలో జ్యేష్ఠుఁడగు రామచంద్రుఁడు
ధ జముభంగి స కులముఁ బ్రకాశింపఁజేయుచుఁ దండ్రి కెంతయు
నానందమును గూర్చుచుండెను. అంతియకాక బ్రహ్మవలె సర
ప్రాణులకు సమ్మతుఁడై యుండెను. కుమారులందఱు వేదముల
నభ్యసించి ధనుర్వేదమునఁ గుశలులై శూరులై లోకహితమును
గూర్చుటయం దత్యంతాదరణముగలిగి వేదములభావమును
దెలిసికొనినవా రగుటంజేసి జ్ఞానసంపన్నులై సకలసద్గుణములు
గలిగి యెంతో వింత గూర్చుచుండిరి.

ఆకుమారులలో రామచంద్రుఁడు సత్య పరాక్రమాతి
శయమున వర్తిల్లి కళంకము నెడఁబాసిన చంద్రబింబమువలె
నెల్లరకు నిష్టుఁడై ముద్దులు మూటగట్టిన ట్లుండెను. మఱియు
నా శ్రీరామభద్రుఁడు గజాశ్వా రోహణముల నిపుణుఁడై యు
రంగమునందు రథముల నెక్కి చరించుప తులయందును
మిగుల నేర్పఱియను ఖ్యాతిం గాంచి బాణాసనవిద్య యందుఁ
గుశలుఁడై వీనివిమించిన పితృశుశ్రూషాకార్యమున మెలఁకువ
గలిగియుండెను. లోకానందకరుఁడగు రామమూర్తికి ననుకూల
ముగా వర్తించుచు బాల్యమునుండియే స్నేహాతిశయమున నన్న
నెడఁబాయక సకలసులలితలక్షణములుగల లక్ష్మణుఁడు వర్తించు
చుండెను. తనశరీరమునకంటె నెల్లవిధముల రామునకే
మిక్కిలి ప్రియముంగూర్చుచు 'బహిఃప్రాణమా యనునట్లు

లక్ష్మణుఁ డుండెను. రామునకుఁ బ్రాణపదమగు సోదరుఁడు సౌమిత్రి చెంత లేకయున్న నిదురపట్టదు. ఎంతో ప్రియమునఁ దల్లి కౌసల తెచ్చిన మృష్టాన్నమునుగూడ లక్ష్మణుఁడు దగ్గఱ లేనిచోఁ దినకుండును. శ్రీరామమూర్తి యశ్వమునెక్కి మృగయా వినోదమునఁ గలయాసక్తుఁడై యడవుల కరిగినయెడల సౌమిత్రియు ధను రుండై కంటికి ఱెప్పవలెఁ గాచుచు నతనివెంటఁ బోవుచుండును.

శ్రీరాముని లక్ష్మణుఁ డెట్లు సేవించునో భరతుని శత్రుఘ్నుఁ డట్లే కొలుచుచుండును. భరతుఁడు నాతనిపై రామునకు లక్ష్మణునియం దెట్టి ప్రీతకలదో యట్టిప్రీతి యునిచెను. రామలక్ష్మణులు భరతశత్రుఘ్నులు నుద్యుక్తులై యేపని చేసినను గలిసియే చేయుచుండిరి. ఇట్టి కుమారచతుష్టయముం బడసి దిక్పాలకులు నలువురు తనుంగొలువ నలరు జలజాసనునివలె దశరథుఁడు సంతోషించుచుండెను. కేవల పుత్త్రప్రీతిమాత్రమే కాక వయస్సునకుఁదగినట్లు చక్కనిపాండిత్యము సంపాదించి సుగుణములుఁ బాండిత్యమునకుఁ దోడుపడుచుండఁగా నలరుటయుఁ బ్రమాదమునఁ జేయఁదగనికార్య మొనరించినచో సిగ్గుపడుచుండుటయు సుజ్ఞానులను కీర్తినొందుటయు సర్వజ్ఞులను వినుతికిం బాత్రులగుటయు, దూరాలోచనములు గలవారునగుటయు నపారతేజస్సంపన్నులగుటయు మఱింత సంతోషము గలుగఁజేయఁజాలుటం జేసి బ్రహ్మపదమునంత సంతోషమును దశరథుఁ డనుభవించుచుండెను.

ఎల్లరకును విశేషించి తండ్రికిని సంతోషముగలిగించుచు నాకుమారులు సోమరితనములేక స్మృతులను బురాణేతిహాస

ములం జనివి జనకశుశ్రూషానిరతులై ధనుర్వేదమునఁ బండి తులుకూడ నై యుండిరి.

ధర్మాత్ముఁడు గావున నారాజు కుమారులకు నలు రకుఁ గాలముతప్పక యాయాయికార్యములఁ జేయనెంచి యప్పుడు వివాహోచితవయస్కులగుటఁ దలపోసి వివాహమునుగూర్చి పురోహితుని బంధువులం జేర్చుకొని యాలోచించుచుండెను. మంత్రులు నం దాహ్లాదులై పాల్గొనుచుండిరి. ఆయాలోచ నము కేవల రహస్యముకాక యర్హజనులమ్రోల సాగుచుండెను. ఎల్లరకుఁ బ్రియమునుగూర్చువారు గావున నెవరుగాని యీ కార్యము మనకేల యనుకొనక వివాహమహోత్సవమును జూడఁగోరియే యుండిరి. కాన సతరము యీకార్యమును సాగించుట మేలనునూహను గనఁబఱచుచుండిరి. ముదుసలి యగురాజు వివాహవిషయమునఁ దొందఱపడుట నాయేత రము కాదుకదా.

మహానుభావులారా! ఈఘట్టమున వ్రాయఁదగినవిశేషము లనేకములు గలవు. వానిలోపల ముఖ్య విషయములనే సంగ్ర హాముగ విమర్శింతును. యజ్ఞములన్నియుఁ బూర్తికాఁగా నయోధ్యానగరమును రాజు సకుటుంబపరివారముగాఁ బ్రవే శించెను. ఎల్లవారు తమస్థానములకుం బోయిరి. ఋశ్యశృంగ మునియుఁ దాఁజేయఁదగుకర్మమును శ్రద్ధమై నిరహించి మామగారితోడ శాంతాసహితుఁడై యంగదేశమునకుం బోయెను. అంతఃపురమున నందఱు సుఖసాగరమున నోల లాడుచుండిరి. దశరథపత్నులు మువ్వురు పుత్రకామేష్టి పూర్తి యైన మూఁడవమాసమునఁ జూలుదాల్చిరి. "చిరేణ గర్భాఃన్

ప్రతిపేదిరే తదా" అనునదియే యీమాటకు నాధారము. పాయసభక్షణానంతరము ఋతువు లాఱు గతించెను. త్రేతాయుగాంతముననాఱుఋతువులను విభాగముకలదని మన మెఱుంగవలయును. "ద్వా దశమాసాః పంచర్తవః"అన్న శ్రుతివాక్యము ననుసరించి ఋతివు లైదుండునని స్పష్టము. కాలమునుబట్టి యాఱుగామార్పఁబడినవి. ఎప్పుడు? అని ప్రశ్నించిన నీదినమున నని సమాధానముచెప్ప నెందు నాధారములు నాయెఱింగినంత దనుకఁ గనఁబడలేదు. పండ్రెండవమాసము చైత్రమాసమయ్యెను. వైశాఖమాసమునఁ బాయసము లభించెనని మన మూహింపవలయు. చైత్రమాసమున ననఁగా వసంతర్తువు నందు నని యర్థము. వసంతర్తువునఁ దొలినెల యగుచైత్రమున శుక్లపక్షమునందుఁ దొమ్మిదవతిథియందు భగవంతుఁ డావిర్భవించెను.

'చైత్రేనావమికేతిథౌ' అని మూలమునఁ గలదు. శుక్లపక్షమని యెట్లు తెలుననఁగా జంద్రుఁడు గురువుంగూడి కర్కాటకమున నుండెననియు, సూర్యుఁడు మేషరాశియం దున్నవాఁడనియుఁ జెప్పఁబడినందున శుక్లపక్షమనియే స్పష్టమగును. చైత్రశుక్లనవమీతిథియందుఁ బునర్వసూనక్షత్రమునందుఁ గర్కాటకలగ్నమున ననఁగా నాల్గవలగ్నమునందు శ్రీరామమూర్తి జన్మించెను.

"నక్షత్రే௨దితిదైవత్యే స్వోచ్ఛసంస్థేషు పంచసు,
గ్రహేషు కర్కటే లగ్నే వాక్పతావిందునా సహ." ౯

"ప్రోద్యమానే జగన్నాథం సర్వలోకనమస్కృతం,
కౌసల్యాజనయద్రామం సర్వలక్షణసంయుతం." ౧౦

అని మూలము. నక్షత్రమును జెప్పుచు నదితి యేనక్షత్రమున కధిదేవతయో యానక్షత్రము అనుటచేత నదితి దేవతాకము పునర్వసువనుజ్యోతిశ్శాస్త్రము ననుసరించి నిశ్చయింపవచ్చును. ఇది ప్రాతీతికార్థము. విశేషార్థమేమనఁగా భగవంతుఁడు రాముఁడని యంగీకరించువారు కౌసల్య యదితి యని యంగీకరింపవలయు. కశ్యపముని దశరథుఁడని యొప్పుకొనవలయును. ఈయర్థమును గనఁబఱచుటకే "అదితి ర్దైవతే నక్షత్రే" అని వాల్మీకి ప్రయోగించెను. లేకున్న "పునర్వసౌ ఖ్యనక్షత్రే" అని యుండును. ఈయర్థము శ్రీకృష్ణజననమునఁ గలదు. దేవకీదేవి యదితి యని. కావున నిందును దదర్థమే మన మూహింపవలయును. "వాక్పతావిందునా సహ" అనుటంబట్టి చంద్రుఁడు కర్కాటకమున నున్నవాఁడుగావునఁ బునర్వసూనక్షత్ర చతుర్థపాదమున నని యర్థము. "కర్కాటే లగ్నే" అను పదముల నొకవిశేషార్థము కలదు.

"పిత్తానిలౌ ధాతుసమః కఫశ్చ త్రిశ్లేషతస్సూరిభిరూహనీయాః,
రాజన్యవిట్శూద్రధరాసురాశ్చ సర్వం ఫలం రాశ్యనుసారతస్స్యాత్."

అని తాజికనీలకంఠీయమునఁ గలదు. కర్కాటకలగ్నము కఫప్రకృతికము. అందు జన్మించువారు కఫప్రధాను లగుదురు. కఫధాతువు శంకరదేవతాకము. దాన శ్రీరామమూర్తి దుష్టసంహారార్థ మవతరించెనని యర్థ మగును. కటకలగ్నము విప్రజాతి కలది. అందు జన్మించువారలు బ్రాహ్మణస్వభావు లగుదురు. ఆపద్ధతి ననుసరించిన శ్రీరామచంద్రునిహృదయ మతికోమలమై వెన్నవలెం గరంగునది యని యేర్పడును. ఒరులకష్టములు చూడఁజాలని కరుణాసముద్రుఁడని సారము. అధర్మప్రవర్తకుల

యందుఁదప్ప నితరులయం దాత్మామూర్తిహృదయము వెన్న వంటిదని దీనినుండి తేలెడుసారము.

కర్కాటకలగ్నము చరలగ్నము. అనఁగా జరప్రకృతిక మని భావము. "చరగతి భక్షణయోః" అన్న ధాతువు ననుసరించి గమనము దనుజసంహారముచేయ నవతరించెనని సారము. కర్కాటలగ్నమనుటచేత పైనుదాహరించిన రెండుకారములు చేయుస భావముగలవాఁడనుటయేగాక కార్యంబుతటి దప్పఁ దనశక్తి నితరులకుఁ దెలియనీయఁడని భావము. కర్కాటకము వివరమున నంతర్యాతముగ నుండి తన్నేజంతువైన బయటికి వచ్చినప్పుడు చంపఁదలంచుకొన్నచోఁ దనసూక్ష్మాగ్రపాదముల నొక్కును. అట్లే వలయునని యముఁలుచేయ నూహింపక ధర్మధ ంసకులగుదురేని వారిం బొడవడంపఁ బ్రయత్నించు స భావముకలవాఁడని యీచోట మనము గ్రహింపవలయు.

నవమీతిథి ఉపక్తప్త మనంబడును. క్తప్తశం మునకు "నియతః కృతకల్పనః కల్పనం సామర్థ్యం తదస్తి శిష్టః" అని శం కల్పద్రుమమునఁ గలదు. సర శం సంబోధినియందు నిట్లే యున్నది. ఉపక్తప్త మనఁగా నధికసామర్థ్యవిశిష్టుఁ డని యర్థ మగును. ఈపే రెట్లువచ్చెనని యడుగవచ్చును.

"సంజ్ఞానం విజ్ఞానం ప్రజ్ఞానం జానదభిజానత్,
సంకల్పమానం ప్రకల్పమానముపకల్పమానముపక్లప్తం క్లప్తం,
శ్రేయో వశీయ ఆయత్సంభూతం భూతమ్."

అని వేదమున శుక్లపక్షతిథినామములు చెప్పఁబడినవి. కావున నవమీతిథియందుఁ బుట్టిన రామచంద్రుఁడు అధికసామ

విశిష్టుఁడు కాఁగలఁడన్న కారణముచేతనే నవమీతిథియం దుద యించెనని భావము. దీనింబట్టి తిథియు నక్షత్రము శ్రీరామా వతారమునఁ జేయఁగలకార్యము లివి యని సూచించెడిని. సత్యముగా నీవిషయము నన్వేషించినఁ గౌసల్య యదితి యనియు దశరథుఁడు కశ్యపుఁడనియు వారిగర్భముననే శ్రీ మహావిష్ణువు జన్మించినట్లు నటించెననియు ననఁగా శిశు రూపమున నగపడెననియు నంతియకాని గర్భవాసదుఃఖ మను భవింపలేదనియు నీయవతారమున దేశసంచారము దుష్టదానవ సంహారణము చేయుకార్యములనియుఁ దోఁచుచున్నవి.

## శ్రీరామావతారకాలికగ్రహసంపత్తి.

దీనింగూర్చి రవంత వ్రాయుదును. "పంచసు గ్రహేషు సోచ్చసంస్థేషు" అన్నదాని నాలోచించిన సూర్యాంగారకగురు శుక్రశను లుచ్చరాసులయందున్నవారని తేలెడిని. చంద్రుఁడు గురువుంగూడి కర్కాటకమున నుండెను.

| శు | ర | బు | |
|---|---|---|---|
| | | | గు చ ల |
| కు | | | |
| | | శ | |

ఇట్లు గ్రహచక్రమున్నతఱి నవతరించెను. ఉచ్చసంస్థ లనఁగాఁ

బరమోచ్చభాగములయం దున్నవారనియు నూహింపవచ్చును. బుధుఁడు వృషభమున నున్నవాఁడని యెట్లు తెలియఁదగి యుండునని ప్రశ్నించువా రున్నచోఁ బె లమాటలంబట్టియే యనవలయును. వృషభరాశియం దున్నఁగాని పరమాయుర్దాయము రాదనుట సత్యము. శ్రీరామమూర్తి పెక్కువేల యేండ్లు భూలోకముననుండుట కీగ్రహస్థితి చాలదు. దశరథుని యాయుర్దాయమున నమితాయుర్యోగము వ్రాసి యుంటిని. అదియుఁ బరమేశ రుజాతకమునఁ బనికిరాదని నాయాశయము. పర కారణుఁ డగుభగవంతునకీజాతకఫలము లేల? అన్న నౌననవలయును.

ఈయైదుగ్రహము లుచ్చరాసులయం దుండఁగా భగవంతుఁ డవతరించెను. కొంద ఱీజాతకమునుబట్టి యారామమూర్తిచర్యలకుఁ దగినఫలముల నెట్లో చెప్పుదురు. కాని ప్రాకృతులకుంబలె భగవంతునకు ఫలస్తుతులు చెల్లవు అఘటనాఘటన సమర్థుఁడుకదా శ్రీరామమూర్తి. సూర్యుఁడు మేషరాశియం దుండఁగా నవమీతిథియందుఁ బునర్వసునక్షత్రముండుట సంగతమా యన్నప్రశ్నము గలదు. అది యిప్పటివాడుకనుబట్టి చూడఁగా నసంభవమే. ఏనాఁడును రాదన వలయును. సూర్యుఁడు మీనరాశియందుండఁగాఁ జైత్రశుక్ల నవమియందుఁ బునర్వసువచ్చును. మేషమున రవియుండఁగా రాదగదు. మహర్షివాక్య మెట్లు సంగతం బగును.

ప్రారంభస్థానము చలనములేదని చాలకాలము నమ్మి యుండిరి. కొంతకాలమునకు మహాత్ములు గ్రహగతులం బరిశీలింపఁగా సరిపడకపోయెను. నిపుణముగాఁ బరీక్షించిరి. తుదకు

ప్రారంభస్థానమునకుఁ గతిగలదనిరి. దానికి "అయనగతి" యని నామకరణముచేసిరి. శాలివాహనశకము ౪౧౯ యం దని కొం దఱు ౪౨౧ సంవత్సరము నని కొందఱు ౪౪౪ వత్సరము నని కేశవదైవజ్ఞపుత్త్రుఁడు గణేశదైవజ్ఞుఁడును దమసిద్ధాంతమును దెలిపిరి ఆనాఁడుమొదలుకొని అయనమని సంక్రమణమని రెండుగా సూర్య రాశిప్రవేశమును భాగించిరి. ఈకల్పనము నంగీరింపక విడువ నవకాశములేకపోయెను. దానిగతి యెంత కాలము ముందో జరగెను. అప్పటిపరీక్షలోని విషమకారణ ములం బట్టి యూహించిరి. సూక్ష్మతమమతులు గావున భాస్క రాచార్య ప్రభృతులు పరీక్షాఫలముగా సిద్ధాంతముచేసిరి. ఈ రెండుకాలములు ముఖ్యములే యనిరి.

ధర్మశాస్త్రకర్తలుకూడఁ దదనుసారముగాఁ గర్మాచరణ కాలములను వానిఫలములను దెల్పిరి. *

---

*వృద్ధవసిష్ఠః. అయనే కోటిపుణ్యం చ సహస్రం విషువే ఫలం,
షడశీత్యాం సహస్రం తు ఫలం విష్ణుపదేష చ. ఇతి

మేషాదిసంక్రాంతయో యస్మిన్ దినే భవంతి. తతః ప్రాక్పశ్చాద్వా తాత్కాలికదృగ్గణితాగతసంఖ్యాకదినే మేషాయనం వృషభాయనమిత్యేవం తత్తత్సంక్రాంతినామాంకితమయనం భవతి. తస్మిన్నయనే స్నానాదిపుణ్య మాహ జాబాలిః, సంక్రాంతిషు యథా కాలస్తదీయేఽప్యయనే తథా, అయనే వింశతిః పూర్వా మకరే వింశతిః పరా ఇతి. మకరవ్యతిరిక్తైకాదశసంక్రాంతి సంబంధిష్వయనేషు తత్తత్సంక్రాంతివత్పుణ్యకాలోఽవగంతవ్యః. మకరే సంక్రాంతిసంబంధిన్యయనే తత్సంక్రాంతివైలక్షణ్యం, తథా మకరాయనే ప్రాచీనా వింశతిఘటికాః. మకరసంక్రాంతౌ తు పాశ్చాత్యాం వింశతిఘటి కాః పుణ్యాః, ఏతేన దృగ్గణితాగతమయనం సిద్ధాంతగణితాగతాసంక్రాంతి శ్చేతి పృథక్పుణ్యకాలావర్థాత్సిద్ధౌ. అని కాలమాధవీయము.

ఖిట్లయనమునకు సంక్రమణమునకు వేలువేలుగాఁ బుణ్యకాలములు చెప్పఁబడినవి. ప్రాచీనములగుస్మృతులయందిట్టిభేదము కానరాదు. కాఁబట్టి యీభేద మించుమించుగాఁ బదునాల్గు వందలసంవత్సరములనుండి కల్గినది. అంతకుఁబూర్వ మీభేదము కనుఁగొనఁబడలేదని యూహింపవచ్చును. ఏకాలమున నీభేద మున్నయట్లు దైవజ్ఞులు కనుఁగొనిరో నాటింగోలె నీరెండును గర్మాచరణయోగ్యములని స్పష్టపఱచిరి.

శ్రీరామావతారకాలమునం దయనమే ప్రధానముగ నుండెను. దానికే సాయన మనిపేరు. మేషతులాయనప్రవేశదినములయందే దినరాత్రప్రమాణములు సమానముగా ముప్పదిఘటికలుండును. మేషతులాసంక్రాంతిదినములయం దట్లు సమానముగా నహోరాత్రప్రమాణము చూపట్టదు. కావునఁ బూర్వకాల మీభేదము లేదని స్పష్టమగును. పదానా అయనాంశములకు మున్నుసాయనమే వ్యవహరింపఁబడుచుండెను. కాన నారీతిగా లెక్కించినఁ జైత్రశుక్లనవమినాఁడు పునర్వసూనక్షత్రము గలుగుట కేలాటిశంకలులేవు అయనసంక్రమణములకుంగల యీభేదమును గుఱితించిన వాల్మీకివచనమునఁ బ్రమాద మేమాత్రము లేదని స్పష్టమగును. ఆకాలము గ్రహసంచారములకు నిప్పటివానికిఁ జాల వ్యత్యయము కలదు. కావున నిప్పటివా రామహామునివాక్యములఁ బ్రమాదము లున్నవని పలుకరాదు. ఎన్నియో లక్షలసంవత్సరముల క్రిందట గ్రహచర్యను మన మిపు డాలోచించి లోపము లున్నవనరాదు ఎందే నుండఁగూడదా యన్న లేదనరాదుగాని యీచోటఁ గానరాదు.

ఇట్టు లైదుగ్రహములు పరమోచ్చభాగములనుండఁగా నస్తాదిదోషములులేని మధ్యాహ్నకాలమున మహాత్ముఁడు రామచంద్రుఁడవతరించెను. తిథినక్షత్రలగ్నములు భగవంతుని ప్రవృత్తి కనుకూలములుగాఁ గుదిరెను. కాలము "అభిజిత్స్వర దోషఘ్న" మ్మను న్యాయము ననుసరించియే కుదిరెను. ఆపరమాత్ముని యాశయ మప్రతిహతముకదా. ఎట్లు తలంచిన నట్లే సాగుచుండును.

"విష్ణోరర్ధం మహాభాగం పుత్రమైక్ష్వాకవర్ధనమ్."

భగవదంశమున సగము రామమూర్తిగా నుదయించెను. తిలక వ్యాఖ్యానమునందు 'శంఖచక్రానంతవిశిష్టస్య విష్ణోరిత రర్ధః ఆ ం కించిన్న్యూనమ మిత ః శంఖచక్రాదేరభావాదితిభావః' అని కలదు. భగవంతు డనఁగ శంఖచక్రానంతులతోఁ గలిసిన వాఁడని దానితాత్పర్యము. శ్రీరామావతారానంతరము భరతుఁడు జన్మించెను. పాయసప్రదానము కౌసల తరాత సుమిత్రకే గల్గెను. తరాతఁ గైకేయికి దొరకెను. మరల సుమిత్రకు దొరకెను. కావున సుమిత్ర పుత్త్రులం గనవలసియుండెను. రెండవది భరతజన్మముగా నిందుఁ గలదు. ఏలయనఁగా సుమిత్రకు యమళసంతానము కలుగవలయును. కవలలో నొక్కరి తరాత రెండవదినమో మూఁడవదినమో రెండవవాఁడు పుట్టు నాచారములేదు. కావున ముందు భరతజన్మము చెప్పఁబడినది.

"భరతో నామ కైకేయ్యాం జజ్ఞే సత్యపరాక్రమః,
సాక్షాద్విష్ణోశ్చతుర్భాగస్సర్వైస్సముదితో గుణైః." ౧౨

"భరతో నామ కైకేయ్యాం జజ్ఞే సత్యపరాక్రమః,
సాక్షా ద్విష్ణోశ్చతుర్భాగస్సర్వైస్సముదితో గుణైః." ౧౭

ఈరామాయణమున "సత్యపరాక్రమః" అనువాక్యము పెక్కుతావులఁ గలదు. అం దొక్కవిశేషము కలదని యూహింపవచ్చును. సత్యమగుపరాక్రమమనికాదు. సత్యయుక్తమగు పరాక్రమమన్న స్పష్టముగా నుండును. కైకేయి కొడుకుం గాంచెను. ఆతఁడు సత్యపరాక్రముఁడు. సకలసద్గుణభూయిష్ఠుఁడు భగవదంశమున నాల్గవభాగము కలవాఁడు. భరతుఁడు పాంచజన్యావతారము. పిదప సుమిత్ర యిరువురు తనయులం బ్రసవించెను. భరతుఁడు పుష్యనక్షత్రమున జన్మించెను. లక్ష్మణశత్రుఘ్ను లాశ్రేషయం దుద్భవించిరి. భరతుఁడు మీనలగ్నమున ననఁగా దెల్లవాఱుజామునఁ గల్గెను. లక్ష్మణశత్రుఘ్నులు కటకలగ్నమున నవతరించిరి. ఈనలువురజననము నవమీదశమీతిథులయందని యెఱుంగవలయును కుమారులు నలువురు పూర్వోత్తరప్రోష్ఠపదరూపములు నాలుగునక్షత్రములు. వానివలె నుండిరనఁగా నెల్ల రొక్కరీతిగా నుండిరని భావము.

రాజు జాతకర్మాదికర్మకలాపములు యథావిధి నెఱవేర్చెను.

"నామధేయం దశమ్యాం తు ద్వాదశ్యాం వాస్య కారయేత్,
పుణ్యే తిథౌ ముహూర్తే వా నక్షత్రే వా గుణాన్వితే." ౩౦

మను. ౨ అధ్యా.

పదియవపండ్రెండవదినములలో నామకరణము దినజులం దలు చేయవచ్చును. అట్లుకాదేని తిథివారనక్షత్రలగ్నశుద్ధులు

గలకాలమునం దెప్పుడుగాని చేయవచ్చునన్న నియమము నను
సరించి యథాకాలముననే విధిమంతముగా నొనరించెను. వసిష్ఠ
మహామునియే నామముల నిర్ణయించెను. పౌరోహిత్యమతినిం
ద్యమైనను మనస్సున నేవాంఛగలిగి యావసిష్ఠమహాముని
యింతకాలమునుండి వేచియుండునో యాపరమపురుషుఁ డవత
రింపఁగాఁ దనయదృష్టము ఫలించెనని మహోత్సాహమున
నామకరణము చేసెను. రామ భరత లక్ష్మణ శత్రుఘ్ను లను పేరుల
నానలువురకుఁ బెట్టెను. ఆపేరు లాకుమారులకు సర్వవిధములం
దగియుండెను. వారు సర్వజనప్రియంకరులై పెరుగుచుండిరి.
లక్ష్మణుఁడు రామచంద్రుని, శత్రుఘ్నుఁడు భరతు ననుసరించి
వర్తిల్లుచుండిరి. ఈప్రవర్తనము లోకోపకారమునకే యని
యెఱుంగవలయును. భరతశత్రుఘ్ను లొకటిగానుండకయున్నఁ
గొన్నిబాధలు కలుగును రామలక్ష్మణులు బాల్యమునుండి
విడువక మెలంగుచుండినఁగాని యరణ్యగమనమున కనుకూ
లము కాదు.

## శ్రీరామాదులబాల్యము.

శ్రీరామమూర్తి యందఱికన్నఁ దండ్రి కధికసంతోష
ప్రదుఁ డయ్యెను. తక్కినవారి కెల్లరకుంగూడ బ్రహ్మదేవుని
వలె సమ్మతుం డయ్యెను. అనఁగా వసిష్ఠమహాముని దివ్యజ్ఞాన
సంపన్నుఁడు గావున నాలోచించియే నామధేయమును దెలి
పెను. రామశబ్దమునకు యోగులమానసవీధిఁ గ్రీడించువాఁ
డనఁగా నితరులకుం జెప్పనేల? బ్రహ్మదేవుఁడు దేవదానవుల
యందు సమమగు నభిమానముకలవాఁడు. రాము నాతనితోఁ
బోల్చుటచేత రామునియాగ్రహము దుర్వృత్తిపైననేగాని

దానవజాతిపైన లేదనియు నధర్మధ్వంసనముచేయ నవతరించె ననియు నధర్మచిత్తులుగాని రాక్షసులఁ బ్రేమించుననియుఁ దేలెడిని.

ఈనలువురుసోదరులును శూరులును లోకహితాభిలాషులు నైయుండిరి. లోకహిత మనఁగా నసాధువిధ్వంసము, సాధుపాలనముకదా. ఆకార్యమునకే యవతరించినపుడు తత్ప్రవృత్తియుండుట సాధారణమే యనవలయు. రాముఁడు సత్వపరాక్రముఁడని రామాయణమున నెన్నియోతావులఁ గనఁబడియెడిని. సత్వము పరాక్రమము ననునీరెండును గలవాఁడని గ్రహింపవలయును. పరుల నాక్రమించుశక్తియేకదా పరాక్రమ మనఁబడును. పరులనఁగా ధర్మద్వేషులనిభావము. సత్వమును స్థాపించి ధర్మద్వేషుల నాక్రమించి యనఁగా నణంచి తనరాకకు ఫలము గలిగించువాఁడనియే దీనిసారము. "శశాంక ఇవ నిర్మలః" కళంకములేని చంద్రునింబోలి సర్వలోకమున కిష్టుఁడని యున్నది. అనఁగా శ్రీరాముని ప్రవృత్తి యెల్లన్యాయసమ్మతమనియుఁ గావున నెల్లరకు నిష్టుఁడయ్యెననియు గ్రహింపనగు. ఈవిషయమున ననేకోదాహరణములు ముందు కనఁబడును. కాన నిపుడు చర్చింపక వదలుదును. చంద్రోపమానమున రాముని రాజ్యపాలనము చల్లఁగా నుండుననియే దీని సారము. కావుననే రామచంద్రుఁడని రామభద్రుఁడని ప్రఖ్యాతములగు నీనామధేయములే భక్తులకెల్లఁ బారాయణార్హములయ్యెను.

"యదా హి హయమారూఢో మృగయాం యాతి రాఘవః,
తథైనం పృష్ఠతోఽన్వేతి సధనుః పరిపాలయన్." 30

రామచంద్రప్రవృత్తిని వాల్మీకిముని తెలుప నారంభించి యటవీసంచారమే తొలుత నారంభించెను. దీనింబట్టియే యరణ్యవాసమే రామునిచరిత్రమునం బ్రధానమైనట్లు కనుపట్టు. లక్ష్మణుఁడు ధనుర్ధారియై రామరక్షణాసక్తిని వెనుకనే పోవుచుండును. అనుటంబట్టి భావివనగమనమునకు లక్ష్మణుఁడు సాయముకాఁగలఁ డనుభావము సూచితము. భగవత్సేవకే కాంతవాసమే ప్రధానము. అరణ్యములు మఱింత ముఖ్యములు. కావుననే మహర్షు లడవుల నుందురు. జనసంసర్గము భగవత్సేవాప్రతిబంధకము. ఏకాంతవాసమే యందులకు ముఖ్యము.

"తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః,
ఉపవిశ్యాసనే యుంజ్యాద్యోగమాత్మవిశుద్ధయే." ౧౨
గీత ౬ అధ్యా.

అను శ్రీకృష్ణవాక్యమే యిందులకుఁ బ్రమాణము అరణ్యవాసము ప్రధానమని యిందు లేదే యని కొందఱు ప్రశ్నింతురేమో. "యతచిత్తేంద్రియక్రియః" అన్నవాక్యమునుబట్టి జనసంసర్గము చిత్తేంద్రియక్రియలు నియమింప బాధకము కావున నేకాంతవాసమే దీనికిం బ్రధానమని తేలుచున్నది. కావున నేచోట మనశ్శాంతికి బాధకములగు జనసంసర్గాదు లుండవో యాచోటు విజనమే యని స్పష్టమయ్యెడిని. అరణ్యమే యట్టిదని మన మూహింపవచ్చును శ్రీరాముఁడు లక్ష్మణసహితుఁడుకాక వనమునకుఁ బోవకుండుటయేగాక తల్లి ప్రియమగు నాహారమునుబెట్టినను లక్ష్మణుఁడులేక భుజింపకుండును. అన్నసూక్తి రామలక్ష్మణులకుంగల నిరంతరసంగతిని దృఢపఱచుచున్నది.

"స చతుర్భిర్మహాభాగైః పుత్రైర్దశరథః ప్రియైః,
బభూవ పరమప్రీతో దేవైరివ పితామహః." 3౧

అన్నవాల్మీకివాక్యమునుబట్టి యాలోచించిన దశరథుఁడు కశ్యపమునియే యని స్పష్టమగును. దేవతలతోఁగూడిన బ్రహ్మవలె ననఁగా నిదియేకదా. కశ్యపుఁడని యెట్లగు ననఁగా నవబ్రహ్మలలోఁ గశ్యపముని యొకటివాఁడుకదా. అదృష్టవంతులై ప్రియులగు తనయులతోఁగూడిన రాజు బ్రహ్మవలె నుండెననఁగా నీభావము తోఁపదనుటసంగతము.

"హ్రీమంతః కీర్తిమంతశ్చ సర్వజ్ఞా దీర్ఘదర్శినః."

మనుష భావము కలవారలగుటఁ బ్రమాదము మానవసహజధర్మమగుట నేమైనఁ జేయఁదగనిపని బాల్యమున నొనరించిన దానికి లజ్జించుచుఁ గీర్తిమంతులై సర్వజ్ఞులై దూరాలోచనము చేయఁజాలి యాతనయు లుండిరి. అనుటచేతనే సామాన్య బాలకులుగాక సర్వశక్తిసంపూర్ణు లగుమహాపురుషులే యని స్పష్టము. సర్వశక్తిమంతు లెందునుగాని యేబాలునివిషయమున నైన నుపయోగింపఁదగినదియా. కావుననే మహాముని వాల్మీకి తత్ప్రభావమును బాల్యవర్ణనముననే తేటపఱచెను.

"తే చాపి మనుజవ్యాఘ్రాః వైదికాధ్యయనే రతాః,
పితృశుశ్రూషణరతా ధనుర్వేదే చ నిష్ఠితాః." 3౨

ఆమనుజలలాములు నలువురును వేదసంబంధములగు ననఁగా స్మృతిపురాణేతిహాసములఁ బఠించుటయందాసక్తిగలవారలై పితృశుశ్రూషాసక్తిగలిగి ధనుర్వేదమునందును నిష్ణాతులై యుండిరి. వేదస్మృతిపురాణాదులయందును బితృశుశ్రూషయం

దును దానితరాత ధనురిద యందు నాసక్తులని యర్థము. కావుననే లోకమున ధర్మము స్థాపించునాసక్తి మొదటిదిగా దానింబోలినది జనకసేవగా భావించువారని ధనుర్వేదము వారికి నంత ప్రధానము కాదనియుఁ దేలెడిని. దుష్టశిక్షకునది ప్రధానముకాదా యందురేని వారు స్మరించినంతనే దివ్యా యుధములు మూర్తిమంతములుగఁ దోఁచును. లోకమునకుఁ దామ తెలుపఁదగిననీతులు శ్రుతిస్మృతిపురాణాదిపఠనాసక్తియు దానికి ఫలముగాఁ బెద్దలను సేవించుటయు నగునుగాన వానిం బ్రధానముగా నాచరించుచుండిరని సారము గ్రహింపవల యును ఇట్లు సర విధముల నొప్పియున్న యకుమారులకు వివాహము చేయఁగోరి వసిష్ఠాద్యుపాధ్యాయులను మంత్రులను గూడి యాలోచించుచుండెను. రాజు కడుంగడు వృద్ధుఁడగు టయే యిందులకుం గారణమని యూహింప నవకాశముకలదు. ఆవిషయము తరాతికథవలనఁ దెలియఁగలదు. దాని నాల కింపుఁడు.

## విశ్వామిత్రాగమనము.

ఇట్లు దశరథుఁ డెల్లరంగూర్చుకొని యాలోచించుచుం డఁగా మహత్తరతేజుఁడు మహామునియు నగువిశ్వామిత్రుఁ డరుగుదెంచెను. రాజును జూడఁగోరిన యామునివరుఁడు దారపాలకులను జూచి కుశికవంశమున జన్మించిన గాధినంద నుఁడు విశ్వామిత్రుఁ డనుముని వచ్చి దర్శనమును గోరుచున్న వాఁడని తెలుపుఁడు. అనువాక్కులు వినఁబడినతోడనే వారందఱు తొందఱయు భయమును గలిసికొనఁగా లోనికిం బరుగిడి పోయి యిక్ష్వాకువంశభూషణమగు దశరథునకు

మహాముని రాక నెఱింగించిరి. ఆవాక్యముల విని దశరథుఁ డా నందపరవశుఁడై సమాహితుఁడై పురోహితుఁడగు వసిష్ఠ మహర్షింగూడి బ్రహ్మ రాఁగా బృహస్పతింగూడి దేవేంద్రుఁ డెదురుగాఁ బోవునట్లు మహర్షి కెదురుగాఁ బోయి బ్రహ్మతేజ ముల వెలుంగుచు సద తాచరణపరాయణుండయి యలరారు నామహాముని జూచి హర్షముచేత ముఖము చెన్నుమీఱ నవి శ్వామిత్రునకుఁ బురోహితునిచే నర్ఘ్య మిప్పించెను

విశ్వామిత్రుఁడు శాస్త్రవిహితమార్గమున రా జిప్పించిన యర్ఘ్యమును గ్రహించి యారాజుతో రాజేంద్రా! క్షేమమా! కోరికలెల్లఁ గొఱంతలేక పయింబయి నొడఁగూడుచున్న వేకదా. ధర్మపాలనమున నీపురము ధనాగారము దేశము నేయుపద్రవ ములులేక యున్నవియేకాదా. మీవారికెల్ల క్షేమమేకద. సామంతు లుచితరీతి మెలంగుదురుకదా. దైవకర్మములు మానుషకర్మములు (యజ్ఞము దేవతార్చనాదికములు. అతిథి సత్కారసామదానాదికములు) చక్కఁగా నీచే నాచరింపఁబడు చున్నవియేకాదా. అని ప్రశ్నించెను. తరువాత నావిశ్వామి త్రుఁడు వసిష్ఠుని సమీపించి యమ్మునిని, అందున్న తక్కిన వామదేవాదిమునులను మహానుభావులను న్యాయము నించుక యేఁ దప్పకయుండఁ గుశలము లడిగెను. ఇట్లు తమ్మెల్ల మర్యా దగా నడుగ వా రానందించి రాజసభను జేరి యర్హాసనముల నాసీనులయిరి. మహాబుద్ధిగలయారాజు దేహము పులకాంకుర ముల నిండియుండ నమ్మునివతంసుం బూజించి మహాత్మా? తమ రరుదెంచుట యమృతము లభించినట్టిది. నిర్జలదేశమున మంచి

వాన కురిసినట్లే. చిరకాలము సంతానములేనివారికి సజాతీయ దారయందుఁ బుత్త్రలాభము లభించినట్టిది. పోఁగొట్టుకొన్న పెన్నిధి మరల లభించినట్టిది. మహాభ్యుదయకాలమున నిర్భరానందము కలిగినట్టిది. ఇది నాకుం గలనమ్మకము. నీకు స్వాగతమగుంగాక. బ్రహ్మామునీ! మీామదింగల పరమవాంఛిత మెద్ది? దాని నేనెట్లు తీర్పవలయును? పాత్రభూతుఁడవుకదా. నాయదృష్టవశమున నిచ్చోటికి నీవే వచ్చితివి. ఇపుడు నా జన్మము ఫలించినది. తొలుత రాజర్షివై మహత్తరతపస్సంపదచేఁ దేజస్సు వెలుంగు బ్రహ్మర్షివైతివి. కావునఁ బెక్కురీతులఁ బూజ్యుండవు. మీారాక యత్యద్భుతము. ఇంతకంటె నన్నుఁ బరమపావనునిగాఁ జేయునది మఱేదియుండును? మీాదర్శనమున నీ(?)లము పావనంబయ్యెను. ఏ కార్యము నామూలమున సాధింపఁగోరి యిచ్చటికి వేంచేసితిరో యను గ్రహించి సెలవొసంగుదురేని దాని నెఱవేర్పం గోరుచున్నాఁడను. నావలన మీాకార్యము నెఱవేఱునో నెఱవేఱదో యను సందియ మందకుఁడు. నాపాలిటిదైవ మనఁగా మీారే. కాఁబట్టి యించుక యేలోపము రాకయుండ నెఱవేర్పఁజాలుదును. మీా రరుదెంచుటయే నాకు మహాభ్యుదయము. మఱియు సుత్తమతమధర్మమంతయు నాకు లభించినది అని చెవులకు మనస్సునకును హితమగుచు వినయముతోఁగూడిన యామతిమంతునివాక్యముల నాలకించి మహాగుణసంపన్నుఁడగు నాముని మిక్కిలి హర్షంబునొందెను.

## విశ్వామిత్రుఁడు రాముని బంపుమని యడుగుట.

* కౌశికుఁ డాశ్చర్యకరమగు దశరథునివాక్యముల విని పులకితాంగుఁడై మహాతేజుఁడు గావున నిట్లు సంభాషించెను. రాజేంద్రా! సద్వంశమునఁ బుట్టి వసిష్ఠమునియంతవాని యుపదేశమునొందిన నీకే యిమ్మాట పలుకందగునుగాని యింకొక్కనికిం దగదు. ఇది యసత్యము కాకయుండఁజేయ నీ వంగీకరింపవలయును. సత్యసంధుఁడవు. కాఁబట్టి పలికి బొంకవు. ఇఁక నావచ్చినకార్యమును వినుము. నే నొక్క ఫలముఁ గోరి యయ్యది లభింప నొకయాగము చేయఁబూనితిని. దాని కొకవ్రతమును సాగించుచున్నాఁడను. కామరూపులగు దానవు లిద్దఱు నాపూనిన మహాకార్యమునకు నంతరాయమును గల్పించుచునే యుందురు. వ్రతముకూడ మిక్కిలిసాగించితిని. కాన నిలుపఁదగదు. పూర్తినొందింపవలయునని పూనుకొనఁగా బలశాలురగు మారీచసుబాహువులు మాంసమును రక్తమును నాయజ్ఞవేదికపైఁ గురియింతురు. ఇంచుక కొఱఁతగానున్న నావ్రతమయ్యది యీదుష్కార్యమున నిష్ఫలముకాఁగా శ్రమంపడియు నిరుత్సాహుఁడనై యచ్చోటువదలి వచ్చినాఁడను. రాజచంద్రా! తపశ్శక్తి వారినేల శపించి వ్రతము సాగింపరాదు.? అని యందువేమో † వారిపై నిపుడు కోపింపవలనుపడదు. యజ్ఞకార్యమున నుండునపుడు కోపము నొందఁగూడదు. కావున నేను వారికి శాప మీయఁజాలకయున్నాఁ

---

* ఈభాగము బాలకాండము పందొమ్మిదవసర్గమునుండి కైకొనఁబడినది. † నచమే క్రోధముత్సృష్టుం బుద్ధిర్భవతి పార్థివ, తథాభూతాహి సాచర్యా న శాపస్తత్ర ముచ్యతే. ౭. అని మూలము.

డను. కావున నాకార్యము నీవలననే కావలసియున్నది.
ఏమో యని యనుమానింపకుము. అది స్వల్పకార్యమే నీక.
గును! ఏమందువా. చక్కఁగా నాలకింపుము.

సత్యపరాక్రముఁడగు నీజ్యేష్ఠకుమారుని రామచంద్రుని
శూరాగ్రేసరుని గాకపక్షధరుండని (కపోలములకుఁ జెంతనుండు
శిఖ కాకపక్షము) యూహింపక నాకొసంగుము. బాలుఁడు
కదా యీకార్యము నొనరింపఁగలఁడా యనుసందియ మూన
కుము. నేను నీవలె రక్షించుచుండఁగా నీరాముఁడు (స్వకీయ)
వైష్ణవతేజమున నెందఱు రాక్షసులు యజ్ఞవిఘ్నకర్తలు వచ్చి
నను ద్రుంపఁగలఁడు. *రాజా! నే నీరామునకు ననేకమార్గముల
శుభమును గల్గింతును. దాన నీకుమారుఁడు ముల్లోకముల
యందుఁ బ్రఖ్యాతిం గాంచును. ఆమారీచసుబాహువు లీతని
మార్కొని క్షణమైన నిలువంజాలరు. ఈరాముఁడుతప్ప వారి
నింకొక్కఁడు వధింపఁజాలఁడు. నాకుమార్కుఁడు శూరుఁడే
యగుఁగాక. ఐన మహావీరవంతులగువా రోడుదురా యని
సంశయమూనకుము. వీరగరితులేవారలైనను బాపమతులు
గావున నకారణమునఁగాలపాశములకుం దగుల్కొనియున్న
వారు కాఁబట్టి మహాత్ముఁడు రామునకు వారు దుర్జయులు
కాఁజాలరు. మహారాజా! పుత్త్రుఁడని స్నేహముఁ బూనకుము.
నామాటను దీని నమ్ముము. ప్రతిజ్ఞచేసి చెప్పుచున్నాను. వా
రిరువురు వధింపఁబడిరనియే నమ్ముము.

అనిపలికి దశరథునకు రామునిమహత్త్వమును గూఢ

* శ్రేయశ్చాస్మై ప్రదాస్యామి బహురూపం న సంశయః, త్రయాణా
మపి లోకానాం యేన ఖ్యాతిం గమిష్యతి ౧౦. అనిమూలము.

ముగాఁ జెప్పఁదలఁచి మఱియు విశ్వామిత్త్రుఁ డిట్లుపలికెను. * రాజా! రామచంద్రుఁడు మహాత్ముఁడు, సత పరాక్రముఁడునని నే నెఱుంగుదును. ఒక్క నేనేకాదు. మహాతేజుఁడగు వసిష్ఠమహామునియు నెఱుంగును. మేమిరువురముమాత్రమే కాదు. నిరంతర తపోనిష్ఠనుండు నీవామ దేవాదిమహర్షులు నెఱుంగుదురు. ఈ విషయము నమ్మిదైన రామభద్రునిం బంపుము. రాజా! విశేషించి మాటలేల? ఒక్కమాట చెప్పెదను వినుము. † భూలోకమున ధర్మాభివృ యు నిరుపమానయశస్సు స్థిరముగా నుండవలయునని కోరితివేని నాకు నీరామమూర్తి నిచ్చివేయుము. నామాటనే నమ్మి యీావలదు వసిష్ఠాదిమంత్రులు సమ్మతించిరేని వారియనుమతి నొందినమీఁదనే పంపుము. లేకలేకకలిగిన ముద్దులపట్టిని విడనాడి చాలదినము లుండఁగలనా యని యనుమానింపకుము. దశరథరాజశేఖరా! చాలదినములు నావశమున నుండనక్కఱలేదు. పదిదినములు నీప్రియపుత్త్రుఁడు రాజీవపత్రనేత్త్రుఁడు నాకుం గావలయును. కావున నీపదిదినములకు వదలఁగలనా యనుచింతఁ బూనక వేవేగ నాకీరాము నిమ్ము. నాయజ్ఞకాలనియమము మించిపోవరాదు. కానఁ దర పడవలయును. నీకు శుభమగుఁగాక. మనస్సున సుంతయేని వగవకుము.

అని మహాతేజుండగు నామునివర్యుఁడు ధర్మమెఱింగిన

---

* అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమం, వసిష్ఠోఽపి మహాతేజా యేచేమే తపసిస్థితాః. ౧౪. అని మూలము. † యది తే ధర్మలాభం చ యశశ్చ పరమంభువి, స్థితమిచ్ఛసి రాజేంద్ర! రామం మే దాతుమర్హసి. ౧౫. అని మూలము.

చిత్తముకలవాఁడు కావున ధర్మార్థయుక్తమగు వాక్యమును బలికి యూరక యుండెను. ఈరీతిగా మంగళములు గలుగునట్లు కౌశికుఁడు తెల్పినమాటలు విని దశరథుఁడు వగపాలై తల్లి మోము వెలవెలఁబాఱఁగా నుండెను. హృదయభేదనదక్షము లగు నామునివాక్యము నాలకించి మిగులనొచ్చి సింహాసనమున నుండి గజగజవడంకెను.

మహాశయులారా! ఈఘట్టమే భగవంతునియశస్సు లోకముల వెల్లడియగునట్టిది. కావున నిందెన్నియే విశేషము లుండకపోవునా. వానిలో నాకుఁ దోఁచినవానిని గొన్నింటిని విమర్శింతును. అవహితులరై యాలకింపుఁడు.

"సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత,
కుర్యాద్విద్వాం స్తథాసక్త శ్చికీర్షుర్లోకసంగ్రహమ్. ౨౫
ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః,
అహంకారవిమూఢాత్మా కర్తాహమితి మన్యతే. ౨౭
గీత 3 అధ్యా.

అన్న శ్రీకృష్ణవాక్యములయర్థము గ్రహించినఁగాని యీఘట్ట మునఁగల విశేషార్థము బోధపడదు. దశరథుఁడు మహాత్ముల సావాసముకలవాఁడు. ఎంతకాలమో పెద్దలయుపదేశములఁ జెవియొగ్గి యాలకించినవాఁడు. ఇందు దశరథవిశ్వామిత్రులకుఁ గలభేద మెఱుంగఁదగును. దశరథుఁడు తెలియని కర్మయోగి. విశ్వామిత్రుఁడు తెలిసిన కర్మయోగి. ఇరువురును గర్మాచరణ మున సమానులే. తెలియక తెలిసియుఁ జేయువారనున దొకటియే భేదము. దశరథుఁడు తాను గర్త ననుకొనువాఁడు. మునియో తెలిసి లోకసంగ్రహార్థము కర్మముల నాచరించు

వాఁడు గావునఁ దాను గర్త ననుకొనఁడు. కర్మముచేయు టలో నిరువురు సమానులే. ఇఁక విషయమును వినుఁడు.

శ్రీరాముఁ డయోధ్య లోనుండి సుఖపడుటకుఁగా నవ తరించినవాఁడు కాఁడు తాఁజేయఁబూనినకార్యము లనేక ములు గలవు. ఏయేకార్య మేనిముసమునకుఁ బూర్తికావల యునో యట్లు సాగింపవలసి యున్నది. దశరథునకుఁ దృప్తి చేయుకార్య మాయవతారమునకుఁ బ్రధానముకాదు ఇతఁడు తండ్రియన్న పక్షపాత మారామునకు వస్తుతఃలేదు. సత రంబ యాతఁడు స స్థానమునకుం బోఁదగినవాఁడు. దేవలోక మున నెన్నియోకార్య ము లీశ్వరునివలనఁ గావలసియున్నవి. వానికెల్ల నంతరాయమును దాను గల్పింపరాదుకదా. ఎంత కాల మాబాలరూపమున నట నుండవలయునో యంతకాల మటఁ గడపెను. ఇంకఁ గృత్యము లనేకములు తననుండి కావలసినవి యున్నవి. అచిరకాలమునఁ దాటకావధము కావల సియున్నది. దానిజీవితాంతమున నొక్కక్షణమైన నాలస్యము కారాదు. తదనుకూలముగాఁ దన ప్రయాణము సాగవలయును. అందులకు నిమిత్తము కావలయును. "పుణ్యై ర్యశో లభ్యతే" అన్నసూక్తి వ్య ము కారాదుకదా. లోకోత్తమకీర్తి నార్జింపఁ దగుపుణ్యము చేసినవిశ్వామిత్రున కాఫలము కలుగవలయును. ఇతరుల కీవిషయము తెలియరాదు. "గహనా కర్మణో గతిః" అన్నశాస్త్రము వ్య ముకారాదు. కావున నొకమాఱు మన స్సున సంకల్పించెను. మహాప్రకృతి తన్నావరించికదాయున్నది. ఆజగ నని యాభగవంతునితలం పెఱింగెను. దశరథునకు వివాహముచేయవలయు నన్నసంకల్పమును గ ంచెను. ఎల్ల

రాలోచనము చేయఁగూడిరి. ఎప్పు డెందుఁ జేయవలయు నన్న మాటలు సాగుచుండెను. ఆమాటలకు ఫల మప్పుడు కలుగ రాదు. విఘ్నముకలిగియే తీఱవలయును. అంతలో విశా మిత్త్రుఁ డరుదెంచెను

భగవత్సంకల్పమే యమ్మునినిం బురికొలిపి కొనితెచ్చెను. ఆసమయమునకే యామునియు నామండపదా రమును జేరఁ గల్గెను. ఒక్కభగవత్సంకల్పసూత్త్రమున నిన్నియిమిడియున్నవి.

"మ త్తః పరతరం నాన్యత్కించిద స్తి ధనంజయ,
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ." ౭. గీత ౭ అధ్యా.

అను శ్రీకృష్ణపరమాత్మయాశయమును మనము నమ్మవలయును. నమ్మినను నమ్మకున్నను గార్య మొకతీరుననే సాగునుగాని తెలిసికొనిన నహంకారము నశించును. అదియే పరమలాభము. ఆపరమలాభమును బోఁగొట్టుకొనుట బుద్ధిమంతుల లక్షణము కాదు. ఇట్లు పరమాత్మ తలంచినంతనే ముని వచ్చి తనరాక రాజునకుం దెలిపెను. ఆ వాక్యమూలమున భగవత్సంకల్పము దశరథునిమనస్సును బరవశమును జేసెను. రాజు మునిని బూజించెను. తోడితెచ్చి కూరుచుండఁజేసి భగవత్సంకల్పరూప కర్మము తన్నుంబురికొలుపఁగా మహర్షిని బెక్కుభంగులం బొగడి నావలనఁ గావలసిన

"కార్యస్య న విమర్శం చ గంతుమర్హసి కౌశిక,
కర్తా చాహమశేషేణ దైవతం హి భవాన్మమ." ౫౬

పనియేమి కలదో తెల్పుఁడు. తప్పక నెఱవేర్తును. నేను మీ వాంఛితమును దీర్పఁజాలుదునో చాలనో యని సందియ మొందకుము. ఎట్టి కడిందికార్యమైనను దప్పక దీర్తును. అని

ప్రతిన చేసినట్లు పలికెను. మహర్షి యెంతయు నానందించెను. తనవచ్చినపని నెఱవేఱెననియే తలంచెను. అయినను దశరథు నకు హెచ్చరిక చేయఁదలఁచి రాజా! కులీనుఁడవై మహాజ్ఞాన సంపన్నుఁడగు వసిష్ఠమునియుపదేశమునకుఁ బాత్రభూతుఁడ వగు నీవిట్లు పల్కుట న్యాయ్యమే. నామనోరథమును దెల్పెదను. దాని నొనరింపవలయు. సత్యవచనుఁడవు కమ్ము. అని హెచ్చరించెను. దీనింబట్టి పరికింపఁగా నాకాలమునందుఁ బ్రజాసామాన్యమున కెట్లు సత్యమున విశ్వాసముకలదో తేటపడును. సత్యము పరమాత్మస్వరూపమనియు దానిం దప్పి ప్రవర్తింపరాదనియు వారిభావముకదా. సత్కులమునఁ బుట్టి పెద్దలసేవించినవారసత్యమాడరనియేకదా సారము. అట్టి నీ వసత్యమాడిన వంశగౌరవమును బాడుచేసినవాఁడ వగుటయ గాక మహాజ్ఞానియగు వసిష్ఠునకు శిష్యుఁడవన్నపేరు మూలమున నామహాత్మునకుంగూడఁ దలవంపులు గల్గించినవాఁడవు కూడ నగుదువనియేకదా యిందుఁగలభావము. అంతియగాక వసిష్ఠోపదేశమునఁ బనమాట నెఱవేర్చుననునూహ విశ్వామిత్రునకుం గలదనియుఁ దేటపడును.

"అహం నియమమాతిష్ఠే సిద్ధ్యర్థం పురుషర్షభ."

అన్నమూలము తెలకవ్యాఖ్యాతమాత్రము 'విఘ్నం పురుషర్షభ' అని వ్రాసెను. 'విఘ్నర్థం యాగామ్' అని తదాశయము. రాజా! నే నొకఫలమునుగోరి యాగముచేయ సంకల్పించితిని. దాని కిరువురాక్షసులు విఘ్నకర్తలు. వారు కామరూపులు. కావున నాకాశముననుండి రక్తమాంసములు గురియించి వేదిక నపరిశుద్ధముగాఁ జేయుదురు. కాన నించుక శిష్టముగా

నున్న యాయజ్ఞముసాగలేదు. వారిరువురుమారీచసుబాహువు లనుపేరుగలవారని తెలిపెను. స. గోరి యనఁగా నొకఫలము. నాశించియే యని య మగును. అది మంచిది కాదనికాఁబోలు "విధ మ్" అనుపాఠమునే తిలకవ్యాఖ్యాత గ్రహించిరి.

"తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర,
అసక్తోహ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః" ౧౯ గీత ౩అధ్యా.

అన్న శ్రీకృష్ణోక్తి ననుసరించి ఫలమునుగోరి చేయుయజ్ఞము భగవత్సమ్మతముకాదని నమ్మి విధ్మస్మను పాఠమును గ్రహించినట్లు కనుపట్టుచున్నది. సిధ్మ మ్మనఁగా శ్రీరామాగమన రూపఫలమును గోరి యనుభావము తక్కినవారు గ్రహించిరేమో. ఈఫలము గోరఁదగినదే. ముముక్షువులును గోరునది యే యగును రక్తమాంసములఁ గురియించిరి. అనుటచేత నహింసారూపమైనది నే నారంభించినయజ్ఞమని మునిమతమని యూహింపవచ్చును. మునులు చేయుయజ్ఞములు ప్రాయశః ఫలమూలాదులవలన సాగునవియే యనవచ్చును. పరమతపోధనులు దయాపరతంత్రహృదయులు జంతుహింసచేయుదురని మనము నమ్మరాదు. ఒకానొకరుందురేమో. తఱచుగా నహింసాకర్మమే వారి కిష్టమనవచ్చును.

వారట్లు పాడుచేయఁగా నుత్సాహము నశింప నాదేశము ను వదలివచ్చితిని. రాజా! వారిపై నాయాగ్రహము నుపయోగింపరాదు. ఆచర్య యట్టిది. కావున శాప మీయఁజాలకున్నాఁడను. అని ముని పలికెను. శాప మనఁగా స శత్రువు నణంచు కర్మము. అది యొకప్రయోగము. ప్రయోగము లాఱువిధములు. అం దిది మారణప్రయోగము. ఉపాసకుఁడు

దేవత నుపాసించి సంతుష్టమతిగా నొనరించి తన్మూలమునఁ దన శత్రువును బొలియించును. ఇదియే మారణప్రయోగము. ఒక్క ప్రయోగమువమూలమునఁ జిరకాలము చేసినజపఫలము నశించును. మరల నెంత కాలమో యుపాసింపవలయును. ఇంకొక్కసారి వేఱొకశత్రువును జంపఁ బంపరాదు. ఆదేవతయే యీతనిపై దేషించును శాంతిప్రయోగముతప్ప ఉచ్చాటన స్తంభనాకర్షణవిదేషమారణములన్నియు మరల మరల నొకరిని బాధింపఁబూన నతనికే హానికల్గును కావున నుపాసకులు పరులు బాధించిన నోర్చియుందురు. తపస్సుకూడ నొకయుపాసనమే కాని వేఱుగాదు. కాని యించుక భేదము కలదు. ఉపాసనము చేయంజేయ మనస్సు పరమపవిత్రమగును. అపుడు సర మా దేవతగానే యాతనికిం దోఁచును. ఆస్థితినే

"సర్వభూతస్థ మాత్మానం సర్వ భూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. ౨౯
యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి. ౩౦
సర్వభూత తం యో మాం భజత్యేకత్వమాస్థితః,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే." ౩౧

గీత. ౬ అధ్యా.

అని శ్రీకృష్ణపరమాత్మ తెలిపెను. ఉపాసనమున కదియే ఫలము గాని వేఱొకండు కాదు తొలుదొలుత నుపాసకుఁడు జపమాలికం దాల్చి లెక్కించును. ఆస్థితియం దాతనిచిత్తము తానువేఱు దేవతవేఱు అని యుండును. చాలకాలము కాఁగా సత్కర్మానుష్ఠానఫలముగా జపమాలికాదిపరికరములతో

నక్కఱయుండదు. తదాకారముగా సర్వముం గాంచఁగల్గును. అప్పుడు తానువేఱని భావముకలవాఁడు కాకయుండును. అట్టి వారికి సర్వదా భావనయే యుండును. అట్టి భావన కుదురుట మంత్రతంత్రములు కల్పింపఁబడినవి. మంత్రము జపించుచు సంఖ్యయందు నష్టదేవతారూపమునందు నాతనిబుద్ధి నిలుపం దగు. దానికే యోగమని పేరు. దానికి ఫలము సర్వము తన్మయముగాఁ గనుఁగొనుటయేగాక మఱేది? వానినే శ్రీహరి సమదర్శనుఁడని పల్కెను. ఆభక్తుఁడే నాకుఁ బరమసమ్మతుఁ డగు ననియె కావున నెంతకాలమో శ్రమించి చేసినతపమును దుచ్ఛశత్రుసంహారమునకై యుపయోగింపరాదనునీతి యీ విశ్వామిత్రవాక్కులనుండి మనము గ్రహింపవలయును. శాపమునకుమున్ను దాతనిమనస్సునఁ గ్రోధము ప్రవేశింపవలయును గదా. శమీకమహాముని చెప్పినట్లు క్రోధము తపోబాధకము.

> "క్రోధోహి ధర్మం హరతి యతీనాం దుఃఖసంచితమ్,
> తతో ధర్మవిహీనానాం గతిరిష్టా నవిద్యతే. ౮
> శమ ఏవ యతీనాం హి క్షమిణాం సి కారకః,
> క్షమావతామయం లోకః పరశ్చైవ క్షమావతామ్. ౯
> తస్మాచ్చరేథాస్సతతం క్షమాశీలో జితేంద్రియః,
> క్షమయా ప్రాప్స్యసే లోకాన్ బ్రహ్మణస్సమనంతరాన్." ౧౦
>
> మహాభారతము. ఆదిపర్వము ౪౨ అధ్యా.

ఓర్పు సర్వతపఃఫలసంపాదకము మనస్సునఁ గ్రోధమను నంతశ్శత్రువు పొడచూపిన్న శాంతతపస్సున కందు నిలువఁజోటులేదు. తక్కినశత్రుపంచకము దానిమూలమునఁ జేరును. కావుననే పడరానికష్టములు తొడరినను శాంతమును గోలుపోయి తపో

వ్యయమును గావించుకొన మహర్షులు సమ్మతింపరు. పరులకు బాధలుగలిగింప సంకల్పించినను జేసినపుణ్యము కొంత నశించును. సదా పరాపకారమునే కోరువారలకుఁ బుణ్యకర్మములు కూడ ఫలింపవు. ఇది సరకాలనియమము విశేషించి దైవప్రార్థనాది సత్కార్యములయందు 'తథాభూతాహి సాచరా' అన్న రీతిఁ గ్రోధముం గొనరాదు. శాంతము కలిపి మనస్సు చంచలతం బాసియుండఁగా భగవత్పూజాదికము నొనరింపవలయును. అంతియకాని తమోగుణమును బాదుకొలిపి యెట్టిసత్కార్యము నాచరించిన నది ఫలింపదనియే యీపట్టునఁగలనీతి.

తనకార్యము నిట్లు పలికి నాయీకార్యమునకు సాయపడుటకు సత్యపరాక్రముఁడగు రామచంద్రుం బంపుము. పిల్లజుట్టుకలవాఁడే యెట్లు పంపుదునని యనుమానింపకుము.

"శక్తో హ్యేష మయా గుప్తో దివ్యేన స్వేన తేజసా,
రాక్షసా యే వికర్తార స్తేషామపి వినాశనే." ౯

నాచే రక్షింపఁబడి స్వకీయదివ్యతేజస్సుచేత యజ్ఞధ్వంసకరులగు రాక్షసుల నశింపఁజేయును. "దివేన నేన తేజసా" స్వీయవైష్ణవతేజమున నని యము దేవతాతేజస్సుచేత నని యము పలుకరాదు. నేన=తనదగు, దివేన=వైష్ణవమగు, తేజసా=తేజస్సుచేత నని యము గానఁ దనదగు దివ్యతేజస్సుచేత ననఁగా వేఱ ము తెలుపరాదు. శ్రీరామమూర్తి శ్రీమహావిష్ణువేయని యంగీకరించువారు తనదివ్యతేజస్సుచేత ననఁగా విష్ణుతేజస్సుచేతనే యని యము చెప్పక మాననయితిగాదు. దీనిచేత మాయాసమాచాదితుఁడగు శ్రీమహావిష్ణువే రామచంద్రుఁడని స్పష్టమగును.

విశ్వామిత్రుఁ డంతతో నూరకయుండక రాజా! నేను శ్రీరామమూర్తి కనేకమార్గములచేత శ్రేయస్సును గల్గింతును. సత్యము. అనుమానమొందకుము. దానిచేత మూఁడు లోకములలో ఖ్యాతిని గడించును అని పలికెను. రామమూర్తి సామాన్య రాజపుత్త్రుఁడు కాఁడని పరమేశ్వరుఁడేయని ముల్లోకములవా రెఱుంగఁగలరని తాత్పర్యము. అదియే నాచేతఁ గాఁదగినకార్యమని మునియాశయము. తాటకావధము, అహల్యా శాపవిమోచనాది మహాకార్యములచేత నని సారము. ఈకార్యములే పురుషోత్తముఁడని యెల్లలోకములఁ జాటఁగలవు. లోకమున ఖ్యాతిని గడించుటకేకదా యెల్లరు ప్రయత్నింతురు. అట్టిఖ్యాతి నప్రయత్నమున నామూలమున లభించును. మంచిసమయ మిది. కేవల పుత్త్రప్రేమమున దానిఁ బోఁగొట్టుకొనకుమని ముని హెచ్చరించెను.

"నహి కారణం వినా కార్యస్యోత్పత్తిః."

అన్నన్యాయానుసారము తాను మహావిష్ణువైనను నామూలమున నీయవతారమున ఖ్యాతిగడింపఁ దగియున్నది. నీకేల యీపామరజనులకువలెఁ బ్రీతిగలిగెను. రాక్షసుల సంహరించునో లేదో యన్నసంశయమును వదలుమా యని యిచ్చట మునిభావము.

రాజా! ఇంకొక్కరహస్యము కలదు. ఈ నీ కుమారుని మ్రోల నామహారాక్షసులు నిలువఁజాలరు. క్షణమాత్రముకూడ నుండలేరు. వేఱొక్కరెవ రైన వారిని జంపలేరు. అను నీముని పల్కులు కర్మప్రాముఖ్యమును వెల్లడించుచున్నవి. రామమూర్తి రూపమును విష్ణువు ధరించినఁగాని వారిని జంపఁజాలఁడు. కాన

నీరాముఁడుతప్ప నెవా రుకాని వారిని వధింపలేరు. అనఁగా నేప్రాణి కెవా నిచే మృతిగల్గ విధియుండునో దానిని మార్ప రాదు. భగవంతుఁడుకూడ నట్లేయాకార్యమును నెఱవేర్చును. మానవరూపమున భగవత్తేజము మారీచసుబాహువులఁ జంపఁ జాలునేకాని వేఱొకరూపమున నాకార్యము చేయఁజాలదు. అనఁగాఁ జేయదు. ఏలయనఁగాఁ గర్మముకూడ భగవత్స్వరూ పమే కావున స్వో వ్యాఘాతము కాకయుండ నామార్గముననే యాకార్యమును దీర్చునని భావము.

"అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః,
మామాత్మపరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః. ౧౮
తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్,
క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు. ౧౯
ఆసురీం యోనిమాపన్నాః మూఢా జన్మనిజన్మని,
మామప్రాప్యైవ కౌంతేయ తతో యాంత్యధమాం గతిం. ౨౦
త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః,
కామః క్రోధస్తథా లోభస్తస్మాదేతత్త్రయం త్యజేత్." ౨౧
గీత. ౧౬ అధ్యా.

అను నీశ్రీకృష్ణపరమాత్మోక్తి కర్మసిద్ధాంతమును దృఢపఱచుచు నెవా రెట్టి క్రూరకర్మము చేయుదురో వారే యాత్మవినాశన మును గూర్చుకొందురని తెలుపుచున్నది. ఈసిద్ధాంతమే లేకున్న భగవంతుఁడు సర సాక్షి నిర్లిప్తుఁడన్నఖ్యాతి యెగిరి పోవును. కావుననే

"మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్.
33 గీత ౧౧ అధ్యా.

యథా ప్రదీప్తం జ్వలనం పతంగా విశంతి నాశాయ సమృద్ధవేగాః,
తథైవ నాశాయ విశంతి లోకా స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః." ౨౯

అను నీశ్రీకృష్ణమూర్తియుత్తరము నర్జునుని ప్రశ్నమును బై కర్మసిద్ధాంతమును దృఢపఱచుచున్నవి. కాఁబట్టియే కదా "గహనా కర్మణో గతిః" అని భగవంతుఁడు చెప్పెను. అట్టులగుట నెట్టికర్మముచేసినవారికి నెట్టి మృతిరావలయునో దానిని భగవంతుఁడు మార్ప శక్తుఁడయ్యును మార్పఁడనియు నీయము

"యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
నస సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాంగతిమ్. ౨౩
తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యకార్యవ్యవసితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి." ౨౪

గీత ౧౬ అధ్యా.

ఈవాక్యములు దృఢపఱచుచున్నవనియు నెఱుంగవలయును. ఈసిద్ధాంతమును మనమున నిల్పుకొన్నచో శత్రుమిత్రత ముల సత్యము తేటపడును ఈయర్థమునే యీరామాయణశ్లోకము తెలుపుచున్నది. చూడుఁడు.

"వీర్యోత్సిక్తౌ హితౌ పాపౌ కాలపాశవశంగతౌ,
రామస్య రాజశార్దూల న పర్యాప్తౌ మహాత్మనః." ౧౭

అనఁగా వారు కాలపాశమునకు లోనైయున్నవారు. నీకుమారుఁడు నిమిత్తమాత్రముగ నుండును. స కర్మముననే వారు మృతినొందుదురు. కాని హేతుభూతుఁడు నీకుమారుఁడగునని సారము. కర్మసిద్ధాంత మెంతబలవత్తమమో యోజింపుఁడు. కనుక మానవుఁడు సత్కార్యములనే యాచరించుచు వానినే సంకల్పించుచు నుండవలయును. దాననే తనమేలు

తాఁ జూచుకొన్న ట్లగును. దుస్సంకల్పములు దుష్కార్యాచరణము తనమేలును దానే పోఁగొట్టుకొన్నయట్లని తెలియఁజేయును. ఈవిషయమునే బు మంతుఁడు సదా మననము చేయుచుండిన సత్కార్యాచరణమున నాసక్తిగల్గుననుట సత్యము.

రాజా! పుత్త్రుఁ డనుస్నేహము వదలుకొనుము. వారు రాముని చే హతులగుదురని శపథము చేయుచున్నాఁడను. వారు మృతులైరనియే యెఱుంగుము. అని విశ్వామిత్త్రుఁ డనియె. అనఁగా నాకొడుకు రాముఁడనుపామరులబు చే నుంచుకొన్న స్నేహమును వదలుకొనుము. అనఁగా "పరంధాముఁడు రాముఁడను" బు<sup>-</sup>గలిగి యుండుమని రహస్యము. విశ్వామిత్త్రుఁ డీవిషయము నెఱుంగుటంబట్టియే ప్రతిజ్ఞ చేయుచున్న వాఁడ ననియె. ఈతేజస్సుప్రోల నారాక్షసులు శలభములగ్నింబడునట్లు మ్రందుదురని పలుకఁ గారణ మిదియే. దశరథుఁ డెఱుంగఁడు. ముని తెలిపిన నెఱుంగఁడు. ఏల?

"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే." ౧౪
గీత. ౭ అ.

అన్నభగవదుక్తిప్రకారము భగవన్మాయ యెల్లరం గప్పియుండును. కేవలజ్ఞానసంపన్నులు వసిష్ఠాదులుతప్ప నితరులు తెలిసికొనఁజాలరు. పుత్త్రుఁడనియో మిత్త్రుఁడనియో బంధువనియో భావింతురు. కాని పరమేశ్వరుఁడని తలంపకయుండఁ బ్రకృతి వారి నాచ్ఛాదించును. కావుననే ప్రకృతి నారాధింపవలయును. ఈవిషయమునే సౌందర్యలహరియందు శ్రీశంకర భగవత్పాదులు,

"తనీయాంసం పాంసుం తవ చరణపంకేరుహభవం
విరించిస్సంచిన్వన్ విరచయతి లోకానవికలం,
వహత్యేనం శౌరిః కథమపి సహస్రేణ శిరసాం
హరస్సంక్షుద్య్యైనం భజతి భసితోద్ధూళనవిధిమ్." ౨

అని తేటపఱచిరి. మహామాయ యనంబడు నామూలప్రకృతినే యుపాసించినఁగాని భగవత్సేవకుఁ బాత్రులుకారు. అనఁగా సకలవిధములగు పూజలు ఏరూపమునకుఁ జేసిన నారూపమెల్ల బ్రకృతియే కావున నామెకుం జెందును. నిరాకారమగు పరత త్త్వమును బూజింప నవకాశమే లేదు. కాన ధ్యానమే యందుల కుపయోగము. ఆధ్యాన మెట్టిదనఁగా

"తమేవ శరణం గ సర్వభావేన భారత,
తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్." ౬౨
గీత. ౧౮ అధ్యా.

అన్న శ్రీకృష్ణోక్తి ననుసరించినదే. అదియే ధ్యానము. ఆస్థితి యందుండువాఁడు సమదర్శనుఁ డనంబడును. అట్టివానికి భేదబుద్ధు లుండ వలనుపడదు. సర ము భగవత్స్వరూపముగా నాతఁడు భావించును. "సర ం విష్ణుమయం జగత్" అని భావింతుమని కొందలు శ్రీవైష్ణవు లందురు. సత్యమే యందును. కాని యపుడు శివుఁడుకూడ విష్ణువే యయె గదా. శివుఁడు తక్కువ యనుభావ మెట్లు కలుగును? దాని కవకాశమే లేదే. అట్టియవకాశమును గల్గించుకొనువాఁడు భక్తుఁ డగునా. ఏవిధమునఁ బరికించినను భగవంతుఁడే కారా ము సకలరూపములుగా నవతరించుననియు నేవస్తువును జూచిన నాభగవంతునిగా భావింపవలయుననియు "ప్రణమేద్దండవద్భూ

మావాశ చండాలగోఖరమ్" అని శ్రీభాగవతమే చెప్పుచున్న దనియుఁ గనఁబడును. అంతియగాని భక్తున కిట్టి తుచ్ఛతమభేద భావము పనికిరాదనుటయే యిటఁగలసారము.

ఈయభిప్రాయమునే విశ్వామిత్రుఁ డింకను

"అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్."

అన్నశ్లోకముచేతనే దృఢపఱచుచున్నవాఁడనియెఱుంగవలయు. ఈశ్లోకము పరతత్త్వము రాముఁడే యని సిద్ధాంతముచేయు చున్నది. దీనిసారమును బాఠకమహాశయులు చక్కఁగాఁ బరి కింతురుగాక. విశ్వామిత్రుఁ డనేకకష్టములకు లోనై తపఃఫల మును బోఁగొట్టుకొని తుదకు విజితేంద్రియుఁడై బ్రహ్మర్షియైన వాఁడు. కావున గర్వశూన్యుఁడే యగు. ఒకప్పు డాగ్రహ మేలకలుగు ననఁగా నది లోకమున కుపకారముచేయుటకే యని యెఱుంగవలయును. కావున నీశ్లోకమునందలి విశేషార్థమే ప్రధానముగా భావింపవలెనుగాని ప్రాతీతికార్థము ప్రధాన ముకాదు. ముని దశరథునకుఁ గొడుకునందుఁగల లౌకికస్నేహ మును వదలించుచున్నవాఁడు. కావున బొమ్మతట్టుచు నేనని పలుకఁడు కావున "నేను" అనుమాటయం దొకవిశేషార్థము గలదని మన మూహింపవలయును.

"తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా,
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః" 34

గీత. 4 అధ్యా.

అన్నభగవదుక్తి ప్రకారము సద్గురువులను సేవించి వారిని బ్రశ్నించి జ్ఞానస్వరూపము నెఱుంగవలయును. కాఁబట్టి "అహం=నేను." అనఁగాఁ జిరకాలము పెద్దల నుపాసించి యుచి

తరితిఁ బ్రశ్నించి సేవచేత నీతఁడు పాత్రుఁడని వారికిఁ దోఁచు నట్లుచేసి జ్ఞానమును సంపాదించినవాఁడ ననియే యర్థము. అది కేవల లౌకికజ్ఞాన మనుకొందువేమో కాదు. ఆముష్మికజ్ఞానము. అనఁగా మోక్షము నొందుమార్గమును దెలుపునట్టిది. దానిని గంఠపాఠముగాఁ జేసినఁజాలునా. చాలదు. దానిచే నేకృత ముల నొనరించిన ముక్తికిఁ జేరఁదగునో యట్టికృత ముల నొనరించి యని యర్థము. స కారా మిమ్మాట చెప్పుచున్నాఁడేమో యనుసంశయము రాజుమదికిఁ గల్గునో యని యది కలుగ కుండ నిట్లు పలికెనని భావము. అనఁగా ముక్తినిగోరి కర్మముల నాచరించువారు తమ కొక కార ము కలదని భావింపరనియే సారము. అట్టి నేను అని య ము చెప్పవలయును. సత్య పరా క్రముఁడని మహాత్ముఁ డనఁగా సామాను ఁడు కాక భగవం తుఁడని యీరాము నెఱుంగుదును. ఒక్క నేనే కాదు. మహా తేజుఁడగు వసిష్ఠమునియు నెఱుంగును. మే మిరువుర మేకాదు. తపోధనులగు నీవామదేవాదు లెఱుంగుదురు. అనఁగా నేను గారా ని. కావున నామాట నష్టవేమో. మీకులాచార్యుఁడు. నాకు విరోధి. అట్టి వసిష్ఠు నడుగుము. నిరంతరతపోనిధులగు నీవామదేవాదు లెఱుంగుదురు. వారినెల్ల నడిగి సర సమ్మత మగుచో నాకొసఁగుము. అని యిందుఁగలసారము.

నీకొడుకు సాక్షాత్పరమాత్మ యని మేమెల్ల నెఱుంగు దుము కావునఁ బుత్రప్రేమము వదలుము మహానుభావుఁడగు మహావిష్ణువే యని తలంపుము. అవతరించినది లోకరక్షణా ము. కాని నిన్నొక్కని సంతోషింపఁ జేయుటకుఁగాదు. ఆవేదుకయుఁ జెల్లించెను. ఇఁక నవతారప్రయోజనమును గనబఱపవలయు.

కావున నా కొసంగుమని విశ్వామిత్రునియాశయమని మన మెఱుంగవలయును. విశ్వామిత్రుఁడనఁగా లోకమునకు మేలు చేయువాఁడని యర్థము. విశ్వ శబ్దమునకు దీర్ఘము ఋషివాచక మగు మిత్ర శబ్దము పరముకాఁగా వచ్చునని వ్యాకరణము తెల్పెడిని. అనఁగా నేకార్యముచేసిన నది లోకమున కుపకార మున కగును. అంతియకాని స్వార్థమునకుఁగాదు. కాఁబట్టియే రామావతార ప్రయోజనము లోకులకుం దెలిపి తనకృత్యము నెఱవేర్చి భగవత్సేవకై హిమాలయమునకుఁ బోవ నిశ్చయిం చెను. సీతాకల్యాణానంతరమే తపస్సునకుంబోయెను.

ఇందలిసార మేమనఁగా భగవంతుని యద్భుతరూపము రామనామమున నొప్పెను. ఆరూపము లోకోత్తరసౌందర్యము గలది. మహర్షులకుంగూడఁ గోరఁదగినది. మన్మథకోటిసదృశ మన్నను జాలదు. దానికి సాటి యదియే. కావున నట్టి రామ రూపమును గన్నులారఁ గాంచి హృదయదర్పణమునందు దానిం జిత్రింపంజేసికొని యేకాంతమునఁగూరుచుండి ధ్యానింప వలయు ననియే విశ్వామిత్రుని వాంఛితము.

"అంతరర్చనసుప్రీతా బహిరర్చనలోలుపా"

అన్నసూక్తి ప్రసిద్ధ మేకదా. బాహ్యార్చనమునకంటె నంతరర్చ నము అనఁగా మానసికధ్యానము విశేషఫలప్రదము. అది యోగగమ్యము. యోగమునఁగాని మనస్సు సాభిమతదేవతా రూపమునం దేకాగ్రతం గాంచదు.

"తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః,
ఉపవిశ్యాసనే యుంజ్యాద్యోగ మాత్మవిశుద్ధయే. ౧౨
ప్రశాంతాత్మా విగతభీర్బ్రహ్మచారివ్రతే స్థితః,

మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః." ౧౪

గీత. ౬ అ.

అను నీశ్రీకృష్ణవాక్యములు పైయమును దృఢపఱచుచున్నవి కదా. భగవంతునకుఁ బ్రియుఁ డెవ్వఁడనఁగా యోగయే యన వలయు. కొందఱు భక్తుఁ డందురు. భక్తి యోగమనియే దానికిం బేరు కలదు. భక్తి యోగరూపమున నభ్యసింపవల యును. మనస్సు భగవంతునియందుఁ జేర్చి ధ్యానింపనిభక్తి తుచ్ఛ ఫలదము. కావుననే

"తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున." ౪౬ గీత. ౬అ.

అని గీతాశాస్త్రమున శ్రీకృష్ణుఁడే తెలిపెను. ఇట్లే కర్మయోగమునందుఁ గర్మయోగి యందఱికన్న నధికుఁడని తెల్పెనా. భక్తియోగమునందు యోగికన్న భక్తుఁ డధికుఁడని తెల్పెనా. గీతాశాస్త్రమునందు వెదకినను గానరాదు. తపసి, జ్ఞాని, కర్మి యనువారు మువ్వురుత్తములు. వీరందఱికన్న యోగి యుత్తముఁడు. అని స్పష్టపఱచెను. ఏల? యోగముచేతఁగాని మనస్సు స్థిరతంగాంచదు. దిట్టముగాఁ దిని కూరుచుండి చందనమలంది తాంబూలచర్వణము చేయుచు మాటలు చెప్పవచ్చును. అవి పరులవంచింపఁ బనికివచ్చును. తాను దరింపఁ బనికిరావు. ఏల? ఆతఁడు యోగికాఁడు. యోగము నభ్యసించిననఁగాని మనస్సు ఏకాగ్రతం గాంచదు. అదిగాంచకయున్న భగవత్పూజ నిరర్థకము కాకమానదు.

"యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః,
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే. ౭

నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్,
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్గచ్ఛన్ స్వపన్ శ్వసన్. ౮
ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి,
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్. ౯
బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః,
లిప్యతే న స పాపేన పద్మపత్ర మివాంభసా. ౧౦
కాయేన మనసా బుద్ధ్యా కేవలైరింద్రియైరపి,
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాత్మశుద్ధయే." ౧౧
గీత ౫ అధ్యా.

అని శ్రీకృష్ణపరమాత్మ తెలిపినది పై భావమును స్పష్టముచేయు చున్నది. అనఁగా సమాహితమనస్సు కలవాఁడు కాకయే భగవత్పూజాదికము చేసిన నది యల్పఫలప్రదమనునదియే దీనిసారము. సమాహితమనస్సు యోగాభ్యాసము చేతఁగాని వేఱొండుపాయము చేతఁ గాదనుట సిద్ధాంతము.

కొందఱు పరమభాగవతులమని యర్థాపేక్షచే వేషముఁ దాల్చి తిరుగుచు భక్తి నుపన్యసించుచు నుందురు. అందుఁ గొందఱు కొన్ని యోగముల నుపదేశింతురు. కాని యవి యోగములు కావు. అ యోగములు భుక్తియోగములు. యోగికి భేదబు యుండ నవకాశమే లేదు.

"ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా. ౬౧
తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత,
తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్." ౬౨.
గీత ౧౮ అధ్యా.

అన్న శ్రీకృష్ణవాక్యమును బఠించినచో భేదబుద్ధి కవకాశ మేది! ఈశ రుఁ డొక్కఁడే విష్ణువే కానిండు. రెండవవాఁడు లేనప్పుడాయీశ రశంకరాదినామము లాపరమాత్మకుఁ జెల్లవా. చెల్లకుండినచో నతఁడు భగవంతుఁ డెట్లగును? కావున నట్టి కపటయోగుల మోసపుమాటల నాలింపరాదు. సర రూప ములుసర నామములుగలిగి సరా ంతరా మిగ్రైె యలరు భగవం తు నేమానప్పుఁడేరూపమున భక్తిగలిగి ధ్యానించినను ఫలము గలదు. అట్లుగాక యీరూపమున నీనామమును ధరించినవా నినే ధ్యానించినఁగానియనుగ్రహింపఁ డనునట్టికుత్సింభరోపదే శము తుచ్ఛతమము నిష్ఫలము.

ఈవిశ్వామిత్రోపదేశము ననుసరించి మనము చక్కఁగా నాలోచించిన భగవంతుఁడే రామరూపమున భక్తులనుఁ రింప ధర్మమును స్థాపింప ధర్మేతరావలంబకుల నడంప నవతరించెను. కావున నాదివ్యమంగళవిగ్రహమును గన్నులారఁ గాంచి యీ రూపమునే ధ్యానింపఁదగుననియు నాకార్యమును సీతా వివాహానంతరము విశ్వామిత్రుఁ డొనర్పఁబూనెననియు మన మెఱింగి భగవంతుని రామరూపమున ధ్యానింపవలయునని తేలెడిని ఈఘట్టమునఁ నాంధ్రీకరణమున నెంతమాత్రము గ్రహింపఁబడినదో కనుఁగొందము.

"క. విమలాత్మక పుత్ర, హా మము విడువుము నీదుభావమంత నెఱుఁగుదున్
సమరమున దానవుల నిక్కము రామశరాభిహతులఁగా నెఱుఁగు మొగిన్.

తే. రామభద్రుఁడు సత్యవిక్రముఁడు లోక
హితుఁడును మహాత్ముఁ డని మది నే నెఱుఁగుదు

నీవసిష్ఠమహాముని యెఱుఁగు మఱియు
నితరతాపసు లెఱుఁగుదు రితనిమహిమ.''

గోపీనాథరామాయణము.

క. "చాలం డని కలనికిఁ బసి, బాలుం డని విడువు పుత్త్రుపై మోహంబున్,
జాలరు బ్రతుకఁగ నీసుతు, మ్రోలసురాహితులు శపథముల్ వచియింతున్.
తే. ఏ నెఱుంగుదు రాజేంద్ర యీమహాత్ము
రాము సత్యపరాక్రమోద్ధాము మఱి ప్ర
సిద్ధతేజోధికుండు వసిష్ఠమునియు
నీతపస్విసతు లెల్లరు నెఱుఁగువార.''

వావిలికొలనురామాయణము.

చం. "నరవర! గోమునం బెరిగినాఁడు కుమారుఁ డటంచు వా వి
స్ఫురణము నొందఁబోకు దనుసూనులఁ జంపఁగఁజాలు నంచు నే
నరసి ప్రతిజ్ఞ చేసెద రణావనిలో హతు లైనయట్టు ల
య్యరుపుర నిశ్చయింపు మది యెట్టు లెఱింగితివన్నఁ జెప్పెదన్.
సీ. పెక్కండ్రగురులసేవించి జ్ఞానము నంది యపవర్గమును బొందునట్టికృత్య
ములఁ జేసి మునినయి వెలయం నే నీరాము సత్యపరాక్రమశాలియనుచు
మఱి మహాత్ముండని గుఱుతింపఁజాలుదు నేనె కాదు వసిష్ఠమౌనిపతియుఁ
నెఱుఁగంగఁజాలు మహితతేజు డౌటచే సతత తపోనిష్ఠ సలుపుచున్న
తే. వామదేవాదు లైనయిర్వరమునీశులును నెఱుంగుదు రో భూప!''

ఆంధ్రశ్రీమద్రామాయణము.

ఆర్యులారా! మూలము పైన వ్రాయఁబడినది. విశేషాములును వ్రాయఁబడినది. తెనిఁగించినవారిపద్యములును వ్రాయఁబడినవి. ఇందునుంగలతారతమ్యముల నిర్ణయించుభారము మీాది. నాపని యది కాదు. పక్షపాతమునఁ గొందఱు విమర్శకులవలె నా రామాయణమునఁ గలదోషములఁ జూపఁబూనినయట్లు

నటించి వావిలికొలనువారిపద్యములం బొగడుచు నన్నుఁ దెగడుటంజేసి రెండుమాటలు వ్రాసెదను. యథామూలమునఁ దెనిఁగించిన వావిలికొలను వారిరామాయణమునందు "చాలం డని కలనికి పసిబాలుండని" కలదే. దీనికి మూల మేది? వ్యాఖ్యానాభిప్రాయము కలుపఁగూడదనికదా వారియభిప్రాయ మని వీరియాశయము. 'హతౌ తౌ విద్ధి రాక్షసౌ' అని మూలము. ఆరాక్షసు లిద్దఱు చచ్చినయట్లే యెఱుంగుము అని మూల మున నుండఁగా "చాలరు బ్రదుకఁగ నీసుతు ప్రెర్వాల" అని విశ్వామిత్రునిచేఁజెప్పించిరి. మూలాభిప్రాయమేమో తెలుఁగునఁ గలభావమేమో యోజింపుఁడు. విశేషించి వ్రాయను. నా పద్యములఁ గలపదములం గొన్నింటిని జూపి పాదపూరణము లనిరి. "సత పరోక్రమోద్దామ" అనుచో ఉద్దామ అనునది యెట్టిదో "ప్రసి తేజోధికుండు" ఇచ్చుటంగల ప్రసి పద మెట్టిదో "ఈతపస్థ్విసతు లెల్లరు" అనుచోటఁగల "ఈ" యనున దెంతసారసముగ నున్నదో విచారింపుఁడు. "యేఇమేచ తపసిస్థితాః" అన్నమూలమున కిది తెలుఁగఁట. ఎంతబాగుగాఁ బొగడిరి? సెబాసు! సెబాసు! అని మెచ్చవచ్చు. వీరివిమర్శనమునఁ గలశక్తిని. ఇంకఁజాలు ఇట్లే విమర్శింపఁబూనిన ఆంధ్రవాల్మీకి రామయణము నిలుచునా. ఇట్టి కువిమర్శనములు పనికిరావని నే నెఱుంగుదు. కాని వారివ్రాఁతకు బదులుచెప్పితిని. అంతియకాని యొకరికృతిని విమర్శించుపని నాకు సమ్మతముకాదు. అందును బక్షపాతముంగొని కువిమర్శ మొనరించుట మఱింత సమ్మతము కాదు. ఇఁకఁ దరువాతివిషయమును బరికింపుఁడు.

దశరథా! ధర్మలాభమును నిరుపమానయశస్సును శాశ్వతముగా నిలుపఁగోరుదువేని రాముని నాకొసంగుము. అనఁగా లోకమున ధర్మాభివృద్ధిని, పవిత్రయశస్సును శాశ్వతముగా నిలుపఁగోరుట సాధువులమతము. రాముని నాకొసంగినఁగాని లోకమున ధర్మము నిలువదనియు నీవంశకీర్తి శాశ్వతముగా నుండదనియు మునిభావము. దీనిచేత దశరథునకు శ్రీరామచంద్రుఁడు భగవంతుఁడని మఱియుఁ దెల్పెను. ఈ భాగమును జక్కఁగాఁ బఠించిన విశ్వామిత్రముని శ్రీరామమూర్తిమూలమున లోకమునందు ధర్మసంస్థాపన మొనరింపఁ బూనినవాఁడనియు సూర్యవంశప్రతిష్ఠను బెంపొందింపఁబూనినవాఁడనియు రామమాహాత్మ్యము నెఱింగినవారిలో నగ్రగణ్యుఁడనియు స్పష్టమగును కావున భక్తులందఱును విశ్వామిత్రుని రామభక్తాగ్రగణ్యునిగ భావింపవలయును. శ్రీరామసేవయందు నామునివర్యుని గొనియాడవలయు. అమ్మునిచందమున శ్రీరామచంద్రునిదివ్యమంగళవిగ్రహమును మది నిలిపి ధ్యానింపవలయును. ఎల్లకాలము దేవాలయమునఁగల పాషాణవిగ్రహమునే దర్శించుచున్నఁ జాలునని తృప్తిపడక యారూపమును మనోదర్పణమునఁ బ్రతిఫలింపఁజేసికొని యేకాంతమునఁ గూరుచుండి ధ్యానింపవలయును రామమూర్తియే పరదైవమని పరదేవతలు నీరామసరూపులే యని నమ్మవలయును. రామునికంటె బ్రహ్మశంకరు లల్పులనిమాత్రము భావింపకుఁడు. రాముఁడే శివబ్రహ్మలని భావింపవలయును. అదియే రాముని పరదేవతాత్మకత మును వెల్లడించును. భేదబుద్ధి నడంచును. బ్రహ్మరూపమునను, శివరూపమునను శ్రీరాముఁడే సృష్టిలయ

ములను జేయుటకు నున్నవాఁడని తలంచిన నీతుచ్ఛమగు మత ద్వేషము నశించును. అజ్ఞానము నశించును. పరమతదూషణ జనితమహాపాపము మాయును. శాంతము నెలకొనును. అదియే మనల నుద్ధరించును. దేవతాంతరదూషణమును జేసి కావలె నని పాపమును సంపాదించుకొనక భగవంతునకుఁగల సర్వ వ్యాపకత సర్వాంతర్యామిత ములను బోఁగొట్టఁ బ్రయత్నించి దానిమూలమున రాఁగలశుభములు దహించుకొనక సద్భక్తి గలిగి రామమూర్తిని సేవించి వేషధారులు ధనార్జనలంపటులు నగువారి కపటవాక్కుల నాలకింపక శాస్త్రవిహితపద్ధతి నా రాధించి కృతార్థులు కావలయునని వేఁడుచున్నాఁడను. ఇంకఁ దరువాతికథను జిత్తగింపుఁడు.

## దశరథునివిషాదము

*భూనాథచూడామణి యగుదశరథుఁ డీరీతిగా విశ్వామిత్రుఁడు పలికిన రాముని బంపుమన్నయము గలమాటల నాలకించి రవంతసేపు చేతనము లేనియట్లుండి యంతటఁ దెలివి నొంది యిట్లు పలికెను. † తెల్లనితామరలనుబోలు కన్నులుగల నాతనయుఁడగు రామునకుఁ బదాఱువత్సరములు గాలేదు. (పంద్రెండేండ్లు గలవు.) మీరు పేర్కొన్న క్రూరరాక్షసులతోఁ బోరఁగలయు నైపుణ్యము రామునకుఁ గలదని నాకుఁ దోఁప లేదు. ఏమిపంచినను జేయ సిద్ధముగ నున్నాఁడనంటివే యనఁ బోకుము. ఆడినమాటను వృథచేయను. నాకడ నొక్కయక్షౌ

---

* ఈభాగము బాలకాండమున నిరువదియవసర్గమునుండి సంగృహీతము. †ఊనషోడశవర్షో మే రామో రాజీవలోచనః, న యుద్ధయోగ్యతా మస్య పశ్యామి సహ రాక్షసైః. ౨. అని మూలము.

హీణిసేన కొంతగాక యుండనున్నది. నామాట ప్రకారము నడచును. దీనింగొని నేనుబోయి యారాక్షసులతోఁ బోరాడు దును. నాభటులు మహాశూరులు. పరాక్రమమున రక్కసులకుం దీసిపోవువారు కారు. శస్త్రాస్త్రముల నాఱితేఱినమేటులు. ఇరు వురుగాదు. ఎందఱు రక్కసు లరుదెంచినను బోరాడఁగలరు. నీ కార్యముగదా నెఱవేఱవలయును? అందులకు మే మెల్ల వత్తుము. రాముని గొనిపోవఁ దగదు. ధనుర్ధారినై నేనే యాసేనలకు చక్షుకుఁడనై యు భూమి నిలిచి నామేనఁ బ్రాణము లుండునంత దనుక నాసిశాచరులతో వెనుదీయక పోరాడెదను. నీపూనిన యజ్ఞకార్యము నిరిఘ్నముగా సాగఁగలదు. నే నిదె వచ్చెదను. రామునిమాత్రము కొనిపోవఁదగదు. నాకొడుకు బాలుఁడు కదా! ధనుర్విద్య యందు నిపుణుఁడు కాఁడు. పగవారి బలా బలముల నెఱుంగఁడు అస్త్రబలము కలవాఁడునుగాదు. యు ములయందు నభ్యాసముకలవాఁడుకూడఁ గాఁడు. రాక్షసుల తోఁ బోరాడ నీతఁడు దగఁడు. సత ముగా రాక్షసులు కపట యుద్ధనిపుణులుగదా.

మహాత్మా! నామనవి వినుఁడు. రామునివదలి నేను జీవించి యొక్కక్షణకాలముగూడ నుండఁజాలను. ఈనాయవస్థ నుబట్టి యైన రాముని గొనిపోవఁదగదు. సువ్రతుఁడవగు నోమునీ! రాముని నే కొనిపోవఁ దలంచితివేని చతురంగబలములం గూడిన నన్నును బిలుచుకొనిపొమ్ము. మహాత్మా! అఱువదివేల యేండ్లు గడచినమీఁద నెన్నియోవ్రతము లొనరించి యీ కుమారునిం గంటిని. ఈవిషయమును దలంచియైన నీ వీరాము నిం దోడ్కొనిపోవఁదగదు. మఱియు నాకుఁ గలిగిన నలువురు

కొడుకులలో రామునియందే మక్కువ చాలగలదు. జ్యేష్ఠ సూనుఁడుకదా. ఈతఁడు మిక్కిలి ధార్మికుఁడు. అట్టి యీ రామునిం గొనిపోవఁదగదు.

మునీంద్రా! ఆ రాక్షసులవీర్య మెట్టిది? వారెవరికుమారులు? వారినామ మేమి? వారలయాకృతు లెంతటివి? వారల కధిపతు లెవరు? కూటయుద్ధములనాఱితేఱిన యాదానవులను రాముఁడుగాని నాసేనలుగాని నేనుగాని ప్రతీకారము చేయుట యెట్లు? పరాక్రమఘనులగు నాదురాత్ముల నేయుపాయమున మార్కొనందగును? ఇవన్నియు మహాత్మా! నా కెఱిఁగింపుమా అని ప్రార్థించెను విశ్వామిత్రుఁడును మహీపాలకా! వినుము. పులస్త్యమునివంశమునఁ బుట్టినరాక్షసుఁ డొకఁడు కలఁడు రావణుండని వానిం బిలుతురు. బ్రహ్మను మెప్పించి వరములం బడసి యవారవీర్యమున విజృంభించి రాక్షసులం బెక్కండ్రను జేర్చుకొని ముల్లోకంబులను విశేషించి బాధించుచున్నాఁడు వాఁడు కుబేరునకుఁ దమ్ముఁడు. విశ్రవసుండను మౌనిపుత్త్రుఁడు. రాక్షసుల కధిపతి. వాఁడు ప్రసిద్ధుఁడే యగు. నీవును వానిని వినియే యుందువు. ఆదానవేశ్వరుఁడు తానుగా వచ్చి యజ్ఞములను బాధచేయ ననుకూలము గానియపుడు వానిప్రోత్సాహమున మారీచసుబాహువులను-వారిరువురు నరుదెంచి యజ్ఞవిఘ్నములఁ గావింతురు అనియెను

దశరథుఁ డామునిపల్కులు విని మునివరా! ఆదుర్మార్గులతో నెదిరించి నిలువ నాకు శక్తిలేదు. సకలధర్మముల నెఱింగినవాఁడవు. గురుఁడవు దైవమవు నీవే. కావున నాకుమారుని విషయమునను, తమయాజ్ఞ నెఱవేర్పఁజాలని మందభాగ్యుఁడ

నగు నాయందును బ్రసన్నుండవుగమ్ము. దేవదానవగంధర్వా దు లారావణుని నెదిరించి నిలువఁజాలరుగదా. మానవులమాట యిఁకఁ జెప్పనేల? వాఁడు మహాశూరులనే యడంచువాఁడు. నే నొక్కఁడనుగాని బలంబులంగూడికొని, కొడుకులసాయము గాఁ దీసికొనిగాని రావణునితో నెదిరింపనోప, తుదకు వాని సేనలతోఁగూడఁ దలంపఁజాల.

దేవతలరీతి నొప్పారుచు రణములఁ బరిశ్రమముచేయని నాముద్దపట్టి పున్నామనరకనిస్తారకుఁ డగురాముని నే నేవిధ ముగ నీయఁజాలను. నీయజ్ఞమును బాడుచేయుమారీచసుబా హువులు యుద్ధవిశారదులు బలవంతులు. మిత్రులు. నేను నొక్కఁడెకగాఁజేరినను వారిలో నొక్కనినైనఁ దలఁపడి యుద్ధము చేయఁజాలుదునా. అని దశరథుఁడు పలుకఁగా గాధినంద నుఁడు నిర్వరకోపావేశమున యజ్ఞమునందు మొదట సమిధ లచే వేల్చఁబడి యామీఁద నేయిపోయఁగా బహుళిధ నిచేఁ జెలరేఁగుచు మండునగ్నివలెఁ బ్రజ్వలించెను.

మహనీయులారా! ఈభాగమునుండి నేర్చుకొనఁదగిన విషయములు కొన్నిగలవు. విచారింపఁదగువిషయములును గలవు. వానిం ద్రోసివేయ వలనుపడదు. మునివర్యుఁడు పెక్కు భంగుల రాముని బరమేశ్వరునిగాఁ దెలిపెను. నీకొడుకు విష్ణు మూర్తియే యని తెలుపలేదుగాని యీరామునిశక్తి వసిష్ఠాదు లగు మహర్షు లెఱుంగుదురు. నేను నెఱుంగుదును. అనుమొద లగుమాటలచే బోధించెను ఎన్నివిధముల బోధించినను భగవ న్మాయాసమాచ్ఛాదితం బగుట నించుకంతయుఁ దెలివిగాంచక దశరథుఁడు పుత్త్రప్రేమరశ్శులు బంధింప విచారించుచుండెను.

"గుణమయీ మమ మాయా దురత్యయా" అన్న శ్రీకృష్ణ
వాక్యము సత్యము గాకపోవునా. శ్రీరామచంద్రుఁ డేమో
యేమియుఁ దెలియనట్లూరకుండెను. సర్వసాక్షిగదా. ఆవిషయ
మును మహామౌనులుతప్ప నితరు లెవ రెఱుంగరనుట
సత్యము. కావున నీసంభాషణమును విమర్శింతము. దశరథుఁ
డెట్లు తనవాదము సమర్థించుకొనునో పరికింతము.

విశ్వామిత్రమునిచంద్రా! నాకుమారునకుఁ బదాఱేండ్లకు
నాలుగేడులు తక్కువగానున్నవి. "ఊనషోడశవర్షః" అనఁగా
బదాఱువత్సరములకుఁ దక్కువప్రాయముగలవాఁడని యర్థము.
పండ్రెండని యర్థ మేరీతినగును? అనఁగా రాజపుత్త్రుఁడు కవచ
ధారియై యుద్ధము చేయఁబోవు వయస్సు పదాఱుగా శాస్త్రము
నియమించుచున్నది. యుద్ధయోగ్యత నాకొడుకునకు లేదని
తెలుపుటకుఁ బదాఱుకూడ లేవని రాజు చెప్పెను. మారీ
చుఁడు ఆరణ్యకాండమున రావణాసురునితో "బాలో ద్వాదశ
వర్షోఽయమకృతాస్త్రశ్చ రాఘవః" అని చెప్పెనుగదా. దానిం
బట్టియే యిటఁ బండ్రెండేడులే అని యర్థము చెప్పవలయును.
వివాహకాలము పదాఱుమీఁదగదా యుండవలయును? అందు
రేని దశరథుఁడు జరాభారముగలవాఁడై యున్నవాఁడు కానఁ
గొడుకులకుఁ బెండ్లిచేసి కన్నులార నావేడుకఁ జూడఁగోరె
నని యూహించినఁ బ్రమాదములేదు. లేకలేక కలిగినసంతా
నముకదా. దీనింబట్టియే యాలోచించిన దశరథున కేమాత్ర
మైన రామునిమహత్త్వము తెలియలేదని యేర్పడుచున్నది.
కావుననే మునిం గాంచి చేతులొగ్గి సామీ! ద్వాదశవర్ష
ప్రాయుఁడు. నారామునియందు యుద్ధయోగ్యతయే యున్నట్లు

నాపరీక్షించినంతదనుక లేదు. అని సంశయింపక తెలిపెను. అంతియగాక నేనలంగూడి నేనే వచ్చి ప్రాణము లుండుదనుకఁ బోరాడుదు ననియె. అనఁగా రాజు పరోపకారము చేయుతఱిఁ బ్రాణముల లెక్కింపక కంఠమునఁ బ్రాణవాయువులు నిలుచు దనుకఁ బోరాడవలయునని యేర్పడుచున్నది.

"పరోక్షా దేవతాస్సర్వా రాజా ప్రత్యక్షదేవతా,
ప్రసాదశ్చ ప్రకోపశ్చ ప్రత్యక్షో యత్ర దృశ్యతే.
రాజా మాతా పితా చైవ రాజా కులవతాం కులం,
రాజా సత్యం చ ధర్మశ్చ రాజా హితకరో నృణాం.
కాలో హి కారణం రాజ్ఞో రాజా కాలస్య కారణం,
ఇతి తే సంశయో మాభూద్రాజా కాలస్య కారణమ్.
రాజమూలో మహారాజ ధర్మో లోకస్య రక్ష్యతే,
ప్రజా రాజభయాదేవ న బాధంతే పరస్పరమ్." మహాభారతము.

దీనింబట్టి యూహింపఁగా రాజు ప్రజాపాలనకార నిరతుఁడు, కనుకనే "నావిష్ణుః పృథివీపతిః" అన్నసూక్తి ప్రసి మయ్యెను. పరా మే సా ముగా భావించుటంబట్టియే రాజు భగవత్సమానుఁడనం బ్రఖ్యాతింగాంచెను. ఏధర్మకార్యమునకును బాధకలిగింపక యుండుటయే రాజకృత్యమని దీనివలన స్పష్టమయ్యెడిని.

ఈభాగమున దశరథుఁడు చెప్పినకారణములన్నియు న్యాయసమ్మతములే. కాని సామాన్యశాస్త్రనియమములకంటె విశేషశాస్త్రనియమ ముత్కృష్టము. సామాన్యక్షత్రియబాలుఁడే రాముఁడైనచో దశరథునివాదము న్యాయసమ్మతము. ప్రతికారణము విశ్వామిత్రుని మరలింపఁజాలును. కాని ముని

రాముఁడు భగవంతుఁడనియే సాయముకోరెను. ఆవిషయము గంరా వదాక్య ములఁ దెలిపెను. కాని దశరథుని మది కవి యెక్కువయ్యెను. కార్యావసరముసుబట్టి మునిపలుకుచున్న యట్లే భావించెను. కాని తదర్థము నించుకంతయే గ్రహింపఁ జాలకపోయెను.

"ధ్యాయతో విషయాన్ పుంసస్సంగస్తేషూపజాయతే,
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే. ౬౨
క్రోధాద్భవతి సమ్మోహస్సమ్మోహాత్స్మృతివిభ్రమః,
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి. ౬౩
రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్,
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి. ౬౪
ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే,
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే. ౬౫
ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే,
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి" ౬౭ గీత ౨ అధ్యా.

అన్న గీతా మీపట్టున స్మరింపఁదగియున్నది. మానవుఁ డింద్రియామైప్రవర్తించినచో సత్య మసత్యముగాఁ దోఁచును. మంచి చెడుగుగఁ గనఁబడును కావున మానవుఁ డుత్తమగతికిఁ బోవలయునన్న నింద్రియార్థములకు లోఁబడక పెద్దలమాటల నాలకించి యారీతిం బ్రవర్తింపవలయునని యుఁ గాముక్రోధాదులుత్తమమార్గమునకుఁ బోవఁదలఁచువానిని గ్రిందికి లాగును గాన వాని త్రిప్పులకు లోఁబడరాదనియు నీపట్టున మనము గ్రహింపవలయును. నిండుసభలో రాముఁడు సాక్షాన్మహావిష్ణు వనున. ము తోఁచునట్లు ముని పల్కినను దశరథునిమనస్సు

ప్రాకృతపుత్త్రవాత్సల్యమునుండి విముక్తి గాంచవయ్యెను. ఇంచుక తెలిసికొనియున్న దశరథునకుఁ జింతలుండ నవకాశ ముండునా! కావున సాధువులవాక్కులను జక్కఁగా విని వానిని ధ్యానింపవలయును. మాయ తన్నాచ్ఛాదించినపుడు ప్రకృతిని భ్రమించి విముక్తిం గాంచవలయును. అంతియకాని యింకను గ్రోధమును బెంచుకొనిన సలాభమును బోఁగొట్టు కొనుటయే కాని వేఱొకఫలము రాఁబోదు. ఇఁకఁ దరువాతి కథను బరికింతము.

## వసిష్ఠముని దశరథునకు హితము తెల్పుట.

* పుత్రస్నేహమున రాజు విభ్రాంతుఁడై పలికినపలుకుల నాలకించి గాధేయుఁడు క్రోధమునిండిన మనస్సుగలవాఁడై రాజా! నా వేఁడికోలు తీర్తునని ప్రతిజ్ఞ చేసితివి ఇపుడు దానిని వదల నెంచితివి. రాఘవులు పరమధార్మికులు. ఆకులమున జన్మించిన నీవిట్లు లాడఁదగునా? మాటయిచ్చి దానిని వీటిఁ బుచ్చ నిష్టపడితివే నిపుడే చెప్పుము. వచ్చినత్రోవం బోయెద. సత్యమునం దే నిలుకడగల కాకుత్థ్సవంశమునఁ బుట్టిన నీవు ప్రతిన చేసి దానిం దప్పితివిగావున బంధువులంగూడి సుఖముగా నుండుము. అని యిట్లు ముని కోపము తెచ్చుకొనఁగా భూమి కంపించెను. ఆతం డేమిచేయునో యని దేవతలు తత్ప్రభా వజ్ఞులుగాన బెగులుపడిరి. అత్తఱి సువ్రతుఁడు బుద్ధిమదరి ష్ఠుఁడునగు వసిష్ఠముని జగత్క్షోభముం గాంచి రాజుతో నిట్లు పలికెను.

---

* ఈభాగము బాలకాండమున నిరువదియొకఁడవసర్గమునుండి గ్రహింపఁబడినది.

రాజా! ఆడినమాట తప్పనిది యిక్ష్వాకువంశము. అందుఁ బుట్టితివి. ధర్మము రూపాంతరమును ధరించినయట్లుండువాఁడవు. సకలసద్గుణవంతుఁడవు. అట్టి నీవు ధర్మము విడనాడ రాదు. ముల్లోకములలో దశరథుఁడు ధర్మాత్ముఁడనుఖ్యాతి వ్యాపించినది. చెప్పినమాట నడపుట నీధర్మము. దాని నాచరింపుము. అధర్మమును గ్రహింపరాదు. ఈరీతిగాఁ జేయుదునని మాటచెప్పి యట్లు చేయనివాఁడు మున్ను తాఁజేసిన సకలధర్మములను నిష్ఫలములనుగాఁ జేసికొన్నవాఁడగును. కావున రాముని మునికొసంగుము. రాముఁ డస్త్రవిద్యయందాఱితేఱిన నేమి? లేకున్న నేమి? విశ్వామిత్రుం డీరామునకుఁ బ్రాపుగా నుండఁగా నగ్నిచక్రావృతమగు నమృతమువలె రాక్షసులు సుంతయేని రామునిఁ జెనకఁజాలరని నమ్ముము. ఈగాధేయుఁ డనఁగా నాకారధారియగు ధర్మమే. వీర్యబుద్ధితపశ్శాలురలో నీతఁడు మేటి. ఇంతటితపసి యింకొక్కఁడు లేఁడని నమ్ముము. సకలలోకములంగల శస్త్రాస్త్రములెల్ల నీతనివశమున నున్నవి. మఱొక్కరికిన్ని శస్త్రాస్త్రములు తెలియవు. దేవదానవాదులుకూడ నిన్నియస్త్రముల నెఱుంగరు. మహాధార్మికుఁడగు భృశాశ్వునిపుత్త్రులెల్ల నస్త్రము లగుదురు.

పూర్వము కౌశికుఁడు రాజ్యముచేయుచుండఁగా భృశాశ్వుఁ డాయస్త్రములన్నియు నొసంగెను. ఆభృశాశ్వునకు దక్షప్రజాపతి దుహిత లిరువురు భార్యలై యాకొడుకులం గాంచిరి. వారు నానావిధరూపులును మహావీర్యవంతులునై జయం బొసంగుదురు. దక్షునకు జయయని సుప్రభయనియుఁ గన్నియ లిరువురు గలరు. వారు చాల లావణ్య

వతులు. వారిరువురు మిగులఁ దేజరిల్లునస్త్రముల నూటిం గాం చిరి. వారిలోఁ దొలిభార యగుజయ మహామహిమాంచితు లును గామరూపులు నదృశా కారులు నగుకుమారుల నేబదు గురను దానవుల జెండాడఁ గనెను. తరువాత ది తీయభార యగు సుప్రభయు మార్కొనంగాని యోడింపఁగాని యలవి కాని బలముగలవారల నేఁబదుగురను గాంచెను. ఆయస్త్రం బులనెల్ల నీమునివరుం డెఱుంగును. వానినేకాదు. పూర్వ ము కని విని యెఱుంగనియస్త్రములనెల్ల నచ్చెరువుతోఁపఁ బుట్టింపఁ జాలును. రాజా! ఈమహానీయునివీర మింతటిది. కావున నీ మునివరునివెంట రామునిం బంప సంశయింపవలదు. వారిరు వుర నీమునియొక్కఁడే యశ్రమంబునఁ జంపఁజాలును. నీ కుమారునకు గొప్పమేలు చేకూర్ప నెంచి వచ్చి నిన్నిట్లు యాచించుచున్నవాఁడు. కులగురువగు వసిష్ఠముని యిట్లు బోధింపఁగా దశరథుఁడు మదిఁగలకలంక తగ్గిపోవఁగా మోము దెలి నివహింప రామునిం బంప నంగీకరించి కొడుకును విశ్వా మిత్రున కీయఁదలంచెను.

భక్తులారా! ఈకథాభాగమునుండి గ్రహింపఁదగిన నీతులు కొన్ని గలవు. అందు మిక్కిలి ముఖ్యములగువాని నిట వ్రాయుదు. దశరథుఁడు చెప్పినమాటను దప్పెనుగదా యని మునిమనస్సున గోపము పొడసూపెను. రాజా యని సంబో ధించి నాయాచ్న నంగీకరించి ప్రతిజ్ఞ చేసితివి. ఇపు డద్దాని విడువఁదలంచితివి. రాజవగు నీ కిది న్యాయముకాదు. "యథా రాజా తథా ప్రజాః" అన్నశాస్త్రము ననుసరించి యాడితప్పిన దుర్గుణమును నీవలన నెల్లరు నేర్చుకొందురు. ఆయందఱపాపము నీపాలంబడునని యెఱుంగవు కాఁబోలును. అని హెచ్చరించెను.

"ఇంద్రియాణాం జయే యోగం సమాతిష్ఠేద్దివానిశం,
జితేంద్రియోహి శక్నోతి వశే స్థాపయితుం ప్రజాః." ४४

మను. ७ అధ్యా.

"మహోత్సాహస్థూలలక్షః కృతజ్ఞో వృద్ధసేవకః,
వినీతస్సత్త్వసంపన్నః కులీనస్సత్యవాక్శుచిః. ३०९
అదీర్ఘసూత్రస్స్మృతిమానక్షుద్రోఽపరుష స్తథా,
ధార్మికోఽవ్యసనశ్చైవ ప్రాజ్ఞశ్శూరో రహస్యవిత్." ३१०

యాజ్ఞవల్క్య ఆచారకాం.

"శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనం,
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్." ४३ గీత ౧౮ అధ్యా.

జితేంద్రియుఁడు సత్యవాదియు రాజు కావలయునని యీవాక్యములే తెలుపుచున్నవి.

"రాఘవాణామయుక్తోఽయం కులస్యాస్య విపర్యయః" ७

అనియు బోధించెను. సత్యసంధమగు రఘుకులమునం బుట్టితివి. ఇట్లు ప్రతిజ్ఞాభంగ మొనరించుట కులాచారములకు విరోధము. ఈవఱకు నీవంశమునఁ బుట్టినవారు నీవలె మాటతప్పినవారు లేరుసుమా యనియె. అనఁగా సత్కులమునఁ బుట్టినవారితరుల కుదాహరణభూతులుగా నుండవలయుననియు నసత మాడరాదనియు సారము.

"కువివాహైః క్రియాలోపైర్వేదానధ్యయనేన చ
కులాన్యకులతాం యాంతి బ్రాహ్మణాతిక్రమేణ చ. ६३
మంత్రతస్తు సమృద్ధాని కులాన్యల్పధనాన్యపి,
కులసంఖ్యాం చ గచ్ఛంతి కర్షంతి చ మహద్యశః" ६६ మను 3 అ.

అసమానజాతి కన్యా పరిగ్రహణము లోనగునవి కువివాహములు. సమానజాతికానిచో సమానాభిప్రాయము లుండవు. సమానకర్మాచరణముకూడ నుండదు. కర్మలోపములు కలుగఁగా మనోభావములు తాఱుమాఱగును. సద్గ్రంథపఠనాదు లుండవు,

"శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః. ३५ గీత ३ అధ్యా
స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మనిరతస్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు." ४५ గీత १८ అధ్యా

అన్నగీతావాక్యముల ననుసరించి స్వకులాచారముల మాని పరకులాచారములఁ బూనినవాఁడే లోకమునకుం బనికిరాఁడు. అనఁగా స్థిరబుద్ధిలేనివాఁడు. కావుననే ధర్మము నాతఁడు చక్కఁగా ననుష్ఠింపఁజాలఁడు. లోకమునఁ గొందఱు స్వకుల ధర్మములు తుచ్ఛములని, పరకులధర్మము లుత్తమములని భావించి కులభ్రష్టతం గాంతురు. అనఁగా స్వకులధర్మములను బరిత్యజింతురని భావము. అట్టివారు స్థిరబుద్ధులు కారు. వారికేజాతిధర్మాచరణమునందును శ్రమయంతమాత్రమేయుండును. భగవంతుఁ డెల్లరకు మంచిమార్గము లుపదేశించెను. ఆమహనీయుని కరుణ యెల్లరయందును సమానము. అంతియగాని కులభేదముల ననుసరించి దయయందు భేదముకలవాఁడు కాఁడు. ప్రతిజాతిమానవుఁడు భగవత్కరుణకుఁ బాత్రుఁడు కావచ్చును. భగవత్సేవకెల్లర కధికారము కలదు. ఒక్కజాతికే కలదనునియమ మెందును లేదు. పద్ధతులు భేదముగా నుండును. అట్టివిషయమునందు స్వకులాచారముల ననుసరించి భగవంతు నారాధించినచోఁ దత్కరుణకుఁ బాత్రులము గాకయుందు.

మని తలంచువారు చంచలబుద్ధులని యూహింపవలయును. ఎవాఁడు తనయాజ్ఞను దిరస్కరించునో వానియందు భగవంతున కాదరణము గలుగదు. తనయానతిని దృణీకరించిన వానిని రాజు దయచేఁ గాపాడునా. అట్లే సర్వలోకప్రభువగు నాపరాత్పరుఁడు తనయాజ్ఞయందు విశ్వాసములేనివాని నాదరింపఁడు. కావున నన్యమతాచారము లుత్కృష్టములనియు, స్వమతాచారములు నికృష్టములనియు భావించువారు భగవదాజ్ఞం దిరస్కరించువారనియే నిశ్చయింపవలయును.

"న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాంగతిమ్,"

అన్న శ్రీకృష్ణోపదేశము నాలోచించినఁ బరమతాచారముల నాదరించి స్వమతాచారములఁ బరిహసించువారు చేయుకర్తములు నిరర్థకములనియు, నంతియకాక దుష్ఫలముల నొసంగునవి యనియుఁ దేలెడిని. కావున స్వమతమున సారము లేదనియు నితరమతమున సారము కలదనియు భావించువారు చంచలచిత్తులనియు వారేయాచారముల నవలంబించినను ఫలము శూన్యమనియు భావింపవలయు నని గీతావాక్యము తెలుపుచున్నది.

కులాచారములను గులదేవతలను గులగౌరవమును జక్కఁగా నాదరించవలయును. దాన మేలు కలుగును. కావున రఘువంశమునందు సత్యము ప్రధానముగా నెలకొనియున్నది. ఇంతకుముం దావంశమునఁ బుట్టినవారెవరును సత్యమును బాటింపనివారు లేరు. నీవే యిపు డాయాచారమును మానితివి. నాయాచనను సఫలముచేయుదునని పలికి వెంటనే తప్పితివి. కాన రఘువంశమర్యాదను బాడుచేసితివి. మిథ్యా

ప్రతిజ్ఞుఁడవు. నేఁబోయివత్తును. బంధువులు నీవు మిత్రులును సుఖంబుండుఁడు. అని కోపమునఁ బలికెను. ఆకోపమునకు భూమి వడంకెను. అనఁగా భావమేమి? సత్యమును దప్పితికదా యని ముని పలికెను. సత్యము పరమాత్మస్వరూపము. సూర్యశశాంకాదులకు సత్యమేయాధారము. సర్వ ప్రపంచములకు సత్యమే యాధారము. అట్టిసత్యమును దప్పినపుడు భూమి వడంకె ననఁగా నిది న్యాయముకాదని తనయసమ్మతమును దెలిపెను. భూదేవి మహాభూతములలో నొక్కటికాదా. కొందఱు భూమి వడంకునా యని పరిహాసింతురు. కాని భూదేవి యనఁగా భూమికాదనియు భూగోళాధిష్ఠానదేవతయనియు వా రూహించినవారు కారనియే యంగీకరింపవలయును. "వివేశచ భయం సురాః" అని మూలమునఁ గలదు. దేవతలు దిగులుపడిరనఁగా న మేమి? దేవకార్యమే రాముఁ డవతరించెను. దశరథుఁ డిపుడు రాముని బంపక యున్నఁ దాటకాదులవధమున కాలస్యమగునే యని భయంపడిరని భావము.

వసిష్ఠోపదేశ మెట్టిదో పరికింతము. ప్రపంచమంతయు భయాక్రాంతమగుట తెలిసి మహాజ్ఞానసంపన్నుఁడగు వసిష్ఠమహాముని సువ్రతుఁడు కావున దశరథున కిట్లుపదేశించెను. రాజా! ఇక్ష్వాకువంశమునఁబుట్టితివి. ధర్మమే నీరూపమునఁ బుట్టినది. సువ్రతుఁడవు. ధీరుఁడవు. నీవే ధర్మమును దప్పవచ్చునా? అనఁగా విశ్వామిత్రుఁ డింతకుమున్నే యీవసిష్ఠమునియు రామునిశక్తి నెఱుంగునని చెప్పియుండెను. కావున నావిషయమును దెలుపుచున్నాఁడని భావము. కౌశికుఁడు సత్యమును

దప్పితివనెను. వసిష్ఠమునిధర్మమును దప్పితివనెను ఏల? రాముని మహత్త్వమును విశేషించి తెలుపఁబూనెననియు, ధర్మసంస్థాపనమున యీరామరూపమున భగవంతుఁ డవతరించెననియు నామహాత్ముని కార్యారంభమునకు భంగము కల్గింప నీవు హేతుభూతుఁడవు కావలదనియు ధీరుఁడవనఁగా జ్ఞానివగు నీవేల యింతమాత్ర మాలోచింపవైతివికదా. న్యాయమా యనియు నీకిది న్యాయముకాదనియు వసిష్ఠమునిభావము. ఈయుపన్యాసయుపదేశసారము

"సత్యం వద ధర్మం చర."

అన్న యుపనిషదా క్యాలయమే యగును. అనఁగా లోకమున రామచంద్రమూర్తి తనప్రవృత్తిచే సత్ప్రవర్తనమును నిలుపఁబూనినవాఁడు. కావున సంకల్పమాత్రమున గాఢేయ వసిష్ఠమునివచలమూలమున లోకులకుం దెలిపెను ఎవాఁడు గాని సత్యము పలుకుచు ధర్మము నారాధింపవలయుననియే యీయుపదేశామృతసారమని మనము గ్రహింపవలయును. ఇవి రెండే భగవంతుని సంప్రీతునిగాఁ జేయుమార్గములు. ఎన్ని పూజలు చేసినను సత్యధర్మములఁ బాటింపని వానికి భగవంతుఁ డనుగ్రహఫలము నొసంగఁడనుట వాస్తవము.

"త్రిషు లోకేషు విఖ్యాతో ధర్మాత్మా ఇతి రాఘవ,
స్వధర్మం ప్రతిపద్యస్వ నాధర్మం వోఢుమర్హసి"

అని వసిష్ఠముని పలికెను. దీనినుండి గ్రహింపఁదగిన నీతియేది? ధర్మము నాచరింప నెవ్వానిమనస్సు నియతిం గాంచునో, యతఁడే ముల్లోకములయందు విఖ్యాతిం గాంచువాఁడు.

స్వధర్మమనఁగా భగవత్ఛాస్త్రమునందుఁ బ్రతిపాదింపఁబడిన

"శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్". ४८ గీత. ౧౮ అధ్యా.

అనువాక మురీతిగాఁ గులధర్మమని భావము. ధర్మమన్నను గర్మమన్ననొక్కటియే. ఈయము పై శ్లోకమునందే కలదు. ధర్మమనఁగా విహితకృత్యమని యర్థము. కర్మమన్నఁ నదియే కదా. కావున నట్టి స ధర్మమును (కులాచారములను) జక్కఁగా నాచరించుచు, అధర్మము నవలంబింపక యుండవలయుననియే యీయిరువురచేఁ జేయఁబడిన సదుపదేశసారము. సత మువలుకుట సత్కర్మములఁ గులోక్తముల నాచరించుట భగవత్ప్రీతికిం బాత్రములనియే భావము.

దీనింబట్టి చూడఁగా శ్రీరామమూర్తి సత్యము పలుకుచుఁ గులాచారములను బాటించుచు సత్కర్మముల నాచరించుచు లోకమునకుఁ దనప్రవర్తనముననే సద్గురూపదేశముల నొనరించువాఁడనుట సూచింపఁబడెనని మన మూహింపవలయును. ఈవిషయమును రామాయణమున నెన్నియోతావుల ముందుముందు విన్నవింతును. "అన్నతం నోక్తపూర్వమ్" అన్న రామోక్తి నందఱెఱుంగుదు రనుకొనియెదను. ఆయాయి ఘట్టముల నీరెండువిషయములు స్పష్టముచేయుటకే యీనా ప్రయత్నమని యూహింపందగు.

"సంశ్రుత్యైవం కరిష్యామీత్యకుర్వాణస్య రాఘవ,
ఇష్టాపూర్తవధో భూయాత్తస్మాద్రామం విసర్జయ. ౮
కృతాస్త్రమకృతాస్త్రం వా నైనం శక్ష్యంతి రాక్షసాః,
గుప్తం కుశికపుత్రేణ జ్వలనేనామృతం యథా" ౯

అన్న యీభాగము నించుక తడవుదము. రాజా! నేను నీలాగు చేయుదునని మాటయిచ్చి యట్లు చేయకపోయినయెడలఁ దాను జేసిన యజ్ఞము దేవతాపూజలును వాపీకూపతటాకాది నిర్మాణము మొదలగు పుణ్యకార్యములన్నియు నిష్ఫలము లగును. అనఁగా నేవాఁడు కాని మాటయిచ్చి యట్లుచేయక వదలినచో మున్ను దాఁజేసియున్న పుణ్యకార్యములఫలమును బోఁగొట్టుకొన్నవాఁ డగును. దీనింబట్టి సత్యముతో సమానమగు పుణ్యకార్యము లేదనియు దానినారాధింపక యెన్ని యితర పుణ్యకార్యములు చేసిన నిష్ఫలమగుననియు సారము. విశ్వామిత్రవాక్యము వసిష్ఠమహామునివాక్యము నొక్కరీతిగానే యున్నది. సకలధర్మశాస్త్రములు సకలపురాణములు నీవిషయము నొక్కరీతిగానే తెలుపుచున్నది. వేదములే దీనిని సిద్ధాంతము చేసినవికదా. మానవులు నిరంతర మసత్యము పలుకుచు ధర్మకార్యములు చేసితిమని యానందింతురు. కాని ప్రాణములేని దేహమువలె సత్యము నెడఁబాసి చేసినధర్మములు వ్యర్థములని యెఱుంగరు. ఇదియే లోకమునఁ గలప్రమాదము. మాతృదూషణము చేసి దేవతలఁ బూజించినయట్లు సత్యమును వదలి చేసిన పుణ్యకార్యములు నిష్ఫలము లగును. ఎఱుంగఁదగిన విషయ మిదియే.

అస్త్రవిద్య నేర్చినవాఁడు కాని రాముఁ డకృతాస్త్రుఁడు కాని యీముని రక్షించుచుండఁగా రాక్షసులు చెనకఁజాలరు. అగ్నిజ్వాలలు కాపాడుచుండ నమృతము నితరులు కొనిపోవఁ జాలుదురా. ఏల యనుమానించెదవు? అని వసిష్ఠముని దశర

ఘుని హెచ్చరించెనుగదా. సారమేమి? రాజా! కొమరుఁడని నీవనుకొనుచున్న యీ రాముఁ డమృతుఁడు. అనఁగా

"సంభూతిం చ వినాశం చ య స్తద్వేదో భయగ్ంసహ,
వినాశేన మృత్యుం తీర్త్వాసంభూత్యాఽమృతమశ్నుతే" ౧౪
ఈశావాస్యము.

అను నీయుపనిషత్ప్రతిపాద్యుఁడగు భగవంతుఁడని నమ్ముము. అమృతునకు మృత్యుభయము కలదా. ఏల యీభ్రాంతి? పరత త్త్వము నెఱింగిన యీముని రక్షించుచుండును. అనఁగా నీవిశ్వామిత్రుఁడు పరమేశ్వర తత్త్వమును వెల్లడించును. రక్షకుఁ డనఁగా ఇతరులవలని బాధలులేకుండఁ గాపాడువాఁ డనికదా యర్థము. దురాశయములఁ దొలఁగఁ జేసి యీభగవంతునిశక్తిని మహాభక్తుఁడగు నీముని వెల్లడించునని యర్థము. అమృతము నగ్నిజ్వాలలు కాపాడునట్లని మూలమునఁ గలదు. ఈరామ మూర్తి యమృతస్వరూపుఁడు. ప్రకృతి యాతత్త్వము నావరించియున్నది. ప్రకృతి యగ్నిస్వరూపిణి యగునా యని కొంద అందురు.

"జ్వాలామాలినికాక్షిప్తవహ్నిప్రాకారమధ్యగా"

అని లలితాసహస్రనామములందుఁ గలదు. అనఁగా నిందలి సారమేమి? అమృతమనంబడు పరతత్త్వమును బ్రకృతి యాచ్ఛాదించియున్నది. అనఁగా రామమూర్తి మాయామానుషవిగ్రహుఁడనిధ్వని. ఈరహస్యమును భగవత్తత్త్వ మెఱింగిన యీకౌశికుఁడు కాపాడునని సారము. యోగ్యుఁడగు శిష్యునకుఁ దత్త్వముపదేశింపవలయును. భక్తిలేనివాని కుపదేశింపరాదు. సద్గురువు యోగ్యుఁడగు శిష్యుఁడు దొరకునా

యని వెదకుచుండును. దొరకినంతనే యుపదేశించును. అట్లే యీమునియు సీరామబ్రహ్మము నెందెందు వెల్లడింపఁదగునో యందందుఁ దెలుపుచుండును. కావున సీతని కీరామము నొసంగు మని రహస్యమని మనమెఱుంగందగు. దీనిచేఁ దాటకాదుల సంహారము, అహల్యా శాపవిమోచనాది మహాకార్యములు సాగుట వసిష్ఠుఁ డెఱుంగుననియే యిందుఁగలవిశేషము. కావుననే "వసిష్ఠోఽపి మహాతేజా యే చాన్యే తపసి స్థితాః" అని విశ్వామిత్రుఁ డెఱింగించెను. ఈయుపదేశము పైని వ్రాసిన విశేషమును దృఢపఱచుచున్నది.

''సుపరీక్షితశిష్యాయ దేయం వత్సరవాసినే.''

అన్నసూత్రప్రసిద్ధమేకదా.

ఈయభిప్రాయము నీక్రిందివసిష్ఠవాక్యములు సిద్ధాంతము చేయుచున్నవి.

"ఏష విగ్రహవాన్ ధర్మ ఏష వీర్యవతాం వరః,
ఏష బుద్ధ్యాధికో లోకే తపసశ్చ పరాయణమ్.'' ౧౦

దశరథా! ధర్మమే యీ కౌశికరూపమునఁ గనఁబడుచున్నది. ఈతఁడు వీర్యవంతులలో నధికుఁడు. లోకమునఁగల బుద్ధిమంతులలో నీతఁడే శ్రేష్ఠుఁడు. తపోనిధి. కావున నీతని వెంటఁ బంపు మనియె. అనఁగా నీకుమారునిచేత నేయేకారములు ధర్మమార్గము ననుసరించి చేయింపఁదగునో నేయేకార్యములు పరాక్రమము నూఁతగొని చేయింపఁదగునో, ఏయే కారములు బుద్ధిబలముచేతఁ జేయింపఁదగునో, ఏయేవి తపోబలమునఁ జేయింపఁదగునో, వానివాని నాయాపద్ధతులఁ జేయింపఁగలఁడని యని స్తుతి. శ్రీరామమూర్తిని ధార్మికులు ధర్మసర

పముగా, శూరులు శూరాగ్రేసరునిగా బుమంతులు బుధ్ధ్యతునిగాఁ దపసులు పరమప్రాప్యస్థానముగా నుపాసింపందగును. ఎల్లరకు భగవంతుఁడు ఫలము నొసంగుననని యిందలి విశేషమని కొందఱందురు. అదియు సారవంతమే యని నా యాశయము.

అస్త్రములన్నియు భృశాశుని తనయులని యిందుఁ గలదు. ఇట్టివిచిత్రము కలదా యని కొందఱు ప్రశ్నింతురు. అంతియగాక యిట్టివి యసంగతప్రసంగములనియుఁ బురాణాదులయం దిట్టివి మెండుగాఁ గలవనియుఁ బరిహసింతురు. కాని వారికి నస్త్రములన నెట్టివో తెలియ దనవలయునేకాని వేఱొక్కమాట పలుకరాదు. తెలియనివిషయమును దెలిసికొనఁ బ్రయత్నింపవలయుఁగాని తెలిసినట్లు నటించి యాక్షేపింపరాదు.

భృశాశున కిరువురు భార్యలు. వారు దక్షపుత్త్రికలు. జయ, సుప్రభ లని వారిపేరులు. వారికుమారులే యస్త్రములైరని రామాయణమునఁ గలదు.

"సర్వాస్త్రాణి భృశాశ్వస్య పుత్త్రాః పరమధార్మికాః,
కౌశికాయ పురా దత్తా యదా రాజ్యం ప్రశాసతి." ౧౩ అని మూలము.

పరమధార్మికులగు భృశాశునికుమారు లస్త్రములైరి. అనఁగా భావమేమి? అస్త్రాధిదేవత లైరనియే. బ్రహ్మాస్త్రమనఁగా బ్రహ్మ తనపనిమాని యాయుధమయ్యెననియా యము. బ్రహ్మ దేవతగాఁగలమంత్రము నుపాసించి యామంత్రము నేవస్తువునందు గాని యభిమంత్రించి ప్రయోగించిన నది యాతని యిష్టముం దీర్చును. ఇదియేకదా భావము. లేకయున్న బ్రహ్మ యెందఱి

కడ నస్త్రరూపమున నమ్ములపొదిలో నుండఁగలఁడు? ఇరువురు నాయస్త్రమునే యుపాసించినవారైన నిరువురను బాధింపక యాయస్త్రము శాంతినొందును. ఏల? ఇరువురును దదక్షులే. ఇరువురియందు నా బ్రహ్మకు సమానప్రీతి యుండును. కావున నెవరికిని బాధనుగలిగింపక శాంతినొందును. ఈవిషయము సర జనవిదితము. అట్లే భృశాశు నిపుత్త్రులు పరమధార్మికులు గావున నస్త్రముల కధిదేవతలైరి. అనఁగా వారిపేర నస్త్ర ములుగలవని సారము. మునిపుత్త్రు లస్త్రదేవతలగుదురా యని యుఁ బ్రశ్నించువారు కలరు. పరశురామునిపేర భార్గవాస్త్ర మున్నయట్లు భారతము తెలియఁజేసెడిని. పరమ ధార్మికు లే దేవత లగుదురు. దేవతలే యస్త్రముల కధిదేవత లగుదురు. ఇదియే యుపాసనమున మంత్రమనంబడును. ప్రయోగకాలమున నస్త్ర మనంబడును. నారాయణమంత్రము నుపాసించి మహర్షులు ముక్తులగుదురు. రాజు లుపాసించి నారాయణాస్త్రమున శత్త్రు వుల వధింతురు. కావున భృశాశ పుత్త్రు లస్త్రములగుట సుసంగ తమే కాని యసంగతము కాదు. ప్రకృత మనుసరింతును.

రామచంద్రుఁడు మాయామానుష రూపుఁడు కావున గురూపదేశ మావశ్యకమనియుఁ దత్కాలమున సకలాస్త్రములు లభించుననియుఁ దత్కాలమున స్వావతారకార్యము సాగించు ననియు నిట్టితరుణమున నీవేల యడ్డుపడఁ బ్రయత్నింతువనియు వసిష్ఠముని తెలిపెననియే యీభాగమున సారముగా గ్రహింపం దగు. దీనిచే గురూపదేశము లేక శిష్యుఁడు మంత్రముల సంగ్రహింపరాదనియు సంగ్రహించిన నవి దుష్ఫలముల నొసం గుననియుఁ గావున గురుపూజ యవసరమనియు నెఱుంగందగి

నది. గురువునను గ్రహమునకుఁ బాత్రుఁడు కాకయున్న నా మంత్రము ఫలింపదనియు నెఱుంగఁదగు.

"శివే రుష్టే గురుస్త్రాతా గురౌ రుష్టే న కశ్చన."

అన్నవిధి తంత్రములయందుఁ గనుపట్టెడిని. మంత్రసిద్ధికి మూలము గురుభక్తియే కాని మంత్రజపము కాదనియు నెఱుంగ వలయును. కావుననే యీముని సకలాస్త్రవేత్తయనియు ముల్లోకముల నుండువారెవరు నీతఁ డెఱింగినన్ని యస్త్రముల నెఱుంగరనియుఁ బ్రశంసించెను. రాముఁడు భగవంతుఁడుగాన నామహనీయునకుఁ దెలిపినట్లు లోకులకు నీయుపదేశము తేటతెల్లముగఁ జేయుచున్నది.

"యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే."

అన్నగీతాశాస్త్రముకూడ నీవిషయమునే బోధించుచున్నది. రామునంతటివాఁడు గురుసేవచేసినాఁడుకదా, మనము చేయవలదా యన్నభావము లోకులకుఁ దెలుపుటయే వసిష్ఠమహాముని భావమని యెఱుంగందగును.

"అపూర్వాణాం చ జననే శక్తో భూయస్స ధర్మవిత్." ౧౭

ఈముని ధర్మవేత్త. అంతియగాక యనేకదివ్యాస్త్రములను బుట్టింపను గౌశికుఁడు సమర్థుఁడు. అనఁగా భావమేమి? క్రొత్తక్రొత్తయస్త్రములను బుట్టించుననికదా దీనిభావము. ఎట్లు? ఆలకింపుఁడు. సప్తకోటిమహామంత్రములుగలవని ప్రసిద్ధి కలదు కదా. అందు దేని నెవ్వఁడు చిరకాలముపాసించి తద్దేవతానుగ్రహపాత్రుఁడగునో యాతఁడే యామంత్రమునకు ఋషి యనంబడును. ఏవిధిగా నామంత్రము నుపాసించిన నాదేవత

ప్రత క్షమయె నో యదియే దానివిధి. కావున నారీతిగా నీ విశ్వామిత్రుఁ డపూరానేకమంత్రముల నుపాసించి వానిప్ర సాదమునకుఁ బాత్రుఁడై యామంత్రములకుఁ దాను ఋషియై యున్నవాఁడు. కావున నీతనిమూలమున శ్రీరామమూర్తికి నరాస్త్రములు లభించును. అని వసిష్ఠముని దశరథునకుఁ గొడుకువిషయమునఁ గలరాక్షసభీతి తొలఁగునని యుపదే శించెను.

"తేషాం నిగ్రహణే శక్తస్స్వయం కుశికనందనః,
తవ పుత్త్రహితార్థాయ త్వాముపేత్యాభియాచతే." ౨౦

రాజా! ఆరాక్షసులవధింప నీముని తానే సమర్థుఁడయ్యును నీ కుమారునకు మేలుచేయుటకొఱకె నీకడ కరుదెంచి యాచించు చున్నాఁడనియె. అనఁగాఁ దపోబలమున వారి నీతఁడు తానే చంపఁగలఁడు. అట్టివాఁడు యజ్ఞమునుగూడ మానుకొని నీ దర్శనమున కేతెంచి నిన్ను వేఁడుట మఱెందులకుఁగాదుసుమీ. నీపుత్త్రునిమేలుకొఱకే యని యెఱుంగుము. అవతరించియున్న యాపరాత్పరున కీలోకమునఁ బ్రవృత్తిని గలిగింపఁబూనియే వచ్చినాఁడు. ఈమునిమూలమున నీకుమారునకు విశేషించి హితమే కలుగును. అట్టిలాభము నాశించియైనఁ బంపుమని వసిష్ఠునాశయము. ఈముని లోకోపకారపరాయణుఁడు. కావున నీకుమారుని దోడుకొనిపోయి త్రిజగదిభాతయశోలాభ మును గల్గించునుగానఁ బంపుమీ యనియే దీనిభావము. ఈ పరాత్పరుం బిలుచుకొనిపోయి యారాధించి కన్నులారఁ గాంచుచుఁ జక్కఁగా మాటలాడుచు సంతోషింపం గోరు చున్నాఁడు. ఆమహాకార్యమున కేల భంగమును గల్గింతువు?

వలదని మునియాశయము. ఇట్లు వసిష్ఠుఁడు బోధింపఁగా దశ
రథుఁ డమ్మాటల నాలకించి రామునిం బంప నుత్సహించెనని
మన మూహింపవలయును. ఈభాగమునుండి సత్ధర్మములు
భగవత్స్వరూపములుగా భావింపవలయుననియు వాని నారా
ధించినఁగాని యిహపరసుఖములు యశస్సు లేదనియు గురూప
దేశము లేక యెట్టిమంత్రము ఫలింపదనియు గురువు సర విష
యము లెఱింగినవాఁడుగా నుండవలయుననియు శిష్యుఁడు
ప్రశ్రయమున గురువు నాశ్రయించి విద్యఁ బడయందగు
ననియు నట్లుగాదేని యావిద్య ఫలము నీయకుండుటయేగాక
దుష్ఫలమునుగూడ నొసంగుననియు గురువనుగ్రహము
నకుఁ బాత్రుఁడగుశిష్యుఁడు త్రిలోకవిఖ్యాతిం బడయఁజాలు
ననియు మనము గ్రహింపవలయును. కథాభాగమునందు రామ
చంద్రుఁడు పరబ్రహ్మముగాని కేవలమానవమాత్రుఁడు కాఁ
డనియు నట్టిరామునకు భక్తాగ్రేసరుఁడగు కౌశికముని హితము
గూర్పనెంచియే వచ్చెననియుఁ గేవల యజ్ఞరక్షణార్థమై రాముని
సాయము గోరరాలేదనియు భగవత్తత్త్వము నెఱింగిన యీ
మునికి శ్రీరాము నొసంగుట ధర్మమనియుఁ బరమపవిత్రమగు
కాకుత్స్థవంశమునఁ బుట్టిననీవే ధర్మమును విడనాడిన లోక
మున ధర్మమే నశించుననియు, ధర్మపాలనమునకే రాజును
బ్రజలు ప్రేమింతురనియు, ధర్మాచరణమున రాజితరుల కుదా
హరణభూతుఁడు కావలయుననియుఁ బుత్రప్రేమము రాముని
యందు వదలి భగవత్ప్రీతి ననుసరింపదగుననియు వసిష్ఠముని
యుపదేశమని గ్రహింపవలయు. ఇట్టు లీకథాభాగము పరమ
ధర్మమును గురూపదేశమహిమమును గురుపరీక్షను బోధిం

చుచు శ్రీరాముఁడు పరతత్త్వమనియు మాయామానుష విగ్రహుఁడనియు, విశ్వామిత్రునిమూలమునఁ గారాచరణ పరాయణత మునకుఁ బూనును. గావుననే సమయము ననుస రించి ముని యరుదెంచెననియు నావిషయము నెఱింగి వసి ష్ఠమహాముని రాజునకుఁ జక్కఁగ బోధించి శ్రీరాముని విశ్వా మిత్రునివెంటఁ బంపునట్లు చేసెననియుఁ దెలియందగు. ఈకథను బఠించువారు విశ్వామిత్రునిమాటల పరిపాటినిమాత్రమే గ్రహింపక శ్రీరామతత్త్వము నెఱింగి యామహాత్ముని గాధి నందనునిమాడ్కి సేవింపఁ బ్రయత్నింపవలయును.

"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః." ౩౪ అ ౯

అన్న భగవద్గీతోక్తి ననుసరించి సర్వేశ్వరునిగా సర్వాంత ర్యామిగా నీశ్వరుని భావించి యేకారణమునందును గర్తృత్వ మును మాని ఫలాభిసంధిరహితముగా నారాధింపవలయును. ఇఁకఁ దరువాతికథ నాలకింపుఁడు.

## శ్రీరామలక్ష్మణులు విశ్వామిత్రునివెంట ధర్మాచరణమున కరుగుట.

*వసిష్ఠమునిపలుకుల కలరి దశరథుఁడు లక్ష్మణునిం గూడి యుండురామునిం బిలువంబంచెను. కౌసల్యయు దశరథుఁడును రామునకు లోకాచారము ననుసరించి స్వస్త్యయనము నిర్వ ర్తించిరి. కులగురువగువసిష్ఠమునియు మంగళసూక్తములచే రామమూర్తి నభిమంత్రించెను. రాజు కుమారునిశిరము మూర్కొని మనస్సంతోషమున గాఢేయున కొసంగెను. రాజీ

*ఈభాగము బాలకాండము నిరువదిరెండవసర్గమునుండి గ్రహింపఁబడినది.

వాత్ముఁ డగు రాముఁడు మునికడఁజేరి నిలుచుండెను. అప్పుడె మలయపవమానుఁడు నిర్మలమగు రీతి నాతనిపైఁ బొలసెను. రామమూర్తి మునివెంటఁ బయనమగుచుండఁగా దేవతలు పుష్ప వృష్టిం గురియించిరి. కర్ణసుఖమును గల్గించుచు దివి దేవదుం దుభులు మ్రోసెను. అయోధ్య యందును శంఖాదిరావములు బోరుకలంగెను.

విశ్వామిత్రుఁడు ముందునడువ నాతనివెంబడి శరచాప ములఁ దాల్చి రామచంద్రుఁడు పయనముసాగించెను. రాము నాశ్రయించి కూఁకటులు ఫాలభాగమున నటియించుచుండ ధనుర్ధారియై లక్ష్మణుండు నడచెను. ఆయన్నదమ్ము లిరువురును దూణీరద్వయము ధరించియుండఁగా మూఁడుతలలుగల భుజంగములు రెండింటింబోలి యుండిరి. పదిదిక్కులు తమ కాంతుల వెలుంగుచుండ నప్రతిహతపరాక్రమంబులు చెలఁగ మహాత్ముఁడగు నామునిని, నశి దేవతలు బ్రహ్మనాశ్రయించినట్లు వెంబడించిపోయిరి. యు సాధనములన్నియు వారికడ నుండెను. వా రట్లుపోవుచుండఁగా నచింత్యమహిముఁ డగునీశ్వరుని వెంబడిన యగ్నిపుత్త్రు లగు స్కందవిశాఖులంబోలె యప్ర మేయకాంతులు వెల్లివిరియఁ బోవునట్లుండెను. ఆదినమున వారు సా యోజనమాత్రదూరము నడచి సరయూనదీదక్షిణ తీరముం జేరిరి. గాధేయుఁడు రామచంద్రునిం దిలకించి మృదు మధురోక్తులతో వత్సా! జలములను గ్రహింపుము. కాల మతిక్రమింపరాదు. సకలమంత్రసమూహములగు బల యబల యనుపేరులంబరఁగు విద్యలను బరిగ్రహింపుము. వానిని బరి గ్రహించితివేని నీ కాయాసముగాని దప్పిగాని యుండవు.

రూపము మాఱుపడక యట్లే యుండును. నిద్రపోవుచున్నపుడుగాని యేమఱుపాటున నున్నపుడుగాని రాక్షసులు లోనగు క్రవ్యాదు లెవరింపఁజాలరు. ఈమంత్రములను రెండింటిని జపించుచుందువేని భూలోకమున బాహుబలమున నీకు సమానుఁ డుండఁజాలఁడు. అంతియకాదు. ఏసద్గుణమునందును నీకు సాటియగువాఁడు త్రిలోకముల నుండఁడు. సౌందర్యము, సామర్థ్యము, సూక్ష్మార్థపరిజ్ఞానము, చేయఁదగినది చేయరానిదిది యనినిశ్చయించుబుద్ధియు ప్రశ్నోత్తరములయందుఁ గుశలతయు, నీకు నెల్లరకంటె నధికముగా లభించును. విశేషించి దీనిమహిమమును జెప్పనేల? నీకు సమానుఁ డుండఁడు. ఈవిద్యలు రెండును జ్ఞానమునకు స్థానములు. దీనిం జపించుచుఁ బయనము చేసిన నాఁకలిదప్పు లుండవు. అసమానయశము కల్గును. వీనిని బ్రహ్మదేవుఁడు నిర్మించెను. కావున మహాప్రభావసంపన్నములని యెఱుంగుము నీవు సద్వంశమగు కాకుత్స్థకులమున జన్మించితివి. ధార్మికోత్తముఁడవు. కావున వీని నొసంగఁదగినపాత్రమవు. నీయట్టివాఁ డింకొక్కఁ డుండఁడు. మున్ను చెప్పిన సౌందర్యాదిగుణములన్నియు నీయందున్నవియే యైనను జిరకాలము తపస్సొనరించి వీనిని సంపాదించితిని. కావున వీనిని గూడఁ బరిగ్రహింపుము. విశేషించి యీతరుణమున నీకు సత్ఫలముల నొసంగును. నీమూలమున నివి ప్రసిద్ధిగాంచును. అని బోధించెను.

మునియానతిం గాంచి శ్రీరామమూర్తియు జలమ్ముల నాచమించి శుచియై సంతోషమునఁ బరమేశ్వరధ్యానయోగసంపన్నుఁడగు నా కౌశికునివలన నా రెండువిద్యలను బరిగ్రహిం

చెను. వెంటనే శ్రీరాముఁడు శరత్కాలమున వెలుంగు చండ భానునికరణి మహాపరాక్రమ మతిశయిల్ల నొప్పెను. ఆమీఁద రామమూర్తి గురువునకుఁ జేయఁదగిన పాదోపసంగ్రహణాది పరిచర్యాత్మకభక్తి నెఱపెను. ఆరేయి మూవురు నాసరయూ తీరమున నెంతో హాయిగా నిదురించిరి. సోదరు లిరువురును దృణములచే శయ్యం గల్పించుకొని చెంతనే శయనించి గాధినందనుఁడు పలుకు శ్రవణసంతృప్తికరవాక్కుల కానందించుచు నిదురించిరి. ఆరాత్రియు వారలకు సుఖముం గూర్చుచు సాగిపోయెను.

మహనీయులారా! ఈభాగము శ్రద్ధగా విచారింపవలసి నదియే. ఇందనేకరహస్యార్థములుగలవు. మానవజాతి యుత్తమ స్థితికి రాఁదగినవిషయము లిందెన్నియో గలవు. వానిని దెలిసి కొని యట్లు ప్రవర్తించినఁగాని యెట్టిమానవుఁడైన నభివృద్ధి గాంచఁజాలఁడు. ఎట్టిశిష్యున కుపదేశింపఁదగునో యిందుఁగలదు. గురుసేవ యెట్లుచేయవలయునో యిందుఁగలదు. భగవంతుఁడు రాముఁడనియు నిందుఁ జక్కఁగాఁ దెలుపఁగలవిషయములు గలవు. మంత్రములవలనిలాభములు నిందుఁ గలవు. ఇట్టి వింక నెన్నియో విషయములు గలవు. కావున వాని నోపికమై జర్చింపక వదలరాదు. సావధానముగా నాలకింపుఁడు.

దశరథుఁడు రాముని లక్ష్మణునింగూడఁ బిలువంబంచి కౌసల్య తోలుతను దాను దరాతను మంగళానుష్ఠానకర్మము నిరర్తించిరి. ఇది పూర్వ కాలమునుండివచ్చుచున్న యాచారము వారియాశిషములు గొన్న పిదపవసిష్ఠమునియు వేదమంత్రముల

చేత నీమహాకార్యమున మంగళములు గలుగుఁగాతమని రాము నభిమంత్రించెను.

"వేదానాం సామవేదోఽస్మి దేవానా మస్మి వాసవః."

అన్న గీతోక్తిప్రకారము మంగళకరములగు వేదమంత్రములచే మంత్రించెననఁగా భావమేమి? వేదవేద్యుఁడవని వినుతించెను. నీయీప్రయాణమున లోకములకు శుభము గలుగుఁగాక. అని కోరెనని తాత్పర్యము. రాజు పిదప సంతోషభరాక్రాంతస్వాంతుఁడై రామలక్ష్మణులను విశ్వామిత్రున కర్పించెను.

"తతో వాయుస్సుఖస్పర్శో నీరజస్కో వవౌ తదా,
విశ్వామిత్రగతం దృష్ట్వా రామం రాజీవలోచనమ్." ౪

అదియే దేవకార్యార్థ మవతరించిన రామచంద్రుని కార్యారంభము. కావున వాయువు చల్లఁగా దేహమునకు సుఖము గలుగునట్లు భూరజము చెలరేఁగకయుండ ననఁగా మెల్లఁగా వీచెను. మహాబలుఁడ నన్న యహంకారమును మాని నీవే దిక్కని యాపరంధాముని స్పృశియించెననియే దీనిసారము. లోకమునకు మిత్రుఁడయిన గాధేయునివెంటఁ బోవ నుంకించు రాముని స్పృశియించి ధన్యుఁడయ్యెననియే దీని సారతరాంశము. ప్రయాణకాలమునఁ దొలుత వాయు వామహాత్మునకుఁ దన సంతోషమును దెలిపెను. భగవంతుని సేవించునపుడు రజోగుణము తగదు. కావున రజోగుణమును మానెననియే మనము గ్రహింపవలయును. నాసేవ నంగీకరింపుమని వేఁడెను. ముందు నాయంశపురుషుఁడు నిన్నాశ్రయింపఁగలఁడని ప్రార్థించెనని యీప్రార్థనము సూచించెడిని. "విశ్వామిత్రగత" మ్మనుటచేత

నెవారు తపోధనమును జగన్మంగళముకొఱకు వ్యయింతురో వారినే భగవంతుఁడు ప్రేమించునని సారము.

"సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత,
కుర్యాద్విద్వాం స్తథాసక్తశ్చికీర్షుర్లోకసంగ్రహమ్. ౨౫
మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా,
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః." ౩౦ గీత 3 అధ్యా.

అను నీగీతావాక్యములు పైవ్రాసినభావమును సూచించుచున్నవి.

"కలాపినౌ ధనుష్పాణీ శోభయానౌ దిశోదశ,
విశ్వామిత్రం మహాత్మానం త్రిశీర్షావివ పన్నగౌ. ౭
అనుజగ్మతురక్షుద్రౌ పితామహమివాశ్వినౌ." ౭

ఈశ్లోకములఁ గలసార మేమనఁగా అంబులపొదులు రెండును ధరించి ధనుస్సులందాల్చి దశదిశల వెలుఁగంజేయుచు మహాత్ముఁడగు విశ్వామిత్రునివెంట మూఁడుతలలపాములవలెఁ బోవుచుండఁగా నశ్వికుమారులు బ్రహ్మవెంబడి పోవుచున్నట్లుండె నని ప్రాతీతికము. వారిరువురతూణీరములఁ గలబాణములు రాక్షససంహారమునకై నాలుకలు చాఁపుచుండెననియు వీరి మోములు క్రూరరాక్షసవినాశపిశునములై యుండెననియు విశేషము. భావికాలకార్యముల నొనరించునూహగలమునివెంటఁ బోవుచుండఁగాఁ జూచువారలకుఁ (మానవులకు) ముచ్చటగా నుండెను. ఆయుధములు యుద్ధము సాగనుండఁగా నాలుకలు జ్వాలారూపములఁ జాఁపుచుండునని పురాణములు తెలుపుచున్నవి. ఈరామాయణమునందే లంకానగరమున తాన్పుతములు కనఁబడునపు డీవిషయము తెలియఁదగును. అనఁగా

రాక్షససంహారమే యీయవతారమునకుఁ బ్రయోజనము కావున
వారియాకృతులు నాయుధములు తత్త్వజ్ఞులకు స్పష్టము
చేయుచుండెననియు, దశదిశలను వెలుంగఁజేయుచుండెననుట
చేత నయోధ్యాపురమునఁ జంద్రికకడనున్నయట్లుగాక నీ యా
ద్భుత తేజముల విశేషించి కనఁబడఁజేసిరనియు నెఱుంగందగును.

"స్థాణుం దేవమివాచింత్యం కుమారావివ పావకీ." ౧౦

'అచింత్యం అచింత్యవైభవమ్' అని గోవిందరాజులు. అచింత
వైభవుఁ డగుశంకరు ననుటచేత శివుఁడు భగవంతుఁడని
వాల్మీకియాశయమని కనుపట్టు విష్ణువునకంటె శంకరుఁ డల్పుఁ
డన్న దురాగ్రహము వాల్మీకివంటిమహామునికిం గలుగునా? మధ్వ
వైష్ణవులకే యది విశేషించి యుండునుగదా.

## గురూపదేశము.

సరయూనదీదక్షిణతీరమునకుఁ బోవఁగానే విశ్వామిత్రుఁడు
రామా యని పిలిచి చెంతకు రాఁగా వత్సా! జలములం
గైకొనుము. ఆలసింపకుమని హెచ్చరించెను.

"గృహాణ వత్స సలిలం మా భూత్కాలస్య పర్యయః,
మంత్రగ్రామం గృహాణ త్వం బలామతిబలాం తథా." ౧౧

ఇందుఁ గలసారమేమి? గురువు సచ్ఛిష్యుఁడు లభింపఁగానే గురు
పారంపర్యాభివృద్ధికొఱకు మంత్రోపదేశము చేయవలయును.
కాలము వ్యర్థపుచ్చరాదు.

"అనర్హే మంత్రవిజ్ఞానం న తిష్ఠతి కదాచన,
తస్మాత్పరీక్ష్య వక్తవ్యమన్యథా నిష్ఫలం భవేత్.
యః స్నేహభయలోభాద్యైరయోగ్యం యది దీక్షయేత్,
దేవతాశాపమాప్నోతి కృతం చ నిష్ఫలం భవేత్.

జ్ఞానేన క్రియయా వాపి గురుశ్శిష్యం పరీక్షయేత్,
సంవత్సరం తద ం వా తదర్థం వా ప్రయత్నతః.
శిష్యోఽపి లక్షణైరేతైః కుర్యాద్గురు పరీక్షణమ్."

అని కాశీనాథకృతపురశ్చ్చరణదీపికయందుఁ దెల్పినట్లు బంధు తా దులను బురస్కరించుకొని మంత్ర ముపదేశింపరాదనియు నట్లుపదేశించిన నాదేవత శపించుననియుఁ జేసినకర్మములు నిష్ఫలము లగుననియుఁ దాత్పర్య ము. గురువు శిష్యుని జ్ఞాన ముచేఁ గ్రియలచేఁ దుదకు మూఁడునెలలైనఁ బరీక్షించి యుప దేశింపవలయును. అట్లే శిష్యుఁడుకూడ గురువును బరీక్షించు కొనియే యుపదేశింపుఁడని ప్రా ంపవలయును.

"ఆనందాద్వైర్యధైర్యగాంభీర్యమాధుర్యనాదిషు
జ్ఞానోపదేశసామర్థ్యం మంత్రశుద్ధిమపీశ్వరి,
బోధకత్వం చ విజ్ఞాయ శిష్యో భూయన్న చాన్యథా."

అను నీ నియమముల ననుసరించి గురువునందు బోధకతాది లక్షణములుగలవా లేవా యని పరికించి శిష్యుఁడు కావలయునే కాని గడ్డము కావిగుడ్డలు యోగదండము కౌపీనము చూచి ధనార్జనమునకు నేర్చుకొన్నమాటల నుపన్యాసమున వెడలఁ గ్రక్కు ధోరణిం దిలకించి మహాగురువు దొరకెనుగదా. ఇఁక ము యొకరూప మిచ్చిన దొరకునని మోసపోయి శిష్యుఁ డుగాఁ జేరి ధనముం బోఁగొట్టుకొని పశ్చాత్తాపము నొంద రాదు. అట్టిగురువులకడ దొరకునది దేవతాంతరదూషణమే.

## గురులక్షణములు.

"శ్రీగురుః పరమేశాని శుద్ధవేషో మనోహరః,
సర్వలక్షణసంపన్నస్సర్వావయవశోభితః,

అగ్రగణ్యో గభీరశ్చ పాత్రాపాత్రవిశేషవిత్.
శివవిష్ణుసమస్స్యాద్ధుర్న చ దర్శనదూషకః,
నిత్యే నైమిత్తికే కామ్యే రతః కర్తవ్యానిందితే.
యదృచ్ఛాలాభసంతుష్టో గుణదోషవిభేదకః.
ఇత్యాదిలక్షణోపేతశ్శ్రీ గురుః కథితః ప్రియే,
అత్రినేత్రశ్శివస్సాక్షాదచతుర్బాహురచ్యుతః,
అచతుర్వదనో బ్రహ్మా శ్రీగురుః కథితః ప్రియే." కులార్ణవము.

ఇవి గురులక్షణములు. పాత్రాపాత్రజ్ఞానసంపన్నుఁడుగ నుండం దగు. శివవిష్ణుసముఁడు కావలయును. శివదూషకుఁడుగాని విష్ణుదూషకుఁడుగాని కారాదు. శాస్త్రదూషకుఁడు కారాదు. నిత్యనైమిత్తికకామ్యము లనఁబడు శాస్త్రవిహితకర్మముల నాచరించువాఁడు కావలయు. దొరకినంతతోఁ దృప్తిపడువాఁడుగావలయు. కొంచెము ధనమిచ్చిన దూషించుచు నధిక మొసంగిన భూషించువాఁడు తుచ్ఛబుద్ధిగలవాఁడు కావున వ్రాతుఁడనంబడు. గురువనఁగా మూఁడవకన్నులేని శంకరుఁడు. చతుర్బాహువుకాని విష్ణువు. నలుమోములులేని బ్రహ్మ యనంబడును. అనఁగా గురువునందుఁ ద్రిమూర్తులయం దునుపఁదగుభక్తి నునుపవలయునని భావము.

## నింద్యగురులక్షణములు.

"శ్విత్రీ చైవ గళత్కుష్ఠీ నేత్రరోగీ చ వామనః,
కునఖీ శ్యావదంతశ్చ స్త్రీజితో వ్యాధికాంగకః.
హీనాంగః కపటీ రోగీ బహ్వాశీ బహుజల్పకః,
ఏతైర్దోషైర్విహీనో యస్స గురుశ్శిష్యసమ్మతః." క్రియాసారము.

"ఉత్తమః పంచధా ప్రోక్తో గురుర్బ్రహ్మవేదిభిః,
బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థశ్చ భిక్షుకః,
అతివర్ణాశ్రమీ చేతి క్రమాచ్ఛ్రేష్ఠో విచక్షణః." సూతసంహిత.

"నిందితస్తు పితుర్మంత్రస్తథా మాతామహస్య చ,
సోదరస్య కనిష్ఠస్య వైరిపక్షాశ్రితస్య చ." జ్ఞానార్ణవము.

అనుపతులు గలవాఁడు గురువన నర్హుఁడు. వీనింబట్టి దేవతా దూషకుఁడు గురుత మునకుఁ దగఁడని స్పష్టము. ఏలయనఁగా నాతనిబుద్ధి సమత ము కాంచలేదు.

"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. ౨౯
యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి. ౩౦
గీత ౬ అధ్యా.

విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ పండితాస్సమదర్శినః. ౧౮
లభంతే బ్రహ్మనిర్వాణమృషయః క్షీణకల్మషాః,
ఛిన్నద్వైధా యతాత్మానస్సర్వభూతహితే రతాః" ౨౫
గీత ౫ అధ్యా.

అన్న శ్రీకృష్ణపరమాత్మ దగునుపదేశమును వారెఱుంగరు. కావున నట్టివారు గురువులు కానర్హులు కారు. ధనార్జనమునకై పాటుపడువ్రాతు లు గురువులనుకొనుమూఢులుతరింపఁజాలరు.

"నాస్తికాన్ భిన్నమర్యాదాన్ కృతఘ్నాన్వేదనిందకాన్,
మంత్రాక్షరోపదేశే తు దూరతః పరివర్జయేత్." నారదతంత్రము.

ఇది శిష్యపరీక్షావిధి. గురువులు నిట్టివారైన దూరముగా నుంచఁదగినవారే.

## శిష్య లక్షణములు.

"న దేయమర్థలుబ్ధాయ పిశునాయాస్థిరాయ చ,
భక్తిశ్రద్ధావిహీనాయ శుశ్రూషావిముఖాయ చ." సనత్కుమారసంహిత.

"దాసస్య శివభక్తస్య వాత ప్రియకరస్య చ,
శూద్రస్యాపి ప్రదాతవ్యం నమోంతం ప్రణవం వినా." కులార్ణవము.

ఇందు శివశబ్దము భగవత్పరము. కాని పార్వతీపతిపరము గాదు. దేవతాభక్తిగలవాఁడని సారము.

"అమాత్యదోషో రాజానం భార్యాదోషః పతిం యథా,
తథా శిష్యకృతో దోషో గురుం ప్రాప్నోత్యసంశయమ్."
తస్మాచ్ఛిష్యం గురుర్నిత్యం పరీక్ష్యైవ పరిగ్రహేత్, కులార్ణవము.

ఇట్లు ప్రమాణగ్రంథములు గురుశిష్యలపరీక్షలఁ దెల్పుచున్నవి. ప్రకృతమునకు వత్తము. ఇందు గురువు విశ్వామిత్రుఁడు. రాజ్యలక్ష్మిని దృణముగా భావించి భగవత్సేవచేసి యాఫలమును లోకోపకారకార్యముల కొసంగిన మహాముని. ఇఁక శిష్యుఁడో రామమూర్తి. సామాన్యమానవునిగానే భావించి విచారింతము. పితృనానతి శిరస్సున ధరించి రాజభోగముల వదలి యడవుల కొకమునివెంట రాక్షసులతోఁ బోర నరుగుచున్న రాజకుమారజ్యేష్ఠుఁడు. ఇట్టి శిష్యుఁడు దొరకినపుడు లోకోపకారపరాయణత మున మేలిబంతియగు కౌశికుఁ డాలసింపక యుపదేశించెను.

కొందఱు శాస్త్రరీతిగా నాకాల ముపదేశార్హమా యని ప్రశ్నింతురు.

"సతీర్థేఽర్కవిధుగ్రాసే పుణ్యారణ్యే వనేషు చ,
పుణ్యక్షేత్రే కురుక్షేత్రే దేవీపీఠచతుష్టయే,
ప్రయాగే శ్రీగిరౌ కాశ్యాం కాలాకాలాన్న శోధయేత్."

అనునాగమము ననుసరించి మహాతీ ముగఁ బరిగణింపఁబడు సరయూతీరము దొరకినపుడు తిథివారాదిశుద్ధులను జూడ నక్కఱలేదు. అన్న యీశాస్త్రముల నెఱింగిన యావిశ్వామిత్రముని పాత్రముదొరకినపుడు తడయక యొసంగి కృతార్థుఁడయ్యెను. భక్తరక్షణదీక్షఁబూనిన పరమాత్మకు రామచంద్రునకుఁ దడవుచేయక చిరకాలార్జితతపఃఫలభూతము లగుమంత్రముల నుపదేశించి యేయ ముం గోరక సద్గురుధర్మముల నవలంబించి "ధనో ఽస్మి" యనుకొనియెను. ఈయుపదేశలక్షణమును బరీక్షించినయెడల ద్రవ్యముకొఱ కుపదేశింపరాదనియు మంత్రజపతత్పరుఁ డన్నయోగ్యతను మాత్రమే పరీక్షించి యుపదేశింపఁదగుననియు, గురుపరంపర వృ చేయక త్రెంపరాదనియు మహాత్ము లీమార్గమునే యవలంబించిరనియు నీభాగమునుండి మన మెఱుంగవలయును.

కొందఱీకాలమున వేషధారులై గురువులమని మంత్రముల నుపదేశించుచు వంచకులై ధనమును లాగుచు దానిచే బంధువులను రహస్య బంధువులను దనుపుచుఁ దమ్మేవ రెఱుంగరని యూహించుచు నితరమతములను, తన్మతస్థు లారాధించు దేవతలను దూషించుచు నిరకకార ములను మహాకార ములవలె సాధింపఁబూనితిమని డంబములు చెప్పుకొనుచుఁ జరింతురు. అట్టిమూర్ఖులను వంచకుల న లుబ్ధులను నమ్మరాదని పైఁజెప్పఁబడిన ప్రమాణవాక్యములు తెలుపుచున్నవి. ఇట్టి యనాచారములు పూర్వకాలమున లేవని రామాయణమే చాటుచున్నది. ఇక్కాలమున భక్తి యనునది భుక్తిగామాఱు చున్నది. ఉపదేశమనునది ధనార్జనోపదేశముగా మాఱు

చున్నది. మతమనునది పరదూషణసమ్మతముగాఁ దారుమా అగుచున్నది. అట్టితుచ్ఛోపదేష్టలమాటలను బేలువోవక విశ్వామిత్రచరిత్రమును బఠించి భగవంతుని శ్రీరాముని సముచిత భక్తిచే ధ్యానించుచు హరిహరపరమేశ్వరూపునిగా నావత్తునే భావించుచుఁ గృతకృత్యులము కావలయును. వేఱొండుపాయము కానరాదు.

"కామం బహుగుణాస్సర్వే త్వయ్యేతే నాత్ర సంశయః,
తపసా సంభృతే చైతే బహురూపే భవిష్యతః." ౧౯

అను నీభాగమునఁ గలవిశేషము మును బరికింతము. ఓశ్రీరామా! బలాతిబలానామకమంత్రముల జపించినఁ గలుగుసౌభాగ్యాది గుణము లేయేవికలవో అవియన్నియు నీయందు నెలకొనియే యున్నవి. ఐనను జిరకాలతపస్సుచే నూర్జితముచేయఁబడిన వీనిని నీవు పరిగ్రహించిన విశేషించి ఫలముల నీయఁగలవు. నీమూలమున నవి వర్ధిల్లఁగలవనియె. అనఁగా భగవంతుఁడవు కనుక సౌందర్యాదులన్నియు ననుపమానములుగా నీయందే యున్నవి. నే నీమంత్రములను జిరకాల ముపాసించితిని. నీకు నుపదేశించిన నవియును ధన్యములగును. నేనును ధన్యుఁడ నగుదు. ఈభావముచేత ముని పల్కెనుగదా. దీనినుండి మనము గ్రహింపఁదగువిషయ మేమనఁగా సద్గురువుకడ నుపదేశముగా గ్రహింపఁబడిన మంత్రములఁ జక్కఁగా నుపాసించి తగినశిష్యున కొసంగవలయుననియు నదియే చేయఁదగిన కార్యమనియు నట్టు లొసంగకయుండుట గురుపరంపరను దెగఁగొట్టిన ట్లగుననియు దానఁ బిశాచత్వము సంభవించు నన్న శాస్త్రము వ్యర్థముకాదనియుఁ దనకుఁ దెలిసినవిషయము నిత

రులకుఁ జెప్పుటయే విధియనియు నీనీతి మది నిల్పఁదగుననియు దీనిచే నుత్తమజ్ఞానము లభించుననియు నగు. పరోపకారము నకుఁ బనికిరానిదేదియు ఫలవంతముకాదని భావము.

"గురుకార్యాణి సర్వాణి నియుజ్య కుశికాత్మజే." ౨౨

అనుభాగమునుండి నేర్చుకొనఁదగినవి. గురుకార్యములనఁగా మంత్రోపదేశానంతరము శిష్యుఁడు

"బ్రహ్మారంభేఽవసానే చ పాదౌ గ్రాహ్యౌ గురోస్సదా,
సంహత్య హస్తావధ్యేయం స హి బ్రహ్మాంజలిస్స్మృతః. ౭౧
వ్యత్యస్తపాణినా కార్యముపసంగ్రహణం గురోః,
సవ్యేనసవ్యః స్ప్రష్టవ్యో దక్షిణేన చ దక్షిణః." ౭౨ మను ౨ అధ్యా-

అన్న స్మృతి ననుసరించి గురువునకు విధిమంతముగా నమస్కరించుట, వినయమున వారిని సేవించుట లోనగుకారము లొనరింపఁదగుననియు గురుభక్తిపరాయణులకే మంత్రములు ఫలము నొసంగుననియు నెఱుంగవలయును. ఇట్లు భగవంతుఁడగు రాముఁడు గురుసేవచేయుట లోకసంగ్రహార్థమే యని యెఱుంగవలయును.

"యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః. ౨౩
ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహం,
సంకరస్య చ కర్తా స్యాముపహన్యామిమాః ప్రజాః." ౨౪గీత ౩అధ్యా-

అన్న గీతావాక్యము భగవదుక్తమేకదా. శ్రీరామచంద్రుఁడిట్లు గురుపూజాదిక మొనరించి లోకమునకు సదాచారమును బోధించెను.

"ధర్మార్థౌ యస్య న స్యాతాం శుశ్రూషావాపి తద్విధా,
తత్ర విద్యా న వక్తవ్యా శుభం బీజమివోషరే." ౧౧౨ మను ౨ అ.

అట్టు లొనరింపకయున్నచో నీస్మృతిప్రకార మసచ్ఛిష్యు లకు మార్గము చూపినయట్లగును శ్రీరాముని ప్రవృత్తి సకలస్మృతి సారముకదా. కావునఁ దా నట్లే యొనరించి యితరులకు మార్గ దర్శకుఁ డయెను. కావున శ్రీరామచంద్రునియాచారము నను సరించి గురువును సేవించి భక్తిచే నారాధించి కృతకృతు లు కావలయును. ఇదియే తొలుత రామప్రవృత్తి మనకుఁ దెలి పిన సదాచారము.

"అభివాదనశీలస్య నిత్యం వృద్ధోపసేవినః,
చత్వారి తస్య వర్ధంతే ఆయుర్విద్యాయశోబలమ్." ౧౨౧ మను. ౨ అ.

అని మనుస్మృతి గురుపూజ ఆయురిద్యా యశోబలములను వృ చేయునని తెలుపుచున్నది. ఈస్మృతినే శ్రీరామచంద్ర మూర్తి తనప్రవర్తనమునఁ దెలియఁజేసెను. కావున శ్రీరామ ప్రవర్తనము సకలస్మృతివిహితమని మనము నమ్మి యట్లు వర్తింపవలయును. మఱియు

"ఉత్పాదకబ్రహ్మదాత్రో ర్గరీయాన్ బ్రహ్మదః పితా,
బ్రహ్మజన్మ హి విప్రస్య ప్రేత్య చేహచ శాశ్వతమ్. ౧౪౬
కామాన్మాతాపితాచైనం యదుత్పాదయతో మిథః,
సంభూతిం తస్యతాం విద్యాద్యద్యోనావభిజాయతే. ౧౪౭
ఆచార్యస్త్వస్య యాం జాతిం విధివద్వేదపారగః,
ఉత్పాదయతి సావిత్ర్యా సా సత్యా సాజరామరా." ౧౪౮
మను. ౨ అధ్యా.

అను నీస్మృతివాక్యములను బాటించి మంత్రోపదేశకుఁడు తండ్రికంటె శ్రేష్ఠుఁడనియు నట్టిమంత్రోపదేశకుని సేవింపవలయు ననునీతిని దృఢపఱచెను.

మునింగూడి తృణశయ్యపై లక్ష్మణునిగూడి రామచంద్రుఁడు శయనించెను. దీనింబట్టి

"హీనాన్నవస్త్రవేషస్స్యాత్సర్వదా గురుసన్నిధౌ,
ఉత్తిష్ఠేత్ప్రథమం చాస్య చరమం చైవ సంవిశేత్. ౧౯౪
ప్రతిశ్రవణ సంభాషే శయానో న సమాచరేత్,
నాసీనో నచ భుంజానో న తిష్ఠన్న పరాఙ్ముఖః." ౧౯౫ మను. ౨ అ.

రామచంద్రమూర్తి గురువు శయనించినపిదపఁ దృణశయ్యపై శయనించి పైస్మృతిప్రతిపాదితాచారమును దృఢపఱచెను. కావున నీసర్గమునఁ బ్రతిపాదింపఁబడిన కథనుండి శ్రీరాముని ప్రవర్తనమే స్మృతియని మనము నమ్మవలయును. అనఁగా స్మృతులు బోధించినసదాచారము నాయుగమున కనుకూలమగునట్లు స ప్రవర్తనమూలమునఁ దెలిపెను. ఇట్లే యిఁక ముందు నెఱుంగందగు. ఇఁకఁ దరువాతి రామచంద్రప్రవృత్తి యెట్టిదని పరికింతము.

## విశ్వామిత్రుఁ డంగదేశవృత్తాంతమును రామునకుఁ దెలుపుట.

* ఆరాత్రి గడుపఁగా గాధేయుఁడు తృణాదికల్పితశయ్యపై శయనించియున్న రామలక్ష్మణులం జూచి యచ్చెరువం దెను. నిత్యకృత్యముల నొనరింపఁ బురికొల్పనెంచి యో

* ఈయది బాలకాండము నిరువదిమూఁడవసర్గమునుండి గ్రహింపఁబడినది.

కౌసల్యా పుత్రా! రామచంద్రా! పూర్వ సంధ్య యరుదెంచెను. పురుషోత్తమా! లెమ్ము. పగటిపూటఁ జేయఁదగిన దేవతాకృత్యము మును జేయవలయు ననియెను. పరమోదారమగు నమ్ముని వాక్యములాలకించి వీరులగు నా రాజకుమారులిరువురు స్నానము చేసి యర్ఘ్యము విడిచి పరమజప మనంబడు సావిత్రీమంత్రమును జపించిరి. సంధ్యోపాసనాదిప్రాతఃకాలమునఁ జేయఁదగు కార్యముల నొనరించి తపోధనుఁడగు విశ్వామిత్రునకు నమస్కరించి పరమానందమునఁ బయనమునకు సిద్ధపడిరి.

అచ్చోటువాసి యామహావీరులు సరయూనదియు గంగానదియుఁ గలియుతావునందు దేవతానదియగు గంగను దర్శించిరి. అందొక్కతావున ననేకసంవత్సరములు తపస్సొనరించిన వారును, మహాప్రభావాంచితులునగు మునులున్న పుణ్యాశ్రమంబు గాంచి కరము హర్షించి మునిం దిలకించి మహాత్మా! ఈ పుణ్యాశ్రమవృత్తాంతమును వినఁగోరుచున్నాము. వచింపుమని వేఁడ వారిమాటలపరిపాటి కానందించి నవి యమ్ముని యిట్లు పల్కెను.

కాముఁడని ప్రసిద్ధిఁగాంచినమన్మథుఁడు పూర్వము దేహధారియైయుండి శంకరుఁడు పార్వతిం బెండ్లియాడంగోరి నియమమునఁ దపస్సొనరించుచుండ నాతని దిరస్కరించి యామహాదేవుని హుంకారమున నిరాకృతుండయె. ఆనేత్రాగ్ని ప్రభల వానియవయవములెల్ల దగ్ధములయెను. ఆనాఁటినుండి యనంగుఁ డనంబరఁగె. ఆమన్మథునియవయవములు పడినతావుగాన నిది యంగదేశ మనంబడుచునున్నది. ఆమహాదేవుని యాశ్రమం బిదియే. ఇందుండు మును లాశంకరభక్తులై యున్నవారు.

కావున వీరునిష్పాపులు. ధర్మపరాయణులు. శ్రీరామా! ఈరాత్రి యంగదేశమున నీపరమపావనాశ్రమమున నీపుణ్యనదులనడుమ నుండి రేపు గంగానదిని దాటిపోవుదము. ఇందు స్నానము చేసి కృత్యంబులం దీర్చి యాశ్రమమునకుం బోవుదము. అని వారు మాటలాడుకొనుచుండఁగా నందున్నమౌనులు జ్ఞానదృక్సంపన్నులుగావున వారిరాకకుం గలకారణ మెఱింగి యరుదెంచి మునికి విధిరీతి మర్యాద లొనరించి కందమూలాదులొసంగి శ్రీరామలక్ష్మణుల కతిథిపూజలు గావించిరి. మునియు నామునుల కుశలమడిగెను. వారు నీముఘ్రురును నానావిధములగుకథలచే సంహృష్టులనుగా నొనరించిరి. సాయంకాలము రాఁగా గాధేయాదులు నేకాగ్రచిత్తులై సంధ్య నుపాసించి యాకామాశ్రమమున సుఖముగా నుండిరి. ఆయాశ్రమమహత్త్త మును రాజకుమారుల కాగాధినందనుఁడు కథారూపమునఁ దెల్పుచు సంతోషపరవశులనుగా నొనరించెను.

## మలదకరూశదేశవృత్తాంతము. తాటకావనగమనము.

*తెల్లవాఱఁగా నరినిషూదనులగు రామలక్ష్మణులు కాలోచితకృత్యముఁదీర్చి విశ్వామిత్రుఁడు ముందరుగ గంగాతీరమునకుం బోయిరి. మును లొకయోడం దెప్పించి మునివర్యా! రాజకుమారులతో నీయోడనెక్కి సుఖముగాఁ బొమ్ము. కాలవిలంబము చేయవలదనఁగా వారిని గారవించి గాధిపట్టి యానదిని దాఁటుచుఁ దన్మధ్యలమునకు నోడచేరఁగా నందుఁదరంగము లొండొంటిని దాఁకుచుండ నాయురవడివలనిధ్వని మహా[illegible]రముగా వినరాఁగా రాకొమరు లాలకించిరి. రాముఁ

*ఇది బాలకాండము నిరువదినాల్గవసర్గమున నున్నది.

డమ్మునితో సీత ని జలములు పరస్పరము మోదుటచేఁ గలిగి నదా అనెను. ఆప్రశ్నమునకు బదులు చెప్పందలంచి మౌని రామచంద్రా! కైలాసమున బ్రహ్మ తనమనస్సుచే నొకసరో వరమును సృజించెను. అది మానససర స్సనంబడును. ఆసరస్సు నుండి ప్రభవిల్లి సరయూనది యయోధ్యా నగరము నావరించి ప్రవహించుచున్నది. అందుచేతనే సరయు వనుపేరు వచ్చినది. గంగకు నెదురుగా వచ్చి సరయూజలములు తాఁకుటంజేసి యా వెనుచప్పుడు కలిగినది. కాన నియతిమై నమస్కరింపుము. అనఁగానే ధార్మికులగు నారాజకుమారు లిరువురును రెండు నదులకు నమస్కరించి గంగ దక్షిణభాగమును జేరి పిదప సులభగమనమునఁ బోవుచు భయంకరముగాఁ గానంబడు నొక వనము జనశూన్య మైయుండఁగాఁ గాంచి మహామునీ! ఈ వనము పేరేమి? ప్రవేశింప వలనుగానియట్టు లున్నది అన్ని దిక్కులందు నీలపురుగులు గీపెట్టుచున్నవి. క్రూరసత్త్వములు పరుగులిడుచున్నవి. పక్షులు భయంకరముగాఁ గూయుచున్నవి. బహువిధవృక్షము లిందున్నవి. దారుణవన మిదెవ రిదని ప్రశ్నించెను. రామమూర్తి యిట్లు ప్రశ్నింపఁగా ముని యిట్లు పలికెను.

రామా! తొల్లి యీచోటున రెండుదేశము లుండెను. మలదకరూశములని వానిపేరులు. అవి దేవనిర్మితములు, ధన ధాన్య సమృద్ధిమంతములు నైయుండెను. వృత్రాసురుని వధింపఁ గానే యాబ్రహ్మహత్య యింద్రు నాపాదించెను. ఆఁకలి యశుచిత ము నాతనికిం గల్గెను. మహర్షులు దేవతలుగూడి గంగాది పుణ్యతీర్థంబుల నభిషేకించి మంత్రపూతకలశోదకంబుల

నింద్రుని స్నాతునిగ నొనరించి యారెండింటిని బాయఁజేసిరి.. ఇంద్రశరీరజనితములగు మలము కారూశము నీదేశమున నునిచిరి. ఇంద్రుఁడానందించి నాదేహ మలకరూశముల ధరించి నందున నీదేశములు ధనధాన సమృ గలిగి మలమును ఖండించుటచేత మలదమనియుఁ గరూశమును గ్రహించుటచేతఁ గరూశమనియుఁ బ్రసి ని గాంచఁగలవని వరమొసంగెను. దేవతలు మేలుమేలని కొనియాడిరి.

తాటక యనుయక్షకాంత కల్గెను. వేయిగజములబలము గలది. కామరూపిణి. రామా! దానివలన నీకేభయము లేకయుండుఁగాక. దానిని సుందుఁడు పెండ్లియాడెను. మారీచుఁడు కుమారుఁడు దానికిం గల్గెను. వానియాకారము మిగుల భయంకరము. ప్రజలు దానిం గాంచి దిగులుపడుదురు. ఆతాటకయు నీరెండు దేశములను నాశనము చేయుచున్నది. ఆరాక్షసి యిచ్చోటికి సా యోజనదూరమున నున్నది. మార్గము నడ్డగించి కాపున్నది. మన మామార్గముననే పోవలయును. నీ వారక్కసిని బాహుబలమునఁ జంపుము. ఆవల నీదేశములు పూర రీతి వెలయునట్లు చేయుము. దానిం జంప నిష్కంటకములగును. మహాపుణ క్షేత్రము లయు ను జయింపనలవిగాని యాయక్షిణి యీభాగము నావరించి నిర్జనముగావించుటచేత నీచోటికి కెవ రు రాఁజాలకయున్నవారు. దీనివృత్తాంత మెల్లఁ దెలిపితినిగదా. అని యూరక యుండెను.

## తాటకావృత్తాంతము.

* ఆమాటలు విని రామమూర్తి మునీశ రా! యక్షు

* ఇది యిరువదియైదవసర్గమునుండి గ్రహింపఁబడినది.

లల్పవీర్యముగలవారని విన్నవాఁడను. ఆజాతిలో నింతబలము గల రక్కసి యెట్లు గల్గెను! దాని వినవలతునన్న ముని యిట్లు తెలిపెను. తాటకకు సహస్రగజములబలము గలుగుటకుఁ గారణము వరమువలననే యని యెఱుంగుము. సుకేతుఁ డనుయక్షుఁ డొకఁడుండెను. సదాచారవంతుఁడే కాని సంతానహీనుఁడై యుండి తపముచేయ నారంభించెను. బ్రహ్మ మెచ్చి తాటక యనుకూఁతు నొసంగి యాకన్నియకు వేయియేనుంగులబలముకూడఁ గల్గునని వరమిచ్చెను. కొడుకుగల్గ ననుగ్రహింపఁ డయ్యెను. ఆతఁడు కన్నియం గాంచి పెంచి సుందునకు నిచ్చి పెండ్లిచేసెను. తాటక కొంతకాలమునకుఁ బరాక్రమశాలి యగు మారీచునిం గనెను. వాఁడు శాపకారణముననే రాక్షసుఁ డయ్యెను. సుందుఁ డగస్త్యముని మూలమునఁ జావఁగాఁ దాటక కుమారుంగూడి యమ్మునిని మ్రింగఁబోఁగా నాయగస్త్యముని దానికొడుకుంగని రాక్షసుఁడవు కమ్మని శపించి తాటకా! నీవు మనుజులఁ దినుచు వికారరూపమును దాల్చియుండుము. అందములకుఁ దావగు నీమోము వికృతిం గాంచుఁగాక. క్రూరశరీరము నీకుఁ గలుగుఁగాక యనియు శాపం బిచ్చెను.

తాటక యాశాపము విని ఘోర ఁజాలక కోపంబు పెంపునఁ జరించుచు నమ్మునియున్న యీభాగమును నిర్జనముగాఁ జేయుచున్నది. రామా! క్రూరస భావము నసత్ప వర్తనముగలయాతాటక లోకములకు మహాపకారము చేయుచున్నది. దుష్టురాలు కావున నీ వాస్త్రీని గోబ్రాహ్మణహితము పొంటె వధింపుము. శాపము సోఁకియున్న యాదుష్టచారిణిని నీవుతప్ప లోకమున మఱెవ్వఁడును జంపలేఁడు. రఘుకులమున

జనించిన నీవే యిందులకు నర్హుఁడవు. స్త్రీని వధించు టెట్లు? అని యేవగించుకొనకుము. నీవు పురుషోత్తముఁడవు. రాజపుత్త్రుఁడవు. నాల్గుజాతులహితముపొంటెఁ దగినకార్యము రాజకుమారులకుఁ గర్తవ్యము. ప్రజారక్షణార్థమగు కార్యము క్రూరమే యగుంగాక. అక్రూరమే యగుంగాక. పాతకమే యగుంగాక. అపవాదము దానఁ గలుగుంగాక. రాజకుమారుఁ డాలసింపక చేసితీఱవలయును. రాజ ధురంధరుల కిది సనాతనమగుధర్మమగును. అధర్మకార్యపరాయణయగు నీయక్షిణిం బొలియింపుము. కాకుత్స్థు లధార్మికుల వధింతురు. దీనియందించుకంతయు ధర్మము కానఁబడదు. కావున నీవు చంపవచ్చును. దుర్మతులగు వనితలఁ జంపుట శిష్టాచారమేకాని వేఱుకాదు. ఈధర్మము నేనుగా కల్పించినదికాదు. విరోచనుని కూఁతురు మంథర యనునది పుడమిని బాడుచేయఁగా నింద్రుఁడు చంపలేదా. భృగుమహర్షి పత్ని శుక్రునితల్లి యింద్రుని లేకుండఁ జేయుదునని శపథంబుచేయఁగా నామెను విష్ణుమూర్తి వధించెను. లోకముల నెందఱో మహాత్ము లధర్మపరాయణలగు వనితలను బ్రజారక్షణార్థము చంపిరి. కాన నిది దోషముకాదని తెలిపెను.

## తాటకావధము.

* విశ్వామిత్త్రుఁ డీరీతి నర్థవంతముగాఁ బలుకఁగా నాగంభీరవాక్కుల విని దృఢవ్రతుఁడు కావున రామమూర్తి తనలో గాధినందనుఁడు చెప్పినట్లు చేయుమని తండ్రి నాకాజ్ఞ నిడెను. ఆయాజ్ఞాగౌరవమువలనను, భగవంతుఁడగు

* ఇది యిరువదాఱవసర్గమునఁ గలదు.

నీమునిపంపుననుశంకాలేశముకూడ మాని నాకుఁ జేయఁదగినదే యగును. అని యాలోచించి యాకౌశికమునిచంద్రుం గాంచి మహాత్మా!అయోధ్యా పురమున మాతండ్రి తమయానతి మెయిఁ జేయుమని నాకుం జెప్పెను. ఆమాట యనుల్లంఘ్యము కదా. తండ్రియానతివినియున్నాఁడను. పితృశాసనము పాలింపనే వ్రతమూనితిని. అందును బ్రహ్మవాదులగు విశ్వామిత్ర మునిచంద్రుల యాజ్ఞ. కావునఁ దాటకావధము నాకుఁ గర్తవ్యము, ఉత్తమకార్యమునగు. శంకింపవలదు. గోబ్రాహ్మణ హితార్థము; ఈదేశహితార్థము తమయానతిం దలందాల్చి యద్దానవి వధింతును. అని మాటయిచ్చి యాశత్రుసూదనుఁడు ధనుస్సునుబట్టుకొని దిక్కులు మారుమ్రోయునట్లు నారి సారించెను. ఆజ్యానినాదము విన్నయంతనే తాటకయున్న యవనముననున్నవారెల్ల భయంబందిరి. తాటక స్వభావముననే క్రూరాత్మురాలు. దానికిం దోడుగ నామ్రోఁత విని యేమి చేయుటకుం దోఁచక తత్తఱపడి కోపాతిరేకమున మూర్ఛిల్లుచు నాశబ్ద మెటనుండివచ్చెనోకో యని యూహించి యచ్చటికే పరుగిడెను.

వికారమగు నాకారముగల యాతాటక మిగులఁ గోపమునం బరువెత్తిరాఁగాఁ గనుంగొని రామమూర్తి తమ్మునితో నావచ్చురాక్షసిం జూడుము. వికారరూపమునఁ జూచువారలు దిగులుపడం జేయుచున్నది. అధీరులే దీనిం గాంచిన వారిగుండెలు బ్రద్దలగును. దీనిని మార్కొనుటయే పౌరుషము. మాయాబలముగలది. దీని ముక్కు చెవులును గోసి మరలి పోవునట్లు చేసెదను. అది చాలును. గురువాక్యము నిరసింం

చిన ట్లగును. ప్రాగావున రక్షింపఁదగును. కావున సాహస మూని వధింప నామనస్సుత్సహింపకున్నది. చేతులు కాళ్లును ఛేదించి పరాక్రమముగ మనము నడంచుట తగునని నాతలం పుగ నున్నది.

రామమూర్తి తమ్మునితో నిట్లు మాటలాడుచుండఁగాఁ దాటక క్రోధమున నోడలెఱుంగక చేతులు పైకిఁజాఁపి యార్చుచు లక్ష్మణుని మాని రామునిమీఁదికిం బోయెను. మహానుభావుఁ డగునాముని రామభద్రుఁ డమానుషశక్తి యుక్తుండే యని యెఱింగియు నాదురాత్మురాలి క్రోధాతిరేక మును గని యించుక జంకి దానిని హుంకారమున నదలించి రామలక్ష్మణులకు శుభములు గలుగుఁగాక యని యాశీర దించెను. అంతలో నాతాటకయు పెంధూళిని జల్లుచు దాన నంధకారమును గల్పించి యించుకసే పాసోదరులను శ్రమం పడంజేసి యంతట మాయపూని కానరాక పాషాణవర్షమును గురియించెను. అంతట రాముఁ డాగ్రహించి బాణవర్షమున నాపాషాణవృష్టిని మాయించి మరల నట్టిపనిచేయకయుండ దానికరముల ఛేదించెను. కరములు లేమి నది శ్రమమొంది చెంతనిలుచుండఁగా లక్ష్మణుఁడు కర్ణనాసికలను గోసివైచెను. తోడనే యాకామరూపిణి మాయందాల్చి నానారూపములం బన్నికనఁబడక ఘోరరీతిని బాషాణములను గురియించి తోఁచక యుండఁజేయఁగా నాశాలవర్షమున మునుఁగుచున్న సోద రులంగని గాధినందనుఁడు దానింజంపింపఁబూని రామచంద్రా! దయచూపుట యిఁకఁజాలును. స్త్రీయని యెంతువో. ఇది మహా పాపాత్మురాలు. ఇఁకను ప్రచితివేని దుశ్చర్యలం బ్రవర్తిల్లును.

యజ్ఞధ్వంసకురాలు. సాయంకాలముకాఁగా దీని మాయప్ర
వృద్ధిం గాంచు. సంధ్యా కాలము రానున్నది. ఇపుడే దీనిం బరి
మార్పుము. రాక్షసులకు సాయంకాలము బలాభివృద్ధి నొసం
గును. రాముఁడు దానిహాసముశబ్దమువలన నెఱింగి బాణముల
నరికట్టెను. కావున దానియాఁటలు సాగవయ్యెను. అదియు
భయంకరముగా నార్చుచు వారిపై కరుదెంచెను. పిడుగు
భంగిఁ బైఁబడవచ్చుచున్నదాని నొక తీవ్రనారాచమున
వక్షము భేదింపఁగా నది భూమింబడి ప్రాణముల వదలెను.
దేవత లింద్రపురస్కృతులై మేలుమేలని రాముని విను
తించిరి. దేవత లామునిం గాంచి మునీంద్రా! నీకు శుభము
కలుగుఁగాక. ఇంద్రాదులమగు మేము నీకార్యమునకు సంతు
ష్టుల మైతిమి. ఈరామునకు నీకడఁగల సకలాస్త్రములఁ బ్రసా
దింపుము. నీవెంటనుండి శుశ్రూష చేయుచు నియతుఁడై
యున్నవాఁడు. కావునఁ బాత్రుఁడు. ఈరాముఁడు భూరిదేవ
కార్యము సాధింపవలయును. కావున సకలాస్త్రములఁ గరు
ణింపుమని పలికి యమ్మునింబొగడి తమతమనెలవుల కరిగిరి.
సంధ్యా సమయముకూడ నయ్యెను. మునియుఁ దాటకాసంహా
రమున కెంతయు నానందించి శిరము మూర్కొని రామచంద్రా!
నయనానందకారణా! నేఁటిరేయి యిందుండి రేపు నాయుండు
నాశ్రమమునకుం బోవుదము. అనఁగా రాముఁ డానందించి
తాటకావనముననుండ సమ్మతించెను. తాటకామృతిచే నావ
నము తివదలి కుబేరోద్యానమగు చైత్రరథమువలెఁ గన్ప
ట్టెను. ఆరేయి యందే వారు గడపిరి. తెల్లవాఱుసమయమున
రాముని వారిని మేల్కొలిపెను.

మహాశయులారా! అంగదేశవృత్తాంతము మొదలు తాటకావధము దనుకంగలభాగమున విశేషాంశము లనేకము లున్నవి. వానిలోఁ గొన్నింటిని విమర్శింతును.

"కౌసల్యా సుప్రజా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే,
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్."

అనుమూలమునఁగల విశేషములను నిటఁ బెంచి వ్రాయను. కాని యందుఁ గలవిశేషవిషయములను గైకొందును. నిద్రాభంగముచేయుట బ్రహ్మహత్యాసమమని దేవీభాగవతమున గలదు. ఆరీతిగా రామమూర్తిని ముని లేపఁబూనరాదుకదా యని యడుగుదురేని సమాధానము సులభమే. నిద్రాకాలము విధివిహితమై యున్నది.

"సూర్యాభ్యుదితస్సూర్యాభినిర్ముక్తః."

అన్నశ్రుతి ననుసరించి సూర్యోదయకాలమున శయనించినచో నొకదోషము గలదు. అభ్యుదితమని దానిపేరు. అది రాకయుండ మేలుకొలుపుట మంచిదే. కాని తటాలునఁ బట్టిలేపరాదు. కొందఱి కద్దానఁ బ్రాణాపాయముకూడ సంభవించును. కావుననే వలదనిరి. రాత్రి చనఁ దలంపఁగాఁ దెల్లవాఱులక్షణములు కనఁబడుచుండఁగా ముని మార్గాయాసమున మైమఱచి యాగడ్డిశయ్యఁ బరుండియున్న మహానుభావుని పరబ్రహ్మాండనాయకుని దివ్యమంగళవిగ్రహుని రామచంద్రుని బిలకించి లేపఁ బ్రయత్నించెను. రాజ్యసుఖములు మాని ధర్మరక్షణమునకై తనవెంట నడవులకు వేంచేసియున్న యాపరమపురుషుని వీక్షించెను. అవలోకనమాత్రమున మానస మానందపరవశమయ్యెను. ఇట్టి మహనీయునిఁ గుమారునిగాఁ గన్న కౌసల

యొంత ధన్యురాలు. అనుమాహ తో౯చెను. దశరథు నేల తలంచుకొనలేదు.? అన్న ప్రశ్నము రాజనదు.

"ఉపాధ్యాయాన్ దశాచార్య ఆచార్యాణాం శతం పితా,
సహస్రంతు పితౄన్మాతా గౌరవేణాతిరిచ్యతే." ౧౪౫ అ ౨.

అన్న మనుస్మృతివాక్యము ననుసరించి తల్లి యెల్లరకన్న నెక్కుడు. వీరప్రసువు, రమాత, అను పేరులు తల్లికే గలవు. కావుననే తొలుదొలుత తల్లియే యమ్మునిమనస్సునకుఁ దగిలెను. దీనింబట్టి మాతృభక్తిలేనివాని కితర దేవతాభక్తి ఫలింపదని తో౯చెడు. గాయత్రి నుపాసింపక "ప్రజపేదే దమాతర" మ్మను శాస్త్రము ననుసరింపక యితరమంత్రముల నుపాసించిన ఫలము లేదుకదా. ఈముని యూహాను బాటించి చక్కఁగా నూహింంచినయెడలఁ బ్రకృతి నుపాసింపక పరమపురుషు నుపాసించినఁ జక్కనిఫల మనఁగాఁ బరమపురుషార్థము లభింపదనియే తో౯చెడు. ఏలయనఁగా నజ్ఞానము తొలఁగింపఁ బ్రకృతికే యధికారము కలదు.

"దైవీ హ్యేషా గుణామయీ మమ మాయా దురత్యయా,
మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే."౧౪ గీత ౭ అ.

అను శ్రీకృష్ణవాక్యము వ్యమా యనరాదు. త్రిగుణస రూపిణియై నాస రూపిణియగుమాయ యనఁగా మూలప్రకృతి దురత్యయ యగును. అనఁగా నెంత శ్రమపడినను దరింపరానిదగును. నన్నే యెవరు విధిగా నారాధింతురో వారీమాయను దరింతురనియే యీశ్లోకాభిప్రాయము. ప్రకృతినివదలి నన్నే యుపాసించిన మాయను దరింతురన్నందునఁ బ్రకృత్యుపాసన మక్కఱలేదని యభిప్రాయమని కొందఱందురు. అది పొరపాటు.

అభావమే భగవంతునిదైనచో "మమ మాయా దురత్యయా" అని యేల పల్కును? దురత్యయా యనఁగా శ్రమించినను దాఁటరానిదనియే యర్థము. ఈ రెండు నెట్లు వాస్తవములగును? కానే కావు. ఇక గ్రహింపఁదగినభావ మేది? తొలుదొలుత మాయ నుపాసించి తదనుగ్రహమునకుఁ బాత్రుఁడైనచో భగవంతు నుపాసించుజ్ఞాన మలవడును. అపుడు మాయామోహము తొలంగును. భగవంతుని తేజోరూపము పొడకట్టును. నేత్రములకుఁ బొరకప్పఁగా దానిని దొలఁగింపక వస్త్వంతరము కనఁబడదు. అట్లే భగవంతు నాచ్ఛాదించి యనన్యసాధ్యయగుమహామాయ యుండఁగా దానిని గడచి భగవంతుని దర్శించు టెట్లు? అది రిక్తమాటలచే నగునదికాదు. దాని నారాధించితీరవలయు. లేనిచో దొరకునది భగవత్ప్రసాద మనఁబడు నన్నవిశేషమే కాని భగవదనుగ్రహము కాదు. భగవద్వాక్యం దుత్తరార్థము సార్థకమైనచోఁ బూర్వార్థము సార్థకమగును. కావున నీమార్గము నాశ్రయించిన రెండును సార్థకములగును. ఈయర్థమునే శంకరభగవత్పాదులవారు

"అవిద్యానామంతస్తిమిరమిహిరద్వీపనగరీ
జడానాం చైతన్యస్తబకమకరందస్రుతిఝరీ,
దరిద్రాణాం చింతామణి గుణనికా జన్మజలధౌ
నిమగ్నానాం దంష్ట్రా మురరిపువరాహస్య భవతి." 3

సౌందర్యలహరియందు వివరించిరి. "జన్మజలధౌ నిమగ్నానాం మురరిపువరాహస్య దంష్ట్రా భవతి" సంసారసాగర నిమగ్నులకు నాదివరాహదంష్ట్ర యగుననఁగా నుద్ధరించునది యగుననికదా భావము. ప్రకృతి యనఁగా సామాన్యు లనుకొనునట్లు పార్వ

తియో లక్ష్మియో శారదయో కాదనియుఁ బరమానందల
హరియే యనియు శ్రీశంకరభగవత్పాదులువారే సౌందర్య
లహరియం దిట్లు తేటపఱచిరి.

"తటిల్లేఖాతన్వీం తపనశశివైశ్వానరమయీం
నిషణ్ణాం షణ్ణామప్యుపరికమలానాం తవ కళాం,
మహాపద్మాటవ్యాం మృదితమలమాయేన మనసా
మహాంతః పశ్యంతో దధతి పరమానందలహరీం. ౨౧
త్రయాణాం దేవానాం త్రిగుణజనితానాం తవ శివే
భవేత్పూజా పూజా తవచరణయోర్యా విరచితా,
తథాహి త్వత్పాదోద్వహనమణిపీఠస్య నికటే
స్థితా హ్యేతే శశ్వన్ముకుళితకరోత్తంసమకుటాః." ౨౫

ఈయభిప్రాయముంబట్టి చూడఁగా భగవ తావాక్య ము సా క్ష
మగుచున్నది. అనఁగాఁ ద్రిమూర్తులు భగవత్ ంశసంభూతులు
కారా ము నిర్మింపఁబడినవారు. ఒక్కభగవంతుఁడే యవికృ
తుఁడు, వికృతి భగవన్మాయ. రూపవంతులెల్లరు ప్రకృతికల్పి
తులు. భగవన్మయియయి వేఱుచేయ సాధ ముకాని దొక్క
ప్రకృతియే. అట్టిదాని నుపాసింపక తత్కల్పితులగు త్రిమూ
ర్తుల నుపాసించు టెట్టిదో, అంతతో నూరకయుండక వారిలో
నొక్కఁడగువిష్ణువును భగవంతుఁడని కొందఱు, శివుఁడు పరా
త్పరుఁడనికొందఱు పాటుపడుట మీఁదుమిక్కిలి దూషించుట
యవివేకముగాక మఱేమగును? సౌందర లహరి ప్రమాణమా
యనికొందఱందురు. భగవ త ప్రమాణమా యన్న నోరుమూ
యవలసినదేకదా. కావున నన్నియుఁ బ్రమాణములే యని శిర
సావహింపవలయును. విరుద్ధములుగ నున్నవే యందు లేని వాని

భావములను గ్రహించుపద్ధతిచే గ్రహించిన నన్నియు నవిరుద్ధములే యగును. నిష్పక్షపాతబు ద్ధియొక్కఁడుండినఁ జాలును. అన్నియు సరిపడును. అదియొక్కటి లేకున్న నన్నియు విరుద్ధములే. అట్టివారలకే శివకేశవాది దేవతాతారతమ్యము కనుపట్టును. అది మది నాటియున్నంతదనుక వారల కీయజ్ఞానాంధకారవిముక్తికి మార్గము తెలియదనుట సిద్ధాంతము.

"యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాంతి పితృవ్రతాః,
భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపి మాం." ౨౫
గీత ౯ అధ్యా.

అన్న భగవదుక్తిని బరికించినయెడలఁ బైయర్థము తేటపడును. మఱియు

"యేఽప్యన్యదేవతాభక్తా యజంతే శ్రద్ధయాన్వితాః,
తేఽపి మామేవ కౌంతేయ యజంత్యవిధిపూర్వకమ్." ౨౩ గీత ౯ అ.

అన్న యీశ్రీకృష్ణవాక్యమూర్ధ్వోదాహృతభావమును సిద్ధాంతము జేయుచున్నది. అనఁగా పర దేవతారూపుఁడనగు నన్నే పూజించుచున్నారు. కాని త్రోవ యదికాదు. బ్రహ్మా సృష్టికర్తమాత్రమే యని భావించినచో నది సరియగుమార్గముకాదు. కాన బ్రహ్మాసరూపుఁడనగు నన్నెఱుంగక నన్నే యారాధించుచున్నారనికదా భావము. ఈవాక్యము పల్కువాఁడు శ్రీకృష్ణమూర్తికదా. విష్ణువేకదా యందురేని 'ఆదిత్యానామహం విష్ణుః' అనియు'రుద్రాణాం శంకరశ్చాస్మి'యనియు కృష్ణుఁడే పలికెను. దేవతలలో విష్ణువును నేను. రుద్రులలో శంకరుఁడను నేను. అనఁగా దేవతలలో విష్ణుమూర్తి యుత్కృష్టుఁడు. రుద్రులలో శంకరుఁ డుత్తముఁడు అనియే య మగును. అపుడు

శ్రీకృష్ణుఁ డెవఁడు? ఈహరిహరధాతృప్రముఖులు సకలభూత ములు తానే యైనవాఁడు. అనఁగా భగవంతుఁడు విష్ణువే యని యెట్లు సిద్ధాంతమగును? తల్లక్రిందులుగా తపస్సు చేసినను అది సిద్ధాంతము కాదు. వైకుంఠలోకవాసి యనఁగానే భగవంతుఁడు కాఁడని యర్థము కాలేదా. సర్వవ్యాపకున కొక్కలోకము నివాసమనుట పొరపాటుకదా. వైకుంఠముకూడ నని యర్థము చెప్పుదు మందురేని కైలాసముకూడ నతనిదే యగును. అపుడు శివకేశవతారతమ్యము కలదనుట యెట్లు? ఎన్ని భంగుల నాలోచించినను భేదబుద్ధి కవకాశమే లేదు. ప్రాక్తనదుష్కర్మముననే యది పొడకట్టు నను నొక్కమాటయే యిటఁ జెప్పఁదగినది.

ఇట్లు విశ్వామిత్రుఁడు కౌసల్య యెంతధన్యురాలని తలంచెను. భగవంతుని గుమారునిగాఁ గన్నదే యని మెచ్చుకొనియెను. ఇందు రామా యనుపదమును వాల్మీకి ప్రయోగించెను. ఏల? రాముఁ డనఁగా యోగిమనఃపద్మరంజకుఁ డని యర్థము. అట్టి పరంధాముఁడు మాయామానుషవేషమును ధరించి కౌసల్యకుం గుమారుఁ డనఁబడుచున్నాఁడే యని యబ్బురంపడుచున్నాఁడు. కావుననే కౌసల్యకుఁ జక్కని కుమారుఁడా. అని సంబోధించెను ఇట్లు ముని రామచంద్రుని భగవంతునిగా నెఱింగియు లోకులకు సత్కర్మానుష్ఠానమున శ్రద్ధ కలిగింపఁబూని రామా! తొలిసంజ యిదె వచ్చుచున్న దనెను. అనఁగా నిత్యకర్మానుష్ఠానమునకుం గడంగవలయునని తెలిపెను.

"స్వాధ్యాయేన ఐపైర్హోమైస్త్రైవిద్యేనేజ్యయా సుతైః,

మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః." ౨౮

మను ౨ అ.ధ్యా

ఇందుఁ జెరొ్కనఁబడిన కర్మములచేత దేహము బ్రహ్మప్రాప్తి యోగ్యముగాఁ జేయవలయును. రాముఁ డిట్టిసత్కర్మములనాచరించిన లోకులెల్ల రాచరింతురు. కావునఁ భగవంతుఁడయు నిర్లిప్తుఁడయు న ఫలాపేక్షుఁడయు నిత కర్మములు సర జనాచరితములుగాఁ జేయవలయు నన్న యూహచేతఁ జేయవలయునని మునిభావము. అందులకే పురికొలిపెను. కాఁబట్టియే "నరశార్దూల" అని సంబోధించెను. మానవులకు మార్గదర్శకుఁడవు కావలయును. లెమ్ము. అని మేలుకొలిపెను. అంతతో నూరక యుండక "కర్తవ్యం దైవమాహ్నికమ్" అని హెచ్చరించెను. పగటిపూటఁ జేయందగు దేవతాకార్యము లొనర్పవలయునని శాసించెను. శాసించుటనఁగా భగవంతుఁడవగు నీవు లోకమును రింప నవతరించితివి. సత్కర్మాచరణమునకుం గడంగుము. నిన్నుఁజూచి నేర్చుకొనవలయును. సకాలమున నీవు చేయకున్న నెట్లని పలికెనని భావము. ఇట్టు లీభాగము సత్కర్మములను తప్పక పరోపదేశమునకునైన జ్ఞానులుకూడఁ జేయవలయు ననియుఁ దన్మూలముననఁగాని యీతుచ దేహము పరిశుద్ధము కాదనియుఁ దొలుతొలుత మహాప్రకృతి నుపాసించి యజ్ఞానమును దొలఁగించి భగవంతుని ధ్యానించుమార్గముఁ జూపుమని ప్రార్థింపవలయు. మాతృపూజ ప్రధానముగా భావించి చేయవలయుననియు దానిని మాని తక్కిన వెన్ని పూజలు చేసినను నిష్ఫలములే యనియు మనకు బోధించుచున్నది.

"తస్యర్షేః పరమోదారం వచశ్శ్రుత్వా నృపాత్మజౌ,

స్నాత్వా కృతోదకౌ వీరౌ జేపతుః పరమం జపమ్." 3

అన్న యీవాల్మీకివాక్యమున నొకవిశేషము కలదు. గంభీరాముగల యీమునివాక్యము వినిరి. అనఁగా లోకమునకు మార్గదర్శకుఁడవు కావలయునన్న దే యిటఁగలమహాము. "పరమం జపం జేపతుః" అనఁగా సావిత్రి నుపాసించిరని యము. కాలభేదము తంత్రభేదము ననువానిమూలమున గాయత్రియే సావిత్రి సరస తి యనఁబడును. మూఁడుకాలములలో మూఁడుపేరులచేత నొక్క దేవతయే పిలువంబడుచున్నది. రూపభేదమున ధ్యానభేదము కలదు. అంతియకాని వస్తుభేదము లేదని యెఱుంగవలయు. "పరమం జపమ్" అనుటచేత "న గాయత్ర్యాః పరం మంత్రమ్" అనుసూక్తి సార్థకమగుచున్నది. "న సావిత్ర్యాః పరం జప్యమ్" అనియు నియమము కలదు.

ఈభాగమునుండి మనము గ్రహింపఁదగు విషయమేమనఁగా, గాయత్రీమూలముననే ది జత మలవడినది. కావున గాయత్రిని జక్క నుపాసింపవలయు నది వేదమాత యగుంగాన దానిఫలముగోరకయే జపింపవలయుననియు సర మంత్రములు తన్మంత్రమునకు దగువాతివే యనియుఁ దదుపాసనము జ్ఞానప్రదమనియుఁ దద ము నాలోచించినఁ దేజోరూపమును ధ్యానించు టుత్తమమని తేలుచున్నదనియు దానిని మానిన బ్రహ్మతేజస్సే ... ణించుననియుఁ గావున దానిని బరమాదరమునఁ బ్రధానమని భావించి యుపాసింపఁదగుననియు ననునదియే. మఱియుఁ ద్విమతస్థులకు గాయత్రి యుపాస్యదేవతయే. ఏల? మహాప్రకృతి యగుటచేతనే. కావుననే

"సర్వే శాక్తాస్సముద్దిష్టా న శైవా నచ వైష్ణవాః"
అని దేవీభాగవతవచనము సా కమే యనియు నెఱుంగవలయు.
మధ వైష్ణవులు గాయత్రిని వదలుదురా. ది జులు శాకపోవు.
దురు. గాయత్రి నుపాసింతురా ప్రకృతు పాసకు లగుదురు..
అట్టి విషయమున శ క్తి నేల దూషింతురో తెలియకున్నది.
దూషించువారు మూర్ఖులగుదురుకదా. ఆమాటయే వారికిం
జాలు.

ఈఘట్టమునఁ దెనిగించినవారియూహాల నించుక పరి
కింతము.

చ. "అని మునిరాజు పల్క విని యారఘువీరులు మేలుకాంచి చ
య్యన సరయూనదీప్రవిమలాంబువులన్ వడిఁ జల్లులాడి నె
మ్మనమున భక్తిమీఱఁ బరమం బగుమంత్ర మొగిం జపించి యా
మ్మునికి నమస్కరించి కడుమోదమునం గృతకార్యసిద్ధులై."
గోపీనాథరామాయణము.

సీ. "అని యిట్లు కౌశికుం డాదరంబునఁ బల్క విని లేచి రఘుకుల
వీరు లంత, సరయూపునం గృతస్నాను లై యుదకంబు వారిచి
పరమజపంబు నిష్ఠ, జపియించి యర్ఘ్యాది సకలక్రియల్,"
ఆంధ్రవాల్మీకిరామాయణము.

క. "అనుటయుఁ బరమోదారము, మునివచనము నాలకించి భూమీశ్వరచం
ద్రునితనయులు సలిలంబుల, మునింగి రవి కర్ఘ్య మొసఁగి మోదంబలరన్.
తే. పరమగాయత్రిమంత్రజపంబుచేసి, భక్తి సంధ్యనుపాసించి;
ఆంధ్రశ్రీమద్రామాయణము..

"పరమోదారం=పరమగంభీర మిత్యర్థః, జప్యత ఇతి జపః గాయత్రీమితి
యావత్. తస్యా ఏవ పరమత్వాత్. న సావిత్ర్యాః పరం జప్యమితి వచ.

నాత్" అని గోవిందరాజులు. 'పరమంజపమ్. సావిత్రీమ్' అని మహేశ్వర తీర్థులు.

యథామూలముగాఁ దెనిఁగించిరని పొగడుచున్న విమర్శకాగ్రేసరులు. 'పరమోదారమ్' అనుదానికి "ఆదరంబునఁ బల్కి" అని తెనిఁగించినపు డేమియు ననఁజాలరైరి. 'పరమం జపం' అనుదానికి పరమజపంబు అని తెనిఁగింపఁబడినవి. "ముక్తస్య ముక్తాః" అన్నదాని నాక్షేపించిన విమర్శకులు దాని నంగీకరింపవలయుఁగదా. విశిష్టాద్వైతమతస్థులగు గోవిందరాజులే గాయత్రీమంత్రజపమనిరికదా. ఆంధ్రవాల్మీకులకావిషయము గూఢముగా నుంచుట యది రహస్యమని కాఁబోలు. ఎంత రహస్యమిది. వ్యాఖ్యానకర్తృభావము మూలకర్తది కాకపోవచ్చుననికదా వారిభావము. పాప మీసందడిలోఁ గ్రమము తప్పిరి. జపము తరాతఁ గాఁబోలు నర్ఘ్యప్రదానాదికము చేయుపతి. ఓహో! తెలిసినది. ఇది రహస్యము. బయలుపఱుపరాదని వారిభావమై యుండవచ్చును. మూలార్థము నేది పోషించునో పాఠకమహాశయులు కుబు పక్షపాతములు మాని పరికింతురుగాక.

ప్రయాణము చేయునపు డొకపుణ్యాశ్రమము కనఁబడియెను. రాజకుమారులిరువు రిది యెవరియాశ్రమము? ఇందున్న మహాత్ముఁ డెవ్వఁడని ప్రశ్నించిరి. ఆప్రశ్నమునకు విశ్వామిత్రుఁడు పక్కుననవ్వి యిట్లుపల్కెను. 'ప్రహస్య మునిపుంగవః' అని మూలము. ఏమి యీమానుషభావనటనము! అని ముని యచ్చెరువందెను. సర్వజ్ఞులయ్యు మాయామానుషులగుటఁ గాఁబోలు నిట్లడుగుచున్నారని మునియాశయమై యుండనోపు.

విశ్వామిత్రునియాశయమున నిట్లు పెక్కుతావులం గనంబడు చున్నది. ఆప్రశ్నమునకు బదులుచెప్పుచు మన్మథదాహము తెలిపెను. ఆతనియవయవము లిందుఁ బడినందున నంగదేశ మయె ననియె. ఇది స్థాణునియాశ్రమము ఇం దీ రేయి నిలిచి రేపు వెళ్లుదమని పలికెను.

ఈశ రుఁడు తపస్సానరించినతావు. తపోనియతి యనఁగా నిష్టదైవమును ధ్యానించుట. దీనింబట్టి శంకరుఁడు దేవతాం తరమును ధ్యానించిన ట్లగునుకదా. పరదైవ మెట్లగునని కొం దఱు ప్రశ్నింతురు. కాని వారికిఁ దమప్రశ్నమే తమ్ము బాధించు నని తెలియదు. నారాయణాశ్రమము కలదు. బదరీనారాయణ మనియు నామాంతరము కలదు. నరనారాయణులు తపస్సాన రించిరని హరివంశమునందును గలదు. కావున నారాయణు నకు శంకరునకు నొక్కటియే సమాధానము. ఒక్కఁడు వైకుంఠనిలయుఁడు. ఒక్కఁడు కైలాసవాసి. వీరిరువురు భగవ దంశసంభూతులు. లోకసంగ్రహా మవతరించిరి. బ్రహ్మాయుఁ గలిసి వీరు త్రిమూర్తు లనఁబడుదురు. ప్రకృతిబద్ధులు. కావున వీరు మువ్వురు దేవతోత్తములు. ఈమువ్వురకు నిట్టివారికెల్ల రకుఁ బరమైనతత్త్వ మొక్కఁడు కలదు. అదియే ప్రకృత తీతము. నిర్గుణము, నిరంజనము, సర్వవ్యాపకము, ప్రకృతివిశిష్ట మగునదియే సగుణబ్రహ్మ మనంబడును. ధర్మసంరక్షణా ము సగుణమగును. కావున నీమతము ననుసరించిననే దేవతాద్వేష ములు వదలును. ఇంకఁ గథయందలివిశేషములఁ బరికింతము.

కామాశ్రమమనియు నాయాశ్రమమునకుఁ బేరుగలదు. కాముని౯ బరశివుఁడు కంటిమంటచే దహించినతావని భావము.

ఈగాథవలన మనము గ్రహింపఁదగువిషయ మేమి? తపస్సాచరింపఁబూనినవారు నిష్కాములుగావలయు. అయినను పెక్కువిఘ్నములు వారికిం గల్గును. కామమును జ్ఞానదృష్టిం బరిశీలించి కాల్చవలయును. అవి నశించినఁగాని మనస్సు నిర్మలముకాదు.

"కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః,
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్. ౩౭
ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా,
కామరూపేణ కౌంతేయ దుష్పూరేణానలేన చ. ౩౮
ఇంద్రియాణి మనోబుద్ధి రస్యాధిష్ఠానముచ్యతే,
ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినం. ౪౦
తస్మాత్త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ,
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్." ౪౧ గీత 3 అధ్యా.

అను శ్రీకృష్ణభగవదాక్యములు పైనివ్రాసినయమును విశదీకరించుచున్నవి. కావున నిష్కాముఁడై సత్కర్మముల నాచరింపఁదగుననియుఁ గామము నడంపఁ దపస్సే ప్రధానకార్యమనియు రిత్తమాటలచే నది యడంగదనియు మనము గ్రహింపఁదగును. వేషధారుల యాలాపములు నిష్ఫలములనియు వానినాదరింపక భగవంతుని నిర్మలచిత్తమున ధ్యానింపవలయుననియు నట్టిధ్యానమున కేకాంతవాసము త్తమోత్తమమనియు సారము.

"ఉపస్థాప్య శుభాం నావం విశ్వామిత్రమథాబ్రువన్. ౨
ఆరోహతు భవాన్నావం రాజపుత్త్రపురస్కృతః,
అరిష్టం గ ' పంథానం మాభూత్కాలవిపర్యయః." ౩

నదులకడ నౌకల నునుచుట పూర్వకాలపుటాచారము. రాజు

నౌకను రక్షించువారల నియమించి బాటసారులను దాఁటింప నాజ్ఞ చేయవలయు తరణమూల మును నిర్ణయింపవలయును.

"పణంయానంతరేదాప్యం పౌరుషోర్థపణంతరే,
పాదం పశుశ్చ యోషిచ్చ పాదార్థం రిక్తకః పుమాన్. ౪౦౪
దీర్ఘాధ్వని యథాదేశం యథాకాలం తరో భవేత్,
న తీరేషు తద్విద్యాత్సముద్రే నాస్తి లక్షణం. ౪౦౭
గర్భిణీతు ద్విమాసాది స్తథా ప్రవ్రజితో మునిః,
బ్రాహ్మణా లింగినశ్చైవ నదాప్యస్తారికం తరే." ౪౦౨

రెండునెలలకు మించినగర్భము ధరించినస్త్రీ, సన్న్యాసియు మునియు బ్రాహ్మణులు బ్రహ్మచారులు తరమూలము నీయ నక్కఱలేదు. అని రాజు శాసింపవలయును.

"యన్నావికించిద్దాశానాం విశీర్యేతాపరాధతః,
తద్దాశైరేవ దాతవ్యం సమాగమ్య స్వతోంఽశతః. ౪౦౮
ఏష నౌయాయినాముక్తో వ్యవహారస్య నిర్ణయః,
దాశాపరాధతస్తోయే దైవికేనాస్తి నిగ్రహః." ౪౦౯ మను ౮ అధ్యా.

ఓడనడపువారి ప్రమాదమునఁ గూరుచున్నవారికి నష్టము కలుగునేని వారివలన నిప్పింపవలయును. దైవికముగా ననఁగా నది మిక్కుటగా జలమురాఁగాఁ బ్రమాదను జరగిన దండింప రాదు.

ఈవిషయమే వివాదరత్నాకరమునందుఁ జక్కఁగా నున్నది. దానిం గాంచినచోఁ బూర్వాచారము లెట్లున్నవో తెలియఁగలవు.

"సంయానేదశవాహో వాహినీ ద్విగుణకరణా స్యాద్దశపురుష
వతీప్రత్యేకం ప్రహాస్సుః పుంసాంచావరార్థంవాహంవహేత్,

అర్ధ్యర్ధాస్త్రియస్స్యుః పురుషోఽష్టామాషాః శరమద్యాయా అశ
రమద్యాయాః పాదః కార్షాపణస్య నిరుదక స్తరో మాష్యః." వసిష్ఠస్మృతి.

నదియందు నౌక పదుగురు నడుపువాండ్రు గలదిగ నుండ
వలయు. నడుపుసాధనము లిరువదియుండవలయు. నడుపు
వాండ్రు కాక పదుగురుమాత్రమే కూరుచుండవలయు. ఆ వే
నౌకలు పెక్కులుండందగు. ప్రపాః అనఁగా దానిని జక్కఁగా
నడుపువారు. పురుషులలోఁ సగము బరువంతవస్తువు లుంచవల
యును. స్త్రీలకుఁ బురుషులకుఁ దీసికొనుశుల్కమున నిరువది
యవపాలు విధింపవలయును. ఈశుల్కము చిన్న నదులకు. పె
నదుల కధికము.

"అకరశ్శ్రోత్రియో రాజా పుమాననాథః ప్రవ్రజితోఽబాల
వృ తరుణప్రజాతాః ప్రాగమికః కుమార్యో మృతపత్న్యశ్చ.
బాహుభ్యాంతరన్ శతగుణం దాప్యః." వసిష్ఠస్మృతి.

అనాథపురుషుఁ డనఁగా దిక్కులేనివాఁడు. క్రొత్తగానైన
బాలింతరాలు 'మృతపత్న్యశ్చ' అనఁగా విధవలు. వీరికి శుల్కము
లేదు. ఊరకే నదిని దాఁటింపవలయునని రాజు శాసింపవల
యును. వీనింబట్టి పరికింపఁగా రాజు ప్రతివిషయమును జాగ
రూకుఁడై పరిశీలింపవలయుననియుఁ బ్రజోపయోగకార ములు
నెమకుచుండవలయుననియు స్పష్టమగును.

మును లిట్లు మంచియోడను జూపి యాలసింపక దాఁటుఁ
డని పురికొల్పిరి. నౌకాసహాయమునఁ దప్ప నదిని వేఱొండు
సాధనమున దాఁటరాదని

"న బాహుభ్యాం నదీం తరేత్"

అను శ్రుతి నియమించుచున్నది. అనఁగా నే ప్రమాదములు పొసఁగకుండ మనుష్య యత్నమున జాగరూకతగలిగి యుండ వలయునని భావము. ఆలసించిన నదీప్రవాహము వృథా కావచ్చు నని మునులయాశయము.

"ఆదానస్య ప్రదానస్య కర్తవ్యస్య చ కర్మణః,
క్షిప్రమక్రియమాణస్య కాలః పిబతి సంపదః."

(ఇచ్చుట, పుచ్చుకొనుట, చేయక తప్పనికార్యము నెఱవేర్చుట, యను వీని నాలస్యముగా నెవఁడు చేయునో వాని సంపదలను గాలము హరించును.) అనుసూక్తి తప్పదని మనము నేర్చుకొనవలయును.

గంగాసరయూసంగమముదాఁటి కొంతదూరముపోయి మహారణ్య మొక్కఁడు కనఁబడఁగా దీనికలరూపును దెలుపుమని శ్రీరామమూర్తి యడిగెను. ఆయది మహాఘోరముగాఁ గనఁబడియెను. కావుననే ప్రశ్నింప నవకాశము కలిగెను. సర్వజ్ఞుఁ డయ్యును రామమూర్తి ప్రశ్నించుట లోకాచారపరిపాటిచే నని మనమూహింపవలయును. ముని యిట్లు తెలిపెను. మహాత్మా! మలదకరూశదేశములు. దేవనిర్మితములు. కరూశమనఁగా ఆఁకలియని యర్థము. వృత్రాసురవధానంతర మాపాపమున నింద్రు నాఁకలియు నశుచిత్వము నావేశించెను. దేవతల కివి రెండు నుండవు కాన వాని దొలఁగింపఁగోరి మహామంత్రముల నభిషేకించిరి. మంత్రపూతములగు కలశోదకముల స్నానము చేయించిరి. జలములు సద్భావముకలవారలఁ బాపములను

"సర్వం పునంతు మామాపోసతాం చ ప్రతిగ్రహాగ్ం స్వాహా"

దొలఁగించునని వేదము తెలుపుచున్నది. కావున వేదమంత్ర

ముల నభిమంత్రించి తత్పాపమును బోఁగొట్టిరి. ఆకర్మము చేసిన దీచోటనే. ఇంద్రుఁడు తనపాపములు తొలంగినతా విదియని కృతజ్ఞుఁడై యీ రెండు దేశములు ధనధాన్య సంపన్నములగుఁ గాక యని వరమొసంగి తనలోకమున కరిగెను. బ్రహ్మహత్య చేసినవారికిఁ బ్రాయశ్చిత్తము కలదుగాని కృతఘ్నునకు లేదని మహాభారతము నాడీజంఘునిచరిత్రమున బోధించుచున్నది. కావునఁ జేసినమేలు మఱచుట పంచమహాపాతకములకంటె నెక్కుడని మన మెఱుంగవలయును. ఏనాఁటికి నట్టిపాపము నొనరింపరాదు. ఉపకర్త పితృసమానుఁడు. ఆతని కపకారము చేయుట పితృవధమువంటిదగును. కావునఁ జేసినమేలు మఱువ రాదని మన కీయుపాఖ్యానము బోధించుచున్నది.

తరువాత విశ్వామిత్రుఁడు రామునకుఁ గథను జెప్పుచు నట్టి యీ రెండు దేశములు తాటక యనురక్కసినిమిత్తమునఁ బాడగుచున్నవి.

"తాటకా నామ భద్రం తే భార్యా సుందస్య ధీమతః" ౨౫

తాటకానామ ముచ్చరించి నీకు మేలుగుఁగాక యని ముని దీవించెను. లోకాపకారము చేయువారిపే రుచ్చరించినంతనే యవా రివలన బాధకలుగక యుండవలయునని మహాత్ములు కోరుదురు. ఇట్టి యాచార మీ రామాయణమున నెక్కుడుగాఁ గనంబడును. కావుననే లోకవిఖ్యాతి నీకార్యము గాంచెను. రామా! తాటక సుందునకు భార్య యగును. దానికొడుకు మారీచుఁడు. పరమదుర్మార్గుఁడు అని వారిరువురవృత్తాంతము తెలుపుచు వారికి రాక్షసత్వ మలవడుటకుం గలకారణమును దెలుపుచు నారాక్షసి యిచ్చోటునుండి గవ్యూతిత్రయ

మాత్రదూరమున (సా యోజనమున) దారి నడ్డగించియున్నది. మన మామార్గముననే పోవలయును. కావున నాయనుమతిం

"స్వబాహుబలమాశ్రిత్య జహీమాం దుష్టచారిణీం,
మన్నియోగాదిమం దేశం కురు నిష్కంటకం పునః." ౩౦

గొని దుష్ప్రవర్తకురాలగు నాతాటకను బాహుబలమున వధింపుమని హెచ్చరించెను.

"సైషా శాపకృతామర్షా తాటకా క్రోధమూర్ఛితా,
దేశముత్సాదయత్యేనమగస్త్యచరితం శుభమ్. ౧౩
ఏనాం రాఘవ దుర్వృత్తాం యక్షీం పరమదారుణాం,
గోబ్రాహ్మణహితార్థాయ జహి దుష్టపరాక్రమాం. ౧౪
న హ్యేనాం శాపసంస్పృష్టాం కశ్చిదుత్సహతే పుమాన్,
నిహంతుం త్రిషులోకేషు త్వామృతే రఘునందన. ౧౫
నహి తే స్త్రీవధకృతే ఘృణా కార్యా నరోత్తమ,
చాతుర్వర్ణ్యహితార్థాయ కర్తవ్యం రాజసూనునా. ౧౬
నృశంసమనృశంసం వా ప్రజారక్షణకారణాత్,
పాతకంవా సదోషంవా కర్తవ్యం రక్షతాసతా. ౧౭
రాజ్యభారనియుక్తానామేష ధర్మస్సనాతనః,
అధర్మ్యాంజహి కాకుత్స్థ ధర్మోహ్యస్యాన విద్యతే." ౧౮. ౨౫ సర్గము.

తాటక యాఁడుది. దానింజంపుటకు రాముని ముని పురికొల్పుచున్నాఁడు. ముని వచించిన కారణము లివి. ౧. అగస్త్యముని శపించినందున నియ్యది క్రోధమూని యామునియుండు నీదేశమును బాడుచేయుచున్నది. ౨. దుష్ప్రవర్తకురాలు, భయంకరురాలు. కాన గోబ్రాహ్మణుల మేలుగోరి దానిం జంపుము. దుష్టపరాక్రమముగలది. ౩. నీవు తప్ప మూఁడులోకములలో నింకె

వధించుటకు చానిం జంపఁజాలఁడు. ౪. ఆఁడుదానిం జంపుట న్యాయమా అని వయఁబూనకుము బ్రహ్మక్షత్రియవైశ్య శూద్రజాతుల హితముగోరుట రాజపుత్రునకు ధర్మము. ౫. ప్రజారక్షణమునకుఁ బూనినవాఁడాకారము నిరసించుటకై క్రూరమని, అక్రూరమని యీమొదలగు కారణముల నాలోచింపక చక్కఁగాఁ జేయఁదగుకర్మమును జేయవలయును. ౬. రాజభారమును వహించువారల కిది సనాతనధర్మము. ధర్మమెఱుంగని దీనిం జంపుము. అను నీయాఱును ధర్మశాస్త్రసమ్మతములా కావా యని యించుక విచారింతము.

భక్తవర్యులారా! మనము సామాన్య దృష్టి నాలోచించినయెడల నివన్నియు ప్రహత్మకుఁ దగినవికావని తోఁచును. ఎట్టితరుణమునందును స్త్రీని జంపరాదనియే స్మృతులు బోధించుచున్నవి. రాజధర్మము లట్టివికావు. ప్రజారక్షణమే ప్రధానము. దానికించుకయు బాధకలుగునే నట్టితఱి రాజు కరుణమాలి పౌరుషమునే పూనవలయునని స్మృతులే ఘోషించుచున్నవి.

"స్వరాష్ట్రే న్యాయవృత్తస్స్యాద్భృశదండశ్చ శత్రుషు,
సుహృత్స్వజిహ్మస్స్నిగ్ధేషు బ్రాహ్మణేషు క్షమాన్వితః." ३०. ७ అధ్యా.

అనునిది రాజులకు సామాన్య ధర్మము.

"భర్తారం లంఘయేద్యా తు స్త్రీ జ్ఞాతిగుణదర్పితా,
తాం శ్వభిః ఖాదయేద్రాజా సంస్థానే బహుసంస్థితే." ३७०
మను ౮ అధ్యా.

నవంతులగుతండ్రి బాంధవులసహాయముగలదని గర్వించి సౌందర్యాదులఁ దా నధికురాలనని దురూహగలిగి పురుషాంతర

గమనకాంక్షచే భర్తను వదలఁదలంచునో బహుజనసమక్షమున రాజు కుక్కల నుసిగొల్పి చంపింపవలయును.

దీనింబట్టిచూడఁగా స్త్రీ పతిని విడనాడఁదలంచెనేని అనఁగా దుష్ప్రవర్తకురాలాయెనేని వధింపవలయునని మనుస్మృతి యనుమతి యిచ్చుచున్నది. ఉపలక్షణవిధి ననుసరించి రాజు దుష్ప్రవర్తనముగలవారిని స్త్రీలనైన వధింపవచ్చును. దానఁ బాపములేదని కనుపట్టెడిని.

"దశబ్రాహ్మణభృత్యర్థమేకం హన్యాద్ద్విజం నృపః,
శతబ్రాహ్మణభృత్యర్థం బ్రాహ్మణో బ్రాహ్మణం తు వా. ౪౨
పంచబ్రహ్మవిదామర్థే వైశ్యమేకం తు దండయేత్,
వైశ్యం దశవిశామర్థే విశం వా దండయేత్తథా. ౪౩
తథా శతవిశామర్థే ద్విజమేకం తు దండయేత్,
శూద్రాణాం తు సహస్రార్థే దండయేద్బ్రాహ్మణం తు వా." ౪౪

బ్రహ్మాండ. ఉత్తరభాగము. ౨ అధ్యా.

రాజు ప్రజాపాలనము చేయ దీక్షఁబూనినవాఁడు.కనుకఁ బెక్కండ్ర రక్షింప నొక్కని దద్బాధకుని జంపవచ్చును. అని పురాణము తెల్పుచున్నది కాఁబట్టి ప్రజారక్షణము ప్రధానముగావున దానికి భంగముగలుగకయుండఁ గాపాడుకొనవలయుననియు నేచ్ఛగాఁ బ్రవర్తించువారలు దండ్యు లనియు స్మృతులు తెల్పుచున్నవి.

"అదండ్యాన్ దండయన్ రాజా దండ్యాంశ్చైవాప్యదండయన్,
అయశో మహదాప్నోతి నరకం చైవగచ్ఛతి." ౧౨౮. మను ౮ అధ్యా.

అని దండింపందగినవారిని వదలరాదనియు దాన పాపమువచ్చుననియు స్మృతి హెచ్చరించుచున్నది.

"మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి,
అథ చేత్త్వమహంకారాన్న శ్రోష్యసి వినంక్ష్యసి.
యద్యహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి." ౫౮ గీత ౧౮ అ.
తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధం
మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్."
33. గీత ౧౧ అధ్యా.

అను నీగీతావాక్యము లొకరి నొకఁడు చంపుటలేదనియుఁ దన కర్మమునవే దాఁ జచ్చుననియు, నట్టితఱి లోకవినాశ సాక్షియొకఁడు నిమిత్తభూతుఁడుగ నుండుననియుఁ దెల్పుచున్నవి.

జగదపకారిణి ధర్మకార్యబాధకురాలిని దీనిం జంపుటయే న్యాయమని యది రాజకుమారునకు విధియనియు బోధించుట సాపరత మునఁ గాదని మన మంగీకరింపవలయును. ఇంకను శ్రీరామునిచిత్తము సంశయాకులమగునేమో యని ముని పూర్వమే విష్ణుమూర్తి లోనగువారిట్లు స్త్రీలను వధించి ధర్మమును గాపాడిరని బోధించెను.

"విష్ణునాపి పురా రామ భృగుపత్నీ దృఢవ్రతా."

అని పలుకుటచేత మున్ను నీవే మునిపత్నిని వధించితివికదా. ఇపుడేల యీసంశయమని రామునకు స్వరూపము స్మృతికిం దెచ్చెనని మనము గ్రహింపవలయును. ఇట్లు రామమూర్తిని బ్రతిపదమునందును భగవంతునిగా భావించి కౌశికుఁడు శ్రీరామభక్తి నస్మదాదులకు నెక్కొలుప మార్గదర్శకుఁడయె నని మనము తలంపవలయును.

ఆమీఁద మునివచనములకు శ్రీరామచంద్రుఁడు చెప్పిన యుత్తరము న్యాయశాస్త్రసమ్మతమై యున్నది. అహంకారలేశము

కూడ రామమూర్తిమనస్సున లేదనియు శుద్ధసత్త్వగుణమే పాదుకొనియున్నదనియు దానివలనఁ గనఁబడుచున్నది.

"పితుర్వచననిర్దేశాత్పితుర్వచనగౌరవాత్,
వచనం కౌశికస్యేతి కర్తవ్యమవిశంకయా. 2
అనుశిష్టోస్మ్యయోధ్యాయాం గురుమధ్యే మహాత్మనా,
పిత్రా దశరథేనాహం నావజ్ఞేయం హి తద్వచః. 3
సోఽహం పితుర్వచశ్శ్రుత్వా శాసనాద్బ్రహ్మవాదినః,
కరిష్యామి న సందేహ స్తాటకావధముత్తమమ్. 4
గోబ్రాహ్మణహితార్థాయ దేశస్యాస్య సుఖాయ చ,
తవ చైవాప్రమేయస్య వచనం కర్తుముద్యతః." 5 26 సర్గము.

ఇవియే శ్రీరామునివాగమృతధారలు. లోకుల కుపదేశించిన వాక్కు లివియే. ఇవియే సకలస్మృతిసారములు. వీనిభావ మిట్లు గ్రహింపవలయును. తండ్రివాక్యము శాసనము. ఆవాక్యమే గౌరవింపఁదగినది. తండ్రిమాటవలెనే తనవృకిం దోడుపడు వారిమాటయు. సంశయింపక వానిని గుమారుఁడు చేయవల యును. జనకునియాజ్ఞ దాఁటినయెడల పరధర్మములను దాఁటి నట్లే. కావునఁ దండ్రియానతి నాచరించిన పరధర్మముల నాచ రించినట్లే. ఇవియే లోకుల కుపదేశించిననీతులు. ఇట్టివే యా యాయిసందర్భముల రామమూర్తి తెలుపుచుండును. తండ్రియే పుత్త్రరూపమునఁ బుట్టును.

"అంగాదంగాత్సంభవసి హృదయాదధిజాయసే."

అన్నశ్రుతి తెల్పుచున్నది. తండ్రిమాట నవమానించినఁ దన్నుఁదా నవమానించుకొన్నయట్లే. ఈయము మది నాటిన నెవ్వఁ డతిక్రమింపఁడని ఆమ్రేడితముగా శ్రీరామ

మూ తెలిపెను. "గోబ్రాహ్మణహితార్థాయ" అనుటంజేసి కొందఱు వేఱువిధముగా భావింతురు, గోశబ్దము సర్వపశూపలక్షణము. బ్రాహ్మణశబ్దము సర్వజాతూపలక్షణము. ఒకగురువు స్నానమునకుంబోవుచు శిష్యునితో "కాకేభ్యో దధిరక్ష్యతామ్" (కాకులనుండి యీపెరుగును గాపాడుము) అని చెప్పిపోయెను. శిష్యుఁడు బుద్ధిమంతుఁడగునేని గురువాజ్ఞయందుఁ గలకాకశబ్దము దధిహననకసర్వజంతూపలక్షణమని గ్రహించును. గురువు కాకులనుండి కాపాడుమనియెను. శునకములు త్రాగిపోవుచున్న గురువునాజ్ఞలేదని యూరకుండవలయునా. జంతువులు త్రాగిపోవకయుండఁ గాపాడుమనికదా గురువునభిప్రాయము. దీనికే యుపలక్షణవిధి యనిపేరు. కావున సర్వజాతులమేలుకొఱకు సర్వజంతుక్షేమముకొఱకు విశేషించి యీదేశములసుఖముకొఱకుఁ దాటకను వధింతును. అని భగవంతుఁడు శపథ మొనరించెను. "తవ చైవాప్రమేయస" అన్న శ్రీరామవాక్యమున నొక్కవిశేషము కలదు. అప్రమేయుఁ డనఁగా గణుతింపఁదరముగాని మహాత్మ్యముకలవాఁడని యర్థము. అనఁగా నాతత్త్వ మెఱింగిన నీవు నాచేతఁ దాటకవధ గావలెనని యెఱింగితివి. లోకులకు నీయాజ్ఞనొంది స్త్రీవధ నొనరించెనుగదా రాముఁడని తెలిపితివి. ఇట్లు నాయవ్యక్తిఁ దోడ్పడు నీమాటను మీఱుదునా యని రామచంద్రునిభావముకావలయును. కావుననే "తాటకావధముత్తమమ్" అని పలికెను. పెద్దలమాట శాస్త్రవిరుద్ధముకాదు. కావున వద్దాని ననుసరించి చేయుకార్యముత్తమమని మనము గ్రహింపవలయును. ఇట్టు లీఘట్టమున శ్రీరామచంద్రుఁడు లోకులకుఁ

దండ్రిమాటయందుఁగల యుక్తయుక్తత మును వెల్లడించెను. కావునఁ బరమాత్మ యానతిని శిరసావహించి మానవులెల్లఁ దండ్రియాజ్ఞ దాఁటక యాచరింపవలయును. ఎట్టియిక్కట్టులందు నద్దానిని మీఱరాదని రామమూర్తి యరణ్యావాసమున నెల్లరకు స్పష్టపఱచెను. రామచరిత్రమునఁ గలవిశేషములను గ్రహించి యారీతిగాఁ బ్రవర్తిల్లవలయును. సర్వజ్ఞతమును దనయం దారోపించుకొని పెద్దలమాటలఁ దృణీకరింపరాదనియు గ్రహింపవలయును.

తాటక యెంతక్రూరురాలైనను బాపము లెన్నియోఁ జేసినదైనను దపోవిఘ్నకారిణియైనను దుదకు భగవంతుని గాంచుచుఁ బ్రాణముల వదలెను. భగవద్దర్శన మంతకాలమునఁ గలుగుటయే గొప్పపుణ్యమనంజను. అట్టిపుణ్యము తాటకకు లభించెను. శ్రీరామావతారమునఁ దొలుతొలుత భగవంతుఁ డొకక్రూరదానవకాంతకు సకలపాపములు తొలఁగించి పుణ్యలోకముల నొసంగెను.

"అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరం,
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః. ౫
యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరం,
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః." ౬ గీత ౮ అధ్యా.

అను నీశ్రీకృష్ణవాక్యము పైభావమును వెల్లడించుచున్నది. తాటకయాశయము భగవంతునియందే యంతకాలముననున్నదని యెట్లు తెలియఁదగును. అందురేని భగవద్దర్శనమునకు ఫలమదియే యని సమాధానము చెప్పవలయును. లేకపోయిన నందఱఁ జూచినట్లే భగవత్సాక్షాత్కారము నవవలయును.

అంత వెగటుమాట యాస్తికులనోటినుండి రాదవి నమ్మెదను. తాటక యీజన్మమున నొక్కపుణ్యకార్యమైనఁ జేసియుండు ననరాదు. ఐనను జన్మాంతరమున నెట్టిపుణ్యకర్మము చేసినదో రామచంద్రుని దివ్యమంగళసుందరవిగ్రహమును గన్నులారఁ గాంచుచుఁ బ్రాణములవదలెను. కావుననే కర్మగతి తెలియఁదరముగాదని భగవంతుఁడు శ్రీకృష్ణమూర్తి "గహనా కర్మణో గతిః" అన్నవాక్యముచేఁ దెలిపెను. పూర్వజన్మమే లేదనువారికిఁ బరమే లేదని చెప్పవచ్చును. తుదకు భగవంతుని దర్శించుచుఁ దుచ్ఛమగు దేహమును వదలి తాటకవంటిక్రూరురాలుకూడ ముక్తినందెను. కావున భగవంతుని నమ్మినవారికి ముక్తి కరతలామలకమే యనవచ్చును.

"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే." ౬౫ గీత ౧౮ అ.

అన్న శ్రీరాధానాథోక్తి ననుసరించి భక్తులు సర్వకర్మలా పరాత్పరునియం దర్పించి తత్కరుణకుఁ బాత్రులుకావలయుననియుఁ దొలుతొలుతఁ బెలసేవచేసి యడఁకువగలిగియుండవలయుననియు దానిచే గర్వము నశించుననియు, నవల సన్మార్గము తనయంతన కన్పట్టుననియు నద్దానినే యాశ్రయించిన భగవత్కరుణానిధి లభించుననియు నమ్మవలయును. ఇఁకఁ దరువాతికథ నాలకింపుఁడు.

"కర్తవ్యం చ మహత్కర్మ సురాణాం రాజసూనునా,
ఏవముక్త్వా సురాస్సర్వే హృష్టా జగ్ముర్యథాగతం." ౩౨

తాటకావధానంతర మాదితేయు లింద్రాదులు, పరమానందమునంది విశ్వామిత్రుని వినుతించి యీరామునకు నీకడనున్న

సకలాస్త్రముల నొసంగుము. ఈరాజకుమారునిమూలమునఁ గావలసిన దేవకార్యము లనేకము లున్నవి. కావున వానికి సహాయముగా నుండవలయును. దివ్యాస్త్రముల నొసంగుము. పాత్రభూతుఁడు సుమా. అని ప్రోత్సహించి తమతమ నివాసములకుం బోయిరి.

సకలబ్రహ్మాండనాయకునకు విశ్వామిత్రునిమూలమున దివ్యాస్త్రలాభము కావలసివచ్చెను. ఎందులకనఁగా రామచంద్రుఁడు సత్ప్రవర్తనమున లోకులకునెల్ల శాస్త్రమర్యాదలఁ దెలుపును. కావున గురువు నాశ్రయించి తన్మూలమున మంత్రముల నుపదేశవిధిని గ్రహింపవలయు ననునీతిని, గురుసేవ చేయక మానవుఁడు వృద్ధిగాంచఁజాలఁడన్న నీతిని, గురుకటాక్షము ద్రవ్యమూలమునఁగాక తదుక్తప్రకారప్రవర్తనమున లభించునన్న నీతిని విశ్వామిత్రసేవాతాటకావధరూపమునఁ దెలిపెను. ఈనీతిని గ్రహించి రామచంద్రుని దలంచుచుఁ దత్ప్రవర్తనము నుదాహరణముగా నుంచుకొని ప్రవర్తింప నేర్చుకొనవలయును.

విశ్వామిత్రుఁడు రామునకు దివ్యాస్త్రముల నొసంగుట.

* ముని యారాత్రి యాచోటనే రాజకుమారులం గూడి గడపెను. మఱుదినము కాల్యకృత్యములం దీర్చినపిదప నవ్వుచు రాజకుమారా యని సంబోధించి మృదుమధురోక్తులతో మహాయశా! నీకార్యమునకుఁ బరమానంద మందితిని. నీకు భద్రము గలుగుఁగాక. మహాప్రీతితో దివ్యాస్త్రముల నొసంగెద. వీనిమూలమున దేవతాప్రభృతులనెల్ల రణరంగ

* ఇయ్యది యిరువదియేడవసర్గమునుండి వ్రాయఁబడినది.

మున జయించి వశంగతులం జేసికొనఁగలవు. ఆయస్త్రములనెల్లఁ బరిగ్రహింపుము నీకు భద్రము లబ్బుంగాక. తొలుత దండచక్రము నొసంగెద. అనిపలికి సకలాస్త్రములపేరులు చెప్పుచుఁ దత్తన్మంత్రములవిధిప్రకార మొసంగెను. ప్రాఙ్ముఖుఁడై యామునినిలిచి యాయుత్తమోత్తమమంత్రముల నుపదేశించెను. దేవతలకుంగూడ దుర్లభములగు నాయస్త్రమంత్రముల నమ్ముని యుపదేశించెను. ఆమంత్రదేవతలను రామచంద్రునకు వశముచేయంగోరి వానినెల్ల స్మరించెను. స్మరించినంతనే తేజోరూపముల నవి యన్నియు రామునిగొలిచి ముదంబున నంజలిబంధించి రఘూత్తమా! మేమెల్ల నీకుఁ గింకరులమైతిమి. రామమూర్తియు వానిసేవలం బరిగ్రహించి హస్తకమలమునఁ దాఁకి నామనస్సు ననుసర్తించి యుండుఁడనియె. ఆమహాస్త్రలాభంబునఁ దనతేజస్సు మిక్కిలి ప్రకాశింపఁగా మునిపతికి నమస్కరించి పయనముచేయ సిద్ధపడియెను.

## ముని రామునకు నుపసంహారమంత్రముల నుపదేశించుట.

* రామచంద్రమూర్తి దివ్యాస్త్రములఁ బరిగ్రహించి శుచియై మునిం గాంచి మహాత్మా! దివ్యాస్త్రలాభమున దేవతలు నన్ను మార్కొనఁజాలరని యెఱింగితిని. మీరు దివ్యాస్త్రప్రయోగములం దెలిపితిరి. వాని యుపసంహారముల నుపదేశింపుఁడని మిమ్మడిగెదను. అని వేఁడఁగా సువ్రతుఁడు గావున నాముని రామునకు వాని నుపదేశింపఁ బూని రామభద్రా! సత్యవంతము లోనుగాఁగల యుపసంహారముల గైకొనుము.

---

* ఇది యిరువదెనిమిదవసర్గమునుండి గ్రహింపఁబడినది.

ఈయుపసంహారమంత్రాధిదేవతలు భృశాశ్వ మునికుమారులు ఈప్రతిగ్రహణమున నీకు శుభంబగునుగాక. వీనింగొన నీ వెంతయుఁ బాత్రుఁడవు. అనుటయు నట్లే యని శ్రీరామ చంద్రుఁ డుల్లమానందమున నోలలాడ వానిని భక్తిమీఱఁ గైకొనియెను. అవియు నారామమూర్తిని సేవించెను. తేజో రూపములుగా నవి యుండెను కొన్ని యగ్నింబోలును. కొన్ని ధూమమువలెను, గొన్ని సూర్యచంద్రులరీతిని గనుపట్టును. ఆమంత్రాకృతులన్నియు నంజలిబంధించి మహాత్మా! లోక రక్షకా! నీసెలవుకొఱకుఁ గాచియున్నాము, అనఁగా నారామ మూర్తి నాకుఁ బనికలుగునపుడు స్మరింతును. అలసింపక పొడ చూపుఁడు. అనఁగా నామంత్రాధిదేవత లట్లే యని యంత ర్ధానమైరి. అంత రామమూర్తి మహాముని యనుమతిం గొని లక్ష్మణునకు నాయస్త్రములెల్లఁ బ్రయోగోపసంహారములతో నుపదేశించెను.

ఆవలఁ బ్రయాణము సాగించిరి. రాఘవేంద్రుఁ డా కౌశికుం గాంచి మధురవాక్కు లలర నించుకదూరమున వృక్ష సముదాయము దట్టముగఁ గనఁబడుచున్నది. శ్రుతిహితముగా బులుఁగులయెలుఁగులు వినవచ్చుచున్నవి. మృగములు సంచరించు చున్నవి. కాన దానిచరిత్రమును వినఁగుతూహల మగుచున్నది. సర భూతభయంకరమగు తాటకారణ్యమును గడచి వచ్చితిమికదా. ఈప్రదేశ మట్టిదిగాఁ దోఁచుటలేదు. ఇదియొక యాశ్రమపదమని తోఁచెడు. ఇదెవరిదో యెఱుంగఁగోరెద. ఆనతిమ్ము. బ్రాహ్మణహింసకులు దుష్టవర్తకులునగు మారీ చాదిదానవులు భవదధ్వరధ్వంసకులు తిరుగు నాశ్రమ మేది?.

వారి నేను బోలియించి యజ్ఞమును రక్షింపఁదగు చోటదియే కదా. ఆయాశ్రమ మెందున్నదో వినఁగోరుదును. సర మెఱింగిన ప్రోడవుగాన వచింప సమర్థుఁడవు. అని కౌశికుం బ్రార్థించెను.

మహాశయులారా! ఈభాగమునుండి గ్రహింప నను వగునీతులు కొన్ని గలవు. ముని యస్త్రములనెల్ల రామమూర్తికి దేవతలయాజ్ఞానుసార ముపదేశింపఁబూనెను. "అప్రాప్తంచ యస్త్రం తత్సర్వం నిష్ఫలం స్మృతమ్" అన్న సాంప్రదాయము ననుసరించే శిష్యుఁడు ప్రార్థింపక మంత్రముల నుపదేశింపరా దనుసామాన్య నియమము ననుసరించి ముని మంత్రముల రాముని కుం దెల్పుటనాయ్యముకాదు. కావుననే దేవతలు ప్రార్థించిరి. పాత్రభూతుఁడగుశిష్యుఁడు దొరకినపుడు గురువు తానుగా నుపదేశింపవలయు ననువిధి విశేషశాస్త్రము. మంత్రోపదేశము నకుముందు నాశీర్వదింపవలయును. అన్నసదాచారము నను

"తాని దివ్యాని భద్రంతే దదామ్యస్త్రాణి సర్వశః." 3

సరించియే యీమంత్రప్రతిగ్రహమున నీకు మేలగుంగాక. అని దీవింపవలయును. మంత్రములు క్రూరములు సౌమ్యములని యిరుదెగలుగా నుండును. వాస్తవము నూహింపఁగా నన్నియు సౌమ్యములే. కారాయ్యము కరాకృతిని దాల్చినదేవతలను క్రూరదేవత లందురు. క్రూరతము నక్రూరతము నుపాసకుల బు ననుసరించియుండును. ఆకారము భయంకరముగాని దాత్మసౌమ్య మేకదా. మహాకాళికా, చాముండాంబ, నృసింహమూర్తి యను నీమొదలగుదేవతలు క్రూరులా సౌమ్యులా. అన్న సమాధానము సౌమ్యులే యనవలయు. యుఃసమయమున రజస్తమోగుణముల నభినయింపవలయును. అది లోకోద్ధ

కారమునకుఁ గారణమగును. అంతియగాని దేవతాప్రకృతి సౌమ్యమే. ఐనను గురువు శిష్యునకు నరసింహామంత్రము నుప దేశించునపుడు ముందు మేలుగలుగుంగాక యని శిష్యు నాశీర దించి పిదప నుపదేశింపవలయు. దాన శిష్యు నిమనస్సున నీ మంత్రము బాధించునేమో యన్నసంశయము తీఱును. ఇది యాచారము. రామచంద్రునివంటి పరమపురుషుని కట్టిశంకలు గలుగునాయన్నఁ గలుగవుగాని లోకమున కొక్కసదాచార మును సప్రవృత్తిమూలమునఁ దెలుపఁగల యవతారపురు షుఁడుకాన నన్నియుఁ దదనురూపముగ నుండవలయును గదా. ఆరీతి నెఱింగినవాఁడు గావునఁ గౌశికుఁడట్లే యుపదేశించెను. తొలుదొలుత శ్రీరామునకు దండచక్రము నుపదేశించెను. మూలముం బరికింపుఁడు.

"దండచక్రం మహద్దివ్యం తవ దాస్యామి రాఘవ. ౪
ధర్మచక్రం తతో వీర కాలచక్రం తథైవ చ."

దీనింబట్టి శ్రీరామచంద్రుఁడు తొలుత దుర్జనుల సంహరించి తన్మూలమున ధర్మమును స్థాపించునని యూహింపవలయును. ఈక్రమమే రామప్రవృత్తినిబట్టి మన మెఱుంగఁదగినది. శ్రీమ ద్రామాయణముకూడ నీవరుసనే తెలుపును. సకలాస్త్రముల నుపదేశించెదఁ బ్రతిగ్రహింపుమనియెను. రామమూర్తియుఁ దూర్పుమోముగా నిలువంబడియెను.

"స్థితస్తు ప్రాఙ్ముఖో భూత్వా శుచిర్మునివరస్తదా,
దదౌ రామాయ సుప్రీతో మంత్రగ్రామమనుత్తమమ్." ౨౧

పరిశుద్ధుఁడై యనఁగాఁ దొలుత నాయాయిమంత్రదేవతల ధ్యానించి వారిని హృదయంగతులుగాఁ జేసికొని యాతేజస్సు

తనయందారోపించుకొని యని దానిభావము. శిష్యోపదేశము సామాన్యము కాదు. గురువు తానుపాసించిన దేవతలం బ్రార్థించి నన్నుఁ గృతకృతునిగావించినట్లే యీశిష్యునికూడఁ గృతార్థునిగావింపుమని ప్రార్థింపవలయును. ఇదియే మహోపకారము. అట్లుగాక శిష్యద్రవ్యలాభముకొఱకు నుపదేశించినచో నిరువురకు లాభమంతియే. ద్రవ్యముకొఱకుపదేశించువారు తుచ్ఛగురువు లనంబడుదురు. వారికి ఫలము నరకానుభవమే. సదాచారము ననుసరించి మహామౌని సుప్రీతుఁడై యుత్తమోత్తమమగు నామంత్రసముదాయమునెల్ల రామమూర్తికి నుపదేశించెను. అట్టిగురువును వెదకుకొని శిష్యుఁడు మంత్రములను బ్రతిగ్రహింపవలయును. అని మన మెఱుంగవలయు.

మంత్రములు సాక్షాత్కరించి యేమిసేయవలయునని శ్రీరామమూర్తిని గోరెనని యున్నది. ఈవిషయమును గొందఱు నమ్మక చప్పరింతురు.

"ఇమేస్మ పరమోదారాః కిం కరాస్తవ రాఘవ.." అని మూలము.

దీనిభావ మేమనఁగా. విశ్వామిత్రముని తమ్ముఁ బ్రార్థింపఁగా నామంత్రాధిదేవతలు శిష్యుఁడగు రామునియెదుట సాక్షాత్కరించి విశ్వామిత్రునిప్రార్థనానురూపముగా నిన్ననుగ్రహించితిమి. అని చెప్పెను. కాని కింకరముల మనుమాట యేటికనఁగా శ్రీరాముఁడు సామాన్య మానవుఁడు కాఁడు. భగవంతుఁడు. కావున దేవతలందఱు స్థూలదృష్టిం బరికించినఁ దత్కింకరులేకదా. శ్రీరాముఁ డెట్టివాఁడో దేవత లెఱుంగుదురుకదా. కావున మేము కింకరులము. ఏమిచేయవలయు నని కోరిరి. ఇతరులవిషయమున ని ట్లేగ్రంథమునందును జెప్పఁబడియుండదు. మీరెల్ల

నాతలంచినపుడు రండు. అని రామమూర్తి కోరెను. వారదృశులైరి. ఇందు సంశయింపఁదగిన విషయమే లేదు. కావున సద్గురువు సచ్ఛిష్యున కుపదేశింపవలసినపతి యీభాగము నుండి మనము గ్రహింపవలయును.

తరువాత శ్రీరామమూర్తి యుపసంహారమంత్రములం దెలుపఁ గౌశికుని వేఁడెను. అస్త్రమును బ్రయోగించుట దాని తీవ్రశక్తి లోకమును బాధింపక యుండఁజేయుట యని భావము. దీనికే శాంతిప్రయోగమని పేరు. ఇది యెఱుంగఁ దగినది. శిష్యుఁడు వేఁడకయున్నను గురు వుపదేశింపవలయును. లేకయున్న నాయస్త్ర మితరులనుగూడ బాధించును. ఆపాపము గురువునకే కలుగును ఇచ్చట రామమూర్తి యడుగఁగా నా కౌశికుఁ డవా నినెల్ల నుపదేశించుచు నాచారము ననుసరించి "భద్రం తే" అని యాశీర్వదించెను. దీనింబట్టి మన మాలోచింపఁగా గురువు శిష్యునియం దెట్టిసద్భావముకలవాఁడుగ నుండవలయునో యూహింపవచ్చును. అట్టిగురువు లిపుడు కానవత్తురా. తఱుచుగా నిపుడు "శిష్యవిత్తాపహారకులే" తిరుగుచున్నారు. కాని "శిష్యహృత్తాపహారకు" లగపడరు. ద్రవ్యము నేకరింపఁగోరి యేవేషమో వేయుదురు. వారిపాదము లాశ్రయించినఁగాని ధనవిముక్తిగాదని పామరు లాశ్రయింతురు. శిష్యహృదయమునఁ గలతాపము నడఁపఁజాలువారు లేరని కాదు. ఉన్నవారు. కాని వారు వీరివలె వేషధారులు కారు. కావున వారిని బెక్కండ్రాశ్రయింపరు. అట్టి పరమకారుణికు లందం దుండుటచేతనే బీజము నశింపకయున్నది. భక్తి నిర్మలముగా వ్యాపించిన నట్టివారు తమకుఁ దమరే వత్తురు.

"తతస్తు రామః కాకుత్స్థో విశ్వాసనాద్బ్రహ్మవాదినః,
లక్ష్మణాయ చ తాన్ సర్వాన్ వరాస్త్రాన్ రఘునందనః,
సంహారాన్ సచ సంహృష్టః మాంస్త్రాన్యవేదయత్."

అను నీభాగమున నొక్కవిషయము గ్రహింపఁదగియున్నది. రామమూర్తి బ్రహ్మమునియాజ్ఞానుసార మామంత్రములనెల్ల మహానందమున లక్ష్మణునకు నుపదేశించెను. ఏల? ముని తన యుపాసనమునఁ గలశక్తియంతయు నొడ్డి రామున కామంత్రముల సాధీనము చేసెను. ఆదేవత లారామమూర్తికిం బొడ సూపి మీయధీనమున నుందుమనిరి. కావున ముని ప్రశిష్యునింగోరి రామా! గురుపారంపరాభివృద్ధి గావింపవలయునన్న నియమము ననుసరించి సోదరునకుం దెల్పుమని యాజ్ఞాపించెను. పరమభక్తుఁడై చిన్ననాఁటంగోలెఁ దన్నెంతయుం గొలుచు సౌమిత్రి కామంత్రములను సోపసంహారముల యథావిధి నొసంగెను. దీనింబట్టి తానేర్చుకొన్న సద్విద్యను దగినశిష్యున కొసంగి పారంపర్యాభివృద్ధి గావింపవలయుననియు నయ్యదియే లోకము బాగుపడుటకు మార్గమనియు మనము నేర్చుకొనవలయును. అదియే గురువుకోరఁదగినది. అంతియగాని సరము గురువునకు నివేదించి నెత్తినగుడ్డవైచుకొని పొమ్మనునది కాదు. ఔరా! పూర్వకాలపుటాచారము లెంతపావనతమములైనవి. ఇపు డట్టివి లేవనఁజాలముకాని తఱచుగా లేవందుము. గురుకులవాస మనునది నిఘంటుపదమైనది. ఆచారమున లేకున్న నుపన్యాసవేదికలపై మాత్రము తాండవించుచున్నది. భగవదనుగ్రహమున మరల నిర్మలప్రాచీనమార్గము నెల్లరు నాశ్ర

యింతురుగాక. ఇఁక శ్రీరామచంద్రుని యనంతరచరిత్రము నాలకింపుఁడు.

## వామనమూర్తి చరిత్రము.

* పరమేశ్వరుఁ డగు రామమూర్తి తానప్రమేయమహిమాంచితుఁ డయ్యును బామరులభంగి నవ నవృత్తాంతము నెఱుంగఁగోరి తన్నడుగఁగా మహాతేజుఁడగు గాధేయుఁడద్దాని చరితమును జెప్పఁబూని మహాబాహూ! రామచంద్రా! శ్రీమహావిష్ణువు తాఁ దపంబొనరించి యామూలమున లోకమునఁ దపస్సును బ్రవర్తింపఁజేయఁబూని యోగాభ్యాసము నల్లే తెలుపఁబూని పెక్కుసారు లావనమున వసించెను. ఇది వామనమూర్తియాశ్రమము. తపోనిధి యని విఖ్యాతినొందిన కశ్యపుఁడు తపస్సొనరించి సిద్ధుఁడయ్యెను. కావున నిది సార్థకనామధేయమున సిద్ధాశ్రమమనఁ బ్రసిద్ధిగాంచెను. వామనమూర్తి యిందు లోకానుగ్రహార్థము తపస్సుచేయుచుండఁగా బలిచక్రవర్తి యింద్రాదుల నోండిచి స్వర్గము నాక్రమించి రాజ్యము నేలుచుండెను. ఆబలిచక్రవర్తి విష్ణుదేవతాకమగు నొక్కయజ్ఞము నొనరించుచుండెను. దిగులొంది దేవత లగ్నిపురస్కృతులై యీయాశ్రమమునకు వచ్చి మహావిష్ణువుం దర్శించి బలివృత్తాంతము నెఱిఁగించి యిపుడు చేయుయజ్ఞము పూర్తినొందకమున్నే కార్యసిద్ధి కావలయును. ఆబలి యెవరు "దేహి" అని తన్ను యాచించిన నద్దానినంతయు నొసంగుచు. మా క్షేమమును గోరి మాయాయోగము నంగీకరించి వామన

* ఈభాగము బాలకాండమున నిరువదితొమ్మిదవసర్గమునుండి సంగ్రహీతము.

రూపము నవధరించి మాకుఁ గళ్యాణమును జేకూర్పుమా
యని ప్రార్థించిరి.

అత్తరుణముననే కశ్యపమునివరుఁ డదితిం గూడి తాఁజే
యుచున్నతపస్సును బూర్తినొందించి ప్రత్యక్షమై విష్ణుమూర్తి
వరమడుగు మనఁగా దేవతలకు నీయదితికి నాకును వరం బొసం
గుము. రాక్షసుల నడఁగఁ ద్రొక్కఁ గోరి యీయదితికిం బుత్త్రుఁ
డవై జన్మింపుము. ఇంద్రున కనుజాతుఁడవు కమ్ము. ఈపుణ్య
ప్రదేశము సిద్ధాశ్రమమను విఖ్యాతి నొందఁ జేయుము. ఇందుండి
సర్గమున నవతరింప లెమ్మని వరమడిగెను. ఆముని యందే
యదృశ్యరూపమునఁ దపస్సానరించు నామహాత్మునివాస మెఱుం
గఁడు. ఆమహావిష్ణువట్లే వరమిచ్చి సర్గమున నదితికిం దన
యుఁడై జన్మించి వామనమూర్తి యై బలికడకుం బోయి
మూఁడడుగులభూమి నడిగి ముల్లోకముల నాక్రమించి బలి
నడంగం ద్రొక్కి యింద్రునకు రాజ్య మొసంగెను. రామ
చంద్రా! వామనమూర్తి సంసారతాపముల నివారించుకొఱకు
నీయాశ్రమమునందు నివసించెను. నేను నద్దేవదేవునియందుఁ
గలదృఢభక్తిం జేసి యీయాశ్రమముననే యున్నవాఁడను.
యజ్ఞము నడంపఁగోరు నారాక్షసు లీయాశ్రమమునకే వత్తురు.
పరమపురుషుఁడవగు నీ వా దనుజులం జంపఁదగినచో టిదియే
సుమీ. మనమిపుడే యాయాశ్రమమునకుం బోవుదము. ఈ
యాశ్రమము నాకెట్లునీ యదియో నీకు నట్లేకదా. అని పలుకుచు
వారిం గూడి యందుఁ బ్రవేశించెను. హిమావరణము తొలం
గఁగాఁ బునర్వసు వనునక్షత్రమునందుండు చంద్రునివలె నాముని
యప్పు డొప్పెను.

అందుఁగల మౌనులెల్లరు వచ్చి కౌశికునకు నుచిత మర్యాద లొనరించి యారాజకుమారుల కాతిథేయసత్కృతుల నొనరించిరి. అంత నాసోదరులిద్దఱు రొక్కముహూర్త కాలము మార్గశ్రమ మపనయింప విశ్రమించిరి. వెంటనే లేచి యంజలులంబట్టి వారామునివరా! నేఁడే యజ్ఞదీక్షఁ బూనుము. నీయజ్ఞము సిద్ధిఁబొంద నీయాశ్రమము పూర్వ నామము నిపుడు మరల సార్థకముచేసికొనుఁగాక. వారిట్లు తన్నుఁ బురి కొలుపుచు నాదుష్టులం బొరిగొనుమన్న నీవాక్యము సత్యమగుంగాక యని పలుక నాముని విజితేంద్రియుఁడు గావున నప్పుడే దీక్షఁబూనెను. ఆసోదరులిద్దఱును నారాత్రి మిగుల జాగరూకులై యుండిరి. తెల్లవాఱఁగా లేచి ప్రాతఃసంధ నుపాసించి సూర్యున కర్ఘ్య మొసంగి పరిశుద్ధులై గాయత్రిని జపించి యగ్నికార్య మొందీర్చి కృతకృత్యులై యుండు నమ్మునికి నమస్కరించిరి.

మహానుభావులారా! విశ్వామిత్రముని మహాభక్తుఁడు గావున శ్రీరాముఁడు భగవంతుఁడనియు మాయాయోగముఁ బూని మనుష్యమాత్రుఁడుగ నున్నవాఁడనియుఁ దేటపఱిచెను. అట్టిదే యీభాగము. కావున నిందుఁగలవిశేషముల మన మెఱుంగవలయును. వామనమూర్తిచరిత్రమును దెలుపుట యేల? అంతతో నూరకయుండక

"తదాశ్రమపదం తాత తవాప్యేతద్యథా మమ." ౨౪

అని పలికెను. ఆనాఁడు వామనమూర్తివిగా నుండి లోకులకు మార్గము చూప నిందే తపస్సొనరించితివి. కావున నాది యని యెట్లు నే నూహించుచున్నానో యట్లే నీదియు నగు నని తెలి

పెను. అనఁగా వామనావతారమున దేవకార్యమును సాధించితివి. ఇపు డీరూపమున మరల దేవకార్యమును సాధింపుమా యని పురికొలిపెనని మన మూహింపక తప్పదుకదా. భగవంతుఁడే రామమూర్తి యని చాటె నని విశ్వామిత్రుని యీమాటలు తెలుపుచున్నవి. అదితియుఁ గశ్యపుఁడును దపస్సొనరించిన విధము తెలుపుటయుఁగూడ నాతల్లిదండ్రులే యిపుడు కౌసలా దశరథులుగా నీకొఱకే ధర జన్మించిరనియు స్మృతికిం దెచ్చుటకే యని మన మూహించినఁ దప్పులేదు. ఆవామనావతారమున భక్తుఁడగుటను ధర్మకార్యతత్పరుఁడగుటను బలి నాశ్రయించితివి. ఇపు డీయవతారమునఁ గోదండమూని చేయవలసినకార్యము లున్నవి. వానిం దీర్చి దేవతాకార్యమును నిరహించి యీలోకమున సత్యధర్మముల స్థాపింపుమా యనియు, గాధేయుఁడు ప్రార్థించెననియు మన మెఱుంగవలయు. అట్లు లెఱింగినఁగాని రామభద్రుఁడు మానవుఁడు కాఁడన్న భావము సంపూర్ణముగాఁ దొలఁగి పరమేశ్వరుఁ డన్నభావము గట్టిగా నెలకొనదు. ఆభావము మనస్సున స్థిరవసతిం గాంచినఁ గాని మన మనన్యభావమున ధ్యానింపము. అనన్యభావమున ధ్యానించినఁగాని భగవత్కరుణకుం బాత్రులము కాఁజాలము. కావున నీఘట్టమునఁ దేటగా రామచంద్రుఁడు భగవంతుఁడే యని తెలిపిన మునివాక్కులను వేదవాక్కులుగా మన మూహించి యారీతిం గృతార్థ మొనరింపవలయును.

"అద్యైవ దీక్షాం ప్రవిశ భద్రం తే మునిపుంగవ,
సిద్ధాశ్రమోఽయం సిద్ధస్స్యాత్సత్యమస్తు వచస్తవ." ౨౯

అన్నభాగమును బరిశీలింతము. మునీంద్రా! ఇపుడే యజ్ఞదీక్ష

కారంభింపుము. నీకు మేలయెడు. ఈయది సిద్ధాశ్రమము. ఆపేరు సార్థకమగుంగాక. అనఁగా నీయజ్ఞదీక్ష నిర్విఘ్నముగా సాగుఁగాక. నీమాట సత్యమగుఁగాక. అనునది శ్రీరామచంద్ర వాక్యముకదా. విశ్వామిత్రుఁడు పూనున దొకయజ్ఞదీక్ష.

"దశరాత్రం హి యజ్ఞస్య రామం రాజీవలోచనమ్."

అని మున్నే దశరథునితో విశ్వామిత్రుఁడు చెప్పియుండెను. ఇంచుమించుగాఁ బదిదినము లాయజ్ఞము సాగవలయునని తేలెడిని. దానికిం దగినసంభారములు కావలయును. ఇపుడే దీక్ష కారంభింపుమని రాముఁ డనఁగానే ముని దీక్ష కారంభించెను. ముహూర్తమువలదా అన్నసంశయము కలుగును. ఈ సంశయమును నివారింపఁబూనఁగా నాకాలపుయజ్ఞము లెట్టివని మనకుఁ దోఁచును.

ఆకాలమునఁ జేయుయజ్ఞములకు ముహూర్త మక్కఱ లేదు. అవి కేవలజపయజ్ఞములు. ఋత్విక్కులకు దక్షిణల నీయ నక్కఱలేదు. ధనముతోఁ బనిలేదు. రాజులను యాచించి వస్తువులను గూర్ప నక్కఱలేదు. మహర్షులు వలసినపుడు సాయపడ సిద్ధముగా నుందురు. ఫలమూలములను దేర శిష్యులు సిద్ధముగా నుందురు. ప్రతిఫలముల నాసింపనివా రెందఱో యట్టి సత్కర్మములకుఁ బిలిచినఁ జాలును. తోడ్పడుటకు సిద్ధులుగా నుందురు. అట్టియజ్ఞము లేవి? ఫలాభిసంధిరహితములగు జపయజ్ఞములే. జపయజ్ఞములకు నితరులసాయ మేల? అని యడుగ వచ్చును. చిరకాలము జపముచేయుదురు. తరువాత నియత సంఖ్య హోమముచేయవలయును. ఆహోమమునకు ద్రవ్యములు పెక్కులుండును. కొన్నిహోమములకుఁ గమలములు.

మల్లి కాదిపుష్పములు. ఇప్పపూవులు లోనగునవి దేవతాభేదము ననుసరించి మార్పునొందును. కాంతి ననుసరించియు మారును. క్రూరకర్మమునందుఁ గొన్ని సమిధలుకూడఁ గలవు. అ. హోమ కాలములయందు నితరులసహాయ మావశ్యకమై యుండును.

జపముచేయకయే హోమము చేయుపద్ధతియుఁ గలదు. జపహోమములు మాని పూజచేయుప తియుఁ గలదు. జప హోమపూజలు మాని న్యాసము చేయుమార్గము గలదు. న్యాస మనఁగాఁ దనయుపాస్య దేవతామంత్ర బీజాక్షరముల నాక్కొక్క యవయవమునందు విన సించుట. అనఁగా సర్వాంగముల యందు దేవతామంత్రమును భావించుటవలన నాయాయింద్రి యములు పవిత్రములగునని విధి ఈనాలుగు సమానఫలముల నీయఁజాలును. దేవతకుఁ దనకు నొకసూత్ర మున్నయట్లు భావింపవలయు. భక్తుని సంకల్పబలమున సీతనియాశయము దేవత యెఱుంగుననియే దీనిభావము. ఇవియే జపయజ్ఞము లనంబడును. అహింసాప్రధానములుగానఁ బరమపావనము లయ్యెను. కాఁబట్టియేకదా భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు "యజ్ఞానాంజపయజ్ఞోఽస్మి"యని య. నునకు సాభిప్రాయమును దేట పఱచెను. తక్కినయజ్ఞములు భగవత్ప్రియములు కావనికాదు. విశేషించి జపయజ్ఞము భగవత్ప్రియమునునిసారము ఇతరప్రాణికి దేనివలన నపాయములేదో యాకార ముత్తమముకదా.

విశ్వామిత్రుఁడు చేయుయజ్ఞము జపయజ్ఞమే యని యెట్లు చెప్పనగును? అన్న నిదియే యని నిర్ణయింప నలను పడదు. ఇట్టియజ్ఞము లనేకము లుండవచ్చును. ధన మక్కఱ లేని యహింసాప్రధానయజ్ఞమనిమాత్రము చెప్పవచ్చునని,

నాకుం దోఁచెడు. సందర్భమునుబట్టి యట్లు తోఁచును. జప యజ్ఞము కానివానికి ముహూర్తముకావలెను. ఆముహూర్త మానాఁడే యున్నదేమో యని ప్రశ్నించిన బదులుచెప్పుట కష్టమే. వేళకూడ నిర్ణయింపవలసియుండును. ఏదియెట్లులున్నను నిది సత్కతువని మాత్రము చెప్పవలయును. ప్రాయశః పూర్వ కాలమున నిట్టియజ్ఞములే సాగుచుండునట్లు పురాణములే మనకుఁ దెల్పుచున్నవి.

## దుష్టనిగ్రహము.

* రామలక్ష్మణులు దేశకాలముల నెఱింగినవారు. మాటలాడు నేర్పుగలవారు, పగవారినడంచు నూహలుగలవారు. కావున మునిపుంగవుని సత్కర్మము నడంచుదుష్టులం బొడవడంపఁగోరి గాధినందనుం గాంచి మునీంద్రా! యజ్ఞమును రక్షింపఁబూనిన మే మారక్కసుల నివారింపఁ దగు సమయ మెప్పుడు? దాని నెఱుంగఁగోరెదము ఆసమయమున జాగరూకులమై యుండఁదగునుగాదే. అని యెప్పుడెపుడు యు ముగలుగునా యని యువిళ్లూరుచున్న యాశీరకుమారులం గాంచి యందున్నమును లి ట్లనిరి. శూరాగ్రేసరులారా! ఈదినము మొదలాఱురాత్రులు మీరు కాపాడుచు నుండవలయును. ఈమౌనియు దీక్షఁబూని యున్నవాఁడు. మౌనముద్రాధారియై యుండును. కావున మీకు బదులిడవలను పడదు. వారియాశయమునే మీకుఁ దెలిపితిమి.

అని యమ్మునులు పలుకఁగా విని యాకుమారు లిరువురు జాగరూకులై యహోరాత్రపక్షము తపోవనమును గాపా

---

*ఈభాగము బాలకాండము ముప్పదియవసర్గమునుండి సంగృహీతము.

డుచు ధనుర్ధారులై సన్నద్ధులై మహర్షిని గనుఁగొనుచు నుండిరి. రాత్రిపంచకము చక్కఁగాఁ గడచెను. ఆఱవదినము వచ్చెను. రామమూర్తిసోదరా! నేఁడు మఱింత హెచ్చరికమై నుండవలయుఁజుమీ. అని పురికొలుపుచు యుద్ధార్థులై యుండఁగా సర సంభారసంభృతమగు నాయజ్ఞవేది చక్కఁగా మండుచుండెను. ఋత్విక్కులు యథావిధిగా సాగించుచుండిరి. అత్తఱి నాకాశమున భయంకరముగా నొకధ్వని వినఁబడెను. మారీచుఁడు సుబాహువు నను నిరువురు రాక్షసులు భటులం గూడి మాయపన్ని యంబరము నెల్ల నావరించి వృష్టికాలమునఁ బరుగిడు మేఘపంక్తివలెఁ బాఱు తెంచిరి. యజ్ఞవేదికపై రక్తధారలను గురియించిరి. పూవులచే నలంకృతమగు నావేది రక్తసిక్తము కాఁగాఁ గాంచి రామమూర్తి కోపాతిరేకమునఁ దన పయికి నురవడించు రక్కసులంగని సోదరునితో లక్ష్మణా! ఘోరగాలిమబ్బుగములఁ దూలించునట్లు మానవమాంసభక్షణాసక్తులగు నీరక్కసుల నిదె నామాయాస్త్రము దూలఁగొట్టును చూడుమని పలికి యంతకంత కెక్కుడగు కోపమున దివ తేజస్సంవాప్తంబగు నామానవాస్త్రమును మారీచువక్షము గాడునట్లు ప్రయోగించెను. ఆయస్త్రము సోఁకుటయు నూఱు యోజనములదూరమున నుఁజిమ్మంబడి సముద్రోదకములయందుఁ బడియెఁగాని మారీచుఁడు చావఁడయె ను. అదిచూచి రాముఁడు లక్ష్మణా! మిగిలియున్న యీదురాత్ములం జెండాడెదను. చూడుమని మహత్తరమగు నాగ్నేయాస్త్రమును సమంత్రకముగా నియతిం బ్రయోగించుటయు సుబాహు వప్పుడే నేలపైఁగూలి యసువులం బాసెను. తక్కుంగల కఱకురక్కసుల నెల్లర వాయ

వా స్త్రమును జెండి మునులకెల్ల మహామోదము నొదవించె
ను. పూర మసురులజయించిన యింద్రుని బూజించినట్లే ముని
లాదుష్టరాక్షసులఁ జక్కాడిన శ్రీరామమూర్తిని బూజించిరి.
యజ్ఞముపూర్తియగుటయు విశామిత్రుఁడు నిరుపద్రవముగా
నలరారు నాయాశ్రమముం గాంచి రామభద్రుని దిలకించి
మహాత్మా! నీబాహువులసాయమునఁ గృతార్థుఁడనైతిని. పితృ
వాక్యమును బాలించితివి. నాయజ్ఞమును నిర్విఘ్నముగాఁ
బూర్ణముగావించి సిద్ధునిగా నొనరించి యీయాశ్రమమును
సిద్ధాశ్రమమే యనఁజేసితివి. నీకీర్తి వృద్ధియయ్యెను. అని
యాదరమునఁ బలికెను.

మహాశయులారా! ఈభాగము ముఖ్యమే. విమర్శ
నార్హమే అగుంగాదే. మునివరుఁడు యజ్ఞదీక్షం బూనెను.
దీక్షయనఁగా నిట మౌనముద్రాధారణమే యని యము.

"అద్య ప్రభృతి షడ్రాత్రం రక్షతం రాఘవౌ యువాం,
దీక్షాం గతో హ్యేష మునిర్మౌనత్వం చ గమిష్యతి." ౪

రాముఁడు రక్కసుల రాక నడుగఁ దక్కినమునులు బదులు
చెప్పిరి. ఇంతకుముందే జపయజ్ఞమే కావలయునని వ్రాసి
యుంటిని. భగవంతునిహృదయపీఠమున నెలకొల్పి గాధేయుఁడు
నిశ్చలమనస్కుఁడై యుండెను. తక్కినజన్నములం దీమౌనము
పనికిరాదు. అయిదుదినములట్లే సాగెను. ఆఱవదినము హోమ
కాలము. పశువిశసనమాయజ్ఞమున కక్కఱలేదు. కావుననే
పూవులు చల్లఁబడి యాయజ్ఞవేది యలంకృతమై యుండెను.
హవిర్భాగములు గైకొన దేవతలు వచ్చినజాడఁ గానరాదు.
యజ్ఞమనఁగా

"ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః,
తైర్దత్తా నప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః. ౧౨
యజ్ఞశిష్టాశినస్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః,
తే త్వఘం భుంజతే పాపా యే పచంత్యాత్మకారణాత్." ౧౩

గీతా. 3 అధ్యా.

అను గీతాశాస్త్రము నైవిషయమును దృఢపఱచుచున్నది. దేవతలయాగమనము వారికోలాహలము నిందుఁ గానరాదు. కావుననే జపయజ్ఞమని మన మూహించుట ప్రమాదకారముకాదు. పరమపవిత్రమగు జపయజ్ఞమేయని నిశ్చయింపుఁడు. జపయజ్ఞము భగవత్ప్రీతికిం బాత్రము. అది పరమేశ్వరునకు నిష్టమైనది. హింసాశబ్దోచ్చారణమునకైన నందుఁ దావులేదు. అందు ధ్యానింపఁబడునది తేజోమయరూపము. నిరవయవము. అది కేవలము ధ్యానగమ్యము. ఆతేజోరూపమునే కొందఱవయవిగాభావింతురు. షట్చక్రములే యామూర్తికి స్థానములు. ఒక్కొక్కచక్రమునం దొక్కొక్కరీతి నారూపము నారాధింపవలయును. అది సగుణము నిర్గుణముగూడ నగును. ఉపాసకునియోగ్యతంబట్టి యది యుండును. అంతియగాని సగుణమే యనికాని నిర్గుణమే యనికాని పలుక నవకాశములేదు. "సగుణం నిర్గుణం చ" అని యుపనిషత్తులే తెలుపుచున్నపుడు మనమా యదికా దిదియని సిద్ధాంతముచేయువారము. ఈ విషయమును శ్రీశంకరభగవత్పాదాచార్యులవారు సౌందరలహరియందు.

"మహీం మూలాధారే కమపి మణిపూరే హుతవహం
స్థితం స్వాధిష్ఠానే హృది మరుతమాకాశముపరి,

మనోఽపి భ్రూమధ్యే సకలమపి భిత్వా కుళపథం
సహస్రారే పద్మే సహ రహసి పత్యా విహరసి."

అని తెలిపిరి. మూలాధారస్వాధిష్ఠానమణిపూరకానాహతవిశుద్ధాజ్ఞాత్మకములు షట్చక్రములు. ఇవి పృథివ్యగ్నిజలవాయువ్యోమమనస్తత్త్వాత్మకములు. ఈతత్త్వము లాచక్రముల యందుఁ దన్మాత్రలధర్మమున నుండును. తన్మాత్రలనఁగా గంధరూపరసస్పర్శశబ్దాత్మకములు. ఉపాసకుఁడు తనశక్తి ననుసరించి వరుసగా నాయాయిచక్రమునందుఁ దదధిష్ఠానదేవత నుపాసించి వరుసగా నూర్ధ్వస్థితికి రావలయును. ప్రకృత మనుసరింతును.

విశ్వామిత్రుఁడు చిరకాలతపస్సంసి మహానిర్మలజ్ఞానసంపన్నుఁడు. కావున ఫలాభిసంధిగలవాఁడు కాఁడు. నిష్కామకర్మముల నాచరించు మహాయోగి. మౌనవ్రతమూనుటయు నొకతపస్సని పెద్ద లందురు. మౌనమునఁ గొన్ని బాహ్యాకారములు తగ్గును. అపుడు ధ్యానమునకు మంచిసమయము దొరకును. అంతమాత్రము చాలదు. యోగమున మనస్సును గుదియింపవలయును. అట్టి యభ్యాసములు కౌశికమునికెన్నియో కలవు. కావున నాలుదినములు మౌనముద్రను బూనెను. దృఢవ్రతము కాన నది మార్పరానిది. ఇట్టియజ్ఞమేదియై యుండును?

"దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే,
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతే. ౨౫
శ్రోత్రాదీనీంద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి,
శబ్దాదీన్విషయానన్య ఇంద్రియాగ్నిషు జుహ్వతి. ౨౬

సర్వాణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే,
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే. ౨౭
ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞా యోగయజ్ఞాస్తథాపరే,
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయస్సంశితవ్రతాః. ౨౮
అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే,
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః. ౨౯
అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి,
సర్వేప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః. ౩౦
యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనం,
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ. ౩౧
ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే,
కర్మజాన్ విద్ధి తాన్ సర్వానేవం జ్ఞాత్వా విమోక్ష్యసే. ౩౨
శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప,
సర్వం కర్మాఖిలం పా జ్ఞానే పరిసమాప్యతే.'' 33 గీత. ४ అధ్యా.

అని యజ్ఞోపనా సము శ్రీకృష్ణభగవంతుఁడు చేసినదానిని బరికించిన ను_మయజ్ఞ మేదియో తెలియఁగలదు. ద్రవ ములు నేకరించి వానితో సాధించుయ్ఞ్ములకంటె జ్ఞానయజ్ఞ ము_మో_మమనియే భగవంతుని యాశయమని మన మూహింపవలయును. ఊహించుట యనఁగా నిశ్చయించుట యనియే భావము. మహాజ్ఞాని యగు కౌశికుఁడు మౌనమూని చేయునది జ్ఞానయజ్ఞమగుట నయ ది జపరూపమనియే మన మూహింపవచ్చును. "యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి" అని భగవంతుఁడే తెలిపెనుగదా. అట్టి మహాపావన య్ఞ మునకు ఫలము భగవంతుఁడు ప్రీతుఁడగుటయే. కాఁబట్టి యజ్ఞపురుషుని శ్రీరామునిం

బిలుచుకొనివచ్చి యామహాత్ముని దివ మంగళవిగ్రహామును దదేకదృష్టిం గాంచుచు దానినే మనఃపీఠమున నిలుపుకొనుచుఁ బరమానందము ననుభవించుచుఁ దదేకధ్యానమున నుండెను.

ముని తనను ధ్యానించుచుండఁగా శ్రీరామమూర్తి నరరూపమున నుండుట నేనేమిచేయవలయునని యడిగెను. వలయనఁగా

"యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః,
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే.
తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్,
భవామి న చిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్." ౭ గీత. ౧౨ అధ్యా.

అని తాను జేసినప్రతిన నెఱవేర్చుట విధికదా.

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహాం." ౨౨ గీ.౯.అ.

అన్న శపథమును సార్థకముచేయక తప్పదు గదా.

"అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ,
న తు మామభిజానంతి తత్త్వేనాతశ్చ్యవంతి తే." ౨౪ గీ. ౯ అ.

అయజ్ఞ మహింసారూపమగు జపయజ్ఞము. యజ్ఞపురుషుఁడు ప్రభువునగు తానూరకుండుట ప్రతిజ్ఞాభంగముకాదా. కావున నాపనియేమని కేవల మానవునిరీతిఁ బ్రశ్నించెను. ఇన్నింటినిం బట్టి పరిశీలించిన నాగాధినందనుఁ డొనరించుయజ్ఞము భగవత్సంప్రీతికిఁ బాత్రతమమగు జపయజ్ఞమేయని మనమూహించి మాయామానుషవిగ్రహుం డగు నాపరమకారుణికో ముని

శ్రీరామచంద్రుని సర్వదా ధ్యానింపవలయును. కౌశికుని
వలె మనము భక్తులము కావలయును. విశ్వామిత్రునివలెనే
నుపకారపరాయణులము కావలయును. అప్పుడే యాపరమే
శ్వరుఁడు మనలం గాపాడఁ గంకణము కట్టుకొనును. హింసా
ప్రధానకర్మముల మానినంగాని యాపరాత్పరునికరుణకుం
బాత్రులము కాఁజాలమనుట నిక్కము. ఇప్పటినుండి గ్రహిం
పఁదగినవిషయ మిదియే. దీనివంటిదే యింక నొక్కటి కలదు.

"పశ్య లక్ష్మణ దుర్వృత్తాన్ రాక్షసాన్ పిశితాశనాన్,
మానవాస్త్రసమాధూతా ననిలేన యథా ఘనాన్. ౧౫
మానవం పరమోదారమస్త్రం పరమభాస్వరమ్,
చిక్షేప పరమక్రుద్ధో మారీచోరసి రాఘవః." ౧౬

అని మూలమునఁ గలదు.

"ఇమానపి వధిష్యామి నిర్ఘృణాన్ దుష్టచారిణః,
రాక్షసాన్ పాపకర్మస్థాన్ యజ్ఞఘ్నాన్ రుధిరాశనాన్. ౧౯
సంగృహ్యాస్త్రం తతో రామో దివ్యమాగ్నేయమద్భుతమ్,
సుబాహూరసి చిక్షేప స విద్ధః ప్రాపతద్భువి." ౨౦

అనియు మూలముఁ గన్పట్టెడిని.

శ్రీరామునిదృష్టి కప్పటిరక్కసులెల్లరు సమానులు
కోప మందఱియందును సమానమే. మానవాస్త్రమున మేఘ
ములను గాలి యెగురఁగొట్టినయట్లు వీరిని నేనెగురఁగొట్టెదను
అని మహత్తరకోపమున మారీచునియురమున మానవాస్త్ర
మును బ్రయోగించెను. అది మారీచుని రామమూర్తి యభి
ప్రాయము ననుసరించియే సాగరమునఁ బాఱవైచెను. మఱల
రామమూర్తి లక్ష్మణా యని పిలిచి చూడుము. ఈదానవు

వధించెదనని యాగ్నేయాస్త్రము సుబాహునిపైఁ బ్రయోగింప వాఁడు పడి మృతినొందెను. ఈభాగమునుబట్టి రామచంద్రుని సర్వజ్ఞత ము తేటపడును. ఎట్లు? మారీచుఁడు శ్రీరామునకుఁ గృతపరిచయుఁడు కాఁడు. సుబాహువు విరోధియుఁగాఁడు. ఇరువురు సమానులే. ధర్మధ్వంసకు లన్నభావమే రామమూర్తికి వారియందుండవలయును. విశేషించి తాటకాపుత్త్రుఁడు మారీచుఁడని మునివలన వినియున్నవాఁడు. కాని వీఁడు మారీచుఁడనియు వీఁడు సుబాహువనియు సామాన దృష్టిం బరికించిన రామభద్రునకుఁ దెలియదనవలయును. అయో ! వీనితల్లిం జంపితిని, తల్లి లేనిపిల్లవాఁడను విశ్వాసమును మా చునిపైఁ జూపెనని యూహింతమన్నను వాఁడు క్రొ‌త్తవాఁడు. ఆకసమున నున్నవాఁడు. ర‌క్తమాంసాదులఁ గురియించుచున్నవాఁడు. గుంపుగా రక్కసులున్నవారుగాని మారీచుఁ డొక్కఁడే యొకప్రక్కన నిలువంబడి యయ్యా నేనే తాటకకుమారుఁడను. తల్లిలేని పిల్లవాఁడనని పలుకలేదు రాముఁ డాగ్రహించి గాలి మబ్బులఁ దూలఁగొట్టినయట్లు వీనిఁ దూలించెదను. చూడుమని సోదరునితోఁ జెప్పెను. దీనిసార మేమనఁగా సౌమిత్రీ! ఈరాక్షసుఁడు మనభావికార్యమునకుఁ దోడ్పడువాఁడుసుమీ. వీని నిపుడు చంపరాదు. వీనిదూలఁగొట్టెద. సమయమున వధించెద. ఎవ ని నెపుడుచంపవలయునో వానినప్పుడే వధింపలయునని రామమూర్తి పలికెను. సుబాహువుతో ముందు పనిలేదు. కావున నాతనింజంపెను. దీనిచే శ్రీరామునకు నెవరెవరితో నేయేకార్యము కావలసియున్నదో, ఏయేకార్యము తానెట్లు చేయవలయునో యెఱుంగుననియు, మానవాకృతిని

సార్థకము చేయఁ బ్రవర్తించుననియు మన మెఱుంగవలయును. దీనింబట్టి మనము చక్కఁగా శ్రీరాముఁడు సప్రవృత్తరూపమున మానవులకు సద్ధర్మములఁ దెలుపఁబూనెనుగాని తనపవిత్రానెఱుంగనివాఁడు కాఁడనియు, సర్వజ్ఞుఁడే యనియు నిశ్చయించి యారాధింపవలయును.

"జన్మ కర్మ చ మే దివ్యమేవం యో వేత్తి తత్త్వతః,
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున." గీ. ౪. అ.

అన్న భగవద్వాక్యము స్మరించుచు నాపరాత్పరుని నిష్ఠమై ధ్యానింపవలయును. ఇఁకఁ దరువాతికథకు మరలుదము.

## కౌశికుఁడు రామలక్ష్మణులతో మిథిలకుఁ బయనమగుట.

* ఆ రామలక్ష్మణు లిరువురు కౌశికునికారమును నిరహించి తెల్లవాఱఁగాఁ దత్కాలకృత్యముల నిర్వర్తించి మునుల కడకుంబోయి యగ్నిసమాన తేజమునఁ బ్రకాశించు నాగాధేయునకు మ్రొక్కి మునీంద్రా! తమయానతిం దీర్చితిమి. ఇఁకఁ జేయఁదగున దేది యని ప్రశ్నించిరి. మధురభాషణంబుల నట్లడుగఁగా నమ్మునియానతింగొని మును లెల్ల శ్రీరామమూర్తిని దిలకించి రామచంద్రా! మిథిలాధిపతి జనకుఁడు పరమధర్మయుతమగు నొకయాగ మొనరింపఁబోవుచున్నాఁడు. అందులకు మేమందఱము పోవఁదలంచితిమి. మీరును మాతోడ వచ్చి యచ్చెరువుగలిగించుచుఁ బ్రఖ్యాతమైయున్న యొకధనుస్సును జూడవలయును. మహాసారవంతమయి భయముగలిగించునదియయి మహాతేజోవంతమునగు నావిల్లును బూర్వము యాగ

* ఈభాగము బాలకాండమున ముప్పదియొకఁడవ సర్గమునుండి గ్రహింపఁబడినది.

కాలమున సభస్సునందు దేవత లొసంగిరి. దేవగంధర్వాదులు కూడ దాని నెక్కు-పెట్టఁజాలరు. మానవులమాట యిటఁ జెప్ప నేటికి? ఎందఱో రాజకుమారులు తద్ధనుస్సారము నెఱుంగఁ దలంచి తుదకు దాని నెక్కు-పెట్టఁజాలక మరలిపోయిరి. నీవు వచ్చినయెడల మహాత్ముఁడగు నాజనకరాజు నామహాధనుస్సును, యాగమును జూడఁగలవు. యజ్ఞమునకు వచ్చి ప్రీతులైన దేవతలను దద్యజ్ఞమునకు ఫలముగా నామేటిచాపము నొసంగు నట్లు జనకుఁడు ప్రార్థించెను. దాని నాదరించి వారాధనుర్వ రము నొసంగిరి. ధనురుత్సవములయందుఁ బ్రధానముగా దాని నర్చించుచుండును. పరిమళధూపాదు లొసంగిదానిం బూజించు చుండును.

అనిపలికినంత నాకౌశికుఁడు మహర్షులంగూడి రామ లక్ష్మణు లమ్మాటల కియకొని వెంటరాఁగాఁ బయనము సాగిం చుచు నందుఁగల వనదేవతలం గాంచి యోవనదేవతలారా! మీాకెల్ల భద్రమగుంగాక. నేను సిద్ధినొందితిని. కావున నీసిద్ధా శ్రమమునుండి పయనమై గంగానదికి నుత్తరభాగమునఁగల హిమవంతమునకుఁ బోయెదను. అని వీడుకొని పరమపావన మగు నాసిద్ధాశ్రమమునకుఁ బ్రదక్షిణమొనర్చియు రదిక్కు నకుఁ బయనము సాగించెను. మునివరునివెంట బ్రహ్మవాదులు మునులు తమతమ యగ్నిహోత్రాదులంగొని వాని బండ్ల నెక్కించుకొనిపోయిరి. అందలిమృగములు పక్షులుకూడ నమ్ముని వెంట నంటిపోవఁదొడంగఁగా వానినెల్ల బుజ్జగించి మరలిం చెను. ఆదినము శోణనదివఱకుఁ బోయిరి. సూర్యాస్తమయ మయమగుటయు నమ్మును లందుండి స్నానముచేసి యగ్ని

కృత్యములం దీర్చుకొని విశ్వామిత్రునిచుట్టును గూరుచుండిరి. సోదరు లిరువురు వారికి నమస్కరించి కౌశికుని గాంచి సంతోషముప్పొంగ మహానుభావా! ఈశోణనది యిరుదరుల వనపంక్తులం గనుపట్టు నీదేశ మెవ్వారిది? వినఁగోరుదుము. మీకు భద్రములగుంగాక, అని యడిగిరి. మహాతేజుఁడు రామచంద్రుని గాంచి దానివృత్తాంత మెఱిఁగింపఁబూని యిట్లు పలికెను.

మహాత్ములారా! ఈభాగమునఁ గొలఁదివిషయములు విమర్శించి గ్రహింపఁదగిన నీతులు కలవు. వాని నెఱుంగఁదగును. కృతకృతుఁడగు మునికడఁ జేరి రామలక్ష్మణులు తమ యానతి నెఱవేర్చితిమి. ఇఁకఁ జేయఁదగునదేది? అని విన్నవించిరి. విశ్వామిత్రునిం గూడియున్నవారెల్ల నేకవాక్యముగా మిథిలాపురమునకుం బోవ నిచ్చయించితిమనియు నందు శివచాపముగలదనియు మహాధర్మస్వరూపమగు యాగముసాగుటయుఁ దెలిపి యాధనుస్సు నెక్కుపెట్టఁజాలక రాజనందనులరిగిరనియుఁ దెల్పిరి. మీరును దానిం జూడఁదగుననియుఁ దెలిపిరి. రాఘవు లిరువురు నందులకు సమ్మతించిరి. ధనురుత్సవములయం దాశివధనుస్సు పూజింపఁబడుచుండును. ఆమాట విన్నతోడనే రామమూర్తి యందులకుఁ జన నంగీకరించెను. ఏల? "అనాహూతోఽధ్వరం గచ్ఛేత్" అన్నసూక్తి ననుసరించి యజ్ఞదర్శనమునకుఁ బోవనిశ్చయించెనని భావము. మునులు కూడ రాజకుమారులమర్యాద నెఱింగినవారు కానఁ బరాక్రమప్రదర్శనసమయ మగుటయు నెఱుంగుదురు కావునను, పిలువకపోయినను యాగమును జూడఁబోవుట ప్రధానమగు సూక్తి ప్రసిద్ధమగుటను రమ్మని పిలువఁబూనిరి.

ధనురా _ విన్నయంతనే రామునకుఁ బూర జ్ఞానము కలిగెను. ఆచాపము తనవిఖ్యా తిని జాట నం దున్నది. దాని మూలమునఁగాని పరశురామసందర్శనము కాదు. అది సమ కూడినఁగాని సీ యతేజస్సు మరలఁ దనలోఁ బ్రవేశింపదు. అది ప్రవేశింపక పరశురామునియందుండి లాభములేదు. కాన దానిని గ్రహింపక యూరకుండ రాదు. పరశురాముని జయించి నట్లు వెల్లడియైనఁగాని దేవతలకు మునులకు సామాన్య మానవులకును దనయందు విశేషించి విశ్వాసము పుట్టదు. ఇన్ని కారణముల కనుకూలమగుటంజేసి యమ్మునులంగూడి పోవ నిష్టపడెను. ఆధనుస్సు తనకొఱకే కాచియున్నదనియు రాముఁ డెఱుంగును. అది మున్ను తనకును శంకరునకునైన చమత్కార సంగరమునందు భావికారణమునకు . నొచ్చిన శంకరచాపము. ఆయుధము భావికారణమునకే కాకయున్నచో నాధనుస్సు సుంత నొచ్చినంతనే యుద్ధము మానునా. ధనుస్సు శిథిలము కాఁగా నొండుచాపమెత్తికొని శూరులు సంగరముచేయుట పురాణాదులయందు గనఁబడుటలేదా. కావున శంకరునకుఁ దనకును సంగరముసాగుటయు విడంబనామే కాని సత్యము కాదు. కొందఱు సత్యముగా శంకరునకు విష్ణుమూర్తికి వైరమే కలిగినదనియు, సంగరముసాగినదనియు శంకరుఁ డోడెననియు నందురు. ఆయుద్ధము విడంబనాముకాక వాస్తవమగు పగ చేతనే సాగియుండునేని శంకరుఁ డోడిన నోడనిండు. విష్ణువు మాత్రము భగవంతుఁడు కాఁడని వెల్లడియగును. "ఆవయో రంతరం నాస్తి"అని హరివంశమున విష్ణువాక్యము కలదు. తానే యైన శంకరునితో మరలఁ దా సంగరముచేయుట యసంగతము

కాదా. సంగరమే సత్యమైన విష్ణుసర్వోత్తమత మెగిరిపోవును. ఆసంగరము విడంబనామైన శంకరుఁడోడెనన్న వాదము దురాదమే యగును. ఇట్టివాదములయందుఁ బ్రీతి నవాంతర స్వీకృతవిప్రత ముగల మధ్వవైష్ణవులకే యని మన మూహింపవలయును. అట్లులగుటంజేసి శివకేశవభేదవాదము దురాదమే యగును.

శ్రీరామమూర్తి మిథిలాప్రయాణవ్యాజమునఁ జేయఁదగినకార్యము లెన్నియో కలవని యెఱుంగును. అహల్యాశాపాంతము సమీపించినది. ఆసమయమునకుఁ దాఁ బోవవలయును. పతివ్రతకుఁ గలదుఃఖము తొలఁగింపవలయును. తనకొఱకు ముందుగనే యవతరించియున్న ప్రకృతిని సీతను లోకాచారము ననుసరించి పెండ్లియాడవలయును. వివాహము పూర్తియైనఁగాని విశ్వామిత్రునితపస్సు సాగదు. దానికి నంతరాయము తాఁ గల్గింపరాదుకదా. గౌతమముని తనయాగమనమునకై యోగిదృష్టి నొడ్డి వేచియున్నవాఁడు. అహల్య నామహర్షితోఁ జేర్చినఁగాని సత్కర్మములు సాగవు. సత్కర్మములకుఁ దా నంతరాయభూతుఁడు కారాదు.

“ కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్,
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్.” ౧౫

గీ. 3 అ.

అన్నసోక్తి తప్పరాదుకదా. కొందఱిచ్చోట నొకప్రశ్న మొనరింతురు. భగవద్గీతలు దాపరాంతమునఁగదా గల్గినవి. వానిని రామాభిప్రాయమున కెట్లు ముడిపెట్టఁదగును? అని ఈప్రశ్నము తెలివితక్కువచేఁ జేయఁబడినది. భగవద్గీతలు భగవంతునిహృదయమున నున్నవే. కృష్ణావతారమున శిష్యునకు

బోధింపఁబడియెను. వానిని గ్రా_గా శ్రీహరి కల్పింపలేదు. సనాతనములు. రామకృష్ణులకు భేదముకల్పించువా రుండర నియే నాయాశయము. అశ_యుఁ గ నచో వారికి నమస్కారమే సమాధానము. భక్తు లట్లు తలంపరన్న నమ్మకము నాకింకను గలదు. ఈవిషయములన్నియు నెఱింగిన పరమేశ్వరుఁడు రామమూర్తి పితృవాక మునే ప్రమాణముగానమ్మి ప్రవర్తింపవలయు నన్న నీతిని లోకులకుం దెలుపంబూని విశ్వామిత్రుని యానతిమీఱక ప్రవర్తింపుమన్న తండ్రిమాట నాధారము చేసికొని తనయవతారప్రయోజనమును వెల్లడింపఁబూని ప్రయాణమయె ను.

"సర్వసంఘుస్సకాకుత్థ్సం ఆమంత్ర్య వనదేవతాః. ౧౪
స్వస్తి వోఽస్తు గమిష్యామి సి స్సిద్ధాశ్రమాదహం,
ఉత్తరే జాహ్నవీతీరే హిమవంతం శిలోచ్చయం. ౧౫
ప్రదక్షిణం తతః కృత్వా సిద్ధాశ్రమ మనుత్తమమ్,"

అను రామాయణభాగ మించుక విమర్శింపఁదగినది. అందొక నీతి గలదు. మన మద్దానిని గ్రహింపవలయును. సర్వస్థలముల యందును దేవతలు గలరు.

"యే వృక్షేషు సస్పింజరా నీలగ్రీవా విలోహితాః,
యే భూతానామధిపతయో విశిఖాసః కపర్దినః."

అని శ్రుతియందుఁ గలదు. విశ్వామిత్రుఁడు చిరకాలము సిద్ధాశ్రమమునఁ దపస్సొనరించెను. సి ంచెను. ఎట్లు? తపఃఫలమగు పరాత్పరుఁడు తనవశమున నుండెను. ఇంతకంటెఁ దపఃఫల మేమి కావలయును? కావున నికఁ దా నీమానవసంసర్గము మాను కొని హిమాలయమున నేకాంతముగా నుండ నిశ్చయించు

కొనియెను. అట్టియాశ్రమమునఁ జాలకాలము తానున్నందున నందుఁగలదేవతలు తపోవిఘ్నములు గలుగకయుండఁ గాపాడెను. అట్టి దేవతలకుఁ గృతజ్ఞత చూపవలయునుగదా. కావునఁ గౌశికుఁడు దేవతలారా! యని సంబోధించి మీకు భగవ ర్శనము కలిగినదికదా. ఇంకను మేలుగలుగుఁగాక యని ప్రా ంచి నేను వెళ్లుచున్నాఁడను. మీ చెంతనున్నందులకు సిద్ధుఁడనైతిని. కాన నిఁక సెలవిండు. అని ప్రా ంచెను. అంతియగాక యిఁక హిమాలయమున గంగోత్తరతీరమున నుండఁదలంచితిననియుం దెల్పెను దీనికే కృతజ్ఞత యనిపేరు. ఇదియే మానవుని నుత్తమ స్థితికిఁ దెచ్చుట కూతకొమ్మ. ఇదొక్కటి లేకుండినఁ దక్కిన సుగుణములన్నియు వ్య ములగు నవలయు. ఈగుణ మొక్కటియే యుండినఁ జాలును. మానవులు ముఖ్యముగా నభసింపఁదగిన దొక్కటియే. భగవత్స రూపము దీనిని భావింపవలయును. కృతఘ్నత యన్నింటికంటె దుర్గుణము. దానికిఁ బ్రాయశ్చి_మే లేదు.

"బ్రహ్మఘ్నే చ సురాపానే చోరే భగ్నవ్రతే తథా,
నిష్కృతిర్విహితా లోకే కృతఘ్నే నాస్తి నిష్కృతిః."

అన్నసూక్తి యందు తెలెంగినదియేకదా. కావున మానవుఁడు కృతఘ్నుఁడు కారాదు. కృతఘ్నతయే పాపస రూపము. కృతజ్ఞతయే ధర్మస రూపము. ధర్మమే భగవత్స రూపము. భగవత్స్వరూపమును జక్కఁగా నారాధించుట యనఁగాఁ గృతజ్ఞతాదభగవత్స రూపముల నెఱుంగుట యనియే య ము. కావునఁ గౌశికముని వనదేవతల నాహ్వానించి వారికి మేలు గలుగవలయునని పరాత్పరుం బ్రా ంచి పయనము సాగించెను.

మనముకూడఁ గృతజ్ఞులముగా నుండవలయు ననునీతి నీకథ నుండి గ్రహించి యుపకర్తలయెడ సద్భావము కలిగియుండ వలయును.

"మృగపక్షిగణాశ్చైవ సిద్ధాశ్రమనివాసినః,
అనుజగ్ముర్మహాత్మానం విశ్వామిత్రం మహామునిం. ౧౮
నివర్తయామాస తతః పక్షిసంఘాన్మృగానపి."

అను నీమూలమునఁ గలభావ మేమని యెఱుంగవలయును.

కౌశికుఁ డాసిద్ధాశ్రమమునఁ జిరకాలము నివసించి తపస్సొనరించెను. హరిణములను బెంచుట పక్షులఁ గాపాడుట మునులయలవాటులు.

"తదంకశయ్యాచ్యుతనాభినాళా కచ్చిన్మృగీణామనఘా ప్రసూతిః."

అని కాళిదాసమహాకవి వచించెను.

"ఆనందాశ్రుకణాన్ పిబంతి శకునా నిశ్శంకమంకేశయాః."

అని భర్తృహరి తెలిపెను. ఈరెండుదాహరణములు మునుల యలవాటులను స్పష్టపఱచెడిని. పక్షులను స్పృశింపరాదను వారును గొందఱు కలరు కాని మునులమానసములు పక్షులఁ బ్రేమించుచుండును. వానిని స్పృశించినంతనే తమ సుకృత మంతయు నశించునన్న తుచ్ఛమతి వారికి నుండదు.

"నవా అరే జాయాయై కామాయ జాయా ప్రియా భవ
త్యాత్మనస్తు కామాయజాయా ప్రియా భవతి నవాఅరేపత్యుః
కామాయ పతిః ప్రియో భవత్యాత్మనస్తు కామాయ పతిః ప్రియో
భవతి........నహి అరే దేవానాం కామాయ దేవాః
ప్రియాభవంత్యాత్మనస్తు కామాయ దేవాః ప్రియా భవంతి."

బృహదారణ్యకము.

ఈశ్రుతితాత్పర్య మేమనఁగా జ్ఞాని ప్రతివస్తువునందుఁగల యాత్మయొక్కఁడనుబుద్ధి గలవాఁడుగ నుండుటంబట్టి యెల్ల భూతముల నాతఁడు ప్రేమించుననునదియే. అట్టిబుద్ధి యెవారికి లేదో వారలకే శత్రుత్వము కొన్నిఁటియం దుండును. ఈ యర్థమునే గీతాశాస్త్రమునందు శ్రీహరి తెలిపెను.

"యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి." అని

కౌశికునిబుద్ధి సర్వమునం దీశ్వరకళను జూచునది. కావున మృగములు పక్షులాదులును నివర్ని ప్రేమించెను. మనము నిర్మల ప్రేమను గనఁబఱిచిన నదియు నట్లే మనలఁ బ్రేమించును. కావున నాముని ప్రయాణము కాఁగా నావనమునఁ గల మృగములు పక్షులాతని వెన్నాడిపోయెను. ఈచోట వాల్మీకిమహాకవి "మహాత్మానమ్" అన్నవిశేషణము ప్రయోగించెను. మహాత్ముఁడనఁగా మూరెడుపొడవుగల యాత్మగలవాఁడని యర్థము కాదు. సర్వత్ర భగవంతు నేకరూపముగాఁ గాంచఁజాలువాఁడనియే.

"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. ౨౯
ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున,
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః." ౩౨. గీత ౬ అ.

అను నీశ్రీహరివాక్యములు పైభావమును సిద్ధాంతముచేయుచున్నవికదా. స్నేహంబుపెంపునఁ దన్ను వెన్నంటవచ్చుచున్న యామృగపక్షులను ముని బుజ్జగించి వెనుకకు మరలునట్లు చేసెను. కావున భూతములెల్ల మనలఁ బ్రేమించునట్లు మనము ప్రవర్తింపవలయును. అనఁగా భూతదయగలవారలము

కావలయుననియు నదియే యుపనిషదభిప్రాయమనియు గ్రహింప వలయును. భూతదయ జ్ఞానికిఁ బ్రధానగుణము. అది లేనిచో జ్ఞాని యజ్ఞానియే యగును. జ్ఞానమునుగుఱించిన యుపన్యాసము పనికిరాదు. సానుభవమున నాజ్ఞానము గలిగియుండ వలయు. అపుడే దానిఫలము కనఁబడును. వాగ్రూపజ్ఞానము దాంభికులలక్షణము. దాని నభ్యసింపరాదు. ఇట్టు లిప్పట్టున మనము గ్రహించి మృగములు పక్షులు మనయెడ భయము మాని ప్రవర్తించునట్లు మనము వర్తింపవలయును. ఇదియే పరీక్ష. మనలఁ గాంచి పక్షులు పాఱిపోవునెడల మనకు సమదర్శనత మలవడలేదని గ్రహించి దానికై ప్రయత్నింపవలయును. ఇఁకఁ దరువాతికథకు మరలుదము.

## కుశకుశనాభులచరిత్రము.

* రామచంద్రా! వినుము. బ్రహ్మపుత్త్రులలోఁ గుశుఁ డనువాఁ డుండెను. ఆతఁడు మహాతపస్సంపన్నుఁడు. సర దావ్రతముల నాచరించుచు ధర్మవేత్తయై సాధువుల నారాధించుచుండెను. ఆతనిభార్య వైదర్భి. కుశాంబుఁడు, కుశనాభుఁడు, ఆధూర్తరజసుఁడు, వసువు ననునలువురుకొడుకు లాదంపతులకుం గలిగిరి. వారెల్ల గుణవంతులైరి. అంతఁ గుశుఁడు క్షత్త్రియజాతికిఁ గర్తవ్యమగు ప్రజాపాలనముచేయఁ గోరి యుత్సాహాదిగుణముల వెలయుకొడుకులం గాంచి తనయులారా! ప్రజాపాలన మొనరించి సమ్యగా ధర్మమును సంపాదింపుఁడు అని యానతీయ నాకుమారులు నలుగురు పితృనాజ్ఞం దలలందాల్చి నాలుగుపట్టనముల నిర్మింపఁబూనిరి.

* ఈభాగము ముప్పదిరెండవసర్గమునుండి గ్రహింపఁబడినది.

అందు మహాతేజుఁడగు కుశాంబుఁడు కౌశాంబి యను నగరమును నిర్మించెను. కుశనాభుఁడు మహోదయపురంబును, అధూర్తరజసుఁడు ధర్మారణ్యపట్టనమును, వసువు గిరివ్రజపుట భేదనమును నిర్మించిరి. శోణనదీతీరమునఁగల యీభూభాగ మావసుభూపాలునిదే. దీనిచుట్టును ఐదుకొండలు న్నవి. మాగధి యనుపేరుగల యీనది మగధదేశమునకు వచ్చి యీ పర్వతపంచకము నంతరమున సుమహారమువలె నగపడుచున్నది. ఈశోణనదియు నావసురాజునకుఁ జేరినదియే. ఈనది ప్రాక్కున నుండి ప్రతీచికిం బాఱుచున్నది. సస్యసమృద్ధి యీపరిసరమునఁ గలిగియుండును. రాజర్షి యగుకుశనాభుఁడు ఘృతాచి యనఁ బరఁగు నచ్చరమిన్న వరించి సౌందర్యమున నలరుకన్నియల నూరుగురం గాంచెను. ఆకన్నియలు సకలాభరణాభూషితాంగములఁగన్నులపండువు చేయుచువచ్చి యుద్యానమునఁ దిరుగుచు నాడుచుఁ బాడుచు వీణియలమీటుచు నుండిరి. నిర్జరమగు జవనమునఁ దేలునాకన్నియలఁ గాంచి వాయుదేవుఁడు కామించి యోకన్నియలారా! మీపై నాకెంతయుఁ బ్రేమము కలిగినది. కాని మీరెల్ల నాకు భార్యలు గండు. నాసంబంధమున మీకు దీర్ఘాయువు కలుగును. జవన మెడఁబాయక నెలకొనును. మానవులయం దీరెండును క్షణభంగురములు గదా. కాన నన్నుఁ బెండ్లియాడుఁడనియె.

తాఁజేయఁబూనినకార్యము నిర్విఘ్నముగా సాగింపఁ గల యావాయువుపలుకుల విని వారెల్లఁ బరిహసించి దేవోత్తమా! సర్వభూతములయందును నీవు ప్రాణరూపమునఁ జరించువాఁడవు, నీప్రభావమును మే మెఱుఁగుదుము. మమ్మేల

యవమానింతువు, మేము కుశనాభుని యాత్మజలముసుమా. కావున నిన్ను నీకుఁ బ్రభువగు దేవేంద్రుని గూడ నధికార ములనుండి తొలఁగింపఁజాలుదుము. శపించిన తపోధనము వ్యయమగునని యూరకయున్నారము. నీకుఁ దొడరిన యీ దుర్బుద్ధి మాతండ్రి యెఱింగెనేని బ్రదుకఁజాలవు. మాతండ్రి కాగ్రహముగలుగకయుండ వర్తింపుము. మాతండ్రి యెవరి కిచ్చిన వారికి భార లమగుదుము. మాతండ్రి ధర్మజ్ఞుఁడు. కాన నాతఁ డంగీకరించువరునికై వేచియున్నారము. మాకుఁ దండ్రియే ప్రభువు పరదైవమునగును. కావున నతఁడే మాకు భర్తను సంపాదింపనధికారి అంతియకాని మేమే వరింపము. అనుటయు వాయుదేవుఁడు భరింపరానికోపమునూని సమర్థుం డగుట వారి యవయవములఁ బ్రవేశించి పొట్టగుజ్జులగునట్లు గావించెను. వారట్లు రూపుచెడి యింటికింబోయి సిగ్గుపెంపున వగపగ్గలమగుడు నేలంబడిరి. కుశనాభుఁ డాతెఱవలపాటుం గాంచి ప్రియపుత్త్రికలారా! ఏమి యీవిచారమునకుం గార ణము. ధర్మమును వీడి యిట్టిసాహసమును జూపినవాఁ డెవఁడు? మీకీకురూపములు గల్గఁజేసినవాఁ డెవఁడు ! తెలుపుఁడని ప్రశ్నించెను.

## బ్రహ్మదత్తుఁడు కుశనాభపుత్త్రికలం బెండ్లాడుట.

* తండ్రి యిట్లు తమ్ము నడుగఁగా వారు నమస్కరించి తమకు వాయునకు నైనవాగ్వాదమును వినిపించి తమకు వాటిల్లినదుర్గతిం దెలిపిరి. ఆమాటల కాకుశనాభుఁ డాగ్రహిం పక శాంతమూర్తికానఁ గుమారికలారా! లోకమున నోర్పు

---

* ఈభాగము ముప్పదిమూఁడవసర్గమునుండి గ్రహింపఁబడినది.

గలవారు తమ కపకారముచేసినవారియెడ క్షమచూపుదురు. మీరిపుడు మిగుల మంచికార మొనరించితిరి. దేవుఁడు ప్రేరేపించినను మనస్సుగలంగక మీరుండితిరి. అతఁ డపకారము చేసినను గోపమును బూనకుండితిరి. ఇవి పెద్దకార్యములుకావా. మీరెల్ల వంశోచితకృత్యమును నిరవర్తించితిరి. స్త్రీలకును బురుషులకు క్షమయే యలంకారము. క్షమను బూనుట కష్టము. అందును రూపము నైశ్వర్యము లోనగుగుణములుగల దేవతలపకారముచేసినతఱి నోర్పును గనఁబఱచుట మిక్కిలి కష్టము. మఱియు మీరెల్ల నొక్కరీతి నోర్పుగలవారలయి యుంటయు నంతకంటెఁ గష్టము దానయజ్ఞసత్యయశోధర్మములఁ గలుగు ఫలములెల్ల క్షమవలనను గలుగును. కాఁబట్టి క్షమయే దానము. అదియే యజ్ఞము, సత్యము, యశము, ధర్మము నగును భూమి యోర్పుగలదికావుననే చరాచరాత్మకప్రపంచమును భరించెను. అనిపలికి వారి నూఱడించి మంత్రులంగూడి యోజించి కులీనునకీయ నిశ్చయించెను

ఆకాలమున నిర్జితేంద్రియుఁడగు చూళి యనుముని వేదచోదితపద్ధతిని దపముచేయుచుండెను. ఊర్మిళయను గొమరితయగు సోమద యనునచ్చరమిన్న యామునికి శుశ్రూష లొనరించుచుండెను. రామభద్రా! నీకు మంగళమగుంగాక. ఆకన్నియ యాతని సేవించుచు నందే యుండెను. అమ్మునియు దానికి సంతోషించెను శుశ్రూషాతిశయము ఫలించుకాలము రాఁగా నమ్ముని దానింగాంచి నీశుశ్రూషలకుఁ గడుంగడు మెచ్చితిని. నీకు భద్రమగుంగాక. నీకుఁ బ్రియమేమి చేయుందగును? అనఁగా నాతన్వి నేర్పుకత్తియగాన మంచికంఠస్వరమున నోభార్యకో

త్తమా! బ్రహ్మవర్చస్సున నెల్లరమించినమేటివి. బ్రహ్మసమానుఁడవు. ఇట్టి నిన్ను బ్రాహ్మశక్తియుక్తుండగు తనయుని నాకిమ్మని వేఁడెదను. నేను పతిలేనిదానను. నీకు శుభంబగుఁగాక. నన్ను విధవనుగా నూహింపకుము. ఇంతదనుకఁ బురుషుని బరిగ్రహింపలేదు. ఇపుడు నేనొక్కనికి భార్యనుగాను. నైష్ఠికబ్రహ్మచారిణి నగుదును. నిన్ను శరణుగాంచితిని. కావునఁ దపశ్శక్తిచేఁ దనయు నొసంగుము. అని వేఁడెను. మునియు సుప్రసన్నుఁడై తనకు మానసపుత్త్రుఁడగు బ్రహ్మదత్తుని దాని కొసంగెను. ఆగంధర్వాంగన క్షత్త్రియజాత. కాఁబట్టి యాపుత్త్రుఁడు బ్రహ్మదత్తుఁడు రాజయ్యెను. తల్లివరుసనుబట్టి యాతఁడు క్షత్త్రియుఁడే యయ్యెను. ఆతఁడు మహాతేజస్వియు నయ్యె. కుశనాభుఁడు కన్యాప్రదానముంగూర్చి యాలోచించునపుడు బ్రహ్మదత్తుఁడు కాంపిల్యానగరమున దేవేంద్రుఁడు స్వర్గముననుండు రీతిని వసించియుండెను. కుశనాభుఁ డప్పుడు బ్రహ్మదత్తునకుఁ దనయలనీయ నిశ్చయించి యాతని రావించి కన్యాశతంబు నిచ్చి పెండ్లిచేసెను ఆతఁడు వారినెల్లఁ బాణిగ్రహణ మొనరించెను పెండ్లాడినంతనే వారికుబ్జాత్వము వీడిపోయెను. యథాపూర్వ లావణ్యము వారికబ్బెను. తండ్రియు వారలం గాంచి యానందించుచుండెను. బ్రహ్మదత్తుని దనపుత్త్రికలను బుత్తెక్కులను గుశనాభుఁడు కాంపిల్యపురికిం బంపెను. బ్రహ్మదత్తజననిసోమదయుఁ గోడండ్రను లాలించుచునుండెను.

మహాశయులారా! ఈభాగముల నెన్నియో విశేషములు గలవు. వానినుండి మన మెఱుంగఁదగునీతులు పెక్కులు గలవు. కొన్నింటిని విమర్శింతును. కుశనాభుఁడు ఘృతాచియను నచ్చర

యందుఁ గనాశతమును బడసెనుగదా. ఆకాలమున దేవ మర్త్య లోకములకు రాకపోకలుగలవు. ఎల్లరకుంగాదు. మానవు లలో యోగము నభ్యసించి వోమయానముచేయ నలవాటు పడినకొందఱకు. దేవాత్మాహ్వానాతులైన రాజులకుస్వర్గగమనము కలదని యూహింపజను. దేవతలకు సర్వలోకగమనము కలదు. అచ్చరమిన్నలు తఱచుగా మర్త్యలోకముననే యుండువారని తలంపవచ్చును. మానవలోకము పుణ్యభూమికదా. హిమాల యాదిపర్వతము లిందేకదా యున్నవి. విహారార్హ ప్రదేశములు దేవతలు కులపర్వతములేకదా. పూజింపఁదగు దేవాలయము లిం దేకదా యున్నవి. కావున మర్త్యలోకము స్వర్గలోకమునకు హృదయమువంటిది. రాజులకు నచ్చరలకు సంబంధముకలదని పురాణములనుండి తేలెడిని. మునులతపోభంగముచేయ నింద్రు నకుంగలసాధనము ముఖ్యముగా నచ్చరలగుంపే యనవచ్చును. వారిమూలముననే మానవలోకమున నృత్య గీతములు లభించె ననుట నిర్వివాదమని నాయాశయము. మహారణ్యములు మహో త్తరపర్వతములు దేవతల నాకర్షించును. ఇట్టివి కావుననే మన యార్యులవానిని బూజించుచుందురు. వనదేవత లందుందురు. పరమపావనవృక్షలతాప్రతతు లందుండును. తపోయోగ్యము లరణ్యములనుట కివియే కారణములు గానోపును.

పూర్వముద్యానములనిర్మించుట యుత్తమకార్యమని యెంచఁబడుచుండెనని తోఁచెడిని. నగరప్రాంతములయందేగాక యడవులలో నుద్యానములుగలవని పురాణములు తెల్పుచున్నవి. ఇప్పటివలె ఫలములులేనిచెట్లు, కుసుమములులేనిలతలు మున్ను లేవనవచ్చునుగాని మహర్షులుకూడ నాశ్రమమునకుఁ జుట్టు

నుద్యానముల నిర్మించుకొని యందుండువారనిమాత్రము మన మూహింప నవకాశము కలదు. మునులెల్ల సన్న్యాసులుకారు. గృహస్థులే యందుఁ దఱచుగా నుండిరి. మునిపత్నిపుత్రికలకు లతారోపణసంరక్షణములే కాలక్షేపమునకు సాధనములగు. శిష్యులును దత్కార్యనిరతులే. కావున నరణ్యములు నుద్యానములును దఱచుగాఁ బూరముండి జనుల కారోగ్యభాగ్యము నొసంగఁజాలువస్తువుల నొసంగుచుండెను. అందువలననే కృతజ్ఞతంగొని మనపూర్వులు వానిని భగవత్స్వరూపములనుగా భావించుచుండిరి. మనముకూడ వృక్షములను లతావిశేషములను బెంచుట వానివలనఁ గలుగునుపకారమునకుఁ గృతజ్ఞులమై యుండుట కలవాటుపడవలయును. అప్పుడే దీర్ఘాయుర్దాయము, ఆరోగ్యము కలుగును. పెద్దవృక్షములగా యు, లతలపూవులతావియు నారోగ్యము నొసంగునని పూర్వుల యాశయమని యిప్పటివృక్షలతాపరీక్షకులుకూడ నంగీకరించి యున్నారు. దేవతాపూజ కనుపేరున వృక్షశాఖలను ద్రెంచుట లతలను బాధచేయుట యనునవి క్రూరకార్యములు. దానఁ బూజాఫలము శూన్యమగును.

కుశనాభునికూఁతులు నూర్వురు సుందరీమణులని పేరుగాంచి యుద్యానమున విహరించుచు నాడుచుఁ బాడుచుండ వాయుదేవుఁ డవారిఁ గోరెనని యున్నది. వాయువనఁగా నిట మన మనుకొనుగాలి కాదనియు దాని కధిష్ఠానదేవత యనియు నెఱుంగఁదగును.

"బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి."

యన్నసూక్తి వ్యర్థముకాదు. ప్రమదామణులు విచ్చలవిడిగఁ దిరుగరాదనియు దానఁ జేటువాటిల్లుననియు మనవారు

చెప్పియే యున్నారు. దాని కిది యుదాహరణ మగునుగదా. వయసువతు లొంటరిపాటునఁ దిరుగరాదు. పురుషసహాయము లేక వారుండరాదు. దాన నెన్నియో యన ములు మూఁడును. అని స్మృతులు చెప్పుచున్నవి. వయసువచ్చినతరాత వివాహముచేయక విడిచినచోఁ వారికింగాక యితరులకుం గూడఁ జేటువాటిల్లు ననుట నిక్కము.

"అస్వతంత్రాః స్త్రియః కార్యాః పురుషైస్స్వైర్దివానిశం,
విషయేషు చ సజ్జంత్యః సంస్థాప్యా ఆత్మనో వశే. ౨
పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే,
రక్షంతి స్థవిరే పుత్రా న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి. ౩
కాలేఽదాతా పితా వాచ్యో వాచ్యశ్చానుపయన్పతిః,
మృతే భర్తరి పుత్రస్తు వాచ్యో మాతురరక్షితా. ౪
సూక్ష్మేభ్యోఽపి ప్రసంగేభ్యః స్త్రియో రక్ష్యా విశేషతః,
ద్వయోర్హి కులయోశ్శోకమావహేయురరక్షితాః." ౫ మను ౯ అధ్యా.

ఈప్రమాణములను దిలకించినచోఁ బూర్వు లీవిషయమున నెంతపరిశీలించి విషయములను గ్రహించిరో తెలియఁదగు.

వాయుదేవుఁడు తమ్ము వరింపఁగోరుచు దీర్ఘాయుర్దాయము నొసంగుదునని యాశపెట్టెను. మీ కీయౌవనము రషుగ నుండునట్లు చేసెదనని యు మాటయిచ్చెను. ఆకాంతామణులు సచ్ఛీలములుగలవారు. కావున నే

"ప్రభావజ్ఞాస్స తే సర్వాః కిమస్మానవమన్యసే,
కుశనాభసుతాస్సర్వాస్సమర్థాస్త్వాం సురోత్తమ,
స్థానాచ్చ్యావయితుం దేవం రక్షామస్తు తపోవయం. ౨౦
మా భూత్స కాలో దుర్మేధః పితరం సత్యవాదినం,

నాపమన్యస్వ ధర్మేణ స్వయంవరముపాస్మహే. ౨౧
పితా హి ప్రభురస్మాకం దైవతం పరమం హి సః,
యస్య నో దాస్యతి పితా స నో భర్తా భవిష్యతి." ౨౨

అని తమయభిప్రాయమును దెలుపంజాలిరి. ఈయభిప్రాయమే మనుస్మృతియందును గలదని పాఠకమహాశయు లెఱుంగఁగలరు. ఆకన్యకలకుఁ దండ్రియందును గులమర్యాదలయందును గల ప్రీతి తేటపడిమెఱుగదా. పెండిలియగువఱకుఁ దండ్రియే మాకెల్లఁ బ్రభువనిరి. పరమదైవ మాతఁడే యనిరి. ఆతండ్రి యెవరికి మమ్మొసంగునో యతఁడు మాకు భర్త యగునని ధైర్యమునఁ బలుకఁజాలిరి. దీనిసారమేమి? తండ్రిని బరమదైవముగా భావించి తనుమతిఁ బ్రవర్తిల్లువారలకు నెన్నియాపదలుకలిగినను దుద కవియన్నియుఁ దొలఁగి మేలుచేకూరును. అట్లుగాక తమయిష్టమునే ప్రధానముగా భావింతురేని రక్షించువస్తువంతరములేమి దిక్కులేక చెడుదురు. కావునఁ దండ్రిని భగవంతునిగా భావించినచో నాభావముచేతనే పరాత్పరుఁడు ప్రసన్నుఁడై వారలం గాపాడును. అనఁగాఁ దండ్రియే మాకుఁ బరమదైవత మనుభావనయే భగవంతుని నారాధించినట్లయె ననియు దాననే వారు కృతకృత్యులైరనియు సకలాపదలను బరాత్పరుఁడు తొలఁగించెననియు మన మెఱుంగవలయును. "దైవతం పరమం హి నః" అనఁగా "యో మాం పశ్యతి సర్వత్ర" అన్నగీతాశాస్త్రవాక్యము ననుసరించి పితృరూపమున భగవంతు నారాధించిరని సారము. ఈభావనయే యోగ మనఁబడును.

"సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే." ౩౧. గీత ౬ అధ్యా.

అను నీభగవదాక్రమము పై నిర్వ్రాసినయభిప్రాయమునే తెలుపు చున్నది. దృఢభావనయే యోగమగునుగదా. అట్టి దృఢభావన వారికిఁ గలుగుటంబట్టియే వాయుశాపముకూడ నిష్ఫల మాయె ను. వారిమనోష్టము చక్కఁగా నెఱవేఱెను. కావున నెవారుగాని భగవంతు నేరూపమున ధ్యానించిన నారూప మున నామహనీయుఁడు ప్రసన్నుఁడై వర మొసంగుననియు దృఢభావనయే యారాధనమనియు బాహ్య పూజ ప్రధానము కాదనియు మానసమున భగవంతునిపైఁగల దృఢవిశ్వాసమే ప్రధానమనియు మన మెఱుంగవలయును. ఈవిషయమునే యీకథ మనకుఁ దెలుపుచున్నది. ఈఘట్టమునఁ దెనుఁగు నిం చుక పరికింతము.

క. "కంజాయతాక్షు లీగతిఁ, గొంజక భాషింప మిగుల కోపంబుననా
కుంజరయానల మేనులు, భంజించెను లోనఁ జొచ్చి పవనుఁ డదయుఁడై.
క. కఱకుటొడల్ వంకనడల్, కుఱుచతొడల్ గలిగి మిగుల గోడుం గొనుచున్
మఱుగుజ్జు లగుచుఁ గడువడిఁ, బఱతెంచిరి తేఱవ లాత్మభవనంబులకున్."
అని వాల్మీకిరామాయణము.

"తాసాం తద్వచనం శ్రుత్వా వాయుః పరమకోపనః.
ప్రవిశ్య సర్వగాత్రాణి బభంజ భగవాన్ ప్రభుః. ౹౩
(అరత్నిమాత్రాకృతయో భగ్నదర్పా భయార్దితాః)
తాః కన్యా వాయునా భగ్నా వివిశుర్నృపతేర్గృహమ్,
ప్రాపతన్ భువి సంభ్రాన్తాస్సలజ్జాస్సాశ్రులోచనాః." ౹౪

అని మూలము. కొందఱు విమర్శకాగ్రేసరు లీయాంధ్రవాల్మీకి రామాయణమును యథామూలమని వాల్మీకిహృదయమే యిందుఁగలదని వ్యాపదములే లేవని వేనోళ్లఁ బొగడిరి. కాని "కఱకుటొడల్ వంకనడల్ కుఱుచతొడల్" ఏమిటివి? ఇదియే కాఁబోలు

వాల్మీకిహృదయము. క్రౌంజక కుంజరయానలు. ఇవి పాదపూరణ పరంపరలు కావు కాఁబోలు. పాపము! వారి కివి వాల్మికిహృదయములుగాఁ దోఁచినదే చాలును. "వివిశుర్న్రపతేర్గ్రృహమ్" అనిమూలముననుండఁగా "పఱతెంచిరి తెఱవలాత్మభవనంబులకుఁ" అని తెనుఁగునఁ గలదు వేఁటుపోయిరి కాఁబోలు.

సీ. వారలయవ...వవారంబులం జొచ్చి గుజ్జురూపంబులఁ గూడునట్లు
గాఁ జేసె;నప్పుడా కాంతలరత్నిమాత్రాంగముల్ గలిగి గర్వాతిరేక[యా...త్రి,
ము... మాని యతిభయంబునఁ గుంది పవమానకృతవామనత తమ కెంతో
నింపఁగాఁ గుశనాభు నిలుసేరి కన్నీరు కాలువలై పాఱఁగాఁ దపించి
తే. సిగ్గుఁ దత్తఱపాటును, జెంది భూమి
బడిరి..." అని యాంధ్రశ్రీమద్రామాయణము.

సాధుమతులు పరిశీలింతురుగాక. పక్షపాతప్రధానముగా విమర్శించువారలకు బదులిచ్చుట యంతనా య...ముగాకున్నను బె...లకుఁ దెలుపుకొనుటకే స్థాలీపులాకనా యమున వ్రాసితిని. కావున నాయీచాపలమును బె...లు క్షమింతురుగాక.

తండ్రికడ కరిగి వారు తమవృత్తాంతమును దెలిపెరి. కుశనాభుఁడు కోపగించుకొనక,

"క్షాంతం క్షమావతాం పుత్ర్యః కర్తవ్యం సుమహత్కృతం,
ఐకమత్యముపాగమ్య కులం చావేక్షితం మమ. ౬
అలంకారో హి నారీణాం క్షమా తు పురుషస్య వా,
దుష్కరం యచ్చ యత్క్షాంతం త్రిదశేషు విశేషతః. ౭
యాదృశీ వః క్షమా పుత్ర్యస్సర్వాసామవిశేషతః,
క్షమా దానం క్షమా యజ్ఞః క్షమా సత్యం హి పుత్రికాః. ౮
క్షమా యశః క్షమా ధర్మః క్షమయావిష్ఠితం జగత్."

అను నీభావమును దెలిపెను. ఇందుఁగలసారము నరయుదము.

ఓర్పుగలవారు తమ కితరు లపకారమునుజేసినయెడల వారిని క్షమించుటయే చేయవలసిన యుత్తమకార్యము. మీ రిపు డెంతో మంచిపనిచేసితిరి. దేవుఁడు కోరినను స్థిరమనస్సు గలవారలైతిరి. అపకార మాదేవుఁడుచేసినను గోప మూనరైతిరి. ఈరెండును మహాకార్యములుగదా. కులమునకుఁగల మర్యాదను గాపాడితిరి. అందఱు నేకమతిత నొందితిరి. క్షమయే పురుషుల కలంకారము. ఓర్పును గనఁబఱచుటయే కష్టము. దానము, యజ్ఞము, సత్యము, యశము, ధర్మము ననువానిమూలమున వచ్చుఫలములు క్షమవలనను గల్గును. అని రాజు దుహితలకు బోధించెను.

ప్రాయశః మానవు లన్నిధర్మముల నాచరింపఁజాలరు. ఏదియే నొకదానిం బ్రధానముగా నాచరించినం జాలును. తక్కినధర్మముల నాచరించినఁ గలుగుఫలము దీననే కల్గునని మన మెఱింగి యన్నింటిని జేయఁబూని తుదకు దేనిని జేయశక్యముగామి నన్నింటిని మానక శక్తికొలఁది నొక్కధర్మమునే యాశ్రయించి దానినే భగవంతునిగా భావించుచు సమాచరింపవలయును. ఆధర్మమే కాపాడును.

"ధృతి క్షమాదమోఽస్తేయం శౌచమింద్రియనిగ్రహః,
ధీర్విద్యాసత్యమక్రోధో దశకం ధర్మలక్షణమ్. ౯౨
దశలక్షణాని ధర్మస్య యే విప్రాస్సమధీయతే,
అధీత్య చానువర్తంతే తే యాంతి పరమాం గతిం. ౯౩
దశలక్షణకం ధర్మమనుతిష్ఠన్ సమాహితః,
వేదాంతం విధివచ్ఛ్రుత్వా సన్న్యసేదనృణో ద్విజః." ౯౪. మను ౬ అ.

ఈదశవిధధర్మముల నొక్కఁ డాచరింపఁజాలఁడనుట నిక్కము-

"అహింసా సత్యమక్రోధస్త్యాగశ్శాంతిరపైశునం
దయాభూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీరచాపలమ్. ౨
తేజఃక్షమాధృతిశ్శౌచమద్రోహో నాతిమానితా,
భవంతి సంపదం దైవీమభిజాతస్య భారత." 3 గీత ౧౬ అధ్యా.

అను శ్రీకృష్ణోక్తియు క్షమను బేర్కొనుచున్నది. మానవులకు క్షమకంటె సద్గుణము వేఱొకఁ డుండదు. సకలసద్గుణసారమే క్షమ యనవలయును. అదియుండిన భగవదనుగ్రహపాత్రుఁడు కావచ్చును. ఈపట్టుననుండి క్షమాగుణము ప్రధానమనియు నదియే కులగౌరవము నొసంగుననియు నదిగలవానికి శత్రువులే యుండరనియు నాతని భగవంతుఁ డనుగ్రహించుననియు నెఱింగి మన మద్దాని నేర్చుకొనవలయును.

చూళి యనుముని తపస్సానరించుచుండ నూర్మిళా పుత్రికయగు సోమదయను గంధర కనక యమ్మునికిఁ బరిచర్య చేయుచుండెను. పరితుష్టుఁడై యమ్ముని నేఁ జేయవలసినసాయ మేదని ప్రశ్నించెను.

"బ్రాహ్మేణ తపసా యుక్తం పుత్త్రమిచ్ఛామి ధార్మిక. ౧౬
అపతిశ్చాస్మి భద్రం తే భార్యా చాస్మి న కస్యచిత్,
బ్రాహ్మేణోపగతాయాశ్చ దాతుమర్హసి మే సుతం." ౧౭

అని యామె కోరెను. ఈఘట్టమున నొక్కనీతి కలదు. నైష్ఠిక బ్రహ్మచారిణిగనున్న నాకు బ్రహ్మజ్ఞానసంపన్నుఁ బుత్త్రు నొసంగుమా యని యాసోమద కోరెను. బ్రహ్మచర్యము పురుషులకుం బోలె స్త్రీలకుంగూడ నాకాలముననుండెను. అట్టివారిక సామాన్యస్త్రీ ధర్మము లన్వయింపవు. విజ్ఞానమే వారికిం బ్రధానము.

బ్రహ్మచర్యముకూడ నొకతపస్సేకదా. బ్రహ్మచారిణులని పేరు మాత్రమే పెట్టుకొనక తదుచితధర్మముల నాచరించుచున్న కాంతలకు ఋతమతిత దోషము లేదు. ఈసోమద గంధర్వాంగన కావున మానవధర్మములతోం బనియే లేదు. మానవులకుం గూడ సామాన్యధర్మము విశేషధర్మములచేం బ్రతిహతములగు.

"యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్."

అన్నశ్రుతివాక్యము భార్యయనుమతి యీయకున్న సన్న్యసింపరాదన్నసామాన్యశాస్త్రము నడంచును. కావున నైష్ఠికబ్రహ్మచారిణులున్నను వారియందీశాస్త్రము నన్వయింపరాదు. వయునాధారిణు లిరువురు నైష్ఠికబ్రహ్మచారిణులుగలరనుట సుప్రసిద్ధమేకదా. సత్ప్రవర్తనముగలిగి పరబ్రహ్మానుసంధాననిరతలగు స్త్రీరత్నము లిక్కాలమున లేకపోయిరిగదా యని మనము విచారింపవలసియున్నది.

"స్పృష్టమాత్రే తతః పాణౌ వికుబ్జా విగతజ్వరాః,
యుక్తాః పరమయా లక్ష్మ్యా బభుః కన్యాశతం తథా." ౨౩

బ్రహ్మదత్తుండు రాజు. ఆతండు కుశనాభునిపుత్త్రికలను బాణిగ్రహణముచేసినంతన వారికుబ్జత తొలంగెను. వారిమనోజ్వరము నశించెను. ఏల? అనునది యొకప్రశ్నము. వాయుదేవుండాగ్రహించి వారియంగముల నన్నింటిని గుజ్జెయించి వికృతిగనం జేసెను. బ్రహ్మదత్తుండు స్పృశించినంత యాబాధ తొలంగి యథాపూర్వలావణ్యాదులు వారి కలవడెను. ఇంచలిసార మేమనంగా భగవత్తేజ మెవారియం దెక్కుడుగనుండునో యవారి కన్నియు సుసాధ్యములే.

"బ్రాహ్మేణ తపసా యుక్తం పుత్త్రమిచ్ఛామి ధార్మిక."

అని సోమద యనుగంధర్వి చూళి మునిని గోరియుండెను. అట్టి పుత్త్రుఁడే బ్రహ్మదత్తుఁడు. కనుక నతని తేజస్సపారము. దానికిఁ బ్రతిహతము లేదు. కావున వాయువుశక్తి నశించెను.

"తదను క్షాత్త్రాత్తేజసఃపరం బ్రాహ్మమేవ మహో మహీయః."

అన్నమాట న్యాయమే యనక తప్పునా.

"తప ఇతి తపో నానశనాత్పరం యద్ధి పరం తపస్తద్దుర్ధర్షం,

తద్దురాధర్షం తస్మాత్తపసి రమంతే" తైత్తిరీయము ౮ ప్రశ్నము.

అన్నశ్రుతివాక్యము పరిశ భావమును దృఢపఱచుచున్నది. కావునఁ దపస్సువలన నూతమగు బ్రహ్మతేజము దేవతలను దదుత్పాదకునిఁగూడఁ గదలించును. కావునఁ దపస్సు చేసి బ్రహ్మ తేజము నార్జింపవలయును. అన్నింటికంటెఁ దపస్సధికము. దాని కంటె యోగము త్కృష్టము. యోగాభ్యాసము లేక మనస్సు స్థిరతఁ గాంచదు. అది కుదురకయున్నఁ దపస్సు ఫలింపదు. కావుననే

"తపస్విభ్యోఽధికో యోగీ"

అని భగవంతుఁ డుపదేశించెను. కావునఁ దొలుత యోగము నభ్యసించి మనోనియతి గలిగి తపస్సొనరించి బ్రహ్మతేజస్సు సంపాదింపవలయును. అట్టిమహనీయుల దర్శనమాత్త్రమున సర్వభూతములు కృతకృత్యతం గాంచును. వేదాంతవాక్యము లుచ్చరించుచు ధనము నార్జించిన నధఃపతనమే కాని వేఱుగతి వారికి లేదు. చచ్చుమాట లుపన్యసించిన లాభము లేదు. శ్రమించి తపస్సొనరింపవలయును. తపస్సనఁగా నుపాసనమని ముఖ్యము. మంత్త్రపురశ్చరణమని సారము. దానికి యోగాభ్యాసము ప్రధానము.

"యోగీ యుంజీత సతతమాత్మానం రహసి స్థితః,
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః." ౧౦ గీత ౬ అధ్యా:

అన్న భగవదుక్తిని దలంపుఁడు. మేము యోగులమని ఛాయా పటములుతీయించి ప్రకటించుటయే వారు యోగులుకారని తెలిపెడిని. ఏలయనఁగా "అపరిగ్రహః" ద్రవ్యాదులను యోగి పరిగ్రహింపరాదని శ్రీకృష్ణమూర్తి యాజ్ఞాపించెను. ధనార్జనమునకే పాటుపడువారియోగము ధనయోగమే యన వలయును. కావున నట్టిదురోగములఁ దలంపక భగవద్గీతోక్తిని బాటించి యపరిగ్రహుఁడై యోగము నభ్యసించుచుఁ బరి శుద్ధాంతఃకరణుండై యుపాసన మొనరించి భగవంతునికృపకుఁ బాత్రులు కావలయుననియే యీభాగమునుండి నేర్చుకొనఁదగిన విషయము. ఇఁకఁ దరువాతివృత్తాంతము నాలకింపుఁడు.

### విశ్వామిత్ర కౌశికీనదుల జన్మచరిత్రము.

* రామచంద్రా! బ్రహ్మదత్తుఁడు కుశనాభునితనయలం బెండ్లియాడి తనపురమునకుఁ బోయినపిదపఁ గుశనాభుఁడు పుత్త్రులం బడయంగోరి, దానికిం దగినయిష్టిని జేసెను. యజ్ఞమ య్యెడి సాగుచుండఁగా గుశుం డపు డాతనింగని కుమారా! సుగుణశాలి భవత్తుల్యుఁడు కొడుకు నీకుంగల్గును. వాఁడు గాధి యనుపేరం బరఁగు. వానిగాంచి నీవు శాశ్వతయశము నొందఁ గలవు. అని పలికి యతఁడు బ్రహ్మలోకమున కరిగెను. కుశుఁడే కుశనాభునితండ్రి. కొంతకాలమున కాతనికిఁ దనయుఁడు గాధి జన్మించెను. ఘృతాచియే యతనితల్లి. రఘునందనా! మహాధర్మా త్ముఁడగు నాగాధియే నాతండ్రి కుశవంశమునఁబుట్టినాఁడఁగావున

* ఇది ముప్పదినాల్గవసర్గమునుండి గ్రహింపఁబడినది.

గౌశికుఁడనైతిని. సత్యవతి నాజ్యేష్ఠసోదరి. సువ్రతయగునామె ఋచీకుని బెండ్లియాడెను. ఆమె సాధ్వీమతల్లి గావున శరీరము తోడ స్వర్గమునకుం బోయెను. అంతియగాక యామె కౌశికియను మహానదీరూపమున నున్నది. ఏలయందువో యీలోకులకు నైహికాముష్మికములు గలుగఁజేయంగోరి పావనసలిలములు గలిగిన మహానదియై హిమాలయము నాశ్రయించెను. ఆకౌశికి హిమాలయము నాశ్రయించినందున నేనును సోదరియందుఁగల వాత్సల్యముపెంపున నాకొండదండనే నెపుడును నివసింతును. ఆమె సత్యధర్మస్వరూపిణి యని నమ్ముము. నదులయం దామె వన్నెకెక్కెను. యాగముకొఱ కామెనువదలి సిద్ధాశ్రమమున కరుదెంచితిని. అందు నీతేజమునఁ గృతార్థుఁడనైతిని. మహాత్మా! ప్రసంగసంగతి నావంశము నుత్పత్తిని నాజన్మమును దెలిపితిని. నీవడిగిన యీదేశచరిత్రమును బోధించితిని. నే నీకథలు చెప్పుచుండఁగా రాత్రిలోఁ గొంత గతించెను. ఇఁక నిద్రఁ బొమ్ము. నీకు శుభము గలుగుంగాక. మేలుకొనియేయున్నఁ బ్రయాణమున కంతరాయము గలుగును. వృక్షములు పక్షులు గదలకయున్నవి. మృగపక్షులు హాయిగా నిదురించుచున్నవి. చంద్రోదయ మగుచున్నది. రేద్రిమ్మరులు తిరుగుచున్నవారు. అనఁగా నందున్నవారెల్ల విశ్వామిత్రునివంశమును దచ్చరిత్రమును మిగులం బొగడిరి. ఎల్లరు నిదురించిరి.

## గంగాపార్వతులజననచరిత్రము.

* తెల్లవాఱుటయుఁ గౌశికుఁడు రామా! చక్కఁగాఁ దెల్లవాఱెను. లెమ్ము. నీకు మేలుగలుగుంగాక. పయనము

---

*ఈవిషయము ముప్పదియైదవసర్గమునుండి సంగృహీతము.

సాగింతము. అనఁగానే లేచి రామమూర్తి సహోదరుఁడై
కాల్యకృత్యములందీర్చి మునీంద్రా! పావనజలములుగల యీ
శోణనదిజలము కొంచెమే కలిగి యిసుకదిన్నెలు గలిగియున్నది.
నౌక యక్కఱలేకయే దీని నుత్తరింపవచ్చును. ఏత్రోవన
దాఁటుదము? అని యడుగ గాధేయుఁ డీమార్గము మన
కనుకూలమని మహర్షులు తోడరాఁగా నదినిదాఁటి యందందుఁ
గనఁబడువనములను జూచుచుఁ బోయెను. మధ్యాహ్నము
కాఁగా వారెల్ల గంగానదిని దర్శించిరి ఆనదీవతంసము సకలజల
విహంగములు చెలఁగుచుండఁ గన్నులపండువు చేయ నందుండి
విడిదియేర్పఱచుకొని విధిగా స్నానము చేసి కృత్యములందీర్చిరి.
హోమశిష్టమగు పావనహవిస్సును భుజించి దానితీరమునఁ
గౌశికునిచుట్టును గూరుచుండిరి.

రామచంద్రుఁ డాగాధేయుం గని మునిచంద్రా! గంగా
నది మూఁడుత్రోవలఁ బ్రవహించెనని వింటిని. ఆవిధము మీ
వలన వినఁగోరెదను. ఈనది ముల్లోకముల నావరించి సముద్రు
నెట్లుచేరెనో తెలుపుమని ప్రశ్నించెను. మునియు నలరి
యిట్లుత్తరము చెప్పఁబూనెను. హిమవంతుఁడను పర్వతరాజు
గలఁడుకదా. ఆతని కిరువురుకొమరితలు గలరు. ఆయి ఱకుఁ దల్లి
మనోరమ. ఆమనోరమయం దాపర్వతరా జీగంగను జ్యే
దుహితగాఁ గనియెను. ఆతనికే యుమ యనునామె ద్వితీయ
పుత్రిక. దేవతలు స్వకార్యార్థము గంగాదేవి నిమ్మని వేఁడిరి.
త్రిలోకహితముఁ బొంటె గంగ నొసంగెను. ఆనది స్వేచ్ఛగాఁ
బ్రవర్తించునది. త్రిలోకపావని. రెండవకన్య యగు నుమ
తపస్సు చేయఁబూనెను. శివునుద్దేశించియే యావ్రత మూనెను.

ఆమెను మహేశ్వరునకు నిల్లాలుగా నిచ్చెను. గంగయును మఱియు నక్కసెల్లెండ్రు. మూఁడుమార్గములఁ బ్రవహించు గంగ మొదట నాకాశమునఁ బ్రవహించినకథ యిది. ఆమెయే స్వర్ణది, మందాకిని, లోకపావని యనియు నెఱుంగుము.

## పార్వతీచరిత్రము.

* ఆకథను విని మహాత్మా యని సంబోధించి యాశ్రామలక్ష్మణులు భూమియందును స్వర్గమునందును గంగకుఁ గలిగిన విఖ్యాతిని దెలుపుము. త్రిపథగ యనుపే రెట్లుగల్గెను? ఆమె చేసిన మహోపకారము లేవి? అని యడిగిరి. ముని యిట్లు బదులు చెప్పెను. మహానుభావుఁడగు శంకరుఁడు పార్వతిని బెండ్లియై సంతోషమున నుండెను. వారివిహారము శతవత్సరములుసాగెను. కాని కుమారోదయము కాదయ్యెను. బ్రహ్మాదు లీదంపతులకుఁ గలుగుమహాభూతమును భరింప నెవరు సమర్థులగుదురు? అని వెళ్లి శివునికడ కరిగి నమస్కరించి ప్రసన్నుఁడవుకమ్మని వేఁడిరి. శంకరా! నీతేజస్సంభూతుని లోకములు దాల్పఁజాలవు. కావున నీవు దేవింగూడి తపస్సుచేయుము. త్రిలోకక్షేమకరమగు నీరేతస్సు నీవే భరింపుము. అంతియు వదలకుము. అన నట్లే యగుంగాక యని మఱియు వారితో నిందుఁ గొంత స్థానచ్యుతింగాంచెను. కాన దానిని వదలుదు. అత్యుత్తమమగు దాని భరింపఁజాలువాఁ డెవ్వఁడు? అన వారు ప్రభూ! దాని భూమి ధరింపఁగలదనిరి అంత నీశ్వరుఁ డద్దానిని వదలఁగా నది భూమింగల పర్వతారణ్యముల వ్యాపించెను. దేవతలు వెళ్లి

* ఇది ముప్పదియాఱవసర్గమునుండి గృహీతము.

యగ్ని దేవుం గాంచి తొలుత నతఁడు భయంపడఁగా నెట్లో సమ్మతింపఁజేసి నీవు వాయువుంగూడి యీ రేతస్సునఁ బ్రవేశింపు మనఁగా నతఁ డట్లు చేయ నదియొక పర్వతమయ్యెను. శ్వేత వర్ణముగ నాకొండ వెలింగెను. పిదపఁ గాలపరిపాకవశమున నయ్యది శరవణమయ్యెను. అందుఁ గృత్తికాతనయుఁడు న సంభవుఁడు నగుకుమారుఁడు గలిగెను. దేవతలా దంపతుల సంతోషమునకుఁ గొంత భంగము గావించినందులకై వేఁడు కొనుచు వారిం బూజించిరి. కాని పార్వతీదేవి దేవతలం గాంచి నాసంతోషమును జెఱచితిరి. కాన దానికిం బ్రతిఫలం బనుభ వింపుఁడని జలములఁదీసికొని మీ కీపాపమువలన భార్యల యందు సంతానము కలుగదు. మీభార్యలు నేఁటినుండి వంధ్య లగుదురని శపించెను. భూమీ! నీ వొక్కరూపమునఁగాక నానావిధాకృతులుగలిగి బహురాజులకు భార్య వగుదువు. నీవు కొడుకులవలని సుఖము నొందకుండుదువు. అనియు శాపం బిచ్చెను.

దేవతలా శాపమును విని సిగ్గుపడి విన్ననై యుండు శంక రుఁడు తనలో దేవీశాపము మరల్పరాదు. వీరిదుఃఖము చూడఁ దరముకాదు. అని యూహించి దేవింగూడి వరుణపాలితదిక్కున కరిగి యచట హిమవదుత్తరపార్శ్వమునందు నొకశిఖరమునఁ దప స్సమాధి నుండెను. ఇదియే పార్వతీవృత్తాంతము. ఇఁక గంగా తరంగిణీమహత్త్వమును గుమారోత్పత్తియు సవిస్తరముగా నెఱింగించెదను. మీరిరువురు సావధానులరై వినుండని యిట్లు పలికెను.

## కుమారసంభవకథ.

* పూర్వము శివుఁ డిట్లు తపస్సు చేయుచుండుతఱి దేవతలు తమసేనాధిపతి తగినవాఁడు లేకుండుటం జేసి యతనిం బడయువాంఛమై బ్రహ్మకడ కరిగి మ్రొక్కి మీరు మున్ను మాకు శంకరుని సేనాధీశునిగా నుండఁ జేసితిరి. కాని యామహాదేవుఁ డందుల కంగీకరింపఁడు. భగవంతుఁడగు నాశంకరుఁ డిపుడు హిమాలయమునఁ దపస్సు చేయుచున్నవాఁడు. లోకహితార్థ మిపు డొనరింపఁదగు కార్యము నొనరింపుము. అని ప్రార్థింపఁగా బ్రహ్మయు నిపుడు శివుఁడు మహోగ్రతప స్సొనరించెడిని. కాన నాతని మరలింపఁ దరము కాదు. అనిపలికి మఱియు నిట్లనియె. పార్వతీదేవి దేవతలకు నిజపత్నులయందు సంతతికలుగదని శపించెను. కాన మీపత్నులయందు సంతతి మీకుం గలుగదు. ఆశాప మమోఘము. ఇఁక గతియేమనుదురేమో వినుఁడు. ఆకాశగంగయం దగ్ని యొకపుత్త్రునిం గాంచును. వాఁడు శత్త్రునిషూదనుఁ డగును. అతఁడే దేవసేనాపతియు నగును. గంగపైఁ బార్వతికిఁ గోపమురాదా యందురేమో గంగ యామెకుఁ దోఁబుట్టువుగాన నామెయందుఁగల ప్రీతిచేత నాతనయుం గైకొనును. సంశయ మొందకుఁడు.

అనుటయు దేవతలు ధన్యులమని తమ్ముం దలంచుకొనుచు సెలవుగొనిపోయి హిమాలయశిఖరమునకుం జని యత్తేజమునందు మూర్త్యంతరమున నిమిడియున్న యాదేవుని దర్శించి యగ్నిదేవా! గంగయందు నీవలరించిన తేజమును విడుము. అని యాజ్ఞాపించిరి. అతఁ డందుల కంగీకరించి గంగా

* ఇది బాలకాండమున ముప్పదియేడవసర్గమునుండి సంగ్రహీతము.

దేవికడ కరిగి దేవీ! నీవు గర్భమును దాల్పుము. ఇది దేవతా ప్రీతికరమగు కార్యము. అనిపలుకఁగా నాదివ్య స్త్రీరూపము దాల్చెను. అగ్ని దేవుఁడును దదీయలావణ్యాతిశయమునుగాంచి యచ్చెరువంది సాంగములనుండి యాశివరేతస్సును వదలెను. దానిచే నామె యొడలుతడిపెను. ఆతేజము తన్ను దహింపఁగా గంగ తత్తఱపడి యగ్నింగాంచి దేవా! దీని నేఁదాల్పనోపను. ఇది వృద్ధి నొందుటెట్లు? అనఁగా నాయగ్ని యిదె యీహిమవత్పర్వత పార్శ్వమున విడువుమనఁగా నామెయుఁ దద్రేతస్సును వదలెను. ఆశోణితరేతస్సులు బంగారువెండియు నయెను. అందలి కారమువలననే రాగియు నల్లనియినుమును బుట్టెను. అందలిమలము తగరము సీసము నయ్యెను. ఇట్లా రేతస్సు భూమింబడి నానాధాతువులుగా వ్యాపించెను. అంత నాశెల్లు వనమంతయు దానిప్రకాశమున బంగరుమయ మయ్యెను. ఆనాఁడు పుట్టినవిగాన బంగరు జాతరూపనామము గలదయ్యెను. ఆవనమందలి తృణతరులతాదులన్నియు హిరణ్మయము లయ్యెను. అంత నందుండి కుమారుఁడు సంభవించెను.

కుమారోదయముకాఁగా నింద్రాగ్ని ప్రభృతి దేవతలరుదెంచి కృత్తికలం బిలిచి మీరు పాలిచ్చి యీకుమారుని రక్షింపుఁడనఁగా వారలా దేవతలతో నీశిశువు మాకెల్లఁ బుత్త్రకుండయ్యెడుంగాక యని సమయము గావించుకొని యాశిశువుం బెంచిరి. దేవతలొక్కమాటఁగా నీకుమారుఁడు కార్తికేయుం డనం బ్రసిద్ధిగాంచునని పలుకఁగా నాకృత్తికలు హర్షించి యాపాపనిం గైకొని జలకమార్చుచు మఱియుఁ జేయందగిన యుపచారములనెల్ల నొనరించి పెంచిరి. గర్భస్రవ

మునుండి పడినవాఁడుగాన నతఁడు స్కందుఁడని యాహా య మిడిరి ఆఱుమోములు ధరించి యాయాఱుగుర స్తన్యము త్రాగి నందునషణ్ముఖుఁడయె. క్రమక్రమమున నాకుమారుఁడు పెరిగి శివవీర్యజనితుం డగుట దురా రవీర్యంబున రాక్షసులం జెండా డెను అంత నగ్ని ప్రముఖులగు దేవతలు తమసేనలకెల్ల నధి పతిగా నభిషేకించిరి. శ్రీరామా! గంగాచరిత్రము నడిగితివి ఈకుమారవృత్తాంతమే గంగాచరిత్రము నగు. కుమారస్వామి కెవ్వారు భక్తులగుదురో వా రాయుష్మంతులై పుత్రపౌత్ర సహితులై స్కందలోకమును బ్రాపింతురు.

మహాశయులారా! ఈభాగములనుండి యనేకనీతులను గ్రహింపవలసియుండును. ఇం దనేకరహస్య విషయములు కలవు. కుశనాభుఁడు యజ్ఞము చేయుచుండఁగాఁ జంద్రి బ్రహ్మలోకము నుండి వచ్చి

"పుత్ర తే సదృశః పుత్రో భవిష్యతి సుధార్మికః,
గాధిం ప్రాప్స్యసి తేన త్వం కీర్తిం లోకే చ శాశ్వతీమ్. 3
ఏవముక్త్వా కుశో రామ కుశనాభం మహీపతిం,
జగామాకాశమావిశ్య బ్రహ్మలోకం సనాతనమ్." 4

ఇట్లు పలికి తననివాసమున కరిగెను. మృతుఁ డగుకుశుఁడు బ్రహ్మలోకమునుండి వచ్చి వరమిచ్చి మరల శాశ తమగు బ్రహ్మస్థానమున కరిగె ననువిషయము విచారింపఁదగినదియే. ఎన్నియో సందియము లిందుఁగలవు. వానిం దడవక సమా ధానము వ్రాసెదను.

ప్రతికార్యమునకు సుకృతము దుష్కృతము తోడు పడును. దుష్కృతఫలము నెడఁబాసినఁగాని సుకృతఫలము

నొందు నవకాశములేదు. కర్మము మానవు నదృశ్య పాశముల బంధించి యాడించుచుండును.

"న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్,
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః. ౫ 3 అధ్యా.
కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన,
మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి. ४౭
యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ,
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే." ४౮. గీత. 2అ.

ఇందు మొదటి గీతావాక్యము పైయర్థమును దెలుపును. తక్కినవి కర్మముచేయుటకే యధికారముగాని ఫలములయం దధికారములేదు. యోగము నభ్యసించి కర్మముల నాచరింపవలయును. యోగమనఁగా సమత మేకదా యనుహితమును బోధించును. కావునఁ గర్మము గహనమని తేలును. అదృశ్య పాశములకుఁ దగులుకొనిన ప్రాణి స్వతంత్రుఁడనని కర్మము చేయును. అది ప్రాక్సుకృతసహాయము గలదగుచో సత్ఫలముల నొసంగును. ఆస్థితియం దాప్రాణి తనపౌరుషమున సమార్జించిన వానినిగా నాఫలములను దలంచును. అంతియకాని కర్మము బలవత్తరమని తలంపఁడు. దుష్కృతఫలములు నిక్లేయన్ని తలంపవలయును.

కుశనాభుఁడు పుత్త్రసంపత్ప్రతిబంధకమగు కర్మము నొనరించెను. దానిపరిణామకాలమున సత్కర్మానుష్ఠానమున నూహ కలుగును. అపుడు ప్రతిబంధనివృత్తికరకర్మము నొనరింపఁ బూనును. ఈయూహకలిగించునది యభిముఖమగు సత్కర్మమే. ఆకర్మమే భావనాబలము ననుసరించి యొక్కనిమూలమున

ఫలము గలుగఁజేయును. ఈనియమము ననుసరించి కుశనాభుని భావన పితృపాదులయం దుండుటంబట్టి కుశునిం బ్రోత్సహించి తోడితెచ్చి వరము నిప్పించెను. ఆ కాలమునకుఁ బ్రతిబంధ కర్మము తొలఁగవలసియుండెను. కావున నాసత్కర్మము ఫలమునీయఁ బూనెను.

మృతినొందినవా రెందుండురనునదియు నొక ప్రశ్నము. దానికి నిటఁ బ్రస క్తి కలదు. మృతుఁడుసుకృతవిశేషమున స్వర్గాది లోకములనొందును. సత లోకమనునదియొకటికలదని యందుఁ జేరినవారు మరలరని పురాణములు తెలుపును. దీనితత్త్వ మేమనఁగా నెందుఁగాని శాశ్వతమగులోక ముండదు. ఫలాభి సంధిగల సత్కర్మవిశేషములవలన నణిమాదిసిద్ధులు లభించును. ఆయువికలవారు నే చ గాఁ దిరుగఁగలరు. అట్టివారు చంద్రాది లోకములయందుఁ దిరుగుచుందురు వారలే కర్మము పురి కొలుప నరుదెంతురు. వారివరమునఫలముగలిగినట్లు తోఁచును. ఇదియే సిద్ధాంతము. బ్రహ్మలోకము లేదని భావముకాదు. అది శాశ్వతముకాదు. అనేక బ్రహ్మాండములలో నదియు నొక్కటి. అభిజిన్నక్షత్రమే యాలోకము. కొన్ని కర్మములను జేసినవారు కొన్ని లోకములలోఁ జరింతురు. కుశుఁ డుత్కృష్టసత్కర్మము చేసినకతన బ్రహ్మలోకమునకుఁబోవఁజాలెను. కుశనాభసత్కర్మ ప్రోత్సాహితుఁడై వచ్చి వరమిచ్చి పోయెను. ఆవర మాతని కర్మమే యాతనినోటఁజెప్పింప వెలువడినదని యెఱుంగవలయు. కావుననే భగవంతుఁడు శ్రీకృష్ణమూర్తి "గహనా కర్మణో గతిః" అని యర్జునునకు బోధించెను. అంతెయగాక "మాఫలేషు కదాచన"అనియు హెచ్చరించెను. కావునమనముకర్మసిద్ధాంత

మును జక్కఁగా నెఱుంగవలయును. అది యెఱింగినఁగాని యహంకారము నశింపదు. అదినశించినఁగాని మనస్సు నిర్మలము కాదు. అది లభించినఁగాని భక్తిమార్గము తోఁపదు. కావునఁ దొలుదొలుతఁ గర్మపద్ధతి నెఱుంగవలయును. ఈసిద్ధాంతము నెఱింగినచో నీలాటిశంక లుండవు. సరము చక్కఁగాఁ దోఁచును.

"పూర్వజా భగినీ చాపి మమ రాఘవ సువ్రతా,
నామ్నా సత్యవతీ నామ ఋచీకే ప్రతిపాదితా. ౭
సశరీరా గతా స్వర్గం భర్తారమనువర్తినీ,
కౌశికీ పరమోదారా ప్రవృత్తా చ మహానదీ. ౮
దివ్యా పుణ్యోదకా రమ్యా హిమవంతముపాశ్రితా,
లోకస్య హితకామార్థం ప్రవృత్తా భగినీ మమ. ౯
తతోఽహం హిమవత్పార్శ్వే వసామి నియతస్సుఖం,
భగిన్యాం స్నేహసంయుక్తః కౌశిక్యాం రఘునందన." ౧౦

అను నీభాగము నించుక తడవుదము. సత్యవతి విశ్వామిత్రుని జ్యేష్ఠసోదరి. ఋచీకమహామునిభార్య. పరశురాముని కులపూర్వజుఁడు ఋచీకముని. ఆమె భర్తంగూడి సశరీరముగా సురపురి కరిగెను. భూలోకమున మహానదియై ప్రవర్తిల్లెను. హిమాలయప్రాంతమున నానది కౌశికి యను ప్రఖ్యాతినొంది ప్రవహించును. లోకహితమును గోరియే యట్లు నదియైనది. భగినియందుఁగల ప్రీతిచేత విశ్వామిత్రుఁడు హిమవత్పార్శ్వముననే నిరంతరము తపస్సొనరించుచుండును. అను నీకథ విన్నంతనే యద్భుతముగాఁ దోఁపకపోవదు. దీనితత్త్వ మీలాగున గ్రహించిన నట్టిశంకల కవకాశము గల్గదు.

మహాత్ములు నిరంతరము పరోపకారమే తపస్సుగా భావింతురు. పెక్కండ్రకు నా సత్కార్యము చేయుచు నుండు టయే యిష్టముగా నుండును ఉపకారము చేయువారలలో నదులు ప్రధానములు. ప్రపంచజీవనమున కాధారములు నదులే. కావుననే నదీస్నానము ముఖ్యమందురు. ఏల? పరమ పావనపరోపకార గుణవంతుల సంసర్గము మంచిదిగదా. అందు వలన నట్టిగుణముగల నదులజలము సోకుట మంచిదనియే భావము. మలనిర్మోచనార్థమేమైన నేజలమైన నొక్కటియే. అట్లుగాక మలనిర్మోచనమునకన్న సాధుసంగతి సంసారమల ముక్తికిఁ గారణమన్న యభిప్రాయము చేత నదీజలముల మునుం గుట విశేషఫలదమని భావించి పెద్దలు తీర్థోదకము మహా పవిత్రమనిరి.

ఈనియమము ననుసరించియే కొన్ని నదులని కొన్ని మహా నదులని పేరుపొందినవి. ఏనదివలన లోకమునకు విశేషోపకారము గలదో యది యుత్తమోత్తమ మగును. అందును గొన్ని ప్రధానస్థానము నాక్రమించెను. అవి పండ్రెండుగాఁ బరిగణింపఁ బడియెను. వానియందే లేట నొకవిశేషము కలదనియు, నది యీకాలముననే యనియు జ్యోతిశ్శాస్త్రము తెలుపుచున్నది. దీనిసార మేమనఁగా ప్రతిఫలమును గోరక తనవలన మేలు జనులు పొందవలయు ననువాంఛ ప్రధానము. అదిగలవారు మహా ములు. సర్వతపస్సులు పరోపకారమునకు సమానము లగును. అనఁగాఁ దపస్సారము పరోపకారము సమానముగాఁ దూఁగునని గ్రహింపవలయును. వృక్షములు నదులు పరోప కారమునకు నుదాహరణములు. మానవుఁ డవ్వాని నుదాహర

ణములుగాఁ గైకొని ఫలాభిసంధిరహితముగా సత్కర్మములఁ బరోపకారా మొనరింపవలయునని యెఱింగి యట్లు చేయవలయును. ఈవిషయము నెఱింగించుటకే శ్రీరామమూర్తి ప్రశ్నించెను. భగవదభిప్రాయ మెఱింగి విశ్వామిత్రుఁడు పరోపకారమునకే తనతపస్సునంతయు దారవోసినమహాత్ముఁడు కావున నడుగకపోయినను శ్రీరామకృతప్రశ్నసార మిదియే యని నమ్మి తనకుటుంబగాథను చెప్పెను. మహాత్ములహితబోధము లిట్టివిగనే యుండునని మనము విశ్వసించి యారీతి నభ్యసింపవలయును.

కౌశికీనదిగా నున్నసత్యవతి ప్రపంచమునకు మహోపకారము చేయఁబూని భర్తృనాజ్ఞ నొంది హిమాలయప్రాంతమున నున్న జలసమృద్ధి సరదా గలిగియుండునని తలంచి నదీరూపమున నందుండెను. నదికి మూలకారణ మేదియని యెఱింగినముని విశ్వామిత్రుఁడు గాన సౌభ్రాతృత ముపెంపున నానది చెంతనుండి తపస్సుచేయుచుండును. నదీప్రాంతమునఁ గొందఱకు నది స్త్రీరూపమునఁ గనంబడుట కలదు. ప్రాణసంబంధ మేదియో వారలకు నుండుటంబట్టియే యట్లగపడుట యని మన మెఱుంగవలయును. కొన్ని వృక్షముల క్రిందఁ గూరుచున్న వారిలోఁ గొందఱకే రోగశాంతి యౌషధములేకయే కలుగును. ఏల? అనఁగా నావృక్షముగనున్న ప్రాణికి నీరోగికిఁ బూర సంబంధముకలదు. కావున నావృక్షచ్ఛాయ యాతనికే మిక్కిలి యుపకారముచేయును. ఒక్కయుదాహరణముఁ జూడుఁడు. ఇరువురు కలహించుచుందురు. మన మందుఁ గూరుచుండి యా బాహుయుద్ధమును జూచుచుందుము. ఆయిరువురును మనకుఁ

గ్రొత్తవారే. వారిలో నొక్కఁడు గెలుపొందవలయునని కొంద
ఱూహింతురు. వా రూహించినవాఁ డోడినచో వారి కించుక
పరితాపము కలుగును. రెండవవాఁడు గెలువవలయునని మఱి
కొందఱు కోరుదురు. ఆతఁ డపజయమునొందినచో నీకోరిన
వారలకు మనఃకష్టముగలుగును. ఏల? అనఁగాఁ దొలిజన్మమున
నందొక్కనితో సంబంధమందుఁ గూరుచున్న మనలోఁ గొంద
ఱకుఁ గలదు. ఇంక నొక్కనితో మఱికొందఱకు సంబంధము
కలదు. ఆకారణముననే వారిరువురుఁ గ్రొత్తవారైనను జయా
పజయము లొందిన మనకు లాభనష్టములు లేకుండినను హర్ష
సంతాపములు గలుగుచునే యుండును. ఇది యనుభవసి మే.
కావునఁ బ్రాక్కర్మగతుల నెఱుంగవలయును. మనలోఁ గొందఱ
కీహర్ష సంతాపము లుండవు. ఎవ రు గెల్చినను ఓడినను వారికి
సంబంధ ముండదు. ఏల? వారికి వారిలో నొక్కనితోడంగూడ
సంబంధములేదని యెఱుంగవలయును. ఈయనుభవమే మనకుఁ
బ్రాక్కర్మగతి నెఱిఁగించుచున్నది. ఈవిషయ మసత మని
యెవ ఁ డనఁజాలఁడు. ఎల్లరకు నిది యనుభవసి మే. కాని కర్మ
గతి యిట్టిదికదా యనిమాత్రము మన మూహింపము. అదియే
మనకుం గలయజ్ఞానము. ఇప్పట్టున నీగాథ మనకుఁ గర్మసిద్ధాంత
మును బోధించినది. దీనిని మనము చక్కఁగాఁబరికింపవలయును.
మనస్సున నీసిద్ధాంతము నాటినయెడల నీగాథ విచిత్రమనికాని,
యసంగతముగా నున్నదనికాని తోఁపదు.

"ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః,
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతం." ౧౫ గీత ౪ అ.

అన్న శ్రీకృష్ణపరమాత్మోపదేశము కర్మమర్మము చేయఁదగి నదని బోధించును. దానిగతి దురవగాహమని "గహనా కర్మణోగతిః" అన్న హరివాక్యము బోధించును. ఇందలి కర్మసిద్ధాంతమును మన మెఱుంగుటయేకాక పరోపకారమే సకలతపఃఫలసారమని యెఱింగి సర విధముల నద్దాని నభ్యసింపవలయును. అదియే భగవంతునిపాదారవిందములచెంతకుఁ దీసికొనిపోవు సన్మార్గము. శక్తి ననురూపముగా నన్న నీతిని మఱువరాదు. మనవలన నీపని యగునా యని భయంపడరాదు. మనకు శక్తి ననుసరించియే యుపకారము చేయవలయును. ప్రతిష్ఠామాత్రకార్యము చేయరాదు. అది వ్యర్థమగును. శక్తి గలిగి యదియే భగవదారాధనమని భావించి భూతదయాది సద్గుణములుగలిగి చేతనైనయంత యుపకారము చేసినచో నాపరమకారుణికోత్తముఁడు మనలఁ బ్రేమించును. ఇదియే యిందుఁగల సారము.

"నిష్పందా స్తరవస్సర్వే నిలీనా మృగపక్షిణః,
నైశేన తమసా వ్యాప్తా దిశశ్చ రఘునందన." ౧౫

ఇందలివిశేష మేమనఁగా వృక్షములుకూడఁ బ్రాణికోటిలోఁ జేరినవని మనవలెనే వానికిఁ గర్మములు కలవని వానిని బాధించుట మహాపాపకార్యమని యెఱుంగుటయే.

"అంతస్సంజ్ఞా భవం త్యేతే సుఖదుఃఖసమన్వితాః."

అన్న ప్రాక్తనోక్తి యిందులకుఁ బ్రమాణము.

"హింసౌషధీనాం స్త్ర్యాజీవోఽభిచారో మూలకర్మ చ,
ఇంధనార్థమశుష్కాణాం ద్రుమాణా మవపాతనమ్. ఉ 3. మను ౧౧అధ్యా.

ఫలదానాం తు వృక్షాణాం ఛేదనే జప్యమృక్శతమ్,
గుల్మవల్లీలతానాం చ పుష్పితానాం చ వీరుధాం." ౧౪౨

మను ౧౧ అధ్యా.

ఈస్మృతియు వృక్షలతాచ్ఛేదనము హింసగాఁ దెలుపుచుఁ బ్రాయశ్చిత్తమును బోధించెడిని. ఎండిపోవనివృక్షముల నింధనార్థము ఛేదించుట యుపపాతకమని తెలుపుచున్నది. వృక్షములు నిదురించుచున్నవనియు సంధ్యగాఁగి పక్షులు శయనించుచున్నవని యీవాక్యము మనకు బోధించుచున్నది. వృక్షములకు నిద్ర గలదా యని యచ్చెరువుపడువారల కిప్పటిపరిశోధకుల యనుభవ ముపదేశకము కాఁగలదు. మానవులకువలెనే వృక్షములకు సకల కర్మములు గలవని పరిశోధకులు చాటుచున్నవారు. ఈ విషయమును మనపూర్వులు మున్నే తెలిపిరి. వానిని నమ్మనివారల కిహపరములు లేవనుట నిశ్చయము. ఇప్పటివారల పరిశోధనములనైన నమ్మి వీనినే మనవారు మున్నే తెల్పిరే యని యెఱింగిన నుత్తమమే. కావున వృక్షములను బూజించుట యవివేకమని భావింపక వాని కించుకయైన బాధగలుగనీయక వానిం జూచి మనముకూడఁ బరోపకారము నేర్చుకొని వానియెడల గురుబుద్ధిఁ గనఁబఱచుచు నుండవలయును.

గంగానది హిమాలయపుత్త్రిక. దేవతలు లోకహితమును గోరి యద్దాని నడిగిరి. హిమవంతుఁడా దేవతల కొసంగెను.

"దదౌ ధర్మేణ హిమవాం స్తనయాం లోకపావనీం,
స్వచ్ఛందపథగాం గంగాం త్రైలోక్యహితకామ్యయా." ౧౫

ఇంచలిసారము వినుఁడు. ఏనది యెచ్చోట నుదయించునో యది జనకస్థానము. కావున గంగానదికి హిమవత్పర్వతరాజ

తంత్రియయెను. పర తుఁ డనఁగా దాని యధిదేవతయని యము. అంతియకాని పాషాణవ్రాతము కాదు. ఆయభిప్రాయముచేతనే మనవారు పర తము పూజ్యమనిరి. ఏది లోకోపకారము చేయునో యది దేవతయని యార్యులసిద్ధాంతము. దానిని భగవంతునిగా భావించి పూజింపవలయునని వారియాశయము. దీనిని గాదనువారు జ్ఞానవంతులా యనియుఁ గొందఱందురు. ఆస్తికు లెవ రును గాదనరు. ఆస్తికాభాసులన్ననుగోదువయేమి? దేవతలు గంగను గొనిపోయిరనఁగా మూర్ధా ధస్సమభాగముల నానదిని బ్రవహింపఁజేసి దానివలని యుపయోగముల వారికిఁ గ ంచిరని భావము. ఈయ మునే "త్రైలోక్యహితకామ యా" అనువాక్యము తెలుపుచున్నది. స్వర్గమున జలము లేదనియా గంగను సికొనిపోవుట. కాదు కాదు. మనుష్యాములకుంగూడఁ బ్రవహింపఁజేసిరనియే దీనిభావమని కొంటఱనిరి. అదియుఁ గాదనరాదు. దేవత లెపుడు మానవులయోగక్షేమముల నరయువారలు. కావున నాగంగానదిని లోకమున వ్యాపింపఁజేసిరని దీనిసారము.

పార తి హిమవంతునకు రెండవకొమరిత. ఈమెచరిత్ర మీఘట్టమున గంగాచరిత్రము సంపూర్ణముగాఁ దెలుపుటకే ప్రసంగసంగతిగఁగాక యవసరమే యగుటఁ జెప్పఁబడినది. దీని నుండి తెలియఁదగినవిశేషములు పెక్కులు గలవు. సావధానులరై వినుండు.

"దృష్ట్వా చ స్పృహయా దేవీం మైథునాయోపచక్రమే.
శితికంఠస్య దేవస్య దివ్యం వర్షశతం గతమ్,
న చాపి తనయో రామ తస్యామాసీత్పరంతప."

అని మూలమునఁ గలదు. సతీదేవి యోగవిసృష్టదేహ కాఁగా శంకరుఁడు దక్షిణామూర్తియవతారముననుండి మరల నాసతీదేవి హిమవంతుని తనయగా నావిర్భవింప వివాహమాడెను. న్మాత్నవధువుగా నటించుచున్న యాసనాతనధర్మపత్ని యాప్సి తమెరింగి సంతోషాంబుధి నోలలాడింపఁబూనెను. ఆకాలము దేవమానమున నూఱువత్సరము లయ్యెను. కాని సంతానము కలుగలేదు. అనునీవిషయము పాఠకులకుఁ దొలుత జుగుప్సను గలిగింపకమానదు. అందుఁ గలత త్త్వ మెఱింగిన నాజుగుప్స మహానందముగా మాఱును. ఎట్లనఁగా నాలకింపుఁడు. మైథున మనఁగా

"ఇయమంబా జగద్ధాత్రీ పురుషోఽహం సదాశివః,
పంచపంచాత్మతృప్త్యర్థం మైథునం క్రియతే తరాం.
ఇతి మంత్రానుభావస్యేన్మథనా క్రియతే యది,
తావుభౌ పుణ్యకర్మాణౌ న దోషో విద్యతే తయోః."

అని బ్రహ్మాండపురాణోత్తరభాగమున లలితాఖండమునఁ జెప్పఁ బడినట్టిదే యని యెఱుంగవలయు. లోకాభివృద్ధికొఱకు మేమిరు వురము ప్రవర్తింతుము. ఇరువదియైదుతత్త్వముల తృప్తి కొఱకుగా మేము సంచరింతుము అను నీమంత్రము ననఁగా రహస్యము (తత్త్వమును) సదా భావించుచు నుండవలయును. ఆదంపతులే పుణ్యకర్ములు. ఏదోషము వారికిం గలుగదు. అనుదీనిసార మేమనఁగా "ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః" అన్నశ్రుతివాక్యము ననుసరించి యీ ప్రకృతిప్రతికృతిని గైకొని పురుషప్రతికృతిగ నున్న నేను ప్రవృత్తిమార్గమునఁ బ్రవేశించితిని. అన్నభావన యేదంప

తులమనస్సుల నిలుచునో వారే పుణ్యకర్ములు అన్న యీనియ
మము ననుసరించి పరమేశ్వరుఁడు నది త్రియుండునగు నాశంక
రుఁడు పార్వతీనామమునఁ బరఁగు ప్రకృతిం గూడి లోకప్రవృ
నంగీకరించెనని య ము. శంకరుఁడు సర దా మహర్షుల కుపనిష
దర్థముల నుపదేశించుచు నుండువాఁడు. సా భిన్నయగు ప్రకృ
తియే తనక దేహముగాఁ గనఁబడనుండు మహాత్ముఁడు. కావు
ననే య నారీశ రుఁ డనఁబరఁగెను. అట్టిశంకరుఁ డుపనిష
ష్టినిమాని లోకాచారప్రవృత్తినిగనుఁగొనఁబూనెనని భావము.
అనఁగా లోకప్రవృత్తి యెట్లున్నదని తలంచెనని సారము.
ఆకాల మత ల్పమైనను లోకవృష్టిం బరికింపఁగా శతసంవత్సర
ములుగాఁ దోఁచెను. సంతానము కలుగలేదనఁగాఁ ద దేకవృ
లోకమును బరికింపఁదగెయ్యెనని సారము. ఇట్లే మనము గ్ర
హింపకపోయినచో విష్ణువక్షస్థలాలయ యగు లక్ష్మినిగుఱిం
చియు, బ్రహ్మాముఖవర్తినియగు శారదనుగూర్చియు విపరీత
ముగా భావింపవలసివచ్చును. లక్ష్మీదేవి విష్ణుమూర్తిభావము
నెఱింగి ప్రవర్తించుననియు, శారద బ్రహ్మావాగ్రూపమునఁ బ్ర
వర్తించుననియు నెఱుంగందగు. ఈముగ్గురును మహాప్రకృతి
యొక్కఛాయలు. ఈమూవురుపురుషులును బరమపురుషుని
ఛాయలు. కావ్యా మా ప్రకృతిపూరుషులు రూపములు ధరిం
చిరనిభావము. ఇదియే మన మెఱుంగఁదగినది. లక్ష్మి వక్షమున
నుండు ననఁగా విష్ణువు గుండియలప్పైఁ గూరుచున్నదనియు
నవస తిబ్రహ్మాముఖముల నున్నదనఁగా నొకముఖమునఁ గాళ్లూని
యొకమోమునఁ జేతులుంచి వేఱొక్కవదనమున వీఁపు [illegible]
యింకొక్కముఖమున శిరస్సునిచి పరుండుననియుఁ, బా[illegible]

శంకరుని సగము దేహమున నున్నదనఁగా నొకచేయి యొక కాలు. ఒక్కకన్ను ననురీతిగాఁ బంచుకొనియున్న దనియు మనము తలంచినచో నంతకంటెఁ దెలివితక్కువ వేఱుగ నుండదు. పురాణార్థముల నీలాగు గ్రహింపరాదు. పైరీతిగా మనము భావించినచో నాముప్పురు పతివ్రతలగుదురా? పూజ్యలగుదురా? ఉపాస్యలగుదురా? అట్టివారికరుణం గోరఁదగియుండునా? ఇందేదియు నుండదు. కావున నిన్నిశాస్త్రము లిన్ని పురాణము లిన్ని యితిహాసములును పైరీతిగా మన మనుగ్రహించిన నసంగతములనవలసివచ్చును. ఇంతయేల. సకలశ్రుతులు వ్యర్థము లనవలసివచ్చును ఇట్టి దుష్టా కల్పనలకంటె మనము చక్కనియర్థము గ్రహింపఁజాలకపోయితిమని తలంచుకొన్న నొక్కబాధయు నుండదు. అల్పబుద్ధులమై వేదశాస్త్ర ప్రముఖముల దూషింపరాదు.

ఇట్లు కొంతకాల మాపరమేశ్వరుఁడు లోకప్రవృత్తిని బరిశీలించుచుండఁగా దేవత లీవిధ మెఱుంగక కేవల స్వార్థపరులై బ్రహ్మకడకుంబోయి శంకరునకుఁ గలిగినతనయునివలననే కడుమూడకయుండఁజేయఁ బ్రార్థించిరి. బ్రహ్మను ముందిడుకొని శంకరుకడ కరిగి నీవీర్యమును నీవే ధరింపుము. వదలకుమని ప్రార్థించిరి. అట్లేకానిండు. అనిశంకరుఁ డనియెను. ఇంచుక భాగమందు సానచ్యుతింగాంచెను. దానిని భూమి ధరించుఁగాకయన దేవత లంగీకరించిరి. అను నీభాగమును బెంచివ్రాయక యించుక వ్రాసెదను.

జితేంద్రియులని యూర్ధ్వరేతస్కులని కొందఱు గలరని మనము వినుచున్నారము. ఊర్ధ్వరేతస్కు లనఁగా లోకప్రవృ

యం దాదరణములేనివారని యర్థము. జితేంద్రియులనఁగా యోగాభ్యాసమున మనస్సును వశంగతమై యుండఁజేసి కొన్న వారని యర్థము. లోకోపకారమునుగోరి లోకపాలకులుగాని సాధువులుగాని ప్రార్థింపనట్టి యూర్ధ్వరేతస్కులు సంసారప్రవృత్తులగుదురు. అది కామేచ్ఛచేఁ గాదు. దాన లోకమునకు మహోపకారము కలుగునేని సంసారచక్రమునఁ బ్రవృత్తులగుదురు రేతస్సు వారియిష్టానుసారము నిలుచును. కార్యానుసారము వారద్దాని వదలుదురు. దానినుండి కలిగినప్రా యప్పటికారము నెఱవేర్పఁజాలియుండును. ప్రాయశః ఈ భావమును జను లంగీకరింపరు. ఏలయనఁగా నిది సామాన దృష్టికిం గ్రొ...దిగ నుండును. కాని యోగుల కిది ప్రాంతవిషయమే. అట్టి యూర్ధ్వరేతస్కులసంకల్పము సా కముగాక పోదు. ఈనియమము ప్రకృతకథ కన యింతయును.

దేవతలు తారకాదిరాక్షసులబాధల కోరఁజాలక వానిని బోలియించువారులేమి శంకరుని బ్రార్థించి వానిం జంపఁజాలు కొడుకుఁ బడయుమని కోరిరి. శంకరుఁ డందుల కంగీకరించి తారకారిఁ బడయువాంఛం బూనెను. ఆవాంఛ నిష్ఫలము కాదుకదా. ఆరేతస్సును గంగాదేవి ధరింపఁజాలకపోవఁగా నగ్నియు ధరింపఁజాలక వదలినవాఁడగుట శరవణమున వదలుమనఁగానే గంగ దాని నచ్చోటికిఁ ద్రోసెను. అందుండి కుమారుఁడు జనించెను. ఇందుఁగలసారస్యమేమనఁగా. పరమేశ్వరుఁడు కుమారసంభవకార్యమును మనస్సున సంకల్పించెను. భూమ్యాప స్తేజస్సులను మహాభూతములభాగము లధికముగాఁగ యొకవ్యక్తి యావిర్భవించెను. అనఁగా నోర్పు కరుణ పరా

కావలయును. ఈనియమముల నవలంబించి యోజింతము. తారకాసురుఁడు త్రిమూర్తులచేతఁ జావఁదగినవాఁడు కాఁడు. ఆతనిం జంపుట కొకశక్తి పుట్టవలయును. దానిచే మఱికొన్ని కార్యములు కావలయును. అని భగవంతుని సద్భావమగు కర్మ ముద్దేశించెను. శివవీర్యము గ్రతమము. లయకర్త శివుఁడేకదా. కావున దేవతలమూలమునఁ దారకాసురునికర్మమే శంకరుని కోరికొల్పెను. దానిచే నాపరమశంకరుఁడు సంతానవాంఛ నొంది కుమారస్వామిని బుట్టించెను. ఆతఁడు శక్తిధరుఁడగును. కావునఁ దారకాసురునిమృత్యువు వానిం గబళింపఁబూనుకాలమున నిమిత్తమాత్రముగ సాయపడెను. అనఁగా "మయా హతాం స్త్వం జహి" అన్నగీతావాక్యము ననుసరించి తారకాసురుఁడు తనకర్మముచేతనే చంపఁబడెను. లోకులకుఁ దెలియుటకై కుమారస్వామి కారణమయ్యెను. ఈయము మన మెఱింగినదానిలో శివకేశవులయందు భేదమును గల్పింపఁ జాలము. ఈత్రిమూర్తులచేతఁగాని కార్యములు పరదేవి సాధింపలేదా. కావుననే శ్రీశంకరభగవత్పాదాచార్యులవారు సౌందర్యలహరియందు

"త్వదన్యః పాణిభ్యామభయవరదో దైవతగణ
స్త్వమేకా నైవాసి ప్రకటితవరాభీత్యభినయా,
భయాత్త్రాతుం దాతుం ఫలమపిచ వాంఛాసమధికం
శరణ్యే లోకానాం తవ హి చరణావేవ నిపుణౌ." ४

అని నిర్వచించిరి. భండాసురప్రముఖరాక్షసుల నాపరదేవి వధింపలేదా. వారిని భగవంతుఁడు వధింపలేఁడనియా భావము?

కాదు కాదు. కర్మమే వారిమూలమున వారినడంపవలయు
వారిం బ్రోత్సహించును. ఈవిషయమున నించుకయు విశ్వా
సములేక తెలివితక్కువచే విష్ణువధికుఁడని శివుఁ డుత్కృష్టుఁ
డని ప్రేలుచుందుము. రాక్షసపక్షపాతి యీశ్వరుఁడన్న వైష్ణ
వోక్తి యీగాథవలన నేటఁగలిసెను. వట్టి ముగా నీతుచ్ఛమైన
మతాభిమానమునఁ బాపమును మన మార్జించుకొననేల? నఱ
దృష్టిం బరికించిన దేవతలు విష్ణువు వానిం జంపలేఁడని యెఱింగి
యేకదా బ్రహ్మను మున్నిడుకొని శంకరు శరణుసొందిరని
తోఁచును. మఱికొన్నితావుల శంకరుఁ డసమర్థుఁడనుకొని విష్ణు
మూర్తి నాశ్రయించిరనియుఁ దోఁచును. ఈ రెండును నీచాభి
ప్రాయములే. ఈయూహలుగలవారలకుఁ గర్మసిద్ధాంతమన
నేమో తెలియదని బాహాటముగా మనము చేయెత్తి యుద్ఘో
షింపవచ్చును. కర్మగతి నెఱింగినవారల కిట్టియసంగతసిద్ధాంత
ములు తోఁపవనుట నిక్కము. శంకరునకు రాక్షసపక్షపాతిత
ముగాని శ్రీవిష్ణువునకు రాక్షసద్వేషముగాని లేవనియే సిద్ధాం
తము. వారికి లేకున్నను మధ్య వైష్ణవులకుమాత్రము మీఁదే ష
ము యున్నది. దీనిచే వీరికింగలుగు శ్రీమన్నారాయణప్రసా
దము భుక్తిరూపముగ నేయుండును. అంతియకాని ముక్తిరూప
మున నుండదని మాటికి ముమ్మాటికి నిరాఘాటముగఁ జెప్ప
వచ్చును అట్టిద్వేషబు ని మానుటుత్తమము. ముఖ్యముగా
నీభాగము కర్మతత్త్వము బోధించుచు దేవతాద్వేషమును
నశింపఁజేయుచున్నది. కర్మగతి దురవగాహమని మనకుఁ జక్కఁ
గా బోధించుచున్నది. పరమేశ్వరుననుపమానమహత్త్వమును

ంపుచున్నది. ప్రకృతిపురుషులకార ము లిట్టివని బోధించు
ౖది. సామాన దృష్టి నేవిషయమును బరిశీలింపక శ్ర
గి విశేషదృష్టిని బరిశీలించి దేవతాదోషమును మాన
ను ననుటయే యిటనుండి గ్రహింపఁదగిన నీతివిశేషము.

లోహములయుత్ప__.

యదస్యా నిర్గతం తస్మాత్తక్షాంబూనదప్రభం. ౧౮
కాంచనం ధరణీం ప్రాప్తం హిరణ్యామమలం శుభం,
తామ్రంకార్ష్ణాయసం చైవ తైక్ష్ణ్యాదేవాభ్యజాయత. ౧౯
మలం తస్యాభవత్తత్ర త్రపుసీసకమేవ చ,
తదేతద్ధరణీం ప్రాప్య నానాధాతు రవర్ధత.'' ౨౦

ను నీభాగమున నొకవిశేషము కలదు. శుక్లశోణితము
తుఁ బ్రవహింప లోహము లుద్భవించెనని యిందుఁగలదు.
ది నునం[illegible] త్రహింప నవకాశము కలదు. దీని
_ మెఱింగినచో నిం దసంగతము కానరాదు.

హిరణ ము, రజతము, తామ్రము, ఇనుము, తగరము,
ము ఇవి క్రమముగా సు_మమధ మాధమాదిభేదముల
ందును.

'' _మా మనసోజాతశ్చక్షో స్సూర్యో అజాయత,
నాభ్యా ఆసీదంతరిక్షం శీర్ష్ణో ద్యౌస్సమవర్తత.
పద్భ్యాం భూమిర్దిశశ్శ్రోత్రాత్ తథా లోకాగ్ం అకల్పయన్.

ఆరణ్యకము. 3 ప్రశ్నము.

అని శ్రుతియు,

"నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప,
ఏవతూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా.
యద్యద్విభూతిమత్సర్వం శ్రీమదూర్జితమేవవా,
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంశసంభవమ్.
అథవా బహునైతేన కిం జ్ఞానేన తవార్జున,
విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్." ४౨ గీత ౧౦

అను భగవదుక్తియు,

"పశూన్ మృగాన్ మనుష్యాంశ్చ వ్యాళాంశ్చోభయతోదతః. 3
కృమికీటపతంగాంశ్చ యూకామక్షికమత్కుణం,
సర్వంచ దంశమశకం స్థావరం చ పృథగ్విదమ్. ४౧
ఏవమేతైరిదం సర్వం మన్నియోగాన్మహాత్మభిః,
యథాకర్మతపోయోగాత్సృష్టం స్థావరజంగమమ్." ४౧ ౧ అధ్యా

అను మనుస్మృతియు, నింక నెన్నియేఁ బురాణములును భగ వంతుని యవయవములనుండి సర విధభూతములు స్థావరము జనించెనని తెల్పుచున్నవి. అనఁగాఁ బ్రాణము తేజస్సుగలవస్తు వెల్ల భగవన్మయమని దీనియ ము. ఈసిద్ధాంతమునకు మాఱు లేదని నాయాశయము. భగవ జ మెందెందు మిక్కిలిగ నుండునో యాయావస్తువు లెల్లఁ బ్రకాశించుచుండును. వా పకత ము భగవంతునకుఁ గలదుకదా. ప్రకృతము భగవ చు క్లశోణితములవలన స ర్ణాదు లుదయించెనన్న నాశ మేమి యున్నది ? భగవత్కల్పితమన్నచో సంశయిం సిన

గము లేదు. భగవదంగభవములయు ను వస్తుత ముసుబట్టి త్తమమధమాధమాధమాధమము లయె ను. కావున స ర్ణా రణములు ప్రాయశః పాదాభరణములుగ నుండరాదని నియ మేర్పడియెను. స ర్ణరజతేతరము లాభరణా ములు కావను యము మేకాలమునుండియో కలిగినదనుట సర జనవిదితము. వున ను మవస్తువులగుటకు భగవత్క ళ యం దధికముగా ండుటయే కారణమని మన మెఱింగి వానిని గారవింపవల మును. అట్టి భగవత్కళ విశేషించి మనయందు నెలకొనుటకుఁ ప్రయత్నింపవలయును. అదియే భ క్తిమార్గము. ఆభ క్త జ్ఞాన హితము కావలయును. అది సత్కర్మానుష్ఠానమునఁ గలు ను. కావున సత్కర్మములను ఫలాభిసంధిరహితములుగా చరించుచు భగవంతుని తేజోమూ ర్తిని హృదయకమలము ందుఁ బదిలముగా నెలకొలిపి ధ్యా నింపవలయును. ఇదియే ము. ఇదియే సకలోపనిషత్పురాణసారము. ఇదియే యన యాశ్రయింపఁదగి ది. అట్టులొటఁ పరమతముల నీసడింపక పరులు పూజించు దేవతలం దిట్టక పర మేశ రుఁ డొక్కఁడే యాయాయిభ క్తుల నుగ్రహింప నిన్నిరూప ములుగా వెలసియున్నవాఁడని నమ్మి సర వా పకునిగా నామహా యుని ధ్యా నింపవలయును. తన్మంత్రమును జపింపవలెను నామమును దలంపవలయును. ఇట్లు నిరంతరముగ వించిన పరమేశ రుఁడు పరమకారుణికుఁడు కావున మనలఁ గృతా లను జేయును.

"మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః." భ గీత ౧౨-౨.

అన్న భగవద్భక్తియే యీవిషయమును దృఢపఱచుచున్న అట్టిభగవదుని నమ్మినఁగాని కృతార్థులము కాఁజాలము. నిరంతరధ్యానమునఁగాని భగవదనుగ్రహము కలుగదు. అభ్యాసముచేయఁ బ్రయత్నింపవలయు.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

భగవదవతారవర్ణనమను

ప్రథమప్రకరణము సంపూర్ణము.

శ్రీ. శ్రీ. శ్రీ.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1931.

శ్రీ:

# శ్రీరామావతారతత్త్వము.

## ద్వితీయప్రకరణము.

### భగవద్ధ్యానము.

శ్లో. శ్రీరామం బలవైరినీలచికురం స్మేరాననం శ్యామలం
కర్ణాంతాయతలోచనం సురవరం కారుణ్యపాథోనిధిమ్,
శోణాంభోరుహపాదపల్లవయుగం క్షోణీతనూజాయుతం
రాజత్కుండలగండభాగయుగళం రామం సదాఽహం భజే. ౧

శ్రీరామం జగదేకవీరమమలం సీతామనోరంజనం
కౌసల్యావరనందనం రఘుపతిం కాకుత్స్థవంశోద్భవం,
లోకానామభిరామమంగళగుణవ్యాపారపారాయణం
వందేఽహం జనఘోరపాపనికరధ్వంసం విభుం రాఘవమ్. ౨

శ్రీరామం జగదీశ్వరం జనకజాజానిం జనానందనం
జంతూనాం జనకం జనార్తిహరణం లోకేశ్వరం శాశ్వతమ్,
జాబాల్యాది మునీశ్వరైః పరివృతం జాజ్వల్యమానం సదా
జంఘాలం జమదగ్నిసూనుహరణం జాతానుకంపం భజే. ౩

శ్రీరామం కరుణాకరం గుణనిధిం సీతాపతిం శాశ్వతం
పారావారగభీరమబ్జనయనం ప్రావృడ్ఘనశ్యామలం,
వీరశ్రేష్ఠమనామయం విజయినం విశ్వప్రకాశాత్మకం
ఘోరారిప్రకరాధిపప్రహరణం కోదండరామం భజే. ౪

రామస్సీతాసమేతో విజయతు హృదయే సానుజో రామచంద్రః

**రామేణ క్షీణపాపస్త్రివిధమపి కృతం కర్మ రామాయ దద్యాత్,**
**రామాదన్యం న జానే న హి కిమపి మహారామనామ్నస్సమానం**
**రామే వక్ష్యామి విశ్వం భువనమనుదినం పాహి మాం రామచంద్ర! ౫**

**శ్రీరామకర్ణామృతము. ౧ అ.**

మహనీయులారా ! ఉత్తమమార్గాన్వేషణపరాయణులారా! శ్రీరామావతారతత్త్వమున మొదటిప్రకరణమును బఠించితిరి. అందు శ్రీరామావతారకారణము, భగవంతుని భక్తరక్షణపరాయణత్వము లోనగు విషయములు గలవు వానిం బఠించుటచేత శ్రీరామావతారమే మిథ్యయన్న వాదము దుర్వాదమని యెఱింగియుందురు. శ్రీరామావతారము కేవల ధర్మసంస్థాపనార్థమే యన్నవిషయము వ్రాయఁదగియుండియు నది బాలకాండాంతమున వ్రాయఁదలఁచి ప్రథమప్రకరణమున వదలఁబడియెననియు నెఱింగియుందురు. శ్రీరామచంద్రుఁడు సామాన్యులలో నుత్తముఁడే యనఁదగునుగాని పురుషోత్తముఁడన వలనుపడదన్నభావమును వెలిపుచ్చువాదమునకు సమాధానము గ్రంథము తుదముట్టఁ బఠించినఁగాని కుదురదు. కావున సందంసు సందుదొరకినపుడెల్ల నించుకించుక వ్రాయఁబడుచుండును.

రాముఁడే పరదైవ మనువారు కొందఱు, కృష్ణుఁడే పరాత్పరుఁ డనువారు కొందఱు, శంకరుఁడే పరమపురుషుఁ డనువారు కొందఱు, పరదేవియే వీరందఱఁ బుట్టించునది కావున నామెయే పరదేవత యనువారు కొందఱు లోకమునఁ గలరు. వీరిలో నిన్నినామరూపముల నలరుభగవంతుఁ డొక్కఁడే యని తలంచువారరుదు. ప్రాయశః వీరందఱు పరమతఖండనప్రచం

డులు. అనఁగాఁ దాఁబట్టినకుందేటికి మూఁడేకాళ్లనువారి వంటివారు. వీరినెల్ల నిట్టివాదములకుఁ దింపి తోలుబొమ్మలం బోలెనాడించు చుండునది కర్మము. దాని త్రిప్పులకు లోఁబడనివారీలోకమునఁగా దేలోకమున నుండరు. తుదకు భగవంతుఁడు కూడ నామరూపధారియగునపు డద్దానివశమున నుండును. అనఁగాఁ దాను కర్మబద్ధునివలె నటించుననియే యిందలి సారము. ఆనటనమున లోకమున కుపకారము కలుగును. "కర్మము బలవత్తమము" అనుసిద్ధాంతము మది నెవ్వారికి నాఁటునో వారి కహంకారము తొలఁగును. నేను ఇతరుఁడు అన్నభావము తుచ్ఛమని తోఁచును. దానిచే భగవంతునియందు భక్తి కుదురును. అయ్యది నిర్మలజ్ఞానము నుత్పాదించును. దాన వైరాగ్యము పట్టుపడును. అది యైహికఫలముల నాశింపక యుండఁజేయును. దాన ఫలాభిసంధిరహితసత్కర్మాచరణపరాయణత్వము కుదురును. అయ్యదియే వైరాగ్యఫలమని పెద్దలందురు. అయ్యది పామరులకు సత్కర్మాచరణమునకు మార్గదర్శకమగును. ఇట్టి యుత్తమమార్గమును జూపించుట కాదికారణము కర్మము బలవత్తమమన్నతలంపే యని యెఱుంగుట తెఱంగు. లేనిచో నహంకారము శాంతమునకుఁ జోటీయక మనసున నిండియుండును. దానిని దొలఁగింప వేఱుమార్గములు చాలవు. కర్తృత్వాభిమానపరిత్యాగ మొక్కఁడే చక్కనిమార్గము. అట్టి యుత్తమమార్గమును బెద్దలు చూప సిద్ధముగనుండఁగా దానికి విముఖులుగఁ బ్రవర్తించువారలకు దుష్కర్మమే కారణము కాక మతేమగును? కనుకనే శ్రీకృష్ణపరమాత్మ,

"అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణోగతిః"

అని గీతాశాస్త్రమున వక్కాణించెను. కొంద ఱీసిద్ధాంతమును స్వానుభవమున నెఱింగియుంగూడఁ బ్రాగ్దుష్కర్మవశమున దానిం బాటించి ప్రవర్తింపక యహంకారమునకు లోఁబడు దురు. దానిచేతనే దైవ మొక్కఁడే యనియు ననేకనామ రూపముల భక్తానుగ్రహార్థము ధరించుననియునిం దేనామమును రూపమును దలంచినను ధ్యానించినను ఆపరమాత్మ కరుణించు ననియు నమ్మరు. అంతియకాక యితర దేవతల దూషింతురు.

మఱికొందఱు భక్తులవలె నటించుచుఁ బామరులను వంచించుచు ధర్మోపన్యాసముల నిచ్చుచు వానిమూలమున నర్థార్జనముచేయుచు మతగురువుల మనిపించుకొనఁ బ్రయత్నింతురు. ఈజాతిమానవులు ప్రాయశః శైవులో వైష్ణవులో యయియుందురు. వీరిరువురును దమగతి నరికట్టుకొనుమూఢులే యనవలసివచ్చును. ఇందొక్కఁడును బరమశివునిగాని, శ్రీమన్నారాయణమూర్తినిగాని కాంచినవాఁడు లేఁడు. పాషాణగృహమున నీలపాషాణమునకు నామమును గల్పించి యద్దానిం జూచుచు నదియే భగవంతుఁ డనుకొనువారే పైవారలగుదురు. ఆమూర్తిదర్శనము చర్మచక్షుష్కులకెల్లఁ గలుగునదియే. దానియందుఁ దారతమ్యము లున్నవన్నవాదమే యాభక్తుల మతోద్ధారణము. అంతియకాని వేఱొండులేదు. విగ్రహారాధన మతిస్వల్పఫలప్రదమౌటఁ గేవల పామరులకొఱ కది యేర్పఱుపఁబడినది. అంతియకాని దానిం బ్రధానముచేసికొని సర్వకాలము దానినే యాచరించు టుత్తమమార్గము కానేరదు. తఱచుగాఁ బైఁజేర్కొనిన శైవులు వైష్ణవులు విగ్రహారాధన

ప్రధానులు. అందు శైవులు నిరవయవమూర్తి నారాధించు వారు. వైష్ణవు లట్లుగాక సర్వాంగసంశోభితమృత్పాషాణాద్య వ్యతమకల్పితవిగ్రహమును నవరత్నాభరణసంశోభితముగ నొనరించి పూజించి యానందించువారు. ఈరెండింటియందుఁ దొలిమార్గ మించుక యుత్తమము. ఈవిషయమునందు,

“శుభ్రమూర్వం హారం కృత్వా మహాపురుషవిగ్రహాన్,
ఈజివాంస్త్వం జపైర్హోమై రుపహారైశ్చ మానద. ౯౪
స తథా పూజ్యమానస్తే పూర్వదేహేఽత్యతూతుషత్,
పుష్కలాంశ్చ వరాన్ ప్రాదాత్తవ విద్వన్ హృది స్థితాన్. ౯౫
జన్మకర్మతపోయోగాస్తయోస్తవ చ పుష్కలాః,
తాభ్యాం లింగేఽర్చితో దేవస్త్వయార్చాయాం యుగే యుగే. ౯౬
స ఏష రుద్రభక్తశ్చ కేశవో రుద్రసంభవః,
సర్వరూపం భవం జ్ఞాత్వా లింగమర్చయతి ప్రభుః. ౯౭
ఆత్మయోగాశ్చ తస్మిన్ వై శాస్త్రయోగాశ్చ శాశ్వతాః,
ఏనమేవాయజన్ దేవా స్సిద్ధాశ్చ పరమర్షయః. ౯౮
ప్రార్థయంతి పరం లోకే స్థాణుమేకం స సర్వకృత్,
కృష్ణ ఏవ హి యష్టవ్యో యజ్ఞైశ్చైవ సనాతనః. ౯౯
సర్వభూతమయం జ్ఞాత్వా లింగమర్చతి యః ప్రభుః,
తస్మిన్నభ్యధికాం ప్రీతిం కరోతి వృషభధ్వజః.” ౧౦౦

ద్రోణపర్వము. ౨౦౨వ యధ్యాయము.

అను నీమహాభారతవాక్యము లుదాహరింపఁదగినవి. విగ్రహా ముగ శివుని నశ్వత్థామ పూజించెను. శ్రీకృష్ణుఁడు మృత్తికం గాని లింగముగ నొనరించి యందు శివు నావహింపఁజేసి పూజించెను. కాన నీకంటె శ్రీకృష్ణు నుత్తమభక్తునిగ శంక

రుఁడు భావించునని వ్యాసమహర్షి యశ్వత్థామ కుపదేశించెను. దీనింబట్టి యూహింపఁగా భగవంతు నవయవవిశిష్టునిగా భావించుటకంటె నిరవయవునిగా ధ్యానించుటయే యుత్తమమని తేలెడిని. కావుననే దేవాలయములు పామరులకొఱకే కట్టింపఁబడినవని యింతకుముందుఁ బెక్కుసారులు వ్రాయఁబడినది. దేవాలయములనే నమ్మకొని యాపూజయే ముక్తి నిచ్చునని ప్రాఁకులాడువారు పండితులవలె నటించుపామరులే. వారు పామరుల నుద్ధరింప నీకార్యము సాగించుచు మానసికపూజ గావించుచుందురేని ధన్యులే యగుదురు. కాని యట్టివారిచర్య వేఱు. మానసికపూజ యనఁగా వస్తువులతోఁ బనిలేని నిర్మలధ్యానమని యర్థము. ఆపూజయంతయు భావనాత్మకము. ఆభావనయుఁ గొంతకాలము సాగఁగా,

"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః." ౨౯

గీత. ౬ అధ్యా.

అను శ్రీకృష్ణోక్తమార్గము పట్టుపడును. ఆస్థితియందుండువాఁడే యోగియనంబడును. కనఁబడునదియంతయు భగవన్మయముగా నతనికిం దోఁచును. కాఁబట్టి గీతాశాస్త్రముకూడ విగ్రహారాధనము నంగీకరింపదని యెఱుంగనగును.

రామశబ్దముకూడ నీవిషయమునే తెలుపుచున్నది. యోగి నిర్మలమనఃకమలవిహారము చేయువాఁడుకదా రాముఁడు. అట్టివాఁడు పరమపురుషుఁ డనఁబడును. అతఁడే పరమాత్మ. ఆత్మతత్త్వమన్న నదియే; పరబ్రహ్మమన్న నదియే. శబ్దములనుబట్టి లింగభేదములు గల్గినవియేగాని వస్తువును

బట్టి కాదు. అలింగ మనామమ రూపమనిర్దేశ్యము నగునదియే పరమాత్మ. ఆపరతత్త్వమునకు నామరూపకల్పనము భక్తుని యిచ్ఛాధీనము. కావున నెవ్వాని కేరూప మేనామ మిష్టముగ నుండునో వా రానామమున నారూపమున నాపరబ్రహ్మమును బిలువవచ్చు. అంతియేకాని వేఱొకఁడు తనవలెనే భగవంతుని బిలువ నులికిపడి యానామ మారూప మాతనికిం జెల్లదనరాదు. ఈలోకమే పరమాత్మదనియు నిందేయుండుననియుఁ దెంపఱి తనమున వాదింపరాదు. అది భగవన్మహిమమును దూషించి నట్లగును. సర్వసమత్వ సర్వసాక్షిత్వ సర్వవ్యాపకత్వము లెగిరి పోవును. ఈవిషయమునే యుపనిషత్తులు బోధించును.

"యతంతో యోగినశ్చైనం పశ్యంత్యాత్మన్యవస్థితం,
యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యంత్యచేతసః. ౧౧
యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలం,
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకం. ౧౨
గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా,
పుష్ణామి చౌషధీస్సర్వాస్సోమో భూత్వా రసాత్మకః. ౧౩
అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః.
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్. ౧౪
సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తస్స్మృతిర్జ్ఞానమపోహనం చ,
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాంతకృద్వేదవిదేవ చాహం." ౧౫

గీత. ౧౫ అధ్యా

అను శ్రీభగవద్గీతోపనిషత్తుపై వ్రాసినభావమును సిద్ధాంతము చేయుచున్నది.

"ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా. ౬౧
తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత,
తత్ప్రసాదా త్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతం." ౬౨
గీత. ౧౮ అధ్యా.

అను నీశ్రీకృష్ణోపదేశము తుచ్ఛవాదములఁ దూలఁగొట్టుచు భగవంతుని సర్వవ్యాపకత్వమును వెలిపుచ్చుచున్నది.

ఉపనిషత్తులు మొద లూఁగుడుకథలవఱకు భగవంతునకు సర్వనామములు సర్వరూపములు చెల్లునని స్పష్టముగాఁ దెలుపుచుండ విష్ణువే పరమాత్మయని వైకుంఠమే తన్నివాసమని వాదించుటయు, శంకరుఁడే పరమేశ్వరుఁడని కైలాసమే తన్నివాసమని వాదించుటయు,నజ్ఞానవిశేషముననే యని తేటపఱుచుచున్నది.

భగవత్తత్త్వమును దెలిసికొనఁదగినవా రీపాడు వాదములలోఁ బ్రవేశింపరాదు. పరమతసహనముకలిగి గురూపదిష్ట మార్గమున నాపరాత్పరుని ధ్యానించుచు నుండవలయును. సర్వమతము లొకతత్త్వమునే మార్గభేదములచే నధికారిభేదముచేఁ దెలుపుచున్నవి. అంతియకాని మతకర్తలకుఁ దెలియదనరాదు. శిష్యయోగ్యత నెఱింగి తదుచితముగా వారు బోధింతురు. ఈవిషయము నెఱింగినవా రితరుల దేవతోపాసన పద్ధతుల నాక్షేపింపరు. తత్త్వమెఱుంగక యెఱింగినట్లు నటించువారే వాదింతురు. వారు కుటుంభరులలో నగ్రేసరులు.

కొందఱు మధ్వవైష్ణవులు భక్తిమార్గమున నాఱితేఱి నట్లు నటించుచుఁ బామరుల కేదో తెలిసితెలియని మంత్రము

## ద్వితీయప్రకరణము.

నుపదేశించుచు దేశికులఁ బూజించుటకంటె నుత్తమపూజ యింకొక్కటి లేదనియు, సర్వస్వము దేశికున కర్పించి చేతులు జోడించుకొని సేవచేయుచుండవలయుననియు, నా దేశికుఁడే చేయిపట్టుకొని వైకుంఠమును జేర్చుననియు, దేశికులయుచ్ఛిష్టము భుజింపఁదగుననియు, నేవో నాలుగు చచ్చుశ్లోకములు చదివి వారిని వంచించి ధనము సంపాదింతురు. కాని యావృత్తి తమజీవితమును బాడుచేయునని వా రూహింపరు. ధనాశయే వారి నట్టిదుర్వృత్తికిఁ బాలుపడఁజేసిన దనుట స్పష్టము. అట్టి దాంభికుల మాయావాగురులకుఁ జిక్కి పామరులు చిరసంచిత ధనసంచయము నర్పించి మోక్షమున కెదురుచూచుచు నుందురు. ధనాపగమమే మోక్షమని వా రెఱుంగరు. పాపము! అట్టి మూఢుల వంచించి యేమి మూటగట్టుకొనుదురో తెలియదుగాని ధనము నేమో మూటకట్టుకొనుటమాత్రము సత్యము. అట్టి వంచకులమాటలనే విని నమ్ముదురు. కావుననే శ్రీశంకరభగవత్పాదులవారు,

"అర్థం తత్త్వమసీతివేఁగదితం నో విశ్వసత్యల్పధీః."

అని పేర్కొనిరి. ఈశ్రుతివాక్యముల నాలకించువారు నమ్మువారు కొందఱే యుందురు. పూర్వోక్తభక్తులందఱు విగ్రహారాధకులే. అదియే వారికి జీవితము. కావున నెన్నిజన్మములకైన వా రుత్తమమార్గము నరయఁజాలరు ఇఁక వారి నమ్మినవారి గతియో యధోగతియే.

భగవత్సేవ కెల్లరు నధికారులే యని కొందఱనఁగా మఱికొందఱు కారు కారందురు. తారతమ్యము గలదనుట సత్యమే. అది తత్కృతకర్మముపై నాధారపడియుండును.

దేవాలయములయందలి పాషాణాదిమూర్తుల నెల్లరు పూజింప రాదనువారు కొందఱు గలరు. సాధువు లామార్గము నంగీకరింతురు. ఏల? విగ్రహారాధన మల్పఫలప్రదము గాన నద్దాని కాయర్చకుఁడే పాల్పడుఁగాక యని వారియాశయము. అట్టి పూజ నెవ్వారు కోరుదురు? ఈవిగ్రహములపైఁ గలభక్తియుఁ దదారాధకుల వాక్కులు సత్కర్మానుష్ఠానవిహీనులనుగా నెల్లరఁ జేయుచుండుట యథార్థము. కావున నట్టి యపూర్వభక్తులమాటలఁ జెవియొగ్గి యాలకింపక వారివారికిం దగిన సత్కర్మముల నాచరించుచు వానివలనఁ గలుగుఫలముల భగవంతున కర్పించుచు లోకులకు నందును బామరులకు మార్గదర్శకులై పరిశుద్ధాంతఃకరణులై భగవంతు ననుగ్రహమునకుఁ బాత్రులు కావలయును.

శ్రీరామచంద్రు నర్చించుమార్గము నిరుపమానము. అది యోగశాస్త్రగమ్యము. అనఁగా ధ్యానమే యని సారము. భక్తి దృఢముకాఁగా నాపరమపురుషుని నిరంతరముధ్యానించుటయే యారాధనము. దీనికే మానసికపూజ యని పేరు. దానియందును రెండుభేదములు గలవు. మనఃపీఠమున నభీష్టదేవతారూపము నావహింపఁజేసి సంకల్పకల్పితపదార్థము లర్పించుట యొకపద్ధతి. మనోవీథియందు భగవంతునిఁ దేజోరూపునిగా ధ్యానించుచుఁ దదేకాగ్రచిత్తుఁడై యానందించుచుండుట వేఱొకపద్ధతి. ఈరెండింటియం దీరెండవమార్గ ముత్తమోత్తమము. దీనినే శాక్తమున సమయాచారమందురు. యోగమతమే శాక్తమని యెఱుంగఁదగినవిషయము. అల్పమతు లనుకొనునట్లు మద్యమాంసనిషేవణము శాక్తముకాదని యెఱుం

గూట బుద్ధిమంతుల లక్షణము. ఈవిషయము శ్రీశంకరభగ
వత్పాదులవారు సౌందర్యలహరియిం దిట్లు నిర్వచించియున్నారు.

"జపో జల్ప శ్శిల్పం సకల మపి ముద్రావిరచనా
గతిః ప్రాదక్షిణ్యక్రమణ మశనాద్యాహుతివిధిః,
ప్రణామ స్సంవేశ స్సుఖమఖిల మాత్మార్పణదృశా
సపర్యాపర్యాయ స్తవ భవతు యన్మే విలసితమ్." ౨౭

"అత్రేదమనుసంధేయం. సమయినాం మతే సమయస్య సాదాఖ్యతత్త్వ
స్య సపర్యా సహస్రదళకమల ఏవ, న తు బాహ్యే పీఠాదౌ. యే యే
సమయినో యోగీశ్వరా జీవన్ముక్తా స్స్వసంసారయాత్రా మనువర్తమానాః సాదా
ఖ్య తత్త్వ మనుచింతయంతః, ఆత్మైకప్రవణా వర్తంతే. తేషాం జపో జల్ప
శ్శిల్ప మిత్యాదినా సపర్యాప్రకారో నిరూపితః. యత స్సమయినో యోగీశ్వ
రా విజనే గుహాంతరే వా బద్ధపద్మాసనాః నిగృహీతేంద్రియాః. సాదాఖ్యతత్త్వ
జ్ఞానైకనిష్ఠా వర్తంతే తేషాం వక్ష్యమాణచతుర్విధమైక్యానుసంధానమేవ
భగవత్యా స్సపర్యే త్యర్థా దుక్తం భవతి. యతశ్చ పక్షద్వయేఽపి బాహ్య
పూజాయాం తత్క్రియాకలాపే చ తత్సంపాదనాయాం చ క్లేశో నాస్తీతి
సమయినా మితి రహస్యం. యత్తు చంద్రజ్ఞానవిద్యాయా ముక్తమ్.

"సూర్యమండలమధ్యస్థాం దేవీం త్రిపురసుందరీం,
పాశాంకుశధనుర్బాణాం ధారయంతీం ప్రపూజయేత్." ఇతి.
బాహ్యపూజాప్రకారకథనం సమయైకదేశిమతం" అని వ్యాఖ్య.

కౌళమని సమయాచారమనియు శాక్తమునఁ బూజాపద్ధతులు
రెండు. కౌళాచారరతులు యంత్రపూజాతత్పరులు. సమయా
చారనిరతులు యోగులు. షట్చక్రములయం దాపరదేవిని
జ్యోతిస్స్వరూపిణిగా భావించి ధ్యానింతురు. విగ్రహపూజ
యీ యిరుదెఱఁగులవారియందుఁగూడఁ గానరాదు. యంత్ర

మనఁగా శ్రీచక్రమని యర్థము. శ్రీచక్రమున సకలదేవత లుందురు. నిర్గుణుఁ డనంబడు పరబ్రహ్మము తప్పఁ దక్కుంగల త్రిమూర్తులు లోనగువా రాపరదేవిని సేవించుచుందురు. ఈచక్రమున వారినెల్ల భావించి యందు బిందుస్థానమునఁ బరదేవిని ధ్యానించి పూజించువారు కౌళమతావలంబులని యెఱుంగవలయు. దీనికే బాహ్యపూజ యందురు. పూజాద్రవ్య సంపాదనక్లేశము వీరికిం గలదు. సమయాచారనిరతులు యోగు లనంబడుదురు. పూజార్థమై ద్రవ్యములసంపాదింప శ్రమపడ నక్కఱలేక వీరు భగవద్రూపము నాయాచక్రములయందే వరుసగా ధ్యానింతురు. అందు సహస్రారపద్మమునఁ దేజో రూపమును ధ్యానింతురు. వారు జీవన్ముక్తులయి సంసారయాత్ర ననాసక్తులై సాగించుచుందురు. జనసంసర్గము వారి కక్కఱ లేదు. ఏకాంతవాసమే వారికిం గావలసియుండును. సర్వకాల సర్వావస్థలయందు నామహామాయనే దలంచుచుందురు గాన వారు చేయుసంభాషణమంతయు మంత్రజపమే యగును. హస్త చలనాదిక్రియలన్నియు సకలముద్రాప్రదర్శనమే యగును. ముద్రా ప్రదర్శనవిహీనజపము సాంగము కాదనియు సంపూర్ణఫలము నీఁజాలదనియు శాస్త్రతత్త్వము నడచుటయే ప్రదక్షిణక్రియ యగును. ఏపదార్థమును వారుభక్షింతురో యది హోమమగును. శయనించుట యిటునటుపొరలుట నమస్కారక్రియ యగును. శరీరమునువంచుట లోనగు సుఖకరవస్తువంతయు నాత్మార్పణ బుద్ధిచేఁ బూజారూపాంతరమే యగు. సకలము దేవతార్పణము చేయుదురుగాన వారు చేయుకృత్యము లెల్ల భగవత్ప్రీతికరములే యగునని సారము. ఇది శాక్తమునఁ బ్రధానము. ఇదియే యోగమతము. ఈపద్ధతి శాక్తమునసే కాదు.

"ఆత్మా త్వం గిరిజా మతిః పరిజనాః ప్రాణాశ్శరీరం గృహం
పూజా తే విషయోపభోగరచనా నిద్రా సమాధిస్థితిః
సంచారః పదయోః ప్రదక్షిణవిధిస్స్తోత్రాణి సర్వా గిరో
యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనమ్."

అనునదియు సుప్రసిద్ధమేకదా. ఇదంతయు "భావనామాత్ర సంతుష్టహృదయః పరమేశ్వరః" అన్న దానిసారము కాదా. "అంతరర్చనసుప్రీతా బహిరర్చనలోలుపా" అన్నదియు నదియే కదా.

"తస్యైవం విదుషో యజ్ఞస్యాత్మా"

అనుశ్రుతియుఁ బైవిధులకుఁ బ్రమాణము. వీనినన్నింటిని బరికింపఁగా విగ్రహారాధన మత్యల్పఫలప్రదమనియు, యంత్రపూజ మధ్యమఫలప్రదమనియు మానసికపూజ యనఁగా ధ్యానముత్తమఫలప్రదమనియు, నందును దేహరూపధ్యానముత్తమోత్తమఫలప్రదమనియు సారము తేలెడిని.

శాక్తమునఁ దక్కంగలయైదుమతములకుఁ బూర్ణావకాశము గలదు. తక్కిన శైవవైష్ణవ గాణపత్య సౌర కాపాలికములయం దట్టియవకాశము లేదు. సప్తకోటిమహామంత్రముల కిందు సన్నివేశము కలదు. కావుననే,

"సర్వే శాస్త్రాస్సముద్దిష్టా న శైవా న చ వైష్ణవాః"

అను మునివాక్యము పొడసూపెను. ఆకృతిగలవస్తువంతయు, మహాప్రకృతికల్పితమే. కావున బ్రహ్మవిష్ణ్వాదులెల్ల నాప్రకృతికిం బుత్త్రులని తెలియవలయు. కావుననే ప్రకృత్యుపాసకులు యోగులనంబడిరి. ఏమతమునందును బరిపక్వజీవులకే భగవద

నుగ్రహాలాభము కలుగుంగాని మతప్రవిష్టుల కందఱకుం గలుగదనుట యందఱెఱింగినవిషయము. కావున నేదేవత నుపాసించినను దద్భిన్నమేదియు లేదనుభావము కలిగి యుపాసించిననే పూర్ణఫలము లభించును. భక్తిజ్ఞానవైరాగ్యసహితముకాదేని వ్యర్థమగును. వానింగూడిన సఫలమగును. ఇవ్వి మూఁడును సత్కర్మానుష్ఠానమూలములు కావేని సమగ్రములుగావు. కావున సత్కర్మానుష్ఠానము ఫలవాంఛలేక యొనరింప జ్ఞానవైరాగ్యసహితమగుభక్తి కుదురును. అట్టివానికి భగవదారాధనము మానసికమునఁగాక వస్తువ్రాతము సాయముగా గలిగినది కాదు. బాహ్యపూజచేయుచు నదియే తుదియని భావించువారు పామరులనుటయే యీవిషయమునఁ గలసారమని యెఱుంగవలయును.

"సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికాం,
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్. ౭

ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునఃపునః,
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతే ర్వశాత్. ౮

న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ,
ఉదాసీన వదాసీన మసక్తం తేషు కర్మసు. ౯

మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరం,
హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే." ౧౦

గీత ౯ అధ్యా.

అను భగవద్గీతావాక్యములు పైవిషయమును సిద్ధాంతము చేయుచున్నవి. నిర్గుణపరబ్రహ్మముతప్పఁ దక్కినవా రెల్లనాప్రకృ

తిచే సృజింపఁబడినవారే యనియు, వారి నుపాసించుచు ముక్తిని బడయఁగోరువారు బాలిశులనియుఁ, బ్రకృతి నుపాసించి తదను గ్రహపాత్రులై పరమపురుషునికరుణకుం బాత్రులు కావల యుననియు భావము. కాని వేఱొండుమార్గము లేదు.

## ప్రకృత్యవతారములు.

లోకమున సత్యధర్మములు సుప్రతిష్ఠం గాంచవలయు నన్నయాశతో భగవంతుని యిచ్ఛాశక్తియగు ప్రకృతి రామ లక్ష్మణభరతశత్రుఘ్నరూపముల నవతరించెను. ప్రకృతిసాయ మునఁ బరమపురుషుఁడు లోకప్రవృత్తిని సాగించునట్లు మాన వులు స్వకీయప్రకృతిసాయమునఁగాని సంసారయాత్ర సాగింపఁ జాలరన్న నీతిని లోకులకు నెఱిఁగింపఁగోరి స్వాంశమున సీతాం బను బుట్టించెను. సీతాసహాయముననే శ్రీరామప్రవృత్తి సాగును. ఆవిషయ మీరెండవప్రకరణమున వ్రాయఁబడును. సత్యమార్గాన్వేషణమే ప్రధానమని భావించి పాఠకమహా శయులు మతవైషమ్యముల మనస్సుల నెలకొలుపక దృఢభక్తి గలిగి శ్రీరామచరిత్రము నాలకింపుఁడు. శ్రీరామునిప్రవర్తనమే స్మృతుల కాధారము. కావునఁ గడుజాగరూకులరై శ్రీరామ మూర్తి యేయేసమయముల నెట్లు ప్రవర్తించి లోకులకు సన్మార్గ ప్రవృత్తిని దెలిపెనో యావిధము నెఱుంగుచు నందేమాత్ర మైన స్వప్రవృత్తియందుఁ జొప్పించి విఖ్యాతచరిత్రులు కావ లయును. అట్టులగుటకు శ్రీరామచంద్రదివ్యచరిత్రమును బెక్కు సారులు పఠింపవలయును. ఒక్కొక్కపర్యాయము పఠించు నపుడు నిందేమివిశేషమని పరికింపవలయును. రహస్యార్థము

కనఁబడుచుండును. మహానంద ముప్పొంగుచుండును. సంసార
తాపములు దూరము లగుచుండును. శ్రీరామమూర్తి వైకుంఠ
మును బాడుపెట్టి వచ్చినవాఁడను మధ్య వైష్ణవులమాటలకుఁ
జోటియకుఁడు. భగవంతుఁడే ధర్మరక్షణార్థ మవతరించెనని
భావింపుఁడు. రామమూర్తిని వైష్ణవులు శ్రీమహావిష్ణువే యని
తలంపవచ్చును. శైవులు పరమశివుఁడని భావింపవచ్చును.
శాక్తులు లలితాంబయే యని నిశ్చయింపవచ్చును. గాణాప
త్యులు మహాగణపతి యని యెంచవచ్చును. సౌరులు సూర్య
భగవానుడఁని యూహింపవచ్చును. కాపాలికులు మహాభైర
వుఁడని చింతింపవచ్చును.

"యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి,
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధా మ్యహం. ౨౧
స తయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధనమీహతే,
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్." ౨౨

గీత. ౭ అధ్యా.

అన్న శ్రీకృష్ణపరమాత్మహితబోధము ననుసరించి యాయాయి
భక్తు లాయాయారాధనమున తనురూపములగు ఫలముల
నొందుదురు. ఇందు వైష్ణవులకే యెక్కుడుస్వత్త్వము లేదనుట
సిద్ధాంతము. రామమూర్తి భగవదంశసంభూతుఁ డనఁగా భగ
వంతుఁడు కార్యార్థ మీమానవరూపమున వెలసెనని సారము.
భగవంతుఁడే వైష్ణవుఁడో శైవుఁడో యెవ్వ రెఱుంగు
దురు. మే మెఱుంగుదుమనువారు బాలిశులు గాక మతేమగు
దురు? అట్టి పరాత్పరునిఛాయ యగు శ్రీరామచంద్రునిచరి

యుండెను. దానిశక్తిచే నాసంతతి పక్షిరూపే యయ్యెను. తరువాతసంతతి యట్లు కావలెనన్నకోరిక యమ్మునికి నుండ నవసరములేదు కావున వినతకు స్త్రీప్రజ జనించెను. ఏకగర్భసంజనితప్రాణులకు సహజత్వము లోకాచారరీతి నలవడినది. కావున సుమతి యనుసగరపత్ని గరుత్మంతుని సహజాత యయ్యెను. ఇదియే యిచ్చట సమాధానము.

కొంద ఱీసిద్ధాంతము నంగీకరింపమనవచ్చును. వారి నంగీకరింపఁజేయఁ బ్రయత్నింతము. ఇక్కాలమునంగూడ నందందు మానవజాతికి జాత్యంతరసంతతి క్వాచిత్కముగాఁ గలుగుచుండును కాని యాప్రాణి జీవించుటలేదు. పశువులకుఁ దత్సమానజాతి కాక భిన్నజాతిజంతువు పుట్టుచుండును. అదియు జీవించినట్లు వినఁబడదు. స్త్రీలకే సర్పాద్యాకారములు గలజంతువు లుదయించుటయుఁ గలదు. ఇట్లగుటకుంగల కారణమేమని మన మాలోచించుటలేదు. రేతఃపతనకాలమున వారిభావన లట్టివిగ నుండవలయును. లేకున్న నట్టిసృష్టికిఁ గారణమే లేదు. ఈవిషయమెల్లఁ గర్మసిద్ధాంతమునే యనుసరించెడిని. వేఱుకారణము వచింపఁగాని దాని దృఢపఱుపఁగాని యవకాశములేదు.

"పంచైతాని మహాబాహో కారణాని నిబోధ మే
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్. ౧౩
అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్ ౧౪
శరీరవాఙ్మనోభిర్యత్ కర్మ ప్రారభతే నరః
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః. ౧౫

తత్రైవం సతి కర్తారమాత్మానం కేవలం తు యః
పశ్యత్యకృతబుద్ధిత్వాన్న స పశ్యతి దుర్మతిః. ౧౬
యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే
హత్వాపి స ఇమాన్ లోకాన్న హంతి న నిబధ్యతే." ౧౭
(గీత ౧౮ అధ్యా.)

అన్న యీ శ్రీకృష్ణవాక్యములయందుఁ బైభావ మిమిడి యున్నది. కర్మసిద్ధాంతము నెఱుంగఁజాలని మూఢుఁడు తరింపఁ జాలఁడని భగవంతుఁడు శాసించుచున్నవాఁడు. కాఁబట్టి భగవద్వాక్యములఁ దలంచియుఁ, బూర్వకాలమునఁ గలవారిమనశ్శక్తిఁ బరికించియు, నికాలమున నెందో యెప్పుడో కలుగుచున్న విచిత్రసృష్టులం బరిశీలించియు, మొండిపట్టుదలలఁ బూనకయుండుఁడనియు నట్టివారిం బ్రార్థింతము. సృష్టివైచిత్ర్యము ప్రకృతిపూరుషులకుందప్ప నితరులకుఁ దెలియఁ దరముగాదని మనము నమ్ముదము.

"యతో విచిత్రా బత వస్తుశక్తయః"

అన్న భాస్కరాచార్యోక్తిం దలంచుచుఁ బైవిషయమును జర్చింప మది మరలింతము.

"స చ జ్యేష్ఠో నరశ్రేష్ఠ సగరస్యాత్మసంభవః
బాలాన్ గృహీత్వా తు జలే సరయ్వా రఘునందన. ౨౦
ప్రక్షిప్య ప్రహసన్నిత్యం మజ్జతస్తాన్ సమీక్ష్య వై
ఏవం పాపసమాచారస్సజ్జనప్రతిబాధకః. ౨౧
పౌరాణామహితే యుక్తః పుత్త్రో నిర్వాసితః పురాత్"

అను నీభాగమునఁగల పూర్వపాలకధర్మముల నెఱుంగఁ బ్రయత్నింతము.

"పితాచార్యస్సుహృన్మాతాభార్యాపుత్రః పురోహితః
నాదండ్యో నామ రాజ్ఞోఽస్తి యస్స్వధర్మే న తిష్ఠతి." ౩౩౫
మను. ౮ అధ్యా.

అను నీమనుస్మృతివాక్యము విశేషవిధియని యెఱుంగవలయును. ఏలయనఁగా,

"అదండ్యాన్ దండయన్ రాజా దండ్యాంశ్చైవాప్యదండయన్
అయశో మహదాప్నోతి నరకం చైవ గచ్ఛతి." ౧౨౮. అ. ౮.

అన్నవిధి కలదుగాన దానింబట్టి యదండ్యులు కొందఱు గలరని తోఁచెడిని.

"బాలవృద్ధాతురస్త్రీణాం న దండస్తాడనం దమః"

అన్నసామాన్య వాక్యముగలదు. కొందఱు పితృపుత్త్రాదులను దండింపరాదందురు. ఆవాక్యములనెల్ల నిట నుదాహరింపఁ బూనను. వీనింబట్టి పరికించిన మనుస్మృతివాక్యము విశేషవిధి యనియే కనుపట్టెడు. పిత్రాదులు స్వధర్మమును వీడి యధర్మమునఁ బ్రవర్తించిరేని వారిని దండింపక వదలరాదన్నది విశేషవిధి కాదని యెవరందురు? ఆశాస్త్రము ననుసరించి సగరభూజాని కుమారుని ముందు రాజు కాఁబోవువాఁడని తలంచి వానివలని చెడుగులఁ బ్రజలనుభవింపకయుండఁ బాఱఁదోలెను. ప్రజాహితమే ప్రభుధర్మమను నీతిని స్వప్రవృత్తిచేఁ దేటపఱచెను. అట్టికాలమున ధర్మము సంపూర్ణాకృతిం దాల్చియుండు ననుటకు సంశయముండునా?

"శ్రోతుమిచ్ఛామి భద్రం తే విస్తరేణ కథామిమాం,
పూర్వకో మే కథం బ్రహ్మన్ యజ్ఞం వై సముపాహరత్." ౧

అన్నభాగమున నొక్కవిశేషార్థము విశేషముకూడఁ గలదు. సగరచక్రవర్తి యజ్ఞముచేయఁబూనెనని ముని పలుకఁగా రామచంద్రుఁడు నే నీకథను వినఁగోరెదనని యడుగుచు నీకు మంగళమగుంగాక యనియె. ఇది ముని కాశీర్వాదమనియుఁ, దాను బరమేశ్వరుఁడగుట ముని నాశీర్వదించుట యుక్తమే యనియుఁ గొందఱందురు. కాని యది సమంజసము కాదు. వాల్మీకికృత రామాయణమహాకావ్యమున "భద్రం తే" అను వాక్యము పెక్కుతావులఁ గలదు. కొన్నితావుల నసంగతముగ నది దోఁచును. ఇచ్చోటమాత్రము మంచియర్థము దానికిం గలదు. మాపూర్వచరిత్రమును దెలుపుము. అందేదే నమంగళ వాక్కు వినఁబడిన నేనేమే మదిఁ గుందుదునో యని సందియ మందకుము. దుఃఖించి నీకార్యమున కించుకంతయు భంగము గల్గింపను. నీకు మేలగుంగాక యని రామునిభావ మని మనము గ్రహించిన మనకును భద్రమే కలుగును.

విశేషమేమనఁగా నాపూర్వుఁడగు సగరమహీపతీంద్రుఁ డెట్లు యజ్ఞమొనరించెనో విస్తరించి చెప్పుమా యని రామ మూర్తి ప్రశ్నించెను. లోకమునఁ బ్రతిమానవునకును దనకుల మున నభిమానముండుట సహజము. అది కల్పించుకొన్నది కాదు నైసర్గికము. మానవజాతి కయ్యది స్వభావసిద్ధము. సర్వ మానవసోదరత్వమనునది కొనితెచ్చిపెట్టుకొన్న యది. సహజము కాదు. సాధ్యమగునదియుఁ గానిది. దీనింబట్టి కులాభిమానము ప్రాచీనముకాని నవీనముగాదని యెఱుంగఁబడును. రామ చంద్రునకే కలిగినపుడు సామాన్యజనుల కయ్యది కలుగుట వింతగాదు. కులాభిమానము ప్రాచీనమనియు, దాని నిర్మూలింపఁ

బూనుట యవివేకముచేతనే యనియు మన మెఱుంగవలయును.

"విశ్వామిత్రస్తు కాకుత్స్థమువాచ ప్రహసన్నివ."

"ప్రహసన్నివ, ప్రసన్నవదన ఇత్యర్థః. స్వవివక్షితస్యైవ పృష్టత్వాత్ ప్రహాసః." అని గోవిందరాజులు. "అత్ర చ కారణం స్వవివక్షితమేవ సగరయాగవృత్తాంతం స్వపూర్వజవృత్తాంతకథా శ్రవణకుతూహలాతిశయేన పృష్టవాన్ రామభద్ర ఇతి." అని మహేశ్వరతీర్థులు.

ఈఘట్టమున నాంధ్ర మొనరించినవా రెట్లు భావములం దెలిపిరని యించుక పరిశీలింతము. తొలుత మూలము నించుక పరిశీలింపుదము.

"స కృత్వా నిశ్చయం రామ సోపాధ్యాయగణస్తదా,
యజ్ఞకర్మణి వేదజ్ఞో యష్టుం సముపచక్రమే.

ఇది ముప్పదియెనిమిదవ సర్గాంతశ్లోకము.

విశ్వామిత్రవచశ్శ్రుత్వా కథాంతే రఘునందనః,
ఉవాచ పరమప్రీతో మునిం దీప్తమివానలం. ౧
శ్రోతుమిచ్ఛామి భద్రం తే విస్తరేణ కథామిమాం,
పూర్వకో మే కథం బ్రహ్మన్ యజ్ఞం వై సముపాహరత్. ౨
శంకరశ్వశురో నామ హిమవానచలోత్తమః,
వింధ్యపర్వతమాసాద్య నిరీక్షేతే పరస్పరం." ౩

అని మూలము.

క. "అతనిసుతుఁ డంశుమంతుఁడు
బుతవాదియు సర్వలోకహితుఁడై వెలసెన్
మతియొదవె సగరునకుఁ దాఁ
గ్రతు వొక్కటి సేయ దానికై పనిపూనెన్.

క. సంధ్యాతాండవునకు సాం
బంధ్యముగల ధారిణీధ్రపరివృఢుఁడును నా
వింధ్యావనీధరంబున
వంధ్యానోన్యేత్శణముల వఱలు సతంబుల్."

అని వావిలికొలనువారి రామాయణము.

ఈ రామాయణమును మెచ్చుకొనుచుఁ గొందఱు మహా
నీయులు నారామాయణములోని వ్యర్థపదముల నెత్తిచూపి
దూషించిరి. వారి కిందలి వ్యర్థపదములను జూపుటకే నా యీ
ప్రయత్నము. గ్రంథకర్త నన్నుఁగాని నేను వారినిగాని
యాక్షేపించుకొనలేదు. "బ్రాహ్మణౌఘనముచిసూదనుఁడు"
అనువాక్యము నాది. దానికిమూలము "విప్రముఖ్యః" అని. పై
పదమునుగుఱించి యాక్షేపించుచు నిది ప్రాసస్థానమున వచ్చిన
దనియు, డొంకతిరుగుడుపదమనియు వ్రాసిరి. వారికి నావిన్నప
మేమనఁగా: "శంకరశ్వశురః హిమవాన్ అచలోత్తమః" అని
మూలమున నుండఁగా

"సంధ్యాతాండవునకు సాంబంధ్యముగల ధారిణీధ్రపరి
వృఢుఁడు." అనునది డొంకతిరుగుడు వాక్యము కాదా. సంధ్యా
కాలమున నాట్యముచేయువాఁ డనఁగా నీశ్వరుఁడు. అతనితోడి
సంబంధ భావముగలవాఁడు హిమవంతుఁడు. ఇంతకంటె మీ
రాక్షేపించినది డొంకతిరుగుపదమా? ప్రాసరక్షణార్థ మంటిరి
గదా. అవంధ్యపద మెట్టిది? ప్రాసరక్షణార్థమువచ్చినదే. "రాజ్య
భ్రష్టునిని నసిద్ధార్థుని" అనుచోట ద్రుతముపై ద్రుతమని
యాక్షేపించితిరి. మీరు మెచ్చుకొన్న రామాయణముననే
"ధారిణీధ్రపరివృఢుఁడును నా వింధ్యావనీధరంబు" అనుచో

ద్రుతముపై ద్రుతము లేదా? ఇప్పు డిది దోషముకాదు. రస స్వరూపమే యందురా? ద్రుతముపై ద్రుతము దోషమని తమ కెవ్వరుచెప్పిరో తెలియదు. అది దోషమేకాదు. మీ మెప్పునకుఁ బాత్రమగురామాయణము యథామూలముకదా. మొదటి మూఁడుశ్లోకము లేయేటఁ గలిసినవి? వానిప్రస్తావమే లేదే. ఏల? యథామూలమనఁగా నిట్లు వదలుట యనియే యర్థమా? వ్యర్థపదము లనసాగినఁ దెనుఁగనఁగాదు. సంస్కృతభాషయం దుంగూడ నేగ్రంథము నిలువదు. తమరు మెచ్చుకొన్న రామాయణము నిలువనే నిలువదని యెఱింగి నన్ను మన్నింపుఁడు. ఇచ్చోట నారచించిన రామాయణపద్యములం దెలిపెదను.

క. "అని విశ్వామిత్త్రుఁడు చె
ప్పినగాథను రాఘవుండు విని దాని తుదన్
మనమునఁ బ్రమదము నొందుచు
ననలునివలె వెల్గుచున్న యమ్ముని కనియెన్.

తే. బ్రాహ్మణోత్తమ! మీకు శుభంబు గల్గుఁ
గాక; యీయజ్ఞగాథను గడు వినంగ
నిచ్చపొడమెడి యజ్ఞమ దెట్లుచేసె
మాకుఁ బూర్వుఁడు సగరక్ష్మావిభుండు.

చ. అన విని చెప్పఁబూనువిషయంబునె తానడిగెన్ సమస్తముం
దనమదిచే నెఱింగియును దాను నెఱుంగనిపోల్కిఁ బ్రశ్న చే
సెనుగదయంచుసుస్మితముచెందినపోల్కి ముఖంబుగ్రాలఁగా
ననియెనురామచంద్ర! వినుమా సగరక్షితినాథువార్తలన్.

తే. విస్తరించి వచించెద వృషభకేతు
శ్వశురుఁడౌ హిమవంతుండు శైలవిభుఁడు

వింధ్యగిరికిని దాపయి వెలసి నడుమఁ
బెనుగిరులు లేమిఁ దా మొగిఁ బెద్దవగుట."

(ఆంధ్ర శ్రీమద్రామాయణము.)

"సమస్తముం దనమదిచే నెఱింగియును" అన్నది ప్రాసపూరణార్థము కాదా యందురేని "అజానన్నివ పృష్టవాన్" అని గోవిందరాజులు వ్రాసెననియు, నాభావము ముఖ్యమే యనియు, దానినే నిట వ్రాసితిననియు సమాధానము. మహాశయులారా! ఈచర్చ యేలయందురేని విమర్శకాగ్రేసరులమని పక్షపాతమునఁ దూలనాడుచుండువారల వ్రాఁతలం గాంచి పాఠకులు దురభిప్రాయముల నొందకుందురుగాక యనియే యందందు నిట్లు వ్రాయుదును. అంతియగాని వేఱుగాదు. ఇఁకఁ గథావిషయము నాలకింపుఁడు.

"తయోర్మధ్యే ప్రవృత్తోఽభూద్యజ్ఞస్సపురుషోత్తమ,
న హి దేశో నరవ్యాఘ్ర ప్రశస్తో యజ్ఞకర్మణి." 1

వింధ్య హిమాలయముల యంతరమునఁ గలభూభాగమున కార్యావర్తమను పేరు గలదు. ఆదేశముననే సగరునియశ్వమేధము విస్తరిల్లెను. శ్రీరామచంద్రా! ఆదేశము యజ్ఞకర్మమునకుఁ బ్రశస్తముకదా. అను నీభాగము విమర్శమున కర్హమైనది. స్మృతులును బురాణేతిహాసములును జంబూద్వీపమునఁ గొన్ని దేశములు యజ్ఞార్హములని కొన్ని యజ్ఞానర్హములని నిర్ణయించినవి. పురాణాదులయం దిది కలదా యన్న స్మృతులలో నున్నపు డన్నింటిలో నున్నయట్లే మన మంగీకరింపవలయును. ఈస్మృతు లీకాలమునఁ బుట్టినవి కావు. కావున నీనాఁటి దేశస్థితిని బట్టి మనమాస్మృతులపై నసూయను గనఁబఱుప నక్కఱ లేదు.

ఆర్యావర్తము పుణ్యభూమియందురు. అదియే జంబూద్వీపమునఁ బ్రశస్తిం గాంచినది. అప్పటిదేశవిభాగము తాఱుమాఱయి నది. దేశస్థితియు మాఱినది. మానవులయాచారవ్యవస్థలును మార్పునొందినవి. కావున స్మృతులలో నేయేదేశములు యజ్ఞ కర్మములకు నిషిద్ధములని పరిగణింపఁబడినవో యాదేశవాసు లాస్మృతులపైఁ గినియరాదు. యజ్ఞార్హమగు దేశ మెద్దియనఁగా:

శ్లో. "కృష్ణసారస్తు చరతి మృగో యత్ర స్వభావతః,
న జ్ఞేయో యజ్ఞియో దేశో మ్లేచ్ఛదేశ స్త్వతఃపరః." ౨౩

జింక యేభూభాగమున స్వభావము చేతనే నివసించునో (అనఁగాఁ బట్టితెచ్చి యిదిగో జింక యిందున్నదనకయుండ) యది యజ్ఞార్హమగు దేశమని తెలియఁదగినది. అట్లుగానిది మ్లేచ్ఛదేశ మగును.

"హిమవద్వింధ్యయోర్మధ్యం యత్ప్రాగ్వినశనాదపి,
ప్రత్యగేవ ప్రయాగాచ్చ మధ్యదేశః ప్రకీర్తితః. ౨౧
ఆసముద్రాత్తు వై పూర్వాదాసముద్రాత్తు పశ్చిమాత్,
తయోరేవాంతరం గిర్యోరార్యావర్తం విదుర్బుధాః. ౨౨
ఏతాన్ ద్విజాతయో దేశాన్ సంశ్రయేరన్ ప్రయత్నతః,
శూద్రస్తు యస్మిన్ కస్మిన్వా నివసేద్వృత్తికర్శితః." ౨౪

(మను. ౨ అధ్యా.)

"వినశనాత్ సరస్వత్యంతర్ధానదేశాత్" అని వ్యాఖ్య.

మధ్యదేశములని యార్యావర్తాంతర్భాగమునఁ గల వానికేపేరు. ఇంచుక భేదముమాత్రము గలదు. ఆదేశములను ద్విజాతులు బ్రహ్మక్షత్రియవైశ్యులు యజ్ఞాదికర్మసిద్ధికొఱకుగా

నాశ్రయింపవలయునని తాత్పర్యము. మృగములను అనఁగాఁ గ్రూరమృగములు కానివానిని జింకల నని యర్థము. ఏ దేశమున హింసింపరో యా దేశమున నవ్వి స్వభావముగాఁ దిరుగుచుండు ను. అనఁగా నిర్భయముగా సంచరించుచుండును. అట్టిదేశమే యజ్ఞార్హమని స్మృతి చాటుచున్నది. దీనింబట్టి హింసాకర్మ మే దేశమున లేదో యది యజ్ఞార్హ మనవచ్చును. అనఁగా నహింసాకర్మప్రధాన దేశమని యర్థము. అట్టిదేశము యజ్ఞార్హమనఁగాఁ బరమపావన దేశమని భావము. తక్కినవి మ్లేచ్ఛ దేశములనఁగా యజ్ఞానర్హములని సారము. జంతుహింసా ప్రధానమని యర్థము. అట్టిదేశమునఁ బరిశుద్ధకర్మములకు నవకాశము లేదని మన మెఱుంగవలయు.

"దేశకాల ఉపాయేన ద్రవ్యం శ్రద్ధాసమన్వితం,
ప్రాప్తే ప్రదీయతే యత్తత్సకలం ధర్మలక్షణమ్." ౬

(యాజ్ఞవల్క్యస్మృతి ఆచారకాండము.)

"దేశో యస్మిన్ మృగః కృష్ణ ఇత్యుక్తలక్షణః."

అని విజ్ఞానేశ్వరుఁడు.

వీనింబట్టిపరికింపఁగా నన్నియుఁ గర్మార్హ దేశములు కావ నియుఁ, గొన్నిమాత్రమే యగుననియు, నందే యజ్ఞకర్మ మొన రించిన ఫలము గలుగుననియుఁ దేలెడిని. ఆనియమము నను సరించియే యార్యావర్త ముత్తమస్థలమని పెద్దలందు సత్ర యాగ మొనరించుచు సకలపురాణముల నితిహాసముల వెల యించిరి. మహర్షివాసార్హమగు దేశము పరమపవిత్రముగాక మఱేమగును? భూతదయగలవా రుండునదియే పరమపావన

మని యిట సారమనుసిద్ధాంతమును మన మంగీకరింపవల యును.

"యజ్ఞచ్ఛిద్రం భవత్యేతత్సర్వేషామశివాయ నః
తత్తథా క్రియతాం రాజన్ యథాఽచ్ఛిద్రః క్రతుర్భవేత్." ౧౧

అను నీభాగమునఁగలవిశేష మరయుదము. ఇంద్రుఁడశ్వము నపహరింపఁగా నుపాధ్యాయులందఱు "రాజా! యజ్ఞాశ్వమును దేఁబంపుము. అది రాకయున్న నీయజ్ఞము పూర్తికానేరదు. విఘ్నమైన మనకెల్ల హానిగలుగును. అటుగాకయుండనొనర్పు" మని ప్రార్థించిరి. ఇందుఁగలవిశేష మేమి ? వేదవిహితకర్మము లదృష్టఫలకములు. కావునఁ గడుజాగరూకులై వాని నిర్వహింప వలయు. విధి నతిక్రమింపరాదు. విఘ్నముకలుగరాదు. ఇందేది పాసఁగినను యజమానునకేకాక యుపాధ్యాయులకును గీడు మూఁడును. కనుకనే "యథావిధి" అనుశాస్త్రము పుట్టినది. దానినిమీఱి ప్రవర్తింపరాదు. యజ్ఞకర్మము శ్రౌతము. కాన దానికి నేదేశమునఁగాని మార్పులు లేవు. యజ్ఞము సత్కర్మములలో నుత్తమమైనది. యజ్ఞమనఁగా బ్రహ్మయజ్ఞాదిపంచకమా. లేక జ్యోతిష్టోమాదిసముదాయమా యన్నప్రశ్నము కలదు. "యజతఇతి యజ్ఞః. యజ దేవపూజాసంగతికరణదానేషు." అని వ్యుత్పత్తి. దేవపూజయే యజ్ఞము. అని యమరము.

"స్వాధ్యాయేన జపైర్హోమైస్త్రైవిద్యేనేజ్యయా సుతైః,
మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః." ౨౮

(మనుస్మృతి ౨ అధ్యా.)

"వేదాధ్యయనేన వ్రతైర్మధుమాంసవర్జనాదినియమైః హోమైః సావిత్రచరుహోమాదిభిః సాయంప్రాతర్హోమైశ్చ వ్రతేష్వప్రాధాన్యాదస్య పృథ

గుహస్యానః. ఇజ్యయా బ్రహ్మచర్యావస్థాయాం దేవర్షిపితృతర్పణరూపయా, గృహస్థావస్థాయాం పుత్రోత్పాదనేన, మహాయజ్ఞైః పంచభిర్బ్రహ్మయజ్ఞాదిభిః, యజ్ఞైః జ్యోతిష్టోమాదిభిః, బ్రాహ్మీ బ్రహ్మప్రాప్తియోగ్యేయం తనుః తన్వవచ్ఛిన్నఆత్మా, క్రియతే, కర్మసహకృతబ్రహ్మజ్ఞానేన మోక్షావాప్తేః.” అని కుల్లూకభట్టు.

“యజ్ఞానాం తపసాం చైవ శుభానాం చైవ కర్మణాం,
వేద ఏవ ద్విజాతీనాం నిశ్శ్రేయసకరశ్శుభః. ౪౦
మధునా పయసా చైవ స దేవాంస్తర్పయేద్ద్విజః,
పితౄన్ మధుఘృతాభ్యాంచ ఋచోఽధీతే హి యోఽన్వహం.”
(యాజ్ఞవల్క్యస్మృతి ఆచారాధ్యాయము.)

“యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః,
తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగస్సమాచర. ౯
సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః,
అనేన ప్రసవిష్యధ్వమేష వోఽస్త్విష్టకామధుక్. ౧౦
దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః,
పరస్పరం భావయంతశ్శ్రేయః పరమవాప్స్యథ. ౧౧
ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః,
తైర్దత్తాన ప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః. ౧౨
యజ్ఞశిష్టాశినస్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః,
తే త్వఘం భుంజతే పాపాః యే పచంత్యాత్మకారణాత్.” ౧౩
(గీత 3 అధ్యాయము.)

“ ‘యజ్ఞోవైవిష్ణుః’ ఇతి శ్రుతేః. యజ్ఞ ఈశ్వరః తదర్థం యత్క్రియతే తద్యజ్ఞార్థం కర్మ......ముక్తసంగః కర్మఫలసంగవర్జితస్సన్ సమాచర. అనేన యజ్ఞేన ప్రసవిష్యధ్వం ప్రసవో వృద్ధిః ఉత్పత్తిః, తాం కురుధ్వం.

**వివ యజ్ఞైః వః యుష్మాకం అస్తు భవతు ఇష్టకామధుక్. దేవయజ్ఞాదీని నిర్వ ర్త్య తచ్ఛిష్టమశనం అమృతాఖ్యం అశితుం శీలం, యేషాం తే యజ్ఞశిష్టాశిన స్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః సర్వైః పాపైః చుల్ల్యాదిపంచ సూనా కృతైః ప్రమాదకృతహింసాజనితైశ్చ అన్యైః. యే త్వాత్మంభరయః భుంజతే తే త్వఘం పాపం స్వయమపి పాపాః యేపచంతి పాకం కుర్వంతి ఆత్మకారణాత్ ఆత్మహేతోః.”** **(అని శంకరభగవత్పాదులు.)**

ఇట్లు పెంచి వ్రాయఁబూనిన నొకమహాగ్రంథమగును కాన వదలెదను. స్థాలీపులాకన్యాయమున నించుక స్మృతులతాత్పర్య మిద్దియని తెలిపితిని.

ఇఁక నిందుఁగలసారమును బరికింతము. యజ్ఞమనఁగా దేవపూజ యని యర్థము మనుస్మృతికాలమునకు బ్రాహ్మణుల కుంగూడ మాంసభక్షణము విధివిహిత మైనది. ద్వాపరయు గాంతమున భగవంతుఁడు ప్రతిపాదించిన గీతోపదేశకాలము నందును సర్వమేధ్యమాంసభక్షణము నిషేధింపఁబడియున్నను, గొన్ని మేధ్యపశువులమాంసము నిషేధింపఁబడలేదు. యజ్ఞమున మిగిలినయన్నము నమృతముగాఁ బరిగణింపఁదగినదని సాధుమత ము. ఆయమృతమును భుజింపఁగా సకలపాపములు తొలంగు నని భగవంతుఁడుపదేశించెను. ప్రమాదమున హింసచేయఁగాఁ గలిగినపాపములు తొలంగును. కావున యజ్ఞమనఁగా హింసా కర్మరహితమైనదనియే యర్థము. అట్టియజ్ఞములు ఫలములను గోరక చేయఁదగినవి. కాఁబట్టి మహాయజ్ఞములని మనుస్మృతి పేర్కొనియెను. ఫలమునుగోరి హింసాకర్మముగలవి జ్యోతిష్టో మాదులు కాన నవి యజ్ఞములనఁబడునని మనువునాశయము. హింసాకర్మప్రధానములే యాభిచారికము లనంబడును.

అవియు యజ్ఞములే. బహువిధజంతుహింసాపూర్వకస్వోప
కారకములు. కాఁబట్టి యవి నీచములయ్యెను.

యజ్ఞము కొనసాగక నిలిచినచో నపారదుష్ఫలము
నొసంగును. తుదకు వంశహానియు నాపాదించును. కావుననే

"అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్,
అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ." ౨౮

(గీత ౧౭ అధ్యా.)

"యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిం. ౨౩
తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి." ౨౪

(గీత ౧౬ అధ్యా.)

అని శ్రీకృష్ణమూర్తి బోధించెను. మానవబుద్ధిసామాన్యముగాఁ
గర్మవశమున మాఱుచుండును. ఆమార్పు నియతముగాక
యనియతముగఁగూడ నుండును. శాస్త్రము లతీంద్రియజ్ఞులచే
వేదార్థమును సంగ్రహించి రచింపఁబడినవి. కావున యుగ
ములు మాఱినను వానిధర్మములు మాఱవు. ఎన్నివంకరలు
తిరిగిను మానవప్రవృత్తి తుద కాశాస్త్రధర్మములనే యాశ్ర
యించును. అట్టులౌటఁ గార్యాకార్యనిర్ణయమునందు శాస్త్ర
మునే ప్రమాణముగా గ్రహింపవలయునని భగవంతుఁడు నిర్ణ
యించెను. అద్దానిని వదలి చేసినకర్మములు సత్ఫలముల నీయఁ
జాలవు.

మహామతులారా! ఈకాలమున యజ్ఞకర్మము తగ్గినది.
ఎందేని సాగినను సాధారణముగా నాలోచింప నయ్యది స్వార్థ

మునకే చేయఁబడుచున్నట్లు తోఁచును. దేవతాప్రీత్యర్థమై చేయుయజ్ఞము ఫలాభిసంధిరహితముగనే యుండవలయును. అట్టివి సాగకయుండుటచే దేవతాప్రసాదము మనవైపు ప్రాలకయున్నది. దాననే యనావృష్టి మొదలగుదోషములు గలుగుచున్నవి. దేశక్షోభములు పొడకట్టుచున్నవి. కావున మహానీయులు ముక్తసంగులై యజ్ఞముల నొనరింపవలయును. ఋత్విక్కులును నియతవ్రతులు కావలయును. లేకయున్న నాయజ్ఞము సఫలము కానేరదు. ఇప్పటిఋత్విజులు నియతవ్రతులుగఁ దఱచుగా లేరనవచ్చును. అట్టివారు చేయించు యజ్ఞములు కర్తకును వారికిని హానికరములగుటయకాక దేశమునకుఁగూడ ననిష్టము నొడఁగూర్చుచున్నవి. ఈవిషయ మెఱింగినవారు కావున నాఋత్విజులు "సర్వేషామశివాయనః" అని తెల్పిరి. పాపభీతికలిగి దేశమునకు నుపకారముకలుగుంగాక యనునూహతో భక్తియుక్తులై యజ్ఞములను విధివిహితములుగా నొనరింపవలయు ననువిషయ మీభాగమునుండి మనము గ్రహింపవలయును. దుష్ఫలములుగాని సత్ఫలములుగాని కనఁబడవు. కానఁ గొందఱు లెక్కచేయక యిష్టానుసారము విధి నతిక్రమించి చేయుదురు. అయ్యది తుదకు వంశహానిం గల్పించును. ఈవిషయమున శ్రీకృష్ణవాక్యమును బ్రమాణముగ నమ్మి కుయుక్తులంబన్ని యశోహానిం గల్పించుకొనక సత్కర్మముల నాచరించునపుడు జాగ్రత్తగలిగి విధి నెఱింగిన ఋత్విక్కుల సంపాదించుకొని హింసాకర్మరహితముగ యజ్ఞముచేసిన నయ్యది దేవతాసంతృప్తిని జేయఁజాలి వృష్ట్యాదిరూపమగుసత్ఫలము నాపాదించును. గీతాశాస్త్ర

మీవిషయమునే విస్పష్టముగా బోధించుచున్నయది. రాజులకు నశ్వమేధము విధివిహితము కావున సగరచక్రవర్తి విధిజ్ఞులగు ఋత్విజులం గూర్చుకొనియే క్రతురాజమును బ్రారంభించెను. కావున వారు నిర్విఘ్నముగా సాగకయున్న మనకెల్లరకు హాని యగునని తెల్పిరి. విధిజ్ఞులు కాకయున్న నింకొక్కసాయము సంపాదింపుము. యజ్ఞము సాగింతుమనియే బోధించియుందురు. ఇంక విషయాంతరమును విచారింతము

"భిద్యమానా వసుమతీ ననాద రఘునందన,
నాగానాం వధ్యమానానామసురాణాం చ రాఘవ. ౧౯
రాక్షసానాం చ దుర్ధర్షస్సత్త్వానాం నినదోఽభవత్. (౩౯ సర్గము.)
యస్యేయం వసుధా కృత్స్నా వాసుదేవస్య ధీమతః,
కాపిలం రూపమాస్థాయ ధారయత్యనిశం ధరాం. ౨
తస్య కోపాగ్నినా దగ్ధా భవిష్యంతి నృపాత్మజాః. (౪౦ సర్గము.)

అనుస్థలమున నొకవిశేషము గలదు. దానిని గ్రహింపవలయును. సగరునాజ్ఞచేత నఱువదివేలుకుమారులు భూమినంతయుఁ గలయఁదిరిగి సకలభూతములను బాధింపసాగిరి. కనఁబడినసర్ప ముల నసురులను రాక్షసులను వధింపసాగిరి. వారియాక్రందన ధ్వనులు మిక్కుటమయ్యెను. దేవతలు బ్రహ్మకడకుంబోయి చెప్పుకొనఁగాఁ గపిలమునికోపాగ్నిదగ్ధు లగుదురని యతఁడు బదులుచెప్పెను. అని కథాసారము

భూతదయగలవారు సాధువులు. భూతదయగలవారినే భగవంతుఁడు ప్రేమించును. సర్వభూతములను భగవంతునిగనే చూచువారే యోగులు. వారే భక్తులు.

"అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ,

> నిర్మమో నిరహంకారస్సమదుఃఖసుఖః క్షమీ. ౧౩
> సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః,
> మయ్యర్పితమనోబుద్ధిర్యో మద్భక్తస్స మే ప్రియః." ౧౪
>
> (గీత ౧౨ అధ్యా.)

అని భగవంతుఁ డుపదేశించెను.

"ఆత్మనో దుఃఖహేతుమపి న కించిద్ద్వేష్టి. సర్వభూతానాత్మత్వేనహిపశ్యతి."
(అని శంకరభాష్యము.)

> "ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున,
> సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః." ౩౨
>
> (గీత ౬ అధ్యా.)

అనియు భగవంతుఁ డుపదేశించెను. తన్ను బాధించువానినిఁ గూడ నాత్మధర్మమునఁ బ్రేమించువాఁడు నాభక్తుఁ డనియెను. సర్వభూతాత్మరూపుఁ డొక్క—భగవంతుఁడని నమ్మువాఁడు యోగి యగునేకాని నేను దాను ననుభేదబుద్ధి గలవాఁడు యోగి కానేరఁడు యోగి కానివాఁడు భక్తుఁడు కాఁడు. భక్తుని సద్గుణములలో మొదటిది భూతదయ యని భగవంతుని యాశయము. ఎవ్వారికి భూతదయ లేదో అనఁగా సర్వభూతములను బ్రేమించుట వానియంతరంగమునఁగల యాత్మయొక్క—టియే యనుభావ మెవ్వారికి లేదో యట్టివారు భగవత్ప్రీతికిఁ బాత్రులు గారు. భగవత్తత్త్వ మెఱుంగక దానిఁ దూలనాడు వారనియే యిటఁ గలసారము. అట్టివారిని భగవంతుఁడే హింసించును.

సగరపుత్త్రులు వధించుచుండఁ గొన్నిభూతములు బాధించుచుండఁ గొన్నిభూతములు కుయ్యో మొఱ్ఱో యని

మొఱపెట్టెను. ఎవ్వారుగాని కొంతకాలమైన జీవింపఁగోరు వారు నిష్కారణముగా భూతములపై ద్వేష మూనరాదనియు, నట్లు ద్వేషించినచో భగవంతుఁడే వారిని నశింపఁజేయు ననియు, మన మెఱుంగవలయును. ఎన్ని వేదాంతోపన్యాసములు చెప్పినను భూతదయగలవారు కారేని, వారు భక్తులు కారని యుఁ, గుటుంభరులగు క్షుద్రులనియుమనము తెలిసికొని వారికి దూరముగ నుండవలయును. పాపము వృద్ధికాఁగా సమయము వేచియున్న పరమాత్మయే వారినిఁ దదుచితసాధనమున నడంచును. కావున భక్తులగువారు భూతదయగలవారుగా నుండవలయును. అట్టివారు సమదర్శను లగుదురు. సర్వసుగుణములలో భూతదయ ప్రధానము. సర్వదుర్గుణములలో హింస యుత్కృష్టము. సర్వధర్మములు నహింసారూపములు.

"భక్తానామనురక్తానామాశ్రితానాం చ రక్షితా,
దయావాన్ సర్వభూతేషు పరత్ర సుఖమేధతే." ౨౫
(అనుశాసనికపర్వము ౩౨ అధ్యా)

"యథా నాగపదేఽన్యాని పదాని పదగామినాం,
సర్వాణ్యేవ పిధీయంతే పదా జాతాని కౌంజరే. ౧
ఏవం లోకేష్వహింసా తు నిర్దిష్టా ధర్మతః పురా,
కర్మణా లిప్యతే జంతుర్వాచా చ మనసాపి చ. ౨
పూర్వం తు మనసా త్యక్త్వా తథా వాచాథ కర్మణా,
న భక్షయతి యో మాంసం త్రివిధం స విముచ్యతే. (అను ౧౧౪.౮)

అహింసా పరమో ధర్మస్తథాహింసా పరంతపః,
అహింసా పరమం సత్యం యతో ధర్మః ప్రవర్తతే. ౨౪
(అను ౧౧౫ అధ్యా)

"న హి లిప్యంతి పాపేన న చైతత్పాతకం విదుః,
న హ్యతస్సుకృతం కించిదిహ లోకే పరత్ర చ. ౧౯
యత్సర్వేష్విహ భూతేషు దయా కౌరవనందన,
న భయం విద్యతే జాతు నరస్యేహ దయావతః. ౨౦
దయావతామిమే లోకాః పరే చాపి తపస్వినామ్,
అహింసాలక్షణో ధర్మ ఇతి ధర్మవిదో విదుః. ౨౧
యదహింసాత్మకం కర్మ తత్కుర్యాదాత్మవాన్నరః,
పితృదైవతయజ్ఞేషు ప్రోక్షితం హవిరుచ్యతే. ౨౨
అభయం సర్వభూతేభ్యో యో దదాతి దయాపరః,
అభయం సర్వభూతాని దదతీత్యనుశుశ్రుమ. ౨౩
క్షతం చ స్ఖలితం చైవ పతితం క్లిష్టమాహతం,
సర్వభూతాని రక్షంతి సమేషు విషమేషు చ. ౨౪
అహింసా పరమో ధర్మ స్తథాహింసాపరోదమః,
అహింసా పరమం దానమహింసా పరమం తపః. ౩౮
అహింసా పరమో యజ్ఞ స్త్వహింసా పరమం బలం,
అహింసా పరమం మిత్రమహింసా పరమం సుఖం. ౩౯
అహింసా పరమం సత్యమహింసా పరమం శ్రుతం,
సర్వయజ్ఞేషు వా దానం సర్వతీర్థేషు చాప్లుతం. ౪౦
సర్వదానఫలం చాపి నైతత్తుల్యమహింసయా,
అహింస్రస్య తపోఽక్షయ్యమహింస్రో యజతే సదా. ౪౧
అహింస్రస్సర్వభూతానాం యథా మాతా తథాపితా."

(మహాభారతము అను ౧౧౬ అధ్యా.)

అను నీభీష్మోపదేశమునుబట్టి సర్వధర్మరూపిణి యహింస యని తేలెడిని. ధర్మమే భగవత్స్వరూపము కావున భూతముల

వలయునని స్వకార్యముకొఱకు హింసించువారు బలవంతులైనను భగవంతుఁడే నశియింపఁజేయునని యీకథ మనకుఁ దెలుపుచున్నది. దుర్బలులగువారిని బలవంతులు బాధించునపుడు వారేమియుఁ జేయఁజాలకున్నను వారియనుతాపమే పరమేశ్వరుఁ బ్రోత్సహించును. సమయమును గనిపెట్టి యాసర్వసాక్షి బలవంతులమని విఱ్ఱవీఁగుదుష్టులఁ బొడవడంచును. సగరకుమారులంతబలవంతులు గలరా? అఱువేలుగా వారుండియు నొక్కకపిలముని కోపాగ్నిదగ్ధులు కావలసినవారైరి. కారణమేమి? దౌష్ట్యమే వారిని బొడవడంచినది. లోకమున నెవ్వరుగాని సహాయసంపదలేదని దుర్బలుల నన్యాయముగ బాధింపరాదనియు, వారికి సాయము భగవంతుఁడే సర్వసాక్షిగాన కలఁడనియు, మన మెఱుంగవలయును. ఈకథనుండి యహింస వంటిధర్మము లేదనియుఁ, బరపీడనము స్వనాశహేతువనియు, మనము చక్కఁగా నేర్చుకొనవలయును.

"తే తం ప్రదక్షిణం కృత్వా దిశాపాలం మహాగజం,
మానయంతో హి తే రామ జగ్ముర్భిత్వా రసాతలమ్." ౧౭

(౪౦ సర్గము.)

ఇందొక్కవిషయము విమర్శింపఁదగును. సకలభూతములను బాధించుచు భయంకరాకారముగలిగియున్న యాసగరాత్మజులు తూర్పుదిక్కున భూభారమును మోయువిరూపాక్షనామకదిగ్గజమును గాంచి వలగొని మ్రొక్కి సంభావించి వెడలిరనునదియే కథాభాగము. అట్టియుద్ధతులు, కనఁబడినవారినెల్లఁ బొడవడంచుక్రూరులు, విరూపాక్షమహాగజమును జూడఁగనే భక్తిచే నమస్కరించి గౌరవించిరనుట పొసఁగునా? అనుశంక

కలుగకపోదు. సామాన్యదృష్టిం బరికించిన నది పొసఁగదనియే తోఁచును. కాని నిపుణముగా నాలోచించిన నది న్యాయ్యమే యని పొడకట్టును. ఎట్లనఁగా లోకపాలనశక్తి గలుగుట యనఁగా భగవత్కళ యధికముగా నందున్నదని భావము. ఆతేజస్సును గాంచినంతనే యెంతటిక్రూరులైనను లోఁబడుదురు. ఆతేజ మప్రధృష్యము. దానికి లోఁబడనివాఁడు తత్సమాన తేజస్సుగలవాఁడుగ నుండవలయును. అందు సత్త్వగుణము ప్రధానముగ నుండును. సత్త్వగుణ మెందు నధికముగా నుండునో ఆప్రాణి తేజస్సు శాంతమును గలిగించును. అట్టివారిమనస్సు సర్వభూతాంతరస్థుని బరమాత్మను ప్రేమించుచుండును. క్రూరజంతువులుకూడ నెవ్వారిం గాంచినపుడు శాంతము గలవగునో అట్టివారే సాధువులు. సర్వభూతదయాశాలురనఁగా వారే. వారిం గాంచినంతనే సకల దుర్గుణములు తగ్గి వానిపై శాంతము వెల్లివిరియును. మహామునులయాశ్రమములయందు సహజద్వేషముగల జంతువులు కూడ దానినిమాని స్నేహభావమున వర్తించునని యెన్నియో తావులఁ గనఁబడును. కొంద ఱది యబద్ధమందురు. కాని వారికిఁ బ్రపంచజ్ఞానము శూన్యమనుటకంటె వేఱేదియు ననరాదు.

"యద్యద్విభూతిమత్సర్వం శ్రీమదూర్జితమేవ వా,
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంశసంభవమ్. ౪౧
(గీత ౧౦ అధ్యా)

అన్న శ్రీకృష్ణహితోపదేశము వారికి నచ్చదు కాఁబోలు. అట్టి

తేజోవంతము కావుననే వారద్దానికి నమస్కరించి గౌరవించిరని యెఱుంగందగు.

విరూపాక్షమను దిగ్గజము భూమిని మోయుచున్నదా యని ప్రశ్నించువారు కలరు. భూభారమును ధరించుట యనఁగాఁ దనపరిశుద్ధమనస్సునందు భూమికిఁ జేటువాటిల్లక యుండవలయునని కోరుటయే యని భావము. మహానుభావులు లోకులమేలుకోరుట స్వభావము. వారియూహచేతనే ప్రజలు నెమ్మదిం గాంతురు. వారిదర్శనమున ననేకులు తరింతురు. ఆపన్నిర్ముక్తు లగుదురు. వాంఛలు ఫలించును. సత్త్వగుణప్రధాను లగుసాధువులు సర్వదా లోకములకు నేయాపదలు గలుగక యుండఁగోరుచుందురు. అట్టివారితపస్సు లోకమున కపారోపకారము చేయఁజాలును. తద్దర్శనమాత్రమున మూర్ఖులు సాధువు లగుదురు. ఇట్లే తక్కిన దిగ్గజముల విషయము నని యెఱుంగందగు. ఒక్కగజముచాలక యిన్ని కావలయునా యందురేని భూమండల మతివిశాలము. కాన నెందఱో భగవదంశసంభూతులు నిరంతరము లోకక్షేమమును గోరుచుం దపస్సొనరించుచుందురు సాధారణముగా జనులవాడుకయందు నీయాచారము కలదు. సత్కాలక్షేపము చేసినతరువాత "స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాన్ లోకాస్సమస్తా సుఖినో భవంతు" అని పఠించుట కలదు. అనఁగా సత్కాలక్షేపఫలము లోకమున కుపకరింపవలయునని కోరవలయునని సారము. ఇట్టులుండఁగా జగత్కుటుంబులగువారు తమతపస్సు వ్యయించి లోకసుఖమును గోరుట విశేషముగాదనియు, వారి కది నైజమేయనియుఁ దలంపవలయును.

"దదృశుః కపిలం తత్ర వాసుదేవం సనాతనం,
హయం చ తత్ర దేవస్య చరంతమవిదూరతః. ౨౫
తే తం హయహరం జ్ఞాత్వా క్రోధపర్యాకులేక్షణాః,
ఖనిత్రలాంగలధరా నానావృక్షశిలాధరాః,
అభ్యధావంత సంక్రుద్ధా తిష్ఠతిష్ఠేతి చాబ్రువన్. ౨౮
రోషేణ మహతావిష్టో హుంకారమకరోత్తదా,
తతస్తేనాప్రమేయేన కపిలేన మహాత్మనా,
భస్మరాశీకృతాస్సర్వే కాకుత్థ్స సగరాత్మజాః." ౩౦
(౪౦ సర్గము.)

అనుభాగమును బరికింతము.

సగరపుత్త్రులీశాన్యభాగమును బరికించుచుండ యజ్ఞాశ్వము కపిలమునియాశ్రమముచెంతఁ గనఁబడియెను. ఆముని యజ్ఞాశ్వహర్తయని వారు తలంచి నానావిధక్షుద్రాయుధముల ధరించి యామునిపైఁబడ నరిగిరి. మహాకోపమున నమ్ముని హుంకరించి వారిని భస్మమొనరించెను. అని కథాసంగ్రహము. ఇంతకుముందే వీరొనరించినసకలభూతబాధయే వీరిమరణమునకు హేతువయ్యెను. దిగ్గజమును గారవించినవీరు మునియనియు, నశ్వముతో మునికిఁ బనియుండదనియు నాలోచింపరైరి. ఏల? కర్మము వారిని బురికొల్పసాగెను. కపిలమునినిసైతము ప్రోత్సహించెను. సాగరులను దేహస్మృతిలేనివారిగా నొనరించెను. మంచిమాటల నిది మీకెట్లువచ్చె ననియు నడుగకయుండఁ జంపునూహగలవారిగా నొనరించెను. కావున సాగరులకర్మమే సకలకార్యములందీర్చునది. వారస్వతంత్రులు. కర్మముత్రిప్పులకు లోనై తిరుగువారు. కాకయున్న నించుకంతయే నాలోచింప

కుందురా? మునిరైన యజ్ఞాహర్త యెవ్వఁడని పరికించి యిం ద్రుని శపింపఁడా? సాగరులు కపిలముని మూలమున భస్మము కావలయునన్నియు, నీకారణమున లోకమునకు గంగావతరణ రూపమగు మహోపకారము కావలయుననియు, భగవంతుని తలంపు. దానిని మార్ప నెవరికిని దరముకాదు. మార్పఁజాలుదు మనువారే మూఢు లనంబడుదురు.

"యద్యహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి. ౫౯
స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్. ౬౦

(గీత ౧౮ అధ్యా.)

అన్న భగవదుపదేశమే యిందులకు నిదర్శనముగా గ్రహింపం దగు. ఇట్టికార్యము సాగినఁగాని లోకమునకు మహోప కారము గలుగదన్న కర్మోద్దేశము వ్యర్థముకాదు. కావునమాన వులు కర్మబద్ధులమనియు, నస్వతంత్రులమనియుఁ దలంచుచు, సహజకర్మముల నాచరించుచుఁ, గర్తృత్వాభిమానమును మాని, యీశ్వరునియం దెల్లభారములువైచి, తత్సేవాపరాయణులు కావలయుననియే యీభాగమునుండి గ్రహింపఁదగువిషయము. ఇఁకఁ దరువాతి శ్రీరామచరిత్రమును బఠింతము.

## అంశుమంతుఁడు యజ్ఞాశ్వము గొనివచ్చుట.

* శ్రీరామమూర్తికి విశ్వామిత్రుఁడు తరువాతికథను దెలుపఁబూని యిట్లు పలికెను. రఘునందనా! కపిలముని కోపా గ్నిచే నలువదివేలసగరపుత్త్రులు దగ్ధులుకాఁగా నావార్త తెలి

---

* ఇయ్యది నలువదియొకఁడవసర్గమునుండి గ్రహింపఁబడినది.

యిక సగరుఁడు కొంతకాలముచూచి మనుమని నంశుమంతుని దేజోవిరాజితుని దిలకించి, "నాయనా! అస్త్రవిద్యయం దాఁటి తేఁటి శూరుఁడవై యున్నవాఁడవు పరాక్రమమున విఖ్యాతి నందిన పూర్వరాజులతో సరిపోల్పఁదగినవాఁడవు. యజ్ఞాశ్వము కొఱకు నీపినతండ్రులు పోయి చాలకాలమయ్యెను. వారి వార్తయే తెలియరాదు. వారివృత్తాంతము యజ్ఞాశ్వహర్తను వెదకుము. భూమి యంతరమునఁ గలజంతువులు వీర్యవంతములు. భూరితరాకృతులు. కావున వాని నడంచుటకై యాయుధముల ధరించి పొమ్ము ఖడ్గాదులం గైకొని యరుగుము. అందెందుఁగాని నమస్కరింపఁదగినవారున్న నమస్కరింపుము. విఘ్నకర్తలను, అశ్వాపహారకుని రూపుమాపుము. సఫలప్రయత్నుఁడవై మరలివచ్చి నా యీయజ్ఞమును సమాప్తినొందింపుము."

మహాత్ముఁడగు సగరచక్రవర్తి యీలాగు చెప్పఁగాఁ దదుక్తప్రకార మాయుధములం దాల్చి శీఘ్రగతిం బయనము సాగించెను. పరాక్రమమునఁ దనతండ్రులు త్రవ్వినమార్గముననే పోయెను. సకలదైత్యదానవాదులు సేవింప నలరుదిగ్గజమును మహాతేజోవంతముం గాంచి వలగొని మ్రొక్కి కుశలమడిగి తనతండ్రులవార్తను, ఘోటకమును హరించిన వానితెఱంగును బ్రశ్నించెను ఆగజరాజు, "ఓ యసమంజతనూజా! నీవచ్చినకార్యము ఫలవంతమగును. త్వరగా నగరమునకుఁ బోవఁగలవు." అని చెవులకింపుగాఁ బలికిన విని యట్లే తక్కుంగలదిగ్గజములం బ్రశ్నించి * యయ్యావి వరప్రభావమున

* తైశ్చ సర్వైర్దిశాపాలై ర్వాక్యజ్ఞై ర్వాక్యకోవిదైః. అని మూలము.

మాటలాడఁగలిగి యితరుల మాటలయందలియర్థము నెఱుంగఁ జాలినవి కానఁ దొలిగజరాజము చెప్పినచొప్పునం దెలుప నాలకించి వానిని సమ్మానించి యవి తన్ను బహూకరింపఁగా మఱియుఁ బురికొలుపఁగాఁ దరలి వడిగాఁబోయి భస్మరాసు లైన తనతండ్రులస్థితిని గాంచెను. ఆవిధ మెఱింగి పొంగివచ్చు దుఃఖము నాపుకొనఁజాలక బోరున నేడ్చెను. అందుఁ గొంత దవ్వునఁ దిరుగుచున్న యజ్ఞాశ్వముగపడఁగా నాభస్మరాసులు తనతండ్రులవే యని నిశ్చయించి మఱింత దుఃఖించెను.

వెంటనే యామహాతేజుఁ డాపితరుల కుదకక్రియలు నిర్వర్తింప నాశించి జలములకొఱకు వెదకఁగా నందొక్క జలాశయముకూడఁ గనంబడదయ్యెను. దూరము పరికించి యెందునుంగానక యందొక్కతావున వాయువేగముగలిగి ఖగములకెల్ల నీశ్వరుండయియుండు గరుత్మంతునిం గాంచెను. ఆమహనీయుఁడే చచ్చినతనతండ్రులకు మేనమామ. కావున మహాబలుఁడగు నాగరుడుఁ డంశుమంతునిం గాంచి "వత్సా! నీపిన్నతండ్రులచావు లోకసమ్మతము. కాన దుఃఖింపకుము. మహాత్ముఁడగు కపిలమహాముని దనకోపానలమున వారిని నీఱు గావించెను. ఆకపిలముని బ్రాహ్మణుఁడు. కావున నతనిమూలమున మరణించిన నీపితృవ్యులకు జలతర్పణము చేయరాదు. సామాన్యజలముల నొనరించుతర్పణము వారికిం జెందదు. నీవు ప్రాజ్ఞుఁడవు కాన నీవిషయ మెఱుంగుదువు. హిమాలయము గలదు కదా. ఆతని పెద్దకూఁతురు గంగాదేవి కలదు. నీవు తజ్జలములనే తర్పణము చేయుము. కేవలతర్పణమే కాదు. లోకపావని కావునఁ

దజ్జలముల నీభస్మరాసులఁదడుపవలయును. ఆగంగాదేవి తనజల ములం దడిసినవారిని స్వర్గలోకమును జేర్పఁగలదు. నీవు మహా భాగ్యవంతుఁడవు. యజ్ఞాశ్వముంగొని తాతకడ కరుగుము. యజ్ఞము చక్కఁగా నెఱవేఱఁజేయు"మని బోధించెను.

అంశుమంతుఁ డాగరుత్మదుపదేశమును గ్రహించి సవ నాశ్వమును గైకొని తనయశస్సు సర్వత్ర వ్యాపింపఁగాఁ బోయి దీక్షితుఁడై యున్న సగరమహీశనేతం గాంచి గరుడుని యుపదేశమును వినిపించెను. సగరుఁ డాఘోరవృత్తాంతము నాలకించి విధిప్రకారము యాగమును బూర్తినొందించి తద్గత మగు తేజమున వెలుంగుచు నగరమును బ్రవేశించెను. దుఃఖము నుంత శాంతింపఁగా గంగానదిం దెచ్చుటకుఁ బూనెఁగాని యేయుపాయము నాతనికిం బొడకట్టదయ్యెను. చాలకాల మాలోచించిన నుపాయమేదియుఁ దోఁపమి ముప్పదివేలయేండ్లు రాజ్యముపాలించి దేవలోకము వాసార్హమని యచటికింబోయి సుఖముండెను.

మహాశయులారా! సగరచరిత్రము ముగిసెను. ఈభాగ మునఁ గలవిశేషాంశములు కొలఁదిగఁ గలవు. సగరుని తొలి కొడుకు కసమంజుఁడు. వానిని దండ్రియే బాలహంతయన్న కారణమునను, దుర్వృత్తునినగరమున నుంచరాదన్న రాజ ధర్మము ననుసరించి వెడలఁగొట్టెను. ఆతనికొడుకే యంశు మంతుఁడు. ఇతఁడు మహాగుణశాలి యయ్యెను. కారణగుణ ములు కార్యమున సంక్రమించు నన్నపరిభాష కల్పితమే యని తేటగ గోచరించును. కావుననే భగవంతుఁడగు శ్రీకృష్ణ మూర్తి "గహనా కర్మణోగతిః" అని బోధించెను. ఎవ్వానికర్మ

మెట్టిదో యది సర్వేశ్వరికిఁ దప్పఁ దక్కుంగలవా రెఱుంగరు. ఒక్కవంశమునఁబుట్టినవారిలోనే యిరువురకైన నొక్కరీతిగాఁ గర్మముండదు. ఎవ్వారిమూలమున నెవ్వరెవ్వరి కెట్టియెట్టిబాధలు పొడమవలయునో, వారివారిమూలమున నాయాకార్యముల నాకర్మమే చేయించును. కొందఱను విజ్ఞానసంపన్నులనుగా నొనరించును. కొందఱ నజ్ఞానసాగరనిమగ్నచిత్తులనుగాఁ జేయును. ఇంకను గొందఱను జ్ఞానాజ్ఞానకృతకార్యకర్తలనుగా నొనరించును. ఎవ్వరి నెట్టిమార్గమునఁ బ్రవర్తింపఁజేయునో యదిమాత్ర మెవ్వరెఱుంగరు. ఎఱుంగఁదగినవాఁ డొక్కపరమాత్మయే. కావుననే కర్మము సర్వమూలకముగాఁ బెద్దలు పేరుకొందురు. తెలివితక్కువచే మధ్యవైష్ణవులు భగవంతుని సేవకన్న భాగవతులసేవ యుత్తమమనియు, భగవత్సేవ కర్మమునఁ బడఁద్రోయుననియుఁ బలుకుదురు. అది సాపాటురామన్నలమాటలని త్రోసివేయవలయును. భక్తసేవ భగవద్భక్తిసాధనమన్నచోఁ దలయొగ్గవలసినదే. భగవత్సేవకన్న నదిమిన్నయన్నమాట మోసపుమాట. గురువులమని పేరుపెట్టుకొని మంత్రోపదేశముచేయుచుఁ దమకు భక్తిలేశము లేకున్న నితరులకు భక్తులవలెఁ దోఁచుచుండు ధనార్థుల తుచ్ఛాలాపములు విశ్వాసార్హములు కావు. కర్మములను ఫలాభిసంధిరహితముగఁ జేయక యాత్మజ్ఞానము సంభవింపదు.

"వేదాభ్యాసస్తపో జ్ఞానమింద్రియాణాం చ సంయమః
అహింసా గురుసేవా చ నిశ్శ్రేయసకరం పరం. ౧౩
సర్వేషామపి చైతేషాం శుభానామిహ కర్మణాం,
కించిచ్ఛ్రేయస్కరతరం కర్మోక్తం పురుషం ప్రతి. ౧౪

సర్వేషామపి చైతేషామాత్మజ్ఞానం పరం స్మృతం,
తద్ధ్యగ్ర్యం సర్వవిద్యానాం ప్రాప్యతే హ్యమృతం తతః. ౮౫
షణ్ణామేషాం తు సర్వేషాం కర్మణాం ప్రేత్య చేహ చ,
శ్రేయస్కరతరం జ్ఞేయం సర్వదా కర్మ వైదికమ్. ౮౬
వైదికే కర్మయోగే తు సర్వాణ్యేతాన్యశేషతః,
అంతర్భవంతి క్రమశస్తస్మింస్తస్మిన్ క్రియావిధౌ. ౮౭
సుఖాభ్యుదయికం చైవ నైశ్శ్రేయసికమేవ చ,
ప్రవృత్తం చ నివృత్తం చ ద్వివిధం కర్మ వైదికం. ౮౮
ఇహ చాముత్ర వా కామ్యం ప్రవృత్తం కర్మ కీర్త్యతే,
నిష్కామం జ్ఞానపూర్వం తు నివృత్తముపదిశ్యతే. ౮౯
ప్రవృత్తం కర్మ సంసేవ్య దేవానామేతి సామ్యతాం,
నివృత్తం సేవమానస్తు భూతాన్యత్యేతి పంచ వై. ౯౦
సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని,
సమం పశ్యన్నాత్మయాజీ స్వారాజ్యమధిగచ్ఛతి. ౯౧
యథోక్తాన్యపి కర్మాణి పరిహాయ ద్విజోత్తమః,
ఆత్మజ్ఞానే శమే చ స్యాద్వేదాభ్యాసే చ యత్నవాన్." ౯౨

(మనుస్మృతి ౧౨ అధ్యా.)

కర్మము కామ్యమని నిష్కామమని ద్వివిధమనియు, నిష్కామ
కర్మమే యాత్మజ్ఞానహేతువనియు, కర్మము యోగియై చేయ
వలయుననియు, సర్వభూతములయందుఁ బరమాత్మను బరమాత్మ
యందు సర్వభూతములను సమానముగాఁ గాంచుచు నాత్మ
యజ్ఞము చేయువాఁడే ముక్తుఁడగుననియు, నీస్మృతివచన
సారము. సర్వకర్మములు వగలి సాపాటురామన్నల సేవించినఁ
గలుగునది ద్రవ్యవ్యయరూపమహాముక్తియే కాని వేఱొకఁడు

లేదు. కావునఁ గర్మమనునది యెల్లరకుఁగాని యొకవంశమునఁ బుట్టినవారికిఁగాని సమానము కాదనియు, స్వస్వకర్మానుసారము ప్రవర్తనముండుననియుఁ, గావున నసమంజుని దుష్కర్మ మాతనికొడుకగు నంశుమంతునకు ననువర్తింపఁబనియు, మన మెఱుంగవలయును.

అంశుమంతుఁడు మహాగుణవంతుఁడు. సగరునానతిం గైకొని తండ్రులను యజ్ఞాశ్వమును వెదకఁబోయెను. పోవునపుడు సగరచక్రవర్తి,

"అభివాద్యాభివాద్యాంస్త్వం హత్వా విఘ్నకరానపి,
సిద్ధార్థస్సన్నివర్తస్వ మమ యజ్ఞస్య పారగః."

అని హెచ్చరించి యాశీర్వదించెను.

ఆఱువేలకొడుకులు దుర్వృత్తులని సగరుఁ డెఱుంగును. కావుననే యేసాధువులను దూషించి బాధించి వధించి యేగతిఁ బుట్టిరో యని యనుమానించి యంశుమంతున కీమాట తెల్పె నని మనమూహింపవలయును. వత్సా! నమస్కరింపఁదగినవారికి నమస్కరింపుమనియె. ఏలయనఁగా:

"ఊర్ధ్వం ప్రాణా హ్యుత్క్రామంతి యూనస్థ్సవిర ఆయతి
ప్రత్యుత్థానాభివాదాభ్యాం పునస్తాన్ ప్రతిపద్యతే. ౧౨౦
అభివాదనశీలస్య నిత్యం వృద్ధోపసేవినః,
చత్వారి తస్య వర్ధంతే ఆయుర్విద్యాయశోబలమ్." ౧౨౧

(మనుస్మృతి ౨ అధ్యా)

పెద్దలకు నమస్కరించిననే యాయుర్విద్యాయశోబలములు వృద్ధియగునని మనువు శాసించెను. ఆధర్మ ముత్తమోత్తమ

మనియు,నభివృద్ధిహేతువనియు, సగరుఁడు మనుమనికిం దెల్పెను. సత్కార్యమునకు విఘ్న మొనరించువారిని దండింపుమనియుఁ దెల్పెను. క్షత్రియధర్మమును వదలి దయచూపకుమా యని హెచ్చరించెను.

“అదండ్యాన్ దండయన్ రాజా దండ్యాంశ్చైవాప్యదండయన్,
అయశో మహదాప్నోతి నరకం చైవ గచ్ఛతి.” ౧౨౮
(మ॥స్మృతి ౮ అధ్యా)

అని స్మృతి శాసించెడిని. ఆపద్ధతినే సగరుఁడు మనుమనికిం దెల్పెను.

“శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనం,
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజం.” ౪౩
(గీత ౧౮ అధ్యా.)

అని శ్రీకృష్ణపరబ్రహ్మముకూడ నర్జునున కుపదేశించెను.

“స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మనిరతస్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు. ౪౫
శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషం. ౪౭
సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్,
సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః.” ౪౮
(గీత ౧౮ అధ్యా.)

అనుభగవదుక్తి ననుసరించి ధర్మద్రోహులను వధించుట క్షత్రియునకుఁ బాతకముకాదనియే తేలెడిని.

తైశ్చ సర్వైర్వర్ధితో హ్యాప్తైర్వాక్యశిష్టైర్వాక్యకోవిదైః,
పూజితస్సహాయైశ్చైవ గంతాసీత్యభిచోదితః. ౧౧

అంశుమంతుఁడు దిగ్గజములకు నమస్కరించి తమవారివృత్తాంతమును యజ్ఞాశ్వవిషయము నడుగ నవి యతని గౌరవించి యశ్వమును దీసికొనిపోఁగలవని పలికెనని కథాసారము గజములు సగరపుత్త్రులతో మాటలాడక యంశుమంతునితో మాటలాడెననుట వింతగాఁ దోఁపక మానదు. మాటలాడ నేర్చి యితరులమాటఁ దెలిసికొనుశక్తిగలవియై యుండెననుటయుఁ జిత్రమేకదా యని ప్రశ్నించువారు గలరు. తొలుతఁ జిత్రముగనే తోఁచును. విమర్శింపఁగా న్యాయ్యమే యని స్ఫురించును. దిగ్గజములనఁగా సామాన్యగజములని యర్థము కాదు. భూభారవహనార్థమై భగవంతుని తేజస్సురూపమున నుండునని యభిప్రాయము. ప్రపంచోద్ధరణక్షములందఱు శ్రీ విష్ణుతేజస్సంభృతులే యని యెఱుంగవలయును.

"ఉచ్చైశ్శ్రవసమశ్వానాం విద్ధి మామమృతోద్భవం,
ఐరావతం గజేంద్రాణాం నరాణాం చ నరాధిపం. ౨౭
ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్,
ప్రజనశ్చాస్మి కందర్పస్సర్పాణామస్మి వాసుకిః." ౨౮
(గీత ౧౦ అధ్యా.)

అని భగవంతుఁడు తెలిపెను. ఇందుఁ జేర్కొనఁబడినవన్నియు లోకోపకారక్షమములు. భగవత్తేజ మిందు విశేషించి వెలయుచుండును. పశుపక్షిరూపమునఁ జేయఁదగు కార్యములను భగవంతుఁడు చేయఁబూని యాయారూపముల నాయాయితావుల నుండును. ఈసిద్ధాంతము నంగీకరించువారు దిగ్గజములు మాటలాడెనన్న నుబ్బురంపడరు. సిద్ధాంత మిది సమంజసము కాదను వారు భగవచ్ఛక్తినే యెఱుంగనివారు గాన వారికి నచ్చఁజెప్ప

నక్కఱయుండదు. సగరపుత్త్రులకు శుభముకలుగుమార్గము లేదుకావున వారితో మాటలాడలేదు. వృద్ధికాముఁడని యెఱింగియే యంశుమంతుని నాదరించి యాశీర్వదించి పంపెను. ఇందు సందియపడవలసినవిషయమే లేదు. భగవత్తేజమునకు సాధ్యముకానిపనియే లేదన్న నమ్మనివా రుండరని యను కొందును. ఉండిరేని వారికి నమస్కారమే సమాధానము.

"కపిలేనాప్రమేయేన దగ్ధా హీమే మహాబలాః,
సలిలం నార్హసి ప్రాజ్ఞ దాతుమేషాం హి లౌకికం. ౧౮
గంగా హిమవతో జ్యేష్ఠా దుహితా పురుషర్షభ,
తస్యాం కురు మహాబాహో పితౄణాం తు జలక్రియాం. ౧౯
భస్మరాశీకృతానేతాన్ ప్లావయేల్లోకపావనీ,
తయా క్లిన్న మిదం భస్మ గంగయా లోకకాంతయా." ౨౦

అంశుమంతునకు గరుత్మంతుఁడు దర్శనమొసంగెను. అంశుమంతా! కపిలముని క్రోధాగ్నిదగ్ధులు. కావున నీపితరులకు సామాన్యజలములఁ దర్పణముచేయరాదు. గంగానదీజలములచేఁ జేయవలయును. ఆజలములు పరమపావనములు కాన నవి యీభస్మరాసులం దడుపునేని వారికి స్వర్గసుఖము గలుగు ననియే కథాసారము. పితరులకు వెంటనే తర్పణముచేయ వలయు ననువిధియుండఁగా దానికి విరుద్ధముగా గరుత్మంతుఁడు తెలుపనేల? అనున దొకప్రశ్నము. సమాధానము వ్రాయక మానరాదు.

కపిలముని బ్రాహ్మణుఁడు. బ్రాహ్మణకోపహతులకుఁ దర్పణాదులు చేయరాదు.

“చండాలాదుదకాత్సర్పాద్బ్రాహ్మణాద్వైద్యుతాదపి,
దంష్ట్రిభ్యశ్చ పశుభ్యశ్చ మరణం పాపకర్మణాం.
తేషాం పాపవిశుద్ధ్యర్థం షణ్మాసం కృచ్ఛ్రమాచరేత్.
ఉదకం పిండదానం చ ఏతేభ్యో యద్విధీయతే,
నోపతిష్ఠతి తత్సర్వ మంతరిక్షే వినశ్యతి. (ఛాగలేయుఁడు.)
ప్రమాదాద్విషశస్త్రాగ్నిభృగ్వాదినిపాతస్తు యః,
కృచ్ఛ్రం షాణ్మాసికో జ్ఞేయ స్తస్య పాపాపనుత్తయే.”

“యస్తు చండాలశ్వపచసర్పపశుదంష్ట్రిభృగ్వగ్నిపాతబ్రాహ్మణవిషాన శనాశనిమార్గవహ్ని గళోద్బంధనజలసాహసచోరరజస్వలాశితవ్యాఘ్రశస్త్రపాతాత్ క్షుత్తృష్ణాదినిమిత్తైర్వా తః స్వపుత్రాదికృతశతపంచదశప్రాజాపత్య కృచ్ఛ్రచరణాద్వా చాంద్రాయణకృచ్ఛ్రాతికృచ్ఛ్రచరణాద్వా కాలశక్త్యా ద్యపేక్షయా శుద్ధ్యతి.” (హస్తామలకుఁడు.)

“ప్రమాదాద్యే మృతా విప్రా విషశస్త్రజలాదిభిః
తేషాం శరీరశుద్ధ్యర్థం ప్రాయశ్చిత్తం విధీయతే,
చాంద్రాయణద్వయం చాథ తప్తకృచ్ఛ్రచతుష్టయం
కారయిత్వా విధానేన దగ్ధవ్యాస్తే ద్విజాదిభిః.” (శంఖస్మృతి.)

అను నీస్మృతులు దుర్మరణమునకుఁ బ్రాయశ్చిత్తములనిర్ణయించి నవి. విప్రకోపమున మృతిగల్గిన నదియు దుర్మరణమే. వారికి సామాన్యజలాశయమునఁ గలయుదకములఁ దర్పణము చేయ రాదనియు, నొకప్పు డట్టులొనరించిన నయ్యది ఫలవంతము కాదనియు స్మృత్యభిప్రాయసారము. కావున సాగరులకు గంగాజలములఁ దర్పణము చేయవలయుననియు, నాభస్మరాసుల నాగంగాజలములఁ దడిపినఁగాని వారికి స్వర్గప్రాప్తిలేదనియు భావము. స్మృతులయందు దుర్మరణమునకుఁ బ్రాయశ్చిత్తము

చెప్పఁబడినది. కాని గంగోదకముల నయ్యది చేయవలయునని
చెప్పఁబడలేదు. కొన్నితావులఁ గాలముకూడఁ దెలుపఁబడి
నది. ఇట్లుండఁగా గరుత్మంతుఁడు గంగాజలములఁ దర్పణము
చేయవలయుననియు, లౌకికోదకములఁ జేయరాదనియుఁ జెప్పు
టకుఁ గలకారణ మేమనఁగా మహానుభావులు భావికాలజ్ఞానము
గలవారు. ఈసగరపుత్త్రులమూలమునఁ బ్రపంచమునకు మహో
పకారము కలుగవలయునని గరుత్మంతుఁ డూహించెను. దాన
నించుక యాలస్యముసాగి కర్మలోపముకలిగినను రాఁగల
మహోపకారమున నియ్యది నశించును. కావున నించుకపాపము
గలిగినను, ఒకకార్యము కాలముగడపి చేసిన లోకులకు
మహోపకారము దానిమూలమునఁ గలుగునేని అవశ్య మట్లా
చరింపవలయునని మన మూహింపవచ్చును. ఈఘట్టమున
నాంధ్రీకరణము లెట్లున్నవని యించుక తడవుదము. శ్లోకములు
పైనుదహరింపఁబడినవికాన నిట మరల వ్రాయనక్కఱ లేదని
తోఁచినను, బాలకమహాశయులకుఁ గష్టముగలుగనీయరాదని
యిట వ్రాయుచున్నవాఁడను.

"కపిలేనాప్రమేయేన దగ్ధా హీమే మహాబలాః,
సలిలం నార్హసి ప్రాజ్ఞ దాతుమేషాం హి లౌకికం. ౧౮
గంగా హిమవతో జ్యేష్ఠా దుహితా పురుషర్షభ,
తస్యాం కురు మహాబాహో పితౄణాం తు జలక్రియాం. ౧౯
భస్మరాశీకృతా నేతాన్ ప్లావయేల్లోకపావనీ,
తయా క్లిన్నమిదం భస్మ గంగయా లోకకాంతయా. ౨౦
షష్టిం పుత్త్రసహస్రాణి స్వర్గలోకం నయిష్యతి." (అని మూలము.)

చ. "అతఁడు మహాబలుండు ప్రియమార వచించెను బూరు
షోత్తమా, పితరులదౌ వధం బిది పవిత్రజనాదృతఁ గాంచి
నట్టిదె, హితమయి యొప్పునట్లగుట నింక విచారముఁ
బొందనేల? య, ప్రతిమమహత్త్వశాలియయి భాసిలు
నక్కపిలుండు వారలన్.

మ. గురుకోపాగ్ని దహించె బ్రహ్మమునిరాట్కోపాగ్ని దగ్ధాం
గులా, ధరణీశాగ్రణిపుత్త్రరత్నములకున్ ధాత్రీస్థలిం గల్గు
పు, ష్కరణిం గైకొని తర్పణం బొనరుపంగా రాదు తన్నీ
రముల్, సురమార్గంబుననే నశించునుగదా క్షోణీశపుత్త్రా
త్మజా.

తే. ప్రాజ్ఞుఁడవు నీవు గాన నీవార్త నీకుఁ
దెలియనిది కాదు హిమవదద్రి తొలికూఁతు
రగును గంగాభవాని మహాభుజా! త
గంగ నద్దానియందె సేయంగవలయు.

క. గంగాజలములఁ దర్పణ
ముం గడుభక్తిని నొనర్చి మునుకొని సంతృ
ప్తిం గనఁగూడదు సజ్జన
సంగా యాభస్మరాశి స్వర్ణది దయతోన్.

ఆ. తడుపవలయు నద్ది తగలోకపావని
గాన నట్లొనర్చెనేని లోక
కాంతరయి చెలంగు గంగాభవాని సం
స్పర్శముననె నీదుజనకులెల్ల."

(ఆంధ్రశ్రీమద్రామాయణము.)

ఆ. "అప్రమేయుఁ డైనహరి కపిలాకృతిఁ
గసిమసంగి వీరిఁ గసిమసంగి
మసిగఁజేసెఁ జుమ్ము మహితవిక్రములకు
వగవఁజన్నె రాజవర్యతనయ.

ఉ. శూరుల కీధరామరనిషూదితపంక్తికి వారిదానముల్
వారిజమిత్రవంశ్యతగవా తగువారిని జేయ కిట్లు ని
స్సారపుసారసాకరము సారములం బొనరింపఁబూన నీ
హారధరాధరాగ్రతనయాంబువులం ఘటియింపు మేలగున్."

(వావిలికొలను రామాయణము.)

నిష్పక్షపాతమతులగు పెద్ద లిందలిబాగోగుల విమర్శింతురు గాక. కొందఱు విమర్శకశిఖామణులు పక్షపాతమున మూలమునఁ గలరసము నారామాయణము లేదనియు, వాల్మీకిరామాయణమున నంతయు నిమిడియున్నదనియుఁ బలుకుటయేగాక, పాదపూరణములు నాగ్రంథమునఁ గలవని నన్నుఁ దెగడిరి. ఇందుఁజూపిన వావిలికొలను రామాయణమునందలి "శూరుల కీధరామర..." అనుపద్యమునఁ బాదపూరణము లెన్ని గలవో పరికింపుఁడు. వాని లెక్కింపక నన్నాక్షేపించుట యెంతటి న్యాయమో పరికింపుఁడు. నేను వారిరామాయణమును విమర్శింపఁబూనలేదు. నన్నాక్షేపించినందులకు విమర్శకులకు వారిపాదముల నెత్తిచూపుటయేకాని గ్రంథకర్తలనుగుఱించి యీవ్రాఁతకాదని మఱియొక్కసారి మనవిచేయుచున్నాఁడను. లోపములులేనిగ్రంథమే యుండుటరుదు. వారియాక్షేపములకు సహస్రోదాహరణములు కనఁబడుచుండఁగా వానిని వదలి

యితరుల నాక్షేపించుట న్యాయ్యముకాదనియే నామనవి. ఇఁకఁ గథాభాగమునకు వత్తము.

అంశుమంతుఁడు గరుత్మంతునిమాటల నంగీకరించి హయమునుగొని నగరమున కరిగి సగరున కావార్తం దెలిపెననియు, నతఁడు దుఃఖవార్తవిని పరితపించి యజ్ఞము సమాప్తి నొందించి గంగానయనప్రయత్నమునఁ దగినయుపాయము తోఁపమి ముప్పదివేలయేండ్లు రాజ్యముచేసి స్వర్గమున కరిగెననియు, రామాయణమునఁ గలదు. దగ్ధులగుపుత్త్రులకు నౌర్ధ్వదైహికముల నొనరించెనని కాని లేదని కాని గ్రంథమునఁ గానరాదు. ఏలొకో తెలియదు. గరుడునివాక్యము ననుసరించి మానియుండు ననవచ్చును. యజ్ఞము పూర్తిచేసిన పిదప నొనరించియే యుండుననవచ్చును స్వర్గప్రాప్తులనుగా నొనరింపఁ బ్రయత్నముచేయ నూహించి తగినవెర వావయస్సునఁ దోఁపమి నూరకుండు ననవచ్చును. సగరుఁడు, తరువాత నంశుమంతుఁడు, పిదప దిలీపుఁడు రాజ్యము చేసియు, వారికిఁ జేయందగు క్రియలను జేయకయుందురా యనుశంక పొడమును. సమాధానము మహాత్ములు చెప్పఁదగుదురు. లోకాచారము ననుసరించి క్రియల నొనరించియుందురనియు, దుర్మరణదోషముపోయి స్వర్గప్రాప్తిని గల్పించుగంగానయనప్రయత్నమున సమర్థులుకారైరనియు నే నూహించుచున్నాను. ఈ యూహకుఁ దగినకారణములఁ దెలుప నాధారములుమాత్రము లేవు. ఇఁకఁ దరువాతికథ నాలకింపుఁడు.

## భగీరథుఁడు గంగనుగూర్చి తప మొనరించుట.

*సగరచక్రవర్తి పిదప మంత్రిప్రముఖులు రాజుగా నంశుమంతు నొనరించిరి. ఆధార్మికునకు దిలీపుఁడు కుమారుఁడు. తండ్రితో సమానుఁడై రాజ్యమును బాలించెను. అంశుమంతుఁడు కొడుకునందు రాజ్యభారము నునిచి గంగను *దేఁగోరి తపోనియతి నుండఁదలఁచి తపస్వియై హిమాలయమునఁగల పరమపావనశిఖరమున ముప్పదిరెండువేలసంవత్సరములు తపస్సొనరించి సఫలప్రయత్నుఁడు కాకయే స్వర్గమున కరిగెను.

దిలీపుఁడు తనపూర్వు లట్లుపమృత్యువుపాలగుట విని తనతండ్రి వారికి సుగతిఁ గల్గింప ఘోరతపస్సుచేసియు వారికి స్వర్గతులు కల్పింపఁజాలకపోవుట నెఱింగి మహాదుఃఖమునొంది, తండ్రిపూన్కి నెఱవేఱుట యెట్లనియుఁ, దమపూర్వులకు సుగతి గల్గుట యెట్లనియుఁ బరిపరివిధములఁ జింతించి పరితపించుచుండెను. దిలీపుఁ డాత్మవేత్తయు నగుట దుర్గతిపాలయిన పూర్వులకు నుత్తమగతులు కల్పింప నాలోచించుచుండఁగా మహాధార్మికుఁడగు భగీరథుఁడు జన్మించెను. కుమారోత్పత్తి కానందించి తేజమునమించి యజ్ఞము లనేకములు కావించి ముప్పదివేలేండ్లు రాజ్యంబు పాలించెను. అంతదనుక సాగరుల నుద్ధరించునుపాయము నూహింపలేక యాదుఃఖముననే వ్యాధి కలుగఁగాఁ గొడుకునకుఁ బట్టాభిషేక మొనరించి కాలధర్మము నొందెను. తండ్రింగూడి స్వర్గమున వసించెను.

---

* ఇది నలువదిరెండవ సర్గమునుండి గ్రహింపఁబడినది.

భగీరథుఁడు రాజర్షి యనుఖ్యాతిం గాంచి ధార్మికు లలో నుత్తముఁడై మహాతేజుఁడై రాజ్యమును బాలించుచు సంతానములేమి దానిని బొందఁగోరెను. రాజ్యమును మంత్రు లయందునిచి గంగాభవాని భూతలంబునకుఁ దేఁగోరి హిమపర్వ ర్వతపాదముల నొకటియగు గోకర్ణమునకుంబోయి యూర్ధ్వ బాహుఁడై యింద్రియములు తనవశమున నునిచికొని నెల్ల కొక్కతడవ యాహారముం గొనుచుఁ బంచాగ్నిమధ్యభాగ మున నిలిచి చిరకాలము తపస్సొనరించెను. ఇట్లు ఘోరతపస్సు చేయుచుండఁగా నెన్నియోసంవత్సరములు గడచెను. సర్వ నియంతయు సకలప్రజావిభుఁడునగు నలువ యతనితపోనియతికి మెచ్చుకొని సంతోషించి దేవతలంగూడి యాగోకర్ణమునకు వచ్చెను. "భగీరథా! నిరుపమాన దృఢవ్రతమూని మహాభాగుఁ డవు కావున ఘోరతపం బొనరించితివి. నీయందు విశేషించి ప్రీతుఁడనైతని. వరమడుగుము." అనఁగా, భగీరథుఁడా తేజో రాశిం గాంచి యంజలింబట్టి యానలుమోముల వేల్పుతో "దయానిధీ! నాయెడ నీకుఁ బ్రీతిగలదేని, నాయీతపస్సు ఫల వంతమేని సగరకుమారులు నాయిచ్చుతర్పణమునకుఁ బాత్రు లగుదురుగాక. మహాత్మా! అంతియ కాదు. వారలభస్మరాసులు గంగాదేవీజలములఁ దడియునేని స్వర్గతి వారలకుం గలుగును. మఱియు నిక్ష్వాకుకులజాతుఁడనుగాన నాకు సంతానము నను గ్రహింపుము. మాకులము క్షీణింపఁదగినది కాదుకదా ఈ రెండువరములను గోరుచున్నవాఁడను."

భగవంతుఁడగు బ్రహ్మ మృదుమధురపదములుగలవాక్కులు చెవులపండువు చేయఁగా "నోయీ భగీరథా! నీ వడిగినవరముల

నిచ్చితిని. శుభము నీకుం గలుగును. ఇక్ష్వాకువంశము వృద్ధి
చేయుసంతానము కలుగఁగలదు. హిమవంతునిచెంతనున్న
గంగాదేవి యతని తొలిపుత్త్రిక. ఆనదిని ధరింప శక్తుఁడొక్క
యీశ్వరుఁడే. కావున దానిధరింప నామహాదేవుని బ్రార్థిం
పుము. గంగాభవాని స్వర్గలోకమునుండి క్రిందఁబడునప్పటి
యురవడిని భూమి సహింపఁజాలదు. వీరుండవయ్యును నీవును
ధరింప వలంతివికావు. పరమశివుఁ డొక్కఁడే యప్పనికిం జాలిన
వాఁడని నాకుం దోఁచెడిని." అని తెలిపి యావాక్పతి గంగా
దేవిం గాంచి "యీతఁడు భక్తుఁడు. కావున నతఁడు ప్రార్థించి
నపు డనుగ్రహించి యతనివాంఛితముం దీర్ప భూలోకమున
కరిగి భస్మరాసులందడిపి కృతార్థులనుగా వారి నొనరింపుమా"
యని పలికి సురవరులంగూడి తనలోకమునకుం బోయెను.

మహాశయులారా! ఈభాగమునుండి మనము గ్రహింపఁ
దగిననీతులు కొన్ని గలవు. సగరచక్రవర్తి మృతినొందఁగా నంశు
మంతుఁడు రాజయ్యెను. దిలీపుఁ డాతనికుమారుఁడు. అంశు
మంతుఁడు కొడుకునందు రాజ్యభార మునిచి హిమవద్గిరివర
మున కరిగి యెన్నియో వేలసంవత్సరములు తపం బొనరించెను.
కాని గంగను దేఁజాలక స్వర్గమున కరిగెను. తఱచుగా పురాణ
ములయందు హిమాలయమే తపోయోగ్యముగాఁ బేర్కొ
నంబడును. ఏల?

"శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః,
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరమ్" ౧౧
(౬ అధ్యా)



అను భగవద్వాక్యము సార్థక[illegible] పరిశుద్ధముగ
[illegible]

నుండ నెందున్న నేమని పలుకరాదు. అదిసర్వసములకుమాత్రమే పనికివచ్చును. ఎల్లరకుఁ బనికిరాదు. మున్ను పెక్కండ్రే చోట తపస్సు చేసియుందురో ఆచోటు తపోవిఘ్నకర్తలగు వారికి నిలువఁ జోటుగాక యుండును. అదియే శుచిప్రదేశమని భావము.

"అపసర్పంతు తే భూతా యే భూతా భూమిధారకాః,
యే భూతా విఘ్నకర్తారస్తే నశ్యంతు శివాజ్ఞయా."

అనునది యెల్లరకుం దెలిసినదియే కదా. "శ్రేయాంసి బహువిఘ్నాని" అన్నదియు నవీనము కాదు. కావున మహర్షులుకూడఁ బూర్వము తపస్సొనరించి సిద్ధులైన మహాత్ములయాశ్రమములకే పోయి యందుఁ దపస్సొనరింతురు. ఆస్థలము శీఘ్రసిద్ధిదమనియే వారలకుఁ గలవిశ్వాసము. దేవాలయములు, నదీప్రాంతములు, మహారణ్యములు, పర్వతములు లోనగునవి తపోయోగ్యములని శాస్త్రకర్తలు తెలిపిరి. హిమాలయమునఁ దపస్సొనరించుట మఱింతకష్టము. అపారహిమవాతమునకు నోర్చుకొని శీతలజలముల మునింగి తపస్సు చేయుట కష్టకార్యములలోఁ గష్టము.

"యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః
సమస్సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే." ౨౨
(గీ. ౪ అ.)

అనుభగవద్వాక్యము స్మరించిన సకలసంశయములు వీడును. ద్వంద్వములనఁగా శీతోష్ణసుఖదుఃఖాదులు. వానిని మీఱినఁగాని కర్మఫలము సమగ్రముగాఁ బొందఁజాలఁడు. జితేంద్రియుఁడైనఁగాని తపస్సు చేయ నర్హుఁడు కాఁడు. జితేంద్రియత్వము యోగమునఁగాని యలవడదు. యోగము ప్రాగ్జన్మసుకృత

విశేషమునఁగాని పట్టుపడదు అట్టియోగము జితేంద్రియత్వము నాపాదించుచుఁ గర్మసన్న్యాసము చేయుబుద్ధి నొసంగును. అట్టివానిని గర్మములు బాధింపఁజాలవు. అనఁగా సత్కర్మములను ఫలములను గోరక యాచరించి దాన జ్ఞానము కలుగఁగా యోగాభ్యాసముచేయుచు మనస్సును వశపఱచుకొని యాత్మజ్ఞానసంపన్నుఁడు కాఁగా నాస్థితియందు సకలకర్మములు బాధింపవనియే యిటఁగలసారము.

"యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయం,
ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ. ౪౧
తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాత్మనః,
ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠ భారత." ౪౨
(గీ. ౪ అ ధ్యా.)

అని భగవంతుఁడు జ్ఞానయోగము నర్జునున కుపదేశించెను. జ్ఞానయోగమునందును యోగమే ప్రాముఖ్యముగా నెన్నఁబడినది. జ్ఞానసహితమైన యోగమనియే యర్థము. యోగము భగవత్సాక్షాత్కారమునకుఁ బరమసాధనము. యోగి యల్పఫలము నొసంగు బాహ్యపూజను మాని సహస్రారకమలమున భగవత్తేజస్సును గాంచును. అనఁగాఁ దేజోరూపునిగాఁ బరమాత్మ నుపాసించునని తాత్పర్యము. దీనింబట్టి యోజింపఁగా మానవుఁ డుపాసకుఁడు కావలయుననియుఁ, దాన మనస్సు పరిపక్వమగుననియు, నయ్యది ధ్యానమునకు మార్గముచూపుననియు, నయ్యది యోగాభ్యాసమున [illegible] సిద్ధింపఁగలదనియు, నయ్యది సిద్ధిగాంచినఁగాని యాత్మజ్ఞానస్ఫూర్తి యుదయింపదనియు, నది కుదిరినఁగాని కర్మబంధములు తొలఁగవనియు, నవి తొలఁగినఁ

గాని నిర్మలభగవత్పదము లభింపదనియుఁ దేలెడిని. భగవత్పద మనఁగా ముక్తిస్థానమని పెద్దలందఱు. అది యొకలోకమనియు, నందు నెన్నియోమండపము లుండుననియు, నేమండపమున నెన్నిసంవత్సరము లున్నను బొమ్మనువారు లేరనియు, సుఖముగా జీవింప నవకాశ మందుఁగలదనియుఁ గొందఱు చిబుకయోగులు పలుకుదురు ఈయుపన్యాసము వారికి జీవికను గల్పించును. కాని వారి కదియే మోక్షము మోక్షస్థాన మొక్కలోక మున నున్నయెడల నదియు దేవాలయములకడ నుండు ముక్తి మండపమువంటిదే యగును. ఆలోకమున దొరకు భగవత్ప్రసాదము ఈముక్తిమండపమున దొరకు చక్కెరపొంగలివంటిదే కాని యింకొక్కటికాదు. ఏమతకర్తగాని నేను జూచివచ్చితి నని మిమ్ముఁ బిలుచుకొనిపోవుదునని చెప్పినజాడ గానరాదు. తమయభిప్రాయమున కనుకూలముగా శ్రుతుల కర్థము చెప్పు కొనుచు నూహించినదే కాని వేఱుగాదు. ముక్తిలోక మెచ్చట నుండదని యెఱుంగవలయును. స్థిరమగునది యేదియు నుండదు. స్థిరమగునది రూపవంతము కానేరదు. వైకుంఠాదిలోకములు ముక్తిస్థానములనుట పామరులకు భక్తిని గలిగింపఁబన్నిన యుక్తియని యెఱుంగుట తెలంగు.

గీతోపనిషత్తు యోగమునే తెలిపెను. యోగమనునది ప్రాయశః ధ్యానమును బోధించును. ధ్యానమనునది యొక వస్తువును మదిఁగాంచుచు దానియందే నిలుకడగలిగి మఱొక దానిపైన మనస్సుపోకుండఁ జేయుట యని తెలుపును. ధ్యాన యోగము కొంతకాల మభ్యసింపఁగా మనస్సు నిశ్చలతం

గాంచును యోగాభ్యాసఫల మదియే. ఆస్థితియందుండువాఁడు యోగారూఢుఁ డనఁబడును.

"యదా హి నేంద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే,
సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే." ౪
(గీత. ౬ అధ్యా.)

అని భగవంతుఁడు చెప్పినది యొకపరీక్ష యగును. ఈసిద్ధి యోగాభ్యాసము చేయువారి కెల్లరకుం గలుగదు. పూర్వజన్మ సత్కర్మముననే యది కలుగును. కావుననే

"తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున." ౪౬
(గీత. ౬అ.)

అని శ్రీహరి బోధించెను. ఇందుఁ దపోజ్ఞానములకంటెఁ గర్మ మధికమని పరమేశ్వరుఁడు బోధించెను. జ్ఞానమనఁగా నీస్థల మున శాస్త్రార్థపాండిత్యమని గ్రహింపవలయు. కర్మమనఁగా నిట యగ్నిహోత్రాదికర్మమనియే యర్థము. వీరందఱుకంటె యోగి యధికుఁడు. తపస్సు శాస్త్రార్థపరిజ్ఞానము. అగ్నిహోత్రాదికర్మము యోగసహితములైనఁగాని ఫలింపవు. చిత్తసమాధిలేనితపస్సు, యోగాభ్యాసమునుజేయని శాస్త్రార్థజ్ఞానము, అగ్నిహోత్రాది కర్మము సంపూర్ణఫలముల నీఁజాలవని సారము. అనఁగా మనస్సు చంచలతంబొరయక భగవంతునియందు నిలిచి సర్వ భూతములయందును భగవంతుని గాంచుచు భగవంతుని యందు సర్వభూతములను జూచుచు సమదర్శనుఁడగు యోగి కంటె నుత్కృష్టుఁ డెవ్వఁడు నుండఁడని భావము. సర్వతప స్సులు సర్వశాస్త్రపఠనములు సర్వకర్మములు మనోదోషము

నడంచుటకే యేర్పడినవి. అట్టి సర్వకర్మఫలమగు యోగమును మించినది వేఱొకఁ డుండదని భావింపవలయును. మఱిమఱి సంభావింపవలయును. యోగము నభ్యసింపనేల యనియు, నది గారడివిద్యవంటి దనియుఁ బలుకుచు వేదాంతవిచారమును జేయుదుమనువారలే యలసు లనంబడుదురు. వారికిఁ దరణోపాయము భుక్తియేకాని వేఱొకటి కాదు.

"యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః,
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే. ౨౨
తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితం,
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా. ౨౩
సంకల్పప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వానశేషతః,
మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమంతతః. ౨౪
శనైశ్శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా,
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్. ౨౫
యతో యతో నిశ్చరతి మనశ్చంచలమస్థిరమ్,
తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్. ౨౬
ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖముత్తమం,
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూతమకల్మషమ్. ౨౭
యుంజన్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః,
సుఖేన బ్రహ్మసంస్పర్శమత్యంతం సుఖమశ్నుతే." ౨౮

(గీత. ౬ అధ్యా.)

అను నీభగవద్వాక్యములు యోగమహిమమును దానివలని యుపయోగములను దెలుపుచున్నది. ఎవ్వఁడుకాని యోగి కాక జితేంద్రియుఁడు కాఁజాలఁడు. జితేంద్రియుఁడుకాకపో

యిన భగవత్తత్త్వమును గనుఁగొనఁ బ్రయత్నింపనుగూడ నర్హుఁడు కాఁడు.

యోగి యుపాసించుమార్గమును శ్రీశంకరభగవత్పాదులు సౌందర్యలహరియం దిట్లు తెలిపియున్నారు.

"మహీం మూలాధారే కమపి మణిపూరే హుతవహం,
స్థితం స్వాధిష్ఠానే హృది మరుతమాకాశముపరి,
మనోఽపి భ్రూమధ్యే సకలమపి భిత్వా కులపథం
సహస్రారే పద్మే సహ రహసి పత్యా విహరసి." ౯

మూలాధారస్వాధిష్ఠానమణిపూరకానాహతవిశుద్ధాజ్ఞాచక్రములని యాఱుచక్రములు దేహాంతర్వ్యాప్తములు. ఇవి వరుసగా భూమి, అగ్ని, సలిలము, వాయువు, ఆకాశము, మనస్సు అను తత్త్వాత్మకములు. ఈయాఱు నాయాఱుచక్రములయందుఁ దన్మాత్రలుగా ననఁగా గంధరూపరసస్పర్శశబ్దాత్మకములై యుండును. ఆజ్ఞాచక్రము మన సత్త్వముచేత ననఁగాఁ బదునొకండింద్రియములచేత సంగృహీతమై యుండునని యెఱుంగంగను. అని.

ఈయుపాసనమే ధ్యానమని వ్యవహరింపఁబడును. యోగపద్ధతి యిదియే. ఈధ్యానముననే పరమాత్మసంతుష్టుఁడగు. దీనికి ఫల మాత్మజ్ఞానమేకాని యితరఫలములు గావు. ఈస్థితి ననుసరించువాఁడు సకాముఁడు కాఁడు. నిష్కాముఁడే యగును. ఆతనిదృష్టి,

"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః." ౨౯

అను గీతోపనిషదర్థము ననుసరించి యుండును. అట్టివాఁడు

లోకానుగ్రహార్థమే కర్మముల నాచరించును. తాను మానినఁ బామరులుఁగూడ మానుదురనియే యాతఁడు భయంపడును.

"యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే." ౨౧

గీ. 3 అ

అనునది భగవదుక్తియే కదా. అట్టివారు కర్మముల మానక చేయుచుండ, నిఁక సామాన్యులు చిబుకయోగులు కర్మము లేలయని యుపన్యసింప నేమనవలయును? అట్టివారలే వంచకులు. స్వార్థైకనిరతులగు మహాయోగులనుగా వారి నెన్నందగు.

యోగసిద్ధిలేనిచోఁ దపస్సు ఫలింపదనియేకదా దీని సారము. అంశుమంతుఁడు పెక్కువేలేండ్లు హిమాలయమున ఘోరతపస్సు చేసెనుగాని సఫలమనోరథుఁడు కాకపోయెను. అంశుమంతుని ప్రాక్కర్మము గంగను దెచ్చి భూలోకమునకు నుపకారము చేయఁజాలినది కాదని మన మెఱుంగవలయును. ప్రతివిషయమునను గర్మసిద్ధాంతము గోచరించుచున్నను, గొందఱద్దాని నంగీకరింపకుండుట మొండిపట్టుదలచేతనేకాక మఱే మున్నది? అంశుమంతుఁడు తపస్సిద్ధిం గానక మరణించెను. స్వర్గమును జూఱఁగొనియెను. దిలీపుఁడు సాగరులముక్తికి మార్గ మూహించియు నయ్యది పొడసూపమి మృతినొందెను.

భగీరథుఁడు రాజ్యమును బాలించుచు రాజర్షి యయ్యెను. అనఁగా సంసారమున మునిఁగిపోవక కర్తవ్యమని రాజధర్మముల నాచరించుచు శీతోష్ణసుఖదుఃఖాదిద్వంద్వములకు లోఁబడక జితేంద్రియుఁడై యున్నవాఁడనియేకదా దానిభావము.

ఆ రాజర్షికి సంతానములేనిలోప మొక్కటిమాత్రమే కలదు. ఆలోపమును బాపుకొన నెంచెను. కొందఱీతుచ్ఛవాంఛ యాతని కేలకలిగెనందురు. అది పొరపాటు. ధర్మార్థకామమోక్షములను పురుషార్థచతుష్టయమును గోరుట యధర్మముకాదు. సర్వసంగపరిత్యాగియగు సన్న్యాసికి నొకనికిఁ దప్ప నందఱకును నవి కోరఁదగినవని స్మృతులే తెలుపుచున్నవి. అందును రాజగువాఁడు తనకులధర్మమును రక్షింపఁదగుకొడుకును గోరక మునిధర్మమగు ముక్తినే కోరుట యుత్తమము కాదు.

> "స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః,
> స్వకర్మనిరతస్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు. ౪౫
> శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
> స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్." ౪౭
>
> (గీ. ౧౮ అ.)

అన్న భగవద్వాక్యము పైవిషయమునే తెలుపుచున్నది. వంశవృద్ధినిగోరుట యించుకంతయు న్యాయవిరహితము కాదు. దీనిచే రాజర్షిత్వమునకు భంగమురాదు. సంతానహీనుఁడౌట భగీరథుఁడు మంత్రులయందు రాజ్యభారమునిచ్చి గంగావతరణకార్యమును సాధింపఁగోరి గోకర్ణక్షేత్రమునకుఁ బోయెను. హిమాలయప్రాంతపర్వతమునకు గోకర్ణమను పేరు గలదు.

> "ఊర్ధ్వబాహుః పంచతపా మాసాహారో జితేంద్రియః,
> తస్య వర్షసహస్రాణి ఘోరే తపసి తిష్ఠతః. ౧౩
> అతీతాని మహాబాహో తస్య రాజ్ఞో మహాత్మనః,
> సుప్రీతో భగవాన్ బ్రహ్మా ప్రజానాం పతిరీశ్వరః." ౧౪

భగీరథుఁడును హిమాలయమున నొకయాశ్రమమునకుం

బోయెను. అది గోకర్ణమనం బ్రసిద్ధిఁగాంచినది. బాహువులు
పైకెత్తి నాలుగు ప్రక్కల నగ్ని మండుచుండఁ బైన సూర్యుఁడు
వెలుఁగుచుండ నాతనిం జూచుచుఁ దపస్సుచేయుటకుఁ బంచా
గ్నితపస్సని పేరు. కొందఱు హిమాలయమునఁ బంచాగ్నిమధ్య
మునఁ దపస్సాచరించుట సులభమే యనియు, శీతలపర్వతము
కాన దేహమున కది **సుఖ**మే క**లి**గించుననియుఁ బల్కుదురు.
అది పరిహాసమునే తెలుపును గాని ప్రశ్నమునఁగల సద్భావ
మును దెలుపదు. ఊర్ధ్వబాహుండగుట జితేంద్రియత్వమును
సూచించును శీతవాతాద్యుపఘాతము దేహమునకుం గలిగి
నపుడు హస్తములు నిర్వికారము నొందియుండవలయును.
ఇంద్రియజయమున కిది ప్రథమసోపానమని యెఱుంగవల
యును. సూర్యునివిష్టదృష్టి మనోనిగ్రహమును దెలుపును.
తేజస్తత్త్వమును జూచుచుండుట సామాన్యముగా సాధ్యము
కాదని యోగు లెఱుంగుదురు. లక్ష్యశుద్ధినిఁగోరువారు తొలుత
నభ్యసింపఁదగిన దిదియే. అగ్నిమధ్యమున నిలుచుట తొలుత
శీతబాధకు నింపుగానుండినను గ్రమక్రమముగా దుస్సహతా
పము చేకూరును. దాని నోర్చుకొనుట ధ్యాననిష్ఠను దెలియఁ
జేయును. దేహతాపమును మఱచుట యనునదియే దీనికిఁ
బరీక్ష. కావునఁ బంచాగ్నితపస్సు సామాన్యులకు సాధ్యము
కాదని యెఱుంగవలయును. నెలకొకపర్యాయ మాహార
మును గొనుట యోగసిద్ధిని దెలుపును. యోగాభ్యాసము
చేయువారల క్షుత్తు విశేషించి బాధించును. దానిని మఱచి
యుండ సాధ్యము కాదు. యోగము నభ్యసింపనివారు పలుకు
మాటల విశ్వసింపరాదు.

"యోగకృత్యం తు యోగానాం ధ్యాన మేవ పరం బలం,
తచ్చాపి ద్వివిధం ధ్యానమాహుర్విద్యావిదో జనాః.
ఏకాగ్రతా చ మనసః ప్రాణాయామ స్తథైవ చ,
ప్రాణాయామస్తు సగుణో నిర్గుణో మనస స్తథా,
ఇంద్రియాణీంద్రియార్థేభ్యో నివర్త్య మనసా మునిః.
దశ ద్వాదశభిర్వాపి చతుర్వింశాత్పరం యతః,
సచోదనాభిర్మతిమాన్ ఆత్మానం చోదయేదథ.
తిష్ఠంతమాచరంతం తు యత్తదుక్తం మనీషిభిః,
విశ్వాత్మా సతతం జ్ఞేయ ఇత్యేవమనుశుశ్రుమ.
ద్రష్టుం హ్యహీనమనసో నాన్యథేతి వినిశ్చయః,
విముక్తసర్వసంగేభ్యో లఘ్వాహారో జితేంద్రియః.
పూర్వరాత్రే పరార్ధే చ ధారయీత మనో హృది,
స్థిరీకృత్యేంద్రియగ్రామం మనసా మిథిలేశ్వర.
మనో బుద్ధ్యా స్థిరం కృత్వా పాషాణ ఇవ నిశ్చలః,
స్థాణువచ్చాప్యకంప్యస్స్యాద్దారువచ్చాపి నిశ్చలః.
బుద్ధ్యా విధివిధానజ్ఞాస్తతో యుక్తం ప్రచక్షతే,
న శృణోతి న చాఘ్రాతి న చ పశ్యతి కించన.
న చ స్పర్శం విజానాతి న చ సంకల్పతే యతః,
న చాపి మన్యతే కించిన్న చ బుద్ధ్యేత కాష్ఠవత్.
తదా ప్రకృతిమాపన్నం యుక్తమాహుర్మనీషిణః."

(బ్ర. ౧౩౫ అధ్యా.)

ఇట్లు యోగిలక్షణములను మహాత్ములనువదించిరి. వానిని దూాల నాఁడి యలసులు పల్కినను ప్రాజ్ఞులు విశ్వసింపరాదు. నిరాహారుఁడై యోగాభ్యాసముచేయుట శక్యము కాదు మితాహారమే యోగి కావశ్యకము.

"నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంతమనశ్నతః,
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున. ౧౬
యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు,
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా. ౧౭
యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే,
నిస్స్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా." ౧౮
(గీత. ౬ అధ్యా.)

"న అత్యశ్నతః. ఆత్మసమ్మిత మన్నపరిమాణం అతీత్య అశ్నతః అత్యశ్నతః న యోగః అస్తి, నచైకాంతమనశ్నతః యోగః అస్తి. తదుక్తం. యదుహవా ఆత్మసమ్మితమన్నం తదవతి తం నహినస్తి యద్భూయో హినస్తి తద్యత్కనీయోన్నం న తదవతి, ఇతి శ్రుతేః. తస్మాద్యోగీ ఆత్మసమ్మితాదన్నాదధికం న్యూనం వా అశ్నీయాత్. అథవా యోగినో యోగశాస్త్రే పరిపఠితాదన్నపరిమాణాదతి మాత్రమశ్నతః యోగో నాస్తి ఉక్తం హి. అర్ధం సవ్యంజనాన్నస్య తృతీయముదకస్య చ, వాయోస్సంచరణార్థం తు చతుర్థమవశేషయేత్. ఇత్యాదిపరిమాణమ్." అని భాష్యము.

యోగి తనయాహారమున నించుకయేని తగ్గించి భుజింపరాదు. అధికముగా భుజింపరాదు. అని గీతాశాస్త్రముకూడఁ దెలుపుచున్నది. అట్టులుండఁగా భగీరథుఁడు యోగసిద్ధుఁడు కాన నెలకొక్కసారి భుజించుచుఁ దపస్సుచేసె ననఁగాఁ దాఁబూనినకార్యమునందు శ్రద్ధయత్యంతముకలవాఁడై ఘోరతపస్సు చేసెనని మన మెఱుంగవలయును. ఇట్లు తపస్సుచేయుచుండఁగా నెన్నియోవేలసంవత్సరములు గడచెను. ఇది కొందఱకుఁ బరిహాసముగాఁ దోఁచును. వాయునిరోధము చేయఁగలిగినయోగులు చిరకాలము జీవింపఁగలుగుదురనుట వారెఱుం

గరు. ప్రాతీతికదృష్టిం జూచువారి కది క్రొత్తగనే తోఁచును. అది యొకచిత్రముకాదు. మనము చేయుకార్యములు బాలు రకుంగూడ మహాకార్యములుగనే తోఁచును. వీరు నీవిషయ మున బాలకులే.

> "భగీరథ మహాభాగ ప్రీతస్తేఽహం జనేశ్వర,
> తపసా చ సుతప్తేన వరం వరయ సువ్రత." ౧౬

బ్రహ్మవాక్య మిది. ఇందుఁ బైవ్రాసిననిష్ఠ తేటపడును. నీ తపస్సునకుఁ బ్రీతుఁడనైతిని. చక్కనితపస్సు చేసితివి. కావున సువ్రతుఁడవు. వర మడుగుమనియెను.

> "యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
> న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్. ౨౩
> తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
> జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి" ౨౪

అని గీతావాక్యము ననుసరించి భగీరథునితపస్సు యోగశాస్త్ర సమ్మతమే యని తేలెడిని అది యశాస్త్రవిహితమే యైనచో ఫలింపదు. కొందఱు శాస్త్రకర్తలుకూడమనవంటివారేయనియు, వారిమాట లేల విశ్వసింపవలయుననియు,మనమనస్సునకు న్యాయ మనితోఁచినట్లు ప్రవర్తింపఁగూడదా యనియుఁ బలుకుదురు. వారియూహ కొంతదనుక మంచిదే యనక తప్పదు. రాగ ద్వేషదూషితాత్ములమగుట మనయాలోచనము లంతమంచివిగ నుండవు. సకలవిషయముల నెఱుంగునంతదనుక జీవింపఁ జాలము. చిఱుతనాఁటినుండి యోగ మభ్యసించినఁగాని యది యలవడనేరదు. అట్టి యభ్యాసమున నాఱితేఱినవారే మహ ర్షులు. స్వానుభవముగలవారు. వారు రచించినవే శాస్త్రములు.

అట్టివారు త్రికాలజ్ఞులుగా నెన్నఁబడుదురు. బాహ్యచక్షుస్సులకుఁ గనఁబడనివానిని జ్ఞానచక్షుస్సుచే ననఁగా నంతర్దృష్టిచేఁ జూడఁజాలుదురు. అట్టిదృష్టి మనలోఁ గొందఱకుండఁగూడదా యందురేని అట్టివారు మనవలె మాటలాడక శాస్త్రమునే పరికింతురు. భగవద్వాక్యమునే విశ్వసింతురు. తోఁచినయట్లు వర్తించువారి నీసడింతురు. వారిజోలి మానుకొందురు. వారును ఋషులే యగుదురు. అట్టివారిమాటలనే మనము విశ్వసించిన నుత్తమమార్గమున నడువఁజాలుదుము. లేనిచో నధఃపతితుల మగుదుము. కావున యోగశాస్త్రమును బరిశీలించి సద్గురువుల కడ దాని నభ్యసించి యమనియమాదులను జక్కఁగా ననుష్ఠానమున నారాధించి భగవంతుని సేవించినఁ దగినఫలము గలుగునని యీభాగమునుండి గ్రహింపవలయును.

"యది మే భగవన్ ప్రీతో యద్యస్తి తపసః ఫలం,
సగరస్యాత్మజాస్సర్వే మత్తస్సలిలమాప్నుయుః. ౧౮
గంగాయాస్సలిలక్లిన్నే భస్మన్యేషాం మహాత్మనాం,
స్వర్గం గచ్ఛేయురత్యంతం సర్వే మే ప్రపితామహాః. ౧౯
దేయా చ సంతతిర్దేవ నావసీదేత్కులం చ నః,
ఇక్ష్వాకూణాం కులే దేవ ఏష మేఽస్తు వరః పరః. ౨౦
మనోరథో మహానేష భగీరథ మహారథ,
ఏవం భవతు భద్రం తే ఇక్ష్వాకుకులవర్ధన." ౨౨

ఇందొక్కనీతి గలదు. పరికింపుఁడు పితామహా! నాయెడ మీరు ప్రీతులరైతిరేని తపస్సునకు ఫలముగలదేని నాకాంక్షితముల నొసంగుఁడు. అని సగరపుత్త్రులకు నుత్తమలోకప్రాప్తియుఁ, దనకు సంతానము నడిగి, యీసంతతి యవిచ్ఛిన్నముగా

నుండఁదగుననియు నడిగెను. బ్రహ్మయు నానందించి యట్లే యగుననియె. ఇది కథాసారము.

"ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః"

అన్నశ్రుతివాక్య మర్థవాదము కాదు. విధివాక్యము. కొందఱు సన్న్యాసులకుఁ దప్పఁ తక్కుంగలవా రెల్ల గృహస్థులై పితరులఋణము తీర్చుకొన సాధనమగుసంతానమును ధర్మపత్నివలనఁ బడయవలయును దానికి నంతరాయమును గలిగించు దుష్కర్మములు మనము చేసియున్నయెడల వానికిఁ బరిహారములుగాఁ జెప్పఁబడినవిధుల నాచరింపవలయు. తుచ్ఛమగు సంతతికొఱకు తపస్సు లోనగుసత్కర్మముల నాచరింపవలయునా యనరాదు.

"యథా వాయుం సమాశ్రిత్య వర్తంతే సర్వజంతవః,
తథా గృహస్థమాశ్రిత్య వర్తంతే సర్వ ఆశ్రమాః. ౭౭
యస్మాత్త్రయో ప్యాశ్రమిణో జ్ఞానేనాన్నేన చాన్వహం.
గృహస్థేనైవ ధార్యంతే తస్మాజ్జ్యేష్ఠాశ్రమో గృహీ. ౭౮
ఋషయః పితరో దేవా భూతాన్యతిథయస్తథా,
ఆశాసతే కుటుంబిభ్యస్తేభ్యః కార్యం విజానతా. ౮౦
స్వాధ్యాయేనార్చయేతర్షీన్ హోమైర్దేవాన్ యథావిధి,
పితౄన్ శ్రాద్ధైశ్చ నౄనన్నైర్భూతాని బలికర్మణా." ౮౧

ఇట "జ్ఞానేన" అనుదానికి వేదార్థఖ్యాపనముచే నని యర్థము.
(మనుస్మృతి. 3 అధ్యా)

అనిస్మృతి విధించుచున్నది. శాస్త్రము మీఱరాదనుభగవద్వాక్యమును మఱువరాదు. సంతానవాంఛ గృహస్థులకుఁ దప్పక యుండఁదగినదని స్మృతి బోధించుచున్నది. పితృపూజ సంతతి

విచ్ఛేదమున నశించును. కావునఁ బ్రజాతంతువును దెగఁగొట్ట
రాదని శ్రుతి విధించెను. ఆకారణముననే రాజర్షియగుభగీ
రథుఁడు పితరులకు స్వర్గప్రాప్తియు, వారిపూజ నశింపకయుండ
నొనరించుసంతానము, అందును దనకుమాత్రమే కాక తనతరు
వాతివారికింగూడఁ గావలయునని కోరెను. "అస్మద్గోత్రం వర్ధ
తామ్" అన్న వాక్య మీనాఁడు పుట్టినది కాదు. కావున ధర్మా
ర్థకామమోక్షములను పురుషార్థములు నాలుగు గృహస్థులు
కోరి భగవంతు నారాధించుట విధివిహితమేయని యీ
భాగము మనకు బోధించుచున్నది.

"ఇయం హైమవతీ గంగా జ్యేష్ఠా హిమవతస్సుతా,
తాం వై ధారయితుం శక్తో హర స్తత్ర నియుజ్యతాం. ౨౩
గంగాయాః పతనం రాజన్ పృథివీ న సహిష్యతి,
తాం వై ధారయితుం వీర నాన్యం పశ్యామి శూలినః." ౨౪

ఈభాగమునుండి కొన్నిసద్విషయములు గ్రహింపందగు. హిమ
వంతమునుండి గంగ పొడమును. కావునఁ దొలిపుత్త్రిక యనం
బరఁగె. దానిని ధరించుటకు నీశ్వరుని బ్రార్థింపుమని బ్రహ్మ
తెలిపెను. అనఁగా శంకరుని బ్రార్థించినఁగాని గంగాదేవి రాఁజాల
దని భావము. గంగావతరణమును భూమిభరింపఁజాలదు. శంక
రుఁడుతప్ప నప్పనికి సమర్థుఁడు వేఱొక్కరుఁడు నాయెఱింగి
నంతలోఁ గానరాఁడు అనఁగా నిట్టిమహాకార్య మీ యుమా
పతిదక్క నింకొక్కఁడు చేయఁజాలఁడని భావము.

కొందఱిది యసంగతప్రసంగమనియు, హిమాలయము
నుండి తెల్లఁగా గంగపడుచుండఁగా నది వియత్తలమునుండి
పడుచున్నట్లు భావించిరనియు, సాంద్రాటవులు దూరమునుండి

చూచువారలకు శంకరుని నీలకేశములుగాఁ గనఁబడినవనియు, హరుఁడు ధరింపలేదని, ఆకాశమునుండి గంగ రాలేదని, యిట్టు లనేకరీతులఁ బల్కుదురు. ఈయుక్తులను జర్చించునంతయవసరము మనకు లేదు. గంగావతరణమునకు భగీరథుని ప్రస్తావమేలయన్నచో హరుశక్తియని వారనవలసిన దేకాని వేఱు యుక్తులు తెలుపఁజాలరు. అట్టి హేతువాదముల మనము స్మృతికిం దెచ్చుకొనరాదు. దాన లాభముకూడ లేదు. ఉన్న భక్తియు సడలును. ఇందుఁ జర్చింపఁదగినవిషయ మొక్కఁడు కలదు

లోకమునకు నత్యంతావశ్యకములగు కార్యములు గలిగినపుడు శంకరుఁడే శరణ్యుఁ డగును. సముద్రమునుండి హాలాహల ముగయించి లోకములఁ గాల్చునపుడు బ్రహ్మావిష్ణ్వాదులూరకుండిరి. మంచిపదార్థములు దొరకినపుడు మాకు మాకని చేతులు చాఁపిరి. లోకమును గాల్చువిషము పుట్టినపుడు మాటాడక యూరకుండిరి త్రిపురాసురులబాధ లధికము కాఁగా శంకరునే ప్రార్థింపవలసివచ్చెను. ఇట్లనుటచే విష్ణుమూర్తికంటె శివుఁడు శ్రేష్ఠుఁడని నాయాశయమని యూహించువారుండుదురేని వారికి నాభావ మది కాదని మనవిచేయువాఁడను. ఈమువ్వురు ప్రకృత్యతీతులు కారు. ప్రకృతికి లోఁబడినవారు. ప్రకృతికంటెఁ బరుండగుభగవంతుని యంశాంశసంభూతులు. ఈమువ్వురివలన ననేక కార్యములు సాగినవి. ఇందు హెచ్చుతగ్గులు పాటింపరాదు. సారమేమనఁగా. హిమాలయమున నొకభాగమగు కైలాసము శంకరావాసము. హిమాలయమున కధిపతియని భావము. హిమవత్సంభూతయగుగంగను

భూలోకమునఁ బ్రవర్తిల్లఁజేయఁబూనినవారు శంకరానుమతి నొందవలయునుగదా. దేవాయతనము లనేకము లాపర్వత మున నున్నవి. కాని వారంద ఱప్పనికిఁజాలరు కావున శంకరుఁ బ్రార్థింపుమని బ్రహ్మ యుపదేశించెనని మన మూహింపవల యును. శంకరుఁడు జలాధిదైవము. కనుకనే శంకరు నభిషేక ములచే నారాధింతురు. "అభిషేకప్రియశ్శివః" అన్న ప్రాచీన వాక్యము సమంజసముగాకపోదు. శంకరు నర్చించుట యనఁగాఁ బ్రధానముగ నభిషేకమే చేయఁబడును. దీనింబట్టి జలతత్త్వ మున కధిదైవతము శంకరుఁడని మన మూహించుట పాప కార్యముకాదు. లోకమున నేకార్యమునకు స్నానము ప్రధా నము. స్నానముచేయక యేకర్మముకూడ నారంభింపఁబడ రాదని విధి కలదు. ఈనియమమున గంభీరార్థము కలదు. దానినే మన మెఱుంగవలయును.

దుర్వృత్తుల నడంచునవి జలములుకాని వేఱొండు కావు. మనకు భరింపరానికోపము కలిగినపుడు స్నానముచేసి నచోఁ గొంత యుపశమించును. సకలపాపపరిహారార్థము తీర్థ యాత్రలు చెప్పఁబడినవికదా. ఏల? జలస్నానమును భక్తి యుక్తముగా నొనరించినచోఁ గామక్రోధలోభమోహమద మాత్సర్యము లుపశమించును. సంపూర్ణముగా నశించునా యన్నచో నశింపవు. ఆతీర్థస్నానము విధిగా నాచరించిన నశించు ననవలయు.

"ఆపో వా ఇదగ్ం సర్వం విశ్వా భూతాన్యాపః ప్రాణా వా ఆపః పశవ ఆపోఽన్నమాపోఽమృతమాపస్సమ్రాడాపో విరాడాపస్స్వరాడాప

శ్ఛందాగ్‌స్యాపో జ్యోతీగ్‌ష్యాపో యజూగ్‌ష్యాపస్సత్యమాపస్సర్వా దేవతా ఆపో భూర్భువస్సువరాపఓం.

"ఆపః పునంతు పృథివీం పృథివీ పూతా పునంతు మాం,
పునంతు బ్రహ్మణస్పతిర్బ్రహ్మపూతా పునాతు మాం.
యదుచ్ఛిష్టమభోజ్యం యద్వా దుశ్చరితం మమ,
సర్వం పునంతు మామాపో సతాం చ ప్రతిగ్రహాగ్‌స్వాహా."

అను నీశ్రుతు లుదకమహిమమును దత్కార్యములను దెలుపుచున్నవి.

"యోసౌ సర్వగతో విష్ణుశ్చిత్స్వరూపీ నిరంజనః,
సఏవ ద్రవరూపేణ గంగాంభో నాత్ర సంశయః.
గంగా గంగేతి యో బ్రూయాద్యోజనానాం శతైరపి,
ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోకం స గచ్ఛతి."

అను నీప్రాచీనోక్తులు సలిలమహత్త్వమును దెలుపుచున్నవి. అంతియగాక జలములను భగవద్రూపములుగా భావింపవలయుననియు, దాన సకలపాపములు తొలంగుననియు, భావమిం దంతర్భూతమై యున్నది.

భగీరథుని బ్రహ్మదేవుఁడు శంకరుని ప్రార్థింపుమనఁగా నామహాదేవుని యనుమతినొందకయున్న నీ యీప్రయత్నము ఫలింపదనియుఁ, నుదకములశక్తిని భూమి భరింపఁజాలదనియుఁ దెలిపెను. మహాప్రళయమునందును జలములకు నాశములేదు. భూమి నశించును. అనఁగా జలములయందు విలీనమగునని సారము. భగీరథునిప్రయత్న మాతనిపితరులకేకాక లోకులకును మహోపకారకమైనది. అట్టి మహాకార్యము భగవత్సహాయము కలిగినఁగాని ఫలింపదు. అతఁ డొనరించినతపస్సు

చాలదు. కావుననే శంకరుని దపంబున సంతుష్టుని జేయుమా
యని బ్రహ్మ యుపదేశించెను. లోకమున నేకార్యము కాని
స్వప్రయత్నమున ఫలింపఁజేయఁబూనిన నది శక్యముకాద
నియు, భగవంతు ననుగ్రహమున నెఱవేఱుఁగాక యనుసద్భా
వముకలిగి చేయఁబూనిన నయ్యది ఫలించుననియు, నీభాగము
నుండి మనము గ్రహింపవలయు.

"సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః,
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్. ౫౬
చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః,
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తస్సతతం భవ. ౫౭
మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి,
అథ చేత్త్వమహంకారాన్న శ్రోష్యసి వినంక్ష్యసి." ౫౮
(గీత. ౧౮ అధ్యా)

అను నీభగవద్వాక్యములు పైనీతిని దృఢపఱచుచున్నవి.
భగీరథునకుంగల మనోమాలిన్యశేషమును బోఁగొట్టఁ దలంచి
బ్రహ్మ యింకను దపస్సుచేసి శంకరు నారాధింపుమనియెను.
శంకరారాధనమునకు నింకొక్క కారణముకూడఁ గలదు.
తమోగుణాధిపతి శంకరుఁడు. దానిఁ దొలఁగింపఁగోరువారు
శంకరునే యారాధింపవలయును. అది తొలంగిననఁగాని యహం
కారము దానిస్వభావమగు కర్తృత్వాభిమానము నశింపవు.
అవి నశించినఁగాని నిర్మలజ్ఞానము పొడసూపదు. కావున
నయ్యది భగీరథున కింకను గలుగలేదు. దానిం గలిగింప నెంచి
చతుర్ముఖుఁడు శంకరారాధనమునఁ బ్రయత్నింపుమని హితము
తెలిపెను. కావున మన మేప్రయత్నముచేసినను గర్తృత్వాభి

మానము మాని భగవంతునిపై సకలభారములుంచి సత్కార్య ముల నాచరించిన నయ్యవి మనకు నితరులకుంగూడఁ బనికి వచ్చుననియు, భగవదారాధనమే సర్వపాపహరము, సర్వపుణ్య ప్రదము నగుననియు, దానిని ఫలాభిసంధిరహితముగా నొన రింపవలయుననియు నిందుఁ గలసారతరార్థములు.

"తమేవముక్త్వా రాజానం గంగాం చాభాష్య లోకకృత్."

బ్రహ్మ భగీరథున కిట్లు హిత ముపదేశించి తనవరమును ఫలింపఁ జేయ నెంచి గంగాదేవినిగుఱించి సంభాషించి తనలోకము నకుఁబోయెనని మూలార్థము.

"అభాష్య వత్సే రాజానం యథాకాల మనుగృహాణేత్యుక్త్వేతి యావత్" అని గోవిందరాజులు.

"అస్య మనోరథం పూరయేతి గంగామాభాష్య గంగాం ప్రత్యుక్త్వా" అని మహేశ్వరతీర్థులు.

తనవరమును ఫలింపఁజేయుమా యని ప్రార్థించి గంగను సమ్మ తింపఁజేసి బ్రహ్మ యరిగెనని యర్థము. జలాధిదైవతముగు స్త్రీవ్యక్తి గలదని తోఁచెడిని జలములతో బ్రహ్మ మాటలాడ లేదు. పంచమహాభూతములకు నధిదేవతలు కలరని మన మెఱుంగవలయు. జలములు జడములు. కాన వానిం బ్రార్థిం చిన లాభమేమని యాక్షేపించువారికి సమాధాన మిదియే. భూదేవి యనఁగా భూగోళాధిష్ఠానదేవత. అది స్త్రీవ్యక్తిగా భావింపఁబడెను. ఆ దేవతను మనము ప్రార్థింపవలయును. అంతియ కాని జలములు మాటలాడునా. వానికి దేహముకలదా యని ప్రశ్నింపరాదు. తరులతాదులకుంగూడ నధిదేవతలుకలరనియు,

వానినే మనవా రుపాసింతురనియు, నంతియకాని చెట్లను దీవియలనుబుద్ధిలేక యుపాసింపలేదనియు నెఱుంగవలయును. అశ్వత్థము వృక్షసామాన్యమని భావింపక త్రిమూర్త్యాత్మకముగా భావించి దానిని బూజింతురు. పాషాణరూపమున నున్న భగవంతుని బ్రార్థించిన నారూపమున వరప్రదుం డగునపుడు వృక్షరూపమున నుండువాఁడు భావనచే నేల తృప్తిఁబొంది వరమీయఁడో తెలియకున్నది. వృక్షరూప మాభగవంతునకు లేదనుట యవివేకముకాదా. సర్వరూపుఁడని యుపనిషత్తులు బోధించును.

"అశ్వత్థస్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః"

అనుగీతావాక్యము స్పష్టమేకాదా సర్వచైతన్యరూపునకు నొకరూపము కలదనియు నింకొక్కరూపము లేదనియు ననఁ గూడదు. ఈవిషయ మెఱుంగనివారే పూర్వులు తెలివిలేక పర్వతములను వృక్షములను బాములను బూజింతురని యాక్షేపింతురు.

"వసూనాం పావకశ్చాస్మి మేరుశ్శిఖరిణామహం,
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ."

అను గీతోపనిషదభిప్రాయము వారికి రుచింపదుకాఁబోలు. భగవత్తత్త్వమహత్త్వమును బూర్వు లెఱింగినవారు కాన నెవ్వానికి దేనియందు భక్తికుదురునో దానిం బూజించిన భగవంతుఁడు తృప్తినొందుననిరి. నా కారిణం బూజించిరి. భగవత్కరుణకుం బాత్రులైరి. మనమంతటివిజ్ఞానసంపద లేనివారమై

వారి నాక్షేపింతుము. లాభమేమి? వృథాపాపము నార్జించు కొనుటయే. ఇట్టు లీఘట్టమునుండి యనేకవిషయములు విమర్శింపఁదగినవి కలవు. కొన్నిం దెలిపితిని. తరువాతికథను విన్నవింతును.

## గంగావతరణము.

*బ్రహ్మదేవుఁడు వరమిచ్చి యరుగఁగా నాతనియానతి మౌళిందాల్చి యాభగీరథుఁడు పాదాంగుష్ఠము భూమిమీఁద మోపి యూర్ధ్వబాహువై వాయువే తన కాహారము కాఁగా నిరాధారముగా నహోరాత్రము లొక్కరీతిగా స్థాణువుచందంబునఁ గదలక యొక్కసంవత్సరము శంకరుని ధ్యానించుచుఁ దపం బొనరించెను. శంకరుండు కరుణాసముద్రుఁడు కావున నొక్కసంవత్సరము నిండఁగాఁ బార్వతింగూడి సాక్షాత్కరించి "రాజా! నీతపంబునకుఁ దద్దయు మెచ్చితి. నీయెడఁ బ్రసన్నుండనైతిని. గంగాదేవిని మౌళిఁ దాల్తును. నీవాంఛితముం దీర్తును." అనెను.

శంకరుఁ డిట్లు వరమీయఁగానే గంగాదేవి భూరితర రూపమును ధరించి సర్వలోకనమస్కృతగావున భయంకరవేగమున నంబరమునుండి పరమపావనమగు మహాదేవుని మస్తకంబునంబడి తనలో నిట్లు తలపోసెను. ఎవ్వరు నన్ను ధరింపఁజాలరు. అట్టి న న్నీశివుఁడు ధరింతునని ప్రతినపట్టెను. ఈతని ప్రతినఁ జూచెదఁగాక. నాదుర్భరప్రవాహమున నితనిం గైకొని యధోభువనముఁ బ్రవేశింతును అని యూహించుచుఁ దదను

---

* ఇది నలువదిమూఁడవ సర్గమునుండి గ్రహింపఁబడినది.

రూపమగు రూపము వేగముగలదగుచు శిరంబునం బడ సాగెను. భగవంతుండగు మహాదేవుఁ డాగంగాదేవికిం గల గర్వము నూహించి క్రుద్ధుఁడై గంగను వెలుపలఁ గానరాక శిరమునందే యడంగం జేసెదఁగాక యని మదిఁ దలపోసెను.

రామచంద్రా! భూరిజటాభరము పెనుచుకొనఁగా నొకగుహవలెఁ గానంబడుచు హిమాలయముతో సరిపోలుచుఁ బరమపావనమై తనరారు నాశివునిశిరస్సున నాగంగ యట్టి వేగముగాఁ బడి యెన్ని యో ప్రయత్నములు చేసియు నందుండి భూమిం జేరఁజాలకయుండెను. జటాభారమునఁ జిక్కి తత్తఱ పాటొంది యందుండి వెలుపలికి రాఁజాలకపోయెను. ఇఁక నెట్లు భూమిని జేరఁగల్గును? పెక్కేండ్లు గంగ యాజటాజూట మునందే తిరుగుచు వెతఁజిక్కియుండెను.

భగీరథుఁ డంత గంగానదిం గాంచజాలక మరల శంక రుంగుఱించి ఘోరతపం బొనరింపఁగాఁ బరమశివుండు సంతో షించి బ్రహ్మచే నిర్మింపఁబడి బిందుసరోవరమనఁ బ్రఖ్యాతిఁ గాంచిన యొకజలాశయమునం దాగంగను వదలెను జటా జూటమునుండి వదలుతఱి నాగంగ సప్తరూపములం గాంచెను. ఆయేడు ప్రవాహములు మంగళజలములుగలిగి భక్తులకుఁ బెక్కుశుభము లొసంగునవిగా నుండెను. హ్లాదిని, పావని, నళిని అనుమూఁడు ప్రవాహములు తూర్పునకుఁ బ్రవహించెను. సుచక్షువు, సీత, మహానది యనందగుసింధువు నను నీమూఁడు గంగలు పశ్చిమదిక్కునకుం బాఱెను. మిగిలిన యేడవదియగు గంగ భగీరథుఁడు ముందరుగ నతనివెనుకం బ్రవహించెను.

రాజర్షియగు నాభగీరథుఁడు దివ్యస్యందము నధిరోహించి తేజస్సు నలుదెసల వెలయించుచుండ ముందుగాఁ బోవసాగెను. గంగయు నాతనివెనుకనే పోవసాగెను. తొలుత నాకాశమునుండి మహాదేవునిశిరంబునంబడి యందుండి పుడమికిం దిగునపుడు గంగకుం గల్గినయురవడిచేత మహాధ్వనులు వ్యాపింపఁగా నామహానదీజలములు భూతలంబునఁ బాఱసాగెను. ఆజలములవెంట లెక్కింపరాని జలజంతువులు పడఁగా భూమి క్రొత్తగా నున్న చందముగఁ జూపట్టెను. ఆవేడుకఁ జూడఁగోరి యక్షగంధర్వాదులు విమానములపై నుండి యాగంగాపతనమును జూచుచుండిరి. గంగావతరణమనుపమానము. అత్యాశ్చర్యజనకము. కావున దానింజూచు వాంఛల దేవతలెల్ల గుంపులుగా వచ్చిరి. సకలాభరణభూషితులై వారు రాఁగా వారియాభరణరత్నకాంతులు నభంబున వ్యాపింపఁగా మేఘావృతములుకాని శతసూర్యబింబములుగల దిగ నాకాశ మలరారెను. మఱియు నందు జలజంతువులు విశేషించి చలించుచుండఁగా మెఱపులు గలిగియున్నట్టులయ్యది యెంతయుఁ బ్రకాశించె. గంగాగమన మతిచిత్రముగా నెన్నియోచందములఁ జూపట్టెను. శంకరునిజటాజూటమునుండి ప్రవహించినకతన నాజలము పరమపావనమని దేవతలు భక్తితో స్పృశించిరి. శాపకారణమున నూర్ధ్వలోకము నుండి భూమిపైఁబడినవారందఱు గంగాజలములయందు స్నానముచేసి శాపవిముక్తిం గాంచి పాపములు తొలఁగి పోవఁగా మరల నాకాశమార్గమునఁ దమరు ముందున్నలోక

ములనొందిరి. మానవు లందు స్నానముచేసి శ్రమములు వాయఁగా సుఖంపడిరి.

భగీరథుఁడు నిజతపఃఫలభూతయగు గంగాతరంగిణి వెంటరా రథము నధిరోహించిపోవుచుండ నావేడుకంజూచుచు దేవతలు మానవులుకూడఁ బోయిరి. సకలపాపములఁ బరిహరించి సర్వమంగళముల నీఁజాలు నాగంగాతరంగిణి భగీరథుండెందెందుఁ బోవునో తాను నందందుఁ బోవుచుండెను. మహానుభావుఁడై విచిత్రకార్యముల నొనరింప శక్తిగలిగినజహ్నుముని యజ్ఞముచేయుచుండు పావనస్థలము తన్మార్గముననే యుండెను. దానిని గంగాతరంగిణి ముంచివైచెను. జహ్నుముని దాని గర్వ మెఱింగి తనతపఃప్రభావమున నొక్కయెత్తునఁ ద్రాగి యూరకుండెను. దేవతలు ఋషులు గంధర్వాదు లాకార్యమున కచ్చెరువంది యామహాత్ము నారాధించి భగిరథునిప్రయత్నం బెఱింగించి యీగంగ మీతనూజ యగుననఁగా నందుల కామునిసమ్మతించెను. వెంటనే మహాతేజుఁడు కావునఁ దన యవయవంబులయందుఁ బవిత్రములగుశ్రుతులనుండి దానిని మరల నుత్పత్తియగునట్లుచేసెను. ఆకారణముననే గంగ జాహ్నవి యనియు, జహ్నుపుత్త్రికయనియుఁ బ్రసిద్ధిం గాంచెను. పదంపడి జాహ్నవి భగీరథుని యరదమువెంటఁ బోవుచు సాగరంబుంజేరి రసాతలమునకు వచ్చెను. రాజర్షియగు భగీరథుఁడాగంగను దీసికొని భస్మరాసులైయున్న తనతాతలఁ బరికించి మనము దుఃఖాక్రాంతముకాఁగా నాలోచించుచుండు టెఱింగి పరమపావనియగు గంగాదేవి యాతనిమనోదుఃఖము నెఱింగి తనజలంబుల నాభస్మరాసులం దడిపెను. తత్ప్రభావమున నా

సగరపుత్త్రులందఱు పాపపంకనిర్ముక్తులై యుత్తమగతిం బ్రాపించిరి.

మనశ్శక్తిసంపన్నులారా ! ఈభాగమునుండి మనము గ్రహింపఁదగునీతు లనేకములు గలవు. అందుఁ బ్రధానములనందగినవాని నించుక తడవి గ్రహింతము. భగీరథుఁడు మరలఁ దపోనిష్ఠకుఁ బూనెను. పాదాంగుష్ఠము నేలమోప యూర్ధ్వబాహుఁడై శంకరుని ధ్యానించుచుఁ దపంబొనరించెను. వాయువాతని కాహారము. ఒక్కవస్తువు నాధారము చేసికొనక నిలువంబడి యొక్కసంవత్సరముండెను. మనస్సు సదా శివునిపాదారవిందములయం దునిచెను. అనునది కథాంశము. ఈతపస్సు చేయ సాధ్యమా యని కొందఱు ప్రశ్నింతురు. అంతియకాక "రాత్రిందివమరిందమ" అనుటంజేసి నిరంతరము నిలిచియే యుండెనని యర్థమగును. కాన స్నానాదులుకూడ మాని యుండుట యట్లుండఁ బాదాంగుష్ఠమున భూమిని స్పృశించుచు నిలుచుండఁగలఁడా యనియు నడుగుదురు. ప్రశ్న మసంగతమనరాదు. కాని వారికి యోగమహిమము సుంతయేఁ దెలియదనవలయును.

ఒంటికాలిమీఁద నిలుచుండుటయే కష్టము. అందునంగుష్ఠాగ్రము నాధారముగా నిలుచుండుట సాధ్యముకాని పని. సామాన్యదృష్టిం బరికింపఁ దోఁచుట యొకవింత కాదు. యోగదృష్టింబరికింతము. ప్రాణాయామయోగమున దేహము వశమగును. అనఁగా సర్వావయవములు నిరోధింపఁబడి మనము చెప్పినట్లు వినునని భావము. అంతమాత్రమున యోగసిద్ధి కాదు. ఒక్కొక్క దేహాంతర్భాగమున దృష్టి నిలిపి వాయువు నిరో

ధింపవలయు. దాన నొక్కొక్కసిద్ధి యగుచుండును. ఈ దేహము వాయునిరోధముననే లోఁబడునుగాని హాయిగా భుజించి చల్లఁగాఁ గూరుచుండి వేదాంతవాక్యములు తోఁచినట్లు చెప్పుచుఁ గాలముంబుచ్చు తిండిపోతులకు లోఁబడదనుట సిద్ధాంతము. వాయువు నిరోధించి యొక్కొక్కచోట దృష్టినిలిపిన నతీంద్రియజ్ఞానాదులు గలుగును. అణిమాద్యష్టసిద్ధు లెట్లు గల్గును? ఉపన్యాసవేదికలయందు హస్తములు త్రిప్పినఁగలుగునా? సకలశ్రమములకు లోఁబడి యోగము నభ్యసించిననే కలుగును.

సూ. "తే సమాధావుపసర్గా వ్యుత్థానే సిద్ధయః. ౩౭

బంధకారణశైథిల్యాత్ప్రచారసంవేదనాచ్చ చిత్తస్య పరశరీరావేశః.

ఉదానజయాజ్జలపంకకంటకాదిష్వసంగ ఉత్క్రాంతిశ్చ. ౩౯

కాయాకాశయోస్సంబంధసంయమాల్లఘుతూల
సమాపత్తేశ్చాకాశగమనం. ౪౨

బహిరకల్పితావృత్తిర్మహా విదేహా తతః ప్రకాశావరణక్షయః." ౪౩

పాతంజలయోగసూత్రములు 3 పాదము.

యోగి బాహ్యదృష్టి నిరోధించి బాహ్యప్రపంచమును మఱచును అంతర్దృష్టి నుద్దీపింపఁజేసి లోకాంతరములఁ గనంజాలును. వాయువు నిరోధించి యాకాశతత్త్వమునఁ గాయము నుండఁదగునన్నపూన్కి సంకల్పించి తదుచితగతిఁ బ్రవర్తింపఁ దేహము ధూళిలేశమువలెఁ దేలికయగును. ఆసమయమున నొక్కభాగమున నంతర్దృష్టి నిలిపినచో దేహము సంకల్పానుసారము పైకెగురును. ఖేచరులంబోలి వలయుతావునకుం బోవఁజాలును. అనఁగాఁ దొలుతఁ దా నేచోటు మనస్సునంగాంచుచు

నందుండఁగోరి సంకల్పించిన నాతనువు తేలికయై వియద్వీథిం బోయి యందుఁజేరును. ఆస్థితియందుండుయోగి భూమిని స్పృశించిన ట్లితరులకుం దోఁచుఁగాని యాకాశముననే దేహమును నిలుపఁజాలును. ఈవిషయమే రామాయణమునందు,

"ఊర్ధ్వబాహుర్నిరాలంబో వాయుభక్షో నిరాశ్రయః".

అని చెప్పఁబడినది. నిరాలంబనిరాశ్రయశబ్దము లీవిషయమునే తెలుపుచున్నవి. వీనిని యోగసూత్రములతో సంబంధింపఁజేసినఁగాని యర్థము చక్కఁగాఁ దేలదు అట్టి యోగాభ్యాసమున కలవాటుపడిన యోగిస్థితి యెట్లుండు ననఁగా.—

"తయోస్సంయోగం జిత్వా లఘుని తూలాదౌవా తద్భావేన సమాధినా లఘుకాయో భూత్వా ఆదౌ జలే విహరతి, తతః ఊర్ణనాభితంతుషు విహరతి పశ్చాత్సూర్యరశ్మిషు తతో యథేష్టమాకాశే గచ్ఛతీత్యర్థః." (మణిప్రభ.)

"లఘుత్వాచ్చ జలే పాదాభ్యాం విహరతి తతస్త్వూర్ణనాభితంతుమాత్రే విహృత్య రశ్మిషు విహరతి తతో యథేష్టమాకాశగతిరస్య భవతీతి." (వ్యాసభాష్యము.)

ఆకాశమనఁగా దేహగతమగు నాకాశమే కాని బాహ్యాకాశము కాదు. యోగమునందు సంయమమనఁగా మనస్సును నిల్పుట యని యనుభవజ్ఞులుపలుకుదురు. మనశ్శక్తి యెట్టిదో యెఱుంగఁదరంబుగాదు. దాని నెన్నివిధముల నుపయోగింపవచ్చునో వర్ణింప నెవరికిని శక్యము కాదు. వియద్గమనము సులభము. అణిమాద్యష్టసిద్ధులు యోగికి సాధ్యములుగాక మాటలవేదాంతులకా సాధ్యములు? ఈయోగము నభ్యసించినవారి దేహమాసమయమున దూదికంటెఁ దేలికగా నుండును. కావున భగీ

రథుఁడు పాదాంగుష్ఠము నేలమోపి నిలుచుండి యొక్క సంవత్సరము తపమొనర్చుట కడుంగడు సులభము. వాయుభక్షణ మొనరించుచు నుండుట శక్యమా యని కొందఱలసులు ప్రశ్నింతురు.

సహస్రారకమలమున నభీష్టదేవతను ధ్యానించుయోగుల కమృతము దొరకును. దానిచేఁ దృప్తినొందుదురు. క్షుత్తు వారిని బాధింపఁజాలదు. దప్పి వారికిఁ బొడసూపదు. నిద్ర దూరమగును. ఆలక్ష్యమునుండి మరలనంతదనుక వారికే బాధలు నుండవు. ద్వంద్వములు వారిని బాధింపవు. ప్రతిదిన స్నానాదులు వారి కక్కఱలేదు. ఇన్నినియమములకు సత్కర్మములకు ఫలమాయేకాగ్రతయే. అది సిద్ధించినవారికి సామాన్యులమగు నస్మదాదులకుం గలవిధు లుండవు. అట్లే వారు పెక్కుయుగము లుండఁజాలుదురు. మహానందమున వారి మనస్సు మునింగియుండును. అట్టివారికి దుష్టజంతువులబాధ లుండవు.

"విషం న దేహే క్రమతే తదీయే దష్టే సుఘోరైరపి పన్నగేంద్రైః"

అని త్రిపురాసారసముచ్చయమునఁ గలదు. ఎట్టిమహావాయువు కూడ వారిం గదల్పఁజాలదు. వారింగుఱించియే భర్తృహరి

"ధన్యానాం గిరికందరే నివసతాం జ్యోతిః పరం ధ్యాయతా
మానందాశ్రుకణాన్పిబంతి శకునా నిశ్శంకమంకేశయాః."

అని నుడివెను. వారిని సామాన్యనియమములు బాధించునా?

ఉపాసకులు పూర్వోక్తసిద్ధులలోఁ గొన్నింటిని సాధింపఁ గలరు. వారికి యోగాభ్యాసము ఉండవలసినదే. కాని మంత్ర

మూలమున నాసిద్ధులు కలుగును. వానికి మంత్రసిద్ధులని పేరు. యోగులకుఁ గల్గుసిద్ధులకు యోగసిద్ధులని పేరు. ఒక్కొక్క సిద్ధి నిచ్చుదేవత యొక్కొక్కటి యుండును. దేనిం గోరిన వారు ఆదేవత నుపాసింతురు. ఉపాసనమునందు ధారణ యుండవలయును. సమాహితచిత్తము కుదురకయున్న నించు కంతయు లాభము లేదు.

> "రససిద్ధిర్లోహసిద్ధిర్బలసిద్ధిస్తథైవ చ. ౫౬
> ఖడ్గసిద్ధిః పాదుకాయాస్సిద్ధిరంజనసిద్ధికా,
> వాక్సిద్ధిర్లోకసిద్ధిశ్చ దేహసిద్ధిరనంతరం. ౫౭
> ఏతాదృశ్యస్సిద్ధయస్తు బహ్వ్యః ఉక్తా యోగిసమ్మతాః,
> అత్రాంతరే తు పరితస్స్వవంతే పరమేశ్వరీం. ౫౮
> కోటిశస్సిద్ధయ స్తస్మిన్నణిమాద్యంతరే శుభే,
> నవలావణ్యసంపూర్ణాస్స్మయమానముఖాంబుజాః. ౫౯
> జ్వలచ్చింతామణికరాస్సదా షోడశవార్షికాః,
> అత్యుదారప్రకృతయః ఖేలంతి మదవిహ్వలాః. ౬౦
>
> (లలితోపాఖ్యానము ౪౦ అధ్యా)

ఈప్రమాణములం బరిశీలించిన నెన్నియోసిద్ధు లుపాసకులు పొందవచ్చునని స్పష్టమగును. ఈమార్గము రెండవది. అనఁగా యోగసిద్ధులకంటె నివి యల్పములని యెఱుంగవలయు. ఓషధీ సిద్ధులుకూడఁ గలవు. లతావిశేషములయందు మహత్త్వము కలదని యెఱుంగవలయు. ఏలయనఁగా లతాధిదేవత నుపాసించుటచేతనే కాని వేఱుకారణముకాదు. కనుకనే తదుక్త పర్వమునందు దేవతను బూజించి యాలతను గ్రహింతురు. కావున మంత్రసిద్ధులకంటె యోగసిద్ధు లుత్తమోత్తమములని

రొలుంగవలయును. ఈవిషయమునుండి యోగమహిమము తేటపడును. కాన భగీరథుఁడు పాదాంగుష్ఠాగ్రమున నిలువంబడి తపస్సుచేయుట గొప్పకార్యమని భావించి సంశయమొందఁ బనిలేదు.

"వాయుంభక్షో నిరాశ్రయః"

అను నీభాగమున నొక్కరహస్యము కలదు. సహస్రారకమలమందు ధ్యానించువారల కమృతము దొరకునని ముందు వ్రాయఁబడియెను. దానిపద్ధతి నించుక తెలిపెదను.

"సుధాధారాసారైశ్చరణయుగళాంతర్విగళితైః
ప్రపంచం సించంతీ పునరపి రసామ్నాయమహసః,
అవాప్య స్వాం భూమిం భుజగనిభమధ్యుష్టవలయం
స్వమాత్మానం కృత్వా స్వపిషి కులకుండే కుహరిణి." ౧౦

అని శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులుగారు సౌందర్యలహరియందు నిర్వచించియున్నారు.

"సుధాయాః ధారభూతాః ఆసారాః ధారాసంపాతాః తైః చరణయుగళాంతర్విగళితైః చరణయుగళస్య పాదారవిందద్వయస్య అంతర్విగళితైః మధ్యప్రదేశాత్ప్రవిద్ధైః ప్రపంచం ద్విసప్తతిసహస్రసంఖ్యాకనాడీమార్గం సించంతీ సేక్త్రీ పునరపి సేచనానంతరమపి రసామ్నాయ మహసశ్చంద్రాత్సకాశాత్ రసామ్నాయ మహాశ్శబ్దో యామళే కళానిధౌ ప్రసిద్ధః. రసస్య సుధాయా ఆమ్నాయో గుణానాం ఆధిక్యమితి యావత్ తదాత్మకం మహః."

ఉపాసకుఁ డుపాస్యదేవతాధ్యానము చేయుచుండఁగాఁ జిత్తసమాధి సిద్ధించును. అనఁగా నుపాస్యదేవతయందు లీనమగును. ఆస్థితియందుండుయోగికి నమృతము

త్రాగినట్టితృప్తి గలుగును. ఈవిషయ మింతకంటె వ్రాయ ననువుపడదు. కనుక వాయుభక్షణ ముపచారార్థమనియు, నాహార మాస్థితియం దున్నవాని కక్కఱలేదనియు, తుత్పిపా సాదు లాతని బాధింపఁజాలవనియు నెఱుంగందగు.

"అచింతయచ్చ సా దేవీ గంగా పరమదుర్ధరా. ౫
విశామ్యహం హి పాతాళం స్రోతసా గృహ్య శంకరం,
తస్యావలేపనం జ్ఞాత్వా క్రుద్ధస్తు భగవాన్ హరః. ౬
తిరోభావయితుం బుద్ధిం చక్రే త్రిణయనస్తదా,"

అను నీభాగమునుండి గ్రహింపఁదగినవిషయ మొక్కండు కలదు. గంగ గర్వించి నాప్రవాహవేగమున నీశంకరు నీడ్చుకొని పాతాళమునకుం బోదునని తలంచెను. ఆతలంపు నెఱింగి యాగర్వము నడంపఁబూనియాగ్రహించి భగవంతుఁడు కావున దానిని దనజడలనుండి బయలుపడకయుండ నడంప నెంచెనని కథాసారము.

"అయుక్తః ప్రాకృతస్స్తబ్ధశ్శఠో నైకృతికోఽలసః,
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే." ౨౮
నైకృతికః పరవిభేదనపరః.
"అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహం,
విముచ్య నిర్మమశ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే." ౫౩
(గీత ౧౮ అధ్యాయము.)

అనుభగవదుక్తి ననుసరించి యితరుల నడంపవలయు ననునట్టి యూహ తామసము అనఁగాఁ దమోగుణప్రధానులకుంగలుగు నహంకారము. అహంకారమును వదలి శాంతుఁడైనఁగాని

జ్ఞాని కాఁజాలఁడు. గంగ భగవంతుఁ డగుశంకరుసత్త్వ మెఱుంగఁజాలకపోయెను. తనప్రవాహవేగము నాపఁజూనుట గర్వముననేకదా యని తలంచెను. సర్వేశ్వరుఁడు కాన దాని యూహ నెఱింగి తనజటాజూటమున నిముడునట్లు చేసెను. కేశములలో నిముడునట్లు చేసెననఁగా దానిశక్తి యత్యల్ప మగున ట్లొనర్చెనని భావము. కేశము లధమములని ప్రసిద్ధి. అధ మేంద్రియాంశమునుండి వెలువడఁజాలక యందే తిరుగు చుండెనని తాత్పర్యము. గంగానది కధిదైవతమగు స్త్రీవ్యక్తిని ధరించెనని సార మెఱుంగఁదగు. ఆమె జలరూపమునఁ బ్రవ హింపఁగలదని మనము విశ్వసింపవలయును. ప్రవాహమును ధరించెనని యంత జల మెట్టు లిమిడెనని జలదోషమునఁ దల నొప్పికలుగలేదా యని కుప్రశ్నములుచేయరాదు. గంగాదేవి నద్యధిదైవతమని గ్రహించినయెడల నీప్రశ్నములకే యవ కాశము కలుగదు. జలరూపమే గంగ యనువారు కొందఱు గలరు. వారు గంగాస్వరూపమే యెఱుంగరనవలయును.

గంగయు, సరస్వతియు, లక్ష్మియు, నీముువ్వురు విష్ణు పత్నులు. వీరు పరస్పరశాపకారణమున భూలోకమున జన్మించిరి.

"లక్ష్మీస్సరస్వతీ గంగా తిస్రో భార్యా హరేరపి,
ప్రేమ్ణా సమాస్తాస్తిష్ఠంతి సతతం హరిసన్నిధౌ. ౧౭
చకార సైకదా గంగా విష్ణోర్ముఖనిరీక్షణం,
సస్మితా చ సకామా చ సకటాక్షం పునః పునః. ౧౮
విధుర్జహాస తద్వక్త్రం నిరీక్ష్య చ క్షణం తదా,
క్షమాం చకార తద్దృష్ట్వా లక్ష్మీర్నైవ సరస్వతీ. ౧౯
బోధయామాస పద్మా తాం సత్త్వరూపా చ సస్మితా,

క్రోధావిష్టా చ సా వాణీ న చ శాంతా బభూవహ. ౨౦
ఉవాచ వాణీ భర్తారం రక్తాస్యా రక్తలోచనా,
కంపితా కామవేగేన శశ్వత్ప్రస్ఫురితాధరా. ౨౧

భగవాన్:—

లక్ష్మి త్వం కలయా గచ్ఛ ధర్మధ్వజగృహం శుభే,
గంగే యాస్యసి పశ్చాత్త్వమంశేన విశ్వపావనీ,
భారతం భారతీశాపాత్పాపదాహాయ పాపినాం
భగీరథస్య తపసా తేన నీతా సుకల్పితే. ౫౦
నామ్నా భాగీరథీ పూతా భవిష్యసి మహీతలే,
మదంశస్య సముద్రస్య జాయా జాయే మమాజ్ఞయా. ౫౧
మత్కలాంశస్య భూపస్య శంతనోశ్చ సురేశ్వరి,
గంగా యాతు శివస్థానమత్ర పద్మైవ తిష్ఠతు
శాంతా చ క్రోధరహితా మద్భక్తా సత్త్వరూపిణీ. ౫౪

(దేవీభాగవతము ౯ స్కం. ౬ అధ్యా.)

భగవంతుఁడు శ్రీమహావిష్ణువు రాఁగలకాలము నాలోచించి మూఁవురుపత్నులకు విరోధము కల్పించెను. పరస్పరము శపించుకొనిరి. సర్వసాక్షిగావున నంతదనుక నూరకుండి వారివారికి శాపముల ననుభవించుపద్ధతి నుపదేశించెను. నదీరూపముల భూలోకమునఁ గొంతకాలముండి యవ్వల మరల నాకడకు రాక బ్రహ్మకడను శంకరుచెంత నుండవలయునని సరస్వతికి గంగకు బుద్ధిచెప్పెను. వారు దుఃఖింపకయుండ మీరు పరమ పావనకీర్తులనందుఁడని యాజ్ఞాపించెను. ఇది కథాసారము.

దీనినుండి గ్రహింపఁదగువిషయమేది?

గంగాదేవి విష్ణుపాదోద్భూత యగుజలమనునది మర్యా
దార్థకము. గంగానామధారిణి విష్ణుపత్ని. ఆమె శంకరుని
మ్రోలనుండఁ దగునని శ్రీమహావిష్ణువునకుఁ దోఁచెను. ఏల?
తమోగుణప్రధానుఁ డీశ్వరుఁడు. అగ్ని యామహాదేవునకు
మూఁడవకన్ను. లయకర్తకదా. కావున శాంత మావశ్యకము.
ఈశ్వరక్రోధ మావిర్భవింపకయుండ గంగాదేవి శాంతింపఁ
జేయును. అనఁగా జలము క్రోధమార్పును. ఈవిషయము
పెద్దల కనుభవసిద్ధము. మిక్కుటమగుకోప మున్నపుడు
స్నానము చేయుమని పెద్ద లుపదేశింతురు. దానఁ గొంత తగ్గు
ననికదా సారము. ఆగంగ విష్ణుపత్నిగా నున్న లోకమున కుప
కారము లేదు. కావున భూలోకమునకుం బోవలయును. ఎట్లు?
ఆకార్యము సంఘటింపఁజేయ నాదేవుఁడు భార్యలకు మువ్వు
రకుఁ గలహము పెట్టెను. వారు శపించుకొనిరి. వారు శపించు
కొనుదురని యెఱింగియే శ్రీపతి యందుండి లేచిపోయెను.

"మనసా చ సమాలోక్య స జగామ బహిస్సభామ్" ౨౪

(దేవీభాగవతము. ౯ స్కం. ౬ అధ్యా.)

శాపముల వా రొకరినొకరు దూషించుకొనుచుండ మరలవచ్చె
ను. సరస్వతి లక్ష్మీదేవిని "వృక్షముగాఁ బుట్టుము. నదివిగూడఁ
గమ్ము." అని. గంగ సరస్వతిని, సరస్వతి గంగను "నదివి కమ్ము."
అని శపించుకొనిరి. ఈశాపము ననుభవించునట్లు చేయఁబూని
శ్రీపతి నీవు గంగానదివి కమ్మనియుఁ, బిదప శంకరపత్నివి కమ్మ
నియు నాజ్ఞాపించెను. భగీరథుఁడు నాభక్తుఁడు కాన నాతని
కారణమ్మున భూలోకమ్మునకుం బొమ్మనియెను. లక్ష్మి శాపకారణ
మునఁ దులసీవృక్షమయ్యెను. పద్మావతి నదియు నయ్యెను. సర

స్వాతియు నది యయ్యెను. ఈకారణమున గంగాదేవి భూలోక
మునకుఁ బోవ నదను వేచియుండెను.

సగరసుతులు భస్మరాసులైనను భగీరథుని ప్రయత్నము
సాగునంతదనుక గంగ రాఁజాలకపోయెను. భగీరథుఁడు తప
స్సున బ్రహ్మ నలరింప నతఁడు గంగాభావము నెఱుంగువాఁడు
కాన దానిని ధరింపఁజాలువాఁడు శంకరుఁడే కాని యింకొ
క్కఁడు లేఁడు. కావున నాతనిం బ్రార్థింపుమనఁగా నతఁడు
శంకరుం బ్రార్థించెను. సమయమువచ్చినదిగాన గంగాధారణ
మున నంగీకరించెను. శాపకారణమున భూలోకమునకుఁ బోవ
లసివచ్చెఁగదా యన్నకోపమున గంగ శంకరుని బ్రవాహవేగ
మునఁ గొనిపోవ నూహించెను. ఆగర్వము నడఁగించి శంక
రుఁడు దాని శిరంబున ధరించెను. "న హి కారణం వినా కార్య
స్యోత్పత్తిః" యన్నన్యాయము ననుసరించి శాపకారణమున
భగవంతుఁడు లోకమునకుఁ గర్మసిద్ధాంతమును బోధించెను.
ఎట్టివాఁడు కాని నాయంతవాఁడు లేఁడని గర్వింప రాదనియు,
నట్లు గర్వించిన నధఃపతనము తప్పదనియు, మన మెఱుంగ
వలయు.

> "తేషామేవానుకంపార్థమహమజ్ఞానజం తమః,
> నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా. ౧౧
> ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ." ౩౧

అనుభగవదుక్తి ననుసరించి కర్మఫల మనుభవింపక తప్పదనియు,
జ్ఞానము విస్తరిల్లినఁగాని యజ్ఞానము నశింపదనియు, సత్కర్మాను
ష్ఠానమునఁగాని జ్ఞానము పొడసూపదనియు, మన మెఱుంగ
వలయును. గంగ జలరూపమున లోకమున కుపకార మొన

రించెననియు, నామె దేవతయనియు, మనము నిర్ణయించుకొనవలయును. గర్వ మాత్మవినాశనహేతువని నమ్మవలయును. జలములను భగవద్రూపములుగా భావించినచోఁ దమోగుణము తగ్గుననియు మన మెఱుంగవలయును.

"శాపాత్ప్రతితా యే చ గగనాద్వసుధాతలం. ౨౭
కృత్వా తత్రాభిషేకం తే బభూవుర్గతకల్మషాః,
ధూతపాపాః పునస్తేన లోకేనాథ సుభాస్వతా. ౨౮
పునరాకాశమావిశ్య స్వాన్ లోకాన్ ప్రతిపేదిరే,

అను నీభాగము నించుక విచారింతము. పాపకర్మములచే నొండె సాధుతిరస్కారాదులచే నొండె నధోగతికలుగు. స్వర్గాదిలోకముల నివసించువారు శాపవశమున నెవ్వరెవ్వరు భూలోకమునకు వచ్చి దుఃఖపడుచుండిరో వారెల్ల నామహానదియందు స్నానముచేసి తమపాపములు నశింపఁగా నూర్ధ్వమార్గమునఁ దమతమలోకములకుం బోయి సుఖంబుండిరని కథాభాగము.

లోకోపకారముచేయువస్తువులెల్లఁ బవిత్రములే యగు. అందును విష్ణుపత్నియై లోకపవిత్రీకరణార్థ మరుదెంచుగంగాదేవి పరమపావనియగు. అంతియగాక పరమపావనియని గరుత్మంతుఁ డంశుమంతునకుం దెలిపియుండెను. విష్ణుమూర్తికూడ

"భారతం భారతీశాపాత్పదాహాఃయ పావినాం."

(దేవీభాగవతము.)

అని పల్కియుండెను. శంకరోత్తమాంగసంస్పర్శము నొందినది. అట్టి మహానదియందు స్నానముచేసినఁ గల్మషములు పాయు టొకవింతయా? అనఁగా నేవారికి శాపాంత మాసన్నమయ్యెనో వారలే యందు స్నానముచేసిరని మన మూహింప

వలయు. అట్లూహింపకయున్న శాపము నిష్ఫలమగుటయేగాక కర్మసిద్ధాంత మెగిరిపోవును. జలములు విష్ణుస్వరూపములనియు, భగవంతుఁడు నివసించియుండుననియుఁ, బ్రమాణములు కనం బడుచున్నవి. ఎవ్వారి కట్టిదృఢవిశ్వాసముగలదో వారికిఁ బాపానుభవ కాల మంతమయ్యెనని మనమూహించు టుచితము. నదీస్నానము పాపహరమను ప్రమాణము లనేకములు గలవు. "స్రోతసామస్మి జాహ్నవీ" అనుభగవద్వాక్యముకూడఁ గలదు. పరమపావననదులలో గంగానది యుత్తమోత్తమ మనవలయు. కావున నట్టి మహానదీస్నానమునఁ బాపజాలములు తూలుననుట స్తుతిగాదు. నిక్కమే. ఆస్నానము నిశ్చలభక్తియోగపూర్వక ముగ నుండవలయును. "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" అని శ్రుతి చాటుచున్నందున స్వర్గాదిలోకములనుండి భ్రష్టు లగువారు మర్త్యలోకమునకు వత్తురు. ఇందు మరలఁ బుణ్య కర్మము లొనరించి తదనుభవముకొఱకు స్వర్గాదిలోకముల కరుగుదురు. యోగమతమందు గంగాస్నాన మనఁగా నింకొక్కయర్థము గలదు. త్రివేణీసంగమ మనఁగా నింకొక యర్థము. అందు స్నానముచేయుట యనఁగా దృఢమనస్సుతో భావించుట యని యర్థము. సకలనదీస్నానపుణ్యము యోగ మతము ననుసరించి మనస్సంయమనమునఁ గలుగుననుటయే రహస్యము. ఆవిషయ మిచ్చట నింతకంటె విస్తరింపఁదలంపను.

"తత్ర దేవర్షిగంధర్వా వసుధాతలవాసినః,
భవాంగపతితం తోయం పవిత్రమితి పస్పృశుః." ౨౭

ఈశ్లోకమున విశేషమేమియు లేదుకాని యించుక నిష్పక్ష పాతబుద్ధు లెఱుంగఁదగువిషయ మొక్కటి కలదు. దేవర్షిగంధ

ర్వాదులు, మానవులు శంకరశిరస్సునుండి జాఱినయీనదీజలము పావనమని స్పృశించిరి. అనఁగా స్నానముచేసిరి. అనునది దీని యర్థము. ఈశ్లోకమునకు

"పవిత్రం పావనం తత్ర జ్ఞాపనహేతుమాహ. భవాంగపతితమితి. భవేన రుద్రేణ శిరసా ధృతత్వాత్ పవిత్రమితి జ్ఞాత్వా పస్పృశురిత్యర్థః. పవిత్రమితి సామాన్యోక్త్యా భవస్యాన్యేషాం చ పవిత్రమిత్యుక్తం. అత ఏవ 'హరస్యగాత్రసంస్పర్శాత్ పవిత్రత్వముపాగతే' త్యత్రాపి హరస్యశుద్ధిప్రదత్వముపాగతేత్యర్థః. అస్యైవ్యృషయ ఊచుః భాగవతే. 'యచ్ఛౌచనిస్సృతసరిత్ప్రవరోదకేన తీర్థేన మూర్ధ్ని విధృతేన శివశ్శివోఽభూ' దితి భారతే. తమంబుపతితం దృష్ట్వా దధారశిరసాహరః, పావనార్థం జటామధ్యే యోగ్యోఽస్మీత్యవధారణా' దితి. అత్రాప్యయోధ్యాకాండే వక్ష్యతి. 'విష్ణుపాదోద్భవాం దివ్యా' మితి. గంగాయా విష్ణుపాదోద్భవత్వేన పవిత్రత్వరూపం. భవాంగాత్పతితమితి వార్థః. ద్వితీయాశ్రితాతీతపతితేతి ద్వితీయాసమాసవిధానాత్ పంచమీసమాసానుపపత్తేశ్చ. భవేన ధృతత్వాదస్మాభిరపి ధార్యమితిపస్పృశురిత్యేవార్థః. యద్వా భవాంగపతితత్వాత్. పవిత్రం న తు పూర్వవదితి పవిత్రం. అతఏవ పస్పృశుః. న తు సస్నుః. యద్వా. యద్యపి భవాంగాత్పతితం. తథాపి విష్ణుపాదోద్భూతత్వాత్పవిత్రమితి వా. నదీ వేగేన శుధ్యతీతి న్యాయాత్ భవసంపర్కానిగమే పవిత్రమితివా పస్పృశుః."

అని గోవిందరాజవ్యాఖ్య.

పండితోత్తములగు వీరు శంకరద్వేషముచే నిట లేని పోనియర్థములు కల్పించిరి. ప్రాతీతికార్థమును ద్రోసివేసిరి. ఈశ్వరునకు మఱియు నితరులకుఁ బవిత్రత్వము నాపాదించునది యని స్పృశించిరఁట దీని కనుకూలముగా భాగవతమునుండి యొకప్రమాణముం జూపిరి. గంగ విష్ణుపత్ని యనువిషయ

మును మఱచిరి. మతాభిమాన మెంతటి విపరీతకార్యమునైనఁ జేయించును.

> "ధాతుః కమండలుజలం తదురుక్రమస్య
> పాదావనేజనపవిత్రతయా నరేంద్ర,
> స్వర్ధున్యభూన్నభసి సంప్రతి నిర్మమార్ష్టి
> లోకత్రయం భగవతో విశదేవ కీర్తిః." ౫
>
> (భాగవతము ౮ స్కం. ౨౧ అధ్యాయము.)

వామనమూర్తిపాదములఁ గడుగ బ్రహ్మ తనకమండలువులోని యుదకము నుపయోగించెను. ఆపాదోదకమే స్వర్లోకనది యయ్యెనని సారతరార్థము. ఆనదియే భూలోకమున వచ్చెను గాన దానిని శంకరుఁడు శిరమున ధరించెను. దాన శివుఁడు పవిత్రుఁడయ్యెను. అక్కారణముననే దేవర్షులు లోనగువారు స్పృశించిరి. కాని స్నానము చేయలేదఁట. శివుఁడు ధరించెను గాన మనకు ధరింపఁదగినదే యని స్పృశించిరఁట. ఏమి చమత్కారము!

పాఠకమహాశయులారా! దీనిచరిత్రమును మన మెఱుంగుట మంచిదికదా. బ్రహ్మ కమండలువులోనియుదకము స్వర్నదియైనది. దీనిని ధరించుటచేతనే శివుఁడు శివుఁడయ్యెను. అనఁగా నమంగళరూపుఁడు మంగళరూపుఁడయ్యెనని తాత్పర్యము. అను నీగోవిందరాజుగారియభిప్రాయమునుబట్టి మనమూహించితిమేని విష్ణువు సర్వోత్కృష్టుఁడని,శంకరుఁడు తత్పాదజలమును ధరించినందునఁ బవిత్రుఁడయ్యెనని వ్యాఖ్యాతయభిప్రాయమని తేలెడినిగదా వీరికి శ్రీభాగవతము ప్రమాణమైనది. కాననే యందున్నశ్లోకము నుదహరించిరి. కావున నాభాగవ

తమునుండియే ప్రమాణము లుదాహరించి పై వారిపక్షపాత మును విమర్శింతము.

క్షీరసాగరమును మథించుకాలమున హాలాహల ముదయించెను. అత్తరుణమున శ్రీమహావిష్ణువు కూర్మరూపమున మంధరపర్వతమును ధరించియుండెను. విషము పుట్టగానే. ఎల్లరు పరువెత్తి శంకరుం గాంచిరి. ఆఘట్టమునం దీశ్లోకము లున్నవి.

"తదుగ్రవేగం దిశిదిశ్యుపర్యధో విసర్పదుత్సర్పదసహ్యమప్రతి,
భీతాః ప్రజాదుద్రువు రంగ సేశ్వరా అరక్ష్యమాణాశ్శరణం సదాశివం.
విలోక్య తం దేవవరం త్రిలోక్యాభవాయ దేవ్యాభిమతం మునీనాం
ఆసీనమద్రావపవర్గహేతో స్తపోజుషాణం స్తుతిభిః ప్రణేముః." ౨౦

ప్రజాపతయ ఊచుః.—

"దేవదేవ మహాదేవ భూతాత్మన్ భూతభావన,
త్రాహి నశ్శరణాపన్నాన్ త్రైలోక్యదహనాద్విషాత్. ౨౧
త్వమేకస్సర్వజగతా మీశ్వరో బంధమోక్షయోః,
తం త్వామర్చంతి కుశలాః ప్రపన్నార్తిహారం గురుం. ౨౨
గుణమయ్యా స్వశక్త్యాస్య సర్గస్థిత్యప్యయాన్ విభో,
ధత్సే యయా సదృగ్భూమన్ బ్రహ్మావిష్ణుశివాభిధాం. ౨౩
త్వం బ్రహ్మ పరమం గుహ్యం సదసద్భావభావనం,
నానాశక్తిభిరాభాత స్త్వమాత్మా జగదీశ్వరః. ౨౪
త్వం శబ్దయోనిర్జగదాదిరాత్మా ప్రాణేంద్రియద్రవ్యగుణస్వభావః,
కాలః క్రతుస్సత్యమృతం చ ధర్మ స్త్వయ్యక్షరం యత్త్రివృదామనంతి.
యే త్వాత్మరామగురుభిర్హృది చింతితాంఘ్రి
ద్వంద్వం చరంతముమయా తపసాభితప్తం,
కత్థంత ఉగ్రపురుషం నితరాం శ్మశానే

తే నూనమూతిమవిదం స్తవ హీనలజ్జాః. ౩౩
ఏతత్పరం ప్రపశ్యామో న పరం తే మహేశ్వర,
మృడనాయ హి లోకస్య వ్యక్తిస్తేఽవ్యక్తకర్మణః. ౩౫
నిశమ్య కర్మ తచ్ఛంభోర్దేవదేవస్య మీఢుషః,
ప్రజా దాక్షాయణీ బ్రహ్మా వైకుంఠశ్చ శశంసిరే." ౪౫

(శ్రీభాగవతము ౮ స్కం. ౭ అధ్యా.)

ఈయవి శ్రీభాగవతములోనివే. సకలదేవతాధిపత, త్రిమూర్తులుగా నెన్నఁబడువాఁడు శంకరుఁడేయని స్పష్టముకదా. శ్మశానవాసియని నిన్నుఁ బలుకుట నీమహిమ మెఱుంగలేకయేకదా. అనియందే కలదు. అట్టిశంకరుఁడు విష్ణుపాదోదకమగు గంగను ధరించి పవిత్రుఁడయ్యెనని వ్యాఖ్యచేయుట మతాభినివేశావేశముచేతనే యనవలయును. విష్ణుపాదోద్భవ యనఁగా నాకాశమునుండి వచ్చినదనియే యర్థముచెప్పుట మంచిదని కొందఱందురు. వామనమూర్తి పాదనిర్ణేజనజలము గంగయనుట స్తుత్యర్థమని గ్రహింపఁదగు పైభాగవతశ్లోకములు ప్రమాణములు కావనరాదుకదా. ఏదేవునిమహిమము చెప్పునప్పుడాదైవమునకంటె నితరుఁ డుత్కృష్టుఁడు లేఁడనుట మహాత్ములస్వభావము. ఏలయనఁగా నేవారి కేరూపనామములయందు విశ్వాసముండునో వా రారీతిగా ధ్యానించిన నాభగవంతుఁడు కరుణించుననియే కాని తెలియకకాదు.

"ధత్సే యయా సదృగ్భూమన్ బ్రహ్మావిష్ణుశివాభిధాం."

అనఁగా నర్థమేమి? మాయంగూడి సగుణబ్రహ్మమవై సృష్టిస్థితిసంహారములుచేయుచు బ్రహ్మావిష్ణుశివనామముల ధరింతువనఁగా నేకార్యమున నానామము, ఆరూపమును ధరింతువని యర్థము

కదా. దీనిని గాదనుట సాధ్యమా? సన్మతియగువాఁడు సర్వ పురాణముల సమరసముచేయవలయుఁగాని యజ్ఞానమునఁ దాఁబట్టినకుందేటికి మూఁడేకాళ్లనరాదు. భాగవతమునఁ గొంత ప్రమాణమని కొంత ప్రమాణముకాదని చెప్ప వలనుపడదు. విష్ణుమహిమమును దెలుపునవి మాత్రము ప్రమాణమనుమాట పరిహాసభాజనమే యగును. అట్టివాదమునకంటె నిస్సార మేదియు నీలోకమున లేదు.

"న మే విదుస్సురగణాః ప్రభవం న మహర్షయః,
అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః. ౨
యో మామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరం,
అసమ్మూఢస్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే." ౩
(గీత ౧౦ అధ్యా.)

అని శ్రీహరి యుపదేశించెను. నేనే సర్వమునకాధారమని దీని సారము. వాంఛల ననుసరించి రూపభేదములు నామాంతరములు కల్పింపఁబడినవి

"బ్రహ్మవర్చసకామస్తు యజేత బ్రహ్మణస్పతిం,
ఇంద్రమింద్రియకామస్తు ప్రజాకామః ప్రజాపతిం,
అన్నాద్యకామస్త్వదితిం స్వర్గకామోఽదితేస్సుతాన్.
విశ్వాన్ దేవాన్ రాజ్యకామస్సాధ్యాన్ సంసాధకో విశాం.
దేవీం తు మాయాం శ్రీకామస్తేజస్కామో విభావసుం,
వసుకామో వసూన్ రుద్రాన్ వీర్యకామస్తు వీర్యవాన్,
ఆయుష్కామోఽశ్వినౌ దేవౌ పుష్టికామ ఇళాం యజేత్.
ప్రతిష్ఠాకామఃపురుషో రోదసీ లోకమాతరౌ,
అకామస్సర్వకామో వా మోక్షకామ ఉదారధీః.

తీవ్రేణ భక్తియోగేన యజేత పురుషం పరమ్."

(శ్రీభాగవతము ౨ స్కం. ౩ అధ్యా.)

ఈవాక్యములఁబట్టి భగవంతుని సేవాంఛానుసారముగాఁ బ్రార్థించిన నాఫలము కలుగుననియే సారము.

"వేదైరనేకైరహమేవ వేద్యో వేదాంతకృద్వేదవిదేవ చాహం,
నపుణ్యపాపే మమ నాస్తి నాశో న జన్మదేహేంద్రియబుద్ధిరస్తి."

(కైవల్యోపనిషత్తు.)

ఇట్లే శ్రుతులన్నియు భగవన్మహిమమును విశేషించి తెలుపుచున్నవి. సకలరూపములు సకలనామములు కార్యముల ననుసరించి యాభగవంతునకుఁ గల్పింపఁబడుచుండునని బోధించుచున్నవి. ఇఁక శివవిష్ణువు లేమూలఁబడియున్నవారో వారి కేటిప్రాముఖ్యము? మతగర్వావేశము మహనీయులను దోలుబొమ్మలంబోలె నాడించుచున్నది. ఆడియాడి యొకమూలఁ బడిపోవును. ఈదూషణములు తమకే హానిని గల్పించునుగాని భగవద్రూపులగు బ్రహ్మవిష్ణుశంకరులకుఁ గృణమాత్రమైన లోపమును గల్పింపఁజాలవనుట మాత్రము సత్యము. ఏమత కర్తయు నే నీలోకమును జూచితినని చెప్పినవాఁడు లేఁడు. కాని వారియుపదేశములనంగీకరించి ప్రవర్తించుట న్యాయమే. పరమతములను, ఇతరదేవతలను దూషించుటగాని, వానికంటె వీఁడెక్కుఁడని వీనికంటె వాఁడు నీచుఁడని తారతమ్యములఁ గల్పించుటగాని నీచమగుఁపని. పురాణములు, స్మృతులు, శ్రుతులులోనగునవి యిట్టివిషయముల కించుకంతయుఁ జోటీయవు. క్రమించి యెట్లో యర్థము చెప్పఁబూనిన: నది సభాముఖమున నపూర్వమర్యాదం గూర్పకపోదు. తెలియనివిషయమును

దెలిసినట్లు నటించి దేవతల నిందించువారిని భగవంతుఁ డనుగ్ర హింపఁడు.

"తతో హి యజమానస్య జహ్నోరద్భుతకర్మణః,
గంగా సంప్లావయామాస యజ్ఞవాటం మహాత్మనః. ౩౪
తస్యావలేపనం జ్ఞాత్వా క్రుద్ధో యజ్వా తు రాఘవ,
అపిబచ్చ జలం సర్వం గంగాయాః పరమాద్భుతం. ౩౫
తతో దేవాస్సగంధర్వా ఋషయశ్చ సువిస్మితాః,
పూజయంతి మహాత్మానం జహ్నుం పురుషసత్తమం,
గంగాం చాపి నయంతి స్మ దుహితృత్వే మహాత్మనః. ౩౬
తతస్తుష్టో మహాతేజాః శ్రోత్రాభ్యామసృజత్ప్రభుః,
తస్మాజ్జహ్నుసుతా గంగా ప్రోచ్యతే జాహ్నవీతి చ." ౩౭

అను నీభాగము విమర్శనార్హము. ఇందలితత్త్వ మేమనియే. గంగ భగీరథుని వెంటనంటిపోవుచు జహ్నుముని యజ్ఞవాటము మును జలములచే ముంచెను. తపోబలమున నమ్ముని జలములఁ ద్రావెను. దేవాదులు ప్రార్థించి గంగ నీతనయ యగును. కాన వదలి లోకమునకు మహోపకారము చేయుమా యని ప్రార్థించెను. సంతోషించి జహ్నుముని శ్రోత్రరంధ్రములనుండి వదలెను. అనునది కథాసారము.

జహ్నుముని యాగము చేయుచుండెను. భగీరథుఁ డా యజ్ఞవాటముమీఁదుగా రథము పోనిచ్చినఁగదా యద్దానిని ముంచ వలనుపడును. భగీరథుఁ డంతవెఱ్ఱివాఁడా? తపస్వియై యెన్నియో శ్రమములకు లోఁబడి గంగాదేవి దయకుఁ బాత్రుఁడై శంకరు ననుగ్రహము నొందెను. అట్టిపరమపావన చిత్తుఁడు సత్కర్మానుష్ఠానము చేయుముని కపకారమును గల్గింప

నెంచునా యని మన మూహింపవచ్చును. ఇందుఁ గలతత్త్వ మేది? గంగానదీమూలమున నెవ్వ రెవ్వరు లోకవిఖ్యాతి నొందఁదగుదురో వారి నుద్ధరించుపొంటె గంగానది యామార్గమునఁ బోవును. యజ్ఞవాటము ముంచెననఁగాఁ బరమపవిత్రముగా నొనరించెను. ఆభూమింగల యపరిశుద్ధప్రాణికోటిని బరిశుద్ధముగ నొనరించెనని తత్త్వము. లోకులకు జలముచే ముంచినట్లు గంగాదేవి కనఁబఱచెను. దాన నెల్లరుఁ దనమహిమము నెఱింగి తరింతురనియే యామెభావము. దేవతలు లోనగువారు ప్రార్థించిరి. గంగాదేవి నీకుఁ బుత్త్రికయని పేరు గాంచును. కాన వదలుమని యభ్యర్థింప నాముని శ్రవణరంధ్రములమూలమున వదలెను. అనఁగా నావార్త నాలకించి యంతటివిఖ్యాతి లభించుట కానందించెనని భావమును గ్రహింపవలెను. దీనిసార మేమనఁగా జహ్నుతనయ గంగాదేవి యనువిఖ్యాతి యెంతదనుక నుండునో యంతదనుకఁ బుణ్యలోకనివాసము కల్గునని శ్రీమహాభారతము తెలుపుచున్నది. ఎవ్వానిపవిత్రనామము భూలోకమున నెంతకాల ముండునో యాపుణ్యమూర్తి స్వర్గమున నివసించును. కావుననే స్థిరసంతానములకై సజ్జనులు పాటుపడుదురు. ఇంద్రద్యుమ్నమహారాజచరిత్ర మిందున కుదాహరణ మగును. స్వర్గభ్రష్టుఁడయి యింద్రద్యుమ్నమహారాజు భూలోకమున కరుదెంచి తననామ మెఱుంగువారు కలరా యని పరికించి చిరకాలము గడచుటచే నెవ్వరు నెఱుంగమనఁగా నొకహ్రదమున నుండు తాఁబేలు తననామము నెఱుంగుదుననఁగా మరల స్వర్గమునకుఁ బోయి స్థిరవసతిం గాంచెను. అని భారతమునఁ

గలదుకదా. కాఁబట్టి జహ్నుమునికి శాశ్వతకీర్తి నాపాదింపఁ బూని గంగాదేవి యతని సత్కర్మప్రేరితయై యిట్టు లొనరించె నని మన మెఱుంగవలయును. లోకమున నెవ్వారికిఁగాని శాశ్వతకీర్తి రావలసియున్నచో దేవతాసాహాయ్యము కావల యును. సత్కర్మము లిందఱిఁ బ్రేరేపించును. ఎల్లరమూలమునఁ గాని శాశ్వతకీర్తి లభింపదు. కావున సర్వజనసుస్తవనీయ నామము లోకమున శాశ్వతముగా వెలయవలయునన్న సత్కర్మానుష్ఠాన మొనరింపవలయును. అయ్యది ఫలాభిసంధిరహితము కావలయును. దాన దేవత లానందింతురు. పితరులు సంతృప్తు లగుదురు. ఎల్లభూతము లాతనిఁ బ్రశంసింతురు. ఆపుణ్యమూర్తి నామము క్షితిని జిరకాలము నిలుచును ఇన్నింటికి మూలము సత్కర్మానుష్ఠానమే. అదియు స్వార్థము కారాదు. భగవత్ప్రీతిదము కావలయును. ఎల్లభూతముల మేలుకొఱకది చేయఁ బడవలయును. దాననే పరమేశ్వరుఁ డానందించును.

> "యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ,
> సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే. ౪౮
> దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ,
> బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః. ౪౯
> బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే,
> తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలం. ౫౦
> కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః,
> జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛంత్యనామయం." ౫౧
>
> (గీ. ౨ అ.)

అను నీశ్రీకృష్ణవాక్యములు సత్కర్మానుష్ఠానపద్ధతిని దానిఫల

మును వెల్లడించుచున్నవి. ఈమార్గమునకు విరుద్ధముగా నొన రించినకర్మములకు ఫలములు విపరీతముగనే యుండునుగదా. ఇట్టు లీఘట్ట మనేకవిషయములను బోధించుచున్నది. ఇఁకఁ దరువాతివృత్తాంతము నాలకింపుఁడు.

## భగీరథునకు బ్రహ్మ హితముఁ దెల్పుట.

*అంతట భగీరథుఁడు గంగాభవాని తను వెనుకొను చుండఁగా సాగరమునకుం బోయి సగరపుత్త్రు లేచోట భస్మ రాసులైరో యాస్థలమునకుం బోయెను. గంగాజలము లాభస్మ రాసులపైఁ బ్రవహించెను.అత్తఱి బ్రహ్మదేవుఁడుసర్వలోకనాయ కుఁడు గావున భగీరథుని గాంచి, "పుణ్యపురుషా! సగరకుమారు లిపుడు మహాత్ము లైరి. ఆయఱువదివేవురు ప్రేతత్వమును విడ నాడిరి. అది నీమూలమున వారికిం గలిగినమహాలాభము. కావున దేవతలంబోలి స్వర్గవాసులైరి. ఈసముద్రోదక మెంత దనుక భూలోకమున నుండునో అంతవఱకు వారు దేవలోక మున దేవతలవలెనే యుందురు. ఈగంగాభవానియు నీకు జ్యేష్ఠదుహిత కాఁగలదు. ఈగంగ నీవే తండ్రివి కాఁగా నాపేరుతో నీలోకమున సుప్రసిద్ధయై ప్రవర్తిల్లఁగలదు. స్వర్గో కమునుండి యవతరించిన యీగంగ త్రిపథగయనియు, నీపేరున భాగీరథియనియు, నీరెండుపేరుల విఖ్యాతింగాంచు. స్వర్గమును భూమిని బాతాళమునను బ్రవహించినకతనఁ ద్రిపథగ యను పేరు దీనికిం గలుగు

రాజర్షి! నీపూర్వులగుసగరతనూజుల కందఱ కొక్క-

---

*ఇయ్యది నలువదినాల్గవసర్గమునుండి సంగ్రహింపఁబడినది.

పారిగనీపావనగంగాజలములందుఁ దర్పణము చేయుము. దానిచే గంగోదకములచే సగరకుమారులను స్వర్గలోకప్రాప్తులనుగా నొనరింతునని నీవు చేసినప్రతిన నెఱవేర్పుము. సగరభూజాని మహాకీర్తిమంతుఁడు. ధార్మికోత్తముఁడు. అతఁ డీకార్యమును జేయఁబూనియు నకృతశ్రముఁ డయ్యెను. మహాపరాక్రమ శాలియగు నంశుమంతుఁడు కూడ గంగాదేవిం బ్రార్థించెను. కాని యతనికి నాపుణ్యము లభించినదికాదు. నీజనకుఁడు దిలీపుఁడు సామాన్యుఁడనఁదగునా. రాజర్షియే యగును. సుగుణ రాశి. మహర్షితుల్యుఁడు. రాజనామ మతనికి సార్థకమే. తప స్సున నాకు నీడగువాఁడు. అతఁడు నీగంగాదేవి నవతరింపఁ జేయఁబూనెనుగాని తుదకావిచారముకూడ లేనివాఁడయ్యెను. ఇందఱుమహాత్ములు చేయఁజాలకపోయిన యీకార్యమును నీవు సాధింపఁగల్గితివి. పుణ్యమూర్తివి. ప్రభావసంపన్నుఁడవు. కానఁ జేయఁజాలితివి. పరమపవిత్రయశస్సు నార్జించితివి. ఈగంగావత రణరూపమహాకార్యముచే ధర్మనిధివైతివి. ధర్మప్రతిష్ఠగల వాఁడవైతివి. ఈనది యితరనదులవంటిదికాదు. సర్వదా స్నాన యోగ్యమైనది. కాన నీనదీజలముల స్నానముచేయుము దాని చేత నీకుఁ బరమపవిత్రతయుఁ బుణ్యముఁ గల్గును. నీపూర్వుల కీజలంబుల నుదకక్రియ లాచరింపుము. నీకు శుభము లబ్బుం గాక. నాలోకమున కిఁకఁ బోయెదను. నీవు నుదకక్రియ లాచ రించి నీ పురమునకుఁ బొమ్ము"

అని హితముపదేశించి ప్రకాశ మెల్లదిశల వెలిఁగింప నాబ్రహ్మ సత్యలోకమునకుఁ బోయెను. రాజర్షివర్యుఁడగు భగీ రథుఁడు జ్యేష్ఠాదిక్రమము ననుసరించి శాస్త్రవిహితముగ

నుత్తమలోకమును గల్పింపఁజాలు నుదకదానము లొనరించి తక్కుంగలవారిని స్మరించి యక్లే క్రియ లాచరించి దానఁ బవిత్రుఁడై యశంబు నలుదెసల వ్యాపింప నయోధ్యానగరమును బ్రవేశించి సకలభాగ్యసంపన్నుఁడై రాజ్యంబుఁ బూజ్యభంగిం బాలించెను. ఆరాజ్యమునఁగలమానవు లరోగులై సర్వసమృద్ధులుగలవారలై శోకవిహీనులైరి. రాఘవా! నీవడిగినగంగావృత్తాంతము సమగ్రముగాఁ జెప్పితిని. దీన నీవు శుభము లొందుము. సంధ్యాకాలము మించిపోవుచున్నది. ఇపుడు నన్నేమియుఁ బ్రశ్నింపకుము. ఈచరిత్రము చతుర్విధపురుషార్థప్రదము. ఎవ్వాఁడుకాని దీనిని వినిపించునో వానిపితృదేవతలు దేవతలు సంతృప్తులగుదురు ఈయుపాఖ్యానము గంగావతరణ మనంబడును. దీని శ్రద్ధగా భక్తిభరితచిత్తంబుతో నెవఁడాకర్ణించునో వానికి సర్వాభీష్టంబు లొనఁగూడును. సర్వపాపములు నశించును. ఆయురారోగ్యములు వృద్ధినొందును

భక్తజనులారా! ఈభాగమునుండి గ్రహింపఁదగు నంశము లనేకములు గలవు. కాని యందు ముఖ్యాంశములను విమర్శించి గ్రహింతము.

"సాగరస్య జలం లోకే యావత్స్థాస్యతి పార్థివ,
సగరస్యాత్మజాస్తావత్స్వర్గే స్థాస్యంతి దేవవత్."

ఈవిషయము పూర్వసర్గమునందే విమర్శించితిని. మరల వ్రాయ నక్కఱలేదు. బ్రహ్మ యీవాక్యము ననువదించెను. ఏల? గంగామాహాత్మ్య మంతకుముం దెల్లరు విన్నయదికాదు. సర్వలోకగురువు, వేదనిధియునగు బ్రహ్మ వచించినఁగాని యెల్లరు విశ్వసింపరు. ఎల్లరు శ్రద్ధాభక్తియుక్తులై దాని సేవించినఁగాని

లోకమున కుపకారముకాదు. కావున బ్రహ్మ పిలువనిపేరింట ముగా నచ్చుటి కరుదెంచెను. తొలుత భగీరథుఁడు బ్రహ్మను గుఱించికదా తపస్సొనరించెను. భక్తుఁడు కాన నారాజర్షికిఁ గృత్యమును దెలుపనరుదెంచెను.

"యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే."

అన్నగీతావాక్యము పరమపావనము కదా. బ్రహ్మచెప్పిన వాక్యము వేదసమ్మతమని యెల్లరు నమ్ముదురు. కావుననే చతు రాననుఁడు తన్నడుగనిదే వచించెను. లోకమున సత్యమార్గ మునఁ దమరు ప్రవర్తించి యితరుల కుపదేశింపఁదగు. తమ రాచరింపనిధర్మము లుపదేశింపరాదు. ఉపదేశించినను వారిని లెక్కపెట్టరు. తా నాచరించి దాని గుణాగుణముల నెఱింగి యితరులకుఁ దెలుపవలయునేకాని ద్రవ్యముకొఱకు కుపదేశింప రాదు. దానిమూలమున వచ్చుబాగోగులకుఁ దానే యధికారి యగు.

"పరోపదేశే పాండిత్యం సర్వేషాం సుకరం నృణాం
ధర్మే స్వయమనుష్ఠానం కస్యచిత్తు మహాత్మనః."

అన్ననీతివాక్యము స్పష్టముకదా. కావున సకలవేదముఖుఁడగు బ్రహ్మ యెల్లరకుఁ దెల్లమగునట్లు శాసించెను.

"ఇయం చ దుహితా జ్యేష్ఠా తవ గంగా భవిష్యతి,
త్వత్కృతేన చ నామ్నాథ లోకే స్థాస్యతి విశ్రుతా. ౫
గంగా త్రిపథగా రాజన్ దివ్యా భాగీరథీతి చ."

అను నీభాగమున నొక్కవిశేషము కలదు. "పుణ్యైర్యశోల భ్యతే" అన్నసూక్తి జగద్విదితము. లోకమున యశస్సువెలయు

వలయునన్నఁ దొలిజన్మమునఁ బుణ్యము చేసియుండవలయును. భగీరథునితపస్సులోకోపకారకమము. కావున బ్రహ్మ నీకీగంగ జ్యేష్ఠకుమారిక కాఁగలదు. నీపేరంబరఁగి త్రిలోకములయందు నీపేరును బ్రకటించుననిశాసించెను. ఈయుపదేశఫల మేమనఁగా లోకమున మానవులు మహత్తరకార్యము లాచరించి భగీరథునిభంగి సద్యశస్సును గాంచవలయుననియే. ఎన్నికష్టముల నైన ననుభవించి భగీరథుఁడు తనపూర్వులకుఁ గలయపకీర్తిని దొలఁగించి స్వర్గలోకవాసులఁగా నొనరించెను. అట్లే మానవులు తమపూర్వులకుఁ గలయుత్తమలోకప్రాప్తిభంగమును దొలఁగింపఁ బాటుపడవలయుననియుఁ దానెన్నికష్టములనైన ననుభవించి తుచ్ఛమగు శరీరసుఖమును బాటింపక శాశ్వతమగు యశఃకాయమును బడయఁ బ్రయత్నింపవలయుననియుఁ, జేయఁబూనినకార్యము తనవారికేకాక లోకుల కెల్లభంగులఁ దోడ్పడఁదగిన ట్లుండవలయుననియు, నట్టికార్యము లొనరించువారి యెడఁ గరుణామయుఁడగు పరమేశ్వరుఁ డనుగ్రహించుననియు, మన మెఱింగి యీకార్యము నాచేత నగునా యని యనుమానింపక శ్రద్ధాభక్తులుగలిగి భగవంతునిపై భారమువైచి చేయఁబూనవలయుననియు, నయ్యది దుర్ఘటమైనను సత్కార్యమై యెల్లరకు మేలుచేయునదిగాయైన ఫలించుననియు,

> "సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే,
> కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన,
> మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి."

అన్న శ్రీకృష్ణమూర్తియుపదేశ మేనాఁటికిని నిష్ఫలము కాదనియు, మన మీభాగమునుండి నేర్చుకొనవలయును. ఏసత్కా

త్యము చేయఁబూనినను సమాహితమనస్కుఁడై చేయవలయు ననియు, నలువురతోఁ గూడి తపస్సుచేయరాదనియు మన మెఱుంగవలయు.

"యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ."

అన్నగీతావాక్యము పైనుదహరించినభావమును స్థిరపఱచు చున్నది.

"ప్లావయస్వ త్వమాత్మానం నరోత్తమ సదోచితే,
సలిలే పురుషవ్యాఘ్ర శుచిః పుణ్యఫలో భవ." ౧౪

ఇందొక్క విశేషము గలదు. భగీరథునితో బ్రహ్మ నీతనువు నీగంగాజలములఁ దడుపుము. పరిశుద్ధుఁడ వగుదువు. పుణ్యఫల ములుగలుగును. అని బోధించెను. దీనికొక్కకారణము కలదు. నదీస్నాన ముత్తమోత్తమమనుట విచిత్రముకాదు. చిరకాలము తపస్సు చేసి దేహము శుష్కించియుండుటం గాంచి ఆరోగ్యము కూడఁ గలుగవలయునని తలంచియు నిట్లు వచించెనని మన మెఱుంగందగు.

"శీతం స్వాదు స్వచ్ఛమత్యంతరుచ్యం పథ్యం పాక్యం పాచనం పాపహారి,
తృష్ణామోహధ్వంసనం దీపనం చ ప్రజ్ఞాం ధత్తే వారి భాగీరథీయం.
స్వాదు పాకరసం శీతం త్రిదోషశమనం లఘు,
పవిత్రమతిపథ్యం చ గాంగం వారి మనోహరం."

(మునిభావబోధిని.)

వైద్యశాస్త్రమునఁగల పైప్రమాణము ననుసరించి యూహించి నను గంగాజల మారోగ్యప్రదమని తేలెడిని. భగీరథున కారోగ్యముకూడఁ గావలయును. రాజ్యపాలనమున కదియు

ముఖ్యమే. కావున బ్రహ్మ పలుసారు లీజలముల మునుంగుచును పరిశుద్ధుఁడవుచున్ననియు బోధించెను. కావున నదీజలము పావనత్వమును గల్గించుటయేగాక యారోగ్యమునుగూడఁ గల్గించును. ఈ రెండును దేహధారులకు ముఖ్యములే. కనుకనే మనమహర్షులు నదీస్నానము, అందును గంగాస్నానము ముఖ్యమని యనువదించిరి.

"కృతే తు సర్వతీర్థాని త్రేతాయాం పుష్కరం వరం,
ద్వాపరే యజ్ఞమేవాహుర్దానమేకం కలౌ యుగే."

(భవిష్యపురాణము.)

"కలౌ తు సర్వతీర్థాని స్వం స్వం వీర్యం స్వభావతః,
గంగాయాం ప్రతిముంచంతి న తు దేవీ న కుత్రచిత్."

(బ్రహ్మపురాణము.)

"వర్జ్యం పర్యుషితం తోయం వర్జ్యం పర్యుషితం జలం,
అవర్జ్యం జాహ్నవీతోయమవర్జ్యం తులసీదళం."

(స్కాందము.)

ఈలోనగు ప్రమాణముల ననుసరించి గంగాజలము పుణ్యప్రదమగుటయేగాక యారోగ్యమునొసఁగును. తపస్సు చేయువారు నుపవాసములొనరించువారు నదీజలముల స్నానము చేయవలయును. దానిచే దేహము బడలకయుండును. తీర్థయాత్రలు ప్రధానములగుట కిదియు నొకకారణము. ఐహికాముష్మికసుఖములు రెండును నదీస్నానమునఁ గలుగును. విశేషించి గంగాస్నానమునఁ గలుగును.

"ప్రముమోద హ లోకస్తం నృపమాసాద్య రాఘవ,
నష్టశోకస్సమృద్ధార్థో బభూవ విగతజ్వరః."

ఈఘట్టము నించుక విమర్శింపుఁడు. భగీరథుఁడు బ్రహ్మాశాసనము నిర్వర్తించి యయోధ్య కేతెంచెను. జను లామహారాజు రాకచే నానందించి మనఃకష్టములు పోవ హాయినొందిరని కథాసారము. ఆకాలమున రాజునకుఁ బ్రజలకుఁ గలసంబంధము తేటపఱచుఘట్ట మిది. మన మెఱుంగఁదగినవిషయము లనేకము లిందుఁ గలవు. ప్రజలను వశముచేసికొనవలయును. ఆకార్యమున కనేకకష్టములు పడవలయును.

"ఇంద్రియాణాం జయే యోగం సమాతిష్ఠేద్దివానిశం,
జితేంద్రియో హి శక్నోతి వశే స్థాపయితుం ప్రజాః. ౪౪
దశ కామసముత్థాని తథాష్టౌ క్రోధజాని చ,
వ్యసనాని దురంతాని ప్రయత్నేన వివర్జయేత్. ౪౫
కామజేషు ప్రసక్తో హి వ్యసనేషు మహీపతిః,
వియుజ్యతేఽర్థధర్మాభ్యాం క్రోధజేష్వాత్మనైవ తు. ౪౬
ద్వయోరప్యేతయోర్మూలం యం సర్వే కవయో విదుః,
తం యత్నేన జయేల్లోభం తజ్జావేతావుభౌ గణౌ." ౪౭

(మనుస్మృతి ౭ అధ్యా.)

"మహోత్సాహస్థూలలక్షః కృతజ్ఞో వృద్ధసేవకః,
వినీతస్సత్త్వసంపన్నః కులీనస్సత్యవాక్ఛుచిః. ౩౦౯
అదీర్ఘసూత్రస్స్మృతిమానక్షుద్రోఽపరుషస్తథా,
ధార్మికోఽవ్యసనశ్చైవ ప్రాజ్ఞశ్శూరో రహస్యవిత్. ౩౧౦
స్వరంధ్రగోప్తాఽన్వీక్షిక్యాం దండనీత్యాం తథైవ చ,
వినీతస్త్వథ వార్తాయాం త్రయ్యాం చైవ నరాధిపః." ౩౧౧

(యాజ్ఞవల్క్యస్మృతి. ఆచారకాండము.)

"యే వ్యపేతాస్స్వధర్మాచ్చ పరధర్మేష్వవస్థితాః,

తేషాం శాస్త్రికరో రాజా స్వర్గలోకే మహీయతే." ౧౭
(అత్రిస్మృతి.)

"రాజ్యస్థః క్షత్రియశ్చాపి ప్రజా ధర్మేణ పాలయన్,
కుర్యాదధ్యయనం సమ్యగ్యజేద్యజ్ఞాన్యథావిధి. ౨
దద్యాద్దానం ద్విజాతిభ్యో ధర్మబుద్ధిసమన్వితః,
స్వభార్యానిరతో నిత్యం షడ్భాగార్హస్సదా నృపః. 3
నీతిశాస్త్రార్థకుశలస్సంధివిగ్రహతత్త్వవిత్,
దేవబ్రాహ్మణభక్తశ్చ పితృకార్యరతస్తథా. ౪
ధర్మేణ యజనం కార్యమధర్మపరివర్జనం,
ఉత్తమాం గతిమాప్నోతి క్షత్రియోఽప్యేవమాచరన్." ౫
(హారీతస్మృతి.)

జితేంద్రియుఁడుగా రాజుండవలయుననియే యఖిలస్మృతులు బోధించుచున్నవి. ఋషుల కహింసాదు లెట్లు ధర్మములో రాజులకు దుష్టదండనము శిష్టపాలనము విహితములు. హింస ధర్మముకాదుకదా యనరాదు. రాజు శత్రుసంహారము విధి నతిక్రమింపక అనఁగా రణధర్మముల వీటిఁబుచ్చుక యాచరించిన మోక్షముకలదని స్మృతులు చాటుచున్నవి

"భయాద్రణాదుపరతం మంస్యంతే త్వాం మహారథాః,
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్. 3౫
అవాచ్యవాదాంశ్చ బహూన్వదిష్యంతి తవాహితాః,
నిందతస్తవ సామర్థ్యం తతో దుఃఖతరన్ను కిమ్. 3౬
హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీం,
తస్మాదుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః. 3౭
సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ,

తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి". ౩౮
(గీ. ౨ అధ్యా.)

అనుభగవదుపదేశము పై వ్రాసినయభిప్రాయమును దృఢపఱచుచున్నది.

"సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్,
సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః." ౪౮
(గీత ౧౮ అధ్యా.)

"సహజం కిల యద్వినిందితం న తు తత్కర్మ వివర్జనీయకమ్,
పశుమారణకర్మదారుణోఽనుకంపామృదుళోఽపి శ్రోత్రియః."
(అని కాళిదాసమహాకవి.)

అను నీసూక్తులంబట్టి యోజింపఁగా దుష్టదండనము క్షత్రియులకు విధివిహితమైనదియే. దుష్టదమనుఁడగు రాజును బ్రజలు విశ్వసింతురు. "రాజా ప్రకృతిరంజనాత్" అన్నన్యాయ మీకాలమునఁ బుట్టినదికాదు. భగీరథుఁ డెంతకాలము రాజ్యము వదలిపోయి మరల వచ్చినను జను లత్యాదరమున నాతని గారవించి తదాజ్ఞలరీతి మెలఁగి దుఃఖరహితులైరి. దీనికింగల కారణమేమి? యోగియై జితేంద్రియుఁడై నిష్పక్షపాతియై ధర్మరక్షణతత్పరుఁడై రాజ్యకుటుంబియగు రాజు నెవ్వరు గోరరు? ప్రజలు రాజభక్తిగలవారుగను బ్రభువు ప్రజానురాగముకలవాఁడుగనుండిన నెంతబాగుండునో వచింపఁదరముకాదు. భూతలస్వర్గమనఁగా నారాజ్యమే యనవలయును. అద్దియే రాజన్యాంతమగువిషయము. అట్లుండవలయునని యెల్లవారును గోరుకొనవలయునని యీకథ మనకు బోధించుచున్నది. రాజభక్తిగలమానవులు ప్రాయశః దైవభక్తిగల

వారుగ నుందురు. కారణమేమనఁగా భక్తియనునది యొక్క విషయమునఁ బొడసూపిన నది నశింపదు. కావుననే మన పూర్వులు "నావిష్ణుః పృథివీపతిః" అని ప్రతిపాదించిరి. దీని మూలమున భగవద్భక్తి యలవడునని వారి తాత్పర్యమై యుండనోపు. ఎంత దూరదృష్టి!

> "శనైశ్శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా,
> ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్." ౨౫
>
> (గీత. ౬ అధ్యా)

అన్న భగవద్గీతావాక్యము ననుసరించి యోగము మెల్ల మెల్లఁగా నభ్యసించి మనస్సును వశపఱచుకొనునట్లు భక్తినిగూడఁ గ్రమముగా నభ్యసింపవలయునని మనము తెలిసికొనవలయును.

మహాశయులారా! సగరచరిత్రము బ్రహ్మాండపురాణాదులయందు విశేషించి కలదు. కాని యీరామాయణమున సగరచరిత్రము నెంతమాత్రము వ్రాయఁదగునో అంత మాత్రమే వ్రాయఁబడినది. గంగావతరణమునఁగూడ నితర పురాణములఁ గలచమత్కృతిని జర్చింపలేదు. రామచరిత్రమున నిట్టివానికిఁ బ్రాముఖ్య మొసంగుట యనవసరమని తోఁచి నందున వదలితినని యంగీకరించి మన్నింతురుగాక. ఇఁకఁ గథాభాగమును విమర్శింతును.

## విశాలాపురచరిత్రము.

* విశ్వామిత్రముని వచించినగంగాచరిత్రము నాలకించి రామలక్ష్మణులు పరమవిస్మయావిష్టహృదయులై యమ్మునివర్య

---

*ఇయ్యది నలువదియైదవ సర్గమునుండి సంగ్రహింపఁబడినది.

నితో "మహానుభావా! గంగావతరణచరిత్రము సగరపుత్రకులు భూమిని బ్రద్దలుచేయుటయు, సాగరమును బెంపొందించుటయు, నాసముద్రమును గంగాజలముచేఁ బూరించుటయుఁ బరికింపఁగాఁ బరమపావనము మహాద్భుతముగా నున్నది." అని పలికి యాచరిత్రమునే యాలోచించుచు నారాత్రియంతయుఁ గడపిరి. అంతఁ దెల్లవాఱఁగా రామచంద్రుఁడు కౌశికుఁడవార్షికోచితకృత్యముల నిర్వర్తించునంతదనుక నూరకుండి యవ్వల నామునితిలకునితో "నోతపోనిధీ! శ్రోతవ్యమగుచరిత్రమును వింటిమి. అకారణమున నీరాత్రి పూజ్యామైనది. ఈగాథ నాలకించుచు దానినే యాలోచించుచుండఁగా యామములన్నియు నొక్కక్షణప్రాయముగాఁ జెల్లినవి. పుణ్యకర్మముల నాచరించిన మీవంటిమహర్షులకుఁ దగినయాసనములు కలిగి యీయోడ మీరాక నెఱిఁగి వచ్చియున్నది. దీనినెక్కి యీగంగాభవానిఁ దరింత"మని విన్నవించెను.

శ్రీరామచంద్రుని యుత్తమవాక్యము నాలకించి కౌశికుఁడును దక్కినమునులును శ్రీరామసౌమిత్రులంగూడి యాగంగానదిని దాఁటి దానియుత్తరపు టొడ్డుంజేరి యాయోడం దెచ్చి తమ్ము దాఁటింపవచ్చినమునులను గారవించి మరలఁ బంపి యచ్చోట క్షణకాలము కూరుచుండి విశాలానగరమును వీక్షించిరి. గాధేయుఁ డపు డారాఘవులను మునులంగూడి దేవలోకముంబోలె దివ్యమై మనోహరమైయొప్పు నావిశాలానగరమునకుఁ బోయెను. మహాప్రాజ్ఞుఁడగు నా రాముఁడు విశ్వామిత్రునిం గని యంజలింబట్టి "యుత్తమమగు నీవిశాలాపురమాహాత్మ్యమేమి? దీనిం బాలించురాజవంశ మేది? వీని

వినఁ గుతూహలమగుచున్నది. నీకు భద్రమగుంగాక. వివరింపుమా" యని ప్రార్థించెను.

శ్రీరామప్రశ్నము నాలకించి తచ్చరిత్రమంతయుఁ జెప్ప నారంభించెను. "రామచంద్రా! ఇందేమి జరగెనో చెప్పెదను. ఇంద్రునివృత్తాంతమంతయు దీనికి సంబంధించియున్నది. ఇది యతిశుభమైనది. కాన వినుము. మున్ను కృతయుగమున దితి తనయులు మహాబలవంతులై యుండిరి. అదితికొడుకులు పరాక్రమశాలురు, ధార్మికోత్తములునై యుండిరి అయిరు దెగలవా రొకప్పుడు కూడి మన కెల్ల జరామరణవ్యాధులు లేకుండు టెట్లని యాలోచించిరి. ఆకాలమున వారికెల్లరకు క్షీరసాగరమును మథించి యందు నమృతమును సంపాదింతమనుబుద్ధి పొడమెను. అది ముఖ్యముగాఁ జేయఁదగునని నిశ్చయించిరి.

మహత్తరతేజస్సుగలవారలు గావునఁ బూనిక మెయి సర్పరాజును వాసుకిని జిలుకఁదగిన త్రాడుగా నొనరించి మందరపర్వతమును గవ్వముగావించి పాలసంద్రమును మథింపం దొడంగిరి. వారట్లు పనిపూని చిలుకుచుండఁగా వేయిసంవత్సరములకు వాసుకిఫణములు భయంకరవిషమును గ్రక్క సాగెను. ఆఫణము లప్పు డాపర్వతపాషాణములను దంష్ట్రలచేఁ గఱవఁగా నవి యగ్నికణములవలె మండుహాలాహలమను పేరుగల విషమై మీఁదికిఁ గవిసెను. దానిచేత సకలభూతయుతమగుజగత్తు దహింపఁబడియె. అంత దేవతలెల్ల మహాదేవుఁడని పశుపతియని పొగడ్తగాంచినశంకరుని శరణుచొచ్చి రక్షింపుము, రక్షింపుమని వినుతించిరి. అప్పు డచ్చోట శంఖచక్రధరుఁడు శ్రీహరి సాక్షాత్కరించి సుస్మితము ముఖమునఁ

జెందులాడ నోసురశ్రేష్ఠా! నీవు దేవతలయం దగ్రగణ్యుఁడవు. కావున క్షీరసాగరమును మథింపఁగాఁ దొలుత నేది జనించునో యది నీదియే యగునుగదా. అగ్రపూజగా నీవిషమును భావించి గ్రహింపుమని పలికి యందే యంతర్హితుండయ్యె.

భగవంతుఁ డాశంకరుఁడు దేవతల భీతిం గాంచి విష్ణు వాక్యము నాదరించి సకలభూతభయంకరమగు నాహాలాహల విషము నమృతమువలె గ్రహించి మ్రింగి దేవతలభయము వాపి పోయెను. పిదప దేవతలెల్ల మథింపఁబూనఁగా నామంద రాద్రి యట్టె పాతాళమునకుఁ గ్రుంగెను. దానిం గాంచి యా దేవతలెల్ల మధుసూదనుని దర్శించి మహాత్మా! సర్వభూత ములకు రక్షకుఁడవు నీవు. విశేషించి దేవతలకు దిక్కగుదువు. ఇపుడు మమ్మెల్లఁ గాపాడుము ఈపర్వతము నుద్ధరింపుము. ఈకార్యమునకుఁ దగినవాఁడవు నీవే. అని వినుతింపఁగా నావిష్ణువు కూర్మరూపమునెత్తి యాపర్వతమును దనవీఁపున నిడుకొని యాక్షీరసాగరమునఁ బవళించెను. అంతియకాక యాపురుషోత్తముఁడు లోకాత్మకుఁడు కావున నాపర్వతాగ్ర మును హస్తమునఁ బట్టుకొని దేవతాంతర్భాగమున నిలిచి మథింపఁబూనెను. సహస్రవర్షములు కాఁగాఁ బ్రథమమున దండకమండలువుల ధరించి ధన్వంతరి కనఁబడెను. వెనుక సద్వర్చస్సుగల యచ్చర లుదయించిరి. పాలుమథించుటచేత రస ముదయించె. దానినుండి యావనిత లుదయించిరి. ఆకారణ మున నప్సరస లనుపేరు వారికి సార్థకమై పరఁగెను. వారిసంఖ్య యఱువదికోటులని యెఱుంగుము. వారిపరిచారికలను గణింప నెవ్వారికిఁ దరంబుగాదు. ఆయచ్చరలు తమకు నాథుఁ డెవ్వఁ

డని విచారింపనికారణమున దేవదానవులం దెవ్వరుగాని వారిని బరిగ్రహింపకుండిరి. దాననే వారు వేశ్యలయిరని తెలి యందగు.

తరువాత సముద్రాధిదేవతయు, వరుణునిపుత్రికయు, మహాభాగ్యవతియు, సురకధిదేవతయు నగువారుణి సాగరము నుండి కానంబడి తన్ను గ్రహించువా రెవ్వరని యరయు చుండఁగా దితికుమారు లెవ్వరైన నావరుణపుత్రిని గ్రహింప కుండిరి. అదితినందనులు అనింద్యచరిత్రయగు నావారుణిని గ్రహించిరి. సురను గ్రహింపనికతన దితికొడుకు లసురు లనం బడిరి. దాని నంగీకరించుటంజేసి దేవతలు సురలైరి. మఱియు నాసుర లావారుణీగ్రహణంబున గగుర్పాటు శరీరములఁ బొడ మఁగా మిక్కిలి సంతసంబునఁ బొదలిరి. పిదప నశ్వవర్యమగు నుచ్చైశ్శ్రవస్సు, మణిరత్నంబగు కౌస్తుభమును,అట్లే యత్యుత్త మామృతమును బాలసాగరమునుండి కలిగెను. శ్రీరామచంద్రా! ఆయమృతమునిమిత్తమే యుద్ధ మొనరించి దేవదానవకులము లెన్నియో నశించెను. దేవతలు దైత్యులం బెక్కండ్ర మడి యించిరి. అసురులందఱు తమబలము వృద్ధినొందుటకు రాక్ష సులతో నొక్కటిగాఁ గూడిరి అత్తఱి లోకత్రయభయంకర మగు మహాసంగ్రామము ప్రవర్తిల్లెను. ఆయుద్ధమున సమ స్తము నశించునట్లుకాఁగా మహాబలశాలియగు విష్ణుమూర్తి జగన్మోహనమగుమాయం గైకొని మోహినీరూపమును ధరించి యసురుల వంచించి వారియధీనమునం దపుడున్న యమృతమును హరించెను. ఎదిరించినవారినెల్ల నామహావిష్ణువు దునిమెను. శరణుచొచ్చిన దేవతలనెల్ల నావేశించి వారికెంతయు బలమును

గలిగించెను. ఆమహాఘోరసంగ్రామమున విష్ణువు నావేశమున బలం బతిశయిల్ల దేవత లాయసురులం బాఱఁద్రోలిరి. ఈరీతిగా నింద్రుఁ డసురుల జయించి త్రిలోకరాజ్యమును బ్రాపించి యమృతముతోఁగూడి సమస్తలోకమును బరిపాలించెను.

సుధీరులారా! ఈభాగమున ననేకాంశములు విమర్శింపినఁగాని సంశయము లడంగవు. పామరుల కెందు ననుచితము లగువిషయము లెన్నియో గలవని తోఁచును. వారలసంశయములం బాపుపొంటె నాలుగుముక్క లెక్కువగా వ్రాసినను మీ రాగ్రహింపరు. కాన నిందొక్కొక్కవిషయమును దడవుదము. శ్రీరామమూర్తి మాయామానుషవిగ్రహుఁడు. కావుననే విషయము తనకుఁ గ్రొత్తదిగాకున్నను బామరునివలె నాలకించును. అద్దాన లోకమునకు మహోపకారము కలుగవలయుననియే యామహాత్మునియాశయము. కావున గంగాప్రాదుర్భావమంతయు నాలకించి విశ్వామిత్రునిం బొగడి యాకథనే తలంచుచు నుండెను. కాన క్షణ మట్లు లీరాత్రి గడచెనని మునికిం దెలిపెను. సచ్చరిత్రము నాలకించుచుఁ గాలముఁ గడుపందగుననుటయే దీనిసారము.

“కావ్యశాస్త్రవినోదేన కాలో గచ్ఛతి ధీమతాం,
వ్యసనేన చ మూర్ఖాణాం నిద్రయా కలహేన వా.”

యన్నసూక్తి యీనాఁటిది కాదుకదా. నిదురపట్టనితఱి మంచి విషయముల స్మరింపవలయును. భగవంతునినామమును నిశ్చలమనస్సుతోఁ బఠింపవలయును. భగవంతు నేరూపముననైన ధ్యానింపవలయును.

“గతా భగవతీ రాత్రిః శ్రోతవ్యం పరమం శ్రుతం,

**క్షణభూతేవ సా రాత్రిస్సంవృత్తేయం మహాతపః. ౫**
**ఇమాం చింతయతస్సర్వాం నిఖిలేన కథాం తవ."**

అను నీశ్రీరామవాక్యము పైనీతిని మన కుపదేశించుచున్నది. జాగరముచేయువారు ద్యూతక్రీడాదులఁ గాలముపుచ్చుట కంటె నిద్రపోవు టుత్తమము ఉపవాసవ్యాజమున నిత్యకర్మముల ననుష్ఠింపక మానుటకంటె వ్రతోపవాసము మాను టుత్తమోత్తమము.

"వేదాస్త్యాగశ్చ యజ్ఞాశ్చ నియమాశ్చ తపాంసి చ,
న విప్రదుష్టభావస్య సిద్ధిం గచ్ఛంతి కర్హిచిత్. ౯౭
న తిష్ఠతి తు యః పూర్వాం నోపాస్తే యశ్చ పశ్చిమామ్,
స శూద్రవద్బహిష్కార్యస్సర్వస్మాద్ద్విజకర్మణః." ౧౦౩
(మను. ౨ అధ్యా.)

ఉపవాసాదులు కామ్యవ్రతములు. వానియందలి యాదరమున నిత్యకర్మముల మానరాదని, మానినచో నేఫలము లభింపదని స్మృతి చాటుచున్నది.

**"నాశేషా హి సుఖా స్తీర్ణా ఋషీణాం పుణ్యకర్మణాం,**
**ఉత్తరం తీరమాసాద్య సంపూజ్యర్షిగణం తథా."**

ఇందుఁ గలధర్మము నెఱుంగవలయును. నదుల దాఁటించువిషయమున రాజు నౌకలను శుల్కమును బరీక్షింపవలయును.

**"ఏవం సర్వానిమాన్ రాజా వ్యవహారాన్ సమాపయన్,**
**వ్యపోహ్య కిల్బిషం సర్వం ప్రాప్నోతి పరమాం గతిం." ౪౨౦**
**(మను. ౮ అధ్యా.)**

ఓడ పుణ్యకర్మము లొనరించు ఋషులు కూరుచుండఁదగిన యాసనములుగలదిగా నున్నదని రామచంద్రుఁడు తెలిపెను.

తరిశుల్కము (ఓడసుంకము) అందఱనుండి చేకొనరాదని స్మృతి తెలుపుచున్నది.

"అకరశ్శ్రోత్రియో రాజా పుమానసాథః ప్రవ్రజితో
బాలవృద్ధతరుణప్రజాతాః ప్రాగమికః కుమార్యో మృతపత్న్యశ్చ.

(వసిష్ఠస్మృతి.)

"రాజాపుమానసాథశ్చ వ్యజనరహితో రోగార్తో వా తరుణప్రజాతా అచిరప్రసూతాః ప్రాగమికో లేఖహారకాదిః శవహారకాదిశ్చ మృతపత్న్యో విధవాః." (అని వివాదరత్నాకరము.)

"తరికశ్చ స్థలశుల్కం గృహ్ణాన్ దశపణాన్ దాప్యః, బ్రహ్మచారి వానప్రస్థభిక్షుగుర్విణీతీర్థానుసారిణాం శుల్కమాదదానశ్చ తచ్చ తేషాం జహ్యాత్."

(విష్ణుస్మృతి.)

"గర్భిణీ తు ద్విమాసాదిస్తథా ప్రవ్రజితో మునిః,
బ్రాహ్మణా లింగినశ్చైవ న దాప్యాస్తారికం తరే." ౪౦౭

(మను. ౮ అధ్యా.)

ఋషులవలన నోడసుంకము గొనరాదు. ఆ కారణముననే రామమూర్తి "ఋషీణాం పుణ్యకర్మణామ్" అని వచించెను ఋషిజాతియందుఁ బుట్టినవాఁడుమాత్రమే కాక పుణ్యకర్మము లాచరించువారలకే యోడసుంకము వలదని శ్రీరామమూర్తి యాశయము స్మృతిసమ్మతమైనది. గంగానదిని దాఁటి యోడను దాఁటింపవచ్చినమునులను బూజించి విశ్వామిత్రుఁ డందుఁ గొంచెముసేపు కూరుచుండెను. దీనింబట్టి నదీప్రాంతముల నివసించువారు ధర్మమని శాస్త్రమున విధింపఁబడినరీతిగా మునులు లోనగువారిని దాఁటించుట యాకాలపుటాచారమని మన

మెఱుంగవలయును. పుణ్యనదులను దాఁటినపుడు దేవాలయమునకుం బోయినపుడు క్షణకాలము కూరుచుండవలయు. నన్నది సనాతనసదాచారము. ఏటికి? అనఁగా దేవాలయమునకుం బోయినపుడు శిలావిగ్రహమును జూచి తృప్తినొందరాదనియు, నామూర్తి భగవంతునిరూపములలో నొకటియని భావించి యందుఁ గూరుచుండి దాని మనోగమ్యముగ నొనరించుకొనవలయుననియు, నట్టిధ్యానము నభ్యసింపవలయుననియు దీనిసారము. లేనిచో శిలావిగ్రహదర్శనము ఫలవంతముకాదు ఏల?

> "న హ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః,
> తే పునంత్యురుకాలేన దర్శనాదేవ సాధవః."

అను శ్రీకృష్ణోక్తి కలదుగదా. 'తే పునంత్యురుకాలేన" అనఁగా శిలామృత్తికామయవిగ్రహములు చిరకాలమునకుఁ దరింపఁ జేయుననఁగా భావమేమి? ఆరూపమును ధ్యానముచేయఁగా, భగవంతుఁ డాధ్యానవశంవదుఁడై యారూపమున భక్తునకుఁ బొడసూపుననియు, దానఁ దరించుననియు, నాకార్యమునకుఁ జిరకాలము పట్టుననియుఁ దాత్పర్యము.

> "ప్రశాంతాత్మా విగతభీర్బ్రహ్మచారివ్రతే స్థితః,
> మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః. ౧౪
> యుంజన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః,
> శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి." ౧౫
> (గీత ౬ అధ్యా.)

అను నీశ్రీకృష్ణోపదేశము ధ్యానమును సూచించుచున్నది. నదీదర్శనమునఁగూడ నట్లే యని యెఱుంగునది. నదీస్నానము

చేసినంతన ముక్తి రానేరదు. ఆనదిని బరమేశ్వరరూపిణినిగా భావించి ధ్యానించినఁగాని సమగ్రపుణ్యము లభింపదని సారము. కావుననే పుణ్యస్థలమునకుఁ బోయిన నందుఁగలవిగ్రహదర్శనము చేసినంతన లాభము లేదు. ఆరూప మర్చారూపమనియు, దానిని మనస్సున నిలిపి ధ్యానింపవలయుననియు, నాధ్యాన మలవాటు కాఁగా,

"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః."

అన్నస్థితి నుండువాఁడగును. కావున శిలామృణ్మయవిగ్రహములం గాంచి యవి రక్షించునని యేవో తుచ్ఛములగు వాంఛలు గోరక యారూపమును మదినిల్పుకొని పరాత్పరుని ధ్యానింపవలయును. అప్పుడే యాక్షేత్రమును గాంచిన ఫలము నొందును. లేకున్న సంచుమించుగా నిష్ఫలమేయని మనము తెలిసికొనవలయునని

"గంగాకూలేనివిష్టాస్తే విశాలాం దదృశుఃపురీం."

అన్న శ్రీమద్రామాయణవాక్యము మన కీనీతి నుపదేశించుచున్నది. భగవదర్చనవిషయము నెందుఁ బరికించినను యోగమే ప్రధానముగాఁ గనఁబడుచున్నది.

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం."

అన్న భగవదుక్తియందు "సతతయుక్తానామ్" అనఁగా నెల్లకాలము మనస్సును నాయందుఁ గూర్చియుండువారలకని యర్థము. అదియే కదా యోగ మనునది. దీనింబట్టి బాహ్యపూజలు సామ

రులకొఱ కేర్పఱుపఁబడినవనియు, మానసికార్చనము జ్ఞానుల కొఱ కేర్పఱుపఁబడినదనియు, మనము నిశ్చయించుకొనవలయు.

"తపస్విభ్యోఽధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున."

అను శ్రీకృష్ణోపదేశమును మఱువరాదు. యోగమనఁగా ముక్కుమూసికొని పామరులను వంచించుటగాదనియు, సర్వభూతసమత్వ మలవడవలయుననియు, మనము తెలిసికొనవలయును. యోగాభ్యాసముచేయువాఁడు పరమతములఁదూషింపఁడని తెలియవలయును. ఏలయనఁగా యోగమున నీదేవతాభేదములు లేవు. జ్యోతిస్స్వరూపధ్యానమే. కావున యోగి యేమతమునకుఁ జేరినవాఁడైనను భేదబుద్ధికలవాఁడు కానేరఁడు. కపటయోగులకుఁ దత్త్వము శూన్యముకావున వారే పరమతముల దూషింతురు. అన్యదేవతల దూషింతురు దానింబట్టి యట్టివారు యోగమనుదాని నెఱుఁగరని మనము నమ్మవలయును. ఈచోట నాంధ్రీకరణకర్తలయూహాలు పరికింపఁదగును.

"ఉత్తరం తీరమాసాద్య సంపూజ్యర్షిగణం తదా,
గంగాకూలే నివిష్టాస్తే విశాలాం దదృశుః పురీం.
తతో మునివరస్తూర్ణం జగామ సహ రాఘవః,
విశాలాం నగరీం రమ్యాం దివ్యాం స్వర్గోపమాం తదా." ౧౦

అను నీమూలముం బరికింపుఁడు.

"ఋషిగణం సా తారణార్థమాగతం సంపూజ్య పూజాపూర్వకం నివర్త్య నివిష్టాః క్షణం స్థితాః." (అని గోవిందరాజులు.)

"యైర్నార్చితా తేషాం గణం సంపూజ్య నివిష్టాస్థిరతాః."
(అని మహేంద్ర తీర్థులు.)

వ. "నావయెక్కి యమ్మహానది నుత్తరించి తదుత్తర తీరంబుఁ జేరి, యచ్చటి మునిగణంబులం బూజించి యచ్చట నొక్కింతసేపు విశ్రమించి కొండొకదూరం బరిగి."

శా. భూకాంతామణిఫాలభూషణమనాఁ బొల్పొందినానావిధా
స్తోకశ్రీకరమై కనుంగవకు నెంతో వేడ్కఁబుట్టించుచున్
బ్రాకారావృతమైనయొక్కపురముల్ భాస్వద్వయాంభోధిరా
ట్రాకాబ్జుండురఘూత్తముండు గనియుల్లంబందునుల్లాసియై.
(గోపీనాథరామాయణము.)

క. తనవెంట నదిని దాఁటిం
పనువచ్చిన మౌనివితతి బహుమానమునన్
జనిపి మరలించి తీరం
బున నించుక గూరుచుండి పురియొం డలరన్.

క. కని రవి విశాలయనుపే
రునఁ దగు నాపిదప మునివరుండు దశరథా
వనిపాలసుతులఁ దోడ్కొని
చనియెన్ సత్వరముగా విశాలాపురికిన్.

క. సురపురికిఁ దుల్యము మనో
హరమును నై యొసఁగు నగరమది యంత ధరా
వరసుతుఁడు ప్రాజ్ఞుఁ డమ్ముని
సురపతిఁ గని చేతు లొగ్గి శుభతమభణితిన్.
(ఆంధ్రశ్రీమద్రామాయణము.)

ఈ రెండింటికిని మూలమునకుఁ గలసంబంధమును బ్రాజ్ఞులు పరికింతురుగాక. నీతినిగాని సదాచారమునుగాని బోధించు భాగము వదలఁబడియెనా యని పరీక్షింపుఁడు పక్షపాతమూని నచో నేదియుఁ దోఁపదు. ఒక్కరు మెచ్చినందున నది పూజ్యము కాదు. ఒక్క రీసడించినందున నది క్షీణింపదు. సజ్జనులు మనస్సున నానందించినఁ జాలు. కనుకనే

"నిందతు నందతు వా సన్న సూయూరనసూయూర త్ర కిం లేన,
యత్ప్రస్థానసగమ నాయై వేదం మమ తు పాథేయం."

అని రామకవిగారు వచించిరి. ఈత్రోవనే నేను బ్రవర్తింతును. ఇఁక యథామూలముగాఁ దెనిఁగించినారని విమర్శకశిఖామణులు వ్రాసిన రామాయణముం జూడుఁడు.

క. ఆ రాకొమరుని వచనము
గా రామునవిని తరించి గాధేయుఁడు ద
ద్ద్వారమణకుమారులతో
నాఋషితతితోనుద గ్గటావని దిగియెన్.

క. సాలంబుల ధికృతకుల
శైలంబుల సౌధకోటిజాలంబుల రు
గ్జాలంబుల ఫలసహితర
సాలంబుల దివిని నగువిశాలానగరిన్.

(వావిలికొలను రామాయణము.)

నేను విమర్శింపఁబూనితినని సజ్జనులు భావింపరాదు. ఆంధ్ర శ్రీ మద్రామాయణమున ననేకలోపములున్నవని పాదపూరణము లనేకములు గలవని మూలార్థమును బోషింపలేదని కొందఱు

వాకొనిరి. ఉండనిండు. లేవనను. వారు యథామూలమని పొగడిన వావిలికొలనువారి రామాయణమును బరికింపుఁడు. సదాచారమును బోధించుభాగము "నివిష్టాస్తే" వదలి వేయఁబడినది. విశాలానగరవర్ణనమున మూలమున లేనియర్థము తెలుపఁబడినది. ఇట్టివి విమర్శకులదృష్టికి యథామూలము లనియే తోఁచును గాఁబోలు. నేనిపు డితరులలోపములు చూపఁ బూనలేదు. నా రామాయణమున లోపములు లేవన లేదు. ఇట్టివి పరికింపఁబూనిన నన్ని గ్రంథములయందుం గలవు. ఈవిషయము నే నెఱుంగనిది కాదు. కేవలము నా రామాయణమునే విమర్శించినచో నితర రామాయణముల ప్రస్తావను నేను దేఁదలంపను. వానిని జూపుచు వ్రాసినందున నేయిపుడు వ్రాయవలసివచ్చినది. దీనికే నే నెంతయో వగచుచున్నాఁడను. విధిలేక వ్రాయవలసివచ్చినది. ప్రతిగ్రంథకర్తయందు నాకు మర్యాద కలదు కువిమర్శకులంబట్టి వారిలోపములు చూపవలసివచ్చినది. దీనిని మన్నింతురుగాక. ఇఁకఁ బ్రకృత మనుసరించెదను.

> "తతస్తేషాం నరశ్రేష్ఠ బుద్ధిరాసన్మహాత్మనాం,
> అమరా అజరాశ్చైవ కథం స్యామ నిరామయాః. ౧౬
> తేషాం చింతయతాం రామ బుద్ధిరాసీన్మహాత్మనాం,
> క్షీరోదమంథనం కృత్వా రసం ప్రాప్స్యామ తత్ర వై." ౧౭

అనుఘట్టమును విమర్శింతము. కృతయుగమున నాదిత్యులు దైత్యులు మహాబలవంతులుగనుండిరి. వారికి జరామరణములు వ్యాధులు లేక జీవించుటెట్లు? అను బుద్ధిపుట్టెను. ఇంక నాలోచింపఁగా క్షీరవారాశి మథించిన యద్దానఁ గల్గునమృతమును

సంపాదింతమనునూహయుఁ గలిగెను. అనునదియేకథాసారము. దీననుండువిషయ మేది?

అమృతమును ద్రాగకముందు దేవతలకుంగూడ మరణముగలదని యిది మనకుఁ దెలుపుచున్నది. అమర్త్యనిర్జరాది శబ్దము లిటీవలివనియు నేర్పడుచున్నది. సృష్టియందు మరణములేనిప్రాణి యేదియులేదని యంద ఱెఱుంగుదురు. ఒక్కభగవంతుఁడుతప్పఁ దక్కినవారు మృతినొందువారే యనుట సిద్ధాంతము. బ్రహ్మదేవుని యొకపగటికాలమునఁ బదునలువురింద్రులు పదునల్వురు మనువులు గడతురు. అనఁగా నొకరి వెనుక నొకరుగా నధికారమునకు వత్తురనిభావము. ఇంద్రాదులు మృతినొందరనియు నధికారముమాత్రము పోవుననియుఁ గొందఱు పలుకుదురు. ఆపక్షమున బ్రహ్మలుకూడ నుండవలయును. వీరికందఱకు గృహములు లోకములు భార్యలు కావలయును. ఎన్నిలోకములు చాలకపోవునేమొ.

"నిజేనైవ తు మానేన ఆయుర్వర్షశతం స్మృతమ్." (విష్ణుపురాణము.)

"యుగానాం సప్తతిస్సైకా మన్వంతరమిహోచ్యతే,
కృతాబ్దసంఖ్యా తస్యాం తే సంధిః ప్రోక్తో జలప్లవః. ౧౮
ససంధయస్తే మనవః కల్పే జ్ఞేయా శ్చతుర్దశ,
కృతప్రమాణః కల్పాదౌ సంధిః పంచదశస్మృతః. ౧౯
ఇత్థం యుగసహస్రేణ భూతసంహారకారకః,
కల్పో బ్రాహ్మమహః ప్రోక్తం శర్వరీ తస్య తావతీ. ౨౦
పరమాయుశ్శతం తస్య తయాహోరాత్రసంఖ్యయా,
ఆయుషోర్ధమితం తస్య శేషకల్పోయమాదిమః." ౨౧

(సూర్యోపనిషత్.)

వీనింబట్టి చూడఁగా బ్రహ్మ కతనిమానము ననుసరించి శత వర్షములే యాయుస్సని స్పష్టమగుచుండ నింద్రాదులమాట యిట నేఁటికి? రూపనామములుగలవంతయు నశించునదియే. అక్షరము, సనాతనము, శాశ్వతము ననఁబడునవ్వస్తువేదో యదియే శాశ్వతము. దానికి రూపనామములు లేవు అన్ని రూపములు, అన్ని నామములు దానివే యగు.

దేవతలు కుడిచి కూరుచుండి జరామరణవ్యాధులు లేకయుండఁ దగునని కోరుట న్యాయవిరహితమే. ఐనను విశేష పుణ్యము చేసి యూర్ధ్వలోకముల సంచరించువారుగావున పాల సంద్రమును ద్రచ్చి యందమృతమును సంపాదింతమని యూహించిరి. అంతకుముందే పాలకడలియందు సుధయున్న యట్లు వారికిఁ దెలిసియుండెనని మన మూహింపవలయునుగదా. ఇట్టు లాలోచించునపుడు దేవతలు రాక్షసులు సిద్ధులై యుండిరి కదా. వారలకెల్ల నట్లుచేయుట మంచిదనియే తోఁచెను. అమృతపానమున జరామరణములు వ్యాధులు నెంతకాలము లేకయుండును? అన్న ప్రశ్నమునకు బదులు కొంతకాలమే యని చెప్పవలసినదే కాని శాశ్వతమన రాదు. పదునలువురింద్రులు బ్రహ్మ యొకపగటికాలమున నశింతురనఁగా నర్థమేమి? అప మృత్యువు లేకయుండ జీవింపఁగోరిరనియు, నారోగ్యము సర్వదా యుండఁగోరిరనియు మన మూహింపవలయును. అది యుంగూడ మానవులకు సాధింపరానికార్యమే. కర్మభూమి గాక కేవలజ్ఞానభూమియగు స్వర్గమున నుండువారుగాననే వార లద్దానిని సాధింపఁబూనిరి.

లోకమునందు గొప్పకార్యమును సాధింపఁబూనువారు సంఘముగాఁజేరి భగవంతుని బ్రార్థింపవలయును. దీనికి యజ్ఞమనియు, సత్రమనియుఁ బేరు. తపస్సిట్టిది కాదు భగవంతుని బ్రార్థించుట కనేకమార్గము లున్నవి. యోగము ముఖ్యము. తపస్సు తదంతర్భూతమే. వేదపారాయణము స్తుత్యంతర్భూతము. దానము పరోపకారరూపము. ఇద్దానివలన ద్రవ్యప్రీతి విడనాడుట యనుసద్గుణ మలవడును. ఇవన్నియు భగవదనుగ్రహము గల్గించుసాధనములు. దేవతలు తపస్సుచేయఁజాలరు. కావుననే సంఘముగాఁజేరి భగవంతుని బ్రార్థింప నెంచిరని మన మూహింపవలయును.

"నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా,
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా". ౫౩
(గీత ౧౧ అధ్యా.)

అను గీతావాక్యము భగవదారాధనమార్గములపద్ధతి తెలుపుచున్నది. భగవంతుని భజింప నెంచిరనఁగా వేదవాక్కులచే వినుతింప నెంచిరని యిట గ్రహింపవలయును. ఈమార్గములు భగవంతుని జగదాకారునిగాఁ జూపింపఁజాలవు. కనుకనే

"భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున,
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప." ౫౪

(నాకంటె నన్యము లేదన్నభావముచే నన్నెఱుంగఁదగును.) అని శ్రీకృష్ణుఁ డర్జునునకుం దెలిపెను. దేవతలభక్తి యొక్కరియందు లేక యమృతమును సాధించుకార్యమునందే యుండెను. అనఁగా అమృతమనఁబడునదియే పరతత్త్వము. దానిని సాధింప

ననఁగా దానిదయకుఁ బాత్రులుగాఁగోరుట యని భావము. ఆకార్యమును జేయ నిశ్చయించిరి.

పాలసముద్రమనఁగా నపారనిర్మలస్థానము. అందు భగవంతుఁడు నివాసముచేయువాఁడని పురాణములు తెలుపును. పరిశుద్ధమగుచోట భగవంతుఁ డుండుననియే యిందు గ్రహింపఁదగినవిషయము.

> "ప్రతిబోధవిదితం మతమమృతత్వం హి విందతే,
> ఆత్మనా విందతే వీర్యం విద్యయా విందతేఽమృతమ్". ౪
> (కేనోపనిషత్తు.)

అను నీకేనోపనిషత్తు భగవంతుఁ డమృతశబ్దవాచ్యుఁ డని తెలుపుచున్నది. ముక్తియన్న నమృత మందురు. ముక్తియన్న భగవత్తత్త్వమున నైక్యమగుటయేకదా. భగవంతుఁడు ద్వంద్వాతీతుఁడుకాన ద్వంగబాధలు గలతావున నుండఁడు. గాఢాంధకారముగా నున్నతావును దాఁటిపోఁగా సముద్రజలముల నొకదివ్యభవనము కనఁబడెనని శ్రీభాగవతమునఁ గలదు.

> "లోకాలోకం తథాతీత్య వివేశ సుమహత్తమః. ౪౭
> తత్రాశ్వాశ్శైబ్యసుగ్రీవ మేఘపుష్పవలాహకాః,
> తమసా భ్రష్టగతయో బభూవుర్భరతర్షభ. ౪౮
> ... ... ... ...
> తతః ప్రవిష్టస్సలిలం నభస్వతా బలీయసైజదృహదూర్మిభూషణం,
> తత్రాద్భుతం వైభవనంద్యుమత్తమంభ్రాజన్మణిస్తంభసహస్రశోభితం."
> (౧౦ స్కం. ౮౯ అధ్యా)

క్షీరవారాశి భగవంతునిస్థానమనియు, నందుండువారు జరామరణవర్జితులనియు నన్నిపురాణములు తెలుపుచున్నవి. అనఁగాఁ

దమోగుణము వ్యాపించుస్థలముల మీఱి పరిశుద్ధసత్త్వ గుణము వెలయుతావులకుఁ బోయినఁగాని భగవంతుని దర్శింప వలనుపడదనియే దీనిసారము. మృతిలేనిదికదా యమృతము. అక్షరమనఁగా నదియే. శాశ్వతమనఁగా నదియే ఇట్టివస్తు వేదో కనుఁగొనినఁగాని తమ కీచింతపోదని వారెంచిరని సారము గ్రహింపవలయును.

మందరపర్వతమును బాలసంద్రమున వైచి మథించిరి. వాసుకిని గవ్వపుఁద్రాఁడుగా నొనరించిరి. అనువిషయమునుండి మనము గ్రహింపఁదగునర్థము గలదు. అది చాల ముఖ్యము. ఆశను బాశములతోఁ బోల్తురు.

"ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః,
ఈహంతే కామభోగార్థమన్యాయేనార్థసంచయాన్." ౧౨
(గీత ౧౬ అధ్యా.)

అన్నగీతయే యిందులకుఁ బ్రమాణము. వాసుకి సర్పరాజు. క్రూరజాతిగలవాఁడు. దానికిఁ బర్వతమునకుఁ జుట్టిరనఁగా ధైర్యమున నాశను నిర్బంధించి యని భావము. ధైర్యమున కుపమానము పర్వతముకదా.

శనైశ్శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా,

అన్నగీతావాక్యము ననుసరించి "ధృతిగృహీతయా" ధైర్యమున గ్రహించి యమునర్థము చేసికొనవలయును. కావున మనోధైర్యమున నాశను గట్టిపెట్టిరని సారము. అనఁగా నమృత శబ్దవాచ్యుఁడగు భగవంతు నారాధించి తమమనోవాంఛను సఫలతనొందఁజేయఁబూని వారెల్లను దానికిఁ బ్రధానప్రతి బంధకమగు నాశాపాశమును బర్వతమువంటిధైర్యమున

జికట్టఁబట్టి నిర్మలస్థానమున సున్న వానిగా భావించి యారాధింపఁ బూనిరని మనమూహించుటుత్తమము. ఈకథనుండి గ్రహింపఁ దగువిషయసార మిదియే.

లోకమున నెవ్వాఁడుకాని పరమేశ్వరు నారాధించి తదనుగ్రహము నొందవలయునన్నఁ, దొలుత యోగము నభ్యసించి మనోధైర్యముఁగలవాఁడయి యాశాపాశమునకు లోఁబడక, యమృతసాగరముఁన ననఁగా శాశ్వతమగుపదమున నెలకొనియున్న పరమతత్త్వము నుపాసింపవలయుననియు, నట్టి యారాధనమునసే యాతత్త్వము కటాక్షించుననియుఁ, దక్కుంగలపూజావిశేషములకంటె ధ్యానమే నిరుపమానమనియు మనము తెలిసికొనవలయును ఇఁకఁ దరువాతివిషయమునకుం గడంగుదము.

"అథ వర్షసహస్రేణ యోక్త్రసర్పశిరాంసి చ,
వమంత్యతివిషం తత్ర దదంశుర్దశనైశ్శిలాః,
ఉత్పపాతాగ్నిసంకాశం హాలాహలమహావిషం,
తేన దగ్ధం జగత్సర్వం సదేవాసురమానుషం."

అనుభాగమును విమర్శింతము.

దేవదానవు లాపాలకడలిఁ ద్రచ్చుచుండఁగా వేయి వత్సరములు గతించెను. వాసుకి యాబాధకుఁ దాళఁజాలక ఫణములచే నాకొండఱాలను గఱవఁగా నవి యగ్నికణములం బోలి మండుచు హాలాహలవిషముగాఁ గాల్పందొడంగెనని కథాభాగము. ఈభాగమునఁ గలకథకు శ్రీభాగవతమునఁగల కథకు భేదము కన్పట్టుచున్నది.

"నిర్మథ్యమానాదుదధేరభూద్విషం మహోల్బణం హాలహలాహ్వమగ్రతః

సంభ్రాంతమీనోన్మకరాహికచ్ఛపాత్తిమిద్విపగ్రాహతిమింగిలాకులాత్. ౧౮
తదుగ్రవేగం దిశి దిశ్యుపర్యధో విసర్పదుత్సర్పదసహ్యమప్రతి,
భీతాః ప్రజా దుద్రువురంగ సేశ్వరా అరక్ష్యమాణాశ్శరణం సదాశివం".

(శ్రీ భాగవతము ౮ స్కం. ౭ అధ్యా.)

మథించుచుండఁగా సాగరమునుండి సర్వభూతభయంకరమగు హాలాహలవిష ముప్పతిల్లెనని భాగవతకథాసారము.

ఈభాగమును దెలుఁగురామాయణభాగమున విషప్రాదుర్భావము, శంకరుఁడు దానిం బానముచేయుట అనుభాగముగల మూలమునకుఁ గుండలీకరణము చేయఁబడినది. అధిక పాఠశ్లోకములని తలంచి గోవిందరాజులు వ్యాఖ్య వ్రాయక వదలిరి. కుండలీకరణముచేసినవారు గోవిందరాజపక్షావలంబకులే. ఇట్లుల జరగినదనఁగా నిందు మహర్షులు దేవతలు శంకరునీయాపత్తును దొలఁగింపుమని ప్రార్థింపఁగా శ్రీమహావిష్ణువు కూడ సాక్షాత్కరించి శంకరునిం బ్రార్థించుచు

"అగ్రపూజామిమాం మత్వా గృహాణేదం విషం ప్రభో."

అని పలికినట్లున్నది. విష్ణు వీశ్వరుని బ్రార్థించెనన్న గోవిందరాజులకుఁ బ్రాణాంతముగాఁ గనఁబడియుండును. కావున నాభాగమంతయు నధికపాఠముగా వదలిరి. అయ్యో! పాపము! మతాభిమానపిశాచ మాపండితోత్తముల నెట్టు లావేశించి విభ్రాంతుల నొనర్చెనో చూడుఁడు. ఇట్లు వీరు వదలుటచే నింకొక్కయాపద వీరికిం గలిగినది. కాని దానినైన నంగీకరించిరి. అదేదనఁగా శ్రీమహావిష్ణువు కూర్మావతారమున మందరాద్రిని ధరించె ననునదియే. అదిపోయిన మానెఁగాని శంకరు హరి ప్రార్థించెనన్నమాట వీరికిఁ గంఠపాశమైనది. తుచ్ఛమతాభి

మానము ! ఔరా ! గోవిందరాజు లెంతటిమహాపండితులు ! వారినే యిట్టిగతిపాలుచేసినదే. ఇఁకఁ బామరుల నెట్టిగతులం బట్టించునో మహాత్ము లూహింతురుగాక. గోవిందరాజులుగారీభాగము నధికపాఠమనిరి కాని శ్రీమహాభాగవతమునఁగల యీకథ ననఁజాలరు. ఆపన్నార్తిహరుఁడు శంకరుఁ డన్నమాట యెవ్వరు తొలఁగింపఁజాలరని భాగవతము వేనోళ్లఁ జాటుచున్నది.

ఇఁక మనకథకు మరలుదము. వేయివత్సరములు మథింపఁగా వారెల్ల రొక్కచోఁ జేరి మనశ్చాంచల్యము నరికట్టఁగా నాశాపాశమును పాగకుండ ఛేదింపఁబూనఁగా నని యర్థము గ్రహింపఁదగినది. వాసుకిఫణములు పాషాణములు కఱవఁగా విషమును వెడలఁగ్రక్కఁగా మహాగ్నిసంకాశమగు హాలాహలమనువిష ముద్భవించి జగంబుల రూపుమాపం జేయంబూనెను. అనుదాని కర్థ మేమనఁగా:

"అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలం,
అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః,
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః." 36

(గీత. 6 అధ్యా.)

అన్న శ్రీకృష్ణోపదేశము ననుసరించి మనోనిగ్రహము లేనివారలకు ఫలసిద్ధి గలుగనేరదు. విజితేంద్రియులు గానిచో యోగము దుష్ప్రాపము స్థిరమనస్కులు ప్రయత్నము చేసిన శాస్త్రోక్తరీతులచే నది సాధ్యమగును. కావున దేవదానవులు పరతత్త్వమునను గ్రహమును సంపాదింపఁబూనఁగా "శ్రేయాంసి బహు విఘ్నాని" అన్నన్యాయము ననుసరించి యామనస్సు

వారిని జితేంద్రియులనుగా నొనరించెనని యర్థము. అదియే హాలాహలవిషముగాఁ దోఁచి వారలను బాధించెను.

లోకమున మహాఫలము నాశించి భగవంతు నారాధింపఁబూనువారల కనేకవిఘ్నములు కలుగును. మనస్సు తిరుగఁబడును విశేషించి క్రోధమును గల్గించు క్రోధ మగ్నిజ్వాలలం బోలి బాధించును. ఇంద్రియములను దపింపఁజేయును. విషపానముచేసిన నెట్టిబాధలు కలుగునో యట్లే దేహేంద్రియములను గాల్పఁబూనును. అట్టి సకలకష్టములకు నోర్చుకొని భక్తులకు సుఖమునే కల్గించుమూర్తిని గల్గించుకొని ధ్యానింపవలయును. దీనికే శరణాగతి యని పేరు. ఆస్థితియందుండుభక్తుఁడు భగవంతు నిట్టికష్టములకు లోనుచేయక నన్నుద్ధరింపుమా యని ప్రార్థింపవలయును. అనువిషయమును మనము గ్రహింపవలయును.

పాలసముద్రమున నుండుభగవంతు నేల ప్రార్థింపవలయు ననఁగా ధ్యానమునకు శాంతము కావలయును. శాంతికరములగుపదార్థములనే భుజింపవలయును.

> "సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత,
> శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధస్స ఏవ సః. 3
> ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః,
> రస్యాస్స్నిగ్ధాస్థిరా హృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః. ౮
> మనఃప్రసాదస్సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః,
> భావసంశుద్ధిరిత్యేత త్తపో మానసముచ్యతే." ౧౬
>
> (గీత. ౧౭ అధ్యా.)

అన్న కృష్ణపరబ్రహ్మోపదేశప్రకారము ఆహారాదులు సాత్త్విక

ములు గావలయును. అట్లుగానిచో నా ప్రయత్నము బాధించు ననిసారము. కావున మహనీయులు శ్రీమహావిష్ణువును బ్రార్థించు నపుడు క్షీరాంభోధిస్థమగు మణిమయసౌధాంతరస్థునిగా ధ్యానింతురు. ఈవిషయమునే శ్రీశంకరాచార్యులుగారు సౌంద ర్యలహరియందు,

"సుధాసింధోర్మధ్యే సురవిటపివాటీపరివృతే,
మణిద్వీపే నీపోపవనవతి చింతామణిగృహే,
శివాకారే మంచే పరమశివపర్యంకనిలయాం,
భజంతి త్వాం ధన్యాః కతిచన చిదానందలహరీం."

"అత్రేదమనుసంధేయం. భగవత్పాదాచార్యాస్సమయమత పారదృశ్వానః సమయాచారప్రవణాః సమయరూపాం స్తువంతి. సమయాచారో నామ ఆంతరపూజారతిః." అని వ్యాఖ్య.

మహాత్ములెల్లరు శాంతసముద్రునిగాఁ బరతత్త్వమును ధ్యానింతురని మన మీయుదాహరణములనుబట్టి యెఱుంగ వలయును.

ఆప్రకారమే దేవదానవులజరామరత్వమును గోరి సుధాసింధుమధ్యస్థునిఁ బ్రార్థించిరి. విజితేంద్రియులు కారు. కావుననే వారలమనస్సు లోఁబడకపోయెను. అదియే వారికి విషముగాఁగ దానిబాధలకు వారు లోఁబడిరి దీనింబట్టి తపః ఫలమును గోరువారనఁగా భగవద్దర్శనమునుగోరువారు రాఁగల బాధలకు నోర్చుకొని భగవత్తత్త్వమును ధ్యానించుచు శర ణాగతి నొందవలయుననియు, నట్లుచేయుటచే ఉపాసకునకుఁ గల యహంకారము నశించుననియు సారము.

"అథ దేవా మహాత్మానం శంకరం శరణార్థినః,

జగ్మః పశుపతిం రుద్రం త్రాహి త్రాహీతి తుష్టువుః.
ఏవముక్తస్తతో దేవైర్దేవదేవేశ్వరః ప్రభుః,
ప్రాదురాసీత్తతోఽత్రైవ శంఖచక్రధరో హరిః,
ఉవాచైవం స్మితం కృత్వా రుద్రం శూలభృతం హరిః,
దైవతైర్మథ్యమానే తు యత్పూర్వం సముపస్థితం,
తత్త్వదీయం సురశ్రేష్ఠ సురాణామగ్రజోఽసి యత్.
అగ్రపూజామిమాం మత్వా గృహాణేదం విషం ప్రభో,
ఇత్యుక్త్వా చ సురశ్రేష్ఠస్తత్రైవాంతరధీయత."

అనుభాగమున నొక్కరహస్యము కలదు. దాని నెఱుంగ వలయును. అదియే వృద్ధికాముఁ డవశ్యము తెలిసికొనఁదగినది. జన్మఫల మదియే.

శరణార్థులగు దేవత లుదారహృదయుఁడయి భక్తులకు సుఖముగూర్చు సదాశివునికడకుం బాఱి కావుకావుమని ప్రార్థించిరి. అత్తరుణముననే భగవంతుఁడు విష్ణుమూర్తియు నట సాక్షాత్కరించి స్మితవక్త్రుఁడై మహాత్మా! దేవతలు మథించు చుండఁగాఁ దొలుత నేది కలుగునో యది నీదియే యగుం గదా. దేవతలకెల్లఁ దొలుతఁ గలిగినవాఁడవు నీవేకదా. కావున నగ్రపూజగా భావించి యీవిషమును బరిగ్రహింపుము. అని తెలిపి యంతర్ధానమయ్యెను అనునదియే కథాసంగ్రహము. దీనినుండి మానవుఁడు గ్రహింపఁదగువిషయ మేది?

తపోవిఘ్నములు పొడసూపుట స్వభావము. అయ్యవి నియతిని బరీక్షించుటకే యని తెలియందగు. ఆస్థితియందు భక్తుఁడు దీనుఁడు కారాదు. భగవంతుని శరణాగతి నొందవల యును. "త్రాహి త్రాహి" యనుభావముకలవాఁడు కావలయును.

కాపాడుము. కాపాడుము. అనుపదములు నిరహంకారతను దెలుపును. ఆస్థితియందు భగవంతుఁ డాతనిశ్రమములపాలు చేయఁడు. కరుణించును. పరీక్ష పూర్తియైనదికదా. శరణాగతుని శ్రమపెట్టువారుందురా? మానవులే యాధర్మము నను వర్తింప నిఁకఁ గరుణాసముద్రుఁడగు భగవంతునిమాట చెప్పవలయునా?

ఆతరుణమునఁ బిలువనిపేరంటముగా నారాయణమూర్తి యేల కనఁబడవలయును? అని కొందఱు ప్రశ్నింపవచ్చును. అట్లడుగుట మంచిది ఉత్తరమేమనఁగా వినుఁడు. దేవతలు తొలుత నమృతత్వము నొందఁగోరిరి. ఇంచుక శ్రమము కలుగఁగా మనోధైర్యములేక శంకరుని గొలువఁబోయిరి. కావున వారలమనస్సు నిశ్చలతఁ గాంచలేదని స్పష్టమయ్యెను. వారల సంకల్పము మంచిది. కాని పద్ధతి చక్కని దింకను వారికి లభింపదయ్యెను. కావున వారలకు భగవత్తత్త్వము బుద్ధిచెప్పనెంచెను. వారలకుఁ గలభేదబుద్ధిని బోఁగొట్టఁదలంచెను. విష్ణురూపమునఁ దోఁచెను. అంతకుముందు దేవత లెఱింగినవారు త్రిమూర్తులే. కనుక వారికి విష్ణురూపమునం దోఁచి వారిపక్షముగా నామహాదేవునితోఁ బ్రథమపూజ్యుఁడవు ప్రభూ! నీవేకదా. వారు కోరినదానిలోఁ దొలుతవచ్చినవిషము నగ్రపూజగా గ్రహింపుమని వేఁడెను. దుఃఖరాహిత్యమే సుఖమగును. ఈవిషము ననఁగా గష్టమును దొలఁగింపుము. తరువాత వారి కభేదబుద్ధి గలుగునని శంకరుని బ్రార్థించునెపమున దేవతలకు హితము తెలిపెనని సారము.

ఈఘట్టమే శివకేశవాభేదమును దెలుపుచున్నది. ఎన్ని గ్రంథముల నిట్టి యుపదేశములున్నను గొందఱకుఁ గలపట్టు దల వదలదు. వీరవైష్ణవు లంగీకరించిన విష్ణుపురాణమున నైదవ యంశమున నిట్లు కలదు.

"యన్మద్దత్తవరో బాణో జీవతామేష శంకర,
త్వద్వాక్యగౌరవాదేతన్మయా చక్రం నివర్తితం. ౪౬
త్వయా యదభయం దత్తం తద్దత్తమఖిలం మయా,
మత్తో విభిన్నమాత్మానం ద్రష్టుమర్హాసి శంకర. ౪౭
యోఽహం సత్వం జగచ్చేదం సదేవాసురమానుషం,
మత్తో నాన్యదశేషం యత్తత్త్వం జ్ఞాతుమిహార్హాసి. ౪౮
అవిద్యామోహితాత్మానః పురుషా భిన్నదర్శినః,
వదంతి భేదం పశ్యంతి చావయోరంతరం హర." ౪౯

(33 అధ్యా).

శ్రీభాగవతమునుండి మున్నే యుదహరించితిని గదా. నీవే నేను. నేనే నీవు. మనకిరువురకు భేదముగలదనువా రజ్ఞానులని కదా శ్రీహరి చెప్పెను విష్ణు శ్రీభాగవతములయం దిట్లుండ వానింగూడ నంగీకరింపని మహాత్ముల కొక్కనమస్కారము తెలిపి సాగనంపి తరువాతవిషయము నెఱుంగుదుము. ఈభాగ మునుండి నేర్చుకొనఁదగినవిషయ మేమని పరిశీలింతము.

భక్తిజ్ఞానయోగములు సమ్మిళితములుగా నుండవలయు. అప్పుడే భగవదారాధనము విధివిహితమగును. అట్టివారే సమ దర్శనులగుదురు సమదర్శనులకు భేదబుద్ధిపొడము నవకాశమే లేదు. భేదబుద్ధికలవారలకు భక్తి దృఢతం గాంచదు. వారు భక్తియున్నట్లు నటింతురు. భేదబుద్ధి యగ్నివంటిది. మనస్సును

గాల్చుచుండును. అది తొలంగినఁగాని భగవత్తత్త్వము గోచ
రింపదు. శాంతియుఁ జేకూరదు. దేవతాదూషణము చేయు
వారిమనస్సున శాంతికిఁ దావేలేదు. కావున దానిని మాని సర్వ
దేవతామయుఁడు భగవంతుఁడని నమ్మి యెల్లభూతములయం
దాతనినే చూచుచుండవలయును. ఆస్థితి యెప్పు డలవడునో
యప్పుడు భక్తుఁ డనంబడును. అట్టిస్థితియందు మన మున్నా
రమా యని తమ్ముఁదామే పరీక్షించుకొనవలయును. అంతియ
కాని యింకొకరిమూలమున నిది కాదు. ఈనీతిని శ్రీమహావిష్ణువు
శంకరుని విషము పానముచేయుమని తెల్పినభాగమునుండి
మనము గ్రహింపవలయును. ఆవిషమును శ్రీమహావిష్ణువు
పానము చేయఁజాలకపోఁడు. ఎవ్వరివలన నేపనిసాగింపవల
యునో ఆమహనీయుఁ డెఱుంగును. తన్ను భగవంతుడని
సేవించువారు శంకరుని దూషింపఁగూడదనియుఁ, దనకు శంక
రునకు భేదమే లేదని వా రెఱుంగవలయుననియు, నీరీతిగాఁ
దెలిపెనని మన మెఱింగిన భేదబుద్ధి నశించును. తరణోపాయము
దొరకును.

"దేవతానాం భయం దృష్ట్వా శ్రుత్వా వాక్యం తు శార్ఙ్గిణః,
హాలాహలవిషం ఘోరం స జగ్రాహామృతోపమం,
దేవాన్ విసృజ్య దేవేశో జగామ భగవాన్ హరః."

అను నీభాగమును బరికింతము.

దేవతలప్రాణభీతియు భగవంతుఁడగు శ్రీహరివాక్యము
నెఱింగి, భయంకరమగు నావిషము నమృతతుల్యముగాఁ ద్రావి
శంకరుఁ డరిగెను. అన్నది కథాభాగము. దీనినుండి మనము
గ్రహింపఁదగిన దేది? శంకరునకు నించుకంతయు నీకార్యమున

లాభము లేదు. స్వార్థైకతత్పరులగు దేవత లడుగువారు. పదార్థము ప్రాణాంతకరమగువిషము. అట్టిచో శంకరుఁడు అమృతముగా దాని ద్రాగెను అనఁగా నెవ్వాఁడు సర్వదర్శనుఁడై యాత్మలాభము నించుకంతయుఁ గోరక పరార్థైకతత్పరుఁడై పరోపకారము చేయఁ బ్రోత్సహించు పెద్దలమాట లాలకించి యట్టికార్యము చేయునో యాతఁ డుత్తమపురుషుఁ డనఁబడు నని యీకథ మనకుఁ దెలుపుచున్నది.

విషము త్రాగ శక్యమా? ఇది విశ్వాసార్హమా యని కొందఱు ప్రశ్నింతురు. మనబోంట్ల కది శక్యముకాదు. కాని మహాత్ముల కది కేవలము స్వల్పకార్యమగును. ఆత్మశక్తిగలవారలకు సాధ్యము కానిపని యుండదు. సమదర్శనులగువారి నేఘోరపదార్థము నేమియుఁ జేయఁజాలదు.

"విషం న దేహే క్రమతే తదీయే దష్టే సుఘోరైరపి పన్నగేంద్రైః"

అని యోగశాస్త్రము తెల్పుచున్నది. వాయువును బ్రాణాయామపద్ధతిని లోఁబఱుచుకొనినదానికిఫల మిది కావునఁ యోగసిద్ధులకు మనకు దుర్ఘటములగు కార్యములు సులభతమములుగాఁ దోఁచును. ఆత్మశక్తి కసాధ్య మేదియుండును? అది లేక మన మిట్లు సంశయింతుము. క్రూరసర్పములు హారములుగాఁ గలశంకరునకు విషమమృతముగాక మఱేమగును? భేదబుద్ధిగలవారలకుఁ బదార్థము లెల్ల వేఱువేఱుగాఁ దోఁచుట సహజమే. కావున నిందు వింతయనఁదగిన దేదియు లేదు. మనకుఁ గలయల్పబుద్ధిచేత నెంతటిసుసాధ్యకార్యమైన నసాధ్యమని తలంతుము, దీనిచేత శాస్త్రవిశ్వాసము తొలఁగును. అలౌకిక

దృష్టి పాడసూపుమార్గమే తొలంగును. కావున నల్పబుద్ధుల మాని యోగశాస్త్రము విధిప్రకార మభ్యసించిన నీశంకలు తొలఁగి భగవత్తత్త్వమున విశ్వాసము కలుగును.

> "ప్రవివేశాథ పాతాళం మంథానః పర్వతోఽనఘ,
> తతో దేవాస్సగంధర్వాస్తుష్టువుర్మధుసూదనం,
> త్వం గతిస్సర్వభూతానాం విశేషేణ దివౌకసాం,
> పాలయాస్మాన్ మహాబాహో గిరిముద్ధర్తుమర్హసి.
> ఇతి శ్రుత్వా హృషీకేశః కామఠం రూపమాస్థితః,
> పర్వతం పృష్ఠతః కృత్వా శిశ్యే తత్రోదధౌ హరిః."

కథాభాగము విదితము. ఈకథ మన కే విషయమును బోధించును? మానవుఁడు తాఁజేయఁబూను కార్యమున నెన్నియో కష్టములు గలుగును అట్టితఱి దీనుఁడు కాఁ[illegible]దు. గతి యెవ్వఁడని యాలోచింపవలయు. సర్వేశ్వరుఁ డొక్కఁడే గతి యని నమ్మవలయును. తదేకాగ్రమనస్కుఁడు కావలయును. ఆస్థితియందుఁ బెక్కండ్రు దేవతలు కలరన్న భావము తోఁపరాదు. ఆధారభూతుఁడు శరణ్యుఁడు సర్వకర్త యొక్కఁడే కలఁడన్న భావము స్థిరపడవలయు అట్టిభక్తునకుఁ బరతత్త్వము తత్కార్యసాధనార్హరూపమునఁ బొడకట్టును. ఆఫలమున కతఁ డర్హుఁడగునేని దానిని సాధించి యొసంగును. అనర్హుఁడేని చింతఁ దీర్చిపోవును. కావున నహంకారమును మాని విపత్తులయందు మానవులను నమ్మక భక్తిశ్రద్ధలుగలిగి సర్వేశ్వరు నొక్కనినే ధ్యానింపవలయును. తఱచుగా దృఢభక్తికుదురుట ఫలము నొందువారలకే యని మన మెఱుంగవలయును. చంచలబుద్ధిచే నెందఱినో యాశ్రయించిన నాకార్యము నెఱవేఱదు.

"మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే,
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే. ౨౬
(అధ్యా ౧౪)
మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః. 34
(అధ్యా. ౯)
మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ,
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ. ౭. (అధ్యా ౭.)
మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి,
అథ చేత్త్వమహంకారాన్న శ్రోష్యసి వినంక్ష్యసి." ౫౮. (అ. ౧౮.)

అను నీగీతావాక్యములు పైవ్రాసినయభిప్రాయమును సిద్ధాంతముచేయుచున్నవి. భగవత్తత్త్వ మేదియని కనుఁగొనుటయే జ్ఞానమని మనము నమ్మవలయును.

"ఉచ్చైశ్శ్రవా హయశ్రేష్ఠో మణిరత్నం చ కౌస్తుభం,
ఉదతిష్ఠన్నరశ్రేష్ఠ తథైవామృతముత్తమమ్. ౨౬
అథ తస్య కృతే రామ మహానాసీత్కులక్షయః,
అదితేస్తు తతః పుత్రా దితేః పుత్రానసూదయన్. ౨౭
యుద్ధమాసీన్మహాఘోరం వీర! త్రైలోక్యమోహనం." ౨౮

ఇందుఁ గొన్ని ముఖ్యవిషయములు గలవు. కథాసారము సులభము

మనస్సును మోహింపఁజేయువస్తువులలోఁ గాంతాకనకములు ప్రధానములనుట సర్వజనవిదితవిషయము. ఈకథయందవ్వి రెండును గలవు. అప్సరసలు, రత్నములు, హయరత్నములోనగునవి కనఁబడెను. ఎవరు బలవంతులో వారెల్ల వాని

వానిగ్రహించిరి. విషము పుట్టినప్పు డొక్కఁడైనను గావలయు నన్నవాఁడు కానరాఁడు. ఆపదార్థములపిదపఁ దమరు కోరినయమృతము దొరకెను. అంతకుముందుఁగల శాంత మెగిరిపోయెను. కలహమున కారంభించిరి. ప్రాణముల లెక్కింపక పోరాడిరి. దితిపుత్త్రులగు రాక్షసులు పెక్కండ్రు మడిసిరి. కులక్షయకరమగు మహాసంగ్రామము చెల్లెను. లోభ మెంత పనిచేసెను! కావున సర్వదుర్గుణమూలము లోభము. దానిని మానుట మేలని సామాన్యముగా నీకథనుండి గ్రహింపఁదగినది.

మఱొకవిశేషము కలదు. దాని నెఱుంగుటయే ముఖ్యము. భగవత్కరుణను బడయఁగోరినవారి కెన్నియో యంతరాయములు కలుగును. మోహమును గల్పించువస్తువులు తోఁచును. అవియే ప్రకృతివికారములు. అట్లవి కనఁబడుట చిత్తశుద్ధిని బరీక్షించుటకే యని యెఱుంగవలయు. తపస్సనఁగా నసిధారావ్రతమువంటిది. దానినుండి కృతార్థుఁడగుట మిక్కిలి కష్టము. అట్టివస్తువులు తుచ్ఛములని భావించి వానిం బడయఁగోరక యెవ్వఁడు తనధ్యానమునందే తత్పరుఁడయి యుండునో యతఁడు ధన్యుండగు. ఏమాత్రమైన నాసించెనా యధఃపతితుఁడగును. దేవదానవు లట్టివారుకాక స్వార్థపరాయణులై రణ మొనరించి నిహతులైరి. అనఁగా లోభమును మానినవాఁడే భగవదనుగ్రహపాత్త్రుఁడగును. కావున సర్వానర్థమూలమైన లోభమునువదలి నిర్మముఁడు నిరహంకారుఁడునై భగవత్సేవ చేయవలయుననువిషయమును మనము గ్రహింపవలయును.

"అథ వర్షసహస్రేణ సదండస్సకమండలుః,
పూర్వం ధన్వంతరిర్నామ అప్సరాశ్చ సువర్చసః.
అప్సునిర్మథనాదేవ రసస్తస్మాద్వరస్త్రియః,
ఉత్పేతుర్మనుజశ్రేష్ఠ తస్మాదప్సరసోఽభవన్.
న తాస్సు పరిగృహ్ణంతి సర్వే తే దేవదానవాః,
అప్రతిగ్రహణాత్తాశ్చ సర్వాస్సాధారణాస్స్మృతాః."

అనుభాగము పరిశీలింపుఁడు. పాలకడలినుండి కమండలువు హస్తమున ధరించి ధన్వంతరి యవతరించెను. తరువాత నసంఖ్యాకలగు నచ్చరమిన్నలు పొడసూపెరి. వారిని దేవదానవులలో నెవ్వరు వరింపకపోయిరి. కావున వారు సాధారణలైరి. అనఁగా వేశ్యలయిరని యర్థము. జలముల మథించుటం జేసి రసముదయించెను. ఆరసమునుండి కలిగినవారౌట నప్సరస లనంబరఁగిరి. అని కథాసంగ్రహము. ఈకథ విన్నంతన కొందఱు నవ్వుదురు. కథకుఁ గాళ్లు లేవన్నమాట తగినదే యందురు. కాని యీకథ మనకుఁ దెలుపునీతిమాత్రమే గ్రహించినఁ గృతార్థులమగుదుము. ప్రాచీనులతాత్పర్య మేమనఁగా

"కథాచ్ఛలేన బాలానాం నీతిస్తదిహ కథ్యతే."

యన్నసూక్తిని బ్రధానముగాఁ జేసికొని కథయందందుఁ జిత్రములు కల్పింతురు. పామరు లవ్వాని కచ్చెరువందుదురు. అంతియ వారికిఁ దృప్తి. వారికంటె బుద్ధిమంతులు కథాసారమేమని యూహింతురు. దేవతలు రాక్షసులు పాలసంద్రమును జిలుకఁగా దేవకాంతులు పుట్టియుండవచ్చునని నిశ్చయింతురు. వారలకంటె బుద్ధిమంతు లీకథయే నీతిని దెలుపునని తలంతురు.

తత్సారమును గ్రహించి యీకథ మన కిట్టి మహోపకార మొనరించెనని యానందింతురు. సముద్రజలములఁ జిట్టిపాత్రము వైచినఁ దనశక్తికొలఁదిగా నీటి నాకర్షించును. అంతకంటెఁ బెద్దపాత్రము తనయోగ్యతకుఁ దగినంతనీటిని గ్రహించును. ఇట్లే పామరులు మొదలుకొని జ్ఞానులవఱకు వారివారియోగ్యత ననుసరించి కథార్థమును గ్రహించి యానందింతురు. కాని మూలకథ నాక్షేపింపరాదు. అదియేకదా యిన్నివిధములగు మనస్సులు కలవారలకు నిన్నివిధముల నానందమును గల్పించి నది. రామాయణమునఁగూడ నట్టిరిత్తకత లున్నవా యన రాదు ఎందేని కొన్నితావుల నర్థవాదము లుండవచ్చును. అవికూడఁ గొందఱను భావనాత్మలనుగాఁ జేయఁజాలును. ఇఁక నిందలిసీతిని గ్రహింతము.

దేవతలు దైత్యులు జలతత్త్వమునుగుఱించి మథించిరి. అనఁగా బంచమహాభూతములలో శాశ్వతమనఁదగినదానిలో నీరు కూడ నున్నదికాన దానిని బరిశీలించిరని భావము. జల ములు నారము లనఁబడును. అవియే నివాసముగాఁ గలవాఁడు కాన నారాయణుఁ డనుపేరు భగవంతునకుఁ గలిగెను. అట్టి భగవత్స్వరూపముల నుపాసించిరని భావము. పట్టుదలలఁబూని పరికింపఁగా వారిమనోధర్మ మెట్టిదని భగవంతుఁడు పరీక్షించె నని భావము. భగవంతుఁడు పరిక్షించెననఁగాఁ దలంచెనని భావము. తదిచ్ఛాశక్తియగు మహాప్రకృతి వెంటనే విచిత్ర సృష్టుల నొనరించెను. సాగరముననుండి కమండలుధరుండగు ధన్వంతరి పొడమె ననఁగా వారికిఁ దొలుత నొకపురుషుఁడు తోఁచెను. ధన్వంతరి శ్రీమహావిష్ణువే యని భాగవతము తెలుపు

చున్నది. లోకోపకారపరాయణుఁడు ధన్వంతరియని యంద ఱెఱుంగుదురు. వైద్యశాస్త్రకర్త. పురుషవ్యక్తి మనస్సును గలఁతనొందింపఁజాలదు. వారిమనోధర్మము పరోపకారప్రవణము కావలయునని యాధన్వంతరి యవతారము బోధించెనని యెఱుఁగందగు వెంటనే యచ్చరలు వేనవేలుగాఁ గనఁబడఁ జేసెను. ప్రకృతి సకలబ్రహ్మాండముల నొక్కసారిగా క్షణమాత్రమున నిర్మింపఁజాలుననగా నిఁక నచ్చరలఁ గల్పించు టొక వింతకాదు. త్రిమూర్తులను గల్పించినభగవతి యీపాటిసృష్టి చేయఁజాలదన్నఁ బరిహాసమేకదా. ఈవిషయము శ్రీశంకర గురువర్యులు సౌందర్యలహరియందు

"జగత్సూతే ధాతా హరిరవతి రుద్రః క్షపయతే
తిరస్కుర్వన్నేతత్స్వమపి వపురీశ స్తిరయతి,
సదా పూర్వస్సర్వం తదిదమనుగృహ్ణాతి చ శివ
స్తవాజ్ఞామాలంబ్య క్షణచలితయోర్భ్రూలతికయోః. ౨౪

ఈరీతిఁ బేర్కొనిరి.

ఈరీతిగా వారికి ధన్వంతరిరూపమున భగవంతుఁడు, నచ్చరలరూపమున భగవతియుఁ గనఁబడిరని మనము గ్రహింపవలయును. ఇదియే వారికార్యము ఫలించుననుటకు శుభశకునము. భక్తుఁడగువాఁడు భగవంతు నారాధించునపు డతని వాంఛ న్యాయసమ్మతమేని దనసంతోషమును దదిచ్ఛాకల్పిత రూపమునఁ గనఁబఱచునని మన మెఱుఁగవలయును. దుస్సంకల్పమగునేని ఫలింపదని తెలియునట్టిగుఱుతులు తోఁచును. నిష్కాముఁడగుభక్తునివిషయమున నివి యన్వయింపఁగూడదు. అచ్చరమిన్నలం గాంచి వారియందమునకుఁ జొక్కి దేవదాన

వులు పరవశులు కాకపోవుటయే భావిఫలావాప్తికి హేతువని మనమూహింపవలయును. ఈవిషయమున మహాకాళీవాక్యమును వినుఁడు.

"యోషాలిరూపసంపన్నా గర్వితా మదశాలినీ
మమ రూపైవ సా జ్ఞేయా పుష్పేణాపి న తాడయేత్."

ఈవాక్యము జితేంద్రియత్వము సూచించుటలేదా. భావనామాత్రమునఁ బరమేశ్వరుఁడు సంతృప్తుఁడగును.

"పత్త్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః. ౨౬
యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్." ౨౭
(గీత. ౯ అధ్యా.)

అను నీశ్రీకృష్ణోపదేశము పైవ్రాసినభావమును దృఢపఱచెడిని. జితేంద్రియుఁడై సత్సంకల్పముచే భగవంతు నారాధించిన నంతరాయము లెన్ని కలిగినను దుదకు వానియభిమతము ఫలించుననియు, భగవంతుఁడు వాని ననుగ్రహించుననియు మనము నేర్చుకొనవలయును.

"వరుణస్య తతః కన్యా వారుణీ రఘునందన,
ఉత్పపాత మహాభాగా మార్గమాణా పరిగ్రహం.
దితేః పుత్త్రా న తాం రామ జగృహుర్వరుణాత్మజాం,
అదితేస్తు సుతా వీర జగృహుస్తామనిందితామ్.
అసురాస్తేన దైతేయాస్సురాస్తేనాదితేస్సుతాః,
హృష్టాః ప్రముదితాశ్చాసన్ వారుణీగ్రహణాత్సురాః." ౩౮

అనుభాగమునుండి యొక్కచక్కనినీతి తేలెడిని. దానిని విమర్శింతము.

అమృత మబ్బుటకుముందే వరుణపుత్త్రికయగు వారుణీదేవి తన్నెవరు పరిగ్రహింతురో యని వెదకుచు వచ్చెను. అనఁగా సముద్రాధిదేవతకొమరితయం దెవరు యోగ్యులనఁగా ఫలభాక్కులు కలరో వారిని బరికింపఁ బ్రత్యక్షమయ్యెనని భావము. పెక్కండ్రు తపస్సుచేయుచుండఁగా నెల్లరు ఫలమును బొందఁజాలరు. అందుఁ గొందఱెయుందురు. కామక్రోధావృతాంతరంగులు శాస్త్రమునఁజెప్పఁబడినట్లు తపం బొనరించినను వారు కోరినఫలము నందఁజాలరు. తపస్సు నిష్ఫలమాయన్నఁ గాదు. దానిచే వారిమనస్సునఁ గలదుర్వాసనలు క్షీణించును. తరువాతఁ జేయుభగవదారాధనము ఫలవంతమగును. అను నీనియమము ననుసరించి ప్రకృతవిషయమును బరీక్షింతము.

దేవతలు శివవిష్ణుభేదము లేనివారు. దైత్యులు విష్ణుద్వేషులు. అదియే వారికిం గలదుష్కర్మవాసన అది తొలంగవలయును తొలఁగినఁగాని యమృతములభింపదు. సామాన్యదృష్టిఁ గలవారలకు దేవదానవులు సమానముగా శ్రమంపడఁగా నందు దేవతలకుమాత్ర మమృతము శ్రీమహావిష్ణువొసంగుట పక్షపాతముకాదా యని తోఁచును. ఆయభిప్రాయము తొలఁగించుటకే యీవారుణీదేవి యవతరించెనని మన మాలోచింపవలయును.

'మార్గమాణా పరిగ్రహమ్.'

అనువాక్యమున నీయర్థ మిమిడి యున్నది. లేక యున్న వరుణపుత్రిక వ్యభిచారిణి యనవలసివచ్చును. అంతకంటెఁ

బాపముకలదా? కొందఱు వారుణి యనఁగా మద్యమని యర్థము చెప్పుదురు. కాని యీయర్థ మిచ్చుట సరిపడదు. అసంగతముగను దోఁచును వరుణపుత్రికయనియే మూలమునఁ గలదు. ఆదేవి నాదరించువారలకే యమృతము దొరకును. దితిజులు వరుణపుత్రికను జూడనొల్లరైరి. భావిభాగ్యము వారికి లేదు అనిందితయగు నాదేవి నదితిపుత్త్రులగు దేవతలు సన్మానించిరి. భావిభాగ్యము వారికిం గలదు కావున వార లాదేవి నారాధించిరి ఆమెను మన్నింపకున్నందున దితిపుత్త్రు లసురులైరి. దేవతలు సురలైరి. సురాదేవి యనునర్థము చెప్పినచో సకలస్మృతిపురాణేతిహాసాది నిషిద్ధమగు మద్యము త్రాగినందున దేవత లెట్లు పూజ్యులైరి? రాక్షసు లెట్లు నింద్యులైరి? ఆయర్థము పొసఁగదు. "సుష్ఠు రాజంత ఇతి సురాః" అన్నట్లు చక్కఁగాఁ బ్రకాశించువా రన్న పేరు దేవతలకు వచ్చెను. అదృష్టహీనులు క్రూరస్వభావులు దారుణకర్మారంభులు కాన మిగులఁ బ్రకాశింపక దైత్యులుండిరి. అన్నభావమే సత్సమ్మతము. ఇందలివిశేష మేమనఁగా వినుఁడు.

సర్వదేవతలు పూజ్యులు. ఎవ్వరినిగాని మనము తిరస్కరింపరాదు. ఎల్లరయందు నొక్కరీతి భావముండుటయే యుత్తమము. అందొక్కరూపము నొక్కనామము మనకు సమ్మతమేని దానిని విశేషించి పూజింపవచ్చును కాని తక్కిన దేవతల దూషింపరాదు. ఇన్నిరూపముల నామముల నధికారముల నెసంగువాఁ డొకభగవంతుఁడేకదా. ఇందొక్కని దూషించిన నాపరమాత్ముని శ్రీకృష్ణుని దూషించినట్లే యగును. మన దేహమున నొకయింద్రియమును గష్టపెట్టిన సర్వేంద్రియములు

శ్రమంపడును ఏల? మనస్సు సర్వేంద్రియముల వ్యాపించి యున్నది. కాన నదిగలవెల్ల బాధపడును. ఆలాగుననే సర్వమయుండగు నాపరమాత్మ యేవ్యక్తిని దూషించిన నంగీకరింపఁడు. అట్టినియతిగలవాఁడే ఆపరమాత్మకృపకుఁ బాత్రుఁడగును. లేనిచోఁ బాత్రుఁడు కాఁజాలఁడు.

"న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః,
మాయయాపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః." ౧౫
(౭ అధ్యా.)

అన్న గీతావాక్యమునఁ బైవ్రాసినయర్థ మిమిడియే యున్నది.

"తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే,
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః. ౧౭
(౭ అధ్యా.)

దేవతలు భావిభాగ్యప్రచోదితులై యాదేవి నారాధించిరి. కావున భగవదనుగ్రహమునకుఁ బాత్రులైరి. ఈయర్థమును దెలుపుటకే "హృష్టాః ప్రముదితాశ్చాసన్" అని మహాకవి వాల్మీకి వచించెను. ఇట్టు లీభాగము భగవంతు ననన్యభక్తిచే నారాధింపవలయు ననువిషయమును బోధించుచున్నది.

"యదాక్షయగతం సర్వం తదా విష్ణుర్మహాబలః,
అమృతం సోఽహరత్తూర్ణం మాయామాస్థాయ మోహినీం,
యే గతాభిముఖం విష్ణుమక్షయం పురుషోత్తమం,
సంపిష్టాస్తే తదా యుద్ధే విష్ణునా ప్రభవిష్ణునా." ౩౦

అనుభాగము శరణాగతిని దెలుపుచున్నది ఎట్లనఁగా వినుఁడు. దేవదానవసంగ్రామమూలమున సమస్తము నశించునట్లు కాఁగా

శ్రీమహావిష్ణువు సకలప్రపంచమును మోహింపఁజేయుమాయ నవధరించి దితిజులవశమున నున్న యమృతమును ద్వరగా గ్రహించెను. తన్ను శరణుసొచ్చిన దేవతలయం దావేశించి బలవంతులనుగా నొనరించెనని కథాసారము.

శరణాగతరక్షణము పరమధర్మము. భగవంతుఁడు శరణు సొచ్చినధర్మతత్పరులను గాపాడువాఁడు. అధర్మాత్ములు శరణు చొచ్చువారు కారు. ఆభక్తి వారలకుఁ గలిగినయెడల వారును ధర్మతత్పరులే యగుదురు. ధర్మము లోకోపకారరూపమైనది. అధర్మము లోకాపకారరూపమైనది. కావునఁ బరమేశ్వరుఁడు ధర్మపక్షమునే యవలంబించును అధర్మపక్షము నవలంబించు నట్టివారి నడంచును.

"యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత,
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహం. ౭
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే. ౮
జన్మ కర్మ చ మే దివ్యమేవం యో వేత్తి తత్త్వతః,
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున." ౯
(గీత. ౪ అధ్యా.)

అన్న శ్రీకృష్ణోపదేశము స్పష్టమేకదా. కావున దేవతలు నీవే దిక్కనిరి. రక్కసులు స్వబలమూని యమృతము దొరకెనన్న గర్వమున నూరకుండిరి. సర్వజ్ఞుఁడగు పరమాత్మ యమృతము దేవతలకే దొరకున ట్లొలచేయ రాదని ప్రశ్నింతురు చేయఁ గలఁడు. కాని చేయఁడు ఏల? కర్మసిద్ధాంతమును బాడుచేసిన వాఁడగును. ఎట్లు? తనచే నమరులచే నిహతులై పరమపదము

నొందఁదగినవా రెందఱో యున్నవారు. వారలు రణనిహతులు కావలసినట్లు కర్మము తెల్పుచున్నది. దాని మానుపు టెట్లు? మఱియు భగవంతు నాశ్రయించిన నెట్టిబలవంతులు నేమియు బాధింపఁజాలరన్న నీతి లోకులు నేర్చుకొనవలయును. అంతియ కాక పురుషప్రయత్న మెంతటిదైన నది దైవసాహాయ్యము లేక ఫలింపదన్న విషయము లోకులకు దృఢము కావలయు. ఇన్ని కారణములచేత రాక్షసులు గైకొనునట్లు చేసెనని మనము తెలిసికొనవలయును.

రక్కసులకుఁ జిక్కినయమృతమును మోహినీరూప మునఁ గైకొనెను. అనఁగా స్త్రీవ్యక్తిని దోఁచెనని భావము. అనఁగాఁ బ్రకృతి నాశ్రయించెననియే సారము. శ్రీశంకరభగ వత్పాదులు సౌందర్యలహరియందు

"హరిస్త్వామారాధ్య ప్రణతజనసౌభాగ్యజననీం,
పురా నారీ భూత్వా పురరిపుమపి క్షోభమనయత్."

అని తెలిపిరి. త్రిమూర్తులు సాధింపరాని కార్యముఁగలిగెనేని ప్రకృతి నాశ్రయించుట పరమాత్మునకు స్వభావమే అపుడు ప్రకృతి నారాధింపకయున్న నమృతము దొరకదు. విష్ణుశక్తి యపుడు కార్యకారి కాదయ్యెను. విష్ణుమూర్తి మోహిని కాలేదు. పరదేవత నారాధించినంతనే భక్తపరాధీనగానఁ బొడసూపెనని సారము. లేకున్న నిర్జితేంద్రియుఁడగు శంక రుఁడు భ్రాంతిపడెనన్నమాట పొసఁగదు ఆకార్యము కాఁగానే యామె యంతర్ధానమందెననియు, నందేయున్న విష్ణుమూర్తి కనఁబడియెననియు మనము గ్రహింపవలయును.

ఈభాగమునఁ గలవిశేష మేమి? భక్తుఁడు పరమేశ్వరు నారాధించి తనపని నెఱవేర్చి ఫలమును దానే పొందక భగవంతున కర్పింపవలయుననియు, దానిచేఁ బరమానందమునంది యాకరుణానీరరాశి మరల నాఫలముల వార లనుభవించునట్లు చేయుననియు మనము తెలిసికొనవలయును.

"యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్.
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్." ౨౭
(గీత. ౯ అధ్యా.)

అన్న భగవదుక్తియందుఁ బై వ్రాసినభావ మిమిడియున్నయది. తండ్రి శ్రమించి తెచ్చినవస్తువులను గొడుకుల కిచ్చును. అందొకఁడు తనవస్తువునందుఁ గొంతభాగము మరలఁ దండ్రి కొసఁగిన నాతనయుని దండ్రి యెంతయాదరమునం జూచునో యట్లే భగవంతుఁడు తానిచ్చినసంపదను సద్వినియోగము చేసి సత్కర్మముల నాచరించి ఫలముల నాభగవంతునకే యర్పించిన నామహానుభావుఁడు పరమానందమున నాతని సముద్ధరించును ఈవిషయము మనము చక్కఁగా భావింపఁదగినది. ఫలాభిసంధిరహితకర్మమే భగవదనుగ్రహపాత్రమగుట యింతలిసారము.

సర్వకర్తయగుపరమేశ్వరుఁడు దనుజులనుండి యమృతమును గ్రహింప శక్తుఁడుకదా. మాయఁదాల్చి మోహినీరూపము గొననేల యను ప్రశ్నము చేయువారు కొందఱు గలరు. ముందే యిది దత్త్వోత్తరము. ఐనను సూంత వ్రాసెదను. పరమేశ్వరుఁడు నిర్గుణుఁడు. నిరంజనుఁడు నిర్లిప్తుఁడు. చిదానందరూపుఁడు. ప్రకృతి. సర్వకర్త్రి. భగవత్సాన్నిధ్యమును విడ

నాడదు. తదిచ్ఛామాత్రమున నెల్లకార్యములు చేయునది. తత్సహాయములేక పరమాత్మ కదలఁజాలఁడు.

"శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
న చెదేవం దేవో న ఖలు కుశలస్స్పందితుమపి,
అతస్త్వామారాధ్యాం హరిహరవిరించాదిభిరపి
ప్రణంతుం స్తోతుం వా కథమకృతపుణ్యః ప్రభవతి."

అను మహనీయ శంకరాచార్యవర్యోక్తి సత్యముకదా. అమృతమథనకాలమునఁ ద్రిమూర్తులలో నొకరగు మహావిష్ణువే దేవతలపక్షము నవలంబించి యుద్ధము చేసెను. ఆసమయము మీఱిన లోకులకు మహాపకారమగును. కావున నాలసింపక ప్రకృతిం బ్రార్థించెను. ఆమె సాక్షాత్కరించెను. తద్దర్శనమాత్రమున దానవులు నిశ్చేష్టులై యమృతమొసంగిరి. ధర్మపక్షముగల దేవతలకుం బంచి యిచ్చి వెడలిపోయెను. ఆమె యదృశ్యము కాఁగా యథాపూర్వబలముగలిగి యాగ్రహించిరి. యుద్ధసన్నద్ధులైరి. శ్రీమహావిష్ణుసహాయమున దేవతలు వారిం బాఱఁదోలిరనువిషయము మన మెఱుంగవలయును. ఇట్లే మహాభారతయుద్ధారంభమునందును;

"ధార్తరాష్ట్రబలం దృష్ట్వా యుద్ధాయ సముపస్థితం,
అర్జునస్య హితార్థాయ కృష్ణో వచనమబ్రవీత్." ౧

శ్రీభగవానువాచ:—

"శుచిర్భూత్వా మహాబాహో సంగ్రామాభిముఖస్థ్సితః,
పరాజయాయ శత్రూణాం దుర్గాస్తోత్రముదీరయ. ౨
ఏవముక్తోఽర్జునస్సంఖ్యే వాసుదేవేన ధీమతా,
అవతీర్య రథాత్పార్థః స్తోత్రమాహ కృతాంజలిః." 3

అర్జునః:—

"నమస్తే సిద్ధసేనాని ఆర్యే మందారవాసిని,
కుమారి కాళి కాపాలి కపిలే కృష్ణపింగళే. ౪

*   *   *   *   *

త్వం బ్రహ్మవిద్యా విద్యానాం మహానిద్రా చ దేహినాం,
స్కందమాతర్భగవతి దుర్గే కాంతారవాసిని. ౧౦

తతః పార్థస్య విజ్ఞాయ భక్తిం మానవవత్సలా,
అంతరిక్షగతోవాచ గోవిందస్యాగ్రతస్థితా." ౧౭

శ్రీ దేవీ:—

స్వల్పేనైవ తు కాలేన శత్రూన్ జేష్యసి పాండవ,
నరస్త్వమసి దుర్ధర్ష నారాయణసహాయవాన్." ౧౮

(భీష్మపర్వము ౨౩ అధ్యా.)

అనునీస్తోత్రము కలదు. శ్రీకృష్ణమూర్తియర్జునునకు నుపదేశించిన దీస్తోత్రము. తాను రథమున నుండినపుడు దుర్గాస్తోత్రము నేల చేయవలయునని యర్జునునకుబోధించెను? త్రిమూర్తులు దుర్గమస్థలములంబర దేవినిస్తుతించువారు. ఏల? త్రిమూర్తులకుంగూడ జననికదా. ఈమాట విన్నయంతన యులికిపడరాదు. ప్రకృతి పురుషులకుం దరువాతివారే త్రిమూర్తు లనకతప్పదు. కావున శ్రీకృష్ణుండు దుర్గను వినుతింపుమన్నంతన దిక్కులు చూడ నక్కఱలేదు. దుర్గయనంగాం బార్వతి కాదు. పరాత్పరుని యిచ్ఛాశక్తి. ఇట్లు గ్రహించిన నేమతభేదము లుండవు. శ్రీవైష్ణవసిద్ధాంతముకూడం బ్రకృతిమూలముననే భగవంతుండు వరములొసంగుననియే కదా. వారు మహాలక్ష్మియందురు. ఏ నామమునం బిలిచిన నేమి? శ్రీకృష్ణమూర్తి మాత్రము దుర్గాంబను వినుతింపుమన్న వాక్యము సత్యము.

ఈ ప్రమాణములంబట్టి మనమాఁలోచించిన నేయే కాలమున నేయే స్తుతులు చేయవలయునో యారీతిగా స్తుతించినఁ గార్యసిద్ధియగుననియు, దుర్గాదినామము లనేకములామహా ప్రకృతికింగలవనియు, శైవవైష్ణవాదిభేదములెల్ల మానవులకర్మానుసారము కల్పింపఁబడినవనియు, నేమతమునకుఁ జేరినవాఁడైనను దమ గురూపదేశమునను సరించి యే నామమున వినుతించినను బరదైవ మానందించుననియు, భగవంతునకు మతములలోఁ గొన్నింటియందే యభిమానము లేదనియు, సర్వమతము లా పరాత్పరుని నెఱుంగుటకే కల్పింపఁబడినవనియు, మార్గభేదమే కాని గమ్యస్థలమొక్కఁడేయనియు, మన మవివేకమున నితర మతముల దూషించి పాపము సంపాదించుకొనరాదనియు, భక్తిభావమునఁ బరాత్పరు నారాధింపఁదగుననియు, స్త్రీపుంలింగాదులు కల్పితములనియుఁ దేలెడిని. కావున విష్ణువు ప్రకృతి నాశ్రయించెనన్నంతన భయపడనక్కఱ లేదు. ఇంకఁ దరువాతి కథ నాలకింపుఁడు.

దితి తపస్సునకుఁ బూనుట.

* అంత దితి తనతనయులందఱు మృతినొంద మిగుల శోకించి మరీచికుమారుఁడగు కాశ్యపుని దనప్రాణేశ్వరుని గాంచి "మహామునివర్యా! బలవంతులగు నీతనయులచే నాతనయులందఱు హతులైరి. కనుక నేను దనయునింబడయంగోరుదు. దీర్ఘకాలతపశ్శక్తిచేత బలశాలియై యింద్రునిం జంపఁజాలువాఁడుగా నాకొడుకుండవలయును. సంతానహీనురాలగు నేను దపస్సు సల్పెదను. నాయభీష్టము తీఱఁ

*ఇది నలువదాఱవ సర్గమునుండి సంగ్రహింపఁబడినది.

త్రిలోకముల నేలఁజాలి శతమఖు నడంపఁజాలు తనయుని ప్రసాదింపుము. ఆకార్యమునకై తపమొనరింప సమ్మతింపుము.”
కాశ్యపమునియు నా మెపలుకు లాలకించి దుఃఖించుచున్న భార్య తో నిట్లనియె—“నీవు కోరినయట్లే యగుంగాక. నీకు శుభము కలుగుఁగాక. తపశ్శక్తి కలుగునంతదనుక శుచిగా నుండుము ఆదితిపుత్త్రోదయమగునంతవఱకు నుండందగు. ఆదితి చక్కఁగా సాగునేని నిం ద్రుంజంపఁజాలినకొడుకుం గాంతువు. ఆనియమము సహస్రవర్షములు సాగవలయును. అది నెఱవేఱెనా త్రిలోక రక్షకుఁడగు తనయుఁడు నాయనుగ్రహమునఁ గలుగు.” అని తెలిపి యాదీను రాలిని గరమునఁ దడవుచు నాశ్వాసించి యుదరము స్పృశించి భద్రమగుంగాత మని దీవించి తపస్సునకుఁ బోయెను.

పతి తపస్సునకుఁ బోవఁగా దితియు మిక్కిలి హర్షము నొంది విశాలాపురిపూర్వస్థానమగు కుశప్లవనమును జేరి ఘోర తపంబు చేసెను. ఇట్లామె తపమొనరించుచుండఁగా నింద్రుఁ డేతెంగి వినయాదిగుణము లుట్టిపడ నామెకడం జేరి శుశ్రూష చేయుచుండెను. అగ్నిని దర్భలను సమిధలను ఫలమూలము లను మఱియు నేది కోరిన దానిం దెచ్చియిచ్చుచుఁ, బాదసం వాహనము చేయుచు, వీవనఁ గొని విసరుచు, నింకను బెక్కు భంగులఁ బరిచర్యలు చేయుచు, సర్వకాలముల నేమఱక యుం డెను. ఆరీతిగా నియమమూనఁగాఁ బదియేండ్లు కొఱంతగా సహస్రాబ్దములు నిండెను. ఒకనాఁ డాదితి తనకత్యంతము శుశ్రూష చేయు నాయింద్రుంగాంచి మిక్కిలి ప్రీతయై నిర్జర నాథా! మీతండ్రియనుగ్రహమునొంది వేయివత్సరములు

నిండఁ గొడుకునుగాంచ వరముగొంటిని. అందులకై తపస్సు చేయుచున్నదానను వీరా! ఇంకఁ బదియేండ్లే కొదువగానున్నవి. నీకు శుభంబు గలుగు. ఆవత్సరములు పదియు నిండెనేని నీ సహజన్ముని జూడఁగలవు. వాఁడు నిన్ను జయింపఁజాలు. అయినను నీమేలుకోరి నేనాతని సమాధానపఱచి నీపై భ్రాతృస్నేహముగలవానినిగా నొనరింతును. నీవు నాతనయునింగూడి నంతనే యీమనశ్చింత లేక త్రిలోకములనుగెలిచి యావిజయసుఖంబనుభవింతును." అని యాతఁ డింద్రుఁడని యెంచక యతఁ డొనరించినసేవవలన నానందించి మఱచి వచించెను.

అంత నాదితి సూర్యుఁ డాకసంబున నడిమిభాగమున వెలుంగుచుండు పట్టపగటివేళ నిద్ర తన్నుఁ బరవశం గావింపఁ దలదెసఁ బాదంబు లునిచికొని శయనించెను. అది గాంచి యింద్రుఁ డిట్లశుచియై పాదములకడ శిరోరుహములు దలప్రక్కఁ బాదములు నునుచుకొని నిదురించుటంజూచి యీమె మిక్కిలి గర్వించినది. అని వింతనవ్వునవ్వుచు నపకారమొనరించునవకాశము దొరకెఁగదా యని సంతసించుచు యోని ద్వారమునఁ బ్రవేశించి నిర్భరధైర్యమూని యాగర్భము సప్త శకలములుగా ఛేదించెను. ఆరీతిగా శతకోటియగు వజ్రాయుధముచే గర్భమును ఛేదించుచుండఁగా నందున్నశిశువు హీతమగుస్వరమున నేడ్చెను. దాన దితియు మేల్కాంచెను. ఇంద్రుఁ డాశిశువు నేడువకు మేడువకుమని యూఱడించి వదలక యేడ్చుచున్నను వదలనియీసువలన దానిని దునియలు చేసె. దితియుఁ ద్రుంచినను జంపకుము చంపకుము అని హెచ్చరింపఁగా నింద్రుఁడు దోసిలొగ్గి దితితో "నమ్మా! నీవశుచివై

పాదములప్రక్కఁ దలవెండ్రుక లునుచుకొని నిద్రపోయితివి. కాన నేనవకాశము చూచి నన్నుఁ జంపనున్నయాశిశువును సప్తశకలములుగా ఖండించితిని. జననీ! ఈయపరాధము క్షమింపందగినది." అని ప్రార్థించెను.

సన్మతాభిమానులారా! ఈగాథ యెన్నియో సద్విష యముల మనకుఁ దెలుపుచున్నది. కాన విమర్శించి వానిని గ్రహించి యనుష్ఠానమునకుఁ దెచ్చుకొనవలయును. విమర్శించు నపుడు నిష్పక్షపాతమతులము గావలయు. అపుడే యథార్థము తేటపడును. లేనిచో నయథార్థము తోఁచును.

"సాహం తపశ్చరిష్యామి గర్భం మే దాతుమర్హసి,
ఈశ్వరం శక్రహంతారం త్వమనుజ్ఞాతుమర్హసి." 3

కాశ్యపముని రెండవభార్య దితి తనకొడుకులు సపత్నీపుత్త్రులగు దేవతలచే హతులుకాఁగా భర్తను సేవించి యింద్రునోంపఁ జాలుతనయుని బడయఁగోరి తపస్సు చేయ ననుజ్ఞ వేఁడెను. అను నదియే కథాసారము. ఇక్కథనుండి మనమేమినీతుల గ్రహింపఁ దగునని ముందు విచారింతము.

౧ స్త్రీలు తపస్సు చేయవచ్చునా అనునది యొకప్రశ్నము.

"నాస్తి స్త్రీణాం క్రియా మంత్రైరితి ధర్మే వ్యవస్థితిః,
నిరింద్రియా హ్యమంత్రాశ్చ స్త్రియోఽనృతమితి స్థితిః." ౧౮
(మను ౯ అధ్యా.)

అనుసామాన్యశాస్త్రము ననుసరించి వేదోక్త కర్మాచరణాధి కారము స్త్రీలకు లేదని కనఁబడియెడిని.

"తూష్ణీమేతాః క్రియాస్త్రీణాం వివాహాస్తు సమంత్రకః." ౧3
(యాజ్ఞ. ఆచారకాండము.)

"ఏతా జాతకర్మాదికాః క్రియాః స్త్రీణాం విష్ణైవ మంత్రైర్యథాకాలం కార్యాః. వివాహః పునస్సమంత్రకః కార్యః." విజ్ఞానేశ్వరపండితుఁడు.

జాతకర్మ నామకరణాదిక్రియలన్నియు మంత్రరహితము లుగాఁ జేయవలయుననియు, వివాహముమాత్రము సమంత్రకముగాఁ జేయవలయును. ఇదియు సామాన్యశాస్త్రమే.

"అపత్యం ధర్మకార్యాణి శుశ్రూషారతిరుత్తమా,
దారాధీనస్తథా స్వర్గః పితౄణామాత్మనశ్చ హ." ౨౮
(మను. ౯ అధ్యా.)

"ధర్మకార్యాణ్యగ్నిహోత్రాదీని." కుల్లూకభట్టు.

ఇది విశేషశాస్త్రము. అగ్నిహోత్రాదికములగు ధర్మకార్యములు భార్యాధీనములని భావము. మంత్రము లుచ్చరింపవచ్చునని యిందు ననుజ్ఞయిచ్చినట్లు స్పష్టముకాదు.

"మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః,
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాం గతిం." ౩౨
(గీత ౯ అధ్యా.)

అన్నగీతావాక్యము ననుసరించి భగవంతు నాశ్రయించుటకు స్త్రీలకు నధికారము కలదనుట స్పష్టము. తపస్సు వైదికకర్మ కలాపమునఁ జేరునా యన్నచోఁ జేర దనవలసివచ్చును. తపస్సు ధ్యానప్రధానము. ధ్యానము మంత్రోపాసనాద్యాధారము.

"వ్రతధారణం దేవకార్యం స్నానమనుజ్ఞాతయా కార్యమితి."
(హారీతస్మృతి.)

వ్రతములు దేవకార్యము స్నానము భర్తయనుమతి నొంది చేయవలయును.

"స్త్రియశ్శూద్రాదయశ్చాపి బోధయేయుర్హితాహితం,
యథార్హం మాననీయాశ్చ నార్హంత్యాచార్యతాం క్వచిత్."

(జ్ఞానార్ణవము.)

"శూద్రాణాం చ తథా స్త్రీణాం గురుత్వం న కదాచన."

(సూతసంహిత.)

"ప్రణవేన వినా మంత్రః స్త్రీశూద్రాణాం ప్రసాధకః,
ప్రణవేన సమాయుక్తస్తయోర్దేవి విషోపమః."

(కులార్ణవము.)

"ఆజ్ఞస్త్రీన్యోపదేశం తు యో గృహ్ణాతి దదాతి చ,
భుజ్యేతే తావుభౌ ఘోరాన్నరకానేకవింశతిం."

(పురశ్చరణదీపిక.)

అను నీప్రమాణములంబట్టి యోజింపఁగా స్త్రీల కుపాసనము విధివిహితమైనది. వారినుండి మంత్రోపదేశము గైకొనరాదని మాత్రము తేటపడియెడు. తపస్సు దేవకార్యాంతర్భూతము. మంత్రోపాసనము స్త్రీపురుషులకు సమానము. హారీతస్మృత్యుక్త ప్రకారము పతియనుమతి నొంది తపశ్చరణమునకుఁ బూనవలయునని స్పష్టమయ్యెడిని. రతి పతివ్రత గావునఁ బతియనుమతి వేఁడెను. అదియే ప్రాచీనాచారము. సదాచారమన్న నిదియే యగు. పతియానతి మీఱినచో నది నిష్ఫలమనియే భావము. స్వాతంత్ర్యము స్త్రీలకు లేదన్న స్మృతివాక్యము నుల్లంఘించినచో మంత్రములఫలముగూడ ననర్థావహమే యగునని మన మెఱుంగవలయు.

"ఏవం భవతు భద్రం తే శుచిర్భవ తపోధనే,
జనయిష్యసి పుత్రం త్వం శక్రహంతారమాహవే.

> పూర్ణే వర్షసహస్రే తు శుచిర్యది భవిష్యసి,
> పుత్రం త్రైలోక్యభర్తారం మత్తస్త్వం జనయిష్యసి. ౬
> ఏవముక్త్వా మహాతేజాః పాణినా సమమార్జ తాం,
> సమాలభ్య తతస్స్వస్తీత్యుక్త్వా స తపసే యయౌ." ౭

అనుభాగము మనకేమి యుపదేశించునని పరికింతము. కాశ్యపుఁడు భార్యకోరికను దెలిసికొనియెను. తనకొడుకు శత్రునిషూదనుఁడు కావలయునని దితికోరుట న్యాయమే. లోకసామాన్యదృష్టిం బరికింపఁగ నిది యధర్మమని తోఁపదు. కాని యాకాశ్యపుఁడు తొలిభార్యకొడుకు నని నొంపఁగలవానిని రెండవభార్యకోరుట కేవగించెను. ఐనను దివ్యజ్ఞానముకలవాఁడు కావున నామె వాంఛితముదీర్పుట భర్తయగు తనకు ధర్మమగుట నంగీకరించెను.

> "స్వాం ప్రసూతిం చరిత్రం చ కులమాత్మానమేవ చ,
> స్వం చ ధర్మం ప్రయత్నేన జాయాం రక్షన్ హి రక్షతి. ౭
> అర్థస్య సంగ్రహే చైనాం వ్యయే చైవ నియోజయేత్,
> శౌచే ధర్మేఽన్నపంక్త్యాం చ పారిణాహ్యస్య వేక్షణే. ౧౧
> అరక్షితే గృహేరుద్ధాః పురుషైరాప్తకారిభిః,
> ఆత్మానమాత్మనా యాస్తు రక్షేయుస్తాస్సురక్షితాః." ౧౨
>
> (మను ౯ అ.)

అన్నమనుస్మృతి ననుసరించి భార్య నలరింపఁజేయుట తనకు విధియని యెఱింగినవాఁడు కావున నామెకుఁ బుత్రదానము చేయ నంగీకరించెను. కాని "శక్రహంతారమ్" అనువాక్యమామునికి ఘోరముగా నుండెను కావున దుస్తరనియమము నొకదానిం జెప్పెను. వేయిసంవత్సరములు పరిశుద్ధాంతఃకరణవై

నియమము ననుసరించినయెడల నీకోరినయట్లే కుమారుఁడు కలుగుననియు నతఁడు త్రిలోకాధిపతియగుననియుఁ బలికెను.

"అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా,
సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధిస్సా పార్థ తామసీ." 3౨
(గీత. ౧౮ అధ్యా.)

అన్న భగవదుక్తిప్రకార మామెబుద్ధి తామసి యని యెఱింగినవాఁడు కావున నాబుద్ధిని మార్పనెంచి దుస్తరవ్రతము నుపదేశించెను. మహాతేజుఁడు కావున రాఁగలకష్టము నూహించి యీమె కషాయము కలుగకయుండుఁగావుతమని కుక్షిని గరతలమున స్పృశించి "స్వస్తి" అని దీవించెను. అనఁగాఁ దన పనిని విధివిహితముగా నెఱవేర్చెను. స్మృత్యుక్తప్రకారము పతియనుమతినొసంగెననియు, ననుమతిలేక స్త్రీలు తపఃప్రభృతి నియమముల నాచరింపరాదనియు, నాచరించిన నవి దుష్ఫలముల నొసంగుననియు మన మెఱుంగవలయు. విశేష మిందుఁ గల దేది? అని ప్రశ్నించుకొందము.

మానవుఁడు ధర్మార్థకామమోక్షములను చతుర్విధపురుషార్థములను గోరవచ్చును. పరహింసాపూర్వకమగు వాంఛను బూనరాదు. అయ్యది ఫలించినట్లే తోఁచి చెడును. కావున నెవ్వాఁడుకాని పరహింసను గోరియే తపస్సుచేయరాదు. దాన దైవానుగ్రహము కలుఁగదు. పట్టుదలతోడఁ దపస్సుచేసినను దుద కది విఘ్నవిహన్యమానమై వేఱువిధముగా ఫలించుననియు మన మెఱుంగవలయును. ఆభిచారికములగు హోమములు, ధ్యానములు భగవంతునకు నిష్టములు కావనియు,

"సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః,

మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయం." ౧౬. అ ౧౮.

అన్న భగవదుక్తిని నమ్మి ఫలమునుగోరని సత్కర్మమునే యాచరించిన నాపరమేశ్వరుఁడు సంతుష్టుఁడగుననియు, నల్పఫలములను గోరి భగవత్కళ కొలఁదిగఁగల దేవతల నర్థించిన వారలొసంగుఫలము లల్పకాలము సుఖదాయకములుగానుండి తుదకు విపరీతఫలముల నొసంగుననియు, నీభాగమునుండి మనము నేర్చుకొనవలయును.

"సహస్రాక్షో నరశ్రేష్ఠ పరయా గుణసంపదా,
అగ్నిం కుశాన్ కాష్ఠమపః ఫలం మూలం తథైవ చ,
న్యవేదయత్సహస్రాక్షో యచ్చాన్యదపి కాంక్షితి. ౧౦
గాత్రసంవహనైశ్చైవ శ్రమాపనయనైస్తథా,
శక్రస్సర్వేషు కాలేషు దితిం పరిచచార హ." ౧౧

అను నీభాగమునుండి దితితప స్సెట్టిదో తెలిసికొనవచ్చును. మంత్రోపాసనమున కంగములు నాలుగు. హోమతర్పణ మార్జన విప్రసంతృప్తులనునవి. జపముతో నైదంగములయ్యెను. కొంత కాలముజపము చేసి దానికిందగినంత హోమము చేసి తర్పణమార్జనము లొనరించి ఫలమూలములచే భూతతృప్తి చేయుచుండెను. ఈరీతిఁ బ్రతిదినము చేయుచుండెనని మన మెఱుంగవలయు. ఉపాసనమునందు యోగాభ్యాసము ముఖ్యము. దానిచేఁ గాని చిత్తము స్థిరతం గాంచదు. దానిచేతఁగాని దేవతారూపమును ధ్యానింప నవకాశము దొరకదు. ఇట్లే ధ్యానించుచుఁ జిరకాలము నిలువ వలనుపడదు. కావుననే హోమాదులను విధించిరి. ఆదీక్షాకాలమున నేదో యొకసత్కార్యమునఁ గాలము పుచ్చవలయుననియుఁ, దాఁజేయు ప్రతికార్య మాదేవతా

ప్రీతికరముగా నుండవలయుననియు శాస్త్రాభిప్రాయము. ఇది యాకర్షణప్రయోగము. అభీష్టదేవతారూపము. ధ్యానపాశముల నాకర్షింపవలయు ఈజపము దృఢభక్తిమూలకమగు నేని తప్పక యాదేవత నాకర్షించును సంకల్పము దుష్టమగు నేని యాదేవత వానినే హింసించును. అనఁగా నతనిదుష్కర్మమా దేవతారూపమున వానికి దుష్ఫలముల నొసఁగును. దుష్కర్మరతులకే దుస్సంకల్పములు గలుగును

దితివాంఛ క్రూరమైనది. ఇంద్రునకు స్థానచ్యుతి యెప్పుడు కలుగునట్లు లేదు. దితితపస్సు దృఢభక్తిమూలమైనది. కావున నీమె కర్మ మాశతమఖునిం బ్రోత్సహించి పరిచర్య చేయునూహ కలిగించెను. కావునఁ గర్మగతి దురవగాహమని తెలిసికొని "గహనా కర్మణో గతిః" అన్నగీతావాక్యము మది నిల్పుకొనవలయును. ఏకాలమునందుఁగాని దుస్సంకల్పము ఫలప్రదముకాదనియు, దానివలనిఫలము తన్నే బాధించుననియు నెఱింగి, దుస్సంకల్పముల మాని భగవదర్పణము చేయ నూహించి, సత్కర్మపరాయణులము కావలయును. ఈకథ యీ విశేష విషయములను మనకు బోధించుచున్నది.

"ఏవముక్త్వా దితిశ్శక్రం ప్రాప్తే మధ్యం దివాకరే,
నిద్రయాఽపహృతా దేవీ పాణౌ కృత్వాథ శీర్షతః. ౧౬
దృష్ట్వా తామశుచిం శక్రః పాదతః కృతమూర్ధజాం,
శిరస్స్థానే కృతౌ పాదౌ జహాస చ ముమోద చ. ౧౭
తస్యాశ్శరీరవివరం వివేశ చ పురందరః,
గర్భం చ సప్తధా రామ బిభేద పరమాత్మవాన్." ౧౮

అను నీభాగమున నేర్పఱుపఁదగినవిషయము గలదు. సాధా

రణాచారము ననుసరించి యోజించినను బగటినిద్ర పనికిరా దని వైద్యశాస్త్రము తెలుపుచున్నది. దితి ఘోరదీక్షఁ బూని నది. దీక్షాకాలమునఁ బగటినిద్ర మంచిదిగాదు. మధ్యాహ్న కాలమున నామెను నిద్ర తనకు లోఁబడునట్లుచేసెను. తపో విఘ్నమునకు సమయమువచ్చెనని యర్థము. తొమ్మిదివందల తొంబదిసంవత్సరములు దీక్ష చక్కఁగా జరపిన యాలేమ నాఁడు గర్వించి తనపట్టినవ్రతమును దెలిసి కొడుకు గలుగునని బోధించి యసమయమున నిద్రింపనేల? దుష్కర్మఫలమనుభవ మునకు వచ్చెనని యర్థము.

> "భోగైశ్వర్యప్రసక్తానాం తయాపహృతచేతసాం,
> వ్యవసాయాత్మికా బుద్ధిస్సమాధౌ న విధీయతే." ४४
>
> (గీత ౨ అధ్యా.)

అన్న భగవదనుశాసనము ననుసరించి యామె బుద్ధి చలించెనని సారము. ఏలయనఁగా సంకల్పములు దుష్టములై మనస్సు నపరిశుద్ధముగాఁ జేయును. కావున వారికి సమాధి కుదరదని భావము. అందులకే

> "కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన,
> మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి. ४७
> యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ."

అని శ్రీకృష్ణపరమాత్మ యుపదేశించెను. అట్లుగానిచో నా కర్మము ఫలవంతముకాదని భావము.

దితి పగటివేళ దీక్షను బాటింపక నిదురించుటయేగాక పాదములకడ శిరస్సునిచి శయనించెను. అనఁగా యుక్తమేది

యయుక్తమేది యని యాలోచింపక రాఁగల దుష్ఫలము నెఱుంగక సంకల్పము నెఱవేఱు నన్నయహంకారము గలది యయ్యెనని భావము. దానిచే

"అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః
మామాత్మపరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః. ౧౮
తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్,
క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు." (గీత ౧౬ అధ్యా)

అను నీశ్రీకృష్ణోక్తిప్రకార మాయహంకారమునకు ఫల మనుభవింపవలసినదయ్యెను. ఈకారణముచే మానవు లెవ్వారుగాని యెట్టినియమముగలవారలైన ననహంకారులై సర్వాంతర్యామియగు పరాత్పరుని దయనుమాత్రము కోరి యారాధించుచో నాదేవదేవునిదయకుఁ బాత్రులగుదురనియు, లేకున్న నయ్యవి గగనకుసుమమే యగుననియుఁ దెలిసికొనవలయు. తర్వాతి యింద్రునిచర్యనుండి యెఱుంగఁదగినవిషయము భక్తులకు సమ్మతముగాదు. స్వకార్యైకనిరతులగువారిప్రవృత్తి యితరులకు దృష్టాంతము కానేరదు. పరార్థైకనిరతుల ప్రవర్తనమే యెల్లరకు నుదాహరణభూత మగునని నిశ్చయించుకొనవలయును.

## సప్తమరుత్తులచరిత్రము.

*ఇంద్రుఁ డారీతి గర్భము నేడుతునియలుగా ఛేదింప దితి పట్టరానిదుఃఖమునఁ దపించెను. ఇంద్రుఁడు సమయము నెఱింగి తనపని నెఱవేర్చుకొనియెననియుఁ దలంచి, వాని కప

*ఇది నలువదియేడవ సర్గమునుండి కైకొనఁబడినది.

కారము చేయరాదనియుఁ దలంచెను. అంతఁ దనకర్మ మిట్టి దియే యని నిశ్చయించుకొని యాఅటఁజెంది యింద్రునిఁ గాంచి "బలసూదనా! నాయపరాధముననే యీ నాగర్భము సప్తవిధములుగా ఛేదింపఁబడి నిష్ఫలమయ్యెను. ఇవ్విషయ మున నీయపరాధమే లేదని తలంచితిని. ఈగర్భము చెడినను దీని కొకయుపకారము నీవు చేయవలయునని కోరెదను. ఈ శకలము లేడును సప్తమారుతములను బాలించుగాక. ఈశక లము లేడును నాకుమారులై వాయుస్కంధాధిదేవత లనఁ బరఁగి దివ్యరూపముల ధరించి దివి విహరింతురుగాక. వీరు వర్తింపఁదగుస్థానములను వారిస్థానపాలనరీతి నెఱింగించెద వినుము.

ఒక్కఁడిందు బ్రహ్మలోకమునందు, మఱియొకఁ డింద్ర లోకమునను జరింతురుగాక. మూఁడవకుమారుఁడు విఖ్యాత యశుండై వాయునామమున నంతరిక్షసంచారమున నుండుఁ గాక. తక్కినవారు నల్వురును నీయానతిం దాల్చి దేవత్వము నొంది వారితో నీవు "మారుదః మారుదః" అని పలికితివి. కావున మారుతు లనుపేరనొప్పి దిక్కులయందు సంచరింపఁ గలరు." అని తనభావము నెఱింగింప దితియాశయము విని దేవేంద్రుఁ డందులకు నొప్పుకొని "తల్లీ నీవు చెప్పినదంతయు నంగీకరింతు. అట్లే యగును. సంశయ మించుకంతయు లేదు. నీకుమారు లేడుగురు దేవత్వమున సంచరింతురు. నీకు మేలగుం గాక." అని వినయమునఁ బలికెను.

శ్రీరామచంద్రా! తల్లియగుదితియు, నింద్రుఁడు నీరీ తిగాఁ దపోవనంబున నిశ్చయించుకొని, స్వర్గమునకుఁ గృత

కృత్యులై పోయిరని వినియున్నాము. మున్ను దేవేంద్రుఁ డిం
దుండి దితికిఁ బరిచర్య చేసెనో యాయాశ్రమం బిదియే. అదియే
యీకాలమున విశాలయను పేరఁ బురియైనది. ఇఁక నేరాజవంశ
మీపురిఁ బాలించునో యెఱింగించెదను.ఇక్ష్వాకునకు నలంబుస
పత్నియయ్యెను ఆమె మిక్కిలి ధర్మాత్ముని విశాలనామకుని గొడు
కుంగాంచెను. ఆతఁడే యీపురమును నిర్మించి యేలెను.విశాలు
నకు హేమచంద్రుఁడును, వానికి సుచంద్రుఁడును, వానికిధూ
మ్రాశ్వుఁడును, ఆతనికి సృంజయుండును, వానికి సహదేవుఁడు,
నాతనికిఁ గుశాశ్వుండును,వానికి సోమదత్తుండును, వానికిఁగాకు
త్స్థుండు,నామహానీయునకు సుమతియుఁ గొడుకులైరి. ఆసుమతి
మహానీయుఁడు పరాక్రమశాలియు నై యిపు డీనగరమును
బాలించుచు నిందే నివసించి యున్నవాఁడు ఇక్ష్వాకువంశమునం
బుట్టినవా రీకొందఱేనా యని సంశయింపవలదు ఇక్ష్వాకుమహా
రాజునను గ్రహమున విశాలాపురాధి నేతలగు రాజులు దీర్ఘాయు
ర్వీర్య ధైర్యములుగలిగి ధార్మికులై యుందురు శ్రీరామచంద్రా!
మనమీరాత్రి యిందే నివసింతము. సుఖనిద్ర చేయుదము.
రేపుదయము జనకుం గానఁబోవుద"మని పలికెను.మహర్షి సమే
తుఁడై రామలక్ష్మణులంగూడి కౌశికుఁడువచ్చుట మహాతేజో
విరాజితుఁడగు నాసుమతి విని ఋత్విగ్బంధుయుతుఁడై యెదురు
వచ్చి యమ్మహర్షిని బూజించి దోసిలొగ్గి కుశలప్రశ్న మొనరించి
తమరాకచే ధన్యుఁడనైతిని. మీయనుగ్రహపాత్రుఁడ నైతిని.
మత్సమానుఁడు కలఁడే యనియెను.

## అహల్యాచరిత్రము.

*కుశలప్రశ్నానంతర మాసుమతి గాధినందనుం గాంచి "మునిచంద్రా! మీకు భద్రములగుంగాక. ఈకుమారు లిరువు రెవ్వరు? ఆకృతిం బరికింప శ్రీమహావిష్ణువుంబోలి పరాక్రమవంతులని తోఁచెడిని గాంభీర్యధైర్యాదులు వీరియందచ్చెరువుగఁ జూపట్టుచున్నవి. వీరినేత్రములు విశాలములు. లావణ్యాస్థానములు. ధనుర్బాణతూణీరములఁ దాల్చియున్నారు. అశ్వీదేవతలంబోని రూపమును దాని కనురూపముగ నూత్నయౌవనము గన్పట్టుచుండ దేవలోకమునుండి స్వేచ్ఛగా భూమిం దిరుగవచ్చినయమరులోయనఁనొప్పుచున్నవారు. మృదుతమములగుపదములు కందుచుండఁగా నీకఱకునేల యేరీతి నడచి వీరు రాఁగల్గిరి? వీరిం జూచినంతనే పరిపూర్ణమనోరథులనుట తెల్లమయ్యెడిని. అట్టి వీరమికోరి యెవ్వనికొఱకిట వచ్చిరి? సర్వజ్ఞులరు గావున మీరు తెలియఁగలరు కావున వచింపుము ఆకాశమును జంద్రసూర్యులు విలసిల్లఁజేయునట్టులు వీరు దేశమును వీని నలంకరించుచున్నవారు వీరివృత్తాంతమును వినఁగోరెద"నని ప్రార్థించెను.

సుమతిప్రశ్నము విని ముని ముదమంది తమరు సిద్ధాశ్రమముచేరుటయు, నందు యజ్ఞధ్వంసకులగురక్కసుల వారు చెండాడుటయు, జనకునియజ్ఞమును జూడ మిథిలకుఁ బోవుటయు, లోనగువృత్తాంతమును జరిగినది నరిగినట్లు వినిపించెను. ఆభూపతిలలామంబుఁ డాలకించి పరమామోదమంది తనయదృష్టమున లభించిన యాయతిథుల శ్రీరామలక్ష్మణుల మిక్కిలి

*ఇది నలువదెనిమిదవ సర్గమునుండి సంగ్రహీతము.

సత్కారార్హులని తలంచి యథాన్యాయముగాఁ బూజించెను. ఆసోదరు లాతనివలన సత్కారములంబడసి యం దారాత్రి నివసించి తెల్లవాఱుజామున మహర్షులంగూడి మిథిలకుం బోయిరి. మార్గమునఁ బోవుచు నామహాను లెల్లరు దూరమునుండి యామిథిలానగరమును దిలకించి సాధువాక్కుల దానిం బొగడిరి.

శ్రీరామచంద్రుఁ డామిథిలానగరమునకు దాపుననున్న యొకవనమును బరికించి యందుఁ బురాతనమై మానవులుగాని పర్ణశాలగాని లేక మనోహరముగాఁ గనఁబడుచున్న యాశ్రమము నొకదానిం గాంచి విశ్వామిత్రునితో "మునీంద్రా! సంపద్భాసురంబగు నీయది యొకయాశ్రమముగాఁ గనఁబడుచున్నది. కాని యిందు మును లెవ్వరు గానరారు. ఏల? మును పిది యెవ్వరియాశ్రమముగా నుండెనో వినఁగోరెదను." అని ప్రశ్నింపఁగా వాక్యవిశారదుఁడగు నామహాని యహల్యాశాపముక్తికిఁ గాలము చెంత కరుదెంచెనన్న యుబ్బునఁ దేజంబు వెలుంగఁగా నచ్చెరువందుచు "శ్రీరామభద్రా! ఈయాశ్రమ మెవ్వనిదో ఎవ్వానికోపమున శాపమునొందెనో ఆమునియున్న తావును దెలిపెదను.

మహాత్ముఁడగు గౌతమముని సుప్రసిద్ధుఁడుకదా. ఆముని దే యీయాశ్రమము. ఇది మిక్కిలి దివ్యముగా నుండునది. కనుకనే దేవతలును దీని సన్మానించుచుండిరి. మహాయశమున వెలయు నాగౌతమముని యహల్య యనుపేరుగల ధర్మపత్నిం గూడి యనేకసంవత్సరము లిందుఁ దపమ్ము సేయుచుండెను. దేవేంద్రుఁడు గౌతముఁ డిందు లేని యదనెఱింగి గౌతముని

యాకృతింగొనివచ్చి యహల్యతో 'నోభామినీ! భోగము నభిల షించువారు కామమున స్వేచ్ఛగా విహరింతురుగాని ఋతు కాలమునకై వేచియుండరు. సృష్టికర్త యెంతయు నింపుగా నిన్ను నిర్మించెను. ఇట్టి యన్నులమిన్నవని యెన్నికం గాంచిన నిన్నుం గాంచి యెవ్వాఁ డోర్వఁజాలును. ఓతనుమధ్యా! నీయందముంగాంచి తమినిలుపఁజాలక రతిక్రీడఁగోరి వచ్చి యున్నవాఁడను. పుత్త్రుఁడు నీవలన గలుగంగోరను. అందులకై ఋతుకాలము ప్రతీక్షింప నక్కఱ లేదుకదా.'

ఆమాటలు విని యహల్యయుఁ దనలో నాపతి యెప్పుడు గాని యిట్లు నన్నడుగఁడు. మఱియొకఁ డియ్యాశ్రమమునకు రాఁజాలఁడు ఇంద్రుఁడు చిరకాలమునుండి నన్నుఁ గాంక్షించు చుండునట్లు వినుచున్నదానను. కావున నీతఁ డాశతమఖుఁడే కాఁదగును అని యెఱింగియు నాలేమ కామనిశాతసాయకపరి పీడితస్వాంతయై మతిచెడి యందుల కంగీకరించి యాతనితోఁ గలయిక సలిపి కోరికఫలింపఁగా మనస్సు దుందుడుకునొంద 'నోప్రభూ! నిర్జరేంద్రా! నేను సఫలమనోరథనైతిని. నీవిందు మసలంజనదు. వేవేగ యరుగుము దేవతాధీశుఁడవు. మాన ప్రదుఁడవు. కాన నెవ్వ రెఱుంగకుండ నీవిందుండక పొమ్ము. నిన్ను నన్ను సర్వదా కాపాడుకొనందగు'నని హితము చెప్పెను.

ఆయింతియుచితవచనవితతుల కింద్రుఁడు నవ్వుచు నహల్యం గనిన 'సుందరీ! నే నత్యంతసంతుష్టుఁడనైతిని. ఇఁక నిందు క్షణమైన నిలువను. వచ్చినయట్లే పోయెదను.'అని సమ్మతిం గాంచ మాటలాడి యామెతోఁ గ్రీడించినది తలంచుకొనుచు

గౌతమమునివచ్చునేమో యను సందేహమువలన భయమ్మపు డంకురింపఁగాఁ దడఁబడుచు నాపర్ణశాలదాఁటెను. ఆతఁ డిట్లు వెడలుడు గౌతమముని తీర్థోదకముల మజ్జనకార్యము తీర్చి హుతవహునిభంగి వెలుంగుచు దర్భలు సమిధలు గ్రహించి యాశ్రమముఁజొచ్చెను. రామచంద్రా! ఆముని తపోమహత్త్వమున దేవదానవులకైనం దేరిచూడందగనివాఁడు తపోనిధి. అట్టిముని యాశ్రమమునఁ బ్రవేశించుచుండఁగాఁ గని యింద్రుఁడు తనువుకంపింప మొగము వెల్వెలవాఱఁగా నిలిచెను. మునియాకృతఁ దాల్చి యధర్మవృత్తికిం బూనిన యాయింద్రునిం దిలకించి సద్వృత్తిధనుండు కావున నాగౌతముఁడు రోషము మూర్తీభవించినట్లు హుంకరించి 'యోరి దురాత్మా! నారూపము దాల్చి దుష్కార్యము నొనరించితివి. కావున నీయండములు పడిపోవును గాక' అని శపించెను. ఆమహర్షినోటనుండి యాశాపవాక్యము వెడలినంతన యాతనియండములు భూమిఁ బడెను. అట్లు సురపతని శపించి యంతట నహల్యను శపింపఁ దలంచి 'యోయధర్మప్రవర్తకురాలా! నీవీదుష్కార్యమొనరించితివి. కావున నీయాశ్రమమునందే యనేకసహస్రసంవత్సరములు వాయువాహారముగా నన్నపానాదులు లేక తపించుచు బూడిదలోఁ దొర్లుచుండి ప్రాణిసంతతికిం గానరాక యుండుదువుగాక. ఏకాలమున దశరథకుమారుఁడు శ్రీరామభద్రుఁడు భయము గలిగించుచుఁ బాడుపడియుండు నీయాశ్రమమునకు నరుదెంచునో యపుడే యామహనీయుని పాదసరోరుహపరాగము సోఁకినంతన నీవు పరిశుద్ధురాల వయ్యెదవు. అంత లోభమోహములు నిన్ను వీడును. ఆపరమపూరుషుని నాతి

థేయముల సత్కరించి నామ్రోల సంతోషమున నీదేహమును మరల ధరింతువని పలికెను. ఇట్లు లాముని యాదుష్టచరితను శపించి యీయాశ్రమమును విడిచి సిద్ధచారణాదిసంసేవితమై పరమపావనమగు హిమవద్గిరిశిఖరమునందుఁ దానిచ్చినశాపము వలని తపోధనవ్యయప్రాయశ్చిత్తముగా మహాతపమొనరింపం బోయి తపము సలుపుచున్నవాఁడు.

మహామతులారా! ఈభాగమునఁ గొన్నివిశేషములు కలవు. మన మరయుదము.శక్తికనురూపముగాఁ దెలిసినవానిని బరిగ్రహింతము. విశాలాపురాధిపతి సుమతి రామలక్ష్మణులకుం గ్రొత్తవాఁడు. వినను వారింగాంచినంతన

"ఇమౌ కుమారౌ భద్రం తే దేవతుల్యపరాక్రమౌ. ౧

యదృచ్ఛయైవ గాం ప్రాప్తౌ దేవలోకాదివామరౌ,

కథం పద్భ్యామిహ ప్రాప్తౌ కిమర్థం కస్య వా మునే. ౪

భూషయంతావిమం దేశం చంద్రసూర్యావివాంబరం,

పరస్పరస్య సదృశౌ ప్రమాణేంగితచేష్టితైః." ౫

అని ప్రశ్నించెను. భగవద్దర్శనమున నూతనవిజ్ఞానము కలుగును. అదియే భగవద్దర్శనఫలము. కనుకనే యించుకవిజ్ఞానము వొడమెను. కాని భగవంతుఁడే యీమహాపురుషుఁడని కనుఁగొనఁజాలినసత్కర్మము పూర్వజన్మమునఁ జేసినకృతార్థుఁడు కాఁడు. కావుననే "దేవతుల్యపరాక్రమౌ" అని వినుతించెను. ఈయుపమానము భగవంతునియెడ నీచము కాదా. వారి యద్భుతతేజస్సు అతిమానుషము కాఁగా సామాన్యమానవులు కారని తలంచెను. కావున దేవలోకమునుండి వచ్చినయమరులాయని ప్రశ్నించెను. ఈప్రశ్నము న్యాయసమ్మతము.

"యస్మాదేషాం సురేంద్రాణాం మాత్రాభ్యో నిర్మితో నృపః,
తస్మాదభిభవత్యేష సర్వభూతాని తేజసా. ౪
తపత్యాదిత్యవచ్చైష చక్షూంషి చ మనాంసి చ,
న చైనం భువి శక్నోతి కశ్చిదప్యభివీక్షితుం. ౬
సోఽగ్నిర్భవతి వాయుశ్చ సోఽర్కస్సోమస్స ధర్మరాట్
స కుబేరస్స వరుణస్స మహేంద్రః ప్రభావతః. ౭
బాలోఽపి నావమంతవ్యో మనుష్య ఇతి భూమిపః,
మహతీ దేవతా హ్యేషా నరరూపేణ తిష్ఠతి." ౮

(మను. ౭ అధ్యా.)

అను మనుస్మృతి వాక్యముల ననుసరించిన రాజతేజమే యతి మానుషము. అట్టులుండ శ్రీమన్నారాయణమూర్తి రాజవంశమున నవతరించియుండఁ జెప్పవలసినదేమి?

"రూపమేవాస్య మహిమానం వ్యాచష్టే."

అని శ్రుతి చాటుచునేయున్నది. బుద్ధిమంతులు ముఖలావణ్యము చూడంగనే వ్యక్తి యెట్టిదని కనుఁగొందురు. ప్రాజ్ఞుఁడగుట సుమతి దేవతలుగాకయున్న నిట్టి రూపలావణ్య తేజస్సులు గలవారుగ నుందురా యని తలంచెను. చంద్రుఁడు సూర్యుఁడు నాకాశమును బ్రకాశింపఁజేసినట్టు లీకుమారు లిరువు రీదేశము నలంకరించుచున్నవా రనెను. అనఁగా వీరిరాకచే నీదేశము ధన్యమయ్యెనని భావము. ఈభాగమునుండి నేర్చుకొనఁదగు సదాచార మేమని తర్కింతము. సాత్త్వికాహారముంగొని సత్కర్మముల నాచరించుచు ఫలములను భగవంతున కర్పించుచు సంసారమున సంబంధించినట్లు నటించుచు నుండవలయు ననియు, నట్టివారికి సాధుబుద్ధి గలుగుటయేగాక మహాత్ముల

సంగతి గలుగుననియు, సజ్జనులసాంగత్య మఖిలోత్తమఫల ముల నొసంగుననియు, నింగితజ్ఞానము గలుగుటయే సత్కర్మ ములకు నిదర్శనమనియుఁ, గావున మానవు లుత్తమగతింబడ యంగోరువారట్టివిధములఁ బ్రవర్తింపవలయుననియు నెఱుంగ వలయును. సత్ప్రివర్తకులను వెదకుచు మహాత్ము లరుదెంతురు. ఆసత్కర్మములే వారిని బ్రోత్సహించి తోడితెచ్చును. వారిదర్శ నముకాఁగానే బుద్ధి వికసించును. అత్తఱి వారు మహనీయులు గాని సామాన్యులు కారని తోఁచును. అదియే పూర్వజన్మకృత సాధుకర్మములను దెలుపును. అట్టిలొట నుత్తమగతిం గోరు వారు సుమతి నుదాహరణముగాఁ గైకొనినచో విశ్వామిత్ర ముని భగవంతులగు రామచంద్రలక్ష్మణులం దోడుకొని సుమతి యింటికిఁ బోయినట్లు మనసత్కర్మములే సద్గురువులఁ బురికొలిపి వారియింటికిం దోడితెచ్చి వారిసహవాసము కలుగఁజేయు ననియు, గురువులను వెదకుచు నేదేశమునకో పోవనక్కఱలే దనియు నీభాగము మన కుపదేశించుచున్నది. మంచియాలో చనములు పరోపకారకర్మములు చేయువారికి దివ్యతేజస్సు వృద్ధియగుచుండును. అట్టివారిని జూడఁగనే పామరులు వింత పడుదురు. ఎందఱో కృతార్థు లగుదురు.అట్టివారు తమవార్తల దెలుపకయున్నను ముఖతేజస్సే యితరులకుం దెలుపుననియు, నట్టితేజస్సు దైవభక్తిమూలమునఁ గాని లభింపదనియు మన మెఱింగి యద్దానికిఁ బ్రయత్నింపవలయును. భక్తుఁడు ధ్యాన ముచేయునపుడు పరమేశ్వరుని నిర్మలతేజోరూపునిగా ధ్యానిం చినచో నాతేజము భక్తునియందుఁ దగినంత ప్రవేశించునని యోగమతము. యోగాభ్యాసము చేసి తత్సిద్ధిని గాంచినవార

లీవిషయము నెఱుంగుదురు. ఆతేజస్సును గాంచినపుడు క్రూర జంతువులు కూడఁ దమక్రౌర్యమును విడనాడి వారిచెంతనుండు నంతవరకు సౌమ్యస్వభావముగలవగును. కావునఁ బ్రతి మానవుఁ డుత్తమమార్గము నరయవలయును.

"పరస్పరస్య సదృశౌ ప్రమాణేంగిత చేష్టితైః."

శ్రీరామలక్ష్మణులు దేహప్రమాణమున నింగితమునఁ జేష్టలను సమానులనుట శ్రీమహావిష్ణువు నాలుగు భాగములుగా ధర నవతరించెననుభావమును దెలుపుచున్నది. లోకమున సమాన కర్మముల నొనరించి తత్ఫలములను సమానముగాఁ బొందు వారు లేరనుట నిశ్చితము కారణాంతరమున భగవంతుఁడు నాల్గురూపముల నవతరించెను. కావుననే సమానదేహప్రమాణేంగిత చేష్టితములు గలిగెను.

"అతిథీ పరమౌ ప్రాప్తౌ పుత్రౌ దశరథస్య తౌ. ౬
పూజయామాస విధివత్సత్కారార్హౌ మహాబలౌ."

అనునీభాగము మనకొక్కసదాచారమును బోధించుచున్నది.

"సంప్రాప్తాయ త్వతిథయే ప్రదద్యాదాసనోదకే,
అన్నం చైవ యథాశక్తి సత్కృత్య విధిపూర్వకం. ౯౯
శిలానప్యుంఛతో నిత్యం పంచాగ్నీనపి జుహ్వతః,
సర్వం సుకృతమాదత్తే బ్రాహ్మణోఽనర్చితో వసన్." ౧౦౦
(మను. 3 అధ్యా.)

(అతిథి యింటికి రాఁగా యథాశక్తి పూజింపవలయును. అతిథి నిరాశుఁడై తిరస్కృతుఁడై పోవుచు గృహస్థుపు చేసినసుకృతమునంతయు గ్రహించికొని పోవును.) మానవులకు నందును గృహస్థువుల కతిథిపూజ ముఖ్యము. అతిథిని నారాయణమూ

ర్తినిఁగా భావించి పూజింపవలయును. శక్తి కనురూపముగనే పూజ స్మృతులయందు విధింపఁబడినది కాని శక్తినతిక్రమించి పూజింపవలయునని విధింపలేదు. కావున నతిథిపూజ భగవత్పూజవంటిదే యగును.

"తృణాని భూమిరుదకం వాక్చతుర్థీ చ సూనృతా,
ఏతాన్యపి సతాం గేహే నోచ్ఛిద్యంతే కదాచన. ౧౦౧
న వై స్వయం తదశ్నీయాదతిథిం యన్న భోజయేత్,
ధన్యం యశస్యమాయుష్యం స్వర్గ్యం చాతిథిపూజనం." ౧౦౭
(మను 3 అధ్యా.)

అతిథిని భుజింపఁజేయక తా భుజింపరాదనియు, నతిథిపూజ సకలసత్ఫలముల నొసంగుననియు మనుస్మృతి బోధించుచున్నది.

"అతిథిత్వేన వర్ణానాం దేయం శక్త్యానుపూర్వశః,
అప్రణోద్యోఽతిథిస్సాయమపి వాగ్భూతృణోదకైః." ౧౦౭
(ఆచారకాండము.)

అను నీయాజ్ఞవల్క్యస్మృతియు నతిథిపూజ మంచిమాటలులోనగువానిచేఁ జేయవచ్చునని తెలుపుచున్నది. అతిథిపూజ మానుట భక్తునిలక్షణము కాదని మన మెఱుంగవలయును. భగవంతునిగా భావింపవలయునన్నమాట మఱువరాదు. అతిథి యనఁగా నొకరాత్రి యుండి పోవువాఁడు కాని కార్యాంతరములచే వచ్చియుండువాఁడు కాఁడు.

"ఏకరాత్రం తు నివసన్నతిథిర్బ్రాహ్మణస్స్మృతః,
అనిత్యం హి స్థితో యస్మాత్తస్మాదతిథిరుచ్యతే." ౧౦౨

అని మనుస్మృతి పైయర్థమును దృఢపఱచుచున్నది. కావున భగవత్పూజవంటిదే యతిథిపూజ యని తెలిసికొనవలయును. దీనిసారమేమి?

అతిథిని బూజించుట యశస్కర మాయుర్వర్ధనము ననుటచేఁ దాను బూజించువాఁడు మానవమాత్రుఁడు కాఁడనియు, భగవద్రూపుఁ డనియు భావించుటచే నాఫలములు గలుగును. ఇందు భావనయే ప్రధానము. బాహ్యపూజ ప్రధానము కాదు. మానసికధ్యానమే ప్రధానము. కాఁబట్టి సద్భావముకలిగి సత్కార్యము చేసిననే ఫలించును. భావన చక్కఁగ లేనిచో నాపూజ నల్పఫలప్రదమగును. అంతియ కాని శాస్త్రోక్తఫలము నీఁజాలదు.

"సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే,
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే." ౨౬

(గీత. ౧౭ అధ్యా.)

అనుగీతావాక్యము స్మరింపఁదగినది.

"అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్,
అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ." ౨౮

అను నీశ్రీకృష్ణోక్తి ననుసరించి శ్రద్ధగలిగియే సత్కార్యమును యథాశక్తి నొనరించిన నది యిహపరసుఖముల నిచ్చునని మనమెఱింగి యట్లు లొనర్పవలయునని మన కీభాగము తెలుపుచున్నది.

"ఋతుకాలం ప్రతీక్షంతే భార్థినస్సుసమాహితే. ౧౮
సంగమం త్వహమిచ్ఛామి త్వయా సహ సుమధ్యమే,

మునివేషం సహస్రాక్షం విజ్ఞాయ రఘునందన. ౧౯
మతిం చకార దుర్మేధా దేవరాజకుతూహలాత్."

అనునీభాగము ముఖ్యమగునాచారపరంపరను బోధించెడిని.

ఇంద్రుఁడు గౌతమవేషమూని యమ్ముని స్నానమునకరుగు వెటంగి యహల్యకడకు వచ్చి తనవాంఛను దెలుపుచు ఋతుకాలనియమము సుఖార్థులు పాటింపరు. కావున నిప్పుడే నేను నీసంగతం గోరుదునని పలికెను. ఋతుదినములు పదాఱు. అవి దాఁటినపిదప భార్యం గూడుట సదాచారము కాదు. ఆవిషయము ప్రధానము . కాదనియు, సుఖైకపరాయణు లద్దానిం బాటింపరనియు, నింద్రుఁ డాతురుఁడు కానఁ దెలిపెను. అహల్య సంశయమునొందునేమో యని తానే సంశయించెను. ధర్మోపదేశము చేసెనని విషయైకసారము.

"ఋతు స్స్వాభావిక స్త్రీణాం రాత్రయష్షోడశస్మృతాః,
చతుర్భిరితరై స్సార్ధమహోభిస్సద్విగర్హితైః. ౪౬
తాసామాద్యాశ్చతస్రస్తు నిందితైకాదశీ చ యా,
త్రయోదశీ చ శేషాస్తు ప్రశస్తా దశరాత్రయః. ౪౭
యుగ్మాసు పుత్రా జాయంతే స్త్రియోఽయుగ్మాసు రాత్రిషు,
తస్మాద్యుగ్మాసు పుత్రార్థీ సంవిశేదార్తవే స్త్రియమ్. ౪౮
పుమాన్ పుంసోఽధికే శుక్రే స్త్రీ భవత్యధికే స్త్రియాః,
సమేఽపుమాన్ పుంస్త్రియౌ వా క్షీణేఽల్పే చ విపర్యయః. ౪౯
నింద్యాస్వష్టాసు చాన్యాసు స్త్రియో రాత్రిషు వర్జయన్,
బ్రహ్మచార్యేవ భవతి యత్ర తత్రాశ్రమే వసన్." ౫౦

(మను. 3 అధ్యా.)

ఇతరస్మృతులు కూడ నీవిషయమున భిన్నమగునాశయ మును దెలుపవు. కాన వాని నుదహరింపక విషయసారమును వ్రాసెదను

ఋతుకాలనియమ మేల యని తొలుతఁ బ్రశ్నించు కొనినఁగాని సారమును బరికింపఁజాలము. ఇంద్రియనిగ్రహము ప్రధానమనుట సార్వజనీనము.

"తస్మాత్సర్వప్రయత్నేన శుక్రం రక్తం చ రక్షయేత్."

అని పూర్వులు మహర్షులే తెలిపిరి. బుద్ధిసూక్ష్మతలోనగు నవి శుక్రరక్షణమున నే కలుగును. మేధాశక్తి కాధార మిం ద్రియనిగ్రహము. యోగశాస్త్రమునఁ బ్రధాన మింద్రియ నిగ్రహమే. దానిని మించినతపస్సే లేదనుట సిద్ధాంతము. గృహ స్థులు సర్వదా బ్రహ్మచర్యమూనుటయు నశాస్త్రము. కావున బ్రహ్మచర్యమునకు భంగము రాకయుండ విషయసుఖము నెంపొందకయుండ నియమము చేయఁబడినది.

"ధర్మప్రజాసంపత్త్యర్థగ్ం స్త్రియముద్వహే."

అనుగృహ్యసూత్రము వివాహమువలని యుపయోగమును దెలుపుచున్నది. ధర్మకార్యము లొనరించుట సంతతింగాంచుట యను నీరెండును దారసంగ్రహణమునకు ఫలములు. ఈరెం డింటిలో సంతతియనునది విషయసుఖాధీనము సుఖానుభవ పూర్వకజితేంద్రియత్వ మసంభవము. సర్వాశ్రమములో గృహ స్థాశ్రమము మహోత్తమమని ప్రశంసించుట తక్కుంగల యాశ్రమత్రయమునకు గృహస్థువు మహోపకారి కాన నాతనికి సామాన్యవిశేషధర్మము లుండవలయునుఁ గదా. అందులకే యీనియమములు నిర్ణయింపఁబడినవి. ఋతుదిననిర్ణయము

ముఖ్యముగా నిందులకే యని మనమూహింపవలయును. ఋతు దినములుగాక తక్కినదినములలో భార్యసంగతి కూడదనుట విషయసుఖాభిలాషమును సంకుచితమొనరించుటకే. మాంస భక్షణము నాపందలంచి మహామునులు యజ్ఞశ్రాద్ధేతరకాల ముల నది పనికిరాదనిరి. అట్లే స్వేచ్ఛాగమనమును నిరో ధించిరి. ఋతురాత్రములు పదాఱు అందుఁ దొలినాలుగుదిన ములు పనికిరావు పదునొకండవ పదుమూఁడవదినములు నింద్య ములు. మిగిలినవి పదిరాత్రులు అందును సరిదినములగు నాఱు లోనగునవి కుమారోత్పత్తిగోరువారికి మంచివి. ఐదుమొద లగు బేసిరాత్రులు పుత్త్రికోత్పత్తి హేతువులు. ఈనియమ ముచే నాపదిరాత్రులయందును వాంఛననుసరించి యింకను దగ్గింపఁబడినది. స్త్రీప్రజంగోరువారు నాలుగునిశలందును, పురుష ప్రజనుగోరువా రాఱురాత్రులయందు దారసంగతినొందవల యునని శాసించుట విషయసుఖమును దగ్గించుటకు బ్రహ్మచర్య నిష్ఠను బెంపొందించుటకుం గాక మఱెందులకు? ఊర్ధ్వరేత స్కుఁడుగా నుండవలయునని నియమమేర్పఱచుట గృహస్థు లకు ధర్మవిరుద్ధముగావున విషయసుఖసంకోచము చేయఁ బడినది.

"వాయురూపా అదృశ్యాశ్చ ప్రవేక్ష్యామ స్తనూభృతః. ౪౧
ప్రవిష్టాశ్చ ప్రతివపుశ్శోషయామో రసాన్ బహూన్,
రసేషు శోషితేష్వేషు శుక్లం సంశోషయామహే. ౪౨
శుక్లాశ్రితాని తేజాంసి నాశం యాస్యంతి దేహినాం,
ప్రాణిత్వే సతి దేహిత్వం జీవిత్వం యస్య వర్తతే. ౪౩
తస్య దేహమనుప్రాప్య తద్రసాన్ భక్షయామహే,

భూమిం భూమిరుహాం త్సర్వాన్ జలజస్థలజానపి. ౪౯

* * * *

అక్షౌహిణీసహస్రేణ తేనాదృశ్యేన సోఽసురః.
ఆవిశ్య మరుతాం చిత్తం శోషయామాస తద్రసం. ౫౦
మథితాని ముఖాన్యాస వైరూప్యం సమజాయత,
రక్తాని నీలరూపాణి నిశ్శ్రీకాణి న రేజిరే. ౫౧
ఉత్సాహాస్సకలా నష్టా మహదాలస్యమాగతం,
ప్రమ్లానవదనాశ్చాపి బభూవుస్స్వర్గవాసినః. ౫౨
ఆవిష్టమాత్రయస్తేన షండేన సదురాత్మనా,
పుంస్త్వేన వర్జితాస్సర్వే జాతా ఏవ నపుంసకాః. ౫౩
న స్త్రీభిర్నాప్యప్సరోభిః కార్యం తేషామవిద్యత,
అన్యోన్యకార్యవిరహా దన్యోన్యం సంగవర్జితాః. ౫౪
అన్యోన్యసంగవిరహాన్నిస్సహాయాశ్చ తేఽభవన్,
నిస్సహాయతయా సర్వే నిరుద్యోగాశ్చ కర్మసు. ౫౫
కర్మాణి దైన్యమాలిన్యదుఃఖప్రాయాణి భేజిరే,
అథాప్సరస్సు చావిష్టా దుర్దాంతా షండసైనికాః. ౫౬
వంధ్యాత్వం వీతరాగత్వం సురతద్రవసంక్షయం,
లావణ్యకాంతివిరహాసవిలాసరసక్షయం. ౫౭
ఆలోకనస్య వైరూప్యం వర్ధయామాసు రుద్ధతాః,
న కాపి రమణం భేజే భోగతృష్ణాపరాఙ్ముఖీ. ౫౮
అలక్ష్మీకమహాసం చ వలీపలితసంకులం,
వానరీణామివ ముఖమమరీణామజాయత.
న కేవలం ప్రాణభాజాం తత్రాభూద్రససంక్షయః,
నందనోద్యానవృక్షాణామపి శోషో మహానభూత్.

* * * * *

విశుక్రేణాసురేంద్రేణ సహస్రాక్షౌహిణీజుషా,
పీతశుక్లేన తే సర్వే పీతశుక్లా నరాభవన్,
స్త్రీణామపి చ సంభోగహేతుశ్శోణితసంప్లవః. ౨౦
రక్తైశ్శుక్లైశ్చ వర్ధంతే యస్మాత్సర్వేఽపి జంతవః,
తస్మాత్ సతి సర్వేషామకాండే విప్లవోఽభవత్. ౨౧
రక్తం శుక్లం సమాసాద్య భోగశ్రీః పూర్వముద్గతా,
తయోః ప్రణష్టయోస్తేన విశుక్రేణ దురాత్మనా. ౨౬
భోగశ్రియో వినేశుశ్చ భోగవస్తుష్వపి క్షయః,
మాత్రపుత్రికాకారా నిర్వికారాశ్చ యోషితః.” ౨౭

(లలితోపాఖ్యానము ౧౯ అధ్యా.)

మున్ను భండాసురుఁడు విశుక్రవిషంగులును ముల్లోకములఁ గలవారిని బాధింపఁదలంచి వాయురూపములు దాల్చి ప్రతి ప్రాణి శుక్లశోణితముల మాయాశక్తుల నాధారముగా శోషిల్లఁ జేసిరనియు, దాన స్త్రీపురుషు లందఱు నుత్సాహము నశింప మోములు కాంతిహీనములు కాఁగా లావణ్యము తుదముట్ట నశింప నొకరినొకరు ప్రేమించుశక్తి విలయమంద నిశ్శ్రీకు లైరని కథాసారము. మానవులకు సకలశక్తులను బోషించునవి శుక్లశోణితములు. వానిఁ జక్కఁగాఁ బోషించినఁగాని యా యుర్బలారోగ్యములు వృద్ధినొందవు. అకాRణముననే స్మృతులు స్త్రీసంగమమును సంకోచింపఁజేసినవి. దీనిచే జితేంద్రియత్వము గలుగునని భావము. ఋతుకాలమున నింద్యము లగు నెనిమిదిరాత్రులను, పదాఱుదినముల మీఁదనున్న రాత్రులను సతీసంగతిని వదలినవాఁడు బ్రహ్మచారియే యగుచున్న వాఁడని స్మృతి విధించుచున్నది.

దీనినుండి గ్రహింపఁదగినవిషయ మేది? ఆయుర్బలాదులు శుక్లము నాధారము చేసికొని యుండునవి. ఊర్ధ్వ రేతస్కులు చిరకాలము జీవింపఁజాలుదురు. సుఖవర్చస్సు గలిగియుందురు. దానిచే నిరంతరము వారు భగవద్ధ్యానము చేయుదురు. ఆ కారణమున నపమృత్యుబాధ లేక యాధివ్యాధివిహీను లై సుఖముగాఁ గాలముం గడపుదురు. లోభాదిగుణములు వారినాశ్రయించునవకాశము లేదు. కావుననే యరోగులు దృఢగాత్రులు నై యనేకవర్షములు జీవింతురు. కావున నూర్ధ్వరేతస్కు లగుటకుఁ బ్రయత్నింపవలయును. గృహస్థు వుల కయ్యది శక్యము కాదు. కావున యథాశక్తి న్యాయము ననుసరించి ఋతుకాలనియమమునైనఁ బాటించినఁ జాలునని స్మృతు లనుశాసించెను. ఆయలవాటు క్రమముగా వృద్ధిచేసి కొనిన బ్రహ్మచర్యము ఫలించును అయ్యది యోగాభ్యాసము నకు మిక్కిలి తోడ్పడును ఆయభ్యాస మశుభ వాసనలందొలఁ గించి శుభవాసనలఁ బెంపొందించి భగవత్కరుణకుం బాత్రుని జేయును. చిత్తశుద్ధికి నింద్రియజయ మత్యంతావశ్యకము. ఇంద్రియజయము లేనివానికి యోగము సిద్ధింపదనుట సిద్ధాం తము

"యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు,
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా." ౧౭.(అధ్యా ౬)

అన్న భగవద్గీతోక్తి పైవ్రాసినభావమును దృఢపఱచుచున్నది.

ఇట్టి గంభీరార్థముగల ఘట్టమున నాంధ్రీకర్త లెంత దనుక మూలార్థమును బోధింపఁగలిగిరో పరికింతము.

"ఋతుకాలం ప్రతీక్షంతే నార్థినస్సుసమాహితే,
సంగమం త్వహమిచ్ఛామి త్వయా సహ సుమధ్యమే." ౧౫

"ఋతుకాలం షోడశర్తుర్నిశా స్త్రీణామిత్యుక్తకాలం. అర్థినః కామాత్ భోగార్థినః అనృతుకాలత్వాన్నాయమవసర ఇత్యహల్యయా ప్రతిషిద్ధమిత్యవగమ్యతే. సుసమాహితే. సమ్యక్ బ్రహ్మణా నిర్మితే. అతిసుందరీత్యర్థః." అని గోవిందరాజులు. "అర్థినస్సకార్థినః సుసమాహితే సుందరి." అని మహేశ్వరతీర్థులు.

శా. గామా యాతఁ డహల్యఁ గూడి పలువర్షంబుల్ తపంబుండ
సు, త్రాముం డొక్కెడ సందుగాంచి సతిఁ జేరఁగా వచ్చి
యామవానియు, ట్లామోదంబున దానిఁ గాంచి జలజాస్యా
మన్మథప్రేరిత, వ్యామోహాత్ములు కారటే ఋతుప్రతీక్షా
శక్తులట్లాట చేఁగా.

క. అంగజుకేళిని దమినీ
సంగతిఁ గాంక్షించినాఁడఁ జరితార్థునిగా
నంగన సలుపుమ యని బహు
భంగులఁ బ్రార్థింప నత్తపస్విని మదిలోఁగా.

"మునివేషం సహస్రాక్షం విజ్ఞాయ రఘునందన,
మతిం చకార దుర్మేధా దేవరాజకుతూహలాత్." ౧౯

"సహస్రాక్షం విజ్ఞాయ కదాచిదపి మునిత్వైవమర్థనాథావాదన్యస్యాత్ర ప్రవేష్టుమశక్తేరింద్రస్యైవాత్మని బహు కాలమభిలాష శ్రవణాచ్చేతి భావః" అని గోవిందరాజులు.

క. మునివేషధరుఁడు శక్రుం
డని యెఱిఁగియు నిర్జరేంద్రుఁడనుతలఁపున నీ
కొనియెఁగా దుర్మతి యై యా
తనితోఁ గలియంగ మఱి ముదంబునఁ బలికెఁగా.

(వావిలికొలను రామాయణము.)

మహాశయులారా! ఇది విమర్శము కాదు. ఆభావము నాకు లేదు. మూలార్థము నీరామాయణము పోషించెనని నారచించినరామాయణము పోషింప లేదని విమర్శకాగ్రేసరులు పక్షపాతమునఁ బలికినపలుకులయందు సత్యమెంత కలదో యని తమకుఁ దెలుపుటకే యీనావిన్నపము. మూలమున నెంత యర్థము కలదో మీారెఱింగితిరి. కాన నిఁక నాపద్యములం జిత్తగింపుఁడు.

క. ఋతుకాలనియమమును స
మ్మతిఁ జూడరు బ్రహ్మ నిన్ను మదిఁ గోరి చమ
త్కృతిఁ జూపి సృష్టి చేసె సు
దతి నీతో సంగమంబుఁ దమిఁ జేయంగన్.

ఆ. మదిని గోరినాఁడ మహిళామణీ! రతి
యొకటె వాంఛ నాకు నొప్పఁ బుత్రి
వాంఛ లేదు నిజము పంచాస్యమధ్యమా
యని సహస్రనయనుఁ డలరి పలుక.

చ. మనమునవిట్టు లెంచె సతి మౌనివరుం డిటు వేఁడఁ డెన్నఁడున్, గనుక నొరుండె యౌ నితఁడు కామవిమోహితుఁడై సురేశుఁడౌ, య్యాన నను గోరుచుంటఁ దెలియంబడి యుండెను గాదె యిప్పుడీ,తని మునినాథువేషమును దాల్చినయింద్రునిగాఁ దలంప నౌ.

చ. అని యిటు లాయహల్య మదియందు వినిశ్చయ మొప్పఁజేసియౌ, తనిపయి నున్నప్రేమమెయిఁ దద్గతముం దగఁ దీర్చె దుష్టబుద్ధినిగొని; ఆంధ్రశ్రీమద్రామాయణము.

ఇందుఁ గల గుణాగుణముల మహాశయులరగు మీరే గ్రహింపఁగలరు. పాదపూరణము లనేకములు నాపద్యములఁగలవనియు, వావిలికొలనువారి రామాయణమున లేవనియుఁ జేతులు త్రిప్పుచుఁ బల్కెడువిమర్శకశిఖామణుల భావ మెంతదనుక సత్యమో పై పద్యములను స్థాలీపులాకన్యాయమునఁ బరీక్షించు తమకే తెలియఁగలదు. పక్షపాత మెన్నియూహాలనైనఁ బుట్టించునను మీ రెఱుంగనిది కాదు.

ఇఁకఁ దరువాతవిషయమునకుఁ బోవుదము. నేను సంతానమును గోరినవాఁడను గాను. నిన్ను బ్రహ్మ సృష్టిచమత్కృతియంతయుం గానంబడ నిర్మించెను. కావున నిత్తఱి నీ కలయికం గోరెదనని యింద్రుఁడు తెలిపెను. ఋతుకాలనియమమును బాటింపక సమవిషమదినవ్యవస్థను లెక్కింపనిచో నందుఁ గలుగుసంతానము సద్బుద్ధికలదిగాకయుండుననియు, దానఁ గులమర్యాద లంతరించుననియుఁ బ్రాజ్ఞులెల్ల రూహించి యద్ది నిషేధమనిరి. కావున స్మృతినిషిద్ధమార్గ మాచరణార్హము కాదనుటే యిటఁ గలసారము.

అహల్య యాతనిమాటలపొందిక నాలోచించి తన మగఁ డేనాఁడు నిట్లు తన్నుఁ గోరియుండుటలేదు. ఇతరుఁ డీయాశ్రమమును బ్రవేశింపఁజాలఁడు. ఇంద్రుఁడు చిరకాలముగాఁ దన్నుఁ గోరెనని తెలిసెను. కాన నీతఁ డింద్రుఁడే యనియు మునివేషమును ధరించెననియు నెఱింగెను. దుర్బుద్ధిగలదియై యింద్రునంతవాఁడు వచ్చి నన్నుఁ గోరెనన్న కుతూహలమునఁ గలయిక కంగీకరించెను. ఈభాగము కర్మ మపరిహార్యమనువిషయమును బోధించుచున్నది.

"సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి,
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి. 33
కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః,
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణం. ౩౭
ధూమేనావ్రియతే వహ్నిర్యథాదర్శో మలేన చ,
యథోల్బేనావృతో గర్భస్తథా తేనేదమావృతం. ౩౮
ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా,
కామరూపేణ కౌంతేయ దుష్పూరేణానలేన చ. ౩౯
ఇంద్రియాణి మనోబుద్ధిరస్యాధిష్ఠానముచ్యతే,
ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్. ౪౦
తస్మాత్త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ,
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనం." ౪౧
(గీత 3 అధ్యా.)

అను భగవదుపదేశము ననుసరించి యోజింపఁగాఁ గామక్రోధములు ప్రధానవైరులై జ్ఞానము నావరించి యకార్యములఁ జేయించుననియు, వాని చేష్టలకు లోఁబడనివాఁడేధన్యుఁడనియుఁ దేటపడియెడిని దీనిచేఁ గర్మమునకు లోఁబడకయుండఁ జాలఁడను సిద్ధాంత మొకఁడు పొడకట్టెడు. ఈసిద్ధాంతమును

"స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్." ౬౦
(గీత. ౧౮ అధ్యా.)

అనునీగీతావాక్యము దృఢపఱచుచున్నది.

"మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి." గీ (అ ౧౮)
"ప్రకృతిః క్షత్రియస్వభావః త్వాం నియోక్ష్యతి." అని భాష్యము.

ప్రతి ప్రాణియుఁ గర్మముచే బద్ధమైనది. కావుననే నీకార్యము చేయనను నహంకారము పూనరాదు. ఎవ్వఁ డాయహంకారమును బూనునో వానిస్వభావమే అనఁగాఁ బ్రాక్కర్మఫలరూప మనోభావమే వానిని లోఁబఱచి యాకార్యము చేయునట్లు చేయును. అనఁగాఁ బ్రాణి స్వతంత్రుఁడు కాఁడని సారము. ఈభావమును బ్రకృతకథకు సమన్వయింతము. అహల్య వనిత. అందును భువనమోహిని. మునిపత్ని యయ్యెను.

> "పౌంశ్చల్యాచ్చలచిత్తాచ్చ నైస్నేహాచ్చ స్వభావతః,
> రక్షితా యత్నతోఽపీహ భర్తృష్వేతా వికుర్వతే. ౧౫
> ఏవం స్వభావం జ్ఞాత్వాసాం ప్రజాపతి నిసర్గజం,
> పరమం యత్నమాతిష్ఠేత్పురుషో రక్షణం ప్రతి." ౧౬
>
> (మను. ౯ అధ్యా.)

అని మనువు శాసించెను. స్వభావముగా స్త్రీలు చంచలమనస్కలు. కావుననే స్త్రీరక్షణమునందు మిగులఁ బ్రయత్నింపవలయునని స్మృతి తెలుపుచున్నది. ఇట్లుండఁగా నహల్య దుర్మతియయ్యెననుటలో వింతయేమి? గౌతముని శపించునన్న కారణమున బ్రహ్మ యహల్యనొసంగెనని పురాణాంతర గాథ కలదు. అంతకుముందే యింద్రుఁ డహల్యను గోరియుండెను వివాహానంతరముకూడ నాతనివాంఛ నశింపలేదు. కారణమేమి? ఇరువురి దుష్కర్మము లీయిద్దఱను బురికొల్పెను. కావునఁ దనమగఁడు కాఁడని యెఱింగియు నంగీకరించుటయే దుర్మతి.

ఋతుకాలేతరకాలములయందు భర్త భార్య కోరినఁ గలయిక కంగీకరింపవచ్చుననియు స్మృతి విధించుచున్నది.

"యథాకామీ భవేద్వాపి స్త్రీణాం వరమనుస్మరన్,
స్వదారనిరతశ్చైవ స్త్రియో రక్ష్యా యతస్స్మృతాః." ౧౧
(యాజ్ఞవల్క్యము.)

మున్ను స్త్రీలకు నింద్రుఁడే వరమిచ్చెను.

"భవతీనాం కామవిహంతా పాతకీ స్యాత్" అని.

"తా అబ్రువన్ వరం వృణీమహే ఋత్వియాత్ప్రజాం విందామహై కామమావిజనితోః సంభవామేతి తస్మాదృత్వియాః స్త్రియః ప్రజాం విందంతే కామమావిజనితోస్సంభవామేతి వరం వృతం హ్యాసామ్." ఇతి.

"తత్ర సురక్షితత్వం యథాకామిత్వేన" అని విజ్ఞానేశ్వరుఁడు.

స్త్రీలకామము నడంపరాదు. నిషిద్ధదినముల విడిచి పదాఱు దినములపైనను భార్యావాంఛను దీర్పవలయును. వారికోరికఁ దీర్పనిభర్త పాపమనుభవించుననియే యింద్రునిశాసనము. కావున నహల్య తన నిట్లు భర్త యెన్నఁడును గోరలేదను కొనుట స్వానుభవజ్ఞానముననే యని మన మూహింపవల యును. కనుక నహల్య పాపాత్మురాలగుట కర్మము ప్రేరే పించుటచేతనే యని మన మూహింపవలసియున్నది. మహర్షి యాట నాగౌతముఁడు స్త్రీరక్షణమున శ్రద్ధగలవాఁడు కాఁడ నియు దీనినుండి తేలెడిని. జ్ఞానులయందుత్తముఁడనఁబరఁగు ముని యీయాచారమును బాటింపకుండుటయుఁ దప్పుగాదు. స్త్రీలచిత్తము చంచలమని యెఱింగియే,

"భర్తృభ్రాతృపితృజ్ఞాతిశ్వశ్రూశ్వశురదేవరైః,
బంధుభిశ్చ స్త్రియః పూజ్యా భూషణాచ్ఛాదనాశనైః." ౭౨
(యాజ్ఞవల్క్యస్మృతి.)

"యస్మాత్తాః పూజితా ధర్మార్థకామాన్ సంవర్ధయంతి."

అని వ్యాఖ్య.

అని వారికి సంతోషము గలిగించుపద్ధతుల నెఱింగించిరి. చిర కాలము పతిం గూడి తపోనిరతినున్న యహల్యయే దేవరాజరు దెంచెనని దుర్మతింగొనియెఁగదా. దీనింబట్టి కర్మ మెంత బల వత్తరమో మన మూహింపవచ్చుఁగదా. స్త్రీస్వభావము నెఱింగియే కాఁబోలు మనువు

"శయ్యాసనమలంకారం కామం క్రోధమనార్జవమ్,
ద్రోహభావం కుచర్యాం చ స్త్రీభ్యో మనురకల్పయత్." ౧౭

"తస్మాద్యత్నతో రక్షణీయాః" అని కుల్లూకభట్టు వ్రాయుట సుసంగతమే యనక తప్పదు.

"లోకానంత్యం దివః ప్రాప్తిః పుత్రపౌత్రప్రపౌత్రకైః,
యస్మాత్తస్మాత్ స్త్రియస్సేవ్యాః కర్తవ్యాశ్చ సురక్షితాః." ౭౮
(యాజ్ఞవల్క్యస్మృతి.)

అని దారసంగ్రహఫలమును యాజ్ఞవల్క్యముని నిర్వచించెను. లోకమునందుఁ బుత్త్రపౌత్త్రాదులచే వంశవిచ్ఛేదము లేకుం డుట అగ్నిహోత్త్రాదులచే స్వర్గప్రాప్తియు భార్యమూలముననే గలుగును. కావున స్త్రీలను రక్షించి సుఖమందఁజేయవలయు నని యీస్మృతి తెలుపుచున్నది.

గౌతమముని యహల్యను బెండ్లియాడి తనధర్మమును నిర్వహించెనాయని కొందఱు ప్రశ్నింతురు. వివాహానంతరము గౌతముఁడు మునివృత్తి నవలంబింపలేదు. మునియై యజ్ఞ ములచే దేవతలను సంతృప్తిచేయనెంచియే వివాహము చేసి

కొనియెను. వివాహము కేవల విషయసుఖార్థము కాదని యాజ్ఞవల్క్యస్మృతిలోనగునవి తెలుపుచున్నవి. శతానందుఁ డహల్యకుమారుఁడని ముందు చదువఁగలరు. కామైకతత్పరుఁడు కానిగౌతమముని తనధర్మమును జక్కఁగఁ దీర్చెననియే దృఢ మగును. ప్రథమసంతానముఁ గాంచినపిదప భార్యయు భర్తయు ధర్మైకతత్పరులు గావలయుననియే స్మృతితాత్పర్యము. "అష్ట పుత్రబహుధనమస్తు" అన్నయాశీర్వచనమున కర్థము ఎన మండ్రుపుత్త్రులం గాంచవలయునని కాదు. సప్తస్థిరసంతాన ములు ఒక్కకుమారుఁడునని దానియర్థము. ఆప్రకారము గౌతమముని పెండ్లియాడి సంతానముగాంచి భార్యంగూడి తపోనిరతినుండెను. అహల్య ప్రాక్కర్మము ఫలాభిముఖమై యామెను బురికొలిపెను. దేవేంద్రునిదుష్కర్మముకూడ నతనిం బ్రోత్సహించెను. త్రిలోకాధిపతియైనను దుర్నయపరుఁడయ్యె నేని ఫలము దాని కనుగుణముగా కలుగ ననుభవింపకపోఁ డన్ననీతి యీభాగము మనకుఁ దెలుపుచున్నది. అహల్యయుఁ దెలిసి యకార్యకరణమున నింద్యురాలే యనుటకు సంశయము లేదు. ఈభాగము కర్మము బలవత్తర మనియుఁ, దానికి లోఁ బడనివాఁడు లేఁడనియు మన కుపదేశించుచున్నది.

"అథాబ్రవీత్సురశ్రేష్ఠం కృతార్థేనాంతరాత్మనా. ౨౦
కృతార్థాస్మి సురశ్రేష్ఠ గచ్ఛ శీఘ్రమితః ప్రభో,
ఆత్మానం మాం చ దేవేశ సర్వదా రక్ష మానద." ౨౧

విషయసుఖైకాభిలాషిణి యహల్య యని యీభాగమునుండి మన మెఱుంగవచ్చును. ఇది ప్రమాదకర్మము కాదనియు, బుద్ధి పూర్వకముగఁ జేయఁబడినదనియు గ్రహింపవలయు. దేవేంద్రా!

సఫలమనోరథ నైతిని. ఇఁక నిందు నిలువక త్వరితముగఁ బొమ్ము. నిన్ను నన్ను నెల్లప్పుడు కాపాడుకొనుము. కాపాడుము. నీవు మర్యాదనొసంగువాఁడవు కదా. అనఁగా నీమర్యాదకు నామర్యాదకు లోకమున భంగము రాకయుండఁగాపాడుము. ఇతరులకు నెట్టులేఁ దెలుపవలదనియే యీప్రార్థనము. మర్యాదకు భంగము రాకయుండఁ బ్రవర్తింపుమని యింద్రుని హెచ్చరించెను. దీనింబట్టి యోజింపఁగా స్త్రీచిత్త మత్యంతచపలమనియు, సత్కర్మవశమున వారు నిశ్చలచిత్తలు గావలసినదే కాని పురుషప్రయత్నమునఁ గారనియుఁ గనఁబడుచున్నది. ఇట్టివారలని స్త్రీలనెఱింగియే వారిననేకభంగుల సంతసింపఁ జేయవలయునని స్మృతులు హెచ్చరించుచున్నవి. బలాత్కరించి వారిని వశపఱచుకొనరాదనుటయే స్మృతులతాత్పర్యము.

> "అరక్షితా గృహే రుద్ధాః పురుషైరాప్తకారిభిః,
> ఆత్మానమాత్మనాయాస్తు రక్షేయుస్తాస్సురక్షితాః. ౧౨
> పానం దుర్జనసంసర్గః పత్యా చ విరహోఽటనం,
> స్వప్నోఽన్యగేహవాసశ్చ నారీణాం దూషణాని షట్. ౧౩
> నైతా రూపం పరీక్షంతే నాసాం వయసి సంస్థితిః,
> సురూపం వా విరూపం వా పుమానిత్యేవ భుంజతే" ౧౪ (అధ్యా ౯)

"స్వప్నః అకాలస్వాపః" అసమయమున నిదురించుట. అనునీమనుస్మృతి పైవ్రాసినభావము సమంజసమని తెలుపుచున్నది. తిరుగుట, దుస్సంగతి, పెనిమిటి నెడఁబాసియుండుట, పానము, అకాలనిద్ర, పరగృహవాసము అనునీయాఱును స్త్రీలకుఁ బనికిరానివని శాసించుటకుఁ గారణమేమి? సత్ప్రవృత్తిని విడనాడుదురని కాక మఱేమిటి?

"పతిప్రియహితే యుక్తా స్వాచారా విజితేంద్రియా,
సేహ కీర్తిమవాప్నోతి ప్రేత్య చానుత్తమాం గతిమ్." ౮౭
(యాజ్ఞవల్క్యస్మృతి.)

"ప్రియమనవద్యత్వేన మనస్యాఽనుకూలం,
ఆయత్యాం యచ్ఛ్రేయస్కరం తద్ధితం." అని వ్యాఖ్య

ఇందు విజితేంద్రియా. అనుపదము స్త్రీలకును యోగాభ్యాసమును సూచించుచున్నది.

"విజితాని సంయమితాని ఇంద్రియాణి శ్రోత్రాదీని వాగాదీని చ మనస్సహితాని యయా సా విజితేంద్రియా" అని విజ్ఞానేశ్వరుఁడు పట్టుదలచే నింద్రియముల మనస్సును నియమింపవలయునని భావము. దీనిచేత శ్రమంపడక యింద్రియముల స్వాధీనము చేసికొనశక్యము కాదని తేటపడియెడిని.

"యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా,
యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి."

అని గీతాశాస్త్రము యోగఫలమును దెలుపుచున్నది. యోగాభ్యాసమునఁ గాని మనస్సు సంయతమై నిశ్చలతం గాంచదు. అట్లొనరింపనికతన నహల్య పాపకార్యము నొనరించెను. ఇది బుద్ధిపూర్వకము కావునఁ బ్రాయశ్చిత్తము దుఃఖానుభవమే కాని వేఱుగాదు. కావునఁ దెలిసిచేసినపాపముల ననుభవింపక తీఱదనున్యాయమును మనము చక్కఁగా నెఱుంగవలయును.

"అథ దృష్ట్వా సహస్రాక్షం మునివేషధరం మునిః,
దుర్వృత్తం వృత్తసంపన్నో రోషాద్వచనమబ్రవీత్.
మమ రూపం సమాస్థాయ కృతవానసి దుర్మతే. ౨౭
అకర్తవ్యమిదం తస్మాద్విఫలస్త్వం భవిష్యసి,
గౌతమేనైవముక్తస్య సరోషేణ మహాత్మనా. ౨౮

"పేతతుర్వృషణౌ భూమౌ సహస్రాక్షస్య తత్క్షణాత్."

అను నీభాగము మనకొక్క యుపదేశము చేయుచున్నది.

"శుభాశుభఫలం కర్మ మనోవాగ్దేహసంభవమ్,
కర్మజా గతయో నౄణాముత్తమాధమమధ్యమాః. ౩
తస్యేహ త్రివిధస్యాపి త్ర్యధిష్ఠానస్య దేహినః,
దశలక్షణయుక్తస్య మనో విద్యాత్ప్రవర్తకమ్. ౪
పరద్రవ్యేష్వభిధ్యానం మనసానిష్టచింతనం,
వితథాభినివేశశ్చ త్రివిధం కర్మ మానసం. ౫
పారుష్యమనృతం చైవ పైశున్యం చాపి సర్వశః
అసంబద్ధప్రలాపశ్చ వాఙ్మయం స్యాచ్చతుర్విధం. ౬
అదత్తానాముపాదానం హింసా చైవావిధానతః,
పరదారోపసేవా చ శారీరం త్రివిధం స్మృతం. ౭
మానసం మనసైవాయముపభుంక్తే శుభాశుభం,
వాచావాచా కృతం కర్మ కాయేనైవ చ కాయికం. ౮
శరీరజైః కర్మదోషైర్యాతి స్థావరతాం నరః,
వాచికైః పక్షిమృగతాం మానసై రంత్యజాతితాం. ౯
లోభః కామోఽధృతిః క్రౌర్యం నాస్తిక్యం భిన్నవృత్తితా,
యాచిష్ణుతా ప్రమాదశ్చ తామసం గుణలక్షణం." ౩౩

(మనుస్మృతి. ౧౨ అధ్యా)

దేవేంద్రుఁడు చేసినయకార్యము శారీరత్రివిధకర్మములలోఁ జేరినది. శరీరముచేతనే యనుభవింపఁదగినది. కర్మము బలవత్తరముకదా. దుర్మతివై నారూపమును ధరించి చేయరాని పని నొనరించితివి. కాన నండవిహీనుఁడవు కమ్మా యని కోపము పెంపున గౌతముఁడు శపించెను. గౌతమవాగ్రూపమున

నింద్రునికర్మము ఫలమునొసంగెనని మనము గ్రహింపవల యును. ముని రోషమునఁ బలుకఁగనే వెంటనే శతమఖుము ష్కములు రెండును భూమిపైఁ బడియెను. "అత్యుత్కటైః పుణ్యపాపై రిహైవ ఫలమశ్నుతే" అన్న న్యాయము ననుసరించి యప్పుడే ఫలించెనని కొందఱందురు. ఆమాట స్మృతిసిద్ధమా యని సందియమందుచున్నాను. ప్రారబ్ధకర్మము ఫలము నొసంగును. ప్రాక్కర్మమే ప్రారబ్ధమగును. అనఁగా ఫలోన్ము ఖమగును. అనఁగా నింద్రుని నిష్క్రియకార్యము చేయఁ బ్రోత్స హించి యప్పుడే మునియు వచ్చునట్టు లొనరించి యమ్ముని కింద్రుఁడు కనఁబడునట్లుచేసి కోపము కలుగఁగా శాపరూప మున ఫలమునొసంగెననుటయే మన మెఱుంగఁదగినది. ఈకర్మ సిద్ధాంతము నెఱింగినవా రితరులు తమ కుపకారాపకారములు చేసిరని భ్రాంతిపడక తమకర్మములు తమకే కర్తలమని యెఱింగి యహంకారమును వదలి కర్మము త్రిప్పినట్లు తిరుగు చర్మప్రతిమలముకదా మన మనుజ్ఞానము గలవార లగుదురు. కావున

"కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః,
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి."

అన్న గీతాశాస్త్రమును దలంచుచు సత్కర్మాచరణపరాయణులు కావలయుననియే యీభాగము మనకుఁ దెలుపుచున్నది. సత్క ర్మముల నాచరించువారు

"మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా,
నిరాశీ ర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః. 30
యే మే మతమిదం నిత్యమనుతిష్ఠంతి మానవాః,

శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేఽపి కర్మభిః. 31
(గీత. 3 అ.)

అనుసీశ్రీకృష్ణోపదేశమును నమ్మి సాధుకర్మముల నాచరించుచు వానినెల్ల భగవత్సమర్పణము చేయవలయును. ఈభాగము, మనకిట్లు కర్మసిద్ధాంతమును, దానినాచరించి భగవత్కరుణకుఁ బాత్రులగుమార్గమును,దుష్కర్మవిముఖత్వము ముఖ్యమనియుఁ దెలుపుచున్నది.

"ఇహ వర్షసహస్రాణి బహూని త్వం నివత్స్యసి,
వాయుభక్షా నిరాహారా తప్యంతీ భస్మశాయినీ. 30
అదృశ్యా సర్వభూతానామాశ్రమేఽస్మిన్నివత్స్యసి,
యదా చైతద్వనం ఘోరం రామో దశరథాత్మజః. 31
ఆగమిష్యతి దుర్ధర్షస్తదా పూతా భవిష్యసి,
తస్యాతిథ్యేన దుర్వృత్తే లోభమోహవివర్జితా. 32
మత్సకాశే ముదా యుక్తా స్వం వపుర్ధారయిష్యసి,
ఏవముక్త్వా మహాతేజా గౌతమో దుష్టచారిణీం. 33
ఇమమాశ్రమముత్సృజ్య సిద్ధచారణసేవితే,
హిమవచ్ఛిఖరే పుణ్యే తప స్తేపే మహాయశాః." 34

అనుసీరామాయణభాగమునుండి మనమనేకవిషయముల గ్రహింపవలయును తొలుత నింద్రునకు శాపమిచ్చి గౌతమముని యహల్యను శపించెను.సామాన్యదృష్టి నాలోచింపఁగా నింద్రునిశాపమునకంటె నహల్య కిచ్చినశాపము ఘోరమనియే తోఁచును. విజ్ఞానదృష్టి నాలోచింప నల్పమని తోఁచును. అహల్య నింద్రునిమాటల విని యితఁడు గౌతమముని కాఁడని యెఱింగెను. చాలకాలమునుండి తన్నింద్రుఁడు వలచియున్నవాఁడని

వినియు నుండెను. ఆమాటల పొందిక విన్నంతనే యింద్రుఁడని గ్రహించెను. దేవరాజుతో నిటికలయికను గోరెను. పిదపఁ గృతకృత్యయై త్వరగాఁ బొమ్మని హెచ్చరించెను. ఈవిషయమును రహస్యముగా నుసుపుమా. మర్యాదను గాపాడుమా యనియు బోధించెను. అనునీవృత్తాంతమును గౌతమముని దివ్యజ్ఞానసంపన్నుఁడు కావున గ్రహించెను. తపశ్చరణమునఁ గాలము గడుపుచునుండు నీయహల్య యిట్టిలోభమోహములకు వశంవదయయ్యెఁ గదా. ఇఁక సామాన్యస్త్రీలమాట చెప్పనేటికని యూహించెను ఎల్లరకు బుద్ధివచ్చుఁ గాక యని యూహించి శాపమిచ్చెను.

పాపములు రెండువిధములు జ్ఞానకృతములు. అజ్ఞానకృతములు. అజ్ఞానకృతపాపములకుఁ బ్రాయశ్చిత్తము సులభముగా విధింపఁబడినది. జ్ఞానకృతపాపములకుఁ బ్రాయశ్చిత్తములు కష్టానుభవములుగా నిర్దేశింపఁబడినవి. ఇందహల్య యొనరించిన పాపము ప్రమాదమునఁ గాదు. కావుననే మహర్షి యాలోచించి చిరకాల మనుభవింపఁదగినట్లు విధించెను. అహల్య వ్యభిచరించుటకు హేతువేమని తొలుత విమర్శింపఁదగును. భర్తకు భార్యకు వయస్సు ఎంత భేదముగా నుండవలయును?

"త్రింశద్వర్షోద్వహేత్కన్యాం హృద్యాం ద్వాదశవార్షికీం,
త్ర్యష్టవర్షోఽష్టవర్షాం వా ధర్మే సీదతి సత్వరః. ౯౪
ప్రజనార్థం స్త్రియస్సృష్టాస్సంతానార్థం చ మానవాః,
తస్మాత్సాధారణో ధర్మశ్శ్రుతౌ పత్న్యా సహోదితః. ౯౬
అన్యోన్యస్యావ్యభిచారో భవేదామరణాంతికః,
ఏష ధర్మస్సమాసేన జ్ఞేయస్స్త్రీపుంసయోః పరః. ౧౦౧

తథా నిత్యం యతేయాతాం స్త్రీపుంసౌ తు కృతక్రియౌ,
యథా నాభిచరేతాం తౌ వియుక్తావితరేతరం. ౧౦౨
ఏష స్త్రీపుంసయోరుక్తో ధర్మో వో రతిసంహితః,"
(మను. ౯ అధ్యా.)

ఈధర్మము ననుసరించి యాలోచించిన కన్యవయస్సునకంటె వరునివయస్సు ఒకటిన్నరభాగ మధికముగా నుండవలయునని తేటపడియెడిని. ముప్పదియేండ్లవయస్సుగలవాఁడు పండ్రెండు వత్సరముల యీడుగలకన్యకను బెండ్లియాడవలయును. బ్రదికియుండునంతదనుక వారెడఁబాయక యుండవలయును. సంతానము ధర్మకార్యములు ననువారికొఱకే వివాహము విధింపఁబడినది. అట్టిధర్మమును విడనాడినయెడల నిరువురకుఁ బ్రాయశ్చిత్తము కలదు. అహల్య బుద్ధిపూర్వకముగా నధర్మమార్గమునఁ బ్రవర్తించెనుగాన నమ్ముని ఘోరశాపమొనరించెను.

"శుద్ధ్యతే బ్రాహ్మణో దోషాద్ద్విగుణాద్బుద్ధిపూర్వతః." ౧౫౦
(లలి. ౨ అధ్యా)

తత్రైవాస్యాంగనాం గత్వా తదుక్తార్థం సమాచరేత్. ౧౬
(అధ్యా. 3.)

భర్తయు భార్యయుంగూడ సంతానకాంక్షం గూడినపుడు కూడ సద్భావము కలవారు కావలయును. ఈవిషయము నీక్రిందివాక్యములు స్పష్టముచేయుచున్నవి.

"దుస్సహో మదనస్తస్మాత్సర్వేషాం ప్రాణినామపి,
పుస్నారీరూపవత్కృత్వా మదనేన స విశ్వసృట్. ౨౬
ప్రవృత్తిమకరోదాదౌ సృష్టిస్థితిలయాత్మికాం,
తత్ప్రవృత్త్యా ప్రవర్తంతే తన్నివృత్త్యా౽క్షయాం గతిం. ౨౭

ప్రవృత్త్యైవ తథా ముక్తిం ప్రాప్నుయుః కేన ధీయుతాః,
తద్రహస్యం తథోపాయం శృణు వక్ష్యామి సాంప్రతం. ౨౮
సర్వాత్మకో వాసుదేవః పురుషస్తు పురాతనః,
ఇయం హి మూలప్రకృతిర్లక్ష్మీస్సర్వజగత్ప్రసూః. ౨౯
పంచపంచాత్మసృష్ట్యర్థం మైథునం క్రియతే తయోః,
ఏతన్మంత్రానుభావస్యాన్యథనా క్రియతే యది. 3౦
తావుభౌ పుణ్యకర్మాణౌ న దోషో విద్యతే తయోః." (౪ అధ్యా.)

దాంపత్యసుఖము సద్భావానురూపము కావలయునని తేటపడును. ఇట్టిభావము కలవారు కావలయునని స్మృతి హెచ్చరించుచున్నది. కావుననే

"బ్రహ్మచార్యేవ భవతి యత్ర తత్రాశ్రమే వసన్."

అని మనువు శాసించెను. పైన వ్రాసినభావమున దంపతులు ప్రవృత్తిమార్గమునఁ బ్రవర్తింతు రేని నివృత్తిమార్గము ననుసరించువారికి లభించుముక్తి లభించును. శాస్త్రోక్తదినములయందు భార్యం గలియుపూరుషుఁడు బ్రహ్మచారియే యగును. అను మునులయాశయము నెఱింగినయెడల వారిభావ మెంత యుదారమో తేటపడును. దేహసుఖమునకై వివాహము విధింపఁబడ లేదనియు స్పష్టమగును. స్మృతులతో నహల్యా ప్రవర్తనమును బోల్చి చూతము. గౌతమముని పరిత్యజించుట యుక్తమా కాదా యనియుఁ బరికింతము.

"మద్యపాసాధువృత్తా చ ప్రతికూలా చ యా భవేత్,
వ్యాధితా వాధివేత్తవ్యా హింసార్థఘ్నీ చ సర్వదా. ८०
వంధ్యాష్టమేఽధివేద్యాబ్దే దశమే తు మృతప్రజా,

ఏకాదశే స్త్రీజననీ సద్యస్త్వప్రియవాదినీ. ౮౧.

(మను. ౯ అధ్యా.)

ఈచెప్పఁబడిన దోషములలో రెండవ దోషము "అసాధు వర్తనము" మునిపత్నియందుఁ గనఁబడెడిని. అప్రియవాదిని యగుపత్ని నప్పుడే వదలవలయునని సారము. "వాదినీ."అన్న పద ముపలక్షణవిధిచే "కారిణీ" అని యెంచవచ్చును నిందిత కార్యమును దెలిసి యొనరించుటంజేసి పరిత్యాజ్యయే యగును. పతియం దెట్టిదోషములు చెప్పఁబడలేదు.

"ప్రత్యక్షదృష్టదోషాపి న స్త్రీ నింద్యా కదాచన,

అన్న వాక్య మొండు వినంబడియెడిని. అది బహుస్మృతిసమ్మతము కాదుకాన దానిం జర్చింపనక్కఱలేదు.

వాయువే యాహారము కాఁగా నితరాహారములు లేక సంతాప మనుభవించుచు భస్మమునఁ బడియుండి యెవ్వారికిం గానరాక యీయాశ్రమముననే యుండఁగలవని శపించెను. ఈశాపము చాలఘోరముగఁ దొలుత నెవ్వారికిని దోఁపక మానదు. ఈరీతిగాఁ దోఁచుట కర్మసిద్ధాంతము మాత్రము కాదు. గౌతమమునినోటినుండి వచ్చినశాపాక్షరములు కర్మము చెప్పించినవి. భగవంతుని మహత్త్వమును గనుఁగొని పామరులు తరింపవలయునని యిట్టి యుదాహరణములు కొన్ని యున్నఁగాని పామరులు పరమేశ్వరతత్త్వము నమ్మరనియు నెఱింగియే కర్మము గౌతమమునికిఁ గోపము నిర్భరముగాఁ గల్గించి శపింపఁజేసెను. దీనిసార మేమనఁగా, మానవుఁడు స్వతంత్రుఁడు కాఁడు. కర్మబద్ధుఁడు. దాని త్రిప్పులకు నిరంత

రము లోఁబడియుండువాఁడు. పామరు లీయర్థమెఱుంగరు. ధీరు లెఱింగి యహంకారము వీడి తరింతురు.

"తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర,
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః. ౧౯
ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః,
అహంకారవిమూఢాత్మా కర్తాహమితి మన్యతే." ౨౭

(గీత 3 అధ్యా.)

అన్న భగవదుక్తి స్పష్టమే కదా. అహల్య దుష్కర్మము శతమఖుని దుష్కర్మము కలిసి ముని నాసమయమునకు నాశ్రమద్వారమునకు రావించి యీయిరువురకు దుష్ఫలము లనుభవింపఁదగినరీతిని శాపమిప్పించెనని మనము తెలిసికొనవలయును.

ఈఘట్టమునుండి యింద్రియలోలత్వముపనికిరాదనియు, లోభమోహములు పురోవృద్ధికి భంగకరములనియు, స్వేచ్ఛాప్రవర్తనము స్త్రీలకు సుంతయుఁ బనికిరాదనియు, నెంత తపస్సు చేసినను ఎంతటి తపోధనుని పొందుగలిగినను దాఁ జేసినకర్మమున కనురూపఫలమును దానే యనుభవింపక తప్పదనియు, సంసారసాగరమును దరింపనెంచు మానవుఁడు విషయసుఖమును దుచ్ఛముగాఁ దలంచి పరమేశ్వరసేవయే ప్రధానముగాఁ దలంపవలయుననియు, నదియే తరణోపాయమనియు మనము నేర్చుకొనవలయు. మఱియు సౌందర్యగర్వితురాలగు యువతీమణిని లావణ్యాధనుఁడు కానివాఁడు వివాహమాడరాదనియు, దానఁ జేటువాటిల్లక మానదనియు,

"ద్వయోర్హి కులయోశ్శోకమావహేయురరక్షితాః,"

అన్న మనుస్మృతి యుపదేశము గ్రహింపఁదగుననియు, కన్యా

వరులకు సమత్వము కుదిరినఁగాని దాంపత్యము సుఖావహము కాదనియు మనము తెలిసి కొనవలయును.

శాపముక్తి విషయము నాలోచింతము. మహర్షి కరుణానిధి. అందును బ్రాహ్మణుఁడు. తృణవహ్నితాళీనునివలె విప్రక్రోధము క్షణకాలమున శాంతినొందును. కావున నహల్య ప్రార్థింపకముందే తనవిధిని ముని నెఱవేర్చెను. దశరథకుమారుఁడై పుట్టి యప్రధృష్యుఁడగు రామచంద్రుఁ డెప్పు డీఘోరవనమునకు వచ్చునో యపుడు, పవిత్రురాలవగుదువు. అనఁగా శాపనివృత్తియగును. "దుర్వృత్తురాలా! ఆమహాత్ము నాతిథేయసత్కారమునఁ బూజించినవెంటనే లోభమోహములు తొలఁగ యథాపూర్వముగా దేహమలర సంతోషించుచు నాకడనుండఁగలవు." అని మహర్షి పలికెను. దుష్టచారిణి యగునాభార్యను వదలి తపస్సున కరిగెను. దీనిచే గౌతమముని తపోధనము వ్యయ మయ్యెను. మరల నార్జించుటకే హిమాలయశిఖరమున కరిగెను.

ఇతరుల కుపకారముగాని యపకారముగాని చేసినచో నతనితపోధనము వ్యయమగును. అనఁగాఁ దానొనరించిన సత్కర్మము నశించునని యర్థము. సత్కర్మఫలమే యితరుల కుపకారాపకారము లొనరింపఁ దోడ్పడును. కనుకనే మహర్షులు తమకితరు లెట్టియపకార మొనరించినను శపింపరు. ఏల? తపస్సు వ్యయించునన్న కారణముచేతనే. ఇతరులయశుభవాసనలం దొలఁగించి శుభవాసనలం బెంపొందించుటయే యుపకరించుటని మన మెంఱుంగవలయు. ఎవఁ డుపకారార్థుఁడో యాతనిదుష్కర్మము నశించి సత్కర్మము నిలిచి యుండు

ననియు నాసమయమునందే యితరులయాశీర్వాదము ఫలించు ననియు మన మెఱుంగవలయును. అట్లే తనయందుఁ గల యశుభవాసనలు పెంపొంది శుభవాసనల నడంచి యుండుతఱి నితరులశాపము సోఁకనపుడు దుష్ఫలము లొనఁగూడుననియు మనము తెలిసికొనవలయును. కనుకనే "పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్" అనునీతి జనించెను. ఉపకారమే పుణ్యము. అపకారమే పాపము. ఇరువురకర్మములు సంకలితములు కాఁగా ఫలము కలుగునని యెఱుంగుటయే బుద్ధిమంతులలక్షణము. ఈవిషయము నెఱింగినపెద్దలు కామక్రోధాదులే శత్రువులనియు వాని నడంచినఁగాని యేతపస్సు ఫలింపదనియు వాకొనుదురు. మనోవీథిఁ గామక్రోధాదులు పొడసూపునంతదనుకఁ దపస్సులొనగుసత్కర్మములు ఫలింపఁజాలవనుట సిద్ధాంతము అరిషడ్వర్గములను కామక్రోధాదుల నడంప యోగాభ్యాసముతప్ప వేఱు మార్గము కానరాదు. మనోనిగ్రహ మున్నఁగాని యవి తొలంగవు. దానిని గల్గింప యోగము నభ్యసింపవలయును. పరంపరాసంబంధమున వృక్షమునకు వేరువలె నన్నిసత్కర్మములకు యోగమాధారమని తేలెడిని. ఈసిద్ధాంతమునకుఁ బూర్వపక్షమే లేదు. సమాహితమనస్కుఁడై కర్మము నాచరింపవలయునని స్మృతి విధించుచున్నది. ఏల? మనస్సు ప్రధానము. దానిచాంచల్యమును మాన్ప నేదియుం బనికిరాదు. పాండిత్య మక్కఱకు రాదు.

"అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలం,
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే."

3వ అధ్యా. ౬

అన్న గీతాశాస్త్రము పై విషయమునే తెలుపుచున్నది. నాలుగు దినములు ముక్కుమూసికొనిన యోగము సిద్ధింపదు. నిరంతరాభ్యాసము కావలయును. దాని కేకాంతవాసము ప్రధానము. అందును విశేష తేజస్సు లేనిచోటుండవలయును. దీనికి శాస్త్రము లుదాహరింపనక్కఱలేదు. యోగి కయ్యది యనుభవమే. కావున గౌతమముని తనచిరకాలసంభృతతపోధనమును వ్యయించి పాపాచరణమునకు ఫలానుభవమిరువురకుఁ గల్పించి భార్యను బోషించుట తనకు విధియౌట శాపాంతము నను గ్రహించి తపోధనమును సంపాదింపఁ గోరి తనకుఁ బొడమిన కోపమును శాంతినొందింపఁ గోరి తపోనిష్ఠుఁడై విజనస్థలమున కరిగెను.

సత్కర్మముల నాచరించువారు పరులకుఁ గీడు చేయరాదనియు, నాకీడు తననుగూడ బాధించుననియుఁ, జేసినసత్కర్మములఫలము వ్యయమగుననియు, దాన మనశ్శాంతి చేకూరదనియు, నెన్నివిధములనైనఁ బరులకుఁ గీడు రోయకయుండుటయే సన్మార్గమనియుఁ, జిరకాలము చేసినసత్కర్మముల ఫలమొక్కక్షణమున నశించుననియు, నట్టిదానికైన నోడంబడువారవివేకు లనఁబడుదురనియు, శాంతమువంటి పదార్థము వేఱొకఁడు లేదనియు, దానిని దుర్వ్యయరూపరోగమునఁ బోఁదోలరాదనియు మనమీ భాగమునుండి యెఱుంగందగిన సద్విషయములు.

ఈఘట్టమున నహల్య పాషాణరూపమున నుండఁదగునని మునిశాపమునఁ గానరాదు. శిలాత్వ మామెకుఁ గలదనుట సుప్రసిద్ధముగ నున్నది. ఏలయని యించుక విచారించు టధిక ప్ర

సంగము కాదు. గోవిందరాజులు శిలాత్వము కల్పాంతరవృత్త ముగా నుండునని వ్రాసిరి. మహేశ్వరతీర్థులు పద్మపురాణము ననుసరించి "స్వం వపుర్ధారయిష్యతి" అన్నమూలమునకు "అనేన పద్మపురాణోక్త పాషాణావస్థా సూచ్యతే, తథా చ మచ్ఛాపపరిప్రాప్తపాషాణావస్థాం విహాయ నిజశరీరం ప్రాప్స్యసీతి భావః" అని వ్రాసిరి. కావునఁ బద్మపురాణమున నితరపురాణము లయందు నీభాగ మేలాగున్నదని యిపుడు విచారింపవలయును.

"మునయో రఘుశార్దూల సహితాః పుణ్యచేతసః,
గచ్ఛతస్తస్య రామస్య పాదాబ్జేన మహాత్మనః. ౧౩౩
అథాత్ర పావనీభూతా సమాక్రాంతా మహాశిలా,
సాపి శప్తా పురా భర్త్రా గౌతమేన ద్విజన్మనా. ౧౩౪
అహల్యా రఘునాథస్య పాదస్పర్శాచ్ఛుభాఽభవత్,"
(పద్మపురాణము ఉత్తరఖండము ౧౬౯ అధ్యా.)

"దృష్ట్వాహల్యాం వేపమానాం ప్రాంజలిం గౌతమోఽబ్రవీత్.
దుష్టే త్వం తిష్ఠ దుర్వృత్తే శిలాయామాశ్రమే మమ,
నిరాహారా దివారాత్రం తపః పరమమాశ్రితా.
ఆతపానిలవర్షాదిసహిష్ణుః పరమేశ్వరం,
ధ్యాయంతీ రామమేకాగ్రమనసా హృది సంస్థితం.
నానాజంతువిహీనోఽయమాశ్రమో మే భవిష్యతి,
రామో దాశరథిశ్శ్రీమానాగమిష్యతి సానుజః.
యదా తదాశ్రమశిలాం పాదాభ్యామాక్రమిష్యతి,
తదైవ ధూతపాపా త్వం రామం సంపూజ్య భక్తితః.
పరిక్రమ్య నమస్కృత్య స్తుత్వా శాపాద్విమోక్ష్యసే,
రామశ్శిలాం పదా స్పృష్ట్వా తాం చాపశ్యత్తపోధనాం.
(అధ్యాత్మరామాయణము. బాల. ౫ సర్గము.)

భాగవతాదులలో నీభాగము లేదు. ఈరెండుతావులను శిలారూపమున నహల్య పడియున్నదని స్పష్టముకదా. శ్రీరామచంద్రపాదస్పర్శమునఁ బాషాణము వనితయయ్యెనని భవిష్యత్సర్గమునందును గూడ లేదు. కావున నిరువురు వ్యాఖ్యాతలయు నభిప్రాయము సుసంగతమే.

"విశ్వామిత్రం పురస్కృత్య తమాశ్రమమథావిశత్. ౧౨
దదర్శ చ మహాభాగాం తపసా ద్యోతితప్రభాం."

అనునీభాగమే రామాయణమునఁ గనుపెట్టెడిని. కావునఁ బురాణాంతరముల ననుసరించి శిలారూపమన్నను గథాభాగమునకు బాధకము లేదు. ఇట్టు లీయహల్యావర్తనమునుండి యనేకవిషయముల గ్రహింపందగు. ఇఁకఁ దరువాతిగాథను బఠింతము.

## అహల్యాశాపమోక్షము.

* అంతట దేవేంద్రుఁడు విగతాండుఁడై మోము వెలవెలపోవఁగాఁ బోయి మునుల నగ్నిప్రముఖదేవతలను జారణులను గాంచి తనయపరాధమును గప్పిపుచ్చుచు దేవతలారా! మహనీయుఁడగు గౌతమముని సర్వదేవతాపదముల నున్మూలింపఁగోరి తపముచేయుచుండఁగా నమ్మునికిఁ గోపముఁ బుట్టించి నియమముఁ జెఱుపఁబూని యిట్టికృత్యము నొనరించితిని. నాయీకార్యము దేవతలనిమిత్తమై చేసితిని. కాని నాకొఱకుఁ గాదు. ఆముని పట్టరానిక్రోధమున నాయండములను బడఁజేసెను. అహల్యకు శాపముమాత్ర మొసంగి విడిచెను. నాకు నాయహల్యకు ఘోరశాపంబిచ్చినకారణమున నాతనితపము

---

* ఈభాగము నలువదితొమ్మిదవ సర్గమునుండి సంగ్రహింపఁబడినది.

క్షీణించెను. ఈపద్ధతిని మునితపస్సు నపహరించితిని. దేవతా
కార్యమును సాధించితిని. దేవతలారా! ఈకారణమున మీ
రెల్ల మునులను జారణాదులం గలిసి మీకొఱకు బూన్కి
సాధించిననాకు నండములు కలుగఁజేయుఁడు. అని పలుక
నాతీయనిమాట లాలించి యగ్నిలోనగు దేవతలు మరుద్గణ
ములం గూడి పితృదేవతలం జూడఁ బోయి యిపుడు యజ్ఞము
నందు మీకుఁ జెందఁదగు నంశము కొఱకు నేర్పడిన యీమేష
మునకు ముష్కము లున్నవి. శతమఖున కయ్యవి పోయినవి.
కావున నీయండములం గైకొని సత్వరంబ యింద్రున కిండు.
అండములు పోయిన మీసంతుష్టి చెడిపోవునే యనఁగూడదు.
ఈమేషము ముష్కవిహీనమైనను మీకుఁ దుష్టినొసంగును.
అంతియకాక మాకు సంతోషము కలుగుటకొఱకు నేమాన
వులు ముష్కరహితమగు మేషపలలము నొసంగుదురో
వారును మీకు విశేషించి సంతృప్తిని గూర్పఁగలరు. అని
పలికిరి.

అగ్నిప్రముఖామర్త్యులు పల్కినయావాక్కు లాలకించి
పితృదేవతలెల్లం గూడి యత్తటి యూపమున నియుక్తంబైన
మేషాండముల లాగి యింద్రునికిం బొందుపఱచిరి. నాఁటం
గోలెఁ బితృదేవతలు పిలువంబడి తమకర్పించిన యితరమేషము
లామొదటిమేషమునకు సమానజాతి కలవిగాన నండములను
మానియే వానిని భుజించుచుందురు. విగతాండమేషముల
నర్పించువారికిని సముష్కమేషములనొసంగువారికెంతఫలమో
యంతియ ఫలమును గూర్చిరి. ఇంద్రుఁడును గౌతమముని తపః
ప్రభావముచేత నదిమొదలు మేషవృషణుం డయ్యెను.

శ్రీరామచంద్రా! మహాప్రభావసంపన్నుఁడవు. ఆయహల్యకుఁ గలశాపముకూడ నీ వీయాశ్రమమునకు వచ్చునంతదనుక నే నిలుచును. కావున మహాతపోరాశియగు నాగౌతమునియాశ్రమమునకు వచ్చి దేవకాంతవలె ననుపమానరూపమునఁ బ్రకాశించు మహాభాగ్యవతి నాయహల్యను శాపవిముక్త యగునట్లు చేయుము. అని తేటపఱచునావిశ్వామిత్రముని మాటచొప్పున శ్రీరామచంద్రుఁడు సలక్ష్మణుఁడై కౌశికుఁడు ముందు నడువఁగా నాయాశ్రమమును బ్రవేశించి మునిపత్నిం గాంచెను. ఆయహల్యాదేవియు వాయుభక్షణము మొదలగుతపోనియమములచేత నెంతయుఁ బ్రకాశించుచు, నెవ్వారికేని విశేషించి సురాసురులకేని సమీపింపను దేఱిచూడను శక్యముగాకయుండెను. ప్రయత్నపూర్వకముగా బ్రహ్మాయాయంగన సృజించియున్న కారణమున మానవజాతిలో లేనిలావణ్యము గలిగి మాయానిర్మితమూర్తివలె నయనానందకారిణియై వృక్షలతాకుసుమాంతర్వర్తిని యాట మంచునావరింపఁగా మేఘములు గ్రమ్ముకొన నుండుసంపూర్ణచంద్రబింబమువలె నుండెను. పొగయావరించుటచే లోపలమండుచున్న యగ్నిరీతి నుండెను. ఉదకములనడుమ నుష్ణము తగ్గియున్న సూర్యప్రతిబింబమువలె నగపడుచు వారికింగనఁబడెను.

ఆయహల్య భర్తృశాపవాక్కుచే శ్రీరామచంద్రుని గాంచునంతదనుక మూఁడులోకముల నుండువారల కెవ్వారికింగాని కానరాక యాకాలమున శాపాంతము కలుగ నాకౌశికరామలక్ష్మణప్రముఖులకుఁ గనఁబడియెను. శ్రీరామలక్ష్మణులాసాధ్విపాదములఁ బూజించిరి. అహల్యయు భర్తవాక్యము

స్మృతికిరాఁగా నారామలక్ష్మణప్రముఖులం బూజింపఁ దలంచి సమాహితాంతఃకరణయై విధిననుసరించి పాద్యము నర్ఘ్యము నొసంగి యాతిథేయసత్కారము లొనరించెను. శ్రీరామచంద్రుఁడా మెచేయుపూజ నత్యాదరమునఁ గైకొనియెను. ఆసమయమున దేవతలు పూలవానఁ గురియించిరి. దేవదుందుభులు మ్రోసినవి. గంధర్వ లచ్చర లరుదెంచి పాడియాడి మహానందము నుఁ గలిగించిరి అహల్యయుఁ దనపూర్వతపోబలమున శరీరాపరాధదోషము తొలఁగఁగా మిక్కిలి పరిశుద్ధయై యాకాలమున శ్రీరామచంద్రుఁ డరుదెంచెనని తెలిసికొని యోగాభ్యాసమహత్త్వమున నచ్చినగౌతమమునీంద్రునిచెంతఁ జేరెను. దేవతలందఱు సాధుసాధుశబ్దముల నాకాంతామణి నలరించిరి. నిరుపమానతపోబలమున నలరుగౌతముని బ్రాణేశుని జిరకాలము విడనాడియుండి యపుడాసాధ్వి చెంతను రాఁగా నమ్మునియు మిగుల సంతోషించి శ్రీరామచంద్రుని దక్కినవారలను విధిదృష్టమార్గమున సత్కరించి యాయాశ్రమమునం దే తపస్సు చేయనెంచెను. రామమూర్తియు గౌతమమునిచంద్రునివలనఁ బూజలంది యచటనుండి మిథిలానగరమున కరుగఁదలంచెను.

మహాశయులారా! ఈభాగమునుండి గ్రహింపఁదగు విషయములు గొన్ని కలవు. శ్రీరాముని యమానుషమహత్త్వమీఘట్టమునఁ దెలుపఁబడినది. కావున విమర్శించి యెఱుంగందగును.

> "కుర్వతా తపసో విఘ్నం గౌతమస్య మహాత్మనః,
> క్రోధముత్పాద్య హి మయా సురకార్యమిదం కృతం.
> అఫలోఽస్మి కృతస్తేన క్రోధాత్సా చ నిరాకృతా,

శాపమోక్షేణ మహతా తపోఽస్యాపహృతం మయా.
తస్మాత్సురవరాస్సర్వే సర్షిసంఘాస్సచారణాః,
సురసాహ్యకరం సర్వే సఫలం కర్తుమర్హథ." ౪

అనునీభాగముం బరికింతము. ఇంద్రుఁడు తనదుష్కార్యఫలముగా విగతాండకోశుఁడై సురపురి కరిగి యెల్లరంగాంచి తన యపరాధమును దాఁచి యసత్యము పలికెను. దేవకార్యమునకు సహాయపడిననాకు నీమేలుచేయుఁడని కోరెననియే కథాసంగ్రహము. మహర్షికిఁ గోపము గల్గించి దేవకార్యము సాధించితిననియు, నాముని మమ్మిరువురను శపించుటం జేసి తపస్సు నశించెననియు నింద్రుఁడు తెలిపెనుగదా. ఇది యొక నీతిని మనకుఁ దెలుపుచున్నది. తపస్సనఁగా నేమి? పాపములఁ దొలఁగించి పుణ్యమును సంపాదించుకొనుటకుఁ బూనినవ్రతము. చేసినపాపమును దలంచుకొని తపించినఁ గొంత తఱుగుననియు, నింక నిట్టిపాపమును జేయనని శపథము చేసి దాని ననుష్ఠించుచున్న మిగిలినపాపము పోవుననియుఁ బెద్దలందురు.

"కృత్వా పాపం హి సంతప్య తస్మాత్పాపాత్ప్రముచ్యతే,
నైవం కుర్యాం పునరితి నివృత్త్యా పూయతే తు సః." ౨౩౦
(అధ్యా. ౧౧)

అనునీమనుస్మృతి పైని వ్రాసినయాశయమును సిద్ధాంతము చేయుచున్నది.

"ఏతచ్చ నివృత్తిసంకల్పస్య ప్రకాశాప్రకాశకప్రాయశ్చిత్తాంగవిధానార్థమ్." అని కుల్లూకభట్టు.

ఈవిధి యజ్ఞానకృతపాపముల విషయమైనదని మన మూహింప

వలయును. లేకయున్నఁ దానుబాపముచేసి సంతపించినఁ బోవు
నని యెల్లపాపములు చేయుచునే యుండును గదా.

"అజ్ఞానాద్యదివా జ్ఞానాత్కృత్వా కర్మ విగర్హితం,
తస్మాద్విముక్తిమన్విచ్ఛన్ ద్వితీయం న సమాచరేత్. ౨౩౨
యస్మిన్ కర్మణ్యస్య కృతే మనసస్స్యాదలాఘవం,
తస్మింస్తావత్తపః కుర్యాద్యావత్తుష్టికరం భవేత్." ౨౩౩

పాపాపనోదనార్థము ప్రాయశ్చిత్తము చేసినపుడు మనస్సంతో
షము కలుగవలయును. అంతవనుకఁ బ్రాయశ్చిత్తము చేయు
చునే యుండవలయును. అనఁగా నీపాపములు నశించెనన్న
తుష్టి మనస్సునఁ బొడమినంతదనుకఁ బ్రాయశ్చిత్తము చేయు
చుండవలయునని భావము.

"తపోమూలమిదం సర్వం దైవమానుషకం సుఖం,
తపోమధ్యం బుధైః ప్రోక్తం తపోఽంతం వేదదర్శిభిః. ౨౩౪
ఋషయస్సంయతాత్మానః ఫలమూలానిలాశనాః,
తపసైవ ప్రపశ్యంతి త్రైలోక్యం సచరాచరం. ౨౩౫
ఔషధాన్యగదో విద్యా దైవీ చ వివిధాస్థితిః,
తపసైవ ప్రసిద్ధ్యంతి తపస్తేషాం హి సాధనం. ౨౩౬
యద్దుస్తరం యద్దురాపం యద్దుర్గం యచ్చ దుష్కరం,
సర్వం తు తపసా సాధ్యం తపో హి దురతిక్రమం. ౨౩౭
మహాపాతకినశ్చైవ శేషాశ్చాకార్యకారిణః,
తపసైవ సుతప్తేన ముచ్యంతే కిల్బిషాత్తతః. ౨౩౮
కీటాశ్చాహిపతంగాశ్చ పశవశ్చ వయాంసి చ,
స్థావరాణి చ భూతాని దివం యాంతి తపోబలాత్. ౨౪౦
యత్కించిదేనః కుర్వంతి మనోవాఙ్మూర్తిభిర్జనాః,

తత్సర్వం నిర్దహంత్యాశు తపసైవ తపోధనాః. ౨౪౧
తపసైవ విశుద్ధస్య బ్రాహ్మణస్య దివౌకసః,
ఇజ్యాశ్చ ప్రతిగృహ్ణంతి కామాన్ సంవర్ధయంతి చ. ౨౪౨
ప్రజాపతిరిదం శాస్త్రం తపసైవాసృజత్ప్రభుః,
తథైవ వేదానృషయ స్తపసా ప్రతిపేదిరే. ౨౪౩
ఇత్యేత త్తపసో దేవా మహాభాగ్యం ప్రచక్షతే,
సర్వస్యాస్య ప్రపశ్యంత స్తపసః పుణ్యము త్తమం. ౨౪౪
వేదాభ్యాసోన్వహం శక్త్యా మహాయజ్ఞక్రియాక్షమా,
నాశయంత్యాశు పాపాని మహాపాతకజాన్యపి.'' ౨౪౫

(మను. ౧౧ అధ్యా.)

ప్రమాదకృతపాపములు. అజ్ఞానకృతపాపములు. ఒకప్పుడు జ్ఞానముచేఁ జేసినపాపములును దపోనియతి నశించునని స్మృతి చాటుచున్నది. మహాయజ్ఞక్రియాఃఅనఁగా బ్రహ్మయజ్ఞములోనగు మహాయజ్ఞములనియే యర్థము. కాని పశుహింసచేయు స్వార్థపరమగు జ్యోతిష్టోమాదికము కాదు. 'పంచమహాయజ్ఞానుష్ఠానమ్' అని వ్యాఖ్య. పాపములను బోఁగొట్టుకొనఁ గోరి మఱొకపాపమును జేయుట న్యాయము కాదుకదా. క్షమ. అనఁగా 'అపరాధసహిష్ణుత్వమ్' కీడొనరించిన నోర్చుకొనియుండుట ఇవన్నియుఁ దపస్సును బాపములను బోఁగొట్టునని స్మృతి శాసించుచున్నది. అట్టితపస్సు జితేంద్రియులకుఁ గాని ఫలింపదు. జితేంద్రియుఁడు కావలయునన్న యోగాభ్యాసము తప్ప వేఱు మార్గము లేదు. అట్టియోగము నభ్యసించి చిరకాలము చేసిన తపస్సు ద్వేషమున నశించును. ఎన్నియో సంవత్సరములు వాయువాహారముగాఁ గొనుచుఁ జేసినతప

స్వాక్కృతక్షణకాలమున ద్వేషమూనిన నశించును. ద్వేషము మొదలగునవి క్లేశము లనఁబడును.

"సూ. అవిద్యాస్మితారాగద్వేషాభినివేశాః క్లేశాః." 3.

(పాతంజల. సాధనపాదము.)

ఈక్లేశములు యోగికి నుండరాదని సారము. యోగసిద్ధి కల వాఁడని యెట్లు తెలియంగవలయును? అన్న ప్రశ్నమునకు.

"సూ. అహింసాప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః." 35

(పాతం. సాధనపాదము.)

"అహింసాసిద్ధౌ సత్యాం తస్యాహింసకస్య మునివర్యస్య సన్నిధౌ స్వభావవిరుద్ధానామహినకులాదీనామపి వైరత్యాగో భవతీత్యర్థః."

అని మణిప్రభ.

"సూ. విరక్తస్య తత్సిద్ధేః." ౨

(సాంఖ్యసూత్రద్వితీయాధ్యాయము.)

విరక్తునకే మోక్షసిద్ధి యని సూత్రార్థము.

"శ్రుతి. పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయ అథ భిక్షాచర్యం చరంతి." ౧ మంత్రః.

(బృహదారణ్యకము 3 అధ్యా. 5 బ్రాహ్మణము.)

"శ్రుతి. శాంతో దాంత ఉపరతస్తితిక్షుస్సమాహితో భూత్వా ఆత్మన్యేవాత్మానం పశ్యతి." ౨3 మంత్రః.

(బృహ. ४ అ. ४ బ్రా)

అని యిట్లు యోగశాస్త్రములు నుపనిషత్తులును జాటుచున్నవి. కామక్రోధాదులు మాని యందు ముఖ్యముగాఁ గోపమును మాని తపస్సు చేసిననే ఫలించును. కాని ద్వేషమును మానక యున్న ఫలింపదనియే వేదాంతసారము. గౌతమముని తాఁ

జేసినతపస్సును గోపమున శపించి వ్యయించెను. ఒక్కక్షణమాత్రమున నాతపఃఫలము నశించెను. కావునఁ గోపమన్నింటి నతిక్రమించి యపకారము చేయును. పుణ్యకార్యముల నాచరించునపుడు కోప మూనరాదనియు, నయ్యది కలిగినఁ దాఁజేయుసత్కర్మము ఫలమునీఁ జాలకపోవుటయేకాక దుష్ఫలమును గూడ నొసంగుననియు, మనకీఘట్టము తెలుపుచున్నది.

"ఇంద్రస్తు మేషవృషణ స్తదా ప్రభృతి రాఘవ,
గౌతమస్య ప్రభావేన తపసశ్చ మహాత్మనః." ౧౦

ఇంద్రుఁ డెంత దాఁచినను పాపఫలము తప్పలేదు. శాశ్వతమగు నపయశోరూపమున వెలసెను. అపకీర్తి మరణమునకంటె నధికము.

"అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయాం,
సంభావితస్య చాకీర్తిర్మరణాదతిరిచ్యతే." 34. (అధ్యా ౨).

అనునీగీతాశాస్త్రరూపమగు శ్రీకృష్ణవాక్యము సత్యమే యగును గదా. మానవులు పాపములు చేసి వానిని గప్పిపుచ్చిన నవి యపకీర్తిరూపముగా బయలుపడుననియుఁ, జేసినదుష్కర్మఫలముల ననుభవింపక మానరనియు, వాని నొనరింపక యుండుటే యుత్తమమార్గమనియు మనకీభాగము బోధించుచున్నది.

"తదాగచ్ఛ మహాతేజ ఆశ్రమం పుణ్యకర్మణః,
తారయైనాం మహాభాగామహల్యాం దేవరూపిణీం." ౧౧

ఈభాగము చాల ముఖ్యము. భగవంతుఁడు ప్రకృతివశంవదుఁడై శ్రీరామరూపమున నవతరించెను కనుక శ్రీరామావతారము ప్రకృతివిలాసమే యనవలయు. లోకులకుఁ బ్రకృతి

పురుషుల కనాదిత్వము తెలుపుటకే సీతారూపమున స్త్రీవ్యక్తిగను రామరూపమున బురుషవ్యక్తిగను రెండువిధముల నా పరమేశ్వరి యవతరించెను.

"ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి,
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్. ౧౯
కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే,
పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే. ౨౦
పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్,
కారణం గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు." ౨౧(గీత. ౧౩ అధ్యా.)

అనుసీ శ్రీకృష్ణోక్తిని సార్థకము చేయనెంచెను. ప్రకృతస్థితి యందు శ్రీరామమూర్తి సీతాదేవింగూడ లేదు. కావున లోకమునకు మహోపకారము చేయఁ బూనఁడయ్యెను. ప్రకృత్యతీతుఁడు భగవంతుఁ డన్న సూక్తిని సార్థకము చేయవలయును గదా. కావున విశ్వామిత్రుఁడు మహాభక్తుఁడు. లోకోపకారపరాయణుఁ డన్నవిఖ్యాతిని నిలుపఁబూని యమ్ముని తనకుం దెలిపినట్లు, తాను జేసినట్లు కనఁబఱచెను.

"యదాయదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత,
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహం. ౭
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే." ౮
(గీత ౪ అధ్యా.)

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం." ౨౨
(అధ్యాయము ౯.)

అనుతన ప్రతిజ్ఞను సార్థకము చేయఁబూనెనని మన మూహింప వలయు.

విశ్వామిత్రుఁ డిపుడు ప్రకృతివిశిష్టుఁడుగనుండు పర మేశ్వరునకు నహల్యాశాపవిమోచనము చేయ నీయాశ్రమ మును బ్రవేశింపుమా యని మనవిచేయుచున్నాఁడు. పాపవృత్తి ననలంబించిన యాయింతి యుండుతావు నెట్లు ప్రవేశింతునని సంశయించునో యని పుణ్యకర్మములు చేయు గౌతమముని యాశ్రమ మని విన్నవించెను. దేవరూపిణి యయి మహాభాగ యగు నీయహల్యను దరింపఁజేయుమా యని యర్థించు చున్నాఁడు. మునివరమున నితరుల కెవ్వారికిని గనఁబడక తేజో రూపమున నహల్య యున్నదనియు, భగవద్దర్శనము తానరిగి చేయుటయే యదృష్టము; తానున్నచోటికే భగవంతుఁ డరు దెంచి దర్శనమీఁగోరుటచే నిరుపమానాదృష్టవతి యనియుఁ, గావుననే యీయింతిని దరింపఁజేయుమా యని ప్రార్థించెననియు మనము తెలిసికొనవలయును. ఇది మాయామానుషవిగ్ర హుండు రామచంద్రుఁడని తెలియఁజేయుచున్నది. ఈభాగము నుండి పెద్దలు చెప్పినట్లు చేయనంగకరింపవలయుననియు, దాన లోకమునకుఁ దనకు మహోపకారము విఖ్యాతియుఁ గలుగు ననియుఁ, దనమేలుకొఱకే పెద్దలు చెప్పుదురని భావింపవలయు ననియు, బదులు చెప్పక చేయువాఁడే బుద్ధిమంతుఁ డనఁబడు ననియు మనము తెలిసికొనందగు.

ఇందొకగూఢరహస్యము కలదు. "ఏనాం తారయ" అని విశ్వామిత్రుఁడు పలికెను. కౌశికుఁడు శ్రీరామచంద్రునిమహా త్త్వమును లోకులకుఁ దెలుపఁ బూనినమహనీయుఁడు. ప్రకృ.

తిం గూర్చునంతకుఁ దాను దోడ్పడిన మహామతిమంతుఁడు. శాపవిమోచనము ననుగ్రహింపుమా యనక "తారయ" అనుటంజేసి యొకరహస్య మిందుఁ గలదని పెద్దలందురు. శ్రీరామమూర్తి తారకమంత్రాధిదైవము. తారకమంత్రము సకలాపత్పరిహారకము అనఁగా ముముక్షువులకు సంసారసాగరరూపాపత్పరిహారకము. ఇతరుల కాధ్యాత్మికాధిభౌతికాధిదైవికమయాపత్పరిహారకము నగు. కావున శ్రీరామచంద్ర ననుగ్రహముల బడయం గోరువారు శ్రీరామతారకమంత్రము నుపాసించిన శీఘ్రంబ కలుగునని పెద్ద లనువదింతురు. ఈయర్థ మిట లేదనువారు కూడఁ గలరు. ఉద్ధరింపుమా తరియింపఁజేయుమాయన్న సమానమే యని వారందురు. ఆమ్నాయషట్కమున శ్రీరామతారకమంత్రము గలదు. ఇది యందఱకుఁ దెలిసినవిషయమే. భగవంతు నాశ్రయించి యత్యల్పములగు నైహికఫలములం గోరక శాశ్వతపదము నందఁగోరు టుత్తమము కాదా. ఐహికాముష్మికఫలములం గోర రాదాయని కొంద అందురు. మంత్రప్రధానోద్దేశము మనమెఱుంగందగు. రామతారకమంత్ర ముపాసించుచు నతితుచ్ఛములగు నైహికసుఖములంగోరుట మహావాక్యములు పఠించి వివాహము కావలయునని కోరుటెట్టిదో యిదియు నట్టిదే. కావుననే మహాత్ములొక్కొక్క దేవత నుపాసింప ననేకమంత్రములఁ దెలిపిరి. భక్తి యున్న నేదియైననేమి యన్నవారి కొక్క నమస్కారము. సీతాదేవితో సరసములాడుశ్రీరామచంద్రుఁడు నావైరిని సకుటుంబముగా నశింపఁజేయుఁగాక యని కోరువాఁ డెంతమహాత్ముఁడో వేఱుగఁ జెప్పనక్కఱలేదు. మంత్రము లొక్కొక్కటి

పేరుచేతనే యిచ్ఛఫలములం దెలుపును. సంతానగోపాలమంత్రమును జపించి నాకు సన్న్యాసాశ్రమము గలిగి మఠాధిపతినై పెండ్లికొడుకువలె సుఖించునట్లు కరుణింపుమని యర్థించు టెంతయుచితమో తారకమంత్రము జపించి ద్రవ్యమడుగుటయు నట్టిదియే. కావున భక్తులు అహల్యాశాపవిముక్తి నొనరింపనాతురంపడు రామమూర్తి మమ్మీసంసారసాగరము నుండి తరింపఁజేయవలయునని కోరుచు నాపరమేశ్వరుని భక్తరక్షణపరతంత్రుని ధ్యానింపవలయునని మన కీభాగ ముపదేశించుచున్నది.

ఈభాగము నాంధ్రీకరించినవా రెంతయర్థమును గ్రహించిరో పరికించి కువిమర్శకులను భ్రాంతిమము. పాఠకులకుఁ గష్టము కలుగకయుండ మరల మూలము నిట వ్రాయుచున్నాఁడను.

> "తదాగచ్ఛ మహాతేజ ఆశ్రమం పుణ్యకర్మణః,
> తారయైనాం మహాభాగామహల్యాం దేవరూపిణీం."

క. "ఇది యాగౌతమునాశ్రమ
పద మిచ్చట నమ్మహానుభావునిసతి యు
న్నది దగ నహల్య యెంతయు
మదమఱి పతిశాపతప్తమానస యగుచున్.

క. రామ యహల్యకు నీవు ద
యామతి శాపంబు వాపనరుగుము నా నా
రాముఁడు విశ్వామిత్రుఁడు
సౌమిత్రియుఁ దోడ రా వెసంజని యెదురన్."

భాస్కరరామాయణము.

చ. "అనిశము తావకాగమనమాత్మఁ దలంచుచు నాఁటఁగోలె
యీ, ఘనవని ఘోరశాపమున గౌతమపత్ని యహల్య
యేరికిం, గనఁబడకుండ నున్నయది గ్రక్కున నాశ్రమ
భూమి సొచ్చి నీ, వనుపమసత్కృపాగరిమ నమ్ముని గేహిని
నుద్ధరింపుమా." గోపీనాథరామాయణము.

సీ. "... రాఘువ మహీ దేవమౌని
పుణ్యకర్మంబులఁబోలుపారఁ జేసిన
వాఁడు గౌతముఁ డట్టివానియాశ్ర

తే. మమును జూడఁగ ర మ్మసమానరూప
మలర దేవవనితవలె నమరుచున్న
భాగ్యవతి నీయహల్యాశాపంబునుండి
యుద్ధరింపుము నీరాకయొప్పఁగోరి.

చ. అతివయు నిందె యున్న దన నమ్మునిపల్కుల నాలకించి"
ఆంధ్రశ్రీమద్రామాయణము.

ఈమూఁడింటిని బఠించితిరికదా. విమర్శకమహాశయులు యథా
మూలమని యెరిగి యెరిగి పొగడిన వావిలికొలనువారి రామా
యణమును బరికింపుఁడు.

ఆ. "ఆశ్రమంబును జొచ్చి, సతిఁ దరింపఁ జేయ మతిఁదలంపు.
సీ. అనుచు వాక్రుచ్చిన..."

అని మాత్రము కలదు. ముందువెనుకల నీయర్థమునకు సంబం
ధించినభాగమే లేదు. కవివర్యుల నాక్షేపించుటలేదు. సంగ్ర
హించి వారు వ్రాసియుండవచ్చును. ఏల యిట్లు వ్రాసితిరని
యడుగరాదు. ఇది యంతముఖ్యము కాదని వ్రాసితిమని వారు

చెప్పవచ్చును. శిరసా ధరింపవలసిన దేను. విమర్శకులు పక్షపాత మూని యించుకయు నాలోచింపక యథామూల మనియు, నితరులెవ్వరు నిట్లు వ్రాయ లేదనియు, నాకవిత్వము రసహీన మనియు విమర్శించినందున నిట వ్రాయవలసివచ్చెను. గ్రంథ కర్తలనుగుఱించి యొక్కమాటయుఁ బలుక నాకవసరము లేదు. నిష్పక్షపాతమతు లీవిషయమును బరికింతురని విన్నవించుటయే నాపని యని విన్నవించి విషయాంతరమునకుఁ బోవుచున్నాఁ డను.

"విశ్వామిత్రం పురస్కృత్య తమాశ్రమమథావిశత్. ౧౨
దదర్శ చ మహాభాగాం తపసా ద్యోతితప్రభాం,
లోకైరపి సమాగమ్య దుర్నిరీక్ష్యాం సురాసురైః. ౧౩
ప్రయత్నాన్నిర్మితాం ధాత్రా దివ్యాం మాయామయీమివ,
*     *     *     *     *
సా హి గౌతమవాక్యేన దుర్నిరీక్ష్యా బభూవ హ,
త్రయాణామపి లోకానాం యావద్రామస్య దర్శనం.
శాపస్యాంతముపాగమ్య తేషాం దర్శనమాగతా." ౧౬

అనునీభాగమును బరికింతము. మాయామానవవిగ్రహుఁడగు శ్రీరామమూర్తి యార్తత్రాణపరాయణుఁడవు కమ్మాయని కౌశికుఁడు విన్నవింపఁగాఁ దా సర్వజ్ఞుండయ్యు సామాన్య మానవునింబోలి తద్వచనము నంగీకరించెను. సామాన్య మానవుఁడే యైన నీపని నాచేత నగునా యని ప్రశ్నించును గదా. ఈపని కర్తవ్యమని యెఱింగియే యంగీకరించెను.

కొందఱు మహనీయులు రాముఁడు మానవులలో నుత్తమ ప్రవర్తనము కలవాఁడందురు. భగవదవతారమనియంగీకరింపరు.

అట్టిగుణములే లేవందురు. ఉత్తమపురుషుఁడని యెట్టకేల కంగీకరింతురు పురుషోత్తముఁడని వారు సుంతయు నంగీకరింపరు. వారీఘట్టమంతయు నసత్యమందురు కాఁబోలు. కథ నంగీకరించి నచో వారివాదము నిలువదు. కథనే విసరిపాఱవైచినచో వారివాదము నిలువ నవకాశము కలదు. ఈకథలో నేమాత్ర మంగీకరించినను వారివాదము కాలూనఁజాలదు. ఇఁక నట్టివాద మునుగుఱించి కొన్ని ప్రశ్నము లడుగుదము ౧. భగవంతుఁడు సర్వశక్తిసంపన్నుఁడని యంగీకరింతురా? ౨. ఆయాయి కార్యములను సాధింపవలసినతఱి నందులకు నుచితములగు రూపముల ధరింపఁగలఁడని యొప్పుకొందురా; లేదా? 3. ఆపత్తుల యందు భగవంతుని స్మరించిన నామహనీయమూర్తి రూపాంతరములఁ బొడసూపునన్న గాథలు సత్యము లందురా? అసత్యములందురా? ర. కర్మములు ఫలమునొసంగును. ప్రాయశ్చిత్తములు స్వల్పదుష్కృతములఁ దొలఁగించునన్న వాదము మీకుసమ్మతమా; కాదా? ౫. తాఁజేసినసత్కర్మములకు దుష్కర్మములకు మానవుఁ డుత్తరవాది యందురా? కాదందురా?

ఈప్రశ్నములలో నేదానికి నంగీకరింపమని తలత్రిప్పినచో భగవంతుఁడే లేఁడన్నవా రగుదురు. అపుడు వారు నాస్తికు లనఁబడుదురు. వారింగుఱించి మనము విచారంపడ నక్కఱలేదు. ఇందు దేనికిఁగాని వారంగీకరింతురేని సర్వకారణుఁ డొకఁ డున్నట్టు లంగీకరించినవారే యగుదురు. వారికి సమాధానము చెప్పవచ్చును. సర్వకారణుఁ డొకఁ డున్నచోఁ గార్యము లుండును. వాని ననుభవించువా రుందురు. వానికిఁ బరిహారము లుండును. ఒక్కప్రాణికి నొక్క

పేరుగలరోగము గలుగును. దానికిఁ గారణము కలుగక తప్పదు కదా. ఆరోగమునకుఁ బరిహారము చేసినప్పు డనఁగా నౌషధాదులుతీసికొన్నప్పు డది నివర్తించును. ఇది ప్రత్యక్షము గాన నసత్యమనఁజాలరు. కర్మవాదు లారోగోత్పత్తికిఁ గర్మము కారణమందురు. ఏదియుఁ గర్మసిద్ధాంతమునకు లోఁబడును. రోగోత్పత్తి, తన్నివృత్తి స్వభావమగుచో మానవప్రయత్న మక్కఱలేక యుండవలయును. అప్రయత్నముగ నకార్యములు సాగుట యీలోకమునఁ గానము. కుయుక్తులు తత్కాలమున బాగున్నట్టు లుండును కాని ఫలకాలమునఁ బనికిరావు. తీవ్రరోగము బాధించుకాలమున నేమానవుఁడైనఁ దన్నివృత్తికి మార్గ మేది యని పరికించుఁగాని దానియంతన యదియే తొలంగునని యూరక యుండఁజాలఁడు. కావునఁ గర్మవాదము నంగీకరింపవలసియే యుండును. దాని నంగీకరించినచో భగవచ్ఛక్తి యమేయమను మాటను శిరసావహింపవలసినదియే యగును. సర్వశక్తులు భగవంతునకుఁ గల్గుచో నేకార్య మాపరాత్పరుఁ డొనరించెనన్నను గాదన వలనుపడదు. రామచంద్రరూపమున నహల్యాశాపమును దొలఁగించెనన్న విచిత్రమేమి గలదు? అమేయశక్తిసంపన్నుఁడగు పరమాత్మ కిది యతిస్వల్పకార్యము గాక మహాకార్యమగునా? ఏశక్తియు దైవమునకు లేదన్నచో మనకు వారితోడి సంభాషణమే యక్కఱలేదు. కొన్నిశక్తులు కలవనియుఁ గొన్నిలేవనియు నంగీకరించుచో నావాదమునకు హేతువు దొరకదు. నీ కెట్లు తెలిసెనయ్యా యని ప్రశ్నించినచో వాఁడు గుటకలు మ్రింగవలసినదే కాని బదులు చెప్ప వలనుపడదు.

మొండిపట్టుదలచే వాదించువారికి సమాధానము చెప్పఁ బూనుట దుష్కాలక్షేపమే యగును. తెలిసినవానికిని దెలియని వానికిని సమాధానము చెప్పుట సులభము. తెలిసియుఁ దెలియనివానికి సమాధానము చెప్పఁ దరముకాదు.

భగవద్భక్తికలవార లీవిషయము నిట్లు తలంపవలయు. భగవంతుఁడు సర్వశక్తిసంపన్నుఁడు. ఆమహాత్మునియిచ్ఛయే ప్రకృతి. అదియే సర్వకార్యముల నొనరించునది. అనఁగాఁ బరమాత్మ తలంచినంతన బ్రహ్మాండజాలము క్షణకాలమున వెలయుననియు నడంగుననియుఁ దాత్పర్యము. అట్టిశక్తి నెఱుంగుటకు మనకుఁ గలయల్పబుద్ధి నాధారముగాఁ బూనుకొనుట వెఱ్ఱితనముగాక మఱేమిటి? సాగరముహద్దు నిర్ణయింపఁజాలము. ఉన్నట్టులుండి సాగరమునం దొకకొండ యుద్భవిల్లును. మహావాతము నిష్కారణముగా వీచును. పిడుగులు పడును. మహావృష్టి గురియును. ధూమశకటము పడును. నౌకలు బ్రద్దలగును. అందున్నవారందఱు మృతినొందఁగా నొక్కముదుసలియమ్మ యించుకంతయు బాధలేక యితరసహాయములేక జీవించును. ఆమెప్రక్కన విజృంభించు మొసలి యామె నంటక తొలఁగిపోవును. ఇట్టివెన్నియో కనఁబడునపుడు కర్మసిద్ధాంతవేత్త నెమ్మదిఁ గూరుచుండి భగవచ్ఛక్తిని బొగడుచుండును. హేతువాదము చేయువారు తికమకగా నూహించుచుఁ గారణములఁ గనుఁగొనఁజాలక యల్లాడుచుందురు. కావునఁ గర్మమార్గము చక్కనిది. దానినుండి పోవుమార్గమున నొరుల సాయము గోరకపోవువాఁడు పరమేశ్వరునికడఁ జేరును. హేతువుల నరయుచుఁ దనకుఁగల యల్పబుద్ధిచేఁ బరికించుచునుండు

వాఁ డూరక చనిపోవును. మరల నీచజన్మముంగాంచునని కర్మ వాదులమతముకదా. కావున భక్తులు భగవంతునిశక్తి యెంత గలదని నిర్ణయింపఁ బూనరాదు. అతీంద్రియజ్ఞానముకలవార లకే యది తెలియఁదరముగానిది. మన మిఁక నేపాటివారము! భగవంతుని నెఱనమ్మి తచ్చరిత్రముల సద్బుద్ధితోఁ బఠించుచు నొరులకుఁ దెల్పుచు సత్కర్మముల నాచరించుచు సజ్జనులసంగతిం గోరుచు సంసారనివృత్తిమార్గము గనఁబఱుపుమా యని భగ వంతునిఁ బ్రార్థించుచునుండిన నాకరుణానీరధియే తనంతన మార్గముం జూపును. హేతువాదు లూరక శ్రమంపడుదురు. వారిని గూడ నీభక్తులుగా నొనరింపుమా యని మన మాపరా త్పరుని బ్రార్థింపవలయును. వారు మనల దూషించినను మనము వారియెడఁ గృపఁ జూపవలయును అది మనవిధి. ఆవిధిని నెఱవేర్పఁ బూననిచో మనల నీశ్వరుఁ డనుగ్రహింపఁడు. ఇదియే పరమేశ్వరుని యాశయము.

> "యే మే మతమిదం నిత్యమనుతిష్ఠంతి మానవాః,
> శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేఽపి కర్మభిః. ౩౧
> యే త్వేతదభ్యసూయంతో నానుతిష్ఠంతి మే మతం,
> సర్వజ్ఞానవిమూఢాంస్తాన్ విద్ధి నష్టాన చేతసః." ౩౨
>
> (గీత ౩ అధ్యా.)

అను నీశ్రీకృష్ణోపదేశమును నమ్మవలయును. దాన నిహపరసుఖ ములు గలుగును. ఇఁకఁ బ్రకృతమనుసరింతము.

శ్రీరామచంద్రుఁడు మౌనిపలుకుల నాలకించి యమ్ముని యుపకారనిష్ఠకు మహానందమంది యేమియుం బలుకక ముని ముందు నడువ వెనుక నడచెను. ఆశ్రమప్రవేశముననే యహ

ల్యకు శాపాంతకాల మాసన్నమయ్యెను. భగవదనుగ్రహము కల్గినంతన లభింపరాని దేదియుండును? శాపము తీఱఁగా నామె కనఁబడెను. వాల్మీకి మహాకవి కావుననే "మహాభాగామ్" అనుపదమును దొలుతఁ బ్రయోగించెను. చక్కని యదృష్టవంతురాలు గాక మఱేమగును? ఎన్నియో నియమములూని పెక్కువేలయేండ్లు తపస్సుచేసియు భగవద్దర్శనముగాక మహర్షులు తపించుచుందురు. అట్టిపరాత్పరుఁడు వెదకుచుఁ దనయున్నచోటికి రాఁగా దర్శించునాతె మహాదృష్టవంతురాలుగాదా? తపస్సుచేఁ బ్రకాశింపఁజేయఁబడు తేజస్సు గలదిగ నుండెను. అనఁగా భర్తృవియోగము కాఁగాఁ దన చేసిన యపరాధమునకుఁ బరితపించి తద్దోషము వాయ భగవంతు నారాధించెననియు, నాతపస్సుచే దుష్కార్యజనితపాపములు నశింప దివ్యతేజస్సు వెలయుచుండెననియుఁ దేలెడిని. బుద్ధిపూర్వకముగాఁ జేసినపాపములు నశించునాతపస్సున కంత శక్తి కలదాయని సందియమొందరాదు. బుద్ధిపూర్వకముగాఁ జేసినపాపము లనుభవింపకపోవనుట సత్యము. తీవ్రతపస్సుచేత జ్ఞానమావిర్భవించును. జ్ఞానాగ్ని సర్వపాపతూలముల భస్మీకరించునని మన మెఱుంగవలయును.

> "అపి చేదసి పాపేభ్యస్సర్వేభ్యః పాపకృత్తమః,
> సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి. 36
> యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున,
> జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా. 37
> న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే,
> తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి. 38

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరస్సంయతేంద్రియః,
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతిమచిరేణాధిగచ్ఛతి." 39

(గీత 4 అధ్యా.)

అను నీశ్రీకృష్ణోపదేశ మీవిషయమును స్థిరపఱచుచున్నది. త్రిలోకవాసులు చెంత కరుదెంచి చూచినను జూడ శక్యము గాక యుండెననుట గౌతమమహామునితపశ్శక్తి యెట్టిదో తెట పడియెడిని. బ్రహ్మ మున్ను సౌందర్యరాశియగు స్త్రీని నిర్మింపఁ దలంపుగొని తన నేర్పు గనఁబఱచి నిర్మించి యహల్య యని నామ కరణ మొనరించెను అనఁగా నసామాన్యలావణ్యశాలినియని భావము. దేవతా తేజస్సు గలిగి మాయాకల్పితవిగ్రహగాఁ జూపట్టెను. ఇట్టియద్భుతరూపలావణ్యవిరాజమాన నాయహల్యంగాంచెనని భావము.

త్రిభువనమోహినియగు నాయహల్య నేల గౌతమముని పరిగ్రహించెనన్న శంక కలుగకమానదు. ప్రాయశః ముని పత్నులు కురూపముగలవారు కారు. సురూపసుగుణసమన్వితలే యగుదురు. ఏలయనఁగా నందులకుఁ జక్కని కారణము కలదు. మహర్షులు జితేంద్రియులు; నిష్కాములు నగుదురు. కాని జితేంద్రియత్వము వాస్తవమా కాదా యని "స్థూణానిఖనన న్యాయము" ననుసరించి పరీక్ష చేసికొనవలయును.

"హేమ్నస్సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధిశ్శ్యామికాపి వా."

యని కాళిదాసమహాకవి చెప్పినట్లు పురుషుల ధైర్యవజ్రము సుందరాంగియను నికషమునందుఁ బరీక్షింపఁబడఁగాఁ దేలఁ గలదు అందు నిలిచినఁగాని యుత్తమము గానేరదు. లలనామణి చెంతనుండఁగా నించుకంతయు మనస్సు చలింపక

యుండునేని యాతఁడే జితేంద్రియుఁ డనఁదగువాఁడు. సుంద రాంగి చెంత లేనియపు డది సులభము కావచ్చును. కావుననే మహర్షులు "భార్యా దండం పృథక్ శయ్యా" అని నిర్దేశించి చెంత శయనించి యుండుతఱి మనోనిగ్రహము కలిగి యుండి నఁగాని జితేంద్రియత్వము దృఢము కాదని భావించి సురూప వతిం బెండ్లియాడుదురు. ఇరువురునుగూడియే యుందురు. తపో నిష్ఠ సలుపుదురు. ఈపరీక్షయం దాఱి తేఱినవాఁడే యోగి యనంబడువాఁడు. కావుననే

> "యోషాలిరూపసంపన్నా గర్వితా మదశాలినీ,
> మమ రూపైవ సా జ్ఞేయా పుష్పేనాపి న తాడయేత్."

అని కాళికాదేవి చెప్పెను. అట్టినాతిని గాంచి పరమేశ్వరి జగ జ్జనని యని యెవ్వాఁడు భావించునో వాఁడే జితేంద్రియుఁ డనంబడును మునులతపస్సులఁ జెఱుప నింద్రుఁడు రంభాది దేవ కాంతలం బంచుట వారిచెయ్వులకు లోఁబడి కొందఱు తపో భ్రష్టులగుట పురాణములయందు మనము గాంచుచున్నారము కదా. స్త్రీలనే పంపనేల? అనఁగాఁ బురుషులం గాంచినంతన లేనివైరాగ్యము పొడసూపును. భామినీమణులం గాంచినంతనే యున్న వైరాగ్య మూడిపోవును. కావుననే వైరాగ్యము తీవ్ర ముగాఁ గలిగినదన్నందులకు గుఱుతు ప్రమదామణులంగాంచి నపుడు హృదయము చెదరక యుండుటయే యని మన మూహింపవలయును. ఈపరీక్షకే కుమారీపూజ శాక్తమునఁ జెప్పఁబడినది. పామరులది దుష్టకర్మమనినిందింతురు. కానివారు దానికారణ మెఱుంగరు."ప్రమాదో ధీమతామపి"అన్నసూక్తిని వారెఱుంగ రనవలయును. ఎఱింగియున్న నిట్లా క్షేపింపరు.

ఇట్టిపరీక్షలయం దాటి తేటినవాఁడు కానసే గౌతమముని శ్రీ రామాగమనముదనుక సురాసురులకే నదృశ్యగా నుండఁదగు నని శాసించెను. మనోనిగ్రహ మెంతటిపనికైనఁ జాలునుగదా.

ఈభాగమునుండి మనము నేర్చుకొనఁదగువిషయము లేవన్న నాలకింపుఁడు. ప్రమాదముననొండె తెలిసియొండె పాపము చేసినయంత విచారపడక దానిని స్మరించుచు నిఁక మీఁద నిట్టిది చేయనని శపథములు పలుకుచు భగవంతుని శ్రద్ధాభక్తులుగలిగి యారాధింపవలయుననియు, నాయారాధనము దృఢమూలముగావలయుననియు, దానఁ దృప్తుఁడై సర్వేశ్వరుఁడు జ్ఞానము ననుగ్రహించుననియు, నయ్యది భుక్తశిష్ట పాపముల హరించుననియు, జ్ఞానమువంటిపదార్థము లేదనియు మన మెఱుంగవలయును. అహల్య గౌతమమునియాజ్ఞానుసారము శాపఫలము ననుభవించెను. వాయుభక్షణాదులే శాపఫలములు. అవి తపస్సునకు ననుకూలములే. "ఏకక్రియా ద్వ్యర్థకరీ" అన్నన్యాయ మాయహల్యాశాపమునకు సరిపోయిన దనవచ్చుననియు మన మూహింపవలయును. శ్రీరామచంద్రునిపాదారవిందద్వంద్వ మాయాశ్రమమునందు సోఁకినంతనే యాయహల్య కనఁబడెను.

> "రాఘవౌ తు తత స్తస్యాః పాదౌ జగృహతు స్తదా,
> స్మరంతీ గౌతమవచః ప్రతిజగ్రాహ సా చ తౌ." ౧౭

మునిపత్ని కనఁబడఁగనే రామచంద్రుఁడు లక్ష్మణుఁడు నాపతివ్రతకు నమస్కరించిరి. గౌతమవాక్కును స్మరించి శ్రీరామచంద్రమూర్తి తనశాపమును దొలఁగింప వేంచేసెనని యెఱింగి యాయన్నదమ్ముల సన్మానించెను.

"అభివాదనశీలస్య నిత్యం వృద్ధోపసేవినః,
చత్వారి తస్య వర్ధంతే ఆయుర్విద్యాయశోబలమ్. ౧౨౧
గురువత్ప్రతిపూజ్యాస్స్యుస్సవర్ణా గురుయోషితః,
అసవర్ణాస్తు సంపూజ్యాః ప్రత్యుత్థానాభివాదనైః." ౨౧౦

అను నీమనుస్మృతివచనముల ననుసరించి నమస్కారఫలముల నెఱుంగవచ్చును.

"కామం తు గురుపత్నీనాం యువతీనాం యువా భువి,
విధివద్వందనం కుర్యాదసావహమితి బ్రువన్." ౨౧౬

అనువచనము ననుసరించి యువతియగు గురుపత్నికిఁ బాదములుముట్టి నమస్కరింపరాదని స్పష్టమగును "దీనిచేత పాదౌ జగృహతుః" అన్నమాట యెట్లు పొసఁగునని కొందఱడుగుదురు. కాని యది సామాన్యనియమమనియే మనుస్మృతిభావమని వారెఱుఁగరు.

"విప్రోష్య పాదగ్రహణమన్వహం చాభివాదనం,
గురుదారేషు కుర్వీత సతాం ధర్మమనుస్మరన్." ౨౧౭

"ప్రవాసాదాగత్య సవ్యేన సవ్యం దక్షిణేన దక్షిణమిత్యుక్తవిధి పాదగ్రహణం ప్రత్యహం భూమావభివాదనంచ గురుపత్నీషు యువా కుర్యాత్, శిష్టానామయమాచార ఇతి జానంతు." అని కుల్లూకభట్టు.

ఈనియమము ననుసరించి పాదములు సోఁక నమస్కరింపవచ్చును. కావునఁ "పాదౌ జగృహతుః" అన్న మహాకవిశిరోమణివాల్మీకివచనము సుసంగతమే కాని యసంగతము కాదు. అహల్య విప్రపత్నిగావున భర్తృవాక్యమును దలంచుకొని అతిథేయసత్కారముల వారిని సమ్మానించెను. శ్రీరామచంద్రుఁడామెచేసిన శాస్త్రోక్తసపర్యను బరిగ్రహించెను.

"పాద్యమర్ఘ్యం తథాతిథ్యం చకార సుసమాహితా."

అనువిషయమున నొక్కవిశేషము కలదు. చిరకాలమునుండి తాఁజేసిన తపఃఫలముగా నిశ్చలమనస్కురాలై రామమూర్తి నర్చించెనని యర్థము. ఏసత్కార్యముచేసినను నిశ్చలమనస్సుతోఁ జేయవలయుననియు, నదియే భగవంతునకు సంప్రీతి నొసంగుననియు దీనిసారము జపకాలమునందు మాత్రముగాక భగవదారాధన మేరీతిగాఁ జేయుచున్నను నిశ్చలమనస్సుతో నొనరించినఁగాని యాకర్మము ఫలింపదనియు, రాజసమునఁ జేయుకార్యము స్వల్పఫలము నొసంగుననియు, నయ్యది భగవంతు నలరింపఁజాలదనియు మన మీభాగమున గ్రహింపఁ దగినది.

"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః." భగ. (అ. ౯)

అను శ్రీకృష్ణోపదేశమునందుఁ బరిశుద్ధబుద్ధిగలిగి భక్తిపూర్వకముగా నున్నంతలో నేమి యొసంగినఁ బరిగ్రహింతు నన్న యర్థ ముండుటంబట్టి పరిశుద్ధమనస్సు ప్రధానమని తేలెడిని. యోగము నభ్యసింపక యది లభింపదు. కాన భక్తికింగూడఁ బ్రధానము యోగాభ్యాసమే యని యెఱుంగవలయును.

ఈభాగమునుండి రామచంద్రునిమహత్త్వమును మన మెద్దాని గ్రహింపవలయును? అన్న ప్రశ్నము చక్కనిదగును. శ్రీరామచంద్రుఁ డవతరించుట దుష్టసంహారమునకు మాత్రమే కాదు. శిష్టరక్షణపూర్వక దుష్టశిక్షణమున కని యెఱుంగవలయును. శరణాగతరక్షణము శ్రీరామచరిత్రమునఁ బ్రప్రధానము. పెద్దలమాటల నాలకించి తత్ప్రకారము మెలంగుటయు

నట్టిదే. "ఆర్తత్రాణపరాయణస్స భగవాన్" అన్నసూక్తి నను సరించి రామచంద్రుఁడు ప్రవర్తింపబూనుట కిదియే మొదటిది. వ్యభిచరించిన మునిపత్నిని మోముచూడక తొలఁగిపోవుట న్యాయము. అందును బుద్ధిపూర్వకాపరాధ మహల్య చేసెను. కాని శ్రీరామమూర్తి యావిషయమును దలంపలేదు. తన్ను స్మరించుచుఁ దనయాగమనమును బ్రతీక్షించుచు నియతయై యున్నదన్నవిషయము నే తలంచెను. ఆర్తత్రాణము తనయవ తారమునకు ఫలమని నిశ్చయించెను. తనకేమియుఁ దెలియ నట్టులు, విశ్వామిత్రుఁడు చెప్పినట్టులుగాఁ దాఁజేసిన యట్లు నటించెను. తనదర్శనమాత్రమున శాపనివృత్తి గలుగునని విన్న యంతనే నేనింతవాఁడనా యనురజోగుణము నవలంబింపక మహర్షి ముందుగాఁ బోవుచుండ వెనుకఁబోయెను. ఆశ్రమ మునఁ దనపాదాంబురుహము సోఁకినంతన యామె శాపవిముక్త రాలగును. అదియే పదివేలని యూహించెను. విప్రపత్ని యన్న న్యాయము నెఱింగి యామె ప్రాక్తనాపరాధములం బాటింపక మాతృభావమున నమస్కరించెను. ఇది శ్రీరామచంద్రుని శర ణాగతరక్షణమను ప్రథమకృత్యము.

ఈచరిత్రమును బఠించి మనము నేర్చుకొనఁదగిన విశేష మేది! మానవుఁడు లోకవిఖ్యాతింగాంచఁ దలంచునేని పెద్దల మాట లాలకింపవలయును. అహంకారమును మాని పెద్దలు చెప్పినట్లు చేయవలయును. శరణాగతుని దప్పులెన్నక మంచి భావముతో నాతనికిం దోడ్పడవలయును. ఈకార్యములే యత్యుత్తమకార్యములు. దీనులై తమచెంతఁ జేరఁగనే యట్టి వారిని మనలోఁ బెక్కండ్రు దూషింతురు. అది మహాదోష

కార్యము. తనచెంతఁ జేరినంతన విరోధమును వదలవలయును. సోదర ప్రీతి గారవింపవలయును. అతఁడు మున్ను చేసినయపరాధములఁ దలంపరాదు. ఇప్పటికైన బుద్ధిమంతుఁడై యైకమత్యము నభిలషించెఁగదా యని యానందింపవలయును. చేతనైనంత తోడ్పడవలయును. ఇట్టి ప్రవృత్తియం దెవ్వాఁడు నిరతుండగునో వాఁడే సర్వసమ్మతుఁడై సజ్జనస్తుతిపాత్రుఁడగును. ఈవిషయము లీచరిత్రమునుండి నేర్చుకొని యంతతోఁ దృప్తినందక వాని నాచరణమున నారాధింపవలయును. అప్పుడే శ్రీరామాయణ పారాయణము ఫలవంతమగును. లేనిచోఁ బారాయణమాత్ర ఫలదమే యగును స్వప్రవృత్తిచే లోకులకు ధర్మముపదేశించుటకే శ్రీరామచంద్రుఁ డవతరించెను కావున నాపరాత్పరునిచరిత్రమును బఠించి యద్దానినుండి గ్రహింపఁదగినవిషయములను గ్రహించి శక్తి కనురూపముగా వాని నాచరింపఁ బ్రయత్నింపవలయును. తనకంటెఁ జిన్నవారుగ నుండువారలకుఁ దెలుపవలయును.

> "సాధు సాధ్వితి దేవాస్తామహల్యాం సమపూజయన్,
> తపోబలవిశుద్ధాంగీం గౌతమస్య వశానుగామ్. ౨౦
> గౌతమోఽపి మహాతేజా అహల్యాసహితస్సుఖీ,
> రామం సంపూజ్య విధివ త్తపస్తేపే మహాతపాః." ౨౧

శ్రీరామచంద్రుఁ డహల్య యిచ్చినవిధివిధానమగు నాపూజను గ్రహించినంతనే సురలు పూలవాన గురియించిరి. దేవదుందుభులు మ్రోఁగెను. గంధర్వు లచ్చరలు భగవంతుని జూచుచు నొక్కచోఁ గూడిరి. ఆకాశమంతయు దేవతలచే నిండి యుండెను. తపోబలమునఁ బరిశుద్ధాంగియై యోగబలమున

శ్రీరామభద్రునిరాక నెఱింగి యరుదెంచినగౌతమునిచెంతఁ జేరిన యహల్యను దేవతలు సమ్మానించిరనియే కథాసారము. దీనఁగలవిశేష మేమనఁగా.

"యథాయథా మనస్తస్య దుష్కృతం కర్మ గర్హతి,
తథాతథా శరీరం తత్తేనాధర్మేణ ముచ్యతే. ౨౨౯
కృత్వా పాపం హి సంతప్య తస్మాత్పాపాత్ప్రముచ్యతే,
నైవం కుర్యాం పునరితి నివృత్యా పూయతే తు సః." ౨౩౦
(మను ౧౧ అధ్యా.)

మానవుఁడు ప్రాక్కర్మపాశబద్ధుఁడై యపరాధ మొనరించును. కాని యించుక కాలమునకైన మనస్సునఁ దాఁజేసినదుష్కార్య మునకు విచారము నందవలయును. మనస్సెంతదుష్కర్మమును గుఱించి రోయునో యాతనిశరీర మాయధర్మమునుండి విముక్తిం గాంచును అనఁగా దాఁజేసినపని యధర్మమని యెఱుంగుటయే యొకవిశేషము. అట్టిమానవుఁ డాయధర్మ మును మరలఁ జేయఁజాలఁడు. సకలవిధప్రాయశ్చిత్తములలో నిది యుత్తమప్రాయశ్చిత్తము. అంతమాత్రము పరిజ్ఞానము కలిగినఁ జాలును. మరల నట్టిపాపముల నొనరించునూహ నశిం చును. లోకమునఁ బాపములు చేయనివా రుండుట యరుదు. అందు నుత్తములు పశ్చాత్తాపము నందువారలు. ద్రవ్యరూప ప్రాయశ్చిత్తము లనేకములు గలవు. వానియన్నింటికంటె మన స్సుననే నిట్టిదుష్కార్య మొనరించితినని సంతాపపడుట యత్యు త్తమము. అది యెవ్వానిమనస్సునఁ గలుగునో యాతఁడు మరల నట్టిదుష్కార్యము లెన్నటికిని జేయఁడు. క్రమముగా

సత్కార్యములు చేయ నలవాటుపడును. అట్టిమానవునిం గాంచినయంత దేవతలు గౌరవింతురు.

ఈపద్ధతి యీకథనుండి తేలుచున్నది. అహల్య బుద్ధి పూర్వకముగా వ్యభిచరించెను. మునిశాపమే యాపాపమునకుఁ బ్రాయశ్చిత్త మనరాదు. ఆమె పశ్చాత్తాపమే దానికిఁ బ్రాయశ్చిత్తము. అంతియకాక మునిపతి శ్రీరామచంద్రాగమనము శాపాంతముగాఁ బలికెను. ఏల? ఆమె తనపాప మేనాఁడు తొలంగునా యని యాలోచించుచు నుండుననియు, నారూపమున భగవంతు నారాధించుననియు, నామె భావనయే తపస్సగుననియు, నద్దాన నాకామిని పరిశుద్ధురాలగుటయేగాక లోకమునఁ గలస్త్రీలకుఁ జక్కనిగుణపాఠము నేర్పునదియుఁ గూడ నగుననియు మహర్షి యాలోచించెను. ఈభావము "నివృత్త్యా పూయతేతు సః" అను మనుస్మృతివాక్యము తెల్పుచున్నది.

"ఇదం చ శృణు దేవేంద్ర రహస్యం పరమం మహత్. 33
సర్వేషామేవ పాపానాం యాగపద్యేన నాశనమ్,
భక్తిశ్రద్ధాసమాయుక్తస్స్నాత్వాంతర్జలసంస్థితః. 34
అష్టోత్తరసహస్రం తు జపేత్పంచదశాక్షరీం,
ఆరాధ్య చ పరాం శక్తిం ముచ్యతే సర్వకిల్బిషైః." 35
(లలి. 3 అధ్యా.)

ఈపురాణవచనములతాత్పర్యమేమి? భగవదారాధనముచేసిన మనపాపములు నశించునన్నభావము కలుగవలయుననియేకదా. అట్టిజ్ఞాన మేనాఁడు కలుగునో యానాఁడే పాపములు నశించును. మరలఁ బాపములు చేయఁజాలఁడు. ఈవిషయమును లోకులకుఁ దెలుపుటకే దేవతలు అహల్యను గౌరవించిరి. లేకున్న

నీమె తొల్లి యిట్టిమహత్తరసత్కార్య మొనరించినదని లోకు లకుఁ దెలుపుటకు గారవించి రనవచ్చునా? కావున నెవ్వఁడు కాని పాపములను దెలిసియో తెలియకయో యొనరించి పిదప వానిని బలుమాఱులు స్మరించుకొనవలయుననియు, దానిచేఁ బశ్చాత్తాపము గలుగుననియు, నయ్యది యధర్మనివృత్తికి దారి చూపుననియు, దానిచే భగవంతునియందు విశ్వాసము కలుగు ననియు, నదియే తరణోపాయమనియు మన మెఱుంగవలయును.

శ్రీరామచంద్రు నహల్య యారాధింపగనే యోగబల మున నెఱింగి గౌతమముని యప్పుడే యటఁ బొడచూపెను. అహల్యయు భర్తపార్శ్వమున నిలిచెను. బాగుబాగని యాత రుణమున దేవతలనిరి. అహల్యంగూడి గౌతమముని భగవంతుని శ్రీరామచంద్రుని విధి ననుసరించి పూజించెను అందే తపస్సు చేయఁబూనెను అను నీభాగమున నొకరహస్యము కలదు. అహల్య యాపావనాశ్రమభూమియందుఁ బాపకార్యము నొన రించెను. దాన నాయాశ్రమ మపవిత్రమయ్యెను. కావున నిందుండ రాదని హిమాలయశిఖరమునఁ దపస్సు చేయ నరి గెను. మరల నాయాశ్రమభూమిని శ్రీరామమూర్తి తనపాదా రవిందస్పర్శమునఁ బవిత్రము గావించెను. భగవత్స్పర్శమున కంటెఁ బావనముచేయున దేది యుండును? కనుకనే మరల నందే తపస్సుచేయ నాముని తలంచెనని సార మెఱుంగవల యును. పూర్వులగుమహర్షులు ఈవిషయము నెఱింగియే నదీ తీరములు దేవాలయములు మహాశైలములు మహారణ్యములు తపోయోగ్యములుగ నిశ్చయించి యందే సత్కార్యము లొన రించుచు వచ్చిరి. అట్టితావులఁ గూరుచున్నపు డందలి తేజస్సు

మనస్సునకు నుత్సాహమును గల్గించును. ఇందుఁ బూర్వు లెందఱో తపస్సుచేసి కృతకృత్యులైరన్న భావము పొడ కట్టును.

"తదేవ లగ్నం సుదినం తదేవ తారాబలం చంద్రబలం తదేవ,
విద్యాబలం దైవబలం తదేవ లక్ష్మీపతే తేంఽఘ్రియుగం స్మరామి."

అన్న ప్రాచీనోక్తి సుసంగతమేకదా. సద్భావము దృఢవిశ్వా సము నెందుఁగల్గునో యందే సత్కర్మముల నాచరించిన నయ్యవి సత్ఫలముల నొసంగుననుట నిశ్చయము. కావుననే గౌతముఁడు భగవద్దర్శనమహాభాగ్యమునఁ బవిత్రమతియగు నాయహల్యం గూడి యాయాశ్రమమునందే తపస్సుచేయఁ దలంచెను.

ఎన్నిపాపములు చేసినను దుదకుఁ బ్రాక్సుకృతవశమున భగవద్దర్శనము లభించినయెడల సకలపాపములు పోవునన్నఘట్ట మునఁ గొందఱొకభంగి నాక్షేపింతురు. పాపాత్ములకు భగ వద్దర్శనమగునెడల నెన్నిఘోరపాపములు చేసి భగవంతుని దర్శించిన నాపాపములు తొలఁగునుగదా. ఇఁక శ్రమంపడి తప స్సేలచేయనలయునని. ఇది యంత మంచిప్రశ్నము కాదు. వల యునని ప్రతిదినము పాపము లొనరించుచుండువారికి భగవద్ద ర్శనము కానేకాదు. దానికిఁ బ్రాగ్జన్మసుకృతము కూడ వలయు. పట్టుపట్టి పాపములే చేయుచుండిన వారు భగవంతుఁ డగపడి నను గృతార్థులమగుదుముగదా యని భావింపరు. కావున వారికి దాన లాభములేదు. ఏకారణముననో యొక్కసారి పాపము చేసి పశ్చాత్తాపమంది యిఁక నిట్టిపాపము చేయనని శపథము చేసి తొలుతఁ జేసినపాపమును స్మరించుచుఁ దన్నివృత్త్యుపాయము రోయువారలకే పరమేశ్వరుఁ డగపడును. నాఁటంగోలె వారలు

మనస్సు భక్తిపూర్ణమగు. దానిచే వారు కృతార్థులగుదురు. ఇదియే యుత్తమమార్గము. ఈఘట్టము నాంధ్రీకరించినవా రెట్లు లర్థముగ్రహించిరో యించుక యరయుదము. విమర్శకుల వైఖరిం బరికింతము.

"సాధుసాధ్వితి దేవాస్తామహల్యాం సమపూజయన్,
తపోబలవిశుద్ధాంగీం గౌతమస్య వశానుగాం. ౨౦
గౌతమోఽపి మహాతేజా అహల్యాసహితస్సుఖీ,
రామం సంపూజ్య విధివత్తపస్తేపే మహాతపాః." ౨౧

హిమాలయశిఖరమునఁ దపస్సుచేయుచున్నవాఁడు గౌతముఁడని మున్ముఁ బాఠకులు చదివియుందురు. గౌతమునివశమున నున్న యహల్యను దేవతలు సమ్మానించిరని యిందుండుటచే నెట్లిది పొసఁగునాయని సంశయింతురు. తెలిఁగించువా రట్టి సంశయములు కలుగకయుండ వ్రాయవలయు. వీరిపాండిత్య మక్కఱలేదు. వ్యాఖ్యాతలు వ్రాసియే యున్నారు.

"గౌతమస్య వశానుగామిత్యనేన గౌతమస్తదా రామాగమనం విదిత్వా సమాగత ఇత్యవగమ్యతే" అని గోవిందరాజులు.

"యోగబలాద్రామాగమనం జ్ఞాత్వా తద్బలాదేవ ఝటితి తదాశ్రమప్రాప్తిర్గౌతమస్యేతి బోధ్యమ్." అని మహేశ్వరతీర్థులు.

ఈభావ మించుకయైనఁ జేర్పకయున్న సంశయము తొలఁగదు. ఇఁకఁ దెనుఁగును బరికింతము.

సీ. "దుందుభిస్వనములు క్రందుగ మొరయంగ
మేలుమే లంచును మెచ్చి రింతి
తే. ఘోరతపమున శుద్ధయా వారిజాక్షి

స్వీకరించుచు గౌతమర్షి ప్రవరుఁడు
రాముఁ బూజించె నామునిరాజు చేతఁ
బూజలను బొంది రాముండు పోవఁదొడఁగె."
(వావిలికొలనువారి యథామూలరామాయణము.)

గౌతమునింకనుగుఱించి యిట లేదు. ముని యందే తపస్సు చేయఁ దలఁచెనన్న యర్థ మిట లేదు.

క. "అలరి యహల్యయు స్వతపో
బలమునఁ బరిశుద్ధదేహభాసురయయి యి
మ్ముల రామాగమనమ్మును
దెలిసియె గౌతముఁడు రా మదిందమి పొదలన్.

చ. పెనిమిటిచెంతఁ జేర సురబృందము మంచిది మంచిదంచున
నవ్వనిత బహూకరించిరి; తపఃపరిపాకమునొంది తేజమున్
ఘనమయి గ్రాలుచుండఁ దగు గౌతముఁ డప్పు డహల్యతో
సుఖం, బును గని రామచంద్రునకుఁ బూజ లొనర్చి యథా
క్రమంబుగన్.

తే. అందె నివసించి తపము చేయంగఁబూనె;"
(ఆంధ్రశ్రీమద్రామాయణము.)

విమర్శకులు "ముక్తస్యముకాక్తర్థః" అని వ్రాసినవ్రాతకుఁ గినిసి సమదర్శనులవలె నేమేమో వ్రాసిరి. మూలార్థము పద్యములం దెందున్నదో మతిమంతు లూహింతురుగాక. కేవలపక్షపాతమూని విమర్శించినచో నవి సాధుసమాదృతింగాంచ నేరవని నే నూహింతు. ఎవరిష్టమురీతి వారు మూలార్థమును బద్యముల నిమిడ్చిరని వ్రాసినచో నట్టివిమర్శకులకు నమస్కా

రము. వారే విమర్శకులు. తెనిఁగించునపుడు వారివారియిష్టము ననుసరించి వ్రాయుదురు. గ్రంథకర్తలకుఁ బ్రతినిధులవలెఁ బక్ష పాతమున బట్టురాజులంబోలి పొగడనేల? పొగడినచో సంతో షము. ఇంకొక్కరిని నిష్కారణవైరమూని నిరసింపనేల? అట్టి మహాత్ములవిమర్శన మిట్టిదని పెద్దలకుఁ దెలుపుటకే నాయీ యత్నము. గ్రంథకర్తలలోపములనెంతమాత్రము తలపెట్టను. ఆపని నాదికాదు. కవి తనకుఁ దోఁచినరీతి వ్రాయును. అట్టియధికారము కవులకుం గలదు. ఈసమాధానము విమర్శ కులకుంగాని యితరులకుంగాదు. విమర్శకులు కాఁగోరువారు నిష్పక్షపాతమతులు కాఁదగియుండవలయును. అట్టివారగుదు రేని గ్రంథకర్తలు వారిని గురువులుగా భావించి సమ్మానింప వలయును.

ప్రకృతము ననుసరింతును. శ్రీరామచంద్రుఁడు తనయార్త త్రాణపరాయణత్వమును ముల్లోకములకుఁ దేటపఱచి యమ్మునికుటుంబమును విచారసాగరమున మునిఁగి శ్రమములపాలు గాకయుండఁ జేసి తనరాకకై వేచియున్న సీతాదేవిని లోక దృష్టిచే వివాహమాడఁగోరి మునివెంట నరిగెను. ఈఘట్టమున నహల్య పరమామోదసాగరమున మునింగి భగవంతుని భక్తి నమ్రశిరస్కయై వినుతించెను. ఆస్తుతి పాఠకమహాశయులు పారాయణము చేయఁదగినది. కావున నిందుఁ బొందుపఱచు చున్నాఁడను.

## అహల్యాకృతశ్రీరామస్తుతిః

అహల్యా:—"అహో కృతార్థాస్మి జగన్నివాస తే
పదాబ్జసంలగ్నరజఃకణాదహం,

స్పృశామి యత్పద్మజశంకరాదిభి
ర్విమృగ్యతే రక్షితమానసైస్సదా. ౧

అహో విచిత్రం తవ రామ చేష్టితం
మనుష్యభావేన విమోహితం జగత్,
చలస్యజస్రం చరణాదివర్జిత
స్సంపూర్ణ ఆనందమయోఽతిమాయికః. ౨

యత్పాదపంకజపరాగపవిత్రగాత్రా
భాగీరథీ భవవిరించిముఖాన్ పునాతి,
సాక్షాత్స ఏవ మమ దృగ్విషయో యదాస్తే
కిం వర్ణ్యతే మమ పురాకృతభాగధేయం. ౩

మర్త్యావతారే మనుజాకృతిం హరిం
రామాభిధానం రమణీయదేహినం,
ధనుర్ధరం పద్మవిశాలలోచనం
భజామి నిత్యం న పరాన్ భజిష్యే. ౪

యత్పాదపంకజరజశ్శ్రుతిభిర్విమృగ్యం
యన్నాభిపంకజభవః కమలాసనశ్చ,
యన్నామసారరసికో భగవాన్ పురారి
స్తం రామచంద్రమనిశం హృది భావయామి. ౫

యస్యావతారచరితాని విరించిలోకే
గాయంతి నారదముఖా భవపద్మజాద్యాః,
ఆనందబాష్పపరిషిక్తకుచాగ్రసీమా
వాగీశ్వరీ చ తమహం శరణం భజామి. ౬

సోఽయం పరాత్మా పురుషః పురాణ
ఏషస్స్వయం జ్యోతిరనంత ఆద్యః,

మాయాతనుం లోకవిమోహనీయాం
ధత్తే పరానుగ్రహ ఏష రామః. ౭

అయం హి విశ్వోద్భవ సంయమానా
మేకస్స్వమాయాగుణబింబితోఽజః,
విరించివిష్ణ్వీశ్వరనామభేదాన్
ధత్తే స్వతంత్రః పరిపూర్ణ ఆత్మా. ౮

నమోఽస్తు తే రామ తవాంఘ్రిపంకజం
శ్రియా ధృతం వక్షసి లాలితం ప్రియాత్,
ఆక్రాంతమేకేన జగత్త్రయం పురా
ధ్యేయం మునీంద్రైరభిమానవర్జితైః. ౯

జగతామాదిభూతస్త్వం జగత్త్వం జగదాశ్రయః,
సర్వభూతేష్వసంసక్త ఏకో భాతి భవాన్ పరః. ౧౦

ఓంకారవాచ్యస్త్వం రామ వాచామవిషయః పుమాన్,
వాచ్యవాచకభేదేన భవానేవ జగన్మయః. ౧౧

కార్యకారణకర్తృత్వ ఫలసాధనభేదతః,
ఏకో విభాసి రామ త్వం మాయయా బహురూపయా. ౧౨

త్వన్మాయామోహితధియస్త్వాం న జానంతి తత్త్వతః,
మానుషం త్వాభిమన్యంతే మాయినం పరమేశ్వరం. ౧౩

ఆకాశవత్త్వం సర్వత్ర బహిరంతర్గతోఽమలః,
అసంగో హ్యచలో నిత్యశ్శుద్ధో బుద్ధస్సదవ్యయః. ౧౪

యోషిన్మూఢాహమజ్ఞా తే తత్త్వం జానే కథం విభో,
తస్మాత్తే శతశో రామ నమస్కుర్యామనన్యధీః. ౧౫

దేవ మే యత్ర కుత్రాపి స్థితాయా అపి సర్వదా,
త్వత్పాదకమలే సక్తా భక్తిరేవ సదాఽస్తు మే. ౧౬

నమస్తే పురుషాధ్యక్ష నమస్తే భక్తవత్సల,
నమస్తేఽస్తు హృషీకేశ నారాయణ నమోఽస్తుతే. ౧౭

భవభయహరమేకం భానుకోటిప్రకాశం
కరధృతశరచాపం కాలమేఘావభాసం,
కనకరుచిరవస్త్రం రత్నవత్కుండలాఢ్యం
కమలవిశదనేత్రం సానుజం రామమీడే. ౧౮

స్తుత్వైవం పురుషం సాక్షాద్రాఘవం పురతస్థితం,
పరిక్రమ్య ప్రణమ్యాశు సానుజ్ఞాతా యయౌ పతిమ్. ౧౯

అహల్యయా కృతం స్తోత్రం యః పఠేద్భక్తిసంయుతః,
స ముచ్యతేఽఖిలైః పాపైః పరం బ్రహ్మాధిగచ్ఛతి. ౨౦

పుత్త్రాద్యర్థే పఠేద్భక్త్యా రామం హృది నిధాయ చ,
సంవత్సరేణ లభతే వంధ్యా అపి సుపుత్త్రకం. ౨౧

సర్వాన్ కామానవాప్నోతి రామచంద్రప్రసాదతః,
బ్రహ్మఘ్నో గురుతల్పగోఽపి పురుషస్తేయీ సురాపోఽపి వా
మాతృభ్రాతృవిహింసకోఽపి సతతం భోగైకబద్ధాతురః,
నిత్యం స్తోత్రమిదం జపన్ రఘుపతిం భక్త్యా హృదిస్థం స్మరన్
ధ్యాయన్ ముక్తిముపైతి కిం పునరసౌ స్వాచారయుక్తో నరః."

(అధ్యాత్మరామాయణము. ౫ సర్గము.)

ఈస్తోత్రము ఆపదుద్ధారకమని ప్రఖ్యాతి గాంచినది. కావున భక్తులిద్దానిం బఠింతురు. ఫలస్తుతి పామరులకొఱకని యెఱుంగందగు. ఏల యట్లు లసత్యము చెప్పవలె ననరాదు. భక్తిబీజము పామరులమది నాటుటయే సాధువులకుఁ గర్తవ్యము. అదియే మహాకార్యము పామరులకు నైహికఫలములపై నాశ మెండుగ నుండును. వానిని గోరియే వారు భగవంతు నారా

ధింతురు. ఆఫలములు కలుగునని చెప్పకపోయినచో వారా రాధింపరు. భక్తిబీజము నశించును. వాస్తవముగ నాలోచించిన నైహికాముష్మికములు భగవత్సేవవలనఁ గలుగునని తోఁచును గదా. సర్వపాపఫలములు నశించుట యసత్యము కాదు. పామరుల నుద్ధరించుపొంటె ఫలస్తుతి విశేషించి చెప్పుట యంత యపరాధము కాదు. ఎన్నిశ్రమములకు లోనైనను పామరులు బాగుపడినచో నదియే ముక్తిగా సాధువులు భావింతురు. నియతుఁడై పఠించినయెడల సకలపాపములు నశించుననుట విచిత్రము కాదు. నియతుఁ డగుటకుఁ బ్రాక్సుకృతము తోడు పడవలయును. ఇట్టి విషయముల నుదారబుద్ధు లాక్షేపింపరనియు, నమ్మినవారి నుద్ధరించు టే పరాత్పరునభిప్రాయ మనియు నాయాశయము. ఇఁకఁ దరువాతికథకు మరలుదము.

మహనీయులారా! భగవంతుఁడు తనశక్తిని దాఁచి సామాన్య మానవునిచందమున మెలఁగుచున్నవాఁడు. ఇఁకఁ దనయవతారఫలమగు ధర్మరక్షణము చేయవలసినవాఁ డగును. అయ్యది ప్రకృతిం గూడినఁగాని కలుగదు. కావున మహాప్రకృతియగు సీతాదేవిని బరిణయమాడఁ బ్రయాణమయ్యెను. ఆమెయు శ్రీరామునిరాకకై వేచియున్నది. ఈపట్టున భక్తికిఁ దావులేనిమనస్సుగల పెద్దలు కొందఱు కొన్నిప్రశ్నముల నావరింతురు. వానికి శక్తికనురూపముగా బదులు సెప్పవలయుఁ గదా. శ్రీరామచరిత్రమును వ్రాయుటయే యీగ్రంథాభిప్రాయము కాదు. పరమపవిత్రమగు నారామచంద్రచరిత్రము నుండి నేర్చుకొనవలసిన ధర్మము లేవనియే. కావున నాప్రశ్నములం దెలిపి సమాధానముగా స్మృతుల నుదహరించుచు

నాలుగుమాటలు వ్రాయుదును. నాకుందోఃపని సద్విషయము లను దమరు నాలోచించి యీసమాధానవాక్యములతో జత చేయవలయును.

"షట్త్రింశదాబ్దికం చర్యం గురౌ త్రైవేదికం వ్రతం,
తదర్ధికం పాదికం వా గ్రహణాంతికమేవ వా. ౧
వేదానధీత్య వేదౌ వా వేదం వాపి యథాక్రమం,
అవిప్లుత బ్రహ్మచర్యో గృహస్థాశ్రమమావసేత్. ౨
గురుణానుమతస్స్నాత్వా సమావృత్తో యథావిధి,
ఉద్వహేత ద్విజో భార్యాం సవర్ణాం లక్షణాన్వితాం. ౪
అసపిండా చ యా మాతురసగోత్రా చ యా పితుః,
సా ప్రశస్తా ద్విజాతీనాం దారకర్మణి మైథునే. ౫
నోద్వహేత్కపిలాం కన్యాం నాధికాంగీం న రోగిణీం,
నాలోమికాం నాతిలోమాం న వాచాటాం న పింగళాం. ౮
అవ్యంగాంగీం సౌమ్యనామ్నీం రహాగామినం నీవాంణ,
తనులోమకేశవదనాం మృద్వంగీముద్వహేత్ స్త్రియం." ౧౦

(మను 3 అధ్యా.)

"అవిప్లుత బ్రహ్మచర్యో లక్షణ్యాం స్త్రియముద్వహేత్,
అనన్యపూర్వికాం కాంతామసపిండాం యవీయసీం." ౫౨

(యాజ్ఞ. ఆచారకాండము.)

"యవీయసీం వయసా ప్రమాణతశ్చ న్యూనాముద్వహేత్ పరిణయే త్పరిణయేత్స్వగృహ్యోక్తవిధినా." (విజ్ఞానేశ్వరయోగి.)

"స్నాత్వాఽసమానార్షామస్పృష్టమైథునాం యవీయసీం సదృశీం భార్యాం విందేత్." (వసిష్ఠస్మృతి. ౮ అధ్యా.)

అను నీమొదలగుస్మృతుల ననుసరించి వరునివయస్సునకు మించని

వయస్సుగల కన్యకం బెండ్లియాడవలయునని సిద్ధాంతమగు చున్నది. వరవయోఽధికకన్యక వివాహయోగ్యురాలు కాద నియే తేలెడిని. తక్కినచర్చలతో నిచ్చటఁ బనిలేదు. సీత జనకు నింటఁ బెరుగుచుండెను. శ్రీరామునకంటె వయస్సునఁ బెద్దది. కావున వివాహ్యకన్యక యగునా యనునదియే కొందఱు మహాత్ముల ప్రశ్నము. సమాధానమును జిత్తగింపుఁడు.

లోకదృష్టిని శ్రీరామచంద్రచరిత్రమును బరికింపరాదు. భగవదవతారము రామమూర్తి కాదన్నవారల కీసమాధానము పనికిరాదు. సీత భూపుత్త్రిక అయోనిసంభూత, అనువార్త నంగీకరింపమన్నవారికింగూడ నీసమాధానము రుచింపదు. సీతాదేవి మహామాయ. శ్రీరామమూర్తి భగవదవతారము. అని యంగీకరించునట్టి యాస్తికులకే యీసమాధానము పనికి వచ్చును.

"ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి,
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్. ౧౯
కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే,
పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే." ౨౦
(౧3 అధ్యా.)

"మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరం,
హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే. ౧౦
అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితం,
పరం భావమజానంతో మమ భూతమహేశ్వరం." ౧౧(గీత:౯ అ.)

అన్న భగవద్వాక్యము ననుసరించి ప్రకృతిపురుషుల కనాదిత్వము సంసిద్ధము. సామాన్యజ్ఞానదృష్టి నాలోచించినను జననమరణ

ములు లేనివారు ప్రకృతిపురుషులని తోఁచును. వారియవతార ములయందును వారిధర్మములే యనుష్ఠేయములుగాని సామాన్యలోకధర్మము లనుష్ఠేయములు కావు "యవీయసీమ్" అన్న నియమము సామాన్య ధర్మముకాని యతిమానుషధర్మము కాదు. కాఁబట్టి వివాహ్యాకన్యక యెట్టిదన్న ప్రశ్నమున కిట నవకాశము లేదు. శ్రీరామచంద్రుని వివాహమును లక్ష్యముగా గ్రహించి మానవు లేల ప్రయత్నింపరాదు? అని ప్రశ్నించువా రున్నారు? శ్రీరామమూర్తి పాదరజస్సంబంధమున నహల్య శాప ముక్తియయ్యెను అట్లే మనపాదరజస్సంగమమున నెవ్వరు శాపవిముక్తిం గాంతురు? అని మాత్రము ప్రశ్నింపరు. ఏల? అట్టిశక్తిమనకు లేదని వారెఱుంగుదురు కాని భగవత్తత్త్వ మున వారికి సంపూర్ణవిశ్వాసము లేదు. కావుననే తోఁచిన యట్టులు పల్కుదురు. అవి వేదవాక్కులుగాఁ గొందఱు నమ్ముదురు. అంతియగాని మానవసామాన్యధర్మములు భగవత్తత్త్వమున కన్వయింపవచ్చునా యన్నయాలోచనము వారికి లేదు. సామాన్యమానవుఁ డన్నచో రాముఁడు సీతను బెండ్లి యాడుటమాత్రము వయస్సుననుసరించి స్మృతిసమ్మతము కాదన వచ్చును. స్వయంవరము కేవలక్షత్రియజాతిధర్మము. ఆవివాహ మున నీవయోధర్మమనుష్ఠానార్హమా యని కొందఱడుగుదురు. స్మృతులఁ బరిశీలించినచో నెందైనఁ గనఁబడుఁగాని యంత పరిశీలించునంతయవసరము నాకిందుఁ గనఁబడదు. నాయభిప్రాయమునఁ బ్రకృతిపురుషులగు సర్వబ్రహ్మాండజనకులు సీతారాములని యున్నది. కానఁ బైనివ్రాసినదే చాలునని సంతుష్టి నంది తరువాతివిషయమునకుం గడంగెదను.

## శ్రీరామాదులు మిథిలను బ్రవేశించుట.

*భగవంతుడు తనయాపదుద్ధారకబిరుదమును సార్థకము చేసి సర్వకార్యకర్త్రియయి స్వాభిన్నయగు ప్రకృతిని సీతా నామమున వెలయుచు జనకపుత్త్రియన్న ప్రఖ్యాతింగాంచి యున్న యామహామాయను గూడఁ దలఁచెను. అప్పుడుగాని తనసర్వసాక్షిత్వము వెలయదని యూహించెను. పాఠకమహా శయు లహల్యాస్తోత్రమును బరిశీలించియే యుందురు. అందుఁ బంద్రెండవశ్లోకమును మరల నొకసారి పఠింపుఁడు.

"కార్యకారణకర్తృత్వ ఫలసాధనభేదతః,
ఏకో విభాసి రామ త్వం మాయయా బహురూపయా." ౧౨

దీనింబట్టి విమర్శింపఁగాఁ ద్రిమూర్తులు ప్రకృతి చేతిలోని యాటబొమ్మలని తేలెడిని. భగవంతుఁ డొక్కఁడే ఆయాయి కార్యముల కాయాయికారణములచే నాయాఫలముల నొసం గుచు బహురూపముల విరాజిల్లుమాయంగూడి యనేకరూప ములు గలయట్టు లుండును. అనియే కదా యిందుఁగలసారము. వీరవైష్ణవులవాదమున కిటఁ జోటు లేదు. త్రిమూర్తులు నాధి కారపురుషులనియు, వారిని సృజించిన పరమాత్మ వేఱనియు, నామహనీయునియిచ్ఛయే సర్వకార్యముల నొనరించుననియుఁ దాత్పర్యము. ఇట్టులుండ శివునికంటె విష్ణువధికుఁడని, విష్ణువున కంటె శివుఁడధికుఁడని వాదించువారికి భగవత్తత్త్వమునకు నెంతదూరము? ఊరక నోటిమాటలచేఁ బాపము గట్టుకొను టెలకో తెలియకున్నది. ఈవిషయమునే

*ఇత్యాది యేఁబదియవ సర్గమునుండి సంగ్రహింపఁబడినది.

"అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితం."

అన్న శ్రీకృష్ణపరమాత్మబోధము తేటపఱచుచున్నది. అతీంద్రియ విషయమును విమర్శించునపుడు తానొకరూపము నుపాసింతు నని పలుకవచ్చునుగాని యిది యెక్కుడు ఇది యెక్కుడు కాదు. అని సిద్ధాంతముచేయ సాధ్య మేలాగగును? అట్టులుండఁగాఁ జూచినట్లు నాదైవ ముత్కృష్టుఁడని యితరదైవ మపకృష్టుఁడని పలుకుట కవకాశ మేది? అది యట్లుండఁగా నూరక కుడిచి కూరుచుండ లేక నోటికివచ్చినట్లు దూషించు టేల? ఇవియే దుష్కార్యములు. తనయుత్తమగతిని ధ్వంసముచేయునాయు ధములు. ఈమాటను అహల్యాస్తుతియందుఁ గల్గు

"త్వన్మాయామోహితధియస్త్వాం న జానంతి తత్త్వతః,
మానుషం త్వాభిమన్యంతే మాయినం పరమేశ్వరం." ౧౩

అనునీశ్లోకము దృఢపఱచుచున్నది. ఇట్టివారలగతి యేమి? అనఁగా,

"దేవ మే యత్ర కుత్రాపి స్థితాయా అపి సర్వదా.
త్వత్పాదకమలే సక్తా భక్తిరేవ సదాస్తు మే."

అన్న యహల్య యుపదేశమే ప్రధానముగా విశ్వసించినఁగాని యుత్తమగతి కల్గదు. భగవద్దూషణమునకుఁ బశ్చాత్తాపము ప్రాయశ్చిత్తము. ఓభగవంతా! నీవు సర్వరూపుఁడవు. సర్వ నామధేయుఁడవు. సర్వాంతర్యామివి. సర్వశబ్దవాచ్యుఁడవు. ఆయాయి భక్తులవాంఛలందీర్ప నాయారూపముల ధరింతువు. ఇట్టినిన్నెఱుంగక దుష్కర్మమోహితులమై నీరూపభేదములఁ గొన్నింటిని దూషించితిమి. కావున నీపాపమునకుఁ బ్రాచిత ముగా నీమహిమముల నెఱుంగమని యిఁక దూషింపమని

యొట్టుపెట్టుకొనుచున్నాము. నీయందు దృఢభక్తిగలిగి నీపాదారవిందముల భజించు రాజయోగము మాకనుగ్రహింపుము. అంతియ చాలును అసునీభావము గలిగిన మతభేదములు నశించును. పాపార్జనమునకుఁ జోటుండదు. కావున భగవంతుని ధ్యానించుచు నాతనిమహత్త్వ మపారమని తలంచుచుఁ దచ్చరిత్ర మనూహ్యమని నమ్ముచుఁ దద్భజన ముత్తమధర్మమని నిశ్చయించుచు నుంట మనవంటిపామరులకు సాధుమార్గము. దీనికంటె నత్యుత్తమమార్గము వేఱొండు కానరాదు. ఇఁకఁ గథవంకకు మరలుదము.

భగవంతుఁ డగు శ్రీరామచంద్రుఁడు స్వాంశమగులక్ష్మణుంగూడి విశ్వామిత్రాదిమహర్షులు ముందు నడువఁగా వారి వెంట నైశానిదిక్కునఁ గొంతదూర మరిగి జనకమహారాజు యాగశాలం బ్రవేశించెను. రామలక్ష్మణులంతట విశ్వామిత్ర మునిం గాంచి మహామునీ! జనకరాజు యజ్ఞసంభారములు మిక్కిలి ప్రశస్తములుగా నున్నవి. ఈప్రక్క చూడుఁడు. వేదములఁ బఠించుచు నానాదేశవాసులగు నుత్తమబ్రాహ్మణులు బహుసహస్రసంఖ్యాకులు యజ్ఞవాటమున నున్నవారు. వందలకువందలుగా బండ్లు అగ్నిసంభారముల నించుకొని క్రిక్కిఱిసి యుండ నెంతో ముచ్చటగా మహర్షులవిడుదు లివె కనఁబడుచున్నవి. ఎడములేని యీచోట మనము నివసింపఁదగిన తావు కానరాదు. కాన నెందు మనము నివసింపఁదగునో యేర్పఱుపుము.

శ్రీరామవాక్యము నాలకించి విశ్వామిత్రుఁడు జనసంకులముగాక పరిశుద్ధమై జలములు గలిగి యున్న యొక్కచోటు

నివసింపఁదగినదానినిగా నిశ్చయించెను. అత్తఱి విశ్వామిత్రుని యాగమనము జనకునకుఁ దెలిసెను. వెంటనే యామహారాజు మహనీయుఁడగుతనపురోహితుని శతానందుని మున్నిడుకొని త్వరపడి వినయము దళుకొత్త నెదురేగి మునింగాంచెను. వి ధులనెఱింగినఋత్విజులు త్వరపడి యర్ఘ్యపాద్యమధుపర్కాది పూజావస్తువులం గైకొని విధిదర్శితమార్గమున మంత్రపూర్వ కముగా విశ్వామిత్రున కాతిథేయసత్కృతుల నాదరించిరి. జనకుఁడు విధిపూర్వముగా నొసంగిన యాసత్కారమును బరి గ్రహించి యాతని ననామయంబడిగి యాగము నిరంతరాయ ముగా సాగుచున్నదియా యని ప్రశ్నించి, యవ్వల ఋత్విజు లను బురోహితుఁడగుశతానందుని వరుసఁగాఁ గుశలముల నడిగి యందఱింగూడి సంతోషించుచుండెను.

జనకమహీపాలుఁడు కృతాంజలియై కౌశికుంగని మహా త్మా! మీరిమ్మునులంగూడి యీపీఠములఁ గూరుచుండుఁడు. అని ప్రార్థించెను. తదాదిష్టవిష్టరమ్మునఁ గూరుచుండఁ దక్కిన ఋత్విక్పురోహితులును గూరుచుండిరి. పదప రాజమంత్రులు గూరుచుండిరి. ఎల్లరుఁ గూరుచున్న పదప జనకభూపతి కౌశిక మునిపతిం గాంచి "మహాత్మా! నాయజ్ఞము నేడుగదా సఫల మయ్యెను. సమృద్ధిఫలము దేవతలమూలమున లభించెను. యజ్ఞముమాట యటుండనిందు తమరిని దర్శించుటంజేసి యజ్ఞ ఫలము నాకొనఁగూడినది. మహర్షులంగూడి మీ రిచ్చటికి వచ్చుటచేత నేను గృతకృత్యుఁడనే యైతిని. మీయనుగ్రహ పాత్రుఁడ నైతిని. కాన సఫలజన్ముఁడ నైతిని. మతిమద్వరిష్ఠు లగు ఋత్విజు లీయజ్ఞ మింకఁ బండ్రెండుదినములకుఁ బూర్ణం

బగునని వచించుచున్నారు. అంతట దేవతలు స్వస్వహావిర్భాగ ములఁ బరిగ్రహింప నరుదెంతురు. అంతదనుక మీరిందే యుండి వారిని దర్శింపఁదగు." అని పలికి సంతోషముప్పొంగ దాన ముఖము ప్రకాశింప మరల నమ్మునితో నిట్లు ప్రశ్నించెను.

"మునిచంద్రమా! మీకు శుభంబగుంగాక. ఈకుమారు లిద్దఱెవరు? వీరల రూపవైఖరిం గాంచ విష్ణుతుల్యపరాక్రమ సంపన్నులని తోఁచెడిని. గజేంద్రముభంగి గంభీరముగను, వ్యాఘ్రంబురీతి భయంకరముగను, వృషభేంద్రము కరణి గర్వ యుక్తముగను వీరలనడక కనఁబడును. వీరకుమారులగు వీరి కన్నులజంట పద్మపత్త్రముల సరిపోలుచు వీరిసౌందర్యమును దెలుపుచున్నది. వీరు ధర్మాచరణపరాయణత్వమున బాణకృపాణ శరాసనములఁ జేతంబూని వెలయుచున్నవారు. రూపమశ్వి దేవ తలమాడ్కి నున్నది. దానికిం దగినట్లు నిండుజవ్వనము నివ్వ టిల్లుచున్నది. వీరు స్వేచ్ఛచే దేవలోకమునుండి భూమి నవత రించిన దేవతలా యనఁ దగియున్నవారు. మార్గము కంటక శిలావృతమగుట దుర్గమముగ నుండఁ గోమలపాదములు గంద వీ రేరీతి నడచి వచ్చిరి? ఎవ్వారిం గాంచ నేపని నెఱవేర్ప వీరి యాగమనమో తెలియఁగోరుదును. మీరు సర్వజ్ఞులరు. ఆయుధ ధారులగు వీ రెవ్వారితనయులు? ఆకాశమును చంద్రసూ ర్యులు ప్రకాశింపఁజేసినట్లు వీర లిదేశమును దమమేటి శరీర తేజంబుల వెలయఁజేయుచున్నారు. వీరు దేహప్రమాణేంగిత చేష్టితములచేఁ బరస్పరము సమానులై జోడుగాఁ గనఁబడు చున్నవారు. కాకపక్షధరులగు వీరివృత్తాంత మున్నదున్నట్లు వినఁ గాంతుంతు"నని ప్రశ్నించెను. జ్ఞానధనుఁడగు జనకమహీ

జాని ప్రశ్నింపఁగా విని విశ్వామిత్రుఁ డాకుమారులు దశరథ పుత్త్రులని తెలిపి సిద్ధాశ్రమమున నుండుటయు, నందు యజ్ఞధ్వంసకులగు రాక్షసుల నాకుమారులు పొలియించుటయు, సకల రాక్షసభూయిష్ఠమగు నరణ్యమార్గముల భయమింతయు లేక వారు వచ్చుటయు, విశాలానగరమును జూచుటయు, నహల్యను గాంచుటయు, గౌతమసమాగమము నొందుటయుఁ దెలిపి నీయింటనున్న భూరిచాపముసారము పరికింపఁ గోరి వచ్చిరను నీమొదలగు వృత్తాంతముల నెల్లఁ దెలియంజెప్పి యూరకుండెను.

ఉదారహృదయులారా! ఈభాగమునుండి మనము కొన్నివిషయముల నేర్చుకొనవలయును.

> "శతానందం పురస్కృత్య పురోహితమనిందితం. ౬
> ప్రత్యుజ్జగామ సహసా వినయేన సమన్వితః,
> ఋత్విజోఽపి మహాత్మాన స్త్వర్ఘ్యమాదాయ సత్వరం. ౭
> విశ్వామిత్రాయ ధర్మేణ దదుర్మంత్రపురస్కృతం,"

అనునీభాగము నించుక పరికింతము. వచ్చినవాఁడు విశ్వామిత్రుఁడు. క్షత్రియుఁడు. తపోబలమున బ్రహ్మర్షి యయ్యెను. శతానందుఁడు గౌతమపుత్త్రుఁడు. బ్రహ్మర్షి. ఋత్విజులు బ్రహ్మర్షులు. ఇట్టు లయ్యు నతిథియగు విశ్వామిత్రున కెదురు పోయి యథాశాస్త్రముగ మంత్రపురస్సరముగా నర్ఘ్యాదు లొసంగి గారవించిరి. అనునది కథాభాగము. దీనినుండి మనమేమి పరిగ్రహింపవలయు? ప్రాయశః పండితు లసూయాగ్రస్తులని లోకవిదితమగు విషయము. అందును క్షత్రియుఁడు బ్రాహ్మణుండయ్యె నన్న మఱెంత యోర్వఁజాలరు. ఇట్టు లుండఁగా జనకమహా

రాజుంగూడి బ్రహ్మహరాయలావిశ్వామిత్రునకుఁ బాదప్రక్షాళన పూర్వకముగా మధుపర్కాంతముగా సత్కారముల నొన రించిరి కదా. ఈకాలమునఁ గలవారలకు నాకాలపుఁబండి తులకుఁ గలభేద మెఱుంగఁదగును. పండితు లనఁగా

"విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ పండితాస్సమదర్శినః."

అన్నగీతాశాస్త్రోక్తి ననుసరించి దుర్మదము లేక సమదర్శనులగు వారే పండితు లనఁబడుదురు. శాస్త్రములు చదివినంతమాత్ర మునఁ బండితులుగారనియు, నసూయాగుణము సకలక్షేమముల నశింపఁజేయునది యనియుఁ, గావున దానిని మానినవారే పండితు లనఁబడుదురనియు మన మెఱుంగవలయును. ప్రమా దముననొండె, పరిజ్ఞానముననొండె, అపరాధము చేసి పశ్చాత్తాప పడక "తదేవాహం సాధయామి" అనువారిని మనమెందఱను చూచుచున్నాము. తనతప్పును తప్పుగాదని సాధించువారికంటె మూర్ఖులు గలరా?

"అధిగతపరమార్థాన్ పండితాన్మావమంస్థాః." అని భర్తృహరి.

సత్యం తపోజ్ఞానమహింసతా చ
విద్వత్ప్రణామం చ సుశీలతా చ,
ఏతాని యో ధారయతే స విద్వాన్న
కేవలం యః పఠతే స విద్వాన్,
శాస్త్రాణ్యధీత్యాపి భవంతి మూర్ఖా
యస్తు క్రియావాన్ పురుషస్స ఏవ,
సుచింతితం చౌషధమాతురాణాం
న నామమాత్రేణ కరోత్యరోగం.(సుభాషితరత్నభాండాగారము)

అనునీనీతిరత్నములు పండితలక్షణములను దెలుపుచున్నవి. ఈలక్షణములు లేక వదరుబోతులగువారు పండితులు కారనియు, నోర్పుగలిగి సదాచారమును బాటించుచు యోగ్యతనే ప్రధానముగాఁ జేకొనుచు నితరులను దూషింపక సర్వదేహాంతరస్థుని బరమాత్మను ధ్యానించుచు నుండువారే పండితులనియు నెఱుంగందగు.

> "**దంభం నోద్వహతే న నిందతి పరాన్ నో భాషతే నిష్ఠురం**
> **ప్రోక్తం కేనచిదప్రియం చ సహతే క్రోధం చ నాలంబతే,**
> **జ్ఞాత్వా శాస్త్రమపి ప్రభూతమనిశం సంతిష్ఠతే మూకవ**
> **ద్దోషాంశ్ఛాదయతే గుణాన్ వితనుతే చాష్టా గుణాః పండితే.''**
>
> **(ఉద్భటసాగరము.)**

అని పండితగుణములు వర్ణింపఁబడినవి. ఇందేది లోపించినను నామధారియే యని స్పష్టమగును పండితలక్షణముల నెఱింగిన వారు కనుకనే యోగ్యతననుసరించి విశ్వామిత్రుని బూజించిరని మన మెఱుంగందగును.

## అతిథిపూజ.

దీనింగూర్చి మనము చక్కఁగా విమర్శింపందగు. అతిథిపూజ ముఖ్యమని యెఱుంగవలయును.

> "**ఇష్టో వా యది వా ద్వేష్యో మూర్ఖః పండిత ఏవ వా,**
> **సంప్రాప్తో వైశ్వదేవాంతే సోఽతిథిస్స్వర్గసంక్రమః.** ౮౦
> **దూరాచ్చోపగతం శ్రాంతం వైశ్వదేవ ఉపస్థితం,**
> **అతిథిం తం విజానీయాన్నాతిథిః పూర్వమాగతః.** ౮౧
> **నైకగ్రామీణమతిథిం సంగృహ్ణీత కదాచన,**

అనిత్యమాగతో యస్మాత్తస్మాదతిథిరుచ్యతే. ౪౨
అతిథిం తత్ర సంప్రాప్తం పూజయేత్స్వాగతాదినా,
తథాసనప్రదానేన పాదప్రక్షాళనేన చ. ౪౩
శ్రద్ధయా చాన్నదానేన ప్రియప్రశ్నోత్తరేణ చ,
గచ్ఛతశ్చానుయానేన ప్రీతిముత్పాదయేద్గృహీ. ౪౪
అతిథిర్యస్య భగ్నాశో గృహాత్ప్రతినివర్తతే,
పితరస్తస్య నాశ్నంతి దశవర్షాణి పంచ చ. ౪౫
కాష్ఠభారసహస్రేణ ఘృతకుంభశతేన చ,
అతిథిర్యస్య భగ్నాశస్తస్య హోమో నిరర్థకః. ౪౬
సుక్షేత్రే వాపయేద్బీజం సుపాత్రే నిక్షిపేద్ధనం,
సుక్షేత్రే చ సుపాత్రే చ హ్యుప్తం దత్తం న నశ్యతి, ౪౭
న పృచ్ఛేద్గోత్రచరణే న స్వాధ్యాయం శ్రుతం తథా,
హృదయే కల్పయేద్దేవం సర్వదేవమయో హి సః. ౪౮
అపూర్వస్సువ్రతీ విప్రో హ్యపూర్వశ్చాతిథిస్తథా,
వేదాభ్యాసరతో నిత్యం త్రయోఽపూర్వా దినేదినే." ౪౯
(పారాశరస్మృతిః.)

"విద్యాతపస్సమృద్ధేషు హుతం విప్రముఖాగ్నిషు,
నిస్తారయతి దుర్గాచ్చ మహతశ్చైవ కిల్బిషాత్. ౯౮
సంప్రాప్తాయ త్వతిథయే ప్రదద్యాదాసనోదకే,
అన్నం చైవ యథాశక్తి సత్కృత్య విధిపూర్వకం. ౯౯
అప్రణోద్యోఽతిథిస్సాయం సూర్యోఢో గృహమేధినా,
కాలే ప్రాప్తస్త్వకాలే వా నాస్యానశ్నన్ గృహే వసేత్. ౧౦౫
నవై స్వయం తదశ్నీయాదతిథిం యన్న భోజయేత్,
ధన్యం యశస్యమాయుష్యం స్వర్గ్యం వాతిథిపూజనమ్." ౧౦౬
(మను. 3 అధ్యా.)

అతిథి యనఁగా నాగ్రామమునఁ గాఁపుర ముండనివాఁడు. భార్యతోఁ గూడనివాఁడు. ఒక్కదినము మాత్రమే మార్గ వశమున వచ్చి యుండి పోవువాఁడని యర్థము. వైశ్వదేవ కాలమున రాఁగా వానిం బూజించి యన్నము పెట్టక పంప రాదనియు, నతిథిపూజ యత్యుత్తమమనియు పైస్మృతుల సారము.

యజ్ఞకాలమునఁ బిలువంగఁబడక పోవలయుననియు నియమము కలదు. విశ్వామిత్రుఁడు రాఁగా "నభ్యాగతస్స్వయం విష్ణుః" అన్నప్రాక్తనసూక్తి ననుసరించి పైవిధుల ననుసరించి పురోహితాదుల మూలమునఁ బూజించెను. వారు యథావిధి నతని నారాయణమూర్తిగా భావించి పూజించిరి. వేదవేదాంగ వేత్తయగు సాధువును నారాయణమూర్తిగా సంభావించి పూజించినయెడల భగవంతుఁ డానందించును. ఈపూజయందుఁ గలసారమేమి! భగవంతుఁ డనుభావనయే యని యెఱుంగ వలయును దేవాలయముల శిలామయవిగ్రహములను భగ వంతుఁడని భావించి ఫలములు గలిగెనని యానందించువా రున్నారుకదా. ఆఫలములు కర్మమూలమున సిద్ధించినను దేవ తానుగ్రహమునఁ గల్గెనని తలంచుట లేదా. ఏమూర్తిని గాని భగవంతునిగా మనస్సున భావించి పూజించిన నాభగ వంతుఁ డానందించుననఁగా భావమేమి? ఎల్లమూర్తులు భగ వంతునివే యని కాదా! అతిథిని బూజించిన భగవంతుని బూజించినట్లగునని స్మృతులు చాటుచుండఁగా, మధ్యవైష్ణ వులు శివుని బూజించిన నరకమువచ్చునని కొందఱు, శివదర్శన మున సచేలస్నానము చేయవలయునని కొందఱు, ఘోషించుట

కేవలాజ్ఞానముననే యనియు, వారలు పూర్వజననమున దుష్కర్మల నొనరించిరనియు మన మూహించుట సత్యదూరము కాదు.

"స బ్రహ్మస్స శివస్స హరిస్సేంద్రస్సోఽక్షరః పరమ స్స్వరాట్."

అనుశ్రుతియైన వారికి బుద్ధిచెప్పదు కాబోలు. ఏమూర్తినిగాని భగవంతునిగా భావించి పూజించిన యాభగవంతుఁ డానందించును గాన భక్తిశ్రద్ధాపూర్వకముగా నారాధింపవలయు ననియు, భక్తియే ప్రధానమనియు, భావన భగవత్ప్రీతికి నాధారమనియు, నితరవస్తువ్రాతములు కావనియు, నెన్నిపదార్థముల నేకరించినను భక్తిపదార్థము లభింపనిచో నాపూజ సఫలము కాదనియు మన మెఱుంగవలయును.

"ఇమౌ కుమారౌ భద్రం తే దేవతుల్యపరాక్రమౌ. ౧౭
గజసింహగతీ వీరౌ శార్దూలవృషభోపమౌ,
పద్మపత్రవిశాలాక్షౌ ఖడ్గతూణీధనుర్ధరౌ. ౧౮
అశ్వినావివ రూపేణ సముపస్థితయౌవనౌ,
యదృచ్ఛయైవ గాం ప్రాప్తౌ దేవలోకాదివామరౌ. ౧౯
కథం పద్భ్యామిహ ప్రాప్తౌ కిమర్థం కస్య వా మునే,
వరాయుధధరౌ వీరౌ కస్య పుత్రౌ మహామునే. ౨౦
భూషయంతావిమం దేశం చంద్రసూర్యావివాంబరం,
పరస్పరస్య సదృశౌ ప్రమాణేంగితచేష్టితైః. ౨౧
కాకపక్షధరౌ వీరౌ శ్రోతుమిచ్ఛామి తత్త్వతః,"

ఇది జనకరాజు కౌశికుని రామలక్ష్మణులంగాంచి వారివిషయము నెఱుంగఁగోరి ప్రశ్నమొనరించినఘట్టమునఁ గలశ్లోకపంక్తి.

ఇందుఁ గలభావమును భాషాంతరీకరణమొనర్చినవా రెంత గ్రహించి యెంత వదలిరని పాఠకమహాశయులకుఁ దెలుపఁ గోరి వ్రాయుదును. మూలమును బద్యములను బరికించి యందలి గుణాగుణముల గ్రహించుభారము తమ దేయని విన్నవింతును. యథామూల మేది? అని పాఠకమహాశయులకుఁ దేటపడును. భట్టుపలెఁ బక్షపాతమూని యొకదానింబొగడిన దోషము లేదు. కాని యీాసున నొకదానిని దూషించిన న్యాయమగువిమర్శ మది కాదని నిష్పక్షపాతమతులు గ్రహింతురు గాక.

సీ "ఏవారలయ్య యీా దేవపరాక్రముల్,
వారణపంచాస్యపరమగతులు
వీరలు శార్దూలవృషభసంకాశులు
జలజాతలోచనుల్ సరసమతులు
కరవాలతూణీరశరచాపధారులు
నాశ్వినేయసమానహారితనులు
తొలకరించుచునున్న మొలకప్రాయమువార
లిచ్ఛమై దివినుండి! యిలకు దిగిన
తే. యమృతభోజనులట్టుల యమరువారు
మఱియు నింగితచేష్టాప్రమాణములను
నొక్కరూపయి కూఁకట్ల నొప్పువారు
వేఁడెదను జెప్పవే నాకు వీరి తెఱఁగు.
చ. అని జనకుండు పల్కిన మహాత్ముఁడు గాధిసుతుండు"
వావిలికొలనువారి రామాయణము.

సీ. "మీాకు శుభంబగుఁగాక కుమారకుల్
వీరిర్వు రెవ్వరు వీరియాకృ

తులవిధంబును జూడఁ దోఁచె విష్ణునిబోలు
నట్టి పరాక్రమంబలరువార
లని నాకు; దంతిసింహములట్లు గాంభీర్య
పౌరుషగమనముల్ ప్రబలుచుండ
వ్యాఘ్రవృషంబులయట్లు భయంకర
సవిలాసగతులు నెసంగుచుండఁ
తే. బొలిచి రీవీరవర్యులు లలితపద్మ
పత్త్రసువిశాలనయనులై ప్రకటఖడ్గ
భూరితూణీరచాపముల్ పూని యశ్వి
దేవతలఁ బోలురూపంబు తేజరిల్ల.

క. తనుసుందరతకు నీడగు
ననూనయౌవనము వెలయ నలరారిరి వీ
రనిమిషు లిచ్చను క్షితినిం
గన దివమునుండి దిగినగతి సుందరు సూ.

సీ. మృదుపదంబులు గంద మొగులఁ గఠినమార్గ
ముల నిట వచ్చిరి యలరువీరి
గాత్రసౌందర్యంబుఁ గాంచినఁ గోరిక
లన్నియు నెఱవేఱియున్నమాడ్కిఁ
గనఁబడుచున్నది కమ్రరూపులు వీర
లెవనిపుత్త్రకు లన్ని యొఱుఁగుదీవు
కానఁ జెప్పుము దివాకరశీతకరు లభ్ర
మును బోలె నీదేశమును నలంక
తే. రించుచున్నారు వీరు శరీరమాన
మునను నింగితచేష్టితంబులఁ బరస్ప

రము సమానముగాఁ బొల్తురమలశస్త్ర
ధారులో వీరు హేతువెద్దానిఁ బూని.

ఆ. చిన్ని జుట్టుతోడఁ జెలఁగుచునుండియు
వచ్చినారు వీరు సచ్చరిత్ర
దీని కారణంబుఁ దెలియంగఁ గోరెదఁ
గరుణఁ జెప్పుఁ డన్నఁ గౌశికుండు."

నా వ్రాసినయాంధ్ర శ్రీమద్రామాయణము.

మూలమును దిలకింపుఁడు ఇరువురపద్యములను బరికింపుఁడు. విమర్శింపనక్కఱ లేదు. విమర్శకులు పక్షపాతప్రేరితులై నా రామాయణము యథామూలము కాదనియు నీమొదలగు కారణములఁ దెల్పిరిగాన నెందో యొకతావునఁగాక యాయాయిభాగముల దమముందఱఁ బెట్టుచుందును. తమ రుదారహృదయము గలవారు. కావున నేది యథామూలమో యోజింపుఁడు

ఈభాగమున నేమేని విశేషము కలదా యని పరికింతము. జనకుఁడు విశ్వామిత్రా! ఈకుమారులు అని యవ్వలనేదో యడుగఁబోయి "భద్రం తే" అని పలికెను. నీకు మేలగుఁ గాక. ఇట్టి మహాపురుషుల నాశ్రయించితివి. కావున నీకు మేలు (అనగా ముక్తి) కలుగుఁగాక. విశ్వామిత్రుఁడవుగాన నీమూలమున లోకులకుఁ గలుగుంగాక యనియె. అనఁగా వారలం జూడఁగనే మహానందము నాశ్చర్యము గలిగి మహాజ్ఞాని కావున వీరు భగవదంశసంభూతులు కాని సామాన్యులు కారని యెఱింగియే యిట్లు ప్రశ్నించెను.

"న తు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా,

దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరం." ౮
(గీత. ౧౧ అధ్యా.)

అన్న భగవదుక్తి ననుసరించి సామాన్యదృష్టికి భగవద్రూపము గనుంగొన శక్యము కాదు. కావున జ్ఞాననిధియగు జనక భూజాని యాయద్భుతరూపులం దిలకించినంతనే యబ్బురపడి ప్రశ్నించెను.

లోకమున సామాన్యముగా రూపసంపదంగాంచి యావ్యక్తి యెట్టిదని కనుఁగొనువారు లేరు. యోగబలముగల వారు బాహ్యరూపమును మాని యాంతరనిర్మలజ్యోతిం గాంతురు. అపుడే యావ్యక్తియందు భగవత్కళ యెట్లున్నదని కనుఁగొందురు. సత్కర్మానుష్ఠాన మొనరించి భూతదయాదిసద్గుణములు గలవ్యక్తియందు భగవత్కళ నిర్మలముగాఁ బ్రకాశించును. పరాపకారాదిదురూపాలు గలిగి దుష్కర్మల నాచరించి యుండువ్యక్తులయం దాకళ ధూమావృతమగు నగ్నివలె నుండును. ఇఁక భగవంతుఁడే యవతరించినపు డావ్యక్తి యెట్లుండునని ప్రశ్నింప నక్కఱయుండదు. సామాన్యులావ్యక్తింగాంచి సుందరాకారుఁడని మాత్రమే తెలిసికొనఁ గలరు. యోగు లాయద్భుతరూపమును గాంచినంతనే కార్యార్థము భక్తానుగ్రహార్థము ధర నవతరించిన పరమపురుషునిగా భావింతురు. ఇదియే సామాన్యులకు జ్ఞానులకుం గలభేదము. బాహ్యచిహ్నములం దిలకించినచో లాభము లేదు. దివ్యదృష్టిం బరికించినఁగాని యావ్యక్తి యెట్టికర్మముల నాచరించుచు నెట్టియుపకారముఖముల నొనరింపఁజాలునని స్పష్టమగును. ఆ

దృష్టి యోగాభ్యాసమూలమునఁగాని లభింపదు. భగవద్దర్శనమునకు యోగమే ప్రధానమని యెఱుంగఁదగు. కావుననే

"తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున." ౪౬

(గీత. ౬ అధ్యా.)

అని శ్రీకృష్ణమూర్తి యుపదేశించెను. తపస్సులోనగుసత్కర్మములన్నియు యోగాభ్యాసమునఁ గాని చక్కఁగా నెఱవేఱవు. అన్నింటికి స్థిరబుద్ధియే ప్రధానము. అయ్యది యోగమునఁ గాని కుదురదు. యోగికి భగవత్కటాక్షము లభించును. మెట్ట వేదాంతములవలనఁ గాలక్షేపమే యగునుగాని ఫలము గలుగదు. భగవంతుని మనస్సున నిలిపి ధ్యానించినఁగాని వశం వదుఁడు కాఁడు. కావున మనమెల్ల మెల్లమెల్లన ధ్యానయోగము నభ్యసించి భగవత్కరుణకుం బాత్రులము కావలయును. ఈవిషయమే యీభాగమునుండి నేర్చుకొనవలయును.

"అహల్యాదర్శనం చైవ గౌతమేన సమాగమం,
మహాధనుషి జిజ్ఞాసాం కర్తుమాగమనం తథా,
ఏతత్సర్వం మహాతేజా జనకాయ మహాత్మనే,
నివేద్య విరరామాథ విశ్వామిత్రో మహామునిః." ౨౫

శతానందునకు నానందముగలిగింపఁగోరియు జనకభూజానికిఁ బరమేశ్వరత్వముఁ దెలుపఁగోరియు నహల్యాదర్శన గౌతమ సమాగమములను కౌశికుఁడు తెలిపి శివధనుస్సందర్శనాభిలాషమువనే యిచ్చటికి శ్రీరామచంద్రునియాగమనమని తేటపఱచి యంతకన్న నెక్కువగఁ జెప్పనక్కఱలేదని యూరకుండెను. "జనకాయ మహాత్మనే" అన్న వాల్మీకిమహాకవిశిరో

మణి యుచితపదప్రయోగము పై భావమును సూచించెడిని. యోగి గావున నాతఁడే కనుఁగొనఁగల్గును. కౌశికుఁ డేల తెల్ప వలెనని ప్రశ్నింపరాదు. శ్రీరామప్రభావప్రకటనార్థమే కౌశిక ముని యయోధ్యకుంబోయి యజ్ఞరక్షణహేతువుచే రామ చంద్రలక్ష్మణులఁ దోడ్కొనివచ్చెను. తనకృత్యమును నెఱవేర్చి యాశ్రీరామచంద్రమూర్తిని ధ్యానమున నారాధింపఁబోవు టకే త్వరపడుచున్నవాఁడు. కావున సంగ్రహముగఁ దెలిపెనని మనము నిశ్చయింపవలయును.

> "విహితస్యాననుష్ఠానాన్నిందితస్యచ సేవనాత్,
> అనిగ్రహాచ్చేంద్రియాణాం నరః పతనమృచ్ఛతి." ౩౧౯

అన్న యాజ్ఞవల్క్యస్మృతి ననుసరించి తాఁజేయఁదగినపనిని జక్కఁగా నెఱవేర్పకుండుటయు నొకదోషము. కావున మహర్షియగువిశ్వామిత్రుఁడు తనపనిఁ జక్క నెఱవేర్చి కృతకృత్యుఁ డయ్యెను. మానవులు విహితకార్యముల మానక తన కక్కఱ లేనిపనులం బ్రవేశింపక ప్రవర్తించుటుత్తమమని మన కీభాగము బోధించుచున్నది.

## విశ్వామిత్రచరిత్రము.

* మతిమంతులలో మేటియగు విశ్వామిత్రునిపలుకుల విని మహాతేజుఁడగు శతానందుఁడు హృష్టరోముఁడయ్యెను. ఆతఁడు గౌతమునితొలికొడుకు తపస్సమధిగతమహా తేజుఁడు. ఆతనితల్లియే యహల్య ఆమెను శాపమునుండి తరింపఁజేసినవాఁడు రామచంద్రుఁడని విన్నయంతనే తన్మ

* ఈచరిత్రము ఏబదియొకఁడవ సర్గమునుండి గ్రహింపఁబడినది.

హ_త్త్వమున కచ్చెరువంది తనమ్రోల సుఖాసీనుఁడై యున్న రామమూ_ర్తిం గాంచెను ధన్యుఁడయ్యెను. అంత విశ్వామిత్రునితో "మహాత్మా! నిరంతరతపస్సమాధి నిష్ఠనున్న మహాయశస్వినిని నాతల్లి నహల్య నీరాజకుమారునకుఁ గన బఱచితివా? విజ్ఞానవతియగు నాజనని సర్వప్రాణిపూజ్యుఁడగు నీశ్రీరామునకు సన్యములగుఫలమూలాదుల నాతిథ్యము జర పెనా? ముష్క దైవదుర్విపాకమున నాజననికిం గల్గినయపరాధ వృత్తాంత మున్నది యున్నట్లు ఈధన్యునకుం దెలిపితివికదా? కౌశికా! నీకుఁ గుశలంబగుఁగాక. నాజనయిత్రి యీమహా పురుషసందర్శనసంభాషణసంభావనలచేఁ గలిగినపుణ్యావశమున నాతండ్రిం గూడినదికదా? నాజనకుఁ డీపరమేశ్వరు నర్చించెనా? మహామతియగు నీశ్రీరామభద్రుఁడు యోగబలమున విదిత వృత్తాంతుఁడై హిమవంతమునుండి వచ్చిననాతండ్రి నహల్యా దానమున నలరించెనా? నాతండ్రి మనస్సునఁ గోపమును దృజించి మరల నాశ్రమమునకు రాఁగా నీమహాత్ముఁ డమ్మునికి నాస_క్తింగొని నమస్కరించెనా?" అని శతానందుఁ డహల్యాదుల వృత్తాంతమును విను వేడుకఁ బ్రశ్నింపఁగా విశ్వామిత్రుఁడు విని వాక్యములఁగల యభిప్రాయ మెఱుంగు ప్రౌఢ కావున వాగ్విశారదుఁడగు శతానందున కిట్లుత్తరము చెప్పెను.

"మౌనివర్యా! నేను దేనింగాని వదలలేదు. కాలోచిత ముగ నాకృత్యము నొనరించితిని. రేణుకాంబ జమదగ్నిముని పతిం గూడినవడువున నీతల్లి యహల్య గౌతమమునీంద్రుం గలిసికొనెను." అని తెలిపినంత నవ్వాక్యముల విని శతానందుఁడు మోమున వింత తేజస్సు గనంబడ శ్రీరామమూ_ర్తిని దర్శించి

యిట్లు పలికెను—"మానవోత్తమా! రఘుకులసార్వభౌమా! నీకుస్వాగతము. దైవయోగముననకుంఠితతపోబలముగలవిశ్వామిత్రుని మున్నిడుకొని యిచ్చటికి వేంచేసితివి. ఈగాధినందనుఁ డూహింపఁదరములుగాని మహాకార్యములను గావించినవాఁడు. తపశ్శక్తిచే బ్రహ్మర్షియై సాటిలేనితేజస్సు గలవాఁ డయ్యెను. ఇట్టి యీమునిపతి నీకు మిక్కిలి హితసంధాయకుఁడని యెఱుంగుదువా? శ్రీరామా! తపోబలవిరాజితుఁడగు నీగాధేయుఁడు నీకు రక్షకుఁడై యుండ నీవీలోకమున ధన్యుఁడవుసుమా. వేఱొకఁడు లేఁడనుట నిక్కము ఈకౌశికునితపోబల మెట్టిదో యీమునిచరిత్ర మెట్టిదో వచింతును. ఆదృతి నాలకింపుము.

ఈవిశ్వామిత్రుఁడు ధర్మాత్ముఁడు. చాలకాలము రాజుగా నుండి శత్రుసూదనుఁడై ధర్మరీతిని బాలనము సాగించుచు సకల విద్యావిచక్షణుఁడై రాజనామము సార్థకముకాఁగా నుండెను. ఈతనివంశచరితము నాలకింపుము. కుశుఁడను రాజు బ్రహ్మపుత్రుఁడు. కుశనాభుఁడనువాఁ డతనికిఁ బుత్రుఁడు. ఆతఁడు పరమధార్మికుఁడు, బలశాలియునగు. తత్సుతుఁడే గాధి యని యెఱుంగుము. ఇపుడు మహామునియగు నీవిశ్వామిత్రుఁడు గాధికుమారుఁడు. రాజ్యమును జాలసంవత్సరములు పాలించెను. ఒక్కనాఁ డీవిశ్వామిత్రుఁడు బలములంగూడి యొకయక్షౌహిణీ సైన్యము తనచుట్టు బలసిరా భూతలంబెల్లఁ గ్రుమ్మరుచు నానా దేశములం గాంచుచు నందుఁగల నగరోత్తమముల నదీనదంబులఁ బర్వతంబులఁ బుణ్యాశ్రమములఁ గ్రమముగాఁ జూచుచు మార్గవశమున వసిష్ఠమునియాశ్రమమునకుఁ బోయెను.

ఆయాశ్రమము శ్రీరామచంద్రా! మిగుల విచిత్రము

నానావిధతరువరము లందుఁ గ్రిక్కిఱిసి యుండును. లతావిశేష ములందు లేనివి లేవు. సింహావ్యాఘ్రాదులు సహజవైరముగల మృగములంగూడి శాంతముగా నందు సంచరించుచుండును. మానవులపరిచయము మిక్కిలిగలిగిన హరిణగణము లాయాశ్రమమునఁ దిరుగుచుఁ జూచువారల కానందము గల్గించుచుండును. వివిధపతంగరుతంబులు శ్రవణానందము చేయుచుండును. సిద్ధచారణప్రముఖు లందు వేడుకగాఁ జరించుచుందురు. బ్రహ్మర్షిసముదయ మందుండును. దేవర్షు లందుఁ దప మాచరింప నరుదెంచి నివసింతురు.

మఱియు ఘోరతపస్సుసల్పి ఫలములంగన్నవారును, అగ్నిసంకాశులును, గురుతరతేజులును, జలవాయుఫలమూల జీర్ణపర్ణభక్షులు, విజితేంద్రియులు, నకోపనులు నగుమహామునులు; సర్వకాల జపహోమతత్పరు లగువాలఖిల్యులును వైఖానసాదులును నలుదెసల నిండియుందురు. ఇట్లు లవ్వసిష్ఠు నాశ్రమము వేఱొక బ్రహ్మలోకము చందమునఁ గన్నులపండువు చేయుచుండును. ఆయాశ్రమవర్యము నీవిశ్వామిత్రుఁడు సపరివారుఁడై ప్రవేశించెను."

మహనీయులారా! ఈభాగమున విమర్శించి గ్రహింపఁ దగిననీతు లెన్నియోఁ గలవు. సావధానులరై యాలకింపుఁడు.

"తస్య తద్వచనం శ్రుత్వా విశ్వామిత్రస్య ధీమతః,"

మతిమంతుఁడగు విశ్వామిత్రునివచనముల నాలకించి శతానందు డిట్లు పలికెను. అహల్యాకృతాపరాధము దెలిపి యామె యీ శ్రీరామదర్శనమునఁ బవిత్రురాలయ్యెనని జనకునకుఁ గౌశిక ముని తెలిపెను. శతానందునితల్లియే యహల్య. ఆమె వ్యభి

చారవర్తనమును దెలుపుట పుత్త్రున కాదుర్వార్త తెలిపి యాదుఃఖము పోవ శాపమోక్షమును వెల్లడించుటకే యని యెఱుంగవలయును. దాన శ్రీరామచంద్రునపారశక్తి తేటపడుననియు, జనకునకు ముఖ్యముగా నీవిషయము తెలుపవలయుననియు, గాధేయు నాశయము. "స్వమాతృజారవద్గోప్యా" అన్న న్యాయము ననుసరించి శతానందుఁడు సిగ్గుపడవలయునని ముని యభిప్రాయమైనట్టు కనుపట్టు. ధీమచ్ఛబ్ద మీయర్థము తెలుపుననియే మహాకవి ప్రయోగించెను.

> "అపి తే మునిశార్దూల మమ మాతా యశస్వినీ,
> దర్శితా రాజపుత్త్రాయ తపోదీర్ఘముపాగతా. ౪
> అపి రామే మహాతేజా మమ మాతా యశస్వినీ,
> వన్యైరుపాహరత్పూజాం పూజార్హే సర్వదేహినాం. ౫
> అపి రామాయ కథితం యథావృత్తం పురాతనం,
> మమ మాతా మహాతేజో దైవేన దురనుష్ఠితం." ౬

అనుభాగమున నొక్కవిశేషము గలదు: దానిం బరిగ్రహింతము. విశ్వామిత్రుఁడు తనతల్లి దుర్వృత్తిని బయలుపఱచెనని యించుక సంశయించి యామె సుశీలయేగాని దుశ్శీలకాదని తెలుపందలంచి యిట్లు పలికెను. యశంబుగాంచిన నాతల్లి చిరకాలతపస్సు చేసి పరిపక్వమానసికముగలదని యెఱుంగుము. అట్టి నాతల్లి నీరాజపుత్త్రవేషమూనిన శ్రీలక్ష్మీపతికిఁ జూపితివికదా. అనఁగాఁ జిరకాలతపోనిరతిం గాంచి యశస్సుగాంచినవారికింగాని భగవద్దర్శనముకాదనియు, భగవద్దర్శనమునకుఁ బాత్రులగువా రపరిశుద్ధులు దుర్వృత్తులుకారనియుఁ, బూర్వపుణ్యఫలమే భగవద్దర్శనమనియు సారము. ఈభాగమునుండి గ్రహింపఁదగువిషయ

మేమనఁగా లోకమున సర్వజనాంగీకృతప్రవర్తనము కలిగినఁగాని యశస్సురాదనియు, ననేకవత్సరములు తపస్సుచేసినఁగాని భగవత్కరుణ కలుగదనియు, నీరెండింటిని సమార్జింప మానవుఁడు ప్రవర్తింపవలయుననియు, భగవద్దర్శనమునకు నెవ్వాఁడు పాత్రుఁడగునో యతనికి సకలపాపములు తొలఁగునదృష్టము లభించియే యుండుననియు మన మెఱుంగవలయును

అంతట మానక తనతల్లి ప్రవృత్తిని దెలుపఁబూని శతానందుఁ డిట్లు పలికెను. గొప్పతేజస్సుగలిగి యశము నార్జించిన నాతల్లి ప్రాణకోటికెల్లఁ బూజార్హుఁడగు నీరామచంద్రుని నడవింగలఫలమూలాదులచేతఁ జక్కఁగాఁ బూజించెనా? అనఁగా భగవంతు నారాధింప నెల్లర కధికారము గలదనియు, మేమే యధికారులని విఱ్ఱవీఁగువా రజ్ఞానులనియుఁ, బరమేశ్వరుని బూజకు శ్రమంపడి పదార్థముల సేకరింప నక్కఱ లేదనియుఁ, బరిశుద్ధభావమున నే ఫలములో మూలములో చాలుననియుఁ, బరిశుద్ధభావము లేనిచో నాపూజ వ్యర్థమనియు గ్రహింపఁదగిన విషయము.

"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః. ౨౬
అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ,
న తు మామభిజానంతి తత్త్వేనాతశ్చ్యవంతి తే. ౨౪
సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహం. ౨౯
అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్,
సాధురేవ స మంతవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః." 30

(గీత. ౯ అధ్యా.)

అను నీశ్రీకృష్ణోపదేశవాక్యములే పైవ్రాసినయర్థమును సిద్ధాంతము చేయుచున్నవి. కొందఱు భగవంతునిపేరుచెప్పుచు, నేవో మహాకార్యములొనరింతుమని లోకుల వంచించుచు, వేషధారులై ధనముఁ సమార్జించి తమయిష్టానుసారము వ్యయించుచుఁ, బెద్దలనిపించుకొనుచుఁ దిరుగుదురు. అంతియకాక భగవంతుని పూజకని యుత్తమపదార్థముల సంగ్రహింతురు కానియాశ్రమము వ్యర్థమని వారెఱుంగరు. శ్రమములకు నోర్చి సంపాదింపఁ దగినది సద్భక్తి. శాంతము. అనసూయ. వీనినిమాని పదార్థముల సంపాదించుట వెఱ్ఱితనము. భగవంతుఁడు బాహ్యవేషమును బరికింపక మనోనిర్మలత్వమునే పరీక్షించును. అది బాగుండెనేని యేపదార్థమును వాఁడిచ్చినను బరమప్రీతిని గ్రహించును. వానిపైఁ దనకరుణను బ్రవహింపఁజేయును. తుదకు ముక్తి ననుగ్రహించును. శునకవృత్తి ననుసరించి తిరిగితిరిగి ధనమును సేకరించి హారములు రత్నమయములుగా నొనరించి తనకర్పించినను భక్తిలేనివాని నాపరాత్పరుఁడు తలంపనైనఁ దలంపఁడు. కావున భక్తిశ్రద్ధలుగలిగి పరమేశ్వరుని దనకు లభించిన యే పదార్థముననైన నారాధింపవచ్చును. సకలశ్రమములకు లోనై మనోనియతిఁ గల్గించుకొనవలయును. యోగాభ్యాసమునఁగాని యది కుదురదనుట రూఢము. దానికై మనమెల్లఁ బ్రయత్నింపవలయును. ముక్కు చెవులు కన్నులు మూసి లోకులను మోసపుచ్చువారలకు యోగమే తెలియదని మన మెఱుంగవలయును.

మఱియు శతానందుఁ డిట్లు పలికెను. చాలకాలము క్రిందజరగిన నాతల్లివృత్తమును మునీంద్రా! శ్రీరాముని

కెఱింగించితివా! ఇంద్రునికపటచేష్టలకు లోఁబడినది నాతల్లి యని యెఱింగించితివికదా. బుద్ధిపూర్వకముగా నొనరించినది పాపమని, అదికానిది యంతపాపము కాదనియు, మఱియు స్త్రీలవిషయమునఁ గొన్ని పరిహారములు కలవనియు, నీవెఱింగిన వాఁడవుకదా యనియుఁ బ్రశ్నసారము. ఇందిఱిలో స్త్రీ వ్యభిచారమును బ్రకటించితివికదా యని శతానందునభిప్రాయ మని మన మూహింపవచ్చును కనుకనే విశ్వామిత్రునిచరిత్రము శ్రీరామమూర్తికిఁ జెప్పఁదలంచెను. ఏలయనఁగా నీతఁడు వ్యభిచరించి తపోధనమును బోఁగొట్టుకొన్న మహానుభావుఁడే యని శ్రీరామమూర్తికిఁ దెలిపిన మేలని శతానందుఁ డెంచెను. మరలఁ దపస్సుచేసి కౌశికుఁడు బ్రహ్మర్షియైనట్లే నాతల్లికూడఁ దపోనిరతినుండి భగవంతు నారాధించుటం జేసి పవిత్రురాలయ్యె నని యందుఁగల యెల్లమునులకు శ్రీరామమూర్తికిఁ దెలియుంగాక యని శతానందుఁ డూహించెనని మన మూహింపవచ్చును. ఈఘట్టమున మూలమునందు.

"మమ మాతుర్మహాతేజో దైవేన దురనుష్ఠితమ్."

అని కలదు.

"మమ మాతుర్విషయే దైవేన ఇంద్రేణ విధినావా దురనుష్ఠితం దురనుష్ఠానరూపం పురాతనం వృత్తం చరితమ్." అని గోవిందరాజులు. "దైవేన విధినా యదనుష్ఠితం మాతుస్సంబంధి యద్వృత్తం." అని మహేశ్వరతీర్థులు. "దైవేన ఇంద్రేణ దురనుష్ఠితం గౌతమవేషధారణపూర్వకం తత్కర్తృకదురనుష్ఠానరూపం మాతుర్యద్వృత్తమ్." అని తిలకవ్యాఖ్య.

శతానందునిప్రశ్నమునుబట్టి యాలోచింపఁగా నింద్రుని కపట చేష్టలకు లోఁబడియే యహల్య చెడువర్తనమునకుఁ బూనె

నని తోఁపకమానదు. దాని శ్రీరామునకుఁ దెలిపితివికదా యన్న ప్రశ్నసారమేమి? సకలపాపపరిహారకము శ్రీరామదర్శన మనియే భావము. ఈఘట్టమున సీయర్థము తెనిఁగించినవా రెట్లు పాఠకమహాశయులకుఁ దెలిపిరో కనుఁగొందము.

సీ. "చెప్పితే నాతల్లి చేటుకాలంబైనఁ
జలిపిన యాదుష్టచరిత మెల్ల,"

వావిలికొలనురామాయణము.

తే. "కందమూలఫలప్రముఖముల నితఁడు
సర్వదేహిపూజ్యుండని స్వాంతమందు
నెఱిఁగి పూజించెనే మహర్షీంద్ర! మున్ను
జిష్ణువాగ్వాగురాళికిఁ జిక్కి యతివ

చ ఒనరుపరానికృత్యమున కున్ముఖురాలగు టాదిగాఁగఁ గ
ల్గినచరితంబులెల్ల నెఱిఁగించితివేకద యీనృపాలనం
దనునకు. ... ... ..."

అని నారచించిన యాంధ్రశ్రీమద్రామాయణము. విమర్శక శిఖామణులు నాపద్యములు నిస్సారములని వావిలికొలను రామాయణపద్యము లమృతమును బిందుచున్నవనియుఁ దెలి పినభావమున నెంతన్యాయము కలదో యని పాఠకమహాశయు లూహింతురుగాక.

"అపి కౌశిక భద్రం తే గురుణా మమ సంగతా,
మమ మాతా మునిశ్రేష్ఠ రామసందర్శనాదితః." 2

అను నీభాగమున నొక్కవిశేషము కలదు. తనప్రశ్నమును బట్టి కౌశికునకుఁ గోపముగలిగెనేమో యని సంశయించి శతా

నందుఁడు "కౌశిక భద్రం తే" యని యూఱడించెను. దీనివలన మనము నేర్చుకొనఁదగిన దేమనఁగా.—

"సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాన్న బ్రూయాత్సత్యమప్రియం,
ప్రియం చ నానృతం బ్రూయాదేష ధర్మస్సనాతనః. ౧౩౮
భద్రం భద్రమితి బ్రూయాద్భద్రమిత్యేవ వా వదేత్,
శుష్కవైరం వివాదం చ న కుర్యాత్కేనచిత్సహ." ౧౩౯
(మను. అధ్యా. ౪.)

అను మనుస్మృతిశాసనము శిరసా ధార్యమనునదియే. ఎవ్వారితోఁ గాని సంభాషించుతఱి శుభవాక్కులు వెడలవలయుననియు, సత్యముగను బ్రియముగను మాటలాడవలయుననియుఁ, బ్రియమైన నసత్యము పలుకరాదనియు, సత్యమైన నప్రియముగా మాటలాడరాదనియు మన మెఱుంగఁదగువిషయము. ఇది ముఖ్యతమము. మాటలాడఁదగువిధముకూడ మనకుఁ బెద్దలు నేర్పిరనియు, వారియుపదేశమే కాలమునఁగాని తలఁదాల్పవలసినదే యనియు, నాయుపదేశము మార్పునొందించిన దుష్ఫలమే కలుగుననియు మనము తెలిసికొని, వారివిజ్ఞానమును స్మరించుచు నుండవలయును.

ప్రకృతవిషయ మేమనఁగా శ్రీరామచంద్రదర్శనము కాఁగా నాతల్లి నాతండ్రియగు గౌతమమహర్షి కడఁ జేరెనా. యని ప్రశ్నము. భర్తకడఁ జేరినఁగాని స్త్రీకిఁ బవిత్రత్వము లేదనియు, నాభాగ్య మామెకుంగల్గినఁ బూర్వదోషము లడంగుననియు భావము.

"ధ్యాయత్యనిష్టం యత్కించిత్పాణిగ్రాహస్య చేతసా,
తస్యైష వ్యభిచారస్య నిష్కృతిస్స్యాదుపోషణమ్" ౨౧

యాదృగ్గుణేన భర్త్రా స్త్రీ సంయుజ్యేత యథావిధి,
తాదృగ్గుణా సా భవతి సముద్రేణేవ నిమ్నగా. ౨౨
అక్షమాలా వసిష్ఠేన సంయుక్తాధమయోనిజా,
సారంగీ మందపాలేన జగామాభ్యర్హణీయతాం. ౨౩
ఏతాశ్చాన్యాశ్చ లోకేఽస్మిన్నపకృష్టప్రసూతయః,
ఉత్కర్షం యోషితః ప్రాప్తాః స్వైస్స్వైర్భర్తృగుణైశ్శుభైః. ౨౪
ఏషోదితా లోకయాత్రా నిత్యం స్త్రీపుంసయోశ్శుభా,
ప్రేత్యేహ చ సుఖోదర్కాన్ ప్రజాధర్మాన్నిబోధత." ౨౫
(మను. ౯ అధ్యా.)

ఇది మానసికవ్యభిచారప్రాయశ్చిత్తమని స్మృతి బోధించెడిని. ఉపలక్షణవిధిచే నంగీకరించినను మనము బాపమురాదు. భర్తను గూడిన నతనిసద్గుణములు సంక్రమించి పవిత్రురాలగుననియే దీనిసారము. ఈవిషయ మెఱింగియే శతానందుఁడు "నాతల్లి నాతండ్రికడఁ జేరెనా" యని ప్రశ్నించెను. భర్తృసంగతి కలిగినఁ బవిత్రురాలగుననుటయే యిట గ్రహింపఁదగువిషయము. జారిణీప్రాయశ్చిత్తములలో దేశాంతరగమనముచేసిన వదల వలయునని ప్రోక్తము. భగవతుఁడగు శ్రీరామచంద్రుని సందర్శనమున సకలపాపములు తొలంగఁ బతింగూడి సుఖంబుండెనా యని శతానందుఁ డడిగెనని మన మూహింపవలయును.

"అపి మే గురుణా రామః పూజితః కుశికాత్మజ
ఇహాగతేన రామేణ ప్రయతేనాభివాదితః" ౯

భగవంతుని రామచంద్రుని నాగురువు పూజించెనా? అహల్యాలాభరూపపూజను శ్రీరామమూర్తివలన మరలఁ బ్రతిగ్రహించెనా? అనఁగాఁ బరమేశ్వరు నారాధించి యహల్య పావనాత్మ

గలదియే యని రాముఁ డనుగ్రహించి భగవదాజ్ఞను నెఱవే ర్చెనా యని మనము గ్రహింపవలయు. భగవదనుగ్రహపాత్రు రాలగుస్త్రీ పుణ్యవతియే యగును. ఆమెయందు దోష మా రోపింపరాదని విశ్వామిత్రుని హెచ్చరించెనని సారము.

భగవంతు నారాధించిన మానవులు సకలపాపనిర్ముక్తు లగుదురు. పిదప వారియందుఁ బాపశేష ముండునని భావింప రాదు. అజ్ఞానముననో ప్రమాదముననో పాపము లొనరించి తనపని మంచిదిగాదని యెఱింగి యనుతాపమంది వానిని బాపు కొన భగవంతుని విధిదృష్టవిధానంబున నారాధించినచో జ్ఞాన ము పొడసూపును. దాన నాపాపములు నశించును. వారే ధూతకల్మషులనఁబడుదురు. కావున సకలపాపప్రాయశ్చిత్తము భగవత్సేవయని మనము నేర్చుకొనవయును.

> "నాతిక్రాంతం మునిశ్రేష్ఠ యత్కర్తవ్యం కృతం మయా,
> సంగతా మునినా పత్నీ భార్గవేణేవ రేణుకా." ౧౧

శతానందునియాశయ మెఱింగి విశ్వామిత్రుఁడు తగినట్లు బదులు చెప్పఁబూని మునివర్యా! కాలమువృచ్చక చేయఁదగినపని నెఱ వేర్చితిని. జమదగ్నిమునిని రేణుక కూడినట్లు నీతల్లి యహల్య పతిం గూడినది. అనఁగా రేణుకయందు నిట్టిదోషమే యుండె ననియు, నామె పతింగూడి పరిశుద్ధురాలైనయట్లే నీతల్లియు భర్తకడఁ జేరెననియు, మునిభావముని తాత్పర్యము. ఎందఱో యిట్టి యపరాధము లొనరించిరి దానికిం బరితాపమొంద నవ సరములేదని కౌశికు నాశయమని మనము గ్రహింపవచ్చును. రేణుకాదృష్టాంతమును విని విశ్వామిత్రునియాశయ మెఱింగి

శతానందుఁడు శ్రీరామచంద్రునకు విశ్వామిత్రునిచరిత్రమును దెల్పంబూనెను.

మహాశయులారా! విశ్వామిత్రచరిత్రము మన కనేక విషయముల బోధించును. దానిం బఠించుటమాత్రము చాలదు. దానినుండి మన మేమి నేర్చుకొనవలయునని చర్చింపవలయును. ఆయాయితావుల నాయానీతుల నేర్చుకొనఁ బ్రయత్నింతము. భగవద్భక్తులలో లోకోపకారపరాయణులలో విశ్వామిత్రుఁ డగ్రస్థానము వహింపఁదగినవాఁడు. విశ్వామిత్రనామము రామమూర్తి ననుసరించి యొనరించిన మహాకార్యములమూలమున మఱింత ప్రఖ్యాతిం గాంచెను. కావున నాతఁడు రాజుగనుండి రాజర్షియై మఱియు బ్రహ్మర్షియుఁగూడ నైనయట్లు సామాన్యమానవులుకూడ శ్రద్ధాభక్తులుగలిగి భగవంతు నారాధించిన జ్ఞానసంపన్నులగుదురు. "శ్రేయాంసి బహు విఘ్నాని" అన్న న్యాయము ననుసరించి సత్కార్యముల కనేకవిఘ్నము లొనఁగూడును. వానికిఁ జలింపక పట్టుదలమానక పరమేశ్వరు నారాధింపవలయును. ఒకజన్మమున నయ్యది ఫలవంతము గాకయున్న వేఱొకజన్మముననైన నయ్యది ఫలించును.

> "ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః
> అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్." ౪౫

అను నీభగవదనుశాసనమే పై విషయమును దృఢపఱచుచున్నది. భగవదారాధన మనఁగా యోగియై భగవంతుని ధ్యానించుట యని భావము. బాహ్యపూజలు నిష్ఫలములు కావు. కాని యల్పఫలము నిచ్చునవి. విగ్రహారాధనము లల్ప

ఫలము నీఁజాలునవనుటకుఁ బెక్కుదృష్టాంతము లక్కఱలేదు. ఈవఱకే యందందుఁ గొన్నింటిని జూపియున్నాను.

"ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా" ౬౧
తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత,
తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్. ౬౨
ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా,
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు." ౬౩
(గీత ౧౮ అధ్యా.)

హృదయదేశమున నీశ్వరుఁ డుండుననఁగా భావమేమి?

"నీలతోయదమధ్యస్థాద్విద్యుల్లేఖేవ భాస్వరా
నీవారశూకవత్తన్వీ పీతా భాస్వత్యణూపమా
తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః
స బ్రహ్మా స శివస్స హరిస్సేంద్రస్సోఽక్షరః పరమస్స్వరాట్"

అన్న శ్రుతిప్రతిపాదిత తేజోరూపపరమాత్మ యనియే భావము కదా.

"సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః"

అన్న శ్రీకృష్ణోక్తియుఁ బైయర్థమును దెలుపుచున్నది. భగవదారాధనము మానసిక ముత్తమోత్తమమని యెఱుంగవలయును.

"ఉచ్చావచేషు భూతేషు దుర్జ్ఞేయామకృతాత్మభిః
ధ్యానయోగేన సంపశ్యేద్గతిమస్యాంతరాత్మనః." ౨౩

సమ్యగ్దర్శనసంపన్నః కర్మభిర్న నిబధ్యతే,
దర్శనేన విహీనస్తు సంసారం ప్రతిపద్యతే" ౭౪
అహింసయేంద్రియాసంగై ర్వైదికై శ్చైవ కర్మభిః,
తపసశ్చరణైశ్చోగ్రైస్సాధయంతీహ తత్పదం" ౭౫
(మను. ౬ అధ్యా)

ధ్యానమే భగవత్ప్రీతికరమని యీస్మృతి తాత్పర్యము. అనఁగా బాహ్యపూజలు తొలుదొల్త ఫలదములని, వాని యభ్యాసమున మానసికపూజ యభ్యసింపవలయుననియు, నది ధ్యానరూపముగా నొనరింపవలయుననియు, దానికిఁ బదార్థములతోఁ బనిలేదనియు నభిప్రాయము.

"విధి యజ్ఞాజ్జపయజ్ఞో విశిష్టో దశభిర్గుణైః,
ఉపాంశుస్స్యాచ్ఛతగుణస్సాహస్రో మానసస్స్మృతః" ౮౫
ఇంద్రియాణాం విచరతాం విషయేష్వపహారిషు,
సంయమే యత్నమాతిష్ఠేద్విద్వాన్యంతేవ వాజినాం." ౮౮
(మను. ౨ అధ్యా)

మానసికజప మనంతఫలప్రదమనియు, మనస్సంయమమునకు యత్నించు టుత్తమమనియు వీనిసారము. జపముకూడ మానసికమగునే నుత్తమమని చెప్పినపుడు మానసికపూజ యుత్తమమని భావము తేలలేదా?

"తతో ధ్యేయః స్థితో యో௨సౌ హృదయే దీపవత్ప్రభుః,
ధారయే త్తత్ర చాత్మానం ధారణాం ధారయన్ బుధః"
(యాజ్ఞవల్క్యస్మృతి ప్రాయశ్చిత్తకాండము.)

హృదయమున దీపమువలె నున్న భగవంతుని ధ్యానింపుఁడనఁగా నర్థమేమి? భగవత్పూజ యనఁగా ధ్యానరూపమని యర్థము.

అదియే యుత్తమఫలప్రదము. విగ్రహారాధన మత్యల్పఫలదము. దేవాలయముల నిర్మించుట కేవలము పామరులకు భక్తిశ్రద్ధలను గల్పించుటకొఱకే యని యెఱుంగందగు. అదియే ముక్తిప్రదమన్నచో నాముక్తి యెల్లరకు లభించును.

కొందఱు దేవాలయములయందలి విగ్రహములను మహానుభావులు పూజింపలేదా యని ప్రశ్నింతురు. అది వారికింగల విగ్రహాభినివేశమునే తెలుపును. శంకరభగవత్పాదాదులు విగ్రహారాధనము చేయువారు కారు. దానిని వలదనువారు. ఆపేరుగలవారెందఱో యుందురు. అందఱు మతస్థాపకులవంటివారు కారు. ఒకప్పుడు వారుకూడఁ బూజించిరనుకొందము. వారియభిప్రాయ మేమని యూహింపవలదా? వారియుపదేశము లెట్టివని తలంపవలదా? ఈగీతివాక్యములం బరికింపుఁడు.

"న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన
నాఽనవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి. ౨౨
యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః. ౨౩
ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహం
సంకరస్య చ కర్తా స్యాముపహన్యామిమాః ప్రజాః. ౨౪
సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత
కుర్యాద్విద్వాంస్తథాఽసక్తశ్చికీర్షుర్లోకసంగ్రహం. ౨౫
న బుద్ధిభేదం జనయేదజ్ఞానాం కర్మసంగినాం
జోషయేత్సర్వకర్మాణి విద్వాన్ యుక్తస్సమాచరన్." ౨౬

(గీత 3 అధ్యా.)

అర్జునా! నే నొనరింపఁదగుకర్మములు లేవు. వానివలనఁ బొందఁ దగుఫలములు కానరావు. నాకు లభింపనిఫలములును లేవు. నే నూరకయుండినఁ బామరులుకూడఁ గర్మముల నాచరింపక యుందురు. దానఁ గీడుగల్గును. పామరుఁడు మహాసక్తిచేఁ గర్మముల నొనరించును. అట్లే విద్వాంసుఁడు వాని నాసక్తిలేక లోకాచారమును బాటించి చేయును. అనికదా హరియుపదేశ సారము. జ్ఞానులుకూడ

"యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే."

అనుగీతాప్రమాణము ననుసరించి యితరులగు నజ్ఞానులను మంచిమార్గమునఁ బ్రవర్తింపఁజేయఁబూని తా మాచరింతురు. అనఁగాఁ దమ్ముం జూచి వా రాచరింతురని భావము.

ఈయభిప్రాయము ననుసరించియే మహనీయులు దేవాలయములఁగల శిలాదివిగ్రహముల నారాధింతురు. అంతియ గాని యాపాషాణములు ముక్తినిచ్చుననికాని, యాపూజ యుత్తమమనికాని కాదు. అది తొలుదొలుత నుపకార మొన రించును. దానిని గ్రమముగా మాని మానసమున నుపాస్య దేవతాబింబమును నెలకొలిపి దాని ధ్యానింపవలయును. అంతి యకాని సర్వకాల మా దేవాలయమును నమ్ముకొని యూఁగు లాడుచుండ రాదు. అందలిప్రసాదము తున్నివృత్తికి మహోప కారము. కపటభక్తులకు విముక్తిప్రదము. విశేషించి మధ్య వైష్ణవులకుఁ బరమానందకరము. అంతియకాని యది పామా న్యులకు దొరకునా యని ప్రశ్నించుట వివేకము. కావ్యతీర్థ మనఁగా శుక్రతీర్థమని భావించువారికిని జతుర్విధపురుషార్థ

ప్రదము. రామానుజకూటమున నదియేకదా ప్రప్రథానము. దానిం గ్రోలి వారు తృప్తినొందుదురుగాక.

ఈవిగ్రహారాధనమునుగుఱించి మహామహోపాధ్యాయ శ్రీపరవస్తు వేంకటరంగాచార్యులయ్యవారలు వ్రాసినవిధముం దెలిపెదను. దానింగాంచిరైన వేషధారులగుమధ్యవైష్ణవులు జ్ఞానవంతు లగుదురుగాక.

"ప్రశ్నము:—అట్లైతే దేవాలయములలో విగ్రహముల నీశ్వరుండని యారాధించుచున్నారే? అది యెట్లు?

ఉత్తరము:—విగ్రహ మీశ్వరుఁడు కాఁడు. సర్వవ్యాపకుండైన యీశ్వరుఁడు విగ్రహ మెట్లగును? ఈశ్వరునిం బూజించువా రతనిం దలంచుటకు గుఱుతు.

ప్ర:—అది యెట్లు?

ఉ:—అ-ఆ-అని యివి మొదలగులిపులను మనము వ్రాసి అక్షరములను దలంచి వానిం జదువుచున్నాము. ఆవ్రాఁత అక్షరముకాదు. అయిన నది గుఱుతుగా నుంచుకొని యక్షరములం దలంచుకొని చదువుచున్నాము. అట్లు విగ్రహమును గుఱుతుగా నుంచుకొని యీశ్వరునిం దలంచి పూజించుచున్నాము.

ప్ర:—విగ్రహముతో నక్కఱలేకుండనే మనసులో నీశ్వరుని ధ్యానము చేయంగూడదా?

ఉ:—చేసికొనవచ్చును. అట్టి యీశ్వరధ్యానము ప్రయాససాధ్యము. వ్రాఁతతోఁ బనిలేక అక్షరములం దలంచునట్లు. కాని దాని యభ్యాసంబగువఱకును విగ్రహము నుంచుకొనుటె బాలురకు సులభసాధన మగును.

ప్ర:—పండితులుసైతము విగ్రహముల నాదరించుచున్నారే?
ఉ:—వారు స్వతంత్రముగా నీశ్వరుని నుపాసించుటకు శక్తి గలవారైనను పామరులకు నీశ్వరజ్ఞానము కలుగుటకుఁ దాము నాసాధనముల వ్యవహరించుచుండుట బహుపరోపకారధర్మములోఁ జేరుచున్నది.
ప్ర:—విగ్రహారాధనము మనవేదమునం జెప్పలేదే. అట్లు చెప్పనిపనిం జేసినఁ బాపముగాదా?
ఉ:—వేదమునం జెప్పినపని సాధించుటకై సులభములైన సాధనములం గల్పించుకొనుట పాపమగునా? వేదోక్తమైన యీశ్వరోపాసనమును వేదోక్తధర్మంబులును మాని వానికి విరోధముగా విగ్రహమునే యెల్లప్పుడుఁ బెట్టుకొనుట మూర్ఖధర్మ మగును."

(ఆర్షమతోపన్యాసములు పుట ౧౨.)

దేవాలయము లెందుల కేర్పడినవో పీనిమూలమునఁ దేటపడ లేదా? మహాత్ములేల విగ్రహములఁ బూజింతురో స్పష్టముగా లేదా? భగవద్గీతార్థమునే యీమహనీయులభావ మనుసరించు చున్నదికదా?

దేవాలయములు తఱచుగా నీకాలమున ననేకకార్యములకుం బనికివచ్చుచున్నవి వానిపేరుచెప్పి స్వర్ణాకర్షణము చేయవచ్చును. విచ్చలవిడి దాని వ్యయింపవచ్చును. అంతయు స్వామికార్యమే యనవచ్చును. అట్లుగాక మహనీయులు కూడఁ బామరులను భక్తులనుగాఁ జేయుపొంటె దేవాలయములు శిథిలములు గాకయుండ నిల్పినఁ గొంత యుపకారమే. కలికాలమున దైవభక్తి తుదముట్ట నశింపకయుండ నవి కొంత

వఱకు నుపకారము చేయుఁగాక యని మనము నమ్మవలయును. అందలివిగ్రహములనే పూజించుచుండిన ముక్తిగలుగునని తెలుపరాదు. అది ద్రోహమగును. కొంతకాలమైనతర్వాత వారికి ధ్యానపద్ధతి నుపదేశింపవలయును. లేనిచో నెన్నిజన్మములకు నంతియే ఫలము.

"ప్రతిమా స్వల్పబుద్ధీనామ్"

అనుట పెద్ద లెఱుంగనిది కాదు. విగ్రహారాధన మల్పఫలదమనునా వ్రాఁతకుఁ గినిసి యెగిరిపడు వేషధారు లీభాగవతవాక్యముం గాంచియైనఁ దెలివిఁదెచ్చుకొందురుగాక.

శ్రీభగవానువాచ.—

"అహో వయం జన్మభృతో లబ్ధం కార్త్స్న్యేన తత్ఫలం
దేవానామపి దుష్ప్రాపం యద్యోగేశ్వరదర్శనం. ౯
కిం స్వల్పతపసాం నృణామర్చాయాం దేవచక్షుషాం
దర్శనస్పర్శనప్రశ్నప్రహ్వపాదార్చనాదికం." ౧౦

(౧౦ స్కం॥ ౮౪ అధ్యా.)

"దేవచక్షుషామ్=ప్రతిమాయాం దేవ ఇతి చక్షుర్యేషాం"
విగ్రహమే భగవంతుఁడని భావించువారలకునని యర్థము.

శ్రుతి "ఏకో దేవస్సర్వభూతేషు గూఢ
స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా,
కర్మాధ్యక్షస్సర్వభూతాధివాస
స్సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ."

అనుశ్రుతి విగ్రహారాధనమును బోధింపక ధ్యానమే ముఖ్యమనుచున్నది. విగ్రహములఁ బూజించుటకంటె నామజపమే యుత్తమ మనవలయును.

"మిథ్యాతర్కసుకర్కశేరితమహావాదాంధకారాంతర
భ్రామ్యన్మందమతేరమందమహిమం స్త్వద్జ్ఞానవర్త్మా స్ఫుటం
శ్రీమన్మాధవ వామన త్రినయన శ్రీశంకర శ్రీపతే
గోవిందేతి ముదా వదన్ మధుపతే ముక్తః కదా స్యామహం."

అను నీప్రమాణము పైభావమునే దృఢపఱచుచున్నది. మధ్య వైష్ణవపాషండమండలమున కియ్యది కంఠపాశముగఁ గనఁబడును. ఇందుఁగల "త్రినయన శ్రీశంకర" అనునవి వారికిఁ గఠోరములుగానుండును. భక్తుల కట్లుండవు. ఇట్టివి లక్షలుగాఁ బ్రమాణములు చూపవచ్చును. ఎన్ని చెప్పినను బాషాణముల మూలమున ధనమునార్జించువారలకు సరిపడునా?

మఱికొందఱు పాషండులు భగవంతునకుఁ బక్షపాతము కలదందురు. అనఁగా బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రుల కొక్కరీతిగా ఫలమునీయకయుండునని వారిభావము. అది తుచ్ఛవాదము. భక్తి దృఢమగునేని ఎల్లవారలకు సమముగా భగవంతుఁ డనుగ్రహము నెఱపును. వేదవేత్తయగు బ్రాహ్మణునకు, భగవంతునియందు దృఢవిశ్వాసముగలిగి యతనినే తలంచు శూద్రునకు భగవత్కరుణ సమానమే.

"న బ్రహ్మణస్స్వపరభేదమతిస్తవ స్యా
త్సర్వాత్మనస్సమదృశః స్వసుఖానుభూతేః,
సంసేవతాం సురతరోరివ తే ప్రసాదః
సేవానురూపముదయో న విపర్యయోఽత్ర." ౬

(శ్రీ భాగ. ౧౦. స్క. ౭౨. అధ్యా)

కల్పవృక్షము నెవ్వరాశ్రయించినను ఒక్కరీతిగా వారికి ఫలమొసంగును. భగవంతుఁడు నట్లేయని యెఱుంగందగు. భగ

వంతునిదృష్టికి జాతిభేదము లగపడవు. సేవించుటలో భేదము లుండిన ఫలభేదముండును. నైవేద్యభేదములకు, దీపసహస్రములకు, బట్టువస్త్రములకు భగవంతుఁడు మోసపోవఁడు.

"తులసీదళమాత్రేణ జలస్య చులకేన చ
విక్రీణీతే స్వమాత్మానం భక్తేభ్యో భక్తవత్సలః."

అన్న విష్ణుధర్మోక్తియుఁ బైయర్థమును జాటుచున్నది. దృఢభక్తిగలిగినచోఁ బదార్థభేదములవలన నధికఫలము గలుగక సమానఫలమే కలుగుననుట సిద్ధాంతము. ఈవిషయమున నభిప్రాయభేదము లుండవనియే తలంతు. విగ్రహారాధనము స్వల్పఫలము నీఁజాలునని శ్రుతిస్మృతిపురాణాదులు స్పష్టపఱచుచున్నవి. అదియే సర్వోత్తమమనువా రుందు రేని వారికి ముక్తిస్థానమనునది యొక్కలోకమున నొక్కహర్మ్యముగా నుండు నన్న విశ్వాస ముండును. ఆపాషాణములకు నీపాషాణములు చక్కనిబంధము కుదురవచ్చును. నిస్సారమగు విగ్రహారాధన విషయ మింకఁజాలింతును.

విశ్వామిత్రుఁడు తపస్సు చేయఁగోరి యే కాంచీనగరమునో, ఏ శ్రీరంగక్షేత్రమునో, ఏయనంతశయనమహాశ్రీక్షేత్రమునో, ఏమధురానగరమునో, ఏకాశీదేవాలయమునో, యాశ్రయించి త్రికాలములయందును జక్కెరపొంగలి మొదలగు నైవేద్యము లర్పించి యాప్రసాదమునారగించి మహర్షి కాఁగోరక, యరణ్యమునకుంబోయి భగవంతు నారాధించెను. పరమేశ్వరానుగ్రహమునకుం బాత్రుఁడయ్యెను. జ్ఞానమున బ్రహ్మర్షి యయ్యెను. ఎన్నియోలోపములు తపస్సునఁ దన్ను బాధించినను, వానిచేఁ దపస్సు చెడినను, బట్టువదలక మరలఁ బ్రయత్నించి తుదకు

సాధించెను. కావున విశ్వామిత్ర చరిత్రము పరమపవిత్రము అవశ్యము పఠింపఁదగినది. దానినుండి యనేకవిషయములు గ్రహించి యంతతోఁ దృప్తినొందక వానిని శక్తికనురూపముగా నాచరించి పట్టుపట్టి భగవంతునను గ్రహమునకుఁ బాత్రులము కావలయును.

పుటపాకశోభితమగునదియే మేలిమిబంగారు. పుటము పెట్టనిచో నది మలినమే యగును. సకలవిధశ్రమములకు గుఱియైనఁగాని మనస్సు భవపాశవిముక్తిం గాంచదు. అట్టిమనస్సు గలవానిని బెద్దలు దాంతుఁడందురు. అంతరింద్రియనిగ్రహము లేనిచో నాతఁడొనరించుతపస్సు లోనగుసత్కర్మములు ఫలము నీఁజాలవు. యత్కించిత్ ఫలము నీజాలినను దాన నతఁడు కృతార్థుఁడు కాఁజాలఁడు. శ్రమములు గలిగినపుడు వానిని సహించి తనపట్టుదలమానక భగవంతు నారాధించినగాని భగవంతుఁ డుత్తమఫలముల నీఁజాలఁడు భగవదనుగ్రహమునకుఁ బాత్రుఁడయ్యెనని యూహించుటకుఁ దార్కాణము శాంతమే. అట్టిశాంతమును సంపాదింపఁగోరి మునులు సుఖమునకుఁ గాక ప్రాణధారణమునకుమాత్రమే యేదోయాహారముం గొందురు. భగవద్ధ్యానానందమే వారికి క్షుత్తృష్ణలఁ గ్రమమున నడంచును.

"అబ్భక్షైర్వాయుభక్షైశ్చ శీర్ణపర్ణాశనైస్తథా,
ఫలమూలాశనైర్దాంతైర్జితరోషైర్జితేంద్రియైః."

అను నీమూలముంబరికించినఁ బైయర్థము తేటపడియెడిని. ప్రాక్కర్మవశమునఁ గొందఱకుఁ దపస్సు శీఘ్రకాలముననే ఫలించును. కొందఱకుఁ జాలకాలమునకుఁగాని ఫలింపదు. మఱి

కొందఱి కాజన్మముననే ఫలింపదు. కాని యాసత్కర్మానుష్ఠానము మీఁదిజన్మమున నుపకరించి బీజరూపమును మాని వృక్షరూపమై వెలయును. అంతియకాని చేసినది నిష్ఫలము గాదు.

"అయతిశ్శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః,
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి"

అనునర్జునుని ప్రశ్నమునకు

"పార్థ నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే,
న హి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి. ౪౦

ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీస్సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే. ౪౧

అథవా యోగినామేవ కులే భవతి ధీమతాం,
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశం. ౪౨

తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికం,
యతతే చ తతో భూయస్సంసిద్ధౌ కురునందన. ౪౩

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః,
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే. ౪౪

ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః,
అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిం." ౪౫

అను నీ శ్రీకృష్ణపరమాత్మయుపదేశములు పైయర్థమును సూచించుచున్నవి. కృషి యేదిగాని నశింపక పైజన్మమునఁ దోడ్పడుచుండును. ఇన్నివ్రతములకు ఫలము దాంతియే. అది కుదిరినపిదప నవిరతభగవద్ధ్యానానందసుఖము గల్గును. అట్టి మహాపుణ్యము గలుగఁ గోరవలయును.

## వసిష్ఠముని విశ్వామిత్రునకు విందుచేయుట.

*విశ్వామిత్రుఁడు వసిష్ఠుని దర్శించి సంతోషము నడఁకు వయుఁ గడలుకొన నభివాదనమాచరింపఁగా నాశాంతధనుఁడు స్వాగతంబడిగి యాతిథ్యము గావించెను ముని యొసంగిన యాసనమునఁ గూరుచుండిన రాజునకు విధిమీఱకయుండ ఫలమూలము లర్పించెను. గాధేయుఁ డాసపర్యను గ్రహించి "మునీంద్రా! తపమునకంత రాయములు లేవుకదా. అగ్ని కార్యము సతతము సాగుచున్నదికదా? శిష్యవర్గమునకుఁ గుశలంబకదా? ఇయ్యాశ్రమమునఁగల వృక్షరాజి వృద్ధినొందుచున్నదియే." అని చక్కఁగాఁ గుశలవార్తల నడిగెను. వసిష్ఠుండును "రాజేంద్రా! నీవడిగినవెల్లఁ గుశలయుక్తములే." అని బదులు పలికి రాజును గుశలంబడిగి పిదప "రాజ్ఞాణీ! పరాక్రమవంతుఁడవు, ధార్మికుఁడవు నగదువు. 'రంజనాద్రాజా' యన్న న్యాయమురీతిఁ బ్రజలఁ బాలింతువుకదా? భృత్యులు చక్కఁగాఁ దృప్తులై యుందురుగా. నీయానతిం దలందాల్తురుగాదే. శత్రువుల జయింతువుకద. శత్రువిజయము రాజునకుఁ గర్తవ్యముగావున నందులకుపలయు చతురంగబలములు, కోశము, మిత్రులు, పుత్రపౌత్రులును సమృద్ధిగలిగి కుశలముగా నుందురుకదా?" అని ప్రశ్నింప రాజు నుచితరీతి బదులిచ్చెను.

పరమధార్మికులగు నాముని రాజులు కొంతసేపు కుశల ప్రశ్నాదికమున జరపిరి. వసిష్ఠముని మోమున సంతోషము వెల్లి విరియుచుండ "మహీపాలకా! సపరివారుఁడవై యీయాశ్రమమునకుఁ జనుదెంచితివి. కావున మీ కెల్లరకు నాతిథేయము

*ఇది యేఁబదియొకఁడవ సర్గమునుండి గైకొనఁబడినది.

చేయఁగోరెదను. నావేఁడికోలు నంగీకరించి నాసత్కారమును గ్రహింపుము. నీవు రాజేంద్రుఁడవు. అతిథులయం దుత్తముఁడవు. కాన నిన్నుఁ బ్రయత్నపూర్వకముగాఁ బూజింపందగు''నని యభ్యర్థించెను. రాజును మునిపలుకుల నాలకించి మతిమంతుఁడు కావున నాఋషిచంద్రునకు శ్రమముగలిగింపనెంచక వినయమున "మునిచంద్రా! సత్కరింతునన్న మాటయే చాలును. సత్కారము లెల్ల లభించెను. వేఱుగ నిఁకఁజేయనేల? మీయాశ్రమవర్యమునంగల కందమూలాదులొసంగి పూజించితిరి. జ్ఞాననిధులగు మీదర్శనంబబ్బెను. మీరు నాకుం బరమపూజ్యులు. అట్టి మీరింతగా నావంటివారికి మర్యాదచేయుటయే మహాపూజయయ్యెను. ఇంక నదియేల? కటాక్షవీక్షణముల నన్ను ధన్యుంజేయుము." అని యెన్నిసారులు వలదని వేఁడుకొన్నను మహోదారమతిగాన నమ్ముని పలుసారులుభోజనమునకై యభ్యర్థించెను. వలదనుట న్యాయముకాదని కౌశికుఁ డంగీకరించి మునీంద్రా! తమచిత్తానుసారము వర్తింతునని బదులిచ్చెను.

ఆపలుకుల కానందించి యప్పుడే చిత్రవర్ణములనలరారు కామధేనువు నాహ్వానించి "శబలా! వేగంబ రమ్ము. నామాట వినుము. ఈ రాజర్షికి నీతనిపరిజనులకును జక్కనివిందొనర్చి సత్కరింప నాకుఁ గోరిక కలిగినది. ఆ కార్యమునకు వలయువస్తువుల సిద్ధపఱుపుము. నీవు కోరినవానినెల్లం బిదుకఁగలవు. కాన షడ్రసములయం దెవ్వారికేది యిష్టమో దానినంతయునన్నుఁ గూర్చి వారికింగల్పింపుము. రసాయనములు, భక్ష్యపానీయములు, తేనియలులోనగు లేహ్యములు, దధిముఖచోష్యములు, గలిగి రుచిగలిగి మెసవఁదగు శాల్యన్నము నందఱకుఁ దనివిసనునట్లు

కూర్పుము. సత్వరంబ యీవిందు సాగవలయును." అని యాజ్ఞాపించెను.

బుద్ధిసంపన్నులారా! ఈభాగమున నొక్కవిశేషము కలదు. అతిథిపూజావిధానము తత్ఫలము మున్నే వివరింపఁబడి యెఁగదా.

"ఆతిథ్యం కర్తుమిచ్ఛామి బలస్యాస్య మహాబల
తవ చైవాప్రమేయస్య యథార్హం సంప్రతీచ్ఛ మే,
రాజా త్వమతిథిశ్రేష్ఠః పూజనీయః ప్రయత్నతః."

అని మూలమునఁ గలదు. నీవు రాజవుగాన నతిథులలో శ్రేష్ఠుఁడవని వసిష్ఠుఁడనియెను.

"న బ్రాహ్మణస్య త్వతిథిర్గృహే రాజన్య ఉచ్యతే,
వైశ్యశూద్రౌ సఖా చైవ జ్ఞాతయో గురురేవ చ. ౧౧౦
యది త్వతిథిధర్మేణ క్షత్రియో గృహమావ్రజేత్,
భుక్తవత్సు చ విప్రేషు కామం తమపి భోజయేత్." ౧౧౧

(మను. 3 అధ్యా)

అనుస్మృతిననుసరించి యోజించిన రాజు బ్రాహ్మణున కతిథి కాఁడనియు, మార్గవశమున వచ్చినవాఁడే యతిథి యనఁబడు ననియు, నట్లే రాజుకూడ వచ్చినయెడల విప్రభోజనానంతర మాతని కన్నము పెట్టవలయుననియుఁ దేలుచున్నది. శ్రీరామాయణమున "రాజా త్వమతిథిశ్రేష్ఠః" అని యున్నదికదా. ఇం దేది ధర్మసమ్మతమనుసంశయము కలుగక మానదు. సమాధాన మేమనఁగా.

మనుస్మృతివాక్యము సామాన్యధర్మమును బోధించును. కాన సామాన్యవిధి యనందగును. అందే,

"రాజర్త్విక్స్నాతకగురూన్ ప్రియశ్వశురమాతులాన్,
అర్హయేన్మధుపర్కేణ పరిసంవత్సరాత్పునః." ౧౧౯

అన్న విశేషవిధికనుపట్టెడిని. ఒకసంవత్సరము రాక మరల రాజు వచ్చెనేని మధుపర్కప్రదానమునఁ బూజింపవలయునని దీని యాశయము.

"ప్రతిసంవత్సరం త్వర్ఘ్యాస్స్నాతకాచార్యపార్థివాః,
ప్రియో వివాహ్యశ్చ తథా యజ్ఞం ప్రత్యృత్విజః పునః." ౧౧౦
యాజ్ఞవల్క్యస్మృతి. ఆచారకాండము.

"అర్ఘశబ్దో మధుపర్కం లక్షయతి." అని వ్యాఖ్య.

ఇట్లుస్మృతులు బోధించుచున్నవి. విశ్వామిత్రుఁడు భూపాలనము చేయుచు నెన్నఁడు రాక వచ్చినవాఁడు కావుననే అతిథులలో శ్రేష్ఠుఁడవని తెలిపెను. యథావిధిఁ బూజించి విందుచేయఁ గోరెను. అతిథి యనఁగా మఱుదినము నివసింపని బాటసారియని యర్థము. రాజట్టివాఁడు కాఁడు. విశేషించి యెప్పుడును వచ్చువాఁడు కాఁడు. కావుననే యాహారదానమున గౌరవింపఁ బూనెను. కావున నిది స్మృతినిషిద్ధవిషయమున కుదాహరణము కాఁజాలదు. ఇందులకు స్మృతి సమ్మతించునా యని యడిగిన యెడల:

"బాలోఽపి నావమంతవ్యో మనుష్య ఇతి భూమిపః
మహతీ దేవతా హ్యేషా నరరూపేణ తిష్ఠతి." ౮
మను. ౭. అధ్యా.

అను నిట్టివిశేషవిధులు గలవని సమాధానము చెప్పనచ్చును.

"యస్యయస్య యథాకామం పద్రసేష్వభిపూజితం. ౨౨
తత్సర్వం కామధుక్ క్షిప్రమభివర్ష కృతే మమ,"

అని మునియాజ్ఞాపించెను. ఎవ్వఁడు షడ్రసముల నెద్దానింగోరు నో వాని కద్దానినొసంగుము. నీవు కామదోగ్ధ్రివికదా. అనియే మునియాజ్ఞ.

రాజుసెలవడిగెను. ముని యతని బలవంతపఱచి విందు నొసంగందలంచి యెన్నిసారులువలదన్నను బట్టువదలఁడయ్యెను. ఏల? అని మనము ప్రశ్నించుకొనవలయును. దాననే మనకుఁ గర్మసిద్ధాంతము చక్కఁగా బోధపడును. మహాకార్యమునకు నెన్నియో సాయములు కావలయును. విశ్వామిత్రజననవృత్తాంతమును దలంచిన క్షత్రియుఁడై పుట్టి బ్రహ్మర్షి కాఁదగినట్లున్నది. పరశురాముఁడు విప్రుఁడై పుట్టి క్షత్రియుఁడు కాఁదగినట్లున్నది. అనఁగా విప్రత్వక్షత్రియత్వములు ధర్మములుగాఁగలవార లగుదురనిభావము గాధినందనుఁడు పెక్కేండ్లు రాజ్యమేలెను. ధర్మమును విడనాడినవాఁడు కాఁడు. వసిష్ఠమహర్షి విందుచేసె నంతదనుక రాజయ్యును బెద్దలయెడ వినయమునఁ బ్రవర్తించు వాఁడే యై యుండెను. అంతదనుక నాకర్మఫలము ననుభవించెను. ఇఁక బ్రహ్మర్షియగుటకుఁ బ్రయత్నము సాగవలయును. కాలము పరమాత్మస్వరూపము. అఖండము. వినాశము లేనిది. భగవంతుఁ డాయాయికర్మఫలముల నాయాసమయములయందొనఁగూర్చుచుండును.

"భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా"

అని గీత బోధించెడిని. అనఁగా భగవన్మాయ యందఱ నాయా కర్మగతులం భరిభ్రమింపఁజేయుచుండునని తాత్పర్యము. ఈశ్వరుఁడు నిర్లిప్తుఁడు నిష్క్రియుఁడుకదా.

మధ్వవైష్ణవులుకొందఱు ప్రకృతియన్న నెగిరిపడుదురు. పాపము! వారికిఁ దత్త్వము తెలియదు. శ్రీరామానుజా చార్యులవారు శ్రీప్రాధాన్యమును స్థాపించిరి. ఏల? భగవంతు నకు సర్వసాక్షిత్వాదు లూడిపోవునన్న భయముచేతనే,

"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా" అనియుం,
"మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరం." అనియుం,

భగవదుక్తుల నమ్మియే యాచార్యులుగారు శ్రీప్రాధాన్యము నంగీకరించిరి. మధ్వవైష్ణవులు ప్రకృతియన్నఁ బార్వతియని యర్థముచేసికొని కాఁబోలు దుముకుచుందురు పాపము శాంతించుఁగాక. ప్రకృతియనునది యాకృతికలదిగాదనియు, భగవదిచ్ఛాశక్తియనియు,సకలప్రపంచనిర్మాత్రియనియుఁ,బరమేశ్వరునకు నాప్రకృతికి నభేదమనియు, నెవ్వరేనామమునఁ బిలిచినను బిలువవచ్చుననియుఁ, బ్రకృతిని దూషించువారు భగవంతుని దూషించినట్లే యగుననియు, వారు తలంచుచో దుర్భావమంత రించును. ప్రకృతి స్త్రీగాదు. పురుషుఁడు కాదు. మఱేదియుఁ గాదు. ప్రకృతిశబ్దము స్త్రీలింగము. దైవత-బ్రహ్మశబ్దములు నపుంసకలింగములు. దేవతాశబ్దము స్త్రీలింగము. అట్లే యిదియు నని యూహించుకొనందగు.

శాక్తమతమును దూషించువార లీయర్థము నెఱుంగని వారే. కనుకనే శాక్తులు విగ్రహారాధనము చేయువారందురు. తెలిసియాక్షేపించిన సమాధానము చెప్పవచ్చును. మూర్ఖులకు సమాధానము చెప్పుట బ్రహ్మకే నశక్యము. చక్రపూజచేయు వారు శాక్తులు. సాలగ్రామము చక్రము విగ్రహములనఁబడవు. ఇదిబాహ్యపూజ. ఈరీతిఁబూజించువారు సామాన్యులు. అథా

రాదిషట్చక్రములయం దాయారూపముల నిలిపి ధ్యానించు వారును శాక్తులనంబడుదురు. "అంతరర్చనసుప్రీతా బహిరర్చనలోలుపా" అని యందులకుఁ బ్రమాణము ఇట్టులుండ శాక్తులు విగ్రహారాధకులేకదా యని దూషించు టున్మత్తప్రలాపమువంటిది. శుక్రతీర్థము శాక్తులకు ముఖ్యమనుట తెలివితక్కువ. అయ్యది కొన్నికూటములందు నుపవస్త్రోత్సవమువంటి దని యాపాషండు లూహింతురు కాఁబోలు. సురాపానము చేయువారు మాంసభక్షకులు శాక్తులయందు లేరాయందు రే నుండవచ్చును. అట్టివారు విశేషించి మధ్వవైష్ణవులయందును గలరు. ఇతరులలో నుండవచ్చును. అయ్యది విధివిహితమా. దాసులతిప్పలు పెరుమాళ్లకుఁ దెలియునన్న సామెత ప్రకారము వర్తించుచుఁ బంక్తిబాహ్యులగృహములభుజించుచు భుక్తశేషమును గురుప్రసాదమని శిష్యులకుఁ బెట్టుచు స్మృతిలేకయుండఁ ద్రాగి సకలమాంసములుతినువారెందఱు వైష్ణవశిఖామణు లనిపించుకొనుటలేదు. అట్టివారే యిందు మధ్వవైష్ణవు లనఁబడుచుందురు.

మతస్థాపకులు నిర్మలాత్మకులు, మహనీయులు, తపస్సిద్ధులు. వారిననుసరించువారిదోషములు వారలకంటగట్టుటుచితముకాదు. వారిహితముననుసరించి ప్రవర్తించువారే శిష్యులనఁబడుదురు. పేరునకుమాత్రము శిష్యులమని చెప్పుకొనుచు మద్యమాంససేవకులైన శిష్యులంజూచి గురువులు నిట్టివారే యని దూషించుట మహాపాపము. శ్రీరామానుజాచార్యులుగారు కంచుకోత్సవమును బోధించిరని యొప్పుకొను నీచుఁడుం

డినయెడల శాక్తులు సురాపానముచేయుచు మాంసభక్షణము చేయువారలన్న నౌనను బాపాత్ముఁడుండును.

ప్రతిమతము సర్వజనులకుగా నేర్పడినదిగాని యొక్క తెగవారికిగా నేర్పడినది కాదు. ఆయాకులములకుఁ జేరినవారు వారియాహారమును నైవేద్యముచేయుదురు. శూద్రులు మాంసభక్షకులు. కాన వారు దానిని దేవతకు సమర్పింతురు. క్షత్రియులుకూడ నట్టివారే. విప్రులకే యది నిషేధమయ్యెను.

"బ్రాహ్మణో మదిరాం దత్వా బ్రాహ్మణ్యాదేవ హీయతే."

అన్న ప్రమాణము నెఱుంగనివా రాక్షేపింతురు.

"యదన్నం పురుషో భుంక్తే తదన్నం తస్య దేవతాః."

అన వినమే. అస్త్రవిద్యక్షత్రియాదులకొఱ కేర్పడినది. వారలకు విధివిహితాహారమేదియో యదియే వారలుపాస్యదేవతకు నొసంగుదురు. వారి నాక్షేపింపరాదు.

"నాత్మార్థం పాచయేదన్నం నాత్మార్థం పాచయేత్పశూన్,
దేవార్థే బ్రాహ్మణార్థే వా హన్తవ్యాస్తేద్యపశూన్ ద్విజః."

అని ప్రమాణముకలదు. పరిశుద్ధమాంసభక్షణము యుగాంతరముల విప్రులకుంగలదు. అది నిషేధింపఁబడుట కలియుగముననే కదా. ఆశ్లోకము లుదాహరించి బ్రాహ్మణులెల్ల మాంసభక్షకులనుట తెలివితక్కువగాక మఱేమగును? శుభాగమపంచకము బ్రాహ్మణులకుగా విధింపఁబడినది. తదుక్తాచారమునఁ బ్రవర్తించువారే విప్రులు.

పాషండులనఁగా దేవతాదూషకులు. వీరుశైవులయందు వైష్ణవులయందును గలరు. అందఱు ననరాదు. కొందఱే యనవలయు. తక్కినవారు దూషింపరు. భూషింపరు. శాక్తు లట్లు

దూషింప నవకాశమే లేదు. సకలదేవతామంత్రము లామ్నా యషట్కమునఁ గలవు. వైష్ణవమున నట్లుండవలనుపడదు. మత మనునది ప్రతిమానవులకుఁ దగినధర్మములు తెలుపవలయును. ఏదేవత నుపాసింపఁబూనిన నావిధి కలిగియుండవలయును. ఈ విషయమునుజర్చించుట కిట విశేషావకాశము లేదు. వేషధారు లన్నిమతములయందుఁ గలరు. ద్రవ్యమునిమిత్తము దాసుల మని యోగులమని మాంత్రికులమని సంచరించుచు, శిష్యులం గూర్చుకొనుచు, మంత్రములనుపదేశించుచు, ధనములాగుచుఁ దమవారికొసంగుచు, వీతస్పృహులవలె నటించుచు నుండువా రెందఱు లేరు? అట్టివారుండఁబట్టియే,

> "జటిలో ముండీ లుంఛితకేశః కాషాయాంబరబహుకృతవేషః.
> పశ్యన్నపి నచ పశ్యతి మూఢో హ్యుదరనిమిత్తం బహుకృతవేషః."

అని శంకరాచార్యశిష్యులు పలికిరి. పూర్వముండిరి. ఇపుడున్న వారు ముందుండఁగలరు. అట్టివారిమాయోపదేశములకు లొంగకుఁడని తెలుపు టొక్కనిదూషించుటకుంగాదని మతి మంతు లూహింతురు. కుమతులు తమ్మే దూషించిరని తలంచి కలహింతురు. అది వారలదుష్కర్మము వారిని స్మరించి మనము విచారింపవలసినదే కాని వేఱుపకారము చేయఁజాలము.

శాక్తులు వైష్ణవులు శైవులులోనగువా రగుదురు. ప్రకృతివిశిష్టునకుఁగదా రూపనామము లుండును. ఆతఁడేకదా ధ్యేయుఁడు. పాషండులనఁదగిన మధ్యవైష్ణవులకుఁగాక తక్కిన వైష్ణవులకుఁ బ్రకృతి మహాలక్ష్మి పురుషుఁడు శ్రీమహావిష్ణువు. వారి నారాధించువారు కృతకృత్యులగుదురు. ఇట్లే శైవులు కూడ. శాక్తులుకానివా రెవ్వరో తెలియఁజాలకయున్నాఁడను.

ఇట్టులుండఁగా శాక్తులన్న నెగిరిపడువారు మతమెఱుంగని వాచాటులు. వారింగూర్చిన పరితాప మింకఁజాలును.

ఇఁకఁ గథాభాగమునకు వత్తము విశ్వామిత్రునకు ఋషిత్వమలవడు కాల మాసన్నమైనది. దానికిఁదగు కృషి చేయవలయును. కావున విశ్వామిత్రునిసత్కర్మము వసిష్ఠమునీంద్రుఁ బురికొలిపెను. బలవంతము చేయునట్లు లొనరించెను. రాజు సమ్మతించునట్లు చేసెను. కనుకనే భగవంతుఁడు శ్రీకృష్ణమూర్తి "గహనా కర్మణో గతిః" అని బోధించెను. కర్మగతి యిట్టిదని బ్రహ్మాదులే యెఱుంగరన నిఁకసామాన్యులమాట యేటికి? కర్మ ప్రోత్సాహమున మునీంద్రుఁడు హోమధేనువును బిలిచి విందు గూర్పనెంచితిని. షడ్రసములలో నెవ్వాఁ డెద్దానింగోరునో వాని కయ్యది కలుగునట్లు చేయుమని యాజ్ఞాపించెను. ఆకార్యమున ముం దేమికీడు మూఁడునోకదాయని ముని యాలోచింప లేదు. దివ్యదృష్టిగల మహాత్ముఁడుకదా వసిష్ఠుఁడు. అటులయ్యును గర్మబద్ధుఁడయ్యెను. ఈఘట్టమును బఠించి మనము నేర్చుకొనఁదగువిషయము మానవులుకర్మబద్ధులు స్వతంత్రులు గారు. కావున సత్కర్మానుష్ఠానము చేయుచు వానిఫలములను గోరక భగవంతునాశ్రయించి యుండవలయుననియే. లేనిపోని కర్తృత్వము నారోపించుకొనరాదు. ఫలాభిసంధిరహితకర్మానుష్ఠానము జ్ఞానమును గల్గించును. కాన మనము శ్రద్ధాభక్తులు గలిగి పాషండులవలె వీనికంటె వాఁడెక్కుడు. వానికంటె వీఁడెక్కుఁడు. అని తెలివిమాలినప్రసంగములతోఁ గాలము వ్యర్థము చేయక భగవంతునే యాశ్రయింపవలయును. ఇఁకఁ దరువాతికథ నాలకింపుఁడు.

## విశ్వామిత్రుఁడు హోమధేనువునిమ్మని వసిష్ఠునడుగుట.

రామచంద్రా! తరువాతికథ నాలకింపుము. వసిష్ఠముని యిట్లు తెలుపఁగా నాశబలయనఁబరఁగు హోమధేనువు కామదోగ్ధ్రి కావున నెవ్వార లెట్లుకోరుదురో వారికోర్కులు తనివిచన నాయాభక్ష్యపదార్థములఁ గల్పించెను. ఇక్షుఖండములు, తేనియలు, లాజలు, మైరేయమద్యములు లోనగుపదార్థములు, పిండివంటలులోనగు భక్ష్యపదార్థములెల్ల నాశబలచేఁ గల్పింపఁబడియెను. శ్రీరామభద్రా! ఆపదార్థములిట్టివని కాని యిన్నివిధములని కాని వర్ణింపఁదరము కాదు. రాసులుగనొప్పెననిమాత్రము చెప్పెదను. రాజపరివారమంతయు సంతృప్తిగా భుజించి త్రాగి మిగుల సంతుష్టిగాంచెను. రాజును రాజపత్నులును బురోహితులు మంత్రులులోనగువా రావిందున మహానందమును గాంచఁగల్గిరి దానసంతుష్టుఁడై రాజు వసిష్ఠమునితో "మహాత్మా! మీరు మాకుఁ బరమపూజ్యులు. అట్టిమీరు మాకెల్లరకు నాతిథ్యముగావించి గారవించితిరి. ఇంతకన్న మాకేమి కావలయును? మీరువాగ్విశారదులరు. కావున నొక్కమాట చెప్పెదను. ఆలకింపుఁడు. మునీంద్రా! లక్షధేనువుల మీకొసంగుదు. వానిని గ్రహించి యీశబలను నాకొసంగుఁడు. ఇది స్వజాతియందు త్తమము. కాన గోరత్నమనందగును. రత్నములు రాజునకుఁ జేరఁదగినవికదా. ఆకారణమున దీని నాకిందు ధర్మపద్ధతినాలోచింపఁగా నీయది రాజుగానుండునాదియేగాని బ్రాహ్మణులరగు మీదికాదు." అని రాజుపలుక మునిపతి మహాత్ముఁడునగు వసి

---

* ఇయ్యది యేఁబదిరెండవ సర్గమునుండి సంగ్రహింపఁబడినది.

ష్ఠుఁడు వినియు ధర్మబుద్ధిగలవాఁడు కావునఁ దానాచరించుధర్మ కార్యములకు నత్యంతసాధనభూతమగుధేనువు కాఁబట్టి దాని నీయనెంచక "రాజా! లక్షయే కాదు.అసంఖ్యాకములగు గోవుల నొసంగినను రజతపర్వతములనిచ్చినను నే నీశబల నీయంజాలను. శత్రుసూదనుఁడవునీవు కాన నాకేమియపకారము చేయుదువో యనిభయంపడి దీనినివదలువాఁడనుగాను.ఇదినాకడనే యుండఁ దగినది. కాని వేఱొకతావున నుండరాదు. మనస్వియగు వానికిఁ గీర్తియుంబోలెఁ దపస్వికి నిది సర్వకాలము చెంతనే యుండఁదగినది. కారణ మేమందువో ఆలకింపుము. దేవతలకు హవ్యములు పితరులకునిచ్చుకవ్యములు,సాయంప్రాతఃకాలముల వేల్చుహోమములు భూతబలియు, దర్శపూర్ణమాసాదిహోమ ములు, మఱియు నిట్టివేవేవికలవో యవియు, నాదేహయాత్ర యు నీకామధేనువుమూలముననే జరగుచున్నవి. మఱియు స్వాహాకారవషట్కారమంత్రములు వేదాదిసద్విద్యలుసాగుట కీధేనువే ప్రధానము. నిస్సంశయము. సత్యమిది. నాసర్వస్వమిది యేయని విశ్వసింపుము నిరంతరసంతోషకారిణి యిదియే. కార ణములివియేగాక యింక ననేకకారణములు గలవు. వానినన్నిం టినిబట్టి యేనీధేనువు నీఁజాలను."

అనియిట్లు వసిష్ఠమునివచింపఁగా విశ్వామిత్రుఁ డెంతయు నభినివేశయుక్తముగా వాగ్విశారదత్వ ముట్టిపడునట్లు మరల నామునితో "మహాత్మా! స్వర్ణాభరణాలంకృతములయి కనకాం కుశములుగలిగి వెలయుగజములను బదునాలుగువేల నిత్తు. నాలుగుగుఱ్ఱములుగట్టియుండ, బంగారుచిఱుగంటలుగలిగి తళ తళలాడునరదంబుల నెనిమిదివందల నొసంగెదను. అంతియ

కాదు. సద్దేశజాతిసముద్భవములగు హయమ్ములఁ బదునొకండు వేల నిచ్చెదను. నానావర్ణముగల కోటియావుల నర్పించెదను. ఈయొక్క శబళను నాకిమ్ము. రత్నములు సువర్ణము కావలయు నేని యెంతయే నిచ్చెదను. ఈ ధేనువునుమాత్రము నాకొసంగుము." ఈరీతివిశ్వామిత్రుఁడడుగఁగా మహాత్ముఁడు కాన రాజుం గాంచి యెట్టులేని నే నీధేనువు నీఁజాలను. నీవిచ్చురత్నములు నాకేల? ఇదియే నాకురత్నము, ధనము, సర్వస్వము, నాజీవితము నిదియేయని నమ్ముము. నాకు సత్కర్మములెల్ల నీశబలయే. నా యొనర్చుకర్మముల కన్నింటికిని మూలమిదియే సుమీ. నాకోరిన వన్నింటిని బిదుకునీధేనువు నియ్యనని గట్టిగాఁజెప్పెను.

మహాత్ములారా! ఈభాగమునఁ గొన్నివిశేషములుగలవు. వానిని దెలిసికొనక ముందునకుసాగ రాదు. వసిష్ఠుననుమతంబున శబల రాజునకుఁ దత్పరివారమునకుఁ గావలసినపదార్థములఁ గల్పించెను. అనఁగా నే సామాన్యుల కచ్చెరువు కల్గును. ఇది నమ్మఁదగునాయనియు వారూహింతురు. దానికిఁగారణముకూడ లేకపోలేదు. ఈవిధము లోకమున లేనిది. కావున నట్టి యూహను గల్గించుటలో వింతయేమికలదు?

యోగుల కివియన్నియు సులభసాధ్యములు. మనవంటి వారి కావిషయమున విశ్వాసము కుదురకయుండుట కర్మఫలమే యనవలయును.

సూ. "కాయేంద్రియసిద్ధిరశుద్ధిక్షయాత్తపసః. 43

స్వాధ్యాయాదిష్టదేవతాసంప్రయోగః. 44

సమాధిసిద్ధిరీశ్వరప్రణిధానాత్." 45

(పాతంజలయోగసూత్రములు.)

తపస్సు చేయుటచేతఁ జిత్తగతమలినము నశించును. దానిచే జ్ఞానకర్మేంద్రియముల కత్యద్భుతశక్తి కలుగును.

అభష్టమంత్రజపము చేయుటచేతఁ దాఁగోరిన దేవత ప్రత్యక్ష్యమగును. పరమేశ్వరునియం దత్యంతభక్తి గలిగియుండు టంజేసి సంప్రజ్ఞాతసమాధిలాభము కలుగును.

"అణిమా మహిమా మూర్తేర్లఘిమా ప్రాప్తిరింద్రియైః
ప్రాకామ్యం శ్రుతదృష్టేషు శక్తిప్రేరణమీశితా
గుణేష్వసంగో వశితా యత్కామస్తదవస్యతి. ఇతి"

(యోగసారసంగ్రహము. 3 అధ్యా.)

"ఈశితా చ శక్తీనాం భూతభౌతికానాం స్వేచ్ఛయా ప్రేరణమ్."

(విజ్ఞానభిక్షువు.)

"ఇదానీం సిద్ధిప్రకారః కథ్యతే.

అత్ర ప్రకృత్యా పూరేణ ప్రకృత్యపసారణముపలక్ష్యతే. జాత్యంతరపరిణామేన చ అణిమా మహిమాద్యా అపి సిద్ధయ ఉపలక్ష్యంతే. తేన యథాయోగ్యం ప్రకృత్యా పూరణాపసారణాభ్యాం సర్వాస్సిద్ధయ ఉత్పద్యంతే. ఏతేన వామననృసింహవరాహాదీనాం క్షణేన ప్రకృత్యా పూరణాదేవ శరీరవృద్ధిః. అగస్త్యాది పీయమానసముద్రాదేశ్చాల్పత్వం ప్రకృత్యపసరణాదుపపన్నమితి. యేన యోగీ జీవాంతరసంయోగేన గజతురగాదీని నిర్మాయైశ్వర్యం భుక్త ఇతి. మంత్రసిద్ధిస్తు మంత్రైరాకాశగమనాదిః తపస్సిద్ధిశ్చ తపసా సంకల్పసిద్ధ్యాదిః. ప్రహ్లాదాదీనాం భక్త్యాదిజన్యసిద్ధయశ్చ తపస్సిద్ధిమధ్యే ప్రవేశనీయాః. అక్షయః పరమో ధర్మో భక్తిలేశేన లభ్యతే."

(యోగసారసంగ్రహము. 3 అధ్యా.)

యోగి యోగసిద్ధింగాంచి యెన్నియోమహాకార్యములు చేయఁజాలును. ఎన్నియోఁ బదార్థములను గల్పింపఁజాలును. మనస్సు

నకు నతీతగమనమున నెందేఁ బోవఁజాలును. అతని కసాధ్య మేదియునుండదు. ప్రహ్లాదుఁడు భక్తిభావమునఁ బరమేశ్వరుని ధ్యానించుచుండఁ దండ్రి పెట్టినబాధ లాకుమారవర్యుని బాధింపఁజాలెనా? అగ్ని కాల్పఁజాలెనా? సర్పములవిష మాతని బాధింపఁగల్గెనా? ఏల? సర్వేంద్రియసంయమనమును జేయఁగల్గిన యాతని నేవియు బాధింపఁజాలవని యెఱుంగందగు.

"వర్షత్రయాభ్యాసవశాదతీతమనాగతం వేత్యఖిలేశకేశః,
విషం న దేహే క్రమతే తదీయే దష్టే సుఘోరై రపి పన్నగేంద్రైః.
(త్రిపురాసారసముచ్చయము.)

అని యిట్లు యోగశాస్త్రములెల్లఁ దన్మహత్త్వమును వేనోళ్లఁ దెలుపుచున్నవి. అట్టియనేకయోగముల నభ్యసించిన మహాత్ము నకు శబలమూలమున నీపాటివిందుచేయించుట యొకగొప్ప కార్యముకాదు. యోగశక్తినెఱుంగనివారలకును, దానినమ్మని వారలకుంగూడ నీవిషయము రుచింపదు. కాని పెద్దలందఱు నేకగ్రీవముగా నంగీకరింతురు. అగస్త్యముని సముద్రోదక మును బానముచేసెననఁగా నర్థమేమి? యోగమహత్త్వమున దానిని రూపుమాపెననియే యర్థము. అవన్నియుఁ గల్లయను వారికి భగవచ్ఛక్తియుఁ గల్లగనే తోఁచును. వారినంగీకరింపఁ జేయఁ దరముకాదు. కనుకనే మహాకవి భర్తృహరి,

"శక్యో వారయితుం జలేన హుతభుక్ఛత్రేణ సూర్యాతపో
నాగేంద్రో నిశితాంకుశేన సమదో దండేన గోగర్దభౌ
వ్యాధిర్భేషజసంగ్రహైశ్చ వివిధైర్మంత్రప్రయోగైర్విషం
సర్వస్యౌషధమస్తి శాస్త్రవిహితం మూర్ఖస్య నాస్త్యౌషధం."

అని తెలిపెను. కావున వారిని సమాధానపఱుపఁబూనుట వ్యర్థకాలక్షేపమే.

ఆవిందున నెల్లరు తృప్తినొందిరి. రాజునకుఁ బ్రభుత్వ సంపద తొలఁగుకాల మాసన్నమయ్యెను. లోకసేవాపరాయణత్వ మలవడఁదగినస్థితికి రావలయును. ఆతనిసత్కర్మము మఱింతగాఁ బ్రోత్సహించెను. వసిష్ఠునిం బొగడించెను. ఆహోమధేనువును గ్రహించిన మనరాజ్యపాలనము చక్కఁగా సాగును గదా యన్నయూహఁ గల్పించెను.

"కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్."

అన్న భగవదుపదేశమును సార్థకము చేయ నాకర్మమే తల పెట్టెను. అంతకు ముందు మునియందుఁగల పూజ్యత్వబుద్ధి నాశాపాశములచే బంధించెను. శబలను గ్రహింపకపోరాదన్న పట్టుదల నాతనిమది నెలకొల్పెను. ఇపుడు రాజు తోలుబొమ్మవలె నున్నాఁడు. వినయమున నీశబలను నాకిమ్మాయని జంకులేక యడిగెను. ఎన్నియేని ధేనువుల నొసంగుదుననియె. మఱియేమి కోరిన నిత్తునని యర్థించెను. అంతట నాకర్మ మూరకయుండ లేదు. మునిమనస్సున నీయరాదన్నపట్టుదల నెలకొల్పెను. ఇపుడిరువురును గర్మప్రేరితులై వాదులాడుచుండఁ జూచుచుండెను. ఉరణము (పొట్టేలు)లవలె వారు కలహింపఁబూనిరి భగవంతుఁడు సర్వసాక్షిగావున నెమ్మదిగాఁజూచుచుండెను. వలయునని రాజు, ఈయనని మునియుఁ బట్టుదలలఁ జూపసాగిరి ఒకరినొకరీవిషయమున మించిరి. ఏమియిచ్చినను ధేనువును దీని నీయనని ముని స్పష్టముగాఁ జాటెను.

మహాశయులారా! ఒక్కక్షణకాలమున నిండఱ నిష్ట మృష్టాన్నకలన సంతుష్టులఁజేసిన గోవుశక్తి యపారమని రాజెఱుంగఁడా? త్రికాలవేదియగుముని మనమీవిందొనర్చిన నాశకుఁ జిక్కి రాజడుగునుగదా యని యెఱుంగఁడా? మనలఁ జంపఁగలవారిని సృజింపఁజాలదాయని రాజేల యూహింపఁ జాలకపోయెను? కర్మము బలవత్తమమైనది. దానిచేష్ట లాభగవంతుఁడొక్కఁడుతప్ప నెవ్వరును గనుఁగొనఁజాలరు. "గహనా కర్మణో గతిః" అన్నమాటను మఱువకుఁడు. ప్రతిక్షణ మావాక్యము మనహృదయఫలకముల నాట్యమాడుచుండవలయును. దాన మనయహంకారము క్రమముగఁదొలఁగును. ఈచరిత్రము నుండి మనము కర్మము బలవత్తమమని నేర్చుకొనవలయును. దుష్టఫలము లనుభవించుకాలము సమాసన్నము కాఁగా మన బుద్ధులు పూర్వస్థితినుండి మార్పునొందుననియు, భావిఫలానుభవమున కనుకూలముగా నూహించుచుండుననియు నెఱుంగవలయును. అట్టితఱి నెవ్వరెన్నివిధముల న్యాయమార్గమునఁ బ్రవర్తింపుమని తెలిపిన నాయుపదేశము మేలుకొఱకుఁగానే కాదని త్రోఁచుననియుఁ దెలిసికొనవలయును. తెలిసికొని చెయునదేమందురేమో. ఏమియులేదుగాని యట్టిసమయముల భగవతిని మహామాయను స్మరించి నన్నుద్ధరింపుమా యని వేఁడుకొనవలయును. నన్నీమాయాప్రపంచమునుండి యుద్ధరించి భగవంతుని సన్నిధిం జేర్పుమాయని ప్రార్థింపవలయును. ఏటికందురు కాఁబోలు. "మమ మాయా దురత్యయా" అని భగవంతుఁడే చెప్పెను. "మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే" అనియు నామహాత్ముఁడే తెలిపెనుగాన నాతనిశరణుచొచ్చినఁ

జాలదాయనియు నందురు కాఁబోలు. ఇందొక్కరహస్యము కలదు కుతర్కముల నది వీడదు శాంతముగా నాలకింపుఁడు.

రాజదర్శనము కావలసియున్నది. మంత్రిమూలముగా నది కావలయునని నియమము కలదు. మంత్రి మనయం దాదరణము కలవాఁడుగా నుండ లేదు. రాజునాశ్రయించిన నీతఁ డేమియుఁ జేయఁజాలఁడు. అది యెట్లగును? తొలుత మంత్రి నాశ్రయించి స్తుతులచేతను, నిరంతరాశ్రయణబలముచేతను సదయునిగా నొనరించుకొనవలయు. మంత్రి క్రూరాత్ముఁడు కాఁడు. కానఁ గొంతకాలమునకు (ననఁగా రాజదర్శనము చేయఁజాలు నదృష్టము మనకు వచ్చునంతకని యర్థము) మంత్రి సదయుఁ డగును తత్ఫలము రాజదర్శనమే. రాజదర్శనము కాఁగా సకలార్థము లొనఁగూడును ఇది మర్యాదయని యంద ఱెఱుంగుదురు. అట్లే భగవంతు నిచ్ఛాశక్తియగు మహామాయను సేవించి తత్కరుణకుఁ బాత్రులమై తత్ప్రసాదితనిర్మలజ్ఞానమునఁ బరమేశ్వరుకడఁ జేరవలయుననిసారము. అజ్ఞానమును వదలించుకొని నిర్మలజ్ఞానమును సంపాదించుకొనిననా పరమేశ్వరుఁడు తనదాస్యమునొసంగుననిభావము. కొందఱు ప్రకృతియందుఁగల యీసు చేత భగవంతునాశ్రయింతు మందురు. ఆయీర్ష్యయేకదా దుష్కర్మమగును. అది యెంతదనుక మదినుండునో యంతదనుక మనకు దుర్గతియే కాని సుగతియెట్లు కల్గును? మహాలక్ష్మినిదూషించిన శ్రీమహావిష్ణువు మనలఁ గాపాడునా? ఆమె నారాధించిన నాభగవంతుఁ డత్యంత ప్రీతుండగును. నిర్గుణబ్రహ్మముకూడఁ దదిచ్ఛాశక్తియగు మహామాయను దూలనాడినఁ బ్రీతుఁడు కాఁడు ఆమహామాయ యేదోయొక దేవతయనుకొనకుఁడు. అజ్ఞా

నాంధకారముఁదొలఁగించు చిచ్ఛక్తియని నమ్ముఁడు. ఈభావము మీకుఁ గలదేని శక్తిదూషణము చేయరని నానమ్మకము. భగవంతునిచ్ఛను దూషించి తత్కారణంగోరుట యెట్టిదో నేను వచింపవలయునా? కావునఁ గర్మగతులనారసి భగవంతునిసేవించు టుచితమనియు, నామహనీయునను గ్రహము కలిగినయెడల నీ కర్మపాశములు తొలఁగుననియు గ్రహింపుఁడు. ఇఁకఁదరువాత వృత్తాంతము నవధరింపుఁడు.

## శబల యోధుల సృజించి రాజసేనలంబొలియించుట.

*వసిష్ఠముని శబలనీయమింజెలిసికొని కౌశికుఁడు దానిని బలవంతముగా గ్రహించి తనపౌరుషము మెఱయఁ దీసికొని పోవుచుండఁగా నాధేనువు శోకాకులితమానసయై యేడ్చుచుఁ దనలోఁ దానిట్లు తలపోయఁజొచ్చెను. హా! ఈవఱకు రాజసేవకులు దిక్కుమాలినయట్టుశోకించునన్ను బంధించి తీసికొనిపోవుచున్నవారు. ఏటికి? మహాత్ముఁడు మునియే విడిచెనా? నేనేమి యపకార మమ్మునికి నొనరించితిని? ఆత్మజ్ఞుఁడగుట నమ్మునికిఁ దెలియని దేదికలదు? అనురక్తుఁడై తన్నెడఁబాయనినన్ను విడువ నేల? అనియూహించి తనచుట్టునుగలభటుల నొక్కసారివిదిల్చి తొలఁగంద్రోచి జవమునఁ బరుగిడి మునిపాదమూలమును జేరి "మునీంద్రా! నన్ను నీవేవదలితివా? కాదేని వీరునన్నేలయీడ్చుకొనిపోవుచున్నారు? బ్రహ్మపుత్త్రుఁడవగునీవు నన్ను వదలఁదగునా?" అనిప్రశ్నించెను మునియు శోకపరితప్తమానసుఁడై తోఁబుట్టువువలెనేడ్చుచున్న యాహోమధేనువుం గాంచి, "శబలా! నిన్ను నేవదలలేదు. నాకేమియునపకారము నీవొనరింపను లేదు.

---

*ఇది యేఁబదినాల్గవ సర్గమునందలిది.

ఈరాజు బలశాలినని కన్నుఁగానక న్యాయమును వీడి నిన్నీడ్చు
కొనిపోవఁ బంచెను. ఆతనింబోఁదోలి నిన్ను విడిపింతునన్నను
నాకు నతనికున్నంతబలము లేదు. తపోబలమున నిగ్రహింతు
ననుకొంటి నే నతఁడు మనకుఁబాలకుఁడు. భూపాలునిదపోబల
మున దండింపరాదని పెద్దలందురు కదా. నేను విశేషించియాద
రించి యాతిథ్యమిచ్చి యిపుడే యేమియు నపకారావమాన
ములు చేయఁదలంపరాదు. భూపతింబొలియించినఁ బాపమం
టును. ఈసేన సామాన్యము కాదు. చతురంగములుగలది. దీన
నీతఁడు బలశాలియైయున్నవాఁడు. కాన నేనేమి సేయుదును?"
అనియూరకుండెను.

వాక్యముల పొంకమెఱింగినది కాన నాశబలయు ముని
యాశయమెఱింగివినయముననా బ్రహ్మర్షితో "బ్రాహ్మణోత్తమా!
క్షత్రియునిబల మెంతయు నల్పము. బ్రాహ్మణుఁడే మిగులబల
వంతుఁడు. బ్రాహ్మణబలము క్షత్రియబలముకంటె నతిశయమైన
బలమని యార్యులందురు. కావున బ్రాహ్మణుఁడవగు నీబలమపా
రము. విశ్వామిత్రుఁడు నీకంటె బలవంతుఁడు కాఁడు. నీతేజం
బితరులకుంగల్గుటాశ్చర్యము. ఇట్టిమహనీయుఁడవుగావున నీదగు
బ్రహ్మబలమున నాకుఁ బ్రభావమును గల్గించి యాజ్ఞాపింపుము.
ఇప్పుడే యీరాజునకునున్న గర్వసంపద నడంచెదను." అని
వేఁడుకొనియెను

మహాకీర్తిమంతుఁడగు నామునిపతి 'శబలా! పరబలమును
మాయించునట్టి బలమును సృజింపుమా'యని యాజ్ఞాపించెను.
ఆమాటవిన్నయంతనే యట్టిబలమును బుట్టింపఁబూని యంబా
రవము గావించెను. ఆరవమునుండి పహ్లవులనుపేరుగల మ్లేచ్ఛ

జాతులు శతసంఖ్యలుగాబయలువెడలి రాజుచూచుచుండఁగనే తత్సైన్యమునురూపుమాపిరి. రాజుతనసైన్యానాశమున క్రోధాక యరదంబెక్కి వారించలపడి కోపంబుదీపింప రోషారుణితనయ నుండై నానాస్త్రప్రహారముల నాపప్లవులనుబోకార్చెను. వందల కొలంది రాజుచే వారు హతులైరి. శబల యావిధ మెఱింగి యాగ్రహావేశంబున శకయవనులను సృజించెను. వారుపరాక్ర మము తేజంబుగలవారుకనుకఁజంపకకుసుమకింజల్క వర్ణములు గలుగ ఖడ్గాదిసాధనములంబూని యెందుఁ జూచినఁ దామెఱ్యై ప్రజ్వలద్దహనులంబోలి తత్సైన్యమునెల్ల బూదిగావించిరి. రాజు వారలపై శరములు ప్రయోగించి చీకాకుపఱచెను.

## కౌశికుఁడు శివునివలన దివ్యాస్త్రములంబడయుట.

*వసిష్ఠముని రాజుబాణములం బాధింపఁబడు సేనలం గాంచి యోగబలంబున సేనల నిర్మింపుమాయని శబలతోఁ బల్కెను. వెంటనే యాధేనువు హుంభారవము గావించెను. ఆధ్వనినుండి సూర్య తేజులగు కాంభోజు లుదయించిరి. ఆధేనువు పొదుగునుండి పప్లవులు బాణధారులై వెలువడిరి యోనినుండి యవనులును, శకృత్తునుండి శకులును రోమకూపములనుండి మ్లేచ్ఛులు బోయలు హారీతులును బుట్టిరి. వారెల్ల రాజుచతు రంగబలంబులఁ జెండాడిరి రాజపుత్త్రులు నూరువురు తమసేనల నాశముంగాంచి నానావిధాయుధంబులందాల్చి మహాకోపమున నున్న మునిపైకిరాఁగా హుంకారమున నే వారిని దహించెను. రథములతోడ వారెల్ల క్షణకాలమున భస్మమైరి గాధేయుఁ డును తనకొడుకులు చతురంగబలములు పొలియుటంగాంచి

* ఇది యేఁబది యైదవ సర్గమునఁ గలదు.

తనమహాయశమునకుఁ గొఱఁ తకలిగెనన్న లజ్జాభరంబున మిక్కిలి చింతగలుగఁగా ననుద్ధతమహాసముద్రమువలె యుద్ధప్రయత్నమును మాని కోఱలు పెఱికిన కాలసర్పముభంగి నితికర్తవ్యతామూఢుఁడై రాహుగ్రస్తసూర్యునికరణి వెంటనే శోకాకులితమానసుం డయ్యెను.

సపుత్త్రబలములు నిహతములు కాఁగా హతపక్షపతంగమురీతి నెంతయు దీనుఁడై దర్పము పోవ సాహసము నశింప విచారించుచు నక్కటా! యీచతురంగబలములు నించుకంతయుఁ బనికిరావు అనియేవగించుచు వానియందుఁగల యాశను వదలి హతశేషుఁడగుకొడుకునకుఁ బట్టంబుగట్టి భూమండలమంతయు న్యాయము విడువక చక్కఁగా నేలుమని బోధించి నియోగించి యప్పుడే వనమునకుం జని సకలామరసేవితంబగు హిమాలయప్రాంతమున మహాదేవుని బ్రసన్నునిజేసికొనఁ గోరి ఘోరతపస్సు చేసెను. కొంతకాలమునకు వృషభధ్వజుఁడు శంకరుఁడు శీఘ్రవరదాత కావున నారాజునకుఁ బ్రత్యక్షమై "భూపాలా! తపమునేయు టుడుగుము. వలసినదాని వదలక తెలుపుము. ఆశ్రితవరప్రదాతను. కాన వరమెద్దానిం గోరుదువో చెప్పు"మని యడిగెను.

తపస్సంపన్నుఁడగు గాధేయుఁడు మహాదేవునకుఁ బ్రణామముగావించి "మహాదేవా! నాయందుఁ బ్రీతి నీకుఁ గలదేని సాంగోపాంగముగా ధనుర్వేదమునుపదేశింపుము. మంత్రరహస్యములను దెల్పుము. ఉపదేశింపఁదగినవాని రహస్యార్థముల ననుగ్రహింపుము. మహానుభావా! దేవదానవమహామునియక్షరాక్షసగంధర్వాదులయం దేయేయస్త్రములు గలవో వానినెల్ల

నావశమున నుండుఁగాక. దేవదేవుఁడవుకదా. ఇట్టి నీప్రసాదమువలన నామనోరథము ఫలించుఁగాక." అని ప్రార్థింపఁగా నామహాదేవుఁ డట్లె యగుగాక యని యంతర్హితుఁడయ్యె.

విశ్వామిత్రు డంతకుముందే బలవంతుఁడై క్షత్రియత్వాదులవలన గర్వించువాఁడై యుండెను. మహాదేవానుగ్రహమున విశేషాస్త్రము లనేకములు లభింపఁగా నాతనికి గర్వము మితిమీఱక యుండఁగలదా? పర్వకాలములయందు సముద్రముప్పొంగునట్లు లతఁడు పరాక్రమమున విజృంభించుచు దాని యుద్రేకమున వసిష్ఠమహామునిని సామాన్యుఁ డనుకొని యిఁక నీతఁ డెక్కడ నుండును? నాచే హతుఁడైనట్లే యని తలంచెను. తరువాత విశ్వామిత్రుఁడు వసిష్ఠముని యాశ్రమము చెంతకుం బోయి యనేకాస్త్రములం బ్రయోగించెను. ఆయస్త్రములమంటలచేతను, రాజతేజస్సుచేతను దపోవనమంతయు దగ్ధమయ్యెను. ఆవిశ్వామిత్రుఁడు బుద్ధిబలము గనఁబడ ప్రయోగించు నాశరపరంపరలం గాంచి యందు నివసించి యున్నమునులు భీతులై నలుదెసలకుఁ బరుగిడిరి. మునిశిష్యులు పరుగిడిరి. మృగపక్షివ్రాతములు దిగులు మిక్కుటము కాఁగాఁ దమతమ యునికిపట్టుల వదలి యెటకో పాఱినవి.

ఆమహాముని పావనాశ్రమ మయ్యది పాడుపడి జంతుశూన్యమై యించుకంతయు ధ్వనిసేయు జంతువులేక ఘటికామాత్రమున మరుభూమివలె వృక్షశూన్య మయ్యెను ఈఘోర కార్యము గాంచి వసిష్ఠమహాముని యూరకుండఁగలఁడా? ఇదిగో భాస్కరుఁడు మంచును విదళించునట్లు క్రూరభూరమణుఁ దూలించెదను. భయమేల? అని పలుసారులు హెచ్చ

రించుచునే యుండెను. ఎంత యొత్తిచెప్పినను భయంకరబాణ జాలములధాటికోర్వఁజాలువా రెవ్వరు? మానియుఁ బాఱి పోవువారలను హెచ్చరించుచు నప్రధృష్యతేజ ముప్పొంగ నాగ్రహంబున విశ్వామిత్రుం గాంచి "యోరీ! క్రూరభూపాలా! చాలకాలముగా వృద్ధిచెందుచుండు నీయాశ్రమమును బాడు చేసితివి. కనుక నీవు దురాచారుఁడవు. మూర్ఖుఁడవు. నీప్రాణము లిఁక నిలువవు. నీ వీలోకమున లేనియట్లే." అని కోపము దీపింప విధూమాగ్నివలె రెండవ దండధరదండమువలెఁ బ్రజ్వలించు బ్రహ్మదండము నెత్తి మార్కొని నిలిచెను.

మహాశయులారా! ఈభాగము చక్కఁగాఁ జర్చింపఁదగి నది. అనేకవిషయము లిందుఁ గలవు. అవధరింపుఁడు.

"ప్రాయస్సమాపన్నవిపత్తికాలే ధియోఽపిపుంసాం మలినాభవంతి."

అన్న ప్రాక్తనసూక్తి ననుసరించి దుష్కర్మఫలము ననుభవింపఁ జేయుకాల మాసన్నముకాఁగాఁ దదనుసారముగా బుద్ధిమాఱు చుండును. కర్మము బలవత్తరముకదా. అయ్యది యేయేకార్య ములు చేయింపఁబూని యెట్లు త్రిప్పునో యెవ్వ రెఱుంగరు. కాననే "గహనా కర్మణో గతిః" అని శ్రీకృష్ణమూర్తి బోధిం చెను. విశ్వామిత్రునిమూలమున ముందుముం దేయేకార్య ములు ఫలింపవలసియున్నవో యది యెఱుంగుదు. సకలాస్త్ర ములు సంపాదించినఁగాని శ్రీరామావతారమున శ్రీరామచంద్ర మూర్తికి నుపదేశింప నవకాశము లేదు. కావున నామునిపలుకుల నారాజు లెక్కపెట్టకయుండ నొనర్చెను. రాజునకు మహర్షి యందుఁగల భక్తి విరోధముగా మాఱునట్టు లొనరించెను. వెంటనే రాజు మాటలాడక దానిని బంధించి యీడ్చుకొని

పొందని భటుల కాజ్ఞాపించెను. ఒక్కక్షణకాలమున నిందఱి కిన్నిరీతుల విందుగూర్చిన కామధేనువు సైన్యమునుగూడ సృజింపఁగల్గునని రాజెఱుంగఁడా? అట్టి కామధేనువుగల్గిన వసిష్ఠునిశక్తి యెఱుంగఁడా? అన్నియు నెఱుంగును. ఏమిలాభము? కర్మపాశబద్ధుఁ డయ్యెను. దానికి దాసుఁ డయ్యెను. స్వాతంత్ర్య మించుకంతయు నతని కిపుడు లేదు. దేశపాలనమున కాతఁడు దూరముగా నుండవలసినవాఁ డయ్యెను. ఇఁక నతఁడు ప్రపంచసేవ చేయవలసినవాఁడు. అనేకలాభములు జగత్తున కారాజువలనఁ గలుగవలయును. రాజుగా నుండినచో నవ్వాని నొనరింపఁజాలఁడు. తపశ్శక్తి కావలయును శాంతము నెలకొనవలయును. వీనిసాయమునఁ ద్రిలోకముల నాడింపఁజాలును. కావునఁ గర్మ మాతని రాజత్వమునుండి మార్పఁదలఁచి దానికి స్వస్త్యయనముగాఁ బట్టుదలం గల్గించెను. తుద కాధేనువు మూలమున సైన్యములు నశించెను. మునిహుంకారమున సుతులు మడిసిరి. తనశక్తి పనికిరానిదని యెఱింగెను.

"న బలం క్షత్రియస్యాహుర్బ్రాహ్మణో బలవత్తరః
బ్రహ్మన్ బ్రహ్మబలం దివ్యం క్షత్రాత్తు బలవత్తరం ౧౩
అప్రమేయబలం తుభ్యం న త్వయా బలవత్తరః
విశ్వామిత్రో మహావీర్యస్తేజస్తవ దురాసదం ౧౪
నియుంక్ష్వ మాం మహాభాగ త్వద్బ్రహ్మబలసంభృతః
తస్య దర్పబలం యత్తన్నాశయామి దురాత్మనః". ౧౫

అను నీభాగమునఁగల మహత్త్వ మించుక పరికింతము. ఇందు మనము కనుఁగొనఁదగినది బ్రాహ్మణక్షత్రియకులముల యుత్కృష్టత కాదు. బ్రాహ్మణశక్తి యేల యుత్కృష్టము? క్షత్రియశక్తి

యేల యుత్కృష్టము కాదు? అనువిషయమే. క్షత్రియతేజస్సు రజోగుణోపబృంహితము. బ్రాహ్మణతేజస్సు సత్త్వగుణసంభృతము. లోకానుభవము ననుసరించి యాలోచించినను శాంతము సుఖప్రదమనియు, నహంకారము దుఃఖప్రదమనియుఁ దెలియనగును. బ్రహ్మతేజస్సనఁగా భగవంతుని దేజోరూపునిగా ధ్యానించి ధ్యానించి విప్రుఁడు తన్మయుఁ డగును. రాజు సర్వజనుల నడంచి తనకు లోఁబడియుండఁజేసికొని సుఖింపవలయు ననియే యూహించి యూహించి రజోగుణమయుఁ డగును. కావున రాజచిత్తమునందు సత్త్వగుణము పాదుకొన నవకాశము తక్కువగ నుండును. భగవత్తేజము సత్త్వముకదా. శాంతనిధి యగు విప్రునియందు భగవదంశము విశేషించి యుండును. కావున బ్రాహ్మణుఁడు సర్వోత్కృష్టుఁ డనఁబడియెను. ఈయొక్క కారణమే లేకపోయినచో బ్రాహ్మణోత్కృష్టత కవకాశమే లేదు.

> "న హాయనై ర్న పలితైర్న విత్తేన నబంధుభిః
> ఋషయశ్చక్రిరే ధర్మం యోఽనూచానస్సనో మహాన్ ౧౫౪
> విప్రాణాం జ్ఞానతో జ్యైష్ఠ్యం క్షత్రియాణాం తు వీర్యతః,
> వైశ్యానాం ధాన్యధనతశ్శూద్రాణామేవ జన్మతః. ౧౫౫
> న తేన వృద్ధో భవతి యేనాస్య పలితం శిరః,
> యో వై యువాప్యధీయానస్తం దేవాస్థవిరం విదుః. ౧౫౬
> యథా కాష్ఠమయో హస్తీ యథాచర్మమయో మృగః,
> యశ్చ విప్రోఽనధీయానస్త్రయస్తే నామ బిభ్రతి. ౧౫౭
> యస్య వాఙ్మనసీ శుద్ధే సమ్యగ్గుప్తే చ సర్వదా,
> స వై సర్వమవాప్నోతి వేదాంతోపగతం ఫలం." ౧౬౦
>
> (మనుస్మృతి ౨ అధ్యా.)

జ్ఞానమువలనను, వేదపాఠాదులవలనను బ్రాహ్మణుఁడు శ్రేష్ఠుఁడయ్యెననియు, నవి లేనిచో నామధారకుఁడే యనియు మనుస్మృతిసారము.

> "సావిత్ర్యాశ్చాపి గాయత్ర్యాస్సంధ్యోపాస్త్యగ్నికార్యయోః,
> అజ్ఞానాత్కృషికర్తారో బ్రాహ్మణా నామధారకాః." 3
>
> (పరాశర ౮ అ.)

ఇట్లే స్మృతులన్నియుఁ దెలుపుచున్నవి. కావుననే కామధేనువాగ్రూపమున వాల్మీకిమహాకవి బ్రాహ్మణశక్తిని వెల్లడించెను. భగవత్తేజ మప్రతిహతమని యంగీకరించినచోఁ బైన్యాయముల నొప్పుకొనవలయును. కావునఁ బరమేశ్వరతేజస్సముపబృంహితము కాన విశ్వామిత్రరాజతేజమును మించఁజాలెను. ఈపైన్యాయముల ననుసరించి యాలోచించినచోఁ దపశ్శక్తిలేని బ్రాహ్మణశక్తి యుత్కృష్టము కాదనియే స్పష్టమగును. బ్రాహ్మణజాతిప్రశంస యిందు లేదనియు స్పష్టము. భగవచ్ఛక్తి సర్వకార్యముల నెఱవేర్పఁగలదని నమ్మినవార లీవిషయమున సంశయింపరు. భగవంతునకే శక్తిలేదన్నవార లీవిషయము నమ్ముదురని నేను ననుకొనలేదు. వసిష్ఠమునియాజ్ఞనందియే యాధేనువు విచిత్రసృష్టి నొనరించెనని మన మెఱుంగవలయును. "త్వద్బ్రహ్మబలసంభృతః" (నీబ్రహ్మబలమున నిండినదాననై) అని ధేనువు తెలిపెను. ఇఁక ధేనువు మునితో నెట్లు మాటలాడెనని ప్రశ్నించువారలకు సమాధాన మీయ నక్కఱలేదు. కామధేనువు సేనల సృజింపఁజాలునని వా రంగీకరింతు రేని యీప్రశ్నము చేయఁజాలరు. అంగీకరింప రేని యిందలిసమాధానములు వారిని దృప్తిపఱుపఁజాలవు. వారలఁ

దృష్టిపఱచుట కీగ్రంథ మారంభింపను లేదు. భగవంతుఁడు సర్వశక్తిసంపన్నుఁడని నమ్మువారలకే సంశయము లెడఁబాపఁ బ్రయత్నించు టుత్తమము. కాని నాస్తికుల కుపదేశింపఁబూను టవివేకము. యోగబలమున భగవద్ధ్యానముచేసి తత్తేజో విశేషసంభృతచిత్తుఁడగుట వసిష్ఠముని బ్రహ్మర్షి యయ్యెను. తత్సాన్నిధ్యమున నాధేను వేకార్యమేని చేయఁజాలెను.

ఇందలిరహస్య మేమి? ఉపాసకుఁడు ఇష్టదేవత నారాధించి తదనుగ్రహపాత్రుఁ డగును. పిదపఁ గామ్యప్రయోగములనుజేయ నర్హుఁడగును. ఆస్థితియం దామంత్రాధిదేవత కస్త్రవిద్యయని పేరు. విధిమంతముగా స్వకార్యనిర్వహణోచిత ప్రయోగము చేయఁబూనును. దాని కనుకూలములగుబీజముల సంపుటీకరణమున నామంత్రము తత్కార్యనిర్వహణక్షమ మగును. ఎట్లు? మూలిక లొకచోఁ గలిపిన నయ్యవి కలిసి యొకరోగమును బోఁగొట్టు నెట్లో యిదియు నట్లే యని యెఱుంగవలయును. ఆమంత్ర ముపాసకునిహృదయేప్సితము ననుసరించి రూపముం దాల్చును. శత్రుసంహార మభీష్టమేని దానికిం దగినరూపముం దాల్చును. ఇట్లే తక్కుంగలకార్యము లకు నని యెఱుంగవలయును. ఇది సాధారణప్రయోగవిధి. దీనికి హోమాదికార్యములు ముఖ్యములు. మహర్షు లీప్రయోగ విధి నంగీకరింపరు. కేవల భగవదనుగ్రహమునే కోరి యారాధింతురు. వారలకుఁ బూజాదికార్యము లక్కఱలేదు.

> "యుంజన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః,
> శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి. ౧౫
> యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే,
> నిస్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా. ౧౮

యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా,
యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి." ౨౦

(గీత ౬ అ.)

అను నీశ్రీకృష్ణపరమాత్మ యుపదేశము ననుసరించి దైవమును ధ్యానమార్గముననే యారాధింతురు. పూజాదులకంటె ధ్యానయోగ ముత్తమోత్తమము. బాహ్యపూజ యుత్తమము కాదు. అందును విగ్రహార్చన మధమము. మధ్యమముకూడఁ గాదు. సాలగ్రామ శివలింగచక్రాద్యర్చనము మధ్యమము. జపముకూడ మానసిక ముత్తమమని స్మృతి బోధించుచున్నది.

"ఉత్తమం మానసం జప్య ముపాంశుం మధ్యమం స్మృతం,
అధమం వాచికం ప్రాహుస్సర్వమంత్రేష్వయం విధిః.
వాచికస్త్వేక మేకం స్యాదుపాంశుశ్శతముచ్యతే,
సాహస్రం మానసం ప్రోక్తం మన్వత్రిభృగునారదైః.
మనస్సంతోషణం శౌచం మానం మంత్రార్థచింతనం,
అవ్యగ్రత్వమనిర్వేదో జప ఏవముదాహృతః.

(విశ్వామిత్రః.)

"విధియజ్ఞాజ్జపయజ్ఞో విశిష్టో దశభిర్గుణైః,
ఉపాంశుస్స్యాచ్ఛతగుణస్సాహస్రో మానసస్స్మృతః. ౮౫
యే పాకయజ్ఞాశ్చత్వారో విధియజ్ఞసమన్వితాః,
సర్వే తే జపయజ్ఞస్య కలాం నార్హంతి షోడశీం." ౮౬

(మను ౨ అధ్యా)

"ఉచ్చావచేషు భూతేషు దుర్జ్ఞేయామకృతాత్మభిః,
ధ్యానయోగేన సంపశ్యేద్గతిమస్యాంతరాత్మనః." ౭౩

(మను ౬ అ.)

అను నీస్మృతులు బాహ్యవిషయములకంటె మానసికజప ధ్యానము లుత్తమోత్తమములని తెలుపుచున్నవి. అట్టి మహామునులు ధ్యానయోగమున భగవంతు నారాధించి తదను గ్రహమును బడసిన ధన్యులు. కావున వారికి మనఃకష్టములు కలిగినపుడు భగవంతుని స్మరించి యేమికావలయునని తలంతురో యాకార్య మగును. తపోవిఘ్నములు కలిగినపుడే వారట్లు తలంతురు. దానికే శాపమని పేరు. ప్రకృతము. ముని కామధేనువును బురికొల్పెను. తత్సంకల్పబలమున ననేకవీరు లాధేనువునుండి వెడలి వారిం బొలియించిరని మన మెఱుంగ వలయును. ఇది మారణప్రయోగము. ఒక్కపశువు బ్రహ్మముని సాన్నిధ్యమున నింతపని చేయఁగల్గెనుగదా. అట్టి బ్రహ్మతేజ స్సుత్తమము గావున దానిని సంపాదింపవలయునని విశ్వా మిత్రుఁడు ప్రయత్నించుఁగాక యని తత్కర్మ మిట్టిమహా కార్యము మునిమూలమునఁ జేయించెనని మనము గ్రహింపఁ దగిన రహస్యార్థము. మానవులంద ఱుత్తమోత్తమమగు ధ్యాన రూపమగుపూజచే భగవంతు నారాధింపఁ బ్రయత్నింపవల యును. కాని దేవాలయములలోఁ గల పాషాణాదివిగ్రహము లను బూజించి యవియే ముక్తి నిచ్చునని నమ్మక యారూప మును మనస్సున నిలిపి ధ్యానముచేయుచు నాదేవతయే పర మేశ్వరుఁడని నమ్మి తాము చేయుసత్కర్మముల ఫలమునుగోరక భగవంతునకే యర్పించుచుండవలయునని మన కీభాగము బోధించుచున్నది.

విశ్వామిత్రుఁడు మిగిలియున్న కొడుకునకుఁ బట్టముంగట్టి న్యాయము ననుసరించి ప్రజలఁ బాలింపుమని బోధించి హిమా

లయమునకుఁ దపస్సు చేయఁ బోయెను. మహాదేవునను గ్రహమునుగోరి తపస్సు చేసెను. శంకరుఁడు ప్రత్యక్షమై వర మడుగుమనెను. రాజు

"యది తుష్టో మహాదేవ ధనుర్వేదో మమానఘ,
సాంగో పాంగోపనిషదస్సరహస్యః ప్రదీయతాం.
యాని దేవేషు చాస్త్రాణి దానవేషు మహర్షిషు,
గంధర్వయక్షరక్షస్సు ప్రతిభాంతు మమానఘ."

అని ప్రార్థించెను. ఇందు గ్రహింపఁదగిన దేవి? రాఁగల శ్రీ రామావతారమున నీరాజు బ్రహ్మర్షియై నరరూపముననున్న భగవంతునకు సర్వజ్ఞునకు లోకాచారము ననుసరించి యుపదేశింపవలయును. సకలాస్త్రము లుండినఁగాని క్రూరదానవులఁ జంప నవకాశము లేదు. అని కర్మమే రాజును బ్రోత్సహించి యా మహాదేవుని బ్రార్థింపఁజేసెను. శంకరునివలన సంపాదించినఁగాని విష్ణువున కుపదేశింప నర్హము కాదు. వారిరువు రొక్కరే. భేదము లేదు. కనుకనే యీయస్త్రముల నన్నింటిని మునియై శ్రీరామచంద్రున కుపదేశించెను. ఇదియంతయు విశ్వామిత్రుని కర్మము చేసినప్రయత్నముగాని వేఱుగాదు అని తెలియందగును.

మధ్వవైష్ణవులు కొందఱు రాజు శంకరు నారాధించి దివ్యాస్త్రములుపడసినను వసిష్ఠు నాయస్త్రములు బాధింపఁజాలక పోయెను. కనుక శంకరుఁడు క్షుద్రదేవత యందురు. సమాధాన మేమనఁగా నవధరింపుఁడు. ఈయస్త్రములు శ్రీరామున కుపదేశింపఁదగినవయ్యెనుగదా. క్షుద్రదేవతలవలన లభించినవి యంత యుత్తమములైనపుడు ఆదేవత క్షుద్రదేవత కాదు.

క్షుద్రులకు క్షుద్రదేవతయే యగును. అక్షుద్రులకు ముక్తి ప్రదుఁడగును. క్షుద్రబుద్ధులకు భగవత్తత్త్వ మెఱుంగఁదరము కాదు. అందును దేవాలయపాషాణములే భగవద్రూపము లను కొనువారలకు మఱెంత యజ్ఞానము నెలకొనియుండునుగాన వారలకు సుంతయుఁ బరమేశ్వరమహత్త్వము తెలియఁ దరము కాదు. సర్వాంతర్యామియగు భగవంతుఁడు శంకరరూపమున నెలకొనఁడేని సర్వాంతర్యామి యనుట పొసఁగదు. కనుక నట్టి వారికి భగవత్ప్రసాదము పాషాణపూజకులు చేయు చక్కెర పొంగలియే కావున నట్టివారిమాటల వినరాదు. అర్థార్జన పరులై వేషధారులై భక్తులవలె నటించుమూర్ఖులఁ జెంతఁ జేరనీయరాదు.

విశ్వామిత్రుఁడు మహాదేవుని వరమడుగునపుడు వసిష్ఠ మహర్షిని దహించునాయుధముల నిమ్మని యడుగలేదు. కావు ననే పైమధ్వవైష్ణవబ్రువులయాక్షేపము నిరాధారము. పాప మూలము. రాజు ధనుర్వేదము వరప్రభావమున లభింపఁగా మఱెంత దర్పోద్ధతుఁ డయ్యెను. తపస్సువలనిఫలము శాంత రూపమున లభింపదయ్యెను. పరమేశ్వరదర్శనము లభించినను మనస్సు పరిపక్వము కాదయ్యెను.

"ఆపూర్యమాణమచలప్రతిష్ఠం సముద్రమాపః ప్రవిశంతి యద్వత్,
తద్వత్కామా యం ప్రవిశంతి సర్వే స శాంతిమాప్నోతి న కామ
కామీ. 70
విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః
నిర్మమో నిరహంకారస్స శాంతిమధిగచ్ఛతి." 71

(గీత ౨ అధ్యా.)

అన్న శ్రీకృష్ణోక్తిప్రకారము తపస్సు సకామమయ్యెనే నది సంపూర్ణఫలము నీఁజాలదు. శాంతము కుదురదు. కావున శంకరు వరము ఫలింపదయ్యెనన్న యాక్షేప మజ్ఞానమూలము.

"ఇంద్రియాణాం ప్రసంగేన దోషమృచ్ఛత్యసంశయం,
సన్నియమ్య తు తాన్యేవ తతస్సిద్ధిం నియచ్ఛతి. ౯౩
న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి,
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే. ౯౪
యశ్చైతాన్ ప్రాప్నుయాత్సర్వాన్యశ్చైతాన్ కేవలాంస్త్యజేత్,
ప్రాపణాత్సర్వకామానాం పరిత్యాగో విశిష్యతే. ౯౫
న తథైతాని శక్యంతే సన్నియంతుమసేవయా
విషయేషు ప్రజుష్టాని యథాజ్ఞానేన నిత్యశః. ౯౬
వేదాస్త్యాగశ్చ యజ్ఞాశ్చ నియమాశ్చ తపాంసి చ
న విప్రదుష్టభావస్య సిద్ధిం గచ్ఛంతి కర్హిచిత్. ౯౭
శ్రుత్వా స్పృష్ట్వా చ దృష్ట్వా చ భుక్త్వా ఘ్రాత్వా చ యో నరః
న హృష్యతి గ్లాయతి వా స విజ్ఞేయో జితేంద్రియః." ౯౮
(మను ౨ అధ్యా.)

అనునీమనుస్మృతివాక్యములు సకామకర్మము లొనరించువార లకు శాంతి కుదురదని బోధించుచున్నవి. కావున విశ్వామిత్రుని తపస్సు వసిష్ఠముని శాంతమూర్తియగుట నాతని నోడింపఁ జాలదయ్యెను.

"వివర్ధమానో వీర్యేణ సముద్ర ఇవ పర్వణి
హతమేవ తదా మేనే వసిష్ఠమృషిసత్తమం."

అనునీమూలము పైభావమునే దృఢపఱచుచున్నది. దివ్యాస్త్రములు లభింపఁగా నట్టె పొంగి వసిష్ఠముని చచ్చినట్లే భావిం

చెను. అనఁగాఁ దనగర్వముచేత మహర్షితపశ్శక్తి నెఱుంగఁ జాలఁడయ్యెను. తపఃఫలము శాంతము అది కుదురదేని యా తపస్సు సంపూర్ణఫలప్రదము కానేరదు. కావున శాంతము సర్వతపఃఫలము. అదియే మహాధనము. అది గలవసిష్ఠముని నీ విశ్వామిత్రుఁ డేమియుఁ జేయఁజాలఁడనుట నిర్వివాదాంశము.

రాఁగలకాలమున శ్రీరామమూర్తికి నుపదేశించుటకీ యస్త్రములనెల్లఁ గర్మప్రేరితుఁడై గాధినందనుఁడు కోరెననియు, భగవంతుఁడగు శంకరుఁడు సర్వజ్ఞుఁడు కాన సకలాస్త్రముల నొసంగెననియు, నయ్యవి తత్కాలమున ఫలింపకయున్నను ముందు ఫలించునని శివుఁ డెఱుంగుననియు, నిన్ని కార్యములు కల్పించినది కర్మమే యనియు మన మీఘట్టమునుండి గ్రహింప వలయును. అస్త్రములు ఫలింపకుండుట విశ్వామిత్రునకు బ్రహ్మర్షిత్వ మలవడుటకే యనియు గ్రహింపవలయును. శంకరదివ్యాస్త్రములు మునిశక్తిని హరింపఁజాలవయ్యెనని తలంపరాదు. కారణ మేమనఁగాఁ బరికింపుఁడు.

"తం కిం కరోమీతి గృణంతమాహ
బద్ధాంజలిం భగవాన్ భూతనాథః,
దక్షం సయజ్ఞం జహి మద్భటానాం
త్వమగ్రణీ రుద్రభటాంశకో మే." ౪

(శ్రీభాగవతము ౪ స్కం ౫ అధ్యా.)

"సయజ్ఞం దక్షం జహి బ్రహ్మతేజో దుర్జయమితి మామంస్థాః యతః త్వం మే అంశకః."

వీరభద్రా! దక్షునితోడ నాయజ్ఞమును ధ్వంసమొనరింపుము. బ్రహ్మర్షులందుఁ గలరు. వారితేజ మజేయయని తలంప

వలదు. నీవు నాయంశము కలవాఁడవు కదా. అనఁగా నాయం శము నీయం దుండినందున బ్రహ్మతేజము దుర్జయము కాదు పొమ్మని శంకరుఁ డాజ్ఞాపించెను. వీరభద్రుఁడు భృగుమహర్షి నశ్రమమున బాధించెను. అప్పుడు బ్రహ్మతేజ మేమూల నుం డెను? ఈప్రమాణము శ్రీభాగవతమున నున్నందున మధ్య వైష్ణవులుకూడ నేమనఁజాలరు. కావున భగవంతుఁ డెటెంగియే రామావతారమున నుపకరించుననియే దివ్యాస్త్రముల నొసంగె నని మన మెఱుంగవలయును. క్షుద్రబుద్ధుల దురాక్షేపములను విశ్వసింపరాదు.

> "ఆశ్రమం చిరసంవృద్ధం యద్వినాశితవానసి,
> దురాచారోఽసి తన్మూఢ తస్మాత్త్వం న భవిష్యసి.
> ఇత్యుక్త్వా పరమక్రుద్ధో దండముద్యమ్య సత్వరః,
> విధూమమివ కాలాగ్నిం యమదండమివాపరం." ౨౯

విశ్వామిత్రునియస్త్రజ్వాలలకు వసిష్ఠశిష్యులు మృగపక్షులు భయంపడి నలుదెసలకుం బాఱిరి. ముని యపు డాగ్రహించి రాజా! చిరకాలమునుండి పోషింపఁబడి వృద్ధినొందిన యీతపో వనమును బాడొనర్చితివి. కావున దురాచారుఁడవు. అనఁగాఁ గ్రూరాచారుఁడవు. ఈకారణముననే నీవు నశింపఁగలవు. అని బ్రహ్మదండమును గైకొని నిలిచెను. బ్రహ్మదండమనఁగా యోగదండమని పెద్దలందురు. విశ్వామిత్రుఁ డిపు డొనర్చినది పాపమా కాదా యని ప్రశ్నించుకొందము. మునులపై నస్త్ర ప్రయోగము చేయుట యటుండ మృగపక్షులను హింసించుట తపోవనమును గాల్చుట యనునివి పాపకార్యములే. ఈపాప కార్యము వలయునని చేసినదేకాని వేఱు కాదు.

“అకుర్వన్ విహితం కర్మ నిందితం చ సమాచరన్,
ప్రసక్తశ్చేంద్రియార్థేషు ప్రాయశ్చిత్తీయతే నరః. ౪౪
అకామతః కృతే పాపే ప్రాయశ్చిత్తం విదుర్బుధాః,
కామకారకృతేఽప్యాహురేకే శ్రుతినిదర్శనాత్. ౪౫
అకామతః కృతం పాపం వేదాభ్యాసేన శుద్ధ్యతి,
కామతస్తు కృతం మోహాత్ప్రాయశ్చిత్తైః పృథగ్విధైః. ౪౬
ప్రాయశ్చిత్తీయతాం ప్రాప్య దైవాత్పూర్వకృతేన వా,
న సంసర్గం వ్రజేత్సద్భిః ప్రాయశ్చిత్తేఽకృతే ద్విజః. ౪౭
(మను ౧౧ అధ్యా.)

ప్రాయో నామ తపః ప్రోక్తం చిత్తం నిశ్చయ ఉచ్యతే,
తపోనిశ్చయసంయుక్తం ప్రాయశ్చిత్తమితి స్మృతం.”
(అంగిరస్స్మృతి.)

తెలిసియో తెలియకయో పాపములొనరించినవారు ప్రాయశ్చిత్తము చేసికొనవలయును. తపస్సు చేయ నిశ్చయించుకొనవలయుననియు, దానినే ప్రాయశ్చిత్తమందురనియు, స్మృతి తెలుపుచున్నది.

“తస్మాత్తేనేహ కర్తవ్యం ప్రాయశ్చిత్తం విశుద్ధయే,
ఏవమస్యాంతరాత్మా చ లోకశ్చైవ ప్రసీదతి.” ౨౨౦
(యాజ్ఞ. ప్రాయశ్చిత్తకాం)

“ప్రాయశ్చిత్తశబ్దశ్చాయం పాపక్షయార్థే నైమిత్తికే కర్మ విశేషే రూఢః.” అని విజ్ఞానేశ్వరభట్టారకుఁడు.”

“జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా.”

అన్నగీతోక్తి ప్రసిద్ధమే కదా. జ్ఞానము కలుగుటకుఁ బ్రధానహేతువు తపస్సు. అయ్యది ఫలాభిసంధిరహితము కాఁదగు.

దానిచే భగవదనుగ్రహము కలుగును. భగవంతుననుగ్రహము జ్ఞానరూపముకదా. కావునఁ దపస్సు చేసి పాపముల నశింపఁ జేసికొనవలయునని ఫలితార్థము.

విశ్వామిత్రుఁడు తపోవనమును బాడుచేయుటంజేసి దురాచారుఁ డయ్యెను. పాతకములు రెండువిధములు. మహాపాతకములని, ఉపపాతకములని వానిభేదములు.

"హింసౌషధీనాం స్త్ర్యాజీవోఽభిచారో మూలకర్మ చ"

(మను ౧౧ అధ్యా.)

"ఔషధీనాం జాతిమాత్రాదీనాం హింసనం ఏతచ్చ జ్ఞానపూర్వకాభ్యాసక్రియాయాం ప్రాయశ్చిత్తగౌరవాత్." అని కుల్లూకభట్టు.

"ఫలదానాం తు వృక్షాణాం ఛేదనే జప్యమృక్ఛతం
గుల్మవల్లీలతానాం చ పుష్పితానాం చ వీరుధాం." ౧౪౨

(మ ౧౧ అ.)

ఈ చెప్పినవి యుపపాతకములు. ఇవి వలయునని చేసినఁ బ్రాయశ్చిత్తము వృద్ధియగును. తపస్సు చేసి భగవంతుని దర్శించియుఁ దామసమును వదలఁడయ్యెను. ఇట్లనుటచేత విశ్వామిత్రుఁడు మూర్ఖుఁడని భావము కాదు. కర్మప్రేరితుఁడై లోకములకు మహోపకారము చేయుట కొఱకే యీఘోరకార్యము చేసెనని మన మూహింపవలయును. దీనింబట్టియే "గహనా కర్మణో గతిః" అన్నమాట సార్థకమని తెలియనగును. బ్రహ్మర్షిత్వము లభించుటకే యీపట్టుదల మూలమయ్యెను. ఇఁకఁ దరువాతి కథను బఠింతము.

## వసిష్ఠముని కౌశికు నోడించుట.

* వసిష్ఠవాక్కుల నాలకించియు రాజు బలశాలి కావున జంకక యాగ్నేయాస్త్రముం గైకొని మునీ! నిలునిలుమని యదలించెను. ముని యపరకాలదండమనవెలుఁగు బ్రహ్మదండ ముంగైకొని కోపమునఁజూడరాక వెలుంగుచు నోరీ నీచక్షత్రియుఁడా! నిలిచితిని. నీపరాక్రమము నగపఱపును. నీగర్వము నీయస్త్రవీర్యము నాశనము చేసెదను. నీవు క్షత్రియుఁడవు. నీ బలమల్పము. నేనో బ్రాహ్మణుఁడను. నాబలము మహనీయము. ఈరెండిటికి నెంతయో భేదము కలదు. కులపాంసనా! సకల లోకవినుతమగు నాబ్రహ్మబలమును జూడుము. అని పలుకుచు రాజు వైచిన యాగ్నేయాస్త్రమును, అగ్ని వేఁడిమి జలములం జల్లార్చునట్లు తనబ్రహ్మదండమున నడంచెను. రాజు దానినిం గాంచియుఁ బట్టుదల వదలక వారుణరౌద్రేంద్రపాశుపతాస్త్ర ములను, ఐషీకమనుదానిని వరుసగాఁ బ్రయోగించెను. వెండి యుమానవ, మోహన, గాంధర్వ, స్వాపన, జృంభణ, మాదన, సంతాపన, విలాపన, శోషణ, దారణ, వజ్రాస్త్రములను, బ్రహ్మ, కాల, వారుణపాశములను, పైనాకాస్త్రము, దయితమును, శుష్కాశనిని, ఆర్ద్రాశనిని, దండపైశాచ, క్రౌంచాస్త్రములను, ధర్మ, కాల, విష్ణుచక్రములను, వాయవ్యమథనాస్త్రములను, హయగ్రీవాస్త్రమును, శక్తిద్వయము నామునిపైఁ బ్రయో గించెను. అంతతో నూరక యుండఁజాలక కంకాళ, ముసల ములను, వైద్యాధరమహాస్త్రమును, కాలదారుణాస్త్రములను,

---

*ఇది యేఁబదియాఱవ సర్గమునుండి సంగ్రహింపఁబడినది.

ద్రిశూలము, ఘోరాస్త్రమును, గాపాలకంకణాస్త్రములను ప్రయోగించెను.

ఇట్లెన్నియస్త్రములం బ్రయోగించినను మహాతపోనిధిగాన నావసిష్ఠముని నాయస్త్రములు సుంతయు బాధింపఁజాలవయ్యెను. అవ్విధమెల్లర కద్భుతముగాఁ గనఁబడుచుండెను. ముని వానినెల్లఁ దనబ్రహ్మదండమున లోఁగొనియెను. బ్రహ్మాకమ్ముని కుమారుఁడుగాన నీపని సులభముగాఁ జేయంజాలెను. రాజట్టు లాయస్త్రములన్నియు నిష్ఫలములై పోఁగా బ్రహ్మాస్త్రమును బ్రయోగించెను. దానింగాంచి యగ్నిప్రభృతిదేవతలు దేవమునులు గంధర్వులు నురగులును విశేషించి వ్యాకులత నొందిరి. బ్రహ్మాస్త్రమును బ్రయోగింపఁగనే మూఁడులోకములు కంపించినవి. అట్టియస్త్రమును గూడ మునివర్యుఁడు బ్రహ్మవిద్యోపాసనమునఁ గలిగినసుతేజమున వెలయు బ్రహ్మదండమున లోఁగొనియెను. ఆకార్యముచేయునపు డామునిరూపము జగముల మూఁడింటిని మూర్ఛిల్లఁజేసెను. అంతియగాక స్మరించినంగూడ భయంకరముగా నుండెను. ఆముని రోమకూపములనుండి పొగలెగయ నగ్నిమంటలు మిణుంగురుల వెదఁజల్లుచుండెను. బ్రహ్మదండము నిర్ధూమకాలాగ్నివలెను, రెండవకాలదండమోయనుకరణిని బ్రజ్వరిల్లుచుండెను. మునిజనమా మహర్షిని బ్రశంసించుచు బ్రాహ్మణోత్తమా! నీబ్రహ్మబల మమోఘము. నీమహత్త్వముననే యీ బ్రహ్మాస్త్ర ముపశమించుఁగాక. ఈరాజు మహత్తరతపోవిరాజితుఁడైన నీమూలమునఁ బరాజయమందెను. ఇఁకఁ గోపమును వదలుము. సుప్రసన్నుఁడవగుము. మహర్షివగు నీ ప్రసాదమున లోకములు వ్యథాశూన్యము లగుంగాక. అని

బోధింప నావసిష్ఠముని శాంతివహించెను. రాజు పరాజితుఁడై వేఁడినిట్టూర్పులపుచ్చుచు నక్కటా! క్షత్రియబలము నిరర్థకము. బ్రహ్మతేజోబలమే బలము. ఈమాటకు వేఱొకదృష్టాంత మేటికి? ఇపుడొకబ్రహ్మదండమున నాదివ్యాస్త్రములెల్ల రూప ఱెను. ఇదియే చాలదా? ఈభేదమును లెస్సగా నెఱింగి యిం ద్రియమనస్సులను బ్రసన్నములుగా నొనరించుకొని బ్రహ్మ త్వమునకుఁ గారణమగు తపస్సొనరించెదను.

మహామతులారా! ఈభాగమునుండి గ్రహింపఁదగినవిష యములు కొన్ని కలవు. పరహింసకొఱకు నెంతయో తపస్సు చేసి యెన్నిసాధనములు సంపాదించినను, బరోపకారబుద్ధిగల వారల నయ్యవి బాధింపఁజాలవనియు, లోకమునఁ దపశ్శక్తిని మించినశక్తిలేదనియు, మనోనిగ్రహము పరమధనమనియు, నది గలవారేకార్యమునైన సాధింపఁజాలుదురనియు, నట్టివారు కోపమూనిన నయ్యదిలోకోపకారమునకే యగునవియు, నెంత తపస్సుచేసినను, అది శాంతయుతము కాదేని స్వదుఃఖహేతు వగుననియు, మనము గ్రహింపఁదగు ముఖ్యవిషయములు. భగ వంతునను గ్రహము న్యాయపక్షమునే యనుసరించుననియు నెఱుంగవలయును. పరాజయముకూడ విశ్వామిత్రుని పురో వృద్ధికిఁ గారణమయ్యెను. తనయస్త్రము లన్నియు నిష్ఫలములు కాఁగా గర్వమాతని సన్మార్గమున నడిపించెను. మొదటనే యీపనిచేయరాదా యని ప్రశ్నింపరాదు. లోకమున కిట్టి కార్యములు గుణపాఠముల నేర్పవలయుఁ గదా. రాజగర్వము తుదముట్ట క్షీణింపవలదా. ఈ రెండుకార్యములు సంపూర్ణ ములు కాఁగా విశ్వామిత్రునిమూలమున లోకమునకుఁ గావల

సినశుభములను జేయింపఁదలఁచియే కర్మ మాతనికిఁ దపస్సు చేయుసూహ మరలఁ గల్గించెను. అంతియగాక బ్రహ్మబలమే యత్యధికమనియు, క్షత్త్రియబలమును నమ్మి ఘనకార్యములు చేయఁబూను టనుచితమనియు, రాజునకుఁ దోఁపఁజేసెను. ఇఁక నెన్ని శ్రమములకు నోర్చియైన బ్రహ్మతేజస్సు సాధింపఁ దపస్సు చేయవలయుననియు, మనోనిగ్రహము లేక యది కొనసాగ దనియుఁ, గౌశికుఁడు నమ్మునట్టు లొనరించెను. కావున మానవులు తపసొనరించి భగవదనుగ్రహపాత్రులు కావలయుఁగాని, వేఱొకమార్గమునఁ గాజాలరనియు, నాతపస్సు నిర్మలమానసికము గలిగి చేసిననే ఫలించుననియు, గ్రహించి తగురీతి దాని నొనరింపఁ బ్రయత్నింపవలయును.

## విశ్వామిత్త్రుఁడు తపముచేసి రాజర్షి యగుట.

* విశ్వామిత్త్రుఁడు తనపరాజయమును స్మరించుకొనుచు మనస్సునఁ గుందుచు ముహుర్ముహుర్నిర్గళితనిశ్వాసుఁడై వసిష్ఠునిపై విరోధించెను. తత్సమానతపోబలము లేదు. మీఁదు మిక్కిలి యతనితోడివిరోధమునఁ జేసినతపస్సు నశించెను. అయినను మరలఁ దప మొనర్చి ముని జయింప నెంచి పట్టపుదేవితో దక్షిణదిక్కునకుంబోయి యందుఫలమూలములఁ దినుచు దమముకలిగి ఘోరతపము చేసెను. కొంతకాలమున కా రాజునకు మూవురుకొడుకులు గలిగిరి. హవిష్యందుఁడు, మధుష్యందుఁడు, దృఢనేత్త్రుఁడు నని వారిపేరులు. వారు సత్యధర్మపరాయణులు. అంత సహస్రవర్షములు నిండఁగా బ్రహ్మ యరుదెంచి మధురోక్తులతో నీవు రాజర్షివైతివి.

---

*ఇయ్యది యేఁబదియేడవ సర్గమునుండి గ్రహింపఁబడియె.

ఈతపము నిన్ను రాజర్షి యంతవాని నొనరించెను. అని పలికి యంతర్హితుండయ్యెను. బ్రహ్మతోడ నరుదెంచిన దేవతలు సురపురి కరిగిరి.

విశ్వామిత్రుఁడు బ్రహ్మపలుకులు విని సిగ్గున శిరస్సువంచి దుఃఖసాగరమగ్నుఁడై దీనుఁడై తనలో నిట్టు లూహించెను. ఘోరతప స్సొనరించితిని. దేవర్షులెల్ల నన్ను రాజర్షిగా గ్రహించితిమనిరి. ఇయ్యది నాతపమునకుఁ దగినఫలము గానేరదు. బ్రహ్మత్వమే దీనికి నర్హమగుఫలము. అని యెన్నియో రీతులం జింతించి మహాయత్నమున నత్యంతఘోరతపస్సు మరలఁ జేయఁబూనెను. ఆరాజర్షి యిట్లు తపముచేయుచుండఁగా నిక్ష్వాకువంశమునఁ ద్రిశంకుఁడనురాజుండెను. సత్యమును బలుకుచు నింద్రియములకు లోఁబడక యుండెను. ఆతఁడు యజ్ఞముచేసి శరీరముతో స్వర్గము నొందవలయునన్న యూహ గలవాఁడయ్యెను. వసిష్ఠుఁడాతనికిం బురోహితుఁడు. కావున నమ్మునిం బిలువంబంచి వాంఛితమును దెలిపెను మౌనియు విని సశరీరస్వర్గప్రాప్తి యశక్యమని యాప్రయత్నమును నివారించెను. వసిష్ఠుఁడా క్షేపింపఁగా నాశమాని యెట్లైన నాకార్యము సిద్ధింపఁజేయఁగోరి దక్షిణదిశకుంబోయి వసిష్ఠపుత్త్రశతమందుంట నెఱింగి వారితపోవనమును జేరి వారికెల్ల విధిప్రకార మభివాదనముచేసి తాను వసిష్ఠుని నిరాకరించి వచ్చుటంజేసి సిగ్గుపడి తలవాంచియుండెను. పిదపఁ జేమోడ్చి మహాత్ములారా! నేను శరణుగోరి వచ్చినాఁడను. మీరు శరణుఁజొచ్చినవారలకు దిక్కుగాన నన్నుఁ జేకొనుఁడు. వసిష్ఠుని మున్నే శరణుఁజొచ్చితిని. కాని యామహనీయుఁడు నావాంఛి

తమును నిరాకరించెను. నావాంఛ యింకేదియుఁ గాదు. మహా యజ్ఞము నొకదానిఁజేయఁగోరితిని. మీరద్దానిఁ జేయింపఁదగు. గురుపుత్త్రులరగు మీకు నమస్కరింతును. ప్రసన్నులరు గండు. వేఁడుకొందును మీరు శ్రద్ధగలిగినే నీశరీరముతో స్వర్గలోక మున కేగునట్లు నాచే యజ్ఞము చేయింతురుగాక వసిష్ఠుఁడు నన్ను విడనాడెను మీరు నాకుఁ దగినయుపాయము చెప్పుఁడు. మిమ్ము వదలి యజ్ఞముచేయ నూహింపను. ఇక్ష్వాకువులకెల్ల వసిష్ఠుఁడే పురోహితుఁడు. విద్వాంసులగుపురోహితులే రాజులకెల్ల నుత్తారకు లగుదురుగదా. అట్టికులగురువు వదలి నచోఁ దరువాత మీరెల్లరే నాకు దైవసమానరక్షకు లగు దురని విన్నవించి యూరకుండెను.

మహానీయులారా! ఈభాగమునుండి నేర్చుకొనఁదగిన విషయములు గలవు. విమర్శింతము. ఇపుడు విశ్వామిత్రుఁడు వానప్రస్థోచితాచారములం బాటింపక గృహస్థువులకుఁ దగు నాచారముల నవలంబించి భగవంతు నారాధించెను. వాన ప్రస్థువునకు భార్య చెంతనే యుండును. కాని జితేంద్రియత్వ పరీక్షకే యాయాశ్రమము కావునఁ దత్సంగతి పనికిరాదు. భార్యను బుత్త్రులయధీనమున నుంచి తానే పోవలయునని కొందఱమతము. ఇపుడు కౌశికునకు సంతానము గలిగెను. కాన నతఁడు వానప్రస్థువు కాదని తెలియందగును. మూవురు కొడుకులం గాంచి యెంతయోకాలము తపంబొనరించెను. బ్రహ్మ ప్రత్యక్షమయ్యెను. రాజర్షివై తివని పోయెను. ఏల? వసిష్ఠునిపై నతనికిఁ గోపము నశింపలేదు.

"యజ్ఞో దానం తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్,
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణాం. ౫
ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ,
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమమ్" ౬
(గీ ౧౮ అ.)

అన్న శ్రీభగవద్వాక్యము ననుసరించి యీతఁడు నమ్మునినొంపఁ గోరి తప మొనరించుటం జేసి యది సంపూర్ణఫలము నీఁజాల దయ్యెను. మనస్సున నసూయ యుండరాదు. ఫలాపేక్షయు నుండరాదు. శాంతము పొడకొనవలయును. చిరకాలము భగవంతు నారాధించినందున నంతమాత్రమే ఫలము కలిగెను. ఇట్టులుండ నీఁక దేవాలయములఁ బాషాణవిగ్రహములనే పూజించిన ముక్తి యెట్లు దొరకునో తెలియరాకున్నది.

"రథస్థం కేశవం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే."

యన్న ఫలస్తుతి కేమియర్థమో యోజింపుఁడు ఈఫలస్తుతియే సత్యమగుచో సృష్టియే నశించును ఈవాక్యమునే మఱియు నిట్టివానినే యుపన్యసించుచు రథముగట్ట ద్రవ్యము నిమ్మని యాచించుదాసులు యోగులు భక్తులు మాంత్రికులు ధనార్జనపరులుగాక మఱేమగుదురు? వారిపాలిటికి మోక్ష మనఁగా సులభలభ్యపదార్థముగాఁ దోఁచును గాఁబోలు. వారిపాపము శాంతించుఁగాక.

"రాజర్షివైతివి" అన్నంతమాత్రమున గాధినందనుఁడు సంతృప్తుఁడు కాఁడయ్యెను. తృప్తినొందరాదని కర్మ మాలోచించెను. కర్మబద్ధుఁడుకదా. అదృశ్యపాశములనెల్లరఁ గర్మము బంధించియుంచును. కావున స్వతంత్రు లెవ్వారును లేరు. కాని

భావిభాగ్యప్రచోదితుఁడు కావున బ్రహ్మత్వమునుగోరి తపస్సు చేయ నాలోచించెను. ఇంకను దానికిం దగినయోగ్యత యత నికి లేదు గర్వము గలదు. అది నశించినఁగాని బ్రహ్మత్వము రాదు. గర్వనాశమున కవమానమే యౌషధము. అద్దానిం గల్గింప నెంచి కర్మ మొక్కపన్నాగము పన్నెను. త్రిశంకు చరిత్ర మందులకే యని యెఱుంగవలయును ఆ రాజుచరిత్రము నిఁక విమర్శింతము.

> "మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః,
> రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః." ౧౨
> (గీత ౯ అధ్యా.)

అన్న శ్రీహరియుపదేశము ననుసరించి యా త్రిశంకుమహా రాజు పాంచభౌతికశరీరముతో స్వర్గమున నుండఁగోరెను. యజ్ఞము చేసి దానికిఫలముగా నీలాభమును బడయ నెంచెను. మహాజ్ఞానియగుట వసిష్ఠుఁ డది యశక్యమని నివారించెను. కాని త్రిశంకుమూలమున విశ్వామిత్రునకు బుద్ధిరావలసి యున్నందున నా రాజు వసిష్ఠమునిమాట నాదరింపకపోయెను. ఎవ్వరినైన నాశ్రయించి యావాంఛను దీర్చుకొన నెంచెను. ఏల? విశ్వామిత్రునిచెంతకుఁ గర్మ మీడ్చుకొనిపోవుచున్నదని మనము గ్రహింపవలయును. దీనింబట్టి యాలోచింపఁగా, మానవుఁడు నెఱవేఱనికోర్కులం గోరరాదనియు, నొకప్పు డూహించినను మతిమంతులు వలదన్నపుడు మానుకొన వలయుననియు నీతులు తేలెడిని. వీనిని మనము గ్రహించు టయేకాక యాచారమున వానిం బాటింపవలయును.

## త్రిశంకుఁడు విశ్వామిత్రుని శరణుఁజొచ్చుట.

* అంత వసిష్ఠతనయశతకము త్రిశంకువాక్యము లాలకించి కోపము పొడసూప బుద్ధిమాలినకార్యము చేయఁబూనితివి. కావున సత్యవాది నీగురుఁడు సమ్మతింపఁడయ్యెను. గురువు నుల్లంఘించి మఱియొకరి నెట్లాశ్రయించెదవు? ఇక్ష్వాకువంశమునకుఁ బురోహితుఁడు వసిష్ఠమునియేకదా. పరమాచార్యుఁడతఁడే కాదా. సత్యైకవాదియగు నతనిమాట వీటిఁబుచ్చి మమ్మాశ్రయించిన మాకు మాత్ర మాక్రతువు శక్యమగునా? రాజేంద్రుఁడవగు నీవే యిట్టిపని చేయఁబూనుటం జేసి మూర్ఖుఁడవైతివి. మరలి పురమునకుఁ బొమ్ము. అమ్ముని సర్వకార్యసమర్థుఁడు. అట్టిమహాత్మున కవమానము చేయఁజాలువారమే? అని వారు కోపమునఁ బర్యాకులాక్షరములుగలమాటలు పలుకఁగా విని రాజు వారిం గాంచి తొలుత గురువు పిదప గురుపుత్త్రులు నన్నుఁ ద్రోచిపుచ్చిరి. ఇఁక గత్యంతరము చూచుకొందును. తపోధనవరులారా! మీకు భద్రమగుంగాక. అని త్రిశంకుఁడు పలుకఁగా నాలించి బ్రహ్మర్షివర్యుఁడు కులగురువునగు వసిష్ఠుని మాని యింకొక్కని నీరా జాశ్రయింపఁదలంచె. ఇట్టి చెడు తలంపు గలుగఁదగునా. అని యెంచి కోపావేశమున "నీవు చండాలుఁడవు" కమ్మని శపించిరి.

తెల్లవాఱెను. రాజు చండాలుఁడయ్యెను. అతఁడు కట్టిన పీతాంబరము చండాలోచిత నీలవస్త్రమయ్యెను. రాజతేజస్సు తొలఁగి నల్లనిచాయ వ్యాపించెను. అవయవసౌకుమార్యము వీడి దేహమంతయు బిరుసై యందము తప్పెను. దీర్ఘరోమము

*ఇయ్యది యేఁబదియేనిమిదవసర్గమునుండి కైకొనఁబడినది.

కేశములు కుఱుచలయ్యెను. ఆతనియవయవములన్నియుఁ జండా లోచితములుగా మార్పునొందెను. అతఁడు చండాలుఁడు కాఁగాఁ గూడవచ్చినమంత్రులు పౌరులు తొలఁగిపోయిరి. ఏకాకియై నిలిచెను. రా జంతటనైనఁ దనపట్టుదలమానక నిరంతరదుఃఖనిమగ్నుఁడగుచు వసిష్ఠవైరియగు విశ్వామిత్రుని చెంతకుఁ బోయెను. దుర్దశయిట్టు లలముకొనఁగాఁ దపోధనుఁడు గాక మఱెవ్వఁడు సాయపడంగలఁడు? సకలసుఖములం బోఁగొట్టుకొని కడునిడుమలంగుందుచు మీఁదు మిక్కిలి చండాలత్వ మలవడఁగా నున్నరాజుం జూచినంతనే విశ్వామిత్రునిహృదయము కృపార్ద్రమయ్యెను. మహాధార్మికుఁడు తపఃప్రభావసంపన్నుఁడు కావున రాజర్షి విశ్వామిత్రుఁ డారాజును మిక్కిలి వికృతాకారమునఁ గనఁబడుచున్నవానిం దిలకించి కరుణ వెల్లివిరియఁగా "నీకు శుభము గలుగుంగాక" యని యాశీర్వదించి నీవిచ్చటికి వచ్చినకార్యమేమి? రాజపుత్త్రుఁడవగు నీబలము నడఁగింప సాధ్య మెవ్వారికింగాదే. సామాన్యరాకొమరుఁడవు గావు. అయోధ్యాపురాధిపతివికదా. మహావీరుఁడవగు నీకు శాపమునఁ జండాలత్వము లభింప హేతువేమి? తెలుపుమా యని ప్రశ్నించెను.

వాగ్విశారదుఁడగు నాముని యిట్టులడుగఁ బొంకముగా మాటాడనేర్చిన యారాజు చేతులుజోడించి మహాత్మా! నేనొక వాంఛంబూని నాకులగురువగు వసిష్ఠమునిని, ఆయనకొడుకులను దానిఫలింపఁజేయుఁడని వేఁడితిని. వారు నన్ను నిరాకరించిరి. ఆవాంఛ ఫలింపకపోయెను. అదిపోఁగా దానికిమాఱుగా నాదురదృష్టవశమున నీవికారగతి నాకు లభించినది. దైవము

నేమందును? ఆవాంఛ యేదియో కాదు. ఈకళేబరముతోడ స్వర్గమున కరుగఁదలంచితిని శతక్రతువుల నొనర్చితిని. వానికి ఫలమేది? సశరీరస్వర్గమే కాదా? అదిమాత్రము నాకు లభింప దయ్యెను. నీ వన్నృతమాడితివేమో. దాన నాఫలము నశించి యుండునని యూహింతురేమో ఇంతకుము న్నెన్నఁడైన నే నసత్యమాడినవాఁడనుగాను. ముందు భరింపరానికష్టములుగలి గినను అనృతము పలుకనని నాక్షత్రధర్మముసాక్షిగాఁ బ్రమా ణము చేయుచున్నాఁడను. అనేకవిధయజ్ఞములు చేసితిని. ధర్మ పాలనమునఁ బ్రజలప్రీతికిం బాత్రుఁడనైతిని. గురువులవిన యాదిసద్గుణములను సదాచారములను సంతుష్టుల నొనరించితిని. ఇంకేమి చేయుదును? ధర్మసంపాదనార్థము ప్రయత్నము చేయుచు నందులకై యాగము చేయఁగోరఁగా నాకులగురువు లకార్య మున కానందింపరైరి. దేనికి వారానందింతురో. ఒక్కరి నన నేల? దైవమే యధికమని నాకుఁ దోఁచెడు. అదియే పురుషునకు హితాహితములఁ గల్గించునది కాని యింక నొక్కటి యేదియుఁ గాదు. పౌరుషము నిరర్థకము. అయ్యది దైవమును మించఁ జాలదు. కావున నాచేసినధర్మానుష్ఠానములన్నియు నిష్ఫల ములు. దైవం బన్నింటి నడంగఁద్రొక్కి తానే యుత్కృష్టమై చెలంగుచున్నది. అదియే సర్వకారణము. అట్టిదైవము నాయత్న ములనెల్ల నడంపఁగా దుఃఖితుఁడనై నీయనుగ్రహామును సంపాదింపఁగోరితిని. నీకు భద్రమగుంగాక. నాయందనుగ్రహా మునుపొందగుదును. నేనింకొక్కనికడకుం బోను. భవదన్యుఁడు నాకు దిక్కెవ్వఁడును గాఁడు. వసిష్ఠముని తానుగా నన్నుఁ బిలిచినను జెంతకుంబోను. మహాత్మా! భవత్ప్రసాదంబగుపురుష

ప్రయత్నమునఁ బ్రతికూలదైవమునుమార్చి నాకనుకూలముగాఁ జేయందగునని ప్రార్థించెను.

మహాభక్తులారా! ఈభాగము విమర్శింపఁదగినది. మధ్వవైష్ణవదుర్వాదముల కిందేసమాధానము కలదు. వసిష్ఠసుతులు రాజుమాటల కాగ్రహించిరి. కారణమేమి? గురుధిక్కారము చేయుట పాడిగాదనియే.

> "గురోర్యత్ర పరీవాదో నిందావాపి ప్రవర్తతే
> కర్ణౌ తత్ర పిధాతవ్యౌ గంతవ్యం వా తతోఽన్యతః. ౨౦౦
> పరీవాదాత్ఖరో భవతి శ్వావై భవతి నిందకః
> పరిభోక్తా కృమిర్భవతి కటో భవతి మత్సరీ." ౨౦౧
>
> (మను ౨ అధ్యా.)

అన్నస్మృతిభావము ననుసరించి రాజు తమతండ్రి నాశ్రయింపక వేఱొకరి నాశ్రయింపనచ్చుటచే నతనిఁ ద్యజించెనని తలంచిరి.

> "బాలిశ స్త్వం నరశ్రేష్ఠ గమ్యతాం స్వపురం పునః
> యాజనే భగవాంచ్ఛక్త స్త్రైలోక్యస్యాపి పార్థివ
> అవమానం చ తత్కర్తుం తస్య శక్ష్యామహే కథమ్."

జ్ఞాననిధి సత్యవాదియు నగువసిష్ఠముని యీకార్య మశక్యమని నపుడు మరల నాకార్యమునఁ బ్రవర్తింపఁబూనుటచే నీవు మూర్ఖుఁడవైతివనిరి. మరల నారాజు "అన్యాం గతిం గమిష్యామి స్వస్తివోఽస్తు తపోధనాః" అని పలుకఁగాఁ గ్రోధకలుషితమానసులై నీచబుద్ధి నవలంబించితివి కానఁ జండాలుఁడవు కమ్మని శపించిరి.

> "స గురుర్యః క్రియాః కృత్వా వేదమస్మై ప్రయచ్ఛతి." ౩౩
>
> (యాజ్ఞ. ఆచా.)

> "నిషేకాదీని కర్మాణి యః కరోతి యథావిధి
> సంభావయతి చాన్నేన స విప్రో గురురుచ్యతే." ౧౪౨
>
> (మను. ౨ అధ్యా.)

తనవృద్ధికిఁ బ్రధానహేతుభూతుఁడగు గురువును ధిక్క-రించుట మహాపాపము. కావునఁ జండాలుఁడవు కమ్మని వారు శపించిరి. మానవుఁడు కృతజ్ఞుఁడు కావలయును కాని కృతఘ్నుఁడు కారాదు. ఎవ్వఁడట్టివాఁడే యగునో వాఁడు చండాలుఁడే యగును. "చండతే కుప్యతి క్రూరకర్మవత్త్వేన." క్రూరకర్ముఁడు కావునఁ గోపమూనువాఁడు చండాలుఁ డనంబడును. కృతజ్ఞుఁడగువాఁడు సత్కర్మముల నాచరించినవాఁడని మనము గ్రహింపవలయును. కృతఘ్నులకు మే లేకాలమునను లభింపదు.

కర్మము రామావతారమునకు వలయుపరికరముల సమకూర్చుచున్నది. ఈకారణము పొసంగినఁగాని విశ్వామిత్రుని తపస్సునశింపదు. మరలమరల నంతరాయములుకలిగినఁగాని బుద్ధి శాంతత నొందదు. అంతరింద్రియనిగ్రహము బ్రహ్మర్షిత్వమునకు ప్రధానము. త్రిజగద్విఖ్యాతకీర్తిగలవాఁడుగా నుండినగాని భగవంతుఁడు నరరూపమున వెలసినను గురుత్వమునకుఁ బనికిరాఁడు. ఇన్నికార్యములు చేయఁబూని కర్మము సహస్రముఖములఁ దనయమోఘశక్తిం జూపెను. చండాలుఁడు కాఁగానే వారినే ప్రార్థింపఁగూడదా. త్రిశంకున కాబుద్ధి పుట్టింపలేదు. విశ్వామిత్రు నాశ్రయింపఁ బోయెను. ఏల? ఈతనిమూలమున గాధేయునకు గొప్పకీర్తి రావలసియున్నది. తప స్సది నశింపవలసియున్నది. విజితేంద్రియుఁడై మరల నమ్ముని తపస్సొనరింప

వలసియున్నది. కావున భగవతి మూలప్రకృతి కర్మరూపమున నిన్నిగతులం బ్రవర్తించెనని మన మెఱుంగవలయును.

విశ్వామిత్రుఁ డారాజుం గాంచి చండాలత్వము నేల పొందితివని ప్రశ్నించెను. రాజు మునికి బదులు చెప్పుచుఁ దన యం దేమాత్రము దోషము లేదని తెలుపంబూని,

"అనృతం నోక్తపూర్వం మే న చ వక్ష్యే కదాచన. ౧౯
కృచ్ఛ్రేష్వపి గతస్సౌమ్య క్షత్రధర్మేణ తే శపే
యజ్ఞైర్బహుభిరిష్టం ప్రజా ధర్మేణ పాలితాః. ౨౦
గురవశ్చ మహాత్మానశ్శీలవృత్తేన తోషితాః."

అని తనధర్మములను దెలిపెను. అసత్య మీవఱకుఁ బలుకలేదు. ఇఁకమీఁద నెప్పుడును బలుకను. ఎన్ని కష్టము లలముకొన్నను నే నసత్యమాడనని ప్రమాణము చేయుచున్నాఁడనని రాజు తెలిపెను.

మానవుఁ డొనరించుసత్కార్యములలో సత్యమును గాపాడుట ప్రధానము. దాని నొక్కదానిని గాపాడుకొన్న సకలదేవత లారాధింపఁబడినట్లే యగును.

"సత్యధర్మార్థవృత్తేషు శౌచే చైవారమేత్సదా,
శిష్యాంశ్చ శిష్యాద్ధర్మేణ వాగ్బాహూదరసంయతః." ౧౭౫
(మను ౪ అధ్యా.)

అని సత్యము చక్కఁగా రక్షింపఁదగినదని స్మృతి బోధించుచున్నది. ఎన్ని పుణ్యకార్యము లొనరించినను, ఎన్ని జపములు చేసినను, ఎన్ని ధర్మవాక్యములు బోధించినను సత్యమును గాపాడుకొనఁడేని నిష్ఫలములగును.

"యజ్ఞోఽనృతేన క్షరతి తపః క్షరతి విస్మయాత్,
ఆయుర్విప్రాపవాదేన దానం చ పరికీర్తనాత్. ౨౩౬
న విస్మయేత తపసా వదేదిష్ట్వా చ నానృతం
నార్తోఽప్యపవదేద్విప్రాన్న దత్వా పరికీర్తయేత్." ౨౩౭

(మను ౪ అధ్యా.)

అను నీస్మృతి పైమాటలను దృఢపఱచుచున్నది. అనఁగా నన్ృతమాడిన యజ్ఞము నశించును. ఇంతతపస్సుచేసితినని యచ్చెరువొందిన నాతపఃఫలము నశించును. సద్బ్రాహ్మణుల నిందించిన నాయువు క్షీణించును. ఇతరులతోఁజెప్పిన దానఫలము శూన్యమగును. అను నీస్మృతిభావము మన మెఱుంగవలయును కావుననే మహాభారతాదిగ్రంథములన్నియు సత్యము పరమోత్కృష్టమని తెలుపుచున్నవి.

"శ్రుతిః సత్యేన వాయురావాతి సత్యేనాదిత్యో రోచతే
దివి సత్యం వాచః ప్రతిష్ఠా సత్యేసర్వం ప్రతిష్ఠితం తస్మాత్స
త్యం పరమం వదంతి. నారాయణోపనిషత్తు. ౧౦౧ అను." ౭౯

(మంత్రము.)

అని శ్రుతియు సత్యమునకు నుత్కృష్టస్థానము ననుగ్రహించుచున్నది. కావుననే సత్యము నారాధించిన భగవంతుఁడను గ్రహించును. సత్యారాధకునకు నితరపూజ లక్కఱలేదు. అది మాని యెన్నియజ్ఞములుచేసినను బూదిలోఁజేసిన హోమములే యగును. కావున నెన్నివిధములనైన నద్దానిని భగవత్స్వరూపముగా భావించి దానిని గాపాడవలయునని మన మీఘట్టమునుండి నేర్చుకొనవలయును.

"దైవమేవ పరం మన్యే పౌరుషం తు నిరర్థకం,
దైవేనాక్రమ్యతే సర్వం దైవం హి పరమా గతిః." ౨౨

అనుభాగము ముఖ్యముగా విమర్శింపఁదగినది. పురుషప్రయత్నమునకంటె దైవము బలవత్తరము. అన్నింటి నదియే మించును. పురుషయత్నము దానిముందు నిరర్థకమగును. దీనిసారమేమి? మానవుఁడు ప్రయత్నించిన కార్యము ఫలించిన నయ్యది దైవానుకూలమున నైనదని భావింపవలయును. దైవమునకన్నఁ బురుషప్రయత్నమే ప్రధానమని భావింపరాదు. అదియే యహంకార మనఁబడును. గీతోపనిషత్తుకూడ నీవిషయమునే బోధించును. అలసులు కొందఱు పురుషయత్నమును మానుదురు అయ్యదియు న్యాయ్యముకాదు. పురుషయత్నము న్యాయ్యముగా నొనరించుఫలము దైవాధీనమని తలంపవలయును. అదియే ఫలాభిసంధిరహితకర్మమని భావింపవలయును. తాను ప్రయత్నముచేయుటకే యర్హుఁడనని ఫలసిద్ధి భగవదధీనమని భావించుచో నాతనిమనస్సున నహంకారము నిలువఁజాలదు. కావున మన మీవిషయమునే చక్కఁగా భావించుచుఁ బ్రతి కార్యమునందును భగవంతునియందే భారమునిచి వర్తింపవలయును.

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం."

అన్నగీతాశాస్త్రము నభిప్రాయమును బ్రతిక్షణము స్మరించుచు దాని నభ్యసింపవలయును.

"అనృతం నోక్తపూర్వమ్మే" అనుశ్లోకద్వయము పైన వ్రాసితిని. దాని నాంధ్రీకరణములం జూపుదు. నిష్పక్షపాత

బుద్ధులగు మీరు పరికింపుఁడు. విమర్శకులు నాపద్యములు పాద పూరణపదముల నిండియుండునన్నమాట యెంతదనుక సత్య మో తేటపడును.

క. "... మౌనీ యనృతమాడఁ గ్రతుఫలము నశిం
పదొకో యందురో యేమో
యది నే నెన్నండుఁ జెప్పినది లేదు సుమీ.

గీ. ఇంక ముం దెన్నఁడేని నేనేమి యనృత
మాడ నెట్టెట్టియాపదల్ గూడిన నని
నీదుసన్నిధి శపథము నేనొనర్తు
క్షత్రధర్మంబె దీనికి సాక్షి సౌమ్య.

మ. పలుజన్మంబులొనర్చినాఁడఁ బ్రజలం బాలించితిం బూన్కిని
స్తులధర్మంబున సన్మతిం దగుదురుస్తోమంబు సచ్ఛీల వృ
త్తుల సంతోషము నందఁజేసితిని గ్రతుస్తోమంబు ధర్మాభిలా
షఁ జేయంగనుబూన్కినాఁడ నిపు డస్మద్దేశికుల్ దానికై."

(ఆంధ్రశ్రీమద్రామాయణము.)

ఉ. "ఆడనుగల్ల యింతనుక నాడుట లేదిఁకమీఁద నెన్నఁడే
నోడక క్షత్రధర్మమున నొప్పుమెయిన్ శపథంబునేసెదన్
గోడొడఁగూడియుండినను గోవిదవర్య నిజంబె పల్కుదున్
వీడక ధర్మముం బ్రజల వేయివిధంబులఁ బ్రోచి జన్మముల్.

తే. ఎన్నిటినొచేసి గురుల కహీనచరిత
ములను సద్గుణగణముల ముదముఁగూర్చి
వారిఁ గంటినిగాని యధ్వరము సేయఁ
గడఁగు నాయందు వారికిఁ గరుణలేదు."

(వావిలికొలను రామాయణము.)

పాదపూరణములే లేక యథామూలమని వేనోళ్లఁ బొగడినవారి చాతుర్యము సత్యాభిరతి యిటఁ దేటపడఁగలదని నమ్మెదను. పక్షపాతమున దూషించుట పాపముకదా.

"దైవం పురుషకారేణ నివర్తయితుమర్హసి."

దైవయత్నమును బురుషయత్నమున మరల్ప సమర్థుఁడవను నీ మాటను త్రిశంకువునోటనుండి వెలువడఁజేసినది కర్మమే యని మన మెంచవలయును. ఆమాట విశ్వామిత్రునకు లేనిపోనిపట్టుదలను గల్గించెను. తపోభంగమున కీపట్టుదలయే కారణమయ్యెను. కర్మసిద్ధాంత మెంతబలవత్తరమో యూహింపుఁడు.

## కౌశికుఁడు త్రిశంకువుకొఱకు యజ్ఞముచేయ నెంచుట.

* చండాలరూపముననున్న యాత్రిశంకు విట్లు ప్రార్థింపఁగా విని విశ్వామిత్రుఁడు కరుణతో నింపుగులుకుపలుకుల నిట్లనియె. రాజా నీకు స్వాగతము. పరమధార్మికుఁడవగు నిన్ను రక్షించెద. భయంపడకుము. రాజోత్తముఁడవగు నీకు భయమేల? నీపూనినయజ్ఞము సాగించుటకు సమర్థులగుమహర్షుల నెల్లఁ బిలిపించెద. కావున నీవు సంతుష్టుఁడవై జన్న మొనర్పఁగలుగుదువు. నీ కిలవడిన యీచండాలరూపము గురుశాపమునఁగల్గినది. కాన బ్రహ్మయు మాన్పఁజాలఁడు. ఇది నీకుఁ దప్పదు. అంతమాత్రమున నేమినష్టము? ఈరూపము వదలకున్నను నీకు సశరీరస్వర్గవాసము లభించును. ఈవిశ్వామిత్రుఁడు శరణ్యుఁడని యెఱుంగుము. అట్టి యీమునినే శరణుఁజొచ్చితివి? కావున స్వర్గము హస్తగతమని నిశ్చయింతును.

---

*ఇది యేఁబదితొమ్మిదవ సర్గమునుండి సంగ్రహింపఁబడినది.

అనిపలికి యాముని పరమధార్మికులు మహాప్రాజ్ఞులు నగు తనకొడుకులం గని యజ్ఞసంభారముల సమకట్టుఁడని హెచ్చ రించి శిష్యులంజీరి వత్సలారా! మీరెల్ల నిప్పుడే నాయానతిం గొని వెడలి యీప్రాంతములంగలఋషులను వారిశిష్యులను సుహృదులను ఋత్విజులను తోడుకొనిరండు. నాయాజ్ఞాను సారము మీరు పిలువఁగా నెవ్వఁడే ననాదరమున నేమేని బదు లిడునేని నాకు నామాటలఁ దెల్పుఁడు. అని యానతీయ వా రప్పుడేపోయి నలుదెసలఁ గలదేశములందున్న బ్రహ్మవాదులం బిలిచివచ్చిరి. మహాముని లరుదెంచిరి. కౌశికుం గాంచి శిష్యులు మహాత్మా! మీయాజ్ఞానుసారము బ్రాహ్మణోత్తములందఱు వచ్చుచున్నారు. మహోదయమునియు వసిష్ఠకుమారులునుదప్పఁ దక్కంగలవారెల్ల వత్తురు. ౘనివారిమాటల నాలకింపుఁడు. వారు కోపమున నిట్లు పలికిరి. యాగముచేయించుట కధికారి బ్రాహ్మణుఁ డొక్కఁడే. ఇది నియమము ఇపుడు యాగము చేయించువాఁడు క్షత్రియుఁడఁట. చేయువాఁడో చండాలుం డఁట. ఇదియే విశేషము. చక్కగా నున్నది. చండాలసదస్సున దేవతలు హవిర్భాగముల నెట్లు పరిగ్రహింతుగు. ఋషులు ఋత్విజులు యాగశిష్టహవిస్సు నెట్లు గ్రహింతురు? బ్రాహ్మణు లను విశ్వామిత్రుఁడు పాలించినను జండాలునన్నము భక్షించి స్వర్గము నెట్లు పొందుదురు? ఇవియే వారు నుడివినమాటలని శిష్యులు విన్నవింపఁగాఁ గోపమురూపముగాఁ గనంబడ నేత్ర ములు రక్తవర్ణముఁదాల్ప విశ్వామిత్రుఁ డిట్లు పలికెను

మహాత్ముల తేజోవిశేషమున నే ప్రత్యవాయము పొసఁగ. దనున్యాయము కలదుకదా. దానిని నమ్మియేకదా చండాలునిం.

గూడ యాగము చేయఁబన్నితి ఈకార్యమున నేను దుష్టుఁడ నెట్లగుదును? దుష్కరతపము సల్పువాఁడనుగాని సామాన్యుఁడను గానుగదా. ఈవిషయముల నించుకే స్మరింపక నాతపస్సును లెక్కింపక నన్ను నిందించినదుష్టాత్మకులు భస్మసాత్కృతులగుదురు. సందేహములేదు. వార లిపుడు కాలపాశములచే నాకృష్టులయి యమపురికిం బోవఁగలరు. సప్తశతజన్మములందు వారు శవపరివృతులై వానిని భక్షించుచు ముష్టికు లనఁబడు నీచజాతియందుఁబుట్టి కఠినులై సర్వదా శునకమాంసముం దిను వారలై వాగాదులన్నియు వికారతంగాంచ వికృతాకారంబులఁదిరుగంగలరు. ఇది వసిష్ఠపుత్త్రులకు శాపము. ఇఁక మహోదయుఁడో దుర్బుద్ధియై దూషింపఁదగని నన్ను నిందించెను. కావున నాతఁడే సర్వలోకదూషితుఁడై నిషాదత్వ మలవడఁగా దయావిహీనుఁడై నాయాగ్రహాకారణమున దుర్గతిం బొందఁగలఁడు. ఇట్లు విశ్వామిత్త్రుఁడు తనతపశ్శక్తిసహాయమున మునిసభాంతరమున వారలనెల్లర శపించెను.

మహాత్ములారా! ఈభాగమున నొక్కవిశేషము కలదు. దానిని జక్కఁగాఁ బరిశీలించి గ్రహింపఁదగును. గురుశాపమున లభించినచండాలత్వము దుస్తరమని విశ్వామిత్త్రుఁడే యంగీకరించెను. వసిష్ఠమునిపైఁ దనకుఁగలకోపమున నట్టిచండాలునకే స్వర్గప్రాప్తి గలిగింపఁ బ్రతినచేసెను ఈకౌశికుఁడు శరణ్యుఁడు. అట్టివానికడఁ జేరితివి. ఇఁక స్వర్గము నీకఱచేతిలోనిదే యగుననియె.

"మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి,
అథ చేత్త్వమహంకారాన్న శ్రోష్యసి వినంక్ష్యసి."

అని శ్రీకృష్ణమూర్తియే తెలిపెను. ఇపుడు కౌశికునిమది నహంకారము నెలకొనియున్నది. ప్రకృతి యాడించుచున్నది. భగవంతుఁడు సాక్షిమాత్రుఁడై కర్మశక్తిని గని యానందించుచున్నాఁడు. తనయుపదేశమునుగూడ మఱచి విశ్వామిత్రుఁడు చర్మనిర్మితప్రతిమవలె నెగురుచున్నవాఁడు. తనతపశ్శక్తిచే నసాధ్యకార్యముల సాధింపఁ జూచుచున్నవాఁడు. ఈస్థితియందాతనిని రాగద్వేషదూషితాత్ముఁడని పిలువవచ్చును వసిష్ఠమునిశక్తి యెట్టిదో యనుభవముననే యెఱుఁగును. అట్టివాఁడయ్యు బ్రహ్మతేజోబలమును సాధింపఁబూనినవాఁడయ్యును దనతపస్సు నశింపఁజేసికొనఁబూనెను. ప్రకృతిశక్తి యెట్టిదో యిపుడు కనుఁగొనవచ్చును.

"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే."
(గీత. 2 అధ్యా.)

అన్న శ్రీకృష్ణపరమాత్మోపదేశము.

"హరిస్త్వామారాధ్య ప్రణతజనసౌభాగ్యజననీం
పురా నారీ భూత్వా పురరిపుమపి క్షోభమనయత్.
స్మరోఽపి త్వాం నత్వా రతినయనలేహ్యేన వపుషా
మునీనామప్యంతః ప్రభవతి హి మోహాయ మహతాం." ౫
(సౌందర్యలహరి)

అను నీభగవచ్ఛంకరాచార్యసూక్తియు నీరెండు పైవ్రాసిన యభిప్రాయమునే దృఢపఱచుచున్నవి. కొందఱు మధ్వవైష్ణవబ్రువులు గీతోక్తికి బదులుచెప్పఁజాలరు. కాన నంగీకరించి తదర్థమునే ప్రతిపాదించిన శ్రీశంకరోక్తి నీసడింతురు. ఏల?

వారిప్రాక్సంస్కార మట్టిది. ఇదియే వారికి మనుష్యజాతియందుఁ దొలిజన్మమని మన మెఱుంగందగు. వారిదూషణముల నావలం ద్రోయుదము. విశ్వామిత్రుని యిప్పటిచరిత్రమును బరికింతము.

మహాకోపమునఁ దనమాటకు నెదురాడినవసిష్ఠతనయ శతమును మహోదయమునిని శపించెను. దీనిచేఁ జిరకాలార్జిత తపస్సు నశించునని తలంపలేకపోయెను.

"యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ
న విముంచతి దుర్మేధాః ధృతిస్సా పార్థ తామసీ." ౩౫
(గీ ౧౮ అ.)

అన్నభగవదుక్తి ననుసరించి వదలఁదగినదుర్గుణముల వదలఁజాలకపోయెను. కావున మానవుఁడు కోపమునఁ దన క్షేమమును బోఁగొట్టుకొనుననియు నితరులకుఁ జేయునపకారము తొలుదొలుతఁ దనకు సంతోషమునిచ్చినను దుద కది శాశ్వతదుఃఖమునే తనకుఁ గల్గించుననియు, శాంతమునకు మనసునఁ దావిచ్చినయెడలఁ దన మేలు తానెఱింగినవాఁడగుననియు, నితరులు స్వార్థపరులై చేయుస్తుతులకు నల్లే యుబ్బరాదనియు, సావధానముగ నాలోచించి భగవంతుని నమ్మి మహాత్మా! నన్నుద్ధరింపుమా యని వేఁడుచు నితరఫలముల నాశింపక యుండవలయుననియు, మన మీఘట్టమునుండి యెఱుంగవలయును. ఇఁకఁ దరువాతకథను బరికింతము.

## నూతనస్వర్గనిర్మాణము.

*గాధేయుఁ డీరీతిగా వాసిష్ఠులను మహోదయుని శపించి మునివరులం గాంచి మునులారా! ఈతఁ డిక్ష్వాకుకులజాతుఁడు.

---

* ఇది యేఁబదియవ సర్గమునఁ గలదు.

త్రిశంకు వనఁబడువాఁడు. దాత ధార్మికుఁడు. క్షత్రియరూప ముననుండి యిపుడు శాపకారణమునఁ జండాలరూపమునొంది యీశరీరముతోడ స్వర్గమునకుఁ బోవఁగోరి నన్ను శరణుఁ జొచ్చినాఁడు. ఈశరీరమున స్వర్గమున కరుగునట్లు మీరు నేనును గలిసి యజ్ఞము సాగింపవలయును. అని పలుకఁగా నా కౌశికుని పలుకుల నాలకించి యంద ఱొక్కమాటగా ధర్మవేత్త లుగావున నిట్లనుకొనిరి. ఈముని కుశికవంశజుఁడు. క్రోధనుఁడు. కావున నీతనిమాటను విని చేయుటమాత్రమే కాక చక్కఁగా సాగింపవలయును. సంశయ మిందులేదు. ఈతఁ డగ్నికల్పుఁడు. మహామహిమోపేతుఁడు. కోప మీతనికిం గలిగించితి మేని మనల శపింపక వదలఁడు. ఈయిక్ష్వాకుకులజుఁ డీశరీరముతో స్వర్గమునకుఁ బోవునట్లు యజ్ఞమును సాగింపవలయును. మన మెల్ల సావధానులమై యొుపరిపనులను వారుగా నిర్వహింపం దగు. అని మాటలాడుకొని యా కార్యమునకుంబూనిరి. విశ్వామిత్రుఁడు యాజకుఁడయ్యెను. తక్కినవారు యథావిధిగా యజ్ఞమును సాగించిరి.

అంతటఁ గౌశికుఁడు తపోబలమున హవిర్భాగములను గ్రహింప దేవతలం బిలిచెను మంత్రముల నెన్నిసారు లుచ్చరించి పిలిచినను వారు రారైరి. ముని నిర్భరక్రోధమున స్రువము నెత్తిపట్టుకొని రాజా! యీయాగం బుండనిమ్ము. నాతపోమహాత్త్వముం జూడుము. తపోమాహాత్మ్యమున నితరాలభ్యమగు స్వర్గము నీదేహముతో నందఁజేయుదును. స్వర్గమున కరుగుము. చిరకాలము నేసాధించినతపస్సున నించుకయే నుండునుగదా.

దానిశక్తిచే నీ వీతనువుతోడనే స్వర్గమునకుం బొమ్ము. అని పలుకఁగా నామునులందఱూరకే చూచుచుండఁగా నారాజు స్వర్గమునకుఁ బోయెను. మానవశరీరముతో స్వర్గమునకువచ్చిన యాత్రిశంకువుం గని యింద్రాదులందఱు త్రిశంకూ! తిరిగి పొమ్ము. ఇందుండ నర్హుఁడవుకావు. గురుశాపహతుఁడవగు నీ వెక్కడ? స్వర్గమెక్కడ? చాలుంజాలును. తలక్రిందుగా భూమిపయిం బడుమనిరి.

ఇంద్రాదులవాక్కుల నాలకించి యారాజు విశ్వామిత్రా! కాపాడుమా యని యాక్రోశించుచు భూమింబడియె. ఆయాక్రోశము నాలకించి ముని రోషాతిరేకమున నిలునిలుమని హెచ్చరించి మునులనడుమ నింకొకసృష్టికర్తయో యన్న యట్లు వెలుంగుచు నారాజుండుభాగమున వేఱొకస్వర్గము నిర్మింపఁదలంచి దక్షిణదిక్పథమున సప్తర్షులను క్రొత్తవారిని సృజించెను. అంతతో మానక నిజయశస్సు దిక్కులవ్యాపింపఁగా నాదిక్కునందే నూత్ననక్షత్రముల వరుసలుగా నిర్మించెను. అంతకంతకుం గోప మతిశయింపఁగా రెండవయింద్రుని నైన నిర్మించెద. ఈక్రొత్తలోకమునఁ ద్రిశంకు వుండును. కాన నింద్రుఁ డింకొక్కఁడేటికి? ఇంద్రుఁ డీతనికిఁ బరిచరుఁడు కాఁదగు. అని పరివారభూతులగు దేవతలను నిర్మింప నారంభించెను. ఆవిధ మెఱింగి సురాసురులును, మహర్షులును వేఱుగా నమరుల నిర్మించిన సహింపందగునా యని యాతురంపడుచు నావిశ్వామిత్రునికడ కరుదెంచి యాశ్వాసించుచు మహానుభావా! సర్వమెఱుంగుదువు. ఈరాజు గురుశాపనిహతుఁడు. కాన సశరీరస్వర్గప్రాప్తి కనర్హుఁడు. అని ప్రార్థించిరి.

విశ్వామిత్రుఁ డామాట లాలకించి దేవతలారా! మీకు భద్రమగుంగాక నాప్రతిన నెఱుంగుదురుకదా. దాని నిపుడు వ్యర్థముచేయ నంగీకరింపఁజాలను. ఇపు డీరాజుండు నీప్రదేశమే శాశ్వతముగా స్వర్గమగుంగాక. ఈలోకం బెంతదనుక నుండునో యంతదనుక నేను సృజించిననక్షత్రములన్నియు స్థిరముగా నెలకొనుంగాక. దీని మీరంద అంగీకరింపవలయును అనఁగా నెల్ల రట్లే యగుంగాక యని పలికిరి. మఱియు మునీంద్రా! నీకు శుభంబగుఁగాక. ఇప్పుడు నీవు నిర్మించిన యీనక్షత్రము లెల్ల నంబరమున నపూర్వమగుజ్యోతిశ్చక్రమార్గమున కవ్వల శాశ్వతముగా నుండఁగలవు. ఆజ్యోతిస్సుల నడుమ త్రిశంకువు గురుకృతాపరాధమునఁ దలక్రిందుగాఁ దేజోవిశేషమున దేవతాప్రతిముఁడై వెలయును. స్వర్గలోకప్రాప్తునిచందమునఁ గృతకృత్యుఁడై ధ్రువునిభంగిం గీర్తిచే వెలుంగుచు నుండఁగలఁడు. ఈనక్షత్రము లీతని ననుసరించి యుండును. అనఁగా విని విశ్వామిత్రుఁడు వారింగాంచి యట్లే యంగీకరించితిననియె. యాగము పూర్తియయ్యెను. ఎల్లరు యథావిధిగా నిర్వర్తించి క్రతుసమాప్తిం గాంచి తమతమ నెలవుల కరిగిరి.

ధీరులారా! ఈభాగము సాధారణబుద్ధిం బఱింప నచ్చెరువు గలిగింపకమానదు. నూతనస్వర్గనిర్మాణమనఁగానే నవ్వు వచ్చును. మనము పల్లె నొకదానిని గట్టించి క్రొత్తపల్లె యని పేరుపెట్టినట్లే యీస్వర్గముకూడ నంత సులభమా యని శంకయుఁ గలుగును. ఇట్టివి యుండుటంబట్టియే పురాణములు నమ్మరానివని కొంద అనవచ్చును. ఇన్నింటికి సమాధానములు

చెప్పవలసియుండును. కావున విమర్శనార్హమే యగును. సామాన్యదృష్టిని వదలి శాస్త్రదృష్టిం బరికింపనిది సాధ్యమే కాని యసాధ్యము కాదని తోఁచును. మనలో నింద్రజాలమని మహేంద్రజాలమని రెండువిద్యలు గలవనుట సత్యమేకదా. అయ్యవి యల్పశక్తిగలవి. సర్వలోకములం గలపదార్థముల నొక్కచోటం జేర్చి కనంబఱచును. ఆపదార్థములు కొంత కాలమే యుండును. మంత్రశక్తి స్థలాంతర లోకాంతరముల యందుండువస్తువుల నొక్కక్షణమున నొక్కచోఁ జేర్చుట మనముకన్నులారఁజూచుచున్నారముకదా. మంత్రములకొక్క యద్భుతశక్తి కలదని తెలియనయ్యెనుగద. ఈమంత్రముల కధిదేవత లల్పదేవత లనంబడుదురు. వారిశక్తి యత్యల్పము. ఈవిధమును నమ్మనివా రుండరు. ప్రత్యక్షసిద్ధి విషయమునకు సాక్షు లక్కఱలేదు. ఐంద్రజాలికుఁడు కుటుంభరుఁడు. మోక్షకామి కాఁడు ఆతనిమంత్రోపాసనశక్తియు నత్యల్పము. తత్ఫలముకూడ నంతియ యనఁదగును. దాని నుదాహరణముగా గ్రహించి యూహింతము. విశ్వామిత్రుని తపశ్శక్తి యపారము. దానిఫలముకూడ నట్టిదియ. తేజస్సుల సృజించుట యొక గొప్పకార్యము కాదు.

"యద్యద్విభూతిమత్సర్వం శ్రీమదూర్జితమేవ వా
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్." ౪౪
(గీ ౧౦ అధ్యా.)

అన్న శ్రీకృష్ణోపదేశము ననుసరించి కౌశికతపోమహత్త్వము తేజోరూపముల నిర్మింపఁజాలుట గొప్పదికాదు. ఏలనఁగా ఘుని సమారాధనవిశేషమునఁ బరాత్పరు నలరించి యామహ

నీయుని యపార తేజమునఁ గొంతభాగము గ్రహించెను. కేవల క్షత్రియత్వమును విడనాడి రాజర్షిత్వము నలవఱచుకొనియెను. అనఁగా ఋషులలక్షణముల నభ్యసించెనని భావము.

"రససిద్ధిర్మోక్షసిద్ధిర్బలసిద్ధిస్తథైవ చ. ౫౨

ఖడ్గసిద్ధిః పాదుకాయాః సిద్ధిరంజనసిద్ధికా

వాక్సిద్ధిర్లోకసిద్ధిశ్చ దేహసిద్ధిరనంతరం. ౫౩

ఏతాదృశ్యస్సిద్ధయస్తు బహ్వోన్యా యోగిసమ్మతాః

అత్రాంతరే తు పరితస్సేవంతే పరమేశ్వరీం." ౫౮

(లలితోపాఖ్యానము ౪౦ అధ్యా.)

ఉపాసకుఁ డభీష్టదేవత నుపాసించి తత్తేజోవిష్టుఁడై యద్భుత కార్యముల నొనర్పంజాలును. అవి పామరుల కసాధ్యములుగఁ దోఁచును. కాని యుపాసకునకు నత్యల్పకార్యములుగఁ దోఁచును యోగవిద్య నభ్యసించినవారల కియ్యవి తుచ్ఛ కార్యములుగాఁ గనంబడును. కావునఁ దపశ్శక్తి యనుప మానము సర్వకార్యక్షమము. కావున దానిని జక్కఁగా నొన రించిన విశ్వామిత్రునకు నక్షత్రమాత్రసృష్టి యొకయుత్కృష్ట కార్యము కాదని తెలియందగు దీనిచే మానితపస్సు వ్యయ మయ్యెనని యు మన మూహింపవలయు. యోగమహత్త్వము నీవఱకే వ్రాసియున్నాఁడను.

"స్వార్జితం కించిదప్యస్తి మయా హి తపసః ఫలం

రాజన్ స్వతేజసా తస్య సశరీరో దివం వ్రజ."

అను నీమాలమే పై విషయమును దృఢపఱచుచున్నది.

విక్రోశమానస్త్రాహీతి విశ్వామిత్రం తపోధనం
తచ్ఛ్రుత్వా వచనం తస్య క్రోశమానస్య కౌశికః."

స్వర్గమునుండిపడుచు విశ్వామిత్రా! కాపాడుము. కాపాడుము. అని యాక్రోశింపఁగా గాధినందనుఁడు వినెను. అను నీయర్థమును విని కొందఱు స్వర్గమర్త్యములకు నంత సమీపమా యని యడిగి పరిహాసింతురు. తపశ్శక్తిచే రాజును శరీరముతో స్వర్గమునకుఁ బంపినమౌని యంతమాత్ర మెఱుఁగఁజాలఁడా యని వారెఱుంగరు కాఁబోలు. యోగాభ్యాసము లేనికతన నీకాలపువారమగు మనకు నన్నియు నచ్చెరువుగాఁ దోఁచు చున్నవి. ఈకాలమునఁగూడ నించుక ప్రాణాయామముచేయ నేర్చినవారు త్రాళ్లతోఁ గట్టవేయఁగా వాయువు వెడలించి యాబంధములు సడలఁగా వెడలివచ్చుట మనము చూచుచున్నారము. అత్యల్పమగు నభ్యాసముచే యోగమహిమము తేటపడుచున్నది. అట్లే చక్కఁగ యోగము నభ్యసించిన లోకాంతరవార్తల నెఱుంగవచ్చును. దానిని మాని వ్యర్థముగాఁ గాలముం బుచ్చుచు మహర్షులశక్తిని దూఱుట వెఱ్ఱితనముగాక మఱేమగును? సర్పవిషాగ్నికీలలఁ జావనున్నవాని నొక్కమాంత్రికుఁడు బ్రదికించుట మన మెఱుంగుదుము. మంత్రశక్తి దీనః దేటపడుచుండఁగా నెన్నియో వత్సరములు నియతవ్రతులై భగవంతు నారాధించిన మహర్షులకుఁ జేయరానికార్యము లుండవని మన మూహింపవలెను. భగవంతు నారాధించువారలకు దుష్కరకార్యము లుండవని నమ్మి వశాత్వరు నారాధింపవలయును. ఆయారాధనము శ్రద్ధారహితమైనచో నిష్ఫలమగును. ఇఁకఁ దరువాతికథ నాలకింపుఁడు.

## అంబరీషుఁడు శునశ్శేఫుని గొనిపోవుట.

*యాగము పూర్తి కాఁగా మును లెల్ల నరుగుట నెఱింగి కౌశికుఁడు తపోవనవాసులతో మునులారా! నా ప్రయత్నించిన తపస్సునకీ దక్షిణదిక్కునందు మహావిఘ్నము ప్రాసంగెను. వేఱొకదెసకుం జని తపము చేయుదము. పశ్చిమదిక్కునందు విశాలతపోవనములు గలవు. అందలి పుష్కరతీర్థతీరముల యందు హాయిగాఁ దపము చేయుదము. అవి సాధుసంసేవ్యతపోవనమని విందును. అని తెలిపి యమ్మునిరాజు మహాతేజము వెలుంగఁ బయనమై పశ్చిమదిశకుం జని యందు ఫలమూలాశనుఁడై పుష్కరతీరములందు దుష్కరతపము చేయుచుండెను.

ఆకాలమున నయోధ్యానగరపాలకుఁడగు నంబరీషమహారాజు జన్న మొకండు చేయ నుపక్రమించి సాగించుచుండెను. యాగపశు వింద్రునిచే నపహృతమయ్యెను. పశువు కనఁబడక పోవఁగాఁ బురోహితుఁడు రాజా! నీయశ్రద్ధవలన యాగపశువు నెవరో దొంగిలికొనిపోయిరి. అది యిట నగపడదు. శ్రద్ధచేఁ బశువును గాపాడకున్నయెడలఁ బశునాశాదిదోషములు రాజును నాశనము చేయును. దీనికిఁ బ్రాచితమో దుష్కరమని తలంపుము ఈసత్కర్మము ప్రవర్తింపకముందే పోయిన యాపశువును వెదకికొనిరమ్ము. లభింపనిచో నొక్కమానవుని యాగపశువుగాఁ ద్వ్రరపడి కొనిరమ్ము. ఆలసింపకుమని తెలిపెను. ఉపాధ్యాయుని యప్పలుకులు విని యంబరీషుఁడు ప్రాజ్ఞుఁడు కావున ననేకపశువుల నొసంగి యొక్కనరపశువును గొనితెచ్చువాఁడై యాయాజనపదముల నగరముల దేశముల

---

ఇది యఱువదియొకఁడవ సర్గమునఁ గలది.

వనములఁ దాపసాశ్రమముల వెదకుచు నెందును నరపశువు లభింపమి భృగుతుంగపర్వతమునకుంబోయి యందున్న ఋచీక మునిం గాంచెను. ఆముని సపుత్త్రకళత్త్రుఁడై యుండెను. రాజా మునిరాజునకు నమస్కరించి ప్రసన్నునిగ నొనరించి సకలవిధకుశలప్రశ్నములను గావించి మహామునీ! లక్షగోవుల నొసంగెదను. వానిని గ్రహియించి నీపుత్త్రుని నాకు యాగ పశువుగా నొసంగుదువేని కృతకృత్యుఁడ నగుదు. నీవు భృగు కులజనితుఁడవు. నాకోర్కె నెఱవేర్పం దగుదువు. సకలదేశ ములం దిరిగితిని. కాని పశు వెందును లభింపదు. నీపుత్త్రకు లలో నొక్కని మూల్యము గ్రహించి యొసంగుమని ప్రార్థించెను.

ఆప్రార్థనమును విని ఋచీకుఁడు రాజా! ఏమియిచ్చినను నా జ్యేష్ఠపుత్త్రు నమ్మనని నమ్ము మనియెను. ఆమునిభార్యయు భూపాలా! నాకుఁ జిన్నికొడుకుపై నెక్కుడు మక్కువ. కాన వాని నీఁజాలను. ఇది న్యాయ్యమే. సాధారణముగా జనకుఁడు జ్యేష్ఠుని బ్రేమించును. జనని కనిష్ఠునిపైఁ బ్రీతి నునుచును. ఈ విషయమున నీకుఁ దెలియని దేమున్నది? అన్యాయము నను సరించి కనిష్ఠకుమారుని గాపాడుకొందునని తెలిపెను. తల్లి దండ్రు లిట్లుచెప్పఁగా విని మధ్యముఁడగు శునశ్శేపుఁడుతానుగా రాజా నాతండ్రి తొలికొడుకును, నాతల్లి కొండికవాని నమ్మఁ గూడదనిరి. ఇఁక మధ్యమతనయుఁడగు నన్నే నీకు వారమ్మిరని తలంతు. నన్నిఁకఁ గొనిపొమ్ము. అనఁగా నాభూపతి పరమ సంతోషమున లక్షగోవులనిచ్చి యాతని గ్రహించి రథముపైఁ గూరుచుండఁజేసి నిజపురమున కరిగెను.

మనీషులారా! ఈఘట్ట మనేకసంశయములఁ గలిగించు నదిగ నున్నది. కాన విమర్శింతము. త్రిశంకురక్షణరూపమున మునితపస్సు నశించెను. ఆచోటు తనకు మేలుకలిగింపలేదని కౌశికుఁ డాలోచించి స్థలాంతరమున కరిగెను. ఎక్కడి కరిగిన నేమి? కర్మము కూడనే యుండును. అది ఛాయవలె ననుస రించును. కౌశికుఁ డచటనుండక పడమర దెసకుంబోయి యం దొక్కతపోవనమున నతినిష్ఠం బూని తపము చేయుచుండెను. ఆతపస్సుకూడ బ్రహ్మత్వము నీఁదలంపదయ్యెను. అది నశించు విధ మొండు పొడసూపెను. ఇదియే "గహనా కర్మణో గతిః" అన్నదానిని మనకుఁ బలుసారులు తలంపునకుం దెచ్చు చుండును.

అంబరీషుఁడు యాగము చేయుచుండ యజ్ఞపశువు నెవరో దొంగిలి కొనిపోయిరి. పురోహితుఁడు దానికిఁ బ్రతి నిధిగా నరపశువును దెమ్మనియెను. ఈకథ చదువఁగనే యా కాలమునఁ గలకొన్ని యలవాటులు గోచరించును. సంకల్పించిన వస్తువు పోయినచో దానికి బదులుగా నిచ్చువస్తువు దాని కంటె నుత్తమముగా నుండవలయును. అనునియమము ననుస రించి రాజు సకలదేశములను దిరిగెను. ఎవ్వరును వధించుటకుఁ గొడుకుల నమ్మువారు లేకపోయిరి. భృగుతుంగపర్వతమున ఋచీకమహాముని మూవురుకొడుకులు భార్యయునుండనుండెను. మహాతేజస్వియగు నామునికి నమస్కరించి తనకార్యమును నివే దించెను.

"గవాం శతసహస్రేణ విక్రీణీషే సుతం యది
పశోరర్థే మహాభాగ కృతకృత్యోఽస్మి భార్గవ."

అనునదియే రాజుకోరిక. ఈప్రార్థనము ననుసరించి యోజించిన నాకాలమున దురాచారము లిట్టివి యున్నట్లు తేటపడును. సామాన్యదృష్టిం బరికింప నిది క్రూరాచారమనియే పొడకట్టును. మానవుని వధించుట దానిచేఁ బుణ్యము లభించునని నమ్ముట యివి ఘోరము లగునలవాట్లనుట కొంతయు శంకలేదు. కాని సూక్ష్మదృష్టిం బరికించిన నాకాలపుమానవులకుం గలదేవతాభక్తి తేటపడును. దేవతాకార్యమునిమిత్తము ప్రాణముల నర్పించుట పుణ్యకార్యమనియే వారియూహయై యుండ వచ్చును.

"మానవస్తేయహింసాశ్చ పానమస్యాంగనారతిః. ౩౭
కర్మ పంచవిధం ప్రాహుర్దుష్కృతం ధరణీతలే
బ్రహ్మక్షత్రియవిట్శూద్రగోతురంగఖరోష్ట్రకాః. ౩౮
చతుష్పదోండజాబ్జాశ్చ తిర్యంచోఽనస్థికాస్తథా
అయుతం చ సహస్రం చ శతం దశ తథా దశ. ౩౯
దశ పంచ త్రిరేకార్థమానుపూర్వ్యాదఘం భవేత్
బ్రహ్మక్షత్రవిశాం స్త్రీణాముక్తార్థే పాదమాచరేత్. ౪౦
సింహవ్యాఘ్రమృగాదీని లోకహింసాకరాణి తు
నృపో హన్యాచ్చ సతతం దేవార్థే బ్రాహ్మణార్థకే. ౫౦
ఆపత్స్వాత్మార్థతో వాపి హత్వా మేధ్యాని భక్షయేత్
నాత్మార్థం పాచయేదన్నం నాత్మార్థం పాచయేత్పశూన్. ౫౧
దేవార్థే బ్రాహ్మణార్థే వా పచమానో న లిప్యతే.
వీతద్రుహాశ్రమస్థానాం క్రియాఫలమభీప్సతాం
పశుయజ్ఞో న చాన్యేషామిష్టాపూర్తికరం భవేత్. ౬౯
జపహోమార్చనాద్యైస్తు తేషామిష్టం హి సిద్ధ్యతి."

(లలితోపాఖ్యానము ౨ అధ్యా.)

హింస దుష్కర్మముగాఁ బరిగణింపఁబడినది. సకలస్మృతులు నీ
విషయమున నైకకంఠ్యముగ నున్నవి. యజ్ఞాదులయందు
మేధ్యపశువధము పాపఫలదము కాదని మనుస్మృతి లోనగునవి
తెలుపుచున్నవి. ఇట్లుండఁగాఁ బశువునిమిత్తము మునికుమా
రుని వధింప నిమ్మని లక్షగోవులగ్రహించి విక్రయింపుమనుట
వినుటకె కష్టముగ నున్నది. కాని వారిభావమేమని యూహిం
తము. ఈయజ్ఞమునఁ దప్పు మఱేయజ్ఞమునందును బోయిన
పశువునకుఁ బ్రతినిధిగా నరపశువును వధించుట కానరాదు.
కావున నిందోక్తివిశేషము కలుగక తప్పదు విశ్వామిత్రునకుఁ
దపోభంగమున శ్రమము కలుగవలయును. దానిమూలమున
నతనికీర్తి సకలదిక్కుల వ్యాపింపవలయును. ఇదియే ప్రకృతి
తాత్పర్యము. కావున నీకార్యమును ఘటింపఁజేసెను ఈవిష
యమును మనము గ్రహించితిమే నాకాలమున నిట్టి యనా
చారములు లేవనియు, విశ్వామిత్రునికొఱ కేర్పడినదనియు,
స్పష్టమగును. తుచ్ఛమగు నీశరీరము భగవదర్పణము చేసినఁ
గృతకృత్యులమగుదుమని యప్పటివారియుద్దేశ్యము అని మన
మంగీకరించినను మంచిదియే.

"ప్రాయేణ హి నరశ్రేష్ఠ జ్యేష్ఠాః పితృషు వల్లభాః
మాతౄణాం తు కనీయాంస స్తస్మాద్రక్షే కనీయసం."

ఇదియు నాకాలపుటాచారమును దెలుపును.

"జ్యేష్ఠ ఏవ తు గృహ్ణీయాత్పిత్ర్యం ధనమశేషతః
శేషా స్తముపజీవేయుర్యథైవ పితరం తథా. ౧౦౫
జ్యేష్ఠేన జాతమాత్రేణ పుత్రీ భవతి మానవః
పితౄణామనృణశ్చైవ స తస్మాత్సర్వమర్హతి. ౧౦౬

యస్మిన్నృణం సంనయతి యేన చానంత్యమశ్నుతే
స ఏవ ధర్మజః పుత్రః కామజానితరాన్ విదుః.” ౧౦౭

(మను ౯ అధ్యా.)

దాయవిభాగమునందు జ్యేష్ఠుఁడే పితృతుల్యుఁడని చెప్పఁబడి నది. కనిష్ఠుఁడు తల్లి కెక్కుడు ప్రీతిపాత్రుఁడను టొక్కముని పత్ని యభిప్రాయమే యనవచ్చును. లేక స్త్రీలు నవప్రియలు గానఁ గొండికవానిని విశేషించి ప్రేమపాత్రునిగా భావింతు రన్న ననవచ్చును. కాని యీయది సర్వకాలములఁ గల యా చారమనిమాత్ర మనరాదు.

“గవాం శతసహస్రేణ శునశ్శేఫం నరేశ్వరః
గృహీత్వా పరమప్రీతో జగామ రఘునందన.”

లక్షగోవుల నొసంగి యామునికుమారుని విక్రయించికొని కొని పోయెనన్నచో నొకసందియ ముదయింపకమానదు. లక్షగోవు లనుగూడఁ దోలుకొని రాజు దేశదేశములు తిరిగెనా? ఇది శక్యమా? యని కొందఱు నన్నే ప్రశ్నించిరి. లక్షగోవులనఁగా నొకనాణెమనియు, గోచిహ్నముగలదిగ నది యుండుననియు, సమాధానము చెప్పితిని. అట్టినాణెముకలదా యనియు మరలఁ బ్రశ్నించిరి. ఉజ్జయినీప్రాంతముల నేఁ జూచితినంటిని.

“లక్షం లక్షం పునర్లక్షం మత్తాశ్చ దశదంతినః.”
దత్తాత ... ... జానుదక్షుత్రభాషణాత్.”

అన్న శ్లోక మిందుల కుదాహరణమగును. గజాదిచిహ్నములు గలవి సువర్ణటంకములు. అంతియగాని గోవులు గజములుగావు. బీదకవికిఁ బదియేనుఁగుల నిచ్చుటకంటెఁ బాఱఁదోలుట మేలు గదా.

పూర్వము యజ్ఞములచే దేవతల నారాధించువారు మెండుగ నుండిరి. యజ్ఞము పశుహింసాప్రధానము. కాని యహింసాప్రధానము కాదు. అనఁగా నాకాలమున బ్రాహ్మణులుకూడఁ బవిత్రజంతుమాంసభక్షకులుగ నుండిరి రాజగృహముల స్వేచ్ఛగా భుజించుచుండిరి. బ్రాహ్మణేతరులకుఁ గొన్నిమద్యములు పానార్హములుగ నుండెను. మద్యపానము భోగాంగమే యని యెఱుంగందగును.

"బృహస్పతిః.—

పైష్టికం తాళజం కైరం మాధూకం గుడసంభవం. ౧౩౩
క్రమాన్న్యూనతరం పాపం తదర్ధార్ధార్థతస్తదా
వర్జ్యమాద్యం సదా సర్వైరాద్యయుగ్మం నృపస్త్యజేత్. ౧౩౪
తృతీయమపి వైశ్యస్తు శూద్రోఽప్యాద్యద్వయం తథా
తృతీయాదిత్రివర్ణానామాసవం పేయముచ్యతే. ౧౩౫
స్త్రీణామపి తృతీయాది పేయం స్యాద్బ్రాహ్మణీం వినా
పతిహీనా చ కన్యా చ త్యజేదృతుమతీ తథా. ౧౩౬
అథ భర్తృసన్నిధౌ నారీ మద్యం పిబతి లోలుపా
ఉన్మాదినీతి సా ఖ్యాతా తాం త్యజేదంత్యజామివ. ౧౩౭
మద్యం పీత్వా ద్విజో మోహాత్కృచ్ఛ్రం చాంద్రాయణం చరేత్
జపేచ్చాయుతగాయత్రీం జాతవేదస మేవ వా." ౧౩౮

క్షత్త్రియాదులు కైరము మాధూకము గుడసంభవము నను నీమూఁడువిధములగు మద్యములను ద్రాగవచ్చునని తేలెడిని. భర్తృసన్నిధియందుఁ దప్పఁ దక్కినతావుల స్త్రీలు త్రాగరాదన్నందున నీపానము సంభోగాంగమని యూహింపఁదగును.

"సురాం వై మలమన్నానాం పాప్మా చ మలముచ్యతే
తస్మాద్బ్రాహ్మణరాజన్యౌ వైశ్యశ్చ న సురాం పిబేత్. ౯౩

గౌడీ పైష్టీ చ మాధ్వీ చ విజ్ఞేయా త్రివిధా సురా
యథైవైకా తథా సర్వా న పాతవ్యా ద్విజోత్తమైః. ౯౪
యక్షరక్షఃపిశాచాన్నం మద్యం మాంసం సురాసవం
తద్బ్రాహ్మణేన నాత్తవ్యం దేవానామశ్నతా హవిః. ౯౫
అమేధ్యే వా పతేన్మత్తో వైదికం వాప్యుదాహరేత్
అకార్యమన్యత్కుర్యాద్వా బ్రాహ్మణో మదమోహితః. ౯౬
యస్య కాయగతం బ్రహ్మ మద్యేనాప్లావ్యతే సకృత్
తస్య వ్యపైతి బ్రాహ్మణ్యం శూద్రత్వం చ స గచ్ఛతి.'' ౯౭

(మను ౧౧ అధ్యా.)

బెల్లము, గారపిండి, యిప్పపూవులు అనువానినుండి తీసినమద్యముసు బ్రహ్మక్షత్రియవైశ్యులు త్రాగరాదనియే యిందలి సారము. తాళజము, ఖైరము అనుమద్యము లిందుఁ బేర్కొనఁ బడలేదు. కావున నవి క్షత్రియవైశ్యులు త్రాగవచ్చుననియు, నాపానము రత్యంగమనియుఁ జెప్పిన పైపురాణవచనముల నీ స్మృతివచనములు బాధింపవు. గుడసంభవమగు సుర పానార్హమన్న పురాణవాక్య మీస్మృతినిషేధముచే బాధింపఁబడినది. శూద్రులు రతికంగముగాఁ ద్రాగవచ్చుననుట కీవిధు లభ్యంతరము కలిగింపఁజాలవు సంవర్తస్మృతియు మనుస్మృతివచనములనే పేర్కొన్నది. సురాపానప్రాయశ్చిత్తమున నీరెండుస్మృతులకు భేదము కలదు

ఇట్లు స్మృతులు పురాణేతిహాసములు పూర్వాచారపరంపరల నెఱిఁగించుచున్నవి. నరపశువును బ్రతినిధిగా నేవిధియందును జెప్పఁబడలేదు. ఈరామాయణమునమాత్రమే యీయని చెప్పఁబడినది. ఏల? అనఁగా నిది విశ్వామిత్రునితపో

భంగమునకును, దన్మహత్త్వప్రకటనమునకు నేర్పడిన దనవల యును. దీనిం బఠించినచో నాకాలపువారలకుఁ బ్రాణముల నొసంగఁదగిన యజ్ఞముల నాచరింపవలయునన్న శ్రద్ధ కలిగియుండె నని మనమూహింపవలయును. కౌశికమునివర్యుని యద్భుతశక్తి లోకమున వెల్లడించుటకే యీయజ్ఞము ప్రవృత్తమయ్యెనని మన మెఱుంగుట తెఱంగు. ఇది యుగాంతరములయాచారము. కలియుగమున మాంసభక్షణమే నిషేధింపఁబడినది. కావున మేధ్యపశువిశసముకూడ నిషేధింపఁబడినయట్లే. కాని యీ కాలమునఁగూడ నాప్రాచీనాచారమునే కొంద ఱవలంబించి పశువులహింసింతురు. అది న్యాయ్యముకాదు వారి నాక్షేపింప రాదు. కాని యది యుత్తమకార్యము కాదని మాత్ర మన వచ్చును. యజ్ఞవిధులఁ బఠించి పశుహింస హింసకాదని వారు వాదింతురు. కాని యావిధులందు మాంసభక్షణము నిషేధింపఁ బడలేదుకదా. ఏల బ్రాహ్మణులు భక్షింపరాదో యెఱుంగఁ జాలకయున్నాఁడను. స్మృతులే కాలానుసారముగా నాచార ములను మార్చును. శ్రుతులు మార్పునొందవు. స్మృత్యుక్త మగునాచారము నంగీకరింపనిచో నీకాలమున శూద్రగృహ ముల నేల విప్రులు భుజింపరాదు? యజ్ఞములయందుఁ బ్రాచీనా చారము తదితరవిషయములందు స్మృత్యుక్తాచారము నవలం బించుట మొండిపట్టుదల యనవలయునే కాని వేఱేమనవచ్చును?

ఇట్లు స్మృతులు పురాణేతిహాసములు విప్రులకు సురా పానము నిషేధించుచుండఁగా మధ్వవైష్ణవబ్రువులు శాక్తులు సురాపానముచేయుదురని యాక్షేపించుట యవివేకమునఁగాక మఱేకారణమున నగును? సురాపానము శాస్త్రోక్తమని సాధింపఁ

గల్గుచో వారియాక్షేపము నిలుచును. ఆచారమునఁ గలదు కదా యందురేని వారికూటములయందును సంవ్యానోత్సవములయందు సురాపానము కలదనవచ్చును. ఎందున్న నది దురాచారమే యగునుగాని సదాచారముగాని శాస్త్రాచారము కాని కానేరదు. కావునఁ దెలివితక్కువచే నాక్షేపించుటయే కాని న్యాయ్యమగు నాక్షేప మయ్యది కాదని యూహింపవలయును.

ఈభాగమునుండి గ్రహింపఁదగువిషయ మేమి? దేవతా కార్యము నెన్నికష్టములకైనను లోనయి సాధింపవలయుననియు, ప్రమాదంపడక దాని నొనరింపవలయుననియు, నెన్ని యంతరాయములుకలిగినను దపస్సు విడలక చేయవలయుననియు, శ్రద్ధయనునది యొక్కండుండిన నెంతటికార్యమునైన సాధింపవచ్చుననియుఁ, గోపమువదలినఁగాని మునికిఁ దపస్సు సత్ఫలము నీయదనియు, మొండిపట్టువల తపఃఫలము నశింపఁజేయుననియు, నట్టిదుస్సంకల్పముల మాని శాంతమువహించి భగవదారాధన మొనరింపవలయుననియు, మనము గ్రహింపఁదగిన ముఖ్య విషయములు. ముందుకథను బఠింతము.

## విశ్వామిత్రుఁడు శునశ్శేఫుని గాపాడుట.

*శ్రీరామచంద్రా! యారాజు శునశ్శేఫుని బిలుచుకొని పోవుచు మధ్యాహ్నము కాఁగాఁ బుష్కరతీర్థతటమునఁ గొంత సేపు విశ్రమించెను శునశ్శేఫుఁడు తన్నుఁ దలిదండ్రులనాదృతిం జూచినందులకుఁ గొందలమందుచు రాజు విశ్రమించియున్న తఱి నెఱిఁగి యాక్షేత్రమున మునులంగూడి తపముచేయు

* ఇది యఱువదికొండవ సర్గమునఁ గలదు.

చున్న తనమేనమామయగు విశ్వామిత్రుని దర్శించెను. దారి బడలికయు దప్పియుఁ దన్ను మిక్కిలి నొంప మోము కాంతి హీనము కాఁగా దీనత్వమున మేనమామ యంకభాగమున వ్రాలి తడఁబడుమాటలతో నిట్లు తనవృత్తాంతము నెఱిఁగించెను.— "నన్నుఁ గాపాడువారుండియు రక్షింపరైరి. నా కిపుడు తల్లి దండ్రులు లేనియట్లే. జ్ఞాతులు నంతియే. బాంధవులు లేరని వేఱుగఁ జెప్పనేల? సౌమ్యా! మునిచంద్రా! ఈరాజు నధ్వరము చెడకయుండ నన్నుఁ గాపాడుము. నీవు సామాన్యుఁడవు కావు. మునీంద్రుఁడవు. సర్వజనరక్షకుఁడవు. హితకారివి. నన్నుఁ గాపాడుట యొక్కగొప్పకార్యము కాదు నావలన నీరాజు యాగము చెడరాదు. రాజు కృతార్థుఁడగునట్లు నేను దీర్ఘాయుష్మంతుఁడనై యుత్తమతపం బొనరించి స్వర్గపదము నొందునట్లు మీరు చేయవలయును. నీవే నాకు దిక్కు. పుత్త్రుని దండ్రి కాచునట్లు నీవు నన్నీపాపవిపత్తునుండి రక్షింపు"మని ప్రార్థించెను.

కౌశికుఁ డాయభ్యర్థనమును విని తపోమహత్త్వమున వాని రక్షింప శక్తుఁడు కావున నతని నాశ్వాసించి తనకొడుకులం గని "శుభము నాకాంక్షించుజనకు లేఫలము నుద్దేశించి కొడుకులం గాంతురో యట్టిఫలమున కిపుడు సమయము వచ్చినది. ఆఫలమనఁగా జనకవాక్యము నెఱవేర్చుటయే కదా. దాని నొనరించుటం జేసి మీకే కాక పరలోకహితముఁ గూర్చుధర్మము నాకును లభించును. మునిసుతుఁ డీతఁడు నామఱుఁగుచొచ్చెను. వీనికిఁ బ్రాణములు నిలుచునంతమాత్రము ప్రియము మీరు గావింపవలయు. పుణ్యకర్ములు ధర్మపరాయణులు. కావున

నంబరీషునియాగమునకు మీయం దెవ్వఁడైనఁ బశువుగాఁబోయి యగ్నిసంతృప్తిఁ గావింపుఁడు. దాన నీతఁడు బ్రదుకును. యజ్ఞము నెఱవేఱును. దేవత లానందింతురు. తండ్రివాక్యము బరిపాలించినట్టులగు" అని పలుకఁగా మధుష్యందాదులు విని యహంకృతిమీఱఁ బరిహాసపూర్వకముగా "జనకా! నీవు మా కెల్లఁ బ్రభుఁడవు. అయిన నౌరసులఁ గాపాడక యన్యపుత్త్రుని గాపాడుట న్యాయ్య మెట్టులగును? ఇదేటి ధర్మము? మేధ్యా న్నము మాని శునకమాంసము మెసవునట్లుగా నిది యకృత్య మని భావింతు"మనిరి.

పుత్త్రులమాటల నాలకించి క్రోధావేశమునఁ గన్నులెఱ్ఱఁ బాఱ "నక్కటా! జనకునకు బదులుచెప్పరాదని యాలోచింపక జంకుమాని తండ్రిచెప్పినట్లు చేయవలయు నన్నధర్మమును గూడ వదలి నామాటఁ బాటింపక తిరస్కరించితిరి. కాన వా సిష్ఠులనలె ముష్టికజాతులై శునకమాంసము దినుచు సహస్ర వత్సరములు భూమియం దుండఁగలరు" అని శపించి దుఃఖార్తుఁ డైన శునశ్శేఫున కభయమిచ్చి విభూతి మంత్రించియిచ్చి రక్షా బంధనముగావించి "మునికుమారా! పవిత్రములగుదర్భరశ్మలచే బంధింపఁబడి రక్తపుష్పమాలికలు కంఠము నలంకరింప రక్త చందనము దాల్చి విష్ణుదేవతాకమగు యూపస్తంభము నొందు నపుడు నాచెప్పెడు నీవాక్యములను దైవాభిముఖుఁడవై స్తుతిం పుము. ఇదిగో యీ రెండుగాథలు నీ కుపదేశించుచున్నాఁ డను. ఇందొకటి యింద్రునిది. రెండవది యుపేంద్రునిది. దివ్య ములగు నీగాథల నంబరీషునియాగమున వినుతింపుము. ఆగాన మున నీకు జీవితసిద్ధి కలుగును.

అని యుపదేశింపఁగా నాబాలుఁడు సమాహితుఁడై వానిని బరిగ్రహించి నెమ్మదిగుదుర రాజుకడ కరిగి యిఁక జాగుసేయనేల? పోవుదము. దీక్షఁబూని యాగముఁ బూర్తి చేయుమనఁగా నామాటల కానందించి రాజుత్వరపడి యజ్ఞవాటమునకుం బోయెను. సదస్యులయనుమతినంది యామునికుమారునకు యాగపశుచిహ్నముగా దర్భత్రాళ్లుగట్టి రక్తవస్త్రములు గట్టనిచ్చి పశువుగా నొనరించి యూపస్తంభమునకుఁ గట్టించెను. సమాహితుఁడై యాబాలుఁడు దివ్యగాథలచేతఁ బశుభోక్తయగునింద్రుని యూపాధిదేవతయగు నుపేంద్రుని విధిప్రకారము గానమున నలరింపఁగా నింద్రుఁడు తనకుఁ బ్రభువగు నుపేంద్రుని శునశ్శేఫుఁడు రహస్యముగా గానముచేయుటకెంతయు సంతసించి తృప్తుఁడై తనను బొగడినందులకు హర్షించి వానికి దీర్ఘాయు వొసంగెను. అంబరీషునకు యజ్ఞఫలము మిక్కుటముగా నొసంగెను. అక్కడ విశ్వామిత్రుఁడు పుష్కరతీరమున సమాహితుఁడై వేయియేండ్లు ఘోరతప స్సొనరించుచుండెను.

జిజ్ఞాసువులారా! ఈభాగము మిగుల ముఖ్యము. విశ్వామిత్రశబ్ద మిందు సార్థకమగును. సకలదానములలో నభయదాన ముత్తమమని తేటపడును. పరోపకారమే సకలతపఃఫలమనియు తేలెడిని. కాన విమర్శింతము.

“న మేఽస్తి మాతా న పితా జ్ఞాతయో బాంధవాః కుతః. ౪
త్రాతుమర్హసి మాం సౌమ్య ధర్మేణ మునిపుంగవ
త్రాతా త్వం హి మునిశ్రేష్ఠ సర్వేషాం త్వం హి భావనః. ౫
రాజా చ కృతకార్యస్స్యాదహం దీర్ఘాయురవ్యయః
స్వర్గలోకముపాశ్నీయాం తపస్తప్త్వా హ్యనుత్తమం.” ౬

రాజు వెంటఁబోవుచు శునశ్శేఫుఁడు మేనమామయగు విశ్వామిత్రునిగన నరిగి యీమాటలుపలికెను. "అస్మద్గోత్రంవర్ధతామ్" అనుభావమున నుండవలసిన తల్లిదండ్రు లర్థాతురులై తన్నమ్మ కొనఁగా నతఁడు వారిని లేరనియే భావించెను. ఇది న్యాయ్యమే యనవలయు. తనయులవిక్రయించుట, యందును వధింప నమ్ముట మహాపాపము అర్థాతురులకుఁ బుణ్యపాపముల విచారముం డదు. ధనమే వారికిఁ బ్రధానము అట్టివారుండిన లాభమేమి? లేకున్న నష్టమేమి? శునశ్శేఫుని సంకల్పము సత్సంకల్పము. కావుననే యాతని కిట్టిఘోరవిపత్తు తప్పెను. ఆకోరిక యేది యనఁగా రాజు యజ్ఞము చెడిపోకయుండవలయు. నా కాయు స్సుండవలయు. ఈ రెండును గోరఁదగినవియే యనవలయు. కావుననే భగవంతుఁ డాతనిప్రాణములఁ గాపాడెనని మనము విశ్వసింపవలయును.

మానవుఁడు ధర్మార్థకామమోక్షములఁ గోరవచ్చును. అయ్యవి పరుల బాధింపరాదు. ధర్మహాని చేయరాదు. అట్టి వానింగోరినను భగవంతుఁ డాగ్రహింపఁడు. ఇది సాధారణ ధర్మము. ఫలాభిసంధిరహితమగు కర్మాచరణ ముత్తమోత్తమము. శునశ్శేఫుఁడు తనకు మృతిగల్గుననికూడఁ దలంపక సత్కర్మము ఫలించునట్లు కోరెను. అదియగదా సత్సంకల్పము.

విశ్వామిత్రుఁడు కొడుకులం బిలిచి ధర్మముం దెలిపి శర ణాగతపరిత్రాణ ముత్తమము. కాన మీలో నొక్కఁడు పశు వుగాఁ బొమ్మని కోరెను. వా రంగీకరింపరైరి. వసిష్ఠతనయుల శపించినట్లే శపించెను. కౌశికునితపస్సు శాంతప్రధానము కాదు. ఆతపస్సు నశింపవలయును. అవ్వాలగాని బ్రహ్మత్వ మల

వడ నవకాశము లేదు. శునశ్శేఫునకు నుపదేశించిన స్తుతులరెం డింటిని దొలుతనే యుపదేశింపక యుండనేల? అనఁగా శాప రూపమున నాతపస్సు నశింపవలయును. దానఁ గొంతదుఃఖ మనుభవింపవలయును. ఆవల మనస్సు నిర్మలము కాఁగాఁ జేయు తపస్సునఁగాని బ్రహ్మర్షి కానేరఁడు. ఈయూహ కర్మ మెఱింగి కొడుకుల నడుగఁ జేసి వారి నంగీకరింపక పరిహసించునట్టు లొనర్చి వారికిఁ గౌశికుఁడు శాపమిచ్చునట్లు పురికొలిపెను. ఇదంతయుఁ గర్మతంత్రము కాని వేఱుగాదు. మన మీఘట్ట మున నీ విషయమునే చక్కఁగా నేర్చుకొనవలయును. తరు వాతికథను బఠింతము

## విశ్వామిత్రుఁడు మహర్షి యగుట.

* కౌశికుఁ డిట్లు నియతిమై వేయివత్సరములు తపము చేయఁగా దేవతలుసంతసించి పూర్తి ముగియఁగా స్నాతుఁడై యున్న యతని చెంత కరుదెంచిరి. బ్రహ్మస్వప్రభావము వెలుంగ నమ్మునిం బరికించి నీకు భద్రము గలుగుంగాక. ఇంతదనుక నీవు రాజర్షివై యుంటివి. ఈసత్కర్మము నొనరించుటంజేసి యిఁక ఋషివగుదువని యాదేశించి నిజలోకమునకు దేవతలంగూడి పోయెను. కౌశికుఁ డమ్మాటలం దృప్తినొందక మరల మహా తపస్సునకుం బూనెను. చాలకాలము సాగఁగా మేనకయను నచ్చరమిన్న యాపుష్కరతీర్థముల జలకమాడ నరుదెంచెను. ముని తపోమహత్త్వముగలవాఁడు. ఐనను మేనకను జూడఁగనే తత్సౌందర్యవిమోహితాత్ముఁడై "యో దేవనారీమణీ! నీకు స్వాగతంబగుంగాక. ఈయాశ్రమమున నీవు సుఖముగా

---

* ఇత్యాది యఱువదిమూఁడవ సర్గమునందుఁ గలదు.

నుండుము. నిన్నుం గాంచినంతన మనస్సు మన్మథవికారము నకుం జిక్కెను. కావున దయమెయి నన్నేలుకొమ్ము. నీకు భద్రములగుంగాక." అని వేఁడఁగా నాయింతి యందుల కంగీకరించి యందే నివసించెను.

వారిరువురు నాయాశ్రమమునఁ బదియేండ్లు సుఖముగాఁ గాలముం బుచ్చిరి. అవ్వల నతఁడు మేనకాసంగతిఁ దనతపస్సు నశించెనని యెఱింగి సిగ్గుపడి దుఃఖించి యిది దేవతలెల్ల నాలోచించి నాతపస్సు నశింపఁజేయ నీయుపాయము నొనరించిరి. అంతియకాని వేఱొకఁడుకాదు. అయ్యో! పదియేఁడు లొక్క దినమువలె గడచినవి. కామాతురుఁడనై మతిమాలి చెడితిని. అదియే నాతపస్సును బాడొనరించెను. ఏమిచేయవచ్చును. అని యనేకభంగులఁ జింతించి చింతించి పశ్చాత్తాపము నొందెను. ఆవిధ మెఱింగి మేనక యీముని నన్నేమి శపించునో యని భయంపడ తనువెల్లఁ గంపింపఁగాఁ జేతులు జోడించి యెదుట నిలువఁబడఁగా నాముని యోసీ! ఇది నాయపరాధమే కాని నీయదికాదు. అని మంచిమాటల నూఱడించి పంపఁగా నామె స్వర్లోకమునకుం బోయెను. కౌశికుఁ డందుండరాదని యుత్తరదిక్కునకు హిమాలయమునకుం బోయెను.

అందు జితేంద్రియుఁడగుటకుఁ గట్టిప్రయత్నము చేయువాఁడై కౌశికీనదీతటమున వసించి దుర్భరతపోనిరతిం బూని యుండెను. సహస్రవర్షము లత్యంతనిష్ఠనుండఁగా నందున్న దేవతలు భయంపడిరి. వారును ఋషులంగూడి బ్రహ్మకడ కరిగి మహాత్మా! ఈకౌశికుఁడు మహర్షి యని పలువంబడినఁగాని తపస్సు చాలింపఁడు. ఆవర మనుగ్రహింప దయచేయుఁడని ప్రార్థిం

పఁగా నాబ్రహ్మ యందుల కంగీకరించి యామునికడకు వచ్చి మధురోక్తుల, "నోమహర్షీ! నీకు స్వాగతము. నీతప మత్యుగ్రము. నాకు మెప్పును గల్గింపఁజాలెను. ఋషిముఖ్యుండవై యుండఁదగుమహత్త్వము నీకొసంగెద." అని పలుక నామాట విని యించుకంతయు విషాదసంతోషముల నందక పితామహునకు నమస్కరించి దోసిలొగ్గి నిలువంబడి "యోమహానుభావా! నేనొనరించిన యీసత్కర్మమున సాటిలేనిమహర్షి నామము నాకుంగలుగఁబలికితివేని నేను జితేంద్రియుఁడనైతింగదా!" అని యడుగ నాబ్రహ్మ "కౌశికా! నీవు ఋషులలో నుత్తముఁడవు. అట్లులైనను మనోవికారహేతువులుండియు వికారమునొందక యుండఁదగు కాలము వచ్చునంతదనుక నీవు నిర్జితేంద్రియుఁడవుమాత్రము కావు. ఆఫలము సిద్ధింపఁ బ్రయత్నింపు"మని బోధించి నిజలోకమునకుం బోయెను. తక్కినవారెల్లఁ దమ యిక్కల కరుగ నాకౌశికుఁడు పట్టువలమానక యూర్ధ్వబాహుఁడై నిరాధారుఁడై నిలిచి వాయువాహారముగా తపస్సు చేయఁబూనెను. అంతియగాక గ్రీష్మకాలమునఁ బంచాగ్నిమధ్యస్థుఁడై శీతకాలమున నహర్నిశము జలాంతరమగ్నుఁడై తపస్సు చేయుచు వేయియేండ్లు గడపెను. అతిభయంకరమగు నాతపస్సునకు నింద్రాదిదేవతలు భయంపడి యాలోచించి రంభను బిలువంబంచిరి. ఇంద్రుఁ డాత్మహితము విశ్వామిత్రున కహితమును గోరి రంభ కిట్లు తెలిపెను.

మహాత్ములారా! ఈభాగమున నొక్కవిషయము ప్రధానముగాఁ దెలియఁజేయఁదగియున్నది.

"ప్రశాంతాత్మా విగతభీర్బ్రహ్మచారివ్రతే స్థితః
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః. ౧౪
యుంజన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి." ౧౫
(గీ ౬ అధ్యా.)

అన్నగీతావాక్యముల ననుసరించి శాంతముగలిగి జంకుమాని జితేంద్రియుఁడై నియతిమై భగవంతు నారాధించిన ఫలముఁ గాంచునన్నది సారము. ఎవ్వఁ డిట్లు పట్టుదలమానక యీకార్యము ఫలించునా యని భయంపడక దమముగలిగి భగవంతు నుపాసించిననే ఫలము గల్గును. ఇందేది లోపించినను ఫలము శూన్యము. కౌశికుఁ డత్యుగ్రతపముఁజేయుచు మేనకం గాంచి విమోహితుఁడై పదియేండ్లు తత్సంగతి మెలఁగెను. దానఁ దపస్సు నశించెను. కాని భగవదారాధనము నిష్ఫలముకాదు. కొంతకాలమునకుఁ బశ్చాత్తాపమును గల్గించెను. తనయవివేకము నతఁడు తలంచుకొనెను. దానిచే మఱుంగుపడియున్న విజ్ఞానము పొడచూపెను. దాననే మేనకయందు దోషము లేదు. ఇది నాయవివేకమునే కలిగినదన్న శాంత మంకురించెను. మంచిమాటలతో సాగనంపి యాచోటుమాని హిమాలయమున కరిగి వేయియేండ్లు నియతుఁడై తపస్సొనరించి మహర్షి యనునామమునొందెను. కాని జితేంద్రియుఁడనై తిఁగదా యని బ్రహ్మనే యడిగెను.

"యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే
నిస్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా." ౧౮

సంకల్పప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వానశేషతః
మనసైవేంద్రియగ్రామం సన్నియమ్య సమంతతః. ౨౪
శనైశ్శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్. ౨౫
యతోయతో నిశ్చరతి మనశ్చంచలమస్థిరం
తత స్తతో నియమ్యైతదాత్మ స్యేవ వశం నయేత్. ౨౬
ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖము త్తమం
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూతమకల్మషం.” ౨౭

(గీత ౬ అధ్యా.)

అన్న భగవద్వాక్యము ననుసరించి దేహాభిమానము వదలలేదని బ్రహ్మ తెలిసికొనెను. జితేంద్రియుఁడవు కావని బదులిడిపోయెను. దానిని సంపాదింపఁ బ్రయత్నింపుమనియు నుపదేశించెను. కావున మానవుఁ డొంటరిగానున్న యపుడు శాంతుఁడనని జితేంద్రియుఁడనని భావింపరాదు. కోపకారణములు గలిగినపుడు శాంతము నెలకొనవలయును. ఇంద్రియవికారహేతువులగు సుందరీదర్శనాదులు కలిగినపుడు నిర్వికారుఁడు కావలయు. అవి లేనితఱి నెల్లరు శాంతులే. ఎల్లవారు జితేంద్రియులే. అట్టిపరీక్షలఁ బలుసారులు చేసి నిశ్చంచలత యలవడఁగా నపుడు ఫలము నొందును. ఈవిషయమే యీభాగమునుండి గ్రహింపవలయును.

## విశ్వామిత్రుఁడు రంభను శపించుట.

*రంభా! హిమవంతమునఁ దపము చేయు కౌశికుని నెట్లైనఁ గామార్తునిగాఁ జేయుము. ఇది సామాన్యకార్యమని భావింప

*ఈకథ యఱువదినాల్గవ సర్గమునఁ గనంబడును.

కుము. విశేషించి దేవకార్యమని తలంపుము. అన్యథాకరింపక నీ వీకార్యము చేయవలయును. అని దీనత్వమున నింద్రుఁడు పలుక నాతన్వి యది యలవికానిపని యని తలఁచి సిగ్గుపడి దోసిలొగ్గి, "దేవనాథా! విశ్వామిత్రుఁడు సామాన్యుఁడు కాఁడు. మహర్షి ప్రచండక్రోధాన్వితుఁడు. నేనుబోయి మరులుకొలిపితి నేని నన్ను శపించును. కాన ననుంబంప మానుమా" యని ప్రార్థించెను. ఇట్లు భయకంపితాంగియై నిలువంబడి వేఁడుచున్న రంభతో "భయంపడకుము. నీ వీకార్యము సాధింపవలయును. మానరాదు. నీకు మేలు గలుగును. నేను వసంతర్తువునందు మనోజ్ఞభూరుహమున మనస్సుగరఁగించు కోకిలాకృతి మన్మథునింగూడి నీప్రక్క నుండుదును. నీవు కడుంగడు మోహ జనకమగు రూపమున యమ్మునిమనస్సును గలంపు"మని యాజ్ఞాపింపఁ జేయునది లేక యాపె యంగీకరించి మోహనాకారమును మఱింత సింగారించుకొని మునిచెంతకుంబోయి మరులుగలిగింపఁ బ్రయత్నించెను. కోయిలపలుకులు చెవులపండువుగా వినంబడెను. రంభను గాంచి దానిసంగీతము నాలించి కోకిల ధ్వనులు చెవులు పండువుచేయఁగా నిది తనకుఁ దానే వచ్చిన దియా, ఇంద్రుఁడేమైన నాకడకు దీనిం బంపినాఁడా యని సంశయించి యిది నన్నుఁ గామపరవశునిగాఁ జేయఁజూచుట యింద్రునిపంపుననే యుండునని యెఱింగి కోపాక్రాంతస్వాంతుఁడై "యోసీరంభా! కామక్రోధములను జయింపఁగోరి నియతినున్న నన్ను మరులుగొలిపి మోసపుచ్చఁజూచితివి. ఈనీదుష్ప్రయత్నమునకు ఫలముగాఁ బదివేలయేండ్లు శిలారూపమున నుండఁగల" వని శపించి భయభ్రాంతయైనదానితో మరల నొకబ్రాహ్మణోత్త

ముఁడు ని న్నీశాపమునుండి యుద్ధరింపఁగలఁడని శాపవిముక్తి ననుగ్రహించెను. అంత నమ్ముని తనమది నయ్యో! తన ప్రభువు పంచిన ట్లిది యొనరించెను. దీనియందుఁ గలయపరాధ మేది? శపించితినే. అని పశ్చాత్తాపమందెను. రంభయు శిలారూప మును దాల్చెను. ఇంద్రమన్మథులు కాలికి బుద్ధిచెప్పిరి.

కౌశికుఁడు తనతపస్సంతయు నశింపఁగాఁ గోపమునఁ గదా యిట్టులయ్యెనని దుఃఖించి యింద్రియముల జయించినఁ గాని యాపదలు తొలంగవు అని తలపోసి నేనింక నేమాత్ర ము కోపముం బూనను. మౌనమునే ధరింతును. ఊర్పుల వలనఁ గ్రోధాదు లుదయించుంగానఁ గొంతకాల మూర్పులం బుచ్చకయే యుందును. తపశ్శక్తి బ్రాహ్మణ్యమును సంపాదించి నంతదనుక జితేంద్రియుఁడనై శరీరమును శుష్కింపఁజేతు. ఆహా రము మానుదు. తపశ్శక్తి నాయనయనము లాహారాభావ మునఁ జెడకయుండెను. అని దృఢసంకల్పమున నుండెను. అదే రీతిగా వేయివత్సరము లూర్పులుపుచ్చకయు నాహారముం గొనకయు నుండుపట్టుదలంబూని సాధింతును దీనినని ప్రతిన పూనెను. భక్తవరులారా!

> "మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే
> శ్రద్ధయా పరయోపేతాస్తే మే యుక్తతమా మతాః." ౨
>
> (గీ ౧౨-౨.)

అన్న గీతాశాస్త్రప్రకారము భక్తుఁడై యేమానవుఁడు భగ వంతు నారాధించునో కోపాదుల నెడఁబాసి శాంతము నెల కొల్పి సత్కర్మానుష్ఠానమున శ్రద్ధగలవాఁ డగునో యతని నాపరాత్పరుఁడు కరుణించి కృతార్థునిజేయుననుట సత్యము.

కాని యాతనివాంఛ సద్వాంఛగా నుండవలయు. దుర్వాంఛ లైన మొదటికే మోసమువచ్చును. విశ్వామిత్రుఁడు కోరినది బ్రహ్మర్షిత్వము. అది న్యాయ్యమైనవాంఛితమే కాని దానికి జితేంద్రియత్వ మలవడవలయు. దానికిఁ బ్రయత్నింపఁ బూనెను. ఆహారాదుల మాని కోపాదుల వదలి తపస్సు చేయం బూనెను. కావున నెల్లరు నుత్తమపదమునకై ప్రయత్నింప వలసినదే. దానికిం దగుయోగ్యతను ముందు సంపాదించుకొన వలయును. అనర్హుఁడే కార్యమునకైనఁ బనికిరాఁడు.

## విశ్వామిత్రుఁడు బ్రహ్మర్షియగుట.

*కౌశికుఁ డంత హిమవంతమును వదలి తూర్పుదిక్కును జేరి యందొక్క పావనస్థలమున నియతుఁడై వేయియేండ్లు మౌనవ్రతమును బూని యితరులకేరికి నశక్యమగుతపస్సు చేసెను. ఆకాలమున నెన్నియోవిఘ్నము లామునీంద్రుని బాధించెను. కాని దారువుభంగి వానికిం గదలక కోపమునకు నించుకయు మనస్సునఁ జోటీయక నియతి సాగించుచుండెను. నియతకాలము ముగియఁగా నాతఁ డన్నము దినఁబూనెను. ఇంద్రుఁడువిప్రరూపమున నరుదెంచి యాయన్నముం బెట్టుమా యని యర్థించెను. సహస్రవర్షాంతమునఁ బారణకై సిద్ధము చేసిన యన్నము నావిప్రుఁడు యాచించినందులకై యనుమానింపక తపస్సిద్ధింపయాచకున కన్నదానము చేయవలయునన్న న్యాయమును నెఱవేర్పఁ గృతనిశ్చయుఁడై యాయన్నము నిశ్శేషముగా నాతనికిం బెట్టి మరల మౌనవ్రతముం దాల్చి యావిప్రుని పై నించుకంతయుఁ గినియక యుండె. మరల యథాపూర్వ

*ఈభాగము అఱువదేనవ సర్గమునఁ గలదు.

ముగాఁ దపస్సు చేయుచుండెను. అంత నావిశ్వామిత్రునిశిరస్సు నుండి ధూమము వెడలెను. దాన ముల్లోకములు గలఁత నొంది వెనుభీతిఁ గుందెను. అంత దేవగంధర్వాదు లాతీవ్ర తపోగ్నిజ్వాలలకు నిలువఁజాలక సోలుచు బ్రహ్మకడకుం బరు గిడి, "మహానుభావా! దేవా! విశ్వామిత్రుని ఘోరతపంబుఁ జెఱుప రంభను బంపితిమి. సహస్రవర్షాంతమున వండుకొన్న యన్నము దినకుండఁ జేసితిమి. ఎన్నియోభంగుల గోపముగలి గింపఁజూచితిమి. తపముఁ జెఱుపఁ బాటుపడితిమి. మాప్రయత్న పరంపరల నయ్యది తఱుగక పెరుగుచున్నది. అపరాధ లేశము నాతనియెడఁ గానరాదు. ఆతనివాంఛఁ దీర్చినఁగాని యీముల్లోకములు సుఖమునొందవు. లేనిచో నశించును. చరాచరములన్నియుఁ జీకాకుపడుచున్నవి. ఇంతయేల? ఈయు పద్రవము పొసంగుటంజేసి జనులు నిత్యకృత్యములు మాను దురని తోఁచెడిని. రవితేజస్సు మాసినది. ఆముని యగ్నితుల్యుఁ డు. కాన ముల్లోకముల భస్మముగాఁ జేయకమును పే యాతని మీఁ రనుగ్రహింపవలయును. ప్రళయాగ్నివలె లోకములఁ గాల్ప నాతఁడుశక్తుఁడు. దేవరాజ్యమునుగూడ నడుగునేమో. అట్టియూహలు పుట్టకమును పే తద్వాంఛితము నొసంగుఁడు."

బ్రహ్మయు దేవాదులంగూడి వచ్చి మధురవాక్కుల నో బ్రహ్మర్షీ! నీకు స్వాగతము. నీతపమునకు మేమందఱ మానందించితిమి. ఈయుగ్రతపమున నీకు బ్రాహ్మణ్యము లభించెను. మేమందఱము నీకు దీర్ఘాయుస్సు నొసంగుదుము. నీకు సుఖంబొదవుఁగాక. మేలు గలుగుఁగాక. హాయినొందు" మని బ్రహ్మాదులు పలుకఁగా విశ్వామిత్రుఁడు సంతోషించి

యెల్లరకు నమస్కరించి "నాకు బ్రాహ్మణ్యము గలిగెనేని దీర్ఘా యువు నాకు లభించెనేని యోంకారవషట్కారములు వేద ములు దమకుఁ దామేవచ్చి నన్నుఁ బ్రవేశించుఁగాక వాని నేనొకరికి నుపదేశించుటకు నొకని యజింపఁజేయునపుడు విని యోగించుటకు నర్హుఁడనుగావలయును. ఇంతియగాదు. వసిష్ఠ ముని సూర్యవంశ్యులకు ననాదిపురోహితుఁడై యుంట క్షత్రి యార్హములగు నాథర్వణవేదముల నెఱింగినవాఁడు. విప్రులకు వలయువేదముల నేర్చినవాఁడు బ్రహ్మమానసపుత్త్రుఁడు ఇట్టి వసిష్ఠముని నన్ను బ్రహ్మర్షీ! యని పిలువవలయు. నాకు మంచి కోరిక యిదియే. ఈవాంఛితమును దీర్చితిరేని మీరు కృత కృత్యులరగుదురు. ఇది నెఱవేఱదేని కృతార్థులు మీరు కారనుట నిజము." అని స్వాభిప్రాయము దేటపఱిచెను. ఆయభి ప్రాయములఁ దీర్పఁదలంచి యాదేవతలందఱు బ్రహ్మర్షి నా వసిష్ఠుని బ్రార్థించిన నాముని ప్రసన్నుఁడై కౌశికునితో మైత్త్రి బాటించి దేవతలవలె నీతఁడు బ్రహ్మర్షియే యనియెను. అమ ర్త్యులు "విశ్వామిత్త్రా! నీవు బ్రహ్మర్షివగుటమాత్త్రమే కాదు. యాజనాధ్యాపనాదులగు నధికారములన్నియు నీకుఁ గలుగు" ననిపలికి తమతమనెలవుల కరిగిరి. విశ్వామిత్త్రుఁడు బ్రాహ్మణత్వ మలవడఁగా ధర్మవేత్తగాన వసిష్ఠముని నారాధించి కృత్యము నెఱవేర్చి తపోనిష్ఠను బూని పుడమియంతయుఁ దిరిగెను.

శ్రీరామచంద్రా! ఈమహాత్ముఁ డీరీతిగా బ్రాహ్మణత్వ మును బొందెను. మునివర్యుఁడు శరీరముఁదాల్చినతపస్సే యీతఁడగు. ధర్మనిరతుఁడు." అని యిట్లు తేజశ్శాలియగు శతానందుఁడు కౌశికునిమాహాత్మ్యమును బొగడి యూర

కుండెను. జనకమహారా జంతట రామలక్ష్మణులకు శతానందు
డెఱింగించినవాక్కులను విని గాధినందనుం గాంచి యంజలి
ఘటించి "మునీంద్రా! కాకుత్థ్సకులాలంకారులగు నీరామలక్ష్మ
ణులతో నీవు నాయాగమున కరుదెంచుటంజేసి ధన్యుఁడ
నైతిని. నీయనుగ్రహపాత్రుఁడనైతిని. మహర్షివగు నీదర్శన
మునఁ బవిత్రుఁడనైతిని. బహుగుణములు నాకు లభించెను.
నీ వొనర్చినమహాతపస్సును శతానందముని కీర్తింపఁగా నేను
శ్రీరాముఁడును వింటిమి. ఎల్లరు నాలకించిరి. నీతప మనుప
మానము. నీబల మనువదింపఁదరముగానిది. అసంఖ్యగుణుఁ
డవు. అయ్యవి బ్రహ్మకు శంకరునకు నెట్లు గలవో యట్లే నీ
యందు నవి నెలకొనినవి. నీ చరిత్ర మాశ్చర్యజనకము ఎంత
విన్నను దృప్తి యొదవదు. సాయంసమయము కావచ్చినది.
కావున సెలవిమ్ము." అనఁగా విశ్వామిత్రుఁ డానందించి జనకునిం
గీర్తించి వీడ్కొలిపెను. జనకుఁడు సపరివారుఁడై సెలవొంది
పోయెను. మహర్షులు రామలక్ష్మణులు వెంటరా నాగాధేయుఁ
డాత్మనివాసమునకుఁ బోయెను.

మహనీయులారా! ఈభాగము చక్కఁగాఁ బఠింపఁదగి
నది.

"అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ
నిర్మమో నిరహంకారస్సమదుఃఖసుఖః క్షమీ. ౧౩
సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః
మయ్యర్పితమనో బుద్ధి ర్యో మద్భక్తస్స మే ప్రియః. ౧౪
యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః
హర్షామర్ష భయోద్వేగైర్ముక్తో యస్స చ మే ప్రియః." ౧౫
(గీత ౧౨ అధ్యా.)

అన్నగీతావాక్యముల ననుసరించి భూతదయగలిగి నిర్మముఁడు నిరహంకారుఁడు సంతుష్టుఁడునై సర్వకాలము భగవంతుని యందు మనస్సును జేర్చియుండువాఁడు భగవత్కరుణకుం బాత్రుఁడగును. జాతియందుఁ దొలుతఁ బ్రసిద్ధింగాంచి తపోవ్రతానుష్ఠానముల నాఱితేఱి జితేంద్రియుండగునేని బ్రహ్మర్షి యగును. స్వజాతిధర్మముల నాచరించినఁగాని యంతకంటె నుత్కృష్టజాతినొంద యోగ్యుఁడు కానేరఁడు. బ్రహ్మర్షిత్వమునకు యోగ్యత జితేంద్రియత్వమని మన కీచరిత్రము బోధించుచున్నది. కేవల బ్రాహ్మణజాతియందుఁ బుట్టినంత మాత్రమున బ్రహ్మర్షిత్వ మలవడదనియు, నింద్రియముల వశపఱచుకొని పరమశాంతుఁడైననే బ్రహ్మర్షియగుననియు, మన మెఱుంగవలయును. బ్రహ్మర్షిత్వమునకు జాతిమాత్రమే ప్రధానముకాదనియు మనము నేర్చుకొనవలయును ఎవ్వఁడుకాని క్రమక్రమమున నుత్తమపదమొంద నర్హుఁడగుననియు, దానికిం దగుయోగ్యతయున్నం జాలుననియు, మన కీభాగము బోధించుచున్నది కష్టములకోర్చి కోపమును విడనాడి భూతదయగలిగి యోగియగునేని, బ్రహ్మర్షి యనఁబడునని గీతావాక్యాదులు సిద్ధాంతము చేయుచున్నవి. ప్రతివారును ఋషులుకారనియు, దానికిం దగుయోగ్యత సంపాదించుకొనువాఁ డెవ్వఁడైన నగునని యిందుఁగలసారము.

కేశములు పెంచి కౌపీనము దాల్చినంతమాత్రమున నతఁ డుత్తముఁడు కానేరఁడు. ఆజాతియందు నీచుఁడే యగును. అక్రోధనుఁడు కావలయును. నిష్కాముఁడు కావలయును. ధనార్జనమున కెన్నియుపాయములు గలవో వాని

నన్నింటిని సంగ్రహించి తదనుగుణముగా శిష్యులఁ జేర్చుకొని వేషమే భూషణముగా యోగులమని, భక్తులమని, విరాగులమని పలుకుచు వంచకులగు నితరులచేఁ జెప్పించుచుం దిరుగు కపటనాటకసూత్రధారులు యోగులుగారు. భక్తులు, భగవద్దాసులుగారు. ధనయోగులు, భుక్తియోగులు, ధనదాసులు నగుదురు.

"హర్షామర్షభయోద్వేగైర్ముక్తః"

అన్న భగవదుక్తికిఁ బాత్రులు కావలయును.

**"తుల్యనిందాస్తుతి ర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్**
**అనికేతస్థిరమతిర్భక్తిమాన్మే ప్రియో నరః."**

అన్న శ్రీకృష్ణోపదేశము ననుసరించిన ప్రవర్తనముకలవాఁడు గావలదా. వానికే భక్తుఁడనిపేరు. ఎవ్వరేమన్నను దననే యని అనుకొనుచుఁ గ్రోధమే రూపొందినట్లు మిట్టిపడుచు ధనగర్వమున విఱ్ఱవీఁగునామధారులు యోగులుగారు హరిదాసులుగారు. ద్రవ్యదాసులే యగుదురు భగవంతుని యుపదేశానుసారములగు లక్షణములుగలవాఁడు కానిచో వాఁడు జగద్వంచకుఁడు కాక మఱేమగును? అట్టివాఁ డిహపరలోకదూరుఁడగుననుట కేశంక లుండవు. అట్టివారిమాయమాటలకుఁ లోఁబడి ధనము పోఁగొట్టుకొనరాదు. అట్టివారినుండి భగవత్ప్రసాదమన్నరూపమో పిండివంటలరూపమో దొరకుఁగాని నిక్కమగు భగవత్కరుణ దొరకదు. భక్తలక్షణములులేక యున్న నతనికేశములఁ గాంచియా భక్తు లనుకొనవలయును? కావున శ్రీహరి చెప్పినలక్షణములను శ్రమములకు లోనై సంపాదించుకొనవలయును. నిందించినను భూషించినను సమము

భావింపఁగలయోర్పుగలవారము కావలయును. అంతదనుక మనము భగవత్కరుణకుఁ బాత్రులము కాఁజాలమనుట నిక్కము.

విశ్వామిత్రునితపోగ్ని ప్రజ్వరిల్లెను. అనఁగా నతఁడు బ్రహ్మ నుపాసించుచు నాకర్షణప్రయోగము చేసెననియు, నామంత్రశక్తి యఖిలలోకముల భీతిల్లఁజేసెననియు, దాన బ్రహ్మ యరుదెంచి నీవు బ్రహ్మర్షివైతివనెననియు మనము గ్రహింపవలయును. తుదకు నిరహంకారుఁడై బ్రహ్మమునివరుఁడగు వసిష్ఠునినోట బ్రహ్మర్షివైతివని వెడలినఁగాని నేను దృప్తి నొందనని కౌశికుఁడు పలికెను. ఏల? సర్వసమ్మతముగా నది యలరవలయునని యాతనియాశయము. మహాజ్ఞానియగు నా, వసిష్ఠుఁడు సుప్రసన్నుఁడై యెల్లరువిన బ్రహ్మర్షివైతివని పలికెను. అనఁగా స్వప్రవర్తనము విరోధమును దొలఁగింపఁజాలినది కావలయునని గాధినందను నాశయము. బ్రహ్మర్షి యయ్యెను. లోకోపకారతత్పరుఁడయ్యెను. కావున మనముకూడ సర్వభూత దయగలవారమై క్రోధాదుల మాని భగవంతుఁ నుపాసింపఁ వలయును. ఫలము తనయంతన లభించును భగవంతుఁడు సర్వజ్ఞుఁడుకదా. మనవాంఛితములం దీర్చును. మహాశయులారా! విశ్వామిత్రచరిత్రమును జక్కఁగాఁ బఠించి యతనిప్రవర్తనమున నెన్నిసుగుణములుగలవో మన మెఱింగి యతనివంటి భక్తులము కావలయునని యూహించుచు నిశ్చలభక్తితో భగవంతు నారాధింపవలయును. వంచకులము గారాదు. ధనదాసులము కారాదు. ఆత్మద్రోహులము కారాదు. పరద్రోహము తలంపరాదు. సర్వదా నిర్మలభక్తి నాసర్వేశ్వరుని

జక్కఁగా నారాధించి కృతకృత్యులము కావలయును. ఇఁకఁ దరువాతికథను బఠింతము.

శంకరధనుర్వృత్తాంతము.

* అంతఁ దెల్లవాఱఁగా జనకుఁడు కృతకృత్యుఁడై మహాత్ముని గాధేయుని శ్రీరామలక్ష్మణులం బిలువంబంచెను. వారరుదెంచిరి. వారినెల్ల సవిధిగా గారవించి జనకుఁడు కౌశికుం గాంచి మునిచంద్రా! మీకు స్వాగతము. నాచేయఁదగుపని నాజ్ఞాపింపుఁడు. మేము భవదాజ్ఞాప్రవర్తకులముకదా యని ప్రార్థింపఁగా ధార్మికోత్తముఁడగు నాకౌశికుఁడు సమయజ్ఞుఁడు వాగ్విశారదుఁడు కాన యాభూపాలకునితో నిట్లు పలికెను. రాజేంద్రా! దశరథకుమారులగు నీయిరువురు క్షత్రియవంశ్యులు జగత్ప్రసిద్ధులు. మీయింటనున్న శివధనుస్సును వీక్షింప నాకాంక్షింతురు. దానిం గానిపింపుము. నీకు శుభం బగుఁగాక. దానిం దిలకించి సఫలమనోరథులై యిష్టానుసారము పోవుదురు.

అని తెలుపఁగా జనకుఁడానందించి మహాత్మా! కౌశికా! ఈధనుస్సు మాయింట నేటికున్నదో వివరింతును. అవధరింపుఁడు. నిమియనుమహాత్ముఁడు మాకులమునకుఁ గూటపురుషుఁడు. (ఆదిపురుషుఁడు) దేవరాతుఁ డనువాఁ డాతనివంశమునం దాఱవవాఁడు. మహాదేవుం డీధనుస్సు నాదేవరాతుని కడ న్యాసముగా (కాపాడుచుండుటకు) నుంచెను. శివధనుస్సిదియెట్లో ముందుఁ దెలిపెదను పూర్వము శంకరుఁడు పరాక్రమాధికుఁడై దక్షయాగధ్వంసముచేయునపు డీధనుస్సు నెక్కు-

*ఇది యఱువదాఱవ సర్గమునుండి సంగ్రహింపఁబడినది.

పెట్టి దేవతలను గాంచి యమర్త్యులారా! ఈయజ్ఞమున హవి ర్భాగము నేను గోర మీరు దానిం జేర్పమానితిరి. కాన దీన మీతలల నిలఁగూల్తు. చూడుఁడనఁగా వారు భీతిల్లి యామహా దేవుని బ్రార్థించి దయగలుగఁజేసికొనిరి. వారి నాశివుఁడు కరు ణించి వదలెను. మహాప్రీతుఁడగు నాపరమశివుఁడు దేవతలకెల్ల దీని నొసంగెను. శివశరాసనమునుబడసి దేవత లిద్దానిని మాకుఁ బూర్వుఁడగు దేవరాతునకు నిక్షేపముగా నొసంగిరి.

నే నొకప్పుడు యజ్ఞము చేయఁగోరి భూమి శోధింపవలయు నని దున్నుచుండఁగా నాగటిచాలున నొకకన్నియ కనఁబడినది. నా కాకన్నియ లభించెను. నాగటిచాలునకు సీత యనుపేరు కలదుగాన నాకన్నియకు సీత యనుపేరుపెట్టితిని. భూజాతయగు నాకన్యకారత్నము దినదినాభివృద్ధినొందెను. నేను బెంచితిని గాన నాకూఁతురయ్యెను. అయోనిజకావున సామాన్యున కీఁదగదు. ఈకన్య వీర్యశుల్కయని భావించి శంకరుచాపము నెక్కుడఁజాలువీర్యవంతునకే యొసంగఁదగునని నమ్మి యింత దనుక నెవ్వనికి నీయక యుంచితిని. భూజాతయగుకన్యకను దమ కిమ్మని రాజకుమారు లనేకులువచ్చి నన్నడిగిరి. వీర్యశుల్క యనిచెప్పి యెవ్వరికే నీనైతిని.

రాజు లఖిలదిక్కులనుండి శివధనుస్సార మెఱుంగఁగోరి వచ్చి దానిం జూడఁగోర దానిం దెప్పించితిని. వారు చూచిరి. వారు దానిని జక్కఁగాఁ బట్టుకొనుటకుఁగాని పైకినెత్తిచూచు టకుఁగాని సమర్థులుకారైరి. ధనురారోపణవిషయమున వారల్ప వీర్యులే యని నే నెఱింగితిని. ఆకారణమున నేను వారికిఁ గన్యక నీయనైతిని. వీర్యశుల్కయగు నాకన్నియను బరాక్రమ

మునఁ బడయరాదని యెఱింగి నిర్భరకోపమున బలాత్కారమున గ్రహింపఁబూని మిథిలానగరమును ముట్టడించిరి. నా పురము నిరోధింప మఱియొక కారణము కలదు. సీత వీర్యశుల్కయని నేనేర్పఱచుటంజేసి తమ్ము నవమానించితినని వారూహించిరి. పట్టరానికోపమున మిథిలానగరమును జుట్టుముట్టి బాధించిరి. ఒక్కసంవత్సర మానిరోధము సాగెను. దుర్గరక్షణసాధనములు నశించెను. నాకు దుఃఖము మితిమీఱెను. తపస్సుచేసి దేవతల సంతుష్టులనుగాఁజేయ వారానందించి చతురంగబలముల నొసఁగిరి. రాజు లాసేనలవలన దీనత్వముఁగాంచి నలుఁగడలకుఁ బాఱిరి. మునీంద్రా! ఈధనుర్వరచరిత్రమును వింటిరి కదా! ప్రకాశవంతమగు నీధనుస్సు నీరామలక్ష్మణులకుఁ జూపెదను. ఈశ్రీరామమూర్తి దీని నెక్కుపెట్టునే నయోనిజయగు సీత నొసంగెదను. అని పలికి యూరకుండెను.

మహాశయులారా! మన మీఘట్టమునుండి కొన్నివిషయములు గ్రహింపవలయును. మధ్వవైష్ణవులదుర్వాదము లిద్దానఁ దొలఁగును. భగవచ్ఛక్తి తేటపడును. శివధనుస్సును జూడఁ గోరుచున్నారీరాజకుమారులని విశ్వామిత్రుఁడు పలుకఁగా రాజు దానిం దెప్పించి చూపక దానివృత్తాంతమును జెప్పనేల? జనకుఁడు మహాజ్ఞాని, త్రికాలజ్ఞుఁడు. ఈవిషయము సకల పురాణములు మహాభారతము తేటపఱచును. అట్టిజ్ఞానధనుఁడగు జనకరాజు సామాన్యరాజకుమారు లెత్తలేకపోయినట్లే రామమూర్తికూడ నెత్తలేకపోవునేమో యని యనుమానించి ధనుశ్చరిత్రమును దెలిపెనని పలుకువారి వాదము నిస్సారము. విశ్వామిత్రుఁడు తెలిపిన యహల్యాశాప

మోక్షాదికథలు శ్రీరామమూర్తిమహత్త్వమును దేటపఱచు చున్నవి. శ్రీరామమూర్తి మాయామానుషదేహుఁడు శంకరు చాపవృత్తాంతమును స్మరించినఁ జాలును. తనమహిమము నెఱుఁగఁగలఁడు. అని యూహించి జనకుఁడిది శివచాపమనియు, దేవరాతునకు దేవత లిచ్చిరనియుఁ దెలిపెను. దక్షునియాగ మునఁ దనకు హవిర్భాగము లిప్పింపని దేవతలం బొలియింతునని శంకరుఁడు పలుకఁగా భీతిల్లి దేవతలందఱు ప్రార్థింపఁ బ్రీతుఁడై యాధనుస్సు దేవతల కొసంగెను. ఏల? వారలం బొలియింపఁ బూనినది కానఁ గ్రూరమనియు, నది తన చెంత నుండ నేలయనియు శివు నాశయము. వార లాధనుస్సు నాలోచించియే దేవ రాతున కొసంగిరి. దీనింబట్టి యూహింపఁగా శంకరుఁడు దేవ తల కొసంగుటయుఁ, దమ్ముం జంపుసాధనమును వారు పాడు చేయక దేవరాతునకిచ్చుటయు రాఁగల రామావతారమునదాని యుపయోగము నెఱింగియే యని తేటపడును. శివధనుర్భంగ మునఁ గాని పరశురాముఁ డాగ్రహింపఁడు. ఆగ్రహించినఁ గాని యుద్ధమున రాఁడు. పరశురాముఁడు తనకడనున్న వైష్ణవ చాపము నిచ్చినఁగాని యాతనియందుఁ గలభగవత్కళ శ్రీ రామునియందు వ్యాపింపఁ వలనుపడదు. ఈవిధమెఱింగియే శంకరాదులు దేవరాతున కిచ్చిరని మన మూహింపవలయును.

కొందఱు పండితబ్రువులు తుచ్ఛమగుమతాభిమాన మున శంకరుచాపమును శ్రీరాముఁ డవలీలం ద్రుంచెననియు, దాన శివునకన్న విష్ణు వధికుఁడనియుఁ బలుకుదురు. తచ్ఛిష్యులు దానినమ్మి శంకరు దూఱుదురు.

"తతో హృష్టమనా విష్ణుస్తుష్టావ హరమీశ్వరం
నమస్తే శితికంఠాయ నీలగ్రీవాయ వేధసే

... ... ... ...

హరాయ హరిరూపాయ నమస్తే తిగ్మతేజసే.

... ... ... ...

కాను వాక్ స్తుతిరూపా తే కోను స్తోతుం ప్రశక్నుయాత్
కస్య వా స్ఫురతే జిహ్వా స్తుతౌ స్తుతిమతాంవర
సర్వాత్మన్ సర్వభూతేశ త్రాహి మాం సతతం హర. ౩౭
రక్ష దేవ జగన్నాథ లోకాన్ సర్వాత్మనా హర
త్రాహి భక్తాన్ సదా దేవ భక్తప్రియ సదా హర." ౩౮

(హరివంశము. భవిష్యపర్వము ౮౭ అధ్యా.)

"అవిద్యామోహితాత్మానః పురుషా భిన్నదర్శినః
వదంతి భేదం పశ్యంతి చావయోరంతరం హర." ౪౮

(విష్ణుపురాణము ౫ అం ౩౩ అధ్యా.)

"త్వమేకస్సర్వజగతామీశ్వరో బంధమోక్షయోః
తం త్వామర్చంతి కుశలాః ప్రపన్నార్తిహరం గురుం. ౨౨
త్వం బ్రహ్మ పరమం గుహ్యం సదసద్భావభావనం
నానాశక్తిభిరాభాతస్త్వమాత్మా జగదీశ్వరః."

(శ్రీభాగవతము ౮ స్కం ౭౦ అధ్యా.)

శ్రీభాగవతము విష్ణుపురాణము హరివంశము శ్రీవైష్ణవులకు వైష్ణవులకుఁ బ్రమాణగ్రంథములు. అందు శ్రీవిష్ణువు శంకరుని స్తుతించి నీవేభగవంతుఁడని నన్నుఁగాపాడుమని పలికినట్లున్నది. అవి ప్రమాణములు కావందు రేని వేఱుగతియే వారికి లేదు. ప్రమాణమందు రేని విష్ణుకృతస్తుతియే శంకరుఁ డుత్కృష్టుఁ డని తేటపడును. ఇపుడు వారిదూషణము తెలివిలేక చేయఁ బడినదని స్పష్టము. ఇందు సారమేమనఁగా వినుఁడు.

లోకానుగ్రహార్థము విష్ణువు శివుని, శివుఁడు విష్ణువును స్తుతింతురు. అంతియకాని వారిరువురకు భేదమే లేదు. శివభక్తులు శివుని విష్ణుభక్తులు విష్ణువును భగవంతుఁడని నమ్మి యారాధింపవలయును. ఫల మిరువురకు సమానమే. అని లోకులకుఁ దెలుపుటకే వారి ప్రయత్నము. అనఁగా నిరువురను సమానముగా భావింపఁజాలనివా రొక్కనినే నమ్మి తరింతురు గాక యనియే పురాణములభావము. ఏభక్తుఁ డేదేవతను నమ్మునో యాదేవతయే భగవంతుఁడని నమ్మవలయుననియుఁ, బరాత్పరుఁడు సర్వదేవతాత్మకుఁడు కావున నారూపమున వారికిం బొడసూపి తరింపఁజేయుననియు దీనిసారము. కావునఁ దత్త్వ మెఱుంగని మధ్యవైష్ణవులు శివుని, మధ్యశైవులు విష్ణువును, మధ్యశాక్తులు శివకేశవులను దూషింతురు. అంతియకానితత్త్వ మెఱింగినవా రిందెవ్వరిని దూషింప వలనుపడదు. ఎవ్వరిని దూషించిన నయ్యది పరమాత్మను దూషించినట్లే యగును. ఆక్రూరకర్మమునకుం బూనరాదు. అది పాపహేతువగును. తుచ్ఛబుద్ధులమై జ్ఞానములేక భగవంతునిదూఱుట పాడికాదు.

జనకుఁడు శ్రీరామావతారతత్త్వము నెఱింగియే శివధనుస్సు నెక్కుపెట్టినవానికి సీతనిత్తునని చాటించెను. ఇతరుల కది సాధింప శక్యము కాదని యూరా జెఱుంగును. లోకాచారమును బాటించి మహర్షులు రాముఁడు భగవంతుఁడని తెలుపరాదని యూహించినట్లె జనకుఁడు శివధనుశ్చరిత్రమును దెలిపి దానిం జూపింతునని తెలిపెను.

"రామలక్ష్మణయోశ్చాపి దర్శయిష్యామి సువ్రత
యద్యస్య ధనుషో రామః కుర్యాదారోపణం మునే
సుతామయోనిజాం సీతాం దద్యాం దాశరథేరహం."

అనుభాగమున జనకునాశయము గర్భితముగా నున్నది. రామ లక్ష్మణులకు శంకరధనుస్సును గనఁబఱతును. రాముఁ డెక్కు-పెట్టునే నయోనిజయగుసీత నొసంగెదననియె. ఇందు లక్ష్మణుని పే రేల తలంపలేదు. ఇరువురకు ధనుస్సును జూపింతునని పలికిన రాజు దీని నెక్కు-పెట్టినవానికి సీత నిత్తు ననక రామునిపే రేల పలుకవలెను? అనఁగా మనస్సున రాముఁడే సీతాదేవికి భర్త యగునని యెఱుంగునని మనము భావింపవలయును. ఎల్లరు శ్రీరామావతారము నభిలషించినవారలే. భగవంతుఁ డవత రించునని యెల్ల రెఱుంగుదురు. లోకాచారము ననుసరించి యూరకున్న వారు. ఈఘట్టమునుండి శివకేశవుల కభేదసిద్ధాం తము మనము గ్రహింపవలయు. జనకాదులు శ్రీరామునిదివ్య మహిమమును విశ్వామిత్రుఁ డెఱింగినట్లే యెఱుంగుదురనియుఁ దెలియందగును. ఇఁకఁ దరువాతికథను బఠించి తరింతము.

## శివధనుర్భంగము.

*జనకుఁ డారీతిఁబలుకఁగా నాలకించి కౌశికుఁడు రాజేంద్రా! రామచంద్రునకు ధనుస్సును దెప్పించి చూపుమని తెలుప నారాజు మంత్రులను బిలిచి గంధకుసుమమాలికాద్యలంకృత మగు నాదివ్యధనుస్సును దెప్పింపుఁడని యాజ్ఞచేయఁగా వా రప్పుడేపోయి నగరమునుండి దాని నుత్సవముతో దేఁ బయన మైరి. అయిదువేలపురుషులు దృఢకాయులు లాగఁబూనిరి. ఆ ధను స్సొకమంజూషయం దుండెను. ఎనిమిదిచక్రము లద్దాని కమర్పఁబడియెను. ఆపెట్టెను గడుంగష్టమున లాగుచుండిరి. మంత్రులాశివధనుఃపేటికను దెచ్చి దేవతాతుల్యుఁడగు జన

*ఇయ్యది యఱువదియేడవ సర్గమునఁ గలదు.

కుం గాంచి రాజేంద్రా! ఎల్లరాజులు కొనియాడినమహాసార ముగల శివచాప మిదిగో కొనితెచ్చితి మని విన్నవించిరి. రాజు దోసిలొగ్గి కౌశికుని రాజకుమారులను గాంచి బ్రహ్మర్షీ! మేము పూజించు ధను స్సిదియే. రాజులమాట యేటికి? దేవగంధర్వా దులు దీని వంపఁజాలరు. మోపెట్టనేని బాణము. సంధింపనేని బరు వెంతయని కనుఁగొనఁ గదల్పనేని యెవ్వరును శక్తులు గారు. అట్టి యీశరాసనవర్యముం దెప్పించితిని. రాజపుత్త్రుల కిరువురకుఁ జూపుమనియె.

ధర్మవేత్తయగు కౌశికముని రామచంద్రునింగని వత్సా! రామభద్రా! ఈధనుస్సును బరికింపుమని హెచ్చరించెను. బ్రహ్మర్షి యానతింగొని శ్రీరామచంద్రుఁడావిల్లున్న మంద సను సమీపించి తెఱచి యందుఁగల శివచాపవర్యముం గనుం గొని విప్రోత్తమా! ఈభూరిచాపమును గ్రహించెద. ఎత్తి కద లించెద. తమయాజ్ఞయైన నెక్కుపెట్టఁ బ్రయత్నించెదను. అనుగ్రహింపుఁ డనఁగా జనకరాజు మునిరాజు నట్లేచేయు మనిరి. మహర్షి యాజ్ఞ మెయి శ్రీరామమూర్తి యాశివధను ర్మధ్యభాగము నవలీలంబట్టుకొని యెందఱో రాజులు చూచు చుండఁగా దాని నెక్కుపెట్టెను. ధర్మాత్ముఁడా రాముఁడా ధనుస్సు నెక్కిడి యాకర్ణాంతముగా నల్లెత్రాటిని లాగఁగా నా విల్లు శ్రీరాముని యశస్సు సకలదిక్కులవ్యాపింప మహాధ్వనితో రెండుఖండము లయ్యెను. ఆచప్పుడు పిడుగుపాటువలె మహా భయంకరమయ్యెను. మహాపర్వతము బ్రద్దలైనయట్లు భూమి కంపించెను. కౌశికజనకులు రామలక్ష్మణులునుదప్పఁ దక్కుంగల యందలివారెల్ల నాపెనుచప్పుడు విని మూర్ఛిల్లిరి. కొంతవడికి

రాజులు మూర్ఛఁదేఱఁగా జనకుఁడు భయము మాని చేతులు జోడించి వాక్యకౌశలము మెఱయ విశ్వామిత్రునిగాంచి మహానుభావా! దాశరథి యనంబరఁగు నీరామచంద్రుని వీర్యము గనుంగొంటిని. బాలుఁడేమి? ఈదివ్యచాపము నెక్కుపెట్టుటేమి! ఇకార్య మత్యాశ్చర్యకరము. ఇట్టివి మున్నెన్నఁడుసాగలేదు. ఈకార్య మిట్టిదని తలంపనుగూడ శక్యముకాదు. ఇది మనుష్యుల కెవ్వారికి నసాధ్యము ఇది యిట్లగునని నేనూహించిన వాఁడనుగాను. నాకొమరితయగుసీత దాశరథియగు శ్రీరామచంద్రుని భర్తగాఁబొంది జనకులవంశమునకుఁ గీర్తిఁదేఁగలదు. వీర్యశుల్కరూపమగు నాప్రతినయు సత్యమైనది. ప్రాణాధికరాలగు నీ నాతనయను సీతను శ్రీరామభద్రున కీయందగును. నీయానతియైన నామంత్రులు స్యందనము లెక్కి సత్వరముగా నయోధ్యకుంబోయి మర్యాదగా మాటలాడి యారాజేంద్రుని మిథిలకుఁ దోడుకొని రావలయును. వారయోధ్య కరిగి విశ్వామిత్రరక్షితులై రామలక్ష్మణులు క్షేమముగా నున్నారనియు, వీర్యశుల్కయగుసీత నిచ్చుటయు లోనుగాఁగలవృత్తాంతముల నెల్ల దశరథభూజానికిం దెల్పి ప్రీతిం గల్పించి వడిగాఁ బిల్చుకొనిరావలయు. అనఁగా విశ్వామిత్రుఁ డట్ల యగుంగాక యనఁగా మంత్రులం బిలిపించి శుభలేఖము నిచ్చి కుశలవార్తాపత్రికయు నొసంగి రాజలలాముని సకలవార్తలం దెలిపి తోడుకొనిరండని పంపించెను.

భక్తులారా! ఈభాగమున ననేకరహస్యములు గలవు. అందుఁ గొన్నింటిని బరికింతము. పంచసహస్రపూరుషులు శ్రమంపడి శివచాపముగలపేటికను లాగి తెచ్చిరి. అట్టిచాపము

నవలీలగా రామచంద్రుఁ డెక్కుపెట్టెననఁగా నచ్చెరువుగాఁ దోఁపకమానదు. శ్రీరాముఁడు మానవమాత్రుఁ డగునేని శక్యమే కాదు. భగవంతుఁడగుట నిదియొకయత్యల్పకార్య మనఁదగును. సకలబ్రహ్మాండముల ధరించిన మహాప్రకృతి కీచాపము తృణప్రాయముగాక మఱేమగును?

"ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరం
మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి."

అన్న భగవదుక్తి వ్యర్థమగునా? సకల ప్రపంచములు తనయందుఁగల భగవంతున కొకశరాసనము నెత్తుట మహాకార్యము కానేరదు. మన మాబుద్ధితో నాలోచించితిమే నిందు విచిత్రముగాఁ దోఁచుభాగమే లేదు. మనస్సంకల్పమాత్రముననే యది రెండుఖండములు కావలసినదే. జనకునకు దానియందుఁగలభక్తి పోనకుండుటకై దానిని స్పృశించి యెత్తి యెక్కుపెట్టఁబూనెనని యెఱుంగందగును. అంతియకాని శ్రీరామచంద్రునిదృష్టి కయ్యది తృణముగనే కనంబడును.

"ఇదం ధనుర్వరం బ్రహ్మన్ సంస్పృశామీహ పాణినా
యత్నవాంశ్చ భవిష్యామి తోలనే పూరణేఽపి వా."

అన్న శ్రీరామచంద్రునివాక్యములయం దీయర్థము గర్భితమైయున్నది. నిమేషమాత్రమున నవలీలఁ దీనిం ద్రుంతుననక సుశీలవాక్కులఁ బ్రయత్నింతుననుట రాముని సౌజన్యము దేటపడుచున్నది. ఎందుల కిట్టు లనె నందురేని యది యెవరిది? తనదేకదా. శంకరుఁ డెవఁడు? తా నెవ్వఁడు?

"అవిద్యామోహితాత్మనః పురుషా భిన్నదర్శనాః
వదంతి భేదం పశ్యంతి చావయోరంతరం హర."

అను విష్ణువాక్యము విష్ణుపురాణమునఁ గలదుకదా. తనచాపమును దానే తిరస్కరించునా? కావున శ్రీరాముని వినయాది సద్గుణవ్రాతము లోకమున కుదాహరణము కాఁదగినది. అంత భారముగా నాచాప ముండుటకు హేతు వేమనఁగా శ్రీరామభద్రుని యమానుషశక్తిని వెల్లడించుటకేకాక మఱెందులకు? ఇదంతయుఁ గల్పితము. నిజ మిందు లేదందురేని వినుఁడు.

మృగక్రీడలయం దొకసామాన్యమానవుఁడు పడుకొని బొమ్మమీఁద మదగజము నెక్కించుకొనును. మనము చూచి యానందింతుము. ఇది యసత్యము కాదుకదా. మానవులలో నింత ఘనకార్యము చేయువారుగలరని చూచినవారు నమ్ముదురు. చిన్నిపల్లియలలో నుండువారు నమ్మరు. మనుష్యులలో నింతటివా రున్నవారని మనమే యచ్చెరుపడుదుము. ఈశక్తికి భగవచ్ఛక్తికి నెంతభేదము కలదో యోజింపుఁడు. ఆంజనేయులు కొండను దెచ్చెనన్న నవ్వువా రెందఱో కలరు. కాని యామహనీయుని తపశ్శక్తి యెంతయని యెఱుంగువారుమాత్రము లేరు. ఏల? మన మట్టితపస్సుచేయఁ బూనినవారముకాము. కనుక నాక్షేపింతుము. అట్లులే మానవులలో నందును స్త్రీలలో నీకాలమున నిరువదేడు మైళ్లదూరము నీఁదిబహుమానము గొన్నవార లిపుడు గలరు. మనము వారిని జూడనికారణమున నమ్మము. చూచినవారు పొగడుచునే యున్నవారు. ఇట్టులుండఁగా భగవంతుఁ డైదువేలపురుషులు లాగునంతబరువుగల ధనుస్సు నవలీల మోపెట్టెనన్న నమ్మకుండుటకుం గలకారణమేమి? మనకు భగవచ్ఛక్తిఁ దెలిసికొను యోగ్యత లేకుండుటంబట్టియే కాక వేఱేమి గలదు?

శివధనుర్భంగకాలమే జగన్మంగళకాలము. ఏసమయమున భగవంతుఁడు ధనుస్సు ఖండించెనో యపుడే ప్రకృతింగూడెను. సీతారూపమున మహాలక్ష్మి యవతరించి యున్నది. భర్తృదర్శనమును గోరుచున్నది. లోకమంగళకార్యముల నొనరింపఁ ద్వరపడుచున్నది. తన్నుంగూడినంగాని శ్రీరాముఁడు దుష్టసంహారము శిష్టపరిపాలనముఁ జేయ నుంకింపఁడని తత్సమాగమము నెదురు చూచుచున్నది. సీతంగూడికాని మహాకార్యములు భగవంతుఁడు చేయఁడు. అట్లు చేసినయెడల నిర్లిప్తత్వ మెగిరిపోవును. ప్రకృతింగూడి యామెమూలమున నన్నికార్యములు చేయించుచుఁ దా సాక్షిమాత్రుఁడై యానందించుచుండును. ఈవిషయము శ్రీరామానుజాచార్యులుగారు సిద్ధాంతము చేసిరి. కనుక వారు పరమశాక్తులయిరి. ఇపుడు కొందఱు మధ్య వైష్ణవులు శాక్తమును దూషింతురు. ఏల? వారు ధనదాసులు. మతస్వరూప మెఱుంగని యల్పమతులు. శ్రీప్రాధాన్యము శ్రీరామానుజాచార్యులమతము. దానిని దూషించినచో వారిని దూషించినట్లే యగును. ప్రకృత మనుసరింతము.

శివధనుస్సు రెండుఖండము లయ్యెను. దానితో దుష్టదానవులగుండెలు పగిలెను. సీత వాంఛ పండెను. దేవతలానందించిరి. శ్రీరాముఁ డేమో యూరకున్నవాఁడు. ప్రకృతియే యన్నిపనులు చేయుననియే యామహాత్ముని యాశయము. ఈతత్త్వము జనకమహారా జెఱుంగును. కావుననే

> "భగవన్ దృష్టవీర్యో మే రామో దశరథాత్మజః
> అత్యద్భుతమచింత్యం చ న తర్కితమిదం మయా."

అని మహర్షిని హెచ్చరించెను. ఇరువురును దొంగదొంగలే యగుదురు. తెలియనట్లు నటించిరి. కాని యొకరికొకరు భగవచ్ఛక్తిని దేటఁబఱచుకొనిరి. కావున మహాశయులారా! మనమీభాగమున భగవంతుని యద్భుతానంతశక్తిని గనుఁగొనవలయును. ఆపరాత్పరుని పాదారవిందముల సేవింపవలయు. ధనుస్సు రెండుఖండములైనట్లు సంసారతాపములు ఖండములగు. శాశ్వతానందము జనకునకుం గలిగినట్లే మనకు లభించును. ఇఁక శ్రీరాముఁడు గృహస్థాశ్రమమునఁ బ్రవేశించును. లోకుల కుదాహరణముగాఁ బ్రవర్తించును. మనమాయిరువురప్రవృత్తిని దలంచుకొనవలయును. అదియేతపస్సు. అదియే యోగము. తలంచునపుడు సీతారాములు ప్రకృతిపురుషులని సకలబ్రహ్మాండములు తత్తేజోపబృంహితములని ధ్యానింపవలయును. అదియే యారాధనక్రమము దాన వారికరుణకుం బాత్రులమగుదుము. కథ నింకఁ బరికింతము.

## అయోధ్యకు దశరథునిబిలువ దూతలఁబంపుట.

*జనకమహారాజు పంపినదూతలు పయనమై ఘోటకములలసిపోవునట్లు నడిపించుచుఁ ద్రోవలో మూఁడు రాత్రులు గడపి యంత నయోధ్యాపురముఁ జొచ్చిరి. రాజగృహము చొచ్చి ద్వారపాలకులం గాంచి జనకరాజు పంపినదూతలము. ఇది రాజునకుం దెలుపుఁడనఁగా వారును రాజున కవ్వార్తఁ దెలిపిరి. జనకరాజు పంపినదూతలని తెలియుటంజేసి వారిని దోడితెమ్మని దశరథుఁ డాజ్ఞాపించెను. దూతలు ద్వారపాలకులఁ గలిసి వృద్ధరాజును దర్శించిరి. ఆరాజేంద్రుని సౌజన్యాదులం

*ఇది యఱువదెనిమిదవ సర్గమునందుఁ గనంబడును.

గని నిర్భయులై దోసిలొగ్గి వినయవినమితకంధరులై మధురో క్తులతో మహారాజా! మిథిలాధిపతియగు జనకమహారాజు మీకుశలం బడిగె. మీ రారాధించునగ్నిహోత్రములయు నుపాధ్యాయులయుఁ బురోహితులయుఁ గుశలములు నట్లే యడిగెను. ఇట్లు తమకుశల మడిగి విశ్వామిత్రు ననుమతిని దమతో నిట్లు పలుక మాకాజ్ఞాపించెను. వీర్యశుల్కముంగొని నాకొమరిత నిత్తునని పూర్వము నేఁ బ్రతినచేసియుంటిని ఆ విషయము మీకెల్లరకు స్పష్టమేకదా. దానికి రోషించి వచ్చి యనేకరాజు లాధనుస్సు నెక్కుపెట్టి సీతను బడయఁగోరి యట్టిశక్తిలేక విముఖులై పోయిరనియు మీ రెఱుంగుదురు. ఇట్లు సకలరాజు లాకాంక్షించు నీసీత మీతో సంబంధమున కర్హుఁడనైన నేను బడసినదుహిత. పూజ్యుఁడగు నీకుమారుఁడు విశ్వామిత్రపురస్సరుఁడై నాయదృష్టవశమున మిథిల కరుదెంచి యీనాపుత్రిని వీర్యాతిశయమునఁ దనవశము గావించుకొనఁ జాలెను. ఆవిధ మెట్లనఁగా. శ్రీరాముమూర్తి తనమహత్త్వమున నిండుసభలో శంకరదివ్యచాపమును రెండుఖండములు గావించెను. నాదుహిత వీర్యశుల్కయాట నాశుల్కమిచ్చిన యీరామునకే ఈసీత నీయందగు నాప్రతిజ్ఞఁ దీర్పఁగోరెద. ఆకార్యమునకు నీ వనుమతింపవలయు. రాజేంద్రా! నీవుపా ధ్యాయపురోహితపురస్సరముగా వేవేగ రాఁదగు. నీకు భద్ర ములు గలుగు. నీప్రియపుత్త్రుల నీవు చూడఁదగుంగదా. భూప చూడామణీ! నిన్ను దర్శించి సీతనొసంగియు నానందింపఁగోరె దను. ఆయానందమును సమకూర్ప నీకుం దగును. సీతన యులం గాంచి వారికల్యాణమును జూచి నే నానందించునట్లు

నీవుకూడ నానందింతువు. ఇట్లు మారాజేంద్రుఁడు విశ్వామిత్ర శతానందుల సమ్మతింబడసి యీశుభవార్తం బుత్తెంచెనని విన్నవించి యూరకుండిరి.

దశరథుఁ డాదూతలపలుకు లాలకించి పరమానందభరితుఁడై వసిష్ఠవామదేవులను దక్కుంగలమంత్రులను దిలకించి కౌసల్యకు సంతోషమును గల్గించు రామచంద్రుఁడు విశ్వామిత్రరక్షితుఁడై సుఖముగా సోదరునితో విదేహనగరమున నున్నవాఁడు. పరాక్రమశాలి జనకుఁడు మనరామచంద్రుని శౌర్యముం గనుంగొనియె కావుననే తనకొమరితను రామున కీయఁగోరుచున్నాఁడు. జనకుఁడు మహాత్ముఁడు. కావున నతఁడు పంపినశుభవార్త మీకు సమ్మతమేని మిథిలానగరమునకు వేగ పయనముచేయుదము. ఆలసింపరాదు. అని తెలుపఁగా నందులకు మహర్షులు మంత్రులు బాగుబాగనిరి. రా జాపలుకుల కానందించి రేపు ప్రయాణమని మంత్రుల కెఱిఁగించెను. వచ్చినవారు మిక్కిలి సత్కరింపఁబడి సంతోషమున నారాత్రి యంతయు నందే గడపిరి.

## దశరథుఁడు మిథిలానగరముఁ జేరుట.

* మఱునాఁ డుదయమున దశరథుఁడు ఋత్విగ్బాంధవులంగూడి మహాహర్షమున సుమంత్రునితో నిపుడే కోశాధ్యక్షులమూల్యధనముం గైకొని నవరత్నముల గ్రహించి వివాహయత్నముల సంసిద్ధులై తగినరక్షకపరివారముతో మునుముందు పోవవలయును. నే నానతీయఁగనే చతురంగబలములును, శిబికాదియానములును, రథ్యాదియుగ్యములును సత్వరముగాఁ

* ఇది యఱువదితొమ్మిదవ సర్గమునుండి సంగ్రహింపఁబడినది.

బ్రయాణము చేయవలయును. వసిష్ఠవామదేవజాబాలికాశ్య పులును, చిరకాలజీవియగుమార్కండేయుఁడు, కాత్యాయన ముని లోనగు బ్రాహ్మణులును ముం దరుగవలయు. ఆలసింపక నారథముం బూన్పంబంపుము. రాయబారులు తొందఱ పెట్టు చున్నారనియె. రాజు మునులంగూడి పయనము సాగింపఁగాఁ జతురంగబలములు వెంటనే పోయెను. దశరథుఁడు నాలుగు దినములు ప్రయాణముసాగించి మిథిలానగరమును బ్రవేశిం చెను.

మిక్కిలి శ్రీమంతుఁడగు జనకరాజు దశరథు నాగ మనము విని కానుకలు సేకరించి యుంచెను. వృద్ధుఁడగు దశ రథునికడ కరుదెంచి దర్శించి మహాహర్షమున శరీరమునఁ బుల కాంకురము లంకురింప వివాహము త్వరితము సాగునని సంత సించెను. మఱియు నావృద్ధరాజుతో రాజేంద్రా! నీకు స్వాగత మగుంగాక. అత్యుత్కృష్టమగు రఘువంశమున జన్మించిన మాననీయుఁడవు. ఇట్టి నీవు మాయదృష్టవశమున నిందుల కరు దెంచితివి. కుమారులు శివధనుస్సువిఱుచుట లోనగుపరాక్రమ కార్యములన్నియు నీకు సంతసముం గూర్పంగలవు. వారిం గాంచి యాయపారహర్ష మనుభవింపుము. మహాత్ముఁడు వసిష్ఠమహర్షియు విప్రప్రవరులంగూడి మాభాగ్యవశమున దేవతలతోడి సురపతివలె నరుదెంచినవాఁడు ఇట్టివారిఁ గొని తెచ్చిన నాభాగ్యమువలన నంతరాయములు తొలఁగినవి. పరా క్రమోత్కృష్టులగు రఘువంశపురాజులతో వీయముసేయు భాగ్యము నాకుఁ గల్గెను. నాకులము పూజ్యమయ్యెను. ప్రథమ మనందగు నిక్ష్వాకువంశమునఁ బుట్టినవాఁడవు. కాన నీవు

నరేంద్రులకు నింద్రుఁడవు. మహాత్మా! నీవు రేపు ప్రాతఃకాలమున వివాహవిషయమునకుఁ దగుప్రసంగము నడుపందగుదువు. మూఁడు నాల్గుదినములలో నాయజ్ఞము పూర్తియగు. వెంటనే మహర్షి సమ్మతమగు బ్రాహ్మవివాహమును నెఱవేర్పందగుననియెను.

వక్తలలో దశరథుఁడు శ్రేష్ఠుఁడు. జనకుఁడు చెప్పిన పలుకు లాలకించి మహర్షుల నడుమనుండి దాత యెపుడొసంగునో ప్రతిగ్రహీత యపుడే ప్రతిగ్రహించును. కనుక ప్రతిగ్రహము దాతయధీనము. వీర్యశుల్కముగా నీవు సాగించు నీవివాహమును బూర్వమే వింటిమి. కావున దాతవగు నీ వెట్లు పలుకుదువో ప్రతిగ్రహీతలమగుట మేమట్లే చేయుదుము. ధర్మవేత్తవగుట నీవెఱుంగనిధర్మము లుండవు. అనఁగా ధర్మయుక్తమగుదశరథుని యశస్కరవాక్యము నాలకించి విదేహాధిపతి విస్మయమునొందెను. మునులందఱు పరస్పరసమాగమసమాగతహర్షమున నారాత్రి యందు సుఖముగాఁ గడపిరి. దశరథుఁడు రఘువంశముక్తాఫలములగు కుమారులం గాంచి నిర్భరానందమునొంది జనకుఁడు చేయుసత్కారముల కెంతయుఁ దృప్తుఁడై హాయిగా నివసించెను. తత్త్వవేత్తయగు నాజనకరాజు ధర్మము నతిక్రమింపక యాగసంబంధములగు కార్యముల నెఱవేర్చి తనూజాతలకుఁ బెండ్లికై ముందు చేయఁదగు నంకురార్పణాదికార్యములఁ జక్కఁగా నిర్వర్తించి యారాత్రి గడపెను.

## వసిష్ఠముని యిక్ష్వాకువంశక్రమము జనకునకుఁ దెల్పుట.

* మఱుదిన ముదయమున జనకుఁడు మహర్షులయనుమతి యజ్ఞక్రియల నిర్వర్తించి శతానందునితో సాంకాశ్యపురము గలదుకదా. అయ్యది శుభముల ప్రోవు. శత్రువులు భేదింపరానియట్లు కోటలు గలవు. పుష్పకవిమానమువలె నయ్యది యాశ్రితులయభీష్టములం దీర్చుచుండును. అందు నాయనుజుఁడు కుశధ్వజుఁ డున్నవాఁడు. ఇక్షుమతీనదీజలపానమాతనికిఁ బ్రీతికరము. ఆతఁ డీయజ్ఞరక్షకుఁడని నేఁదలంతును. కావున వాని జూడఁగోరుచున్నాఁడను. ఈవివాహశుభఫలముల నాతోడ నతఁడు ననుభవింపఁగలవాఁడు. అని పలుక శతానందుఁ డాతనిం దోడుకొనిరా దూతలం బంపెను. వారు జవనాశ్వముల నారోహించి యింద్రునియాజ్ఞ మహావిష్ణువును వలె జనకాజ్ఞఁ గుశధ్వజుని గొనిరానేగిరి. కుశధ్వజుఁ డా వృత్తాంతమును విని రాజాజ్ఞం బయనమైవచ్చి మహాత్ముని దన యగ్రజుని జూచెను. శతానందునకు జనకునకుఁ గ్రమముగా నమస్కరించి తదనుమతి నుచితాసనమునఁ గూరుచుండెను. ఆ యన్నదమ్ములిరువురు సుదాముఁడనుమంత్రినిగని మంత్రివర్యా! నీవేపోయి మహనీయకులభవులగు దశరథుని దత్కుమారులను మంత్రులను బిలుచుకొనిరమ్మనిరి. ఆతఁ డవ్వారలున్నచక్కటికింబోయి యారాజును దర్శించి శిరస్సువంచి మ్రొక్కి వైదేహుని ప్రార్థనముఁ దెలుప నందఱుంగూడి వారున్నచక్కటికిం బోయెను. విదేహాధిపతిం గాంచి వాక్కుశలమొప్పఁగా మహా

*ఇది డెబ్బదియవసర్గమునఁ గలదు.

రాజా! భగవంతుఁడగు వసిష్ఠముని మాకులమునకుఁ బరమ గురువనియు మాకుఁ దగినవాక్యములన్నింటియందుఁ బ్రథానుఁడై మాటలాడుననియు నీకు నెఱుకయేకదా. ఆముని విశ్వామిత్రు ననుమతింబడసి మహర్షియుతుఁడై మదీయవంశ క్రమమును దెలుపుననియె. వాక్యవిదుత్తముఁ డగువసిష్ఠ మానియు శతానందుని జనకుని గాంచి యిట్లు చెప్పెను.

ప్రత్యక్షాదిప్రమాణముల కగోచరముకాని విష్ణువు వలన బ్రహ్మ జన్మించెను. ఆబ్రహ్మ శాశ్వతుఁడని నిత్యుఁడని యవ్యయుఁడని పిలువంబడు. ఆతనికుమారుఁడు మరీచి. వానికిఁ గశ్యపుఁడు, నాతనికి సూర్యుండును జన్మించిరి. సూర్యపుత్రుఁడే మనువు. ఆతఁడే తొలుత రాజయ్యెను. ఇక్ష్వాకు వతనికొడుకు. అయోధ్యాపాలకులలో నతఁడే ప్రథముఁడు. అతనికిఁ గుక్షియు, వానికి వికుక్షియు, ఆతనికి బాణుఁడు, నారాజునకు ననరణ్యుఁడు, వానికిఁ బృథువు, నతనికిఁ ద్రిశంకువు, నతనికి దుందుమారుఁడును గలిగిరి ఆరాజునకు యువనాశ్వుఁడును వేఱొక పేరు కలదు. అతనికుమారుఁడు మాంధాత. తత్పుత్రుఁడు సుసంధి. వానికి ధ్రువసంధి ప్రసేనజిత్తు లను నిరువురు గలిగిరి. ధ్రువసంధికి భరతుఁడు కొడుకు. ఆతనికి నసితుండు తనయుఁడు. ఆయసితునకు హైహయులు తాలజంఘులు శశిబిందువులు విరోధులైరి. వారలు యుద్ధమునకు రాఁగాఁ బోరాడి యోడి పోయి రాజ్యభ్రష్టుఁడుకూడ నయ్యెను. అసితుఁ డవశిష్టాల్ప సైన్యముంగూడి హిమవంతమున కరిగి భృగుప్రస్రవణమనఁ బడు శృంగమున వసించియుండెను. ఆతనిపత్ను లిరువు రంతర్వత్నులై యుండిరని వినంబడియె. అందొక్కతుక సవతిగర్భము

నశించుటకై విషయుతభక్ష్యము నొసంగెను. భృగువంశ జాతుఁడగు చ్యవనమహర్షి యారాజు తానుండుభాగమున నున్నవాఁడన్న యనుకంపచేతఁ బ్రీతుఁడై యక్కడికి వచ్చెను. ఆరాజపత్నులలో విషభక్ష్యము తిన్నపురంధ్రి భాగ్యరేఖ చెలువారఁ బంకజపత్త్రాక్షము లొప్పనుండును. ఆమె తనకుఁ గుమారుఁడు దీర్ఘాయుష్మంతుఁడు కలుగవలయునని కోరుచు నామునికి నమస్కరించెను. విషభక్ష్యము పెట్టిన కాళిందియు వచ్చి మ్రొక్కెను. నిర్విఘ్నముగాఁ బురుషశిశువు కలుగుంగాక యని కోరుచుఁ దనకు వందన మర్పించిన యాసుచరిత నాముని కని యోభాగ్యవంతురాలా! బలపరాక్రమతేజశ్శ్రీయుతుఁడగు పుత్త్రుఁడు నీయుదరమున గరళముతోఁగూడి వేగంబ పుట్టును. నీవేమియు భయంపడకుము. భయముకూడ నతనికి లేదని యాశీర్వదించెను.

సాధ్వియు మహిషియునగు నారాజపుత్త్రిక యాముని వర్యునకు నమస్కరించెను. అంత నచిరకాలముననే పతి వియోగము కలుగ నాకాంత తనయునిం గాంచెను. విషము తోడ జన్మించుట సగరుఁడన నాకుమారుఁడు ప్రసిద్ధిగాంచెను. వాని కసమంజుఁడు, వాని కంశుమంతుఁడు, నతనికి దిలీపుఁడు, వానికి భగీరథుఁడు తనయులైరి. భగీరథసుతుఁడు కకుత్థ్సుఁడు వానికి రఘువు, నతనికిఁ బ్రవృద్ధుఁడు కలిగిరి. అతఁడు నా(వసిష్ఠుని) శాపమున రాక్షసుఁడై తాను నన్ను (వసిష్ఠుని) శపింపఁ జలముఁ గైకొని భార్యవలదని యడ్డుపడఁగా దాని వదలి పెట్టెను. ఆజలము తనపాదములపైఁబడఁగా నదిమొదలతఁడు కల్మాషపాదుఁ డయ్యెను. వానికి శంఖుఁడు, ఆతనికి సుదర్శ

నుఁడు, వాని కగ్నివర్ణుఁడు, వానికి శీఘ్రగుఁడు, నతనికి మరువు, వానికిఁ బ్రశుశ్రుకుఁడు, నతని కంబరీషుఁడు, నతనికి నహుషుఁడు, ఆతనికి యయాతియు, వానికి నాభాగుఁడు, అవ్వానికి నజుఁడు, నతనికి దశరథుఁడు వరుసగాఁ దనయులై జన్మించిరి. ఈదశరథునకు నన్నదమ్ములగు నీరామలక్ష్మణులు కల్గిరి. ఇక్ష్వాకు వంశజనితులగు రాజులు పూర్వమునుండి పరమపావనవంశము గలవారు. మహాధార్మికులు. సత్యపరాక్రమశాలురు నగుదురు. అట్టిసద్వంశమున జన్మించిన యీరామలక్ష్మణులకొఱకు నీ కుమారితల నర్థించుచున్నవాఁడను. నీతనయల కీకుమారులే యర్హులు. వీరికి వారలే తగినవారు. ఈదాంపత్యమొనఁగూర్చుట నీకుఁ దగును.

## జనకుఁడు తనవంశక్రమము నెఱిఁగించుట.

* వసిష్ఠముని యిట్లు రాడ్వంశక్రమము నెఱింగింపఁగా జనకుఁడు కైమోడ్పుసంధిల్లఁగా మునివరా! నీకు శుభం బగుఁగాక. స్తుతిపాత్రమగు నస్మదన్వయక్రమమును వివరింతు. అయ్యది వినందగుదువు. సద్వంశజాతుఁడు తాఁ గన్యాదానము చేయునపుడు స్వవంశమునంతయుఁ జెప్పఁ దగును. ఆయాచారము ననుసరించి మావంశక్రమము దెలుపుదును. పరమ పావనకార్యములచేతఁ ద్రిజగద్విఖ్యాతింగన్న నిమి యను రాడ్వర్యుఁ డుండెను. బలధర్మముల నతఁ డెల్లరకంటె నధికుఁడు. అతనికొడుకు మిథి. ఆతఁడే యీమిథిలను నిర్మించెను. మొదటి జనకుఁ డామిథియే ఆమిథికి నుదావసువు సుతుఁడు. వానికి నందివర్ధనుఁడు, నతనికి సుకేతుఁడు, ఆతనికి దేవరాతుఁడు

---

* ఇది డెబ్బదియొకఁటవసర్గమునఁ గలదు.

తనయులుగా వరుసగలిగిరి. రాజర్షియగు దేవరాతునకు బృహద్రథుఁడును, వానికి మహావీరుఁడు, వానికి సుధృతి,వానికి ధృష్టకేతుఁడు, వానికి హర్యశ్వుఁడు, నతనికి మరుఁడు, అవ్వానికిఁ బ్రతింధకుఁడు, నతనికిఁ గీర్తిరథుఁడు, నయ్యవనీశునకు దేవమీఢుఁడు, వానికి విబుధుఁడు, వానికి మహీధ్రకుఁడు, నతనికిఁ గీర్తిరాతుఁడు, నతనికి మహారోముఁడు, వానికి స్వర్ణరోముఁడు, నతనికి హ్రస్వరోముఁడు తనయులైరి. ఆహ్రస్వరోమునకు నిద్దఱు కొడుకులు. వారిలో నేనే యగ్రజుఁడను. కుశధ్వజుఁడు నాతమ్ముఁడు. మాతండ్రి యగ్రసుతుఁడ నగునాకు రాజ్య మొసంగి కుశధ్వజునిఁ బోషించుభారము నాపైఁ బెట్టి తపోవనమున కరిగెను. వృద్ధుఁడగు నాతండ్రి స్వర్గము నలంకరింపఁగా నాతమ్ముని బ్రీతితోఁ జూచుచు రాజ్యభారము వహించితిని. కొంతకాలము గడువఁగా సాంకాశ్యనగరమునుండి సుధన్వుఁడను రాజు మిథిలను ముట్టడింపవచ్చి యనుపమానశంకరచాపమును సీతను దనకిమ్మని వార్త నంపెను. నేనందుల కంగీకరింపనైతిని. దానఁ గోపమూని నన్ను మార్కొనఁగా వానిం బొలియించితిని. ఆనగరమునకు నీకుశధ్వజుని రాజుగా నొనరించితిని. ఈతఁడే నాతమ్ముఁడు. నీవడిగినట్లే మహాహర్షమున నాయిరువురుతనయల నొసంగువాఁడను. నీకు శుభంబగుఁగాక. రామచంద్రునకు సీతను, లక్ష్మణునకు నూర్మిళ నొసంగెదను. వీర్యశుల్కయై దేవకన్యకవలెఁ జెలువమరు నాతనయను సీతను, రెండవకొమరితయగు నూర్మిళనుద్రికరణశుద్ధిమీఱ ముమ్మాటికి నొసంగెదను. శ్రీరామలక్ష్మణులకు గోదానవ్రతమును జేయింపుము. నీకు సకల

శుభములు గలుగుంగాక. పితృకార్య మనందగునాందీశ్రాద్ధము (వృద్ధిశ్రాద్ధమును) నొనరింపుము. నేఁడు మఘానక్షత్రముకదా. మూఁడవదిన ముత్తరఫల్గునీనక్షత్రము వచ్చును. అది మంగళ కరము. దానియందు వివాహకార్యము నెఱపును. వరద్వయ మునకు శుభసంధాయకమగు గోభూతిలహిరణ్యాదిదానములఁ గావింపుమని విన్నవించెను.

## దశరథుఁడు కుమారులవివాహార్థము గోదానాదులు చేయుట.

*జనకుఁ డీకరణిఁ దెలుపఁగా నంతఁ గౌశికుఁడు వసిష్ఠుం గూడి జనకునితో మహీపాలకచంద్రా! ఇక్ష్వాకువిదేహవంశము లాశ్చర్యము గలిగించునవి. వానిమహిమము వర్ణనాతీతము. వీనికి సాటి మఱొక్కటి యీలోకమున లేదు. సీతోర్మిళలను రామలక్ష్మణులకు నొసంగునట్టి యీయుద్వాహ సంబంధము తుల్యకులములకుఁ గలుగుటంజేసి తగియున్నది. మఱొక్క పలుకునాలకింపుము. ఈకుశధ్వజభూపాలుఁడు నీకుఁ దమ్ముఁడు. ధర్మజ్ఞుఁడు. కావున నితఁడుకూడ సంబంధమున కర్హుఁడు. ఈ నీసోదరునకుఁ గన్యకాద్వయము కలదుకదా. ఆసుందరీమణులను మఱియుఁ గోరుచున్నాము. ఎవరికొఱకందువో చిన్నవాఁడగు భరతుఁడు బుద్ధిమంతుఁడగుశత్రుఘ్నుఁడు కలరుకదా. వారల కొఱకే యీతనితనయల నిరువురను వరించుచున్నారము. ఈనలువురును సకలగుణసంపన్నులు: మీయిరువురసంబంధము వలన నిష్కళంకమగు నిక్ష్వాకువంశమును, బుణ్యకర్ముఁడవగు నీకులము వియ్యముచేఁ బరస్పరసంబద్ధములై యుండుఁగాక.

---

*ఇది డెబ్బదిరెండవసర్గమునుండి గ్రహింపఁబడినది.

ఇట్లు విశ్వామిత్రుఁడు పలుకఁగా విని వసిష్ఠునినుమతిని గైకొని జనకుఁడు చేతులుజోడించి వారిరువురనుజూచి మౌని వరులారా! ఇక్ష్వాకుకులముతోడి వియ్యముతగినది. అట్టి తగిన సంబంధమును జేయుఁడని మీరే యాజ్ఞాపించుటచే మావంశము ధన్యమైనది. మీయానతిప్రకారమే యగును. మీకు శుభంబగుఁగాత. పరస్పర మెడఁబాయకయుండు భరతశత్రుఘ్నులు కుశధ్వజుతనయల నిర్వురను బెండ్లియాడుదురుగాక. రాజకుమారచతుష్టయము నొకపగటియందే నలువురు రాజపుత్రికలను బాణిగ్రహణముచేయుదురుగాక. భగుండను ప్రజాపతియే దేవతగాఁగల యుత్తరఫల్గునీ నక్షత్రమునందుఁ బగలే వివాహమంగళము సాగుట శుభమని పెద్దలు వచింతురని మృదుతమములగుపలుకులఁ దేటపఱచి యంజలి బంధించి మఱియు నిట్లుపలికెను. కన్యాప్రదానరూపధర్మము ననుష్ఠించు లాభము నాకుఁ గల్గించితిరి. మీకు శిష్యుఁడను. మీయను గ్రహపాత్రుఁడను. మీరు మాసింహాసనములను దశరథుని సింహాసనమును గ్రహించి మా రాజ్యములను బాలింపుఁడు. మనస్సుల నిది యెట్లులగునని సంశయింపకుఁడు. దశరథున కీ మిథిల యెట్లు స్వీయమో యయోధ్య నాకు నట్లే స్వీయమే యగును. కావున మీ కీమూఁడు రాజ్యములయందుఁ బ్రభుత్వము కలదనుటకు సంశయమే లేదు. మేమెల్ల మీయాజ్ఞలఁ గొని వర్తింపఁగలవారము. కావున నేది హితమో దాని మా కుపదేశమిడి కార్యము చేయింపుఁడని ప్రార్థించెను.

జనకమహారా జిట్లు ప్రార్థించుచుండఁగా దశరథుఁడు హర్షించి యావిదేహభూపతిం గాంచిమీయన్నదమ్ములకల్యాణ

గుణగణములు పరిగణింప నలవికాకున్నవి. కనుక రాజులు మునులు మీచేఁ బూజితులైరి. నీకు భద్రములు గలుగుం గాక. నేనింటికింబోయి గోదానాదికృత్యముల నిర్వర్తింతు. అని పలికి యాజనకునొద్ద ననుమతిం గైకొని మునివరుల నిరువురను బురస్కరించుకొని దశరథుఁడు తనవిడిదికింబోయి వృద్ధిశ్రాద్ధము యథావిధి నొనరించి మఱుదిన ముదయమున లేచి యపుడు చేయందగుగోదానవ్రతమును సాగించెను. అవ్వల నాదశరథుఁడు పుత్త్రుల నుద్దేశించి వారికై మూర్ధ మొక్కొక్కలక్ష గోవులను సద్విప్రులకు దాన మొసంగెను. పుత్త్రవాత్సల్యము మెండుగా నుండుటంబట్టి యంతటితోఁ దృప్తినొందక వారి సమావర్తనమహోత్సవమునందు స్వర్ణభూషితశృంగాగ్రములు గల నాలుగులక్షలగోవులను సవత్సములుగాఁ బాలుపిదుకు పాత్రములతో సద్విజులకు దాన మొసంగి యింకను ద్రవ్య మొసంగెను. సమావర్తనము చేసికొన్న తనయులు చుట్టు నుండఁగా నాదశరథుఁడు దిక్పాలకపరివృతుఁడగు బ్రహ్మవలెఁ బ్రకాశించెను.

మహాశయులారా! అఱువదెనిమిదవసర్గమునుండి యింతదనుకఁ గలసర్గములకథల వ్రాసి యందుఁగలసారమును వ్రాయనైతిని. విశేషించి చర్చింపఁదగువిషయము లందు లేవు. ఐనఁ గొన్నింటి నిందే వ్రాయుదును.

"యజ్ఞస్యాంతే నరశ్రేష్ఠ వివాహమృషిసమ్మతమ్." (౧౨ సర్గము.౬౫)

"ఋషిసమ్మతం బ్రాహ్మం వివాహమిత్యర్థః" అని గోవిందరాజులు.

"ఋషిసమ్మతం వివాహం నిర్వర్తయితుమర్హసి." అని మహేశ్వరతీర్థులు.

ఇందొకసందియము గలదు. ఋషిసమ్మతం వివాహమ్మనఁగా బ్రాహ్మవివాహమని గోవిందరాజులు వ్రాసిరి కాన నించుక చర్చింపవలసివచ్చెను. వివాహము లెనిమిదివిధములు.

"చతుర్ణామపి వర్ణానాం ప్రేత్య చేహ హితాహితాన్
అష్టావిమాన్ సమాసేన స్త్రీవివాహాన్నిబోధత. ౨౦
బ్రాహ్మో దైవస్తథైవార్షః ప్రాజాపత్యస్తథాసురః
గాంధర్వో రాక్షసశ్చైవ పైశాచశ్చాష్టమోఽధమః." ౨౧

అని వివాహములనామములు. శ్రీరామచంద్రునివివాహ మిం దేపేరునకుఁ దగినది? అనునదియే ప్రశ్నము. "మమ సత్యా ప్రతిజ్ఞా చ వీర్యశుల్కేతి కౌశిక" అని జనకుఁడు పెక్కుతావులఁ జెప్పెను. ఎవఁడు శివశరాసనము నెక్కుపెట్టునో వానికి సీత నిత్తునని జనకుఁడు ప్రతినచేసెను.

"యద్యస్య ధనుషో రామః కుర్యాదారోపణం మునే
సుతామయోనిజాం సీతాం దద్యాం దాశరథేరహమ్."

అని జనకవాక్యము కలదు. కావున నీవివాహము బ్రాహ్మమనఁబడువివాహ మగునా కాదా యని విమర్శింతము.

"యో యస్య ధర్మ్యో వర్ణస్య గుణదోషౌ చ యస్య యౌ
తద్వస్సర్వం ప్రవక్ష్యామి ప్రసవే చ గుణాగుణాన్. ౨౨
షడానుపూర్వ్యా విప్రస్య క్షత్రస్య చతురోఽవరాన్
విట్శూద్రయోస్తు తానేవ విద్యాద్ధర్మ్యానరాక్షసాన్. ౨౩
చతురో బ్రాహ్మణస్యాద్యాన్ ప్రశస్తాన్ కవయో విదుః
రాక్షసం క్షత్రియస్యైకమాసురం వైశ్యశూద్రయోః. ౨౪
పంచానాం తు త్రయో ధర్మ్యా ద్వావధర్మ్యౌ స్మృతావిహ
పైశాచశ్చాసురశ్చైవ న కర్తవ్యౌ కదాచన. ౨౫

పృథక్పృథగ్వా మిశ్రౌ వా వివాహౌ పూర్వచోదితౌ
గాంధర్వో రాక్షసశ్చైవ ధర్మ్యౌ క్షత్రస్య చైవ హి." ౨౬

గాంధర్వరాక్షసములు క్షత్రియులకు ధర్మ్యములని యేర్పడినది.

"యదా స్త్రీపుంసయోరన్యోన్యానురాగపూర్వకసంవాదేన పరిణీతా యుద్ధాదినా విజిత్య తాముద్వహేత్తదా గాంధర్వరాక్షసౌ మిశ్రౌ భవతః" అని కుల్లూకభట్టు.

బ్రాహ్మవివాహ మనఁగా

"ఆచ్ఛాద్య చార్చయిత్వా చ శ్రుతిశీలవతే స్వయం
ఆహూయ దానం కన్యాయా బ్రాహ్మో ధర్మః ప్రకీర్తితః." ౨౭

దైవవివాహ మనఁగా

"యజ్ఞే తు వితతే సమ్యగృత్విజే కర్మ కుర్వతే,
అలంకృత్య సుతాదానం దైవం ధర్మం ప్రచక్షతే." ౨౮

ఆర్షవివాహ మనఁగా

"ఏకం గోమిథునం ద్వే వా వరాదాదాయ ధర్మతః,
కన్యాప్రదానం విధివదార్షో ధర్మస్స ఉచ్యతే." ౨౯

ప్రాజాపత్యవివాహ మనఁగా

"సహోభౌ చరతాం ధర్మమితి వాచానుభాష్య చ,
కన్యాప్రదానమభ్యర్చ్య ప్రాజాపత్యో విధిః స్మృతః." 30

కన్యావరులను వస్త్రాదుల నలంకరించి విద్యాచారవంతుఁడగు వరుని బిలిచి కన్యక నొసంగిన బ్రాహ్మ్యవివాహము. యజ్ఞము సాగుచుండఁగా ఋత్విజులు తమకృత్యమును సమరు చేయుచుండఁగా నలంకరించి కన్యనొసంగిన దైవవివాహము. రెండు

లేక మూఁడుగోవుల జంటలను వరునివలనఁ దీసికొని విధిమంతముగాఁ గన్యాప్రదానముచేసిన నార్షవివాహము. మీ రిరువురు కలిసి ధర్మమొనరింపుఁడని వాగ్రూపమున నియమించి పూజించి కన్యక నొసంగినఁ బ్రాజాపత్యవివాహము. తక్కినవి ఆసురగాంధర్వరాక్షసపైశాచముల కిందుఁ బ్రసక్తియే లేదు. కావున వానిని వ్రాయ లేదు. యాజ్ఞవల్క్యస్మృతియు నీయర్థమునే తెలిపెను. శంఖస్మృతియందు,

"విఖ్యా ధర్మ్యాస్తు చత్వారః పూర్వం యే పరికీర్తితాః,
గాంధర్వో రాక్షసశ్చైవ క్షత్రియస్య తు శస్యతే." ౩౧

అని గాంధర్వరాక్షసవివాహములు క్షత్రియులకు ముఖ్యములు. స్త్రీపురుషులు పరస్పర మొకనియమము చేసికొని వివాహముచేసికొన్న గాంధర్వమగును. యుద్ధమునఁ గన్యకను హరించి తీసికొనిపోయిన రాక్షస మనంబడును. మాధవాచార్యులుగారు మన్వాదిస్మృతులనే ప్రతిపాదించి యంగీకరించిరి.

వీర్యశుల్కయగు సీతను రాముఁడు పెండ్లియాడెను. కాననిది యష్టవిధవివాహములలోఁ జేరదని కొందఱందురు. శివధనురారోపణము వీర్యపరీక్షగాని శుల్కము కాదు. కావున నీవివాహము బ్రాహ్మవివాహమే యని గోవిందరాజులు వ్రాసినది స్మృతిసమ్మతమే యగును.

"సహాంశస్య యయాతిస్తు నాభాగస్తు యయాతిజః." ౩౨

(౭౦ సర్గము.)

"సహాంశ యయాతీ చంద్రవంశ్యాఖ్యామస్యా" అని గోవిందరాజులు.

సూర్యవంశమునందును నహుషయయాతినామధేయము గల వారు గలరని యెఱుంగవలయును. చంద్రవంశమునందుండు వారిచరిత్రములు భారతాదులలో నున్నకతన వారే వీరని ప్రమాదంపడరాదు.

"ఏవం బ్రువాణం జనకః ప్రత్యువాచ కృతాంజలిః
శ్రోతుమర్హసి భద్రం తే కులం నః పరికీర్తితం. ౧
ప్రదానే హి మునిశ్రేష్ఠ కులం నిరవశేషతః
వక్తవ్యం కులజాతేన తన్నిబోధ మహామునే." ౨ (స ౭౧.)

దశరథవంశమును వసిష్ఠముని కీర్తించెను. జనకవంశమును బురోహితుఁడగు శతానందుఁ డేల కీర్తింపలేదని ప్రశ్నింపరాదు. కన్యాదానమున నతఁడే స్వవంశచరిత్రము చెప్పవలయు నన్న శిష్టాచారమును బాటించితినని జనకుఁడే తెలిపెను. కాన శతానందునకుఁ దెలియదనిగాని యింకేమియో కారణముండు ననిగాని సంశయింపరాదు.

"ఏకాహ్నా రాజపుత్రీణాం చతసృణాం మహామునే
పాణీన్ గృహ్ణంతు చత్వారో రాజపుత్రా మహాబలాః." ౧౨.
(౭౨ సర్గము.)

ఒక్కపగటియందే నలువురకు వివాహముసాగవలయునని జనకు నభిప్రాయము. ఇది శాస్త్రసమ్మతమా యనుప్రశ్నము గలదు. దానినించుక విచారింతము.

"ఏకాహేఽపి జనాశ్రయాంతర ఇహేదం తారతమ్యాద్భ్రాతౄ
ర్జ్యైష్ఠ్యం నో యమయోర్నిషిద్ధమనయోః కిం తత్ర కార్యం బుధైః

నైకస్మై దుహితృద్వయం సహజయోర్భిన్నోద్భవే కన్యకే
దద్యాదుద్వహనం మిథో న తనయాత్కుర్యాదసంపద్యదః."

(ముహూర్తమార్తండము.)

అను నీమొదలగునిషేధముల ననుసరించి యేకలగ్నమున శుభకార్యద్వయము నిషేధింపఁబడుచున్నది. ఇది సామాన్యశాస్త్రము. మండపాంతరమున రెండుశుభములు చేయవచ్చునని యభ్యనుజ్ఞయు నీఁబడినది.

"న ప్రతిషిద్ధం లగ్నం సంప్రాప్తే సంకటే మహతి
ఏకోదరసంభవయోరేకాహే భిన్నమండపే కాలే"

ఇతి జ్యోతిర్వివరణము.

"పృథఙ్మాతృజయోః కార్యో వివాహస్త్వేకవాసరే
ఏకస్మిన్మండపే కార్యః పృథగ్వేదికయోస్తథా." మేధాతిథి.

"సోదరాణామపి సమానసంస్కారా వివాహా చ సంకటే అబ్దభేదాత్కార్యా. చతుర్దినవ్యవధానాదేకదినవ్యవధానాద్వా కార్యా. అతి సంకటే ఏకదినే కర్తృభేదేన మండపభేదేన వా కార్యా. ద్వాభ్యాం కర్తృభ్యాం ఏకస్మిన్నపి లగ్నే ఏకస్మిన్నపి గృహే భిన్నోదరయోర్వివాహః కార్యః. ఏవం ప్రాగుక్తనిషేధచతుష్టయేఽపి వర్షభేదే దోషాభావః. యమలయోరేకకాలే ఏక మండపే వా సమానసంస్కారాణాం న దోషః. ఏవం మాతృభేదేఽపి షణ్మాసాభ్యంతరే సమానసంస్కారే దోష న మాతృభేదే ఏకజాతకన్యయోరేకదినే ఏకమండపేఽపి వేదీభేదేన వివాహో న దోషాయేతి కేచిత్."

ధర్మసింధువు 3 పరిచ్ఛేదము.

అతివిస్తర మేలయని వదలెదను. ఏవియేని కష్టములు గలిగినపుడు సోదరుల కొక్కలగ్నముననే వివాహము చేయవచ్చును.

మండపములు రెండుండవలయును. తల్లులు వేఱుగనుండిన యెడల వారలకుఁ జేయవచ్చును. కవల కీనిషేధ మక్కఱయే లేదు. కన్యకలకు నిదియే విధి. హోమకుండములు వేఱుగనున్నఁ జాలును. మండపములు వేఱుగ నుండవలయునని కొందఱి మతము. సంవత్సరభేదము గలిగియున్న నాలునెలలలోఁగా మరల నింకొక్కవివాహము చేయరాదన్ననియమము బాధింపదు. అనియే పైస్మృతులసారము.

ఈనిషేధములను దదపవాదముల ననుసరించి యాలోచించిన లక్ష్మణశత్రుఘ్నులు కవలుగాన వారల కీదోషము లేదు. కుశధ్వజునిదుహితల నిరువురను భరతశత్రుఘ్నులకు భిన్నోదరుల కొసంగుట యశాస్త్రము కాదు. జనకరాజతనయ యూర్మిళయే కావున నాలుగువివాహము లొకదినము సాగుట యశాస్త్రము కాదని తేటపడఁదగు. ఒక్కలగ్నమున రెండు వివాహములు సాగరాదన్నది సామాన్యశాస్త్రమని మన మూహింపవలయును.

> "గవాం శతసహస్రాణి బ్రాహ్మణేభ్యో నరాధిపః
> ఏకైకశో దదౌ రాజా పుత్త్రానుద్దిశ్య ధర్మతః. ౨౨
> సువర్ణశృంగాస్సంపన్నాస్సవత్సాః కాంస్యదోహనాః
> గవాం శతసహస్రాణి చత్వారి పురుషర్షభః." ౨౩

అనుభాగమును బఠించి కొందఱు నవ్వుదురు. ఒక్కొక్కతనయునకు క్షేమాయుర్భాగ్యాదు లభివృద్ధికావలయునని యొక్కొక్కలక్షధేనువుల నిచ్చెననియు, నంతటఁ దృప్తిలేమి మరల నాలుగులక్షల నొసంగెననియు దీనియర్థము. ఎనిమిదిలక్షలగోవులను దానమిచ్చెననఁగా నిన్ని యెట్లు సంపా

దించెను? ఎప్పు డయోధ్యనుండి తోలుకొని రాఁబంచెను? నిరంతరప్రయాణముల నవి రాఁగలవా ? మిథిలానగరమునఁ గొనియెనన్న నన్ని యొక్కచో నునుచుట యెట్లు? అని యీమొదలగు ప్రశ్నము లెన్నియో వారిమనస్సులఁ గలంచునుగాఁబోలు. కనుక వా రిట్టు లూహింతురు. ఇటీవల జరగినపాశ్చాత్యమహాసంగ్రామమునందు జర్మనుదేశప్రజలకు స్విజర్లండువా రొక్కవారమునకు రెండులక్షల వరాహముల నమ్మిరఁట. అట్లు కొన్ని నెలలు విక్రయించిరఁట. వార్తాపత్రికలలో నీమాటలున్నవి. ఇది శక్యమా యని యెవరును బ్రశ్నింపరు. ఏల? ఈకాలమున నెట్టియశక్యకార్యములైనను శక్యములగునని, పూర్వకాలమునఁగావని వారిభావము. పూర్వకాలమున నొకగోవనఁగాఁ బండ్రెండురూప్యములని నియమము. మహారణ్యము లెక్కుడు. పశుసమృద్ధి యత్యధికము. ప్రభువులకును గోధనముండెనని మహాభారతమున ఘోషయాత్ర మనకుఁ దెలుపును. గోధనమే యాకాలమున ధనము. కావున నట్టిరాజు ప్రయత్నించిన నిది యొకగొప్ప కార్యముకాదు. షాజిహానను మహమ్మదీయచక్రవర్తి భార్యను సంతోషింపఁజేయందలంచి పన్నీటితోఁ గాలువను నింపి తానుదనపత్నియు నౌకలోఁ గూరుచుండి వెన్నెలదినములలోఁ దిరిగిరని తెలిపినపుస్తకములం గాంచి యేమియు నాక్షేపింపరు. పురాణములలో నున్న నవ్వకపోదురా? ఈకాలమున నశక్యములైనకార్యము లెన్నియో పూర్వకాలమున సులభముగా సాగెడివి. ఆకాలపువారిశక్తి నెఱుంగక తపశ్శక్తియన నెట్టిదో యెఱుంగనివారే యిట్టు లాక్షేపింతురు. సాధారణముగాఁ

గవిత్వమున నించుక యతిశయో_క్తి యున్నదన్నను బ్రమాదములేదు. ఉపలక్షణవిధిచే ననేకధేనువులని యర్థముచెప్పినను బాపమురాదు. ఈయాక్షేపణములకు శ్రీరామత_త్త్వమునకు సంబంధములేదు. ఆకాలమున గోధనమే ప్రధానైశ్వర్యమనుటయే యిటఁ గలసారము.

## —• శ్రీసీతాకల్యాణఘట్టము. •—

* ఏనాఁడు దశరథుఁడు కుమారులకు సమావ_ర్తనము సాగించెనో ఆనాఁడే యుధాజిత్తు వచ్చెను. ఆతఁడు కేకయ రాజుకుమారుఁడు. భరతునకు మేనమామ. దశరథుం గాంచి కుశలమడిగి యతఁడు మాతండ్రి ప్రీతిపూర్వకముగా మీ కుశలమడిగెను. మేమందఱము క్షేమముగా నున్నవారము. కేకయరాజు నామేనయల్లుని భరతుని జూడఁగోరుచున్నాఁడు. కాన వానింబిలుచుకొనిపోవ నయోధ్యకుం బోయితిని. అందు మీరిచటికి వచ్చుట నెఱింగి భరతుని జూడఁ గోరి వచ్చితిని. ఆమాటలు విని మిక్కిలి ప్రీతిగలిగినయాతని సమ్మానించి దశరథుఁడు చేయఁదగుపనుల నెఱవేర్చి యారేయి గడపెను.

తెల్లవాఱఁగనే యహర్ముఖోచితము లగుపనుల నిర్వ_ర్తించి ఋషిపురస్కృతుఁడై యజ్ఞశాలకుఁ బోయెను. శ్రీరామచంద్రుఁడు సమ_స్తభూషణాలంకృతుఁడై యట్లున్నసోదరుతో వివాహసూత్రధారణమను సదాచారమును నిర్వ_ర్తించి వివాహమునకు మిక్కిలితగి విజయావహమగుముహూ_ర్తమునందు వసిష్ఠాదులు ముందు నడువ యాగమండపమునకుం బోయెను.

---

*ఇయ్యది డెబ్బదిమూఁడవ సర్గమునఁ గలదు.

సోపకులతో దశరథుని చెంతఁ గూరుచుండెను. మహాజ్ఞాననిధి యగు వసిష్ఠముని జనకరాజుదగ్గరకుఁ బోయి యతనితో మహారాజా! మాతేఁడు వివాహసూత్రమును ధరించియున్న తన యులంగూడి కన్యాదాతవగు నీరాకను గోరుచున్నాఁడు. కన్యాదాతృ ప్రతిగ్రహీతలకు సకలపురుషార్థములు లభించును. వారియుభయపురములందునవే కన్యాదానప్రతిగ్రహాదికార్యములు సాగవలయును. కనుకఁ గన్యకనొసంగునీవు కాలముపుచ్చరాదు కన్యాదానము చేసి కృతప్రతిజ్ఞుఁడవు కావలయును. అదియే నీధర్మము. అత్యుత్తమమగునీవివాహమును విధియుతముగా నడపి యాధర్మమునొందుము.

అని వసిష్ఠముని తెలుపఁగా జనకుఁడు దాతయు ధర్మవిద్వర్యుఁడునగుటఁ దాఁజేయఁదగినపనుల నెఱవేర్చియున్నవాఁడగుట నమ్మునిపలుకులు విని మహాత్మా! మీరేల సత్వరముగ రారైతిరి? మిమ్ము నిరోధించువా రెవ్వరు? ఎవరియాజ్ఞకై యెదురుచూచుచున్నవారు? నీరాజ్య మెట్లో యీరాజ్యము కూడ నీదియేకదా. ఇఁక నాయిల్లు నీదనవలయునా? నారాక కెదురుచూచుచున్నామని పలికితిరి. నాకన్నియలు వివాహోచితమంగళాచారముల నన్నింటిని నిర్వర్తించి యగ్నిజ్వాలలవలెఁ బ్రకాశించుచు వివాహవేదికను సమీపించియున్నవారు. నేనును సిద్ధపడి యీవేదికకడనుండి మిమ్ము దర్శింపఁ గోరియున్నవాఁడ. ఇఁక దశరథమహీపతి నిరంతరాయముగా శుభకార్యము నడపుఁగాక. ఆలస్యమేల? అనఁగా నాజనకు నభిప్రాయ మెఱిఁగి వార్తపంపఁగా దశరథుఁ డాలకించి పుత్త్రులను మహర్షులు లోనగువారిని బిలుచుకొని యాగశాలం జేరెను.

అంత జనకుఁడు వసిష్ఠునితో మునీంద్రా! ధర్మవేత్తవు. మాకెల్ల నాజ్ఞాపింపఁదగినవాఁడవు. లోకరంజకుఁడగు రామచంద్రునకుఁ జేయఁదగువివాహకార్యమెల్ల నీవే మహర్షులం గూడి చేయింపుము అనుచియు నట్లే యని విశ్వామిత్రశతానందులంగూడి వివాహార్థమై పల్లవములతోఁ గ్రొత్తగా నలంకరింపఁబడిన మండపాంతర్భాగమున విధిననుసరించి నిర్మించిన వేదికకుఁ జుట్టును గంధపుష్పములు అంకురములు నిండియుండు బంగరుపాలికలను, అంకురములుగల నీళ్లుపోవుటకై యడుగు లేనిపాత్రములను, అంకురములు నిండినమూఁకుళ్లను, ధూపముతోఁగూడిన ధూపపాత్రములను, శంఖరూపపాత్రములను, ఆజ్యహోమోచితములగు స్రుక్స్రువములను, అర్ఘ్యమునిమిత్తము జలసంభృతపాత్రములను, లాజపాత్రములను, పసుపుఁ బూసి సంస్కరింపఁబడినయక్షతల నునిచి దాని యలంకరించెను. అట్టివేదికయం దగ్నిప్రతిష్ఠాపనము నొనరించి సమములుగా నున్నదర్భలను మంత్రములతోఁ బఱచి మంత్రపూర్వకముగా వధూవరుల యభ్యుదయమునిమిత్త మాహుతవహునియందు హోమము చేసెను

తరువాత జనకరాజేంద్రుఁడు సర్వాభరణభూషితయై యలరుసీతను బిలుచుకొనివచ్చి హుతవహునిముందు శ్రీరామచంద్రున కెదుట నిలిపి కౌసల్యానందసంధాయకుఁ డగురామభద్రునితో శ్రీరామచంద్రా! ఈసీత నాకొమరిత. ఈపురంధ్రి నీకు ధర్మపత్నియగు. ఈమెను బ్రతిగ్రహింపుము. నీకు శుభం బగుంగాక. నీహస్తముచేత నీసీతాహస్తమునుబరిగ్రహింపుము. ఈభూజాత సాధ్వియై మహాభాగ్యయుక్తయై నిన్నెప్పుడు నీడ

వలె ననుసరించియుండుము. అనిపలికి శ్రీరామచంద్రుని హస్తారవిందమున నాసుముహూర్తమునందు మంత్రపూతమగుజలము వదలెను.

ఆశుభలగ్నమును మేలుమేలని దేవతలు మునులు పొగడిరి. దేవదుందుభులు మ్రోఁగె. పుష్పవృష్టి నిరంతరముగాఁ గురిసెను. ఇట్లు సమంత్రకముగా సీతాదేవిని ధారాపూర్వముగా నిచ్చి జనకుఁడు సంతోషసాగరమున మునుంగుచు, సుమిత్రానందవర్ధనుఁ డగులక్ష్మణునిం గాంచి లక్ష్మణా రమ్ము. నీకు మంగళమలరుఁగాక. నే నీయూర్మిళను నీకొసంగఁబూనితిని. నీ వీకన్యకను బ్రతిగ్రహించి కరగ్రహణము చేయుము ఆలసింపకుము. అని పలికి భరతునింగాంచి రఘునందనా! నీ వీమాండవిని హస్తగ్రహణరూపముగాఁ బరిగ్రహింపుము. అని యవ్వల శత్రుఘ్నునిఁ బరికించి సౌమిత్రీ! నీ వీశ్రుతకీర్తిని బాణిగ్రహణము చేయుము. మీరందఱు సాధుస్వభావముగలవారు. సుచరితవ్రతులు. ఇట్టి మీకు మాకన్యకలే పత్నులు కాఁదగుదురు. కాకుత్స్థ వంశమౌక్తికములారా! మీ రెల్లరు భార్యలంగూడి మాకు నేత్రానందమును గల్గింపుఁడు. ఆలస్యము చేయకుఁడు. అనఁగా నారాకొమరులు జనకమహారాజు మాటలచొప్పున వసిష్ఠానుమతులై రాజపుత్రికా చతుష్టయహస్తములను దమ హస్తములచే స్పృశించిరి.

అత్తఱి మహాత్ములగు శ్రీరామలక్ష్మణభరతశత్రుఘ్నులు తమతమపత్నులతో నాహవ్యవాహునకును, వేదికకును, జనకునకును, ఋషులకును బ్రదక్షిణము చేసి విధివిహితముగాఁ గల్పసూత్రానుసారముగా వివాహవ్రతమును జరపిరి. ఆ రాజకుమా

రులు తమకళత్రముల కరములం బట్టుకొనినంతనే యంబరము నుండి పూలవాన కురిసెను. దేవవాద్యములు మొరసెను. అచ్చరమిన్నలు గుంపులుగాఁగూడి నాట్యముచేసిరి. గంధర్వ మధురగానము చెలరేఁగెను. శ్రీరామచంద్రాదులు రఘుకు లోద్ధారకులు గావున నట్టివారి పెండ్లి కాలమున నిట్టి శుభ చిహ్నములు పొడసూపెను. ఇట్లు నృత్తగీతవాదిత్రధ్వనులు నలుఁగడల వ్యాపింపఁగా నతిశయతేజస్సుల వెలుంగు నాసోదరులు స్వస్వాగ్నిహోత్రములకు వలగొని పెండ్లియాడిరి. అంత వధూరత్నములతో నా పెండ్లికొమరులు విడిదియిండ్లకుం జనిరి. దశరథుఁడు భార్యలంగూడియున్న కొడుకులంగాంచి నేత్రానంద మపారముగా ననుభవించుచు వారివెనుక మహర్షు లంగూడి పోయెను.

మహాశయులారా! సీతాకళ్యాణము జగత్కళ్యాణము. ప్రకృతిపురుషులకు వివాహమయ్యె ననఁగా నభిప్రాయ మేమి? ఇరువురు లోకకళ్యాణకార్యములను జేయ మొదలిడిరనియు, భగవంతుఁడు సగుణుఁడై ప్రకృతివశంగతుఁడై చేయఁదగుపను లను బ్రకృతిమూలమునఁ జేయించుచు, సంసారివలెఁ గనఁ బడుచు, సుఖదుఃఖాదిద్వంద్వములననుభవించునట్లు నటించుచు, నిర్లిప్తుఁడై సాక్షిమాత్రుఁడై యుండుననియు మన మూహింప వలయును. లోకదృష్టిని బరికింపఁగా సీతారాములు క్రొత్తగా నొకరినొకరు చూచినట్లు నటింతురుగాని యాదిమదంపతులే యనియు, లోకులకు సదాచారములను బోధింప నిట్లు కార్య ములను జేయుదురనియు నెఱుంగందగును.

"పరస్పరతపస్సంపత్ఫలాయితపరస్పరౌ
ప్రపంచమాతాపితరౌ ప్రాంచౌ జాయాపతీ స్తుమః."

అన్న ప్రాచీనోక్తి వ్యర్థమగునా?

"రాఘవత్వే భవేత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని"

అన్నదియుఁ గలదుకదా.

"ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్. ౧౯
కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే
పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే. ౨౦
పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్
కారణం గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు. ౨౧
ఉపద్రష్టానుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః. ౨౨
య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే." ౨౩

(గీత. ౧౩ అధ్యా)

అనుగీతావాక్యములు ప్రకృతిపురుషమహత్త్వమును వారి ప్రవృత్తిని బోధించుచున్నవి ఏకాలమున నేకార్యము తా మాచరింపఁదగునో యప్పుడెల్ల నవతరింతురు. ఇరువురు నొకప్పు డవతరింతురు. ఒక్కరే యవతరింతురు. ఎట్టు లవతరించినను వారిద్దఱకు నవినాభావసంబంధము గలదు. చంద్రునుండి వెన్నెల నెడఁబాపఁజాలనియట్లు పురుషునుండి ప్రకృతి నెడఁ బాపఁజాలరు. కావుననే "అనాదీఉభావపి" అని శ్రీకృష్ణమూర్తి పలికెను. ప్రకృతికే శక్తి యనిపేరు. ఆశక్తి నారాధించువారే శాక్తులు. మధ్వవైష్ణవులు శాక్తుల నాక్షేపింతురు. అనఁగా గభవంతునే వా రాక్షేపింతురనికదా భావము. ఎంత యజ్ఞా

నము!! సీతారాములుగాఁ బ్రకృతిపురుషు లవతరించిరన్న సంత
సింతురు. రుక్మిణీశ్రీకృష్ణులుగా నవతరించిరన్న నానందింతురు.
పార్వతీపరమేశ్వరులుగా నవతరించిరన్న మోము చిట్లింతురు.
కాన వారికి భగవత్తత్త్వమన నేదో తెలియదు. ఇఁక వారిం
గూర్చి యేమి చెప్పిననేమి? శవజాగరణమువంటిది. దాసులమని
యోగులమని మాంత్రికులమని యింక నెన్నియో పేరులు
పెట్టుకొన్న నేమిలాభము? వారాత్మద్రోహులు, జగద్వంచ
కులు, ధనదాసులు నగుదురు. వారలకంటెఁ బామరు లుత్త
మోత్తములు.

ఇపుడు శ్రీరామచంద్రుఁడు ప్రకృతిని లోకులెఱుంగు
నట్లు కూడెను. ఇపుడు గృహస్థులకు సదాచారముల నేర్పఁ
జాలును. తనప్రవర్తనమే స్మృతులు పురాణేతిహాసము లగు
నట్లు వాని ననుసరించి ప్రవర్తించువారు తరించునట్లు చేయఁ
బూనును. గృహస్థాశ్రమ ముత్తమోత్తమమని స్మృతులు
తెలుపునుగదా. ఎట్లు? అన్న ప్రశ్నమునకు సమాధానము
వినుఁడు. కొందఱవివాహమునందుఁ బాణిగ్రహణము చేయఁ
బడినది ఇది క్షత్రియజాత్యుచిత ధర్మముకాదనియు శరగ్రహ
ణమే యుచితమనియుఁ బ్రశ్నింతురు. అయ్యది పొరపాటు.
క్షత్రియకన్య విప్రుని వరించునపుడాధర్మమని స్మృతి తెలుపు
చున్నది.

"పాణిగ్రహణసంస్కారస్సవర్ణాసూపదిశ్యతే
అసవర్ణాస్వయం జ్ఞేయో విధిరుద్వాహకర్మణి. ౪౩
శరః క్షత్రియయా గ్రాహ్యః ప్రతోదో వైశ్యకన్యయా
వసనస్య దశా గ్రాహ్యా శూద్రయోత్కృష్టవేదనే." ౪౪

మను. ౩ అధ్యా.

అసవర్ణవివాహమునందుఁ బాణిగ్రహణసంస్కారము లేదని యెఱుంగందగు.

"యథా వాయుం సమాశ్రిత్య వర్తంతే సర్వజంతవః
తథా గృహస్థమాశ్రిత్య వర్తంతే సర్వ ఆశ్రమాః. ౭౭
యస్మాత్త్రయోఽప్యాశ్రమిణో జ్ఞానేనాన్నేన చాన్వహం
గృహస్థేనైవ ధార్యంతే తస్మాజ్జ్యేష్ఠాశ్రమో గృహీ. ౭౮
స సంధార్యః ప్రయత్నేన స్వర్గమక్షయమిచ్ఛతా
సుఖం చేహేచ్ఛతా నిత్యం యోఽధార్యో దుర్బలేంద్రియైః. ౭౯
ఋషయః పితరో దేవా భూతాన్యతిథయస్తథా
ఆశాసతే కుటుంబిభ్యస్తేభ్యః కార్యం విజానతా. ౮౦
స్వాధ్యాయేనార్చయేతర్షీన్ హోమైర్దేవాన్యథావిధి
పితౄన్ శ్రాద్ధైశ్చ నౄనన్నైర్భూతాని బలికర్మణా. ౮౧
కుర్యాదహరహః శ్రాద్ధమన్నాద్యేనోదకేన వా
పయోమూలఫలైర్వాపి పితృభ్యః ప్రీతిమావహన్. ౮౨
శునాం చ పతితానాం చ శ్వపచాం పాపరోగిణాం
వాయసానాం కృమీణాం చ శనకైర్నిర్వపేద్భువి." ౯౨

(మను 3 అధ్యా.)

సకలాశ్రమములకు నాశ్రయము గృహస్థాశ్రమము కావున నుత్తమమని స్మృతులెల్ల నొక్కరీతి బోధించుచున్నవి కావున నట్టి గార్హస్థ్యము నవలంబించి శ్రీరామచంద్రుఁడు లోకుల కుపకారము చేయఁబూనెనని మన మెఱుంగవలయు. జనకుఁ డయోనిజయగుసీతను లోకాచారమును బాటించి కన్యాదానము చేసెనని మన మెఱుంగవలయు. సీత భూజాతయనఁగా నోర్పు ప్రదానముగాఁగలది యని తెలిసికొనవలయు. సర్వంసహాకదా

భూమి. అట్టి భూమినుండి యావిర్భవించినకతన సకలప్రపంచ ధారిణియగు మూలప్రకృతియే సీతయని తేటపడును. యోగి మానసములఁ గ్రీడించువాఁడు కావున రామనామమున భగవంతుఁడు వెలసెనని మనము తెలిసికొనవలయును. యోగిమానసధ్యేయుఁడు రాముఁడు సకలలోకభరణస్వభావ సీతయనియే యిటఁగలసారము.

"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా"

అనుభగవదుక్తి ననుసరించి సత్త్వరజస్తమోగుణమయి ప్రకృతియని తేలును రజస్సత్త్వతమోగుణ ప్రధానములు సృష్టిస్థితిలయకార్యములు. వాని కధిపతులు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు. వీరు మువ్వురు ప్రకృతిసంభూతులు. ప్రకృతియగు భగవంతు నిచ్ఛాశక్తి భగవంతుఁడు తలంచినంతన రూపమునుదాల్చి యాకార్యములను క్షణమాత్రమున నిర్వహించును. ఈత్రిమూర్తులు ప్రతిబ్రహ్మాండమునకుం గలరు అనేక బ్రహ్మాండములు గలవు కావున బ్రహ్మ యొక్కఁడని మనమూహింపరాదు. తక్కనవారు నట్లే బ్రహ్మాండనాశనము కాఁగా వీరు నశింతురు. భగవంతుఁ డొక్కఁడే యక్షరుం డగుట నిలుచు ప్రకృతిరూపముగలది కాదు. ఇచ్ఛయే కానభగవంతుని యందే యుండును. వారిరువురకు భేదముగలదని పలుక బ్రహ్మకును దరంబుగాదు. "విద్ధ్యనాదీ ఉభావపి" అని శ్రీకృష్ణమూర్తియే తెలిపెఁగదా. అట్టి ప్రకృతిపూరుషు లిపుడు లోకమునకు ధర్మప్రవర్తనము నుపదేశింప స్త్రీపుంరూపముల వెలసిరనుటయే యిటఁగలసారము. అట్టి యనాదిదంపతులకు వివాహ మనఁగా నర్థమేమి? ఆపద్ధతిగా లోకులు పరస్పరప్రేమవంతులై

సత్కార్యముల నొనరింప బద్ధకంకణులు కావలయుననియే యీవివాహము సాగెననికదా గ్రహింపం దగువిషయము. అట్లు గ్రహించినంగాని రామాయణము పారాయణముచేసిన ఫలింపదు. రాముఁడు భార్యను గోలుపోయి శోకించెనన్న నేమి లాభము కలదు? దేవాలయములలోవిగ్రహములకు వివాహము ప్రతియేట సాగించుట మానవులకు విస్మృతిగాకయుండ నా సదాచారము నొనరింపఁదగు ననుటకాక మఱెందులకు? ఈ విషయము తేటపడంజేయు శ్లోకము వాల్మీకిమహాకవియే చెప్పెను.

> "ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ
> ప్రతీచ్ఛ చైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా.
> పతివ్రతా మహాభాగా ఛాయేవానుగతా సదా"

దీనికింగల యర్థములన్నియు నిట వ్రాయఁబూనను. పైభావమును దెలుపునర్థమునే వ్రాయుదును. సీత రాముని కెదుట నిలిచియుండెను.జనకుఁడు కన్యాదానముచేయుచు నిట్లుపలికెను. జనకచక్రవర్తిమహాజ్ఞాని. మునీంద్రులకు నుపదేశించువాఁడు. ఎందఱోమును లామహాత్ముని బరీక్షించి త్రికాలవేత్తయని యంగీకరించిరి అట్టివాఁడు కన్యాదానముచేయుచుఁ బలికిన మాట లెంతభావగాంభీర్యము గలిగియుండునో పెద్ద లూహింపందగుదురు. శ్రీరామచంద్రునియమానుషమహత్త్వములను విశ్వామిత్రుఁడు కూడఁ దెలిపెను. కావుననే యిందుఁ బైవ్రాసినయభిప్రాయముగలదని యిటఁ బొందుపఱచుచున్నవాఁడను. రాముఁడు సీతనెదుటనున్నదానిం గాంచుచునే యున్నవాఁడు. ప్రతిగ్రహించు శ్రీరామమూర్తి భగవంతుఁడు. ప్రతిగ్రహింపఁ

దగుకన్యక మూలప్రకృతి మహామాయ. దానముచేయువాఁడు జ్ఞానధనుఁడు ఇట్టితరుణమున నెట్టిమాట లుండునో యోజింపుఁడు.

ఓ రామచంద్రా! కౌసల్యానందవర్ధనుఁడవు. అనఁగా నదితి కౌసల్యగా నవతరించినది. ఆమెకు నానందము నుప్పొంగఁజేయువాఁడవు. మానవలోకమున నవతరించినను నాకడుపుననే పుట్టినాఁడు. నాయం దెంతవాత్సల్యము కలదు? అని యామె యానందించుచుండునని భావము. యోగి మనఃపద్మముల విహరించువాఁడవు. ఇట్టి నీవు అని జనకమహర్షి సంబోధించుచున్నాఁడు. ఇయం సీతా! నీపురోభాగముననున్న యీసీత. అనఁగా భగవదారాధనముచేయుటకు స్వర్ణలాంగలమున నేనే భూమిని దున్నుచుండఁగా నాచాలునుండి వెలువడినది. కావున నయోనిజయే యగును. ఎప్పుడు పుట్టినది? ఎట్లు? వయస్సెంత? అనువిచారము చేయందగినయవసరమే లేదని తాత్పర్యము. నీకొఱకుగా నవతరించినమహాలక్ష్మిగాని మఱొకర్తుక గాదని సారము. "మమ సుతా" నాకూమరిత. నాయదృష్టము వర్ణనాతీతము. నాగలిచాలునుండి నాకే కనఁబడినది. నాపుణ్యమేమందును? నీపాదములుగడిగి కన్యాదానముచేయునంతసత్కర్మము నాచరించితినిగదా.

"దశపూర్వేషాం దశాపరేషాం మద్వంశ్యానాం పితౄణాం నరకాదుత్తీర్య శాశ్వతబ్రహ్మలోక నివాస సిద్ధ్యర్థం."

అన్నసంకల్పమునఁ గన్యాదానము చేయుచున్నాఁడ నే అని జనకుఁ డుబ్బుచున్నాఁడని పాఠకులు గ్రహింపందగు.

"బ్రాహ్మాదిషు వివాహేషు చతుర్ష్వేవానుపూర్వశః
బ్రహ్మవర్చస్వినః పుత్రా జాయంతే శిష్టసమ్మతాః.

రూపసత్త్వగుణోపేతా ధనవంతో యశస్వినః
పర్యాప్తభోగా ధర్మిష్ఠా జీవంతి చ శతం సమాః." ౪౦

(మను 3 అధ్యా.)

అన్న స్మృతిప్రమాణము ననుసరించియీవివాహము బ్రాహ్మ్యము లోకోపకారపరాయణులు మహాతేజశ్శాలురు కుమారులు గలుగుదురు. అట్టి మహోపకారము లోకమున కీకన్యాదానమువలన గలుగును అన్న భావము "మమసుతా" యన్న వాక్యమువలనఁ దేటపడుచున్నది. లేకున్న "సూతీతి సుతః" అన్న సమాసము ననుసరించి "సుతా" అని జనకుఁడు వచింపరాదుకదా. కావున నే పై భావము కలవాఁడయ్యెనని మన మూహింపవలయు. "సహధర్మచరీతవ" రామా! నీ కీసీతాదేవి 'సహధర్మచరి' కాఁగలదు. మీయిరువురకుంగలయవినాభావసంబంధము సార్థకము కాఁగా ధర్మకార్యములను నిన్నుఁగూడియే చేయును.

"ధర్మాః పుణ్యయమన్యాయ స్వభావాచారసోమపాః" అని అమరము.
"ధర్మః పుణ్యే యమే న్యాయే స్వభావాచారయోః క్రతౌ
"ఉపమాయామహింసాయాం కాస్తుకే చ నిగద్యతే" విశ్వప్రకాశము.
"......ధర్మోఽస్త్రీ పుణ్యే సామాన్యభావయోః
చాపన్యాయాధ్వరాహింసా యజ్వాచారయమేషు వా"

(నానార్థరత్నమాల.)

అన్న యర్థములలో నేయేయర్థము లీయవతారమున సార్థకము చేయవలయునో యాకార్యము లన్నియు నిన్నుఁగూడియే యొనరించునని భావము. నిన్నెడఁబాయదు. తాఁజేయఁదగు కార్యములనెల్లఁ గొఱఁతపడకయుండఁజేయును. నీనిర్లిప్తత్వమునకు నించుకయు నపాయము కలుగనీయదు. నీవు సర్వసాక్షి

వికదా. దాని నెఱింగినదికాన నీయిచ్ఛ ననుసరించి యెల్ల పనులు తానే యొనరించును. నీవు రూపవంతుఁడవగుట నామె వలననేకదా నీ వానందించుచుండఁ దానే సర్వధర్మముల నొనరించునని సారము.

"త్వదన్యః పాణిభ్యామభయవరదో దైవతగణ
స్త్వమేకా నైవాసి ప్రకటితవరాభీత్యభినయా
భయాత్త్రాతుం దాతుం ఫలమపి చ వాంఛాసమధికం
శరణ్యే లోకానాం తవ హి చరణావేవ నిపుణౌ. ౪

హరిస్త్వామారాధ్య ప్రణతజనసౌభాగ్యజననీం
పురా నారీ భూత్వా పురరిపుమపి క్షోభమనయత్
స్మరోఽపి త్వాం నత్వా రతినయనలేహ్యేన వపుషా
మునీనామప్యంతః ప్రభవతి హి మోహాయ మహతామ్. ౫

అన్న శంకరాచార్యకృతస్తుతి పై వ్రాసిన యభిప్రాయమును దేటపఱచుచున్నది. ప్రకృతింగూడిననేకదా భగవంతునకు రూపము. ఏసమయమున భగవంతున కేరూపము కల్పింపవలయునో ఆరూపము నాప్రకృతియే కల్పించును. అనఁగా భగవంతుఁడు తలఁచినంతనే రూప మలవడునని యిటఁ గలరహస్యము.

అంబా.— "స్వతంత్రాహం సదా దేవాస్స్వేచ్ఛాచారవిహారిణీ
మమానురూపచరితో భవితా తు మమ ప్రియః. ౧

బ్రహ్మ.— త్వమేవాసి పరబ్రహ్మప్రకృతి స్సాత్వమేవ హి
త్వమేవానాదిరఖిలా కారణాకారణాత్మికా. ౨
త్వామేవ హి విచిన్వంతి యోగినస్సనకాదయః
సదసత్కర్మరూపాం చ వ్యక్తావ్యక్తోదయాత్మికాం. ౩

త్వామేవ హి ప్రశంసంతి పంచ బ్రహ్మస్వరూపిణీం
త్వమేవ హి సృజస్యాదౌ త్వమేవ హ్యవసి క్షణాత్. ౧౦
త్వమేవ భూయో హరసి విదధాసి మహేశ్వరి
తస్మాత్సాధకం త్వ్యైనాశస్తే న భవేత్ప్రియసంగమాత్. ౧౧
భజస్వ పురుషం కంచిల్లోకానుగ్రహకామ్యయా
ఇతి విజ్ఞాపితా దేవీ బ్రహ్మణా సకలైస్సురైః." ౧౨

లలితోపాఖ్యానము ౧౦ అధ్యా.

అను నీహయగ్రీవవాక్యములు ప్రకృతియే స్త్రీపుంరూపముల వెలయుననని తేటపఱచుచున్నవి.

"సత్వం త్రిలోకస్థితయే స్వమాయయా
బిభర్షి శుక్లం ఖలు వర్ణమాత్మనః
సర్గాయ రక్తం రజసోపబృంహితం
కృష్ణం చ వర్ణం తమసా జనాత్యయే." ౨౦

(శ్రీమద్భాగవతము. ౧౦ స్కం. 3 అధ్యా.)

"భగవానపి విశ్వాత్మా విదిత్వా కంసజం భయం
యదూనాం నిజనాథానాం యోగమాయాం సమాదిశత్. ౬
గచ్ఛ దేవి వ్రజం భద్రే గోపగోభిరలంకృతం
రోహిణీ వసుదేవస్య భార్యాస్తే నందగోకులే. ౭
అన్యాశ్చ కంససంవిగ్నా వివరేషు వసంతి హి. ౮
దేవక్యా జఠరే గర్భం శేషాఖ్యం ధామమామకం
తత్సన్నికృష్య రోహిణ్యా ఉదరే సన్నివేశయ." ౯

(భా. ౧౦ స్కం. ౨ అధ్యా.)

మాయామూలమున భగంతుఁ డెల్లకార్యములు చేయుచుండు నని తేటపడలేదా. ప్రకృతి సర్వకార్యముల నాపరాత్పరు

నాజ్ఞఁబూని యొనరింప సమర్థురాలనుటయే యీప్రమాణముల సారము. ఈయభిప్రాయమంతయు "సహధర్మచరీ తవ" అన్న వాక్యమున నిమిడియున్నది.

"ఏనాం ప్రతీచ్ఛ" ఈసీతను గ్రహింపుము. ఏతచ్ఛబ్దముచే మరల రామచంద్రున కీసీతను నీమాయాదేవినే అని స్మృతికిఁ దెచ్చుచున్నాఁడు. "గ్రహింపుము" అనఁగా నలువురు చూచుచుండఁ బరిగ్రహించినట్లు నటింపుము మాకేటిపెండ్లి అని సంశయింపకుము. ఇది లోకాచారము. దీనిం బాటింపుము. మీదాంపత్యమును జూచి నలువురు సదాచారములను నేర్చుకొందురని జనకునియాశయము. "భద్రం తే" నీకు మేలు గలుగును. జగన్మంగళమేకదా నీమంగళము. ఈవివాహమున జగములకు మేలుకలుగును. అదియే నీకు మంగళము. ఈప్రకృతిని (మహాలక్ష్మిని) గూడిన నీవలన లోకములకు మేలు కలుగును. పాణిం గృహ్ణీష్వ పాణినా" నీకరమున నీసీతాకరమును బట్టుకొనుము. మన మిరువురము కలిసియే యీభూభారమును బాపుటకుఁ బ్రయత్నింపందగు మన యీ రెండు చేతులకుం గల వ్రేళ్లు పది కనుకఁ బదితలలుగల రావణుం బొలియింపవలయు నను నభిప్రాయము నాదిగా గ్రహింపుము అని తెలుపుటకే యీపాణిగ్రహణమని యూహింపవచ్చును. ఎల్లవారు నిట్లే పాణిగ్రహణము చేయుదురుకదా. అప్పు డేమియర్థము? అని ప్రశ్నింతురుకాఁబోలు. సీతారాములు కలిసి కార్యములు సమర్థులై చేసినట్లే భార్యాభర్తలు ఐకమత్యముకలిగి కార్యములు సాగింపవలయునని గ్రహింపవలయునని సమాధానము. ఎల్లవారు సీతారాములే యైన నట్లే గ్రహింపవచ్చును. వరుఁడు

తనకుడి చేతితోఁ గన్యకకుడి చేయిని గ్రహించును. స్త్రీలకు సవ్యహస్తము ప్రధానమేయైనను దానిని వరుఁడు పట్టుకొనఁడు. భర్త యనుమతినొందియే కార్యములు నడుపందగు ననుభావ మిట నిమిడియున్నది. భార్య భర్తహస్తమును బట్టుకొనదుకదా. కనుకనే పైయర్థ మిందుఁ గలదని మన మూహింపవచ్చును.

"పతివ్రతా" రామా! ఈసీత పతివ్రత; పతియే వ్రతముగాఁ గలది. నీ వేయేయవతారముల నవధరింతువో యా యాయవతారముల నీమెయు భార్యగా నగును. నిన్నెప్పుడు నెడఁబాయదని భావము. "మహాభాగా" అదృష్టముగల వారలలో నీమెయే యుత్తమురాలు. శాశ్వతుఁ డద్వితీయుఁ డచింత్యమహిముఁడు సర్వజ్ఞుఁడునగు నీవు భర్తయగుటకంటె నదృష్ట మేమికావలెను? ఇంకొక్కవిశేషార్థము కలదు. నీవు చేయుకార్యములలోఁ గొంతభాగమే కాదు. గొప్పభాగ మీమెయే గైకొనును. నీవు తలంచుట. ఆతలంపును దాను నిర్వహించుటంజేసి యధికభారము నీప్రకృతియే వూనుననియే యిటఁ గలరహస్యము. "ఛాయేవానుగతా సదా" నీడవలె నిన్ననుసరించి యెల్లప్పు డుండును. చంద్రాతపసూర్యాతపములు లేనితఱి ఛాయ కనఁబడదు. కాని ఛాయ లేక యుండకపోదు. ప్రకృతి యితరులకుఁ గనఁబడకయున్న నిన్ను నెడఁబాయదు. ప్రకృతి లేక నీ వుండఁజాలవు. నీవులేక ప్రకృతి యుండఁజాలదు. అవినాభావసంబంధము మీకే కలదు. కావున నీ వీ సీతంగూడి యవతారఫలమును గల్గింపుమా యని పలికి కన్యాదానము చేసెను.

దాన మనఁగా "స్వస్వత్వనివృత్తిపూర్వకపరస్వత్వోత్పాదనత్వం దానత్వమ్" తనకుఁగల బాధ్యతను వదలుకొని యితరున కాబాధ్యత నావస్తువునందుఁ గల్పించుట యని యర్థము.

"స్వస్వత్వత్యాగానుకూలవ్యాపారః" సర్వతంత్రసిద్ధాంత పదార్థలక్షణసంగ్రహమున వ్రాయఁబడినది. ఈయర్థము కన్యాదానమునకుఁ జెల్లదు. కన్యకయందుఁ దండ్రికిఁ గలబాధ్యత తొలంగదు. కనుకనే

"ఇదం తుభ్యమహం సంప్రదదే న మమ" అని దాన కాలమునఁ గర్త చెప్పును. "న మమ" అనఁగా నాకు లేదు. ఏవి బాధ్యత. అని దానము చేయవలెను. కన్యాదానకాలమున "న మమ" అని పలుకరాదు. ఇదియే యన్నిదానములకుఁ గన్యాదానమునకుం గలభేదము. సత్ప్రవర్తనము కలుగునట్లు దండించుట కధికారము తండ్రికింగూడఁ గలదని మన మెఱుంగవలయును. ఈదానమున నిరువదితరమువారు పితరులు గతగమ్యకాలమువారు కర్తతోఁగలిపి యుత్తమలోకముల కరుగఁజాలుదురు. ఇట్టి మహాదానముచేసి జనకుఁడు కృతకృత్యుఁడయ్యెను. ఆదంపతులపైఁ బూలవానలు కురియించిరి. ఇఁక దేవతలగుండెలు కుదుటఁబడునని వారలు నమ్మిరి. మునులకుఁ దపోవిఘ్నములు పొసంగవని వా రానందించిరి. లోకుల కెల్ల నిఁక దుష్టులవలన బాధ లుండవని యెల్లరు సానందించిరి. ఇఁక సీతారామచంద్రులు ప్రపంచక్షేమము నొడఁగూర్పఁ బ్రయత్నింతురు. తరువాతికథ నవధరింపుఁడు.

## శ్రీరామపరశురాములసమాగమము.

* మహోత్సవములతో నారేయి గడచెను. విశ్వామిత్రుఁడు జనకదశరథుల నామంత్రణముచేసి తనపయనము నెఱిఁగించి సోదరులను దత్పుత్త్రుల నాశీర్వదించి యుత్తరదిక్కునందు దానివసించియున్న హిమాలయమున కరిగెను. కౌశిక మహర్షి తనకృత్యము నిర్వర్తించి తపోవనమునకుం బోవఁగా దశరథుఁడు సపుత్త్రపరివారుఁడై జనకు ననుమతింబడసి యయోధ్యకుఁ బయనముసాగించెను. అట్లు వారు పయనము సాగించుచుండఁగా నాచారము ననుసరించి సాగనంపివచ్చుటకై జనకుఁడు దశరథుని వెంబడించెను. ఆభూపతి తన కొమరితలకు వరణము గొప్పగా నీయఁబూని పెక్కులక్షల గోవులను, మంచికంబళములను, మంచికౌశేయములను, సాలంకృతములగు రథగజహయపదాతులను, దాసదాసీజనంబు నొసంగెను. పరమానందమున నసంఖ్యాకములగు స్వర్ణరజత ముద్రికలను మౌక్తికప్రవాళములను గన్యాధనముగ నిచ్చెను. ఇట్లు విభవానుసారమొసంగి దశరథుచే ననుజ్ఞాతుఁడై యమ్మిథిలాధిపతి స్వస్థానమునకు మరలెను.

అయోధ్యాధీశుఁడు దశరథుఁడు చతురంగబలములు కొలుచుచుండఁగాఁ గుమారులను ఋషులను బురస్కరించుకొని నిజపురమునకుఁ బోవుచుండెను. ఆతనిదిక్కుగా నాకసమునఁ బక్షు లమంగళసూచకముగా భయంకరముగాఁ గూయసాగెను భూమియందుఁగూడ మృగము లాతనికిఁ బ్రదక్షిణముగాఁబరుగిడి మంగళమును దెలియఁజేసెను. ఆశకునములను

* ఇయ్యది డెబ్బదినాల్గవ సర్గమునుండి గ్రహింపఁబడినది.

జూచి దశరథుఁడు వసిష్ఠమునితోఁ గ్రూరపతత్త్రులు భయము గలుగఁ గూయుచున్నవి మృగములు ప్రదక్షిణక్రమమునఁ జరించుచున్నవి. అశుభచిహ్నములు శుభచిహ్నములుగూడఁ గనఁబడుచున్నవి దీని కేమికారణమో తెలియక నామనస్సు కలఁతనొందుచున్నది. ఇదమిత్థమని నిశ్చయింపఁజాలని నామనస్సు దుఃఖమునకు లోనైనది ఎఱింగింపుమా. అని యడుగ నమ్మాట లాలకించి మౌనిపతి మధురభాషణముల నోభూపతీ! దీనఁ గలుగుఫలముల నిర్వచింతును. ఆలకింపుము. ముందు మన కతి దారుణభయము గలుగఁగలదని యాకసమునఁ బక్షులరుతములు తెలియఁజేయుచున్నవి. భూమియందో మృగము లాభయము శాంతించునని సూచించుచున్నవి. కావునఁ బరితాపము వదలు కొమ్మా యని బోధించెను.

వారిరువురు నందు నట్లు సంభాషించుచుండఁగా వాయువు భూతలమెల్లఁ గంపింప భూరిభూరుహములు పడఁగా వీచెను సూర్యుని నంధకారము లాచ్ఛాదించెను. దిక్కులు తెలివితప్పెను. పరాగ మెల్లయెడల నావరించెను. దాన నారాజు సేనలు కలఁతనొందిన ట్లుండెను. అత్తఱి వసిష్ఠాదిమహర్షులు, రాజును, దత్సూనులుమాత్రమే యథాప్రకార స్మృతిగలిగి యుండిరి తక్కుంగలవారెల్లఁ దెలివితప్పియే యుండిరి. గాఢాంధకారము వ్యాపింపఁగా నాసేనలు భస్మాచ్ఛాదితము లైన ట్లుండెను. అత్తఱి నతిభయము కలిగించుచు జటామండల ధారియై పరశురాముఁ డరుదెంచెను. భృగువంశాలంకారుఁడై జమదగ్నికింగుమారుఁడై సార్వభౌములం గూడఁ జించి చెండాడి మించిన పరాక్రమమున విఖ్యాతినొందినవాఁ డా పరశు

రాముఁడే. కైలాసమువలె నప్రధృష్యుఁడు, ప్రళయాగ్నిం బోలి యసహ్యప్రతాపవంతుఁడు. మహాతేజస్వి. ఎవ్వారికిఁ దేఱి చూడరానివాఁడు. భుజశిరస్సునఁ బరశువును దాల్చి విద్యుత్తతి వలె స్వీయతేజము దుస్సహమై వెలుంగ ధనుస్సు తీవ్రబాణములు కరములం గనఁబడఁగాఁ ద్రిపురములఁ గూల్చిన యీశ్వరుఁడో యనఁ గనుపట్టుచుండెను.

నిరంతరజపతపములు సలుపుచు మహాత్ములగు వసిష్ఠాది బ్రహ్మర్షులందఱు భూరిభయంకరుఁడై యగ్నివలెఁ బ్రజ్వరిల్లుచున్న యారాముని దిలకించి యొకటిగాఁ జేరి పరస్పరము పరశుధారియగు నీరాముఁడు తనజనకుని వధించిరని క్షత్రియులందుఁ గోపమూనియే యుండును. ఇపుడుకూడఁ బూర్వము వలె రాజులం బొలియింపఁడుకదా. పూర్వము రాజులనెల్లఁ జంపిచంపి కోపతాపములు మానియున్నాఁడు. కాన మరల వారిం జంపఁడు. అనియిట్లు గుసగుసలాడుకొనిరి. ఇట్లు వారనుకొనుచు నర్ఘ్యముం గొని యాతని నెదుర్కొని రామా ! రామా ! అని పిలుచుచు మధురభాషణములఁ బూజించిరి. పరశురాముఁ డాపూజనంగీకరించి దాశరథిం గని యిట్లనియె.

మహాశయులారా! విశ్వామిత్రుఁడు భగవంతుని సేవించి కృతార్థుఁడై తపస్సునకుం బోయెను. శ్రీరామచంద్రుని సీతాసమేతునిగ నొనరించుటకే యాతని ప్రయత్నము. కొలఁదిదినములు కూడనుండి యాదివ్యమంగళవిగ్రహమును గన్నుల ఫలముగాఁ దిలకించి నిరంతరధ్యానము చేయుచుఁ బ్రకృతిం గూడినఁగాని ప్రపంచోపకారము బహుతరముగాఁ జేయఁ జాలఁడని యెఱింగినవాఁడు కావున "నిమిత్తమాత్రం భవ సవ్య

సాక్షీ" అన్నయట్లు తానుండి యాజగన్మంగళకార్యము సాగఁగా నిఁక నీపరమపురుషుఁడు సాక్షిమాత్రుఁడై యుండఁగా మహామాయ యగు సీతాదేవి రామసాన్నిధ్యమున సర్వకార్యముల నశ్రమమునఁ దీర్చునని తలంచి వారిరువురను గన్నుల పండువుగాఁ జూచి యిఁకఁ దనవలన లోకములకుఁ గావలసిన కార్యము లేదుగాన నేకాంతమునఁ గూరుచుండి వారి యా కృతులను ధ్యానించుకొనుచు నామహానందము ననుభవింపఁ గోరి విజనమగు హిమాలయమునకుఁ బోయెను.

తానే యావివాహమునకుఁ బ్రధానహేతువు కదా. అట్టి తానాదంపతులకడ నుండక హిమాలయమున కేల విశ్వామిత్రుఁడు పోయెనని ప్రశ్నించుకొందము.

> "యోగీ యుంజీత సతతమాత్మానం రహసి స్థితః
> ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః. ౧౦
> శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః
> నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరం. ౧౧
> తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః
> ఉపవిశ్యాసనే యుంజ్యాద్యోగమాత్మవిశుద్ధయే." ౧౨
>
> (గీత. ౬ అ.)

> "యో యో యాం యాం తనుం భక్త్యా శ్రద్ధయార్చితుమిచ్ఛతి
> తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహం. ౨౧
> స తయా శ్రద్ధయా యుక్తస్తస్యారాధనమీహతే
> లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్." ౨౨
>
> (గీత ౭ అధ్యా.)

అన్న శ్రీకృష్ణోపదేశము ననుసరించి యోగి యేకాంతముగఁ గూరుచుండి పరాత్పరుని హృదయకమలాంతరాసీనునిగా నొనరించి ధ్యానించును. ఏరూపమునైనను ధ్యానింపవచ్చును. కాని పరాత్పరునకు స్వాభిమతమగురూపమును గల్పించుకొని శ్రద్ధగలిగి ధ్యానము చేయవలెను. ఆరూపముననే పరమేశ్వరుఁడనుగ్రహించును. రూపకల్పనము ధ్యానార్థమే కాని వేఱుగాదు. ఇదియే యోగులమతము మానవరూపమున భగవంతుఁడుచితకార్యములను జేయఁబూనును. ఇఁకఁ దనతోఁ బనిలేదు. ఇఁకఁ దాఁ జేయఁదగుపని భగవద్ధ్యానమే అందులకు నిర్జనారణ్యమర్హము. కావుననే విశ్వామిత్రుఁడు పరమేశ్వరీపరమేశ్వరులకు లోకదృష్టిచే సంబంధమును వివాహరూపమునఁ గల్పించి వారిఁదలంచుచుఁ బోయెను. ఇది యోగికృత్యము.

కొందఱు మధ్యవైష్ణవులు పాషాణనిర్మితదేవాలయములలో శిలావిగ్రహములను బ్రతిష్ఠించి, త్రికాలనైవేద్యములర్పించుచుఁ, బూజ మానినను నైవేద్యములను మానక యర్పించుచుఁ, గుక్షినిండ భక్షించుచు, శిష్టాన్నము నమ్మి ద్రవ్యము గణించుచు, నావిగ్రహమే సదా పూజింపఁదగినదని బోధించుచు, ముక్తినొసంగునని యుపదేశించుచుఁ గాలము గడపుచుండుట కన్నులారఁ జూచుచున్నారము. అది కేవల పామరులకుఁ గాని యితరులకుఁ గాదన్న వారు మండిపడుదురు. నిత్యోత్సవములు సాగించువారల కాజన్మము తొలిజన్మమే యనవలెను. ముక్తిదొరకదుగాని ధనవిముక్తిమాత్రము కలుగును. భక్తులగువారు వారికపటభాషణములకు లోఁబడక యుండఁదగు. శిలాపూజయే పురుషార్థము నీఁజాలదు. లోలుత

దానిఁ బూజించి యారూపమును మదింజేర్చి ధ్యానించి క్రమక్రమముగా మానసికపూజకలవాటు పడవలెనని మన కీ విశ్వామిత్రచరిత్రము బోధించును. ఇంతమహిమముగల కౌశికుఁడు దేవాలయము నేల కట్టింపలేదు? పామరుఁడు కాఁడు కనుకనే యని బదులీవలయును. ఎంతకాల మీ దేవాలయముల యుత్సవములపైఁ బ్రీతియుండునో యంత దనుక వాఁడు పామరుఁడే యనవలయును. పెద్దలుకూడఁ జేయుదురే యనుదురేని వారు పామరుల కుపదేశించుట కొఱకే యని యెఱుంగవలయు.

"సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత
కుర్యాద్విద్వాం స్తథాఽసక్తశ్చికీర్షుర్లోకసంగ్రహం." ౨౫
(గీ 3 అధ్యా.)

అన్న భగవద్గీతావాక్యమే పైభావమునకుఁ బ్రమాణము. కావున బుద్ధిమంతులు భగవంతుని బాషాణరూపుఁడని భావింపక తేజోరూపునిగా ధ్యానించి కృతార్థు లగుదురుగాక.

పరశురాముఁడు శ్రీరామునిరాక నెఱింగియే వచ్చెను. భగవత్కళ కార్యార్థము రాముని దేహమునఁ బ్రవేశపెట్టఁబడి యుండెను. ఆకార్యము ముగిసెను. దాని నిఁక నందునిచిన లాభములేదు. కాన శ్రీరామునిలోఁ జేర్పవలెను. ఆవిషయ మితరుల కెఱుకపడరాదు. కావుననే భయంకరాకారమునఁ గన్నులు నిప్పులుగురియుచుండ నరుదెంచెను. శకునములు తుదకు భయములేదని సూచించెను.

"ఉపస్థితం భయం ఘోరం దివ్యం పక్షిముఖాచ్చ్యుతం
మృగాః ప్రశమయంత్యేతే సంతాపస్త్యజ్యతామయం."

ఆకసమునఁబక్షులు భయముగలుగనున్నదని తమపలుకులమూల మునఁ దెలిపెను. భూమియందుఁ గలమృగములు ప్రదక్షిణ ముగాఁబోవుచు మేలుగలుగునని తెలియఁజేసెను. ఈవిషయము ననేకు లాక్షేపింతురు. పక్షుల కింతజ్ఞానముకలదా. మృగముల కింత తెలివికలదా యనియే వారియనుమానము. పాపము! వారలకేమియును దెలియదని మనము విచారింపవలయును.

జలములులేనితావుల నిసుకలో బిలములు చేసికొని కొన్నిపక్షులుండును అవి కదుంజిన్నవి. రెండుదినములలోఁగా వానకురియునట్లైన నవి యందుండక వేఱుతావునకుఁ బోవును. ఆవిధ మెఱిఁగినకృషీవలులు వానవచ్చుననియే నమ్ముదురు. అట్లే వర్షముకురిసి నది ప్రవహింపఁగా నాపక్షు లుండుతావులు జలాక్రాంతములగు. ఈవిషయ మొకపల్లియయందుఁ గలకాపు బాలుఁడు నాకుం దెలిపెను. పరికించితిని. అవి చోటుమార్చిన రెండవదినమే మంచివర్షము కురిసెను. ఆతావులు జలాక్రాంత ములే యయ్యెను. ఈవిషయమున మానవులకంటెఁ బశుపక్షుల కెక్కుడుతెలివి కలదని మన మంగీకరింపవలయును కావున వాల్మీకిమునివర్యుఁ డీవిషయమును మనకుఁ దెలిపెనని మన మూహింపవలయును. ఇఁకఁ గథ నాలకింపుఁడు.

## శ్రీరామపరశురాముల సంభాషణము.

*దశరథరామా! నీ వీర్య మచ్చెరువుగా నెల్లయెడల వినంబడియెడు శివధనుర్భంగము తాటకానిర్మూలనము లోనగు నీకృత్యముల విన్నవాఁడను. శివునిచాప మెక్కడ? నీవెక్కడ? దాని వంచుట యెక్కడ? అచ్చెరువుకాదా. అంతియకాక యది

*డెబ్బదియైదవ సర్గమున నీకథ కలదు.

యిట్టిదని స్మరింప నశక్యముగ నున్నది. ఆవృత్తాంతము నాలకించి మంచిధనుస్సును దీసికొని యిదె వచ్చినవాఁడను. ఆభయంకర చాప మిదిగో. నాతండ్రి దీని నా కొసంగెను. దీన బాణములు సంధింపుము. ఏకీ సీబలమును గనఁబఱుపుము దీని నెక్కు-పెట్టితివేని నీబల మింతమాత్రమని తెలిసికొందును. అప్పుడు కదా నీశౌర్యము మెచ్చుకొనందగును. అత్తటి ద్వంద్వయుద్ధమున కవకాశము గల్గింతును. అను నాపరశురామభాషణముల నాలకించి దశరథుఁడు దుఃఖాతిశయమున మొగము కాంతిహీనముకాఁగా దీనుఁడై దోసిలొగ్గి పరశురామునిం గని మహాత్మా! నీవు పూర్వము క్షత్రియులందుండురోషమును వదలి శాంతుఁడవై తివికదా. బ్రాహ్మణోత్తముఁడవు. మీకు శాంతియే కదా స్వరూపము. మహాకీర్తిశాలివగు నీవు సహజమగుశాంతమును వదలి సత్కీర్తిని బోఁగొట్టుకొనరాదు. నీవు సకలవిషయముల నిష్ణాతుఁడవు. నాకొడుకులు పసివారు. కావున వీరి విషయమున రోషముమాని అభయ మొసంగుము. సంతతవేదాధ్యయనశీలురగు భార్గవవంశజాతుఁడవు ఇంద్రునిచెంతఁ బ్రతిన చేసి శస్త్రసన్న్యాసము చేసితివే. ధర్మాత్ముఁడవై కాశ్యపునకు భూమియంతయు నొసంగితివి. ఇఁక నిందుండ రాదని మహేంద్రాద్రి నివసించియున్నవాఁడవు. మరల నేల యరుదెంచితివి? మమ్మందఱఁ బొలియింప దయచేసితి వనుకొందును. మిమ్ము కాదు. ఈరాము నొక్కని జంపుదుననిమాత్ర మనకుము. అతనిం జంపుదువేని మేమందఱము జీవింపమనుట నిక్కము

అని దశరథుఁడు పలుకుచుండ నారాముఁడు ప్రతాపాతిశయమున నామాటల నాదరింపక రాముని కభిముఖుఁడై

యిట్లు పలికెను. రెండుధనుస్సులే లోకమునఁ బ్రఖ్యాతిఁ గాంచెను. దేవనిర్మితములే యవి. దృఢసారములై ధనుశ్శ్రేష్ఠములై విశ్వకర్మ ప్రయత్నపూర్వకముగా నిర్మింప నవి యొసంగును. వానిలో నొకదానిని త్రిపురాసురసంగ్రామమునపుడు శంకరునకు దేవత లొసంగిరి. అద్దానితో వారల నామహాదేవుఁడు పాలియించెను. ఆధనుస్సునే నీవిపుడు ఖండించితివి. ఇదిగో యిది రెండవధనువు. దీనిని దేవతలు నారాయణమూర్తి కొసంగిరి. రామచంద్రా! అతిభాస్వరమగు నీధనువు వైష్ణవము. శంకరచాపసమాన సారముగలదియే యిదియని యెఱుంగుము. దీని నట్లే ఖండింతునని భావింపకుమా. ఆవిల్లు సుంత వికలమైనది. కాన విఱిచితివి. వికలముగాకున్న విఱువఁగలవా? ఏల యట్లయ్యెనో వినుము. త్రిపురాసురసంహారానంతరము దేవతలు శివకేశవులబలాబలముల నెఱుంగఁగోరి బ్రహ్మనడిగిరి. వారియభిప్రాయము నెఱింగి యాయిరువురకు బ్రహ్మ పగ గల్గించెను. వారొండొరులగెలువ నూహించి పోరాడిరి. ఆపోరు ఘోరంబయ్యెను. విష్ణువు హుంకరింపఁగా శివశరాసనము స్వల్పసారమయ్యెను. శంకరుఁడు స్తంభితుఁడయ్యెను. సురలు మునులు లోనగువారేఁక యుద్ధము వలదని ప్రార్థించిరి. వారిరువురు శాంతినొందిరి. దేవత లపుడు విష్ణువే బలాధికుఁడని నిశ్చయించిరి. శంకరుఁ డాచాప మిట్లు తూలఁగా నాగ్రహించి యద్దానిని బాణముతోడ విదేహరాజగు దేవరాతున కొసంగెను. శత్రుపురనిషూదనమగు నీచాపమును భగవంతుఁడు భృగువంశ్యుఁడగు ఋచీకునకు నీకడ నునుచుకొమ్మని న్యాసవిధి నొసంగెను. ఆతఁడు కుమారునకు జమదగ్ని కిచ్చెను. నాతండ్రి

యాయుధమును వదలి తపోనిరతి నుండఁగాఁ గార్తవీర్యార్జునుఁడు తామసమునఁ బొలియించెను ఈ కార్య మెంతైన జరగెనా? ఎంత క్రూరకార్యము? ఆవార్త నాలకించి నేను రోషావిష్టుఁడనై క్షత్రియజాతిని నాశముఁ జేయఁబూనితిని. ఆయావేళమునఁ బెక్కుసారు లాజాతిని నిర్మూలించితిని. ఒక్కయాగము చేసి కాశ్యపునకు భూమినంతయు దక్షిణగా నిచ్చితిని. కావున మహేంద్రపర్వతమున నివసించుచుఁ దపోనిరతి నున్నవాఁడను. నీవు శివధనుస్సు విఱచుట విన్నాఁడను. కనుకఁ ద్వరపడి వచ్చితిని. రామచంద్రా! వంశక్రమముగా వచ్చిన యీవైష్ణవ శరాసనము నిద్దానిని క్షత్రియుఁడవగుట నీవు బ్రాహ్మణునివలె నశక్యమనక స్వధర్మమును బురస్కరించుకొని వికలముగాక యున్న యీభూరిశరాసనముఁ బట్టుము. శత్రుపురముల నిర్మూలించు నీధనుస్సునందు శక్తుఁడవేయైన బాణంబు సంధింపుము. అది సాగిన నిన్ను మెచ్చుకొందును. ద్వంద్వయుద్ధము నొనరింతును.

మహనీయులారా! ఈభాగమున ననేకవిషయములు గలవు. కౌశికుఁడు తపోవనమున కరిగి ప్రకృతిపూరుషులగు సీతారాములను మనస్సున ధ్యానముచేయుచు నేకాంతవాసమున హిమాలయమున నుండఁబోయెను తడవుచేయక దశరథుఁడు ప్రయాణము సాగించెను. పరశురాముఁ డదు దెంచెను. శ్రీరాముఁడు శివచాపమును విఱువగనే జనకుఁడు దూతలంబంపెను. వారిరాకపోకలకు నెనిమిదిదినములు, వివాహము వఱకు నించుమించుగాఁ బండ్రెండుదినములు లెక్కింతము. ఇంతలో నీవార్త పరశురామునకు మహేంద్రాద్రియందుండు

వాని కెట్లు తెలిసెను? ఇప్పటిమళయాళమునకుఁ బరశురామ క్షేత్రమనిపేరు. అందుండువాని కెవ్వారు పరుగెత్తిపోయి యెఱింగించిరి? అన్నప్రశ్నము చాలకాలముగా వినుచున్నారము పరశురాముఁడు దుష్టక్షత్రియులఁ గార్తవీర్యార్జునప్రభృతుల వధించుటకే భగవదంశమును ధరించినమహనీయుఁడు. సహస్రబాహువగు కార్తవీర్యుఁడుగ విష్ణుచక్ర మవతరించెను. తద్ధ్వని ర్వాపణమునకై పరశురామునియందు విష్ణ్వంశము చేరియుండెను. అట్టివారిని వధింపఁగా నాపని తీఱెను. ఆయంశము మరల భగవంతునియందుఁ జేరవలయును. ఇది లోకాచారవిరుద్ధముగా నుండరాదు. కావునఁ బరశురాముఁడు త్రికాలవేత్తయగు మహర్షి గావున శ్రీరాముని రాక నెఱింగి వారిదివ్యచాపము వారికియ్యఁదలంచి యరుదెంచెను ఇతరుల కిందలిరహస్యము తెలియఁగూడదు. కావునఁ దనగురువగు శంకరునిచాపమును రామచంద్రుఁడు ఖండింపఁగా నందుల కాగ్రహించినట్లు ఆశరాసనము ప్రాఁతదిగాన రామమూర్తి భంజింపఁజాలెనని యూహించి వైష్ణవశరాసన మెక్కు-పెట్టునేని సంగరము చేయఁ దాఁబూనినట్లు లోకుల కెఱిఁగించుచు మాటలాడెను. శ్రీరామమూర్తిపై వాస్తవముగాఁ బరశుధారి కాగ్రహముకలదేని శరాసన మేలయిచ్చును? దానిని దీసికొని మరల నీయకున్నఁ దానేమిచేయఁగలఁడు? తనగురువగుశంకరుఁ డోడిపోయెనని తాఁజెప్పుకొనునా? ఆచాపమునకంటె నిది పృథుతరసారవంతమగు వైష్ణవచాపమని యేల తెల్పును? దీనిసారమేమి!

శ్రీరామచంద్రా! ఎంతకాలము శివధనుస్సు భూలోకమున నుండవలెనో యాకాలము పూర్తియైనది. ఇతరుల కది

యప్రధృష్యము. కావున నీ వద్దాని లయమందఁజేసితివి. దానిందీసికొని నీవు శత్రువుల నురుమాడవచ్చును. కాని యది పూజింపఁబడుచుండెను. అట్టిదానితో ఘోరకార్యము చేయరాదు. ఇదిగో నీచాపము. నీకొఱకై యింతదనుక నేను వహించితిని. నాచేయఁదగుకార్య మింక లేదు. దుష్టక్షత్రియులు పొలిసిరి. ఇఁక రాక్షసులఁ బొలియింప నవతరించిన నీ కీశరాసనమీవలయుననియే వచ్చితిని. బాణము సంధింపుము. ఇది మంచిముహూర్తము. ఈశరాసనమునఁ బెక్కండ్రు రాక్షసులఁ బొలియింపుము. అనుభావముననే పరశురాముఁడు పలికెనని మన మెఱుంగందగు

"శ్రుతవాన్ ధనుషో భేదం తతోఽహం ద్రుతమాగతః
తదిదం వైష్ణవం చాపం పితృపైతామహం మహత్
క్షత్రధర్మం పురస్కృత్య గృహ్ణీష్వ ధనురుత్తమం." ౨౭

అను నీవాక్యములధోరణి యించుక యాలోచించినఁ బైయర్థము తేటపడును. ఈరీతిగా సారము గ్రహింపనియెడల భగవత్తేజస్సు మూర్ఖునియందుఁ జేరియున్నట్లు గనఁబడును. అది గ్రహింపరానియర్థమే. ఏమూలనో యున్న పరశురాముఁడు శివధనుర్భంగవార్త నెఱిఁగెనఁట. అట్టిజ్ఞానదృష్టిగలవాఁ డీరామమూర్తి భగవంతుఁడని యెఱుంగఁడా. ఈకోపమేలయన్న నిజశరీరగతభగవదంశము భగవంతునిలో మరలఁ జేర్చు టితరులకుం దెలియఁగూడదనియే కాని వేఱుగాదు. ఇకఁ దరువాతికథ వినుఁడు.

## శ్రీరాముఁడు పరశురాము ననుగ్రహించుట.

*దాశరథి పరశురామునిపలుకుల విని పితృసన్నిధినుండు టంబట్టియు నామునియెడలఁ గలగౌరవమునుబట్టియు గట్టిగా మాటలాడక మెల్లమెల్లన నిట్లనియె భార్గవా! పితౄణమును దీర్పఁగోరి నీవు చేసినకృత్యము నాలకించితిని. శూరుఁడగువాఁడు పగదీర్చుట న్యాయమే. కాన నాకార్యమునకై నీవు చేసినది యంగీకరించితిని. నీవు నన్ను వీర్యరహితునిగను, ఈధనుస్సును దాల్ప నశక్తునిగ నూహించి యవమానించుచున్నాఁడవు. ఇద్దాని నంగీకరింపను జుమీ. నా తేజఃపరాక్రమముల నిదె చూడుమని హెచ్చరించి కోపము గనఁబఱచి తటాలున నాభార్గవుని కరముచుండి యావైష్ణవచాపమును బాణమును వానితో నాతనియందుఁగల తనకళను సులువుగా గ్రహించెను. ధనుస్సునందు శరముంకొడిగి భార్గవునింగని యత్యంతాగ్రహము కనంబడఁగా నోపరశురామా! నీవు బ్రాహ్మణుఁడవు విశ్వామిత్రునియెడ నాకు స్నేహము మిక్కిలి గలదు. కావున నీవు నాకుం బూజ్యుఁడవు అక్కారణమున నీప్రాణములందీయ నే నీబాణమును విడువఁజాలకున్నాఁడను. నాశరము నిష్ఫలము కాదు. నీపాదగమనశక్తినిగాని, తపోబలసమార్జితనిస్సమాన లోకములనుగాని నీకోరిక ననుసరించి భంజింతును. ఇది దివ్యబాణము. విష్ణుదేవతాకము. అక్కారణమునఁ బరపుర భంజకమగును. కనుక నీబలమును భేదింపక లక్ష్యమెడలి భ్రమింబడదు. వ్యర్థముకాదని నమ్ముము.

---

*ఇది డెబ్బదియాఱవ సర్గమునఁ గలదు.

అత్తఱి ఋషి దేవగంధర్వాదులు గుంపులుగాఁ గూడి బ్రహ్మను ముందిడుకొని వైష్ణవధనుర్వర్యమును గేలంబట్టుకొని మెఱయు శ్రీరామచంద్రునిం గాంచుటకు మహాశ్చర్యకార్యమును జూచుటకు వచ్చిరి కరుదెంచిరి. శ్రీరామచంద్రుఁడా చాపవర్యమును బట్టఁగనే లోకమంతయు మ్రాన్పడెను. పరశురాముఁడు తనయందుఁగల భగవదంశమును రామునిలోఁ జేర్చి నిర్వీర్యుఁడై యాదశరథరాముం గాంచెను. తన తేజమా రామమూర్తివీర్యమున భగ్నము కాఁగా జడీకృతుఁడై యాకమలాక్షుని గని మందమందభాషణముల నిట్లనియె.

శ్రీరామా! పూర్వ మీభూమండలమంతయు నేను గాశ్యపునకు దారవోసితిని. ఆముని నా దేశము గాన నీభూమియం దుండ రాదని శాసించెను. వసింపనని ప్రతిజ్ఞపట్టితిని. కాన గురుఁడగు కాశ్యపుఁడు చెప్పినట్లు చేయఁబూని రాత్రికాలమున నిందు వసింపమానితిని వీరాగ్రణీ! రామమూర్తీ! నాకు గమనశక్తి లేకుండఁ జేయరాదు. ఎందులకందువో ఇందు నిలువక సత్వరమ మహేంద్రాద్రికిం బోవలయును. తపశ్చర్య నడపి యసదృశలోకముల నార్జించితిని నీబాణమున వాని భేదింపుము. ఈధనుర్ధారణమున నిర్వికారుఁడై శత్రునిర్మూలనస్వభావుఁడయి తనరారు పురుషోత్తముఁడ వగుదువు. దేవదేవుఁడవు నీవే. అని నే నెఱుంగుదును. పరంతపా! నీకు శుభములగుంగాక. ఇదిగో చూడుము. బృందారకులెల్ల వచ్చి యుద్ధమున నప్రతిద్వంద్వుఁడవగు నిన్ను నీవీరకృత్యమును దిలకించుచున్నారు. నా కిపుడు గల్గిన యీసిగ్గు తగదు. త్రిలోకవల్లభుఁడవు ఇట్టి మహాప్రభుఁడవగు నీచే నేనోడినందులకు సిగ్గేల? శత్రుసూదనవ్రతుఁడవు.

కాన నసదృశభవత్సాయకము చు వదలుము. దానిం గాంచి మహేంద్రాద్రికింబోయెదను.

ప్రతాపశాలియయ్యు నిట్లు పలుకు నారామునిపలుకు లాలకించి శ్రీరామమూర్తి యాయుత్తమబాణమును వైచెను. ఆబాణ మాతనితపస్సమార్జితలోకముల భేదించెను. దానిం గాంచి ధన్యోఽస్మి యనుకొనుచుఁ బరశురాముఁడు మహేంద్రాద్రికింబోయెను. దిక్కులు తేటగా నుండెను. మునులు సురలు వైష్ణవచాపధారియగు నారామునిం బ్రశంసించిరి. జామదగ్న్యుఁ డాదశరథనందనుం గొనియాడి ప్రదక్షిణము గావించి స్వస్థానమునకుఁ బోయెను.

భక్తాగ్రగణ్యులారా! ఈఘట్టమున ననేకరహస్యవిషయములు గలవు. కొందఱు పరశురామునకు గర్వభంగమాయె నందురు. అద్ది సామాన్యదృష్టిం గాంచిన నగపడును. కాని భగవదవతారములలోఁ బరిగణింపఁబడు నారామునకు గర్వమన్న నపరాధము కాదా. అందందుఁగలవిషయములఁ బరికింతము.

> "వీర్యహీనమివాశక్తం క్షత్రధర్మేణ భార్గవ
> అవజానాసి మే తేజః పశ్య మేఽద్య పరాక్రమమ్."

అని రామచంద్రుఁడు పలికెను. ఇందు భగవంతు నభిప్రాయమేమి? ఇపుడు పరశురాముఁడు రామమూర్తియెదుట నున్నవాఁడు. స్వతేజమును గ్రహించుసమయ మాసన్నమైనది. ఇతరుల కయ్యది తెలియనీయరాదు. లేనియాగ్రహమును గైకొనవలయును. కనుకనే "పశ్యమేఽద్య పరాక్రమమ్" అని రామమూర్తి పలికెను. మునిచెంత నింతగర్వముగా శ్రీరామచంద్రుఁడు పలుకునా. నాతేజస్సు నవమానించుచున్నాఁడవా.

నీలోనున్న నా తేజస్సు నిరర్థకముగా నుంచితివా. నాపరాక్రమమును జూడుము. అనఁగా నిపుడే గ్రహింతును. చూడుము. అని మనోభావమును మాటుపఱచి పలికెను.

"ఇత్యుక్త్వా రాఘవః క్రుద్ధో భార్గవస్య శరాసనమ్
శరం చ ప్రతిజగ్రాహ హస్తాల్లఘుపరాక్రమః."

అని పలికి కోపమూని అనఁగా భావమేమి? ఇతరులు చూచి పరాక్రమమును జూపఁబూనెనని గ్రహింతురుగాక యనియు, వాస్తవముగాఁ దన తేజస్సును జాపశరములను దీసికొనవలయు నని రామమూర్తి కోపము నగపఱచెను. ధనుస్సు లాగుకొనుచుఁ దనదివ్యతేజస్సునుగూడఁ దీసికొనియెను. ఇపుడు పరశురాముఁడు సాధారణమునులలో లెక్కింపఁదగినవాఁడు. భగవదంశము స్వస్థలమున నే చేరినది. సకలపరికరములు నమరినవి. ఈవిషయ మితరులకుం దెలియనీయ రాదన్న యూహచే శ్రీరామచంద్రుఁడు,

"బ్రాహ్మణోఽసీతి పూజ్యోఽసి విశ్వామిత్రకృతేన చ"

అని తెలిపెను. ఇంతకుముందే విశ్వామిత్రుఁడు శ్రీరామచంద్రమూర్తికిఁ బరశురామాగమనవృత్తాంతమును దెలిపెనని యూహింపఁదగును. విశ్వామిత్రునితోఁబుట్టువు ఋచీకునకు భార్య యనుసంబంధమునుబట్టి క్షమించితినని వ్యాఖ్యాతలు వ్రాసిరి. బ్రాహ్మణుఁడవని విశేషించి విశ్వామిత్రుఁడు పలుకుటచేతను బూజ్యుఁడవే. నా తేజస్సు నేను గ్రహించినందున నీకుఁ గొఱంత లేదని రామమూర్తి తెలుపుచున్నాఁడని మన మూహింపందగు.

"ఇమాం పాదగతిం రామ తపోబలసమార్జితాం
లోకానప్రతిమాస్త్వా తే హానిష్యామి యదిచ్ఛసి." ౭

ఇందుఁ బైనుదాహరించినయర్థమునకుఁ గారణముకలదు. బ్రాహ్మణుఁడవు. కానఁ బూజ్యుఁడవని పలికి నీపాదములు ఛేదింతునా యని రామమూర్తియనునా? ఇందు విశేషార్థము కలుగవలదా? నీవు సంచరింప నిఁక నవసరములేదు. నీవు తిరిగి చేయుపనిని నాకు వదలుము. క్రూరదానవశిక్షకు వలయుశక్తి యింకను నాకుఁ గావలయు. నీతపోబలము నాకొసంగుమనియే రాముని భావమని గ్రహింపందగు. పరశురాముఁడు తపస్సుచేసి యే లోకములు సంపాదించెను? వానికిఁ బేరులేమని? పుణ్యలోకములను నాశనముచేయుదునా యని రామమూర్తి పలికెనన్న నెంతటియపరాధము! పుణ్యారక్షణార్థ మవతరించెనుగదా భగవంతుఁడు. అట్లగునా యందురేని త్రిపురాసురసంహారకాలమున శంకరుఁడు దేవతల నిట్లే యడిగెను. ఇపుడు శ్రీరామమూర్తియు నడుగుచున్నాఁడు. రావణాదులు దుర్వారతపస్సు చేసినవారు. వారి నడంపఁ దపోబలము తోడ్పడవలయును. విష్ణ్వంశముగలిగియున్నపుడు చేసినతపస్సున భాగము రామమూర్తికిం గలదు. కాన దానినిమ్మని యడిగెను. ఈరహస్య మితరులకు బోధపడఁగూడదని యిుదలు విన నట్లడిగెనని మన మూహింపఁదగును.

"నిర్వీర్యో జామదగ్న్యోఽసౌ రామో రామముదైక్షత."

గతవీర్యః అనక నిర్వీర్యః = నిర్గతం వీర్యం యస్య సః. వెడలిపోయినతేజస్సుగలవాఁడనఁగా నర్థమేమి? తనలోనితేజస్సు పరమపురుషునియందు సంక్రమించెననియే యర్థము.

"అక్షయం మధుహంతారం జానామి త్వాం సురేశ్వరం
ధనుషోఽస్య పరామర్శాత్స్వస్తి తేఽస్తు పరంతప."

అని పరశురాముఁడు స్పష్టపఱచెను. కావునఁ బరశురామునకు శ్రీరామునిమాహాత్మ్యము తెలియుననియు, నితరులకుఁ దెలియ నీయక తొలుత మాటలాడి తుదకు భక్తిపారవశ్యమున భగవంతునిగా వినుతించెననియుఁ దెలిసికొనవలయు.

ఈసమయమున శ్రీరామచంద్రుఁడు దుష్టనిగ్రహము నకు వలయుపరికరములన్నియుఁ గలవాఁడయ్యెను. ప్రకృతిం గూడి సగుణబ్రహ్మమయ్యెను. తానూరకయున్నను బ్రకృతి సర్వకార్యనిర్వహణక్షమ కలదు. కనుకఁ దనసర్వసాక్షిత్వము వెలయ మహానందమున నుండును. ఈఘట్టమున నొక్కవిశే షము కలదు. పరశురామునిపై శ్రీరామున కాగ్రహ మిసు మంతయు లేదు. అట్లే పరశురామునకుఁగూడనని తెలిసికొన వలయును. భగవదంశము రెండుతావుల నుండనక్కఱ లేదు. శ్రీరామమూర్తి వివాహము చేసికొనక ముందు భార్గవ రాముఁడు రాలేదు. సమయమునకై కాచియుండెను. సుము హూర్తము సమీపింపఁగాఁ దనకుఁ దానై వచ్చి వారియంశ మును వారికి సమర్పించి కృతకృత్యుఁడయ్యెను.

రామావతారమునకు ముందే వలయుపరికరములు కూర్పఁబడుచునుండెను. శివచాపము దేవరాతునకును, వైష్ణవ చాపమును ఋచీకున కీయఁబడెను. మునికి ధనుస్సెందులకని మన మూహింపవలదా. ఇవి రెండును శ్రీరామావతారమున కుపయోగింపవలయుననియే కాక మఱెందులకు? భగవదంశము

గల పరశురాముఁడాచాపమునఁ గొందఱదుష్టులం బొలియిం
చెను. ఇట్లు బొలియింపఁదగినవారి నడంప శ్రీరామున కా
చాపవర్యము నొసంగెను. ప్రకృతి సీతాదేవి రామాగమన
మునకుఁ గాచియుండెను. సమయము రాఁగా నన్నియు సమ
కూడెను. కావున నిపుడు శ్రీరామమూర్తిని సర్వపరికరవిశిష్టుని
మనము ధ్యానింపనలయును. మానసికపూజాపద్ధతినారాధింపం
దగును. ఆపరమేశ్వరుని విచిత్రచరిత్రమును సభక్తిఁ బఠింపం
దగు. పఠించినంతమాత్రమునఁ జాలదు. అందుఁగలసారమేదని
యెఱుంగవలయును. ఊరకే దేవాలయములకుంబోయి కుక్షిం
భరులమాటలకు లోఁబడి ధనవిముక్తిం గాంచి సంసార
ముక్తికిం దూరులము కారాదు. సకలదేవతామయుండని యీ
రామమూర్తిని నమ్మి సదా ధ్యానింపవలయును. అపుడే సర్వ
మతసమారాధ్యుఁడని తేటపడును. లేనిచో మతద్వేషము మన
మనస్సుల నలముకొని పురోవృద్ధి నడ్డగించును. అట్టి తెలివి
తక్కువపనులకుఁ బోవక పరమతములయం దోర్పుగలిగి భగ
వంతుఁ డెల్లరకు సమారాధ్యుఁడని నమ్మి మన కనుకూలమగు
మార్గమున నారాధించుచుండవలెను. అదియే మంచిమార్గము.

## అయోధ్యాప్రవేశము.

* పరశురాముఁడు మహేంద్రాద్రికిం బోవఁగా శ్రీరామ
మూర్తి కల్పితకోపమును వదలి శాంతమునూని యప్రమేయుఁ
డగువరుణునకుఁ (నదృశ్యముగా నున్నవానికి) నాధనుర్వరము
నొసంగెను. బాణముంగూడ నిచ్చెను. తరువాత రామచంద్రుఁ
డు వసిష్ఠాదులగుమునులకు మ్రొక్కి పరశురామునిరాకవలని

* ఇయ్యది డెబ్బదియేడవ సర్గమునుండి గ్రహింపఁబడినది.

భీతిచేఁ గలంతనొంది యించుకయు నెఱుంగనియట్లున్న తండ్రిని గాంచి నాయనా! జామదగ్న్యుఁడు వెళ్లెను. ఇఁకఁ జతురంగ బలములఁ బయనము చేయ నాజ్ఞాపింపుము. చాతకపక్షులు మేఘోదకమును గోరునట్లు సేనలన్నియు నీయాజ్ఞకై యెదురు చూచుచున్నవి. అనఁగా నాపలుకులు చెవులఁబడఁగానే కుమారునిం గౌఁగిలించుకొని మూర్కొనియెను. పరశురాముఁడు పోయెనన్న వార్త రెండుసారులు చెప్పినఁగాని యాతనిభయము పోవదయ్యెను. పుత్త్రులతోఁ దాను మరల జన్మించినట్లే యాతఁడు తలంచెను. వెంటనే పయనముకండని సేనల కాజ్ఞాపించెను. తూర్యధ్వనులు మిన్నుముట్టఁగా వారిపయనము సాగెను.

అయోధ్యయందలి రాజమార్గము లలంకరింపఁబడియుండెను. పూవులుచల్లి మిగులఁ గైసేసిరి. రాజు రాకవలనఁ బౌరులకుఁ గల్గినమహానందము వర్ణనాతీతము. జనులు మార్గములయందుఁ గ్రిక్కిఱిసియుండిరి. దశరథమహారాజా తరుణమున నయోధ్యం బ్రవేశించెను. బ్రాహ్మణులును దక్కుంగలవారును జాలదూరమునకుంబోయి రాజు దర్శించిరి. సర్వాలంకార శోభితమగు రాజభవనమును సపుత్త్రుఁడై ప్రవేశించెను. సౌధ మండలిజనులు మహానందమున నోలలాడిరి. భోగోచితసర్వపదార్థముల నాదివ్యమందిరము నిండియుండెను. కౌసల్య సుమిత్ర కైకయిం కనుగల రాజపత్నులును గోడండ్రను మర్యాదగా నంతఃపురమునకుఁ దోడ్కొనిపోయిరి. ఆవధూరత్నములు నలువురు పెద్దలయాశీస్సులనొంది కౌశేయవస్త్రములం దాల్చి యమూల్యాభరణముల ధరియించి గృహదేవతలం బూజించి నమస్కరింపఁదగినవారల కెల్ల నమస్కరించిరి. తమతమయంతః

పురములు బ్రవేశించిరి. గోపులను ధనధాన్యముల నాశ్రితుల లగువిప్రుల కొసంగి సంతృప్తులను గావించి యందఱ కానందము గూర్చుచుఁ దమప్రాణేశ్వరులంగూడి హాయిగా నుండిరి. ఏవిషయమునందును వారలకుం గొఱంతయే లేకయుండెను. ఆ రాజకుమారులు నలువురును సాటిచేయవలనుపడనిశౌర్యము విలసిల్ల సకలవిధముల ననురూపలగుపురంధ్రీమణులం బెండ్లియాడి సకలాస్త్రవేత్తలై ప్రఖ్యాతింగాంచిరి. మఱియుఁ గన్నతండ్రికి శుశ్రూష చేయుచుఁ దదనుమతులై సర్వకార్యముల నిర్వహించుచుండిరి.

అంతఁ గొన్నిదినములకు దశరథుఁడు భరతునిం గాంచి వత్సా! మేనమామ యుధాజిత్తు నిన్నుఁ బిలుచుకొనిపోవ వచ్చియుండి నన్ను వేఁడుకొనెను. ధర్మ మెఱుంగుదువు. కాన నాతనికి వేడ్కసేయవలయు. అనఁగానే తండ్రియానతిం దలందాల్చి నమస్కరించి రామలక్ష్మణులం గౌఁగిలించుకొని శత్రుఘ్నునితోఁ బయనముసాగించెను. భరతుఁడు పోవఁగనే శ్రీరామలక్ష్మణులు పితృపూజాతత్పరులై యుండిరి. శ్రీరామచంద్రుఁడు ధర్మజ్ఞుండౌటఁ దండ్రియానతిఁ దలఁదాల్చి పౌరులకు హితములగుకార్యములను జక్కఁగాఁ జేయుచుండెను. తల్లులకు గురువులకును జేయఁదగుపనులను గాలానుసారముగా శాస్త్రవిహితముగాఁ జేయుచుండెను. శ్రీరాముని కలవడిన సుశీలాదులకు దశరథుఁడు సంతుష్టుఁడయ్యెను. తండ్రి ప్రీతుం డగుట యటుండ విప్రులును వైశ్యులును దద్దేశవాసులందఱును ప్రీతులైరి. యశస్వియు సత్యపరాక్రముఁడునగు శ్రీ

రాముఁడు శీలవృత్తములచేత నేకాక తక్కినగుణములచేతను భూతములకు బ్రహ్మవలెఁ బ్రియతముఁడై వెలయుచుండెను.

శ్రీరామచంద్రుఁడు మనస్వియై సీతయందు దాదృతిగలిగి తద్గతప్రాణుఁడై యామెంగూడి యానందించుచుండెను. రామునకు జానకి యతనితండ్రియగు దశరథుఁడు కూర్చినభార్య యగుట యత్యంతప్రియురా లయ్యెను. భర్తృశుశ్రూషాగుణమునుబట్టియు సౌందర్యాభిజాత్యముల ననుసరించియు రామునకు సీతయం దత్యంతప్రీతి యమరియుండెను. సీతాహృదయమునందు భర్తృప్రీతి ద్విగుణముగ నుండెను. సీత యనురాగ మతిగూఢము. రాముఁ డుచితచిహ్నములఁ దర్కించి యా యనురాగమును దెలిసికొనుచుండెను. సర్వకాలము తద్ధృదయవర్తి కావున నామె యనురాగము నిగూఢమైనను దెలియకయుండునా? జానకియు రామునిహృదయమును మిక్కిలిగ నెఱుంగుచుండెను. ఏలన, సీత మైథిలి; జనకదుహిత. కాన సూక్ష్మజ్ఞయే యగును. దేవతాకన్యకల మించినరూపముగలది. కావున నతిప్రౌఢురాలు. దేహమును దాల్చి యవతరించిన శ్రీదేవినాఁ గనంబడునది. కాన శ్రీరామచంద్రహృదయమును విశేషించి తెలిసికొనఁజాలెను. అట్టి సీతాదేవింగూడి మహాలక్ష్మింగూడిన శ్రీమహావిష్ణువుకరణిఁ బ్రకాశించెను.

మహనీయులారా! ఇందు విమర్శింపఁదగినవిషయములు లేవనరాదు. ఇందు స్త్రీధర్మములు విశేషించి వర్ణింపఁబడినవి.

"దేవతాయతనాన్యాశు సర్వాస్తాః ప్రత్యపూజయన్"

అని మూలము.

"దేవతాయతనాని గృహదేవతానామర్చాగృహాణి. ఆయతనపూజా మాత్రే స్త్రీణామధికారాత్. అని గోవిందరాజులు. దేవతాయతనాని గృహదేవతాప్రతిమాః" అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి.

గోవిందరాజులయభిప్రాయము ననుసరించి గృహదేవత లుండుపూజాగృహముల స్త్రీలు పూజింపవలయునని యేర్పడును. ప్రతిమల నారాధింపవచ్చునని మహేశ్వరతీర్థాభిప్రాయముననుసరించి యేర్పడును. స్మృతులతాత్పర్య మేమని యింక విచారింతము.

"జపస్తపస్తీర్థయాత్రా ప్రవ్రజ్యా మంత్రసాధనం
దేవతారాధనం చైవ స్త్రీశూద్రపతనాని షట్." ౧౩౩

అని అత్రిస్మృతి.

ఇదియు గోవిందరాజాభిప్రాయమునే తెలుపును.

"నాస్తి స్త్రీణాం క్రియా మంత్రైరితి ధర్మే వ్యవస్థితిః
నిరింద్రియా హ్యమంత్రాశ్చ స్త్రియోఽనృతమితి స్థితిః." ౧౮

(మను. ౯. అధ్యా.)

మంత్రరహితముగాఁ గ్రియలు జరపవచ్చునని మనుస్మృతి యనుమతినిచ్చుచున్నది.

"శూద్రో వానుపనీతో వా స్త్రియో వా పతితోఽపి వా
కేశవం వా శివం వాపి స్పృష్ట్వా నరకమశ్నుతే.
బ్రాహ్మణ్యపి హరం విష్ణుం న స్పృశేచ్ఛ్రేయ ఇచ్ఛతీ
సనాథా మృతనాథా వా తస్యా నాస్తిహ నిష్కృతిః.

స్త్రీణామనుపనీతానాం శూద్రాణాం చ జనేశ్వర
స్పర్శనే నాధికారోఽస్తి విష్ణోర్వా శంకరస్య చ." స్కాందము.

స్పర్శరహితా తు తయోర్భవత్యేవ.

"సాలగ్రామం సంస్పృశేత్తు హీనవర్ణో వసుంధరే
స్త్రీశూద్రకరసంస్పర్శో వజ్రస్పర్శాధికో మతః.
మోహాద్యస్సంస్పృశేచ్ఛూద్రో యోషిద్వాపి కదాచన
స్వపతే నరకే ఘోరే యావదాభూతసంప్లవమ్.
యది భక్తిర్భవేత్తస్య స్త్రీణాం వాపి వసుంధరే
దూరాదేవాస్పృశన్పూజాం కారయేత్సుసమాహితః."

వారాహపురాణము.

"సాలగ్రామశిలామాత్రే నిర్బంధో న ప్రతిమాదౌ
సర్వవర్ణైస్తు సంపూజ్యాః ప్రతిమాస్సర్వదేవతాః
లింగాన్యపితు పూజ్యాని మణిభిః కల్పితాని చ." వారాహము.

అనువీనింబట్టి పరికింపఁగా స్త్రీలు సాలగ్రామముల స్పృశింపరాదనియుఁ, బ్రతిమల నారాధింపవచ్చుననియు, మణికల్పితశివలింగమునుగూడ నారాధింపవచ్చుననియు స్పష్టము. ఇంక నీచర్చ చేయుట యంత మంచిది కాదు.

తఱుచుగా నర్చకులే యీపూజ కర్హులనియు, నితరులు స్పృశింపరాదనియు, దేవాలయములనే నమ్ముకొని జీవించువారు కల్పించినట్లు తోఁచెడిని. ఈనియమము ద్రావిడాదిదేశముల యందే కనంబడును. ప్రాచీనాగమములయం దిట్టినియమములు తఱుచుగాఁ గానరావు. ప్రతిమార్చనము స్త్రీశూద్రులకొఱకే

యేర్పడినది. అదియుఁ బనికిరాదను టుచితమని నాకుఁ దోఁపదు. ప్రతిమార్చనము కేవల పామరులకొఱకే యేర్పడినది. అట్టిది కూడఁ బనికిరాదనుట సామాన్యశాస్త్రమున సిద్ధింపకయున్నను విశేషవిధిచేత సిద్ధించును.

సీతారాములు సుఖముగా నయోధ్యానగరమునఁ గాలముఁబుచ్చుచుండిరి. మానవుఁడు చేయఁదగినసత్కార్యములగు పితృశుశ్రూషాదుల నొనరించుచుఁ బౌరులకును జానపదులకు హితము నొనరించుచు నుత్తమోత్తముఁడని తన్నెల్లరు కొనియాడఁ దనమహత్త్వము కానరానీయక మహామాయయగు సీతాదేవి యెల్లర ముగ్ధులుగా నొనరించుచుండ నిర్లిప్తుఁడయ్యు సకలకార్యపరతంత్రుఁడై లోకులకు నుదాహరణభూతుఁడై సర్వజనాదృతిం గాంచుచుఁ బ్రవర్తించుచుండెను. ఇ ట్లెన్నివత్సరము లుండఁగలఁడు? తా నవతరించినపని సాగవలయుఁగదా. అద్దానికొఱకే దశరథుఁడు భరతుని శత్రుఘ్నునితోడ మేనమామయింటికిం బంపెను. ఏనాఁడు భరతుఁ డయోధ్యను దాఁటెనో మహాప్రకృతి తనప్రయత్నము నెఱవేర్చెఁ గదా యని యానందించెను.

"గహనా కర్మణో గతిః."

అన్న భగవద్వాక్యము తప్పునా? శ్రీరామచంద్రుఁడు శత్రువధార్థము ప్రయత్నింపఁదగుసమయము సమీపముననున్నది. దాని కనుగుణముగా నెల్లకార్యములు సాగవలయుఁగదా. శ్రీరామమూర్తి మహానందమున నున్నవాఁడు. మహామాయసీత స్మరించినంతన యెల్లపనులు సాగుచుండును. భరతుఁ డుండఁగూడ

దని తలంచెను. దశరథుఁడు మేనమామయింటికిం బొమ్మని పంచెను. అయోధ్యకు రాఁగానే యేల పంపకుండెను? సీత మనస్సున స్మరింపలేదు. ఏయేకాలమున నేయే రాక్షసులు వధింపఁబడి ముక్తి నొందవలయునో యాసమయ మింకను రాలేదు. కావున నామె యూరకయుండెననియు, సమయ మాసన్నమైనది కాన నిఁక నిది యిట్లు సాగవలయునని తలంచెననియు నెఱుంగవలయును. ఏదినమున నేరాక్షసుఁడు శ్రీరామమూర్తిచేఁ బొడవడంగవలయునో, ఏమహర్షి యేదినమున భగవంతునిమాయామానుషవిగ్రహుని దర్శింపవలయునో యాసమయమునకుఁ బ్రకృతిపూరుషు లిరువురు నాయాచోట్ల నుండవలయుఁగదా. అట్టియేర్పాటు ప్రకృతి యొనరించుననియు మన మెఱుంగవలయు. ఆజగజ్జనని యుద్దేశమునకు మాఱులేదు. హరిహరబ్రహ్మాదు లామెశాసనమున మౌళులందాల్చి మెలంగుదురన నిఁకఁ దక్కినవారిమాట యిట నేటికి? కావున సీతానామమున వెలయుమహామాయ భరతుఁ డుండఁగూడదని తలంచినంతనే దశరథుఁ డామెసంకల్పమునఁ బురికొల్పఁబడి భరతుం బిలిచి మేనమామయింటికిం బొమ్మనఁగా నాతఁ డనుజునింగూడి పోయెను. తరువాతి కార్యము లెట్లెట్లు చేయందలంచునో యా సీతాదేవి సంకల్పప్రకారము సాగుననియు, శ్రీరామచంద్రుఁడు సాక్షిమాత్రుఁడై యుండుననియుఁ దలంపవలయును.

శ్రీరామచంద్రునకు నితరులు తెలిపినఁగాని స్వశక్తి నెఱుంగఁడని పలుకువారు కొందఱు గలరు.

"వరుణాయ ప్రమేయాయ దదౌ హస్తే ససాయకం." (౧. స ౭౭.)
పరశురాముఁ డొసంగినవైష్ణవచాపమును బాణముతోడ వరు ణున కిచ్చెనని కలదు వరుణుఁడు వచ్చినట్లు కానరాదు భగవ ద్దర్శనముచేయ దేవత లరుదెంచిరని యున్నది. వారింగూడివచ్చి యదృశ్యముగా నున్నయ ట్లూహింపవలయుఁగాదే. "అప్రమే యాయ = అదృశ్యాయ" అని గోవిందరాజులు వ్రాసిరి. ఈయభిప్రాయము నంగీకరింపకయున్న నీశ్లోకమే ప్రత్యక్ష మనవలయు అనఁగా నాచాపముతో నప్పుడు పనిలేదు. కాన దర్శనముచేయ నరుదెంచి యితరులకుఁ గనఁబడకయున్న వరుణుని చేతి కిచ్చెను. దీనింబట్టి మానవులచందమున నటించు ననియు సర్వమెఱుంగుననియుఁ దలంపంజనుఁగదా. కువాదముల వలన నేమి లాభము? వ్యర్థమగు కాలక్షేప మదియగును. అట్టి కార్యములచేఁ గాలముఁ గడుపక భగవంతుని యనంతకల్యాణ గుణముల స్మరించుచుఁ గీర్తించుచుఁ బ్రకృతిశక్తి కబ్బురం పడుచు నామహాజనని నారాధించుచు భగవత్సాన్నిధ్యమును జేరుయోగ్యత ననుగ్రహింపుమా యనివేడుచు సత్కర్మముల నాచరించుచుఁ దత్ఫలములను భగవంతున కర్పించుచు నుండ వలయును. అంతకంటె మించి చేయందగిన దేదియు లేదు. దుర్వాదములను జేయక పరమతముల దూషింపక యితరు లారాధించుదేవతలు నీచులని దూఱక భగవంతుఁడు భక్తులు కల్పించుకొన్నరూపము గలవాఁడగునని యెవ్వరేనామమునఁ బిలిచినను భక్తియున్నచోఁ బలుకునని నమ్మి శక్తి కనురూప

ముగ నాపరాత్పరు నారాధించి తదనుగ్రహపాత్రులము కావలయును. ఇంతకంటె మంచిమార్గము కానరాదు. ధనముతో నక్కఱలేదు. మానవులసహాయముకూడ నక్కఱలేదు. ఉపవాసాదులచే దేహమును గృశింపఁజేయ నవసరములేదు. సమాహితచిత్తులమై సర్వేశ్వరుని ధ్యానించినఁ జాలును. కరుణానీరరాశి పరమేశ్వరుఁడు భక్తరక్షణదీక్షుఁ డుద్ధరించును.

> "నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా
> శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా. ౫౩
> భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున
> జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప. ౫౪
> మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః
> నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాండవ." ౫౫
>
> (గీత. ౧౧ అధ్యా.)

అన్నశ్రీకృష్ణోపదేశము మనకుఁ బ్రమాణము. కొందఱు కపటయోగులు ధనార్జనతత్పరులై వేదములఁ బఠించుట, తపస్సు చేయుట, దానములిచ్చుట, యజ్ఞములుచేయుట లేక పూజించుట ఫలములేదనియు భక్తియే ప్రధానమనియు నుపదేశించుచుఁ బామరులవలన ధనము నార్జింతురు. వారు గ్రహించిన యర్థము భగవదుపదేశమున లేదు. భక్తిగలిగి యవియన్నియు నాచరింపవలయునని యభిప్రాయమే కాని వేఱుగాదు. అట్లు గానిచో

"తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి."

యన్నగీతావాక్య మేటఁగలియును. అట్టిదాంభికులు వేషధారులనియు, వారు ధనముఁగోరి యట్లుపదేశింతురనియు నెఱుంగవలయును. ఏకాంతభక్తులగువా రట్లు పలుకరు. ఏమానవునకేసత్కార్యము చేయ నవకాశము దొరకునో యాకార్యమును భక్తిగలిగి చేయవలయుననియు, లోకమును మెప్పించుటకు మాత్రమే చేయరాదనియు నాయుపదేశవాక్యములసారము. భక్తిగలిగి వేదపారాయణ మొకఁడు చేయవచ్చును. మఱొకఁ డట్లే తపస్సు. ఈరీతిగా నెవ్వరి కేదియిష్టమో యట్టిసత్కర్మముల నాచరింపవచ్చుననియే దానియర్థము. ఇదియే శాస్త్రసమ్మతమగునర్థము. ఈయర్థమున నితరుల దూషింపనవకాశము దొరకదు. కనుకఁ బెద్దలవలనఁ జక్కనియర్థమును గ్రహించి భగవంతుని సేవించుటయే సర్వోత్తమము.

మహాశయులారా! ఈబాలకాండమునందు భగవంతుఁడవతరించుట, అమానుషకృత్యముల మూలమున సర్వేశ్వరత్వమును వెల్లడించుట, లోకులకుఁ జక్కనిప్రవర్తనము నేర్పమానవాచారములఁ దాను జేయుట, ప్రకృతిని సీతాదేవిని బెండ్లియాడుట, తనకళను బరశురామునుండి గ్రహించుట సర్వజనరంజన మూలమునఁ దనకరుణాపరతంత్రత్వమును దెలుపుట లోనగు నద్భుతపరమపావనచరిత్రములు వర్ణింపఁబడినవి. వీనింబఠించి భగవంతునిమహిమము నెఱింగి శక్తికొలఁది

తత్సేవాపరాయణులము కావలయును. కుతర్కముల లాభము లేదు. సత్కర్మానుష్ఠానమునకు సుముఖులము కావలయును. పరమేశ్వరునే నమ్మియుండవలయును. ఇఁకఁ దరువాతికథల నయోధ్యాకాండమునఁ బఠింతము.

ప్రకృతిపురుషసమాగమమను

రెండవ ప్రకరణము సంపూర్ణము.

శ్రీ. శ్రీ. శ్రీ.

ఇది బాలకాండము. పరమేశ్వరార్పణము.

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్‌సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1932.

శ్రీః

# శ్రీరామావతారతత్త్వము

## మూఁడవప్రకరణము.

ఇయ్యది


కడప మ్యునిసిపల్ హైస్కూలునందుఁ బ్రధానాంధ్రపండితుఁడగు

కావ్యస్మృతితీర్థ

జనమంచి శేషాద్రిశర్మ విరచితము.





చెన్నపురి:

"వావిళ్ల" ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1932

# సువిహితవార్త.

పుణ్యపురుషులారా! పరమేశ్వరానుగ్రహమున శ్రీరామావతారతత్త్వమున మూఁడవప్రకరణము మీసన్నిధిం జేర్పఁగల్గితిని. సాధుజనులయాశీర్వాదఫలమే యిది యని విన్నవించువాఁడను. అయోధ్యాకాండమునఁ బందొమ్మిది సర్గములే యీప్రకరణమునఁ గలవు. అయోధ్యాకాండమే శ్రీరామాయణహృదయమనుట యెల్ల రంగీకరించినవిషయము. నాకుంగల యల్పజ్ఞానమునకుం దగినయట్లు విమర్శించితిని. ఆయాయితావులం బరిశీలించునపుడు పెద్దలు నాభావమేమి యని తొలుతం బరికించి పిదపఁ దప్పొప్పుల నెమకందగుదురు. ప్రకృతిపూరుషులు సీతారాములను నాసిద్ధాంతము ననుసరించి యాయాయితావులఁ దదనుగుణముగా నర్థము వ్రాసితి. ఆశబ్దముల కాయర్థము కలదని నే నెఱుంగుదు. నాసిద్ధాంతమనఁగా నాకల్పించినక్రొత్తసిద్ధాంతము కాదు. పెద్దల పాదసేవ చేసి యెఱింగినవిషయమని యర్థము. హరిహరపరమేష్ఠులు తక్కుం గలయింద్రాదులగుసిద్ధరోత్తములు వారువీరననేల ? సృష్టియంతయుఁ బ్రకృతికల్పితము.

"మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరం,
హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే." ౧౦

అన్న గీతావాక్యమే యిందులకుం బ్రమాణము. ఈవాదము నంగీకరింపనివారుండరని నమ్మువాఁడనుగాను. కాని సమస్తము భగవంతుఁడే నడుముకట్టుకొని చేయుచున్నాఁడన్న సిద్ధాంతము ననుసరించి నిర్లిప్తుఁడు, సర్వసాక్షి యనఁగు నామము లాపరమేశ్వరునకు నిలువఁజాలక యెగిరిపోవును. ప్రకృతి యనఁగా శంకరపత్నియగు పార్వతి యనుభ్రాంతిచేఁ గొందఱు ప్రకృతి యనఁగానే యీసడింతురు. భగవంతునకుఁ బ్రకృతికి నవినాభావసంబంధము కలదు. వారల వేఱుచేయ సాధ్యమే కాదు.

"దైవీహ్యేషాగుణమయీ మమ మాయాదురత్యయా"

అన్న గీతావాక్యము.

"శివశ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుం,
న చే దేవం దేవో న ఖలు కుశలస్స్పందితు మపి."

అన్న శ్రీశంకరభగవత్పాదోక్తియుఁ ఈవిషయమును దృఢపఱచుచున్నవి. కావున నావిశ్వాసము ననుసరించి వ్రాసినయర్థములను పెద్దలు విమర్శింప

వలయు. "అణూనపిగురూకృత్యాలాలయంతి విపశ్చితః" అన్నయట్లు గుణ
మేమాత్రముండినను బెద్దలు బహూకరింతు రన్ననమ్మకము నాకుఁ గలదు.

ఈపద్ధతిననుసరించి వ్రాసిన సీయయోధ్యాకాండము నాల్గుప్రకరణము
లగునని తోఁచెడు. పెద్దలయాశీర్వాదము భగవంతు ననుగ్రహంబునాఁగో
యట్లు కార్యముసాగును. ఈ నాప్రయత్నము నాదరించి కొందఱు పోషకు
లైరి. వారి కెంతయుఁ గృతజ్ఞుఁడను. కడపనగరవాసులు వైశ్యకులాలంకార
భూతులగు మ॥ రా॥ శ్రీ, పత్తి రాఘవులుశ్రేష్ఠిగారు పోషకద్రవ్యమునకంటె
నెక్కుడు ధనమిచ్చి తోడ్పడిరి. వారికింగృతజ్ఞుఁడను. అనంతపురమండలమున
హిందూపురముచెంతనుండు బేవినహళ్ళి యనుగ్రామవాసులు సరసగోపులునగు
మ॥రా॥శ్రీ, కరణము కృష్ణరావుగారును గుత్తినగరవాసులు సుపాధ్యాయులునగు
మ॥రా॥శ్రీ, వై. కొండలరావుగారును దమరు పోషకులగుటయే గాక పెక్కుం
డ్రఁ బోషకులఁగాఁ బ్రోత్సహించి యీసత్కార్యమునకు సాయపడిరి. వారలకు
శ్రీరామచంద్రమూర్తి యాయురారోగ్యభాగ్యములను బ్రసాదించుఁగాక.
నాప్రయత్నమునెల్ల బహూకరించుచు నాకుఁజేయూఁతనొసంగుచు నాకష్ట
సుఖములు తమవిగనే భావించుచు నుండువారు మ॥ రా॥ శ్రీ, వావిళ్ళ వేంక
టేశ్వరశాస్త్రులుగారు. వారుచేయుభాషాసేవ వచింప నలవికానిది. వారికి
తన్ముఖమున నాకృతజ్ఞతం దెలుపుకొనుచున్నాఁడను. పరమేశ్వరియుఁ బరమే
శ్వరుఁడునగు సీతారామచంద్రులు నామూలమున నీసత్కార్యమును బూర్తి
చేయించి భక్తరక్షణపరత్వమును మఱింత ప్రకటింతురుగాక యని త్రికరణ
శుద్ధిగాఁ బ్రార్థించుచున్నాఁడను. నాయాశయములఱుంగినియొక సావధాన
ముగాఁ బరిశీలించి నాలక్ష్యమేదియని యెఱింగి నాకుఁ దెలుపఁదగువిషయములఁ
దెలిపి శిష్యవాత్సల్యము నెఱపఁ బండితులఁ బ్రార్థించువాఁడను. ఇంతకంటెఁ
దెలుపఁదగువిశేషాంశములు లేవు. ప్రమాదములు క్షమింపఁ బ్రార్థింపకయు పం
డితు లప్పనియందు బద్ధకంకణులుగదా.

ఇట్లు, విన్నవించు భక్తపాదసేవకుఁడను

జనమంచి శేషాద్రిశర్మ.

శ్రీ. శ్రీ. శ్రీ.

# విషయసూచిక.

శ్రీః.

# శ్రీరామావతారతత్త్వము

## అయోధ్యాకాండము

### తృతీయప్రకరణము.

పరమేశ్వరధ్యానము.

శ్లో. శ్రీరామో రఘునాయకో రఘువరో రాజీవనేత్రాంచితో
రాజేంద్రో రఘుపుంగవో రఘుకులోత్తంసో రఘూణాం పతిః
రామో రాక్షసనాశకోఽమితబలో రాకేందుపూర్ణాననో
రాజత్కింకిణికంకణాంకితకరో రామస్సదా పాతు నః. ౧

శ్రీరామం సరసీరుహాక్షమమలం దూర్వాంకురశ్యామలం
విద్యుత్కోటినిభప్రభాంబరధరం వీరాసనాధిష్ఠితం
వామాంకోపరిసంస్థితాం జనకజామాలింగ్య తాం బాహునా
తత్త్వం చాపరపాణినా మునిగణానాజ్ఞాపయంతం భజే. ౨

శ్రీరామామలపుండరీకనయన శ్రీరామ సీతాపతే
గోవిందాచ్యుత నందనందన ముకుందానంద దామోదర
విష్ణో రాఘవ వాసుదేవ నృహరే దేవౌఘచూడామణే
సంసారార్ణవకర్ణధారక హరే కృష్ణాయ తుభ్యం నమః. ౩

రామం రత్నకిరీటకుండలధరం కేయూరహారాన్వితం
సీతాలంకృతవామభాగమతులం సింహాసనస్థం ప్రభుం
సుగ్రీవాది సమస్తవానరవరైస్సంసేవ్యమానం సదా
విశ్వామిత్రపరాశరాదిమునిభిస్సంస్తూయమానం భజే. ౪

రామస్సీతాసమేతో నివసతు హృదయే సానుజం రామమీళే
రామేణ క్షీణపాపస్త్రివిధమపి కృతం కర్మ రామాయ దద్యాం
రామాదన్యం న జానే న హి కిమపి మహారామనామ్నస్సమానం
రామే పశ్యామి విశ్వం భువనమనుదినం పాహి మాం రామచంద్ర. ౧

(శ్రీరామకర్ణామృతము.)

మహాశయులారా! సత్యాన్వేషణతత్పరులారా! శ్రీరామావతారతత్త్వమున ద్వితీయప్రకరణమును బఠించితిరి. ఆప్రకరణమున సగరచక్రవర్తిచరిత్రము, గంగావతరణము, అహల్యాశాపవిమోచనము, విశ్వామిత్రచరిత్రము, శివధనుర్భంగము, శ్రీసీతాకల్యాణము, పరశురాము ననుగ్రహించుట, అయోధ్యానగరమును బ్రవేశించుట లోనగువిషయములు గలవు. పరమపావనములగు నాగాథలం బఠించుటం జేసి శ్రీరామచంద్రునియపారమహత్త్వము, ఆతఁడు మునీంద్రవాంఛానిచయమును ఫలింపఁజేయుటయు, నాశ్రితరక్షణమున నాపరాత్పరునకుంగల యాదృతియుఁ జక్కఁగా గ్రహించియే యుందురు. శ్రీరామచంద్రమూర్తి ధర్మసంస్థాపనము చేయుటకొఱకే యవతరించెనన్న విషయ మీయయోధ్యాకాండమున స్పష్టము చేయుభారము నాపై నున్నది. పెద్దలే యీవిషయమును దెలిపిరి. వానినెల్ల నొక్కచోటం జేర్చుటయే నాపని. ఇపుడు పరాత్పరుఁడు ప్రకృతివిశిష్టుఁడయ్యెను. ప్రకృతిపురుషుల కవినాభావసంబంధము కలదుకదా. ఇపు డెట్లు ప్రకృతివిశిష్టుఁడయ్యెనని ప్రశ్నించువారు గలరు. భగవంతున కిది యొకవిహారము. వివాహపద్ధతిని సీతాదేవింగూడినట్లు నటించెను. దానిచే లోకులకు వివాహపద్ధతి నేర్పెనని గ్రహించు

టుచితము. చంద్రచంద్రికలకుంబోలె భగవతికిని భగవంతునకు నభేదము సిద్ధము అట్టులయ్యుఁ బ్రకృతిని లోఁగొని కొంత కాల ముండును. ఆకాలమునే మనసు మహాప్రళయమం దుము మరల జగన్నిర్మితియందు వాంఛఁగొను. దానినే సృష్టి యందును. ఆయిచ్ఛయే ప్రకృతి. ప్రకృతిదూషకులు కొందఱు గలరు వారు వాస్తవముగ నాలోచింప భగవద్దూషకులే యగు దురని తోఁచు. ప్రకృతి గుణమయియని భగవంతుఁడు నిర్గుణుఁ డని యందురు. మహామాయ దురత్యయయని భగవంతుఁడే గీతాశాస్త్రమున బోధించెను.

"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా. ౧౪. అ. ౭
ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి,
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్. ౧౯
కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే,
పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే." ౨౦. అ ౧3.

అను నీగీతావాక్యములు స్పష్టవిషయమును దెలుపుచున్నవి. గుణవిశిష్టుఁడయ్యెనేని భగవంతునిసగుణబ్రహ్మ మందుము. ప్రకృతివిశిష్టుఁడు కానిచో నిర్గుణుఁడై స్థాణువువలె నుండును. నిరీహుఁడని యర్థము. ఇచ్ఛయేకదా యామహాత్మునిమార్చెను. అనఁగాఁ బ్రకృతిని స్మరించెనని సారము. అంతకుముందుఁ గదలకయుండి యపుడు రూపవంతుఁడై జగన్నిర్మాణమునఁ గుతూహలము కలవాఁడయ్యెననియేకదా యిందుఁగలసారము. ఈవిషయమునే శ్రీశంకరభగవత్పాదులు

"శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
న చేదేవం దేవో న ఖలు కుశలస్స్పందితుమపి,

అతస్త్వామారాధ్యాం హరిహరవిరించాదిభిరపి
ప్రణంతుం స్తోతుం వా కథమకృతపుణ్యః ప్రభవతి."

అని సౌందర్యలహరియందుఁ దేటపఱచిరి. భగవద్గీతార్థమించు మించుగా నిదియేకదా. శ్రీహరివాక్యమును విశ్వసించువారు దీనిని విశ్వసింపక తప్పదు. శంకరాచార్యోక్తినిమాత్ర మంగీకరింపమనువారు శ్రీకృష్ణోక్తియందు విశ్వాసములేనివారే యనవలయును.

"జగత్సూతే ధాతా హరిరవతి రుద్రః క్షపయతే
తిరస్కుర్వన్నేతత్స్వమపి వపురీశస్తిరయతి,
సదా పూర్వస్సర్వం తదిదమనుగృహ్ణాతి చ శివ
స్తవాజ్ఞామాలంబ్య క్షణచలితయోర్భ్రూలతికయోః. ౨౪
త్రయాణాం దేవానాం త్రిగుణజనితానాం తవ శివే
భవేత్పూజా పూజా తవ చరణయో ర్యా విరచితా,
తథాహి త్వత్పాదోద్వహనమణిపీఠస్య నికటే
స్థితా హ్యేతే శశ్వన్ముకుళితకరోత్తంసమకుటాః. ౨౫
విరించిః పంచత్వం వ్రజతి హరిరాప్నోతి విరతిం
వినాశం కీనాశో భవతి ధనదో యాతి నిధనం
వితంద్రీ మాహేంద్రీ వితతిరపి సమ్మీలితదృశా
మహాసంహారేఽస్మిన్ విహరతి సతి త్వత్పతిరసౌ." ౨౬ (సౌందర్యలహరి.)

అనువీనింబట్టి యాలోచింపఁగా నాపరాత్పరునియిచ్ఛాశక్తి యనఁబడుమహాప్రకృతిమహత్త్వము స్పష్టమగును. ఇందుఁ ద్రిమూర్తులు మహాప్రళయమున నశింతురనియుఁ బరమేశ్వరుఁ డొక్కఁడుమాత్రము సకలబ్రహ్మాండభంగసమయమున విహరించుననియుఁ దేలెడిని. ఇందచ్చెరువొందఁదగిన విషయమే

లేదు. పరమాత్మయొక్కఁడే శాశ్వతుఁడని యెల్లరంగీకరింతురు కదా. ఆమహనీయునియిచ్ఛాశక్తి యగు ప్రకృతికింగూడ శాశ్వతత్వ మంగీకరింపవలయును. "ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి" అన్న శ్రీకృష్ణమూర్తియుపదేశముకూడ నిదియేకదా. ఒక్కభగవంతుఁడు శాశ్వతుఁడనియంగీకరించుచో నిఁకఁ ద్రిమూర్తులులోనగువారు శాశ్వతు లెట్టులగుదురు? త్రిమూర్తులలో నొక్కఁడుగఁ బరిగణింపఁబడువిష్ణువు శాశ్వతుఁడన్నచో నిరువురు శాశ్వతులుకలరని యంగీకరింపవలసివచ్చును. విష్ణువే భగవంతుఁడన్నయెడల నొక్కయధికారమే కలిగియుండు టసంగతమగును. విష్ణునామ మాపరాత్పరునకుం గలదనుచో శంకరాదినామము లేలయుండవు? అవి లేనిచో సర్వేశ్వరుం డతఁ డెట్లగును? సర్వాంతర్యామియై సర్వకారణకారణుఁడై సర్వశబ్దవాచ్యుఁడై యుండు పరమేశ్వరుఁడుతక్కఁ దక్కినవారెల్ల నశ్వరులనుట నిర్వివాదము ప్రకృతిపూరుషుల కభేదమనుటయు సిద్ధాంతము.

కొందఱు ప్రపంచపరిపాలకుఁ డగువిష్ణుమూర్తియే పరమేశ్వరుఁడనియు శంకరాదులు తత్పాదభక్తులనియు వాదింతురు. వారిభావ మట్లుండునే నా కేపేక్షింప నితరులకు నవసరముండదు. శంకరుఁడే పరమాత్మయనియు విష్ణ్వాదులు తత్పాదసేవకులనియు వాదించువారిని నీ రేల యాక్షేపింపవలయునో తెలియఁజాలకయున్నాఁడను. విష్ణురూప మాభగవంతునకుఁ గలిగినట్లే శంకరాద్యాకృతులు నాపరమాత్మకుంగలవు.

"న తే రూపం న చాకారో నాయుధాని న చాస్పదం,
తథాపి పురుషాకారో భక్తానాం త్వం ప్రకాశసే."

ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా"

అను నీసూక్తులు పైభావమునే తెల్పుచున్నవి.

"త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వమింద్రస్త్వగ్ం రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మ త్వం ప్రజాపతిః."

అను నీశ్రుతియు పైనవ్రాసినవిషయమునే సిద్ధాంతము చేయుచున్నది.

"సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే." ३०. అ ౬.

అను నీగీతావాక్యము పైవిషయమునే దృఢపఱచుచున్నది.

"సత్యం విధాతుం నిజభృత్యభాషితం
వ్యాప్తించ భూతేష్వఖిలేషు చాత్మనః,
అదృశ్యతాత్యద్భుతరూపముద్వహన్
స్తంభే సభాయాం నమృగం నమానుషమ్." ౧८. స్కం. ౭. అ ८.

అను నీశ్రీభాగవతవాక్యముకూడ నుదాహృతాభిప్రాయమునే తెల్పెడిని. ఇట్లొకొక్కగ్రంథముకూడఁ దెల్పుచుండఁగా దుర్వాదములకుంబూని సభలలో ఘోషించువారి ప్రాద్ధుష్కర్మమునుగుఱించి మనము చింతింపవలయును.

"అహం త్వం సర్వగో దేవ త్వమేవాహం జనార్దన
ఆవయోరంతరం నాస్తి శబ్దై రర్థై ర్జగత్పతే,
నామాని తవ గోవింద యాని లోకే మహాంతి చ
తాన్యేవ మమ నామాని నాత్ర కార్యా విచారణా." (హరివంశము.)

అనుశంకరోక్తియు,

"యోఽహంసత్వంజగచ్చేదం సదేవాసురమానుషం,
మత్తోనాన్యదశేషం యత్తత్త్వం జ్ఞాతుమిహార్హసి. ౪౭
అవిద్యామోహితాత్మానః పురుషా భిన్నదర్శినః,
వదంతి భేదం పశ్యంతి చావయోరంతరం హర. ౪౮

ప్రసన్నోఽహం గమిష్యామి త్వం గచ్ఛ వృషభధ్వజ." ౫అం. 33అధ్యా.

అను నీవిష్ణుపురాణమునఁగల శ్రీకృష్ణోక్తియు శివకేశవుల కభేద మునే సిద్ధాంతము చేయుచున్నది. ఉపలక్షణవిధిచే నీవిషయమే త్రిమూర్తుల కభేద మనుదానిని దృఢపఱచును.

ఇట్లు శ్రుతిస్మృతిపురాణేతిహాసములు భగవన్మహిమ మును దెలుపుచుండఁగా నొకకొందఱు మధ్యవైష్ణవులు దుర్మ తాభిమానమున శంకరాదులదూషించుట వారలప్రాగ్దుష్కర్మ మూలముననే యగును గాని వేఱుకారణమేమియుండును? తమ వంటివారిని గలుపుకొని యొకసంఘముగ నిరంతరము దేవ తాంతరదూషణము చేయుచుండువారినిగూర్చి మన మక్కటా! యనవలయుం గాని యింకేమనఁగలము? అట్లు దూషించినఁగాని వారలకు ధనముదొరకదు కాఁబోలు. తుచ్ఛమగుధనముకొఱకుఁ బరమసుగతిని బాడుచేసికొనుట యెంతటదుష్కార్యము? "అ జ్ఞానమోహితులైన పురుషులు కొందఱు భేదముగఁ గనుఁగొనుచు మనకిరువురకు భేదమును గల్పింతురు. భేదదృష్టిం జూతురు!" అని శ్రీకృష్ణమూర్తియే శంకరుంగూర్చి పలికినట్లు విష్ణుపురా ణమే చాటుచుండఁగా శివకేశవులకు చాలభేదము గలదను వైష్ణవు లెంతటిభక్తులో వర్ణింపఁదరమా! తమకంటె నజ్ఞాను లగువారలం జేప్పుకొని వారికి వేదోమంత్ర ముపదేశించి భగవ ద్భక్తిని బోధించునెపమున ధనము నాకర్షించుచు దానిని

వ్యయించుచున్నయట్లు నటించుచు మున్ను చేరఁదీసిన స్త్రీపురు షుల కొసంగుచు గడియ కొకవేషము వేయుచు భాగస్వాము లకుఁ గొంతయొసంగుచునుండు వేషధారులే దేవతాదూష ణము చేయువారని యూహింపవచ్చును.

భగవదారాధనమునకు భక్తియొక్కఁడే చాలును. ధన మక్కఱలేదు. ఇతరులసాయ మక్కఱలేదు. వేసారివేసారి ధన మడుగనక్కఱలేదు. ఇదియే ఋషులమతము. అదియే భగవంతు నకు సమ్మతము. కొందఱు యాచించి ధనముకూర్చి యన్నదాన మున నెందఱనో సంతృప్తులను జేయుచు నుందురు. అదియు భగవదారాధనమే యగును. కాని యది యుత్తమము కాదు. మధ్యమమనవలయును. వారికర్మమట్టిదియే. ధనమునుమాత్రము కూర్చి దాని వ్యయింపక యేదో కొంతమాత్రము వ్యయించి యెంతయో వ్యయించినట్లు డంబములు పలుకుచుఁ బరుల వంచించువా రెందఱో యుందురు. వారధములు. ఆయారా ధనము భగవంతుని సంతృప్తునిగాఁ జేయఁజాలదనుట నిక్కము. పామరు లట్టివారి నెఱుంగఁజాలక వారు నిక్కముగా యోగు లనియు, దాసులనియు, సన్న్యాసులనియు, భక్తులనియుఁ, బరో పకారపరాయణులనియుఁ, బామరులను మార్గదర్శకులనియుఁ దలంచి శ్రమములకుఁ బాలగుచుండియు ధన మొసంగుదురు.

"సత్పాత్రే విహితం దానం సఫలం పాండునందన"

అన్నసూక్తింబట్టి యాదానము వ్యర్థమే యగుననవలయును.

భక్తియొక్కఁడుండినఁ బరమేశ్వరు నారాధింపవచ్చును. తత్కథల నాలకింపవచ్చును. తన్నామసహస్రములఁ బఠింప వచ్చును. తద్దివ్యమంగళవిగ్రహమును ధ్యానింపవచ్చును. తీర్థ

యాత్రలు చేయవచ్చును. సాధువులను సందర్శింపవచ్చును. ఇవన్నియు భగవత్కరుణఁబడయుటకు మంచిత్రోవలు. ఇన్ని సులభమార్గములుండఁగా వీనిని లెక్కసేయక వంచకులై వేషధారులై తిరుగు దురాత్ములమాటలనమ్మి ధనముఁబోఁగొట్టుకొని దాన ముక్తివచ్చునని యెదురుచూచుటకంటె నజ్ఞానము వేఱుగ నేమియుండును?

భగవంతు నారాధించుమార్గములలో విగ్రహారాధన మధమము. అది భగవంతు నలరింపఁజాలదు. ప్రతిమానవునకు నయ్యది తొలుత నుండవలసినదియే. తరువాత దానిని వదలి భగవంతునకు నిచ్ఛానుసారముగా నొకరూపమును గల్పించి దాని మదినిలుపుకొని సకలోపచారముల నారాధించినట్లు భావించుచు ధ్యానముచేయు టుత్తమమార్గము. ఆవిధమున నారాధించుటకు ధన మక్కఱలేదు. ఏపరికరము లక్కఱలేదు. భక్తిమాత్రము కలిగియున్నం జాలును. దాన నాపరమేశ్వరుఁడు సంతుష్టాంతరంగుండగును. పలుకష్టములకు లోనై ధన మార్జించి యెన్నియోదుఃఖములకుఁ బాలై విగ్రహముల నలంకరించి తన్మూలమున ముక్తిఁబడయ నెంచుట యెండమావుల నుదకములని నమ్మి పరుగెత్తుట యెట్టిదో యట్టిది. విగ్రహారాధన మత్యల్పఫలదమే యనక తప్పదు. పామరులే యద్దానియం దాదరముకలవార లగుదురనుట నిస్సంశయము.

భక్తుఁడు తాఁగాంచువస్తువులనెల్ల భగవన్మయములనుగా భావింపవలయును. ఆస్థితియం దాతఁడు సమదర్శనుఁ డనఁబడును. అట్టివాని దృష్టికి భేదమనునది గగనకుసుమముగనేయుండును.

"యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి." ౩౦. గీత ౬ అ.

అను నీ కృష్ణోపదేశమే యీయాశయమును స్పష్టీకరించెడిని. ఇట్టులుండఁగాఁ గొందఱు దేవానాంప్రియులు ప్రకృతిపూరుషులకు భేదముకలదందురు. విష్ణుమాయ నారాధించుట తుచ్ఛమందురు. తద్భిన్నమగువ్యక్తి బ్రహ్మాండజాలముల లేదని వారెఱుంగరు. తన్నిర్మితులగు త్రిమూర్తులనే ప్రకృత్యతీతులందురు. ఏమి వారియజ్ఞానము?

"మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరం,
హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే." ౧౦. గీ ౯. అ.

అన్నభగవదుక్తిని వా రంగీకరింపరు. ఈవాక్యముంబట్టి త్రిమూర్తులకు జనని మూలప్రకృతియని స్పష్టము కాలేదా. ఈ యాశయమునే

"తవాధారే మూలే సహ సమయయా లాస్యపరయా
నవాత్మానం మన్యే నవరసమహాతాండవనటమ్,
ఉభాభ్యామేతాభ్యాముదయవిధిముద్దిశ్య దయయా
సనాథాభ్యాం జజ్ఞే జనకజననీ మజ్జగదిదమ్." ౪౧

అని సౌందర్యలహరియందు శ్రీశంకరభగవత్పాదాచార్యులు తేటపఱచిరి. కావున మతిమంతులు రూపవంతిమగునది ప్రకృతి వశంగతమని నమ్మి పూజింపవలయును. ప్రకృత్యతీతు నారాధించుట కొకధ్యానమే మార్గము. అదియు మూలప్రకృతి కగుణకుం బాత్రులగువారలకే దొరకును.

మహాత్ములారా! ఈవిషయ మిట నేటికి వ్రాయఁబడినదని ప్రశ్నింపకుఁడు ఇఁకఁ బ్రకృతియుఁ బరమపురుషుఁడు లోక

మున ధర్మరక్షణమునకై యెట్లు విహరించిరో యావిధమే
వ్రాయఁబడును. కావునఁ బ్రకృతిపురుషులమహత్త్వచరిత్ర
ములు చర్చింపఁబడియెను. శ్రీరామచంద్రుఁడు భగవంతుఁడని
సీతాదేవి విష్ణుమాయయనంబడు మహాప్రకృతియని తలం
పుఁడు. ఈవిషయమును మఱువక రామాయణమును బఠించి
నచో ననేకవిషయములు బయల్పడును. దాన భగవతీమహా
త్త్వము భగవంతునిప్రవర్తనము బోధపడును. శ్రీరామ
మూర్తి ప్రకృత్యతీతుఁడని తేటపడును. సీతాదేవి మూల
ప్రకృతియని స్పష్టమగును. ఎవరెవ రెట్లు ప్రవర్తింతురో విశద
మగును. వారిప్రవర్తనము లోకమున కెట్లుదాహరణభూత
మగునో విస్పష్టమగును. దానఁ బాఠకుల మనోమాలిన్యము
వదలి యాచోట భక్తిరసము వెల్లివిరియును. అపుడు దుష్కర్మ
వాసనలు నశించును. పరమేశ్వరారాధనపద్ధతి బోధపడును.
అదియే యుత్తమమార్గమని తోఁచును. కావున నిన్నిం
టికి మూలకారణమనందగు ప్రకృతిచరిత్రమును సుంత వ్రాసితి
నని మీ రెఱుంగవలయును. మతభేదములమాని దేవతాంతర
దూషణము మహాపాపకార్యమగుట నద్దానిఁ దొలంగంద్రోసి
కపటయోగుల మోసపుమాటలఁ దుచ్ఛములనియు ధనాకర్షణ
మూలములనియు నమ్మి వాని నాలకింపక వంచకులు చేయు
మంత్రోపదేశముల శాసింపక పరాత్పరుని పాదారవిందముల
ధ్యానింపఁ బ్రయత్నింపుఁడు. వాల్మీకిరామాయణము శ్రీరామ
చరిత్రము నెట్లుతెలిపెనో అధ్యాత్మరామాయణ మేరీతి శ్రీ
రామతత్త్వమును బోధించెనో పరిశీలింపుఁడు. కథాభేదమును
బాటింపక యాగ్రంథ మేపద్ధతి భగవన్మహత్త్వమును దెలిపె

ననువిషయమును గ్రహింపుఁడు. కొన్నితావుల నొకదానికి వేఱొకటి విరుద్ధముగఁ గథాభాగములం దోఁచును. ఆభేదము బాహ్యదృష్టింబరిశీలింప నసంగతముగనే తోఁచును. సూక్ష్మదృష్టినిబరిశీలింపుఁడు. భేదముకానరాకపోవును. మార్గభేదమే కాని లక్ష్యమొక్కటియేయని తేటపడును. ప్రతివిషయము నిట్లే పరికింపవలయు ననుభావము స్పష్టమగును. ఆభావము దృఢపడినపుడు మతములను దత్కర్తలను దదాచారములను దూషింప నవకాశముండదు. భగవంతున కొక్కరూపము,ఒక్కనామము, ఒక్కలోకము లేదనియు, సర్వరూపములు సర్వనామధేయములు, సర్వస్థలములు కలవనియు, నేభక్తుఁ డేరీతి ధ్యానించినను నిర్మలభక్తి యుండెనేని పరమాత్మ యాతని ననుగ్రహించు ననియుఁ దోఁచును. ఆస్థితియందే మీరు పరమభాగవతు లనంబడుదురు.

లోకమున నొకమతమును వదలి వేఱొకమతము నెవ్వారు స్వీకరింతురో వారు తమరు వదలినమతమును తదాచారములను దత్కర్తను విశేషించి దూషింతురు. అట్టివారు మతధర్మములను జక్కనిదృష్టిచేఁ బరిశీలింపలేదనియు రజోగుణప్రధానులై తమోగుణము దానికి సాయపడఁగా నట్లు దూషించిరనియు మన మూహింపవలయును. అంతియగాని వారిని మనము దూషింపరాదు. అట్లు దూషించినచో మనయందుఁ గలసత్త్వగుణమును మించి రజస్తమస్సులు ప్రకాశించుననియు నవ్విరెండును మనపురోవృద్ధికి నెంతయు భంగకరములనియు నిశ్చయించుకొనవలయును. పురోవృద్ధికై నను భంగము కల్గించుకొని పరమతముల దూషింపనేల? అది మూర్ఖపద్ధతి.

"శిరశ్శార్వం స్వర్గాత్పతతి శిరస స్తత్క్షితిధరం
మహీధ్రాదుత్తుంగాదవనిమవనేశ్చాపి జలధిం,
అధోఽధో గంగేయం పదముపగతా స్తోకమథవా
వివేకభ్రష్టానాం భవతి వినిపాతశ్శతముఖః. ౧౦
వరం పర్వతదుర్గేషు భ్రాంతం వనచరైస్సహ,
న మూర్ఖజనసంపర్కస్సురేంద్రభవనేష్వపి." ౧౪

అన్నభర్తృహరివాక్యము లిట స్మర్తవ్యములు. ఇఁకనైన మన మాదారినఁ బ్రయాణముచేయకయుండు టత్యుత్తమము.

## ధర్మరక్షణము.

ఇఁక శ్రీరామమూర్తి ధర్మము నెట్లు సంరక్షించెనో యనుదానిఁ బరికింతము. ఇదియే ప్రధానము. "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే." అనునది భగవంతుని ప్రతినకదా. దానిని శ్రీరామాకృతిం దాల్చినభగవంతుఁ డెట్లు నిర్వహించెనో విమర్శింతము. విశ్వామిత్రునిమూలమునఁ దాటకాదులమర్దించినట్లునటించి తనమహత్త్వమును సామాన్యమానవు లెఱుంగకయుండ నమ్మునిపంపుననే గౌతమాశ్రమమును బ్రవేశించి యతఁడు పురికొలుప నహల్యకు శాపవిముక్తి ననుగ్రహించినచందము నభినయించి గంగామాహాత్మ్యము నెఱుంగనియట్లు ప్రశ్నించి దానిని సేవించి యది పరమపవిత్రకార్యమని లోకులకు బోధించి శివధనుర్భంగమూలమునఁ దన యపారశక్తిని లోకులకుం దెలిపి తన్నుఁడంబొయకయుండు ప్రకృతిని సీతారూపమున వేఱుగా నున్నయట్లు నటించుమహామాయను బెండ్లియాడి వివాహపద్ధతి యిట్టిదని లోకములకు నెఱింగించి నూతనదంపతిత్వమును గనఁబఱచుచుఁ బయనము

సాగించి పరశురామాగమనమునఁ దనయవికృతిత్వమును వెల్లడించుచు నాతనినుండి స్వాంశమును సంగ్రహించి సాధుదూషణము నాత్మప్రశంసయు మంచివికావనునీతిని బరశురామార్జితపుణ్యలోకభంజనరూపమున నెల్లరకుఁ దేటపఱచుచు నయోధ్యానగరమును బ్రవేశించినగాథ బాలకాండమునఁ గలదు.

ఆశ్రమములు నాలుగు. అందు రెండవదగు గార్హస్థ్యము త్తమమని యెఱుంగందగు. గృహస్థాశ్రమమును స్వీకరించినఁగాని లోకమున నుపకారము చక్కఁగా నెవ్వాఁడును జేయఁజాలఁడు. ఎల్లయాశ్రమవాసులకు నుపకరించునది గృహస్థాశ్రమమే.

"యథా వాయుం సమాశ్రిత్య వర్తంతే సర్వజంతవః,
తథా గృహస్థమాశ్రిత్య వర్తంతే సర్వ ఆశ్రమాః. ౭౭
యస్మాత్త్రయోఽప్యాశ్రమిణో జ్ఞానేనాన్నేన చాన్వహం,
గృహస్థేనైవ వర్తంతే తస్మాజ్జ్యేష్ఠాశ్రమో గృహీ. ౭౮
స సంధార్యః ప్రయత్నేన స్వర్గమక్షయమిచ్ఛతా,
సుఖం చేహేచ్ఛతా నిత్యం యోఽధార్యో దుర్బలేంద్రియైః. ౭౯
ఋషయః పితరో దేవా భూతాన్యతిథయస్తథా,
ఆశాసతే కుటుంబిభ్యస్తేభ్యః కార్యం విజానతా. ౮౦
స్వాధ్యాయేనార్చయేతర్షీన్ హోమైర్దేవాన్ యథావిధి,
పితౄన్ శ్రాద్ధైశ్చ నౄనన్నైర్భూతాని బలికర్మణా." ౮౧

మనుస్మృతి. 3 అధ్యాయము.

ఈస్మృతివాక్యముల నెట్లు శ్రీరామమూర్తి స్వప్రవృత్తిని సిద్ధాంతములుగ నొనరించెనో మన మెఱుంగుటయే మంచి తెఱంగు. సర్వాశ్రమములవారు గృహస్థు నాశ్రయింపవలయు.

సకలాశ్రమోపకారక్షమము గృహస్థాశ్రమము. అందైహికా
ముష్మికసుఖములు గలవు. ప్రపంచమునకుఁ దఱచుగా నీరెండు
నావశ్యకములే. కావున శ్రీరామమూర్తి ప్రకృతిఁగూడి
యయోధ్యానగరమును బ్రవేశించెను. అందు నుత్తమగృహస్థు
వెట్లు ప్రవర్తింపఁదగునో యట్లు ప్రవర్తించెను. నిర్లిప్తుఁడై
యుండియు సంసారివలె నటించెను. మహామాయ సద్గృహిణి
యెట్లు వర్తింపఁదగునని మన్వాదిస్మృతులు తెలిపెనో యట్లు
వర్తించెను. తన్నుఁగాంచి యుత్తమకాంతలెల్లఁ బ్రవర్తింప
నుత్సాహపడునట్లుండెను. ఎంతకాల మాపురవాసులకుఁ బ్రవర్త
నము నేర్పఁదగునో యంతకాల మాయిరువురు నందుండిరి.

మహామాయ భగవంతు నాజ్ఞఁ దలందాల్చి దుష్టసంహా
రము చేయఁదలంచెను. శ్రీరామమూర్తి ప్రకృతిఁగూడి నిర్లిప్తుఁ
డయ్యు నెల్లకార్యములఁ దా నాదృతిం గన్నయట్లుండెను.
సర్వజ్ఞుఁడయ్యుఁ బెద్దలు చెప్పునట్లు నడువసాగెను. పెద్దల
మాటల నాదరించుసద్గుణశాలియన్న విఖ్యాతిం గాంచెను.
ఎవరెవరిని గర్మ మెట్లెట్లు త్రిప్పుచున్నదో యాచందమును
గాంచి వేడుకపడుచుండెను. తనయానందమునే ప్రకృతియు
ననుభవించుచుంటఁ దానెఱుఁగును. ఉత్తమగృహస్థులెల్ల
రాశ్రీరామునినడవడిక ననుసరింపఁ బ్రయత్నపడుచుండిరి.
కాని యద్ది సాధింపశక్యమా. అనన్యసాధ్యముకదా భగవ
ద్వర్తనము. యథాశక్తి నద్దాని నభ్యసింప నెల్లరుఁ గోరవలసి
నదే నగరవాసులనేగాక ప్రపంచవాసులనెల్ల నాపరాత్పరుని
తత్త్వ మెఱుంగకయుండ మహామాయ తనయద్భుతశక్తి
మోహింపఁజేసి రాజకుమారుఁ డనుభావము కలవారిగా నొన

రించెను. అహల్యాశాపమోక్షము శివధనుర్భంగము పరశురాము ననుగ్రహించుటయు లోనగుమహాద్భుతకృత్యములం గన్నులారఁ గాంచినదశరథాదులుగూడ నీవ్యక్తి యెట్టిదని యూహింపక పుత్త్రప్రీతిచే భగవంతుని గనునట్లు లాప్రకృతి యొనరించెనన నీక నామహాకార్యములఁ జూడనివారలమాట యిటఁ బ్రస్తావింప నేటికి?

"అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితం,
పరం భావమజానంతో మమ భూతమహేశ్వరమ్. ౧౧
మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః,
రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః. ౧౨
మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః,
భజంత్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయం. ౧౩
సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః,
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే. ౧౪
జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మాముపాసతే,
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్." ౧౫. గీ॥ ౯ అధ్యా॥

అను నీశ్రీకృష్ణపరమాత్మయుపదేశవాక్యములు పైనుదాహరించినభావమునే సూచించుచున్నవి. జ్ఞానయజ్ఞమునఁ బరాత్పరు నారాధించువసిష్ఠాదిమహర్షులే యించుక యొఱింగిరి. అంతటి మోహింపఁజేయఁజాలుశక్తి యాజగదంబకుఁ గలదు. బ్రహ్మవిష్ణ్వాదు లాపరదేవి ముందు బాలకులవలె నాడుచుందురు.

"కరాంగుళినఖోత్పన్ననారాయణదశాకృతిః"

అన్న నామ మాజగజ్జననికిం జెల్లు. శ్రీభాగవతమునఁ బరాత్పరుఁడే

"అర్చిష్యంతి మనుష్యాస్త్వాం సర్వకామవరేశ్వరీం,
నానోపహారబలిభిస్సర్వకామవరప్రదాం. ౧౦
నామధేయాని కుర్వంతి స్థానాని చ నరా భువి,
దుర్గేతి భద్రకాళీతి విజయా వైష్ణవీతి చ. ౧౧
కుముదా చండికా కృష్ణా మాధవీ కన్యకేతి చ,
మాయా నారాయణీశానా శారదేత్యంబికేతి చ." ౧౨

అను నీవాక్యములు శ్రీకృష్ణమూర్తి యోగమాయనుగుఱించి చెప్పినవి. ఇపు డీయోగమాయ యెవతుక? శివపత్నియా? విష్ణుపత్నియా? బ్రహ్మపత్నియా?

"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా."

అని శ్రీకృష్ణమూర్తి భగవద్గీతలయందుఁ జెప్పినది యీయోగమాయయేనా? వేఱొకతుకయా? ఈదేవీపూజనము నింద్యమనువారు భగవద్దాసులా? ధనదాసులా? క్షుద్రజనదాసులా? అంబికా, దుర్గా, భద్రకాళీప్రభృతినామములు లాయోగమాయకుంగలవని శ్రీభాగవతమే చాటుచున్నదికదా. మధ్వవైష్ణవులద్దానిఁ బ్రమాణముగా నంగీకరింపకుకాఁబోలు? అంగీకరించుచో భగవంతునితోడ నవినాభావసంబంధముగలశక్తి నెట్లు దూషింతురు? శక్తినుపాసించువారే శాక్తులు. ఆశక్తియే భగవదిచ్ఛ. ఆమెను గూడినపుడే భగవంతుఁడు దేహధారి యగును. ఉపాసించువారు సగుణునే ధ్యానింతురు. ఇపుడాధ్యాన మీమధ్వవైష్ణవుల యభిప్రాయానుసారము నీచమనవలయు. కావున నట్టిదాసులదుర్వాదములకుఁ జెవియొగ్గక యీ మాయ నారాధించి తదనుగ్రహమునకుఁ బాత్రులు కావలయును. ఆమహాప్రకృతి బ్రహ్మవిష్ణుమహేశ్వరులసృజించి

యొక్కొక్క బ్రహ్మాండమున నధికారపురుషులనుగా నియమించును. భద్రకాళియన్న మధ్వవైష్ణవులకుఁ దలనొప్పి. వైష్ణని యను పేరుకూడఁ గలదు. అద్దాని విన్న నేమందురు? ఈ రెండు నామము లొక్కయోగమాయకే కలవు. ఇట్లే శివ శంకర మధుసూదనాదినామము లాపరమాత్మకుం గలవు. ఒక్కనామమును దూషించి వేఱొక్కనామమును బ్రశంసించిన నది యాపరమాత్మను దూషించినట్లే యగును. విష్ణుభక్తులు, శివభక్తులు, దేవీభక్తులు, సూర్యభక్తులు, గణనాథభక్తులు, భైరవభక్తులు భగవద్భక్తులే. వీరలకందఱకు లక్ష్య మాపరమేశ్వరుఁడే. ఇందొక్కరొక్కరు ఇతరులదూషింప నవకాశ మేది? లేనియున కాశ మున్నదనుకొని నోటికివచ్చినట్టు లాభగవత్స్వరూపు లగు శంకరాదుల దూషించుట మధ్వవైష్ణవులకు, నట్టివారగు విష్ణ్వాదుల దూషించుట మధ్యశైవులకు నయుక్తమనక యుండ నవకాశముకలదా? వీరే పాషండులు ఆస్తికులగువార లిట్టి దుష్కార్యముల నాచరింపక మనోవాంఛానుగుణరూపమున నాభగవంతు నారాధించు టుత్తమమార్గము. ఆ యీశ్వరా రాధనము మానసికంబైన నుత్తమము. బాహ్యమైన నల్పఫలదము. విగ్రహారాధన మధమఫలదము. ప్రతివ్యక్తిని భగవత్స్వరూపముగా భావించు టుత్తమోత్తమము. ఆస్థితియందుండువారే సమదర్శను లనంబడుదురు. వారినే పరాత్పరుఁడు విశేషించి ప్రేమించును.

అయోధ్యానగరమునఁ బ్రకృతియుఁ బరమపురుషుఁడును ధర్మసంస్థాపనము చేయఁబూని స్వప్రవృత్తియే యెల్లరకు నుదాహరణమగునట్లు చేయుచుఁ జేయఁగలకార్యముల నాలో

చించుచుండిరి. శ్రీరామమూర్తి తన సర్వసాక్షిత్వమును వెల్ల
డించుచు మహానందసాగరమున నోలలాడుచు నిర్లిప్తుఁడై
యుండెను మహామాయ సీతారూపమునఁ బరాత్పరుని
శ్రీరాము ననుకరించుచు నపారస్వీయశక్తిని దాఁచి పురం
ధ్రులు తన్నుఁజూచి సదాచారముల నేర్చుకొనఁ బ్రయత్నపడఁ
జేయుచు నెప్పుడెప్పు డెట్లెట్లు దుష్టనిగ్రహశిష్టపరిపాలనము
లను జేయవలయునో యూహించుచుఁ గర్మగతులఁ బరిశీలిం
చుచు నుండెను. దేవతలు దుష్టరాక్షసులవలనిబాధ లెప్పు
డడంగునా యని యువ్విళ్లూరుచుండిరి. మహర్షులు భగవంతు
నాశయ మిట్టిదని యెఱుఁగఁజాలక యేక్షణమున నేమికార్య
మాపరమాత్మ చేయునో కనుఁగొనఁగోరుచు నాప్రకృతిపురు
షుల ధ్యానించుచు లోకాచారములఁ బాటించి యాదంపతుల
యపారశక్తిని వెల్లడింపఁ బూనక యంతఱవలెఁ దమను
ప్రవర్తించుచుండిరి.

భగవంతుఁడు కూడఁ గర్మగతుల నరయుచుఁ దనసుగుణ
ముగాఁ దాను బ్రవర్తించును. ఏపనినైనను జేయుటకుఁ జేయ
కుండుటను వేఱొకవిధముగాఁ జేయుటను(కర్తుమకర్తుమన్యథా
కర్తుం) సమర్థుఁడయ్యును గర్మసిద్ధాంతము గహనమనుతన
యుపదేశమును

"కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః,
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః."

అన్నదానిని సార్థకము చేయుపట్టువలతో నుండును. అంతియ
గాని దాని నించుకంతయు మీఱఁడు. అట్లు మీఱిన లోకా
చారములు తాఱుమాఱగునని యాపరమాత్మ యెఱుఁగును.

"యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః. ౨౩
ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహం,
సంకరస్య చ కర్తా స్యాముపహన్యామిమాః ప్రజాః." ౨౪ గీ. ౩ అధ్యా.

అను శ్రీకృష్ణోక్తులు పై భావమును సిద్ధాంతము చేయుచున్నవి. కనుకనే బ్రహ్మాదులందఱు కర్మసూత్రబద్ధులై యుందురు. ఆకారణముననే

"కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః,
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి." ౨౦ గీ. ౩ అ.

అని భగవంతుఁడు శాసించెను. మహాయోగులు కూడ లోకసంగ్రహార్థము ఫలాభిసంధిరహితకర్మముల నాచరింతురు. భగవంతుఁడు కూడఁ గర్మబద్ధునిరీతి నటించునని యెఱుంగవలయును. ఆపద్ధతియే యీయయోధ్యాకాండమున స్పష్టమగును. కొందఱు కర్మముల నాచరింపరాదనియు నయ్యవి సంసారబంధమునకే హేతువులగుననియు వానిని వదలి

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః."

అను నీశ్రీకృష్ణోపదేశముచొప్పున భగవంతునే యాశ్రయింపవలయుననియు నియ్యది చరమశ్లోకమనియుఁ బలుకుదురు. ఇట్టివారే మధ్యవైష్ణవులని యిందుఁ బేర్కొనఁబడువారని యెఱుంగవలయును. ఈయొక్కయభిప్రాయమే భగవంతునకు సమ్మతమైనదగుచో

"కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన,
మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి. ౪౭

యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ,
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే. ౪౮
దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ,
బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః. ౪౯
బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే,
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్. ౫౦
కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః,
జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛంత్యనామయం. ౫౧ గీత. ౨ అధ్యా.
నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః,
శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః. ౮
యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః,
తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగస్సమాచర.'' ౯ గీత. 3 అధ్యా.

అను శ్రీకృష్ణోక్తులు వ్యర్థములగును.

''మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే.'' ౬౫ గీ. ౧౮అ.

మద్యాజీ అనునది కర్మము కాదా. చరమశ్లోకానంతరమునందు

''ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన,
న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి.''

అను శ్రీకృష్ణవాక్యమే కలదు. 'అతపస్కాయ' అనఁగా నర్థమేమి? తపస్సు సత్కర్మము కాదా. అగునన్నచో సకలకర్మములు వదలుమనుదాని కర్థమేమి? ఇందు సారమేమనఁగా "ఫలము నిందుకయే నాశించి కర్మముల నాచరింపక సత్కర్మముల నాచరించి భగవదర్పణము చేయుచు దాన లోకులు

సత్కర్మాచరణపరాయణు లగుదురుగాక యని యాశించుచుం జెక్కండ్రు దేవతల ననఁగా భాగ్యమునకుఁ గుబేరుని, మృత్యుబాధ తొలఁగుటకు యముని, సుఖానుభవమునకు నింద్రుని, సంతానమునకు శ్రీకృష్ణుని ఇట్లే యెన్నియో వాంఛల కంత అనో దేవతల నాశ్రయింపక సర్వమునకు భగవంతు నొక్కనినే నమ్మియుండవలయుననియు భక్తుఁ డేరూపనామములఁ దన్నుఁ గొలుచునో దాన సంతుష్టినొంది పరమేశ్వరుఁ డును గ్రహించుననియు" నెఱుంగఁ దగు. అంతియగాని నిత్యనైమిత్తికకర్మములను వదలి పాషాణాదినిగ్రహములు ముక్తిఁ బ్రసాదించునని నైవేద్యము లర్పించి వాని దినుచునుండు సోమరులకు భగవదనుగ్రహము శశవిషాణమే యగును కొందఱు శ్రీచరమశ్లోకార్థమును విచ్చలవిడి బోధించుచు సంధ్యావందనాదులను మాని భగవత్కైంకర్యమని భుక్తికిఁ బ్రయత్నింతురు. వారిదుర్బోధములకు లోఁబడక మనము చేయుసత్కర్మముల నాపరాత్పరున కర్పించుచునుండిన నామహాత్ముని యనుగ్రహమునకుఁ బాత్రులమగుదుము. కావున వంచకుల మహోపన్యాసములకు లోఁబడక సద్గ్రంథములఁ బఠించి తదుక్తప్రకారము ప్రవర్తించుచు భగవద్రూపములను దదారాధనభేదములను దదాచరణపరాయణులను దూషింపక చక్కఁగా భగవంతుని సేవించు టుత్తమము.

ఇఁకఁ బ్రకృతిపురుషులగు సీతారామచంద్రుల ప్రవృత్తిని బరికింతము. దాన నాదంపతులు ధర్మరక్షణమున కెట్లు పాటుపడిరో స్పష్టమగును. కథ తెలిసినదని యానందించి సంతృప్తి నొందరాదు. వారివలెఁ బ్రవర్తింప శక్తికలిగినంతదనుకఁ

బ్రయత్నింపవలయును. ఈభాగము పఠించునపుడు కర్మసిద్ధాంత మెంత బలవత్తరమో పరికింపుఁడు. దానవే మేలు చేకూరును. పేరునకు భక్తులమని తెల్పుకొనుచు దాసులమని విఱ్ఱవీఁగుచు సన్న్యాసులమని ధనము నార్జించుచు యోగులమని శిష్యుల వంచించుచు నుండుదురాత్ములమాటలకు లోఁబడిన నధఃపతనమే ఫలముగాని వేఱుఫలము రాఁబోదు. గురువులమని యుపదేశింతుమని బోధించువారు గురువులు కారు. ఉపదేశకులును గారు. ఎవరిని గాంచినంతనే యితరులకు భక్తివినయములు పొడముసో వారిని గురువులుగా భావింపవలయును. వారి మనశ్శక్తి మనలను మార్చివేసెనని యెఱుంగవలయును మేము గురువులమని మిమ్ముద్ధరింతు మనువా రహంకారపూరితస్వాంతులుగాన వారు దురాత్ము లగుదురు. ధనకాంక్షు లగుదురు. వారిపొంతకుఁ బోవరాదు.

"అనేకగురవస్సంతి శిష్యవిత్తాపహారకాః."

అన్నసూక్తి స్పష్టమే కదా. ఎవరిమోమున నానందరసము వెల్లివిరియుచు నిత్యసంతుష్టులనుభావము తోఁపఁజేయునో వారు భగవద్దాసులు. వారిని సేవించిన లాభము కలుగును. వారికి ధన మక్కఱ లేదు. స్తోత్రపాఠము లక్కఱ లేదు. శిష్యులం గూర్చుకొను ప్రయత్న మక్కఱ లేదు. తగినపాత్రము దొరకినఁ బెన్నిధిం గాంచినయట్లానందించి తమరనుభవించు మహానందమునకుఁ గారణమగుమార్గము నుపదేశించి యాశీర్వదింతురు. అంతియగాని మాకొడఁ గూర్చుండి ఛాయాపటములను దీయింపుఁడని వారు కోరరు. శిష్యు నభివృద్ధియే వారికి దక్షిణ. అట్టివారే సద్గురువులు;మహాభక్తులు. వారిదర్శనము మనపూర్వ

సత్కర్మఫలముగాఁ గలుగును. ఇఁకఁ గథవంకకు దృష్టిని మరలింతము.

మహాశయులారా! బాలకాండము తుదిభాగమునందు శ్రీరామమూర్తి యుత్తమరాజకన్యయై తన్ను విశేషించి ప్రేమించుచు నున్నసీతాపురంధ్రీమణింగూడి లక్ష్మీదేవితోడ మహావిష్ణువు ప్రకాశించినట్లు ప్రకాశించెనని పఠించితిరి.

"అతీవ రామశ్శుశుభేఽతికామయా విభుశ్శ్రియా విష్ణురివామరేశ్వరః."

అనుమూలముం బఠించితిరికదా. "అమరేశ్వరః విష్ణుః శ్రియా" అనఁగా దేవతలకుఁ బ్రభువగువిష్ణువు లక్ష్మింగూడి ప్రకాశించినట్లు. అనుటచే నిటఁ బేర్కొనఁబడినవిష్ణువు త్రిమూర్తులలో నొకఁడని యెఱుంగందగు.

"ఆదిత్యానామహం విష్ణుః."

అన్నగీతావాక్య మీయర్థమునకుఁ బ్రమాణము. త్రిమూర్తులు ప్రకృతిచే సృజింపఁబడినవారలనియు బ్రహ్మాండముల కధికారపూరుషులనియుఁ దేలెడిని. వీరిమాటయేల? ప్రకృతికింగూడఁ బరుఁడగువాఁడే భగవంతుఁడు. తదంశసంభూతులే యెల్లరు. అందు నీమూవురు భగవదంశము విశేషించికలిగిన యుత్తమోత్తమపూరుషులనియు, మనము వారిని భగవంతునిగా భావించుట వాంఛాప్రదానమునకే యనియు నెఱుంగవలయును. కనుకనే మహర్షులు

"స్వాత్మానందలవీభూతబ్రహ్మాద్యానందసంతతిః."

అని ప్రకృతిం బ్రశంసించిరి. ప్రకృతిపూరుషుల కనాదిత్వము సిద్ధము. "ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి" అన్న

గీతోక్తిని మనము మఱువ రాదు. వైకుంఠవాసుఁడే రామరూప
మున నవతరించె నన్న వాక్యమున కర్థమేమని ప్రశ్నింతురేని
వైకుంఠ మనుశబ్దమునకు సత్యమగునర్థమును గ్రహించిన
భగవంతుఁడే వైకుంఠవాసి యగునని తోఁచుననియు, విష్ణ్వాది
నామములకు రూఢ్యర్థము గ్రహింపరాదనియు,యౌగికార్థము
గ్రహింపవలయుననియు,నపు డీప్రశ్నమున కవకాశమే లేదనియు
సమాధానమగును అనఁగా విష్ణు వెట్లు బ్రహ్మాండరక్షణమున
కధికారిగాఁ బ్రకృతిచే నిర్మింపఁబడియెనో యట్లే శ్రీరామ
మూర్తి మనుష్యలోకరక్షణకార్యమును జక్కఁ నొనరించి ధర్మ
సంస్థాపనముచేయ నవతరించెననియు, భగవంతుఁడు మహా
మాయంగూడినట్లు శ్రీరామమూర్తి సీతాదేవింగూడియుండు
ననియు గ్రహింపందగు. సీతారాములే ప్రకృతిపురుషులని
మనము భావించిన వారే వీరగుదురు కదా. "భావనామాత్ర
సంతుష్టహృదయః పరమేశ్వరః" అన్న సూక్తియే యిందులకుఁ
బ్రమాణమనియు నెఱుంగవలయు. జానకీదాశరథుల ప్రవర్త
నమే స్మృతిసమ్మతమనియుఁ దదనుసారముగాఁ బ్రవర్తించు
వారలకు సుస్థిరపురుషార్థము లభించుననియు మనము దృఢ
ముగ నమ్మవలయును. ఆచరిత్రమే శ్రద్ధాభక్తులు గలిగి పఠిం
చుచుఁ గర్మగతులవైఖరి పరికించుచుండవలయును.

## కథారంభము.

*అయోధ్యాపురప్రవేశానంతరము దశరథుండు నల్వురు
కుమారులు కోసలేంద్రుని దన్ను సేవించుచుండఁగాఁ గొంతకా

* ఈయది యయోధ్యాకాండాదిసర్గమునుండి యధ్యాత్మరామాయణ
విషయములం గలుపుచు గ్రహింపఁబడియెనని యెఱుంగఁదగు.

లము సుఖముగా నుండెను. భగవతిసంకల్పించిన ప్రకారము భగవత్కార్యము నెఱవేఱునట్లెల్లరమనస్సులం దూహాలు జనించెను. మాయామహాసంకల్పమే కర్మరూపమున నెల్లర నాడించునని మన మెఱుంగందగు. తొలుదొలుత భరతశత్రుఘ్నుల కా కర్మమే గమనమును గల్పించెను. ఆకార్యము నెఱవేఱినంగాని రామావతారఫలము లోకములకుం గలుగునవకాశము లేదు. నిరాతంకముగా భగవత్సంకల్పము ఫలింపవలయునుంగదా.

మిథిలానగరమునకు శ్రీరామాదులవివాహసమయమున యుధాజిత్తు వచ్చియుండెనుగదా. అతఁడు భరతుని మాతామహుఁడు చూడఁగోరుచున్నాఁడని తెల్పియుండెను. వివాహానంతర మా యుధాజిత్తు భరతునిం దోడ్కొనిపోవ నయోధ్యకు వచ్చెను. కొంతకాల మావేడుకలం గాంచుచు నందే యుండెను. ప్రకృతి సంకల్పించినవెంటనే దశరథుఁడు భరతుని శత్రుఘ్నుని తోడ యుధాజిత్తుంగూడి పొమ్మని సాగనంపెను. భరతశత్రుఘ్నులయోధ్యానగరమును వదలిపోయిరి. ఈయిరువురిలో నెవ్వరున్నను దేవకార్యము నెఱవేఱదు. కనుకనే జన్మముమొదలు భరతశత్రుఘ్నులొక్కరీతిగా నుండిరి. శ్రీరామలక్ష్మణులొక్క జట్టుగా నుండిరి. కర్మగతి గహనము కదా తొలుదొలుత నీ నలువురన్నదమ్ములు రెండుతెగ లగుటకుఁ గారణ మేమని యెవ్వరు నాలోచింపరైరి. ఏల? ఆయూహాద్గమున వారికిఁ గలుగకయుండఁజేసినది యాకర్మమే యని తలంపుఁడు. భరత శత్రుఘ్నులకు రామలక్ష్మణులపైఁ బ్రీతి లేదని యభిప్రాయము నొందరాదు. కాని యట్లుండినఁగాని దేవతాకార్యములు ఫలింపవు. మర్త్యలోకమున ధర్మము నెలకొని మానవులకు శాంతి

కుదురునవకాశము లేదు. కావుననే కర్మమాయాపద్ధతుల
ముందే నియమించెను. దాని నాపరాత్పరుఁడే మీఱఁబూనఁ
డన నితరులమాట ప్రస్తావింపనేటికి?

భరతశత్రుఘ్నులు కేకయపట్టం జూడఁ బోవఁగా శ్రీ
రామలక్ష్మణులు దశరథసేవాకార్యమున జాగరూకులై కొడు
కులగుపెంబోటునలని పరితాపము తోఁపకయుండ సేవించుచుం
డిరి. కేకియనగరమున నాసోదరులిరువురు నెమ్మదిగా నుండిరి.
చిరకాలమునకు వచ్చిరన్న ప్రేమమున రాజు వారల విశేషించి
యాదరించుచుండెను. ఎన్నివిధముల నాదరించుచున్నను వారలు
తండ్రిని స్మరించుచు వృద్ధత్వమును దలంచి పరితపించుచు
శుశ్రూష చేయక వచ్చితిమికదా యనుకొనుచు నుండిరి.
అయోధ్యానగరమున నున్న దశరథుఁడుకూడఁ బరదేశము
నకుం బోయియున్న యాతనయులనిరువురను దలంచుకొని పరి
తపించుచుండెను. ఏలయనఁగా నానల్వురు నాలుగుబాహువుల
వంటివారు. తనకుఁగల నాలుగుబాహువులపై నెట్టిప్రీతి యుం
డునో యానలువురుకొడుకులపై నట్టిసమానప్రీతి దశరథునకు
నుండెను. ఐనను జ్యేష్ఠపుత్త్రుఁడగు శ్రీరామమూర్తి తండ్రికి
మిక్కిలి ప్రీతిపాత్త్రుఁ డయ్యెను. ఏలయనఁగా భగవంతుఁడు
దేవతలచేఁ బ్రార్థింపఁబడి రావణవధముఁగోరిన సురలప్రార్థనము
నంగీకరించి మానవలోకమున దేహమును ధరించెను గదా.
తాను సనాతనుండయ్యు నరూపుఁడయ్యు నిర్గుణుండయ్యు,
భక్తానుగ్రహార్థము ప్రకృతికల్పితరూపుఁ డయ్యెను. కనుకఁ
దన్మాయామోహితుండగు దశరథుఁడు రామునియందు మిక్కిలి
ప్రీతికలవాఁడగుట వింతకాదు. కౌసల్యయు నాకుమార

రత్నముం గాంచి పరమానందసాగరమున నోలలాడుచుం డును. సుందరాకారుఁడు, శూరుఁడు, అసూయావిరహితుఁడు, ఉపమానశూన్యుఁడు, గుణములచేఁ దండ్రివంటివాఁడు నగు కుమారుని గన్నతల్లియానంద మిట్టిదని వచింప నేరితరము?

శ్రీరామమూర్తి మిక్కిలి మనస్సున శాంతి మల రారఁగా నెదుటివారిమనస్సులకు నొప్పియే కలుగకయుండు మాటలాడుచు నెవరైనఁ గఠినముగ మాటలాడినను దాను నట్లే బదులు పలుకక, ఇతరు లేకారణమున నెంతటి యపకారము చేసినను దానికే నిరంతరము సంతోషించుచు, నాత్మ జ్ఞానసంపన్నుఁడు కావునఁ దనకొరులు చేసిన యపకారపరం పరల నొక్కసారియైనఁ దలంపక, సదాచారనిరతులను సదా చారవిశేషములంగూర్చి ప్రశ్నించుచు, జ్ఞానవృద్ధులను మోక్ష విషయముల నడుగుచు, వయోవృద్ధులను గులక్రమాగతము లగుసంప్రదాయముల నడుగుచు, శస్త్రవిద్య నభ్యసించునప్పుడు కూడ నవకాశము దొరకిన వృథచేయక సాధువులతో భాషిం చుచు, మిగుల బుద్ధిమంతుఁడై మధురముగనే మాటలాడుచు, నీచునితోఁగూడఁ దానే తొలుత మాటలాడుచు నెల్లరకానం దముగలుగ సంభాషించుచు నుండువాఁడు. ఎన్నఁడుగాని తన వీర్యమున కచ్చెరువందఁడు విద్వాంసుఁడు కాఁబట్టి యసత్యము పలుకఁడు. పెద్దలు కనఁబడినచో నెదురేగి పూజించును. భేదములేక ప్రజలనెల్ల రంజిల్లఁజేయును. ఇట్టిసద్గుణము లెల్లను శ్రీరామునియందే నెలకొనియుండును. వేదశాస్త్రములయందు ధనుర్వేదమునందును బండితుఁడై శ్రీరామచంద్రుఁడు సర్వజన ప్రియుఁడయ్యెను. రాజోచితములగు నాయవ్యయాదులయందు

నిపుణుఁడయ్యెను. కాలవంశగతుఁడు కాఁడయ్యెను. విశేషించి సమయాచారమున నిరతుఁడయ్యెను. ఇట్లు లోకోత్తరగుణముల విరాజిల్లు నా శ్రీరామమూర్తిని భూదేవి తనకుఁ బాలకునిగాఁ గోరెను.

* ఒక్కనాఁడు శ్రీరామమూర్తి యోగమాయాస్వరూపిణి యగుసీతాదేవి చామరము వీచుచుఁ బ్రక్కన నిలుచుండఁగా నేకాంతముననున్న శ్రీరామచంద్రునికడకు నారదముని దేవలోకమునుండి యరుదెంచెను. అత్తఱి దాశరథి తాంబూల చర్వణము చేయుచు దేవితో మందమందమధురోక్తులు పలుకుచుండెను. శుద్ధస్ఫటికసంకాశుఁడై యంబరమునుండి యవతరించు నా దేవమునిపతిం గాంచి శ్రీరామమూర్తి త్వరపడి లేచి యెదురేగి శిరస్సు భూమి సోఁక భక్తిపూర్వకముగా నమస్కరించి మహాత్మా! మావంటి సంసారులకుఁ మీదర్శనము దుర్లభమని తలంతుము. మేము విషయాసక్తచేతస్కులము కదా. పూర్వజన్మకృతసత్కర్మఫలముగా మీదర్శనము లభించెను. సంసారులకు మీవంటి సాధువులదర్శనము పూర్వపుణ్యమువలననే కలుగును. కృతార్థుఁడనైతిని. ఏపని నామూలమునఁ జేయింపఁగోరి యరుదెంచితిరి? అని పరమానందమునఁ బలుకు శ్రీరామభద్రునిం గాంచి నారదముని యిట్లు పలికెను.

† శ్రీరామచంద్రా! లోకాచారమును బాటించుచు నిట్టి మాటలచే నన్నేల మోసపుచ్చఁబూనితివి? నేను సంసారినంటివి

* ఈభాగ మధ్యాత్మరామాయణమునుండి సంగ్రహింపఁబడినది.

† జగతామాదిభూతా త్వం సా మాయా గృహిణీ తవ. ౧౦. త్వత్సన్నికర్షా జ్జాయంతే తస్యాం బ్రహ్మాదయః ప్రజాః, త్వదాజ్ఞయా సదా భాతి మాయా

కదా. అది సత్యమే. నీవు యోగమాయ గృహిణివి. ఆమె జగదాదిభూతురాలు. నీయిచ్ఛ పొడమినమాత్రమున నామూలమాయనుండి బ్రహ్మాదిప్రజలు పుట్టుదురు. సత్త్వరజస్తమోగుణాత్మికయగు నామాయ నీయాజ్ఞచే బ్రవర్తిల్లును. నీవు లోకత్రయరూపమగుగృహమున గృహస్థుడ వగుదువు. నీవే త్రిమూర్తులుగ నుందువు. యోగమాయ త్రిశక్తులుగ నుండును. ఇట్లే సకలదిక్పాలకులుగ నీవలరుచున్న దామాయ తత్పత్నులుగ నలరు కావున మిమ్ము విడిచి యొండొకటి భిన్నమగునదేదియు నెందును గానరాదు. మీరిరువురును దంపతులనఁబడుదురు. నిర్లిప్తుండవగునీవు తలంచినంతనె ప్రకృతి సకలమును సృజించును. ప్రపంచమెల్లఁ దుదకు నీయందే లీనమగు. మరల నీవలననే కలుగు. వృద్ధినొందుటయు నీమూలముననే. కావున నీపాదపద్మములను భజించువారలు కృతార్థులు కలుగవు. ముక్తినొందువారు వారలే. నేను నీభక్తిపరాయణుండను. కాన నన్ను భక్తులలో నొకనిగ నెంచి ...

యా త్రిగుణాత్మికా. ౧౧. సూతేజగత్ప్రజాం శుద్ధ కృష్ణలోహితవర్ణస్వనా ప్రజాః, లోకత్రయమహాగేహే గృహస్థస్త్వముదాహృతః. ౧౨. త్వం విష్ణుర్జానకీ లక్ష్మీశ్శివస్త్వం జానకీ శివా, బ్రహ్మా త్వం జానకీ వాణీ సూర్యస్త్వం జానకీ ప్రభా. ౧౩. భవాన్ శశాంకస్సీతా తు రోహిణీ శుభలక్షణా, శక్రస్త్వమేవ పౌలోమీ సీతాస్వాహానలో భవాన్. ౧౪. యమస్త్వం కాలరూపశ్చ సీతాసంయమనీ ప్రభో, నిరృతిస్త్వం జగన్నాథ తామసీ జానకీ శుభా. ౧౫. రామ త్వమేవ వరుణో భార్గవీ జానకీ శుభా, వాయుస్త్వం రామ సీతా తు సదాగతిరితీరితా. ౧౬. కుబేరస్త్వం రామ సీతా సర్వసంపత్ప్రకీర్తితా, రుద్రాణీ జానకీ ప్రోక్తా రుద్రస్త్వం లోకనాశకృత్.

కాపాడుము. నీమాయచే నన్ను భ్రాంతుఁడనుగా నొనరింప కుము. బ్రహ్మ నీనాభికమలమునుండి పుట్టినవాఁడు. నే నా బ్రహ్మపుత్త్రుఁడను. కాన నీకుఁ బౌత్త్రుఁడను. నన్ను రక్షింపు మని పలికి భగవంతుని ధ్యానించుచుఁ బరమానందమున మేను గగుర్పాటొంద నానందబాష్పధారలఁ దనువు తడుపఁబడు చుండఁగా రాజ్యరక్షార్థము దశరథుఁడు నిన్న భిషేకించును. ఈసందడిలో రావణవధమును మఱచి వేసి నీప్రతిజ్ఞయే వ్యర్థమగునని పలికి యూరకుండెను.

నారదముని యిట్లు పలుకఁగ నాలకించి శ్రీరామమూర్తి మునిచంద్రా! నే నెఱుంగని దేదియు లేదు. మున్ను చేసినప్రతిజ్ఞను నెఱవేర్తును. సంశయింపకుము. కాలము ననుసరించి పూర్వకర్మమున కనుకూలముగా నాయాదురాత్ముల సంహరింతును. భూభారము నడంతును రేపు. దండకారణ్యమునకుఁ బ్రయాణము సాగింతును. పదునాల్గువత్సరము లందుందును. మునివేషమును ధరింతును. సీతావ్యాజమున దురాత్ముఁడగు రావణుం బొలియింతును. సర్వాంతరాత్మున దుష్టభేదము లేక

౧౭. లోకే స్త్రీవాచకం యావత్తత్సర్వం జానకీ శుభా, పున్నామవాచకం యావత్తత్సర్వం త్వం హి రాఘవ. ౧౮. తస్మాల్లోకత్రయే దేవ యువాభ్యాం నాస్తి కించన, త్వదాభాసం హి చాజ్ఞానమవ్యాకృతమితీర్యతే. ౧౯. తస్మాన్మహాంస్తతస్సూత్రం లింగం సర్వాత్మకం తతః. ౨౦. అహంకారశ్చ బుద్ధిశ్చ పంచ ప్రాణేంద్రియాణి చ, లింగమిత్యుచ్యతే ప్రాజ్ఞైర్జన్మమృత్యుసుఖాదిమత్. ౨౧. స ఏవ జీవసంజ్ఞశ్చ లోకే భాతి జగన్మయః, అవాచ్యానాద్యవిద్యైవ కారణోపాధిరుచ్యతే. ౨౨. స్థూలం సూక్ష్మం కారణాఖ్యముపాధిత్రితయం చితేః, ఏతైర్విశిష్టో జీవస్స్యాద్వియుక్తః పరమేశ్వరః.

యుండఁజేయుదు. అని రామమూర్తి ప్రతినచేయఁగా నారద
మునియానందించి తదనుజ్ఞాతుఁడై సురలోకమునకుం బోయెను.

అంత నొక్కనాఁడు శత్రువులనడంచు దశరథుఁడు
సకలగుణాభిరాముఁడగు శ్రీరామునిం గాంచి తాఁజేయఁదగు
పని యిదికదా యని యాలోచించెను. నేను జీవించియుండఁగా
నీరాముఁడు రాజగు టెప్పుడు? ఆమహోత్సవమును జూడవల
యునన్న నాకోరిక యెప్పుడు ఫలించును? నాకు నత్యంత
ప్రియుఁడగు రాము నభిషేకించి యాస్థితియందున్న నీకుమారు
నెపుడు చూడఁగల్గుదును? సర్వభూతములపయి దయగలుగు
నీరామమూర్తి లోకులకు నాకంటెఁ బ్రియుండే యగును?
దిక్పతులంబోలు వర్షించుమేఘుఁడు కర్షకుల కిష్టుఁడగునుగదా.
నీరామచంద్రునకుఁ బట్టముగట్టి కన్నులారఁ గాంచి స్వర్గము
నొందుభాగ్యము నాకుఁ గలుగునా? అని పెక్కుభంగుల
నాలోచించి సకలకల్యాణగుణాభిరాముఁ డగుపుత్త్రునిం గాంచి
యామహామహీపతి మంత్రులతోఁ జక్కనాలోచించి రాముని
యువరాజుగా నొనరింప నిశ్చయించెను. మఱియును [illegible]
యగు నారాజు గ్రహనక్షత్రాదివైకృతమగు [illegible]

---

౨౩. జాగ్రత్స్వప్నసుషుప్త్యాఖ్యా సంవృతిర్యా ప్రవర్తతే, తస్యా విలక్షణః సాక్షీ చిన్మాత్రస్త్వం రఘూత్తమ. ౨౪. త్వత్త ఏవ జగజ్జాతం త్వయి సర్వం ప్రతిష్ఠితమ్, త్వయ్యేవ లీయతే కృత్స్నం తస్మాత్త్వం సర్వకారణమ్. ౨౫. రజ్జావహిమివాత్మానం జీవం జ్ఞాత్వా భయం వహేత్, పరాత్మాహమితి జ్ఞాత్వా భయదుఃఖైర్విముచ్యతే. ౨౬. చిన్మాత్రజ్యోతిషా సర్వాస్సర్వదేహేషు బుద్ధయః, త్వయా యస్మాత్ప్రకాశ్యంతే సర్వస్యాత్మా తతో భవాన్. ౨౭. అజ్ఞానాన్న్యస్యతే సర్వం త్వయి రజ్జౌ భుజంగవత్, త్వజ్జ్ఞానాల్లీయతే సర్వం

లను, మహావాతము, పరివేషము, సంధ్యాకాలదిగ్దాహాది రూపమగు నంతరిక్షోత్పాతములను, భూకంపము, శిలాపాతము, స్వతీరక్తస్రావము లోనగు భౌమోత్పాతములను గిలకించి, తన తనువునందలి వార్ధకమును బరిశీలించి మంత్రులతో నీయుత్పాతము లెల్ల నాకు రాఁగలకీడును బోధించెడిని. కాన రామునిఁ గ్వరగా యువరాజుగాఁ జేయవలయుననియుఁ దెలిపెను. అంతియకాక రామమూర్తి సర్వజనప్రియుఁడౌట నెఱింగి పున్నమచందురునిబోలు మోముగల రాముఁడు తనశోకమును దొలఁగించువాఁడని నిశ్చయించెను. కావున నీకారణముల నన్నింటిని బరిశీలింపఁగా శ్రీరాముని యువరాజుగాఁ జేయుటయే తగినకార్యమను తనయభిప్రాయమును మంత్రులకు సంశయింపక బోధించెను. తనకుఁ బ్రజలకు శ్రేయస్సునుగోరి యాకార్యము సవరింపఁ ద్వరపడెను.

మంత్రులందఱు తనపూన్కికి సమ్మతిం జూపఁగా నపుడే నానానగరవాసులను జానపదులను బిలిపించెను. రాజశ్రేష్ఠులను రాజసామాన్యులను వేలువేలఁ బిలిపించెను. కేకయరాజును జనకమహారాజును దూతలుపోయి పిలుచుకొనివచ్చునంతటి యవకాశములేమిం జేసి యనంతర మీశుభవార్తను వారాల

---

తస్మాత్ జ్ఞానం సదాభ్యసేత్. ౨౮. త్వత్పాదభక్తియుక్తానాం విజ్ఞానం భవతి క్రమాత్, తస్మాత్త్వద్భక్తియుక్తా యే ముక్తిభాజస్త ఏవ హి. ౨౯. అహం త్వద్భక్తభక్తానాం త్వద్భక్తానాం చ కింకరః, అతో మామనుగృహ్ణీష్వ మోహయస్వ న మాం ప్రభో. ౩౦. త్వన్నాభికమలోత్పన్నో బ్రహ్మా మే జనకః ప్రభో, అతస్తవాహం పౌత్రోఽస్మి భక్తం మాం పాహి రాఘవ. ౩౧
అయోధ్యాకాండము. ప్రథమసర్గము.

కింతురుగాక యని యూహించి పిలువనంపక వదలెను. అయోధ్యకు వచ్చినవారలకెల్ల నివాసగృహముల నేర్పఱచి సకలవిధమర్యాదలందనుపఁదగినవారి నియమించెను. వారెల్లరు సకలాభరణభూషితులై యరుదెంచి తన్ను దర్శింప నానందించును. కొలువుకూటమునఁ దా నాసీనుఁడై తనయానతిచొప్పున వచ్చినరాజులను బ్రజలను గాంచి యుచితాసనముల వారు కూరుచుండఁగాఁ దనపలుకులను వినఁగోరి చెంతఁగూరుచున్న వారినెల్లఁ దిలకించి సంతసించెను. ఆసభ దేవేంద్రునిసభవలె నుండెను.

మహాశయులారా! ఈభాగ మనేకసంశయములతోఁ గూడినవి. విమర్శించి గ్రహింపఁదగినవిషయము లింక నేకములు గలవు. వానినెల్ల నెఱింగినఁగాని శ్రీరామచరిత్రము, దశరథుని ప్రవృత్తి పరమపావనమని తేటపడదు. కనుక శ్రద్ధగా నాలకింపుఁడు. కొండవీటి చేఁదుడు త్రాడుగా నింతయేల వ్రాయవలయునని విసుగునొందకుఁడు. తొలుత నథ్యాత్మ రామాయణకథాభాగమును విమర్శించి యవ్వల వాల్మీకి రామాయణభాగమును బరిశీలింతము. శ్రీరామావతారము దేవతల యాపదలఁ దొలఁగించుటకని యందఱెఱింగినవిషయము. తన్మూలమున ధర్మసంస్థాపనమునకనియు స్పష్టమే. శ్రీరాముని వర్తనము మానవమాత్రుని బోలియుండుట సాధారణము. ఇప్పుడు మహామాయయే కార్యధురంధరురాలు. రామమూర్తి సాక్షిమాత్రుఁడు. రామసాన్నిధ్యమునఁగదా ప్రకృతి చరించు నని ప్రశ్నింపరాదు. వారల కుభయులకు నవినాభావసంబంధము కలదు. రామునినుండి సీతను వేఱుచేయ నెవ్వారికిని సాధ్యము

కాదు. ఉష్ణమునకు నగ్నికి నెట్టిసంబంధమో దానిని వేఱుచేయ నెట్లు సాధ్యముకాదో యిదియు నట్టిదే యని యెఱుంగనగును. ఇపుడు రెండుగా నున్నారే యనియు ననుమానింపరాదు. లోకులదృష్టి కట్లే యగపడును. అట్లు నటించినఁగాని లోకమునకు సీతబోధింప శక్యముకాదు. శ్రీరామమూర్తి మాయామానుషవిగ్రహుఁడు. తన సర్వసాక్షిత్వమును, నిర్లిప్తతను వదలఁడు. మహామాయ పరమేశ్వరునిచ్ఛ నెఱింగి సకలకార్యములను స్వతంత్రించి నిర్వహించును. భగవంతుఁడు ప్రకృతికి లోఁబడినట్లుండును. సర్వ మాతనికి లోఁబడునుగదా? లోకదృష్టి కట్లు కనఁబడునని గ్రహింపవలయు. ఈసిద్ధాంత మీయధ్యాత్మరామాయణభాగము బోధించును. మూలముం బరికింపుఁడు. తేటతెల్లముగఁ దెలియఁగలదు.

ఈవిషయము శ్రీమద్రామాయణమున నేల లేదని ప్రశ్నింపరాదు. ఒక్కొక్క రొక్కొక్కవిషయమును బ్రధానముగాఁ జేసికొని వ్రాసిరి. భగవత్తత్త్వమునే విశేషించి యధ్యాత్మరామాయణము బోధించును. భగవచ్చరిత్రమునే విశేషించి వాల్మీకిరామాయణము తెలుపును. లోకప్రవృత్తికి రెండవదియు, ముక్తికి మొదటిదియుఁ దోడుపడును. కావున నిందేది యుత్కృష్టము? ఏది యపకృష్టము? అని సంశయపడరాదు. ఈ రెండును లోకోపకారకక్షమములే. లోకులందఱొక్కరీతిఁ గర్మముల నాచరించినవారు కారు. ఎవ్వరెవ్వరి కేదియేది హితమో వారువారు దానిదాని గ్రహింతురు. శర్కరయు గుడము మధురపదార్థములు. ఇందేది శ్రేష్ఠమనరాదు. కొందఱకు నొకటి, మఱికొందఱకు నింకొక్కటి

యిష్టములు. వారి కదియే శ్రేష్ఠముగఁదోఁచు. ముక్తికాము లగుమానవులు భగవత్తత్త్వము నెఱుంగఁగోరుదురు. త్రివర్గ కాములు (ధర్మార్థకామములఁ గోరువారు) భగవత్ప్రవర్తన మును బఠింపఁగోరుదురు. ఈరెండును మానవులకు మిక్కిలి యుపయుక్తములే. ఈస్థితియందు హెచ్చుతగ్గులఁ బరిశీలింపఁ బ్రయత్నింపరాదు.

దేవతలు పురికొలుప నారదముని యరుదెంచినను టయచ్చెరువుకొలుపదు. దేవకార్యమునకుఁ దానై వచ్చుటయు నమ్మునికి సహజము. లోకులకు సదాచారము నేర్పుటకై రామ మూర్తి యెదురేగి నమస్కరించెను.

"ఊర్ధ్వం ప్రాణా హ్యుత్క్రామంతి యూనస్థవిర ఆయతి,
ప్రత్యుత్థానాభివాదాభ్యాం పునస్తాన్ ప్రతిపద్యతే. ౧౨౦
అభివాదనశీలస్య నిత్యం వృద్ధోపసేవినః,
చత్వారి తస్య వర్ధంతే ఆయుర్విద్యాయశోబలమ్." ౧౨౧

మను. ౨ అధ్యా.

పెద్దలకు విధిగా నమస్కరించిన నాయుర్విద్యాయశోబలములు వృద్ధియగునని స్మృతులు తెలుపుచున్నవి.

"సంప్రాప్తాయ త్వతిథయే ప్రదద్యాదాసనోదకే,
అన్నం చైవ యథాశక్తి సత్కృత్య విధిపూర్వకం. ౯౯
ఏకరాత్రం తు నివసన్నతిథిర్బ్రాహ్మణః స్మృతః,
అనిత్యం హి స్థితో యస్మాత్తస్మాదతిథిరుచ్యతే." మను. 3 అ. ౧౦౨.

ఒక్కరాత్రి నివసించువాఁడతిథి యనంబడును. అట్టి యతిథిని సత్కరింపవలయునని స్మృత్యభిప్రాయము

"అతిథిత్వేన వర్ణానాం దేయం శక్త్యనుపూర్వశః,
అప్రణోద్యోఽతిథిస్సాయమపి వాగ్భూతృణోదకైః." ౧౦౭
యాజ్ఞవల్క్యస్మృతి. ఆచారకాండము.

అతిథి యింటికి రాఁగా సత్కరించుట కేమియు నింటలేదేని మంచిమాటల నాదరించి యాసన మర్పించి కూరుచుండఁ బ్రార్థించి జలము నొసఁగవలయును. అంతియకాని నాయింట నేమియు లేదు పొమ్మని కసరరాదని స్మృతి తెలుపుచున్నది.

"తృణాని భూమిరుదకం వాక్చతుర్థీ చ సూనృతా,
ఏతాన్యపి సతాం గేహే నోచ్ఛిద్యంతే కదాచన." ౧౦౮ మను. ౩ అ.
"తృణగ్రహణం శయనీయోపలక్షణార్థమ్."

అని కుల్లూకభట్టు. శయనించుటకు వలయుపరికరమును, పండు కొనుస్థలము, మంచిమాటలు, జలము ననునీనాలుగు సాధు గృహముల నెల్లప్పుడుండును. అనఁగా దరిద్రుఁడైనను అతిథి యరుదెంచినఁ బండుకొనస్థలమును జూపి శయ్య నర్పించి మంచి నీరిచ్చి ఉపచారవాక్యములు పలికి సత్కరింపవలయునని స్మృతి తాత్పర్యము. దీనింబట్టి శ్రీరామమూర్తి భగవంతుఁడయ్యు, సకలమునీంద్రసమర్చిత పాదారవిందుఁడయ్యు, నతిథిపూజ ప్రధానమనున్యాయమును లోకులకుఁ దెలుపుటకై యీసదాచారము నాచరించెనని యెఱుంగవలయు.

"యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే."

అన్నగీతావాక్యము శ్రీరామచంద్రునభిప్రాయమునే వెల్లడించె నని యెఱుంగందగు. శ్రీరామమూర్తి యాచరించినదానినే శ్రీకృష్ణమూర్తి బోధించెనని మన మెఱుంగవలయును.

"సంసారిణా హి ముసే లభ్యతే సత్సమాగమః,
అతస్త్వద్దర్శనాదేవ కృతార్థోఽస్మి మునీశ్వర."

అనునదియే "వాక్చతుర్థీ చ సూనృతా" అనునదియే యీ వాక్యము. నీదర్శనమువలన సఫలజన్ముఁడనైతిని. అనుభావము కలుగవలయునని శ్రీరాముఁడు మనకు బోధించెను. ఈయభిప్రాయమునే శ్రీకృష్ణమూర్తి శ్రీభాగవతమునందు నక్రూరునితో భాషించునపుడు

"న హ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః,
తే పునంత్యురుకాలేన దర్శనాదేవ సాధవః."

అని తెల్పెను. ఇట్లు శ్రీరామమూర్తిచర్యను బరికింతుమేని స్మృతిసమ్మతముకాని దేదియే నుండదని తేటపడును.

దేవానాంప్రియులు కొందఱు మహామాయను దూఱుచు నామె నారాధించువారిని దూషింతురు. తఱచుగా నట్టివారు మతాంతరప్రవిష్టులుగ నుందురు. మతాంతరము స్వీకరింపఁగనే పూర్వమతమున వారికి ద్వేషము మెండుగ నుండును. వారలే తన్మతాచారముల దూఱువారు. మతభ్రష్టులు దూషించినచో మనకేలనని యుండరాదు. సమాధానము చెప్పకయున్నఁ బామరులాయాక్షేపములు సత్యములే యనుకొందురు. కానఁ బామరులమేలుకొఱకే సమాధానము.

"జగతామాదిభూతా యా సా మాయా గృహిణీ తవ,
త్వత్సన్నికర్షాజ్జాయంతే తస్యాం బ్రహ్మాదయస్సురాః."

అన్నమూలము నించుక పరిశీలించినచో సీత యెవతుకయో తెలియును. జగత్తులకు నాదిభూతురాలు. అనఁగా సర్వకర్త్రి

అనికదా యర్థము. నారదునభిప్రాయమున శ్రీరామమూర్తి పరమపూరుషుఁ డనియేకాని త్రిమూర్తులలో నొకఁడగువిష్ణు వని కాదు.

"త్వం విష్ణుర్జానకీ లక్ష్మీశ్శివ స్త్వం జానకీ శివా,
బ్రహ్మా త్వం జానకీ వాణీ సూర్య స్త్వం జానకీ ప్రభా."

అనునీమూలము పైభావమును దృఢపఱచుచున్నది. శ్రీరామమూర్తి పరబ్రహ్మమనియు సీత యోగమాయ యనంబడు మూలప్రకృతి యనియు నారదుఁడు స్తుతించుచున్నవాఁడు. నీసాన్నిధ్యమునఁ బ్రకృతి సకలమును సృజించునని ముని తెలిపెను. ఈభావమే

"మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరం."

అని శ్రీకృష్ణమూర్తిచే గీతాశాస్త్రమునఁ జెప్పఁబడియె. దీనింబట్టి వికారమంతయుఁ బ్రకృతిదే యనియు, భగవంతుఁడు సర్వసాక్షియై యుండుననియు స్పష్టము. అర్చాదిరూపములన్నియుఁ బ్రకృతివే యనవలయు. నిరాకారమే పరబ్రహ్మము. సావయవమే పూజార్హము. తఱచుగా మానసికపూజయందు నయ్యదియే ధ్యేయమగును. యోగులు తేజోరూపముగా నాపరతత్త్వమును ధ్యానింతురు. ఇట్టు లుండఁగా భగవన్మాయను దూషించువారలతాత్పర్యమేమో తెలియ శక్యము గాకున్నది. భగవంతుఁ డొకనగరమున మహాసౌధమునఁ గాఁపురముండి భార్యం గూడి, కొన్నియామములు జీవకోటులఁ బుట్టించుచుఁ గొన్నియామములు పాలించుచుఁ గొన్నియామములు సంహరించుచు నుండుననియు, మనవలెనే యాదంపతులకు సుఖదుఃఖములు గలుగుచుండుననియుఁ, బండుగు లుపవాసములు వారు

చేయుచుందురనియు, నపుడపుడు జ్వరాదులు వచ్చుచుండు ననియు, మందులు పుచ్చుకొనుచుందురనియు వారలభావనము యుండనోపు. కావుననే వారలకు విగ్రహారాధనము, దేవాల యోత్సవములు, ప్రసాదవిశేషములని పిలువంబడు పదార్థాస్వాదనాదికములు మహాప్రియములుగ నుండును. అట్టివారలకుఁ బ్రకృతి నారాధించుపద్ధతి యెట్లు రుచించును?

వస్త్రహీనముగనున్న స్త్రీవ్యక్తిని బూజించుట శాక్తమున నాచారమని కొందఱు తలంతురు. కంచుకోత్సవము భగవదర్చనమని కొంద ఱూహింతురు. ఈయిరువురు సాత్త్వికవిధమగు కర్మము నాచరించినవారే. కావున వారి యభిప్రాయములను బదులీయకుండుటయే యుత్తమకార్యము జిజ్ఞాసువులకు సమాధానము చెప్పవలయును. భగవంతు నారాధించుట యెట్లో ప్రకృతి నారాధించుట యట్లే. ఈరెండును ధ్యానరూపములే. బాహ్యచక్రార్చనమద్దానికంటె నెన్నియోమడుంగు లధమము. షట్చక్రసంచారిణిగా భావించి విధిమంత్రముగా నారాధించుట యంతకంటె నుత్తమము

"తటిల్లేఖాతన్వీం తపనశశివైశ్వానరమయీం
నిషణ్ణాం షణ్ణామప్యుపరి కమలానాం తవ కళాం,
మహాపద్మాటవ్యాం మృదితమలమాయేన మనసా
మహాంతః పశ్యంతో దధతి పరమానందలహరీం." ౨౧

అను నీప్రమాణము పైవ్రాసినయభిప్రాయమును దెలుపుచున్నది. ఇట్టి యుత్తమమార్గము మతభ్రష్టులకుఁ బ్రాయశః రుచింపదు. ఈవిషయమున నొక్కమాట చెప్పవలసియున్నది. ప్రకృతిమయమే సృష్టియంతయుననియుఁ, బ్రకృత్యతీతుఁ డా

భగవంతుఁడే యనియు, నారాధనవిశేషములన్నియుఁ బ్రకృతివికృతులకేయనియు నెఱుంగవలయును. ఈవిషయము నెఱింగినచో మతాచారములను దూషించునవకాశమే యుండదు. ఐకమత్య మొనఁగూడును. ఎంతకాల మీవిషయము నెవ్వఁ డెఱుంగఁడో వానికి నుత్తమమార్గ మగమ్యమే యనవలయు.

ఇట్లు నారదముని పలుకఁగా భగవంతుఁ డాలకించి మునీ! ఈవిషయము నెఱుంగుదును. ప్రతిన నెఱవేర్తును. భూభారము నడంతును. అంతియకాక

"సీతామిషేణ తం దుష్టం సకులం నాశయామ్యహం."

అని పలికెను. ఈవాక్యమున నొకవిశేషము కలదు. దాని మన మెఱుంగవలయు. సీతను రావణుఁడు హరింపఁజాలఁ డనియు, హరించినట్లు లోకులు తలంచునట్లు చేసి యాకారణమున వానిఁ జంపుదుననియు రామునాశయము కదా. దుష్కార్యముల నొనరించువారు సమూలముగ నశింతు రన్న న్యాయము లోకులకెల్లఁ దెలుపవలయు. దాని నెఱింగినవా రట్టిదుష్కార్యముల నొనరింపరు. అనునీతిని శ్రీరామమూర్తి తెలిపెను. ఈవాక్యమును మనము లెస్స పరికించితిమేని, భగవంతు నెడఁ బాయనిసీతను రావణుఁ డపహరించెనన్నవార్త యసత్యమనియు, హరిహరబ్రహ్మాదులకు నెఱుంగఁదరముకాని యోగమాయను నీచరాక్షసుఁ డపహరించె నన్నవార్త యెంతమాత్రము విశ్వాసపాత్రము కాదనియు, నాప్రకృతియే లోకుల కిట్టిభ్రాంతిని గల్గించి వానిం బొడవడంచెననియు, భగవంతుఁడగు శ్రీరామమూర్తి సర్వముం జూచుచు సాక్షిమాత్రుఁడుగ

నుండెననియు మనము గ్రహింపఁగలము. ఇది యథార్థ్యాత్మ రామాయణహృదయము. ఇఁక వాల్మీకిరామాయణమునఁ గలకథను బరిశీలింతము.

"తత్రాపి నివసంతౌ తౌ తర్ప్యమాణౌ చ కామతః,
భ్రాతరౌ స్మరతాం వీరౌ వృద్ధం దశరథం నృపం." 3

అని మూలము. భరతశత్రుఘ్నులు మాతామహునియింట నివసించి వారెల్లవిషయములఁ దమ్ము సంతుష్టమానసులఁ జేయుచుండఁగా నేకొఱంతలు లేకున్నను వృద్ధుఁడగు దశరథమహారాజును స్మరించుచుండిరని యర్థము. దీనింబట్టి యాలోచింపఁగా నాకుమారులు పితృవాత్సల్యముగలవారలని తేటపడియెడు.

"దశరథో వృద్ధోఽభూన్న రాజ్యభరణే సమ్యక్ క్షమ తే. అపీదానీం రామం యువరాజం కారయేదిత్యచింతయతామితి భావః." అని గోవిందరాజులు.

"శుశ్రూషాకాలోఽతీత ఇతి ధర్మలోపభియా పితరం స్మృతవంతావితి తాత్పర్యమ్." అని మహేశ్వరతీర్థులు.

ఈ రెండుభావములు న్యాయ్యములుగ నున్నవి. భరతశత్రుఘ్నులకుఁ గలపితృభక్తిని ధర్మైకశీలత్వమును వెల్లడించుచున్నవి. ఇచ్చోఁ దెలుఁగు.

చ. అలరుచు నిట్టులుండియును నాసహజన్ములు వీరు లాత్మలోఁ
దలఁచిరి వృద్ధుఁడై పరఁగు తండ్రిని బల్మఱు; నెట్లు మోయఁగాఁ, గలఁడొకో భూభరం బిఁక నికామముదంబున
రామచంద్రును,జ్జ్వలతరయౌవరాజ్యపదభారముఁబూనఁగఁ
జేయుటొప్పుగా.

క. ముదిసినతండ్రికి శుశ్రూ
 ష దగఁ జల్పంగఁ దగినసమయ మరిగెడిం
 గద దానధర్మలోపం
 బౌదవుఁగదా యనుచుఁ జింతఁ బూనిరి వారల్.

(ఆంధ్రశ్రీమద్రామాయణము.)

క. అచ్చటనుండియు నిచ్చకు
 నెచ్చినసుఖసంతతులను నెలమిం గనుచున్
 నిచ్చలు స్మరించుచుండిరి
 సచ్చరితులు దశరథేశు జనకున్ వృద్ధున్.

(వాల్మీకిరామాయణము.)

మహాత్ములు విమర్శకు లీపద్యముల నుదాహరించి నా పద్యము లాకాశరామన్న పంచాంగమువలె నున్నవనియు, వావిలికొలనువారిపద్యము హృద్యమనియు, మూలార్థపోషక మనియు వ్రాసిరి. వారికింగలపక్షపాత మెట్టిదో సరసాగ్ర గణ్యులే గ్రహింతురుగాక. ద్రుతముపై ద్రుత మసహ్యమని వారే వేఱొకచో నాక్షేపించిరి. "సుఖసంతతులను నెలమిన్" అనువావిలికొలనువారిపద్యమున నయ్యది పొడసూపినను వద లిరి. దుష్టపక్షపాతము కాదా యిది. పైనుదాహరించినవ్యాఖ్యా నాభిప్రాయము చేర్పకయున్న రసమేమికలదో సరసు లూహింపఁ గలరు.

భరతుఁడు రామభక్తాగ్రగణ్యుఁడని ప్రసిద్ధియే కదా. పితృభక్తుఁడగుట యొకవింత కాదు. తత్సమ్మతుఁడగు శత్రు ఘ్నుఁడు నట్టివాఁడే. వారు శ్రీరాముని రాజమౌళి యువ రాజుగాఁ జేయఁడా, వృద్ధుఁడౌట రాజ్యభారము మోయఁ

జాలఁడుకదా యని యాలోచించుట విచిత్రముకాదు. పితృశుశ్రూష యిట్టికాలమున నొనరింపక హాయిగా భుజించుచుండుట న్యాయ్యమా యని యూహించుటయు ధర్మమే. ఈకుమారుల ప్రవృత్తింబట్టి యాలోచింపఁగా, జననీజనకుల శుశ్రూషించుట ప్రధానకార్యమనియు, భ్రాతృప్రీతి యత్యుత్తమ మనియుఁ దేటపడియెడిని. ఆ రాజకుమారులం గాంచి పెద్దలసేవించువిధము మనము నేర్చుకొనవలయును.

"ఉపాధ్యాయాద్దశాచార్య ఆచార్యాణాం శతం పితా,
సహస్రం తు పితౄన్మాతా గౌరవేణాతిరిచ్యతే." ౧౪౫. మను. ౨ అ.

అను నీమనుస్మృతి రాజకుమారుల ప్రవృత్తినే యనుసరించి తెలుపుచున్నది. ఈకాలమున జననీజనకులశుశ్రూషలం దనుపునాచారము శూన్యమైన దనవచ్చును. శ్రీరామాయణపారాయణఫల మట్టిసదాచారముల నలవరించుకొనుటయే యనవలయును. తల్లిదండ్రులఁ దిరస్కరించిన భగవంతుని దిరస్కరించుటయే యగును. శ్రీరామాదికుమారు లీవిషయమున నెట్లు ప్రవర్తించిరో యెఱింగి మనముకూడ నట్టిప్రవర్తనమున కలవాటుపడవలయునని యూహింపవలయును. లేక యున్న రామాయణపారాయణఫలము శూన్యప్రాయమగును.

"స హి దేవైరుదీర్ణస్య రావణస్య వధార్థిభిః,
అర్థితో మానుషే లోకే జజ్ఞే విష్ణుస్సనాతనః."

అనుమూలమున విశేష మొక్కండు కలదు.

వైకుంఠమనునగరము నివాసముగాఁగలిగి త్రిమూర్తులలో నొక్కఁడుగ లెక్కింపఁబడుచు జగత్పాలనాధికారము

మాత్రముగలిగిన విష్ణువనువాఁడు శ్రీరామమూర్తి కాఁడు. సనాతనుఁ డనఁగా శాశ్వతుఁడని యర్థముకాన, నిత్యవస్తువగు పరబ్రహ్మమే ప్రకృతివిశిష్టుఁడై నిర్మలజ్ఞానము మానవలోకమున వెలయింపఁజేయ నుత్సహించెను. కావుననే మాయామానుషవిగ్రహుఁడన్న విఖ్యాతిఁ గాంచెను. వైకుంఠశబ్దము నకు రూఢ్యర్థముకాక యౌగికార్థమును గ్రహించునెడల నయ్యది శాశ్వతమనంబడును. రూఢ్యర్థమునే గ్రహించునెడల నయ్యది నశ్వరమే యగును. తదధిపతియగువిష్ణువు తక్కిన బ్రహ్మశంకరులవలె నేకాలముననో నశించువాఁడే యగును.

"యథాకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్,
తథా సర్వాణి భూతాని మత్థ్సానీత్యుపధారయ. ౬
సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికాం,
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహం. ౭
ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః,
భూతగ్రామమిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్. ౮
న చ మాం తాని భూతాని నిబధ్నంతి ధనంజయ,
ఉదాసీనవదాసీనమసక్తం తేషు కర్మసు." గీత. ౯ అధ్యా. ౯.

అను నీశ్రీకృష్ణవాక్యములయందుఁ బైభావ మిమిడియున్నది. విష్ణ్వాదులు శాశ్వతులను ప్రమాణములయందుఁ గనంబడు చున్నవికదా. వానికిం గతియేమని ప్రశ్నింపరాదు. అశ్వత్థా మాదులు చిరకాలజీవులను ప్రమాణములు గలవు. ఒక్కభగ వంతుఁడుతప్ప రూపవంతమగునదియంతయు నశ్వరమేయగును. అట్టిసమయమునకే మహాప్రళయమని పేరు. మహాప్రళయమున వటపత్రశాయిగనై విష్ణువున్నయట్లు పురాణములు ఘోషించు

చున్నవే యందు రేని, వటపత్త్రము, విష్ణువు, మార్కండే
యుఁడు అనుమూఁడువ్యక్తులును స్థిరము లనవలసివచ్చును.
అది సృష్ట్యాదికాలమనుకొనిన నీసంశయమున కవకాశమే
యుండదు. మార్కండేయమునికూడ మహాప్రళయమున
నుండు నేని యింక నెందఱో యుందురనుకొనవచ్చును. కావున
శాశ్వతవస్తు వొక్కపరబ్రహ్మమే యని యెఱుంగుట మంచి
మార్గము. ఈవిషయము గీతావాక్యములయం దిమిడియున్నది
కదా. ఈగీతోపనిషదర్థమే

"ఉన్మేషనిమిషోత్పన్నవిపన్నభువనావళిః"

అనులలితాసహస్రనామవాక్యము తెలుపుచున్నది. పైసుదా
హృతములగు గీతాశ్లోకములయందలి సప్తమశ్లోకార్థమే యిది
యని యెఱుంగందగు.

"సహస్రశీర్షా పురుషః సహస్రాక్షస్సహస్రపాత్"

అన్న శ్రుత్యర్థమే

"సహస్రశీర్షవదనా సహస్రాక్షీ సహస్రపాత్,"

అనులలితాస్తుతి తెలుపుచున్నది.

"మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరమ్"

అనుగీతావాక్యము నర్థమే.

"ఆబ్రహ్మకీటజననీ వర్ణాశ్రమవిధాయినీ"

అనుపరమేశ్వరీస్తుతి తెలుపుచున్నది. అధ్యాత్మరామాయణము
కూడ నీవిషయమును దృఢపఱచెనుగదా. ఇందొక్కొక్క
టియు వేఱువేఱుభావములు తెలుపక యేకత్వమునే తెలిపి
డిని. ఇట్లు ప్రకృతివిశిష్టమగుపరబ్రహ్మమే శాశ్వతవస్తువను

టయే సిద్ధాంతము. తద్భిన్నమగునదియెల్ల నశ్వరమే యని యెన్నవలయును. ప్రకృతము మాపరబ్రహ్మమే సీతారామరూపముల వెలసెననియు, నందుఁ బ్రకృతియగుసీతయే సర్వకర్త్రి యనియుఁ, బరబ్రహ్మమగు శ్రీరామమూర్తి సాక్షిమాత్రుఁడై స్వాత్మానందమున నుండుననియు నిశ్చయించుకొనవలయును.

కొందఱు శ్రీరాముఁడు భగవదవతారమే కాదనియు, మానవులలో నత్యుత్తమచరిత్రుఁడనియు, నేకపత్నీవ్రతుఁడను మొదలగుసద్గుణములు కలవారెందఱో యున్నవారనియు, నుత్తమపురుషులలో గణింపఁదగినవాఁడేకాని శ్రీకృష్ణమూర్తివలె నవతారపురుషుఁడు కాఁడనియు నందురు. వారిసంశయములను దొలఁగించుటకే యీవిషయము వ్రాయఁబడును. శ్రీమద్రామాయణము ప్రమాణముకాదన్నవారితో మనకు వాదమే లేదు. ఆప్రకార మాలోచించినను భగవంతుఁడని తోఁపదన్నవారలంగూర్చియే సంభాషింపందగు. ఈఘుట్టమునఁ జేర్కొనఁబడిన శ్రీరామచంద్రునిసద్గుణము లొక్కపర మేశ్వరునకుందక్క నితరులకు నుండ నవకాశముకలదా యని యోజింతము.

"న హి రూపోపపన్నశ్చ వీర్యవాననసూయకః,

... ... ...

న చావమంతా భూతానాం నచ కాలవశానుగః.

... ... ...

సమ్మతస్త్రిషు లోకేషు వసుధాయాః క్షమాగుణైః,

... ... ...

లోకపాలోపమం నాథమకామయత మేదినీ."

అనునంతవఱకుఁ గలగుణము లేలోకమందుఁగాని యేకాలమున నేపురుషునియందు నుండఁజాలవు. "న చ కాలవశానుగః" అనునదియే భగవంతుఁ డనువిషయమును దేటపఱచెడు. కాలవశంవదుఁడు కానివాఁ డొక్కఁ భగవంతుఁడుతప్ప వేఱొక్కఁ డుండుననవచ్చునా. లోకోత్తరగుణగణ్యుఁడగు రామమూర్తి మానవులయం దుత్తమునిగా లెక్కించుట సాహసమని యెన్నఁ దగు. భగవల్లక్షణము లెట్టివని యెఱుంగనివారే యట్లందురు. సత్యవాఙ్నిరతి, ఆశ్రితరక్షణాదృతిలోనగు లోకోత్తరగుణములు శ్రీరామమూర్తియందు మూర్తీభవించియున్నవని తెల్లమగును. ఆయాభాగములయం దావిషయమును జర్చింతును. అట్టివారియాక్షేపములకుం జోటీయక పరమపావనమగు శ్రీరామచరిత్రమును బఠింపందగును.

"లౌకికే సమయాచారే కృతకల్పో విశారదః."

అనుమూలమునఁ గలవిశేషార్థమును బరిశీలింతము.

"లౌకికే లోకైకప్రమాణకే సమయాచారే సాంకేతికాచారే."

అని గోవిందరాజులు,

"లౌకికే లోకవిదితే సమయాచారే సాంకేతికాచారే."

అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి. ఈయర్థము భగవత్తత్త్వమును బోధింపదు. ఇందలితత్త్వ మేదియని విచారించు టావశ్యకము. ఇట్టివిమర్శనములయందుఁ బక్షపాతబుద్ధి యుండరాదు. ఉండినచో నందలిసత్యము గోచరింపదు.

శ్రీరామమూర్తి లోకులకు సదాచారముల నేరుప నవతరించెను. అంతియేకాని కార్యాంతరము లేక యేమియుఁ

దోఁపక కాదు. పరమేశ్వరుఁడు ధ్యేయమగువస్తువు వేఱొకటి లేనందునఁ దన్నుఁ దానే చూచుచుండును. శ్రీరామమూర్తి తాను జేయుచుఁ దన్మూలమున నెల్లరకు సదాచారముల నేర్పు ననుట సిద్ధాంతము. ఇతరులకు బోధించునాచారము కలవాఁడు కాఁడు. లౌకికమనఁగా బాహ్యపూజ, సమయమనఁగా మానసిక పూజ అను వీనియందు నేర్పఱి యని గ్రహింపవలయును. బాహ్యపూజలు చేయుచు మానసికారాధనము గావించువాఁ డని సారము. బాహ్యపూజానిరతులే పెక్కండ్రు లోకమునఁ గలరు. వారల కాయాచారము వదలకయుండఁ దానును దేవతాంతరములఁ బూజించును. యోగులకు నిష్టమగుధ్యానమును జేయునని తాత్పర్యము. సమయమనఁగా మానసికపూజ యను నర్థము కలదా యనుశంక కొందఱకుం గలుగవచ్చును.

"అనుళానసమయాంతస్థాసమయాచారతత్పరా."

అని లలితానామసహస్రవాక్యము.

"సమయాంతస్థా. దహరాకాశావకాశే చక్రం విభావ్య తత్ర పూజాదికం సమయ ఇతి రూఢ్యోచ్యతే. స చ సర్వైర్యోగిభిరైకమత్యేన నిర్ణీతోఽర్థ ఇతి సంకేతరూపత్వాదపి సమయః. తత్ప్రతిపాదకత్వాద్వసిష్ఠశుక సనకసనందనసనత్కుమారాఖ్యతంత్ర పంచకమపి సమయపదేన వ్యవహ్రియతే, తదంతస్తత్ప్రతిపాద్యతయా తిష్ఠతి."

"సమయాచారతత్పరా. మహానవమ్యాం జాతే సతి పశ్చాన్మూలాధారాదుత్థితా దేవీమణిపూరే ప్రత్యక్షా భవతి. తాం తత్రైవ పాద్యాది భూషణాంతైరుపచారైస్సంపూజ్యానాహతచక్రం నీత్వా తాంబూలాంత మభ్యర్చ్య విశుద్ధచక్రం నీత్వా తత్రత్యచంద్రకళారూపైర్మణిభిః పూజయిత్వాజ్ఞాచక్రం నీత్వా నీరాజ్య సహస్రదళకమలే సరఘామధ్యే సదా

శివేన సంయోజ్య తిరస్కరిణీం ప్రసార్య సమీపమందిరే స్వయం స్థిత్వా యావద్భగవతీ పునర్నిర్గతా సతీ మూలాధారకుండం ప్రవిశతి తావత్తత్ర సమయం ప్రతీక్షేతేత్యాకారో గురుముఖైకవేద్యస్సమయాచారః తయో రుభయవిధయోరపి తత్పరా ఆసక్తా" అని సౌభాగ్యభాస్కరభాష్యము.

ఈవిషయమే,

"సుధాసింధోర్మధ్యే సురవిటపివాటీపరివృతే
మణిద్వీపే నీపోపవనవతి చింతామణిగృహే,
శివాకారే మంచే పరమశివపర్యంకనిలయాం
భజంతి త్వాం ధన్యాః కతిచన చిదానందలహరీం.

అని శంకరభగవత్పాదు లుపదేశించిరి.

"భగవత్పాదాచార్యాస్సమయమతపారదృశ్వానః సమయాచారప్రవణాస్సమయరూపాం స్తువంతి. సమయాచారోనామ అంతరపూజారతిః. కులాచారోనామ బాహ్యపూజారతిరితి రహస్యం." అని లక్ష్మీధరవ్యాఖ్య.

ఈప్రమాణములంబట్టి సమయాచారమనఁగా మానసిక ధ్యానమనియు, నయ్యదియే యోగీంద్రులచే నాచరింపఁబడునదియు, లౌకికమనఁగా సామాన్యమానవు లాచరించుబాహ్యపూజయనియు స్పష్టము. సమయపూజ యనఁగా

"ప్రదీపజ్వాలాభిర్దివసకరనీరాజనవిధి
స్సుధాసూతేశ్చంద్రోపలజలలవైరర్ఘ్యరచనా,
స్వకీయైరంభోభిస్సలిలనిధిసౌహిత్యకరణం
త్వదీయాభిర్వాగ్భిస్తవ జనని వాచాం స్తుతిరియం."

అన్నట్టిభావనయే

"ఆత్మా త్వం గిరిజా మతిః పరిజనాః ప్రాణాశ్శరీరం గృహం
పూజా తే విషయోపభోగరచనా నిద్రాసమాధిస్థితిః,

సంచారః పదయోః ప్రదక్షిణవిధిస్స్తోత్రాణి సర్వాగిరః
యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనమ్."

అనుసూక్తి యెల్లరకు విదితమేకదా. ఈభావన నిరంతరయోగాభ్యాసబలమునఁగాని కుదురదు. అట్టివారికి బాహ్యపూజ యక్కఱలేదు. అందును విగ్రహారాధన మత్యల్పఫలప్రద మగుట వార లంగీకరింపరు. కొందఱంగీకరించి చేయుచుందురు కదా అందు రేని, పామరులకు భక్తిని గలుపుటకొఱకే యని యెఱుంగవలయు.

"సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత
కుర్యాద్విద్వాం స్తథాఽసక్తశ్చికీర్షుర్లోకసంగ్రహమ్. ౨౫
న బుద్ధిభేదం జనయేదజ్ఞానాం కర్మసంగినాం,
జోషయేత్సర్వకర్మాణి విద్వాన్ యుక్తస్సమాచరన్. గీత. 3 అ. ౨౬.

అను నీగీతాశాస్త్రవాక్యములు పైనుదాహరించినవిషయమును దృఢపఱచుచున్నవి. కావున శ్రీరామమూర్తియుఁ దన కక్కఱ లేకపోయినను పామరులకు సదాచారములను దెలిపి వాని నాచరించి వారుత్తమమార్గమును గనుఁగొనవలయునని బాహ్యపూజల నాసక్తిగలిగినట్లు చేయుచు వసిష్ఠాదిమహర్షులకు సమ్మత మగు మానసికధ్యానము చేయుచు నెల్లరకు సదాచారమును గలుపుచున్నవాఁడను విశేషార్థమును గ్రహింపవలయును.

"స్వయమేవ స్వమాత్మానం పశ్యంతం పరమేశ్వరం"

అనురీతిగా మనస్సునఁ దన్నుఁ దానే చూచుకొనుచుండునని రామచరిత్రవిశేషమును మనము చక్కఁగాఁ బరిశీలింపవలయును.

"అమోఘక్రోధహర్షశ్చ త్యాగసంయమకాలవిత్."

అనుమూలమునుగూడ నించుక పరిశీలింతము. దీనిచే శ్రీరామ మాహాత్మ్యము తేటపడును. క్రోధహర్షములు సార్థకములుగాఁ గలవాఁడని యర్థము. భగవదన్యులక్రోధహర్షములు సర్వదా ఫలవంతములు కావు. భగవంతునకు వాస్తవముగాఁ గ్రోధమే విషయమున నుండదు. హర్షము నట్లే. అయిన నధర్మతత్పరులయందుఁ గ్రోధమున్నయట్లు నటించును. వారిదుష్కర్మముల రూపుమాపును. ధర్మములయందు హర్షముగలవాఁడు. ఆహర్షము ధర్మతత్పరులకు వృద్ధిని గల్గించును. ఎప్పుడు కాని ఫలవంతముగాకయుండదు. అనిచెప్పుటచేత శ్రీరామమూర్తి యధర్మమును రూపుమాపుటకు ధర్మమును వృద్ధిచేయుటకు నవతరించెనని మన మెఱుంగవలయును.

"ఆయకర్మణ్యుపాయజ్ఞస్సందృష్టవ్యయకర్మవిత్."

అని మూలమున నొకనీతి కలదు. సేకరించినధనములో నెంత వ్యయముచేయవలయు ననువిషయ మిందుఁగలదు. కొందఱు సర్వము నర్థివశముచేయవలయు నందురు. కొందఱు కొంతయే వ్యయింపవలయునందురు. ఋణముచేసియైన దానము చేయ వలయు నందురు. ఎంతదానము చేయవలయుననఁగా

"కశ్చిదాయస్య చార్థేన చతుర్భాగేన వా పునః,
పాదభాగైస్త్రిభిర్వాపి వ్యయస్సంశోధ్యతే తథా."

నాల్గవ భాగముగాని సగముగాని మూఁడుభాగములు గాని సంపాదించినధనమున దానముచేయవలయు ననుప్రమాణము గలదు. అంతియగాని సర్వస్వము యాచకులకు నొసంగి

తన్ను నాశ్రయించినవారికిఁ గష్టములు గల్గించుట న్యాయము కాదని యీభాగమునుండి మన మెఱుంగవలయు. సత్ప్రస్థుఁడు విశ్వామిత్రుఁడు లోనగువారియాచార మిందులకు విరుద్ధము కాదా యందురేని సామాన్యశాస్త్రమునఁగాక విశేషశాస్త్రవిధి ననుసరించి యట్టియాచారము లుండుననియు నవి సామాన్య జనాచారమునఁ బనికి రావనియు నెఱుంగవలయును. గృహస్థులందఱు కుటుంబపోషణాదులకుఁ దగినధనముంచుకొని యవ్వల మిగిలినదానిని వ్యయింపవలయు ననునీతి నెఱుంగం దగును. ఇట్లు లీభాగమునుండి యనేకవిషయములు గ్రహింపఁ దగియుండును.

ఇందుఁ గొందఱు దశరథుఁడు భరతశత్రుఘ్నులు దేశాంతరములకుం బోవఁగా నిదియే సమయమని రామాభిషేకప్రయత్నముచేయ నెంచెననియుఁ గావుననే

"న తు కేకయరాజానం జనకం వా నరాధిపః,
త్వరయా చానయామాస పశ్చాత్తౌ శ్రోష్యతః ప్రియం."

అనుమూలమునఁ జెప్పఁబడినచందమునఁ గేకయరాజున కీవార్త తెలిసిన నతఁడు మున్ను కైకవివాహకాలమునఁ దీసికొన్న మాటను నెఱవేర్పవలదా యని యడుగునన్న భయముచేతనే యాతనింబిలువనంబంపలేదనియు నట్లుగావున సత్యమందాదరము కలవాఁడు కాఁడనియు నాక్షేపింతురు. కాని యిట్లు లాక్షేపించువారు విషయమును ముందువెనుకల నెట్లు చెప్పఁబడినదని యూహించువారు కారు. ఎప్పు డెట్లు తోఁచునో యప్పు డట్లు లాక్షేపింతురు. కేకయరాజును బిలువనంపనందులకు వారు చెప్పినహేతువు సరిపడును. జనకరాజును బిలువనంపనందుల

కేమికారణము వారు చెప్పుదురు? ఈకార్య మాజనమున కత్యంత ప్రీతిపాత్రము కదా. ఈభాగమునకు సమాధాన మేమనఁగా దశరథుఁడు కేకయరాజునకు భయపడి తెలుపక పోలేదు. రామాభిషేక మింతవేగముగాఁ జేయఁదలంచుటకుఁ గారణము లనేకములు గలవు.

"దివ్యంతరిక్షే భూమౌ చ ఘోరముత్పాతజం భయం
సంచచక్షేఽథ మేధావీ శరీరే చాత్మనో రుజాం. ౪౩
పూర్ణచంద్రాననస్యాథ శోకాపనుదమాత్మనః,
లోకే రామస్య బుబుధే సంప్రియత్వం మహాత్మనః. ౪౪

అనుమూలమునుం బరిశీలింతము. దానఁ గొన్నిసందియములు డిందుపడు. తత్త్వ మిదియని తేలు. కర్మగతుల నెఱుంగఁ దరమ్ము కాదుకదా.

"ఆదానస్య ప్రదానస్య కర్తవ్యస్య చ కర్మణః,
క్షిప్రమక్రియమాణస్య కాలః పిబతి సంపదః."

అను నీతిశాస్త్రము ననుసరించి యోజింపఁదగియుండును. శ్రీరామాభిషేక ప్రయత్నము సాగినఁగాని దేవతలకార్యము ఫలింపదు. దశరథున కకాలమున మరణచిహ్నము లనేకము లగపడసాగెను. శాస్త్రజ్ఞానముకలవాఁడు కాన నయ్యావి వేగము తనకు మృతిని గల్పించునని యతఁ డెఱింగెను. ప్రతిదినము జరాభారమున బుద్ధిపాటవము తప్పుచుండెను. సర్వసమ్మతుఁడై యుక్తవయస్కుఁడై రాజలక్షణసమన్వితుఁడై రామమూర్తి చెంతనుండెను. బంధువులయాగమనమునకుఁగా నీమహాకార్యము తడవుసేయరాదని యాతఁ డెంచెను.

"కదా నామ సుతం ద్రక్ష్యామ్యభిషిక్తమహం ప్రియం."

అనుమూలము పైనిర్వాసినయభిప్రాయమును దృఢపఱచెడు. వీక్షణమున నీకార్యమును సాగించి యీనేత్రములతోఁ బట్టభద్రుఁడగుకొడుకును జూతునా యని రాజువిల్లూరుచుండెను. ఈకారణములంబట్టి పరికింపఁగా, దశరథుఁడు భరతునకు రాజ్యము సంక్రమింపఁదగియున్నదని యొఱింగి మోసముచేసెనను నాక్షేపము వ్యర్థమనియు, భరతుని మాతామహునింటికిం బంపుటకు మాతులాగమనమే కారణమనియు, వృద్ధుఁడగు కేకయరాజును జూచుట భరతునకు న్యాయ్యమని రాజూహించి పంపెననియు, భరతశత్రుఘ్నులయెడఁబాటునకు నోర్వఁజాలక పలుమాఱు వారిని స్మరించెనన్నవాక్యము ప్రమాణమనియు నెఱుంగందగును. (రాజాపి తౌ మహాతేజాః స్సస్మార ప్రోషితౌ సుతౌ) ఇట్టిలికార్యములు సాగుటకు దైవయత్నమే కారణముకాని దశరథునియూహ కారణముకాదని తెలియందగు. ఇదియే కర్మసిద్ధాంతమునకుఁ జక్కని యుదాహరణమనియు, "గహనా కర్మణో గతిః" అన్నభగవద్వాక్యమును మఱువరాదనియుఁ దెలియందగు. ఈవిషయము మఱొక్కచోఁ దర్కింతము. ఇఁకఁ దరువాతకథను బఠింతము.

## దశరథుఁడు రామాభిషేకవార్తను బ్రజలకుఁ దెల్పుట.

* ఆమహాసభలో దశరథమహారాజు తనమాటలకొఱకు వేచియున్న పెద్దలనెల్లం గాంచి స్వాభిప్రాయ మిదియని యొఱిం

* ఇది రెండవసర్గమునుండి సంగ్రహీతము. అధ్యాత్మరామాయణకథయుం నిందుఁ గలుపఁబడును.

గింపఁ దలంచుకొన్నవాఁడు కనుక గంభీరకంఠధ్వనితో నిట్లు పలికెను. సభాసదులారా! నాకుఁ బూర్వులగురఘుప్రభృతు లీవిశాలరాజ్యమును న్యాయ్యముగా నౌరసపుత్త్రతుల్యముగాఁ బాలించిరనుట మీ రెఱింగినవిషయమే కదా. వారివంశమున జన్మించిన నేను రాజన్వంతంబగుట సుఖములకుఁ దగిన యీ రాజ్యమున కెంతయు సుఖముఁ గూర్ప నెంచినాఁడను. మా పూర్వులమార్గమునే యనుసరించి యేమఱుపాటు లేక నా యోపినంతదనుకఁ బ్రజలను రక్షించితిని. కోటఁకఁగాంచని పరాక్రమమున శ్వేతచ్ఛత్త్రమును ధరించి జరాభారము క్రమ్మినంతవఱకు సార్వభౌముఁడనై రాజ్యమును గాపాడి జగద్ధితము గోరుచు వచ్చితిని. కావున నా శ్వేతాతపత్త్రచ్ఛాయయందే కాలముం గడపిన యీనాశరీరము జరాక్రాంతమయ్యెను. మనుష్యాయుర్మానము నుల్లంఘించి పెక్కేండ్లు జీవించుటం జేసి యీశరీరము విశేషించి సడలినది. వృద్ధుఁడనైతిని. కాన మున్నువలె శ్రమముల కోర్వఁజాలను. విశ్రాంతినే కోరుచున్నాఁడను. ధర్మపరిపాలనము సామాన్యమైనపని కాదు. శౌర్యాదులుగలిగినవారే యప్పనికిఁ బూనవలయును. ఇంద్రియనిగ్రహము లేమిచే నట్టిశౌర్యాదిప్రభావములు లేనివారల కప్పని యశక్యము. అప్పని మిగుల భారము. అట్టి భూభారమును వహించి విశేషించి యలసితిని. ఈరీతిగా నలసి ప్రజారక్షణమున శక్తిచాలని నేను రాజ్యభారమును వహింపఁ గుమారుని శ్రీరామచంద్రుని నియమించి నాయందు విశేషప్రీతిగల యీ విప్రప్రవరులను సమ్మతింపఁజేసి విశ్రాంతినొందవలయునని వాంఛించుచున్నాఁడను.

జ్యేష్ఠకుమారుఁడగు రామచంద్రుఁడు పరాక్రమాది గుణముల దిక్పతులం బోలినవాఁడు. మత్సమానుఁడే యగు. ధర్మవిదులయం దుత్తముఁడు. పురుషోత్తముఁడై పుష్యనక్షత్ర యుతచంద్రునింబోలి ప్రకాశించుచున్నవాఁడు. అట్టిరామ చంద్రుని యౌవరాజ్యమున నభిషేకింపఁ గోరెదను. జగత్త్రయము బహులనాథులుగలిగినదయ్యు నేమహాత్ముని బ్రభువుగాఁ బడసి నాథవంతమగునో యట్టితేజశ్శాలియు లక్ష్మీవర్ధనుఁడు నగులక్ష్మణునకు నన్నయు నయినరామమూర్తి మీకుం దగిన ప్రభువు. పెక్కేండ్లు నేను భరించిన యీరాజ్యభారమును జ్యేష్ఠకుమారునందునిచి గొప్పలాభము భూమికిఁ గల్పించి విశ్రాంతినొందువాఁడ.

రాజ్యధురంధరత్వమున మిక్కిలి యలసి వృద్ధునకు నాకు రామమూర్తి నభిషిక్తునిగఁ జేయఁబూనిన యీశుభకార్యము తగిన ప్రయోజనమును గల్గించునదియే యగునేని, నా చేయఁ బూనిన యీ కార్యము చక్కఁగా యోజించి చేయఁబూనినదే యని మీకుఁ దోఁచునేని, నాకీకార్యమునకు సమ్మతినిండు. మీయనుమతి లేక యేమిచేయఁగలను? శ్రీరామాభిషేకమున నాకుం బ్రీతి యుండినను, ఇంతకంటె హితమగుకార్యము వేఱొకఁడు గలదేని దాని నాలోచింపుఁడు. పక్షపాతముగల యొక్కఁడుచేయు కార్యమునకన్నఁబక్షపాతవిరహితులగుమధ్యస్థులయాశయము వేఱుగ నద్దాని నతిశయించియే యుండును. అయ్యది ప్రశ్న ప్రతివచనములచేఁ జక్కఁగా విచారముచేసి యెంతయో మేలుగూర్చును.

అని యిట్లు దశరథమహారాజు పలుకఁగా నందుఁగల

రాజులందఱు విని పరమానందమున నాతని మిక్కిలి కొనియాడిరి. జనులందఱు సంతోషముప్పొంగఁగా మేలు మేలనిరి. ఆధ్వని మిన్నుముట్టి వారలయంగీకారమును సూచించెను. వసిష్ఠాదిమహర్షులు దశరథుఁడు న్యాయ్యముగాఁ బలికిన యాపలుకుల నాలకించి రాజులు ప్రజలు తమ్మనుసరింపఁగా నందఱపక్షమున మాటలాడఁ దలంచి రాజేంద్రా! పెక్కేండ్లు జీవించి వృద్ధుఁడవైతివి. కాన నీ వాశ్రీరామచంద్రుని యువరాజుగా నభిషేకింపుము. మహాభుజుఁడు బలాధికుఁడు రఘువంశాభరణమునగు శ్రీరామమూర్తి పట్టపుటేనుంగు నెక్కి శ్వేతాతపత్రము నీడయందు ముఖసౌందర్యమక్కజమై వెలుంగ వచ్చుచుండఁగా మేమెల్లఁ గన్నులారఁ జూడఁ గోరుచున్నారము.

ఆనుమాట లాలకించి వారిసంతోషము నెఱింగినవాఁడయ్యుఁ దెలియనట్లు నటించి వారినుండియే యెఱుంగఁదలంచి మహీపతులారా! నేను రామాభిషేకవార్తను దెలిపినంతనే చక్కఁగా నాలోచింపక రాముఁడు మాకుఁ బ్రభువుగా వలయును నని కోరితిరి. దీన నామనస్సున సందియ ముదయించెడిని. మీ రేల రాముని బ్రభువుగా నభిలషించితిరో సత్యముగా నెఱిఁగింపుఁడు. న్యాయ్యముగా నేను జాగరూకుఁడనై రాజ్యముం బాలించితిని. ఇట్టులుండఁగా ముగ్ధుఁడగు నాపుత్త్రుని యువరాజుగాఁ జూడఁగోరెదరు. ఏల? నాయందలి యపరాధ మేదియో యెఱుంగఁగోరుచున్నాను. అని యడుగ నందుఁగల రాజన్యులు పౌరజానపదులందఱు దశరథుని దిలకించి మహీశశేఖరా! నీకుమారుఁడు సకలకల్యాణగుణాభిరాముఁడు. ప్రశస్తగుణవంతుఁడగుటయేగాక దేవతలతో సాటిరాయైయుం

దుట నా రాముని గుణములు మాకెంతయు నానందమును గలి
గించుచున్నవి. వానిని నీ ప్రశ్నము ననుసరించి చెప్పఁదగు
సుసమయము గాన వచింతుము.

## ప్రజలు రామగుణములను బ్రశంసించుట.

శ్రీరాముఁడు సాటిలేనిశౌర్యధైర్యాదిగుణములుగలిగి
యింద్రునితో సాటియగువాఁడు. ఇక్ష్వాకువులలో శ్రేష్ఠుఁడు.
సత్పురుషపదవాచ్యుఁ డితఁడే యని చెప్పఁదగినవాఁడు సత్యధర్మా
సక్తుఁడు. ధర్మము దానిఫలముగు సంపత్తియు రామునినుండియే
కలిగినవి. ఇతరసహాయము లేక యతఁడొక్కఁడే వానిని నిర్వ
హింపఁగలఁడు. ప్రజారంజనమున నమృతకరుఁడే యగు అని
రామచంద్రునందుఁగల సకలగుణములను బ్రశంసించిరి. మఱియు
నిట్టిగుణములుగలిగి దిక్పాలురతో సమానుఁడయినందున భూ
దేవి ప్రభువుగా నా రాముని గోరినది. నీమహాభాగ్యవశమునఁ
బ్రజలశ్రేయస్సుకొఱకు నీకు నీకుమారుఁడు జనించెను. మరీచి
కుమారుఁడగు కశ్యపునివలె నీ రాముఁడు నీయదృష్టమునఁ
గల్గెను. దేవతలు రక్కసులు ఋషులు గంధర్వోరగప్రభృతులు
నెల్లప్రజలు శ్రీరామునకు నాయురారోగ్యప్రభృతులు కలుగఁ
బ్రార్థింతురు. కాలముచెల్లినపురంధ్రులు ప్రాయముగలయన్ను
మిన్నలు నభీష్టదాతయగు భగవంతుని సమాహితచిత్తముల
సాయంప్రాతఃకాలములయందు శ్రీరామాభ్యుదయమును గోరి
నమస్కరించి వేఁడుదురు. వారు కోరుచున్న యీ రామాభిషేక
ము నీయనుగ్రహమున ఫలవంతమగుఁగాక. కువలయనేత్రుఁ
డగు రామచంద్రుని యువరాజుగాఁ జూడఁ గోరుచున్నారము.
ఆశ్రితులవాంఛితములఁ దీర్చువాఁడవు. దేవాదిదేవుఁడగువిష్ణు

మూర్తికి సమానుఁడై ప్రపంచహితము చేయువానికి కలిగి యౌదార్య మలంకారముకాఁగా నలరారు శ్రీరామచంద్రుని మాకెల్లహితమగుటంబట్టి త్వరపడి యుత్సాహముతో యువ రాజుగా నభిషేకింపుమని ప్రార్థించిరి.

మహామతులారా! ఈభాగము శ్రీరామచంద్రునిమహాత్త్వమును దెలుపునదియుఁ, బూర్వకాలమునందుఁ గలరాజ ప్రజాసంబంధమును దెలుపునదియు నై యున్నది. కాన నించుక విమర్శింతము. తొలుత రాజలక్షణములను బ్రజాపాలనపద్ధతిని బరికింతము.

"బ్రాహ్మణేషు క్షమీ స్నిగ్ధేష్వజిహ్మః క్రోధనోఽరిషు,
స్యాద్రాజా భృత్యవర్గేషు ప్రజాసు చ యథా పితా. 334

పుణ్యాత్షడ్భాగమాదత్తే న్యాయేన పరిపాలయన్,
సర్వదా నాధికం యస్మాత్ప్రజానాం పరిపాలనమ్. 335

చాటతస్కరదుర్వృత్తమహాసాహసికాదిభిః,
పీడ్యమానాః ప్రజా రక్షేత్కాయస్థైశ్చ విశేషతః. 336

అరక్ష్యమాణాః కుర్వంతి యత్కించిత్కిల్బిషం ప్రజాః,
తస్మాత్తు నృపతేరర్ధం యస్మాద్గృహ్ణాత్యసౌ కరాన్. 337

యే రాష్ట్రాధికృతాస్తేషాం చారైః జ్ఞాత్వా విచేష్టితం,
సాధూన్ సమ్మానయేద్రాజా విపరీతాంశ్చ ఘాతయేత్. 338

ఉత్కోచజీవినో ద్రవ్యహీనాన్ కృత్వా వివాసయేత్,
సద్దానమానసత్కారాన్ శ్రోత్రియాన్ వాసయేత్సదా. 339

అన్యాయేన నృపో రాష్ట్రాత్స్వకోశం యోఽభివర్ధయేత్,
సోఽచిరాద్విగతశ్రీకో నాశమేతి సబాంధవః. 340

ప్రజాపీడనసంతాపాత్సముద్భూతో హుతాశనః,

రాజ్ఞః ఫలం శ్రియం ప్రాణాంశ్చాదద్యా న నివర్తతే." ౩౪౧

యాజ్ఞవల్క్యస్మృతి. ౧౩ అధ్యా.

అనుస్మృతివాక్యముల ననుసరించి పరికించినచో రాజధర్మము మిక్కిలి కష్టమైనదని తేలకమానదు. ఆకష్టమునుండి యుత్తీర్ణుడగుటచేసి రాజునకంటెఁ బుణ్యాత్ముఁడు లేఁడనియు స్పష్టమగును. ప్రజారంజనతత్పరుఁడై ధర్మవిధుల ననుసరించి ప్రజలఁ బాలించు రాజు ప్రజలు చేయుపుణ్యముల నాఱవపాలు గైకొనును. లేనిచో వారు చేయుపాపములనుండి యాఱవ పాలు గ్రహించుననియు నూహింపందగును. మానవసామాన్య ధర్మములు రాజున కన్వయింపవు. రాజధర్మము లితరుల కన్వయింపవు. కాన రాజధర్మములు కొన్ని యన్యాయ్యములుగఁ దోఁచును. వాని నాచరించుటంజేసి రాజును దూషింపరాదు. ఆతనిలక్ష్యము ప్రజల సధర్మప్రవృత్తులుగఁ జేయరాదని యుండు టెఱుంగందగు. వంచకులు, నమ్మించి సొమ్ము హరించు వారు, తెలియఁబడకయుండఁ బాపముల నొనరించువారు, ఐంద్ర జాలికులు, ఘాతుకులు లోనగువారిచేఁ బీడింపఁబడుచుండు ప్రజలను జక్కఁగాఁ గాపాడవలయు. లేఖకులవలనను, గణ కులవలనను బ్రజలు కష్టపడకయుండ విశేషించి కాపాడందగు. రాజపాలనము లేనిచోఁ బ్రజలు పాపముల నొనరింతురు. కావున నట్లు పాపములు చేయకయుండఁ గాపాడినరాజు పుణ్య ములనుండి యాఱవపాలు గైకొనును. కావున రాజధర్మములు మిక్కిలి జాగరూకుఁడైనఁగాని యనుష్ఠింపఁజాలినవి కావు. రాజు వినయవంతుఁడు కావలయు. అది లేనిచోఁ బ్రజలను వశంవదులఁ జేసికొనఁజాలఁడు.

"వృద్ధాంశ్చ నిత్యం సేవేత విప్రాన్ వేదవిదశ్శుచీన్,
వృద్ధసేవీ హి సతతం రక్షోభిరపి పూజ్యతే. ౩౮
తేభ్యోఽధిగచ్ఛేద్వినయం వినీతాత్మాపి నిత్యశః,
వినీతాత్మా హి నృపతిర్న వినశ్యతి కర్హిచిత్. ౩౯
బహవోఽవినయాన్నష్టా రాజానస్సపరిచ్ఛదాః,
వనస్థా అపి రాజ్యాని వినయాత్ప్రతిపేదిరే. ౪౦
వేనో వినష్టోఽవినయాన్నహుషశ్చైవ పార్థివః,
సుదాః పైజవనశ్చైవ సుముఖో నిమిరేవ చ. ౪౧
పృథుస్తు వినయాద్రాజ్యం ప్రాప్తవాన్మనురేవ చ,
కుబేరశ్చ ధనైశ్వర్యం బ్రాహ్మణ్యం చైవ గాధిజః. ౪౨
ఇంద్రియాణాం జయే యోగం సమాతిష్ఠేద్దివానిశం,
జితేంద్రియో హి శక్నోతి వశే స్థాపయితుం ప్రజాః. ౪౪

మనుస్మృతి, ౭ అధ్యా.

అను నీమనుస్మృతివచనముల ననుసరించి వినయమునున్ననే రాజు ప్రజల వశంవదులుగఁ జేసికొని పాలింపఁజాలు. వేనుఁడు లోనగు రాజులు వినయము లేక నశించిరి. పృథువు లోనగు వారు వినయవంతులై రాజ్యమును బొంది యశఃకీర్తుల నార్జించిరి. అట్టివినయము పెద్దలనుండి నేర్చుకొనవలయును.

"అర్థశాస్త్రాదిజ్ఞానేన వినీతోఽప్యతిశయార్థం తేభ్యో వినయమభ్యసేత్."

కుల్లూకభట్టు.

పాండిత్యముచేత వినయము రాదనియు, నహంకారము వదలి పెద్దల సేవించిననే యది కలుగుననియు మనుస్మృతిభావము. ప్రభువునన్న యహంకారమును మాని ప్రజాప్రతినిధినన్న జ్ఞానముగలిగి శరీరము ప్రజాసేవకై యర్పింపఁదగునన్న భావముల

వహించగా రాజు ప్రజారక్షణము చేయవలయును. ఇట్లు శరీరసుఖమును పాటింపక ప్రజారక్షణమే ధర్మమన్న న్యాయము ననుసరించిన రాజు భగవత్సాన్నిధ్యమున నుండును. ఇంద్రియజయము ప్రజావశీకరణమున కాధారమని స్మృతి ఘోషించెడిని. దానికి యోగము నభ్యసింపవలయునని మనుస్మృతి హెచ్చరించుచున్నది.

"యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే,
నిస్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే బుధైః."

అనుగీతావాక్యము ననుసరించి నిశ్చలచిత్తుఁడైనఁ గాని నిస్పృహుఁడు కాఁడు. అప్పుడుఁ గాని సర్వకామములు నశింపవు. కామములు వదలినఁగాని భగవద్భక్తి కుదురదు. కావున సర్వశ్రేయస్సులకు మూలము యోగాభ్యాసమని సిద్ధాంతము. అట్టివాఁడగు రాజు జగత్తును వశీకరించుకొను టబ్బురమా!

"బాలో౽పి నావమన్తవ్యో మనుష్య ఇతి పార్థివః,
మహతీ దేవతా హ్యేషా నరరూపేణ తిష్ఠతి." ర. మను. ౭. అ.

ప్రజలు రాజును మానవమాత్రునిగాఁ దలంపరాదనియుఁ, దమ్ము రక్షింపవచ్చిన దేవతనుగా భావింపవలయుననియు మనుస్మృతి తెల్పుచున్నది. బాలుఁడైనను రాజు దేవతయే యను భావము మానవులకు నుండఁదగును. ఇట్టిభావముగల ప్రజలు, అట్టిప్రవర్తనముగల ప్రభువు కలుగఁగా నిఁక ధర్మమునకుఁ గొఱంతయేమి? ఈపద్ధతులు రెండును గోసలరాజ్యమునఁ గలవని తేటపడును.

## అప్పటియాచారములు.

దశరథుఁడు రాము నభిషేకింపఁ దలంచెను. నిరంకుశప్రభుత్వ మాకాలమునఁ గలదనుట యెల్ల రెఱింగినదియే.

అందును రాజు వృద్ధుఁడై మరణచిహ్నములు కనంబడఁగా భీతుఁడై సత్వరంబ రాము నభిషేకించి కన్నులారఁ గాంచి ధన్యుఁడు కాఁగోరెను. మంత్రులతో నాలోచించుట సహజమే. ఆతొందఱలో సామంతరాజులను పౌరులను జానపదులను మహర్షులను బిలువనంపెను. తాఁజేయఁబూనినపని సర్వసమ్మతము కావలయునన్న భావ మాకాలపురాజులకుం గలిగియుండుట యాచారమే యని మన మెఱుంగవలయును. ప్రజాసమ్మతముగాఁ బ్రభువు వర్తింపవలయుననియుఁ, బ్రభువును భగవంతునిగాఁ బ్రజలు భావింపవలయుననియు నుపదేశించుస్మృతుల ప్రకారము ప్రవర్తించునాచార మాకాలమునఁ గలదనుట స్పష్టమే. ఆరాజ్యమే రాజన్వంతమనంబడును. అట్టియాచారము లేకాలమున నున్నను బ్రజలకు సుఖముగల్గు ననుట కేమి సందియము? ప్రభుభక్తిలేని ప్రజలు ప్రజలఁ గన్నబిడ్డలవలె నోమని ప్రభువు నుండినచో నాకాలము దుఃఖప్రదమనుటయు స్పష్టమే. అన్యోన్యానురాగము సుఖహేతువనుటయే యిందుఁగల సారము.

ఈయాచారము ననుసరించియే రాజు జానపదులంగూడఁ బిలువనంపెను. జానపదులు (పల్లెలలో నివసించువారు) వివేకహీనులన్న భావము దుర్భావమని యీకథ బోధించుచున్నది. నాగరకులు వివేకులన్న నానుడికలిగినను సమష్టిదృష్టిం బరికించిన నయ్యది పొరపాటని తోఁచును. "సంఘే శక్తిః కలౌ యుగే" అన్ననీతియుఁ గ్రొత్తదికాదుకదా. ముఖ్యముగా జానపదులయనురాగమే ప్రభువునకుఁ బ్రధానము. పౌరుల యనురాగ మద్దానికి నీడుకాదని యూహించుట పొరపాటుగాదు.

ఈసిద్ధాంతము స్మృతిసమ్మతమని యిందుదహరించినవాక్యములే బోధించును. కావునఁ గీర్తికాముఁడగు రాజు తాఁజేయఁబూను కార్యము రాజ్యమునఁగల వయోవృద్ధులకు జ్ఞానవృద్ధులకుం దెలిపి వారిసమ్మతినొంది యొనరించిన నయ్యది చిరస్థాయి కాఁగలదనియు, నట్లు లేనిచో రూఢమూలముగాని భూరుహము వలె క్షణకాలముననే చెడుననియు మన మీభాగమునుండి యెఱుంగవలయును.

"ఇదం శరీరం కృత్స్నస్య లోకస్య చరతా హితం,
పాండురస్యాతపత్రస్య చ్ఛాయాయాం జరితం మయా. ౭
రాజప్రభావజుష్టాం హి దుర్వహామజితేంద్రియైః,
పరిశ్రాంతోఽస్మి లోకస్య గుర్వీం ధర్మధురం వహన్. ౯
సోఽహం విశ్రమమిచ్ఛామి పుత్రం కృత్వా ప్రజాహితే,
సన్నికృష్టానిమాన్ సర్వాననుమాన్య ద్విజర్షభాన్." ౧౦

అను నీభాగము దశరథునాశయమును బోధించుచున్నది. ఇందు విశేషించి రాజత్వము ప్రజాసుఖకల్పనమునకే యేర్పడె నన్నయభిప్రాయము కలదు. రాజు స్వసుఖము నించుకంతయుం బాటింపక ప్రజాహితమునకే పాటుపడవలయు నన్ననీతి నీ భాగము తెలుపుచున్నది.

"అరాజకే హి లోకేఽస్మిన్ సర్వతో విద్రుతే భయాత్,
రక్షార్థమస్య సర్వస్య రాజానమసృజత్ప్రభుః." 3 అ. ౭

అను మనుస్మృతియుఁ బైభావమునే తెలుపుచున్నది. ప్రజా రక్షణార్థమే బ్రహ్మ రాజును సృజించెనని యీశ్లోకార్థము. కనుక వాల్మీకి స్మృతిసమ్మతముగ రామచంద్రునియు దశరథు నియుఁ బ్రవర్తనముగలదని తేటపఱచెను. ప్రజారక్షణరూప

మగుధర్మభారమును జిరకాలము మోసితిని. ఇఁక సహింపఁ జాలను. కావునఁ బ్రజాహితకార్యమును నిర్వహింప శ్రీరాముని నియమింప నెంచితిని. ఈకార్యము సర్వసమ్మతమే నొనరింతునని దశరథుఁ డుగ్గడించెను. శూరుఁడు ధర్మరక్షణతత్పరుఁడు నగుట నాకుమారుఁడు మిమ్ము రక్షింపఁగలఁడని తేటపఱచెను. ఈ భాగమును జక్కఁగఁ బరిశీలించితిమేని యాకాలపువారికి ధర్మరక్షణమున నెంతయాసక్తిగలదో తెలియనగును. రాజ్యపాలన మనఁగాఁ బ్రజల నధర్మమునఁ బ్రవర్తింపకయుండ నియమించి ధర్మమార్గమున నడచునట్లు చేయుటయే యని తేలెడిని. ధర్మము భగవత్స్వరూపము. ధర్మము నారాధించుట యనఁగా భగవంతు నారాధించుటయే కాని వేఱుగాదు.

"యత్ర ధర్మోఽహ్యధర్మేణ సత్యం యత్రానృతేన చ,
హన్యతే ప్రేక్షమాణానాం హతాస్తత్ర సభాసదః. ౧౪
ధర్మ ఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః,
తస్మాద్ధర్మో న హంతవ్యో మానో ధర్మో హతోఽవధీత్. ౧౫
వృషో హి భగవాన్ ధర్మస్తస్య యః కురుతే హ్యలం,
వృషలం తం విదుర్దేవాస్తస్మాద్ధర్మం న లోపయేత్. ౧౬
ఏకఏవ సుహృద్ధర్మో నిధనేఽప్యనుయాతి యః,
శరీరేణ సమం నాశం సర్వమన్యద్ధి గచ్ఛతి." ౧౭

మను. ౮ అధ్యా.

అను నీమనుస్మృతివాక్యములు పైనవ్రాసినయర్థమునే స్పష్టపఱచుచున్నవి. ధర్మము రక్షించినచో నయ్యది వాని రక్షించును. దానిని నశింపఁజేసిన నది వాని నశింపఁజేయును. కావున రాజును, సభ్యులనఁగా రాజునకు మంచియాలోచనము చెప్పు

మంత్రులు లోనగువారలును ధర్మమునసే దృష్టియునిచి ప్రజా రక్షణకార్యమునఁ బ్రవర్తించినఁగాని లోకక్షేమము కలుగదు. అధర్మ మనేకరూపములుగలదిగ నుండును. వర్ణధర్మముల నాశ్రమధర్మములరక్షించుటయు సద్ధానియం దంతర్భాగములుగ నుండును. వర్ణధర్మము లుండఁదగవనువాదము దూరదృష్టిగలవార లనువదింపఁదగినది కాదు. వర్ణధర్మములు ప్రతి దేశమునందును గలవు. నామాంతరముల నవియుండును. అంతియకాని భరతఖండమునఁ దప్పఁ బ్రపంచమునఁగల యే భాగమునందును లేవన్నవాదము నిస్సారమైనది. ఆచారభేదములే యవి యున్నవనుటకు దృష్టాంతముకదా. అసవర్ణవివాహము పాశ్చాత్యదేశములయందు గర్హింపఁబడుటయేటికి? జాతిభేదములు కలుగుటచేతనే కాదా. జాతిభేదము లుండవచ్చుంగాని యం దవాంతరభేదము లుండరాదని మఱికొందఱందురు. ఒక్కజాతియందే మతభేదములుండుట పాశ్చాత్యులయందును గనంబడును. సభామండపముల నవి లేకున్నను వాడుకయందేమో యవి చెలరేఁగుచునే యున్నవి వానిం బాటింపక మనదేశమునందే కలవనియు, వానిమూలమున మన యభివృద్ధి నశించుచున్నదనియుఁ గొందఱుద్ఘోషింతురు. పాశ్చాత్యదేశములందు సాగినమహాహవము వారికి సమాధాన ముగ్గడించుచున్నది. పంక్తిభోజనమే దైకమత్యమును గల్గించునేని యిటీవలసాగిన మహాఘోరసంగ్రామ మయ్యది యసంగతమని తేటపఱచుచున్నది. కావున నేకాలమునందు నేదేశమునందును నామాంతరములచే వర్ణధర్మములు నాశ్రమధర్మము లుండు ననుట సిద్ధాంతము.

మాయ యనియు, భగవంతుఁడు సాక్షీమాత్రుఁడే యనియు సారము. ఇట్లు సారము గ్రహించుటచేత భగవత్తత్త్వమాహాత్మ్యము స్పష్టమగు. మఱియు మహామాయ సర్వమునకు నాది కారణమనియుఁ దేటపడును. త్రిమూర్తులు నింద్రాదిదిక్పాలకులు ప్రకృతినిర్మితులై తదాజ్ఞ శిరస్సులం దాల్చి తమతమ పనుల నిర్వహించువారనియు స్పష్టమగును. ఈభావమే "ఆబ్రహ్మకీటజననీ, నిజాజ్ఞారూపనిగమా, పుణ్యాపుణ్యఫలప్రదా, పురుషార్థప్రదాపూర్ణాభోగినీ భువనేశ్వరీ, నారాయణీ నాదరూపా నామరూపవివర్జితా" అను నీదేవీనామములు స్పష్టీకరించుచున్నవి. భగవద్గీతాతాత్పర్య మిదియే యని తేలకపోదు. కాదందురేని నిర్గుణత్వ నిరంజనత్వ సర్వసాక్షిత్వ నిర్లిప్తత్వాదులాపరాత్పరునకు నూడిపోవును. తలంచినంతమాత్రమునఁ బ్రకృతి బ్రహ్మాండముల నిర్మించుననఁగా భగవచ్ఛక్తి యపారమని తేలలేదా. మధ్వవైష్ణవు లేల యులికిపడి యెగిరిపడవలయునో తెలియకున్నది. వారికిం బ్రాణాధారములు దేవాలయములు నుత్సవములు ప్రసాదపరిగ్రహణాదులు మొదలగువానికి గౌరవముతగ్గునని భయము కాఁబోలు. ఏటి కంత భయము? దానికిం బాత్రులగుపామరు లెందఱో యున్నవారు కదా. వారిం గనిపెట్టుకొని జీవింపవచ్చునే. భగవద్భక్తియనునది పెక్కుభేదములుగ నుండునుగదా. అందుత్తమమార్గము వారికిం బనికిరాదు. అందిప్రసాదాదు లుండవు. అది ధ్యానరూపము. పామరుల మోసపుచ్చి ధనము నార్జించి బంధువులఁ బోషించు నవకాశ మందు లేదు. అద్దానియందుఁ బ్రీతికలవారల కీసిద్ధాంతము ప్రాణాంతముగాఁ దోఁచునేమో కాని.

నిక్కువిష్ణుభక్తుల కిది యెంతమాత్రము విరుద్ధము కాదు. ఈ సిద్ధాంతమున భగవంతుఁడు సర్వకారణుఁడన్నభావమే స్పష్ట మగును. ప్రకృతి తదిచ్ఛామాత్రమునఁ బొడసూపి తత్సంకల్ప మును నెఱవేర్చుననియుఁ దోఁచును. కావున శ్రీరామమూర్తిని బ్రభువుగానుండ భూదేవి కోరెననుట సుసంగతమని తేట పడును.

"స్త్రియో వృద్ధా తరుణ్యశ్చ సాయంప్రాతస్సమాహితాః,
సర్వాన్ దేవాన్నమస్యంతి రామస్యార్థే యశస్వినః."

అన్నచోట నొకవిశేషార్థము గలదు. స్త్రీలుకూడ రామాభి షేకమును గోరుదురనుట సామాన్యార్థము. ఆసభలోనున్న విద్వజ్జను లీవిషయము నేల ప్రశంసింతురు? కావున నిందేదో విశేషమే యుండవలయును. వసిష్ఠాదిమహర్షులు రాజులు పౌర జానపదశ్రేష్ఠులెల్లరు నేకవాక్యముగా నీవాక్యముం దెలుపు టచే నిందుఁ గలవిశేషమును బరికింపవలసినదే. పతివ్రతియగు స్త్రీమాహాత్మ్య మపారము. అట్టివారియెడ భగవంతుఁడు సుప్రసన్నుఁడగు. ఈవిషయమున స్మృతులు లోనగువానిం బరికింతము.

"లోకానంత్యం దివః ప్రాప్తిః పుత్త్రపౌత్త్రప్రపౌత్త్రకైః,
యస్మాత్తస్మాత్స్త్రియస్సేవ్యాః కర్తవ్యాశ్చ సురక్షితాః." ౭౮

యాజ్ఞవల్క్యస్మృతి.

"ఉత్పాదనమపత్యస్య జాతస్య పరిపాలనం,
ప్రత్యక్షం లోకయాత్రాయాః ప్రత్యక్షం స్త్రీనిబంధనమ్. ౨౭
అపత్యం ధర్మకార్యాణి శుశ్రూషా రతిరుత్తమా,
దారాధీనస్తథా స్వర్గః పితౄణామాత్మనశ్చ హ. ౨౮

పతిం యా నాభిచరతి మనోవాగ్దేహసంయతా,
సా భర్తృలోకానాప్నోతి సద్భిస్సాధ్వీతి చోచ్యతే." ౨౯

మను. ౯ అధ్యా.

"క్లేశేన మహతా సాధ్వీ ప్రాజాపత్యాదికాన్ క్రమాత్,
స్త్రియస్త్వేవం సమస్తస్య నరైర్దుఃఖార్జితస్య వై. ౬౦
పుణ్యస్యార్ధాపహారిణ్యః పతిశుశ్రూషయైవ హి,
నాస్తి స్త్రీణాం పృథగ్యజ్ఞో న శ్రాద్ధం నాప్యుపోషణమ్. ౬౧
భర్తృశుశ్రూషయైవైతాన్ లోకానిష్టాన్ వ్రజంతి హి,
తస్మాత్సాధ్వి మహాభాగే పతిశుశ్రూషణం ప్రతి." ౬౨

మార్కండేయపురాణము. ౧౬ అధ్యా.

ఇత్యాద్యనేకప్రమాణములు గలవు. వీనిం బరికింపఁగా నుప వాసవ్రతాదు లాచరింపకయే పతిశుశ్రూషచేత నతఁడు సకల దుఃఖములకు లోనై సంపాదించినపుణ్యమునం దర్ధము గ్రహించును. భర్త యొనరించుపాపమునం దాపురంధ్రికి భాగము లేదు. అట్టి యుత్తమచరిత్రముకలది కనుకనే

"ప్రోవాచ వ్యథితా సూర్యో నైవోదయముపైష్యతి." ౩౭

మార్క. ౧౬ అధ్యా.

సూర్యుఁ డుదయింపకుండుఁగాక యని శపించెను. ఆపతివ్రత నింద్రాదులు ప్రార్థింపవలసివచ్చెను. స్వర్గప్రాప్తికి హేతుభూతులు రాలు. కావుననే వారిని జక్కఁగా రక్షింపవలయునని స్మృతు లుపదేశించుచున్నవి. ధర్మకార్యములు తదధీనములగుట పురుషుఁడు తత్సహాయమును బడయవలసినదే యుండును. ఇక్కారణములంబట్టి కాంతలచిత్తము దుఃఖింపకయుండఁ గాపాడుట పురుషధర్మమని మనుప్రభృతు లుపదేశించిరి. సర్వధర్మములు

భార్యాధీనములగుట నామెమనస్సు నిర్మలముగా నుండునట్లు చేయుట పురుషునకు విధియని మన మెఱుంగవలయు.

"స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః,
సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ.
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః."

అని యర్జునుఁడు ప్రశ్నింప విని కృష్ణుఁడు బదులిడక విషయాంతరములఁ బ్రొద్దుపుచ్చెను. ఇందేదే నసత్యమున్న నేల యాక్షేపింపఁడు? భగవంతుఁ డిది సత్యమని యెఱింగియున్నవాఁడు గాన నించుకయే బదులిడకపోయెను. సకలధర్మకార్యములకుం బ్రధానహేతుభూతురాండ్రగు పతివ్రతలు భగవంతుని బ్రార్థించుచున్నారని సభ్యులు దశరథునకుం దెల్పిరి. వృద్ధురాండ్రు, వయస్సుగలవారు భగవంతు నారాధింప ననువగుమూఁడుకాలములయందు శ్రద్ధగలవారలై యశస్వి యగురామచంద్రునకు సకలశుభములు గలుగుఁగాక యనువాంఛల సర్వదేవతలకు నమస్కరించుచున్నవారని భావము. "సర్వాన్ దేవాన్ నమస్యంతి" అనుచో నొకవిశేషము గలదు. దాని నెఱుంగవలయును. ఒక్కొక్కవాంఛను ఫలింపఁజేయ నొక్కొక్కదేవత నియమింపఁబడియెను. సుఖమునుగోరువా రింద్రుని, తేజస్సు గోరువా రగ్నిని, ఇట్లే యాయాయివాంఛల కనుగుణముగా నాయాయి దేవతల నర్థింపవలయును. ఒక్కఁడే యిన్నిఫలములను గల్పింపఁజాలఁడా యన్నఁ జాలఁడనియే సమాధానము. ఏవాఁడే కోరికకొఱకు నేదేవతను బ్రార్థించునో యపుడారూపమున నానామమున భక్తులను రక్షింపఁగోరి నెలకొన్నయాసర్వేశ్వరుఁ డనుభావముగలిగి యుండవలయు. ఆభావము పురో

వృద్ధికి హేతువగును. క్రమక్రమముగా నాభావము దృఢమగును. దాన నిష్కామత్వ మలవడును. అయ్యది సమదర్శనత్వము కుదురుట కవకాశమిచ్చును. అద్దాన యోగగమ్యుఁడగు భగవంతుని ధ్యానించుపద్ధతి కనంబడును. దాన ముక్తి యలవడును. కావునఁ దొలుదొలుత వాంఛాప్రదాతలగు దేవతల నీభావమున నారాధింపవలయు ననువిశేషవిధి యీభాగము నుండి గ్రహింపవలయును.

ఈసంభాషణములనుండి రామచంద్రుఁడు ప్రభువగుట కాబాలవృద్ధ మంగీకరించుచున్నదనియు, నీమహాకార్యమును ఫలింపఁజేయుమా యని స్త్రీలుకూడ భగవంతు నారాధించుచున్నవారనియు, రాముని ప్రవర్తనము నేవగించువా రొక్కరైన లేరనియు మనము గ్రహింపందగు. ఈవిషయ మొక్కఁడే రామమూర్తి భగవంతుఁడని తెలుపుచున్నది. ఇట్లు పలికి యంత మాత్రమునఁ దృప్తినొందక వారెల్ల

"సర్వస్య లోకస్య హితే నివిష్టం, హితాయ నః క్షిప్రముదారజుష్టం,
ముదాభిషేక్తుం వరద త్వమర్హసి."

అని స్వాభిప్రాయమును దెలిపిరి. సర్వలోకహితము గోరినవాఁడనుటచే శ్రీరామమూర్తి సకలబ్రహ్మాండనాయకుఁ డగుపరమేశ్వరుఁ డనునర్థ మిందు నిమిడియున్నదని యెఱుంగవలయు. "హితాయ నః" అనుటచేత నీరామాభిషేకము మాకు మేలు గూర్చునదియే కాని నీవిద్ధానిమూలమున నిహలోకశుభము పొందఁజాలవని సారము. రావణాదిదుష్టదానవపీడితులగు మానవులకు వేవేగ మేలుచేకూర్ప నీపట్టాభిషేకప్రయత్నము చేయుమనుభావము గలదని మన మెఱుంగందగును. ఇట్టు లీభాగ

మాకాలమునఁ గలమానవులస్వభావమును దెలుపుచు రాజు నకుఁ బ్రజలకుం గలసంబంధమును దేటపఱచుచు రాజెట్లు ప్రవర్తింపవలయునన్నధర్మము నుపదేశించుచు శ్రీరామచంద్రుని సర్వేశ్వరత్వమును స్పష్టపఱచుచు సర్వజనరంజకుఁడుగా రాజుండఁదగునన్న న్యాయమును వెలిపుచ్చుచున్నది. దీనింబఠించునపుడీభావముల నాలోచించుచుండవలయును. అధ్యాత్మరామాయణమున దశరథుఁడు తొలుత వసిష్ఠమునితో నాలోచించెనని యుండుటయే విశేషము. ఇఁకఁ దరువాత శ్రీరామచరితమును బఠికింతము.

## పట్టాభిషేకప్రయత్నములు.

* సభ్యులెల్లరు శ్రీరామపట్టాభిషేకమును గోరి దోసిలొగ్గి తన్నుఁ బ్రార్థింపఁగా దశరథుఁడాయభ్యర్థనము నంగీకరించి మధురోక్తుల వారి కిట్లను. మీరెల్ల రేకవాక్యముగా నా పెద్దకుమారుని రామచంద్రుని యువరాజును జేయఁగోరుచుండుట సంతోషమును గల్గించెను. నాయదృష్టమే యదృష్టము. ఇట్టి దింకొక్కరి కుండదు. అని వారికి సంతోషమును గల్గించి విప్రప్రవరుల గౌరవించి వారెల్లరు నాలకించుచుండఁగా వసిష్ఠవామదేవులం గాంచి యీచైత్రమాసము మిగుల మనోహరమైనది. మనమనుకొనుశుభకార్యములకు నర్హమై పవిత్రమైనది. కాననములెల్లఁ బూచియున్నవి. శ్రీరామాభిషేకమునకు వలయువస్తువులనెల్ల నాయత్తపఱుపుఁడు. అని రాజు పలుకఁగనే సభ్యులందఱు చాలకాలముగాఁ దమరు

* ఈభాగము మూఁడవసర్గమునుండి వ్రాయఁబడును. అధ్యాత్మరామాయణతాత్పర్యముకూడ నిం దిమిడియుండును.

చూడఁగోరియున్న రామచంద్రాభిషేకముఁ జూచుభాగ్యము కలుగునని యొకపెట్టున ధ్వనిగావించిరి. ఆధ్వని సుంత యుప శాంతింపఁగా రాజు మరల వసిష్ఠవామదేవమునివర్యులం దిల కించి మహర్షులారా! శ్రీరామునియభిషేకమునకు మును పేయే కర్మములఁ జేయవలయునో వానికి వలయుసాధనముల నాయత్త పఱుపవలయుఁ గాన సెలవిండు. అని రాజు తమ్ముఁ బ్రశ్నిం పఁగా వసిష్ఠముని వామదేవునింగూడి రాజునెదుట మర్యా దగాఁ జేతులుమొగిడ్చి నిలుచున్ననియోగులం గాంచి యందు సుమంత్రాదు లుండఁగా వారితో మీరు సువర్ణాదులను, రత్న ములను, శ్వేతపుష్పమాలికలను, లాజలను, బలులను, సర్వౌష ధులను గూర్పవలయును. మఱియు భిన్నభిన్నపాత్రముల యందుఁ దేనియ, నెయ్యి సమకూర్పందగు. నూతనవస్త్రము లను, రథము, సర్వాయుధములను, చతురంగబలమును, సాము లక్షణలక్షితమగుగజవర్యమును, జామరద్వయమును, ధ్వజ మును, శ్వేతచ్ఛత్రము, నగ్నిజ్వాలవలె వెలుంగుబంగరుకలశ శతకమును, బంగరురంగుపూసిన కొమ్ములుగల వృషభమును, సమగ్రవ్యాఘ్రచర్మమును, సూర్యోదయమగునప్పటికి దశ రథు నగ్నిశాలయందుఁ జేర్పందగు. ఇంకను వలయుగంధ పుష్పాదులగు మంగళద్రవ్యముల నెవుడెవు డేయవి వలయునో వానినెల్ల మునుదే సేకరించి యుంచుఁడు. రాజగృహద్వారము నందును, నగరద్వారములయందును సుగంధమును జల్లించి కుసుమమాలికలు వ్రేలాడవైచి దశదిశలవ్యాపించు సువాస వలు గుబులుకొనఁజేయు ధూపధూమములఁ గల్పింపుఁడు. ఎందఱువిప్రులువచ్చిన నందఱకు వారు కోరినరీతి మృష్టాన్న

మును పాలు పెరుఁగులతోఁ జేయంబడువ్యంజనములంగూర్చి రేపటనుండి కాలముతప్పింపక వారికిం బెట్టింపుఁడు. కోరిన పదార్థములఁ బెట్టించి వారలకు దక్షిణాల నొసంగుఁడు. రేపు రవి యుదయింపఁగనే స్వస్తివాచనము సాగును. అందులకై మంచిబ్రాహ్మణులను రప్పింపుఁడు. వారు కూరుచుండఁదగు నాసనములఁ గల్పింపుఁడు. ధ్వజము లెత్తింపుఁడు. రాజమార్గములఁ జల్లగా నుండఁజేయుఁడు. స్వస్తివాచనమునకుఁగా వరింపఁబడుబ్రాహ్మణు లంతఃకక్ష్యయందుందురు. రెండవకక్ష్యయందు నటనర్తకీజనము నివసింపఁదగు. వారెల్ల నలంకరించుకొని మనోహరవేషముల నుండందగుదురు. అన్నము పెట్టుటకుఁ బిండివంటల నిచ్చుటకు, దక్షిణలొసంగుటకుఁ బూలహారముల నిచ్చి గౌరవించుటకు నెవరెవరు నియోగింపఁబడుదురో వారెల్లరు దేవాలయములందును, నాల్గుబాటలు గలియుతావులందును, రాజమార్గమందుఁగల చల్లనివృక్షముల చెంతను నిలిచి బ్రాహ్మణులు లోనగువారలకు దక్షిణలను భక్ష్యములు లోనగువాని నొసంగుచుండునట్లు లేర్పఱుపుఁడు. వీరభటు లాయుధపాణులై కవచములందాల్చి ధౌతవస్త్రములధరించి శ్రీరామాభిషేకరూపమహాభ్యుదయము సాగు రాజభవనముముందుఁ బ్రవేశించి నిలిచియుండవలయు. అని హెచ్చరించిరి.

ఇట్లు లామునివరు లిరువురు కార్యనిష్ఠ పెంపున నందుఁ జేయఁదగు కార్యమునకు వలయుపరికరముల సిద్ధముచేయ మంత్రులకుఁ దెలిపి దాసీజనులను, బరివారము లోనగువారిని రప్పించుట, యింకనుం జేయఁదగుపనులను రాజునకు విన్నవించి వానిని నెఱవేర్చి నిజకార్యనిర్వహణసంతోషమున రాజుచెంతఁ

జేరి భవదాజ్ఞను నెఱవేర్చితిమని విన్నవించిరి. అంత నాదశరథ మహారాజు కుమారునకు నభిషేకము చేయుసంతోష ముప్పొంగుచుండఁగా సుమంత్రునిం గాంచి నీ విపుడేపోయి శ్రీరాముని సత్వరము తోడుకొనిరమ్మనఁగా నాతఁడు తదాజ్ఞరీతింబోయి దివ్యస్యందనమున నాకుమారలలాము నెక్కించుకొని వచ్చెను.

సుమంత్రుఁడు శ్రీరామమూర్తిని దోడుకొని రాఁబోవఁగనే యాపేరోలగమున నున్న ప్రాగుత్తరపశ్చిమదక్షిణభాగములనున్న దేశాధీశులు, మ్లేచ్ఛప్రభువులును, మఱియు వనపర్వతముల నివసించునాటవికప్రభువులు నందఱు దేవేంద్రు నమరులు సేవించునట్లు లారాజలలాముని గొలుచుచుండిరి. ఇంద్రునిచందముననున్న యారాజు సౌధముపైనుండి రథము నెక్కివచ్చుచున్న శ్రీరామచంద్రునిం దిలకించెను. గంధర్వరాజువలె భోగోచితవేషములు గలిగి జగద్విఖ్యాతశౌర్యముల రారఁ బౌరుషచిహ్నములయిన యాజానుదీర్ఘబాహువులు లోనగునవి చెలువారుచుండ మందగమనము వంతీంద్రగతిని ధిక్కరింప నెమ్మోము చందురుని దూలనాడఁ జూచువారల లోచనములకుఁ బ్రతిక్షణము విలక్షణానందముం గలిగించుచు రూపౌదార్యసౌశీల్యగుణములచే స్త్రీలకుమాత్రముకాక పురుషులకుంగూడ మనోహరుండయి తగుచుఁ బ్రజలమనస్సులను జల్లఁజేయుప్రవృత్తిగలిగి రామచంద్రుఁడు వచ్చుచుండెను. ఆరాముని సౌధోపరిభాగమునుండి యెంత చూచినను రాజు తృప్తినొందఁజాలఁడయ్యెను.

సుమంత్రుఁ డారామచంద్రునిఁ కై దండయొసఁగి రథము నుండి దించి యతఁడు తండ్రికడ కరుగుచుండఁగా నంజలింబట్టి

కూడఁబోయెను. శ్రీరామమూర్తి కైలాసమువలెఁ దెల్లనైన యాసౌధమునెక్కి శాస్త్రవిహితముగాఁ దనపేరుచెప్పి తండ్రి పాదములకు నమస్కారముచేసెను. నమస్కరించి దోసిలొగ్గి నిలుచున్న ప్రియపుత్త్రవర్యునిం గాంచి యంజలింబట్టి చెంతకుం దిగిచికొని కౌఁగిటం జేర్చి తదర్హమగునాసనమునఁ గూరుచుండ నియోగించెను. ఆయాసన మా శ్రీరాముని తేజంబున మఱింతఁగాఁ బ్రకాశించెను ఉదయభానుఁడు మేరుపర్వతమును బ్రకాశింపఁజేయుచుండ మందుఁ గనఁబడుచుండెను. తనకంటె సర్వప్రకారములఁ దేజరిల్లుకుమారుం గాంచి రా జెంతయు హర్షించెను. అంత రాజు సుస్మితము చెలరేఁగుచుండ రామచంద్రా! యని పిలిచి తొల్లి కాశ్యపుఁడు తనకొడుకగు నింద్రునితో భాషించినట్లుగా సంభాషింపఁబూని యిట్లనియె.

ప్రియకుమారా! అనుకూలవతియగు జ్యేష్ఠపత్నియందు నానోములపంటవై జన్మించితివి. గుణవంతుఁడవు. నా కెంతయుఁ బ్రియమునే చేకూర్చువాఁడవు. సద్గుణప్రవృత్తిచే నన్నుఁ బ్రజల నానందింపఁజేసితివి. ఈపేర్కొన్న కారణములచే నీవు యువరాజత్వమునకు మిక్కిలి తగుదువు. కావునఁ బుష్యనక్షత్రయుతమగుశుభదినమున యౌవరాజ్యము నొందుము. వినయము లోనగుసద్గుణములుగల నీకు వేఱుగ నే నుపదేశింపఁదగిన దేదియు నుండదు. పుత్త్రస్నేహాతిరేకమున నొక్కహితము వినిపించువాఁడ. విశేషించి వినయము వెలయఁగా నెల్లతఱులను జితేంద్రియత్వ మలవడఁగాఁ బ్రవర్తింపుము. కామజనితములగువ్యసనములను క్రోధప్రభవములగువ్యసనములను వదలిపెట్టుము. సామాన్యసేవకులకు దర్శనమీయక వారి

పరోక్షమున నధికారులమూలమున నాజ్ఞల నొసంగుచుఁ దన్మూలమునఁ గార్యముల సాగింపుము. మంత్రిప్రభృతులతో సమక్షమున మాటలాడి ముఖ్యకార్యముల వారిమూలమునఁ బ్రజలకు హితముగా సాగింపుము. పరోక్షముగనుండి గూఢచారుల మూలమున నన్యదేశవార్తలం బరిశీలించుచుఁ బ్రత్యక్షముగా స్వదేశవార్తలం దెలిసికొనుచుఁ బ్రవర్తింపుము. మంత్రులు లోనగువారల సంతోషింపఁజేయుచుండుము. ధాన్యగృహములయందు ధాన్యరాసులను, శస్త్రగృహములయందు బహువిధాయుధములను జక్కఁగా సమృద్ధిగా సేకరించి దానఁ బ్రజలెల్ల సుల్లాసముగలవారు కాఁగా నెవ్వాఁడు ప్రజాపాలనము చేయునో యారాజుం గని సామంతరాజు లమృతముగాంచిన దేవతలవలె నానందింతురు. కావున రామచంద్రా! నీవును మనోనిగ్రహముకలవాఁడవగుచు నాహితము ననుసరించి యొనరింపుమని మహాదరంబునఁ బలికెను.

శ్రీరామునకు యౌవరాజ్యమును గూర్పఁదలఁచిన రాజేంద్రునియత్నము నెఱింగి శ్రీరామునకు మిక్కిలి మేలుగోరి మిత్రులు సత్వరముగాఁ గౌసల్యం గానంబోయి యాశుభవార్తలం దెలిపిరి. ఆదేవి తనకుమారు నభిషేకవృత్తాంతమును దెలిపిన యారామచంద్రస్నిగ్ధుల కెల్ల సువర్ణటంకములను గోవులను రత్నరాసుల నిచ్చెను. అంత నక్కడ శ్రీరాముఁడు దశరథునకు నమస్కరించి రథమెక్కి యందందుఁ బ్రజలు గుంపుగా వచ్చి పూజలు చేయఁ గైకొనుచు నిజకాంతుల దిశలవెలిఁగించుచు నాత్మసౌధమునకుం బోయెను. పౌరజానపదులును సామంతరాజులును దమవాంఛల సార్థకము చేసిన దశరథునికడ సెలవు

పుచ్చుకొని తమతమ నెలవుల కరిగి యీమహోత్సవము నిరంత రాయముగా సాగవలయునని యిష్టదైవములఁ బ్రార్థించుచుఁ బూజించిరి.

మహాశయులారా! ఈభాగమును విమర్శింతము. కొన్ని విశేషములు తోఁపకపోవు.

"చైత్రశ్శ్రీమానయం మాసః పుణ్యః పుష్పితకాననః,
యౌవరాజ్యాయ రామస్య సర్వమేవోపకల్ప్యతామ్."

అనుమూలమును బరిశీలింతము. ఈభావము దశరథుఁడు మునులతోఁ జెప్పునపుడు గలదు.

"మాసానాం మార్గశీర్షోఽహమృతూనాం కుసుమాకరః."

అని గీతాశాస్త్రమున భగవంతుఁడు పల్కెను. చైత్రవైశాఖ మాసములు వసంతర్తువుచే గ్రహింపఁబడుచున్నవి. అందుఁ జైత్రమాసము ప్రధానమని తేలదు. మార్గశీర్షము మాసోత్తమమని శ్రీహరిభావముకదా. "వసంతవల్లోకహితం చరంతః" అన్న శంకరోక్తియుఁ గలదు. లోకహితమును వసంతర్తువవలెఁ గోరవలెనని దీనిభావము. వాల్మీకిమునివాక్యముంబట్టి యీఋతువునందుఁ జైత్రమాసము మిక్కిలి ప్రశస్తమని మన మంగీకరింపవలయును. ప్రజాసామాన్యమునకు నితరమాసములకంటెఁ జైత్రమాసము సకలసుఖావహము. సామాన్యముగాఁ బ్రజలైహికసుఖమునుగోరువారుగా నుందురు. కావునఁ బ్రజాసుఖసంపాదనమున నీమాసము ప్రధానమని తేలెడిని. భగవంతుఁడగు రామమూర్తి యట్లె యైహికమును గోరువారలకుఁ దత్సుఖమును గలిగించువాఁడు. అనఁగా రామరాజ్యము సకలప్రజాసుఖసంపాదనసమర్థమని భావము. శ్రీమాన్ అనఁగాఁ బ్రకృతి

ప్రధానుఁడు కావుననే రాజ్యపాలనమునకుం బూనునని సారము. పుణ్యాః = పవిత్రమైనది. మార్గశీర్షమాసము శ్రేష్ఠమని భగవద్వాక్యము గలదు. తద్విరుద్ధముగా నిందుండునా. అని కొందఱు ప్రశ్నింతురు. దానికి విరుద్ధముగ నిది లేదు. భగవతిం బూజించువారలకు శరన్నవరాత్రములకంటె వాసంతనవరాత్రము లుత్కృష్టములుగఁ జెప్పఁబడినవి వాసంతనవరాత్రములు భగవతీవిహారయోగ్యములు. శరన్నవరాత్రములు రాక్షససంహారార్హములు. కావున నిందు నారాధించు టుత్తమ మని పెద్దలభావము. మహామాయ యగుసీతాదేవింగూడి సర్వసాక్షియై శ్రీరామపరబ్రహ్మ మున్నవాఁడు కావున నిపుడే యారాధనవిశేషములకుఁ బ్రధానమని రహస్యము. అనఁగా

"న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా,
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే. ౧౪
ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః,
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్." ౧౫

గీత. ౪ అధ్యా.

అనుగీతావాక్యముల ననుసరించి భగవంతుఁడు కర్మబద్ధుఁడు కాఁడని, కర్మములవలనిఫలమును గోరునాసక్తి యతనికి లేదనియు నెవరు గ్రహించి యారాధింతురో వారు కర్మబద్ధులు కారన్న శ్రీకృష్ణతాత్పర్యమును నమ్మి యెవరు ఫలాభిసంధిరహితముగా సత్కర్మములను లోకులు నేర్చుకొందురన్న భావమున నాచరింతురో వారలు సంసారము తరింపఁగలరని పరమార్థము. సీతారాము లౌక్కయయోధ్యారాజ్యవాసులకే కాక సకలలోకసుఖసంపాదనక్షములు గావున వారిమహత్త్వ

మెఱిఁగి యారాధించినఁ దత్ఫల మనుపమానముగాఁ గల్గునని సారాంశము. కావుననే పుణ్యము పవిత్రమైనదని వాల్మీకి తెల్పెను. "పుష్పితకాననః" అరణ్యములు పుష్పించియున్న వనఁగా వసంతుఁ డుద్యానవనములయం దెట్టి యాదరణము కలవాఁడో యట్లే యరణ్యములయందును బ్రీతిగలవాఁడని యర్థము. అనఁగా నయోధ్యాపురవాసు లెట్లు రామాభిషేకమును గాంచఁగోరుచున్నారో యట్లే యరణ్యములనున్న మహర్షులే కాంతసేవను గోరుచున్నవారనియు వీరియం దెట్టిసద్భావమామహాత్మునకుఁ గలదో వారలయందు నట్టిసద్భావమే కలదని భావము. అరణ్యవాసముకూడ శ్రీరాములకుఁ బ్రియమైనదని రహస్యము. వనములు శ్రీరామాగమనమునుగోరి పూజింపఁ బుష్పములఁ దాల్చియున్నవనుటయే యిటఁ బరమార్థము.

ఆత్మారాముఁడు శ్రీరాముఁడు. సకలభూతాంతర్యామి యగుట సమబుద్ధియు సమదృష్టియుఁ గలవాఁడు. కావున నీ కాలము సుఖకరమగుట మనశ్శాంతి చేకూరునుగాన నదిగలవారు పరాత్పరుని సమ్యగారాధనవిశేషముల నారాధింపఁదగు నన్నభావము దశరథునివచనములమూలమున వాల్మీకిమహర్షి మనకుఁ దెలిపెనని మన మెఱుంగవలయును. వసంతర్తువును బేర్కొన్నకతన వసంతున కెట్లు పక్షపాతములేదో యట్లే రామచంద్రునకుఁ బక్షపాతములేదనియు, భక్తి నారాధించువారల కెల్లఁ దనకరుణఁ జూపుననియు నిందుండి గ్రహింపవలయును. కొంద ఱూర్ధ్వపుండ్రాదిచిహ్నములుకలవారలే శ్రీరాముని బూజింప నర్హులగుదురనియు, నితరు లట్లర్హులు కారనియు నుపదేశింతురు. వారే మధ్యవైష్ణవులు, ధనదాసులు, జనవంచకు

లనంబడుదురు. భగవంతు నెవ్వఁడెవ్వఁడు తనకుఁగలశక్తి ననుసరించి యారాధించును. భక్తియొక్కఁడున్న నెల్లరకు సమానఫలముల నొసంగును. అనఁగాఁ బూవులు సుగంధవస్తువులతోఁ బూజించువారల కధికఫలమును, అవి సంపాదించుశక్తిలేక యరణ్యమునఁగల కుందప్రముఖపుష్పములం బూజించువారల కత్యల్పఫలము నీయఁడనియు, బాహ్యచిహ్నములనఁగాఁ బంగరు పదకములు లోనగువానిం గాంచి వీరే నాభక్తులని భావింపఁడనియు, నట్లు భావించునని యుపదేశించువారు భక్తులు గాక ద్రవ్యాసక్తులగు నల్పమతులనియు మనము గ్రహింపఁదగిన విషయము.

"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః. ౨౬
యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్. ౨౭
సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్. ౨౯
అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్,
సాధురేవ స మంతవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః." ౩౦

గీత. ౯ అధ్యా.

అను నీగీతావాక్యములు పైసిద్ధాంతము సత్యమని బోధించుచున్నవి. కావునఁ గలిగినధనమునుబట్టి దొరకినపదార్థములను బట్టి తృప్తిచేకూరఁగా భక్తిచే సీతారాములను బ్రకృతిపురుషులనుగా భావించి ధ్యానించిన నేజాతివాఁడైనను దదనుగ్రహమునకుఁ బాత్రుఁడగునని మనము చక్కఁగా గ్రహింపవల

యును. మతభ్రష్టులై పరమభాగవతోత్తములమని దుర్మతముల బోధించుదాసులు ధనదాసులు వేషధారులు నగుదురని నమ్మి వారితుచ్ఛవాక్కులకు లోఁబడక చక్కనిభక్తితో సీతారాములను లోకానుగ్రహార్థ మవతరించిన ప్రకృతిపురుషులనుగా భావించి యారాధింపందగు. దాననే యాపరమపురుషుని యనుగ్రహము కల్గును.

దశరథుఁడు పట్టాభిషేకసంభారములంగూర్పుఁడని పలుక మునులు మంత్రుల కవ్విధముం జెప్పిరి. ఆవిషయమునందే

"దేవాయతనచైత్యేషు సాన్నభక్షాస్సదక్షిణాః,
ఉపస్థాపయితవ్యాస్స్యుర్మాల్యయోగ్యాః పృథక్పృథక్."

అను నీవిషయము గలదు. దేవాలయములయందు, నాల్గుత్రోవలు కలియుతావులయందుఁ గలవృక్షములయందును, అన్నము పిండి వంటలు దక్షిణలు పూలహారము లిచ్చువారల నేర్పఱుపుఁడు. అని మును లాజ్ఞాపించిరి. ఒక్కచో సంఘమును జేర్చి భుజింపఁ బెట్టరాదనియు, నాయాయిపవిత్రస్థలముల నేకొంత లేకయుండ నన్నము భక్ష్యములతో నొసంగవలయుననియు, బీదలకు దక్షిణ లీవలయుననియుఁ, బూలదండలు చందనము తాంబూలముల నీవలయుననియు వారు తెల్పిరి. అన్నికార్యములలో భూతతృప్తి ప్రధానమని యిటఁగలసారము.

"గంధర్వరాజప్రతిమం లోకే విఖ్యాతపౌరుషం,
దీర్ఘబాహుం మహాసత్త్వం మత్తమాతంగగామినం
చంద్రకాంతాననం రామమతీవ ప్రియదర్శనం,
రూపౌదార్యగుణైః పుంసాం దృష్టిచిత్తాపహారిణం.

ఘర్మాభితప్తం పర్జన్యం హ్లాదయంతమివ ప్రజాః,
న తతర్ప సమాయాంతం పశ్యమానో నరాధిపః."

అన్నమూలమునఁ గలప్రాతీతికార్థముగాక విశేషార్థము పరికించినఁగాని భగవత్తత్త్వము తెలియరాదు. శ్రీరామమూర్తి రథాధిరూఢుఁడై వచ్చుచుండఁగా దశరథుఁడు సౌధోపరిభాగముననుండి చూచెను. కాని తృప్తినొందఁడయ్యెను. ఏల? మత్స్యకూర్మాద్యవతారములలో భగవంతునిభక్తపరాధీనత్వము తేటపడియెను. అసమానసౌందర్యముకూడ భగవంతునకుఁ గలదని తేటపడలేదు. శ్రీరామావతారమునందుఁ బ్రకృతిమహాత్త్వము తేటపడుచున్నది. లోకవశీకరణమున భగవంతుఁడు స్త్రీరూపమును దాల్చెననుట యమృతవిభాగకాలమున స్పష్టమయ్యెను. ఇపుడు స్వాభిన్నయగు ప్రకృతి ప్రాకృతులనేత్రములకు భిన్నరూపముగలదిగఁ దోఁపఁజేయ నెంచి రెండుగాఁ దన కళను విభజించి సీతారాములనఁబరఁగెను. ప్రకృతిని వేఱు చేయు టెట్లు? మనస్సునుండి యిచ్ఛను వేఱుచేయ సాధ్యమాఁ కాదుకదా. యోగులదృష్టికి నారూప మొక్కవిధముగ దోఁచును. రామమూర్తి మాయామానుషుఁడనుట ప్రసిద్ధము కదా. సర్వజనరంజనము చేయువాఁడుకదా రామమూర్తి. సౌందర్యసౌకుమార్యాదులు ప్రకృత్యంశములు సర్వసమత్వాదులు భగవదంశములు. ఈ రెండును శ్రీరామునియం దిపుడు కనఁబడుచున్నవి. కనుకనే పురుషులనేత్రములను మనస్సుల నాకర్షింపఁజాలెను. కామవికారమును బురుషులకుఁ బుట్టించెనని యర్థము గ్రహింపరాదు. "అతీవ ప్రియదర్శనమ్" ఎంత చూచినను విసుగునొందఁజేయక యింకను జూడవలెననియెడు

నాశెను బుట్టించుచుండెనని భావము. దాన ఫలమేమి? అని పామరులు ప్రశ్నింతురని యెఱింగియే మహాకవి

"ఘర్మాభితప్తం పర్జన్యం హ్లాదయంతమివ ప్రజాః"

అని పలికెను. ఎండబాధల ననుభవించువారలకు వృష్టినిగురియించు మేఘాధిదేవతలఁ బ్రజలను సంతోషింపఁజేయువాఁడని సామాన్యమగునర్థము. ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవతము లనఁబడు త్రివిధతాపముల నడంచి మహానందమును గల్గించువాఁడను నర్థమును గ్రహింపవలయును. పర్జన్యసామ్య మిందుఁ గలదు. మేఘాధిదేవత యెట్లు కనంబడకయున్నను సంతాపమునడంచునో భగవంతుఁడు కనఁబడకపోయినను సర్వసుఖములఁ గల్పించువాఁడని మన మెఱుంగవలయును. ఇట్లుండఁగా నా భగవంతుఁడొకమూర్తిని ధరించిన నెట్లుండవలయునో యూహింపఁదరమా? దశరథుఁ డిట్టిపరాత్పరుని నారామచంద్రునిం గాంచి యవ్యయానందమును గాంచెనని ప్రకృతార్థము. మరణచిహ్నములు తోఁచువారికి సంతృప్తియుండకుండుటయు నొకగుఱుతు. అది లేనివాఁడయ్యెనని యొకయర్థ మిందుఁగలదని కొందఱందురు. అది యసంగతమన వలనుపడదు. కాని యిట నది పొసఁగదనవచ్చును. దశరథుఁడవ్యయానంద మనుభవింపఁబోవుచున్నాఁడుకదా. రామచంద్రుని జూచి సంతోషపడుట కిదియే చివర. ఇఁకముందు రామదర్శనము విషాదహేతువు కాఁగలదు. కావున భగవంతుఁడు తాను దశరథునకుఁ బుత్త్రుఁడన్న ఖ్యాతిని బొందెను. కావున నతనికిఁ దనయదృష్టానంద ప్రదరూపమును గనఁబఱిచెనని మన మెఱుంగందగును.

"స ప్రాంజలిరభిప్రేత్య ప్రణతః పితురంతికే,

నామ స్వం శ్రావయన్ రామో వవందే చరణౌ పితుః."
అను నీమూలము మనకు నొకసదాచారమును బోధించు చున్నది. తండ్రి కడ కరిగి రామమూర్తి తన పేరు వినిపించి పాదములకు వందనము లర్పించెను.

"ఆత్మనామ గురోర్నామ నామాతికృపణస్య చ,
శ్రేయస్కామో న గృహ్ణీయాజ్జ్యేష్ఠాపత్యకళత్రయోః."

అన్న సూక్తి నుదాహరించి తన పేరు చెప్పఁదగ దనునార్యయవిరుద్ధముగా నెట్లు రాముఁడు తన పేరు చెప్పెనని యాక్షేపింతురు.

"అభివాదాత్పరం విప్రో జ్యాయాంసమభివాదయేత్,
అసౌ నామాహమస్మీతి స్వం నామ పరికీర్తయేత్. ౧-౨-౨
నామధేయస్య యే కేచిదభివాదం న జానతే,
తాన్ ప్రాజ్ఞోఽహమితి బ్రూయాత్ స్త్రియస్సర్వాస్తథైవ చ. ౧-౨-౩
భోశ్శబ్దం కీర్తయేదంతే స్వస్య నామ్నోఽభివాదనే,
నామ్నాం స్వరూపభావో హి భోభావఋషిభిస్స్మృతః." ౧-౨-౪
మను. ౨ అధ్యా.

"తతోఽభివాదయేద్వృద్ధానసావహమితి బ్రువన్." ౧-౫
యాజ్ఞవల్క్యస్మృతి.

"పాదోపసంగ్రహణం గురుసమవాయేఽన్వహమ్, అభిగమ్య తు విప్రోష్య మాతృపితృతద్బంధూనాం పూర్వజానాం విద్యాగురూణాం చ సన్నిపాతే పరస్య స్వనామ ప్రోచ్యాహమిత్యభివాదోఽజ్ఞసమవాయే స్త్రీపుంయోగేఽభివాదతోఽనియమమేకేనావిప్రోష్య." గౌతమస్మృతి. ౬ అధ్యా.

నమస్కారము చేయునపుడు తన పేరు చెప్పవలయునని స్మృతులు తెల్పుచున్నవి. కావున విశేషవిధిగా నీవిషయము గ్రహించి సామాన్యధర్మముల నుల్లంఘింపవలయును. నమస్కారలక్షణ మెట్టిదనఁగా,

"దక్షిణం బాహుం శ్రోత్రసమం ప్రసార్య బ్రాహ్మణోఽభివాదయేత్, ఉర
స్సమం రాజన్యో మధ్యసమం వైశ్యో నీచైశ్శూద్రః ప్రాంజలిరితి."

ఆపస్తంబస్మృతి.

కుడిచేయి కర్ణపర్యంతము వ్యాపింపఁజేసి బ్రాహ్మణుఁడును, వక్షముదనుకఁ జాపి రాజును, నడుముదనుకఁ జాపి వైశ్యుఁడును, వంగి చేతులుజోడించి శూద్రుఁడును నమస్కరింపవలయును. ఒక్కచేతితో నమస్కారము చేయరాదు.

"జన్మప్రభృతి యత్కించిచ్చేతసా ధర్మమాచరేత్,
సర్వం తన్నిష్ఫలం యాతి ఏకహస్తాభివాదనాత్."

అని విష్ణుస్మృతి తెల్పుచున్నది. నమస్కరించుపద్ధతి యెట్లనఁగా

"వ్యత్యస్తపాణినా కార్యముపసంగ్రహణం గురోః,
సవ్యేన సవ్యస్స్పృష్టవ్యో దక్షిణేన తు దక్షిణః." ౭౨

మను. ౨ అధ్యా.

"ఉత్తానాభ్యాం హస్తాభ్యాం దక్షిణేన దక్షిణం సవ్యం సవ్యేన పాదావభి
వాదయేత్, దక్షిణోపరిభావేన వ్యత్యాసో హ్యయం శిష్టసమాచారాత్."

పైఠీనసిః.

ఎడమచేతిపైఁ గుడిచేయి యునిచి మ్రొక్కవలయు. కుడిచేతితోఁ గుడిపాదమును, ఎడమచేతితో నెడమపాదము స్పృశింపఁదగు. పాదములను దగులవలయునని భావము. ఇట్లు సామాన్యవిధులను బాటింపక విశేషవిధుల ననుసరించి యాచారము నడుపవలయునని స్మృతులు తెలుపుచున్నవి. ఈస్మృతుల యర్థమునే శ్రీరామచంద్రమూర్తి తనయాచారమునఁ దెలియఁజేసినని మనము తెలిసికొనవలయును. రామచంద్రప్రవర్తనమే స్మృతులభావమని మనము నిశ్చయించుకొనవలయును.

"తదాసనవరం ప్రాప్య వ్యదీపయత రాఘవః,
స్వయైవ ప్రభయా మేరుముదయే విమలో రవిః."

మేరుపర్వతమనఁగా నత్యున్నతభాగమని పెద్దలందురు. "సర్వేషాం మేరురుత్తరః" అన్నసూక్తి స్పష్టమే కదా.

"యత్రోదితోఽర్కః కిల తత్ర పూర్వా తత్రాపరా యత్ర గతః ప్రతిష్ఠాం
తన్మత్స్యతోఽన్యే చ తతోఽఖిలానాముదగ్గతో మేరురితి ప్రసిద్ధం."
సిద్ధాంతశిరోమణి గోళాధ్యాయము.

"అనేకరత్ననిచయో జాంబూనదమయో గిరిః,
భూగోళమధ్యగో మేరురుభయత్ర వినిర్గతః."
సూర్యసిద్ధాంతము. గోళాధ్యాయము.

"వ్యక్షోత్తరే తు సర్వేషాం సుమేరుస్సౌమ్యదిక్స్థితః,
యామ్యేప్యేవం పరో మేరుః కుసంజ్ఞో యామ్యదిక్స్థితః." ౧౩౮
సిద్ధాంతతత్త్వవివేకము మధ్యమాధికారము.

ఆర్యభట, లల్లసిద్ధాంతములయందు నిట్లే శ్లోకము లగపడియుడిని. దక్షిణోత్తరభాగములయందు మేరుద్వయము కలదనఁగా నేమియర్థమో పెద్దలే యూహింపవలయును. ప్రాక్పశ్చిమచిహ్నములవలె దక్షిణోత్తరచిహ్నములు మేరువు లనంబడునని గ్రహించిన నేబాధయు లేదు. ఉదయాస్తాద్రులున్నట్లే దక్షిణోత్తరమేరువు లున్నవని యెఱుంగవలయు. గ్రహసంచారమునకు సీమలుగానున్న దక్షిణోత్తరప్రదేశములు మేరుసంజ్ఞకములు. ప్రకృత మనుసరింతము. శ్రీరామమూర్తి తన దేహకాంతులచే నాయాసనము నలంకరఁజేసెనని కలదు. సకలవ్యక్తులకుఁ దేజఃప్రదాతయగుభగవంతుఁ డాయాసనము రత్నఖచితమైనదానిఁ బ్రకాశింపఁజేయుట యచ్చెరువుఁ గల్పింపఁజాలదు.

దశరథున కదియే మానవజన్మజనితసంతోషమునకుఁ దుది. కాలము కావునఁ దనదివ్యమంగళానుపమానరూపమును గనఁ బఱచెనని గ్రహింపఁదగును. ఏలయనఁగా దశరథునకు శాపఫలానుభవకాలము సమీపించుచున్నది. "గహనా కర్మణో గతిః" అన్నవాక్యము భగవంతునకుఁ గాదు. సర్వజ్ఞుఁడుకదా పరమేశ్వరుఁడు. అట్టులౌట దుఃఖఫలానుభవకాలము ముందు రానున్నదని యెఱింగి పితృతృప్తి కుమారునకు విధి యను శాస్త్రము ననుసరించి మానవుల కానీతి నెఱింగింపఁబూని తన యానందమయరూపమును దండ్రికిం గనఁబఱచెననియే యిందుఁ గలరహస్యము.

"భూయో వినయమాస్థాయ భవ నిత్యం జితేంద్రియః,
కామక్రోధసముత్థాని త్యజేథా వ్యసనాని చ."

అనునీతిని బుత్రప్రీతిచే రాజు రామచంద్రున కుపదేశించెను.

ఈప్రకరణమున రాజధర్మములు చెప్పఁబడినవి. కాని యందుఁ బ్రధానములేవి? అని మన మెఱుంగవలయును.

"అతస్తు విపరీతస్య నృపతేరజితాత్మనః.
సంక్షీయతే యశో లోకే ఘృతబిందురివాంభసి." 38

మను. ౭ అధ్యా.

అను నీస్మృతిధర్మమునే రామాయణము తెలుపుచున్నది. సర్వదా జితేంద్రియుఁడు రాజు కావలయును దాన దుష్టాలోచనములు నశించును. సత్యానురక్తి పాదుకొనును. అట్టివాని కడ దుర్వృత్తులు చేరఁజాలరు. ఇన్నిధర్మములకుఁ బ్రధానము జితేంద్రియత్వమని సారము. జితేంద్రియత్వమునకు యోగాభ్యాసము ముఖ్యముకదా.

"యదా హి నేంద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే,
సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢస్తదోచ్యతే. ౪
ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్,
ఆత్మైవ హ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః." ౫

గీత. ౬ అధ్యా.

అనుగీతాశాస్త్రము పైనవ్రాసినయభిప్రాయమునే యుపదేశించి డిని. యోగము నభ్యసింపక మనస్సు స్థిరతఁగాంచదు. ఎన్ని వేదాంతవాక్యములు చదివినను మనోనిగ్రహము కుదురదు. యోగముననే యయ్యది కుదురును. కనుకనే భగవంతుఁడు శ్రీకృష్ణమూర్తి తపస్వివి కమ్మా యనక యర్జునుని, "తస్మాద్యోగీ భవార్జున" అని యుపదేశించెను. భగవద్గీతలు యోగమే ప్రధానమని బోధించుచున్నవి. సర్వవిజ్ఞానములకు మూలము మనోనిగ్రహము. అయ్యదియే యోగఫలము. కావున యోగాభ్యాసము మిక్కిలి ప్రధానమని తేలుచున్నది.

కొందఱు గురువులమని పేరు పెట్టుకొని ముక్కుసెవులు మూసి చక్కఁగాఁ గూరుచుండి మహాయోగులవలె నటించి యాస్థితియందు ఛాయాపటములం దీయించుకొని వాని విక్రయించి శిష్యులకడ ధనమును సేకరింతురు. వారు కపటయోగులు, ధనదాసులునగుదురు. భగవత్పాదదాసులుమాత్రము గారు. సన్న్యాసులును గారు. వారిమాయలకుఁ బామరులు కొందఱు లోఁబడుదురు. వారికి ముక్తి ధనవిముక్తియే. యోగి విజనస్థలమునే కోరును. బాహ్యాడంబరముల నాశింపఁడు. ధనమాతని కక్కఱలేదు. విగ్రహారాధనమున కతఁడు దూరమున నుండును. తేజోరూపునిగాఁ బరాత్పరుని సమాహితాత్ముఁడై యతఁడు ధ్యానించును.

"అహింసా ప్రథమం పుష్పం పుష్పమింద్రియనిగ్రహః,
సర్వభూతదయా పుష్పం క్షమా పుష్పం విశేషతః."

అన్నన్యాయము ననుసరించి యాతనియారాధనవిశేష ముండును. బాహ్యపూజలందు నాతనికి నిరతి యుండదు. మానసిక ధ్యానమే యతనిపూజ యని యెఱుంగవలయును. క్రోధ మాతనికడ నిలువఁజాలదు.

"యోగీ యుంజీత సతతమాత్మానం రహసి స్థితః,
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః." ౧౦.

గీత. ౬ అధ్యా.

అను నీ శ్రీకృష్ణవాక్యములు పైనవ్రాసినయభిప్రాయమును సిద్ధాంతము చేయుచున్నవి. సర్వదా తనమహిమమును దెలుపుకొనుచు నితరులను దూషించుచు ధనమొసంగిన భూషించుచు నది యీయకున్నను గొంచెమిచ్చినను వారిని దూషించుచుండు కపటయోగులకుఁ బామరులకుఁ గలభేదమేమి? అట్టివారు విశేషించి పామరులనియే మన కీఘట్టమున శ్రీరామాయణము "నిత్యం జితేంద్రియః" అన్నవాక్యము చేత బోధించుచున్నది.

వ్యసనములు రెండువిధములు. కామజనితములు, క్రోధజనితములు అని. ఈ రెండువిధములగువ్యసనములను వదలవలయునని రామచంద్రునకు దశరథుఁ డుపదేశించెను. అవ్వి యెవ్వియనఁగా,

"దశ కామసముత్థాని తథాష్టౌ క్రోధజాని చ,
వ్యసనాని దురంతాని ప్రయత్నేన వివర్జయేత్. ४৯
కామజేషు ప్రసక్తో హి వ్యసనేషు మహీపతిః,

విముచ్య తేఽర్థధర్మాభ్యాం క్రోధజేష్వాత్మనైవ తు. ౪౬
మృగయాక్షో దివా స్వాపః పరివాదస్త్రియో మదః,
తౌర్యత్రికం వృథాట్యా చ కామజో దశకో గణః. ౪౭
పైశున్యం సాహసం ద్రోహ ఈర్ష్యాసూయార్థదూషణం,
వాగ్దండజం చ పారుష్యం క్రోధజోఽపి గణోష్టకః. ౪౮
ద్వయోరప్యేతయోర్మూలం యం సర్వే కవయో విదుః,
తం యత్నేన జయేల్లోభం తజ్జావేతావుభౌ గణౌ. ౪౯
పానమక్షాః స్త్రియశ్చైవ మృగయా చ యథాక్రమం,
ఏతత్కష్టతమం విద్యాచ్చతుష్కం కామజే గణే. ౫౦
దండస్య పాతనం చైవ వాక్పారుష్యార్థదూషణే,
క్రోధజేఽపి గణే విద్యాత్కష్టమేవ త్రికం సదా. ౫౧
సప్తకస్యాస్య వర్గస్య సర్వత్రైవానుషంగిణః,
పూర్వం పూర్వం గురుతరం విద్యాద్వ్యసనమాత్మవాన్. ౫౨
వ్యసనస్య చ మృత్యోశ్చ వ్యసనం కష్టముచ్యతే,
వ్యసన్యధోధో వ్రజతి స్వర్యాత్యవ్యసనీ మృతః." ౫౩

మను. ౭ అధ్యా.

అనుమనుస్మృతిప్రోక్తవ్యసనములను రాజు వదలవలయుననియు, ఈవ్యసనములకంటె మరణము మేలనియుఁ గావునఁ గామక్రోధజనితవ్యసనముల విడనాడుమని రాజు కొడుకున కుపదేశించెను. రాజధర్మములను సంగ్రహముగఁ దెలిపి దశరథుఁడు మరల

"తస్మాత్త్వమపి చాత్మానం నియమ్యైవం సమాచర."

అని నొక్కి చెప్పెను. అనఁగా రాజధర్మములు జితేంద్రియుఁడగు రాజునకే యాచరింపనను వుపడును గాని విషయాభిలాషము గలరాజునకు దుర్లభములని భావము.

మహాశయులారా! ఈరీతిగా నీభాగము శ్రీరామచంద్రుఁడు పరమేశ్వరుండని తెలుపుచుఁ దదారాధనక్రమమును బోధించుచు జితేంద్రియత్వమాహాత్మ్యమును దెలుపుచున్నది. కావునఁ గుప్రశ్నములు చేయువారలమాటలఁ బాటింపక శ్రీరాముఁడు మానవసామాన్యుఁ డన్నభావము వదలి ప్రకృతిపురుషులు సీతారాములని భావించి వారిని సర్వదా ధ్యానింపవలయును. ఇఁకఁ దరువాతికథను బఠింతము.

## అభిషిక్తుఁడవు కమ్మని రాజు రాముని బురికొలుపుట.

* ఎల్లరును దమతమయునికిపట్లకుఁ బోయినపిదప దశరథుఁడు తాఁజేయఁదగుపని నిశ్చయించువిషయమున నేర్పుగలవాఁడౌట మరల నేకాంతమున మంత్రులంగూడి యాలోచించి పుష్యనక్షత్రము రేపే. కనుక శ్రీరాము నభిషేకించుటకు రేపే సుసమయము. తప్పక యాశుభకార్యము రేపు సాగింపఁదగునని నిశ్చయించెను. వెంటనే రా జంతఃపురమునకుఁబోయి సుమంత్రునిం గని నా ప్రియపుత్త్రుని మరల వేగంబ తోడుకొనిరమ్మని పంచెను. ఆశాసనముం దలందాల్చి త్వరగాఁ బోయి తనరాకఁ దెలియఁజెప్ప ద్వారపాలకులం బంప వారి వలన నావార్త నాలకించి శ్రీరామమూర్తి మరల నింతలో నీతఁడు రాగతంబేమని సంశయించి లోపలికి రప్పింప భటుల కాజ్ఞాపింప వార లట్లుచేయ సుమంత్రా! మరల నేకార్యమున కరుదెంచితివి? దాఁపక తెల్పుమని ప్రశ్నించెను. సుమంత్రుఁడు

* ఈభాగము నాల్గవసర్గమునుండి వ్రాయఁబడినది. అధ్యాత్మరామాయణకథాసారమిం దిమిడియుండును.

దేవా! రాజు నిన్నుఁ జూడఁ గోరుచున్నవాఁడు నే నెఱింగిన దింతియే. కార్యనిశ్చయమున నీవే సమర్థుఁడవు. అనఁగానే మరలఁ దండ్రినిఁ జూడ రాముఁ డతనితో నరిగెను. ప్రియ కుమారుని జూచి మహానందమున రాజు కూరుచుండఁ బంచి రామభద్రా! చిరకాలము రాజ్యము నేలి వృద్ధుఁడనైతిని. చేయం దగు కార్యములన్నియుఁ జేసితిని. ఎల్లఋణములు తీర్చితిని. నిన్ను రాజ్యాభిషిక్తునిగ నొనరించుపనియే మిగిలియున్నది. కాన నేనేమి చెప్పుదునో దాని నీవు చేయవలయును.

వత్సా! ఇత్తఱి జనులెల్ల రాజుగా నీవే యుండఁగోరు చున్నవారు. కాన నిన్ను యువరాజుగా నభిషేకింప నెంచితిని. నిన్నభిషేకింపఁ బూనినందులకు వేఱొక కారణము కలదు. ఇత్తఱి నాకు స్వప్నములయందు భయంకరములు నమంగళ ములు నగునుత్పాతములు కనఁబడుచున్నవి. ఆకసమునుండి పిడుగులతో మహాధ్వనితో నుల్కపడుచున్నవి. నాజన్మతారను భయంకరపాపగ్రహము లాక్రమించి యున్నవని దైవజ్ఞులు చెప్పుచున్నవారు. ఇట్టిదుర్నిమిత్తములు తోఁచిన సాధారణ ముగా రాజునకు మృతి సంభవించును. అది తప్పిన దుస్తరమగు నాపద కల్గును. కావున నిన్ని కారణములం దలంచి నిన్నభిషే కింపఁదలంచు నాయూహ మార్పునొందకమునుపే యభిషిక్తుఁ డవుకమ్ము. ప్రాణులబుద్ధి మిగులఁ జంచలము కద. కావున నాల సించిన నేడే మార్పుకలుగవచ్చును. నేఁడు చంద్రుఁడు పుష్య నక్షత్రమునకుఁ బూర్వముగ నుండుపునర్వసువునం దున్నాఁడు. మనము నిశ్చయించిన పుష్యనక్షత్రము రేపు వచ్చునని దైవ జ్ఞులు తెల్పిరి. అపుడు నీవభిషిక్తుఁడవు కావలయును. నా

మనస్సే నన్నీకార్య మొనరింపుమని తొందఱించుచున్నది. శత్రుసూదనుఁడవగు నీకు రేపు పట్టముగట్టెదను.

రామభద్రా! నీవీపగటిపూట మొదలుకొని దృఢమనస్సు గలిగి దర్భశయ్యపై శయనించి పత్నితోడ నీరేయియంతయు నుపవాసనియమము జరపవలయు. శ్రేయస్కరములగు కార్యముల కనేకవిఘ్నములు గలుగును. అట్టులగుట నీమిత్రులు కడు జాగరూకతఁ గలిగి చుట్టునుండి నిన్ను సర్వప్రకారములను రక్షింతురుగాక. భరతుఁడు దేశాంతరమునకుం బోయియున్నవాఁడు. వాఁడయోధ్యకు రాకమునుపే నీయభిషేకము సాగవలయునని నాయూహ. ఇదియే సుసమయము. నీసోదరుఁడు సత్ప్రవర్తనముగలవాఁడే యగును. నిన్ననుసరించియే వర్తించును. ధర్మదయాదిసుగుణవంతుఁడు. జితేంద్రియుఁడు ననుటకు శంకలు లేవు. అయినను సామాన్యదృష్టి నూహింప మానవచిత్తము చంచలమనియే నావిశ్వాసము. ధర్మమున నిత్యపరాయణత్వముగల సాధువులచిత్తము పరస్పరకృతోపకారమును స్మరించుచు నలరుచుండును. కాని భేదభావమునకుఁ బాల్పడదు. రఘువరుఁడవగు నీ కీవిషయము తెలియనిది కాదు. అని పలికి పోననుజ్ఞ నొసంగెను.

రామభద్రుఁడు తండ్రికి నమస్కరించి యింటికింబోయి తల్లి కామహోత్సవవార్త నెఱిఁగింప నపుడే పోయి యామె యంతిపురింజొచ్చెను. అందామె యాసమయమునఁ బట్టుపుట్టముందాల్చి దేవతాగృహమున మౌనమూని యిష్టదేవతాధ్యాననిరతయై యుండెను. కుమారునకు రాజ్యప్రాప్తింగోరియే యాధ్యానము చేయుచుండెను. రామాగమనమునకుఁ బూ

ర్వమే రామాభిషేకరూపప్రియతమవార్తను విన్న సుమిత్ర
యచ్చటికి వచ్చియుండెను. అత్తరుణముననే లక్ష్మణుఁడు వచ్చెను.
దాసీజనులఁ బంపి కౌసల్య రమ్మనఁగా జానకియు వచ్చియుండెను.
కౌసల్యయుఁ బుష్యనక్షత్రమునఁ గుమారుని యౌవరాజ్యాభి
షేకము సాగునని విని సుమిత్రయుఁ దత్పుత్రుఁడును సేవింపఁగాఁ
గుమారునకు నభివృద్ధిం గోరి ప్రాణాయామపూర్వకముగాఁ
బాపాత్ముల నడంచుభగవంతుని ధ్యానించుచుఁ గన్నులుమూసి
కొనియుండెను.

ఆసుసమయమున రామభద్రుఁడు తల్లికడకుం బోయి
నమస్కరించి మహానందమును గల్గించుచుఁ దల్లీ! తండ్రి ప్రజా
పరిపాలనకార్యమున నన్నాజ్ఞాపించెను. తదాజ్ఞాప్రకారము
రేపు నాకు యౌవరాజ్యాభిషేకమహము సాగును సీతయు
నాతోడ నీరాత్రి యుపవాసవ్రతము సాగింపవలయు. జన
కుఁడు ఋత్విగుపాధ్యాయులు సవిధిఁ దెల్పిరి. రేపటియభిషేక
మునకుఁగాఁ జేయఁదగుమంగళకృత్యముల నన్నింటిని నాకు
సీతకు నిపుడే చేయింపుము. అని ప్రియపుత్త్రుఁడు పలుకఁగనే
యానందబాష్పము లుప్పొంగ మధురోక్తుల వత్సా! దీర్ఘా
యుష్మంతుఁడవు కమ్ము. నీశత్త్రువులు నశింతురుగాక. రాజ్యలక్ష్మిం
గూడి నాబంధుమిత్త్రులను సంతోషింపఁజేయుము. ప్రియనం
దనా! నాయానందమునకు మేరకలదా. కల్యాణనక్షత్రమున
నాకుఁ గల్గితివి. ఆకారణముననే వినయాదిసద్గుణములు గలిగి
సంతోషపఱచితివి. ఇక్ష్వాకురాజ్యలక్ష్మి నిన్నీనాఁటికిఁ జేరఁగల్గి
నది. భక్తిచే భగవంతునిగూర్చి యనేకవ్రతోపవాసములుండి
శ్రమించినదంతయు నిప్పటికి ఫలించినదని పల్కెను.

ప్రియజనని యీరీతిఁ బలుకఁగా రామమూర్తి తన ప్రక్క హస్తములు జోడించి వినయముననున్న తమ్ముని గని లక్ష్మణా! నీవు నాతోడ నీరాజ్యమును బాలింపుము. నీవు నాకు ద్వితీయప్రాణమవుకదా. కనుక నిన్నీ రాజ్యరమ పొందినది. కోరిన భోగములు రాజ్యప్రాప్తిఫలములగు నమూల్యమణిభూషణ ములు నీకు లభింపఁగలవు. వాని ననుభవింపుము. నాప్రాణమును రాజ్యమును నీనిమిత్తమే వాంఛింతును. పెంచి వచింపనేల? అని పల్కి తల్లులయుల్లములలర మ్రొక్కి సీతను బంప వారి నర్థించి కూడఁబిలుచుకొని స్వగృహమునకుఁ బోయెను.

మహామతులారా! ఇందలివిశేషముల నాలకింపుఁడు. దశ రథునిచిత్తము స్థిరతఁగాంచ నవకాశములేదు. మృతికాలము చెంతకు వచ్చుచున్నది. కనుకనే మరల మంత్రులంబిలువంబంచి యాలోచించి రేపే పుష్యనక్షత్రముకాన నభిషేకమహాము సాగవలయునని నిశ్చయించెను. ఇయ్యది యింతకుమును నిశ్చయింపఁబడినదే. కాని యతనిచిత్తము కలవిలపాటొందు చున్నందున స్మృతితప్పి మరల నాలోచించి రామునిం బిలువ నంపించెను. సుమంత్రుఁడు రాజునానతి వచ్చెనని తెలియఁగనే రాముఁ డనుమానించెను. సుమంత్రుఁడు వచ్చిన నిజము దాఁపక తెల్పుమనియెను. పిలుచుకొనిరమ్మనియె ననిమాత్రమే చెప్పఁగల నని బదులుపల్కెను. రాముఁడు తండ్రికడ కరిగెను. రాజు రామునితో మున్ను పాడినపాటనే మరలఁ బాడెను. తుదకు నేఁజేయవలసినపని నీయభిషేక మొక్కటియే కనుక నాచెప్పి నట్లు చేయు మనెను.

"తద్యావదేవ మే చేతో న విముంచతి రాఘవ,
తావదేవాభిషించస్వ చలా హి ప్రాణినాం మతిః."

తనకుఁ దోఁచిన స్వప్నగతదుశ్చిహ్నముల నెఱిఁగించి రామున కీవార్తఁ దెలిపెను. ఇపుడు దశరథుఁడు తాజీవింపనని యెఱింగె ననియు, నొకప్పుడు మృతితప్పిన నొకయాపద తన్నలముకొను నని యెఱింగెననియు మనమూహింపవలయును. ప్రాణులచిత్తము చపలమైనదికదా. ఈయూహ నాచిత్తమున నిలిచియుండఁగనే యువరాజవు గమ్ము. ఏమేని పలికితివా నాచిత్తము మార్పు నొందునేమో యనికదా దీనియర్థము. ఇందేమో విశేషము కలదని మనము విమర్శింతము.

సాధారణముగా మానవులకు సంపదలుగాని విపత్తులు గాని రానెంచినపుడు వానికనుకూలముగా వారిచిత్తము మార్పునొందును. సూక్ష్మబుద్ధులాచిహ్నములం గాంచి వారిగతుల నరయఁజాలుదురు. వారుమాత్రము తమప్రవృత్తి మంచిదనియే భావింతురు. అంతియగాక రాఁగలఫలములఁ బరికింపఁజాలరు. ఇదియే పెద్దలకుఁ బామరులకుఁ గలభేదము.

"ప్రాయస్సమాపన్నవిపత్తికాలే ధియోఽపి పుంసాం మలినా భవంతి."

అన్నన్యాయము తప్పునా? ఈన్యాయము దశరథునివిషయమున నన్వయింతము. సమీపమున మృతియున్నది. బుద్ధి క్షణమాత్ర మైన నొకరీతిగా నిలువలేదు. ఈస్థితియందు రాజు చిరకాలము పెద్దలసేవించినవాఁడు కావున రాఁగలదుష్ఫలము ననుమానించెను. ఎన్నియో దుర్నిమిత్తములు రాజునసుమానమును దృఢపఱచుచుండెను. కావున రామచంద్రునిం బిలిచి యీ యూహ మార్పునొందకమునుపే యీకార్యమున కంగీకరింపు

మనియెను. ఈభావమే గీతాశాస్త్రము విజయునిమూలమున మనకుఁ దెల్పెడిని.

"చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢం,
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరపి సుదుష్కరమ్." అని.

శ్రీరామునియందు భిన్నభావము రాజునకు లేదని యిపుడు మన మెఱుంగవలయును. దశరథునియూహ లొకదానిపై నొకటిగఁ దోఁచుచునే యున్నవి. ఆతని దుష్కర్మమనఁగా మునికుమారుని బాణప్రయోగమునఁ జంపినది ఫలింప నున్నది. కర్మము బలవత్తరమగుటఁ జేసినదుష్కర్మములు ఫలమునీయక మానవు. ప్రాణులు కర్మవశంవదులు. కర్మగతుల నరయుశక్తి మానవులకుఁ బ్రాయికముగా లేదనవలయు. అతీంద్రియజ్ఞులగు యోగులు మాత్ర మెఱుంగుదురు. పండితమ్మన్యు లెఱింగినట్లు నటింతురు. కాని వారు పామరులకంటె నధములు. అహంకారము వారి యందు నృత్యముచేయుచు నుండును. ఈవిధమునకు సమాధానము భగవంతుఁ డర్జునునకు

"యద్యహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి."

అని యుపదేశించుచుఁ దెలిపెను. కావున మనము కర్మగతులఁ దృణీకరింపక యహంకారమును వదలి సత్కర్మములు భగవదర్పణముగా నాచరించుచుండినఁ దదనుగ్రహపాత్రులమగుదుము. అంతియగాని కర్మములను త్యజించిన భ్రష్టులమగుదుము. ఈనీతియే యీభాగము మనకుఁ దెలుపుచున్నది.

"తస్మాత్త్వయాద్య ప్రభృతి నిశేయం నియతాత్మనా,
సహ వధ్వోపవస్తవ్యా దర్భప్రస్తరశాయినా.

సుహృదశ్చాప్రమత్తాస్త్వాం రక్షంత్వద్య సమంతతః,
భవంతి బహువిఘ్నాని కార్యాణ్యేవం విధాని హి.”

అనుభాగము మన కనేకసద్విషయముల బోధించెడిని. వాని నాలకింపుఁడు. రామచంద్రుఁడు దీక్షఁబూనవలయును. దీక్ష యనఁగా సత్కార్యము నాచరింతునన్న ప్రమాణము. శరీరసుఖ మును బాటింపక రాజ్యమునఁ గల ప్రజలను న్యాయసమ్మత ముగాఁ బాలింతునన్న శపథమే దీక్ష. దీక్ష విధివిహితముగా సాగునంతదనుక బ్రహ్మచర్యము అధశ్శయ్యయుఁ బ్రధానము లుగ నుండవలయు. ఆత్మనియతి నొందందగు. అనఁగా నితర చింత లత్తఱి నుండరాదని భావము.అట్లుండినఁగాని కార్యము సాగదు. తానుమాత్రమున్నఁ జాలదు. భార్యయు నట్టిదీక్షఁ బూనవలయు. భార్యంగూడియే దర్భశయ్యపైఁ బరుండవల యును. బ్రహ్మచర్యవ్రతపరీక్ష యిదియని యెఱుంగవలయు. పార్శ్వమున భార్యయుండఁగాఁ గామము మనస్సునఁ బొడమక యుండవలయు. వాఁడే నియతాత్ముఁ డనంబడును. భోగ త్యాగము కష్టముగఁ దోఁపరాదని భావము. దీక్షాభంగము చేయఁ గొన్నిభూతములు వేచియుండును. భూతోచ్చాటనము నకు మనస్సు పవిత్రముగ నుండవలయును. కేవలమంత్రోచ్చార ణము పనికిరాదని యెఱుంగవలయు.

“అస్మిన్మహత్యర్ణవేఽంతరిక్షే భవాఅధి, నీలగ్రీవాశ్శితికంఠాశ్శర్వా అధః క్షమాచరాః, నీలగ్రీవాశ్శితికంఠాదివగ్ంరుద్రాఉపశ్రితాః.”

అన్నశ్రుతి యీవిషయమును బోధించుచున్నది.

“అపసర్పంతు తే భూతా యే భూతా భూమిభారకాః,
యే భూతా విఘ్నకర్తారస్తే నశ్యంతు శివాజ్ఞయా.”

అన్నసూక్తికూడ నివ్విధమునే బోధించుచున్నది. కడుంగడు జాగరూకులై నీమేలుగోరినమిత్రులు రామా! నిన్నుఁ గాపాడు దురుగాక యని రాజు తెలిపెను. శత్రువు లీయంతరము నెఱింగి యపకారముచేయుదురుగాన వారిబాధ లంటకయుండ సేవకులుమాత్రముగాక మిత్రులుకూడ జాగరూకులై నిన్నుఁ గాపాడవలయుననియెను. అగపడువారిని మిత్రులు, అదృశ్య భూతములను శాస్త్రనియమములగు నుపవాసాదులు పాఱఁ దోలఁగలవని తెలిసికొనవలయును. "శ్రేయాంసి బహువిఘ్నాని" అన్నసూక్తి యీ రామాయణమునుండి గ్రహింపఁబడినదనియే తేలెడిని. ఉపవాసముమాత్రముండి సమాహితాత్ముఁడు కాక యున్న నయ్యది యారోగ్యమున కించుక తోడ్పడునేమో కాని ఫలము నీయఁజాలదు. ఏకాదశియుపవసించి నిత్యకర్మ ముల మానుటయేగాక ద్యూతాదులఁ గొందఱు కాలముం బుత్తురు. ఆయుపవాసము నిష్ఫలమే. అయినను గేవలపామరు లకు భక్తిని గల్పింప నించుక తోడ్పడును. కాయక్లేశములు మనోనిగ్రహమునకుఁ దోలుతఁ దోడ్పడును. ఆవల దానికి బాధకములుకూడ నగుననుట యోగులకుఁ దెలియును. నిశ్చం చలబుద్ధిని భగవంతుని ధ్యానింపవలయు ననునదియే యిందుఁ గలసారము. ద్యూతాదులు సత్కార్యభంగకరములు. కావున నుపవాసముండి జూదము లోనగువానినాడి కాలముపుచ్చుట కంటెఁ గడుపార భుజించి భగవన్నామమును స్మరించుటయే మేలు.

"విప్రోషితశ్చ భరతో యావదేవ పురాదితః,
తావదేవాభిషేకస్తే ప్రాప్తకాలో మతో మమ.

కామం ఖలు సతాం వృత్తే భ్రాతా తే భరతస్స్థితః,
జ్యేష్ఠానువర్తీ ధర్మాత్మా సానుక్రోశో జితేంద్రియః.''

అనుభాగమునఁ గలవిశేషాంశములఁ బరికింతము. సంతాన హీనుఁడై దశరథుఁడు కైకను వివాహమాడెను. రాజు వృద్ధుఁడని యెఱింగి కేకయరాజు నాదౌహిత్రునకు రాజ్యమిత్తువేని కూఁతు నిచ్చెద ననెను. కౌసల్యాసుమిత్రలందు సంతానము కల్గుననునాశ లేనివాఁడు కావున నట్లే దశరథుఁ డంగీకరించెను. ఆమెకు సంతానము కలుగలేదు. ఈశ్వరానుగ్రహమునఁ బుత్రకామేష్టియాగమున మూవురు సంతానముంబడసిరి. ఇప్పుడు దశరథుఁడు తనవాగ్దానము చెల్లింపనక్కఱలేదని యెంచెను. జ్యేష్ఠపత్ని సంతానవతియైనఁగూడ దానిమాని నీదౌహిత్రున కిత్తునన్న నియమము వాగ్దానమున లేదు. మానవప్రయత్నమున కంటె దైవయత్నము బలవత్తరము కాఁబట్టి యజ్ఞమున సంప్రీతుఁడై భగవంతుఁ డగ్నిరూపమునఁ బాయస మొసంగెను. మూవురుభార్యలు సంతానముంబడసిరి. కావున నిందు వాగ్దానమునకుఁ బ్రాముఖ్యము లేదని దశరథుఁ డెంచెను. కావుననే రామాభిషేకప్రయత్నము సాగించెను. కాని మనస్సున నించుక సంశయముకలవాఁడే యయ్యెను. వసిష్ఠాదుల కీవిషయము తెలిసి యుండుననియే మన మూహింపవలయును. వారు నీప్రయత్నము వాగ్దానమునకు భంగకరముగాదనియే భావించిరి. అందులకే వారివిషయము రాజునకు స్మృతిగతముగఁ జేయకపోయిరి. దశరథుఁడు సభలో నీవిషయముఁ దెల్పకపోయెను. ఏల? మోసము చేయఁదలఁచియా? కాదు. రామాభిషేక మావాగ్దానమును భంగముచేయునని యూహింపలేదు. పాయసప్రదానము సం

కాన హేతువయ్యెను. కాన ధర్మవిరుద్ధ మిందు లేదని దశరథుని యూహ. ఐనను రామమూర్తి కీవిషయము తెలుపక యుండ రాదని తలంచియే యీమాటలు చెప్పెను.

సాధారణముగా మానవులచిత్తము చంచలమైనదని దశరథుం డెఱుంగును. దాన ధనము సర్వానర్థమూలమనుమాట భరతునిచిత్త మించుక యురియాడునేమో యనుశంక పొడమంగా రాజు రామచంద్రా! భరతుం డయోధ్యకు రాకమునుపే యీయుత్సవము సాగవలయునని నాయభిప్రాయ మనియెను. దీనిచేత మనమూహింపందగిన దేది? భరతుండు మరల నయోధ్య చేరినతర్వాత నేమైన నీకార్యమునకు భంగము కలుగునో యని తలంచెననియేకదా. ఇక్కారణమున రాజు వంచకుం డన రాదు. భరతునిగుణగణము లెఱింగినవాండుకనుక నతండు రాజ్యమును గాంక్షింపండని యూహించెను. ఈవిషయము భరతగుణగణవర్ణనమువలనం దెలియుచున్నది. ఈవిషయమం తయుం బరిశీలించిన శ్రీరామాభిషేకము దశరథశపథమునకు భంగముకల్పించునదికాదని తేలెడిని.

భరతుండు సుగుణవంతుండైనను జిన్నతనము, బంధు ప్రోత్సాహము, జననిభావము కలిసి తన్ను జంచలాత్మునిగాం జేయంగా నించుక మార్పునొంది వాగ్దానము చెల్లింపుమని యడుగునేమో; యతనియిష్ట మేల తీర్పరాదు? నాకేల యీ యభిషేకోత్సవము? అని రామమూర్తి యనునేమో యని యను మానించి దానిం బాపనెంచి రాజిట్లు చెప్పుచున్నవాండు. వత్సా! సజ్జనులు ధర్మనిరతులు. వారిమనస్సులుకూడ నితరులుచేయు మిత్రభేదాద్యుపాయములకు లోంబడుచుండును. ఒక్కప్పుడు

కార్యముసాగినవెనుక దానిని ద్వేషింపక యంగీకరించును. అంతియకాని ముందు సాగింపఁబోవు కార్యముల కంగీకరింపవు. కనుక నీయభిషేకము సాగినచో నావార్త నాలకించి భరతుఁ డంగీకరించును. కాని ద్వేషింపఁడు. వచ్చినవెనుక నితరులు పురికొలుప నంగీకరింపఁడేమో యనుసందియము. ఐనను నీ తమ్ముఁడు సత్పురుషులనడవికగలవాఁడు. నిన్ననుసరించి వర్తించు వాఁడు. ధర్మము నెఱిఁగినవాఁడు. జితేంద్రియుఁడు. భ్రాత దయగలవాఁడు. కావున నీయభిషేకమునకుఁ దప్పక సమ్మతిం చును ఐన నింతత్వర యేలనకుము. మానవులచిత్తములు చంచ లములు. కాన నెట్లుండునో నిర్ణయింప నవకాశము లేదని నా యభిప్రాయ మనియెను.

ఇందు శ్రీరామునకు సంశయము గలుగకయుండఁజేయఁ గలమాటలు ఏవి? ధర్మాత్మా! జితేంద్రియః, జ్యేష్ఠానువర్తీ. అను నవి. జ్యేష్ఠునకేరాజ్యముకాని సహజునకుఁ గాదనుధర్మ మెఱిం గినవాఁడు. మనస్సు ప్రాయికముగాఁ జంచలమే గైనను జితేం ద్రియులు చంచలచిత్తులు గారు. సహజప్రీతి విన్ననుసరించు వాఁడు. అను నీవాక్యములచేత భరతుఁడు నాప్రయత్నమున కంగీకరింపఁడేమో యనుశంక నూనకుమని రాజునభిప్రాయ మని మనము గ్రహింపవలయు.

ఇందుఁగలపరమార్థము నించుక పరిశీలింతము. భగ వంతునికళ నాల్గుభాగములుగ నవతరించెను. అందు సగము శ్రీరామనామమున వెలసెను. భరతుఁ డొకభాగముగలవాఁడు. సౌమిత్రు లిరువు రొకభాగముగలవారు. కావున రామోత్సవ మున కనుజన్ములు సమ్మతింప రనుశంక వసిష్ఠాదులకుఁ గలుగదు.

పరమార్థ మెఱుంగనిరాజునకు నించుక గల్గెను. మాయాతీతుఁడయ్యు శ్రీరామచంద్రుఁడు మాయావశంవదుఁడుగఁ గనఁబడుచున్నవాఁడు. కావునఁ దండ్రి చెప్పిన ప్రతివిషయమునకు నంగీకరించుచుండెను. ఈయుత్సవము సాగదని యాపరాత్పరుఁ డెఱుంగఁడా? తనయవతారకారణ మెఱుంగఁడా? తనకేల యీపెత్తనమనియుఁ బ్రకృతియగుసీత సర్వభారమును వహింపవలసినదికనుకఁ దాను నిర్లిప్తుఁడుగను సర్వసాక్షిగ నుండెనని మనము తెలిసికొనవలయును.

జననీజనకాజ్ఞల శ్రీరాముఁ డేది ప్రధానమనుకొనువాఁడు? అన్నప్రశ్నము నిచ్చో నించుక విమర్శింతము.

"ఆచార్యో బ్రహ్మణో మూర్తిః పితా మూర్తిః ప్రజాపతేః,
మాతా పృథివ్యామూర్తిస్తు భ్రాతా స్వోమూర్తిరాత్మనః. ౨౨౬.
యం మాతాపితరౌ క్లేశం సహేతే సంభవే నృణాం,
న తస్య నిష్కృతిశ్శక్యా కర్తుం వర్షశతైరపి. ౨౨౭.
తయోర్నిత్యం ప్రియం కుర్యాదాచార్యస్య చ సర్వదా,
తేష్వేవ త్రిషు తుష్టేషు తపస్సర్వం సమాప్యతే. ౨౨౮.
తేషాం త్రయాణాం శుశ్రూషా పరమం తప ఉచ్యతే,
న తైరభ్యననుజ్ఞాతో ధర్మమన్యం సమాచరేత్. ౨౨౯.
పితా వై గార్హపత్యోఽగ్నిర్మాతాగ్నిర్దక్షిణస్స్మృతః,
గురురాహవనీయస్తు సాగ్నిత్రేతాసమాహితా. ౨౩౧.
ఇమం లోకం మాతృభక్త్యా పితృభక్త్యా తు మధ్యమం,
గురుశుశ్రూషయా త్వేవం బ్రహ్మలోకం సమశ్నుతే." ౨౩౩.

మను. ౨ అధ్యా.

అను నీమనుస్మృతిప్రకారము తల్లిదండ్రులలోఁ దండ్రి యుత్కృష్టుఁడని తేలెడిని. కొన్నితావులఁ దల్లి తండ్రికంటె నెన్నియోమడుంగు లుత్కృష్టురాలని కలదు. జ్ఞానప్రదాత తండ్రి కావున నతఁడే యుత్కృష్టుఁడని గ్రహింపఁదగు.

"ఉపాధ్యాయాద్దశాచార్య ఆచార్యాణాం శతం పితా,
సహస్రం తు పితౄన్మాతా గౌరవేణాతిరిచ్యతే. ౧౪౫
ఉత్పాదకబ్రహ్మదాత్రోర్గరీయాన్ బ్రహ్మదః పితా,
బ్రహ్మజన్మ హి విప్రస్య ప్రేత్య చేహ చ శాశ్వతమ్. ౧౪౬

మను. ౨ అధ్యా.

అనుస్మృతివాక్యములే యిందులకుఁ బ్రమాణములు. మర్యాద చేయుటలోఁ దల్లియే ఎక్కుడుగఁ జెప్పఁబడినది. ఇందుఁగల సారమెఱింగియే శ్రీరామమూర్తి పితృనాజ్ఞ పరమోత్కృష్టమని భావించెను. తారతమ్య మెఱుంగుటయే కదా వివేకము. సామాన్యవిశేషభేదము లెఱుంగక ప్రవర్తించుట యవివేకమూలమని భగవత్ప్రవర్తనమే మనకుఁ దెలుపుచున్నది. తల్లిదండ్రులయాజ్ఞ లొక్కవిషయమున విరుద్ధములుగనున్నపుడు శ్రీరామప్రవృత్తి ననుసరించి ప్రవర్తించుట మేలు.

శ్రీరామమూర్తి తల్లికడ కరిగి శుభవార్తఁ దెలిపిన ఘట్టము విమర్శింపఁదగు. అందనేకవిషయములు తెలిసికొనఁదగినవి కలవు.

"తస్మిన్ కాలే హి కౌసల్యా తస్థావామీలితేక్షణా."

అని మూలము రాముఁడు తల్లికడకుఁ బోవకమునుపే సుమిత్ర లక్ష్మణుఁడు లోనగువారిమూలమున శ్రీరామపట్టాభిషేకమహోత్సవవార్త నాలకించి సగము కన్నులుమూసి భగవంతుని

ధ్యానించుచుండెను. పరమేశ్వరునిధ్యానించునపుడు బాహ్య దృష్టి విరమింపవలయును. కన్నులుమూయరాదు. తెఱువ రాదు. "అర్ధోన్మీలితలోచనః" అని యోగశాస్త్రము తెలుపు చున్నది. బాహ్యదృష్టి విరమించినయెడల బాహ్యవస్తువు లగ పడవు. అంతమాత్రము లాభముచాలదు. ఉపాస్యదేవతా రూపము నెదుటనునుచుకొని దానియందే దృష్టినునిచి మనస్సు తదేకలగ్నమగునట్లు చేయవలయును. ఇదియే తొలుతఁ జేయఁ దగినపని. ఈయభ్యాసమునఁ గృతార్థుఁడై పిదప నుపాస్య దేవతామూర్తి (అనఁగా స్వేచ్ఛాకల్పితమూర్తిని) మనఃపీఠ మున నునుచుకొని దానినే యంతర్దృష్టిని దిలకించుచు దాని నుండి దృష్టి మరలనీయకయుండ నభ్యసింపవలయును. యోగా భ్యాసమున నిదియే. ఇట్లు చేయుచు వరుసగా వాయునిరోధము చేయుచుండవలయును. ఇట్లుచేయక ముక్కుసెవులుమూసి యందేమో రహస్యమున్నయట్లు శిష్యులకుఁ బశుప్రాయులకు బోధించి ద్రవ్యములాగుట కొందఱిమతమున యోగాభ్యా సము. అది నిరర్థకమగుటయేగాక శరీరమునఁ గొన్నియవయవ ముల నశింపఁజేయును. అట్టిదానికిఁ బాలుపడరాదు. పుస్తక ములఁజూచి యారీతిగా నభ్యసింపరాదు. అదియుఁ బ్రమాద కరము. సత్యముగా యోగాభ్యాసము నభ్యసించుసాధువుల కడఁ గ్రమముగా నభ్యసింపవలయును. వారు ధనముంగోరరు, శిష్యునినిర్మలమనస్సునే కోరుదురు. అట్టివారిని వెదకి కనుఁగొని వారివైరాగ్యమును బరిశీలించి పిదప వారి నాశ్రయింపవల యును. యోగి వైరాగ్యవంతుఁడుగానుండును. ఈషణత్రయ మున కతఁడు లోఁబడఁడు. ఏదియో యొకపేరుపెట్టి ధనమును

లాగఁబూనఁడు. ధనముతో నతనికి సంబంధమే యుండదు. భగవంతునితో సంబంధముగలవారుగ నుండును. శిష్యులసంపాదించునూహలు వారికిం గలుగవు. దేవతాదూషణము వారు చేయరు. పరమేశ్వరునే యెల్లతావులం జూచుచుందురు. అట్టి గుణములుగలవార లెవరాయని పరీక్షించి క్రోధాసూయలు వారినుండి వదలినవా లేదా యనియు గట్టిగా నెఱింగి వారినే యోగులని నిశ్చయించి యాశ్రయించినచో వారు తరణోపాయమును దెల్పుదురు. లేకయున్నఁ దరణోపాయము దొరకదు. ఈవిషయ మీభాగమునుండి మన మెఱుంగవలయును.

“ప్రాణాయామేనపురుషం ధ్యాయమానాజనార్దనం”

అనుభాగమున నొకవిశేషము గలదు.

“ప్రాణాయామేన ప్రాణాయామపూర్వకం పురుషం పురుషసూక్తప్రతిపాద్యపురుషశబ్దవాచ్యమ్ జనార్దనం నారాయణమ్.”

అని గోవిందరాజులు వ్రాసిరి.

“ప్రాణాయామః ప్రాణావృత్తినిరోధః. ౧. నిశ్వాసోచ్ఛ్వాసయోర్గతివిచ్ఛేదకారకవ్యాపారో వా. ౨. రేచకపూరకకుంభకలక్షణః ప్రాణనిగ్రహోపాయః”

అని సర్వతంత్రసిద్ధాంతపదార్థలక్షణసంగ్రహము.

ధ్యానమ్. “అంతరాంతరా వృత్త్యంతరవతీ ప్రత్యయైకతానతా ౧ విజాతీయప్రత్యయతిరస్కారేణ సజాతీయప్రత్యయప్రవాహీకరణమితి”

దీనింబట్టి యాలోచింపఁగా ధ్యానమునకుంగూడ యోగాభ్యాసమే ప్రధానమని తేలెడిని. పురుషసూక్తమునఁ జెప్పఁబడిన పురుషశబ్దవాచ్యుఁడగు నారాయణమూర్తినని గోవిందరాజులు

వ్రాసిరి. వారిభావము త్రిమూర్తులలో నొకరగువిష్ణువనియే. ఏలయనఁగా నందు నారాయణునివలన రుద్రాదులు జనించి రనియున్నందున విష్ణు వధికుఁడనుసిద్ధాంతము సర్వోత్కృష్ట మని వారియూహ. కాని యీవిషయమున వారు చాల పొర పడిరని నాభావము. వైకుంఠవాసి నారాయణమూర్తి వారొప్పు కొనక తప్పదు. ఆనారాయణునకు నాలుగుబాహువులుకలవని సకలపురాణములు తుదకు వారంగీకరించిన శ్రీభాగవతము కూడఁ దెలుపుచున్నది. పురుషసూక్తమున శీర్ష, వేయితలలు, వేయికన్నులు, వేయిపాదము లున్నట్టు లున్నది. వైకుంఠవాసి నారాయణున కీలక్షణములు పొసఁగవు. కావున నిందుఁ జెప్పిన్న దైవము సర్వవ్యాపకుఁడగుభగవంతుఁడేయని యెఱుంగవలయు. ఒకప్పుడు గోవిందరాజులుగారు వైకుంఠవాసి నారాయణు నకు వేయితలలుండవచ్చునని యంగీకరించినను వారిసిద్ధాంతము నిలువదు.

"స బ్రహ్మ స శివస్సహరిస్సేంద్రస్సోఽక్షరః పరమస్స్వరాట్"

అన్నశ్రుతి యేమగును?

"సఏవ విష్ణుస్సప్రాణస్స కాలోఽగ్నిస్స చంద్రమాః"

అన్నయుపనిషత్తేమగును?

"ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావృత్తినోఽర్జున,
మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే. ౧౬ అ. ౮.

అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః,
అహమాదిశ్చ మధ్యం చ భూతానామంత ఏవ చ." ౨౦ అ. ౧౦.

అను నీగీతాశాస్త్రవాక్యము లేమగును? ఇట్టి యసంఖ్యాక ప్రమాణములంబట్టి పరిశీలింపఁగాఁ బురుషసూక్తప్రతిపాద్యుఁడు సకలశ్రుతివిశేషప్రతిపాద్యుఁడు సకలపురాణాదిప్రమాణప్రతిపాద్యుఁడు పరాత్పరుఁ డొక్కఁడే. త్రిమూర్తులు తత్ప్రతికృతులే కాని యందు భేద మేమాత్రము కానరాదు. భేదము మానవులహృదయములయందున్నది. ఆభేదమే సకలాపన్మూలము. అది వదలినఁగాని భగవత్ప్రసాదము దొరకదు. కౌసల్య హృదయమునఁ ద్రిమూర్తులబుట్టించిన ప్రకృతి కతీతుఁడగు పరమపూరుషుని ధ్యానించుచు శ్రీరామచంద్రునకు శుభము లొనఁగూడవలయునని ప్రార్థించుచుండెనని మన మెఱుంగవలయును.

"అంబ పిత్రా నియుక్తోఽస్మి ప్రజాపాలనకర్మణి,
భవితా శ్వోఽభిషేకో మే యథా మే శాసనం పితుః."

అన్నమూలమునఁ గలవిశేషము వినుఁడు. ప్రజలరక్షింపుమని తండ్రి నియోగించెను. రేపు నాకు నభిషేకము కాఁగలదు. తండ్రిశాసనముప్రకారమే సాగునని రామమూర్తి కౌసల్యకుం దెల్పెను. రేపు నాకు నభిషేకము కాఁగలదని రాముఁడు చెప్పినందున రాఁగలకష్టము నెఱుంగకపోయెను. కాన మానవసామాన్యుఁడే కాని భగవంతుఁడు కాఁడని కొందఱందురు. అట్టివారల కిందుఁగలవిశేషార్థము తెలియలేదని మన మెన్నఁదగును. ప్రజాపరిపాలనము రేపు ప్రారంభింతునని రామమూర్తి పలికెను. అదియే యవతారఫలము. తండ్రిశాసనముప్రకార మభిషేకమగును. దశరథుఁడు రేపటినుండి ప్రజాపాలనకార్యము మానును. నే నాకార్యమును జేయఁబూనుదునని పలుకుట

సత్యమే. అయోధ్యా రాజ్యప్రజలఁబాలింపుమని కాదు. ప్రపంచమునఁగల యెల్లమానవులననియే తాత్పర్యము. ప్రజాపాలనము దుష్టనిగ్రహమునఁగాని చక్కఁగా సాగదు. కావునఁ దొలుత దుష్టుల నిగ్రహింప రేపే పూనెదనని శ్రీరామునిభావము. అదియే సత్యము. శ్రీరామవాక్య మేదియు నసత్యము కాదు. "అనృతం నోక్తపూర్వం" అనియేకదా యామహాత్మునిశపథము. అది యేనాఁడు నసార్థకము కాదు. ఇట్లర్థమును గ్రహించినఁగాని రామాయణపఠనము ఫలవంతము కాదు. దుర్మతాభిమానము మానినఁగాని పరమేశ్వరానుగ్రహము కలుగదు.

"వత్స రామ చిరం జీవ హతాస్తే పరిపంథినః,
జ్ఞాతీన్ మే త్వం శ్రియా యుక్తస్సుమిత్రాయాశ్చ నందయ."

అను నీకౌసల్యావాక్యముం బరిశీలింపఁదగు. చిరకాలము జీవింపుము. నీశత్రువులు హతులగుదురుగాక శ్రీదేవితోఁగూడి నాజ్ఞాతులను సుమిత్రజ్ఞాతులను (బంధువులను) సంతోషపెట్టుమని కౌసల్య యాశీర్వదించుచుఁ గోరెను. శ్రీదేవి యనఁగా యోగమాయ. పరమేశ్వరి యంతకంటె వేఱెవ్వ రుందురు? ఆమెయే యిపుడు సీతానామమున వెలసినది. ఆమెంగూడినఁగాని యేకార్యము సాగదు. పగవారి ననఁగా భగవంతునకు శత్రువులు కలరా? ఉండరుకదా. ఉండినచో భగవంతుఁడే కాఁడనవలయును. కాన నిటనున్న "తే" అనునది సర్వనామముగా నెంచందగు. "తే పరిపంథినః" ఆశత్రువులు అనఁగా లోకమున నీవలెకే ధర్మద్వేషులై సాధువుల బాధించు రావణాదిరాక్షసులని యర్థము. వారు నీచేఁ జంపఁబడుదురుగాక. ఇదియే యాశీర్వాదము. కౌసల్య వీరమాతకదా. ఈయాశీర్వాదమే

యూమెఱుంగగినది. నాబంధువులను సుమిత్రబంధువులను సంతోషపెట్టుము. అనఁగా నాకును సుమిత్రకును సంతోషము గలిగించుకాలము లేదు. మాకు వైధవ్యమే కలుగును. మా యిరువురిబంధువుల నానందింపఁజేయుము. అని కౌసల్యనోట వెడలెను. ఇది యామె తెలిసి పలుకలేదు. భగవత్ప్రేరణమున నట్టిమాటలు వెలువడెనని మన మూహింపవలయును. లేకున్న నన్ను నాబంధువుల నని యేల పలుకఁజాలకపోయెను? దీనింబట్టి రాఁగలఫలముల ననుసరించి యూహాలు కలుగునని యుఁ బ్రవృత్తియు నట్లే కుదురుననియు మన మెఱుంగవలయును.

"సౌమిత్రే భుంక్ష్వ భోగాంస్త్వమిష్టాన్ రాజ్యఫలాని చ.
జీవితం చ హి రాజ్యం చ త్వదర్థమభికామయే."

అను నీరామవాక్యమే యతనిభగవత్తత్త్వమును వెల్లడించుచున్నది. లక్ష్మణా! కోరినభోగముల ననఁగా రాజ్యఫలములవియే కాన వాని ననుభవింపుము. ఈశరీరమునఁ బ్రాణముల ధరించుట రాజ్యము నేలఁబూనుట నీకొఱకే. అనఁగా నేఁ గోరఁదగినవియు అనుభవింపనివియు నగుసుఖములు లేవని భావము.

"న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన,
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి." గీ. అధ్యా. 3

అను నీగీతావాక్యము పైభావమును దృఢపఱచుచున్నది. "త్వదర్థ" మనుచో నీయొక్కనికొఱకుఁ గాదనియు నెల్లరకొఱకనియు గ్రహింపఁదగును. నిర్లిప్తుఁడను, సర్వసాక్షిని, పరిపూర్ణుఁడను, నిత్యతృప్తుఁడను. కావున నితరులకొఱకే యీశరీరమును ధరించితినని రామచంద్రునిభావమనియే. యిటఁగల సారము.

"అభ్యనుజ్ఞాప్య సీతాం చ జగామ స్వం నివేశనమ్."

తన్ను నాజ్ఞాపించినట్లే సీతనుగూడ వారిచే నాజ్ఞాపింపఁజేసి తన యింటికిం బోయెను. జానకీ! నీవు రామునకుఁ దోడ్పడుము. ఉపవాసాది వ్రతనియమములఁ బాటింపుమని వారిభావము. వివాహకాలమున జనకమహారాజు

"ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ."

అని పలికియేకదా దానము చేసెను. ధర్మరక్షణకార్యమున నీకుఁ దోడ్పడుననికదా దానిభావము.

"ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునఃపునః,
భూతగ్రామమిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్." ౯ అధ్యా. ౮.

అను నీగీతావాక్యము పైభావము సమంజసమేయని బోధించుచున్నది. ప్రకృతి వెలయింపకయున్నచో భగవంతుఁడే కార్యము చేయఁజాలఁడని సారము. చేయఁజాలఁడనఁగా నసమర్థుఁడని యర్థము కాదు. తాను సర్వసాక్షియగుట సర్వకార్యము లొనరింపఁ బ్రకృతిని అనఁగాఁ దనయిచ్ఛాశక్తిని యోగమాయ నాజ్ఞాపించుననియుఁ దానూరక చూచుచుండుననియు తాత్పర్యము.

"శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం,
న చేదేవం దేవో న ఖలు కుశలస్స్పందితుమపి."

అన్న శ్రీశంకరాచార్యోక్తియు భగవద్గీతావాక్యము నొక్కరీతిగనే యున్నవి. ఇట్టు లీభాగము మన కనేకనీతులను బోధించుచు భగవంతునిమహత్త్వమును వెల్లడించి యోగమాయాకార్యమును దేటపఱచుచున్నది. కావున నీసర్గమును బఠించి

ప్రకృతిపురుషులమహత్త్వము నెఱింగి వారే సీతారామచంద్రు లన్నవిశ్వాసముగలిగి వారలను నిశ్చలచిత్తమున ధ్యానింపవల యును. శిలావిగ్రహముల నారాధించినందున సంపూర్ణమగు భగవదనుగ్రహము కలుగదనుట సత్యము. ధ్యానమే ముఖ్య మని చక్కఁగా విశ్వసింపవలయును. ఇఁకఁ దర్వాతి భగవచ్చరిత్ర మును బఠింతము.

## —సీతారాము లుపవాసవ్రతము నడపుట.—

*దశరథుఁడు మఱునాఁటియభిషేకమునకుగా నుపవాస ప్రముఖనియమములు చేయునట్లు రామమూర్తికిం జెప్పి వసిష్ఠ మహర్షిం దిలకించి మహాత్మా! నీవు పోయి రామచంద్రుని సీత తోడ నిరుపమానకీర్తిని రాజ్యలక్ష్మినిబొందుటకై యుపవాసము సలుపునట్లు తెలుపుమని పంపెను. వేదవేత్తలలో శ్రేష్ఠుఁడు. దృఢవ్రతుఁడు. కావున రాముని చేత విధివిహితముగా నుప వాసవ్రతము చేయింపం దలంచి బ్రాహ్మణులకుం దగినయశ్వ శకటము నెక్కి తానే రామునివేశనమునకుంబోయి శ్వేతపర్వ మునఁ బ్రకాశించు నాసౌధముం జేరి మూఁడుకక్ష్యలు దాఁటి పోవఁగా రామమూర్తి మునిరాక నెఱింగి బయలువెడలి రథముచెంత కరిగి తానే యమ్మునివర్యుని రథమునుండి చేయూఁత యొసంగి దింపెను. ప్రియార్హుఁడగు నా రామునిం గాంచి కుశలప్రశ్నపూర్వకముగ సుప్రసన్నునిజేసి సంతోష ముప్పొంగుచుండఁగా నాతనితో శ్రీరామా! నీయెడ సుప్ర సన్నుఁడగు నీతండ్రియానతి యౌవరాజ్యము నొందెదవు. సీతాదేవితోడ నుపవాసము సలుపుము. రేపు ప్రాతఃకాలమునఁ

---

* ఈభాగ మేనవ సర్గమునుండి గ్రహింపఁబడియె.

బూర్వము నహుషుఁడు యయాతికింబోలె నీకు నీతండ్రి యౌవరాజ్య మీయఁదలంచియున్నవాఁడు. అని పలికి వారి నిరువురను విధి ననుసరించి యుపవాసము సలుపఁజేసెను.

అవ్వల ముని రామసత్కారముంబడసి యతఁడు సాగ నంప రాఁగా నిలువంబంచి తన నివాసమున కరిగెను. రామ మూర్తియు వేడుకఁగా మాటలాడు ప్రియమిత్రులంగూడి యానందించుచు వారిని సమ్మతింపఁజేసి వారియనుమతినొంది యంతఃపురముం బ్రవేశించెను. అందుఁగలస్త్రీపురుషు లందఱు నానందపరవశులై మాటలాడుచు మోములు వికసింపనుండఁగా నాగృహావరము కమలాకరమువలె నొప్పియుండెను. వసిష్ఠ మునియు రాజగృహమునుండి వెడలి రాజమార్గమెల్ల జనా క్రాంతముగ నుండంగాంచుచు నభిషేకదర్శనార్థ మరుదెంచి వారలం బరికించుచుఁ బోవుచుండెను. వీథులెల్ల జనులు నిండఁగా రాకపోకల కనువుగాకయుండెను. ఆజనుల కలకలము సముద్రఘోషము ననుకరించుచుండెను. వీథులెల్ల నలంకృత ములై యుండెను. ధ్వజపటము లెత్తఁబడియుండెను. పురమునఁ గల స్త్రీలు పురుషులు బాలురు ముదుసలులు శ్రీరామాభిషేక మహోత్సవమును గన్నులారఁ గాంచందలంచి వ్యాపారాంతర ములవదలి యెపుడు సూర్యోదయమగునా యని యాశించుచు నలంకరించుకొని మహానందమున మేనుల మఱచియుండిరి. వారి నెల్లం జూచుచు మెల్లగాఁ జని శ్వేతగిరిశిఖరమువలెఁ బ్రకా శించు రాజేంద్రునిప్రాసాదము సమీపించి బృహస్పతి దివస్పతిని సమీపించునట్లు దశరథునిచెంతకుఁ జనియెను. మునివర్యుని యాగమనముం గాంచి రాజు లేచి సీతారాముల నుపవసింపఁ

జేసితిరికదా యని యడుగ నట్లే యొనరించి వచ్చితినని యతఁడనెను. సభ్యులెల్లరు లేచి యమ్మునిని నారాధించిరి. ఎల్లరకు నావార్తలం దెలిపి వారినెల్లఁ బోవంబనిచి దశరథుఁ డంతఃపురమునకుం బోయెను.

మహాశయులారా! ఇందు విమర్శింపఁదగినవిషయ మొక్కఁడు కలదు.

"ఇత్యుక్త్వా స తదా రామముపవాసం యతవ్రతం
మంత్రవత్కారయామాస వైదేహ్యాసహితం మునిః"

ఉపవాసము మంత్రపూర్వకముగా ననఁగా నీధర్మకార్యమును విధి నతిక్రమింపక యోపికమెయి నొనరింతు ననుసంకల్పపూర్వకముగా నని యర్థము. మానవబుద్ధి చంచలము. ఎన్నియో ప్రమాదములకు లోనగును. కావునఁ దమకుఁ దోఁచినట్లు చేయక శాస్త్రములోఁ జెప్పినట్లే చేయవలయును. శాస్త్రములు మనవంటివారిచేఁ గల్పింపఁబడినవి. వానిని మనమేల యనుసరింపవలయును? మన మాలోచించి యేది యుక్తమని మన మదికిం దోఁచునో యట్టులే యొనరింపవలయును. శాస్త్రములతోఁ బనిలేదు. అని యుపదేశించు మహాత్ములు గలరు. ఆయభిప్రాయము న్యాయముకాదు. ఏలయనఁగా మానవు లల్పకాలజీవులు. లోకమున నేయేవిషయము లెట్లెట్లు సాగుచున్నవని స్వానుభవమునఁ దెలిసికొనఁజాలునంతకాలము జీవింపఁజాలరు. దేశములు తిరిగితిరిగి ప్రతివారియాచారములఁ బరిశీలించి యెట్టి యలవాటున నెవ్వ రెట్లు కష్టపడిరి? దేనిచే నెవ్వ రెట్లు సుఖపడిరి? అని కనుఁగొనినఁగాని లోకజ్ఞాన మలవడదు. అట్టి యభ్యాసమునఁగాని సదాచారదురాచారములవలని లాభనష్ట

ములు తేటపడవు. నాలుగుశుక్రవారములు బ్రదుకువారు మా
యనుభవ మిదియని వచించుట తెలివితక్కువయే. లోకుల కిది
యిట్లుండవలయునని బోధించుట యంతకంటె నవివేకము. చిర
కాలము జీవించుటకు యోగాభ్యాసము కావలయును. ఒక్కఁ
డెల్లతావులఁ దిరుగఁజాలఁడు. యోగదృష్టిగలవా రెల్లవిషయ
ముల నెఱుంగఁగలరు. అట్టివారు రచించినవే శాస్త్రములు. వాని
నాక్షేపించుట యట్టిజ్ఞానము లేకపోవుటచేతనే యని మన
మెఱుంగవలయును.

"త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః,
కామః క్రోధస్తథా లోభస్తస్మాదేతత్త్రయం త్యజేత్. ౨౧
ఏతైర్విముక్తః కౌంతేయ తమోద్వారై స్త్రిభిర్నరః,
ఆచరత్యాత్మనశ్శ్రేయస్తతో యాతి పరాం గతిం. ౨౨
యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిం. ౨౩
తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి." ౨౪

గీత. ౧౬ అధ్యా.

అన్న భగవద్గీతావాక్యము లీభావమును దృఢపఱచుచున్నవి.
అతీంద్రియజ్ఞానములేనివారు సర్వజ్ఞులవలె భాషించుటయు,
లోకులను వంచించుటయు నను నీరెండుకార్యములచే స్వలాభ
మునే పోఁగొట్టుకొందురు. ఈవిషయమును మన శ్రీరామ
చంద్రప్రవర్తనము బోధించుచున్నది. ఉపవాసము తోఁచిన
ట్లుండిన నది ఫలవంతము కాదు. విధి నతిక్రమింపక మనోనిగ్ర

హాముగలిగి ధర్మకార్యసాధనముకొఱకుఁ జేసిననే సంపూర్ణ ఫలము గలుగును. కొంద ఱారోగ్యముకొఱ కుపవాసములు సల్పుదురు. దాన ఫలముగలదో లేదో తెలియరాదు. కాని యొకప్పు డద్దాన బాధకలుగుటమాత్రము సత్యము. ఏయత్నము చేసినను ధర్మముకొఱకు చేయవలయును. దానసే దేహా రోగ్యము మనోనైర్మల్యము లభించునని యెఱుంగందగు. ఉప వాసముచేయునపుడు విషయాసక్తి పనికిరాదు. దీనింబట్టి యాలోచింపఁగా నుపవాసమువలన నింద్రియములు శోషిల్లు నని దాన విషయాసక్తి తగ్గునని సారము. విషయాసక్తి తగ్గిన వారల కీయుపవాసము లక్కఱలేదు. ఐనను వన్నుఁ జూచి పామరు లీసదాచారము నేర్చుకొందురుగాక యను నభిప్రాయ ముతోఁ జేయవలయును.

"కుర్యాద్విద్వాంస్తథాసక్తశ్చికీర్షుర్లోకసంగ్రహమ్."

అనుగీతావాక్యము కలదుకదా. ఇట్టిభాగమునఁగల శ్రీరామ చంద్రునిచరిత్రము మనకు సదాచారమును బోధించుచున్నది. దంపతు లిరువురు నిట్టియాచరణముల నాచరింపవలయు. కొందఱు పురుషులుమాత్రమే వ్రతాంగములగు నుపవాసముల సల్పు దురు. స్త్రీలుమాత్రమే యుపవాసములు సల్పుదురు. అదియు ననాచారమే యని యూహింపవచ్చును. భార్య యనువ్రత కావలయును. ధర్మపత్ని యనఁగా నర్థ మదియేకదా. "సహాధర్మ చరీ తవ" అను జనకవాక్యము మన కిట్లే బోధించును. అను వ్రత కాకయున్న నాదాంపత్యము పుణ్యప్రతతమము కాదు. ఇఁకఁ దరువాతిభగవచ్చరిత్రమును బఠింతము.

## శ్రీరామాభిషేకప్రయత్నము.

* పురోహితుఁ డగువసిష్ఠమహర్షి తనకు విధిఁ దెలిపి వెళ్లి నంతట శ్రీరామచంద్రుఁడు స్నాన మొనరించి నిశ్చలమనస్కుఁడై ప్రియపత్నిం గూడి శ్రీమన్నారాయణమూర్తి నుపాసించెను. అంత నా రాజకుమారుఁడు హవిఃపాత్రమును శిరస్సున ధరించి మండు నగ్నిహోత్రునియందు దేవతోత్తముఁ డగు నారాయణుని గూర్చి ఘృతముతో హోమము చేసి హవిశ్శేషమును బ్రియముగా భుజించి యభీష్టమును స్మరించుచు శ్రీమన్నారాయణమూర్తిని ధ్యానించుచుఁ దానుగాఁ గల్పించుకొన్న దర్భశయ్యపై మౌనమూని నిశ్చలమనస్కుఁడై పత్నిం గూడి దేవతాగృహమున శయనించెను. నాల్గవయామమున మేల్కాంచి గృహాలంకారవిధి నొనరింపఁజేసి స్తుతిపాఠకధ్వనుల నాలకించుచుఁ బ్రాతస్సంధ్యాదైవతమగు సూర్యభగవంతు నారాధించి వశీకృతమనస్కుఁ డగుచు గాయత్రిని జపించి మధుసూదనమూర్తిని నమస్కారపూర్వకముగా వినుతించెను.

ఇట్లు ప్రాతఃకృత్యము లాచరించి యభిషేకమహాప్రయుక్తమగు స్నానము చేసి ధౌతవస్త్రములఁ దాల్చి బ్రాహ్మణులచే స్వస్తివాచనము చేయించెను. అవ్విప్రు లాపుణ్యాహము చెప్పఁగా నావేదమంత్రధ్వని మధురగంభీరమై తూర్యధ్వనులం గలిసి చెలరేఁగి నగరమందంతట వ్యాపించెను. సీతారాము లుపవాసములు సలిపిరని యాకర్ణించి పౌరులెల్ల నానందించిరి. రామాభిషేకదినమని యెఱింగినవారుగాన నెల్లరు తమతమ

* ఇది యా౬వసర్గమునుండి గ్రహింపఁబడినది. అధ్యాత్మరామాయణ విషయము నిట నిమిడియుండును.

గృహములను ముంగిళ్ల నలంకరించిరి. దేవాలయచైత్యాదు లెల్లఁ జక్కఁగా నలంకరింపంబడియె. ఎల్లతావుల రాజచిహ్నములుగల ధ్వజము లెత్తఁబడి యలరారుచుండెను. ఆటలు పాటలు నెల్లతావుల సాగుచుండెను. ఆనందపరవశులై జనులెల్లరు నాయాటలపాటల నాలకించుచుఁ జూచుచునుండిరి. ఎల్లతావుల శ్రీరామాభిషేకవార్తలనే యందఱుఁ జెప్పుకొనుచుండిరి. బాలకులుగూడ నాడుకొనుచు నామాటలనే చెప్పుకొనుచుండుట వింతగొలుపుచుండెను. రాజమార్గము లలంకృతములై సువాసనల వెదఁజల్లుచుండెను.

పట్టాభిషేకోత్సవమున శ్రీరామచంద్రుఁడు పట్టపుసేనుంగుపై వచ్చుచుండఁగా నెత్తుగానున్న యారామమూర్తి యగపడుటకును, ఆతఁడు పయనము చేయకముందే రాత్రియందే నారాముని యితరాలంకారములను జీకటియందుఁ జక్కఁగాఁ గాంచుటకుంగోరి పౌరులు రాజవీథులయందుఁ బొడవులైవృక్షములంబోలు దీపస్తంభములను నిర్మించిరి. అభిషేకోత్సవదర్శనార్థులై జనులు గుంపులుగాఁ జేరి దశరథుఁడు రామాభిషేకము నొనరింపఁబూను టుత్తమకార్యమనియు, మన మీ విషయమునే చిరకాలముగాఁ గోరుచున్నదే యనియు, రామమూర్తి సర్వవిధములఁ బరిపాలనమునకుఁ దగినవాఁడనియుఁ జెప్పుకొనసాగిరి. రామచంద్రుఁడు తోఁబుట్టువులయం దెట్టి భావమో మనయందు నట్టియభిమానమే కలవాఁడనియు, నా రాజచంద్రుఁడు దీర్ఘాయుష్మంతుఁడై యుండుఁగాక యనియు విశేషించి చెప్పుకొనఁజొచ్చిరి. ఆవార్తలను క్రొత్తగావచ్చియున్న జనులెల్లరు నాలకించిరి. రామునిసద్గుణములకు నానందిం

చిరి. దశరథమహారాజుకూడ దీర్ఘాయుష్మంతుఁడై యుండవలయు ననియే యెల్లరు గోరుచుండిరి. ఆజను లారాముని పట్టణము నెల్లెడల నిండి యుండిరి. వారలకోలాహలము దిగ్దిగంతముల నిండెను.

మహాసారజ్ఞులారా! ఇందుఁ గలవిశేషముల నరయుదము.

"గతే పురోహితే రామస్స్నాతో నియతమానసః,
సహ పత్న్యా విశాలాక్ష్యా నారాయణముపాగమత్."

అనుమూలముఁ బరిశీలించిన నొక్కసద్విషయము బయల్పడును. వ్రతాంగస్నానము చేసి మనస్సును విషయాంతరముల వ్యాపింపకయుండ నొనరించి విశాలాక్షియగు జానకింగూడి భగవంతుని నారాయణమూర్తి నుపాసించెను. అనఁగా ధ్యానించెనని యర్థము. ఈయుపవాసము పట్టాభిషేకాంగము. సకలపుణ్యనదీసరస్సముద్రోదకముల నభిషేకింతురు. కావున నారాయణుని ధ్యానించెనని చెప్పఁబడినది. నారాయణుఁ డనఁగా

"ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః"

అన్న నియమము ననుసరించి జలములనుండువాఁడని యర్థము. జలములు భగవత్స్వరూపములు గానఁ దద్ధారిపునిగాఁ బరాత్పరుని ధ్యానించెనని భావము. ఆధ్యేయమూర్తి యెవఁడు? తానే. తన్నుఁదానే చూచెనని సారము. ధ్యేయమగుమూర్త్యంతరము లేదు గదా. కావున నప్పటికార్యమున జలములు ప్రధానములు కాన జలములనుండుభగవంతు ననఁగా నాపస్తత్త్వాధిదేవతనుగాఁ దనను దానే మనస్సునఁ గాంచుచు నిర్వికారుండై యుండెనని మనము గ్రహింపఁదగును. దీనింబట్టి

శ్రీరాముఁడు నిర్వికారుఁడగుపరమేశ్వరుఁడని తేలెడిని. ఈయభిషేకమునఁ జేయఁదగు కార్యము లెట్లుసాగును? అన్న ప్రశ్నను వచ్చుననియే మహాకవివాల్మీకి "సహ పత్న్యా విశాలాక్ష్యా" అని ప్రయోగించెను. విశాలాక్షి యనఁగా పొడవుగానుండుకన్నులు గలదనుసామాన్యార్థము చాలదు. సీత మహాప్రకృతి. సర్వమును భగవదిచ్ఛానుసారము చేయుచుండుయోగమాయ. అత్తటి భూభార మడంపఁ గన్నులు తెఱచి చూచుచున్నదని యెఱుంగవలయును. అనఁగా సకలకార్యములఁ నొనరింపఁబూనిన యాదిశక్తి యగుసీతంగూడి యుండెననియే యిటఁగలసారము. శ్రీరామమూర్తి నిమిత్తమాత్రము చెంతనుండఁగాఁ దానే సకలకార్యముల నాయాయిరీతులఁ జేయుచుండునని యెఱుంగుటయే చమత్కారము. దీనిచేత శ్రీరామమూర్తి సర్వసాక్షిత్వము సిద్ధాంతము. ప్రకృతిచేయుచుండు సకలకార్యములను జూచుచు నానందించుచుండునని తాత్పర్యము. భగవత్సాన్నిధ్య బలమున మహాప్రకృతి సర్వకార్యముల నొనరించు నన్నవిషయము గ్రహింపందగును. నియతమనస్సు కుదిరినఁగాని భగవద్ధ్యానము ఫలింపదనువిషయముకూడ నెఱుఁగవలయును.

"మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతాస్తే మే యుక్తతమా మతాః." ౨ గీ. ౧౨ అ.

అను నీశ్రీహరి యుపదేశము తప్పదుకదా.

ఈమూలమునకు గోవిందరాజులు నారాయణశబ్దమునకు శ్రీరంగనాయకుఁ డర్థమనిరి. మతాభిమానముచేత దాని కనుగుణముగా శబ్దములకు నర్థము చెప్పిరి. "విశాలాక్ష్యేతి శ్యామవిగ్రహానుభవాదపి శ్రీరంగవిగ్రహస్య నిరతిశయప్రియా

స్పదత్వేన నిర్ని మేషానుభవ ఉక్తః” అని వ్రాయుటం జూడఁగా మతాభిమానపిశాచావేశము స్పష్టమగుచున్నది. శ్రీరామ విగ్రహామును జూచినంతన కలుగుసంతోషానుభవమునకంటె శ్రీరంగవిగ్రహదర్శనము నిరతిశయప్రియాస్పద మగునఁట. ఇట్లర్థము చెప్పుటంజేసి తోఁచుచున్నయనర్థపరంపరను లెక్క పెట్టకపోవుట కడుంగడు శోచ్యము. అక్కటా! మతాభిమాన మెంతపనిగ్నైనఁ జేయించుననుట సువ్యక్తము.

“మహాతే దైవతాయాజ్యం జుహోవ జ్వలితేఽనలే,”

అని మూలము.

“తేన మహాతే దైవతాయేతి మహాదేవభ్రాంతిర్నిరస్తా”

అని గోవిందరాజులు వ్రాసిరి.

“మహాతే దైవతాయ నారాయణాయ”

అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి. ఎవరైన మహాదేవుఁడని యర్థము చెప్పుదురేమోయని యదరిపడిరని యూహింపక తప్పదు. ఇట్లు వారూహించుటచే నారాయణమూర్తి భగవంతుఁడు కాక యొకగొప్ప దేవత యగుననవలసివచ్చుచున్నది. మహాదేవశబ్దము భగవంతునకు ననువర్తింపదేని యతఁ డేటిభగవంతుఁడు? శివకేశవులవాదమున వచ్చినయనర్థ మిది. నారాయణశబ్దము మహాదేవశబ్దము వేలువేలు దేవతలకు నుండవచ్చును. వీరందఱు భగవంతునియంశములే. మహాదేవుఁడని శైవులు, నారాయణుండని వైష్ణవులు, భైరవుఁడని కాపాలికులు, సూర్యుఁడని సౌరులు, గణనాథుఁడని గాణాపత్యులు, పరదేవియని శాక్తులు పూజించి ధ్యానించువాఁ డొక్కభగవంతుఁడే. ఇన్నిరూపముల నిన్ని

నామముల నిందఱిచేఁ బూజలందు వినుతులం గాంచువాఁడు నొక్కపరమేశ్వరుఁడే. అట్లు కాఁడేని యతఁడు పరమేశ్వరుఁడే కాఁడు. ఒక్కలోకాధిపతియై యొక్కపేరనే పిలువంబడుచు నొక్కతెగవారిచే నారాధింపఁబడఁదగి బుజములు కాల్చు కొనినఁగాని ప్రీతినొందకయుండునే నాతఁ డొకక్షుద్రదైవమే యగును. సర్వమతములవారును వారివారి యోగ్యతానుసారము పూజింప ధ్యానింప నానందించుచు వారివారికర్మముల నను సరించి ఫలముల నొసంగుచుఁ బ్రకృతికిం బరుఁడై యన్యక్తుఁడై యోగమాయ యెల్లకార్యములు చేయుచుండఁ దాఁగాంచుచు సర్వసాక్షియని, నిర్లిప్తుఁడని, సర్వభూతాంతర్యామియని, నిరం జనుఁడని యింక నెన్నియోవిధములఁ గొనియాడఁబడుచు నుండువాఁ డెవ్వఁడో యాతఁడే భగవంతుఁ డగును

"న మే విదుస్సురగణాః ప్రభవం న మహర్షయః,
అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః. ౨
యో మామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరం,
అసమ్మూఢస్సమర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే." 3 గీత. ౧౦ అధ్యా.

అను నీశ్రీహరియుపదేశములే పైనవ్రాసిన యభిప్రాయమును సమంజసమనుచున్నవి. ఇందు "మహేశ్వరమ్" అని యున్నదే. ఇది శ్రీకృష్ణవాక్యమేకదా. ఇపుడు గోవిందరాజులు మహేశ్వర శబ్దము శివపరమని భ్రాంతినొందునా! ఇదియు శ్రీకృష్ణునకుఁగల దని యంగీకరించునా! మహాదేవుఁ డన్నపేరుకూడ నారాయణ మూర్తికిఁ గలదన్న నింతచిక్కు లేకుండునే ? నిస్సారమగు నీమతాభిమానపిశాచ మెందఱినో బాధించుచున్నది. దేవతా దూషణ మొనరింప మార్గము చూపుచున్నది. ఈక్షుద్రపిశాచ

మును బొఱందోలినఁగాని భగవంతుని జక్కఁగా నారాధింప ననువుపడదు. ఇందు శైవులు మహాదేవు నారాధించెనని యర్థము చెప్పినను శ్రీరాముఁడు శివునకంటెఁ దక్కువ యను నర్థము పొసఁగదు. శివుఁడుకూడ శ్రీరాముఁడే కాక మతె వ్వఁడు? శివుఁడు శ్రీరాముఁడు నొక్కరూపము నంశములే కదా. వీరందఱిసమష్టిరూపమునే భగవంతుఁడని పిలుతుము. కార్యములంబట్టి రూపనామభేదము లేర్పడినవి. మతధర్మములు నశింపరాదు. మతధర్మములను పేరఁ జెలరేఁగుచున్న నీచాభి ప్రాయములు నశింపవలయును.

"యం శైవాస్సముపాసతే శివ ఇతి బ్రహ్మేతి వేదాంతినో
బౌద్ధా బుద్ధ ఇతి ప్రమాణపటవః కర్మేతి మీమాంసకాః,
అర్హన్నిత్యథ జైనశాస్త్రనిరతాః కర్మేతి నైయాయికాః,
సోఽయం వో విదధాతు వాంఛితఫలం త్రైలోక్యనాథో హరిః."

అను నీసూక్తితాత్పర్యమేమి? సర్వమతోపాసకుఁడు భగవంతుఁడని కాదా. ఒక్క శ్రీహరినే యిందఱెన్ని పేరుల భజించుచున్నవారనియే యిందుఁగలసారము. ఇందుఁగాని మతేశ్రుతి యందుఁగాని వైష్ణవులను తెగవారికిందప్ప నితరుల ననుగ్రహింపఁడని కలదా! అట్లున్నదని యేదో యర్థము చెప్పుదురేని పక్షపాతముకలవాఁడగుట నతఁడు పరాత్పరుఁడే కాక యొక క్షుద్రదేవతయే యగును. భక్తులకర్మము ననుసరించి ఫలముల నొసంగుచుండువాఁడు భగవంతుఁడన్నభావము గలవారల కిట్టిభేదము లుండవు.

ఈదుర్మతధర్మముల ననుసరించియే దేవాలయములఁగల విగ్రహముల నితరులు స్పృశింపరాదు. పూజింపరాదు. అను

కట్టుబాటు లేర్పడినవి. వానిం గడుగుకొని జీవించువారల దుర్వ్యవస్థలివి. కాశ్యాదిదేశముల నీదుర్వ్యవస్థలు లేవు. జాతి శబ్దవాచ్యులెల్లరు నారాధింపఁదగుననియే యందు నాచారము నిర్ణయింపఁబడినది. ఈదుర్నియమముల ననుసరించువారే కొన్ని గుఱుతుల ధరించినఁగాని రామకృష్ణాదుల నారాధింప నర్హులు గాదనుచుందురు. ఎంత దురభిప్రాయ మిది! మహాస్థులిట్టిభావములుకలవారలుగ నుండిరనుట కెందును బ్రమాణములు కానరావు. శంకరుని గాంచినను శ్రీమహావిష్ణువును జూచినను వేదాంతవేద్యునిగా వినుతించిరి. అనఁగా నీమూర్తులెల్ల నతని మూర్తులన్నభావమేకదా వారలకుం గలదనవలయును? అట్టి వారలకేకదా పరమాత్మ ప్రత్యక్షమగుచుండును. ఇఁక నీతుచ్ఛమతాభిమానులకో శిలావిగ్రహములే కనఁబడుచుండును. ఇట్టి మతాభిమానరూపమగు దురాచారమును బాఱఁద్రోలి యాభగవంతు నెవ్వని కేనామమునఁ బిలువ నిష్టమో ఏరూపమున ధ్యానింప వాంఛయో వాఁడట్లే సంకీర్తనముచేయుచు ధ్యానించుట శ్రేయస్కరము. అప్పుడుకానియీదురభిమానము తొలఁగదు. అట్టి మంచిమార్గము కనఁబడకయుండ ధనార్జనమునకై భక్తి నభినయించుదాసులు సన్న్యాసులు యోగులు పండితులు లోనగువార లేవో ధర్మములను బోధించుచు, "సర్వస్వము భగవదర్పణము చేసితి" మని పలుకుచు, ధనము లాగుచు నుందురు. వారిమాయావాగురులకుం దగులుకొనక భక్తులు తొలఁగి యుండవలయును. భక్తిచేఁ దనకుఁ గలశక్తి ననుసరించి యారాధింపవలయును.

శ్రీరామమూర్తి సీతానామమున వెలసిన శ్రీయోగమాయంగూడి తాఁజేయఁదగుప్రార్థనాదికము లేకయున్నను లోకులకు సదాచారముల నేర్పంబూని యుపవాసవ్రత మాచరించెను. భగవంతుని ధ్యానించెను. అంతియకాని

"న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన"

అన్నట్లు పరమాత్మ చేయఁదగుకర్మ మేదియు లేదు. సదాచారములడుగంటగా వానిని మరల నుద్ధరింపఁబూని తా నీరామరూపమున వెలసినవాఁడు కావున నందఱు తన్నుఁగని నేర్చుకొనవలసినయట్లు పెద్దలు చెప్పినచొప్పున నన్నికర్మములను బామరుని వలె నాచరించెనని మన మీభాగమునుండి చక్కఁగా గ్రహింపవలయు.

"ధ్వజాస్సముచ్ఛ్రితాశ్చిత్రాః పతాకాశ్చాభవంస్తదా"

ధ్వజములనఁగా రాజచిహ్నములుగలపటములు. పతాకలనఁగా విచిత్రవస్త్రబద్ధములు. దీనింబట్టిచూడఁగా నీకాలమున రాజాగమనాదులయందు రాజచిహ్నములుగల ధ్వజములనెత్తు నాచారము క్రొత్తది కాదనియు నతిప్రాచీనమే యనియుఁ దేటపడుచున్నది. మంచియలవాటులన్నియుఁ బూర్వకాలముననుండినవియే యిప్పటికిఁ జెడకయున్నవి. క్రొత్తగావచ్చినవన్నియు దురాచారములే యనుట కెన్నియో యవకాశము లున్నవి. ఇఁకఁ దరువాతిదగు భగవచ్చరిత్రమును బఠింతము. దానికి ముందుగాఁ గర్మ మెంత బలవత్తరమో పరికింతము. కథను మాత్రమే చదివి యానందించిన నాయానందము క్షణమాత్రమున నంతరించును. కావున నట్లుగాక యందుఁగలసార మేది యని విమర్శింతము.

## కైకకు మంథర దుర్బోధనము చేయుట

మహనీయులారా! శ్రీరామావతారఫల మిటఁ బూర్ణముగాఁ గానంబడును. కర్మము బలవత్తరమను విషయము ప్రత్యక్షమగును. ఎంతకాలమునుండియో రావణాదిదుష్టదానవ సంహారము దేవతలు మునులు కోరుచుండిరి. శ్రీరామమూర్తి యవతరింపఁగనే యించుక సంతసించిరి. కాని యెపు డడవులకు వచ్చునా యని వాంఛించుచుండిరి. ఆవాంఛ ఫలించునట్టితరుణ మాసన్నమయ్యెను. ఆవిషయమే యిందుఁ గలదు. చక్కఁగా నాలకింపుఁడు. ఇందు ముఖ్యముగాఁ గర్మసిద్ధాంతము కలదు. దాని నెఱుంగుట మంచిదికదా. ఎట్లనఁగా నాలకింపుఁడు.

ప్రాక్కర్మము శుభాశుభముల నొసంగుచుండును. కాని వదలదు. కర్మమునకుఁ బక్షపాతము లేదు. ఈయఁదగుఫలముల నీయక వదలదు.

"స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్. ౬౦
ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా. ౬౧

అనియు,

"యద్యహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైషవ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి." ౫౯

అనియు, గీతాశాస్త్రమునఁ బ్రమాణములు కలవు. ఇవన్నియుఁ గర్మము బలవత్తరమని తెలుపుచున్నవి. ఒకకార్యము చేయు

టకుఁగాని చేయననుటకుఁగాని పురుషుఁడు కర్త కాఁడనియు, నొకప్పు డట్టి యొండిపట్టుదల కలిగెనేని వానిచే నాకార్యము నామహామాయయే చేయించుననియు సారము. అనఁగా మాన వుఁడు తోలుబొమ్మవంటివాఁడే యనియు, నైనను దానే సర్వ కార్యములు చేయ సమర్థుఁడనని భావించుచుండుననియు, నంతి యకాని తుదకు దేనిని జేయఁజాలఁ డనియుఁ దేలిన సారత రార్థము. ఈయర్థమును బ్రకృతకథ కన్వయింతము.

దశరథునకుఁ బుత్త్రవియోగమున మృతినొందవలసిన ట్లున్నది. కౌసల్యాదికాంతలు విధవలగుటయేగాక దుఃఖభార మగ్నలు కావలసినట్లున్నది. కైక యూరక లోకాపవాదము నొందవలసినట్లున్నది. పౌరులు జానపదులుకూడఁ దమ కేయప కారము చేయకయున్నను గైకను దూషింపవలసినట్లున్నది. ఈ మూలమున మహర్షులు సంతోషింపవలసినట్లున్నది. పదునాల్గు వత్సరములు నిద్రాహారములు మానిన సచ్చ్రితునిమూలమున మేఘనాథుఁడు మృతినొందవలసినట్లున్నది. విరాధాదులు మృతి నొంది యుత్తమలోకములకుఁ బోవుసమయము సమీపించి యున్నది. ఇందఱికర్మము లీయీమార్గములఫలింపవలసియున్నవి. కావున నిన్నికర్మగతుల నెఱింగిన పరమేశ్వరుఁడు శ్రీరాముఁడు పరమేశ్వరి సీతయు నెట్టు లూరకుండ నేర్తురు? ఈ కార్యము లిట్లగు నని యితరు లెవ్వరు నెఱుంగరు. వసిష్ఠవామదేవాదిమహర్షులు జ్ఞాననిధులు కాన నెఱుంగుదురనవలయు కాని వారు బయ ల్పఱుపఁబూనరు. ఎఱుంగనట్లే యుందురు. లేక వారికిఁగూడఁ దెలియనియట్టు లాయోగమాయ యావరించెనో చెప్పఁ జాలము. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ "గహనా కర్మణో గతిః"

అని స్పష్టముగాఁ దెలిపెను. దానికి దృష్టాంతమే యీభాగమని మన మూహింపవలయును.

"జగత్సూతే ధాతా హరిరవతి రుద్రః క్షపయతే
తిరస్కుర్వన్నేతత్స్వమపి వపురీశ స్తిరయతి,
సదా పూర్వస్సర్వం తదిదమనుగృహ్ణాతి చ శివ
స్తవాజ్ఞామాలంబ్య క్షణచలితయోర్భ్రూలతికయోః."

అని శ్రీశంకరాచార్యులు దేటపఱచిరి. ఈకర్మగతులెల్ల నా మహాప్రకృతి కనుబొమలకదలిక ననుసరించి యుండునని దీని భావము. వీనినన్నింటిని గలిపి యిపుడు సమన్వయము చేయుదము.

ఆరాత్రి సీతారాము లుపవసించి స్వాభిన్నభగవంతు నారాధించిరి. అనఁగా మనయవతారఫలము నెట్లు నిర్వహింపనగునా యని యాలోచించిరని యర్థము. వారిరువురు తలంచినట్లే పనిసాగుచుండునుగదా. వారితలంపులు కర్మానుసారములుగనే యుండును. కర్మము తదాజ్ఞయే యనవలయును. తద్విరుద్ధముగ వారియూహ లుండవనుట నిక్కము. వెంటనే దేవతలు హర్షింతురు. ఈకార్యములు మన మాచరింపఁదగునని వారల కర్తృత్వం దోఁచును. అంతకుముం దీవిషయము వారెఱింగి యున్నను త్వరపడక యూరకయుందురు. సమయ మాసన్నముకాఁగా సప్రయత్నమున నాయూహలు ఫలోన్ముఖము లగును. ఈవిషయమే కర్మసిద్ధాంత మనఁబడును. ఈసిద్ధాంతమునే ఈ భాగము తెల్పుచున్నది.

"ఏతస్మిన్నంతరే దేవా దైవీం వాణీమచోదయన్,
గచ్ఛ దేవి భువో లోకమయోధ్యాయాం ప్రయత్నతః.

రామాభిషేకవిఘ్నార్థం యతస్వ బ్రహ్మవాక్యతః
మంథరాం ప్రవిశస్వాదౌ కైకేయీం చ తతః పరం
తతో విఘ్నే సముత్పన్నే పునరేహి దివం శుభే.
తథేత్యుక్త్వా తథా చక్రే ప్రవివేశాథ మంథరాం,
సాపి కుబ్జా త్రివక్రా తు ప్రాసాదాగ్రమథారుహత్."

(అధ్యాత్మరా. ౨ సర్గము.)

ఈవిషయమునే యీయధ్యాత్మరామాయణభాగము తెల్పుచున్నది. దేవతలు సరస్వతిని బ్రార్థింపఁగా నామె మంథర యందుఁ బ్రవేశించి విఘ్నవాక్యములు పలుకునట్లును, కైక యందుఁ బ్రవేశించి యామాటల నాలకించునట్లును జేసెననియే యీవాక్యములసారాంశము. ఇది వాల్మీకిరామాయణమున లేదే ఏల యని ప్రశ్నింపరాదు. కథనుండి నేర్చుకొనఁదగినట్లు గూఢముగా నందును గలదు. ఇఁకఁ గథ వినుఁడు. లోపలికథ యంతయు నారాత్రి యుపవాసముతర్వాతఁ బ్రజలయుత్సా హము తెల్పెను. మంథరావృత్తాంతము తొలినాఁటిదాని నిటఁ బఠింపఁదగును.

*కైకవివాహకాలమునఁ గేకయరాజల్లునకు నరణమొసఁగుచు మంథర యనుదాసినిగూడ నొసంగెను. ఆదాసిపుట్టుక యెందో తెలియరాదు. పుట్టినింటివా రిచ్చినదాసి కావునఁ గైకేయింగూడియే యది యుండును. ఆనాఁడాదాసి చంద్రుని వలెఁ దెల్లనై యుండుప్రాసాదముపైకిఁబోయి యయోధ్యానగర మును గలయంజూచెను. రాజవీథులయందలి శృంగారము విచి

* ఈభాగము సప్తమసర్గమునుండి గ్రహింపఁబడినది. అధ్యాత్మ రామాయణకథయుం నిం దిమిడియుండును.

త్రముగా నుండెను. ధ్వజములు పతాకలు విశేషించి యెగ
పడెను. జనులెల్ల నలంకృతులై వచ్చుచుం బోవుచు నుండిరి.
బ్రాహ్మణులు పూలమాలికలు చేతులంబట్టుకొని సంతోషమునఁ
దిరుగుచుండిరి. దేవాలయములు చక్కఁగాఁ గైసేయఁబడి
యుండెను. వాద్యధ్వనులు వేదనాదములు వినఁబడుచుండెను.
ఏనుఁగులు గుఱ్ఱములుకూడ నలంకరింపఁబడి యభిషేకోత్సవ
మునఁ బాల్గొన నువ్విళ్లూరుచున్నట్లుండెను. ఆఁబోతులఱంకెలు
వినఁబడుచుండెను. ఇట్టియలంకారముల నెన్నింటినో యామంథర
చూచెను.

అత్తఱి శ్రీరామునియుపమాత తెల్లనిచీర గట్టుకొని
సంతోషాతిశయమున నేత్రములు వికసిల్ల సమీపమునఁ గనం
బడెను. ఆమంథర యాదాదిం గాంచి రామునితల్లి ద్రవ్యము
నేకరించు నాసక్తికలదికదా. ఎవ్వరికింగాని యిచ్చునలవాటు
కలదికాదు. అట్టియామె యిపు డానందపారవశ్యమున నితరు
లకు సమృద్ధిగా ధనమిచ్చుచున్నదాయేమి? అట్లుచేయకయున్న
యింతటియానందము జనులకుం గలుగఁ గారణమేమి? కా దేని
మహారాజు పట్టరానిసంతోషమున నేదే నొకకార్యము చేయఁ
బూనెనా? అని ప్రశ్నించెను. ఆదాదియు లోనిముడక సంతోష
ముప్పొంగఁగాఁ బరవశయై దానితోఁ జెప్పఁదగునా యని
యూహింపక శ్రీరామచంద్రునకుఁ గలుగఁబోవురాజ్యసంప
దను దెలుపఁగోరి మహారాజు రేపు పుష్యనక్షత్రమునందే
పాపరహితుఁడై జితక్రోధుఁడగు శ్రీరాముని యావరాజ్య
మున నభిషేకముచేయనున్నాఁడని తెలియంజెప్పెను.

ఆగూనిదాసి దాదిచెప్పిన యీపలుకు లాలకించి యప్పుడే పట్టరానికోపముగలదియై కైలాసశిఖరమువలె నెత్తుగానున్న యాసౌధమునుండి తొందరగా దిగెను. ఆమంథరదృష్టి పాపమునందే యాసక్తికలది. కనుక రామాభిషేకవార్త విని కోపముచే మండిపడుచు శయనించియున్న కైక చెంతకుంబోయి యిట్లు పలికెను. మూర్ఖురాలా! శయనించియున్నదానవే ఏమి? లెమ్ము. లెమ్ము. భయమొక్కండిప్పుడు నీపైఁబడనున్నది. ఒక్కటి యనుకొంటివా? అనేకదుఃఖములు నిన్ను ముట్టడించుచుండుట తెలియదా? నిశ్చయముగ నీవు రాజేంద్రునకుఁ బ్రియురాలవు కావుసుమీ. రాజు నన్నే ప్రేమించుసౌభాగ్యము గలదనుకొనుచున్నదానవు. నన్ను రాజు మిగులఁ బ్రేమించును. అదృష్టవంతురాలను నేనే. అని మిట్టిపడుచున్నదానవు. ఎక్కడి యదృష్టము? గ్రీష్మకాలమున నదీప్రవాహమువలె నీయదృష్టమంతయు నిపుడు క్షీణించినదని నొక్కిచెప్పెను.

ఆకుబ్జ పాపదృష్టిగలది. కాన రోషాతిరేకమున నీరీతి నతికఠినముగాఁ బలుక నాలకించి కేకయరాజపుత్త్రి మిక్కిలి విషాదమునొంది యాదాసింగని మంథరా! ఏమే యిది? నాకు క్షేమమే కదా. నీమోము విన్నఁదనమునఁ జిన్నఁబోయియున్నది. కావున నీకేదో పట్టరానిదుఃఖము సంభవించినదని తలంచుచున్నాను. అని పలికెను. కైక యిట్లు మధురవాక్కులఁ బల్కఁగా విని యామంథర అక్కటా! రామునిపట్టాభిషేకమును గణింపక మధురవాక్కులఁ బల్కుచున్నదే. ఏమి? అని కోపము పైకొనఁగాఁ దాను ఆరాణికి క్షేమమే కాంక్షించుచుండునది కావున రాజపత్నులలోఁ గౌసల్యకంటెఁ గైక హీన

మర్యాదయగుచున్నదికదా యన్నదుఃఖము మఱింత యతిశయింపఁగా రాజ్యలక్ష్మి సపత్నీవశగతమగునని యోజించి యాబిడకు వగపుపుట్టింప నెంచి రామునియందుఁగల పుత్త్రప్రేమను భేదించి పగకల్గింపను దలంచి చమత్కృతి వెల్లివిరియు నట్లు మాటలాడఁగలది కావున నెంతో విచిత్రముగా నాకైకతో నిట్లు పలికెను.

దేవీ! నిన్ను నశింపఁజేయుట కొకప్రయత్నము సాగుచున్నది. బదులుచేయ నది సాధ్యముకానిదే. నాశమేమందువా. మహారాజు రేపే రాముని యౌవరాజ్యమున నభిషేకింప నున్నాఁడు. నీమేలుకోరుదాననుగాన నాప్రయత్నము నాలకించి భయము పైకొనఁగా రామునకు రాజ్యము సంక్రమించు నన్నదుఃఖము, భరతునకు రాజ్యము తప్పుచున్నదే యను శోకము నొకదానిపై నొకటిగాఁ బైకొనఁగా నిప్పులం బొరలినట్టు లంగములు మండుచుండ నూరకయుండఁజాలక నీకు మేలుచేయఁగోరి యిచ్చటికివచ్చితిని. రాకయుండ నెట్లుండఁగలను? ఈదుఃఖము నాకుఁగదా. నీకేల? అందువేమో. నీకుఁ గలిగినదుఃఖము నన్ను మఱింతగా బాధించును. నీకు నభివృద్ధి గలిగిన నది నాకు సుఖమును గల్గించును. ఇందులకు సందియము లేదు. అయ్యో! ఎంతటియవివేకు రాలవు? మంచి రాజవంశమునఁ బుట్టినదానవు. దశరథునకుఁ బ్రియపత్నివి. ఇట్టులయ్యు రాజు చేయుక్రూరప్రయత్నము తెలిసికొనఁజాలకున్నావే. ఏల? ఏమి చిత్రమమ్మా! నీప్రాణనాథుఁడు ధర్మవాదివలెఁ గనంబడును. కాని రహస్యముగా నపకారముచేయువాఁడు. మాటలు ప్రియకరములుగా నుండును. కాని కార్యముపట్ల క్రూరుఁడు.

నీవో కపటములేనిస్వభావముకలదానవు. కావున నీవంటి మనస్సుకలవానినిగా భర్తను దలంతువు. అయ్యో! నిన్నిట్టి నిర్మలస్వభావముగలదానిని వంచింపక వదలలేదు. వినుము. నీపతి కాలోచితముగా నీకడ మాటలాడును. ఫలము నగ పఱుపకయే నిన్ను మంచిమాటల నూఱడించుచు నిత్తఱిఁ గౌసల్యకు మహాలాభముఁ గల్పింపనున్నాఁడు. ఎట్లనఁగాఁ దెలిపెద. ఆలకింపుము.

దేవీ! నీపతి యెంత దుష్టాత్ముఁడో యెఱుఁగుదువా? నీ కొడుకును భరతుని నీపుట్టినింటికిఁ బంపెను. అతనికి భరతుఁడే కదా కంటకుఁడు. అదియెఱింగి వాని దేశాంతరమునకుఁ బంపి నిష్కంటకమైనరాజ్యమును రేపుదయమే రామునకు నీయఁ బూనియున్నాఁడు. నీవేమియు నెఱుఁగనిదానవు. పతి యను పేరు పెట్టుకొన్న విరోధి నీమగఁడని యెఱుంగుము. సర్పమునకు లోపల విషముండునని యెఱుంగక బాలిక దానికి నుపకారము చేయఁగోరి తల్లివలెఁ బోషించుచుఁ దొడపై నునుచుకొని బుజ్జగించుచు నాడించుచందమున నీవు భర్తను అంతశ్శత్రుత్వముగలవాఁడని యెఱుంగఁజాలక లాలించుచున్నదానవు. ఉపలాలించినపాము ఎట్టియపకారము చేయునో చంపక వదలిన పగవాఁ డెట్టియపకారము చేకూర్చునో యట్లే దశరథుఁ డిత్తఱి నీకు నీకుమారునకు నపకారము చేసినాఁడు. సర్వదా సుఖానుభవమునకుఁ దగినదానవు. అయ్యో! ఏమియుఁ దెలియని బేలవు. ఈరా జెంతదుష్టాత్ముఁడు? ఇన్నినాళ్లు నిన్ను మంచి మాటల ననునయించి యనునయించి యిపుడు రామునకు రాజ్యమర్పించి నిన్ను సమూలముగాఁ బాడు చేసినాఁడు. ఒక్క

నిన్నే కాదు. నీకుమారుని బరిజనముంగూడ నాపదలపాలు చేసి నాఁడు. అక్కటా! నశించితివి. ఇట్టి మహాదుఃఖమునఁ జిక్కియున్నదానవు. కావున వెంటనే యీకాలమునకు నుచితమగునట్లు నీకు మేలు దేననగునో చూచుకొనుము. ఎట్లు ప్రతీకారముఁ జేయనోపుదునని యనుమానింపకుము. నీజ్ఞానము విస్మయము గల్గించునదియని నే నెఱుంగుదును. ఆతెలివి నుపయోగించి నిన్ను నీకుమారుని మిమ్ము నమ్ముకొన్న నన్నును గాపాడందగు.

ఇట్లు మంథర వచింపఁగా శుభముల వెదఁజల్లుమోముగల యాకైక శయనించి యుండియే యాలకించి సంతోషముప్పొంగుచుండఁగా శరత్కాలచంద్రరేఖవలెఁ బ్రకాశించుచు లేచి శుభతమమగు శ్రీరామాభిషేకవార్త మఱింత యానంద ముప్పొంగఁజేయఁగా నయ్యది యదృష్టవశమునఁ గలిగినందుల కచ్చెరువందుచు నామహామంగళవృత్తాంతమును వినిపించినందుల కాకుబ్జకుఁ బారితోషికముగా నమూల్యాభరణము నొసంగెను. అట్లు బహుమానపూర్వకముగా నాభరణ మొసంగి యాదరణమున దానింగని మంథరా! నాకు మిక్కిలి ప్రియమగు శ్రీరామాభిషేకవార్తను వినుపించితివి. ఇఁక నేనేమి బహుమాన మొనరింతును? నాకు భరతునియందును శ్రీరామునియందును భేదభావము కన్పట్టదు. నాకిరువురు నొక్కటియే. మహారాజు రామమూర్తికి రాజ్యాభిషేకము చేయఁబూనెనని విన్నయంతనే నాకు నిర్భరానందమే పొడమెను. మంథరా! నీవు ప్రియార్హవు. ఇవ్వార్తకంటె శుభవార్తను వేఱొకదానిని నాకుఁ జెప్పఁగలవని భావింపను.

ఎందులకందువో. ప్రియవార్తలలో నీ రామాభిషేకవార్తయే యత్యంతప్రియమైనది. అట్టివార్తను వినిపించితివి. ఇందులకు మఱేది కోరఁదలఁతువో చెప్పుము. ఆకోరికం దీర్చెదనని కైక పలికెను.

ధీమంతులారా! ఇందు విమర్శింపఁదగినవిషయములు విశేషించి లేవు. కాని యథార్థ్యాత్మరామాయణమునఁగలవార్త సత్యమే యని యీభాగము దృఢపఱచుచున్నది. కైకదాసి యానాఁడే ప్రాసాదాగ్రము నెక్కెను. నగరమునఁగల శృంగారమును దిలకించెను. అంతలో రామునకుఁ బాలిచ్చినయుపమాత తెల్లనిచీరకట్టుకొని దానిచెంతకుంబోయెను. అనఁగా నాసౌధము నెక్కెననియే యర్థము. దీనిమూలముం బరిశీలింతము. దాన నీశంకలు తొలఁగును.

> "ప్రాసాదం చంద్రసంకాశమారురోహ యదృచ్ఛయా
> ప్రహర్షోత్ఫుల్లనయనాం పాండురక్షౌమవాసినీం
> అవిదూరే స్థితాం దృష్ట్వా ధాత్రీం పప్రచ్ఛ మంథరా
> ధాత్ర్యాస్తు వచనం శ్రుత్వా కుబ్జా క్షిప్రమమర్షితా
> కైలాసశిఖరాకారాత్ప్రాసాదాదవరోహత."

అను నీవాల్మీకివాక్యములఁ బఠించితిరికదా. మంథర మేడ నెక్కెను. సమీపమున నలంకరించికొని సంతోషమున నుబ్బుచున్న రాముని యుపమాత కనఁబడెను. అది తెల్పినమాటల విని క్రోధావేశమున మేడదిగెను. అనికదా యర్థము. రామునకుఁ బాలిచ్చినదాది సొగసుగా నలంకరించుకొని కైకమేడపైకిఁ బోవు టెందులకు? మహోత్సవములు తనయింట సాగుచుండఁగా వానింజూచుచుండక కైకయింటికే పోవ నేదోకార

ణము కలుగవలయుఁగదా. అదేది? మహాప్రకృతియగు సీతా దేవితలంపే యని యెఱుంగవలయు. ఆమె కీయూహ కలుగఁగా దేవతలు వాగ్దేవిం బ్రార్థించి మంథరకుఁ గైకకు దురూహాలు కలుగఁజేయుమా యని వేఁడిరి. ఆమె యట్లే యగుఁగాక యని తలంచెను. వెంటనే గూనిదాసి మేడనెక్కెను. ఆసమయమునకే రామునిదాది యచ్చోటికిం బోయెను. అది రామాభిషేకవార్తఁ దెలిపెను. వెంటనే మంథర మేడదిగెను. వీనింబట్టి పరిశీలింపఁగా "గహనా కర్మణో గతిః" అన్న శ్రీకృష్ణవాక్యము తప్పదని కర్మగతుల మానవులు పరికింపఁజాలరని తేటపడియెడిని. అధ్యాత్మరామాయణమున స్పష్టముగాఁ జెప్పినభావము వాల్మీకిరామాయణమున గూఢముగా నున్నదనియే మన మూహింపవలయును.

"సాపి కుబ్జా త్రివక్రా తు ప్రాసాదాగ్రమథారుహత్
నగరం పరితో దృష్ట్వా సర్వతస్సమలంకృతమ్
నానాతోరణసంబాధం పతాకాభిరలంకృతం
సర్వోత్సవసమాయుక్తం విస్మితా పునరాగమత్
ధాత్రీం పప్రచ్ఛ మాతః కిం నగరం సమలంకృతమ్."

అధ్యాత్మరామాయణము. ౨ సర్గము.

మంథర మేడనెక్కి నగరశృంగారమును దిలకించి దిగివచ్చి యందొకచోఁ గనఁబడినరామునిదాదిం గని యడిగి రామాభిషేకవార్త నామె తెలుపఁగా

"తచ్ఛ్రుత్వా త్వరితం గత్వా కైకేయీం వాక్యమబ్రవీత్."

అధ్యా. ౨ సర్గము.

విని యీసుపూని కైకకడకుం బోయెనని యధ్యాత్మరామాయణమునం గలదు. సరస్వతి మంథర నావేశించెనని తెల్పినందున నీవిషయము నిట్టులే తెల్పంబడినది. శ్రీమద్రామాయణమున దేవతలప్రోత్సాహమున శారద మంథర నావేశించెనని స్పష్టముగాం దెలుపనందున ధాత్రి మేడపైకిం బోయినట్లు తెలుపంబడెను. ఈయర్థము నూహింప మఱొకకారణముకూడం గలదు.

"మంథరాయా వచశ్శ్రుత్వా శయానా సా శుభాననా
ఉత్తస్థౌ హర్షసంపూర్ణా చంద్రలేఖేవ శారదీ.
అతీవ సా తు సంహృష్టా కైకేయీ విస్మయాన్వితా,
ఏకమాభరణం తస్యై కుబ్జాయై ప్రదదౌ శుభం."

అను నీరామాయణవాక్యములం బరికింతము. రామాభిషేకవార్తను దాసి వినిపింపంగనే యాశ్చర్యపడి లేచి పట్టరాని యానందమున నొకయాభరణము నిచ్చెను. దీనిభావమేమి? మంథర రాంగలయనిష్టమునుగూడం దెలిపెనుగదా! దానిని లెక్కింపక (అనంగాం దెలివితక్కువది దాసి యని భావించి యనికదా యర్థము) అశుభతమవార్తను దెలిపినందులకే యాభరణము నిచ్చెను.

"రామే వా భరతే వాహం విశేషం నోపలక్షయే"

అనికూడ ననెను. ఇంతదనుక కైకయాశయము రామునియందు భేదభావమును గాంచలేదనియు, భరతుండు రాముండు సములనియే యామె భావించెననియు మన మెఱుంగవలయు. దేవతలప్రోత్సాహమున సరస్వతి యామె నావేశించి బుద్ధియందొకవికారము గలిగింపంగా నామెమాటలకు లోంబడెననియు.

మన మూహించుట పొరపాటు కానేకాదు. కావునఁ గర్మ సిద్ధాంత మిట స్పష్టముగాఁ గనంబడుచున్నది. కావున మన మీభాగమునుండి కర్మము బలవత్తరమనియు, దానిమీఱ నెవ్వారు శక్తులు కారనియు నెఱుంగందగు. మఱియు భగవత్సంకల్ప మన్నింటికి మూలమనియు, నన్నియు దాని ననుసరించియుండుననియు, నయ్యదియుఁ గర్మము ననుసరించుననియు మనము నిశ్చయించుకొనవలయును. మంథర కైక లోనగు వారు నిమిత్తమాత్రమే యనియుఁ దెలిసికొనుట మంచిది. ముఖ్యముగాఁ గైకభావ మెంతపరిశుద్ధమో యూహించి పిదపఁ గర్మవశమున నది యెట్లు మార్పునొందెనో తర్కించిన నెయ్యది యన్నింటికంటె బలవత్తరమో యెఱుంగుటయే సమంజసము. ఇఁకఁ దరువాతిభగవత్ప్రవృత్తిని దెలిసికొందము.

## కైకను మంథర దుర్బోధముచేయుట.

* కైకేయి యీరీతిగాఁ బలుకఁగా మంథర యీసుపూని యామె పారితోషికముగా నిచ్చినయాభరణమును విసరివైచి తాఁజెప్పినహితము నంగీకరింపదయ్యెఁగదా యనుకోపమును, మహానర్థము రానున్నదే యనుదుఃఖమును గలిసికొనఁగా, నామెం గాంచి బాలిశురాలా! దుఃఖమునకుఁ దగినకాల మిది. ఇట్టిసమయమున నీకు సంతోషము గలుగుచున్నదే. ఏల? నీ విపుడు దుఃఖసముద్రమధ్యభాగమున నున్నదానవుసుమా. నీవు తెలిసికొనఁజాలక సంతసించుచున్నావే. ఏది యాదుఃఖమని యడుగుదువేమో. రామాభిషేకరూపమగు దుఃఖమునొంది

* ఈభాగము ఎనిమిదవ సర్గమునుండి గ్రహింపఁబడినది. అధ్యాత్మ రామాయణసారముకూడ నిం దిమిడియుండును.

కృశింపవలసియుండఁగా సంతోషముతో నున్నదానవే. ఇట్టి నిన్నుఁ జూచినంతన నన్ను శోకము బాధించుచున్నది. నీవెఱ్ఱితనముచూడఁగా నాకు నవ్వువచ్చుచున్నది. కైకా! నీదుర్మతికి నాకు దుఃఖముప్పొంగుచున్నదిసుమీ. సపత్నీపుత్త్రుఁ డనఁగా శత్రువే. వానియభివృద్ధి మనకు మృత్యువువంటిది. అట్టిదానిని వారింపఁబూనక యెవ్వతెగాని యానందించునా? రామునకువలె భరతునకుమాత్రమే రాజ్యముపొందునధికారము గలదు. అట్లగుటం జేసి భరతునిమూలమున రామునకు భయముగలుగు నవకాశమున్నది. మనలం గనినంతనే పాముబెబ్బులి భయం పడును. కాని వానివలననే మనకు భయముకలుగును. కనుక భరతునిం గాంచి భయపడురామునివలననే భరతునకు భయము కలుగును. ఈవిషయ మూహించియే విషాదముపాలగుచున్న దానను. సుమిత్రాపుత్త్రులకు రానిభయము రామునివలన భరతునకే కలుగునా యని తలపోయకుము. ధనుర్ధారులలో మేటి యగులక్ష్మణుఁడు సర్వప్రకారముల రామునే యాశ్రయించియున్నవాఁడు. అట్లే భరతుని శత్రుఘ్నుఁ డాశ్రయించియున్న వాఁడు. కావున వారిరువురివలనను రామభరతులకు భయము కలుగదు.

రామునకు భరతునివంకనే భయముకలుగుననుట కింక నొక్కకారణ మున్నది. వినుము. జన్మక్రమమునుబట్టి యూహింపఁగా భరతుఁడే రామునకు విశేషించి సమీపముననున్న వాఁడు. రాజ్యప్రాప్తి రామునివెనుక భరతునకే యత్యంత సమీపముగ నుండును. లక్ష్మణశత్రుఘ్నులు వయసునఁజిన్న వారు కాన వారి కయ్యది దూరముకదా. నీవు చెప్పినపద్ధతిం

బట్టి యాలోచింపఁగా భరతునకు రాజ్యము రాఁదగదుకదా యందువేమో. ఆవరుసమాట యటుండనిమ్ము. ఒకరహస్యము వినుము. విద్వాంసుఁడై రాజనీతికోవిదుఁడై కర్తవ్యము నాలకింపక యొనరించుచుండువాఁడు రాముఁడు. నీకుమారుఁడనఁగా నంతటిసమర్థుఁడు కాఁడు. కావున నీవిషయము తలంపునకువచ్చి, నపుడెల్లను రామునివలన భరతున కేమికీడుమూడునో యను భయము నన్నావరించుచుండును. ఇన్నియు నాలోచించిన నాపదలు రాకయుండఁ గాపాడుకొనుటయే యుక్తమని తోఁచుచున్నది.

ఇఁక మీసపత్నులవిషయ మాలకింపుము. కౌసల్య కొడుకు రాముఁడు రేపే పుష్యనక్షత్రమున యౌవరాజ్యాభిషిక్తుఁడగును. అప్పటి కౌసల్యభాగ్య మెట్టిదగును? ఆమెయే భాగ్యవంతురాలు. పుత్త్రుఁడు యువరాజు కాఁగా నిర్భరానంద పారవశ్యమున విఖ్యాతింగాంచి మీవంటిసపత్నుల పొగరడంచి చెలంగును. నీవపు డాకౌసల్యకు దాసివై దోసిలొగ్గి వర్తింపఁగలవు. నీ వాకౌసల్యకు దాసివి కాఁగా మే మెల్ల నీతోడ దాసిజనమే యగుదుము. నీకొడుకు రామునకు సేవకుఁడు కాఁగలఁడు. రాముఁడు యువరాజు కాఁగా నతనియుత్తమకాంత లానందపరవశలగుదురుకదా. ఇఁక భరతుఁడో దరిద్రుఁడై సేవచేయుచుండఁగా నీకోడండ్రు దుఃఖములపాలగుదురు.

అని యీరీతి నుచితముమాని దుర్బుద్ధులు చెప్పుచున్న గూనిదాసింగని కైక దానిమాటలు నిరాకరించి శ్రీరాముని గుణములనే ప్రశంసింపంబూనెను. మంథరా! ధర్మవేత్తయై, యంతరింద్రియనిగ్రహము కలిగి, కృతజ్ఞుఁడై యసత్యములే

పలుకక, నిర్మలుఁడైనవాఁడు రాముఁడని యెఱుంగుము. రాజచంద్రునకు జ్యేష్ఠపుత్త్రుఁడు. కావున నారాముఁడే యావ రాజ్యమున కర్హుఁడు. కనుక రాజ్యము భరతాదులకు నయ్యెడి రాఁదగుననుట న్యాయ్యముకాదు. ఇఁక రామునిగుణముల నాలకింపుము. తమ్ముల నందఱను దండ్రివలెఁ గాపాడువాఁడు. భృత్యుల నాదరించును. ఆరాముఁడు దీర్ఘాయుష్మంతుఁడై యుండవలయును. అట్టిశ్రీరాముని యభిషేకవార్తనువిని మహానందము నొందవలయుఁగదా. దానికి బదులుగా మంథరా! పరితపించుచున్నదానవే. ఏల?శతవత్సరములు రాముఁడు పాలింపఁగా నవ్వల నాకొడుకుఁ దండ్రితాతలనుండి వచ్చు రాజ్యమును బొందఁగలఁడు. సత్యము. ఇపు డీరామాభిషేకము సాగుటుచితము. ఆశుభసమయము చెంతనున్నది. భరతాభిషేక సమయము రాఁగలదు. నాకుఁ గష్టములువచ్చుననికదా నీవు పరితపించుచున్నదానవు? శ్రీరాముఁడు కౌసల్యకంటె నెక్కువ ప్రీతితో నాకు శుశ్రూషలు సలుపుచున్నవాఁడు. కనుక నాకు రాముఁడు భరతునకంటె నెక్కుఁడుగ మన్నింపఁదగినవాఁడు. సోదరులను దనవలె నారయువాఁడగు రామునకు రాజ్యము వచ్చిన భరతున కయ్యెడి వచ్చినట్లే యని నమ్ముము. ఎప్పుడో వచ్చునని యెంచనేల? ఇపుడే వచ్చినదే యనుకొనవలయును.

అని యీరీతి నాకైక తనమాటలం బాటింపక పల్కఁగా నాలకించి మంథర మిక్కిలి దుఃఖించి నిట్టూర్పులుపుచ్చి కైకం బరికించి నీవు మూర్ఖురాలవుసుమా. ఏదిమేలు? అని యెఱుంగఁజాలక యనర్థమును శుభముగా భావించుచున్నదానవు. ఏమందును? నీకొడుకు రాజ్యము లేక యడవిపా లగునన్న

శోకము, సుఖములు తొలఁగి కష్టములు రానున్నవే యన్న వ్యసనము కూడఁగా సవతికి సేవచేయుమహాదుఃఖము సాగరము వలెఁ బైకొని ముంచివేయుచుండఁగా నందు మునుఁగుచుఁ దేలుచునుండు నీవు నీయవస్థలఁ దెలియకయున్నావే? ఏమనం దగును? కైకా! నీవెంత వెఱ్ఱిదానవే? రాముఁడు పాలించిన పిదప భరతునకు రాజ్యము లభించునని యాశించుచున్నావే? ఎన్నటికిని రాదు. రాముఁ డిప్పుడు రాజగును. ఆతనివెనుక నతనికొడు కెవ్వఁడో యతఁడే రాజగును? కావున నీపుత్త్ర పౌత్త్రు లేనాఁటికిని రాజులు కారు. రాజవంశమున మనభర తునకుఁ బేరే యుండఁబోదు. ఒక్కభూపాలునకుఁ బుట్టినకు మారులందఱును రాజ్యమునఁ బాలకులుగా నునుపఁబడుదురేని నీతిదూలి రాజ్యమునకే హాని సంభవించును. ఎందఱుకొడుకులు గుణవంతులుండినను వారిని మాని జ్యేష్ఠపుత్త్రునకే రాజ్యమును బ్రభువు లిత్తురు. ఇది నిజము. ఈనియమముచేత నీకొడుకున కేకాలమునకైన రాజ్యము రాదనుట స్పష్టము. నీకుమారుఁడు సకలవిధముల దుఃఖములపాలు కావలసియున్నవాఁడు. దిక్కు లేనివాఁడే కానున్నాఁడు. సుఖహీనుఁడగుటయేకాక రాజవం శమునందు గణింపఁబడఁడు.

జ్యేష్ఠుఁడగు రాముఁ డుండఁగా భరతునకు రాజ్యము వచ్చుమార్గ మెట్లు? అని సంశయింతువేమో. ఆమార్గమెఱిం గియే భరతునకు రాజ్యమిప్పించుటకుఁ దగిన హేతువు నీకుఁ దెలుపుటకే యిచ్చటికి వచ్చితిని. ఇది నీవెఱుంగకయే యిట్లులాడి తివి. సవతికి మేలు గలుగుచుండఁగా నాకుఁ బారితోషిక మొక్కటియిచ్చి యంతతోఁ దృప్తినొందక యింకొక్కటికూడ

నీయఁగోరుచున్నదానవే. నారాకకుఁ గారణమేమని తెలియక యున్నావే. ఇంత యవివేకమా? చక్కఁగా వినుము. శత్రువులు నశింపఁగా శ్రీరాముఁడు నిష్కంటకమగు రాజ్యమునొంది భరతుని దేశాంతరమునకుఁగాని లోకాంతరమునకుఁగాని బంపును. నిశ్చయము. భరతుఁడు బాలుఁడుగానుండ నీవు వానిని మేనమామయింటికిం బంపితివి. వృక్షములులోనగు స్థావరములందును బరస్పరసాన్నిధ్యమువలన స్నేహము కలుగుచున్నది. మానవులయం దదియుండునని వేఱుగాఁ జెప్పవలయునా. అట్టిసాన్నిధ్యము లేకుండ భరతుని సాగనంపినదానవు నీవేకదా. భరతానువశుఁడగు శత్రుఘ్నుఁ డాతనివెంటఁ బోయెను. లక్ష్మణుఁడు రాము నెట్టు లాశ్రయించెనో శత్రుఘ్నుఁడు భరతునాశ్రయించి యున్నవాఁడు. వాఁడైన నుండిన నించుక లాభముండెడిది. అదియు నిపుడు లేదు.

కైకా! ఒక్కవిషయము నాలకింపుము. వనమునమ్ముకొని జీవించువా రొకవృక్షమును సకాలమున ఛేదింపరాఁగా ముండ్లపొద లద్దాని నలముకొనియున్నందున నావృక్షము వాని సాన్నిధ్యమువలనఁ దనకుఁ గలుగుమహానర్థమునుండి తప్పించుకొనునని జనులవలన మనము వినుచున్నాముకదా. అట్లే దశరథునిచెంత భరతుఁ డుండినయెడలఁ బ్రేమమున నీకార్యము చేయకుండెడివాఁడు. రాముని లక్ష్మణుఁడు వానిని రాముఁడును రక్షించును. అశ్విదేవతల కిరువురకుంబోలె రామలక్ష్మణుల కిద్దఱకును సోదరవాత్సల్య ముత్కృష్టమని లోకవిదితము కావున రామునివలన లక్ష్మణున కేకష్టము రాదు. భరతునకే రామునివలన భయము కలుగును. ఇది సత్యము. అట్టిభయము

రాకయుండ మాతులగృహమునుండియే భరతు నడవికింబోవ నిమ్ము. అట్లు లైనఁ బ్రాణహానియైనఁ గలుగకయుండు. కావున నాకార్యము చేయుటయే నాకు హితముగాఁ దోఁచుచున్నది. కొడుకునకుఁ బ్రాణములైన నిలుచునుగాన నీకునుగూడ నది హితమేయగు. భరతు నడవులకుంబంప నిష్టపడవేని రాజ్యము నిప్పింపుము. తండ్రియానతి ధర్మమునఁ దండ్రి రాజ్యము నొందు నేని నీకును బంధువర్గమునకును నిశ్చయముగ మేలగును. రాజ్యము లేక భరతుఁడు రామునికడ నుండరాదు. సుఖార్హుఁడే కాని నీకొడుకు కష్టముల కర్హుఁడు కాఁడు. పరవశము దుఃఖ హేతువుకదా. భరతుఁడు రామునకు సహజశత్రువు. అట్టి వాఁడు రాజ్యము లేక యెట్లు రామునికడనుండి జీవింపఁగలఁడు? కావున నెన్నిభంగుల నాలోచించినను భరతునకు రాముని మూలమున హాని తప్పదనియే తోఁచెడు. గహనమునందు సింహము తఱుమఁగా మృతినొందనున్న గజయూథపతివలె రాము నకుఁ జిక్కి కష్టములపాలై మృతినొందనున్న భరతుని నీవు రక్షించు టుచితము. ఇంతకుమున్ను నీవు నాథునకుఁ గూర్చు దాన నన్నగర్వమున సపత్నియగు కౌసల్యను నిరాకరించియు న్నావు. ఇపు డాకౌసల్య కుమారుఁడు రాముఁడు రాజు కాఁగా నీపైఁ బగసాధింపక విడుచునా? దాసినిగాఁ జేసికొనినిన్ను శ్రమం పఱచును. సకలమణిగణములుగల యాకరములుగలిగిన పర్వత పత్తనాదులుగల యీభూమికి రాముఁ డెప్పు డధిపతియగునో అపుడే నీకొడుకు నీవు దారిద్ర్యమునఁ గుంది సకలదుఃఖాకర మగు నవమానమును బొందుదురు. రాముఁడు రాజు కాఁగానే భరతుఁడు నశించుననుట నిస్సంశయము. కావున భరతునకు

రాజ్యముగలుగుటకు, మఱొకని నగరమునుండి వెడలఁగొట్టు టకును దగినయుపాయము వేగంబ యాలోచించుకొనుమని నొక్కిచెప్పెను.

మహామతులారా! ఈభాగమున ననేకవిషయములు విమర్శింపఁదగియున్నవి. మంథరగాని కైకగాని స్వాయత్తచిత్తలు గారు. కర్మపాశములచేఁ గట్టఁబడియున్నవారు. ఆపాశము లెట్లు తిరుగునో యట్లే తిరుగువారు. ఇపుడు మంథర లోకోపకారమునకుఁ బ్రథమసోపాన మనవలయును. ఆమెయు శారద తన్నావేశించుటంజేసి యుక్తిప్రత్యుక్తులయందు నిపుణయై యున్నది. కైకయో దాసి తన్ను దూషించుచున్నను గోపమూనక సంతోషించుచు దాని నూఱడింపఁ జూచుచున్నది. రాజపత్నియయ్యు నొకదాసి తన్ను నోటికివచ్చినట్లు దూషింపఁగా నానందించుట యచ్చెరువుగొలుపకమానదు.

"కార్యతే హ్యావశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః"

అన్నగీతావాక్యమున నీయర్థ మిమిడియున్నది. కావునఁ గర్మము త్రిప్పులకు లోఁబడనివాఁ డొక్కభగవంతుఁడు తప్ప మఱెవ్వరును లేరనుట సిద్ధాంతము. ప్రకృత మనుసరింతము.

కైక శుద్ధాంతఃకరణముకలదని పూర్వసర్గమునందే తేటపడియెను. కాని సరస్వతి యంతలోఁ దన్నావేశించినందున మంథరమాటలు హితోపదేశములని భావింపవలసినదయ్యెను. ఏల? పరమేశ్వరియై సర్వకర్త్రియై సీతానామమును దాల్చి యిలవెలసిన యోగమాయ సంకల్పించినది యంతరాయములపాలగునా? అది సాగక తప్పదు. రాఁగలయవస్థలకు జంకువారెవ్వరు? కర్మగతులఁ దెలియని కౌసల్యాదులే. తొలుతఁ గొంద

దానందింతురు. కొందఱు దుఃఖింతురు. కర్మగతుల నెఱింగినవా రూరకయుందురు. సర్వకారణకారణుండగు శ్రీరామచంద్ర మూర్తి సాక్షిమాత్రుఁడై చూచుచుండెను. సర్వజ్ఞుఁడయ్యుఁ దనయోగమాయ నాశ్రయించి తాను నొకకార్యభారమున నిమగ్నుఁడై యున్నట్లున్నవాఁడు. తనప్రభావము తెలియనీయక జానకి సామాన్యస్త్రీవలె సుఖదుఃఖముల ననుభవించుచున్నట్లు నటింపఁగాఁ దాను నట్లే రామచంద్రుఁడు నటించుచున్న వాఁడు. వారిసంకల్పములు కర్మరూపపాశములై యందఱ నాడించుచున్నవి. కావున నీఘట్టమునుండి యెన్నియో నీతులు బయలువెడలును. వాని విమర్శించి యెఱింగి కృతార్థులమగు టయే యుత్తమము. ఆనీతు లెట్టివనఁగాఁ జిత్తగింపుఁడు.

"హర్షం కిమిదమస్థానే కృతవత్యసి బాలిశే,
శోకసాగరమధ్యస్థమాత్మానం నావబుధ్యసే."

అని మూలము. ప్రాతీతికార్థము ముందే వ్రాసితిని. సారమే యిందు వ్రాయుదును. అనవసరసంతోషము పనికిరాదు. అనఁగా దుఃఖింపవలసినకాలమున సంతోషము నొందుట భావ్యనర్థ హేతువు. ఎవరు తన్నలముకొననున్న యాపదల నెఱుంగరో వారు శోకములపా లగుదురు. ఎవ్వారికిఁగాని ముందు సంభ వింపఁబోవుసుఖదుఃఖముల ననుసరించి బుద్ధి మాఱుచుండును. ఇపుడు కైకకు రానున్నది కష్టముకాని సుఖముకాదని మంథర తలంచి యాక్షేపించుచున్నది. ఇపుడు మంథర కైక నాక్షేపించుట యామె మేలు కోరియే. తనకుఁ దెలియునని కైక కేమియుఁ దెలియదని యూహించియే దూషించుచున్నది. కావున మానవులబుద్ధులు రాఁగలశుభాశుభకర్మఫలముల కనురూపముగా

మాఱుచుండుననియు, నితరులు చెప్పుహితము వారి కహిత ముగాఁ దోఁచుననియు మనము గ్రహింపవలయును. ఎవ్వఁడు తనమేలు చెప్పువారిమాటల నాదరింపఁడో వాఁ డవశ్యము కీడునొందుననియే యిటఁగలసారము. ఈవిషయమునే పలు మాఱు లిందుఁ దెలుపుశ్లోకము లున్నవి.

ఈఘట్టమున శారదాదేవి యావేశించుటంజేసి మంథర భరతునకు రాముని మూలమున రాఁగలయాపత్తుల నెన్నింటినో వెలిఁబుచ్చెను. ముఖ్యముగా సవతిసిరిని బొగడి యసూయఁ గల్పింపఁ బ్రయత్నించెను. ఆమాట లసంగతములనికాని యా దాసి మేఱమీఱి పలుకుచున్నదనిగాని యారాణికిఁ దోఁప లేదు ఏల? సరస్వతి దేవతలప్రార్థనమున నావేశించినందుననే. కావున మానవుఁడు స్వతంత్రుఁడు కాఁడనియు దేవతలమాయల నెఱుంగఁజాలఁడనియు మన మెఱుంగవలయు. దీనిచేతఁ గర్మ సిద్ధాంతము బలవత్తరమనియు, దానిని ద్రోసిపుచ్చ సాధ్యము గాదనియు, నయ్యది హరిహరవిధాతృలకుంగూడ శక్యము గానిపనియనియు నెఱుంగు టుత్తమము. ఇట్టులుండఁ గొందఱు కపటనాటకసూత్రధారులు కర్మమునకన్న భక్తియే ప్రధాన మనియు, సర్వకర్మముల మాని విష్ణువు నారాధింపవలయునని బోధింతురు. భక్తియుఁ గర్మమున నంతర్భూతమని వా రెఱుంగ రనుట నిక్కము. వారు భక్తియనఁగాఁ గైంకర్యమనియుఁ, బూవులు తెచ్చుట వింజామరలు విసరుట యీలోనగుసేవలు చేయుటయే యనియుఁ దలంచిరని మన మూహింపవలయు. అట్టి యూహకలవారు కనుకనే

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ

అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః”

అనునది చరమశ్లోకమని పలుకుచుఁ గర్మత్యాగమునే యిది బోధించునందురు. వారలే యిందు ధనదాసులని పేర్కొనం బడుదురు. భక్తిమార్గమే వారికిఁ దెలియదనియుఁ, బుష్పమాలికాదికృత్యములు ముక్తిప్రతిబంధకములేయనియు, నావిగ్రహపూజ వదలవలయుననియు, నయ్యది క్షుద్రఫలమునే యొసంగునని యు నిశ్చయింపవలయును.

“తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర,
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః.” ౧౯

అన్న గీతోక్తి కర్మము నాచరించుపద్ధతిని దెలియఁ జేయుచున్నది.

“న కర్మణామనారంభాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే,
న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి.” ౪

అను శ్రీకృష్ణభగవదుపదేశమే కర్మప్రధానతను వెల్లడించుచున్నది.

“కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః,
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి. ౨౦

అను శ్రీహరియుపదేశము కర్మరతులమార్గమును దెలియఁ జేయుచున్నది.

“మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా,
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః. ౩౦
యే మే మతమిదం నిత్యమనుతిష్ఠంతి మానవాః,
శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేఽపి కర్మభిః. ౩౧

అను శ్రీపరమేశ్వరోపదేశము కర్మఫలము లభించుపద్ధతిని దేట

పఱచుచున్నది. వీనినెల్లం బరికింపఁగాఁ గర్మము బలవత్తర మనియు, నయ్యది యెట్టివారినైనఁ బరవశులనుగాఁ జేయు ననియు మన మెఱుంగవలయును. భగవదనుగ్రహము వలయు నేని ఫలములంగోరక సత్కర్మములను భగవదర్పణబుద్ధిచే నాచ రింపవలయునని తేలెడిని. కర్మసిద్ధాంతమును దూషించి దాసులు యోగులు శిష్యులకు భక్తిమార్గ ముపదేశింతురుకదా. అది కేవల ధనాకర్షణార్థమే కాని వేఱుకాదని తెలిసికొని వారి మాటలం ద్రోసిపుచ్చి భగవంతు నారాధింపవలయుననియే యిటఁగలసారము.

"హృష్టాః ఖలు భవిష్యంతి రామస్య పరమాః స్త్రియః,
అపహృష్టా భవిష్యంతి స్నుషాస్తే భరతక్షయే,"

ఈమూలము మంథరనోట వాల్మీకి పలికించెను.

"రామస్య పరమాః స్త్రియఇత్యనేన బహువచనేన సీతాసఖ్య ఉచ్యంతే. స్నుషా ఇత్యత్రాప్యేవమేవ జ్ఞేయం."

అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి. గోవిందరాజులుగారు ఎన్నియో శంకలు సమాధానములు కనఁబఱచి పెంచిపెంచి తుద కీసమాధానము యుక్తియుక్తముగాఁ గుదురనందున

"పరమాః స్త్రియ ఇతి పరిచారికాంతర్భావేన స్త్రీభిశ్చ మన్యఇతి స్వవినాశేస్త్ర్యంతరసంభావనయా పరమనారీణామితి కవివచనత్వేన శ్రీభూ మ్యాద్యభిమర్శవిషయత్వాచ్చేతి దిక్."

అని ముగించిరి.

శ్రీరామమూర్తి కనేకభార్యలున్నట్లు రామాయణమున నందందుఁ గలబహువచనాంతపదములచేతఁ దెలియవచ్చెడిని.

ఏకపత్నీవ్రతుఁడు శ్రీరాముఁ డన్నందులకు బహుతరప్రమాణ ములు గలవు.

"పితుర్నిదేశం సమయేన కృత్వా వనాన్నివృత్తశ్చరితవ్రతశ్చ,
స్త్రీభిస్తు మన్యే విపులేక్షణాభిస్త్వం రంస్యసే వీతభయః కృతార్థః." ౧౪
సుందరకాం. ౨౧ సర్గము.

అను నీసీతావాక్యముంబట్టి కొందఱు నవనాగరికులు రామున కనేకభార్యలున్నయట్లు సీతయే చెప్పెనని యాక్షేపింతురు. ఏక పత్నీవ్రతుఁడన్నమాట యెన్నితావులఁగన్పట్టినను వానిని ద్రోసి పుత్తురు. కారణమేమనఁగా భగవత్తత్త్వము వారికిఁ దెలియక పోవుటయే యనవచ్చును. సీత రావణప్రోత్సాహమున రాక్షసాం గనలు తన్ను బాధపెట్టఁగా నాదుఃఖమున జీవితాశపోఁగా మరణ వ్యవసాయముననుండి యీమాట చెప్పినది. సమయ మట్టిది. కావునఁ దనకుఁ గలజీవితనిరాశ ననుసరించి చెప్పినమాటయం దెట్టియర్థముండునని గ్రహింపవలయునో పాఠకులే నిర్ణయింప వలసినవారు. ప్రకృతము "రామస్య పరమాః స్త్రియః" అను చోట "సీతాసఖ్యః" అనుమహేశ్వరతీర్థులు వ్రాసినయర్థము గోవిందరాజసమ్మతమే యనవచ్చును. శ్రీరామునంతఃపురమునఁ గల స్త్రీలందఱు సంతోషింతురు. అని మంథర కైకను మఱింత కోప ముద్దీపింపఁజేయఁ జెప్పినది. "తే స్నుషాః" నీకోడండ్రు దుఃఖింతురు. అనఁగా భరతున కెందఱు భార్యలో కైక యెఱుంగదా. ఇందుఁగలబహువచనమున కేమియర్థమో "పర మాఃస్త్రియః" అన్నచోట నదియే యర్థము. ఇట్లు సులభ ముగా నర్థమగుచుండఁగా లేనిశంకలు గలిగించుకొని యాశం కలమూలమున నేకపత్నీవ్రతుఁడు రాముఁడు కాఁడని యాక్షే

పించిన వచ్చులాభమేదియుఁ గానరాదు. భరతునకు మరల వివాహమైనయట్లు లేదు. కావున నీకోడం(డ్రనుచోటఁ బూజ్య వాచకమునకు బహువచననిర్దేశము శాస్త్రసమ్మతముగావున రామునికాంత లన్నచోట నట్లే గ్రహింపందగు. సాధారణముగా నంతగపురములఁ దిరుగువారు మర్యాదగనే మాటలాడుదురు. కావున నెంతయిూసున్నను మంథర వాడుకచొప్పున రాముని స్త్రీలని పలికెననుట స్పష్టము. ఇట్టి యసంగత ప్రసంగములచేత సమయము వెళ్లించుట పాపహేతువు. రామమూర్తి ప్రభువైనయెడల నంతఃపురమునఁ గలవారెల్ల నానందించుచుండఁగా భరతు నంతగపుర స్త్రీలు దుఃఖింతురుకదా యని మంథర పలికెనని మనము గ్రహింపవలయు.

"రామస్యైవ గుణాన్ దేవీ కైకేయీ ప్రశశంస హ
ధర్మజ్ఞో గురుభిర్దాంతః కృతజ్ఞస్సత్యవాక్ఛుచిః,
రామో రాజ్ఞస్సుతో జ్యేష్ఠో యౌవరాజ్యమతోఽర్హతి.
భ్రాతౄన్ భృత్యాంశ్చ దీర్ఘాయుః పితృవత్పాలయిష్యతి,
సంతప్యసే కథం కుబ్జే శ్రుత్వా రామాభిషేచనం."

అను నీవాక్యములు మహర్షి వాల్మీకి కైకనోటఁ బలికించెను.

"హర్షస్థానే కిమితి మే కథ్యతే భయమాగతం
భరతాదధికో రామః ప్రియకృన్మే ప్రియంవదః,
కౌసల్యాం మాం సమం పశ్యన్ సదా శుశ్రూషతే హి మాం
రామాద్భయం కిమాపన్నం తవ మూఢే వదస్వ మే."

అధ్యాత్మరామాయణము ౨ సర్గము.

అను నీభావము రామాయణమునఁ గలదానినే యనుకరించుచున్నది. భరతునకుఁ గీడుమూడనున్న దనుమంథరమాటలఁ

బాటింపక కైక యీరీతిం బలికెను. "గురుభిర్ధాంతః" అన్న మాటలనుబట్టి రామమూర్తి భగవంతుఁడని కైక యెఱుంగ దనిమాత్రము చెప్పవచ్చును. కాని గురువులకడ సుశిక్షితుం డైనవాఁడు. అనఁగా సకలధర్మముల నెపుడెపు డెట్టులెట్టు లాచ రింపఁదగునో యెఱింగినవాఁ డనుభావముచే నాతనిమూలమున నాకుఁగాని భరతునకుఁగాని యేయపకారము కలుగదని కైక యాశయమని గ్రహింపవలయు. శ్రీరామునియం దింతదనుకఁ గైక కేమాత్ర మేదురభిప్రాయము లేదనియే యిందుఁగల సారము. దేవతలు పురికొల్పవచ్చినశారదా దేవి కైకయం దింక నావహింపలేదని మన మెఱుంగవలయు. ఏల యావ హింపలేదనఁగాఁ గైక సదభిప్రాయముగలదియే యనుభావము లోకులకుఁ దెలియవలయునని, దేవతలకార్యము సాగింప నా పిదప నాసరస్వతి యావహించెననియు నిందుఁ దాత్పర్యము.

"సన్నికర్షాచ్చ సౌహార్దం జాయతే స్థావరేష్వపి."

అనుమూలమున నొకనీతి గలదు. దగ్గరనున్నందున సద్భావము గలుగును. ఇది స్థావరములయందుఁగూడఁ గలదు. మానవు లకుఁ గలుగునని యేల చెప్పవలయును. అని దీనియర్థము. అన్యోన్యాలాపాదులవలన మైత్రి వృద్ధియగును. ఆమైత్రి సజ్జ నులమూలమునఁ గలుగునేని వృద్ధిహేతువగు. దుర్జనమూల మగునేని నాశనహేతువగు. మైత్రి కుదురుటయుఁ గర్మవశము ననే యగు. అదియు భగవదనుగ్రహాలభ్య మగునేని సత్కర్మ మగును. తన్మూలమున సకలసంపదలు గలుగును.

"సూనుస్సచ్చరితస్సతీ ప్రియతమా స్వామీ ప్రసాదోన్ముఖః
స్నిగ్ధం మిత్రమవంచకః పరిజనో నిఃక్లేశలేశం మనః,

ఆకారో రుచిరః స్థిరశ్చ విభవో విద్యావదాతం ముఖం
తుష్టేవిష్టపహారిణీష్టదహరా సంప్రాప్యతే దేహినా."

సాధుసంసర్గమునఁగాని మంచిమార్గము దొరకదని మన కీ రామాయణవాక్యము తెలుపుచున్నది. సాధువులచెంత నివసించినఁగాని సదాచారములు పట్టుపడవు. తరుగుల్మాదులుకూడ సమీపస్థితివలన నొండొంటిని గలియుచున్నది. సాధువులకు దూరమందుండినవారిని జూచి నేర్చుకొనవలసినభాగములు చొప్పడవు. శాస్త్రపఠనముమాత్రము చాలదు. బహుశ్రుతులతోడ నెల్లప్పుడు సాంగత్యము కలిగియుండదు. దానిచేతఁ గర్మవాసనలు తాఱుమాఱుకూడ నగును. క్రమముగా దుష్కర్మవాసనలు నశించి సత్కర్మవాసనలు వృద్ధినొందును. కావున సత్సన్నికర్షము ముఖ్యమని మన కీభాగము బోధించుచున్నది. అయ్యుదియు భగవదారాధనమూలముననే కలుగును. దానికి సత్కర్మము మూలము. కావున నన్నింటికిఁ గర్మమే మూలమని మన మెఱుంగవలయును.

"త్రాయతే హి ద్రుమః కశ్చిచ్ఛేత్తవ్యో వనజీవిభిః,
సన్నికర్షాదిషీకాభిర్మోచితః పరమాద్భయాత్."

అని మూలము. ఇది యొక్కచక్కనినీతిని బోధించుచున్నది. వనములఁగలచెట్లు నఱికి కట్టెలమ్ముకొని జీవించువారు సకాలమున నొకవృక్షమును ఛేదింపఁ బోవఁగా నాయాపదనుండి ముండ్లపొదలు తన్నలముకొని యున్నందున వానిసాయమున విముక్తిఁగాంచెనని ప్రతీతికార్థము. లోకమున నెవ్వఁడు తానుత్కృష్టుఁడనని యూహించునో యతఁడు తనకుఁగల్గు నాపదలనుండి తనకంటె నల్పులసాయ మున్నఁగాని తప్పించుకొన

నేరఁడు. ఈభాగము మనకుఁ దెలుపునీతి యేది? అల్పులనునది కల్పితాహంకారము. భగవంతుఁ డద్దానిం దొలఁగించి యితరులకుఁ గుణపాఠము చెప్పఁగోరి యాపదలు వానికిం గర్మానుసారము కల్పించును. అత్తఱి నతఁ డల్పులసాయమునఁ దప్పించుకొన్నయట్లు చేయును ఉత్కృష్టుఁడ ననుకొన్నవాఁడు బుద్ధి నుపయోగించి యోజించినఁ దనయహంకారమే యిందులకుఁ గారణమని యద్దానిం దొలఁగింప నీయుపాయము భగవంతుఁ డొనరించెనని తెలిసికొనును. అజ్ఞానము పొడసూపఁగనే ముందున్నయహంకారము తుదముట్ట నశించును. మానవుని సర్వానర్థములకు నహంకారమే ప్రధానము. దాని నాధారముచేసికొని యన్నియవగుణములు నందుఁ జొరఁబడును. కావున నాయహంకారమును మానవలయును.

> "అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః,
> మామాత్మపరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః. ౧౮
> తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్,
> క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు." ౧౯ గీత. ౧౬ అధ్యా.

అను శ్రీకృష్ణవాక్యము పైభావమును దెలుపుచున్నది. ఈ యుదాహరణమూలమున మన మధికులము. ఇతరులతో నేమి పని? అనుదుర్భావము మాని యాయాయికార్యముల కాయా మానవులతోడ్పాటు వలసియుండునుగాన వారియందున్న భగవదంశము పూజ్యమేయగుట నద్దాని నిందించుట దోషము గావునఁ దానుత్కృష్టుఁడ ననుభావము మానవలయునని యీ భాగమునుండి మనము నేర్చుకొనవలయును. ఎంతవారికిఁగాని యహంకారము పనికిరాదనుట యిటఁగలసారము.

మంథరచెప్పిన యీమాటలు తొలుతఁ గైకకుం గల భావమును. మార్పఁజాలెను. ఏల? శారదాదేవి యంతలో నావహించెను. పరవశగ్రైన కైక మంథరమాటల నాలకించి యిం దేమో సత్యమున్నదనునభిప్రాయము గలదయ్యెను. దేవతల యాశయము మానవులయభిప్రాయమునకంటె నెంత యుత్కృష్టమో యెఱుంగనగు.

"ఏతస్మిన్నంతరే దేవా దైవీం వాణీమచోదయన్."

అని యథ్యాత్మరామాయణమునఁ గలదు. బ్రహ్మ, యింద్రుఁడు లోనగువా రుండఁగా వాగ్దేవి నేల ప్రార్థించిరి? అనువిషయ మించుక చర్చింపఁదగినది. ప్రకృతిని మార్చుటకుఁ బ్రకృతియే కావలయును. పురుషశక్తి నిరర్థకము.

"మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి."

అని యర్జునునకు శ్రీకృష్ణుఁ డేల తెలిపెను? నే నాజ్ఞాపించుచున్నవాఁడనని యేల తెలుపలేదు? తాను సాక్షిమాత్రుఁడు. ప్రకృతికార్యమే యది హరిహరబ్రహ్మాదులు ప్రకృతికల్పితులు. తదాజ్ఞాధారకులు. వారివలన నగుకార్యము లత్యల్పములు. భండాసురాదిమహాదానవులు చెలరేఁగినపు డీదేవాధీశు లెందుండిరి? దుర్ఘటకార్యము లన్నియుఁ బ్రకృతిమూలముననే కావలయును. అహంకారమునఁ దనయందే కర్తృత్వ మారోపించుకొనువారలను బ్రకృతి శాసించునని శ్రీహరియే బోధించెను. ఈవిషయ మెఱుంగక కొందఱు మధ్యవైష్ణవులు దుర్జ్ఞానమునఁ బ్రకృతిని దదారాధనమును దూషింతురు. వారెట్టివారు? ధనముకొఱకు సన్న్యాసివేషమును దాల్చినవారు. లోక

వంచకులు. అట్టివారికే భగవంతుఁడు ప్రతిక్షణము ప్రత్యక్షమగు చుండునని పామరులు నమ్ముదురు. దేవుఁడు శిలారూపమునఁ బ్రత్యక్షమగుటమాత్ర మందు సత్యము. భక్తుఁడు దేవతాంతరదూషణము చేయునా? ఏనాఁటికిఁ జేయఁడు. భస్మధారణము చేసి మంత్రము జపించిన ఫలింపదని మతభ్రష్టులగు వైష్ణవులు కొందఱు పలుకుదురు. భస్మధారణము మాని జపించినందున నా పామరులయిష్టము ఫలించెననియుఁ దెలుపుదురు. కాని వారి యజ్ఞానమునుగుఱించియే మనము విచారింపవలయును. కర్మము ఫలము నిచ్చుకాలమురాఁగా మంత్రజపము ఫలించును. అంత దనుక నెన్నిజపములు చేసినను ఫలింపవు. భస్మధారణ మందులకుఁ బ్రతిబంధకము కాదని ప్రాజ్ఞు లెఱుంగుదురు. మతభ్రష్టుల కేమి తెలియును? ఒక్కమతమున నుండక క్రొత్తమతమున నేదోయున్నదనుకొనువాఁడు స్వమతతత్త్వ మెఱుంగఁ డనుట నిక్కము. ఈవిషయము శ్రీరామకృష్ణపరమహంసగారే చెప్పియున్నారు. ఒక్కవారే కాదు. ఎల్ల రంగీకరించిరి. మతధర్మములను జక్కఁగా నెఱింగిన నందు లోపములున్నవని తోఁపదు. అల్పజ్ఞులయార్భాటములఁ బాటింపక పామరులు తప్పించుకొనవలయును. భస్మధారణాదిచిహ్నము లేవియుఁ గర్మఫలములను స్వతంత్రించి యీయఁజాలవు. ఒక్కచిహ్నమును మాని వేఱొక్కదాని నంగీకరించిన ఫలముగలుగునని చెప్పుట వారి యవివేకమహత్త్వముననే యని మన మెఱుంగవలయును. ఇట్టు లీభాగము మనకు ననేకవిషయముల బోధించుచున్నది. ఇఁకఁ దరువాతి భగవచ్చరిత్రమును బఠింతము.

## కైక దుర్బోధములకు లొంగిపోవుట.

*తనదాసి యీరీతిగా నొక్కినొక్కి పలుకఁగా నాలకించి కౌసల్యకు నేను దాసినగుదునా యని కోపమూని మండి పడుచు దానఁ దనముఖము రక్తవర్ణముం దాల్పఁగా వేఁడి నిట్టూర్పులు పుచ్చుచు మంథరం గాంచి యిట్లు పలికెను. మంథరా! అతివేగముగా నీదినమునందే నేను రాము నడవికిం బంచుదాన. వేవేగ భరతుని యౌవరాజ్యమున నభిషిక్తునిగాఁ జేయించెద. కుబ్జా! ఏయుక్తిపన్నిన భరతుఁడు యువరాజగును? దేనిచే రాజ్యము రామునకు లేక యుండును? ఈవిషయములు మాత్రము చక్కఁగా నాలోచించి తెలుపుమని ప్రశ్నించెను. ఆప్రశ్నము నాలకించినంతనే మంథర తన పంతము నెఱవేఱునని సంతసించి పాపకార్యములయందే దృష్టి గలది యగుచు రామునకు రానున్న రాజ్యమునకు విఘ్నమాచరించు వేడుకతోఁ గైకతో నిట్లు పలికెను.

ఔరా! యిప్పుడడిగితివి. కైకా! నీకుమారునకే సర్వరాజ్య మేలాగు లభించునో తెలిపెదను. శ్రద్ధగా నాలకింపుము. నీకార్యములను నీవే నాకుఁ బలుమాఱు తెలుపుచుందువు. వానినెల్ల మరల నావలననే వినఁగోరుచున్నదానవు. ఎందులకు? వానిని మఱచితివా యేమి? కాదేని తెలిసియుండియు నాయంత నేను దెలుపఁగా వినవలయునను కోర్కి దాని దాఁచిపెట్టుచున్నదానవా? విలాసములయం దిష్టముగలయో కైకా! నేను దెలుపఁగా వినవలయు నను నభిలాషము నీకుం గల్గియున్నచోఁ

* ఇది తొమ్మిదవ సర్గమునఁ గలదు. అధ్యాత్మరామాయణకథాసారమిం దిమిడియుండును.

దెలిపెద. ఆలకింపుము. విన్నపిదప నాహితము చక్కఁగా విమర్శించుకొనుము. అనఁగానే మెత్తగాఁ బఱచియున్నశయ్యనుండి యత్యంతాదరమున నించుక లేచి దానిం గాంచి మంథరా! ఏయుపాయము పన్నుదునే? భరతునకు రాజ్యమువచ్చును గదా. రామునకు రాజ్యము రాకయుండ నెట్లు పోవును? ఆ విధము తెలుపుమని యొత్తియొత్తి ప్రశ్నించెను.

మంథరయుఁ బాపదృష్టిగలది కావున రామాభిషేక భంగమును జేయఁబూని కైక కిట్లు తెలిపెను. దేవీ! మున్నొక్కసారి దేవదానవసంగ్రామమందు దశరథుఁడు శతమఖునకు సాహాయ్యము చేయఁబూని సామంతరాజులతోడ నంతకించుక పూర్వమే వివాహమాడిన నిన్నుంగూడఁ దీసికొని దక్షిణదిక్కునంగల దండకారణ్యమునకుఁ బోయి యందుఁ దిమిధ్వజుఁ డున్న వైజయంతపురమునకుం బోయెను.

ఆతిమిధ్వజునకు శంబరుఁడను నామాంతరము కలదు. కడుబలశాలి శతవిధములగు మాయల నెఱింగినవాఁడు. దేవతలకుఁ జిక్కక వారినెల్లఁ జీకాకుపఱచి యింద్రునితోఁ బోరాడెను. ఆసంగరమున బాణాద్యాయుధప్రహారముల నవయవములు రక్తసిక్తములుగాఁ బండుకొని నిద్రించుపూరుషులను రాత్రియందు వచ్చి రక్కసులు చంపివైచిరి. ఆరేయి దశరథ మహారాజు మహాబలులగు నారాక్షసుల మార్కొని ఘోర యుద్ధము చేసెను. వారు ప్రయోగించుతీవ్రాయుధముల వ్రేటుల పాలయ్యెను. సారథి చావఁగా నీవే సారథ్యము చేయుచు బాణఘాతములచే సొమ్మసిల్లిన నీపతిని యాభూమినుండి దూరముగాఁ దీసికొనిపోయితివి. శీతలోపచారము లనేకము లొనర్చి

కాపాడితివి. ఆచోటికివచ్చి రక్కసులు నానావిధములగునాయు ధములం బ్రయోగింప నాప్రేటులకుంజిక్కిన నీమగని నచ్చటి నుండి వేఱొక్కతావునకుఁ గొనిపోయి యనేకభంగుల నుప చారములొనరించి రక్షించితివి. దేవీ! నీ వామహాపదనుండి రెండుమాఱులు రక్షించితివి కాన నందులకు నానందించి రెండు వరములు నీకు నొసంగెను. నాథా! యీవరములు వలసినపుడు కోరుదునంటివి. అట్లే కానిమ్మని భర్త పలికెను. నా కావరముల నిచ్చుసమయము తెలియదు. నీవే యావిధమంతయు నాకుఁ దెలిపితివి. నీయందుఁ గలవాత్సల్యాతిశయమున నెప్పుడైన నుపయోగించు నను నాశయమున వానిని మఱువక మది నిల్పు కొన్నదానను.

ఇపుడు మహారాజు రామాభిషేకసంభారములఁ గూర్చు చున్నాఁడు. ఆప్రయత్నము నతఁడు నిలుపునట్లు నీవు చేయం దగు. ఆ రెండువరముల నడుగునపుడు భరతునకుఁ బట్టాభిషేక మొక్కఁడు;పదునాలుగుసంవత్సరములు రాము నడవిలోనుండు నట్లు చేయుట రెండవది. అని యడుగుము. రాము నడవులఁ బదునాల్గుసంవత్సరము లుండఁజేయుదువేని యంత కాలము భరతుఁడు ప్రజలం బాలించును గాన నతనిపై వారనురాగము గలిగియుందురు. పిదప రాముఁ డరుదెంచి యెంత ప్రయత్నిం చిన నెంత శ్రమంపడినను రాజ్యము లభింపదు. అతఁడు విఫల మనోరథుఁడగును. నీకొడుకునకే రాజ్యము సుస్థిరమగును. ఇదియే యుపాయము. దీనిని సాగించువిధము నాలకింపుము.

కైకా! కోపగృహమునకుం బోయి మలినవస్త్రమును ధరించి కఠినభూమిపై శయనించియుండుము. పతి యాదర

మున నీకడ కరుదెంచును. ఆతనిం గాంచి నీవు దుఃఖము నటించి యేడ్చుచుం గన్నీటిఁ దోయైన నతనిం జూడకుండుము. ఒక్కపలు కైనఁ బలుకకుము. నీయం దామహారాజునకుఁ గడుంగడుం బ్రీతి. నిస్సందేహము. నీనిమిత్త మారాజగ్నిలోఁబడును. ఇట్టి ప్రాణాధికురాలవగు నీకాతఁడు కోపము కలిగింపఁజాలఁడు. నీకుఁ గోపముకలిగినచో నాతఁడు తలయెత్తి చూడఁజాలఁడు సుమీ. నీప్రియముకొఱ కాతఁడు ప్రాణములంగూడ వదలును. నీమాట మీఱఁజాలఁడనుట నిశ్చయము. మందమతివిగాన నీశక్తి నీవెఱుంగవు. నీసౌందర్యమహత్త్వ మెంతయో యిప్పుడైన నెఱుంగుము. రాజు రత్నాద్యమూల్యపదార్థముల నీకొసంగును. వానిపై మాత్రము మన స్సునుపఁగూడదు. అదృష్టవంతురాలవగు నోకైకా! ఆవరములను స్మరింపుము. నీవు పట్టిన పట్టును సడలనీయకుము. ఎన్నిభంగుల నతఁడు చెప్పిన నయ్యది సిద్ధించునట్లే ప్రయత్నపడుము. రాజు శయనించిన నిన్ను మహాదరణమున లేవనెత్తి కూరుచుండఁబెట్టుకొని వరమిచ్చు నేని యపు డాతనిని సత్యముగా వరమిత్తునని పలికించి మెల్లఁగా "రాజా! పదునాలుగేండ్లు రాముఁడు వనవాసముచేయునట్లు, భరతుని రాజరాజునుగాఁ జేయునట్లు వరముల ని"మ్మని యడుగుము. రాముని వనములఁ బదునాలుగువత్సరము లుండునట్లు చేసితివేని ప్రజానురాగమునకుఁ బాత్రుఁడై నీకొడుకు స్థిరరాజ్యపదుఁడగును. మరల రాముఁడువచ్చినను రాజ్య మాతనికి సంక్రమింపదు. నీకుమారుఁడే సర్వదా రాజగును.

కైకా! వరములనడుగుతఱి భరతునకు రాజ్యమిమ్మని మాత్రమే కోరక రామారణ్యవాసముంగూడఁ గోరుము.

అంత మన కెల్లయర్థములు సిద్ధించును. రాముఁ డొక్కఁడే యగును. ఆతనిపక్షమున నెవ్వరుండరు. నిష్కంటకమగు రాజ్యము భరతుఁడు పాలించును. రామవనవాసనియమకాలమంతయు బుద్ధిమంతుఁడగు భరతుఁడు ప్రజానురాగపాత్రుఁడై రూఢమూలమగు రాజ్యమేలును. కావున నీకోర్కి సిద్ధించుకాల మిదియే యని నాకుం దోఁచెడు దశరథు నేరీతినైన నిర్బంధించి రామాభిషేకమును నిలిపివేయుము. ఆపనికి నిదియే సుసమయమని మంథర చక్కఁగా బోధించెను.

దాసి యీరీతిగా బోధింపఁగా నాయుపదేశము ప్రతికూలమే యైనను ననుకూలమే యని గ్రహించెను. కైక మతిమంతురాలే యైనను మంథరాదుర్వాక్యములకు విస్మయమొంది భయపడిన యాఁడుగుఱ్ఱమువలెఁ బెడదారిం ద్రొక్కెను. ఆస్థితియందుండిన యా రాణి దాసితో నిట్లు సంభాషించెను. కుబ్జా! ఇంతదనుక నీవిట్లు మేలు తెలుపుదానవని యింతవిశ్వాసముగలదానవనియు నెఱుంగనైతిఁజుమీ. గూనివారలు భూమియందు నందఱికన్న సూక్ష్మబుద్ధి గలవారలగుదురు. వారలలో నీవు మొదట లెక్కింపఁదగినదానవు. నీవు లేకయున్న నాభర్త రామునకు రాజ్యమిచ్చి నన్నుఁ బాడుచేయంగోరియుండును. నేనద్దాని నెఱుంగఁజాలననుట సత్యము. గూనివారలు వికృతావయవములుగలవారు భూమియందనేకు లున్నారు. నీవట్టివారిలోఁ జేర్పఁదగవు. గాలిచే వంగిన పద్మమురీతి వాతదోషమున నీగాత్రము వంగినను జూచుటకు నందముగనే యున్నదానవు. నీయవయవములు వర్ణనార్హములుగ నున్నవి. నీవు నాముందఱఁ దిరుగుచు రాజహంసివలె నున్నదానవు. సకలమా

యలు నీమనమున నిమిడియున్నవి. బుద్ధివైభవము నీవభ్యసించిన రాజనీతులు నీగూనునందే కాఁపురముచేయుచున్నవి. భరతుఁడు రాజుకాఁగానే నీగూనుమీఁద బంగారుదండను వైచెదనుజుమీ. నాప్రయత్నము సఫలముకాఁగా మహాసంతోషమున మృదుహిరణ్యపంకమును నీగూనుపై నలందుదును. నీమోమున నలంకరింప రత్నములుచెక్కిన సొగసైనబంగారు తిలకమును జేయించెదను. ఎన్నియే నాభరణము లొసంగుదును. అప్పుడు నీవమూల్యవస్త్రమును ధరించి దేవతరీతిఁ దిరుగుదువులే. నాసపత్నులను లెక్కింపక యెల్లవారిని దృణీకరించుచు నొయ్యారమున నటునిటు సంచరింతువు. నీవు నాపాదములను సేవించునట్లు కుబ్జలెల్ల నీపాదముల సేవింపఁగలరు.

అని యిట్లనేకభంగులఁ దన్నుఁ బొగడుచు వేదికయందగ్నిజ్వాలతీరున శ్వేతశయ్యపై శయనించియున్న యాదేవిం గాంచి మంథర యిట్లు పలికెను. తల్లీ! గతజలసేతుబంధము పనికిరాదుగదా. రామున కభిషేకోత్సవముకాఁగా నీవు వరమడిగినను లాభమేమి? కనుక నిట్లూరక కాలముం ద్రోయక త్వరపడి లెమ్ము. కోపగృహమున కరిగి రాజెపుడువచ్చునా యని వేచియుండుము అని తన్నుఁ ద్వరపెట్టఁగాఁ గైక తానే రాజునకుఁ బ్రియురాలనని యందగత్తెనని గర్వించుచున్నది కాన యాకుబ్జోపదేశములకు లోఁబడి దానింగూడి కోపగృహమును బ్రవేశించి యమూల్యాభరణములం దీసివైచి భూమిపైఁ బండుకొని మంథరా! నామగఁ డరుదెంచి నావాంఛలఁదీర్పఁడేని నేనిందే ప్రాణముల వదలుదును. ఇది నిజము. అట్లులగునేని నీవు రాజు

నకు నామరణవార్తను దెల్పఁగలవు. అది కలుగదేని రాముఁ డడవులపాలు కాఁగా భరతుఁ డీరాజ్యమును బాలింపఁగలఁడు. ఈ రెండింటిలో నేదో యొకటిసాగును. నిశ్చయము. ఏవస్తువులతో నాకుం బనిలేదు. రామునిపట్టాభిషేకము సాగెనేని నాకు నాయుస్సు తీఱినదియే. అని కైక పలుకఁగా నాలకించి క్రూరభాషిణియగు నాదాసి కైకకు మిగుల హితము రామునకు నపకారము గావింపఁ బూని యారాణిం జూచి భాగ్యవతీ! రాముఁడే రాజగునేని నీవు నీకుమారుఁడు కష్టములకుంజిక్కి దుఃఖించుట సత్యము. కాన భరతునకే రాజ్యము వచ్చునట్లు చేయఁ బ్రయత్నింపుము. అని నారాచములవంటిమాటలచేతఁ బలుసారులు పురికొలుపఁగా నామెయు దుఃఖించి అంత ప్రీతిగనఁబఱచుచుండు ప్రాణనాథుఁ డింతఘోరకార్యమున కొడిగట్టునా యని వక్షమునఁ జేయియుంచుకొని యచ్చెరుపడుచు రామాభిషేకమునకు నాగ్రహించుచు మంథరా! నేనిచటనే యుండి యమలోకమునకుంబోవువార్త విని నీవు రాజునకుఁ దెలియఁజేయుము లేదేని రాముఁ డడవులపాలు కాఁగా భరతుఁడు రాజై సుఖములంబొందును. ఈ రెండింటిలో నేదో యొక్కండు సిద్ధము. రాముఁ డడవులకుంబోవనిచో నేను శయ్యపైఁ బండుకొనను. పూవులు ధరింపను. గంధాదుల స్పృశింపను. అన్నముం దినను. నాకేదియు నక్కఱలేదు. ఇఁకఁ బ్రాణములనైన నిలుపుకొనను. అని యిట్లు పరుషభాషణములు పలికి యాభరణములం బాఱవైచి యుత్తనేలపై పుణ్యమునశింప నాకసంబునుండి పుడమింబడిన కిన్నరాంగనవలె శయనించెను. కోపాంధకారము మోముపై వ్యాపింపఁగాఁ బుష్పహారములఁ

బాఱవైచి యేమగునో యని సంశయించుచు నాకేకయరాజ పుత్రి నక్షత్రములు పోవ గాఢాంధకారము క్రమ్ముకొన నగ పడు నాకాశమువలెఁ గనంబడుచుండెను.

మహానుభావులారా! ఈభాగమును విమర్శించి నీతిరత్నములను సంగ్రహింతము. సరస్వతీదేవి మంథరనోట నెన్నియో న్యాయములు నిష్ఠురములు పలికించి కైకయం దావేశించి యామె యవ్వాని నన్నింటిని సత్యములే యని నమ్మునట్లు చేసెను. భరతునకంటె నెక్కుడుగా భావించు రాముని వనవాసమునకుఁ బంపఁగడంగెను. రామభరతులకుం గలమైత్రి గాని, భరతునిస్వభావమునుగాని విమర్శింపకపోయెను. తన యీకపటోపాయమును కుమారుఁ డంగీకరించునా యనినైన నూహింపకపోయెను. ఈకార్యమున రాఁగల లోకాపవాదమును స్మరింపకయే పోయెను. కైక వాస్తవముగా నాలోచింప విదుషీమణి. అంతియగాక సంగ్రామనిపుణ. పతిభక్తిపరాయణురాలు. లోకజ్ఞానములేనిమూర్ఖురాలు కాదు. అట్టులయ్యు వాని నెల్ల వీటఁబుచ్చి మంథరపలుకులు తనచెవులకు నమృతోపమానములు కాఁగా వాని విశ్వసించి త్వరపడి యీకార్యమును సాధించినఁగాని కొడుకునకు జీవితములేదని నిశ్చయించెను. దీనింబట్టి మనము చక్కఁ బరికింపఁగాఁ గర్మపాశములనుండి విముక్తింగాంచు టెట్టివారికేఁ దరంబుగాదని తేలెడిని. మానవప్రయత్నమునకంటె దైవయత్నము బలవత్తమమనియుఁ బోడకట్టును. ఆవిషయమునే మనము విమర్శింతము.

"ఇదం త్విదానీం సంపశ్య కేనోపాయేన మంథరే,
భరతః ప్రాప్నుయాద్రాజ్యం నతు రామః కథంచన."

అని కైకనోట వాల్మీకి పలికించెను.

"ప్రాయస్సమాపన్నవిపత్తికాలే ధియోఽపి పుంసాం మలినా భవంతి."

అన్నప్రాక్తనసూక్తిని ముని యీయుదాహరణముచే సార్థకముగఁ జేయించెను. సకలవిషయముల నెఱింగినకైకకు నెప్పుడైన మఱవరానివరద్వయవిషయము స్మృతిగోచరము కాదయ్యెను. ఏల? దేవతలప్రయత్నమట్టిది. శారదాదేవి యావేశింపఁగా నెవ్వరేమి చేయఁగలరు? రామున కెంతకష్టమునన్నైన రాజ్యము రాకయుండునట్లు భరతునకు నిప్పుడే రాజ్యము లభించునట్లు తగినయుపాయము చెప్పుమా యని ప్రశ్నించెను. ఆలసింపకుమా యని త్వరపెట్టెను. నిక్కముగా కైకేయియే లోకోపకారమునకుఁ దోడ్పడినపూజ్యమతి.

"మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్."

అని శ్రీకృష్ణమూర్తి యుపదేశించినచందమునఁ గైక నిమిత్తమాత్రమే యయ్యెను. కర్మసిద్ధాంతము నెఱుంగనిమూఢులే కైకను దూషింతురు. మంథరను నిందింతురు. అది చేయరాని కార్యము. కర్మబద్ధులగు మనమెల్ల స్వతంత్రించి యేకార్యమును జేయఁజాలము. దైవయత్నము ఫలించుచుండ నందులకుఁ బ్రధానులము మనమని గర్వించుచుందుము. మంథరయే లేకయున్న శ్రీరామునవతారప్రయోజన మేమగును? విశ్వామిత్రముని శ్రీరాముని మహాప్రకృతిని జేర్చుట కెట్లు కారణభూతుఁడయ్యెనో ఈదాసియు రాణియు నట్లే దుష్టసంహారమునకు మిగులఁ దోడ్పడిరని మన మెఱుంగవలయును.

"ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా."

అను గీతావాక్యముచొప్పున భగవద్రూపమగుకర్మము మానవుల నాయాచందముల నాడించుచుండఁగా నెవ్వాఁడు స్వతంత్రుఁడు కలఁడు? లేఁడనుట సత్యము. కావునఁ గైక శారదాదేవి తన్నావేశించుటం జేసి మహోపకారకార్యపరాయణురాలయ్యెననియే మనము గ్రహింపవలయును. ఇదియే భగవత్సంకల్పము. దాని నెఱుంగఁజాలనివారే కైక నాక్షేపింతురు.

"తవ దైవాసురే యుద్ధే సహరాజర్షిభిః పతిః,
అగచ్ఛత్త్వాముపాదాయ దేవరాజస్య సాహ్యకృత్."

ఇది మంథరావాక్యము. సామాన్యార్థము సుగమము. దశరథుఁడు దేవరాజునకు సాహాయ్యమొనరింపఁబూని సేనలంగూడి పోవుచుఁ గైకనుగూడఁ దీసికొనిపోయెను. ఏల? "గహనా కర్మణో గతిః" అన్నమాట యిట సార్థకమగును. కైకవలన దేవతలకు మునులకుఁ గలుగఁబోవుమహోపకారమునకు హేతుభూతురాలగుటఁ గైకను బిలుచుకొనిపోఁదగు ననుబుద్ధి దశరథున కాకాలమునందే కలుగునట్లు భగవదిచ్ఛ యగుకర్మమే చేసెను. ఎందులకుఁ బిలుచుకొనిపోయెనని యెవ్వరెఱుఁగరు. కర్మగతులనరయుట శక్యమా? కైక రాఁగల రామావతారమున నింతటిమహోపకారము చేయఁగలదని సిద్ధాంతమే యయియుండెను. కావుననే దాని కనురూపముగా శారదాదేవి యామెయందావహించెను. ధర్మసంరక్షణమున కెందఱు పాటుపడిరో పాటుపడనున్నారో మన మూహింపవచ్చును. ముఖ్యముగా మన మెఱుంగఁదగినవిషయ మిదియే. లోకమునకు మహోపకార మొనర్పఁదగినది కర్మమే. కావుననే

"ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే."

అని భగవంతుఁడు చెప్పెను. భగవంతుఁ డవతరించుట కర్మ ముల మానవులు విధివిహితములుగా నాచరించునట్లు చేయు టకేకాక యెల్లరను సన్న్యాసులుగాఁ జేయుటకుఁగాదు. కనుక భక్తియనునది కర్మమున నంతర్భూతమే యగును. కర్మమును జ్ఞానవైరాగ్యములను వలదనువారు కలరుగాని భక్తి వలదను వారు కలరా యని కొందఱు మధ్వవైష్ణవులు ప్రశ్నింతురు. వారికి భుక్తియే భక్తి. మూఢులలో వారినిమించినవారు లేరనవలయు. భక్తి లేక యెవ్వఁడు నేకార్యము చేయఁజాలఁడు. జ్ఞానికాక యే కర్మ మొనరించినను లాభములేదు. వైరాగ్యము లేక కర్మముల నాచరించిన నవి సత్ఫలముల నీయఁజాలవు. వీని నొకొక్కదానిని వేఱుచేయ సాధ్యముకాదు. సోమరిపోతులే కర్మములేల? అనువారు. వా రలసులు. భుక్తితత్పరులు. కావునఁ గర్మములను వలదందురు.

"ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహం,
సంకరస్య చ కర్తా స్యాముపహన్యా మిమాః ప్రజాః."

అన్న శ్రీకృష్ణోపదేశమునఁగల సారమేమి? సత్కార్యము లన్నియుఁ గర్మాంతర్భూతములే. సర్వకర్మత్యాగము వినాశన హేతువగును. కావున గర్మసిద్ధాంతమే యన్నింటికంటె నుత్కృష్టము. దానిననుసరించి మనము ప్రవర్తించిననే భగవ దనుగ్రహమునకుఁ బాత్రులమగుదుము.

ఈ దేవాసురయుద్ధకథనమున శ్రీరామాయణమునకు నధ్యాత్మరామాయణమునకు నించుక భేదముకలదని యెఱుం గందగు.

"తత్రాకరోన్మహాయుద్ధం రాజా దశరథస్తదా,
అసురైశ్చ మహాబాహుశ్శస్త్రైశ్చ శకలీకృతః.
అపవాహ్య త్వయా దేవి సంగ్రామాన్నష్టచేతనః,
తత్రాపి విక్షితశ్శస్త్రైః పతిస్తే రక్షితస్త్వయా."

అని శ్రీమద్రామాయణము.

"యుద్ధం ప్రకుర్వతస్తస్య రాక్షసైస్సహ ధన్వినః,
తదాక్షకీలోన్యపతచ్ఛిన్నస్తస్యన వేదసః,
త్వంతు హస్తం సమావేశ్య కీలరంధ్రేఽతిధైర్యతః,
స్థితవత్యసితాపాంగి పతిప్రాణపరీప్సయా."

అధ్యాత్మరామాయణము.

ఈభేదమువలనఁ గథకుఁగాని యందలిధర్మములకుఁగాని యే మాత్రము బాధ లేదు. కథవలన గ్రహింపఁదగునీతికిని బాధ లేదు. కైక చేసినమహాకార్యమున కానందించి దశరథుఁడు రెండువరము లిచ్చుటయే మనకుఁగావలసినది. రెండుసారులు రాక్షసులవలనఁ గలుగుబాధలనుండి తప్పించినందున రెండు వరము లడుగుమని దశరథుఁడు చెప్పినట్లు రామాయణమునఁ గలదు.

"తుష్టేన తేన దత్తౌ తే ద్వౌ వరౌ శుభదర్శనే."

రామాయణము.

"ఆశ్చర్యం పరమం లేభే త్వామాలింగ్య ముదాన్వితః,
వృణీష్వ యత్తే మనసి వాంఛితం వరదోఽస్మ్యహం,
వరద్వయం వృణీష్వ త్వమేవం రాజావదత్స్వయం. ౭౦
యదా మేఽవసరో భూయాత్తదా దేహి వరద్వయం,

అధ్యాత్మరామాయణము

ఇట్టిభేదములను ప్రధానములుగా భావింపరాదు. భగవత్తత్త్వ మునే తెలుపునది యథార్థ్యాత్మరామాయణము. తత్త్వమును నిగూఢముగాఁ గథను ప్రధానముగా వెల్లడించునది శ్రీమద్రా మాయణము. అని మనము గ్రహించినయెడల నెంతమాత్రము. భేదము కనంబడదు.

"అనభిజ్ఞా హ్యహం దేవి త్వయైవ కథితా పురా,
కథైషా తవ తు స్నేహాన్మనసా ధార్యతే మయా."

అని మంథర పలికెను.

"ఇంద్రియాణి పరాణ్యాహురింద్రియేభ్యః పరం మనః,
మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః." ౪.౨

(సంకల్పవికల్పాత్మకము మనస్సు.) అను నీగీతాశాస్త్రము ననుస రించి యోజింతము. కైక మంథరకు మాత్రమే యీవిషయ మును దెలిపెను. తక్కుంగలప్రియసఖిజనమునకుఁ దెలుపలేదు. మంథరయు నింతదనుక దానిని స్మరింపలేదు. ఏల? భగవదిచ్ఛ యీవిషయ మితరులకుఁ దెలియరాదనియు నీవిషయమున నించుక లోకాపవాదమును, మహర్షివినుతిని బొందఁదగినవారు మంథరయుఁ గైకయు నని యూహించి స్మృతికి రాకయుండ నొనరించెనని మన మెఱుంగందగు. సకాలమున నొకతుకకు స్మృతిగోచరమయ్యెను. దీనింబట్టి మనము నిష్పక్షపాతముగా నూహించిన మంథర కైక పామరులదూషణములకు గుఱి యైనను దేవతలయు, మునులయు సంస్తుతికిఁ బాత్రభూతు రాండ్రై యైరని తేలకమానదు. కనుకఁ బ్రతివిషయమును విన్నంతమాత్రమున మంచిదని చెడ్డదని పలుకక సావధాన ముగాఁ బరిశీలించి దానఁ గలుగఁబోవుఫలమును దెలిసి యొక

భావమును దెలుపవలయు ననునీతిని మనము చక్కఁగా గ్రహింపవలయును.

"ప్రవ్రాజనం తు రామస్య త్వం వర్షాణి చతుర్దశ.
చతుర్దశ హి వర్షాణి రామే ప్రవ్రాజితే వనం,
ప్రజాభావగతస్నేహస్థిరః పుత్రో భవిష్యతి."

అను నీమంథరావాక్యములఁ బరికింతము. వనములఁ బదునాలుగేండ్లు రాముఁడుండఁజేయుము. అంతలో భరతుఁడు ప్రజలయనురాగమునకుఁ బాత్రుఁడై స్థిరరాజ్యుఁడగును. శారదాదేవి మంథరనోట యీమాట చెప్పించినది. పదునాలుగుసంవత్సరములని యేల నియమము? అను ప్రశ్న రావచ్చును. ఈ ప్రశ్నమునకు బదులువ్రాయుటకుఁదగినస్థలము లనేకములున్నవి. ఇందును వ్రాయుదును. విరాధాదిరాక్షసుల వధించుపని శ్రీరామమూర్తికిం గలదు. ఒక్కొక్కనికిఁ బరిమితి రావలయును. విరాధునకు శాపాంతసమయము రావలయును. ఆసమయము నకుఁగాని ముందుగా నాకృత్యమునకుం బోరాదుగదా. శరభంగముని యగ్నిప్రవేశముచేసి పరమపదమునకుఁ బోవుసమయమున నందు దర్శనమీవలయును. ఖరదూషణాదులకు సాంఘాతమరణము కావలయును. దానికిఁ దగుసమయము రావలయును. ఇట్లే వాలిప్రభృతులకు రామునివలనఁ బరమపదము లభించుసమయములు గలవు. పదునాల్గవవత్సరము తుదిభాగమున రావణసంహారము కావలయును. వారనుభవించు కర్మఫలము లుండఁగా ముందు వారిని వధింపరాదుకదా. ఎవ్వరెవ్వరి కేయేకాలమున నెవ్వారినుండి శుభాశుభఫలములు గలుగఁదగునో యవి యట్లే సాగవలయును. కావుననే కర్మ

సిద్ధాంత మన్నింటఁ బ్రధానత వహించినది. దానిని భగవం తుఁడు మార్పఁబూనఁడు. సర్వశక్తుఁడగు నామహనీయమూర్తి మార్పఁజాలఁడా యని యడుగ రాదు. స్వోక్తివ్యాఘాతముగ నాపరమేశ్వరుఁడు ప్రవర్తింపఁడు. "నిజాజ్ఞారూపనిగమా పుణ్యాపుణ్యఫలప్రదా" అనువాక్య మిందులకుఁ బ్రమాణము కాఁగలదు. భగవతియాజ్ఞయే వేదములని యర్థము. అట్టి మహా మాయ తనయాజ్ఞను దానే దాఁటిన నింకఁ బాటించువా రెవ్వరుందురు? అట్టిపని నాయాదిమదంపతులు చేయరు. కావు ననే కర్మగతి యప్రతిహతమయ్యెను. ఇందఱికర్మము లీరీతి ఫలము నీయఁదగుకాలము రావలయునుగానఁ బదునాలుగు వత్సరములనునియమము మంథరాముఖమునుండి వెడలునట్లు వాగ్దేవి యొనరించెనని మన మెఱుంగందగు. "గహనా కర్మణో గతిః" అని యెన్నిసారులు పఠించినను దానిసిద్ధాంతము సరిగాఁ దెలియకుండును. పరమాత్మయే యామాటను జెప్పినప్పుడు తక్కినవారిమాట యిటనేటికి? మానవులకుఁ గర్మగతుల నరయఁ దరముకాదనుట సత్యము.

"క్రోధాగారం ప్రవిశ్యాద్య క్రుద్ధేవాశ్వపతేస్సుతే,
శేష్వానంతర్హితాయాం త్వం భూమౌ మలినవాసినీ."

రాజగృహనిర్మాణ మెంతవిచిత్రముగ నుండెనో యోజింపుఁడు. కోపమూనినతఱి నొకయింట నుండవలయును. అంతఃపురమున నొకభాగమునఁ గ్రోధాగారము కట్టఁబడియుండును. ఆసమయ మున నాయింటనే యుండందగు. ఇట్లే మఱికొన్ని కార్యము లకు మఱికొన్నిగృహములు కట్టఁబడియుండును. తొలుదొలుత నీగృహనిర్మాణమపహాస్యభాజనముగా నుండును.

ఈగృహనిర్మాణమునకు ఫలమేమని విచారింతము. మహా యోగులమాటవదలి సాధారణమానవులవిషయ మిట గ్రహింతము. క్రోధము కలిగెననఁగా రజోగుణము విశేషించి వృద్ధి నొందెనని యర్థము. ఆస్థితియందుండుచోట నాతని తేజము వ్యాపించును. అయ్యది మలిన తేజస్సే యగు. ఆచోట భగవద్ధ్యానముచేయ నారంభించినచో నతనిమనస్సు మలినమే యగును. ఎందులకు? ఆ తేజ స్సీతని వ్యాపించునుగదా. దానిం జయించునంతటి శక్తిగలయోగుల కీనియమములు చెల్లవు. దేవతాగృహమని వేఱుగ నుండుటయు నిందులకే. అందుఁ బ్రవేశించునపు డితరచింతలుండక యుండవలయు. ప్రతిదిన మందు దైవమునుగూర్చి పూజయో ధ్యానమో సల్పుచుండుటంజేసి యందుఁ బరిశుద్ధ తేజస్సు వ్యాపించియుండును. అందుఁ జొచ్చువారలయం దది వ్యాపించును. కావున నితరచింతలు మదిఁ జొరకయుండ నయ్యది చేయును. ఇట్టికారణము లనేకము లుండుటంబట్టి క్రీడాగృహము, సభామండపము, కోపాగారము లోనగునవి వేఱువేఱుగా నుండునట్లు కట్టుదురు. ఆయాగృహముల నుండునపుఁ డాకార్యముకొఱకని యితరు లెఱుంగుదురు.

"శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః,
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరం. ౧౧.
తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః,
ఉపవిశ్యాసనే యుంజ్యాద్యోగమాత్మవిశుద్ధయే." ౧౨.

గీత. ౬. అధ్యా.

అనుగీతావాక్యము పై వ్రాసినయాశయమును దృఢపఱచెడిని.

"శుచౌ శుద్ధే వివిక్తే స్వభావతః సంస్కారతో వా దేశే స్థానే."

అని శంకరభాష్యము.

పరిశుద్ధస్థలమనఁగా మంత్రములచే నందుఁ గలభూత జాలములఁ బాఱఁదోలియున్నచోటని యర్థము. దేవాలయములు, తపోవనములు, నదీతీరములు పావనములని తెలియందగు. మహర్షులుకూడ నట్టితావులకే పోయి తపస్సు చేయు టెందులకు? మున్ను మహాత్ము లెందఱో యందు నియతులై తప మాచరించియుందురని, వారి తేజస్సందు వ్యాపించియుండునని, యాచోటఁ దపోవిఘ్నకరము లగుభూతము లుండవని, యందుఁ గూరుచున్న మంచియూహాలు కలుగుననియే కదా. కనుకనే రాజగృహములయందేమి సామాన్యగృహములయందేమి యుచితరీతి నాయాయి కార్యముల కాయాయితావులు నిర్ణయింపఁబడవలయును. విహారగృహము దైవప్రార్థనమున కుపయోగింపరాదు. ఊహాలు మార్పునొందును. దేవాలయములు విశేషధనవ్యయ మొనరించి నిర్మించుట పామరులు మహారణ్యములకుఁ బోవఁజాలరనియు, దేవాలయములకుఁబోయినపుడైన నది పరిశుద్ధస్థలమన్న భావము కలుగుననియు, నందున్న కాలమునందైన దుర్వాసనలు నశించి మంచియూహాలు కలుగుననియు, నీలాభములు గ్రామవాసులకుఁ గల్గించుటకే యని యెఱుంగందగు. దేవాలయములవలన నింతకంటె నెక్కుడు లాభము కానరాదు. ఆశిలావిగ్రహమే ముక్తినిచ్చునని నమ్మియుండరాదు. దానిని మదిఁ బదిలపఱచుకొని ధ్యానింపవలయును. దాననే లాభము కలుగును.

"దయితా త్వం సదా భర్తురత్ర మే నాస్తి సంశయః,
త్వత్కృతే స మహారాజో విశేదపి హుతాశనమ్.
న త్వాం క్రోధయితుం శక్తో న క్రుద్ధాం ప్రత్యుదీక్షితుం,
తవ ప్రియార్థం రాజా హి ప్రాణానపి పరిత్యజేత్."

అను నీమంథరావాక్యముల నించుకఁ బరిశీలించినఁ బ్రాచీనులు ప్రియపత్నుల నెట్లు బహూకరించిరో స్మృతు లెట్లు విధించెనో తేటపడఁగలదు.

"యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః,
యత్రైతాస్తు న పూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియాః. ౫౬
శోచంతి జామయో యత్ర వినశ్యత్యాశు తత్కులం,
న శోచంతి తు యత్రైతా వర్ధతే తద్ధి సర్వదా. ౫౭
జామయో యాని గేహాని శపంత్యప్రతిపూజితాః,
తాని కృత్యాహతానీవ వినశ్యంతి సమంతతః. ౫౮
తస్మాదేతాస్సదా పూజ్యా భూషణాచ్ఛాదనాశనైః,
భూతికామైర్నరైర్నిత్యం సత్కారేషూత్సవేషు చ. ౫౯
సంతుష్టో భార్యయా భర్తా భర్త్రా భార్యా తథైవ చ,
యస్మిన్నేవ కులే నిత్యం కల్యాణం తత్ర వై ధ్రువం. ౬౦
స్త్రియాం తు రోచమానాయాం సర్వం తద్రోచతే కులం,
తస్యాం త్వరోచమానాయాం సర్వమేవ న రోచతే." ౬౧

మనుస్మృతి. 3 అధ్యా.

"యోషాతిరూపసంపన్నా గర్వితా మదశాలినీ,
మమ రూపైవ సా జ్ఞేయా పుష్పేనాపి న తాడయేత్."

కాశీవాక్యము.

ఈవచనములం బరిశీలించినభర్త భార్యకు విశేషించి వస్త్రాలం
కారాదుల నిచ్చి సంతోషము కలిగింపవలయుననియు, అట్లు
చేయక వారిని దుఃఖములపాలు చేసిన నాకుల మేనశించుననియు,
వారు దుఃఖపడ రాదనియుఁ దేలెడిని. ఈనియమములననుసరించి
దశరథుఁడు కైకను విశేషించి సత్కరించుట న్యాయ్యమే కాని
విరుద్ధము కాదు. భార్యకొఱకుఁ బ్రాణములర్పించుటయు నన్యా
య్యము కాదు. ఇక్కారణములంబట్టి దశరథుఁడు కాముకుఁ
డనుట విశేషదోషము. కైక పతిభక్తికలది కాదనుటయు నంత
కంటెఁ దెలివితక్కువచేతనే. ఆమెమూలమునఁగాని శ్రీరామా
వతార ప్రయోజనము లోకులకు దేవతలకు సమకూడదు.
ఆకారణమున దేవతలు ప్రార్థింప శారదాదేవి యావేశించెను.
దాన నామె పరవశయై పలికెననియు, మంథరయు నట్లే పలు
కుల నామెఁ బ్రోత్సహించెననియు మన మూహింపవలయును.
ఈవిషయము రామాయణమునకు విరుద్ధము కాదా యనుదు
రేని కాదు. రామాభిషేకవార్తను దెలుపుచుఁ దొలుత
మంథర తనభావమును వెలిఁబుచ్చెను. అపు డామె మెడలో
నున్నహారము నొసంగి తెలిపినమాట లెట్టివి? ఆయభిప్రాయము
మార్పునొంద హేతువేమి? శ్రీరామాయణమున నీవిషయము
ధ్వనిరూపమునఁ గలదనియే గ్రహింపవచ్చును కర్మసిద్ధాంతము
నిట నన్వయింతము. రావణాదిదుష్టరాక్షసుల దుష్కర్మము.
మహర్షులయు దేవతలయు సత్కర్మము కైకను బ్రోత్సహించెను.
ఇదియు నధ్యాత్మరామాయణభావము నొక్కవిధమే యని
యెన్నఁదగు.

"కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః"

అన్నగీతావాక్యము కర్మము బలవత్తరమనియు, దానికి నెల్లరు లోఁబడుదురనియు బోధించుచున్నది. కావునఁ గైక శీలమున నించుకంతయు దూషింపఁదగినభాగమే లేదనియు, దేవకార్యార్థమే మహామాయ యారాణిని బ్రేరేపించెననియు, నామెశీలము స్తోత్రపాత్రమే కాని నిందార్హము కాదనియు మన మెఱుంగవలయును.

"ఏవం ప్రవ్రాజితశ్చైవ రామోఽరామో భవిష్యతి,
భరతశ్చ హతామిత్రస్తవ రాజా భవిష్యతి."

అనుమూలము విమర్శింపఁదగును.

"రామోఽరామ ఇత్యత్ర అరామ ఇతి పదచ్ఛేదః, అరామో భవిష్యతి. ఇదానీమేవ ప్రకృతిస్నేహపాత్రం న భవిష్యతీత్యర్థః. రామో భవిష్యతి ఏక ఏవ భవిష్యతీత్యర్థః."

అని గోవిందరాజులు.

"రామో రామో భవిష్యతీతి స్వయమేక ఏవ భవిష్యతి. రమయత్యానందయతీతి రామః, మునీనామితి శేషః."

అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి.

ఈవాక్యమును మహాకవి వాల్మీకి మంథరనోటఁ బలికించెను. కైకా! నీవడవులకు రాముని఼ బంపిన యెడలనే రామమూర్తి మునిజనమనోరంజకుండగు. అనఁగా నడవులకు శ్రీరామమూర్తి పోయి దుష్టదానవుల మడియించి వారలకు నుత్తమలోకములఁ గల్పించిననే మహర్షు లానందింతురు. భరతుఁడుకూడ నపుడు శ్రీరామపాదసేవాసక్తుఁడయి యరిషడ్వర్గమునోడించి విజితేంద్రియుఁడై శ్రీరామభక్తుఁడన్న ప్రఖ్యాతిం

గాంచి రాజు కాఁగలఁడు. అనఁగా భరతుఁడు రాజ్యము నాసించువాఁడు కాఁడు. రామభక్తుఁడన్న భావము నెల్లరకుం గల్గించి వారలను రంజింపఁజేయఁగలఁడు. కైకా! నీ వీకార్యమున నౌదాసీన్యము పూనుదువేని లోకాపకారిణి వగుదువు సుమీ యని మంథరయాశయమను విశేషార్థమును దెలిసికొనవలయును. ఈయర్థమును గ్రహించినఁగాని

"హేమ్నస్సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధిశ్శ్యామికాపివా."

అను కాళిదాససూక్తి ననుసరించి రామాయణమునఁ గలనీతి తేటపడదు. మంథర దుర్మార్గురాలు. కైక పాపస్వాంత యను దుర్భావము వదలవలయు. నిజముగాఁ గైక పాపాత్మురాలే యైన యెడల శ్రీరాముఁ డామెను కౌసల్యంబోలె సేవించెననుట యసంగతప్రసంగ మగును. పూతచారిత్రలనే భగవంతుఁ డాదరించును. లోకులకు బుద్ధి సదాచారము ననువానిని నేర్ప సేవించును. అంతియకాని దుశ్చరిత్రల నాదరింపఁడు. ఈవిషయము శ్రీరాముఁడు కైకతో సంభాషించుకాలమున మఱియుఁ బెక్కుతావుల స్పష్టమగును.

"అనర్థమర్థరూపేణ గ్రాహితా సా తతస్తయా,
హృష్టా ప్రతీతా కైకేయీ మంథరామిదమబ్రవీత్.
సా హి వాక్యేన కుబ్జాయాః కిశోరీవోత్పథం గతా"

అను నీమూలముం జూడుఁడు. సామాన్యార్థము వదలి విశేషార్థముల బరిశీలింతము. సామాన్యదృష్టి కనర్థముఁగాఁ (కీడుగా) గనంబడి పరమార్థదృష్టికి ననుకూలప్రయోజనముగాఁ గనంబడునట్లు తెల్పినమంథరావాక్యములను జక్కఁగా నెఱింగినదై అనఁగా గ్రహించినదియై కైక మహాహర్షమున మంథర తనకు

మేలుగలుగ బోధించెనని తానెఱింగినందునఁ గల్గిన పట్టరాని సంతోషమున నిట్లు పలికెను. దేవతలయు మునులయుఁ బ్రజలయుఁ గష్టములఁ దీర్చి సుఖమును ధర్మరక్షణము నొనరించు కార్యము నామూలమునంగానున్నదిగదాయన్న సంతోషమని గ్రహింపందగు. ఈయర్థము న్యాయ్యమాయందు రేని

"కైకేయీ విస్మయం ప్రాప్తా పరం పరమదర్శనా"

అను దీనికిం దరువాతిదగుమూలముంగాం చుఁడు. పరమదర్శనా= మంచిని జూచునది యని యర్థము. ఆపదము వ్యర్థముకాదా. కావుననే యీయర్థమే మహాకవిభావమని మన మెఱుంగందగు. ఈఘట్టమున నాంధ్రీకరణ మెట్టులున్నదో పరిశీలింతము. విమర్శకులిచ్చో నాపద్యము లాకాశరామన్నపంచాంగమనిరి. మూలము మరల వ్రాయను. ముందున్నదానిని జదివితిరికదా.

సీ. ప్రతికూలమైన యర్థంబుల ననుకూల
  ములుగ నమ్మంథర బోధసేయ
నారీతి గ్రహియించి యాకైక మును సద్వి
  షయములఁ జూచు నైజంబుగలది
యయ్యును గుబ్జవాక్యముల కచ్చెరువంది
  భ్రాంతినొందిన బడబావిధమున
నపమార్గమును ద్రొక్కె నంత నాబోధకు
  సంతసమంది కుబ్జ నటఁ గాంచి
తే. పలికె నీవింత మేలైన పలుకు చెప్పు
  దాన వనియును మేలైన దానవనియు

నింతకాలమునుండి నే నెఱుఁగనైతిఁ
దెలిసె నిప్పుడు నీవగు తీరులెల్ల.

(ఆంధ్రశ్రీమద్రామాయణము.)

తేటగీతమునకు మూలము పైనవ్రాయలేదని గ్రహింపవలయు.

క. కావున రాముని రాజుగఁ
గావింపఁగనీకుమన్నఁ గైకయు భృశహ
ర్షావిష్టచిత్త యగుచుం
దావిషమగునర్థ మెంచెఁ దనహిత మనుచున్.

క. కారాని తెరువులం జనఁ
గోరినగోడిగవిధానఁ గొని విస్మయమున్
జారువిలోచన తమిపెం
పారఁగ నిట్లనియెఁ గుబ్జ కతిమోదమునన్.

(వావిలికొలనువారి రామాయణము.)

ఒకానొకవిమర్శకాగ్రేసరుఁడు నాపద్యములు మూలార్థమును బోషింపలేదనియె. వావిలికొలనువారిపద్యములు మూలార్థపోషకములనియె. పాఠకమహాశయులే యావిమర్శకు నభిప్రాయమెట్టిదో పరికింతురుగాక. మహాశయులమదులయం దుండినం జాలు. వారు వెలిఁబుచ్చునక్కఱలేదు.

కొందఱు కైక మంథరకు మరల నెన్నియోయలంకారములనిత్తునని పల్కెనుగదా. కైక దుశ్శీలముకలదికాదని యెట్లులనందగునందురు. వారిప్రశ్నమును విన్నంతనే నవ్వురాకమానదు. తనవలన నింతమహోపకారము దేవర్షులకుఁ గలుగనుండఁగా ధర్మమునకు నిలువనీడ దొరకనుండఁగాఁ దెలియక

రామాభిషేకమువార్త విని యానందించిన తనకు మేలుగలుగు మార్గమును వినిపించినమంథరకు బహుమానము చేయుదునని కైక పలికెను. ఇదియే సమాధానము. ఈభావమును మది నిడుకొనియే రామాయణమును బఠింపవలయు. అపుడే ధర్మరక్షణమున కెవ రెవ రెట్లు తోడ్పడి భగవంతునియనుగ్రహమునకుం బాత్రులైరో తేటపడఁగలదు. లేకున్న సత్యము బయల్పడదు.

"నరేంద్రపత్నీ విమనా బభూవ సా తమోవృతా ద్యౌరివ మగ్నతారకా"

అని మూలము. క్రోధాగారమున శయనించియున్నకైక యంధకారావృతాకాశమువలె నున్నదని మహాకవి తెల్పెను. ఏల? వాగ్దేవి యావేశించినందునఁ దనయూహాలు మాటుపడఁగా నేమియుఁ దోఁపక నవ్యాభిప్రాయములుగలదై యుండెనని భావము.

ఈభాగమును బరిశీలించినం దేలెడుసారమేమి? లోకోపకారమే భగవత్సేవ యనుకొనువారు స్వసుఖమును బాఱఁదోలి సకలశ్రమములకు నోర్చి పరమార్థ మదియే యని పాటుపడవలయుననున దొకనీతి. మంథరయుఁ గైకయు శ్రీరామవర్తనము నెఱింగినవారలే. మహాప్రీతి యతనిపైఁగలవారలే. ఐనను సకలజగదుపకారమునకై యవతరించినప్రకృతిపురుషుల యాశయము ననుసరించి రాముని వనవాసమునకుం బంపుటకుఁ బూనిరి. దేవతలయుద్దేశము మహర్షులవాంఛయు నెఱవేర్పఁ బూని రనునది యొకనీతి. ఈవిషయములం బరికించి వారిని దూషింపరాదనియు, నయోధ్యాపురమునఁ గలవార లెవ్వరు నింతటి మహోపకారము లోకమునకుఁ జేయఁబూనినవారు లేరనియు నెఱుంగవలయును. స్వల్పలాభమునకు నాశపడక

మహాలాభకార్య మేదియో దాని నెఱవేర్పఁ బ్రయత్నింపవల యును. ఇఁకఁ బ్రకృతివిలాసము లెట్లు చెలరేఁగునో పరికింతము.

## దశరథుఁడు కైకను జూడ నరుదెంచుట.

* పాపకార్యదృష్టిగలమంథర న్యాయము తాఱుమాఱగు నట్లు చెప్పినమాటలు విని కేకయరాజపుత్త్రి విషముపూసిన బాణము నాటుకొనఁగా భూమింబడినకిన్నరాంగనంబోలి క్రిందఁ బండుకొనియుండెను. తానేమి చేయవలయునో చక్కఁగా నిశ్చ యించుకొని మెల్లగా గూనిదానికిం దెలిపెను. తనపూనినపని యెట్లు నిర్వహింపఁబడునో యనునసుమానమున వగలు పైకొనఁగా దాసిమాటల కులికిపడి యాఁడుఁబాముువలె నిట్టూర్పులుపుచ్చుచు ముహూర్తకాలము తనకు సుఖము గలుగుమార్గ మేదియని యాలోచించి కర్తవ్య మిదికదా యని తీర్మానించుకొని మంథరతో నీవు చెప్పినది న్యాయ్యమే యను కొందునని పల్కెను. తనదేవియందు విశేషాదరముగలదాసి యామెనిశ్చయము నెఱింగి పరమసంతోషమును బొందెను.

కైక యంతట తనపూనిక నెఱవేర్ప నిశ్చయించి కోప మునఁ గనుబొమలు ముడివడుచుండఁగా నేలపైఁ బండుకొని యుండెను. కార్య మెట్టులైన నగుఁగాక యని యారాణి తా ధరించినపూలదండల విసరివైచి రత్నహారములఁ బాఱవైచి పండుకొనఁగా నవి యందందుఁ బడియుండెను. అవి నక్షత్రము లాకాశమునుబలె నాభూమిని బ్రకాశింపఁజేసెను. ఏవిధమగు

*ఇది పదియవ సర్గమునుండి గ్రహింపఁబడినది. అధ్యాత్మరామాయణ కథాసార మిం దిమిడియే యుండును.

నలంకారములఁ జేసికొనక కోమలములగు వెండ్రుకల నొక్క ముడివేసికొని మలినాంబరమును గట్టుకొని ప్రాణములు వదలి పడియున్న కిన్నరస్త్రీవలె నుండెను.

మహారాజు శ్రీరామునకుఁ బట్టాభిషేకము చేయ నిశ్చయించి యందులకు వలయుపరికరములఁ గూర్ప నేర్పఱచి సభాసదులయనుమతింగొని తనమనస్సునందు నాముద్దులమూటయగు రామచంద్రునకుఁ బట్టాభిషేకోత్సవము చేయఁబూనుట యందఱకుఁ దెలిసిన దిప్పుడే. ఈవార్త కైకకుఁ దెలియ నవకాశ మెక్కడిది? అని తలంచి యీశుభవార్త నెఱింగింపఁ గైకమిక్కిలి యర్హురాలు. అనుకొని యామె యంతఃపురమునకుం బోయెను. తన్ను ప్రేమింగఁబూను రాహువుంగూడి తెల్లని మేఘము వ్యాపింపఁగా నున్నయాకాశమును జంద్రుఁడు ప్రవేశించు చందమున నారాజు తనకంతమును గల్పింపఁబూనియున్న కైక వసించియున్న సౌధముం జొచ్చెను. అందు శుకములు లోనగు పక్షులు శృంగారమునకై పెంచఁబడి మనోహరముగాఁ గూయుచుండెను. వాద్యధ్వను లెల్లయెడలఁ జెలరేఁగుచుండెను. ప్రియముగా మాటలాడువా రనేకు లందుండిరి. సొగసుగాఁ బూలతీఁగెలుగల పొదరుటిండ్లందందుఁ గనఁబడుచుండెను. విచిత్రగృహము లాసౌధమునకు నలుదిక్కులఁ గట్టఁబడియుండెను. మంచిదంతములతో రజతకాంచనములతో నలంకరింపఁబడిన యరుఁగులు కనంబడుచుండెను. అకాలమునఁగూడఁ బూలు కాయలు కనంబడ ననేకదోహదక్రియలు చేయంబడుటచేఁ బుష్పములు ఫలములు వృక్షములఁ గనంబడుచుండెను. వాపికలు సరస్సు లాయాయితావుల సొంపుగా నుండెను. ఇంక

నెన్నియో శృంగారవస్తువు లం దమర్పఁబడియుండెను. సకలా
భరణభూషితలగు కాంతామణులు తిరుగుచుండుటం జేసి యప్స
రస్సమావృతమగు నాకలోకమువలె నానగరు వెలయుచుండెను.

రాజేంద్రుఁ డెంతయు మరులుగొలుపువస్తువుల నల
రారు నానగరుఁ బ్రవేశించి యందుఁ దల్పమునఁ దనప్రేయసిం
గాంచక యందుఁగలవస్తువులు తనకు నిర్భరానందపారవశ్య
మును గల్పింపఁగాఁ బ్రాణనాయికం గాంచక వేడుకకొఱకు
వచ్చినవాఁడగుటఁ గేకయాత్మజా యని పిలిచి యో యను
బదులు వినరామికి విషాదమునొందుచు మున్ను తానరుదెంచు
తఱికి సకలశృంగారముల నలరుచు నాలేమ సుస్మితముమోముఁ
దమ్మిఁ జిందులాడ నెదురుగా వచ్చునది కాన నాఁ డట్లురాకుండు
టకుం గారణ మెఱుంగఁజాలక పరితపించెను. మున్నెన్నఁడు
నట్టు లాసౌధము శూన్యముగాఁ గనంబడినదే లేదు. నాఁ డట్లుం
డుట కతఁడు దుఃఖించెను. కైక తనపనియందే యాసక్తికల
దనిగాని భావ్యనర్థముల నెఱుఁగనిదని కాని యతఁ డెఱుంగఁడు.
ఎన్నఁడేని కార్యాంతరనిమగ్నయై తన కెదురు రాకయుండ
నడుగునట్లే ద్వారపాలకుం గని కేకయరాజకుమారి యెందున్న
దని యడిగెను. వాఁడు భయంపడి సంభ్రమమున నంజలింగీలించి
మహాప్రభూ! దేవిగారు మిగులఁ గోపించి కోపగృహమునకుం
బోయిరని విన్నవించెను.

ముందే కలిగినదుఃఖమునకుఁ దోడు కోపమూనియున్న
దని తెలియఁగనే మఱింత విచారముపైకొన నారాజచంద్రుఁడు
నిశ్చేష్టుఁడై యప్పుడే కోపగృహంబునకుంబోయి కటికనేలపైఁ
బరుండఁదగని కోమలాంగముకల యాప్రేయసి నేలఁ బండు

కొని యుండంగాంచి వగలంబొగిలెను. కపటమున నెట్టిదో యెఱుంగనియారాజు పాపసంకల్పముగల యాకైకం గనెను. వృద్ధుఁడు తానగుట నవయువతి కైకయగుట కారణములుగాఁ దనప్రాణములకంటె మిన్నగా నామెం దలంచుకొను నారాజు కైకదురూహను దెలిసికొనఁజాలకపోయెను. ఛేదింపఁబడిన తీఁగవలె, భూమిపయిం ద్రోయఁబడిన కిన్నరాంగనరీతి పుడమిం ద్రెళ్లిన దేవతచందమున స్వర్గమునుండి భూలోకమునకు జాఱి పడినయచ్చరమిన్నకరణి, నొరుల మోహింపఁజేయఁబూని రూపము తీరుతప్పఁగా నున్నమాయభంగి, వాగురులం జిక్కిన జింకయట్లు, వనమున మృగయుఁడు విషముపూసినబాణమును వైవ నయ్యది మేన నాటుకొనఁగా పడినగజస్త్రీవడవునఁ గైక నేలఁ బండుకొనియుండఁగాఁ గన్నులారఁ గాంచి బాణహతిం బడిన స్త్రీగజమును మగగజమువచ్చి స్పృశించులాగున స్నేహము వృద్ధినొంద స్పృశించెను.

తాను గాముకుండగుట నన్నులమిన్నను దామరసాక్షి నాకైకను దడవుచు నిట్లు ప్రశ్నించెను. ప్రాణనాయికా! నీకుఁ గోపము రాఁగతమేమో తెలియఁజాలకయున్నాఁడను. ఎవ్వరే నిన్ను నిందించిరా? అవమానించిరా? తెలుపుమా. శుభాంగీ! భూరజమున శయనించి నీవుండ నాకు దుఃఖము కలుగకయుం డునా? నాకు మేలుగోరుచుందువుకదా. ఇది యమంగళకార్యము కదా. నీపై నాకుఁ బ్రేమ మపారము. ఇట్టి నేను బ్రదికియుం డఁగా దయ్యముసోఁకినట్లు నీవు క్రిందఁ బండుకొనియుండఁగా నాచిత్తము దుఃఖమున మునుంగకయుండునా? హృదయేశ్వరీ! నీకు వ్యాధి కల్గెనా? దేవవైద్యులవంటి భిషగ్వరులు కలరు. నా

వలనఁ దృప్తులై వారున్నవారు. వారు నీరోగమును దొలఁగించి సుఖము చేకూర్తురు. నీకు మేలుచేసినవాఁడెవఁడు? కీఁడుచేసిన వాఁడెవ్వఁడు? వారికి బదు లేమేమిచేయవలయునని కోరెదవు? తెలుపుమా. నీకోర్కులందీర్తును. ఏడువనేల? నీవు చెప్పినట్లు నేను జేయకయున్నఁగదా నీకీదుఃఖము కలుగవలయు? కోమల శరీరము నలయింపకుము. ఎవరినే వధింపఁగోరుదువా? వాని నెఱిఁగింపుము. వాఁడవధ్యుఁడేయైన వధించెదను. నీవెవనినైన రక్షింపఁదలఁచితివా? వాఁడు నిక్కముగా వధింప నర్హుఁడే యైన వదలిపెట్టుదును. దరిద్రుని ధనవంతునిగా ధనవంతుని దరిద్రునిగాఁ జేయఁదలంచితివే నట్లుచేసెదను. నేను నాసేవకులు నీవశముననున్నవారమే. ఎట్లు పంచిన నట్టు లొనరింతుము. నీయభీష్టమును దీర్పుటకై నాప్రాణములు పోయిన నంగీకరించి దానిని సాధింతును. నీయందు నాకుఁ గలప్రేమ మపారమని యెఱుంగుదువుకదా. అట్టులెఱింగియు నాయందేల సంశయము నీకుంగలిగెను? నీవుచెప్పినదాని ఫలింపఁజేసి నీకానందమును గల్గింతును. నిస్సందేహము. అని నాపుణ్యము సాక్షికమని శపథముచేయుదును.

కైకా! మఱొక్కమాట వినుము. సూర్యకిరణములు వ్యాపించునంతదనుక నాయాజ్ఞను శిరసావహించురాజ్యము నాకుంగలదు. అందు నాలుగుదిక్కులయందును సింధు, సౌవీర, సౌరాష్ట్ర, దక్షిణాపథ, దేశములు, అంగ, వంగ, మగధ, మత్స్యదేశములు, కాశీకోసలాదులు నింకను బహుదేశములు గలవు. వానియందు ధనధాన్యకంబలాది బహువిధామూల్య ద్రవ్యములు గలవు. అందేది కావలయునో తెల్పుము. ఇప్పుడే

యితును. నీవు భీరువవు. ఇట్లు నేలంబరుండి యలసటలఁ గుందిన మేలేమి? శుభాంగీ! నేల శయనింపనేటికి? ఇది తగదు సుమీ. లెమ్ము. లెమ్ము. నీకు భయ మేల కలిగెను? నాకుం దెల్పిన సూర్యుఁడు మంచును విరియించురీతి నాభీతిని దొలఁగింతును. అని యిట్టు లనేకరీతుల రాజూఱడింపఁగాఁ గైక తనయప్పటి స్థితికే దుఃఖపడుభర్తను ఇంకను నిర్బంధించి శపథములు చేయించి విశేషించి బాధింపందలంచెను.

మహాశయులారా! మంథరోపదేశము శారద యావేశించినందున ఫలించినట్లే భావింపవలయును. ఈఘట్టమునుండి మన మెఱుంగఁదగిననీతి యొకఁడు కలదు. దానిని మన మెఱుంగవలయును.

"ధీరోఽత్యంతదయాన్వితోఽపి సుగుణాచారాన్వితో వాథవా
నీతిజ్ఞో విధివాదిదేశికపరో విద్యావివేకోఽథవా,
దుష్టానామతిపాపభావితధియాం సంగం సదా చేద్భజే
త్తద్బుద్ధ్యా పరిభావితో వ్రజతి తత్సామ్యం క్రమేణ స్ఫుటం. ౨-౨
అతస్సంగః పరిత్యాజ్యో దుష్టానాం సర్వదైవ హి,
దుస్సంగీ చ్యవతే స్వార్థాద్యథేయం రాజకన్యకా." ౨-౩
అధ్యాత్మరామాయణము ౨ సర్గము.

ఎంతటివాఁడుకాని దుస్సంగమువలన భ్రష్టుఁడగును. వాని యోగ్యత యెంత మంచిదిగానున్నను దుస్సాంగత్యబలమున నయ్యవి వ్యత్యయమగును. కైకవంటి యుత్తమకాంత మంథరావాక్యములకు లొంగిపోయెను. అను నీవిషయము అధ్యాత్మరామాయణమునఁ గలదు. దానిని మనము చక్కఁగా మది నిల్పుకొనవలయును. కైకయు మంథరయు మహోపకారమును

జేసిరనునది రహస్యార్థము. సామాన్యార్థము పరిశీలింపఁగా మంథర దుర్బోధము చేయఁగాఁ గైక దానికి లొంగెననికదా తేలెడిని. ఎన్నివిధములచేతను దుస్సహవాసము పనికిరాదనియు, సత్సహవాసము శ్రమించియైనఁ జేయవలయుననియు సారము దీనినుండి మనము గ్రహింపవలయును.

"ప్రియార్హాం ప్రియమాఖ్యాతుం వివేశాంతఃపురం వశీ."

అని మూలము. పెద్దలసహవాసమున జితేంద్రియుఁడగు దశరథుఁడు ప్రీతికే తగినదనఁగా దనమనస్సునకు ననుకూలించునది యగుకైకనుగూర్చి రామాభిషేకవృత్తాంతమును దెలుపఁగోరి యంతఃపురమును బ్రవేశించెను. "ఉదర్కస్య కాలో బలీ" అన్న న్యాయము ననుసరించి దశరథుని మృత్యువుప్రేరేపించెననియు, నెంతవాఁడైనను గర్మము త్రిప్పలకు లోఁబడక తప్పించుకొనఁ జాలఁడనియు నెఱుంగందగు. ప్రకృతియిష్టము ననుసరించి యాకాలమే దశరథున కాబుద్ధిగలిగించెననియే యిట సిద్ధాంతము.

"అవధ్యో వధ్యతాం కో వా కో వా వధ్యో విముచ్యతాం,
దరిద్రః కో భవత్వాఢ్యో ద్రవ్యవాన్ వాప్యకించనః."

అను నీ మొదలగు దశరథునివాగ్దానములు తెలివితక్కువ కాఁగా వచించినట్లగపడును. కాని యట్లుగాదు. నీవాంఛితము నెంత దుర్లభమైనను దీర్తునని రాజు కైకకుఁ దెలిపెనని యిందలి సారము. కాని మహాపరాధుని వదలి నిరపరాధుని వధింతునని రాజుభావము కాదు.

"అదండ్యాన్ దండయన్ రాజా దండ్యాంశ్చైవాప్యదండయన్,
అయశో మహదాప్నోతి నరకం చైవ గచ్ఛతి."

అన్న మనుస్మృతి న్యాయము లాదశరథునకుం దెలియనివికావు. తటాలున నిట్టియాగ్రహము రాఁగతంబేమి యని చింతించి యెన్నియోరీతుల నాసపెట్టి యాకోపకారణ మడుగవలయు ననియే రాజుభావము. అవధ్యుని వధింపఁదగునని యామె కోరదని యారా జెఱుంగును. ఎన్నఁడు నట్లు కోరలేదు. అంతియకాక యాకైక విదుషీమణి. దేవాసురసంగ్రామమునఁ దన ప్రాణము కాపాడిన ప్రియురాలు. ఇన్నియేండ్లనుండి యొక దుష్కార్యమైన నొనరింపని యీపురంధ్రి యిపుడు కుమార్గమునఁ బ్రవర్తించునని యతఁ డెట్లు సంశయింపఁగలఁడు? కనుక నేదియో యొకయమూల్యపదార్థమునో మఱేదియో కోరునని యతఁ డూహించి యిట్టివాగ్దానము లొసంగెనని మనమూహింపవలయు. దశరథుఁడు జల్పుము లే యాడువాఁడందు రేని రామవియోగరూపసత్యపాశబద్ధుఁ డేల యగును? దశరథునకు శ్రీరామవియోగమునకంటె దుఃఖకర మేదియుండును? దానికింగూడ నోర్చుకొనెఁగదా. దీనింబట్టియే యారాజేంద్రునకుఁ గల సత్యపరత్వము తేటపడ లేదా. ఇన్నికారణములను సమన్వయము చేసికొని యాలోచించిన నతఁడు ప్రేమాతిశయమునఁ గైకకుఁ గోపాటోపోపశమనము చేయఁబూనియే యిట్లు మాటలాడె నని మన మెఱుంగుట సముచితము. అంతియకాని దశరథుఁడు కాముకుఁడని దూషింపరాదు. "స కామబలసంయుక్తః" అని యున్నదికదా యందు రేని ధర్మపత్నియందు దనురాగము మిక్కిలి యుండుట న్యాయ్యమే. దానిచే నన్యాయమునఁ బ్రవర్తించునుగదా యని యూహాలపై నూహాలుచేయుట యసంగతమేకాని న్యాయసంగతము కాదు.

ఈవిషయమున నధ్యాత్మరామాయణముకూడ నీయభి ప్రాయమునే తెలిపినది.

"తథోక్తా సా సమాశ్వస్తా వక్తుకామా తదప్రియం,
పరిపీడయితుం భూయో భర్తారముపచక్రమే."

అని మూలము. కైకభావ మీమూలమున వెల్లడియగును. ఆమాటలకే యూఅడిల్లెను. ఆయప్రియవార్త ననఁగా రామ వనవాసమును దెలుపఁబూనెను. ఏల? బాధింపవలయునన్న కోర్కి చేఁగాదు. దశరథుఁడు చిన్నతనమునఁ జేసిన మునికుమార వధరూపపాపకర్మ మాసన్నమై కైకను బ్రోత్సహించెను. పుత్త్ర శోకమునఁ దుదిఁగాంతువనికదా మునికుమారుని పెద్దలశాపము. అది ఫలించుకాల మాసన్నమయ్యెను. కైకమూలముననేకాని యాఫలము కలుగ వలనుపడదయ్యెను. కావున నాదుష్కర్మము మఱింత యాకైకను బురికొల్పసాగెను. దేవతలు మునులు మనశ్శక్తి నుపయోగించి వాగ్దేవి నభ్యర్థించిరి. ఆమె యావహించెను. మహామాయ తనకార్యక్రమమునఁ గైకను మంథరను బ్రధానముగాఁ జేసికొనియే యిట్టి లీకార్యము సాగవలయు నని తలంచెను. ఆదేవితలంపు వ్యర్థముకాదుకదా. హరిహర బ్రహ్మాదు లుత్తమాంగములఁ దదాజ్ఞను ధరింతురన నిఁకఁ గైకమాట యిటఁ జెప్పనేటికి? ఇన్నియు నొక్కసారి యా కైకను వశపఱచుకొని తమతలంపుల నామెమోమునుండి తెలుపవలయునని యెంచెను. కనుక

"పరిపీడయితుం భూయో భర్తారముపచక్రమే."

అన్నమహాకవివాక్కు ననుసరించి యీవఱకే తననిమిత్తము దుఃఖించుచున్నాఁడని యెఱింగియు నింకను సంతాపములు

పాలు చేయఁబూనెనని మనము గ్రహింపవలయును. ఇట్టు లీఘట్ట మునఁ గైకయాశయమును గ్రహించినఁగాని యాయాదిమ దంపతుల యుదారాశయములు మనబోంట్లకుఁ దేటగ బోధ పడవు. పక్షపాతము దుర్మతాభిమానము వదలి శ్రద్ధాభక్తులు వెలయ నీచరిత్రమును బఠింపవలయును. ఇఁకఁ దరువాతి వృత్తాంతమును జక్కఁగాఁ బరిశీలింతము.

## కైక దశరథుని వరముల నడుగుట.

* కామబాణములచేఁ గొట్టఁబడి దానివేగమును నెదుర్కొనఁజాలక లోఁబడి దానిమార్గమునే యనుసరించుచుండు నాదశరథునిం బరికించి దారుణవాక్కును జెప్పందలంచి యిట్లు పలికెను. ప్రాణేశ్వరా! వ్యాధి నన్నంట లేదు. ధనము నాకక్కఱ లేదు. ఎవ్వనిమూలమునను నాకవమానము సంభవింప లేదు. నాకొకకోరిక గలదు. దానిని సఫలముగాఁ జేయుదువనియే కోరుచున్నాను. అందులకు నీవిష్టపడుదువేని యాడినమాట తప్పనని శపథము చేయుము. తరువాత నావాంఛితమును దెలుపుదును. అని కైక పలుకఁగా నారాజు నీవు చెప్పినట్లు చేయ సిద్ధముగా నుండఁగా శపథము గోరుటేల? ఎంత పిఱికిదానవు? అనుకొనుచు నించుక దరహాసము మోమునఁ గన్పడఁగా శుచిస్మితయగు నాకైకముఖమును దనవంకకుఁ ద్రిప్పుకొని మృదుతమకేశపాశము నిమురుచు నిట్లు పలికెను.

లోకజ్ఞానము చక్కఁగా లేని యోప్రేయసీ! ప్రియురాండ్రలో నీకంటె నెక్కుడుప్రేయసి నాకు లేదని నీవెఱుం

* ఇది పదునొకండవ సర్గమునఁ గలదు. అధ్యాత్మరామాయణమున మూఁడవ సర్గమునఁగల కథాసారముకూడ నిందు నుండును.

గదా? పురుషులలోఁ బురుషోత్తముఁడగు రామునికంటెఁ బ్రేమాస్పదుఁడు నాకు లేఁడు. శత్రువుల కెవ్వరికి గెలువఁదరము గాక నాకత్యంత ప్రీతిపాత్రుఁడై ప్రాణములకంటె నధికుఁడై మహాత్ముఁడై నాజీవితమునకు నాధారభూతుఁడు నగువాఁడు రామచంద్రుఁడు. అట్టి రామునిపై బాసచేసెదను. నీవేమికోరుదువో తెల్పుము. నెఱవేర్తును. ఆరాముని జూడకయున్న ముహూర్తమైన బ్రదుకంజాలను. అట్టి రామునిసాక్షిగాఁ బలికెదను. నీమదిఁ గలకోర్కి తెలుపుము. తప్పక నెఱవేర్తును. నాదేహమునకంటెఁ దక్కినకొడుకులకంటెఁ బ్రియబంధువుల కంటె నేనెవ్వని నెక్కుడుగఁ బ్రేమింతునో యారామభద్రునిపై నొట్టుపెట్టి పలికెద. నీవాంఛయేది? సౌభాగ్యవతీ! ప్రాణాధికుఁడగు శ్రీరామమూర్తిపై నొట్టుపెట్టి నీకు మాటయిచ్చు నంతటిప్రీతి నీయందుఁగల నాహృదయము నెఱింగియు నాడిన మాటఁ దప్పక తీర్తునని దృఢవిశ్వాసముకలదానవై నీకోరికఁ దెలిపి నన్నీశోకమునుండి యుద్ధరింపుము. జీవించునట్లు చేయుము. నామనోవాక్కు లేకరీతిగా నుండుట గాంచియైన నేఁడి మంచిదని నీవు తలంచితివో దానిం దెలుపుము. నాప్రేమము నీయం దెంతయో నీవే యెఱుంగుదువుకదా. ఏల సంశయించెదవు? దానిని వదలిపెట్టుము. నీవాంఛితము నెఱవేర్చి యానందమును గల్గింతును. ఇట్లు సేయుదునని నాసుకృతరాశిపై నొట్టు పెట్టి చెప్పుచున్నాను.

ఇట్లు ప్రాణనాథుఁడు ప్రతిజ్ఞ లెన్నియో చేయఁగా విని యాకైక తనపట్టినకార్యము నెఱవేర్ప బద్ధకంకణురాలుగావున నతనిశపథములను విని సంతోషమున భరతునియందుఁ గల

యభిమానము పెంపున మోమోటమి మాని శత్రువైనఁ జెప్ప జంకునట్టి దారుణవార్తను దెలుపంబూనెను. ఆవాక్యము మృత్యుదేవతకంటెఁ గ్రూరమైనది. మరణభీతిని గల్గించునది. వినను దెలుపఁబూని యిట్లు పలికెను. మహారాజా! నీవు వరుసఁగా జేసినశపథములు నాకిచ్చినవరములు నగ్నిప్రముఖులగు ముప్పదిమూఁడుకోట్లదేవతలు విందురుగాక. చంద్రుఁడు, సూర్యుఁడు, కుజాదిగ్రహములు, నాకాశము, దివారాత్రములు, దిక్కులు, స్వర్గమర్త్యములు, గంధర్వులు, రాక్షసులు, నక్తంచరములగుభూతజాలములు, గృహముల నాశ్రయించి యుండుకులదేవతలుఁ, దక్కంగలవివిధభూతములు నీ యీ సత్యవాక్యములను సాక్షిభూతులై యాలకింతురుగాక. ఓసర్వగీర్వాణులారా! సత్యసంధుఁడు, శౌర్యధుర్యుఁడు, ధర్మవేత్త, సుసమాహితుఁడు నగునీరాజు వరమిచ్చినవిధమును మీరాలకింతురుగాక. ఇట్టు లాదేవి చాపధారులలో మేటియైనయారాజును దనవశముచేసికొని శపథములు చేయించి దేవతలనెల్ల సాక్షులుగా నుండునట్లు ప్రకటించి కామవశంగతుండగు మగనితో నిట్లు పలికెను.

మహారాజా! తొల్లి దేవదానవసంగ్రామమునందు నడచినవార్తను స్మరింపుము. అందు నడుమ శత్రువగు శంబరాసురుఁడు నీప్రాణములు తీయకపోయిన నంతటిపనిచేసి నిన్ను మూర్ఛపుచ్చెఁగదా. ఏమఱుపాటులేక నేను నిన్ను సంరక్షించితిని. అందులకు సంతోషించి నాకు రెండువరము లిచ్చితివి. ఆవరముల నీకడనే యుండనిచ్చితిని. దాఁచిపెట్టియున్న యా వరముల నిప్పు డడుగుచున్నాను. రాజేంద్రుఁడు; సత్యరక్షకుఁ

డవు. కాన వానిని నాకు నిత్తువని యాచించుచున్న దానను. వాని నీయవేని యిపుడే ప్రాణముల వదలుదును. ధర్మమును గాపాడని నీకడ బ్రదికియుండుటకంటె మరణమే నాకు శ్రేయస్కరంబగు. ఆమాట చెవుల సోఁకినంతనే విభ్రాంతుఁడై వేఁటకాని మోసపుఁగూఁత విని నమ్మి వలలోఁ దగులుకొనిన జింకరీతిగా స్వవినాశార్థము వరముల నిత్తునని యంగీకరించి ధర్మపాశమునం జిక్కుపడెను.

కైకయు నిశామకామమోహితుఁడై వరముల నీయఁ బూనియున్న రాజుం దిలకించి ప్రాణనాథా! పూర్వము నాకిచ్చిన వరము లిట్టివని తెలిపి వాని నిచ్చువిధమును దెలిపెదను. ఆలకింపుము. శ్రీరాము నభిషేకింప సమకట్టినవస్తువులచేతనే నా కుమారుఁడు భరతున కభిషేకము జరపవలయును. ఒకవర మిది. ఆనాఁడు ప్రాణమును రక్షించితినన్న సంతోషమున నాకిచ్చిన వర మడుగుసమయ మిదియే. రామమూర్తి పదునాలుగు సంవత్సరములు దండకారణ్యమున వసియించి వల్కలములఁ దాల్చి జింకచర్మములను జడలను ధరించి తాపసుఁడుగ నుండవలయు. రాముఁ డడవుల కిపుడే పోఁగా శత్రువులులేని యీరాజ్యమును భరతుఁడు యువరాజుగనుండి రక్షింపవలయు. ఆలసింపరాదు. ఇదియే రెండవవరము. క్రొత్తవరముల నడుగలేదు. మున్నిచ్చినవానినే యిపుడడుగుచున్నాను. న్యాయవిరుద్ధముగా నిన్నడిగి నిర్బంధింపలేదు. రాముఁ డడవులకుంబోవఁగా నిపుడే చూడఁగోరుచున్నదానను. నీవు రాజరాజని, సత్యసంధుఁడని ప్రఖ్యాతిం గాంచితివి. ప్రతిన సత్యముగాఁ జేసి కులమును, శీలమును, జన్మమును రక్షించుకొనుము. ఊర్ధ్వలోకమున నివ

సింపఁగోరినయెడల సత్యమునకంటె హితమగు నుత్తమసాధనము లేదని తపోధనులు చాటుట యెల్లరెఱుంగుదురుకదా. అని పలికి యూరకుండెను.

మహామతులారా! కైకచేయఁదగినపని నెఱవేర్చెను. దేవతలు లోనగువా రానందింతు రనవలసిన దే. ఇదియే మూల ప్రకృతియగు సీతాదేవితలంపు. శ్రీరామమూర్తి యీవిధ మంతయుంగాంచుచు నూరకుండును. ఒక్కమాటనైన ననఁడు. కదలఁడు. ప్రకృతి యాడించినట్టు లాడుచుండును. అట్టులని యాప్రకృతి స్వతంత్రురాలు గాదు. భగవదిచ్ఛానుసారము మెలఁగును. ఆమహనీయునితలంపు నెఱింగి యించుకంతయుఁ దప్పకయుండ నెఱవేర్చును. ఆమెప్రయత్నమును హరిహర విరించిప్రభృతు లెఱుంగఁజాలరనక తప్పదుగదా. ఇట్టులుండ మంథరగాని కైకేయిగాని యేమి చేయఁగలరు? లోకులు కొందఱు వారిరువురను దూషింతురు. కాని యది యాలో చించి చేయనిపని. వారిరువురిమూలమున లోకమునకు మహో పకారము కలిగినదని వారిని వినుతింపవలయునుగదా.

"తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధం,
మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్."

అను శ్రీకృష్ణోపదేశము ననుసరించి మంథరయుఁ గైకయు నిమిత్తమాత్రముగా నున్నవారలేకదా. విరాధాదులు శాపాంత మునఁ జావవలసినవారు. కర్మవశమునఁ జచ్చినవారు నగుదురు. శ్రీరామవనవాసయాత్ర యెట్లులైనను సాగవలసిన దే. అవతార ఫల మదియే. రామచంద్రవనవాసకాలమున నుండువారలలోఁ గొందఱుపామరులు వారిని దూషించినను సకారణముగనే

యుండును. ఈకాలమున రామాయణమును జదివినవారు వారి దూషించుటయే చమత్కారముగ నుండును. ప్రకృత మనుస రింతము.

కైక దశరథుని గామవశంగతునిగ భావించి మెల్లఁగా శపథము చేయింప నెంచి నామనోరథమును దీర్తునని శపథము చేసినఁ జెప్పుదుననెను. అంతమాత్రము మాటలాడినదే చాలు నని కాలము పురికొల్పుచుండఁగా నతఁడు శపథములఁ గొన్నిం టిం జేసెను. దైవవశమున నవి రామావతారఫలమును దశ రథునిమరణమును దెలియఁజేయునవిగ నయ్యెను. ఆవిధ మెఱుం గుదము.

"తేనాజయ్యేన ముఖ్యేన రాఘవేణ మహాత్మనా,
శపే తే జీవనార్హేణ బ్రూహి యన్మనసేచ్ఛసి."

ఇది తొలిశపథము. విశ్వామిత్రుఁడు వచ్చి యడిగినపుడు రాముఁ డేమియు నెఱుంగఁడని చెప్పినదశరథుఁ డిపుడు రాముని౦ బొగడుచున్నవాఁడు. దానియర్థమును బరిశీలింతము. "మహా త్మనా" అనునది కొడుకుంగూర్చి చెప్పఁదగినది కాదు. మహాత్ముఁ డనఁగాఁ బక్షపాతరహితమతిగదా యర్థము. అట్టివాఁడు భగ వంతుఁ డొక్కఁడే. "జీవనార్హేణ" ప్రాణములకంటెఁ బూజ్యుఁ డని యర్థము. అనఁగాఁ బ్రాణములకంటె నెక్కుడుగా భావింపఁ దగినవాఁడని భావము. అట్టి రామమూర్తి సాక్షియై యుండుఁ గాక. నాప్రతిన చెల్లింతును. కైకా! నాకుంగల ప్రియతమవస్తు వులలో నెల్ల శ్రీరామచంద్రుఁడనుపమవస్తువు. దాని నేప్రేమించు చున్నాఁడను. నేను బ్రేమింపఁదగినవస్తు వీలోకమున లేదు. ఒక్క శ్రీరామమూర్తినే ప్రేమింతును. అనువాక్యమునందు

నిహాసుఖములు తీఱినవి. పరసుఖమునే కోరుచున్నాఁడను. అందుల కాధార మాశ్రీరామమూర్తియే యనునభిప్రాయ మిమిడియున్నదని యెఱుంగవలయు.

"యం ముహూర్తమపశ్యంస్తు న జీవేయమహం ధ్రువం,
తేన రామేణ కైకేయి శపే తే వచనక్రియాం."

అనునది రెండవ శపథవాక్యము. రాముని జూడక ముహూర్త కాలమైన జీవింపననుట సత్యము. అట్టిరామునితోడుగాఁ జెప్పు చున్నాను. అనఁగా రాముఁడు వెళ్లినపిదప బ్రదుకననుట సత్యమని దశరథుఁడే తెల్పుకొన్నాఁడు. అంతటిప్రేమాస్పదుఁ డనికదా యర్థమని కొందఱందురేమో. యది నిజమే. కాని యీప్రతిజ్ఞలధోరణింబట్టి యాలోచించిన నతఁ డెఱుంగక యుండ నాయర్థముగలమాటలు వెడలివచ్చినవని యూహిం చుట పొరపాటుగాదు.

"ఆత్మనా వాత్మజైశ్చాన్యైర్వ్రణేయం మనుజర్షభం,
తేన రామేణ కైకేయి శపే తే వచనక్రియాం."

అనునది మూఁడవ శపథము.

"సర్వాన్ పరిత్యజ్యాపి రామమేవ పరిగృహ్ణామీత్యర్థః."

అని గోవిందరాజులు.

"ఆత్మానమితరానాత్మజాంశ్చ విహాయాపి యో వరణీయస్తేన రామే ణేత్యన్వయః."

అని మహేశ్వరతీర్థులు. ఈదేహమును భరతాదిపుత్త్రులను ఇతరబంధువులనుగూడ వదలి రామునే ప్రేమింతుననఁగా నిఁక నీలోకములోనివారితోడి సంబంధము చాలును. శ్రీరామునే

విశ్వసింతును. అని ప్రయత్నము లేకయే దశరథునినోటనుండి వచనములు ఆగామిఫలమును దెలుపుచు వెడలెననియే యుందలిసారము. ఈయర్థమును దృఢపఱచు వేఱొకశ్లోకముం బరికింపుఁడు.

"భద్రే హృదయమప్యేతదనుమృశ్యోద్ధరస్వ మే,
ఏతత్సమీక్ష్య కైకేయి బ్రూహి యత్సాధు మన్యసే."

అని మూలము. భద్రే యనుసంబుద్ధి కర్థమేమి? మేలుకోరుదానా. లోకక్షేమము కోరుదానా యని భావము. నాచెప్పిన యభిప్రాయమును విమర్శించి నాచేసినప్రతిజ్ఞల నాలోచించి నన్నుద్ధరింపుము. ఏది మంచిదని నీకుఁ దోఁచునో దానిం దెల్పుము. అనఁగా నాజీవితమున నీకుఁ గల్గులాభము గొప్ప యనుకొందువో, లోకక్షేమమును గొప్పగా భావింతువో యాలోచించి పలుకుము. ఎట్లయిన నన్నుద్ధరింపుము. అనఁగా నన్నుద్ధరించుభారము నీపై నాధారపడియున్నది. నాకుఁగల శాపము బలవత్తరము. దానిని దీర్చుటకు నీవే యాధారభూతురాలవు. కావున నీకోరికను దెలిపి నన్నుద్ధరింపుమా యని దశరథునిభావమని ప్రతిజ్ఞలధోరణింబట్టి మన మూహింపవచ్చును.

"ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్,
ఆత్మైవ హ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః. ౫
బంధురాత్మాత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః,
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్." ౬
(గీత ౬ అధ్యా.)

అను గీతావాక్యముల ననుసరించి యోజించిన నిది విరుద్ధము

కాదా యందురేని దశరథునకుఁ బుత్త్రదుఃఖముననే మృతి గలుగవలసినట్లు శాపము కలదు. అయ్యది కైకమూలమున ఫలింపవలయును. ఆకర్మము బలవత్తరము. ఫలము నీయక మానదు. కావున నీవుద్ధరింపుమా యని కైకను రాజు కోరుట సుసంగతమే కాని యసంగతము కాదని యెఱుంగవలయు. ఈ భావమును సమర్థించుపై శ్లోకమును బరిశీలింపుఁడు.

"బలమాత్మని జానంతీ న మాం శంకితుమర్హసి,
కరిష్యామి తవ ప్రీతిం సుకృతేనాపి తే శపే."

అని మూలము. నీయందు నాకుఁ గలప్రేమాతిశయము నెఱింగియు నేల యనుమానించు చున్నదానవో తెలియఁజాల కున్నాను. నీకు దేనఁ బ్రీతి కలుగునో యద్దాని నొనరింతును. అని నాసుకృతము సాక్షిగాఁ జెప్పుచున్నాఁడను. అని దశరథుఁడు పలికెను. మనమెవ్వరిని బ్రేమింతుమో వారు మనలఁ బ్రేమింపవలయును. అనఁగా మనకుపకారము చేయవలయునని భావము. అట్లుగా దేని ప్రేమమునకు ఫలమేమి? మాటలలాభమే లాభమా. కాదుకదా. ఇంతకాలము నిన్నుఁ బ్రేమించి నీ యిష్టానుకూలముగాఁ బ్రవర్తించితిని. కైకా యిప్పుడు నాకు మహోపకారము చేయుమా. నీకుఁ బ్రీతిని గల్పింతును. అనఁగా నీవు కోరుకార్యమును నాపుణ్యములసాక్షిగాఁ జేయుదును జుమీ యని రాజు పలికెను.

కైకా! చిరకాలము జీవించితిని. నీవలన సకలసుఖములనుభవించితిని. శ్రీరామమూర్తి మహాత్ముఁడని యెఱింగితిని. జరాభారము దుర్భరమైనది. తనుధారణము బరువుగాఁ దోఁచుచున్నది. శాపము ఫలింప సిద్ధముగా నున్నది. నిమిత్తమేదియే

నుండవలయును. నీమేలుమాత్రమే చూచుకొనక జగత్కల్యాణమే స్వమంగళమని భావించి నన్నుద్ధరింపుమా యని దశరథుని వాక్యములయందు సార మిమిడియున్నది. బుద్ధిపూర్వకముగా నతఁడు పలికినట్లు భావింపకయున్నను కర్మము ఫలమునీయ నెదురుచూచుచున్నది. కావున దాని కనురూపముగా బుద్ధి మాఱుచుండునని నీతిశాస్త్రము తెలుపుచున్నందున నీభావము గలమాట లాతనినోటనుండి వెడలెనని మన మెఱుంగుటయే న్యాయ్యము. కర్మసిద్ధాంత మిట్టిదియే. అట్లు భావింపక కైక పతివ్రత కాదు. క్రూరమతి. దుశ్శీలముకలది యని దూషించిన నది క్రమముగా శ్రీరామమూర్తికిం జెందఁగలదు. అట్టిపాప కార్యము మనము చేయరాదు. కావునఁ గర్మమే యాతని నట్లు పలుకఁజేసినదని కైక నట్లు పురికొల్పినదని మంథర నారీతిగాఁ బ్రోత్సహించెనని మనము నిశ్చయించుకొనుట సముచితము.

శ్రీరామమూర్తి యేకార్యము లొనరింప నవతరించెనో దాని కనుకూలముగాఁ గైక వరముల నడిగెను. దశరథుని మాట లనఁగా శపథవాక్కులు అగ్నిలోనగు దేవతలు విందురుగాక యని ప్రార్థించెను. ఈప్రార్థనము మనకొక్కనీతివిశేషమును బోధించును. మానవుఁడు చేయుపాపములను గొందఱు మానవులే యెఱుంగుదురు. కొన్నింటి నెఱుంగఁజాలరు. అగ్ని మొదలగు దేవతలు మనోదోషములంగూడ నెఱుంగుదురు. కొందఱు మనముచేయుమోసము నితరు లెఱుంగఁజాలరని యానందించి గర్వింతురు. ఆగర్వము తమకే హానికరమని యెఱుంగరు. ఇతరుల వంచించితినిగదా యని యానందించుట

యనఁగాఁ దన్నుఁ దానే వంచించుకొంటి నసుకొనుటయే కదా.

"అంతఃప్రచ్ఛన్నపాపానాం శాస్తా వైవస్వతో యమః."

అన్నసూక్తి న్యాయ్యమేకదా. కావున సూర్యచంద్రాదులు సాక్షిభూతులన్నమాట నమ్మి మనస్సున దుష్టాలోచనములు చేయరాదని మనము తెలిసికొనవలయును. ఈనీతిని వాల్మీకి మహర్షి లోకులకుం గైకమాటలమూలమునఁ దెలియఁజేసిరని మన మూహింపవలయును. మనము చమత్కృతిగా లోకులను మోసపుచ్చితి మనుకొనువారు తమనాశనమునఁ బ్రవర్తించితి మని యెఱుఁగనంతమూఢులని తలంపందగును.

"అద్య చైవ హి పశ్యేయం ప్రయాంతం రాఘవం వనం."

అను కైకవాక్యమును గనుంగొనుఁడు. ఇపుడే రాముఁ డడవికింబోవు చుండఁగాఁ జూడఁగోరుచున్న దాన ననికదా యర్థము. దశరథునిశాపఫల మగుమృత్యువు కైకను మఱెంత ప్రోత్స హించుచున్నది. రెండుదినములలోఁగా నతఁడు మృతుఁ డగును. ఆదుఃఖము ననుభవింపవలయును. కాన నాలసింప రాదని యామెకుం దోఁచునట్లు కర్మమే యొనరించెను. దీనిం బరికించినయెడఁ గర్మసిద్ధాంతమహత్త్వము నెఱింగి యంతతోఁ దృప్తినొందక సత్కర్మములను ఫలముఁ గోరక యాచరించి భగవదర్పణము చేయవలయునని నిర్ణయించుకొనందగు.

"స రాజరాజో భవ సత్యసంగరః కులం చ శీలం చ హి రక్ష జన్మ చ,
పరత్ర వాసే హి వదంత్యనుత్తమం తపోధనాస్సత్యవచో హితం నృణాం.

అని కైక పలికెను. కైకవాక్కులమూలమున వాల్మీకిమహర్షి

సత్యపరత్వము ప్రధానమని మనకు బోధించెను. అసత్యము సర్వధర్మనాశనము చేయంజాలును.

“న విస్మయేత తపసా వదేదిష్ట్వా చ నానృతం,
నార్తోఽప్యపవదేద్విప్రాన్న దత్త్వా పరికీర్తయేత్. ౨౩౬
యజ్ఞోఽనృతేన క్షరతి తపః క్షరతి విస్మయాత్,
ఆయుర్విప్రాపవాదేన దానం చ పరికీర్తనాత్. ౨౩౭
ధర్మం శనైస్సంచినుయాద్వల్మీకమివ పుత్తికాః,
పరలోకసహాయార్థం సర్వభూతాన్యపీడయన్. ౨౩౮
(మను. ౪ అధ్యా.)

అను స్మృత్యర్థమే రామాయణము తెలుపుచున్నది. రాజా! సత్యప్రతిజ్ఞుడవు కమ్ము. దానిచే నీకులమును, శీలమును, జన్మమును గాపాడుకొనుము. పరలోకమునకు సత్యమునుమించి నది సహాయపడునది లేదనికదా యర్థము. ఒక్కసత్యమును గాపాడుకొనినఁ గులమును గాపాడుకొనిన ట్లగును. శీలమును రక్షించుకొన్న ట్లగును. జన్మమునుగూడఁ గాపాడుకొనిన ట్లగును. కావున సత్యమును వచించితివి. దానిని గాపాడు కొమ్మా యని కైక రాజును హెచ్చరించెను. దీనిచే నాకాలమున సత్యముపై నెంతయాదరము కలదో యెట్టివిపత్తులందును దాని నెట్టు లాదరించిరో దీనిమూలమునఁ దెలిసికొనవచ్చును. మహాశయులారా! ఈభాగము మనకు సత్యాదరమును బోధించుచున్నది. కర్మము బలవత్తరమని సూచించుచున్నది. భగవంతునాశయము తప్పక ఫలించునన్నవిషయమును దృఢపఱచుచున్నది. కావున మన మీభాగమును జక్కఁగాఁ బఠించి విశేషార్థములను గ్రహించి వ్యర్థముగఁ గైకను మంథరను

దూషింపక వారిమూలమున దేవతలకు, మునులకు, జనులకు ధర్మమునకుఁ గలుగఁబోవుమహోపకారమును స్మరించి వారిని గీర్తింపవలయును. ఇఁకఁ దరువాతిభగవచ్చరిత్రమును బరికింతము.

## దశరథుఁడు దుఃఖించుట.

* దశరథుఁడు కైకమాట విన్నంతనే పిడుగుపడినయట్లు భావించి చింతాసాగరమున మునిఁగి ముహూర్తకాలము మూర్ఛిల్లి తనలో నక్కటా ! కైకవంటిసాధ్వి యిట్టిపరుషవాక్కు లాడునా. ఇదేమి స్వప్నమా. నిద్రపోనందున దాని కవకాశమేది? చిత్తవిభ్రాంతినొందితినా? నిష్కారణముగా నది యేల కలుగును? జన్మాంతరానుభవ మిత్తఱి స్మృతిగోచరమగుచున్నదా? ఇంతటిఘోరమగు ననుభవము జన్మాంతరమందును గలుగఁగలదా? రోగవికారము మనస్సునఁ గలిగెనా? వీనిలో నేదియుండును? అని తలఁచి నిశ్చయింపఁజాలక సుఖము నొందఁజాలకయుండెను. కొంతసేపటికి తెలివిరాఁగా వ్యాఘ్రినిగన్న జింకవలె దుఃఖమున నవయవములు పరితపింపఁగా వట్టినేలఁ గూరుచుండి పాములవానిమంత్రమండలమునఁ గట్టఁబడిన విషసర్పమువలెఁ గదలఁజాలక వేఁడినిశ్వాసవాయువుల వదలుచు నిర్భరకోపము ప్రజ్వరిల్లఁగా నిస్సీ! యని పలికి మరల మూర్ఛిల్లెను.

మరలఁ దెలివిరాఁగాఁ గోపము దావాగ్నివలెఁ జెలరేఁగఁగా దానఁ గన్ను లరుణవర్ణములై యొప్ప నాకన్నులచే

---

* ఇది పండ్రెండవ సర్గమునఁ గలదు. అధ్యాత్మరామాయణవిషయసారమిందుండును.

దహింప నెంచునట్లు చుఱుకుఁజూపులఁ బర్వఁజేయుచుఁ గైక
తో నిట్లనియెను. క్రూరురాలా! దుశ్శీలవుకదా. కులపాంసను
రాలా! పాపమతీ! రామచంద్రుఁ డేయపరాధము నీకు నొన
ర్చెనే? నేనేమి పాపము నీకుఁ గల్పించితిని? తల్లికి శుశ్రూషలు
చేయునట్లు రాముఁడు నీకు సేవలుచేయుచున్నాఁడుకదా. అట్టి
వాని కీయపకారము చేయఁబూనితివికదా. ఏటి కీపాపము
చేయఁబూనుట? రాజకుమారివని భావించి క్రూరవిషభుజంగిని
వలె వివేకముచాలమి వినాశార్థమే యింటిలోనికిఁ బ్రవేశపెట్టి
తిని. తిర్యగ్జంతువులుకూడ శ్రీరామునిగుణములఁ బొగడు
చుండఁగా నాముద్దులకుమారు నేమితప్పుచేసెనని పొగనంపు
దును? కౌసల్యాసుమిత్రలను, రాజ్యలక్ష్మిని దుదకు నాప్రాణ
ములనైన వదలుదునుగాని పితృవత్సలత విలసిల్లు నాప్రియ
పుత్త్రుని రామమూర్తిని విడువను. నిజము. జ్యేష్ఠకుమారసంద
ర్శనమున నాతనువెల్ల నుప్పొంగును. రాముని జూడకయున్నఁ
బ్రాణములు నిలువవు. సూర్యుని వదలి లోకముండునుగాక.
సస్యము జలమువదలి యుండుఁగాక. రాముని వదలి నాప్రాణ
ములు క్షణమైన నిలువవు. ఎంతపాపమునకు నంగీకరించితివి?
పాపమతీ! నీవు నిశ్చయించినభావము నాప్రాణములఁ దీయును.
కనుక నింతదనుకఁ జాలుచాలు. వదలుము. నీకు నేను భర్తనన్న
కారణమున సంశయించుచున్నాను. నీపాదములను నాశిరము
సోఁక నమస్కరింపుమనియెదవా? తెలుపుము. అప్పుడైన నీ
దుర్వృత్తిమాని కరుణంజూపుమా. దుష్టచిత్తురాలా! ఇట్టిఘోర
తరమగు నభిప్రాయమేల నీకుంగలిగెనో. భరతునియందుఁ బ్రీతి
గలదా లేదాయని తెలిసికొనఁగో రెదవా? అదినిజమైన నీవాంఛ

మంచి దేయగుంగాక. అట్టులేయైనను నీకు రామభద్రునందుఁ బ్రీతితగ్గుట కేమియు హేతువగపడదు. నన్నుఁ బరీక్షించుటకే నీవిట్లడిగియున్న రాజ్యము భరతున కిమ్మని యడుగవచ్చును. అంతియగాని శ్రీరాము నరణ్యములకుంబంపుమని యడుగ నవకాశ మేది?

కైకా! నీవింతకుముందు నాతో నెన్నియోపర్యాయ ములు "శ్రీరాముఁడు నాకుం దొలికుమారుఁడు. శ్రీమంతుఁడు. ధర్మశ్రేష్ఠుఁడు" అని చెప్పితివికదా. ఆమాటలన్నియు నిజములు కావని యిపుడు తలంతును. నేవార్థము రామునిపైఁ బ్రీతియు న్నట్లు పలికితివని యూహింపఁదగియున్నది. రామాభిషేకవార్త నాలకించి దుఃఖమొంది నన్నును శోకసంతప్తునిగ నొనరించి బాధించుచున్నావే? కనుకనే యొరులమాటలకు లోఁబడి శూన్యమగు కోపగృహమును బ్రవేశించితివి. అదృశ్యరూప ములుగల పిశాచములు నిన్నావేశించియుండును. కనుకనే యిట్లు త్వరపడి మాటలాడితివి. నీవింతకాలము నీతిమంతురాలవుగ నుంటివి. ఇట్టి నీవిక్ష్వాకువంశమునకు వచ్చియు నిట్టివిపరీతబుద్ధి పుట్టుటంజేసి యీవంశమునకే మహానర్థము గల్గినది. నీవెప్పుడు గాని యయుక్తము నప్రియము నగు కార్యమును జేయలేదు. కనుక నిపు డిట్టికార్యమును జేయుచున్నదానవని నమ్మఁజాల కున్నాను. బుద్ధిమంతుఁడగు భరతునితో రాముఁడు నీకు సమా నుఁడేకదా. ఇట్లే నీవు నాకుఁ దెలుపుచుంటివి. నీవు చిన్నతన మునఁ గృత్రిమబుద్ధితో నిట్టులంటివని యూహింపఁ గారణము లేదు. పెక్కుసారు లీయభిప్రాయమునే తెలిపితివిగాన బుద్ధి

పూర్వకము గాదని యనుకొనఁ గారణము లేదు. ఈపాడుమాట నీవు వచింపఁదగినది కాదు.

దేవీ! ధర్మమువిూఱ జంకుదానవు. ఆభయ మిపు డెందుఁ బోయెనో. సత్కీర్తి సంపాదించి నీకృపకుఁ బాత్రుఁడై ధర్మాత్ముఁడయియున్న శ్రీరాముని బదునాల్గుసంవత్సరము లడవుల నుండఁ బంపుమని యడుగుట ధర్మము నెఱింగిన నీకు నెట్లు బాగని తోఁచినది? రాముఁడు సుకుమారుఁడు. ధర్మమార్గమున దృఢనిశ్చయముకలవాఁడు. అట్టి రామచంద్రుఁడు ఘోరారణ్యముల వసింపఁదగునని నీకెట్లు హితముగాఁ దోఁచెనో? రాముని సౌకుమార్యాదులంబట్టి నీమనస్సు కరఁగకున్న మానె. ఆతఁడు నీకుఁ గావించినశుశ్రూషలంబట్టియైన నాసుందరాకారుని దేశమునుండి తఱిమివేయవలయునని నీవు కోరుటకుఁ గలహేతువు లేదే. భరతునికంటె రాముఁడు మిక్కిలి నిన్ను సేవించువాఁడుకదా. రామునికంటె భరతునందుఁగల విశేషమేమో నాకుఁ దోఁపకున్నది. రాముఁడు నిన్ను శుశ్రూషించును. గొప్పగా సంభావించును. పూజించును. నీమాట శిరసావహించును. ఇవన్నియు రామునికంటె నెక్కుడుగాఁ జేయువాఁ డింకెవ్వఁడు గలఁడు?

నీకడ ననేకసహస్రములు స్త్రీలు సేవచేయుచున్నారు. భృత్యగణము గలదు. వీరియం దెవ్వారికైన రామునియందు దప్పున్నదని తోఁచినదా. అడుగుము. ఏయపరాధము లేని రాముని నడవులుపా లెట్లుచేయుదును? రామచంద్రుఁడు నిర్మలచిత్తుఁడు. సర్వప్రాణులను హితభాషణముల నాదరించును. ఎల్లరకుఁ బ్రియముకల్గించుకార్యములనే చేయువాఁడు. గారవించును. కావు,

వనే సర్వజనప్రియకరుఁడు రాముఁడయ్యెను. రామభద్రుఁడు దయాదానపరాక్రమవీరుఁడు. భూతహితమగుసత్యముచే స్వర్గాదిలోకముల వశములుగఁ జేసికొనుచున్నాఁడు. దానములచే దరిద్రులను, శుశ్రూషలచే గురువులను, వశముచేసికొని రహస్యార్థములఁ దెలిసికొనుచున్నాఁడు. ధనుర్ధారియై నిలిచి శత్రువులు లోఁబడునట్లు చేసికొనును. సత్యము, దానములు, తపస్సు ఈలోకమునఁగల ప్రయోజనమును గోరి దేవతల నుద్దేశించి చేయు త్యాగము, మైత్రియు, బాహ్యాభ్యంతరశుద్ధియు, కపటము లేకుండుటయు, విద్యయు, గురుశుశ్రూషయునను నీసద్గుణములు రామునియందు సర్వదా నెలకొనియుండును. కపటములేకుండుట యెట్టివారికేఁ గలుగుట యరుదు. ఇన్నిగుణములు గలిగి దేవసమానుఁడై మహర్షితేజస్సు గలిగియుండు నాకుమారుని సుకుమారుని శ్రీరాముని మహారణ్యములకు నంపుపాపము చేయ మనస్సెట్టు లొప్పినది? ఎవరికైన నప్రియమగుమాట రామునినోట వెడలునా? అట్టిరామచంద్రున కప్రియమును మదినైనఁ దలంపను జుమీ. ఇఁక నీకొఱకు రామభద్రున కప్రియము చేయఁదలంతునా? అడవికిఁ బొమ్మని యెట్లు వచింపఁగల్గుదును? క్షమాదమములు, సత్యధర్మములు, కృతజ్ఞతయు, సకలప్రాణిహింసాశూన్యతయు ననునీయుత్తమగుణము లెవ్వాని యందు నెలకొనియున్నవో యట్టి రామచంద్రుఁడు తప్ప నాకు గతి యింకెవ్వఁడు కలఁడు? రామచంద్రుఁడే నాకు గతియని సత్యముగా నెన్నిసారులైనఁ జెప్పుదును. కైకేయీ! నామాట వినుము. వృద్ధుఁడనైతిని. ఆయురంతము చెంత నున్నది. కనుక నా యీదశకు విచారపడవలయును. దీనుఁడనై పలుమాఱులు

ప్రార్థించి విలపించుచున్న నాపై దయ యుంపుము. సముద్రములు పొలిమేరగాఁగల భూమండలమునందు వచ్చుద్రవ్యజాతమునంతయు నీకిత్తును. రామునియందుఁ గలకోపమును మాత్రము వదలివేయుము. చాలును. దోసిలొగ్గి వేఁడుదును. నీపాదములు పట్టుకొందును. నారామమూర్తిని గాపాడుము. ప్రతిజ్ఞ దప్పినందున నధర్మమునకు లోఁబడినవానిగా నన్నుఁ జేయకుము.

దశరథుఁ డీరీతిగాఁ బలవించుచుఁ దపించుచు మూర్ఛ మునుఁగుచు నేలంబడి పొరలాడుచు రాము నెడఁబాయఁ జాలక దుఃఖించుచు నన్నీకష్టములనుండి యుద్ధరింపుమా యని కైకను బెక్కురీతుల బతిమాలుచుండఁగాఁ గాంచి కైక దారుణాకారము కనంబడుచుండ మిక్కిలి క్రూరముగా నిట్లు పలికెను. రాజా! వరములిచ్చితివి. తరువాతఁ బరితపింతువేని భూమండలమున వీఁడసత్యవాదియై ధార్మికుఁడనని యెట్లు చెప్పుకొనఁ జాలుదువు? రాజర్షు లెందఱో గలరు. వా రెప్పుడైన నిన్నుఁ గలిసికొని ధర్మమువిషయము మాటలాడుచు రాజా! నీకుఁ బ్రాణావసానసమయమున నుపకారము చేసినకైకకు రెండు వరములిచ్చితివే ఆమె యేమడిగినది? ఏమియిచ్చితివి? అని ప్రశ్నించినయెడల ధర్మవేత్తవగు నీవేమి యుత్తరమిత్తువు? నేనురణారంగమున స్మృతిలేక పడియుండఁగాఁ బ్రయత్నపూర్వకముగా దూరమునకుఁ దీసికొనిపోయి యుపచారములు పెక్కులొనరించి కాపాడినది. అట్టి నాభార్యయగు కైకయనుగ్రహముననే నింతదాఁక జీవించియున్నాఁడను. అట్టికైకకు నిచ్చినవరముల నసత్యములు గావించితినని వారలకుం దెలుపుదువేమో? రాజా!

శపథము తప్పకుమా. ఇపుడే వరములిచ్చితివి. ఇంతలో నూహాలు మాఱఁగా నింకేవో మాటలాడుచున్నాఁడవు. ప్రజాపాలకుఁడవు సుమీ. ఇట్టిరాజే యిట్టులు దబ్బఱలాడునేని యిఁక రాజులెల్ల దశరథునివలెఁ గల్లలాడువారని లోకమునఁ గల రాజులకందఱకుఁ గళంకము కలిగింతువుకదా.

ఒక్కదృష్టాంతము నాలకింపుము. మున్ను శైబ్యుఁడను భూతలపతి సత్యమున నాదరణముగలవాఁడుగ నుండెను. ఒక్క డేగయుఁ బావురమును గలపించెను. అందుఁ బావురము రాజును శరణువేఁడెను. డేగ యరుదెంచి పావురము నిమ్మని బతిమాలెను. రాజు తనశరీరమాంసమునుగోసియిచ్చి డేగనుదృప్తిపఱచి పావురమును గాపాడెను. అలర్కుఁడను రాజర్షి తననేత్రము లొక విప్రునకిచ్చి యుత్తమలోకమునుజూఱఁగొనియెను. సముద్రునంతవాఁడు తాఁజేసిన ప్రతిజ్ఞరీతిగా నేఁటిదనుకఁ జెలియలికట్టను దాఁటకయున్నాఁడుకదా. శైబ్యుఁడు లోనగు పూర్వకాలపుమహాత్ములవృత్తాంతమును స్మరించియైన నీవు చేసినశపథమును దబ్బఱ చేయక నెఱవేర్పుము. రాజా! దుర్మతివై ధర్మమును బాడు చేయుతలంపున రాముని యువరాజు నొనరించి కౌసల్యం గూడి సంతతము సుఖింపఁ గోరుచున్నాఁడవు. మఱొక్కమాట నేనడిగినది ధర్మమో యధర్మమో మంచియో చెడుదో యేమైన నగుంగాక. నీ వడిగినదాని నిత్తునన్నమాట నిర్వహింపక మానరాదు. శపథమును దిగనాడి రాము నభిషేకింతువేని ఆలస్యముచేయక నీయెదుటనే విషపానముచేసి ప్రాణత్యాగము చేయుదును. రాజమాత యని కౌసల్య కెల్లవారు చేతులు జోడించి సేవచేయుచుండఁగా నొక్కదినమైనఁ జూడఁగల్గుదు

నేని బ్రదుకుటకంటె మరణమే నాకు శ్రేయస్సని తలంతును. రాము నిప్పుడే వనములకుఁ బంపుటకంటె మఱొక్కఁడాన మెట్టి దాని నేఁజేసినను నామదికి సంతృప్తికలుగదు. ఈమాట నిజమని నాకుమారునిసాక్షిగా నాప్రాణములసాక్షిగాఁ బ్రమాణము చేయుచున్నాను. అని ఘోరముగాఁ బలికి యూరకుండెను. రాజెంతగా విలపించుచున్నను బదులుచెప్పఁ బూనకుండెను.

రాజు కైకయడిగిన యమంగళమునుగల్గించు నా రెండు వరములవలన నింద్రియములు కలంగఁగా ముహూర్త మాత్రము కైకతో నేమియు భాషింపక యప్రియవాదినియగు నాభార్య ననిమేషదృష్టిం జూచుచుండెను. న్యాయవిరుద్ధముగా భరతుని యువరాజునుగఁ జేయుమనుట, యోర్వలేక రాముని వనములకు మునివృత్తినుండఁ బంపుమనుట యను నీరెండును దుఃఖమును శోకమును గలిగింపఁగా నందులకుఁ గారణభూతు రాలై పిడుగువలెఁ గఠినమై యప్రియముగ మదికిందోఁచు చున్న యాకైక చెప్పినమాటల స్మరించి రాజించుకయైన శాంతి నొందఁజాలఁడయ్యెను. కైకనిశ్చయము భయంకరమని యెఱింగి తనశపథమును దలంచి బదులుచేయుట కేదియుఁ దోఁపమి "రామభద్రా" యని పలికి నిట్టూర్పులువదలి హతమూలవృక్షము వలె భూమిపయిఁబడి యున్మత్తునిచందమున సన్నిపాతవ్యాధిచే మనస్సు తాఱుమాఱు కాఁగా వెతలంబడురోగివలె మంత్ర హృతవీర్యమగుపామువలె నపుఁడారాజు కనంబడుచుండెను.

పిదప రాజు దీనాలాపముల నాకైకేయిం గాంచి మహా నర్థము నొడఁగూర్చు నీకోరిక మంచిదిగాఁ దోఁచునట్లు నీకెవ్వరు బోధించిరి? పిశాచగ్రస్తురాలివలె యుక్తాయుక్తములఁ బాటిం

పక నాముండట భాషించుచున్నదానవు? నీకించుకయేే లజ్జ లేదా? నీచిన్నతనమునాఁడు స్వభావ మిప్పటివలె దుష్టము కాఁగా నేనెఱుంగను. వయస్సు రాఁగా నది విపరీతమైన ట్లగపడు చున్నది. నీవడిగినవరము లతిక్రూరములు. ఏకారణమున నీకింత భయముగల్గెను ? భర్తయగు నాకుఁ బ్రపంచమునకు నీకుమా రునకుఁ బ్రియమొనర్ప వాంఛింతువేని భరతునకు రాజ్య మిమ్మను నభిప్రాయమును బాఱఁదోలి శ్రీరాముని వనముల కిపుడే పంపుమనుపాపాశయమును బరిత్యజించి నెమ్మదినుండుము. నిర్దయురాలా ! రాము నడవులకుఁ బంపుమూహ మహాపాప ఫలముగా నెట్లు కలిగెను? తొలిపుట్టువునందు మహాపాపము చేసితివి. దానికిఫలమే యీనీచబుద్ధియని యెఱుంగుము. నేను గాని రామమూర్తిగాని నీకేమేని యప్రియమొనరించి యెఱుం గుదుమా. ఏయపరాధము మాయిరువురియందు నీకుం గనం బడినది? నీవనుకొన్నయట్లే నీకుమారుఁడు రాజ్యము పాలింపఁ దలంచునా? వాఁడు ధర్మమున రామునికన్న మిన్నయని యెన్నువాఁడ. పరమధార్మికుఁడగు భరతుఁడు రామునివదలి రాజ్యము నాశించునా? నీప్రయత్నము వ్యర్థమేకాని భరతుఁడు రాజ్యమును గ్రహింపఁడు. వత్సా! నీవడవులకుఁ బదునాలు గేండ్లు మునివృత్తినుండఁ బొమ్మని నేను జెప్పఁగా దీనాననుఁడై నిలుచున్న రామచంద్రునిమోము నేనెట్లు చూడఁగలను?

మంత్రులతో నాలోచించి కార్యము నిశ్చయించి మిత్రుల నడిగి స్థిరముగాఁజేయ నిర్ణయించి రాముని యువ రాజునుజేయ నెంచితిని. వ్యూహముగా నునిచిన తనసైన్యమును శత్రువులు కొట్టుచుండఁగాఁ జూచునట్టులు నిర్ణయించిన

మాయభిప్రాయము తాఱుమాఱు కాఁగా నెట్టు చూచుచుండఁగలను? రాము నభిషేకింతునని నాల్గుదిక్కులనుండి రాజులను రావించితిని. వారిపుడు నన్నేమందురు? ఇక్ష్వాకువంశమున జన్మించిన యీబాలుఁడు రాజ్యపాలనము చాలకాలము సాగించెనా? అడవికేలపోవుచున్నాఁడు? ఈదశరథుఁడు తెలివితక్కువవాఁడు. అదృష్టవశమున నింతకాలము రాజ్యమును బాలించెనుగాని బుద్ధియున్న రామచంద్రు నిట్లు వనములపాలుచేయునా! యని పరిపరివిధముల నన్నుఁ బరిహాసభాజనముగఁ జేయకవిడుతురా? ఇంక వృద్ధులు గుణవంతులు విద్వాంసులునగువారు పెక్కండ్రువచ్చి రామభద్రుఁ డెందున్నవాఁడని నన్నడుగ వారి కేమని బదులిత్తును? కైకకు వరద్వయమెన్నఁడో యిచ్చియుంటిని. రామున కరణ్యవాసము భరతునకు రాజ్యలాభము గల్గింపుమని కోరఁగా నడవులకు రాముని బంపినాఁడను. అని సత్యముపల్కిన నింతకుఁ గొంతముందు వసిష్ఠాది మహర్షులు వినుచుండఁగా మహాసభలో రామునకు రేపు పట్టాభిషేకోత్సవము జరపుదునని నేను జెప్పినమాట యసత్యమగును.

దుర్మతీ! నిర్దయచే నేను రాము నడవికిం బంపఁగాఁ గౌసల్య నన్నేమే నడిగిన దానికి బదు లేమని చెప్పుదు? అపకారము చేసినందున సమాధానము చెప్పు నవకాశము నాకేది యుండును? కౌసల్య నాయం దెక్కువమక్కువగలది. రామునందు వాత్సల్యముకలది. దాసికన్న మిన్నగ నాకయ్యాది సేవలు చేయును జుమీ. సఖివలెఁ ద్యూతక్రీడాదుల వినోదించును. ధర్మాచరణమునందు భార్య యెట్లు సాయపడవలెనని విధిగలదో యట్లు తోడ్పడును. నేను వేఱొకతుకఁ బెండ్లియాడఁగోరఁగాఁ

దోడఁబుట్టువురీతి నాకార్యమునఁ బ్రయత్నించును. శరీర పోషణకార్యమునఁ దల్లివలెఁ బ్రవర్తించును. పట్టపుదేవి నన్ను గరువ మాకౌసల్య కిసుమంతయు లేదు. ఆయాకాలములయం దయ్యైరీతుల నాకుఁ దోడ్పడునపుడు నేనును దగినయుపకారము చేయుట నాకు ధర్మముకదా. అట్లుండియు నేను నీయందుఁగల ప్రేమమున నీకేమి కోపమువచ్చునో యన్నశంకచే దాని నించుకంతయు గారవించినవాఁడను గాను. వ్యాధిబాధితుఁ డపథ్యవస్తువులఁ దిన నవి యవ్వల బాధించుచందమున నెఱుం గక పూర్వము నీకొనరించిన యుపకారమంతయు నిపుడు నీ దౌర్జన్యము ప్రత్యక్షముకాఁగా నింతటిపాపాత్మురాలి కొన రించితినే యని యది నన్నుఁ బిడించెడిని. అట్లుపకారము నీకుఁ జేయకయే యుండిన నింతటిప్రీతియు నాకుండదు. ఈసంతా పముకలుగు నవకాశము నాకు లేకపోవును.

సుమిత్ర నిన్నటి నానిర్ణయము. దానిని మార్చుటయు నంతియేగాక రాము నడవులకుంబంపుటయుఁ గాంచి ప్రాణ ములకంటె నధికుఁడగు రామచంద్రునినే యిట్టియన్యాయమున నడవులపాలు చేసినాఁడుకదా. ఈరాజు స్థిరబుద్ధికలవాఁడు కాఁడు. మిక్కిలి క్రూరుఁడు. నాకుమారు నేమిచేయునోకదా యని భయంపడి నన్ను నమ్మునా? అక్కటా ! జానకియు నా మృతికి రాము నరణ్యవాసమునకు నత్యంతము దీనురాలై యీ రెండువార్తల నొక్కకాలముననే వినఁగలదు. అయ్యో! హిమాలయముచేరువఁ గిన్నరుంబాసిన కిన్నరాంగనవలె రాము నడవులకు నేఁబంపఁగా సీత వగచుచుఁ బ్రాణములంబాయును. రాముఁ డడవులకుంబోవుచుండఁగా దానిం గాంచి సీత విల

పించుచుండఁగాఁ జూచుచున్న నేనుమాత్రము చిరకాలము జీవింపఁగలుగుదునా? నామృతికించిదప నీవు విధవవై కుమారుం గూడి రాజ్యము పాలింపుము. నాప్రియపుత్త్రుఁడు వనవాసము చేయఁబోవఁగా నాకుఁ బ్రాణములేల? క్షణమేని బ్రదుకఁగలనా? నీసౌందర్యమును మాత్రమే చూచి పూర్వము సాధుచిత్తవని నిన్నెంచితిని. ఇపుడు నీశీలము బయల్పడఁగా మహాపాపాత్మురాలవని తేలుచున్నది. నేత్రపర్వముగ నున్నదని చూచి విషమిళితమగుమద్యము త్రాగి యవ్వల దానిదుర్గుణములు బయలు పడఁగా దానిఫల మనుభవించువానియవస్థ నాకుంబట్టెను.

కైకా! ఇంతదనుక ననృతములగుసాంత్వనోక్తుల నన్ను పలావించుచుంటివి. వేఁటకాఁడు సుస్వరమున జింకను జెంతకుఁ దీసికొని వధించునట్లు నన్నిపుడు వధించితివి. భార్యాసుఖము నకై కొడుకును విక్రయించిననన్నుఁ బూజ్యమానవులు సురాపానముచేసిన బ్రాహ్మణుని దూఱునట్లు రాజవీథులయందు దూషింపక వదలరు. అక్కటా! ఎంత దుఃఖము సంభవించెను! ఎంతటికష్ట మిది! ఇట్టివానిని మున్నెఱుంగను. నారచీరలుగట్టి యడవులనుండునట్లు రాముని బంపుమని నీవడిగినమాటలను గూడ విని యోర్చుకొనుచున్నానుగదా. ఈవిధములగుదుఃఖములు పురాకృతదుష్కృతఫలములరీతి బదులుచేయ శక్యము గాక నాకిపుడు కలిగినవి. పాపమతీ! నీవిట్టిదానవని తెలిసికొనక గొంతున కురిత్రాఁడు తగిలించుకొని దానిని రక్షించుచున్నట్లు దురాత్ముఁడనై చాలకాలము రక్షించినాఁడను గదా. నీవురిత్రాఁడుచంపునట్లు నన్నుఁ జంపనెంచితివి. ఇట్టిదానవని యెఱుంగనైతిని. అజ్ఞానమున బాలుఁ డొంటరిపాటున నాగుఁబామును

జేతులంబట్టుకొనునట్లు నిన్నుఁ బెండ్లియాడితిని. ఆనాఁగుఁబాము బాలునింజంపునట్లే నామరణమునకు నీవు హేతువవైతివికదా! మహాత్ముఁడు రామునకు దుర్మతినగు నేను దండ్రి యయ్యు సుఖము గల్గింపఁజాలకపోతిని. రాముఁడు తండ్రిలేనివాఁడే యయ్యెను. ఇంతటిపాపాత్ముని నన్నుం గాంచి జనులందఱు మనప్రభువు కాముకుఁడు. మూర్ఖుఁడు. భార్యకొఱకు రాము నడవులపాలు చేయుచున్నవాఁడు. అని పలుభంగుల నాక్రో శింతురు.

దుర్మతీ! రామచంద్రుఁ డింత కాలము వ్రతములు, బ్రహ్మచర్యనియమము, గురుశిక్ష యనువానివలన విశేషించి శ్రమలపాలయ్యెను సుఖముల ననుభవించినవాఁడే కాఁడు. సుఖమనుభవించుకాలమున నిపుడు మహాకష్టములు గలిగినవి. నా ప్రియపుత్త్రుఁ డడవికిఁబొమ్మని నేఁ జెప్పఁగా బదులు పలుకఁ నేరఁడు. శిరసావహించి పోవును. ఈమాట నిశ్చయము. రాముఁడు వనమునకుఁ బొమ్మను నామాటకుఁ బ్రతికూల ముగాఁ బ్రవర్తించునేని నాకది మిక్కిలి ప్రియముగనుండును. కాని యతఁ డట్లు చేయునా? రామమూర్తి కపటమెఱుంగని విమలాంతఃకరణుఁడు. కనుక నే నన్నును దనవంటివానిగా భావించును. అభిప్రాయము వేఱొకరీతిగా నామాటయం దుండునని తలంపఁడు. అట్టివాఁడు కనుకఁ బొమ్మనఁగానే పోవు దునునను. వనగమనము నాకిష్టముకాదనియు, నదియే నామనో భావమనియు నెఱుంగఁడు.

శ్రీరామమూర్తి వనములకుఁ బోవఁగా లోకులెల్ల నన్ను ధిక్కరింతురు. అది సహింప శక్యమగునా? తుదకు మృత్యువు.

యముని౦టికి నన్నుఁ గొనిపోవును. నేను యమపురికి రాముఁ డడవులకుఁ బోవఁగా మిగిలియున్న కౌసల్యాదులకు నే మపకార ము చేయఁదలంతువో. కౌసల్యయుఁ గొడు కడవులకుఁబోవఁగా మృతినొందక యుండఁజాలునా? సౌమిత్రి యన్న నెడఁబాయఁ జాలఁడు కాన నతఁడును వానింగూడియే వనులకుంబోవును. శత్రుఘ్నుఁడు దైవవశమున భరతునివెంటఁ బోయెను. కాన నిట వాఁడును లేఁడు. నీవు కౌసల్యను నన్ను రామలక్ష్మణశత్రు ఘ్నులను వదలుదువేని సుమిత్రయు నీశోకమును భరింపఁ జాలక నన్ననుగమించి మృతినొందు. మమ్మెల్లర ఘోరనరక ప్రాయమగు నీదుఃఖమునఁ బడఁద్రోసి నీవుమాత్రము సుఖ ముగా నుండుము. ఈయిక్ష్వాకువంశము శాశ్వతముగా నుండు నది. సద్గుణములఁ బూజ్యమైనది. ఇట్టి పవిత్రవంశమును గలంపఁ దలంపకుము. దీనిని రాముఁడు నేను వదలిపోవఁగా నీవు రాణివై బీభత్సముగాఁ బాలింపఁగలవు.

రాముఁ డడవికేగుట భరతునకుం బ్రియమేని నాకా భరతుఁ డూర్ధ్వలోకక్రియలు చేయఁగూడదు. అక్కటా! దుష్టాత్మకురాలా! నాకు నీవు శత్రువవు. ఇంతటిఘోరకార్యము చేసి నీవాంఛలను దీర్చుకొనుము. రామునిపైఁ బ్రీతినుంపుము. నేను మృతినొంద రాముఁ డడవులకుంబోవ నిపుడు పరమ కల్యాణివై యుండు నీవు విధవవై భరతునింగూడి రాజ్యమును బాలింపఁగలవు. నాకు నీవే మహాపకీర్తివి. మహాజనులయెదుట నాకుఁ గలిగెడుతిరస్కారము నీవే. ఎల్లభూతములదృష్టికి నీచ ముగాఁ దోఁచునవమానమే నీవు నాకగుదువు. రాజకుమారి యనుపేర నాయింట నివసించినందుననే యింతటియపయశస్సు

పరాభవము నవమానము నాకుఁగల్గినవి. పాపాత్ములకుం గల్గు నవియెల్ల నాకుఁ గలిగినవి. నాకుఁ బ్రియపుత్త్రుఁడగు రాముఁడు కోరినపుడెల్ల గజతురగరథాదులనెక్కి తిరుగుచుండి యిపుడు మహాటవులలో నెట్లు తిరుగఁగలఁడు? కుండలముల బహుమాన ముగాఁ బొంది వాని ధరించియున్నవంటవాండ్రు రాముఁడు భుజించుతఱి నేను ముందు నేను ముందని మంచియన్నము లోనగువస్తువులను వడ్డింతురు. అట్టిసుకుమారుఁడు వనముల నొగరు కారము చేఁదు నగు కందమూలాదుల నెట్లు తిని బ్రదుకఁ గలఁడు?

నాచిన్నారికుమారుఁడు రామచంద్రుఁ డమూల్యవస్త్రములధరించి చిరకాలము సుఖశయ్యలశయనించియుండి యిపుడు మహారణ్యములయందుఁ గాషాయవస్త్రములంగట్టుకొని కఠిన భూతలముల నెట్లు శయనింపఁగలఁడు? ఛీ! ఛీ! కైకా! రామమూర్తి నడవులకుంబంపి భరతునకు రాజ్యమిమ్మని యించుకైన ముందువెనుక లాలోచింపని భయంకరవాక్యము నీ వెవ్వరియుపదేశమునఁ బలికితివి? సాధారణముగా స్త్రీలెల్ల కపటవ్యాపారముకలవారు. వారిస్వభావము సర్వదా రహస్యముగా నొరులకు నపకారముచేయుటయే. వారిదృష్టి స్వకార్యమునందే. పరులకష్టములను బాటింపరు. వారు నిందలపాలై నశింతురు గాక. ఆలోచింపఁగా స్త్రీలలోఁ బుణ్యాత్మురాండ్రును గలరు. కావున నెల్లవారలను నేను దూషింపఁదలంపను. భరతునితల్లిని గూర్చియే ముఖ్యముగా నీమాటచెప్పెదను. కైకా! ఇప్పటి నీభావము నీకు నితరులకు ననర్థావహమే. నీపనియే నీకు ముఖ్యముగ నున్నదే. ఏల? కొంచెమైనఁ గరుణలేక నన్ను దుఃఖ

ములపాలుచేయ నిట్టిదుర్భావము నేలపూనితివి? నావలన నీకేమి యపకారముకలిగెను? సర్వప్రపంచమునకు హితము రాముఁడు చేయును. నీకుమాత్ర మహితము గావించునా? ఈవఱ కేయప కారము చేసెను?

లోకమునఁ దండ్రులు తమప్రియపుత్త్రులవదలినను వదల వచ్చును. పురుషులు తమరు ప్రేమించుభార్యల వదలిన వదల వచ్చును. భార్యలు తమప్రియభర్తలను విడిచినను విడువ వచ్చును. ఈజోలికి లోకులు రారు. దీనిచే నాకు నీకు నేమియు బాధలేదు. నేనిపు డడవికి రాముని బంపఁగా నతఁడు దుఃఖ మున మునిఁగియుండఁగా లోకముఁ గాంచెనా యిన్నికష్ట ములు రామునకుఁ గల్గించిన నిన్నుమాత్రము స్థావరజంగమ ములుకూడఁ గోపగించును ఇది తప్పదు. ప్రపంచమునఁ దండ్రులకుఁ గుమారులయందుఁ బ్రీతియుండుట సామాన్యము. నాకన్ననో కుమారునియందుఁ గలప్రీతి లోకసాధారణమగు నది కాదు. లోకాతిశయమైనది. కావున దేవపుత్త్రుఁడువలె సహజ సుందరుఁడై సకలభూషణభూషితుఁడై గంధగజగమనమున వచ్చు నాచిన్నారికొడుకును మనస్సునఁ జూచినను దూరమునఁ జూచినను మిక్కిలి సంతోషముగల్గును. సమీపమునకు రాఁగాఁ గాంచినచో దేహ ముప్పొంగి బల మతిశయింపఁగాఁ గ్రొత్త వయస్సు వచ్చినట్లే యుండును. సూర్యుఁడు లేకపోవుఁగాక. పర్జన్యుఁడు వర్షింపకయుండుఁగాక. లోకులకు గమనాగమన ములు బ్రదుకును గలుగును. కాని శ్రీరాముఁడిటనుండి యడ వికిఁ బోవుచుండఁ జూచినయెడల నొక్కజంతువుకూడ బ్రదుక దని నాకుం దోఁచెడిని. నావినాశముంగోరి యహితురాలవై

నాకపకారము చేయఁగోరుచున్న నిన్ను మృత్యువుంబోలె నింత కాలము నాయింట నుంచుకొంటిని. క్రూరవిషసర్పమవగు నిన్నుఁ దెలియక చాలకాలము తొడపై నిడుకొంటిని. కనుకనే నన్ని పుడు కఱచి చంపితివి. నన్ను రామలక్ష్మణులనువదలి భరతుఁడు నిన్నుఁగూడి పురమును రాజ్యము బంధువులనువధించి చక్కఁగా బరిపాలనము సాగించుఁగాక. ఈరీతిగా నొనరించి నీవుకూడ సంతోషమును గూర్చుచుండుము.

క్రూరప్రవృత్తిగల యోకైకా! దెబ్బపై దెబ్బగా శ్రీరాము నెడఁబాటు నోర్వనివ్యసన మొకవంక బాధించు చుండఁగా రాము నడవులకుం బంపుము. పంపుము అని మరల మరల నన్ను బాధించుచున్నదానవే. ఆపత్కాలముననే బాధించు దానవుకదా. భార్య చూపఁదగుమర్యాద వదలి నాయెదుట నీవిపుడు స్వాతంత్ర్యము వహించి యిట్టిక్రూర వాక్యములు పలుకుచున్నావుకదా. ఇట్టి నీనోటినుండి దంతము లన్నియు వేయిశకలములై పగిలి భూమింబడకయున్నవే. ఏల? శ్రీరామమూర్తి నీకహితముఁగాని యప్రియముఁగాని యొక్క మాట చెప్పినాఁడా? పరుషోక్తులాడ నతఁ డెఱుఁగనే యెఱుఁ గఁడు. సర్వజనులకుఁ బ్రియముగా మాటలాడుచు సద్గుణా కరుఁడై జనస్తుతులకుం బాత్రుఁడైయుండు నాకుమారవర్యుని యందు దోషములు గలవని యెట్లు చెప్పఁగలవే? కేకయ రాట్కులపాంసనీ! పరితపింపుము క్రోధాగ్ని మండిపొమ్ము. నశింపుము. పైనుండి క్రిందఁబడి వేయితునుకలుగా నగుము. ఇందు నీవెట్టులైన నగుదువుగాక. నాకత్యంతాహితము దారు ణము నగుమాటను నేను జేయనుజుమీ.

కైకా! నీవు మంగలకత్తిరీతి క్రూరమయినదానవు. అసత్యమును బ్రియముగాఁ బలుకుదానవు. దుస్స్వభావురాలవు. కులపాంసనురాలవు. నాహృదయమును బ్రాణములతోడఁ గాల్పఁ గోరుచున్నదానవు. కనుక నీవు జీవించియుండ నేఁజూడఁ జాలను. నేనును బ్రదికియుండఁజాలను. ఇఁక నాకు సుఖ మెక్కడనుండివచ్చును? బ్రదికియున్నను రామమూర్తిలేక సుఖ మెట్లు కల్గును? నీతోడంగూడిన సుఖమెక్కడిది? ఇవి లేకుండుఁ గాన, నీవు నాకు భార్యవుగాన నాకు నపకారము నీవు చేయ రాదు. నీపాదములపైఁబడి ప్రార్థింతును. నాయం దనుగ్రహము కనఁబఱపుము. అని వేఁడెను.

ఈరీతిగా దశరథుఁడు స్త్రీమర్యాద నతిక్రమించిపోవు చున్న యాకైకకుఁ దనహృదయము చిక్కిపోవఁగా రాజయ్యుఁ దనమనస్సును మరలించుకొననేరక యనాథునివలె నేడ్చుచు రోగి బలముదూలి పడిపోవున ట్లామెపాదములపైఁ బడియెను. కాని యామె దానిం బాటింపక పాదములను వేఱొకప్రక్కకుఁ జాఁపెను. కావున నారాజు వట్టినేలపైఁ బడియెను. అంతియ కాని యామెపాదములనుమాత్రము స్పృశించినవాఁడు కాఁడు.

మహాశయులారా! ఈభాగమున నత్యంతదుఃఖవిష యము కలదు: కాన నిది విమర్శనార్హమా యని భావింపక విమర్శింతము. అనేకవిషయము లిందు విమర్శనార్హములు కలవు. నేర్చుకొనఁదగిననీతు లెన్నియో యిందుండి గ్రహింప వలయును.

“ఇత్యాలోక్య పురః పత్నీం వ్యాఘ్రీమివ పురస్థితాం,
కిమిదం భావసే భద్రే మమ ప్రాణహారం వచః

రామః కమపరాధం తే కృతవాన్ కమలేక్షణః."
అధ్యాత్మరామాయణము 3 సర్గము.

అనుమూలమును బరికింతము. కైకవరములను విన్నయంతనే రాజుచెంతకు మృత్యు వరుదెంచెను. మృత్యువు సమీపింపఁగా భయముం గలుగునుగదా. ఆభయమే యతనికిం గలుగఁగా ఆఁడుబెబ్బులివలెఁ గైక యెదుటఁ దోఁచెను. కాని కర్మవాసనంబట్టి భార్యయన్నబుద్ధి యాతని వదలలేదు. మృత్యుప్రోత్సాహితుఁడు కావున నాప్రాణములఁదీయుమాట నేల భాషించుచున్నదానవని ప్రశ్నించెను. సత్కర్మవాసన లలము కొన్నందున శ్రీరాముని భగవంతుఁడనియే తలంచెను. "కమలేక్షణః" అన్నపదమే యిందులకు దృష్టాంతమని యెఱుంగవలయును. అట్టి దుఃఖసమయమున రామునిసౌందర్యమును దెలుపు పదములు స్మృతికి రాఁజాలవు.

"హారామ పుత్ర హాసీతే హాలక్ష్మణ గుణాకర,
వదన్నేవం దశరథః ప్రాణాంస్త్యక్త్వా దివం గతః."

అని యున్నది. రాముని స్మరించుచునే ప్రాణములను వదలెను. కావున దశరథునిభావ మపుడు కర్మప్రోత్సాహమున రాముని భగవంతుఁడనియే నమ్మెను. తనకుఁ బ్రాణహాని కలుగుననియు రాజూహించెను. కావునఁ దొలిమేన సత్కర్మము లాచరించినవారల కంత్యకాలమున నేవిధముననైన భగవంతునియందు నాసక్తి కలుగును. దాన నామహాత్ముని యనుగ్రహమునకుఁ బాత్రుఁడగును.

"అంతకాలేచ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరం,
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః. గీ

యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరం,
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః. ౬
తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ,
మయ్యర్పితమనోబుద్ధిర్మామేవైష్యస్యసంశయః. ౭
అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా,
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్." ౮

గీత. ౮ అధ్యా.

అను నీభగవద్వాక్యములు సత్యములు కాకపోవుగదా. కొందఱిప్పట్టున నిట్లు ప్రశ్నింతురు. అనేకపాపములు విసుగులేక యొనరించి తుదకు భగవంతుని ధ్యానించుచుఁ బ్రాణములు వదలిన ముక్తికల్గునా? అనునదియే వారిప్రశ్నసారము. వీరికి సమాధానము చెప్పుట సులభకార్యము కాదు. అనేకపాపము లొనరించువారు మరణకాలమున భగవంతుని దలంచుచుఁ బ్రాణములవదలుభాగ్యము కలవారు కాఁజాలరు ప్రాణములవదలు కాలమున వారిచిత్తవృత్తి యెట్లుండునో తెలియఁదరముకాదు. కొంతముందు భగవంతుని ధ్యానించినను దత్కాలమున వారి చిత్తము పరమేశ్వరునిచరణారవిందములయందు లగ్నమై యుండునని సాధారణముగా నమ్మ వలనుపడదు.

"అనేకజన్మసంసిద్ధస్తతో యాంతి పరాం గతిం"

అనియే భగవద్వాక్యము కలదు. భగవంతుని బెక్కుజన్మముల నారాధించినవారికింగాని యట్టిస్మృతి యంత్యకాలమునం గలుగదు. అనేకపాపకార్యము లొనరించినవా రేదోయొకనెపమున భగవన్నామ ముచ్చరించి ముక్తినొందినట్లు కథలుకలవుకదా యందురేని తఱచుగా నట్టికథలనుండి భగవన్నామ మనంత

ఫలదమనునీతిని గ్రహింపవలయునే కాని మనమట్లే దుష్కార్యము లొనరించి యెపుడో యొక్కసారి నారాయణా యని స్మరించి గుబీలున ముక్తిమండపమున దుముకఁగలమని గ్రహింపరాదు. సాధారణముగాఁ బురాణములయం దట్టికథ లగపడుచుండును. అవి పామరులహృదయక్షేత్రములందు భక్తిబీజమును నాటుటకై యతిశయముగఁ జెప్పఁబడినవి. అట్లు చెప్పుట లోకోపకారమే యగు. ఆకథలవలనిసార మెద్దియని విమర్శింపక యెన్ని పాపములు చేసిన నొక్కసారి రామ! కృష్ణ మహాదేవ! యను మొదలగుభగవన్నామము లుచ్చరించిన సకల పాపములు తొలఁగునన్న ఫలస్తుతుల నమ్మి దుష్కార్యములు చేయరాదు. తలుచుగా ఫలస్తుతుల నమ్మరాదు. అసత్యము లేల చెప్పిరని వారి నాక్షేపింపరాదు. పామరు లాఫలములంగోరి యైన భగవంతు నారాధింతురనియే మహర్షులయాశయము.

"శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే,
సహస్రనామతత్తుల్యం రామనామ వరాననే."

అనువాక్యముల నుదాహరించి కొందఱు మధ్యవైష్ణవులు,

"కోటయో బ్రహ్మహత్యానామగమ్యాగమకోటయః,
సద్యః ప్రళయమాయాంతి మహాదేవేతి కీర్తనాత్."

అనువాక్యముల నుదహరించి మధ్యశైవులు. ఇంకనుంగల మహానీయులు కొందఱు పామరుల మోసపుచ్చి వారిపాపములు తొలఁగిపోవునని నమ్మించి ధనము సంపాదింతురు. కాని యీపామరులపాపములన్నియు వారలనే పొందును. కావున మన మట్టి భగవంతు నారాధించుచు శ్రద్ధాభక్తులు గలిగి తన్నామసంకీర్తనము చేయవలయును. కపటవేషధారులమాటలకుఁ జోటి

ష్యరాదు. పాపకార్యనిరతుల కంత్యకాలమున భగవంతునిపై ధ్యానము కుదురదు. ప్రాక్తనసుకృతపుంజఫలమే యది యగును. ఈసిద్ధాంతము మార్పఁదరముకానిది.

"జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః" ౭. (గీ. ౬.)

అన్న శ్రీకృష్ణోపదేశమే పైవిషయమును సిద్ధాంతముచేయుచున్నది. చిత్తశుద్ధిగలవారికే భగవదనుగ్రహము కలుగుఁగాని ధనాశాపీడితాంతఃకరణులై కాషాయవస్త్రములు దాల్చి సర్వసంగపరిత్యాగులమని చెప్పుకొనుచు ధనములాగుమూఢులకా భగవదనుగ్రహము శశవిషాణమే. వారిమాటలు తుచ్ఛములని భావించి పరమేశ్వరు నిక్కపుభక్తితో నారాధించుచు సత్కర్మముల నాచరించుచు దుష్కర్మములకు దూరమున నుండుచు వర్తించువార లెవ్వరో వారలే భగవదనుగ్రహముఁబడయఁగలరు. ఇది యధ్యాత్మరామాయణమునఁ గలప్రస్తుత విషయసారము. ఇఁక శ్రీమద్రామాయణమును బరికింతము.

"మండలే పన్నగో రుద్ధో మంత్రైరివ మహావిషః"

అని మూలము. దశరథుఁడు కైకవాక్కులను పాశములకుం జిక్కెను. క్రూరసర్పము సర్పములబట్టుకొనువానిమంత్రమండలమునఁ జిక్కుపడినరీతిగా నని ప్రతీతికార్థము. పాములవాఁడు సర్పము వెడలుమార్గమునఁ గొన్నిగీఁతలుగీచి మంత్రబీజాక్షరముల లిఖించి యక్షతలు చల్లును. కొన్ని ద్వారములుగా నవి యుండును. ఆవిధ మెఱుంగక యాక్రూరభుజంగము వల్మీకము నుండి వెలువడి యామండలమునఁ బ్రవేశించును. ప్రథమ ద్వారభూతరేఖామధ్యభాగమునఁ గొంతబలము తగ్గును.

ఎంతో కష్టముపై నవ్వలం బ్రవేశించును. ద్వితీయమండలమున మఱెంతలోఁబడును. దానిని దాఁటు ననుకొందము. ఆవలనున్న రేఖామండలమునఁ జిక్కుపడి నిట్టూర్పులుకూడ వదలఁజాలక యుండును. దానినపుడు వాఁడు పట్టుకొనును. ఈవిషయము సర్వజనులకుఁ బ్రత్యక్షముకావున విశేషించి పెంచి వ్రాయ నక్కఱలేదు. మంత్రశక్తి యిందుమూలమునఁ దేటపడును. మంత్ర దేవతలుకూడఁ గర్మవశంగతులు. కర్మదేవతలకు మంత్రాధిదేవలకు భేదములేదన్నను బ్రమాద మేదియులేదు.

మంత్రపాశబద్ధుఁడగుసర్పరాజువలె దశరథుఁడు మృత్యు పాశబద్ధుఁడయ్యెను. కైకవరము నిమిత్తమాత్రమే. మున్ను చేసినపాపము ఫలమీయ సిద్ధముగా నుండెను. అదుష్కర్మమే మృత్యువును బ్రోత్సహించెను. తత్పాశములే దశరథుని నిర్బంధించెను. లోకదృష్టికిఁ గైక హేతువుగాఁ గనంబడును. అంతియగాని కైక కిందు నేయధికారము లేదు. ఇందలిరహస్య మెఱుంగనివారే కైకను దూషింతురు. ఇందలిరహస్యము పరిశీలించినఁ గర్మసిద్ధాంతతత్త్వము తేటపడును. కనుకనే మానవులు సత్కర్మముల నాచరించి ఫలములను భగవదర్పణము చేసిన నయ్యవి యనంతఫలము నొసంగును. భగవదనుగ్రహ మట్టివారికే కలుగును.

"కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన,
మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి." ४७

(గీత. ౨. అధ్యా.)

అను నీగీతావాక్యము కర్మపద్ధతిని బోధించుచున్నది. దీనింబట్టి మానవులేకార్యము నొనరింప నశక్తులనియు, నట్టులని ప్రయ

త్నము మానరాదనియు, ఫలముల నాశింపరాదనియు, స్వప్రయ త్నము ఫలించినను ఫలింపకయున్నను మోదఖేదముల నొంద రాదనియుఁ దేటపడుచున్నది.

"కౌసల్యాం వా సుమిత్రాం వా త్యజేయమపి వా శ్రియం
జీవితం వాత్మనో రామం న త్వేవ పితృవత్సలం
పరా భవతి మే ప్రీతిర్దృష్ట్వా తనయమగ్రజం
అపశ్యతస్తు మే రామం నష్టా భవతి చేతనా"

అనుమూలము పరిశీలింపఁదగినది. సర్వమును త్యజింతును. నా యందు ప్రీతిగలరామచంద్రుని వదలఁజాలను. రాముని జూచి నంతన నా ప్రీతి వృద్ధియగును. ఆతనింజూడకయున్న జీవితము నష్టమగును. అని దశరథుఁడు పల్కెను. మున్ను చేసిన ముని కుమారవధరూపదుష్కర్మ మాతని నిట్లు పల్కించెను. భార్య లను భాగ్యమును గూడ వదలఁగలను. రాముని వదలఁజాలను. అనఁగా భావమేమి? కైకా! మీకు నాకును ఋణరూపమగు ననుబంధము వదలినది. రాముఁడడవులకుఁ బోవుట నేను దేహ మునువదలుట ఈ రెండు కార్యముల వ్యవధిగా సాగును. అని దశరథుఁడు పల్కెననియేకదా. దీనినుండి మనము గ్రహింపఁ దగినదేమి? మానవులబుద్ధులు రాఁగలఫలముల ననుసరించి మాఱుచుండును. దుష్ఫలము లనుభవించుతఱి రానున్నచో దురూహలు కలుగును. సత్ఫలానుభవకాలము రానుండఁగా సదుద్దేశములు పొడసూపును. బుద్ధిమంతు లీవిషయము నెఱుంగఁగలరు. సామాన్యుల కిది పొడకట్టదు. కావుననే తమ లాభనష్టములఁ దామే యెఱుంగఁజాలక పాటుపడుచుందురు.

ఆయూహలను మరల్ప శక్యము కాకయుండును. అట్టితఱిఁ జేయ వలసిన దేది?

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం"

అన్న శ్రీకృష్ణపరమాత్మయుపదేశమును సర్వదా స్మరించుచు సర్వము నతనిపై వైచి తదారాధనము చేయుచుండుట మంచిది. దాన భావిఫలానుభవము సుగమమగును. దుఃఖము తగ్గును. ఈమాత్ర మాలోచింపక పోయినచో నాఫలానుభవమున మోదమో ఖేదమో పొడసూపక మానవు. ఇవి రెండును తుదకు దుఃఖమునే కల్గించుననవలయును. మోదము మంచిది కాదా యని కొందఱందురు. అయ్యది పొరపాటు. ఏలన? ఆమోదము స్వార్థలాభమున నాసక్తిని పెంపొందించును. అయ్యది యనర్థముగాక మతేమగును! కావున బుద్ధిమంతులు మోదమును ఖేదమును సమానముగా భావింతురు.

"సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ,
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి." 38
(గీ. ౨. అ.)

అన్నగీతావాక్యము పైవిషయమును దృఢపఱచుచున్నది.

"తిష్ఠేల్లోకో వినా సూర్యం సస్యం వా సలిలం వినా,
న తు రామం వినా దేహే తిష్ఠేత్తు మమ జీవితం
తదలం త్యజ్యతామేష నిశ్చయః పాపనిశ్చయే,
అపి తే చరణౌ మూర్ధ్నా స్పృశామ్యేష ప్రసీద మే"

అని మూలము. ఇందుఁగల దశరథునూహ పైవిషయమునే దృఢపఱచుచున్నది. తనకు మృతి దప్పదని చాటెను. తనకుఁ

ప్రాణములపైఁ గలయాశచేఁ గైకపాదములపైఁ బడుదును. దయ యనుపుమా యనియుఁ బలికెను. దీనింబట్టి పామరులన్నింటికంటెఁ బ్రాణరక్షణమునే ప్రధానముగా భావించువారని తెలియనయ్యెడిని. ఇపుడు దశరథునకు జ్ఞానము నశించినది. దానిచే యుక్తాయుక్తకార్యము లేవియో తెలియకున్నది. భార్యకు నమస్కరించుట యసమంజసమని తోఁపలేదు. ఈర్ష్యాకలహకోపములయందు భార్యకు నమస్కరింపవచ్చు నను పురాణవచనము కలదు.

"మమ కో వా నమస్కార్యో విద్యతే భువనత్రయే. 33
ఈర్ష్యాకలహకోపేషు త్వయి మే పరమా నతిః
అతః పుమంతరే క్వాపి న నమస్కారవానహం 34
అతః ప్రణయకాలేషు తుభ్యమేవ నమస్కృతిః"
(లలితోపాఖ్యానము. ౧౧. అధ్యా.)

అని శంకరవాక్యము. ఇదియుఁ గామవ్యవహారమున నిర్దేశింపఁబడినది. అంతియగాని భార్యకు నీర్ష్యాకలహకోపములయందు నమస్కరింపవలయునని కాదు. దశరథునిచిత్తము స్వాయత్తముగా లేదు. కనుక నసంగతప్రసంగముల నెన్నియో చేసెను. కాని శ్రీరామునియందుమాత్రము చిత్తము చేర్చెను. అదియే సత్కర్మఫలమని మన మూహింపవలయును.

"బహూనాం స్త్రీసహస్రాణాం బహూనాం చోపజీవినాం,
పరివాదోపవాదో వా రాఘవే నోపదృశ్యతే.
సాంత్వయన్ సర్వభూతాని రామశ్శుద్ధేన చేతసా,
గృహ్ణాతి మనుజవ్యాఘ్రః ప్రియైర్విషయవాసినః.
సత్యేన లోకాన్ జయతి దీనాన్ దానేన రాఘవః,

> గురూన్ శుశ్రూషయా వీరో ధనుషా యుధి శాత్రవాన్.
> సత్యం దానం తపస్త్యాగో మిత్రతా శౌచమార్జవం,
> విద్యా చ గురుశుశ్రూషా ధ్రువాణ్యేతాని రాఘవే.
> తస్మిన్నార్జవసంపన్నే దేవి దేవోపమే కథం,
> పాపమాశంససే రామే మహర్షి సమ తేజసి"

అని మూలము. వీనిసార మెద్దియని పరికింతము. సామాన్యార్థము స్పష్టముకదా.

ఎవ్వాఁడు తనసేవకులవలనను, దనసేవకు రాంద్రవలన నొక్కపరిభవముగాని, అపవాదారోపణముగాని పొందఁడో యాతఁడు శుద్ధచరిత్రుఁడని మన మూహింపవలయును. ఏల యనఁగా సర్వకాలము వారు సేవించుచుందురు. మానవుని యందుఁ గలలోపములు వారెఱింగినన్నింటి నితరు లెఱుంగఁ జాలరనుట సత్యము. ఏకాలముననో ప్రమాదము లుండవచ్చు. అవి వారికిఁ దెలియకయుండకమానవు. కావున నట్టివా రించు కయు దూషింపకయున్నచో నతఁడు పరిశుద్ధాచారసంపన్నుఁ డనియే గ్రహింపవలయును. అట్టి యదృష్ట మెవ్వానికి లేదో యతఁడు మలినాచారవంతుఁడే యనవలయును. శ్రీరామ చంద్రుఁడు సదాచారమున నెవ్వరివలనంగూడ నించుకయే నిందనొందినవాఁడు కాఁడు. ఏల? పరమాత్మ కదా. ఏదోషము నెవ్వాఁడు కనిపెట్టఁగలరు? సర్వభూతములహృదయదేశముల నుండి వారిని దోలుబొమ్మలవలె నాడించుభగవంతు నెవ్వరు పరి భవింపఁగలరు? ఈయుదాహరణముచేత శ్రీరాముఁడు భగవం తుఁడే యని తేటపడుచున్నది.

సర్వభూతములను మంచిమాటల నుపలాలించును. అనఁ

గా సర్వభూతములయందు దయగలవాఁడని భావము. ఆయుప లాలనము పరిశుద్ధమనస్సునఁ జేయును. అనఁగా లోకులను మోస పుచ్చుటకుఁగాక నిర్మలస్వాంతమునఁ జేయువాఁడని భావము. భూతదయగలిగినట్లు నటించుచు నంతరంగమునఁ గాఠిన్యము వహించుట పాపమని యట్టివారు జగద్వంచకు లనఁబడుదురని సారము. రాజ్యమునఁ గలమనుజులనందఱను వారివారికోర్కులఁ దీర్చుటచే లోఁబఱచుకొనుచున్న వాఁడు. అనఁగా వారివారి కష్టసుఖములఁ బరిశీలించి తోడ్పడువాఁడనియే భావము. ఇదియే రాజనీతి. ఇదియే పూజ్యులలక్షణము.

"నమ్రత్వేనోన్నమంతః పరగుణకథనైస్స్వాన్ గుణాన్ ఖ్యాపయంతః
స్వార్థాన్ సంపాదయంతో వితతపృథుతరారంభయత్నాః పరార్థే,
క్షాంత్యైవాక్షేపరూక్షాక్షరముఖరముఖాన్ దుర్ముఖాన్ దూషయంతః
సంతస్సాశ్చర్యచర్యా జగతి బహుమతాః కస్య నాభ్యర్చనీయాః. ౭౦
(నీతిశతకము.)

అని భర్తృహరి వచించెను. శ్రీరామునిచర్యయే యిందుల కాధారము. సత్యమున లోకముల జయించును. అనఁగా లోఁబఱచుకొనునని భావము

"సత్యేన పూయతే సాక్షీ ధర్మస్సత్యేన వర్ధతే
తస్మాత్సత్యం హి వక్తవ్యం సర్వవర్ణేషు సాక్షిభిః" ౭౩
(మను. ౮. అధ్యా.)

అనుస్మృతి రామచంద్రునాచారమునే ప్రమాణముగాఁ గై కొనియె ననవచ్చును. దీనులను దానమున సుఖపెట్టుచున్నాఁ డను. దీనులనఁగా దారిద్ర్యసాగరనిమగ్నులని యర్థము.

"దరిద్రే దీయతే దానం సఫలం పాండునందన"

అని నీతిశాస్త్రము రామునిచర్యను శరణముగాఁ గొనియె నన వచ్చును. గురువులను సేవాధర్మమున సంతోషపఱచును.

"వృద్ధాంశ్చ నిత్యం సేవేత విప్రాన్ వేదవిదశ్శుచీన్
వృద్ధసేవీ హి సతతం రక్షోభిరపి పూజ్యతే 3౭
తేభ్యోఽధిగచ్ఛేద్వినయం వినీతాత్మాపి నిత్యశః
వినీతాత్మా హి నృపతిర్న వినశ్యతి కర్హిచిత్" 3౯

అన్నమనుస్మృతిరామచంద్రునాచారమునే ప్రశంసించుచున్నది. ధనుస్సుచే యుద్ధరంగమున శత్రువుల నోడించుచున్నవాఁడు. అనఁగాఁ బౌరుషము నుచితకాలమున నుపయోగించునని భావము. ఇన్నిగుణములుగలవాఁడు రామమూర్తియని దశరథుఁడు వర్ణించెను.

దీనినుండి గ్రహింపఁదగువిషయములేవి? మానవుఁడు భూతదయగలిగి యుండవలెనని తొలుత నేర్చుకొనవలెను. దానిచే నహింసావ్రతమున నాసక్తి గలుగును. అహింసయందు సకలధర్మములు నెలకొనియున్నవి. దానిని మించినధర్మములు లేవని మహాభారతము స్పష్టపఱచుచున్నది. అట్టి యహింసావ్రతము శ్రీరామమూర్తిప్రవృత్తియందుఁ గనందగు. ఆశ్రితరక్షణ మాపురుషోత్తముని స్వభావమనవలయు. సత్యసమాదరణము ప్రధానము. శ్రీమద్రామాయణమునందు రామచంద్రుఁడు తెలిపినవానిలో "అనృతంనోక్తపూర్వమ్మే" అనునదియే ప్రధానము. కావున నట్టిభగవంతుఁ డాచరించి తేటపఱచిన సద్గుణములలోనే యొక్కదానినైన మన మలవఱచుకొనఁ బ్రయత్నింపవలయును. కేవల రామచరితమును బఠించి ధనము సంపాదించుట లాభకరముకాదు. దాన విశేషించి మేలు లేదు.

దానిసారమేమని విమర్శించి యందొక్కమంచియలవాటునైన మనకు లభించునట్లు చేసికొనకయున్న నారామాయణఫల మల్పమే యగును. యథాశక్తి న్యాయమునననుసరించి యాపర మేశ్వరునియందుఁ గలసద్గుణవ్రాతమున నేయొక్కదానినైన నభ్యసింప యత్నింపవలయును. అదియే యిందుఁగలసారము.

"అంజలిం కుర్మి కైకేయి పాదౌ చాపి స్పృశామి తే
శరణం భవ రామస్య మాఽధర్మో మామిహ స్పృశేత్"

అని మూలము. "శరణం భవరామస్య" రాముని రక్షింపుమా యనికదా భావము. ఇది సామాన్యార్థమునుండి తేలినది. శరణ మనఁగా గృహము. రామునకు గృహము కమ్మా. అనఁగా రాముఁడు నివసింప నవకాశము కల్పింపుమా యని యర్థము. శ్రీరామునిచరిత్రము నీమూలమున నిలుచునట్లు చేయుమా యని భావము. నీ వీవరము లడుగకయున్న శ్రీరామునిచరిత్రము లోకపావనమై దేవతలకు లాభము నొసంగుచు, దుష్టనిర్మూలనముచేయుచు, ధర్మమును శాశ్వతముగా నెలకొల్పఁ జాలదనియే సారము. దశరథుఁ డీయభిప్రాయముకలవాఁడా యని ప్రశ్నింపకుఁడు. దశరథునకుఁ దెలియక వాక్కులు వెడలుచున్నవి. దుఃఖాక్రాంతుఁడు. పరవశుఁడు నై యున్నవాఁడు. భావికాలము పురికొల్పఁ దానేమనుచున్నాఁడో యాతఁ డెఱుంగఁడు. కాని దైవికముగా నీభావమే వెలువడవలెను. అట్లే వెడలెనని మనము గ్రహింపందగు. దీనివలనిలాభమేమి? అని యడుగవచ్చును. కైక లోకమునకు మహోపకారమొనర్చె నని యెఱుంగుటయే లాభము. కైకేయి దుష్టురాలన్న భావము మనమనస్సులనుండి తొలంగెనేని భగవంతునకు సాయపడిన

వారలలోనొకతుక కైకయగునని మనము గ్రహింతుము. అపుడామెను మనము దూషింపక భూషింతుము. ఇంతకన్న లాభము వేఱేది కావలయును?

"యది దత్త్వా వరౌ రాజన్ పునః ప్రత్యనుతప్యసే,
ధార్మికత్వం కథం వీర పృథివ్యాం కథయిష్యసి. 39
యదా సమేతా బహవస్త్వయా రాజర్షయస్తదా,
కథయిష్యంతి ధర్మజ్ఞ తత్ర కిం ప్రతివక్ష్యసి. 40
యస్యాః ప్రసాదే జీవామి యా చ మామభ్యపాలయత్,
తస్యాః కృతం మయా మిథ్యా కైకేయ్యా ఇతి వక్ష్యసి. 41
కిల్బిషత్వం నరేంద్రాణాం కరిష్యసి నరాధిప,
యో దత్త్వా వరమద్యైవ పునరన్యాని భాషసే." 42

అని మూలము. దీనఁగలుగువిశేషముల నెఱుఁగుదము. ఆడినమాటతప్పినయెడల ధార్మికత్వము చెల్లదు. అనఁగా సత్యము ధర్మాశ్రయము, ధర్మము సత్యమూలము. పరస్పరసంబంధము వదలదని భావము.

"యత్ర ధర్మో హ్యధర్మేణ సత్యం యత్రానృతేన చ,
హన్యతే ప్రేక్షమాణానాం హతాస్తత్ర సభాసదః. 14
ధర్మ ఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః,
తస్మాద్ధర్మో న హంతవ్యో మా నో ధర్మో హతోఽవధీత్. 15
వృషో హి భగవాన్ ధర్మస్తస్య యః కురుతే హ్యలం,
వృషలం తం విదుర్దేవాస్తస్మాద్ధర్మం న లోపయేత్. 16
ఏకఏవ సుహృద్ధర్మో నిధనేఽప్యనుయాతి యః,
శరీరేణ సమం నాశం సర్వమన్యద్ధి గచ్ఛతి." 17

(మను. 8. అధ్యా.)

అనుమనుస్మృతివాక్యములనే కైక యిటుఁ దెల్పెను. సత్యము వదలిన ధార్మికుఁ డనఁబడఁడు. ధర్మమునుమించినమిత్రము లోకమున లేదు. జనాపవాదము భరింపరానిది. వీనినెల్ల నెట్లు భరింతువని దశరథుని గైక ప్రశ్నించెను? 'లోకాపవాదా ద్భయ'మ్మను భర్తృహరినీతివాక్య మాకాలమున నెంతప్రాముఖ్యమును వహించియుండెనో యిందుమూలమునఁ దేటపడియెడు. ఎవరు సత్యమును దప్పుదురో ధర్మమును దాఁటుదురో వారినెల్ల రాజర్షులు చేరి యాక్షేపింతురనియు, దాన వారల కపవాదము వ్యాపించి యపకీర్తిని దెచ్చుననియు మన మెఱుంగవలయు. ఇది యాకాలమునఁ గలయాచారము. సత్యధర్మములను భగవద్రూపములుగా భావించుచున్నందుననే వాని వదలినవారు పాతకులని పరిగణింపఁబడుచుండిరి. ఈకాలమున నయ్యవి ప్రాధాన్యమును గోలుపోయినవి. కావుననే వానిని వదలుట కష్టముగాఁ దోఁచుట లేదు. దేశారిష్టముల కివియే కారణమని మన మెఱుంగవలయును. సత్యధర్మములు భగవత్స్వరూపములగుట వాని నాదరింపకయున్న భగవంతు నాదరింపనట్లే. నాస్తికాభాసులన్న నింకెవ్వరు? భగవదనుగ్రహము కలుగవను వారు కొందఱు గలరు. భగవంతు నాదరింపనపు డది యెట్లు కలుగును? ఎన్ని తపస్సులు చేసినను, ఎన్ని వేషములు వేసినను, ఎన్ని విధముల భగవంతు నారాధించునట్లు నటించినను, ఎవ్వారి మనస్సు సత్యధర్మముల నాదరింపదో వారియారాధనములు నిష్ఫలములని యీరామాయణవాక్యములు మనుస్మృతివాక్యములు తేటపఱచుచున్నవి. "అంతఃప్రచ్ఛన్నపాపానాం శాస్తా వైవస్వతో యమః" అన్నసూక్తి తప్పదుకదా. పైవేషములు

పామరులనుమాత్రమే మోసపుచ్చఁజాలుననియు, స్వనాశన హేతువులగుననియుఁ దెలియక లోకులను మోసగింప యతి వేషములుదాల్చువారు దుర్గతిపాలగుదురనియు, బహువిధ వేషధారులు చెలరేఁగుకొలఁదిని సత్యధర్మములు నశించి భగ వంతునిదయను వ్యాపింపకయుండఁజేయుననియుఁ, గావున నట్టి వారిని దూరముగాఁ బాఱఁదోలి యథాశక్తిన్యాయము నను సరించి సత్యధర్మములు భగవంతునియాకారములే యని నమ్మి వాని నారాధించిన నాపరమేశ్వరుఁడు, సంతృప్తుఁడగుననియు మనకీభాగము బోధించుచున్నది.

ఎవతుకయనుగ్రహమున బ్రదికితినో ఎవ్వతుక నన్నుఁ బ్రాణముపోవునట్టి కట్టడికాలమునఁ గాపాడెనో యట్టికైకకు నేనిచ్చినవరముల నీయక వృథనేసితినని పెద్దలయెదుటఁ జెప్పఁ గలవా? అని కైక రాజును బ్రశ్నించెను.

> "పాపానామధికం పాపం హననం జీవజాతినాం
> ఏతస్మాదధికం పాపం విశ్వస్తే శరణం గతే
> విశ్వస్య హత్వా పాపం తం శూద్రం వా ప్యంత్యజాతికం
> బ్రహ్మహత్యాధికం పాపం తస్మాన్నాస్త్యస్య నిష్కృతిః"

అని పురాణవాక్యము కనంబడియెడి. కృతఘ్నుఁడగుట మహా పాపమని దీనినుండి గ్రహింపందగు. ఆపత్కాలమున మహోప కారమొనరించిన నాకు నీవిట్లు మాటతప్పుట న్యాయముకాదని కైక తెలుపుచున్నది. ఒకరివలన నుపకారమునొందినపుడు వారి కిఁ బ్రత్యుపకారము చేయవలయునని, బదులుచేయఁజాలఁడేని ఆయుపకారమును స్మరించుచుండవలయునని మనము గ్రహింప వలయును. అట్టివాఁడే కృతజ్ఞుఁడనంబడును. అట్లుగాక బదులు

చేయఁజాలక యుపకారమును స్మరింపక మీఁదు మిక్కిలి యప కారము చేయునేని కృతఘ్నుఁడగును. కృతఘ్నతకంటె మహా పాపము లేదని మహాభారతము చాటుచున్నది. బ్రహ్మఘ్నునకుం గూడఁ బ్రాయశ్చిత్తము కలదు కాని కృతఘ్నునకు లేదనియే మహాభారతాభిప్రాయము. ఈనీతిని వాల్మీకిమహాముని కైక వాక్కులమూలమున మనకుఁ దెలిపెనని మన మెఱుంగందగు.

"సమయం మానృతం కార్షీః పూర్వవృత్తమనుస్మరన్
స త్వం ధర్మం పరిత్యజ్య రామం రాజ్యేఽభిషిచ్య చ
సహ కౌసల్యయా నిత్యం రంతుమిచ్ఛసి దుర్మతే
భవత్వధర్మో ధర్మో వా సత్యం వా యది వానృతం
యత్త్వయా సంశ్రుతం మహ్యం తస్య నాస్తి వ్యతిక్రమః"          ౪౬

అని మూలము. దీనిసారమేమి?

చెప్పినమాటను దప్పరాదు. పెద్దల ప్రవర్తనమును స్మరింపవలయును. అది మంచినడవడికను గలుగునట్టు లొనర్చును. కావున ధర్మమును బరిత్యజింపరాదు. ముందువెనుకలాలోచించి మాట చెప్పవలయును. ఒకప్పు డాలోచించియో యాలోచింపకయో ప్రతిన చేసినయెడల దానిని దీర్పవలయును. దాని నతిక్రమింపరాదు. అను నీతులే యీభాగమునుండి మనచే గ్రహింపఁబడఁదగినవి. తాఁజెప్పినమాట తప్పువాఁ డసత్యవాది యగును. సత్యము భగవత్స్వరూపము. "తస్మాత్సత్యం పరమం వదంతి" అని మహనీయు లుపదేశించిరి. సత్యమును విడనాడుట భగవంతు నాదరింపని యట్లే. కావున ఎట్టులైన ధర్మము నిర్వహించుటయే యుత్తమకార్యమనునీతిని మన కీభాగము బోధించుచున్నది.

"శ్రుత్వా తు రాజా కైకేయ్యా వృతం పరమశోభనం
రామస్య చ వనే వాసమైశ్వర్యం భరతస్య చ
నాభ్యభాషత కైకేయీం ముహూర్తం వ్యాకులేంద్రియః."

అని మూలము. ఇది విమర్శింపఁదగినది. 'కైకేయ్యావృతం పరం అశోభనమ్' అని పదవిభాగము. మిక్కిలి యమంగళకరమగు వరమును విని యని సామాన్యార్థము. కైక యడిగినవరము (అనఁగా శ్రీరామవనవాసము. భరతాభిషేకము ననుభావము గలది.) పరమశోభనము అనఁగా స్వర్గమర్త్యపాతాళములను మూఁడులోకములకు మిక్కిలి మంగళకరమైనదని విశేషార్థము. ఎట్లు ? రామచంద్రుఁ డడవుల నివసించి దుష్టరాక్షసుల సంహరించి సాధువుల రక్షించి ధర్మమునిలుపుటకే యవతరించెను. అది కైకవరములపై నాధారపడియున్నది. కావున నామె యావరముల నడుగుట జగత్కల్యాణహేతువుగాక మఱేమగును? భరతునకు రాజ్యప్రాప్తివలన లాభమేమని యడుగువా రుండక పోరు.

"హేమ్నస్సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధిశ్శ్యామికాపి వా"

అన్నయట్లు రాజ్యము లభించినపుడుగాని భరతునకుఁ గల భ్రాతృవాత్సల్యము, నీతి, ధర్మము ననునవి బయల్పడవు. దాననే యాతనిప్రవృత్తి లోకమున కుదాహరణభూతము కాఁ గలదు. కావున నీరెండును జగన్మంగళకరములే యని వాల్మీకి యిందుమూలమున మనకుఁ దెలిపెనని గ్రహింపఁదగు. ఒక్కనికహితమైనను బ్రపంచమునకు హితమగునేని యదియే పరమమంగళమని యెఱుంగవలయు. ఎందఱకో యహితమై యొక్కనికిమాత్రమే హితమగునది యమంగళమనియే యెఱుంగ

వలయు. భగవంతునాశయ మిదియేకదా. తనయవతారఫల మును దానెఱింగియే కైక నట్లడుగఁజేసెను. సంకల్పమాత్ర మున సకలకార్యములు సిద్ధింపఁజేయు పరమేశ్వరునకు నీకా ర్యము స్వల్పము గాకమానదు. ఇట్టిఘట్టముల నిట్టియర్థములను మన మంగీకరింపకపోరాదు. అంగీకరించిననే తత్త్వము బయ ల్పడును. తత్త్వ మెఱుంగుటయే గ్రంథపారాయణమునకు ఫలము.

"ప్రైక్షతానిమిషా దేవీం ప్రియామప్రియవాదినీం"

అనుమూలము పైనవ్రాసినభావమును దృఢపఱచుచున్నది. ఇందు మహాకవి వాల్మీకిముని 'దేవీం' అని ప్రయోగించెను. పూజ్యురాలనికదా దానియర్థము. కైక బాహ్యదృష్టికి దుష్టు రాలుగాఁ గనంబడినను జ్ఞానదృష్టికి లోకోపకారధర్మరక్షణ కార్యములకు మహోపకార మొనరించినదని తోఁచును. కావున "అప్రియవాదినీమివ స్థితాం ప్రియాం దేవీం" అని యన్వ యింపవలయును. పైకి నప్రియములు పలుకుచున్నయట్లు తోఁపఁ జేయుచున్న పూజ్యురాలగుభార్యను అని దానియర్థము. అట్టి కైకను నిమేషములులేనిదృష్టిం గాంచెనని సాధారణార్థము. ఈఘట్టమున నీయర్థము గ్రహించుట న్యాయ్యము. కూడ దందురేని మహాకవి పదప్రయోగములు సార్థకములు కావన వలసివచ్చును. జ్ఞానధనుఁడగు మహాకవి కైకవలనఁ గలుగు లోకోపకారము నెఱింగియే యట్టిగూఢార్థగుంభితపదములం బ్రయోగించెను. "దుష్టచారిణీమ్" అను మొదలగుపదములు మృత్యువశంగతుఁడగు దశరథునినోటం బలికించెను. ఈవిష యమును మనమెఱింగి కైకను దూషించుటకు బదులుగా

భూషింపవలయును. ఈఘట్టమున నాంధ్రీకరించినవా రెంత దనుక మూలార్థమును బోధించిరో కనుఁగొందము. మూల మునుగాంచిన పెద్దలీపద్యములం బరికింతురుగాక.

"నాభ్యభాషత కైకేయీం మహార్తం వ్యాకులేంద్రియః
ప్రేక్షతానిమిషో దేవీం ప్రియామప్రియవాదినీం" ౧౨

... ... ... ... వరము
లడుగఁగా విని యింద్రియంబులు వ్యాకుల
ములయి మార్గముతప్పఁ బలుకకొక్క
గడియకాలంబుండి కడునప్రియములాడి
నట్టిప్రేయసిఁ గేకయాత్మజఁగను
తే. రెప్పవేయక కాంచుచు ... ... ...

(ఆంధ్రశ్రీమద్రామాయణము.)

తలఁచి మనంబు విహ్వలతఁ దత్తఱమంద మహార్త
మాత్రదా, నలుకను బల్కమాని సతి నట్టె కనుంగొని
దుఃఖతప్తుఁడై. (వావిలికొలనురామాయణము.)

వావిలికొలను రామాయణము మూలార్థమును బోధించు ననియు,నావ్రాసినది యాకాశ రామన్న పంచాంగమనియు వ్రాసిన పెద్దలయభిప్రాయము సత్యసమ్మతమా కాదా యని సాధు మతులు పరీక్షింతురుగాక. 'వ్యాకులేంద్రియః' అని మూలమున నుండఁగా మనమ్మని తెనిఁగింపఁబడినది. అలుకను అనునది ప్రాసముకొఱకుఁ దేఁబడినది. ఇట్టివాని నాక్షేపింపరాదని నే నెఱుంగుదును.నాపద్యముల నిండవ్యర్థపదములున్నవని యాక్షే పించు పెద్దల కీమాటలు వ్రాయఁబడినవి. గ్రంథకర్త నాక్షేపింపఁ గోరికాదు. ఎవరికిఁ దోఁచినట్లు వారు వ్రాయుదురు. పక్షపాత

మున లేనిగుణములను గల్పించి యున్నవానిం దీసివైచి వ్రాయ రాదని విమర్శకులం బ్రార్థించుచున్నవాఁడను.

"తాం హి మే సుకృతాం బుద్ధిం సుహృద్భిస్సహ నిశ్చితాం
కథం ద్రక్ష్యామ్యపావృత్తాం పరైరివ హతాం చమూం
కిం మాం వక్ష్యంతి రాజానో నానాదిగ్భ్యస్సమాగతాః
బాలో బతాయమైక్ష్వాకశ్చిరం రాజ్యమపాలయత్"

అనుమూలము విమర్శింపఁదగినది.

ఇప్పుడే మంత్రులు సుహృదయులు నగువారింగూడి యాలోచించి నిండుసభలో శ్రీరాముని యువరాజుగా రేపే యభిషేకింతునని పలికితిని. ఆమాట నెట్లు తప్పుదునని దశరథు నాశయము. ఎట్లయిన నాకనృతదోషము గల్గును గదా యని దశరథుఁడు పరితపించుచున్నవాఁడు. వరములిచ్చిన రామాభిషేకవాగ్దానము వ్యర్థమగును. అభిషేకము జరపిన వరదానము వ్యర్థమగును అసత్యపాశబద్ధుఁడ నగుదుగదా యన్నభయ మారాజునకుం గల్గెను. ఇందేది వదలఁదగినది? అనునదియే యిటఁ బ్రశ్నము. దేనిని మానినను బాపమురాక తప్పదు. ఇపుడు దశరథునకుం గర్తవ్యమేది? అని విచారింతము.

పాపద్వయసమాగమమున గురుత్వలఘుత్వవిచార మావశ్యకమగు. ఇది యట్టిదికాదు. అనృతపాపమునకు గురుత్వలఘుత్వములు స్మృతికర్తలు తెలుపలేదు. కావున నీరెండును మానరానివి. సమానఫలదము లనవలయును. కాని సూక్ష్మదృష్టిం బరిశీలించిన మొదటిదే ప్రధాన మనవలయునని తోఁచెడిని. తాను మృతినొందునంతవిపత్కాలమునఁ గైక రక్షించెను. రెండుసారు లట్టివిపత్తు తనకుఁ (దశరథునకుఁ) గలుగ

నామె రక్షించెను. దానికిఁ బ్రతిఫలముగా నామె వరముల నడుగలేదు. కృతజ్ఞతంగొని తానే రెండువరము లడుగుమని కోరెను. నాకు వలసినపు డడుగుదునని కైక పలికెను. కృతఘ్నతకుఁ బాలుపడకయుండుట రాజునకు విధి. వలసినపు డడుగుదు నన్నమాటప్రకారమే యామె యడిగెను. రాజు వరముల నీయవలసినదే. రెండవదానిం బరిశీలింతము. రామచంద్రునకు రాజు కైక కోసంగినట్లు వరముల నీయలేదు. యువరాజుగా నభిషేకింతమని యాలోచింప మంత్రులు లోనగువా రంగికరించిరి. ప్రయత్నము సాగింప నెంచెను. ఇది మాటయిచ్చితప్పుట యెట్టిదో యట్టిది కానేరదు. ఉత్సవాదులు కాలాంతరమున సాగవచ్చును. కైకకు వరములనడిగినపు డిత్తు నన్నందున రాజధమర్ణుఁడయ్యెను. ఆయప్పుతీర్చవలసినదే కాని మానరాదు. శ్రీరాముఁ డొనరించిన యుపకారమునకుఁ దృప్తుఁడై రాజు వరము లీయలేదు. కనుక నీయుత్సవము నిలిపినంతమాత్రమున నసత్యఫలము రా జనుభవింపవలయునని శాస్త్రమురీతి మనము విధింప నవకాశములేదు. వరప్రదాన కాలమునఁ గోరరానివి కోరఁగూడదన్ననియమమును రాజు విధింపలేదు. కనుక దానిని దీర్చవలసినవాఁడయ్యెను. దానిమాని రెండవకార్యమగు పట్టాభిషేకముచేయుట ధర్మము నెఱవేర్చుట యనరాదు. దీని నొనరించినంతన యాపాపము తొలంగదు. ఈవిషయమెఱింగియే దశరథుఁ డూరకయుండెను. కనుక నీరెండింటిలో మొదటివరదానమును సఫలముచేయుటయే రాజునకు న్యాయ్యమని తేటపడియెడిని. ఈవిషయమున దశరథునిభావ మిదియే యని నిర్ణయించుట కాతనికి మనస్సు

స్థిరతం గాంచకుండెను. కాన నాతనిపలుకులంబట్టి నిర్ణయింప వలనుపడదు.

"యదాయదా హి కౌసల్యా దాసీవచ్చ సఖీవ చ,
భార్యావద్భగినీవచ్చ మాతృవచ్చోపతిష్ఠతి.
సతతం ప్రియకామా మే ప్రియపుత్రా ప్రియంవదా,
న మయా సత్కృతా దేవీ సత్కారార్హా కృతే తవ." ఉ. 

అనునివి దశరథునివాక్యములు. సామాన్యార్థము స్పష్టము. ఇందు గ్రహింపఁదగినవిషయములు కొన్ని గలవు. భర్తకు భార్య యెట్లుపకారము చేయునో యిందు నావిషయము కలదు.

"ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ."

అని సీతావివాహకాలమున జనకమహారాజు తెలిపెనుగదా. ధర్మము అనఁగాఁ బరోపకారము అని కొందఱ అర్థముచెప్పి తదితరకార్యములయందు భార్యసాయమును భర్త కోరరాదని పలుకుదురు. అయ్యది ధర్మవిరుద్ధమని యీరామాయణమే తెలుపుచున్నది. సేవించుతఱి దాసివలె, పరమరహస్యము దెలుపునపుడు సఖివలె, ధర్మాచరణమున భార్యవలె, హితము తెలుపునపుడు తోఁబుట్టువువలె, మృష్టాన్నముపెట్టుసమయమునఁ దల్లివలె ధర్మపత్ని నటింపవలెనని దీనిభావము. ఈయుపచారము చేయవచ్చును. ఈయుపచారము చేయరాదు. అనువిచారముచేయక దాసి యెట్లు మర్యాదఁ బాటింపక చేయునో యట్లు సేవచేయవలయును. పరమరహస్యములగు విషయములు తెలుపునపుడు సఖి యెట్లు దాఁపక తెలుపునో యట్లు తెలుపవలయును. ధర్మము నాచరించునపుడు భార్యవలె

ననఁగానందు సగము పుణ్యము పంచుకొనుటంబట్టి యత్యంతా సక్తితో నాచరించునది భార్యయే కాన నట్టిపనియం దెక్కువగఁ దోడ్పడవలయును. ఇట్లే తక్కినవియు నూహింపవలయును. ఇట్లు కౌసల్య నాకుఁ దోడుపడుచుండ నట్టిసాధ్విని నీకుఁ గోపము వచ్చునన్నభయమున గారవింపనైతినని దశరథుఁడు పశ్చాత్తాపతప్తుఁడయ్యెను.

"పతిర్భార్యాం సంప్రవిశ్య గర్భో భూత్వేహ జాయతే,
జాయాయా స్తద్ధి జాయాత్వం యదస్యాం జాయతే పునః. ౮
అర్థస్య సంగ్రహే చైనాం వ్యయే చైవ నియోజయేత్,
శౌచే ధర్మే ఽన్నపంక్త్యాం చ పారిణాహ్యస్య రక్షణే." ౧౧

మను. ౯ అధ్యా.

"మనోవాక్కర్మభిశ్శుద్ధా పతిదేశానువర్తినీ,
ఛాయేవానుగతా స్వచ్ఛా సఖీవ హితకర్మసు. ౨౮
దాసీవ దిష్టకార్యేషు భార్యా భర్తుస్సదా భవేత్."

వ్యాసస్మృతి. ౨ అధ్యా.

ఇట్లు స్మృతులు భార్యాధర్మములు తెలుపుచున్నవి. ఈనీతులనే రామాయణమున వాల్మీకి తెలిపెను. దంపతిధర్మము లిట్లుండఁగా భరతఖండవాసులు స్త్రీల మిక్కిలి శ్రమముల పాలు చేయుచున్నవారని యాక్షేపించువారు విమర్శకులు కారని తోఁచెడిని. అనుకూలవతియగు తనయువతిని సత్కారములచే ననఁగా వస్త్రాలంకారాదిదానముల నలరింపవలయు ననియే స్మృతులు ఘోషించుచున్నవి. ఈరామాయణభాగము కూడ దశరథపశ్చాత్తాపరూపమున నావిషయమునే తెలుపుచున్నది. కావున సాధుశీలముగలయువతిని సత్కరింపవలయు

నని భర్తకు హితమును స్మృతులే తెలుపుచున్నవికదా-యని యెఱింగినవా రెవ్వరు భరతఖండవాసుల నాక్షేపింపఁబూనరని తలంచుచున్నాఁడను.

"యోషాతిరూపసంపన్నా గర్వితా మదశాలినీ,
మమ రూపైవ సా జ్ఞేయా పుష్పేనాపి న తాడయేత్."

అను కాళీవాక్యమును బరికింపుఁడు. గర్వితా=సౌందర్యగర్వము గలది. మదశాలినీ=భర్తను సంతోషింపఁజేయుటలో నేనే యందఱికన్న మిన్న ననునభిప్రాయముగలది. అట్టియువతి నన్నుగా భావింపవలయును. పుష్పముచేతను బ్రహరింపరా దనఁగా నించుకయు నొప్పింపరాదని సారము. ఇట్లుండఁగా మనల నాక్షేపించు టెంత యసంగతమో యూహింపుఁడు. ఇట్టి నీతిబోధకములగు నీశ్లోకములను దెనిఁగించువా రెంతమాత్రము గాపాడి దానినీతి లోకులకుఁ దెలిపిరో యించుక పరిశీలింతము.

సీ. సతతంబు నాకుఁ గౌసల్య ప్రియంబునే
కోరుచుండును దనకొడుకునందుఁ
బ్రీతియుఁ గలయది ప్రియభాషిణియుఁ గానఁ
బరిచర్య లొనరించుఁ బరమనియతి
దాసిగా మఱియు దుర్యాత్మము లొనగువినో
దమ్ముల సఖివలెఁ దానొనర్చు
ధర్మములను జేయుతఱి భార్యవలె సహా
యముచేయు నాకు హితమును దెలుపు

తే. కాలమునఁ దోడఁబుట్టువు లీల నలరుఁ
దనువు పోషించుతఱిని దా జననిరీతి

నాదరము సూపుఁ బట్టంపుటతివ ననుచు
గర్వమును బూనియుండ దెక్కాలమునను.

(ఆంధ్ర శ్రీమద్రామాయణము.)

సీ. సమయోచితంబుగా సఖివలె దాసి నా
భార్యయట్టుల సొంతభగినిరీతిఁ
దల్లిమాడ్కిఁ జరించుఁ దగ సుప్రియంవద
ప్రియకామప్రియపుత్రప్రేమ కెంతొ

(వావిలికొలనురామాయణము.)

పెద్దల కీవిషయమున విశేషించి చెప్పఁదలంపను. మూలార్థమును దెలుపునట్టిపద్ధతిలో నిందేది యుత్తమమో సాధువులు నిర్ణయించుకొనవలయు. నారామాయణమును దెగడి వావిలికొలను రామాయణమును బొగడినవారుమాత్రము "సొంతభగినిరీతి" అన్నచోటఁ గలచమత్కారమును మఱొకసారియుఁ బొగడి తృప్తినొందుదురుగాక.

"సతీం త్వామహమత్యంతం వ్యవస్యామ్యసతీం సతీం,
రూపిణీం విషసంయుక్తాం పీత్వేవ మదిరాం నరః." ౭౬

అని మూలము. ఇందొకవిశేషము కలదు. భరతఖండమునందు సురాపానము మహాపాతకపంచకమునఁ బరిగణింపఁబడును. దానికిం బ్రాయశ్చిత్త మనేకప్రకారముల విధింపఁబడినది. ఖండాంతరములయం దిద్ది పాపమునొసంగునదిగాఁ బరిగణింపఁ బడదని నావినికి. ఔషధముల నది విశేషించి యుపయోగింపఁ బడుననియు విన్నవాఁడను. కాని సురాపానము నింద్యమని యెల్లవారు నంగీకరింతురని నాయభిప్రాయము. దానివిషయమును సుంత వ్రాయుదును. సురాపానము సర్వజాతులకు సర్వ

దా నిషేధమా? అ దెందులకు వాడుకలోనికివచ్చెను? తలచుగా సురాభేదములన్నియుఁ బాపము నొసంగునవియా? భేదము గలదా యనువిషయములు విమర్శించుట యధికప్రసంగము నకు నుదాహరణము కాదు.

"బ్రహ్మహత్యా సురాపానం స్తేయం గుర్వంగనాగమః,
మహాంతి పాతకాన్యాహుస్సంసర్గశ్చాపి తైస్సహ. ౫౪

బ్రహ్మోజ్ఝితా వేదనిందా కౌటసాక్ష్యం సుహృద్వధః,
గర్హితాన్నాద్యయోర్జగ్ధిస్సురాపానసమాని షట్." ౫౬

సురాపానము మహాపాతకమని వేదనిందాదులు సురాపాన సమానపాపము నిచ్చునవియని తాత్పర్యము.

"సురాం పీత్వా ద్విజో మోహాదగ్నివర్ణాం సురాం పిబేత్,
తయా సకాయే నిర్దగ్ధే ముచ్యతే కిల్బిషాత్తతః."

బ్రాహ్మణులు సురాపానముచేయరాదనియే దీనిసారము.

"సురాం వై మలమన్నానాం పాప్మా చ మలముచ్యతే,
తస్మాద్బ్రాహ్మణరాజన్యౌ వైశ్యశ్చ న సురాం పిబేత్." ౯౪

బ్రహ్మక్షత్రియవైశ్యులు సురాపానము చేయరాదనియే దీని సారము.

"గౌడీ పైష్టీ చ మాధ్వీ చ విజ్ఞేయా త్రివిధా సురా,
యథైవైకా తథా సర్వా న పాతవ్యా ద్విజోత్తమైః." ౯౪

బెల్లము కలిపిచేసిన సుర గౌడి యనంబడును. పిండిచేఁ జేయఁబడి నది పైష్టియనంబడు. (గారపిండి యని కొందఱమతము) ఇప్ప చెట్టుపూవులనుండి వచ్చినది మాధ్వి యనంబడు. ఈమూఁడు

విధములగు మద్యములను ద్విజులు (బ్రహ్మక్షత్రియవైశ్యులు) త్రాగరాదు. అను నీమనుస్మృతివాక్యముల ననుసరించి సురాపానము శూద్రజాతికి నిషేధింపఁబడలేదని యూహింపవచ్చును.

"నిషిద్ధభక్షణం జైహ్మ్యముత్కర్షే చ వచోఽనృతం,
రజస్వలాముఖాస్వాదస్సురాపానసమాని తు. ౨౨౯

సురాంబుఘృతగోమూత్రపయసామగ్నిసన్నిభమ్,
సురాపోఽన్యతమం పీత్వా మరణాచ్ఛుద్ధిమృచ్ఛతి. ౨౫౩

వాలవాసా జటీ వాపి బ్రహ్మహత్యావ్రతం చరేత్,
పిణ్యాకం వా కణాన్వాపి భక్షయేత్త్రిసమా నిశి." ౨౫౪

మనుస్మృత్యర్థమే యిందును గలదు.

"అజ్ఞానాత్తు సురాం పీత్వా రేతోవిణ్మూత్రమేవ చ,
పునస్సంస్కారమర్హంతి త్రయో వర్ణా ద్విజాతయః. ౨౫౫

పతిలోకం న సా యాతి బ్రాహ్మణీ యా సురాం పిబేత్,
ఇహైవ సా శునీ గృధ్రీ సూకరీ చోపజాయతే." ౨౫౬

అను నీయాజ్ఞవల్క్యస్మృతి ననుసరించి యాలోచింపఁగా ద్విజులనంబడు బ్రహ్మక్షత్రియవైశ్యులు సురాపానము చేయరాదనియు, బ్రాహ్మణస్త్రీయును త్రాగరాదనియుఁ దేలెడిని. శూద్రులకిది నిషేధము కాదనియు, స్త్రీజాతియందు బ్రాహ్మణస్త్రీ త్రాగరాదనియు నీస్మృతి యభిప్రాయము.

"మాధూకమైక్షవం సైరం తాళం ఖార్జూరపానసమ్,
మధూత్థం చైవ మాధ్వీకం మైరేయం నాలికేరజం
అమేధ్యాని దశైతాని మద్యాని బ్రాహ్మణస్య తు."

అను నీబృహద్విష్ణుస్మృతివాక్యము బ్రాహ్మణునకు మాత్రమే సురాపానము నిషేధించుచున్నది.

"పానసం ద్రాక్షమాధూకం ఖార్జూరం తాళమైక్షవం,
మధూత్థం సైరిమారిష్టమైరేయం నారికేళజం
సమానాని విజానీయాన్మద్యాన్యేకాదశైవ తు." పులస్త్యస్మృతి.
"పీత్వా ప్రమాదతో మద్యమతికృచ్ఛ్రం చరేద్ద్విజః,
కారయేత్తస్య సంస్కారం శక్త్యా విప్రాంశ్చ భోజయేత్."
బృహస్పతిస్మృతి.

దీనింబట్టి బ్రాహ్మణుఁడుతప్పఁ దక్కినవారికి నిషేధము కానరాదని యూహింపవచ్చును.

"మద్యపశ్చ ద్విజః కుర్యాన్నదీం గత్వా సముద్రగామ్,
చాంద్రాయణే తతశ్చీర్ణే కుర్యాద్బ్రాహ్మణభోజనమ్
అనడుత్సహితాం గాం చ దద్యాద్విప్రేషు దక్షిణామ్. ౨౪
సురాపానం సకృత్కృత్వా అగ్నివర్ణాం సురాం పిబేత్,
స పాతయేదథాత్మానమిహ లోకే పరత్ర చ." ౨౫
పరాశరస్మృతి. ౧౨ అధ్యా.

పరాశరస్మృతిప్రకారము మద్యము సుర యొకటి కాదని తేలెడిని.

"పనసాదిజన్యం మదకారణద్రవ్యమ్ మద్యమ్,
పిష్టాదిజన్యో ద్రవద్రవ్యవిశేషస్సురా."

అని మాధవాచార్యులు వ్రాసిరి. పులస్త్యస్మృతిలోఁ జెప్పఁబడిన పదునొకండువస్తువులు మద్యములని, తక్కినవి సురాభేదములనియు నెఱుంగందగు. ఈస్మృతులసారము శూద్రులకు క్షత్రి

యాదిజాతిస్త్రీలకు సురాపానము నిషేధముకాదని తేలెడిని.

ఇంద్రః—

"ఆసవస్య తు కిం రూపం కో దోషః కశ్చ వా గుణః,
అన్నదోషకరం కిం తు తన్మే విస్తరతో వద."

బృహస్పతిః—

"పైష్టికం తాళజం క్షైరం మాధూకం గుడసంభవం. ౧౩౩
క్రమాన్న్యూనతరం పాపం తదర్ధార్ధార్ధతస్తదా,
వర్జ్యమాద్యం సదా సర్వై ర్వరాద్యయుగ్మం నృపస్త్యజేత్. ౧౩౪
తృతీయమపి వైశ్యస్తు శూద్రోఽప్యాద్యద్వయం తథా,
తృతీయాదిత్రివర్ణానామాసవం పేయముచ్యతే. ౧౩౫
స్త్రీణామపి తృతీయాది పేయం స్యాద్బ్రాహ్మణీం వినా,
పతిహీనా చ కన్యా చ త్యజేదృతుమతీ తథా. ౧౩౬
అభర్తృసన్నిధౌ నారీ మద్యం పిబతి లోలుపా,
ఉన్మాదినీతి సా ఖ్యాతా తాం త్యజేదంత్యజామివ. ౧౩౭
దశాష్టషట్చతస్రస్తు ద్విజాదీనామఘం భవేత్,
స్త్రీణామఘం తదర్ధం స్యాత్పాదం స్యాద్భర్తృసంగమే. ౧౩౮
మద్యం పీత్వా ద్విజో మోహాత్కృచ్ఛ్రం చాంద్రాయణం చరేత్,
జపేచ్చాయుతగాయత్రీం జాతవేదసమేవ వా. ౧౩౯
అంబికాహృదయం వాపి జపేచ్ఛుద్ధో భవేన్నరః,
క్షత్రియాదిత్రివర్ణానాం ద్విజాదర్ధార్ధతః క్రమాత్. ౧౪౦
స్త్రీణామర్ధార్ధక్లృప్తిస్స్యాత్కారయేద్వా ద్విజైరపి,
అంతర్జలే సహస్రం వా జపేచ్ఛుద్ధిమవాప్నుయాత్. ౧౪౧
లక్ష్మీస్సరస్వతీ గౌరీ చండికా త్రిపురాంబికా,
భైరవో భైరవీ కాళీ మహాశాస్తా చ మాతరః. ౧౪౨
అన్యాశ్చ శక్తయస్తాసాం పూజనే మధు శస్యతే,

బ్రాహ్మణస్తు వినా తేన యజేద్వేదాంతపారగః. ౧౪౩
ఇతరే మధునా దేవీమర్చయేయుః ఫలార్థినః,
తన్నివేదితమశ్నంత స్తదనన్యా స్తదాత్మకాః. ౧౪౪
తాసాం ప్రభావాద్గచ్ఛంతి నిర్లేపాస్తే పరాం గతిం,
కృతస్యాఖిలపాపస్య జ్ఞానతోఽజ్ఞానతోఽపి వా. ౧౪౫
ప్రాయశ్చిత్తమిదం ప్రోక్తం పరాశక్తేః పదస్మృతిః,
అనభ్యర్చ్య పరాం శక్తిం పిబేన్మద్యం తు యోఽధమః. ౧౪౬
రౌరవే నరకేఽబ్దాంస్తు నివసేద్బిందుసంఖ్యయా,
భోగేచ్ఛయాపి యో మద్యం పిబతే బ్రాహ్మణాధమః. ౧౪౭
ప్రాయశ్చిత్తం న వై వాచ్యం శిలాగ్నిపతనాదృతే,
ద్విజో మోహాన్న తు పిబేత్స్నేహాద్వా కామతోఽపివా.'' ౧౪౮

లలితోపాఖ్యానము. ౨ అధ్యా.

ఈపురాణము ననుసరించి యోజింతము. ఆసవము, మద్యము, సుర అనువానికి భేదము కానరాదు. గారపిండినుండితీసినది, తాటిచెట్టునుండితీసినది, నారికేళమువలనఁ గలిగినది, యిప్పపూవులనుండితీసినది, బెల్లముకలిపితీసినది అనునవి యైదువిధము లగుమద్యములు ప్రసిద్ధములు. ఇవి వరుసగా సగము పాప మొకదానికంటె నొకటి తక్కువగాఁగలవి. నాలుగుజాతుల వారును పైష్టికమును ద్రాగరాదు. పైష్టికతాళజమద్యముల రాజులు త్రాగరాదు. పైష్టికతాళజకైరములను మద్యముల మూఁడింటిని వైశ్యులు త్రాగరాదు. శూద్రులు పైష్టికతాళ జములఁ ద్రాగరాదు. అనఁగా క్షత్రియులు లోనగువారు తక్కినవానిని ద్రాగవచ్చును. బ్రాహ్మణస్త్రీతప్పఁ దక్కినమూఁడు జాతులస్త్రీలు మొదటిరెండుతప్పఁ దక్కినవానిని ద్రాగవచ్చును.

విధవయుఁ గన్యకయు ఋతుమతియైనస్త్రీయుఁ ద్రాగరాదు. ఎప్పుడు? అనుప్రశ్నము వచ్చెను. స్త్రీ భర్తృసన్నిధానమునం గాక వేఱొకచో నాశచేతఁ ద్రాగిన నది యున్మాదిని యనఁ బడు. దానిని వదలవలయును. పది, ఎనిమిది, ఆఱు, నాలుగు భాగములు బ్రాహ్మణాదిస్త్రీలకుఁ బాపము. భర్తచెంతఁ ద్రాగిన నందు సగముపాపము గల్గును. బ్రాహ్మణుఁ డజ్ఞానమున మద్య పానముచేసినఁ జాంద్రాయణవ్రత మాచరింపందగు. తక్కిన ప్రాయశ్చిత్తములు చేయందగు.

ఇంతదనుక మనము పరిశీలించితిమేని బ్రాహ్మణుఁడుతప్పఁ దక్కినమూఁడుజాతులవారు నేవో కొన్నివిధములగుమద్య ములఁ ద్రాగవచ్చునని తేలెడిని. విషయమును జక్కఁగా విమ ర్శింపవలయును. కొంద ఱింతమాత్రమే గ్రహించి శాక్త గ్రంథములన్నియు సురాపానమునే యనుగ్రహించుచున్న వందురు. స్మృతులకంటె నీగ్రంథములయందు సురాపానము నిషేధింపఁబడినది. చూడుఁడు. లక్ష్మి మొదలగుదేవతల నారా ధించునపుడు మద్యము ప్రశస్తము. బ్రాహ్మణుఁ డాదేవతల నారాధించునపుడుకూడ మద్యమును గ్రహింపరాదు. తక్కిన జాతులవారు తమజాతి కుచితమగుమద్యము నివేదింపవచ్చును. ఇష్టదేవత కర్పించియే త్రాగవలయును. ఆదేవతయందే భక్తి యునుపవలయు. అట్టివా రాదేవతయనుగ్రహమునఁ బరమ పదము నొందుదురు. తెలిసియుండె తెలియకయుండె పాపము లొనరించిన పరదేవతాపాదస్మరణమున నయ్యది నశించును. ఇష్టదేవత నర్చింపక యేనీచుఁడు సురాపానము చేయునో వాఁడు బిందుసంఖ్యల ననుసరించి యన్నివత్సరములు రౌరవ

నరకమునం బడును. ఏబ్రాహ్మణాధముఁడు భోగేచ్ఛచే సురా
పానము చేయునో వానికిఁ బ్రాయశ్చిత్తము లేదు. ఎందుండియో
పడి చావవలసినదే. అజ్ఞానముననొండె కామముననొండె
ద్విజుఁడు మద్యపానము చేయరాదు. అనియే యీపురాణమునఁ
గలభావము. దీనిసారమేమి?

సురాపానము నిషేధమే. ఎవరైన దానియం దాసక్తి
గలవారలుండినఁ దమజాతికి నిషేధింపఁబడనిమద్యమును దైవ
తారాధనమున నుపయోగించి త్రాగవలయు. క్షత్రియాది
జాతులస్త్రీలు సంభోగాంగముగా జాత్యుచితమద్యము త్రాగ
వచ్చును. భగవదారాధనము చేయక సురాపాన మెవ్వారును
జేయరాదు. అనునదియే సారము. దీనినుండి మనము గ్రహింపఁ
దగు నర్థమేది?

శాస్త్రము సురాపానము నంగీకరింపదు. ఏల విధించెనని
ప్రశ్నించువారు దానిహృదయ మెఱుంగఁజాల రనవచ్చును.
దురాచారము దుష్కర్మమూలమున నలవడును. దాని నొక్క
సారి తొలఁగింప శక్యము కాదు. క్రమముగాఁదొలఁగింపవలయు.
సురాభేదములయందు నల్పదోషముగలదానిని నిషేధింపక
యధికదోషముగలదానిని నిషేధించిన దాని మానుదురని
శాస్త్రములహృదయము. అదియుఁగూడ స్వేచ్ఛగాఁ ద్రాగరా
దని నిషేధించి దేవతారాధనకాలమున నివేదించి యుపయో
గింపవలయునని యనుజ్ఞ యిచ్చినందున నిరంతరాభ్యాసమునకు
విచ్ఛేదముగలిగించిన ట్లగును. దాన నలవాటు తగ్గును. దేవ
తారాధనమునఁ గొంతకాలమునకైన జ్ఞాన మంకురించును.
దాన నిది దుష్కార్యమని తోఁచును అట్టిసమయమున దానిని

వదలుదురు. ఈభావమే పురాణములు స్మృతులు వెల్లడించును. అంతియకాని సురాపానము చేయుమని ప్రోత్సహింపవు.

"న మాంసభక్షణే దోషో న మద్యే న చ మైథునే,
ప్రవృత్తిరేషా భూతానాం నివృత్తిస్తు మహాఫలా."

అన్న మనుస్మృతివచనమున కర్థమేమి? నిరంతరాభ్యాసమునకు భంగముకలిగించుటయేగాక మఱేమగును?

యజ్ఞములయందు జంతుహింస విధించుట కిదియే కారణము. ఆయాచారమే సర్వదా పరిగ్రహింపఁదగినదని కాదు. కొందఱిపుడుకూడ యజ్ఞములయందు ఛాగవధము చేయుచునే యున్నవారు. పనికిరాదన్న వారు స్మృతివాక్యములం బఠింతురు. కాని యాస్మృతితాత్పర్యమేమని గ్రహింపరు. దుష్కార్యముల నెన్నింటినో స్మృతు లంగీకరించెను. ఏల? క్రమముగా దాని నడఁగించుసాధనములు తెల్పి తన్మూలమున నాదుష్కార్యము వరుసగా నశించుననియే. అంతియకాని యవి దుష్కార్యములు కావనియుఁ, బెద్దలందఱు నంగీకరింపఁదగినవనియు, వానివలన ముక్తి లభించుననియుఁ గాదు. ఈవిషయమును గ్రహింపకయున్నచో స్మృతిపురాణాదిపాఠము వ్యర్థమే యనవలయును. ఏమతముకూడ దురాచారముల నంగీకరింపదు. ఆయాకాలము ననుసరించి దేశము ననుసరించియు, నాయాయియాచారముల నిషేధించినచో ఫలింపదని కొన్నింటి నంగీకరించును. అంతియకాని యవి దురాచారములు కావని యామతహృదయము గాదు.

కొందఱు మతాంతరప్రవిష్టులు భగవతి నారాధించుట నీచమని దూఱుదురు. వారిదుష్కర్మము వారి నట్టు లాడించు

చున్నదని మన మూహింపవలసినదే. ఒక్కమతమువా రింకొ క్కమతమువారి నాక్షేపించుట యలవాటుగా నున్నది. మధ్వ వైష్ణవులు విశేషించి శక్తి నారాధించువారిని దిట్టుదురు. వివస్త్ర యగునవయువతి నెట్లో యారాధింతురందురు. కాని తమ కూటములయందుఁ గంచుకోత్సవములందు సాగునాచారములు వారికిఁ దలంపునకు రావు కాఁబోలు. మతివిహీనులై యట్టు లాక్షేపింతురు. అంతియకాని దేవతారాధనము నెవ్వారు విధించినను దానిమూలమున భక్తులు తరింతురనియేకాని చెడవలయునని కాదు. కావున మతస్థాపకుల మన మేమాత్ర మాక్షేపింపరాదు. వారియభిప్రాయము లివి యని యెఱుంగఁ జాలమైతిమని దుఃఖింపవలయును. ప్రాయశఃపరమతముల నాక్షే పించువారు సద్గురువులకడఁ జక్కఁగఁ జదువుకొన్నవారు కారు. నాలుగుమాటలు నేర్చుకొని యత్యాచారముల నవలంబించి, కొందఱు యోగులమని, కొందఱు ధనార్జనలంపటులై, పరమత ధర్మముల నాక్షేపించుచుఁ దిరుగుచుందురు. ఒక్కతావున నట్టి వారు చాలకాల ముండఁజాలరు. అందుఁ గొన్నిదినములకు లోగుట్టు బయల్పడును. కావున నంతకుముందే స్థలాంతరమున కరుగుదురు. అందు నిట్లే ధనము చిక్కినంతకాలముండి యిం కొక్కతావునకుఁ బోవుదురు. జ్ఞానియగువాఁ డెవ్వఁడుగాని విధివిహితమతముల నాక్షేపింపఁడని నాయాశయము. ధనా ర్జనోపాయములలో నిక్కాలమున వేదాంతప్రవచన మగ్ర స్థానమును వహించినది. మతస్థాపనము ద్వితీయస్థాన మలంక రించినది. విగ్రహస్థాపనము వీనికిం దీసిపోవక సమానస్థానము కావలయునని చేతులు చాఁపుచున్నది. సోమరు లిట్టికార్యముల

మూలమున లోకుల మోసపుచ్చుచుండఁగాఁ బామరులు వారు ముక్తిస్థానమునకుఁ దీసికొనిపోవుదురని యాశించి యున్న నాలుగు డబ్బుల నాకపటనాటకసూత్రధారులకిచ్చి సేవించుచున్నారు. వారికి ధనవిముక్తియే ముక్తి. ఇట్టివారిపాలఁ బడకుండ సన్మతములబోధించువా రరుదుగనున్నారు. వారిమాటలు పామరుల కంతమధురములుగా నుండుట లేదు. పరమేశ్వరుఁడే యట్టివంచకులపాలఁబడకయుండఁ బామరులఁ గాపాడవలయును.

"అనార్య ఇతి మామార్యాః పుత్త్రవిక్రాయికం ధ్రువం,
ధిక్కరిష్యంతి రథ్యాసు సురాపం బ్రాహ్మణం యథా." ౨౮

అను నీమూలముకూడఁ బైవ్రాసినట్లు సురాపానము బ్రాహ్మణునకేసమయమునందును దగదని తెలుపుచున్నది. వాల్మీకిమహర్షి స్మృతులభావమునే యాయాయిసమయములయందు సంభాషణరూపమున వెల్లడించును. రామాయణము సదాచారములను దెలుపునదియే యని స్పష్టము.

"బాలిశో బత కామాత్మా రాజా దశరథో భృశం,
యస్త్రీకృతే ప్రియం పుత్త్రం వనం ప్రస్థాపయిష్యతి." ౮౩

అని మూలము. రాజు మూర్ఖుఁడు. కామాసక్తుఁడు. కనుకనే స్త్రీకొఱకుఁ బ్రియపుత్త్రకు నరణ్యములకుఁ బంపనున్నాఁడని తన్ను లోకులు దూషింతురని కైకకుం దెలుపుచున్నాఁడు. రాజులకు లోకమును రంజింపఁజేయుటయే ప్రధానమనియు, లోకాపవాదము రాకయుండఁ బ్రవర్తింపవలయుననియు, నందును గామాతురుఁ డనుపేరు రాఁగూడదనియు, స్త్రీని సంతోషింపఁజేయుటకై సత్కార్యమును వదలరాదనియు వాల్మీకి

మునివర్యుఁడు దశరథునివాక్యమూలమున లోకులకు నీతిని బోధించెను.

దశరథుని యీమాట న్యాయ్యమా కాదా యని పరికింతము. స్త్రీని వలచి తన్నిమిత్తమై రాముని నడవులకుం బంప లేదు. తానిచ్చినవరములమూలమునఁ దనసత్యము నిలుపుకొనఁ బంపెను. ఇపుడు పరితపింపనేల? తానిన్నిరీతుల న్యాయమును బోధించినఁ గైక తనపట్టుదలను మానుకొనునని యతనిభావమై యుండనోపు. కైకయుఁ బతివ్రతయగుట నీమాటల నంగీకరింప వలసినదియే. కాని భగవంతునియభిప్రాయము వేఱురీతిగానున్న పుడు కైక యేమిచేయఁగలదు? ఇట్టితావులఁ గైక దుర్వృత్త యని తేటపడియెడిని. ఐనను దీర్ఘదృష్టిం బరికించినఁ గైక యేమియుఁ జేయఁజాలదు. ఆమెకరుణ లోకోపకారక్షమ మైనది. కాన రాజుమాటలకుఁ జెవియొగ్గ నుంకింపదు. దీనింబట్టి యెట్టిస్నేహముకాని భావిఫలము ననుసరించి మార్పునొందునని మన మెఱుంగవలయును.

యది మే రాఘవః కుర్యాద్వనం గచ్ఛేతి చోదితః,
ప్రతికూలం ప్రియం మే స్యాన్న తు వత్సః కరిష్యతి." రా౾

అను నీమూలము పరిశీలింపుఁడు. ఇందు సత్పుత్త్రునిధర్మములు తెలుపఁబడియున్నవి. తండ్రి సర్వసుఖములను వదలి యడవులకుఁ బొమ్మన్నను బితృశాసనముఁ దలందాల్చి యేకుమారుఁడు పోవునో యాతఁడే కీర్తిమంతుఁడని యీభాగము మనకు బోధించుచున్నది. "పుత్త్రః పితృవశానుగః" అన్నసూక్తి యీ యర్థమునే తెలుపునుగదా.

శ్రీరామావతారమున భగవంతుఁడు ప్రధానముగా లోకమునకు వెల్లడించినది పితృపాలనము, సత్యనిరతి లోనగు నాచారములనే. ఆవిషయము ముందు వ్రాయఁబడును. ఇచ్చట దశరథుఁడే తనమాటకు వ్యతిరేకముగా శ్రీరామమూర్తి ప్రవర్తించెనేని తనకిష్టమే యనియుఁ, గాని యతఁడట్లు ప్రవర్తింపఁడనియుఁ జెప్పుటచే, శ్రీరామమూర్తి తండ్రియానతి నించుకయు మీఱఁడని సూచితము. శ్రీరామునియాచారము నుదాహరణముగాఁ గైకొని యెవరు తండ్రియానతి మీఱరో వారెల్ల లోకవిఖ్యాతింగాంతురనుట నిస్సందేహము.

"శుద్ధభావో హి భావం మే న తు జ్ఞాస్యతి రాఘవః,
స వనం ప్రవ్రజేత్యుక్తో బాఢమిత్యేవ వక్ష్యతి." రా౹౨

అని మూలము. నిర్మలహృదయుఁడు రాముఁడు. కావున నా హృదయ మెట్టిదో యెఱుంగఁడు. తనచలెనే నన్నును శుద్ధభావముగలవానినిగా నెఱింగి వనమునకుఁ బొమ్మని నేను జెప్పినంతనే యట్లే యని పలుకును. అని దశరథు నాశయము. అనఁగా రామవనవాసగమనము నామనస్సున కిష్టముకాదని యెఱుంగఁడని తాత్పర్యము. వరపాశబద్ధుఁడనై యుండుటంజేసి మాటాడకయున్న నామాటనే విశ్వసించును. కాని నాహృదయము నెఱుంగఁడు. ఎఱింగి నేను బోనొల్లనని పలుకునేని నాకిష్టమే. ఐన నారామచంద్రుఁ డట్లనువాఁడు కాఁడని సారము. దశరథునిభావ మేమని విచారింతము. నేఁజెప్పినమాటప్రకార మభిషేకము సాగవలయునని పట్టుపట్టి రాముఁ డడవులకుఁ బోనొల్లనని పలికినఁ జాలమేలు. కైక వరములమాట యేమన్న నాయాజ్ఞను రాముఁ డతిక్రమించెనని బదులు చెప్పవచ్చును.

అసత్యదోషము రాదు. అనియేకదా. ఈయూహ న్యాయసమ్మ
తమా. కాదా. అని విమర్శింతము. దుఃఖసాగరనిమగ్నుఁడై
యున్న రాజు తగినట్లాలోచించుశక్తిలేమి నిట్లనియెనన్న దోషము
లేదు. మనసార నీమాటయే చెప్పియున్న దోషమనుభవింపఁ
దగినవాఁడే యగును. ఇది రామచంద్రసద్గుణకీర్తనము గావచ్చు
ను. నామాట నతిక్రమింపక రాముఁ డడవులకుఁ బోవునని
తాననఁగా నామాటలకుఁ గైకహృదయము కరఁగుననియే దశ
రథునిభావమని మన మూహించిన నది యంతగా నసత్యము
కాదనవలయు. విచారముచేతఁ దపించుచున్న రాజు దూర
మాలోచించి యన్నమాట కాదని యూహింతుమేని దోషియే
యనవలయును. కైకయు దశరథుఁడును భవిష్యత్కాలపాశ
బద్ధులుగాన దానికిం దగినట్లే మాటలాడుచుందురనియు, నస్వ
తంత్రులనియు నూహించుటయే మంచిదని నాయాశయము.
ఇందలివిశేషార్థమేమి?

రాఘవుఁడు శుద్ధస్వభావుఁడు. అనఁగాఁ గృత్రిమగుణము
లేనివాఁడని భావము. నాయానతి నిమిత్తమాత్రమే. వనమున
కరుగుమా యన్నంతనే శిరసావహించి వెడలును. కాని నా
భావము నెఱుఁగఁడు. అనఁగా నంగీకరింపఁడు. వనగమనమే
రామావతారప్రయోజనమని యెఱుఁగకయున్నను దశరథుని
నోట నీమాటలు వెడలెననియే మన మెఱుంగవలయును. ఈ
యర్థమును

"రాఘవే హి వనం ప్రాప్తే సర్వలోకస్య ధిక్కృతం,
మృత్యురక్షమణీయం మాం నయిష్యతి యమక్షయం." ౨౨

అని నీమూలము సూచించుచున్నది. రాముఁ డడవులకుఁ బోవఁగా సర్వజనతిరస్కార మోర్వఁజాలనినన్ను మృత్యువు యము నింటికిఁ దీసికొనిపోవునని యే దీనిభావము. ఇంతటిజ్ఞానము దశరథునకుఁ గలదా యని ప్రశ్నింపరాదు. తనకుఁ గలిగినశాపము నతఁ డెఱుంగును. పుత్త్రశోకమున మరణము కలుగుననియే యతఁ డూహించెను. అది తప్పునది కాదనియే యతనివిశ్వాసము. కావున దశరథుఁ డిట్లు జరగఁగలదని యూహించెనని మనము నిశ్చయించుట పొరపాటు గాదు.

"ప్రియం చేద్భరతస్యైతద్రామప్రవ్రాజనం భవేత్,
మాస్మ మే భరతః కార్షీత్ప్రేతకృత్యం గతాయుషః." ౯౩

అనుమూలము విమర్శనార్హము. రాముఁ డడవులకేగుట భరతునకు సమ్మతమగునేని, మృతినొందిన నాకుఁ జేయఁదగుకర్మము లాతఁడు చేయరాదు. అనఁగాఁ దండ్రిమాట మీఱునతఁ డనిష్టుఁడు. కాన నతఁడు చేయుప్రేతకృత్యములు తండ్రికిం జేరవు. అతఁడు కుపుత్త్రుఁ డనంబడును. అట్టివాఁడు కర్మముల నాచరింప నర్హుఁడు కాఁడని దశరథునభిప్రాయము. ఇందలిసార మేది? మృతినొందినవారల నూత్నశరీరము ప్రేతత్వవిముక్తికొఱకుఁ జేయుకర్మములు ముగియుదనుక నిండే యుండును. మనకు వినఁబడునట్టికంఠస్వరము లేనందున వారిభావము మన మెఱుంగఁజాలము. పాంచభౌతికశరీరమునఁ గలయభిమానాదు లపుడుండుటంబట్టి యెవరు తమప్రీతికిం బాత్రులో వారు చేయు కర్మములఫలములే వారలకుం జెందు. కర్మముల నొనరించువాఁడు పరిశుద్ధభావము కలిగిననే యాభావనచే నాతనికర్మములు వారలకుఁ జెందును. నిర్మలాంతఃకరణులు కానివారు

చేయుకార్యములు నిష్ఫలములగును. బంధువులుకూడ దుఃఖింపక ప్రేతత్వవిముక్తికొఱకు సత్కర్మములు చేయవలయునని స్మృతి దెలుపుచున్నది.

"శ్లేష్మాశ్రు బాంధవైర్ముక్తం ప్రేతో భుంక్తే యతోఽవశః,
అతో న రోదితవ్యం హి క్రియాః కార్యాస్స్వశక్తితః." ౧౧.

యాజ్ఞవల్క్యము.

దుఃఖము మనశ్శాంతిభంగకరము. మనోనిర్మలత్వము భావనకు ముఖ్యము. అట్టివాఁడు కానిచో నాతఁ డొనరించుకర్మములు ఫలము నీఁజాలవు. ఈవిషయమును మహర్షి వాల్మీకి దశరథవాక్యరూపమున మనకుఁ దెలిపెనని యెఱుంగందగును. ఏ సత్కర్మములు చేయుచున్నను మనస్సు నిర్మలముగా నుండవలయునని దీనిసారము. తండ్రియాజ్ఞ మీఱరాదనియు, నట్లుగాక దానిం బాటింపనివాఁడు తండ్రికిఁ జేయునౌర్ధ్వదైహికక్రియలు ఫలింపవనియు దీనివలన మనము గ్రహింపఁదగువిషయము.

"ధిగస్తు యోషితో నామ శఠాస్స్వార్థపరాస్సదా,
న బ్రవీమి స్త్రియస్సర్వా భరతస్యైవ మాతరం." ౧౦౨

అని మూలము. శఠాః = కపటముగలవారు. ఆలంకారికులు "గూఢవిప్రియకృచ్ఛఠః" అందురు. స్వార్థపరాః=స్వప్రయోజనమందే యాసక్తిగలవారు. కావున నిందింపఁదగుదురు. ఈనింద స్త్రీలకందఱకు నన్వయింపదు. భరతునితల్లినిగుఱించియే చెప్పుచున్నవాఁడనని దశరథుఁడు పలికెను.

"సురాపీ వ్యాధితా ధూర్తా వంధ్యార్థఘ్న్యప్రియంవదా,
స్త్రీప్రసూశ్చాధివేత్తవ్యా పురుషద్వేషిణీ తథా." ౭౩

యాజ్ఞవల్క్యస్మృతి. ఆచారకాండము.

చాంశ్చల్యాచ్చలచిత్తాచ్చ నైస్స్నేహాచ్చ స్వభావతః,
రక్షితా యత్నతోఽపీహ భర్తృష్వేతా వికుర్వతే. ౧౫
ఏవం స్వభావం జ్ఞాత్వాసాం ప్రజాపతినిసర్గజం,
పరమం యత్నమాతిష్ఠేత్పురుషో రక్షణం ప్రతి.” ౧౬

మనుస్మృతి. ౯ అధ్యా.

అన్నస్మృతుల ననుసరించి దశరథుఁడు స్త్రీజాతినే దూషించెను. పతివ్రతాశిరోమణులగు ననసూయారుంధతులు లోనగు వారిం దలంచుకొని భరతునితల్లి యగుకైకనే దూషింతు ననెను. దీనిభావమేమి ? స్త్రీస్వభావము సాధారణముగా గూఢము. నిర్మలము కాదని భావము. రహస్యముగా నపకారము చేయ నుంకించునదియని భావము. తనలాభమునే కోరునది. ఇది స్మృతిసిద్ధము. కాని యట్టిజాతియం దుత్తమోత్తమస్వభావముగలవారుదయించిరి. వారలకీర్తి లోకోత్తరముగ నున్నది. కాని భరతునితల్లి యాసాధ్వులలోఁ జేరదని దశరథు నాశయము. ఇది న్యాయ్యము కాదు. స్త్రీపురుషులస్వభావము ప్రాక్కర్మాధీనము. దానిననుసరించియే చిత్తవృత్తులు మాఱుచుండును. స్త్రీలకందఱ కొక్కరీతిగ నభిప్రాయముండదు. తఱచుగా నట్లే యుండుననవచ్చును. కైకచిత్త మేల యట్లు మార్పునొందెనో రాజెఱుంగఁడు. అసాధ్వి యనియే యాతఁడూహించెను. అంతియకాని తనశాప మామెవా గ్రూపముగా ఫలము నీయఁబూనెనని యెఱుంగఁజాలకపోయెను. ఎఱింగియు మరలమరలఁ బుత్త్రవాత్సల్యమనుతెఱ తన్నుం గప్పఁగా మఱచి పోవఁజొచ్చెను. దీనింబట్టి కర్మ మెంతబలవత్తరమో యెఱుంగవచ్చును. “గహనా కర్మణో గతిః” అన్నమాట యెన్నిసారులు

స్మరించినను విసుగు రాదు. కావున సర్వము కర్మాధీనమని యెఱింగి యొకరిపై నాగ్రహ మునిచి వారిని దూషింపరాదు. ఏజాతినిగాని దూషింపరాదనియు, నొక్కనియందుఁగలయప రాధము జాతిని బాధుచేయఁజాలదనియు, నెవరికర్మము నను సరించి వారు వర్తింతురనియు మన మెఱుంగవలయును.

"వినాపి సూర్యేణ భవేత్ప్రవృత్తిరవర్షతా వజ్రధరేణ వాపి,
రామం తు గచ్ఛంతమితస్సమీక్ష్య జీవేన్న కశ్చిత్త్వితి చేతనా మే. ౧౦౬

అని మూలము. దీనియర్థము స్పష్టము. ఎట్టి యశక్యకార్య మైనను శక్యము కావచ్చునుగాని రాముఁ డడవికిం బోవఁ జూచువారిలో నొక్కఁడైన జీవింపఁడని నాయభిప్రాయమని దశరథుఁడు తెలిపెను. ఇదియే దీనితాత్పర్యము. వర్షము కురి పించువాఁ డింద్రుఁడని యార్యులు వ్యవహరింతురు. దీనినే యీకాలమున నుండువారిలోఁ గొంద రాక్షేపింతురు. మన పూర్వులకు వర్షమన నెట్టిదో తెలియదనియే వారిభావము.

"యాభిరాదిత్యస్తపతి రశ్మిభిస్తాభిః పర్జన్యో వర్షతి."

అని శ్రుతి తెలుపుచున్నది. భూమిని సూర్యుఁ డేకిరణములచేఁ దపింపఁజేయుచున్నాఁడో యాకిరణములచేతనే పర్జన్యుఁడు వర్షించుచున్నాఁడని శ్రుతి తాత్పర్యము. భూగతజలమును గిరణములవలని యుష్ణగుణమునఁ బీల్చి సూర్యుఁడు మరల వానిరూపముననే వర్షించుననియేకదా యిందుఁ గలసారము. ఇంద్రునిప్రస్తావ మేలయనఁగా వర్షాధిదేవతగా నింద్రుని బలు కుదురు. దాన నపగాధ మేమి? పూర్వులహృదయ మెఱుంగక యాక్షేపించువారల తెలివితక్కువయే యిటఁ దెల్లమగు చున్నది. విజ్ఞానసంపద్విషయమున మనయార్యుల కెవ్వరు సరి

పోలరని యెఱుంగుటయే యిప్పటిబుద్ధిమంతులకుఁ దగిన కార్యము.

"న కించిదాహాహితమప్రియం వచో
న వేత్తి రామః పరుషాణి భాషితుం,
కథన్ను రామే హ్యభిరామవాదిని
బ్రవీషి దోషాన్ గుణనిత్యసమ్మతే." ౧౧౦.

అని మూలము. ఈభాగము శ్రీరామచంద్రునికళ్యాణగుణములను దెలుపుచున్నది. హితముగానిది ప్రియముగానిది యొక్కమాటనైనను బలుకఁడు.

"సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాన్న బ్రూయాత్సత్యమప్రియం,
ప్రియం చ నానృతం బ్రూయాదేష ధర్మస్సనాతనః."

అన్నమనుస్మృతివాక్యము స్మరింపఁదగినది. "అనృతం నోక్తపూర్వం" అను శ్రీరామవాక్యము నిట స్మరింపందగు. కఠినముగ మాటలాడ నెఱుంగఁడు.

"భద్రం భద్రమితి బ్రూయాద్భద్రమిత్యేవ వా వదేత్,
శుష్కవైరం వివాదం చ న కుర్యాత్కేనచిత్సహ."

అన్నమనుస్మృతివాక్య మిట నుదాహార్యము. సర్వజనులకుఁ బ్రియముగలుగఁ బలుకువాఁడు. నిరంతరసద్గుణపూర్ణుఁడు. అట్టి రామునియందు దోషములున్నవని యెట్లు చెప్పఁగలవు? అని దశరథుఁడు కైకను బ్రశ్నించుచున్నాఁడు? ఇపుడు దశరథుఁడు స్మృతిలేక పలుకుచున్నవాఁడనవలయును. శ్రీరాముఁడు దుర్గుణుఁడని, అసత్యవాదియని, పరుషభాషణుఁడని, ద్రోహియని కైక పలుకలేదు. రామమూర్తియందు దోష మారోపింపలేదు. వరముల నడిగి రాము నిపుడే యడవులకుం బంపు

మన్నది. "బ్రవీషి దోషాన్" అని రాజడుగుచుండుట విరుద్ధము కాదా. యని ప్రశ్నింతురు. అడవులకుఁ బంపుమన్నంతనే నగరమున నుండఁదగనివాఁడని కైక యూహించి యీవరములడిగెనని రాజు తలంచెను. రాముఁడు నిర్దోషియని కైక యెఱుంగదనియే దశరథునియభిప్రాయమని మన మూహించిన దశరథుఁ డవివేకియన్నదురూహ తొలంగును. అదియే మనము చేయఁదగుసత్కార్యము. శ్రీరామచంద్రుఁడు లోకాతీతుఁడగుపురుషోత్తముఁడని యీభాగము మనకు బోధించుచున్నది. రామమూర్తి భగవంతుఁడని వాల్మీకి యీఘట్టమున స్పష్టముగా నుత్తరకాండమునఁ దెలిపినట్లు తెలుపకయున్నను దదభిప్రాయమునే వెల్లడించెనని మన మెంచఁదగు. సకలకల్యాణగుణములు భగవంతునియందుఁ దప్ప నితరులయందు నెలకొనియుండవనుట సిద్ధాంతముకదా. పక్షపాతశూన్యత్వమే పరమేశ్వరలక్షణమని పెద్ద లంగీకరించిరి. అట్టిలక్షణము లన్నియు శ్రీరామచంద్రునియందు నెలకొనియున్నవి. ఈవిషయమును మన మెఱింగి శ్రీరామచరితమును బఠించిననే దానిసారము తెలియును. లేకున్నఁ గొన్నిభాగములు విపరీతములుగాఁ దోఁచును. మనకుఁ గల్గుశంకలే మనపురోవృద్ధి నడ్డగించును. కావునఁ దొలుత సదభిప్రాయముకలిగి గ్రంథము పఠింపవలయును.

"ప్రతామ్య వా ప్రజ్వల వా ప్రణశ్య వా
సహస్రశో వా స్ఫుటితా మహీం వ్రజ,
న తే కరిష్యామి వచస్సుదారుణం
మమాహితం కేకయరాజపాంసని!" ౧౧౧

అని మూలము. నీవెట్లైన నశింతువుగాక. దారుణమగు నీమాటను సఫలముచేయను. ఓకేకయవంశచ్ఛేదనకారిణీ! అని రాజు పలికెను. దీనింబట్టి సత్యప్రతిజ్ఞుఁడు రాజు కాఁడని యూహింపవచ్చును. వరముల నిపుడీయననికదా రాజుభావమని కొందఱందురు. ముందువెనుక లాలోచింపక యొకయభిప్రాయము నొందరాదు. ఇట్టి క్రూరవాక్కు పలికిన విని యించుక జ్ఞానము కలిగి భర్తకాగ్రహమును గలిగించితినే యనుపశ్చాత్తాపమున సన్మార్గమునకు వచ్చునేమో కైక యని రాజాలోచించియే యీ మాట పలికెను. "కేకయరాజపాంసని" అనువాక్య మీయర్థమును సూచించెడిని. పితృకులమునకు నీవలన మహాపయశస్సు ప్రాప్తించును జుమీ. అన్నవాక్యమునందు నీవిట్టిదుష్ప్రియత్నమును మానకయున్న మీజనకవంశమునకు నీమూలమున దుర్యశముకలుగు ననునర్థమిమిడియున్నది. దానికి జంకియైనఁ గైక మంచిదారిం ద్రొక్కుననియే రాజు నాశయము. ఈ భావము పూర్వాపరగ్రంథమును విమర్శించినఁ బోడసూపును. కావునఁ జక్కఁగా విమర్శింపకయే భావమును వెలిఁబుచ్చరాదని విమర్శకులఁ బ్రార్థింతును. ఈభావము నీక్రిందిశ్లోకమే తెలుపుచున్నది.

"మమాహితం దేవి న కర్తుమర్హసి
స్పృశామి పాదావపి తే ప్రసీద మే." ౧౧౩

తనవరమునీయ నిష్టపడనివాఁడైనచో నీనమస్కారములేల ? ఈదీనవాక్కులేల? సత్యపాశబద్ధుఁడై యేమియు ననఁజాలక కైక కెట్టులైన బుద్ధివచ్చుననియే యెన్నియుపాయములైనఁ జేయఁబూనెనని మనము గ్రహింపవలయును.

మహాశయులారా! ఇట్టు లీసర్గము కైకయొక్కయు దశరథునియొక్కయు నాశయముల వెలిఁబుచ్చుచు ననేకధర్మవిశేషముల మనకు బోధించుచున్నది. భగవతి యగుసీతాదేవి సంకల్పము ఫలించుచున్నజాడను విశదముచేయుచున్నది. రామాయణము కేవలకావ్యము కాదు. స్మృతిపురాణోక్తధర్మవిశేషములనిధియని తేటపఱచుచున్నది. కర్మము బలవత్తరమనియు, దాని నెఱుంగఁదరముకాదనియు సిద్ధాంతముచేయుచున్నది. శ్రీరాముని పరమేశ్వరత్వమును స్పష్టీకరించుచున్నది. సత్యము భగవత్స్వరూపమే యని యుపదేశించుచున్నది. కావున నిందలి విశేషముల నాకుఁ దోఁచినయంతవట్టు వ్రాసితిని. ఇది చాలఁ దక్కువయని నే నెఱుంగుదును. మఱికొన్నిభాగము లిందు విమర్శింపఁదగినవి కలవు. గ్రంథవిస్తరభీతిచే వాని వదలితిని. విష్ణుభక్తిని దూషించువాఁడనని కొందఱు పలుకుదురు. ఆవాక్కులయం దెంతసత్యముకలదో నాయీవ్రాఁతలంబట్టి నిర్ణయింప వలంతులు మీరే. విశేషించి పెంచి వ్రాయఁబూనక పైకథను వ్రాయుదును.

## దశరథుఁడు కైకను మరల వేఁడుట

* దశరథుఁడు నేలపైఁ బరుండఁగాని భార్యపాదముల కడ వ్రాలియుండుటకుఁగాని తగినవాఁడు కాకుండియు నారెండు కార్యము లొనరించెను. అంతియకాక విలపించుచుఁ బుణ్యము భోగానుభవమున నశింపఁగా భూమికి దిగినయయాతివలె నుండెను. ఆతనిం గని కేకయరాజదుహిత యనర్థరూపిణి

* ఈభాగము పదుమూఁడవసర్గమునఁ గలదు. అధ్యాత్మరామాయణవిశేషవిషయము లిందుఁ గలిసియే యుండును.

కావునఁ దన ప్రయత్నము నెఱవేఱుమికి వగచుచు లోకనింద కలుగుననియైన జంకక దానిని సాధింపఁగోరి దశరథుని మన స్సుననున్న భయము సుంతయైన లెక్కింపక యతనికిఁ బూర్వ మునకన్న నెక్కుడుభయము గలిగించుచుఁ బూర్వవరములనే కావలయునని మరల గట్టిగా నడుగంబూని యిట్లు పలికెను.

రాజశేఖరా! అసత్యములాడనని దృఢవ్రతుఁడనని ప్రల్లదములాడుచుందువు. అట్టి నీవు నాకు నిత్తునని శపథము లెన్నియో పల్కినయవ్వరముల నీఁదలంపక ఋణముగా నింకను బెట్టుకొనియున్నాఁడవే. ఏల? అని గట్టిగాఁ బ్రశ్నించెను. ఆ మాటలు చెవులసోఁకినంతనే పట్టరానికోపమొంది ముహూర్త కాలము స్మృతిలేకయుండి యంతట స్మృతికలుగఁగా యిట్లు పలికెను. అనార్యురాలా! ఇంతటి క్రూరురాలవటే. నాయందు విరోధముగల యోకైకా! నే నీతనువును వదలఁగా శ్రీరాముఁ డడవులకుఁ బోవఁగా నీమనసునఁగల వాంఛలు దీఱ సుఖము లనుభవింపుమా. మృతినొందియు నేను సుఖపడను జుమీ. నా ప్రియపుత్రునియభ్యుదయమును బరికింపక స్వర్గమునకు నేఁబోయినను దేవతలందఱు నన్నుం గాంచి రాజా! మూర్ఖురా లగు స్త్రీనిమిత్తమై సుగుణాకరుండగుకుమారు నడవులకుం బంపు దువా. యని తిరస్కరించుచు నడుగ నక్కటా! నేనెట్లు సహిం తును? అందుఁగూడ నాకు సుఖము శూన్యమే. దేవత లట్లు ప్రశ్నింపఁగాఁ గైకకు మున్ను వరము లిచ్చితిని. కావున నా వరదానమునఁ గైకకు మేలుచేయఁగోరి రాముని వనములకుం బంపితిని. అని యీసత్యమును బదులుగాఁ బలుకుదునేని రేపు

పట్టాభిషిక్తుని జేయుదునని రామునకుం జెప్పినది యనృత మగును.

కైకా! చాలకాల మపుత్త్రకుఁడనై యుండి యనేక శ్రమములకు నోర్చి సుగుణాభిరాముఁ డగు రామునిం బడయంజాలితిని. ఎట్లు వానిని వదలుదును? రామునియందుఁ గలసద్గుణము లిన్నియని వినుతింప నలవికాదు. అన్ని సుగుణములు గలవనియే నమ్ముము. అట్టి ప్రియపుత్త్రుని ఘోరాటవులకు నెట్లు పంపుదును? సుందరాంగుఁడు సుకుమారుఁడగు నారాముని దండకారణ్యములకుం బొమ్మని యక్కటా! యెట్లు సాగనంపుదు? సుఖార్హుఁడై దుఃఖము లెఱుంగకయుండు నాకుమారుఁడు కష్టముల పాలుగా నుండ నెట్లు చూతును? సుఖార్హుఁడగు రామునకు దుఃఖముగలిగింపక యిపుడే ప్రాణములం బాయుదునేని నాకప్పటికి సుఖములు గలుగును. క్రూరచిత్తురాలా! పాపమతీ! శత్త్రువులయందుఁ బౌరుషమును మనయందఱియందుఁ బ్రీతి వెలయించు నారామచంద్రు నడవులకుఁ బంపుమని యేల దుఃఖమును గలిగించుచున్నావు? నీ యీ ప్రయత్నమూలమున నాకు మిక్కిలి దుర్యశము త్యజింప నను వుకాని యవమానము కలుగకమానదు.

అని పలికి మనస్సు వికలతంగాంచఁగా నయ్యో యని యేడ్చుచుండఁగాఁ బ్రొద్దు గ్రుంకెను. రాత్రియుఁ జక్కఁగాఁ బ్రవేశించెను. ఆ రేయి యమృతకరమండలమున నెంతో హాయి గూర్చునదియైన దుఃఖించుచున్న యాదశరథునకు హాయి నీయఁజాలదయ్యెను. దుఃఖయోగమున నామూఁడుజాములు గడచెను. అంత నారాజు నిట్టూర్పులుపుచ్చుచు నాకాశమున

దృష్టిఁబరఁగించి పెనురోగము పీడింపఁ బడలినవానిరీతి విను వారలకుంగూడ జాలికలుగులాగున నక్షత్రప్రకాశముగల యో త్రియామా! నీవు తెల్లవాఱకుమా. అయ్యది నాకు సరి పడదు. దయ నాపై నుంపుము. అంజలింబట్టి ప్రార్థించుచున్నాఁ డను. నాప్రార్థనము నీకిష్టముకాదేని త్వరగాఁబొమ్ము. ఎవ తుకమూలమున నా కీమహాదుఃఖము కలిగెనో యాక్రూరాత్ము రాలిని దయారహితను జూడనొల్లను. అని గట్టిగా విలపించెను.

మరల నారాజు దోసిలొగ్గి కైకను వేఁడుచుఁ బట్టువదలు నట్లుచేయఁ బ్రయత్నించి యామె కిట్లనియె. దేవీ! మంగళము లకుం దగినదానవు. నాకు ధర్మపత్నివి. నేనుగూడ సాధువృత్త ముగలవాఁడను. దుఃఖములఁ బొగులుచు నిన్నిపుడు శరణు వేఁడితిని. ఆయుశ్శేష మెంతయో లేక చావునకు సిద్ధపడి యుండువాఁడను. ప్రభువుగా నున్నాఁడను. ఇట్టి నాయం దను గ్రహ మునుపందగుదువు. సుందరీ! నిర్జనప్రదేశమున రాము నభిషేకింతునని నేఁ జెప్పలేదుగదా. ఎల్లరు వినఁగాఁ బలికితిని గదే. తెలిసియో తెలియకయో యామాటఁ బలికితిని. నీవు సుహృదయముకలదానవు. నన్నింకనైన దుఃఖపెట్టక దయచేఁ జూడుము. శుభవీక్షణముల నలరారునోకైకా! ప్రసన్నహృద యవు కమ్మా. వరములమూలమున నీవే యీరాజ్యమునెల్లఁ బడసి రామునకు దాని నొసంగి సాధుకీర్తింబడయుమా. చారు ముఖి! శుభవీక్షణా! నీవిట్లు లాచరించినచో నాకు, రామునకుఁ, బ్రపంచమునకు, గురువర్యులకు, భరతునకు నీకార్యము మిక్కిలి ప్రియమగుఁజుమ్మీ! నామాట పెడచెవింబెట్టక యీ రీతిఁ జేయుమా యని ప్రార్థించెను.

కైక క్రూరమతికలది. విశేషించి యపుడు దుష్టస్వభావు రాలుగాఁ జూపట్టెను. కావున నిర్మలాత్ముఁడగు రా జెంత ప్రార్థించి నను విలపించినను మగనిమాట నంగీకరింపదయ్యెను. ఆసాయం కాలముదనుకఁ దన కనుకూలవతియై ప్రియములంగూర్చునదియై యున్నయాకైక రాత్రి రాఁగానే ప్రతికూలముగా మాట లాడం గాంచి చిరకాలమైత్రింజేసి యామెపలుకులఁ దిరస్క రింపఁజాలక శ్రీరాము నడవులకుం బోమ్మనలేక యితికర్త వ్యతామూఢుఁడై దుఃఖసాగరమున మునింగి స్మృతి తప్పి పడి పోయెను. సన్మతియగు నాదశరథుఁడు దుఃఖావేశమునఁ జూచు వారలకుంగూడ భీతిజనింప నిశ్వాసవాయువులం బుచ్చుచుం డఁగా నారాత్రియంతయుఁ గడచెను. తెల్లవాఱుజామున వైతాళికప్రముఖులు రాజును మేల్కొలుపఁ బ్రయత్నింపఁగా వలదని యతఁ డాజ్ఞాపించెను.

మహాత్ములారా! ఈభాగమునఁ గల విశేషములఁ దిలకిం తము. అధ్యాత్మరామాయణమునందు విశేషమేమియు నీభాగ మునఁ గానరాదు. కాని

"అరుణోదయకాలే తు వందినో గాయకా జగుః,
నివారయిత్వా తాన్ సర్వాన్ కైకేయీ రోషమాస్థితా."

అని యున్నది.

"విబోధ్యమానః ప్రతిబోధనం తదా నివారయామాస సరాజసత్తమః."

అని యున్నది. స్తుతిపాఠకులు మర్యాద ననుసరించి మేలు కొలుపరాఁగా రోషమున వలదని కైక వారించెనని యధ్యా త్మరామాయణమునందును, రాజే వలదనె నని శ్రీమద్రామా యణమునందును గలదు. ఈభేదము కథకుఁగాని నీతికిఁగాని

బాధను గల్గించునది కాదు. కావునఁ గువిమర్శకు లీభేదముం బాటించి యాక్షేపించుచు దంతములఁ గనఁబఱుపక యుందురు గాక.

"అతదర్హం మహారాజం శయానమతథోచితం,
యయాతిమివ పుణ్యాంతే దేవలోకాత్పరిచ్యుతమ్." ౧

అని మూలము. యయాతిమహారాజు పెక్కుసుకృతకార్యము లొనరించి పుణ్యలోకములం గ్రుమ్మరి పుణ్యము నశింపఁగా స్వర్గమునుండి చ్యుతిం గాంచెను. అట్లే దశరథుఁడు భూమిపై శయనించియుండెనని సామాన్యార్థము. భూలోకమునఁ జేసిన సుకృతములకు ఫలము స్వర్గాదిలోకముల నివసించుట. అందలి సుఖము లనుభవించుట. ఆపుణ్యము నశింపఁగా మరల భూలోకమున కరుదెంచుట యని యర్థమగును.

"క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి."

అని శ్రుతి చాటుచున్నది. స్మృతులు పురాణములు నీయర్థము నే సహస్రధా బోధించెడిని. పునర్జన్మము నంగీకరింపనిమతములకు సంబంధించినవా రీమార్గము నంగీకరింపకయే యుండిరి. కాని యందుఁ గొంద ఱిపుడిపుడు పునర్జన్మమును విధిలేక యంగీకరించుచున్నా రని వినఁబడియెడిని.

"తేనానుభూయతా యామీశ్శరీరేణేహ యాతనాః,
తాస్వేహ భూతమాత్రాసు ప్రలీయంతే విభాగశః. ౧౭
తే௨నుభూయ సుఖోదర్కాన్ దోషాన్ విషయసంగజాన్,
వ్యపేతకల్మషో௨భ్యేతి తావేవోభౌ మహౌజసౌ. ౧౮
తౌ ధర్మం పశ్యత స్తస్య పాపం చాతంద్రితౌ సహ,
యాభ్యాం ప్రాప్నోతి సంపృక్తః ప్రేత్యేహ చ సుఖాసుఖం. ౧౯

యద్యాచరతి ధర్మం స ప్రాయశోఽధర్మమల్పశః,
తైరేవ చావృతో భూతైః స్వర్గే సుఖముపాశ్నుతే. ౨౦
యది తు ప్రాయశోఽధర్మం సేవతే ధర్మమల్పశః,
తైర్భూతైస్స పరిత్యక్తో యామీః ప్రాప్నోతి యాతనాః. ౨౧
యామీస్తా యాతనాః ప్రాప్య స జీవో వీతకల్మషః,
తాన్యేవ పంచభూతాని పునరప్యేతి భాగశః. ౨౨
ఏతా దృష్ట్వాస్య జీవస్య గతీస్స్వేనైవ చేతసా,
ధర్మతోఽధర్మతశ్చైవ ధర్మే దధ్యాత్సదా మనః." ౨౩

మనుస్మృతి ౧౨ అధ్యా.

"అనంతాశ్చ యథాభావాశ్శరీరేషు శరీరిణాం,
రూపాణ్యపి తథైవేహ సర్వయోనిషు దేహినాం. ౧౩౨
విపాకః కర్మణాం ప్రేత్య కేషాంచిదిహ జాయతే,
ఇహ వాముత్ర వైకేషాం భావస్తస్య ప్రయోజనం. ౧౩౩
పితృయానోఽజవీథ్యాశ్చ యదగస్త్యస్యచాంతరం,
తేనాగ్నిహోత్రిణో యాంతి స్వర్గకామా దివం ప్రతి. ౧౮౪
యే చ దానపరాస్సమ్యగష్టాభిశ్చ గుణైర్యుతాః,
తేఽపి తేనైవ మార్గేణ సత్యవ్రతపరాయణాః. ౧౮౫
తత్రాష్టాశీతిసాహస్రా మునయో గృహమేధినః,
పునరావృత్తినో బీజభూతా ధర్మప్రవర్తకాః." ౧౮౬

యాజ్ఞవల్క్యస్మృతి, ప్రాయశ్చిత్తకాండము.

అను నీస్మృతులు స్వర్గాదిలోకప్రాప్తిహేతువులగు సుకృతకర్మములను, సుఖానుభవానంతరము పునర్జన్మమును దెలుపుచున్నవి.

"పార్థ! నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే,
న హి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి. ౪౦

ప్రాప్య పుణ్యకృతాన్ లోకానుషిత్వా శాశ్వతీస్సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే. ౪౧
అథ వా యోగినామేవ కులే భవతి ధీమతామ్,
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్. ౪౨
తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికం,
యతతే చ తతో భూయస్సంసిద్ధౌ కురునందన. ౪౩
పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః,
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే. ౪౪
ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః,
అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిం.'' ౪౫

భగవద్గీత ౬ అధ్యా.

అను నీభగవదుపదేశ మూర్ధ్వలోకసుఖానుభవమును, మరల భూలోకమున జన్మమును దెలుపుచున్నది. ఇట్లీ ప్రమాణములం జూపంబూనిన స్కాందపురాణమంతె యగును. ఈ రామాయణ భాగము మన కేనీతిం దెల్పుచున్నది? పుణ్యకర్మములు స్వర్గ సుఖానుభవహేతువులని, పాపకర్మములు నరకకష్టానుభవ హేతువులని, యీవిషయము నెఱింగి మానవుఁడు సత్కర్మ ముల నాచరింపఁ బ్రయత్నింపవలయును. పునరావృత్తిరహిత పదప్రాప్తింగోరువారు ఫలాభిసంధిరహితముగా సత్కర్మముల నాచరింపవలయును. ఫలములఁగోరి చేయుకర్మము లెంతకాల మునకైన మరల జన్మము ననుగ్రహించుననియు, నట్టిది లేక యుండ ముక్తిని గోరువారు భగవదర్పణముగా సత్కర్మముల నాచరింపవలయు నను నీనీతులను యయాతిదృష్టాంతమునుండి తేలెడినని యెఱుంగవలయును.

''త్వం కత్థసే మహావీర సత్యవాదీ దృఢవ్రతః,

మమ క్షేమం వరం కస్మాద్విధారయితుమిచ్ఛసి." 3

అని మూలము. కైక దశరథు నాక్షేపించుచున్నది. సత్యవాది నని, దృఢవ్రతుఁడనని నిన్ను నీవే పొగడుకొనుచుందువు అని. దీనిసార మేమి?

"న విస్మయేత తపసా వదేదిష్ట్వా చ నానృతం,
నార్తోఽప్యపవదేద్విప్రాన్న దత్వా పరికీర్తయేత్. ౨౩౬
యజ్ఞోఽనృతేన క్షరతి తపః క్షరతి విస్మయాత్,
ఆయుర్విప్రాపవాదేన దానం చ పరికీర్తనాత్." ౨౩౭

మను ౪ అధ్యా.

అను నీమనుస్మృతిధర్మమునే రామాయణము బోధించుచున్నది. ఆత్మస్తుతి మంచిదికాదు. ఇంత తపస్సుచేసితినికదా యని యబ్బురంపడిన నాతపస్సు నశించును. దానముచేసి నలుగురిలోఁ జెప్పుకొనిన నయ్యది నశించుననియే స్మృతిభావము. ఈస్మృతిసారము డంబములు పలుకరాదనియేకదా. తాను జేసినకార్యమునఁ గీర్తిరావలయు నన్నభావమే యాత్మస్తుతి కర్థము.

"ప్రదానం ప్రచ్ఛన్నం గృహాముపగతే సంభ్రమవిధిః
ప్రియం కృత్వా మౌనం సదసి కథనం నాప్యుపకృతేః,
అనుత్సేకో లక్ష్మ్యా నిరభిభవసారాః పరకథా
స్సతాం కేనోద్దిష్టం విషమమసిధారావ్రతమిదమ్." ౬౪

అని భర్తృహరి హిత ముపదేశించెను. "దానం చ పరికీర్తనా" త్తనుస్మృతిసారమే యిందుఁగలదు. తన్నుఁ దాఁ బొగడుకొనరాదనియే యిందుండి మనము గ్రహింపఁదగునీతి.

"అపుత్రేణ మయా పుత్రశ్శ్రమేణ మహతా మహాన్,

రామో లబ్ధో మహాబాహుస్స కథం త్యజ్యతే మయా. ౮
శూరశ్చ కృతవిద్యశ్చ జితక్రోధః క్షమాపరః,
కథం కమలపత్త్రాక్షో మయా రామో వివాస్యతే. ౯
కథమిందీవరశ్యామం దీర్ఘబాహుం మహాబలం,
అభిరామమహం రామం ప్రేషయిష్యామి దండకాన్. ౧౦.
సుఖానాముచితస్యైవ దుఃఖైరనుచితస్య చ,
దుఃఖం నామానుపశ్యేయం కథం రామస్య ధీమతః." ౧౧.

అను నీమూలమునం గనుఁడు. దైవికముగా దశరథునినోట రాముఁడు భగవంతుఁ డనునర్థము నిచ్చుమాటలే వెలువడి యెను. "మహతా శ్రమేణ మయా అపుత్త్రేణ మహాన్ పుత్త్రః రామో లబ్ధః, మహాబాహు స్స మయా కథం త్యజ్యతే." అను నన్వయక్రమము భగవంతుఁడే యని తెలిపెడిని. మహత్తర శ్రమములచేత నీమహాపుత్త్రునిం గాంచితినని రాజనియోఁగదా. ఇత్తఱి దశరథుఁడు నల్వురుకొడుకులనుమాటనే మఱచెను. నాలుగురూపముల నొక్కభగవంతుఁడే యుదయించెనని తలం చెను. రామునే ధ్యానించుచు నాతనివిషయమున దుఃఖించు చున్నవాఁడుగాన సర్వము రామమయముగనే రాజు చూచు చున్నాఁడని తోఁచెడిని. "మహాబాహుః కమలపత్త్రాక్షః ఇందీ వరశ్యామః అభిరామః" అను మొదలగువిశేషణములు రాముని సర్వేశ్వరత్వమును దెలిపెడిని. "అహం రామం కథం దండ కాన్ ప్రేషయిష్యామి" అనువాక్యోరణిం బట్టి యాలోచింపఁగా గతాయుస్సుగల నే నిపు డెట్లు దండకారణ్యభాగములకుఁ బంపఁగలనని యడుగుచున్నవాఁడని తోఁచెడు.

"అంత్యకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరం,

యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః. ౫
యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరం,
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః. ౬
తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుద్ధ్య చ,
మయ్యర్పితమనోబుద్ధిర్మామేవైష్యత్యసంశయః.” ౭

భగవద్గీత ౮ అధ్యా.

అను నీభగవదుపదేశము దశరథునకు మహామునులసావాసమున నెఱుకపడియే యుండుననియు, దాననే సారెసారెకు శ్రీరామగుణవర్ణనము చేయుచున్నవాఁడనియుఁ, బూర్వపుణ్యమున నారామపరబ్రహ్మము సగుణరూపమే యాతనికన్నులం గట్టినట్లుండెననియు

“యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి.”

అన్నభావ మాతనిమది దృఢముగా నెలకొనియున్నదనియు మన మూహింపవలయును. నిరంతరాభ్యాసబలమున రామమూర్తియం దత్యంతప్రేమమే యోగికి ధ్యేయమునందుబలె దృఢపడినది. నడుమనడుమఁ బలుకుమాట లభ్యాసవశమున వచ్చునవియే కాని తెలిసి పలుకునవి కావు. మృత్యు వాసన్నమగుచున్నది. చిరకాలము రామదర్శనస్పర్శనసంభాషణములు వ్యర్థములు కావుకదా. దానికి ఫలమే యకాలమున రామచింతన మనందగు. కృతకృత్యులు కాఁదగువారిస్థితి యిట్లుండుననియే మన మూహింపవలయు.

ఉపాసకుఁ డభీష్టదేవతారూపమును ధ్యానించుచుఁ దొలుత మంత్రమును జపించును. ధ్యానము దృఢము కాదేని మంత్రజపము సత్ఫలము నీయఁజాలదు. ధ్యేయమూర్తి మనః

పీఠమున నెలకొనియున్నఁగాని ధ్యానము సార్థకముకాదు. కొంతకాల మట్టియభ్యాసము కాఁగాఁ బిదప జప మక్కఱ లేదని తోఁచును. ఇష్టదేవతామూర్తియే కన్నులఁ గట్టినట్లగును.

"నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్,
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్,
ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్ నిమిషన్నపి,
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్." ౯

అన్నగీతాభావము స్వానుభవమునఁ గాంచును. ఆస్థితివచ్చుటకే మంత్రజపము కాని యవ్వల నక్కఱ లేదు. నిరంతర ధ్యానమే యవ్వలికృత్యము. మంత్రసిద్ధి యనఁగా నిదియే యని యెఱుంగవలయు. దేవత యెదుట సాక్షాత్కరించు ననఁగా ధ్యానము ఫలించెనని భావము. ఒక్కసారి కనంబడి యదృశ్యమైన నది తపఃఫలము కానేరదు. ఇష్టదేవతాభిన్నముగ నేదియు నుండునట్లు చూడరాదు. అదియే యోగఫలమని సారము. ఎవ్వారి కాస్థితి రాదో వారి కయ్యది ఫలింప లేదని యెఱుంగవలయును.

"సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ,
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః." ౫౨. గీత. ౧౧ అ.

అన్న శ్రీకృష్ణోపదేశము కలదుకదా. నిత్యసాక్షాత్కారమే తపఃఫలమని దీనినుండి మన మూహింపవచ్చును. ఇట్లుగాక యుపాసకులు స్వప్నమున నేదో కనఁబడినదని పలుకుచుండు వారు కొందఱు గలరు. వారికి జపసిద్ధిస్వరూపమే తెలియదన వచ్చును.

"భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున,

జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప.'' ౫౪ గీ. ౧౧ అ.
అన్న భగవదుపదేశానుసారము సర్వదేవతాస్వరూపముగ నిష్ట దేవతను భావించుట సంపూర్ణభక్తిసాయమునకే యని యెఱుంగవలయు.

కొందఱు కపటభక్తులు

''సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః.''

అన్న గీతాశాస్త్రమందలి శ్రీకృష్ణోపదేశము వదలి 'విష్ణువధికుఁడు. శివుఁడు తక్కువ. బ్రహ్మయు నంతకంటెఁ దక్కువ' అను నీ మొదలగు నశాస్త్రవాక్కులచేతఁ బామరుల వంచించుచు భక్తి నభినయింతురు. అదిగో నిన్నరాత్రి నాతండ్రినలెఁ గనంబడెననియు, మొన్న ధనమెట్లు వచ్చునాయని చింతించుచుండఁగాఁ గోటీశ్వరుఁడగు వైశ్యునివలె నగపడియెననియు, నేమి చేయుదునాయని చింతించునంతలో నిద్దఱు యాచకులవలె నగపడి పాడుదేవాలయము బాగుచేయుమని తెల్పి యంతలోఁ గనఁబడకపోయిరనియు, లోకులను మోసపుచ్చుటెట్లని యూహించుచుండఁగా నీవేషమును వదలి యతివేషము వేసికొమ్మని చెప్పిరనియు, జ్ఞానులమనిపించుటెట్లని విచారించుచుండ సర్వసంగపరిత్యాగము చేసినట్లు నటింపుమని యాకాశవాణి వినఁబడియెననియుఁ బలుకుదురు. వీరు భక్తులా? లోకవంచనాసక్తులా? రెండవవారనుట కావంతయు శంకలేదు.

''పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః,
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ.'' ౫

అన్న గీతావాక్యార్థము వారికిం గోచరింపదు.

"త్వం యజ్ఞ స్త్వం వషట్కార స్త్వమింద్ర స్త్వగ్ం రుద్ర స్త్వం విష్ణు స్త్వం బ్రహ్మ త్వం ప్రజాపతిః, త్వం తదాప ఆపో జ్యోతీరసో మృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్."

అన్న శ్రుతియుఁ బనికిరాదు.

"ఈశానస్సర్వవిద్యానామీశ్వరస్సర్వభూతానాం బ్రహ్మాధిపతిర్బ్రహ్మణోధి పతిర్బ్రహ్మా శివో మే అస్తు సదాశివోమ్."

అన్న శ్రుతియు వారికి సమ్మతముకాదు. కావున వారికి శ్రీకృష్ణమూర్తి తెల్పిన 'సమదర్శనత్వము' సరిపడదు. ఇంక నేమనఁగాఁ దమవాక్యమే వేదవాక్యమని నమ్మవలయు ననునదియే సరిపడును. భక్తునిలక్షణములలో నొకటియు వారియందుండదు గాని వేషము పరుల మోసపుచ్చఁజాలునదిమాత్ర ముండును. వారిమాటలకు మోసపోవరాదు. బకవ్రతులు కొందఱు, బైడాలవ్రతులు కొందఱు లోకమున విచ్చలవిడిగాఁ దిరుగుదురు.

"ధర్మధ్వజీ సదా లుబ్ధశ్ఛాద్మికో లోకదంభకః,
బైడాలవ్రతికో జ్ఞేయో హింస్రస్సర్వాభిసంధకః. ౧౯౫
అధోదృష్టిర్నైష్కృతికస్స్వార్థసాధనతత్పరః,
శఠో మిథ్యావినీతశ్చ బకవ్రతచరో ద్విజః. ౧౯౬
యే బకవ్రతినో విప్రా యే చ మార్జారలింగినః,
తే పతంత్యంధతామిస్రే తేన పాపేన కర్మణా. ౧౯౭
న ధర్మస్యాపదేశేన పాపం కృత్వా వ్రతం చరేత్,
వ్రతేన పాపం ప్రచ్ఛాద్య కుర్వన్ స్త్రీశూద్రదంభనమ్. ౧౯౮
ప్రేత్యే నచేదృశా విప్రా గర్హ్యంతే బ్రహ్మవాదిభిః,
ఛద్మనా చరితం యచ్చ వ్రతం రక్షాంసి గచ్ఛతి." ౧౯౯

మనుస్మృతి ౪ అధ్యా.

ఎల్లరకుఁ దెలియవలయునని ధర్మమాచరించువాఁడు ధర్మధ్వజి యనంబడును. పరధనములంగోరి యొకనెపముచేతఁ జరించుచు జనులవంచించువాఁడు బైడాలవ్రతికుఁ డనంబడును. వినయ మగపఱచుచుఁ గ్రిందుగాఁ జూచుచుఁ గఠినప్రవృత్తిగలిగి, స్వప్రయోజనము నభిలషించుచుఁ గుటిలవ్యాపారము గలిగి కపటవినయము నభినయించువాఁడు బకవ్రతుఁడనంబడును. వారిరువురు స్వపాపములచేతనే యధోలోకములఁ బడుదురు. ధర్మకార్యముల నెపమునఁ బాపముచేసి వ్రతముచేయరాదు. దానిచేఁ బాపమే లభించును. వ్రతమునాచరించి పాపమును గప్పి స్త్రీశూద్రమూర్ఖాదుల మోసపుచ్చరాదు. ఇట్టిరీతిగాఁ బ్రవర్తించు బ్రాహ్మణులను బ్రహ్మవాదులు తిరస్కరింతురు. ఒక నెపముచేఁ జేయుధర్మవ్రతఫలము రాక్షసులకుఁ బ్రీతిని గలిగించును.

మనుస్మృతికాలమున నిట్టివారు బ్రాహ్మణులు మాత్రమే యుండిరని స్పష్టముకదా. ఆకాలము ధర్మకాలమని మనమూహింతుము. అట్టి కాలముననే బ్రాహ్మణులలోఁ గొందఱుండిరి. ఇఁక నీకాలమున బ్రాహ్మణులేకాక యన్ని జాతులలోనుండవచ్చును. వారెవ్వరనిమాత్రము నిర్ణయించుట కష్టము. వీరిమూలమున సత్యముగా ధర్మముల నాచరించువారిని నమ్మరానియవస్థ వచ్చుచున్నది. వీరు మోసగాండ్రని, వీరు నిష్కపటులని కనుఁగొనుటయే కష్టము కాని కొంతకాలమునకు వారి ధనసంగ్రహము ననుసరించి జనసామాన్యము తెలిసికొనకపోదని నాయాశయము. ఇట్టిమోసమున వారే చెడుదురుగాని యితరులకు నష్టములేదు. స్వాత్మవినాశనకార్యమునఁ బ్రవర్తింప నేటికో

తెలియఁజాలను. ధనమెందఱి నెన్ని పాట్లుపడునట్లుగాఁ జేయు చున్నది !!

"అర్థమనర్థం భావయ నిత్యం నాస్తి తతస్సుఖలేశస్సత్యం,
పుత్త్రాదపి ధనభాజాం భీతిస్సర్వత్రైషా విహితా రీతిః.
మా కురు ధనజనయౌవనగర్వం హరతి నిమేషాత్కాలస్సర్వం,
మాయామయ మిదమఖిలం హిత్వా బ్రహ్మపదం త్వం ప్రవిశ విదిత్వా.
దినయామిన్యౌ సాయంప్రాతశ్శిశిరవసంతౌ పునరాయాతః,
కాలః క్రీడతి గచ్ఛత్యాయు స్తదపి న ముంచత్యాశావాయుః." ౧౨

అని శ్రీశంకరాచార్యులుగారును,

"జటిలో ముండీ లుంఛితకేశః కాషాయాంబరబహుకృతవేషః,
పశ్యన్నపి చ న పశ్యతి మూఢో హ్యుదరనిమిత్తో బహుకృతవేషః." ౨
"అంగం గళితం పలితం ముండం దశనవిహీనం జాతం తుండం,
వృద్ధో యాతి గృహీత్వా దండం తదపి న ముంచత్యాశాపిండం." 3

అని శంకరభగవత్పాదశిష్యులు హస్తామలకాచార్యులును స్పష్టపఱచిరి.

"భ్రాంతం దేశమనేకదుర్గవిషమం ప్రాప్తం న కించిత్ఫలం
త్యక్త్వా జాతికులాభిమానముచితం సేవా కృతా నిష్ఫలా,
భుక్తం మానవివర్జితం పరగృహేష్వాశంకయా కాకవ
త్తృష్ణే జృంభసి పాపకర్మనిరతే నాద్యాపి సంతుష్యసి." ౫
(వైరాగ్యశతకము.)

అని భర్తృహరియుఁ దేటపఱచెను. ఇన్ని వేషములు వేయుటకు స్వకీయజన్మలాభమునైనఁ బోఁగొట్టుకొనుటకు నాధారము దురాశయేకదా. దానిం దొలఁగించుకొనఁ బ్రయత్నించువారు తొలుత భగవంతు నారాధించుమార్గ మెఱుంగవలయు. దాని

మూలమునఁగాని యిట్టి దుర్గుణములు తొలంగవు. అందును దేవతాదూషణము సర్వానర్థమూలము కాన దాని మానినఁగాని దేవతానుగ్రహము కలుగదనుట నిక్కము.

"సాధువృత్తస్య దీనస్య త్వద్గతస్య గతాయుషః,
ప్రసాదః క్రియతాం దేవి భద్రే రాజ్ఞో విశేషతః.  ౨౦
శూన్యే న ఖలు సుశ్రోణి మయేదం సముదాహృతం,
కురు సాధు ప్రసాదం మే బాలే సహృదయా హ్యసి.  ౨౧
ప్రసీద దేవి రామో మే త్వద్దత్తం రాజ్యమవ్యయం,
లభతామసితాపాంగే యశః పరమవాప్నుహి."  ౨౨

అనునివి దశరథునివాక్యములు. కైకను బ్రసన్నురాలినిగాఁ జేయఁ బ్రయత్నించు రాజువాక్యము లివి. ఇందొక్కొక్క కారణము క్షమింపఁదగిన దనునర్థము నిచ్చును. "కైకా! మంచి నడవడికగలవాఁడను. రామవియోగము దుస్సహదుఃఖహేతువు గాన దాన బాధితుఁడను. నీయధీనమున నున్నాఁడను. ఆయుశ్శేష మించుకంతయే కలదు. నీవు భార్యవు. శుభమునే కోరుదానవు. కావున నిందుఁగల యేకారణముచేతనైన క్షమింపఁదగుదువు. ఇన్నికారణములు త్రోసివేసినను, రాజు నన్నకారణము ప్రధానముకాన దానిని బురస్కరించుకొనియైన నాయందు దయఁ గనఁబఱుపుమా" యని ప్రార్థించెను. సద్వర్తనమునకుఁ బూర్వకాలమున మనవా రెంతమర్యాద నొసంగిరో తేటపడును. రాజు ప్రధానకారణముగాఁ దొలుత దానినే తెలిపెను. దీనిచేఁ బాండిత్యము ప్రధానము కాదనియుఁ, జెప్పిన చొప్పున నడుచుకొనుటయే ప్రధానమనియుఁ దేటపడియెడిని.

"పరోపదేశే పాండిత్యం సర్వేషాం సుకరం నృణాం,

ధర్మే స్వయమనుష్ఠానం కస్యచిత్తు మహాత్మనః.''

అన్ననీతిశాస్త్రము పైయభిప్రాయమునే తెలుపుచున్నది.

''అజ్ఞేభ్యో గ్రంథినశ్శ్రేష్ఠా గ్రంథిభ్యో ధారిణో వరాః,
ధారిభ్యో జ్ఞానినశ్శ్రేష్ఠా జ్ఞానిభ్యో వ్యవసాయినః.'' ౧౦౩
వ్యవసాయినః అనుష్ఠాతారః, అనివ్యాఖ్యా. మను. ౧౨ అధ్యా.

అనుమనుస్మృతియుఁ బైనవ్రాసినభావమునే దృఢపఱచుచున్నది. కావున శాస్త్రమునేర్చుకొని దానిరీతి నడుచుకొనువారిమాట చెప్పనేల? శాస్త్రముమాత్రము చదివి దానిప్రకార మాచరింపనివారికంటెఁ బెద్దలవలన విన్నయట్లు లాచరించువారే యుత్తములగుదురు. కావుననే ప్రవర్తనము సాధువయ్యెనేని యుత్తమమని పూర్వమహర్షులయాశయము.

పదుగురుగలసభలో రేపే రామునిపట్టాభిషేకమని పలికితిని. నిర్జనస్థలమునఁ జెప్పియుండలేదు. భద్రే! కల్యాణీ! యని కైకను సంబోధించుచున్నవాఁడు. సహృదయా హ్యాసి=మంచి మనస్సుకలదానవని స్తుతించుచున్నవాఁడు. ఇందు దశరథుని భావమేమి? తానిచ్చియున్నవరముల నీయక తప్పించుకొనవలయునని కాదు. నిన్న నలువురిలోఁ జెప్పినమాటయు నీవరములవంటిదే యన్నమాట విని నిరాశురాలై యీమాట కంగీకరించునేమో యనియే రాజుభావము. అంతియకాని యసత్యమునకుఁ బాలుపడవలయునని కాదు. ఈయర్థ మెట్టు లూహింపవచ్చునని శంకనొందరాదు. ఈ క్రిందిభావము దీనిని సూచించుచున్నది. వరములకుగా రాజ్యమును దీసికొనుము. దయచేత రాముని కొసంగుము. దాన నీకీర్తి లోకముల వర్ధిల్లును. అనఁగా భావమేమి? కైక దుష్టురాలు గాదు. వరముల

నడిగి రాజ్యము గ్రహించి రామచంద్రునకే యిచ్చెను. భరతుని కన్న శ్యామమూర్తినే ప్రీతిపాత్రునిగా నెన్నినది. న్యాయదృష్టి కలది. అన్న విఖ్యాతి లోకమున వ్యాపింపఁగలదని తాఁజెప్పిన నంగీకరించు నేమో యనునాస రాజునకుఁగలదని యూహింప వచ్చును. దీనిచేత వరములనీయక తప్పించుకొనుభావమే రాజు నకు లేదని యెఱుంగవచ్చును. దీనింబట్టి మన మాలోచింపఁగా నాకాలమున సత్యమునఁగలయాదరణ మింతయని వర్ణింప నలవి కాదని తేలెడిని. ఎన్ని కష్టములు వచ్చినను దుదకుఁ బ్రాణములు పోయినను దామన్నమాట తప్పరాదన్నసద్భావ మాకాల మునఁ బ్రజలహృదయముల నాటుకొన్నదని స్పష్టముకదా! అట్టియభిప్రాయము మరల నెల్లరయుల్లముల నెలకొని యుల్ల సిల్లు కాల మెప్పుడగు నెంచునో తెలియఁజాలకున్నారము. ధర్మ మును గాపాడిన నది వారిని గాపాడును. దానిని వదలినవారి కాయుఃకీర్తి సుఖము లెట్లు కల్గును?

"ధర్మ ఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః,
తస్మాద్ధర్మో న హంతవ్యో మానో ధర్మో హతోఽవధీత్. ౧౫
వృషో హి భగవాన్ ధర్మస్తస్య యః కురుతే హ్యలం,
వృషలం తం విదుర్దేవాస్తస్మాద్ధర్మం న లోపయేత్. ౧౬
ఏక ఏవ సుహృద్ధర్మో నిధనేఽప్యనుయాతి యః,
శరీరేణ సమం నాశం సర్వమన్యద్ధిగచ్ఛతి." మను ౮ అధ్యా. ౧౭

అని స్మృతి యుపదేశించుచున్నది. కావున నెల్లరు ధర్మమును రక్షించినచోఁ దమ్ము రక్షించుకొన్నయట్లే యగును. దానిని గాపాడకయున్న స్వసంరక్షణమున నిష్టములేనివారే యగు దురు. పూర్వకాలమునకు నిప్పటికిఁగల భేద మిదియే యని యేర్ప

డుచున్నది. దీనివిశేషార్థ మేమని విచారింతము. దీని తరువాతి శ్లోకముం బరికింపుఁడు. అపు డావిశేషార్థము స్పష్టమగును.

"ప్రసీద దేవి రామో మే త్వద్దత్తం రాజ్యమవ్యయం,
లభతామసితాపాంగే యశః పరమవాప్నుహి. ౨౨
మమ రామస్య లోకస్య గురూణాం భరతస్య చ,
ప్రియమేతద్గురుశ్రోణి కురు చారుముఖేక్షణే." ౨౩

కైకా! నాయందనుగ్రహ మునుపుము. నీచే నీయఁబడి నట్టి అవ్యయమగురాజ్యమును రాముఁడు పొందుఁగాక. దాన నీవు నిరుపమానయశస్సు నొందుము. ఇపుడు నీవు పరబలమున నావలన గ్రహించినను రామునకే యీవలసియుండును. అది యవ్యయమగును. అనఁగా రాజ్యము నీకు దక్కునది కాదు. అది రామునకే దక్కును. నావలన రాజ్యము నీవు గ్రహించి నందున రాముఁ డడవులకుంబోవును. దాన దేవకార్యము సిద్ధించును. నీమూలమున నింతటిమహోపకారము కలిగినందున దేవతలు నిన్ను గౌరవింతురు. దానఁ ద్రిలోకములయందు నీయశస్సు వ్యాపించును. ఇయ్యది నాకును రామునకు లోకమునకు గురువర్యులగువసిష్ఠాదిమునులకు భరతునకు మిక్కిలి ప్రియమగును. అనునది విశేషార్థము. నాకును బ్రియమనఁగా నాయుశ్శేషము రవంతగలిగిన నాకు శాపఫలానుభవము తప్పదు గాన రామచంద్రునినే తలంచుచు ముక్తిపదమున కేగుదును. అవ్యయానందము కలుగును. అదియే నాకుఁ బ్రియమగునది. ఈయర్థము దశరథుఁడు తెలిసిచెప్పినదే యగునా యనవచ్చును. దైవికముగా నాతనిమాటలకూర్పువలన నీయర్థము తోఁచెడు ననవచ్చును. భరతునకుఁ బ్రియ మెట్లగును? అనునదియే

ప్రశ్నము. ఏతన్మూలమున భరతుఁడు రామపాదారవిందభజనాసక్తుఁడన్న యశస్సు శాశ్వతముగా నెలకొనఁగలదు. కొలఁది కాలము దుఃఖము భ్రాతృవియోగమునఁ గలిగినను దరువాత సుస్థిరయశస్సు కలుగుటయే భరతున కానందమని గ్రహింపవలయు. మానవు లెన్ని ప్రయత్నములు చేసినను యశస్సుంగోరియే కదా. అట్టియశస్సు నీమూలమున శ్రమములేక లభించుచుండఁగా నద్దానిం గోరువారుండుట యరుదా.

నిక్కముగా నీయర్థము చెప్ప ననువగునా యని కొందఱు ప్రశ్నింపవచ్చును. "భావిభాగ్యప్రచోదనాత్" అన్న ప్రాచీనసూక్తి ననుసరించి భావములు మార్పునొందును. సత్యముగా నివియన్నియు సాగినవికదా. కాన వాగ్ధోరణింబట్టి యాలోచింపఁగా నీయర్థము సుసంగతమనియే తోఁచును. శ్రీరామవనవాసముననే దశరథాదులకు నిరుపమానవిఖ్యాతి కల్గినది. లేకయున్న రామచరిత్ర మెవరు పఠింతురు? వనగమనమే త్రిలోకములకు మహోపకార మొనరించినది. శ్రీరామచంద్రు నవతారఫలము నదియే కాక మఱి యేమున్నది? కావున నిట్టి యర్థము మన మాలోచించుట సుసంగతమే.

"తతస్స రాజా పునరేవ మూర్ఛితః ప్రియామదుష్టాం ప్రతికూలభాషిణీం,
సమీక్ష్య పుత్రస్య వివాసనం ప్రతి క్షితౌ విసంజ్ఞో నిపపాత దుఃఖితః."

అను నీమూలము పైనవ్రాసినయర్థమును దృఢపఱచుచున్నది. ఎట్లన "ప్రియామదుష్టామ్" సర్వదా ప్రియురాలును బతివ్రతయు నైనది. ప్రతికూలభాషిణీం. ఆకాలమున విధివశమున విరుద్ధముగా మాటలాడినది. ఈయర్థము సరియేనా అందులేమో "తత్కాలే దైవాత్ప్రతికూలభాషిణీమ్" అని మహే

శ్వరతీర్థులు వ్రాసిరి. అనఁగా భగవతి ప్రేరేపింపఁగా లోకోప కారములను రామునిమూలమునఁ జేయింపఁబూని పరవశయై పతికి మాటాడెననికదా యర్థము. ప్రతికూలభాషిణి యగునది అదుష్టురాలగునా? ఈరెండుపదములలో నొకఁడు సార్థకము కావలసివచ్చును. అధ్యాత్మరామాయణమునఁగల

"రామాభిషేకవిఘ్నార్థం యతస్వ బ్రహ్మవాక్యతః."

అనుభావము సార్థకము కదా. ఈభావము మనస్సున నుంచుకొనియే వాల్మీకిమహర్షి "ప్రియామదుష్టాం ప్రతికూలభాషిణీమ్" అని వచించెను. విధివశమున నెట్టివారును మార్పు నొందుదురనుట దీనిచే స్పష్టమయ్యెను. జగజ్జనని యగుసీతాదేవి సర్వకారణభూతురాలగు మహాప్రకృతిగాన నేరీతిగాఁ దలంచునో యట్లే కైక పట్టుపట్టెను. దశరథుఁ డీవిషయము నెఱుంగక దుఃఖసాగరమున మునింగెను. ఇట్టిఘట్టముల నిట్టి యర్థవిశేషములు గ్రహించినఁగాని సీతారాములు ప్రకృతి పూరుషులని తేటపడదు. అది విస్పష్టమైనఁగాని భక్తి తదారాధనతత్పరము కాదు. అదియైనఁగాని తరించుమార్గము లేదు. కేవల మతాభిమానమున నేవో యర్థములు చెప్పఁబూనక వానికంటె వీఁడెక్కుఁడు. వీనికంటె వాఁడెక్కుఁడు. అని యల్పబుద్ధిప్రలాపములఁ గాలముపుచ్చక సర్వరూపముల సర్వనామముల సర్వస్థలముల వెలయుపరమాత్మ శ్రీరామరూపమున జగత్కల్యాణకరధర్మమును నిలుపఁబూని యవతరించెనని గ్రహించి యభేదబుద్ధిచేత నారాధించి కృతకృత్యులము కావలయును. వేషధారులమాటలఁ జెవియొగ్గి యాలకించి చెడరాదు. ఇట్టిసద్భావములఁ దెలుపుఘట్టమునఁ దెనిఁగించినవా

రెంతమాత్ర మందలివిశేషముల గ్రహించిరో నెఱుఁగము. మూలమును బైనఁ బఠించితిరికదా.

నంత నజ్జనపతి యంతదాఁకఁ దన
స్వాంతమురీతి మెలంగుచుం బ్రియాం
గనయుఁ బతివ్రతానియతిఁ
గాంచియు నుండినకైక యప్డు రా
ముని వనికంపు మంచుఁ గడు
మూర్ఖతచే వచియింపఁ జూచుచున్

క. చిరపరిచితమగు ప్రియమునఁ
దరుణీమణి ధిక్కరింపఁ దనప్రియసుతుని
స్మరుణన్ విడువన్నేరక
ధరణింబడె మూర్ఛ మరలఁ దనుముంచుటచేన్.

(ఆంధ్ర శ్రీమద్రామాయణము.)

ఆ. ప్రియ నదుష్టభావఁ బెంకెను బ్రతికూల
వచనఁ జూచి సుతునివననివాస
మందు బుద్ధినిలిపి యన నేర కేమియు
శోకమునను బడియె శోష మొంది.

(వావిలికొలనురామాయణము.)

విశేషించి వ్రాయనక్కఱలేదు. సహృదయులు రస మిందు గ్రహింపఁగలరు. విమర్శకులపొగడ్తలిం దెంతమాత్రము సఫలములో రసికులే యూహింపఁగలరు. ఇట్టు లీసర్గము మన కనేక నీతుల బోధించుచున్నది. కావున దీనింబఠించి యందలిసార మెఱింగి దైవ మెంతబలవత్తరమో యెఱింగి మెలంగుట శ్రేయము. తరువాతికథఁ బఠింతము.

### దశరథునిఁ జూడ సుమంత్రుఁడు వచ్చుట.

* శ్రీరాము నడవులకుఁ బంపుమన్నందులకుఁ బెనుశోకమంది యవయవములు వివశములుకాఁగా నేలంబడియున్న రాజుం జూచి యాపాపమతి రాజా! నాకు వరమిచ్చి భూమిం బడియున్న వాఁడవే. ఏల? అనృతముపలుకనినియతి నుండుటయే న్యాయసమ్మతము. ధర్మజ్ఞులగుమునులు సత్యమే పరమధర్మమని పలుకుదురు గాదే. నేను సత్యరూపధర్మము నాశ్రయించియే వర మనుగ్రహింపఁ బ్రోత్సహించితినిగాని యించుకయు నధర్మము చేయ లేదు. మహీపాలకా! పూర్వము శైబ్యుఁడనుభూమిపతి మాటయిచ్చి పక్షిమాత్రమగు డేగకు శరీరమును గోసి యొసంగి సద్గతినొందెను. అలర్కుఁడు వేదవేత్తయగు నొక విప్రుఁడు తననేత్రముల నిమ్మని యర్థింపఁగా రవంతయు విచారింపక లాగియిచ్చెను. సాగరుఁడు చెలియలికట్టను సులభముగా దాఁటఁగలిగియు దానిమీఱనని చేసినసత్యమురీతిగా సంకల్పించి నంతకాల ముప్పొంగినను గూడ దానిని మించిపోవకయున్నాఁడే. సత్యమే యేకరూపమగుపరబ్రహ్మము. సత్యమునందే ధర్మము సంపూర్ణముగా సుప్రతిష్ఠితమై యున్నది. సత్యమే ధర్మమునకుఁ బరమావధి. శాశ్వతములగుశ్రుతులు సత్యమునే ప్రధానమని బోధించుచున్నవి. అట్టిసత్యముచేతనే ముక్తి లభించుచున్నది. కావున రాజా! ధర్మమునందు నీకు స్థిరముగా బుద్ధి నిలుచునేని సత్యము ననుసరింపుము. సత్యమును మించఁజాలు ధర్మము లేదుకదా. నావాంఛించినవరము ఫలింపఁజేయుదువు గాక.

---

*ఇయ్యది పదునాల్గవ సర్గమునఁ గలదు. అధ్యాత్మరామాయణ మిందుఁ గలిసియుండును.

మహీపాలకా! యాచించువారికి లేదనక వరము లొసంగు ప్రోడవు. ఉత్తముఁ డనంబడువాఁడవు కదా. ధర్మపాలనము, దానియభివృద్ధి యనువానికొఱకుఁ, బ్రేయసినగు నేను బ్రోత్సహించుటచే నీకుమారుని శ్రీరాముని వనములకుఁ బనుపుము. త్రివారము లీమాటఁ జెప్పుచున్నాను. పూజ్యమతి నీవు ప్రతిన తప్పరాదు సుమీ. నాకుఁ జెప్పినమాట సార్థకముగా నొనరింపవేని, రామమూర్తిని వనములకుఁ బంపకపోవుదువేని, నన్నిట్లు గారవింపక త్రోసిపుచ్చుదువేని, నేనేల బ్రదుకవలయును? నీవు చూచుచుండఁగా నిందే ప్రాణత్యాగ మొనరింతును.

ఈవిధముగాఁ గైక సంశయమనునది యించుకంతయు లేక మఱిమఱి యడుగఁగాఁ బూర్వము బలిచక్రవర్తి యింద్రానుజుఁడగు వామనమూర్తి తన్నుఁ గట్టివేయఁగా దానిని విడిపించుకొనఁజాలనిచందమున మునుపు తాను గైకకు మాట చెప్పియున్నవాఁడు కనుక సత్యపాశములు తన్ను బంధింపఁగా వానిని వదలించుకొనఁజాలకుండెను. మఱియుఁ బత్నికిచ్చిన వరము లేదనుటకుంగాని, ప్రియకుమారు నడవులకుఁ బంపుటకుఁగాని వలనుపడమి బండికాఁడికిఁ జక్రమునకు నడుమఁ జిక్కినవృషభమువలెఁ జిత్తము త్తలంపడఁగా మోము కాంతిహీనము కాఁగా నోకించుకనే పూరకయుండి పట్టరానిదుఃఖముచే దృష్టి చెదఱఁగా నంధునిబోలి యేమియుఁ గనఁబడకపోవఁగాఁ దుదకు నెట్లో ధైర్యము తెచ్చుకొని మనస్సు దుఃఖసాగరమున మునుఁగకయుండ నిలిపి కైకం గాంచి పాపచిత్తురాలా! అగ్నిసాక్షికముగా విధిమంతముగాఁ జేసికొన్నపాణిగ్రహణమును వదలితిని. ఇంక నీవు నాకు భార్యవు కావు. నేను భర్తనుగాను.

భరతునింగూడ నీతోఁ గూడ వదలితిని. రాత్రి ముగిసినది. సూర్యోదయింపఁగా గురువులు లోనగువారు వచ్చి రామాభిషేకసంభారములు సిద్ధపడినవి. శ్రీరాము నభిషేకింపుమా యని నన్నుఁ ద్వరపెట్టుదురు. ఈమాట తప్పదు. చేసినప్రయత్నము భగ్నమగునేని నే జీవింపను. కనుక నాపదార్థములచే రాముని చేత నాకుఁ బారలౌకికక్రియలు చేయింపవలసి యుండును. దుష్టాత్మురాలా! అమంగళాచారసంపన్నురాలవుగావున రామాభిషేకమునకు నడ్డపడుదువు. అది నాకనిష్టము. కాఁబట్టి నీవు నీకుమారుఁడును నాకు నుదకక్రియలు చేయరాదు. సర్వథా చేయరాదు. నిండుసభలో శ్రీరాముని యువరాజుగా నభిషేకింతునని చెప్పఁగా జనులెల్ల రానంద మతిశయించుచుండఁ జూచిననేత్రములతో నిపుడు శ్రీరాముఁ డడవులకుఁ బోవుచున్న దుర్వార్త నాలకించి యుత్సాహము నశింప నానంద మంతరింప దుఃఖావేశమునఁ దలలు వంచియుండఁగాఁ జూడఁజాలను.

ఈరీతి రాజు భార్యకుం జెప్పుచుండఁగాఁ జంద్రునితోను నక్షత్రములతోను బ్రకాశించుచున్నయారాత్రియుఁ గడచెను. ఆరాత్రి విరామములేక శ్రీరామప్రస్తావముతో సాగినందునఁ బరమపవిత్రమయ్యెను. అంతట దుష్టాచారవతియగునాకైక నిర్భరరోషమునఁ బరవశయైయుండుటంజేసి మండిపడుచు సమయోచితముగా మాటలాడుశక్తికల దాట రాజుం గాంచి మరలఁ గఠినముగా నిట్లు చెప్పెను. భూపాలా! మహావ్యాధి దేహమంతట వ్యాపించి బాధించునట్లున్న యిట్టిమాట చెప్పుచున్నావే. ఏల? శ్రమములేక రాము నిటకుఁ బిలుపింపందగుదువు. నాకుమారునకు రాజ్య మిచ్చి రాము నడవులఁ జరియింపఁ

జేసి శత్రురహితనుగా నన్నుం గావించి నీప్రతిజ్ఞను బరిపాలించినయెడల నీవు కృతకృత్యుఁడవగుదువు. అని మోమోటమిలేక పలికెను.

వాడియగుమునికోలవ్రేటులచే నొచ్చియున్నయాజానేయమువలెఁ బలుసారులు పలుకుచున్నయాకైకమాటలకు మిక్కిలి నొప్పిపడి దశరథుఁ డిట్లు పలికెను. ఓసీ! దుర్బుద్ధీ! నేనిపుడు సత్యపాశబద్ధుఁడను. నావివేకము నశించినది. ధర్మాత్ముఁడగు నాప్రియకుమారు శ్రీరాముఁ జూడఁగోరెద ననిపలికి యూరకుండెను. తెల్లవాఱె సూర్యుఁ డుదయించెను. పట్టాభిషేకనిమిత్తము నిశ్చయించియున్న పుష్యనక్షత్రయోగసుముహూర్తము సమీపించెను. గుణవద్వరిష్ఠుఁడగు వసిష్ఠముని శిష్యగణములు సేవించుచుండఁగాఁ బురబహిర్భాగముననున్న సరయూనదికింబోయి స్నానముచేసి సత్వరముగా నభిషేకవస్తువులం గైకొని పురమును బ్రవేశించెను. అమ్మునివరుఁడు పురిఁ జొచ్చునవసరమునందు జను లానందపరవశులై మార్గములయందు జలము చల్లి పరిశుద్ధములుగాఁ జేయించి యుంచిరి. ధ్వజోత్తమములు విలసిల్లుచుండెను. ఎల్లతావులఁ బూవులు చల్లఁబడి యందముగా నుండెను. పూలహారములు వ్రేలుచు నెంతయో శృంగారము నానగరమునకుఁ గూర్చుచుండెను. జను లానందపారవశ్యమునఁ జెలరేఁగుచుండిరి. ఎన్ని వేడుకలు గలవో యందు నపు డన్నియు నుండెను. ఆముని యెల్లభంగుల నమరావతింబోలు నానగరమును జొచ్చి యంతఃపురమునకుం బోయెను.

అందు శుభపక్షినినాదములు చెలరేఁగుచుండెను. పౌర జానపదభూసురప్రముఖుల నాపురము నిండియుండెను. ఋత్వి క్కులు సదస్యులు నిండియుండిరి. వసిష్ఠముని యాయంతఃపురము చెంతకుంబోయి యందుఁ గ్రిక్కిరిసియున్న పౌరజానపదులం జూచుచు ద్వారముంజొచ్చెను. రాజునకు మంత్రియు సార థియు నగుసుమంత్రుఁ డభిషేకమహోత్సవముకొఱకు నలం కృతుఁడై లోనికింబోయియుండి యపుడే వెడలివచ్చి ద్వారము కడ నుండఁగా వసిష్ఠముని చూచి యతని కిట్లనియె. మంత్రివరా! నారాక రాజశేఖరునకు నెఱిఁగింపుము. అభిషేకమునిమిత్తము గంగాజలసంభృతస్వర్ణఘటములు, సముద్రోదకపూరితసువర్ణ కలశములు నివిగో సిద్ధముగ నున్నవి. మేఁడిమ్రానిదగు రాజ పీఠము సిద్ధమైనది. నవధాన్యములు బహువిధపరిమళవస్తువులు నవరత్నములు దెప్పించితిని. తేనె పెరుఁగు లోనగునివి తెప్పించి తిని. అందగత్తెలగుకన్యక లెనమండుగురు మేటిదంతావళము సిద్ధముగనున్నవి నాల్గుతురంగంబులం బూన్చినరథవర్యము, ఖడ్గము, ధనుర్వరము, మోయఁదగువారితోడఁ బల్లకియు, శ్వేతచ్ఛత్రచామరాదులు సంసిద్ధములు. కనకకలశము, శ్వేత వృషభములును, నిండుప్రాయమున నలరునుత్తమాశ్వములు సంసిద్ధములై యున్నవి. సింహాసనవ్యాఘ్రచర్మములు నగ్ని హోత్రము నాయత్తపఱుపఁబడినవి. సమస్తవాద్యవిశేషము లొప్పుచున్నవి. వేశ్యలు సర్వాలంకృతుల నలరు నితరస్త్రీలు రప్పింపఁబడిరి. ఆచార్యులు బ్రాహ్మణులు వచ్చియున్నవారు. గోవులు, మఱియుఁ బవిత్రమృగములు, పక్షులు తెప్పింపఁబడి నవి. పౌరజానపదప్రవరులు, వణిజులు, నధ్యాపకులు తమతమ

వీథులం గలవారలంగూడి వచ్చియున్నారు. ప్రియంవదులై మూఁచే నాహూతులై వచ్చియున్న పెద్దలు రాజులును శ్రీరాము నభిషేకోత్సవమును జూడ నిరీక్షించియున్న వారు. మంగళకర మగు నీపగటియందుఁ బుష్యనక్షత్రమున రామచంద్రుఁడు రాజ్యాభిషిక్తుఁడగునట్లుచేయ మహారాజును వేగిరింపుము.

అని వసిష్ఠమహాముని పలుకఁగా విని సుమంత్రుఁడు రాజశేఖరుని వినుతించుచు నంతఃపురమును జొచ్చెను. అంతకు మున్నే దశరథుఁడు సుమంత్రుఁడు వచ్చిన నాలసింపక రానిండని ద్వారపాలకులకుం దెల్పియున్నాఁడు కాన సుమంత్రుఁడు లోపలికిఁబోవుచుండ వారెవ్వరు నడ్డగింపఁజాలరైరి. రాజునకు మేలు కోరు నాద్వారపాలకులు సుమంత్రుఁడు లోనికరుగ నానందించిరి. సుమంత్రుఁ డంత రాజుచెంతకుంబోయి యాతని యప్పటి దురవస్థ నెఱుంగనివాఁడౌట సంతోషజనకములగువాక్కుల రాజు వినుతింప నెంచి తత్కాలోచితముగా నంజలింబట్టి యిట్లు స్తుతించెను. తేజోవంతుఁడగుసాగరుఁడు నిండుచందురుని యుద యమున నెట్టులుప్పొంగునో మహనీయుఁడవగు నీవు నట్లే యానందింపుము. ఇపుడే మాతలి దేవరాజు నుతించెను. ఆతఁడు సర్వదా నవవీరుల జయించెను. ఆలాటి కాలమిది. నేనును మాతలివలె నిన్నుఁ బొగడుచు మేలుకొలుపుదును. నీవు కూడ దేవరాజువలె శత్రువుల నోడింతువు. అంగషట్కముతోఁ గూడినవేదములు సర్వనాథుఁడగుబ్రహ్మదేవునకు సృష్టినిమిత్త ములగు నర్థముల బోధించువిధమున నేనుగూడఁ జేయఁదగు వానిం జేయుటకై నిన్ను మేలుకొలుపుచున్నాఁడను. రవి చంద్రులు విశ్వమును ధరించియుండుభూదేవిని శుభాత్మురాలి

నుదయాస్తమయముల మేలుకొలుపురీతి నిపుడు నే నిన్ను మేలుకొలుపుచున్నాఁడను. మహారాజా! అభిషేకమహోత్సవార్థము సర్వజననేత్రోత్సవముగా నలంకృతుఁడవై సహజసుందరమగు నీశరీరమును మఱింతగాఁ బ్రకాశించునట్లు మేరువునుండి రవి యుదయించునట్లు లెమ్ము. కకుత్థ్సకులదీపకా! సూర్యుఁడు, చంద్రుఁడు, శ్రీవిష్ణువు, పార్వతీరమణుఁడు, నలుమోముల వేలుపు, కుబేరవరుణులు, నగ్ని దేవుఁడు, శతమఖుఁడు, విజయము నీకుం గూర్తురుగాక. శ్రీరామచంద్రు నభిషేకింప నుపయుక్తముగానఁ బవిత్రమగు నీ రేయియుఁ గడచెను. నీవొనరింపఁదగిన కార్యములన్నియు మేము సిద్ధము చేసియున్నాము. రాజసింహ! మేల్కాని తరువాతికార్యముల నిర్వహింపుము అభిషేకసంభారములు సిద్ధమైనవి. మహర్షి వసిష్ఠుఁడు. పౌరులు జానపదులు వర్తకులు లోనగువారు చేతులు జోడించుకొని తన్నుఁ గొలువ బ్రాహ్మణులంగూడి నీరాకకై వేచియున్న వాఁడు. కావున శ్రీరామాభిషేకము త్వరగా సాగునట్టు లాజ్ఞాపింపుము. పాలకుఁడు లేని పశువులచందమున, అధిపతి లేనిసేనలరీతి, శశాంకుఁడు లేనిరాత్రికరణి, వృషభము లేనిగోవుపగిది. రాజు దర్శనమీయని రాజ్యము మర్యాదలేక నశించును. కాన సత్వరమ ప్రజలకు దర్శన మొసంగుము.

ఈకరణి సుమంత్రుఁడు మనస్సునకు సమ్మతమగునట్లు సాంత్వనోక్తుల మేలుకొలుపుట జయప్రదమాట వచింపఁగా నాపలుకులు చెవులంబడినంతనే రాజునకు శోకము నిర్భరమయ్యెను. అంతటఁ బ్రియకుమారునకుఁ గలుగనున్న దురవస్థకు సంతోషము నశించి ధర్మజ్ఞుఁడు కావున సూనృతము మీఱఁ

జాలక పొక్కుచు శోకాతిశయమున నెఱ్ఱగానున్న కన్నులతో నాసారథివంకఁ దలయెత్తి చూచి యో సుమంత్రా! ఇప్పటికే నామర్మములు ఛేదింపఁబడినవి. ఈస్తుతివాక్కులచే నింకను వానిని ఛేదించుచున్నవాఁడవు సుమీ. అని యూరకుండెను. సారథి వినినంతనే జాలిగలిగించు నావాక్కుల విని దీనుఁడై యున్నభూపాలుం గాంచి భీతిల్లి యంజలింబట్టి కొంతదూరముగాఁ దొలఁగి యుండెను. దశరథుఁడు దుఃఖావేశమునఁ దానుగా మాటలాడఁజాలక యుండఁగాఁ జక్కనియాలోచన మెఱింగినకైక సుమంత్రునితో సారథీ! రాజు రామాభిషేక మహోత్సవోత్సాహముచే రాత్రియంతయు మేల్కొనియుండి యాయాసపడి యిపుడు నిద్రపోవుచున్నాఁడు. కాన నీవిపుడే పోయి యశోవిశాలుఁడగు రామునిఁ దోడ్కొనిరమ్ము. నీకు భద్రమగుంగాక. ఈవిషయమై యాలోచింపక పొమ్ము. అనఁగానే యాసుమంత్రుఁడు రాజు పలుకులచేతనే యేమో యనర్థముగలిగినదే యని సందేహించుచున్నవాఁడు కావున నాకైకపలుకులు విని విశేష మేమియు లేదు. ఇఁక శుభమే. యని మనంబున నూహించుచు సంతసించుచు రాజుననుమతినొందిరయే దేవి యీరీతిఁ బలికెనని యెంచుచుఁ బోయెను. పోవుచుఁ గైక తన్ను రాముని దోడ్కొనిరమ్మని పురికొలిపినందులకు మనస్సున నిప్పటికిఁ దెలిసెను. శ్రీరాముఁడు పట్టాభిషేకమునిమిత్తమే రాఁగలఁడని యెంచుచు శ్రీరాముని దర్శింపఁగోరి పురమధ్యభాగమున నున్నందున సాగరాంతరమందున్న హ్రదమురీతి నలరారు నంతఃపురమునుండి వెడలి చని జనులునిండియున్నదాని ద్వారమును గాంచి యచటఁజేరి ముందున్న రాజులను బరికించి కానుకలుగొని గుంపులుగా నున్నజనులను గాంచెను.

మహామతులారా! ఈభాగమునఁ గొన్ని భాగములు విమర్శింపఁదగినవి కలవు. వానినుండి నేర్చుకొనఁదగిననీతులు గలవు. అధ్యాత్మరామాయణమున సుమంత్రుఁడరిగి రాజు చింతఁ బూనినట్లుండఁగాఁ గైక నడిగెననియు, నామె చెప్పినకారణము తృప్తికరముగా లేనందున రాజాజ్ఞ లేకయుండ నే నెట్లు రాముని దోడ్కొనివత్తునని యడిగెననియు, రాజు రాముని జూడఁ గోరుచున్నాఁడనని పలికెననియు, దాని విని యతఁ డరిగెననియు నున్నది. ఇదియే భేదము.

"తమాహ కైకయీ రాజా రాత్రౌ నిద్రాం న లబ్ధవాన్,
రామ రామేతి రామేతి రామమేవానుచింతయన్.
ప్రజాగరేణ వై రాజా హ్యాస్వస్థ ఇవ లక్ష్యతే,
రామమానయ శీఘ్రం త్వం రాజా ద్రష్టుమిహేచ్ఛతి,

సుమంత్రః—

అశ్రుత్వా రాజవచనం కథం గచ్ఛామి భామిని,
తచ్ఛ్రుత్వా మంత్రిణో వాక్యం రాజా మంత్రిణమబ్రవీత్.
సుమంత్ర రామం ద్రక్ష్యామి శీఘ్రమానయ సుందరమ్."

(అధ్యాత్మరామాయణము 3 సర్గము.)

ఈపాటిభేదము పాటింపరాదనియుఁ గథాసారమునకు దాన బాధలేదనియుఁ బెద్ద లెఱుంగుదురు.

"పాపం కృత్వైవ కిమిదం మమ సంశ్రుత్య సంశ్రవం,
శేషే క్షితితలే సన్నస్థిత్యాం స్థాతుం త్వమర్హసి. 2
ఆహుస్సత్యం హి పరమం ధర్మం ధర్మవిదో జనాః,
సత్యమాశ్రిత్య హి మయా త్వం చ ధర్మం ప్రచోదితః." 3

అని మూలము. కైక దశరథున కిందు సత్యమును దెలుపుచు దాని వదలకుమని బోధించుచున్నది. శ్రీరామచంద్రుఁడు సత్య నిరతుఁడు. లోకమునకుఁ దాను సత్యపద్ధతికి నుదాహరణ భూతుఁడు. ఏల? సత్యమే భగవత్స్వరూపము. సత్యముననే ప్రపంచము నిలిచియున్నది. సత్యముగలచోట భగవంతుఁడు నివసించును. రామమూర్తి పరమాత్మ. ఆతఁడుండుచోట సత్యమునకు లోపము రారాదు. కావున నీవు సత్యమనేమర్యాద యందు నిలువఁబడుమా యని తెలిపెను. "యథా రాజా తథా ప్రజాః" అన్నయట్లు రాజే యసత్య మాడినఁ బ్రజలాడక యుండరు. వారికి నసత్యము నేర్పినవాఁడు రాజగును. కావున నెన్నికష్టములు గలిగినను రాజు సూనృతము మానరాదు. లోకమున నీకీర్తి శాశ్వతము కావలయును. కనుక నామూలమున నీవు యశస్సు నార్జింపుమని దేవి హెచ్చరించుచున్నది. భార్య భర్తకు నీతిని దెలుపవచ్చునా యని కొందఱందురు. తెలుపవచ్చునని స్మృతి బోధించుచున్నది. "అంత్యాదపి పరం ధర్మమ్" అని నీతి బోధించుటకుఁ బెద్ద యని యెన్నవక్కఱలేదు. "బాలాదపి సుభాషితం" అని స్మృతివాక్యము కలదు కదా. ఈయర్థమే రామాయణము తెలిపెడిని.

ధర్మజ్ఞులగుమహాత్ములు సత్యమును బరమధర్మమని చెప్పుదురు. ధర్మమనఁగా నెట్టిది? అని విచారింతము. "ధరతి లోకానితి ధర్మః" అనువ్యుత్పత్తిప్రకారము ధర్మమే భగవత్స్వరూపమని తేలెడిని.

"ఏకఏవ సుహృద్ధర్మో నిధనేఽప్యనుయాతి యః,
శరీరేణ సమం నాశం సర్వమన్యత్తు గచ్ఛతి."

(అని హితోపదేశము.)

ఈమతమునందు శుభాదృష్టము ధర్మశబ్దమున కర్థము.

"శ్రద్ధా కామం చ శ్రీర్దర్పం నియమం ధృతిరాత్మజం,
సన్తోషం చ తథా తుష్టిర్లోభం పుష్టిరసూయత.
మేధా శ్రుతం క్రియా దండం నయం వినయమేవ చ,
బోధం బుద్ధిస్తథా లజ్జా వినయం వపురాత్మజం.
వ్యవసాయం ప్రజజ్ఞే వై క్షేమం శాంతిరసూయత,
సుఖం సిద్ధిర్యశః కీర్తిరిత్యేతే ధర్మసూనవః." (పురాణవచనము.)

ధర్మోత్పత్తి వరాహాపురాణమున నిట్లు చెప్పఁబడినది.

"అథోత్పత్తిం ప్రవక్ష్యామి ధర్మస్య మహాత్మో నృప,
మాహాత్మ్యం చ తిథిం చైవ తన్నిబోధ నరాధిప.
సర్వం బ్రహ్మోవ్యయః శుద్ధపరాదపరసంజ్ఞితః,
స సిసృక్షుః ప్రజాస్త్వాదౌ పాలనం చ వ్యచింతయత్.
తస్య చింతయతస్త్వంగాద్దక్షిణాచ్ఛ్వేతకుండలః,
ప్రాదుర్బభూవ పురుషశ్శ్వేతమాల్యానులేపనః.
తం దృష్ట్వోవాచ భగవాంశ్చతుష్పాత్స్యత్కృతే యుగే,
త్రేతాయాం త్రిపదశ్చాసౌ ద్విపదో ద్వాపరేఽభవత్,
కలావేకేన పాదేన ప్రజాః పాలయతే ప్రభుః.
షడ్దేహో బ్రాహ్మణానాం స త్రిధా క్షత్రే వ్యవస్థితః,
త్రిధా విశ్యేకథా శూద్రే స్థితస్సర్వగతః ప్రభుః.
గుణద్రవ్యక్రియాజాతిచతుష్పాదః ప్రకీర్తితః,
త్రిశృంగోఽసౌ స్మృతో వేదే ససంహితపదక్రమః.
తథా ఆద్యంతఓంకార ద్విశిరాస్సప్తహస్తవాన్,
ఉదాత్తాదిత్రిభిర్బద్ధ ఏవం ధర్మో వ్యవస్థితః.

బ్రహ్మోవాచ—

అద్యప్రభృతి తే ధర్మ! తిథిరస్తు త్రయోదశీ,

యస్తాముపోష్య పురుషో భవంతం సముపార్చయేత్,
కృత్వా పాపసమాచారం తస్మాన్ముంచతి మానవః."

బ్రహ్మాండపురాణమునందు ౨౭ అధ్యాయమునందు.

"ధర్మో నారాయణో నామ వ్యాసస్తు భవితా యదా,
తదాప్యహం భవిష్యామి భవిష్యామి మహామునిః,
వాలఖిల్యాశ్రమే పుణ్యేపర్వతే గంధమాదనే,
తత్రాపి మమ తే పుత్రా భవిష్యంతి తపోధనాః,
సుధామా కశ్యపశ్చైవ కనిష్ఠావిరజాస్తథా,
మమ యోగబలోపేతా విమనా హ్యూర్ధ్వరేతసః,
ప్రాప్య మాహేశ్వరం తేజో రుద్రలోకాయ సంస్థితాః."

ధర్మలక్షణము పద్మపురాణోత్తరఖండమునందుఁ గలదు.

"పాత్రే దానం మతిః కృష్ణే మాతాపిత్రోశ్చ పూజనం,
శ్రద్ధాబలిర్గవాంగ్రాసః షడ్విధం ధర్మలక్షణం."

అందే భూమిఖండమునందు ధర్మాంగములు చెప్పఁబడినవి.

"బ్రహ్మచర్యేణ సత్యేన తపసా చ ప్రవర్తతే,
దానేన నియమేనాపి క్షమా శౌచేన వల్లభ,
అహింసయా సుశాంత్యా చ అస్తేయేనాపి వర్తతే,
ఏతైర్దశభిరంగైస్తు ధర్మమేవ ప్రసూచయేత్."

ధర్మమూల మేది యనునది మత్స్యపురాణమునం గలదు.

"అద్రోహశ్చాప్యలోభశ్చ దమో భూతదయాతపః,
బ్రహ్మచర్యం తతస్సత్యమనుక్రోశః క్షమా ధృతిః,
సనాతనస్య ధర్మస్య మూలమేతద్దురాసదం."

కలియుగమునఁ బదివేలయేండ్లు నిండఁగా ధర్మాంగములన్నియు భగవంతునికడం జేరును. ఈవిషయము బ్రహ్మవైవర్తపురాణమునఁ బ్రకృతిఖండమునఁ గలదు.

"సాలగ్రామో హరేర్మూర్తిర్జగన్నాథశ్చ భారతం,
కలేర్దశసహస్రాంతే యయౌ త్యక్త్వా హరేః పదం.
సత్వం చ ధర్మం సత్యం చ వేదాశ్చ గ్రామదేవతాః,
వ్రతం తపశ్చానశనం యయుస్తైస్సార్ధమేవ చ."

ధర్మమునకు స్థానములు వామనపురాణమునందుఁ గలవు.

"యత్ర స్థానం తవాధారో వదామి శ్రూయతాం విభో,
వైష్ణవేషు చ సర్వేషు యతిషు బ్రహ్మచారిషు,
పతివ్రతాసు ప్రాజ్ఞేషు వానప్రస్థేషు భిక్షుషు.
నృపేషు ధర్మశీలేషు సత్సు సద్వైశ్యజాతిషు,
ద్విజసేవిషు శూద్రేషు సత్సంసర్గస్థితేషు చ.
ఏషు త్వం సతతం పూర్ణో ధర్మరాజ! విరాజసే,
యుగే యుగే తవాధారా ఏతే పుణ్యతమా జనాః."

ఇంకను వ్రాయఁబూనిన స్కాందపురాణమంత యగును. భగవంతుఁడే యుగానురూపముగా ధర్మరూపమున వెలయుననియు, నట్టిధర్మస్థానము లివియనియు, వాని నారాధింపఁదగుననియు, నందు సత్యము ప్రధానమనియు దీనిసారము. "వైష్ణవేషు చ సర్వేషు" అనుచోట నిలువుగా నామమను గుఱుతు పెట్టువారు కారనియు, విష్ణుభక్తు లేజాతియందున్నను వారియందు ధర్మము నిలుచుననియు భావము. ఇందు శివభక్తులకుఁ జోటు లేదే యని కొందఱు శంకింపవచ్చు. విష్ణువనఁగా సర్వవ్యాపకుఁ

డగు భగవంతుఁడేకాని వైకుంఠమున కధిపతియయి త్రిమూర్తులలో గణింపఁబడునతఁడు కాఁడనియు నెఱుంగందగు. ఆ నారాయణమూర్తి భగవదవతారము కాదా యన్న నతఁడొక్కఁడే కాదు. శంకరాదులు భగవదవతారములే యనునది సమాధానమగును. విష్ణుభక్తులకే ముక్తి దొరకునుగాని శివభక్తులు లోనగువారికి ముక్తిలేదను మధ్వవైష్ణవులవాదము దుర్వాదమనియు, నజ్ఞానఫల మదియనియుఁ దెలియందగువిషయము. భగవంతు నేరూపమున నారాధించినను భక్తి నిశ్చలతంగాంచిన నతఁడు ముక్తి కర్హుఁడగుననునదియే యుపనిషన్మతము. సర్వమతసార మిదియే. అట్లుగాక నిలువు నామములే పెట్టుకొని చక్రాంకితులైనఁగాని ముక్తి లేదన్నచో నయ్యది వారికే సిద్ధాంతమగును. ఇతరులకుఁ గాదు. వేదసమ్మతముకాదు. జ్ఞానిసమ్మతముకాదు. ఏజాతియందుఁగాని సర్వేశ్వరుని నమ్మినవారికెల్ల ముక్తి కలదనుటయే తత్త్వము. సకలశ్రుతిస్మృతిపురాణేతిహాససమ్మతమగున దిదియేకాని వేఱొకఁడు కానేరదు. ముమ్మాటికిఁ గానేరదు. వైష్ణవులకే ముక్తియనునది యాహారరూపమగు శిలావిగ్రహప్రసాదమే యనుట సర్వసాధుసమ్మతము. పాంచరాత్రాద్యాగమములయం దిట్లు లేదే యని కొందఱు భక్తినాటకులు పలుకుదురు. శైవశాక్తాద్యాగమములుకూడ నట్లే తెలుపును. అవి యప్రమాణములు కావుకాని తొలుదొలుత భక్తి కుదురుటకుగాఁ జెప్పఁబడినవనియు, భక్తి కుదురుకొనఁగా శిలావిగ్రహపూజ మాని భగవంతుని యోగమతము ననుసరించి ధ్యానింపవలయుననియు నుపనిషత్తులు బోధించును. ఆగమములే ప్రమాణములన్న వేదము లెగిరి

పోవును. ఆగమములు ప్రాయశః కుక్షింభరులగువారిని భక్తులుగాఁ జేయునెపమున వ్రాయఁబడినవనుట శిరోధార్యమగు మాటయే యగును.

ఈరీతిగాఁ గైకేయి రాజునకు ధర్మమును సత్యరూపముగ నుండుదానిని బోధించెను. స్వకార్యసిద్ధికేకదా యని కొందఱందురు. కైక పతివ్రతయే యని వాల్మీకి తెల్పెను. భగవదిచ్ఛవలన నామె లోకోపకారపరాయణురా లయ్యెనని మన మెన్నవలయును. దుష్టురాలే యైన శ్రీరామమూర్తి యామెను గౌరవింపఁడుగదా. దుష్టురాండ్రనుగూడ గౌరవించునేని శ్రీరాముని ప్రవర్తనము స్తుత్య మేల యగును? కైక ధర్మపరాయణురాలు గనుకనే రాజా! ధర్మమార్గమున నడువ నిన్నుఁ బురికొలుపుచున్నదాన ననియె. సత్యమును బరమధర్మమని పెద్దలు పలుకుదురుకదా. దానిని వదలఁగూడదని హెచ్చరించెను.

"సత్యమేకపదం బ్రహ్మ సత్యే ధర్మః ప్రతిష్ఠితః,
సత్యమేవాక్షయా వేదాస్సత్యేనైవాప్యతే పరం.
సత్యం సమనువర్తస్వ యది ధర్మే ధృతా మతిః
సఫలస్స వరో మేఽస్తు వరదో హ్యసి సత్తమ."

అని మూలము మరల నారాజునకు సత్యరూపమును దెల్పుచున్నది. సత్యమే యేకరూపమగు బ్రహ్మము. అనఁగా నిర్వికారుఁడగు పరమాత్మ యని యర్థము. సత్యమే యాధారముగా ధర్మమున్నది సత్యము ప్రధానముగాఁ దెలుపుటంబట్టి వేదము లక్షయములైనవి. సత్యము నారాధించిన ముక్తి లభించును. అనఁగా సత్యము పరమాత్మస్వరూప మనియుఁ, దదారాధన

మునఁగాని ముక్తి లభింపఁదనియు నిందుండి మనము గ్రహింప వచ్చును.

కొన్నియెడల నసత్యము సత్యముగాఁ జెప్పఁబడినదికదా యని కొందఱు శంకింతురు. కాని వారు దూర మాలోచించినవారు కారని తోఁచెడు. ఎట్టిసంకటములందు నసత్యమాడరాదనువారే యుత్తములు. ఆమార్గమున నడువఁజాలని వారలకుంగూడ సత్యమున నడువ నేర్పుటకే కొన్నియవకాశము లొసంగిరి అట్టివిషయములందప్పఁ దక్కినసమయములయందైన వారసత్యమాడకయుందురుగాక యనియే స్మృతులతాత్పర్యము. "వారిజాక్షులందు వైవాహికములందు" అనుపద్యమునఁ గలకాలముల నసత్యముపలుకువారు హారిశ్చంద్రునిచెంత నిలువఁబడఁదగరు. సర్వకార్యములయం దసత్యము పలుకువారలకంటె వీ రుత్తము లనవచ్చును. అంతియ కాని యెట్టియాపదలయందు నసత్యముపలుకనివారివలె నుత్తములు కారని నిశ్చయించుట మంచిది. లోకమున నన్నింటికి నుదాహరణభూతు లుండవలయుఁగదా.

"సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాన్న బ్రూయాత్సత్యమప్రియం,
ప్రియం చ నానృతం బ్రూయాదేష ధర్మస్సనాతనః."

అన్న మనుస్మృతివాక్యము గోడపై నుంచినదీపమువలె నున్నదేయందు రేని అది సామాన్యధర్మములలోఁ జెప్పఁబడినది.

"దృష్టిపూతం న్యసేత్పాదం వస్త్రపూతం జలం పిబేత్,
సత్యపూతాం వదేద్వాచం మనః పూతం సమాచరేత్." ४६

(మను. ౬. అధ్యా.)

అని సన్న్యాసులవిషయమున మనుస్మృతి యాజ్ఞాపించుచున్నది. సత్యేతరవాక్కు వారు పలుకరాదని విధించుచున్నది. కావున సామాన్యులధర్మముల నుదాహరించి మనుస్మృతి యసత్యమున కవకాశమిచ్చెనని మనము వాదింపరాదు. దానిహృదయ మెట్టి దని విచారింపవలయును.

"ధర్మస్యైవాభికామార్థం మమ చైవాభిచోదనాత్,
ప్రవ్రాజయ సుతం రామం త్రిః ఖలు త్వాం బ్రవీమ్యహం."

అని మూలము. సామాన్యార్థము సుగమము. విశేషార్థ మేమ నఁగా నీకుఁ బ్రియురాలనగు నాప్రోత్సాహమువలనను ధర్మ రక్షణముకొఱకును సుతుఁడనుప్రీతిచే మానక శ్రీరాము నడ వులకుం బంపుము. మాటికి ముమ్మాటికిఁ జెప్పుచున్నాను. అనఁగా ధర్మసంరక్షణము ముఖ్యకార్యము. దానికొఱకు నేనుఁ బురికొల్పుచున్నాను. కావునఁ ద్రికరణశుద్ధిగా నామాట నమ్ముము. మహోపకారము కలుగును. రామచంద్రు నడవులకుఁ బంపు మని కైకభావము. ఎట్టులైన రాము నడవులకుంబంపినఁగాని ధర్మరక్షణము కాదనియే దీనిసారము. దీనిచేత విధివశమునఁ గైక లోకముల కుపకారము చేయఁబూనెనని మన మెఱుంగ వలయు. నాప్రోత్సాహమునఁ బంపినట్లుండినఁగాని నాకీర్తి లోక ముల వ్యాపింపదని కైక యడుగుచున్నది. అపకీర్తికూడ రాదాయన్నఁ దొలుత నలుగురు దూషించినను దేవతలు మహ ర్షులు పొగడుదురు. అదియే యశస్సు. లోకమునకు మహోప కారము కైకమూలమునఁ గలిగినదని భగవంతుఁ డెఱింగినం జాలుననుమాట భగవంతునిప్రేరణమున నామెకుం గల్గినదని మన మెఱుంగుట న్యాయ్యము.

"యస్తే మంత్రకృతః పాణిరగ్నౌ పాపే మయా ధృతః,
తం త్యజామి స్వజం చైవ తవ పుత్రం త్వయా సహ." ౧౪

అని మూలము. కైకయాశయ మెద్దియని రా జెఱుంగఁడు. తా నేల యిట్లు పట్టుపట్టియడుగుచున్నానని యామెయే యెఱుంగదు. భగవత్సంకల్ప మిట్టిదని మన మెఱుంగవలయును. అంతఃపురమునఁ గూరుచుండి దుష్టరాక్షసులం బొలియింప సంకల్పించి మహామాయ సీతాదేవి సంకల్పించెను. ఆసంకల్పమే యెవ్వారిచేత మరల్పరానిదై పనిచేయుచున్నది. శ్రీరామమూర్తియో తనసర్వసాక్షిత్వమును వెలయించుచు నూరక యున్నవాఁడు. ప్రకృతివశంవదుఁడు. స్వాత్మానందము ననుభవించుచు నిర్వికారుఁడై యున్నవాఁడు. అనువిషయమును మనము చక్కఁగా నెఱింగినఁగాని రామాయణతత్త్వము తెలిసికొనఁజాలము. ఏవేవో యర్థములు చెప్పి గురువునకు శరణాగతి సమర్పింపవలయునని బోధించిన లాభము లేదు. ఈకాలమునఁ బ్రపత్తి యనునది విపరీతముగాఁ బరిణమించుచున్నది. గురువులు వేషధారులు. వంచకులు. స్వానుభవము లేనిజ్ఞానమును వెదఁజల్లువారు. కేవల నామధారులు. అట్టివారు తెలుపు ప్రపత్తియు నట్టిదే యగును. ప్రపత్తి యనుమాటలు చాలవు. దాని ననుభవమునకుఁ దెచ్చుకొనుట మహాకార్యమే యగును. కాని యది యిపుడు గగనారవిందమే. ఇప్పటిమాటల ప్రపత్తి ధనవిముక్తి కారణమగును. అంతియగాక భగవదుపాసనమునకు భంగమును గల్గించును. ఆచార్యోపాసనమున నాసక్తికలిగించి సంసారమున ముంచును. కావున నద్దాని మాని భగవంతు నారాధించుపనికిం గడంగవలయును. ప్రపత్తియని, శరణాగతి

యని, భక్తియని మార్చిమార్చి పేరు లేవేవో పల్కుచు నుందురు. వానిని త్యజించి శాస్త్రమురీతిగా నుపాసింపవల యును. అంతియగాని ప్రపత్తి ప్రపత్తియని యూరకుండుట నిరర్థకము.

"జీవాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః,
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః. ౭
జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః,
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః." ౮

అన్న గీతాశాస్త్రమురీతిగాఁ దపోనిరతికిం గల్గులక్షణముల సంపా దించుకొని మంత్రవిక్రయముచేయని (ధనముకొఱకు మంత్ర ముపదేశింపని) గురువుల నాశ్రయించి యోగప్రకారము భగ వంతు నారాధింపవలయును.

"ద్వాసప్తతిసహస్రాణి హృదయాదభినిస్సృతాః,
హితాహితా నామ నాడ్యస్తాసాం మధ్యే శశిప్రభం. ౧౦౮
మండలం తస్య మధ్యస్థ ఆత్మా దీప ఇవాచలః,
స జ్ఞేయస్తం విదిత్వేహ పునరాజాయతే న తు." ౧౦౯

యాజ్ఞవల్క్యస్మృతి.

ఈయదియే యోగిధ్యేయమగు నాత్మస్వరూపము.

"తస్య మధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః,
నీలతోయదమధ్యస్థాద్విద్యుల్లేఖేవ భాస్వరా,
నీవారశూకవత్తన్వీ పీతా భాస్వత్యణూపమా,
తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః,
సబ్రహ్మా సశివస్సహరిస్సేంద్రస్సోఽక్షరః పరమస్స్వరాట్."

అనుశ్రుతియు నుపాస్యమూర్తిని దేటపఱచును. బ్రహ్మ,శివుఁడు, విష్ణువు మొదలగువారుగాఁ బరిణమించువాఁడు భగవంతుఁడు ధ్యేయమూర్తి యని తేటపఱచెడు. ఈత్రిమూర్తులు భగవదంశములే కాని పరమాత్మ యనఁబడు సర్వభూతాంతర్యామి కారని స్పష్టపఱచుచున్నది. కావున ధనముంగోరు నాచార్యులు లోనగుగురువుల మోసపుమాటలఁ బాటింపక శ్రుతిస్మృతిపురాణేతిహాసాదిప్రతిపాద్యమగు నాత్మస్వరూపము నెఱింగి సేవింపవలయును. ప్రకృత మనుసరింతును. దశరథుఁడు కైక దుష్టురాలని యాగ్రహించుచు నీవు నాకు భార్యవు గావు. వివాహసంస్కారమును వదలుచున్నాఁడ ననుచున్నాఁడు. నీతోడ నీకుమారుని భరతునింగూడ వదలుచున్నాఁడ ననియెను. ఈ మాటలంబట్టి దశరథునకుఁ జిత్తశుద్ధి కలదనవచ్చునా? వివాహసంస్కారము నశించు టెట్లు? జీడిమచ్చవలెనగ్నిసాక్షికముగాఁ జేసికొన్నభార్యను దగినకారణములు లేక వదలుట న్యాయ్యమా? భార్యాత్యాగకారణములు స్మృతిప్రతిపాదితములైనవి కైకయెడఁ గానంబడుచున్నవియా? అట్టివి లేనితఱి వదలుకొనుట యెట్లు? దీనిభావమేమి? మృత్యుగ్రస్తుఁడగుట మతి తప్పియున్నవాఁడు. రామచంద్రాసక్తచేతస్కుఁడై సర్వము మఱచెను.

"ప్రాయస్సమాపన్నవిపత్తికాలే ధియోఽపి పుంసాం మలినా భవంతి"

అన్నసూక్తి న్యాయ్యమే కదా. దీనినెల్లఁ బరికించి చూడఁగాఁ గర్మము బలవత్తరమని తేలెడిని. దానిపోకడ లెంతవారలే నెఱుంగరు. మానవులే కాక త్రిమూర్తులును గర్మబద్ధులే.

కర్మమే బ్రహ్మస్వరూపమని నమ్మినవారు తరింతురు. దశరథుని సంభాషణమునుండి నేర్చుకొనవలసిననీతులు కొన్ని కలవు.

"పాణిగ్రాహస్య సాధ్వీ స్త్రీ జీవతో వా మృతస్య వా,
పతిలోకమభీప్సంతీ నాచరేత్కించిదప్రియమ్."

అన్నమనుస్మృతివచనముప్రకారము పతికిఁ గొంచెమే నప్రియ మాచరింపరాదు. ఇది సాధ్వీధర్మము. అప్రియవాదిని యగు భార్యను వదలవలయునని మనువే తెల్పెను.

"వంధ్యాష్టమేఽధివేద్యాబ్దే దశమే తు మృతప్రజా,
ఏకాదశే స్త్రీజననీ సద్యస్త్వప్రియవాదినీ. ౮౧
యా రోగిణీ సా తు హితా సంపన్నా చైవ శీలతః,
సానుజ్ఞాప్యాధివేత్తవ్యా నావమాన్యా కదాచన." ౮౨

మను. ౯ అధ్యా.

ఈనియమము ననుసరించి కైక వదలఁదగుఁగదా యనువా రుందురు. కైక యప్రియవాదిని కాదు. దశరథుఁడు కృతజ్ఞుఁడై వరములు తానే యిత్తుననియెను. వలసినపు డడుగుదునని యామె బదులిచ్చెను. నాకు మనఃకష్టము కలుగునట్టు లడుగకుమా యని సమయము రాజు చేయలేదు. అడిగినపు డప్రియ వాదిని యగునందుమేని సత్యస్వరూపము మనకుఁ దెలియ దనియే సిద్ధాంతమగును. దశరథునకు శాపఫలానుభవకాలము సమీపించినది. కైక నాశాపమే పురికొల్పినది. కావున మనుస్మృతి తెల్పినదోష మామెయందుఁ గానరాదు.

"కిమిదం భాషసే రాజన్ వాక్యమంగరుజోపమం,
ఆనాయయితుమక్లిష్టం పుత్త్రం రామమిహార్హసి." ౨౧

అని మూలము. ఏకష్టములు లేకుండునట్లుగా రాముని బిలి
పింపఁదగుదువని రాజుతోఁ గైక తెల్పెను. అనఁగా నీకేల యింత
కష్టము! కష్టములు లేకుండునట్లు లనఁగాఁ గష్టములన్నియుఁ
దొలఁగిపోవునట్లనికదా తాత్పర్యము. రాముని బిలిపింపఁగా
నీకష్టములు తొలఁగునని సారము. శ్రీరామదర్శనమున నన్ని
కార్యములు ఫలించును. కావునఁ ద్వరగాఁ బిలువఁబంపుమనియే
యిటఁగలవిశేషము. ఈయర్థ మెఱిఁగి కైక తెల్పెనా యనరాదు.
భగవతి సీతాదేవి స్మరించినంతన దేవతలప్రార్థనము ఫలించు
నట్లు కైక యవశయై పల్కెనని మన మూహింపవలయును.

"స్థాప్య రాజ్యే మమ సుతం రామం కృత్వా వనేచరం,
నిస్సపత్నాం చ మాం కృత్వా కృతకృత్యో భవిష్యసి." ౨౨

అని మూలము. ఇందు విశేషార్థము కలదు. రాజా! సత్పుత్రులం
గంటివి. చిరకాలము రాజ్యమేలితివి. సుఖము లనుభవించితివి.
ఇఁక భరతుని రాజ్యమున నిలుపుము. రాము నడవుల కను
పుము. శత్రువులు లేనిదానినిగా నన్నొనరింపుము. ఈకార్య
ముల నొనరించిన సఫలమనోరథుఁడవు కాఁగలవు. అనఁగా
విశేషమేమి? భరతుని రాజ్యమున నిలిపినఁగాని యాతని
యవ్యాజభ్రాతృవాత్సల్యము వెల్లడికాదు. రామమూర్తి నడవు
లకుఁ బంపినఁగాని యవతారఫలము కనఁబడదు. ఈరెండు
కార్యములు నెఱవేఱినపిదపఁగాని నేను శత్రువులు లేనిదానను
గాను. అనఁగా రామావతారఫలము కనఁబడఁగా నన్ను
దూషించినయెల్లరు వినుతింతురు. ఏల? రామావతారఫలము
కైక కారణమునఁ గనఁబడియెనని. ఇట్లు చేసి కృతకృత్యుఁడ
వగుదువనఁగా నీకార్యములు నెఱవేర్చినవాఁడవగుదువు. ఈ

శరీరభారము వదలఁగా ధన్యుఁడవగుదువని భావము. మఱి యొకయర్థ మిటనున్నది. మాం ప్రకృతిరూపిణియగుసీతాదేవిని నిస్సపత్నాం కృత్వా = శత్రువులగు రాక్షసులు లేనిదానినిగా ననఁగా రాక్షససంహారము నొనరించునట్లుచేసి కృతకృత్యుఁడవు కమ్మని తాత్పర్యము. ఈపక్షమున మూలప్రకృతియే సర్వకార్యములు భగవదిచ్ఛ ననుసరించి చేయుననియుఁ, బరాత్పరుఁడు సాక్షిమాత్రుఁడై యుండుననియు సారము. రాము నడవులకుం బంపినఁగాని రాక్షససంహారము కాదు. అందులకు సీతయే కారణము కాఁగలదు. తన్మూలముననే యెల్లకార్యములు నెఱవేఱును. ఇట్టికృత్యము నొనరించి నీవు ధన్యుఁడవు కమ్మని తెలిపినదని గ్రహింపందగు.

"హరిస్త్వామారాధ్య ప్రణతజనసౌభాగ్యజననీం,
పురా నారీ భూత్వా పురరిపుమపి క్షోభమనయత్,
స్మరోఽపి త్వాం నత్వా రతినయనలేహ్యేన వపుషా
కవీనామప్యంతఃకరణమపి మోహాయ మహతామ్."

అన్న శంకరభగవత్పాదాచార్యోక్తి యిందులకుఁ బ్రమాణము. జగదంబ యగుసీతం గాంచి భ్రాంతిపడి రావణాదిరాక్షస ప్రముఖులు నశింతురని దీనినుండి తేలెడిని.

"మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరమ్"

అనుగీతావాక్యము మాయయే చరాచరనిర్మాణ మొనరించు నని తేటపఱచుచున్నది. నిర్మించుటకు హేతువైనపుడు చంపుటకును బాలించుటకును హేతువగును. కాదనుట కెవ్వరికి నధికారములేదు. ఈయర్థమునే శంకరాచార్యులుగారు

"విరించిః పంచత్వం వ్రజతి హరిరాప్నోతి విరతిం
వినాశం కీనాశో భజతి ధనదో యాతి నిధనం,
వితంద్రీ మాహేంద్రీ వితతిరపి సమ్మీలితదృశా
మహాసంహారేఽస్మిన్విహరతి సతి త్వత్పతిరసౌ." ౨౬

అనునది "మయాధ్యక్షేణ" అనువాక్యమునఁ గలయర్థమునే తెలిపెడిని. అనఁగాఁ బరమపురుషుఁడనగు నేను శాశ్వతుఁడనై యధిపతినై యుండఁగా ననికదా భగవంతుఁడు తెలిపెను. ఇందుఁగూడ నోభగవతీ నీభర్త ప్రళయకాలమందు నిన్నుఁ గూడి విహరించుచున్నాఁడు. అనునర్థమే కలదు.

"జగత్సూతే ధాతా హరిరవతి రుద్రః క్షపయతే
తిరస్కుర్వన్నేతత్స్వమపి వపురీశస్తిరయతి,
సదా పూర్వస్సర్వం తదిదమనుగృహ్ణాతి చ శివ
స్తవాజ్ఞామాలంబ్య క్షణచలితయోర్భ్రూలతికయోః." ౨౪

అన్న శ్రీశంకరభగవత్పాదోక్తి "సూయతే సచరాచరమ్" అన్నభావమునే తెలుపుచున్నది. వైష్ణవులు ప్రకృతి యనఁగా లక్ష్మి యనుకొననిండు. బాధయేమియు లేదు. ఎవ్వరెట్లు భావించినను దదాకారమునఁ బరిణమించు నాదిశక్తికి లక్ష్మీప్రభృతి నామములు తద్రూపములు లేవనరాదు. భక్తులయిచ్ఛానుసారముగా రూపనామములఁ దాల్చు పరమేశ్వరిగదా ప్రకృతి. ఇట్లు భగవద్గీతావాక్యము శంకరభగవత్పాదోక్తియు నేకరీతిగాఁ బ్రకృతికిం గలమహాద్భుతశక్తిని భగవంతుని నిరంజనత్వసర్వసాక్షిత్వములను దేటపఱచుచున్నవి.

మధ్యవైష్ణవులు కొందఱు శిష్యబోధమునకుఁ బాటు పడునట్లు నటించుచుఁ బ్రకృతి యనఁగాఁ బార్వతియనియు,

నామె క్షుద్ర దేవతయనియు బోధించుచు, భగవంతుఁడగు రామ
మూర్తి నైవేద్యప్రియుఁడనియు, ఘృతము స్రవించుచుండఁ
బరమాన్నముచేసి నైవేద్య మర్పించి దానిని గురువున కర్పిం
చినఁ గరుణించి ముక్తి నొసంగుననియుఁ బ్రేలుచుందురు. వారి
తత్త్వోపదేశములు రహస్యభోజనమునకే యుపకరించును. శిలా
విగ్రహముల నారాధించువారి కంతగాక మతేమగును? ధనము
దొరకును. చక్కనిభోజనము దొరకును. రెండుపూట లుప
వాసమే. రాత్రి భోజనము. ఇట్టిదాసులు, పరమహంసలు,
యతులు భిక్షువులు పలుకుతత్త్వము

"హతే రామే హతే కృష్ణే హతే చ శివశంకరే,
అహో పేరూరుదౌర్భాగ్యం వ్యాఖ్యాతా సూపశంకరః."

అన్నట్లుండుననుట నిస్సంశయము. విష్ణుభక్తులు శ్రీకృష్ణోప
దేశముం దెగడుదురా. ఆమహామాయ నెవ్వ రేయేపేరులం
బిల్చిననేమి? భక్తిగ నారాధించినం జాలును. వరముల నొసం
గును. కావున నీఘట్టమున నీయర్థ మసంగతము కానేరదు.

"ధర్మబంధేన బద్ధోఽస్మి నష్టా చ మమ చేతనా,
జ్యేష్ఠం పుత్త్రం ప్రియం రామం ద్రష్టుమిచ్ఛామి ధార్మికమ్." ౨౮

అని దశరథుఁడు పల్కెను. దశరథునియాశయ మిందు సువ్య
క్తము. కైక ధర్మమును మరలమరల బోధించెను. రాజు కైక
బుద్ధిని మరల్ప నెన్నియోవిధములఁ బ్రయత్నించెను. కాని
దైవవశమున నామెచిత్తము మార్పునొందినది కాదు. తుదకు
దశరథుఁడు రాము నడవులకుఁబంపవలయుననియే తీర్మానించు
కొనియే యీమాట చెప్పుచున్నాఁడు. ధర్మపాశమునకుఁ జిక్కి
తిని. నాబుద్ధి నశించినది. అనుటచేతనే వరద్వయమును సఫలము

గావింతు నన్నభావము కైకగ్రహించెను. ధార్మికుఁడగు రాముని జూడఁగోరుచున్నానని రాజు పల్కెను. ఇందలిచమత్కార మేమనఁగా ధర్మపాశబద్ధుఁడను నేను. ధార్మికుఁడు రాముఁడు. నాధర్మము నెఱవేర్పవలసినవాఁడను నేను. తనధర్మము నెఱవేర్పవలసినవాఁడు రాముఁడు. కావున నామాట మీఱఁడని రాజు నభిప్రాయము. కొంద ఱిందొకయర్థమును దెల్పుదురు. నాధర్మమును నేను నెఱవేర్చినట్లే తనధర్మమును యువరాజయి ప్రజలఁ బాలించుకార్యమును నెఱవేర్చును. అన్నభావమే దశరథునకుఁ గలదనియే యందురు. కాని యది న్యాయ్యము కాదు. ఏలయనఁగా శ్రీరాముఁడు పితృవాక్యపాలకుఁడే యని రాజే తొలుతఁ గైకకుఁ దెలిపెను.

"యది మే రాఘవః కుర్యాద్వనం గచ్ఛేతి చోదితః,
ప్రతికూలం ప్రియం మే స్యాన్నతు వత్సః కరిష్యతి."

అను నీదశరథవాక్యమునకు నీయర్థము విరుద్ధమే యగును. కావున నిట నీయర్థము పొసఁగదు. ధర్మజ్ఞుఁడు కావున నాశాసనరూపధర్మము నెఱవేర్చుననియే దశరథుఁడు భావించెనని మనము నిశ్చయింపవలయును.

"వసిష్ఠో గుణసంపన్నశ్శిష్యైః పరివృతస్తదా,
ఉపగృహ్యాశు సంభారాన్ ప్రవివేశ పురోత్తమం." ౨౬

అని మూలము. వసిష్ఠముని యయోధ్యలో నివసించువాఁడు కాఁడని సరయూతీరమున నొకయాశ్రమమున నుండువాఁడని తోఁచెడిని. మహర్షులు నగరములనుండినఁ దపోవిఘ్నము కలుగునన్నభయమున నాశ్రమములయందే నివసింతురు. కనుకనే తెల్లవాఱఁగనే పట్టాభిషేకసంభారములను దాను సంగ్రహింపఁదగిన

వానిని శిష్యులచేఁ బట్టించుకొని నగరమును బ్రవేశించెను. కొందఱిచ్చోట నొక్కప్రశ్నము చేయుదురు. వసిష్ఠుఁడు త్రికాలజ్ఞుఁడుకదా. అప్పుడు జరగనున్నపట్టాభిషేకము సాగక పోవునని యెఱుంగఁడా? ఎఱింగిన సంభారములతో నేల నగరమును బ్రవేశించును? కావున యోగదృష్టి యనునదియే మునులకు లేదు. కలదనుట స్తోత్రమే. అని. దీనికి సమాధానము చెప్పుట సులభమనరాదు. మహర్షులు యోగదృష్టిగలవారనుట నిస్సంశయము. యోగశాస్త్రము దానిమార్గముం దెల్పును. రామాభిషేకము సాగదని, శ్రీరామమూర్తి భగవంతుఁడే యని వసిష్ఠునకుఁ దెలిసియేయున్నది. కర్మగతుల నివారింపఁ దరము కాదు. ఏది యెట్లు సాగవలయునో దానిని బరికించుచుందురు. సామాన్యుల కది తెలియక దుఃఖింతురు. మహనీయులు ముందే యెఱింగినవిషయమౌట నద్దానికి దుఃఖింపకయుందురు. ఇదియే ప్రాజ్ఞులకుఁ బామరులకుం గల ప్రధానభేదము. తెలిసినవిషయము దశరథునకు వసిష్ఠుఁడు తెలిపియున్నఁ గర్మగతికి నంతరాయము కల్గించిన వాఁడగును. భగవదాజ్ఞను మీఱి ప్రవర్తించిన వాఁడగును. జ్ఞానులు ఖేదమోదములయందు సమముగా వర్తించువారుకదా. తమకు నేవిషయము తెలిసినట్లు నటింపకయుందురు. మాకుఁ దెలియునని వారు పలుకుదు రేని లోకులెల్లఁ దమకు రాఁగలవిపత్తుల నడుగుచుందురు. అప్పు డద్దానికి ఫలము తుచ్ఛతమలోకప్రతిష్ఠయే యగును. ఎప్పుడు జ్ఞానులట్టిప్రతిష్ఠం గోరుదురో వారితపస్సు ఫలింపదు. ఫలాభిసంధిరహితముగా వారితపస్సుండవలయుఁగదా. తమకుగా దేనిని వారు కోరరు. కోరుదురేని నిస్సంగులు కాఁజాలరు. నిస్సంగులు

కానివారలకు భగవత్ప్రసాదము లభింపదు. ప్రసాదమనఁగా భోజనప్రియులగు మధ్యవైష్ణవులు చెప్పునట్టియర్థము కాదు. ప్రసాదమనఁగా దయ యనియే యర్థము.

"యస్య ప్రసాదే పద్మా శ్రీర్విజయశ్చ పరాక్రమే,
మృత్యుశ్చ వసతి క్రోధే సర్వతేజోమయో హి సః."

అన్నమనుస్మృతి ప్రసాదశబ్దార్థమును బ్రాతీతికమును వెల్లడించుచున్నది. శిష్యులను జేర్చుకొనుదాసులకు, నాచార్యులకు, లంబచిబుకులకుఁ, గపటయోగులకుఁ, గపటనాటకసూత్రధారులకుఁ బ్రసాదశబ్దమున కర్థము వేఱుగ నుండును. ఔషధము వేసికొని తూఁగుచునుండు భగవద్భక్తులకుంగూడ వేఱుగ నర్థము తోఁచును.

ఎవ్వరు ఫలాపేక్షలేక భగవంతు నారాధింతురో వారిపైఁ బరమేశ్వరుకరుణ యపారముగాఁ బ్రవహించును. అట్టివారేయేమానవుల కేయేవిపత్తులు రానున్నవో ముందుగాఁ దమతపస్సు వినియోగించియైన నెఱింగి తెలుపుచుండరు. అది యొకవిధముగా ఫలాపేక్షగలదియే యగును.

"సంకల్పప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వానశేషతః,
మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమంతతః. ౨౪
శనైశ్శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా,
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్." ౨౫
(గీ. ౬. అ.)

అనుభగవదుక్తి పైవిషయమునే తెలుపుచున్నది.

"యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతిమాప్నోతి నైష్ఠికీం,

అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే." ౧౨
(గీత. ౫. అధ్యా.)

అను నీశ్రీకృష్ణబోధము పైవిషయమును దృఢపఱచుచున్నది. కావున వసిష్ఠమహర్షి లోనగుమునివర్యులకు నీవిషయము తెలిసి యుండదనుకొనుట పొరపాటు.

"అష్టౌ చ కన్యా రుచిరాః మత్తశ్చ వరవారణః,
సర్వవాదిత్రసంఘాశ్చ వేశ్యాశ్చాలంకృతా స్త్రియః,
ఆచార్యా బ్రాహ్మణా గావః పుణ్యాశ్చ మృగపక్షిణః
పౌరజానపదశ్రేష్ఠాః నైగమాశ్చ గణైస్సహ.
ఏతే చాన్యే చ బహవః ప్రీయమాణాః ప్రియంవదాః,
అభిషేకాయ రామస్య సహ తిష్ఠంతి పార్థివైః." ౪౧

అని మూలము. అందగత్తెలగు నెనమండ్రుకన్యకలు వచ్చి యున్నవారని వసిష్ఠముని తెలిపెను. కన్యకలనఁగా నవివాహితలగుస్త్రీలు. వయస్సురానివారనియే యర్థము. ఏలయనఁగా మరల స్త్రీలువచ్చినట్లున్నది. వీరేల? అని యడుగువారు కొందఱున్నవారు. వివాహము కానికన్యలనఁగాఁ బదియేండ్లకు మించనివారనియే యర్థము. ఎనిమిదవయేఁడువచ్చినది కన్యయని యొకమతము, పదియవసంవత్సరమునఁ గన్య యనఁబడునని యొకమతము స్మృతులయందుఁ గలదు. కన్యక యనఁబడఁదగిన స్త్రీకి మనోవ్యాపారము నిర్మలమై యుండును. అంతకుమించిన యీడుగలవారిమనస్థితి వేఱు.

"నైతా రూపం పరీక్షంతే నాసాం వయసి సంస్థితిః,
సురూపం వా విరూపం వా పుమానిత్యే చ భుంజతే. ౧౪
పౌంశ్చల్యాచ్చలచిత్తాచ్చ నైస్నేహాచ్చ స్వభావతః,

రక్షితా యత్నతో౽పీహ భర్తృష్వేతా వికుర్వతే. ౧౫

ఏవం స్వభావం జ్ఞాత్వాసాం ప్రజాపతినిసర్గజం,
పరమం యత్నమాతిష్ఠేత్పురుషో రక్షణం ప్రతి.” ౧౬

(మను. ౯. అధ్యా.)

అన్నమనుస్మృతిప్రకార మాలోచించిన వయస్సురాఁగాఁ జిత్తవృత్తి మాఱునని తేలుచున్నది. కన్యకలు లోకవ్యాపారముల నెఱుంగనివారుగా నుందురు. కనుక నట్టివా రభిషేకించిన మేలు కలుగునని భావము. వేశ్య లెందులకని ప్రశ్నింపవచ్చును. వేశ్యలనఁగా వ్యభిచారవృత్తిగలవారు గారు. నాట్యకళాధురీణలే యని ప్రాచీనులభావము. వివాహముకూడ మాని యింద్రియములఁ జిక్కఁబట్టి నాట్యాధిదేవత నుపాసించువారే యాకాలమున వేశ్య లనంబడుచుండిరి. బ్రహ్మచారిణులని యర్థము. నాట్యకళకు భరతముని ఋషి. లోకుల నానందింపఁజేయుటయే వినియోగము. అనఁగా ఫలము. నాట్యకళ నీచవిద్య యని కొందఱందురు. కాని యది పాటింపఁదగనిమాట. మహాత్ములగు కాళిదాసభవభూతిప్రభృతి కవితల్లజులు నాటకము లేల వ్రాయుదురు? అభినయము మనస్సును రంజింపఁజేయునది. మనోరంజనమే దుఃఖాంతము. మానవులకుఁ గావలసిన దదియేకదా! సామాన్యులకు సదాచారములను నీతుల నేర్పుటకు నాటకములకంటె నుత్తమములు వేఱుమార్గములు లేవనుట సర్వసమ్మతము. నాట్యము పవిత్రమైనది. దాని నారాధించువారు పవిత్రహృదయులు. నాట్యమే యపవిత్రమై సద్వృత్తి నశింపఁజేయునదియే యయ్యెనేని పూర్వరాజగృహములయందు స్త్రీలకు నాట్యము నేర్పుపద్ధతి యేటికి నుండును?

"దేవానామిదమామనంతి మునయః కాంతం క్రతుం చాక్షుషం
రుద్రేణేదముమాకృతవ్యతికరే స్వాంగే విభక్తం ద్విధా,
త్రైగుణ్యోద్భవమత్ర లోకచరితం నానారసం దృశ్యతే
నాట్యం భిన్నరుచేర్జనస్య బహుధాప్యేకం సమారాధనమ్.
యద్యత్ప్రయోగవిషయే భావికముపదిశ్యతే మయా తస్యై,
తత్తద్విశేషకరణాత్ప్రత్యుపదిశతీవ మే బాలా.
పాత్రవిశేషే న్యస్తం గుణాంతరం వ్రజతి శిల్పమాధాతుః,
జలమివ సముద్రశుక్తౌ ముక్తాఫలతాం పయోదస్య.
జనమిమమనురక్తం విద్ధి నాథేతి గేయే
వచనమభినయంత్యా స్వాంగనిర్దేశపూర్వం,
ప్రణయగతిమదృష్ట్వా ధారిణీసన్నికర్షా
దహమివ సుకుమారప్రార్థనావ్యాజముక్తః.
అంగైరంతర్నిహితవచనైస్సూచితస్సమ్యగర్థః
పాదన్యాసో లయమనుగతస్తన్మయత్వం రసేషు
శాఖాయోనిర్మృదురభినయస్తద్వికల్పానువృత్తౌ
భావో భావం నుదతి విషయాద్రాగబంధస్స ఏవ."

(అని కాళిదాసకవివరుఁడు.)

విరాటభూపాలునంతఃపురమున రాజకన్యకలకు నర్జునుఁడు నాట్యము నేర్పుట ప్రసిద్ధమే కదా. నాట్యకళ మర్యాదగలవా రంగీకరింపనిచో రాజాంతఃపురములయం దది నేర్పఁబడుట యేటికో? అట్టి పరమపవిత్రమగు నాట్యకళ నారాధించుచు రసికుల నానందవార్ధి నోలలాడించువారు కనుకనే వేశ్యలు మహర్షి చేఁ బిలిపింపఁబడిరని యెఱుంగవలయును. ఇప్పటివారల వృత్తిం బట్టి పూర్వకాలమున నిట్టివారుగనే వారుందురనియు,

నట్టిదుష్ప్రవర్తనముకలవారిని దేవాలయములయందు భగవత్సేవార్థము నియమించుట తెలివితక్కువయనియు నాక్షేపింపరాదు. అట్టివారుగాక సత్ప్రవృత్తిగలిగి నాట్యకళాధిదైవతమగు శారదాదేవి నుపాసించువారే వేశ్యలనఁబడుదురనియు, నట్టివారినే పూర్వులు భగవత్సేవార్థ మంగీకరించిరనియు మన మెఱుంగుట మంచిది. వసిష్ఠమునివంటిజ్ఞాననిధి వేశ్యలఁ బిలిపించుట యందును బట్టాభిషేకమహాసభకు రానసుమతించుటయే పై విషయమును దృఢపఱచెడిని.

"అలంకృతాస్త్రియః" సర్వాలంకారములుగల యితర స్త్రీలు. అనఁగా నామహోత్సవమునఁ బాల్గొనుటకుఁ బిలిపించెను. పతివ్రతలుకూడ వరుసప్రకారము శ్రీరాము నభిషేకింపఁదగువారనికదా భావము.

"ఆచార్యాః బ్రాహ్మణాః" అనుమూలమునకుఁ గొందఱాచార్యులనఁగా శ్రీవైష్ణవులని, బ్రాహ్మణాః అనఁగా స్మార్తులని పిలువంబడునద్వైతులని యర్థము చెప్పిరి. బ్రాహ్మణశబ్దవాచ్యులాచార్యులు కారని యేర్పడును. అది యసంగతము కదా.

"ఉపనీయ తు యశ్శిష్యం వేదమధ్యాపయేద్ద్విజః,
సకల్పం సరహస్యం చ తమాచార్యం ప్రచక్షతే. ౧౪౦
(మను. ౨ అధ్యా.)

"స గురుర్యః క్రియాః కృత్వా వేదమస్మై ప్రయచ్ఛతి,
ఉపనీయ దదద్వేదమాచార్యస్స ఉదాహృతః." ౩౪
యాజ్ఞ. ఆచారకాండము.

అని స్మృతులు బోధించెడిని. ఇప్పటియాచార్యశబ్దము జాతి వాచకము. పూర్వమునఁగల యాచార్యశబ్దము పూజ్యవాచకము. వేదము తద్విహితకర్మముల నొనరించుమార్గముల నుపదేశించువారే యాచార్యులని చెప్పఁబడుదురు. ద్వైతాది భేదము లిటీవల మార్పునొంది వాని నాదరించువా రొక్కతెగగా మాఱిరి. పూర్వకాలమున నిట్టిభేదములు లేవు. శాస్త్రకర్తలకు శాస్త్రోక్తపద్ధతులను దామవలంబించి యితరు లవలంబించునట్లు చేయువారలకు నాచార్యశబ్దము చెల్లుచుండును. శ్రీశంకరాచార్యులు, అనఁగా నర్థమేమి? ఈ కాలమునఁ గల మార్పుల ననుసరించి యిట్టితావుల విపరీతార్థములు చెప్పరాదు. అది మూలచ్ఛేదహేతువగును.

పౌరజానపదశ్రేష్ఠాః, అయోధ్యాపురవాసులలోఁ బెద్దలగువారు పల్లెలనుండి యరుదెంచినవారిలోఁ బెద్దలు అనఁగా గుణవృద్ధులు అని యర్థము. ఇందు నాల్గుజాతులవార లుందురు. వృద్ధత్వమున భేదము కలదు.

"న హాయనైర్న పలితైర్న విత్తేన న బంధుభిః,
ఋషయశ్చక్రిరే ధర్మం యోఽనూచానస్సనో మహాన్. ౧౫౪
విప్రాణాం జ్ఞానతో జ్యైష్ఠ్యం క్షత్రియాణాం తు వీర్యతః,
వైశ్యానాం ధాన్యధనతశ్శూద్రాణామేవ జన్మతః. ౧౫౫
న తేన వృద్ధో భవతి యేనాస్య పలితం శిరః,
యో వై యువాప్యధీయానస్తం దేవాస్స్థవిరం విదుః." ౧౫౬

(మను. ౨ అధ్యా)

అన్నరీతిగా నాయాయికులములలో జ్యేష్ఠత్వకనిష్ఠత్వము లెఱుంగందగు. మొత్తముమీఁద విద్యావంతుఁడే వృద్ధుడనుట సర్వసాధారణవిషయము.

నైగమాశ్చ గణైస్సహ=నైగము లనఁగా వైశ్యులు. ధనవంతులబుద్ధి తఱచుగా నీచత్వము నాశ్రయింపదు. లక్ష్మీ సంపన్నులుకాన వారిమనస్సు నిర్వికారముగా (దుఃఖబహుళముగా) నుండదని భావము. అట్టివా రందఱభిషేకించిన వృద్ధికరమనియే యిందుఁగలసారము.

"పుణ్యే నక్షత్రయోగే చ రామో రాజ్యమవాప్నుయాత్." ౪౨

అని మూలము. ఇందు వసిష్ఠముని మహాయోగిగానఁ దనభావమును వ్యక్తీకరించెను. న క్షరతీతి నక్షత్రం క్షరసంచలనే. అను వ్యుత్పత్తి ననుసరించి క్షతిలేనియోగము గలపుణ్యకాలమునందని యర్థము. ఇచ్చట యోగశబ్దమునకు ధ్యానమని యర్థము. ధ్యానమనఁగాఁ జిత్తవ్యాపారముల నిరోధించుట యని యర్థము. అనఁగా విషయసుఖములయందలి యభిలాషముల చేతఁ దిరుగుచుండుదురాత్మలు నశింపఁగాఁ బవిత్రవాంఛలు చిత్తములయందు నెలకొనఁగా నట్టికాలమునందని యర్థము. రావణాదిదుష్టదానవసంహారానంతర మట్టికాలము వచ్చును గావున నప్పుడు రామచంద్రుఁడు తనయవతారఫలమున నొక్కభాగమగు దుష్టపరిపాలనము కాఁగా మానవులకు సదాచారములఁ దనయాచారములచే నేర్పఁదగినకాలము రానున్న యపుడు రాజ్యమును వహించి పరిపాలించునని సారము. నిర్వికల్పున కీపని యెట్లు సరిపడును? అని ప్రశ్నింప రాదు. సాక్షిమాత్రుఁడై యోగమాయ యగుసీతాదేవి సర్వకార్యముల నొనరించుచుండఁగా (ఎల్లరఁ బ్రోత్సహించుచుండఁగా) నిస్సంగుఁడై సంగముకలవానివలె నటించుచు నిత్యానందము ననుభవించుచుండుననియే తాత్పర్యము. ఇట్లు వాల్మీకిమహర్షి యాయాయి

త్పాల విశేషార్థముల నిమిడించియే రామాయణమును రచించె నని పెద్దలు నిర్ణయించిరి. పెద్దలనఁగా బృహచ్ఛిబుకులు గార నియు జ్ఞానులనియు నెఱుంగవలయును. గడ్డము పెంచినవారెల్లఁ బెద్దలైన వంగదేశమున నసంఖ్యాకులు గలరు. వారెల్లఁ బెద్దలే కావచ్చును. మనుస్మృతిప్రకారము జ్ఞానధనులనియే మనము తెలిసికొనవలయును. "విప్రాణాం జ్ఞానతో జ్యైష్ఠ్యమ్" అని కదా స్మృతి. జటిలో ముండీలుంఛితకేశః కాషాయాంబరబహు కృతవేషః, పశ్యన్నపి చ న పశ్యతి మూఢో హ్యుదరనిమిత్తో బహుకృతవేషః" అని శంకరభగవత్పాదశిష్యతోటకాచా ర్యులుగారు నిర్వచించినది తెల్లమే కదా. జ్ఞానధను లెల్లరు వాల్మీకి మహర్షి యథార్థ్యాత్మవిషయముల నిముడించి వ్రాసిరనియే యంగీ కరించిరను నానుడి యిప్పటిది కాదు.

"యథా నందతి తేజస్వీ సాగరో భాస్కరోదయే,
ప్రీతః ప్రీతేన మనసా తథానందఘనస్స్వతః." ౪౭

అని మూలము. ఇందు భాస్కరోదయే = అనుచోట భాస్కర శబ్దమునకు సూర్యుఁడని యర్థము చెప్పరాదనియుఁ జంద్రుఁ డనియే నిర్ణయింపవలయుననియు వ్యాఖ్యాతలు వ్రాసిరి. చంద్రో దయకాలమున సముద్రము పొంగుననుట కవిసమయము. దానిని బోషించుటకై యాగికార్థమును గ్రహించిరని తోఁచెడు. అమవసయందుఁగూడ సముద్రము పొంగుననుట వారికిఁ దెలిసినదియే కాని క్రొత్తది కాదు. అయినను లోకోక్తి ననుసరించిరని మన మెన్నుకొనవలయును. "తేజస్వీ" అనఁగా నిందుఁ దేజశ్శబ్దమునకు సారమని యర్థము.

"రసాదీనాం శుక్రాంతానాం ధాతూనాం యత్పరం తేజస్తత్ ఖలు ఓజః తదేవ బలమిత్యుచ్యతే. స్వశాస్త్రసిద్ధాంతాత్" సుశ్రుతము ౧. ౧౫.

దీప్తియుఁ బౌరుషము లనునర్థములు సహజములేకదా. ఓజస్స్థానమగుసాగరుఁడు చంద్రోదయకాలమున ననఁగా నిండుచందురునియుదయమున నెట్టు లానందపారవశ్యమున నుప్పొంగునో యట్లే నీవు నానందపూర్ణుఁడవు కమ్ము. 'ప్రీతేన మనసా' అని మూలమునఁ గలదు. సంతోషముతోఁగూడిన మనస్సుతోడ నని యర్థము. మహత్తరదుఃఖకాలమునందు సత్యము ననుష్ఠించి దశరథుఁడు కృతకృత్యుఁడయ్యె ననుప్రఖ్యాతిఁ గాంచఁగల్గితి నన్నదే యిట సంతోషము. ఈయర్థము సుమంత్రుఁ డెఱిఁగి చెప్పినది కాదు. దైవికము. సుమంత్రునిభావము సాధారణార్థముననే స్పష్టము. రామాభిషేకనిర్వహణమే యానందమని యప్పటియర్థము. మహాద్భుతకార్యము సాగునెడ నెల్లరిమనస్సులు దైవవశమున మార్పునొందును. విపత్తునందు నట్లే. ఆమానసములు భావ్యర్థమును సూచించునట్టియూహలు గలవగును. లోకముల కానందజనకమగు కాలముగదా యిది. దశరథా! మహానందము నొందఁదగు కాల మిదియని సుమంత్రుఁడు సూచించెను. సత్యపాలనమునకంటె సంతోషమును గల్గించునది యేది? తత్కాలజనితమగుదుఃఖము భావ్యానందమున నడంగును. తుదకు మహానందమే. కావున నదియే కోరఁదగినది.

ఈభాగమునుండి గ్రహింపఁదగునట్టివిషయమేది? కష్టములను బాటింపక మానవులు నిత్యమగునానందమును గోరవలయును. అట్టికోరికగలుగునట్లు పెద్దలు వారలఁ బురికొల్పవలయును. స్వల్పసుఖము గొప్పకష్టము కలుగునపు డది సుఖముగా

లెక్కింపఁబడదు. స్వల్పకష్టము గొప్పసుఖము కలుగుతఱిఁ గష్టము సుఖముగనే తలంపవలయును. దూరదృష్టియుండుటే. ప్రధానముకాని కాళ్లముందఱిచూపు ప్రధానముకాదు. అను నీతులఁ బరిగ్రహింపవలయును.

"ఇంద్రమస్యాం తు వేళాయామభితుష్టావ మాతలిః,
సోఽజయద్దానవాన్ సర్వాంస్తథా త్వాం బోధయామ్యహం." ౪౫

అని మూలము. సుమంత్రునివాక్కులే యిందుండునవి. ఉదయ కాలమున మాతలియనుసారథి యింద్రుని బొగడెను. అతఁ డసురుల నోడించెను. అట్లే నిన్ను బోధింతును. అనఁగా విశేష మేమి? దేవతాప్రార్థనాదులకు నుదయకాల మత్యుత్తమము. సూర్యునింబొగడుట యందులకే. తేజోగోళముకదా సూర్య మండలము. "తేజసాం గోళకస్సూర్యః" అని సిద్ధాంతము.

"ధ్యేయస్సదా సవితృమండలమధ్యవర్తీ నారాయణస్సరసిజాసనసన్నివిష్టః" అనునది యిందులకే. అనఁగాఁ దేజోరూపముగా భగవంతుని ధ్యానింపవలయును. అదియే చక్రనిధ్యానము.

"ప్రాదుర్బభూవ పరమం తేజఃపుంజమనూపమం,
కోటిసూర్యప్రతీకాశం చంద్రకోటిసుశీతలం,
తన్మధ్యమే సముదభూచ్చక్రాకారమనుత్తమం,
తన్మధ్యమే మహాదేవీముదయార్కసమప్రభామ్,
జగదుజ్జీవనాకారాం బ్రహ్మవిష్ణుశివాత్మికామ్,
సౌందర్యసారసీమాన్తామానందరససాగరామ్." ౭౧

(లలితోపాఖ్యానము. ౯ అధ్యా.)

భగవద్రూపము సాక్షాత్కరించునపుడు తేజోమండలముగాఁ దోఁచుతఁ గనంబడి యది దుర్నిరీక్ష్యమనుతలంపున దానిమధ్య

భాగమున సౌమ్యరూపముగా(గనంబడును. ఇది లలితారూపము కదాయందురేని భగవంతు(డు భక్తులవాంఛల ననుసరించి రూపము కల్పించుకొనుననియు, స్త్రీపున్నపుంసకభేదము లావ్యక్తికి లేవనియు నెఱుంగవలయును.

"దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా,
యది భాస్సదృశీ సా స్యాద్భాసస్తస్య మహాత్మనః. ౧౨
మయా ప్రసన్నేన తవార్జునేదం రూపం పరం దర్శితమాత్మయోగాత్,
తేజోమయం విశ్వమనంతమాద్యం యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్.
సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ,
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః. ౫౨
నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా,
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా." ౫౩

(గీత. ౧౧ అధ్యా.)

అన్న యీభగవద్వాక్యములు పైనవ్రాసినభావమును సిద్ధాంతము చేయుచున్నవి. కావున నుదయకాలమున భగవంతుని తేజోరూపునిగా ధ్యానింపవలయునని మన మెఱుంగందగు. ఉదయకాలమున మనస్సు ప్రాయశః ఎట్టివారికిని సుంతయైన నిర్మలముగా నుండును. సంసారయాత్రాభిముఖమగు కాల మదియే. స్నానముకూడ మాని తెల్లవాఱుజామున( బూర్వులు శిష్యుల కాసమయముననే వేదము చెప్పుదురు. కా(బట్టి యుదయకాలమున లేచి తొలుదొలుత భగవంతుని బరాత్పరుని తేజోరూపునిగా ధ్యానింపవలయుననియే యీభాగమునుండి మన మెఱుంగవలయును. అట్టిసుసమయము కావున నిన్ను మేలుకొలుపుచున్నా(డనని ప్రకృతకథావిషయము.

"వేదాస్సహాంగవిద్యాశ్చ యథా హ్యాత్మభువం విభుం,
బ్రహ్మాణం బోధయంత్యద్య తథా త్వాం బోధయామ్యహం." ౪౯

అని మూలము. ఇందు సామాన్యార్థము స్పష్టము. "ధాతా యథా పూర్వమసృజత్" అను శ్రుత్యర్థమే యిది యగు. విశేషార్థమేమి? వేదాదిసమస్తవిద్యలు ప్రవృత్తిమార్గమును బోధించును. అనఁగా సగుణబ్రహ్మమును బోధించును. ఎట్లు? జగత్సృష్టిపరిపాలనసంహారాది కార్యముల నొనరింపుమని. ఈ మూఁడురూపము లొక్కరూపమునుండి వెలువడియెనని భావము. అనఁగా భగవదంశములనియే సారము. మాయాతీతులుగారు కావున నీపని యిట్లు చేయందగునని వేదాదివిద్యలెల్ల బోధింపవలసివచ్చెను. "మమమాయాదురత్యయా" అన్న శ్రీకృష్ణోక్తి యిట స్మర్తవ్యము ప్రకృత్యతీతునకు వేదాదివిద్యలు తెలుపఁజాలవు. వేదాంతములు తత్స్వరూపము నిర్ణయింపఁజాలమని తమయశక్తత్వమును విన్నవించుకొని యూరకుండెను. ఆరీతిగా నిన్ను బోధించుచున్నవాఁడనని సుమంత్రుఁడు తెలిపెను. అనఁగాఁ బ్రకృతిపూరుషులగు సీతారామచంద్రుల నవతారఫలమగు కార్యముల నొనరింపఁ బురికొల్పలెమ్మని సారము. వేదాదులు ప్రవృత్తిమార్గబోధకములనఁగాఁ బ్రకృతిమహత్త్వమును దెలుపునవియే. ఉపనిషత్తులు ప్రకృత్యతీతుఁడగు నిర్గుణు బోధింపఁబూనును. ఈవిషయము నెఱింగినవారికిఁ బ్రకృతిద్వేషము గలుగఁజాలదు.

"అంధం తమః ప్రవిశంతి యేఽవిద్యాముపాసతే"

అన్న శ్రుతి ప్రసిద్ధమే కదా. అవిద్య యనఁగాఁ బ్రకృతివిశిష్టులగు త్రిమూర్తులు లోనగువారి నుపాసించుపద్ధతి యని భావము.

"విద్యాముపాసతే" అనఁగాఁ బ్రకృతివిశిష్టుఁడగుభగవంతుని నని యర్థము. ప్రకృత్యతీతుననికదా యర్థమని కొందఱార్భటింతురు. ప్రకృత్యతీతు నుపాసించు టెట్లు? రూపకల్పనమున నని సమాధానము చెప్పుదురేని యదియే ప్రకృతివిశిష్టరూప మందుము. ఉపాసించుట యంతయు దానివఱకే. అరూపము నుపాసింప నవకాశమే లేదని యెఱింగి బాగుపడవలయును.

"ఆదిత్యస్సహ చంద్రేణ యథా భూతధరాం శుభాం
బోధయత్యద్య పృథివీం తథా త్వాం బోధయామ్యహం." ౫౦

అన్న మూలమున విశేషమేమి? ఆదిత్యశబ్దము భగవత్పరము. చంద్రశబ్దము ప్రకృతిపరము. చంద్రశబ్దము ఆహ్లాదమును దెలుపును. ఆహ్లాదము రూపదర్శనజనితము. రంజింపఁజేయునదియే ప్రకృతి. తేజస్స్వరూపుఁడే భగవంతుఁడు. తేజస్సు నొక వ్యక్తిగా మార్చునదియే భగవదిచ్ఛయగు ప్రకృతి. అనఁగాఁ బ్రకృతిపూరుషులు సీతారాములుగా నవతరించిరి. కావున సకలభూతముల ధరించిన శుభముల నొసఁగుపృథివి నుద్ధరింపఁ బయనము చేయింపుమని బోధించుచున్నాఁడను. ఈయర్థము సుమంత్రుఁడు తెలిసి యనకయున్నను ధోరణిం బట్టి గ్రహింపవలయు.

"గతా భగవతీ రాత్రిః కృతం కృత్యమిదం తవ,
బుద్ధ్యస్వ నృపశార్దూల కురు కార్యమనంతరం." ౫౩

అని మూలమునఁ గలవిశేషము పరికింతము.

"ఇదం తవ యత్కృత్యమస్మాభిః కృతం తత్ బుద్ధ్యస్వ అనంతరం కార్యం కురు."

నీవు చేయఁదగుపని మేము చేసితిమని యెఱింగి తరువాతిపని ననఁగా మేము చేయఁజాలని రామగమనకార్యమును నీవొనరింపుమని సారము. భావిఫలములను గాలము తెలుపునని మనము గ్రహింపవలయును. "భగవతీ రాత్రిర్గతా" అని రాత్రిస్తుతి.

"సర్వానందకరరామాభిషేకమహోత్సవోపయుక్తత్వాద్రాత్రిర్భగవతీతి స్తూయతే"

అని గోవిందరాజులు వ్రాసిరి. దీనిని విమర్శింపఁబని లేదు.

"ధూమోరాత్రిస్తథా కృష్ణష్షణ్మాసా దక్షిణాయనం,
తత్ర చాంద్రమసం జ్యోతిర్యోగీ ప్రాప్య నివర్తతే." ౨౫
"శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతశ్శాశ్వతే మతే,
ఏకయా యాత్యనావృత్తిమన్యయా వర్తతే పునః." ౨౬

(గీత. ౮. అధ్యా.)

"ధూమోరాత్రిః ధూమాభిమానినీ రాత్ర్యభిమానినీ చ దేవతా. తథా కృష్ణః కృష్ణపక్షదేవతా. షణ్మాసా దక్షిణాయనమితి చ పూర్వవద్దేవతైవ. తత్ర చంద్రమసి భవం చాంద్రమసం జ్యోతిః ఫలం ఇష్టాదికారీ యోగీ కర్మీ ప్రాప్య భుక్త్వా తత్క్షయాదిహ పునః నివర్తతే. శుక్లకృష్ణే శుక్లా చ కృష్ణా చ శుక్లకృష్ణే జ్ఞానప్రకాశకత్వాచ్ఛుక్లా. తదభావాత్ కృష్ణా. ఏతే శుక్లకృష్ణే హి గతీ జగతః ఇత్యధికృతానాం జ్ఞానకర్మణోః న జగతః సర్వస్యైవ ఏతే గతీ సంభవతః. శాశ్వతే నిత్యే సంసారస్య నిత్యత్వాత్ మతే అభిప్రేతే తత్రైకయా శుక్లయా యాత్యనావృత్తిం అన్యయా ఇతరయా ఆవర్తతే పునః భూయః."

(శంకరభాష్యము.)

ఈవిషయమున నితరభాష్యములకుంగూడ మిక్కిలి భేదాభిప్రాయము గలుగ నవకాశమే లేదు.

భగవతి యనఁగా షడ్గుణైశ్వర్యసంపన్నురాలని యర్థము. భగవంతుఁడన్న నదియే యర్థము. లింగభేదమే కాని యర్థభేదము లేదు. 'భగవతీ రాత్రిర్గతా' అనఁగా రాత్ర్యభిమానదేవతయు భగవతియు నగుమహాప్రకృతి సీత గతా=కార్యము నిర్వహింపఁబోయెను. అనఁగా సర్వకార్యములు తాను నిర్వహించుచు భగవంతునినామమాత్రము కారణభూతునిగా నునుచుకొనునదియే మహాప్రకృతి. ప్రకృతవిషయమున భూతలమున నవతరించినజానకి యని యర్థము. ఆమె ముందే పోయినది ఆమహాప్రకృతిసంకల్పము నీవొనరింపఁదగుకార్యమునకు ముందే దండకారణ్యములకుం బోయినదని భావము. ఆమె సంకల్పానుసారము మంత్రులు చేయఁదగుకార్య మొనరించిరి. కైకయుఁ దనపనిని దాను జక్కఁగా నిర్వహించెను. బుధ్యస్వ నృపశార్దూల = రాజేంద్రా! ఈవిషయ మెఱుంగుము. ఇఁక మేలుకొనుము. అనఁగా నేను నిమిత్తమాత్రుఁడనని తెలిసికొని జాగరూకుఁడవు కమ్మని భావము. కురు కార్యమనంతరమ్=అంతరము లేనిపని నొనరింపుము. ఆలసింపక నీవు చేయవలసిన కార్యము ననఁగా 'శ్రీరామచంద్రా! యడవులకుఁబొమ్ము.' అను మాటను బలుకుమని భావము. అవకాశ మిఁక లేదు. త్వరపడుమనియే సారము. ఇందు రాముఁడే చంద్రుఁడు. ఆజ్యోతియే రాత్రిప్రకాశకము. అనఁగాఁ బ్రకృత్యుద్బోధకము. భగవత్సాన్నిధ్యమే ప్రకృతికిం గావలయును. అనఁగా భగవంతుఁడు సంకల్పించినంతనే ప్రకృతి సర్వకార్యముల నొనరించునని భావము.

రాజా! పరమేశ్వరి మహామాయ సీత దుష్టసంహారము నకు సంకల్పించెను. యోగిధ్యేయమగు శ్రీరామచంద్రుని చల్లని తేజస్సు సాయపడును. ఆసంకల్ప మప్రతిహతము. ఫలిం పకమానదు. మాపనులను మేము నిర్వహించితిమి. కైకయుఁ దనపనిని దా నిర్వహించెను. ఇఁకఁ దెలిసినొంది నీకార్య మాల సింపక నిర్వహింపుము. లెమ్ము. అనునదియే యీశ్లోకసారము. ఈవిషయమును గ్రహించుటంజేసి దశరథాదులు నిమిత్త మాత్రమేగాని దైవసంకల్ప మప్రతిహతముగా సాగుననియుఁ, గర్మగతుల నెఱుంగఁదరము కాదనియుఁ, గర్మానుసారమే భగ వంతుఁడు సంకల్పించుననియు, నాసంకల్పమును మహామాయ నిర్వహించుననియు, నీసిద్ధాంత మెఱింగినంగాని మతభేదములు దేవతాంతరదూషణములు తొలంగవనియు మన మెఱుంగవల యును. సమదర్శిత్వముకదా ప్రధానమని భగవంతుఁడు శ్రీ కృష్ణమూర్తి బోధించెను. సమబుద్ధి దేవతలయందుండుటయే భగవంతునిశక్తి నెఱుంగుట అదిద్దైన లేనివారికి మానవుల యందు సమభావ మెట్లు గలుగును? అది లేనివారికి భగవదను గ్రహ మెట్లు కలుగును?

"విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ పండితాస్సమదర్శినః."

అనికదా భగవదుపదేశము. దేవతలయందే సమత్వముగనలేని వారికీభావ మేలాగు కలుగును? కలుగకున్న నిష్ఫలముగదా. కాఁబట్టి యిట్టిఘట్టములయం దిట్టియభిప్రాయములను జక్కఁగా భావింపవలయును. దుర్మతాభిమానముచేత భేదబుద్ధిని వృద్ధిచేసి కొనరాదు. అది మంచిమార్గము కాదు.

"ఇతి తస్య వచశ్శ్రుత్వా సాంత్వపూర్వమివార్థవత్,
అభ్యకీర్యత శోకేన భూయ ఏవ మహీపతిః." ౫౮

అని మూలము. పైనవ్రాసినయర్థము నీమూలము సూచించుచున్నది. సాంత్వపూర్వమ్ = సామవచనప్రధానమై, అర్థవదివ = గూఢార్థముగలదివలెనున్న, తస్య వచశ్శ్రుత్వా=ఆసుమంత్రుని మాట నాలకించి రాజు శోకించెను. అనఁగా సుమంత్రునిమాటలలో గూఢార్థమిమిడియుండెనని తేలెడింగదా.

"వాక్యైస్తు ఖలు మర్మాణి భూయ ఏవ నికృంతసి." ౫౯

అని దశరథుఁడు పలికెను. సుమంత్రా! మాటలచేతనే మరల నామర్మముల ఛేదించుచున్నాఁడవు? మరల ననుటచే నీవఱకే యవి తెగినవని యర్థము. విప్రశాపము కైక వరములడుగుట యనువానిచేతనే నామర్మములు తెగియున్నవి. మరల నన్ను మహారాజా! యని రాజేంద్రా! యని యేల స్తుతించుచున్నాఁడవని భావము..ఇఁక నావలన నేకార్యము సాగదని తాత్పర్యము. "మర్మాణి భూయ ఏవ నికృంతసి" వయోధర్మమును గర్మము ననుసరించి మర్మములు తమయంతన తామే వ్యాపారముల మానుకొనుచున్నవి. నీవేల మరల వానిని ద్రెంచుచున్నాఁడవనుట గ్రహింపఁదగువిషయము.

"తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధం,
మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్." 33
(గీ. ౧౧. అ.)

అను శ్రీకృష్ణోక్తి యిట స్మరింపఁదగును. ప్రాణికోటులు స్వస్వకర్మములచేతనే సత్ఫలదుష్ఫలముల ననుభవింతురు. ఇతరులు కారకు లనఁబడుట కర్మసిద్ధాంతము నెఱుంగకపోవుటచేతనే

యని యూహింపవలయును. ఈసిద్ధాంతమును మనము చక్కఁ గాఁ దెలిసికొనిన నితరుల నాక్షేపింప రాదనుట స్పష్టమగును. కర్మగతులఁ జక్కఁగా నెఱుంగవలయును. లేకున్న నవకతవక సిద్ధాంతములు తోఁచుచుండును. వానిమూలముననే మత సిద్ధాంతములు తాఱుమాఱగుచుండును. కర్మమార్గముల తెఱంగు పరిశీలింపవలయును.

"తదా సుమంత్రం మంత్రజ్ఞా కైకేయీ ప్రత్యువాచ హ"

అనిమూలము. మంత్రజ్ఞా=ఆలోచనము నెఱింగినదని సామా న్యార్థము. కర్మమార్గము నెఱింగినదని భావము.

"కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్"

అన్నగీతావాక్యము ననుసరించి మంత్రమనఁగాఁ గర్మమని యర్థము గ్రహింపవలయును. వేదజనితమునకదా కర్మము. కర్మము తనకెట్టిబుద్ధి పుట్టించెనో యద్దానితత్త్వము నెఱింగిన దనియే సారము. అనఁగాఁ గర్మము కైకను బుఱికొల్పఁగా దానికి లోఁబడి పలుకుచున్న దేకాని స్వతంత్రురాలు గాదని మన మెఱుంగఁదగువిషయము. సత్యపాశబద్ధుఁడు దశరథుఁడు; కర్మపాశబద్ధురాలు కైక. వీరిమార్గముల నరయునది మహా మాయ సీత. సాక్షిమాత్రుఁడు భగవంతుఁడు రాముఁడు. ఈ విషయము నెఱుంగఁజాలనివారు నగరవాసులు. ఇంతకంటెఁ జమత్కార మేమికావలయును? ఎఱుంగక పరితపించువారు కొందఱు. ఎఱింగియు నెఱుంగనట్టు లుండువారు కొందఱున్న వారు. వీరియందఱచరిత్రములను జదివి మనము కొంతసేపానం దించుచుఁ గొంతకాలము వగచుచున్నవారము.

"సుమంత్ర రాజా రజనీం రామహర్ష సముత్సుకః
ప్రజాగరపరిశ్రాంతో నిద్రావశము పేయివాన్.
తద్గచ్ఛ త్వరితం సూత రాజపుత్రం యశస్వినం
రామమానయ భద్రం తే నాత్ర కార్యా విచారణా." 63

అని మూలము. "రంజంతి కామినోఽత్ర రజనీ" కాముకు లిందు ననురాగవంతులగుదురు. ఇది సామాన్యార్థము. 'రంజంతి యోగినోఽత్ర రజని' యోగు లిందుపాస్యదేవతయందు నత్యంత ప్రీతి (భక్తి) గలవార లగుదురు. యోగాభ్యాసమునకు రాత్రి ముఖ్యము. నిశ్శబ్దముగనుండు కాలము యోగులకు మిగుల మంచిది. అక్కాలమున మనస్సు నిర్వ్యాపారస్థితిం గాంచును. నివాతదీపనిష్కంపముగ మనస్సుండు కాలమే ధ్యానమునకుఁ బ్రశస్తము. ప్రజారంజనతత్పరుఁడగుట దశరథుఁడు రాత్రి యందు రామహర్షసముత్సుకుఁడై నిదురింపక యలసియున్నాఁడు. కాన నిపుడు నిదురించుచున్నవాఁడు. అని సామాన్యార్థము. 'నియతం ద్రాంతీంద్రియాణ్యత్రేతినిద్రా' ఇంద్రియము లీ యవస్థయందు నియతముగాఁ దమతమవ్యాపారముల మాను కొనును.

"నింద్యతేఽనయానిద్రా. నిది కుత్సితాయామ్. మేధ్యామనస్సంయోగః ఇతి జగదీశః "సుషుప్త్యవస్థాస్వప్నావస్థా" ఇతి చండీటీకాయాం నాగభట్టః"

(పరిశుద్ధమనస్సంయోగము లేని యవస్థ.) శబ్దకల్పద్రుమము. చక్కనిమనస్సు దశరథునకు లేదని భావము. రామునకుఁ బట్టాభిషేక మొనరించి హర్షింపవలయునని యున్నవాఁడే కాని యింతకంటె మిక్కిలి యానందకార్యము కలదని యెఱుంగఁడని తాత్పర్యము. దశరథునిమనస్సు చక్కనిస్థితియం దిపుడు లేదని

కైకభావము. కనుకఁ ద్వరితముగఁ బోయి యశస్వియగు రాజ
పుత్త్రునిం దోడ్కొనిరమ్మని కైక పలికెను. వాల్మీకి మహాకవి
యగుట "యశస్వినమ్" అనువిశేషణమును బ్రయోగించెను.
"యాతి దేశాంతరమితి యశః" అయోధ్యనుమాని దేశాంతర
మున కరుగు రాజపుత్త్రుని రాముని దోడితెమ్మని వాక్యహృద
యము. "రామమానయ" అనఁగా రామమూర్తి నిటఁ జేర్పు
ము. "భద్రంతే" నీకు మేలు. ఆలసింపకుము. అని కైక పలి
కెను. సుమంత్రా! నీవు సారథివి. త్వరగా రామచంద్రుని బిలుచు
కొనిరమ్ము. జగత్కల్యాణకర కార్యమునకుఁ దోడుపడు నీకు
మంగళములు గలుగుననుట నిస్సంశయము. ఆలోచింపకుము.
పొమ్ము. అనువిశేషార్థమును గ్రహింపవలయును. పదముల
కూర్పు విశేషార్థమును బోధించును. లేకున్న "యశస్వినమ్
భద్రం తే" అనుపదములు వ్యర్థములగును. కైక కింతజ్ఞానము
కలదా యని ప్రశ్నింపవచ్చును. ఇంతటి తెలివి లేకున్నను గర్మ
వశమున మాటలు దొరలవచ్చును. ఈమాట నంగీకరింపనివా
రుండరు. కావున రామాయణమునందు విశేషించి కర్మసిద్ధాం
తమే ప్రతిపాదింపఁబడినది. "ప్రపత్తి, శరణాగతి" అనునవియే
ప్రధానములు కావు. ప్రప్రధానము కర్మసిద్ధాంతము. భగవ
చ్చరిత్రమునందెల్ల శరణ్యుఁడు భగవంతుఁడన్న భావమిమిడియే
యుండును. అది రామాయణమే ప్రధానముగాఁ దెలుపునని
యననేల? కర్మసిద్ధాంత మట్లుకదా యందురేమో. విశేషించి
శ్రీరామమూర్తి యేవిషయమును బోధించువాఁడు కాఁడు. తా
నాచరించి యితరుల కుదాహరణభూతుఁ డగును. ఆచరణము

సత్కార్యసిద్ధాంతము ననుసరించియే యుండును. కావున మనము చక్కనికర్మమార్గము నెఱుంగవలయును.

మహాశయులారా! ఈరీతిగా నీభాగము భగవదవతార ప్రయోజనమును బోధించుచుఁ, గర్మమార్గ మగమ్యమని తెలుపుచు, నెన్ని యోనీతులఁ దేటపఱచును. రామాయణమును బఠించుటచేతఁ దృప్తిచెందక యేయేవ్యక్తి యెట్లెట్లు శ్రీరామకార్యమునకుఁ దోడ్పడెననియుఁ, గర్మము లెన్నిరీతుల మానవులచేఁ గార్యములు చేయించునో యనియు నెఱుంగవలయును. దాన మనకెంతో లాభము చేకూరును. మనోగర్వము నశించును. వినయము పొడుకొనును. భక్తి నెలకొనును. లోకమున నెట్లు ప్రవర్తించిన నితరులకు మార్గదర్శకుల మగుదు మనువిషయము స్ఫురించును. మనుష్యప్రయత్నము దైవసహాయము లేక ఫలింపదన్నసిద్ధాంతము దృఢపడును. మఱియు జాల్ములగువారియుపదేశములు వ్యర్థములనుట తేటపడును. కావున రామాయణమునఁగల మహార్థమును జక్కఁగా విమర్శించి తెలిసికొనవలయును. ఇఁకఁ దరువాతికథను బరిశీలింతము.

## పట్టాభిషేకోత్సవవర్ణనము.

*వేదములఁ జదివినబ్రాహ్మణులెల్లరు తెల్లవాఱఁగనే వసిష్ఠునింగూడి సభ కేతెంచిరి. మంత్రులు, పౌరులు, జానపదులును వేడుకమెయి వారిని గలిసికొనిరి. శ్రీరాముని జన్మలగ్నమగు కర్కాటకము రాఁగాఁ బుష్యనక్షత్రమున నభిషేకింప

*ఇది పదునైదవ సర్గమునుండి గ్రహింపఁబడినది. అధ్యాత్మరామాయణకథాసార మిందుఁ గలదని యెఱుంగవలయును.

వలయునని వలయుపరికరములం గూర్చుకొనియుండిరి. బంగారు కలశములనిండఁ బావననదీజలముల నింపి రాజయోగ్యపీఠము లోనగువస్తువుల నాయత్తముచేసి ముహూర్తమునకు వేచి యుండిరి. పావననదీహ్రదప్రముఖస్థలములనుండి జలము తేఁబడి యెను. తూర్పుదిక్కుగాఁ బ్రవహించు గంగాగౌతమీప్రముఖ నదులనుండియు, నూర్ధ్వముగాఁ బ్రవహించుబ్రహ్మావర్తరుద్రా వర్తప్రముఖసరిద్వరములనుండియు, దక్షిణోత్తరముఖములుగా నడ్డముగాఁ బాఱుచుండు గండకీ శోణభద్రాదినదులనుండియుఁ బ్రవహింపకయుండు పావనసరస్సులనుండియు, సమస్తసాగర ములనుండియు జలములు తెప్పింపఁబడియెను. రావియాకులు కప్పి, పేలాలు చల్లి, పద్మములు లోనగుపుష్పములఁ గై సేసి జల ములనిండియుండు బంగరువెండికలశములు సొంపారుచుండెను. తేనె మొదలగువస్తువులు సిద్ధముగ నుండెను. సకలవిధాలంకా రముల నలరారువేశ్యలు సభనుండిరి. శ్వేతచ్ఛత్రచామరములు సిద్ధముచేయఁబడియుండెను. శ్వేతవర్ణముగలవృషభము హాయ గజములు సిద్ధముగ నుండెను. మంగళార్థము నియమింపఁబడి యలంకృతగాత్రలగుకన్యలెనమండ్రు సభయందుఁ గాచుకొని యుండిరి. అవి యివి యననేల? అభిషేకార్థ మఖిలవస్తువులు సంసిద్ధముచేయఁబడియే యుండెను.

జనులందఱు గుంపులుగూడి రాజేంద్రుఁ డంతఃపురము నుండి వెడలిరాలేదనుకొనుచుఁ దమరాకను బ్రభుమణికిఁ దెలు పువా రెవ్వరో యని కాచియుండిరి. అంతలో సుమంత్రుఁ డరుదెంచి యందుఁగలరాజులం గని రాజాజ్ఞచే శ్రీరామ చంద్రుని బిలుచుకొనిరాఁబోవుచున్నాఁడను. పూజ్యులరగు

మీమాటలుగా రాజుతో సుఖప్రశ్నముచేసి మీరాక నెఱిం గింతునని పలికి రాజాంతఃపురమునకుంబోయి శయనగృహంబు కడ నిలిచి జవనికకీవల నిలుచుండి మంగళాచారయుక్తముగా మేలుకొలిపి రాత్రి గడచెను. చేయఁదగుపనులు చేసితిమి. మేలు కని మీరొనర్పఁదగుపనులనొనరింపుఁడని విన్నవించెను. మహా రాజా! బ్రాహ్మణోత్తములు లోనగువారు మీదర్శనమును గోరు చున్నారు. కనుక మేలుకొనుఁడు. అని వినుతించెను.

దశరథుఁడు మేలుకని తన్ను వినుతించు సుమంత్రుని గాంచెను. అంతలోఁ గైక సుమంత్రా! రాముని దోడ్కొని రమ్ము. అని యాజ్ఞాపించెను. ఆమాటకు నేనంగీకరించితిని. కాన నదియు నాయానతియే. దాని నుల్లంఘింపరాదు. అది నాయా నతియా కాదా యని సంశయింతువా? నా కిపుడు నిద్ర లేదు. కాన రామునిం దోడ్కొనిరమ్మని మరల రాజు సుమంత్రున కాజ్ఞాపించెను. రాజాజ్ఞను విని యతనికి నమస్కరించి యిఁక రామాభిషేకము తప్పక సాగునని తనలో ననుకొనుచు రాజ గృహమును వెడలి నిష్కపటచిత్తుఁడు కావున మోసమే మోకల దని యూహింపకపోయెను. మార్గమున జనులనుకొను శుభ వాక్కుల కానందించెను. అంత శ్వేతవర్ణమున నలరు రామ చంద్రునిసౌధమును జూచెను. ఆసౌధకవాటములు విశాల ములు. వానికడ వేదికలు శతసంఖ్య వెలయుచుండెను. అందందు బంగరుబొమ్మలుండుశిఖరములు సొంపుగ నుండెను. బహిర్ద్వా రము మణిచిత్రితము. శరత్కాలచంద్రికంబోలి దానికాంతి తగియుండెను. మేరుకందరమువలెఁ గంభీరమై పూలదండలు వ్రేలాడుచుండఁగా నెంతయో వింతగ నది యుండెను. సువాస

నలుగలధూపములు వేయఁబడుచుండెను. పక్షులశుభరవములు వినఁబడుచుండెను. గోడలయందు మృగములయాకృతులు చిత్రింపఁబడియుండెను. శిల్పచాతుర్యము మెచ్చఁదగి కుబేర నిర్జరేంద్రులభవనరాజములఁ దిరస్కరించుచుండెను.

ఆసౌధము దానిచెంత జనులు గుంపులుగా నుండిరి. జానపదులు మహోత్సాహములతోఁ గానికలంబట్టుకొనియుండిరి. ఆ గృహావర్యమున గుజ్జువాండ్రు, స్వల్పదేహులు మెండుగ నుండిరి. దానిం దిలకించి సుమంత్రుఁడు రథము దానిచెంతకుం బోనిచ్చి జనుల నానందింపఁజేసెను. దానిం బ్రవేశించి యందు వినోదముం గలిగించుమృగపక్షులం గాంచుచు గగుర్పాటొంది కక్ష్యాంతరము దాఁటి రామచంద్రప్రియజనులం గాంచుచు లోపలికిం బోయెను. అందుఁగలవారు చెప్పుకొనుశుభతమ వాక్కులకు మిక్కిలి యానందించెను. అందును శ్రీరామమూర్తి యుండుభాగమును గని సంకులముగానున్న జనులంజూచుచు శత్రుంజయనామక దంతావళేంద్రమును గని సేవార్థ మరుదెంచినరాజులం గడచి లోపలఁ బ్రవేశించెను. ఆతని నెవ్వరు నడ్డునట్టి యాచారములేదు. కావున సించుకయు నాలస్యములేక లోనఁ జొచ్చెను.

మహాశయులారా! ఈభాగము చదువునపుడు పాఠకులకుఁ గొన్నిసందేహములు తోఁచును. పూర్వసర్గమున సుమంత్రుఁడు దశరథు నానతింగొని రాముని దోడ్కొనిరాఁబోయె నని యున్నది. మరల నిందుఁగూడ నాయర్థమే కొంత గలదు. ఏల? అని సంశయము కలుగును. అభిషేకసంభారములవిషయము మున్ను వర్ణింపఁబడలేదు. విశేషించి యావిషయమే

యుండఁగలదు. పూర్వసర్గమున నిదియు నంతర్భూతము కాఁద గును. ఇట్లు విషయమును వర్ణించుట ప్రాచీనులయాచారము. కానఁ గథాభాగమున కిది బాధకము కాదు. ఇందు విమర్శించి గ్రహింపఁదగిన క్రొత్తవిషయములు లేవు. ఒకటి రెండువిషయ ములఁ బరికింతము.

"వేశ్యాశ్చైవ శుభాచారాస్సర్వాభరణభూషితాః"

అను నీమూలము మున్ను వ్రాసిన నాయాశయమును సిద్ధాం తమే చేయుచున్నది. "శుభాచారాః అంజనస్రగలంకరణాది మంగళవేషయుక్తాః" అని గోవిందరాజులు వ్రాసిరి. 'సర్వాభరణ భూషితాః' అనుపదము వ్యర్థ మనవలయు. సదాచారముగల వారని యర్థము చెప్పవలయు. అపుడే వేశ్యలను బిలుపించుట మహర్షి కార్యములయందుఁ జక్కనిదిగా నిదియొకటి యన వచ్చును. నియతవ్రతలగువా రాకాలమునఁ గలరని వ్రాసిన నా వ్రాఁతఁ దిలకింపుఁడు.

"రామమానయ సూతేతి యదస్యభిహితోఽనయా,
కిమిదం కారణం యేన మమాజ్ఞా ప్రతిహన్యతే. ౨౬
న చైవ సంప్రసుప్తోఽహమానయేహాశు రాఘవం,
ఇతి రాజా దశరథస్సూతం తత్రాన్వశాత్పునః." ౨౭

అని మూలము. ఈవిషయము తెల్పుటకే యీసర్గ మారంభింపఁ బడినదనవచ్చును. పూర్వసర్గమునఁ గైకయే యాజ్ఞాపించినట్లు న్నది. ఆయానతికి సుమంత్రుఁ డించుక సంశయించినట్లు రాజు సంశయింపకుము. కైకయాజ్ఞయు నాయాజ్ఞయే యనుకొను మని రాజు పలికినట్లు మన మూహింప నీభాగ మవకాశమిచ్చు చున్నది. నేను నిద్రురింపలేదని రాజు పలికెను. ఇందుఁ గ్రహింపఁ దగినదేది?

కైకపట్టుదలకు రాజు లోఁబడెను. ఎన్నివిధములనో యామెచిత్తమును మార్పఁజూచెను. కాని యది మార్పునొందదయ్యెను. సత్యపాశబద్ధుఁడయ్యెను. రాము నడవులకుం బంపక తప్పదనియే తీర్మానించుకొనెను. సుమంత్రుఁడు కైక చెప్పుచున్నదే యని యనుమానించెను. ఆసంశయము రాజే తొలఁగించెను. కానఁ గైకవాక్యములు ధర్మయుక్తములే యని యంగీకరించెననియే యనవలయు. కాని రామచంద్రవియోగముమాత్ర మాదశరథునకు మహార్తిని గలిగించుచుండెను. సత్యము తప్పఁజాలక రాము నెడఁబాయఁజాలక తొట్రుపడుచుండెను. రామదర్శనమునఁ గైకచిత్తము మారునేమో యని రాజూహించియే రాముని దోడ్కొనిరమ్మని సుమంత్రునకుఁ దెలిపెనని కొందఱందురు. ఆయూహ కవకాశము కల్గించు భాగము రామాయణమునఁ గానరాదు. ఆవిషయమును రాజీవఱకే కైకకుఁ దెలిపెను. కాని యామె యంగీకరించినది కాదు. అవ్వల నిరాశుఁడయ్యెను. ఏది యెట్లున్నను రాజు సత్యముతప్పరాదనునూహ కలవాఁడయ్యెననుట నిస్సంశయము.

"మహేంద్రధామప్రతిమం నానాపక్షిసమాకులం"

అని మూలము. ఇది శ్రీరామచంద్రగృహవర్ణనమునఁ గలదు. నానావిధములగుపక్షులు గలవనికదా దీనియర్థము. కొందఱు పక్షులఁ బెంచరాదనియు, వాని నిర్బంధించినట్లగునుగాన మహాపాపమనియు, నట్లు పెంచినవారు పైజన్మమునఁ గారాగారమునఁ బడుదురనియుఁ బలుకుదురు. సామాన్యముగ నిర్బంధించుట పాపకార్యమే యనవలయును. కాని రాజగృహములయందుఁ బక్షులఁ బెంచుట ప్రాచీనాచారముగ నున్నయట్లు వినఁబడి

యెడిని. మహాకవివాల్మీకి శ్రీరామగృహవర్ణనమున నీవిషయము పేర్కొనెను. దీనింబట్టి యూహింపఁగాఁ బక్షులఁ బెంచుట పాపకార్యము కాదని తేలెడిని. పంజరములలో నునిచి తిరుగు నవకాశము లేకయుండఁజేయుట పాపహేతువనఁదగు. రాజ హర్మ్యముల నట్లుగాదు. అంతఃపురము చెంత నొకగృహముం డును. అందు వివిధజాతులపక్షు లుండును. కొన్ని తిరిగితిరిగి మరల వచ్చునవియు నుండును. చిలుకలు వదలిన మరల రావు. అట్టివాని నాగృహమున నొకభాగమున వదలుదురు. తంత్రీ బద్ధమగుట నందుండి పోవఁజాలవు. అవి తిరుగఁ జొట్టుండును. విశాలగృహముగాని యది యల్పగృహము కాదు. వానికి నాహారాదులు కాలానుసారముగా నీయఁబడుచుండును. వాని రుతములు (పలుకులు) శ్రుతిహితములు. మనోరోగములు కొన్ని తొలఁగును. పక్షులపక్షముల కదలికంగలుగుగాలి పక్ష ఘాతాదిరోగముల నడంచునని ప్రాచీనులందురు. కావునఁ బక్షులఁ జక్కఁగా రామచంద్రునిసౌధమునఁ బోషించుచుండి రని మన మెఱుంగవలయును. సామాన్యజను లనుకొనునట్లు పక్షుల రక్షించుట పాపహేతువు కాదని యీవచనము ననుస రించి యూహింపవచ్చును. విశేషించి విమర్శింపఁదగువిషయము లిందుఁ గలుగమి శ్రీరామునననంతరచరిత్రమును బఠింతము.

## శ్రీరాముఁడు దశరథునికడ కరుగుట.

* సుమంత్రుఁడు జనులు నిండియుండు తొలికక్ష్య దాఁటి యంత జనసమ్మర్దములేని రెండవకక్ష్యకుం బోయెను. అందు

---

*ఇది పదునాఱవ సర్గమునఁ గలదు. అధ్యాత్మరామాయణకథయం నిం దిమిడియే యుండును.

ధనుర్ధారులగు వయసుకాండ్రుండిరి. వివిధాయుధములధరించిన యోధులు నుండిరి. వారెల్లరు కుండలములఁదాల్చి సకలాభరణ భూషితులై రామునియందు విశేషించి ప్రీతిగలవారలై యుండిరి. అచ్చట శ్రీరామచంద్రునకు సంతోషముకలిగింప నలంకారార్థము కావిదోవతులంగట్టుకొని చక్కఁగా నలంక రించుకొని యంతఃపురచారిణుల కధిపతులై ద్వారపాలకులై ముదుసలులగు వేత్రహస్తు లుండిరి. వారు సుమంత్రుని గాంచి రామునకుఁ బ్రియముచేయఁగోరువారు కావునఁ ద్వరపడి తమ యాసనములనుండి లేచి గౌరవించిరి. రాజమర్యాదల నెఱింగిన వాఁడు కావున సుమంత్రుఁ డడ్డులేకయే లోనికింబోవఁగల వాఁడయ్యు ద్వారపాలకులం గాంచి నారాక నెఱిఁగించి దర్శన మునకుఁ గాచియున్నానని తెల్పుఁడని పలికెను. వారట్లే యని శ్రీరామునకు సారథిరాక నెఱింగించిరి.

సుమంత్రుఁడు తండ్రి కంతరంగభూతుఁడని రామ మూర్తి యెఱుంగును. కాన సీతంగూడి తానున్న యంతరంగ స్థలమునకే రప్పించెను. రక్తచందనచర్చ యలరారఁగాఁ గుబే రునివలె మెఱయుచు శత్రువుల రూపుమాపుపరాక్రమము విలసిల్లఁగా సువర్ణపర్యంకమునందుఁ గూరుచుండి రామమూర్తి కన్నులపండువు చేయుచుండెను. జానకి పార్శ్వమున నిలిచి చామరముగైకొని వీచుచుండెను. జానకీరామచంద్రులు చిత్రానక్షత్రయుత శీతాంశునిం బోలి ప్రకాశించుచుండిరి. వారిం గాంచి సుమంత్రుఁడు వినయజ్ఞుఁడు స్తుతిపాఠకుఁడు నౌటఁ దనుకాంతిచే భాస్కరునివలెఁ గనంబడు సీతాప్రాణ నాయకు నట్టెచూచి సాష్టాంగనమస్కారము చేసెను. దశర

థుఁడు తానెప్పుడే నేకాంతమున నున్నపుడుగాని శయన గృహమున నున్నపుడుగాని కూరుచున్నపుడుగాని సుమంత్రుని గారమునఁ జెంతనుండనిచ్చువాఁడు. అట్టియాంతరంగికసేవకుఁడు గాన నామంత్రి రామమూర్తితో "విహారశయ్యాసనములయందు సుఖమేకదా" అని కుశలప్రశ్నము గావించి మఱియు నిట్లు ప్రశ్నించెను.

కౌసల్యాసుపుత్త్రరత్నమా! నిన్నుఁ గుమారునిగాఁ బడసి కౌసల్య సత్పుత్రవతియయ్యెను. ఇపుడు కైకయు దశరథుఁడు నిన్నుఁ జూడఁగోరుచున్నవారు. అచ్చటికి దయచేయఁదగు జాగు చేయవలదని విన్నవించెను. ఆమాటల నాలకించి తేజంబు పెంపున నుల్లసిల్లు నారామమూర్తి సారథిం గారవించి ప్రియపత్నిం దిలకించి దేవీ! తల్లిదండ్రులు నావిషయమునఁ బట్టాభిషేకమును గూర్చి యేమో యాలోచించుచున్నవారు. నిశ్చయము. కైక నాప్రియమును గోరునది. మిక్కిలి సమర్థురాలు. కనుక రాజు వృద్ధువగుటం జేసి భరతాగమనమువఱకు నీయుత్సవము నాపరాదని యెంచి నానిమిత్తము రాజేంద్రుని బ్రోత్సహించుచున్నది. ఆమెకు నాపై మిక్కిలి ప్రీతికలదు. రాజు ననువర్తించుచుండును. లోకమునకు మేలే కోరునది. కావున నీమహోత్సవము సాగింపఁగోరియే రాజును బ్రోత్సహించుచున్నదని నాతలంపు. తండ్రి ప్రేయసియగు కైకంగూడి నామేలే ముఖ్యముగాఁ గోరునట్టి సుమంత్రుని నాకడకుం బంపినాఁడు. ఇది భాగ్యవిశేషము కదా. అందెట్టిసభ చేరినదో అట్టిదూతయే వచ్చినాఁడు. నాహితమునే గోరువా రందుఁ జేరినారు కాన నట్టిదూతనే పంపినారు చుమీ. ఇప్పుడే నాకుఁ బట్టాభిషేకము రాజు చేయంగలఁ డనుట

నిజము. సంతోషింపదగువిషయ మిది. నేనిప్పుడే పోయి కైకను రాజును దర్శింతును. నేను జెంతనుండనని చింతింపకుము. పరిజనులున్నవారు. వారితో సంతోషముగ నుండుము. ఏవో వినోదములఁ గాలము వారింగూడి గడపుము.

శ్రీరామచంద్రుఁ డిట్లు ప్రియతమోక్తుల గారవింపఁగా నాకువలయాక్షి ప్రాణనాథునకు నిరంతరమంగళములు కోరుచుండునదిగావున నిట్లుపలికెను. రామచంద్రా! మున్ను బ్రహ్మదేవుఁడు దేవరాజునకు నభిషేకముసాగించినట్లు దశరథమహారాజు రాజసూయయాగమునకు మహారాజవై ముందభిషిక్తుఁడగుచందమున నిత్తరుణమున నీకు యౌవరాజ్యమును బ్రాహ్మణులసాహాయ్యమునఁ దత్ప్రియుక్తవిధానమున నీయఁదగును. అంతట నీవు రాజసూయాధ్వరదీక్షవహింపఁగా వ్రతసంపన్నుఁడవై వరకృష్ణాజినమును దాల్చి జింకకొమ్మును జేఁదాల్చియుండఁగా నేత్రోత్సవముగా నిన్నుం దిలకించుచు నేను సేవింతును.

రామా! తూర్పున నింద్రుఁడు, దక్షిణమున యముఁడు, పడమటిదెస వరుణుఁడు, ఉత్తరదిక్కునఁ గుబేరుఁడు నిన్నురక్షింతురుగాక. అని మంగళకరవాక్యములు పలుకుచు ద్వారముదనుక రాముని వెంబడించెను. అవ్వలఁ బట్టాభిషేకమునకుఁదగినమంగళాచారములఁ గైకొని మఱింత ప్రకాశించుచున్న రామమూర్తి జానికికడఁ బోయిరమ్మనుమాటను దీసికొని సారథింగూడి గిరికందరమునఁ గాఁపురముండుసింహ మాశైలమునుండి పయనము చేయునట్లు గృహావర్యమునుండి వెడలి ద్వారముకడ నంజలింబట్టి వినయముననున్న లక్ష్మణుని గాంచెను. పురుషోత్తముఁడగు రామమూర్తి మధ్యకక్ష్యయందుఁ

ప్రియమిత్రులంగూడి యున్న జనులం గాంచి వారిం జేరంబోయి సాధుభాషణముల నాశ్వాసించి మెఱయుచు వ్యాఘ్రచర్మము పఱవఁబడియున్న రథవర్యము నెక్కెను. ఆరథము మేఘమురీతి శబ్దముగలుగ మణిఖచితమగుట సూర్యునివలె మెఱయుచుండె ను. అయ్యది వేగముగాఁ బోవుచుండఁగా లక్ష్మణుఁ డొకచేత ఛత్రమును మఱొకచేతఁ జామరమును దాల్చి వెనుకనిల్చి సేవించుచుండ రాముఁ డరిగెను. జనులంద ఱొక్కపెట్టున జయజయనినాదములఁ గావించిరి. ఆశ్వికులు గజారూఢులు వీర భటులు వేలకొలఁది రామమూర్తి ననుసరించిపోయిరి. ముందు గా శూరులుకొందఱు పోవుచుండిరి. వాద్యధ్వనులు లోనగు నవి యెల్లతావుల నిండెను. పురంధ్రీమణులు భూషణములఁ దాల్చి జాలమార్గములనుండి రామచంద్రునిపైఁ బూలవర్షముం గురియించిరి. వాని గ్రహించుచు రాముఁ డరిగెను. సర్వాంగ సుందరులగు స్త్రీలు కొందఱు హర్మ్యాగ్రముల నుండియుఁ గొంద ఱందు భూమిపై నుండియు రామునకుఁ బ్రీతింగలిగింపఁగోరి మంగళవాక్కుల నాతనిం గాంచి రామభద్రా! తల్లికి సహజ ముగా సంతోషమును గల్గించువాఁడవు. అట్టి నిన్నిపుడు కౌసల్య గాంచి యానందించుననుట సంశయమా. నీప్రయా ణము సఫలమై పిదపఁ దండ్రిరాజ్యము నొందియున్న నిన్ను జనులు చూడఁగలరు. అని వినుతించిరి. పురంధ్రీమణులు రామునిమనస్సునకు మిక్కిలి ప్రీతింగూర్చుసీతాదేవిని స్త్రీజనం బుల నుత్తమురాలిగా భావించిరి. కాఁబట్టి యామానిను లాజానకింగుఱించి రోహిణీకాంత శీతాంశుని బొందినట్లుగా నీకల్యాణి రామునిం జేపట్టినది. కనుకఁ దొలిజన్మమున భూరి

తపస్సు విధియుతముగాఁ జేసియుండుననుట నిస్సంశయమని స్తుతించిరి. వారిప్రియాలాపముల నాలకించి శ్రీరామభద్రుఁడు సంతోషించుచుఁ బోయెను.

జానపదులును బౌరులును దన్నుంగూర్చి యీ రామమూర్తి రాజానుగ్రహమువలన మహారాజ్యలక్ష్మిని బడయంబోవుచున్నాఁడు. ఇట్టి రామమూర్తి మనకుఁ బరిపాలకుఁడగుట మనవాంఛలు ఫలించును. ఈ శ్రీరాముఁడు చాలకాలము రాజ్యమేలును గాన నదియే మనభాగ్యము. ఏలయన నెవ్వరికైన నీతనిపాలనమున నప్రియముగాని యనిష్టముగాని కలుగదు. అనునిట్టివాక్కుల నాలకించుచు జయజయనాదము లాలకించుచు రామమూర్తి యరిగెను. సకలవిధశృంగారముల విలసిల్లు రాజమార్గము కన్నులపండువు చేయుచుండఁగా దాని నారామభద్రుఁడు చూచెను.

మహాత్ములారా! ఈభాగమున ననేకవిషయములు గ్రహింపఁదగినవి కలవు, పరిశీలింతము.

> "తత్ర కాషాయిణో వృద్ధాన్ వేత్రపాణీన్ స్వలంకృతాన్
> దదర్శ విష్ఠితాన్ ద్వారి స్త్ర్యధ్యక్షాన్ సుసమాహితాన్." 3

అని మూలము. రామచంద్రునంతఃపురద్వారమున నున్నవారి వృత్తాంత మిందుఁ గలదు. ఇందుఁ గలవిశేషార్థమే పరిశీలింపఁదగును. అందుఁగలవారే వచ్చినవారివృత్తాంతమును రామమూర్తికిం దెలుపఁగలవారు. కావున వారు రామభద్రునకుఁ బ్రియసేవకులై యుందురు. భగవంతుని సేవింపఁగోరి యతివేషధారులై అనఁగా రక్తవర్ణము మిక్కిలిగలిగి శ్వేతవర్ణము స్వల్పముగా గలవస్త్రముల ధరించినవారని యర్థము. స్వలంకృతులై

యనఁగా నుపాసనార్థమాలికాధరులై యని యర్థము. సుస మాహితులై యనఁగా స్వాధీనాంతఃకరణులై (జితేంద్రియులని సారము) స్త్ర్యధ్యక్షులై అనఁగా భార్యగలవారలై (అపత్నీకులుగారని భావము) వృద్ధులుండఁగాఁ జూచెనని కథాంశము. వృద్ధులనఁగాఁ దొంబదియైదేండ్లయీడుగలవారలని వ్రాసినది సామాన్యార్థము. ఇచట జ్ఞానులని గ్రహింపవలయు.

"న తేన వృద్ధో భవతి యేనాస్య పలితం శిరః
యో వై యువాప్యధీయానస్తం దేవాస్స్థవిరం విదుః." ౧౫౬
(మను. ౨. అధ్యా.)

అనుమనువాక్యము ననుసరించి యేండ్లుమించినబాలిశులు కారనియు జ్ఞానులనియు భావము.

ఉపాసకుఁడు స్నానము చేసి ధౌతవస్త్రములధరించియలంకారవిశేషములధరించి (దరిద్రుఁడైనచో సర్వార్థాలంకారవంతునిగాఁ దన్ను భావించుకొనవలయునని విధి.) నిర్మలనియతాంతఃకరణుఁడై భార్య చెంతనుండఁగా నుపాస్యదైవతము నారాధింపవలయును ప్రస్తుతము సీతారాములు ప్రకృతిపురుషులు గావున సదారులై జ్ఞానవంతులగువారు ద్వారసీమయందుండి సేవించుచున్న వారని భావము. ఉపాసకులవాఙ్మనస్సులు పరిశుద్ధములుగ నుండవలయును.

"యస్య వాఙ్మనసీ శుద్ధే సమ్యగుప్తే చ సర్వదా
స వై సర్వమవాప్నోతి వేదాంతోపగతం ఫలం." ౧౬౦
(మను. ౨. అధ్యా.)

అను నీస్మృతివాక్యము ననుసరించి వాక్కు మనస్సు ననునీరెండును భావనములుగ నుండవయునని తేలెడిని. అట్టివారే భగ

వత్సేవాఫలము నొందుదురనియు, నవి పరిశుద్ధములుగాక వేష మువూత్రము పరిశుద్ధముగా నున్నవారికి భగవత్సేవాఫలము భక్ష్యభోజ్యాకారమునఁ గలుగుననియు సారము. అట్టివారు గాక వ్యాఙ్మానసములు పావనములుకాఁగా జ్ఞానులగువారు ద్వారమున వేత్రపాణులై అనఁగాఁ బరభయంకరఖడ్గపాణులు కాకయని భావము. పరమేశ్వరీపరమేశ్వరులగుసీతారాములను సేవించుచున్నవారని తాత్పర్యము.

"సహభార్యాయ రామాయ క్షిప్రమేవాచచక్షిరే." ౯

అనుమూలమును బరికింపుఁడు. సుమంత్రునిరాకను భక్తులగు నాసేవకులు సీతతో మాటలాడుచున్న రామునకుం దెల్పిరి. భక్తుల కుపాస్యదైవతముకడ సర్వస్వాతంత్ర్యములు కలవని యెఱుంగవలయు. ఇది రహస్యసమయమని వారు తలంపరు. భేదబుద్ధి వారలకు లేదు. తల్లిదండ్రులుకదా సీతారాములు. ఆభావము లేకయున్న స్త్రీలే సీతాదేవికడకుంబోయి చెప్పవలసి యుండును. అట్లు కాలేదు కనుక మనము పైఁదెల్పినయర్థ మునే గ్రహింపందగు.

"దదర్శ సూతః పర్యంకే సౌవర్ణే సోత్తరచ్ఛదే
వరాహరుధిరాభేణ శుచినా చ సుగంధినా
అనులిప్తం పరార్ధ్యేన చందనేన పరంతపం
స్థితయా పార్శ్వతశ్చాపి వాలవ్యజనహస్తయా
ఉపేతం సీతయా భూయశ్చిత్రయా శశినం యథా." ౧౦

అని మూలము. సుమంత్రుఁడు రాముని దర్శించెనని కథా విషయము. విశేషార్థములం బరిశీలింతము. మెత్తనియాస్తర ణముగల బంగారుపీఠమునఁ గూరుచున్నవాఁడని యర్థము.

పట్టాభిషేకము సాగనున్నది. తొలిరాత్రి యుపవాసము. ఈ స్థితియందేమాత్రము మనస్సునఁ దొందఱపాటు లేక నెమ్మదిఁ గూరుచుండియున్నవాఁడనఁగాఁ దననిర్లిప్తత్వము లోకులకు వెల్లడిచేయుచున్నవాఁడని భావము. సకలకార్యము లామహా ప్రకృతి సీతారూపిణి యొనరించుచుండ నాత్మానందార్ణవ నిమగ్నుఁడై యున్నవాఁడని గ్రహింపవలయును.

"మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరమ్."

అనుగీతోక్తి యిందులకుఁ బ్రమాణమగును. పందిరక్తమువలె నెఱ్ఱనై పరిశుద్ధమై పరిమళమిళితమగు శ్రీచందనమును బూసి కొన్న పరంతపుని గాంచెను. అని యున్నదికదా. ఈభాగము నుండి మనమేమి గ్రహింపవలయును? వరాహము నుపమాన ముగా సజ్జులవిషయమునఁ జెప్పుట స్వభావము. దుష్టులు నజ్జులు క్రూరులునగు దానవులఁ బోలియుంచి తద్రక్తమున భూమిని దడుపఁబూనె ననుభావము నిది సూచించుచున్నది. శుచినా అన్న పదమున కర్థమేమనఁగా రావణుఁడు మహాభక్తుఁడు. శాప వశమున రాక్షసయోనిం బుట్టెను. కాన నాతనిరక్తము పరి శుద్ధమే యని ధ్వని. ఈయర్థమును "పరంతపమ్" అనుపదము సార్థకము చేయుచున్నది. పార్శ్వమునందు సీత నిలుచుండి చామరమును వీచుచుండెను. అనఁగాఁ బ్రకృతి ప్రోత్సహించు చున్నదని భావము. సకలకార్యములు ప్రకృతి భగవంతుఁడు రూపాంతరము నొందఁగా నాతనిమూలమున సాగించునని తాత్పర్యము.

"ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునఃపునః
భూతగ్రామమిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్."

"న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ
ఉదాసీనవదాసీనమసక్తం తేషు కర్మసు." ౯ గీత ౯ అధ్యా.

అను నీశ్రీకృష్ణోపదేశము పైదానిని సిద్ధాంతముచేయుచున్నది కదా. ఈయర్థమునే శ్రీశంకరభగవత్పాదులు సౌందర్యలహరి యందు,

"శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
న చేదేవం దేవో న ఖలు కుశలస్స్పందితుమపి."

అని బోధించిరి. దీని నంగీకరింపనివారున్నచో వారికి భగవద్గీతయుఁ బ్రమాణము కాదనియే సిద్ధాంతముకదా. కావునఁ బ్రకృతి నిర్లిప్తుఁడగుపరాత్పరుని భావికార్యమునకుఁ బురికొల్పుచున్నదనియుఁ దదనుగుణముగా రామమూర్తి యలంకారము లొప్పియుండెననియు గ్రహించుటయే సమంజసము.

"చిత్రయా శశినం యథా"

అనునది యీపైవ్రాసినయర్థమును దృఢపఱచుచున్నది. చిత్రానక్షత్రముంగూడినచంద్రునివలె సీతంగూడి రాముఁడుండెనని సామాన్యార్థము. విశేషార్థమేదనఁగా, చిత్రానక్షత్రము నక్షత్రవీథియందు దక్షిణభాగమున నుండును. చంద్రుఁడు సమీపింపఁగా దానిప్రకాశము తగ్గును. అనఁగా నయ్యది చక్కఁగా నగపడకయుండును. లోఁబడియుండునని భావము. విచిత్రాకృతులందాల్చు మహామాయ సీతాదేవి దక్షిణదిక్కునందు నగపడకయున్నయట్లుండును. అనఁగా శ్రీరాముని చెంత లేనట్లుగా లోకుల భ్రమింపఁజేయునని దీనిసారము. రామచంద్రుఁ డొక్కఁడే యున్నయట్లు నటించునని మన మెఱుంగవలయు. చిత్రానక్షత్రము మధ్యవీథియందుండునుగాన నీయర్థ

మిటఁ బోసఁగదందురు. కాని వారిమాటలు పాటింపఁదగినవి కావు. ప్రాగ్దిక్కు నిర్ణయించు టెట్లన్న ప్రశ్నమునకు సమాధానము "చిత్రాస్వాత్యంతరం ప్రాచీ" అని చెప్పఁబడినది. కావునఁ జిత్రానక్షత్రము దక్షిణభాగమున నున్నదని యెఱుంగవలయు. ఈయర్థమునే యధ్యాత్మరామాయణము కూడఁ దెల్పెను. ప్రకృతిపూరుషుల కవినాభావసంబంధము ప్రతిపాదింపఁబడఁగాఁ గొంతకాలము లేకుండు టెట్లు? రాక్షససంహారార్థము తాను వారికి లోఁబడినట్లు నటించుననియే భావము. తానై వధింపక నిర్లిప్తుఁడగు శ్రీరామునిచే నేల చంపింపవలెనని కొందఱు పండితమ్మన్యులు ప్రశ్నింతురు. మూఁడుజన్మములు విరోధించి భగవంతునిచే మృతింగాంచవలసినట్లు వరము గొన్నవారు కనుక నావరమును వ్యర్థముచేయరాదనియే రాముఁడు వధించినట్లు లోకులకుఁ గనంబఱచెనని భావము.

"తం తపంతమివాదిత్యముపపన్నం స్వతేజసా,
వవందే వరదం వందీ వినయజ్ఞో వినీతవత్." ౧౧

అను నీమూలము విమర్శనార్హము. "స్వతేజసా ఉపపన్నమ్" తన తేజస్సుతోఁ గూడినవాఁడని ప్రాతీతికార్థము. కార్యభారనిర్వహణమునకుం దగిన స్వకీయతేజస్సుతోఁ గూడినవాఁడనియే భావము. భగవత్తేజస్సు సమగ్రముగా నిపుడు రామమూర్తియం దావిర్భవించెను. ఇంతకుముందున్న తేజ స్సిట్టిది కాదు. క్రూరదానవసంహారోచితమగు సాటిలేని తేజస్సు రామమూర్తియందు వెలయుచుండెనని తాత్పర్యము.

"తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః."

అని శ్రుతి తెల్పుచున్నది. భగవద్రూపము తేజోమయమని భావము.

"ఉద్యంతమస్తంయంతమాదిత్యమభిధ్యాయన్కుర్వన్ బ్రాహ్మణోవిద్వాన్
త్సకలంభద్రమశ్నుతేఽసావాదిత్యోబ్రహ్మేతి బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి
య ఏవం వేద."

అనియు శ్రుతి బోధించెడిని.

"ధ్యాయేత్సదాసవితృమండలమధ్యవర్తీ నారాయణస్సరసిజాసనసన్నివిష్టః."

అని ప్రాచీనోక్తియు వేదాభిప్రాయమునే తెలుపుచున్నది. వరదం అను విశేషణము భగవంతుఁడని సూచించుచున్నది. రాజపుత్త్రులవిషయమై వరదులని చెప్పుటకలదా. ఈభాగమును బరికించిన శ్రీరామమూర్తి నిర్లిప్తుఁడనియు, భగవంతుఁడే యనియు, సీత మహామాయ యనియు, సర్వకారణభూతులరా లనియు స్పష్టము.

"కౌసల్యాసుప్రజా రామ పితా త్వాం ద్రష్టుమిచ్ఛతి,
మహిష్యా సహ కైకేయ్యా గమ్యతాం తత్ర మాచిరం." ౧౩
"ఏవముక్తస్తు సంహృష్టో నరసింహో మహాద్యుతిః,
తతస్సమ్మానయామాస సీతామిదమువాచ హ." ౧౪

అని మూలము. సుమంత్త్రుఁడు రామమూర్తికిఁ దండ్రివాక్యమును దెలుపుచున్నాఁడు. "కౌసల్యాసుప్రజా రామ" అను వాక్యమసంగతముగా నిటుఁ దోఁచును. ప్రస్తుతవిషయమున నిది పొసఁగదు. కాని యిందొక్కగూఢార్థము కలదు. సుమంత్త్రుఁడు భావికార్యప్రచోదితుఁడై యీవాక్యమును దెలిపెననియే నిర్ణయింపవలయును. రామా! కౌసల్యాదేవి సుప్రజ.

సత్పుత్త్రుఁడుకలది. నిన్నుఁ గని యందఱిలోఁ బ్రఖ్యాతిగాంచి నది. ధన్యురాలయ్యెనని తాత్పర్యము. ఎవ్వనిమూలమునఁ దల్లి దండ్రులకు విఖ్యాతి యతిశయించునో యతఁడే సత్పుత్త్రుఁ డగును. వారే సత్పుత్త్రులుకలవారని తాత్పర్యము. భగవం తుఁడు కుమారుఁ డగుటకంటె నదృష్టము వేఱుగ లేదుకదా. 'పితా త్వాం ద్రష్టుమిచ్ఛతి' తల్లి ధన్యురాలయ్యెను. తండ్రియు ధన్యుఁడు కాఁగోరి నిన్నుఁ జూడఁగోరుచున్నవాఁడని భావము. ఒక్కఁడే కాఁడు. 'మహిష్యా కైకేయ్యాసహ' రాణియగు కైకతోఁ గూడి నిన్నుఁ జూడఁగోరుచున్నవాఁడు. 'కృతాభి షేకామహిషీ' అని యమరము. కౌసల్యకే యీపేరు చెల్లును. కైకకుఁ జెల్లదనవచ్చును. ఇది సామాన్యవిషయము. కశ్యప ముని దశరథుఁడనియుఁ, గౌసల్య యదితియనియుఁ బ్రమాణ ములు కలవని పెద్దలందురు. అదితి మూఁడురూపములఁ గైకొనెననవలయు. భగవంతుఁడు నాలుగువిధములుగాఁ దన మూర్తిని భాగించి ముప్వురియందును జనించెనని యర్థము. కావున 'మహిషీ' అనునది కైకకుంగూడఁ జెల్లునని సమాధా నము చెప్పవచ్చును. రాజపత్నులయందు సమానభక్తి సేవకు లకు నుండఁదగును. కావున సుమంత్రుఁ డాకైకనుగూడఁ బట్టపురాణియని పలికెననియుఁ జెప్పవచ్చును. ఇందుఁ గలవిశేష మేమనఁగా రామా! కౌసల్య నిన్ను గని సత్పుత్త్రవతి యయ్యెను. నీయవతారఫలమునకు హేతుభూతురాలు కైకేయియే. కావునఁ నాకైకంగూడి తండ్రి నిన్నుఁ జూడఁగోరుచున్నవాఁడు. నీయవ తారఫలమును లోకులకుఁ గల్పింపఁబూనినది కైక. కనుక నామెయుఁ దండ్రియు నిన్నుఁ జూడఁగోరుచున్నారు. "గమ్య

తాం తత్ర మాచిరం” అక్కడికిఁ బోఁదగును. ఆలసింపకుము. అనఁగా నీవలనఁ గాఁదగుకార్యము లనేకము లున్నవి. ఇందు నిలువ నవకాశము లేదు. భక్తత్రాణము ముఖ్యము. కాన నిందుఁ గాలముం బుచ్చక త్వరగా నచటికిం బొమ్ము. అను నదియే విశేషాంశము. పట్టాభిషేకసంరంభమున సుమంత్రుఁ డాలసింపక పొమ్మని చెప్పె ననునది సామాన్యార్థము. దైవికముగా నీవిశేషార్థమును దెలుపుపదములకూర్పు కలిగినది. ఈ యర్థమును సార్థకము చేయు పైశ్లోకమును బఠింపుఁడు. “మహాద్యుతిః నరసింహః ఏవముక్తస్తు సంహృష్టః” అనుపదముల కూర్పును బరిశీలింపుఁడు. మహత్తరతేజస్సుగల మానవశ్రేష్ఠుఁ డగు రాముఁ డానందించి యనునది సామాన్యార్థము. అది యిచ్చోట సార్థకము కాదు. “నరసింహః. సింహశార్దూల నాగాద్యాః పుంసిశ్రేష్ఠార్థగోచరాః” అని యమరము. దీని నను సరించి నరోత్తముఁడని పలుకరాదు. దుర్నిరీక్ష్య తేజో రాశి యగు నరసింహమూర్తివలె నుండెనని గ్రహింపవలయు. ఏల? అనఁగా రాక్షససంహారమునకుఁ బోవవలసినసమయ మొదవెను. తదనుగుణముగాఁ బ్రయత్నము సాగుచున్నది. ఈమహాదీక్షకుఁ బ్రథమాంగముగ నుపవాసదీక్ష గడచెను. శత్రుధ్వంసన మహాహవదీక్షం బూనుచున్నాఁడను. అనునూహతో నా రామమూర్తి యాకారము శత్రుభయదమగు నృసింహమూర్తివలెఁ గనఁబడి యెనని యెఱుంగవలయు. ‘తతస్సుమ్మానయామాస’ అనఁగా హిరణ్యకశిపువధకుఁ బ్రధానుఁడగు ప్రహ్లాదు ననుయించిన చందమున నట్టి శుభవార్తను గొనివచ్చినసుమంత్రుని గౌరవించెనని యర్థము. “సీతామిదమువాచహ” తనవూనినపనికిఁ

గరణభూతురాలగు మహాప్రకృతిం గని యిట్లు పలికెను. అను
నీ విశేషార్థమును గ్రహింపవలయును.

"దేవి! దేవశ్చ దేవీ చ సమాగమ్య మదంతరే,
మంత్రయేతే ధ్రువం కించిదభిషేచనసంహితం. ౧౫
లక్షయిత్వా హ్యభిప్రాయం ప్రియకామా సుదక్షిణా,
సంచోదయతి రాజానం మదర్థం మదిరేక్షణే." ౧౬

అనుమూలము పరిశీలింపందగు. సామాన్యార్థము సులభము.
దేవి! ప్రకాశస్వరూపిణియగు నో ప్రకృతీ! రాజును దేవియగు
కైకేయియు నించుక యభిషేకవిషయమును నాకొఱకు నాలో
చించుచున్నారు. ఇది నిశ్చయము. నన్ను మహాదీక్షకుంబూన్ప
నాలోచించుచున్నవారని భావము. నా కవకాశము కల్పించు
విషయమున నించుక యాలోచించుచున్నవారని రాముఁడు
స్వాభిప్రాయమును బ్రకటించెను. నీయభిప్రాయమును గనుఁ
గొని మంచినేర్పఱితనముగలది కావున లోకములకుఁ బ్రియ
మగు వాంఛకలదియై నావిషయమై రాజును బురికొల్పుచు
న్నది. అనఁగాఁ గైకయూహ లోకమున కుపకారకము. కార్య
నిర్వాహణశక్తి కలది కైక. కావున నాకొఱకు భర్తను బ్రోత్స
హించుచున్నది. 'మదిరేక్షణే' అని రాముఁడు సీతను సంబో
ధించెను. మదముగప్పిన కన్నులుకలదానా! అనఁగా మహాహావ
మున వీరపానముచేసినచందమున నీకన్నులున్నవని యర్థము.
అనఁగా నీదృష్టి యుద్ధమునే సూచించుచున్నది. అని రాముని
హృదయము.

"సా ప్రహృష్టా మహారాజం హితకామానువర్తినీ,
జననీ చార్థకామా మే కేకయాధిపతేస్సుతా. ౧౭

దిష్ట్యా ఖలు మహారాజో మహిష్యా ప్రియయా సహ,
సుమన్త్రం ప్రాహిణోద్దూతమర్థకామకరం మమ." ౧౮

అని మూలము. ఇదియు రామవాక్యమే. తనప్రయత్నమును దెలుపుచున్నాఁడు. కైక లోకహితవాంఛగలది. అందులకే మహారాజు ననువర్తించుచున్నది. నిరంతరసంతోషముగలది. విశేషించి నాకుఁ దల్లి. నాప్రయోజనమునే కోరునది. నాయదృష్టమున నే రాజు ప్రియురాలిఁగూడి నాకు వలయుప్రయోజనము నొనరించుసుమంత్రుని దూతగా నంపెనుగదా. అని రాముఁడు సీతకుం దెల్పెను. సారమేమి? కైక నాకొఱకే రాజు ననుసరించి లోఁబఱచుకొని లోకక్షేమముగోరు నాకొఱకుఁ బురికొల్పుచున్నది. అదృష్టవశమున మహారాజు దేవిఁగూడి యున్నాఁడు. ఆలోచించియే సుమంత్రుని దూతగాఁ బంపినాఁడు. వీఁడు నాప్రయోజనమును నావాంఛితము ననుసరించి మెలంగువాఁడు కావున నివన్నియు నాయవతారఫలమును సార్థకము చేయుచున్నవని శ్రీరాముఁడు మహామాయకుం దెలిపెనని మనము గ్రహింపవలయును.

"యాదృశీ పరిషత్తత్ర తాదృశో దూత ఆగతః,
ధ్రువమద్యైవ మాం రాజా యౌవరాజ్యేఽభిషేక్ష్యతి. ౧౯
హంత శీఘ్రమితో గత్వా ద్రక్ష్యామి చ మహీపతిం,
సహ త్వం పరివారేణ సుఖమాస్స్వ రమస్వ చ." ౨౦
సఖి త్వం పరివారేణ=అని పాఠాంతరము.

అన్న నీమూలము పైనవ్రాసినయభిప్రాయమును దృఢపఱచెడిని. అందెట్టిసభ కూడినదో యట్టిదూతయే వచ్చినాఁడు. అనఁగా నాకార్యము ఫలింపఁజేయుటకుఁ గంకణముకట్టుకొన్నవారే

యందుఁ జేరిరి. వారివలె నాకార్యమునకుఁ దోడుపడుసుమం
త్రుఁడే దూతగా వచ్చినాఁడు. నిశ్చయముగా నిపుడే యావ
రాజ్యమున కభిషేకము చేయఁగలఁడు. సీతాదేవీ! ఈదేశ
పాలకుఁడుగా నింకొకఁడు రాఁగలఁడు. నేను యువరాజుగా
నుండియే నాయభిమతములు సాధింపవలయును. అనఁగా నేను
రాజుగా నుండనని భావము. ఈవిషయమును వాలివధకాల
మున రామమూర్తి తెలుపును. ఆభావమును జక్కఁగఁ బరికించిన
నీయర్థము సమంచితమనియే తోఁచును. ఈపని తప్పక సాగునని
రామమూర్తి సీతకుం దెల్పెనని గ్రహింపఁదగును. 'హంత'
అని రామమూర్తి యనియెను. ఇంతకన్న హర్ష కారణమగున
దేదికలదు? సకలలోకరక్షణమే యుత్తమకార్యము; ధర్మసంస్థా
పనమే మనకు విధి. కాన శీఘ్రముగా నిందుండి బయలువెడలి
రాజును దర్శింతును. అనఁగా నిఁక నేమాత్రము కాలవిలంబము
చేయరాదు. మనము చేయఁదగుమహాకార్యమునకుఁ ద్వరపడ
వలయు. సఖి! అని భార్యను సంబోధించుచున్నాఁడు. 'సమాన
ఖ్యాతిః' అని సఖి శబ్దార్థము. సమానత్వము కలవాఁడనియే
సారము. కావున నిట రామమూర్తి గూఢార్థము గలుగునట్లే
సఖి! అని పిలిచెను. నాచేయునంతపని నీవుకూడఁ జేయవలయు
నని భావము. "పరివారేణ సుఖమాస్వ రమస్వ చ' నావచ్చునంత
దనుక నీపరివారముం గూడియుండుము. విహరింపుము. వారి
తోఁటిసల్లాపములం గ్రీడింపుమని భావము. ఈపరివారము నానం
దింపఁజేయుట నావచ్చునంతవఱకే. ఆవల వీరి నానందింపఁజేయు
నవకాశము మనకు లేదనియే రామునాశయము. నీవు నీయంతి
పురమున వీరింగూడి యానందించుకాల మిఁకొలదిఘటికలే.

ఆవల వేలువిధమగు నానందము కలుగును. ఈపరివారముతో నన్న మాటనుబట్టి యల్పానందమే మహానంద మనుకొను బాలిశు లగు వీరితో నీరవంతకాలల మానందించినట్లు నటింపుమని భావ మని గ్రహింపందగును. నీవు లేక నే నేకార్యము చేయఁజాలనని రాముఁడు పలికెననియే యిటఁగలసారము. ఈయర్థమే గీతా శాస్త్రమునందు శ్రీకృష్ణభగవానులు

"న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ,
ఉదాసీనవదాసీనమసక్తం తేషు కర్మసు. ౯
మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరం
హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే." ౧౦

అని తేటపఱచిరి. ఈవిషయమునే శ్రీశంకరభగవత్పాదులు

"త్వదన్యః పాణిభ్యామభయవరదో దైవతగణ
స్త్వమేకా నైవాసి ప్రకటితవరా భీత్యభినయా
భయాత్త్రాతుం దాతుం ఫలమపి చ వాంఛాసమధికం
శరణ్యే లోకానాం తవ హి చరణావేవ నిపుణౌ." ౪

అని సౌందర్యలహరియందు వెల్లడించిరి. 'సహ త్వం పరివారేణ' అనుపాఠమున నీయర్థము లేదే యందురేని యందునుగూడ నిదియు నిమిడియే యున్నదని యెఱుంగవలయు.

"పతిసమ్మానితా సీతా భర్తారమసితేక్షణా,
ఆద్వారమనువవ్రాజ మంగళాన్యభిదధ్యుషీ." ౨౧

అనుమూలమును బరిశీలింపుఁడు. దీని కాకాశరామన్నపంచాం గమువంటి యర్థముగలదు. నిస్సారము. విశేషార్థముకలదా యని గ్రహింతము. 'పతిసమ్మానితా అసితేక్షణా సీతా' నిందుజప్పు

నముగలదనుట 'అసితేక్షణా' అనునది సూచించును. 'సీతా' అనునది యామె యయోనిజత్వమును దెలుపును. అట్టిమహామాయ జానకి భర్తచే నిట్లు మన్నింపఁబడినదియై అనఁగా భావి కార్యమున బద్ధకంకణురాలవై యుండుమా యని పురికొల్పఁబడినదై అని యర్థము. నీవు లేకున్న నే నశక్తుఁడ నగుదు నను భావము తెలుపఁబడినదై యని భావము. నేను నిర్లిప్తుఁడను. (ఉదాసీనుఁడను) నాసమక్షమున నీవే యన్ని కార్యములు నిర్వహింపవలసియుండుననియే యిటఁగలవిశేషము. ఈమాట భగవంతుఁడు పలుకఁగా శ్రీపరమేశ్వరునకు మంగళములను ధ్యానించుచున్నదియై, అనఁగా వేవేగ మాయవతారప్రయోజనము సమకూడవలయునని కోరుచున్నదియై ద్వారముదనుక వెంబడించెను. అనఁగా మీరు వెడలి వారిమాటలను విని రండు. తమయిచ్ఛ ననుసరించి సర్వకార్యములు నిర్వహింతునని పలుకుచున్నదియై యని భావము. జగన్మంగళములను గోరుచు భర్తను ద్వారముదనుకఁ బోయి సాగనంపెను. అనఁగాఁ ద్వారపెట్టెనని సారము. తమయవతారఫలము లోకములకు సమకూర్ప నాయాదిమదంపతు లాతురంపడుచుండిరనునదియే యిటఁగలవిశేషమని మన మెఱుంగవలయును.

కొందఱు 'మంగళాన్యభిదధ్యుషీ' అనుదానికి మంగళములుగలుగ నాశీర్వదించెనని యర్థము చెప్పి పతిని భార్య నాశీర్వదించెననుట సమంజసము కాదని యాక్షేపింతురు. ఏమి సాహసము! వాల్మీకిమహర్షి నాక్షేపించుటకంటె విశేషపాండిత్యమింకేమిగలదు? 'అభిదధ్యుషీ' అనఁగా ధ్యానించుచున్నదనియే యర్థము. కాని దీవించెననికాదు. 'భర్తుః ప్రియహితే రతా'

అన్నసూక్తి స్మృతిసమ్మతమే. కావునఁ బతికి మేలుగలుగవలయు నని ధ్యానించెనని తాత్పర్యము.

"రాజ్యం ద్విజాతిభిర్జుష్టం రాజసూయాభిషేచనం,
కర్తుమర్హతి తే రాజా వాసవస్యేవ లోకకృత్. ౨౨
దీక్షితం వ్రతసంపన్నం వరాజినధరం శుచిం,
కురంగశృంగపాణిం చ పశ్యంతీ త్వాం భజామ్యహం. ౨౩
పూర్వాం దిశం వజ్రధరో దక్షిణాం పాతు తే యమః,
వరుణః పశ్చిమామాశాం ధనేశస్తూత్తరాం దిశం." ౨౪

అని మూలము. సామాన్యార్థ మిటఁ జర్చింప నక్కఱలేదు. రాజసూయ మనఁగా ఎల్లరాజులను జయించి రాజు చేయు యజ్ఞవిశేషము. బ్రహ్మ ఇంద్రు నభిషేకించినట్లు దశరథమహారాజు యువరాజుగా నిన్నిపు డభిషేకించుచు రాజసూయము ముందు నీవు చేయున ట్లభిషేకింపఁగలఁడని భావము. అనఁగా శ్రీరామా! ఇపుడు రాజు నిన్నుం బిలిపించి నీవు ముం దెల్ల రాజుల జయించి ద్విజాతిసమృద్ధమగు రాజ్యమునుబొందున ట్లభిషేకింపందగును. నీకు లోఁబడక యనఁగా నధర్మతత్పరు లగుభూపాలకుల జయించియే రాజ్యమును బాలింపవలయునని సీత యాశయము. తొలుత దుష్టసంహారము పిదప శిష్టపరిపాల నము చేయఁదగునను భావ మిట సూచింపఁబడియెను. జగదీశా! దుష్టసంహారదీక్షంబూని వ్రతసంపన్నుఁడవై శ్రేష్ఠమగుజింక చర్మమును దాల్చి దుష్టసంహారరూపమహత్తరకార్యమునఁబరి శుద్ధుఁడవై కురంగశృంగమును హస్తముచే ధరించియున్న నిన్ను భజింతునని సీత పలికెను. దండకారణ్యమున దుష్టసంహారము చేయఁబూని క్రొత్తజింకచర్మమును దాల్చి (అనఁగా మాయా

కురంగరూపుఁడగు మారీచునిం బొలియించి) క్రూరరాక్షస సంహారమునఁ బరిశుద్ధుఁడవై కురంగశృంగపాణివై (భూమిఁ దిరుగుమృగప్రాయుని శృంగముఁ దాల్చి అనఁగాఁ జంపి) వచ్చుచున్న నిన్ను నేను సేవింతును. అనఁగా మారీచుని వధించి నీవు వచ్చుచుండఁగా సంతోషమునఁ గొల్తునని ధ్వని. రావణాసురుఁ డపహరించినసీత మహాప్రకృతి కాదనియు, సీతాప్రతికృతియనియు నిట సూచితము. రామచంద్రపత్నిని స్పృశింపఁ ద్రిమూర్తులకేఁ దరమా! మోసపుసీత నెత్తుకొనిపోయి మూర్ఖుఁడు గావున సీతయే యని భ్రమించెననియే యిటఁగలవిశేషము. భగవత్సాన్నిధ్యమున సకలకార్యముల నిర్వహించునట్టిచోట నిర్లిప్తుఁడగుపరమేశ్వరునకుఁ బ్రోత్సాహమును గల్గించెననియే యిట మనము గ్రహింపఁదగినవిషయము. ఇట్లు భావికార్యభారమును సూచించి పరిచారకులకుఁ దెలియునట్లు లోకాచారము ననుసరించి నాల్గుదిక్కుల కధిపతులగు నింద్రయమవరుణకుబేరులు రక్షింతురుగాక యని శుభవాక్కులు పలుకుచున్నది. దీనినుండి గ్రహింపఁదగున దెద్ది? మానవుఁడు గృహమువదలి యేదిక్కునకుం బోవ నెంచునో యాదిగధిపతిం బ్రార్థింపవలయును. సర్వవ్యాపి యగుభగవంతుఁడు స్వాంశమున దిగధిపతిని నిర్మించును. కావున నాదిక్పాలకుని భక్తుఁడు భగవంతునిగా భావించి నీచెంతకు వచ్చుచున్నవాఁడను. అపమృత్యుప్రముఖమహార్తులు లేకయుండఁ గాపాడుమా యని ప్రార్థింపవలయుననియు, నాప్రార్థనము భగవంతుఁ డంగీకరించుననియు నీభాగమునుండి గ్రహింపవలయును. దీనికే యపరిచ్ఛిన్నభక్తి యని పేరు. ఇట్లు ప్రార్థించుటం జేసి భగవదంశ

ములుకాని ప్రాణకోటులు లేవనుభావము దృఢపడును. దాన దేవతాంతరదూషణమునకుఁ గలయవకాశము దూరమగును. అదియేకదా కావలసినది. కావునఁ బరమేశ్వరుని సర్వాకార ముల విలసిల్లువానిగా నెఱింగిన మేలు కలుగును.

"యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి. 30
సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే." 31

గీత. ౬ అధ్యా.

అన్న శ్రీకృష్ణోపదేశము నెఱుంగనివా రుండరు.

"తతః పావకసంకాశమారురోహ రథోత్తమం,
వైయాఘ్రం పురుషవ్యాఘ్రో రాజతం రాజనందనః. ౨౭
మేఘనాదమసంబాధం మణిహేమవిభూషితం,
ముష్ణంతమివ చక్షూంషి ప్రభయా సూర్యవర్చసం." ౨౮

అని మూలము. రామచంద్రునిగమనము భయంకరమనియు, శాంతమును దెలుపలేదనియు నీభాగము తెలిపెడిని. 'పావక సంకాశమ్' అగ్నివలె వెలుంగుచున్నది. 'వైయాఘ్రం' పెద్ద పులిచర్మము పఱవఁబడియుండెను. దానిపైఁ గూరుచుండెననఁగా దుష్టప్రాణులం బొలియించి వారికంటె మిన్నగనుండునని తెలి యందగు. 'చక్షూంషి ముష్ణంతమివ' అనుటంజేసి చూచువారి కన్నులకు మిఱుమిట్లు కొలుపునదియై యనఁగా జూడఁదరము గానిదై యుండెననిభావము. మహాసంగ్రామమున రాక్షసవీరులం బొలియించు కార్యమునకుం బ్రయాణమగుచున్నవాఁడని

సూచింపఁబడియె. 'సూర్యవర్చసమ్' అనఁగా భీషణమని భావము.

"యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ."

అన్నయట్లు భగవంతుఁ డేకార్యమునకై యవతరించెనో దానికిం దగినపరికరము లొప్పెనని మనము తెలిసికొనవలయును.

"స పర్జన్య ఇవాకాశే స్వనవానభినాదయన్,
నికేతాన్నిర్యయౌ శ్రీమాన్మహేంద్రాదివ చంద్రమాః." ౩౧

అని మూలము. "ఆకాశే నాదవాన్ పర్జన్య ఇవ సదిశః అభినాదయన్" అనఁగా మేఘుఁ డొక్కయాకాశమునందే ధ్వనించును. శ్రీరాముఁ డెల్లతావులను ధ్వనింపఁజేయుచు ననఁగాఁ దనకార్య మెల్లరకుఁ దేటపడఁ జేయుచు నెల్లరకు నానందమును గల్గించుచుఁ బోయెనని భావము. అనఁగా శ్రీరాముని యత్నము సర్వదిక్కులనుండువారు పొగడఁదగినదికాని కొందఱకే యుపకరించునదికాదని సారము. దీనిచేత సర్వసముఁడు భగవంతుఁడగుట తెల్లమగుచున్నది.

"సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః
యే భజంతి తు మాం భక్త్యా మయితే తేషు చాప్యహం." ౨౯
(గీత. ౯. అధ్యా.)

అన్నశ్రీకృష్ణోపదేశము స్మర్తవ్యము. పర్జన్యు నుపమానముగాఁ జెప్పుటచేత శ్రీరామమూర్తి యితరులమెప్పుకొఱకుఁగాని, స్వార్థమును గోరికాని యేకార్యము చేయువాఁడు కాఁడని, సర్వోపకారకరణము తనపనియే యని భావించి యొనరించువాఁడనియు స్పష్టము.

"హర్మ్యవాతాయనస్థాభిర్భూషితాభిస్సమంతతః,
కీర్యమాణస్సుపుష్పౌఘైర్యయౌ స్త్రీభిరరిందమః." 32

అని మూలము. సౌధములయందలి గవాక్షములకడనుండి పురంధ్రీమణులు పూవులుచల్లుచుండఁగా శత్రుధ్వంసకుఁడగు రాముఁ డరిగెను. అనఁగా శత్రునృపుల రూపుమాపుటకొఱకు నూర్ధ్వలోకవాసులు ప్రార్థింపఁ బ్రయాణము చేసెనని సూచింపఁబడినది. ఈభావముననే మహాకవి యిందు నరిందమశబ్దమును బ్రయోగించెను. ఈయర్థము నీక్రిందిశ్లోకము దృఢపఱచుచున్నది. చూడుఁడు.

"నూనం నందతి తే మాతా కౌసల్యా మాతృనందన,
పశ్యంతీ సిద్ధయాత్రం త్వాం పిత్ర్యం రాజ్యముపస్థితం." 33

అని మూలము. సామాన్యార్థము స్పష్టము. నీతల్లి వీరమాత యగును. కావున నీవీ ప్రయాణము సఫలముగాఁ గైకొని రాక్షససంహారరూపభూభారహరణమహాకార్యమును దీర్చి ధర్మమును స్థాపించి పిదపఁ దండ్రివంకనుండివచ్చిన రాజ్యము నొందఁగా నీతల్లి కౌసల్య చూచి యానందించును. క్షత్రియకాంతలు పుత్త్రులు జైత్రయాత్రల కరుగుచుండ నానందింతురనుట స్పష్టముకదా. 'సిద్ధయాత్రం త్వామ్' అన్నందున నీప్రయాణము శీఘ్రముననే సాగుననియు సూచింపఁబడియె. 'పిత్ర్యం రాజ్యముపస్థితమ్' అనుటచేత రాజ్యకాంక్షచేత దండయాత్ర చేయకయుండు వాఁడనుట సూచింపఁబడియె. అనఁగా ధర్మసంస్థాపనమునిమిత్తమే దుష్టరాక్షససంహారము చేయువాఁడని భావము.

"సర్వసీమంతినీభ్యశ్చ సీతాం సీమంతినీం వరాం,
అమన్యంత హి తా నార్యో రామస్య హృదయప్రియాం.

తయా సుచరితం దేవ్యా పురా నూనం మహత్తపః,
రోహిణీవ శశాంకేన రామసంయోగమాప యా.
ఇతి ప్రాసాదశృంగేషు ప్రమదాభిర్నరోత్తమః,
శుశ్రావ రాజమార్గస్థః ప్రియా వాచ ఉదాహృతాః." ౪౨

అని మూలము. విశేషార్థ మేమనఁగా 'రామస్య హృదయప్రియామ్' యోగిధ్యేయుఁ డగుభగవంతునకు హృదయానంద కారిణి. అనఁగా భగవంతు నిచ్ఛాశక్తిని. అని యర్థము. మహామాయ యనఁగా భగవంతు నిచ్ఛయేకదా. 'సీతాంహి తా నార్యః అమన్యంత' భగవంతునిహృదయానందకారిణిగా సీతను బతివ్రతలు తలంచిరి. అనఁగా భగవంతునిహృదయ మెఱింగి సర్వకార్యముల నిర్వహించుమహామాయగా నెఱింగిరనియే కదా భావము. సీత నాఁగటిచాలునఁ బుట్టినది. అయోనిజ యని యెఱుంగుదురు. కావున నీమె సామాన్యరాజపుత్త్రిక కాదనియు మూలప్రకృతియనియు భావించిరని తాత్పర్యము. 'రోహిణీవ శశాంకేన' శశము గుఱుతుగాఁగలవాఁడు చంద్రుఁడని ప్రసిద్ధము. ఆయర్థము వాస్తవము కాదుగదా. అట్లే మానుష వేషము కార్యార్థమే యనియు, నట్టిపరమేశ్వరుఁడగు రాముని తోడ సంబంధమునుబొందినదని యెఱింగిరి. చంద్రునకుఁ బ్రియ పత్ని రోహిణియని ప్రసిద్ధము. అట్లే రామునకు హృదయప్రియ సీతయగును. ఈమాటలు రాజమార్గమునఁ బోవుచున్న రాముఁ డాలకించెను. ఆవాక్కులు "ప్రియాః" ప్రియములైనవి. అనఁగా రామునిహృదయానందకారిణి సీత యన్నమాటలు రామునకు హృదయప్రియములయ్యెనని భావము. లోకము నందుఁ బతివ్రత యనుఖ్యాతిఁ గాంచినభార్యయందు భర్తకు

మహాప్రీతి గలుగుట కనంబడును. ఆయాచారము ననుసరించియే రామమూర్తి యానందించెనని తాత్పర్యము.

"ఏష శ్రియం గచ్ఛతి రాఘవోఽద్య రాజప్రసాదాద్విపులాం గమిష్యన్
ఏతే వయం సర్వసమృద్ధకామా యేషామయం నో భవితా ప్రశాస్తా.
లాభో జనస్యాస్య యదేష సర్వం ప్రపత్స్యతే రాష్ట్రమిదం చిరాయ
న హ్యప్రియం కించన జాతు కశ్చిత్పశ్యేన్న దుఃఖం మనుజాధిపేఽస్మిన్."

అని మూలము. సామాన్యార్థముగాక విశేషార్థముఁ బరికింతము. రాముఁ డరుగుచుండఁ జను లాడుకొనుమాటలే యిందుఁ గలవు. "ఏష రాఘవః అద్య రాజప్రసాదాత్ శ్రియం గమిష్యన్ విపులాం ప్రతి గచ్ఛతి" ఈ రామమూర్తి దశరథు ననుగ్రహము వలన శ్రీదేవిని బడయఁగోరి భూమినిగూర్చి పోవుచున్నవాఁడు. అనఁగా భూమిని దిరుగఁబోవుచున్నాఁడు. మహాలక్ష్మి యగు సీతను లోకదృష్టిచే రావణునింట నున్నయట్లుండఁగా వానిని జయించి తేఁబూని యరుగుచున్నాఁడని భావము. ఇపుడే పోవుచున్నాఁడు. అనుటంజేసి సత్వరమే యీయాత్ర సాగునని రహస్యము. దశరథుననుగ్రహము లేకయున్న నీపని సాగదుకదా. లోకోపకారమునకై తొలుత నెన్నిదుఃఖము లనుభవించినను దుదకు సుఖము చేకూరును. కాన నయ్యది ప్రసాదమే యగును. దశరథుఁ డిష్టములేక పలికినను రామున కయ్యది యనుగ్రహమే యగును. తండ్రియానతి లేకపోఁగూడదు. కానఁ దనయవతారఫలము రాజానుగ్రహమూలము కాన నది కాంక్షింపవలసివచ్చెనని భావము. ఈయాశయము దృఢపఱచుటకే మహాకవివాల్మీకి "అయం నో భవితా ప్రశాస్తా" యని ప్రయోగించెను. ఈరామమూర్తి మనకు రాజు కాఁగలఁడు. రాక్షస

సంహారము ధర్మసంస్థాపనము నను రెండుమహాకార్యము లొనరించి పిదప మనకుఁ బాలకుఁడగు ననునదియే యిటఁగలవిశేషము. పట్టాభిషేకము నాఁడే సాగునట్టిలక్షణములు కనఁబడలేదు. కాన నీయూహ వారికింగల్గుట యసమంజసము కాదు. ఈయర్థము. 'చిరాయ' అనుపదము సార్థకముచేయుచున్నది. చాలకాలమునకని యర్థము చెప్పవలయును. పెక్కువత్సరములకు రాముఁడు రాజ్యమును బొందును. మనకు సర్వలాభములు చేకూరును. ఎవ్వనికి నప్రియము కలుగదు. అనిష్టము సంభవింపదు. అనఁగా ధర్మసంస్థాపనానంతరము అకాలమరణాదులు క్షామాదిబాధలు కలుగవు. కావుననే రామరాజ్యమని జగద్విఖ్యాతి గల్గెను. సర్వజనానందకరుఁడగుట నాకాలమున నెవ్వరికి నేబాధలు కలుగవు ఈవిశ్వాస మాప్రజలకుం గల్గెను. ఏల? భగవత్సంకల్పము సర్వభూతసంకల్పమే యగును. సకలభూతాంతర్యామికదా పరమేశ్వరుఁడు. కావున నామహనీయునిసంకల్పమే యెల్లరసంకల్పముగాఁ బరిణమించును. ఇట్టు లీభాగము భగవత్తత్త్వమును బ్రతిపాదించుచున్నది. దీనిం జక్కఁగాఁ బరిశీలించితిమేని సీతారాములసంకల్పము లెట్టివో తెలియఁగలవు. కైంకర్యలోనగువారి కెట్టియధికారము గలదో తేటపడును. ఇఁకఁ దరువాతికథను బరిశీలింతము.

## రామచంద్రుఁడు తండ్రిని దర్శించుట.

శ్రీరామచంద్రుఁడు రాజమార్గమునఁ బోవుచుఁ బట్టాభిషేకమహోత్సవములఁ దగియున్న యయోధ్యాపురమును గాంచెను. అందు జనులసందడి వచింపనలవిగాకుండెను. అలంకారములు

* ఇది పదునేడవ సర్గమునఁ గలదు.

కన్నులపండువు చేయుచుండెను. రాజమార్గమున దాసులుగాఁ
బోసియున్న యమూల్యవస్తువులం గాంచి జనము హర్షించెను.
ప్రతిగృహమునుంగిలియుఁ జక్కఁగా నలంకరింపఁబడి పూవులు
వేలాలు లోనగు శుభద్రవ్యములు చల్లఁబడి ప్రకాశించుచుండె
ను. తన్నుం గాంచి సుహృజ్జనులు పలుకు నాశీర్వాదవాక్యముల
నాలకించుచు వారివారిం దగినరీతి గౌరవించుచు రామమూర్తి
తండ్రిని జూచుకౌతుకమునఁ బోయెను. మిత్రులు రాముంగని
నీవిపు డభిషిక్తుఁడవై పూర్వులు పాలించుచుండినట్లు మమ్మెల్ల
రక్షింపుము. నీరాజ్యమున మేమెల్ల నీపూర్వులయేలుబడి
యందుఁ గాంచుసుఖమును మించినసుఖమును గాంతుము. అను
మాటలను రాముఁ డాలకించెను. మఱియుఁ గొందఱుమిత్రులు
భోజన మిపుడేల? భోగములు జపహోమాదిపురుషార్థములు
నిపుడు చాలును. రామచంద్రుఁడు రాజ్యాభిషిక్తుఁడై మరల
సౌధమున కరుగునపుడు కన్నులపండువుగాఁ జూతము. పట్టా
భిషిక్తుఁడు రాముఁడగుట మాకెంత ప్రియమో యట్లు ప్రియ
మగునది మఱేదియు లేదు. అని తమలోఁ దాము చెప్పుకొను
చుండఁగా నాలకించుచు ననుత్సుకుఁడై పోయెను. పురుషులలో
నొక్కఁడైనను రామమూర్తి యెదురుగ మఱుఁ గనుపాపు మేరఁ
గడచిపోయినను పదియుజగన్మంగళకరరూపమున నాసక్తము
యుండుమనస్సును నేత్రములను మరలించుకొనశక్తుఁడుగాక
యుండెను. రామునిసన్నిధి నున్నవారేమని పలుకుదురో వచి
యింపనేల? ఇఁకఁ గొంతకాలము మాట యిటుఁ బలుకనేటికి?
ఎవ్వాఁడు రామచంద్రుని దర్శింపకుండునో రామమూర్తి
యెవ్వనిఁ జూడకయుండునో వాఁడు సర్వజననిందితుఁడే య

గును. వానియాత్మయు నతనిదూషించును. రామమూర్తి ధర్మాత్ముఁడు. కనుక నాల్గువర్ణములవారలయందు వారివారియోడు నకుఁ దగినట్లు కృపచూపుచుండును. వారెల్ల నారాము నను సరించియే యుందురు.

అంత నారామమూర్తి దేవాలయములు లోనగువానికిఁ బ్రదక్షిణముగాఁబోయి యంతఃపురముంజేరి యందు దశరథుఁడు నివసించుమందిరమును బ్రవేశించెను. ఆగృహవరము కైలాసపర్వతముతో సమానమై వివిధవిచిత్రముల నలరారు చుండెను. అనల్పశిల్పముల నలరారుగృహములు నందుఁ గను పట్టుచుండెను. అమరేంద్రునిసౌధముభంగిఁ జెలువారు జనకునిగృహవర్యమును శ్రీరామమూర్తి ప్రవేశించెను. మూఁడు కక్ష్యలు రథముమీఁదఁ గూరుచుండియే దాఁటి యవ్వల రథము దిగి తరువాతికక్ష్యాద్వయము కాలినడకతోఁ బోయి కక్ష్యాంతరములెల్ల దాఁటి తనవెంటనున్నవారల మరలించి యంతఃపురమునకుఁ దాఁ బోయెను. రామునివెంటఁ బోయినవారెల్లరు మరలి రామమూర్తి యెపుడరుదెంచునో యని సాగరము చంద్రోదయమును గోరుచందమున నెదురుచూచుచుండిరి.

మహాత్ములారా! ఈభాగమునఁ గొన్నివిశేషములు గలవు. వానిం బరిశీలింతము.

“ఆశీర్వాదాన్ బహూన్ శృణ్వన్ సుహృద్భిస్సముదీరితాన్,
యథార్హాం చాపి సంపూజ్య సర్వానేవ నరాన్ యయౌ.” 2

అని మూలము. సన్మతులు తనకు మేలుగలుగ నాశీర్వదించుచుండఁగా వినుచుఁ దగినరీతి వారల గౌరవించుచు రామమూర్తి యరిగెను. అనఁగా వారియూహలు మంచివియే యై

నను దనకార్యము నెఱుంగఁజాలక పలుకుచున్నారే యని తలంచి వారివారిని దగినయట్లు సత్కరించి అనఁగాఁ గొందఱ నంగని శిరఃకంపనముగావించి, కొందఱ దోసిలొగ్గి ప్రార్థించి, కొందఱఁ గనుసన్నలచే గారవించి, యందఱ కన్ని రూపుల సమాధానమగునట్లుచేసి యరిగెను. దీనింబట్టి యాలోచింపఁగా నొక్కవిధమగు కర్మముకాని, యొక్కవిధమగునాచారముగాని, యొక్కవిధమగుమర్యాదగాని యందఱకుం బనికిరాదని యేర్పడుచున్నది.

"చతుర్విధా భజంతే మాం జనాస్సుకృతినోఽర్జున,
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ. ౧౬
తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే,
ప్రియోహి జ్ఞానినోఽత్యర్థమహం సచ మమ ప్రియః." ౭
(గీత. ౭. అధ్యా.)

అను నీగీతాశాస్త్రము ననుసరించి పక్షపాతశూన్యుఁడగుటచే, భగవంతుఁడు కర్మానుసార మాయాయివారల కాయాయిఫలముల నిచ్చుననియు, నొక్కరీతిగా నేల యీయలేఁడను ప్రశ్న మసంగతమనియు నెఱుంగవలయు. దీనింబట్టి కర్మసిద్ధాంత మప్రతిహతమని యేర్పడియెడు. కర్మముల మానితి మనువారెంత జ్ఞానులో యెఱుంగవలయును.

"పితామహైరాచరితం తథైవ ప్రపితామహైః,
అద్యోపాదాయ తం మార్గమభిషిక్తోఽనుపాలయ. ౧
యథాస్మ లాలితాః పిత్రా యథా పూర్వైః పితామహైః,
తతస్సుఖతరం రామే వత్స్యామస్సతి రాజని. ౯
... ... ... ...
పతాకాన్యాశ్చ సుహృదాముదాసీనః కథాశ్శుభాః

ఆత్మసంపూజనీశ్శృణ్వన్ యయౌ రామో మహాపథం." ౧౩

అని మూలము. పెద్దలు త్రొక్కినమార్గమునే యాశ్రయించి యభిషిక్తుఁడవై మమ్ముఁ బాలింపుమా. తాతలు ముత్తాతలు నాచరించినమార్గము నిపుడు గ్రహింపుము. "అద్యోపాదాయ" అని మూలము. అనఁగా మీపెద్దలు పట్టాభిషిక్తులై దిగ్విజయము చేసి యశస్సు నార్జించిరి. ఆమార్గము నీవిపుడే యాశ్రయింపుము. తర్వాతఁ బట్టాభిషిక్తుఁడవై మమ్ముం బాలింపుము. అని వారిమాటలు రామమూర్తి ప్రయాణమునకుఁ దోడ్పడెనని యెఱుంగందగు. రాముఁడు రాజు కాఁగా దశరథాదులచే లాలింపఁబడుటకంటె మిక్కిలి సుఖము గాంతుము. అనఁగా నిపుడు వగలఁబొగిలినను ముందు రామమూర్తి పాలకుఁడు కాఁగా సుఖపడుదుమని వారినోట వాల్మీకిమహర్షి పలికించెనని యెఱుంగందగు. ఈలోనగుశుభకరములుఁ దన్ను గౌరవించునవియు నగుకథల నాలకించుచు నుదాసీనుఁడై రాముఁడరిగెను.

"న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా,
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే." ౧౪

(గీత. ౪ అధ్యా.)

అన్నభగవద్గీతావాక్యము ననుసరించి నిర్లిప్తుఁడు కాన నాత్మప్రశంసాగాథల నాలకించుచు నించుకంతయు మార్పునొందక యరిగెను. ఈమాటలు ఫలించుకాల మిది కాదని యెఱింగిన ప్రోడ గావున నిర్వికారుఁడై యరిగెనని యర్థము. రావణాది దుష్టరాక్షసవధ మామహాత్మునకుం గ్రొత్తది కాదనియు నెఱుంగందగు.

"యశ్చ రామం న పశ్యేత్తు యం చ రామో న పశ్యతి,
నిందితస్స వసేల్లోకే స్వాత్మాప్యేనం విగర్హతే."

అని మూలము. ఇందు విశేషార్థ మరయుదము. భూభారహార ణార్థ మవతరించినభగవంతుఁడు తనపూర్వపు నెలవేలుసమయము వచ్చినదనుమహాహర్షమునఁ బోవుచుండఁగా నాపరమాత్మ నేవాఁడపు డారాజమార్గమునఁ జూడలేఁడో, ఆపరమేశ్వరుఁ డేవానిపై దృష్టి నిగుడింపలేఁడో (అనఁగాఁ దనకరుణకుఁ బాత్రునిగా భావింపలేఁడో యని యర్థము) అతఁడు సుజనులచే నిందింపంబడును ఆతనిమనస్సే యతని నిందించును. ప్రకృత్యతీతుఁడగుపరమేశ్వరునిం జూడఁగరాదు కాదు. కాన నాతని నేవాఁడును రూపవంతునిగాఁ జూడఁజాలఁడు. ప్రకృతిం గూడి ధర్మరక్షణార్థము సగుణబ్రహ్మముగా నవతరించెను. అట్టి రామచంద్రుఁ డెల్లరకు దర్శనమియ్యఁగోరి రాజమార్గమున నరుగుచుండఁగాఁ గన్నులారఁ గాంచఁజాలనివాఁడు సుకృతాత్ముఁడు కాఁడు. అట్టివాఁడే పాపాత్ముఁడు. వానిదృష్టి భగవంతుని గాంచఁజాలదు. భగవంతుఁడుసూడ నాపాపుని జూడఁ దమకింపఁడు. అట్టివాని సాధుజనులు నిందింపకయుందురా.

"అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితం,
పరం భావమజానంతో మమ భూతమహేశ్వరం. ౧౧
మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః,
రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః. ౧౨
మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః,
భజంత్యనన్యమనసో భూత్వా భూతాదిమవ్యయం. ౧౩
సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః,

నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే. ౧౪
జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మాముపాసతే
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్." ౧౫

(గీత. ౯ అధ్యా)

అనుగీతావాక్యముల ననుసరించి పరికింపఁగా నీమూలమునఁ గలసార మెఱుఁగంబడు. భగవద్రూపమని కాక యగ్నిహోత్రముల నారాధించువారు నిష్ఫలకర్ము లనఁబడుదురు. లోకమున నెవ్వారు భగవద్రూపమని కాక యగ్ని నారాధింతురో వారు రాక్షసీప్రకృతినాసురీప్రకృతి నాశ్రయించినవారు. అనఁగా నట్టివారల నామహాప్రకృతి దుర్మతులనుగా నొనరించును. భగవద్రూపముగ దేని నారాధించినను వారు మహాత్ములనం బడుదురు. వారిని మహామాయ మహాత్ములనుగా నొనరించును. అట్టివా రేకమనస్కులై యవ్యయుండగు భగవంతు నారాధింతురు. అనఁగా వారు నిరంతరము తదారాధనకుతూహలు లగుదురని భావము. జ్ఞానయజ్ఞమునఁ గొంద ఱాపరమాత్మ నారాధింతురు. ఏకత్వమునఁ గొందఱు,పృథక్త్వమునఁగొందఱు ననఁగా సర్వభూతాంతర్యామియగువానిని గొంద ఱుపాసింతురు. సూర్యాదిదేవతాభేదమున నాభగవంతునే గొంద ఱుపాసింతురు. సూర్యరూపమున భగవంతుఁడే వెలసెనని యారాధింతురని భావము. దీనఁగలసారమేమి?

సత్కర్మముల నాచరించువారి నామూలప్రకృతి భగవంతుని జక్కనిమార్గమున నారాధింపఁజేయును. ఫలాభిసంధిని గర్మముల నాచరించువారి నాప్రకృతియే భగవంతు నెఱుంగకయుండఁజేయును. అనఁగా నవిధిగా వారిని భగవంతునిబూ

జించువారినిగాఁ జేయును. భగవత్తత్త్వము నెఱుంగనివారినిగాఁ జేయునని భావము. ఎవ్వరుగాని ప్రకృతిని మీఱి భగవంతు నారాధింపఁజాలరనియే కదా గీతాశాస్త్రాశయము. దీనింబట్టి యూహింపఁగాఁ బ్రకృతికృపకుఁ బాత్రుఁడు కానివాఁడు భగవంతు నెఱుంగంజాలఁడనియే తేలెడిని. ఈయర్థమునే శంకరభగవత్పాదులు సౌందర్యలహరియందు,

"హరిస్త్వామారాధ్య ప్రణతజనసౌభాగ్యజననీం
పురా నారీభూత్వా పురరిపుమపి క్షోభమనయత్,
స్మరోఽపి త్వాం నత్వా రతినయనలేహ్యేన వపుషా
కవీనామప్యంతఃకరణమపి మోహాయ మహతాం."

అని తేటపఱచిరి. గీతాశాస్త్రము నమ్మినవారు దీని నేల నమ్మరో తెలియఁజాలకున్నాను. వారు రాక్షసీప్రకృతియు నాసురీప్రకృతియుఁగలవారలై యుండవలయుఁగదా. త్రిమూర్తులు ప్రకృతిబద్ధులై యుండఁ దక్కినక్షుద్రదేవతలు లోనగువారిమాట యిటఁ జెప్పనేటికి? తొలుత నామహామాయ నారాధించి తదనుగ్రహపాత్రులై భగవంతు నారాధింపవలయును. అట్టివారలకే చక్కనిమార్గము దొరకును. లేనిచో నేదో యొకమార్గము దొరకును. అది యధఃపతితునిగాఁ జేయుననిసారము. శ్రీరామమూర్తి రాజమార్గమున నరుగుచుండఁగాఁ గన్నులుండియుఁ జూడనివాఁడాసురీప్రకృతియు రాక్షసీప్రకృతియుఁగలవాఁడు. వానినెల్లరు దూషింపకపోరు. వానియాత్మయే వాని నాక్షేపించును. రామునిదృష్టి యెవనిపై వ్యాపింపలేదో వాఁడు దుష్కృతియేయగునని మన మెఱుంగవలయును. సత్కర్మముల నాచరించినవారు పరమేశ్వరుం జూతురు. వారి నాపరమాత్మయుం జూచు

ననియే యీభాగమున మన మెఱుంగవలయును. నేత్రసాఫ ల్యము భగవద్దర్శనమనియుఁ బుణ్యకర్మఫలము భగవత్కరుణా పాత్రుఁడగుటయే యనియు నీభాగము మనకుఁ దెల్పుచున్నది.

"సర్వేషాం హి స ధర్మాత్మా వర్ణానాం కురుతే దయాం,
చతుర్ణాం హి వయస్థానాం తేన తే తమనువ్రతాః." ౧౫

అని మూలము. నాల్గువర్ణములవారికిని వయోభేదముల ననుస రించి ధర్మాత్ముఁడుగాన నారామమూర్తి దయఁజూపును. కాన వారెల్లరు నాతని ననుసరించిరి. అనునది సామాన్యార్థము. వాల్మీకిమహర్షి భగవత్ప్రసాదము నీశ్లోకరూపమున మనకెల్ల రకు బోధించెను. ఇందు "చతుర్ణాం వర్ణానామ్" అనువాక్య మున సంఖ్యాబోధకపదమునకు నుపలక్షణవిధి ననుసరించి తది తరమానవులకునని యర్థము చెప్పవలయును. ఏలయనఁగా

"సమోఽహం సర్వభూతేఽషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహం. ౨౯

అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్,
సాధురేవ స మంతవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః. ౩౦

క్షిప్రం భజతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి,
కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి. ౩౧

మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః,
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాం గతిం. ౩౨

కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయస్తథా,
అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వ మాం." ౩౩

(గీత ౯ అధ్యా.)

అను నీభగవద్గీతావాక్యము లీవిషయమునే తెలుపుచున్నవి. విమర్శింపుఁడు.

భగవంతుఁడు సర్వభూతసముఁడు. ఆమహాత్మున కొకఁడు మిత్రుఁడని, యొకఁడు శత్రుఁడని చెప్ప నలనుపడదు. భక్తితో నెవరు సేవింతురో వారి నాతఁ డుద్ధరించును. దురాచారుఁడైనను బూర్వకర్మవశమున నాతనియందే భక్తిగలిగి పరమేశ్వరు సేవించిన నాతఁడు సజ్జనుఁడే యగును. అనఁగా భగవంతుని యందు భక్తిలేనివాఁడే దురాచారుఁడని, అదిగలవాఁడే సాధుజనుఁడని భావము. ఏజాతియందైన నీయిరువురు నుండ వచ్చునుగదా. నాభక్తున కపాయములేదనఁగా నరకాదినరక ప్రాప్తిలేదనికదాభావము. వాఁడు మృతినొందఁడని కాదుగదా. పాపయోనులుకూడ నన్నాశ్రయించి ముక్తినొందుదురనఁగా భావమేమి? ఒక్కవర్ణమువారికే ముక్తిగలదని వేఱొకవర్ణము వారికి ముక్తిలేదని కాదు. పరమేశ్వరు నారాధించువారికెల్ల ముక్తికలదనియే సారము. జ్ఞానులగువారలకు ముక్తిదొరకుట యబ్బురమా యనఁగా వారి కది కరతలామలకమే యని భావము. అను నీగీతావాక్యసారమే రామాయణమున నీశ్లోకమునఁ గలదు.

శ్రీరామమూర్తి యెల్లజాతులవారలకు వయోధర్మము ననుసరించి దయ నెఱపును. కానసే వార లాతని ననుసరించి యుందురు. అనఁగా భావమేమి? వారువారు చేసినకర్మములు వయోధర్మము ననుసరించి ఫల మొసంగును. అదియే భగవంతుని దయ. ఎట్లనఁగా సర్వసాక్షి, నిర్లిప్తుఁడు నగుభగవంతుఁడు సత్కర్మముల నాచరించినవారలకు భక్తి లోనగుమంచిఫలముల నొసంగును. వయోధర్మము ననుసరించి సుఖాదుల నొసంగును. అయ్యవి విధివిహితముగ వార లనుభవింతురు.

దుష్కర్మముల నాచరించినవారలకు నాస్తికత్వము లోనగు నశుభఫలముల నొసంగును సుఖాదులను వారు విధివిరహిత ముగా ననుభవింతురు. అనఁగాఁ గర్మమే ఫలము నిచ్చును. సత్కర్మాచరణపరాయణులపై భగవత్కరుణ వ్యాపించును. భగవద్దృష్టిచే నందఱు సమానులే. కాని ఫలానుభవ మొక్క రీతిగాదు. దీనింబట్టి భగవంతునకుఁ బక్షపాతముకలదనరాదు. సూర్యకిరణములు సర్వత్ర యొక్కరీతిగా వ్యాపించును. స్థలభేదము ననుసరించి నిర్మలముగాను, మలినముగను గనం బడురీతి, సత్కర్మరతులయందు సత్ఫలరూపముగను, దుష్కర్మా చరణపరాయణులయందు దుష్ఫలరూపముగను భగవద్దయ వెలయుననిభావము. కర్మము ఫలము నొసంగునదియనియు, సర్వద్రష్ట భగవంతుఁడనియు నెఱుంగుట మంచిది.

"చతుష్పథాన్ దేవపథాంశ్చైత్యాన్యాయతనాని చ,
ప్రదక్షిణం పరిహారన్ జగామ నృపతేస్సుతః." ౧౬

అని మూలము.

"యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే."

అన్నగీతాశాస్త్రము ననుసరించి శ్రీరామమూర్తి సదాచార మును మానవులకు నేర్పెనని మన మెఱుంగవలయును. నాల్గు త్రోవలుకలిసిన చోటులు లోనగువానికిఁ బ్రదక్షిణముగా రథమును బోనిచ్చెననఁగా నాచోటులయందు మానవులు నిలు వఁబడు నవకాశము లేర్పడియుండుననియుఁ, బదుగు రుండు తావులు పవిత్రములనియు, వానికిఁ బ్రదక్షిణము చేయుట యనఁగాఁ బవిత్రస్థానములు భగవత్స్వరూపములుగా భావింప

వలయుననియు లోకులకు నేర్ప శ్రీరాముఁ డట్లు లొనరిం చెను. లేకున్న

"న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన."

అనుగీతయందుఁ గలభగవదుక్తి వ్యర్థమగును. ఈరీతిగనే శ్రీరామమూర్తి సదాచారములను మనకు నేర్పనని యెఱింగి మనము భగవదుపదేశముగా భావించి యట్లు లాచరింపవల యును. ఇట్టివిషయములు తెలిసికొన్నంతమాత్రమునఁ జాల వనియు, వానిని జక్కఁగా నాచరింపవలయుననియు నిశ్చయించి, యవకాశమున్నంతదనుక వాని నభ్యసింపవలయును. ఈభాగ మీరీతిగా మన కనేకనీతులను బోధించుచున్నది. కావున మన మీభాగమును బఠించి రామచంద్రుని యనుపమానసదా చారముల నెఱింగి వాని నిరంతరము తలంచుచు నవకాశము గలిగినంతదనుక నభ్యసింపవలయును. ఇఁకఁ బరువాతికథను బఠింతము.

## కైకరామునకుఁ దానడిగినవరములఁ దెల్పుట.

* శ్రీరామచంద్రుఁ డంతఃపురమున కరిగి తండ్రిని దర్శించెను. అపుడు దశరథుఁడు మోము వెలవెలపోవఁగాఁ గరము దీనుఁడై మంచిమంచముపైఁ గూరుచుండి యుండెను. కైకయు నతనిచెంతనే యుండెను. దశరథుం గాంచి భక్తి శ్రద్ధలు వెలయ నతనిపాదములు విధిగా నమస్కరించి వెంటనే తల్లిపాదములకు నమస్కరించెను. ఆమహారాజు దుఃఖముప్పొం గుచుండ శ్రీరామా! యనిమాత్రము పలికి యశ్రుజలములు

* ఇది పదునెనిమిదవ సర్గమునఁ గలదు. అధ్యాత్మరామాయణసార మిందుఁ జేరియుండును.

కన్నులం గ్రమ్మఁగా దుఃఖము భరింపరామిఁ గొడుకుం జూడఁ గాని మాటలాడఁగాని శక్తుఁడుగాక యుండెను. తండ్రికిఁ దానెఱింగినంతవట్టు బెట్టిదంపుదుఃఖ మింతవఱకు నిట్టిది రామి దానిం గాంచి రాముఁ డెట్టిభయమునకు లొంగనివాఁడయ్యు సర్పమును బాదమున స్పృశించినట్లే భయంపడియెను. అట్టితఱి దశరథుఁడు దుఃఖసంతాప మింద్రియములఁ గుదియింప వేఁడి నిట్టూర్పులుపుచ్చుచు, మనోదార్ఢ్యము తప్పిపోఁగాఁ దరంగ ములు చెలరేఁగనున్న సాగరమువలె, మహాతేజస్సుగలవాఁ డయ్యు రాహుగ్రస్తదివాకరునివలె, నిర్మలాంతఃకరణుఁడయ్యు ననృతములుపలికిన మహర్షిభంగి నుండఁగా రాముఁడు భయ పడియెను. అప్పుడు తండ్రి కట్టిదారుణదుఃఖము కలుగుటకు విచారించి పూర్ణిమయందు సాగరమురీతిఁ గలఁతనొందెను. పితృభక్తిపరాయణుఁడు కావున రాముఁడు తనలో నాతండ్రి కోపముతోనున్నపుడు నన్నుం గాంచినంతనే ప్రసన్నుఁడగును. నేఁ డేటికో నన్నుంజూచియు సంతుష్టుఁడు గాకయున్నవాఁడు. అంతియగాక. వగచుచున్నాఁడు. అని యూహించి వగపున మోము వెలవెలపోవఁగాఁ గైకకు వందనమిడి అమ్మా! ప్రమాద మున నేనేయపరాధము చేయలేదుకదా. నాతండ్రి యేల కోప గించియున్నాఁడో దానికిం గలకారణము నాకెఱిఁగింపుము. తల్లీ! నీవే యీనాతండ్రివిచారముం దీర్పుము. తండ్రి నాయందు నిరంతరము వాత్సల్యముగలిగియే యుండును. అట్టిరాజిత్తరుణ మున మనస్సుకలఁగఁ బ్రసన్నుఁడుగాక మోముకాంతి క్షీణింప నాతో మాటలాడకున్నాఁడే. ఏల? శరీరవ్యాధిగాని మనశ్చిం తగాని లేదుగదా ! మానవులకు సర్వదా సుఖమే కలుగుట

యరుడుసుమా. కావున ననుమానించెదను. నాసోదరుఁడు భరతుఁడు దర్శనీయాకృతిగలవాఁడు అనుమానమునకు నమంగళ మేదియు లేదుకదా. బలవంతుఁడగుశత్రుఘ్నునకుఁగాని, నామాతలలో నెవరికిఁగాని యశుభ మొక్కండును లేదుకదా. నాతండ్రికి సంతోషమును గల్గించుకార్యము చేయక, యాతని యాజ్ఞ చేయక యొకఘటికమాత్రమైన జీవింపనొల్లను నాతండ్రియే కోపమొందిన నావ్యథ వచింపఁదగునా.

మానవుఁ డీజగమున జన్మించుట కెవ్వాఁడు హేతువని తెలియునో యట్టిసాక్షాద్దైవమై యుండునాతండ్రికి నేరీతి వశుఁడై వర్తింపక యుండును? తల్లీ! నీవు ప్రియము రాలనని గర్వించికాని కోపమొందిగాని నాతండ్రితో నతినిచిత్తము కుందునొందునట్లు పరుషోక్తులు పలికియుంటివా. ఎన్నఁడు లేని యీవికార మీరాజునకు నేఁడేల కల్గినది? ఎటులుంగఁగోరు చున్నాఁడను. ఉన్నదున్నయట్లు వచింపుమా. అని ప్రశ్నించెను. మహాత్ముఁడు రాముఁ డీరీతిఁ బ్రశ్నింపఁగాఁ గైక విని భర్తను దుఃఖము నిడఁజాలుపలు కెట్లు చెప్పవచ్చునని కొంచెమైన సిగ్గుపడక నీవడవులకుం బొమ్మని యెట్లు చెప్పుదునా యని సంశయింపక తనవాంఛిత మెట్టులైన నెఱవేర్చుకొనంబూని రామునితో నిట్లు పలికెను. శ్రీరామా! రాజునకిపుడు కోపము లేదు. వ్యసనముకూడ లేదు. మనస్సున నీతండ్రి కొక్కకోరిక కలదు. ఆకోరికం దెల్పిన నీవేమని తలంతువో యనుభీతిని దానిం జెప్పకయున్నాఁడు. నీయందు మిక్కిలి ప్రీతికలదు. కాఁబట్టి యప్రియవార్తం దెల్పుటకు రాజు జంకుచున్నాఁడు నీతండ్రి యేకార్యముచేయఁ బ్రతినచేసెనో యాకార్యము నీవు తప్పక

చేయవలయును. నీతండ్రి సత్యవ్రతపరాయణుఁడు. అట్టివాఁడౌట నీరాజు పూర్వము నన్నుఁ గృతజ్ఞతంగొని వరమొసఁగి గారవించెను. ఇపుడు వరమడుగ ననృతవాదియగుపామరుని వలె వగచుచున్నాఁడు. వరమిత్తునని శపథముచేసి జలము పోయినవెనుక కట్టనుగట్టఁగోరుచందమున నిపుడేల శపథము చేసితినని నిరర్థకముగా వగచుచున్నాఁడు. రామచంద్రా! సత్యము ధర్మమే మూలమని పూజ్యులందఱు పలుకుదురు. కాఁబట్టి యీరాజు నీకొఱకు నాపైఁ గోపమూని సత్యరూప ధర్మమును విడువకుండునట్లు చేయుము. రాజవాక్యము నీకు మేలుగాని కీడుగాని నీవుమాత్రము చేయనొప్పినచో నేను దానిం జెప్పెదను. రాజుపలుకు నీయందు నిష్ఫలముగాక సార్థక మగునేని దాని నేను జేయుదునని నీవు ప్రతినచేయుదువేని రాజునకుమాఱుగ దాని నేనే తెలుపుదును. రాజేల పలుకరాదని యూహింపకుము. నీమోము చూచి యామాటఁ జెప్ప జంకుచున్నాఁడనియెను.

కైకపలికినవిషయము నాలకించి రామచంద్రుఁడునాయం దిట్టిసంశయము మీ మెకుఁ గలిగెనే యని దుఃఖించి రాజసన్నిధి నాకైకం గాంచి యక్కటా! నాజీవితమేల? తల్లీ! నన్నిట్లన రాదు. రాజాజ్ఞయే యైన నగ్నిలోఁ బడుదును. తీవ్రవిషముం ద్రాగుదు. సాగరమునఁ బడుదును. ఈతఁడు నాకు గురువు. తండ్రి. అంతియకాక ప్రభువు. నాహితమును గోరువాఁడు. ఇట్టి యీమాన్యుఁ డాజ్ఞాపించిన దేనినైనఁ జేయఁజాలనందునా! కావున జననీ! రాజవాంఛితము నెఱిఁగింపుము. దాని నొన రింతును. చేయువాఁడనని శపథముచేయుదును. రాముఁడు

ద్విజిహ్వుఁడు కాఁడని నమ్ముము. మొదటఁ జెప్పి మరలఁ జెప్ప లేదనఁడని పల్కెను.

నైక పూజ్యురాలు కాదు. కావున నించుకయుఁ గపటము లేక సత్యవాది యగు రామునిం గని కరము భయంకరముగా నిట్లు పలికెను. రామభద్రా! తొల్లి దేవాసురసంగ్రామము సాగుచుండ నాతరుణమున మీతండ్రి యొడలెల్లఁ దీవ్రనారాచసాంద్రమై సొమ్మసిల్లఁగా నాబాణములఁ దొలఁగించి యుపచారము లొనరించి కాపాడితిని. అందులకై నా కీరాజు రెండువరము లొసంగెను. ఆవరములకు భరతునకుఁ బట్టాభిషేకము కావలయుననియు, నిన్నిపుడే దండకారణ్యములకుఁ బంపవలయుననియు రాజును గోరితిని. నరశ్రేష్ఠా! నిన్ను నిజజనకుని సత్యప్రతిజ్ఞులనుగాఁ జేసికొన నూహింతువేని నామాట నాలకింపుము. నీవు పితౄజ్ఞయందు స్థిరుఁడవు కమ్ము. నాకతఁడు ప్రతినచేసినట్లు పదునాలుగువత్సరములు దండకారణ్యముల నుండవలయును. రామా! నీయభిషేకమునకై రాజు సేకరించినపదార్థములంగొని భరతునకే పట్టాభిషేకము చేయవలయు. నీ వీమహోత్సవము వదలి దండకాటవిని జడలు కృష్ణాజినమును దాల్చి నివసింపుము. భరతుఁ డీనగరమున నుండి ప్రాజ్యమగు రాజ్యమును బాలించుచుండుఁగాక. ఈవరద్వయ మొసఁగుహేతువునుబట్టి నీపై మిక్కిలి దయయుంచినందునఁ బ్రియపుత్రకుని నిన్ను వనములకుఁ బంపవలసివచ్చెనే యని దుఃఖమున మొగము వేలవైచుకొని నిన్నుఁ గననైనఁ జాలకున్నవాఁడు. రఘుకులమున జనించినవాఁడవు. రాజువాక్కుఁ గృతి నొనరింపుము. సత్యవాక్పరతుఁడవై రాజు నసత్యదోష

రహితునిగా నుద్ధరింపుమని కఠినముగాఁ బలికెను. ఈరీతిగా నా నారీమణి కఠినవాక్కులు పలుకుచుండఁగా రామునకు శోక వికారచిహ్నములు గలుగకయుండెను. అంతరంగమునందును దుఃఖము పొడసూపకుండెను. దశరథుఁడు లోకానుభవము మిక్కిలి కలవాఁడయ్యును బుత్రునెడఁబాటు తప్పదన్న దుఃఖముచేఁ దపించెను.

మహామతులారా! ఈభాగమునఁ గొన్ని విశేషములు గలవు. వానిం దడవుదము.

"స పితుశ్చరణౌ పూర్వమభివాద్య వినీతవత్,
తతో వవందే చరణౌ కైకేయ్యాస్సుసమాహితః." ౨

అని మూలము.

"అభివాదనశీలస్య నిత్యం వృద్ధోపసేవినః,
చత్వారి తస్య వర్ధంతే ఆయుర్విద్యా యశో బలం. ౧౨౧
అభివాదాత్పరం విప్రో జ్యాయాంసమభివాదయన్,
అసౌ నామాహమస్మీతి స్వం నామ పరికీర్తయేత్." ౧౨౨
(మను. ౨ అధ్యా)

అను నీస్మృతిని రామమూర్తి లోకులకు బోధించెను. తండ్రికి నమస్కరించి తరువాతఁ దల్లికి నమస్కరించెను. ఇదియే సనాతనాచారమని యెఱుంగవలయు.

"ఉపప్లుతమివాదిత్యముక్తానృతమృషిం యథా." ౬

అని మూలము. అసత్యవాది యగుఋషివలెఁ దేజోహీనుఁడయి యున్నతండ్రిని రాముఁడు చూచెను.

"న విస్మయేత తపసా వదేదిష్ట్వా చ నానృతం,
నార్తోఽప్యపవదేద్విప్రాన్న దత్త్వా పరికీర్తయేత్." ౨౩౬
(మను. ౪ అధ్యా.)

అను నీస్మృత్యర్థము రామాయణమునందును గలదు. సకల స్మృతులవిశేషము రామాయణమునఁ గలదనియు, శ్రీరాము నాచరణమే స్మృతివితతియనియు గ్రహింపవలయును.

"కచ్చిన్మయా నాపరాద్ధమజ్ఞానాద్యేన మే పితా,
కుపితస్తన్మమాచక్ష్వ త్వం చైవైనం ప్రసాదయ." ౧౧

అని మూలము. ప్రమాదవశమున నేనేమి నపరాధము తండ్రి కొనరించితినా? దానిం దెలుపుము. నీవు గూడ నాతండ్రి కలుకఁ దేర్పుము. ఈకోపమునకుఁ గారణమేమని రాముఁడు ప్రశ్నించెను. అనఁగాఁ దెలియక తండ్రి కపరాధము చేసినను దూష్యమే యని స్పష్టము. నీవును బ్రసన్నునిగాఁ జేయుమని ప్రకటముం దెల్పెను. దీనింబట్టి రామునిమనోభావము కైకయుం జేసినను నసూయ పొరయదనియే స్పష్టముకదా. "న మే ద్వేష్యోఽస్తి న ప్రియః" అన్నగీతోక్తి రాముని ప్రవర్తనమువలన నిరూపితమైనదని తెలియందగు.

"శారీరో మానసో వాపి కచ్చిదేనం న బాధతే,
సంతాపో వాభితాపో వా దుర్లభం హి సదా సుఖం." ౧౩

అని మూలము. మానవులకు సదా సుఖమే కలుగుట యసంభవము. అని రామమూర్తి మనకుఁ దెలిపెను. దుఃఖములు గూడఁ గలుగును. వాని నోర్చుకొనవలయుననికదా రామమూర్తి యాశయము. అనఁగా సుఖానుభవము ముగిసినదని దుఃఖానుభవకాలము వచ్చినదనియు సూచింపఁబడినది.

"అతోఽషయన్మహారాజమకుర్వన్ వా పితుర్వచః,
ముహూర్తమపి నేచ్ఛేయం జీవితం కుపితే నృపే." ౧౫

ఇదియే రామునియుపదేశము. జనకుని సంతోషపెట్టకకాని, తండ్రిమాట యొనరింపకకాని క్షణకాలమైన బ్రదుకనొల్లను. నీకిచ్చినవరములను సాగించి సత్యప్రతిజ్ఞునింజేయక తండ్రిమాట సార్థకము చేయక యనఁగా దండకాటవుల మునివేషమున నుండక యని యర్థము. క్షణకాలమైన నిట జీవింపనొల్లను. అనఁగా నీపురమున నిఁక ముహూర్తమాత్రముకూడ నివసింపనని రాము నాశయమనియే యిటఁగలవిశేషము. పితృవాక్య పరిపాలనమే కుమారునకుఁ గర్తవ్యమని రాముఁ డుపదేశించిన నీతి యని మన మూహింపవలయును. పితృవాక్యమును బాలింపక జీవించుట భూమికి భారమే యని యిందుఁగలనీతి.

"యతో మూలం నరః పశ్యేత్ప్రాదుర్భావమిహాత్మనః,
కథం తస్మిన్న వర్తేత ప్రత్యక్షే సతి దైవతే." ౧౬

ఇదియు నొకయుపదేశమే యనవలయును.

"పతిర్భార్యాం సంప్రవిశ్య గర్భో భూత్వేహ జాయతే,
జాయాయాస్తద్ధి జాయాత్వం యదస్యాం జాయతే పునః." ౮
(మను. ౯ అధ్యా)

అను నీస్మృతివాక్యము ననుసరించి తండ్రియే కుమారుఁడుగాఁ బుట్టుచున్నాఁడు. కావునఁ గుమారుఁడు తండ్రికి విరుద్ధముగాఁ బ్రవర్తింపరాదు. అన్నస్మృత్యర్థమునే శ్రీరామమూర్తి తేటపఱచెను. తనమాటను మీఱి తాఁబ్రవర్తింపఁజాలనిరీతిఁ దండ్రియే కుమారుఁడుగాఁ బుట్టుచున్నవాఁడు గావున నెట్టులాతని మీఱఁజాలునని రామమూర్తి యడుగుచున్నాఁడు.

తండ్రిమాట మీఱుట యనఁగా నాత్మద్రోహమునంటి దన వలయు. ఆత్మద్రోహ మెట్లు మహాపాపకార్యమో పితృవాక్య నిరాకరణముకూడ నట్టిదే యనినీతి. రామోపదేశములయం దిద్ది ప్రధానమని మనము తెలిసికొనవలెను.

"న రాజా కుపితో రామ వ్యసనం నాస్య కించన,
కించిన్మనోగతం త్వస్యత్వద్భయాన్నాభిభాషతే. ౨౦
ప్రియం త్వామప్రియం వక్తుం వాణీ నాస్యోపవర్తతే,
తదవశ్యం త్వయా కార్యం యదనేనాశ్రుతం మమ." ౨౧

అని మూలము. కైక రామునకుం జెల్పువచన మిది. నీభయ మువలన మాటలాడకున్నాఁడు. సామాన్యార్థమిది. విశేషార్థ మేమనఁగా. నీమూలమునఁ గలుగఁబోవు భయమువలన ననఁగాఁ బుత్రమూలమున మృతిగల్గు నన్నశాపభయమువలన మాటలాడకున్నాఁడని కైకనోట మహాకవివాల్మీకి పలికించెను.

"లౌకికానాం హి సాధూనామర్థం వాగనువర్తతే
ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి."

అన్నభవభూతివాక్కు తప్పదుగదా. రామా! అత్యంతప్రీతికిఁ బాత్రుఁడవగునిన్ను గుఱించి యప్రియముపలుక నీతని నోరాడ కున్నది. ఏకార్య మొనరింపఁ బ్రతినచేసెనో యద్దాని నీవొన రింపవలయును. అనఁగాఁ దండ్రికిం బ్రియముచేయ జన్మించిన వాఁడవు. కాన నిన్నుం జూడఁగనే యీతనివిషయమున వాణి స్తంభించినది. అనఁగా నింక నీతఁడు మాటలాడవలసినకాలము చాల లేదని భావము. కావునఁ బితృవాక్యమును సార్థకము చేయవలసినవాఁడవు నీవు. ఆపని నిర్వహింపుము. మరణ మా సన్నమైనవారలకు వాక్కు స్తంభించును. అనఁగా వికృతిం

బొరయును. దాని నెఱిఁగి మానవుఁడు కృత్యముల నొనరింప వలయును ఆతఁ డొనరింపఁజాలనిపనులను బిత్రుప్రీతిగాఁ గుమారుఁ డొనరింపవలయు ననునీతి మనము గ్రహింపవల యును. "ప్రియం త్వా మప్రియం వక్తుం వాణీ నాస్యోప వర్తతే" సర్వలోకప్రియుఁడవగు నిన్నుఁగూర్చి యొకయప్రియ వాక్కునైనఁ బలుక వాగ్దేవి జంకుచు నీతని నో రరికట్టెను. భగవద్దర్శనమున నప్రియుఁడు ప్రియుండగును. పుణ్యము చేసిన వానికే భగవంతుఁ డగపడును. తద్దర్శనమునఁ జిత్తము పరి పక్వమగును. పాపములు నశించును. అట్టిస్థితియందు వాఁడప్రి యము లెట్టులు పలుకఁగలఁడు? ఇందు రామశబ్దార్థము మహా కవి వివరించెను. సర్వలోకప్రియుఁడు రాముఁడు. కైకకు మాత్రము ప్రియముంగూర్చువాఁడు కాకపోవునా? ఎంతక్రోధ మున్నను ఎవ్వానిదర్శనమున మనస్సు మాఱునో యట్టివాఁడు మానవుఁడైన నాతనియందు భగవత్కళ విశేషించియుండునని మన మెఱుంగవలయును. మృగములు క్రూరములైనను భగవ త్కళ విశేషించియుండువానింగాంచి తమదౌష్ట్యమును మాను కొనును. ఏల?

> "సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని
> ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః." గీ

అన్నభగవదుక్తి ప్రసిద్ధమేకదా. క్రూరమృగమునందును భగ వంతుఁడు కలఁడు. కాన నాతనిం గాంచువాని నది యేమి చేయఁగలదు? అట్టివాఁడే యోగి. పరులం గాంచి యోర్వఁ జాలక దూషించుచు, గడ్డము పెంచుకొన్నంతమాత్రమున యోగి యగునా? అట్టివాఁడు కపటయోగి యనంబడును.

వానిం గాంచి యెవ్వారును స్నేహింపరు. ఇట్టులుండఁ బ్రత్యక్షముగా భగవంతుఁడు కనఁబడిన నెవ్వాఁడు ప్రేమింపక యుండును? అను నీవిశేషవిషయ మీభాగమునుండి మన మెఱుంగవలయును.

"అతిసృజ్య దదానీతి వరం మమ విశాం పతిః
స నిరర్థం గతజలే సేతుం బంధితుమిచ్ఛతి." ౫౩

అనుమూలమున నొక్కవిశేషము కలదు. మానవపతి వరమిత్తు నని ప్రతినసేసెను. వెనుకఁ జింతించుచున్నాఁడు. అది నిరర్థకము. గతజలసేతుబంధమనఁగా నిదియే. కర్తవ్యమును సకాలమునఁ జేయఁజాలక వృథగాఁ గాలముం బుత్తురో వారే నిరర్థకులని భావము.

"దినయామిన్యౌ సాయంప్రాతశ్శిశిరవసంతౌ పునరాయాతః,
కాలః క్రీడతి గచ్ఛత్యాయుస్తదపి న ముంచత్యాశావాయుః." ౧౨. భజ.

అన్న శంకరభగవత్పాదాచార్యోపదేశము.

"ఆదానస్య ప్రదానస్య కర్తవ్యస్య చ కర్మణః,
క్షిప్రమప్రియమాణస్య కాలః పిబతి సంపదః.

అన్నసూక్తియు నిట స్మర్తవ్యములు. గతజలమగువానికిఁ గట్టఁ గట్టఁ బ్రయత్నించినవానిపగిది సకాలమునఁ గర్మములఁ నాచరించి భగవంతునికరుణకుం బాత్రులుగానివారు పశ్చాత్తాపతప్తులై చెడుదురనిభావము.

"ధర్మమూలమిదం రామ విదితం చ సతామపి,
తత్సత్యం న త్యజేద్రాజా కుపితస్త్వత్కృతే యథా." ౫౮

అను నీభాగమున నొక్కవిశేషము కలదు. ధర్మమనఁగా "ధరతి విశ్వమితి ధర్మః" అనువ్యుత్పత్తి ననుసరించి ప్రపంచమును ధరించునది ధర్మ మనంబడును.

"ధర్మ ఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః,
తస్మాద్ధర్మో న హంతవ్యో మానో ధర్మో హతోఽవధీత్. ౧౫
వృషో హి భగవాన్ ధర్మస్తస్య యః కురుతే హ్యాలం,
వృషలం తం విదుర్దేవా స్తస్మాద్ధర్మం న లోపయేత్. ౧౬
ఏకఏవ సుహృద్ధర్మో నిధనేఽప్యనుయాతి యః,
శరీరేణ సమం నాశం సర్వమన్యద్ధి గచ్ఛతి." ౧౭

(మను. ౮ అధ్యా.)

స్మృతి యిట్లు తెల్పుచున్నది. సత్యమునకు మూలమనఁగా నాధారము ధర్మము. 'ధ్రియతే ఇతి ధర్మః' అను వ్యుత్పత్త ననుసరించి శ్రుతివిహితకర్మమని యర్థము. సత్యమునకు శ్రుతివిహితకర్మమే మూలము. ఇది సజ్జనుల కెఱుకపడినదే. రాజు నీభయమున నాపైఁ గోపించి కర్మమూలసత్యమును వదలకుండఁజేయుము. అని కైకేయి తెలిపెను. "యజ్ఞోఽనృతేన క్షరతి" అన్నమనుస్మృతి వాక్యము ననుసరించి శ్రుతిహితకర్మ మనృతము పలికిన నశించును. కాన నీమూలమున నిది నశింపకయుండఁజేయుము. అనఁగా రామా! నీరూపము సత్యము. అయ్యది వేదమూలము. అట్టిదాని నీకొఱకే యీరాజు వదలునేమో యట్లుగాక యుండఁజేయుభారము నీదే యని తాత్పర్యము. నీయవతారఫలము ఈభూపతి సత్యవాక్కుపై నాధారపడియున్నది. అట్టి సత్యమునకు నీవే యాధారము. ఎట్లు? కర్మము భగవత్స్వరూపము.

"కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవం,
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితం. ౧౫
ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః,
అఘాయురింద్రియారామో మోఘం పార్థ స జీవతి." ౧౬

(గీత. 3 అధ్యా.)

అనుభగవదుక్తి కలదుగదా. అనఁగా నీవొనరింపఁదగు సకల కర్మములకు సీతనిమాట యాధారము. దానిని గాపాడుము. ఈరాజునోట సత్యమాడించి నీయవతారఫలము దుష్టసంహార శిష్టపాలనధర్మసంస్థాపనరూపకార్యముల సాగింపుమని కైక పలికెననియే యిటఁగలసారము. ఇట్టిజ్ఞానము కైకకుఁగలదా యన్న సందియ మక్కఱలేదు.

"కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః." అనియు,
"మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి." అనియుం

కృష్ణోపదేశములు కలవుకదా. మహర్షి వాల్మీకిమహాకవి కైకనోట గూఢార్థభూయిష్ఠములగుపదముల నీయర్థముం బలికించె నని మన మెన్నవలయును. లేకయున్న భగవత్సందర్శనము వ్యర్థమగునుగదా. రామచంద్రసందర్శనము మహాప్రకృతియగు సీతాదేవి సంకల్పము ప్రోత్సహింపఁ గైక యేమిచేయఁగలదు? హరిహరబ్రహ్మాదులే యవశులై చెప్పినయట్లు ప్రవర్తింతురన నిఁకఁ గైకమాట యిటనేటికి? ధర్మము సత్యము కలిసియుండు నుగాన నొకదానికొకటి యాధారముగాన నీరెండింటిననఁగా సత్కర్మమును సత్యమును భగవంతునియాకృతులుగ భావించి వాని నారాధింపవలయుననియు, ఫలాభిసంధిరహితములుగా

నవి యుండవలయుననియు నీభాగమునుండి మన మెఱుంగఁదగు.
విషయములు.

"యది తద్వక్ష్యతే రాజా శుభం వా యదివాశుభం,
కరిష్యసి తతస్సర్వమాఖ్యాస్యామి పునస్త్వహం." ౨౫

సామాన్యార్థము విమర్శింపమాని విశేష మెఱుంగందగుంగదా.
ఏకార్యమువలనఁగాని కొందఱకు మేలు, కొందఱకుఁ గీడును
గలుగును. కాని యాకార్యము ధర్మప్రధానమయ్యెనేని యా
చరింపఁదగినదే. సకలప్రజారంజకుఁడవగు నీకు ధర్మమే యాచ
రింపఁదగును. కావునఁ దప్పక యొనరింతునని నాకుఁ దెల్పిన
నేనే యవ్విషయమును రాజు పలుకఁదగుదానిని బలుకుదును.
అనఁగాఁ బితృవాక్యపరిపాలనము ముఖ్యమని తలంపకుము.
ఇదియుఁ బితృవాక్యమే. వారిమాటనే నేను జెప్పుచున్న
దానను. అని కైకభావము. లోకమున నొక్కమహాకార్యము
చేయఁబూనినపుడు కొందఱకుఁ గీడుగలుగును. అంతమాత్ర
మున వారికొఱకుగా నద్దానిని మానరాదు. ధర్మమున కయ్యది
హితమైనఁ జాలును. నాకిపు డేయపకారముతలంపని రాక్షస
వధార్థము సంకల్పముచేయ నేల యని యూహింపకుము.
వారికి నీవలన మేలే కలుగును. ప్రపంచహిత మొనర్ప నవత
రించితివి. కాన నాకార్యమున నప్రమత్తుఁడవుకమ్మని కైకయభి
ప్రాయమని యూహింపందగు. మానవులు ధర్మకార్యము నొన
రింపఁబూనినపు డద్దానివలన నేస్వల్పమో కొందఱ కపకారము
కల్గునేని యది సరకుగొనరాదనునదియే యీభాగమునుండి మన
మెఱుంగందగినది.

"అహో ధిఙ్నార్హసే దేవి వక్తుం మామీదృశం వచః,
అహం హి వచనాద్రాజ్ఞః పతేయమపి పావకే. ౨౮
భక్షయేయం విషం తీక్ష్ణం మజ్జేయమపి చార్ణవే,
నియుక్తో గురుణా పిత్రా నృపేణ చ హితేన చ." ౨౯

అనునది శ్రీరామవాక్యము. నే నీకార్యము చేయ నేమాయని సందియ మొందుట మంచిది గాదు. ఈ రాజాజ్ఞ ననుసరించి యగ్నియందును బడుదును. అనఁగా నా తేజస్సు నగ్నియందుం తునని తాత్పర్యము. నా తేజస్సు ననఁగా నాభార్యను (సీతను) హుతవహునియందుంతునని యర్థము. అనఁగా నగ్నియే నారూపము. యోగు లగ్నిని నే ధ్యానింతురు. అందుఁ బడుదు ననఁగా తేజోరూపమున నుందును. నే నేకార్యము చేయువాఁడను గాను. ప్రకృతియే యన్ని కార్యముల నాయానతిం బూని యొనరించును. నేను సాక్షిమాత్రుఁడను. అని సారము. విష మనఁగా నధర్మము. దానిని భక్షింతును. అనఁగా మాయింతును. సముద్రమున మునుంగుదు. సాగరమును బ్రార్థింపఁగు కాలము వచ్చును. అప్పుడు స్నానము చేసి దాని చెంత శయనింతు ననునర్థ మిందు సూచింపఁబడియెను. తాను ముందుఁ బ్రకృతి విశిష్టుఁడై సీత నగ్నియందునిచి మాయాసీత రావణునియిల్లు చేరునట్లు చేసి యేయే కార్యములు తాఁ జేసినట్లు లోకు లెన్న నటించునో వాని నిట గూఢముగాఁ దెలిపెనని మనము భావింపవలయు. దీన లాభ మేమని ప్రశ్నింతు రేమో. శ్రీరాముఁడు భగవంతుఁడను భావము చక్కఁగాఁ దెల్పుటయే దీనికిం దగు ఫలము.

"తద్బ్రూహి వచనం దేవి రాజ్ఞో యదభికాంక్షితం,
కరిష్యే ప్రతిజానే చ రామో ద్విర్నాభిభాషతే." ౩౦

అనునిదియే శ్రీరాముని ప్రతిజ్ఞ. రాముఁడు తొలుత నొక్క విధముగాఁ బలికి దానికి భంగముకలిగించుపద్ధతిని రెండవతడవ పలుకఁడని భావము. చెప్పినమాట తప్పఁడని సారము. ఇదియే యీయవతారమునఁ జేయుమహాకార్యము. తొలుత నొక్క రీతిగాఁ బలికి దానివలనఁ గొన్నిబాధలుకలుగ నుండఁగా వానిని దప్పించుకొన నింకొక్కవిధముగాఁ జెప్పు నాచార మీరాము నకు లేదని శ్రీరాముఁడు పలికెను. సత్యమును గాపాడనే యవ తరించితిని. ధర్మమును నెలకొల్పఁ బ్రతినచేసితిని. కావున నీ యవతారమున సత్యధర్మములకు బాధకలుగకయుండఁ గాపా డుదునని శ్రీరామమూర్తి తేటపఱచెను. "అనృతం నోక్త పూర్వమ్మే" అనియుఁ జెప్పఁబోవును. ఈయవతారమున సత్య వాక్కునకు నేకాలమునను భంగము కలుగనీయక రామ మూర్తి ప్రవర్తించెనని మనము తెలిసికొనవలయు. ఒక్కొక్క యవతారమున నొక్కధర్మమునే స్థిరపఱచును. సకలధర్మముల నిలుప నవకాశము దొరకదు. ప్రజలయందుఁ గొన్నిధర్మము లుండును. క్షీణించినవానిని క్షీణింపనున్నవానిని గాపాడ భగ వంతుఁ డవతరించునని సారము. మానవులుకూడ నన్నిధర్మ ముల నాచరింపఁబూని కృతకృత్యులు కాఁజాలక మిన్నకుండక తమకు శక్యమగునొక్కధర్మము నవలంబించి దానిని జక్కఁగా సాధింపవలయును. దాననే యాపరమేశ్వరుఁడు సంతృప్తుం డగును. అనఁగాఁ బూర్వకర్మము ననుసరించి తనకు నుత్తమ మని తోఁచినధర్మమును భగవత్స్వరూపముగా భావించి యా రాధింపవలయును. లోకుల వంచించి ధనమార్జింప నేధర్మముం

బూనరాదు. దానఁ దనపురుషార్థమునే పోఁగొట్టుకొనును. కాని వేఱుకార్యము సాధింపఁజాలఁడు.

"తమార్జవసమాయుక్తమనార్యా సత్యవాదినం,
ఉవాచ రామం కైకేయీ వచనం భృశదారుణమ్." 3౧

సామాన్యార్థము. అనార్య యనఁగా నపూజ్యురాలని. "నవిద్యతే ఆర్యా యస్యాస్సా అనార్యా" అతిపూజ్యురాలని విశేషార్థము చెప్పవలయును. ఏలయనఁగా కైకయానతినే తండ్రియానతిగా రామమూర్తి భావించి యడవుల కరుగును. దుష్టురాలివచనమును బాటించుటంజేసి శ్రీరామునిచరిత్రమునకుఁ గళంకము కల్గును. కావున నీయర్థము సముచితమే. భగవత్కార్యమున కెల్లరు సాయపడువారే. కర్మప్రేరణమున నామె యాకార్యమునకుం దోడుపడి లోకములకు మహోపకార మొనరించెను. కాన ననార్య యని చెప్పుట మంచిదిగాదు. సామాన్యజనులదృష్టి కనార్య యని తోఁచినను మహర్షులదృష్టికి నార్య యనియే కైక తోఁచును. కైకయే లేకున్న రామావతారమే లేదు కావున నీయర్థ మసంగతముకాదని యూహించుటొప్పు.

"త్వయారణ్యం ప్రవేష్టవ్యం వర్షాణి నవ పంచ చ." 3౨

అని కైకనోట వాల్మీకి పలికించెను. ఇందుఁగలవిశేష మేమనఁగా "వత్సరాణిచతుర్దశ" అనిపలికిన వ్యర్థపదము లేకుండును. అట్లుండినంగూడ మహాకవి వాల్మీకి "వర్షాణి నవ పంచ చ"అని పలికెను. ఏల? తొలుతటితొమ్మిదివర్షములు లోకమున కంతయుపయోగము నుగల్గించునవి కావు. కడపటియైదువర్షములే జగత్త్రయోపకారకములు. తొలుత సామాన్యరాక్షసులఁ జంపి మునుల కభయ మొసంగుము. తక్కుంగలయైదేండ్లలో ధర్మసంస్థాపన

మునకుఁ బ్రథమసోపానమగు శూర్పణఖ శ్రుతినాసికాచ్ఛేదాది దుష్టరాక్షససంహారము, స్వాశ్రితసంరక్షణము లోనగుమహా కార్యములు నిర్వహింపుము. అనునర్థము గూఢముగా నుంచు టకై యట్లు పలికి తనసర్వతోముఖపాండిత్యమును వెల్లడించి యాదికవి ఖ్యాతిమించెనని మన మెఱుంగందగు.

"భరతస్త్వభిషేక్ష్యేత యదేతదభిషేచనం,
త్వదర్థే విహితం రాజ్ఞా తేన సర్వేణ రాఘవ." 3౬

దీన నొకవిశేషము గలదు.

"యస్మాదేతదభిషేచనం విహితం తథాపీత్యధ్యాహారః. భరతస్తు త్వదర్థే అభిషేక్ష్యేత రాజ్ఞా. కేన? తేన సర్వేణ వస్తువ్రాతేన. రాఘవేతి సంబోధనం."

ఏకారణమున నీయభిషేకవస్తువ్రాతము విహితమో అనఁగా నీయభిషేకపదార్థములు గూర్పఁబడినవో, ఆప్రయత్నము విహితమే ఐన నిప్పు డది విహితముకాదని భావము. నాకొడుకు భరతుఁడైతే నీకొఱకు రాజుచే నభిషేకింపఁబడుంగాక. అనఁగా నీకుఁ బ్రతినిధిగా భరతుఁడు రాజుగా నుండును. నీకార్యముల నిర్వహించుటకే కాని భోగానుభవముకొఱకుఁ గాదు. అని కైకనోటినుండి వెడలెనని యెఱుంగవలయు.

"అభిషేకమిమం త్యక్త్వా జటాజినధరో వస."

జటాజినధరుఁడవై యుండుము. లయకర్తయగు నీశ్వరునిరూపమును ధరింపుమా యని యర్థము. శాంతరూపమున నుండ రాదు. దుష్టరాక్షససంహారదీక్షం బూనవలయుఁగాన నధశ్శయ్యాదిరూపమగు దీక్షాధర్మముల నవలంబించి లయ మొనరింప వలయునని భావము. లోకమున నుపాసకుఁడు శత్రుక్షయా

మహాకార్యమున నాసక్తింబూని తాత్కాలికమగునపయశ స్సును లెక్కింపక తనపట్టినపట్టు వదలక భగవంతునిం బ్రోత్స హించునేర్పును మనకుఁ దెలుపుచున్నది. కావున దీనింబఠించు నపుడు శ్రీరామమూర్తి మనకు బోధించినపితృభక్తిని లోకో ద్ధరణనియతిని మన మెఱుంగవలయు. కైకయాశయము మూఁడులోకములయం దెందఱకు సమ్మతమో యనియు నూహింపవలయును. అపుడుగాని మనకు రామాయణపారా యణఫలము చేకూరదు. ఇఁకఁ దరువాతిదగుభగవచ్చరిత్ర మును బఠింతము.

## శ్రీరాముఁ డడవికింబోవ నంగీకరించుట.

* కైకవచించిన యావార్త సామాన్యమానవులకు మరణతుల్యమైనది. శ్రీరామమూర్తి యమిత్రుల రూపడంచు వాఁడు. అట్టులయ్యు నావాక్కును విని యించుకంతయు విచా రంపడక కైకం గాంచి యిట్లు పలికెను. తల్లీ! అట్లే యగుఁ గాక. నీ వానతిచ్చినచందమున భరతునకుఁ బట్టాభిషేకోత్స వము సాగుఁగాక. నేను దండ్రియొనరించిన ప్రతినరీతిగా జడ లను గృష్ణాజినమును ధరించి యిటనుండి కదలి యడవినుండఁ బోయెదను. శత్రుహంతయగు దశరథుఁడు మునుపటిరీతి నన్నేల మన్నింపకున్నవాఁడు? కరుణచేతనా? నా నైజము తండ్రికిం దెలియుంగదా. ఏల మాటలాడఁడు? తల్లీ! నీవు దీనురాలవు కావలదు. నేను నీమ్రోల వచియింతును. నీవు చూచుచుండఁ గా వల్కలములు గట్టుకొని జడలుధరించి యడవులకుంబోయె

* ఇది పందొమ్మిదవ సర్గమునఁ గలదు. అధ్యాత్మరామాయణకథయుం నిందే కలిసియుండును.

దను. నీవు సంతుష్టురాలవై యుండుము. రాజు నాకు నెంతయు హితుఁడు. ఆచార్యుఁడు. జనకుఁడు. నీ కొసంగిన వరదానము సార్థకము చేయువాఁడు. అట్టి యా రాజేంద్రుఁడు నియోగించినంతనే యనుమానింపక తన్ప్రియ కార్యమును దేనినేఁ జేయకుందునా? రాజు తానుగా భరతాభిషేకము తెల్పలేదే యనునప్రియము విశేషించి నామనస్సును బాధించు చున్నది. ఇతరుల ప్రోత్సాహము లేకయే భరతుఁడు కోరినచో శివశరాసనభంగకాలముననే సీతనుగాని నాకు రాఁగలరాజ్య మును, ప్రియమైనప్రాణమును, ధనరాశి నిచ్చియుందును. అట్టి నేను జనకుఁడగు దశరథమహారాజు తానుగ నానతిచ్చినచో దాన నీకు సంతోషము కలుగునేని చెప్పినయట్లే చేయుదునన్న నాప్రతిన ఫలించుచుండ రాజ్యము నొసంగుదునని వేఱుగాఁ జెప్పవలయునా? దీన నాకించుకంతయు నప్రియము కలుగదు. కావున నోతల్లీ! నీవు సంకోచింపనేల యని రాజు నాశ్వాసిం పుము. రాజు భూమిం గనుచు మెల్లమెల్లగాఁ గన్నీరువిడుచు చున్నాఁడే, వల? ఇప్పుడే దూతలు రాజాజ్ఞంగొని వేగముగాఁ బోవునైజముగలగుఱ్ఱములనెక్కి మేనమామయింట నున్నభర తునిం బిలుచుకొని రావలయును. నేను నిర్విచారముగాఁ బదు నాలుగువత్సరములు దండకారణ్యమున నివసింప నిదిగో ప్రయా ణము చేయుదును.

అని రామచంద్రుఁడు పలుకఁగా విని కైక యానం దించి రామునిసాగనంపుకార్యమున జాగ్రత్తకలదియై పొమ్మని తొందఱించుచు రామునితో అట్లే చేయుము. దూత లరుగు దురు. భరతుని దోడ్కొనివత్తురు. అని పలికి యంతరంగమున

నిట్లు తలంచెను. నాకుమారుఁడు రామునియందు మిక్కిలి భక్తిగలవాఁడు. అతఁడు వచ్చునంతదనుక రాముఁ డిందుండు నేని వాఁ డీతని నడవికింబోనిచ్చునా? అపుడు నాప్రయత్నము నిష్ఫలమగును. అని తలపోసి రామునిం గని మరల నిట్లు పలికెను. రామా! నీవు దండకాటవికింబోవ నుత్సుకుఁడవై యున్నాఁడవు. కావున నీవు జాగుచేయరాదని తోఁచెడిని. కావున సత్వరముగా నడవికిం జనుటయే లెస్స. పురుషశ్రేష్ఠా! ఈరాజు తనప్రతినను రామమూర్తి సార్థకముచేయునో చేయఁడో యని లజ్జనొంది నీతో నించుకంతయు మాటాడకున్నాఁడు. ఇతరకారణ మేమియు లేదు. కనుక రాజుమాటాడకుండ నేల యని విచారింపకుము. నీవిపుడే పయనముచేసి యాతనిలజ్జను దైన్యమును బోఁగొట్టందగు. నీ వయోధ్యనుండి వేవేగ పయనముచేసి యడవికిం బోవునంతదనుక నీతండ్రి స్నానముగాని, భోజనముగాని చేయఁడు.

అని యిట్లు కైక పలుకఁగా నాలకించి యట్టియనృతములు పలుకుచున్నందులకుఁ జింతనొంది చీ! చీ! ఏటిబ్రదుకిది? ఇదేమికష్టము? అనుచు వేఁడినిట్టూర్పులు నిగుడించి శోకసాగరనిమగ్నుఁడై యామంచముపైఁ దటాలునఁ బడియెను. మూర్ఛమునింగెను, రాముఁ డంతట రాజును లేవనెత్తి కైక ప్రయాణముచేయఁ దొందఱించుచున్నందునఁ గశాఘాతమునఁ బరుగిడుగుఱ్ఱమువలెఁ ద్వరపడసాగెను. అంతియకాక పాపమతిచేఁ దన్నామె యడవులకుం బొమ్మన్నఘోరము నప్రియము నగు నావృత్తాంతమునకు దుఃఖపడక యామెతోఁ దల్లీ! నాకు ధనాశ లేదు. ఈలోకమున నుండవలయుననియేని, జగము

నాక్రమించుకొనవలయుననియేని కోరిక లేదు. నేను ఋషి
తుల్యుఁడను. ధర్మమును మాత్రమే యాశ్రయించినవాఁడను.
ఇవితప్ప మఱేవియు నాకిష్టములు కావు. పితృప్రీతికార్య మేది
యైనఁ జేయుదును. దాన నాకుఁ బ్రాణాపాయము కల్గినను వద
లక చేయువాఁడనని నమ్ముము. జనకునకు శుశ్రూష చేయు
టయు, నాతనిమాట జవదాఁటక చేయుటయు ననువానికంటె
శ్రేష్ఠమగుధర్మానుష్ఠాన మొక్కటియు లేదు. తండ్రి తానుగ
నడవికింబొమ్మని పలుకకున్నను నీవుచెప్పినం జాలును. నీవాక్య
ము ననుసరించి యిపుడే నేను నిర్జనారణ్యమునకుంబోయి పదు
నాల్గుసంవత్సరములు నివసింతును. కేకయరాజపుత్రీ ! తల్లీ !
నీవే యొకరికంటె నధికముగా నాకు నాజ్ఞనీయ శక్తికల
దానవుకదా. అట్టి నీవాక్యమును దప్పక చేయ సిద్ధముగ
నేనుండఁగా భరతాభిషేకము, నాయరణ్యగమనము మదభీష్ట
మని నీవు నాతోఁ బలుకక రాజును వరరూపమున నడిగితివే,
ఏల? దీనిచే నాయందుఁ గొంచెమైన గుణమున్నదని విచారింప
వైతివి. ఇపుడే పొమ్మంటివికదా. తల్లియగు కౌసల్యయొద్ద సెలవు
తీసికొని జానకి నాశ్వాసించి వచ్చునంతదనుక నిందుండ నను
మతియిమ్ము. ఆవల క్షణమైన నిందుండక యీదినమే యడవికిం
బోయెదను. భరతుఁడు రాజ్యమును బాలించుచుఁ బితృశుశ్రూష
యేమఱక చేయుచుండునట్లు నీవు పరికించుచుండవలయును.
పితృసేవ యెంతోకాలమునుండి వచ్చుచున్నధర్మము. కావున
నేను జెప్పితిని.

ఈరీతిగా శ్రీరాముఁడు పలుకఁగా నాలకించి దుఃఖము
క్రమ్మఁగాఁ గన్నీరు నాపుకొనఁజాలక పెద్దగా నేడ్చెను.

రాముఁడు నబ్భంగి నెఱుకమాలియున్న జనకునకు నమస్కరించి కైకకు నభివాదన మాచరించి ఘోరతరమగు నాకష్టమునకు వగవక పితృవాక్పాలనరూపసుకృతము లభించెనన్నసంతోష మున మిగులఁ దేజస్సంపాదల నందుండి వెడలెను. ఆయంతః పురమువెడలి తనస్నిగ్ధులం గాంచెను. సుమిత్రానందవర్ధనుఁడగు లక్ష్మణుఁడు సమీపమున నున్నందున నచ్చటివృత్తాంత మెఱింగి దుఃఖాశ్రువులు కన్నులం గ్రమ్మ భరింపరానికోపముగలుగ నా రాముని వెంబడి పోయెను. దేవాలయాదులకుఁ బ్రదక్షిణముగఁ బోవలయునన్న శాస్త్రము ననుసరించి రామమూర్తి యందునిచి యున్న యభిషేకవస్తుజాతమునకుఁ బ్రదక్షిణ మాచరించి యద్దాని యందపేక్ష లేకున్నను భరతున కభిషేకము గావలయునని వాంఛించుచు మెల్ల మెల్లగాఁ బోయెను. నిరుపమాననిజముఖ తేజస్సుగల యారామమూర్తి రాజ్యముపోయెనన్న కష్ట మెంత యుండిన నద్దానిచే ముఖకాంతి యించుకయైన క్షీణింపక యుండఁగా మానావమానముల లెక్కింపనియోగివర్యుఁడువలె మనస్సు వికారమునొందనీయక యరిగెను. మహాధీరుఁడగు నా రాముఁడు మంగళకరమగు శ్వేతాతపత్త్రమును జామరములను మాని పరిజనమును బౌరులనుగూడ వదలి రథమునెక్కక తనకు దుఃఖము లేకున్న నితరులకు నయ్యది కలుగుచున్న దన్న దుఃఖమునుగూడ మదిలోనే యణఁచివైచి వెలుపల నించు కంతయుఁ గానరానీయక జితేంద్రియుఁడై యాయప్రియ వార్తఁ దెల్పఁగోరి తల్లియింటికిఁ బోయెను.

రామాభిషేకదర్శనోత్సుకులగు పరిజనులు రాముని మోమునం దెట్టిమార్పును బరికింపఁజాలకుండిరి. శరత్కాల

శీతాంశుఁడు తనప్రకాశమును వదలకుండునట్లు మహాబాహుఁడగు నారాముఁడు స్వైజమగుసంతోషమును దవంతయును వదలకయుండెను. తా వ్యథనొందక పరిజనుల నితరులంగూడి మంచిమాటల గౌరవించుచు లక్ష్మణునిదగ్గరకు వచ్చి కలిసికొనెను. ఆతఁడు తనయన్నతోడ సమానములగుసుఖదుఃఖములుకలవాఁడు. కాన రామునకు దుఃఖము కలుగఁ దాను దుఃఖించుచు దాని మదినే యడంచుకొని రాముని వెంటనే పోయెను. రామమూర్తి సౌధముం బ్రవేశించి తనయభిషేకమున కానందించుచుఁ జేరియున్న జనులం దిలకించి తనస్థితిని దలంచుకొని దానిచే దుఃఖము తప్పక కలుగవలసియున్నను దాదుఃఖించినఁ దనమేలుగోరువారు ప్రాణత్యాగము చేయుదురన్న సంశయమున దాని లోపలనే యడంచుకొని వెలుపల నేమియు నగపడక యుండు నట్లుండెను.

మహాశయులారా ! ఈభాగమున ననేకవిశేషములు గలవు. అందుఁ గొన్నింటిం బరికింతము.

"తదప్రియమమిత్రఘ్నో వచనం మరణోపమం,
శ్రుత్వా న వివ్యథే రామః కైకేయీం చేదమబ్రవీత్. ౧
ఏవమస్తు గమిష్యామి వనం వస్తుమహం త్వితః,
జటాజినధరో రాజ్ఞః ప్రతిజ్ఞామనుపాలయన్." ౨

అని మూలము. "అప్రియం మరణోపమం వచనం తత్ శ్రుత్వా" అని యన్వయము. దేనికన్నఁ బ్రియములేదో యది యప్రియము. అపూర్వము. అనాది యనువాని కిట్లే యర్థములు పెద్దలే తెల్పియున్నారు. మరణమే యుపమగాఁగలది. అనఁగా

దుష్టరాక్షసవధ మే దానికి సాటియని భావము. లోకదృష్టిచేఁ
బ్రియముగా నున్నను జ్ఞానదృష్టిగలవారల కది మహాప్రియ
మైనది. అనఁగా ధర్మవృద్ధిని గలిగించునది యని భావము. కను
కనే రామమూర్తి వగవలేదు. రాజుప్రతినను సార్థకము
చేయుచు నిపుడే వనవాసమునకై వెడలెదనని రామచంద్రుఁడు
తెలిపెను. తనయవతారఫలమున కయ్యదియే ప్రధానసాధన
మౌట నయ్యది మహాప్రియముం గూర్చునదియయ్యెనని సారము.

"అహం హి సీతాం రాజ్యం చ ప్రాణానిష్టాన్ ధనాని చ,
హృష్టో భ్రాత్రే స్వయం దద్యాం భరతాయాప్రచోదితః. ౭
కింపునర్మనుజేంద్రేణ స్వయం పిత్రా ప్రచోదితః,
తవ చ ప్రియకామార్థం ప్రతిజ్ఞామనుపాలయన్." ౮

అని మూలము. సామాన్యదృష్టి నీశ్లోకముం గాంచి పఠించిన
విరుద్ధముగం దోఁచును. భరతుఁడు కోరిన నేనేమైన నీయకుం
డునా. అతఁడు ప్రియసోదరుఁడుకదా యనియే యిందుఁగల
సారము. "సీతాం రాజ్యం చ" అనుట విరుద్ధముగా నుండక
తప్పదు. వివాహకాలమున నన్నా! నాకు సీతఁ బెండ్లియాడు
కోర్కి కలదని యడిగియుండిన నిచ్చియుందునే యని రాముని
యాశయము. మహాభక్తుఁడగు భరతుఁ డట్లడుగునా యని
ప్రశ్నింపవలదు. కైకకుఁగల కోర్కెఁ దీర్ప సిద్ధముగానున్నాఁడ
నన్న భావమును దెల్పుటకే యీమాటలు రామునిచేఁ జెప్పఁబడి
నవి. ఇచ్చోట శివధనుర్భంగకాలమునందే యని యర్థము పలుక
వలయును. లేకయున్న ధర్మసంస్థాపనార్థ మవతరించినభగవం
తుఁడే యిట్లు చెప్పెనన్నఁ దక్కినవారిమాట లింక నేటికి?
"వ్యాకరణోపమానకోశాప్తవాక్యాద్వ్యవహారతశ్చ" అన్న

సూక్తి ననుసరించి యర్థము పలుకవలయును. ప్రాణములను వానికంటెం బ్రియవస్తువగుసీతనుగూడ నిచ్చియుందునే. ఇంత ప్రయత్న మేలచేసితివి? అని భరతునియందుం దనకుం గల వాత్సల్యమును దేటపఱచిన నామె సంతోషించు ననియే రాముని యభిప్రాయము. ఇదియే మనము గ్రహింపఁదగిన యర్థము. ఈఘట్టమునఁ దెనిఁగించినవా రెట్లు ప్రవర్తించిరో పరికింతము.

ఆ. "ఆ ప్రచోదితుండ నయ్యును భరతున
కఖిల రాజ్య మిచ్చునట్టివాఁడ
జనకుచేత నిట్లు సంప్రచోదితుండనై
యిచ్చుటకు విచార మేల కలుగు?"

(గోపీనాథ రామాయణము.)

తే. "ఒకరిప్రేరణమే లేక యకలుషమతి
యైన నాసోదరునకు రాజ్యంబు ధనముఁ
బ్రియములౌ ప్రాణములనైన వేడ్క నిత్తుఁ
గాంక్షయుండినఁ జాపభంగంబునందె."

క. జానకి నొసంగియుందును;"

(ఆంధ్ర శ్రీమద్రామాయణము.)

చ. భరతున కిమ్మటన్న బహుభాషల వేటికి మున్నె జానకిన్
ధరణిని బ్రాణముల్ ధనవితానము నీయఁగలేనె నేను గా;

(వావిలికొలనువారి రామాయణము.)

మొదటివారు చల్లఁగా దాఁటిరి. తక్కిన రెండింటిలో నీ శ్లోకార్థము నేదిపోషించె ననువిషయము పెద్దలే నిర్ణయించు

కొందురుగాక. విమర్శకులు కొందఱు పక్షపాతమున నన్నాక్షే పించిరి. వాలికొలనువారిరామాయణముం బొగడిరి. అదెంత న్యాయమో పెద్దలే యెఱుంగఁదగుదురు. గ్రంథకర్తలను గుఱించి నేను వ్రాయను. ఎవరియిష్టము వారిదని నేనెఱుంగనా?

> "నాహమర్థపరో దేవి లోకమావస్తుముత్సహే,
> విద్ధి మామృషిభిస్తుల్యం కేవలం ధర్మమాస్థితం." ౨౦
> యదత్ర భవతః కించిచ్ఛక్యం కర్తుం ప్రియం మయా,
> ప్రాణానపి పరిత్యజ్య సర్వథా కృతమేవ తత్. ౨౧
> న హ్యతో ధర్మచరణం కించిదస్తి మహత్తరం,
> యథా పితరి శుశ్రూషా తస్య వా వచనక్రియా." ౨౨

అని మూలము. శ్రీరామమూర్తి స్వావతారఫలమును దెలుపు చున్నాఁడు. ధనమునందుఁ బ్రీతిగాని, జనుల లోఁబఱచుకొను కుతూహలముగాని నాకు నుత్సాహము లేదు. ఋషులతో సమానునిగాను ధర్మమునే యాశ్రయించినవానిగ నన్నెఱుంగుము. ఋషి యనఁగా

> "జ్ఞానసంసారయోః పారగంతా ఋషితిప్రాప్నోతిసర్వాన్ మంత్రాన్
> జ్ఞానేన పశ్యతి సంసారపారం వా"

అని జ్ఞానముయొక్కసారమును గాంచినవాఁడు. సంసారపారము నెఱింగినవాఁడు. అని యర్థము. జ్ఞానపారంగతుఁడు రాముఁడు సంసారపారమును గాంచినది ప్రకృతి. అనఁగా నన్ను మాయామయుతునిగా సగుణబ్రహ్మముగా నెఱుంగుము. ధర్మమునే యాశ్రయించియుందును. నేనుండుతావున నధర్మమే నిలువఁజాలును. అధర్మమునకుఁ దావేయుండదని భావము. పిత్రు

సేవకంబో పిత్రువచనప్రకారము నడచుకొనుటకంటె గొప్ప దనఁబడు ధర్మాచరణమే లేదు. ఈ రెండు నొనరింపక శాస్త్రముం గలధర్మముల నాచరించిన నయ్యవి ధర్మములే కావని భావము. లోకమున సత్పుత్త్రుఁడు తండ్రికి శుశ్రూష చేయుచుఁ దదాజ్ఞ శిరసావహించి యొనరించువాఁడే ధర్మాచరణుఁడు. ఈనియమ మును స్థాపించుటకే రాముఁ డవతరించెనని తేటపఱచెను. ఈ రెండు నొనరించువాఁ డన్నిధర్మముల నాచరించినట్లే యని సారము. ఇదియే శ్రీరామచంద్రుని సదుపదేశమని మన మెఱుంగవలయును.

"అభిషేచనికం భాండం కృత్వా రామః ప్రదక్షిణం,
శనైర్జగామ సాపేక్షో దృష్టిం తత్రావిచాలయన్. ౩౧
న చాస్య మహతీం లక్ష్మీం రాజ్యనాశోఽపకర్షతి,
లోకకాంతస్య కాంతత్వాచ్ఛీతరశ్మేరివ క్షపా." ౩౨

అని మూలము. పట్టాభిషేకమనఁగా ధర్మపాలనరూపమహామహో త్సవవిశేషము. కాన నయ్యది మహాదీక్ష. దానికంగమగుసాధన ములు పరమపవిత్రములు. కావున వానికిఁ బ్రదక్షిణముచేసి రాముఁ డరిగెను. భరతాభిషేకముగూడఁ దనదే యగునన్న భావమే యపేక్షకుం గారణము. భరతున కభిషేకము కాఁగా నది తనకే యన్వయించును. అనఁగాఁ దనపాదుకలకే యగు నన్నభావమున వానిని ప్రీతితో రామమూర్తి చూచెనని గ్రహింపందగు. రాజ్యనాశమనఁగా రాజ్యభ్రంశము రామ చంద్రుని పూజ్యురాలగులక్ష్మి నాకర్షింపఁజాలకపోయెను.అనఁగా నీరాజ్యప్రాప్తి గొప్పదిగా భావించినవాఁడు కాఁడు. అతితుచ్ఛ మైనదని భావము. కావున నిది రాకపోయినందునఁ దనసంపదకు

భంగమని తలంచువాఁడు కాఁడయ్యెను. ఆమహనీయుని లక్ష్మి యనఁగా మహామాయ మహత్తరమైనది. ఇట్టి రాజ్య కోటులనుగాక యనేకబ్రహ్మాండములను గల్పించునది. కావున నిది యొకకోఅంతగా శ్రీరాముఁడు భావింపలేదనియే యిందు గ్రహింపఁదగువిషయము.

"వాచా మధురయా రామస్సర్వం సమ్మానయన్ జనం,
మాతుస్సమీపం ధీరాత్మా ప్రవివేశ మహాయశాః."

అని మూలము. మనోహరములనఁగాఁ జెవులకుఁ బండువు చేయునవి. అట్టిమాటలచే నెల్లవారిని గారవించుచు ధీరాత్ముఁడు మహాయశుఁడు గావునఁ దల్లియింటికిఁ బోయెను తన యవతారఫలము లోకములకు సమకూర్ప సమయ మరుదెంచెనన్న సంతోషమున నెల్లవారల నుమ్మలికము గ్రమ్మకయుండ నాశ్వాసించుచుఁ దల్లి చెంతకుం బోయెను. సామాన్యులకుఁ గలుగుదుఃఖము మోముననే తాండవమాడుచుండును. ఆస్థితి యందు వారు సరసవాక్కులు పలుకఁజాలరు. భగవంతున కట్టి దుఃఖము లంటవుగదా. కనుకనే శ్రుతిహితములగువాక్కుల చేత నెల్లర నూఱడించుచుఁ బోయెనని మన మెఱుంగవలయు. "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" అనుశ్రుతివాక్య ననుసరించి యానందమే పరమేశ్వరస్వరూపము. కావున నాలక్షణము కనంబడఁజేసెనని యీభాగము మనకుఁ దెలుపుచున్నది. ఇట్లు గ్రహించి సదానందరూపమును ధ్యానింపవలయును. అట్లు ధ్యానము చేయువారలకు సంసారతాపత్రయములు బాధింపఁజాలవని యోగులు పలుకుదురు.

"యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ"

అన్న లోకోక్తియు,

"యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్"

అన్న భగవద్గీతోక్తియుఁ బ్రమాణములు కాకపోవు కదా. కావునఁ బరమేశ్వరుని నానందబ్రహ్మమును సర్వకారణుని జక్కనిభక్తిమై నారాధింపవలయును. ఆరాధించుమార్గములలో ధ్యానమార్గ ముత్తమము. మనోవీథి నెలకొల్పఁబడిన తేజోరూపమును ధ్యానించుచు నిరతిశయానందము ననుభవించుచుండుటయే జన్మసాఫల్యము. విగ్రహారాధనము చిరకాలము చేసినను ఫల మత్యల్పము. భగవంతునిరూపము భక్తులచే నిచ్ఛానురూపముగాఁ గల్పింపఁబడును. అయ్యది తొలుదొలుత మనోవీథి నెలకొనఁజాలదు. కావున విగ్రహముల నిర్మించుకొని పూజించు టవసరమయ్యెను. పాషాణములయందు భగవద్బుద్ధి పామరులకు ధ్యానము కుదురుటకుఁగా నుపకరించును. ఆవెనుక నయ్యది నిరర్థకమగును. నిర్జనస్థలమునే యోగులు కోరుదురు. ధ్యానమునకు వస్తుప్రాప్తి మక్కఱలేదు. నిశ్చలమనస్సుమాత్రమే యుండవలయు. అయ్యది పూర్వకర్మానుసారముగా లభించినయోగనిరతి ననుసరించియుండును. ఎప్పుడాసిద్ధి చేకూరునో ముక్తి యప్పుడు కరతలామలకమే. ముక్తిస్థానమనఁగా నొకలోకము కాదు. అందు దివ్యహర్మ్యములుండవు. అందు విహరించుటయు ముక్తి కానేరదు. అవ్యయానంద మనుభవించుమార్గము దొరకుటయే ముక్తి. ఆస్థితియందుండువాఁడు సమదర్శనుఁడై యుండును. పాంచభౌతికశరీరముతో నుండవచ్చును. వేఱొకరూపమున నుండవచ్చును.

ముక్తిస్థానము వైకుంఠమని కొందఱు, కైలాసమని కొందఱు, సత్యలోకమని కొందఱు, ఈమూఁడును గావు. ఇంకొక్కలోక మని మఱియుఁ గొందఱు చేతులం ద్రిప్పుచుఁ బలుకుదురు. అది యొకలోకమైనచో నాముక్తి యెవ్వరికిని వలదు. లోకము శాశ్వతమనుట వెఱ్ఱిమాట. ఆనమ్మకముకలవారల కదియు నొక విధమగుముక్తియే కావచ్చును. కాని వారికిఁ బునరావృత్తి కలదు. ఇదియే యుపనిషన్మతము. యోగమత మిదియే. భగవ దుపదేశ మిదియే. ఇంకొక్కటి కాదు.

ప్రకృత మనుసరింతును. మహానందసాగరమున నోల లాడుచు నితరులకు దారుణవృత్తాంతముగనున్నను శ్రీరామున కయ్యది శుభోదంతముగాఁ దోఁచెను. తనయవతారమునకు ఫలములు దుష్టసంహారశిష్టపాలనధర్మసంస్థాపనము లేకదా. వాని కీప్రయత్నమే ముఖ్యసాధనము. తనయిచ్ఛాశక్తియగు సీతా సంకల్పమే కైక నట్లు ప్రోత్సహించెను. అసంగుఁడయ్యు శ్రీరాముఁడు సంగిభంగిఁ బ్రవర్తింపఁబూనెను. ఆమహాపురు షునిమనోవీథియం దానందము తాండవమాడుచున్నది. సుస్మి తము మోమునఁ జెలరేఁగుచున్నది. ధర్మసంస్థాపనముచేయ వలయునన్నసత్సంకల్పము బుద్ధియందుఁ దాండవము సల్పు చున్నది. తనకుఁ గష్టముగలిగినే యని వగచుమిత్రులం గాంచిన వీరెంతపామరులా యన్నజాలి యుదయించుచున్నది. దండ కారణ్యవాసుల రక్షించుకార్యమున నుత్సాహము పెరుగు చున్నది. అయోధ్యానివాసమున క్షణముగూడఁ గడపరా దన్నయాశయ మంకురించి పురికొల్పుచున్నది. తల్లికిం దెల్పఁ బోవునపు డిట్టు లాభగవంతుఁడు పెక్కుముఖముల సంతో

షము వెళ్లివిరియఁగా నొప్పుచున్నాఁడు. అట్టిభక్తగణగణాన్వితుం
గాంచి మహానందమున నొప్పు నాశ్రీరామచంద్రునిరూపము
ధ్యేయమనుట యతిశయోక్తి కానేరదు. యోగులారూపమునే
ధ్యానింతురు. కన్నులకు ఫలమన నదియే. అనేకజన్మార్జితసత్కర్మ
ఫల మదియే. యోగాభ్యాసజనితమహానందఫల మదియే.
కావున నట్టి ధర్మసంస్థాపనిరతచిత్తుఁడై మహాప్రపన్నపాలనాం
గతుఁడై ప్రవృత్తిమార్గమునఁ బ్రసిద్ధిగను నాదేవదేవుని
కరుణాశరధిని దాశరథిని నిర్మలమనస్సున ధ్యానించుటయే
యీకలికాలమున విశేషించి యుత్తమకార్యము. శ్రీరామ
భక్తులమనువారెందఱో కలరు. దేవాలయములు కట్టఁబడు
చున్నవి. తరణోపాయమగుధ్యానమార్గమును బోధించువా
రరుదుగ నుండుననవచ్చును. ధనముసేకరించుట కీకాలమున
వేదాంతశాస్త్రము, భక్తిమార్గము, మంత్రోపదేశము నను నీ
మూఁడును ముఖ్యములుగ నున్నవి. పామరులు భగన్నామ
సంకీర్తనము చేయుచు, దానికి ఫలముగా మనస్సున నొక్క
గడియసేపయిన నాభగవత్కల్పితమూర్తిని ధ్యానించునభ్యా
సము చేయవలయును. దాననే యాపరమేశ్వరుఁ డానందిం
చును. భక్తులని వారల సంభావించును. కృతార్థులనుగా నొన
రింప నూహించును కావున విగ్రహారాధనము చేయువారుం
గూడ నామూర్తినే మనస్సున నొక్కక్షణకాలమైన నిలుపు
కొనఁ బ్రయత్నింతురుగాక. కపటనాటకసూత్రధారులమోస
మునకు లోఁబడి ధనము పోఁగొట్టుకొనక యుందురుగాక. కట్టి
యున్న దేవాలయములే చాలును. అవి మానవుల నుద్ధరింపఁ
జాలవు. మహనీయధ్యాన ముద్ధరింపఁగలదు. కావునఁ దదభ్యాస

మునకై ప్రయత్నము చేయవలయు. ఇది కలియుగము. సనాతనాచారములు తారుమారగును. ధర్మపద్ధతులు తలక్రిందులగును. వానిని సరకు చేయక ప్రతిమానవుఁడు తనతరణోపాయమును జూచుకొనవలయును. దానికిందగుమార్గ మేదియని పరికింపవలయును. శ్రీపరమేశ్వరు నామసంకీర్తనము సర్వదా చేయుచుఁ, దచ్చరిత్రామృతమును గ్రోలుచుఁ, దుచ్ఛలయుపదేశముల నాసక్తింగొనక, యితరు లారాధించు దేవతల దూషింపక, సర్వమతము లాపరమేశ్వరునే మార్గభేదముల నాయాయి మానవులకుం దగినయట్లు దేశకాలముల నెఱింగి బోధించును గాన వానియాశయ మెఱుంగకయే వానిదూషింపక, పరమతములయందు నోర్పుగలిగి తమకు నభ్యాసమునఁ దెలిసినవాని నితరులకు మంచిమాటలచేఁ దెల్పుచు, వార లాదరింపనిచో దూషింపక శాంతముఁ బహించుచు, ధర్మమార్గమును బెంపొందఁ జేయుచు భగవంతుని సేవింపవలయును. ఇంతకంటె నుత్తమము సులభమునగుమార్గము కానరాదు. కావున మానవులు భక్తిశ్రద్ధలతో శ్రీరామచంద్రుని సేవించి కృతార్థులు కావలయును.

"రామం రాజశిఖామణిం రఘుపతిం దేవారిదర్పాపహం
లోకానాం హితకారిణం గుణనిధిం కారుణ్యపుణ్యోదయం,
ముక్తావిద్రుమరత్నశోభితతనుం సౌందర్యహాస్తాంబుజం
కౌసల్యాతనయం భజామి సతతం శ్రీజానకీనాయకం. ౧౮

రామం వీరాసనస్థం హృదయగతకరోదంచితజ్ఞానముద్రం
జానున్యాసక్తహస్తం క్షితివరతనయాభూషితం వామభాగే,
షట్కోణే వ్యాహరంతం పవనసుతయుతం మానసే మానయంతం
సుగ్రీవే సేవమానే దృఢశరధనుషా దక్షిణే లక్ష్మణేన. ౧౯

రామం సౌమిత్రిమిత్రం రఘుపతిమమలం రామచంద్రం రమేశం
రమ్యం శ్రీరాఘవేశం శుభలలితముఖం శుద్ధసత్త్వం సువీరం,
సీతాసౌందర్యపాత్రం సురమునివినుతం నీరజేందీవరాభం
వందే వందారుపాలం రజనిచరహరం రమ్యకోదండరామమ్." ౨౦

ఈరీతిగా శ్రీరామచంద్రు నాకారమును మనస్సున నెలకొలిపి ధ్యానింపవలయును. మానసపూజానిరతులము కావలయును. అదియే యుత్తమోత్తమమార్గము. ఓం శాంతిః శాంతిః శాంతిః.

ధర్మరక్షణప్రయత్నమను మూఁడవప్రకరణము

సంపూర్ణము.

శ్రీ. శ్రీ. శ్రీ.

---

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్ సన్సు వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము— 1932.

# భద్రవాక్కు.

మహాశయులారా! ఈశ్వరానుగ్రహమున శ్రీరామావతారతత్త్వమునందు నాలుగవప్రకరణమును నేటికి తమ సన్నిధానమున నర్పింపఁజాలితిని. ఇంచుమించుగా సకాలముననే యిది యందినదని మీరు భావింపఁగలరు. అయోధ్యాకాండమున నిరువదియవసర్గము మొదలుగ నేఁబది రెండవసర్గము వఱకును గలకథాభాగ మిందు వ్రాయఁబడినది. పెక్కుస్థలములలో మూలమునకు నా వ్రాసినయర్థములు విమర్శింపఁదగినవిగఁ దోఁపవచ్చును. వానిని బఠించునప్పుడు దుర్మతాభిమానము మానక వానిపోకడ లా యర్థమును బోధించు ననువిషయమును జక్కఁగ నాలోచించిన నా యర్థము సార్థక మనియే తోఁచును. ఈగ్రంథమంతయు శ్రీసీతారాములు వైకుంఠనాధిపతియగు విష్ణువు మహాలక్ష్మిం గూడి యవతరించె నను వాదము సుసంగతము కాదనియు, సర్వాంతర్యామియగు పరమేశ్వరుఁడు తన శేషశాయిని యగుమహాప్రకృతిం గూడి యవతరించెననియు, వెల్లడించును గాన నావిషయము తేటపడఁ బునరుక్తితాదోషమునకు భయపడక యితరు లేమనుకొందురో యని జంకక తోఁచినయర్థమును వ్రాసితిని. సమదర్శను లగు పెద్దలు దీనిం బరికింతురుగాక!

ప్రాయికముగా నిందు భగవదారాధనమంతయు యోగమతము ననుసరించియే వ్రాయంబడినది. భగవద్గీతాసిద్ధాంతమదియే యని నాదృఢవిశ్వాసము. తదనుగుణముగా నందందుఁ బ్రమాణములు చూపఁబడినవి. స్వాత్మమతప్రవిష్టులగువారు కొంద ఱీసడించిన నీసడింతురుగాక! దానం గొఱంతయేమి? "యత్స్నానసగమనాద్యైవేదం మమతు పాథేయమ్" అను సూక్తియే నాకు శరణము. అయోధ్యాకాండమున నించు

మించుగ సగముభాగ మయినదనవచ్చును. అధ్యాత్మ రామాయణమునఁ గలవిశేషములును నిందుఁ జర్చింపఁబడినవి. ఇతర పురాణములయం దీకథాభాగము విశేషించి చర్చింపఁబడనందున వాని నిందుఁ గైకొనలేదు. ముందుముందు, వానిం గలిపికొని, గ్రంథమును సాగింతును. ఈ నాప్రయత్నమునకు మహనీయులు, కొందఱు తోడుపడిరి. వారికెంతయుఁ గృతజ్ఞుఁడను. ఈప్రయత్నము కడుంగడుం బెద్దదియగుట ధనముకూడ మిక్కిలిగఁ గావలసియుండుట పెద్దలకుఁ గ్రొత్తదికాదు. దానిని జేకూర్పవలసినభారము శ్రీరామచంద్రునిదిగాని నాదికాదు. ఇందు విశేషించి స్మర్తవ్యులు సనాతనాధునాతనభాషోద్ధారకులు మ-రా-రా-శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు. వారి కేనెంతయుఁ గృతజ్ఞుఁడను. ఆంధ్రపత్రికాధిపతులు దేశోద్ధారకులు విశ్వదాతలునగు మ-రా-రా-శ్రీ, కాశీనాథుని నాగేశ్వరరావుగారును, కృష్ణాపత్రికాధిపతులును స్మర్తవ్యులు. వారిసాయమపారము కొందఱు కాలగతింబట్టి యీసంపుటము మూల్యము నొక్కరూప్యముగాఁ జేయఁదగునని నాకుం దెలిపిరి. పోషకులును, చందాదారులును, మఱికొందఱు చేరినఁ గాని యట్లుచేయ సాధ్యముకాదు. ఈవిషయము నేను దెలుపకయే తెలియవచ్చుచుండును. ఈకార్యము తమకార్యమని భావించి నాలోపముల మన్నించి తెలుపఁదగువిషయములు నాకుం దెలిపి నాచేతనే వ్రాయించి నన్ను ధన్యునిఁ గావింతురని సాధువులఁ దలయొగ్గి వేఁడుచున్నాఁడను. ఇంతకంటె విశేషించి వ్రాయఁదగినవి కనఁబడవు.

ఇట్లు విన్నవించు
సాధుజనపాదసేవకుఁడు
జనమంచి శేషాద్రిశర్మ.

# విషయసూచిక.

పుట.

శ్రీః.

# శ్రీ రామావతారతత్త్వము

## అయోధ్యాకాండము.

### చతుర్థప్రకరణము.

---

#### దేవతాస్తవము.

౧. రామం చందనశీతలం క్షితిసుతామోహాకరం శ్రీకరం
వైదేహీనయనారవిందమిహిరం సంపూర్ణచంద్రాననం,
రాజానం కరుణాసమేతనయనం సీతామనస్స్యందనం
సీతాదర్పణచారుగండలలితం వందే సదా రాఘవమ్. ౧

రామం శ్యామాభిరామం రవిశశినయనం కోటిసూర్యప్రకాశం
దివ్యం దివ్యాస్త్రపాణిం శరముఖశరధిం చారుకోదండహస్తం,
కాలం కాలాగ్నిరుద్రం రిపుకులదహనం విఘ్నవిచ్ఛేదదక్షం
భీమం భీమాట్టహాసం సకలభయహరం రామచంద్రం భజేహమ్. ౨

రామచంద్రచరితాకథామృతం లక్ష్మణాగ్రజగుణానుకీర్తనం,
రాఘవేశ తవ పాదసేవనం సంభవంతు మమ జన్మజన్మని. ౩

రామో మత్కులదైవతం స కరుణం రామం భజే సాదరం
రామేణాఖిలఘోరపాపనిహతీ రామాయ తస్మై నమః,
రామాన్నాస్తి జగత్త్రయైకసులభో రామస్య దాసోఽస్మ్యహం
రామే ప్రీతిరతీవ మే కులగురో శ్రీరామ రక్షస్వ మామ్. ౪

శ్రీరామచంద్ర తవ కీర్తిసురద్రుమస్య
తారాగణస్సుమనసః ఫలమిందుబింబమ్,
మూలం ఫణాతలిగతం గగనం చ మధ్యం
శాఖాదిశో భువనమండలమాలవాలమ్. ౫

(శ్రీరామకర్ణామృతము.)

భక్తవర్యులారా! సత్యాన్వేషణతత్పరులారా!

శ్రీరామావతారతత్త్వమునందలి మూఁడవప్రకరణమును భక్తిమెయి మీసన్నిధానమున సమర్పించుభాగ్యవిశేషము నాకుఁగలిగినది. ఆప్రకరణమున దశరథమహీజాని శ్రీరామాభిషేకసువార్తను బ్రజలకుఁ దెలుపుట యనునది మొదలాపరమేశ్వరుఁ డడవికిఁబోవ నంగీకరించినంతదనుకఁ గలకథలు గలవు. సకలసదాచారప్రబోధకములగు నాకథావిశేషములఁ బఠించినకతన భగవంతునియాశయము. లోకుల కెట్లు న్యాయమును స్వప్రవర్తనమునఁ దెలిపినపద్ధతియు మంథరాకేకయరాజపుత్త్రికలచరిత్రసారము. వారెందులకయి యట్లు ప్రవర్తించినదియు మీరు తృప్తిగా గ్రహించియే యున్నవారనియే నావిశ్వాసము. శ్రీరామచంద్రమూర్తియు మహామాయయగుసీతయుఁ బ్రపంచమున ధర్మసంస్థాపన మెట్లెట్లు చేయఁబూనినదియుఁ దేటతెల్లముగా నాప్రకరణము మీకుఁ దెలుపును. ఒక్కధర్మమును శాశ్వతముగా నిలుపంబూని యెవ్వరెవ్వ రెంతెంతకష్టములపాలైనదియు నించుక పరికించిన స్పష్టము కాకపోదు.

తఱచుగా లోకులలోఁ గొందఱు మంథరను గైకను దూఱుదురు. అది మిగులఁ బ్రమాదమని యాప్రకరణము

ధించును. ఎన్నిలోకాపవాదములు తమ్మలముకొనినను, దతెన్నెన్నిరీతులఁ దమ్ము దూషించినను వానిని లెక్కసేయక భగవదాశయమగు ధర్మరక్షణమహాకార్యమును లక్ష్యముగా నిడికొని దేవమునీంద్రులయానతిని శిరసావహించి వారు తమ పనులఁ జక్కఁగా నిర్వహించిరని మన మెఱుంగవలయును. అల్పబుద్ధు లొనరించు స్తుతులు దూషణములు నచిరకాలమున లయమొందును. భగవదాజ్ఞ శాశ్వతానంద మొసంగుపదమ్ము నొసంగునదియే యగును. కావున నద్దాని యథామతి నొన రించి లోకములకు ధర్మమునకును మహోపకార మొనరించిన వారు కైకయు మంథరయు నని స్పష్టమగును. అట్టివారిని యాథార్థ్య మెఱుంగక దూషించుట పొరపాటుగాక మఱే మగును? తన్మూలముననఁగాని భగవంతున కరణ్యాగమనము పొసఁ గదు. అది సాగిననఁగాని దుష్టదానవసంహారము, శిష్టపరిపాలనము సాగింప వలనుపడదు. పట్టాభిషేకమహోత్సవము సాగియుండినఁ గొందఱి కే యానందము కలుగును. అట్టి యానందమున కడ్డు పడినదన్న కారణమున మంథరను గైకను నిందింపవలయునో, ముల్లోకములకు మహోపకార మొనర్ప సాయపడిరన్న కారణ మున నుతింపవలయునో మహామతులే యూహింపఁదగుదురు. వీరు లేకయున్న భగవత్కార్యము సాగదా యనువారు కొందఱు గలరు. ఇంకొక్కరు నిమిత్తముగా నుండవలయును. నిమిత్తములేకయున్నఁ గార్యమేసాగదు. "నిమిత్తమాత్రం భవసవ్యసాచిన్" అని భగవంతుఁడే యుపదేశించెనుగదా. "నహి కారణం వినా కార్యస్యోత్పత్తిః." అన్న న్యాయము సుప్ర సిద్ధముకదా. ఇన్ని కారణములంబట్టి యాలోచింపఁగా నేకారణ మును బట్టి వారు నిందింపఁబడుచున్నారో ఆ కారణమునుబట్టి

న్నది. అట్టివారే మధ్యవైష్ణవులని, మధ్యశైవులని, మధ్యశాక్తులని యిందుఁ జేర్కొనఁబడుదురు. సర్వదేవతాస్వరూపునిగా నవనఁగాఁ బరమేశ్వరునిగా సర్వకారణునిగా నన్నెవరుతలంతురో

"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః."

అన్నగీతావాక్యము ననుసరించి యెవరు సర్వము నన్నుగాఁ జూతురో వారు ఫలాభిసంధిరహితసత్కర్మాచరణనిపుణులు. కాన వారిని నేనే రక్షింతునని భగవంతుఁడు పలికెను. ఈభావము గలిగిన మతద్వేషమునకుఁ జోటులేదు. దేవతాంతరదూషణమున కవకాశమే లేదు. అట్లుగాక మారాముఁడే గొప్పవాఁడు. మాశంకరుఁడే యధికుఁడు అని యూహించునెడల వారు భగవత్కరుణకుఁ బాత్రులుకాఁజాలరు. పాషండులే యగుదురు. సర్వశబ్దవాచ్యుఁడుకదా భగవంతుఁడు. మారాముఁ డనఁగా నర్థమేమి? అహంకారస్వరూపుఁ డీమానవుఁడనియేకదా దాని యర్థము. ఎల్లరకుఁ బరమాత్మ సమానుఁడే. సర్వసాక్షి. కరుణాస్వరూపుఁడు. అట్టిమహాత్ముని నహంకారమున నారాధించిన ఫలము శూన్యమే యగును. భగవంతుఁడు మానవుని బాహ్యచిహ్నములను జూడఁడు. పవిత్రమగుమనస్సునే చూచును. అన్నబుద్ధుని హితోపదేశ మెంతబాగున్నదో చూడుఁడు.

"స్థితిః పుణ్యారణ్యే సహపరిచయో హంత హరిణైః
ఫలైర్మేధ్యావృత్తిః ప్రతిదివసతల్పాని దృషదః,
ఇతీయం సామగ్రీ భవతి హరిభక్తిం స్పృహయతాం
వనం వా గేహం వా సదృశముపశాంతైకమనసామ్." 33

(వైరాగ్యశతకము.)

న్న భర్తృహారిహిత మెంతసొంపుగానున్నది? మనోదోషములు తొలఁగినఁగాని భగవదారాధనము సత్ఫలవంతము కాఁజాలదని తేలెడిని. మనస్సు ధనాశాబద్ధమై యీర్ష్యాదుర్గుణసాంద్రమై యుండఁగా యోగివేషముదాల్చిన కపటనాటకసూత్రధారులు చేయు భగవదారాధనము నిష్ఫలమగుటయే గాక దుష్ఫలదము కూడ నగుననుట కేమిసందియము. కావున మనోమలము లనఁబడు కామక్రోధాదులఁ బాఱఁదోలి యథాశక్తి న్యాయము ననుసరించి పరమేశ్వరుని భక్తిమెయి నారాధించిన నామహాత్ముఁ డనుగ్రహించి యక్షయానందసుఖము నొసంగును.

భగవంతుఁడు సర్వశక్తియుతుఁడు. బీజాంకురన్యాయము ననుసరించి యెల్లవస్తువులు తద్వశముననుండు. కాని యాస్థితియం దాపరమాత్మ యేకార్యము నొనరింపఁడు. ప్రకృతివిశిష్టుఁడైననే ప్రపంచవిషయకచింతగలవాఁడగును. ఆస్థితియం దా మహానుభావుఁడు సగుణబ్రహ్మ మనంబడును. అనఁగాఁ బ్రకృతిని సర్వకార్యముల నొనరింప నియమించి తాను సర్వసాక్షియై యుండునని భావము. ప్రకృతి యొకస్త్రీగాదు. ప్రకృతిశబ్దము స్త్రీలింగము. ప్రకృతి భగవంతు నిచ్ఛాశక్తి. ఆప్రకృతి ఇచ్ఛాశక్తి యని, జ్ఞానశక్తి యని, క్రియాశక్తి యని పిలువంబడును. ఈమూఁడును భగవంతుని సంకల్పములే. ఉపాసకునియిచ్ఛ ననుసరించి స్త్రీరూపముఁ దాల్చును. భగవంతుఁడుకూడ నుపాసకునియిష్టము ననుసరించి రూపమును ధరించునుగదా. అనఁగా నేరూపమున నుపాసకుఁ డాపరమాత్మను ధ్యానవిషయకునిగాఁ జేయునో యారూపమునఁ దోఁచి వానిని రక్షించును. అట్లే ప్రకృతియు నని యెఱుంగఁదగు. ప్రకృతి యని

యుపాసించినను ఆపరమాత్మ నుపాసించినట్లే యని భావము. ఆయిచ్ఛయు నామహానుభావుని దేకదా.

"ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా,
న తే రూపం న చాకారో నాయుధాని న చాస్పదం,
తథాపి పురుషాకారో భక్తానాం త్వం ప్రకాశసే."

అనుప్రాచీనసూక్తు లీయర్థమునే సమర్థించుచున్నవి. కావున భక్తానుగ్రహార్థ మీశ్వరుఁడు రూపమును ధరించుననునదియే సారము. ఇఁకఁ గథాభాగమున నీవిషయమును సమన్వయింతము.

భగవంతుఁడు రామచంద్రరూపమును, మూలప్రకృతి సీతారూపమును ధరించి జగదుపకారము చేయఁబూనిరి. వారి కార్యము నిర్వహింపఁదగువారెల్ల భూలోకమునఁ బుట్టిరి. వారివారి కార్యముల నిర్వహింపఁబూనిరి. వారిమూలమున నానాకార్యములు చేయించుపని ప్రకృతిది. శ్రీరామమూర్తి యీ ప్రకృతికార్యములను బరికించుచు సర్వసాక్షియై నిర్లిప్తుఁడై యుండును. కాని తానుగూడ సర్వకార్యముల నిర్వహించుచున్నయట్లు నటించును. ఎవ్వరెవ్వ రేయే కార్యముల మూలమునఁ గీర్త్యపకీర్తుల నొందవలయునో వారు వారట్టి కార్యముల నించుకంతయుఁ బ్రమాదంపడక యొనరించునట్లు చేయవలయునని ప్రకృతి సంకల్పించును. కార్య మట్లేసాగును.

"సత్యం విధాతుం నిజభృత్యభాషితం
వ్యాప్తిం చ భూతే ష్వఖిలేషు చాత్మనః,
అదృశ్యతాత్యద్భుతరూప ముద్వహన్
స్తంభే సభాయాం న మృగం న మానుషమ్." ౧౮

(శ్రీభాగ. 7 స్కం. 8 అధ్యా.)

అనువచనము.

"జగత్సూతే ధాతా హరిరవతి రుద్రః క్షపయతే
తిరస్కుర్వన్నేత త్స్వమపి వపు రీశ స్తిరయతి,
సదా పూర్వస్సర్వం తదిద మనుగృహ్ణాతిచ శివ
స్తవాజ్ఞామాలంబ్యక్షణచలితయో ర్భ్రూలతికయోః." ౨౪

(సౌందర్యలహరి.)

ఈ వచనము పై వ్రాసినభావమును స్పష్టీకరించుచున్నవి.

ప్రస్తుతము సీతారాములు ధర్మరక్షణమునకుం బూనిరి. మంథరయుఁ గైకయు నాకార్యము సాగింపఁ బ్రధానకార్య మనంజను వనగమనమునకుఁ దోడ్పడిరి. దశరథునిదీనాలాప ములు కైకేయికి రుచింపనయ్యెను. ఎంతప్రార్థించిన నామె తన పట్టు వదలనయ్యెను. ఏల? సీతాదేవి సంకల్పరూపశక్తి కైకేయి హృదయము నావేశించినది. ఆమెకుఁ గలశక్తి యడంగినది. పతివచనము దుర్లంఘ్యమన్న భావముగల సాధ్వియే కైకయగును. ఐనను బరదేవతాసంకల్ప మామెను మార్చివైచినది. పతివచ నము గ్రాహ్యమా? ధర్మరక్షణప్రయత్నము ముఖ్యమా? అని మనము విచారింపవలయును. సామాన్యదృష్టికిఁ బతివాక్యము రీతి మెలఁగుటయే ధర్మమని తోఁచును. ఇదియే సిద్ధాంతమైన యెడలఁ గర్మసిద్ధాంతమునకుఁ దిలోదకప్రదానము కావలసి వచ్చును. ఎట్లనఁగాఁ జిత్తగింపుఁడు. దశరథుఁడు శాపకారణ మునఁ బుత్రవియోగదుఃఖమున మృతినొంద సిద్ధుఁడై యున్న వాఁడు. విరాధాదిరాక్షసులు రామునిచేఁ జావ నాయత్తులై యున్నవారు. ఈకర్మఫలముల కన్నింటికిఁ గైకపట్టుదలయే

ప్రధానము. దశరథునిభార్యల కందఱకు వైధవ్యదుఃఖానుభవ కాలము సమీపించియున్నది. గుహుఁడు లోనగుభక్తులకు శ్రీరామదర్శనమహాభాగ్యము లభించుకాలము వచ్చియున్నది. ఇన్నికర్మములు ఫలింపనుండఁగాఁ గైక యెట్లు పతివచనము నంగీకరించును? అంగీకరించు నవకాశముకలదా? ఆమెయుఁ గర్మపాశబద్ధురాలేకదా. కర్మసిద్ధాంతము బలవత్తరమని భగవంతుఁడే "గహనాకర్మణోగతిః" అన్న వాక్యముచేతఁ దెలిపియే యున్నాఁడు. కాఁబట్టి కైక పతివ్రతాశిరోమణియే యగును. దశరథుఁడు సత్యవాదియే యగును. కాని కర్మము త్రిప్పులకు లోనుకానివాఁ డెవ్వఁడు ప్రపంచములయం దెందైనఁగలఁడా? ఇట్లుండఁ గైకేయిని మంథరను దూషించుట కర్మసిద్ధాంతమునకు విరుద్ధముకాదా. కావున దైవకార్యమునకుఁ దోడ్పడి లోకములకు మహోపకార మొనరించిరని వారిని మనము భావింపవలయు. మఱిమఱి సంభావింపవలయును. దానిచేఁ గర్మగతి యిట్టిదని యెఱుంగనగును. దాన నహంకారము నశించు. అయ్యది భక్తికిఁ ద్రోవచూపు. అదియే భగవత్కారుణ్యమునకుఁ బాత్రులనుగా మనల నొనరించును. ఈవిషయమును బలుసారులు మననము చేయుచుండినచో మనోమలము లనంబడు కామక్రోధాదులు తొలఁగును. పిదప

"మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః."

అన్నసూక్తి స్వానుభవరూపసత్ఫలము నొసంగును. ఇఁక శ్రీరామచంద్రుఁడు ప్రకృతియు నెట్లు ప్రవర్తించి ధర్మరక్షణము చేసి రనువిషయమును బరికింతము.

## శ్రీరాముఁడు తల్లికిఁ దనయరణ్య గమనముఁ దెల్పుట.

* శ్రీరామమూర్తి తల్లిదండ్రులకు నమస్కరించి తన వనగమనాంగీకారమును దెలిపి యంతఃపురమునుండి వెలుపలికి రాఁగా నందలిపురంధ్రు లొక్కపెట్టు రోదనముగావించిరి. వారెల్ల విలపించుచు శ్రీరాముఁడు తండ్రి యాజ్ఞాపింపక యున్నను మనకెల్ల నేయేకార్యములు కావలయునో వానినెల్లఁ దానే యొనరించి రక్షించువాఁడు. అట్టి మహనీయమూర్తి యయోధ్యవదలి యడవుల కరుగుచున్నాఁడుకదా. తల్లి కౌసల్య కెట్లు సేవలుచేయుచుండునో యట్లే మనకెల్ల శుశ్రూషలు చేయుచుండును. ఇతరు లెట్టిపరుషభాషణములు పల్కినను రాముఁడు కోపమూనఁడు. ఒరులకుఁ గోపము గల్గించు పనుల నొనరింపఁడు. కేవలకోపావిష్టులను సంతోషవంతులనుగాఁ జేయును. అక్కటా! ప్రభువునకు బుద్ధి కాలుమాత్రైనది. కను కనే సకలభూతరక్షకుఁడగు శ్రీరాము నడవులకుఁ బంపి భూతకోటిఁ బొలియించుచున్నాఁడు. అని యొండొరులతోఁ జెప్పుకొనుచు రాజును దూఱుచు వత్సములఁబాసిన ధేనువులంబోలి విలపించిరి. పుత్రవిరహదుఃఖమున వగచుచున్న రా జాయంతఃపురకాంతలయేడ్పు వినఁబడఁగా ద్విగుణమగు దుఃఖమున నట్లే శయ్యపైఁ బడియెను రామచంద్రుఁడును వారివిలాపధ్వనుల నాలకించి సంకటపడుచు జితేంద్రియుఁడు కాన దుఃఖముఁ జిక్కఁబట్టి తమ్మునితోఁ దల్లికడకుంబోయెను. రాజు మిక్కిలి గారవింప

---

* అయోధ్యాకాండమున నిరువదియవసర్గమున నీకథ గలదు. అధ్యాత్మ రామాయణకథయుం నిం దంతర్భూతముగనుండు.

నున్న వృద్ధుఁడు ద్వారపాలాధిపతి యందుండఁగాఁ గాంచెను.
అందుఁగలవారెల్లరు లేచి నిలువంబడి జయజయశబ్దరూపమున
నాశీర్వదించిరి.

శ్రీరామమూర్తి తొలుతటికక్ష్యఁ బ్రవేశించి యవ్వల
రెండవకక్ష్యనొంది వేదవిదులగు వృద్ధబ్రాహ్మణులం గాంచెను.
వారికి నమస్కరించి యవ్వలికక్ష్యం బ్రవేశించి యందుఁ గావలి
యుండుముదుసలిస్త్రీలను బాలికలను దిలకించెను. వారెల్లరు
నానందమున నాశీర్వదించి లోపలి కరిగి రామచంద్రాగమన
మును గౌసల్య కెఱింగించిరి. ఆమె రాత్రియంతయు నియమ
మున జాగరణమొనరించి యుదయముననే పుత్రునకు మేలు
గోరి విష్ణుమూర్తి నారాధించెను. ఆమె వ్రతాచరణపరాయణు
రాలు. శ్వేతవర్ణముగల కౌశేయమును దాల్చి శుభాలంకారములు
గలదియై హోమము విప్రులవలనఁ జేయించుచుండెను. ఆతరు
ణముననే శ్రీరాముఁ డంతఃపురముం బ్రవేశించి తల్లిని దర్శిం
చెను. అందుఁగల దేవపూజోపకరణములం గాంచెను. దధి అక్ష
తలు లోనగు మంగళద్రవ్యములు రామమూర్తికి గోచరించెను.
భగవత్పూజానిరతిగలిగి దేవతవలెఁ బ్రకాశించుతల్లిని దర్శిం
చెను. ధ్యాననిరతయున్న యాకౌసల్య కొంతసేపూరకుండి స్మృతి
రాఁగాఁ దనగారాబుకొడుకు రాకం గాంచి యుప్పొంగి యెదు
రేగెను. రామమూర్తి నమస్కరింపఁ గౌఁగిలించుకొని శిరము
మూర్కొనియె. ఆమె వాత్సల్యము వర్ణనాతీతమనవలయును.
రామచంద్రా! మహాధార్మికులు వృద్ధులు నగు రాజన్యులవలె నీవు
పూర్ణాయుష్యమును విశాలకీర్తిని గులోచితధర్మమును
బొందుము. నీతండ్రి చెప్పినమాట తప్పువాఁడు కాఁడు. కాన
నింక నభిషేకమునకుఁ బ్రయత్నింపలేదే యని సంశయము

లేదు. నిన్నిపుడె యభిషేకించుంజుమీ యని హితముగాఁ
బలికెను.

తల్లి భోజనార్థము పిలిచి పీఠముచూపఁగా నితరు
లొసంగునాసనమునఁ గూరుచుండకయున్న హస్తమునసైనఁ
దాఁకవలయు నన్ననియమము ననుసరించి దానిని స్పృశించి
యాదరణమునఁ బలుకుచున్న తల్లికి నడవికిఁబోవుదునని యేరీతిఁ
దెలుపుదునా యని లజ్జించి యంజలిబంధించి మిక్కిలి వినయ
ముతోఁ దనపయనమున కనుజ్ఞ వేఁడఁబూని యిట్లు పలికెను.
తల్లీ! ఇత్తఱి మహాభయ మొక్కఁడు నిశ్చయముగా రాను
న్నది. అది నీవు నెఱుకపడలేదు. ఈమాట సీతాలక్ష్మణులకు
నీకును దుఃఖమును గల్గించును. అయినఁ జెప్పక మాననయితి
గాదు. నేను దండకారణ్యమునకుం బోవుచున్నవాఁడనుగదా.
అట్టి నాకీమణిమయమగుపీఠ మేటికి? దర్భాసనముపైఁ గూరు
చుండఁదగినకాల మిపుడు వచ్చియున్నది. తేనె, మూలములు,
ఫలములు భక్షించుచు వంటలవారు సిద్ధము చేసిన మేధ్యమాంస
మును వదలి నిర్మానుష్యమగు మహారణ్యమునఁ బదునాలుగు
సంవత్సరములు కాపురము చేయఁబోవుచున్నాఁడను. రాజేం
ద్రుఁడు భరతునకు రాజ్యమొసంగెను. నన్ను మాత్రము ముని
వలె దండకారణ్యమునకుఁ బోవునట్లు కట్టడ చేసినాఁడు. తల్లీ!
నేను దండకారణ్యమునకుఁ దండ్రియానతిచొప్పున వానప్రస్థ
కర్మముల నాచరించుచు ఫలమూలములఁ దినుచుఁ గాలముఁ
ద్రోయుచు నాఱుపైనెనిమిదియు నగువత్సరములు నివసించి
యుందును

అని కుమారుఁడు పలుకఁగా విని యారాణి భరింపరాని
శోకముపైఁగ్రమ్మఁగా గానఁ బరశుధారాహతిం దెగిపడిన

వృక్షమువలె, స్వర్గమునుండి క్రిందఁబడిన దేవతాస్త్రీచందమునఁ దటాలున మూర్ఛిల్లి పుడమింబడియెను. దుఃఖమును భరింపఁజాలని యాతల్లి యరఁటిమ్రాకువలెనట్లు నేలంబడఁగాఁ గాంచి లేవనెత్తి రామచంద్రుఁడు శుశ్రూష చేసెను. మహాభారమును వహింపఁజాలక క్రిందఁబడిన గోడిగపగిదిఁ గ్రిందఁబడియా రాముఁడు లేవనెత్తఁగా నాదుఃఖభారమునకుఁ దాళఁజాలక ధూళింబొరలినతనువుతో నెట్లో కూరుచుండఁగా రామమూర్తి యాధూళివోవఁ దుడిచెను. అత్తఱి నాకౌసల్య తనచెంతనుండి పరిచర్యచేయుకుమారునిం గని సౌమిత్రి వినుచుండఁగా నిట్లు పలికెను.

నాయనా ! నన్ను దుఃఖములపాలు చేయుటకే నీవుపుట్టితివి. నీవు నాకడుపునఁబుట్టకయుండిన వంధ్యనై యాదుఃఖమునే యనుభవింతును. అంతకంటె నధికదుఃఖము నాకుఁ గలుగదు. వంధ్యాదుఃఖ మంతమాత్రమేకదా. కొడుకు నెడఁబాసి నేలఁబొరలుచు ననుభవించుదుఃఖమువంటిది వేఱొకటిలేదు. పతి మహానురాగమున రంజింపఁజేయ నలరఁదగిన నేను పెద్దభార్యకుఁదగిన యేమంగళముగాని, యేసుఖముగాని యింతదనుక ననుభవించియెఱుంగను. కొడుకుగలిగినపిదపనైన నాబలముననైన ననుభవింతునన్నయూహచే నింతకాలముంటిని. ఇఁక నాకంటెఁ గనిష్ఠలగుసపత్నులు నామనస్సు శకలములగునట్లు సహింపరానిమాటలాడుచుండఁగా నాజ్యేష్ఠత్వము క్షీణింపవినవలయుఁగదా. సపత్నీవాగ్బాణహతికంటె వేఱుదుఃఖము స్త్రీలకుఁగలదా. కనుక నాదుఃఖము నావిలాప మింతయని వచింపరానిదే. బలశాలివగు నీవు చెంతనుండఁగ నన్నిట్లు తిరస్కరించుచుండుట నీవును జూచుచుందువుకదా. ఇట్టులుండ

నీవు చెంతలేకపోఁగా నిఁక వచింపవలసినదేమి? మరణమున కంటె వేఱుగతి నాకులేదు. పతి నన్ను నిరంతరము నిరాకరించువాఁడే కనుక నామేలు నశింపఁజేసి నన్ను నధఃకరించినాఁడు. ఈకారణమున నేను కైక, దాసికలతో సమానురాలనో తక్కువదాననో యైతిని. కైకకొడుకు రాజైనందున నన్నింతకుముం దెవ్వఁడైన నాశ్రయించినను, అనుసరించినను వాఁడు కూడ రాజభయమున నిఁక నాతోఁ బలుకనైనఁ బలుకఁడు. కైకయన్ననో నిరంతరము నాపైఁ గోపముగలది. కనుక మొగము చిట్లించి యనరానిమాట లనుచుండును. ముందే యిట్లుండ నిఁక దిక్కుమాలినదాననైనవెనుక దాని మొగముఁజూచి శ్రీరామా! యెట్లు తాళఁగలను. దానిమాటల కెట్లు తాళుకొనును.

శ్రీరామచంద్రా! నీవు జన్మించినది మొదలు పదునైదు వత్సరములుగా నీవు యువరాజవైన నాదుఃఖము తొలఁగునని దినములు గడపితిని. ఇంతదనుక సవతుల యీసడింపుమాటలకుఁ బ్రాయము బలము నశింపఁగా శ్రమింపఁబడితిని. ఇఁక వారి తిరస్కారములవలని యనంతదుఃఖము చాలకాల మనుభవింపఁ జాలను. పున్నమచందురునింబోలు నీముద్దుమోముచూడక దీననై యనాథవంటి బ్రదు కెట్లు బ్రదుకుదును? దురదృష్టవంతురాలనుగాన నుపవాసములుండి వ్రతములుచేసి దేవతల నారాధించి యత్యంతకష్టముతో నిన్నుఁ బెంచినదంతయు నీయరణ్యగమనమున వ్యర్థమైనదేకదా. వానకాలమున నూతనప్రవాహముసోఁకఁగా మహానదీతటము బ్రద్దలగునట్టు లీఘోరతర దుఃఖవార్తవిని నామనస్సు బ్రద్దలుకాకున్నది. అందుచే నా మనస్సు దృఢతరపాషాణమయమని తలంతును. సింహము దుఃఖ

పడుచున్న హరిణమును జంపునట్లు నన్నుఁ గాలుఁడు వెంటనే చంపకయున్నాఁడే. దానంజేసి చావే లేదని తోఁచెడిని. నేనుం డుటకు యమలోకమున స్థలమే లేదని తోఁచుచున్నది. నాతను హృదయము లిట్టి ఘోరదుఃఖ మొక్కసారి యలముకొనఁగా శకలములై నేలఁబడకయున్నవి. లోహనిర్మితములు కావల యును. భగవంతుఁడు నియమింపనికాలమునఁ జావు రాదనుట నిశ్చయమే. ఇఁక నీదుఃఖమున మృతి నాకెట్లువచ్చును? సంతాన వాంఛ నేను జేసిన దానోపవాసవ్రతాదులు నిరర్థకములైనవి. నాతపస్సంతయు నూషరక్షేత్రమున నాటినబీజమువలె ఫల రహితమైనది. ఈదుఃఖము పూర్వ మనుభవించినది కాదుకదా. నిర్భరదుఃఖము కలుగఁగాఁ గాలము రాకున్న నెవ్వఁడు కాని ప్రాణములను వదలఁజాలు నేని దూడను వదలిన ధేనువుపగిది నీయెడఁబాటునోర్వక యిపుడే మృతినొంది యమునింట నుందును. రామభద్రా! నా కకాలమరణము లేకున్నమానె. పూర్ణచంద్రసమానమగు నీమోమును గన్నులకఱవుదీఱఁ గాంచుభాగ్యమైన లేక యుందే నీచపుబ్రదుకు బ్రదుకుటవలనఁ బ్రయోజన మేమైనఁగలదా చెప్పుము. ధైర్యములేక ధేనువు దూడవెంబడిపోవునట్టులు నేను నీవెంట నడవులకువత్తును. ఈ రీతి నా కౌసల్య దుఃఖమునకుఁ దాళఁజాలక రాము నెడఁబాసి సపత్నులంగూడి వారివలనఁ గలుగనున్న మహావ్యసనముల నాలో చించియు సత్యపాశబద్ధుఁడై రాముఁడుండుటయుం గాంచి పర బద్ధుఁడగు కొడుకుం గాంచి కిన్నరాంగన విలపించినట్టులు తా నెంతయు రోదనము చేసెను.

మహాశయులారా! ఈభాగము విమర్శింపఁదగినదే. ఎన్ని యోగరహస్యము లిందుఁగలవు. వాని నెఱుంగక కథను జదివిన లాభమేమి?

"కృత్యేష్వచోదితః పిత్రా సర్వస్యాంతఃపురస్య చ,
గతిర్యశ్శరణం చాపి స రామోఽద్య ప్రవత్స్యతి.
కౌసల్యాయాం యథా యుక్తో జనన్యాం వర్తతే సదా,
తథైవ వర్తతేఽస్మాసు జన్మప్రభృతి రాఘవః. 3
న క్రుధ్యత్యభిశప్తోఽపి క్రోధనీయాని వర్జయన్,
క్రుద్ధాన్ ప్రసాదయన్ సర్వాన్ స ఇతోఽద్య ప్రవత్స్యతి." ౪

అని మూలము. అంతఃపురాంగనలు రామమూర్తి యడవికిం బోదునని జననీజనకులకడ సెలవుతీసికొని పోవుచుండఁగాఁ బలికినమాట లివి. ఇవి శ్రీరామచంద్రుని పరమేశ్వరత్వమును దెలుపుచున్నవి. తండ్రి కెందఱు భార్యలు గలరో వారిని వారి పరిచారికలను గూడఁ జక్కఁగా నూఱడించుచు రామమూర్తి తండ్రి యాజ్ఞాపింపకముందే వారియోగక్షేమముల నరయుచుండువాఁడు.

"గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసశ్శరణం సుహృత్,
ప్రభవః ప్రళయస్స్థానం నిధానం బీజమవ్యయమ్." గు. అ. ౯.

అన్న భగవద్గీతావాక్యము ననుసరించి సర్వశరణ్యుఁడు రాముఁ డనునర్థము తేలెడిని. తల్లిని సేవించునట్లు లందఱిని సేవించును. పుట్టినదాదిగా నట్లే చేయువాఁడు.

"సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,"

అన్న శ్రీకృష్ణవాక్యమున శ్రీరామప్రవృత్తియే యాధారమని తేలెడిని. ఒరులు దూషించిన నాగ్రహింపఁడు. క్రోధహేతువు

లగుకర్మములను వదలును. కోపవంతులను బ్రసన్నులనుగాఁ జేయును.

భగవద్దర్శనమున నింద్రియకర్మములు మాఱవలయును గదా. అట్టిదియే భగవద్రూపము. అనఁగాఁ బరిపక్వాంతఃకరణులే యారూపమును గాంచఁగలరు. దాన దుర్వాసనలు నశించును. మనస్సు నిర్మలమగును భగవత్తేజస్సు భక్తమనస్సు నలముకొనును. ఆకారణమున నందుఁగల క్రోధాదులు మార్పు నొందును. సద్వాసనలు పెంపొందును.

"మయా ప్రసన్నేన తవార్జునేదం రూపం పరం దర్శితమాత్మయోగాత్,
తేజోమయం విశ్వమనంతమాద్యం యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్."
(४१. అధ్యా. ౧౧)

అనుగీతావాక్యమును బరికించిన నీయర్థము తేటపడును. సామాన్యముగా రాజతేజ మెల్లరను భయపెట్టునది.

"యస్మాదేషాం సురేంద్రాణాం మాత్రాభ్యో నిర్మితో నృపః,
తస్మాదభిభవత్యేష సర్వభూతాని తేజసా." (४. మను. ౭ అధ్యా.)

భగవత్తేజ మట్టిది కాదు. సర్వభూతములను దర్శనమాత్రమున మార్చివేయునది. మహాత్ముల తేజముగూడ నట్టిదే యగునుగదా. కణ్వాదిమునులు తమతేజోబలమున సహజవైరముగలజంతువుల మనోవృత్తులను మార్చి సహజసౌహార్దములనుగా నొనరించినట్లు పురాణాదులు తెలుపుచుండఁగా విందుముకదా. అట్టికృత్యము నొనర్చునది యేది? నిర్మలమగువారితపోమహత్త్వమున నలవడినభగవత్తేజోలవమే కాక మఱేది? ఎవ్వారిమనస్సున నీర్ష్యాదిదుర్గుణములు లేవో వారియందే భగవత్తేజ మావ

హించును. దుర్వాసనలు గలిగిన నున్న కొంచెముకూడ నచ్చోట నుండదు.

"అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ,
నిర్మమో నిరహంకారస్సమదుఃఖసుఖః క్షమీ. ౧౩
సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః,
మయ్యర్పితమనోబుద్ధిర్యో మద్భక్తస్స మే ప్రియః. ౧౪
యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః,
హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యస్స చ మే ప్రియః. ౧౫
అనపేక్షశ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః,
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః. ౧౬
యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి,
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః. ౧౭
... ... ... ... ...
తుల్యనిందాస్తుతిర్మౌని సంతుష్టో యేన కేనచిత్,
అనికేతస్స్థిరమతిర్భక్తిమాన్ మే ప్రియో నరః." ౧౯

(గీత. ౧౨ అధ్యా.)

అను నీభగవద్గీతావాక్యములే భక్తలక్షణములను దెలుపుచున్నవి. పైనివ్రాసినయర్థము నీశ్రీకృష్ణమూర్తివాక్కులే దృఢపఱచుచున్నవి. ఈలక్షణములు లేనివారు భక్తు లెంతమాత్రము కారు. సర్వభూతములను ద్వేషింపరాదనునది ప్రథమలక్షణముగ భగవంతుఁడు తెలిపెను. ఇఁక దేవతలనే దూషించువారెట్టివారో యూహింపవచ్చును. ఎవ్వరు దేవతల దూషింతురో వారియందు భక్తి నిలువఁ జోటులేదనియే యిటఁగలసారము. పరమతసహనము, పరు లారాధించు దేవతల నిందింపకయుండుటయు ననుసద్గుణము సామాన్యులకు లభించునదియా? పూర్వపుణ్యపరిపాకవశముననే లభించును.

కొందఱు వేషధారులు ధనార్జనమున నాసక్తిమెయి, దాసులమని, యోగులమని, సన్న్యాసులమని యింకనెన్నియో పేరులు పెట్టుకొని తిరుగుచుఁ బరమతముల దూషించుచు విశేషించి శంకరునే నిందించుచు దేవాలయముల నుద్ధరింతుమని, సత్రములఁ బెట్టుదుమని, మఠముల నిర్మింతుమని, యిట్టివే యగు పెక్కు పేరులను బెట్టుకొని ధనమును గూర్తురు. మఱొక కార్యముల కద్దాని నిష్టానుసారము వ్యయింతురు. ఉపన్యాసవేదికల యందుఁ దమమిథ్యాజ్ఞానమును వెల్లడింతురు. వారివేషములఁ గాంచియు మాటల వినియుఁ బాపము! పామరులు మోసపోయి ధనమిత్తురు. వారిమూలముననే దేవతాదూషణము, మతదూషణము పామరులకుఁ బట్టుపడును. అట్టివారికి భగవదనుగ్రహ మెన్నిజన్మములకైనఁ గలుగదని శ్రీహరివాక్యములే మనకుఁ దెల్పుచున్నవి.

"వృద్ధానాం ధర్మశీలానాం రాజర్షీణాం మహాత్మనాం,
ప్రాప్నువ్యాయుశ్చ కీర్తిం చ ధర్మం చోపహితం కులే. ౨౩
సత్యప్రతిజ్ఞం పితరం రాజానం పశ్య రాఘవ,
అద్యైవ హి త్వాం ధర్మాత్మా యౌవరాజ్యేఽభిషేక్ష్యతి." ౨౪

అని మూలము. కౌసల్యావాక్యము లివి. వృద్ధులు ధర్మశీలురు మహాత్ములు నగు రాజర్షులకుఁగల యాయుస్సును గీర్తిని గులోచితధర్మమును బొందుమని దీవించెను. అనఁగా లోకానుభవము కలిగి ధర్మశీలముగలిగి సర్వభూతసములైనవారు చిరకాలము జీవింతురనియుఁ గీర్తి నొందుదురనియు మన మెఱుంగవలయును. "పాపీ చిరాయుస్సుకృతీ గతాయుః" అన్నసూక్తి సామాన్యమేగాని విశేషవిధి కాదనియు నెఱుంగందగు. కుల

ధర్మము నొందుననఁగా భావమేమి? కులోచితధర్మము లర్థ్మాని వరించుననియు, నవి సనాతనములనియుఁ గాక మఱేమి? సనాతనములగు నాకులధర్మముల ననుష్ఠింపవలయును. వానిని విడనాడరాదు. వదలిన నరకము లభించును. కులధర్మములు కుల దేవతలు సర్వథా ఆరాధ్యములు, ఆరాధ్యులు నగుదురు.

"కులక్షయే ప్రణశ్యంతి కులధర్మాస్సనాతనాః,
ధర్మే నష్టే కులం కృత్స్నమధర్మోఽభిభవత్యుత. ౪౧
ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన,
నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమ." ౪౪

అని భగవంతుని ప్రశ్నించెను.

"దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః,
పరస్పరం భావయంతశ్శ్రేయః పరమవాప్స్యథ. ౧౧
ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః,
తైర్దత్తా న ప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః. ౧౨
యజ్ఞశిష్టాశినస్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః,
తే త్వఘం భుంజతే పాపా యే పచంత్యాత్మకారణాత్." ౧౩

గీత. 3 అధ్యా.

అని భగవంతుఁడు బదులిచ్చెను. దేవతలకొఱకుఁగాక తనకొఱకని పాకము చేయరాదనికదా యించలిసారము. అనఁగాఁ గుల దేవతారూపమున భగవంతునకు సర్వము సమర్పింపవలయునని సారము. భగవదారాధనబుద్ధితో నేపనినైనఁ జేయవలయు ననియుఁ దనకొఱకుగా నేపనియుఁ జేయరాదనియుఁగదా దీని యర్థము. లక్ష్యము భగవంతుఁడు. దానిమఱచి యేకార్యము

చేయరాదని మనము గ్రహింపవలయును. కులధర్మముల వదల రాదనియు మన మెఱుంగవలయును.

"ధర్మ ఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః,
తస్మాద్ధర్మో న హంతవ్యో మానో ధర్మో హతోఽవధీత్. ౧౫
వృషో హి భగవాన్ ధర్మస్తస్య యః కురుతే హ్యలం,
వృషలం తం విదుర్దేవాస్తస్మాద్ధర్మం న లోపయేత్." ౧౬ అధ్యా. ౮

అని మనుస్మృతి బోధించెడిని. కావునఁ గులధర్మములు తప్పక యనుష్ఠేయములే. కాని ధర్మానుష్ఠానము ఫలము గోరి చేయ రాదు. భగవత్స్వరూపమని తదారాధనమునఁ బరమేశ్వరుఁడు తృప్తుఁడగుననియుఁ జేయఁదగినది.

"సత్యప్రతిజ్ఞం పితరం రాజానం పశ్య రాఘవ,
అద్యైవ హి త్వాం ధర్మాత్మా యౌవరాజ్యేఽభిషేక్ష్యతి." ౨౪

అని మూలము. దశరథుఁడు సత్యప్రతిజ్ఞుఁడే యగునని యెఱుంగు మనుట ప్రాతీతికార్థము. దశరథుఁ డాడితప్పనివాఁడన్న కౌసల్య వాక్యము సార్థకము. పూర్వాపరవాగ్దానములలో దేనినను పరించినను సత్యవాదియే కదా. కైక కోసంగినవరమును జెల్లించుటం జేసి యసత్యప్రతిజ్ఞుఁడు కాఁజాలఁడు. అవరదాన మెఱుంగనివా రట్లూహింపఁజాలిరి. మహాకవి వాల్మీకి దశరథుని ప్రవర్తన మెట్టిదని లోకులకుఁ దెలియవలయుననియే కౌసల్యనోట సత్యవాదియే యని పలికించెను. అపఱ కెన్నఁడునాడితప్పనివాఁ డనుభావము నీవాక్యమే తెలుపును. జనులను బాలించురాజు సత్యపాలకుఁడుగా నుండవలయునను నీతి నీవాక్యము తెలుపుచున్నది. సత్యము నారాధించినఁగాని ప్రజారంజనకార్యమునఁ

కృతార్థుఁడు కాఁజాలఁడని మన మెఱుంగవలయును. సత్య పాలన మొకతపస్సనియు నెఱుంగందగు.

"ఋతం తపస్సత్యం తపశ్శ్రుతం తపశ్శాంతం తపో దమ స్తపశ్శమ స్తపో దానం తపో యజ్ఞం తపో భూర్భువస్సువర్బ్రహ్మైతదుపాస్యైత త్తపః."

—అరణ్యకము.

అని శ్రుతి బోధించుచున్నది. సత్యము ననుసరించువారు మును లనఁదగుదురు. ఈశ్రుతిలోఁ దెలిపినవన్నియుఁ దపశ్శబ్దవాచ్య ములే. దేని నారాధించినను భగవంతుఁడు తృప్తుఁడగునని సారము.

"దత్తమాసనమాలభ్య భోజనేన నిమంత్రితః,
మాతరం రాఘవః కించిద్వ్రీడాత్ప్రాంజలిరబ్రవీత్." ౨౫

అని మూలము. తల్లి రామచంద్రుని భుజింపఁ బంచి యాసన మిప్పించెను. రామమూర్తి భుజింపక యాపీఠమును గరమున స్పృశించెను. పరమాదరమునఁ బిలిచి యన్నము పెట్టి యాసన మీయఁగా భుజింప వలనుపడకయున్నను వారిచ్చినపీఠమును దాఁకవలయును. దాన నాగృహస్థుఁడు తృప్తుండగునన్న సదా చారమును శ్రీరామమూర్తి మనకుఁ దెలిపెనని యెఱుంగవల యును. సదాచారములన్నియు రామచంద్రప్రవర్తనమునుండి మనము గ్రహింపవచ్చును. ఆదరించినవారిని గౌరవింపవలయును గాని తిరస్కరింపరాదనునది యే యిందుఁగలసారము.

"దేవి నూనం న జానీషే మహద్భయముపస్థితం,
ఇదం చ తవ దుఃఖాయ వైదేహ్యా లక్ష్మణస్య చ." ౨౬

అనునది శ్రీరామవాక్యము. సామాన్యార్థము స్పష్టము. రామ మూర్తి సర్వజ్ఞత్వము దీనిమూలమున వెల్లడించెను. ఎట్లు?

దేవీ! మహాభయము రానున్నదని నీవు నిశ్చయముగా నెఱుం
గవు. ఇది తొలుత నీదుఃఖమునకొఱకు, పిదప సీతకు నామీఁద
లక్ష్మణునకు నగును. ఆభయము నీదుఃఖమున కగుననఁగా నభి
ప్రాయమేమి? మహారాజమరణము పుత్త్రవియోగము ననునవి
రెండు నీకు. వైధవ్యము మనశ్చింతను గల్గించును. వైదేహికి
నామీఁద భర్తృవియోగము పరగృహవాసమునను దుఃఖ
మును గల్గించును. లక్ష్మణునకు నకార్యకరణరూపదుఃఖమును
గల్గించును. అని భావిఫలములను శ్రీరామమూర్తి యెఱింగించె
ననుటయే యిద్దానఁగలవిశేషము. "ఉదర్కస్య కాలో బలీ"
అన్నకేశవజ్ఞోక్తి యీవిషయమునే తెల్పుచున్నది.

"గమిష్యే దండకారణ్యం కిమనేనాద్య నేన చ,
విష్టరాసనయోగ్యో హి కాలోఽయం మాముపస్థితః. ౨౮
చతుర్దశ హి వర్షాణి వత్స్యామి విజనే వనే,
మధుమూలఫలైర్జీవన్ హిత్వా మునివదామిషం." ౨౯

అని మూలము. శ్రీరామమూర్తి తనయవతారఫలమును దల్లికిం
దెల్పుచున్నాఁడు. ఈకాలము విష్టరాసనయోగ్యముకదా. అది
నన్నుఁ బొందినది. కనుక దండకారణ్యమునకుఁ బోవుచున్నాను.
ఈవాసమున నాకేమిలాభము? మునులు కూరుచుండు
దర్భాసనముపైఁ గూరుచుండఁ దగినకాలమిది నాపాలఁబడియె
నని రామభద్రుఁ డెఱిఁగించెను. ఇందుఁగలవిశేష మేమి?

లోకమున నొకమహాకార్యము చేయఁబూనువాఁడు
తొలుతఁ దానికిం దగినయోగ్యతను సంపాదించుకొన
వలయును. యుద్ధము చేయఁబూను రాజు తదనురూపమగుబల
మును గూర్చుకొనవలయును. మహాకార్యము చేయఁబూనిన

ముని సమాహితచిత్తముగలవాఁడు కావలయును. ప్రకృతమున శ్రీరామమూర్తి దుష్టరాక్షససంహారరూపమునఁ బాపమును నిర్మూలించి శిష్టరక్షణరూపమున ధర్మమును స్థాపింపవలయును. దానికిఁ దగినమనశ్శక్తి కావలయును అది నియమసాధ్యము. ఆనియమము భగవద్ధ్యానరూపముగ నుండును యోగాభ్యాసమునకుఁ దగినయాసన ముండవలయును. పరిశుద్ధస్థలము గావలయును. పరిశుద్ధస్థలమనఁగా మనస్సును బాధించునట్టి వికారములు లేనిదని భావము నిమ్నోన్నతములు గలదిగాక యుండవలయు

"శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః,
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరం. ౧౧
తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః,
ఉపవిశ్యాసనే యుంజ్యాద్యోగమాత్మవిశుద్ధయే. ౧౨
సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః,
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్. ౧౩
ప్రశాంతాత్మా విగతభీర్బ్రహ్మచారివ్రతే స్థితః,
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః. ౧౪
యుంజన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః,
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి." ౧౫

గీత. ౬. అధ్యా.

అను నీగీతావాక్యములు పైనివ్రాసినయర్థమును దెలుపుచున్నవి. ఇట్లు యోగము నభ్యసించినఁగాని మనశ్శక్తి రానేరదు. ఆశక్తి సంపాదించుకొనినఁగాని మహాకార్యము సాధ్యముకాదు. రావణాదులు సామాన్యులుకారు. తపశ్శక్తిసంపన్నులు. కాని, వారు

పరహింసారూపదుష్కార్యమునఁ బ్రవర్తించినందున వారితపశ్శక్తి ఫలవంతము కాదయ్యెను. ఎట్టిసత్కార్యములైనను హింసాకర్మపరములయ్యెనేని సత్ఫలము నీయఁజాలవనుట సిద్ధాంతము. కనుక నట్టిదుష్టకార్యరతుల వధింపఁబూనిన రామమూర్తి తదనురూపశక్తిమంతుఁడు కావలయును. కాఁబట్టియే మునివృత్తి నుండవలయునని కైకను బ్రోత్సహించి యామెచేఁ జెప్పించి యామాటరీతిగాఁ దాను వర్తించినట్లు నటించెను. శ్రీరామమూర్తి పరమేశ్వరుఁడౌట దుష్టసంహారార్హమగు శక్తిసంపన్నుఁడు కాఁజాలఁడా. మరలఁ దచ్ఛక్తిసంపాదనమున కేల ప్రయత్నింపవలయును? అను ప్రశ్నము చేయవచ్చును.

"యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః"

అన్న గీతాప్రమాణము ననుసరించి లోకులకు సదాచారమును నేర్పుటకే యవతరించినందునఁ దాను బ్రతికార్యము చేసియే బోధింపవలయునుగాని వాగ్రూపమునఁ దెలుపరాదు. కాఁబట్టియే దర్భాసనమును గూరుచుండఁదగిన కాల మిదియగును గాని మణిమయాసనమునఁ గూరుచుండఁదగినది కాదని తెలిపెను.

"విష్టరాసనయోగ్యో హి"

అన్న మూలమునకు,

"విష్టరో నామ పంచవింశతి దర్భనిర్మితో తాపసాసనవిశేషః, పంచాశద్భిర్భవేద్బ్రహ్మా తదర్ధేన తు విష్టర. ఇతి స్మృతేః."

అని గోవిందరాజులు,

"విష్టరాసనం నామ అవిచ్ఛిన్నాగ్రపంచవింశతిదర్భనిర్మితాసన మిత్యర్థః"

అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి.

"విష్టరస్తు సార్ధద్వితయవామావర్తవలితాధోముఖాగ్రా అసంఖ్యాతదర్భాః.
తథా చ గృహ్యాసంగ్రహః.—
"ఊర్ధ్వకేశో భవేద్బ్రహ్మా లంబకేశస్తు విష్టరః." ఇతి.
ఛందోగపరిశిష్టమ్.
"దర్భసంఖ్యా న విహితా విష్టరాస్తరణేష్వపి,
ఏవంచ.
పంచాశద్భిర్భవేద్బ్రహ్మా తదర్థేన తు విష్టరః." ఇతి.
"యది సమూలం తదాశాఖ్యంతరీయం, ఏతేన విష్టరే పంచవింశతి సంఖ్యా భవదేవభట్టోక్తా నిరస్తా. ఏవం విష్టరగ్రహణం హస్తాభ్యా మపి యదుక్తం తదపి నిరస్తం.
"యత్రోపదిశ్యతే కర్మ కర్తురంగం న చోచ్యతే,
దక్షిణస్తత్ర విజ్ఞేయః కర్మణాం పారగః కరః."
ఇతి ఛందోగపరిశిష్టం ఇతి సంస్కారతత్త్వమ్."

అని శబ్దకల్పద్రుమము.

ఇరువదియైదుదర్భలచే నిర్మింపఁబడినది విష్టరమనుట నియమము కాదని సారము. తపోనిరతినుండి భగవదనుగ్రహపాత్రుఁడైనఁగాని మనశ్శక్తిగలవాఁడు కాఁడనువిషయ మీభాగమునుండి మనము గ్రహింపవలయును. భగవద్ధ్యానమునఁగాని యేగొప్పకార్యము సాధింపఁజాల ననునూహ యెపుడు కలుగునో యపుడే యహంకారము తొలఁగునని భావము. అపుడే మనస్సు నిర్మలముగా నుండఁగలదనియే తాత్పర్యము.

నాలుగుపదియు నగుసంవత్సరములు దండకారణ్యవాసమని శ్రీరామచంద్రుఁడు తెలిపెను. దీనఁగలవిశేషమేమి? ఉపాస

కుండు ఇష్టదేవత నారాధించుచుండినఁ దదనుగ్రహము పండ్రెండుసంవత్సరములకుఁ గలుగుననియు నీలోపలనే కలుగ వచ్చును. కాని పండ్రెండుసంవత్సరము లుపాసించుట మహానియమమని పెద్దలభావము. దీనికే మహాదీక్షయనియు నామాంతరము గలదు. తరువాతి రెండుసంవత్సరములు తత్ఫలమగు దుష్టసంహారమనియు నెఱుంగందగును "విజనే వనే" అనునవి యీతపోనియమమును దెలుపుచున్నవి. ఏకాంతసంస్థితి యోగిసమ్మతమనుట ప్రసిద్ధమే కదా.

తేనె కందమూలఫలములు నాహారముగా మునివలె నుందును. వంటవాండ్రు పెక్కుభంగుల సంస్కరించినమాంస విశేషమును వదలుదును. అని రామమూర్తి పలికెను. దీనిసార మేమి?

"ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః,
రస్యాస్స్నిగ్ధాస్స్థిరా హృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః." ౮
గీత ౧౭. అధ్యా.

అన్న భగవదుక్తి ననుసరించి సత్త్వగుణమును వృద్ధిచేయునాహారము మునులయాహారమని ప్రసిద్ధము. కాన నట్టియాహారమునే భుజించువాఁడనని రామునాశయము. ఆమిష శబ్దమునకు వంటవాండ్రు పెక్కుభంగుల వండినమాంసమనియే యర్థమని వ్యాఖ్యాతలు వ్రాసిరి.

"ఇదం మేధ్యమిదం స్వాదు నిష్టప్తమిదమగ్నినా,"

అని సూక్తి. ముందు దీనాహారగుణమునందే కేవలమాంసగ్రహణము చెప్పఁబడును. కావుననే యీయర్థము సుసంగతమే. "మధుమూలఫలైః" అనుమూలమునఁ గలమధుశబ్దమునకు

మద్యముకూడ నర్థమని కొందఱందురు. 'మధు మద్యే పుష్పరసే' అని యున్నదికదా. మద్యము గ్రహింపననునర్థము పలుకరాదని కొందఱాక్షేపింతురు. క్షత్రియాదులకు కొన్ని మద్యములు పానార్హములే యగును.

"న మాంసం రాఘవో భుంక్తే న చాపి మధు సేవతే." ౪౧

సుందరకాం. ౩౬-సర్గము.

అని హనుమంతుఁడు సీతాదేవికిం దెల్పెను. ఇందు మద్యమే మధుశబ్దార్థముగాని తేనె కాదు.

"పైష్టికం తాళజం క్షైరం మాధూకం గుడసంభవమ్.
తృతీయాది త్రివర్ణానామాసవం పేయముచ్యతే,
స్త్రీణామపి తృతీయాది పేయం స్యాద్బ్రాహ్మణీం వినా.
అథ తృప్రసన్నతా నారీ మద్యం పిబతి లోలుపా,
ఉన్మాదినీతి సా ఖ్యాతా తాం త్యజేదంత్యజామివ." బ్రహ్మాండపురాణము.

అని ప్రమాణము కలదు. దీనింబట్టికూడఁగా సీతావియోగానంతరము మద్యమాంసములను వర్జించెననియు, నంతకుముందు విధివిహితములగు మద్యమాంసములఁ బరిగ్రహించువాఁడనియుఁ దేలెడిని. మధుశబ్దమునకు మద్య మిట నర్థము కాదను వాదము సాధువా కాదా యని పండితు లూహింతురుగాక. మద్యపానము చేయువారికి మనఃప్రసన్నత్వ మలవడునా. అట్టివారిచ్చుపూజను బరమేశ్వరుఁడు గ్రహించునా యని ప్రశ్నించువారు కలరు. కాని,

"యదన్నం పురుషో భుఙ్క్తే తదన్నం తస్య దేవతాః."

అన్నసూక్తిని వారెఱుంగరు. కులోచితాచారము భగవదనుమోదితమే కాని వేఱు కాదు. విధివిధించినయాహారము దుష్టము కానేరదు. కనుకనే

"బ్రాహ్మణో మదిరాం దత్వా బ్రాహ్మణ్యాదేవ హీయతే."
అన్న కాళీవాక్యము సుసంగతమయ్యెను. కులాచారముల విడనాడక కులదైవతముల నారాధించుచుఁ గులధర్మముల ననుసరించువారు భక్తిగలవారలైనచో భగవదనుగ్రహమునకుఁ బాత్రులేల కారో తెలియరాకున్నది. ఈఘట్టమునఁ దెనిఁగించువారిభావ మరయుదము.

"చతుర్దశ హి వర్షాణి వత్స్యామి విజనే వనే,
మధుమూలఫలైర్జీవన్ హిత్వా మునివదామిషమ్."

అని మూలము.

"అత్ర ఆమిషశబ్దేన సూదైస్సంస్కృతం మాంసముచ్యతే, కేవలం మాంసస్వీకారస్యోత్తరత్ర వక్ష్యమాణత్వాత్."
అని గోవిందరాజవ్యాఖ్య.

"ఆమిషశబ్దేన సూదైస్సంస్కృతం మాంసభక్ష్యభోజ్యాదికం లక్ష్యతే. 'ఇదం మేధ్యమిదం స్వాదు నిష్టప్తమిదమగ్ని' నేతి ఉత్తరత్ర కేవలమాంసస్వీకారస్య వక్ష్యమాణత్వాత్."

అని మహేశ్వరతీర్థులు.

క. "మునివలె విజనంబగున
వ్వనమున నివసింపఁబోవువాఁడను మాంసం
బును వంటవాండ్రు పచనం
బును జేసినదానిఁ దినఁగఁ బోలదు సుమ్మీ."

(ఆంధ్ర శ్రీమద్రామాయణము.)

"పాటిలె మౌనిరీతి మధుపక్వఫలంబుల మెక్కి మాంసము
న్మాట దలంపకుండుఁ బదునాలుగువర్షము లేఁ దపస్వినై"

(వావిలికొలను రామాయణము.)

ఆమిషశబ్దమునకుఁ బెద్దలు సిద్ధాంతము చేసినది వ్రాయుట మేలో, మానుట మేలో పెద్దలు నిర్ణయింపఁగలరు. విమర్శకులు పక్షపాతమునఁ బొగడినందునను, నాపద్యములఁ దెగడినందున నీవిషయము చూపవలసివచ్చెను. వేఱు కారణమునఁ గాదని పాఠకమహాశయు లూహింతురుగాక.

"సా బహూన్యమనోజ్ఞాని వాక్యాని హృదయచ్ఛిదాం,
అహం శ్రోష్యే సపత్నీనామవరాణాం వరా సతీ." ౩౯

అని మూలము. రామచంద్రునకుం గౌసల్య తెలుపుమాట లివి. ఇది కేవలము స్త్రీస్వభావమును బోధించెడిని. ఎల్లరయం దెక్కువదాననయ్యు ననఁగాఁ దొలిభార్యనయ్యుఁ దక్కువవారగు సపత్నులాడు కఠోరవాక్కుల వినుట విశేషదుఃఖకరమని తల్లి కొడుకునకుం దెల్పెను. తొలిభార్య కొడుకునకు రాజ్యము లభించుటయేకదా పెద్దభార్యయందుఁ గలశ్రేష్ఠత్వము. ఎంతశాంతముగలవారైనను స్త్రీలుమాత్రము సపత్నులతోఁ గలిసియుండరనుదానిని మన మెఱుంగవలయును.

"దశ సప్త చ వర్షాణి తవ జాతస్య రాఘవ,
అసితాని ప్రకాంక్షంత్యా మయా దుఃఖపరిక్షయం." ౪౧

అని మూలము కైక రామునకుఁ దెల్పెనని సంగతార్థము. ఇందు రామునివయోనిర్ణయము చేయు నవకాశము కలదు. వాల్మీకి రామాయణమున నందందు నీవిషయము కలదు. ఒక్కదానికి నింకొకటి విరుద్ధముగ నుండును. కావునఁ గొందఱు వాల్మీకిరామాయణమున ననేకు లనేకభాగములు చేర్చినా రనియుఁ గనుకనే యిట్టిపూర్వాపరవిరుద్ధములు గలవనియుఁ జెప్పుదురు కాఁబోలు. పనిలేనిమంగలి పిల్లితలఁ గొఱిగెనన్నట్లు

పరిశీలకుల మనుపేర నాక్షేపించువారనియే వారినిగూర్చి మనము చింతింపవలయును. విరుద్ధములగు నీవిషయముల సమర్థించుటెట్లు? వినుఁడు.

ఆర్షగ్రంథములన్నియు మతసిద్ధాంతములపై నాధారపడియుండును. నాలుగుజాతులుగా విభజించినవారలలో మొదటి మూఁడుజాతులవారికి ద్విజులని పేరు.

"వైదికైః కర్మభిః పుణ్యైర్నిషేకాదిర్ద్విజన్మనాం,
కార్యశ్శరీరసంస్కారః పావనః ప్రేత్య చేహ చ. ౨౬
గార్భైర్హోమైర్జాతకర్మచౌడమౌంజీనిబంధనైః,
బైజికం గార్భికం చైనో ద్విజానామపమృజ్యతే. ౨౭
స్వాధ్యాయేన వ్రతైర్హోమైస్త్రైవిద్యేనేజ్యయా సుతైః
మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః." ౨౮

మను. ౨ అధ్యా.

"మాతుర్యదగ్రే జాయంతే ద్వితీయం మౌంజిబంధనాత్,
బ్రాహ్మణక్షత్రియవిశస్తస్మాదేతే ద్విజాస్స్మృతాః. ౩౯
యజ్ఞానాం తపసాం చైవ శుభానాం చైవ కర్మణాం,
వేదఏవ ద్విజాతీనాం నిశ్శ్రేయసకరః పరః." ౪౦

యాజ్ఞవల్క్యస్మృతి. ఆచారకాండము.

"సంక్రాంతౌ విషువే చైవ స్వజన్మత్రితయేఽయనే,"

లలితాసహస్రనామస్తోత్రము.

స్వజన్మత్రితయ మనఁగా జననము, ఉపనయనము, దీక్షాస్వీకారము అనునవి మూఁడును స్వజన్మత్రితయ మనంబడును.

ద్విజులనఁగా సాధారణముగా రెండుజన్మములుగలవారనియే యర్థము. జననము, ఉపనయనము అనునవియే

రెండుజన్మములు. జనన మెల్లరకు సమానజన్మము. ఉపనయనము విశేషించి బ్రహ్మక్షత్రియవైశ్యులకు జననజనము. ప్రాయశః పెద్దలుపనయనాదిగా వయస్సు లెక్కింతురు. కొందఱు జననాదిగా లెక్కింతురు. ఈ రెండువిషయములు మనస్సున నునుచుకొనిన నీశంకలు గలుగునవకాశము లేదు. విరుద్ధవిషయము లేవనఁగా:—

దశ సప్త చ వర్షాణి = కౌసల్య (పదునేడేండ్లు)
ఊనషోడశవర్షో మే=దశరథుఁడు (పదాఱేండ్లు నిండలేదు.)
ఉషిత్వా ద్వాదశ సమా ఇక్ష్వాకూణాం నివేశనే=సీతాదేవి.
(అయోధ్యలోఁ బండ్రెండు వత్సరము లుంటిని.)

"మమ భర్తా మహాతేజా వయసా పంచవింశకః,
అష్టాదశ హి వర్షాణి మమ జన్మ నిగణ్యతే." సీతాదేవి.
(నామగనికి నిరువదైదు వత్సరములు. నాకు బదునెనిమిది.)

దశరథమహారాజు విశ్వామిత్రునితో నాకొడుకునకు నింకను బదాఱువత్సరములైన నిండలేదే అనియెను. ఆసంవత్సరమునందే సీతాకళ్యాణము సాగెను. సీత యయోధ్యయందుఁ బండ్రెండు వత్సరము లుంటినన్నందునఁ బదునాఱు పండ్రెండు కలిపిన నిరువదెనిమిదిసంవత్సరముల గును. అడవికిఁ బోవునప్పటికి రాముని వయస్సు ఇరువదైదువత్సరములు నాకుఁ బదునెనిమిదేండ్లు. అని సీతయే పలికెను. కౌసల్య పదునేడువర్షము లనియెను. ఈ మూఁడు నొకదానికొకటి సరిపడవు. ఇవి సరిపడువిధము కౌసల్య ఉపనయనమునుండి వయస్సుపరిగణించెనని యూహింపందగు. కామ్యాబ్దములని చెప్పఁబడిన యుపనయనకాలము నందు నెనిమిదవయేఁట నుపనయనము సాగినదనుకొనందగు. కౌసల్యచెప్పిన పదియేడేండ్లు ఈరీతిగా నంగీకరింపవలయును.

జన్మాదిగా నెనిమిదేండ్లకు జేర్చి సీత రాముని వయస్సిరువదైదని పలికెనని నిశ్చయింపవలయు. దశరథుఁడు మునితోఁ బదాఱు వత్సరములు నిండనిబాలుఁడు మా రాముఁడనియెను. విశ్వామిత్రయజ్ఞకాలమున మారీచుఁడు రామునిచేఁ గొట్టఁబడియెను. మారీచుఁడు రావణాసురునకు రాముని మహత్త్వమును దెలుపుచు

“బాలో ద్వాదశవర్షోఽయమకృతాస్త్రశ్చ రాఘవః.”

అని వయోనిర్ణయముం దెలిపెను. కావున దశరథుఁడు రామునకుఁ బదాఱువత్సరములు నిండలేదనఁగాఁ బండ్రెండువర్షములని పరిగ్రహింపవలయును. ఇట్లుగానున్నవీనింబట్టి తర్కింపఁగా శ్రీరామునకు నెనిమిదవవత్సరమున నుపనయనము పండ్రెండవయేఁట వివాహము. పిదప ద్వాదశసంవత్సరములయోధ్యానివాసము. ఇరువదైదవయేఁట దండకారణ్యప్రయాణమని తేలెడిని.

“నాభర్తకు నిరువదైదుసంవత్సరములు నాకుఁ బదునెనిమిదియేండ్లు” అని సీత చెప్పినవిషయమునఁ గొన్ని సంశయములు గలవు. పెండ్లినాఁటికి సీత యైదేండ్లబాలికయని స్పష్టమగును. ఆఱవసంవత్సరమున సీతకుఁ బండ్రెండవయేఁట రామునకు వివాహము సాగెననికదా దీనిభావము.

“రామస్తు సీతయా సార్ధం విజహార బహూనృతూన్,
మనస్వీ తద్గతస్తస్యా నిత్యం హృది సమర్పితః.” ౨౫

బాలకాం. ౭౭ సర్గము.

అనువాక్యముంబట్టి చూడఁగా నయోధ్యానగరప్రవేశానంతరమునందే సీతారాములవిహారము స్పష్టముగాఁ దోఁచును.

ఆవయస్సున వివాహము సంగతమాయన్న దృఢశరీరులకు సంగతమే యని కొందఱు వ్రాసిరి. అయ్యది యుపహాస్యభాజనముగాఁ దోఁచును. ఇఁక సమాధాన మేలాగు? అన్న ప్రశ్నము చక్కనిది. సీత యయోనిజాత యనునది యంగీకరించువారల కిది యచ్చెరువు కలిగింపదు. రామమూర్తికన్న వయసున సీత పెద్దదిగానే తోఁచును. సీతారాములు ప్రకృతిపూరుషులుగాన సీవయఃపరిమాణము వారికిం జెల్లదు. సీత తనవయస్సు పదునెనిమిదియనుట లోకులకు విశ్వాసార్థమే కాని వేఱుగాదు. పదునెనిమిదియేండ్లనారీమణిగా నెల్లరకు దర్శనమిచ్చెను. శ్రీరామమూర్తి కౌసల్యాగర్భసంభూతుఁడుగాన నాశ్రీరాముని వయస్సు సరిగనే యున్నది.

"అనన్యపూర్వికాం కాంతామసపిండాం యవీయసీమ్." యాజ్ఞవల్క్యము.
"యవీయసీం వయసా ప్రమాణతశ్చ న్యూనామ్."

అనుస్మృతివాక్యము ననుసరించి వరునివయస్సుకంటెఁ గన్యకవయస్సు తక్కువగా నుండవలయుననుట స్పష్టము. దానిననుసరించి సీతారాములవివాహమే శాస్త్రసమ్మతము కాదనవలయును. ఆదిమదంపతులగు సీతారాముల కీసామాన్యవిధుల సమన్వయము చేసి యాక్షేపింపరాదు. కావున, సీతారూపిణి యగు మహాప్రకృతి రావణసంహారార్థము పదునెనిమిదేండ్ల ప్రాయముగలదిగాఁ గనఁబడినదనియు, సామాన్యశాస్త్రనియమము లాదంపతులవివాహవిషయమున నన్వయింపరాదనియు మనము నిర్ణయించుకొనవలయును. భగవచ్చరిత్రము చదువునపుడు దానిసారమేమనియే యూహింపవలయును. దాననే మనకు లాభము కలుగును. సామాన్యధర్మములు విశేషధర్మ

ములచే నడఁగఁద్రొక్కఁబడునుగదా. ఈవచనమున కావచనము, ఆవచనమున కీవచనము విరుద్ధమనియుఁ, గాన నొక్కఁడు చేసినకావ్యము కాదనియు వాదములు చేయుచు, నదియే పరమపురుషార్థముగా భావించువారలు భగవత్తత్త్వము నెఱుంగఁజాలరనుట సిద్ధాంతము. సీతారాములప్రవృత్తియు, దాని మహత్త్వము,వారు చేయుమహాకార్యములు నెట్టివని పరికించుటుత్తమము. రామాయణము ననుసరించి యాలోచించినను వయోనిర్ణయ మసంగతముకాదు. సీతంగూడి రామమూర్తి విహరించె నను తావున సమాధానమేమనఁగా "స్మరణం కీర్తనం కేళిః" అను ప్రమాణము ననుసరించి విహారాష్టకమును యుక్తకాలమున ననుభవించెననుటయే సమాధానము. అయోధ్యయందున్న పండ్రెండుసంవత్సరములలో నాలుసంవత్సరములు సీతవయస్సునఁ గలుపఁగాఁ బండ్రెండు దాఁటును. ఆఱిలియాఱు వత్సరములు దాంపత్యసుఖానుభవకాలమని నిర్ణయింపవచ్చును. ఈసమాధానమున నసంగతముల కాధారము గాన రాదు.

"అపశ్యంతీ తవ ముఖం పరిపూర్ణశశిప్రభం,
కృపణా వర్తయిష్యామి కథం కృపణజీవికాం." ౪౭

అని మూలము. కౌసల్యవాక్య మిది. సామాన్యార్థము స్పష్టము. సకలజగదాహ్లాదకరమగు భగవంతునిమోము చూడకయుండువాఁడు కృపణుఁడు. ఆతనిజీవనము దుఃఖజీవనము. శ్వేతవర్ణము ముక్తిప్రదము. శ్వేతవర్ణముగా భగవంతుని ధ్యానించువారు ముక్తికాములని యెఱుంగవలయు.

"ముక్తా ధ్యేయా శశిజ్యోత్స్నా ధవళాకృతిరంబికా. ౩౦
రక్తసంధ్యకరోచిస్స్యాద్వశీకరణకర్మణి,

కవిత్వే విశదాకారా స్ఫటికోపలనిర్మలా. ౨౨
ధనలాభే సువర్ణాభా చింత్యతే లలితాంబికా,
సర్వసంపత్తిలాభే తు శ్యామలాంగీ విచింత్యతే. ౨౩
నీలా చ మూకీకరణే పీతా స్తంభనకర్మణి,
ఆమూలమాబ్రహ్మబిలం జ్వలన్మాణిక్యదీపవత్. ౨౪
యే ధ్యాయంతి మహఃపుంజం తే స్యుస్సంసిద్ధసిద్ధయః,
ఏవం బహుప్రకారేణ ధ్యానయోగేన కుంభజ. ౨౫
విభావయంతశ్శ్రీదేవీం భజంతే మహతీం శ్రియం,
ప్రాప్యతే సద్భిరేవైషా నాసద్భిస్తు కదాచన." ౨౬

లలితోపాఖ్యానము. ౪౧-అధ్యా.

అను నీప్రమాణవాక్యములం బరిశీలించినచోఁ బైవిషయము స్పష్టమగును. భగవంతుని దేజోరూపునిగా ధ్యానింపనివారి జీవనము దుఃఖజీవనమని భావము.

"యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి
చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః,
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తస్సతతం భవ."

అను నీభగవద్గీతావాక్యములు పైభావమునే సూచించెడిని. కావున, శ్రీరామచంద్రుని శ్వేతవర్ణవిశిష్టునిగా ధ్యానించి మనఃకమలమునందు నెలకొల్పిన యారూపమును జూచుచుండినచో నట్టిభక్తుని దే సుఖజీవనము. అనఁగా నాతనియానందమే నిజముగా నానంద మనంబడును. దీనిచేతఁ బూజ యనఁగా మానసికపూజయే యుత్తమమనియు, విగ్రహారాధన ముత్తమము కాదనియు, నయ్యది కేవలపామరులకొఱకు నిర్మింపఁబడిన దనియుఁ దేలెడిని.

“మయ్యైవ నూనం మరణం న విద్యతే న చావకాశోఽస్తి యమక్షయే మమ,
యదంతకోఽద్యైవ న మాంజిహీర్షతి ప్రసహ్యసింహో రుదతీం మృగీమివ.”

అని మూలము. ఇదియుఁ గౌసల్యపలుకువాక్యమే. మహాముని కౌసల్యనోట నొకరహస్యవిషయమును వెల్లడించెను. ఎట్లనఁగా భగవద్దర్శనముచేసి ప్రీతితో నారాధించి నిరంతరము మనస్సునఁ దత్కళ్యాణరూపమును జూచుచుండువారికి మరణ మెక్కడిది? వారికి యమలోకమున జోటుండునా? యముఁడు వారలఁ గన్నెత్తియైనఁ జూడఁగలఁడా? అనఁగా వారిదివ్యశరీరము శాశ్వతమని భావము. పాంచభౌతికశరీరము స్థిరముగ నుండునా యని ప్రశ్నింపవచ్చును. అట్టివారు కోరరు. కాని వారి కించుక కోరికకలిగిన నీపాంచభౌతికశరీరమే యక్షయముగా నిలుచును. పరమేశ్వరుఁడు చేయఁజాలనిపని యుండునా? భక్తులు సాధారణముగాఁ గోరికకలవారు కారాదు. భగవద్దర్శనానందానుభవమే వారలకు ముక్తి వారలే యోగులనఁబడుదురు. ధ్యేయమూర్తిని మనమునఁ గాంచుచుందురు.

“యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి.” ౩౦ అధ్యా. ౬

అన్న గీతావాక్యము కలదుకదా. భగవంతుని చెంతనుండు నవఁగా భావమేవి? కనఁబడుసకలపదార్థములు భగవద్విభూతులుగా నాతనికిం గనఁబడునని తాత్పర్యము.

“ఇదం తు దుఃఖం యదనర్థకాని మే
వ్రతాని దానాని చ సంయమాశ్చ హి,
తపశ్చ తప్తం యదపత్యకారణా
త్సునిష్ఫలం బీజమివోప్తమూషరే.” ౫౦

ఇదియుఁ గౌసల్యావాక్యమే. ఇందొక్కవిశేషాంశము కలదు. ఇందలి యపత్యశబ్దము సర్వవాంఛోపలక్షణమని యెఱుంగ వలయు. ఐహికసుఖముంగోరి చేయువ్రతములు దానములు ధ్యానాదులు తపస్సు నిష్ఫలములగును. అనఁగా వానికిఁ దగి నంతఫలము చేకూరదని భావము. స్వల్పసుఖముంగోరి చేయు భగవత్పూజ చవుటినేలలో నిడినవిత్తనముంబోలి నిష్ఫల మగును.

"చతుర్విధా భజంతే మాం జనాస్సుకృతినోఽర్జున,
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ. ౧౬
తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే,
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః. ౧౭
ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతం,
ఆస్థితస్స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిం." ౧౮

గీత. ౭ అధ్యా.

"విహాయ కామాన్యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్స్పృహః,
నిర్మమో నిరహంకార స్స శాంతిమధిగచ్ఛతి." ౭౧

గీత. ౨ అధ్యా.

అను నీగీతావాక్యములు నిష్కామకర్మము భగవదనుగ్రహ పాత్రమని బోధించుచున్నవి. స్వార్థపరులై యొట్టికర్మము లొనరించిన నవి చవుటినేల విత్తనబీజములంబలె యగుచుండును. ఈ గీతార్థమే రామాయణమునఁ గౌసల్యావాక్యరూపమున మహర్షి తెలిపెనని యెఱుంగవలయును. ఇట్లీసర్గము మన కనేకవిషయములను దెలుపుచున్నది. ఇఁకఁ బయివాతకథను బఠింతము.

## లక్ష్మణుఁడు కౌసల్య నూఱడించుట.

*ఆరీతిగాఁ గౌసల్య వగచుచుండఁగా సౌమిత్రి దీనుఁడై యామె వగలడంపఁబూని తత్కాలోచితముగా నిట్లు పలికెను. ఆర్యా! ఒక్కస్త్రీమాటలకు లోనై రామచంద్రుఁడు రాజ్యము వదలి యడవికేగుట నీకుమాత్రము కాక నాకుంగూడ సమ్మతము కాదు. మహారాజు కడు వృద్ధుఁడు. ఆతనిమనస్సు తాఱుమాఱయియున్నది. మఱియు విషయలోలుఁడు. కామవశంగతుఁడు. కనుకఁ గైక ప్రోత్సహింప నింక నేమాట చెప్పక యుండును? అయుక్తము లెన్నియైనఁ జెప్పును. కావున నాతని వాక్యము పాటింపరాదు. ఇది రాజుదోషము కాదు. రాముని దోషమే యగునందువేమో అది సరికాదు. రాజ్యము వదలి యడవినుండి వెడలఁగొట్టఁదగిన రాజద్రోహముగాని, యింక నేమహాపాతకముగాని రాముఁడు చేసినట్లు నాకుఁ దోఁపలేదు. (ముదుసలియై షండ్రి దుర్విషయలోలుఁడై స్త్రీచెప్పినట్లు సిగ్గుమాలి యిట్లు చేయుచున్నాఁడు. కనుక ధార్మికుఁడు కాని రాజును వధించురీతి నే నాతని వధింతును.) రాజు రామునకు మిక్కిలి పగవాఁడు. రామునిచే నవమానింపఁబడినవాఁడు కాని మత్తెవ్వఁడు కాని చాటునైనను రామునియందీదోషముకలదని చెప్పఁగా నేను విననేలేదు. కనుక రామునియందే దోషముకలదని సంశయింపరాదు. దేవతలంబోలి కౌటిల్యము లేక గురువులవలన సుశిక్షితుఁడై జితేంద్రియుఁడై శత్రువులయందుఁగూడఁ బ్రేమమునించి, ధర్మస్వరూపుఁడునై యున్న శ్రీరామమూర్తి నిర్దోషుఁడనుట

---

* ఇయ్యది యిరువదొకఁడవ సర్గమునుండి గైకొనఁబడినది. అధ్యాత్మ రామాయణము కథాసారమునకు నిది విరుద్ధమగును.

ప్రత్యక్షముగాదా. అట్టిసత్పుత్రుని దోషమ్ముగాని కారణము గాని లేక లోకమున నేధార్మికుఁడు విడనాడును? శ్రీరాముని నిష్కారణముగా విడనాడిన దశరథుఁడు ధార్మికుండగునా? దుర్మతి యగుట నతనిమాటఁ బాటింపరాదు. ముదివగ్గయ్యును మరల బాలత్వ మలవడినట్లు కామమునకు లోఁబడియున్న రాజు శాసించినయసంగతవాక్కును రాజనీతిననుసరించి యూహించి నచో నేనుమారుఁడైన మనస్సున నొప్పుకొనునా? అన్నా! రామచంద్రా! నిన్నడవులకుఁ బంపువిషయ మెవ్వరికిఁ దెలియక మునుపే నాతోఁగూడి యీ రాజ్యమంతయు వశపఱచుకొనుము. ధనుర్ధారినై నేను బార్శ్వమున రక్షకుఁడనై యుండఁగా యమునింబోలి యొరులకుఁ గన్పట్టుచున్న నీకంటె విశేషపౌరు షము చూపువాఁ డీలోకమున నెవ్వఁడు గలఁడు? నీయానతి నెవ్వఁడు మీఱును? పురుషోత్తమా! ఈపౌరులు నీకుఁ బ్రతి కూలమగుదానిని దేనినేఁ జేయఁబూనిరేని వారిని నానిశితవిశిఖ ముల రూపఱఁజేసి పురము నిర్మానుష్యముగా నొనరింతును. ఇఁక భరతునిపక్ష మూనినవారుగాని, వారికి మేలుగోరువారు మఱెవ్వరుగాని యెుండైన గనంబడిన వారినెల్ల వధించెద. మృదుమానసుల నెల్ల రవమానింతురు. కావునఁ గాఠిన్యమూని యే పనిని సాధింపవలయును.

అన్నా! తండ్రి కుమతినై కైకప్రోత్సహింపఁగా నామె మాటలను విశ్వసించి మనకు శత్రువై విరోధముచేయునేని అట్టితండ్రి నాలసింపక వధింతము. అంతటి క్రూరకార్య మాయందు వేని కట్టివేయుదము. ఇట్లు చేయవచ్చునా యందు వేని చేయఁదగుననుటకుఁ బ్రమాణము కలదు జనకుఁడైనను గర్వించి కామాదులకు లోఁబడి కార్యాకార్యము తెలియంగక

హాద్దుమీఱి చెడుత్రోవను ద్రొక్కునేని యాతని దండింపవలయును. మహాత్మా! ఆమాట యటుండనిమ్ము. ధర్మముననుసరించి నీకు లభింపనున్నయీ రాజ్యమును, దశరథుఁడు నిన్నడంపఁజాలుబల మేది తనకుఁ గలదని, తగినకారణ మేదికలదని యూహించి నీకొసంగక కైకేయికి నీయఁగోరుచున్నవాఁడు? రాజున కట్టిబలముగాని కారణముగాని లేదు. శత్రుసూదనుఁడ వగు నీతోడను నాతోడను కాదనక విరోధము గలిగించుకొని భరతునకు రాజ్యమిచ్చుట కతని కేమి యధికారముకలదు? అని పలికి కౌసల్యం గాంచి యిట్లు పలికెను.

అమ్మా! నేనును భరతునివలె జ్ఞాతినేకదా. అయిన నాహృదయమునందు భ్రాతయగు రామునిపై ననురాగము కలదు. ఈమాట నీయెదుట నేను సత్యముపై ధనుస్సుపై దానముపై దేవతార్చనాదులపైఁ బ్రమాణముచేసెదను. తల్లీ! మండుచుండునగ్నినిగాని యరణ్యమునుగాని శ్రీరాముఁడు ప్రవేశించునేని నేను నతనికంటె ముందే ప్రవేశించితిననియే నిశ్చయింపుము. సూర్యుఁడుదయించి కిరణసమూహము చేత నంధకారము నడంచుచందమున నేనుంగూడఁ బరాక్రమమున నీదుఃఖమును మాయింతును. నాపరాక్రమముఁ దల్లియు నన్నయు నిపుడు కనుఁగొందురుగాక. అని మహాత్ముఁడు లక్ష్మణుఁడు పల్కినది విని కౌసల్య దుఃఖించుచు, నీదుఃఖము తొలఁగునా యని కోరుచు రామునితో నిట్లు పలికెను. వత్సా! తమ్ముఁడు చెప్పుచుండుపలుకుల వింటివికదా. అవి నీకు సమ్మతములగునేని యింకఁ జేయఁదగుపని నాచరింపుము. నాసవతి ధర్మవిరుద్ధముగాఁ జెప్పినపలుకు విని దుఃఖములపాలగుచున్న నన్నువదలి నీవిచ్చోటు వదలి పోరాదు. ధర్మముల నెఱుంగు

దువు. పరమధార్మికుఁడవగు నీవు ధర్మమునే యాచరింపవలయు నని కోరినయెడల నిందేయుండి నాకు సేవలు చేయుచు నసమానమగు నీధర్మమును సమాచరింపుము. తల్లికి శుశ్రూషలు చేయుటకంటె నుత్తమధర్మము వేఱొకటిలేదుకదా. మున్ను కశ్యపకుమారులలో నొక్కఁడు తల్లికిఁ బరిచర్యలు చేయఁదలఁచి దానిచేత మహాతపస్సును బొంది స్వర్గముఁ బ్రాపించెను. నీతండ్రి దశరథుఁడు గౌరవముచే నెట్లు పూజ్యుఁడో యట్లే నేనును దల్లి నగుటఁ బూజ్యురాలనే. కావునఁ బితృవాక్యమువలెఁ దల్లిమాటను నీ వంగీకరింపవలయును. నీ వడవులకుఁ బోవ నే నంగీకరింపను. అడవికి నీవెంతమాత్రము పోరాదు. నిన్ను నెడఁబాసిన నా కీబ్రదుకేటికి? సుఖములేఁ? నీవు చెంతనుండక నేనిందు సకలభోగముల ననుభవించుటకంటె నీతోడ వచ్చి తృణభక్షణము చేయుచుండుటయు మంచిదియే. దుగఖించుచుఁ దల్లడిల్లు నన్ను విడిచి యడవులకుఁబోవుదువేని నేనిందే ప్రాయోపవేశముఁబూని యన్నపానములువదలి ప్రాణములఁ ద్యజింతును. అంతియకాని బ్రదికియుండనోపను. నీకొఱకు నేను బ్రాణముల వదలినయెడల మున్ను సముద్రుఁడు పిప్పలాదులవిషయమున నధర్మము నొనరించి బ్రహ్మహత్యాతుల్యపాతకము నొందిన చందమున లోకములనెల్ల వ్యాపించునట్లు నీవును దుర్గతిని బొందఁగలవు.

అని యిట్లు విలపించుచు దీనురాలై యున్న తల్లిని గాంచి శ్రీరామచంద్రుఁడు ధర్మాత్ముఁడు కనుక ధర్మవిహితము లగువాక్కుల నిట్లనియె. తల్లీ! నీయానతిరీతి మెలఁగవలసినదే. అట్లైయ్యు నీమాటకంటెఁ దండ్రిమాట మొదటిదిగనుండును. ఉత్కృష్టమైనది. కాఁబట్టి పితృశాసనమును మీఱుననంతసాహ

సము చేయఁజాలను. నీపాదములు తలసోఁకునట్లు నమస్కరించి
ప్రార్థింతును. ప్రసన్నురాలవుకమ్ము. తండ్రిమాట ప్రకారమడ
వికిఁ బోవఁగోరెదను. అనుజ్ఞనొసంగుము. తండ్రివలెనే తల్లి
వగు నీవును బూజ్యురాలవే. మున్ను జ్ఞానియుఁ బండితుఁడు
వ్రతపరాయణుఁడు నగుకండుమహర్షియుఁ బితృశాసనము
నెఱవేర్పఁబూని గోవునుగూడ వధించెను. అంతియకాక మన
వంశమునందుఁగూడ సగరకుమారులెల్లఁ దండ్రియాజ్ఞచేత
భూమిని ద్రవ్వుచు భయంకరవధమునొందిరి. పరశురాముఁడు
జనకునిమాట నెఱవేర్పఁబూని తల్లిని రేణుకను దానే చంపెను.
ఇట్లు గోవధము, ఆత్మవధము, జననీవధము ననువానినైన నొన
రించి పిత్రాజ్ఞను బాలింపవలసియున్నదికదా. ఇట్లుండఁ దల్లికిఁ
గొంతకాలము దుఃఖమునుమాత్రము కల్గించుటకుఁ బ్రాలు
మాలి మహోత్కృష్ట మనఁదగుతండ్రియానతి నతిక్రమించి
యడవికిఁబోవక యెట్లుండుదును? అమ్మా! కండుముని మొద
లగువారు దేవసమానులుకదా. వారు మఱికొందఱును జేసినట్లే
నేనుగూడ నాతండ్రికి హితముగా నతనివాక్యమును సార్థకము
చేయుదుంగాని వ్యర్థముచేయను. లోకమున నేనొక్కఁడనే
తండ్రియానతిఁ జేయఁబూనువాఁడను గాదుకదా. దాని నొన
ర్చినమహాత్ములను దెలిపితిఁగదా. నీకు దుఃఖముకలిగింపవలయు
నని నేను మున్నెన్నఁడును లేని పూర్వాచారవిరుద్ధమగు
నూతనధర్మము నాచరింపఁబూనలేదు. మహానుభావులెందఱో
యాచరించిన పితృవాక్యపరిపాలనరూపధర్మమార్గము ననుసరించి
వర్తింతునుగాని వేఱుకాదు. భూలోకమున ముఖ్యముగాఁ
బితృవచనము సమాచరణీయము. కాన దాని మాన నామానస

మంగీకరింపదు. తల్లి లోనగువారికి దుఃఖ మొకప్పుడు కలిగినను
జనకునివాక్కు ననుసరించువాని కేకష్టము కలుగదు.

అని యిట్లు వాగ్విశారదులందును ధనుష్మద్వర్యులందు
ను త్తముఁడగు రామమూర్తి తల్లి కిట్లుత్తరమిచ్చి యవ్వల
సోదరుం గాంచి యిట్లు పలికెను. సౌమిత్రీ! నాయందు నీకుఁ
గలమైత్రి యసమానము. నీబలపరాక్రమప్రతాపము లెవ్వరికి
నుండవు. నా కీవిషయములు తెలిసినవే. నాయనా! నాతల్లి
సత్యశాంతులస్వరూప మెఱుంగనిది. కాన విశేషదుఃఖాక్రాంతు
రాలయ్యెను. వానినెల్ల నెఱింగిన నీవేటికో యిట్లు పలుకు
చున్నాఁడవు? సకలపురుషార్థములందు లోకమున ధర్మమే
యుత్తమము. ఏటికందువో. ధర్మమునందే సత్యమున్నది. పితృ
వాక్యపరిపాలనముకూడ నాధర్మమునే యాశ్రయించినది.
కాన దీన నిక్కలి ధర్మము కల్గును. ధర్మమునందు నియతిఁగలిగి
యవియే ఫలముగాఁ గోరువాఁడు తల్లిదండ్రులకుఁగాని విప్రు
నకుఁగాని చెప్పినట్లు చేసెదనని వాగ్దానము చేసి తప్పవచ్చునా?
అట్లే నేనుగూడఁ దండ్రికిఁ జెప్పినట్లు చేసెదనని ప్రతినచేసిన
వాఁడను. కాన దానిని మీఱిపోఁజాలను కైకయానతిగాని
తండ్రియాజ్ఞ యేవి? అని యందువేమో తండ్రిమాట ననుస
రించియేకదా కైక నన్నడవికిఁ బొమ్మన్నది. కావునఁ దండ్రిని
జంపి రాజ్యము నిత్తుననుదుష్టరాజధర్మము నాధారముచేసి
కొనిన యీదుష్టబుద్ధిని మానుము. ధర్మమునే యాశ్రయిం
పుము. ఇంక నెప్పుడుగాని యిట్టిక్రూరత్వమును బూనకుము.
నాబుద్ధి ననుసరించి ప్రవర్తింపుము.

అని యిట్లు తమ్మునకు హితముపదేశించి మరలఁ దల్లిం
గాంచి శిరస్సామెపాదములు స్పృశించునట్లు నమస్కరించి

యంజలింబట్టి తల్లీ! నేను గానవమున కరుగుచున్నాఁడను. పోయిరమ్మని యనుమతినొసంగుము. నాప్రాణములతోడుసుమీ. పోవలదని పలుకకుము. శుభముగాఁ బోయిరమ్మని మాకు స్వస్త్యయనముల నొనరింపుము. నాయాజ్ఞ మీఱకుమా యని మాత్రము పలుకకుము. తొలుతఁజెప్పిన తండ్రిమాటప్రకారముగాఁ గాననమునకుఁబోయి నాప్రతిన నెఱవేర్చి పూర్వము స్వర్గమునువదలి మరల దానింజెందినయయాతిమహారాజుచందమున నడవినుండి మరల నయోధ్య కరుదెంతును. అమ్మా! హృదయముననే వగనడంపుము. నలువురు తెలిసికొనునట్లు దుగఖింపకుము. పితృవాక్యమురీతి వనవాసము ముగించి మరల నిచ్చటికివత్తును. తండ్రియానతిఁ దీర్చుభారము నాయొక్కనిది కాదు. వానిని నీవును నేనును సీతయు సౌమిత్రియుఁ జక్కఁగా నెఱవేర్పవలసినవారము. ఆభారము మనయందఱపైనున్నది. ఇది సనాతనధర్మము కాని నేనుగాఁ గల్పించినదిమాత్రము కాదు. ఇంక నీ వీపూజాద్రవ్యములను వదలి మనోదుగఖము నడంచికొని వనవాసమునకుగా నేఁబూనినబుద్ధిని నీవుంబూని నన్నుఁ బంపుము. ఈబుద్ధి పితృవాక్యపాలనరూపధర్మముతోఁ గూడినది. కావున నీకు ననువర్తింప నర్హము.

ఇట్లు శ్రీరాముఁ డత్యంతధర్మహితముగను మహాధైర్యయుక్తముగను దృఢప్రయత్నయుక్తముగను బలికిన విని మూర్ఛిల్లినట్లున్న యాపట్టపురాణి తెలివినొంది మరల రామునితో నిట్లు పలికెను. కుమారా! నిన్నుఁ బెంచెడు మాధర్మమును బట్టియుఁ బ్రీతిననుసరించియు దేహసంబంధము నాశ్రయించియు నీకుఁ దండ్రి యెట్లు పూజ్యుఁడో యట్లే నేనుకూడఁ బూజ్యురాలనే. కనుక జనకవాక్యమురీతి జననీవాక్యముకూడ

నెఱవేర్పఁదగిన దేకాని పరిత్యజింపఁదగినది కాదు. కాన, నేను నీవనగమనమున కనుజ్ఞ నీయను. మహాదుఃఖమున క్రుంగిననన్ను వదలి నీవుపోవుట తగవు కాదు. నీవు లేకయున్న నేనిందు బ్రదుక నేల? తక్కినవారింక తెంపులకు? పరలోక మేటికి? పితృలోకమునకుంబోయి స్వధచిక్కినను లాభ మేమి? స్వర్లోకమున నమృతముదొరకిన నద్దానిం గ్రోలినను లాభ మేమి? ఆనందమునకు స్థానమగుమహర్లోకములోనుగాఁగల యూర్ధ్వలోకములఁగల ప్రాణివితతి యెల్ల బ్రోఁగనుపట్టినచందమున ముహూర్తమాత్రము నాయెనుట నుండుసుఖమునకు సమానము కాదు. మానవులుల్కలచేఁ బీడించి రాసిక యరికట్టినను లెక్కచేయక తాఁబోయినమార్గమునే మరలఁ బ్రవేశించుమహాగజముచందమునఁ గౌసల్యయు లక్ష్మణుఁడును హితవాక్కులుపలికి వలదన్నను ధర్మమార్గమునే రాముఁడు పూనుటంజేసి తల్లి మిక్కిలి దయగలుగునట్లు పిలపింపఁగా నాలకించియు మఱింతగాఁ దనపట్టు వదలక యందే నిలిచియుండెను. అంత మూర్ఛనుండి నట్లున్న తల్లిని దుఃఖపీడితుఁడై యున్న తమ్ముని గాంచి ధర్మమునందే స్థిరతం గాంచి యున్న రాముఁడు మహాధర్మసంకటకాలమున నట్టివారికే తగినమాటల నిట్లు పలికెను.

లక్ష్మణా! నాయందు నీకుఁగలభక్తియు నీపరాక్రమమును నేను నిరంతర మెఱుంగుదును. నీవు ధర్మమునందే స్థిరుఁడవై యుండవలయునను. నాయాశయమును నెఱుంగఁజాలక తల్లిం గూడి మిక్కిలి దుఃఖముకలుగుచందమున నన్నుఁ గలవరపెట్టుచున్నాఁడవు. వత్సా! ధర్మఫలభూతములగుసుఖములఁ గల్గించుటకు హేతువులు ధర్మార్థకామములని నిశ్చయింపఁబడినవి. ఆపురుషార్థములెల్ల నాధర్మమునందే నెలకొనియున్నవి.

అన్నింటి కాధర్మమే యాధారము. సందియము లేదు. ఒక్క భార్యయే, పతికనుకూలయై ధర్మమును, ప్రియురాలై కామమును, సత్పుత్త్రునిం గాంచి యాపుత్త్రునదృష్టముచే నర్థము నేరీతిఁ గల్గించునో, యట్లే యొక్కధర్మము ననుష్ఠించినయెడల సౌఖ్యమునుగల్గించు నర్థకామాదిసర్వపురుషార్థములు లభించు. దేనియందు ధర్మార్థకామములు మూఁడును గలుగవో యట్టి కార్యమునకుఁ బూనరాదు. ధర్మము సిద్ధించుకార్యమునకే పూనవలయును. లోకమునందుఁ గేవలార్థపరాయణుఁడగు వాఁడు లోకులచే ద్వేషింపఁబడుచున్నవాఁడు కేవలకామపరాయణత్వము ప్రశస్తముకాదుకదా. మనకు దశరథుఁడు ఆచార్యుఁడు, రాజు, వృద్ధుఁడు,తండ్రియునగు. అట్టిరాజు కోపముననొండె సంతోషముననొండె, కామముననొండె, తాఁజేసిన ప్రతిన పాలింపవలయునన్న ధర్మము నాశ్రయించి యేవో కార్యము నొకదాని నాజ్ఞాపించునేని క్రూరవర్తనము లేనివాఁ డెవ్వఁడైనఁ జేయకయుండునా? నేను గ్రూరుఁడను గాను. తండ్రి భరతునకుఁ బట్టాభిషేకము నాకు వనవాసము నియమించెను. అట్టితండ్రిశపథమును బూర్ణముగను, యథార్థముగను జేయక యుండనోపను. వత్సా! దశరథుఁడు నాకు భరతునకును ఆజ్ఞచేయుటకుఁ బ్రభువు. తల్లియగుకౌసల్యకు భర్త. కాఁబట్టి యతనియాజ్ఞ మీఱరాదు. కౌసల్యకు భర్తతోడిదే గతి. అతనివెంట నుండుటయే ధర్మము. భర్తయగుదశరథుఁడే పరలోకశ్రేయస్సాధనము. ధర్మమునడపువాఁడై పూర్వరాజులకంటె విశేషించి తనకు నియమితమగుమార్గమున వర్తించుచుఁ దనకు గతియైయున్న యట్టిభర్త జీవించియేయున్నవాఁడు. తల్లియో పట్టపురాణి తానగును. ఇప్పగిదినుండఁగా

నీమె కొడుకు ననుసరించి పోరాదు. విభర్తృక యట్లు కొడుకు వెంటఁ బోవలయు. నాతోడ వనమునకు రాఁజెల్లునే? రాఁగూడ దనుట సిద్ధాంతము. భర్త జీవించియున్న తల్లి నావెంట రాఁదగదు. కావున నా కడవికింబోవ ననుజ్ఞ యీవలయును. తల్లీ! దౌహిత్రుఁడు చెప్పినట్ల యయాతి మరల స్వర్గమునొందినట్లుగా నేనును బదునాలుగేండ్లు నియమమును సాగించి యది ముగియఁగా సుఖముగా మరలివచ్చునట్లు మాకు నాశీర్వచనము లొసంగుము. నేను ధర్మమార్గమును బరిత్యజించి తుచ్ఛ రాజ్యముకొఱకు మహాఫలమనం పగుకీర్తిని వదలుటకు శక్తుఁడనుగాను. జీవించుకాలము మిక్కిలి స్వల్పము. ఇందులకు నధర్మము నవలంబించి తుచ్ఛమగుభూమి నిపుడు సంపాదింపనే నెంతమాత్రము కోరను. అని యాపురుషోత్తముఁడు జనని ధర్మమునఁ బ్రవర్తింపఁజేసి కైక వేగముగాఁ గదలిపొమ్మని తనకు నుత్తరువుచేసినందున దండకారణ్యమున కరుగ నిశ్చయించుకొని సోదరునకు స్వమతమును బోధించి తల్లికిఁ బ్రదక్షిణముగావింప సంకల్పించుకొనియెను.

మహాశయులారా! ఈసర్గము చాల ముఖ్యము. శ్రీరామచంద్రు నాశయము తేటపఱచునది యీభాగమే యనవచ్చును. ఇంచుమించుగా నీయయోధ్యాకాండమున కిది హృదయస్వరూప మనవచ్చును. శ్రీరామచంద్రుఁడు తనయవతారఫలమును దాఁ జేయఁబూనినకార్యమును దనకు సమ్మత మెద్దాని యందో దాని నిందుఁ దేటపఱచెను. ఇందనేకవిషయములు విమర్శనార్హములు గలవు. వానిని జాఱవిడువ మనస్సొప్పకున్నది. గ్రంథము పెరిగిపోవునేమో యని భయము పొడ

నూపుచున్నది. తెలిసినవిషయములను దాఁపక వ్రాయవలయు నన్న పేరాశ బాధించుచున్నది కావునఁ గొన్నిఁటినైన విమర్శింతును. నాయోగ్యత ననుసరించి వ్రాయుదును. విశేషాంశములు పెద్దలే తెలుపఁగలరు.

"త్యక్త్వా రాజ్యశ్రియం గచ్ఛేత్ స్త్రియా వాక్యవశం గతః. ౨
విపరీతశ్చ వృద్ధశ్చ విషయైశ్చ ప్రధర్షితః,
నృపః కిమివ న బ్రూయా చ్చోద్యమానస్సమన్మథః. 3

అనునివి లక్ష్మణవాక్యములు. క్రోధాతిరేకమునఁ బలికినవాక్యములయందు విశేష మేమియుండునని యూహింపరాదు. వాల్మీకి మహాముని యొక్కొక్కరిమాటలమూలమునఁ గొన్ని నీతులను మనకుఁ దెలుపును. కావున, మన మందుఁగల నీతులఁ బరిశీలించి తెలిసికొనఁదగును. సాధారణముగా మానవుఁడు చంచలమనస్కుఁడు కానితఱి యోజించిననే సద్విషయము తోఁచును. ఇంద్రియసుఖములఁ గోరినతఱి మనస్సు విశేషించి చంచలత్వమొందును. అట్టిసమయమున నూహించినది నీతిబాహ్యముగనే యుండును కావున, దశరథునియాజ్ఞ నీతిబాహ్యమని లక్ష్మణుఁడు పలికెను.

"విపరీతశ్చ వృద్ధశ్చ విషయైశ్చ ప్రధర్షితః, స్త్రియా వాక్యవశంగతః"

అనుకారణములను దెల్పెను. విపరీత మనఁగా బుద్ధి తాఱుమాఱుగా నుండుట యని యర్థము. దశరథుఁడు సనాతనాచారమును మానెనని భావము. కారణము వృద్ధుఁడగుటయే. వార్ధక్యమున బుద్ధి భ్రంశము కలుగుట స్వభావము. ఈ రెండు కారణములే కాక విషయములకు లోఁబడెననునది మూఁడవకారణము. ముసలితనమున విషయములు మఱింత కలవరపెట్టునని

భావము. ఈమూఁడే చాలును. పైఁగాఁ గామినీవాక్యము పురి కొల్పుట నాల్గవకారణము. ఇట్టి యిక్కట్టులకు లోఁబడినరాజేమి చెప్పినను జెప్పును. ఇన్నింటికి ముఖ్యకారణము "సమన్మథః" అనునది. కామము భయపెట్టుచున్నదని తాత్పర్యము. ఇట్టి రాజుమాటలు గ్రాహ్యములా యని లక్ష్మణుఁ డడుగుచున్నాఁడు. ఈప్రశ్నమునకుఁ దగినవని చెప్పిన కారణములన్నియు న్యాయ్యములే యని భావింపవలయును.

"యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః,
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః. ౬౦
తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః,
వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. ౬౧
ధ్యాయతే విషయాన్ పుంసస్సంగస్తేషూపజాయతే,
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే. ౬౨
క్రోధాద్భవతి సమ్మోహస్సమ్మోహాత్స్మృతివిభ్రమః,
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి. ౬౩
రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్,
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి. ౬౪
ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే,
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి. ౬౫
నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా,
న చాభావయతశ్శాంతిరశాంతస్య కుతస్సుఖం. ౬౬
ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే,
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి." ౬౭

గీత. ౨. అధ్యా

అను నీభగవద్వాక్యములు ఇంద్రియసుఖములను గోరి వానినే తలంచుచుండువారలబుద్ధి నిర్మలముగా నుండదనియుఁ గాన నాతలంపు మానిన నయ్యది ప్రసన్నమగుననియు, విషయలోలు రగువారలకు మనశ్శాంతి కలుగదనియు, అశాంతి లేకయున్న సుఖమే లేదనియుఁ దెలుపుచున్నవి. దశరథున కివి సమన్వయము చేయవచ్చును. ఈకారణములే లక్ష్మణుఁడు తెలిపెను.

"సోఽసహాయేన మూఢేన లుబ్ధేనాకృతబుద్ధినా,
న శక్యో న్యాయతో నేతుం సక్తేన విషయేషు చ. 30
శుచినా సత్యసంధేన యథాశాస్త్రానుసారిణా,
ప్రణేతుం శక్యతే దండస్సుసహాయేన ధీమతా. 31
అతస్తు విపరీతస్య నృపతేరజితాత్మనః,
సంక్షీప్యతే యశో లోకే ఘృతబిందురివాంభసి." 34

మను. 7 అధ్యా.

అను నీమనుస్మృతియు జితేంద్రియుఁడుకానిరాజు పరిపాల కుఁడు కారాదని తెలుపుచున్నది. కావున, లక్ష్మణుఁ డారో పించినదోషములు న్యాయ్యములే. పితృదూషకుఁడుకదా లక్ష్మణుఁడని మనము భావింపరాదు. వాల్మీకిమహర్షి యొక్కొక్క రిమూలమున నొక్కొక్కధర్మమును దెలుపుచుండును. ఈ లక్షణములు రాజునం దుండరాదని చెప్పుట కేలాటిబాధలు నుండవు. వాస్తవముగా లక్ష్మణుఁడు పితృభక్తుఁడు కాకపోలేదు. పితృభక్తుఁ డైనచో,

"(అహం హనిష్యే పితరం వృద్ధం కామవశం గతం,
స్త్రియా యుక్తం చ నిర్లజ్జం ధర్మాద్యుక్తం నృపం యథా")

అని చెప్పియుండునా యని కొంద ఱడుగవచ్చును. ఈశ్లోక

మధికపాఠమని కుండలీకరణము చేయఁబడినది. వ్యాఖ్యాతలు దీనిని వదలిరి. ఎవరో చేర్చిరని వారిభావమై యుండనోపు. లక్ష్మణుఁ డింతమాట యనునా యని శంకించియు నుందురేమో. కాని యిది మూలమున నున్నదే యనుకొందము. తప్పేమి? లక్ష్మణుఁడు దురాత్ముఁడు కాఁడా యనిగదా యితరు లడుగుదురని భయపడవలయును. దానిసార మేమనఁగా ధర్మవిరుద్ధముగాఁ బ్రవర్తించినరాజు వధింపఁదగినవాఁ డనునదియే. మహామునులు వేనుని వధించిరికదా. వారు పాపాత్ములా? ధర్మధ్వంసకుని వధించినను బాపములేదనువిషయమే యిద్దానినుండి మనము గ్రహింపఁదగును. వాల్మీకిముని లక్ష్మణునినోట నీసామాన్యశాస్త్రవిహితధర్మమును బలికించి శ్రీరామునినోట విశేషధర్మమును బలికించెను. ఈరెండును మన మెఱుంగవలయుననియే మహర్షిభావము. అట్లుకాదేని సామాన్యధర్మమును బోధింప నవకాశమే లేకపోవును. అని మనము గ్రహించిన నీలాటియూహల కవకాశమేయుండదు. లక్ష్మణుఁడు దురాత్ముఁడే యనుదురేనట్టివానిఁగూడిన రామమూర్తియు దుష్టుఁడే యనవలసివచ్చును. ఈకావ్యమూలమున సకలధర్మము లుపదేశింపఁబూనినవాఁడు వాల్మీకిమహర్షి. కాన నాయాయితావుల నాయాయిపాత్రల మూలమున నానాధర్మము లుపదేశించునని మనము గ్రహించుటయే సముచితము.

"న తం పశ్యామ్యహం లోకే పరోక్షమపి యో నరః,
స్వమిత్రోఽపి నిరస్తోఽపి యోఽస్య దోషముదాహరేత్." ౫

అనుమూలమున నొక్కనీతి కలదు. మిత్రుఁడు కాని, రామునిచేనేదో యపరాధవ్యాజమునఁ దిరస్కరింపఁబడినవాఁడుగాని

పరోక్షమునందును రామునియం దీదోషముగలదని చెప్పఁగా వినలేదు. అనఁగా సమక్షమునందు గుణములు ప్రకటించుచుఁ బరోక్షమున దోషములు ప్రకటించువారు దుష్టులు. సమక్షమున మోమోటమిలేక యున్నదోషములం దెలిపి పరోక్షమున గుణములఁ బ్రకటించువారు సజ్జనులు. అనఁగా మనమేలు కోరినవారని భావము.

"పాపాన్నివారయతి యోజయతే హితాయ
గుహ్యం చ గూహతి గుణాన్ ప్రకటీకరోతి,
ఆపద్గతం చ న జహాతి దదాతి కాలే
సన్మిత్రలక్షణమిదం ప్రవదంతి సంతః." 23

అని భర్తృహరి తెల్పిన మిత్రలక్షణములు రామాయణమునఁ జెప్పఁబడినవే యని మన మెఱుంగవలయును. రామునిసద్గుణ ప్రశంసారూపమున లక్ష్మణవాక్యములనుండి మహాకవి మన కీ నీతిని దెలిపెను. రామాయణమును బఠించునపు డిట్టివిషయ రత్నములను గ్రహింపవలయును. కథమాత్రము తెలిసికొని తృప్తిచెందిన విశేషలాభము లుండవు.

"దేవకల్పమృజుం దాంతం రిపూణామపి వత్సలం,
అవేక్షమాణః కో ధర్మం త్యజేత్పుత్రమకారణాత్." ౭

అనునదియు లక్ష్మణవాక్యమే. ఈయది శ్రీరామచంద్రునిసర్వ సమత్వమును బోధించుచున్నది. దేవసమానుఁడనఁగా స్వర్గ వాసులతో సమానుఁడనికాదు. పరిశుద్ధుఁడని భావము. దాంతుఁ డనఁగా నంతరింద్రియనిగ్రహముకలవాఁడని కాదు. గురువులచేఁ జక్కఁగా శిక్షింపఁబడినవాఁడని భావము. శత్రు

త్రులవిషయమునందును వాత్సల్యముగలవాఁడనఁగాఁ గరుణా స్వరూపుఁడని భావము.

"సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్." ౨౯
గీత. ౯ అధ్యా.

అను శ్రీకృష్ణపరమాత్మోపదేశము "రిపూణా మపి వత్సలమ్" అనుదానిసారముకదా. భగవంతుఁడు శత్రుమిత్రభావములు లేనివాఁడుకదా!

"తదిదం వచనం రాజ్ఞః పునర్బాల్యముపేయుషః,
పుత్త్రః కో హృదయే కుర్యాద్రాజవృత్తమనుస్మరన్." ౭

అని మూలము. ఈయది లక్ష్మణవాక్యమే. వయోవృద్ధుఁడైనను వృత్తిచే బాలునివలె నుండెనేని అనఁగాఁ దెలిపితక్కువగాఁ బ్రవర్తించెనేని యట్టితండ్రిమాట కుమారుఁడు గ్రహింపరాదని సారము. గుణవంతునిమాటయే గ్రాహ్యముకాని గుణహీనునివచనము గ్రాహ్యముకాదని భావము. సుభాషితము వయోవృద్ధునివలననేగాక బాలునినుండియు గ్రహింపఁబడును. సుభాషితము గాచో వృద్ధుఁడు చెప్పినను గ్రహింపరాదని సారము.

"విషాదప్యమృతం గ్రాహ్యం బాలాదపి సుభాషితం,
అమిత్రాదపి సద్వృత్త మమేధ్యాదపి కాంచనమ్." ౨౩౯
మను. ౨ అధ్యా.

అని స్మృతి విధించుచున్నది. ఈయర్థమే రామాయణమునఁ గలదు. సకలస్మృతులసారము రామాయణమని తెలుచున్నది గదా.

"భరతస్యాథ పక్ష్యో వా యో వాస్య హితమిచ్ఛతి,
సర్వానేతాన్ వధిష్యామి మృదుర్హి పరిభూయతే." ౧౧

ఇదియు సౌమిత్రి వాక్యమే. ఇందొక్కనీతి కలదు. రామాయణకాలమునందు నిప్పటియాచార మొక్కటి కలదని యీ శ్లోకము తెలుపుచున్నది. "మృదుర్హి పరిభూయతే" (నోరు మెత్తగానున్నవాని నెల్లరు దూలనాడుదురు) ఏ కాలమునందును గట్టిగా మాటలాడువాని నెవ్వరు నేమనను భయంపడుదురు.

"మౌనాన్మూకః ప్రవచనపటుర్వాతులో జల్పకో వా
ధృష్టః పార్శ్వే వసతి చ సదా దూరతశ్చాప్రగల్భః,
క్షాంత్యా భీరుర్యది న సహతే ప్రాయశో నాభిజాతః
సేవాధర్మః పరమగహనో యోగినామప్యగమ్యః."

అను భర్తృహరిసూక్తి ప్రసిద్ధమే కదా. సామెతలుగూడ రామాయణమునుండియే గ్రహింపవలసియున్నవి.

"గురోరప్యవలిప్తస్య కార్యాకార్యమజానతః,
ఉత్పథం ప్రతిపన్నస్య కార్యం భవతి శాసనమ్." ౧౩

ఇదియు సౌమిత్రి వాక్యమే. గర్వించి కార్యాకార్యము లెఱుంగక యధర్మమార్గమునఁ బ్రవర్తించుగురువునైనను శిక్షింపవలయునని భావము. ఇది న్యాయ్యమా కాదా యని విచారింతము.

"య ఆవృణోత్యవితథం బ్రహ్మణా శ్రవణావుభౌ,
స మాతా స పితా జ్ఞేయస్తం న ద్రుహ్యేత్కదాచన. ౧౪౪
ఉపాధ్యాయాన్ దశాచార్య ఆచార్యాణాం శతం పితా,
సహస్రం తు పితౄన్మాతా గౌరవేణాతిరిచ్యతే." ౧౪౫

మను. ౨ అధ్యా.

అను నీమనుస్మృతివాక్యమే సామాన్యశాస్త్రమనందగు. పితృవాక్యము గ్రాహ్యమని తేలును. గౌరవార్హుఁడనునదియే యిందు లకుం గలకారణము.

"గురోర్యత్ర పరీవాదో నిందా వాపి ప్రవర్తతే,
కర్ణౌ తత్ర పిధాతవ్యౌ గంతవ్యం వా తతోఽన్యతః. ౨౦౦
పరీవాదాత్ఖరో భవతి శ్వా వై భవతి నిందకః,
పరిభోక్తా కృమిర్భవతి కీటో భవతి మత్సరీ." ౨౦౧

మను. ౨ అధ్యా.

ఈవాక్యములు గురునిందచేసినవారికిం గలుగుదుష్ఫలములఁ దెలుపుచున్నవి. ఈమొదలగు ననేకప్రమాణములు సామాన్యశాస్త్రము లనుపట్టికలోఁ జేరును.

"అధర్మదండనం స్వర్గకీర్తిలోకవినాశనం,
సమ్యక్తు దండనం రాజ్ఞస్స్వర్గకీర్తిజయావహమ్. 3౫౬
అపి భ్రాతా సుతోఽర్ఘ్యోవా శ్వశురో మాతులోఽపి వా,
నాదండ్యో నామ రాజ్ఞోఽస్తి ధర్మాద్విచలితస్స్వకాత్. 3౫౭
యో దండ్యాన్ దండయేద్రాజా సమ్యగ్వధ్యాంశ్చ ఘాతయేత్,
ఇష్టం స్యాత్క్రతుభిస్తేన సమాప్తవరదక్షిణైః." 3౫౮

యాజ్ఞవల్క్యస్మృతి. ఆచారకాండము.

"అర్ఘ్యోఽర్ఘార్హః ఆచార్యాదిః." అని విజ్ఞానేశ్వరుఁడు.

ఇది విశేషవిధి. రాజునకు దండార్హులు కానివారు లేరని దీని భావము. స్వధర్మత్యాగము చేసినవానిని దండింపక తప్పదని స్మృతి రాజునకు ధర్మము విధించుచున్నది. ఈధర్మమునే లక్ష్మణుఁడు బోధించెను. దీనివలన లక్ష్మణుఁడు పితృభక్తుఁడు కాఁడన

వలనుపడునా? సామాన్యధర్మమునకు రాజధర్మమునకు విశేష భేదము కలదు. సౌమిత్రి రాజధర్మము ననుసరించి తండ్రియం దిట్టిదోషములు కలవని కావున శిక్షార్హుఁడని తేటపఱచెను. తండ్రినని న్యాయమార్గమునకు విరుద్ధముగాఁ బ్రవర్తింపరా దనియు, నట్లు ధర్మవిరుద్ధమార్గము నవలంబించినపుడు కుమారుఁ డాతనిమాటను దాఁటవచ్చునన్న న్యాయమును మహర్షి లక్ష్మ ణుని వాక్యమూలమున మనకుఁ దెలిపెనని మన మెఱుంగ వలయును.

"ధర్మజ్ఞ యది ధర్మిష్ఠో ధర్మం చరితుమిచ్ఛసి,
శుశ్రూష మామిహస్థస్త్వం చర ధర్మమనుత్తమం. ౨౨
శుశ్రూషుర్జననీం పుత్రస్స్వగృహే నియతో వసన్,
పరేణ తపసా యుక్తః కాశ్యపస్త్రిదివం గతః. ౨౩
యథైవ రాజా పూజ్యస్తే గౌరవేణ తథా హ్యహం,
త్వాం నాహమనుజానామి న గంతవ్యమితో వనం." ౨౪

అని మూలము. ఇది కౌసల్య రామునకుఁ జేయునుపదేశము.

"పితుర్భగిన్యాం మాతుశ్చ జ్యాయస్యాం చ స్వసర్యపి,
మాతృవద్వృత్తిమాతిష్ఠేన్మాతా తాభ్యో గరీయసీ." ౧౩౩

మను. ౨ అధ్యా.

అనుస్మృతివచనము ననుసరించి తనమాట మీఱక యుండ వలయునని పుత్త్రునకుఁ గౌసల్య తెలిపెను. ఇది పితృవాక్యమున కంటె మాతృవాక్యము శ్రేష్ఠమనునర్థమును బోధింపదు. ఇందుఁ జెప్పఁబడినవారిలోఁ దల్లి యుత్తమురాలనియే బోధించును. కనుకనే రామమూర్తి చెప్పఁబోవుసమాధానము విశేషవిధిగా

గ్రహింపఁదగును. వనగమనమునకు నే నంగీకరింపనని కౌసల్య తెలుపుచు "ధర్మజ్ఞ" అని రాముని సంబోధించెను. కావుననే రామమూర్తి ధర్మమురీతినే ప్రవర్తించెను. దీనింబట్టి తల్లి చెప్పినది సామాన్యశాస్త్రమని గ్రహింపఁదగును.

"యది త్వం యాస్యసి వనం త్యక్త్వా మాం శోకలాలసాం,
అహం ప్రాయమిహాసిష్యే న హి శక్ష్యామి జీవితుం. ౨౬
తతస్త్వం ప్రాప్స్యసే పుత్ర నిరయం లోకవిశ్రుతం,
బ్రహ్మహత్యామివాధర్మాత్సముద్రస్సరితాం పతిః." ౨౭

అనునవియుఁ గౌసల్యపలికినవాక్యములు. నన్ను వదలి యడవులకుం బోవుదువేని నే నిందుఁ బ్రాయోపవేశము చేసి ప్రాణముల వదలుదును. దానివలన నీకు నరకముగలుగును సముద్రుఁ డిట్లే బ్రహ్మహత్య నధర్మమునఁ బొందెనని కౌసల్య రాముని భయపెట్టెను. సముద్రునకు బ్రహ్మహత్య యనుపాపము రాలేదు. ఒకముని కృత్యను బుట్టింపగాఁ దానిబాధను సముద్రుఁడు పొందెను. ఎట్లనఁగా:—

దధీచికుమారుఁడు పిప్పలాదుఁడు. ఇతనితల్లి సువర్చ దేవతలు దధీచిమునియెముక నడిగినతఱి నాముని భార్యను గృహములోనికిం బొమ్మని ప్రాణముల వదలెను. ఎముకలు దేవతల కబ్బెను. సువర్చ వచ్చిచూచి విలపించుచు దేవతలారా! మీరు పశువులు కావలసినదని శపించి సహగమనము చేయఁ బూనెను. అశరీరవాణి నీవు చితి నెక్కకుము. నీకడుపులోఁ గుమారుఁడున్నవాఁడు. అని వినవచ్చెను. అయిన నామె లెక్కచేయక చితినెక్కెను. అపుడు గర్భమునుండి బాలుఁడు క్రిందఁ

బడిపోయెను. ఆతఁడే పిప్పలాదుఁడు. పిప్పలవృక్షముక్రింద వానిం బెట్టి యామె చితినెక్కి మృతినొందెను. చంద్రుని యమృతకిరణములు సోఁకినందున నతఁడు బ్రదికి పెద్దవాఁడయ్యెను. పిప్పలవృక్షముక్రింద నుండినందున నాతనికిఁ బిప్పలాదుఁ డనుపేరు ప్రసిద్ధమయ్యెను. ఆతఁడు పెద్దవాఁడై పితృమరణమునకు దేవతలే కారణమని తెలిసికొని వారిని జంపఁబూని చంద్రునితో నాలోచించి యతఁడు సదుపాయము తెలుప గోదావరీతటమున శివుని వినుతింప నామహాదేవుఁడు తోఁచి యొకకృత్యనొసంగెను. దేవతలం జంపరమ్మని పిప్పలాదుఁ డాజ్ఞాపించెను. ఆవిధ మెఱింగి దేవతలు వడఁకుచు శివుని గానంబోయి ప్రార్థించిరి. శంకరుఁ డాకృత్యను బడబారూపమున గంగలోనుండుమని చెప్పి పిప్పలాదునికడ కరిగి దేవతల నేల బాధింపఁబూనెదవు? వారు మరణించినంగూడ నీతండ్రి బ్రదుకఁడుకదా. ఆయత్నమును మానుమని చెప్పెను. అనఁగానే పిప్పలాదుఁడు కృత్యనాపుటకు నాకు శక్యముగాదు. నాప్రయత్నమును మానుదును. పితృలోకమున నాతల్లిదండ్రులం గనుఁగొనునట్లు నాకు వరమిమ్ము. అన శంకరుఁ డట్లే యనెను. దేవతలు కృత్యను బ్రార్థించిరి. ఆమె బడబారూపమున గంగలో నుందుననియెను. బంగారుకలశమున నాకృత్య నునిచి గంగకడకుఁ దీసికొని పోయిరి. గంగ యొకతె యాకృత్యను భరింపఁజాలక యమునయందు సరస్వతియందునుగూడ నామె నునిచెను. వారుమూవురును భరింపఁజాలక సముద్రములో నామె నునిచిరి. ఆబాధ నాతఁడుకూడ ననుభవించె ననునీకథ శివపురాణమున నున్నది. సముద్రునివలె నీవును నరకము నొందఁగలవని కౌసల్య తెలి

పెను. అనఁగాఁ దండ్రిమాటవలెనే తల్లిమాటయు గ్రాహ్యమని యాఁమె తేటపఱచెను.

తండ్రియానతి యరణ్యములకుం బొమ్మనియుఁ దల్లి యాజ్ఞ యడవులకుఁబోరాదనియునుండఁగా శ్రీరామచంద్రుఁడు చేయఁదగు కార్య మేది యని యాలోచింపవలయును. ఈ రెండింటిలో నేది ప్రథమగణ్యమని శ్రీరాముఁడు సిద్ధాంతము చేయునో యది శాస్త్రసమ్మతమో కాదో యని విచారింతము. తల్లి ప్రాయోపవేశనముచేసి ప్రాణముల వదలుదు ననుచున్నది. తండ్రి యట్టులు శపథములు వల్కలేదు. తల్లి యాక్రూర కార్యము చేయక యుండఁజేయుట రామునకుఁ బ్రధాన కార్యము. ఎట్లు లీ రెండు కార్యములను సాధించునో ధర్మనిర్ణయ మేలాగు చేయునో యెఱుంగవలయు. దీనింబట్టి శ్రీరాముని యవతారఫలము తేలును.

"ఉవాచ రామో ధర్మాత్మా వచనం ధర్మసంహితం. ౨౮
నాస్తి శక్తిః పితుర్వాక్యం సమతిక్రమితుం మమ,
ప్రసాదయే త్వాం శిరసా గంతుమిచ్ఛామ్యహం వనం. ౨౯
ఋషిణా చ పితుర్వాక్యం కుర్వతా వ్రతచారిణా,
గౌర్హతా జానతా ధర్మం కండునాపి విపశ్చితా. 30
అస్మాకం తు కులే పూర్వం సగరస్యాజ్ఞయా పితుః,
ఖనద్భిస్సాగరైర్భూమిమవాప్తస్సుమహాన్ వధః. 31
జామదగ్న్యేన రామేణ రేణుకా జననీ స్వయం,
కృత్తా పరశునారణ్యే పితుర్వచనకారిణా. 32
ఏతైరన్యైశ్చ బహుభిర్దేవి దేవసమైః కృతం,
పితుర్వచనమక్లీబం కరిష్యామి పితుర్హితం. 33

న ఖల్వేతన్మయైకేన క్రియతే పితృశాసనం,
ఏతైరపి కృతం దేవి యే మయా తవ కీర్తితాః. 34
నాహం ధర్మమపూర్వం తే ప్రతికూలం ప్రవర్తయే,
పూర్వై రయమభిప్రేతో గతో మార్గోఽనుగమ్యతే. 35
తదేతత్తు మయా కార్యం క్రియతే భువి నాన్యథా,
పితుర్హి వచనం కుర్వన్న కశ్చిన్నామ హీయతే." 36

అనునివి శ్రీరామచంద్రునిధర్మ వాక్యములు. శ్రీరామమూర్తి లోకులకుఁ దెలిపిన ధర్మోపదేశవాక్యము లివి. కాన, సావధానముగాఁ బరిశీలింపవలయు. తల్లిదండ్రులయానతి యొకదానికొకటి విరుద్ధమగుచో నేదానిని సత్పుత్త్రుఁ డనుసరింపవలయు నననదియే యిటఁ బ్రశ్నము.

"ఉత్పాదకబ్రహ్మదాత్రోర్గరీయాన్ బ్రహ్మదః పితా,
బ్రహ్మజన్మ హి విప్రస్య ప్రేత్య చేహ చ శాశ్వతం. ౧౪౬
కామాన్మాతా పితా చైనం యదుత్పాదయతో మిథః,
సంభూతిం తస్య తాం విద్యాద్యద్యోనావభిజాయతే. ౧౪౭
ఆచార్యస్త్వస్య యాం జాతిం విధివద్వేదపారగః,
ఉత్పాదయతి సావిత్ర్యా సా సత్యా సా జరామరా. ౧౪౮
అల్పం వా బహు వా యస్య శ్రుతస్యోపకరోతి యః,
తమపీహ గురుం విద్యాచ్ఛ్రుతోపక్రియయా తయా. ౧౫౦
మాతురగ్రేఽధిజననం ద్వితీయం మౌంజిబంధనే,
తృతీయం యజ్ఞదీక్షాయాం ద్విజస్య శ్రుతిచోదనాత్. ౧౬౯
తత్ర యద్బ్రహ్మజన్మాస్య మౌంజీబంధనచిహ్నితం,
తత్రాస్య మాతా సావిత్రీ పితా త్వాచార్య ఉచ్యతే. ౧౭౦

వేదప్రదానాదాచార్యం పితరం పరిచక్షతే,
న హ్యస్మిన్ యుజ్యతే కర్మ కించిదామౌంజిబంధనాత్." ౧౭౧
మనుస్మృతి. ౨ అధ్యా.

జననమునకంటె నుపనయనజన్మ ముత్తమ మైనది. వేదపఠనాధికార ముపనయనమునఁ గలుగును. అది చేయువాఁడు తండ్రి. అతఁడే ఆచార్యుఁడు. అట్టితండ్రిమాట ప్రధానమని యీవాక్యములసారము. జననమునకుఁ గారణమగుతల్లి కంటెఁ బై కారణములవలనఁ దండ్రియే యుత్కృష్టుఁడనికదా భావము. తండ్రి స్వతంత్రుఁడు. తల్లి స్వతంత్రురాలు కాదు. తండ్రి యాజ్ఞ రీతిగా వర్తింపవలసినది. "న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి" అన్నదియు మనువాక్యమే. తల్లికింగూడ నాజ్ఞ చేయువాఁడు తండ్రి యగును. కావునఁ దల్లి మాటకంటెఁ దండ్రిమాట గురుతరమని తేలెఁడిని.

తల్లీ! తలసోఁక మ్రొక్కి నిన్ను వేఁడుచున్నాఁడను. తండ్రిమాట మీఱుటకు నాకు శక్తిలేదు. వ్రతమునూని పండితుఁడగుకండుమహర్షి ధర్మజ్ఞుఁడయ్యుఁ దండ్రిమాట ననుసరించి ధేనువును వధించెను. సగరతనయులు మనవంశపూర్వులు గదా. వారు తండ్రిమాట చేయఁబూని భూమిని ద్రవ్వుచు నొక్కసారి మృతికిఁ బాలుపడిరి. పరశురాముఁడు జనకుని యాజ్ఞఁగొని తల్లినే వధించెను. వీరుగాక యింక నెందఱో మహాత్ములు తండ్రిమాట నాదరించి యొనరించి కృతార్థులైరి. ఈయుదాహరణములంబట్టి నాకంటెఁ బూర్వు లెందఱో పితృశాసనము ననుసరించిరని స్పష్టముకదా. నేను నట్లే పితృనానతినే యనుసరింతును. నీకుఁ బ్రతికూలముగా నుండవలయు

వని శ్రౌతధర్మము ననుసరింపలేదు. పెద్దలు త్రొక్కినత్రోవనే ప్రవర్తించువాఁడను. తండ్రిమాట ననుసరించినవాఁడు కీడు నొందలేదు. ఈమాటలే శ్రీరాముఁ డుపదేశించినవి. వీనిసార మేమి?

"వృషో హి భగవాన్ ధర్మస్తస్య యః కురుతే హ్యలం,
వృషలం తం విదుర్దేవాస్తస్మాద్ధర్మం న లోపయేత్." మను. ౮ అధ్యా.

ధర్మము నాస్వరూపము. దానిసత్యము నేనెఱుంగుదును. దాని యందేమాత్రము కొదువఁగలిగింపఁబూనను.

"అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్,
ప్రకృతిం స్వామవష్టభ్య సంభవామ్యాత్మమాయయా. ౬
యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత,
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహం. ౭
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే." ౮

గీత. ౪ అధ్యా.

అన్నప్రతిజ్ఞ ననుసరించి తండ్రిమాట నెపముగా నడవులకుం బోవువాఁడను. దానిని మీఱుట నాకు శక్తిలేదు. శ్రౌతమార్గము త్రొక్కను. మున్నే నిర్ణయించినమార్గమిది. దాని నించు కంతయు నతిక్రమింపఁజాలను. అనఁగా సృష్ట్యాదిప్రళయాంతము నేయేకార్య మెట్లెట్లు ఎపుడెపుడు చేయ నిర్ణయించితినో దాని నేమాత్రము దాఁటరాదు. నేను మీఱిన నందఱు ధర్మసేతువును మీఱుదురు.

"ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహం,
సంకరస్య చ కర్తా స్యాముపహన్యామిమాః ప్రజాః." ౨౪

గీత. 3 అధ్యా.

అన్న నాయాజ్ఞయను నీవెఱుంగవు. కావుననే నిన్ను వేఁడు చున్నాఁడను. వనగమనమున కనుమతింపుము. అనియేకదా.

లోకమున స్త్రీలు స్థిరమనస్కలు గారు. దూరపుటాలోచనము వారికి నుండదు. కనుకఁ గుమారుఁ డేరీతి లోకమునఁ బ్రవర్తింపవలయునో తల్లి యెఱుఁగదు. తండ్రి స్వానుభవమునఁ గొంత యెఱుంగును. కావునఁ దండ్రిమాటయే ప్రధానముగా నంగీకరింపవలయుననియే యిందుఁగలసారము. ధర్మమార్గము మిగుల సూక్ష్మము. మదుక్తమగు నామార్గమును బూర్వు లెందఱో యంగీకరించిరి. ఇపుడామార్గముననే నడువఁ బూనితిని. దాని మాని క్రొత్తమార్గము నంగీకరింపఁజాలను. అడవులకుం బోవుటయే నాపని. అని శ్రీరామచంద్రుఁడు స్వాభిప్రాయమును దెలిపెనని మన మెఱుంగవలయును. జననీజనకులకు శుశ్రూష చేయుటలోఁ దండ్రికంటెఁ దల్లి యెక్కుడు, కావున జనని యావిషయమున మిగుల గౌరవార్హురాలు. కార్యాకార్య నిర్ణయమునందుఁ దండ్రి యెక్కుడు కావునఁ దల్లిమాట కంటెఁ దండ్రిమాట మిక్కిలి గౌరవింపఁదగినదని శ్రీరాముఁడు బోధించిన ధర్మమార్గమని మన మెఱుంగవలయును.

"తామేవముక్త్వా జననీం లక్ష్మణం పునరబ్రవీత్,
వాక్యం వాక్యవిదాం శ్రేష్ఠః శ్రేష్ఠస్సర్వధనుష్మతాం." 32

అని మూలము. శ్రీరాముని యాజ్ఞయ మిందు స్పష్టముగఁ గనంబడును. మాటనేర్పరులయందు మేటియగు రాముఁ డిట్లు పలికె

ననుట సుసంగతముగ నున్నది. ధనుర్ధారులలో నుత్కృష్టుం డనుట యేల? పాదపూరణవాక్యమా? కాదు. మహాకవి యట్లు ప్రయోగింపఁడు. సిద్ధవాక్కులుగదా మహర్షివి. శ్రీరాముఁడు లక్ష్మణునకుం దెలుపఁబోవువాక్కులు ధనుస్సాధ్యములు. దుష్ట శిక్షణమునకై ప్రయాణము చేయ నుద్దేశించితని. నీకు నాపని యందు భాగము కలదని రామునియాశయమని తెలుపంగ వలయుననియే వాల్మీకిమహర్షి యీపదముల నందుఁ గూర్చెను. శ్లోక మెట్లో పూర్తిచేయవలయునని కాదు.

"లౌకికానాం హి సాధూనామర్థం వాగనువర్తతే,
ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి."

అనుసూక్తి భవభూతిమహాకవి తెలిపెను. పూర్వమహాకవుల హృదయ మెట్టిదో తేటపడియెనుగదా.

"ధర్మో హి పరమో లోకే ధర్మే సత్యం ప్రతిష్ఠితం,
ధర్మసంశ్రితమేతచ్చ పితుర్వచనముత్తమం. ౪౦
సంశ్రుత్య చ పితుర్వాక్యం మాతుర్వా బ్రాహ్మణస్య వా,
న కర్తవ్యం వృథా వీర ధర్మమాశ్రిత్య తిష్ఠతా. ౪౧
సోఽహం న శక్ష్యామి పితుర్నియోగమతివర్తితుం,
పితుర్హి వచనాద్వీర కైకేయ్యాహం ప్రచోదితః. ౪౨
తదేనాం విసృజానార్యాం క్షత్రధర్మాశ్రితాం మతిం,
ధర్మమాశ్రయ మా తైక్ష్ణ్యం మద్బుద్ధిరనుగమ్యతాం." ౪౩

అనునివి శ్రీరామునివాక్కులు. లక్ష్మణుఁడు రాజధర్మము నాశ్రయించి పలికెను. ఆవాక్కులు రాజధర్మవిరుద్ధములుగావు. కాని బహువిధములగుధర్మభేదములందు నేది సూక్ష్మమార్గమని యెఱుంగుటయే బుద్ధిమంతులలక్షణము. దుర్మతియై తండ్రి

కుమార్గమునఁ బ్రవర్తించినపుడు తదాజ్ఞను మీఱుట కుమారు నకుఁ దప్పుగాకపోవచ్చును. ఆశాస్త్రము దశరథునివిషయమున నన్వయించునా యని యూహింపవలయును. దశరథుఁడు మతి చెడి కుమార్గమున వర్తింపలేదు. కామమునకు లోఁబడి కైక మాటలకు లొంగలేదు. రాజధర్మమునే యాశ్రయించి

"వినీతస్సత్వసంపన్నః కులీనస్సత్యవాక్ఛుచిః,"

అన్నస్మృతి ప్రమాణము ననుసరించి సత్యపాశబద్ధుఁ డయ్యెను. అదియు రాజధర్మమే. ఆమార్గముననే హరిశ్చంద్రాదులు ప్రవర్తించి యపార యశోలక్ష్మి నార్జించిరి. స్థిరయశఃకాయు లైరి. కావున దశరథునభిప్రాయము రాజధర్మవిరుద్ధమని కైక మాటలకు లోఁబడియెనని లక్ష్మణుఁ డభిప్రాయపడియెను. ఆ యభిప్రాయము మంచిదికాదని తమ్మునకు శ్రీరాముఁడు ధర్మ సూక్ష్మములను బోధించెను.

ధర్మమే లోకమున నుత్కృష్టము. దానియాధారముననే సత్యము నిలిచియున్నది. తండ్రివాక్యము ధర్మాశ్రితమే. ధర్మ మెఱింగినవాఁడు తండ్రికిఁగాని తల్లికిఁగాని బ్రాహ్మణునకుఁగాని చెప్పినట్లే యాచరింతునని మాట యిచ్చి వేఱువిధముగాఁ బ్రవర్తింపరాదు. కైకకదా యాజ్ఞాపించినది. తండ్రి కాదే యను నీయభిప్రాయము మంచిదిగాదు. తండ్రివాక్యము ననుస రించియే తల్లి నన్నడవులకుఁ బొమ్మని ప్రోత్సహించెను. కావున నయ్యది పితృవాక్యమే యని విశ్వసింపుము. తండ్రినిగూడ వధించి రాజ్య మేలఁజేసెద నన్న నీబుద్ధి యధర్మము నాశ్రయించి నది. ఆర్యసమ్మతము కాదు. ధర్మమెఱుంగని కేవలశూరసమ్మతము గాన రౌద్రమైనది. దానిని వదలుము. ధర్మమునే యాశ్రయిం

పుము. ఇఁకనైన నిట్టిక్రూరత్వమును మానుము. నాబుద్ధి ననుసరించి వర్తింపుము. అని రాముఁ డుపదేశించెను. దీనిసారమేమి?

లక్ష్మణా! సత్యసమ్మతమగుధర్మమును మనము స్థాపింపవలయును. చెప్పినమాటను దప్పరాదు. కైకేయి నన్నుఁ బురికొలిపెను. అనఁగా నిర్లిప్తుఁడనగు నేనాస్థితిని వదలి ప్రకృతిబద్ధుఁడనై యున్నాను. కావున స్త్రీమూలముననే నేనీకార్యములు నిర్వహింపవలయును. ఇప్పటి యీయూహ యార్యసమ్మతము కాదు. అనఁగా ఆర్యు లిపుడు నన్ను రాజ్యమును బాలింపుమని కోరరు. కావున నద్దానికి నిపుడు ప్రయత్నింపకుము. ఆకాలము రాఁగలదు. ఇప్పటి యీక్రూరత్వమును దశరథునివిషయమున వదలుము. నాబుద్ధి ననుసరింపుము. అనఁగా నాతోడ నడవికి రాఁదగును. అని స్వాభిప్రాయమును గూఢముగాఁ దమ్మునకుఁ దెలిపె ననునదియే యిందుఁగలసారము.

అని తెలిపి యింకఁ దడవుచేయరాదని తలంచి తల్లి కిట్లు తెలిపెను:—

"ఉవాచ భూయః కౌసల్యాం ప్రాంజలిశ్శిరసా నతః. ౪౪
అనుమన్యస్వ మాం దేవి గమిష్యంతమితో వనం,
శాపితాసి మమ ప్రాణైః కురు స్వస్త్యయనాని మే. ౪౫
తీర్ణప్రతిజ్ఞశ్చ వనాత్పునరేష్యామ్యహం పురీం,
యయాతిరివ రాజర్షిః పురా హిత్వా పునర్దివం. ౪౬
శోకస్సంధార్యతాం మాతర్హృదయే సాధు మా శుచః,
వనవాసాదిహైష్యామి పునః కృత్వా పితుర్వచః. ౪౭
త్వయా మయా చ వైదేహ్యా లక్ష్మణేన సుమిత్రయా,
పితుర్నియోగే స్థాతవ్యమేష ధర్మస్సనాతనః. ౪౮

అంబ సంపృత్య సంతారాన్ దుఃఖం హృది నిగృహ్య చ,
వనవాసకృతా బుద్ధిర్మమ ధర్మ్యానువర్త్యతాం." ౪౫

అని మూలము. ఈమాటలవలన శ్రీరామమూర్తి తనయవతార ఫలమును దెలుపుచున్నాఁడు. ధర్మోపదేశమున నామె పట్టుదల మానదు. అని. తల్లీ! ఇదె యడవికింబోవనున్నాను. సమ్మతింపుము. నాప్రాణములతోడుసుమా, కొడుకుప్రాణములపైఁ దల్లికిఁ బ్రీతి మెండు. కనుక వానితోడు. ఇఁక మాటలాడకు మనుచున్నాఁడు. ప్రతినదీర్చి యనఁగాఁ బదునాల్గవసంవత్సరమునఁ జివరభాగమున రావణునివధించి మరల యయోధ్యం జేరుదును. తల్లీ! దుఃఖమును హృదయమున సహించుకొమ్ము. ఎల్లరకుఁ దెలియునట్టులు శోకింపకుము. అనఁగా దశరథున కంతకాలము సమీపించినది. దుఃఖించి లాభము లేదు. నీవంటియోగ్యురాలు దుఃఖించిన విని నలువు రేమనుకొందురో అని రామచంద్రుఁడు తల్లికిం దెల్పెను. వనవాసము సలిపి తండ్రియానతి నెఱవేర్చి మరల వత్తును. నీవు నేను సీతయు లక్ష్మణుఁడు సుమిత్రయు తండ్రియానతిం బూనికమీఱ నొనర్పవలసినవారము. అనఁగా నేను సీతాలక్ష్మణులతో నడవులకుం బోఁవఁగా నన్నుఁ గూర్చి నీవును లక్ష్మణునిగుఱించి సుమిత్రయు దశరథశాసనమున వెతలఁబడసినవారలగుదురు. భరతశత్రుఘ్నులిందే యుందు రనుభావము సూచించెనని మన మూహింపవలయును. ఇట్లు మనము రాజునాజ్ఞఁ బాలించుటయే సనాతనధర్మము. అనఁగా మనమిట్లు రాజాజ్ఞ నెఱవేర్చినఁ గాని ధర్మమును స్థాపింపఁ జాలమని తాత్పర్యము. ఇందుఁగలసార మేమనఁగా లక్ష్మణునకుఁ దల్లియగుసుమిత్రయు నాతల్లివగు నీవును రాజునాజ్ఞను శిరసా

వహించి మీరు వనములకుఁ బోవలదని మాకు నాజ్ఞనీయక యుండిన సనాతనధర్మరక్షణము సాగదనియు, ధర్మసంస్థాపనమునకై మీరును మావనగమనమున కంగీకరింపవలయుననియు శ్రీరామమూర్తి యొత్తిగించెననియే దీనిసారము. ఈభావమును

"వనవాసకృతా బుద్ధిర్మమ ధర్మ్యానుమన్యతాం"

అనుమూలము దృఢపఱచుచున్నది. అని రాముఁడు తల్లికిం దెల్పెను.

ఇదియే శ్రీరామోపదేశము. పితృనాజ్ఞ యని తల్లిని దుఃఖములపాలు చేయక ధర్మోపదేశరూపమున నూఱడించి సమ్మతింపఁజేయవలయుననియు, వారిసమ్మతియే పురోవృద్ధికి హేతువనియు మన మెఱుంగవలయు. ప్రతివాక్యమునందును శ్రీరాముఁడు ధర్మము ప్రధానమని తెలిపెను. కావునఁ గేవల ధర్మసంరక్షణార్థమే శ్రీరాముని ప్రవృత్తి యనియే మనము నిశ్చయింపవలయును. అనఁగా ధర్మము ననుష్ఠింపఁగోరువారు శ్రీరామప్రవృత్తి నుదాహరణముగా గ్రహింపవలయుననియే దీనిసారము.

"కిం జీవితేనేహ వినా త్వయా మే
లోకేన కిం వా స్వధయామృతేన,
శ్రేయో ముహూర్తం తవ సన్నిధానం
మమేహ కృత్స్నాదపి జీవలోకాత్." గ.

అనునది కౌసల్యావాక్యము. నీవు చెంత లేకపోయిన నాకీ బ్రదుకేల? పితృలోకప్రాప్తివలన స్వధ యబ్బినను లాభమేమి? స్వర్గలోకప్రాప్తిచే నమృతము దొరకినను బ్రయోజనమేమి? ఒక్కముహూర్తకాలము నీసన్నిధి నుండిన నదియే చాలును.

మహర్లోకాదిసకలలోకములఁ గలజీవులు నాయెదుట నుండినను నాకుఁ దృప్తిలేదని కౌసల్య పలికెను. కౌసల్యాముఖమునుండి వాల్మీకిమహర్షి యీగూఢార్థోపబృంహితము లగుపలుకులఁ బలికించెనని మన మెఱుంగవలయును. దీనియందుఁగల విశేషార్థ మేమి? పితరులనఁగా వసురూపము నొందినవారు. పితామహులనఁగా రుద్రరూపము నొందినవారు. ప్రపితామహులనఁగా నాదిత్యరూపము నొందినవారు.

"వసూన్ వదంతి తు పితౄన్ రుద్రాంశ్చైవ పితామహాన్,
ప్రపితామహాంస్తథాదిత్యాన్ శ్రుతిరేషా సనాతనీ." ౨౮౪

మను. ౪ అధ్యా.

"పిత్రాదయో వస్వాదిరూపేణ ధ్యేయా ఇతి విధిః కల్ప్యతే. అత ఏవ పైఠీనసిః. య ఏవం విద్వాన్ పితౄన్ యజతే వసవో రుద్రా ఆదిత్యాశ్చాస్య ప్రీతా భవంతి"

అని కుల్లూకభట్టు. పితృదేవతలఁ బూజించిన వసువులను దేవతలు ప్రీతినొందుదురనఁగా భావమేమి? వసువులను దేవతలు పితృదేవతారూపమున మానవుల మేలుకోరుచుందురనియేకదా. చచ్చిపోయినవారెల్ల వసులోకమున నుందురని కొందఱందురు. అది పరిహాసాస్పదము. వసులోకము పితృలోకమని మనమూహింపందగు రుద్రలోకము పితామహులది. ఆదిత్యలోకము ప్రపితామహులది. ఈలోకము లొకదానిపై నొకటిగా నుండునవి కావని యెఱుంగవలయు. ఆదిత్యలోకమునఁ బ్రపితామహు లుందురనఁగాఁ దేజోరూపులని భావము. స్వకీయ తేజస్సంవ్యాప్తి నితరులయందుఁ గలమలినవాసనలఁ బోఁగొట్టి నిర్మలాత్మ

కులనుగా నొనరింతురని భావము. తేజోలోక మాదిత్యలోక మనుట నిర్వివాదాంశము.

"ప్రీణాతి దేవానమృతేన సూర్యస్సోమం సుషుమ్నేన చ వర్ధయిత్వా,
శుక్లే తు పూర్ణం దివసక్రమేణ తం కృష్ణపక్షే విబుధాః పిబంతి. ౩౮
పీతం చ సోమం చ కలావశిష్టం కృష్ణక్షయే రశ్మిభిరక్షరంతం,
సుధామృతం తత్పితరః పిబంతి దేవాశ్చ సౌమ్యాశ్చ తథైవ కావ్యాః. ౩౯
సూర్యేణ గోభిశ్చ సముజ్ఝితాభిరద్భిః పునశ్చైవ సముద్ధృతాభిః,
వృష్ట్యాభివృద్ధాభిరథౌషధీభిర్మర్త్యాః క్షుధం త్వన్నపానైర్జయంతి. ౪౦
తృప్తిశ్చ శుక్లే సుధయా సురాణాం పక్షే చ కృష్ణే సుధయా పితౄణాం,
అన్నేన శశ్వచ్చ దధాతి మర్త్యాన్ సూర్యస్తపంస్తాన్ సుబిభర్తి గోభిః.౪౧
బ్రహ్మాండపురాణము. ౨౩ అధ్యా.

అను నీప్రమాణములు సూర్యమహత్త్వమును దేవోరాశిత్వ మును బోధించుచున్నవి. ధనదాతలు వసువులు. శత్రుబాధా నివారకులు రుద్రులు. మనఃపావనత్వాపాదకు లాదిత్యులని యూహింపవచ్చును. ఉత్తరోత్తరోత్కృష్టులీమువ్వురనుట పొరపాటుగాదు. ఈమూఁడులోకములయందుఁ గలుగుసుఖము లల్పములని రాముని నొక్కముహూర్తకాలము గూడియుండు నదియే యుత్తమమని కౌసల్యభావము. దీనింబట్టి భగవద్దర్శన సుహస్థితు లొక్కక్షణకాలమైనను మహానందజనకమనియేకదా దీనిసారము.

"శ్రేయో ముహూర్తం తవ సన్నిధానం మమేహ,
కృత్స్నాదపి జీవలోకాత్."

అనుమూల ముపాస్యదేవతామహిమమును దెల్పుచున్నదని యెఱుంగవలయును. శ్రీరాముఁడు లలితాకృతికదా. ఈధ్యా

నము సహస్రారచక్రగతప్రకృతిపురుషులదే యగును. సహస్రకమలమనఁగా జ్యోత్స్నామయమగులోకము.

"క్షితౌ షట్పంచాశద్ద్విసమధికపంచాశదుదకే
హుతాశే ద్వాషష్టిశ్చతురధికపంచాశదనిలే,
దివి ద్విషట్త్రింశన్మనసి చ చతుష్షష్టిరితి యే,
మయూఖాస్తేషామప్యుపరి తవ పాదాంబుజయుగం." ౧౪

సౌందర్యలహరి.

"ఏవం సోమసూర్యానలాః పిండాండబ్రహ్మాండే ఆవృత్య వర్తంతే పిండాండబ్రహ్మాండయోరైక్యాత్. పిండాండావృత్తిరేవ బ్రహ్మాండవృత్తిరితి రహస్యం. ఏవం పిండాండమావృత్యావర్తతే సహస్రకమలం. తచ్చ జ్యోత్స్నామయోలోకః. తత్రత్యచంద్రమా నిత్యకళః.

"తేషామనంతకోటీనాం మయూఖానాం మహేశ్వరి,
మధ్యే షష్ట్యుత్తరం తేఽమీ త్రిశతం కిరణాశ్శివే.
బ్రహ్మాండం వ్యశ్నువానాస్తే సోమసూర్యానలాత్మనా,
అగ్నేరష్టోత్తరశతం షోడశోత్తరకం రవేః.
షట్త్రింశదుత్తరశతం చంద్రస్య కిరణాశ్శివే,
బ్రహ్మాండం భాసయంతస్తే పిండాండమపి శాంకరి.
దివా సూర్యస్తథా రాత్రౌ సోమో వహ్నిశ్చ సంధ్యయోః,
ప్రకాశయంతః కాలాంస్తే తస్మాత్కాలాత్మకాస్త్రయః.
షష్ట్యుత్తరం చ త్రిశతం దినాన్యేవ మహాయనః,
హాయనాత్మా మహాదేవః ప్రజాపతిరితి శ్రుతిః.
ప్రజాపతిర్లోకకర్తా మరీచిప్రముఖాన్మునీన్,
సృజంత్యేతే లోకపాలాస్తే సర్వే లోకరక్షకాః.
సంహారశ్చ హరాయత్త ఉత్పత్తిర్భవనిర్మితా,

రక్షార్థం హృదయంలగ్నస్సృష్టిస్థితిలయేషు చ.
నియుక్తః పరమేశాన్యా జగదేవం ప్రవర్తత"

ఇతి చంద్రజ్ఞానవిద్యాతంత్రమ్.

"తమేవ భాంతమనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభా"తీతి శ్రుత్యర్థోఽనూదితః." శ్రుతి. అని వ్యాఖ్య.

దీనింబట్టిచూడఁగాఁ బ్రకృతిపురుషులగు సీతారాములను సహస్రారచక్రమున ధ్యానించుట ప్రధానమని తేలెడిని.

"మహీం మూలాధారే కమపి మణిపూరే హుతవహం
స్థితం స్వాధిష్ఠానే హృది మరుతమాకాశముపరి,
మనోఽపి భ్రూమధ్యే సకలమపి భిత్త్వా కులపథం
సహస్రారే పద్మే సహ రహసి పత్యా విహరసి." ౯

అను నీశ్లోకమునందు శ్రీశంకరభగవత్పాదాచార్యులు వివరించిరి. కావున భగవతిని భగవంతుని ననఁగా సీతారామచంద్రులను సహస్రారకమలమున ధ్యానించి, యందు ముహూర్త మాత్రము తద్రూపము నాంతరదృష్టిని దర్శించినచో దానఁ గలుగు నానంద మమృతపానమునకంటె నానందదాయకమని యెఱుంగుటయే యీశ్లోకార్థము నెఱుంగుట. ఇదియే యిందుఁ గలసారము.

సహస్రారకమలమున ధ్యానము సామాన్యదృష్టి నాలోచింప ముహూర్తకాలమే చేయ సాధ్యమగును. చిరంతనయోగాభ్యాసమున నంతకంటె మించినకాలము సాధ్యమగునేమో. లంబికాదియోగసిద్ధిగలవారలకు నెంతకాలమైన నయ్యది సాధ్యము కాఁగలదు. అట్టివారిని గుఱించియే,

"ధన్యానాం గిరికందరే నివసతాం జ్యోతిః పరం ధ్యాయతా
మానందాశ్రుకణాన్ పిబంతి శకునానిశ్శంకమంకేశయాః.

అని భర్తృహరి వచించెను. కావునఁ గౌసల్య ముహూర్త మాత్రము రామునిసన్నిధానము సర్వాతిశయఫలదమని పలికెను. ఆవిషయమునే మహర్షి వాల్మీకి మహాయోగి కావునఁ గౌసల్యనోటఁ బలికించెను. ఈరహస్యము నెఱింగి భక్తులు శ్రీసీతారాములను ధ్యానముచేయుచు వారిపాదారవిందముల యందు మనస్సును యథాశక్తి న్యాయము ననుసరించి నిలిపి యది యభ్యసింపవలయును. దానికంటె మించినపూజ లేదు. "యోగిహృద్ధ్యానగమ్యం వందే విష్ణుం భవభయహరం సర్వ లోకైకనాథమ్" అనుసూక్తి యున్నదియేకదా.

"తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః
ఉపవిశ్యాసనే యుంజ్యాద్యోగమాత్మవిశుద్ధయే.
సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః,
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్.
ప్రశాంతాత్మా విగతభీర్బ్రహ్మచారివ్రతే స్థితః,
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః
యుంజన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః,
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి." ౧౫

గీత. ౬. అ.



అను నీశ్రీకృష్ణవాక్యములు యోగాభ్యాసమునే ప్రధానమను చున్నవి. బాహ్యపూజ కేవలము పామరులకే యని తెలుపు చున్నవి.

"తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున."

అను నీభగవద్గీతావాక్యమే పైవ్రాతను సిద్ధాంతముచేయు చున్నది. ఇన్నివిషయము లుపదేశించిన శ్రీహరి దేవాలయ ములమాహాత్మ్యమును దెలిపెనా యని యూహింతము. కేవల పామరులకుగాఁ బాషాణగృహము లేర్పడినవి. క్షామకాలమున దొరతనమువారు క్రొత్తమార్గముల నియమించి బీదలను బోషిం చినట్లు లుబ్ధులగుధనవంతులను బురికొలిపి, దేవాలయములఁ గట్టించి శిల్పులను బీదవారిని బోషించుట దేవాలయములకు ఫలమనవలయును. తన్మూలమునఁ గొందఱకు జీవనము సాగు చున్నదికదా యందురేని యట్టివే ఫలములుగాని, యవియే ముక్తినొసంగునను కపటనాటకసూత్రధారులకపటోక్తులు నిర ర్థకములుగాక మఱేమగును? ఎన్నియోనియమముల నేర్పఱచి యాపాషాణవిగ్రహముల నెంతపరిశుద్ధమనస్కుఁడుకూడ ముట్టుకొనరాదనియు, నర్చకుఁడు నఖస్నానము చేసివచ్చి ముట్టు కొన్నను భగవంతుఁడు తృప్తినొందునని కల్పించియు, దాని మూలమున ధనము నార్జించువేషధారుల కృత్రిమోక్తులకు మోసపోవక, బుద్ధిమంతుఁడు ధనలంపటులుగాక, శిష్యోద్ధరణ తత్పరులగుపెద్దలకడ భక్తిమార్గమును దెలిసికొని యోగా భ్యాసము చేసి పరమేశ్వరుని నిరుపమానతేజోరూపమును ధ్యా నింపవయులనని వాల్మీకిమహర్షి యీశ్లోకరూపమున మన కుప దేశించెనని, యీయర్థమునే భగవద్గీత సిద్ధాంతముచేయుచున్న దని మన మెఱుంగవలయును.

"స మాతరం చైవ విసంజ్ఞకల్పామార్తం చ సౌమిత్రిమభిప్రతప్తం,
భర్తృస్థితో ధర్మ్యమువాచ వాక్యం యథా సపీనార్హతి తత్ర వక్తుం."౫౮

అనునిది వాల్మీకివాక్యము. శ్రీరామచంద్రునిపూన్కిని దెలుపు చున్నది. ధర్మమునందే యుండువాఁడు. అనఁగా "వృషో హి భగవాన్ ధర్మః" అన్నమనుస్మృతివాక్యమురీతిగా ధర్మమే తానైనవాఁడు. "తత్ర వక్తుం స ఏవార్హతి" అనఁగా నట్టికట్టడి కాలమునందు ధర్మమార్గమును జక్కఁగాఁ దెలుపుట కతఁడే తగినవాఁడు ఇతరుఁడు కాఁడని "ఏవకా" రార్థము. దీనింబట్టి భగవంతుఁడగు రామమూర్తియే ధర్మసూక్ష్మములను దెలుపఁ దగినవాఁడని వాల్మీకిమహర్షి భావము. ఏకాలమున నెట్టిధర్మ మార్గమును లోకులకుఁ దెలిపి వారాచరించునట్లు చేయుచు వారల కుదాహరణభూతుఁడు తానేయై చెప్పనట్టులాచరించుచు వెలయువాఁడు భగవంతుఁడు తప్ప నింకెవ్వఁడుండును? అనఁగా సర్వజ్ఞుఁడు తప్ప ధర్మస్వరూపము నెఱుంగఁదగువాఁడు లేఁడని భావము. కనుకనే శ్రీరాముఁడు లోకులకు ముఖ్యధర్మములను దెలిపి వానిని దానాచరించి యితరులకు మార్గదర్శకుఁడయ్యె ననియు నాకారణమున శ్రీరామునిప్రవృత్తియే ధర్మస్వరూప మనియు మన మెఱుంగవలయును.

"మమ త్వభిప్రాయమసన్నిరీక్ష్య మాత్రా సహాభ్యర్దసి మాం సుదుఃఖమ్." ౫౩

అని శ్రీరామమూర్తి లక్ష్మణున కుపదేశించెను. నాయభిప్రాయ మిట్టిదని తెలిసికొనక యనఁగా ధర్మైకతత్పరము నాయాశయ మని యెఱుంగవైతివే యని భావము. అందువలననే దుఃఖపడు చున్నావు. నన్నును గాఱియపెట్టుచున్నాఁడవు. ఇది తగదని భావము. అనఁగా నాపూన్కి ధర్మమునందే నెలకొనియుండును. దానిని మరల్ప వలనుపడదని రామాభిప్రాయము. ధర్మమునకు

విరుద్ధమగుదాని నాచరింప నామనస్స్వప్పదని రామచంద్రుఁడు స్పష్టముగాఁ దెలిపెనని మన మెఱుంగవలయును.

"ధర్మార్థకామాః ఖలు తాత లోకే సమీక్షితా ధర్మఫలోదయేషు
తే తత్ర సర్వే స్యురసంశయం మే భార్యేవ వశ్యాభిమతా సుపుత్రా." ౫౬

ఇదియే శ్రీరామచంద్రోపదేశసారము. సుఖము గలుగుటకు హేతువులు ధర్మార్థకామములనుట స్పష్టము. అందర్థకామములు ధర్మమునందే నెలకొనియున్నవి. నిస్సంశయము. కావున నొక్కధర్మము నాచరించినఁ దక్కిన రెండింటిని యథాశాస్త్రముగా నాచరించినట్లే యగును. అనఁగా ధర్మము నాచరించిన నన్నింటి నాచరించినట్లే. ధర్మమే ప్రధానమని భావము.

"శ్రుతిస్స్మృతిస్సదాచారస్స్వస్య చ ప్రియమాత్మనః,
సమ్యక్సంకల్పజః కామో ధర్మమూలమిదం స్మృతం. ౭
ఇజ్యాచారదమాహింసాదానస్వాధ్యాయకర్మణాం,
అయం తు పరమో ధర్మో యద్యోగేనాత్మదర్శనమ్." ౮

యాజ్ఞ. ఆచారకాండము.

ఇజ్యాదీనాం కర్మణామయమేవ పరమో ధర్మః యద్యోగేన బాహ్యచిత్తవృత్తినిరోధేనాత్మనో దర్శనం యాథాతథ్యజ్ఞానం. యోగేనాత్మజ్ఞానే దేశాదినియమో నాస్తీత్యర్థః. తదుక్తం. యత్రైకాగ్రతా తత్రావిశేషాత్ ఇతి పాతంజలే. అని విజ్ఞానేశ్వరస్వామి.

"ఏక ఏవ సుహృద్ధర్మో నిధనేఽప్యనుయాతి యః,
శరీరేణ సమం నాశం సర్వమన్యద్ధి గచ్ఛతి." ౧౭ మను ౮ అధ్యా.

అను నీమొదలగుస్మృత్యభిప్రాయమే రామాయణాభిప్రాయము. శ్రీరామచంద్రుని యాశయము స్మృతిసిద్ధమైన దేశాని ప్రోత్తది

కాదని తెలియవచ్చెడిని. ధర్మము ప్రధానమని దానినారాధించినఁ దక్కినయర్థకామము లనఁగా సుఖములు తమయంతనఁ గలుగు ననియు భావము. పురుషార్థములనఁగా ధర్మార్థకామమోక్ష ములు. ఈనాలుగింటిలో ధర్మము నారాధించినఁ దక్కినవాని నారాధించినట్లే. దీనిసార మేమనఁగా. ఒక్కొక్క దేవత నొక్కొక్కకోరికకారాధించుట యుత్తమమార్గము కాదనియు నొక్కభగవంతునే యారాధించినఁ దక్కినవారినెల్ల నారాధించినట్లేయగుననియు సారమని యెఱుంగవలయును.

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం. ౨౨
యేఽప్యన్యదేవతాభక్తా యజంతే శ్రద్ధయాన్వితాః,
తేఽపి మామేవ కౌంతేయ యజంత్యవిధిపూర్వకం. ౨౩
అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ,
న తు మామభిజానంతి తత్త్వేనాతశ్చ్యవంతి తే. ౨౪
యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాంతి పితృవ్రతాః,
భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపి మాం. ౨౫
పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః. ౨౬
యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం." ౨౭. గీత. ౯ అ.

అను నీశ్రీకృష్ణవాక్యములు పైనవ్రాసిన యభిప్రాయమునే తెలుపుచున్నవి. అంతియగాక భగవదారాధనక్రమమును బోధించుచున్నవి. కర్మానుసారము మానవు లాయాయి దేవతల నుపాసింతురనియు నాయారాధనము నన్నుఁగూర్చి యని వా

రెఱుంగరనియుఁ దేటపఱచుచున్నవి. నన్నే యాశ్రయించిన వారివాంఛలను వారడుగకపోయినను నేనే యొసంగుదునని భగవంతుఁడు తెలిపెనని స్పష్టపఱచుచున్నవి. వీనిసారమేమి? ఫలాభిసంధిరహిత సత్కర్మానుష్ఠానము ముఖ్యమనియే కాని వేఱొండు కాదు. ఇట్లే ధర్మము నొక్కదాని నారాధించినఁ దక్కినవాని నన్నింటిని జక్కఁగా నారాధించినట్లే యగునని యీయుదాహరణమునుబట్టి గ్రహింపవలయును. ఈయర్థము నకుఁ జక్కనియుదాహరణమును శ్రీరాముఁడు తెలిపెను.

"భార్యేవ వశ్యాభిమతా సుపుత్త్రా."

పూర్వజన్మకృతపుణ్యవిశేషమున లభించినభార్య అనుకూలరై ధర్మమును, ప్రియరై కామమును, సత్పుత్త్రులంగాంచి వారి యదృష్టవిశేషమున నర్థమును గల్గించును. ధర్మార్థకామముల కెట్లు భార్య కారణమో యట్లే ధర్మముకూడ నర్థకామములం గల్గించును. అనఁగా నన్నింటికి ధర్మమే ప్రధానమని భావము.

ఈఘట్టమున నాంధ్రీకరణము లెట్లున్నవో పరికింతము.

"భార్యేవ వశ్యాభిమతా సుపుత్త్రా." ౫౬

"యథా భార్యా వశ్యా అనుకూలా సతీ ధర్మం జనయతి, అభిమతా ప్రియా కామం, సుపుత్రా సతీ అర్థం."

అని గోవిందరాజులు

"సీ......ఒక్క,

భార్యయే వశ్యరై పరమధర్మంబును
ననుకూలరై కామమును సుపుత్త్ర

తే. వతియు నయి యర్థము నదెట్టిభంగిఁ గలుగఁ
జేయునో యొక్కధర్మ మట్లే యనుష్ఠి

తమయి సౌఖ్యదములగునర్థంబుఁ గామ
ముఖ్యపురుషార్థముల సిద్ధిఁబొందఁజేయు."

ఆంధ్ర శ్రీమద్రామాయణము.

చ. "ధర్మిణియైనభార్యగడుధర్మముఁగూరుచుఁ బ్రేమఁగామపుం
శర్మముగూర్చునర్థమునుసత్సుతుమూలముగాఁగఁగూర్చెడుఁ."

వావిలికొలనువారి రామాయణము.

విమర్శకులస్తుతిపాత్రములను సమదర్శను లెఱుంగుదురు గాక.

''యస్మింస్తు సర్వే స్యురసన్నివిష్టా ధర్మో యతస్స్యాత్తదుపక్రమేత
ద్వేష్యో భవత్యర్థపరో హి లోకే కామాత్మతా ఖల్వపి న ప్రశస్తా. ౫౭
గురుశ్చ రాజా చ పితా చ వృద్ధః క్రోధాత్ప్రహర్షాద్యది వాపి కామాత్,
యద్వ్యాదిశేత్కార్యమవేక్ష్య ధర్మం కస్తం న కుర్యాదనృశంసవృత్తిః.
స వై న శక్నోమి పితుః ప్రతిజ్ఞామిమామకర్తుం సకలాం యథావత్,
స హ్యావయోస్తాత గురుర్నియోగే దేవ్యాశ్చ భర్తా స గతిస్స ధర్మః. ౫౯
తస్మిన్ పునర్జీవతి ధర్మరాజే విశేషతస్స్వేపథి వర్తమానే,
దేవీ మయా సార్ధమితోఽవగచ్ఛేత్కథం స్విదన్యా విధవేవ నారీ. ౬౦
సా మానుమన్యస్వ వనం ప్రజంతం కురుష్వ నస్స్వస్త్యయనాని దేవి,
యథా సమాప్తే పునరావ్రజేయం యథా హి సత్యేన పునర్యయాతిః."

అనునివి శ్రీరామునివాక్యములు. వీనిసారమేమి? ధర్మార్థకామములు మూఁడును గలుగనట్టికార్యము చేయఁబూనరాదు. ధర్మము సిద్ధించుకార్యమేదో దానికే పూనవలయును. కేవలార్థపరుఁడగువాఁడు లోకులచే ద్వేషింపఁబడును. కామపరాయ

ణత్వ మొక్కటిమాత్రము మంచిదికాదు. అనఁగాఁ బ్రధానము ధర్మముకాన నది సిద్ధించుపనిని జేయఁబూనవలయును. సకలభంగులఁ బూజ్యుఁడగు దశరథుఁ డేకారణమున నాజ్ఞాపించిన నది ధర్మమగునని తలంచి చేయవలసినదే కాని మాన రాదు. భరతునకు నాకు నాజ్ఞాపించుటకుఁ బ్రభువు. తల్లియగు కౌసల్యకు భర్త. కాన నట్టిపూజ్యునియాజ్ఞ మీఱ రాదు. పతిం గూడియుండుటే సతికి ధర్మము. భార్యకు భర్తయే సర్వవిధ ముల శాసించువాఁడు. అని తమ్మునితోఁ జెప్పెను. జననీ జనకులు పూజ్యులే యైనను జననిమాటకంటె జనకుని పలుకు ప్రధానము. జనని కాజ్ఞాపించుటకుంగూడ నతఁడే యధి కారముగలవాఁడు. కనుకఁ దండ్రిమాట యుత్కృష్టము. క్రూరచిత్తుఁడే తండ్రియానతి మీఱువాఁడు. నేనట్లు మీఱను. కౌసల్యకు భర్తయాజ్ఞ శిరసావహింపఁదగును. కావున నావన గమనమున కామె యంగీకరించి దీవించి పంపవలెను. ప్రతిజ్ఞ నెఱవేర్చి మరలివత్తునని ధర్మవిహితముగ శ్రీరామచంద్రుఁ డుప దేశించెను. దీనింబట్టి యాలోచింపఁగా శ్రీరామునకు ధర్మము నందుఁగల యాదరణము తేటపడియెడిని. ధర్మేతరవాక్యము శ్రీరామునోటనుండి వెడలదని స్పష్టమగును.

"జీవీ మయా సార్ధమితోఽవగచ్ఛేత్కథంస్విదన్యా విధవేవ నారీ"

అన్నమూలము మనకొకనీతిని బోధించెడిని. పుత్త్రునింగూడి యడవికి సువాసిని పోఁగూడదనియు భర్తృవిహీనయైన స్త్రీ మాత్రమే యట్లు పోనచ్చుననియు, భావము. అనఁగా

"పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే,
రక్షంతి స్థవిరే పుత్త్రా న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి." 3మను ౯ అధ్యా.

అన్న స్మృతివాక్యమునఁ గలయర్థమే యీ రామవాక్యార్థమని తేటపడియెడిని. ముదుసలితనమునందు భర్త తురీయాశ్రమము స్వీకరించినపుడే పుత్త్రులు రక్షింపవలయునని భావము. దీనింబట్టి స్త్రీ యొంటరిగాఁ దిరుగ రాదనియు, తండ్రి భర్త తనయులు లోనగుసంబంధుల సంరక్షణము స్త్రీలకు ముఖ్యమనియే శ్రీరాముని భావమని మన మెఱుంగవలయును. గతభర్తృక పుత్త్రవిహీనయైన నెట్లుండవలయు నన్న ప్రశ్నము రావచ్చును. తండ్రి వంకవారు గాని తత్తుల్యులు గాని రక్షకులుగా నుండవలయునే కాని సాహసించి యొంటిగఁ దిరుగ రాదనునర్థము సిద్ధమగును.

"కాలేఽదాతా పితా వాచ్యో వాచ్యశ్చానుపయన్పతిః,
మృతే భర్తరి పుత్త్రస్తు వాచ్యో మాతురరక్షితా. ౪
సూక్ష్మేభ్యోఽపి ప్రసంగేభ్యః స్త్రియో రక్ష్యా విశేషతః,
ద్వయోర్హి కులయోశ్శోకమావహేయురరక్షితాః. ౫
ఇమం హి సర్వవర్ణానాం పశ్యంతో ధర్మముత్తమం,
యతంతే రక్షితుం భార్యాం భర్తారో దుర్బలా అపి." ౯ మను ౯ అధ్యా.

అను నీమనుస్మృతిభావమునే సంగ్రహించి "అనాథా విధవేవ నారీ" యని శ్రీరామమూర్తి మన కెఱింగించెను. పూర్వకాలమునందుఁ గూడ స్త్రీరక్షణమునం దెంతయాదరమును బెద్దలు చూపిరో యెఱుంగనగు.

"న కశ్చిద్యోషితశ్శక్తః ప్రసహ్య పరిరక్షితుం,
ఏతైరుపాయయోగైస్తు శక్యాస్తాః పరిరక్షితుం." ౧౦

అను నీమనుస్మృతివాక్యము ననుసరించి పూర్వులు స్వానుభవమున స్త్రీరక్షణమున నెన్నియుపాయములు కనిపెట్టి రక్షించిరో స్పష్టమగును. "కురుష్వ నస్సర్వ స్వస్త్యయనాని దేవి" అని శ్రీరామ

మూర్తి ప్రార్థించెను. సీతకు లక్ష్మణునకు నాకు నాశీర్వచనముల
దయసేయవమ్మా యని ప్రార్థించెను. లక్ష్మణునియనుగమనము
నెఱింగెను. సీతరాక నెఱుంగఁడు. కావున లక్ష్మణునకు నాకు
నాశిషము లిమ్మని యడిగెనని కొందఱి యభిప్రాయము. గోవింద
రాజులుకూడ నిట్లే వ్రాసిరి. కాని యీగ్రంథము సర్వజ్ఞుఁ
డయ్యు శ్రీరాముఁడు మానవుల ననుసరించునట్లే నటించు
ననువిషయమే ప్రధానముగాఁగలది. గావున నాయభిప్రాయము
నంగీకరింప నవకాశము లేదు. సీతయూహించినట్లే శ్రీరాముఁడు
ప్రవర్తించును. భగవంతు నిచ్ఛ ననుసరించియే జానకి యూహిం
చును. శ్రీరాముఁడు నిర్లిప్తుఁడు. సీత సర్వకార్యకర్త్రి. అన్న
భావమే యిందుఁగలముఖ్యవిషయము. కావున మామువ్వురకు
శుభముకలుగ ననుగ్రహింపుమని శ్రీరాముఁడు ప్రార్థించెననియే
గ్రహింపవలయును.

"యశో హ్యహం కేవలరాజ్యకారణాన్న పృష్ఠతః కర్తుమలం మహోదయం,
అదీర్ఘకాలేన తు దేవి జీవితే వృణేఽవరామద్య మహీమధర్మతః." ఉ౧

అనుమూలమున శ్రీరాముఁడు తనయవతారఫలమును దెలి
పెను. యశస్సు మహాఫలముగలది. రాజ్యకారణమున నట్టి
యుత్తమఫలమును వదలఁజాలను. జీవితము క్షణభంగురము.
అట్టిదానిని నమ్మి యధర్మమార్గమునఁ దుచ్ఛమగు రాజ్యమును
గోరనని శ్రీరాముఁడు పలికెను. దీనిభావమేమి? యశస్సు ధర్మ
మూలమైనది. శాశ్వతము. దానిని సంపాదింపక యుండరాదు.
బ్రదుకు క్షణభంగురము. అట్టిదానిని నమ్మి యధర్మమూలమున
రాజ్యము లభించునేని గోరరాదనియే తెలియందగు. అనఁగా
ధర్మమునే యారాధింపవలయును. దానఁ గలుగుఫలము శాశ్వ

తము. ధర్మమూలముగా దొరకు రాజ్యమును గోరవచ్చును. అధర్మమూలమగు నేని రాజ్యసుఖము నాశింపరాదు. అనఁగా నేను ధర్మమునే యాశ్రయించి దాన లభించుయశస్సు నార్జింతును. అయ్యది నాచరిత్రరూపమున స్థిరముగా జగంబున నెలకొనును. దాన ధర్మస్వరూపము తేటపడును. దాని నెఱింగినవారు నాదయకుఁ బాత్రులగుదురు. అనునదియే యిటఁగల సారము. రాక్షససంహారము ధర్మము యందు రేని ధర్మధ్వంసకులగుటచే వారు వధ్యులైరి. ధర్మసమారాధకులగుట విభీషణాదులు కృపాపాత్రులైరి. కావున యుద్ధమున నధర్మ ప్రవర్తకులం బొలియించుట న్యాయ్యమే. కనుకనే క్షత్రియ వంశమున నవతరించెను. తదుచితమైన యాచారములు ధర్మములే.

"స్వధర్మమపి చావేక్ష్య న వికంపితుమర్హసి,
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్క్షత్రియస్య న విద్యతే. ౩౧
యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమపావృతం,
సుఖినః క్షత్రియాః పార్థ లభంతే యుద్ధమీదృశం. ౩౨
అథ చేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి,
తతస్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాపమవాప్స్యసి. ౩౩
అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయాం,
సంభావితస్య చాకీర్తిర్మరణాదతిరిచ్యతే. ౩౪" గీత. ౨ అధ్యా.

అను నీశ్రీకృష్ణోపదేశవాక్యములు శ్రీరామచంద్రునివే యని యెఱుంగవలయును. శ్రీరామావతారము సంగ్రహముగాఁ దెల్పినవానినే శ్రీకృష్ణావతారమున భగవంతుఁడు విస్తరించి తెల్పెనని యెఱుంగందగు. ఈశ్రీరామునివాక్యముల ననుస

రించి ధర్మమువలన యశస్సు నార్జింపవలయుననియుఁ దుచ్ఛమగు సుఖమును గోరరాదనియు మన మెఱుఁగందగు. ఫలాభిసంధి రహితకర్మానుష్ఠానము మంచిదన్నందుల కిది విరుద్ధముకాదా యందురేని యిట్టి యశస్సంపాదన మితరులకు ధర్మకర్మాసక్తిని గల్గించునదికావున సత్కర్మమే యనఁబడునని తెలియవలయును. ఈవాక్యమునందు శ్రీరాము నభిప్రాయమేమి? అను ప్రశ్నము కలదు. నేను ధర్మరక్షణమూలక మగుయశస్సు నార్జింప నవత రించితిని. ఈయవతారముననే యెల్లప్పుడుండఁబూనను. కావున నిపుడు రాజ్యము గోరను. రాక్షసనాశానంతరము ధర్మము వెలయుఁగాన నపుడు కొంతకాల మంగీకరింతును. అన్నదియే శ్రీరామచంద్రునభిప్రాయము.

"ప్రసాదయన్నరవృషభస్స మాతరం పరాక్రమాజ్జిగమిషురేవ దండకాన్,
అథానుజంభృశమనుశాస్యదర్శనం చకారతాంహృదిజననీంప్రదక్షిణం." ఉ౩

అను నీమూల మొక విశేషమును దెలుపుచున్నది. పురుషోత్తముఁ డిట్లు తల్లి నాశ్వాసించి పరాక్రమమున దండకారణ్యముల జయింపఁగోరియే పోవ నెంచెను. లక్ష్మణునకు ధర్మరహస్యమును జక్కఁగాఁ దెలిపి తల్లికిఁ బ్రదక్షిణముచేసి మనస్సునఁ బోవ నిశ్చయించెనని ప్రతీతికార్థము. విశేషమేది? అనఁగా వినుఁడు.

ఇంతదనుక శ్రీరామమూర్తి శాంతమునే యాశ్రయించి యుండెను. ఇఁకఁ బరాక్రమమును జూపఁదగుసమయ మరుదెంచును. కావునఁ దదుచితమగుశౌర్యమును బూని దండకాటవులజయింప నిచ్ఛయించియే పోవ నెంచెను.అనఁగా విరాధ ఖరదూషణత్రిశిరోదనుకబంధాదులఁ బొలియింపఁ దగుసమయ

మాసన్నమగుచున్నది. లక్ష్మణుఁడు రాజ్యము తనకు నిప్పింపఁ గోరి తల్లింగూడి దుఃఖించుచున్నవాఁడు. దుఃఖము శాంతింపఁ జేయునంత యవకాశము లేదు. కావున నపుడు పరాక్రమ ప్రదర్శనోచితస్వరూపమును గనఁబఱచెను. మిక్కిలి యను శాసించి యనఁగా నిఁక బదులాడకుమని హెచ్చరించెను. తల్లికిఁ బ్రదక్షిణముచేసెను. ప్రయాణముచేయ మనసున నూల్కొనియెను.

> "ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరం,
> మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి. ౭
> న తు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా,
> దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరం." ౮

గీత. ౧౧ అధ్యా.

అను గీతోపదేశము ప్రకారము స్వరూపదర్శన మొసంగెను. ఆ తేజోమయరూపదర్శనమున నెట్టివారైనను దద్వశంవదులగు దురని యెఱుంగునది. లక్ష్మణునిమూలమునఁ గావలసిన కార్యము లనేకము లున్నవి. కావున నాతని క్రోధదుఃఖావరణములనుండి మరలించె ననునదియే యిందు గ్రహింపఁదగును. తన తేజస్సును లక్ష్మణునియందుఁ గొంత చేర్చెననియుఁ గొందఱందురు. ఇట్టి లీభాగము శ్రీరామచంద్రునియుపదేశసారములచే సంభరిత మైనది.

అధ్యాత్మరామాయణమునం దీభాగ మెట్లున్నది పరికింతము. కౌసల్యవచనసారమున నిందు విశేషము లేదు. లక్ష్మణునివాక్కులయందు

> "ధనుష్పాణిరహాం తత్ర నిహాన్యాం విఘ్నకారిణః."

అనియే కలదు.

> ఇతి బ్రువంతం సౌమిత్రి మాలింగ్య రఘునందనః. ౧౭
> శూరోఽసి రఘుశార్దూల మమాత్యంతహితే రతః,
> జానామి సర్వం తే సత్యం కింతు తత్సమయో న హి. ౧౮
> యదిదం దృశ్యతే సర్వం రాజ్యం దేహాదికం చ యత్,
> యది సత్యం భవేత్తత్ర ఆయాసస్సఫలశ్చ తే. ౧౯
> భోగా మేఘవితానస్థవిద్యుల్లేఖేవ చంచలాః,
> ఆయురప్యగ్నిసంతప్తలోహస్థజలబిందువత్. ౨౦
> యథా వ్యాళగళస్థోఽపి భేకో దంశానపేక్షతే,
> తథా కాలాహినా గ్రస్తో లోకో భోగానశాశ్వతాన్. ౨౧
> కరోతి దుఃఖేన హి కర్మతంత్రం శరీరభోగార్థమహర్నిశం నరః,
> దేహస్తు భిన్నః పురుషాత్సమీక్ష్యతే కోవాత్ర భోగః పురుషేణ భుజ్యతే.

అను మొదలగు వాక్యరత్నము లుపదేశింపఁబడినవి. రామాయణమున సంక్షేపరూపమున నున్న విషయము లిందు విస్తరింపఁబడినవి. విషయసారమున నేభేదము కనఁబడదు. ప్రవృత్తిప్రధానముగ వాల్మీకి రామచరిత్రమును దెలిపెను. ఉపదేశప్రధానముగా నధ్యాత్మరామాయణము విస్తరిల్లెను. సారగ్రాహకుల కర్మానుసారముగఁ దత్సారము గ్రహింపఁబడుచుండును. ఇఁకఁ దరువాతి శ్రీరామచంద్రప్రవృత్తిని బరికింతము.

### శ్రీరాముఁడు లక్ష్మణునకు శాంతముగల్గ బోధించుట.

*అత్తఱి దుఃఖము పైకొనఁగా దానినాపుకొనఁజాలక వేఁడినిట్టూర్పులుపుచ్చుచుఁ గోపాతిశయమునఁ గన్నులు పెద్దవి

*ఇత్యాది యిరువదిరెండవ సర్గమునుండి గ్రహింపఁబడినది. అధ్యాత్మరామాయణసారముకూడ నిందుండును.

కాఁగాఁ బెనుసర్పముభంగి బుసగొట్టుచు నుండు ప్రియానుజుని గాంచి మనోనిగ్రహముగల శ్రీరాముఁడు మనోవికారమును బయలుపడనీయక యడంచికొనుచు నిట్లనియె. లక్ష్మణా! నీవు కోపమును శోకమును బట్టాభిషేకము నిలిచిపోయె నన్నయవమానము వదలి ధీరుఁడవై యుండుము. సంతుష్టుఁడవు కమ్ము. నాయభిషేకార్థము సమకట్టినయలంకారాదుల వదలుము. నిరపాయకార్యమునకుఁ బ్రయత్నింపుము. నావనవాసమునకు ననువగుయత్నము చేయుట మంచిది. నావిషయమున నీకుం గల యుత్సాహము నియభిషేకమును నిలిపి వనమున కరుగఁదగిన వల్కలాదుల సేకరించుటయందు వ్యాపింపఁజేయుము. నాకీయభిషేకోత్సవము సాగునేమో యని సంతాపమునొందు తల్లికిఁ గైకకు నీవిపుడు నన్నుఁగూడి యాలోచించుటవలన నేసందియముగాని డెందమునఁ గలుగకయుండ వర్తింపుము. అభిషేకభంగ మాయె నన్నదుఃఖమునఁ బరితపించు నాతల్లికిఁ గౌసల్యకుఁ దండ్రియానతి మీఱరానిది గనుక మాయన్న వనముల కరిగి పదునాలుగుసంవత్సరము లుండివచ్చునుగదా. ఈయల్పకాలమున కేల విచారించెదవని నారాకను గూర్చి సంశయము నొందకయుండఁ దగుభంగిఁ బలికి యూఱడింపుము. కైకకుఁగాని కౌసల్యకుఁగాని శంకామయదుఃఖము రవంతసేపు కల్గినను నేనోర్వఁజాలనుజుమీ. ఇంతవనుక జననీజనకుల కెప్పుడైన నెఱిఁగియే నెఱుఁగకయే నపకారము చేసినట్లు నాకుఁ దోఁచదుసుమీ. తండ్రి యనృతములాడఁడు. పలికినమాటను దప్పఁడు. అమోఘపరాక్రముఁడు. భూలోకమున నెందు నా తండ్రికి భయమే లేదు. ఇప్పుడు భయంపడియుండుట చెప్పిన మాట చెల్లింపకపోయినఁ బరలోకదూరుఁడ నగుదునే

యనియుఁ బరలోకమున శ్రమంపడవలసివచ్చుననియు నూహా
చేతఁగాని వేఱుగాదు. అట్టిభయము నాతండ్రికి లేకయుండుఁ
గాక. ఈప్రయత్నము నిలుపక మనము సాగించితిమేని కైకకుఁ
దానిచ్చినవర మసత్యమగు ననుపరితాపము తండ్రికిం గలుగక
మానదు. అట్లు కలిగిన నయ్యది నాకుం గల్గును. కనుక వత్సా!
అభిషేకార్థములగు నీయలంకారముల వదలి యిచటనుండి
యిపుడే యడవుల కరుగ నెంచుచున్నాఁడను.

ప్రియసోదరా! నాప్రయాణము సాగఁగా నాకైక
యనుమానము మాని భరతునకు నభిషేకమహము సాగింపఁ
గలదు. వల్కలాజినముల ధరించి జడలుదాల్చి నే నడవుల కరి
గినతర్వాతఁ గైకకు మనస్తృప్తి కలుగును. నేనిందుండునంత
దనుక నిది యామెకుఁ గలుగదు. నాకు వనగమనేచ్ఛ కలిగినది.
తద్విషయమున మనస్సును గట్టిపఱచుకొంటిని. ఆలసించి మనస్సు
నకు లేనితొందఱలఁ గల్గింపరాదు. సత్యపాలనార్థము నన్నడవు
లకుఁ బంపఁగోరి నాతండ్రి యెట్టకేలకుఁ దనమనస్సు దృఢము
చేసికొనియున్నాఁడు. అట్టితండ్రికి మనోదుఃఖము నామూల
మునఁ గల్గరాదు నాయభిషేకవిఘ్నమునఁ బ్రయత్నము చేసిన
వారలకెల్ల దుఃఖము గలుగరాదు. కనుక సత్వరంబ వనము
నకుఁ బోవలయు. నన్నడవులకుఁ బంపుటకుఁగాని, నాకు లభిం
చినరాజ్యమును దప్పించుటకుఁగాని కైక కారణము కాదు.
దైవమే కారణము. కైక కీయభిప్రాయము దైవము పురికొల్పఁ
గలిగినది. అట్లు కాకయున్నఁ జిన్నతనమునుండి నాయందు మిగుల
వాత్సల్యముఁ గలిగియుండు నాతల్లికి నిపుడు నన్నుఁ గష్టముల
పాలుసేయవలయు ననునూహ యెట్లు కల్గును? మృదుమనస్కుఁ
డవు. నా యీమాటలఁ జక్కఁగా నాలోచింపుము. లక్ష్మణా!

నేనింతదనుక జనని యని సవతితల్లియని భేదము పాటించిన వాఁడను గానని నీవే యెఱుంగుదువుకదా. ఆకైకకుంగూడ నాయందును భరతునియందును భేదభావము లేదనియు నీవెఱుంగుదువు. ఇట్టితఱి నంతవాత్సల్యము నాయందుఁగల కైకకు దైవప్రోత్సాహమే లేకపోయిన నిట్టిభేదభావ మేలాగు కలుగును? ఇంతకాల మామె దయారసవిశేషము ననుభవించు చున్న నన్నుఁ బట్టాభిషేకము మాని యడవికిఁ బొమ్మని వచింప రానిభయదవాక్యము లాకైక పలుకుట నాలోచింపఁగా నిందు లకు దైవమే తప్ప మఱియొక్కటి కారణమని నిర్ణయింపఁజాల కున్నాఁడను. దైవకారణము తప్ప నామెవాత్సల్యము దూర మగుట కింకొక్కకారణమే లేదు.

వత్సా! లక్ష్మణా! కైక నిజముగా సాధుస్వభావము కలది. ఉత్తమక్షత్రియకులసంజాత. అందులకుఁ దగినదయాది సద్గుణములు కలది. అట్టి యాకైక దుష్టప్రకృతిగలస్త్రీవలెఁ బ్రాణనాథునెదుట నన్ను బాధించుమాటలు పలుకునా? పలుక దనుట నిస్సంశయము. పలికెఁగదా యందువేమో. అందులకు దైవమే కారణమని విశ్వసింపుము. దైవమహత్త్వ మిట్టిదని యూహింప నలవియే కాదు. సకలభూతములలో నెద్దానియందుఁ గాని దైవము చేయఁబూనినకార్యమునకుఁ బ్రతిహతమే లేదు. ఇది సుస్పష్టము. వేఱు తార్కాణము లేల? నాహస్తగతమగు రాజ్యము తప్పిపోయినది. కైకకు నాయందుఁ జిరంతనమగు ప్రేమము మాఱినది. లక్ష్మణా! నాస్థితియు నామెబుద్ధియుఁ దటాలునఁ దాఱుమాఱయ్యెఁగాదే. కావున దైవమునకుఁ బ్రతి హతమే లేదని నమ్ముము. దైవమున్నదని యెట్లు పలుకవచ్చు నని, ఉండెనేని పురుషకారమున దాని నాపఁగూడదా యనియు

నడుగుదువేమో సమాధానము నాలకింపుము. మనము చేయు చుండు కార్యముల ఫలములనుబట్టియే దైవముకలదని తెలిసికొనవచ్చును. మనము పట్టుదలతోఁ జేయు కార్యములయందుఁ గొన్నింటికి ఫలమే కలుగదు. అశ్రద్ధతో నెందులకో చేసిన కార్యములందుఁ గొన్నింటికి ఫలము కలుగుచున్నది. ఈఫలములకు దైవముతప్ప మఱొక్కటి కారణమని చెప్ప వలను పడదు. కనుకనే దైవమున్నదని యనుమానము కలుగుచున్నది. చేసిన కార్యములు ఫలించుటచేత నేతప్ప వేఱుసాధనము దైవమున్నదని యెఱుంగుటకు లేదు. ఈ హేతువుచేత దైవమున్నది. దైవమనునది ఫలమునకుఁ బూర్వమే తెలియునదిగా నుండునేని ప్రతికూలమని తోఁచినయెడల దాని కేదైన ప్రాయశ్చిత్తము ముందుగనే చేసికొనవచ్చును. కాని ఫలమునకు ముం దెంత మాత్రమయ్యది తెలియరాదు. ఫలమునకు ననంతరమే తెలియునట్టి బలవత్తమమగు నాదైవముతోఁ బ్రతిఘటించి దాని యత్నము నిలుపుట కెవ్వఁడు యత్నించును? వత్సా! ఈరీతిగానే యాదైవము ఫలముచేత ననుమానించి తెలిసికొనఁదగినదిగా నుండుటంజేసి యత్యంతబలీయమే యనఁదగినదికదా. కావున నట్టిదైవమును బురుషకారముచేత నాపుట యశక్యము. సుఖదుఃఖములు, శాంతికోపలాభనష్టములు జననమరణములు లోనగునట్టి కారణము తెలియరాని కార్యములన్నియు దైవకార్యములే యని నమ్ముము. ఘోరతపస్సొనరించుచు నింద్రాది దేవతలంగూడ లెక్కసేయని విశ్వామిత్రాదులగుమునులుకూడ నాదైవముచేఁ బీడింపఁబడి పూని చేయుచున్నవ్రతోపవాస ప్రముఖతీవ్రనియమములను వదలి కామక్రోధములకు లోఁబడి ఋషిత్వమునుండి దూరముగ నుండఁదగినవారలైరి. ఈభూలో

కమునందు నారంభించిన కార్యము నాపి, తత్పూర్వము మనస్సు
నందైన నెప్పుడేఁ దలంపనైనఁ దగని కార్యము క్రొత్తది
యాకస్మికముగా ఫలించుచున్నదికదా. అది దైవకార్యమే
యని యెఱుంగుము.

లక్ష్మణా! ఇపుడు నేను నీకుపదేశించిన యీబుద్ధి సత్యము
సుమీ. ఆబుద్ధిచేత నామనస్సును నేనే యాపియున్నాఁడను.
పట్టాభిషేకము నిలిచిపోయినను దాన విచారము నాకుఁ గలు
గకయున్నది. దైవశక్తి బలవత్తమము కాఁబట్టి నా తెలిపిన యీ
బుద్ధి యోగబలమున నీవును బరితాపమును బోఁదోలి నా
యీమతమునే యనుసరించి యభిషేకసంభారముల నిలుపుము.
వత్సా! ఇప్పటి యీమంగళకుంభోదకం బంతయు నాకుఁ
గాకున్నను దాపసులకు నర్హమగు వ్రతము నేఁ బూనినపుడు
చేయఁదగుస్నానమునకుఁ బనికివచ్చునుగాక. ఈజలము స్నాన
మునకు నే నుపయోగించిన రాజ్యార్థము చేసితినని తల్లి సంది
యము నొందునేమో. ఇది రాజద్రవ్యము. ఇది రాజ్యోప
యుక్తములగు మంగళద్రవ్యము లనేకములు గలిగియున్నది.
కాన నీజలము నాకెందులకు? నేనే తెచ్చుకొన్న జలములచే
స్నానముచేసి వ్రతనియమమును సాగింతును. ప్రియసోదరా!
సంపద తలక్రిందులయ్యెఁగదా యని పరితాపపడకుము. రాజ్య
మును యథావిధిగాఁ బాలించిన నత్యంతధర్మము కలుగును.
వనవాసముచేఁ దపస్సు లభించును. ఇవి రెండును సమానములే.
చక్కఁగా నాలోచించి చూడఁగా రాజ్యలాభమున మానవు
లకు వలయు కార్యాకార్యచింతయుఁ గష్టము విశేషించి యుం
డును. వనవాసమున నట్టికష్టము లుండవు. అంతియ కాక తండ్రి
మాటపాలించిన ధర్మముకూడ సిద్ధించును. కాఁబట్టి వనవాసమే

మిక్కిలి ఫలము నిచ్చునది. అంతియకాక యయ్యది మహాభ్యుదయమునకు సాధనముగా నున్నది. ఇపుడు నేఁబూనినకార్యమునకు విఘ్నము గలుగఁజేయఁ బిన్నతల్లి కారణమని యనుమానింపకుము. అయ్యది సరిగాదు. కైక దైవప్రోత్సాహమున నప్రియము పలుకుచున్నది. అంతియగాని వేఱుకాదు. అట్లు ప్రోత్సహించిన దైవమనఁగా నంతటిమహాప్రభావము కలదని నేను జెప్పతినిగదా. కావున నీకును దెలిసియేయున్నది. దైవము కారణముగా నున్నదానికై తల్లి యగుకైకను నిందించుట మంచిదిగాదని శ్రీరామమూర్తి బోధించెను.

మహాశయులారా! ఈసర్గము విశేషప్రయత్నమున విమర్శింపఁదగినది. దీనియందలిసార మెఱింగితిమేని యహంకారము మొదలంట నశించును. ఇఁక వినుఁడు. శ్రీరామచంద్రుఁడు పూర్వము తెలిపినదంత యు ధర్మముపాస్యమని. లక్ష్మణున కంత మాత్రమున నహంకారము తుదముట్ట నశింపలేదు. మన ప్రయత్నమున నీకార్యము కొనసాగదా యన్నయూహ కలదు. ఆయూహ ముందుముందు వృద్ధిపొంది యహంకారమును బెంచును. శ్రీరాముని సేవించువారలకయ్యదియుండరానిదియకదా. అట్టియహంకారమును దొలఁగించి కర్మసిద్ధాంతము మదినాటునట్లు లొనరింప శ్రీరామమూర్తి యెంచెను. భగవదారాధనము చేయువారలు కర్మబద్ధులముకాని స్వతంత్రులముకాము. అనుభావము గలవారలుగా నుండఁదగుదురు. గర్వమున కెవ్వారి మనస్సునఁ జోటులేదో వారలే యీశ్వరారాధనమునకు నర్హులు. తన్ను నమ్మినవారల కట్టిదుర్గుణము లేకుండఁజేయ నీశ్వరుఁడు తలంచును. సత్కర్మానుష్ఠానఫల మదియేకదా. అట్టియుపదేశము నీభాగమున శ్రీరాముఁడు తమ్మునకుఁ జేసెను. కావున

## శ్రీరాముఁడు లక్ష్మణునకు శాంతముగల్గ బోధించుట

సకలపురుషార్థసాధనమగు నహంకారధ్వంసనరూప సద్విషయ మిందుఁ గలదని మన మెఱింగి దాని ననుష్ఠింపఁ బ్రయత్నింప వలయును.

"శ్వసంతమివ నాగేంద్రం రోషవిస్ఫారితేక్షణం,
ఆసాద్య రామస్సౌమిత్రిం సుహృదం భ్రాతరం ప్రియం,
ఉవాచేదం స ధైర్యేణ ధారయన్ సత్త్వమాత్మవాన్."

అని మూలము. "సత్త్వం చిత్తావికృతిం" అని వ్యాఖ్య. విశేషార్థ మేమనఁగా లక్ష్మణునకుఁ గోపము నశింపలేదు. పట్టాభిషేకము నిలిచిపోయెనే అన్న యవమానము మదిఁ బాదుకొన్నది. ఈ రెండింటిని దొలఁగింప నెంచెను. కావున శ్రీరామమూర్తి తన చిత్తావికారము ననఁగా నేకాలమునందు నేపనియందు మార్పు నొందని చిత్తవృత్తిని ధరించినవాఁడై 'ఆత్మవాన్' అనఁగా నిర్మలాంతఃకరణుఁడు. సర్వము ప్రకృతియధీనము చేసి మహానంద మనుభవించువాఁడని సారము. తనమనోవృత్తిని బయలు పడనీయక చేయఁ బూనినకార్య మితరులకుఁ దెలియనీయక యని చెప్పరాదు. దానిచే భగవచ్ఛక్తి నశింపఁజేసినట్లగును. బ్రహ్మాదులే నెఱుంగరాని తనమహత్త్వమును లక్ష్మణునకుఁ దానై తెలుపక యిట్లు పలికెనని మన మీభాగమునుండి గ్రహింపవలయును. ఇట్లేల శ్రీరాముఁడు పలికెనని ప్రశ్నింతురు. "సుహృదం ప్రియం భ్రాతరం" అనుమూలము బరిశీలింపుఁడు. మంచిహృదయముకలవాఁడు. తనమేలుకోరినవాఁడు. మానవ దృష్టిచే సోదరుఁడు కావున నతనికిఁగల కోపమును నశింపఁ జేయఁబూనెను. నిర్మలాంతఃకరణులకుంగూడ యేదో లోపము లుండును. వానిని భగవంతుఁడు తొలఁగించి తనపదము నొసంగును.

"అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్,
సాధురేవ స మంతవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః." ౩౦ గీ. ౯ అధ్యా.

అన్నగీతాప్రమాణము ననుసరించి ప్రారబ్ధవశమున నేవో కొన్ని లోపములు లేశములవలె నుండినను భగవంతుని సాంద్ర భక్తిచే నమ్మి సేవించిన నయ్యవి తొలఁగఁజేసి పరమేశ్వరుఁడే కాపాడునని యూహింపవలయును. దురాచారుఁడు భగవంతుని సేవించునా యని ప్రశ్నింపరాదు. దుష్కర్మలేశము లేని సత్కర్మము చేసినవారే యుండరనవచ్చును. ఒక్కొక్కజన్మమునందును సత్కర్మము నాచరించుచు రాఁగా దుష్కర్మములు నశించుచుండఁగా నెన్నియోజన్మములకు యోగసిద్ధుఁడగును.

"ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః,
అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిం." ౪౫ గీత. ౬ అధ్యా.

అను నీగీతావాక్యమే పైవ్రాసినదానిని సిద్ధాంతము చేయుచున్నది. కావునఁ బాపలేశము లేనివారే భగవంతుని సేవింతురనుట పొరపాటు. పాపములు భగవత్సేవచేఁ దొలఁగవలయును. అవిలేకున్న నివి తొలఁగు టెట్లు? కావున సత్కర్మానుష్ఠానమే అనఁగా ఫలాభిసంధిరహితముగా సత్కర్మముల నాచరించుటయే భగవత్సేవ. ఫలములను గోరి భగవంతు నాశ్రయించుట భగవత్సేవ యనంబడదు. అట్టివాఁడు భగవదనుగ్రహమునకుఁ బాత్రుఁడు కాఁజాలఁడు. అది కృత్రిమభక్తి. అట్టివారే వేషధారు లనఁబడుదురు.

"జటిలో ముండీ లుంఛితకేశః కాషాయాంబరబహుకృతవేషః."

అని శ్రీశంకరభగవత్పాదాచార్యశిష్యులు తెలిపిరి. అట్టివారు భగవదనుగ్రహమును బొందఁజాలరనుట నిక్కము.

"నిగృహ్య రోషం శోకం చ ధైర్యమాశ్రిత్య కేవలం,
అవమానం నిరస్యేమం గృహీత్వా హర్ష ముత్తమమ్.
ఉపక్లప్తం హి యత్కించిదభిషేకార్థమద్య మే,
సర్వం విసర్జయ క్షిప్రం కురు కార్యం నిరత్యయం." ౮

అని మూలము.

"జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః,
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః." ౭ గీత ౬ అధ్యా.

అన్నగీతావాక్యము ననుసరించి యోజించిన నీశ్రీరామోప దేశము చక్కఁగాఁ దోఁచును. కర్మసిద్ధాంతము నెఱుంగని వారికే రోషాదు లుండఁగలవు. ఏలన తనకర్మమే తనకుశుభాశుభ ఫలముల నొసంగుచున్నదని కర్మయోగి నమ్మును. ఇతరులు కర్మ ప్రోత్సాహితు లగుదురన్నవిశ్వాసము వారలకు నుండును. ఇత రులను నట్లుగాక పనులు హాసి చేయుదు రనుతలంపు గల్గును. కావున వారికి రోషాదులు నశింప నవకాశమే లేదు. ఇట్టి మహా నర్థములు కర్మసిద్ధాంతము నెఱుంగనివారికిం గల్గును. శ్రీరాముఁ డిపుడు లక్ష్మణునకుఁ గర్మసిద్ధాంతమునే యుపదేశించుచు న్నాఁడు. లక్ష్మణునకుఁ దండ్రియందు రోషము కలదు. ఏల ? పెండ్లముమాటలకుఁ గామాతురుఁ డౌట లోఁబడినవాఁడు కదాయని. కర్మగతుల నెఱింగినవాఁ డట్లూహింపఁడు. తన కర్మ మితరులఁ బ్రోత్సహించి తన్మూలమున నీఫలము తనకుఁ గల్గించెనని తలంచును. అప్పు డాతని కితరులయందు రోష ముండుట కవకాశము లేదు. రాముఁ డడవులపాలగుఁగదా యన్నశోకము సౌమిత్రికిఁ గలదు. కాని ధర్మసంస్థాపనార్థమై ప్రకృతిపూరుషు లవతరించిరన్నభావ మాతనికి లేదు. ఈరెండిం

టిని వదలుమా యని శ్రీరామమూర్తి తెలిపెను. చక్కని ధైర్యము కలుగవలయునన్నయెడల రోషశోకము లుండ రాదు. తదభావముననే ధైర్యము పాదుకొనును. అభిషేకము నిలిచి పోఁగా మీఁదు మిక్కిలి వనగమనముకూడఁ గలిగెనే యన్న యవమానము తొలఁగింపుమని తెల్పెను. దీని చేత నహంకార త్యాగ ముపదేశించెనని యెఱుంగవలయు. సత్యపాలనరూప మునఁ దండ్రిని గారవించితి మనునదియే హర్షము. భగవ త్స్వరూపమే సత్యము. దాని నారాధించుట యనఁగా భగ వంతుని సేవించుట. అది గలిగెనేని యంతకన్న హర్ష మెందుఁ గలదు. అట్టిహర్ష ముత్తమముగాన నయ్యది గలుగవలయును. ఈమాటలచే దేలినభావ మేమి?

"కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః,
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్." 37 (గీ. 3 అధ్యా.)

అన్న భగవదుక్తి ననుసరించి రోషాదుల వదలినఁగాని యానం దముకలుగదనియు నట్టియానందము గలిగినఁగాని నావెంట రాఁదగదనియు సారముకదా. నిరత్యయకార్యమునకుఁ బ్రయ త్నింపుమనఁగా నాశరహితకార్యమునకుఁ బూనుము. నాశ రహితకార్య మేది? ధర్మరక్షణము. దానికిఁ దగినట్లు ప్రయత్నిం పుము. నాయవతార మందులకే కావున నట్టికార్యమునకుఁ దగినవనగమనమునకుం బూనుమనియేగాక మఱేమి? ఈయుప దేశము చేత శ్రీరామచంద్రుని సర్వజ్ఞత్వము ప్రకటింపఁబడియె నని మన మెఱుంగవలయును.

"సౌమిత్రే యోఽభిషేకార్థే మమ సంభారసంభ్రమః,
అభిషేకనివృత్త్యర్థే సోఽస్తు సంభారసంభ్రమః." ౫

అని మూలము. దీనిభావమేమి? నాపట్టాభిషేకనిమిత్తము వస్తు సంగ్రహణమున నెంతయుత్సాహము నీకుఁ గలదో యభిషేక నివృత్తికొఱకు నది యగుఁగాక. అట్లే వనవాసోచితవస్తువుల సంగ్రహణమున నుత్సాహవంతుఁడవు కమ్ము. అనఁగా

"యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ,
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే." ౪౮
(గీత. ౨ అధ్యా.)

అన్నగీతావాక్యము ననుసరించి హర్షవిషాదములను సమముగా భావింపుమని భావము తేలెడిని. లాభాలాభములు జయాజయములు సుఖదుఃఖములు సమానములుగా భావించువా రెవ్వరో వారే భగవదనుగ్రహపాత్రులు. వారలే సంసారబంధవిముక్తులగుదురు.

"సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ,
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి." ౩౮
(గీత. ౨ అధ్యా.)

అన్నభగవదుక్తి పైదానిని దృఢముగాఁ జేయుచున్నది.

"యస్యా మదభిషేకార్థే మానసం పరితప్యతే,
మాతా మే సా యథా న స్యాత్సవిశంకా తథా కురు. ౬
తస్యాశ్శంకామయం దుఃఖం ముహూర్తమపి నోత్సహే,
మనసి ప్రతిసంజాతం సౌమిత్రే౽హముపేక్షితుం." ౭

అని మూలము. దీనిసారమేమనఁగా జగములకు మహోపకారము నామూలమునఁ జేయఁబూనినది కైక నాతల్లి. ఆమెకు సంశయము కలుగరాదు. అనఁగా నీపని సాగునో లేదో యన్న సందేహము కలుగరాదు. సాగుననియే యామె నమ్మవలయును.

అట్టిప్రయత్నము చేయమనఁగా వేవేగ వల్కలాజినములం గూర్పుము. నీమాటలకు బెలుపోయి నిరర్థకమగు నాసబూని నది నాతల్లి కౌసల్య. కావున మన యీసంభాషణము కైకకు మఱింత శంక కలుగఁజేయును. అట్టిశంక యామెకుం గల్గక యుండఁజేయమని శ్రీరాముఁ డుపదేశించెనని మనము గ్రహింప వలయును. దీనిచేత శ్రీరాముని సర్వసమత్వము తేటపడిరెుడిని.

## దైవమే బలవత్తరము.

"కృతాంతస్త్వేవ సౌమిత్రే ద్రష్టవ్యో మత్ప్రవాసనే,
రాజ్యస్య చ వితీర్ణస్య పునరేవ నివర్తనే. ౧౫
కైకేయ్యాః ప్రతిపత్తిర్హి కథం స్యాన్మమ పీడనే,
యది భావో న దైవోయం కృతాంతవిహితో భవేత్. ౧౬
జానాసి హి యథా సౌమ్య న మాతృషు మమాంతరం,
భూతపూర్వం విశేషో వా తస్యా మయి సుతేఽపి వా. ౧౭
సోఽభిషేకనివృత్త్యర్థైః ప్రవాసార్థైశ్చ దుర్వచైః,
ఉగ్రైర్వాక్యైరహం తస్యా నాన్యద్దైవాత్సమర్థయే." ౧౮

అని మూలము. శ్రీరామచంద్రుఁడు సౌమిత్రికి నుపదేశించు నెపమునఁ గర్మసిద్ధాంతతత్త్వమును మనకుఁ దెలుపుచున్నాఁడు. లక్ష్మణా! నన్నడవులకుఁ బంపుటకు లభింపనున్న రాజ్యము లభింపకయుండఁజేయుటకుఁ గైక కారణము కానేకాదు. దైవమే కారణము. నాయందుఁ బ్రీతిగలకైకకు నిట్టిభావము గలుగు నట్లు చేసినది దైవమే. కాకయున్న నింతలో నిట్టిమార్పామె మదిఁ గల్గ నేమికారణము? నాకుఁ దల్లులందఱియందు సమబుద్ధి గల్గియుండుట నీవే యెఱుంగుదువుకదా. ఆమెకు నాయందు

భరతునియందు సమానప్రీతి యుండుటయు నీవే యెఱుంగు దువు. అని రాముఁడు తెలిపెను. దీనిసారమేమి? కర్మము బల వత్తరము. దైవమన్న నదియే. దైవమునకన్న నెక్కుడు లేదు. మానవులభావములు విపరీతముగా మార్పునొందుచుండును. ఏల? కర్మము ఫలానుభవమునకుఁ దగినరీతిగాఁ బ్రాణులబుద్ధుల మార్చుచుండును. ఆకర్మపాశములు దృఢతమములు. వానిసం బంధము గల్గినతఱి నెవ్వఁడుకాని దప్పించుకొనఁజాలఁడు. కాని కర్మము తన్నిట్లు త్రిప్పుచున్నదనిమాత్ర మెవ్వఁడుగాని యాలోచింపఁడు. తనశక్తిచేఁ గార్యానుగుణముగాఁ దన ప్రవృత్తి యున్నదనియే యూహించును. కావుననే దైవము బలవత్తమము. దానికంటె బలమైనది లేదు. అనియే యీయుప దేశసారము.

"యద్యహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి. ౫౯
స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్." ౬౦

గీత. ౧౮ అధ్యా.

అను నీశ్రీకృష్ణపరమాత్మవాక్యములు పైరామచంద్రవాక్య సారమునే తెలుపుచున్నవి.

"కథం ప్రకృతిమాపన్నా రాజపుత్రీ తథాగుణా,
బ్రూయాత్సా ప్రాకృతేవ స్త్రీ మత్పీడాం భర్తృసన్నిధౌ. ౧౮
యదచింత్యం తు తద్దైవం భూతేష్వపి న హన్యతే,
వ్యక్తం మయి చ తస్యాం చ పతితో హి విపర్యయః." ౨౦

అని మూలము. దీనిసారమేమి? ఎట్టిసత్కులమునఁ బుట్టినను సకలసద్గుణములు కలిగినను దైవము వానినెల్ల మార్చివేయఁ గలదు. కర్మపాశబద్ధులు యుక్తాయుక్తములం బరికింపక కేవల విద్వాంసులైనను మూర్ఖులే యనఁబడుచు నసంగతముగా మాటలాడుదురు. సకలభూతములలో దేనియందైనను దైవము చేయుకార్యమున కడ్డముగలుగఁజాలదు. ఇది సత్యము. దృష్టాంతము క్రొత్తది చెప్పనక్కఱలేదు నాచేతికివచ్చినరాజ్యము తప్పిపోయినది. ఆమెకు నాయందుఁగలప్రీతి మాఱినది. నా స్థితియుఁ దలక్రిందులైనదికదా. ఇంకేమికావలయును? అనఁగా దైవముచేయుకార్యమునకుఁ బ్రతిహతిని గల్పించువా రెవ్వరు లేరు. దాని నెదుర్కొనఁజాలినదే లేదు. దానిగతి యిట్టిదని తెలిసికొనువారుకూడ లేరు. కావున గైక నాకపకారముచేసె నని యూహించుట తప్పు. ఎవ్వారి కీయూహ స్థిరపడునో వారిత రులను దూషింపరు. దైవము తమసంపద్విపత్తులకుఁ గారణమని తలంతురు. అనువిషయమునే మన మీభాగమునుండి నేర్చు కొనఁదగును.

"కశ్చిద్దైవేన సౌమిత్రే యోద్ధుముత్సహతే పుమాన్,
యస్య న గ్రహణం కించిత్కర్మణోఽన్యత్ర దృశ్యతే. ౨౧
సుఖదుఃఖే భయక్రోధౌ లాభాలాభౌ భవాభవౌ,
యచ్చ కించిత్తథాభూతం నను దైవస్య కర్మ తత్. ౨౨
ఋషయోఽప్యుగ్రతపసో దైవేనాభిప్రపీడితాః,
ఉత్సృజ్య నియమాంస్తీవ్రాన్ భ్రంశ్యంతే కామమన్యుభిః." ౨౩

అని మూలము. మఱియు శ్రీరామమూర్తి దైవము బలవంత మని లక్ష్మణునకుఁ దెలుపుచున్నాఁడు. దైవయత్నమును బురుష

కారముచే నాపఁగూడదా? దైవమున్నట్లు నమ్ముట యెట్లు? అని
లక్ష్మణునకు సందియముగలదేమో యని యూహించి తన్మూల
మున లోకుల కిట్టిసంశయములు గలుగకుండఁ జేయఁబూని యీ
యుపదేశము చేసెను. మానవులు చేయు కార్యముల ఫలముల
ననుసరించియే దైవమున్నదని తెలియవలయును. ఎట్లనఁగా
నెంతయో పట్టుదలతోఁ జేయు కార్యములకుఁ గొన్నింటికి
ఫలము కల్గదు. పట్టుదలలేక చేసిన కార్యములకు ఫలము మిక్కిలి
కల్గును. అట్లు కలుగఁ గారణమేమి? దైవము తప్ప దానికి వేఱు
కారణము చెప్ప వలనుపడదు. ఈయనుమానముచేత దైవ
మున్నదనియు నది మనకు లోఁబడదనియుఁ గనఁబడదనియుఁ
దెలియవలయును. కార్యఫలము తప్ప దైవము నెఱుంగుటకు
నింకొక్కసాధనమే లేదు. కార్యఫలమునకు ముందే తెలియఁ
దగినదైన నేదైనఁ బరిహారము చేయవచ్చును. అట్లుగాక ఫలా
నంతరము తెలియునుగానఁ బురుషప్రయత్నమున దాని నాపుట
కవకాశమే లేదు అట్టిదైవముతో నెవ్వఁడు పోరాడఁగలఁడు?
కావునఁ బురుషకారము దానిముందఱఁ బనికిరాదు. సుఖ
దుఃఖాది కారణము లెల్ల దైవకార్యములే. ఇట్లు చెప్పుటకు
దృష్టాంతమేమని ప్రశ్నించినచో సమాధానమేమనఁగా మహాను
భావులగు మునులు తీవ్రనియమముంబూని తపస్సు చేయుచుం
దురు. ఆతపస్సునకు విఘ్నములు గలుగును. వానికి లొంగి
తపస్సు మానుకొందురు. శాంతముఖములమాని తుదకుఁ గామ
క్రోధాదులకు లోఁబడుదురు. దానిచేఁ దమఋషిత్వమును
బోఁగొట్టుకొందురు. దీనింబట్టి యాలోచింపఁగా బురుషప్రయ
త్నము దైవము మ్రోల వ్యర్థమని తేలుచున్నది. ఈవిషయము
నెఱింగిన నహంకారము నశించును. ఆచోట శాంతము పాదు

కొనును. అయ్యది భగవత్సాక్షాత్కారమునకు హేతువగును.
కావున నీసిద్ధాంతమును జక్కఁగా నెఱుంగవలయును.

"అసంకల్పితమేవేహ యదకస్మాత్ప్రవర్తతే,
నివర్త్యారంభమారబ్ధం నను దైవస్య కర్మ తత్. ౨౪
ఏతయా తత్త్వయా బుద్ధ్యా సంస్తభ్యాత్మానమాత్మనా,
వ్యాహతేఽప్యభిషేకే మే పరితాపో న విద్యతే. ౨౫
తస్మాదపరితాపస్సన్ త్వమప్యనువిధాయ మాం,
ప్రతిసంహారయ క్షిప్రమాభిషేచనికీం క్రియాం." ౨౬

అని మూలము. దృష్టాంతము నొసంగి కర్మసిద్ధాంతమునే శ్రీ
రామమూర్తి మఱియు నుపదేశించుచున్నాఁడు. లోకమున
నొక్కఁ డొక కార్యము చేయ మొదలుపెట్టును. అది నిష్కా
రణముగా నిలిచిపోవును. తలంపనిపని యాకస్మికముగా నెఱ
వేఱును. అయ్యది దైవకార్యముగాక మఱెవ్వరిది? ఈవిష
యము సత్యము. ఈబుద్ధిచేత నెవ్వరిమనస్సును వారే యుద్వి
గ్నముగాకయుండ నిలుపుకొనవలయును. అట్లు చేసినఁ గష్ట
ములు కలిగినపుడు పరితాపము కలుగకయుండును. ఇంతకంటెఁ
గావలసినదేమి? అనఁగా గర్మసిద్ధాంతము మనస్సున నెవ్వారికిఁ
జక్కఁగా నాటునో వారికి సుఖదుఃఖములయందు సమత్వము
కుదురును. అది కల్గినవారు ఫలాభిసంధి లేనిసత్కర్మముల నాచ
రింతురు. వారు భగవత్కృపకుఁ బాత్రులగుదురు.

"కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన,
మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి. ౪౭
యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ,
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే. ౪౮

దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ,
బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః. ౪౯
బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే,
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలం.'' ౫౦
గీత. ౨ అధ్యా.

అను నీగీతావాక్యములయర్థసారము శ్రీ రామోపదేశనీతి సారముగాక మఱేమిటి?

''మా చ లక్ష్మణ సంతాపం కార్షీర్లక్ష్మ్యా విపర్యయే,
రాజ్యం వా వనవాసో వా వనవాసో మహోదయః.'' ౨౯

అని మూలము. ఇంతవఱకు సీతాదేవి యడవుల కరుగునని సౌమిత్రి యెఱుఁగఁడు. కావున నన్న యొంటిగా నడవులకుఁ జనుచున్నవాఁడని దుఃఖించుచున్నవాఁడని యెఱింగి యాపరితాపమును బోఁగొట్టుచుఁ దనప్రభావమును శ్రీరాముఁడు తెలుపుచున్నవాఁడు.

''లక్ష్మ్యాః విపర్యయే సంతాపం మాకార్షీః.''

అని యన్వయము. లక్ష్మణా! లక్ష్మీదేవి నన్ను వదలిపోవునని పరితపింపకుము. అనఁగా మాకిసుపురకు శాశ్వతానుబంధమని భావము. లక్ష్మీయుక్తుఁడ నగునాకు రాజ్యముగాని వనవాసము గాని సమానమే. ఐనను వనవాసమే మహాఫలదము. అని తెలిపెను. ఇందుఁగలవిశేషమేమి? శ్రీరామమూర్తి వనవాసమే మహాఫలప్రద మనియెను. ఈవాక్యరూపమున లోకులకుఁ దెలిపిన మహావిషయమేది? ఎవ్వరుగాని యొకమహాకార్యమును జేయఁబూనినయెడల నేకాంతస్థలమునఁ గూరుచుండి భగవద్ధ్యానము చేయవలయును. సామాన్యులకు నెన్నియో సంసర్గ

దోషము లుండును. నిస్సంగుఁడై యోగము నభ్యసింపవల యును. "యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ" అన్నది యిదియేకదా. అట్టు లేకాంతస్థలముననుండి యోగము నభ్యసించినవారియందు భగవత్కళ సంక్రమించును. అధిక తేజశ్శాలియై యతఁడు యత్నించినపని నెఱవేర్పఁగలఁడు. దైవ తేజస్సు సంక్రమించినఁగాని యదివఱకు గలతేజస్సు నిర్మలము కాదు. నిర్మలతేజస్సుండినఁగాని సత్కార్యముల నాచరింప నెట్టి వారును సమర్థులు కాఁజాలరు. ఆకారణముచేత వనవాసమనఁగా మానవబాహుళ్యముగానిచోటు. అను నీవిషయమునే మన మత్యంతశ్రద్ధతో నెఱుంగవలయును. వనవాసమే మహాఫలద మని శ్రీరామమూర్తి తెలుపుటం జేసి స్వావతారఫలమును దెలిపెనని మన మెఱుంగుట తెఱంగు.

ఇట్టు లీభాగము మనకుఁ గర్మసిద్ధాంతమును బోధించి "గహనా కర్మణో గతిః" అనువిషయమును సిద్ధాంతము చేయు చున్నది. దీనింబట్టి శ్రీరామచంద్రునియభిప్రాయము కర్మసిద్ధాంత మున నాస్తికలదియే యని యేర్పడుచున్నది. ఇఁక నధ్యాత్మ రామాయణ మీభాగమున ముందువ్రాసినట్లే వైరాగ్యమును దెలిపెను. దైవపౌరుషములవిషయము వాల్మీకిమహర్షికే వదలి నది. ఇఁకఁ దరువాతివృత్తాంతమును బఠింతము.

లక్ష్మణుఁడు పౌరుషమే దైవమునకంటె మిన్న యనుట.

* శ్రీరామమూర్తి పెక్కుచందములను జెప్పుచుండ సౌమిత్రి యాధర్మము తనకు సమ్మతముకానందున శిరస్సువంచి విని యన్నకుఁ గలధర్మపరాయణత్వమునకు సంతోషము, రాజ్య

---

* ఇయ్యది యిరువదిమూఁడవసర్గమునుండి కైకొనంబడినది.

భ్రంశమునకు దుఃఖము ననునీ రెండు మనస్సు నలంపఁగా, వాని యంతరమునఁబడి సుడివడుచుండెను. అంత నతఁడు దుఃఖమున రోష ముప్పొంగఁగాఁ గుటిలభ్రూకుటి యదరఁగాఁ బేటికాంతర్గతమహాసర్పమురీతి నిశ్వాసములు వెడలించెను. అత్తఱి నాతనిమోము భ్రూకుటిచే భయదమై చూడరాక క్రోధము నొందిన సింహవక్త్రమురీతిఁ గనంబడుచుండెను. మదగజము తన తొండము విదుల్చురీతి నాసౌమిత్రి ముంజేతిని నిర్భరకోపమున విదుల్చుచు నాత్మకంఠము నడ్డముగను గ్రిందుగను మీఁదుగను దేహమును దాఁకునట్లు త్రిప్పుచుఁ గ్రీఁగంటిచూపు లడ్డముగా వ్యాపింపఁజేయుచు నన్నుంగాంచి యిట్లు పలికెను. శ్రీరామచంద్రా! నీవు పితృవచనపరిపాలనరూపధర్మమునకు హానికలుగునని నాయట్లె లోకులు దాని నాచరింపరని తలంచి వనగమనమునకు నుద్యమించు టెంతమాత్రము తగదు. ఇదియు సమయము. దైవమునుగూడ మీఱఁజాలినమహాశూరుఁడ వగు నీవు దుర్బలమగుదైవమును బ్రబలతరముగా నిర్వచించితివి. దీనింబరికింపఁగా నీవు భ్రాంతినొందితివని తోఁచెడిని. భ్రాంతియే కాకయున్న నీయట్టివాఁ డిట్టులేల చెప్పును? దైవము దుర్బలులకుఁ బట్టుగొమ్మ. అయ్యది యొక్కరి నాశ్రయించి తనకోర్కి తీర్చుకొనును. కాన నది దీనమైనది. తానుగనే పని చేయుటకుఁ గాని, పురుషకారమును మీఱి పని చేయఁగాని శక్తికలది కాదు. అట్టిదాని నేమేమో పొగడితివే.

కైకయు దశరథుఁడును బాపాత్ములని నీకేల సందియము కలుగలేదో, పాపులమాట ననుసరింపమి నీకేధర్మహానియుఁ గలుగదు. ఎట్లు పాపాత్ములని వారినంటివందువేమో. లోకమునఁ బైకిమాత్రము ధర్మమును వ్యాజముగాఁ గనఁబఱచి

తన్మూలమునఁ దమరు చేయఁదగుదుష్కార్యములను సాధించు కొందురో, ధర్మము నాచరించునట్లు వేషమూని దానిచేతఁ దమదోషములఁ గనఁబడకయుండఁజేయువారో అట్టివారు పెక్కండ్రు గలరు. వారివలెనే యీతల్లిదండ్రులని నీవు పేర్కొన్నకైకేయీదశరథులు పట్టాభిషేకము నీకుఁ జేయునట్లు ధర్మమును నామమాత్ర మభినయించిరి. కాని వాస్తవమున రహస్యముగా నీకపకారము చేయువారే. కనుక మనకుఁ జేయఁబూనినయభిషేకమును నిలుపఁగోరి యందుల కనుగుణముగ నీదురాలోచనము చేసినారు. ఇది లోక మెఱుంగకయుండునా. శ్రీరామా! వారీదురాలోచనమును మున్నే చేసినారు. ఇది నిశ్చయము కాకపోయినయెడల నెంతకాలముక్రిందనో వరమిచ్చునట్లు చెప్పినరాజు దాని నింతదనుక నీయకుండఁ గారణమేమి? తొలికొడుకవగు నిన్నుమాని చిన్నవాని కభిషేకముచేయ నుపక్రమించుట యెల్లరు ద్వేషింపఁదగినపనికదా. అట్టిదుష్కార్యమును వారు చేయఁబూనిరే. దీని నోర్వఁజాలను. దీని నీవు మన్నింపవలయును.

తండ్రిమాట మీఱకుండుట గొప్పధర్మమంటివి. మతిమంతులలో నీవగ్రగణ్యుఁడవగు నీవేధర్మము ననుసరించి రాజ్యముపాలింపనుండిన బుద్ధి నడవులకుఁ బోవలయునని వేఱుగాఁ ద్రిప్పితివో, ఏధర్మము నాచరింపకున్న మహాపాపము గల్గునని మోహము చెందియున్నవాఁడవో తెలియకున్నాను. జనకవాక్యపాలనమన్న యాధర్మము నాకు సమ్మతముగాకున్నది. రవంతయే నిష్టపడకున్నది. నేను భ్రాంతి నొందితినా యని యడుగుదువా? పురుషకారముచేత బదులు చేయఁదగినవాఁడవు. తండ్రి కామినీమోహావాగురులకుఁ జిక్కి మహాధర్మము లోక

నిందితము నగునాజ్ఞ నీయఁగా, ధీరుఁడవగు నీవద్దానిని దిరస్క-
రింప శక్తిగలవాఁడవయ్యు దాని నాచరింపఁజూచెదవే ? ఏల ?
ఇట్టిది మోహమునొందినఁగాక చేయఁబూనుదువా ? వారు
కపటవరములఁ గల్పించి యీయుత్సవమునకు భంగముగల్పిం
చిరి. ఇది యిట్టిదని నీకేల తోఁచలేదు? దీనికే నాకు దుఃఖము
గలుగుచున్నది. కామపరతంత్రుఁడగు తండ్రిమాట యనుస
రింపఁదగునన్నధర్మముకూడ లోకనిందితమేకాని యాచరింపఁ
దగదు. కామోద్రేకమున నీకు నపకారముచేయఁగోరుచు
జననియని జనకుఁడని పేరుపెట్టుకొనియున్న యాశత్రువులు
వాంఛింపరానిది వాంఛింపఁగా దానిని ఫలింపఁజేయవలయునని
నీవు మనస్సునఁగూడఁ దలంపరాదు. వారల కీకార్యమున నిట్టి
బుద్ధిపుట్టుటకుఁ గారణము దైవమే అంతియకాని వారిస్వభావ
మునఁ గల్గినదికాదని నీవు తలంచుచున్నావుకదా. అయిన నీ
వీయాశయముగలవాఁడవుకారాదు. నాకుమాత్రము దైవము
ప్రమాణమనువాదము రుచింపదు. భయస్వభావుఁడు వీర్య
హీనుఁడు నగువాఁడే దైవమును నమ్మును. పరాక్రమశాలురు
దృఢమనస్కులు నగుధీరులు దైవము నాశ్రయింపరు. తమ
యంతనే కార్యములను సాధించుకొందురు. పురుషకారమున
దైవమును మించఁజాలుపురుషుఁ డెవ్వఁడును దైవమునే నమ్మి
స్వకార్యమును బోఁగొట్టుకొని విచారమునఁ గుందఁడు. ఇప్పుడే
లోకులు దైవపౌరుషములశక్తులను గన్నులార జూడఁగలరు.
దైవపురుషకారములలో నేది బలవత్తరమో వానిరెండింటికిం
గలతారతమ్య మెంతయో నేనిత్తఱినే యెల్లరనుఁ జక్కఁగాఁ
దెలియఁజేసెదను. పట్టాభిషేకవిఘ్నము గావించినదని నీ వేదైవ
మును నమ్మియున్నావో యాదైవమునే నాపౌరుషమున నడం-

పఁగా నందఱు చూచి తత్త్తత్త్వము నెఱుంగఁగలరు. అంకుశము లెక్కచేయక శృంఖలములఁ ద్రెంచుకొని మదమత్తతఁ గన్ను మిన్నుఁగానక యథేచ్ఛముగాఁ బరుగిడుగజమును దక్షుఁడగు మావటివాఁడు మరలించులాగున నెవరును మరల్పఁజాలరని నీవు పల్కినదైవమునే నాపౌరుషమున మరలించెదను. దిక్పాల కులు గుమిగూడివచ్చినను, త్రిలోకవాసు లొక్కటిగ వచ్చి నన్ను మాఱొడ్డినను, నేనిపుడు సాగింపఁబూనిన శ్రీరామాభి షేకమును నివారింపఁజాలరనుట నిక్కము. ముదుసలితండ్రి యింక నేమియుఁజేయఁజాలఁడని వేఱుగాఁ జెప్పవలయునా? శ్రీరామా! నీవిపుడు మహారాజవేయైతివి. రహస్యముగ నాలో చించి నీకరణ్యగమనము నీకుఁ గల్గించినయాపాపాత్ములు నీకుఁ గల్పించినపదునాలుగేండ్లు తమరే యడవుల నుండఁజేసెద. మఱియు నీపట్టాభిషేకమును భంగపఱచి కొడుకునకు రాజ్యము నిప్పింప నవ్వ్రతుక కోరెనో యామెకుఁ దండ్రికిని మనస్సులఁ గల మహాశను దూలించెదను.

దైవబలముగలతండ్రిని నీపురుషకార మేమిచేయఁగల దందువేమో వినుము. అన్నా! నాపౌరుషము నెదుట దైవము నిలువఁజాలదని నమ్ముము. తండ్రికిఁగాని నాతోఁ బగఁగొన్న మఱెవ్వరికిఁగాని నాపౌరుషము దుగఖము కలిగించును. కాని దైవము సుఖము కల్గింపఁజాలదు. నాపౌరుషమునకు నెవ్వఁడు చిక్కునో వానిని విడిపింప దైవమునకు శక్తిచాలదు. ధర్మ మూని నీవు ప్రజలఁబాలించి రాజ్యసుఖము లనుభవించుచు సహస్రవర్షములు సాగింపఁగా నవ్వల నీవు వానప్రస్థాశ్రమము వూని వనములకుఁ బోవఁగా నీపుత్త్రులు రాజ్యపాలనముచేయు దురు. అంతియగాని భరతుఁడు పాలింపఁజాలఁడు. శక్తిమం

తుఁడై రాజ్యమును బాలించి కొడుకులకు దాని నిచ్చి ప్రజ
లను గన్నబిడ్డలభంగిఁ గాపాడ నియమించి పూర్వపురాజర్షు
లనుష్ఠించినరీతి వనవాసము నడపఁబోవలయునని శాస్త్రము
విధించుఁగదా. ధర్మనిరతా! శ్రీరామభద్రా! రాజచిత్తము
చంచలమయ్యెను. ఇపుడు సాహసమూని రాజ్యము స్వాధీనము
చేసికొన్నయెడల నెన్నియో కలహములు (భేదములు) కలు
గును. వానిని సరిచేయుట శ్రమము. అని యనుమానించి
రాజ్యమువలదందువా. ఆవిషయము నాకుం దెల్పుము. రాఘవా!
నీవో మహావీరుఁడవు. నేను నీకు బాసటనై నిలిచెద. సము
ద్రము నేలాగు వేల నిలుపునో యట్లే రాజ్యమున నేకలహ
ములు లేకయుండఁ గాపాడెదను. ఈచెప్పినచందమున నేను
జేయకున్న వీరలోకమునకుఁ దప్పినవాఁడనగుదును. ఇదియే
నాశపథము. నీవిపుడు వసిష్ఠాదులంగూడి మంగళవస్తువులం
గూడినపానజలములఁ బట్టాభిషేకము చేసికొమ్ము. ఆలసింపక
యీపనికిం బూనుము. రాజు లెవ్వరుగాని నీమీఁదికివచ్చిన
యెడల వారల నోడింప నేఁజాలుదును. నాయీకరములు రెండు
నీదేహమున కలంకారార్థ ముండునవికావు. ధనుస్సును గరము
లకు భూషణముగా నేఁ బట్టుకొనలేదు. ఈనిశితకృపాణము
వీరభూషణముగా వ్యర్థముగ మధ్యభాగమున వ్రేలాడఁగట్టు
కొన్నదికాదు. ఈబాణములన్నియు నెదుటనున్న వారిని స్తం
భింపఁజేయ నుండునవికావు ఈయాయుధచతుష్కము దక్కం
గలసాధనములు శత్రుసంతతి నడంపనున్నవేకాని యింకొక్క
పనికిఁగావు. నామ్రోలఁ బగవాఁ డెవ్వఁడు నిలుచునో వాఁడు
సప్రాణుఁడై యుండ నేను సహింపఁజాలను. శత్రువు దేవరాజుగా
నిమ్ము. నిశాతఖడ్గమున కాహుతిచేయకమానను. నాయీఖడ్గ

ప్రహారములచేత గజాశ్వపదాతులయవయవములు శకలములు కాఁగా నవి భూమిపై నిండియుండఁగా నయ్యది సాంద్రారణ్యముభంగి యడుగుపెట్ట సందులేక యుండఁగలదు. శ్రీ రాఘవా! చూడుము. ఇత్తటినే యీఖడ్గధారాఘాతములకు గుఱియై దానినుండి వెడలుమిఱుఁగుఱులతోఁ గూడినవియగుచు శత్రుదంతావళములు మండిపోవుకొండలవలెను, విద్యుల్లతాన్వితములగు మేఘములరీతిని గనఁబడుచు నేలఁ గూలఁగలవు. గోధాంగుళిత్రాణము (ఉడుముతోలుతిత్తిని) వ్రేళ్లకుందొడుగుకొని చాపము ధరించి యెదుర్కొని నిలువఁగా నేపురుషుఁడు నన్ను మార్కొనఁగలఁడు? ఎల్లశూరులు స్త్రీలవలెఁ బాఱిపోవఁగలరు. పెక్కండ్రు మార్కొన్న నీవొక్కఁడవే పోరాడఁగలవా. అందువేమో. వినుము బలశాలి నొక్కని ననేకబాణములను ఒక్కబాణమునఁ బెక్కండ్ర నెగురఁగొట్టుచుఁ జతురంగబలముల మర్మములునాట బాణములఁ బ్రయోగింతును. జగదీశా! నాయస్త్రప్రభావము రాజును బ్రభుత్వహీనునిగాఁ జేయుటకు, నీకుఁ బ్రభుత్వము నిచ్చుటకుఁ జాలును. అన్నా! చందనచర్చలకును, కేయూరధారణమునకును, ధనములు దానముచేయుటకును, మిత్రులఁ బాలించుటకు నా యీబాహువులు సమర్థములు. ఐన నట్టిబాహువు లిపుడు వానినెల్ల మాని నీయభిషేకభంగము గావించినవారినెల్లఁ దూలించు కార్యము నకుఁ బూనఁగలదు. నీశత్రుఁ డెవ్వఁడో తెల్పుము. ఇపుడే వాని జముప్రోలి కనిపెద. వానికీర్తి మాయించెద. వాని మిత్రులం బాఱఁదోలెద. రాజ్యమంతయు నీయధీనమున నుండఁ జేసెద. నాకు నుత్తరువిమ్ము. దానికై వేచియున్నవాఁడను. నీ కింకరుఁడనేకాని యన్యుఁడఁగాను. కరుణచే సెలవిమ్ము.

అని యనేకభంగులఁ బ్రార్థింపఁగా రఘుకులాలంకార భూతుఁడు శ్రీరామచంద్రుఁడు సౌమిత్రి వచించినదంతయు నాలకించి కన్నీరు వదలి యదియెల్లఁ దనకు సమ్మతము గాక యుండుటం జేసి కన్నీటిధారలు వెడలఁగాఁ దుడుచుకొని పెక్కురీతుల శీతలమృదూక్తుల నాతని నాశ్వాసించి యాతనిం జక్కఁ బరికించి ప్రియసోదరా! నీవు సర్వదా మృదుహృద యుఁడవు. ఇపు డిట్లేల కోపమునొందితివి? పితృవాక్యమునందే స్థిరముగా నిలువఁబడువాఁడనుగాని యించుకంతయు మీఱు వాఁడను గానుజుమీ. ఇది మది నెఱుంగుము. పరమధర్మ మనఁగా నిదియేసుమీ యనియెను.

మహాశయులారా! వాల్మీకిమహర్షి లక్ష్మణునిమూలమునఁ గుమతులగువారలభావమును దెలిపెను. అనఁగా దైవము ప్రధానము కాదనువారలయభిప్రాయములఁ దెలిపెనని మన మెఱుంగఁదగు. లక్ష్మణుఁ డంత| యవివేకి కాఁడు. శ్రీరాముని యుపదేశముకూడఁ బడసినవాఁడు. అట్టి బుద్ధిమంతుఁడు ప్రత్యక్ష ప్రమాణవాదుల యభిప్రాయములఁ దెలుపఁడు. ఈరామాయణమూలమున మహర్షి పూర్వపక్షసిద్ధాంతరూప ముగా లోకులకు సన్మార్గముం దెలుపఁబూనెను. కావున నీవాద మునకుఁ జోటుదొరకినందున సౌమిత్రిమూలమునఁ బూర్వపక్ష మును దెలిపెను. శ్రీరామచంద్రునిమూలమున ముందు సిద్ధాంత మును బోధించును. ఈసర్గమున లక్ష్మణుఁడు దైవమే లేదన్నంత దృఢమగు పూర్వపక్షము చేసెను. ఇదియు నొక్కతరుణమున సిద్ధాంతతుల్యమగును. అనఁగా రాజధర్మములయం దిట్టివి చెల్లఁదగినవే. న్యాయమార్గమును మీఱినచో నెవ్వనిమీ

టయు వినరాదన్నదియు నీతియే. ఆనీతి యెల్లెడల నుపయో
గింపరాదు.

"యథా హ్యైవమశౌండీరం శౌండీరః క్షత్రియర్షభ,
కిం నామ కృపణం దైవ మశక్తమభిశంససి. ౭
యద్యపి ప్రతిపత్తిస్తే దైవీ చాపి తయోర్మతం. ౧౫
తథాప్యుపేక్షణీయం తే న మే తదపి రోచతే,
విక్లబో వీర్యహీనో యస్స దైవమనువర్తతే. ౧౬
వీరాస్సంభావితాత్మానో న దైవం పర్యుపాసతే,
దైవం పురుషకారేణ యస్సమర్థః ప్రబాధితుం. ౧౭
న దైవేన విపన్నార్థః పురుషస్సోఽవసీదతి,
ద్రక్ష్యంతి త్వద్య దైవస్య పౌరుషం పురుషస్య చ. ౧౮
దైవమానుషయోరద్య వ్యక్తావ్యక్తిర్భవిష్యతి,
అద్య మత్పౌరుషహతం దైవం ద్రక్ష్యంతి వై జనాః. ౧౯
యద్దైవాదాహతం తేఽద్య దృష్టం రాజ్యాభిషేచనం,
అత్యంకుశమివోద్దామం గజం మదబలోద్ధతం. ౨౦
ప్రధావితమహం దైవం పౌరుషేణ నివర్తయే. ౨౦½
మద్బలేన విరుద్ధాయ న స్యాద్దైవబలం తథా,
ప్రభవిష్యతి దుఃఖాయ యథోగ్రం పౌరుషం మమ." ౨౪

అను నీసౌమిత్రివాక్యములు పురుషకారమే బలవత్తరమని దైవము దుర్బలమని తేటపఱచుచున్నవి. ఇవి యుక్తియుక్తములు కావనరాదు. వీనివలన నేయుపకారము లేదనియుఁ జెప్ప రాదు. పురుషకారము దుర్బలమనువాదము జ్ఞానులకే యుపకరించును. పామరులకుఁ బౌరుషము దైవము సమానమనువిష

యమే యవసరము. లేకున్న సోమరులగుట కవకాశ మేర్ప డును.

"దైవం నిహత్య కురు పౌరుషమాత్మశక్త్యా
యత్నే కృతే యది న సిద్ధ్యతి కోఽత్ర దోషః."

అన్నసూక్తి యందు తెలియఁగుదురుకదా.

దైవపౌరుషములు సమానములని శ్రీమహాభారతము చాటుచున్నది. ఈసౌమిత్రిమాటలమూలమున వాల్మీకి మనకుఁ దెలిపిన యీభాగమునుండి తేలినసార మేమనఁగా పురుష ప్రయత్నము చేయఁదగినది. దాని ఫలము గలదని నమ్మియే చేయవలయును. లేకయున్న నుత్సాహము నశించును. ఇది పామరులకు ననుకూలమగుమార్గము. పురుషకారము చేయుచు ఫలసిద్ధి దైవాధీనమని నమ్మవలయును. ఇది మధ్యముల కను కూలమగుమార్గము. ధర్మమనియే పురుషయత్నము చేయ వలయు. దైవము బలవత్తమమని పురుషకారము దుర్బలతమ మని నమ్మవలయును. సిద్ధ్యసిద్ధులయందు సమభావముగలవారుగ నుండవలయును. ఇది జ్ఞానులకు ననుకూలమగుమార్గము. ఈమూఁడుమార్గములు లోకమున కుపకారమును గల్గించు నవియే కాని యపకారమును గల్గింపవు. ఇన్నిత్రోవ లేల? అన్న ప్రశ్నమునకు నుత్తర మాలకింపుఁడు. కర్మము బహువిధముల వ్యాపించియున్నది. ఉత్తమ మధ్యమాధమ ఫలప్రదములగు కర్మముల నాచరించినవారు లోకమునఁ గలరు. వారల కందఱకు నొక్కమార్గ మనుకూలము కాదు. బహుమార్గముల వారు ప్రవర్తింతురు. ఏమార్గమున వర్తించినను దుదకు గమ్యస్థాన మొక్కటియే. వారివారికర్మముల కనురూపముగా నాయా

మార్గముల వారువారు ప్రవర్తింతురు. దైవము లేదని పురుష యత్నమే ఫలప్రదమని కొందఱునమ్ముదు రనుకొందము. ఒక్క కార్యార్థము గట్టిప్రయత్నము చేయుదురు. అది ఫలింపక పోవును. అల్పప్రయత్నము చేసినది ఫలించును. కొన్నిసారు లిట్లు చేయఁగాఁ జేయఁగా యత్నములు ఫలింపకపోవుచుండఁ గాఁ దుదకు దైవము ప్రబలమని పురుషకారము దాని ప్రోల వచింపరానియంత తుచ్ఛమని వారు నమ్ముదురు. అప్పుడు వారు జ్ఞానులలోఁ జేరుదురు. మొదటనుండి పురుషకారము నిరర్థక మన్నభావము గలిగినచో వారెల్ల నలసులగుదురు. కనుక నీభావముకూడ మంచిదే యనవలయును. కొందఱ కీమార్గము మేలు కలిగించును. ఈవిషయమునే యీభాగమునుండి తేలిన సారముగా నంగీకరింపవలయును.

"కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః,
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః." ౧౭. గీ. ౪ అ.

అన్న భగవద్వాక్యము నీవిషయము సిద్ధాంతము చేయుచున్నది. లోకమున ననేకవిధములగు కర్మములు వెలయుట కిదియే కారణము.

"అద్య మేఽ సత్ప్రభావస్య ప్రభావః ప్రభవిష్యతి,
రాజ్ఞశ్చాప్రభుతాం కర్తుం ప్రభుత్వం తవ చ ప్రభో." ౩౭

అని మూలము. సౌమిత్రి తనప్రతాపమును బొగడుకొనెను.

"యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే,
హత్వాపి స ఇమాఁల్లోకా న్నహంతి న నిబధ్యతే." ౧౭. గీ. ౧౮ అ.

అను నీగీతావాక్యమునకు సౌమిత్రిభావము కేవల విరుద్ధము. కావుననే శ్రీరామచంద్రుఁడు కన్నీరువదలెనని ముందు తెలియ

గలదు. సౌమిత్రి యిన్నిదినములుగా సేవచేయుచు నహంకార మును వదలలేదే యన్నవిచారమే రామమూర్తి కన్నీరువదలు నట్లు లోనరించెను. ఎవ రహంకారముగలిగి భగవంతుని ద్వేషింతురో వారిని నరకమునఁ బడవేయుదుననియే భగ వంతుని ప్రతిన.

"అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః,
మామాత్మపరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః. ౧౮
తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్,
క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు. ౧౯
త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః,
కామః క్రోధస్తథాలోభ స్తస్మాదేతత్త్రయం త్యజేత్. ౨౧
ఏతైర్విముక్తః కౌంతేయ తమోద్వారైస్త్రిభిర్నరః,
ఆచరత్యాత్మన శ్రేయస్తతో యాతి పరాంగతిం." భ. గీ. ౧౬. అధ్యా.

అను నీగీతావాక్యములు భగవంతు నాశయమును దెలుపు చున్నవి. లక్ష్మణుఁడు శ్రీరాముని ద్వేషింపలేదు. దశరథాదులు ద్వేషించిరనియు వారిని నివారించి శ్రీరామమూర్తికి మేలుచే యూర్పవలయుననియు లక్ష్మణునిభావము. కావున నట్టిసోదరునిం గాంచి భగవంతుఁడు వాత్సల్యబలమున మనస్సు మృదుతమము కాఁగాఁ గన్నీరువదలెననియే యిందుఁగలతాత్పర్యము. ఎవ్వారు నిరహంకారులో కామక్రోధలోభదూరులో వారినే భగ వంతుఁడు మిగులఁ బ్రేమించునని మన మెఱుంగవలయును. భగవంతుఁడు కరుణాస్వరూపుఁడైనను క్రోధయుక్తునిగాఁ జేయునవి కామక్రోధాదులే. కాన భక్తుఁడు వానిని వదల వలయును. అపుడే నిర్మలుఁడగును. వేషభాషలచేత భగవంతుని

మెప్పింపఁ దరము కాదు. భూతదయాది సద్గుణముల చేతనే మెప్పింపవలయుననియు మనము తెలిసికొనవలయును. ఇంత దనుక సౌమిత్రి మాటలు వినరానివియే. కాని కడపట

"యథా తవేయం వసుధా వశేధ వేత్తథైవ మాం శాధి తవాస్మి కింకరః." ౪౦.

అని తనభావమును దేటపఱచెను. ఈయహంకారమంతయుఁ దనకు మేలు చేయఁగోరి సౌమిత్రి వహించెనని భగవంతుఁడు గ్రహించెను. కావుననే యీఘట్టమున

"విమృజ్య బాష్పం పరిసాంత్వ్య చాసకృత్స లక్ష్మణం రాఘవవంశవర్ధనః,
ఉవాచ పిత్ర్యే వచనే వ్యవస్థితం నిబోధ మామేష హి సౌమ్య సత్పథః."

అని మహర్షి వాల్మీకి వచించెను. పాదసేవకుఁ డగు లక్ష్మణుఁడు తనకొఱ కింతటి దారుణకార్యము చేయ సాహసించెఁగదా యన్నయాదరము, నాయవతారతత్త్వ మెఱుంగక యిట్లు వదరుచున్నాఁడే యన్న విచారము, ధర్మము బోధించిన నందలి సార మెఱుంగలేదే యన్న పరితాపము ననునీమూఁడును శ్రీ రామునిచిత్తము శోకాధీనముగా నొనర్చెను. భక్తుల నుద్ధరించుటయే పరమేశ్వరుని కార్యము. కావునఁ జెక్కు సారు లాసోదరు నాశ్వాసించెను. కన్నీటిని దుడుచుకొనియెను. ఈచోట మహాకవి "రాఘవవంశవర్ధనః" అన్న వాక్యమును బ్రయోగించి తనయాదికవి ప్రఖ్యాతిని నిలువుకొనియెను. సౌమిత్రి పితృదూషకుఁడని యాగ్రహించినఁ గార్యము చెడును. తా నవతరించినది రఘువంశమును వృద్ధినొందించుటకే కదా. కానఁ గోపమున కవకాశమే లేదు. కరుణచూపుట కనేకమార్గములు కలవు. మహోపన్యాస మేల యని ముందొక్కమాట యనెను. "తండ్రి మాట మీఱనని నన్నెఱుంగుము" అనునదియే యావాక్యము.

దీనియందెంతయో యర్థమిమిడియున్నది. ఇదియే భగవంతుఁడు చేయుపరీక్షను దెలుపును. ఎట్లనఁగా ధర్మసూక్ష్మమనునది తల్లి మాటకంటెఁ దండ్రిమాట యెక్కుడనువిషయము. పితృవాక్య వ్యాజమున నరణ్యములకుఁ బోవనే యవతరించితిని. దానిని మాన నయితిగాదు. మానిన నాయవతారఫలము లోకములకుఁ గల్గదు. పితృవాక్యపాలనమే సన్మార్గము. దానిని మించఁజాలినది లేదు. ఈయుపదేశమున ధర్మాచరణము ప్రధానమనియు, దాని నాచరించి లోకులకుఁ గనఁబఱచి వారిచే నాచరింపఁజేయుటకే యవతరించితిననియు, నీవట్టి నాపూనిక నెఱుంగవనియు సారము. ఈయుపదేశమే లోపలఁ దమ్మునకుఁ దెలిపినసద్ధర్మ సారమని మన మెఱుంగవలయును. ఇట్టు లీభాగము శ్రీరామ లక్ష్మణులసంవాదమూలమున మన కనేకవిషయములఁ దెలుపు చున్నది. ఇప్పట్టున నధ్యాత్మరామాయణమునుండి తెల్పఁదగిన విశేషములు లేవు. ఇఁకఁ దరువాతి శ్రీరామచంద్రచరిత్రముం బఠింతము.

## వనవాసమునకుఁ గౌసల్య సమ్మతించుట.

*అంతఁ గౌసల్య తనకుమారుఁడు పితృవాక్యపాలనాద రుఁడని నిశ్చయించి యశ్రుజలములచే గద్గదకంఠయగుచు ధర్మయుక్తముగా నిట్లు పలికెను. ఇంతదనుక రాముఁడు దుఃఖ వార్త నెఱుఁగఁడు. ధర్మాత్ముఁడు. ప్రియహితభాషణుఁడు. చక్రవర్తికుమారుఁడు. ఇట్టిరామమూర్తి విధిదుర్విపాకమున భూమిమీఁద రాలినగింజల నేఱ్ఱుక్కుదాని నేఱితిని యెట్లు

* ఇయ్యది యిరువదినాల్గవసర్గమునఁ గలదు. అధ్యాత్మరామాయణ విషయముకూడ నిందుండును.

జీవింపఁగలఁడు? రామునికింకురులే మృష్టాన్నమును దిందురు గదా. అట్టిప్రభువగు రాముఁ డడవుల మూలఫలముల నెట్లు భక్షించి యెట్లుండును? గుణవంతుఁడు కోమలాంగుఁడు నగు కుమారు నడవులకు రాజు పంపుచున్నవాఁ డనువార్త విన్న వారుకూడ నమ్ముదురా? నమ్మఁదగనిమాటకదా యది. ఎవరైన నమ్ముదురేని రా జిట్టికుమారునే యడవులకుం బంపుచున్న వాఁడే మనల నిక్లే కానలకుఁ బంపకుండునా యని యతని యెడ భయముకలిగియుందురు.

రామచంద్రా! దిక్పాలకామోదకరుఁడవయ్యు విధివశమునఁ గానకుఁబోవనున్నావుకదా. దీనింబట్టి పరికింపఁగా నెట్టి వారికైన నీలోకమున సకలవిధసుఖదుఃఖములఁ గల్గించునది దైవమేయని యేర్పడును. మఱియు నయ్యది ప్రబలమనియుఁ దేటపడుచున్నది. కుమారా! నీయెడఁబాటుచే నా దేహమున శోకానల ముప్పతిల్లును. దాని నెసఁగొల్పుగాలి నీయదర్శనమే. నిన్ను స్మరించి స్మరించి పలవించుట యనునడయే దారువులు. నాదుఃఖాశ్రుజలమే యాయగ్నియందు హోమముచేయునాహుతి. నిన్నుఁజూడని విచారముచే మనస్సున నుడుకువేఁడి యావిరిపొగ. నిట్టూర్పులు దానిని బెంపొందింప నాచేయు పురుషకారము. ఇట్లుండు నీశోకాగ్ని నాతనువున జనించి శిశిరర్తువునందు హిమముచేఁ దడిసినపాదను దావానలము వరుసగా వాడునట్లుచేసి యుదకమురీతిఁ జల్లార్పు నిన్ను వదలి యొంటిగా నిందున్న నన్ను శుష్కింపఁజేసి కాల్పఁజాలును. గోవు తనదూడ వెంటపోవక యెట్లుండును? అట్లే నేనుగూడ నిన్నుఁ గూడి వచ్చెదను.

అని తల్లి పలుకఁగా నాలకించి పురుషోత్తముఁడు మిక్కిలి పరితపించు నాకౌసల్యం గాంచి యిట్లు పలికెను. తల్లీ! దశరథుఁడు మొదటనే కైకచే వంచితుఁడయ్యెను. నేనడవికిఁబోవుచున్నాఁడను. నీవుకూడ నాతోడవచ్చినఁ దండ్రి జీవింపఁడనుట నిక్కము. స్త్రీలకు భర్తను విడుచుట యత్యంతక్రూరకార్యము కదా. నీవంటిపూజ్యురా లట్టిక్రూరంపుఁబని చేయఁదగదు. చేయఁదలంపరాదు. నాజనకుఁ డెంతదనుక జీవించియుండునో యంతదనుక నీవు శుశ్రూష చేయుచుండుము. అదియే పురంధ్రులకు శాశ్వతధర్మము. అని శ్రీరాముఁడు తెలుపఁగా నాకౌసల్య బుద్ధిచమత్కృతిగల యన్నుమిన్నగాన నామాటల కెంతయో సంతోషించి దుఃఖమును దొలఁగంద్రోచుకుమారరత్నమును బరికించి వత్సా! నీవు చెప్పినట్లే చేయుదుననియె. ధర్మాత్మురాలగుతల్లి యిట్లు పలుక నాలకించి వగచుచున్నయామెం గని అమ్మా! నేనొక్కఁడనే కాదు. మనమిరువురము తల్లియానతి నాచరింపవలయును. అతఁడు మన కధిపతి, రక్షకుఁడు, ఆచార్యుఁడు, నియామకుఁడు, ప్రభువు కనుక, మన కెల్ల నాతనియాజ్ఞ శిరోధార్యము. నే నడవులలో నైదుతొమ్మిదివత్సరములు మాత్రము సుఖముగాఁ గడపి తరువాత మహాసంతోషమున నీయాజ్ఞరీతి మెలంగుదును. అని రాముఁడు పలుకఁగా విని పుత్త్రవాత్సల్య ముప్పొంగుచుండఁ గన్నులనుండి యశ్రుజలములు స్రవింపఁగాఁ గడుంగడు వగచుచుఁ బ్రియపుత్త్రునిం గని యిట్లు పలికెను.

కుమారా! నన్ను ద్వేషించు నీసపత్నులచెంతనుండుట న్యాయము కాదు. నీవు పితృశాసనమురీతి నడవుల కరుగనెంచితివేని వనహరిణింబోలె నన్ను నడవికిం గొనిపొమ్ము. అని పలికి

మాటరాక దుఃఖించుచున్న తల్లింగాంచి రాముఁడుకూడదుఃఖించుచు నిట్లుపలికెను. తల్లీ! స్త్రీలకు బ్రతికియుండుదనుక భర్తయే దైవము, ప్రభువు కనుక, నాకెట్లో నీకు నట్లే రాజు నియమించువాఁడు. లోకమునకెల్ల నాథుఁడై యుండ మనకుమాత్రము గాకపోవునా? అట్టి ప్రభువుండఁగా మన మనాథులమగుదుమా? మనకు భయ మెట్లుకలుగును? సపత్నులవలన భయము కలుగు నంటివే. వినుము. ప్రభువుగానున్న భరతుఁడు ధర్మాత్ముఁడు. ప్రియభాషణుఁడు. తల్లివగు నీకతఁ డప్రియము చేయునా? తల్లిమాట చేఁ జేయునని యనుమానింతువేమో. భరతుఁడు ధర్మైకనిరతుఁడు. కనుక నెవ్వ రేమేమి చెప్పిన వినఁడు. నిన్ననుసరించి సేవించుచుండును. నేనడవులకరుగ నీవేమియుఁ బ్రమాదంపడక పుత్త్రదుఃఖమున రాజు కుందకయుండ నాశ్వాసింపవలయును. సేవలు చేయవలయు. నిరంతరవ్రతోపవాసనిరతలైనను స్త్రీమాత్రముత్తమరాలనుఖ్యాతిగాంచినను భర్తననుసరించియుండకపోయిన యామె పాపాత్మురాలే యగును. ఆర్యులకు నమస్కరింపక దేవతల నర్చింపకయున్న స్త్రీయును భర్తకు సేవచేయుచునుండిన నుత్తమురాలనఁబడి స్వర్గసుఖములంగాంచును. వనితమాత్రము నిరంతరము పతిప్రియకార్యనిరతయై శుశ్రూష చేయుచుండవలయును. ఈధర్మము పూర్వమునుండి శిష్టాచారమువలన నెల్లరకుఁ దెలియుచున్నది. వేద మిట్లే తెలియఁజేసెడిని. వేదార్థమునే స్మృతులుకూడ నుపదేశించుచున్నవి. అమ్మా! నేను క్షేమముగా మరలివచ్చుటకొఱకు శాంతికపౌష్టికాదిహోమములు చేయించి దేవతలఁ బూజింపవలయును. నియతవ్రతులగు బ్రాహ్మణుల నర్చింపవలయును. ఇట్లొనరించిన నావచ్చునంతదనుక నీకుఁ జక్కఁగాఁ గాలము గడ

చును. సుఖముగా నగరమునకు నేను రావలయునని మదిం గోరుచు స్నానాదినియమము నాశ్రయించి నిషిద్ధవస్తుత్యాగ ముచేసి సాత్వికము వంశోచితమునగు నాహారమును గ్రహిం చుచు నారాక కెదురుచూచుచుండుము. నేవచ్చినపిదప రాజు సప్రాణుఁడై యుండెనేని నీవాంఛితమెల్లఁ బడయఁజాలుదును.

అని శ్రీరామచంద్రుఁడు చెప్పఁగా విని కౌసల్య వగచుచు గన్నీరు మోమునఁ బ్రవహింపఁగాఁ గొడుకుతో నిట్లు పలికెను. శూరాగ్రణీ! వత్సా! వనగమనమున శ్రద్ధగలవాఁడవైతివి. మరలింపఁజాలను. కాలమహాత్త్వమిది యనవలయును. కాలమునుమీఱఁ దరముగాదనుట నిక్కము. స్థిరబుద్ధిగలవాఁ డవై వనముల కరుగుము. నీవు ప్రభుడవు. నీకు నిరంతరము మంగళములే కలుగుచుండును. మరల నీవు రాఁగా నాకష్టములు తీఱును. సుఖము గల్గును. పితృవాక్యము చెల్లించి ధన్యుఁడవై పితౄణము దీర్చుకొని వనమునుండి రాఁగానే యత్యంతసౌఖ్య మొందుదును. రఘువంశోద్ధారకా! భూలోకమున దైవగతి యిట్టిదని యూహింప శక్యమేకాదు. అది యట్టిది కావుననే మాతృవాక్యముంగూడఁ బాటింపక వనముల కరుగవలయునని నిన్నుఁ బ్రోత్సహించినది. కుమారా! మహాబాహుఁడవగు నిన్నె వ్వరును మార్కొనఁజాలరు. కాననిపుడు ప్రయాణము చేయుము. కుశలముగా నిచ్చటికివచ్చి మంచిమాటల నాకు సంతోషమును జేకూర్పఁగలవు. పదునాలుగు వత్సరములు గడుపఁగా జటావ ల్కలముల ధరించి నీవు రాఁగా నిన్నుఁ జూచునదృష్టము నాకి పుడే కలుగునాయని వగచెను. తనకుమారుఁడు తండ్రివచనము ననుసరించి యడవుల నుండఁబోవుచున్నాఁడని యెఱింగి కౌసల్య.

బడియున్న పండ్లు వెదురుపొదలక్రింద రాలినధాన్యము మొదల గునవి అని యర్థము చేయవలెను. పట్టభద్రుఁడట్టి నీచవృత్తి జీవింపవలసివచ్చెఁగదా యనియే కౌసల్య యాశయము. రాముని సేవకులు మృష్టాన్నమును భుజింతురుగదా. అట్టినాథుఁడు వనముల మూలఫలముల నెట్లు భుజించునని కౌసల్య వగచెను. ఇపుడు కౌసల్యను మహామాయ యావరించినది. కాని భగవద్దర్శనమహాఫల మూరకపోలేదు. ఆమాటలసందడిలో నాథుఁడు అను లోనగుపదములు దొరలెను. భగవంతునకు నెల్లపదార్థములు ప్రియములేకదా యనుభావ మామెకుఁ బోడకట్ట దయ్యెను.

"కైకేయ్యా వంచితో రాజా మయి చారణ్యమాశ్రితే,
భవత్యా చ పరిత్యక్తో న నూనం వర్తయిష్యతి. ౧౧
భర్తుః కిల పరిత్యాగో నృశంసః కేవలం స్త్రియాః,
స భవత్యా న కర్తవ్యో మనసాపి విగర్హితః. ౧౨
యావజ్జీవతి కాకుత్స్థః పితా మే జగతీపతిః,
శుశ్రూషా క్రియతాం తావత్సహి ధర్మస్సనాతనః." ౧౩

అని రాముఁడు తల్లికిం దెల్పెను. ఈపల్కులు శ్రీరాముని సర్వజ్ఞత్వమును ధర్మనిరతిని దెల్పుచున్నవి. తల్లీ! కైక రాజును వంచించెను. నేనడవుల కరుగుచున్నాఁడను. నీవుకూడ నాయనను వదలిపెట్టి నాతోడవచ్చిన మృతినొందును. నిజము. అనఁగా భావమేమి? కైకేయీవచనరూపముగఁ దండ్రి కర్మమే వంచించెను. నేనిట నుండను. నీవును నావలెనే వదలిపెట్టరాదు. తండ్రి జీవింపఁడు. నిశ్చయము. పుత్త్రశోకమున మృతినొందుమన్న శాపరూపకర్మ మూరకపోదు. నే నాకారణమున ననఁగా నేను వెంతనుండఁగా మృతినొందుసత్కర్మమును దశరథుఁడు

చేయలేదని తాత్పర్యము. నీవు నాతోఁడవచ్చు కర్మము చేయ లేదు. పతి మృతిం గాంచి దుఃఖించుదుష్కర్మము నొనరించితి వని సారము. నేనడవులకుఁ బోయినతర్వాతఁ దండ్రి మృతి నొందును. నీవు చెంతనుండువు. అనియేకదా శ్రీరాముని యుప దేశము. ఈధోరణిలో లోకులకు నీతిని దెల్పుచున్నాఁడు. పతిని విడనాడుట స్త్రీలకుఁ బాపహేతువు. అట్టిపాపకార్యము పెద్దలు గర్హించుదానిని దల్లీ నీవు మనస్సుచేతను జేయరాదు. అనఁగా నీవడవులకుఁ బోవలయునని మనస్సునఁగూడ నాలోచింపకుమని భావము ఈవాక్యమే

"ఉన్మత్తం పతితం క్లీబమబీజం పాపరోగిణం,
న త్యాగోఽస్తి ద్విషంత్యాశ్చ న చ దాయాపవర్తనం." ౭౯

మను. ౯ అధ్యా.

"స్త్రీభిర్భర్తృవచః కార్యమేష ధర్మః పరస్త్రియాః,
ఆశుద్ధేస్సంప్రతీక్ష్యో హి మహాపాతకదూషితః." ౭౭

యాజ్ఞవల్క్యము.

"గృహవాసస్సుఖార్థోఽహి పత్నీమూలం చ తత్సుఖం,
సా పత్నీ యా వినీతా స్యాచ్చిత్తజ్ఞా వశవర్తినీ. ౭
అనుకూలా త్వవాగ్దుష్టా దక్షా సాధ్వీ పతివ్రతా,
ఏభిరేవ గుణైర్యుక్తా శ్రీరేవ స్త్రీ న సంశయః. ౧౦
ప్రహృష్టమనసా నిత్యం స్థానమానవిచక్షణా,
భర్తుః ప్రీతికరీ యా తు భార్యా సా చేతరాజరా. ౧౩
శిష్యో భార్యా శిశుర్భ్రాతా పుత్రో దాసస్సమాశ్రితః,
యస్యైతాని వినీతాని తస్య లోకే హి గౌరవం. ౧౪
ప్రథమా ధర్మపత్నీ తు ద్వితీయా రతివర్ధినీ,
దృష్టమేవ ఫలం తత్ర నాదృష్టముపపద్యతే. ౧౫

భర్తృవర్త్మ సమాఖ్యాతా నిర్దోషా యది సా భవేత్,
దోషే సతి న దోషస్స్యాదస్యా భార్యా గుణాన్వితా. ౧౬
దరిద్రం వ్యాధితం చైవ భర్తారం యావమన్యతే,
శునీ గృధ్రీ చ మకరీ జాయతే సా పునః పునః." ౧౭

దక్షస్మృతి. ౪ అధ్యా.

అనునీ మొదలగుస్మృతులకు నాధారమని తెలియును. భర్త ప్రాణములతో నుండునంతదనుక నీవు శుశ్రూష చేయుచుండ వలయును. అదియే సనాతనధర్మము అను నీవాక్యసార మేమి? నీయింటనే నాతండ్రి మరణించును ప్రాణములుపోవుదనుక సేవ చేయుచుండుము. నీయాచారమే సనాతనధర్మము కాఁగల దనియే ఇదియే స్త్రీధర్మరూపమగు శ్రీరామోపదేశము. దీనినే స్మృతులు గ్రహించినవి. ఈయుపదేశరూపధర్మము వివాహ కాలమునందే కన్యలమది నెలకొన్నచో దాన నెంతసౌఖ్యము వారలకుంగల్గునో యోజించినఁ దేటపడఁగలదు. వీఁడు పోయిన మఱియొకఁడు మగఁడు దొరకునన్నభావము నెలకొనిన నాదాంపత్యమున నేమాత్రము సుఖముండునో తెలియఁగలదు. పతిక్షేమమునే కోరుటకుఁ బ్రధానకారణము పత్యంతరా లాభమేగాక మఱేమి?

"ఏవముక్తా తు రామేణ కౌసల్యా శుభదర్శనా,
తథేత్యువాచ సుప్రీతా రామమక్లిష్టకారిణం." ౧౮

అని మూలము. శుభదర్శనా = శుభప్రదమగు దర్శనముకలది. అనఁగా భగవద్దర్శనముకంటె శుభ మెద్ది?

"సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ,
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః." ౧౦

అన్న గీతావాక్యఫల మిదియేకదా. ఆఫలము ననుభవించినది కనుకనే కౌసల్య యట్లే యొనరించెదనని మహాప్రీతిచే నచించెను. అక్లిష్టకారిణమ్ = కష్టమును గల్గింపనివాఁడు. అనఁగా సంసారసంతాపములు భక్తులకు నంటకయుండఁ జేయువాఁడనుట.

"అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః,
మామాత్మపరదేహేషు ప్రద్విషంతో౽భ్యసూయకాః. ౧౮
తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్,
క్షిపామ్యజస్రమశుభా నాసురీష్వేవ యోనిషు." ౧౯
గీత. ౧౬ అధ్యా.

అన్న భగవద్వాక్యము ననుసరించి తన్ను నాశ్రయింపక కేవలాహంకారాది దుర్గుణవిశిష్టులగువారల ననఁగాఁ బరహింసాదిరూపానేకదుష్కర్మముల నాచరించినవా రధఃపతితులగుదురనియు నట్లుగాక సత్కర్మముల నాచరించుచు ఫలములను గోరనిభక్తులను సంసారకూపమునుండి యుద్ధరించువాఁడనియు సారము తేలుచున్నది. కనుకఁ బరాత్పరు నాశ్రయించినవారలకు సంసారదుఃఖము లంటవని భావము. అట్టి శ్రీరామునిగన్న కౌసల్య కాకుమారుఁడు కష్టములను గల్గించునా?

"ఆసాం రామసపత్నీనాం వస్తుం మధ్యే న మే క్షమం,
నయ మామపి కాకుత్స్థ వనం వన్యాం మృగీం యథా." ౧౯

ఇది కౌసల్య పలికినవచనజాలము. దీనిసార మేమనఁగాఁ దనయందీర్ష్యగలవారినడుమ నుండుటకంటె నరణ్యగమనమే బాగు. అనునదియే. పరస్పరదర్శనము లేకపోయిన మది నలముకొని

ధర్మపత్నీ సమాఖ్యాతా నిర్దోషా యది సా భవేత్,
దోషే సతి న దోషస్స్యాదస్యా భార్యా గుణాన్వితా. ౧౬
దరిద్రం వ్యాధితం చైవ భర్తారం యావమన్యతే,
శునీ గృధ్రీ చ మకరీ జాయతే సా పునః పునః." ౧౭

దక్షస్మృతి. ౪ అధ్యా.

అనునీ మొదలగుస్మృతులకు నాధారమని తెలియును. భర్త ప్రాణములతో నుండునంతదనుక నీవు శుశ్రూష చేయుచుండ వలయును. అదియే సనాతనధర్మము అను నీవాక్యసారమేమి? నీయింటనే నాతండ్రి మరణించును ప్రాణములుపోవుదనుక సేవ చేయుచుందుము. నీయాచారమే సనాతనధర్మము కాఁగల దనియే ఇదియే స్త్రీధర్మరూపమగు శ్రీరామోపదేశము. దీనినే స్మృతులు గ్రహించినవి. ఈయుపదేశరూపధర్మము వివాహ కాలమునందే కన్యలమది నెలకొన్నచో దాన నెంతసౌఖ్యము వారలకుంగల్గునో యోజించినఁ దేటపడఁగలదు. వీఁడు పోయిన మఱియొకఁడు మగఁడు దొరకునన్నభావము నెలకొనిన నాదాంపత్యమున నేమాత్రము సుఖముండునో తెలియఁగలదు. పతిక్షేమమునే కోరుటకుఁ బ్రధానకారణము పత్యంతరా లాభమేగాక మఱేమి?

"ఏవముక్తా తు రామేణ కౌసల్యా శుభదర్శనా,
తథేత్యువాచ సుప్రీతా రామమక్లిష్టకారిణం." ౧౮

అని మూలము. శుభదర్శనా = శుభప్రదమగు దర్శనముకలది. అనఁగా భగవద్దర్శనముకంటె శుభ మెద్ది?

"సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ,
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః." ౫౦

అన్న గీతావాక్యఫల మిదియేకదా. ఆఫలము ననుభవించినది కనుకనే కౌసల్య యట్లే యొనరించెదనని మహాప్రీతిచే నచించెను. అక్లిష్టకారిణమ్ = కష్టమును గల్గింపనివాఁడు. అనఁగా సంసారసంతాపములు భక్తులకు నంటకయుండఁ జేయువాఁడనుట.

"అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః,
మామాత్మపరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః. ౧౮
తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్,
క్షిపామ్యజస్రమశుభా నాసురీష్వేవ యోనిషు." ౧౯
గీత. ౧౬. అధ్యా.

అన్న భగవద్వాక్యము ననుసరించి తన్ను నాశ్రయింపక కేవలాహంకారాది దుర్గుణవిశిష్టులగువారల ననఁగాఁ బరహింసాదిరూపానేకదుష్కర్మముల నాచరించినవా రధఃపతితులగుదురనియు నట్లుగాక సత్కర్మముల నాచరించుచు ఫలములను గోరనిభక్తులను సంసారకూపమునుండి యుద్ధరించువాఁడనియు సారము తేలుచున్నది. కనుకఁ బరాత్పరు నాశ్రయించినవారలకు సంసారదుఃఖము లంటవని భావము. అట్టి శ్రీరామునిగన్న కౌసల్య కాకుమారుఁడు కష్టములను గల్గించునా?

"అసాం రామపరిత్యక్తా నాం వస్తుం మద్ధ్యే న మే క్షమం,
నయ మామపి కాకుత్స్థ వనం వన్యాం మృగీం యథా." ౧౯

ఇది కౌసల్య పలికినవచనజాలము. దీనిసార మేమనఁగాఁ దనయుం దీర్ఘ్యగలవారినడుమ నుండుటకంటె నరణ్యగమనమే బాగు. అనునదియే. పరస్పరదర్శనము లేకపోయిన మది నలముకొని యున్న క్రోధాదులు క్రమముగా క్షీణించును. చూచుచు

నుండిన నితరేతరదుష్కర్మరశ్ములు పెనఁగి మఱింత బాధిం
చును. కావుననే కౌసల్య వీరికడ నుండుటకంటె నడవులకుఁ
బిలుచుకొనిపొమ్మని యాచించెను. అందు జింక యడవియం
దెట్లు సుఖముగా నుండునో నేను సుఖముగా నుందును. దీని
సారమేమి? ఏవ్యక్తి తన కీర్ష్యాదులు కలుగఁజేయునో అట్టివ్యక్తి
లేనికావున నుండుటయే సుఖము. అనఁగా నీర్ష్యాదులు లేక
యుండుకాలమే సుఖమని సారతరార్థము. అయోధ్యలోనుండి
భర్తకు సేవచేయుదునని చెప్పిన కౌసల్య మరల నిట్లు పలుకు
టసంగతము కాదా యని ప్రశ్నింపవచ్చును. ఇది రామచరిత్రము.
ఈకావ్యమూలమున నెన్నియోనీతులను లోకులకుఁ దెలుపు
టయే మహర్షికృత్యము. పైనవ్రాసిననీతి వేఱొకమార్గమున
దెలుప వలనుపడలేదు. కావున నామె పుత్త్రవాత్సల్యమున
రామచంద్రుని వదలియుండఁజాలక యడిగె ననుకారణమున
నీనీతి లోకులకుం దెలిపెనని మనము గ్రహింపవలయును. ఈ
యర్థము దీనికిఁబూర్వమునఁ గలశ్లోకమున

"ఉవాచ పరమార్తా తు కౌసల్యా పుత్త్రవత్సలా."

అని మహర్షి ప్రయోగించియే యున్నందున నర్థానిమూలమున
మనము గ్రహింపవచ్చును.

"తాం తథా రుదతీం రామో రుదన్ వచనమబ్రవీత్." ౨౦

అని మూలము. ఇది శ్రీరామునిమానవత్వమునే ప్రకటించుట
లేదా యని కొందఱు ప్రశ్నింపవచ్చును. వారు లోకస్వభావ
మెఱుంగనివారే యనవలయు. దుఃఖమున విలపించుతల్లి తన
వలెనే దుఃఖించుప్రియపుత్త్రునిదుఃఖము నోర్వఁజాలదు. కా
నాదుఃఖము నడంచుకొని కొడుకు నాశ్వాసించును. ఇది ప్రత్య

ష్టము. కావున శ్రీరాముఁడు స్వీకృతదుఃఖము నభినయించెను. అంతియకాని శ్రీరామునకు దుఃఖమెక్కడిది? మాయామానుషవేషుఁడుకదా రాముఁడు. ఈవిషయమును మది నెంచినచోఁ బై ప్రశ్నమున కవకాశమే దొరకదు.

"జీవంత్యా హి స్త్రియా భర్తా దైవతం ప్రభురేవ చ,
భవత్యా మమ చైవాద్య రాజా ప్రభవతి ప్రభుః. ౨౧
న హ్యనాథా వయం రాజ్ఞా లోకనాథేన ధీమతా,
భరతశ్చాపి ధర్మాత్మా సర్వభూతప్రియంవదః. ౨౨
భవతీమనువర్తేత స హి ధర్మరతస్సదా,"

అని మూలము. మరలమరలఁ గౌసల్యకు స్త్రీధర్మములను రాముఁడుపదేశింపఁబూనెను. సపత్నులనడుమ నుండఁజాల నన్నమాటకు బదులుచెప్పెను. భరతుఁడు ధర్మాసక్తిగలవాఁడు. కావున నిన్ననుసరించి వర్తించును. అనఁగా నీయాజ్ఞానువర్తియే యగునని భావము. అనఁగా రాజుగా నుండఁడని సారము. పాదుకాపట్టాభిషేక మీమాటచే రాముఁడు సూచించెనని కొందఱందురు.

"యథా మయి తు నిష్క్రాంతే పుత్రశోకేన పార్థివః. ౨౨
శ్రమం నావాప్నుయాత్కించిదప్రమత్తా తథా కురు,
దారుణశ్చాప్యయం శోకో యథైనం న వినాశయేత్. ౨౩
రాజ్ఞో వృద్ధస్య సతతం హితం చర సమాహితా,"

అని మూలము. భావికాలగతి నీమూలమునఁ దెలిపెను. నే నడవులకుంబోవుదును. కుమారులలో నొక్కఁడైనఁ జెంతనుండక పోఁగా నాదుఃఖమున రాజు శ్రమమునొందక యుండునట్లు స్థిరమనస్సుకలదానవై యాశ్వాసింపుము. ఈవిషయమునఁ బ్రమా

అను మనుస్మృతివాక్యములసారము కూడ శ్రీరామోక్తిసారమే కదా.

"అధర్మాభిభవాత్కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః,
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః." ౪౧.

అని యర్జునుఁడుకూడ స్త్రీలు వ్యభిచరింతురే యని భయపడెను. శ్రీకృష్ణమూర్తి దాని నంగీకరించెను. బదులుచెప్పక పోవుటయే యందులకు నిదర్శనము.

లోకమున స్త్రీలమూలముననే ధర్మము నిలువవలయును. సదాచారములు నశ్లే పురుషులు ధర్మమూలభూతురాండ్రగు స్త్రీలను గడుజాగరూకులై కాపాడవలసియుండును. వారికిఁగలుపువిద్యకూడ ధర్మవిధ్వంసనక్షమమైనదిగ నుండరాదు. దైవభక్తి పెంపొందింపఁజేయునదిగా నుండవలయును. దాన సదాచారములు రూపుమాయక నిలుచును. నీతి సదాచారమూలము. సదాచారములు నశించిన నీతియు నశించును. దాన వంశగౌరవములు క్షీణించును. అది మానవత్వమునే నిర్మూలించును. కావునఁ దోఁచినట్లు ధర్మమును దాఱుమాఱుచేయఁబూనరాదు. సదాచారము లేల యని బలవంతముగనైన స్త్రీలకనాచారములు నేర్పరాదు. దూరదృష్టిలేక యిష్టానుసారముగ ధర్మములను మార్చినఁ దీఱనిచేటు వాటిల్లును. కనుక నీకాలపువారు శ్రీరామోపదేశమునైన మది నిలిపి హితముగాఁ బ్రవర్తిల్లుట శ్రేయోదాయకమని యీభాగమునుండి నేర్చుకొనవలయును.

"గచ్ఛ పుత్త్ర త్వమేకాగ్రో భద్రం తేఽస్తు సదా విభో,
పునస్త్వయి నివృత్తే తు భవిష్యామి గతక్లమా.

ప్రత్యాగతే మహాభాగే కృతార్థే చరితవ్రతే. ౩౪
పితురానృణ్యతాం ప్రాప్తే త్వయి లప్స్యే పరం సుఖం,
కృతాంతస్య గతిః పుత్త్ర దుర్విభావ్యా సదా భువి. ౩౫
యస్త్వాం సంచోదయతి మే వచ ఆచ్ఛిద్య రాఘవ.''

అని మూలము. కౌసల్య రాము నాశీర్వదించుచున్నది. వత్సా! మనోవ్యాకులముల నొందకపొమ్ము. ఇక్కడిదుగఖమునకుఁ జోటీయక సంతుష్టమనస్కుఁడవై పొమ్మని భావము. సర్వదా నీకు మేలగుఁగాక. నీవు మరలిరాఁగా నాకష్టములు నివర్తించును. పితృఋణముతీర్చుకొని నీవురాఁగాఁ గాంచి నిరుపమానసుఖము నొందుదును అనఁగా నిన్నుఁ గన్నులారఁ గాంచుటయే మహానందమని భావము. నాయనా! నామాట జవదాఁటని నిన్ను మార్చివేసినదే. ఇఁక దైవగతికంటె మిక్కిలి యేది గలదు? అనఁగా సారమేమి? లోకమున దైవగతినాపగల దేదియులేదు. దైవగతి యనఁగాఁ గర్మఫలమనియే భావము. దాని నాపువా రెవ్వరుందురు? సర్వేశ్వరుఁడు కర్మస్వరూపుఁడు. తదితరులు కర్మబద్ధులు. కావునఁ గర్మగతి దుర్నివారకమని తాత్పర్యము. "గహనా కర్మణో గతిః" అన్నసూక్తి భగవంతునిదేకదా. ఎన్నివిధముల నూహించినను బౌరుషమునకంటె దైవమే యుత్కృష్టతమ మనువిషయమే మనము గ్రహింపఁదగును. ఇట్టులీభాగము మనకెన్నియోవిషయములను బోధించుచున్నది. కావున శ్రద్ధగాఁ బఠించి యందలిసారమును గ్రహించి దాని నెంతదనుక మనయలవాటున నుండఁజేయ శక్యమో యట్లు చేసికొనవలెను. అదియే రామాయణఫలము. కాని పారాయణమాత్రమున సంపూర్ణఫలము చేకూరదు. ఇఁకఁ దరువాతి కథను బఠింతము.

## కౌసల్య కుమారు నాశీర్వదించుట.

*మంచిమనస్సుగల యాకౌసల్య దుఃఖానుభవమువలని యాయాసమున గలిగిన యశుచిత్వమును బోఁగొట్టుకొనఁగోరి జలముల నాచమనముచేసి కుమారు నాశీర్వదించెను. రఘువంశోద్ధారకా! నిన్ను నిందే నిలుపుటకు నాకు శక్యముకాలేదు. నీవు కోరినట్లే యడవుల కరుగుము. నియతకాలము దాఁటగనే యాలసింపక రమ్ము. పిదపఁ గ్రమముగాఁ బెద్దలయాచారము ప్రకారము పట్టాభిషిక్తుఁడవుకమ్ము. రామా! కొఱంతవడనినియమమున నీవే ధర్మము ననుసరింప నెంచితివో యాధర్మమే సకలదిశల నిన్ను రక్షించుఁగాక. నీవు చైత్యములయందు దేవాగారములయందే దేవతలకు నమస్కరించుచుందువో వారే వనముల ఋషులతోఁగూడ నెల్లభంగుల నిన్నుఁ గాపాడుదురుగాక. ప్రతిభాశాలియగు విశ్వామిత్రుఁడు నీకు నుపదేశించిన మహాస్త్రములన్నియు నిన్ను సంరక్షింతురుగాక. నీపితృమాతృశుశ్రూషలు సత్యవ్రతము నీకేకష్టములు గలుగకయుండఁ గాపాడుఁగాక. దీర్ఘాయుష్మంతుఁడవగుము. వనముల సంచరించునపుడు ప్రమాదమున నీవలనఁగలిగిన ప్రత్యవాయము నోర్చుకొనుచు నందుఁగల తరుగుల్మలతాదులు వనస్పతులు పక్షులు సర్పములు పర్వతాదులు నిన్ను రక్షించుఁగాక. సాధ్యులు లోనగు దేవతాభేదములు నీకు శుభములిచ్చుఁగాక. ధాతృవిధాతలు సృష్టికర్తయగుబ్రహ్మయు నీకఖిలశుభముల నిత్తురుగాక. సూర్యద్వాదశకమునఁ గలపూషయు భగార్యములు నీకు శుభము లొసంగుదురుగాక. ఇంద్రాదిదిక్పాలకులు నీకు సర్వదా శుభ

* ఇయ్యది యిరువదియైదవసర్గమునుండి కైకొనఁబడినది.

ప్రదులగుదురుగాక. ఋతుపక్షమాససంవత్సర దివారాత్రిరూప కాలము నిన్ను రక్షించుఁగాక. కుమారా! ధ్యానము పరిపక్వ మగు యోగము ధర్మము నిన్నెల్లభంగులఁ గాపాడుఁగాక. కుమార చంద్రబృహస్పతులు సప్తర్షులు నారదాది దేవర్షులు నిన్నెల్లతావులఁ గాపాడుదురుగాక. దిక్కులు దిక్పాలకులు నాచేయుస్తుతులకు దయగలిగి వనముల నిన్నెమఱక రక్షింతురుగాక. కులపర్వతసముద్రములు కుబేరవరుణులు భూమ్యాకాశములు నదులు నక్షత్రములు కుజాదిగ్రహములు వానియం దభిమానముగల దేవతలు నహోరాత్రములు సంధ్యలు నడవుల నిన్నెమఱక కాచుచుందురుగాక. పవిత్రములగుఋతువు లాఱు మాససంవత్సరాదులునీకు సుఖమొసంగుదురుగాక. మతిమంతుఁ డవై జనకు ననుమతిం గొని మునివేషమును దాల్చి గహన మునఁ జరించు నీకు సురాసురులు మేలుగూర్తురుగాక.

శ్రీరామచంద్రా! కోపాటోపమున, క్రూరకర్మరతిగలిగిన రాక్షసపిశాచములవలన మఱియుఁ గ్రూరమృగంబులవలనను నీకు భీతి రాకుండుఁగాక. అరణ్యానియందు వానరములు వృశ్చికములు వనమక్షికములు దోమలు పాములు నితరకృములు నిన్నుఁ బీడింపకయుండుఁగాక. కుమారా! వన్యగజసింహవ్యాఘ్ర భల్లూకప్రముఖదంష్ట్రాయుధమృగములు నీకు నపకారము చేయకయుండుఁగాక. మానవమాంసభక్షణాదృతిగల యితర క్రూరజంతువులు నా దేవతారాధనమున నానందించి నిన్ను హింసింపకుండుఁగాక. రామభద్రా! త్రోవలన్నియుఁ గంద మూలఫలాదులతో సుఖప్రదములే యగుఁగాక. అప్రతిహత పరాక్రమము చెల్లుఁగాక. శుభములం గాంచుచు నడవికిం

బొమ్ము. అంతరిక్షమునఁ దిరుగు దేవతలవలనను దక్కిన దేవతల వలనను నీకు శుభములుగలుగుఁగాక. శత్రువులవలనను నీకు మేలేకలుగుఁగాక. నేను బూజించుచుండఁగా సంతసిల్లి బృహస్పతి లోనగువారు నీకు మంగళప్రదులగుదురుగాక. నదీస్నానకాలమున నగ్నియు వాయువు హోమాగ్నిధూమము విశ్వామిత్రోపదిష్టమంత్రములు నిన్నుఁ గాపాడుఁగాక. లోకనాథుఁడగు బ్రహ్మయు సర్వప్రాణిపోషకుఁడగు నారాయణమూర్తియు ఋషులు తక్కుంగలదేవతలు వనవాసవ్రతమూనిన నిన్నుఁ గాపాడుఁగాక.

అని యీరీతి నాకౌసల్యల శ్రీరాము నాశీర్వదించి పూలదండలొసంగి యుచితరీతి దేవతలఁ బూజించెను. రామాభ్యుదయార్థము హోమముచేయించెను. హోమార్థము శ్వేతపుష్పహారములు, సమిధలు, తెల్లనియావాలు తెప్పించి యీయఁగా నావిప్రుఁడు కష్టఫలనిరసనార్థము విశేషించి యారోగ్యప్రాప్త్యర్థము విధ్యుక్తముగా హోమముచేసెను. శిష్టహవిస్సుచేత బహిర్బలిగావించెను. తేనె లోనగుపదార్థములను బ్రాహ్మణులకొసంగి పుణ్యాహవాచనముచేయించి వనమున మంగళములు గలుగఁజేయుమంత్రములం జదివించెను. కీర్తిమంతురాలగు నా కౌసల్య యాఋత్విజునకు వాంఛానురూపదక్షిణల నొసంగి కుమారునితో నాయనా! దేవతానమస్కృతుఁడగు దేవేంద్రునకు వృత్రాసురుఁడు నశింప నేమంగళమొదవెనో యామంగళములు నీకుం గలుగుంగాక. పూర్వము వినతకుమారుఁడు గరుత్మంతుఁడు దేవలోకమున కమృతముం దీసికొనిరాఁబోవుతఱి నేయాశీర్వచనముచేసెనో యది నీకు లభించుఁగాక. సముద్ర

మథనమున నదితి కుమారుఁడు దేవేంద్రునకు రాక్షససంహా
రార్థ మేదీవనల నొసంగెనో ఆశుభాశీర్వాదఫలము నీకిపుడు
గలుగుఁగాక. శ్రీమహావిష్ణువు త్రివిక్రమావతారమునందు
మూఁడడుగు లిచ్చునపు డేయాశిషము లొసంగెనో యాశు
భాశీర్వచనఫలము నీకుంగలుగుంగాక. శుభవస్తువులను మఱియు
శుభవంతములుగాఁజేయు వసంతాదిషడృతువులు సముద్ర
ములు ద్వీపములు వేదములు స్వర్లోకాదులు దిశలు నీకు
మేలుఁగూర్చుఁగాక.

ఇట్టు లావిశాలాక్షి కొడుకును దీవించి యతనితలపై
నక్షతలునిచి గంధముపూసి విశల్యకరణి యనుమూలికనురక్షగా
రామునికరమునకుం గట్టెను. ఆమూలిక ఫలముగలిగించునంత
శక్తికలది. లోనఁగలశల్యములను వెలుపలికిఁ దీయఁగలదియు
నగు. ఆరక్షను రక్షోమంత్రముల నభిమంత్రించెను. దుఃఖవశం
వదయైనను బ్రయాణము చేయునపు డది యమంగళమగునని
తలఁచి మనస్సున సంతోషము లేకున్నను వాక్కున నానందించు
నట్లు గనంబడుచు గద్గదవాక్కుల నారాముని యుత్తమాం
గము వంచి మూరుకొని యాలింగనము చేసికొని వత్సా!
ధన్యుఁడవై సుఖముగాఁ బొమ్ము. నిరోగుఁడవై సుఖముగా
నయోధ్యకువచ్చి రాజ్యమును స్థిరముగాఁ బాలించు చుండఁగాఁ
గన్నులారఁ గాంచఁగలను. నీవు మరలి రాఁగా నాదుఃఖము లెల్ల
నశించి మోమున సంతోషము నివ్వటిల్ల సంపూర్ణచంద్రబింబము
తోఁచినట్లు నిన్నుఁ జూడఁగలను. పితృనానతి నెఱవేర్చి యడవి
నుండివచ్చి సింహాసనము నధిష్ఠించియుండ నానందమునఁ జూడఁ
గలను. వనమునుండి యరుదెంచి రాజోచితములగువస్త్రాభరణ

ములఁ దాల్చి నీవు నాకును నాతోడలికిని సర్వదా సంతోష మును గలిగించుచుండుము. ఇప్పుడు దండకాటవుల కరుగుము. నేనిపు డారాధించు దేవతలు లోనగువారెల్లఁ దృప్తినొంది వనమునకరుగు నీకుఁ జిరకాలము హితముగోరుచుందురుగాక. అని యిట్టులా కౌసల్య కన్నీటిధారలు ప్రవహింపఁగా నాశీర్వ దించి రక్షార్థ మాతనిచుట్టును దిరిగి కౌఁగిలించుకొనియె. అంత రామచంద్రుఁడు తల్లిపదములు మరలమరల నమస్కరించి మానవతను సహజమగువిచారముకలిగినను నిరుపమాన తేజో రాశి గావున నించుకయు మోముకాంతి తగ్గకయుండఁగా సెలవుతీసికొని సీతాదేవికడకుం బోయెను.

మహాశయులారా! ఈభాగమున మన మెఱుంగఁదగిన విషయములు కొన్ని గలవు. వాని నెఱుంగుటయే ముఖ్యము. కౌసల్య రామునకు మేలుగలుగవలయునని దీవించెను. భగ వంతుఁడని యెఱింగియుమాయామోహితయగుట సామాన్యుఁ డనియే భావించి మాత గావున దీవించెను. ఇందన్నియుఁ బునరుక్తతాదోషమున కుదాహరణములుగనే కన్పట్టును. కాని యది పుత్రునియందుఁ గలవాత్సల్యాతిశయమునను దద్విరహ వేదన చేతను బలికినపలుకులని భావించుచో నాదోష మదృశ్య మగును. ఇందుఁగలవిశేషము లేవని విచారింతము.

"శ్రీఘ్రం చ వినివర్తస్వ వర్తస్వ చ సతాం క్రమే. 2
యం పాలయసి ధర్మం త్వం ధృత్యా చ నియమేన చ,
స వై రాఘవశార్దూల ధర్మస్త్వామభిరక్షతు." 3

అని మూలము. 'సతాం క్రమేచ వర్తస్వ' అనునది విధివాక్య ముగా గ్రహింపఁదగు. నీపూర్వు లేరీతిగా నడచిరో యా

మార్గమునసే. అనఁగా భరతుఁడే రాజ్యమేలుఁగాక యని యనరాదు. జ్యేష్ఠుఁడు పట్టాభిషిక్తుఁడు కాఁదగునన్నదియే పూర్వమార్గము. దాని ననుసరింపుమని హెచ్చరించెను.

"స్వధర్మమపి చావేక్ష్య న వికంపితుమర్హసి,
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే. 31
యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమపావృతం,
సుఖినః క్షత్రియాః పార్థ లభంతే యుద్ధమీదృశం." 32

గీత. 2 అధ్యా.

అను నీగీతావాక్యములుకూడ నీయర్థమునే తెలుపుచున్నవి.

"సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్,
సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః." 48 గీ. 18 అ.

అన్న శ్రీకృష్ణవాక్యము పైనివ్రాసినభావమునే తెలిపెడిని. నిరంతరప్రీతిచే నియమముచే నీ వేధర్మమును పాలించుచున్నాఁడవో యది నిన్నుఁ గాపాడుఁగాక.

"ధర్మ ఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః,
తస్మాద్ధర్మో న హంతవ్యో మానో ధర్మో హతోఽవధీత్." 15

మను. 8 అ.

అను నీమనుస్మృతిభావమునే రామాయణ ముపదేశించెను. ఇట్లు లాకౌసల్య తెల్పెనుగదా. ఇందుఁ గలవిశేషమేమి? భగవంతుఁడు ధర్మస్వరూపుఁడు. ఇతరు లెవరు రక్షింతురు? ఆపరమేశ్వరు నతఁడే రక్షించుకొనును. అనఁగా ధర్మమే నీయాధారము. నిన్నొరు లెవరు రక్షింపఁగలరు? అనుభావ మిందుఁ గలదు.

"వృషో హి భగవాన్ ధర్మ స్తస్య యః కురుతే హ్యలం,
వృషలం తం విదుర్దేవా స్తస్మాద్ధర్మం న లోపయేత్." ౧౬ శా. ౯ అ.

అనుస్మృతి పై భావమును దృఢపఱచెడిని.

"యేభ్యః ప్రణమసే పుత్త్ర చైత్యేభ్యాయతనేషు చ,
తే చ త్వామభిరక్షంతు పథే సహ మహర్షిభిః." ౮

అని మూలము. చైత్యమనఁగా నాలుగుత్రోవలు కలియుచోట నున్నమహావృక్షము. దాని చుట్టు వేదికనిర్మించియుందురు. వానికి ప్రదక్షిణక్రమమునఁబోవుట శ్రీరామునలవాటులలోనొకఁడు. మహావృక్షముల నాశ్రయించి దేవతలుందురు.

"యే వృక్షేషు శష్పింజరా నీలగ్రీవా విలోహితాః."

అని వేదము తెల్పుచున్నది. అట్టితావులఁ గ్రీడాదులు జరపరాదనియు నట్టియకృత్యముల నొనరించినచో నందుఁగల దేవతలు వారల హింసింతురనియు భావము. అట్టి మహావృక్షములం గాంచినపుడు శ్రీరామమూర్తి నమస్కరించుట యితరుల కాసదాచారము నేర్పుటకే. దేవమందిరములకుఁగూడ నట్లే నమస్కరించును. అట్టివెల్ల నిన్నుఁ గాపాడుఁగాక యని యాశీర్వదించెను. లోకమున కుపకారము చేయువస్తువు లెల్ల భగవన్మయములే. అనఁగా నందు భగవత్కళ విశేషించి యుండునని భావము.

"యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి స చమే న ప్రణశ్యతి." ౩౦ గీత. ౬ అ.

అన్న శ్రీకృష్ణోపదేశ మిదియే. శ్రీరాముఁ డాచరించిచూపెను. శ్రీకృష్ణుఁ డద్దానినే యుపదేశించెను. వృక్షాదులనుగూడ భగ

న్మయములుగా భావించువాఁడే యోగి. అట్టి యోగసిద్ధి లేకపోయినచో విద్యవలన లాభములేదని సారము.

"తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః,
గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః. ౧౭
ఇహైవ తైర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః,
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః." ౧౯
గీత. ౫. అ.

అను నీగీతావచనములు పై భావమునే విస్తరించుచున్నవి. పూర్వులు చెట్లకుఁ గొండలకు మ్రొక్కుదురని దూషించువారు విజ్ఞానసంపద్విరహితులని తేలకపోదు. సర్వము భగవన్మయముగా భావించుటయే వారిలక్ష్యము. పాషాణవిగ్రహములయందు భగవంతుఁడు వెలసియున్నవాఁడని విశ్వసించువారికంటె వృక్షాదులు భగవన్మయములని నమ్మువా రుత్తములే యనవలయును. ఈయర్థమునే ఈ క్రింది రామాయణశ్లోకములు తేటపఱచుచున్నవి.

"సమిత్కుశపవిత్రాణి వేద్యశ్చాయతనాని చ,
స్థండిలాని విచిత్రాణి శైలా వృక్షా క్షుపా హ్రదాః,
పతంగాః పన్నగాస్సింహాస్త్వాం రక్షంతు నరోత్తమ." ౭

ఈ మొదలగునవియన్నియు నీవిషయమును బోధించునవియే. కాన మరలమరల వ్రాయనక్కఱలేదు.

"గంధైశ్చాపి సమాలభ్య రామమాయతలోచనా,
ఓషధీం చాపి సిద్ధార్థాం విశల్యకరణీం శుభాం.
చకార రక్షాం కౌసల్యా మంత్రైరభిజజాప చ." ౩౭

అని మూలము. రామమూర్తికిఁ దల్లి గంధము పూసి విశల్యకరణి యనునోషధిని రక్షార్థము కట్టి మంత్రముల జపించెను.

అనఁగా నేమి! దేవతారాధనము చేయునపుడు సాధకుఁడలంకృతగాత్రుఁడై యుండవలయునని శాస్త్రము విధించెడిని. "క్షుప్తాకల్పస్సంకల్పాకల్పోప్యేవా" అని. దీనిచేత నిర్మలినత్వము ముఖ్యమని తేలెడిని. దేహానైర్మల్యమునకంటె మనోనిర్మలత్వము ప్రధానమని సారము. మూలికనుగుఱించి విచారింతము.

"సర్వాకరేష్వధీకారో మహాయంత్రప్రవర్తనం,
హింసౌషధీనాం స్త్ర్యాజీవోఽభిచారో మూలకర్మ చ. ౬౩
ఫలదానాం తు వృక్షాణాం ఛేదనే జప్యమృక్శతం,
గుల్మవల్లీలతానాం చ పుష్పితానాం చ వీరుధాం. ౧౪౨
కృష్ణజానామోషధీనాం జాతానాం చ స్వయం వనే,
వృథాలంభేఽనుగచ్ఛేద్గాం దినమేకం పయోవ్రతః." ౧౪౪

మను ౧౧ అధ్యా.

అను నీస్మృతివాక్కులననుసరించి యోషధుల నశింపఁజేయుట యుపపాతకమని తెలియనయ్యెడిని. వానియుపయోగముల గుఱించి యించుక వ్రాయఁదగు. ఓషధుల కొక్కొక్కదాని కొక్కొక్కదేవత గలదు. ఆదేవత నారాధింపకయున్న నా యోషధివలన లాభము కన్పట్టదు. దేవతారాధనముల జపముత్తమము. జపము మంత్రాధీనము. కావున నోషధులవలని లాభములఁ బడయఁగోరువారు తదధిష్ఠానదైవము దగుమంత్రమును జపించి తదుక్తనక్షత్ర వారతిథులు గలిసిన కాలమునందు నాయోషధిని బూజించి తదుక్తకాలమునఁ దీసికొనవలయును. అయ్యది ఫలవంతమగును. కొన్ని పగటివేళలయందును గొన్ని రాత్రికాలములయందును వీర్యవంతములుగ నుండును. విపరీతకాలములయందు గ్రహించినను నిష్ఫలములే యవి యగును.

సర్పవృశ్చికాదిబాధలు క్షుత్పిపాసలు రోగములు దుష్టపిశాచ
బాధలు మూలికాసంపర్కమున నుండవు. మూలికాప్రయోగ
మున సర్పవిషతాపము శాంతించుట సర్వజనవిదితమే. అట్టిశక్తు
లనేకములు గలవని నమ్మవలయును. మూలికాప్రయోగపద్ధతి
యీకాలమున నడుగంటినది. అదియే ప్రజాదౌర్భాగ్యము.
దానిని విడనాడరాదని మన కీభాగము బోధించుచున్నది.
ఈవిషయము వరాహమిహిరాచార్యాదులు పెక్కుతెఱంగుల
బోధించియేయున్నవారు. ఈవిషయములన్నియుం గ్రొత్తవి కా
వని యీరామాయణమే మనకుం దెల్పుచున్నది. ఈపూర్వాచా
రమునం గలుగుఫల మేమనంగా భగవద్భక్తియే. మూలికాధి
ష్ఠానదేవత నారాధించుట భక్తిచేతంగదా. అది విశ్వాసమూల
ముగాదా. ఇట్లు మనపూర్వులయాచారములన్నియు దైవభక్తి
మార్గము లగుచుండును. కావున మన మవ్వానిని విడనాడరా
దని దృఢసంకల్పులము కావలయును.

"అవదత్పుత్ర సిద్ధార్థో గచ్ఛ రామ యథాసుఖం,
అరోగం సర్వసిద్ధార్థ మయోధ్యాం పునరాగతం. ౪౧
పశ్యామి త్వాం సుఖం వత్స సుస్థితం రాజవర్త్మని,
ప్రణష్టదుఃఖసంకల్పా హర్షవిద్యోతితాననా.
ద్రక్ష్యామి త్వాం వనాత్ప్రాప్తం పూర్ణచంద్రమివోదితం." ౪౨

అని మూలము. ఇది కౌసల్య తెల్పినమార్గము. భగవత్సంకల్పము
ఫలోన్ముఖమైనదని యీవాక్కులే తెల్పుచున్నవి. "గచ్ఛ రామ
యథా సుఖమ్" ఎట్లు లోకములకు సుఖముగల్గునో యట్టి
ప్రయోజనము ఫలించునట్లు పొమ్ము. అనంగా నీప్రయాణము
లోకసుఖము గల్గించునని భావము. సర్వసిద్ధార్థమ్మనంగా సర్వ

ప్రయోజనములు ఫలింపఁగా నని భావము. నీయవతార ప్రయోజనము సఫలముకాఁగా మరలి యయోధ్యకు రాఁగా నిన్నుఁ జూతునని కౌసల్య పలికెను. కుమారా! నాదుఃఖసంకల్పములు నశింపఁగా సంతోషమున నామోము వికసింప వనమునుండి వచ్చిన నిన్ను నుదయించినచంద్రబింబమునువలెఁ జూడఁగలను. అనఁగా సారమేమి? నాకు రాఁగలవైధవ్యాదిదుఃఖములు తుచ్ఛసంకల్పములు నశించును. హర్షముప్పొంగును. నామనస్సు చల్లనగును. అనియే. లోకమున దుస్సంకల్పములు పరమేశ్వరునిధ్యానించువారలకు వరుసఁగా క్షీణించును. అవి క్షీణించినఁగాని హర్షముదయింపదు. అది కలిగినఁగాని మనస్సు చల్లఁబడుట యనఁగా శాంతినొందదు. ఇట్టిఫలములు కలుగుటకుఁ బ్రధాన కారణము పరమేశ్వరునిధ్యానమే.

"ధ్యాయతో విషయాన్ పుంసస్సంగస్తేషూపజాయతే,
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే. ౬౨
క్రోధాద్భవతి సమ్మోహస్సమ్మోహాత్స్మృతివిభ్రమః,
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి. ౬౩
రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్,
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి. ౬౪
ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే,
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే. ౬౫
నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా,
న చాభావయతశ్శాంతిరశాంతస్య కుతస్సుఖం." ౬౬ గీత. ౨ అధ్యా.

అను నీగీతావాక్యములు పైవ్రాసినభావమును స్పష్టపఱచుచున్నవి. కౌసల్య భగవంతునిదృఢసంకల్పము తనదుఃఖమును

దొలఁగింపఁగా నిర్మలస్వాంతయై యిట్లు పలికెను. అంతకుముం దున్న దుఃఖము తొలఁగెను. ఆచోట శాంతము పొడుకొని యెను. కావున మానవప్రయత్నమునకంటె దైవమే ప్రబలమని మన కీవాగ్ధోరణి తెల్పుచున్నది.

"మంగళైరుపసంపన్నో వనవాసాదిహాగతః,
వధ్వా మమ చ నిత్యం త్వం కామాన్ సంవర్ధ యాహి భో." ౪౪

అని మూలము. కుమారా! వనవాసమొనరించి పిదప నీయ యోధ్య కరుదెంచి సీతకు నాకును సుఖముం గూర్పుము. ఇఁకఁ బొమ్ము. సీతకు నాకును గలవాంఛల ఫలింపఁజేయు మనఁగాఁ దాత్పర్యమేమి? దుష్టసంహారము శిష్టపరిపాలనము ననుకార్య ములు నెరవేర్చిన సీతాదేవికి విశ్రాంతి చేకూర్పుము. నాకును మనశ్శాంతిని బ్రసాదింపుము. ఇఁకఁ బొమ్ము. అనఁగా నీవు వన వాసము చేసి వచ్చినఁగాని మా యీకోర్కులు ఫలింపవు. కావునఁ ద్వరితముగా నడవులకుం బొమ్మని కౌసల్య తేటపఱి చెను. ఇదియే యిందుఁగలసారము.

"ప్రదక్షిణం చైవ చకార రాఘవం పునః పునశ్చాపి నిపీడ్య సస్వజే." ౪౬

అని మూలము. కౌసల్య రామునకుఁ బ్రదక్షిణము చేసెను. అనఁగా నాలుగుప్రక్కలు నిర్భయములగుఁగాక యనుసంకల్ప ముతోఁ దిరిగెను. రక్షాబంధనమనఁగా నిదియే. ఇది సంకల్పశక్తి ప్రభావమును దెలిపెడిని. పెద్దలు పిన్నవారి నాశీర్వదించునపుడు నిర్మలమనస్సుతో భగవంతుని ధ్యానించి పిదప నాశీర్వదింపవల యును. ఆధ్యానశక్తిచే మేలుగలుగవలయునుగదా. కావుననే ప్రతికార్యమునందును దొలుత భగవంతుని ధ్యానింపవల యును. పెద్దలయాచారము లిట్టివే. వానిని దృణీకరింపరాదు.

ఏది ప్రధానమో దానిని వదలి తరువాతికార్యమును జేయఁ బూనుట మంచిదికాదు. సంధ్యావందనాదిసత్కర్మముల నాచరించునపుడు తొలుతఁ బ్రాణాయామము చేయవలయు ననువిధి కలదు. మంత్రము నుచ్చరించుచు ముక్కుపట్టుకొనిన లాభమే లేదు. ప్రాణాయామఫలము మనస్సు స్థిరముగా నుండనభ్యసించుటయే. దానిని మాని వేదమంత్రములఁ జక్కఁగా నుచ్చరించిన సంధ్యావందనాదిసత్కార్యములఫలము గలుగఁజాలదు. స్వల్పఫలమే కలుగును. సంకల్పము దృఢము కావలయును. అనఁగా మనస్సు నిర్మలమై యుండవలయుననియే సారము. ఇట్టి సద్విషయముల నందందు నుచితరీతిని వాల్మీకిమహర్షి మనకుఁ గథారూపమున బోధించెనని యెఱుంగవలయును. ఇట్టివిషయములను గ్రహింపక కథనుమాత్రమే తెలిసికొనిన లాభము లేదు.

> "తథా చ దేవ్యా సకృతప్రదక్షిణో
> నిపీడ్య మాతుశ్చరణౌ పునః పునః,
> జగామ సీతానిలయం మహాయశాః
> స రాఘవః ప్రజ్వలితస్స్వయా శ్రియా." ౪౭

అను నీమూలము మనకొకరహస్యమును దెలిపెడిని. దానిం బరికింతము. రాముఁడు తల్లి రక్షాబంధనకార్యము నిర్వర్తింపఁగా నామెకు నమస్కరించి సీతయింటికింబోయె ననునది సామాన్యార్థము. ఇచ్చో మహాకవివాల్మీకి "మహాయశాః" అనువిశేషణము ప్రయోగించెను. నిరుపమానవిఖ్యాతిని గోరినవాఁడనికదా దీనియర్థము. యశస్సు సత్కర్మానుష్ఠానమున గలుగును. అధర్మధ్వంసనమే సత్కర్మము. దానినిమించిన సత్కర్మము జగములయందు లేదు. దేనియాధారమునఁ బ్రపంచములున్నవో,

దేని నవలంబించినవారు చెడుదురో యవి ధర్మాధర్మము లనఁబడును. భగవత్స్వరూపమేధర్మము. భగవత్స్వరూపనివారకమే యధర్మము. ఒకటి యారాధింపఁదగినది వేఱొకఁడు నివారింపఁదగినది. అని భావము. అట్టివాంఛగలవాఁడు శ్రీరామమూర్తి. అనఁగా ధర్మము నశింపకయుండ నధర్మము తలయెత్తకయుండ నొనరింపఁబూనెనని భావము. "స్వయా శ్రియా" అని మూలమునఁ గలదు. దీనివాస్తవార్థమేమి? అనపాయినియగు శ్రీదేవితోఁ బ్రకాశించుచు ననియే దానియర్థము. అనఁగాఁ బ్రకృతివిశిష్టుఁడై యని భావము. శ్రీదేవిం గూడినఁగాని యనఁగా మూలప్రకృతిం జేకొనినఁగాని యే కార్యమును జేయఁజాలఁడు. శక్తిలేక కాదు. సంకల్పశక్తిలేక యేకార్యము సాగదు కావునఁ దన నిర్వికల్పత్వమును మానెననియే తాత్పర్యము కనుక నే తల్లి సెలవుపొంది తన ప్రయత్నమును నెఱవేర్పనున్న సీతాగృహమున కరిగెను. లోకమునందును భార్యతో నాలోచింపక యేకార్యము పురుషుఁడు చేసి ఖ్యాతిని గాంచఁజాలఁడు. ఈయాచారము సనాతనము. దానినే భగవంతుఁడు కార్యరూపమున మనకుఁ దెలిపెను. కావున మూలప్రకృతి నాశ్రయింపక యెవ్వఁడు కాని తమోరూపతిరస్కరణిని దాఁటి భగవంతుని నిర్మలతేజస్స్వరూపమును గాంచలేఁడని తేటపడియెడిని. ఒక్క గంతున భగవంతుని జేరఁగల మనువారే పామరులు. విద్యవచ్చినను వారు పామరులే. విద్య వారికి ఫలము నీఁజాలదని భావము. "తదను ప్రధానద్వారా రాజదర్శనం కర్తవ్య" మ్మనున్యాయము ప్రసిద్ధమేకదా. కనుక భగవంతు నిచ్ఛాశక్తిని దొలుత నారాధించి రజస్తమోగుణముల జయించి శుద్ధసత్వ ముద్దీపింప భగ

వంతుని దేవోరూపునిగా ధ్యానింపవలయునని మన మీభాగ మునుండి నేర్చుకొనవలసియే యుండును. అట్లుగాక దుర్మతాభి మానముగాని స్వలాభార్థ మేవో యిందు రహస్యార్థము లున్న యట్లు నటించి శిష్యులకు బోధించుచు దేవతాద్వేషమును గలిగించుచు ధనార్జనముచేయు కపటయోగులమాటలకు లోఁబడి నిర్మలమగుభక్తిని బోఁగొట్టుకొనరాదు. ఇఁకఁ దరు వాతి శ్రీరామచరిత్రమును బఠింతము.

## రాముఁడు సీతాదేవికి స్వాభిప్రాయ మెఱిఁగించుట.

* శ్రీరాముఁడు తల్లి యాశిషములొంది యత్యంత ధర్మమార్గము నవలంబించి యడవుల కరుగఁబూని తనప్రభల రాజమార్గమును వెలిఁగించుచుఁ బోయెను. జనులు రాముని గనినంతనే తత్సుగుణసంపత్తి యత్యంతప్రీతులుగా వారిఁ జేయఁజాలెను. అభిషేకార్థము వ్రతనియతింగాంచినసీతాదేవికి నభిషేకవిఘ్నము లోనగువార్త లేవియుఁ దెలియవు. నాఁడభి షేకోత్సవము సాగుననియే యామె తలంచుచుండెను. పట్ట భద్రుఁడగుభర్తకుఁ దాఁ జేయఁదగుమర్యాదల నెఱింగియే యుండెను. రాజచిహ్నము లిట్టివనియు నెఱుంగును. ఆనాఁడు పట్టాభిషిక్తుఁడైన భర్తకు నభ్యుదయమునుగోరి దేవతాపూజలఁ గావించి మహోత్సవానంతరము వచ్చునాథునకుఁ దగుపూజల నొనరింప సిద్ధపడి రాజచిహ్నములతో వచ్చు శ్రీరామునింగాంచ నువ్విళ్లూరుచుండెను.

---

* ఇది యిరువదాఱవసర్గమునుండి గ్రహింపఁబడినది. అధ్యాత్మరామా యణకథయం దిం దిమిడియుండును.

అట్టితఱి శ్రీరామమూర్తి సీత కీదుఃఖవార్త నెట్లు తెలుపవలయు ననుసిగ్గుచేఁ దలవంచి సంతుష్టజన నిబిడమగు నంతఃపురమును బ్రవేశించెను. సీత త్వరపడి లేచి భయకంపితాంగియై శోకతప్తుఁడగు శ్రీరామునిం గాంచెను. ధర్మాత్ముఁడగుట రాముఁడు సతిం గాంచఁగనే దుఃఖము నాపుకొనఁ జాలకపోయెను. కనుక నాతఁడు దుఃఖపడెను. మోము కాంతిహీనముకాఁగా మేను చెమటబిందువులం దడియఁగా నాపుకొన రానిదుఃఖమునఁ గలఁతనొందు రామునిం గాంచి దుఃఖార్తయై ప్రాణేశా! ఇదియేమి? బృహస్పతి యధిదేవతగాఁగలిగి సంపత్కరమై నీయభిషేకమునకు నర్హమగు పుష్యనక్షత్రమువచ్చినదని మహాప్రాజ్ఞులగుబ్రాహ్మణులు పల్కిరిగదా. ఈశుభతమసమయమున నీవేల యిట్లు కుందుచున్నావే. ఏల? శ్వేతాతపత్త్రము పట్టకుండుటంజేసి నీమోముచందురుఁడు ప్రకాశింపక యున్నాఁడే. ఏల? చామరులేల వీవలేదు? వాగ్విశారదులగు వందిమాగధాదులు నిన్ను వినుతింపకయున్నారేల? వేదాంతవేత్తలగుబ్రాహ్మణులు శిరస్స్నానముచేసి శుద్ధుఁడవుగానున్న నీశిరస్సుపై యథాశాస్త్రముగఁ దీర్థోదకాదులచేత నభిషేకింపకయున్నారే. ఏల? మంత్రిప్రముఖులు, పౌరముఖ్యులు, జానపదులు నలంకృతులై నిన్ననుసరించి రాలేదే. ఏల ? బంగరుచే రంగారుచు నాల్గుగుఱ్ఱములు గట్టియున్నరథవర్యము నీముందు రాకయున్నదే, ఏల ? నీలమేఘముభాతిఁ బర్వతమువలె నగపడుచు మంగళలక్షణలక్షితమైయుండు భద్రదంతావళము నీప్రయాణమున నీకు ముందు రాకయున్నదే. ఏల? సుందరాకారా! శ్రీరామభద్రా! శూరులు కనకరత్నసింహాసనము మున్నిడుకొని పోవు

చుండగా నీవు రావలయుఁగదా. అశ్వముల రాకైతివి? పట్టాభిషేక మెంతసంతోషమున నాయత్తమైనదో యంతదుఃఖముగా మున్నెన్నఁడులేని యీఛాయ నీముఖమునఁ గలిగియున్నది. సంతోష మదృశ్యమైనది. ఏటికో! అని ప్రశ్నించెను.

ఈరీతిఁ బ్రశ్నించుచు వగచుచున్న జానకిం గాంచి రామచంద్రుఁడు సీతా! ఆర్యులగు నాతండ్రిగారు నన్నీయయోధ్యనుండి యడవికిం బంపుచున్నారు. జానకీ! ఉత్తమవంశసంభూతురాలవు. ధర్మ మెఱింగినదానవు. ధర్మాచరణపరాయణవు. జ్ఞానధనుఁడగు జనకచక్రవర్తికుమారికవు. కావునఁ బామరులవలె వేగమున ధర్మము నతిక్రమింపవు. ఇఁక నావనవాసక్రమము నాలకింపుము. పలికినమాట విడనాడని నాతండ్రి పూర్వము నాతల్లి కైకకు వరద్వయ మొసంగెను. ఇత్తఱి రాజు ప్రయత్నపూర్వకముగా నాకభిషేకము చేయసిద్ధపడియుండఁగా నాజనని యావరములఁ బ్రార్థించెను. మాట తిరుగని రాజు ధర్మజ్ఞుఁడుగాన ధర్మవశంగతుఁడై యాదేవికి లోఁబడెను. నేను దండకారణ్యములఁ బదునాలుగేఁడులు మాత్రము నివాసము చేయుట యొకవరము. భరతునకుఁ బట్టాభిషేకము నాతండ్రి చేయుట రెండవవరము. అను నీవరముల కనుగుణముగాఁ దండ్రి యాజ్ఞాపింప నే నిపుడే నిర్మానుష్యమగువనమున కరుగ నిశ్చయించి నిన్నుంజూచిపోవ నిచ్చటికి వచ్చితిని. భరతునిచెంత మాత్రము నన్నెపుడుగాని నీవు కొనియాడకుము. సంపద్వృద్ధి నొందినపురుషులు ప్రాయికముగా నితరుల నుతింపనోర్వరుగదా. ఆన్యాయము ననుసరించి భరతునిచెంత నాగుణవర్ణనము చేయకుము. నాతమ్ముఁడు నలువురతో సమానముగా నిన్నుఁ బోషిం

పఁదగుభారము కలవాఁడేకాని విశేషవిధి ననుసరించి నిన్నుఁ
బోషించుభారము వానికి లేదు. అట్టులగుట నీతోడికోడండ్ర
కన్న మిన్నగాఁ బోషణము నీవు వానిం గోరఁదగదు. నీవు భర
తున కనుకూలముగానుండిననే నీవాతనికడ నుండఁజాలుదువు.
కాని ప్రతికూలముగా నుండ సాధ్యముగాదు. అదేల యందు
వేమో వినుము పూర్వమునుండివచ్చు యువరాజత్వమును
రాజు భరతునకే యిచ్చెను. జానకీ! కావున నీవాభరతునకు
విశేషించి దశరథునకు నేమాత్రము మనస్సునకుఁ గలఁతలేని
చందమునఁ బ్రవర్తింపవలయును. పితృనానతి నెఱవేర్ప నే
నిపుడే యడవి కరిగెదను. నీవు దృఢచిత్తవు. కాఁబట్టి నాయం
దలిదృఢతమాను రాగమునకుఁ గొఱంతరానీయక యుండుము.
కల్యాణీ ! మహర్షినివాసయోగ్యమగువనమున కరిగినపిదప
నీవు వ్రతోపవాసనిరతవై యుండుము. నిత్యము నుషఃకాల
మున మేల్కాని యథోచితముగ దేవతలం బూజించి మాన
వులఁ బాలించురాజునకు నమస్కరించి ధర్మమునే యాశ్ర
యించి సంతాపపరితప్తయయియున్న వృద్ధురాలగు నాతల్లిని
సత్కరింపవలయును. మిగిలిన నాతల్లులు నాయందుఁ గలస్నేహ
మునను ప్రేమమునను పాలించువిషయమునను నాకు సమా
నలే యగుదురుగాన వారలకెల్లరకు నీవు నమస్కరింపవల
యును. నాకుఁ బ్రాణసమానులుసుమీ భరతశత్రుఘ్నులు.
వారిని మిక్కిలి నిసోదరులను బుత్త్రులను జూచుకొనురీతిఁ
గాంచుచుండుము. భరతుఁడనఁగా దేశమునకేకాక మనవంశ
మునకు రాజు ప్రభువునగుఁగాన నీవతని కప్రియకార్యము
నెద్దానిం జేయరాదు. సామాన్యముగా రాజులందఱు తమకను

కూలముగా నడుచుకొనుచు నాలస్యముచేయక ప్రయత్నపూర్వకముగఁ దమ్ము సేవించువారియందే ప్రసన్నులైయుందురు. విపరీతముగ వర్తించువారిపైఁ గోపమూనుదురు. ప్రభువులు ధర్మపత్నియందుఁ బడసినకొడుకులైనను విరోధముగా వర్తించి రేని వదలివేయుదురు. బంధువులుగాకున్న యితరులనుగూడ శక్తిగలిగి హితముచేయువారైనఁ బరిగ్రహింతురు. మంగళాంగీ! భరతుఁడు రాజు గావున నతని కనుకూలముగఁ బ్రవర్తింపకయున్న నెన్నియోకష్టములుగలుగును. అట్లుకాకయుండ ననుసరించి వర్తింపుము. ధర్మనిరతవై సఫలవ్రతముల నాచరించుచు నిందే యుండుము. ప్రేయసీ! నేను గహనముల కరిగెదను. ఆయడవులు నీవంటిస్త్రీ రాఁదగినవి కావు. కనుకనే నీవిక్కడనుండఁదగుదువుకదా. అనుకూలవర్తనము నీకుఁ బ్రధానము. నా యీమాటలు నీమనసున నెలకొనఁదగినవి. అని పలికి యూరకుండెను.

మహాశయులారా! ఈఘట్టమున ననేకవిషయములు విమర్శింపఁదగినవికలవు. వానిని వదలనయితిగాదు.

"దేవకార్యం స్వయం కృత్వా కృతజ్ఞా హృష్టచేతనా,
అభిజ్ఞా రాజధర్మాణాం రాజపుత్రం ప్రతీక్షతే." 8

అని మూలము. ఇందలివిశేషార్థ మిది.

"రాజధర్మాణామభిజ్ఞా అత ఏవ రాజపుత్రం ప్రతీక్షతే."

అని యన్వయక్రమము.

"బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ పరంతప,
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః. 8౧
శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనం,

దానమీశ్వరభావశ్చ క్షాత్త్రం కర్మ స్వభావజం. ౪౩
స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మనిరతస్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు. ౪౫
యదా ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతం,
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః. ౪౬
శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్." ౪౭

గీత. ౧౮ అధ్యా.

అను నీగీతావాక్యప్రమాణము ననుసరించి క్షత్త్రియార్హ
మగు దుష్టనిగ్రహశిష్టపరిపాలనరూపధర్మము నెఱింగినదిగాన
యాలోకమాత రాజపుత్త్రుఁడుగా నున్న భగవంతుని రాకకై
వేచియుండెనని యెఱుంగవలయును. దీనికి హేతువేమనఁగా
నాలకింపుఁడు. "దేవకార్యం స్వయం కృత్వా" దేవతాకార్య
మగు భూభారహరణమును దానే యొనరించి అనఁగా నేకార్య
మేరీతిగాఁ జేయవలయునని యాలోచించి యని భావము.
"కృతజ్ఞా" ఇంతకుముం దెన్నియోసారులు తాను జేసియున్న
యిట్టి యనేకకార్యములనెఱింగి యనవతరము వానినే తలంచు
నది యని భావము. "హృష్టచేతనా" అనఁగాఁ దానొనరింపఁ
బూనినకార్యములెల్ల ఫలించునుగాన సంతోషస్వాంత యయ్యె
నని తాత్పర్యము. ఇట్టు లీశ్లోకమునర్థముం బరిగ్రహింపఁ
గారణమేమి? అన్న ప్రశ్నమునకు సదుత్తరము వినుఁడు. భగ
వంతుఁడు నిర్లిప్తుఁడు కాన నేకార్యము తానే చేయఁబూనఁడు.
తనసాన్నిధ్యమున మూలప్రకృతియే సకలకార్యముల నవలీల
నొనరించుచుండఁ దాఁ జూచుచుండును. ప్రపంచకర్త్రి ప్రకృ

తియే. తత్సంకల్పమే యీజగదోఘము. కావున శ్రీరామమూర్తి తననిర్లిప్తత్వమును దేటపఱుపంబూని తనసంకల్పశక్తియగు సీతాగేహమునకుం బోయెను. ఆమెయుఁ దాఁ జేయఁబూనినకార్యమునకు శ్రీరామాగమనము ఫలముగాన నాపరాత్పరుని రాకకై వేచియుండెను. సర్వదా యానందస్వరూపిణియగు నాసీత యెపుడు వచ్చునా రాముఁడని తలంచుచుండెను. దుఃఖాభినయము ప్రపంచార్థమని యెఱుంగ వలయును.

"జగత్సూతే ధాతా హరిరవతి రుద్రః క్షపయతే
తిరస్కుర్వన్నేతత్స్వమపి వపురీశస్తిరయతి,
సదా పూర్వస్సర్వం తదిదమనుగృహ్ణాతి చ శివ
స్తవాజ్ఞామాలంబ్య క్షణచలితయోర్భ్రూలతికయోః. ౨౪
విరించిః పంచత్వం వ్రజతి హరిరాప్నోతి విరతిం,
వినాశం కీనాశో భజతి ధనదో యాతి నిధనమ్,
వితంద్రీ మాహేంద్రీ వితతిరపి సమ్మీలితదృశా,
మహాసంహారేఽస్మిన్విహరతి సతి త్వత్పతిరసౌ." ౨౬

అను శ్రీశంకరభగవత్పాదాచార్యవర్యకృత సౌందర్యలహరి వాక్యములు పై భావమును దృఢపఱచుచున్నవి. ఇట్టి శ్లోకముల కర్థమును గ్రహించుచో శ్రీరామావతారప్రయోజనము తేటపడును. లేకయున్న శ్రీరాముని పరమేశ్వరత్వము చక్కఁగా నవగతము కానేరదు.

"ప్రహృష్టజనసంకీర్ణం హ్రియా కించిదవాఙ్ముఖః. ౫
అథ సీతా సముత్పత్య వేపమానా చ తం పతిం,
అపశ్యచ్ఛోకసంతప్తం చింతావ్యాకులితేంద్రియం." ౬

అను మొదలగుశ్లోకములయందలిభావమును సీతారాములు మానవత్వము నభినయించి తదనురూపముగాఁ బ్రవర్తించిరనియు, వాస్తవముగా వారి కట్టిదుఃఖము లేదనియు గ్రహింపవలయును. లేకయున్న మున్ను చెప్పియున్న శ్రీరాముని సత్యపరాయణత్వము లోనగునవి యెగిరిపోవును. కనుక నాదంపతులు మానవధర్మము ననుసరించి దుఃఖము నభినయించిరనియే మనము గ్రహింపవలయును

"అద్య బార్హస్పత శ్శ్రీమాన్యుక్తః పుష్యోఽను రాఘవ,
ప్రోచ్యతే బ్రాహ్మణైః ప్రాజ్ఞైః కేన త్వమసి దుర్మనాః." ౯

అనునది సీతాప్రశ్నము. ప్రాజ్ఞులనఁగా

"స్మృతిర్వ్యతీతవిషయా మతిరాగామిగోచరా,
బుద్ధిస్తాత్కాలికీ జ్ఞేయా ప్రజ్ఞా త్రైకాల్యగోచరా."

అను ప్రమాణము ననుసరించి త్రికాలజ్ఞానసంపన్నులని యర్థము. అట్టి బ్రాహ్మణులు పుష్యనక్షత్రము నీకు సకలైశ్వర్యప్రదమని పలికిరిగదా. నీవేటి కిట్లు మతి గౌరవము విడనాడితివని సీత యడుగుచున్నది. దీనత్వమున కవకాశమే లేదే. నీయవతారఫలము లోకములకుం గలిగించుసత్కాలముకదా యిది. ఏల యింక నాలస్యముచేసెదవని మహాప్రకృతి పరమపురుషుని హెచ్చరించుచున్నది.

"ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః,
భూతగ్రామమిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్. ౮
న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ,
ఉదాసీనవదాసీనమసక్తం తేషు కర్మసు." ౯ గీత. ౯ అ.

అను గీతావాక్యముల ననుసరించియు,

"శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం,
న చేదేవం దేవో న ఖలు కుశలస్స్పందితుమపి."

అను శ్రీశంకరభగవత్పాదాచార్యవరోక్తి ననుసరించియు నాలోచింపఁగా, నిర్లిప్తుఁ డగు భగవంతుఁడు ప్రకృతిసహాయమునఁ గాని కార్యనిర్వహణమునకుఁ బూనఁడని తేలెడిని. ఉదాసీనుఁడగుట సర్వసాక్షియే యగు. కావుననే ప్రకృతి యాతనిఁ బురికొలిపెనని తెలిసికొనందగును.

"ఇతీవ విలపంతీం తాం ప్రోవాచ రఘునందనః,
సీతే తత్రభవాంస్తాతః ప్రవ్రాజయతి మాం వనం. ౧౯
కులే మహతి సంభూతే ధర్మజ్ఞే ధర్మచారిణి,
శృణు జానకి యేనేదం క్రమేణాభ్యాగతం మమ." ౨౦

అని మూలము. "విలపంతీం ఉద్వేగేనపృచ్ఛంతీం" అని వ్యాఖ్య. ఏడ్చుచున్నదని యర్థము కాదు. ఆతురంపడి యడుగుచున్నదని యర్థము ఇచ్చోట మహాకవి వాల్మీకి శ్రీరామునిపరమేశ్వరత్వము నానందమయుఁడగుటను దెలుపఁబూని "రఘునందనః" అని ప్రయోగించెను. రఘువంశమున కానందముంగూర్చువాఁడనఁగా లోకోపకార మొనర్చుటయే రఘువంశసంభూతులకుఁ బ్రధానకర్మమని భావము. అట్టికులోచితమహాకార్యము నాచరించువారిం దలంచి పితృదేవత లానందింతురు. ఇచ్చోట శ్రీరాముఁడు తనసర్వజ్ఞత్వమును మాటుపఱచి లోకానుగుణవర్తనము ననుసరించుచున్నాఁడు. స్త్రీలస్వభావ మాతురంపడుట. సీత యాధర్మము నవలంబించి తండ్రి నేమేని దూషించునేమో యని యూహించి సీతాదేవీ! పూజ్యుఁడగు నాతండ్రి నన్ను దవ్వులకుం బంపుచున్నాఁ డనెను. భర్తకుఁ బూజ్యుఁడగువాఁడు

సాధ్వియగు భార్యకుంగూడఁ బూజ్యుఁడే యగును. అసతి యైనచో నీన్యాయము విపరీతమగును.

"సోఽహం త్వామాగతో ద్రష్టుం ప్రస్థితో విజనం వనం." ౨౩

అనునిది శ్రీరామవాక్యము. నిర్జనారణ్యమునకుం బోవనున్న నేను నిన్నుం జూడవచ్చితిని. అనఁగా నీసాయముఁగోరివచ్చితి నని సారము. నిర్గుణుఁడ నగు నేను సగుణుఁడను గావలయునుగదా. కాన నీ చెంత కరుదెంచితినని శ్రీరాము నాశయము. ఇఁక శ్రీ రామమూర్తి సీతకుఁ దెలుపునెపమునఁ గొన్ని మంచియలవా టుల లోకులకుఁ దెలుపుచున్నాఁడు.

"భరతస్య సమీపే తు నాహం కథ్యః కదాచన. ౨౪
బుద్ధియుక్తా హి పురుషా న సహంతే పరస్తవం,
తస్మాన్న తే గుణాః కథ్యా భరతస్యాగ్రతో మమ." ౨౫

అని మూలము. రామమూర్తి యుపదేశించునీతి యిది. ఇది సీతాదేవికొఱకని భ్రాంతిపడరాదు. రాజులు ప్రాయశః పరస్తుతి నంగీకరింపరు. సామాన్యులయందు నిది వర్తించును. సంపదలతో వర్ధిల్లువారు పరస్తుతి నోర్వరు. కావున బుద్ధిమంతులు పరస్తుతుల నొనరించునపుడు చక్కఁగా నాలోచించి వినువారిచిత్తవృత్తుల నరసియే చేయవలయునని యెఱుంగవలయును.

ఈఘట్టమున సీతకు రామమూర్తి తెలుపుధర్మము లన్నియు భరతునిస్వభావమును దెలుపక లోకాచారములనే తెలుపునవియనియు, నొకరిననుసరించి వర్తించునపుడు మిక్కిలి మర్యాదలఁ గోరరాదనియు నీమొదలగునీతులను రామ భద్రుఁడు బోధించెనని మనము గ్రహింపవలయును. "సమా హి మమ మాతరః" అను శ్రీరామవాక్యము మనము మది నిలుపు

కొనవలయును. తల్లులందఱు నాకు సమానలే. అనఁగా వారి యందు నాకు సమబుద్ధిగలదని భావము. దీనఁ గలవిశేష మేమి? కైక నావనగమనమునకుఁ గారణమని లోకులు భావింతురేమో. అయ్యది పొరపాటు. నాకు నుపకారము చేయుటకే యామె యవతరించెను. కాన నాకు నామెయందుఁ గౌసల్యవిషయమున నెట్టిసద్భావమో యట్టిదియే కలదని రాము నభిప్రాయము. దీనిని

"సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహం." ౨౯

అను నీగీతావాక్యము దృఢపఱచుచున్నది.

"భ్రాతృపుత్త్రసమౌ చాపి ద్రష్టవ్యౌ చ విశేషతః,
త్వయా భరతశత్రుఘ్నౌ ప్రాణైః ప్రియతరౌ మమ." 33

అనుమూలము శ్రీరామమూర్తి సద్భావమును దెలుపుచున్నది. భరతుఁడు సీత నడిగియున్న నిత్తునే యన్న వాక్యము రామా యణమునఁ గలదు. దాని నాధారముగాఁ జేసికొని పండితమ్మన్యు లెందఱో విపరీతార్థములు పలికిరి. అవి తుచ్ఛతములనియు రాము నభిప్రాయ మయ్యదికాదనియు నీవాక్యము తెలుపు చున్నది. జానకీ! భరతశత్రుఘ్నుల నిరువురను నీవు సోదరులు గను బుత్త్రులుగను భావింపుము. వారు నాకుఁ బ్రాణములకంటె నధికులుసుమీ యనెను. అనఁగా వారే నాయవతారఫలమును లోకులకుఁ గల్గించినవారిలో నుత్తములు, నాకు భక్తులు నగుదురని రామభద్రుఁడు స్పష్టపఱచెను. ఇట్టితావులఁ జక్కఁగఁ బరిశీలింపక యొక్కొక్కతావునఁ గలభావమును విమర్శించి రాము నభిప్రాయ మిదని తెలుపరాదు.

"సా త్వం వసేహ కల్యాణి రాజ్ఞస్సమనువర్తినీ,
భరతస్య రతా ధర్మే సత్యవ్రతపరాయణా." 32

అని మూలము. సామాన్యార్థము స్పష్టము. కల్యాణీ! జగన్మంగళకారిణివగు నో మహాప్రకృతీ! రాజ్ఞః భరతస్య = రాజగు భరతునకు ననుకూలముగాఁ బ్రవర్తించుచు ధర్మమునం దాసక్తి గలిగి యుండే యుండుము. సత్యవ్రతపరాయణురాలవు కమ్ము. అనఁగా నీవు సర్వవ్యాపకురాలవు. కావున నిందు భరతునకు ధర్మపరిపాలన కార్యమునందుఁ దోడ్పడుచు సత్యవ్రతమునం దాసక్తిగలిగి యనఁగా లోకమున సత్యము నిలుచునట్లు సంకల్పించుచు నిందుండుము. నన్నుఁ గూడియుండుట చే నిందుఁ గలధర్మములకు లోపము రానీయరాదు. కాన నిందు నందును దోడ్పడుమనియే విశేషార్థము. సత్యవ్రతపరాయణత్వము జగమునకు క్షేమముగోరుట ధర్మమునం దాసక్తి స్త్రీలకుఁ బ్రధానములని రామమూర్తి యుపదేశించిననీతులు.

"అహం గమిష్యామి మహావనం ప్రియే త్వయా హి వస్తవ్యమిహైవ భామిని,
యథా వ్యలీకం కురుషే న కస్యచి త్తథా త్వయా కార్యమిదం వచో మమ."

అనుమూలము పైనవ్రాసినభావమునకు బాధాకరము కాదా యని కొందఱందురు. కాదని మన మూహింపవలయును. ఎట్లనఁగాఁ బరికింపుఁడు. ప్రియే భామిని = ప్రియమునే కలిగించు నో కాంతాళలామమా, త్వయా = నీతోడ, అహం = నేను, మహావనం గమిష్యామి = దండకారణ్యములకుఁ బోవుదును. "కస్యచిద్వ్యలీకం యథా న కురుషే తథా ఇహైవ వస్తవ్యం త్వయా. ఇదం కార్యం మమ వచశ్చ కార్యం" ఎవ్వనికేని ప్రియ మేలాగు కలుగకయుండునట్లుగా నీకార్యమునందు వర్తింపుము. ఇదియే

చేయఁదగినది. నామాటయు నిట్టిదియే. అనఁగా నిందెవ్వరికి నప్రియముకలుగకయుండునట్లు నీవు చూచుకొనవలయు. ఈ కార్యమునందేనీవు బద్ధానురాగవై యుండవలయును. ఇదియే నీవు చేయఁదగినపని. నావాక్య మీయర్థమునే తెలుపును. సార మేమనఁగా. ఇచ్ఛాశక్తివిగాన నీవిందుఁ గలవారల కెవ్వరికి నేవిధముగనైన నప్రియము కలుగరాదని సంకల్పింపుము. భరతునియందుఁ గాని మఱెవ్వరియందుఁగాని యెవ్వారికైన నప్రియము కలుగకయుండవలయునని సంకల్పింపుము. ఇకా ర్యమునందే బద్ధానురాగవగుము. నీసంకల్పమున నీసకలకార్య ములు ఫలించును. నీవిపుడు చేయఁదగున దిదియే. నావచన సారముకూడ నిదియే. "ఇచ్ఛామాత్రం ప్రభోస్సృష్టిః" పర మేశ్వరుఁడు సంకల్పించినంతనే యాకార్యము నెఱవేఱును. అనఁగాఁ బరాత్పరుఁడు సంకల్పించును. తదిచ్ఛానుసారమే ప్రకృతి యెల్లకార్యములను క్షణమాత్రమున నొనరించును. నిర్లిప్తుఁడగుభగవంతుఁడు సర్వసాక్షియై యుండును. అనియే యిటఁగలసారమని గ్రహింపవలయును. దీనిచేతఁ బ్రజలకు భరతునియందుఁ గైకేయియందును భరతాదులకుఁ బ్రకృతుల యందు నేలాటియప్రియము కలుగకయుండవలయునని శ్రీరా ముఁడు మూలప్రకృతి కాజ్ఞాపించె ననుభావము సూచితమగు చున్నది. ఇట్టు లీఘట్టమున ననేకార్థములు గలవు. వీనిని గ్రహించిననే శ్రీరామచంద్రతత్త్వము తేటపడును. మానవ మాత్రుఁడు రామమూర్తి యన్నభావము దూరమగును. ఈఘట్టమునఁ గలయధ్యాత్మరామాయణవిషయము పైసర్గము నందు వ్రాసెదను. తరువాతికథను బరికింతము.

## సీత రామచంద్రునకు బదులు చెప్పుట.

* ప్రియమునకే తగి ప్రియముగా మాటలాడునట్టి స్వభావముగల యాసీత వినుట కింపుగానియట్లు కనఁబడు మాటలు శ్రీరామమూర్తి పలుకఁగా స్నేహాభారమున నాగ్రహాము కలదానివలె నటించి ప్రాణనాథున కిట్లనియె. శ్రీరామా! నీవు రాజోత్తమరుఁడవు. ఇప్పని న్యాయసమ్మతముగాదని నీకే తెలియును. నావంటివనితకుంగూడఁ బరిహాసింపఁదగినమాట చెప్పితివికదా ఇదియే చిత్రము. ఇంతదనుక నీవిట్టిమాట నాకుం దెల్పఁగా నేను వినియుండలేదు. [ధనుర్విద్యావిశారదులగు రాజకుమారుల కేమాత్రము తగనిది, అపకీర్తికరమైనదియు నగును. గాన నీయది వినఁదగినదే కాదు. అద్దానిం జెప్పుట యెట్లు?] ప్రాణేశా! తల్లిదండ్రులు సోదరులు కొడుకులు వారిభార్యలు వీరెల్లరుతమతమసుకృతదుష్కృతముల ననుభవించుచుఁ దత్ఫలభూతములగు శుభాశుభరూపకర్మముల నాచరింతురు. భార్య యనఁగా భర్తకు సగము శరీర మనఁదగినది. కనుక ఆమె యొక్కతుకయే భర్తకుఁ గలుగుభాగ్యములనే తాను ననుభవించుచున్నది. కావున నిన్ను వనముననుండ శాసించుటచేతనే నన్నుఁగూడ శాసించినట్లే కదా. స్త్రీలకు గతి తల్లిదండ్రులు తనయులు చెలికత్తియలు కారు. వారు తమకుఁ దమరే స్వతంత్రలు కానేరరు. వారికి భర్తయొక్కఁడే యిహాపరలోకముల యందు సర్వకాలము గతియగు. మఱొక్కఁడు కాఁడు. రాఘవేశ్వరా! నీవు మహారణ్యములకుఁ బ్రయాణమగుదువేని నేను

* ఇయ్యది యిరువదేడవసర్గమునుండి గ్రహింపఁబడినది. అధ్యాత్మ రామాయణమునఁ గలసార మిందు వివరింపఁబడును.

నీపురోభాగమునందుఁ గుశకంటకముల నడఁగఁ ద్రొక్కుచుఁ బోయెదను. వెనుక నరుదెంచు నీవు వానిపై సుఖముగా నడుగులిడవచ్చును. నావంటిస్త్రీ నొంటరిగా నడవులకుఁ దీసికొని పోయి కాపాడుటెట్లని నీవంటిశూరాగ్రణి భయంపడరాదు. రావలదన్న వచ్చుచున్న దేయనియు,నన్ననుసరించి యీమె చరితార్థురాలగుచున్నదనియు నీవూహించి యౌార్వ్యమిగలవాఁడవైనను, నామాటవినక వనముల ఫలమూలాదుల భక్షింప సాహసించుచున్నదికదా యని రోషమొందినను, ఉచ్ఛిష్టోదకమును వదలునట్టు లాభావములఁ బరిత్యజించి నాయందు విశ్వాసము నిచి నన్నుఁగూడఁ దీసికొనిపొమ్ము. నీవట్టు లొనరించిన నాకుఁ బతి నెడఁబాసి జీవించుపాతకము కలుగదు.

శ్రీరామచంద్రా! దివ్యసౌధములవదలి మహారణ్యములకు రానేల? అని యనకుమా. సౌధాగ్రములయందును విమానములయందు నుండుటకంటె అణిమాద్యష్టసిద్ధులం గాంచి యాకసమునఁ దిరుగుటకంటె సర్వావస్థలయందును భర్తను గూడి పాదసేవ చేయుచునుండుటయే యుత్కృష్టకార్యము. పతివిషయమున నెట్లు వర్తింపవలసినదియు నాతల్లిదండ్రులు బహుభంగులుగా బోధింప నెఱిఁగియున్నదానను. కనుక నెవ్వరు నాకావిషయము నిపుడు నేర్పనక్కఱ లేదు. అరణ్యము ప్రవేశింప సాధ్యముకానిదనియు, నిర్జనమనియు, వ్యాఘ్రాది జంతునిబిడమనియు నెఱింగియుఁ దప్పక నిన్నుఁగూడి యచ్చటికి వత్తును. ఈపట్టుదల శ్రమముకలిగించునదియేకాని సుఖకరము కాదే యని పలుకుదువేమో. శ్రీరామా! త్రిలోకాధిపత్యము లభించినను నేను లెక్కింపక భర్తృశుశ్రూషావ్రతముతప్పు

నితరము నూహింపక జనకగృహమున నున్నయట్లు నిన్నుంగూడి యడవుల సంతోషముతో నుందును. శూరాగ్రేసరా! నిరంతరము నీకు శుశ్రూష లాచరించుచు నింద్రియనియమము నూని దానిచేఁ గామమును భోగములను వర్జించి మకరంద పరిమళముల విలసిల్లు కాననములందు నిన్నుంగూడి విహరించు చుందును. మర్యాదాపరిపాలకా! అనన్యశరణ్యులగు నితరులఁ గూడ నడవుల బాలింపఁజాలిన నీవు నన్నుఁ బాలింపఁజాలవా? ఆవిషయము చెప్పనేల? ఇపుడు నీతోడ నడవులకు వత్తును. సందేహము లేదు. రాఁదలఁచిన నన్ను నిట నిలుప నీకును శక్యముకాదు.

మంచియాహార మట లభింపదే. ఏల వత్తువందువేమో. నేనందు ఫలమూలములను గందములను దినుచునుందును. మంచియాహారము నాకునక్కఱలేదు. ఆహారమునందును బానమునందును నీకు నేను గష్టమును గల్గింపక కూడియుందును. మహాబుద్ధిశాలివి. ప్రాణేశ్వరుఁడవు. నీవు సూడనుండ నేను భయలేశమైన లేక యటఁగల నదులను గొండలను నీటిపట్టులను గాననముల నన్నింటిని గనుఁగొనఁ గోరుచున్నాను. మహాశూరుఁడవగు నిన్నుంగూడి యేభీతియులేక మిగుల సుఖముగా హంసకారండవాదిజలపక్షినిబిడములై వికసించినపూవులుగలిగి సొంపుగూర్చుచున్నసరస్సులను గన్నులపండువుగాఁ జూడఁగోరుచున్నాను. దృఢయత్నమూని యాసరస్సుల జలకములాడెదను. స్నానార్థముష్ణోదకములను వాంఛింపను. అట్టికమలాకరముల యందు నిన్నుఁగూడి మహానందమునఁ గ్రీడింతును. వనము నందు నిట్లు నిన్నుఁ గూడి కాలము పుచ్చితినేని లక్షవత్సరము

మైనను నాకుఁ దెలియకయుండును. పదునాలుగేండ్లనఁగా నిఁక నెంత? నీవు లేనిస్వర్గమునుగూడ నేనుగోరను. పురుషోత్తమా! స్వర్గసుఖవాసము లభించినను నీవు లేకయున్న నేను దాని నొప్పుకొనను.

శ్రీరామభద్రా! అరణ్యము ప్రవేశింపరానిదేయైనను, వానరములు గజములు లోనగుమృగములుండినను, భయంపడక వచ్చెదను. నీముమున నీపాదములఁ జేపట్టి జనకునింటనుండునట్లు హాయిగా నుందును. నీపాదముల నాశ్రయించిన నాకు భీతి యెట్టిది? నీయందుఁ దక్క వేఱొకచో మనస్సు నునుపనిదానఁ గదా. మహానురాగము నాకు నీయందే కలదు. నన్ను వదలి పోయితివేని మృతినొంద నిశ్చయించుదానను. కాన నన్నడవికిఁ దీసికొనిపొమ్ము. నావేఁడికో లంగీకరింపుము. నాతాకవలనఁగాని నావలనఁగాని నీకేమాత్రము భారము కలుగదు. పురుషులలా ముఁడగు శ్రీరామమూర్తి ధర్మప్రియుఁడు కావునఁ దనయర్ధాంగి శ్రమములకునోర్వక యామె యెంత వేఁడుకొనుచున్నను వన గమనమున కంగీకరింపకపోయెను. ఆమె నందే నిలుపుటకు వన వాసశ్రమములఁ బెక్కింటిని దెలిపెను.

మహాభక్తులారా! ఈభాగమునఁ బెక్కురహస్యవిషయ ములు గలవు. వానిని విమర్శింతము. ఇందు సీతపలికినమాటల వలన బాహ్యదృష్టిం బరిశీలించిన విపరీతముగాఁ దోఁచును. శ్రద్ధమైఁ బరిశీలించిన నాదేవి మహామాయ యనియు జగ దుద్ధరణముకొఱకు నవతరించెననియుఁ దేటపడును. కావున నోపికగఁ బరికింతము.

"ఏవముక్తా తు వైదేహీ ప్రియార్హా ప్రియవాదినీ,
ప్రణయాచ్చైవ సంక్రుద్ధా భర్తారమిదమబ్రవీత్." ౧

అని మూలము. ప్రియములకే తగినది. అనఁగా నాశ్రయింపఁ దగినది. విరోధించి సాధింపరానిదనుట. ప్రియముగా మాట లాడునది. అనఁగా వరములనొసంగుటయే యామెమాటలు. అట్టి యాసీత పరమపురుషుఁ డిట్లు నీవిందే నిలువవలయునని పలుక (నవ్వి ప్రణయవాక్యములగుట) వానితత్త్వ మెఱింగినది కానఁ బ్రణయమువలననే కోపమూని యిట్లు పలికెను. 'భర్తా ర'మ్మనుసార్థకపదము మహాకవి ప్రయోగించెను. తన్ను భరించు వాఁడు. అనఁగాఁ బ్రకృతిపురుషుల కవినాభావసంబంధమనుట. తన్నెల్లప్పుడు భరించువాఁడు. తనమూలముననే రూపవంతుఁ డగుననుట. కావుననే స్నేహాతిశయమునఁ గోపమూని సీత రామచంద్రున కిట్లు బదులుచెప్పెను. రామునివాక్యము లెట్లు గూఢార్థములుగ నుండునో సీతవాక్కు లట్లే యుండునని మన మెఱుంగవలయు.

"కిమిదం భాషసే రామ వాక్యం లఘుతయా ధ్రువం,
త్వయా యదపహాస్యం మే శ్రుత్వా నరవరాత్మజ."

అని మూలము.

"లఘుతయా ధ్రువం వాక్య మిదం కిం భాషసే."

అని యన్వయము. చక్కఁగా నాలోచింపక ఏల యిట్లు పలుకు చున్నావు? రాజేంద్రపుత్త్రుఁడవుకదా! నాకుఁగూడ నీమాట నవ్వు పుట్టించుచున్నదే. శ్రీరామా! ఏమి యీలోకవిడంబ నము? అనఁగా నేను లేక నీవే కార్యము నిర్వహింతునను చున్నావే యింతకంటెఁ బరిహాసపాత్రమగు వాక్కుగలదా? అని భావము. నిర్గుణుఁడవు సర్వసాక్షివి అగునీవు ప్రకృతి నగు నాసహాయములేక యేపని చేయఁగలవు?

"ఉదాసీనవదాసీనమసక్తం తేషు కర్మసు"

అను భగవదుక్తి ననుసరించియు,

"శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం,
నచేదేవం దేవో న ఖలు కుశలస్స్పందితుమపి."

అను శంకరభగవత్పాదాచార్యోక్తి ననుసరించియు నాలోచింపఁగా, నిర్గుణుఁడు సగుణుఁడై నఁగాని అనఁగాఁ బ్రకృతి విశిష్టుఁడై నఁగాని యేపనియుఁ జేయఁజాలఁడనుసారమును గ్రహింపవలయును. ఈయర్థము. "యదపహాస్యం మే" అన్నవాక్యమున నిమిడియున్నది.

"ఆర్యపుత్ర పితా మాతా భ్రాతా పుత్రస్తథా స్నుషా,
స్వాని పుణ్యాని భుంజానా స్వం స్వం భాగ్యముపాసతే. 3
భర్తుర్భాగ్యం తు భార్యైకా ప్రాప్నోతి పురుషర్షభ,
అతశ్చైవాహమాదిష్టా వనే వస్తవ్యమిత్యపి. ४
న పితా నాత్మజో నాత్మా న మాతా న సఖీజనః,
ఇహ ప్రేత్య చ నారీణాం పతిరేకో గతిస్సదా." ౫

అని మూలము. ఈసంభాషణమూలమున సీతాదేవి లోకమునఁగల స్త్రీలకు ధర్మోపదేశము చేయుచున్నది. తల్లిదండ్రులు లోనగువారు తమరు చేసికొన్న పుణ్యపాపఫలముల ననుభవించువారు. భార్య యొక్కతుకయే పతిభాగ్యమునే పొంద నర్హురాలు. కావున నిన్నడవికిఁ బొమ్మనుమాటయందే నన్నుఁగూడ నడవికింబొమ్మను నర్థ మిమిడియున్నది. సీతను బిలుచుకొనిపొమ్మని వేఱుగాఁ జెప్పనక్కఱలేదు. స్త్రీలకు గతి యీలోకమునందుఁ బరలోకమునందుఁ బతియే గతి. అనువిషయమే యిటఁగలసారము.

"నాస్తి స్త్రీణాం క్రియా మంత్రైరితి ధర్మే వ్యవస్థితిః,
నిరింద్రియా హ్యమంత్రాశ్చ స్త్రియోఽనృతమితి స్థితిః. ౧౮
భర్తుశ్శరీరశుశ్రూషాం ధర్మకార్యం చ నైత్యకం,
స్వా చైవ కుర్యాత్సర్వేషాం నాస్వజాతిః కథంచన." ౮౬

మను. ౯ అధ్యా.

మనుస్మృతి మొదలగు ప్రమాణగ్రంథముల ననుసరించి మన మాలోచించిన నీసీతోపదిష్టధర్మములే స్మృతులయందును బురాణాదులయందును గలవని తేలెడిని. ప్రకృతిపురుషు లెట్లు ప్రవర్తింతురో యట్లే భార్యాభర్తలు ప్రవర్తింపవలయును. ఈశ్లోకమున నీయుదాహరణమును గొని భగవత్తత్త్వము నెఱుంగందగును. అనఁగా భార్య గృహకార్యములనెల్ల నిర్వహించును. పతియనుమతిమాత్రము గలిగియుండును. ధర్మకార్యములనెల్ల నామెయే నడపించును.

"అపత్యం ధర్మకార్యాణి శుశ్రూషా రతిరుత్తమా,
దారాధీనస్తథా స్వర్గః పితౄణామాత్మనశ్చహ." ౨౮ మను ౯ అధ్యా.

("ధర్మకార్యాణి అగ్నిహోత్రాదీని' అని కుల్లూకభట్టువు.) అను నీమనుస్మృతి ననుసరించి భార్యయే గృహకార్యములనెల్ల నాచరింపవలయును. ప్రకృతి పరమపురుషు నాజ్ఞ నొందునట్లు భార్య భర్తయనుమతినిమాత్రము కైకొనవలయును. అట్లుప్రవర్తించిన కుటుంబ మెంతహాయి ననుభవించునో వచింపవలయునా? పతిని విడిచిన గతి స్త్రీలకు లేదనున దొక్కటియే యిందుఁ బ్రధానము. భరతఖండమున నీధర్మమే సనాతనము. అది సడలినచో నన్నిధర్మములు నశించినట్లే యనవచ్చును. ఇక్కాలమునఁ గ్రమముగా నీయుత్తమధర్మము నశింపఁజేయుయత్నములు

సాగుచున్నవి. కాని కొంతకాలమున కీప్రయత్నములు ఫలింపక యథాపూర్వపద్ధతి చేకూరునని మనము నమ్మవలయును.

"యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత,
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహం." 2 గీత. ౪ అ.

అను నీ శ్రీకృష్ణపరమాత్మోపదేశము వ్యర్థము కాదుకదా.

"ఈర్ష్యారోషౌ పరిత్యజ్య భుక్తశేషమివోదకం,
నయ మాం వీర విస్రబ్ధః పాపం మయి న విద్యతే." 2

అని మూలము. ఇందొక్కనీతియు సదాచారము కలదు. పతి శ్రమంపడుచుండఁగా భార్య యాకష్టమునఁ బాల్గొనక తానింట నుండుట తగదనునదియే నీతి. త్రాగిననీటిని బాఱఁబోయవలయు ననునది సదాచారము. భోజనాదికాలములయందు నీటిని గొంత త్రాగి కొంత మఱొకసారి త్రాగుట దురాచారమని మనము గ్రహింపవలయును. ఈస్థలమునఁ గలసారమేమనఁగా, శ్రీరామా! నిశ్శంకముగా నన్నుఁ బిలుచుకొని పొమ్ము. నాయందుఁ బాపము కలుగదు. వదలిపోయితివేని పాపము కల్గును. పతివ్రత పతి నెడఁబాసి యుండరాదని భావము. వనములకు నన్నుఁ బిలుచుకొనిపోవుట కనుమానింపకుము. అనఁగా నామూలముననే నీయవతారఫలము సాగవలయునని సారము.

"అనుశిష్టాస్మి మాత్రా చ పిత్రా చ వివిధాశ్రయం,
నాస్మి సంప్రతి వక్తవ్యా వర్తితవ్యం యథా మయా." ౯

అని మూలము. రామచంద్రా! నాతల్లిదండ్రులు పతి నేయేవిధముల నాశ్రయింపవలసినదియు ననఁగా సేవింపవలసినదియు నాకుఁ దెలిపిరి. మరల నాకెవ్వరు నుపదేశింప నక్కఱలేదు.

"ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ,
ప్రతీచ్ఛ చైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా."

అనువాక్యలరూపమున నన్ను నీకొసంగునపుడు పలికిరని భావము. ధర్మాచరణమున నాసాయము నీకత్యంతావసరమనియే సారము. పురుషుఁడెట్టిధర్మకార్యములు చేయుచున్నను భార్యం గూడియే చేయవలయునని స్మృతులాజ్ఞాపించుచున్నవి. భార్యను వదలి చేసిన సత్ఫలదములు కావనియేకదా యిందుఁగలయాశయము. కావున నన్ను వదలి యొట్లడవుల కరుగుదువని సీత ప్రశ్నించుచున్నది. ఈప్రశ్నము ప్రకృతిపురుషులకుం గలయవినాభావసంబంధమును దేటపఱచుచున్నది.

"అహం దుర్గం గమిష్యామి వనం పురుషవర్జితం,
నానామృగగణాకీర్ణం శార్దూలవృకసేవితం. ౧౦
సుఖం వనే నివత్స్యామి యథైవ భవనే పితుః,
అచింతయంతీ త్రీన్ లోకాన్ చింతయంతీ పతివ్రతం. ౧౧
శుశ్రూషమాణా తే నిత్యం నియతా బ్రహ్మచారిణీ,
సహ రంస్యే త్వయా వీర వనేషు మధుగంధిషు." ౧౨

అని మూలము. రామమూర్తి పూర్వసర్గమున

"కులే మహతి సంభూతే ధర్మజ్ఞే ధర్మచారిణి"

అని సంబోధించి

"వస్తవ్యం దండకే మయా ప్రస్థితో విజనం వనమ్"

అని సెలవిచ్చెను. నిర్జనారణ్యముల కరుగుచున్నాఁడ వనఁగా నవి భయంకరములుగా నుండుననియేకదా రామునిభావము. దానికిట సీత బదులిడుచున్నది.

"చింతయంతీ పతివ్రతఖ్ త్రీకాలాశా నచింతయంతీ శుశ్రూషమాణా నియతా బ్రహ్మచారిణీ."

అనునదియే "ధర్మజ్ఞే ధర్మచారిణి" అనుదానికి సమాధానము. ఇంక నిందుఁగలవిశేషమేమి ? పురుషశబ్దము మానవజాత్యుప లక్షణము. రామచంద్రా! సింహవ్యాఘ్రాదులగుక్రూరజంతువులు నావాహనములు సుమీ నాకడ నవి పరమసాధుజంతువులే యని యెఱుంగుము. తండ్రియింట నున్నయట్లే యుందును. అనఁగా శివశరాసనవ్యాజమున నీయాగమనమును గోరుచుం టిని. అట్లే యడవులయందు నీయాగమనము కోరుకార్యమున నాసక్తురాల నయియే యుందును. అనఁగా రావణాసురునింట నిన్ను రప్పించుటకే యుందును. అదియు నానామృగగణా కీర్ణమే. సింహవ్యాఘ్రాదిక్రూరజంతుసాంద్రమే. అనఁగా భయం కరజంతువులు దానవులకు వాహనములు. తక్కినవి వారి భక్ష్య ములు. కావున నయ్యదియు వనసమానమే. అదియు నిర్జనమే. దుర్గమమే. అయిననందు సుఖముగా నుందును. నేనుండినఁగాని నీవు రావలనుపడదనిసారము. నియతురాలనై యనఁగా నొక్క సంవత్సరకాలమున రాక్షసులఁ జంపవలయునన్నపట్టుదలకల దాననై యని భావము. బ్రహ్మచారిణి అనఁగా భగవంతుం గూడియే చరించుదానను. అనఁగా నిన్ను వదలనని భావము. అది యెట్లు? నీవెంటనుండియు నితరులకు రావణునింట నున్న యట్లు కనఁబఱచుచు నందు నిందును సుగ్రీవాదులయందు నెల్లెడల వ్యాపించియుందునని భావము. పరమాత్మవగు నీవెట్లు సర్వాంతర్యామివో నేనట్లే యని సారము. వీరుఁడవగు నిన్నుం గూడి విహరింతును. అనఁగా నీవు వెంటనున్నఁజాలును. దుష్ట రాక్షసులఁ ద్రుంతునని భావము. ఈయర్థ మెట్లు పొసఁగునందు

లేని "వీర" అనుసంబోధన మిందుఁగలదు. వీరుఁడవగు నీతోఁడ
విహరింతుననఁగా నీచెంతనుండి నేనే వీరవిహారము సలుపుదునని
భావము. ఇట "మధుగంధిషు వనేషు త్వయా సహ రంస్యే" అని
కలదు. ఇందొక్క విశేషార్థ మిమిడియున్నది. వసంతర్తువునందుఁ
బరదేవి నుపాసింతురు. ఆదినములు పరమేశ్వరికి సంతోషదాయ
కములని వారిభావము. శరన్నవరాత్రములు యుద్ధదినములు.
వాసంతనవరాత్రములు విహారదినములు. నవరాత్రములనఁగాఁ
దొమ్మిదినిశలే యనికాదు. వసంతర్తువునందు దేవి నారాధించు
వారు యథాశక్తి న్యాయము ననుసరించి యారాధింతురు.
వసంతర్తువంతయు నామహాకార్యమునందే యాసక్తులై యుం
దురు. అట్టి యారాధనము భక్తులకు విశేషఫలదాయకమగును.
ఆకాలమునందే యాటవికులు దేవియాగము చేయుదురు. వారు
కూడ నాదినములు పరమాహ్లాదకరములని భావించియే దేవికి
జాతర చేయుదురు. కావున దండకారణ్యవాసులకెల్లరకు దర్శన
మొసంగి వారి నుద్ధరించుటకు వారివలనఁ బూజలంది నినుఁ
గూడి విహరింతు ననునాశయమును సీత వెలిపుచ్చెను.
మహాకవిపదములకూర్పెంత సరసముగ నున్నదో మహాశయులు
గ్రహింతురుగాక.

"లౌకికానాం హి సాధూనాం మర్థం వాగనుధావతి,
ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి."

యన్న మహాకవిప్రయోగము వ్యర్థము కాదుకదా. ఇట్టు
లీఘట్టమున నర్థవిశేషములఁ బరికింపవలయును.

"త్వం హి శక్తో వనే కర్తుం రామ సంపరిపాలనం,
అన్యస్యాపి జనస్యేహ కింపునర్మమ మానద."

"సహ త్వయా గమిష్యామి వనమద్య న సంశయః,
నాహం శక్యా మహాభాగ నివర్తయితుముద్యతా." ౧౪

అని మూలము. విశేషార్థ మిం దిట్లు గ్రహింపఁదగు. మానద! మర్యాద నొసంగువాఁడవు. ఏయేభక్తు లెంతమర్యాద కర్హులో వారి కంతమర్యాద నిత్తువు. వారిని గాపాడుదువు. "కింపు నర్మమ" నామాట చెప్పనేల? అనఁగా సకలభువననిర్మాణపరిపాలన సంహారరూపమర్యాద నాకొసంగితివి. నీవిచ్ఛగించినంతన నొక్కక్షణమాత్రమున నేనెల్ల కార్యముల నొనరించుచున్న దానను. అట్టి నన్నుఁ బాలింప నేల యనుమానించి రావల దందువని సీత ప్రశ్నించుచున్నది. మహాభాగ! శ్రీరామా! కావున నిన్నుఁగూడి యడవికి వత్తును. సంశయమే లేదు. "ఉద్యతాహం నివర్తయితుం న శక్యా" నాఁదలంచిన నన్ను మరలింప శక్యమే కాదు. అనఁగా నాసంకల్ప మమోఘమని యెఱుంగుము. ఈవాక్యము సీతాదేవి మహామాయయే యని స్థిరపఱచుచున్నది. కొందఱీవాక్యము సీతాపాతివ్రత్యమునకు భంగమని పలుకుదురు. "సహ త్వయా గమిష్యామి" అన్నవాక్య మేల ప్రయోగించెనో మహాకవి యని వా రెఱుంగరు. భగవత్సాన్నిధ్యమున భగవతి యేకార్యమునైనఁ జేయఁజాలునని మన మెఱుంగవలయు.

"హరిస్త్వామారాధ్య ప్రణతజనసౌభాగ్యజననీం,
పురా నారీ భూత్వా పురరిపుమపి క్షోభమనయత్."

అని మహాత్ము లుపదేశించిరి. పరమేశ్వరు నిచ్ఛాశక్తి నారాధించియే త్రిమూర్తులు సృష్టిపాలనసంహారక్రియాదక్షులైరని మన మెఱుంగవలయును.

"ఫలమూలాశనా నిత్యం భవిష్యామి న సంశయః,
న తే దుఃఖం కరిష్యామి నివసంతీ సహాత్వయా.　　౧౫
ఇచ్ఛామి సరితశ్శైలాన్ పల్వలాని వనాని చ,
ద్రష్టుం సర్వత్ర నిర్భీతా త్వయా నాథేన ధీమతా."　　౧౬

అని మూలము. భగవతి యారాధనక్రమము నుపదేశించుచున్నది. ఆరణ్యమే కాంతస్థలము. అనఁగా నుపాసనార్హము. భక్తుఁడు పరమైకాంతస్థలమునఁ గూరుచుండి యభీష్టదైవము నారాధింపవలయును. భక్ష్యభోజ్యాద్యమూల్యపదార్థములు లేక పోయెఁగదా యని కొఱంతనొందఁ బనిలేదు. దొరకినపదార్థములనే సమర్పింపవచ్చును. దాన నిష్టదైవ మానందించును. జపయోగ్యస్థలములు మహానదులు పర్వతాదులు. అందుపాసకునకు విఘ్నములుగలిగించువా రుండరు. కావుననే సీతాదేవి పర్వతనదీప్రముఖస్థలముల నిన్నుఁ గూడి విహరింతునని తెలిపెను. కావున భగవతి కేయేస్థలములు విహారార్హములో ఆస్థలములయందే భక్తుఁడు నిలిచి దృఢభక్తి నారాధించిన నాదేవి సంతుష్టురాలగు. భక్ష్యవిశేషములు లేవని కొఱంతపడువాఁడు భక్తుఁడు కాఁడు.

"ప్రదీపజ్వాలాభిర్దివసకరనీరాజనవిధి
స్సుధాసూతేశ్చంద్రోపలజలలవైరర్ఘ్యరచనా,
స్వకీయైరంభోభిస్సలిలనిధిసౌహిత్యకరణం
త్వదీయాభిర్వాగ్భిస్తవ జనని వాచాం స్తుతిరియం."

అని శ్రీశంకరభగవత్పాదాచార్యులవారు తెలిపిరి. కావున నభీష్టదేవతను విజనస్థలమునఁ గూరుచుండి యుపాసించి యందు దొరకినపదార్థముల నర్పించుచు నారాధింపవలయును. అద్దియే

చక్కనిసేవ. అట్టివానిపై నిష్టదేవత యించుకయే నాగ్రహింపక పరమానందమున వాని నుద్ధరించును. అను నీరహస్య విూ ఘట్టము మనకుఁ దెలుపుచున్నది. "త్వయా ధీమతా నాథేన నిర్భితా" "బుద్ధిమంతుఁడవు నాథుఁడవునగు నీతో" అనునర్థము నిస్సారము. ఇంగితజ్ఞుఁడవని యర్థము చెప్పవలెను. అనఁగా నాయత్నము నెఱింగినవాఁడ వనుభావము తేలెడిని. అట్టినాథుఁ డవు నీవు చెంతనుండఁగా నిర్భయముగా నన్ని కార్యములు సాధింతునని సీతాహృదయము.

"హంసకారండవాకీర్ణాః పద్మినీస్సాధుపుష్పితాః,
ఇచ్ఛేయం సుఖినీ ద్రష్టుం త్వయా వీరేణ సంగతా. ౧౭
అభిషేకం కరిష్యామి తాసు నిత్యం యతవ్రతా,
సహ త్వయా విశాలాక్ష రంస్యే పరమనందినీ." ౧౮

అని మూలము. ఉపాసకుఁడు సాధువులగుపత్త్రులం గాంచుచు భగవత్సారాధనమునకు యోగ్యములగుపద్మములుగల కమలాకరములం బరికించుచు మనస్సంతోషము గలిగియుండవల యును. ఆరాధనవిశేషమునకు హోమమునకుఁ గమలములు మిక్కిలి యోగ్యములు. ఇష్టదేవతను గమలములఁ బూజించుచు హోమమును గమలములతోఁ జేసిన మంత్రసిద్ధి యగును. అందు నాదిమదంపతులను బూజించుట యత్యుత్తమము.

"ఇయమంబా జగద్ధాత్రీ పురుషోఽయం సదాశివః."

అన్నభావమున సంసారయాత్ర సాగింపవలయునని చెప్పఁబడి నది. సగుణోపాసనమునందు నిష్టదేవతారాధనమున సతీపతు లను బూజించు టత్యుత్తమమని పెద్దలమతము. కమలాకర

ముల స్నానముచేయుటయు మంచిది. ఈయర్థ మీఘట్టము
నుండి గ్రహింపవలయును.

"ఏవం వర్షసహస్రాణాం శతం వాహం త్వయా సహ,
వ్యతిక్రమం న వేత్స్యామి స్వర్గోఽపి న హి మే మతః." ౧౯

అనునీమూల ముపాసకుని మంత్రసిద్ధిరూపానందమును దెలియఁ
జేయుచున్నది. యోగి భగవత్తేజోరూపమును హృదయాకాశ
మునఁ గాంచుచు శతవర్షములు, సహస్రవర్షములు మేను
మఱచియే యుండును. ఆయానందము ననుభవించుయోగి
స్వర్గసుఖమును దలంపనైనఁ దలంపఁడు. పరమేశ్వరుఁ డానంద
రూపుఁడు భక్తుఁడు తన్మయుఁడై యానందమయుఁడే యగును
గదా. ఆస్థితియందా యోగికిఁ గాలపరిమితి తెలియకయుండును.

"ధన్యానాం గిరికందరే నివసతాం జ్యోతిః పరం ధ్యాయతా
మానందాశ్రుజలం పిబంతి శకునా నిశ్శంకమంకేశయాః,
అస్మాకం తు మనోరథోపరచితప్రాసాదవాపీతట
క్రీడాకాననకేలికౌతుకజుషామాయుః పరం క్షీయతే." ౧౦౨

అనియు,

"కౌపీనం శతఖండజర్జరతరం కంథా పునస్తాదృశీ
నిశ్చింతం సుఖసాధ్యభైక్ష్యమశనం శయ్యా శ్మశానే వనే,
మిత్రామిత్రసమానతాతివిమలా చింతాథ శూన్యాలయే
ధ్వస్తాశేషమదప్రమాదముదితో యోగీ సుఖం తిష్ఠతి." ౧౦౦

అనియు భర్తృహరి బోధించియే యున్నాఁడు. కావున నే
భక్తునిమనస్సు కాలభేదమును గనుఁగొనక యిష్టదేవతాజ్యోతీ
రూపమునే కాంచుచుండునో యాతఁడే యోగి, అతఁడే
సిద్ధుఁడు. ఇదియే మంత్రసిద్ధికి లక్షణము. అనువిషయ మీ

భాగమునుండి మన మెఱుంగవలయును. ఇం దొక్క విశేషము కలదు. ఉపాసకుఁడు స్వేష్టదేవతారూపమును ధ్యానించుపద్ధతి యెట్టిదని యెఱుంగుటయే విశేషము. కేవలస్తోత్రములు పఠించుట దేవతాచరిత్రములు పారాయణముచేయుట యనునవి సిద్ధి నీయఁజాలవు. ధ్యానమే మంత్రసిద్ధి నీఁజాలును. బాహ్యపూజాదులు ప్రారంభమునఁ బనికివచ్చును సర్వదా వానినే యాచరించుచుండిన నిరర్థకము. కనుకనే శ్రీశంకరాచార్యుల వా రిష్టదేవతాధ్యానలక్షణము నిట్లు తెలిపియున్నారు.

"సుధాసింధోర్మధ్యే సురవిటపివాటీపరివృతే
మణిద్వీపే నీపోపవనవతి చింతామణిగృహే,
శివాకారే మంచే పరమశివపర్యంకనిలయాం
భజంతి త్వాం ధన్యాః కతిచన చిదానందలహరీం."

ఆరాధనక్రమము రెండువిధములు. సమయాచారమని కౌళాచారమని వానిపేరులు. సమయాచారమనఁగా ఆంతరపూజానిరతి. కౌళాచారమనఁగా బాహ్యపూజానిరతి. సమయమతమే యోగమతము. అందు నిష్టదేవతాధ్యానమే పూజ యని యెఱుంగవలయు. అట్టివారు సిద్ధిగాంచుట యనఁగా నిరంతరము ధ్యేయవస్తువును దేహోమయముగాఁ జూచుటయే. అవ్యయానంద మనుభవించుచు బాహ్యప్రపంచమును మఱతురు. ఆస్థితి నుండువారలకు స్మృత్యుదితాచారములు పనికిరావు. దివానిశములభేదములుకూడ వారెఱుంగరు. ఆస్థితి కలుగుటకే సిద్ధి యని పేరు.

దేవాలయములయందుఁగల పాషాణాదిప్రతిమల నారాధించినవారికి ఫలము ప్రసాదమే. ప్రసాదమనఁగా దయ యని

కాదు ఆహారపదార్థమే. వంచకులు కొందఱు విగ్రహములం జూపి యిది యనాదియని వినుతించి ధనము నార్జింతురు. అట్టి కపటనాటకసూత్రధారులగు కుయోగులవేషమునకు మోసపోవక భగవంతుని ధ్యానింపవలయును. కొంతకాలమునకా ధ్యానమే మనోనిర్మలత్వమునాపాదించును. భగవదనుగ్రహమద్దాననే కలుగును. నిరంతర మాయోగి పరమేశ్వరు నిష్టరూపుని ధ్యానించును. ఈపూజయం దాసక్తులగువారలకుఁ దుచ్ఛబుద్ధులకుఁ గలదేవతాభేదము లుండవు. కావున ధ్యానముత్తమోత్తమము.

"అహం గమిష్యామి వనం సుదుర్గమం మృగాయుతం వానరవారణైర్యుతం,
వనే నివత్స్యామి యథా పితుర్గృహే తవైవ పాదావుపగృహ్య సంయుతా.

ఈమూలమునకు గోవిందరాజులు విశేషార్థము వ్రాసిరి.

"అత్రేదమవధేయం. వనే మారీచమృగో భవిష్యతి; తత్ప్రసంగేనావయోర్వియోగస్స్యాత్. తత్ర కో వా పునర్ఘటకః? కథం త్వం తు మయా వినా స్థాతుం శక్తాసీతి చింతయంతం రామం ప్రతి సీతా సూచయతి వానరవారణైరిత్యాది. తథాహి.—మృగో మారీచః వానరవారణైర్వానరశ్రేష్ఠైః, సుగ్రీవాదిభిః పునర్వనగ్రహణాద్వనేఽపి అశోకవనేఽపి వత్స్యామి. పునస్తవైవ పాదావుపగృహ్య సంయుతా నియతా భవిష్యామీతి."

ఇది వారివ్యాఖ్య. దీని నించుక విమర్శింతము. వనములకు సీతను బిలుచుకొనిపోయిన మృగరూపమున మారీచుఁడు వచ్చును. వానిమూలమున నాకును సీతకు వియోగము సంభవించును. నన్ను వదలి యెట్లుండఁగలదు? అని యాలోచించుచుండు శ్రీరామునకు సీత సూచించుచున్నది. ఏమని? అశోకవనమున నుందును. మనకిరువురకు మరల సంగతిని గల్పించువారు సుగ్రీ

వాదివానరశ్రేష్ఠులు. నేనాయశోకవనమున నీపాదములు తలంచుచు నియతురాలనై యుందును. అని.

మహాశయులారా! వీరియాశయమునుబట్టి పరికింపఁగా రాఁగలకష్టములన్నియు నిరువురకుఁ దెలిసినవే యని తేలెడిని. అప్పుడు సీతారాములు ప్రకృతిపూరుషు లనుట కేసంశయములు లేవుకదా. ఇట్టు లుండఁగా మధ్వవైష్ణవులు కొందఱు నేను శాక్తము ననుసరించి యర్థము వ్రాసితనని, యది రామాయణాభిప్రాయము కాదని సూచించిరి. సీతారాములకు భావికాలజ్ఞానము లేదందురేని యీవ్యాఖ్యకుఁ దిలోదకము లీవలసివచ్చును. దీనిని బ్రమాణము కాదనరు. దీని నంగీకరించినచో నావ్రాసినయర్థము నంగీకరింపక తప్పదు. కావున మధ్వవైష్ణవుల యభిప్రాయము సమంజసము కాదనియే సిద్ధాంతము. ధనార్జనవ్యగ్రమనస్కు లితరులభావము లెంత సద్భావములైన నంగీకరింతురా? ఇఁక నిందలివిశేషముల నించుక పరిశీలింతము. శ్రీరామా! మృగరూపమున మారీచుఁడు నీమూలమున సత్పదమునొంద నువ్విళ్లూరుచున్నాఁడు. వానరేంద్రులగుసుగ్రీవాదులు నీకుఁ దోడ్పడి నీసంగతి నానంద మనుభవింప వాంఛించియున్నారు. తండ్రియింట నున్నట్లే నీయందు ననుపమానభక్తిగలరావణునియింట నశోకవనమున నుండఁగలను. నాకడకు నీవు రాఁగలవు. తండ్రియింట నే నుండఁగాఁ బిలువనిపేరింటముగా నీవు రాలేదా. నీరాకవలనఁగాని రావణాదిభక్తులకు శాపవిముక్తియు ముక్తియుఁ గలుగదు. నే నందుండియే నీపాదారవిందములను గ్రహింతును. ఎట్లు? నియతురాలనై అనఁగా నీపాదారవిందములు లంకాద్వీపమును స్పృశించునట్లు నియతించుకొని యొనరింతును. నేనున్నకావుకు నీవు రాక తప్పదనుభా

వముసూచింపబడినది. కావున నేను నీవెంట రావలయును. నీకంటె ముందే దండకారణ్యమును బ్రవేశింతును. నాకారణముననే విరాధాదిదనుజులు సత్ఫదమునొందుదురు. అని సీత పలికెను.

జనపదవాసులు నగరవాసులు మనల దర్శించి తరింతురు. వనజంతువులందును బరిపక్వజీవులు కొందఱుందురు. వారా రూపమును శాపవశమునం గాంతురు. వారుగూడఁ బాపఫలానుభవము ముగియఁగా మిగిలినపుణ్యమున మనలఁ గాంచి తరింపవలదా? గజములు వానరములు నితరమృగములుకూడ నస్మద్దర్శనమునఁ దమపుణ్యము ఫలింపఁగా ముక్తింగాంచవలయును. నేను లేకయున్న నీకు రూపమే లేదు. నిన్నెట్లు చూడఁగలవు? కావున నన్నుంగూడి నీవడవులకరుగుటయే యీయవతారఫలమని సీత హెచ్చరించెనని మనము గ్రహింపవలయును. అశోకవనమున నీపాదముల ధ్యానించుచు నియతి నుందుననికదా సీతాదేవి పలికెను. సంవత్సర మేల యుండవలయును? అని కొందఱు ప్రశ్నింపవచ్చును.

"సుపరీక్షితశిష్యాయ దేయం వత్సరవాసినే."

అను ప్రమాణము కలదు. పండ్రెండువత్సరములుకాని పండ్రెండు నెలలదనుక శిష్యునిఁ బరీక్షింపవలయు నను నియమములు కలవు. రావణాసురుఁడు పరమశివభక్తుఁడు.

"రూపాణాం సత్త్వం జగచ్చేదం సదేవాసురమానుషం,
మత్తో నాన్యదశేషం యత్తత్త్వం జ్ఞాతుమిహార్హసి. ౪౭
అవిద్యామోహితాత్మానః పురుషా భిన్నదర్శినః,
వదంతి భేదం పశ్యంతి చావయోరంతరం హరః." ౪౮

విష్ణు. ౫ అంశము. ౩౩ అధ్యా.

అన్న విష్ణుపురాణవాక్యము ననుసరించి పరమవిష్ణుభక్తుఁడనియే భావము. అట్టిభక్తుని బరీక్షించి ముక్తినొసంగఁగోరియే ప్రకృతి లంకాపురమునఁ బండ్రెండునెలలు నివసించెను. శాపకారణమున ద్వేషించినట్లు రావణాసురుఁడు నటించినను, మహాభక్తుఁడు సకలవేదవేదాంగపారంగతుఁడు కావునఁ, దద్దర్శనమున గృతకృత్యుఁడయ్యెను. రావణునంతేగకరణము స్త్రీమోహానిబిడమే యైన నరకకూపమునఁ బడవలసినవాఁడే. సనత్కుమారుని హితోపదేశమువలన నట్టి పాపకార్యమునకుఁ గడంగెనని రామాయణమే తెల్పుచున్నది. త్రిలోకములఁగలస్త్రీలలో నెవ్వరెవ్వరు కారాగృహవాసము నొందఁదగుదుష్కర్మము నాచరించిరో వారెల్లఁ గర్మప్రేరితుఁడగు రావణాసురునిమూలమునఁ గారాగారశిక్ష ననుభవించిరి. వారలకెల్లరకు విముక్తికాలము రావణవిముక్తికాలము సమానకాలమే యయ్యెను. కావున సీతారూపమునఁ గనంబడుమహామాయ లంకానగరమునఁ బండ్రెండునెలలు నివసించెనని మన మెఱుంగవలయును. "పాదావుపగృహ్య సంయతా" అనువాక్యముధోరణింబట్టి భక్తుఁడు స్వేష్టదేవతాపాదారవిందములను నియతుఁడై మనసికపదమున నిలుపుకొనవలయు ననువిషయమును గ్రహింపవలయును.

"అనన్యభావామనురక్తచేతసం త్వయావియుక్తాం మరణాయ నిశ్చితాం,
నయస్వ మాం సాధు కురుష్వ యాచనాం న తే మయాలో గురుతా భవిష్యతి."
౨౨

అని మూలము. ఇవి సీతాదేవి చేయుచున్న కార్యమును బోధించుచున్నది. 'త్వయా అవియుక్తామ్' అని పదవిభాగ విశా

యర్థమునఁ జేయవలయు. ఇతరభావము లేక యనఁగా నీవేమి సంకల్పించితివో దానినే నేనును సంకల్పించితినని భావము. అనురక్తచేతసం సులభము. త్వయా అవియుక్తాం=నీతోటి యెడఁ బాటు లేనిదాన నని భావము. మరణాయనిశ్చితామ్ = మరణ రూపలాభము గలుగునను నిశ్చయము కలదాన నని భావము. 'ఆయ'మనఁగా లాభము అనఁగా దుష్టమారణరూపలాభమును నిశ్చయించియున్న దాన నని సారము. అట్టి నన్నుఁ దోడుకొని పొమ్ము. నా ప్రార్థనమును సఫలము చేయుము. అనఁగా నాకోరిన కార్యము నొనరింప సమ్మతింపుము. నావలన నీకుఁ గష్టము కలుగదు. నాకు శక్యముగానిపని లేదుగాన నీవు ప్రయత్నించి చేయఁదగుపని లేదని తాత్పర్యము. లోకమునఁ దనయందు దనురక్తి గలిగి యనన్యభావ యైయుండు భార్యను వదలి యేధర్మ కార్యము చేయరాదనియు, నెట్టితీర్థయాత్రలు చేయరాదనియు నీతిని గ్రహింపవలయును. ధర్మపత్ని యనుభావమును భర్త మఱువరాదనియే యర్థము. ప్రకృతి లేక భగవంతుఁడు భార్యను వదలి భర్తయు నేకార్యము చేయఁజాలరనియే యిటఁగల సారము. ఇట్టు లీఘట్టము భగవతియగు సీతాదేవి సద్భావమును వెల్లడించుచు గురుశిష్యధర్మములను దెలుపుచు నుపాసకుని కృత్యములఁ దేటపఱచుచున్నది ఇఁకఁ గథ్యాత్మ రామాయణ భాగముం బరిశీలింతము.

"తస్మాద్భద్రే గృహే తిష్ఠ శీఘ్రం ద్రక్ష్యసి మాం పునః,
రామస్య వచనం శ్రుత్వా సీతా దుఃఖసమన్వితా. 20.

ప్రత్యువాచ స్ఫురద్వక్త్రా కించిత్కోపసమన్వితా,
కథం మామిచ్ఛసే త్యక్తుం ధర్మపత్నీం పతివ్రతాం. 21

త్వదనన్యా మదోషాం మాం ధర్మజ్ఞోఽసి దయాపరః,
త్వత్సమీపే స్థితాం రామ కో వా మాం ధర్షయేద్వనే. ౭౨

... ... ... ... ... ...

బాల్యే మాం వీక్ష్య కశ్చిద్వై జ్యోతిశ్శాస్త్రవిశారదః. ౭౫
ప్రాహ తే విపినే వాసః పత్యా సహ భవిష్యతి,
సత్యవాదీ ద్విజో భూయాద్గమిష్యామి త్వయా సహ. ౭౬
అన్యచ్చ కించిత్ప్రవక్ష్యామి శ్రుత్వా మాం నయ కాననం,
రామాయణాని బహుశశ్శ్రుతాని బహుభిర్ద్విజైః. ౭౭
సీతాం వినా వనం రామో గతః కిం కుత్రచిద్వద,
అతస్త్వయా గమిష్యామి సర్వథా త్వత్సహాయినీ. ౭౮
యది గచ్ఛసి మాం త్యక్త్వా ప్రాణాంస్త్యక్ష్యామి తేఽగ్రతః,
ఇతి తం నిశ్చయం జ్ఞాత్వా సీతాయా రఘునందనః.'' ౭౯

అధ్యాత్మ. ౫ సర్గము.

ఇందలి సీతాసంభాషణమును బరికింతము. దైవజ్ఞుఁ డొకఁడు చిన్నవయసున సీతం గాంచి పెనిమిటితో నడవుల నివసింతువని పలికెను. ఆతఁడు సత్యవాది కావున నామాట తప్పదు. కనుక నీతో వత్తునని పలికి మరల నిట్లు చెప్పెను. రామచంద్రా! పెక్కు రామాయణములు వింటిని. అందెందును సీతను వదలి రాముఁ డడవికిఁ బోయినట్లు చెప్పఁబడలేదు. ఎపుడైన నేను నింటనుండ నీవు పోయితివా? చెప్పుము. కావున నెల్లప్పుడు నీకు సాయ పడుచు నుందును. కాన నన్నుఁ దోడ్కొని పొమ్ము. ఇదియే యిటఁగలపారము. ప్రతియుగమునందును రామాయణము గలదా? ఆపక్షమున నెల్లరకు రామచరిత్రము తెలిసియే యుండ వలదా? వాల్మీకియే యాచరిత్రముల రచించెనా? వేఱొక్క కవియా? అని కొందఱు ప్రశ్నింతురు. కాని వారు చక్కఁగ

నాలోచించి ప్రశ్నము చేసినవారు కారని తోఁచెడిని. ప్రతిత్రేతా యుగమునందును రామావతారము సీతాపహరణాదులుండవు. ఈచరిత్ర మీయుగమునకు ముందు రెండవయుగమున సాగినదే. ఆచరిత్రమునే పెక్కండ్రు విషయము నించుక మార్చి వ్రాసిరి. కొందఱు కథాప్రధానముగ వ్రాసిరి. కొందఱు తత్త్వమే ప్రధానముగ వ్రాసిరి. మఱికొంద ఱించుకకథను మార్చి వ్రాసిరి. వారివారిభక్తిననుసరించి బహువిధములుగా వ్రాసిరి. ఎన్నివిధములగుమార్పులున్నను సీతను బురమునవదలి రాముఁ డొక్కఁడే యడవులకుం బోయినట్లు మార్పుఁబూన లేదు. బహుశః అనఁగాఁ బెక్కుసారులని యర్థము. కాని అనేకములు జరిగినవని యర్థముకాదు. కనుక నిట్టిశంకలు కలుగ నవకాశమే కనఁబడదు. "సర్వథా త్వత్సహాయినీ" అను నీసీతావాక్యమున నొకరహస్యార్థము కలదు. సర్వప్రకారముల చేతను సాయపడుదును. అనఁగా భావమేమి? రామా! నిమిత్తమాత్రముగ నీవుందుము. నీసన్నిధినుండి సర్వకార్యములను నేనే సాధింతును. ఇది సీత మూలప్రకృతి యని స్థిరపఱచుట లేదా? ఎట్టిఘట్టములనైన నేను నిలిచి యాకార్యమును సాధింతునని కదా దీనిభావము. ఈయథ్యాత్మరామాయణముకూడ శ్రీరాముని నిర్లిప్తత్వమును, ప్రకృతి సర్వకార్యకర్త్రి యనుభావమును దేటపఱచెను. భగవదనుగ్రహము నొందెననఁగాఁ బ్రకృతి కృపకుఁ బాత్రుఁ డయ్యెననియు, దాన భగవత్సాయుజ్యము నొందుననియు భావము. ఈయర్థమునే

"త్వదన్యః పాణిభ్యామభయవరదో దైవతగణ
స్త్వమేకా నైవాసి ప్రకటితవరాభీత్యభినయా,

భయార్త్రాతుం దాతుం ఫలమపి చ వాంఛాసమధికం,
శరణ్యే లోకానాం తవ హి చరణావేవ నిపుణౌ."

అను నీశ్లోకరూపమునఁ దేటపఱిచిరి. అనఁగా భక్తరక్షణము, అసాధుశిక్షణము ప్రకృతిస్వభావములు. తదనుగ్రహపాత్రు లగు దేవతలు, త్రిమూర్తులు లోనగువారు తత్కింకరులు. వారిచ్చుఫలము లత్యల్పములు. కావున నారాధనమునఁ బ్రకృతియే ప్రధానముగా నుండునని తేలెడిని. ఇట్టి సీతాభిప్రాయము మనస్సున నిల్పినఁగాని రామాయణపరమార్థము బోధపడదు. కావున నీఘట్టమున సీతాదేవి వచియించిన ప్రతివాక్యమందును మహార్థ మిమిడియున్నదని యెఱుంగవలయును. ఇఁకఁ దరువాతికథాభాగమును బరిశీలింతము.

వనవాస కష్టములను రాముఁడు సీతకుం దెల్పుట.

* రామచంద్రుఁడు ధర్మస్వరూపము నెఱింగినవాఁడు. కావున సీత పట్టుదలఁబూని యిట్లు పలుకుచున్నను వనవాసకష్టములఁ దలంచుచు నామె నడవులకుం బిలుచుకొనిపోవ నంగీకరింపకపోయెను. అశ్రుపూర్ణలోచనయై యుండుసీత నాశ్వాసించుచు నయోధ్యయందే నిలుపఁబూని యిట్లు పలికెను. జానకీ! సద్వంశసంభూతురాలవు. ధర్మజ్ఞురాలవు. కనుక నిందే యుండి ధర్మముల నాచరింపుము. నీమనస్సుఖమునే కోరకుము. నామాట నాలకించుట నీకు ధర్మముసుమీ. కనుక నీమనస్సునకు సమాధానమగునట్లు చేయఁదగుధర్మములను జక్కఁగా నాచరింపుము. నీ వబలవు. కనుక నాచెప్పినట్లు నీవొనరింపవలయుఁగాని

---

*ఇది ౨౮ వదెనిమిదవసర్గమునుండి సంగ్రహింపఁబడినది. అధ్యాత్మ రామాయణార్థము నిందిమిడియుండును.

స్వాతంత్ర్యమును బూనకుము. వనములఁగలకష్టముల నెఱుంగవు. వానిం దెల్పెదను. ఆలకింపుము. వనవాసబుద్ధిని వదలుము. మహారణ్యముల ననేకశ్రమములు కలవని యెల్లరు పలుకుదురు కాదే. ఈమాట నేను నీక్షేమము నాశించియే పలుకుచున్నాఁడను. నిన్ను భరించుట కష్ట మనునభిప్రాయమున నిట్లు పలుకలేదుసుమీ.

వనముల నెల్లప్పుడు సుఖమే కలుగదు. దుఃఖమే కలుగునని నాభావము. సెలయేళ్ళచప్పుడులు గుహాలయందుండు సింహముల భీషణనాదములు విన శక్యమా? కనుకనే వనవాసము కష్టమంటిని. మనుష్యసంచారము లేనిచోవుల భయమన నెఱుంగక స్వేచ్ఛగా విహరించుచుఁ గ్రొవ్వినసింహవ్యాఘ్రాదిమృగములు మనలం గాంచి మున్ను చూడనికతన త్వరపడి వధింప నెదురు వచ్చును. అట్టివనమున నుండుట శ్రమము కాదా? నదులు మకరములంగూడి పంకముతోఁగూడి మదించినయేనుఁగులుకూడ దాఁట శక్యము గానియట్టు లుండును మార్గములు సుగమములుకావు. తీఁగెల్లుకొని కాళ్లకుఁ జుట్టుకొనును. ముండ్లు గ్రుచ్చుకొనును. అడవికోళ్లు భయము నొదవించునట్లు కూయుచుండును. కనుక వననివాసము కష్టము. నీరు దొరకదు. ప్రవేశింపఁ దరమే కాదు. పగల్లె నాహారముకొఱకు తిరుగవలయును. ఆకష్టమున దేహ మలసటఁజెంది రాత్రులయందుఁ గ్రిందరాలిన యాకులం బఱచుకొని శయనింపవలయును. కాన నడవినుండుట కష్టము. జానకీ! దివానిశములు పరిపక్వములై రాలినఫలములను భక్షింపవలయును. దాన సంతుష్టినొందవలయును. ఇతరవిధమగు నాహారము మఱేద్దియు లభింపదు. కనుకనే వనవాసము కష్టము. ఇంతియ కాదు. ఓపినకొలఁది నడవుల నుపవాసములు సలుపం

దగును. నారచీరలు కట్టుకొని జడలఁ దాల్పవలయును. నిరంత
రము దేవతలకుఁ బితృదేవతలకు నపుడపుడు వచ్చుచుండునతి
థులకుఁ బూజచేయవలయును. నియమమునే సర్వదా పూన
వలయును. త్రికాలములయందు స్నానము చేయవలయును.
అట్లుండుట కష్టముకాదా? వానప్రస్థులవలెనే తానే పూవులం
దెచ్చి నిత్యమగ్నివేదికయందు బలికర్మము చేయవలయును.
వనవాసులు నియతాహారులై యుండవలయును. ఫలము లెన్ని
దొరకినవానితోఁ దృప్తినొందవలయును.మిక్కిలికోర రాదు.అది
కష్టముకదా? వనవాతములు హెచ్చుగా వీచుచుండును. రాత్రు
లయం దంధకారము దట్టముగా నుండును. ఆఁకలి హెచ్చుగాఁ
బొడసూపును. ఇవి యన్నియు భయంకరములు కావా? కనుక
నడవి నుండుట మిక్కిలి కష్టము. కొండచిలువలకు దేహము
చాలఁ బెద్దది. అవి మదించి యందందుఁ బొరలాడుచుండును.
వానిం గనినంత నీవంటియాఁడువారికి భయముకలుగకమా
నునా? నదులయందేయుండి వానివలెనే వంకరగాఁ బోవునట్టి
పాములు త్రోవకడ్డముగాఁ బండుకొనియుండును. మిడుతలు
తేళ్లు పురుగులు నడవియీఁగలు లోనగునవి యెల్లవేళల బాధిం
చుచునుండును. ఆబాధలకు నీవోర్వఁజాలవు. కంటకద్రుమ
ములు గఱికలు తెల్లు పెరిగియుండును. చెట్లకొమ్మలొండొంటం
బెనచుకొనియుండును. అడుగుపెట్టుటయుం గష్టమే. అడవి
నుండువారి కెన్నియోకష్టములు గల్గుచుండును. భయము
లెన్నోయోవిధముల గల్గును. కనుక నడవి భయంకరమే.
అంతఁ గోపము లోభమును వదలవలయు. తపస్సునందే
తలంపు లుండవలయును. భయంకరములగు సింహాదిక్రూర
జంతువులు కనఁబడినను భయంపడరాదు. కనుక నీకు వనగమ

నాసక్తి చాలును. నీవంటికాంతకు వనము తగినదికాదు. ఎంత యాలోచించినను వనవాసము కష్టమనియే నాకుఁ దోఁచెడిని. అని శ్రీరామమూర్తి పలుకఁగా నాతనితలంపు తనను బిలుచుకొనిపోరాదని యుండు టెఱింగి సీత యామాటల నాదరింపక దుఃఖించుచు నారామచంద్రునిం గాంచి యిట్లు పలికెను.

మహాశయులారా! ఈభాగమున విమర్శింపఁదగినవిషయములు లేవు. ఒక్కటిరెండుతావులు విమర్శనార్హములు. వానిం బరిశీలింతము.

"క్రోధలోభౌ విమోక్తవ్యౌ కర్తవ్యా తపసే మతిః,
న భేతవ్యం న భేతవ్యే నిత్యం దుఃఖమతో వనం." ౨౮

అని మూలము. ఈఘట్టమున సీతను రామమూర్తి పరీక్షించుచున్నాఁడు. భయకారణములు తోఁచినపుడవ్వానిని లెక్కచేయనివారే యక్కార్యమున కర్హులు. కనుక వనమునఁ గల కష్టముల నన్నింటిని రాముఁడు తెలిపెను సీతమానసము మరి యాడునో లేదో యనియే రామమూర్తితలంపు. ఇదేటికి? అందు రేని యీనెపమున స్త్రీలను బరీక్షించుపద్ధతుల లోకులకు నుపదేశించెనని మన మెఱుంగవలయును. ప్రాయికముగా స్త్రీలు సుఖమునే కోరువారు. సుఖభంగహేతు వేది యుండిన నద్దాని వదలుదురు. అట్టివారెల్లరు లోకోపకారరూపధర్మమున నిలువఁజాలరు. అట్టికష్టముల లెక్కింపక యుండువారే ధర్మరక్షణమహాకార్యమున నిలువఁదగినవారు. సకలకష్టములలో నగ్రగణ్యము క్రోధమును జయించుట. మహాకష్టము.

"కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః,
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్." ౩౭

అన్న గీతావాక్యము ననుసరించి క్రోధమును జయించుట మహా
కష్టమని తేలెడిని. అట్టిక్రోధమును దానివంటిలోభమును వదల
వలయునని రాముఁడు బోధించెను. అంతియగాక తపస్సనం దే
మనస్సు ననుపవలయు ననియె. ఈమూఁడును దఱచుగా
స్త్రీలకు సాధ్యములుగానేరవు అట్టివి సాధ్యములు కావలయు
నని రామునుపదేశము. దీనిసారమేమి? భగవంతు ననుగ్రహ
మునుగోరువా రెవ్వరైనను క్రోధలోభాదిదుర్గుణములను వదల
వలయును. అవి వదలి పరమైకాంతస్థలముననుండి యారాధింప
వలయును. భయకారణములగు సింహవ్యాఘ్రాదులు కనఁబడి
నను భయంపడరాదు. అనఁగా,

"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః."

అన్న గీతాప్రమాణము ననుసరించి భయకారణమగు క్రూర
జంతువు భయకారణము కాదనియు, నందున్న జ్యోతి భగవత్క
ళయనియు, నదియే తనయందు నున్నదనియు భావింపఁదగును.
అట్టి సమదర్శనుఁడే నాయనుచరుఁడు కాఁదగినవాఁడు. వానినే
నే నుద్ధరింతును. అని రాము నాశయమని మనము తెలిసికొన
వలయును. ఇది మానసికపూజనే బోధించును. తపస్సు
మనోనిగ్రహప్రధానకర్మము. తపస్సు చేయువారు స్వేష్ట దేవతా
మూర్తిని మనఃపీఠమున నిలుపుకొందురు. దానినే యోగ
దృష్టిని బరీక్షించుచు బాహ్యప్రపంచమునే మఱచియుందురు.
వారే యోగులనఁబడుదురు. విగ్రహములఁ బూజించుచు ధనా
ర్జనము చేయుయోగులు వేషధారులు. కపటనాటకసూత్రధా
రులు. అట్టివారిని భగవంతుఁడు విరోధులనుగా భావించును.

కాని వారికిమాత్రము దేవాలయములయందు శర్కరాన్నము భగవత్ప్రసాదముగా దొరకును. అదియే వారికి ముక్తిసోపానము. మానసికపూజ నాచరించువారి కట్టిప్రసాదముదొరకదు. అదృశ్యఫల మేదియో కలుగును. దాని నాశించువారే ముముక్షువు లనంబడుదురు. అట్టివారు వనవాసమునే కోరుదురు. విజనస్థలమే తపోయోగ్యము. నిస్సంగులే తపోనిష్ఠ కర్హులు. సత్సహవాసమే నిస్సంగత్వమును గలిగించును.

"సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహిత్వం,
నిర్మోహిత్వే నిశ్చలతత్త్వం నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః."

అని శ్రీశంకరభగవత్పాదాచార్యులుగారు బోధించిరి. కావున విజనస్థలమునఁగూర్చుండి క్రోధలోభములవదలి యిష్టదైవము నారాధింపవలయుననియు, మనస్సు సర్వభూతములయం దంతర్యామిగ నుండుభగవంతుని సమదృష్టిం గాంచవలయుననియు, నట్టిస్థితియందుండుయోగి భగవత్కరుణకుఁ బాత్రుఁడగుననియు నీశ్రీరామోపదేశము తెలుపుచున్నయది. ఇతరజంతువులవలన మనకు బాధకలుగు ననుభీతిని వదలవలయుననియుఁ దేటపఱచుచున్నది. ఇఁకఁ దరువాతి సీతాదేవియాశయమును బరికింతము.

## సీత రామమూర్తితోఁ దా నడవికి రాకమాననని తెలుపుట.

*శ్రీరామునిపలుకులకు సీత దుఃఖము పొంగిపొరలఁగాఁ గన్నీరుమోమునుండి కాలువలుగట్టునట్లు ప్రవహింపఁగాఁ ద్రైలోకేశుం గాంచి మెల్లగా నిట్లు పలికెను. రామభద్రా! వనవాస

*ఈభాగము ఇరువదితొమ్మిదవసర్గమునఁ గలదు.

ముననేయేదోషములు కలుగునని చెప్పితివో అవియెల్ల నీస్నేహ
మునకుఁ బాత్రురాలనై నిన్నుంగూడియుండు నాకు దోషములే
కావు. విశేషించి గుణములేయగును. మోహనాకారా! సింహ
వ్యాఘ్రాదిజంతువులు నీవంటి నిరుపమానాకారముగలవాని
మున్నెన్నఁడు చూడనికతనఁ దటాలున నిన్నుం గాంచినంతన
భయంపడి దూరముగాఁ బాఱిపోఁగలవు. అంతియకాని యెదు
రువచ్చి చంపునన్నది యంత యుక్తముకాదు. భయకారణము
గలుగ నెల్లరు భయంపడుదురు. వానివలన నాకు భయముకలు
గదు. నిన్ను నడవికిఁ బొమ్మన్నదియే నన్నుఁ బొమ్మని చెప్పినట్లే.
మీపితృనానతి ననుసరించి నీతో నడవులకు నేనును బోవవల
సినదాననే. నన్ను వదలిపోదువేని నీవిరహమునకుఁ బ్రాణములు
వదలవలసినది ధర్మమే. నీచెంతనున్న నన్ను దేవేంద్రుఁడైనఁ దిర
స్కరించి తేజముదక్కించుకొనఁజాలునా? పతి నెడఁబాసిన సతి
మాత్రము బ్రదుకఁజాలదు. ఈవిషయము నీవు విశేషించి
బోధించియేయున్నవాఁడవు. రామా! నీవు ప్రాజ్ఞులలో నుత్త
మోత్తముఁడవు. నాభావము నించుక యాలకింపుము. తండ్రి
యింటనుండఁగా నాకువనవాసముకలుగునని దైవజ్ఞులు చెప్పఁగా
వింటిని. ఇది సత్యము. సాముద్రికశాస్త్రజ్ఞులగు బ్రాహ్మణులవలన
వనవాసము నాకుఁ గలుగఁగలదని విని నాటంగోలె నెపుడు
కానకుఁబోవుదునా యని యత్యుత్సాహముతో నున్నదానను.
పెద్దలు నిర్ణయించినట్లే నేను గాననమునఁ గొంతకాలము నివ
సింపవలసిన దేకదా. పెద్దలడవికిఁబోవలసినదిగా నిర్ణయించినపుడు
నేను నీతోడఁ బోవలయునే కాని వేఱొండురీతిని దానింజెల్లింప
వలనుపడదుకదా. మహానీయులయాజ్ఞానుసారము వచ్చుచున్నా
నుగాని నాయిచ్ఛచేతఁగాదు. నే నాపెద్దలమాటల సార్థకము

లను జేయ నీతోడ వచ్చెదను. దాని కనురూపముగాఁ గాలము వచ్చినది. కనుక నిఁక నీతోడ నరుదెంతును. ఆపెద్దలవాక్యసూత్రమే యగుఁగాక.

వనవాసమునందుఁ గష్టములుకలుగునని నేను నెఱుంగుదునుజుమీ. వీరుఁడగు నీకవ్వి కలుగవు. మనోధైర్యము లేనివారికే యవి కలుగును. నేను గన్యకనై జనకునింటనుండి నా తల్లికడనుంటిని.మంచియాచారములుగల యొకానొకతాపసస్త్రీ నన్నుం దిలకించి నీకుఁ గొంతకాలము వనవాసము కలుగునని పలికెను. ఆమాట వినియున్నదానను. అయోధ్యకు వచ్చినపుడు గంగాతీరగతతపోవనప్రముఖములయందుఁ గొంతకాలము నివసింపవలయునని కోరుచుంటినిగదా ఈవాంఛతీర్పుఁడని నాథా నిన్నెంతయుఁ బ్రసన్నునిగా మున్నే చేసికొనియున్నదానను. వనగమనము నాకుఁ బెద్దపర్వముగానున్నది. నీకు శుభముగలుగుంగాత. శూరాగ్రగణ్యుఁడవగునీవు వనముల నుండఁగా నీకు శుశ్రూషచేయు కుతూహలము నాకెంతయో గలదు. నీవో యసూయాదులులేని నిర్మలాత్ముఁడవు. నేను బ్రీతితోడ నాథుఁడవగు నిన్ను వెనుకొని యాశ్రయించి నాపాపముల నిర్మూలించుకొందును. ఇందే నిలిచి కులదైవములఁ బూజించినఁ బాపములు పోవునే యని యందువేమో. నాకుఁ బతియే దైవము. అంతకన్న మిక్కిలి దైవము లేదు. ఇహలోకమునందుంబలెఁ బరలోకమునందును నాకు నవిచ్ఛిన్నముగ నీతోడిసంగతి కలిగియే యుండును.

జనకుఁడు లోనగువార లేపురుషునకు నేకన్యకను స్వవర్ణాచారము ననుసరించి యుదకపూర్వకముగా నిత్తురో ఆస్త్రీ పరలోకమునందు నాథర్తను గూడియే యుండును. అని పావన

మగు నీవేదవాక్యము మహాత్ములగుభూసురోత్తములు చెప్పఁగా వివియున్న దానను. సదాచారములుగలిగి పతివ్రతయునై జలధారాపూర్వకముగాఁ బరిగ్రహించిన యీభార్యను నన్ను నీవు వనములకుఁ బిలుచుకొని పోనొల్లక యుండుటయేల? నీయం దత్యంతభక్తిగలదానను. సాధ్విని. నన్ను వదలిపోవుదువో యని దుఃఖపడుచున్న దానను. సుఖదుఃఖములుగలిగినను నీయెడ సమానముగాఁ బ్రవర్తించుదానను. నీతోడిసుఖదుఃఖములే కలదానను. ఇట్టి నన్ను వదలిపోవరాదు. పిలుచుకొని పోవుటే నీకు నర్హము. ఇట్లు కోరు నన్ను వదలిపోయితివేని విషముభక్షించియో యగ్నింబడియో జలములంబడియో ప్రాణములఁ ద్యజించెదను. అని యాజానకి పెక్కురీతులఁ బ్రార్థించినను రామమూర్తి నిర్జనారణ్యములకు సుకుమారయగు నాలేమ సంచరించుట కష్టమని తలఁచి తోడ్కొనిపోవ నంగీకరింపఁడయ్యెను. ఆమెయుఁ బతిభావ మెఱింగి కన్నీటిధారలచే భూమిని దడుపుచు దుఃఖించెను. అంతఁ గోపశోకంబులు పైకొనఁగాఁ గెమ్మోవి మఱియు నెఱ్ఱఁబాఱుచుండ నాసీతం గాంచి శ్రీరాముఁడు వనములకు రావలదని యెంతయు నాశ్వాసించెను.

మహామతులారా! ఈఘట్టమున సీతాదేవిమాటలు విమర్శింపఁదగియున్నవి. వాని నించుక యరయుదము.

"యే త్వయా కీర్తితా దోషా వనే వస్తవ్యతాం ప్రతి,
గుణానిత్యేవ తాన్ విద్ధి తవ స్నేహపురస్కృతాన్."

అని మూలము. నీస్నేహము నాపై నుండఁగా నరణ్యములఁగల్గు నన్నకష్టములు సుఖములే యని యెఱుంగుము. అనఁగా భావ

మేమి? సతీపతులు స్నేహారసపూరితాంతఃకరణులై యెందున్నను ఎన్నికష్టములు గలిగినను అవి సుఖములే యగును. ఈభావ సారమేమి? దంపతు లిరువురు నెడఁబాటులేక కష్టములను సుఖ ముల ననుభవింపవలయుననియే. భర్తతోడ ననుభవించుకష్టము సుఖముగఁ దలంపవలయును. అదియే పతివ్రతాలక్షణము. ఈయర్థమే మనుస్మృతియందు.

"పతిం యా నాభిచరతి మనోవాగ్దేహసంయతా,
సాభర్తృలోకానాప్నోతి సద్భిస్సాధ్వీతి చోచ్యతే.
వ్యభిచారాత్తు భర్తుః స్త్రీ లోకే ప్రాప్నోతి నింద్యతాం,
సృగాలయోనిం చాప్నోతి పాపరోగైశ్చ పీడ్యతే." ౩౦ అధ్యా. 5.

అని చెప్పఁబడినది. అనఁగా స్మృతులకు రామాయణమునకు ధర్మోపదేశవిషయమున నైక్యమే కలదని మన మెఱుంగవల యును.

"పక్షిణస్సృమరాశ్చైవ యే చాన్యే వనచారిణః. 3
అదృష్టపూర్వరూపత్వా త్సర్వే తే తవ రాఘవ,
రూపం దృష్ట్వాపసర్పేయుర్భయే సర్వేహి బిభ్యతి. ౪
త్వయా చ సహ గంతవ్యం మయా గురుజనాజ్ఞయా,
త్వద్వియోగేన మే రామ త్యక్తవ్యమిహ జీవితం." ౫

అని మూలము. భయంకరసింహవ్యాఘ్రాదులు పైఁబడి మనలఁ జంపఁజూచు నన్న రామచంద్రునివాక్యమునకు బదు లిది. శ్రీ రామా! అడవులఁగలక్రూరజంతువులు మున్నెన్నఁడుగానని నీయత్యద్భుత తేజోపబృంహితదివ్యసుందరవిగ్రహమును గాంచి భయంపడి పాఱిపోవును. ఎల్లజంతువులకు భయము తోఁచి నపుడు పరుగెత్తుట స్వభావముకదా. అని సీత పలికెను. దీని

భావమేమి? మహానుభావా! ఎన్నిరౌజన్మములనుండి పాప కర్మముల నొనరించినకతన సింహవ్యాఘ్రాదిరూపము లలవడును. అట్టి పాపజంతువులు సర్వపాపక్షయదక్షంబగు నీదివ్యమూర్తి దర్శింపఁగలవా? భక్తిలేనికతన వానికి నీరూపము వికారముగాఁ గనంబడును. కాన నవి భయంపడి పరుగెత్తును. భయ మెల్ల రకు సమానఫలమునే యిచ్చునుగదా.

"శరీరజైః కర్మదోషైర్యాతి స్థావరతాం నరః,
వాచికైః పక్షిమృగతాం మానసైరంత్యజాతితాం. ౯

స్థావరాః కృమికీటాశ్చ మత్స్యాస్సర్పాస్సకచ్ఛపాః,
పశవశ్చ మృగాశ్చైవ జఘన్యా తామసీ గతిః. ४౨

హస్తినశ్చ తురంగాశ్చ శూద్రా మ్లేచ్ఛాశ్చ గర్హితాః,
సింహా వ్యాఘ్రా వరాహాశ్చ మధ్యమా తామసీ గతిః." ४३

మను. ౧౨ అధ్యా.

"మహాపాతకజాన్ ఘోరాన్నరకాన్ ప్రాప్య దారుణాన్,
కర్మక్షయాత్ప్రజాయంతే మహాపాతకిన స్త్విహ. ౨౦౬

మృగాశ్వసూకరోష్ట్రాణాం బ్రహ్మహా యోనిమృచ్ఛతి,
ఖరపుల్కసవేనానాం సురాపో నాత్ర సంశయః. ౨౦౭

కృమికీటపతంగత్వం స్వర్ణహారీ సమాప్నుయాత్,
తృణగుల్మలతాత్వం చ క్రమశో గురుతల్పగః." ౨౦౮

యాజ్ఞ. 3 కాండము.

అను నీస్మృతులు వ్యాఘ్రాదిదుష్టమృగజన్మహేతువులం దెల్పు చున్నవి. ఇట్టి పాపములనొనరించినవానికి నీదివ్యదర్శన మానంద జనకముగాక భయజనకమే యగును. కాన నవ్వి పాఱిపోవును.

"సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ,
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః.                    ౫౨
నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా,
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా."                    ౫౩

గీత. ౧౧ అధ్యా.

అన్నగీతావాక్యప్రకారము దేవాదులకుంగాని నీరూపము చూడ గోరిక పొడమదు. క్రూరమృగము లట్టి నీరూపమును జూడఁగలవా. వానిపాపమే భయమును గలిగించి దూరముగాఁ దొలంగఁజేయును. అంతియకాని యవి మనల బాధింపఁజాలవని సీత తాత్పర్యము. అర్ధశరీరముగలదానను గాన నిన్ను వనముల కుం బొమ్మన్నపుడు నన్నును బోవలయునని యాజ్ఞయిచ్చినిట్లె భావింపవలయును. కాని వేఱుగ నాకాజ్ఞసేయనక్కఱలేదు. ఈఘట్టమున గ్రహింపఁదగు విశేషవిషయ మేది ?

భగవత్కళ విశేషించి యేయేకోశముల నుండునో యావ్యక్తులం గాంచినతోడనే క్రూరబుద్ధులుగల వ్యక్తులన్నియు భయంపడి తొలఁగిపోవుచుండును. అనఁగా నవి చేసికొన్న పాపమే భయముగొలిపి యాభగవత్కళను జూడకయుండఁ దొలఁగించునని భావము. ఇది సిద్ధాంతమె. ఏవ్యక్తి భగవత్కళా విశేషమును బ్రీతితో గనుఁగొనఁగలదో యావ్యక్తి పాపకర్మము క్షీణింపఁగాఁ బుణ్యకర్మము ఫలోన్ముఖముకాఁగా నుండఁదగు స్థితి నున్నదని మన మెఱుంగవలయును. భగవత్కళావిశేషము సుకృతాత్ములకే చూడఁదగియుండునని సారము. మహాత్ములను గాంచి కొందఱు నిందింతురు. ఏల? వారి తేజము వీరికి సహ్యము గాఁజాలదు. కావుననే ఏవగింపుగలిగి వారిని దూఱుదురు.

సుకృతవంతులు వారిం గాంచినంతన మహానందము నొందు దురు. ఇది యెల్లర కనుభవమే. ఐన నియ్యది యిందులకనిమాత్ర మాలోచింపరు. ఊహించిన నెఱుంగరానివిషయ మిదికాదు. ప్రకృత మనుసరింతము. సీతాదేవి శ్రీరామునకు నీవిషయమునే తెలిపెను. మృగములు లోనగునవి నీదివ్యతేజస్సు గాంచినంతన దూరముగాఁ బరుగిడునుగాని చెంత నుండఁజాలవు. అట్టివారి నుండి నాకు భయ మెట్లు కలుగునో యెఱుంగఁజాలనని సీత ప్రశ్నించెను.

"న చ మాం త్వత్సమీపస్థామపి శక్నోతి రాఘవ,
సురాణామీశ్వరశ్శక్రః ప్రధర్షయితుమోజసా." ౬

అని మూలము. ఇచ్చట సీత తనతత్త్వమును దేటపఱచెనని మనము తలంపవలయును. పరమేశ్వరా! నీచెంతనున్న నన్ను నింద్రుఁడైనఁ దిరస్కరింపఁజాలఁడు. అనఁగా నతనితేజస్సు నాప్రోల నత్యల్పమని భావము. ఇందలిసారమేమి? ప్రకృతి పరమపురుషునినుండి బహిర్గతమైనపుడు అనఁగా భగవంతుఁడు ప్రవృత్తిమార్గమునఁ బ్రవేశింప నిష్టపడినపుడు తదిచ్ఛాశక్తి రూపము కలదగును. ఆవ్యక్తియే సగుణబ్రహ్మమనంబడును. పురుషుఁడు తద్విశిష్టుఁడై తనసర్వసాక్షిత్వమును బ్రకటించుచు నుండును. మహాప్రకృతి త్రిమూర్తులంబుట్టించి సర్వబ్రహ్మాండ ములసృజించును. అట్టి ప్రకృతి నింద్రాదులు తేఱిచూడఁ జాలరు. భగవంతుఁడు నివృత్తిమార్గమునఁ బ్రవర్తింపఁబూని నపుడు ప్రకృతి యాతనియందు విలీనమగును అనఁగా నిచ్ఛలేక యతఁడుండును. కావున నెవ్వఁడుగాని భగవదిచ్ఛను జయింపఁ గలఁడా? ప్రకృతిని దూషించువారు తత్త్వము నెఱుంగఁజాల

రనియే సారము. ప్రకృతమున మన మెఱుంగఁదగువిషయమేది? రామా! నీవూరకయుండినను నన్ను నింద్రాదులుకూడఁ జూడఁ జాలరు. ఇఁకఁ గ్రూరమృగములమాట యిటనేటికి? అనఁగా సర్వకార్యములు నేనే యొనరించుచుందును. నీవు సర్వసాక్షివి కావున నాకార్యములం గాంచుచుండుమని సీత తెలిపెను. ఇదియే మన మెఱుంగఁదగుసారము.

"పతిహీనా తు యా నారీ న సా శక్ష్యతి జీవితుం,
కామమేవం విధం రామ త్వయా మమ విదర్శితమ్. ౭
అథ చాపి మహాప్రాజ్ఞ బ్రాహ్మణానాం మయా శ్రుతం,
పురా పితృగృహే సత్యం వస్తవ్యం కిల మే వనే. ౮
లక్షణిభ్యో ద్విజాతిభ్యశ్శ్రుత్వాహం వచనం పురా,
వనవాసకృతోత్సాహా నిత్యమేవ మహాబల. ౯
ఆదేశో వనవాసస్య ప్రాప్తవ్యస్స మయా కిల,
సా త్వయా సహ తత్రాహం యాస్యామి ప్రియ నాన్యథా. ౧౦
కృతాదేశా భవిష్యామి గమిష్యామి సహ త్వయా,
కాలశ్చాయం సముత్పన్నస్సత్యవాగ్భవతు ద్విజః." ౧౧

అని మూలము. ఈభాగము సీతారూప మహాప్రకృతి కార్యములను దేటపఱచుచున్నది. పరికింపుఁడు.

పతిహీనయగు పురంధ్రి బ్రదుకఁజాలదు. ఈవిషయము నీవే నాకుఁ బెక్కుసారు లుపదేశించితివి. అని సీత యనియెఁ గదా. దీనిభావమేమి? భగవంతుఁ డెందో భగవతి యందే యుండుననియు, వారికింగల యవినాభావసంబంధ మట్టిదనియు, వారిరువు రెడఁబాయుటసంభవమనియు, నీపద్ధతి యెఱుంగని వారు భగవత్తత్త్వమే యెఱుంగరనియుఁ దాత్పర్యము. శ్రీరామా! నీవు మహాప్రాజ్ఞుఁడవు. అనఁగాఁ "బ్రజ్ఞాత్రైకాల్య

గోచరా" యన్న న్యాయానుసారము త్రికాలవేత్తలలో నీవంటి వాఁడు లేఁడని యర్థము. అనఁగా నో భగవంతుఁడా యని తాత్పర్యము. బ్రాహ్మణులనఁగా బ్రహ్మము నెఱింగినవారు తత్త్వవేత్తలనుట. అట్టివారు నేను జనకునింటనుండఁగా నీసీత వనమున వసియింపఁదగును. అని పలికిరి. వారు లక్షణముల నెఱింగినవారు. అనఁగా నాయుత్పత్తి నాశరీరసౌభాగ్యము నెఱింగినవారు కనుకనే నాయవతారము నెఱింగిరని భావము. అది నే విన్ననాఁటి నుండి నిరంతరము వనముల నివసింప నుత్సాహవంతురాలనై యున్న దానవని యర్థము. ఆ పెద్దలయా దేశము వ్యర్థము కాదు కదా. అడవుల నుండఁదగిన ట్లవతరించిన నేను నిన్నుఁగూడి యనఁగా ధర్మసంరక్షణార్థ మవతరించిన నిన్నుఁగూడి పోవఁదగునుగదా? అందుల కిది తగినయదను అద్విజుఁడు సత్యవచనుఁడగుఁగాక. అనఁగా ముఖ్యార్థమేమి? మనమిరువురము భూలోకమున నేల యవతరించితిమో ఆ కార్యము నెఱవేర్పఁదగినసమయ మొదవినది. ఇఁక నాలసింప నేల? పోవుదము. నాచిన్నతనమున నే మహాత్ములు బ్రాహ్మణులు నానివాసము కొంతకాలము వనముల యందని నిర్ణయించిరి. లోకసమ్మతముగా నావనవాసము చెల్లును. నిన్నుంగూడి యందుండవలయును. అనఁగా మనయిరువురమూలమునఁగాని యీమహాకార్యము సాగదు. నీచెంతనున్న నన్ను సేవించినఁగాని యా రావణుఁడు శాపవిముక్తి నొంనఁడు. నేనిందే యున్న నీయవతారమునకు ఫలము గలుగునా! అని సీత శ్రీరామునిఁ బ్రశ్నించెను. నిన్నుంగూడి యుందునన గా సీతారాములకు వాస్తవమైన యెడఁబాటు లేదనియు నది భ్రాంతియే యనియు మన మెఱుంగవలయును. అగ్నికి దాహకశక్తికి నెట్లు వేఱుపాటు గల్పింప శక్యము కాదో యట్లే సీతారాములకు నెడఁ

చాటు లేదని సిద్ధాంతము. ప్రకృతియే కార్యకరణదక్షురా లనియుఁ, బరాత్పరుఁడు సాక్షిమాత్రుఁడుగ నుండుననియుఁ, దత్సాన్నిధ్యబలము లేకయుండఁ బ్రకృతి వేఱుగ నుండ దనియు, నాప్రకృతిం గైకొన్నపుడుగాని పరమపురుషుఁడు రూపవంతుఁడు కాఁడనియు నిటఁగలసారము. ఈవిషయమునే

"శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
న చేదేవం దేవో న ఖలు కుశలస్స్పందితుమపి,
అతస్త్వామారాధ్యాం హరిహరవిరించాదిభిరపి
ప్రణంతుం స్తోతుం వా కథమకృతపుణ్యః ప్రభవతి."

అని శ్రీశంకరభగవత్పాదాచార్యులుగారు తేటపఱచిరి.

"వనవాసేఽభిజానామి దుఃఖాని బహుధా కిల,
ప్రాప్యంతే నియతం వీర పురుషైరకృతాత్మభిః." ౧౨

అని మూలము.

"అకృతాత్మభిః అశిక్షితమనస్కైః ప్రాప్యంతే న తు మాదృశైర్జనై రితి భావః." అని గోవిందరాజులు.

అకృతాత్మభిః అజితేంద్రియైః విషయలోలుపైః నతు త్వాదృక్ష్ దృశైర్జనైరిత్యర్థః." అని మహేశ్వరతీర్థులు.

సామాన్యార్థము స్పష్టము. వనవాసదుఃఖములు జితేంద్రియులు కానివారలకేకాని జితేంద్రియులకుఁ దోఁపవని తాత్పర్యము. ఇఁక విశేషార్థ మిందేమని విమర్శింతము. శ్రీరామచంద్రా! వనవాసమునఁ గలుగనున్న దుఃఖముల నేనెఱుంగక పోలేదు. అవి రాక తప్పవు. అవి జితేంద్రియులు కానివారలకు ననఁగా సామాన్యమానవులకు దుఃఖములుగాఁ దోఁచును.

మనఁబోంట్లకు నవి సుఖములే యగును. అనఁగా మనమిరువుర మవతరించినది దుఃఖము లనుభవించునట్లు నటించి లోకులకు సుఖము ధర్మరక్షణము చేయుటకే కదా. విరాధాదిదానవులకు శాపమోక్షము నను గ్రహించుటయు,మనదర్శనమునకొఱకు వేచి యున్న మునులకు వారితపఃఫలముగా దర్శన మొసంగుటయు, మనల దర్శించి యూర్ధ్వలోకముల కరుగనున్న మునివరులకు దర్శనభాగ్యము లభింపఁజేయుటకే కాదా. ఇవన్నియు నెట్లు మానఁగలము? వారివారికర్మఫలముల నొసంగుట మనపని. కావున నడవుల దుఃఖములు కలుగునని నాకుం జెప్పుట నన్ను సిద్ధముగానుండుమని హెచ్చరించుటకే కాక మఱెందులకు? అని సీతాదేవి రామునితోఁ బల్కెను. ఇప్పట్టున నీయిరువురు ప్రకృతి పురుషులా, లేక త్రిమూర్తులలో నొకరుగ గణింపఁబడు నారాయణమూర్తియు లక్ష్మీదేవియు సీతారాములుగ నవతరించిరా యనువిషయ మించుక విచారింపఁదగియున్నది. పలుతావుల నీవిషయము చర్చించుట కవకాశము కల్గినను విమర్శించి యున్నను సంపూర్ణముగా విమర్శించుట మంచిదనితోఁచినందున వ్రాయుదును.

## సీతారాముల యవతార సిద్ధాంతము.

ప్రాయికముగా వైష్ణవులు వైకుంఠవాసియగు శ్రీమన్నారాయణమూర్తి లక్ష్మీసహితుఁడై సీతారాములుగా నవతరించె నందురు. ఏలయనఁగా విష్ణువే సర్వోత్తముఁ డనియు శివుఁడు తద్భక్తులలో నొకఁడనియు వారిమతము. దానిని సిద్ధాంతము చేయుటకై వారెన్నియో పాట్లుపడుదురు. ప్రధానముగా శివుని దూషింతురు. ఈశివదూషణమహాకార్యమునం దుత్త

ములు మధ్యవైష్ణవులు. అందును శిలామండపములు శిలావిగ్రహములు మోక్షమొసంగు ననువారుత్తమోత్తములు. అట్టివారే శిష్యులను జేర్చుకొని శివదూషణము చేయుచుందురు. వారికి శ్రీవిష్ణువునందు భక్తియున్నదో లేదో దైవమెఱుంగును. కాని విష్ణుప్రసాద మనంబడుభక్ష్యమునందు మహాభక్తి కలదనుట నిర్వివాదము.

భగవంతుఁడు పరతత్త్వమని, నిర్గుణుఁడని, అద్వితీయుఁడని యుపనిషత్తులు ఘోషించును. ఈవిషయమున భేదాభిప్రాయమే లేదు. విష్ణుశబ్దము రాఁగానే యెగిరిపడువారే మధ్యవైష్ణవులు. విష్ణువు లిరువురు గలరు. శంకరు లిరువురు గలరు.

"ఆదిత్యానామహం విష్ణుర్జ్యోతిషాం రవిరంశుమాన్,
రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసాం." ౨౧. గీత. ౧౦ అ.

అని గీతాప్రమాణము గలదు. ద్వాదశాదిత్యులలో నొకవిష్ణువు కలఁడు. ఏకాదశరుద్రులలో నొక్కశంకరుఁడు కలఁడు.

"అహమాదిశ్చ మధ్యం చ భూతానామంత ఏవ చ."

అనుగీతావాక్యమున కర్థమేమి? సృష్టిస్థితిసంహారములు నేనే. అనఁగా బ్రహ్మవిష్ణుశివులు నేనే యనికదా. ఈచెప్పినవాఁడెవ్వఁడు? భగవంతుఁడే కదా.

"యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున,
న తదస్తి వినాయత్స్యాన్మయా భూతం చరాచరం." ౩౯ గీత. ౧౦ అ.

అన్నవాఁడు భగవంతుఁడు కాక మఱెవ్వఁడగును? ఈ శ్రీకృష్ణోపదేశము మనకేమి తెల్పుచున్నది? భగవంతుఁడు ప్రకృతిసంబంధమున లోకప్రవృత్త్యర్థము త్రిమూర్తులుగా నవతరించె ననునదియే. విష్ణువెక్కుడనుట కవకాశ మేమికలదు? దురహంకార

మునఁదప్ప వేఱువిధముగా నవకాశము లేదు. శ్రీభాగవతము ప్రమాణమని వైష్ణవు లంగీకరింతురు. విష్ణుపురాణము హరి వంశముకూడఁ బ్రమాణములనియే వారిమతము. తక్కినవి తామసపురాణము లందురు. అట్లు చెప్పినఁగాని వారివాదము నిలువదు. పాపము వా రేమి చేయుదురు? బుద్ధిమంతు లన్ని పురాణములు ప్రమాణములే యందురు. ఏ దేవతారూపమునం దెవ్వరికి భక్తి చక్కఁగా నుండునో వా రారూపవంతుఁడే పరమాత్మ యనుకొనవచ్చును. ఉపాసనమున నాబుద్ధియే వారికి దృఢముగనుండిన వారు తరింతురు. ఎల్లమూర్తులుగ నాపరమాత్మయే కదా యుండును.

"వదంతి తత్తత్త్వవిద స్తత్త్వం యద్జ్ఞానమద్వయం,
బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి శబ్ద్యతే. ౧౧
తచ్ఛ్రద్దధానా మునయో జ్ఞానవైరాగ్యయుక్తయా,
పశ్యంత్యాత్మని చాత్మానం భక్త్యా శ్రుతగృహీతయా. ౧౨

శ్రీభాగవతము. ౧ స్కం. ౨ అధ్యా.

బ్రహ్మ యని పరమాత్మ యని భగవంతుఁ డని ఆమహాతత్త్వమే పిలువఁబడును. ఆతత్త్వము నే మహర్షు లాత్మయందుఁ జూతురు. అనఁగా జ్ఞానదృష్టి దర్శింతురని భావము.

"ధామ్నా స్వేన సదా నిరస్తకుహకం సత్యం పరం ధీమహి. ౧

శ్రీభా. ౧ స్కం. ౧ అధ్యా.

సత్యం పరం అనుశబ్దములచే భగవంతుని వ్యాసమహర్షి పేర్కొనెను

"స్థిత్యుద్భవప్రళయహేతురహేతురస్య
యత్స్వప్నజాగరసుషుప్తిషు సద్బహిశ్చ,

దేహేంద్రియాసుహృదయాని చరంతి యేన
సంజీవితాని తదవేహి పరం నరేంద్ర." ౩౫

శ్రీభా. ౧౧ స్కం. ౩ అధ్యా.

సృష్టిస్థితిలయములకు హేతువనియు హేతువుకాదనియుఁ జెప్పఁబడునది పరతత్త్వ మొక్కఁడే యని సారము.

"యత్కాయ ఏష భువనత్రయసన్నివేశో
యస్యేంద్రియైస్తనుభృతాముభయేంద్రియాణి,
జ్ఞానం స్వతశ్శ్వసనతో బలమోజఈహా
సత్త్వాదిభిస్థ్సితిలయోద్భవ ఆదికర్తా. ౪
ఆదావభూచ్ఛతధృతీరజసాస్య సర్గే
విష్ణుస్థ్సితౌ క్రతుపతిర్ద్విజధర్మసేతుః,
రుద్రోఽప్యయాయ తమసా పురుషస్స ఆద్య
ఇత్యుద్భవస్థితిలయాస్సతతం ప్రజాసు. ౫

శ్రీభా. ౧౧ స్కం. ౪ అధ్యా.

పరమాత్మయే సర్వమనియు నాతత్త్వమే బ్రహ్మావిష్ణురుద్రులుగా సృష్టిపాలనసంహారకార్యములకొఱ కవతరించెననియు సారము. ఈ ప్రమాణముల ననుసరించి యాలోచింపఁగా భగవంతుఁ డొక్కఁడే త్రిమూర్తులుగా నవతరించెనని తేలెడిని.

"అహం భవో యజ్ఞ ఇమే ప్రజేశా దక్షాదయో యే భవదాదయశ్చ,
స్వర్లోకపాలాః ఖగలోకపాలాన్నృలోకపాలా స్తలలోకపాలాః. ౪౩
లీలావతారాః పురుషస్య భూమ్నః." ౪౪

బ్రహ్మ యనఁబడు నేను శివుఁడు విష్ణువు దికాల్పకాదులెల్లరు భగవంతునిలీలావతారములే యనంబడువారమని బ్రహ్మ తెలిపెను.

శ్రీభగవాన్:—

"అహం బ్రహ్మా చ శర్వశ్చ జగతః కారణం పరమ్,
ఆత్మేశ్వర ఉపద్రష్టా స్వయం దృగవిశేషణః. ౫౦
ఆత్మమాయాం సమావిశ్య సోఽహం గుణమయీం ద్విజ,
సృజన్ రక్షన్ హరన్ విశ్వం దధ్రే సంజ్ఞాం క్రియోచితాం. ౫౧
తస్మిన్ బ్రహ్మణ్యద్వితీయే కేవలే పరమాత్మని,
బ్రహ్మరుద్రౌ చ భూతాని భేదేనాజ్ఞోఽనుపశ్యతి. ౫౨
యథా పుమా న్న స్వాంగేషు శిరఃపాణ్యాదిషు క్వచిత్,
పారక్యబుద్ధిం కురుత ఏవం భూతేషు మత్పరః. ౫౩
త్రయాణామేకభావానాం యో న పశ్యతి వై భిదాం,
సర్వభూతాత్మనాం బ్రహ్మన్ స శాంతి మధిగచ్ఛతి." ౫౪

౪ స్క—౦. ౭ అధ్యా.

త్రిమూర్తులు భగవదవతారములనియు, భేదము వీరియందుఁ బాటింపఁగూడదనియు, నాపరతత్త్వముగనే భావింపవలయు ననియు దీనిసారము.

ప్రజాపతయ ఊచుః:—

"గుణమయ్యా స్వశక్త్యాస్య సర్గస్థిత్యప్యయాన్ విభో,
ధత్సే యదా స్వదృగ్భూమన్ బ్రహ్మవిష్ణుశివాభిధాః. ౨౩
త్వం బ్రహ్మ పరమం గుహ్యం సదసద్భావభావనం,
నానాశక్తిభిరాభాత స్త్వమాత్మా జగదీశ్వరః. ౨౪
త్వం శబ్దయోనిర్జగదాదిరాత్మా ప్రాణేంద్రియద్రవ్యగుణస్వభావః,
కాలః క్రతుస్సత్యమృతం చ ధర్మ స్త్వయ్యక్షరం యత్త్రివృదామనంతి. ౨౫

... ... ... ... ... ...

న తే గిరిత్రాఖిలలోకపాల విరించవైకుంఠసురేంద్రగమ్యం,

జ్యోతిః పరం యత్ర రజస్తమశ్చ సత్వం న యద్విభాతి నిరస్తభేదం. ౩౧
శ్రీభా. ౮ స్కం. ౭ అధ్యా.

ప్రకృతి త్రిగుణమయియగు. ఆమహాప్రకృతింగొని నీవే బ్రహ్మవిష్ణురూపుఁడవై తివని శంకరుని ప్రజాపతులు నుతించిరి.

మహామతులారా! శ్రీభాగవతమునుండియే యీప్రమాణములు చూపఁబడియెఁగదా? వీనింబట్టి యూహింపఁగా పరతత్త్వ మొక్కటియే త్రిమూర్తులుగా నవతరించెనని స్పష్టము. త్రిమూర్తులు ప్రకృత్యధీనులు అనువిషయము తేలెను. మఱియు శంకరుని బ్రహ్మావిష్ణుస్వరూపుఁడవు నీవే యని వినుతించినట్లు స్పష్టమాయెను. నేను బ్రహ్మయు శంకరుఁడును బరతత్త్వాంశభూతులమే యని విష్ణువే తెలిపినట్లు కనఁబడియెను. వీనిసార మేమనఁగా నిర్గుణబ్రహ్మమే మహాప్రకృతింగూడి సగుణబ్రహ్మమగుచు సృష్టిస్థితిలయముల నొనర్ప రజస్సత్వతమోగుణప్రధానులుగ బ్రహ్మావిష్ణురుద్రుల సృజించెననియు, వారు తదాజ్ఞచే నాయాకార్యము లొనరింతురనియు, వారిముగ్వురి యందొక్కింతయు భేదభావము లేదనియు, నట్లు భేదబుద్ధిగలవారజ్ఞులనియు సారము శ్రీభాగవతము ననుసరించి హరిహరబ్రహ్మలకు భేదములేదని సిద్ధాంతము.

నారాయణః:—

"త్వత్వంభూతా భూతకృతో వరేణ్యో గోప్తారోఽస్య భువనస్యాది దేవ,
అవిశ్యేమాం ధరణీం యేఽభ్యరక్షన్ పురా పురాణీ తవ దేవ సృష్టిః.

... ... ... ... ... ...

అస్తౌషం త్వాం తవ సత్యానమిచ్ఛన్ విచిన్వన్ వై సదృశం దేవవర్య,
సుదుర్దభాన్ దేహి వరాన్ మమేష్టానభిష్టుతః ప్రవ్యకార్షీశ్చ మాయాం

భగవాన్ శంకరః—

మత్ప్రసాదాన్మనుష్యేషు దేవగంధర్వయోనిషు,
అప్రమేయబలాత్మా త్వం నారాయణ భవిష్యసి. ౮౪
న చ త్వాం ప్రసహిష్యంతి దేవాసురమహోరగాః,
న పిశాచా న గంధర్వా న నరా న చ రాక్షసాః. ౮౫

... ... ... ... ... ...

కశ్చిత్తవ రుజం కర్తా మత్ప్రసాదాత్కథంచన,
అపి చేత్సమరం గత్వా భవిష్యసి మమాధికః." ౮౭

మహాభారతము, ద్రోణపర్వము, ౨౦౧ అధ్యా.

మహావిష్ణువు తపస్సుచేసి శంకరుననుగ్రహమున వరములు పొందెను. సకలప్రపంచరక్షకుఁడవు నీవే యని నారాయణస్తుతి సారము. ఈఘట్టముననే యర్జునునకు వ్యాసమహర్షి యుపదేశించిన శివప్రభావము గ్రంథవిస్తరభీతి మానితిని. సర్వమునకు శివుఁడే కారణమని తెలుపఁబడినది.

"సంతి నో బహవో రుద్రాశ్శూలహస్తాః కపర్దినః,
ఏకాదశస్థానగతా నాహం వేద్మి మహేశ్వరం. ౨౦

దధీచిః—

సర్వేషామేవ మంత్రోఽయం యేనాసౌ న నిమంత్రితః,
యథాహం శంకరాదూర్ధ్వం నాన్యం పశ్యామి దైవతం.
తథా దక్షస్య విపులో యజ్ఞోఽయం న భవిష్యతి." ౨౧

శాంతిపర్వము, ౨౮౩ అధ్యా.

ఈఘట్టమున రెండువందలయెనుబదిమూఁడవయధ్యాయము వఱకుఁ గలశివమాహాత్మ్య మత్యద్భుతము. బ్రహ్మవిష్ణ్వాదులు తత్స్వరూపులనియే స్పష్టము.

"స ఏష భగవాన్ దేవస్సర్వసత్త్వాదిరవ్యయః,
సర్వ తత్త్వవిధానజ్ఞః ప్రధానపురుషః పరః. ౩౫౦
యోఽసృజద్దక్షిణాదంగాద్బ్రహ్మాణం లోకసంభవం,
వామపార్శ్వాత్తథా విష్ణుం లోకరక్షార్థమీశ్వరః. ౩౫౧
యుగాంతే చైవ సంప్రాప్తే రుద్రమీశోఽసృజత్ప్రభుః,
స రుద్రస్సంహరన్ కృత్స్నం జగత్స్థావరజంగమం." ౩౫౨

విష్ణుః:—

"నమోస్తు తే శాశ్వతపుణ్యయోనే బ్రహ్మాధిపం త్వామృషయో వదంతి,
త్వామేవ నారాయణశబ్దసంజ్ఞం పరం చ సత్యం ప్రవదంతి సంతః. ౪౧౨
త్వాం వై బ్రహ్మా చ రుద్రశ్చ వరుణోఽగ్నిరనుర్భవః."

అనుశాసనపర్వము, ౧౪ అధ్యా.

శంకరుఁడు దేహదక్షిణభాగమున బ్రహ్మదేవుని వామపార్శ్వమునుండి విష్ణువును సృజించెను. సృష్టిపాలనముల నొనరింప వారి నాజ్ఞాపించెను. రుద్రుని సృజించి సంహారాధికార మొసంగెను. అని పై దానిసారము. విష్ణువే శంకరా! నీవే నారాయణశబ్దవాచ్యుఁడ వనియెను. సర్వకారణుఁడు శివుఁడే యని సారము.

"రుద్రో నారాయణశ్చైవ సత్త్వమేకం ద్విధా కృతం,
లోకే చరతి కౌంతేయ వ్యక్తిస్థం సర్వకర్మసు." ౨౭

శాంతిపర్వము ౩౪౨ అధ్యా.

ఒకవ్యక్తియే రుద్రనారాయణు లనఁబరఁగెనని సారము. ఇట్టివెన్ని యోచూపవచ్చును. 'అతి సర్వత్ర వర్జయే' త్తని యున్నదిగాన మానితిని. ఉపనిషత్తులు శ్రీభాగవతాదిపురాణములు హరివంశ మహాభారతాదులు పరిశీలించిన నేర్పడుసిద్ధాంత మేమనఁగా భగవంతుఁ డొక్కఁడే కార్యభారముల ననుసరించి యనేకరూప

ములఁ దాల్చుననియు, నాపరమపురుషుఁడే ప్రపంచోన్ముఖుఁడై
ప్రకృతివిశిష్టుఁడై త్రిమూర్తులఁ దనయంశమువలన నిర్మించె
ననియు,వారు తమతమ కార్యములగు సృష్టిపాలనసంహారములను
జేయుచున్నవారనియు, వారికంటెఁ దక్కువ కార్యముల నిం
ద్రాదులు చేయుచుందురనియు, వారెల్లఁ బ్రకృతిబద్ధులేయని
యు, నిందెవ్వరుగాని స్వతంత్రులు కారనియు నేర్పడుచున్నది.
త్రిమూర్తు లనఁబడు బ్రహ్మవిష్ణుశంకరులలో నుత్తమమధ్య
మాధమభేదములే కానరావు. ధర్మరాజు శివమాహాత్మ్యమును
దెలుపుమని భీష్మునడుగ శ్రీకృష్ణుఁడు తప్ప దానిం జెప్ప నర్హులే
లేరని బదులుపల్కెను. శ్రీకృష్ణుఁడు శివునిచరిత్రమును దెల్పెను.
శివుఁడు కొన్నిపురాణములయందు శ్రీవిష్ణువును గొనియాడెను.
అనఁగా నర్థమేమి? వీరిరువురు బ్రహ్మాయు స్వతంత్రులుగారనియు,
నాభగవంతునియంశములే యనియు భావము. భక్తుఁ డేమూ
ర్తిని ధ్యానించినను బరాత్పరునిగా ధ్యానించిన నాపరాత్పరుఁ
డెల్లరూపములుగలవాఁడుగాన నాతని దరింపఁజేయును. కనుక నే
భక్తుఁడుకాని తనమనఃపద్మమున నిష్టదేవతాకల్పితరూపము
నుపాసించునపుడు పరతత్త్వమనియే దానిని భావింపవలయును
కాని వేఱుగా భావింపరాదు. మహాప్రకృతి యొకవ్యక్తి కాద
నియు నయ్యది భగవంతుని సంకల్పమే యనియు నెఱుంగవల
యును. నిర్గుణుఁడగుభగవంతుఁడు కార్యోన్ముఖుఁడగుతఱి నా
మహాప్రకృతి యాతని రూపముగలవానినిగాఁ జేయును.సగుణుఁ
డనుపే రాసమయముననే కల్గును. ప్రకృత్యతీతుఁ డాపర
మాత్మయే కాని యితరులు కారు. త్రిమూర్తులు లోనగువా
రెల్లఁ బ్రకృతికి లోఁబడినవారలే.

కొందఱు త్రిమూర్తులలో నొకఁడగువిష్ణువును శివ బ్రహ్మాలకంటె నధికుఁడందురు. విష్ణువు శివునేల పరమేశ్వరునిగాఁ దెలిపెనన్న శివనామములన్నియు విష్ణుపరములే యందురు. కాని విష్ణునామములు శివపరము లేల కావో యోజింపరు. ఇన్ని నామములా భగవంతునకు నొక్కనికే చెల్లును. విష్ణు సర్వోత్తమత్వము గలదనువారు విష్ణురూపమున నాభగవంతుఁడే వెలసెనని భావించుచో దోషములేదు. అట్లే శివసర్వోత్తమత్వము గలదనువారు శివరూపముగల భగవంతుఁడని భావింపవలయును. వైకుంఠవాసియుఁ బ్రపంచరక్షణకార్యకర్తయు నగువిష్ణువు శంకరునికన్న శ్రేష్ఠుఁడనువాదము నిస్సారము. దుర్మతాభిమానపిశాచమే వారి నట్లు పలికించునని మన మూహించుట మంచిది. భగవంతుని తత్త్వ మెఱుంగవలయు నను వార లిట్టి మతాభిమానావేశము గలవారు గాకుండవలయు. మతములనునవి దురహంకారమును బుట్టించి కొందఱను సత్యదూరులనుగాఁ జేయుచున్నవి. దేవతాదూషణము వారిచేఁ జేయించుచున్నవి. వారిదుష్కర్మమే యిట్టి మతాభిమానపిశాచరూపమున వారిని ద్రిప్పుచున్న దని మన మెఱింగి వారిని దూషింపక వారినిగూడఁ దరింపఁ జేయుమా యని పరమేశ్వరుని బ్రార్థింపవలయును. శివసహస్రనామములయందు విష్ణునామములు గలవు. విష్ణుసహస్రనామములయందు శివనామములు గలవు. అవి రెండు నాభగవంతుని దెలుపుచు నభేదమును సూచించుచుండఁగా నంతమాత్ర మెఱుంగక యందొక్కరుని దూషించువారిని మన మేమని భావింపవలయుననఁగా వారి కయ్యది భగవద్భజనము చేయఁదగుజన్మము కాదని తలంపవలయును. కర్మము త్రిప్పులకు లోను

గానివా రెవ్వరు? ఈపై వ్రాసిన ప్రమాణములననుసరించి సీతా రాములు ప్రకృతిపూరుషులేకాని వైకుంఠలోకమునకుమాత్ర మధిపతులగు లక్ష్మీనారాయణులుకారు. భగవంతుఁడు వైకుంఠ మున కధిపతికాఁడా యని కొందఱు ప్రశ్నింతురు. వైకుంఠ మునకేకాదు సకలబ్రహ్మాండములకు నధిపతియే కాని యా పరమేశ్వరుని నివాసము వైకుంఠమే కాదు. ఎల్లతావుల నుండును. ఎల్లనామము లాయనకుం జెల్లును. కావున నాభగ వంతుఁడే ధర్మరక్షణమును జేయఁబూని దానికి విరుద్ధముగా బ్రవర్తించురావణాదులను వారికర్మగతుల ననుసరించి శిక్షింపఁ దనప్రకృతిని సీతారూపమున నుండఁబంచి తాను మానవ రూపమున శ్రీరామనామమున నవతరించి తన యవతారమును సఫలముచేయఁబూనెనని మనము భావింపవలయును. ఇఁక రామాయణమును బఠించి విశేషార్థములం గనుఁగొందము.

"కన్యయా చ పితుర్గేహే వనవాసశ్శ్రుతో మయా,
భిక్షిణ్యాస్సాధువృత్తాయా మమ మాతురిహాగ్రతః. ౧౩
ప్రసాదితశ్చ వై పూర్వం త్వం వై బహువిధం ప్రభో,
గమనం వనవాసస్య కాంక్షితం హి సహ త్వయా." ౧౪

అని మూలము. ఇందలివిశేషార్థమేమి? రామచంద్రా! విదేహనగ రమున నేనున్నపుడే యొకబ్రహ్మచారిణి వచ్చి నాతల్లి విను చుండ నీసీత వనముల వసించునని తెలిపెను. ఆమె త్రికాల వృత్తముల నెఱుంగును. నేనయోధ్యకు వచ్చినతర్వాత వన ములఁ జూచుకోరికకలదనియు నన్నుఁబిలుచుకొనిపొమ్మని నిన్ను యాచించియుంటిని. ఈవనగమన మీనాఁటిదికాదుకదా. కాన నన్నేల రావలదనియెదవు? నిన్నుఁగూడి వనవాసము చేయుటకే

కదా నేను బుట్టినది? అని సీత యాశయము. దీనినుండి మనము నేర్చుకొనఁదగిన దేది? మానవులు భవిష్యత్కాలఫలముల కను గుణమగు ప్రవర్తనము కలవారలుగ నుందురు. జ్ఞానులవ్వారి గతుల నెఱుంగఁజాలుదురు. సాధువులు కానివార లవ్విష యము నెఱుంగఁజాలరు. గొప్పదశ ననుభవించుకర్మములు గల వారలైనచో నాఫలముల కనుగుణములుగఁ బ్రవర్తింతురు. దుర్దశయందు నట్లే. కొంతకాల మొక్కరీతిగాఁ బ్రవర్తించుచుఁ దటాలునఁ దద్విరుద్ధప్రవర్తనము కలవారలగుటఁ గొందఱ మనము చూచుచున్నాము. అట్టివా రప్పటికన్న వేఱువిధము లగుఫలముల ననుభవింపవలసినవారే యగుదురు వారిప్రవృత్తి ననుసరించి సాధువు లావిధము నెఱుఁగుదురు. అజ్ఞులగు వారు కర్మగతుల నెఱుంగక వారిని దూషించుటో భూషిం చుటో యను కార్యముల నొనరింతురు. 'గహనా కర్మణో గతిః' అనువిషయ మెఱుంగుటయే వివేకము. మన మెఱుఁగఁదగువిషయ మిదియే. పై సీతావాక్కుల ననుసరించి ఆలోచింపఁగాఁ దమ రెండుల కవతరించిరో వా రెఱుంగుదురనియు దుఃఖానుభ వము నటనమే యనియు మన మెఱుంగవలయును.

"కృతక్షణాహం భద్రం తే గమనం ప్రతి రాఘవ,
వనవాసస్య శూరస్య చర్యా హి మమ రోచతే.  ౧౪
శుద్ధాత్మన్ ప్రేమభావాద్ధి భవిష్యామి వికల్మషా,
భర్తారమనుగచ్ఛంతీ భర్తా హి మమ దైవతం.  ౧౫
ప్రేత్యభావేఽపి కల్యాణ సంగమో మే సహ త్వయా."

అని మూలము. పై నవ్రాసినభావము నీసీతావాక్యములు సిద్ధాం తము చేయుచున్నవి. రాఘవ! రఘువంశమున నవతరించిన

యోపరమేశ్వరా! 'గమనం ప్రతి కృతక్షణా' వనముల కరుగ వలయునని యాకాల మెప్పుడెప్పుడు వచ్చునని తొందఱపడు చున్నాను. భద్రంతే=నీకు మేలు గలుగును. వనముల నివసించుచు విక్రమమునుజూపు నీయొక్క-చర్యయే నాకు సమ్మతము. సేవచేయుటని సామాన్యార్థము. అనఁగా నీక నాలసింపరాదు. నేను త్వరపడుచున్నాను. మనము చేయఁదగు కార్యములకు విలంబము పనికిరాదు. నీవు పరాక్రమింపఁదగు కాలము వచ్చెడిని. దానినిజూడ వేడుకపడుచున్నాను. అనుటచే నానిమిత్తమున నీవు పరాక్రమము చూపవలసియున్నది. విరాధాదులు నీవలన ముక్తినొందవలసినవా రున్నారనుట యీమాటలమూలమున సూచింపఁబడినవి. సీతనెత్తుకొనిపోవు విరాధుని రాముఁడు సంహరించును. సీత రామవిక్రమమును జూచుచుండును. నీకు మేలు గలుగును. అనఁగా నీకీర్తి జగముల వ్యాపించును. అని సారము. శుద్ధాత్మన్=పరిశుద్ధాత్మస్వరూపా! అని యర్థము. నన్ను భరించునిన్ను ననుసరించివచ్చుచుఁ బ్రేమభావమున ననియర్థము. వికల్మషాభవిష్యామి=కల్మషరహితురాల నగుదును.అనఁగా నగ్నిశుద్ధిని గాంతునని భావము. భర్తయందుఁ బ్రేమముగలపురంధ్రీమణి నగ్ని కాల్పఁజాలదన్నభావము నెల్లవారలకుం గల్గింతునని సారము. నాకు నీవే దైవతమవు. అనఁగా సకలలోకములు లోకేశులు నాయధీనులు. ప్రకృతిబద్ధులనుట. ఇట్టి నన్ను భరించువాఁడవు నీవే. ప్రకృత్యతీతుఁడవనుట. సర్వదా నేను నీసంకల్పరూపిణిగా నుందుననుట సారము. నీకంటె దైవతము నాకు వేఱులేదనియేకదా విశేషము.ఈయర్థమునే యీక్రిందిశ్లోకము దృఢపఱచుచున్నది. పరమేశ్వరా! పరలోకమునందును నీతోడి

సంగమరూపమగుమంగళము గలుగుఁగాక. అనఁగా మానవ
లోకమునఁ గలపనులు తీఱఁగనే నిన్నుఁగూడియుండు భాగ్య
మనఁగా నిట్లు స్త్రీపురుషరూపభేదములేక యభేదముగా నుండు
భాగ్యము కలుగుఁగాక యని సీతాదేవి స్వాభిప్రాయమును
విశదీకరించెను. మనదిరువురము మానవలోకమునఁ జేయఁ
గలకార్యములుతీర్చి ధర్మమును స్థాపించి ప్రజాసుఖమును గల్గఁ
జేసి మఱొకకార్యమునకుం గడంగుదమనియే యిందుఁగల
సారతరార్థము. ఈభాగమునుండి తేలినధర్మమేది? ఏకాంత
ప్రేమమున భర్తననుసరించి యతని దైవతమనియే భావించి
ప్రవర్తించునో, యాకాంత విగతకల్మష యనంబడును ఆసాధ్వి
పరలోకమునందు నావ్యక్తింగూడియే మంగళములఁ గాంచును.
పతివ్రతయన నామెయే. స్త్రీలకుఁ బతికన్న మిన్నయగుదైవ
తము లేదు అనఁగాఁ బతిని దైవముగా భావింపవలయును. అను
నదియే యిందుఁ గలధర్మము. ఈయర్థమే

"పతిం యా నాభిచరతి మనో వాగ్దేహసంయుతా,
సా భర్తృలోకానాప్నోతి సద్భిస్సాధ్వీతి చోచ్యతే." ౨౯

మను. ౯ అధ్యా.

అని మనుస్మృతి చాటుచున్నది. ఈధర్మమును స్త్రీలకొఱకు
మహాయోగి వాల్మీకి సీతావాక్యరూపమునఁ దెలిపెను. కావున
స్మృత్యర్థమే రామాయణము తెల్పుచున్నదని మన మెఱుంగ
వలయును. కేవల కావ్యమనుబుద్ధి యనుపరాదు. ధర్మసార
మనియే తలంపవలయును.

"శ్రుతిర్హి శ్రూయతే పుణ్యా బ్రాహ్మణానాం యశస్వినాం,
ఇహ లోకే చ పితృభిర్యా స్త్రీ యస్య మహామతే,

అద్భిర్దత్తా స్వధర్మేణ ప్రేత్యభావేఽపి తస్య సా. ౧౮
వివమస్మాత్స్వకాం నారీం సువృత్తాం హి పతివ్రతాం,
నాభిరోచయసే నేతుం త్వం మాం కేనేహ హేతునా. ౧౯
భక్తాం పతివ్రతాం దీనాం మాం సమాం సుఖదుఃఖయోః,
నేతుమర్హసి కాకుత్స్థ సమానసుఖదుఃఖినీం.” ౨౦

అనుమూలము పతివ్రతాధర్మములను బోధించుచున్నది. “మహామతే!” యని సీత రామచంద్రుని సంబోధించుచున్నది. “మతి రాగామిగోచరా” అన్న న్యాయమును ననుసరించి రాఁగలకాలమునకుఁ బనికివచ్చుటకే నే నీధర్మములను దెలుపుచున్నదానవని భావము. సామాన్యార్థము స్పష్టము. ధర్మోపదేశ మిది యని తెలియందగు. తమజాతికిఁ జెప్పఁబడినధర్మముల ననుసరించి యుదకధారాపూర్వకముగాఁ దల్లిదండ్రులు కన్యను వరునకు దానముచేయవలయును. ఆమె భర్తననుసరించి వర్తించునేని పరలోకమునందు నాపురుషుఁడే భర్తగా నుండును.అనఁగా నట్టి వారికిం గలసంబంధ మవిచ్ఛిన్నమని భావము. ఈధర్మము వేద విహితము. అట్లు నేను నీకును భార్యగా నీయఁబడితని. సాధు వర్తనము గలదానను. అనఁగా సాధువుల రక్షించుకొఱకే వర్తించుదానను. ఈలోకమున నవతరించితినని భావము. పతివ్రతను. నీయాజ్ఞాకరణమే నాకు వ్రతమని యర్థము. ఇట్టి నన్ను వెంటఁగొనిపోవ నేల సమ్మతింపకయున్నావు? లోకమున నేపురుషుఁడు కాని పతివ్రతను వదలి తానెచ్చటికిని బోరాదనుధర్మమింపు నుపదేశింపఁబడినది. భక్తురాలనఁగా నిన్నే సేవించుదానను. దీనాం=నీవు విడనాడినచో నాకు దిక్కులేదని యర్థము. సుఖదుఃఖయోస్సమాం=ద్వంద్వములగు శీతోష్ణసుఖదుఃఖాదుల

సీతోడ సమముగా ననుభవించుచుదానను అనఁగా నిరువుర మొక
దేహమే కాన నీకుఁ గలుగుసుఖదుఃఖములు నాకునుం గలుగు
చున్నవని భావము మాం = లక్ష్మీదేవిని. అనఁగా నీకు లక్షణ
ములఁగూర్చుదానను. నావలననే నీకు రూపసంపదలుగలుగునని
భావము. సమానసుఖదుఃఖనీం=ఈయవతారమున నీతో సమాన
ముగా సుఖదుఃఖముల ననుభవింపవలసినదాననే యని భావము.
ఇట్టి నన్ను నేతుమర్హసి=పిలుచుకొనిపోవఁదగుదువు. అనఁగా
నేను రాకయున్న నీ వేకార్యములు చేయఁజాలవు. నీవింగు
నేను లంకలో సమానముగా దుఃఖమనుభవించునట్లు సహింప
వలయునే. ఇట్టి నన్నేల వలవందువయ్యా యని జానకి
యడుగుచున్నది. ఈభాగము మన కెట్టిధర్మమును బోధించు
చున్నది? అనువ్రతయయి పతిప్రేమమునఁగూడి సుఖదుఃఖ
ములను బతితోడ ననుభవించుస్త్రీ సాధ్వి యనంబడును.
ఆమెతోఁ గూడియుండక పురుషుఁ డేధర్మములను జేయరాదు.
ఏయాత్రలు చేయరాదు. ఏధర్మకార్యములు చేయరాదు. అను
ధర్మము మరల నిందుఁ జక్కఁగాఁ జెప్పఁబడినది. అట్టిభార్య దీను
రాలుగా నుండరాదు. దీనురాలుగా నుండుటకు భర్తయే
కారణమగును. ఏసాధ్వి దుఃఖించునో యాయింట లక్ష్మి నివ
సింపదు. కావున సాధ్వియగుభార్యను భర్త సంతుష్టురాలినిగా
నొనరింపవలయును. అను నీధర్మమును మన మీభాగమునుండి
గ్రహింపవలయును. ఈనీతినే

"పితృభిర్భ్రాతృభిశ్చైతాః పతిభిర్దేవరైస్తథా,
పూజ్యా భూషయితవ్యాశ్చ బహుకల్యాణమీప్సుభిః. ౫౫
యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః,

యత్రైతాస్తు న పూజ్యంతే సర్వా స్తత్రాఫలాః క్రియాః. ౫౬
శోచంతి జామయో యత్ర వినశ్యత్యాశు తత్కులం,
న శోచంతి తు యత్రైతా వర్ధంతే తత్ర సర్వదా. ౫౭
జామయోయాని గేహాని శపంత్యప్రతిపూజితాః,
తాని కృత్యాహతానీవ వినశ్యంతి సమంతతః. ౫౮
తస్మా దేతా స్సదా పూజ్యా భూషణాచ్ఛాదనాశనైః,
భూతికామై ర్నరై ర్నిత్యం సత్కారేషూత్సవేషు చ. ౫౯
సంతుష్టో భార్యయా భర్తా భర్త్రా భార్యా తథైవచ,
యస్మిన్నేవ కులే నిత్యం కల్యాణం తత్ర వై ధ్రువం." ౬౦

మను. 3 అధ్యా.

(పూజ్యాః=గారవింపఁదగినవారని యర్థము.) అని మనుస్మృతి తేటపఱచెను. స్మృతి ధర్మముల నాయాయితావుల రామాయణము తెల్పుచున్నదని మన మెఱింగి దానిం బఠింపవలయును.

"యది మాం దుఃఖితా మేవం వనం నేతుం న చేచ్ఛసి,
విషమగ్నిం జలం వాహమాస్థాస్యే మృత్యుకారణాత్." ౨౧.

అనుమూలము భావికార్యములఁ దెల్పుచున్నది. శ్రీరామా! నిన్నుఁగూడి రావలయునని తత్తఱపడుచున్న నన్నుఁ బిలుచుకొనిపోవ నిచ్ఛగింపవేని విషాగ్నిజలములలో నొక్కదాని స్వీకరింతును. అనుటచేఁ గాఁగలయగ్నిప్రవేశము సూచింపఁబడినది మఱియు నొక్కసంవత్సరకాల మగ్నియందు నేనుండి నాప్రతికృతినే లంకలో నుంతును. అన్నభావ మిట సూచింపఁబడినదని యెఱుంగందగు. ఇట్లు లీభాగము మనకు సీతావాక్యములమూలమున వారిమహత్త్వమును దేటపఱచుచున్నది. ఈభాగమునఁ గలయధ్యాత్మరామాయణమునఁ గలవిషయము

పూర్వసర్గముననే వ్రాయఁబడినది. విశేషవిషయ మిందు దెలుపఁ దగినదలేదు. కథాంశము రెంటియం దేకరీతిగా నున్నది. ఇఁకఁ దరువాతికథాభాగమును బఠింతము.

## వనగమనమున సీతారాములసంవాదము.

* జానకి తన్ను నిట్లు శ్రీరాముఁ డాశ్వాసించుచుండఁగా నేవిధముననైన వనములకుఁ బిలుచుకొనిపొమ్మని యడుగఁ బూని కులవర్ధనుఁడగు రామునిం గని స్నేహబలమున నభిమానమున నీవిధమునఁ దర్కింపసాగెను. రామచంద్రా! నీయందు సౌందర్యవిశేషముమాత్రమే కలదు. దానిం గాంచి యెల్లవారు ప్రీతిమెయి ననుభవించుచున్నారు. కాని పౌరుషమును నదియే లేదు. మిథిలానగరపాలకుఁడు విదేహవంశవర్ధనుఁడగు నాతండ్రి జనకుఁడు నన్నొకతుకను గాపాడఁజాలక విడిచి నీవొక్కడవే దండకారణ్యములకుఁ బోయితివని తెలిసినయెడల నిన్ను నాసమయమునందు నాయల్లుఁడగు శ్రీరామమూర్తి సత్యమునకు స్త్రీయే. పైకిఁ బురుషవేసముదాల్చి వచ్చి నా కుమారికను బెండ్లియాడెనని తలంచునుగదా. అక్కటా! ఈ లోకులెల్లఁ బ్రజ్వలించుసూర్యునియం దెట్లో యట్లే శ్రీరామునియందు మిక్కిలి తేజస్సుకలదని యజ్ఞానమునఁ జెప్పుదురు. అది యనృతము. ఉండినయెడల సూర్యునియం దెట్లు కనఁబడునో యట్లేల నీయందుఁ జూడఁబడదు? అకార్యములు సహస్రముచేసిరైనను భార్యను భరింపవలెనని యార్యులు వచింతురు. నీవో నన్ను నడవులకుఁ దోడుకొనిపోవువిషయమున నకార్యముచేసినరీతి నీవేల విషాదము నొందుచున్నావు.

* ఇయ్యది యుప్పుదియవసర్గమునుండి సంగ్రహింపఁబడినది.

డవు? ప్రళయకాలానలునివంటి కోపముగల నీకు భయ మేరీతిఁ గలుగును? అనన్యచింతగలదాననై నీయందే యాసక్తిగలిగి యున్న నన్ను విడిచిపోవ నూహించుటకుఁ గలహేతు వేమో కనఁబడకున్నది.

శ్రీరామచంద్రా! మనస్సున నేతలంపుగలిగి యిట్లు విచారపడుచున్నావో యూహింపఁజాలకయున్నాను. భయ విషాదములచే నన్ను విడిచిపెట్టి నీవే పోఁగోరుచున్నావు. ద్యుమత్సేనునికుమారుఁడగు సత్యవంతుని ననుసరించుట ప్రధాన వ్రతముగాఁగల సావిత్రిచందమున నన్నుంగూడ నిన్నే యనుసరించి వర్తించుదానిగా నెఱుంగుము. మహాత్మా! అట్లు తలంప కులపాంసనురాలగు దుష్టవనితవలె నేనెప్పుడుగాని మన మునఁగూడ నిన్నుఁదక్క వేఱొక్కని దలంచుదానఁగాను. అకారణమున నిన్నుంగూడి వనములకు వత్తునేకాని యిందుండఁజాలను. ఇట్టి దృఢసంకల్పముగల పతివ్రతనని తలంచియు నన్ను రావలదందువా? మంచిదే. కుమార దశయందే నిన్నుఁ జెట్టవట్టితిని. చిరకాలము నిన్నుం గూడి యున్నదానను. సాధ్విని. నీకు భార్యను. ఇట్టి నన్ను శైలూషునిచందమున నీవే పరులకొసంగఁగోరుచున్నావు. ఎవ్వా రికి హితము సేయుమనియు, నెవ్వరికి శుశ్రూషలు చేయ నన్నిందు నిలుపవలయుననియుఁ గోరుచున్నావో, ఆతల్లులకు ననుకూలుఁడవై వారు చెప్పినపనులు నీవే చేయుచుండుము. నీవడవుల కరిగిన నేనుమాత్రము నీవెంట రాకమానను. ఇంత దనుక నెవ్వరికి హితోపదేశము చేసితివో, ఎవ్వరికై యింత విచారపడితివో, అట్టిదానను నేనే కాన నాయీమాటను నీవు

వినవలయును నేను జెప్పినయట్లు వనములకుఁదోడ్కొనిపొమ్ము. ఎవ్వనివిషయమున హితప్రవర్తనము కలదానవు కమ్మంటివో, ఎవ్వనియభిషేకోత్సవమునుబట్టి జనకునిచే నిగ్రహింపఁబడితివో, అట్టి భరతుని యిష్టము ననుసరించి వర్తించుచు నీవే యతఁడు పనుచునట్లు చేయుచుండుము. నేను నిన్నే యనుసరింతును. నన్ను మాత్రమే యట్లు భరతహితకార్యముల నొనరింపుమని పలుకకుము. సకలధర్మవేత్తవగు నీవు నన్నిటనుంచి యడవికేఁబోరాదు. తపమాచరించుటయో, వనములనుండుటయో, ఇవి లేక స్వర్గవాసమో ఇందేదియైన నీతోడనే నాకుఁ గలుగుంగాక. నీకు లేనిది నాకేదియువలదు. నేను నిన్నుంగూడివచ్చుచుండఁగాఁ ద్రోవయందు నా కేకష్టములు కలుగవు. ఆ రామముల విహారము సల్పునట్లు, పుష్పశయ్యల శయనించుచందమున, నడవులు హాయిగా నేనాకు నుండఁగలవు. త్రోవలంగల కంటకాదులు నీవెంటఁబోవుతఱి దూదివలె హరిణచర్మము లోనగువానిరీతి ముట్టుకొన హాయిగా నుండును. ప్రాణేశ్వరా! వనుల ఝంఝామారుతములకు నెగసి నాపై నావరించుధూళిని మనోహరపరిమళవంతమగు శ్రీచందనచూర్ణముభంగి భావింతును

వనములయందు నీవుండఁగా నందుఁగల లేఁతపచ్చికగల భాగములందు శయనించుటకంటె మృదుతమవస్త్రములు పఱచినశయ్యయందుఁ బవ్వళించుట యెంతయో సుఖముగా నుండునా? నీవడవులఁ గందమూలాదులలో వేనిని ప్రియముగా నీచేతులార నిత్తువో యవి యమృతమువలె నాకు నుండును. ఋతువుల ననుసరించి పూయుచుండుపూవులఁ బెట్టికొనుచు నాయాయిఫలములం దినుచు హాయిగా నాతల్లిదండ్రులఁగాని,

సౌధములఁగాని యించుకంతయుఁ దలంపను. నాతోడ నడవులకు నీవరిగినపిదప నందు నావలన నీకేదియుఁ గష్టముగాఁ దోఁపదు పెక్కుమాటలేల? ఒక్కమాట వచింతు నాలకింపుము. శ్రీరామభద్రా! నిన్నుంగూడి యుండుటే స్వర్గము. నీవిరహమే నరకము. నీపై నాకుఁగలప్రీతి నిన్ను వదలియుండఁజాలనంత దృఢమైనదని యింతవనుక ననేకథంగుల ననుభవమునఁ దెలిసికొంటివికదా! కనుక నన్నుం బిలుచుకొనియే యడవికిం బొమ్ము. నిర్భయముగా నడవికివచ్చుటకు నిశ్చయించుకొనియున్న నన్ను రావలదందువేని, నీవిచ్చటనుండునప్పుడే నీయెదుట విషపానమునఁ బ్రాణములను త్యజింతును. జ్ఞాతుల వశమున నుండఁజాలను. పరమేశ్వరా! ఇపుడు చావకయున్నను నీవడవికిఁబోయినతరువాతనైన దుఃఖాతిశయమున నసువులు నాశరీరమున నుండవనుట నిశ్చయము. దుఃఖమున మృతినొందుటకంటె నిన్నుఁ జూచుచుఁ బ్రాణత్యాగముచేయుటే యుత్తమము. నిన్నుఁ బాసినయెడల నాదుఃఖమున నిమేషమైన జీవింపఁజాలను. నామత మిది. తొలుతఁ బదివత్సరములు. మరల మూఁడు. ఆమీఁద నొక్కటియు నిట్లు పదునాలుగుసంవత్సరములు నీవియోగమును సహించుట యెట్లు?

అని పలుకుచు శోకావేశమునఁ జూచువారికి జాలి గలుగునట్లు విలపించుచు నంత నాథుని బిగియార నాలింగనము చేసికొని గట్టిగా నేడ్చెను. ఆమె రామోక్తులు చెవుల కహితములై ముండ్లవలెఁ గ్రుచ్చుకొనఁగా విషలిప్తబాణము తనువునఁ గ్రుచ్చుకొనఁగాఁ స్త్రీగజమువలె నొచ్చి యరణి యనఁబడు యజ్ఞపాత్రమును మథింపఁగా నెంతోసేపు లోపలనిమిడియున్న

యగ్ని నాపాత్రము వెడలఁగ్రక్కునట్లు మాటలసందడిని లోపల నడఁగియున్న యశ్రుజలముల నాసీత వెడలించెను. అట్టి తఱి నాసీతాదేవి నేత్రములనుండి దుఃఖవేగమునఁ బుట్టి సందు లేక కాఱుటం జేసి యంజనపంకమంతయుఁ బోవ స్ఫటికరీతిఁ దేటగానున్న కన్నీరు కమలమునుండి మకరందమువలె స్రవించు చుండెను. నిర్మలచంద్రబింబమువలెఁ జెలంగుచు విశాలములగు నేత్రములతో నలరుచున్న సీతమోము సంతాపోష్ణమున నీటి నుండి వెడలించినకమలము సూర్యకిరణముల వాడినచందమున నెంతయు శోభిల్లెను. అత్తఱి నా రామచంద్రుఁడు మిగులు వగ మూర్ఛమునుంగునట్లున్న యాకోమలాంగిని దీర్ఘబాహువులం బిగియఁబట్టుకొని యత్యంత విశ్వాసపాత్రములగుమాటల నిట్ల నియె.

దేవీ! నీకు దుఃఖము కలుగునేని నాకు లభించుస్వర్గము కూడ నిష్టము కాదు. జంతుసంతతి సృజించి పోషించి త్రుంచు స్వయంభువునకు దేనినుండియు భయములేనట్లు నాకు నెద్దాని వలనను భయము కలుగదు. పూర్ణచంద్రసుందరవదనా! నిన్ను వదలియుండనివాఁడనయ్యును నిర్భయుఁడనయ్యు నిన్నడవులఁ గాపాడఁదగినశక్తి గలవాఁడనయ్యు నీమనోభావము సంపూర్ణ ముగా నాకుఁ దెలియకయున్నందున నన్నుఁగూడివచ్చి వనమున వసియింప నంగీకరింపకయుంటిని. మైథిలీ! నన్నుఁగూడి వన వాసము చేయనే నీవు సృజింపఁబడితివి. అందులకై సిద్ధముగ నుండియున్నదానవు. కనుక నెట్టికట్టిడి కాలమునందును జలింపని మనస్సుగలవాఁడు కీర్తిని విడనాఁడఁజాలనిరీతి నిన్ను నేను వదలియుండఁజాలను. సుశ్రోణీ! తొల్లి రాజర్షులు భార్యలం

గూడియే వానప్రస్థవ్రతమును సల్పిరి. సువర్చల భాస్కరు నను
సరించియే యుండెఁగదా. అట్లే నేనును బూర్వులయాచారమునే
యనుసరించి నిన్నడవులకుఁ దోడుకొనిపోయెదను. సూర్యుని
సువర్చల యనుపురంధ్రీమణివలె నీవు నన్ననుసరించి రమ్ము. జనక
తనయా! పితృచరణులు నన్నడవికిఁ బొమ్మన్నదొకటియే
కాదు. ఆరీతివర్తింతునని నేనుఁ బలికితిని కావున నాతండ్రి
పలుకు మిక్కిలి బలీయము. ఆమాటయే నన్నడవికిఁ బిలుచు
కొనిపోవుచున్నది. కాన దానిమాననయితి కాదు. తప్పక
పోవనున్నాను.

పవిత్రురాలా! జనకులకు విధేయుఁడై యుండుటను
నదియే ధర్మము. దానిని మించినధర్మమే లేదు. కాఁబట్టి జనక
వాక్పరిపాలనమునకుఁ బూనియున్న నేను నట్టిధర్మమును దాఁటి
జీవింపనొల్లను. దైవము నారాధించుచు నిందే యుండఁ
గూడదా. అదియు ధర్మమే కదా. యందువేమో వినుము. జననీ
జనకులు గురువనెడు మూవురు ప్రత్యక్షదైవతములు మన
కాజ్ఞచేసి మనపూజలకు లోఁబడుదురు. దైవము ప్రత్యక్ష
ముగా మన కాజ్ఞసేయఁడు. మన మారాధింప వశ్యుఁడుకాక
స్వతంత్రుఁడై యుండును. అట్టిదైవము నెట్లు లారాధింప
శక్యమగును? విశాలాక్షీ! జననీజనకులు గురువను నీమూవురే
మూఁడులోకములు. ఈమువ్వురిని బూజించిన ముల్లోకములను
వశముచేసికొనవచ్చును. వీరికి సేవచేసినఁ ద్రిలోకముల దేవత
లను బూజించినఫలము కల్గును. కనుక నీపూజవలెఁ బావనమైనది
వేఱొకటి లేదు. కాఁబట్టియే నేను వీరలనే యారాధించు
చున్నాఁడను. సీతా! పితృసేవ పరలోకమునొందుట కెట్లు

తోడ్పడి మేలు కలిగించునో యట్లు సత్యదానమానములు, పూర్ణదక్షిణలతోడియాగములు పరలోకప్రాప్తికిఁ దోడ్పడఁజా లవు. గురుసేవచేయువారలకు స్వర్గము, ధనధాన్యములు, విద్య, పుత్త్రసుఖములు మఱేవిగాని కోరినఁ గలుగును. దాన సాధ్యము కాని దేదియుఁ గానరాదు. విరామములేక తల్లిదండ్రులను ప్రీతితో సేవించుమహాత్ములు దేవగంధర్వగోలోకములను, మఱియు నితరములగు పుణ్యలోకములను బొంది క్రమముగ బ్రహ్మలోకమును జేరుదురు. స్వతంత్రుఁ డగునట్టితండ్రి సత్య ధర్మములను దృఢముగా గ్రహించి నన్నే రీతి నాజ్ఞాపించునో యట్లే ప్రవర్తింపఁ గోరుచున్నాఁడను. అదియే శాశ్వతధర్మము. జానకీ! ఇంతదనుక నీభావము నాకు స్పష్టముగాఁ దెలియనందున దండకారణ్యములకు నిన్నుఁగొనిపోవ బుద్ధి నాకుఁ జనింపలేదు. నీవే యడవుల నుందునని చెప్పి నాతోడ రా నిశ్చయించు కొన్నావు. దాన నీసద్భావము నాకిప్పుడు స్పష్టమైనది. కనుక నిన్నుఁ దోడ్కొని పోవుదు.

అనవద్యాంగీ! హరిణాక్షీ! జానకీ! అరణ్యముల నన్నుఁ గూడియుండుటకు దైవమే నిన్నుఁబుట్టించెఁగదా. భీరువవయ్యు నాతోడరమ్ము. నీ కేభయము కలుగదు. అందు నాతో ధర్మముల నాచరించుచుందుము. భర్త ననుసరింపవలయునన్న నిశ్చయము నీకు నెంతయుఁ గలదు. ఇయ్యది మనయిరువురవంశములకుఁ దగి నది, శుభమైనదియు నగు. ఇఁక జాగుసేయక వనవాసమునకుఁ దగినకార్యముల నొనరింప నారంభింపుము. నీవిఁక లేకున్న నాకు స్వర్గముకూడ హితముకాదు. బ్రాహ్మణులకు వివిధరత్నములు, భిక్షుకులకు నీకుఁదోఁచినట్లు భోజనము నొసంగుము. మఱియు

నెవ్వరెవ్వ రేదేది కోరుదురో యది వ్యర్థము చేయక వారల కొసంగుము. ఆలసింపకుము. త్వరపడవలయుంజుమీ. బ్రాహ్మణులకు దానమిచ్చిన పిదప నమూల్యాభరణములను, మేలగువస్త్రములను, వేడుకగా నాడుకొనుబొమ్మలను, మఱియుఁ గలవస్తువులను, పాన్పులను శిబికాదియానములను మనయుభయులకు సంబంధించినవానిలో వేనినిగాని భృత్యుల కొసంగుము. జానకియుఁ దనయనుగమనమునకు రామమూర్తి సమ్మతించినందుల కానందించి వెంటనే తదాజ్ఞానుసారము దానములు చేయ మొదలిడెను. కీర్తిమంతురాలగు నామహాదేవి భర్తయనుజ్ఞ ననుసరించి మహానందమున నితరచింతల మాని ధార్మికులకు ధనములను రత్నములను సంతృప్తిగా దానముచేయ మొదలిడెను.

మహాశయులారా! ఈఘట్టము పూర్వసర్గములయందు నేవ్రాసినవిశేషార్థము సత్యమని దృఢపఱచుచున్నది. సీతారాములసంవాదము వారు మూలప్రకృతిపరమపురుషులనునర్థమును సిద్ధాంతముచేయుచున్నది. మఱియుఁ బతివ్రతాధర్మవిశేషముల వెలిపుచ్చుచున్నది. కావునఁ జక్కఁగా విమర్శింపవలయు. దుర్మతాభిమానమును బాఱఁదోలినఁగాని తత్త్వము తెలియ వలనుపడదు. ఈశ్వరానుగ్రహము దుర్మతావలంబకులకు దూరమగుచుండునని యెల్లరెఱింగినవిషయమేకదా.

"సా తము త్తమసంవిగ్నా సీతా విపులవక్షసం,
ప్రణయాచ్చాభిమానాచ్చ పరిచిక్షేప రాఘవమ్." •

అని మూలము. తానెన్నిభంగులఁ బ్రార్థించినను శ్రీరామమూర్తి తనపట్టు వదలనట్లు నటించెను. కావున మహాప్రకృతి చేయఁ

దగు కార్యమునకుఁ దనయనుగమనము ప్రధానమని స్మృతికిం దగులఁ జేయఁబూని యిట్లు పలుకుచున్నది. ఉత్తమసంవిగ్నా= ఉత్తమ కార్యమగు దుష్టశిక్షణపూర్వక ధర్మసంస్థాపనవిషయమున వడంకుచున్నదిగ్నైయని యర్థము. అనఁగాఁ ద్వరపడుచున్నదని భావము విపులవక్షసం=విశాలహృదయము గలవానినని యర్థము. అనఁగా గొప్పమనస్సుగలవాఁడని భావము. ప్రణయాత్=విశేషనీతివలనను అనఁగా న్యాయమునందలి యాదరమువలన నని భావము. అభిమానాచ్చ=విశేషమర్యాద వలన నని యర్థము. పతివ్రతలకు నుపదేశింపఁదగుమర్యాద వలన నని తాత్పర్యము. పరిచిక్షేప=ప్రేరేపించెను; క్షిప్ప్రేరణే అని. చేయవలసినపను లనేకము లుండ వానికన్నింటికి నేనే మూలమయియుండ నన్నేల రావలదని యాలస్యము చేయుచున్నావు. త్వరపడుమని హెచ్చరించెననియే యిటఁ గలసారము. అయోధ్యలో నిఁక మనము నిలువరాదు. విరాధాదులశాపవిముక్తికాలము సమీపించుచున్నది. మాటలతో నిఁకలాభము గలుగదు. పయనము సాగింతును. వేవేగ నారాకకు సమ్మతింపుమని సర్వేశ్వరునకు భావికార్యముల నొనరింపఁ బురికొల్పెనని మన మెఱుంగందగు. భగవంతుని బ్రకృతి యేల ప్రోత్సహింపవలయు నను వారు కొందఱుందురు. సగుణుఁడనఁగా నర్థమేమి? ప్రకృతింగూడి జగత్కార్యకరణమునకుం బూనెననియే యర్థము. అపుడుకూడఁ బ్రకృతియే సర్వకార్యములఁ దత్సాన్నిధ్యమున నొనరించును. పరమేశ్వరుఁడు సాక్షిమాత్రుఁడై యుండును. ఈయర్థమునే శంకరభగవత్పాదులు

"జగత్సాతే ధాతా హరిరవతి రుద్రః క్షపయతే

తిరస్కుర్వన్నేతత్స్వమపి వపురీశ స్తిరయతి,
సదా పూర్వస్సర్వం తదిదమనుగృహ్ణాతి చ శివ
స్తవాజ్ఞామాలంబ్య క్షణచలితయో ర్భ్రూలతికయోః." ౩౨

అనువాక్యరూపమునఁ దేటపఱచిరి. కనుకనే భగవతి నిర్లిప్తుఁ డగుభగవంతుని బురికొలిపెననియే యిటఁగల యర్థవిశేషము. ఆప్రోత్సాహ మెట్టిదో యీ క్రిందిశ్లోకము తెలుపుచున్నది.

"కిం త్వామన్యత వైదేహః పితా మే మిథిలాధిపః,
రామ జామాతరం ప్రాప్య స్త్రియం పురుషవిగ్రహమ్." 3

అను నీమూలమునకు నెన్నియో యర్థములు వ్యాఖ్యాతలు వ్రాసిరి. ఇందు వ్రాయఁదగిన యర్థమును దానిసారము నెట్లు గ్రహింపఁదగునో యాపద్ధతిని వ్రాసెదను. తన్నడవికిఁ దోడ్కొని పోలేదన్నకోపమున సీత రాముని నాక్షేపించుచున్నది. రామా! నీవేమో పురుషశ్రేష్ఠుఁడవని నన్ను నీకు భార్యగా నొసంగినవాఁడు కాని పురుషాకారము స్త్రీస్వభావము కలవాఁడని యెఱింగియుండిన నాతండ్రి నీకునొసంగియుండఁడు. అనఁగా నడవులకు నన్నుఁ బిలుచుకొనిపోయిన నెన్నియో కష్టములు కలుగునన్నభయము గలవాఁడవైతివే. ఇది పురుషునకుఁ దగునా యని సీతభావము. ఇది కథననుసరించిన సామాన్యార్థము. ఈగ్రంథమునఁ దెలుపఁదగిన విశేషార్థ మేది యనఁగా వినుఁడు.

"కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః,
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి." ౨౦. గీత 3 అధ్యా.

అన్న శ్రీకృష్ణోపదేశముప్రకారము జనకచక్రవర్తి విదేహవంశసంభూతుఁడు. ఆవంశమున జన్మించినవారు కర్మసిద్ధుల నెఱింగిన

జ్ఞానులు. మిథిలానగరము జ్ఞానుల కునికిపట్టు. ఆనగరమునకుం బ్రభువు. అనఁగా జ్ఞానులలో నుత్తముఁడు. అట్టి నాతండ్రి జనకచక్రవర్తి పురుషవిగ్రహముగల స్త్రీనిగా ననఁగా సగుణ బ్రహ్మమునుగా దలపోయఁడాయేమి? కన్యాదానకాలముననే నీవంటియల్లునిం గాంచి జ్ఞానధనుఁడగు నాతండ్రి మూలప్రకృతివశుఁడవని తెలియఁడనుకొనుచున్నావాయేమి? సకలకార్యములు స్త్రీమూలముగా నీయవతారమున సాగించుచు సాక్షిమాత్రుఁడవై యుండు భగవంతుఁడవని యెఱుంగును. కనుకనే

"సహధర్మచరీ తవ. భద్రంతే పాణిం గృహ్ణీష్వ పాణినా."

అని పలికినమాట మఱచితివా యేమి? ఈసీత నీకు సహధర్మచారిణి. మేలు నీకుం గలుగును. అనఁగా సకలధర్మకార్యములను నిన్నుఁగూడి యాచరించును. లోకమున సకలవిధములగుధర్మముల నిలుపును. దాన నీయవతారమునకు మేలు గలుగును. నిర్లిప్తుఁడవగు నీ కీభార్యవలన నేకష్టములును గలుగవు సుమీ. నీహస్తమున నీమెహస్తమును గ్రహింపుము. మన మిరువుర మొక్కటియే యన్నభావము గాంచుము. అనఁగా నీసీతకు నీకు భేదములేదు. అనఁగా నవినాభావసంబంధమే. అనికదా నాతండ్రి హెచ్చరించెను. అట్టిపలుకు నంగీకరించి నన్ను గ్రహించితివి. ఇపుడు నన్ను రావలదందువే యేల? నేను రాకయున్న వనముల నీవేమి చేయుదువు? సర్వము నామూలమునఁగదా కాఁదగును? అట్టి నన్ను రావలదనుచున్నావే? అని సీత ప్రశ్నించుచున్నది. ఇదియే గ్రహింపఁదగినవిశేషము. 'స్త్రియం పురుషవిగ్రహామ్.' ప్రకృతి కార్యార్థము పురుషాకార

మును దాల్చును. అనఁగా నేరూపమున నేకార్యము సాధింప వలయునో యారూపమును ధరించునని భావము. ప్రకృతి శబ్దము స్త్రీలింగము కాన స్త్రీయనరాదు. బ్రహ్మశబ్దము పరమాత్మ వాచకమైనపుడు నపుంసకలింగము. కానఁ బరమాత్మ షండుఁ డనరాదు. ఈమూఁడును గానివాఁడనియు మూఁడునైనవాఁ డనియు భావము.

"ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా."

అనుసూక్తి కలదు.

"స ఏవ వాసుదేవోఽయం సాక్షాత్పురుష ఉచ్యతే,
స్త్రీప్రాయమేత త్తత్సర్వం జగద్బ్రహ్మ పురస్సరమ్."

అను విష్ణుపురాణవచనము కలదు.

"సత్యం విధాతుం నిజభృత్యభాషితం
వ్యాప్తిం చ భూతేష్వఖిలేషు చాత్మనః,
అదృశ్యతాత్యద్భుతరూపముద్వహన్
స్తంభే సభాయాం న మృగం న మానుషం." స్కం ౭ అధ్యా ౮.

అను శ్రీభాగవతవచనము కలదు. వీనిం బరికింపఁగాఁ గార్య మునకుఁ దగినట్లు రూపమే కాని యీరూపము భగవంతునకు శాశ్వతముగా నుండునది లేదని స్పష్టమగును. భగవంతున కెట్లో తత్ప్రకృతికి నట్లే యని యెఱుంగందగు. ఈప్రమాణ ముల ననుసరించి మహామాయ పురుషాకృతింగొని రామనామ మున వెలసి సీతారూపముఁగ జగములయాచారమును బాటింప నొప్పెనని భావము.

వాసుదేవోఽయం సాక్షాత్పురుషః = అనఁగా వైకుంఠ లోకవాసి యగునారాయణుఁడు. సర్వాంతర్యామి యగుభగ

వంతుఁడని యర్థము. వాసుదేవనారాయణశంకరాదినామము లెల్ల నాపరతత్త్వమునకుం జెల్లు. బ్రహ్మాపురస్సరంజగత్=అనఁగా బ్రహ్మదేవుఁడు లోనుగాఁగలవారెల్ల నామహాప్రకృతికి లోఁబడినవారని, విష్ణువు ప్రకృత్యతీతుఁడనియుఁ జెప్పునర్థము వాస్తవముకాదు. బ్రహ్మను జెప్పఁగనే తత్తుల్యులగు విష్ణుశంకరు లుపలక్షణవిధి గ్రహింపఁబడుదురు. విష్ణువు భగవంతుఁడన్న నౌనన వచ్చును. కాని బ్రహ్మశంకరు లావిష్ణువు కాదు. అన్న నిస్సీయనవలయును. ఆరూపములు తద్భిన్నములనఁగా నీవిష్ణువు భగవంతుఁడు కాకపోవలయును. ఎల్లరూపములు తానైన వాఁడే భగవంతుఁడు. ఏభక్తు లేరూపమున నేనామమునఁ బూజించినను సంతృప్తినొందువాఁడే పరమాత్మ. ఒక్కరూపము నొక్కపేరు నాతనికిఁ జెల్లదన్నను, బ్రియము కాదన్నను, భగవంతునకుఁ గలపరమాత్మత్వ మూడిపోవును. అదుర్వాదమునకేభక్తుఁడును బూనరాదుకదా 'పురుషవిగ్రహం స్త్రియం' అనఁగాఁ బురుషవిగ్రహముగల స్త్రీ యనునర్థముచెప్పిన బహువ్రీహి సమాసము కాన "విగ్రహామ్" అని యుండవలదా యని కొంద అందురు. అట్లుండవలయుననుట విధి కాదు. కొన్నితావుల నట్లుండ నక్కఱలేదని ప్రయోగములు కనఁబడియెడిని "పురుష విగ్రహామివ పరిదృశ్యమానాంస్త్రియమ్" అని యర్థము చెప్ప వలయును. లేకున్నఁ బ్రాతీతికార్థముకూడఁ జెడును. కావునఁ బైవ్రాసినయర్థము సుసంగతమే యగును. దీనినుండి గ్రహింపఁ దగుసార మేమనఁగా శ్రీరామచంద్రా! ఏల నన్నిట్లు పలుభంగుల రావలదని హెచ్చరించెదవు? కన్యాదానకాలమున ధర్మచర్యల యందు నిన్నుఁ గూడియుండ నిశ్చయింపఁబడితినిగదా. ఈవన

వాసము పితృవాక్యానుసారము చేయవలయుననియు, నదియే ధర్మమనియు బహుభంగులఁ జెప్పితివికదా. అది ధర్మమే యగు నేని నన్ను వదలి నీవెట్టు లాచరింతువు? నాతండ్రి భావము నన్ను విడనాడి నీ వేధర్మకార్యము చేయరాదనియే. నీవు శక్తిహీనుఁడవని నాతండ్రి తలంపలేదు శక్తి నగు నన్నుంగూడియే వనములకుం బోవవలయును. అని సీతయాశయము నుదాహరణపూర్వకముగా శ్రీరామునకుఁ దెలిపెనని మనము గ్రహింపం దగు. ఈభాగము మన కేనీతులను దెలుపును?

వివాహకాలమున నేయేనియమములకు లోఁబడి భార్యను భర్త గ్రహించునో యీనియమముల నించుకంతయు మీఱరాదు. సాధ్వియగుభార్యను వదలి యేధర్మకార్యములు చేయరాదు చేసినచో నవి "అవిధినా కృతమకృత" మ్మను న్యాయము ననుసరించి చేయనట్లే యగును. అగ్నిసాక్షికముగా సహధర్మచారిణి యని గ్రహించినభార్యలచెంత లేక ధర్మకార్యము లొనరించిన

"యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్."

అన్న శ్రీకృష్ణవాక్యము ననుసరించి నిష్ఫలములగును. కావున భార్య సమ్మతము గొనక యేధర్మకార్యములను భర్త చేయరాదు. సాధ్వియు భర్తయనుమతి మీఱి యేకార్యము చేయరాదు. ఇరువురు సమ్మతించియే ధర్మకార్యములు చేయవలయును. తీర్థయాత్రాదికములు భార్య నింట వదలి పతి చేయరాదు. ఈనీతుల నీభాగము బోధించునని మన మెఱుంగవలయును.

మఱొక్కవిశేష మింటుఁగలదు. రామ! పరంథాముఁడ వగు త్వా=నిన్ను, జామాతరమ్ = అల్లునిగా, ప్రాప్య=పడసి, (నాతండ్రియగు మిథిలాధిపతి) స్త్రియం = భార్యనుగుఱించి, పురుషవిగ్రహమ్ = పురుషునితోటికలహమును, అమన్యత కిం=తలంచెనాయేమి? అనఁగా నీయంతటివాఁ డల్లుఁడు కాఁగా నిఁక నామూలమున నీకొకపురుషునితోడ యుద్ధమగునని తలఁప లేదని భావము. దీనిచేఁ గొంతకాలమునకు నన్నుఁగూర్చి యుద్ధముసాగునే అని సీత హెచ్చరించెను. భగవత్సాన్నిధ్య బలమునఁగదా ప్రకృతి యెల్ల కార్యముల నొనరించును. కావున నన్ను వదలి నీవుపోయిన నేమి చేయఁగలవు? నామూలముగా యుద్ధము కావలసియుండఁగా వలదనుచున్నావే. అని సీత రామమూర్తికి స్మృతిగోచరమగునట్లు లొనరించెననియే తాత్ప ర్యము. రామమూర్తి మాయామానుషవిగ్రహుఁడు కాన నొకరు విషయమును దెలిపినఁగాని త్వరఁబూనఁడని మన మెఱుంగవలయును. సాక్షిమాత్రుఁడు నిర్లిప్తుఁడు నగుభగవం తుని దత్ప్రికృతి పురికొలుపు టుచితమేకదా.

> "అనృతం బత లోకోఽయమజ్ఞానాద్యద్ధి వక్ష్యతి,
> తేజో నాస్తి పరం రామే తపతీవ దివాకరే."

అని మూలము సీత లోకాపవాదమును నిరసించుచున్నది. మండుచుండు మార్తండునంబోలె నీయందు శ్రీరామా! తేజస్సు లేదని లోకము చెప్పుచుండును. అది యనృతమే. బత! అనునది లోకులంగూర్చిననింద. సూర్య తేజస్సుతో నీ తేజస్సును బోల్చువా రజ్ఞానులని భావము

> "దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా,

యది భాస్సదృశీ సా స్యాద్భాసస్తస్య మహాత్మనః. ౧౨
తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా,
అపశ్యద్దేవదేవస్య శరీరే పాండవస్తదా." ౧౩ గీత. ౧౧ అధ్యా

అన్నగీతాశాస్త్రము ననుసరించి యనేకసూర్యు లొక్కసారి యుదయించిన నెట్టితేజస్సుండునో యట్టిదని సామాన్యబుద్ధి నిర్ణయింపఁదగినది భగవత్తేజస్సు. అట్టిదాని నొకసూర్యుని తేజస్సుతోఁ బోల్చుట యదికూడ లేదనుట యజ్ఞానముకదా. అయ్యో! లోక మెంతమూఢమైనదని సీత విచారించుచున్నది. అనఁగా నీదివ్యతేజస్సు లోక మెఱుంగదు. నే నెఱుంగుదును. అట్టి నీ వేల నన్ను రావలదందువో తెలియఁజాలకున్నదాన నని జానకి తనవిచారమును దెలిపెను. దీనిచే భగవంతుని తేజోరూపము లోకుల కెఱుంగఁదరముగానిదనియు, జ్ఞానధనులకే యది యెఱుంగ సాధ్యమనియు సారము.

"కిం హి కృత్వా విషణ్ణస్త్వం కుతో వా భయమస్తి తే,
యత్పరిత్యక్తుకామస్త్వం మామనన్యపరాయణాం." ౯

అని మూలము. రామమూర్తిని సీత మఱియుఁ బురికొలుపుచున్నది. రామచంద్రా! ఏమి యీనటనము! ఏమి యీవింత భయము! లోకమున నకార్యముచేసినవారు విషణ్ణులు కావలయు. అశక్తులు భయంపడవలయును. ధర్మస్వరూపునకు నీకు విషాద మెక్కడిది? లయకాలమున సకలజగములను క్షణకాలమున భస్మముచేయు రుద్రరూపుఁడవగు నీకు భయ మేత్రోవనుండి వచ్చును? ఛాయవలె నిన్నే యెడఁబాయని నన్నుఁగాపాడఁజాల ననుభీతిపొంద హేతువేమో తెలియఁజాలక

యున్నాను. లోకమోహనవ్యాపార మింకఁ జాలును. అని సీత భావమని మనము గ్రహింపవలయును.

"ద్యుమత్సేనసుతం వీర, సత్యవంతమనువ్రతాం,
సావిత్రీమివ మాం విద్ధి త్వమాత్మవశవర్తినీం." ౬

అని మూలము. ఇందు సత్యవంతుని సావిత్రిని దృష్టాంతముగాఁ జెప్పుట లోకమునఁ బతివ్రతలవర్తనము బోధించుటకే యని యెఱుంగందగు.

"న త్వహం మనసాప్యన్యం ద్రష్టాస్మి త్వదృతేఽనఘ,
త్వయా రాఘవ గచ్ఛేయం యథాన్యా కులపాంసనీ. ౭
స్వయం తు భార్యాం కౌమారీం చిరమధ్యుషితాం సతీం,
శైలూష ఇవ మాం రామ పరేభ్యో దాతుమిచ్ఛసి." ౮

అని మూలము. సీత పతివ్రతల మర్యాదలఁ దెలుపుచున్నది. ఏస్త్రీ యితరుని బ్రీతిచేఁ గాచునో యామె కులపాంసిని యనం బడును.

"వ్యభిచారాత్తు భర్తుః స్త్రీ లోకే ప్రాప్నోతి నిన్ద్యతాం,
సృగాలయోనిం చాప్నోతి పాపరోగైశ్చ పీడ్యతే. ౩౦
స్వాం ప్రసూతిం చరిత్రం చ కులమాత్మానమేవ చ,
స్వం చ ధర్మం ప్రయత్నేన జాయాం రక్షన్ హి రక్షతి." ౩

మను. ౯ అధ్యా.

అని మనుస్మృతి చెప్పినచొప్పునఁ గులగౌరవము భార్యాధీనము. ఆమర్యాద నెవ్వతుక నాశముచేయునో యాతన్వి కులపాంసిని యనంబడును. పితృభర్తృవంశముల రెండింటికి హానిగల్గించునని భావము. అనఁగా పుట్టినయింటికిఁ జొచ్చిన యింటికి మర్యాదామర్యాదలను దెచ్చునది స్త్రీయని తేలెడిని.

పతివ్రత ఉభయకులానందదాయిని యగు. దుర్వృత్తిగలస్త్రీ కులపాంసిని యగు. అట్టికులపాంసినివలె నితరుని నేఁ జూడఁగోర నని సీత హెచ్చరించుచున్నది. మనస్సునఁగూడఁ గోరనని సీత పలికెను. శరీరదోషములకన్న మనోదోషము లెక్కుడుగఁ బరి గణింపఁదగినవని దీనిభావము. మనోవాక్కాయములచే శుద్ధ ప్రవర్తనముగలకాంతయే పతివ్రత యనఁబడును.

"విప్రియం న చ కర్తవ్యం భర్తస్య కదాచన."

అని శ్రీరామమూర్తి యింతకుముందు పలికెను. వానికి బదులు సీత యిత్తఱిఁ జెల్పుచున్నది. కౌమారీం = చిన్నియస్సునసే పెండ్లియాడితిని. చిరమధ్యుషితాం=పండ్రెండుసంవత్సరములు నీచెంత నున్నదానను. భార్యాం = నీవు భరింపఁదగియున్న వాఁడవు. నేను భరింపఁదగినదానను. శైలూషఇవ=భార్యవంక బ్రదుకువాఁడని సామాన్యార్థము. వేషధారియని విశేషార్థము. అట్టివానివలె నిట్టి నన్నితరుల కొప్పింపఁబూనెదవు. ఇది నీకుఁ దగదుసుమా యని కథానుసార మగునర్థము. విశేషార్థమేమి? కౌమారీం = కుత్సితుల మరణము నొందింప నవతరించినదాన నని యెఱుంగుము. చిరమధ్యుషితాం = అఖండకాలము అనఁగాఁ బరిమితిలేనికాలము నీతోడ నున్నదానను. భార్యాం= నన్ను భరింపఁదగినవాఁడవు నీవే. అనఁగాఁ బరతత్త్వము నీవే. కనుకఁ దక్కినవారెల్ల నాచే భరింపఁదగినవారని భావము. స్వయంశైలూషః = నీవే వేషధారివి. భార్యాజీవనుఁడవు. అనఁగా నామూలముననే నీబ్రదుకు విఖ్యాతిం గాంచును. నేను లేకున్న నీకు నామరూపము లెక్కడివి? నేను దోడ్పడిననే నీవొకవ్యక్తిత్వము నొందుదువు. మామ్ = లక్ష్మీదేవిని అనఁగా

నీయైశ్వర్యము నేనే యని యర్థము. ఇట్టి నన్ను పరేభ్యో దాతుమిచ్ఛసి = శత్రువులుగా లోకదృష్టికిం దోఁచు రావణాది రాక్షసుల కీయఁదలఁచుచున్నావు. అనఁగా మానవవేషమును ధరించిననన్ను శత్రువులవలె నున్న రావణాదుల కొసంగి యావ్యాజమున ధర్మరక్షణము నొనరింపఁగోరుచున్నావు. అని కాఁగలసీతాపహరణ మిందు సూచితము. నీతియేమనఁగా తన్ననుసరించి వర్తించుసాధ్వి నితరులకడనుంచి తానే ధర్మకార్యము నిర్వహింప బ్రయత్నింపరాదనియే యీభాగమునుండి మనము గ్రహింపఁదగును.

"న దేవి తవ దుఃఖేన స్వర్గమప్యభిరోచయే,
న హి మేఽస్తి భయం కించిత్స్వయంభోరివ సర్వతః." ౨౭

అని మూలము. స్వయంభుపుశబ్దము నారాయణపరమని గోవిందరాజులు, బ్రహ్మపరమని మహేశ్వరతీర్థులు వ్రాసిరి.

"స్వయంభోః నారాయణస్య న చతుర్ముఖస్య,
తస్య మధుకైటభాదిభ్యో భయసంభవాత్."

అని గోవిందరాజులు వ్రాసిరి. మతావేశమున నిట్లు పలికిరి. నారాయణునకుఁ ద్రిపురాసురులవలన భయముకలిగెనని తలంపరైరి. కాన నిట స్వయంభువనఁగాఁ బరాత్పరుఁడగు భగవంతుఁడే యర్థము.

"మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోర మీదృఙ్మమేదం,
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం
తదేవ మే రూపమిదం ప్రపశ్య." ౪౯. అధ్యా. ౧౧.

అన్న భగవద్వాక్యము ననుసరించి యితరులవలన భయమను

నది యెఱుంగనివాఁ డొక్క భగవంతుఁడే కాని త్రిమూర్తు లలో నెవ్వరు కాదని యెఱుఁగందగు. నారాయణుఁడనఁగా నట్టి భగవంతుఁడే యందు రేని యాక్షేపము లేదు. నారాయణశంక రాదినామము లాపరతత్త్వమునకుం గలవు. కావుననే "అకుతో భయః" అన్న ప్రసిద్ధి యొక్క పరమేశ్వరునకుం గలదు. ఈభాగ మున శ్రీరామమూర్తి తన సర్వేశ్వరత్వమును వెల్లడించుచు న్నాఁడు. నాకెందును భయము లేదు.

"స్వయంభోర్మే సర్వతః కించిద్భయం నహి."

అని యన్వయక్రమము. భగవంతుఁడనగు నాకెవ్వరివల నను భయము కలుగదని సారము.

"తవ సర్వమభిప్రాయమవిజ్ఞాయ శుభానసే,
వాసం న రోచయేఽరణ్యే శక్తిమానపి రక్షణే. ౨౭
యత్సృష్టాసి మయా సార్ధం వనవాసాయ మైథిలి,
న విహాతుం మయా శక్యా కీర్తిరాత్మవతా యథా." ౨౮

అని మూలము. శ్రీరాముఁ డీభాగమునఁ దమయిరువురకుంగల సంబంధమును బ్రకృతిపురుషత్వమును దేటపఱిచెను. నీయభి ప్రాయమెల్ల నిట్టులని తెలియక యేను వనవాసము నిచ్చగింప నైతిని. రక్షింప శక్తిగలవాఁడనే. అనఁగా నేయేకార్యము లెట్టులెట్టులు చేయవలయునో యవి నీవలన విన్నఁగోరి వలదంటి నని భావము. దీనిచే భగవంతుని నిర్లిప్తత్వము స్పష్టము.

"మైథిలి మయా సార్ధం వనవాసాయ సృష్టాసి.
యత్ యస్మాత్కారణాత్ అతః మయా విహాతుం న శక్యా."

అని యన్వయక్రమము. వనవాసమునకొఱకే సృజింపఁబడితివి. కాన వదలశక్యమా? వనవాసమువలననే మనయవతార ప్రయో

జనము తేటపడవలయును. కనుక నిన్నెట్లు వదలుదును? ఇట్లను టంజేసి ప్రకృతిపురుషుల కవినాభావసంబంధము స్థిరమయ్యెను.

"ఏష ధర్మస్తు సుశ్రోణి పితుర్మాతుశ్చ వశ్యతా,
ఆతశ్చ తం వ్యతిక్రమ్య నాహం జీవితుముత్సహే. 32
అస్వాధీనం కథం దైవం ప్రకారైరభిరాధ్యతే.
స్వాధీనం సమతిక్రమ్య పితరం మాతరం గురుం. 33
యత్రయం తత్రయో లోకాః పవిత్రం తత్సమం భువి,
నాన్యదస్తి శుభాపాంగే తేనేదమభిరాధ్యతే. 34
న సత్యం దానమానౌ వా న యజ్ఞాశ్చాప్తదక్షిణాః,
తథా బలకరాస్సీతే యథా సేవా పితుర్హితా. 35
స్వర్గో ధనం వా ధాన్యం వా విద్యాః పుత్రాస్సుఖాని చ,
గురువృత్త్యనురోధేన న కించిదపి దుర్లభం. 36
దేవగంధర్వగోలోకాన్ బ్రహ్మలోకాం స్తథా నరాః,
ప్రాప్నువంతి మహాత్మానో మాతాపితృపరాయణాః. 37
స మా పితా యథా శాస్తి సత్యధర్మపథే స్థితః,
తథా వర్తితుమిచ్ఛామి స హి ధర్మస్సనాతనః." 38

అని మూలము. ఇందు శ్రీరాముని ధర్మోపదేశము కలదు.

"ఆచార్యో బ్రహ్మణో మూర్తిః పితా మూర్తిః ప్రజాపతేః,
మాతా పృథివ్యా మూర్తిస్తు భ్రాతా స్వోమూర్తిరాత్మనః. 226
తేషాం త్రయాణాం శుశ్రూషా పరమం తప ఉచ్యతే,
న తైరభ్యననుజ్ఞాతో ధర్మమన్యం సమాచరేత్. 228
త ఏవ హి త్రయో లోకాస్త ఏవ త్రయ ఆశ్రమాః,
తఏవ హి త్రయో వేదాస్త ఏవోక్తాస్త్రయోఽగ్నయః. 230
త్రిష్వప్రమాద్యన్నేతేషు త్రీన్ లోకాన్ విజయేద్గృహీ,
దీప్యమానస్స్వవపుషా దేవవద్దివి మోదతే. 232

ఇమం లోకం మాతృభక్త్యా పితృభక్త్యా తు మధ్యమం,
గురుశుశ్రూషయా త్వేవం బ్రహ్మలోకం సమశ్నుతే. ౨౩౩

సర్వే తస్యాదృతా ధర్మా యస్యైతే త్రయ ఆదృతాః,
అనాదృతాస్తు యస్యైతే సర్వాస్తస్యాఫలాః క్రియాః. ౨౩౪

త్రిష్వేతేష్వితి కృత్యం హి పురుషస్య సమాప్యతే,
ఏష ధర్మః పరస్సాక్షాదుపధర్మోఽన్య ఉచ్యతే." ౨౩౭

మను. ౨ అధ్యా.

అను నీమనుస్మృతిభావమే రామాయణమునఁ గలదు. అప్రత్యక్షముగా నుండుదైవము నారాధించుటకంటెఁ బ్రత్యక్షముగా నుండుపితరుల నారాధించు టుత్తమము. అనఁగాఁ దనయుల మేలుగోరి సర్వవిధములఁ బాటుపడు తల్లిదండ్రుల నారాధింపక యున్నఁ దక్కినయారాధనములు నిష్ఫలములని భావము. మనుస్మృతియు నీయభిప్రాయమునే సిద్ధాంత మొనరించెను. మాతృపితృశుశ్రూషయే పరమధర్మమని శ్రీరామమూర్తి సిద్ధాంతము. సత్యదానమానయజ్ఞాదులు పరలోకప్రాప్తికిఁ దల్లిదండ్రులసేవ యెట్టిసాయముచేయునో యట్లు సాయపడఁజాలవని భావము. అనఁగాఁ దల్లిదండ్రుల సేవింపనివాఁడు చేయునితర ధర్మములు వ్యాజప్రధానములని తాత్పర్యము. ఇప్పట్టున నొక విషయము తేలెడిని. శ్రీభాగవతమున గోలోకము ప్రస్తావమే లేదనియు శ్రీకృష్ణుఁడు గోలోకవాసి యన్నమాట ప్రమాణము కాదనియు రాధ లేదనియుఁ గొందఱు మధ్వవైష్ణవులు వాదింతురు. గోలోకమున్న యట్లు శ్రీరామమూర్తియే తెల్పెను. గోలోకమున్నదని తెల్పుపురాణములే ప్రమాణములే కావని

కొందఱిమతము. వారు శ్రీరామోక్తి తుచ్ఛమందురో లేక ప్రమాణమందురో యెఱుంగరాదు. మనకు హితముకాని విషయమంతయు నప్రమాణమే యనుట యల్పబుద్ధులస్వభావమని మన మెఱింగిన వారిదుర్వాదముల వినునంతటి దుష్కర్మము తొలంగును. పితరులశాసనము సనాతనధర్మమని శ్రీరామోపదేశసారము.

ఈభాగమునుండి మన మెఱుంగఁదగినచరిత్ర మేది? త్రేతాయుగము కొసభాగమున మానవులు దేవతాంతరముల నారాధించుచుఁ దమవిధియగు మాతాపితృశుశ్రూషల మానిరి. స్వధర్మముల మాని పరధర్మముల నాచరించువారే మెండుగ నుండిరి. తల్లిదండ్రులయాజ్ఞ సాధారణధర్మమనికూడఁ బరిగణింపఁబడక యుండెను. దానంజేసి యుపధర్మములే ప్రధానములై ప్రధానధర్మము లుపధర్మములుగా మార్పునొందెను. మఱియుఁ దల్లిదండ్రులశాసనమునందుఁ బ్రధాన మేది? అనువిషయమున భేదాభిప్రాయము లుండెను. ధర్మసూక్ష్మము లివియని నిర్ధారణ మొనర్చువారు లేకయుండిరి. తోఁచినధర్మములెల్లఁ బ్రధానములని పొగడువారు పెక్కండ్రుండిరి. అట్టి యిక్కట్టుకాలమున నీధర్మసందేహములఁ దీర్ప శ్రీరామమూర్తి యవతరించి యీ సందేహములఁ దీర్చెను. అందు తల్లిదండ్రులయం దెవ్వరియాజ్ఞ ప్రధానమనువిషయ మింతదనుక శ్రీరామోపదేశమునను దత్ప్రవర్తనమునను దేటపడియెను. అను నీచరిత్రవిషయము మన మూహింపవచ్చును.

"సా హి సృష్టానవద్యాంగీ వనాయ మదిరేక్షణే,
అనుగచ్ఛస్వ మాం భీరు సహధర్మచరీ భవ. ౪౦

సర్వథా సదృశం సీతే మమ స్వస్య కులస్య చ,
వ్యవసాయమతిక్రాంతా కాంతే త్వమతిశోభనం. ౪౧
ఆరభస్వ శుభశ్రోణి వనవాసక్షమాః క్రియాః,
నేదానీం త్వదృతే సీతే స్వర్గోఽపి మమ రోచతే." ౪౨

అని మూలము. శ్రీరాముఁ డిందు స్వాభిప్రాయమును సిద్ధాంతము చేయుచున్నాఁడు. 'అనవద్యాంగి' అనునది అయోనిజత్వమును 'మగరక్షణే' యనునది విరాధాది దానవప్రవృత్తిని 'భీరు' అనునది యనుగమనప్రయోజనమును 'సహధర్మచరీ భవ' అనునది అవినాభావసంబంధమును సూచించుచున్నవి. వనములకు నన్నుఁ గూడి రావలయునన్న ప్రయత్నము నీకు గట్టిగాఁ గలిగినదే. ఇది నీకులమునకు నాకులమునకు సదృశమైనది. ఇది యత్యంత శుభదాయకము. అనఁగా మనయిరువురజన్మములకు సర్వము. ఈప్రయత్నము నీవు చేయక యింటే యుండ నంగీకరించియున్న మనపుట్టుక నిష్ఫలమే యగునని భావము. కావున నీప్రయత్నము జగన్మంగళదాయకమనియే సారము. సీతా ప్రోత్సాహమున రామమూర్తియుఁ ద్వరపడుచున్నాఁడు. వనవాసమునకు ననుకూలములగు కార్యముల నారంభింపుము. ఇట్లుకాక నీవు లేకున్న స్వర్గముకూడ నాకు నిష్టపడదు. అనఁగా

"సంతుష్టో భార్యయా భర్తా భర్త్రా భార్యా తథైవ చ,
యస్మిన్నేవ కులే నిత్యం కల్యాణం తత్ర వై ధ్రువం. ౬౦
స్త్రియాం తు రోచమానాయాం సర్వం తద్రోచతే కులం,
తస్యాం త్వరోచమానాయాం సర్వమేవ న రోచతే." ౬౨

మను. ౩ అధ్యా.

అను నీమనుస్మృతిప్రమాణముల ననుసరించి పతి ననుసరించు

భార్యయు, భార్యనానందింపఁజేయుభర్తయుఁ గుదిరిననే సంతోషము, కార్యసాధనము కల్గును. ఇప్పుడు సీత రాకమాననని పట్టుపట్టెను. రామమూర్తి రానంగీకరించెను. ఇప్పుడేకదా రామావతారప్రయోజనము లోకములకుఁ గల్గించునవకాశము కలిగెను. కావున రామచంద్రుఁడానందించి వనవాసమునకుఁ బోవుటకు జేయఁదగు కార్యముల నారంభింపుమని యనుమతి నొసంగెను.

లోకమున నెవ్వారుకాని యొకమహాకార్యమునకుం బూనినయెడల ముందు త్యాగబుద్ధి గలిగియుండవలయును. మనోబలము గలుగుట కయ్యది ప్రధానము. "త్యాగాయ సంభృతార్థానామ్" అని కాళిదాసు తెల్పెను. స్వార్థత్యాగము చేసినఁగాని మనోమాలిన్యములు పోఁగవు మనస్సు నిర్మలముగనుండినఁగాని ధర్మము తోడ్పడదు. అది తోడ్పడినఁగాని కార్యసిద్ధి గలుగదు.

"ధర్మ ఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః,
తస్మాద్ధర్మో న హంతవ్యో మా నో ధర్మో హతోఽవధీత్." ౧౫

మను. ౮ అధ్యా.

అని మనుస్మృతి తెల్పుచున్నది.

"యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే,
నిస్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా."

అన్నగీతావాక్యముకూడఁ బైయర్థమునే దృఢపఱచుచున్నది.

"మనః ప్రసాదస్సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః,
భావసంశుద్ధిరిత్యేతత్తపో మానసముచ్యతే. ౧౬
శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్త్రివిధం నరైః,

అఫలాకాంక్షిభిర్యుక్తైస్సాత్త్వికం పరిచక్షతే." ౧౭ గీత. ౧౭ అధ్యా-
అన్న యీశ్రీకృష్ణవాక్యములు పైనివ్రాసినభావమునే సిద్ధాం
తముచేయుచున్నవి. సీతారాములు ధర్మాభివృద్ధికొఱకవతరిం
చిరి. అధర్మము నడంపవలయును. అనఁగా నధర్మమార్గప్రవర్త
కుల రూపడంచినఁగాని ధర్మమార్గము నవలంబించినవారలకు
మేలులేదు. కావున నధర్మము వృద్ధియగునట్లు చేయుదానవులను
సంహరింపవలయును. ఆకార్యమునిర్వహింపఁబూని దానికొఱకు
మనస్సును నిర్మలమగునట్లుచేయఁ బ్రయత్నించిరని భావము.
భగవంతునకుఁ గూడఁ బ్రయత్నింపవలసినయవసరము కల్గినా
యని ప్రశ్నింపరాదు. లోకుల కట్టినీతిని దెల్పుటకే శ్రీరామ
మూర్తి సీతాదేవికి వనవాసమునకు యోగ్యములగుక్రియల
నొనరింపుమని యాజ్ఞాపించెను. కావున మన మీవిషయము
నుండి పైవ్రాసినయట్లు మహాకార్యము సాధింపఁబూనునపుడు
ముందుగాఁ ద్యాగబుద్ధిని సంపాదించుకొనవలయు. అదియే
మానసతప స్సనంబడును. తపోబలములేక యేకార్యమును
సాధింపరాదు. ఇన్నింటికిం బ్రధానము మనస్సుగదా. దానిని
లోఁబఱచుకొనుటకే యిన్నితపస్సులని సారాంశము. అది కర్మా
ధీనమై, కొందఱకు సులభసాధ్యమై, కొందఱకుఁ గష్టసాధ్యమై,
మఱికొందఱకుఁ దుర్లభమై యుండును. ఆవిషయ మాతని
ప్రవృత్తి ననుసరించి యూహింపం దగియుండును. కర్మసిద్ధాం
తమే యీభాగము మనకు స్పష్టముగా బోధించెనని యెఱుంగ
వలయును.

"బ్రాహ్మణేభ్యశ్చ రత్నాని భిక్షుకేభ్యశ్చ భోజనం,
దేహి యాచమానేభ్య స్సంవత్సరస్య చ మా చిరం. ౪౩

దేహి స్వభృత్యవర్గస్య బ్రాహ్మణానామనంతరం." ౪౫

అని మూలము. ఇది దానలక్షణమును బాత్రాపాత్రవివేకమును దెలుపుచున్నది. రత్నములనఁగా నమూల్యవస్తువు లర్థమని కొందఱిమతము. భిక్షుకులనఁగా సంసారమును ద్యజించిన సన్న్యాసులు. వారికి ధన మీయరాదనియు నట్లొసంగిన నది పాపహేతువనియు స్మృతి తెలుపుచున్నది.

"అధ్యాత్మరతిరాసీనో నిరపేక్షో నిరామిషః,
ఆత్మనైవ సహాయేన సుఖార్థీ విచరేదిహ." ౪౯ మను. ౬ అధ్యా.

అన్న యుత్తమధర్మము మనుస్మృతి తెలుపుచున్నది. కావున యతులకు ధనమీయక యన్నముమాత్రమే పెట్టవలయునని యేర్పడుచున్నది. 'బ్రాహ్మణానామనంతరమ్' తొలుత బ్రాహ్మణులకు నొసంగి పిదప సేవకులకు మన మనుభవించు నమూల్యవస్తువులగు శయ్యాభూషణాదుల నొసంగుమని శ్రీరామమూర్తి భార్యకుం దెల్పెను. మతధర్మములఁ బాటింపవలయునని మన కీభాగము తెల్పుచున్నది. శ్రీరామచంద్రుని కాలమున నందఱు బ్రాహ్మణులు వేదాభ్యాసము చేయుచుఁ దదుక్తక్రియల నిర్వర్తించువారుగాన నట్టిసమ్మానమునకుఁ బాత్రులైరని తేలెడిని.

మహానుభావులారా! ఈసీతా రామసంభాషణము మనకు వారియవతారతత్త్వమును దెలుపుచున్నది. వారు ప్రకృతి పురుషులనియుఁ, ద్రిమూర్తులలో నొక్కరగు విష్ణుమూర్తియుఁ దత్పత్నియగు లక్ష్మియుఁ గారనియు, ధర్మరక్షణమునకుగా నవతరించిరనియు మన కీసంభాషణము తేటపఱచుచున్నది. ఇఁకఁ గథాభాగమే ప్రధానముగా నుండును. ఈభాగమునుండి తత్త్వము నిశ్చయించుకొని తరువాతఁ గథను బఠించిన రామా

యణము నర్థము చక్కఁగా బోధపడును. కేవల కథాసారము నెఱింగినంతనే విశేషలాభము లేదు. మహర్షి వాల్మీకి యం దందుఁదెలిపినధర్మములను మన మెఱుంగవలయును. సదాచార ములను నీతులను రాజధర్మముల నెఱుంగవలయును. ఈవిషయ ములను దెలిసికొని తదుక్తప్రకార మారాధించి భగవంతుని దయకుఁ బాత్రులము కావలయును. అధ్యాత్మరామాయణము నుండి యీభాగమున వ్రాయఁగలవిశేషములు లేవు. ఇఁకఁ దరు వాతికథను బఠింతము.

## రామలక్ష్మణసంవాదము.

* లక్ష్మణుఁడు కౌసల్యయంతఃపురమునుండి మునుపే వచ్చియున్నవాఁడు. కనుక నాసంభాషణము నాలకించి రాముఁడు సీతాదేవిని దోడ్కొనిపోవుటకే యింతకష్టముపైన సమ్మతిం చెనుగదా. ఇఁక నావిషయమై యంగీకరించునా, నాగతి యెట్లు! అని విచారించి వగపెల్లునఁ దొరఁగుకన్నీటిధారలు దృష్టిని నిరోధింపఁగాఁ బట్టరానిదుఃఖమున మహాయశస్కుఁడుగాన శ్రీరామపాదములను గట్టిగాఁబట్టుకొని సీత నుద్దేశించియు మహావ్రతుఁడు రాఘవు నుద్దేశించియు నిట్లు పలికెను. రామ భద్రా! వనముల కరుగ నిచ్చగింతువేని మృగములు వనగజ ములు నిండియుండుటంజేసి నేను జాపమును ధరించి నీకు ముందుగాఁ బోవుదును. అందులకై నిన్ననుసరించి వచ్చెదను. నీవు నన్నుంగూడి మృగపక్షులనినాదములు చెలరేఁగువన ములఁ దిరుగవచ్చును. నీవు చెంతలేకున్న స్వర్గముగాని దేవ త్వముగాని నేనొల్లను. త్రిలోకములఁ గల యైశ్వర్యముకూడ

---

* ఈభాగము ముప్పదియొకఁటవసర్గమునఁ గలదు.

నాకు వలదు. వనగమనమునఁగల నిశ్చయమున లక్ష్మణుఁ డిట్లు పలుకఁగా విని రామమూ ర్తి మెల్లగ వత్సా! నీ విందుండుము. వనములకు రావలదనెను. లక్ష్మణుండు మరల నిట్లు పలికెను.

అన్నా! నాయనుగమనమునకు మున్నే నీ వనుమతించితివి. ఇపుడు నన్ను రావలదనుచున్నావే; ఏల? నిర్దోషుఁడవగు నో శ్రీ రామా! నిన్నుంగూడి నేను రాఁ గోరుచుండఁగా వలదనఁ గారణమేమి? దానిం దెలిసికొనఁ గోరుచున్నాఁడను. నే నేయపరాధము నిపుడు చేసితినో యనుసందియము మదిఁ గలదు. దానిందీర్పుము. అని ప్రశ్నింపఁగా మహాతేజుఁడగు రామచంద్రుఁడు ముకుళితహస్తుఁడై యుండి తనకంటె ముందుగా నడవికిం బోవ నిశ్చయించుకొనియున్న వీరుని దమ్ముని బిలుచుకొని పొమ్మని వేఁడుచున్న భక్తునిం గని యిట్లు పలికెను. సౌమిత్రీ! నీకు నాయందుఁ బ్రీతి మెండుగఁ గలదు. ధర్మాసక్తుఁడవని వీరుఁడవని సన్మార్గవర్తనుఁడవని ప్రియుఁడవని ప్రాణతుల్యుఁడవని వశ్యుఁడవని సఖుఁడవని సోదరుఁడవని నేనెఱుంగుదు. ఇట్టి నీవు నాతోడవత్తువేని యన్నివిధములఁ దోడ్పడంజాలుదువు నీరాక నాకు నెంతో సౌఖ్యము.

వత్సా! నీవు నాతోడ వత్తువేని కౌసల్యాసుమిత్రల నిందరయువా రెవ్వరు? ఆకార్యముకొఱకే రావలదంటిని. అప్పుడు నీ రాకకు సమ్మతించుట యీకాలమున కనుకూలముగా నిన్నాఅడించుటకేకాని వేఱు గాదు. తండ్రియే వారిని బోషించును. నేనేల? అందువేమో పర్జన్యుఁడు భూమిపై వర్షించునట్లు తన వారివాంఛలన్నియు ఫలింపఁజేయు రాజు కైకకు లోఁబడి కామవశుఁడై తపించుచున్నాఁడుకదా. అతఁ డెట్లు వారిని

భరింపఁజాలును? అశ్వపతితనయ యగుకైక యీరాజ్యమెల్లఁ జేకొన్నమీఁద వగలఁ బొగులుసవతుల కేమాత్రమైన మేలు చేయఁగలదా? భరతుఁ డుండుఁగదా. తల్లుల కేమి లోపముం డును? అనెదవేమో. అతఁడుకూడ రాజ్యప్రాప్త్యనంతరము తల్లిమాటలకే లోఁబడి వర్తింపఁగలవాఁడు. కాన వగలఁగుం దు మనతల్లులఁ దలంచునా? నావలన నేమి లాభము తల్లుల కుం గలుగును? అని ప్రశ్నింతువేమో! నీవిందే యుండి రాజా నుగ్రహము నార్జించి పూజ్యురాండ్రగు తల్లులఁ బోషింప వచ్చును. వీనికి బదులు పలుకకుము. నే నేమని చెప్పితినో యట్లే చేయుము.

వత్సా! నన్నే సేవింపఁగోరుదువని యెఱుంగుదుఁజుమీ. ధర్మవేత్తవు. నాచెప్పినరీతి నొనరింతువేని నాయందు నీకున్న భక్తి మిక్కిలి స్పష్టమగును. మాతృసేవ ధర్మములయం దుత్త మము. అదియుఁ గల్గును. ఇట్టికార్యమున రఘువంశజనితులం దఱు నానందింతురు. కాన నాకొఱకు నీవిందుండుము. మనము లేకయున్నఁ దల్లులకు మనస్సుఖ మెంతమాత్రము కలుగదు సుమా. వాగ్విశారదుఁ డగురామమూర్తి పలుకఁగా వాక్య విశారదుఁ డగుసౌమిత్రి హితముగా నన్నపలికినది విని యిట్లు బదులు పల్కెను శ్రీరామా! వీరుఁడవు. నీప్రతాపమునకు భయంపడి భరతుఁడు కౌసల్యాసుమిత్రలను జక్కఁగాఁ బోషింపఁగలఁడు. నిస్సంశయము. కౌసల్యను సేవించి జీవించు వారే తదనుగ్రహమున ననేకగ్రామములను సంపాదించి యున్నారు. అట్టితల్లి నావంటివారి నెందఱినేఁ బోషింపఁజాలును. కాన మహాకీర్తిమంతురాలగు కౌసల్య నన్ను, సుమిత్రను,

మఱియు నస్మాదృశుల నెందఱినో బోషింప సమర్థురాలే యగును. అనుచరునిగా నన్నుఁ గావింపుము. దాన ధర్మహాని లేదు. నేను గృతార్థుఁడనగుదును. వనములఫలములు మొదలగువానిం దెచ్చియిచ్చుటంజేసి నీకుఁ బ్రయోజనము కలదు. శరశరాసనములు పట్టుకొని గడ్డపాఱ గంపను దీసికొని ముందుగాఁ ద్రోవ చూపుచుఁ బోవుదును. ప్రతిదినము ఫలమూలాది మున్యాహారములను దెచ్చి యిచ్చుచుందును. ఈసేవ చేయుభాగ్యము నాకుఁ బ్రసాదింపుము. రామా! సీతంగూడి నీవు శైలసానువుల యందు విహరింపవచ్చును. నీవు మేలుకొనియుండుతఱి నిద్రించుసమయమునను గాపుగా నెల్లకార్యములను జేయుచుందును.

అని లక్ష్మణుఁడు పలుకఁగా రాముఁడానందించి సౌమిత్రీ! అది నీవూన్కియేని నీవిపుడేపోయి నీమిత్రులకుం దెల్పి యనుమతింగొని రమ్ము. జనకచక్రవర్తియాగమునందు వరుణదేవుఁడు భయంకరములగు దివ్యచాపములు రెండు, నభేద్యకవచములు రెండు, నక్షయబాణతూణీరములు, బంగరురంగుపూసి సూర్యదీప్తిగలిగి వెలయు రెండుఖడ్గములు తానై మనకు నొసంగెను గదా. వీని నేను బూజించి యాచార్యుఁడగు వసిష్ఠమునియింట నుంచితిని. నీవు వానిం గైకొని త్వరగా రమ్ము లక్ష్మణుం డాపలుకుల నాలించి వెడలి మిత్రులయనుమతి నొంది కులగురువు నింటికింబోయి యాయాయుధములను గైకొని వచ్చెను. పూజింపఁబడుచున్న యాయాయుధముల రామభద్రునకు గనఁబఱచెను. ధీరుఁడు రాముఁడు వానిందీసికొనివచ్చిన తమ్మునిం జూచి సంతసమున సౌమ్యా! నీరాకకై వేచియుంటిని. సకాల

మునకే వచ్చితివి. పరంతపా! నిన్నుఁగూడి సాధనమంతయుఁ దపస్వులకు బ్రాహ్మణులకు నీఁగోరెదను. విప్రప్రవరులు నన్నా శ్రయించియున్నారు. అట్టివారలకు సాధనము వలసిన ట్లియ్యఁ గోరెద. నీవరిగి బ్రాహ్మణవర్యులను మునిపతి యగువసిష్ఠుని సుతుని సుయజ్ఞునిమాత్రము పిలుచుకొనిరమ్ము. సుయజ్ఞుని విప్రవరులను బూజించి యరణ్యమునకుంబోయెద నని యుత్తర్వు చేసెను.

మహాత్ములారా! ఈభాగమునఁ గొలఁదివిషయములే విమర్శనార్హములు గలవు. వాని నాలకింపుఁడు.

"స భ్రాతుశ్చరణౌ గాఢం నిపీడ్య రఘునందనః,
సీతాముబాచాతియశా రాఘవం చ మహావ్రతం."

అని మూలము. ఇందుఁ బ్రాతీతికార్థము స్పష్టము. విశేషార్థ మేమనఁగా నాలకింపుఁడు.

"అతియశాః రఘునందనః సః భ్రాతుశ్చరణౌ గాఢం నిపీడ్య సీతాం మహావ్రతం రాఘవం చ ఉవాచ."

అని యన్వయక్రమము. మహాయశాః, గొప్పయశస్సుగల సౌమిత్రి యని యర్థము. సీతారాములు ప్రయాణము సాగింప నున్నారని యతఁ డెఱుఁగును. సీతను రాఘవునిగుఱించి యిట్లు పలికెనని భావము. సీత యనుపదప్రయోగమును బరికించి శరణాగతి యిందు బ్రతిపాదితమని వ్రాసిరి. ఇరువురిదయను సంపాదింపఁగోరియే సౌమిత్రి పలికెను. సీత వలదన్నను రాముఁడు వలదన్నను దనప్రయాణము నిలిచిపోవునని తెలిసికొని లక్ష్మ ణుఁడు వారిరువురనుగుఱించి యిట్లు ప్రార్థించెననుట సమంజస మగునర్థము. సీతాశబ్దము తొలుత నున్నందువఁ గాఁబోలు

నేవేవో భావములు కనఁబఱచుచు వ్రాసిరి. ఇట్టివారు ప్రకృత్యు పాసనము పనికిరాదందురు. ఏటికో? శాక్తమనఁగా నట్టివారలకే తలనొప్పి. భగవత్కారుణ్యాఫలము లక్ష్మీమూలకముగా లభించు నన్నవారే శాక్తమనఁగా భయంపడుదురు. లక్ష్మణుఁ డడిగినట్లే సీతయు రాము నడిగెను. అది శరణాగతి కాదు కాఁబోలు. ఔరా! వ్యర్థమతాభిమానము!!

కొందఱు మధ్యవైష్ణవులు కుటుంభరులై ధనము నార్జింపఁగోరి, శరణాగతి ప్రధానమనియుఁ, గర్మముల నాచరించుట సంసారహేతువనియు నుపదేశించుచు, నేదోమంత్రము నుపదేశించుచు, నూర్ధ్వపుండ్రధారణము చేయనిచో భగవదనుగ్రహము లభింపదనియుఁ, గలధనమెల్ల నాచార్యాధీనమొనరించి కైంకర్యము చేయుచుండవలయుననియు శిష్యుల కుపదేశింతురు. దీనిఫలము శిష్యులు కర్మభ్రష్టులగుటయు, నాచార్యునకు ధనము చేకూరుటయు నగు. బాహ్యచిహ్నములు ప్రధానములు కావనియు, నయ్యవి కేవలమూఢులకుఁ దొలుత సంచుకభక్తిని గల్పింపఁ దోడ్పడుననియుఁ, దరువాత నవి నిరర్థకములే యనియు శాస్త్రము లుద్ఘోషించును. ఊర్ధ్వపుండ్రత్రిపుండ్రాదులు ధరింపనివారిని భగవంతుఁడు ప్రేమింపఁడనువాదము తుచ్ఛతమము. భగవంతుఁడు నిర్మలమగుమనస్సును బరికించి ప్రేమించును. బాహ్యచిహ్నములను జూడఁడు అయ్యవియే ప్రధానములనువారు పామరులలో శిరోమణు లనవచ్చును. వారిమోసపుమాటలకు లొంగి ధనము పోఁగొట్టుకొనరాదు. వారిం గూర్చియే

"అనేకగురవస్సంతి శిష్యవిత్తాపహారకాః."

అని పెద్దలు వచించిరి. ఊర్ధ్వపుండ్రములేక భగవన్మంత్రము జపింపరాదనుట హేయము. పెద్ద లూర్ధ్వపుండ్ర త్రిపుండ్ర ధారణము మత మిదియని తేటపడఁ గల్పించిరి. పామరు లివ్వానివలనఁ దృప్తినొందుదురు. భక్తిబీజము నది తొలుతఁ బుట్టింపఁ దోడ్పడు ననవచ్చునేమో. అదియే ప్రధానమని దాననే పరమేశ్వరుఁడు తృప్తిపడునని వచించువారు జగద్వంచకులను బిరుదమున కెంతయుఁ బాత్రులు.

ప్రకృతవిషయ మేమనఁగా సీతారాము లరణ్యమునకుఁ బోవ నిశ్చయించిరని లక్ష్మణుఁ డెఱింగినవాఁడు కావున, వారిరు వురను దల్లిదండ్రులనుగా భావించువాఁడు కావున, నం దెవ్వరిష్ట పడకపోవుదురో తనవనగమన మాగిపోవునో యనుసంశయము కలుగ, సీతారాములను బ్రార్థించె ననునదియే యిటఁగల సారము. ఉపాసకుఁడు సగుణము నుపాసింప నర్హుఁడు కావునఁ, బ్రకృత్యతీతమగు మహాతత్త్వమును నోదుర్గమమగుటఁ,దొలుత వ్యక్తి నిచ్ఛానుసారము కల్పించుకొని మనోవీథి నెలకొల్పి దానిం దిలకించుచు ధ్యానించును. అయ్యది సిద్ధింప నవ్వలఁ గేవల తేజోరూపముగా నాపరతత్త్వమును భావింపవలయును. ప్రకృతియు నం దిమిడియే యుండును ఇదియే యీభాగమున మనము తెలిసికొనఁదగు విషయసారము.

"న దేవలోకాక్రమణం నామరత్వమహం వృణే,
ఐశ్వర్యం వాపి లోకానాం కామయే న త్వయా వినా." ౫

అని మూలము. దీనినుండి మన మేమి గ్రహింపవలయును? భక్తుఁ డుపాస్యదేవతను ధ్యానించునపుడు తత్కారుణతప్ప మఱేకోరికను స్మరింపరాదు. స్వర్గాదిసుఖములు బంధహేతు

వులు. దేవత్వముకూడ నట్టిదే. కావున నిష్టదేవతానుగ్రహము మాత్రమే కోరవలయును. అదిమాత్రము వాంఛకాదా యని ప్రశ్నింపరాదు. "అభావధర్మానాద్వైతం నిఘ్నంతి" అన్నపరిభాష యందతెలుంగుదురుకదా. అట్లే భగవత్కారుణయు నని యెఱుంగవలయును.

"కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన,
మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోऽస్త్వకర్మణి. ౪౭
యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ,
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే. ౪౮
దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ,
బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః. ౪౯
బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే,
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలం. ౫౦
కర్మజం బుద్ధియుక్తాహి ఫలం త్యక్త్వా మనీషిణః,
జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛంత్యనామయం." ౫౧ గీత. ౨ అధ్యా.

అనుభగవద్గీతావాక్యములు పైనివ్రాసినవిషయము సిద్ధాంతీకరించుచున్నవి.

"కురుష్వ మామనుచరం వైధర్మ్యం నేహ విద్యతే,
కృతార్థోఽహం భవిష్యామి తవ చార్థః ప్రకల్ప్యతే." ౨౨

అని మూలము. దీనికెంతయోరీతుల నర్థములు చెప్పఁబడినవి. శాఖాచంక్రమణన్యాయమున కవి తగినయుదాహరణము లనవచ్చును. కాని యవి వ్యర్థము లనరాదు. అహంకారము తొలఁగింప నవి సాధనములే యగును. విశేష మేమని మనస్స్వాహింతము. "మా మనుచరం కురుష్వ" నిన్ను ...బడినది. ...ముల

సంచరించువానిగా నంగీకరింపుము. "ఇహ వైధర్మ్యం న విద్యతే" ఇందు ధర్మహాని యేమియుఁ గనంబడదు. రాదని యర్థము. "అహం కృతార్థో భవిష్యామి" 'నేఁ గృతకృత్యుఁడ నగుదును "తవ చ అర్థః ప్రకల్ప్యతే" నీకును గార్యము సిద్ధించును. అను నీయర్థము దేనిని బోధించు నన్న ప్రశ్నమునకు సదుత్తర మేది యనఁగా శ్రీరామచంద్రా! నాపుట్టుకకుఫలము నిన్ననుసరించితిరుగుటయే. దాన నీవొనరింపఁదగు కార్యమునకు హానిలేదు. నాయొనరింపఁ దగుపనినొనరించి నానిజఫలము జేకూర్తును. నావలని కార్యములు నీకు సిద్ధించును. అనఁగా నిన్ననుసరించి తిరిగినఁగాని రావణవధ సాధనమగు సీతాపహరణకార్యము కాదు. దాన ధర్మహానిలేదు. అనఁగా సీతాపహరణమున నధర్మవృద్ధి కానేరదు. దానికి నాశమే యగును. ధర్మము రక్షింపఁబడుననుట నేను జేయఁదగు నతికాయేంద్రజిద్దానవవిధ్వంసన మొనరింతును. దాన నీకార్యము సిద్ధించును. అనువిశేషార్థ మిందుఁ గానఁబడును.

"స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మనిరతస్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు." ౪౫ అధ్యా. ౧౮.

అన్నగీతాభిప్రాయము ననుసరించి నేనొనరింపఁదగుకర్మమును జేసినఁగాని కృతార్థుఁడను గానేరను. దాన నీకు లాభమేమనఁగా నెవరెవరిచే నీయే కార్యములు చేయింపవలెనో యట్లు చేయించి సర్వసాక్షిగా నుండుట యనునదియే. ఇందు నాశ్రయాశ్రయిభావము చెప్పఁబడినదని కొందఱిమతము. కపికిశోరన్యాయము ననుసరించి భక్తుఁడగులక్ష్మణుఁడు శ్రీపరమేశ్వరు ననుసరించి కోరుచున్నాఁడు. భగవంతుఁ డాతనిశ్రద్ధను బరీక్షింపఁగా కోరికను స్మరింపవలసెనని. అంతియగాని యతనిరాక

వలనఁ గలుగఁగల లాభములు తెలియక కాదు. ఇందు సగుణో పాసనము చెప్పఁబడినది. ప్రకృతిపూరుషుల నిరువురను లక్ష్మణుఁ డాశ్రయించుచున్నాఁడు ఫలాభిసంధిరహిత సత్కర్మరూప సమాశ్రయ మిందుక్తమయ్యెను సేవాభాగ్యము ననుగ్రహింపు మని భగవంతుని కోరుటయే యిందు లక్ష్మణునియాశయము. వేఱొండు కాదు. మహర్షి వాల్మీకి లక్ష్మణునుఖమునుండి భవిష్య త్సీతాపహరణాదికమును సూచించెను. శిష్యుఁడు సద్గురువు నాశ్రయించి పట్టినల వదలక వెంటనుండి తెలిసికొనఁదగు విష యమును దెలిసికొనవలయు ననునీతి మన కీభాగము తెలుపు చున్నది. శిష్యుఁడు కృతార్థుఁడగుటయే గురువునకుఁ గోరఁదగు లాభము. అంతియగాని శిష్యసర్వస్వము లాగుట కాదనియు మన మెఱుంగందగు. ఇఁకఁ దర్వాతికథను బఠింతము.

## శ్రీరాముఁడు పయనము చేయఁబూని దానములిచ్చుట.

*అంత సౌమిత్రి శుభము లొనఁగూర్పఁగల రామాజ్ఞను గైకొని వేగమే సుయజ్ఞునింటికిం బోయి యగ్నిహోత్రమందిర మునసున్న యమ్మునిం గాంచి భక్తిమీఱ నమస్కరించి మిత్రమా! రామమూర్తి వనముల కరుగుచున్నాఁడు. నీవు వచ్చి దుష్కర రాము కార్యమును జూడుమనియె. అమ్ముని వేగమే కృత్యముం దీర్చి సౌమిత్రింగూడిపోయి శ్రీరాముని రమ్యహర్మ్యముం బ్రవే శించెను. హుతాగ్నివలె బ్రహ్మతేజోనిధియగు నమ్మునికి నంజలిం బట్టి జానకింగూడి శ్రీరాముఁడు వలగొనియెను. అమ్మునికిఁ దన యంగదాద్యమూల్యాభరణముల నొసంగెను. అంత సీతా ప్రోత్సాహమున రాముఁడు వానిం గాంచి సౌమ్యా! మిత్రమా!

* ఇది ముప్పదిరెండవసర్గమునుండి గైకొనఁబడినది.

సంచరించువానిగా నంగీకరింపుము. "ఇహ వైధర్మ్యం న విద్యతే" ఇందు ధర్మహాని యేవిధముగ గనంబడదు. రాదని యర్థము. "అహం కృతార్థో భవిష్యామి" 'నేఁ గృతకృత్యుఁడ నగుదును "తవ చ అర్థః ప్రకల్ప్యతే" నీకును గార్యము సిద్ధించును. అను నీయర్థము దేనిని బోధించు నన్న ప్రశ్నమునకు సదుత్తర మేది యనఁగా శ్రీరామచంద్రా! నాపుట్టుకకుఫలము నిన్ననుసరించితిరుగుటయే. దాన నీవొనరింపఁదగు కార్యమునకు హానిలేదు. నాయొనరింపఁ దగుపనినొనరించి నానిజఫలము జేకూర్తును. నావలని కార్యములు నీకు సిద్ధించును. అనఁగా నిన్ననుసరించి తిరిగినఁగాని రావణావధ సాధనమగు సీతాపహారణ కార్యము కాదు. దాన ధర్మహానిలేదు. అనఁగా సీతాపహారణమున నధర్మవృద్ధి కానేరదు. దానికి నాశమే యగును. ధర్మము రక్షింపఁబడుననుట నేను జేయఁదగు నతి కాయేంద్రజిద్దానవవిధ్వంసన మొనరింతును. దాన నీకార్యము సిద్ధించును. అనువిశేషార్థ మిందుఁ గానఁబడును.

"స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మనిరతస్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు." ౪౫ అధ్యా. ౧౮.

అన్నగీతాభిప్రాయము ననుసరించి నేనొనరింపఁదగుకర్మమును జేసినఁగాని కృతార్థుఁడను గానేరను. దాన నీకు లాభమేమ నఁగా నెవరెవరిచే నీయే కార్యములు చేయింపవలెనో యట్లు చేయించి సర్వసాక్షిగా నుండుట యనునదియే. ఇందు నాశ్ర యాశ్రయిభావము చెప్పఁబడినదని కొందఱిమతము. కపికిశో రన్యాయము ననుసరించి భక్తుఁడగులక్ష్మణుఁడు శ్రీపరమేశ్వరు ననుసరి ంగోరుచున్నాఁడు. భగవంతుఁ డాతనిశ్రద్ధను బరీక్షిం పఁగోరికను స్మరించి రావలదనియె. అంతియగాని యతనిరాక

వలనఁ గలుగఁగల లాభములు తెలియక కాదు. ఇందు సగుణో పాసనము చెప్పఁబడినది. ప్రకృతిపూరుషుల నిరుపురను లక్ష్మణుఁ డాశ్రయించుచున్నాఁడు. ఫలాభిసంధిరహిత సత్కర్మరూప సమాశ్రయమిందు క్తమయ్యెను సేవాభాగ్యము ననుగ్రహింపు మని భంగవంతుని కోరుటయే యిందు లక్ష్మణునియాశయము. వేఱొండు కాదు. మహర్షి వాల్మీకి లక్ష్మణుముఖమునుండి భవిష్య త్సీతాపహరణాదికమును సూచించెను. శిష్యుఁడు సద్గురువు నాశ్రయించి పట్టువల వదలక వెంటనుండి తెలిసికొనఁదగువిష యమును దెలిసికొనవలయు నను నీతి మన కీభాగము తెలుపు చున్నది. శిష్యుఁడు కృతార్థుఁడగుటయే గురువునకుఁ గోరఁదగు లాభము. అంతియగాని శిష్యసర్వస్వము లాగుట కాదనియు మన మెఱుంగందగు. ఇఁకఁ దర్వాతకథను బఠింతము.

## శ్రీరాముఁడు పయనము చేయఁబూని దానములిచ్చుట.

*అంత సౌమిత్రి శుభము లొనఁగూర్పఁగల రామాజ్ఞను గైకొని వేగమే సుయజ్ఞునింటికింబోయి యగ్నిహోత్రమందిర ముననున్న యమ్మునిం గాంచి భక్తిమీఱ నమస్కరించి మిత్రమా! రామమూర్తి వనముల కరుగుచున్నాఁడు. నీవు వచ్చి దుష్కర రాము కార్యమును జూడుమనియె. అమ్ముని వేగమే కృత్యముం దీర్చి సౌమిత్రిం గూడిపోయి శ్రీరాముని రమ్యహర్మ్యముం బ్రవే శించెను. హుతాగ్నివలె బ్రహ్మతేజోనిధియగు నమ్మునికి నంజలిం బట్టి జానకింగూడి శ్రీరాముఁడు వలగొనియెను. అమ్మునికిఁ దన యంగదాద్యమూల్యాభరణముల నొసంగెను. అంత సీతా ప్రోత్సాహమున రాముఁడు వానిం గాంచి సౌమ్యా! మిత్రమా!

---

* ఇది ముప్పదిరెండవసర్గమునుండి గైకొనఁబడినది.

జానకి నీకళత్రమునకు హారము సువర్ణకంఠహారమునీయఁదలఁచు చున్నది. వానింగొనిపోయి యాయమ్మకిమ్ము. వనగమనకుతూహలమున జానకి నీకళత్రముకొఱకు నీచేతికిఁ దనరత్నాంగదాద్యాభరణములు వస్త్రములు నిచ్చుచున్నది. కైకొనుము. నా మేనమామ యొసంగిన శత్రుంజయనామకగజము గలదు. దానిని మఱి వేయిగజములతో నీకొసంగుదు. పరిగ్రహింపుము.

అమ్మునియు శ్రీరామదత్తాభరణములఁ గైకొని సీతారామలక్ష్మణుల నాశీర్వదించెను. ప్రియవాది శ్రీరాముఁడు సుసమాహితుఁడగుతమ్ముని గని వత్సా! వేగమే చని యగస్త్యవిశ్వామిత్రకుమారుల నిరువురను దోడుకొనిరమ్ము. వారి నర్హావిధిం బూజింపుము. మేటివస్తువు లొసంగుము. మఱియు గోహిరణ్యాదికమున వారలఁ దృప్తులను గావింపుము. తైత్తిరీయశాఖాధ్యయనపరులకు నాచార్యుఁడగు నొక్కవిప్రుఁడు నాతల్లి నెప్పుడు నాశీర్వదించుచుఁ గొలిచియుండును. ఆయనకుఁ దృప్తికలుగ నావాహనాదికము నొసంగుము. సారథిచిత్రరథుఁడు పితృసఖుఁడు. చిరకాల మిందే కడపినవాఁడు వానికమూల్యరత్నవస్త్రములను మేఁకలు లోనగుసత్పశువుల నిచ్చి సమ్మానింపుము. గోసహస్రముగూడ నిమ్ము. కఠశాఖను, కాలాపశాఖను జదువువారు పెక్కండ్రు గలరు. పలాశదండధారులు బ్రహ్మచారులు విరివిగా నున్నారు. అధ్యయనముతప్ప మఱొక్కకార్యము చేయువారుకారు. మఱికొందఱు కార్యలంపటులుగాక మేటియాహారమును గోరుదురు. మాన్యులుకూడ వారిని గారవింతురు. వారి కెనుబదిశకటములనిండ ధాన్యము రత్నాదివస్తువులు పోసియిమ్ము. భోజనప్రియులుగాన వారికి

ధేనుసహస్రము నొసంగుము. పెక్కండ్రు బ్రహ్మచారులు కౌసల్య
నాశ్రయించియున్నవారు. ఒక్కొక్కనికి గోసహస్రముచొప్పున
నొసంగుము. తల్లి కానందము గలుగఁ దదాశ్రితులకెల్లఁ
దృప్తిగాఁ బదార్థముల నిమ్ము.

అని శ్రీరాముఁ డాజ్ఞాపింపఁగా సౌమిత్రి యట్లే వారల
కమూల్యవస్తువుల నిచ్చెను. రామమూర్తి కన్నీరు నవలుచు
నిలుచున్న యాశ్రితులం గనివారలకెల్లఁ గొఱఁతకలుగకయుండ
ధనమిచ్చి నావచ్చువఱకు నాగృహము సౌమిత్రియిల్లు శూన్య
ములుగ నుండఁజేయక సర్వదా కాపాడుచుండవలయు. అని
వగచువారల నూరార్చి కోశాధీశునిం గని ధనముఁ దెమ్మని
శాసించెను. సేవకులు ధనమంతయుఁ దెచ్చిరి. ఆధనరాశి
చూపఱులకు వింతగొలుపుచుండెను. లక్ష్మణుఁడు సాయ
పడఁగా నాధనమంతయు బీదలకిచ్చె. అత్తఱి మిగుల దారిద్ర్య
మున గోరోచనము రంగుగలిగిన త్రిజటుఁ డను బ్రాహ్మ
ణుఁడు గార్గ్యవంశజుఁ డుండెను. వన్యవస్తువులను దెచ్చు
కొని జీవించువాఁడు. పడినవెన్నుల నేఱికొని బ్రదుకువాఁడు.
ఆతనిభార్య నూత్నయౌవన. బీదతనమునఁ గష్టపడుచుఁ జిన్న
వారుగా నున్నకొడుకులంగూడి ముదుసలియగుభర్తకడ కరిగి,
గడ్డపాఱ లోనగువాని విసరివైచి నాచెప్పునట్లు చేయుము. ధర్మ
జుండగు శ్రీరాముని దర్శింపుము. నీకేదేని లభించును అనెను.
భార్యమాట నాలకించి శతరంధ్రములుగా నున్నగుడ్డను గప్పు
కొని రామునింటికిం బోయెను. జనులగుంపులో నాత్రిజటుఁడు
అంగిరసుఁడువోలె బ్రహ్మతేజమున వెలుంగుచు రామునంతః
పురముఁ బ్రవేశింపఁగా నైదవకక్ష్యవఱకు నెవ్వరు నాతని

అన్నమనుస్మృతి ననుసరించి ముప్పదియేండ్లవాఁడు పండ్రెం
డేండ్లయీడుగలకన్యకను బెండ్లియాడవలయును. లేక యిరు
వదినాల్గువత్సరముల వరుఁ డెనిమిదేండ్లకన్యకను బెండిలికావల
యును. అనఁగాఁ గన్యకవయస్సునకంటె రెండింతలుగాని
యించుకతక్కువగాఁగాని యుండవలయుననిస్పష్టము. అనఁగాఁ
బురుషునకు వయోధర్మము చాలకాల ముండుననియు, స్త్రీలకు
నవి సత్వరము తగ్గుననియు భావము. సంతానమే యందులకుఁ
గారణమగు. కావున నీధర్మము చెప్పఁబడినది. అంతియగాక
నియమమున గార్హస్థ్యము సాగించుట పూర్వులయలవాటు.
కనుకనే వారు శతవత్సరములపై నిరువదివఱకు జీవించుచుం
డిరి. ఆర్తవాదులు కారణములుకాఁగా స్త్రీలకు వయస్సువేవేగ
క్షీణించుటంజేసి వారు పురుషులవలె దృఢగాత్రలు కాకుం
దురనుట యుక్తియుక్తమే. చిరకాలము జీవించుటకుఁ బ్రధాన
కారణము మనస్తృప్తియే. అది యాశ మానిననే కలుగును.
ఆశాపాశబద్ధులుకాక యదృచ్ఛాలాభసంతృప్తులై బ్రహ్మచర్య
నియమమును బాటించుచు నుండువా రకాలమృత్యువువాతఁ
బడరనుట సత్యము. ఈకాలమున నాధర్మములు చెల్లకున్నవి.
కావుననే నూఱువత్సరములవఱకును జీవించువా రరుదుగ
నున్నారు. కనుక వివాహపద్ధతులలో వయఃపరిమితి మాఱవలసి
వచ్చెను. సముదాయాయుస్సు అఱువదేండ్లని యూహింపవలసి
యున్నది. అదియు సత్యముకాదని తోఁచుచున్నది. కావునఁ
బూర్వధర్మముల నిప్పటివారు పరిహసింపరాదు.

త్రిజటుఁడు వన్యవస్తువులతోఁ గాలముపుచ్చువాఁడు.
కావుననే ధనముకొఱకు నొరుల యాచింపక యుండెను.

బహుపుత్త్రవంతుఁడుకాఁగా భార్య పురికొలుపవలసివచ్చెను. అంతమాత్రమున నామెయం దొక్కదోషము నారోపింప రాదు. బాలురనుబోషించుభార మామెయందే పడునుగదా. కనుక నామె పురికొలిపెను. కుచేలుఁడు జ్ఞానియైనను భార్య పురికొలుప శ్రీకృష్ణునికడకుం బోయెనుగదా. అట్లే త్రిజటుఁడు రామచంద్రుని జూడఁబోయెను. కాని యాతనిసంభాషణము భావగాంభీర్యమును దెలుపుచున్నది.

"నిర్ధనో బహుపుత్త్రోఽస్మి రాజపుత్త్ర మహాయశః,
ఉంఛవృత్తిర్వనే నిత్యం ప్రత్యవేక్షస్వ మామితి." 3౫

అని. ధనహీనుఁడను. పెక్కండ్రుకొడుకులు గలవాఁడను. నీవు రాజపుత్త్రుఁడవు. గొప్పయశస్సుకలవాఁడవు. ఇంతదనుకఁ దాను భార్య ప్రోత్సహింప వచ్చినవాఁడనని తేటపఱచెను. అయాచకుఁడను. వనమున సర్వదా వసించువాఁడను. నన్నుఁ గరుణింపుము. అను నీభాగమున నన్ను ముక్తుని జేయుమా యను భావమును దెలిపెను. దీనిచే నైహికాముష్మికములను గోరెనని తేటపడియెడిని. ధనమిమ్మని యడుగక "ప్రత్యవేక్షస్వ" అనుట యేల? ముక్తిగోరె నన్నయర్థము సుసంగతమా యని కొంద ఱడుగుదురేమో. "రాజపుత్త్రమహాయశః" అనున దొక్క పదమే కావచ్చును. రాజపుత్త్రుఁడనుయశస్సుగల యోపరమేశ్వరా యని యర్థమగును. దశరథవంశమున నవతరించిన భగవంతుఁడా నన్నుఁ గరుణింపుము అనఁగా నాకేమి కావలయునో వానినెల్ల నొసంగుమా యనునర్థ మేర్పడును. చతుర్విధపురుషార్థములు గృహస్థువు యాచింపవచ్చును. ఇందుఁ ద్రిజటుఁడు "ప్రత్యవేక్షస్వ" అని యడుగుటంజేసి నాపూర్వ

కర్మము ననుసరించి యేమేమి యీయఁదగునో వాని నొసంగుమా శ్రీహరీ! యని యతనిభావమైనట్లు పొడకట్టు. ఈయర్థము సార్థకమని యెట్లు చెప్పవచ్చునందురేమో.

"తతస్సభార్యస్త్రిజటో మహామునిర్గవామనీకం ప్రతిగృహ్య మోదితః."

అని మూలము.

"వృణీష్వ కించేదపరం వ్యవస్యతి."

ఇంకేమైనఁ గావలసిన నడుగుమని రాముఁ డనఁగా గోవులనుమాత్రము గైకొని మఱేదియుఁ గోరకపోయెను. అని యున్నందున భార్యాతృప్త్యర్థము శిశుపోషణార్థము గోధనమును గోరెననియు, సకలకల్యాణదాయకమగు శ్రీరామచంద్రసందర్శనమే తనకుఁ జాలునని యతఁ డింకేద్దియుఁ గోరకయే పోయెననియు నర్థము స్పష్టమగును. కావున శ్రీరాముని కాలమున నన్నపేదలున్నవారే. ఏమి ధర్మపాలనము? అన్న కుత్సితప్రశ్నమున కవకాశమే లేదని యెఱుంగునది.

మఱొక్కసందేహనివారణము.

వేలకువేలుగా గోవుల నిచ్చెనని యున్నదికదా. అన్ని గోవుల గైకొనినవా రేమి చేయుదురని కొందఱు ప్రశ్నింతురు. సమాధాన మాలకింపుఁడు. పూర్వకాలము గోవు లోకనాణెముగా నుండెను.

"ఆర్షే గోమిథునం ద్వేవా వరాదాదాయ ధర్మతః,
కన్యాప్రదానం విధివదార్షో ధర్మస్స ఉచ్యతే. ౨౯
ఆర్షే గోమిథునం శుల్కం కేచిదాహుర్మృషైవ తత్." ౫౩

మను. 3 అధ్యా.

అన్నమనుస్మృతి గోవు లోకనాణెమని యేర్పడుచున్నది.

ఇక్కాలమునఁగూడ విశాఖపట్టణప్రాంతములఁ బశువులను సొమ్ములని పిలుచువాడుక ప్రసిద్ధముగనున్నది. పూర్వము గోవులే ధనము. రాజులుకూడ గోధనము విశేషించి చేర్చు వారు. మహాభారతమున దుర్యోధనుఘోషయాత్ర యన నెట్టిది? రాజులు గోధనముకలవారనుట కది యుదాహరణము కాదా. మహాటవులు విశేషించిగల యాకాలమున గోధనము మిక్కుటముగ నుండుటకుఁ గొఱంత యేమి యుండును ? మునులుకూడ గోవులను బోషించువారు. హోమధేనువులని వానిని బిల్చువారు. హరిణములఁ బెంచుట మునులయలవా టులలో నొకటి.

"తదంకశయ్యాచ్యుతనాభినాళా కచ్ఛిన్నఙ్గీణామనఘా ప్రసూతిః."
అని కాళిదాసమహాకవి తెల్పెను. కావున గోవు లసంఖ్యలుగా నుండుట విచిత్రముకాదు. అన్నియావుల నాత్రిజటునకు శ్రీ రాముఁ డిచ్చెనన్న నబ్బురము నొందవలసినయవసరము కనఁ బడదు. ఇఁకఁ దరువాతికథను బరికింతము.

## సీతాలక్ష్మణులఁ దోడ్కొనిపోవ ననుమతిఁ గోర రాముఁడు తండ్రికడ కరుగుట.

* రామలక్ష్మణులు సీతతోడ సమృద్ధిగా బ్రాహ్మణులకు ధనమొసంగి పిదప సీతతోడ రాజుకడ కరిగిరి. అర్చింపఁబడి పూలహారములుగల కోదండకృపాణాదుల నాయన్నదమ్ములు పట్టుకొనఁగా నవి చూడ శక్యముగాక యెంతయు సీతంగూడి నందున వెలింగెను. త్రోవలనిండ జనులుండుటంజేసి పోవ వలనుపడకయుండెను. జనులు మేడలపైనుండి దీనముఖముల

* ఇయ్యది ముప్పదిమూఁడవ సర్గమునుండి గైకొనఁబడినది.

రామమూర్తిం గాంచుచుండిరి. ఛత్రముకూడ లేకయే శ్రీ రాముఁడు పాదచారియై పోవఁగని పగలఁబొగులుచిత్తముల నెన్నియోరీతుల ననుశోకింపసాగిరి. చతురంగబలములు వెంట రాఁగాఁ బోవురాముఁ డిపు డొక్కఁడే పోవుచుండఁగా సీతా లక్ష్మణులు వెంటఁ జనుచున్నవారు. ప్రభుత్వసంపదను రాముఁ డనుభవించువాఁడు. యాచకులపాలిటికల్పవృక్షము. పితృసేవా నిరతుఁడు. కావునఁ దండ్రి చేసినప్రతిన వ్యర్థము కాకయుండఁ జేయనున్నాఁడు పూర్వము వియద్వీథిని సంచరించుమహాభూత ములుకూడ నేజానకిం జూడఁజాలకయుండెనో యాసీత నిత్తఱి రాజమార్గమున నెల్లరుం జూచుచున్నారు. సీత సుకుమారమగు దేహముకలది. చారుచందనచర్చలకే యామె మేను దగినది. అరుణవర్ణమగు శ్రీచందనమునే యామెపూసికొనును. ఇట్టి యా సీతాదేవి యిఁకమీఁద వేవేగ వర్షాతపమారుతములు రంగు మాఱిపోవఁజేయఁగా నడవుల నుండవలయు భూకాంతుఁడు కావుననే రా జిట్లు పలుకుచున్నాఁడు. సత్యము. లేకపోయిన రాజు ప్రియపుత్త్రుని రామమూర్తిని గానకుఁ బొమ్మనునా? వయసువచ్చినకొడుకు దుర్గుణుఁడయినను వనమునకుఁ బొమ్మనఁ దండ్రికి మనసువచ్చునా? సుగుణము లట్లుండనీ. ప్రవర్తనము చనే యీలోకమెల్ల లోఁబడునట్లు చేసికొన్న కుమారరత్న మును శ్రీరాముని వనికిం బంపుటగుఱించి వచింపనేల? అహిం సయు వాత్సల్యము జాతివిద్యాశీలశమదమములను నీయాఱు గుణములు పురుషోత్తముఁడగు శ్రీరామునకు సొంపుగూర్చు చున్నవి. అట్టి యీరామునకుఁ గొంతమాత్రము హింసగూర్చు టంజేసి ప్రజలెల్లరు తీవ్రగ్రీష్మమున జలములు తగ్గిపోవఁగాఁ

గలఁతనొందుజంతువులవలె నెంతయో పీడితులై యున్నారు. శ్రీరాముఁడు జగదధిపతి. అట్టివానికి వనవాసాయాసము పాటి ల్లఁగా మూలము చెడఁగా వృక్షము పుష్పఫలములతో నశించు చందమునఁ దదాధారమగు నీజగత్తంతయుఁ బీడింపఁబడియే యున్నది. రామచంద్రునకు ధర్మమే సారము. కావున నీశ్రీరా ముఁడు మనుష్యాదిప్రాణిరూపమగు వృక్షమునకు మూలము. తక్కుంగలజనులెల్లరు నందుఁ బూవులు పండ్లు ఆకులు కొమ్మలు నగుదురు. ఆశ్రితులమగు మనము భార్యలతో బంధువులతోను గూడి సౌమిత్రిరీతి రామునివెంట నడవికిం బోవుదము. మన మారామములను భూములను గేహములను వదలి రాముని తోడిసుఖదుఃఖములే యనుభవించుచు ధర్మాకృతియగు నీతని వెనుకఁ బోవుదము.

మనము గృహముల మానిపోవఁగా నందలి నిక్షేపములఁ బెల్లగించుకొనిపోవుదురు. అంగణములు చెడిపోవును. సంపా దించియున్న ధనధాన్యములు పాడగును. మఱియుంగలపదా ర్థములెల్ల నపహరింపఁబడును. గృహదేవతలు వెడలిపోవుదురు. వివరములు త్రవ్వి మూషికములు విహరించుచుండును. కాపుర మున్న లక్షణములు పాడకట్టవు. బలికర్మములు యాగమంత్ర శబ్దములు హోమకార్యములు జపములు శూన్యములగును. కలివురాఁగాఁ బాడుపడినట్లున్న మనగృహములఁ గైకేయి స్వాధీనము చేసికొని హాయిగా నుండుఁగాక. రాముఁడున్న యడవి పురమగును. శ్రీరాముఁడు మనము వదలినపిదప నీ పట్టణ మరణ్యమగుఁగాక. మనమెల్ల నీరాముఁడు పోయియున్న యడవికిఁ బోయినపిదప భయంపడి సర్పములు తమబిలముల

వదలి పాఱిపోవును. మృగపక్షులు పర్వతసానుభాగముల మాని పరుగిడును. ఏనుఁగులు సింగములుకూడఁ బాఱిపోవకమానవు. అవియన్నియు వనములవదలి మనము విడిచిపెట్టిన యీయయోధ్యలోఁజేరి కాపురముండుఁగాక. మృగపక్షులకు నివాసమగు నీదేశమును గైకేయియుఁ దత్పుత్రుఁడు వారిబంధువులును గైకొందురుగాక. మనము సుఖముగా నడవుల శ్రీరామునిం గూడి వసింతము. అని యిట్లు లొండొరులతో మాటలాడుకొనిరి. ఆమాటలనెల్ల శ్రీరాముఁ డాలకించెను. కాని యించుకంతయు వికారము నొందకయుండెను

అంత రామమూర్తి మందగమనమునఁ బోయి కైలాసమునవలెఁ దెల్లనై యుండు రాజభవనముం గాంచెను. వీరభటులు వినీతులయి యందు రక్షకులుగా నుండిరి. రాముఁ డా రాజమందిరమును జేరి యించుకదూరమున దీనుఁడై యున్న సుమంత్రుని జూచెను. రాముఁడు పితృనానతిని గొఱఁతగాక యుండఁ జేయఁబూని యతనిం జూడ వాంఛించి త్రోవయందలిజనులు తన్నుంగాంచి నగచినను దావగవక నవ్వుచున్నయట్లే యెల్లరకుం గనఁబడుచుఁబోయెను ధీరాగ్రగణ్యుఁడగు నాదాశరథి వనములకుంబోవంగోరి తండ్రి వనమున కరుగుమన్నదిమొదలు దుఃఖమునఁ బరితపించుచున్న సుమంత్రునిం గాంచి తనరాక తండ్రికిఁ దెలుపుటకై యించుకసేపు వేచియుండెను. అంత సుమంత్రునిం గాంచి తానువచ్చి దర్శింపఁ గాచియున్నరీతి రాజునకుం దెల్పుమా యని సుమంత్రునకుఁ జెప్పెను.

మహానుభావులారా! ఈభాగమునఁ గలవిశేషములఁ బరికింతము.

"యాం న శక్యా పురా ద్రష్టుం భూతైరాకాశగైరపి,

తామద్య సీతాం పశ్యంతి రాజమార్గగతా జనాః. ౭
అంగరాగోచితాం సీతాం రక్తచందనసేవినీం,
వర్షముష్ణం చ శీతం చ నేష్యంత్యాశు వివర్ణతాం." ౮

అని మూలము. సామాన్యార్థము స్పష్టము. విశేషార్థ మిందేది? ఆకాశగైర్భూతైరపి=దేవతాభేదములచేతఁగూడ, పురా ద్రష్టుం నశక్యా=మున్ను చూడశక్యముగాక యేదేవియుండెనో, తాం సీతాం=ఆసీతాదేవిని, రాజమార్గమునఁగలమానవులు చూచుచున్నారని భావము. అనఁగా భూలోకమున నవతరింపక ముందు కేవల ప్రకృతి యనంబడుచుండు నీదేవిని భూమియందుఁ దిరుగువారిమాట యేటికింగాని వియచ్చరులుకూడ దర్శింపఁజాలకయుండిరి. ఇప్పుడో ఆప్రకృతియే యొక ఆకారమును ధరింపఁగనే మానవులుకూడఁ జూచుచున్నారు. భగవంతునకు మహామాయకు రూపములే లేవనియు, సర్వవ్యాపకులుగా నుందురనియుఁ, గారణాంతరమున నేదో యొకరూపమును ధరింతురనియు నీభాగమునుండి తేలెడిని. అనఁగా భక్తకల్పితరూపమేగాని నియమితరూపము లేదని తాత్పర్యము. ఈవిషయము శ్రీశంకరభగవత్పాదులుగారు

"క్వణత్కాంచీదామా కరికలభకుంభస్తననతా
పరిక్షీణా మధ్యే పరిణతశరచ్చంద్రవదనా,
ధనుర్బాణాన్ పాశం సృణిమపి దధానా కరతలైః
పురస్తాదాస్తాం నః పురమథితురాహోపురుషికా."

అని తేటపఱచిరి.

"భక్తానాముపకారార్థం బ్రహ్మణో రూపకల్పనా."

అను సూక్తి కలదుకదా. దీనింబట్టి చూడఁగాఁ బ్రకృతిపురుషులవినాభావసంబంధముచే సర్వవ్యాపకులుగా నుందురనియు,

భక్తులు వారియిష్టానుసారము రూపమును గల్పించుకొని యారాధింప ననఁగా ధ్యానింప నారూపమునఁ బొడకట్టి వారి నుద్ధరింతురనియు సారము. ఇట్టులుండ భగవంతున కొక్క లోకము నొక్క రూపము కలదనియు, నదియే ధ్యేయమనియుఁ గల్పించువారు మధ్వవైష్ణవాదులుగాక మతెవ్వరగుదురు? కల్పితరూపమే భగవంతునకుఁ గలుగుచుండునన్నపుడు మత ద్వేషమునకుఁ దావే లేదని తేలెడిని ఇన్ని మతద్వేషములకు దేవాలయములే హేతువులని తోఁచెడిని ఆ దేవాలయముల లోని పాషాణవిగ్రహములు సికతాసుధాసమ్మిశ్రపదార్థకల్పిత విగ్రహములు ముక్తి నొసంగునని భక్ష్యవిశేషములు సమర్పింపుఁ డని బోధించు మధ్వవైష్ణవులు కపటనాటకసూత్రధారులు గాక మతెవ్వరగుదురు? వారిదుర్మతసిద్ధాంతములఁ ద్రోసివైచి భగవంతుని నిర్మలభక్తి నారాధింపవలయునని మనము నిర్ణ యించుకొనవలయును.

"అంగరాగోచితాం సీతాం రక్తచందనసేవినీం,"

అనుదానియందుఁ గలసారము నరయుదము భగవతికి రక్తచం దనమునందుఁ బ్రీతి యని మంత్రములు తెలుపుచున్నవి. రక్త ములు నట్టివే. రక్తవర్ణము రజోగుణస్వభావము. రూపమును ధరించినపుడు భగవంతుఁడు కార్యకరణదక్షుఁడగును. రజోగుణ మునకు స్వభావములగుగుణము లున్నయట్లు నటింపక తీఱదు. భగవతియు నట్లే

"భజంతి త్వాం ధన్యాః కతిచన చిదానందలహరీం"

అని శంకరభగవత్పాదులు పొగడిరి. అనఁగా అవతరింపక ముందు భగవతి శుద్ధసత్త్వగుణప్రధానగా నుండునని భావము.

ప్రస్తుతము మహాప్రకృతి రాక్షసనాశనార్థము సీతారూపమున వెలసినదగుట రజోగుణమును బ్రధానముగాఁగలదని తేటపడ నటించుననియుఁ, దదనుగుణములగు రక్తచందనపుష్పాదుల నామె నారాధింపవలయుననియు మన మెఱుంగవలయును. సాధకులు ప్రాయికముగా ముముక్షువులే కారు ధర్మార్థకామములను గోరువారలుగ నుందురు. వారు శుద్ధసత్త్వప్రధానములగు పద్ధతుల నారాధింపరాదు. ఫలాభిసంధిరహిత సత్కర్మాచరణపరాయణులుమాత్రము పైవ్రాసినపద్ధతి నవలంబింపరు. కాని ఫలమును గోరువారు తదుచితవిధుల నాశ్రయింపవలయును. సారమేమనఁగా సీతాదేవి రజోగుణప్రధానయై యవతరించినమాయ యనియు, రాక్షసనాశనమే ప్రధానముగాఁ గలదనియు సారము.

"ఆనృశంస్యమనుక్రోశశ్శ్రుతం శీలం దమశ్శమః,
రాఘవం శోభయంత్యేతే షడ్గుణాః పురుషోత్తమం." ౧౭

అని మూలము. అహింసకత్వము లోనగునాలుగుణములు భగవంతుఁడగు రామునియందుండుట విచిత్రము కాదు. ఎవ్వని యందు నీగుణములుండునో యతఁడు పురుషశ్రేష్ఠుఁడగును. తొలుత లెక్కపెట్టఁదగిన దహింసయని తేలెడిని. అట్టిపరమ ధర్మము నవలంబించువాఁ డుత్తముఁడు కాకతప్పునా?

"ప్రతీక్షమాణోఽపి జనం తదార్తమనార్తరూపః ప్రహసన్నివాథ."

అని మూలము. దీనులై జనులు శ్రీరామునిం గాంచుచుండిరి. శ్రీరాముఁడు దీనుఁడుగాక నవ్వుచుండెను. అనఁగా నాయవతారకారణము వనగమనమే యని యెఱుంగక వీరు దుఃఖించుచున్నారే. ఎంత పామరులు? అని నవ్వుచుండెనని తాత్పర్యము.

ఇట్టు లీభాగము సీతారాములతత్త్వము తెలుపుచున్నది. ఇఁకఁ దరువాతికథవంకకు మరలుదము.

## శ్రీరాముఁడు తండ్రికడ ననుజ్ఞఁ గొనుట.

* జగన్మోహనాకారముగల శ్రీరామమూర్తి యంత సారథిం గాంచి తనరాక తండ్రికిం దెల్పుమనఁగా నాతఁడు కంపితేంద్రియుఁడై లోపలికింజని నిట్టూర్పులుపుచ్చుచుఁ దపించుచున్న రాజుం గనియె. రాజు రాహుగ్రస్తసూర్యబింబమువడువున నీటుగప్పినయగ్నిచందమున నిర్జలతటాకమురీతి వెంపుమాలి తపించుచుండఁగా సుమంత్రుఁడు గాంచి ప్రాజ్ఞుఁడుగాన దోసిలొగ్గి చెంతకేగి జయాశిషము లొసంగి భయమున మాటలు తడఁబడఁగా మెల్లగా మధురవాక్కుల నిట్లనియె. మహారాజా! పురుషోత్తముఁడగు నీతనయుఁడు ధనమెల్ల బ్రాహ్మణులకు సేవకులకు నొసంగి నీదర్శనమునకై వాకిటనున్నాఁడు. సఖులకడ ననుమతింగొని నీసెలవు గ్రహింపఁగోరి చూడవచ్చియున్నాఁడు. రాజేంద్రా! రామమూర్తి యడవికింబోవ నున్నవాఁడు. సూర్యుఁడు కిరణాళిఁగూడియున్నచందమున సకలరాజగుణభూషితుఁడగు నా రామభద్రుని జూడుము. సత్యధర్మరతుఁడగు నా రాజు సారథిం గాంచి సుమంత్రా! ఇపు డిందుఁగలభార్యలం దొడ్కొనిరమ్ము. పత్నులతోడ నా రామచంద్రునిం జూడఁ గోర్కి కలదు. అనఁగా నాతఁడరిగి రాజపత్నులంగని తల్లులారా! రాజు మిమ్ముం బిలుచుచున్నవాఁడు. సత్వరమపోఁదగు. అనఁగా బలియానతిమెయి నంద అచటికింబోయిరి. వారు మూఁడు

* ఇది ముప్పదినాల్గవసర్గమునుండి సంగ్రహీతము. అధ్యాత్మరామాయణకథయు నిందఱకర్యాతముగనుండు.

వందలపై యొనమంద్రుగానుండిరి. సాధ్వీమణులువారెల్ల రాముని కై విలపించి నేత్రములు రక్తవర్ణములు కాఁగాఁ గౌసల్య చుట్టునుండి మెల్లఁగా నచటఁ జేరిరి రాజేంద్రుఁడు భార్యల రాకంగాంచి సుమంత్రా! శ్రీరామచంద్రుని బిలిచికొనిరమ్మనఁగా నతఁడు సీతారామలక్ష్మణులం దోడుకొనివచ్చి రాజుకడ విడిచెను. దూరమునుండి యంజలింబట్టి యరుదెంచు ప్రియపుత్రునిం గాంచి వగచుచు భార్యలతోఁ దటాలునఁ బీఠమునుండి లేచెను. రామున కెదురుగాఁ బోయెను. దుఃఖతప్తుఁడుగాన రామునివగ్గరకుఁ బోవఁజాలక నడుమ విస్మృతుఁడై పడెను. అట్టి తండ్రింగని రామలక్ష్మణులు లేవనెత్తఁ జెంతకుం బరువిడిరి. రాజపత్నులొక్కమొగి నేడ్చిరి. సీతారాములు సౌమిత్రియు నారాజును జేతులంబట్టి యెత్తి దుఃఖించుచు శయ్యాతలంబునఁ గూరుచుండఁబెట్టిరి.

దశరథుఁడు కొంతసేపట్లుండి స్మృతి రాఁగా దుఃఖార్ణవమున మునింగియుండఁగా రామమూర్తి యంజలింబట్టి తండ్రీ! మాకెల్లఁ బ్రభుఁడవు. నీయనుజ్ఞలేక పోవఁగూడదు. సెలవు వేఁడుదు. దండకారణ్యమునకుంబోవ నున్న నన్ను దుఃఖము లేనినేత్రములం జూడుము. లక్ష్మణునకు ననుజ్ఞయిమ్ము. సీతయు నావెంట వనములకు వచ్చుచున్నది. కాన సీతకు ననుమతి యొసంగుము. ఎన్నివిధములనో రావలదని చెప్పినను వీరిరువురు నుండ నంగీకరింపక వచ్చుచున్నారు. విశోకుఁడవై మామూపురకు బ్రహ్మప్రజలకు ననుజ్ఞయిచ్చునట్టు లొసంగుము. వనవాసమునకై తొందఱపడు శ్రీరాముని దశరథుఁడు చూచి వత్సా! కైకకు వరమిచ్చి నేను వంచితుఁడనైతిని. నన్ను నిగ్ర

హించి నీవే యయోధ్యకుఁ బ్రభుఁడవుకమ్ము. నాపుఁడు వాగ్విశారదుఁడు ధర్మాత్ముఁడు నగురాముఁడు చేమోడ్పు గీలించి రాజేంద్రా! పెక్కువేలేండ్లు భూమిఁబాలించితివి. అట్టి నీవిపుడు నన్నసత్యవంతునిగాఁజేయుట న్యాయమా? నిన్ను ననృతవచనునిగాఁజేయుట నాకు న్యాయ్యముగాదు. కనుక నే వనముల వసింతును. నేనందు నైదుతొమ్మిదియువత్సరములు వనముల హాయిగా సంచరించుచునుండి ప్రతిన తీఱఁగా మరవచ్చి మీపాదముల నాశ్రయింతును.

అని రాముఁడు పలుకఁగా సత్యపాశబద్ధుఁడగుట రాజు విలపించుచు నిపుడే పంపుమని కైక ప్రోత్సహించుచుండఁ బ్రియపుత్త్రుని గని యిట్లు పలికెను. వత్సా! వనముల కరుగుము. దానఁ బరలోకసత్ఫలము నైహికశ్రేయస్సు నీకుం గలుగుంగాక. శుభముల నొసంగుచు నెట్టిజంతువులవలనను భయము కలుగక యుండు సత్పథము నాశ్రయించి యరుగుము. నాయనా! సద్గుణముల రాఘవులకెల్ల నానందముం గూర్చువాఁడవు. సత్యశీలుఁడవు. ధర్మనిరతచిత్తుఁడవు. ఇట్టి నీకుఁగలిగిన యీవనవివాసబుద్ధి మరలింప శక్యమగునది కాదు. నేఁడుమాత్రముపోవరాదుసుమీ. రాత్రియు సమీపించుచున్నది. రాత్రియంతయు నిందే యుండుము. ఒక్కదినమైనను నిన్నుఁగన్నులారఁ జూచుచు హాయిగా నుందును. కౌసల్యను నన్నుం జూచుచు నీరాత్రి యిందుండుము. నిన్నుఁ దృప్తినొందింతుము. అంత రేపుదయము పయనము చేయవచ్చును. నాకుఁ బరలోకమున మేలుగోరి నీకుఁ బ్రియములగు వానినన్నింటిని ద్యజించి నిర్జనారణ్యములకుం బోవుచున్నాఁడవు. ఇదెంతవారికైనఁ జేయందరముగాదు. నీవద్దాని నొనరించు

చున్నవాఁడవు. నాయనా! నిన్నడవులకుఁ బంపుట నాకెంత మాత్రము సమ్మతముగాదు. సత్యముపై నొట్టుపెట్టి వచింతును. ఈకైక నీఱుగప్పినయగ్నివలెఁ దనమదిఁగల క్రౌర్యమును వెలిపుచ్చక గుప్తముగానుంచి నన్నుఁ జలింపఁజేసి వంచించినది. మున్ను నేను సామాన్యముగా నిచ్చినవరములను విపరీతముగాఁ గోరి మోసగించెను. నీవు కులాచారధ్వంసకురాలగు కైకేయి చెప్పినట్లే యొనరించి యామోసమునుగూడ ఫలింపఁజేయఁగోరుచున్నవాఁడవు. నీగుణము వర్ణింపఁదగినదే. వత్సా! జ్యేష్ఠపుత్త్రుఁడవగునీవు నన్ను సత్యవచనునిగా నొనరింపఁగోరుచున్నావు. ఇది యచ్చెరువుకాదు. అంత రామభద్రుఁడు విచారపడుచుఁ బలికిన తండ్రిపలుకు లాలకించి వగచి సోదరుఁడు దుఃఖించుచుండఁగాఁ దండ్రీ! కోర్కులన్నింటిని దీర్చి సంతృప్తునిగా నన్నుఁ జేసెదనంటివికదా. ఇపుడు మీరిచ్చునిష్టధర్మముల ననుభవించినను రేపు వానిని నాకుఁ గల్గించువాఁడెవ్వఁడు? కాన నిది యంత మంచిది గాదు. ఈకోర్కులకెల్లమాఱుగా నన్నవ్వలికంపిన సంతృప్తి నొందుదు. సర్వసమృద్ధియగు నీదేశము వదలిపోవుదును భరతునకు దీనినిమ్ము. వనవాసమున మక్కువగల నాతలంపు మార్పు నొందదు. అడిగినవరముల నిచ్చువాఁడవుకదా నీవు. సంతోషమున మున్ను కైకకు వరము లిచ్చితివి. వానిని గొఱఁతలేక యుండ నాయమ్మకిచ్చి సత్యసంధుఁడవు కమ్ము. నేను భవదాజ్ఞ నించుకయుఁ దప్పక పాలించుచు వనమునందు, నందుఁ జరించు మునులతోఁడఁగూడి పదునాలుగేండ్లు వసింతును. నిన్ను నిగ్రహించి రాజవు కమ్మని నాకుఁ దెలిపితివి. ఇట్టివిచార మించుకయు వలదు. తమ్మునకు రాజ్య మిమ్ము. రఘుకులానందదాయకా!

నామనస్సుఖమునకుగా రాజ్యమును గోరను. నాకోరిక నీయాజ్ఞా పాలనమునందే యాసక్తమగును. దుఃఖింపకుము. అశ్రుజలముల వదలకుము. నదీనాయకుఁడగుసాగరుఁడు కలఁతనొందునా? తత్తుల్యుఁడవగునీవు కలవిలపాటొందరాదు. రాజ్యసుఖములలో దేని యందును సీతయందును దక్కిన కామ్యవస్తువులందును వెండియు స్వర్గమునందును నవంతయైన కోరిక లేదు. పురుషశ్రేష్ఠా! సత్యసంధుఁడవు నీవగుటయే నావాంఛ. నీయందనృతదోష మారోపింపఁబడిన నాకుఁ గష్టముగ నుండును. ప్రత్యక్షదైవమగు నీమ్రోల సత్యసుకృతములపై నొట్టుపెట్టి ప్రమాణము చేయుదును. రాజేంద్రా! ఇఁక నిందు నిముసమైన నిలువఁ దరము గాదు. నేనుండ లేదనిమాత్రము శోకింపకుము. నాసంకల్పమునకు మార్పు కలుగదు. కైకేయి నన్నడవులకుఁ బొమ్మనికోరెను. నే నంగీకరించితిని. కావున నీయానతి మెయి వర్తించుట యేకాక నాసత్యమును గూడఁ గాపాడుకొనవలయుఁగదా. కనుక వనమునకుఁబోవక మానరాదు. ఇందులకు విచారపడకుము. క్రూర మృగములుగాక మంచిస్వభావముగలజింకలు లోనగుమృగములు నిండియుండఁగా పక్షులు శ్రావ్యముగాఁ గూయుచుండఁగా నలరువనముల విహరింతుము.

తండ్రీ! దేవతలకుంగూడ జనకుఁడే దైవమని శాస్త్రము లుద్ఘోషించుచున్నవికదా. మానవులమాట యిఁక వేఱుగఁ జెప్పవలయునా? దైవమన్నభావము చేతనే తండ్రియానతి నెఱపెదను. పదునాలుగుసంవత్సరములు గడువఁగా నిందు నన్నుఁ జూతువు. కనుక నీసంతాపము వదలుము. వగచుచున్న యీజనులయార్తిని బాపి దుఃఖము శాంతింపఁజేయు

భారము నీయందున్నది. అట్టి నీవే యిట్లు వగచిన నిఁక వారి
గతి యేమగును? నేను వదలినరాజ్యమును భరతున కొసం
గుము భవదాజ్ఞం బాలించుచు నరణ్యమునకుం బోయెదను.
కొంతకాల మందుందును. పర్వతపంక్తులు నగరములు నరణ్య
ములు పెక్కులుగలిగి మనోహరసీమలు వెలయఁగా శుభదమై
యున్న యీభూమిని వదలి నేను వెళ్లఁగా భరతుఁడే యంతయు
లోఁబఱచుకొని పాలించుంగాక. ఇది నాయిచ్ఛచేఁ జేయఁబడిన
దనుకొనకుము. నీవేమిచెప్పిన నది యట్లే సాగఁదగును. సాధు
సమ్మతమగు నీయాజ్ఞను బాలించుటయందు నామనస్సిట్లు దృఢ
ముగనున్నదో, యట్లు మఱికోర్కులయం దేని, ఇంకను నాకుం
బ్రియమగుదానియం దెద్దానియందు నిలువదు. అందుచేత వన
గమనము నాకుఁ గష్టముగాఁ దోఁచునని నీవేమాత్రము వగ
వకుము. నీకసత్యపాపముం గూర్చుటచే నాకు సర్వకామములు
సిద్ధించిన నొల్లను. అంతియే కాదు. సీతను బ్రాణములనుగూడ
నొల్లను. రాజ్యముమాట యేటికి? నీసూనృతవ్రతమునకుఁ
గొఱంతరానిచందమున నవియెల్లఁ గావలయును. నేను రా
జ్యము పోయెనని వగతునేమోయని యూహింపకుము. అనేక
భూరుహములు గలయడవులకు నరిగి యందు ఫలమూలముల
నశనముగాఁ గైకొనుచుఁ బర్వతములను నదులను సరస్సులను
జూచుచు సుఖముగా నుండుదు. నీవును విగతశోకుఁడవై
సుఖముగా నిందుండువుగాక. అని రాముఁడు పలుకఁగా భరింప
రానియట్టిదుఃఖమునఁ బొక్కుచు రాజు ప్రియకుమారా యని
చేరఁదీసి కౌఁగిలించుకొని విస్మృతుఁడై మూర్ఛమునింగి నిశ్చే
ష్టుఁడై యుండెను. కైక యొకతుకతప్పఁ దక్కంగలరాజపత్ను

లెల్ల నొక్కసారి రోదనముచేసిరి. మూర్ఛిల్లిరి. అందుఁగల జనులు హాహాకారము లొనరించిరి.

మహాశయులారా! ఈభాగమున విమర్శనార్హ విషయములు లేవు. కాని యొకటి రెం డుండకపోవు. వానిని బరికింతము.

"స త్వా పశ్యతు భద్రం తే రామస్సత్యపరాక్రమః,
సర్వాన్ సుహృద ఆపృచ్ఛ్య త్వామిదానీం దిదృక్షతే."

అని సుమంత్రుఁడు పలికెను.

"సత్యపరాక్రమస్సు రామస్త్వాం పశ్యతు భద్రం తే."

అని యన్వయక్రమము. సాధుమతులనెల్ల నడిగి వారి యనుమతినొంది సత్యము పరాక్రమముగల రామమూర్తి నిన్ను నిపుడు గాంచుఁగాక. నీకు భద్రములు గలుగును. భగవతి యిచ్ఛానుసారము సుమంత్రునినోటనుండి యీమాటలు వెలువడెను. సజ్జనులకడ సెలవుపుచ్చుకొని యనఁగా మహర్షుల యనుమతినొంది తనయవతారఫలమును గల్పింపఁబోవుచున్నాఁడనని రాముఁడు తెలిపెనని భావము. దేవకార్యము ధర్మకార్యముగాన వా రామోదించిరి. సత్యపరాక్రముఁ డనఁగా సత్యమాధారముగాఁ బరాక్రమముఁ జూపువాఁడని భావము. పితృసత్యము నెఱపఁబూని తనపరాక్రమమును జూపునని సారము. వనగమనమునకు సత్యము హేతువయ్యెనని తాత్పర్యము. ధర్మరక్షణమునకు సత్యము ప్రధానము. అధర్మనాశమునకుఁ బరాక్రమము ప్రధానమనియే సారము. అవి రెండు నెఱపఁబూని వనములకుఁ బోవుచు శ్రీరామమూర్తి నిన్నుఁ జూడ వచ్చెను అపరమేశ్వరుం జూడుము. నీకు భద్రము గలుగును.

అనఁగా దశరథా! వనగమనమునకు ముందుగాఁ దనదర్శన మొసంగఁ దానే యరుదెంచెను. నీకు సకలశుభములు గలుగును.

"భద్రం భద్రమితి బ్రూయాద్భద్రమిత్యేవ వా వదేత్."

అన్న మనుస్మృతివచనానుసారము భద్రవాక్కుల నాసుమంత్రుఁడు పలికెను. భగవద్దర్శనమున సకలభద్రములు ననఁగా దశరథునకుఁ గోఁరఁతగానున్న ది యాముష్మికసుఖమే. అయ్యది భగవద్దర్శనమున నపునరావృత్తికముక్తియే. అది కలుగునని వాక్యసారము.

"అంతకాలే తు మామేవ స్మరన్ ముక్త్వా కళేబరం,
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః. ౫
యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరం,
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః. ౬
తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ,
మయ్యర్పితమనోబుద్ధిర్మామేవైష్యస్యసంశయః." ౭ గీత. ౮ అధ్యా.

అను నీభగవదుపదేశము ననుసరించి స్మరించిననే తత్పదము లభించును. ఇఁక సాక్షాత్కరించిన భగవంతునే చూచిన భద్రముగలుగుటకు సందియమేల?

"సుమంత్రానయ మే దారాన్ యే కేచిదిహ మామకాః,
దారైః పరివృతస్సర్వైర్ద్రష్టుమిచ్ఛామి ధార్మికమ్." ౧౦

అని మూలము. ఇది దశరథునివాక్యము. భార్య సహధర్మచారిణి. సత్కర్మము లామెతోడనే యాచరింపవలయును. అన్న నియమము ననుసరించి యాజన్మమున నిదియే సత్కర్మము కడసారి చేయునది గాన దగ్గరనున్న భార్యలనెల్లం బిలుచుకొని

రమ్మనెను. వారినెల్లరఁ గూడి రామభద్రుని జూడఁగోరెదను. వీరందఱింగూడి భగవంతుని గాంచి వీరిసంసర్గము వదలుకొని పరమపదమునకుఁ బోవుదునని రాజుభావము. ఈభావము రాజునకుఁ గలదా యనరాదు. అప్రయత్నముగా నాతనినోట వెలువడిన యీయక్షరసముదాయ మీయూహను దెలిపెడిని. ఈభాగమునుండి మనమేమి నేర్చుకొనవలయును? కంఠగతప్రాణుఁ డగునంతదనుక భార్యంగూడియే సత్కర్మము లాచరింపవల యును. తనకుగానరియే కర్మము నాచరింపరాదు. అట్లు పత్నిని వీడిచేసినసత్కర్మము ఫలింపదు అనునీతి యిందుఁ గలదు.

"ఆపృచ్ఛే త్వాం మహారాజ సర్వేషామీశ్వరోఽపి నః,
ప్రస్థితం దండకారణ్యం పశ్య త్వం కుశలేన మాం. ౨౨
లక్ష్మణం చానుజానీహి సీతా చాన్వేతి మాం వనం,
కారణైర్బహుభిస్తథ్యైర్వార్యమాణౌ న చేచ్ఛతః." ౨౩

అని మూలము. ఇవి రామవాక్యములు.

"మహారాజ! త్వాం ఆపృచ్ఛే. నస్సర్వేషా మీశ్వరోఽపి త్వం దండకా రణ్యం ప్రస్థితం మాం కుశలేన చక్షుషా పశ్య."

అని యన్వయము. దండకారణ్యమునుగూర్చి పోవుచున్న నన్ను సామ్రాజ్యలక్ష్మి యగుసీతను సాధుదృష్టి నవలోకింపుము. ఈనేత్రములతో మరల మమ్ముం జూడఁజాలవు. మమ్ము నెవ్విధిఁ జూడఁదగునో యట్లు అనఁగా మహాప్రకృతిని బరమేశ్వరునిగా నవలోకింపుమని భావము. లక్ష్మణునిరాకకు సమ్మతింపుము. "సీతా మామన్వేతి" సీత నన్ననుసరించి యడవులకు వచ్చును. సీత రాకకు సమ్మతింపుమని యర్థమునుండి సిద్ధమగును. ఏల

యనఁగా సీతవేఱుగా నుండ వలనుపడదు. అవినాభావసంబంధము వారికిం గలదు. ఈవిషయము సీత యింతకుముందే

"భర్తుర్భాగ్యం తు భార్యైకా ప్రాప్నోతి పురుషర్షభ,
అతశ్చైవాహమాదిష్టా వనే వస్తవ్యమిత్యపి." ౪ సర్గ. ౨౭

అనువాక్యమునఁ దేటపఱచినది. కావుననే రామభద్రుఁడు లక్ష్మణునిరాకకు సమ్మతింపఁడు. సీత నన్నుఁగూడి యడవులకు వచ్చుననియె. దీనిచే సీతారాములకుఁ జంద్రచంద్రికలకువలె నభేదము స్పష్టమయ్యెనని యెఱుంగందగు.

"నవ పంచ చ వర్షాణి వనవాసే విహృత్య తే,
పునః పాదౌ గ్రహిష్యామి ప్రతిజ్ఞాంతే నరాధిప." ౭౯

అని మూలము. ఇదియు శ్రీరామవాక్యమే. సామాన్యార్థము సులభము. తొమ్మిదియైదువత్సరములు వనమున విహరింతు ననుటంజేసి తొమ్మిదేండ్లు ఒకవిధముగను అయిదేండ్లొకవిధముగా వనవాసమునఁ గడపుదునని భావము. అనఁగా మొదటఁ దొమ్మిదేండ్లు విహరింతును. ఈమానవదేహమునకు రాఁదగిన విశేషకష్టములు లేవని భావము. తక్కినయైదేండ్లలోనే కొన్ని కష్టములు వచ్చుననియు నందు విహరింతుననఁగాఁ గ్రూరరాక్షసులను విశేషించి హరింతుననఁగా సంహరింతుననియు సారము. ప్రతిజ్ఞాంతము ననఁగా నాయవతారమునకు ఫలమగుదుష్టరాక్షసవినాశనానంతరము పదునాలుగేండ్లు గడువఁగా మరల "పాదౌ గ్రహిష్యామి." పాదుకలను గ్రహింతుననఁగా నాపాదుకలయం దునుపఁబడినరాజ్యమును గ్రహింతునని భావము.

"శ్రేయసే వృద్ధయే తాత పునరాగమనాయ చ,

గచ్ఛస్వారిష్టమవ్యగ్రః పంథానమకుతోభయం. ౩౧
న హి సత్యాత్మనస్తాత ధర్మాభిమనసస్తవ,
వినివర్తయితుం బుద్ధిశ్శక్యతే రఘునందన." ౩౨

అని మూలము. ఇవి దశరథవాక్యములు. "శ్రేయసే=పరలోక హితాయ, వృద్ధయే=లోకాభ్యుదయాయచ" అనివ్యాఖ్య. స్వర్గ లోకవాసులహితముకొఱకు మర్త్యలోకవాసులయభివృద్ధి కొఱకు నని భావము. పునరాగమనాయచ= రాక్షససంహారము కాఁగా నవతారసమాప్తినొందింపక మరల నయోధ్యకు రావల యుననిభావము. అవ్యగ్రః అరిష్టమకుతోభయం పంథానం గచ్ఛస్వ=శుభము, ఎందును భయము లేనిది అయిన మార్గమును. అట్టి దేది? ధర్మమార్గము. అట్టిమార్గమునఁ బొమ్మని దశరథు నభి ప్రాయము. సత్యాత్మనః ధర్మాభిమనసః తవ = సత్యస్వరూపము గలవాఁడు. ధర్మమున కభిముఖమగుమనస్సుగలవాఁడు. అట్టివా డెవ్వఁడు? సర్వేశ్వరుఁడే అట్టి పరమేశ్వరునకుఁ గలిగినబుద్ధిని మరలింప నెవ్వరికి శక్యమగును? ఎవ్వరికి శక్యము కాదనిభావము. ధర్మసంరక్షణార్థము నీవు పోవుమార్గ మేవిధమునను భయము లేనిది. అనుటచే "వృషో హి భగవాన్ ధర్మః" అనుమనుస్మృతి వచనభావమే రామాయణమునందుఁ గలదు. అనఁగా రామా యణము కేవలకావ్యముగాక సకలధర్మప్రతిపాదకమని భావము.

"దుష్కరం క్రియతే పుత్ర సర్వథా రాఘవ త్వయా,
సుప్రియార్థం ప్రియాం త్యక్త్వా యద్యాసి విజనం వనం." ౩౫

అని మూలము. రామా! ఇందుఁగలమిత్రమండలమును వదలి నాకుఁ బరలోకమున మేలుగలుగవలయు నన్నవాంఛతో నడ వులకు వెళ్లుచున్నావే. ఇదియే నీకుఁదప్ప మఱెవ్వరికి దుష్క

రమగు కార్యము. అనఁగా నీవడవులకుఁ బోయినఁగాని నాకు మరణము సిద్ధింపఁదనియు, నాకీశరీరతాపములు తీఱి శాశ్వతానందము కలుగఁజేయుటకే నీ వీప్రయాణము సాగించుచున్నాఁడవనియు దశరథునాశయము. ఇట్టిపరిజ్ఞానము రాజునకుఁగలదాయని యందురేమో. అప్రయత్నముగా భావికాలము పురికొలుపుచుండ మానవులు సంభాషింతురు. ఆమాటలు వారిప్రయత్నములేకయే వెలువడుననుభావము మన మెఱుంగవలయును.

"న చ శక్యం మయా తాత స్థాతుం క్షణమపి ప్రభో,
న శోకం ధారయస్వైనం న హి మేఽస్తి విపర్యయః. ౪౯
అర్థితో హ్యస్మి కైకేయ్యా వనం గచ్ఛేతి రాఘవ,
మయా చోక్తం వ్రజామీతి తత్సత్యమనుపాలయే." ౫౦

అని మూలము. ఇది శ్రీరాముని దృఢాభిప్రాయము. రాజా! ఇఁక క్షణమైన నిలువరాదు. విరాధాదిదానవులకు శాపవిముక్తికాలము సమీపించుచున్నది. నాయవతారమునకు ఫలమదియే. గుహుఁడు లోనగుసుహృదయులకు నాసఖ్యముగోరువారలకు నయ్యది ప్రసాదింపవలయు. ఈశోకమును వదలుము. నాయత్న మమోఘము. తండ్రీ! కైక వనములకుఁ బొమ్మని నన్నుఁ బ్రార్థించినది. ఈయవతారమున స్త్రీమూలమున నాప్రవృత్తి సాగవలయునని భావము. తప్పక వెళ్లెదనంటిని. ఆసత్యమును బాలింతును. అనఁగాఁ గైక వనములకుఁ బొమ్మని నిర్బంధింపలేదు. ప్రార్థించెను. ఆమె వేఁడికోలు నంగీకరించితి. ఆమెకు వరమిచ్చితి. భగవద్వాక్యము వరమే యగును. అట్టిసత్యమును బాలింతును. అనఁగా వేఁడినవారిని ధన్యులఁ జేయుట నాపని. కైకకోరినది ధర్మరక్షణమహాకార్యము కాన నంగీకరించితినని రాముఁడు పలికెనని సారము.

"పితా హి దైవతం తాత దేవతానామపి స్మృతం,
తస్మాద్దైవతమిత్యేవ కరిష్యామి పితుర్వచః. ౫౨
చతుర్దశసు వర్షేషు గతేషు నరసత్తమ,
పునర్ద్రక్ష్యసి మాం ప్రాప్తం సంతాపోఽయం విముచ్యతాం." ౫౩

అని మూలము. ఇదియు శ్రీరామానుగ్రహపరిపూరితవాక్యమే. దేవతలుకూడఁ దండ్రిని దైవముగా గౌరవింతురు. కాన దైవ వాక్యమే తండ్రివాక్యమని తలంచి యారీతి మెలఁగుదును. అనఁగా తండ్రిమాట మీఱరానిదని భావము. తండ్రిమాట నెపముగా దేవకార్యము సాధింతుననునర్థమిందు సూచింపఁబడియె. పదు నాలుగేండ్లు కాఁగా మరల నన్నుఁ గాంచఁగలవు. కాన నీసంతా పమును వదలుము. అని రామమూర్తి తెలిపెను. ఇది యసత్య ముకాదా యని కొందఱందురు రావణవధానంతరము దశర థుఁడు యుద్ధరంగమున శ్రీరాముని గాంచును. ఆభావమే యిట రామమూర్తి తండ్రికిం దెలిపెనని భావము. కానఁ దై దోషము పొసఁగదనుటయే సమాధానము.

"వనం ప్రవిశ్యైవ విచిత్రపాదపం సుఖీ భవిష్యామి తవాస్తు నిర్వృతిః."
అను నీవాక్యమున శ్రీరాముఁడు దశరథునకుం గలసంసార తాపములఁ దొలంగుగాతమని వరమొసంగుచున్నాఁడు. వనముల సుఖముండుదు. నీకు సుఖసిద్ధియగుఁగాక. అపునరావృత్తికమగు సుఖస్థానము లభించుఁగాక యని భావము. ఇట్లు లీభాగము మనకు శ్రీరామమూర్తి మనోభావము తండ్రినుద్ధరింప నెట్లు పలికినదియుఁ దెలుపుచున్నది.

"అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః."
అనుభావమును సూచించుచున్నది. కనుక నట్టిపరమతత్త్వ

మును శ్రీరామనామమును గార్యార్థము ధరించిన భగవంతు నుపాసించి తదనుగ్రహమునకుఁ బాత్రులము కావలయును.

అధ్యాత్మరామాయణమునఁ గలవిషయము నీకుఁ బరికింతము. తండ్రియింటికి సీతారామలక్ష్మణులు పోవుచుండఁగా జనులు దుఃఖపడిరనునది సాధారణము. అట్టిజనులం గాంచి వామదేవముని యిట్లు తెల్పెను.

"మాశోచథ రామం వా సీతాం వా వచ్మి తత్త్వతః. ౧౦
ఏష రామః పరో విష్ణురాదినారాయణస్స్మృతః,
ఏషా సా జానకీ లక్ష్మీర్యోగమాయేతి విశ్రుతా. ౧౧
అసౌ శేషస్తమన్వేతి లక్ష్మణాఖ్యశ్చ సాంప్రతం,
ఏష మాయాగుణైర్యుక్తస్తదాకారవానివ. ౧౨
ఏష ఏవ రజోయుక్తో బ్రహ్మాభూద్విశ్వభావనః,
సత్త్వావిష్టస్తథా విష్ణుస్త్రిజగత్ప్రతిపాలకః. ౧౩
ఏష రుద్రస్తామసోఽన్తే జగత్ప్రళయకారణం,
ఏష మత్స్యః పురా భూత్వా భక్తం వైవస్వతం మనుం. ౧౪

... ... ... ... ...

స ఏష విష్ణుశ్శ్రీరామో రావణాదివధాయ హి,
గంతాద్యైవ వనం రామో లక్ష్మణేన సహాయవాన్,
ఏషా సీతా హరేర్మాయా సృష్టిస్థిత్యంతకారిణీ,
రాజా వా కైకయీ వాపి నాత్ర కారణమణ్వపి.

... ... ... ... ...

రామరామేతి యే నిత్యం జపంతి మనుజా భువి,
తేషాం మృత్యుభయాదీని న భవంతి కదాచన.

... ... ... ... ...

భక్తానాం భజనార్థాయ రావణస్య వధాయ చ,

రాజ్ఞశ్చాభీష్టసిద్ధ్యర్థం మానుషం వపురాశ్రితః." అధ్యాత్మ ౫ సర్గము.

కథాభాగము విమర్శింప నక్కఱలేదు. ఇందొక్కరహస్యము కలదు. దానిం దెలిసికొందము. భగవంతుఁడు సత్త్వరజస్తమోగుణముల నాశ్రయించి విష్ణుబ్రహ్మరుద్రనామములం బరఁగుచు వరుసగాఁ బాలనము సృష్టిని, లయమును జేయుచున్నాఁడు. మత్స్యకూర్మాద్యవతారముల నాశ్రయించెను. ఆతఁడే రావణవధార్థము దశరథునికోర్కిదీర్పుటకు రామనామమున నీయవతారమెత్తెను. ఈసీత జగన్మాయ. సృష్టిస్థితిలయములకు హేతుభూతురాలు అని యున్నదికదా. దీనింబట్టి పరికింపఁగా శ్రీరాముఁడు సీతాదేవియు వైకుంఠమాత్రమున కధిపతియగు లక్ష్మీసహితనారాయణుఁడు కాఁడనియుఁ, త్రిమూర్తులకు జనకుఁడనియుఁ దేలెడిని. యోగమాయయే సృష్టిపాలనసంహారముల నొనరించునది. దశరథుఁడు కైకయు వనగమనమునకుఁ గారణ మేమాత్రము కారు. అనునదియే యిటఁగలసారము. త్రిమూర్తులకు మూలమగుపరతత్త్వమే రామచంద్రుఁడని తాత్పర్యము.మధ్యవైష్ణవులసిద్ధాంత మీభావమును బరికింపఁగా నెగిరిపోవును. సీతారాములనఁగాఁ బ్రకృతిపురుషులనియే తేటపడును. దీనిచేఁ ద్రిమూర్తులలో నొక్క రుత్కృష్టులు రెండవవారు తద్భక్తులు నగుదురన్న భావము నీచమేయని తేలెనుగదా. సర్వమూర్తులు తానగువాఁడే భగవంతుఁడు కాని కొందఱు కాని వాఁడు పరమేశ్వరుఁడగునా? అట్టి రామపరమాత్మయందు నామహాత్మునిసంకల్పశక్తియగు సీతయందు భక్తిగలిగియుండుటయే తరణోపాయమని మన కీయధ్యాత్మరామాయణము బోధించుచున్నది.ఇఁకఁ దరువాతికథాభాగమునకు మరలుదము.

## సుమంత్రుఁడు కైకను నిందించుట.

* అట్లు రాజు మూర్ఛిల్ల రాణులందఱు హాహాకారములు చేయఁ గాంచి సుమంత్రుఁడు కోప మాపుకొనఁజాలక తల విదలించుకొనుచు నిట్టూర్పులు పుచ్చుచుఁ జేతులు పిసికికొనుచు దంతఘట్టనశబ్దము వినంబడఁ గోపమునఁ గన్నులెఱ్ఱగా నుండఁగాఁ దనువెల్ల రక్తవర్ణముగాఁ గనంబడ మఱియుఁ గోపమునఁ బెక్కుమార్పులు గలుగఁగాఁ గైకయందు రాజుచిత్తము విరసంబైనదని యెఱింగి తీవ్రబాణములం బోలుపలుకులఁ గైకం గాంచి యిట్లు లాక్షేపించెను. దేవీ! దశరథుఁడు రాజు. జగమునకెల్లఁ బాలకుఁడు. ఇట్టిపతిని మనసారవదలితివిగా. దుష్టమతివిగాన నీకుఁ జేయరాని దేకార్యముండును? ఇంద్రపర్వతసాగరములంబోలి యప్రధృష్యుఁడగు రాజునుగూడ దుష్టకార్యమున నొగఖింపఁజేసితివే. కావున నీవు వల్లభుం జంపుదానవు. ఆపనిచేఁ గులమంతయుఁ బాడుచేయుదానవని నాయాశయము. రాజు సర్వపోషకుఁడు. వాంఛితములనిచ్చువాఁడు. నీకు భర్త. అట్టివాని నవమానింపఁ బూనుట న్యాయ్యము కాదుసుమా! పుత్రునైన వదలి పతిననువర్తించుట స్త్రీలకుఁ బ్రధానధర్మము. పుత్రకోటులకంటెఁ బతివాంఛ యుత్కృష్టము. రాజు మృతినొందఁగాఁ గ్రమము ననుసరించి జ్యేష్ఠపుత్త్రుఁడా రాజ్యముం బడసి పాలించును. ఆన్యాయము ననుసరించి శ్రీరాముఁడు పుత్రజ్యేష్ఠుఁడుగాన రాజ్యపాలకుఁడగుటయే యుత్తమధర్మము. సూర్యవంశముక్తామణియగు రాజు బ్రదికియుండఁగనే కులక్రమాగతధర్మమును

* ఇది ముప్పదియైదవసర్గమునఁ గలదు.

నాశనము చేయంబూనితివి. నీకుమారుఁడు రాజే యగుఁగాక. రాజ్యము నేలుఁగాక. ఎందు రాముఁ డుండఁబోవునో మేమెల్లర మచ్చటికే పోవుదుము. ఈ దేశమున నొక్కచిత్రుఁడైనను నివసింపఁడని నమ్ముము మర్యాద నతిక్రమించి యెల్లరు లేచిపోవు నంతటి దుష్కార్యము నాచరించుచున్న దానవు. మర్యాద తొలఁగినయిట్టియాచారము పూనినందుల కిప్పుడే భూమి బ్రద్దలు కావలయును. అట్టిదయ్యు నేలొకో పగులకున్నదే ఇంతకంటె నచ్చెరువు కలదా? వసిష్ఠాదిబ్రహ్మర్షులు నీ యీమర్యాదకుఁ గ్రోధమూని నీవు పాడై పోవుదువుగాక యని వాగ్దండములు ప్రయోగించియుందు రేకదా. చూచువారికి ఘోరములుగా నుండు నీవాగ్దండములుకూడ శ్రీరామచంద్రు నడవులకుం బంపుచున్న నీవంటికఠినురాలిని బాధింపఁజాలకున్న వేలొకో!

తియ్యమామిడిచెట్టుల నెవ్వఁడైనఁ గుఠారధారఁ నఱికి వేఁపచెట్టునకుఁ బాదులుకట్టి పెంచి దానిని బాలచేఁ దడుపుచుండునేని యది వానికి మధురఫలముల నొసంగునా? చేఁదుకాయలనే యిచ్చునుగదా. సత్కులమునఁ బుట్టినను నీతల్లికెట్టిస్వభావ మలవడియెనో నీస్వభావ మట్టిదే యని నేనెఱుంగుదును. నింబవృక్షమునుండి తేనె యొడవదన్నపలుకు లోకప్రసిద్ధముకదా. దుర్మతికి సుపుత్త్రిక కలుగునా? మీతల్లి చేసినపాపకర్మములు మున్నే యంత తెఱుంగుదుము. మాకు నట్టే యిప్పుడెఱుకపడియెను. వరములనిచ్చు నొక్కయార్యుఁడు నీతండ్రికొకయుత్తమవర మిచ్చెను దానిచే నతనికి సకలప్రాణులపలుకులు చక్కఁగాఁ దెలియసాగెను. తిర్యగ్జంతువులగుపశుపక్ష్యాదులు చెప్పుకొనుమాటలుకూడఁ దెలియఁజొచ్చెను. ఒకానొక

తరుణమున మహాతేజశ్శాలియగు నీతండ్రి తనశయ్యకడఁ గ్రిందిభాగమున జృంభమను నొకజాతిగల చీమ చెప్పినమాటలు విని దానియాశయ మెఱింగి పెక్కుసారులు నవ్వెను. అది తన్నుఁ గాంచి నవ్వెనని నీతల్లి తలంచి మృతినొందఁదగినంత కోపముం దెచ్చుకొని పతితో నిట్లు పలికెను. నాథా! శాంత స్వభావముగల నీవి ట్లకారణముగ నవ్వఁ గారణమేమి? తెలియఁ గోరెద ననఁగా నీతండ్రి భార్యతో దేవీ! దానికిం దగిన కారణమును దెలిపినచో వెంటనే నాకు మృతి సంభవించును. నిస్సంశయము. కాన నద్దాని నడుగకుము. అని యెంత చెప్పినను వినక నీతల్లి నీవు బ్రదికినను మృతినొందినను సరే. కారణము చెప్పుము. పిదప నన్ను నవమానింప నవ్వ లేదనుకొనియెదను. అంత నా రాజు భార్యవలనికష్టములను బరిశీలించి తనకు వర మొసంగినయతనికి జరగిన యట్లు తెల్పెను. సాధువర్యుఁడగు నావరదాత రాజుం గాంచి భూపతీ! నీభార్య చచ్చినఁ జావనిమ్ము. వదలి పోయినను బోనిమ్ము. ఏమైనఁగాని నీవెంతమాత్రము రహస్యమును దెలుపకమనియెను. నిర్మలాత్ముఁడగు నావరదాత చెప్పినమాట నాలించి రాజు భార్యను ద్రోసివైచి కుబేరుని భంగి సుఖముగా నుండెను. నీతల్లివలె నీవుకూడఁ బాపదృష్టి గలదానవు. కనుకనే దుర్జనపద్ధతి నాశ్రయించి నీతల్లివలె నీవు కూడ నజ్ఞానమున రాజును దుర్విషయములందుఁ బ్రవేశింపఁజేసి పాడుచేయుచున్న దానవు. లోకమునందుఁ దండ్రివలెఁ గొడుకులును దల్లివలెఁ గుమారికలును గుణములుగలిగి పుట్టుదురను ప్రవాదము నిజమని నాకిపుడు తోఁచుచున్నది. నీవట్టి దానవు కావలదు. పతికి లోఁబడి చెప్పినచొప్పున వర్తించు

చుందుము. నాథుఁడు పూనినట్లు రామాభిషేకమునకు నిష్ట పడుము. రాముని వనగమనమునకు వగచు ప్రజల కూఁటి గల్గింపుము. పాపచిత్తులమాటల విని యింద్రునివలెఁ బ్రకా శించు నీనాథు నధర్మమునకుఁ బాలుపడకుండఁ జేయుము. పెద్దవానిని వదలి చిన్నవానికిఁ బట్టముకట్టుటయే యధర్మము కదా!

దేవీ! ఈదశరథుఁడు పాపదూరుఁడు. కాన నీకుఁ జేసిన శపథము వ్యర్థముగఁ జేయఁడు. ఏవిధముగానైన రాజ్యమున కన్న మిక్కిలి వెలగలరత్నభూషణాదు లొసంగి నీవరముల యప్పు దీర్చును. జ్యేష్ఠకుమారుఁడు ఉదారస్వభావుఁడు. సదాచార నిరతుఁడు. క్షత్రియోచితధర్మము నడపువాఁడు. మహాబలశాలి. పట్టాభిషిక్తుఁడు కాఁదగినవాఁడు రాముఁడు కనుక నాతని కాయుత్సవము సాగునట్లు చేయుము. తల్లీ! ప్రభువగుతండ్రిని వదలి రాముఁ డడవులకరుగు నేని దుర్నివారమగు నపవాదము లోకమున నీకుఁ గలుగకపోదు. సర్వసుగుణరాశియగు రామ మూర్తి రాజ్యమును రక్షించుఁగాక. నీ వీభేదము వదలుము. అడవికి రాముఁ డరుగ నిం దతనికి నీడగుయోగ్యుఁ డెవ్వఁడు లేఁడు. కనుక నీరాజ్యమున కతఁడే తగినవాఁడు. జ్యేష్ఠుఁడగు రాముఁడుండ ననుజుఁడగుభరతుఁడు రాజ్యపాలనమునకర్హుఁడు కాఁడు. యువరాజుగ రాముఁ డేర్పడఁగాఁ గోదండధరులలో మేటియగుదశరథుఁడు వంశాచారము ననుసరించి వనమున కేగును. ఇదియేకదా ధర్మము. అని సుమంత్రుఁడు పలికి యాసభ యందుఁ గైకేయిని సాంత్వనోక్తులను గఠినభాషణములనుగలంచి వైచి యథాపూర్వముగా హస్తయుగము మోడ్చి నిలుచుం

డెను. కైకయు నమ్మాటల కించుకేని కలఁతనొందక యెంత వేఁడు
కొన్నను జాలినొందక యత్యుగ్రవదనముతోనుండ నామెముఖ
వర్చస్సు రవంతయైనఁ దేటపడక యథాపూర్వముగనే యుండెను.

మహాశయులారా! ఈభాగమున గొన్ని విశేషములు కలవు.
శ్రీరామునియందు నెల్లరు ప్రీతిగలిగియుండుటంజేసి యాపర
మేశ్వరుని కరుణాపరత్వము స్పష్టమగును. మంత్రులెల్లరు రాజ
భక్తిపరిపూర్ణచిత్తులనియు ధర్మప్రియులనియుఁ దేటపడియెడిని.
మఱియు మోమోటమిలేక రాజునకుఁ బ్రియపత్ని కైక యన్న
భావము మాని ధర్మమందే నిష్ఠగలవారే యాకాలమున రాజు
కడ మంత్రులున్నవారనియు విశదమగును. కావున నీభాగమున
గలవిశేషవిషయములను బరిశీలింతము. మంత్రులు సభాసదులు
రాజాస్థానమున నెట్టివారుండనగు నన్నవిషయము తొలుతఁ
బరికించు టుత్తమము.

"మౌలాన్ శాస్త్రవిదశ్శూరాన్ లబ్ధలక్షాన్ కులోద్భవాన్,
సచివాన్ సప్త చాష్టౌ వా ప్రకుర్వీత పరీక్షితాన్. ౫౪
అపి యత్సుకరం కర్మ తదప్యేకేన దుష్కరం,
విశేషతోఽసహాయేన కింతు రాజ్యం మహోదయమ్. ౫౫
తైస్సార్ధం చింతయేన్నిత్యం సామాన్యం సంధివిగ్రహం,
స్థానం సముదయం గుప్తిం లబ్ధప్రశమనాని చ." ౫౬

మను. ౭ అధ్యా.

"స మంత్రిణః ప్రకుర్వీత ప్రాజ్ఞాన్ మౌలాన్ స్థిరాన్ శుచీన్,
తైస్సార్ధం చింతయేద్రాజ్యం విప్రేణాథ తతస్స్వయం." ౩౧౨

యాజ్ఞవల్క్యస్మృతి, వ్యవహారాధ్యాయము.

ఇందు మౌలాన్ వంశపరంపరాప్రాప్తులని యర్థము. వంశాచా

రముగా మంత్రిపదము నందఁగలవారని యేర్పడును. మంత్రి యగుటకుఁ దగినయోగ్యత చిన్నతనమునుండియే కలుగవలయు ననియే దీనిభావము. పుట్టుకనుండి మర్యాద నేర్చుకొనవలయునే కాని నడుమ నది యలవడదని తాత్పర్యము. శాస్త్రజ్ఞానముగలిగి పరిశుద్ధప్రవర్తనముకలవారలై యుండవలయుననియే స్మృతుల తాత్పర్యము. అట్టివారు నిర్భయముగా రాజులకుఁ గష్టసుఖము లను దెలుపఁగలరు. అధికారము కారణాంతరముననలవడినచోఁ దదనుకూలములగు మర్యాదలు లభించుట దుష్కరముకదా. మోమోటమిలేక మంచిమాటలను జెప్పువా రరుదుగనుందు రని భర్తృహరియే తెలిపెను. సుమంత్రునిచరిత్రమునుండి మన మీనీతిని దెలిసికొనవచ్చును.

"మావమంస్థా దశరథం భర్తారం వరదం పతిం,
భర్తురిచ్ఛా హి నారీణాం పుత్రకోట్యా విశిష్యతే." ౧

అని మూలము. పుత్రకోటులకంటె భర్తయిచ్ఛయే యధికమని భావము. స్మృతులయాశయముకూడ నిదియే. ఈమంత్రి భావము కైక పతిని గష్టపెట్టుచున్నదనియే కాని దేవతాకార్యమునకుఁ దోడ్పడ నవతరించినదని తెలిసికొనఁజాలఁడు. ఇందు స్త్రీలధర్మములుమాత్రమే గ్రహింపఁదగు. భర్తకంటె దైవము లేఁడనియుఁ బుత్రునికొఱకు నట్టిసనాతనధర్మము వదలరాదనియు నిటఁగలసారము. ఇందుల కుదాహరణముగాఁ గైక తల్లిచరిత మునే సుమంత్రుఁడు తెలిపెను.

"పితుస్తే వరదః కశ్చిద్దదౌ వరమనుత్తమం,
సర్వభూతరుతం తస్మాత్సంజజ్ఞే వసుధాధిపః,
తేన తిర్యగ్గతానాం చ భూతానాం విదితం వచః. ౧౭

తతో జృంభస్య శయనే వివృతాద్వ్యారివర్చసః,
పితుస్తే విదితో భావస్స తత్ర బహుధా హసత్." ౧౨

అని మూలము. ఇందు విశేషమేమి? పూర్వకాలమున మంత్ర ప్రభావమున సకలజంతుభాషల నెఱుంగఁజాలినశక్తి యలవడు చుండెను. దేవతారాధనప్రభావముననే కలిగెనని వారివిశ్వాసము. అది మూఢవిశ్వాసమని కొందఱ అనవచ్చును. ఈరీతి నను వారిదేమూఢవిశ్వాసమో లేక వారిదే మూఢవిశ్వాసమో దైవ మెఱుంగును. పూర్వులకు మూఢవిశ్వాసమే కలదని యొప్పు కొందము. దానిచేత నహంకారము నశించి భగవంతునియందు భూతులగు దేవతలయందు భక్తి యలవడును. ఆక్షేపించువార లకు నయ్యది నశించి నాస్తికత్వము దురహంకారముఁ గలుగు మహాలాభములు. కైక తండ్రి కొకమహాత్ముఁ డొకవరమిచ్చె ననఁగా సర్వభూతభాషణములయభిప్రాయము తెలిసికొనఁదగు శక్తి కలిగెను. ఒక్కనాఁడు శయనించియుండు నారాజు శయ్యకుఁ జెంత నొకచీమ యేమో భాషించెను. దానిభావమె ఱింగి రాజు పలుసారులు నవ్వెను. అని కథాసారము. ఆరాజున కద్దానిభావము విచిత్రముగాఁదోఁచెను కనుక నింతస్వల్పజంతు వున కింత మంచిభావముకలదా యనుసంతోషమున నవ్వెను. అది యెఱుంగక భార్య తన్నుఁ బరిహాసించెనని తలంచెను.

చీమలు లోనగునవి క్షుద్రజంతువులని మనము తలంచు చుందుము. కాని మనముకూడ క్షుద్రులమని తలంపము. ప్రతి జంతువునకు జ్ఞానము కలదు. సుఖదుఃఖములు కలవు తన్నుఁ జక్కఁగా రక్షించుకొనఁదగునుపాయ మయ్యది యెఱుంగఁ జాలు. మననుండి యేల కాపాడుకొనఁజాలదందురేమో మన

ముకూడఁ గాలము సమీపింపఁగాఁగాని యాపదలు మూఁడు నపుడుగాని మనలను రక్షించుకొనఁగల్గుదుమా? కర్మము బల వత్తరము. దానిచేతకు మాఱుచేయ బ్రహ్మాదులకు శక్యము గాదు. తుదకు దానిపోకడ లిట్టివని యెఱుంగఁజాలరు. "గహనా కర్మణో గతిః" అని భగవంతుఁడే తెలిపెనుగదా. ప్రతిజంతువు లోకమునఁ దా వన్నె కెక్కినలయునని తలంచును. అది స్వభావము. దానింగూర్చి యాక్షేపించువారికంటె మూర్ఖు లుండఁబోరు. ప్రతిమానవుఁడు తనయౌన్నత్యమునే ప్రకటింపఁ జూచును. అది మానవస్వభావము. అట్లే సర్వప్రాణులని యెంచెంగినఁ జీమలకు భాషకలదనునప్పకము కలుగును. అదియే యుత్తమోత్తమగుణము. "స తత్ర బహుధా హసత్" అను విషయము విమర్శింపఁదగినది.

"న కుర్వీత వృథా చేష్టాం న వార్యంజలినా పిబేత్,
నోత్సంగే భక్షయేద్భక్ష్యాన్ న జాతు స్యాత్కుతూహలీ." ౬౩
మను. ౪. అధ్యా.

అన్న మనుస్మృతివాక్యము ననుసరించి నిష్కారణముగాఁ గుతూ హలముకలవాఁడు కారాదు. నిష్కారణముగా నవ్వరాదని తోఁచెడిని. భార్య చెంతనుండఁగాఁ బలుసారు లారాజు నవ్వెను. ఇతరులుండఁగానే కారణము లేనియట్లితరులకుఁదోఁచు నట్లు నవ్వరాదు. అది యొకదురభ్యాసముగాఁ బరిగణింపఁదగి నదియే. దానిచే నెన్నియో యిడుమలు వాటిల్లును. ఉదాహర ణముం బరికింపుఁడు.

"లక్ష్మీస్సరస్వతీ గంగా తిస్రో భార్యా హరేరపి,
ప్రేమ్ణా సమాస్తాస్తిష్ఠంతి సతతం హరిసన్నిధౌ. ౧౭

చకార సైకదా గంగా విష్ణోర్ముఖనిరీక్షణం,
సస్మితా చ సకామా చ సకటాక్షం పునఃపునః. ౧౮
విభుర్జహాస తద్వక్త్రం నిరీక్ష్య చ క్షణం తదా,
క్షమాం చకార తద్దృష్ట్వా లక్ష్మీర్నైవ సరస్వతీ." ౧౯

స్కం. ౯ అధ్యా ౬.

అను దేవీభాగవతకథ తెలిసినదియే కదా. విష్ణుమూర్తి నవ్వినది నిష్కారణమే యైనను భార్యలెల్ల వేఱువేఱర్థములు చేసికొని పరస్పరము శపించునంతదుస్థితికిఁ జేరిరి ఈకథ వృథాకలహము వృథాహాసము పనికిరావనియు దాన నెన్నియోకష్టములు వాటిల్లుననియుఁ దెలుపుచున్నది. మనుస్మృతియు నీయర్థమునే బోధించెను. కావున నిష్కారణముగా నవ్వుట దురభ్యాసములలో నొక్కఁడని తేటపడియెడిని. మహాకవివాల్మీకి సుమంత్రునిమాటలవలన మన కీనీతిని బోధించెనని మనము గ్రహింపవలయును.

"మాతరం తే నిరస్యాథ విజహార కుబేరవత్." ౨౪

అని మూలము. కైకా! అంత నీతండ్రి నీతల్లిని వదలిపెట్టెను. అని కథాసారము. నవ్వుటకుంగలకారణ మడిగినంతన భార్యను వదలవచ్చునా యనుప్రశ్నము రావచ్చును. రాజు నీకావిషయమును దెలిపిన నాకు మరణము సంభవించునని తెలిపినను వదలక

"మ్రియతాం ధ్వంసతాం వేయం మాకృథాస్త్వం మహీపతే." ౨౩

అని పలికినకారణముననే యారాజు వదలెను. అట్టియంగనను వదలవచ్చునని స్మృతి తెలుపుచున్నది.

"వంధ్యాష్టమేఽధివేద్యాబ్దే దశమే తు మృతప్రజా,

ఏకాదశే స్త్రీజననీ సద్యస్త్వప్రియవాదినీ." ౮౧

మను. ౯ అధ్యా.

అప్రియవాదిని యగుస్త్రీ సాధ్వి కానేరదు. కాన దానిని వదలి వేయుటయే మంచిది. వదలివేయుట యనఁగా నన్నపానముల నాదరించుటయే యని తాత్పర్యము.

"వివాదశీలాం స్వయమర్థచోరిణీం పరానుకూలాం పరిహాసభాషిణీం,
అగ్రాశినీమన్యగృహప్రవేశనీం త్యజంతి భార్యాం దశపుత్త్రమాతరం."

అను నభియుక్తోక్తియుఁ గలదు.

"అర్థాగమో నిత్యమరోగతా చ ప్రియా చ భార్యా ప్రియవాదినీ చ,
వశ్యశ్చ పుత్త్రోఽర్థకరీ చ విద్యా షడ్జీవలోకేషు సుఖాని రాజన్."

అను నీతిశాస్త్రము ప్రియవాదిని భార్యయగునేని మంచిదని తెలుపుచున్నది. అప్రియవాదినివి కాఁగూడదని సుమంత్రుఁడు కైకను హెచ్చరించెననియే కథాసారమునుండి మనము తెలిసికొనఁదగునీతి.

"సత్యశ్చాద్యప్రవాదోయం లౌకికః ప్రతిభాతి మా
పితౄన్ సమనుజాయంతే నరా మాతరమంగనాః. ౨౬

నైవం భవ గృహాణేదం యదాహ వసుధాధిపః,
భర్తురిచ్ఛాముపాస్యేహ జనస్యాస్య గతిర్భవ. ౨౭

అని మూలము. తండ్రినిబోలి కొడుకులు తల్లినిబోలి కొమరితలు పుట్టుదురని లోకప్రవాదము కలదని సుమంత్రుఁడు పలికెను. నీతల్లివంటిదానవు కారాదని తెలుపుటయే యతనిసంకల్పము. ఈసామెత కర్మసిద్ధాంతవిరుద్ధ మనవలయును. కర్మముల నెల్ల రొక్కరీతిగా నాచరించువా రుండరు. అదృష్టము కర్మాధీనము గనే యుండును. వానివానికర్మఫలముల వాఁడువాఁ డను

భవించునుగాని యొక్కనిబోలి వేఱొక్కఁడు ఫలము నను భవింపఁజాలఁడు. లోకులు పోలికలననుసరించి యూహింతురు. అనుభవము ననుసరించి యూహించినను లోకప్రవాదము సత్యము కాదనియే తేలెడిని. తండ్రివంటివారు కొడుకులు తల్లినిబోలిన కొమరితలు కల్గుదురనుట పొరపాటే యనుట న్యాయ్యము. తల్లి దౌష్ట్యము నుగ్గడించుట కైక మనో భావము మాఱునేమో యనుసద్భావముననే యని యెఱుంగ వలయును. దీనింబట్టి శ్రీరాముని సౌజన్యము సర్వభూతాకర్షణ దక్షమని తేలుచున్నది. కైక శ్రీరాముని కార్యమునకు మిక్కిలి సహాయము చేయుచున్న దనువిషయము సుమంత్రుఁ డెఱుం గఁడు. లోకదృష్టిం బరికించియే యిట్లనుచున్నాఁడుకాని కైకయు మంథరయు భగవంతుని ప్రోత్సాహముననే యిట్టి కార్యము నాచరించుచున్న వారని మాయాసమాచ్ఛాదిత చేత స్కుఁడగు టెఱుంగఁజాలక సుమంత్రుఁడు వగచుచున్నాఁడని యే యిటఁగలసారము.

"జ్యేష్ఠో వదాన్యః కర్మణ్య స్స్వధర్మపరిరక్షితా,
రక్షితా జీవలోకస్య బలీ రామోఽభిషిచ్యతాం. ౩౦
పరివాదో హి తే దేవి మహాన్ లోకే చరిష్యతి,
యది రామో వనం యాతి విహాయ పితరం నృపం." ౩౧

అని మూలము. ఇందు రాజునకు నుండఁదగులక్షణములు చెప్పఁబడినవి. అందు దాతృత్వము సదాచారనిరతత్వము కుల ధర్మలక్షణత్వము చెప్పఁబడినవి

"స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మనిరతస్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు." ౪౫
యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతం,

స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః. ౪౬
శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వభావనియతం కర్మ కుర్వన్ నాప్నోతి కిల్బిషమ్. ౪౭
గీత. ౧౮ అధ్యా.

శుచినా సత్యసంధేన యథాశాస్త్రానుసారిణా,
ప్రణేతుం శక్యతే దండస్సుసహాయేన ధీమతా. ౩౧
స్వే స్వే ధర్మే నివిష్టానాం సర్వేషామనుపూర్వశః,
వర్ణానామాశ్రమాణాం చ రాజా సృష్టోఽభిరక్షితా. ౩౫
ఇంద్రియాణాం జయే యోగం సమాతిష్ఠేద్దివానిశం,
జితేంద్రియో హి శక్నోతి వశే స్థాపయితుం ప్రజాః.” ౪౪
మను. ౭ అధ్యా.

అను నీప్రమాణములం బరికించిన రాజు సదాచారనిరతుఁడు దాత కులాచారములఁ బ్రవర్తించువాఁడుగా నుండవలయు నని తేలుచున్నది. స్వధర్మపరిరక్షకుఁడుగాని రాజు చిరకాలము రాజ్యమును బాలింపఁజాలఁడనుట స్పష్టముగా నీభాగము తెల్పుచున్నది. కులాచారముల రక్షించువాఁడనుటచేతఁ గులా చారములన్నియు నొక్కరీతిగా నుండవని తోఁచెడు. రామా యణకాలమునందును గులాచారములున్నవనిస్పష్టము.అనఁగాఁ గులాచారము లీనడుమవచ్చిన వనువాదము నిస్సారమనియు, నవి యెంతో కాలము నుండియున్నవనియు, నిద్దానిమూలమున స్పష్టమగుచున్నది. భగవద్గీతలయందుఁగూడ

“బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ పరంతప,
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః.” ౪౧

అని యున్నది. జాతిభేదములు తత్తదుచితకర్మములు నుండ

వలయుననియే శ్రీకృష్ణపరమాత్మ యనుగ్రహించెను. దానిని వలదనువారు భగవంతుని గారవింపనివారే యని తోఁచెడి. అట్టిపనికిఁ బూనకుందురుగాక యని మనము వారిని బ్రార్థింప వలయును. "రక్షితా జీవలోకస్య" అనువిశేషణము శ్రీరాముని పరమేశ్వరత్వమును వ్యక్తీకరించుచున్నది. తెలిసియుండెఁ దెలి యకయుండెనెల్లవారు శ్రీరాముని భగవంతుఁడనియే కొని యాడుచున్నారనువిషయము మన మందఱుఁ బరికింపవల యును. సుమంత్రుఁడు లోకాపవాదము నీవిషయమున విశే షించి వ్యాపించునని పలికెను. దేనికి భయంపడకున్నను లోకాపవాదమునకు భయంపడవలయునని పెద్దలుపలుకుదురు. భగవద్గీతాశాస్త్రమునందును

"అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయాం,
సంభావితస్య చాకీర్తిర్మరణాదతిరిచ్యతే. 34
భయాద్రణాదుపరతం మంస్యంతే త్వాం మహారథాః,
యేషాంచ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్. 35
అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యంతి తవాహితాః,
నిందంతస్తవ సామర్థ్యం తతో దుఃఖతరన్ను కిం. 36 అధ్యా. 2

అని శ్రీకృష్ణమూర్తి తెలిపెను. అపకీర్తికంటె మరణమే మేలనియు లోకాపవాదమునకంటె దుఃఖము వేఱుగాలేద నియు నిందు సారము.

"వాంఛా సజ్జనసంగమే పరగుణే ప్రీతిర్గురౌ నమ్రతా
విద్యాయాం వ్యసనం స్వయోషితి రతిర్లోకాపవాదాద్భయం,
భక్తిశ్శూలిని శక్తిరాత్మదమనే సంసర్గముక్తిః ఖలే
యేష్వేతే నివసంతి నిర్మలగుణాస్తేభ్యో నరేభ్యో నమః." 62
నీతిశతకము.

అని భర్తృహరి యుపదేశించెను. ఈవిషయమునే మహర్షి వాల్మీకి సుమంత్రునినోటఁ జెప్పించెను. నీతిసారము రామాయణమని మన మెఱుంగవలయుఁగదా.

"న రాజ్యం రాఘవః పాతు భవ త్వాం విగతజ్వరా,
న హి తే రాఘవాదన్యః క్షమః పురవరే వసేత్." ౩౭

అని మూలము. రాముఁ డడవులకరిగిన నీపురమున నెవ్వరుండరని సామాన్యార్థము. ఇందొకవిశేషము గలదు. సుమంత్రుఁడు సాధారణమంత్రి మాత్రుఁడు గాఁడు. మంత్రి సారథి యగునాచారము లోకమున నింత దనుక లేదు. ఇతఁడు సారథియునగు. అనఁగా రాజునకుఁ గలయాంతరంగికులలో నీతఁ డుత్తమోత్తముఁడని స్పష్టమగును. ఈసుమంత్రుఁడు పుత్త్రకామేష్టి దశరథుఁడు చేయుటకుముందే

"పుత్త్రాశ్చాస్య భవిష్యంతి చత్వారోఽమితవిక్రమాః,
వంశప్రతిష్ఠానకరాస్సర్వలోకేషు విశ్రుతాః.
ఏవం స దేవప్రవరః పూర్వం కథితవాన్ కథాం,
సనత్కుమారో భగవాన్ పురా దేవయుగే ప్రభుః. ౧౧.

బాలకాండము. ౧౧ సర్గము.

సనత్కుమారుఁడు తనతోఁ జెప్పినట్లు రాజునకుం దెల్పెను. యోగబలమున నమితాయుర్దాయముగలవాఁడు సుమంత్రుఁడని యీభాగము మనకుం దెల్పెడిని. సనత్కుమారుఁడు దశరథునకు నలువురుకొడుకులు సర్వలోకవిశ్రుతులు కలుగఁగలరని చెప్పినపుడు భగవంతుఁడే యవతరించునని చెప్పియుండునని మన మూహించుట పొరపాటుగాదు. సర్వలోకవిశ్రుతులు నలువురు కలుగుదురని భవిష్యత్ఫలము నెఱింగినమహర్షి భగ

వంతుఁడు ధర్మసంరక్షణార్థ మవతరించునని యెఱుఁగకయుం డునా? అట్టిమహర్షి యితరులకుం దెలుపక సుమంత్రునకు మాత్రమే తెలుపనేల? అని యూహించిన సుమంత్రుఁడు భక్తుఁడని శ్రీరామునకు సారథ్యరూపమగు శుశ్రూష చేసి కృతార్థుఁడు కాఁగోరి దశరథునకుంగూడ సారథియయ్యెనని తేలెడిని. కనుక శ్రీరామమూర్తి తత్త్వమునెఱింగినవాఁడే యనక తప్పదు. కాఁబట్టి యీభాగమున విశేషార్థము లేకపోదు. కైక భగవత్కార్యార్థమే యవతరించినదని యెఱింగియే యుండును. కాని యోగమాయాచ్ఛాదితమతిగావున నెఱుం గనియట్లే యామెను నిందించెను. అయిన భక్తునినోట నేరూ పముననైన మంచిమాటలే వెలువడును. కాబట్టియే.

"న హి తే రాఘవాదన్యః క్షమః పురవరే వసేత్."

అని పలికెను. దేవీ! తేపురవరే=నీ యీయోగ్యశరీరమునందు రాఘవాదన్యః=శ్రీరామమూర్తికంటె వేఱొకఁడు, క్షమః = సమర్థుఁడు, న వసేద్ధి=నివసింపఁడుకదా. అని యర్థము. అనఁగా దేవీ! అడవులకు రామునిం బొమ్మనుచున్నదానవు. నీశరీరమున నంతర్యామిగా నున్నవాఁ డెవ్వఁ డనుకొనియెదవు? శ్రీరామ మూర్తియే సుమా.

"ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా."

అన్న భగవద్గీతార్థమే రామాయణమునఁ గలదు. కనుక దీని నుప నిషత్తనవలయును. నీ దేహాంతరమునసున్న యీశ్వరుఁడే యీరాముఁడని యెఱుంగుమా కైకా యని సుమంత్రుఁడు తెలిపెననియే యిటఁగలసారము.

"పూషన్నేకర్షేయమసూర్య ప్రాజాపత్యవ్యూహరశ్మీ న్ సమూహ తేజో యత్తే,
రూపం కల్యాణతమం తత్తేఃపశ్యామి
యోఽసావసౌ పురుషస్సోఽహమస్మి. ౧౬. ఈశావాస్యోపనిషత్తు.

పురి శయనాద్వా పురుషః=అని నిర్వచనము. ఈయుప నిషత్తు ననుసరించి పురమనఁగా శరీరమని యర్థము స్పష్టము.

"ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః,
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః. ౧౭
యస్మాత్ క్షరమతీతోఽహమక్షరాదపి చోత్తమః,
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః." ౧౮
గీత. ౧౫ అధ్యా.

"పురి శయనాత్పూర్ణత్వాద్వా పురుషః."
అని భాష్యము. ఈప్రమాణములన్నియుఁ బైయర్థమునే తెలుపు చున్నవి. ఇట్టు లెన్నిభంగుల నాకైకకు లోకాచారము ననుస రించి బోధించినను మహామాయాప్రోత్సాహిత యగుటచే నాకైక యించుకంతయుఁ జలింపకయుండెను. భగవత్సంకల్ప మట్టిదేకదా. ఇట్టు లీభాగము మనకుఁ గొన్నినీతులను బోధిం చుచున్నది. ఇఁకఁ దరువాతికథను బరికింతము.

## సిద్ధార్థుఁడు కైకను హితోపదేశము చేయుట.

* సుమంత్రునివాక్కులఁ గైక సమ్మతింపకపోఁగా రాజు సత్యపాశబద్ధుఁడై ప్రతిజ్ఞాపీడితుఁడై యూర్పులు తీవ్రరూప ముల వెడలఁగా సుమంత్రునితో నిట్లనియె. మంత్రీ! రాముని వెంటఁ జతురంగబలములు నమూల్యరత్నములు లోనగుపదార్థ ములు పంపవలయును. సిద్ధపఱుపుము. వేశ్యాజనములు రాము

* ఇయ్యది ముప్పదియాఱవసర్గమునుండి గ్రహింపఁబడినది.

ననుసరించిపోవునుగాక. వణిజులు ప్రతివిడివిపట్టునందును సకల పదార్థముల నునిచియుందురుగాక. రాము నాశ్రయించి యెవ్వారు జీవింతురో, శ్రీరాముఁ డెవ్వారితోఁ గ్రీడించునో వారికిం గొఱంత లేకుండ నలయువస్తువు లొసంగి వెంటనుండఁ బంపుము. ఆయుధధారులు శైలాదులఁ గొనిపోవుభటులు పౌర ముఖ్యులు రామచంద్రునింగూడి పోదురుగాక. ఆటవికులు మార్గముచూపఁ బోవవలయు. బలములంగూడి నాకుమారుఁడు వనముల దుష్టమృగములఁ ద్రుంచుచుఁ దేనియలఁ ద్రాగుచు ననేకతరంగిణులం బరికించుచు రాజ్యవిషయమునఁ జింత లేక హాయిగా నుండుఁగాక. రామభద్రునివెంట ధనధాన్యకోశ ములు పంపవలయును. పుణ్యక్షేత్రములయందు యాగములు చేయుచు విధివిహితముగా దక్షిణల నిచ్చుచు ఋషులతోఁ గూడి రాముఁ డడవిని సుఖముగా నుండఁగలఁడు. మహా భుజుఁడు భరతుఁ డీపురమును బాలించుఁగాక. శ్రీరాముని కోర్కి కనుగుణముగా నలయువస్తువులం బంపుమని యాజ్ఞాపిం చెను. రా జిట్లు పలికినంతన కైక భీతినొంది మోము కాంతి వాయ డగ్గుత్తిక తోఁప దుఃఖము పైకొనఁగా రాజుం గాంచి యి ట్లనియెను.

మహారాజా! నీవు సజ్జనుఁడవు. ఇట్లు చేయరాదు. మను ష్యులు లేక పాడుపడి పయిఁగలతేట త్రాగఁగా శేషించిన మద్యమురీతి యమూల్యవస్తువిరహితమయియుండు నీరాజ్య మును భరతుఁ డంగీకరించునా? అని యిట్లు కైక లజ్జయైన లేక భీషణభాషణములు వినిపింప రా జామె కి ట్లనియె. పగదానవగు నోకైకా! దుర్భరభారము నాపై నిడితివి. మఱియు బాధించు

చున్నదానవే? ఏటికి? సైన్యములు లోనగువానిని రాముని వెంట నంప నాజ్ఞ చేయ వలదందువే? ఏల? వరమడుగునపుడే యేల వలదనవైతివి? కాన నిపుడు పలు కంగీకరింప వలనుపడదు. అని క్రోధమున రాజు పలుకఁగా విని యామె పతి తనవాంఛితము నేదోకారణమునఁ బాడుచేయఁ దలఁచెనని రెట్టించిన యాగ్రహమున నతనితో నిట్లనియె. రాజా! ఈవంశమునందే సగరుఁడను రాజు పెద్దకొడుకు నసమంజసుఁ డనువానిని వనమునకుఁ బొమ్మని వెళ్లఁగొట్టెను. వానితో సేనలం బంపెనా? వనమునకుఁ బోవువాఁడనఁగా నిర్ధనుఁడనియే యర్థము. అట్లే రాముఁడు కూడఁ బోవవలయును. అనఁగా రాజాగ్రహించి ఛీ! ఛీ! యని మఱేమియుఁ బలుకక యూరకుండెను. అందఱివా రామాటలకు విసుగుకొనిరి. కైకమాత్ర మవ్వారియీసడింపుల లెక్క పెట్టకయే యుండెను.

అత్తఱి నందేయున్న రాజు మన్నించుమంత్రిసిద్ధార్థుఁడు కడువృద్ధుఁడు పరిశుద్ధాంతరంగుఁడునుగానఁ గైకతో నిట్లు పలికెను. దేవీ! నీవు తెలిపిన యసమంజసుఁడు దుష్టబుద్ధియై త్రోవలఁ బొంచియుండి బాలురం బట్టుకొనిపోయి నదీజలములఁ బడవైచుచుండెను. వారు మునిఁగినందులకు గుఱుతుగా బుగ్గలు లేవఁగా నవ్వుచు నదియే విహారముగా నుండెను. పౌరులాతనిక్రూరకృత్యముం గని కోపించి సగరచక్రవర్తితోఁ గొడుకునుంచుకొని మమ్మెనఁ బంపుము. లేదేని వానిం బంపుమనిరి రా జులికిపడి వారింగాంచి మీ కీభయముగలుగఁ గారణ మేమని ప్రశ్నించెను. వా రాతనిపనినంతయుఁ దెలిపిరి. రాజా పలుకు లాలించి వారికిఁ బ్రియముచేయువాఁడై జ్యేష్ఠపుత్త్రుని

బాఱఁదోలెను. కొడుకు భార్యను బరిజనులను బిలుచుకొని వాహనమునెక్కి పోఁదగునని యాజ్ఞాపించెను. యావజ్జీవము వనముల నుండవలయునని శాసించెను. వాఁడు పాపాత్ముని రీతిగా వనములలోఁ దిరుగుచుఁ గందమూలాదులం ద్రవ్వికొని బ్రదుకుచుండెను. మహాపరాధము చేసినకొడుకును బరమ ధార్మికుఁడు గావున సగరచక్రవర్తి వదలిపెట్టెను. అసమంజసునిరీతి నడవులకుం బాఱఁద్రోలఁ దగినపాపమును శ్రీరామమూర్తి యేమైనఁ జేసినాఁడా? ఈశ్రీరామునియందు దుర్గుణలేశమేదియుఁ గానరాదు. మాలిన్యము చంద్రునియందు లేనట్లు రామునియందు దోష మణుమాత్రమును లేదు. తల్లీ! రామునందేదేని దోష మగపడినచో నిపుడు దాఁపక తెల్పుము. రాము నడవికింబంపఁదగిన రాజు పంపును. దౌష్ట్యమనుననియే లేక సన్మార్గమునందే యాసక్తిగలిగియున్న వానిని వదలు టధర్మము గాన, నట్టిదుష్టకార్యమున నింద్రునంతవానికైనఁ దేజము రూపుమాయును. శ్రీరాముని గష్టపెట్టుటఁ జాలింపుము. అధర్మదోష మట్లుండనిత్తము. లోకమునఁ గల్గు నపకీర్తినైన రాకుండఁ జూచుకొనవలయుఁగాదా. అని సిద్ధార్థుఁడుపలుకఁగా విని రాజు వగపుచే మాటలు తడఁబడఁగాఁ గైకతో నిట్లు పలికెను. దుష్టవర్తనముగలకైకా! ఈమంత్రిమాటల నంగీకరింపవా? ఇపుడు నీవు నీమేలును నామేలునుగూడఁ దెలియఁజాలక యున్నదానవు. కుమార్గము నాశ్రయించి నీచకార్యముఁ జేయుచున్నావు. నీచర్య సన్మార్గమున కనుకూలము కాదుసుమీ. నేనిత్తఱి రాజ్యాదులవదలి నాకొడుకువెంటఁబోవుదును. నీవు

ప్రభువగుకుమారునితో నిందు సుఖముగా రాజ్యము నేలుచుఁ జిరకాలముండుము.

మహాశయులారా! ఈభాగమునఁగల విశేషములఁ బరిశీలింతము.

"రూపాజీవాశ్చ వాదిన్యో వణిజశ్చ మహాధనాః,
శోభయంతు కుమారస్య వాహినీం సుప్రసాదితాః." 3

అని మూలము.

"వాదిన్యః పరచిత్తాకర్షణ చతురవచనాః రూపాజీవాః వేశ్యాః."
అని వ్యాఖ్య.

ఇది దశరథుఁడు చెప్పినవాక్యము. రాముఁడు చతురంగబలములతోఁ బోవలయునని యాజ్ఞాపించి యందు సైనికులను సొంపగుమాటలచే మనస్సులఁగరఁగించుచు వేశ్యలు పోవలయునని రాజు పల్కెను. ఈవాక్యమును బరికించినంతనే యాకాలమున నిట్టియనాచారములు పెక్కులున్నవని తోఁచును. కాని పరిశీలించినయెడలఁ నాయాచారము మంచిదిగనే తోఁచును. అరయుదము. వాదిన్యః రూపాజీవాః. పరచిత్తముల నాకర్షింపఁజాలు చమత్కృతిగలమాటలం బల్కు వేశ్యలనికదా ఈవాక్యమున కర్థము. ప్రాయికముగా సంగీతాభినయములు రెండును దుఃఖమును దొలఁగించి యానందమును జేకూర్పఁజాలునవియే. ఇందు వేశ్యలఁ బంపుట శ్రీరామునకు సంతోషము నుత్పాదింపఁగాదు. సేనలకనియే మూలమున నున్నది. వీరభటుఁడనఁగాఁ బ్రాణముల నర్పించి వీరస్వర్గమును గైవసము చేసికొనఁ గోరువాఁడనికదా తాత్పర్యము. అట్టివారలకు నుత్సాహము కలిగించుటకుగా వేశ్యలను రాజులే రక్షించుచుండు

వారు. వారు వాక్చాతుర్యమునను సంగీతాభినయముల చేతను బరుల నుత్సాహవంతులనుగాఁ జేయుచుందురు. అంతియగాని దుర్వృత్తిచే జీవించువారు కారని తోఁచెడిని. దుర్వృత్తిగల వారిని ధర్మరక్షణతత్పరుఁడగు రాజు రక్షించుచు సేనలతోఁ బంపెననుట విశ్వాసపాత్రము కాదు. నాట్యశాస్త్రమున నిష్ణాత లగు స్త్రీలు తదభ్యాసబలమున భగవదారాధనతత్పర లగుదురే కాని వ్యభిచారవృత్తికలవారు కానేరగు. నాట్యకళోపాస నము భగవత్కైంకర్యమే యని యెఱుంగవలయును. ఆజాతి యందుఁ గొంద ఱట్టి నీచవృత్తి యలవఱచుకొనువా రుండ వచ్చును. వారు ప్రాయికముగా నాట్యశాస్త్రారాధనము చేయు వారుగా నుండరని మన మూహింపవలయును.

"భరతశ్చ మహాబాహురయోధ్యాం పాలయిష్యతి,
సర్వకామైస్సహ శ్రీమాన్ రామస్సంసాధ్యతామితి." ౯

అని మూలము. దశరథోక్తి యిది. సోపాలంభోక్తి యని వ్యాఖ్యాత లనిరి. దశరథునిభావ మూహించిన వాస్తవముగనే యనినట్లు తోఁచెడిని. కైకయందు రాజునకుఁ గోపము కలుగ వచ్చును. కాని భరతునియందుఁ గోపముండుటకుఁ గారణము లేదు. కైక భరతునికొఱకు వరములడిగెనుగాన నతనిమూల మునఁగదా యీయనర్థము సంభవించెనన్న యాగ్రహ ముండఁ గూడదా యనవచ్చును. కాని చిన్నటనాటనుండి భరతశత్రు ఘ్నులయాశయ మెఱింగినరా జంతటియవివేకముగా నూహిం చునా యని మన మూహింపవలసియున్నది. భరతుఁడు రాజ్య మును బాలించుఁగాక. శ్రీదేవీసహితుఁడగు రామచంద్రుఁడు సర్వకామములతోఁ బ్రయాణము సాగించుఁగాక. అను నీ

వాగ్ధోరణినిబట్టి పరికింపఁగా భావిపాదుకాపట్టాభిషేకము సూచింపఁబడియెడిని. సర్వకామములతో ననఁగాఁ దనపేర రాజ్యమును నిమిత్తమాత్రము రాజుగా భరతుఁడు పాలించు చుండఁగా శ్రీమహామాయాపహితుఁడై రాముఁడు దండ కారణ్యములకుం బోవుఁగాక యని దశరథునివదనమునుండి దైవికముగా వాక్కు వెడలెనని తోఁచుచున్నది. ఎల్లవారును రాఁగలఫలమును సూచించుప్రవర్తనము కలవారలే యగుదు రనుట స్పష్టము. కావున నానియమప్రకారము దశరథుఁడు పలికెననుటలో వింత యేమియు లేదు.

"ఏవం బ్రువతి కాకుత్స్థే కైకేయ్యా భయమాగతం,
ముఖం చాప్యగమచ్ఛోషం స్వరశ్చాపి న్యరుధ్యత. ౧౦
సా విషణ్ణా చ సంత్రస్తా ముఖేన పరిశుష్యతా,
రాజానమేవాభిముఖీ కైకేయీ వాక్యమబ్రవీత్." ౧౧

అని మూలము. ఆమాటలకుఁ గైక భయపడి రాజున కిట్లులనియె. అని సామాన్యార్థము. "కాకుత్స్థే ఏవం బ్రువతి సతి కైకేయ్యా భయమాగతమ్" అనికదా యన్వయక్రమము. ఇట్లు దశరథుఁడు పలుకుచుండఁగాఁ గైకకు భయముకలిగెను. అనఁగా భగవంతుని యాశయము దండకారణ్యగమనముకాన దానికిఁ గారణ భూతురాలు కైకయే కావున నామె మృదుమానసముకలదైనఁ దనకార్యమునకు సాధనాంతరము కావలసివచ్చునని యాలో చించుపరమేశ్వరు నాశయమున నామెకు భయముతోఁచెనని యర్థము స్ఫురించెడు. భయమనఁగాఁ గార్యాతురత్వమని యర్థము. ఆభయమేకదా పట్టినపట్టు వదలక యుండఁజేసినది. భయపడినవారు కార్యమును వదలుకొందురుగాని చేయఁ బూనుదురా? కావున భయమనఁగాఁ గార్యపరత్వమనియే

యర్థము. దేవకార్యమునకు విఘ్నము కలుగరాదనుభగవంతుని యూహ ఫలింపకమానదు. కానఁ బరవశయగుకైక యేమి చెప్పిన నది భగవత్ప్రేరితమనియే మన మూహింపవలయును. కైక నిర్దోషురాలనుట యీభాగము మనకుఁ దెలుపుచున్నది.

"తవైవ వంశే. సగరో జ్యేష్ఠపుత్రముపారుధత్,
అసమంజ ఇతి ఖ్యాతం తథాయం గంతుమర్హతి."    ౧౬

అని కైక పలికినది. దీనిసారమేమి? రాజా! ధర్మమాలోచింపుము. నీ వేవంశమునఁ బుట్టితివో యావంశముననే పుట్టినపూర్వకాలమున విఖ్యాతిగాంచిన సగరచక్రవర్తి ప్రజాక్షేమమును గోరి కుమారునిగూడ వదలుకొనెను. అనఁగాఁ దమపని ప్రజారక్షణము గోరునదియేకదా. ఇప్పుడు కేవల ప్రజాహితమేకాక ధర్మరక్షణము దేవతాకార్యమునను ననేకకార్యములు ఫలింపవలసియున్నవి ఇన్నికార్యములు ఫలింపవలయునన్నకోరికతో శ్రీరాము నరణ్యములకుం బంపుమని కైక పలికెను. సగరచక్రవర్తికంటె నీవికార్యమున మహోపకారము లోకమునకు నొనరించి కీర్తి గడింపుమా యనియే కైక యాశయము. ఇందుఁగలనీతి నెద్దానిని మనము గ్రహింపవలయును? "రాజా ప్రకృతిరంజనాత్" అన్న నానుడి ననుసరించి రాజు ప్రజలహితమునకై సర్వము వదలవలయుననియు నట్టివాఁడే రాజనం బడుననియు నీతి.

"సమీక్ష్య స ధృతస్సమ్యక్సర్వా రంజయతి ప్రజాః,
అసమీక్ష్య ప్రణీతస్తు వినాశయతి సర్వతః."  ౧౯   మను ౭. అధ్యా.

అన్నస్మృతియుఁ బైవ్రాసినభావమునే తెలుపుచున్నది. ప్రజాహితమన ధర్మరక్షణమనియే తాత్పర్యము.

"అదుష్టస్య హి సంత్యాగస్సత్పథే నిరతస్య చ,
నిర్దోషాదపి శక్రస్య ద్యుతిం ధర్మనిరోధనాత్. 29
తదలం దేవి రామస్య శ్రియా విహతయా త్వయా,
లోకతోఽపిహి తే రక్ష్యః పరివాదశ్శుభాననే." 30

అని సిద్ధార్థుఁ డనుమంత్రి కైకకుం దెల్పెను. ఇందలినీతి యే మనఁగా. సన్మార్గమున నర్తించుచు దుష్టత్వము లేనివానిని వద లినయెడల నింద్రునిభాగ్యముకూడఁ దగులఁబడును. లోకాప వాదమున కెవ్వఁడుగాని భయంపడక తప్పదని యెఱుంగవల యును. ఇట్టినీతుల నీభాగము తెలుపును ఇఁకఁ బరువాత కథాంశమును బఠింతము.

## శ్రీరామాదులు వల్కలముల ధరించుట.

*శ్రీరాముఁ డీరీతి సిద్ధార్థుఁడు తెల్పినపద్ధతి నాలకించి వినయజ్ఞుఁడు కావునఁ దండ్రి కిట్లనియె. మహారాజా! నేను భోగములనెల్ల మాని వనమున ఫలమూలాదులభక్షించి జీవించు వాఁడ. కొందఱకు భోగము వదలినను సంగము వదలదు. నేనో సర్వసంగములను మానినవాఁడను. కావున సేనలతో నేమిలాభము? భద్రగజమునొసంగి దానియందలి మోహమును వదలినవానికి నదుముఁ గట్టుత్రాటియందు మనస్సుండునే నేమి లాభము? సత్పురుషవరేణ్యుఁడవు. కనుక నే వచించుసద్విష యము నాలకింపుము. పైఁజెప్పినయుదాహరణమురీతిగా రాజ్యా దుల వదలిననాకు సేన యెందులకు? నీవు నాకొసంగినవానినెల్ల భరతునకు నిచ్చుచున్నాను. ఏకార్య మెట్లు చేయువలయునో నే నెఱుంగుదును. నారచీరలు తెప్పింపుము. పదునాలుగుసంవ

---

* ఇది ముప్పదియేడవసర్గమునుండి గ్రహింపఁబడినది.

శ్వరములు వనముల నుందును. మాకెల్లఁ గందమూలాదులు తెచ్చుకొనుటకై వలయుసాధనములు దెప్పింపుము.

అని రాముఁడు పలుకఁగాఁ గైక యంతఃపురమందు సిగ్గు మాని తానే నారచీరలఁ దెచ్చి రామా! వీనిం దాల్పుమని పల్కెను. పురుషోత్తముఁ డామెయిచ్చినవస్త్రములను రెండింటిని గైకొని యమూల్యవస్త్రముల వదలి మునియోగ్యములగు వానిని ధరించెను. లక్ష్మణుఁడు రామునివలె వానిం గట్టుకొనియెను. పట్టుచీరఁ గట్టుకొన్న జానకి తనకై తెచ్చియున్న వల్కలమును గాంచి వలనుజూచిన హరిణమువలె భయంపడెను. సులక్షణములుగల యామహామాయ తనమనస్సు తత్తఱపడుచున్నను సాధ్వీధర్మము లెఱింగినవిదుషీమణిగావున దనయనుష్ఠానబలమున లోకమునఁగల పురంధ్రీగణమునకుఁ బాతివ్రత్యధర్మము లెఱిఁగించునదియుఁ గావునఁ గైకయొసంగినవల్కలముల నత్యంతలజ్జాతరంగితాంతరంగ యగుచు గ్రహించి ధరించుచుఁ దామరలంబోలుకన్నులనుండి నీరు గ్రమ్మఁగా గంధర్వరాజువలె మెఱయు ప్రాణేశ్వరుం గాంచి యిట్లనియె. నాథా! అడవులఁ గాపురముండుమునులు నారచీరల నెట్లు దాల్తురు? చెప్పుమని యడుగుచు వానిని గట్టుకొనునుపాయము తెలియక యూరకయుండెను. మరల నాజానకి యావల్కలములలో నొక్కదాని మెడపై వైచుకొని వేఱొకదానిఁ జేఁబట్టుకొని కట్టుకొనుటకు వలనుపడమి సిగ్గుతో నిలుచుండెను.

ధర్మాత్ముఁడగు శ్రీరామమూర్తి యావిధ మెఱింగి సీత దగ్గరకు వచ్చి పట్టుపుట్టము ధరించియున్నదికాన దానిపై నా వల్కలమును గట్టెను. పురుషోత్తముఁ డట్లు నారచీరఁ గట్టుట కన్నులారఁ గాంచి యంతఃపురకాంతలు కన్నీటిధారలు వెల్వ

డఁగా వగచిరి. రామునింగని తండ్రీ! మతిమంతురాలగు జానకి వనముల కరుగవలయునన్న శాసనము లేదుకదా. ఆశాసనము నీకు నొక్కనికేకదా. నిర్జనంబగు నడవికి నీవు పోవఁగా మరల నీవు వచ్చుదనుక నిన్నుం గాంచునట్టు లీబిడం గాంచుచు మానేత్రముల కానందమును జేకూర్చుకొనుచుందుము. ఆ ఫలము మాకుఁ గలిగింపుమా. కుమారా! లక్ష్మణుఁడు తోడుగా నుండ నడవికిం బొమ్ము. కల్యాణముల కాటపట్టగు నీజానకిని బుష్పింబోలె వనముల నడిపింపరాదు. మేమొక్కటి వాంఛింతుము. ఆవాంఛితము నెఱవేర్పుము. నీభార్య యిందే యుండు నట్లు చేయుటయే యావాంఛితము. నీవుకూడ నుండవలయు ననియే కోరుదుము. ఐనను ధర్మైకవర్తనుఁడవగు నీవు నిలువ నంగీకరింపవని యెఱుంగుదుము. జానకినైన నిట నునిచి పొమ్మని వేఁడిరి. ఎన్నివిధముల వారు వేఁడినను గైక యందుల కంగీకరింపనందున బదులు పలుకక నారచీర గట్టుచునుండెను.

అట్లు సీత వల్కలమును ధరింపఁగా రాజగురువగు వసిష్ఠముని లేచి యావస్త్రమును గట్టుకొనవలదని నివారించుచుఁ గైకదిక్కుచూచి యిట్లు పలికెను. కైకా! నీవు మేరమీఱి వర్తించుచున్నదానవు. దుర్మతిఁ బూనితివి. కులధర్మములను బాడుచేయుదానవు. రాజును వంచించుటయేగాక మఱియు మర్యాద వదలి క్రూరత్వమునకుఁ బాల్పడుచున్నదానవు. దుశ్శీలముకలకైకా! జానకి వనమునకుఁ బోవరాదు. రామచంద్రునకుగా సిద్ధపఱచినసింహాసనము నీసీత యధిష్ఠించుఁగాక. రాజ్యముఁ బాలించుచుండుఁగాక. గృహస్థులకు భార్యయే యాత్మయని శాస్త్రము కలదుకదా. శ్రీరామునకు సీత యాత్మ కావున నాతఁడు పాలింపఁదగినరాజ్యమును బాలించుచుండును.

అట్లుగాక సీత రాముని౦గూడి వనమున కరుగునేని మేముం బోయెదము. పౌరులందఱును బోవఁగలవారు. దండనాథులు పోదురు. రాజేంద్రుఁడు తత్పరివారము జనపదవాసులు వారు వీరననేల. యందఱు రాముని వెంట నరుగుదురు. భరతశత్రుఘ్నులు వల్కలములందాల్చి వనముననున్న శ్రీరాము ననుసరించియుందురు. దురాచారమును బూని ప్రజల కహితమును గోరియున్న నీవు నిర్జనమయి పాడుపడిన యీరాజ్యము నీ వొక్కతుకవే యేలుచుండుము. రాముఁ డేచోటఁ బ్రభువుగా నుండఁడో యది రాజ్య మనిపించుకొనదు. రాముఁడుండు చోటు రాజ్యమే కాఁగలదు.

భరతుఁడు దాశరథి యగునేని మనఃపూర్వకముగాఁ దనకుఁ దండ్రి యీయనిరాజ్యముఁ బాలింపఁడగదు. తండ్రి నిట్లు వంచించిన నీవిషయమున మాతృభక్తిని జూపుట యాతనికి న్యాయముకూడఁగాదు. నీవీభూమినుండి వ్యోమమున కెగసినను బితృవంశప్రవర్తనమును, జ్యేష్ఠుఁడర్హుఁడుండఁగా ననుజునకు రాజ్యమొసంగఁగూడ దన్నయాచారమును దెలిసినవాఁడుగా నున్న భరతుఁడు న్యాయమును వదలి నీవాంఛితము రీతిఁ బ్రవర్తింపఁడు. శ్రీరాము ననుసరింపనివాఁడు లోకమునందే కనఁబడఁడు. ఇఁక భరతునిమాట చెప్పనేల? పుత్రునియందుఁగల నెయ్యమున రామున కిట్టిపాటులు కల్పించి రాజ్యమును నీవు గ్రహించినను రామునియందు భక్తిగలభరతున కిది యెంతమాత్రము సమ్మతముకాదు. విశేషించి యప్రియమే యగును. పశువులు లోనగునవియుంగూడి రాము ననుసరించిపోవుచుండఁగా నీవిపుడే చూడఁగలవు. వృక్షములుగూడ రామాభిముఖములై పోవఁ బూనినట్లుండుట నీకగపడఁగలదు.

దేవీ! ఇంకనైన నీకోడలు సీతకు వల్కలముల మాని యమూల్యాభరణములనిమ్ము. నారచీర యీసీత కిమ్మన్న విధి లేదు. ఇచ్చుటయే యనర్థము. అని పలుకుచు సీతాదేవీ! వానిని ధరింపకుమా యని నివారించెను. మరలఁ గైకం జూచి రాముఁడొక్కఁడే యడవినుండఁదగునని కదా నీవు కోరితివి? జానకియు నట్లే యుండవలయునని కోరలేదుకదా. నిరంతర మలంకారార్హయగు సీతాదేవి భూషణములఁ బెట్టుకొనియే రామునింగూడి యడవినుండుగాఁక. ఉత్తమవాహనములు పరిచారికలు వెంట రాఁగా నమూల్యవస్త్రములతో బంగారుపాత్రములు లోనగు వస్తువులతో వనికేగుఁగాక. వరము వేఁడుతఱి సీతంగూడి రాముఁడడవులకుం బోవలయునని యడుగలేదు. అని మహానుభావుఁడు కులగురువు నగువసిష్ఠముని పలుకుచున్నను సీత ప్రాణేశుని వేషాదులనే యనుసరించునదియై యతనివలె వనమున నుండఁ గోరినది కాన వల్కలధారణము నుజ్జగింప నెంచకయుండెను.

మహాత్ములారా! ఈభాగమునఁ బెక్కువిశేషములుగలవు. జ్ఞాననిధి త్రికాలవేత్తయు నగువసిష్ఠముని బోధించుధర్మములత్యుత్తమములనుట కే శంకలుండవు. కావునఁ బరికింతము.

"త్యక్తభోగస్య మే రాజన్ వనే వన్యేన జీవతః,
కిం కార్యమనుయాత్రేణ త్యక్తసంగస్య సర్వతః. ౨
యో హి దత్వా ద్విపశ్రేష్ఠం కక్ష్యాయాం కురుతే మనః,
రజ్జుస్నేహేన కిం తస్య త్యజతః కుంజరోత్తమం. ౩
తథా మమ సతాం శ్రేష్ఠ కిం ధ్వజిన్యా జగత్పతే,
సర్వాణ్యేవానుజానామి చీరాణ్యేవానయంతు మే." ౪

అని మూలము. ఇది రామోక్తము. సామాన్యార్థము సుగమము. విశేషార్థమేది? త్యక్తసంగస్య సర్వతః = సర్వవిధముల

సంగముఁ ద్యజించినవాఁడను. ఎవరితోడ్పాటు నాకు వలదని భావము. నిస్సంగుఁడనని సారము. అట్టి నాకు సైనికుల తోడ్పాటేల? సర్వశక్తులుగల నాకేల యితరులసహాయ మనియే శ్రీరాముని యాశయము. వనే వన్యేన జీవతః=వనమునఁగలపదార్థములనఁగాఁ గందమూలాదులఁ దిని కాలముఁ బుచ్చువాఁడను. ఇయ్యది దీక్షానియమముఁ దెల్పుచున్నది. మహాకార్యము సాధింపఁబూనువాఁడు వ్రతోపవాసము లొనరించి దైవశక్తిని సముపార్జించుకొని కార్యమును సాధింపవలయును. ఆహారనియమముఁ బాటింపవలయును. మనోబలమును బెంపొందించునవి కందమూలాదులని పెద్దలందురు. సర్వవస్తువుల నిచ్చితిని నారచీరలే యిపుడు కావలయు. వానిం దెప్పింపుమా యని భావము. మహాకార్యమునకుఁ బూనువారు దీక్షఁ బూనుదురు. దానికి నూత్నవస్త్రములు కావలయును. ఇంతదనుకఁ గలయనుభవములిపుడు పనికిరావు. క్రొత్తవిధములగు వస్త్రములను ధరించి నూత్నసంకల్పమునకుం బూని మునివృత్తి నవలంబించి భగవదనుగ్రహమునకుం బాత్రులై కార్యము సాధింపవలయు నన్న భావ మిందు సూచింపఁబడినది. "చీరాణ్యానయంతు మే" అని రామమూర్తి పలికెను. ఏవకారముచేత శ్రీరాముని దృఢసంకల్పితము సూచింపఁబడినది. వేదవేదాంగపారగుఁడగు రావణుని మునివృత్తి నవలంబించియే వధింపవలయునన్న భావము కూడ నిందిమిడియున్నదని కొందఱందురు. అదియు యుక్తియుక్తముగనే యున్నదని గ్రహింపఁదగియున్నయది.

"అథ చీరాణి కైకేయీ స్వయమాహృత్య రాఘవం,
ఉవాచ పరిధత్స్వేతి జనౌఘే నిరపత్రపా." ౬

అని మూలము. కైక తానే నారచీరలు తెచ్చి రామా ధరింపు మని యిచ్చెను. జను లేమనుకొందురో యనులజ్జకూడ నామె కుం దోఁపలేదు. అని సామాన్యార్థము. ఇఁక నాలస్యముచేయ రాదు. మాటలతోఁ బ్రొద్దుపోవుచున్నది. అని మహామాయ సంకల్పింపఁగా నయ్యది కైకను బురికొలిపెననియు వెంటనే యామె యానారచీరలు తెచ్చియిచ్చెననియు గ్రహింపఁదగును. అపుడు నారచీర లెక్కడివి? అని కొందఱు ప్రశ్నింతురు. చీర లనఁగాఁ గొందఱు నారతో సిద్ధముచేసినవస్త్రములని యర్థము చెప్పుదురు. చీరశబ్దము సంస్కృతము. చీరవల్కలశబ్దములు సమానార్థకములు.

"చీరాణి కిం పథి న సంతి దిశంతి భిక్షాం నైవాంఘ్రిపాః పరభృతస్సరితోఽప్యశుష్యన్."

అని భాగవతము తెల్పుచున్నది.

"పూర్వజస్యానుయాత్రార్థం ద్రుమచీరైరలంకృతః."

అని రామాయణముననే కలదు. చీరశబ్దమునకు "వస్త్రభేదః" అని నిఘంటువులయం దర్థము వ్రాయఁబడినది. వృక్షముల పైభాగమునఁ గలపట్టను జీల్చి నేసినవస్త్రములని కొందఱందురు. ఆయర్థము పరిహాసపాత్రము. వీనినెల్లఁ బరికింపఁగా ధనవంతులు ధరింపయోగ్యములుగాక నిర్ధనులు ధరింప ననువగువస్త్రములని యర్థము తేలెడిని. అవి రాజులు ధరించునెడలఁ గష్టముగనే తోఁచ వచ్చును. తటాలున కైక తెచ్చియిచ్చెననఁగా నర్థమేమి? ఆ వస్త్రములు సులభలభ్యములనియేకాక మఱేమగును? శ్రీరాముఁ డంతకుముందు ధరించువానిని వీనిని బరికించినఁ గ్రొత్తగాఁ దోఁపవచ్చును. కాని చెట్లపట్టలు కావు. మహర్షులుకూడ సులభ

లభ్యములగువానినే ధరింతు రనుకొనవచ్చును. నారికేళవృక్ష ములయందుఁ గనంబడుచు వస్త్రములవలెఁ దోఁచుచుండునవని కొందఱందురు. అవి ధార్యము లెట్లులగునో తోఁపకున్నది. ఎన్నిభంగుల నూహించినను పైవ్రాసినయర్థమే సుసంగతమని తోఁచెడు.

"అథాత్మపరిధానార్థం సీతా కౌశేయవాసినీ,
సమీక్ష్య చీరసంత్రస్తా పృషతీ వాగురామివ. ౯
సాప్యపత్రపమాణేవ ప్రగృహ్య చ సుదుర్మనాః,
కైకేయ్యాః కుశచీరే తే జానకీ శుభలక్షణా. ౧౦
అశ్రుసంపూర్ణనేత్రా చ ధర్మజ్ఞా ధర్మదర్శినీ."

అని మూలము. కుశచీరే=ఇందుఁ గుశశబ్దమునకు దర్భ యర్థమా కాదా యని ప్రశ్నము. దర్భవలెఁ దాఁకిన మెత్తగానుండని వని యర్థమని కొందఱు పెద్దలభావము. దర్భతో నేసినవని కొందఱందురు. అవి ధార్యములు కావచ్చునా యనుసంశయ ముంకురింపకమానదు. ముదుకవస్త్రములని యర్థము చెప్పుటయే సమంజసముగాఁ దోఁచెడిని. ధనవద్ధార్యములు కానివని యర్థము.

"తస్యాస్తత్క్షిప్రమాగమ్య రామో ధర్మభృతాం వరః,
చీరం బబంధ సీతాయాః కౌశేయస్యోపరి స్వయం." ౧౪

అనుమూలము పైనివ్రాసినయర్థమును దృఢపఱచుచున్నది. పట్టుపుట్టము మీఁదఁ గట్టెననఁగా నది యమూల్యము ఇది యత్యల్పమూల్యముగా నుండునదియగుటఁ, జూచువారల కేవ గింపు గల్గింపఁజాలునది యని యర్థము. సారము ముదుకవస్త్రము లనియే కాని వేఱు కాదు.

"చీరే గృహీతే తు తయా సమీక్ష్య నృపతేర్గురుః,
నివార్య సీతాం కైకేయీం వసిష్ఠో వాక్యమబ్రవీత్." ౨౧

అని మూలము. త్రికాలవేత్తయగుముని యేల యాక్షేపించెనని కొందఱందురు. భావికాలగతుల నరసియే యాక్షేపించెను. రత్నభూషణములఁదాల్చియే సీత పోవలయును. లేకున్నఁ గథా భాగమునకుఁ గొంత బాధ కల్గును. లంకాగమనకాలమున నీ భూషణములసంగతివలని లాభము తేటపడును. ఆవిధ మెఱిం గియే ముని కైకనాక్షేపించెనని మన మెఱుంగవలయును. లేక భావికర్మము మునిఁ బురికొలిపెననియు దాన నాతఁడాగ్ర హించి పలికెననియు గ్రహింపవలయును.

"న గంతవ్యం వనం దేవ్యా సీతయా శీలవర్జితే,
అనుష్ఠాస్యతి రామస్య సీతా ప్రకృతమాసనం. ౨౩
ఆత్మా హి దారాస్సర్వేషాం దారసంగ్రహవర్తినాం,
ఆత్మేయమితి రామస్య పాలయిష్యతి మేదినీం. ౨౪
అనుయాస్యతి వైదేహీ వనం రామేణ సంగతా,
వయమప్యనుయాస్యామః పురం చేదం గమిష్యతి." ౨౫

అని మూలము. ఇవియు వసిష్ఠోక్తులే. సామాన్యార్థమును బరి శీలించిన ముని కైకయందుఁ గలకోపముచే సీత రాజ్యమును బాలించునని తెల్పెనని తోఁచును. దానికిం దగినకారణముఁ గూడ మునియే తెల్పెను గృహస్థులకు భార్యయే యాత్మ. రామున కాత్మయగు సీత భూమిని బాలింపవచ్చునని ముని యొసంగినకారణము. దీనిభావ మేమి? పురుషుఁడు నిర్గుణస్థానీ యుఁడు. పత్ని ప్రకృతిస్థానీయురాలు. సర్వకార్యము లొనరిం చునది ప్రకృతి. నిర్గుణుఁడు సాక్షిమాత్రుఁడై చూచుచుండు.

తదాశయ మెఱింగియే ప్రకృతి ప్రవర్తించును. ఆమె ప్రవృత్తిని నిర్దేశించువాఁడు పరమపురుషుఁడు. అనఁగా భగవంతుని సంకల్ప మెఱింగి సర్వకార్యములను బ్రకృతి స్వాతంత్ర్యురాలై యొనరించును ప్రకృతిఁగూడక పురుషుఁ డేకార్యము చేయఁజాలఁడు శ్రీరాముఁడు రాజ్యము పాలింపఁడు. సీత ప్రకృతి గాన నామెయే పాలించును. అనఁగాఁ బ్రకృతికే యాయధికారము. సీత యంతగఃపురమున నుండునదికదా యని యడుగుదు రేమో. లోకసృష్టికి నట్లు తోఁచును. కాని వారిరువురకు విరహ మసంభవము. అను నీభాగముననుబట్టి దంపతికృత్యము స్పష్టము. సగుణమే యుపాస్యము. నిర్గుణము ధ్యానగమ్యము అనువిశేష మిందుఁ దెలుపఁబడినది. అవయవిని ధ్యానించి పూజించిన నదియెల్ల సగుణమే యనఁబడు. తేజోరూపునిగా భగవంతుని ధ్యానింపవలయును. దీనికే శాక్తమని పేరు. సురామాంసభక్షకులు శాక్తులు గారు. అట్టివారు లేరా యన్న వైష్ణవులలోను గలరు. భ్రష్టు లన్ని మతములయందును గలరు. సురామాంసభక్షణము శాక్తధర్మము కాదు. ప్రకృతి నుపాసించిన సర్వదేవతలను త్రిమూర్తుల నుపాసించినట్లే యని యెఱుంగవలయు.

"త్రయాణాం దేవానాం త్రిగుణజనితానాం తవ శివే
భవేత్పూజా పూజా తవ చరణయోర్యా విరచితా,
తథా హి త్వత్పాదోద్వహనమణిపీఠస్య నికటే
స్థితా హ్యేతే శశ్వన్ముకుళితకరోత్తంసమకుటాః." ౨౫

అని సౌందర్యలహరియందు శ్రీశంకరభగవత్పాదులుగారు నిర్వచించిరి. బ్రహ్మవిష్ణురుద్రేశ్వరసదాశివులను ప్రేతపంచకముపై

నధివసించును. కావుననే "పంచప్రేతాసనాసీనా" అను పేరు మహాప్రకృతికిం గల్గెను. ఏమూర్తిని బూజించినను శక్తిని బూజించినట్లే యని యెఱుంగుటయే బుద్ధిమంతులలక్షణము. ప్రకృత్యతీతుఁ డొక్కఁపరమపురుషుఁడే. ఆతత్త్వము నిర్గుణము. అను నీవిషయము లిద్దానినుండి తెలిసికొనఁదగినవి.

"భరతశ్చ సశత్రుఘ్న శ్చీరవాసా వనేచరః,
వనే చరంతం కాకుత్స్థమనువత్స్యతి పూర్వజం." ౨౯

అని మూలము. భరతుఁడు రాజ్యము పాలింపక శ్రీరాముని వంటివేషముతో నందిగ్రామమున నుండుననుభావివార్త యిట సూచింపఁబడియె.

"న హ్యదత్తాం మహీం పిత్రా భరతః శాస్తుమర్హతి,
త్వయి వా పుత్త్రవచ్ఛాస్తుం యది జాతో మహీపతేః." ౩౦

అని మూలము. "పితౄన్ సమనుజాయంతే నరా నార్యస్తు మాతరః" అనున్యాయము ననుసరించి యీభావమును ముని తెల్పెను. ప్రాయికముగాఁ దండ్రిగుణములే తనయునకు రావలయునని ధర్మము. కాని యింతకంటెఁ గర్మసిద్ధాంతము బలీయము. ఇది సామాన్యశాస్త్రము. కర్మసిద్ధాంతము విశేషశాస్త్రము. అని యెఱుంగవలయును.

### రాజు వల్కలములు సీతకు నీవలదని కైకను యాచించుట.

*సీతాదేవి లోకనాథునిభార్యయయ్యు వల్కలధారణము చేయుచుండఁగా నందుఁగలప్రజలెల్లరు దశరథుని గాంచి యీ

* ఇది ముప్పదియెనిమిదవసర్గమునుండి గ్రహింపఁబడినది.

నీబ్రదుకేమని గట్టిగా నాక్షేపించిరి. ఆధ్వని చెవుల సోఁకఁగా నతఁడు నగచి ప్రాణధర్మకీర్తులయందుఁ దనకుఁ గలసంబంధమును వదలుకొనువాఁడై నిట్టూర్పులు పుచ్చుచుఁ గైకం గాంచి యిట్లనియె కైకా! జానకి వల్కలమును ధరించి పోవరాదు. కోమలాంగికదా సీత. బాలకదా. సుఖములకే తగినదిగాన నడవిలో నుండరాదని గురువు చెప్పినది సత్యము. ఇపుడు జానకి వల్కలధారిణియై యందఱయంతరమున నొకమునిపత్నివలె నిలుచున్నదే. పతివ్రతాశిరోమణియు రాజర్షివర్యుఁడగు జనక చక్రవర్తిపుత్త్రికయు నగు నీకన్య యిట్లుండుట కెవరి కేయపకారము చేసెను? వల్కలమును వేగముగా వదలుఁగాక. ఈవేషమున నడవికి సీత పోవలయునని మునుపు నీకు మాటయిచ్చియుండ లేదు. కావున నీమె వస్త్రాలంకారభూషితయై సద్వస్తువులం గయికొని వనమున కరుగుఁగాక. ఇంక నేబ్రదుకుట కర్హుఁడఁ గాను. మృతి సమీపించినది. ఇట్లున్న నేను నీకతిక్రూరమగు శపథము చేసినాను. అవివేకురాలవుగాన నీవుకూడ రామారణ్యగమనము భరతాభిషేకము నిశ్చయించితివి. ఏమిచేయఁ గలను? వెదురుపొదను దానిపుష్పమే కాల్చుచందమున నాశపథమే నన్నుఁ గాల్చుచున్నది. పాపాత్మురాలా! కైకా! నీకేదే నపరాధము రాముఁడు చేసియున్న నడవులకుఁ బంపుటకుఁ దగినంతయపకారమేమి చేసినాఁడు? సీత మృదుచిత్త. భీతహారిణాక్షి! అపరాధ మొనరింప నెఱుఁగనే యెఱుఁగదు. మహాసాధ్వి యిచ్చుట నీ కేయపకార మొనరించెను? రాము నడవికిఁ బంపుటొక్కటియే నీయాత్మ యుండునంతదనుక నరకమున దుఃఖములనుభవించునట్లు నిన్నుఁ జేయఁజాలునుగదా. ఇంకను బాపములు చేయుచున్నదానవే నీగతి యేమగును?

శ్రీరాముఁ డిచ్చోటికిఁ బట్టాభిషేకమునకై రాఁగా నతనితో వల్కలములం గట్టుకొని వనమునఁ బదునాలుగేండ్లుండఁ బొమ్మంటివి. ఊరక యుండినందుననే నందుల కంగీకరించిన వాఁడనైతినిగాని సీత నడవికిఁ బంపవలసినట్లు నీవు నన్నడుగ లేదు. నేను సరే యనలేదు. సుకుమార యగుజానకి యీ ముదుకవస్త్రములఁ గట్టుకొనుచుండఁగాఁ గాంచుచున్నావు కదా. ఎంతటిపాషాణహృదయవు? ఎంతటిపాపమున కొడిగట్టుచున్నదానవు? అని పలుకుచు నారాజు విలపించుచు నామె మనస్సు మెత్తఁబడనికతన దుఃఖము నంతమును జూడఁజాలక పోయెను. పుత్త్రశోకవేగమున భూమిపైఁ బడియెను. ఇట్లు కైకను బ్రార్థించి పడియున్న తండ్రిం గాంచి శ్రీరామమూర్తి వనమునకుఁ బ్రయాణమై యిట్లు పలికెను.

తండ్రీ! నీవు పరమధార్మికుఁడవు. నాజనని యీకౌసల్య కీర్తిమంతురాలు. వృద్ధురాలు. సుశీల. సంపదగలది. తనకొడుకును నీ నడవికిఁ బంపుచున్నను నిందింపక యూరకున్నది పరదాతవగు నీవు నాకు వరమొసంగుము. నీవామెను గౌరవింతువు. కాని నేనడవికిఁ బోయినతర్వాత దుఃఖార్ణవమునఁ బడియుండును. ఇట్టియాపద నీవఱకెఱుంగదు. కాన మునుపటికన్న మిన్నగ నీవామెను గౌరవింపందగు. పుత్త్రదుఃఖమునఁ గుంది పోవకయుండ మన్నింతువేని యామె జీవించి యుండఁగలదు. దేవేంద్రతుల్యుఁడవు. కాన నాయెడఁబాటువలన నామె వగచి కృశించి చచ్చి యమపురమునకుం బోవకయుండ నాప్రార్థనమునఁ జేయవలయును. మన్నించుచున్న నామె జీవించియుండును.

మహనీయులారా! ఈభాగమునఁ ధర్మము లుపదేశింపఁ బడినవి. వాని నెఱుంగవలయును.

"పుత్రశోకం యథానర్ఛేత్త్వయా పూజ్యేన పూజితా,
మాం హి సంచింతయంతీ సా త్వయి జీవేత్తపస్వినీ." ౧౭

అని మూలము. పూజితా = అనఁగా సమ్మానింపఁబడినదని యర్థము. పూలచేఁ బూజింపఁబడినదని కాదు.

"పితృభిర్భ్రాతృభిశ్చైతాః పతిభిర్దేవరైస్తథా,
పూజ్యా భూషయితవ్యాశ్చ బహుకల్యాణమీప్సుభిః. ౫౫
యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః,
యత్రైతాస్తు న పూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియాః. ౫౬
శోచంతి జామయో యత్ర వినశ్యత్యాశు తత్కులం,
న శోచంతి తు యత్రైతా వర్ధతే తద్ధి సర్వదా. ౫౭
జామయో యాని గేహాని శపంత్యప్రతిపూజితాః,
తాని కృత్యాహతానీవ వినశ్యంతి సమంతతః. ౫౮
తస్మాదేతాస్సదా పూజ్యా భూషణాచ్ఛాదనాశనైః,
భూతికామైర్నరైర్నిత్యం సత్కారేషూత్సవేషు చ." ౫౯

మను. 3 అధ్యా.

అని మనుస్మృతి తెలుపుచున్నది. భర్త భార్యను గౌరవింపఁదగిన పద్ధతి యిద్దానివలన స్పష్టమయ్యెడిని మాంసంచింతయంతీ = నన్నే చింతించుచుఁ దపస్విని యగుకౌసల్య నీచెంత జీవించును అని శ్రీరామమూర్తి భార్యను భర్త యెట్లు గౌరవింపఁదగునో మనకు బోధించెను. మనుస్మృతి యట్లే తెలిపెను. సకలస్మృతి సారము రామాయణమని మన మూహింపవచ్చును.

"ఇమాం మహేంద్రోపమజాతగర్ధినీం
తథా విధాతుం జననీం మమార్హసి,
యథా వనస్థే మయి శోకకర్శితాం
న జీవితం న్యస్య యమక్షయం వ్రజేత్." ౧౮

అని మూలము. సామాన్యార్థము సుగమము. ఇందొక్కసూక్ష్మ ధర్మము కలదు. శోకముచేఁ దపించి ప్రాణత్యాగముచేయువారు యమలోకమున కరుగుదురు. అనఁగా దుఃఖించుచునే ప్రాణములు వదలరాదు. ఏలనఁగా

"యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరం,
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః."

అన్నగీతాప్రమాణము ననుసరించి దుఃఖమునఁ దపించుచుఁ బ్రాణముల వదలినఁ దదనురూపఫలమే కలుగును. కావున దుఃఖముతోఁ బరితపించి చావకయుండఁ జక్కఁగా నాదరింపుమని రామమూర్తి తెలిపెను. భర్త యుపలాలించినచోఁ బతివ్రతలు పుత్త్రవిషయమునఁ గలవిచారమునుమఱతురనియేకదా భావము. ఈభాగమునందు శ్రీరామమూర్తి సంగ్రహముగా భార్యను సంతోషింపఁజేయుపతిధర్మములఁ దెలిపెను. పతియే దైవముగా భావించిననారీమణి భర్త తన్ను లాలింపఁగా నెంతటిచింతల నైన మఱచునని స్పష్టము. అక్కారణముననే భార్యకు భర్త సర్వాధికారము లొసంగి తాను సాక్షిమాత్రుఁడై యుండవలయును. మనుస్మృతితాత్పర్య మిదియేకదా. ఇవ్వానిని గ్రహించి తదనుసారముగా మెలంగినవారు శ్రీరామునానతిని శిరసా వహించువా రగుదురు. మన మిట్టిసూక్ష్మవిషయములఁ ద్రోసి పుచ్చక యాఁటెంగి తదనుసారముగా మెలంగవలయును.

## వనగమనసన్నాహము. కౌసల్య సీతకు నీతిని దెలుపుట.

*శ్రీరామచంద్రుఁడు చెప్పినవాక్యముల నాలకించి దశరథుఁడు సీతారామలక్ష్మణులు మునివేషములఁ దాల్చియుండుటం గాంచి భార్యలతో నల్ల మూర్ఛిల్లెను. అట్టితండ్రిని రాముఁడు చూడనొల్లఁడయ్యెను. కొంతసేపూరకుండి చూచియు నేమియు మాటలాడకపోయెను. రాజు కొంతసేపట్లేయుండి కుమారునే తలంచుకొనుచు విలపించెను. మున్ను నేను పెక్కండ్ర శిశువులం బొలియించియుందును. కాదేని పెక్కుప్రాణుల హింసించియుందును. కనుకనే నాకీదుఃఖము తటస్థించినది. ప్రారబ్ధము పూర్తియైనఁగాని దేహము నశింపదు. అట్టిసమయము రానుండఁగా నెవ్వానికైనఁ బ్రాణము తనువునుండి వీడిపోవదు. అందుననే కైక నన్నిట్లు దుఃఖములపాలు చేయుచున్నది. ఐనను మరణ మింకను రాకున్నదే. ఏల? అగ్నితేజస్సు నడంపఁజాలు తేజస్సుగల నాకుమారుఁడు రాజవస్త్రములు విడిచి మునులకుఁ దగిన వల్కలములఁ గట్టుకొని నా యెదుటనుండఁ జూచుచున్న నాకు మృతిలేకున్నది. కపటముపన్ని తన కార్యము ఫలింపఁజేసికొన యత్నించుకైక కొఱకే యింత జనులు దుఃఖించుచున్నారుకదా. ప్రతికార మేమి చేయవచ్చును? అని బోరున నేడ్చెను.

ఇట్లు విలపించుచు రాజు కన్నుల నీరు గ్రమ్మ రామభద్రా! యని పిలిచి మరలఁ బలుకఁజాలక యుండెను. మరల స్మృతి గలుగఁగా సుమంత్రుని గని నీవుపోయి విలాసార్థమగు స్యందనము మేటిరథ్యములంబూన్చి తెచ్చి రామభద్రు నెక్కిం

* ఇయ్యది ముప్పదిమూడవసర్గమునుండి కైకొనఁబడినది.

చుకొనిపోయి యీదేశమున కవ్వల విడిచిపెట్టుము. సాధు గుణుఁడగు కుమారుని దల్లిదండ్రులు చేరి యడవికిఁ బొలఁ దోలుచున్నారు. సత్పురుషత్వమున కిదియే ఫలముకాఁబోలు! ఇది దానికిఁ దగదు. లోకమున గుణవంతులప్రవర్తనమునకు ఫల మిదియే యని నాకిపుడు తోఁచుచున్నది. కనుక గుణము లుండకుండుటయే మేలు. అని రాజు పలుకఁగా సుమంత్రుఁ డాయాజ్ఞ శిరసావహించి వేవేగ రథమును సిద్ధముచేయించి తెచ్చెను. కనకమయమగురథము సిద్ధముగానున్నదని సుమం త్రుఁడు తెలుపఁగనే రాజు కోశాధిపతిని బిలిపించెను. దేశకాల గతుల నెఱింగి బాహ్యాభ్యంతరములఁ బరిశుద్ధతవెలయ వస్తు తత్త్వ మెఱింగియుండుప్రోడ. కావున రాజుకడ నిలువఁగా నత నితో రా జిట్లులనియె. వనమునఁ బదునాలుగేండ్లు సీత యుండ వలయును కావున నంతకాలమునకుఁ జాలున ట్లుత్తమవస్త్రాభర ణముల వేగతెచ్చి సీత కొసంగుము ఆతఁడు వెంటనే కోశాగా రమునకరిగి తగినవాని నన్నింటిని దెచ్చి సీతకర్పించెను. సుజాత యాసీత ప్రయాణమై యాభరణమ్ములఁ దాల్చెను. ఉదయ భానుఁ డాకసమును బ్రకాశింపఁజేయుచందమున సీత యాభ రణధారణమున గృహమునంతయు మఱింతగాఁ బ్రకాశింపఁ జేసెను.

అంతఁ గౌసల్య యాజానకిం బిగియారఁ గౌఁగిలించుకొని మహాకార్యములనే యాచరించు నామెశిరము మూర్కొని యిట్లు పలికెను. అమ్మా! ఈలోకమున దుష్ప్రవర్తనముగలస్త్రీలు కోరినవానినెల్ల నొసంగి పతులు గారవించుచున్నను దైవవశ మునఁ గష్టములు గల్గి వారు శ్రమంపడుదురేని యత్తఱి వారిని

బరిగణింపక మెలంగుదురు. ము దెంత సుఖ మనుభవించి పతికి
హితముగా వర్తించియు నాకష్టకాలమున దుర్వృత్తి వారిని
వదలుదురు. ఇది స్త్రీస్వభావము. అసత్యము పలుకుటయు క్షణ
క్షణము మాఱుచుండుటయు వారి నైజము. వారిచిత్త
మిట్లుండునని యెఱుంగుట కష్టము పాపకార్యములనే వారు
తలంతురు. వారిప్రేమము స్థిరమని నమ్మరానిదే. ఒక్కక్షణమున
నది తప్పిపోవును సత్కులోపకారవిద్యలుగాని, అగ్నిసాక్షి
కముగా గ్రహించినపతిగాని, లోకమర్యాదగాని స్త్రీలచిత్త
మునకుఁదోఁపవు. ధనమునే వారు కోరుచుందురు. వారిమనస్సులు
మిగులఁ జంచలములు. కులము ప్రవర్తనము సత్యాదృతి
గురూపదేశము చక్కఁగా నాశ్రయించి శాంతిగలిగి వర్తించు
కాంతలకుఁ బరమపావనపదార్థము భర్తయే. భర్తకన్న నతి
శయవస్తు వేదియు లేదు. కావున నాకుమారుని రామచంద్రుని
దండ్రి చేనడవులపాలు చేయఁబడినవాఁడని యవమానింపకుము.
దరిద్రుఁడైన ధనవంతుఁడైన నాతని దైవమనియే తలంపుము.
అని యుపదేశింపఁగా నామాట ధర్మప్రయోజనమని యెఱింగి
సీత యెదుటనున్న యత్తయగు కౌసల్యం గాంచి యంజలి
బంధించి యిట్లు పలికెను.

పూజ్యురాలా! తమయానతి మెయి నొనరింతును. భర్త
కడఁ బ్రవర్తింపఁదగువిధ మెఱుంగుదు. వినియున్నాను.
దుర్వృత్తులతో నన్ను సాటిచేయవలదు. ప్రభ చంద్రుని వదలి
పోవనట్లు ధర్మమునుండి యించుకంతయు నేను వదలిపోవఁ
జాలను. వీణె తంత్రులు లేక ధ్వనింపదు. చక్రము లేక రథము
నడుపదు. ఆరీతి నారి శతపుత్త్రవతియైనను భర్త లేనిచో సుఖము

నొందఁజాలదు. వనితకుఁ దండ్రి మితముగా (ననఁగా నైహికము మాత్రము) నొసంగును తల్లియు నంతియ యిచ్చును. భర్త యన్ననో యమితముగా నిచ్చును. ఐహికాముష్మికములనెల్ల నొసంగును. అట్టిభర్త నేస్త్రీ పూజింపకయుండును? అట్టి పాతివ్రత్యధర్మమునే యాశ్రయించి యున్నదానను. సాధ్వీమణుల వలన సామాన్యవిశేషధర్మములనెల్ల వినియున్నదానను. ఇట్టి నేను నాప్రాణేశు నవమానింతునా? స్త్రీలకుఁ బతియే పరమదైవతముకదా. అని సీత పలుకఁగా సత్త్వగుణప్రధానురాలగు కౌసల్య మనస్సు తృప్తినొందునట్లు కోడలు పలికినవిధ మెఱింగి రాముని వనగమనమునఁ గల్గినదుఃఖముచేతను సీతాపాతివ్రత్యశ్రవణ సంతోషముచేతను గన్నీరు వదలెను. ధర్మాత్ముఁడు పూజ్యురాలగుతల్లికిఁ బ్రదక్షిణము గావించి దోసిలిబట్టి యిట్లనియె. జననీ! దుఃఖింపకుండుము. నాతండ్రిని జూచుకొనుము. వనవాసనియతి వేవే ముఁగియును. నీవు కన్నులుమూసికొని నిదురించుచుండఁగనే తొమ్మిది యైదు నగునేండ్లు గడచును. ఈ యేండ్లు సీకొక రాతిరి నిద్దురవలె గడచును. అంత వచ్చి మిత్రమండలము పరివేష్టింప సంపూర్ణకాముఁడనై యుండు నన్నుఁ గనఁగలవు.

ఇట్లు శ్రీరామభద్రుఁడు విషయములనెల్లఁ జేర్చి యీపలుకులలో నిమిడించి స్పష్టముగాఁ దెలిపి తల్లులను మున్నూటయేఁబదుగుండ్రను వేఱువేఱుగాఁ బరికించెను. తల్లిభంగి వగచువారిని గని దోసిలిపట్టి ధర్మ్యముగా నమ్మలారా! ఒక్కచోఁగూడియుండిన చిరపరిచయముచే నొండె నజ్ఞానముచే నొండె నే నేదియే నపరాధ మొనరించియున్న క్షమింప నంగీక

రింపు(డు. సెలవుతీసుకొనియెడ. అంగీకరింపు(డు. అని రాము(డు ధర్మయుతముగా( బలు(కగా విని యారాజపత్నులు మన స్సులు దుఃఖపూర్ణములు కా(గా నుండిరి. క్రౌంచగణముంబోలు కంఠరవముల వారెల్లరు విలపించిరి. సకలవాద్యధ్వనుల నిండి యున్న యారాజసౌధము వారెల్లరు చేయురోదనధ్వనులచే నిండియుండెను.

మహాత్ములారా! ఈభాగమున ననేకవిషయములు గలవు. శ్రీరామునిధర్మోపదేశ మిందు( గలదు. సావధానముగా విమ ర్శింతము.

"మన్యే ఖలు మయా పూర్వం వివత్సా బహవః కృతాః,
ప్రాణినో హింసితా వాపి తస్మాదిదముపస్థితం." ४

అని మూలము సంచితము ఫలోన్ముఖమై ప్రారబ్ధమనుపేర( బర(గును. ఫలానుభవమునందు మానవులు స్వస్వకర్మముల స్మరింతురు. అందు( బ్రధానముగా దుష్ఫలానుభవమునపుడు ప్రాక్కర్మముల స్మరింపక మానరు. సత్ఫలానుభవమునపు డహం కారము తమ్ము( బైకొన(గా నూరకయుండుటయు, అకారణ మునే మూ(డుజన్మములన(గా( గడచినది అప్పటిది రానున్నది యనువానిఫలముల నెఱుంగుదురు. కాని కర్మవశులగుట మరల నట్టికర్మములనే యాచరింతురు.

"ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే,
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి." ౬౭ అధ్యా. ౨.

అనుగీతావాక్యము కర్మము బలీయమనునర్థమును సూచించెడిని.

"ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః,
అహంకారవిమూఢాత్మా కర్తాహమితి మన్యతే." ౨౭ అధ్యా. ౩.

అను నీశ్రీకృష్ణవాక్యము మానవులపరవశత్వాహంకార భూయిష్ఠత్వములఁ దేటపఱచుచున్నది. ప్రకృతమున కీవాక్యముల సమన్వయింతము. పుత్త్రదుఃఖమున రాజు మున్ను తాఁజేసిన పాపకర్మములను స్మరించుచున్నాఁడు. ప్రాణిహింసలు శిశుహత్యలు తాఁ జేసినట్లు తలంచుచున్నాఁడు. వానికి ఫలమే యీదుఃఖమని నిశ్చయించుచున్నాఁడు. నాస్తికుఁడుకూడ నన్నము దొరకక యాఁకలి బాధింపఁగాఁ దొలిజన్మమున నెవ్వరికే నన్నము పెట్టనిదిన మిదియని భావించును. అంత్యకాలమున నెల్లరు నాత్మదుష్కృతములఁ దలంతురు. కాని దాన లాభమేమి? దుఃఖమే ఫలమగును. కావున నే

"కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన,
మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి. ౪౭
యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ,
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే. ౪౮
దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ,
బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః." ౪౯ గీత. ౨ అధ్యా.

అని గీతాచార్యులు తేటపఱచిరి. కర్మముల నాచరించుటకే మానవోత్తముల కధికారముగాని వానిఫలములఁ గోర నధికారములేదు. అనఁగాఁ గోరరాదనుట. ఫలహేతువులగు కర్మములు నీచములు. ఎవ్వారు ఫలాభిసంధిరహితములగు విధివిహితకర్మముల నాచరింతురో వారుత్తములగుచు భగవంతు ననుగ్రహమునకుఁ బాత్రులగుదురు. వారల కేనాఁడును గష్టములు రాకయుండ నాసర్వేశ్వరుఁడే యొనరించును. అట్టి వివేకములేక కర్మముల నాచరించి వానివలన నేవో ఫలముల

నాశించువారు దశరథునివలె నంత్యకాలమున దుఃఖఫలముల ననుభవింతురు. అను నీవిశేషవిషయ మీభాగము మనకుఁ దెలుపుచున్నది. సారమేమనఁగా నితరులశిశువులకు హాని గల్గించినవారు తమశిశువులమూలమున దుఃఖము కలుగఁ దపింతురు. ప్రాణిహింస మహాదరమునఁ గావించి తమరే తుదకు దుఃఖముచే హింసింపఁబడుదురు. అనుసారమును మనము గ్రహింపవలయును. అహింసావ్రతమే యుత్తమవ్రతమనునదియే యిటఁ గలముఖ్యవిషయము. అద్రోహమే దైవీసంపత్తనఁబడును.

"అహింసా సత్యమక్రోధస్త్యాగశ్శాంతిరపైశునం,
దయా భూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీరచాపలం. ౨
తేజః క్షమా ధృతిశ్శౌచమద్రోహో నాతిమానితా,
భవంతి సంపదం దైవీమభిజాతస్య భారత. ౩ గీత. ౧౬ అధ్యా.

అని శ్రీగీతాచార్యులు ప్రతిపాదించిరి కదా.

"సా సుజాతా సుజాతాని వైదేహీ ప్రస్థితా వనం,
భూషయామాస గాత్రాణి తైర్విచిత్రైర్విభూషణైః, ౧౪
వ్యరాజయత వైదేహీ వేశ్మ తత్సువిభూషణా,
ఉద్యతోంఽశుమతః కాలే ఖం ప్రభేవ వివస్వతః." ౧౫

అని మూలము. ఈభాగము మనకొక్కవిశేషమును దెల్పుచున్నది. సామాన్యదృష్టి నాలోచింపఁగా నున్నపట్టాభిషేకము చెడఁగా మీఁదు మిక్కిలి వనగమనము ప్రాప్తింపఁగా విశేషించి స్త్రీజాతికి దుఃఖముగలుగుట స్వభావము. జానకి యట్లుగాక మహానందమున నవరత్నభూషణములఁ దాల్చి యాహార్ష్యముఁ బ్రకాశింపఁజేసినది. దీనింబట్టి విమర్శింతము. సుజాతా=చక్కని పుట్టుకగలది. అనఁగా నయోనిజగా నవతరించినది. అనఁగా

భగవతి మాయ యని యర్థము. వనగమనము చేయుతతి సుజా తానిగా త్రాణి=శాస్త్రమునఁ జెప్పినట్లున్న యవయవములను, విచిత్రై ర్విభూషణై ర్భూషయామాస=విచిత్రములనఁగా నితర కాంతాగణాలభ్యములగు నాభరణములచే నలంకరించెను. అనఁగా నాయవయవములకు నితరభూషణము లక్కఱలే కున్నను గార్హ్యార్థము ధరించెనని భావము. రావణుని వెంటఁ తన ప్రతికృతి యరుగుతఱి సుగ్రీవాదులముం దీభూషణములఁ బాఱవైచినఁగాని శ్రీరాముని కార్యమునకు ననుకూలము కాదని యూహించియే ధరించెననియే మన మెఱుంగవలయును. దశరథుఁడు తన్ను నంతమర్యాదతోఁ జూచినందున నాయలంకార మున నాగృహమును బ్రకాశింపఁజేసెను. ఖం ప్రభేవ వివస్వతః= సూర్యప్రభ ఆకసమునువలె. ఇచ్చట దశరథునిసౌధ మాకాశ ముగను, సీతావిభూషణకాంతులు సూర్యప్రభగను సీత సూర్య బింబముగను జెప్పఁబడినది. దశరథునిల్లు శూన్యమగు ననుభావ మిందు సూచింపఁబడినది. అనఁగా నిఁక దశరథుఁ డాయింట నుండఁడనియే తాత్పర్యము. మృతి కాసన్నుఁడుగ నున్న వాఁడనుట సారము. సూర్యబింబమనఁగాఁ దేజోరాశి యని యర్థము.

"తేజసాం గోళకస్సూర్యో గ్రహర్క్షాణ్యంబుగోళకాః"

అని సిద్ధాంతమునఁ గలదు. తేజోరాశికి సూర్యుఁడని పేరు. మనకుఁ గనఁబడునది తేజోరాశిగాని సూర్యుఁడనుపురుషుఁడు కాఁడు. ఆ తేజోగోళాధిష్ఠాన దేవతకు సూర్యుఁడని పేరు. ప్రకృ పము సీతారూపము తేజోబృందమని యెఱుంగందగు. భగవంతుఁడు తేజోరూపుఁడు. భగవతియుఁ దేజోరూపిణి.

"ప్రాదుర్బభూవ పరమం తేజఃపుంజమనూపమం,
కోటిసూర్యప్రతీకాశం చంద్రకోటిసుశీతలం. ౭౩
తన్మధ్యమే సముదభూచ్చక్రాకారమనుత్తమం,
తన్మధ్యమే మహాదేవీ ముదయార్కసమప్రభా."	౭౪

లలితోపాఖ్యానము. ౮ అధ్యా.

"తటిల్లేఖాతన్వీం తపనశశివైశ్వానరమయీం
నిషణ్ణాం షణ్ణామప్యుపరి కమలానాం తవకళాం,
మహాపద్మాటవ్యాం మృదితమలమాయేన మనసా
మహాంతః పశ్యంతో దధతి పరమానందలహరీం." ౨౧

అని శ్రీశంకరాచార్యులు తెటపఱచిరి. అట్టి తేజస్స్వరూపిణి యగు భగవతి సీత దశరథునకుఁ గడసారిచూపుగా దర్శన మొసంగెనని యెఱుంగవలయును. ఇందు దశరథమృతియు నాపౌధభాగ్యక్షతియు భగవతీభక్తానుగ్రహతత్పరత్వము సూచింపఁబడినవి.

"అసత్యస్సర్వలోకేఽస్మిన్ సతతం సత్కృతాః ప్రియైః
భర్తారం నానుమన్యంతే వినిపాతగతం స్త్రియః. ౨౦
ఏష స్వభావో నారీణా మనుభూయ పురా సుఖం,
అల్పామప్యాపదం ప్రాప్య దుష్యంతి ప్రజహత్యపి. ౨౧
అసత్యశీలా వికృతా దుర్గ్రాహ్యహృదయాస్సదా,
యువత్యః పాపసంకల్పాః క్షణమాత్రాద్విరాగిణః. ౨౨
న కులం న కృతం విద్యా న దత్తం నాపి సంగ్రహం
స్త్రీణాం గృహ్ణాతి హృదయమనిత్యహృదయా హి తాః." ౨౩

అని మూలము. కౌసల్య సీతాదేవికి సాధారణముగా స్త్రీలకుఁ గలస్వభావమును దెలుపుచున్నది.

"నైతా రూపం పరీక్షంతే నాసాం వయసి సంస్థితిః,
సురూపం వా విరూపం వా పుమానిత్యేవ భుంజతే. ౧౪

పౌంశ్చల్యాచ్చలచిత్తాచ్చ నైస్నేహాచ్చ స్వభావతః,
రక్షితా యత్నతోఽపీహ భర్తృష్వేతా వికుర్వతే. ౧౫

ఏవం స్వభావం జ్ఞాత్వాసాం ప్రజాపతినిసర్గజం,
పరమం యత్నమాతిష్ఠేత్పురుషో రక్షణం ప్రతి. ౧౬

శయ్యాసనమలంకారం కామం క్రోధమనార్జవం,
ద్రోహభావం కుచర్యాం చ స్త్రీభ్యో మనురకల్పయత్." ౧౭

మను. ౯ అధ్యా.

అను నీమనువాక్యములు రామాయణాభిప్రాయము నే బోధించు చున్నవి కదా. వీని రెండింటిని బరికింపఁగా నేనాఁటినుండియో స్త్రీలస్వభావము స్పష్టమగుచు ఎంతకాలము భర్త వస్త్రాభరణాదులచే సత్కరించినను బతికొకయాపదవచ్చినపుడు వానిని బ్రేమింపక యీసడింతురని యేర్పడినది. పతిని దూషించుటయు స్త్రీస్వభావమని తేటపడినది వారిహృదయ మిదియని గ్రహింపరాదనుటయు నెఱుకపడినది. కులవిద్యాదులు జేసిన మేలు వారి హృదయములను దృప్తిపఱుపఁజాలవను విషయము సిద్ధాంతితమగుచున్నది. వారిమన స్సొకరీతిగా నుండక మార్పునొందుచుండుననియుఁ దెలియవచ్చెడిని. ఈవిషయ మీకాలముననఁగాక పూర్వకాలమునందుఁగూడ స్త్రీస్వభావము ప్రాయికముగా నిట్టిదే యని తోఁచుచున్నది. ఇప్పుడు వారి కొసంగుస్వాతంత్ర్యము ముందెట్టియుపకారము చేయునో పరీక్షింపవలసియే యున్నది. స్త్రీలయను రాగప్రదర్శనము క్షణభంగురమనియే యిటఁ గలసారము.

"సాధ్వీనాం హి స్థితానాం తు శీలే సత్యే శ్రుతే శమే,
స్త్రీణాం పవిత్రం పరమం పతిరేకో విశిష్యతే. ౨౮
స త్వయా నావమంతవ్యః పుత్త్రః ప్రవ్రాజితో మమ,
తవ దైవతమస్త్వేష నిర్ధనస్సధనోఽపి వా." ౨౯

అని మూలము. శీలము సత్యము గురుజనోపదేశము ఓర్పు అనువానియందు నాసక్తిగలిగి వర్తించుస్త్రీలకుఁ బరమదైవము పతియే. ఇంకొకఁడు కాఁడు. అనఁగాఁ బతికంటె నెక్కుడు ప్రేమింపఁదగువస్తువు లేదని భావము. అట్టి ప్రేమాస్పదుఁడగు భర్తను శ్రీరామచంద్రుని వనములకరుగువాని నవమానింప కుము. అనఁగాఁ బరిహాసోక్తుల నాడకుమని భావము. పతి నిర్ధనుఁడుగాని ధనవంతుఁడుగాని నీకు దైవముకదా. అని పతివ్రతాధర్మములను కౌసల్య తెలిపెను. సీతాస్వభావము పండ్రెండువత్సరములు కౌసల్య పరికించెను. మరల నెందుల కీయుపదేశము? అయోనిసంభూతురాలనియు సీత నెఱుంగును గదా. అన్న స్త్రీస్వభావము నియతముకాదని యనుమానించి బోధించెననియు నీమూలమున లోకమునఁ గలస్త్రీలకెల్ల నీయుపదేశము పనికివచ్చుననియు సమాధానము చెప్ప వచ్చును. లోకమునకు ధర్మములనెల్ల నుపదేశించునుగదా రామాయణము. కావుననే యాయాయితావుల నాయాధర్మ ములను దెలిపెనని యెఱుంగందగు.

కపటనాటకసూత్రధారులగుకొందఱు మధ్యవైష్ణవులు కుటుంభరులై ధనార్జనమునకు సులభోపాయమని శిష్యులం గూర్చుకొని మంత్రోపదేశముచేయుచు మోగులమని చెప్పు కొనుచు భక్తుఁడు పతివ్రతవంటివాఁడనియుఁ బతివ్రతయొక్క భర్తనే నమ్ముకొనియుండులాగున నతఁడుకూడ నొక్కవిష్ణువునే

నమ్ముకొనియుండవలయు ననుచు బోధింతురు. గురూచ్ఛిష్టమే శిష్యులకుఁ బ్రసాదమని వారివాదము. భగవంతుఁడు కర్మపాశ ములలోఁ దగిలించుననియు గురువు చక్కఁగా ముక్తికిఁ గొనుచుఁబోవుననియుఁ బామరులగుశిష్యులకు బోధింతురు. వారికంటె ద్రోహులు లేరనవలయు. పతియే పరమదైవమని యీ రామాయణమే బోధించెనుగదా. పతివ్రతకు భర్తయే దైవమనఁగా నర్థమేమి? దైవమువలె భావించి తదాజ్ఞఁ దలఁ దాల్పవలయునని భావమా? లేక దైవమే భర్తయని భావ మున నారాధింపవలయునని భావమా? భక్తున కిష్టదైవము తండ్రి. తండ్రి కొడుకును రక్షించునట్లు భగవంతుఁడు భక్తు లను రక్షించును. పతియే దైవమనఁగా దండ్రి యనియా భావము. ప్రేమమే గురుజనకదైవవిషయమున భక్తి యనం బడును. భర్తయెడఁ బ్రేమమనఁబడును. పతివ్రత పతిని దండ్రిగా భావింపరాదు. దైవముత్కృష్టుఁడని భావించునట్లు తల్లిదండ్రులు లోనగుబంధువులలో నుత్కృష్టుఁడనియు నతనియానతిని దక్కినవారిమాటకంటె నుత్కృష్టమని భావింపవలయుననియుఁ దాత్పర్యముగాని పైవారుచెప్పునట్టి యర్థము కాదు. అట్టివారి మాటలఁ జెవియొగ్గి వినరాదు. ఇట్టియుపమానము లితరుల మాటలకు లోఁబడకయుండఁ దమమాటలనే నమ్మవలయు నను దుర్బుద్ధిచేఁ దెలుపు కుయుక్తులు కాని వేఱుకావు. పతిశుశ్రూష కంటె నుత్తమమైనకార్యము లేదనియే యిందలిసారము.

"కరిష్యే సర్వమేవాహం మార్యా యదనుశాస్తి మాం,
అభిజ్ఞాస్మి యథా భర్తుర్వర్తితవ్యం శ్రుతం చ మే. ౨౭
న మామసజ్జనేనార్యా సమానయితుమర్హతి,
ధర్మాద్విచలితుం నాహమలం చంద్రాదివ ప్రభా." ౨౮

అని మూలము. ఇవి సీతావాక్యములు. సామాన్యార్థము సుగమము. తమయవతారతత్త్వ మెఱిఁగినభగవతి గూఢముగాఁ దనయాశయమును దెలుపుచున్నది. అభిజ్ఞాస్మి=విద్వాంసురాలనగుదును. నాయెఱుంగనిధర్మములు లేవని తాత్పర్యము. భర్తృవిషయే యథా వర్తితవ్యమ్=భగవంతునియెడ నెట్లు ప్రవర్తింపఁదగునో యందు విద్వాంసురాలనే యని భావము. నేను భగవంతునిచ్ఛాశక్తినిగాన నాపరాత్పరునిభావ మేదియో నాకంటెఁ దెలిసికొనఁదగినవారు లేరని సారము. మే = విభక్తివిపరిణామమున మయా అని యర్థము చెప్పందగును. మయా శ్రుతంచ = నాచే వినఁబడియెను. అనఁగా మేము సృష్ట్యున్ముఖులము కాఁగాఁ బ్రాక్సృష్టిక్రమమంతయు వేదములు తెలుపునని భావము. వేదముల కనాదిత్వ మిద్దానిమూలమున సిద్ధము.

"అగ్నివాయురవిభ్యస్తు త్రయం బ్రహ్మ సనాతనం,
దుదోహ యజ్ఞసిద్ధ్యర్థమృగ్యజుస్సామలక్షణం. ౨౩ మను. ౧ అధ్యా.
కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవం,
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితం." ౧౫ గీత. ౩ అధ్యా.

అను వీనింబట్టి వేదము శాశ్వతమని స్పష్టము. వేదములు కల్పితములనువారు దానితత్త్వము నెఱుంగరు. వేదమనఁగాఁ బరమేశ్వరు నుద్దేశ్యములను దెలుపునవి. వానిమూలమున మన మెఱుంగుదుముగాన వేదము లనఁబడునని నిర్వచనము చేయఁబడియెను. భగవంతుఁడు శాశ్వతుఁడని యంగీకరించినయెడలఁ దదాశయములు సనాతనములనియే యంగీకరింపవలయును. వేదములమూలమున నన్నిధర్మముల నెఱింగినదాననే యని సీత తెలిపెనుటయే యిందుఁగల యర్థవిశేషము.

మామసజ్జనేన సమానయితుం నార్హతి=దుష్టనితోసము దాయములో సమానముగాఁ జేయఁదగదు. నేను జిదానంద రూపిణినని తలంపుమని హెచ్చరించుచున్నది.

"సుధాసింధోర్మధ్యే సురవిటపివాటీపరివృతే
మణిద్వీపే నీపోపవనవతి చింతామణిగృహే,
శివాకారే మంచే పరమశివపర్యంకనిలయాం
భజంతి త్వాం ధన్యాః కతిచన చిదానందలహరీమ్." ౮

అని శ్రీశంకరభగవత్పాదులు నిర్వచించిరి.

"చిత్ జ్ఞానం తదాకారః ఆనందః నిరతిశయసుఖం తస్యలహరీముత్సేక రూపాం త్వాం కతిచన భజంతి."

అని యన్వయక్రమము. ఇందు సమయమతము చెప్పఁబడినది. సమయమతమనఁగా "ఆంతరపూజారతిః" మానసికపూజ. ఓ కౌసల్యా! లోకమునఁ దఱచుగానుండుస్త్రీజనముతో సమాను రాల ననుకొనకుము ధర్మమునుండి యించుకంతయుఁ జలిం పను.

"వృషో హి భగవాన్ ధర్మః."

అని మనుస్మృతి ప్రమాణము కలదు. ధర్మస్వరూపిణినిగా నన్నెఱుంగుమాయని సీత కౌసల్యను నుపదేశించుచున్నది. "చంద్రాదివ ప్రభా" వెన్నెల చంద్రుని వదలనట్లు అనఁగాఁ జంద్రచంద్రికల కెట్టిసంబంధముకలదో శ్రీరామునకు నాకు నట్టి యవినాభావసంబంధము కలదని తాత్పర్యము. అనఁగా నేను మహాప్రకృతిని. పరమాత్మతత్త్వము నే నెఱిఁగిన ట్లితరు లెఱుంగఁజాలరు. నన్ను మహామాయనుగా నెఱుంగుము. నేను జిదానందస్వరూపిణిని. ఇట్టి నేను లోకమునఁ గనంబడుకులటల

వలెఁ బతి నవమానింతునని యేల పొరపడియెదవు? అది నీవంటి ముదుసలికిఁ దగదు. భర్తయిష్టానుసారముగఁ బ్రవర్తింపనే యవతరించితినని సీత గూఢముగా స్వాభిప్రాయ మెఱిఁగించె నని యెఱుంగవలయును.

"మితం దదాతి హి పితా మితం మాతా మితం సుతః,
అమితస్య హి దాతారం భర్తారం కా న పూజయేత్. 30
సాహమేవంగతా శ్రేష్ఠా శ్రుతధర్మపరావరా,
ఆర్యే కిమవమన్యేఽహం స్త్రీణాం భర్తా హి దైవతం." 31

అని మూలము. తనయుపన్యాసము ముగించుచు సీత మఱియు నుక్తార్థమునే తెలుపుచున్నది. మధ్యవైష్ణవ దుర్వాదనిర్వాపణ మిందుఁ గావించినవిధ మెఱుంగఁదగు. ఐహికాముష్మికసుఖ ముల నొసంగుభర్త నేస్త్రీ పూజింపకయుండును? తల్లిదండ్రుల కంటెఁ దనయులకంటె భర్త మిక్కిలి సమ్మానార్హుఁడన్నవిష యమే యిట ముఖ్యము. ధర్మములను విని యెఱింగియున్న నేనేల పతి నవమానింతును? స్త్రీలకు భర్త దైవతముకదా. అనఁగా దేవత నారాధించినట్లు శుశ్రూషలచేఁ దనుపవలయు నని భావము. భగవంతుని దండ్రిగా భావింపవలయును. అట్లె భర్తను భావింపరాదు. తాను సేవింపఁదగినవారిలో నెల్ల నుత్త మోత్తమునిగా భావింపవలయునని భావము. అంతియకాని సర్వేశ్వరుఁడే లేఁడు. పతియే భగవంతుఁడు తల్లియుఁ దండ్రియు నని కాదు.

"సుప్తాయాస్తే గమిష్యంతి నవ వర్షాణి పంచ చ,
సాసమగ్రమిహ ప్రాప్తం మాం ద్రక్ష్యసి సుహృద్వృతం." 32

రామవాక్య మిది. ఒక్కరాత్రి నీవు నిదురించుచుండఁగాఁ దొమ్మిదియైదునగు సంవత్సరములు గడచును. పితృవాక్యము కొంతగాంచకయుండఁ జెల్లించి వచ్చి సజ్జనులఁ గూడియుండు నన్నుఁ జూడఁగలవు. అనునది ప్రాతీతికార్థము. ఇందు రామచంద్రుని భావమేమి? క్షణకాలమువలె నీపదునాలుగేండ్లు గడచుననియే యని కొందఱందురు. అది కాదు.

"యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ,
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః." ఉ॥
"నిశా రాత్రిః సర్వపదార్థానామవివేకకరీ తమస్స్వభావత్వాత్ సర్వ భూతానాం సర్వేషాం భూతానామ్." అని భాష్యము.

అనుగీతావాక్యము ననుసరించి తల్లీ! తమోగుణప్రధానవై యిట్లు పతిమృతికి సుతవియోగమునకు దుఃఖించుచుండునంతలో నా వ్రతము పదునాలుగేండ్లు గడచును. నాయవతారఫల మగు దుష్టనిగ్రహపూర్వకశిష్టధర్మపరిపాలన మొనరించి నాకు సాయపడ నవతరించిన బ్రహ్మాదులయంశమునఁ బుట్టినజాంబవదాదులం గూడివచ్చిన నన్ను నాయపరస్వరూపమనఁబడుజానకిని జూడఁ గలవు. నారాకదనుక నీవు దుఃఖములనే యనుభవించుచుందు వనియు నారాకతో నీదుఃఖము లంతమొందుననియుఁ దాత్పర్యము. ఇదియే యీభాగమునుండి గ్రహింపఁదగినసారము. మానవులజ్ఞానకల్పితకార్యములచే గాలమును వ్యర్థముగాఁ బుత్తురు. అదియే తమోగుణకార్యము. ఎప్పుడు జ్ఞానభానూదయము మనోవ్యోమమున నగునో దుఃఖాంతకాల మదియే యనియు నయ్యది గాకయున్న నాజన్మమంతయు నిద్రావస్థలో నున్నయట్లే భావింపవచ్చుననియు మన మెఱుంగఁదగునీతి. భగవ

దారాధనకుతూహల ప్రాదుర్భావమే జ్ఞానభానూదయమని తాత్పర్యము. ఈవిషయమునే శ్రీరామమూర్తి యుపదేశించె నని మన మెఱుంగుట మంచిది.

"సంవాసాత్పరుషం కించిదజ్ఞానాద్వాపి యత్కృతం,
తన్మే సమనుజానీత సర్వాశ్చామంత్రయామి వః." 3౦

లోకమున లోకసదాచారమును శ్రీరాముఁడు తెల్పుచున్నాఁడు. ఎంతటివారుకాని స్థలాంతరమున కరుగునపుడు తమవారి ప్రార్థించునెపమున గృహదేవతలను వృక్షముల నాశ్రయించియుండుదేవతలను మఱియు నెల్లతావుల వ్యాపించి యాయాపాపఫలముల కనురూపమగుబాధలఁ గల్పించుదేవతలను బ్రార్థింపవలయును.

"యే వృక్షేషు సస్పింజరా నీలగ్రీవా విలోహితాః,
యే భూతానామధిపతయో విశిఖాసః కపర్దినః
యే అన్నేషు వివిధ్యంతి పాత్రేషు పిబతో జనాన్,
యే పథాంపథి రక్షయ ఐలబృదా యవ్యుధః
యే తీర్థాని ప్రచరంతి సృకావంతో నిషంగిణః
య ఏతావంతశ్చ భూయాగ్ంసశ్చ దిశో రుద్రా వితస్థిరే."

అను శ్రుతి ప్రమాణము ననుసరించి యాభూతములను వేఁడుకొని పోవలయును. "మిమ్మెల్లఁ బ్రార్థించుచున్నాను. నాయపరాధము లేమూలమునఁ గల్గినను వానిని క్షమింపుఁడు." అని ప్రార్థించి పిదపఁ బ్రయాణము సాగింపవలయు నన్నన్యాయమును శ్రీరామమూర్తి తాను దల్లులఁ బ్రార్థించునెపమునఁ దెలిపెనని తెలియందగు. శ్రీరామునిధర్మోపదేశములు వ్యాఖ్యానరూపములేకదా. సదాచారములఁ దానాచరించి యా

మూలముననే బోధింప నవతరించినవాఁడని మనము నమ్మవల యును. ఈనీతిని చెప్పెనని మనమేల యూహింపవలయునని ప్రశ్నింతురేమో.

– "వచనం రాఘవస్యైతద్ధర్మయుక్తం సమాహితం,
శ్రుత్వా సీతాపి సుశ్రోణీ శోకోపహతచేతనా." 38

అను నీమూలము పైవ్రాసినయర్థము సత్యమని తెలుపుచున్నది. "సమాహితం సమీచీనార్థయుక్తం." అని గోవిందరాజులు మహేశ్వరతీర్థులు వ్రాసిరి. ధర్మయుక్తము సమాహితము నన: గా నర్థమేమి? కేవల ముపచారార్థమే యైన నీవిశేషణము వ్యర్థము లనియే చెప్పవలసియుండును: గదా. ఇట్టు లీభాగము మనకు శ్రీ సీతారాములయాశయములఁ దెల్పుచున్నది. వాని నెఱింగి యాయిరువురదివ్యపాదారవిందముల ధ్యానించుచుఁ దదను సారముగా మెలఁగవలయునని దృఢసంకల్పము చేయవలయు. ఈభాగమున నధ్యాత్మరామాయణమునందు విశేషము కాన రాదు. తరువాతికథకు మరలుదము.

## శ్రీరామావతారఫలమగు వనప్రయాణము.

*తరువాత సీతారాములు లక్ష్మణుఁడును దోసిలులొగ్గి దశరథుపదములఁ దాఁకి మ్రొక్కి పెద్దలసేవించునవకాశము లేక పోయె నన్నదైన్యము పొడమ వలగొనిరి. సకలధర్మవేత్తయగు శ్రీరాముఁడు తండ్రియనుమతినొందక సీతాసౌమిత్రులం బిలు చుకొనిపోవరాదని యెఱింగి తండ్రిచే ననుమతి వారలకిప్పించి కౌసల్యను వదలిపోవలసివచ్చెఁగదా యనువగపు సుంతభ్రాంతిని గల్పింపఁగా నామెకు నమస్కరించెను. లక్ష్మణుఁడును నమస్కరిం

* ఇది నలువదియవసర్గమునుండి గ్రహింపఁబడినది.

చెను. పిదపసుమిత్రపాదములం దాఁకి వందనమాచరించెను. సుమిత్రయు నమస్కరించిన లక్ష్మణునిం గాంచి దేహధర్మము ననుసరించి విలపించుచు మహాబాహుఁడగు నతని శిరంబు మూర్కొని యతనికి మిక్కిలి హితముగోరి యిట్లు పలికెను. పుత్త్రకా! కౌసల్యయేరీతి లోకమును రక్షించు కార్యముకొఱకు శ్రీరాముని గనెనో యారీతిగా నేను సుహృజ్జనుఁడగు శ్రీరాముని యందు నత్యంతానురక్తుఁడవగు నిన్ను, నన్నుంగూడి వనములకరిగి సేవచేయుపొంటెఁ గంటిని. ఇమ్మహా కార్యముకొఱకే దైవము నిన్ను నాయందు సృష్టించెను. అట్టులగుట శ్రీరాముఁడు వనమున ననేకవిచిత్రములు చూచుచుఁ బరవశుఁడై యరుగుచుండఁగా నీవు ప్రమాదంపడక యాతనిం గాపాడుచుండవలయుఁజుమీ. శ్రీరామునితోడ నేలపోవలయునని ప్రశ్నింతువేమో వినుము. అనఘా! లక్ష్మణా! శ్రీరాముఁడు రాజ్యములోనగునవి లేక విపన్నుఁడయి చూపట్టినను రాజ్యము లోనగునవి కలిగి సంపన్నుఁడై యున్నను శ్రీరాముఁడే నీకు దిక్కు. ఏటికందువేమో చిన్నవాఁడు జ్యేష్ఠునకు లోఁబడియుండుట యీలోకమున సజ్జనులనుష్ఠించు ధర్మము. మఱియు ఇట్టి సద్వర్తనము, దానము, యజ్ఞదీక్షఁబూనుట, సంగ్రామములందు దేహము నర్పించుట యనునివియన్నియు మీకులమున కర్హములు. అంతియకాక చిరకాలమునుండి వచ్చుధర్మములు. కాఁబట్టి దేహము విడిచిపెట్టవలసివచ్చినను శ్రీరాముని రక్షింపవలయును. అని పలికి రామునందే ప్రీతికలిగి యతనితోఁ బయనముచేయ సిద్ధముగ నుండుకుమారుని జూచి వత్సా! పొమ్ము! పొమ్మని పలుసారులు పలికి మరలఁ గుమారునకు గర్తవ్యమెఱిఁగింపఁ దలంచి యిట్లు వాక్రుచ్చెను. నాయనా! శ్రీరాముని దశరథు

నిగా నెఱుంగుము. సీతాదేవిని నన్నుగా నెఱుంగుము. అటవి నయోధ్యనుగా నెఱుంగుము. సుఖముగాఁ బోయిరమ్ము. అని సముచితగతిఁ దెల్పెను.

అంతట సుమంత్రుఁడు వినయవేత్తయగుట నింద్రునికడ మాతలివలె రామునికడ నంజలింబట్టి యిట్లు విన్నవించెను. మహాయశోవిభూషణా! అరదముంగొనివచ్చితిని. ఆరోహింపుము. నీకు భద్రమగుఁగాక. ఎచ్చోటికిఁ బోవలయునందువో యందుఁ బోనిత్తును. పదునాలుగువర్షములుకదా మీవనవాసము! ఆలాగే కైక మీకాజ్ఞచేసెను. కనుక నిఁక నాలస్యమేల? అపరిమితియం దొక్కదినము గతించిన నెంతయో మేలుకదా. త్వరితముగ దాని గడువ మొదలుపెట్టుటయే మంచిదని యూరకుండెను. జానకియత్తగారొసంగిన వస్త్రాభరణముల నలంకరించుకొని మనోమోదము పైకొనఁగా భాస్కరుంబోలి మెఱయుస్యందనము నెక్కెను. కనకరథము మాతవానివలె మెఱయుచుండుదాని నాయన్నదమ్ములు నధిష్ఠించిరి. దశరథుఁడు కోడలు సీతకు వనము నుండుకాలమును లెక్కించి యంతకాలమునకుఁ దగినవస్త్రాభరణముల నొసంగెను. కొడుకులకు నిరువురకు నాయుధములు కవచముల నిచ్చెను. సీతారామలక్ష్మణులకు రాజిచ్చిన యావస్తువులను బుటికయు గుద్దలియుఁ బదిలముగా రథమునందుఁ జేర్చి వారు మూవురురథమెక్కుటం గాంచి వాయుగమనము గలగుఱ్ఱముల నదలించి తోలెను.

రామమూర్తి వనమునఁ జాలకాలము వసింపఁబోవు చుండఁగా నాపురమెల్ల మూర్ఛమునిఁగెను. గజాశ్వములుకూడ స్మృతితప్పిపడియెను. జానపదు లుత్సవార్థ మురుదెంచియున్న

వారు గాన వారునట్లే మూర్ఛిల్లిరి. పౌరు లంత మనస్సులు కలఁత నొందఁగాఁ గింకర్తవ్యతామూఢులై రాముని వెంటఁబోవ నుంకించుచుండిరి. వగపెల్లిదమున మదగజములు కుపితములై ఘుంకారము లొనరించెను. పరితపించుచు గుఱ్ఱములు పరుగిడుటం జేసి వానియాభరణములు మ్రోఁగుచుండెను. పురమెల్ల ధ్వనిగలదయ్యెను. అంత బాలురు వృద్ధులు మొదలగువారు శ్రీరాము నెడఁబాసి వగలఁబొగులుచు దప్పిగొన్నవారు జలములకుంబోవు చందమున రామునికడకుం బోయిరి. పరుగువాఱి రామరథ పార్శ్వములందుఁ గొందఱు వెనుకభాగమునఁ గొందఱు నుండి వానిం బట్టుకొని వ్రేలాడుచు రాముని మోమును జూచుచుఁ గన్నీటిధారలు పాఱుచుండఁగా గట్టిగా నోసూతా! పగ్గముల బిగించి పట్టుకొమ్ము. మెలమెల్లన నడుపుము. రామమూర్తి దివ్య ముఖమును గాంతుము. ఇదియే సమయము. మరల నెన్నటికో యదియబ్బును. దేవకుమారునింబురుడించు రామమూర్తి వనమున కరుగుచుండఁ దల్లి మన స్సెంతగట్టిదో శకలములుగాకయున్న దే. అది యయోమయముకాఁబోలును. సీతయు ఛాయవలెఁ బతి వెంటఁ బోవుచున్నది. కనుక నామె కృతార్థురా లయ్యెను. సాధ్వీ ధర్మముల నెఱింగినసీత సూర్యరశ్మి మేరుపర్వతము విడువనిరీతి నాధర్మమునే చేపట్టినది. లక్ష్మణా! ప్రియవాదియగు శ్రీరామునకు నిరంతరము శుశ్రూషచేయుచునే యుందువు. ఎంతటికృతార్థజన్ముఁడవయ్యా! రాము ననుసరించిపోవుటయే నీకుఁ దపస్సిద్ధి. స్వర్గప్రాప్తికి నీకిదియే మార్గము. ఇక్ష్వాకువంశమునకు యశస్సుగూర్చుచు నెల్లరకు హితముగావర్తించుచు నున్న రామమూర్తి నాపౌరజానపదులెల్ల నిట్లు మాటలాడుచుఁ బోవుచు నెడఁబాయఁజాలక కన్నీరు వెడలఁ బోవుచుండిరి.

దశరథుఁ డంత వంతఁగుందుచుఁ దనవలె వంతఁగుందు కాంతలంగూడి నాప్రియపుత్త్రు నొకసారి చూచివత్తునని పలుకుచు నిల్లువెడలెను. అత్తఱి గజరాజు బంధింపఁబడఁగా స్త్రీగజములు వగపున గొప్పగా ఘీంకరించుచందమున రామమూర్తి పయనముచేయుచుండ స్త్రీలెల్ల నేడ్చుచుండ నాధ్వని ముందు వినంబడెను. ఆదుఃఖమునకు రాజు రాహుగ్రస్తచంద్రబింబముపగిది వివర్ణుఁడయ్యె. రాముఁడు కడుంగడు ధీరుఁడగుట జనులు వెంబడించుటయు వగచుటయుం జూచియు మది నించుకేఁ గలంగక సుమంత్రుని వేగ రథముఁ దోలుమని శాసించెను. తోలుత రాముఁడు రథము పోనిమ్మనఁగా జనులు నిలుపవయ్యా యని వేఁడఁగా నతఁ డారెంటిని జేయఁజాలకయుండెను. రాముఁడు పయనము సాగింపఁగనే రథవేగజనిత పరాగము పౌరులకన్నీటం దడిసి యడంగెను. పౌరు లేడ్చుచుఁ గన్నీటఁ గార్చుచు హాహాకారముల వెడలించుచు మూర్ఛిల్లిరి. మత్స్యములు చలింపఁగా నిటునటుకదలు తామరలనుండి మకరందము స్రవించునట్లు వనితానేత్రములనుండి దుఃఖాశ్రువులు పాఱసాగెను. రాజు పురమెల్ల రామగమనమునకు దుఃఖించుచుండఁ గాంచి మఱింత వంత కలుగ మూలచ్ఛేదనునఁబడు మహావృక్షమురీతిఁ దటాలున నేలఁబడియె. రామునివెనుక వనుగుజనులందఱు దుఃఖించురాజును గని యయ్యో యని మఱింత దుఃఖించిరి. కొంద ఱక్కటా! శ్రీరామా యనిరి. కొంద ఱయ్యో రామునిగన్నతల్లీ యనిరి. రోదనముచేసిరి. అంతఃపురకాంతలు నవ్లే యేడ్చిరి. రామమూర్తి యాదుఃఖధ్వని నాలకించి వెనుకఁదిరిగి వారింగాంచుచుఁ దన్నుఁ జూడవచ్చు తల్లిదండ్రులం గనియె. త్రాటఁగట్టివేయఁబడిన గుఱ్ఱపుఁబిల్ల

తనతల్లిని దైన్యమునఁ గనునట్టులు ధర్మపాశబద్ధుఁడు తానగుట
నట్లు వగచు జననీజనకులఁ గాంచఁజాలక క్రీఁగంటం జూచు
చుండెను. తల్లిదండ్రులు కాలినడకల వచ్చుచు దుఃఖించు
చుండం గాంచి సుమంత్రా! ఇఁక రథము వేగపోనిమ్మని యాజ్ఞా
పించెను. వారిం గాంచుట రామునకు దుఃఖకరముగనే
యుండెను. తోత్రముచే (బరిగోలచే) బొడువఁబడినగజ
మా దెబ్బకు నోర్వఁజాలనియట్లు తావారలంగని యాదుఃఖమున
కోర్వఁజాలఁడయ్యెను. ధేనువు దూడపైఁగలప్రీతిచే దానిం
గట్టివేసినచోటికిఁ బరువునవచ్చునట్లు కౌసల్యయు రాముఁడున్న
యెడకుఁ బరుగునవచ్చెను. హా రామా! హా సీతా! హా సౌమిత్రీ!
యనుచుఁ బెరెలుంగునం బిల్చుచు వారికింగల్గిన దుఃఖమునకుఁ
గన్నీరు విడుచుచు నిటునటు తిరుగుచున్న తల్లిని బలుసారులు
రాముఁడు చూచెను. నిలునిలువుమని రాజుపలుకఁ బోనిమ్ము
పోనిమ్మని రాముఁడుపలుక సూతుఁ డేమియుఁదోఁపక యుండెను.
సుమంత్రా! నిన్నొకవేళ రాజు నామాట వినకపోయితి వేల
యనియడుగు నేని ఆమహాధ్వనిలో స్పష్టముగా వినఁబడదయ్యె
నని నీవు బదులు చెప్పవచ్చును. ఈయబద్ధమైనఁ బలుకవచ్చుం
గాని దురంతదుఃఖము వారనుభవింపఁజూచి యోర్వ శక్యము
కాదని రాముఁడు పలికెను. సూతుఁడు రామవాక్యనాలకించి
యట్లే చేయఁబూని కూడవచ్చు నంతఃపురజనమున కతనిచే
వనుమతి నిప్పించి యాజానేయములగుటఁ వానిందోలెను.
జనులు రామునకుఁ బ్రదక్షిణమొనరించి వెనుకకు మరలిరి.
అందుఁగలవారలకునెల్ల వారిదేహములు మరలినవేకాని మన
స్సులు నేత్రోదకములు మాత్రము మరలఁజాలవయ్యెను.
మంత్రులు రాజుంగాంచి ఏ శ్రీరాముని వేగముగా రావలెనని

కోరుదుమో అతనిని దూరముగా వెంబడించి పోవరాదని పల్కిరి. సకలవిధములఁ బొగులుచున్న రాజు మంత్రివాక్యము విని ఆమాట తగియున్నదిగాన రాముని వెంబడింపక తాను భార్యలతోడ బ్రియకుమారునిం గాంచుచుండెను.

మహామతులారా! ఈభాగమున నొకటిరెండువిషయములు విశేషించి విచారింపఁదగియున్నవి. విశేషార్థములు గల భాగములును గలవు. కాన విసుగునొందక విమర్శింతము. లక్ష్మణుఁడు కౌసల్యకుఁ దొలుత నమస్కరించి పిదప సుమిత్రకు నమస్కరించెను. ఆమె తనయునితో నిట్లు చెప్పెను.

"సృష్టస్త్వం వనవాసాయ స్వనురక్తస్సుహృజ్జనే,
రామే ప్రమాదం మాకార్షీః పుత్ర భ్రాతరి గచ్ఛతి." ౫

అనిమూలము. సామాన్యార్థము సుగమము. సుమిత్ర తనయునాచోట నేమియుననలేక మంచిమాటలఁగనే తనదుఃఖమును వెల్లడించెనని కొందఱందురు. కాని యది యంతమంచిది కాదు. సుమిత్ర మతివైభవముకల సాధ్వీమణి. కావుననే కుమారునకు బుద్ధిచెప్పుచున్నది. వత్సా! సుహృజ్జనే = సర్వభూతదయాపరుఁడగు జనునియం దనఁగా శ్రీరామునియందు. అనురక్తః=అనురాగముగలనీవు, వనవాసాయ సృష్టః= వనములవసించుకొఱకే పుట్టింపఁబడితివి. నీపుట్టుకకుఫలము వనవాసమే యని భావము. భ్రాతరిరామే గచ్ఛతి ప్రమాదంమాకార్షీః=శ్రీరాముఁ డడవుల నడుచుచుండఁ బ్రమాదంపడకుము. అనఁగా నీవు సేవించు కర్మమునందు నశ్రద్ధ గలవాఁడవు కాఁగూడదు. అని హితముపదేశించెను. వనములయందు శ్రీసీతారాములకు శుశ్రూష చేయ భగవంతుఁడు నిన్నుఁ బుట్టించెను. ఆకార్యమునందు

శ్రద్ధగలిగియుందుము. అనికదా తాత్పర్యము. ఇది మనకుఁ దెలుపుమార్గ మేది?

మానవు లేకార్యముగాని చేయఁ బూనిరేని శ్రద్ధగలిగియే చేయవలయును. అశ్రద్ధగలిగిచేసినది చేయనియట్లే యగును. ఫలము లేదని భావము.

"అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప,
అప్రాప్య మాం నివర్తంతే మృత్యుసంసారవర్త్మని. 3"   గీత. ౯ అధ్యా.
"అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్,
అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ."   ౨౮
గీత. ౧౭ అధ్యా.

అను నీగీతావాక్యములు పైనవ్రాసినయభిప్రాయమునే తెలుపుచున్నవి. శ్రద్ధయనునవి యొకదేవతయని దాని నారాధింపవలయునని వేదము తెల్పుచున్నది. అనఁగా శ్రద్ధయనుగుణము భగవత్స్వరూపముగా భావించి దాని నారాధింపవలయునను దానిసారమేమనఁగాఁ దానుజేయఁబూనుకొన్న కార్యమును లోకులు మెచ్చుకొనవలయునని కాక భగవంతు నారాధించునట్లు చేయవలయుననియే. కావుననే సద్గుణములయందు శ్రద్ధయనునది ప్రధానమయ్యెను.

"శ్రద్ధయాగ్నిస్సమిధ్యతే శ్రద్ధయా విందతే హవిః,
శ్రద్ధాం భగస్య మూర్ధని వచసా వేదయామసి,
ప్రియగ్గ్ శ్రద్ధే దదతః ప్రియగ్గ్ శ్రద్ధే దిదా సతః,
ప్రియం భోజేషు యజ్వసు ఇదం మ ఉదితం కృధి,
యథా దేవా అసురేషు శ్రద్ధాముగ్రేషు చక్రిరే, ఏవం
భోజేషు యజ్వసు అస్మాకముదితం కృధి, శ్రద్ధాం దేవా

యజమానాః, వాయుగోపా ఉపాసతే, శ్రద్ధాగ్ం హృ
దయ్యయాకూత్యా శ్రద్ధయా హూయతే హవిః, శ్ర
ద్ధాం ప్రాతర్హవామహే శ్రద్ధాం మధ్యందినం పరి శ్రద్ధాగ్ం
సూర్యస్య నిమృచి శ్రద్ధే శ్రద్ధాపయేహమా, శ్రద్ధాదే
వానది వస్తే శ్రద్ధాం విశ్వమిదం జగత్ శ్రద్ధాం కామస్య మా
తరం హవిషా వర్ధయామసి."

అని శ్రద్ధాదేవిని వటువు పూజింపవలయును. ప్రణవశ్రద్ధామేధలు మూఁడును వటువునకుఁ బూజ్యములయ్యెను. ఈవిషయము శ్రీమహాభారతమునందు నెట్టివానియన్నము భోజ్యమను ప్రశ్నమునకు సమాధానము శ్రద్ధగలవానియన్నమే భోజ్యమనియు నదిగలవాఁడే గౌరవజ్యేష్ఠుఁడనియుఁ జెప్పఁబడినవి. ఈధర్మమునే సుమిత్ర కుమారున కుపదేశించెను. భగవంతుని సేవార్థము లక్ష్మణుఁ డవతరించె ననుటచేత నతనికంటె భరతశత్రుఘ్నులు తక్కువయని కాదు. భగవత్కార్యమున కనేకరీతుల సహాయపడువారు సృజింపఁబడిరని యెఱుంగవలయు. అందఱు భగవంతునిదృష్టికి సమానులేయని తాత్పర్యము.

"వ్యసనీ వా సమృద్ధో వా గతిరేష తవానఘ,
ఏష లోకే సతాం ధర్మో యజ్జ్యేష్ఠవశగో భవేత్. ౬
ఇదం హి వృత్తముచితం కులస్యాస్య సనాతనం,
దానం దీక్షా చ యజ్ఞేషు తనుత్యాగో మృధేషు చ. ౭
లక్ష్మణం త్వేవముక్త్వా సా సంసిద్ధం ప్రియరాఘవం,
సుమిత్రా గచ్ఛ గచ్ఛేతి పునః పునరువాచ తం." ౮

అని మూలము. సామాన్యార్థము సుగమము. విశేషార్థమేమి? ఇందు శ్రీరాముఁడు పరబ్రహ్మమని తల్లి కుమారునకుఁ దెల్పు

చున్నది. అనఘ! అని కొడుకును సంబోధించెను. మహర్షి యీ భావమును మనకుఁ దెలుపుటకె సుమిత్రనోట "అనఘ!" అని పలికించెను. అకృతపాపుఁడవగు నీకు "ఏషగతిః" ఈపరమపురుషుఁడే దిక్కు. రక్షకుఁడని భావము. ఇపుడు వ్యసనమునొందినవాని వలె నుండనిమ్ము. సకలరాజ్యభోగములు గలవాఁడుగానుండనిమ్ము నీ కీశ్రీరాముఁడే రక్షకుఁడు. తాత్కాలికస్థితిని బరికింపరాదనియు వస్తుతత్త్వమునే పరికింపవలయుననియు సారము. ఇదియే సజ్జనులధర్మము. సజ్జను లీతనినే నమ్ముదురని భావము. ఎవ్వాఁడు జ్యేష్ఠుఁడో యతనికి లోఁబడుట యనునదియే ధర్మము. సకలలోకములయందు జ్యేష్ఠుఁడెవ్వాఁడు? భగవంతుఁడే. సర్వజ్యేష్ఠుఁ డతఁడేకదా. అట్టిభగవంతునకు లోఁబడివర్తించుట యనఁగాఁ దదారాధనము చేయుచుఁ దదుక్తప్రకారము ప్రవర్తించుటయనునదియే సజ్జనులామోదించు ధర్మమని భావము. భగవదుక్తమేది?

"యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిం. ౨౩
తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి." ౨౪ గీత. ౧౬ అ.

అనునదియే భగవదుక్తము. అనఁగా నెవ్వారు విధివిహితములగుకర్మములను భగవత్ప్రీతికొఱకే యాచరించుచు వానిఫలముల నాశింపకయుండుటయే ధర్మమని యిందుఁ గలవిశేషము. ఇది యీరఘువంశమునఁ గలసనాతనాచారము. ఈవాక్యములఁ బట్టి మనము వితర్కింపఁగా సుమిత్ర కొడుకు వనమునకరుగుటకు మనసార సమ్మతించెననియే స్పష్టము. శ్రీరామతత్త్వ.

మామె యెఱుంగుననియు సిద్ధాంతము. "గచ్ఛ గచ్ఛ" అను టచే నిఁక నాలసింపరాదనునూహ భగవంతునభిప్రాయమున నామెకుఁ గల్గెనని మన మెఱుంగవలయును.

> "రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజాం,
> అయోధ్యామటవీం విద్ధి గచ్ఛ తాత యథా సుఖం." ౯

అని మూలము. ఈశ్లోకము ననేకభంగుల నన్వయించి విశేషార్థములు వ్యాఖ్యాతలే చెప్పిరి. ఇన్ని యర్థములు మనస్సుననునుచుకొని సుమిత్ర కొడుకునకుఁ దెల్పెనా యని కొందఱందురు. కాని సుమిత్రనోట మహాకవి వాల్మీకిమునివరుఁడే మాటలం బలికించెను. వెనుకనామె కొడుకునకుఁ దెల్పినభావము చూడఁగా భగవంతుఁడు రాముఁడని యామె యెఱుంగునని తేలెడిని. కావున నామెగంభీరభావము పాఠకుల కనేకార్థములుగలదిగఁ దోఁచెననుట యచ్చెరువు కాదు. విమర్శింతము. ఇందు సుమిత్ర కొడుకును "తాత" అని సంబోధించెను. "తనోతి కులమితి తాతః" అని వ్యుత్పత్తి చెప్పఁబడినది. ఇది వంశోద్ధారకుఁడను నర్థము తోఁపఁజేయుచున్నది. వంశోద్ధారకుఁడనఁగా యశస్సునార్జించినవాఁడు. ఎవనియశఃకాయము లోకమున శాశ్వతముగనుండునో వాఁడు వంశోద్ధారకుఁడని భావము. సామాన్యమానవులకార్యములకుఁ దోడ్పడిననే సజ్జనుఁ డనంబడుచుండఁగా నిఁకఁ బరమేశ్వరుకార్యమునకుఁ దోడ్పడువాఁడు సజ్జనశ్రేష్ఠుఁడు కాకయుండునా? అట్టివానిజన్మమే యత్యుత్తమమని సారము. సామాన్యార్థము స్పష్టముకదా. "పితృసమో జ్యేష్ఠః" అనున్యాయము ననుసరించి యన్నను సేవింపఁబోవుట కుతూహలము చూపుటచే నీవు వంశోద్ధారకుఁడవే యగుదువు. కాన

వత్సా! లక్ష్మణా! ఇఁక నీవు రాముని దశరథునిగా భావింపుము. తండ్రియతఁడే యని భావము. సీతను నన్నుగా నెఱుంగుము. నావలె నిన్నా సీతాదేవి భావించునుగాన దల్లి యామెయే యని భావింపుము. అడవి నయోధ్యనుగాఁ దలంపుము. అనఁగాఁ గొఱంతనొందక యుండుమని భావము. యథాసుఖముగాఁ బొమ్ము. ఇదియే సామాన్యార్థము. ఇది కుమారునకుఁ దల్లి చెప్పఁదగినహితమే యనవలయును. ఇది సుమిత్ర సాధుచరిత్రమునే తెల్పుచున్నది. జ్యేష్ఠుఁడు పితృసముఁడని శాస్త్రము విధించు నపుడు తత్పత్ని తల్లియే యగును. అరణ్యాగమనము తప్పనిసరి కాఁగా నది యయోధ్యయే యని తలంపుమనుట యుక్తియుక్తమే. అనఁగా వత్సా! యీపదునాలుగేఁడులు నిర్విచారముగాఁ గాలముపుచ్చిరమ్మని తల్లి కుమారునకు నుపదేశించుట న్యాయమే.

సుమిత్ర సంస్కృతభాషతో మాటలాడియున్న విశేషార్థములు చెప్పవచ్చును. "రామం దశరథం విద్ధి" అను మొదలగు వాక్యముల నట్లే యామె యుచ్చరించెనా యన్న నౌననుట యెట్లు? ఆకాలమున సంస్కృతమే దేశభాషగా నున్నదన్న వాదము సారవంతము కాదనుకొనువాఁడను. విశేషించి సంస్కృత భాష వ్యాపించియున్నదనుట నిస్సంశయము. మహాకవివాల్మీకి యాయాపాత్రముల కుచితములగుభావములంబొదిగి యీ మహాకావ్యమును వ్రాసెను. కావున నీశ్లోకమునకు విశేషార్థములు చెప్పవచ్చును. ఈయర్థములలో సుమిత్రకు నేది సమ్మతమన్నయెడల సామాన్యార్థమే యనవలయును. ఇందిదియే యామెకు సమ్మతమగునర్థమని సిద్ధాంతము చేయ వలనుపడదు. కావున నన్నియర్థములు సుసంగతములే యనుకొనవలయు.

ఎవ్వారి కేదియిష్టమో వా రదియే సుమిత్రభావమని నవ్వ వచ్చును.

రామం దశరథం విద్ధి. "దశః పక్షీ విహంగమః" అను నిఘంటువుననుసరించి దశరథుఁడు పక్షివాహనుఁడని యర్థము. నాయనా! రాముని విష్ణువుగా నెఱుంగుమనుట. సీతాం మాం విద్ధి=సీతను లక్ష్మీదేవిగా నెఱుంగుము. అటవి నయోధ్యనుగా ననఁగా నపరాజితాఖ్యవైకుంఠముగా నెఱుంగుము. సుఖముగాఁ బొమ్ము. ఈయర్థము సర్వాసంగతముగాఁ దోఁచవచ్చును. కాని చక్కఁగనాలోచించిన యుక్తముగనే తోఁచును ఇది భావనయని తాత్పర్యము. "భావనామాత్రసంతుష్టహృదయః పరమేశ్వరః" అన్నసూక్తి ననుసరించి భక్తు లేరూపమునఁ దన్ను భావింతురో యారూపమునఁ బొడకట్టుటయం దిష్టముకల వాఁడని భావము. రాముని మహావిష్ణువుగా భావింపుము. సీతను మహాలక్ష్మిగా నెఱుంగుము. అటవి నయోధ్యగాఁ దలంపుము. ఈభావము గలిగిన నీకు సుఖముగల్గునని యామె తెలిపెను. మన స్తృప్తియేకదా సుఖహేతువు. "యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ" అన్నసూక్తి ప్రసిద్ధమేకదా. మఱొకవిచిత్రార్థము గలదు. ఆలకింపుఁడు.

రామం దశరథం చ విద్ధి. ఈశ్లోకమున నెందును "చకారము" లేదు. లేకున్నను దత్తపుత్త్రునివలెఁ దెచ్చుకొనవలయును. అనఁగా దీనితరువాతిశ్లోకము "వినయజ్ఞశ్చ" అనుపదము నుండి చకార మప్పుగాఁ గైకొందము. నాయనా! రాముని జూడుము. దశరథుని జూడుము. ఇరువురకుఁ గల తారతమ్యము నెఱుంగుము. రాముఁడు జ్ఞాతి. దశరథుఁడు తండ్రి. ఎవరికడ నెట్లు మెలఁగవలయునో యోచింపుము. అనఁగాఁ

దండ్రికడ మెలఁగినట్లు రామునికడ మెలఁగరాదని భావము. "మాం జనకాత్మజాం చ విద్ధి" పైనవ్రాసినచకారమునే యిచ్చటికి జరపుకొనుఁడు. నన్నును జానకిని జూడుము. నాదగ్గర వర్తించినట్టులు జనకరాజపుత్త్రికకడ వర్తింపరాదు సుమీ. భ్రాతృసంబంధము కాన జాగ్రత్తగా మెలంగుము. గుణముం బట్టి యాలోచించిన నాకంటె సీత నీమేలు కోరునది యని భావమని గోవిందరాజులు వ్రాసిరి. ఇదెంత బాగుండునో పాఠకులే యూహింపఁదగు. అయోధ్యా మటవీం చ విద్ధి. మరల నాచకారమునే తెచ్చి పెట్టుకొనుఁడు. అయోధ్యను అటవిని జూడుము. అయోధ్యకంటె నడవియే కైంకర్యమున కేకాంత స్థానమని గోవిందరాజులు వ్రాసిరి. అయోధ్యలోనున్నయట్టు లడవిలో నుండరాదుసుమీ జాగరూకుఁడపై మెలంగుమని బోధించెనని ప్రకృతమున కనుకూలమగునర్థము. వీనింబట్టి సుమిత్ర యర్థాంగీకారమున నిట్లు పలికెనని తేలెడిని. వ్యాఖ్యానమున వ్రాసినప్రకారము సీతారాములకు శుశ్రూష లొనరించుచుం బొమ్మని సాగనంపిన ట్లర్థమగును. ఇంకొక్కయద్భుతమగునర్థము.

"దశరథం రామం విద్ధి" మీతండ్రి నుపరతునిగా నెఱుంగుము. లేనట్లే యెఱుంగుము. "మాం జనకాత్మజాం విద్ధి" పతి చావఁగాఁ గైక బాధించుచుండఁగా నిందుండఁజాలక తండ్రి యింటనుండుదానినిగా నెఱుంగుము. "అయోధ్యా మటవీం విద్ధి" అయోధ్యనుండి యందఱు వెడలిపోవఁగా నరణ్యము నిర్మానుష్యమగును. కాన నిర్విచారముగాఁ బొమ్ము. దీనియందొక్కసంశయము కలదు. భరతుఁడు కైక వారిపరిచరులైన

నుండరని సుమిత్ర కెట్లు తెలిసినదని యడిగిన నూరకయుండ వలసినదే. పెక్కండ్రు లేచిపోవఁగా వారు నుండఁజాలక పోవకుందురా యనునదియే సమాధానమో. సుమిత్రకు జ్యోతిశ్శాస్త్రము వచ్చుననియైనఁ జెప్పవలయును. పతి మృతి నొందుననియుఁ దాను దండ్రి యిల్లు చేరుదుననియు నగరము వనమగుననియు నామె యూహించెనన్నచో నన్నుఁ గని పెట్టు కొని నీవిం దేయుండవలయునని యడుగ దాయనికొందఱందురు.

ఇంక నొక్క యర్థము. "రామం విద్ధి దశరథం విద్ధి" వత్సా! నీకుఁ దండ్రియు నన్నయు గురువులే. ఒక్కరు పరిచారకులం గూడియున్న వారు. ఒక్కరు పరిచారకులు లేనివారు. ఈయిద్ద ఱిలో నెవ్వ రనుసరింపఁదగినవారని యూహించుకొనుము. "మాం విద్ధి జనకాత్మజాం విద్ధి." నే నూరనున్న దానను, సీత యడవిలో నుండునది. ఎవ్వరికిఁ దోడ్పడిన మంచిదో యూహింపుము. "అయోధ్యాం విద్ధి అటవీం విద్ధి" ఇందొక్కటి యైహిక సుఖానుభవస్థానము వేఱొకటి ఆముష్మికసుఖదమగునది. ఇం దేదిశాశ్వతమో యాలోచించుకొమ్ము. జ్యేష్ఠానువర్తనము యుక్తమనియే దీనిసారము.

ఇట్టు లీశ్లోకము తడిపినగోధుమపిండివలె నెట్టు లీడ్చిన నట్లు సాగుచుండును. ఏయర్థమువలసిన నాయర్థము నంగీకరింప వచ్చును. మొత్తముమీఁద సుమిత్ర కుమారుఁడు శ్రీరామునిం గూడిపోవుట కంగీకరించెనని మన మంగీకరింపవలయును. దుఃఖము దేహధర్మము ననుసరించి యుంచుకగాఁ గలిగినఁ గలుగుఁగాక. ఆమె విశ్వాసమేమో శ్రీరామసేవాధురంధరుఁడు లక్ష్మణుఁడన్న భావము వందేకలదని యూహింప నవకాశము

కలదు. ఒకప్పు డట్టిభావ మామెకు నైజము గాకపోయినను బ్రకృతిపురుషులయుద్దేశము ననుసరించి కలుగవచ్చును. ప్రపంచములన్నింటి నొక్కసారి మార్పఁగలవారలకు సుమిత్రాశయము మాఱునట్లు చేయుట యొకయద్భుతము కాదు. లక్ష్మణునకు నడవికిఁబోవ ననుమతినొసంగెననుటయే యిందు గల కథాభాగము.

ఇందుగలవిశేషమేమి? మానవుఁడు సద్భావముకలిగి యుండు టుత్తమమనునదియే యిటఁగలవిశేషము. ఉపాసకుఁడు పూజాద్రవ్యములకొఱకెందఱికడకో పోయి యాచించి తెచ్చి యాయారాధనమునఁ దృప్తినొందు టధమము. అట్లుకాక

"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః. ౨౬
యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం. ౨౭
శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః,
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి. ౨౮
సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహం." ౨౯

గీత. ౯ అధ్యా.

అను నీశ్రీకృష్ణోపదేశప్రకారము భక్తిభావమున మనోవీథి నభిమతదేవతాబింబమును నెలకొలిపి భావనారూపభక్త్యుపహృత సకల సత్పదార్థముల నారాధింపవలయును. "అంతరర్చన సుప్రీతా బహిరర్చనలోలుపా" అన్న ప్రమాణము కలదు. "బహిరంతశ్చ కథముద్వాస్యతే విభుః" అన్నసూక్తి కలదు.

"ధ్యానేనాత్మని పశ్యంతి కేచిదాత్మానమాత్మనా,
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే. ౨౪
అన్యే త్వేవమజానంతశ్శ్రుత్వాన్యేభ్య ఉపాసతే,
తేఽపి చాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః. ౨౫
యావత్సంజాయతే కించిత్సత్త్వం స్థావరజంగమం,
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్తద్విద్ధి భరతర్షభ. ౨౬
సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరం,
వినశ్యత్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి. ౨౭
సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థితమీశ్వరం,
న హినస్త్యాత్మనాత్మానం తతో యాతి పరాం గతిం." ౨౮

గీత. ౧౩ అధ్యా.

అను నీగీతోపదేశము పైనవ్రాసినయర్థమునే సిద్ధాంతము చేయుచున్నది. బాహ్యపూజకంటె నాంతరపూజ మహాఫలద మని తెలిసికొనవలయును. ఈవిషయమునే యీభాగమునుండి మనము గ్రహింపవలయును.

"రథమారోహ భద్రం తే రాజపుత్ర మహాయశః,
శీఘ్రం త్వాం ప్రాపయిష్యామి యత్ర మాం రామ వక్ష్యసి." ౧౧

అని మూలము. అరదమెక్కుము. శుభము కలుగును.

"రాజపుత్ర ఇతి మహాత్ యశః యస్య సః తస్య సంబుద్ధిః."

రాజపుత్రమహాశయః = రాజపుత్త్రుడన్న విఖ్యాతిగలయోపరమేశ్వరా! రథమెక్కుటయే యాలస్యము. నీకు శుభములు గలుగును. విజయము కలుగునని భావము. శీఘ్రంత్వాం ప్రాపయిష్యామి = త్వరితముగా నిన్నుం జేర్తును. అనఁగా నీవొనరింపఁదగుకార్యములకుఁ గాలము చెంతకు వచ్చుచున్నది. కాన

శీఘ్రమే రథ మారోహింపుము. అని సుమంత్రుఁడు పలికెను. మహాప్రకృతి సుమంత్రునినోటినుండి యిట్లుపలికించెనని తేలెడిని. ఈయర్థ మెట్లూహింపఁదగును? రాముఁడే పలికించెనని యేల యనరాదు? అని యందురేని

"తం రథం సూర్యసంకాశం సీతా హృష్టేన చేతసా,
ఆరురోహ వరారోహా కృత్వాలంకారమాత్మనః." ౧౩

అని మూలము. ఈశ్లోకమే మన కీయర్థమును దెలిపెడిని. సీత సంహృష్టమగుమనస్సుచేత సర్వాలంకారశోభితాంగియై సూర్య ప్రకాశముగలరథము నెక్కెను. ఈసంతోషమునకు హేతు వేమి? సొమ్ములు చీరలు మామగారిప్పించిరనియే యగునా? ఈసంతోషము కాకున్న పట్టాభిషేక మూడిపోయినందునఁ గలుగుదుఃఖమును మించఁగలదా? లోకదృష్టిచే నూహింపుఁడు. సామాన్యదృష్టి పనికిరాదందురేని సంతోషమునకు వేఱుకారణ ముండకతప్పదు. అదేది? సర్వకార్యకారణభూతురాలు మహా ప్రకృతియేకదా. తా నవతరించినపని భూభారహరణరూపధర్మ సంస్థాపనమే కాన దాని కనురూపముగాఁ గైక వరమడుగుట ప్రయాణముచేయ ననువుపడుట యనుకారణములే యాజగ జ్జనని హర్షమునకుఁ గారణములు. శ్రీరాముఁడు నిర్గుణ బ్రహ్మము. సగుణబ్రహ్మ మయ్యెను. అనఁగాఁ దనమాయం గూడెను. కనుకనే ప్రకృతిచేయుకార్యములం గాంచుచుఁ దాను సాక్షిమాత్రుఁడై యుండెను. ఆపరమేశ్వరుని గార్యో న్ముఖునిగ నొనరించునది ప్రకృతియేకదా.

"పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్,
కారణం గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు." ౨౧ గీత. ౧౩ అధ్యా

అనుగీత మనకొకహిత ముపదేశించును. అదియే యిది యని తలంపుఁడు.

"జగత్సూతే ధాతా హరిరవతి రుద్రః క్షపయతే
తిరస్కుర్వన్నేతత్స్వమపి వపురీశ స్తిరయతి,
సదా పూర్వస్సర్వం తదిదమనుగృహ్ణాతి చ శివ
స్తవాజ్ఞామాలంబ్య క్షణచలితయోర్భ్రూలతికయోః." [illegible]

అను నీశ్రీశంకరభగవత్పాదోక్తి ప్రకృతిశక్తిని దృఢపఱచు చున్నది. కనుక మహామాయ యగుసీత తొలుత రథ మెక్కెను. ఆరథారోహణమే యామెకార్యాతురత్వమును దెలుపుచున్నది.

"అథోజ్జ్వలనసంకాశం చామీకరవిభూషితం,
తమారురుహతుస్తూర్ణం భ్రాతరౌ రామలక్ష్మణౌ." ౧౪

అని మూలము. సామాన్యార్థము సులభమే. ఇందొక్కవిశేషము కలదు. తొలుత సీత రాజపుత్త్రిక యని తలంపక భగవంతు నెడఁబాయని సంకల్పశక్తి యని భావింపవలయును. ఆభావము కుదిరినఁగాని సీతాచరిత్రము విశ్వాసపాత్రము కానేరదు. రామాయణము లన్నియు నొక్కరీతిగా సర్థమునఁగుటకు భావమే ప్రధానము. "జ్వలనసంకాశమ్" అని మూలమునఁ గలదు. విశేషార్థ మిదియని యాలకింపుఁడు.

భగవతికి జ్వాలామాలిని యంగదేవత. యుద్ధకాలముల యం దాజ్వాలామాలిని ముందుచుఁ దత్సైన్యము చుట్టుకోటవలె నుండును. దాని నార్పఁ దరముకాదు. సూర్యకాంతిని శీతలోదకముల నార్పఁగలవారుండిన వారు దాని నార్పఁగలరు.

"జ్వాలామాలినికాక్షిప్త వహ్నిప్రాకారమధ్యగా."

అని సహస్రనామస్తోత్రమునఁ గలదు.

"తత్ర గత్వా జ్వలజ్జ్వాలావహ్నిప్రాకారమండలం,
శతయోజనవిస్తారమాలోకయత దుర్మతిః." ౩౨

లలితోపాఖ్యానము. ౩౨ అధ్యా.

రావణాసురునకుఁబురుషులచేతఁ జావకయుండ వరములేదు కాన మహామాయ యాయరదమునఁదనజ్వాలామాలినిని దేజోరూపమున నావహింపఁజేసెను. అపు డారథము జ్వలనసకాశముగాఁ జూపట్టెను. తొలుదొలుత సీతాదేవి తానే యారథమును మనస్సంతోషముప్పొంగ నెక్కెను. తరువాత మండుచున్న యగ్నివలె నొప్పురథమును సోదరులు రామలక్ష్మణు లెక్కిరి. సర్వకార్యములు ప్రకృతివిశిష్టుఁడయియే పరమేశ్వరుఁడు చేయుననియుఁ, బ్రకృతి నెడఁబాసినపు డనఁగా బ్రపంచెచ్ఛలేనితఱిఁ దా నూరకయుండుననియు దీనిసారము. అట్టి దుఃఖాకరమైన ప్రయాణమున హర్షము సీతాదేవికిఁ బొడమఁగారణమేమనఁగా దానవతరించినఫలమును జూపుట కదను దొరకినదనియేగాక మఱేమగును? ఈభాగమునుండి యీవిషయమును జక్కఁగా గ్రహించి సీతాదేవిని మహామాయగా భావించి యారాధింపవలయును. ప్రకృత్యతీతుఁడై ప్రకృతివిశిష్టుఁడై యొకప్పుడును భక్తరక్షణము చేయుచు ధర్మమును రక్షించుచునుండు భగవంతుఁడు శ్రీరాముఁడై యవతరించెనని తలంచి యారాధింపవలయును.

"కృతకృత్యా హి వైదేహీ ఛాయేవానుగతా పతిం,
న జహాతి రతా ధర్మే మేరుమర్కప్రభా యథా." ౨౪

అని మూలము. ఇందొక్కవిశేషము కలదు. జనులందఱు సీతం గాంచి యిట్లు పల్కిరి. నీడవలెఁ బతి ననుసరించుచున్నది. కాన సీత ధన్యురాలు. ధర్మమునఁగల యాసక్తిని వదలదని వారు పొగడిరి. "కృతకృత్యా హి" అన్న వాక్యముసార మేమి? కార్యముల నొనరించునది సీతయే యనియు, శ్రీరాముఁడు సాక్షిమాత్రుఁడనియుఁగదా. మేరుపర్వతమును సూర్యప్రభ వదలనియట్లు అని యుపమానము చెప్పఁబడినది మేరుపర్వతమును సూర్యప్రభ వదలకయుండు టసంభవము. అట్లే యిదికూడ నసంగతమా యని కొంద ఱడుగుదురు. ఖగోళశాస్త్రము ననుసరించి పురాణములకథలు లేవు. సామాన్యులకు సూర్యుఁడు లోకబాంధవుఁడని తెలుపుటయే పురాణములహృదయము. గ్రహగతితత్త్వ మెఱుఁగవలయునన్న ఖగోళశాస్త్రము చదువుకొనవచ్చును.

"యద్యదుద్దిశ్య ప్రవృత్తం తత్తదంశ ఏవ ప్రమాణమ్."

అన్న న్యాయము ననుసరించి యేగ్రంథ మేవిషయమును దెలుప నభిప్రాయమున నారంభింపఁబడినదో యావిషయముననే యది ప్రమాణము. నడుమనడుమ వచ్చువిషయములతత్త్వముఁ బ్రమాణముగా నద్దానినుండి గ్రహింపరాదు. పురాణములు కథారూపముల లోకులకు నీతులను సదాచారములను బోధింప నేర్పడినవి. అంతియగాని ఖగోళశాస్త్రతత్త్వ మిదియని వచింప వ్రాయఁబడినవి కావు. కావున మేరుపర్వత మున్నయట్లు దాని చుట్టు గ్రహములు తిరుగనట్లు చెప్పఁబడియె. దానినుండి గ్రహింపఁ దగుసార మేమనఁగా భూగోళమునకుఁ బరమోపకార మొనరించు గ్రహగోళములు కావున నాగ్రహములు పూజ్యములు. అందు సూర్యుఁడు గ్రహరాట్టు. త్రిమూర్త్యాత్మకుఁడు.

కావున నారోగ్యమును గోరువారెల్ల సూర్యు నారాధింపవలయు ననువిషయమే. "సర్వేషాం మేరురుత్తరః" అన్న ప్రమాణము ననుసరించి భూగోళమున సర్వోన్నతస్థానమునకు మేరువని పేరు. అను నీభావము గ్రహించిన నేబాధలుండవు.

సీతయే ప్రధానమని చెప్పుటచేత శాక్తమిందు సిద్ధాంతము చేయఁబూని యీపుస్తక మారంభింపఁబడినదా యని కొందఱనుమానింపవచ్చును. కాని నాభావ మది కాదు. సగుణుఁడయినఁగాని భగవంతుఁ డేకార్యము చేయఁదలంపఁడు. త్రిగుణాత్మికయే మహామాయ, ప్రకృతియు ననఁబడు.

"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా."

అని శ్రీభగవద్గీతోక్తి ననుసరించి యూహించినఁ బైమాట సార్థకమే యగునుగదా. భగవంతుఁడు ధర్మరక్షణార్థము శ్రీరామరూపమున నవతరించినపుడు తన్మాయయు సీతారూపమున నవతరించెను. ఇంతవఱకు నెల్లరు నాభావము నంగీకరింతురు గదా. సీతకు ముందు రాఁగలకష్టములన్నియు నామె పూర్వచారిత్రమునకుఁ గళంకముఁగల్గించునవిగనే యుండును కావునఁ దత్త్వమేమియని విచారింపవలసివచ్చినది. భగవన్మాయ సీత కాదందురేని యయోనిజాత యన్నమాట యెగిరిపోవును. భూమిలో నొక్కపెట్టియలోఁ గన్యక దొరకెనన్న నెల్లరు నవ్వవలసినదే. దానిని నమ్మించుట కుపాయమేమి! ఆమె భగవచ్ఛక్తికాన నేరూపమున నేచోటనుండిన నుండఁగలదని చెప్పుట తప్ప మార్గాంతరము లేదు ఈవిషయము నధ్యాత్మరామాయణమే తెల్పెను ఇందు నాకల్పించిన దేవియు లేదు. పూర్వుల భావమును దెలుపుటయే కాని క్రొత్తసిద్ధాంతము కాదు.

ఈవిషయమును విమర్శింపకపోయిన శ్రీరామాయణ ముత్తమ గ్రంథమని యెట్లు తెల్పఁజాలుదురు? మహాలక్ష్మియని యెట్లు సిద్ధాంతముచేయఁగల్గుదురు? కావున సీతాచరిత్రము పరమ పావనమని శ్రీరామాయణము ననుసరించియే తెల్పుట న్యాయా శయము. కావున నిందు సంశయింపఁదగిన దేదియు లేదు. పరమ తద్వేషమే ప్రధానముగాఁగల పాషండులగుకొందఱు మిథ్యా వైష్ణవులకు సరిపడకయున్నమాత్రమున నియ్యది తత్త్వము కాకపోదు. శిష్యులవంచించి ధనమునార్జించు కుమతులయభిప్రా యము మనము తిరస్కరించుటయే న్యాయము.

"అహో లక్ష్మణ సిద్ధార్థస్సతతం ప్రియవాదినం,
భ్రాతరం దేవసంకాశం యస్త్వం పరిచరిష్యసి. ౨౫
మహత్యేషా హి తే సిద్ధిరేష చాభ్యుదయో మహాన్,
ఏష స్వర్గస్య మార్గశ్చ యదేనమనుగచ్ఛసి."

అని మూలము 'సతతం ప్రియవాదినం' అనువిశేషణము శ్రీ రాముఁడు పరమేశ్వరుఁడని తెల్పుచున్నది. సతతము ప్రియ ముగా మాటలాడువాఁ డెవ్వఁడు? పరిపూర్ణుఁడు. భగవంతుఁ డొక్కఁడే పరిపూర్ణుఁడు. ఇతరులు కారు.

"సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహం." ౨౯
గీత. ౯ అధ్యా.

అన్నగీతావాక్యము ననుసరించి యెవ్వానికి మిత్రామిత్రులు లేరో సర్వము సమానముగాఁ దోఁచునో యతఁడే పరిపూర్ణుఁడు. అట్టి పరమేశ్వరుని సేవించుచున్న యోలక్ష్మణా! నీవే సిద్ధార్థుఁ డవు. అనఁగా సకలమనోరథుఁడవు. నీకంటె లోకమునఁ గృత

కృత్యు లెవ్వారు కలరు ? భగవత్సేవకన్నఁ బరమపురుషార్థ
మొసఁగుమార్గ మేదికలదు? అంతకంటెఁ దపస్సిద్ధియేది? దాని
కంటె నభ్యుదయమేది? భగవంతు ననుసరించి పోవుటకంటె
స్వర్గమార్గమును జూపునదేది ? అన్నింటికంటె భగవత్సేవ
యుత్తమమనువిషయ మిద్దానినుండి మనము గ్రహింపవలయును.

"వృద్ధాంశ్చ నిత్యం సేవేత విప్రాన్ వేదవిదశ్శుచీన్,
వృద్ధసేవీ హి సతతం రక్షోభిరపి పూజ్యతే." ౩౮ మను. ౭ అధ్యా.
అభివాదనశీలస్య నిత్యం వృద్ధోపసేవినః,
చత్వారి తస్య వర్ధంతే ఆయుర్విద్యాయశోబలం." ౧౨౧
మను. ౨ అధ్యా.

అని నీమనుస్మృతియుఁ బై భావమునే తెలుపుచున్నది.

"చతుర్విధా భజంతే మాం జనాస్సుకృతినోఽర్జున,
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ. ౧౬
తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే,
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః. ౧౭
ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతం,
ఆస్థితస్స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిం." ౧౮
గీత. ౭ అధ్యా.

అను నీశ్రీకృష్ణోపదేశము భగవదనుగమనమాహాత్మ్యమును
దేటపఱచుచున్నది. దీనిసారమేమి? భగవత్సేవయే ప్రధానము
గాని యితరమేదియుఁ గాదని నమ్మి యెవ్వరు భగవంతు ననుగ
మింతురో వారే ధన్యులగుదురు. స్వర్గమార్గము వారలకే కనఁ
బడును. భగవత్సేవ యనఁగాఁ బాషాణావిగ్రహములపూజ
కాదని యెఱుంగవలయును.

"ప్రశాంతాత్మా విగతభీర్బ్రహ్మచారివ్రతే స్థితః,
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః. ౧౪
యుంజన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః,
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి." ౧౫ గీత. ౬ అధ్యా.

అన్న శ్రీకృష్ణోపదేశము ననుసరించి యోగియై యుపాసించు వాఁడనియే యర్థము. పాషాణపూజ యత్యల్పఫలమనియే సారము. పాషాణపూజయే ప్రధానమని బోధించుట పామరులవంచించి ధనమార్జించుటకే యని యెఱుంగవలయు.

"నాశ్రౌషమితి రాజానముపాలబ్ధోఽపి వక్ష్యసి,
చిరం దుఃఖస్య పాపిష్ఠ మితి రామస్తమబ్రవీత్." ౪౭

అని మూలము. ఇది రామచంద్రవచనము. సుమంత్రా! రథము నిలుపుమను తండ్రిమాటరీతి నిలుపక రథముఁ దోలుము. మరల నీవు రాఁగా నాతండ్రి యేల నామాటప్రకారము రథము నిలుపక రథముతోలితివని యాక్షేపించినయెడల జనుల కలకలమున వినఁబడలేదని బదులు చెప్పుము. ఏలయనఁగా నా తండ్రి యనుభవించు నీదుఃఖమును జాలసేపు చూడఁజాల కున్నాఁడను. అని రాముఁడు సారథికిం దెల్పెనని మూలార్థము. "అనృతం నోక్తపూర్వమ్మే" అన్న రామమూర్తి యసత్యముం బలుకుమని మంత్రిని బ్రోత్సహించెఁగదా. ఇది భగవంతునకుఁ దగినమార్గమేనా? అని ప్రశ్నము రావచ్చును. దుఃఖము చూడఁజాలననునదియే సమాధానమందుమేని శ్రీరాముఁడు అస్మాదృశుఁడే యగును. విశేషమేమి? అని యాక్షేపింపవచ్చును. సమాధానమేమనఁగా వినుఁడు.

దశరథునకు మృతికాల మెంతదగ్గరనున్నదో శ్రీరాముఁ డెఱుంగును. ఎంతకాలము తన్నుంజూడక దుఃఖించిదుఃఖించి శాపఫల మనుభవించి చావవలయునో యెఱుంగును. కర్మసిద్ధాంతము మార్పరాదన్న శాసనము తనదే. తానొక్కనిమేషమైన నిఁక నిలువఁదరముగాదని భావించెను. పుత్త్రుని జూడవలయు నన్న వాంఛ నిర్భరము కాఁగా నిలుపుమా రథమునుసూతా యని రాజాక్రోశించెను. ఆమాట యిరువురకు వినఁబడియె. నిలుపుడమన్నఁ బోనిమ్మని రామాజ్ఞ. దాని నొనరింపక యుండవలనుపడదు. సూతుఁడేమిచేయుటకుఁ దోఁచక యూరకుండఁగా రాముఁ డీపలుకు చెప్పెను. సామాన్యదృష్టి నాలోచించిన నిది యసత్యమునకుఁ బురికొల్పెననియే తోఁచును. కాని సూక్ష్మదృష్టింబరికించిన నిది సత్యేతరము కాదనియే తోఁచును. అన్నింటికంటెఁ గర్మమార్గము బలిష్ఠమైనది.

"సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాన్న బ్రూయాత్సత్యమప్రియం,
ప్రియం చ నానృతం బ్రూయాదేష ధర్మస్సనాతనః." ౧౩౮
మను. ౪ అధ్యా.

అని మనుస్మృతి తాత్పర్యము.

"సత్యమ్. అనర్థానమబంధి యథాభూతార్థవచనమ్. ప్రియహిత ప్రమాణదృష్టప్రతార్థ భాషణం వా. అని. విధిముఖప్రతీతివిషయ ఇతి వేదాంతమతమ్. యథార్థజ్ఞానవిషయ ఇతి నైయాయికాః."
సర్వతంత్రసిద్ధాంతపదార్థలక్షణసంగ్రహము.

అనర్థమునకు సంబంధింపక జరగినది మార్పక తెల్పువాక్యము సత్యమనంబడును.

"యథార్థకథనం యచ్చ సర్వలోకసుఖప్రదం,

తత్సత్యమితి విజ్ఞేయమసత్యం తద్విపర్యయః."

పాద్మము. క్రియాయోగసారము. ౧౬ అధ్యా.

"సత్యం చ సమతా చైవ దమశ్చైవ న సంశయః,
అమాత్సర్యం క్షమా చైవ హ్రీ స్తితిక్షానసూయతా,
త్యాగో ధ్యానమథార్యత్వం ధృతిశ్చ సతతం దయా,
అహింసా చైవ రాజేంద్ర సత్యాకారాస్త్రయోదశ."

మహాభారతము. రాజధర్మప్రకరణము.

అని శబ్దకల్పద్రుమము. ఇతరులకు బాధింపనియథార్థము సత్యమని తేలెడిని. దీనిసారమే మనుస్మృతి తెల్పెను. ఈప్రమాణముల ననుసరించిచూడఁగా తెలిసినదానినిగాని చూచినదానినిగాని విన్నదానింగాని దాఁపక యెదుటివానిమనస్సు నొవ్వక యుండఁ దెలుపునది సత్యశబ్దార్థము. ఇపుడు రామమూర్తి సుమంత్రునకుఁ దెల్పిన దసత్యముకదా యందురా? జనుల మాటలసందడిలో రథము నిలుపమన్నమాట వినఁబడలేదన్నందున దశరథున కపకారము కలుగదు. ఆమాటవలన సూతునకు లాభములేదు. కాన నిది యసత్యస్వరూపము కాదనవలయు. దశరథుఁడీప్రశ్నము చేయఁడనియుఁ దన్నే స్మరించుచు దుఃఖించుననియు శ్రీరాముఁ డెఱుంగును. కావున సుమంత్రుఁ డబద్ధమాడవలసినంత యవసరమేలేదని శ్రీరాముఁ డాలోచించి సర్వజ్ఞుఁడుకానఁ దనకు నద్దాన నపకీర్తి రాదని యూహించియే పురికొల్పెనని మన మూహింపవలయును. చక్కఁగా నాలోచించిన దశరథుఁడే యాప్రశ్న మడిగి సుమంత్రుఁడే యాసమాధానము చెప్పియుండినచో నిది యసత్యమే యనవలయును. ఆప్రసక్తిలేనందున నిందు నాదోషము పొసంగలేదని

మనము తలంపవలయును. దశరథుఁడు మృతినొందును. సుమంత్రుఁడు రాఁగా నీమాట ప్రశ్నింపఁడు. కావున నసత్య మాడవలయునని పురికొల్పినదోషము నాకు రాదు. అని శ్రీరాముఁడెఱుంగును. కర్మమార్గము భగవంతునకుఁ దెలియదనరాదు కదా. ఇది యొకమార్గముగా సమాధానము. మఱొక్కరీతిగా నాలోచింతము. దశరథునకు దుఃఖము హెచ్చుచున్నది. రథము నిలిపి మరల నతని నాశ్వాసించి ప్రయాణము చేయు నంతయవకాశము లేదు. దుఃఖభారము నాపుటకు వేఱు మార్గము కానరాదు. తండ్రితో మాటలాడుట కతనికర్మము ననుసరించి రామునకవకాశములేదు. కావున రాజాజ్ఞ మీఱఁ జాలక వగచుసూతున కిట్లు రాముఁడు తెలిపెనుకొన్నను బాధలేదు. సర్వజ్ఞుఁడు శ్రీరాముఁడు కాఁ డనుకొనుచో నిది యసత్యమే యనక తప్పదు. ఆస్తికు లెవ్వరట్టిమాట శ్రీరాముని విషయమై పలుకరుగాన నిదియు సమాధానమే యనవలయును. తనమాటకుఁ దగినకారణమును రామమూర్తియే తెల్పెను గదా.

"యమిచ్ఛేత్పునరాయాంతం నైనం దూరమనువ్రజేత్,
ఇత్యమాత్యా మహారాజమూచుర్దశరథం వచః." ౫౦

అని మూలము. సాగనంపుపద్ధతి యిందుఁ గలదు. ఎవ్వరు వేగముగ రాఁదలంచి ప్రయాణము సాగింతురో వారిని దూరముగాఁ బోయి సాగనంపరాదు. అనఁగా వారితో మాటలాడుచుఁ జాలదూరము పోరాదని భావము. వారిప్రయాణమున కభ్యంతరము గల్గింపరాదని సారము. ఉదకముండు తావుదనుక సాగనంపవలయునని స్మృతి శాసించుచున్నది. ఆ ధర్మమునే రామాయణము మనకుఁ దెలుపుచున్నది.

"ఓదకాంతాత్ స్నిగ్ధో జనోఽనుగంతవ్యః."

అని యభిజ్ఞానశాకుంతలమునఁ గాళిదాసు వచించెను. ఇట్టు లీరామాయణభాగము మన కనేకరహస్యవిశేషములఁ దెలుపుచున్నది.

"తిష్ఠ తిష్ఠ సుమంత్రేతి రాజా దశరథోఽబ్రవీత్,
గచ్ఛగచ్ఛేతి రామేణ చోదితోఽచోదయద్రథమ్."

అని యధ్యాత్మరామాయణమునఁ గలదు. అసత్యశంకకు నవకాశమే యిందుఁ గానరాదు. ఇది యధ్యాత్మరామాయణము కదా. ఇంతకంటె విశేష మీభాగమున నిందుఁ గనఁబడదు. ఇఁకఁ దరువాతికథను బరికింతము.

## అపశకునములు పొడమఁగాఁ బ్రజలు దుఃఖించుట.

* శ్రీరాముఁడు జననీజనకులకు నమస్కరించి యడవికిఁ బ్రయాణము చేయఁగనే రాజుం గూడియున్న యంతఃపురకాంతలందఱు బొక్కపెట్టున రోదనధ్వనులు కావించిరి. దిక్కులేనికరుణకుఁ బాత్రులై యుండు నీజనుల కెవ్వఁడు దిక్కయుండెనో యట్టిరక్షకుఁ డిత్తఱి నెచ్చోటి కరుగుచున్నాఁడో! లేనినిందలఁ దనపై నారోపించినను గోపమూనక, ప్రజలకుఁ గోపము గలుగుపనుల నేనిని జేయక, తనపైఁ గోపమూనువారల మనోవృత్తిని మార్చును. అట్టిమహాత్ముఁడు రాముఁ డెచ్చోటికో పోవుచున్నాఁడు. మనలఁ దల్లివలె భావించి ప్రవర్తించును. అట్టిసత్పుత్త్రుఁ డెచ్చటికో పోవుచున్నాఁడు. కైక నిర్బంధమున రాజు వనములకుఁ బొమ్మనఁగా నెల్లరకు రక్షకుఁడగు శ్రీరామ

---

* [illegible]ది నలువదొకటవ సర్గమునఁ గలదు.

మూర్తి యాయాజ్ఞను దలఁదాల్చి యెచ్చటి కేగుచున్నాఁడో; అక్కటా! రాజునకు బుద్ధి తగ్గినది. సకలజనప్రియుండగు శ్రీరాము నడవికిఁ బంపుచున్నాఁడుగదా. అని పలుకుచు దూడ నెడఁబాసిన ధేనువువలె విలపించిరి. ఆరోదనధ్వని విని పుత్త్రశోకాతురుఁడగు రాజు మఱింత దుఃఖించెను.

రాముఁ డడవికిఁ బోయెనే యన్న చింతచే యజ్వలు హోమము చేయమానిరి. త్రేతాగ్ను లంతర్హితములయ్యెను. గృహస్థులు తమయిండ్ల శయనింపరైరి. ఏపనియు మాని ప్రజలు చింతించుచుండిరి. ముందుగనే సూర్యుఁ డస్తమించెను. గజములుకూడ నాహారమును దినకుండెను. ధేనువులు దూడలకుఁ బాలీయకుండెను. తల్లులు తమ ప్రథమకుమారుఁడు వచ్చినను సంతసముం జూపకయుండిరి. ఇక్ష్వాకువంశకూటస్థుఁడై నక్షత్రాకారమున నున్న త్రిశంకువు కుజగురుబుధులు తక్కిన క్రూరగ్రహములు కొన్ని సంగమముచేతను,కొన్ని దృష్టిచేతను, కొన్ని వక్రగతిచేతను జంద్రునిగూడియుండెను. నక్షత్రకాంతి క్షీణించెను. గ్రహతేజస్సులు తగ్గెను. కోసలదేశనక్షత్రమగు విశాఖధూమముచే నావరింపఁబడినచందమున మలినముగఁ గనఁబడెను. మేఘములఁగూడిన మహావాయువు వేగమున సముద్రముప్పొంగునట్లు రామమూర్తి వనమునకుఁ బోవఁగనే యయోధ్య తీరుతప్పినది. దెసలెల్ల ధూమావృతములయ్యెను. రాముఁ డడవికింబోవఁగనే యితరకారణములు లేకున్నను జనులు వగచిరి. వారి కాహారవిహారములందు నిష్టము లేకుండెను. రాజుం దలంచుకొనుచు నెల్లరుఁ జింతించుచుండిరి. అంతియ గాక వారిండ్లకుఁబోవక రాజమార్గములయందే యుండిరి. సంతోష మెవ్వారికిని గలుగకుండెను. వాయువు శీతలత్వమును

ఖాసెను. చంద్రుఁడు చక్కఁగాఁ గనఁబడకయుండెను. సూర్య కాంతి మాసెను. శిశువులు పాలుద్రావ మానిరి. భార్యలు పతులయెడఁ బ్రీతిమానిరి. సోదరప్రీతి యలరదయ్యెను. ఎల్లరు రామునినే తలంచుచుండిరి. రామునిమిత్రులు దుఃఖముప్పొంగ నేమియుం దోఁపక భూమింబడి లేవకయుండిరి. త్రిలోకాధి పతియగు నింద్రుఁడు లేకయుండినచో భూమండలము తోడ్పాడులేక కలతనొందుచందమున రాముఁ డడవికింబోఁగా నగరము శోకాక్రాంతమై యాక్రందనధ్వనుల నిండియుండెను.

మహాత్ములారా! ఈభాగమునఁ గొన్ని విశేషములు గలవు. పరికింతము.

“విశాఖస్తు సధూమశ్చ నభసి ప్రచకాశిరే.” ౧౨

అనిమూలము. కూటస్థుఁడగు నిక్ష్వాకు రాజు విశాఖయందుఁబుట్టి నందున నయ్యది కులనక్షత్రముగఁ బరిగణింపఁబడినది. ఇందుఁ జెప్పఁబడిన వికారములన్నియు శ్రీరామునివియోగమునఁ గలుగుటంబట్టి వానిం బరికింపఁగా సర్వభూతాంతర్యామియగు రామునకు విచారము కలిగినపుడు కలిగినవనియు నితరకారణ మేదియు లేదనియుఁ దెలియవచ్చెడిని. ఇది శ్రీరాముని భగవత్త్వమునే తెలుపుచున్నవి.

“యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున,
న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరం. ౩౯
యద్యద్విభూతిమత్సర్వం శ్రీమదూర్జితమేవ వా,
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంశసంభవమ్. ౪౦
అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున,

విష్టభ్యాహమహం కృత్స్నమేకాంశేన స్థితో జగత్." ౪౨

గీత. ౧౦ అధ్యా.

అను నీశ్రీకృష్ణోపదేశము పైవిషయమును మనకుఁ దోఁపఁ జేయుచున్నది. మనస్సు నొచ్చిన శరీరమంతయు నొచ్చునట్లు భగవంతునకుఁ గష్టముగలిగినట్లుండఁగా సకలభూతములకుఁ గష్టమే కలిగెనని మన మూహించుట పొరపాటుగాదు. ఎంత మంచివారైనను సర్వభూతరంజకులుగ నుండఁజాలరనుటయే సత్యముకదా. తిర్యగ్జంతువులు కూడ దుఃఖించెననుటయే శ్రీరామునిసర్వాంతర్యామిత్వమును దేటపఱచుచున్నది.

దశరథుఁడు శోకించుట.

* శ్రీరామచంద్రుఁడు నగరమునుండి పోవుచుండఁగనే రథధూళి యెంతవనుకఁ గనంబడుచుండెనో యంతదాఁక రాజు రాముని దెసనే కనుచుండెను. ఆధూళి చాలసేపు రాజునకుఁ బ్రియము నుంతస్నైన జేయఁగోరి లేఁగినట్లే యుండెను. తుద కది యడంగఁగా రాజు శరీరము కలఁతనొంద వగపెల్లునఁ గ్రిందఁబడెను. కౌసల్య యతని లేవనెత్తఁబూని దక్షిణహస్తమును బట్టుకొనియెను. కైక భరతునియందే ప్రీతిగలదిగాన రాజు నెడమపార్శ్వమున నిలువఁబడి యూరకయుండెనుగాని లేవనెత్తఁ బ్రయత్నింపదయ్యెను. ధర్మనిరతుఁడగు రాజు కైకం గాంచి కైకా! దుష్ప్రవర్తనము కలదానవు. నన్నుం దాఁకవలదు. నిన్నింకఁ జూడనొల్లను భార్యవు కావు. నీకు నాకును బంధుత్వమే లేదు. నీతోడిసంబంధమే కాక నీకడనుండి బ్రదుకు వానికింగూడ నేను రాజునుగాను వారు నాకు భృత్యులు కారు.

* ఇది నలుబదిరెండవ సర్గమునఁ గలదు.

కేవలార్థాసక్తురాలవు. ధర్మమునందు నీకుఁ బ్రీతియే లేదు. కావున నిన్నుఁ ద్యజించెదను. అది సాధ్యమా యందువేమో. వివాహసంబంధమునఁ గలిగెడిదియైహికాముష్మికముల నన్నింటిని గూడఁ ద్యజించుచున్నాఁడను. భరతుఁ డక్షయమగు నీ రాజ్యమును బడసి యానందించువాఁడగునేని యతఁడు నాకొసంగు తర్పణాదులు నాకుం జేరక నశించుఁగాక యని యూరకుండెను.

అంతటఁ గౌసల్య ధూళింబొరలాడిన ప్రాణనాథుని లేవనెత్తి దుఃఖించుచు నాతనిం బిలుచుకొని మరలెను. కొడుకు మునివేషమూని యడవికిం బోవుట తలంచుకొని యాధార్మికోత్తముఁడు బుద్ధిపూర్వకముగ బ్రాహ్మణుని వధించినవానిచందమున, నగ్నిని గరమున స్పృశించినవానిపగిది మిగుల ననుతాపము నొందుచుండెను. రామునియరద మరిగినత్రోవను అడుగు పెట్టినపుడెల్ల దిరిగితిరిగి చూచుచు దుఃఖించుచు సూర్యబింబము రాహుగ్రస్తము కాఁగా నున్నయట్లు కౌసల్యయు రాజును దేజము దూలియుండిరి. రాముఁ డయోధ్యను దాఁటిపోయెనని యెఱింగి దశరథుఁడు దుఃఖావేశమున నాకుమారుని దీసికొనిపోయిన యుత్తమహయములయడుగులు త్రోవవెంటఁ గనంబడుచున్నవి. కాని యా రామమూర్తిమాత్ర మగపడలేదు. దివ్యచందనము నలంది యుత్తమాంగనలు వింజామరలు వీచుచుండఁగా మృదులములగుతలగడలయం దుండఁదగిన నా ప్రియకుమారుఁడు ఘోరారణ్యముల వృక్షముక్రింద దారువో పాషాణమో తలగడగా నిడికొని శయనింపఁగలఁడు. తప్పని దీమాట. నా జ్యేష్ఠకుమారుఁడు దీనుఁడై ధూళి తనువునిండ నలముకొనఁగా నిట్టూర్పులు పుచ్చుచు

నేలనుండి లేచును సర్వలోకనాథుఁ డా రాముఁడు నేలఁబరుండి లేచిపోవుచుండఁగా వనచరులు నిజముగాఁ గాంచఁగలరు. జనకుని ప్రియపుత్త్రిక సీతాదేవి నిరంతరసుఖానుభవమునకే తగినది. అట్టియామె ముండ్లపై నడుగిడి యవి గ్రుచ్చుకొనఁగా బాధలం గుడుచుచుఁ బోవఁగలదు. అడవుల నెన్నఁడే నెఱుంగనియాసీత మహాక్రూరజంతువులభీషణధ్వనుల విని భయమునొందఁగలదు.

కైకా! నీవాంఛితములు ఫలించెనా? ఇఁక విధవవై రాజ్యమేలుము. నేనుమాత్ర మాపురుషోత్తము నెడఁబాసి యెంత మాత్రము బ్రదుకనోల్లను. అని యిట్లు రాజు విలపించుచుండఁగా జనులు గుంపులుగాఁ జుట్టుకొనిరి. బంధువు చావఁగా స్నానము చేసివచ్చువానివలె నమంగళముగా నున్న యానగరమును బ్రవేశించెను. గృహములు మార్గములు శూన్యములై యుండెను. బలాఢ్యులు రామునివెంటఁ బోవఁగా మిగిలినదుర్బలులు కనంబడుచుండిరి. అట్టి యాశూన్యనగరమును గాంచి రాముని స్మరించుచు నేడ్చుచు రాజు మేఘమండలమును సూర్యుఁడు ప్రవేశించునట్లు తనగేహమును జొచ్చెను. మహాసర్పముండుట నెవ్వారికిం గలంపరాకయుండినమడువును సర్పమును గరుత్మంతుఁ డెత్తుకొనిపోవఁగా సులువుగా నెల్లరు ప్రవేశించునట్లు సీతారామలక్ష్మణులచేఁ బూజ్యమైయుండి వారడవికింబోవఁగా శత్త్రువులకుం గూడ సులభగమ్యమై యాగేహముండెను. రాజంత విలపించుచు మాటలు తడఁబడుచుండఁగా నర్థబాహ్యము లేనిచప్పిడిమాటల మహాదైన్యమున రా జిట్లు పలికెను.

నన్ను వేగముగ రామునితల్లి యగుకౌసల్యయింటికిం గొనిపోవుదురుగాక. వేఱొకచో నామనస్సు శాంతి గాంచదని పలికెను. ఆమాట శిరసావహించి మార్గముచూపువార లా

కౌసల్యయింటికిం దీసికొనిపోయిరి. అం దారాజు శాంతునిచంద మున నుండెను. అంతట నారాజు శయ్యపైఁబరుండియు శాంతి గానక కలఁతనొందుచుండెను. తనయు లిర్వురు కోడలు లేక యుండుట నాగేహము చంద్రుఁడు తారాగ్రహములు నక్షత్ర ములులేని యాకాశమువలె నుండెను. ఆరాజప్పుడు కౌసల్యను గాంచి గట్టిగా నక్కటా! శ్రీరామా! నన్ను వదలిపోవు చున్నావే యని యాక్రోశించి రామచంద్రుఁడు మరలరాఁగా నాలింగనముచేసికొని నేత్రపర్వముగాఁ జూచుభాగ్యము గల పురుషులు సుఖమున నాతఁడు వచ్చునంతదనుక జీవించియుండఁ గలరు. వారు సుఖమున నాలింగనముచేసికొని వనమునుండి వచ్చిన శ్రీరాముని జక్కఁగాఁ జూడగలరు. నాకు నట్టిభాగ్యము గలుగదని శోకించెను. మఱియుఁ దనకు విలయకాలరాత్రివలె భయముగొలుపునట్లు తోఁచుచున్నరాత్రి రాఁగా రాజు నడి రేయిఁ గౌసల్యం గని యిట్లు పలికెను. అతనికంఠస్వరము నిర్భర పరితాపము నొందియున్నచందముగ నుండెను. కౌసల్యా! నాదృష్టి రాముననుసరించియే పోయియున్నది. ఇంకను మరలి రాలేదు. కనుక నిన్నుఁ జూడఁజాలకయే యున్నాఁడను. నీవు నాపైఁ గోపమూనక కరుణగలిగి యుండవలయు. నీహస్తము చేత నన్ను స్పృశింపుము. అద్దానిచే నాసంతాపము రవంత తగ్గును. అనఁగా నా దేవి శయ్యపైఁ బొరలుచు శ్రీరామునే తలంచుచు వగచుచున్న యాదశరథునిం గాంచి చెంతఁ గూరు చుండి చింతించుచు వేఁడియూర్పులు పుచ్చుచు నతికష్టము తోఁచినందున మిక్కిలి శోకించెను.

మహామతులారా! ఈభాగము విశేషార్థభూయిష్ఠ మన వలయును. కాన వానిం దెలిసికొనఁ బ్రయత్నింతము.

"యావత్తు నిర్యత స్తస్య రజోరూపమదృశ్యత,
నైవేక్ష్వాకువరస్తావత్సంజహారాత్మచక్షుషీ." ౧

అని మూలము. అయోధ్యానగరము దాఁటఁబూనఁగనే శుద్ధ సత్వగుణము మఱుఁగుపఱచి రజోగుణప్రధానుఁడుగ భగవంతుఁడు చూపెట్టెను. ఆరూపమే దశరథునికన్నులకుఁ గనంబడియెను. దానిం గాంచుచునే యుండెను. దృష్టిని మరలించుకొనఁజాలఁడయ్యెను అనఁగా రథము కనంబడలేదు. రథము నావరించి పరమేశ్వరుతేజస్సు వెలయుచుండఁగా దానిని రాజు కనుంగొనియె.మరణము సమీపించుచుండువారలకు మున్నున్న సత్వగుణము తొలఁగి రజోగుణము పొడకట్టును. అత్తఱి సంసారమునఁ బ్రీతి మెండగును. అహంకారము హెచ్చును. మఱింతదాపునకు మృతికాలము రాఁగాఁ దమోగుణము హెచ్చును. ఇది నైజము. అట్టిదుష్టకాలమునఁ బూర్వపుణ్యవశమున నెవ్వానికి భగవంతునిపై నిష్టము కలుగునో వారె తరింతురు.

"అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరం,
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః." ౫

గీత. ౮ అధ్యా.

అని శ్రీకృష్ణమూర్తి బోధించెనుగదా. దశరథునకుంగూడఁ దమోగుణము వ్యాపించునా యందురేని మునిశాపమున నాకష్ట మనుభవించియేకాని మృతినొంద నతఁడు శక్తుఁడు కాఁడు. కాని యాతాపము ననుభవించి భగవంతుని గన్నతండ్రి గావున నాశ్రీరామమూర్తినే తలంచుచుఁ బ్రాణముల వదలఁగలఁడని మనమెఱుంగవలయును. అనఁగా శ్రీరామమూర్తి యప్పటితేజస్సు రాజునకుఁ గనంబడుచుండఁగా నవ

శుఁడై చూచుచుండెననియు నెంతకాల మారూపమును దర్శించుభాగ్యముకలదో యంతదనుక దానిం గాంచుచుండె ననియు నిందలివి శేషము.

"కైకేయి మా మమాంగాని స్ప్రాక్షీస్త్వం దుష్టచారిణీ,
న హి త్వాం ద్రష్టుమిచ్ఛామి న భార్యా న చ బాంధవీ. ౬
యే చ త్వామనుజీవంతి నాహం తేషాం న తే మమ,
కేవలార్థపరాం హి త్వాం త్యక్తధర్మాం త్యజామ్యహం." ౭

అని మూలము. దశరథునివాక్కు లివి. దైవకార్యము నెఱవేర్ప నవతరించినకైకను దత్త్వమెఱుంగఁజాలక దుష్కర్మవశమున విభ్రాంతుఁడై రాజా మెను దూఱుచున్నాఁడు. కాని విధివశమునఁ గొన్నిమాటలు సత్యముగనే వెడలినవి. మరణకాలమున భావము మార్పునొందునుగదా. కైకా! నన్ను స్పృశింపకుమా నీవు. దుష్టచారిణివి. దుర్వృత్తిగలదానవని సామాన్యార్థము. "చరగతిభక్షణయోః" అన్న ధాతువునుండి "చారిణీ" అనుపద మేర్పడినది. దుర్జనులనడంచుదానవని యర్థము. భగవత్కార్యనిర్వాహణమున నరిషడ్వర్గముల జయించినదానవని భావము. అట్టి నీవు నన్నుఁ దాఁకవలదనునా యందు లేమో. కేవల శాపఫలము ననుభవించుస్థితియందున్న వాఁడు కానఁ దా నేమనుచున్నాఁడో యతఁడెఱుంగఁడని మన మూహింపవలయు "న భార్యా త్వం." నీవు భార్యవు కావు. అనఁగా నేను నిన్ను భరించుకాలముపోయినది. మన యీ సంబంధము తెగిపోవనున్నది. కాన "త్వం న బాంధవీ" అని రాజు పలికెను. అనఁగా నిన్నింకఁ జూడఁగోరను. మృతికాలము దాపుననున్నది. శ్రీరామునే తలంచుకొనుచుందును. నీవిపుడు

నా దేహమును స్పృశించిన నేమేని వికారములు గలుగునేమో. కనుక మనకునున్న సంబంధమునే వదలుచున్నాఁడని భావము. ఈభావ మాతనిదే యనవచ్చునా యందురేమో. మునివర్యుఁడు మహాకవివాల్మీకి యీభావము నిందిమిడించెనని యెంచవలయును. లేకున్న నామెను దుర్వృత్తి గలదానవని రాజునోటఁ బలికించునా? కైక సాధ్వి కాదనవచ్చునా? కాదన్నచో శ్రీరాముఁడామెను సంభావించుట యసంగతము కాదా. అట్లు కాఁగూడదుకదా. కాఁబట్టి యేమాత్రమున్నను మంచియర్థమును గ్రహింపవలయునని నాయాశయము.

"ద్రక్ష్యంతి నూనం పురుషా దీర్ఘబాహుం వనేచరాః,
రామముత్థాయ గచ్ఛంతం లోకనాథ మనాథవత్." ౧౫

అని మూలము

"లోకనాథం మహాబాహుం రామం నూనం,
ద్రక్ష్యంతి వనేచరాః పురుషాః."

అని "అనాథవదుత్థాయ గచ్ఛంతమ్." అనియు వరుస. సకలలోకనాథుఁడయ్యు నతఁడు కానియట్లు పోవుచున్న రామమూర్తి నాయరణ్యవాసులు చూడఁగలరు. "అనాథవత్" ఇందు సామాన్యార్థము గ్రహింపరాదు."న విద్యతే నాథో యస్మాత్సః అనాథః. అనాథ ఇవ అనాథవత్" అని గ్రహింపందగు. ఎవ్వనికంటె నింకొకఁడు రక్షకుఁడు లేఁడో యతఁడనాథుఁ డనఁబడు. అట్టివాని వలెనని భావము. సర్వరక్షకునిగా వనచరులెల్ల రామమూర్తిని గాంచఁగలరనియే యిందుఁగలవిశేషార్థము. వనములవసించువారనుటచే లోకవ్యవహారసంబంధము లేనివారని యర్థమగును. సర్వకాలము భగవంతునే ధ్యానించువారని తెలియుందగును.

పౌరులకంటె జానపదులకంటె వనవాసు లుత్తములని భావము. ఏల? మానవవ్యవహారసంబంధము లేకుండుటయే యుత్తమత్వమునకుఁ గారణము. సర్వసంగపరిత్యాగ మొనరించినవారే భగవద్ధ్యానమున నిలుకడ గలవారలు కాఁదగుదురు. అట్టివారనఁగా మునులని యర్థము. మునులు శ్రీరామమూర్తి లోకరక్షకరక్షకుఁడని భావించి నేత్రఫలముగఁ గనుఁగొందురనియే యిందలిసారము. మనమేమి నేర్చుకొనఁదగు?

భగవంతుని ధ్యానించునపుడు జనసంసర్గము పనికిరాదు. ఏకాంతస్థలము కావలయును అందుఁ గూరుచుండి యోగాభ్యాసమున బుద్ధి నిలుకడంగాంచఁగా హృదయకమలాంతరమున నాదివ్యమూర్తి నావేశింపఁజేసికొని యానిరుపమతేజోమూర్తిని ధ్యానింపవలయు. జనసంసర్గము ధ్యానయోగమునకు భంగకరమని తెలియందగు.

“యోగీ యుంజీత సతతమాత్మానం రహసి స్థితః,
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః. ౧౦
తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః,
ఉపవిశ్యాసనే యుంజ్యాద్యోగమాత్మవిశుద్ధయే.” ౧౨ గీత. ౬ అధ్యా.

అని భగవద్గీతలు బోధించెడిని. ‘రహసిస్థితః’ అనఁగా నేకాంతస్థలముననుండి యని యర్థముకదా. అట్లుగాక కొందఱు వేషధారులై గడ్డముం బెంచి యోగులమని దాసులమని భక్తులమని చెప్పుకొనుచుఁ దమకంటెఁ బామరులు తమ్ము వెంబడింపఁగా వారిమూలమున ధనములాగుచు యోగము నభినయించుచు నెన్నియో పేరులంజెప్పి ధనము సేకరించి రహస్యవర్తనమునఁ దమవారి కొసంగుచుఁ బైకి నిష్పక్షపాతులని తోఁచునట్లు

నటించుచుఁ దిరుగుచుందురు. అట్టి పాషండులు చూచునది దేవళములలోనిపాషాణమునే యని యెఱింగి వారిసంగతికిం బోక మెలంగవలయును. అట్టిపాషండులయుపదేశము నాలకింపఁ జెవులకుం బని కల్పింపరాదు.

"సుఖితా బత తం కాలం జీవిష్యంతి నరోత్తమాః,
పరిష్వజంతో యే రామం ద్రక్ష్యంతి పునరాగతమ్. 32
అథ రాత్ర్యాం ప్రపన్నాయాం కాళరాత్ర్యామివాత్మనః,
అర్ధరాత్రే దశరథః కౌసల్యామిదమబ్రవీత్." 33

అని మూలము. దశరథునకు మృత్యువాసన్నమయ్యెనని యెఱింగెను. నిమిత్తములనఁగా మనోవ్యాపారాదులు దానినే తెలుపుచుండెను. శ్రీరాముఁడు మరలవచ్చినంతదనుక జీవించియుండువారే సుఖితులు. వారే ధన్యులు. ఏలయనఁగా శ్రీరామమూర్తిని దర్శింపఁగలరని తనమరణమును దాఁదెల్పుచున్నవాఁడని యెఱుంగనగు.

"ఆత్మనః కాళరాత్ర్యామివ రాత్ర్యాం ప్రపన్నాయాం సత్యామ్."

కాళరాత్రి యనఁగా సంహారరూపిణి శక్తి యని యర్థము. తమోగుణమయి యని భావము. సత్త్వగుణప్రధానమగు విష్ణునాకృతింగొని రక్షించుచు రజోగుణప్రధానమగు బ్రహ్మయాకృతిం గొని సృజించుచుఁ దమోగుణప్రధానమగు రుద్రునాకృతిం గొని సంహారించుచు మూలప్రకృతియే యొప్పునని భావము.

"సృష్టికర్త్రీ బ్రహ్మరూపా గోప్త్రీ గోవిందరూపిణీ,
సంహారిణీ రుద్రరూపా తిరోధానకరీశ్వరీ."

అను ప్రమాణము పై దానిని దృఢపఱచుచున్నది. రక్షించువారే సంహారింతురా యని కొందఱు ప్రశ్నింతురు.

"కాలః పచతి భూతాని కాల స్సంహరతి ప్రజాః."

అను సూక్తియు,

"కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో,
లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః."

అని గీతయుఁ దెలుపుచున్నవిషయమేది? భగవంతుఁడు కాలరూపుఁడని సృష్టిస్థితిలయములు చేయువాఁడని యేసమయమున నేదిముఖ్యమో యారూపమువహించునని తాత్పర్యముకదా. కావునఁ గాళరాత్రి యనఁబరఁగునది పరిపాలించునధికారము కలది కారాదన్నయాక్షేపము నిరాధారమని యెఱుంగవలయును. నడిరేయి కాఁగా రాజు కౌసల్యతోఁ దనవృత్తాంతము నిట్లు తెలిపెను. అనఁగా మృత్యువాసన్నమగుచున్నదని యాతఁడెఱింగెననియే యిట ముఖ్యము.

"రామం మేఽనుగతా దృష్టిరద్యాపి న నివర్తతే,
న త్వాం పశ్యామి కౌసల్యే సాధు మా పాణినా స్పృశ."

అని మూలము. అనేకార్థములను బోధించుచున్నదని దీనికి వ్యాఖ్యాతలు పెక్కురీతుల భావములను దెలిపిరి వానిం జర్చించుటవలన లాభములేదు. వానిసారము గ్రహింతము మృతికాలమున నొక్కొక్కయింద్రియమే తనతనవ్యాపారమును మానుకొనును. అది యెఱింగి మెలంకువపడి మానవుఁడు తరణోపాయమును వెదకికొనవలయును. అనఁగా భగవంతుని మనగపీఠమున నెలకొలిపి కొలువవలయును. ధ్యానించుచుండవలయునని సారము.

"ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా. ౬౧
తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత,
తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతం." ౬౨
గీత. ౧౮ అధ్యా.

అని భగవంతుఁ డుపదేశించినచందమున దేవాలయమునఁ గల పాషాణవిగ్రహమునుగాక సర్వాంతర్యామియైన పరాత్పరుని ధ్యానింపవలయును.

"యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరం,
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః. ౬
అభ్యాసయోగయుక్తేన చేతసా నన్యగామినా,
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్. ౮
కవిం పురాణమనుశాసితారమణోరణీయాంసమనుస్మరేద్యః,
సర్వస్య ధాతారమచింత్యరూపమాదిత్యవర్ణం తమసఃపరస్తాత్." ౯
గీత. ౮ అధ్యా.

అని శ్రీకృష్ణమూర్తి చెప్పినప్రకారము భగవంతుని తేజో రూపునిగా ధ్యానించుచుఁ బ్రాణముల వదలిన నా తేజస్సే తమోగుణమును నాశముచేసి పరమపదమును బ్రాపింపఁజేయు నని యేర్పడుచున్నది.

దశరథునకుఁ జక్షురింద్రియము తనపని మానుకొను చున్నది. కౌసల్యా నీవు నాకగపడుట లేదని పలికెఁగదా. అనఁగా నాయింద్రియము స్వవ్యాపారవిరతిం బొందుచున్న దని రామమూర్తి ననుసరించిపోయిన నాదృష్టి యింతదనుక మరలలేదనఁగా భావమేమి? నాచిత్తము శ్రీరామునియందే

యాసక్తమైయున్నదనియే. మరలలేదనఁగా విషయాంతరమునఁ బ్రసక్తిగాంచలేదని యర్థము. ఇఁకఁ ద్వగింద్రియము (చర్మము) కూడఁ దనవ్యాపారము మానుకొనుచున్నదేమో పరీక్షించుకొందును. నీవు కరమునఁ దాఁకుము. సుఖస్పర్శముగ నుండు నదికదా నీహస్తము. నిర్మలచిత్తముగలవారిహస్తము పరులకు స్పర్శసుఖమునే కల్గించునని పెద్దలందురు. క్రూరులచిత్తము పరదుఃఖకరముకదా. మరణచిహ్నములలోఁ ద్వక్చక్షురింద్రియములు స్వప్రవృత్తిని మానుకొనుటయే ప్రధానచిహ్నములు. వాని నెఱింగినవారు తరణోపాయము నాలోచించుకొందురు. దీనిసారమేమి?

ఏయింద్రియముగాని యేకార్యమున నియోగింపఁబడునో యాకార్యమునే చేయుచుండవలయును. ఇతరకార్యము నెఱుంగకయుండవలయును. అపుడే యది యాకార్యమున శ్రద్ధకలదిగ నున్నదని మనము గ్రహింపవచ్చును. యోగి యుపాస్యదేవత యందు మనస్సునిలిపి దానినే గాంచుచుండును. ఇతరులు పిలుతురు. ఆశబ్దము శ్రోత్రేంద్రియగోచరము కారాదు. అనఁగా మనస్సు శ్రోత్రేంద్రియమునఁ బ్రవర్తింపకున్నదని భావము. మనస్సు చేరకయున్న దాని కేశక్తియులేదు. ఒక్కపని చేయుచు రెండవకార్యమునుగూడ నాయింద్రియ మెఱుంగునేని యది కార్యమున శ్రద్ధగలదిగాదని యెఱుంగవలయును. యోగమునకుఁ బరీక్షయిదియే. దశరథుఁడు స్వకీయాయుదంతమును బరికించుచున్నాఁడనుకథ మన కీపరీక్షను దెలుపుచున్నది. పరాకాష్ఠ యన నదియే. ప్రతికార్యమునందు నేకాగ్రత కుదురవలయును. ఇట్టిపరీక్షలమూలమున దానివాస్తవ మెఱింగి

యందుఁగలకొలంతను దీర్చుకొనవలయును. ఇదియే యీభాగ ముచుండి నేర్చుకొనఁదగినవిషయము.

## కౌసల్య దుఃఖించుట.

* తరువాతఁ బుత్రదుఃఖమునఁ గుందు కౌసల్య తల్ప మునఁబడి పొరలాడుచుండుపతిం గాంచి యిట్లుపలికెను. మహా రాజా! కైకేయి శ్రీరామచంద్రునకు స్వకీయకుటిలప్రవృత్తిరూప విషముఁబెట్టెను. ఇఁక నెమ్మదిగాఁ గుబుసమువదలిన నాగుఁబాము వలె నుండఁగలదు. దృష్టికి శృంగారముగ నామె యుండును. శ్రీరాము నడవిపాలుచేసి వాంఛ ఫలింప సుఖమునొందినది. ఇంకమీఁద నామె గృహాగతభుజంగమువలె నెక్కుడు బాధలు గలుగఁజేయఁగలదు. భరతునకు రాజ్యమీయక తప్పకపోయిన యపుడు రాము నడవులకుఁ బాఱఁదోలుటకంటె నన్నము పెట్టక భరతునకు దాసునిగానుండుమని యాజ్ఞాపించినను బాగుండును. ఆస్థితియందు నాకొడుకు భిక్షమెత్తుకొని జీవిం చుచు నాకుఁ గనఁబడుచున్నైన నుండునుగదా. అట్లుచేయక యడవిపాలుచేయనేల? రాజా! యజ్ఞము చేసినవిప్రుఁడు దేవ తలకీఁదగినహావిర్భాగమును నజ్ఞానమున రక్కసులకు నిచ్చు నట్లు మర్యాదమీఱి నీవు రాముని బాఱఁదోలి యతని రాజ్య మును కైక కిచ్చితివికదా. రాజలక్షణములుగల రాముఁడు సీతాలక్ష్మణులంగూడి ధనుర్ధారియై యడవిని బ్రవేశించు చున్నాఁడు. కైకమాటను బాటించి వనమునఁగా నెట్టిదో యెఱుంగనిసీతను రామలక్ష్మణులను వనమునఁ గాపురము చేయు నట్లు విడిచితివి వారిగతి యేమగును! సుఖింపఁదగువారెల్ల నడ

* ఇది నలువదిమూఁడవసర్గమునఁ గలదు.

వుల నెట్లు జీవింపఁగలరు? నాకుమారుఁడు సీతాసౌమిత్రులం తోడ నాదుగఖములు తొలఁగునట్లు రాఁగాఁ జూచునంత యదృష్ట మిపుడే కలుగునా? ఒక్కరాత్రి యొందో నిద్రపోయి వచ్చినవారివలెవారు మరలివచ్చి సకలశృంగారములంగులుకు నీ నగరమును బ్రవేశింపనుండ నీపౌరు లెదుర్కొనుకాల మెపుడు వచ్చును? ఎప్పు డీపౌరు లానందమున మునిఁగి తేలుదురు? ఆఁబోతు ధేనువుంగూడి వచ్చినట్లు సీతను బురస్కరించుకొని రథముపైఁ గూరుచుండి యారామచంద్రుఁ డెపు డీనగరమును బ్రవేశించును? పరవీరులంజెండు నాకుమారులు రాఁగా జను లెత్తైతి రాజమార్గములందుఁ బుష్పములఁ జల్లుదురు? సర్వాలంకారశోభితులై వారు నగరముం జొచ్చుచుండఁ గన్నులార నే నెప్పుడు చూడఁగలను? కన్యకలకు విప్రులకుఁ బుష్పఫలముల నొసంగుచు నాకుమారు లెపుడు నగరమునకుఁ బ్రదక్షిణము చేయుదురు? జ్ఞానవృద్ధుఁడు దేవతలవలె నిరువదియేండ్లయీడుగలవానివలె నుండువాఁడు నగు నా రామమూర్తి మూఁడేడులబాలునివలె ముద్దులు మూటఁగట్టుచు రాఁగా నే నెపుడు చూతును? నేను తొలిజన్మమునఁ గ్రూరమతినై శిశువులు పాలు త్రాగఁబూనియుండఁ దల్లులపాలిండ్లుగోసివైచియుందును. సంశయము కలుగదు. కనుక నే యీదుగఖము నాకుఁ గలిగినది. సింహము దూడను బొలియించి దానితల్లిని దూడలేనిదానినిగా నొనరించినచందమున బిడ్డలపైఁ బ్రీతిగలనన్నుఁ గైక బిడ్డలులేనిదానినిగాఁ జేసినది. లేకలేక యొక్కకుమారుఁడు గలిగెను. వాఁడు సకలకల్యాణగుణములకుఁ బుట్టినయిల్లు. సకలవిద్యావంతుఁడు. అట్టి నాకొడుకు వదలి జీవింపనొల్లను. నా చిన్నారికుమారుని జూడఁజాలనేని బ్రదుకుటకు నాకు దైవము

శక్తినియ్యదు. గ్రీష్మకాలమున సూర్యుఁడు భూమిని దపింపఁ జేయులాగునఁ బుత్త్రవియోగజనితపరితాపాగ్ని మండి నన్ను మఱింత తపింపఁజేయుచున్నది.

## సుమిత్ర కౌసల్య నోదార్చుట.

* ఈరీతి విలపించుచున్నసాధ్విని కౌసల్యం గని ధార్మికురాలగు సుమిత్ర ధర్మ్యముగా నిట్లు పలికెను. పూజ్యురాలా! రాముఁడు సకలసద్గుణవంతుఁడు. పురుషోత్తముఁడు. ఆతనింగుఱించి నీవు దుఃఖింప న్యాయముకాదు. దాన లాభమేమి? దైన్యమునఁ గలుగుఫల మేది? మహాబలుఁడగు నీ కొడుకు పెద్దలు పట్టుదలతో నాచరించునదియు మహాఫలవంతము నగుధర్మమును బూని తండ్రి కసత్యదోషము కలుగకయుండు నట్లు సత్యప్రతిజ్ఞునిగాఁ జేయువాఁడై రాజ్యమును మాని వనమునకుఁ బోయెను. అంతియగాని యింకేమియుఁగాదు. అట్టి సత్కార్యము నొనరింపఁబోయియుండఁగా నాతని దలంచి వగవ రాదు. అనఘుఁడు ప్రాణి దయాపరుఁడు నగులక్ష్మణుఁ డతనికి సేవలు చేయఁబోయెను. ఇవి లక్ష్మణునకు మహాలాభము. కాన వానింగూర్చికూడ వగవరాదు. సుఖార్హురాలగుసీతయు వనవాసకష్టములు తెలిసియుఁ బతివ్రతగావున స్త్రీలకుఁ బతియే దైవమని తలఁచి పతికష్టములఁ బోఁగొట్టఁబూని యడవికిఁ బోవుచున్నది. కాన ధర్మము నాశ్రయించిన సీతనుగుఱించియుఁ జింతింపరాదు. ధ్వజమును ద్రిప్పునట్లు విఖ్యాతిని బ్రపంచమునం దెల్లకడల వ్యాపింపఁజేయుప్రభువు శ్రీరాముఁడుకాన నతనిఖ్యాతి సకలభూతములకుఁ దెలియును. ఇంద్రియముల

* ఇది నలుబదినాల్గవసర్గమునఁ గలది.

జయించి యాశ్రితరక్షణవ్రతధనము కలిగియుండు శ్రీరామున కన్ని మేలులు కలుగును. సకలశ్రేయస్సులు గలుగునట్టి రాముని గుఱించి చింతింపవలదు.

శ్రీరాముని త్రికరణశుద్ధిని, నసమానమహాత్త్వమును, దెలిసి భాస్కరుఁ డాతనిశరీరమును దనయుష్ణకిరణముల నించు కంతయు తపింపఁజేయఁడు పవమానుఁడు సర్వదా తగినయట్లు చల్లఁదనము వేఁడిమిని గల్గించుచు హితముగా వీచుచు వన కుసుమపరిమళముల వెదఁజల్లుచుండును. పాపములకు దూర ముగనుండు శ్రీరాముని జంద్రుఁడు రాత్రులయందుఁ దుహిన కిరణముల నింపుగలుగ సేవించుచుండు. నీకుమారుఁడు శంబరా సురునికుమారుని జంపఁగాఁ గాంచి సంతుష్టుఁడై చతుర్ముఖుఁడు దివ్యాస్త్రము లొసంగెనుగదా. అట్టిశూరుఁడగు రాము నొకరు రక్షింపవలసిన యవసరమే లేదు. బాహుబలమే యాతనిం గాపా డును. కావున నతఁ డడవినివసించిన నింటనున్నయట్లే హాయిగా నుండును.

పదునాలుగేండ్లు భరతుఁడు రాజ్యముచేసి ప్రజల లోఁ బఱచుకొనఁగా నవ్వల రాజ్యము రామున కెట్లువచ్చునని యను మానింతువేమో. రామునిబాణములకు లక్ష్యమైన నెట్టిశత్రువు లైనను బ్రదుకరు. అట్టి వీరాగ్రేసరునకు భూమి యెట్లు లోఁ బడకయుండును! సకలరాజలక్షణసంపన్నుఁడగు రామమూర్తి దేహప్రకాశముఁ జూడఁగా నరణ్యావాసముం దీర్చి వేవేగ రాజ్యమును బాలించునని నాకుఁ దోఁచుచున్నది. దేవీ! శ్రీరా ముఁడు సూర్యునకు సూర్యుఁడు, అగ్నికి నగ్ని, ప్రభువులకుఁ బ్రభువు, సంపత్తికి సంపత్తి, కాంతికిఁ గాంతి, కీర్తికిఁ గీర్తి,

కోర్చున కోర్పు, దేవతలకు దేవత, భూతముల కాదిభూతము. అట్టి రాముని కెందుఁగాని ప్రతిబంధకము లేవేని కలుగఁగలవా? నగరమును విడిచి రాముఁ డడవికిం బోవుచుండఁగా నెల్లరు దుఃఖించిరో యా రాముఁడే సీతాలక్ష్మణులతో రాజ్యలక్ష్మితోఁ గూడివచ్చి పట్టాభిషిక్తుఁడు కాఁగలండు. అపజయమే యెఱుం గని శ్రీరాముఁడు మునివేషమూని నారచీరలుగట్టి వనమున కరుగుచుండఁగా సీతవలె రాజ్యలక్ష్మియు వెంబడించియే పోయెను. ఆ రామునకు దుర్లభ మేది యుండును? విలుకాం డ్రలో మేటియగులక్ష్మణుఁడు బాణఖడ్గాద్యాయుధములు దాల్చి రామునకు ముందుఁ దానే పోవుచున్నాఁడు. అట్టి శ్రీరామునకు లభింపరాని దేది యుండును? ఆర్యా! రాముఁడు వనవాసము యథావిధిగా నెఱవేర్చి రాఁగా నీవు చూడఁగల్గు దువు. ఇట్టి యజ్ఞానము దుఃఖము వలదు. సత్యమునే చెప్పు చున్నానుగాని వేఱుగాదని నమ్ముము. నిష్కళంకయశస్సుగల దానవు. మరలివచ్చిన శ్రీరాముఁడు నీపాదములకుఁ దలసోఁక వందనమాచరించునపుడు చంద్రునివలె మనస్సు చల్లఁజేయఁగా నీవు కన్నులారఁ గాంచఁగలవు. పట్టాభిషిక్తుఁడగు రామునిం జూచి యానందబాష్పముల వదలఁగలవు. తల్లి! రామున కించు కయే నశుభము కలుగునని నాకుం దోఁపలేదుసుమీ. కావున నిట్లు నీవు వగవవలదు. శీఘ్రకాలముననే నీవు సీతారాములను లక్ష్మణుని జూడఁగలవు. నిర్దోషురాలవగు నీవు నిన్నేగాక తక్కినవారిం గూడ నాశ్వాసింపవలసినదానవు. అట్టికాలమే యిది. ఈసమయమున నీవే యీలాగున మనమునఁ గుందు చున్నదానవే. ఏల! శ్రీరాముని గుమారునిగాఁ గాంచిన నీవంటిదానికి దుఃఖము తగునా? సన్మార్గవర్తనము గలవారిలో

రామునిమించువా రెందేని కలరా? మిత్రబృందముంగూడివచ్చి రామమూర్తి నీకు నమస్కరించుచుండఁగా మేఘములు వర్షించునట్లు నీవానందబాష్పములు శీఘ్రమే వదలంగలవు. వాంఛితార్థముల నొడఁగూర్చు నీకుమారుఁడు తామరలవంటికరముల నీపాదముల నొత్తఁగలఁడు. మ్రొక్కనకుమారు నానందబాష్పముల నీవే తడుపంగలవు. అని యనేకభంగుల మాటలచే నుపచారముచేయుశక్తిగల సుమిత్రాదేవి కౌసల్య నూఱడించి యూరకుండెను. కౌసల్యయు నామె యాశ్వాసించుచుండ దుఃఖమును వదలియుండెను.

మహాశయులారా! ఈభాగమున విమర్శింపఁదగు భాగము లనేకములు గలవు. ఈసర్గమంతయు సుమిత్ర కౌసల్యకుఁ జేయుహితోపదేశము కలదు. దీనింబట్టి సుమిత్ర "రామం దశరథం విద్ధి" అనుశ్లోకమునఁ గుమారునకుఁ జెప్పిన విషయ మనేకార్థములు గలదని పల్కువారియాశయములు సఫలములే యని తోఁచును.

"ఇదం ధర్మే స్థితా ధర్మ్యం సుమిత్రా వాక్యమబ్రవీత్." ౧

అని మూలము.

"జన్మాంతరసుకృతవశేన తౌ రామందోదర్యోరివ సుమిత్రాయాః పరతత్త్వజ్ఞాన మస్తీతి సంప్రదాయః."

అని గోవిందరాజులు వ్రాసిరి. తౌ రామందోదరులకుఁ బరతత్త్వజ్ఞానము కలదనుట కెట్టి ప్రమాణములు కనఁబడవో యీామె యందుఁ గలదనుటకుంగూడ నట్లే సంప్రదాయార్థములని లేనిపోనియర్థములు కొన్ని పలుకుట మతాచారప్రవర్తకులకు సహజము. కాని యవ్వానివలన లోకమున కపకారమేమియు లేదు

గాన వాని నాక్షేపింపరాదు. ఏది యెట్లున్నను కొందఱు పురంధ్రీమణులకుఁ దత్త్వజ్ఞానము కలదన్నందున మనకు గౌరవమేకదా. కొన్నిత్రావుల నిట్టిసంప్రదాయార్థములు పరమతాచారదూషణపరములుగా నుండును. ఆరూపముగా నాలుగు డబ్బు లార్జించుకొనువారు కొందఱు వేషధారులు గలరు. వారికి విముక్తియేగాని దాతలకుఁ బుణ్యము కలుగకపోదు. ప్రకృత మనుసరింతము. 'ధర్మే స్థితా' అనఁగా ధర్మనిష్ఠగలదని యర్థము. కౌసల్య దుఃఖించునట్లు దుఃఖింపక తదుపశమనార్థము ప్రయత్నించుటంజేసి పెద్దలవలన ధర్మమార్గము లెఱింగిన సాధ్వి యని తెలియవచ్చెడిని.

"తవార్యే సద్గుణైర్యుక్తః పుత్త్రస్స పురుషోత్తమః,
కిం తే విలపితేనైవం కృపణం రుదితేన వా." ౭

అని మూలము.

"ఐశ్వర్యస్య విభూషణం సుజనతా శౌర్యస్య వాక్సంయమో
జ్ఞానస్యోపశమః శ్రుతస్య వినయో విత్తస్య పాత్రే వ్యయః,
అక్రోధస్తపసః క్షమా ప్రభవితుర్ధర్మస్య నిర్వ్యాజతా
సర్వేషామపి సర్వకారణమిదం శీలం పరం భూషణం." ౭౩

అని భర్తృహరి చెప్పినట్లు సుమిత్ర కౌసల్యకు రామునియందుఁ గల సుగుణసంపత్తిని దెలిపి సద్గుణున కెందును బాధలౌదవని తెల్పుచున్నది. పురుషోత్తమః = ఉత్తమపురుషుఁడు. విశేషణోత్తరపదకర్మధారయ సమాసము. పురుషులలో నుత్తముఁడని యర్థము చెప్పరాదు. అట్టిమహాత్మునిగూర్చి విచారింపనేల? అనఁగా నెవ్వఁడు సుగుణవంతుఁడో యతని కెందు నేబాధలు కలుగవని భావము. సత్వరజస్తమోగుణములతోఁ

గూడి యవతరించిన భగవంతుఁడుకదా. అట్టివానింగూర్చి దుఃఖింపఁ బనిలేదని రహస్యార్థము. తెలిసి సుమిత్ర చెప్పినదా యున్నఁ బరమేశ్వరానుగ్రహమున నాసమయమున నట్టిమాటలే తమయంతన దొరలుచుండునని మన మెఱుంగవలయును.

“అరణ్యవాసే యద్దుఃఖం జానతీ వైసుఖోచితా,
అనుగచ్ఛతి వైదేహీ ధర్మాత్మానం తవాత్మజమ్.”

ఈపలుకు సీత యడవుల నివసించినదికాదని సుమిత్ర యెఱుంగును. అడవిఁ గలుగుదుఃఖముల నెఱింగియు విదేహరాజకన్యక సుఖానుభవమునకుఁ దగినదయ్యును ధర్మాత్ముని నీకుమారు ననుసరించిపోయెను. అని సామాన్యార్థముకదా. ఇందు జానకి యనక “వైదేహీ” అని మహర్షి ప్రయోగించెను. ఆపదమే జ్ఞానశక్తి యనునర్థ మిచ్చును. అరణ్యవాసమం దే దుఃఖముగలదో యది యెఱింగి యనఁగా నడవులఁ దావసించినపుడు రాక్షసులకుఁ గలుగఁబోవుదుఃఖముల నెఱింగినదని భావము. సుఖోచితా=సుఖము చేకూర్పఁదగినది. మునులకు దేవతలకు సుఖముఁ జేకూర్పఁదగినది. అనఁగా దుష్టరాక్షససంహారమున శిష్టులకు సుఖముఁ గల్పింపఁదగినదని భావము. సర్వబ్రహ్మాండనాయికయని సారము. అట్టి జ్ఞానశక్తి ధర్మమే యాత్మగాఁగల, అనఁగా “వృషో హి భగవాన్ ధర్మః” అను మనుస్మృతివాక్యము ననుసరించి ధర్మమే యాత్మకలవాఁడు. అనఁగా రూపహీనుఁ డగుపరమేశ్వరుఁడని యర్థము. “తవాత్మజమ్” నీకుమారుఁడుగా నున్నవాఁడని యర్థము. నీకుమారుఁడుగాఁ గనంబడురాము ననుపరించిపోయెను. కనుక నామెయే యాతనికి నతఁడే యామెకు సహాయము. ఇతరు లక్కఱలేదని

భావము. సీత సహాయురాలై యుండఁగా నీవేల రామమూర్తిం గూర్చి విచారించెదవని తెలిపెనని మన మెఱుంగవలయు. దీనిచేఁ బ్రకృతిపురుషులు సీతారాములని మనము గ్రహింపవలయును.

"వ్యక్తం రామస్య విజ్ఞాయ శౌచం మాహాత్మ్యముత్తమం,
న గాత్రమంశుభిస్సూర్యస్సంతాపయితుమర్హతి." తా

అని మూలము. శ్రీరామమూర్తిదగు నగ్నిసంబంధమగు తేజస్సును, అనుపమాన సర్వనియంతృత్వాదిలక్షణమగు మహత్త్వము నెఱింగి సూర్యుఁడు తనయాతపముచేఁ దపింపఁజేయఁజాలఁడు. అనఁగా

"ఆదిత్యానామహం విష్ణుర్జ్యోతిషాం రవిరంశుమాన్,
పవనః పవతామస్మి రామశ్శస్త్రభృతామహమ్."

అనియు,

"దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా,
యది భాస్సదృశీ సా స్యాద్భాసస్తస్య మహాత్మనః."

అనియుఁ గల భగవద్గీతావాక్యములను బరికించినఁ దెలియఁజాలు భగవద్రూపమును సూర్యుఁడు తపింపఁజేయునని యేల భ్రాంతిపడియెదవని సుమిత్రయాశయమని మన మూహింపవచ్చును. ఈ రెండు తేజస్సు లొక్కనిదే కావునఁ దన్నుఁదానెట్లు బాధించును? అనునదియే యిటఁగలపరమార్థము.

"ధ్యేయస్సదా సవితృమండలమధ్యవర్తీ నారాయణస్సరసిజాసనసన్నివిష్టః"
అనిసూక్తియుఁ బ్రసిద్ధమేకదా. ఇందు నారాయణశబ్దమునకు మధ్యవైష్ణవులు చెప్పెడు త్రిమూర్తులలో నొకఁడగు విష్ణువు కాదనియుఁ ద్రిమూర్తులను బుట్టించు మహాప్రకృతి యొవని

సంకల్పమో యట్టి భగవంతుఁడనియు నర్థమును గ్రహింప వలయు. ఇట్లే వాయుచంద్రులవిషయమునను గ్రహింపందగు. రవిచంద్రు లిరువురు మహాప్రకృతి తాటంకములని యెఱుంగ వలయు.

"తాటంకయుగళీభూతతపనోడుపమండలా."

అని ప్రమాణము.

"దదౌ చాస్త్రాణి దివ్యాని యస్మై బ్రహ్మా మహాతాజసే,
దానవేంద్రం హతం దృష్ట్వా తిమిధ్వజసుతం రణే." ౧౧

అని మూలము. ఇదిచూడఁగనే యసంగతముగాఁ దోఁచును.

"కదాచిద్రామో దండకారణ్యం గత్వా వైజయంతం పురం నిరుధ్య దశరథ విరోధీభూత శంబరసుతం హతవాన్. తేన ప్రీతో బ్రహ్మా రామాయ దివ్యాస్త్రాణి దదా వితృవగమ్యతే."

అని గోవిందరాజులు మహేశ్వరతీర్థులు వ్రాసిరి. దీనివలన ననేకసంశయము లుదయించును. సుమిత్ర యీమాట చెప్పు టకుముందే యీయుద్ధము సాగియుండవలయుఁగదా. విశ్వా మిత్రుఁడు శ్రీరాముని బంపుమా యని దశరథు నడిగినప్పటివా రిరువురసంభాషణముం బట్టి చూడఁగా నంతకుముం దీవిషయ మునకుఁ బ్రసక్తియే లేదని తేలెడిని. సీతాకల్యాణానంతరము రాముఁ డయోధ్యనున్న పండ్రెండేండ్లలో నెపుడో సాగియుండ వలయు. ఇంత గొప్పయుద్ధము సాగియుండినయెడల నద్దాని వాల్మీకి వ్రాయకయుండునా యని కొందఱందురు. ఆప్రశ్న మసంగతమన రాదు. దండకారణ్యమునకు శ్రీరామమూర్తి యరిగినట్లు పైగాథ తెలుపుచున్నది. ఆమార్గము రామలక్ష్మణు లకుఁ గ్రొత్తయైయున్నవని ముందు రామాయణముననే చదువ

వచ్చును. దశరథునకుఁ దెలియకయుండ నీయుద్ధము పోగి యుండదుకదా. చతురంగబలములతోఁ బంపక యన్నదమ్ము లను రాజు పంపదుకదా. అపుడు దండకారణ్యము రామలక్ష్మ ణులకుం బ్రాఁతదియే యగుంగాని క్రొత్తది కాదు. ఇవన్నియు నొకదాని కింకొకట్టి విరుద్ధముగానున్నవి. "స్థితస్య గతిశ్చింత నీయా" యన్నన్యాయము ననుసరించి యెట్లో సమాధానము చెప్పవలెనని వ్యాఖ్యాతలు వ్రాసిరని యూహింప నవకాశ మేర్పడుచున్నది.

'యదా వ్రజతి సంగ్రామం గ్రామార్థే నగరస్య వా'

అన్న వాక్యమును దీనికి బలిగా నీయఁబూనినను మహాభూతము వంటి యీప్రశ్నమునకుఁ జాలదనియే తోఁచెడిని. వ్యాఖ్యా తలు వ్రాసినపుడు మూల మిది ప్రక్షిప్తమనుటకు నోరాడ కున్నది. నాయాశయ మీశ్లోకము ప్రక్షిప్తమనుటయే మంచిదని. ముందే మీనాధారము దొరకిన వ్రాయుదును. ఇపు డిది సరిపఱచుయోగ్యత లేదనియే యంగీకరింతును. వ్యాఖ్యా తలు మహాత్ములు కాన వారిబుద్ధుల కిది సరియనియే తోఁచి యుండును. నావంటియల్పమతుల కిది తగినసమాధానముగాఁ దోఁపకయున్నది. సమయమొదవిన వ్రాయుదును. ఇప్పటికి మన్నింపుఁడు.

"సూర్యస్యాపి భవేత్సూర్యో హ్యగ్నేరగ్నిః ప్రభోః ప్రభుః,
శ్రియశ్శ్రీశ్చ భవేదగ్ర్యా కీర్తిః కీర్త్యాః క్షమా క్షమా.
దైవతం దేవతానాం చ భూతానాం భూతసత్తమః,
తస్య కే హ్యగుణా దేవి రాష్ట్రే వాప్యథవా పురే. ౧౬

పృథివ్యా సహా వైదేహ్యా శ్రియా చ పురుషర్షభః,
క్షిప్రం తిసృభిరేతాభిస్సహ రామోఽభిషేక్ష్యతి." ౧౭

అనుమూలము

"పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః,
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ. ౫
పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రానశ్వినా మరుతస్తథా,
బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత. ౬
ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరం,
మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి." ౭ గీత. ౧౧ అధ్యా-

అనునీగీతాశాస్త్రవిషయమునే తెలుపుచున్నది. భగవంతుఁడను నది యిదియే తెల్పుచున్నదికదా. పృథివి సీత లక్ష్మి యను మూవురతో శ్రీరాముఁడు పట్టాభిషిక్తుఁడు కాఁగలఁడు. అనఁగా భావమేమి? ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తులను మూవురంగూడి యయోధ్యానగరమున నభిషిక్తుఁడగునని యే. అనఁగా మహామాయంగూడి యని సారము. ప్రకృతి సర్వకార్యములొనరింపఁ దాసాక్షిమాత్రుఁడై సర్వదా మహానందరూపుఁడై యుండునని యే యిందలివిషయము. ఇఁకఁ దరువాతికథ నాలకింపుఁడు.

## రాముఁడు పౌరుల నాశ్వాసించుట.

* అంతఁ బరాక్రమశాలి జనరంజనము చేయ వలంతియు నగు శ్రీరాముఁడు వనమునఁ గరుగుచుండఁ బౌరులు వెంబడించి పోయిరి. శ్రీరామునిమిత్రబృందము నంతఃపురకాంతాజనము

---

* ఇయ్యది నలుబదియైదవసర్గమునఁ గలదు.

ప్రయాసమున మరల్పఁబడిరి. పౌరులుమాత్రము మరలక వెంట వెంటియే పోవుచుండిరి. శ్రీరాముఁ డవ్వారలకు నాహ్లాదమును గల్గించువాఁడు. కాన వారు పోవలవదని యెంత యభ్యర్థించినను సత్యసంధుఁడు కాన మరలక పోవుచునే యుండెను. వెంటవచ్చు వారలం గాంచి నెయ్యముపొలయఁగా నయోధ్యావాసులకు నాయందేప్రీతిగలదో గౌరవబుద్ధిగలదో దానినంతయు నా ప్రీతిని బురస్కరించుకొని విశేషముగా భరతునియందునుపం దగును. కైకకానందముగూర్చు నాభరతుఁడు సత్ప్రవర్తనము కలవాఁడు. కావున మీకెల్లఁ బ్రియహితముల నుచితరీతి నొనర్పఁగలఁడు. చిన్నవయస్సుగలవాఁడైనను జ్ఞానమున వృద్ధుఁడే. మృదుస్వభావుఁడు. పరాక్రమశాలి. కాన మీకు భయము పొదలకయుండఁ గాపాడఁగలఁడు. రాజగుణలక్షితుఁడు. మహారాజాతని యువరాజుగా నియమించెను. మనమెల్ల రాజాజ్ఞశిరసావహింపవలయుఁ గాన భరతుని రాజుగా నంగీకరింపవలయును. నేను వనముననుందును గాన మీరెల్ల మహారాజు సంతాపములపాలుగాక యుండఁ జూచుచుండందగును.

ఇట్లు రాముఁ డెంత చెప్పినను వారు మరలక రామా! దశరథుఁడు తొలుత నిన్నే యువరాజుగా నొనరించెను. కనుక నామాటను నీవు మేముకూడ సార్థకముగాఁ జేయవలయును. అని పలుకుచుఁ దమభావముల వెల్లడించిరి. కన్నీరుధారగాఁ గాఱుచుండఁగా వెంటవచ్చుచుండుట గాంచువారల కాసోదరులిరువురస్నేహపాశముల వారల బంధించి యీడ్చుకొనిపోవుచున్నట్లగపడియెను. జ్ఞానవయోబ్రహ్మవర్చస్సుల వృద్ధులగు బ్రాహ్మణులు తలలు వణఁకుచుండఁగా దూరమునుండియే రామా యాజానేయములారా! ఇటు మరలవలయు. పోవలదు.

ప్రభువగు శ్రీరామునకు హితము చేయవలయును. జంతుసంతతి నశ్వములకుఁ జెవులు మిగులఁ బెద్దవి. మాకోరికలఁ దెలిపితిమి. మా యీప్రార్థనము మీకు వినవచ్చును. ఇఁక నవ్వలంబోవక మరలుట న్యాయ్యము. సకలసద్గుణాభిరాముఁ డగు రాముఁడు పురమునకుం గొనిపోవఁదగినవాఁడే కాని యడవులకుఁ దీసికొని పోవఁదగఁడు. అని వగచుచుఁ బలుకుచుండ నాలకించి యావృద్ధ బ్రాహ్మణులరాక కోర్వఁజాలక శ్రీరాముఁడు రథమునుండి తటాలున దిగెను. వృద్ధబ్రాహ్మణవాక్యములవినియు రథమునఁ బోవుట న్యాయముకాదని తలఁచి వారి నాశ్వాసింపఁబూని మరలిన ప్రతిభంగమగునన్నయూహ సీతాలక్ష్మణులతోఁ గాలి నడకలఁ బోవుచుండెను. రథమునుండి వారి నాశ్వాసింప నంగీక రింపక నడిచిపోవుచుండఁగాఁ గాంచి వారు దుఃఖమునఁ బొగు లుచు నిట్లనిరి.

రామచంద్రా! బ్రాహ్మణసేవ నీకత్యంత ప్రీతికరముకదా. మేము నీవెంటవచ్చుచున్నాము. అగ్నిహోత్రముల మోచికొని వచ్చుచున్నారము. శరత్కాలమేఘములవలెఁ దెల్లగానుండు మా యీఛత్రములు వాజపేయయాగమునఁ గల్గినవి. నీవెనుక నివియు వచ్చుచున్నవి. నీకు ఛత్రము లేదు. ఎండసోఁకి నిన్ను బాధింపకయుండ మే మీవాజపేయయాగలబ్ధములగు వీనింబట్టి నీడఁ గల్గింతుము ఇంతదనుక నేచింతలులేక వేదము పఠించు చుండిన మాబుద్ధు లిపుడు వనవాసము చేయ వ్యాపించుచున్నవి. మహాధనము మాకు వేదములే. అవి మాహృదయములో నిమిడి యున్నవి. కళత్రములను పాతివ్రత్యమే కాపాడును. మేము కాపాడనక్కఱలేదు. కాన భార్యలిండ్లయందే యుందురు. నిన్ను మరలించి పిలుచుకొనిపోవ దృఢనిశ్చయముగలిగి

యున్నాము. వనమునకేపోదునని యింకఁ బట్టుపట్టకుము. పితృవాక్యపాలనమే ధర్మమని యెంచి యడవికింబోయిన మాకిందు ధర్మరక్షణనిమిత్త మేమియుండును? బ్రాహ్మణప్రార్థనము నంగీకరించుట ధర్మము. దాని నీవే యొప్పుకొనవేని యింతకంటె మిక్కిలి కోరఁదగిన దేమియుండును? నిశ్చలధర్మానుష్ఠానతత్పరుఁడవు. శ్వేతశిరోజములుగల మేము తలలు మేదిని సోఁక మ్రొక్కుచుఁ బ్రార్థింతుము. ఇంకనైన మరలిరమ్మా. నీవెంటవచ్చు మాలోఁ గొందఱు యజ్ఞములు చేయఁగోరి వలయుసంభారముల సేకరించినవారుగలరు. నీవు రాకున్న నవి సాగవు. రాకయున్న వానికి విఘ్నముగావించినట్లే యగును. శ్రీరామా! మేమే కాదు. చరములగుతిర్యగ్జంతువులు స్థావరములగువృక్షములు లోనగునవి నీయందు భక్తికలిగియున్నవి. కాన నిన్ను వేఁడుచు రమ్మనుచున్నవి. అట్టివానియెడ స్నేహముంజూపి వానివేఁడికోలు సఫలముగావింపుము. వృక్షములు నీవెంట రాఁబూనినవి. వాని పాదము లనఁబడుమూలములు కదలనందున వాయువేగమునఁ బొడవుగా లేచిన కొమ్మలతో ధ్వనిచేయుచున్నవి. దానింజూడగా నెత్తుగాహస్తము లెత్తి నీతోడ రాఁజాలకపోయితిమే యని యాక్రోశించుచున్నయూహ పొడమెడిని. పక్షులుకూడఁ దమచర్యల మాని యాహారముమాని యొక్కచోటనుండి సకలభూతదయాపరుఁడవగునిన్ను మరలుమని వేఁడుచున్నవి. అని యిట్లు పలుకుచున్న వారలంగాంచి తమసానది తానుగూడ రామమూర్తి నడ్డగించు దానివలెఁ గనంబడియె. సుమంత్రుఁ డంత నలసిన యుత్తమాశ్వములను విప్పి యలసటలువాయ భూమిపైఁ బొరలించి నీరుత్రాగించి నీటిచే వానిని గడిగి మేయుటకై త్రిప్పెను.

మహాజనులారా! ఇందుఁగలవిశేషములఁ బరికింతము.

"ఏవమార్తప్రలాపాంస్తాన్ వృద్ధాన్ ప్రలపతో ద్విజాన్,
అవేక్ష్య సహసా రామో రథాదవతతారహ." ౧౪

అని మూలము. తన గమనమునకుఁ దపించువృద్ధబ్రాహ్మణుల యాలాపములు విని రాముఁడు రథమునుండి దిగెను.

"వృద్ధాంశ్చ నిత్యం సేవేత విప్రాన్ వేదవిదశ్శుచీన్,
వృద్ధసేవీ హి సతతం రక్షోభిరపి పూజ్యతే. ౩౮." ౭ అధ్యా.
"ఊర్ధ్వం ప్రాణా హ్యుత్క్రామంతి యూనస్స్థవిర ఆయతి,
ప్రత్యుత్థానాభివాదాభ్యాం పునస్తాన్ ప్రతిపద్యతే. ౧౨౦
అభివాదనశీలస్య నిత్యం వృద్ధోపసేవినః,
చత్వారి తస్య వర్ధంతే ఆయుర్విద్యాయశోబలమ్." ౧౨౧

మను. ౨ అధ్యా.

అను నీస్మృత్యాచారమునే శ్రీరామునియాచారము తెల్పుచున్నది. వృద్ధభూసురులు నడిచి వచ్చుచుండఁగా దాను రథమెక్కి పోరాదనియు నయ్యది క్షేమమును గూర్పదనియు శ్రీరామునియాశయము. మనకు సదాచారమును దెల్పెడిని.

"యా హి నస్సతతం బుద్ధిర్వేదమంత్రానుసారిణీ,
త్వత్కృతే సా కృతా వత్స వనవాసానుచారిణీ." ౨౪

అని మూలము.

వేదములఁ బఠింప నుపయోగించుచున్న బుద్ధి యిత్తఱి వనవాసోన్ముఖమగునట్లు చేయఁబడినది. అనఁగా వేదాభ్యాసమునకు ఫలము పరమాత్మ వగు నిన్నేకాంతవాసమున నారాధింపఁ గల్గుటయే యని తాత్పర్యము. వేదపఠనమున సత్కర్మాచరణపరాయణత్వ మలవడును. దాన భగవత్సేవ చేయఁదగుపద్ధతి తెలియఁగలదు. దాని నాశ్రయించి యేకాంతమున ధ్యానిం

చినఁ దదనుగ్రహమునకుఁ బాత్రుఁడు కావచ్చును. అనువిషయ మిందు సూచింపఁబడును. భగవత్సేవచేయుభాగ్యము ఫలాభిసంధిరహితసత్కర్మాచరణమునఁ గల్గునని భావము. అన్నిశ్రేయస్సులకు విధివిహితకర్మాచరణమే ప్రధానమని మన మెఱుంగవలయును.

"హృదయేష్వేవ తిష్ఠంతి వేదా యే నః పరం ధనం,
వత్స్యంత్యపి గృహేష్వేవ దారాశ్చారిత్రరక్షితాః." ౨౫

అని మూలము. దీనిభావమేమి? వేదములే నిరుపమానధనము. అవి హృదయముననే యున్నవి. అనఁగా వేదార్థము హృదయగతము కావలెను. భగవంతుని వేదవేద్యుని హృదయపీఠమున నిలుపుకొనవలయుననియేకదా. మాభార్య లిండ్లయందే యుందురు. ప్రవృత్తియే వారిని రక్షించును. అగ్నిహోత్రములతోఁబోవు బ్రాహ్మణులమాట లివి. భార్యలు గృహముల నయోధ్యయందుండ నగ్నిహోత్రము లడవిలో నెట్లుపోగును! శాస్త్రవిరుద్ధముకదా యని ప్రశ్నింపరాదు. భగవద్ధ్యానమున నాసక్తి కుదురఁగా నీస్మృతులయాచారములు తొలఁగును. వైరాగ్యసంపత్తి కుదురును. సామాన్యధర్మములే యోగము లొనరించుట లోనగునవి.

"యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్"

అని ప్రమాణము కలదుకదా. వైరాగ్యముదయింపఁగనే సంసారమును త్యజింపవలయునని దీనిసారము. "దారాశ్చారిత్రరక్షకాః" అనునది విమర్శింపఁదగినది. పాతివ్రత్యము రక్షింపఁగా వారు గృహములనుందురనికదా దీనియర్థము. స్త్రీలను

బురుషులు రక్షించుటకు శక్యమే కాదనియు వారి ప్రవర్తనమే వారిని గాపాడవలయుననియు దీనిభావము.

"న కశ్చిద్యోషితశ్శక్తః ప్రసహ్య పరిరక్షితుం,
ఏ తైరుపాయయోగైస్తు శక్యాస్తాః పరిరక్షితుం. ౧౦
అర్థస్య సంగ్రహే చైనాం వ్యయే చైవ నియోజయేత్,
శౌచే ధర్మేఽన్నపంక్త్యాం చ పారిణాహ్యస్య వేక్షణే. ౧౧
అరక్షితా గృహే రుద్ధాః పురుషైరాప్తకారిభిః,
ఆత్మానమాత్మనా యాస్తు రక్షేయుస్తాస్సురక్షితాః. ౧౨

"యాస్తు ధర్మజ్ఞతయా ఆత్మానమాత్మనా రక్షంతి, తా ఏవ రక్షితా భవంతి. అతో ధర్మాధర్మఫలస్వర్గనరకప్రాప్త్యాద్యుపదేశేనాసాం సంయమః కార్యః ఇతి ముఖ్యరక్షణోపాయకథనపరమిదమ్."

అని వ్యాఖ్య. స్త్రీలను బలవంతముగా రక్షింప నెవ్వారికిని సాధ్యముకాదనియు విద్యచెప్పి ధర్మస్వరూపము నెఱింగించి యధర్మాచరణమునకు నరకప్రాప్తఫలమని బోధించి ఆత్మజ్ఞానము కలిగించుటయే వారిని రక్షించునుపాయమని దీని భావము. ఈభాగము మన కేది తెల్పుచున్నది? సద్విద్య స్త్రీలకు నేర్పవలయునని ఆత్మజ్ఞానము కలిగింపవలయుననియు ధర్మకార్యములెల్ల నామెమూలమున జరపుచుండవలయుననియు దాని మూలమున వారిబుద్ధి సన్మార్గముననే ప్రవర్తించుననియు నదియే వారిని రక్షించునదియు నంతియకాని భయమున వారికి దుష్ప్రవర్తన మలవడకయుండఁజేయ సాధ్యమే కాదనియు దీనిసారము. ఆర్యులారా! స్త్రీధర్మము లెంతచక్కగా మనకు రామాయణము తెలుపుచున్నదో చూడుఁడు. లోకానుభవమున నివి యెంతచక్కఁగా నున్నయట్లు తోఁచునో యోచింపుఁడు. మన

పూర్వులయాచారము లెంత మంచివిగ నున్నవో తలంపుఁడు. వాని నభ్యసించిన లోకయాత్ర యెంత చక్కఁగా సాగునో పరికింపుఁడు. శ్రీరామునిచరిత్రము మనకు సకలసదాచారములను బోధించుచున్నది. మానవజీవితమునకు ముఖ్యములగు ధర్మములన్నియు సంగ్రహముగ నిందుఁ గలవని మనము నమ్మవలయును.

"యాచితో నో నివర్తస్వ హంసశుక్లశిరోరుహైః,
శిరోభిర్నిభృతాచారమహీపతనపాంసులైః." ౨౭

అని మూలము. ఇవి విప్రప్రవరులమాటలు. వెండ్రుకలు హంసల వర్ణము గలవయ్యెను. అట్టి మేము తలలు భూమిసోఁక మ్రొక్కి నమస్కరించి ప్రార్థింతుము. మాయభ్యర్థనము నంగీకరించి ప్రయాణము చాలింపుము. అని ప్రార్థించిరి. వేదవేదాంగ పారంగతులగుబ్రాహ్మణులుకూడ నమస్కరింతుమనిరి. ఇట్లనఁదగునా. అని ప్రశ్నము. వేదాంతవేత్తలు కనుక క్షత్రియ కుమారుఁ డనుభావమున నమస్కరింపలేదు. పరతత్త్వమన్న జ్ఞానముననే నమస్కరించుచున్నారు. ఇదియే సమాధానము. ఇందు నమస్కారపద్ధతి తెలుపఁబడినది. భూమిధూళి తనువు సోఁకనట్లు నమస్కరింపవలయుననఁగా సాష్టాంగనమస్కారమని యర్థము. పరతత్త్వమనునర్థ మెక్కడఁ గలదందురేని "నిభృతాచార" నిశ్చలధర్మానుష్ఠానము చేయువాఁడాయని యర్థము. ధర్మస్వరూపా యని సారము. భగవంతుఁడా యని ఫలితార్థము జ్ఞానదృష్టికి జాతి గోచరింపదు. అందుఁగల పరమాత్మకళయే గోచరించును.

"ప్రణమేద్దండవద్భూమావాశ్వచండాలగోఖరమ్,"

అని శ్రీభాగవతము ౧౧ స్కం.

"విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ పండితాస్సమదర్శినః."

అను గీతావాక్యము,

"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః."

అనుగీతావాక్యము ఇందులకుఁ బ్రమాణములు. జ్ఞానులు సర్వాంతర్యామి యగుభగవంతునినే గాంతురు. బాహ్యరూపమును బరికింపరు. వారే జ్ఞానులు.

కొందఱు యోగివేషధారులు తమమతచిహ్నములఁ దాల్చి సేవించినఁగాని భగవంతుఁడు ప్రీతుఁడు కాఁడంచుఁ బామరులగుశిష్యులకు బోధించి ధనము లాగుదురు. "భగవత్సేవకుఁ జిహ్నము లవసరములే. అవి లేకున్న నది పూజగాదు" అనుటకంటె నవివేకప్రసంగములేదు. బాహ్యచిహ్నము లక్కఱలేదు. నిర్మలమన స్సొకటియే కావలయును. త్రిపుండ్రముగాని యూర్ధ్వపుండ్రముగాని మఱియే యితరచిహ్నములుగాని రవంతయైన నక్కఱలేదు.

"నాహం వేదైర్న తపసా నదానేన న చేజ్యయా,
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి యన్మమ. ౫౩
భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధో౽ర్జున,
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప. ౫౪
మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః,
నిర్వైరస్సర్వభూతేషు యస్సమామేతి పాండవ." ౫౫ గీత. ౧౧ అధ్యా.

అను శ్రీకృష్ణవాక్యములు భగవదారాధనక్రమముఁ దెలుపుచున్నవి. ఇందుచుకంతయైన బాహ్యచిహ్నములవిషయము

చెప్పఁబడినదా? పామరులకుఁ దొలుత భగవంతునియందుఁ బ్రీతిగల్గింపఁ గొన్ని చిహ్నములు మనవా రేర్పఱచిరి. ఆమార్గమునఁ బ్రవర్తింపఁబూనినవారల కవియేల?

"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః."

అన్న శ్రీకృష్ణవాక్యమునందు బాహ్యచిహ్నములమాటయే లేదు. స్థిరబుద్ధిగలవారు భక్తిమెయి ధ్యానించినఁ బరమానందమందుదురనియేకదా భగవంతుఁడనియెను. క్షుద్రతమములగు చిహ్నములు భక్తున కేటికి? ద్రవ్యార్జనపరులకే యవి యుపయోగించును. కపటయోగుల కవి ప్రాణాధారములు. పాషాణార్చకుల కవ్వి మూలధనములు. భక్తుల కవియేల?

"ధర్మధ్వజీ సదా లుబ్ధశ్ఛాద్మికో లోకదంభకః,
బైడాలవ్రతికో జ్ఞేయో హింస్రస్సర్వాభిసంధకః. ౧౯౫
అధోదృష్టిర్నైష్కృతికస్స్వార్థసాధనతత్పరః,
శఠో మిథ్యావినీతశ్చ బకవ్రతచరో ద్విజః. ౧౯౬ మను. ౪ అధ్యా.

బైడాలవ్రతికుఁడు బకవ్రతుఁడు ననునిరువురుమహాత్ములు లోకమునఁగలరని మనువు చెప్పెను. ఈయిరువురిలక్షణములుగలవారొక్కరుగనే యిపుడుండువారు పెక్కండ్రు గలరు. భగవంతుని పేరుచెప్పుకొని యాతనినామముల నమ్ముచు ధనము ప్రోగుచేసి ధర్మకార్యము లొనరింతుమని ధర్మమును నిలువఁ జేయుచు శిష్యులఁ జేరఁదీయుచు ధర్మము లుపదేశించునట్లు నటించుచు బంధువులకు లోలోన ధనమొసంగుచు సర్వస్వము భగవంతున కర్పింతుమని ప్రల్లదములు పలుకుచు నామాటలనే గాలములవైచి నిష్కపటమత్స్యములంబట్టి వశపఱచుకొనుచు

శిష్యులందఱు తమ్ము పూజించునట్లు పురికొల్పుచు ఛాయాపట
ములయందు యోగులవలెఁ గనఁబడుచుందురు మహాత్ములు
కొందఱు బకవ్రతులు బైడాలవ్రతులు కలరు. భక్తులగువారు
వారిమాయావాగురులకుఁ జిక్కరాదు.

"భక్తిమంతి హి భూతాని జంగమాజంగమాని చ,
యాచమానేషు రామ త్వం భక్తిం భక్తేషు దర్శయ." ౨౯

అని మూలము.

"ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరం,
మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి." ౭ అధ్యా. ౧౧

అన్న యీభగవదుక్తినే యీభాగము మనకుఁ దెలుపు
చున్నది. మానవులవలెఁ బ్రవర్తింపఁజాలనివృక్షాదులుకూడ
శ్రీరామునియందుఁ బ్రీతిగలవనుటచే నవికూడ శ్రీరాముని
వనగమనమునకు వగచుచున్నవని భావము. వానికోరికందీర్పు
మా. అనఁగా మృగములు పక్షులు వృక్షాదులు భగవంతు
నారాధింపఁజాలవని కొందఱందురు. అది మిగులఁ బొరపాటు.
మానవు లారాధించుపద్ధతులు వేఱు. పశువులు లోనగువవి
యారాధించుమార్గములు వేఱు. ప్రతిప్రాణియు భగవదారా
ధనముచేయు నవకాశము లుండక తప్పవు. లేవన్న నందున్న
భగవత్కృపకు ఫలమేమి? పూర్వపుణ్యము పరిపక్వముకాఁగా
నవి యాస్థితియందే భగవంతు నారాధించును. దాన నవియుఁ
గడతేఱును. అట్లుగానిచో భగవంతుని సర్వసమత్వ మూడి
పోవును. వరుసగా మానవజన్మమెత్తి యందు విప్రత్వమునొంది
జ్ఞానియై ముక్తినొందవలయు నన్నవాక్యముల కర్థమేమని
ప్రశ్నింపవచ్చును. అదియు నొకమార్గము. పాలెపురువు, సర్వ

ము, ఏనుఁగు ననునవి భగవంతునియం దైక్యమైనట్లు స్కాంద పురాణమునఁ గలదు. ఇట్టికథ లెన్నియో పురాణములయందుఁ గలవు. అవియన్నియు నపసిద్ధాంతములుగావు. వానినెల్లఁ బరిశీలింపఁగా నేయేకర్మము లొనరించి యేజన్మములనెత్తినను సత్కర్మవశమున నాజన్మముల కుచితమైన సేవావిశేషముల నన్నియు భగవదనుగ్రహమునకుఁ బాత్రములు కావలసినవే యని సిద్ధాంతము.

"అనుగంతుమశక్తాస్త్వాం మూలైరుద్ధతవేగినః,
ఉన్నతా వాయువేగేన విక్రోశంతీవ పాదపాః. 30

నిశ్చేష్టాహారసంచారా వృక్షైకస్థానవిష్ఠితాః,
పక్షిణోఽపి ప్రయాచంతే సర్వభూతానుకంపినం." 31

అని మూలము. వృక్షములకుఁ గొమ్మలు చేతులు. వాయువేగమున గొమ్మలు పైకిలేవఁగా శ్రీరామా! వనమునకుఁ బోవలదని వృక్షములు ప్రార్థించుచున్నవని తాత్పర్యము. "అశ్వత్థ స్సర్వ వృక్షాణామ్." అన్నగీతావాక్యము ననుసరించి వృక్షము లన్నింటిలో నుండుభగవదంశమునకంటె నశ్వత్థమునందు నది మిక్కిలిగనున్నదనికదా భావము భగవంతునకించుక విచారము కలుగఁగా నెల్లజంతువులకుం గల్గెనన్న విచిత్రమేమి? పక్షులు కూడ నాహారము మానియున్నవన్నను విచిత్రమేమి? ఒక్క మనస్సునకు దుఃఖము కలుగఁగా సకలేంద్రియము లాకులము లగునట్లు భగవంతుఁడించుకవిచారము నభినయింపఁగా నన్నియు దానినే గాంచునని మన మెఱుంగవలయును. అట్టిజ్ఞానముననే మానవుఁడు సముద్ధరనుఁడగు. అదియే భగవంతునను గ్రహము నకుఁ బాత్రునిగాఁ జేయును.

## శ్రీరాముఁడు పౌరులకుఁ దెలియకుండఁ బ్రయాణము సాగించుట.

*అంత శ్రీరాముఁడు తమసానదీతీరమును జేరి సీతం గాంచుచు సౌమిత్రితో నిట్లుపలికెను. సోదరా! మనము చేయఁ దగువనవాసకాలమున నిదియే తొలిరేయి. వనభాగమున మనకు రానున్నది. నీవు సౌఖ్యాదులం దలంచుకొనియేని సీత బడలికలఁ దలంచుకొనియేని కలవిలపాటొందరాదు. వనము లివిగో చూడుము. రాత్రి రానుండఁగా మృగపక్షులు నన్ని భాగములనుండి తమనివాసముల కరుదెంచి యందు శయనింపఁ బూనుచున్నవి. దాన నడవులు శూన్యములై తేజస్సుదూలి మృగపక్షులు చేయుశబ్దములచే విలపించుచున్నట్లున్నది. ఇత్తఱి నయోధ్యయందుఁ గలవారెల్ల మనరాకకై వగచుచుందురు. సంశయమేల? ప్రజలెల్ల గుణవిశేషములంబట్టి రాజునందును మనయందును భరతశత్రుఘ్నులయందును విశేషానురాగము కలవారలుగ నున్నారుగదా. తండ్రిని యశోధురంధరురాలగు తల్లిని దలంచుకొనఁగా నాకు దుఃఖము కలుగుచున్నది. నాకొఱకు వారు విలపించి విలపించి వరుసగా గ్రుడ్డివారే యగుదురేమో. అనిన నొక్కవిధముగ విచారము తొలంగు చున్నది. ధర్మాత్ముఁడు భరతుఁడౌట ధర్మార్థకామయుక్తములగు మాటలుచెప్పి నాతల్లిదండ్రులవిచారమును భరతుఁడు తగ్గింపఁ గలఁడు. ఆతఁడు క్రూరుఁడుకాఁడని తలంచుకొన్నపుడెల్ల నాకు వారింగుఱించినచింత తొలంగుచున్నది. లక్ష్మణా! నీవు నావెంట వచ్చుటచే మంచిపని చేసినవాఁడవైతివి. నీవు రాకయున్న

---

* ఇది నలుబదియాఱవ సర్గమునఁ గలదు.

సీతారక్షణార్థము వేఱు సహాయము వెదుకవలసియుండును గదా. ఆ శ్రమ మిపుడు తప్పినది.

ప్రియసోదరా! నేఁడు వనవాసప్రారంభదినము పరమపావనమగు తమసానదీతీరమే యిది. కాన నుపవాసము చేయఁదగు. ఈ రేయి జలపానమే చేసియుందును.అనేకవన్యాహారములున్నవి. కాని నన్ననుసరించివచ్చువారి విచారము తలంపునకు రాఁగా నవి రుచ్యములు నాకుఁ గానోపవు. జలమే నాకిపుడిష్టము. శ్రీరాముఁ డిట్లు సౌమిత్రికింజెప్పి సుమంత్రునితో నోసౌమ్యా! పరాకులేక గుఱ్ఱములఁ గాపాడుము. అనఁగా నతఁడు రవి క్రుంకఁగానే అశ్వముల బంధించి ఆహారమొసఁగి వానిదాపున నుండె. మఱియు నతఁడు మంగళకరమగుసాయంకాలము సంధ్యనుపాసించి రాత్రియగుటం గని సౌమిత్రింగూడియున్న రామునకు శయ్యా నాయత్తము చేసెను. తమసాతీరమునఁ బర్ణ రచితశయ్యం గాంచి లక్ష్మణసీతాసహితుండై యందు శయనించెను. అన్నయు జానకియు నిద్రపోవుటం దిలకించి సౌమిత్రి సుమంత్రునితో రామగుణములు వర్ణించి చెప్పెను.అట్లు చెప్పుచు నా రేయి యంతయు మేల్కొనియేయుండెను. సూర్యుఁ డుదయించెను. రాముఁడు తనవెంటవచ్చినవారితో ధేనుసముదాయములు నిండియుండు నానదీతీరమున నా రాత్రి యంతయు నుండెను. అంత శయ్యనుండి లేచి ప్రజలనందఱిం గాంచి లక్ష్మణా! మనయందలి ప్రీతిచే గృహాదులయందు నపేక్షమాని చెట్లక్రింద నిండుఁ బరుండిన యీ ప్రజలం జూడుము. వీరి శ్రద్ధనుజూడఁగాఁ బ్రాణములఁగూడ వదలుదురుగాని పూనికను వదలరు. వీరు లేవకముందే మనము చప్పుడుగాకయుండ నరద మెక్కి నిర్భయమార్గమునఁ బోవుదము. అట్లులైన వీరెల్ల

నన్నుంగూర్చి చెట్లక్రిందనైన శయనింపకయుందురు. రాకొమరులు తమమూలమున మనుజులకు దుఃఖముకలుగఁగా వానిని దమరు పోఁగొట్టఁదగుంగాని తమదుఃఖములను వారలకు గల్గింపరాదుగదా.

అనఁగా సౌమిత్రి ధర్మస్వరూపుఁడగు రామునిం జూచి మహాప్రాజ్ఞుఁడవగు నీపల్కు నాకు సమ్మతమె. వేగమ రథమెక్కుము. అంతట శ్రీమంతుఁడా రాముఁడు సారథిం గాంచి నీవు సమర్థుఁడవు. రథ మాయత్తము చేయుము దానినెక్కి యడవికిఁ బోయెద. శీఘ్రముగఁ బొమ్ము. అని తెలుపఁగా నాసారథి యతి త్వరితముగా నుత్తమాశ్వములం బూన్చినరథముం దెచ్చి దోసిలొగ్గి రథికవర్యా! ఇదిగో రథము తెచ్చితిని. నీవు సీతాలక్ష్మణులం గూడి యెక్కుము. నీకు శుభంబగుంగాక. అనఁగా నారాముఁడు శరచాపములుపూని కవచాదులంగొని రథమెక్కి వేగముగఁ బ్రవహించుచు సుడులుగలిగిన యానది నుత్తరించెను. అవ్వలి గట్టునదిగి శివమై యకంటకమగు దారినిబోయెను. తనవెంటవచ్చు ప్రజల నేమఱించుటకై సారథింగని సుమంత్రా! నీవొక్కండవే రథమెక్కి యుత్తరపుదిక్కున కరుగుము. అపుడు పురజనులు నేనయోధ్యకేపోయితి ననుకొందురు. ఒక్కగడియసేపట్లుపోయి రథమును మరలించి మఱియొకత్రోవనరమ్ము. నేను వనమునకుఁ బోవుట పురజనుల కెఱుకపడకయుండులాగున నుపాయము గావింపవలయు. అని రామమూర్తి తెలుప సారథి తదుక్తప్రకారమే యొనరించి మఱొకమార్గమున నరదము మరలించి తెచ్చి నిలుపఁగా రాఘవులిరువురు జానకియు దాని నెక్కిరి. తపోవనమున కరుగుత్రోవనుబట్టి రథముం దోలెను. ఆసారథి యాకాలమున శుభనిమిత్తములం గాంచ నెంచి దాని నుత్తరదిక్కునకుఁ

గొంత పోవనిచ్చెను. దానినెక్కి వా రడవులం గాంచుచుం గొంతదూర మరిగిరి.

మహాత్ములారా! ఈభాగము శ్రీరామమూర్తికరుణా పరత్వమును దెలుపును. స్థాలీపులాకన్యాయము ననుసరించి యుంచుక విమర్శింతము. ప్రజల వంచించి రాముఁ డరణ్యమున కుంబోయె ననుచో నిది శ్రీరామునకుఁ దగునా యనునాక్షే పము వచ్చును.

"అతో భూయో౽పి నేదానీమిక్ష్వాకుపురవాసినః,
స్వాపేయురనురక్తా మాం వృక్షమూలాని సంశ్రితాః. ౨౨
పౌరా హ్యాత్మకృతాద్దుఃఖాద్విప్రమోక్ష్యా నృపాత్మజైః,
న తే ఖల్వాత్మనా యోజ్యా దుఃఖేన పురవాసినః." ౨౩

అనునివి శ్రీరామవాక్యములు. ఇవి శ్రీరాముని కర్మసిద్ధాంత పరత్వము నుపపాదించుచున్నవి. అప్పటిపౌరులెల్ల శ్రీరాముని విరహము నోర్వఁజాలనివారనుట స్పష్టముకదా. వారిమనస్సులు శ్రీరాముని సర్వవ్యాపకత్వము నెఱుంగఁజాలకున్నవి. భగవంతునింగూడి వనములఁ జరించి తత్సంగతి మెలంగుచుఁ దన్మహత్త్వము నెఱుంగఁజాలినసత్కర్మములు వా రాచరించిన వారు కారు. హృదయకమలకర్ణికారమున నామహాత్ముని తేజో రూపమును నెలకొలిపి ధ్యానించునంతటిపుణ్యము చేసినవారు కారు కావున వారు తనతో నుండవలసినవారు కారు. తన్నే తలంచుచు విచారమునఁ గుందవలసినకర్మములు చేసినవారు. కావున నాకర్మఫలముల వారనుభవించునట్లు చేయుట భగ వంతునిపనిగావున నట్లే యొనరించెననియే సమాధానము. మఱియొక్కనీతి యిందుఁగలదు. ఇతరులు దుఃఖపడుచుండఁ

దాను దానిఁ దీర్పవలయుననియు నయ్యవి విశేషించి క్షత్రియ కుమారునకుఁ గృత్యమని యాశయము. తనదుఃఖము నితరులకుఁ గల్గించుట యవివేకము. ఇది రాజధర్మముగనే తోఁచును. కాని యితరులకుంగూడ నుపలక్షణవిధిచే నిది నీతిని బోధించును. తనవలన నితరులు కష్టపడరాదనుటయే యిట ముఖ్యము. ఇత రులకు శ్రమము కలిగింపని కార్యములనే చేయవలయును. అనఁగా నితరులను బాధించుకార్యము లేవియుఁ జేయరాదనియే యిందుఁగలసారము. అహింసావ్రతసిద్ధాంత మిదియే.

"అహింసా సత్యమక్రోధస్త్యాగశ్శాంతిరపైశునం,
దయా భూతేష్వలోల్తుప్త్వం మార్దవం హ్రీరచాపలం.
తేజః క్షమా ధృతిశ్శౌచమద్రోహో నాతిమానితా,
భవంతి సంపదం దైవీమభిజాతస్య భారత." 3

అను నీగీతాశాస్త్రమునాశయమే యిందుఁగలదు. దైవీసంపద్వి చారమున నహింస తొలుతఁ బేర్కొనఁబడినది. అహింసా ధర్మమున నన్నిధర్మము లిమిడియున్నవని భావము. ఇతరులకు దుఃఖమును గల్గింపరాదనఁగాఁ దనకార్యముమూలమున నిత రులు శ్రమంపడరాదనికదా తాత్పర్యము. ఇట్లు రామా యణము విమర్శించుకొలఁదిని ధర్మములు విశేషించి తెలిసికొన వచ్చును. శ్రీరామచంద్రునభిప్రాయము పరులను బాధించుకార్య ములు చేయరాదని తేలెడిని.

## పౌరులు రామునిం గానక యయోధ్య కరుగుట.

* బల్లున తెల్లవారెను. పౌరులు శ్రీరామునిం గానక శోకించి నిశ్చేష్టులైరి. కన్నీరు స్రవించుచుండ నలుదిక్కులం

* ఇది నలువదేడవసర్గమునఁ గలదు.

గాంచుచు రథధూళినైనం గాంచఁజాలక మిగుల విలపించిరి. మిక్కిలి ప్రియుఁడగు రాముఁడు తమ్మేమఱించిపోవుటంజేసి దీనులై యయోధ్యాపౌరులతో నిట్లు చెప్పుకొనిరి. ఈపాడునిద్ర యేటికివచ్చెను? రామునిం జూడకుండఁజేసిన దీనిద్రయేకదా. ఆమాన్యుఁ డాశ్రితుల నిష్ఫలమనోరథులఁ జేయువాఁడు కాఁడు. అట్టికరుణానిధి యీభక్తుల వదలి వనమున కెట్లు పోయెను? కన్నకొడుకులం దండ్రి కాపాడుచందమున మనల నిరంతరము కాపాడురామమూర్తి మనల దిగనాడి యెట్లు పోయినాఁడు? ప్రాయోపవేశముపూని ప్రాణముల నిందే వదలుదము. మరణదీక్షఁబూని యుత్తరదిక్కుంగుఱించి పోవుదము. అంతియకాని రామునివదలి బ్రదుకఁజాలము. వలసినన్ని శుష్కదారువులున్నవి. చితింజేర్చుకొని యగ్ని రగిలించి మన మందుఁ బడిచచ్చుట యుత్తమము. అయోధ్యకుంబోయిన నడిగినవారికి బదు లేమని చెప్పుదుము? మహాభుజుని రాముని బిలుచుకొని పోయి యడవిలో వదలివచ్చితిమనికదా చెప్పవలయు. అది తగునా? మనము రాముఁడు లేక పురికింబోయిన నందుఁగలవారెల్ల దుఃఖమునఁ దపించుటమాత్రము సత్యము. రాముఁడు మనోనిగ్రహముకలవాఁడు. అట్టివానితోడ నగరమునుండి బయలువెడలితిమి. ఇపు డాతని దిగనాడి మనమే యెట్లు పురముఁ బ్రవేశింతుము?

అని యిట్లు పలుకుచు దూడనువదలిన గోవ్రాతమురీతిఁ బలవించిరి. తరువాత వారు రథమార్గమునుబట్టి కొంతదూరము పోయి పిమ్మట నది కనంబడక పోవఁగా విషాదనిమగ్నులై యింకేమిచేయవచ్చును? దైవముకూడ మనయెడ ద్వేషించెను. అని యేడ్చుచు మరలిరి. వచ్చినదారింబట్టి దుఃఖించుచునే పోయి

యయోధ్యం జేరిరి. అందుఁగలపుణ్యపురుషులెల్ల వగలంబొగులు
చుండిరి. పురమున సమ్మార్జనాదులు లేకయుండ మఱింత వగచిరి.
హ్రదముననుండు భుజంగమును గరుత్మంతుఁడు తన్నుకొని
పోయిన నది యెట్టులుండునో యట్లు శ్రీరామచంద్రుఁడు లేని
కతన నగరము చులకనగానున్నదే యని యూహించుచున్న
యాపౌరులకు నాపురము చంద్రుఁడు లేని రాత్రివలె జలములు
లేనిసముద్రముకరణిఁ గనుపట్టెను. ఆదుఃఖావేశమున వారు
తమయెదుటనుండువారు తమవారో యితరులో కనుఁగొనఁ
జాలకయుండిరి.

మహాజనులారా! ఈభాగమున విమర్శించి తెలిసికొనఁ
దగిన దేదియుఁ గానరాదు. సర్వజనుల రంజించువాఁడు రామ
చంద్రుఁ డన్నభావమునే యీభాగము దృఢపఱచుచున్నది.
కావునఁ దరువాతిభాగమును బఠింతము.

### మహాజనులు రామునిగూర్చి వగచుట.

* పౌరులందఱు రాముని వదలిన వగలపెంపున దిక్కు
దోఁపక కృశించుచు నట్టె మూర్ఛిల్లిరి. గృహముల కరిగి యాలు
బిడ్డలం గాంచి మఱింత వారింగూడి వగచిరి. మిత్రసందర్శనము
దుఃఖము నడంపఁజాలదయ్యెను. ఎట్టి యపూర్వవస్తువులు దొర
కినను సంతసింపకయుండిరి. వ్యాపారము నిలిచిపోయి పురము
పాడుపడినట్టులుండెను. అన్ని కార్యములు సాగకుండెను. గృహ
స్థులు శయనింపక రామునే తలంచుచుండిరి. రత్నములు దొర
కినను మోదమందకుండిరి. ప్రథమకుమారుఁడు వచ్చినను సంతస
మొదవకుండెను. అంతటఁ బురంధ్రీమణులు విలపించుచు నిండ్ల

---

* ఇది నలుబదియెనిమిదవసర్గమునఁ గలదు.

కరుడెంచినభర్తలం గాంచి యంకుశములచే నేనుఁగులం బొడుచుచందమున మనస్సు నొవ్వఁజేయుమాటలచేఁ దూలనాడిరి. ప్రాణేశులారా! శ్రీరామమూర్తిని నేత్రఫలముగాఁ జూడలేనివారలకు గృహములేటికి? పత్నులేల? వారికి ధనపుత్త్రులచేఁ బ్రయోజనమేమి? సుఖము లెంచులకు? సీతాదేవింగూడి యడవికిం బోయినయన్నకుఁ బరిచర్యచేయ నరిగినలక్ష్మణుఁడొక్కండే యీలోకమున సత్పురుషుఁడు. రామమూర్తి యెందెందు స్నానముచేయునో యవియెల్లఁ బుణ్యవంతములు. నదులు వనములు వృక్షరాజము లామహాత్మునకు సంతోషమును జేకూర్పఁజాలును. ఆరాముఁ డడవికేని కొండలకేని పోయిన నవి సంతోషమునఁ బ్రియాతిథిం బూజించుసజ్జనులలాగునఁ బూజింపకయుండవు. వనస్పతులు భూషణములవలెఁ బూవుగుత్తులుగలిగి భృంగఝంకారములు చెలంగ రామున కానందమును గూర్పఁగలవు. పర్వతములన్నియు శ్రీరామునిం గన్న ప్రీతిచే నాకాలముననుండు దివ్యప్రసూనముల నింపుఁ గూర్పంగల్గును. అవియు మఱియు సెలయేళ్లం గనఁబఱచుచు నిర్మలజలముల నీఁగలవు. మహాభుజుఁడగు రాముఁ డెందుండునో యందు భయమే యుండదు. కాన మనమెల్ల నిపుడే పోయి శ్రీరామునిం గాంతము. మహాప్రభువగు నతనిసేవయే సౌఖ్యమొసంగును. నాథుఁ డతఁడే. గతి యన నతఁడే. మేమెల్ల జానకీదేవికి సేవలు చేయుదుము. మీరు శ్రీరామునకు శుశ్రూషలొనరింపుఁడు.

అని యీరీతి నాపౌరపురంధ్రీమణులు దుఃఖాతురలై పలుకుచు మరల నిట్లు పలికిరి. మనయోగక్షేమముల నరయు నారాముఁడు లేని యీపురము వాసయోగ్యము కాదు. అప్రశ

స్తము. కాన నిందు వసింపనేల? దీనఁ బ్రీతియేమికల్గును? అధర్మ మున కునికిపట్టగు నైకకే యిది తగును. మాకుఁ బ్రాణములే యింపుగావు. కొడుకులేల? భాగ్యముకొఱకుఁ బెనిమిటిని వద లినకైకయే దేనినైన వదలఁజాలదా. ఆమె బ్రదికియుండఁగా నీ రాజ్యమునఁ బ్రాణము లుండుదనుక సేవకులవలె వసింపనోపము. పుత్త్రులసాక్షిగా నిది సత్యము. శ్రీరామునే యడవికింబంపిన దుర్వృత్తురాలగు కైకకడ నెవ్వరు సుఖముగా నుండఁగలరు? ఈ రాజ్యము దిక్కులేక ధర్మము లేక పాడుపడియున్నది. ఒక్క కైక కారణమున నిది నశింప సిద్ధముగా నున్నది. రాజు బ్రదుకఁ జాలఁడు.అతఁడు చావఁగా నంతయునశించుననుటయుచ్చెరువా? మాకుఁ బుణ్యము క్షీణించినది. మీరుకూడఁ గేవలదరిద్రులే. ఈవిషయము నాలోచించి విషమునైన ద్రావుఁడు. లేకున్న రామునననుసరింపుఁడు. వలనుపడ దేని పేరుకూడఁ దెలియనట్టి దూరదేశముననైన నుండుఁడు. రాజు కపటమూని సీతారాముల నడవికింబంపినాఁడు. పశువులను గటికవానికి వశము చేయునట్లు మనలనందఱ భరతునివశమున నుండఁ జేసినాఁడు. ఇది యకా ర్యము కాకపోవునా? కాదని యెవ్వారైన ననఁగలరా? మోహానా కారుఁడగు రాముఁ డెందున్న నాభాగము మిగులఁ బ్రకా శించును.

ఇట్లు పౌరకాంతామతల్లులు పలవించుచుండిరి. అంత సూర్యుఁ డస్తమించెను. రాత్రి యరుదెంచెను. అగ్నిపూజా కార్యము సాగదయ్యెను. వేదాధ్యయనాదికార్యములు నిలిచి పోయెను. అంధకారమువూసినట్లు క్రమ్ముకొనియెను. వర్తకులు తమకృత్యములమానిరి. సంతోషము లేదయ్యె. నక్షత్రములు లేని యాకసమువలె నయోధ్యయుండెను. పుత్త్రులను దోఁబుట్టువుల

నడవులకుంబంపిన వగచునట్లు స్త్రీలు రాముని దలంచి దుఃఖించిరి. పుత్రభ్రాతలకన్న వారికి రాముఁడే యెక్కుడుకదా. పురమున నెందును సంతోషమును గల్గించుకార్యమే సాగకుండెను. శుష్కసాగరముభంగి నానగరము చూపట్టెను.

మహాత్ములారా! ఈభాగమునఁ గూడ విశేషములు లేవు. ఇందుఁ గులకాంతలు పెనిమిటుల దూఱుజాడలు గోచరించును. అవి శ్రీరామునిపైఁ గలమహాభక్తిని సూచించునేకాని యసాధ్వీత్వమును దెలుపవు. శ్రీరామవియోగము దుస్సహమనియే యీభాగము మనకు బోధించునేకాని యితరవిషయమును గాదని మనము గ్రహింపవలయును. ఇప్పట్లు శ్రీరాముని సర్వాంతర్యామియగు నీశ్వరుఁడని దృఢముచేయుచున్నది. కావున మనముకూడ వారివలె నాభగవంతుని హృదయారవిందమునుండి కదలనీయక నిలుపుకొనఁ బ్రయత్నింపవలయు. అదియే దృఢభక్తి యనుపించుకొనును. అద్దాని నలవరించుకొనుట మనకు విధి.

## శ్రీరాముఁ డడవికింబోవుచు సుమంత్రునితో భాషించుట.

*అట శ్రీరామచంద్రుఁడు పితృనానతిఁ దలంచుచు నా రాత్రిశేషమును బయనమున ముగించి తెల్లవాఱునప్పటికిఁ జాలదూరముపోయెను. అంతఁ బ్రాతస్సంధ్యనుపాసించి యుత్తరకోసలదేశసీమాంతభాగముం జేరెను. భూములు సస్యములు విత్తుటకై చక్కఁజేయఁబడియుండెను. వృక్షములు పుష్పించియుండెను. వానిం గాంచుచు మహాగ్రామములందును బల్లియల

* ఇది నలువదితొమ్మిదవసర్గమునుండి గ్రహింపఁబడినది.

యందును గాపురముండుజను లాడుకొనుపలుకు లాలకించుచు గుఱ్ఱములు వడివడింబోవుచున్నను వానిగమనవైచిత్రి నందలి విశేషములం దిలకించుచు మందగమనమునఁ జనినయట్లు చాల దూరముపోయెను. జనపదవాసు లారామమూర్తిం గాంచి యయ్యో! దశరథమహీపతి యెట్టివాఁడు? కామమునకే లోఁ బడియెను. క్రూరురాలు కైక యెంతపాపాత్మురాలు. నిరంతరము పాపములే చేయుచుండును. సకలసద్గుణములు గలరాముని వన ములకుఁ బంపినదే. కులతాంతలమర్యాద నతిక్రమించెను క్రూరకార్యమున నాసక్తిగలది. కాఁబట్టియే మహాభాగ్యవంతు రాలగు జానకిని గష్టములుపాలుచేయఁబూనినది. రాజునకుఁ బ్రీతిలేదు. కనుకఁ బ్రజారంజకుఁడై నిర్దోషుఁడై యుండు నాత్మజుని శ్రీరాముని వదల నిష్టపడియెఁగదా. అని మాటలాడు కొనిరి. రాముఁడు వారిమాట లాలకించుచుఁ గోసలదేశమును దాఁటిపోయెను.

అంతట నారాముఁడు స్వాదూదకములుగల వేదశ్రుతి యనునది నుత్తరించి దక్షిణదిక్కున కభిముఖుఁడై కొంతదూ రముపోయి గోమతీనదిని దాఁటెను. అందుఁగలజలము పానా ర్హము. దానిసవ్యభాగమున సహస్రసంఖ్యలు గోవులుండును. ఆనది గంగానదీమూలమునఁ సముద్రగామిని యయ్యెను. నెమి ళ్లు హంసలు ధ్వనిచేయుచుండుటం జేసి, యింపుగానుండు స్యంది కానది నుత్తరించి మున్ను మను విక్ష్వాకువున కొసంగినది విశాలము నవాంతరజనపదములుగలదియు నగుకోసలదేశమును రామమూర్తి సీతకుం గనఁబఱచెను. హంసధ్వనివంటిధ్వనితో సూతా యని పిలిచి యింక నెపుడు మరలివచ్చి జననీజనకులం గూడి పుష్పితమగు సరయూనదీతీరవనమున వేటలాడుచు

విహరింపఁగలను? పెద్దలు వేట నంగీకరింపరందువేమో. వన మున వేట పరలోకసుఖదము కానిదైనను రాజుల కీలోకమున నింపుఁగల్గింప నేర్పడియున్నది. సదాచారనిరతు లగుమానవులు శ్రాద్ధాదికాలములయందు మాంసార్థము వేటను గోరుచుం దురు. ధానుష్కులు లక్ష్యశుద్ధికొఱకు దీనిని గోరుచుందురు. అయినను నేను మృగయావిహారమును విశేషించి కోరను. సర యూనదీతీరమున రవంత వేటచేయఁగోరెదను. సర్వదా దీని నొనరించిన దోషము కల్గు. కొంచెము చేసిన దోషము రాదు. అట్టివేట యుక్తకాలమునందుఁ జేయుట రాజర్షిసమ్మతమే. దీని వంటి వినోదకేళి వారి కింక నొకటిలేదు. అని యీరీతి మధు రోక్తుల నాయావిషయములఁ దెల్పుచు మార్గము గడచిపోవు చుండెను.

మహాత్ములారా! ఇందు విశేషములు కొన్ని గలవు. వానిం దెలిసికొందము.

"కదాహం పునరాగమ్య సరయ్వాః పుష్పితే వనే,
మృగయాం పర్యటిష్యామి మాత్రా పిత్రా చ సంగతః". ౧౫

అని మూలము. తల్లితోఁ దండ్రితోఁ గూడి సరయూనదీ తీరమునఁ గల కాననములు పుష్పించియుండ నెపుడు వేట లాడఁగలను? అని సుమంత్రునకు రామచంద్రుఁడు తెలిపెను. దీనిచే రామునిభావమేమి? ఇఁక నీయవతారమున జననీజన కులంగూడి మృగయావిహార మిందు సాగింప వలనుపడదని భావము. దీనిచేఁ బితృమరణము సూచింపఁబడినది. సర్వజ్ఞత్వ మున కిది యుదాహరణము.

"రాజర్షీణాం హి లోకేఽస్మిన్ రత్యర్థం మృగయా వనే,
కాలే వృతాం తాం మనుజైర్ధన్వినామభికాంక్షితాం. ౧౬

వాత్యర్థమభికాంక్షామి మృగయాం శరయావనే,
రతిర్హ్యేషాతులా లోకే రాజర్షిగణసమ్మతా" ౧౬

అని మూలము.

"దశ కామసముత్థాని తథాష్టౌ క్రోధజాని చ,
వ్యసనాని దురంతాని ప్రయత్నేన వివర్జయేత్. ౪౫
కామజేషు ప్రసక్తో హి వ్యసనేషు మహీపతిః,
వియుజ్యతేఽర్థధర్మాభ్యాం క్రోధజేష్వాత్మనైవ తు. ౪౬
మృగయాక్షో దివాస్వప్నః పరివాదః స్త్రియో మదః,
తౌర్యత్రికం వృథాట్యా చ కామజో దశకో గణః. ౪౭
పైశున్యం సాహసం ద్రోహ ఈర్ష్యాసూయార్థదూషణం,
వాగ్దండజం చ పారుష్యం క్రోధజోఽపి గణోఽష్టకః. ౪౮
ద్వయోరప్యేతయోర్మూలం యం సర్వే కవయో విదుః,
తం యత్నేన జయేల్లోభం తజ్జావేతావుభౌ గణౌ." ౪౯

మనుస్మృతి ౭ అధ్యా॥

అను మనుస్మృతిప్రమాణముల ననుసరించి వేఁట కామము వలనఁ గలుగుదుర్వృత్తమనియు దాని కాధారము లోభమనియు దానిని బ్రయత్నపూర్వముగా వదలవలయుననియు నేర్పడుచున్నది. రామాయణమునందు శ్రీరామమూర్తియే వేఁట రాజర్షిసమ్మతమని చెప్పెను. ఇందేది సత్యము? అని ప్రశ్నించువారుందురు. ఇందు శ్రీరామునాశయ మేమనఁగా శ్రాద్ధాదికార్యార్థము వేఁటసల్పుట పాపహేతువు కాదనియు సదాచారనిరతులగు మానవు లద్దాని నాకాంక్షింతురనియు రాజర్షులుకూడ విహారార్థము వేఁటనభిలషింతురనియు నట్టి సనాతనశిష్టాచారము ననుసరించి తానుగూడ వేఁటాడఁగోరుదు

వనియు నై యున్నది. అయ్యది విశేషించి చేయక ప్రాద్దుపోకకుఁ జేయుట దురాచారము కాదనియు శ్రీరామునాశయము. దీని సారమేమి?

"శాస్త్రార్థం పాచయేదన్నం శాస్త్రార్థం పాచయేత్పశూన్,
దేవార్థే బ్రాహ్మణార్థే వా హన్యాన్మేధ్యపశూన్ ద్విజః"

అను ప్రమాణము ననుసరించి అతిథి దేవతాపూజకొఱకుఁ జేయు విధివిహితహింస యహింసయే యని తేలెడిని. పూర్వ కాలము శ్రాద్ధాదికార్యములకు మేధ్యపశుమాంసము విధి విహిత మైయున్నది. అయ్యది ప్రయత్నసాధ్యము కాని యప్రయత్నలభ్యము కానేరదు. వేఁట హింసాకర్మమే. అయ్యది బ్రాహ్మణునకు విహితము కానేరదు. మనుష్యులను బాలించురాజు మానవులసుఖముపొందఁ జేయుకార్యములు పాపమును గల్గింపఁజాలవు. క్రూరమృగబాధ లేకుండఁజేయుటకై హరిశ్చంద్రాదిచక్రవర్తులు వేఁటసల్పిరని పురాణములు తెల్పుచున్నవి. అదియుఁ గొలఁదిగఁ జేయవలయుననియు సర్వ కాల మాకార్యముననే ప్రయత్నించి మానవపాలనాదికార్య ములు వదలరాదనియు శ్రీరాముఁడు తెలిపెను. కావున మను స్మృతిభావమునకు శ్రీరామునాశయము భిన్నము కాదనియే తేలెడిని. ధర్మవిరుద్ధమగుమాట శ్రీరాముఁడు తెల్పెననుటయే మహాపాపమని గ్రహింపందగు.

## శ్రీరామమూర్తి గంగాతీరము చేరుట

* అంత శ్రీరామచంద్రుఁడు మహాబుద్ధివైభవముకల వాఁడుకావున నట్లు మాటలాడుచుఁ గోసలదేశము సరిహద్దు

* ఇది యేఁబదియవసర్గమునఁ గలదు.

చేరంబోయి యయోధ్యాభిముఖుఁడై దోసిలొగ్గి యిట్లు పలికెను. కాకుత్థ్సవంశభూపాలురచేఁ బాలింపఁబడుచుండు నో నగరవర్యమా! నిన్ను వీడుచున్నాను. నీయం దెవ్వారు నివసించియున్నారో, నిన్నెవ్వా రేలుచున్నారో యాదేవతలను గూడ వీడ్కొనుచున్నాఁడను. వనవాసనియమమునఁ గడపఁ దగుపదునాలుగేండ్లు జరపి నాప్రభువగుతండ్రి ఋణము చెల్లించి తల్లిదండ్రులంగూడి మరల నిన్ను దర్శింతునని ప్రార్థించెను. రాముఁ డంతట నేత్రములు రక్తవర్ణమునఁ జూపట్టగాఁ దన్నుఁ గనవచ్చినజానపదులు రథవేగమున దూరమునకుంబోవఁగా వారిని బిలుచుటకై కుడిచేయి యెత్తి వారు కన్నీటిధారల వదలుచుండుటెఱింగి దాన మఱింత తనమోమున నాకన్నీటిధారలు ప్రవహింపఁగా వారల కిట్లనియెను. జానపదులారా! మీరు నాయెడలఁ దగినట్లుగా స్వామి నన్నుభావమున నాదరమును దయను గనఁబఱచిలిరి. నన్నుం గాంచుచుండుటం జేసి మీకంతకంతకు దుఃఖము చెలరేఁగుచున్నది. చాలసేపు దుఃఖించుటయు మంచిదికాదుకదా. కావున గృహకృత్యములఁ దీర్చుకొనంబొండు. మేమును గార్యసిద్ధికొఱకు సెలవుతీసికొందుము. అని శ్రీరాముఁడు పలుకఁగా విని వా రాశ్రీరామునకుఁ బ్రదక్షిణముచేసి నమస్కరించి గట్టిగా విలపించుచుఁ జూపులు తృప్తింగాంచమి మఱిమఱి కాంచుచు నేడ్చుచుండఁగా రేయి సమీపించినందున సూర్యుఁడు మఱుఁగుపడునట్లు శ్రీరాముఁడు చాలదూరముపోయెను.

కోసలరాష్ట్రగ్రామములు ధనధాన్యసంపత్ప్రవృద్ధములు. వానికిందగినట్లే మానవులు మహాదాతలు. కావున నిర్భయముగా వారుందురు. ఆగ్రామములందు దేవాలయములు యూపస్తంభ

ములు నెల్ల తావులం గనంబడుచుండును. అందు నుద్యానవన ములు మామిడితోఁటలు మిక్కిలియుఁ గలవు. సరోవరములు లోనగుజలాశయములయందు నీరు సమృద్ధిగానుండును. జనులు తృప్తిగలిగి ధనవంతులై పుష్టిగలిగియుందురు. ధేనువ్రాతములు విశేషించి యందుండును. పల్లెలు నగరములవలె సొంపుగా రాజిలకనుఁజూడందగియుండును.మఱియు నందెందుఁజూచినను వేదనాదములే వినఁబడుచుండును. అట్టిగ్రామములం గాంచుచు శ్రీరాముఁడు వానిం గడచిపోయెను. ఉద్యానము లిరుదెసల నిండియుండఁగా జూడఁదగిన యామధ్యేమార్గము ననుసరించి విశేషరమ్యస్థలములు గనంబడినను ధీరుఁడుగాన లోభమున వానిని చూడకయే పోయెను. ఆదేశదక్షిణభాగమున నిర్మలో దకముగలిగి పరమపావనమై ఋషులకు సేవ్యమై త్రిలోక ములం బ్రవహించునదియై ప్రకాశించుగంగానదిని దర్శించెను. దానితీరముల నాశ్రమము లనేకములుండెను. క్రీడాకాలముల యందు దేవకన్యలు వచ్చి యానదియందుఁ గలమడుఁగుల యందు జలక్రీడలాడుచుందురు. దేవదానవగంధర్వకిన్నరు లందుఁ జరించుచు సంతసించుచుందురు. గంధర్వులభార్యలు సర్వర్తువులందు నందు జలకము లాడుదురు. ఆజలము పరిశుద్ధ ముగనే యుండును. దేవవిహారయోగ్యములగు క్రీడాపర్వత ములు వందలకొలంది గలవు. దేవతలకుఁ బనికివచ్చునుద్యాన ములు లెక్కకు మించియుండును. దేవతలఁ బూజింపఁదగు పద్మము లందుఁ గనుపట్టును. కొన్ని తావుల జలము పాషాణ ములపైఁ బడి ప్రవహించునపుడు కలుగుశబ్దమే దానినవ్వు వలెఁ గనంబడుచుండును. నురుగులు వది తేటగా నవ్వెన వాడలఁ దెలుపుచుండును. కొన్ని తావులయందు మన్నతభాగ

ములనుండి తగ్గుభాగములకుం బరుగిడు ప్రవాహము దానిజడ లవలెఁ గనుపట్టుచుండు. సుడులు మిక్కిలిగ నుండు. కదలక గంభీరముగఁ గొన్నియెడలఁ గన్పడును. అతివేగముగా జల మొక్కచో బాఱుచుండు. ఒక్కొక్కతావున మృదంగనాద ముంబోలి ధ్వని గల్గుచుండును. కొన్నితావులఁ బిడుగులచప్పుడు లాయన్నట్లు ధ్వని వినంబడు. దేవత లందు స్నానముచేయు దురు. కువలయములు కన్నులపండువుచేయుచుండు. కొన్ని చోట్ల నిసుకదిప్పలు కనుపట్టు. తెల్లనియిసుక తళతళలాడు చుండును. జలవిహంగమములు కొలకొలమనికూయుచుండును. చక్రవాకాదు లొక్కయెడ విహరించుచుండు. ఎన్నియో పక్షులు సంతోషమున నందందు విహరించుచుండు.వృక్షవాటిక లొక్కొక్కతావునఁ బుష్పహారములు వేసికొన్నదానిచందము కనంబడంజేయుచుండును. అనేకజలప్రసూనములు వికసించి చూపరులకు నేత్రపర్వము గల్గించుచుండు. ఆనదియొడ్డునంగల వనాంతరములయందు మత్తిల్లి గజములు ఘీంకారములుచేయు చుండును. పూలగుత్తులు ఫలములు చిగురుటాకులు తన్నా వరింప నన్నదియుండుటంజేసి వలయునని భూషణముల నలంక రించుకొన్న యొకసొగసులాడివలెఁ గనంబడును. విష్ణుపాద మునుండి జాఱినదొాట దివ్యస్వరూపముకలదిరై పాపదూ రరై యానది తన్నాశ్రయించినవారలపాపములను దూలఁ గొట్టుచు భగీరథుని తపోమహత్త్వమున శంకరుజటాజూటము నుండి దిగి పక్షినాదములువెలయ భూభాగమునం బ్రవహించి సాగరపత్నిరై యలరారుచుండును.

శ్రీరాముఁడు శృంగిబేరపురమునకుఁ బోవుచుండి దాని చెంతమున్న యాగంగాతరంగిణిం జేరెను. ఆమహాత్ముఁడు

తరంగములుగల మహాహ్రదములవెలయు మందాకినిం జూచి సుమంత్రున కిట్లనియె. మనమిందే నివసింతము. దీనిచెంతనే పెద్దగారచెట్టు చిగిరించి పుష్పించియున్నది. కనుక నిందే వసింతము. ఎల్లప్రాణులకు దీనియుదకము సమ్మానింపందగినది. మన మిద్దానిం గనుఁగొందము. సుమంత్రుఁడు లక్ష్మణుఁడు నా మాటల కంగీకరించి గారచెట్టుకడకుం బోయిరి. ఇక్ష్వాకు వులకుం బ్రమోదముంగూర్చు శ్రీరాముఁడు రథము రమ్య వృక్షము కడకుంబోవఁగనే రథము దిగెను. సీతాలక్ష్మణులు దిగిరి. సారథి రథముదిగి యశ్వముల విప్పి రామునికడ నంజలి బంధించియుండెను.

## గుహుఁడు రాముని దర్శించుట.

ఆదేశమును గుహుఁడు పాలించుచుండెను. నిషాదులకుఁ బ్రభువు. బలశాలి. రామునకుఁ బ్రియమిత్రుఁడు. అతఁడు శ్రీరామమూర్తి తనదేశమునకు వేంచేయుట నాలకించి కుల వృద్ధులు మంత్రులు లోనగువారు రాఁగా శ్రీరాము దర్శింప వచ్చెను. దూరమున నాతనిం గని శ్రీరాముఁడు సోదరునిం గూడి యెదుర్కొనిపోయెను. గుహుఁడు నారచీరలుకట్టియున్న యారామభద్రునిం గాంచి వగపెల్లున నాలింగనముచేసికొని శ్రీరామా! అయోధ్యవంటిదే నీకు నాపట్టణమగును. ఏమిపని నేఁజేయవలయును? అనతిమ్ము. ప్రియాతిథి యెవ్వనికి దొరకును? నీయాగమనము నాపూర్వపుణ్యఫలమే. అని పలికి రుచ్యములగునన్నాదులు కొనివచ్చి యర్ఘ్యమును చెప్పించి యో మహాప్రభూ! నీకు స్వాగతము. ఈనావనరాజ్యమంతయు నీది.

మేము నీకింకరులము. నీవే మాకుఁ బ్రభుఁడవు. ఇఁక నీ రాజ్యము నీయిష్టానుసారము పాలింపుము. భక్ష్యములులోనగు పదార్థము లివిగో ఆరగింప నవధరింపుము. ఉత్తమశయనము లివియే యున్నవి. గుఱ్ఱములకు నాహారము గలదు. అని గుహుఁడు విన్నవింపఁగా రామమూర్తి యతని కిట్లనియె.

గుహా! కాలినడక నరుదెంచి రాజ్యముం గైకొను మని మాయెడఁగలసుస్నేహమును గనఁబఱచితివి. ఈమాత్రము ననే సకలార్చనములు మాకుఁజేసినట్లే యయ్యెను. ప్రమోదము గల్గెను. అని యాతని నాలింగనముచేసికొని యదృష్టవశమున నీవు బంధువులంగూడ నీరోగుఁడవై సుఖముగా నుండం గాంచంగల్గితిని. నీరాజ్య ముపద్రవరహితమై యున్నదియా? మిత్రులకుం గుశలమా? ధనాగారము క్షీణతంగాంచక దినదినాభివృద్ధి నొందుచున్నదికదా? ప్రీతిచే నేదేది నా నిమిత్తము సమకట్టితివో దానినెల్ల నాకుఁజేసినట్లేయని యంగీకరించి నీకే మరలనిచ్చెద. ఏటికందువో యిపుడు ప్రతిగ్రహము మాని వర్తించుచున్నాఁడను. కారణమేమనఁగా పితృవాక్యమును బాలించుధర్మమునందే మదినిలిపియున్నాను. కానఁ దండ్రియానతిచొప్పున దర్భలు నారచీరలు ధరించి ఫలములఁ దినుచు నడవులఁ జరించుచుఁ దపమొనర్చుచుండఁదగినవాఁడను. అశ్వములకు వలయునాహారము నొక్కదానినే యిపుడు కోరుచున్నవాఁడను. ఇంకొక్కటి నాకు వలదు. ఇది యొనర్చిన నన్నెల్లభంగులఁ బూజించినవాఁడవగుదువు. ఈఘోటకములు నాతండ్రికి మిక్కిలి సంతసము నొదవించునవి. వీనిం బోషించితివేని నన్నుఁ బూజించినట్లగును. దాన వేయిభంగుల నన్నుఁ నర్చించినట్లగును.

ఆగుహుఁ డప్పుడే తనసేవకులం బిలిపించి గుఱ్ఱములకుఁ బాలు నీరు త్రాగించి గడ్డి వేసి తెండని పంచెను. శ్రీరాముఁడు నారచీరనే యుత్తరీయముగా నమర్చుకొని సాయంసంధ్య నారాధించి లక్ష్మణుఁడు పోయి తెచ్చినగంగాపావనజలమునే యాహారముగా భావించి త్రాగెను. పాదములంగడిగికొని యాచమనము చేసి జానకింగూడి భూతలమున శయనించెను. సౌమిత్రి గుహుఁడున్న కడకుంబోయి యాగార చెట్టుదగ్గరకు వచ్చెను. గుహుఁడు సుమంత్రునింగూడియుండి శ్రీరామచంద్రుని సద్గుణములం గొనియాడి లక్ష్మణుఁడు చెప్పఁగా నాలకించుచుఁ గార్ముకమును ధరించి ప్రమాదంపడక శ్రీరామునిం గాపాడు పొంట నారేయియెల్ల మేలుకొనియుండెను. తరువాత శ్రీరామమూర్తి సుఖార్హుఁడే యగుట నట్లు పుడమిపై శయనించి యుండుటం జేసి చక్కఁగా నిద్దురపట్టనందున నారాత్రి పెద్దదిగాఁ దోఁచఁగా నెట్లో గడపెను.

మహాశయులారా! ఈభాగము విమర్శనార్హవిషయములు గలవియే. ఆమూలతావుల విమర్శించి యందలివిశేషముల నెఱుంగుదము.

"అయోధ్యాభిముఖో ధీమాన్ ప్రాంజలిర్వాక్యమబ్రవీత్. ౧
ఆపృచ్ఛే త్వాం పురిశ్రేష్ఠే కాకుత్స్థకులపాలితే,
దైవతాని చ యాని త్వాం పాలయంత్యావసంతి చ. ౨
నివృత్తవనవాసస్త్వామనృణో జగతీపతేః,
పునర్ద్రక్ష్యామి మాత్రా చ పిత్రా చ సహ సంగతః. 3

అని మూలము. ఇందలివిశేషములెవ్వి? నగరములు ధనధాన్య సంపన్నములుగను నిరుపద్రవములుగా నుండుటకుం గారణము

దైవతము లవ్వానిని పాలించుటయే. నగరనిర్మాణమున దిశా
ధనముచేసి యెనిమిదిదెసల నెనమండ్రు దేవతల నావహింపఁ
జేసి యాపురరక్షణముచేయఁ బ్రార్థింపవలయును. వాని నానగర
వాసు లారాధించుచుండవలయును. ఆదేవత లాభక్తుల
కోర్కులు ఫలింప నందుండి పాలింతురు. ఎంతదనుక నట్టిక్రమము
సాగునో యంతదనుక నానగరము క్షీణింపదు. నిరోగమై
యుండును. ఆదేవత లానగరమును గాపాడుచు నందే యుం
దురు. ఈనియమము భరతఖండమునకే యేర్పఱుపఁబడియెనా,
ఎల్లతావులకుంగూడ నియమింపఁబడినదా? అను ప్రశ్నము
కలదు. సమాధానము నాలకింపుఁడు. గ్రామదేవతలనుట యంద
ఱెఱింగినయదియేకాని క్రొత్తమాటకాదుకదా. నేఁటికింగూడ
వాని నారాధించునాచారము కలదు. మహానగరములు కాశ్యా
దులు నిర్మించినపుడు దిగ్దేవతలను స్థాపించి దానికిఁ జిహ్న
ములుగా నాలయములు కట్టించియున్నారు. వానికే అష్టశక్తులని
పేరు. ఆదేవతల నారాధించుపద్ధతు లనేకరీతులం గనుపట్టెడిని.
అట్లు పూజాదులు సాగుచుండునంతదనుక నే యానగర మభి
వృద్ధిని గాంచుచుండును. అది క్షీణించుకొలది నిదియు క్షీణిం
చును. దేవతలు కాపాడుచుందురన్న విశ్వసింపనివారల కీభావ
ము నచ్చదు. అంతమాత్రమున నీసిద్ధాంతము తప్పనరాదు. ఈ
సిద్ధాంతమునే శ్రీరాముఁడు తెలిపెను. ఇట్టియాచారము ద్వీపాం
తరములయందుఁగలదా? అందలినగరములు వృద్ధిగాంచుట
లేదా? అను ప్రశ్నమునకు సమాధానము వినుఁడు.

ద్వీపాంతరములయందును మార్గాంతరమున దేవతా
పూజలు చేయఁబడును క్రొత్తభవనమునఁగాని క్రొత్తనగరమునఁ
గాని ప్రవేశించునపుడు వారికి నెవ్వారియందు నెక్కుడు విశ్వా

సము కలదో వారిం బిలిపించి దేవతాప్రార్థనపూర్వకముగా నా ప్రవేశోత్సవము జరపుదురు. అదియే పూజాపద్ధతి యీదేశము నందని మనము విశ్వసింపవలయును. దేవతలే లేరన్న యూహాలు వారికింగల్గినఁ దొలుత నాప్రార్థనము నేల జరపుదురు? అట్టివే మార్గాంతరము లనఁబడునవి. విగ్రహములఁ బూజించునాచార ములు కొన్నితావులనుండును. స్తోత్రమునే పూజగా భావించు నాచారము కొన్నిస్థలముల నుండును. ఇందేదియుత్తమ మను వాద మిపు డనవసరము. వారివారియోగ్యత ననుసరించి యది యుండునని మన మూహింపవలయును. మొత్తముమీఁద దేవతాద్వేష మెవ్వారికి లేదనియు వారి నారాధించుపద్ధతులు వేఱనియు మనము విశ్వసింపవలయును.

పురమునకు శ్రీరాముఁడు నమస్కరించెనుగదా. ఏల? అనఁగా స్థలముగాని వృక్షాదులుగాని మతేవికాని యెవ్వారి కుపకారము చేయునో యదియెల్లఁ బూజ్యము. దానిని భగవత్స్వరూపముగా భావించి పూజింపవలయును. కృతజ్ఞత యనునదియు నొకవిధమగుపూజయే. కృతజ్ఞతలేనిపూజ నిష్ఫల మగుటయేగాక దుష్ఫలముకూడ నొసంగును. తమపూర్వులకుఁ దనకును దరువాతివారికింగూడ నాధారభూతమగు నయోధ్యను దేవతగా భావించి శ్రీరామమూర్తి ప్రీతిపూర్వకముగా సెలవడిగెను. అనఁగా నీసదాచారమును మనకు నేర్పెనని మన మూహింపవలయును. మనముకూడఁ గొంతకాలమైన నేగృహ మునసుందుమో దానిని వదలిపోవునపుడు దేవతాబుద్ధిచే సెల వడిగి పోవవలయును. అదియే వర్ధిష్ణువులమార్గము. ఈభాగము నుండి మన మీసద్విషయమును నేర్చుకొనవలయును.

వనవాసవ్రతము పూర్తి కాఁగా దశరథునియప్పాలిర్పి తల్లిదండ్రులంగూడి మరల నిన్నుఁ జూచెదను. అని శ్రీరామ మూర్తి పలికెను. దశరథునిమరణమును రాముఁ డెఱుఁగునని యీపలుకే సూచింపఁబడియెను. ఈమాట యెట్లు సంగత మగును? అనుచో సంగతమే యనవలయును. ఇపుడు శ్రీరామ మూర్తి గ్రామనివాసులందఱుఁ దన్ను జూడరాఁగా వారితో మాటలాడక ముందే దేశప్రధానమగునగరమును బ్రార్థించు చున్నాఁడు. తండ్రిమృతివార్త లక్ష్మణసుమంత్రులకు సీతకుఁ జెంతనుండుజానపదులకుఁ దనమూలమునఁ దెలియరాదనియే శ్రీరామునిభావము. కనుకనే "మాత్రా పిత్రా చ సంగతః" అని యెను. తల్లినిగూడి తండ్రినింగూడఁ గూడి యనునర్థము తేటపడ 'పిత్రా చ' అనియెను. తండ్రిమాట సంశయమే యని యిందలి చకారము తెలుపును. కావున శ్రీరామమూర్తికి దశరథుని మృతికాలము తెలియకపోలేదని తేలెడిని.

"అనుక్రోశో దయా చైవ యథార్హం మయి వః కృతః,
చిరం దుఃఖస్య పాపీయో గమ్యతామర్థసిద్ధయే." ౫౧

అని కన్నీరుస్రవించుచుండఁ బల్లెలనుండువారలతో రాముఁడు పల్కుచున్నాఁడు. అనుక్రోశదయాశబ్దము లేకార్థమునే సామా న్యముగాఁ దెలుపును. కాని యిందు ననుక్రోశమనఁగా నాదర మని గ్రహింపవలయును. నాయందుఁ గలయాదరము దయ యనువాని కనురూపముగా మీరు నన్ను గారవించితిరి. నన్నుంజూచుచుఁ జాలసేపు మీరిటనుండుట దుఃఖహేతువే యగును. మేము సెలవుతీసికొని ప్రయాణము సాగింతుము. అని సామాన్యార్థము. నన్నాదరించి దయచే గారవించితిరి.

కాని మీరు నన్నుం జూచుకొలఁది నాకేమో యీకార్యము కష్టదాయకమని భావించుచు దుఃఖించుచున్నారు. కావున మీరిఁక వెళ్లుఁడు. మేమును ప్రయాణము సాగింతుము. అనఁగా మావూనినకార్యగౌరవ మెఱుఁగక నాతత్త్వము తెలిసికొనఁజాలక దుఃఖించుచు మీరిందుండుట తగదు.పోవుట మంచిది. ఆనందస్వరూపుఁడ నగునన్నుం గాంచి తదానంద సుఖము ననుభవించుటకు మాఱుగా దుఃఖించుచున్నారు. నామానవత్వాభినయనము మీకుఁ దెలియలేదు. కావున నన్నుం గాంచి దుఃఖపడువారలంజూడ నాకిష్టములేదు. వేగము పొండు. మీ వెంత నుండక మేమును వెడలుదుము. అని యిందు విశేషార్థము. ఈయర్థమున కేమైన నాధారముకలదా యనువా రుండకపోరు.

"తథా విలపతాం తేషామతృప్తానాం చ రాఘవః,
అచక్షుర్విషయం ప్రాయాద్యథార్కః క్షణదాముఖే." 8

అను నీమూలమే పైవిషయమును దేటపఱచుచున్నది. ఇట్లు లేడ్చుచుఁ దృప్తి నొందకయుండు వారలకన్నులకు దూరముగా శ్రీరాముఁడు పోయెను. అనఁగా స్వవిశేషమును దెలిసికొనఁజాలక కేవల పామరులగువారలకు భగవద్రూపము చాలసేపు కనఁదగదని శ్రీరామునాశయము.

"విష్ణుపాదచ్యుతాం దివ్యామపాపాం పాపనాశినీం,
సముద్రమహిషీం గంగాం సారసక్రౌంచనాదితాం.
ఆససాద మహాబాహు శ్శృంగిబేరపురం ప్రతి." ౨౯

అని మూలము. విష్ణుపాదమనఁగా నాకాశము. అనఁగా హిమాలయమున నత్యున్నతప్రదేశమునుండి పడుచున్నదని

భావము. విష్ణుమూర్తిపాదమునుండి గలిగినదని కొందఱు వాదింతురు. భగవంతునిపాదమే సకలప్రపంచమునని భావించిన బాధయేమి? మధ్యవైష్ణవులు కొందఱు విష్ణుపాదప్రక్షాళనోదకమే గంగయనియు, దానిని శంకరుఁడు తలపై ధరించెననియుఁ బల్కుచు శివునికంటె విష్ణు వెక్కుడందురు. అంత కంటె నీచమగునభిప్రాయము వేఱొండు లేదు. వారికిఁ జక్కని సమాధానము బదరీనారాయణక్షేత్రమే. అందే నారాయణుఁడు శంకరునిగుఱించి తపస్సు చేసెను. శివునిదయకుఁ బాత్రుఁడై వరములఁ బొందెను. అట్టియల్పవాదములకు సమాధానమే యక్కఱలేదు. ఎవ్వరి కేదేవతయందు భక్తి యెక్కువగనుండునో వారి కాదేవతయే భగవంతుఁడగును. అనఁగా సర్వదేవతామయుఁ డొక్కపరమాత్మయే యని భావము. ఈసిద్ధాంతమున దుర్మతాభిమానమునకు స్థలమే లేదు. కావుననే మహాత్ము లొక్కదుర్వాదమునందును బ్రవేశింపరు.

"అవిదూరాదయం నద్యా బహుపుష్పప్రవాళవాన్,
సుమహానింగుదీవృక్షో వసామోఽత్రైవ సారథే." ౨౭

అని మూలము. నదీతీరమున నించుక చెంత పూవులు చిగురుటాకులుగల తాపసవృక్షము కనంబడుచున్నది. అందు నివసింతము. మునులకు నుపయోగించునది కాన నాయది తాపసతరు వనంబడియెను. పరోపకారము నొనరించు ప్రతివస్తువునందును భగవత్కళ యధికముగా నుండుననియు దానవయ్యాది మహాత్ములకు వాసార్హమయ్యెననియు భావము. ఇందే యుందమనఁగా నాతేజస్స్వవృక్షమునందు విశేషించియున్నది. కాన నిదియే నాకు సంతోషము గల్గించుచోటు. "అత్రైవ

అనుటచే నీచెంత దీనినిమించినస్థానములేదని భావము. మంచి శిల్పముచే నేదియుఁ బావనముకాదు. పావనమనఁగాఁ బరో పకారాది సద్గుణములుగలదియే యగును. వేషాలోకకారణమునఁ గా నేరదు. వేషభాషలచేతఁగాని గడ్డముపెంచుట లోనగు బాహ్యచిహ్నములచేతఁగాని మానవుఁడు పవిత్రుఁడు కాఁడు. నిర్మలమనస్సుచేతనే పావనుఁడగు. భగవంతుఁడు బాహ్య చిహ్నములం గన నూహింపఁడు. పరిశుద్ధమనస్సునే పరికించును. అది గల్గినయెడల నందే నివసించియుండును.

"తత్ర రాజా గుహో నామ రామస్యాత్మసమస్సఖా,
నిషాదజాత్యో బలవాన్ స్థపతిశ్చేతి విశ్రుతః"

అని మూలము.

"బ్రాహ్మణాద్వైశ్యకన్యాయామంబష్ఠో నామ జాయతే,
నిషాదః శూద్రకన్యాయాం యః పారశవ ఉచ్యతే." ౮

మను. ౧౦. అధ్యా.

మనుస్మృతిప్రకారము నిషాదజాతి నీచవాచకమని తేటపడును. పూర్వము చక్రవర్తులు కొండయందు నడవులయందు నుండు మానవులకు నాటవికులనే ప్రభువులనుగా నియమించి వారి వలనఁ దక్కిన దేశములకుఁగాని బాటసారులకుఁగాని బాధలు లేకుండఁ జేయుచుండిరి. వారు కప్పముగా నందుదొరకు తేనె లోనగువస్తువులఁ దమప్రభువులకుఁ బంపుచుండిరి. అటవీ రాజ్యములు పశుధనాకీర్ణములు. క్షామబాధ యెఱుంగనివి. అందుండువారలకు దైవభక్తి మెండు. హింసాకర్మమున వారికి విసుగు తోఁపదు. ఈవిషయము పురాణాదులవలనఁ దెలియ వచ్చెడిని.

గుహుఁడు హీనజాతిప్రభవుఁడు. శ్రీరామున కాత్మ సముఁడు. అనఁగా మిత్త్రుఁడని భావము.

"శూద్రప్రేష్యం హీనసఖ్యం హీనయోనినిషేవణం,
తథైవాసాశ్రమే వాసః పరాన్నపరిపుష్టతా. ౨౬౧

అను యాజ్ఞవల్క్యస్మృతిప్రకారము హీనజాతిసఖ్యము పనికి రాదనియు, నది యుపపాతక మనఁబడుననియుఁ దేటపడు చున్నది. మహాకులప్రభవుఁడగు శ్రీరామున కిది తగునా యని యాక్షేపించువారు కలరు. సమాధానము వినుఁడు. రాజ వర్యులే యాటవికులకుఁ బ్రభువుగా నందు బలవంతుని రాజుగా నియమింతురు. వానితో విరోధించిన లాభములేదు. కావున నీపాతకములు రాజుగా నివారికని చెప్పవలయును. ఇది సామా న్యమగు సమాధానము.

"సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహం. ౨౯
అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్,
సాధురేవ స మంతవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః. ౩౦
మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః,
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాం గతిం." ౩౧

భగవద్గీత. ౯. అధ్యా

అను నీశ్రీకృష్ణోపదేశము ననుసరించి భగవంతునిదృష్టికి జాతి భేదములు గానరావు. నిర్మలచిత్తుఁడే యాదృష్టికిం బాత్త్రుఁ డగును. ఎవ్వారు భగవంతుని భక్తిభావమున సేవింతురో వారు సదాచారవంతులుగాక కుత్సితాచారవంతులే యైనను వారు సాధువులే యగుదురు. పాపజాతిసంభవులైనను దన్నే నమ్మిన

వారైనచో ముక్తులగుదురని తేలెడిని. గుహుఁడు పరమపావన హృదయుఁడు. కావున నతనితో సఖ్యముచేయుట నీచకార్యము కాదు. శూద్రప్రేష్యము హీనసఖ్యము లోనగునవి మానవ మాత్రులకు నుపపాతకములగునుగాని భగవంతుఁడగు శ్రీ రామమూర్తికింగావని యెఱుంగునది. వేషభాషల ప్రాధాన్య మల్పదృష్టులకుంగాని సర్వసాక్షియగు భగవంతునకుఁ గాదు.

"స్వాగతం తే మహాబాహో తవేయమఖిలా మహీ,
వయం ప్రేష్యా భవాన్ భర్తా సాధు రాజ్యం ప్రశాధి నః." 3౦

అని మూలము. ఇది గుహుని మనోభావమును దెలుపుచున్నది. సామాన్యార్థము సుగమము.

"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః." 34
గీత. 9 అధ్యా.

అను శ్రీకృష్ణోపదేశమునకు నుదాహరణభూతుఁడగు వాఁడు గుహునిరీతినే యుండవలయును.

"అఖిలా ఇయం మహీ తవ వయం ప్రేష్యాః భర్తా భవాన్ నః రాజ్యం సాధు ప్రశాధి."

అనువాక్యములభావ మేమనఁగా ఈపృథ్వియంతయు నీది. నీ యష్టమూర్తులలో నొక్కటికదా. మేమెల్ల నీకింకరులము. మమ్ము భరించువాఁడవు నీవు. కనుక మమ్ములను రాజ్యమును జక్కఁగాఁ బాలింపుము. మాయొక్క రాజ్యమని యర్థము కాదు. అది గర్వమును దెల్పును. అట్టిమాట గుహుఁ డనఁడుకదా. సాధు ప్రశాధి. అనఁగా ననేకబ్రహ్మాండము లేలు నాకీస్వల్ప రాజ్యమా యనరాదు.

"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః"

అన్నతమవాక్యమునే యనుసరించి మీరొసంగినదానిని మీకే యర్పించితిని. దాని నాదరమునఁ గైకొని చక్కఁగాఁ బాలింపుము. మమ్ముఁ బాలింపుమనఁగా నన్ను నన్నాశ్రయించినకళత్రాదులను గృతార్థులనుగాఁజేయుము. రాజ్యం ప్రశాధి. ఈ రాజ్యము మహారణ్యమునడుమ నున్నది. దీనిని దమపాదారవిందస్పర్శమున సుగమముగాఁ జేయుమా యని భావము. మహాత్ములేచోటఁ గాలూనుదురో యదియే పుణ్యక్షేత్రమనియే యిందుఁగలతాత్పర్యసారము. అనఁగా మహాదేవా పరమేశ్వరా శ్రీరామచంద్రా! ఈభూమియంతయు నీది. నీయానతిమెయి నిందున్నవాఁడను. సేవకుఁడను. సర్వమును భరించువాఁడవు నీవు. నాపుణ్యోదయమున నేఁటి కరుదెంచితివి. మమ్ముఁ గింకరులనుగాఁ జేకొని పాలింపుమని గుహుఁడు భగవత్తత్త్వము నెఱింగినవాఁడుగానఁ దదుచితముగాఁ బ్రార్థించెను. ఫలాభిసంధిరహితసత్కర్మమనఁగా నిట్టిదే. ప్రభుకుమారా! ఈనాటికి వచ్చితివి. నాకుఁ గావలసిన విచ్చి. వాని నొసంగుమని కోరువారు పామరులు. భక్తు లట్లు గోరరు. నన్నుఁ బాలింపుమనఁగా

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహాం"

అన్నభగవదుక్తి ననుసరించి తన్నే నమ్మినవా రడుగకపోయినను వారికిఁ గర్మానుసారములగుఫలముల నొసంగువాఁడు భగవంతుఁడుకాన నతఁడే యొసంగును. వేఱే ప్రార్థన మేల? సర్వజ్ఞునకుఁ దెలియనివిషయము లుండవు. కావున భక్తులు సత్కర్మముల

నాచరించి తత్ఫలము భగవంతున కర్పింపవలయుననియు నా మహాత్ముఁడే యతనికి ననుభవార్హములగుఫలముల నొసంగు ననియు మన మెఱుంగవలయును.

"తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర,
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః. ౧౯
యే మే మతమిదం నిత్యమనుతిష్ఠంతి మానవాః,
శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేఽపి కర్మభిః. ౩౧
గీత. ౩ అధ్యా.

అన్న గీతావాక్యములే పైని వ్రాసినయాశయమును దృఢపఱచు చున్నవి.

"గుహమేవం బ్రువాణం తం రాఘవః ప్రత్యువాచ హ,
అర్చితాశ్చైవ హృష్టాశ్చ భవతా సర్వథా వయం. ౪౦
పద్భ్యామభిగమాచ్చైవ స్నేహసందర్శనేన చ."

అని మూలము. ఇందొక్కవిశేషార్థ మిమిడియున్నది. విమర్శింతము. కాలినడకతో నీవు వచ్చుటచేతను స్నేహభావము కనఁబఱచుటచేతను మేము పూజింపఁబడితిమి. మిక్కిలి హృష్టుల మైతిమి. నీవు మమ్ము సర్వథా పూజించినట్లే యయ్యెను. అనఁగా నీరామవాక్యసారమేమి? అహంకారవిరహితుఁడై భగవంతుని దివ్యకళ విశేషించియుండుచోటికి భక్తిభారమున శ్రమమునే యెఱుఁగక పోవుట. స్నేహభావమున భగవత్పదమును దర్శించుట యనునివి రెండును భక్తునిమనోభావమును దేటపఱచును. సామాన్యముగ మానవులు దేవతాదర్శనమునకుం బోవునపుడు వస్త్రాభరణాదుల నెవరిదగ్గరనైనఁ దెచ్చుకొనియైన ధరించి పోవుదురు. వారు భగవంతునికడఁ గూడ దమయైశ్వర్యగర్వమును

జూపఁ గడఁగువారగుట వారిం గాంచి భగవంతుఁడు ప్రమో ధమందఁడు. కపటభక్తులనియే భావించును. అచ్చోటనే యహం కారమును జూపువా రింకెందు నద్దానిం జూపరు? కావున భాగ్య స్వరూపుఁడగు పరమేశ్వరుఁడు స్నేహభావమున నహంకారము వదలి దర్శింపఁదగినవాఁడు. వారికే యాత్రాఫలము సిద్ధించును. వేడుకఁగా యాత్ర చేయువారలకు ఫలము నిష్ఫలమే.

"నిర్మానమో నిరహంకారస్సమదుఃఖసుఖః క్షమీ." ౧౩ అధ్యా. ౧౨

అన్న భగవద్వాక్యమే యిందులకుఁ బ్రమాణము. అహంకార ప్రదర్శనము భక్తినభినయించుట యనునివి ధనాశాలంపటుల యుపాయములని తలంపవలయును. ఇక్కాలమున భక్తులమని పొగడుకొనుచు భూషణాంబరములం దాల్చి భగవత్కైంక ర్యము చేయుటకని డబ్బులాగువా రెందఱో కలరనుట సార్వ జనీనముకదా. ఇప్పట్టున నొక్కవిషయము స్మృతికిం దగులు చున్నది.

"ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా."

అన్న శ్రీభగవద్వాక్యమును బఠించుచు నుపన్యసించుచు నేదో యొక భగవత్కైంకర్యము చేయుదుమని పలుకుచుఁ దమ గుట్టు పరులెఱుంగఁజాలరని యానందించుచు నెల్లరచే మ్రొ క్కించుకొనుచు భగవంతుఁడు కనఁబడి తమకేదోవిషయమును దెల్పుచునే యుండునని చెప్పుచు ధనము బంధువులకొఱ కార్జించి వారలం బోషించువారుకలరుగదా. వారల కాస్తికము భగవద్భక్తమనువిశ్వాసముకలదని మనము నమ్మవచ్చునా? అట్టి వారికపటజ్ఞానోపదేశములకు లోఁబడవచ్చునా? లోఁబడువారు

కేవల మూఢులు కారా? వారికిని వీరికిని ఫలము తుదకు దుష్ఫ లమే కాక మతేమగును? భగవంతుఁడు కనంబడి నా కీపదార్థ ములు కావలెనని యడుగునా? అది నమ్మఁదగినదే యగునా? "పత్రం పుష్పం ఫలం తోయం" అన్నది భగవంతుఁడే కదా. లేక గడ్డము పెంచుకొన్న దాసరియా? సర్వేశ్వరుఁడు తనకలి గినపదార్థమును భక్తిమై నర్పించువానినే ప్రేమించునుగాని తనను గూడ వంచింపఁ దలఁచువానిని ప్రేమింపఁడు. ఇది నిశ్చి తము. నిర్మలభక్తిగలగుహుఁడు ఈ రాజ్యము నీది. మేము నీ దాసుల మనియెను. మనము కూడ లోకవంచకులవలెఁ బ్రవర్తింపఁబూనక భక్తిభారమున నాసర్వేశ్వరుని శ్రీరాముని గుహునివలె నారాధించి కృతార్థులము గావలయును. పైని వ్రాసినవిషయము నెట్లు శ్రీరామమూర్తియే తెల్పెనో యీ క్రిందివాక్యము చిత్తగించినఁ దేటపడును.

> "యత్త్విదం భవతా కించిత్ప్రీత్యా సమభికల్పితం,
> సర్వం తదనుజానామి న హి వర్తే ప్రతిగ్రహే. ४३
> కుశచీరాజినధరం ఫలమూలాశినం చ మాం,
> విద్ధి ప్రణిహితం ధర్మే తాపసం వనగోచరం." ४४

అని మూలము. తొలియర్ధశ్లోకమునందే పైభావము స్పష్టము. తరువాత శ్రీరాముఁడు భక్తలక్షణములు తెల్పుచున్నాఁడు. శ్రీరామావతారమునఁ దానొనరించి వానినే యితరులకుం దెల్పుటయేకదా మార్గము. దీనిభావ మేమనఁగా ప్రతిగ్రహము మాని యనఁగా నేదియుఁ దనకుఁ గావలయునన్న కోర్కినుండి తొలఁగి దొరకినవస్త్రమును దృప్తిమాలి ధరించి యితరులకు బాధకల్పింపనిపదార్థముల భుజించి ధర్మమార్గమును వదలక జన

సంగతికి దూరమై తపోవృత్తిచే ననఁగా భగవద్ధ్యానముచేఁ గాలము గడుపవలయును. అట్టివాఁడే భక్తుఁడు. అనునదియే యిటఁగలవిశేషము.

"న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః,
మాయయాపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః. ౧౫
చతుర్విధా భజంతే మాం జనాస్సుకృతినోఽర్జున,
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ. ౧౬
తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే,
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః." ౧౭
గీత. ౭ అధ్యా.

అను నీగీతావాక్యములే శ్రీరామునియాశయమును వెల్లడించుచున్నవి. అప్రతిగ్రహీతృత్వమే భక్తునిలక్షణము. ప్రతిగ్రహణము ధనాశను వృద్ధిచేయును. అది జ్ఞానమునకుఁ బ్రతిబంధకము. కాన నద్దాని మానుటయే యుత్తమమార్గము. ధనము కొంచె మిచ్చినం దిట్టి యెక్కువగా నొసంగినఁ భూషించువారు జ్ఞానులా? లోకవంచకులా? రెండవవారే యగుదురుగదా. ధనసంబంధమునుమాని యదృచ్ఛాలాభసంతుష్టుఁడై సర్వదా భగవంతుని శ్రీరాముని సేవింపవలయును. అదియే యుత్తమమార్గము. ఈఘట్టమున నధ్యాత్మరామాయణమున నెట్లు చెప్పఁబడినదో తెలిసికొందము.

"సఖాయం స్వామినం ద్రష్టుం హార్దాత్తూర్ణం సమాపతత్,
ఫలాని మధుపుష్పాది గృహీత్వా భక్తిసంయుతః,
రామస్యాగ్రే వినిక్షిప్య దండవత్ప్రాపతద్భువి.
... ... ... ... ...
ధన్యోఽహమద్య మే జన్మ నైషాదం లోకపావన,

బభూవ పరమానందస్సంస్పృష్ట్వా తేంగం రఘూత్తమ.
నైషాదరాజ్యమేతత్తే కింకరస్య రఘూత్తమ,
త్వదధీనం వసన్నత్ర పాలయాస్మాన్రఘూద్వహ.
ఆగచ్ఛ యామో నగరం పావనం కురు మే గృహమ్.
గృహాణ ఫలమూలాని త్వదర్థం సంచితాని మే
అనుగృహ్ణీష్వ భగవన్ దాసస్తేఽహం సురోత్తమ.''

అధ్యాత్మరా. ౫ సర్గము.

''భక్ష్యం భోజ్యం చ పేయం చ లేహ్యం చేదముపస్థితం,
శయనాని చ ముఖ్యాని వాజినాం ఖాదనం చ తే.'' ౩౯

శ్రీమద్రామాయణము ౫౦ సర్గము.

చతుర్విధాహారపదార్థములఁ దెచ్చితిని. శయ్యాదులు గలవు. గ్రహింపుమాయని రామాయణమునందును, పండ్లు తేనె పుష్పములు లోనగువస్తువులు నీకొఱకు సంపాదించి తెచ్చితిని. పరిగ్రహింపుమని యధ్యాత్మ రామాయణమునందును గలదు. నిషాదునియింట క్షత్రియులు భుజింతురా యనుశంక కవకాశము రామాయణమునఁగలదు. అధ్యాత్మ రామాయణమున నద్దానికిఁ జోటులేదు. మొదటిది చరిత్రప్రధానము. రెండవది తత్త్వ ప్రధానము. కావునఁ దమపని నా రెండును జక్కఁగా నెఱవేర్చినవి. లోకపావన అనువిశేషణము మిక్కిలి చక్కఁగా నున్నది. లోకపావనుఁడవు కనుకనే నా యీనిషాదజాతిసంభూతిని ధన్యముగా నొనరింపుమా యని ప్రార్థించెను. ఫలమూలము లారణ్యకము లారోగ్యాయుఃప్రదములు. అవి యర్పించుట యటవీరాజ్యపాలకునకుఁ దగినదియే.

''రామస్తమాహ సుప్రీతో వచనం శృణు మే సఖే,
న వేక్ష్యామి గృహం గ్రామం నవ వర్షాణి పంచ చ,

దత్తమన్యైర్న నో భుంజే ఫలమూలాది కించన,
రాజ్యం మయైతత్తే సర్వం త్వం సఖా మేఽతివల్లభః."

అధ్యాత్మరా. ౫ సర్గము.

ఇది గుహునకు శ్రీరామమూర్తి చెప్పినసమాధానము. న్యాయ్యముగనున్నది. చెలికాఁడా యని గుహుని బిలిచెను. సెబాస్. పరమేశ్వరాశయ మెంత బాగున్నది! భగవంతునకు భక్తునికంటెఁ బ్రియుఁ డొకఁడు లేఁడనుట సిద్ధాంతము.

"అనపేక్షశ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః,
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః. ౧౬
యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి,
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః. ౧౭
సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః,
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగవివర్జితః. ౧౮
తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్,
అనికేతస్థ్సిరమతిర్భక్తిమాన్ మే ప్రియో నరః. ౧౯
యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే,
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః." ౨౦

గీత. ౧౨ అధ్యా.

అన్నగీతావాక్యములు భక్తునకుఁ బరమేశ్వరునకును గలసంబంధము తేటపఱచుచున్నవి. భక్తునకంటెఁ బరమేశ్వరునకు సఖుఁడు లేఁడు. భగవంతునకంటె భక్తునకు శరణము వేఱు లేఁడు. కావుననే పరస్పరసఖ్యము ముఖ్యము. ఇఁక నవ్వాలిచరిత్రమును బఠింతము.

## గుహుఁడు సౌమిత్రితో భాషించుట.

*సౌమిత్రి భ్రాతృరక్షణమున నాసక్తిగలిగి మనఃపూర్వక
ముగా మేల్కొనియుండఁగాఁ గాంచి గుహుఁడు విచార
మునఁ గుందుచు నతని కిట్లనియె. ఆర్యా! రాజకుమారుఁడ
వగు నీవేల మేలుకొనియున్నాఁడవు? అది మంచిదిగాదు. ఈ
శయ్యపై సుఖనిద్ర చేయుము. బడలికలు వాపుకొనుము. అటవి
కులముగానఁ గష్టపడుట మాకువిధి. నీవనఁగా సుకుమారుఁ
డవు. శ్రీరామునికొఱకు మేమెల్ల మేల్కొనియుందుము.
నాకు శ్రీరామునికంటెఁ బ్రియముఁ గూర్చువాఁ డొకఁడు
నీలోకమున లేఁడు. ఇది సత్యము. రామచంద్రానుగ్రహము
ననే విశాలకీర్తిని ధర్మము నర్థము నార్జింపఁగోరుచున్నాఁడను.
రామప్రసాదమునే కోరువాఁడనుగాన నాబంధువులంగూడి
నిదురనుండి లేచుదనుక మేలుకొనియుండుదు. రక్షించుభారము
నాది. ఈయడవిలో నాయెఱుంగనితావులు లేవు. విరోధి
యెవఁడువచ్చినను నాకుఁ దెలియకయుండదు. రహస్యభాగము
లెల్ల మేమెఱింగినవేకానఁ జతురంగబలయుతుఁడై పగవాఁడు
వచ్చినను మే మాపఁగలము.

ఆమాటలు విని లక్ష్మణుం డిట్లనియె. అనఘా! ధర్మైక
నిరతుఁడవు. ఇట్టి నీవు రక్షించుచుండఁగా మా కేభయము
గలుగును? మహారాజకుమారుఁడు శ్రీరాముఁడు భూతనయం
గూడి నేలఁ బరుండియుండఁగా నిద్దుర నాకువచ్చు నెట్లు? ఊఱట
యెట్లు గల్గును? సురాసురు లొక్కటియైవచ్చిన నెవ్వని నోర్వఁ
జాలరో యట్టిశౌర్యనిధి సీతంగూడి శాద్వలముల హాయిగా

* ఇయ్యది యేఁబదియొకఁడవసర్గమున నున్నది.

శయనించియున్న వాఁడు. చూడుము. దశరథుఁడు ఎన్నియో
తపములుసలిపి యజ్ఞములొనర్చి యెన్నియోకష్టములకులోనై
యేసత్పుత్త్రునిగాంచెనో సకలశుభలక్షణములుగల యా శ్రీ
రాముఁడు వనమునకుఁబోవఁగా రాజిఁక నెంతకాలము బ్రదుకఁ
గలఁడు? ఈభూమియుఁ ద్వరితముగ విధవ కాఁగలదు. సత్యము
అంతఃపుర కాంతలు రోదనములు చేసి యలసి యూరకయుం
దురు. నాగృహము నిశ్శబ్దముగా నుండునని తలంచెదను.
కౌసల్యయు దశరథుఁడు నాతల్లియు జీవించియుందు రను
నూహ నాకు లేదు. బ్రదికిన నీయొక్క రాత్రియే యనుకొం
దును. రేపు బ్రదుకరు. నాతల్లికి నింకొక్కఁడు శత్రుఘ్నుఁడు
కుమారుఁడు గలఁడు. కాన వానియందుఁ గలస్నేహమునఁ
బలుసారులు చూచుకొనుచు జీవింపవచ్చును. ఆమెవిషయ
మును నాకు విశేషించి చింతలేదు. కాని కౌసల్య శ్రీరాముని
వంటికొడుకు వదలి బ్రదుకఁజాలదు. అదియే నాకు దుస్సహ
దుఃఖము. రాజునందు ననురాగము గలప్రజ లయోధ్యయం
దున్న వారు. ఎంతో శృంగారముగనుండు నయోధ్య రాజు మర
ణింపఁగా విపత్తునొంది చెడఁగలదు. రాజు మహాత్ముఁడగుకుమా
రునిం గాంచకయున్నఁ బ్రాణములతో నుండు టెట్లు? రాజు
మృతినొందఁ గౌసల్యయు మృతినొందు. పిదప నాతల్లియుఁ
జచ్చు. అక్కటా! నాతండ్రి రాజ్యమున శ్రీరాము నభిషేకించి
తనవాంఛితము తీర్చుకొనకయే నశింపఁగలఁడు. కనుక సకల
ప్రయోజనములు మించిపోయినవి. ఇపుడు వానిం దలంచిన
లాభ మేమి? నాతండ్రి కుమారునివిషయమున నేముద్దుముచ్చ
టలు తీర్చుకొనకయే నశింపఁగలఁడు. తండ్రి చావఁగా నతనికిఁ
జేయవలసినప్రేత కార్యములు సాగింపఁదగునపుడు కృతార్థులగు

రాజకుమారులకే తండ్రికి సంస్కారములు చేయుభాగ్యము కల్గును. మేమట్టిధన్యులము గాము.

అయోధ్యానగరము సకలవిధముల సొంపుగులుకుచుండును. జనులెల్ల సుఖవంతులుగా నుందురు. కాని రాజు బ్రదికి యుండునా? అతఁడు జీవించియుండఁగా మేము వనవాస వ్రతము ముగించి మరలివచ్చి సువ్రతుఁడగు నామహారాజును జూతుమా? మాయన్న వనవాసము గడపివచ్చి తండ్రి క్షేమముగనుండఁగా నతనిఁగూడి యయోధ్యం బ్రవేశింప నేను బ్రవేశింతునా? అని యిట్లా రాకొమరుఁడు దుఃఖార్తుఁడు రోదనము చేయుచుండ రాత్రి గడచెను. లక్ష్మణుఁడు చూపిన నెయ్యమునకు మెచ్చుకొని గుహుఁడు శ్రీరామునకుఁ గల్గిన విపత్తునకు భీతుఁడై వగచి మనస్సు దిటవుతప్పఁ గన్నీరువిడిచెను.

మహాత్ములారా! ఈభాగమున విమర్శించి గ్రహింపఁదగినవిశేషము లేవియులేవు. సౌమిత్రికి శ్రీరామునియెడఁగల ప్రేమాతిశయము వెల్లడియగును. అతని మాటలపొందికం గాంచిన శ్రీరామవియోగము తల్లిదండ్రులకు దుర్భరమనియు దాననే వారు మృతినొందఁగలరనియుఁ దోఁచెడిని. సౌభ్రాత్ర్యమన నిట్టిదే కదా. "పితృసమో జ్యేష్ఠః" అన్నసూక్తి లక్ష్మణుఁడు చక్కఁగా నెఱుంగును. లోకమున రామలక్ష్మణులవంటి యన్నదమ్ములుండిన నెంతశాంతముగను సుఖముఁగను గాలము సాగునో కదా. ధనాశ యనుపిశాచ మావేశింప సోదరసంబంధము తుదముట్టి నశించుచున్నది కదా. ఇంతకంటె దుఃఖింపఁదగినవిషయ మేమి కలదు? ఆచంద్రతారార్కముగా యశస్సు నిలుపఁదగినది ప్రేమమే కాక మఱేమికలదు? అద్దాని నెవ్వారా రా

ధింతురో వారే మహాత్ములు. ఆకాలమే మంచికాలము. ఆదేశమే వాసార్హము. అట్టికాలము మనభరతఖండమునకు మరల వచ్చుఁగాక.

**శ్రీరాముఁడు జడలుదాల్చుట, గంగాసంతరణము.**

* తెల్లవాతెను. శ్రీరాముఁడు లక్ష్మణునింజూచి వత్సా! భాస్కరుఁ డుదయించుసమయ మిది. భగవతిరాత్రి కడచినది. భరద్వాజపక్షియుఁ గోకిలము కూయుచున్నవి. అడవినుండి మయూరధ్వనులు వినఁబడుచున్నవి. ఈగంగ సాగరగామిని గాన మిగుల జవమునఁ బాఱుచున్నది. దానిం దాఁటుదము. అనఁగా నాలక్ష్మణుఁడు మహాత్మా యీనది నూరక దాఁట సాధ్యముకాదు. సాధనమేదేని గావలయును. అనఁగా విని రాముఁడు గుహునింబిలిచి ఈయాశయము తెలిసినదికదా. అనిపిలిచి యడిగెను. గుహుఁడు శ్రీరాము నానతిని తలదాల్చి మంత్రులం బిలువనంపి సులువుగా నది దాఁటింపఁదగునట్టి నావను బరికరములతోఁ దెచ్చి కర్ణధారునితోడ రేవునకుం జేర్పింపుఁడని యుత్తర్వుచేసెను. వారల్లె యప్పుడే యొనరించిరి. అంజలి బంధించి గుహుఁడు శ్రీరామునిమ్రోల నిలువంబడి మహాత్మా! తమయానతిమెయి నౌక సంసిద్ధముగనున్నది. ఇంకేమి చేయంబడగునో యానతిండు. శ్రీరామా! సాగరగామిని గంగను దరింప నాయత్తమైయుండు నీయోడ నెక్కుమని విన్నవించెను.

శ్రీరామమూర్తి గుహుం గని, నాకోర్కి ఫలింపఁజేసి తివి. వనవాససాధనములను సీత యాభరణాదుల నందుఁ

* ఇది యేఁబదిరెండవసర్గమునఁ గలదు.

జేర్పుము. అనిపలికి తమ్మునింగూడి కవచమును దాల్చి తూణీర ఖడ్గశరాసనములం జక్క నమరించి జానకిం గలిసి నదికిం బోవు త్రోవ నాశ్రయించి పోయెను. భృత్యధర్మములను శ్రీరాముఁ డెఱుంగునుగాన సుమంత్రుఁ డతనికడకుంబోయి యడంకువ సంజలింబట్టి నేనేమి చేయవలయును? అని వేఁడెను. శ్రీరాముఁడు తనదక్షిణహస్తమున సుమంత్రుని దాఁకుచు మంత్రీ! నీవు కడు వేగమ రాజుకడకరుగుము. అతని నేమఱక కాపాడుచుండుము. ఇంతదూరము రథము నెక్కించి నన్నుఁ గొనివచ్చితివి. ఇఁకఁ బాదచారినై వనమునకుం బోయెద. నీవు మరలి యయోధ్యకుం బొమ్ము. అనఁగా నతఁడు తనకు సెలవిచ్చెనని యెఱింగి పిలుచు కొనిపోనొల్లఁడయ్యెఁగదా యన్న దుఃఖమున నిట్లనియెను. నీవంటిమహాపురుషుఁడు తమ్మునితో భార్యతోఁ క్షుద్రజనుఁడువలె వనముల వాసముచేయుట లోకమం దెవ్వానికైన సమ్మతము కాదు. నావంటివాని కది సమ్మతమగునా యని చెప్ప నేల? దైవ కృతమగు నీవిపత్తును మార్ప నెవ్వరికి సాధ్యముకాదు. బ్రహ్మ చర్య మవలంబించి వేదములఁ బఠించి దయగలిగి యార్జవమున వెలయు నీవంటిమహాపురుషున కిట్టివ్యసనము వచ్చునేని బ్రహ్మ చర్య వేదపాఠదయాళుత్వ నిష్కాపట్యములవలన ఫలముగల్గు నని నే నించుకయు నూహింపను. మహావీరా! నీవు సోదరునిం గూడి సీతాసహితుఁడవై పితృవాక్యమును బాలించుపొంటె వనముల నివసించి త్రిలోకములమించిన శ్రీమహావిష్ణువువలెఁ బృథుకీర్తినొందఁగలవు. త్రిలోకజయమున సద్గతి కేగఁగలవు. నీపట్టాభిషేకమునకు విఘాత మొనరించి కైకయు, నిద్రపోవు చుండఁగా జెప్పకయేవచ్చి నీవును బౌరుల వంచించితిరి. ఇఁక వగలపాలై పాపాచారముగల కైకకు లోఁబడి వర్తింపఁగల

వారము కావున హతులమే యైతిమి. అని సుమంత్రుఁడు పలికి శ్రీరాముఁ డడవి నుండవలసివచ్చె నన్న దుఃఖమున రోదనము చేసెను. పిదప నశ్రుపాతమునకుఁ బొచితముగా నాచమనము చేసి పరిశుద్ధుఁడై యుండు సారథిం గాంచి శ్రీరాముఁడు మధురోక్తులఁ బెక్కుసారె లూఱడించుచు నిట్లు పలికెను.

ఇక్ష్వాకువంశమున జన్మించినవారలకు నీకంటె నెక్కుడగుమిత్రుని నెవ్వని నేఁ జూడలేదు. నీవు మాతండ్రి నన్నుఁ దలంచుకొని దుఃఖపడకుండునట్లు చేయుచుండుము. ఆతఁడు శోకించుచున్నవాఁడు. ముదుసలి. నికామకామపీడితుఁడు. కనుకనే నేనిట్లు చెప్పుచున్నాఁడను. రాజు కైకకుఁ బ్రీతిగల్గింపఁగోరి యేమేమి యానతిచ్చినను వానినెల్ల నించుకయు ననుమానింపక చేయవలయును. ప్రభువులు కామక్రోధముల నేయేకార్యముల యందు మనస్సు ప్రవర్తించిన నవి ఫలించుటకేకదా రాజ్యమును బాలింతురు. మంత్రివర్యా! ఎట్టులేకార్యము చేసిన రాజు ప్రీతినొందునో దుఃఖముకలుగు నవకాశము లేకయుండునో దాని నట్లే చేయుచుండుము. ఇంతదనుక నాతండ్రి దుఃఖ మెట్టిదో యెఱుఁగఁడు. ముదుసలి పూజ్యుఁడు. స్వాధీనేంద్రియుఁడు. అట్టిరాజిపుడు దుఃఖములపాలైనాఁడు. కనుక నీవు నాకు మాఱుగా మ్రొక్కి యిట్లు పలుకుము. "అయోధ్యనుండి విడిపోయితిమి. వనమున నుండవలయునన్న దుఃఖము నాకు లేదు. సీతకును సౌమిత్రికిని గూడ లేదు. పదునాలుగేండ్లు గడువఁగా నాలసింపక మేమెల్ల వచ్చి మిమ్ము దర్శింతుము." అని. సారథీ! ఇట్లు తండ్రికిఁ దల్లులకుం గైకకుం దెల్పి తరువాత సీతయు నేనును లక్ష్మణుఁడును జెప్పినట్లుగాఁ గౌసల్యకు మాయారోగ్యము నమస్కారములు తెల్పుము. నాతండ్రితో భరతుని

వేగ పిలిపించి రాజ్యమున నునిచి కౌఁగిలించుకొన్ము. ఆసుఖ మున మాసంతాపము తొలఁగఁగలదు. అని మామాటలుగాఁ బల్కుము. తరువాత భరతునితో వత్సా! నీవు రాజువిషయ మున నెట్లు ప్రవర్తింతువో యట్లే తల్లులవిషయమున నించు కంతయు భేదములేక వర్తింపుము. కైకయు శత్రుఘ్నునందలి ప్రీతిచే సుమిత్రయుఁ గన్నతల్లులవలె నెట్లు విశేషించి ప్రీతితోఁ జూడఁదగియున్నారో యట్లే నాతల్లియగుటం జేసి కౌసల్యయు నీకు మిక్కిలి మన్నింపఁదగినది. తండ్రికిఁ బ్రీతిగల్గింపఁగోరి యావరాజ్యము నంగీకరింతువుగాన నిహపరసుఖములను బ్రజ లకు రాజునకుం గూర్పఁజాలుదువు. అని నేను జెప్పితినని తెల్పుము.

అని పలికి శ్రీరాముఁడు తన్నుఁ బురమునకుఁ బోవునట్లు చేయఁగా నాసుమంత్రుఁడు శోకించుచు వాని నాలకించి యిట్లు పలికెను. మహాత్మా! అనుమానముమాని నేమిచెప్పితినో యది స్నేహభావముననేయని గ్రహింపవలయు. సేవాధర్మము నతిక్ర మించి నీపైఁగల కూర్మిపెంపున నాచెప్పినమాటలన్నియు భక్తుఁడ నని తలంచి నన్ను మన్నింపందగు. నిన్నిటవదలి నేనెట్లు పురము నకుంబోవుదును. ఒకప్పుడందులకు నేను సాహసించినను గొడుకు నెడఁబాసిన స్త్రీవలె నిన్ను నెడఁబాపుకొను నాయయోధ్యకు నొంటరిగా నేనెట్లుపోవఁగలను? అందుఁగలప్రాణికోటులు నిన్నుఁ గూడిన యీస్యందనము నిప్పుడు నీవులేకుండఁ జూడఁగనే దుఃఖము పెల్లున హతములగునే. పౌరులు నన్నుమాత్రము చూచి మిక్కిలి దుఃఖింతురుగదా. అందలివారెల్ల దూరమున నున్ననిన్నే తలంచుచుఁ దమముందున్నరీతి భావించుకొనుచు నాహారమును వదలియుందురనుట యథార్థము. పౌరులదుఃఖ

మును నీవే చూచియున్నవాఁడవుకదా. నేను నీవు లేనిరథ మును దోలుకొనిపోవఁగా వేయింతలుగా దుఃఖమున విలపిం తురుగదా. మీతల్లి కౌసల్యతో నేమని పల్కుదు? నీకుమారుని తల్లీ మాతులగృహమున వదలివచ్చితినందునా? అబద్ధము నెట్లు పల్కుదు? వనములో డించివచ్చితినని నిజముచెప్పుదునా? అది యప్రియముకదా. సత్యమైన నప్రియము నెట్లు పల్కుదు? నామాట విన్నంతనే యాదేవి యసువులంబాయునే! మిమ్ము మువ్వురను వహించివచ్చిన యీయుత్తమాశ్వములు మీరు లేమి నేనుదోలిన నెట్టు లీడ్వఁగలవు? కాఁబట్టి నేను నిన్ను వదలి యయోధ్య కరుగనోపను. నీవెంటనుండ నానతిమ్ము. నాప్రార్థనము నంగీకరింపవేని రథముతో నగ్నింజొత్తును. శ్రీరామా! నీతపమునకు విఘ్నముగావించు క్రూరజంతువులం బొలియింతును. మహాత్మా! పురుషోత్తమా! నీవు రాజ్యాభిషిక్తుఁ డవై భూమిఁ బాలించుచుండఁగా నీకొఱకు సారథినై దానఁ గలుగుసుఖము దౌర్భాగ్యుఁడనగు నాకు లభింపకపోయెను. అదిలేకున్నమానె. నీతో వనవాసము చేయుచు నీకు సారథినై పరిచర్యాసుఖమునైన నొందఁగలనని యాశించుచున్నాఁడను. వనముల నీచెంత నుండఁగోరెద. ఇద్దాని కనుమతింపుమా. నాచెంతనుండుమను నీప్రియవాక్యము చెవులపండువుగా విన వాంఛింతును. ఈగుఱ్ఱము లడవిలో నిన్ను సేవించునేని ముక్తి నొందును. నేను నీకు శుశ్రూషలు చేయఁగోరుదును. అయో ధ్యమాటయేల? నీవు లేక దేవలోకము లభించినను నాకు వలదు. నీసేవయే నాకుఁ గావలయును. దుష్కర్మము లొనర్చిన వాఁడు దేవలోకమునకుఁ బోవ నర్హుఁడుకానిచందమున నిన్నుఁ బాసి నే నయోధ్యాపురమునకుఁ బోవఁజాలను. వనవాసునియ

మము ముగియఁగా నిన్నీరథముననే యెక్కించుకొని యయో
ధ్యకుం దీసికొనిపోవలయునని నాకుఁ గోర్కి కలదు. వనమున
నిన్నుంగూడియుందునేని నా కీపదునాలుగేండ్లు నిమేషకాల
తుల్యములుగా గడచును. నిన్ను వదలియుండిననవియే నూఱిం
తలుగా నాకుం దోచును. భృత్యవాత్సల్యముగల నీవు భక్తుఁ
డను భృత్యుఁడను నగునన్ను రానంగీకరించిన మర్యాదమీఱ
అక ప్రభుకుమారుని నిన్ను ననుసరించియుందును. ఇందేయప
రాధము లేదు. నన్ను వదలుట నీకుఁ దగదు.

అని యిట్లు దీనుఁడై వేఁడుచున్న యాసుమంత్రునిం
గాంచి శ్రీరాముఁ డిట్లు పలికెను. సుమంత్రా! నీవు ప్రభువిశ్వా
సముగలవాఁడవు నాయందు నీకు విశ్వాసముకలదని యెఱుంగు
దును కాని నిన్నిపుడు రావలదని మరల నయోధ్యకుం
బంపుటకుం గలకారణము నాలకింపుము. నీ వయోధ్యకుం
బోవఁగా నాపిన్నతల్లి రాముఁ డడవుల కరిగెననునమ్మకము గల
దగును. ధర్మాత్ముఁడగు నాతండ్రిని గుఱించి యసత్యవాదియని
సందియ మొందకయుండును. తనకుమారుఁడు భరతుఁడు రాజ్య
మేలుచుండఁగా వృద్ధినొందిన యారాజ్యమును బాలింపవలయు
ననియే నాకోరిక. ఈలాభమునుగోరియే నిన్నుఁ బంపఁగోరుచున్న
వాఁడ. ఇదియేగాక మఱికొన్ని ప్రయోజనములుకూడఁ గలవు.
నాకు రాజేంద్రునకు దీనఁ బ్రియము చేకూరుఁగాన నీవిపు
డయోధ్య కరుగుము. ఏయేమాట లెవ్వ రెవ్వరికిఁ జెప్పుమంటినో
వానినెల్ల నట్లే తెలుపుము. అని పలికి పలుమాఱు లాతని
నాశ్వాసించుచు గుహునిం గని యుక్తి కనురూపముగా నిట్లు
తెలిపెను. ఆర్యా! నన్నిందుండుమంటివి. జనసాంద్రమగు
నిందుండుటనాకు న్యాయ్యము కాదు. తప్పక యాశ్రమములం దే

యుండందగు. తండ్రియాజ్ఞయు నట్టిదే. కావున నేను మునుల కుచితమగువ్రతమునుబూని నాజనకునకు విశేషించి సీతాలక్ష్మణులకు మేలుగలుగ జడలుదాల్చి వనమున కరిగెదను. మఱ్ఱి పాలు తెమ్ము. అనఁగా నాగుహుఁడు మఱ్ఱిపాలు తెచ్చియిచ్చెను. తొలుత నాపాలతో లక్ష్మణుఁడు జడలుతాల్చునట్లుచేసి పిదపఁ దాను జడలు దాల్చెను. వల్కలములధరించి జడలదాల్చి గుహునితో రాజ్యపాలనము చాలఁ గష్టమే యగుఁజుమీ. కావున నీవు చతురంగబలములయందును కోశమునందు దుర్గములయందు దేశమునందు నించుకయైనను బ్రమాదములేక యుండవలయును.

తరువాత రఘుకులాలంకారుఁడు శ్రీరాముఁడు గుహుని వీడ్కొని తత్తఱపాటులేక సీతాసౌమిత్రులంగూడి ప్రయాణము సాగించెను గంగానదియొద్దున నోడ కనఁబడఁగా నది వడివడిం బాఱుచున్నదిగాన నోడ నెక్కియే దాని దాఁట నూహించి పురుషసింహా! ఈయోడ కదలవచ్చి యిట నిలిచి యున్నది తొలుత నీవెక్కి భయస్వభావముగల జానకిని మెల్లగ నెక్కింపుము. అనఁగా మతిమంతుఁడుగావున ముందు సీతాదేవి నెక్కించి వెంటఁ దానెక్కుటయన్నభావ మగుటంజేసి తానెక్కెను. తరువాత శ్రీరాముఁ డెక్కెను. గుహుఁడు బంధువులం గాంచి యోడను మీర లావలిగట్టునకుం జేర్పుఁడని శాసించెను. శ్రీరాముఁ డాయోడపైఁ గూరుచుండి బ్రాహ్మణక్షత్రియులకు జపింపఁదగిన "దైవీంనావమ్" అను నారోహణమంత్రము నాత్మహితార్థము జపించెను. శ్రీరామమూర్తి సీతాసహితుఁడై యాచమించి మహానందమున శరీరము పులకరింపఁగా విధిననుసరించి యాగంగానదికి నమస్కరించెను.

శాంతిమంతుఁడు లక్ష్మణుఁడు నమస్కరించెను. రాముఁ డంత గుహుని సుమంత్రుని వీడ్కొలిపి నౌక నెక్కి యిఁక నడుపుఁ డని నావికులకు నానతీయ వారు జాగరూకులై మంచితెడ్లం గైకొని జవమలర దాని నడుపఁగా నవ్వలియొడ్డున నవి చేరెను. అనిందితభూజాత నదీమధ్యభాగమున కాయోడవచ్చినంతట దోసిలొగ్గి గంగాతరంగిణిం గాంచి జననీ! ధీశాలియగు నీదాశ రథి నీసంరక్షణముమూలమునఁ బదునాలుగేండ్లు పూర్ణముగా నడవులనుండి నిరంతరాయముగా వ్రతము గడిపి సోదరుని నన్నుంగూడి మరల నిచ్చోటికి రాఁగా క్షేమయుక్తి మరలి వచ్చినందులకై నావాంఛితములు ఫలింప నిన్నుఁ జక్కఁగాఁ బూజించెదను. దేవీ! నీవు త్రిలోకముల సంచరింతువు. బ్రహ్మ లోకమును నీవు చూచియేయుందువు. ఈలోకమున సాగర పత్నివై యున్నావు. సుప్రసిద్ధురాలవు. కల్యాణీ! నమస్కరించెద. వినుతింతును. పురుషోత్తముఁడు క్షేమముతో మరలవచ్చి రాజ్యము స్వీకరింపఁగనే నీకుఁ బ్రియముఁ గూర్పఁదలఁచి లక్ష గోవులను వస్త్రములను మృష్టాన్నమును బ్రాహ్మణుల కొసంగు దును. దేవీ! నే నయోధ్యకు మరలఁజేరి పరిశుద్ధచిత్తమున నీకు సహస్రకుంభసంభృత మద్యమును అన్నముకొఱకు మాంస మును సమర్పించి పూజింతును. నీతటమున నేయే దేవతలుందురో వారలనందఱఁ బూజింతును. నీయొడ్డునఁగల మణికర్ణికా ప్రయా గాదితీర్థరాజములను, గాశ్యాదిదేవాలయములను బూజించె దను. పాపరహితురాలవగు నోగంగా దేవీ! పాపదూరుఁడగు నీ శ్రీరామమూర్తి వనవాసవ్రతముచేసి నన్ను సోదరునింగూడి మరల క్షేమమున నయోధ్యను నీయనుగ్రహమునఁ జేరుఁ

గాక అని ప్రార్థించెను. అని యానీత గంగను బ్రార్థించుచు దక్షిణతీరముం జేరెను.

అవ్వలియొడ్డు చేరఁగనే శ్రీరాముఁ డాయోడను వదలి సీతాసౌమిత్రులతోఁ బ్రయాణము సాగించెను. లక్ష్మణుం గాంచి రాముఁడు నేఁడు మొదలు నీవు జనులున్నను లేకయున్నను రక్షణమునందుఁ బ్రమాదములు లేకయుండుము. కని విని యెఱుఁగని నిర్మానుష్యవనభాగమునకుఁ బోవుచున్నాము. కనుక సంరక్షణకార్యమున నించుకయేఁ బ్రమాదము పనికిరాదు. లక్ష్మణా! నీవు ముందు పోవుచుండుము. సీత నీవెనుక వచ్చును. మీయిరువురంగాపాడుచు వెనుక నేను వత్తును. ఇట్టితావుల మనము పరస్పరము కాపాడుకొనుచుండవలయును. ఏకార్యమైనను దదుచితకాలముదాఁటఁగా మరల దానిని జక్కఁగా నిర్వహింప సులభము కాదు. కావున నుచితసమయమున హెచ్చరికగలిగియుండవలయును. జానకి యిపుడు జనసమ్మర్దములేక సస్యములులేక యారామములులేక భయజనకమై హెచ్చుతగ్గులు గలిగియుండునడవిని బ్రవేశించుచున్నది. ఇపుడు వనవాసకష్టము నెఱుంగఁగలదు. అనఁగా లక్ష్మణుఁడు తదాజ్ఞాప్రకారమే ముందుగాఁబోయెను. సీతయు నావెనుకఁ జనియె. వారిద్దఱకుఁదరువాత శ్రీరాముఁడు నడిచెను.

శ్రీరాముని వదలి చూచువారలకు జాలిపుట్టించుచు దీనుఁడై సుమంత్రుఁడు శ్రీరాముఁ డవ్వలిగట్టుచేరువఱకు నందే యుండి యనిమేషదృష్టులం గాంచుచు నతఁడు దూరముగాఁ బోవ దృష్టుల మరలించుకొని వగచెను. శ్రీరాముఁ డంతఁ గొంతదూరము పోయి సస్యసమృద్ధమై జను లుత్సాహవంతులుగా నున్నదగువత్సదేశమును జొచ్చెను. అందు వా

రాఁకలిపోడసూపఁగా సీత నొక్కచోపున నునిచి వేఁటకుం బోయి యాయిసుపురు సూకరమును, మనుఁబోతును, దుప్పిని, నల్లచాఱలుగలదుప్పిని వధించి వానియందలి పరిశుద్ధమాంస మును గొనితెచ్చి సీతంగూడి సాయంకాలమగుటం జేసి త్వరపడి యొకవృక్షముం జేరి యందు విడిసిరి.

మహాశయులారా! ఇప్పట్టునఁ దెలిసికొనఁదగిన విశేషాంశ ములు కలవు. వాని విమర్శించి కనుఁగొందము.

"భాస్కరోదయకాలోఽయం గతా భగవతీ నిశా,
అసౌ సుకృష్ణో విహగః కోకిలస్తాత కూజతి. ౨
బర్హిణానాం చ నిర్ఘోషశ్శ్రూయతే నదతాం వనే,
తరామ జాహ్నవీం సౌమ్య శీఘ్రగాం సాగరంగమాం." ౩

అని మూలము. ఇవి శ్రీరామవాక్యములు. భగవతీ నిశా గతా= షడ్గుణైశ్వర్యసంపన్నురాలగు రాత్రి గతించెను. భగవతీ యను విశేషణము శ్లోకపూరణార్థమా యన్నఁ గాదు. "నిశా రాత్రిః సర్వపదార్థానామవివేకకరీ" అని భాష్యము. ఎల్లప్రాణులకుఁ దమోబాహుళ్యమున నజ్ఞానమును గల్పించునది యని యర్థము. అట్టినిశ గడచెను. అనఁగా భావమేమి? ఇంతదనుక నాపూనిన కార్యము చేయఁ బూనిక కలుగదయ్యెను. ఇంక జాగ్రత్తపడ వలయును.

"యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ,
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః." ౬౯
గీత. ౨ అధ్యా.

అన్నగీతావాక్యానుసారము రేయియంతయు నెల్లరు నిద్రిం చుచుండ మేల్కొని యాలోచించితిని. కార్యము నిశ్చిత

మయ్యెను. రాత్రియు గతించెను. ఆమె భగవతి. మహామాయ. గడచెను. అనఁగా నన్నుం బురికొల్పి తనపనిని నిర్వర్తించి విరమించినదని యర్థము. నావలనఁ గాఁదగినకార్యములు చేయింపఁ బూనుకొన్నదని సారము. భారద్వాజపక్షియుఁ గోయిలయుఁ గూయుచున్నవి. వనమున నెమిళ్లు ధ్వనిచేయుచుండఁగా వినఁబడుచున్నది.

మానవులను నిద్రనుండి మేలుకొలిపి ప్రవృత్తిమార్గమునకుం బురికొలుప నెన్నియోపక్షులు ప్రయాసపడుచున్నవి. వానికి మానవులు కృతజ్ఞులుగా నుండవలయును. ఉషఃకాలమాసన్నమగుచున్నదనియు, నేల నిద్రపోయెదరనియు, మనుజులు మేలుకొనునంతదనుక వాయసములు కుక్కుటములులోనగునవి యెంతో ప్రయాసపడుచున్నవి. వనముల నేలయవి ధ్వనిచేయుచున్నవి? అందు మానవు లుండరుకదా. ఆరీతిగా ధ్వనించుట వానికలవాటు అని కొందఱందురు. గ్రామములయందు వాయసాదులు మేలుకొని యితరులం బురికొలుపును. మహారణ్యములయందును భగవంతు నారాధించు జంతువు లనేకములుగలవు. ఆపూజాపద్ధతి వేఱుగానుండు నని మన మెఱుంగవలయును. గరుడపక్షి కృష్ణా యని ధ్వనిచేయును. అదియే దానియారాధనమార్గము. ఎన్నియోపక్షులు తొలుదొలుత లేవఁగనే భగవంతుని దెలిసియో తెలియకయో వాడుకచొప్పున బ్రార్థించునని యోగులు పలుకుదురు. శ్రీకాళహస్తీశ్వరమాహాత్మ్యమున నీవిషయము కనంబడును. పురుగులుకూడ భగవంతు నారాధించెనని చెప్పఁబడినదే. క్రూరజాతియగుసర్పముకూడ నీశ్వరు నర్చించెనుగదా. ఇఁక మానవేతర ప్రాణులు భగవంతుని సేవింపవనుట యెట్లు? ఆసేవాపద్ధతి యిట్టి

దని మన మెఱుంగము. మన మెఱుంగని విషయములన్నియు శూన్యప్రాయము లనరాదు. ఈవిషయమున మానవులకుఁగల యజ్ఞానాహంకారములగుఱించి చింతింపవలసినదియే కాని గర్వింపరాదు. ప్రకృత మనుసరింతము.

పక్షులు లోనగుజంతువులకు మానవు లప్పుపడియున్నవారు. వానియప్పు తీర్పవలసియున్నది. భూతయజ్ఞ మెందులకు? ఆయప్పు తీర్చుటకే కదా. పంచమహాయజ్ఞములలో భూతయజ్ఞ మొక్కటిగ నిర్ణయింపఁబడినది. "భూతాని బలికర్మణా" అని స్మృతి చెప్పుచున్నది. యజ్ఞములు ఫలమును గోరి చేయఁదగునవి. హింసాప్రధానములు. కావున స్వర్గాదిలోకప్రాప్త్యర్థమవ్వాని నాచరింతురు. బ్రహ్మయజ్ఞాదులైదును హింసాలేశము కూడ లేనివి. కావుననే మహాయజ్ఞము లనుఖ్యాతిఁ గాంచినవి.

"స్వాధ్యాయేన వ్రతైర్హోమైస్త్రైవిద్యేనేజ్యయా సుతైః,
మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః." ౨౮

మను. ౨ అధ్యాయము.

"మహాయజ్ఞైః పంచభిర్బ్రహ్మయజ్ఞాదిభిః యజ్ఞైః జ్యోతిష్టోమాదిభిః."

అని కుల్లూకభట్టు.

అట్టిమహాయజ్ఞములలో భూతయజ్ఞ మొక్కటిగఁ బరిగణింపఁబడినది. పంచమహాయజ్ఞములను వదలి జ్యోతిష్టోమాదులొనరించి కుండలాలంకృతులయి ఖ్యాతిగలవార మనుకొందురు. ఇస్సీ! ఎంత యసంగతము! ఎంత దారుణము!

"నిత్యనైమిత్తికకర్మణామేవ నైమిత్తికకర్మణ్యధికారః"

అని నియమము పెద్దలచేఁ జేయఁబడినది. ఏల? సంధ్యావందనము మాని యితరశ్రౌతకర్మముల నాచరించు నధికారము గలదా? అట్లు లాచరించిన నవి "అవిధినా కృతమకృత" మ్మను న్యాయమున నిష్ఫలములే. అంతియకాక దుష్ఫలములేయగు. చేయనక్లే యని యూహింపఁదగు. కనుకనే గీతాశాస్త్రమునందు

"యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిం. ౨౩
తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి." ౨౪గీత. ౧౬. అధ్యా.

అని శ్రీకృష్ణపరమాత్మయే బోధించెను. కనుక విధివిరహితముగ నాచరించుకర్మములు నిష్ఫలములగుటయగాక దుష్ఫలములుకూడ నగునని యెఱుంగవలయును. భూతయజ్ఞ మేటికనఁగా మనకెన్నెన్నిరీతులనో తోడ్పడుచుండుపక్షులు లోనగువానియప్పు తీఱుటకని మన మెఱుంగవలయును. కాలజ్ఞానము పక్షులకున్నయట్లు మానవులకు లేదనుట రూఢము వానికున్నంత యింద్రియనిగ్రహము మానవులకు లేదనుట సిద్ధాంతము. పక్షులధ్వనులు వానిపైనుండి వ్యాపించువాయువు మానవుల కెంతో యారోగ్యమును గలిగించి యానందమును గల్గించును. కనుక వానియప్పుతీర్చుకొనక తప్పదు. ఈవిషయమును శ్రీరామమూర్తి స్థాలీపులాకన్యాయము ననుసరించి మనకుఁ దెలిపెను.

తొలిసంధ్య నుపాసించి శ్రీరాముఁడిఁక గంగానదిని దాఁటుదమని లక్ష్మణునకుఁ దెల్పెను. "సాగరంగమామ్" అన్న విశేషణ మొకవిశేషము నెఱిఁగించుచున్నది. సముద్రమునఁ గలియునదులే మహానదులని పిల్వఁబడఁదగినవి. తక్కినవన్నియు

నుపనదులు. నదీశబ్దము స్త్రీలింగము సముద్రశబ్దము పుంలింగము. భర్తృసంయోగము కలిగినఁగాని నదికిఁ బావనత్వము లేదు. అను నీకారణముచేత శ్రీరామమూర్తి మనకొక్కనీతిని దెల్పుచున్నవాఁడు. ఏమనఁగా. భర్తను గూడకయున్న స్త్రీ కులట యనంబడును. తత్సంగతి మెలఁగినచోఁ బతివ్రత యనఁబడును. అని.

"పతిం యా నాభిచరతి మనోవాగ్దేహసంయతా,
సా భర్తృలోకానాప్నోతి సద్భిస్సాధ్వీతి చోచ్యతే."

అని మనుస్మృతియుఁ దెలుపుచున్నది ఈవిషయమున నభిప్రాయభేదము కానరాదు. కావునఁ బతి నెడఁబాయనినాతి పతివ్రత యనంబడును. ఆమెయశస్సు చిరకాలము నిలుచును. అట్టియశస్సు నార్జించుటకే పురంధ్రీమణులు ప్రయత్నింపవలయును.

"అసత్యమపి నైవాహం బ్రూయాం వచనమీదృశం,
కథమప్రియమేవాహం బ్రూయాం సత్యమిదం వచః." ౪౬

అని మూలము. సత్యమైన నప్రియము పలుకఁజాలను. ప్రియమైన నసత్యము పలుకఁజాలను. అని సుమంత్రునితోట మహర్షి పలికించెను. ఈయర్థమునే

"సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాన్న బ్రూయాత్సత్యమప్రియం,
ప్రియం చ నానృతం బ్రూయాదేష ధర్మస్సనాతనః."

అని మనుస్మృతి తెల్పెను. సత్యము ప్రియమునగు దానిని దెలుపవలయునని అప్రియమగుసత్యమును జెప్పరాదని, ప్రియమైన నసత్యమును బలుకరాదని దీనితాత్పర్యము. ఇతరులు తన మాటలమూలమున నార్తులుగాకయుండవలయుననియే యీ

యుపదేశఫలము. మాటలాడునపుడు కర్ణకఠోరము హృదయ తాపకరము నగునట్లు సత్యమునైన బలుకరాదు. హితముగా నసత్యమును బలుకరాదు. అని మన మీభాగమునుండి నేర్చు కొనవలయును.

"భవిష్యంతి వనే యాని తపోవిఘ్నకరాణి తే,
రక్షేన ప్రతిబాధిష్యే తాని సత్త్వాని రాఘవ." ౫౦

అను నీమూలము మనకొక క్రొత్తవిషయమును దెలుపుచున్నది. మానవు లెట్లు సత్కార్యములకు విఘ్నము లొదవించి యానం దింతురో అట్లే వనమునసుండి తప మాచరింపఁబూనినను క్రూరమృగములు తపోవిఘ్నము చేయఁ బ్రయత్నించును. "శ్రేయాంసి బహువిఘ్నాని" అన్నసూక్తి సార్థకమే కదా. అనఁగా దపస్సు సకలపాపముల నశింపఁజేసి భగవద్దర్శనలాభ మును గూర్చునది. కావున నట్టిదాని కీతఁడు పాత్రుఁడగునా కాఁడా యని భగవంతుఁడు పరీక్షించును. అనఁగాఁ గ్రూర మృగదర్శనము, వానిభయంకరధ్వనులు వినఁబడుట, లోనగు బాధ లెన్నియో కలుగఁగా వానికి నోర్చుకొని తపమొనరింప వలయును. ఏల యీపరీక్ష భగవంతునకని యడుగవచ్చును. తన్ను దర్శించునంతజ్ఞానము కలదా లేదా యని విమర్శింప వలదా. ఎవ్వానికి మనస్సు సర్వభూతముల నంతర్యామియగు నాపరతత్త్వమునే చూచునో యాతనికిఁ గ్రూరాక్రూరభేదము లుండవు. ఆస్థితియందున్నవాఁడా లేదా యనియే యీపరీక్ష.

"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః." ౬౫

అనికదా గీతాశాస్త్రము తెల్పుచున్నది. అట్టిపరీక్షలలో నాఱి తేఱినవాఁడే భగవద్భక్తుఁడగును. అతనినే కరుణించి పరాత్పరుఁడు సంసారార్ణవమునుండి యుద్ధరించును. శంకరుఁడే శ్రేష్ఠుఁడని యొక్కఁడు విష్ణువే శ్రేష్ఠుఁడని యొక్కఁడు వాదించుచుఁ బరస్పరము శివవిష్ణువుల దూషించుచు నుండువారు భక్తులా? జగద్వంచకులా? ధనదాసులా? వీరి కేమని పేరు పెట్ట వలయునో తెలియరాకున్నది. సమదర్శనుఁడు కానివాఁడు నా భక్తుఁడు కాఁడని శ్రీకృష్ణపరమాత్మ బోధించుచుండఁ జిహ్నములు లేకున్న భగవంతుఁడు భక్తులననుగ్రహింపఁ డనుప్రేలు వారలెంతధనదాసులో యోజింపుఁడు. పరమేశ్వరుఁ డన్నిమతములవారలయందు సమబుద్ధికలవాఁడు. అందెవ్వరు ధనాశావిరహితులో నిర్మలాత్ములో తనను సర్వత్ర గాంతురో వారి నుద్ధరించును. విష్ణుమూర్తినే యారాధించినఁగాని వాంఛల నొసంగఁ డనుమూర్ఖులు కలరు. ఇతరమతములవారు తమమతధర్మముల ననుసరించి భక్తియుక్తి నారాధించినచో వారలం గరుణింపఁ డనవచ్చునా? అన్నచో నతఁడు భగవంతుఁ డెట్లులగును? సర్వరూపములు తానై యంతట వెలయువాఁడుకదా భగవంతుఁడు. కావున నట్టి నీచోపదేశములకు దూరముగనుండి యెవ్వరికేరూపము నేనామము ప్రియముగనుండునో యారూపమున నానామమున నాపరమేశ్వరు ధ్యానించిన వినుతించిన నతఁడు ప్రసన్నుండగును.

"ఇమే చాపి హయా వీర యది తే వనవాసినః,
పరిచర్యాం కరిష్యంతి ప్రాప్స్యంతి పరమాం గతిం." ౫౩

అను నీమూలము భగవదుదేశమును దేటపఱచుచున్నది. స్కాందమహాపురాణమున శ్రీశంకరుఁడు సాలెపురుగునకు

భుజంగమునకు గజమునకు ముక్తినొసంగునట్లు గలదు. తిర్య
గ్జంతువులకుంగూడ ముక్తికలుగునా యని కొందఱు ఆక్షేపింతురు.
అట్టివారి నోరుమూయించుటకే యీశ్లోక మిందుఁ బొందు
పఱుపఁబడినది. ఇదియు నేల యప్రమాణముకాఁగూడదందు
రేని వారు నాస్తికులే యగుదురు. వారివాదముల నేయాస్తి
కుఁడు నాలకింపఁడు. వనమున నివసించు నీకు నో శ్రీ రామా!
యీగుఱ్ఱములు శుశ్రూష సలుపునేని పరమగతి నొందును.
శుశ్రూషయనఁగా వంగివంగి దండములు పెట్టుట కాదు. దేవాల
యముల నలికి మ్రుగ్గులు పెట్టుట కాదు. ఏవాని కేది యర్హమో
యావిధమున భగవంతు నారాధించుట యని యర్థము. వంగి
వంగి దండములు సమర్పించు దాసులు ధనదాసులే. మనగ
పూర్వకముగాఁ బరమేశ్వరుని సేవించుటయే భక్తి. ఏజంతు
వైనను భగవదనుగ్రహమునకుఁ బాత్రమైన ముక్తినొందును.
తోలుతిత్తినిబట్టి ముక్తి దొరకదు. ఒడలు కనఁబడకుండఁ దులసి
పూసలహారములు ధరించినంతమాత్రమున భక్తుఁడు కాఁడు.

"అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ,
నిర్మమో నిరహంకారస్సమదుఃఖసుఖః క్షమీ. ౧౩
సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః,
మయ్యర్పితమనోబుద్ధిర్యో మద్భక్తస్స మే ప్రియః. ౧౪
అనపేక్షశ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః,
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః." ౧౬

గీత. ౧౨. అధ్యా.

"ఆరభ్యంత ఇత్యారంభాః ఇహాముత్రార్థాని కామహేతూని కర్మాణి సర్వా
రంభాః తాన్ పరిత్యక్తుం శీలమస్యేతి సర్వారంభపరిత్యాగీ యో మద్భక్త
స్స మే ప్రియః" అని భాష్యము

అని శ్రీకృష్ణమూర్తి యర్జునునకుం దెల్పెను. ఇట్టివారే భక్తు లని సిద్ధాంతముచేసెను భగవదుక్తి యిది కాదన్నచో నొక నమస్కారము. సర్వకర్మవిముఖుఁడై అనఁగా వానిఫలములం గోరక యాశవదలి యితరులను ద్వేషింపక

"తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్,
అనికేతస్థిరమతిర్భక్తిమాన్ మే ప్రియో నరః." ౧౯

గీత. ౧౨. అధ్యా.

అన్నగీతావాక్యము ప్రకారము తనవారలు దూషించినను భూషించినను సమముగా భావించుచు దొరకినదానితో సంతుష్టినొందుచు నుండువాఁ డెవ్వఁడో వాఁడు భగవద్భక్తుఁడని నమ్మవలయును. అంతియకాని ధనము కొంచెమిచ్చిన నోటికి వచ్చినట్లు తిట్టుచు నెక్కువ యొసంగిన భట్టురాజువలెఁ బొగడుచుఁ గ్రొత్తక్రొత్త కార్యము లారంభించి లోకము నుద్ధరింతుమని ప్రకటించి ధనములాగుచు సర్వము భగవదర్పణము చేసితిమని కన్నులు తేలవైచుచు భగవంతుని ధ్యానించునట్లు నటించి యెవ్విధమున ధనము లాగవచ్చునా యని యోజించుచు నప్పటికిఁదగినట్టు లేదోయుక్తిఁ బన్నుచు యోగులమని జ్ఞానులమని నిస్సంగులమని భక్తులమని సమయోచితముగా శ్రోతలయోగ్యతను గనిపెట్టి డంబములుపలుకుచుండు ధనదాసులు భక్తులగుదురా! వారు రహస్యమృష్టాన్నభుక్తలే యగుదురు. అట్టివారినుదుల నవలంద్రోచి యథాశక్తి న్యాయము ననుసరించి నిర్మలచిత్తమున భగవంతుని సేవించుచుండిన నాక రుణానీరధి జాతి నాలోకింపక వేషభాషల లెక్కింపక నిర్మల చిత్తమునే పరికించి యానందించి ముక్తినొసంగు ననువిషయము మున మీభాగమునుండి గ్రహింపవలయును.

"తవ శుశ్రూషణం మూర్ధ్నా కరిష్యామి వనే వసన్,
అయోధ్యాం దేవలోకం వా సర్వథా ప్రజహామ్యహం." ౫౪
అని మూలము. వనమునవసించి నీకు శుశ్రూష శిరస్సుచేఁ జేయుచున్నాఁడను. అయోధ్యనుగాని తుదకు స్వర్గమునుగాని వదలుదును. అనఁగా నీసేవయే ప్రధానమనుట. ఇందొక్కవిశేషము కలదు. శిరస్సుచే సేవచేయుట యనఁగా భావమేమి? వనవాసమున విశేషమేమి? ఏకాంతస్థలమునఁ గూరుచుండి సహస్రారకమలగతుండయి తేజోరూపమున వెలయుభగవంతు నాంతరదృష్టిచేఁ దిలకించుటయే యుపాసించుట యని యర్థము.
"మహీం మూలాధారే కమపి మణిపూరే హుతవహం
స్థితం స్వాధిష్ఠానే హృది మరుతమాకాశముపరి,
మనోఽపి భ్రూమధ్యే సకలమపి భిత్వా కులపథం,
సహస్రారే పద్మే సహ రహసి పత్యా విహరసి."
అని శ్రీశంకరభగవత్పాదులుగారు తేటపఱచిరి. మూలాధారస్వాధిష్ఠానమణిపూరకానాహతవిశుద్ధాజ్ఞాత్మకములు షట్చక్రములు. ఇవి పృథివ్యగ్నిజలవాయువ్యోమ మనస్తత్త్వాత్మకములు. ఈతత్త్వము లాయాచక్రములయందుఁ దన్మాత్రతత్త్వమున నుండును. తన్మాత్రలనఁగా గంధరూపరసస్పర్శశబ్దాత్మకములు. ఆజ్ఞాచక్రస్థితమగు మనస్తత్త్వముచేతఁ బదునొకండింద్రియములు గ్రహింపఁబడును. ఇట్లేకవింశతితత్త్వములు ప్రతిపాదింపఁబడినవి పతితో సహస్రారకమలమునందు విహరింతువనుటం జేసి తత్త్వచతుష్టయము సూచింపఁబడియె. మాయాశుద్ధవిద్యామహేశ్వరసదాశివాత్మకమే తత్త్వచతుష్టయమని యెఱుంగందగు. పైవానితోఁ గలిసి పంచవింశతితత్త్వములయ్యెను. ఇవి ప్రాకృతములనంబడును. మాయ మహేశ్వరునిం

గూడి యతనికి జీవత్వము నాపాదించును. ఆజీవుఁడు ప్రాకృ
తుఁడే యనంబడును. శుద్ధవిద్యయన్ననో సదాశివునింగూడి
సాదాఖ్యకళయని వ్యవహరింపఁబడును. కనుక భగవతి చతుర్విం
శతి తత్త్వముల నతిక్రమించి సదాశివునితోనఁగా నిరుప
ద్రవ తత్త్వముతోఁగూడి విహరించుచు నిరుపదాఖ్యతత్త్వ
మనంబడుచుఁ బరమాత్మ యని వినుతింపఁబడును అట్టి నిరుప
మాన తేజోరూపము నఁగాఁ బ్రకృతిపురుషైక్యరూపమునని
యర్థము. దానిని ధ్యానించుట యని తాత్పర్యము. ఇదియే
నిరుపమానభగవత్సేవయని యెఱుంగవలయును. ఇదియే తపస్సు.
యోగమతసారమిదియే.

"ధన్యానాం గిరికందరే నివసతాం తేజః పరం ధ్యాయతామ్."

అని భర్తృహరిచెప్పినవాక్యభావ మిదియే. శిరస్సుతో నిన్ను
సేవింతుననఁగా నిన్ను నాంతరపూజావిధి ధ్యానింతునని సుమం
త్రునియాశయము. అంతజ్ఞానము సుమంత్రునకుఁగలదా యందు
రేమో. మహర్షులను సేవించినప్రాజ్ఞున కీమాత్రము తెలియ
దేమో యని సంశయించుట మనదౌర్భాగ్యముననే యను
కొనుట మంచిది. ఈయర్థమును దృఢపఱచు శ్రీరాముని
వాక్యముల నాలకింపుఁడు.

"జానామి పరమాం భక్తిం మయి తే భర్తృవత్సల,
శృణు చాపి యదర్థం త్వాం ప్రేషయామి పురీమితః. ౨౦

... ... ... ... ... ...

నేదానీం గుహ యోగ్యోఽయం వాసో మే విజనే వనే,
అవశ్యం హ్యాశ్రమే వాసః కర్తవ్యస్తద్గతో విధిః.
సోఽహం గృహీత్వా నియమం తపస్విజనభూషణం,
హితకామః పితుర్భూయః సీతాయా లక్ష్మణస్య చ. ౨౪

జటాః కృత్వా గమిష్యామి న్యగ్రోధక్షీరమానయ."

అని మూలము. సుమంత్రా! నాయందు నీకుఁగలభక్తి నెఱుంగుదును. దాని ననుసరించి తోడ్కొనిపోవలసినదే. కారణాంతరము లనేకములు గలవు. వానినెల్ల నీకుఁ జెప్ప వలనుపడదు. ఒక్కకారణము చెప్పెద నని శ్రీరామమూర్తి చెప్పెను. ఈ వాక్యములు పైనవ్రాసినయాశయమును దృఢపఱచుచున్నవి కదా. కావున నదియే భగవంతుని సేవించు నుత్తమమార్గము.

గుహునితో శ్రీరాముఁ డిట్లు చెప్పుచున్నాఁడు. మను జులుండుతావున నిపుడు నేనుండఁదగదు. తాపసు లుండఁదగు తావులనే యుండవలయును. కావున మునిజనులకుఁ దగిన నియమమును గ్రహించి తండ్రికి హితము చేయఁగోరినవాఁడనై జడలు ధరింతును. అనఁగా భావమేమి ? నిర్జనారణ్యములనే యే నుండవలయును. విధితంత్రముఁననుసరించి తాపసాశ్రమముల నుండఁదలఁచితిని. అనుటచే శ్రీరామమూర్తి లోకుల కొకహితము దెల్పఁ బూనెను. మహాకార్యముల నొనరించు వారు భగవత్కరుణకుఁ బాత్రులు కావలయును. దైవతేజస్సు మిక్కిలి గల్గినఁగాని యాకార్యము సాధింపఁజాలరు. ఆతేజస్సు యోగమువలనఁగాని సిద్ధింపదు. యోగము నభ్యసింప నేకాంత స్థలము కావలయును. అందులకరణ్యములు గిరికందరములు ముఖ్యములు. యోగికానివాఁడు భగవత్తేజస్సు నారాధింపఁ జాలఁడు.

"తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున."

అని భగవంతుఁడే పలికెను. ఇపుడు శ్రీరాముఁడు నిర్జనారణ్యముల నియమమూని తనతేజోరూపమును దానే యుపాసింపఁ

బూనెను. ఏల? ఈమార్గమత్యుత్తమమని లోకులకు నుపదేశించుటకే యని యెఱుంగవలయును.

"— —. కాయా లక్ష్మణస్య చ హితకామః"

అనుచోఁగల విశేషమేమి? రాముఁడు జడలుదాల్చుట సీతాదేవికి మిక్కిలి హితము. ఆమెసంకల్పము ఫలించును. అనఁగా మహాతపశ్శాలియగు రావణాసురుని దపోవేషధారియగు శ్రీరాముఁడే సంహరింపవలయును.లక్ష్మణునకు హితముకోఱకనఁగా లక్ష్మణునకు శాశ్వతకీర్తిగలుగుట కోఱకని యెఱుంగవలయును. అదియే మహాప్రకృతిసంకల్పము. అది నెఱవేఱవలసినదే. కావుననే జడలు దాల్చెనని తెలిసికొనందగు.

"పుత్రో దశరథస్యాయం మహారాజస్య ధీమతః,
నిదేశం పారయిత్వేమం గంగే త్వదభిరక్షితః. ౮౩
చతుర్దశ హి వర్షాణి సమగ్రాణ్యుష్య కాననే,
భ్రాత్రా సహ మయా చైవ పునః ప్రత్యాగమిష్యతి. ౮౪
తతస్త్వాం దేవి సుభగే క్షేమేణ పునరాగతా,
యక్ష్యే ప్రముదితా గంగే సర్వకామసమృద్ధినీ. ౮౫
... ... ... ... ... ... ...
ప్రాప్తరాజ్యే నరవ్యాఘ్రే శివేన పునరాగతే. ౮౭
గవాం శతసహస్రాణి వస్త్రాణ్యన్నం చ పేశలం,
బ్రాహ్మణేభ్యః ప్రదాస్యామి తవ ప్రియచికీర్షయా." ౮౮

అని మూలము. ఇది సీతాకృతగంగాప్రార్థనాదికము.

"దశరథస్యపుత్రోఽయం త్వదభిరక్షితః. మహారాజస్యనిదేశం పారయిత్వా."

అని యన్వయక్రమము. ఓగంగాదేవి దశరథమహారాజపుత్త్రుఁడు శ్రీరాముఁడు నీచే రక్షింపఁబడి అని యర్థము. ఇందుఁగలవిశేషమేమనఁగా దేవతాప్రార్థనము చేయునపుడు నీవే సర్వాధారస్వరూపవని తలంపవలయు. ఇపుడు గంగాదేవినే సర్వకారణ

ముగా సీత భావించెను. దీనిచేత నెవ్వఁడైన నేదేవతను బ్రార్థించి నను త్వదన్యమేదియు లేదని తలంపవలయునను విషయము తేలెడిని. అదియే భావనయందుఁ గలవిశేషము.

"సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే." ౩౧
గీత. ౬ అ.

అనుగీతాశాస్త్రముకూడఁబై వ్రాసినదానినే దృఢపఱచుచున్నది. ఈభావనచేత దేవతాద్వేషపిశాచము నశించును. రాముఁడు శ్రేష్ఠుఁడు. శివుఁ డుత్కృష్టుఁ డనుదుర్వాదములు చేయువారి నోళ్లు మూతపడును. ఈ దేవతాద్వేషమే కొందఱకుఁ బది రూపాయలు దొరకునట్లు చేయుచున్నది. కాని యది యాముష్మిక భంగకరము. ధనమే మర్యాద నిచ్చునన్న దాసులు కపట యోగులు సంతోషించిన సంతోషింతురుగాక మతసారముల నెఱింగినపెద్ద లాదుర్వాదము నాలకింపరనుట రూఢము.

"సురాఘటసహస్రేణ మాంసభూతౌదనేన చ,
యక్ష్యే త్వాం ప్రయతా దేవి పురీం పునరుపాగతా. ౮౯
యాని త్వత్తీరవాసీని దైవతాని వసంతి చ,
తాని సర్వాణి యక్ష్యామి తీర్థాన్యాయతనాని చ." ౯౦

అని మూలము. ఇందు సురాశబ్దము క్షత్రియార్హమద్యవాచకము. మాంసశబ్దము మేధ్యపశుమాంసవాచకము త్రేతా యుగమున క్షత్రియాదులకుఁ గ్రీడోచితమద్యములు కొన్ని చెప్పఁబడినవి. బ్రాహ్మణుల కవి చెప్పఁబడలేదు. మాంసములు కొన్ని బ్రహ్మక్షత్రియవైశ్యులకు స్మృతులచే నిర్ణయింపఁబడినవి. "యదన్నం పురుషో భుంక్తే తదన్నం తస్య దేవతాః" అన్నసూక్తి ననుసరించి విధివిహితముగాఁ దామారగింపఁదగువస్తువులు వారిదేవతలకు నైవేద్యము పెట్టవచ్చును. ఆయాచారమునే

సీతవాక్యము బోధించుచున్నది. మహానదులతీరమునందు నేయే దేవత లుందురో యేయేతీర్థములు గలవో దేవతాస్థానములు గలవో వానినెల్ల నారాధింతునని సీత ప్రార్థించెను. అనఁగా మహాత్ము లారాధింప నావాహనము చేసియుండు దేవత లందే యుందురు. కనఁబడనందున లేరనరాదు యోగదృష్టికి వారగ పడుదురు. కొన్ని యేండ్లకుమునుపు మీచరణసేవకుఁడగు నీతఁడు గౌతమీతీరమున సంధ్యావందనముచేసి యిష్టదేవత నుపాసించుచుండఁగా నందేయున్న మహావృక్షమునిండ దివ్యతేజోరాసులగు దేవత లగపడిరి. పరిశీలించిచూచుచు వారిని బలుకరింపఁబూనునంతలో నదృశ్యులైరి. ఈమాట విశ్వాసపాత్రము కాదన్నను బాధలేదు. నాటంగోలె నీతఁడు దేవత లెల్లతావులం గలరన్నవిశ్వాసము కలవాఁడయ్యెనని విన్నవించుచున్నాఁడు.

"అగ్రతో గచ్ఛ సౌమిత్రే సీతా త్వామనుగచ్ఛతు,
పృష్ఠతోఽహం గమిష్యామి త్వాం చ సీతాం చ పాలయన్.
అన్యోన్యస్యేహ నో రక్షా కర్తవ్యా పురుషర్షభ." శ్లో

"నహి తావదతిక్రాంతా సుకరా కాచన క్రియా."

అని మూలము.

"ఆదానస్య ప్రదానస్య కర్తవ్యస్య చ కర్మణః,
క్షిప్రమక్రియమాణస్య కాలః పిబతి తద్రసమ్."

అన్నసూక్తిమూల మీశ్రీరామవాక్యమే యని యెఱుంగవలయు. ఏకార్యముగాని సమయముదాఁటక యుండఁజేయుట సులభముకదా. అనునదియే యిందుఁగలనీతి. మీవెనుక సీతను నిన్ను (లక్ష్మణుని) బాలించుచు వచ్చెదను. అనఁగా సర్వరక్షకుఁడనై మీవెనుక వత్తునని భావము. ఇట్లనుటచే నెల్లరకర్మవర్తనములఁ గనిపెట్టుచు వారివారి కనువగుఫలముల నొసంగుచు సర్వమును జూచుచునుందునని సారము. ఇట్లనుటచే

పర్వేశ్వరత్వ సర్వకారణత్వములు నిరూపింపఁబడియెను. ఇఁక నీఘట్టమున నధ్యాత్మరామాయణమును బఠింతము.

"తచ్ఛ్రుత్వా లక్ష్మణః ప్రాహ సఖే శృణు వచో మమ. ౪
కః కస్య హేతుర్దుఃఖస్య కశ్చ హేతుస్సుఖస్య వా,
స్వపూర్వార్జితకర్మైవ కారణం సుఖదుఃఖయోః. ౫
సుఖస్య దుఃఖస్య న కోఽపి దాతా పరో దదాతీతి కుబుద్ధిరేషా,
అహం కరోమీతి వృథాభిమానస్స్వకర్మసూత్రగ్రథితో హి లోకః. ౬
సుహృన్మిత్రార్యుదాసీనద్వేష్యమధ్యస్థబాంధవాః,
స్వయమేవాచరన్ కర్మ తథా తత్ర విభావ్యతే. ౭
సుఖం వా యది వా దుఃఖం స్వకర్మవశగో నరః,
యద్యద్యథాగతం తత్తద్భుక్త్వా స్వస్థమనా భవేత్. ౮
న మే భోగాగమే వాంఛా న మే భోగవివర్జనే,
ఆగచ్ఛత్వథ మాగచ్ఛత్వభోగవశగో భవే. ౯
యస్మిన్ దేశే చ కాలే చ యస్మాద్వా యేన కేన వా,
కృతం శుభాశుభం కర్మ భోజ్యం తత్తత్ర నాన్యథా. ౧౦
అలం హర్షవిషాదాభ్యాం శుభాశుభఫలోదయే,
విధాత్రా విహితం యద్యత్తదలంఘ్యం సురాసురైః. ౧౧
సర్వదా సుఖదుఃఖాభ్యాం నరః ప్రత్యవరోహతే,
శరీరం పుణ్యపాపాభ్యాముత్పన్నం సుఖదుఃఖవత్. ౧౨
సుఖస్యానంతరం దుఃఖం దుఃఖస్యానంతరం సుఖం,
ద్వయమేతద్ధి జంతూనామలంఘ్యం దినరాత్రివత్. ౧౩
సుఖమధ్యే స్థితం దుఃఖం దుఃఖమధ్యే స్థితం సుఖం,
ద్వయమన్యోన్యసంయుక్తం ప్రోచ్యతే జలపంకవత్. ౧౪
తస్మాద్ధైర్యేణ విద్వాంస ఇష్టానిష్టోపపత్తిషు,
న హృష్యంతి న ముష్యంతి సర్వం మాయేతి భావనాత్." ౧౫

సర్గము. ౬.

శ్రీరామమూర్తి పవ్వళించియుండుతఱి సాగిన గుహలక్ష్మణుల సంభాషణ మిది. ఇయ్యది విశేషించి కర్మసిద్ధాంతమును బోధించు

చున్నది. దీని నెఱింగిన ద్వేషమూనునవకాశము నశించును. అహంకారము తొలంగును. కర్మము భగవత్స్వరూప మను జ్ఞానము లభించును.

ప్రాయికముగా మానవులు తమరనుభవించుకష్టముల కితరులు హేతుభూతులని యూహింతురు. ఆకారణమున నత నిపై ద్వేషమూని దానిని మించినకష్టమును వారికిఁ గల్గింపఁ బ్రయత్నింతురు. తమ రేసమర్థులమని యహంకారమును బూను దురు. సుఖములనుభవించునపుడు తమకృత్యములే యందులకుఁ గారణములని తలంతురు. దాన మఱింత యహంకారము వారి మదులఁ బొడలును. తమరొనరించుప్రయత్నము లెంతదృఢతమ ములైనను ఫలింపక యవి వ్యర్థములు కాఁగా నపుడైనఁ గర్మము బలవత్తమమని భావింపక యితరు లాకార్యములఁ బాడుచేసి రనియే యూహింతురు. సులభప్రయత్నమున మహాప్రయత్న సాధ్యకార్యము ఫలించినపుడది తమశక్త్యతిశయమున ఫలించె నని మిగుల గర్వింతురు. అజ్ఞానులనుట కింక వేఱేమి యుదాహార ణము కావలయును? ఆవిషయమున నీసంభాషణము మిక్కిలి తగియున్నది. కర్మము భగవత్స్వరూపము. దానిత్రిప్పలకు లోనుగానివా రుండరు. హరిహరబ్రహ్మాలే కర్మఫలముల నను భవింతురన నిఁకఁ దక్కినవారిమాట యేటికి?

"న హి కశ్చిత్క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్,
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః. 5
నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః,
శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః." 8

గీత. 3 అధ్యా.

అను నీభగవద్వాక్యములు కర్మము బలవత్తరమని తెలుపు చున్నవి. కర్మగతులు దురూహాములని మాత్ర మెఱింగినవారు

సుఖముగనుందురు. ద్వేషభావ మానునవసరము వారలకు లేక యుండును. అపుడు వారు తొలిజన్మమునఁ జేసియున్న కర్మములు ఫలముల నీఁజాలుననియు వాని ననుభవింపక తప్పదనియు వారలకుం దోఁచును. దాన నహంకారము తొలఁగును. తమ కష్టముల కితరులు కారణభూతులు కారనుభావము పొడకట్టును. ఆభావమే నిర్మలజ్ఞానముఁ గల్గింపఁ గారణమగును. ఆజ్ఞానము భగవంతునితత్త్వ మెఱిఁగించును. దాన ముక్తు లగుదురు. కావునఁ గర్మమార్గము సర్వాధారమని మన మెఱుంగవలయు. సత్కర్మముల నాచరించునపుడు వానివలన నిట్టిలాభములు వల యుననిమాత్ర మాశింపరాదు.

"కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన,
మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి. ౪౭
యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ,
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే. ౪౮
దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ,
బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః." ౪౯

గీత. ౨ అధ్యా.

అను నీగీతావాక్యము లీవిషయమునే దృఢఱచుచున్నవి. ఇట్టివిషయము లీసంభాషణమునుండి మనము గ్రహింపవల యును.

సీత గంగాదేవిని బ్రార్థించినవిషయము మాంసము సురా ఘటములు సమర్పించువిషయ మీరెండింటియందు సమాన మనియే భావింపవలయును.

"అయాస్యామ్యుదితం సత్యం నాసత్యం రామభాషితం,
ఇత్యుక్త్వాలింగ్య తం భక్తం సమాశ్వాస్య పునః పునః.
నివర్తయామాస గృహం సోఽపి కృచ్ఛ్రాద్యయా గృహం,

తత్ర మేధ్యం మృగం హత్వా పక్త్వా హంత్వా చ తే త్రయః,
భుక్త్వా వృక్షతలే సుప్త్వా సుఖమావత తాం నిశామ్."

౭. సర్గము.

"నాసత్యం రామభాషిత" మ్మనునదియే మనము గ్రహింపఁదగి నది. అసత్యము శ్రీరామునోట వెడలదని భావము. శ్రీమద్రా మాయణమునందు "అనృతం నో క్తపూర్వమ్" అని కలదు. సత్య వచనమునకు నుదాహరణమే శ్రీరామాయణమని యెఱుంగ వలయును. గంగానదిం దరించి సీతారామలక్ష్మణులు పోయి యొకవృక్షమూలమున విడియుట పవిత్రమృగమాంసమును భక్షించుట యనునవి రెండింటియందు సమానమే యన వచ్చును. మునివృత్తినుండువారలు మాంసము భక్షింపవచ్చునా యనుప్రశ్నమున కింతకుముందే సమాధానము వ్రాయఁబడి నది. మరల వ్రాయనక్కఱలేదు.

మహాత్ములారా! యిట్టు శ్రీరామాయణభాగము భగ వత్తత్త్వమును జక్కఁగా బోధించుచున్నది. శ్రీరామచంద్రుని సర్వేశ్వరత్వ సర్వకారణత్వాదుల వెల్లడించుచున్నది. మఱియు జానకీదేవిమహత్త్వమును బోధించుచున్నది. ఇట్టి తావుల బఠించునపుడు కథయందే కాక తత్ప్రతిపాదితవిషయసార మందు మనస్సునునిచి వానినెఱింగి తదుక్తప్రకారము ప్రవ ర్తింపవలయును. శక్యమైనఁగదాయన్న యథాశక్తి న్యాయ ముగలదు గదా. శక్తివంచనసేయక దేవతాంతరద్వేషమువదలి భగవంతుఁడు సర్వమతములవారలకు నుపాస్యుఁడే యని నిశ్చ యించి యేరూపమునఁబూజించినను నిర్మలభక్తియుండిన ఫలము సమానమే యని తలంచి యారాధించి కృతార్థులము కావల యును. శంకరుఁడు శ్రీరామతారకోపాసకుఁ డన్నమాట వినఁ

బడఁగా నెంతటియుత్సాహము కలుగునో శ్రీరాముఁడు శం కరమంత్రోపాసకుఁ డన్నమాట వినినప్పు డంతటియుత్సాహ మును గాంచుచు భగవంతు నారాధింపవలయును. శ్రీరా ముఁడు నిర్లిప్తుఁడనియు మహాప్రకృతియగుసీతాదేవి సర్వకార్య ముల నిర్వహించుచుండఁ దాను సర్వసాక్షి కావునఁ జూచు చుండుననియుం మన మెఱుంగవలయును. ఇపుడు శ్రీ సీతా రాములు తమయవతారఫలమును లోకమునకుఁ గల్గింపఁ బ్రయాణముచేసి దీక్షవూనిన ప్రథమదినమే యిది. తరువాతి కథను మఱియొక ప్రకరణమునఁ బఠింతము. ఏభాగము పఠించి నను నిశ్చలభక్తితో నర్థము నరయవలయును. భగవత్తేజో రూపమును ధ్యానింపవలయును. బాహ్యపూజాసక్తి తొలఁగి మనోవీథి భగవంతుని నిలిపి ధ్యానింపవలయును. అదియే భగవంతునియనుగ్రహమునకుఁ బాత్రు నిగాఁజేయును.

అసితకమలభాసా భాసయంతం త్రిలోకం
దశరథకులదీపం దైవతాంభోజభానుం,
దినకరకులబాలం దివ్యకోదండపాణిం
కనకఖచితరత్నాలంకృతం రామమీళే.
వామే కోదండదండం నిజకరకమలే దక్షిణే బాణమేకం
పశ్చాద్భాగే చ నిత్యం దధతమభిమతం చాపతూణీరభారం,
వామేఽవామే లసద్భ్యాం సహమిళితతనుం జానకీలక్ష్మణాభ్యాం
రామం శ్యామం భజేఽహం ప్రణతజనమనఃఖేదవిచ్ఛేదదక్షమ్.
అంభోధరశ్యామలమంబుజాక్షం, ధనుర్ధరం చీరజటాకలాపం,
పార్శ్వద్వయే లక్ష్మణమైథిలీభ్యాం, నిషేవ్యమాణం ప్రణమామి రామం."

దుష్టధ్వంసనదీక్షాపరిగ్రహమను నాల్గవప్రకరణము సంపూర్ణము.



చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1933.

# శ్రీరామావతారతత్త్వము

## ఆఱవ ప్రకరణము.

ఇయ్యది

కడప మ్యునిసిపల్ హైస్కూలునందుఁ బ్రధానాంధ్రపండితుఁడగు

కావ్యస్మృతితీర్థ:

**జనమంచి శేషాద్రిశర్మ విరచితము.**

చెన్నపురి:

'వావిళ్ల' ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1934.

# విషయసూచిక

శ్రీః.

# శ్రీరామావతారతత్త్వము

## ఆరణ్యకాండము.

### షష్ఠప్రకరణము.

శ్లో. క్షీరాంభోనిధిమధ్యవర్తిని సితే ద్వీపే సువర్ణాచలే
రత్నోత్ఫుల్లాసితకల్పభూరుహతలే జాంబూనదే మండపే,
తేజోభ్రాజితవేదికే సురుచిరే మాణిక్యసింహాసనే
హేమాంభోరుహకర్ణికోపరితలే వీరాసనస్థం భజే. ౧

దోర్దండేన చ మండలీకృతమహాకోదండచండాశుగై
ర్నిర్ఘాతై రవికోటితుల్యనిశితైర్బ్రహ్మాదిముఖ్యస్తుతైః,
సుగ్రీవాదిసమస్తవానరవరానాజ్ఞాపయంతం గిరా
దైత్యాన్ తాడయ తాడయేత్యనుపదం శ్రీరామచంద్రం భజే. ౨

భూకంపం జనయన్ నభో విదళయన్నంభోనిధిం క్షోభయన్
దైతేయాంశ్చ విమర్దయన్ గిరివరాన్ భిందన్ దిశః పూరయన్,
వైదేహీమతిమోదయన్ సకలగీర్వాణాన్ శిరః కంపయన్
కల్యాణో రఘురామబాణవిలసత్కోదండచండధ్వనిః. 3

విమలకమలనేత్రం విస్ఫురన్నీలగాత్రం
తపనకులపవిత్రం దానవధ్వాంతమిత్రం,
భువనశుభచరిత్రం భూమిపుత్రీకళత్రం
దశరథవరపుత్రం నౌమి రామాఖ్యమిత్రం. ౪

జననీ జానకీ సాక్షాజ్జనకో రఘునందనః,
లక్ష్మణో మిత్రమస్మాకం కో విచారః? కుతో భయం? ॥

(శ్రీరామకర్ణామృతము.)

విజ్ఞానధనులారా! ఉదారాశయులారా!

శ్రీరామావతారతత్త్వము నైదవ ప్రకరణమును గాని కగాఁ దమసన్నిధి నర్పించుకొనఁజాలినంతటి మహాభాగ్యము పరమేశ్వరానుగ్రహము నాకుఁ గలిగినది. ఆప్రకరణమునందు శ్రీరామచంద్రుఁడు సీతాసౌమిత్రులంగూడి గంగాతరంగిణీ ప్రాంతమునఁ బర్ణశయ్యాలం బవ్వళించుట మొదలు దండ కారణ్యమునకుఁ బయనము సాగించునంతదనుకఁ గలకథా విశేషములు చూపట్టు. వానినెల్ల స్సావధానముగాఁ బఠించి తిరి. అందుఁ గలవిశేషాంశముల నెఱింగితిరి. మహాత్ముఁడగు శ్రీరామచంద్రునియాశయ మెట్టిదని మీ రెఱింగియే యుందురు. భరతశత్రుఘ్నులవిషయమున శ్రీరాముఁ డెట్లు ప్రవర్తించెనో భరతుఁడు శ్రీరామునివిషయమున నెట్లు ప్రవర్తించెనో యాభాగమునుండి స్పష్టమయ్యెఁగదా. లోకోప కారతత్పరత్వమున భగవంతుఁ డెట్లు ప్రవర్తించె ననువిషయ మునే మన మెఱుంగవలయును మానవులట్లే పరోపకార తత్పరులు గావలయుననియే భగవత్ప్రవర్తనము తెలుపు చుండును. స్వార్థపరత్వ మేమాత్రము పనికిరాదనియుఁ బరోప కార మొనర్పఁ బ్రయత్నించుటయే మానవజాతిధర్మమనియు మన మెఱుంగవలయును. ఎల్లరకు నీభావము ననుసరించి ప్రవర్తింప సాధ్యమా యని ప్రశ్నింపరాదు.

"ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః.
అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్." ౪౫ గీ: ౬ అ.

అను భగవద్వాక్యము కలదు కదా. ప్రయత్నించుచుండిన నెప్పటికేని గమ్యస్థానమును మానవుఁడు చేరఁగలుగుననుట సిద్ధాంతము. అది యసాధ్యమని యూరకుండుట మానవ ధర్మము కాదు. శక్త్యనురూపముగ భగవత్సేవయుఁ బర హితకరణమును జేయుచుండవలయును. అది యేజన్మము నందైన ఫలింపకపోదు.

శ్రీరాముఁడు భరతుఁడు మెలంగినవిధము పరికింపఁగా, సోదరప్రవృత్తి యట్టులుండవలయునని తేలుచున్నది. అట్లు మెలంగుటకే మానవులు ప్రయత్నింపవలయును. ఈకాల మున సోదరప్రీతి "జ్ఞాతిశ్చేదనలేన కిమ్" అనున్యాయము ననుసరించి తఱచుగ నుండుటంజేసి గగనకుసుమాయమాన మయ్యెఁగదా. స్వార్థపరత్వమే కదా యిన్నియిడుములకు మూలకందము. దానిని బరిత్యజింపవలయును. అది సాధ్యమా యని ప్రశ్నింపరాదు. ఓపినకొలందిని దానికిఁ బ్రయత్నించిన నేనాఁటికైన నది కలుగక పోదు. భగవద్గీతావాక్యము పైన నుదాహరింపఁబడియెఁ గదా. ఈరీతిగా సోదరప్రీతి యడు గంటగా నిఁక బంధుప్రీతి యెట్లుండును? పిదప నితరులపైఁ బ్రీతి యెట్లు కుదిరినదని ప్రశ్నింపనవకాశ మెక్కడిది? ప్రాయిక ముగాఁ బరస్పరముగ నుండఁదగిన మైత్రి మతములమూల మునఁ జెడుచున్నదనుట సిద్ధాంతము. మతము లట్టివా యని యడుగువా రుండకపోరు. సత్యముగ నాలోచించిన మతము లట్టివి కానే కావు. అన్యోన్యప్రీతిఁ గూర్చి తరింపఁజేయుటకే యవి యేర్పడినవి కాని యిప్పుడవి మానవులమూలమున స్వాశయములఁ గోలుపోయినవి. పరస్పరద్వేషమును వృద్ధి

చేయుటకే యవి పాటుపడుచున్నవి. ఇంతకన్న దుష్కాలమేది యుండునని విచారపడవలసి యున్నది.

పరమశివశబ్దమునకుఁ గొందఱు పెద్దనక్కయని యర్థము చెప్పిరి.

"స్త్రియాం శివా భూరిమాయు గోమాయుమృగధూర్తకాః,
శివా గౌరీ ఫేరవయోః." అనియు నమరకోశమునఁ గలదు.

"క్లీబే శివం భద్రసుఖోదకేషు ద్రవ్యే త్రిషు స్యాద్గిరిశేతు పుంసి,
శివా భవేదామలకీ భవానీ హరీతకీ సక్తుఫలాసృగాలః."

నానార్థరత్నమాల.

"శివో మోక్షే మహాదేవే కీలకగ్రహయోగయోః. ౨౫
వాలుకే గుగ్గులౌ వేదే పుండరీకద్రుమే పుమాన్,
సుఖక్షేమజలే క్లీబం శివాద్యాటామలౌషధౌ. ౨౬
అభయామలకీ గౌరీ ఫేరుసక్తుఫలాస్వపి." మేదినీకోశము.

ఇట్లు కోశములయందు విశేషార్థములు కనుపట్టుచున్నవి. ఒకప్పుడు శివశబ్దమునకు జంబుకార్థము కలదని యొప్పుకొందము. అంతమాత్రము శివశబ్దము జంబుకార్థమునందు రూఢమన వచ్చునా? అదేటి పాండిత్యము?

"యమానిలేంద్రచంద్రార్కవిష్ణుసింహాంశువాజిషు,
శుకాహికపిభేకేషు హరిర్నా కపిలే త్రిషు.
హర్యక్షః కేసరీ హరిః." అమరము.

"హరిశ్చంద్రార్కవాతాశ్వశుకభేకయమాదిషు. ౯౯
కపౌ సింహే హరేఽజేంఽశౌ శక్రే లోకాంతరే పుమాన్."

మేదినీకోశము.

"హరిర్యమార్కాశ్వాగ్నీందువిష్ణ్వింద్రాంశుశుకేషు నా,
వాయుభేకాహిసింహేషు కపౌ చ కపిలే త్రిషు." నానార్థరత్నమాల.

ఇట్లు హరిశబ్దమున కర్థములు గలవు. హరిశబ్దము చిలుక యందో కప్పయందో అశ్వమునందో రూఢమని యేల వచింప రాదో. వా రిపుడేమందురు? ఇట్లు దుర్మతాభిమానముని పండితులు కొందఱు పాషండు లగుచున్న వారనవలయు.

"సర్వశ్శర్వశ్శివస్థాణురీశ్వరో విక్రమీ ధన్వీ, రుద్రో బహుశిరాబభ్రు
ర్హిరణ్యనాభస్సుతపాః."

అనువిష్ణుసహస్రనామములయందుఁ గల హరిశబ్దము నక్కయందే రూఢమా? శివసహస్రనామములయందుఁ గలహరిశబ్దము కప్పయనునర్థమందు రూఢమా? అక్కటా! ఇట్టికుపండితుల దుర్దశ యేమనవచ్చును?

"హరాయ హరిరూపాయ నమస్తే తిగ్మతేజసే.

... ... ... ...

కాను వాక్త్స్నతిరూపా తే కోను స్తోతుం ప్రశక్నుయాత్,
కస్య వా స్ఫురతే జిహ్వా స్తుతౌ స్తుతిమతాం వర.
క్షమస్వ భగవన్ దేవ భక్తోఽహం త్రాహి మాం హర,
సర్వాత్మన్ సర్వభూతేశ త్రాహి మాం సతతం హర.
రక్ష దేవ జగన్నాథ లోకాన్ సర్వాత్మనా హర,
త్రాహి భక్తాన్ సదా దేవ భక్తప్రియ సదా హర." ౩౮

హరివంశము. భవిష్యపర్వము ౮౭ అ.

అని శ్రీకృష్ణుఁడు శంకరు వినుతించెను. శంకరుఁడు హరికి వరమిచ్చెను. ఇందు హరి శివుని వినుతించెనుగదా. నక్కను గుఱించియా విష్ణువు తపస్సుచేసినది? ఏటి కీతుచ్ఛవాక్కు

లుపయోగించి పాపము కట్టుకొందురో తెలియఁజాలకున్న వాఁడను.

"అవిద్యామోహితాత్మానః పురుషా భిన్నదర్శినః,
వదంతి భేదం పశ్యంతి చావయోరంతరం హర." ౪౯

విష్ణుపురాణము. ౫ అంశము 33 అ.

అజ్ఞానులే శివవిష్ణువులకు భేదముఁ గాంతురని శ్రీకృష్ణుఁడు పలికెను.

"త్వమేకస్సర్వజగతామీశ్వరో బంధమోక్షయోః,
తం త్వామర్చంతి కుశలాః ప్రపన్నార్తిహరం గురుం. ౨౨
గుణమయ్యాం స్వశక్త్యాస్య సర్గస్థిత్యప్యయాన్ విభో,
ధత్సే యయా సద్వృగ్భ్రమన్ బ్రహ్మవిష్ణుశివాభిధాం. ౨౩
త్వం బ్రహ్మ పరమం గుహ్యం సదసద్భావభావనం,
నానాశక్తిభిరాభాతస్త్వమాత్మా జగదీశ్వరః." ౨౪

శ్రీభాగవతము. ౮ స్కం. ౭ అధ్యా.

ఈభాగవతప్రమాణవాక్యములం బరిశీలించితిమేని శివకేశవులు మఱియు బ్రహ్మయు నొక్కతత్త్వమునుండియే పుట్టినవారనియు, నాతత్త్వమునకు శివకేశవాదినామములెల్లఁ జెల్లుననియుఁ దేలెడిని. ఇట్టు లుండఁగా శివకేశవులలో నొకఁడు భగవంతుఁడనియు నొకఁడు కాఁడనియు వాదించుట కేవల దౌష్ట్యమునఁ గాక మఱేమగును? అట్టివారి పొల్లుమాటలకు మోసపోయి వారియనుచరులు కొందఱు పరస్పరము దూషించుకొనుచుఁ గాలము పుచ్చుచుందురు. ఇది దుర్మతాభిమానఫలముగాక మఱేదగును? అట్టిదుర్మతాభిమానమును వదలి సర్వశబ్దవాచ్యునిగా సర్వమతశరణ్యునిగా సర్వధర్మరక్ష

కునిగా సర్వభక్తార్తిభంజనునిగా దేవాదిదేవు నారాధించి తదనుగ్రహామునకుఁ బాత్రుల మగుటయే మానవులకు విధి. అదియే భవజలధితరణోపాయ మనవలయును.

కొందఱు మధ్యవైష్ణవులు కపటనాటకసూత్రధారులై "శ్రీరామరామరామేతి" యనుశ్లోకమును బార్వతికి శంకరుఁ డుపదేశించెననియు, శ్రీమహావిష్ణువే రామనామమున నవతరించెనుగాన శ్రీరాముఁడే భగవంతుఁ డనియు, శంకరుఁడు రామ భక్తుఁడనియు శిష్యుల కుపదేశింతురు. వారు పామరులగుట శిరఃకంపమొనరించి యదియే తత్త్వమనుకొని వారే తరింపఁ జేయువారని నమ్మి ధనమిచ్చి సత్కరింతురు. ఆగురువులు సంతృప్తులగుదురు. శంకరుఁడు పార్వతికి శ్రీరామప్రభావమును దెలిపెననుట నిర్వివాదాంశము. అట్లే శ్రీకృష్ణమూర్తి

"న గతిః కర్మణాం శక్యా వేత్తుమీశస్య తత్త్వతః,
హిరణ్యగర్భప్రముఖా దేవాస్సేంద్రా మహర్షయః. ౨౨
న విదుర్యస్య భవనమాదిత్యాస్సూక్ష్మదర్శినః,
స కథం నరమాత్రేణ శక్యో జ్ఞాతుం సతాం గతిః. ౨౩
తస్యాహమసురఘ్నస్య కాంశ్చిద్భగవతో గుణాన్,
భవతాం కీర్తయిష్యామి వ్రతేశాయ యథా తథమ్." ౨౪

శ్రీమహాభారతము. అనుశాసనికపర్వము ౧౪ అధ్యా.

ధర్మరాజునకు శివప్రభావమును దెలిపెను. ఆకారణమున విష్ణువు శివభక్తుఁడనియే తేలెడినిగదా. శివుఁడు రామభక్తుఁ డని పలికిననోట రాముఁడు శివభక్తుఁడని పలుకవలసియున్నది. అట్లేల చేయరో తెలియదు. అట్టివారికు వాదము లంగీకారము లెట్లగును? వారు భక్తు లెట్లగుదురు? వేషధారులే యగుదు రనుట కేశంకలుండవుకదా? శంకరాచార్యస్వాములు విష్ణు

భక్తులనియుఁ, గావున విశిష్టాద్వైతమతమే వారికి సమ్మత
మనియు, నద్వైతమనునది పైకిఁ గనఁబఱచిరనియు దేవా
నాంప్రియులు కొందఱు పలుకుదురు. ఏమి వారిదుష్కర్మము!
శంకరభగవత్పాదులు కేశవాదిదివ్యనామములెల్ల నొక్కభగ
వంతునకే చెల్లుననియు, బాహ్యచిహ్నములు నిష్ఫలము
లనియు, వాని వదలి సర్వవ్యాపకునిగా భగవంతు నారా
ధింపుఁడనియు బోధించిరి.

"అలింగకమచక్రాంగమజటాస్థ్యసురామిషం,
అరక్తకమనాచ్ఛిష్టం షడస్మాభిరనుష్ఠితమ్."

అని షణ్మతసిద్ధాంతములం దెల్పిరి. సర్వమతము లొక్కటియే
యనియుఁ, గొన్నిదురాచారము లవ్వానియందుఁ గల్పింపఁ
బడినవనియు, వానిని వదలిన నన్నియు భగవంతునే ప్రతి
పాదించుననియు వారు వెల్లడించిరి. వారు విశిష్టాద్వైతులే
యనువా రిపుడేమనఁగలరు? విష్ణుశబ్దము భగవంతునకు
లేదనువారుండరు. ఈయుపన్యాసకు లనుకొనువాఁడుమాత్ర
మాతండు కాఁడు సర్వవ్యాపకుఁడు. సర్వాంతర్యామి. ఆతఁ
డెవ్వఁడు? పరమాత్మయే. కార్యార్థము నానారూపములం
దాల్చును. అట్లే శ్రీరామరూపమున నవతరించెను. ఇది సర్వ
సమ్మతసిద్ధాంతము. సకలశ్రుతిస్మృతిపురాణేతిహాససారము.

బాహ్యచిహ్నములగు నూర్ధ్వపుండ్రాదులు పామరుల
కొకవిధమగునమ్మకమును గల్గింపఁజాలునేమో యని యేర్ప
ఱుపఁబడినవే కాని వేఱొక ప్రయోజనము వానినుండి కలు
గదు. అవియే ప్రధానములని యవి లేకున్నంతమాత్రమున
నరకముల పాలగుదురనుట కంటె హాస్యవాదము వేఱొకఁడు
గానరాదు.

"మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతాస్తే మే యుక్తతమా మతాః. ౨
యే త్వక్షరమనిర్దేశ్యమవ్యక్తం పర్యుపాసతే,
సర్వత్రగమచింత్యం చ కూటస్థమచలం ధ్రువమ్. ౩
సన్నియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః,
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః. ౪
యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః,
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే. ౬
తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్,
భవామి న చిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్. ౭
మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ,
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః." ౮ గీత. ౧౨ అ.

అను నీశ్రీకృష్ణవాక్యములు పైవిషయమునే తెలుపుచున్నవి. ఇంద్రియనిగ్రహము, శ్రద్ధ మొదలగునవి ప్రధానములనియు, నవి గలవారే నాభక్తులనియు భగవంతుఁడు తెలిపెఁగాని, యూర్ధ్వపుండ్రాదులు ప్రధానములని కాని తుద కవి యుండిన నించుకంతయైన మేలు గలదనిగాని పలుకలేదు. మనస్సే ప్రధానమని సారము. ఈచిహ్నములు తొలుదొలుత నించుక యుపయోగకరములుగాఁ దోఁచును. ఆవల నిరర్థకములే యని తోఁచును. అవి లేకున్న భగవంతునియనుగ్రహము కలుగనే కలుగదనువాదము దుర్వాదమనుట నిస్సందేహము. సమాధినిష్ఠగలవా రెంతకాలమో యట్లే యుందురు. వారు స్నానాదికృత్యముల నొనరింతురా? భగవత్పాదములయందుఁ జిత్తముంజేర్చి యట్లే ధ్యానించుచుందురు. వారు భక్తులు కారా? నామతీర్థము పుచ్చుకొన

కున్న ముక్తి లేదనుట వారియం దెట్లు సమన్వయము చేయఁ దగును? అనఁగా నట్టియోగుల కెట్టికర్మములు లేవనియు సర్వకర్మఫలమే యాయోగాభ్యాసమనియు మన మెఱుంగ వలయును. అప్పు డీబాహ్యచిహ్నము లప్రధానములని తోఁచును.

భగవంతు నారాధించుమార్గము లనేకములు గలవు. అందు ముఖ్యతమము ధ్యానము దానింబోలునారాధన విశేషము వేఱొండు కానరాదు. దానికి నిర్మలచిత్తమే కావలయుఁగాని వేఱు పరికరము లక్కఱలేదు. సకలసత్కర్మ ఫలమే కదా నిర్మలమనస్సు నెలకొనుట. అనఁగా నెన్నియో జన్మములయందు ఫలములను గోరనిసత్కర్మముల నాచరింపఁగా వానికి ఫలముగ భగవంతుననుగ్రహమున నిర్మలమగుమనస్సు గలుగునని సారము. అట్టిమనస్సు కుదురగా భగవంతు నారాధించుమార్గమేది? కేవల ధ్యానముననే. వేఱొక్కమార్గము లేదు. ధ్యానమహిమము నాలకింపుఁడు.

"హృత్పుండరీకమంతస్థమూర్ధ్వనాళమధోముఖం,
ధ్యాత్వోర్ధ్వముఖమున్నిద్రమష్టపత్రం సకర్ణికం,
కర్ణికాయాం న్యసేత్సూర్యసోమాగ్నీనుత్తరోత్తరం. ౩౬
వహ్నిమధ్యే స్మరేద్రూపం మమైతద్ధ్యానమంగళమ్,
సమం ప్రశాంతం సుముఖం దీర్ఘచారుచతుర్భుజం. ౩౭

... ... ... ...

ధ్యానేనేత్థం సుతీవ్రేణ యుంజతో యోగినో మనః,
సంయాస్యత్యాశు నిర్వాణం ద్రవ్యజ్ఞానక్రియాభ్రమః." ౪౬

శ్రీభాగవతము ౧౧ స్కం. ౧౪ అధ్యా.

అని యుద్ధవునకు శ్రీకృష్ణమూర్తి యుపదేశించెను. ఈసారము నే

"తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున." ౪౬

అని గీతాశాస్త్రమునందు నర్జునున కుపదేశించెను. యోగాభ్యాసము లేక చచ్చువేదాంతవాక్యములఁ బల్కువారు భగవత్కరుణకుఁ బాత్రులు కాఁజాలరనియే దీనిసారము. ఇది భగవంతుఁడు తెలిపినమాటలేకాని వేఱుగావని నమ్మవలయును. ఇట్లు యోగము నభ్యసించి ధ్యానమున భగవంతు నారాధించి భగవంతునను గ్రహమునకుఁ బాత్రులము కావలయునని మనము సర్వథా సర్వదా ప్రయత్నింపవలయును. అంతటిశక్తి మనకుఁ గలుగునా యని సందియమందరాదు.

"శనైశ్శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా,
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్. ౨౫
యతో యతో నిశ్చరతి మనశ్చంచలమస్థిరం,
తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్. ౨౬ అధ్యా. ౬
అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా,
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్." ౮
గీత ౮ అధ్యా.

అని భగవంతుఁడు సులభోపాయమును బోధించెను. ఆరీతిగాఁ బ్రయత్నించిన నది సాధ్యము కాకపోదు. సర్వకాలము రిత్తమాటలు చెప్పుచుండిన నేలాభము లేదు అట్టిమాటలమూలమునఁ గాలము పుచ్చుచుండక మానవుఁడు భగవంతు నుత్తమ

మార్గమున నారాధించి తత్కృపకుఁ బాత్రుఁడై తరింప వలయును. అంతియ కాని వేఱొండు త్రోవ కానరాదు. ధనార్జనమునకొఱకుఁ దిరుగుచుఁ గపటవేషధారులయి భక్తుల వలె నుండు వంచకులమాటలకు మోసపోరాదు.

ఇట్లు భగవంతు నారాధించుమార్గము నెఱింగి దాని మూలమున నరిషడ్వర్గములకు లోఁబడక ధనమే ముక్తిసాధన మను మూఢవిశ్వాసమును మది నునుపక శివుఁ డెక్కువ విష్ణువు తక్కువ యనిగాని విష్ణు వెక్కువ శివుఁడు తక్కువ యనిగాని తలంపక శివవిష్ణ్వాదు లెందఱో పరమేశ్వరునంశ ములని నమ్మి యట్టిపరమాత్మను జక్కఁగా సేవింపవలయును. ప్రకృతకథామూలభూతుఁడగు శ్రీరామునియం దీభక్తి నెల కొలుపుదము. కార్యార్థమా పరమేశ్వరుఁడు భూలోకమున శ్రీరామనామమును ధరించి యవతరించెననియుఁ, బ్రకృతి సీతారూపమున నవతరించెననియు, వారిచర్యలఁ బరిశీలించు టయే మనకుఁ దరణోపాయమనియు నమ్మవలయును. పామ రులంబోలి వారు చరించుచు నుత్తమధర్మములను లోకులకుఁ దమప్రవృత్తిమూలమునఁ దెలుపుచుఁ దిరుగుట నే మనము తెలిసికొనవలసినవిషయము. వారిచరితమును మాత్ర మెఱిం గినఁ జాలదు. వారిచూపినమార్గము ననుసరించి మనము కూడ శక్తికిం దగినరీతిఁ బ్రవర్తింపవలయును. శ్రీమద్రా మాయణమును బఠించిన దానికంటె దానియర్థ మెఱుం గుటయు, నద్దానికంటె నాయర్థము మది నిలుపుకొనుటయు, నంతకంటె నద్దాని ననుసరించి ప్రవర్తించుటయు నుత్తమంబు లై యుండు. ఎన్నిసారులు రామాయణమును బఠించినను దద్రీతిఁ బ్రవర్తింపమేని తత్ఫలము చక్కఁగాఁ గలుగదు.

కావున శ్రీరామునిప్రవర్తనమును బరికించి యందించుకభాగ మైనను మనప్రవర్తనమునఁ గలుగఁజేసికొనవలయును ఇఁక శ్రీరామునియరణ్యగమనమునందు మహాపురుషుఁ డాపర మేశ్వరుఁడు చేసినమహాకార్యములను బఠింతము.

## శ్రీరామాదులు దండకారణ్యముఁ బ్రవేశించుట.

* మహాధీరుఁడగు శ్రీరాముఁడు సీతాలక్ష్మణులం గూడి దండకారణ్యమును బ్రవేశించి యందలి మునులయాశ్రమ ములం జూచెను. వానియందంతటను యజ్ఞపరికరములు కనఁ బడుచుండెను. మహర్షుల యపారతేజోవిశేషము వెలయుటం జేసి యవి సూర్యమండలముంబోలి దుర్నిరీక్ష్యములుగ నుండెను. వానియందు జాతివైరములు లేవుగాన నవి ప్రాణి కోటులకు వాసార్హములుగ నుండెను. రాక్షసులభయము గలవారలుగూడ నందుండిరి. అలుకఁబడినముంగిళ్లు మఱియు ననేకమృగము లందుఁ గనంబడియెను. పక్షివిశేషము లందు విశేషించి యుండెను. ఆభాగము లత్యంతమనోహరములగుట నచ్చరమిన్న లరుదెంచి నాట్యము సలుపుచుందురు. అనేకఫల వృక్షము లందుఁ గనుపట్టుచుండు. భూతబలులచేఁ బావనమై వైశ్వదేవాదులచేఁ బూజితమై వేదపారాయణధ్వనుల నిండి దేవతారాధనార్హపుష్పవిశేషములు గలిగి సరోవరంబులు వెలయ నాభూభాగసముదయ మెంతో యచ్చెరువుగ నుండెను.

అందు వన్యఫలములం దినుచు నింద్రియనిగ్రహము గలిగి వల్కలాజినములఁ దాల్చి సూర్యాగ్నులంబోలియుండు

* ఇది యారణ్యకాండమునఁ బ్రథమసర్గమునఁ గలదు.

వృద్ధమహామునులు కాఁపురముండిరి. నియతాహారులగుమహర్షులు నందు వెలయుచుండిరి. బ్రహ్మలోకముం బోలుచు నాయాయికర్మకాలములయందు వేదమంత్రధ్వనులు చెలరేఁగుచుండ బ్రహ్మజ్ఞానసంపన్నులగు బ్రాహ్మణు లుండుటం బవిత్రమైయున్న యాయాశ్రమసమూహమును గాంచి మహాతేజుఁడౌ రాముఁ డెక్కుపెట్టిన కోదండమును డించి యాయాశ్రమములకు నెదురు వోయెను. దివ్యజ్ఞానసంపన్నులగు నామునివరులు విశేషప్రీతిగలవారలై శ్రీరామచంద్రుని యశస్వినియగు వైదేహిని దర్శించి యెదురుగఁ బోయిరి. ధర్మార్థమే ప్రవర్తించువారును నియతవ్రతులు నగు మునీశ్వరు లుదయించుచంద్రునిం బోలియున్న శ్రీరాముని లక్ష్మణుని యశస్వినియగు వైదేహిని దర్శించి మంగళాశిషముల నొసంగుచుఁ బిలుచుకొనిపోయిరి. వనవాసులగునామునులందఱు రూపసంహననమును శృంగారసంపదను సౌకుమార్యమును సువేషతను జక్కఁగాఁ గాంచి యచ్చెరువందిరి. మఱియు సీతారాములను లక్ష్మణుని గన్నులారఁ గాంచి యశ్రుతపూర్వంబగు తద్దర్శనమున కద్భుతంపడుచు నిలింపులవలె నుండిరి. సకలభూతహితైకపరాయణుఁడగు శ్రీరాముఁ డతిథియై రాఁగా వారెల్లరు నతని సాధ్వీసోదరులతోఁ దమయాశ్రమములకుఁ బిలుచుకొనిపోయి యిందు నిలువఁదగునని ప్రార్థించిరి. అగ్నింబోలి ప్రకాశించునామునులు ధర్మయుక్తముగా వారిని గుశలంబడిగి యాతిథేయసత్కారముల నాచరింపఁగోరి జలమును దెచ్చిరి. వన్యములగుపుష్పఫలములను మూలములను దమపర్ణశాలలను జూపి మహాత్ములారా! యివన్నియు మీవియే కనుక యథేచ్ఛముగా నుపయోగించుకొనుఁ డని

నివేదించి యంజలిబంధమ్ము లొప్ప రామచంద్రు నిట్లు ప్రార్థించిరి. మహాయశా! వర్ణాశ్రమధర్మపాలకుఁడవు కదా నీవు. మునిజనశరణ్యుఁడవు. దేవతవలె నారాధింపఁదగుదువు. మహారాజుగా భావించియు సన్మానింప నర్హుఁడవు మహాత్మా! రాజు దుష్టుల నిగ్రహించువాఁడు. గురువు. రాజనఁగా భూలోకమున నింద్రునిచతుర్థాంశమునను దక్కినదిక్పతులయంశమునను బుట్టినవాఁడు. ప్రజారక్షకుఁడు. కనుకనే యర్హ్యతమభోగముల ననుభవించును. లోకనమస్కృతుఁడు నగు. శ్రీరాఘవా! ఆర్తులమగు మేమెల్లరము నీదేశమున నుండువారము. కాన మమ్మెల్ల రక్షింపఁదగినవాఁడవు నీవే పురమున నున్న వనముల నున్నను బ్రభుఁడవగు నీవే మాకు దిక్కు. జితేంద్రియులమగు మేము కోపవిశిష్టులము గారాదు. దానఁ దపోనాశము గల్గును. ఆభయమునఁ గ్రోధమువదలి యున్నవారము. కావునఁ గ్రోధమూనిశపించి దుష్టుల దండించుమార్గమునకు దూరముగా నున్నవారము. తపోనిరతులము. నీబిడ్డలము. మమ్మెపుడును గాపాడఁ దగినవాఁడవు నీవే. అని వచియించి వారెల్ల వన్యఫలాదులచేతను సంకల్పసంభవములగు నితరపదార్థములచేతను శ్రీరామాదుల నర్చించిరి. అందు వేంచేసియుండు నితరమహర్షులు న్యాయముననుసరించి లోకప్రభువగు శ్రీరామచంద్రుని వినుతుల నారాధించిరి.

మహాశయులారా! ఈభాగమున ననేకవిషయములు మనము పరిశీలింపఁదగినవి కలవు. శ్రీరామాగమనమును గోరువారలు మునులే. దుష్టరాక్షసులబాధల ననుభవించువారు మునులే కదా. దివ్యజ్ఞానమున శ్రీరామునియవతారము నెఱుంగుదురు. మఱి యేల యీయుపచారవాక్యములందు

రేమో. ప్రభువునారాధించుపద్ధతులను లోకులకు బోధించుటకే యని మన మెఱుంగవలయును. కనుక నిట్టిఘట్టములను విమర్శించి యందుఁ గల సారమును గ్రహించి దానఁ దృప్తి నొందక యందుఁ గొంతమాత్రమే నాచరణమునం దునుపవలయును. అదియే ఫలప్రదము. లేకున్న నేకొంచెము ఫలమో కలుగును. ఇఁక నీభాగమును విమర్శింతము.

"మృగైర్బహుభిరాకీర్ణం పక్షిసంఘైస్సమావృతం,
పూజితం చ ప్రనృత్తం చ నిత్యమప్సరసాం గణైః." 3

అని మూలము. మహర్షులయాశ్రమవర్ణనమే యిది. మృగములనఁగా నిందు హరిణములని యర్థము గ్రహించు టుత్తమము. మునులు జింకలఁ బెంచుట ప్రాచీనాచారము.

"తదంకశయ్యాచ్యుతనాభినాళా కచ్చిన్మృగీణామనఘా ప్రసూతిః."

అని కాళిదాసు వచించెను. పక్షులం బెంచుటయు మునుల యలవాటులలో నొక్కటి. ఏల? శ్రావ్యనాదముల నయ్యవి యానందమును గలిగించుచుండును. మనస్సు నిర్వికారముగా నుండవలయునన్న నానందము నార్జింపవల్లయు. అది యుండినఁగాని దుఃఖములు పాఱిపోవు. సాధుమృగస్పర్శము కూడ నానందజనకమే. సర్వసంగపరిత్యాగు లయ్యు మునులు హరిణములను బక్షులను బెంచుచుందురు. అదియుఁ గూడ మాని యెందో గుహలలోఁ గూరుచుండువారును గలరు. వారలు నిర్వికల్పసమాధినిష్ఠు లనంబడుదురు. యోగులనఁగ వారే. వారికి నిత్యనైమిత్తికకర్మములు లేవని మన మెఱుంగవలయును. అచ్చరమిన్న లేతెంచి మునులయాశ్రమములముందాడుచుంబాడుచుందురని వాల్మీకి యిందు వక్కాణించెను.

మనోవైకల్యహేతుభూతలు కదా యచ్చరలు. వారేల వచ్చు చుందురని ప్రశ్నింపరాదు. వారిరాక మునుల కుపకారము చేయును. రూపవిలాసముల మరులుగొలుపు సరసిజనయన లాటలంబాటలఁ గొటి మేయానందమును గల్పించుచుండ నాయా నందము మనోవికారజనకమై యుండ నద్దానికి లోఁబడని వైరాగ్యము నభ్యసించుటయు నయ్యది దృఢమూలమా కాదా యని పరీక్షించుకొనుటయు నను నీకార్యములకు నచ్చ రలే యవకాశమిచ్చువారు. సాన్నిధ్యబల మపారము. దానిని గూడ జయించుటకు మనోదార్ఢ్యము కావలయును. అట్టిది కలదా లేదా యని పరీక్షించుకొనుటయే వారికిం గల కార్య ములలోఁ బ్రధానము. అచ్చరలకన్నను మహాత్ముల నాటలం బాటలం దేలించుటయే తరణోపాయము. అంతియ కాని వేఱు మార్గము వారికి లేదని మన మెఱుంగవలయును. మునులు తఱచుగా దేవతోపాసకులు. ఉపాసకులు వీణాదివాద్యధ్వను లకు విముఖులు కారాదని తంత్రములు తెలుపుచున్నవి. ఈశ్వరోపాసనమునందు నృత్యము ప్రధానమని మన మెఱుంగ వలయు.

"నృత్తావసానే నటరాజరాజో ననాద ఢక్కాం నవపంచవారం,
ఉద్ధర్తుకామస్సనకాదిసిద్ధానేతద్విమర్శే శివసూత్రజాలమ్."

అని సూక్తి ప్రసిద్ధము కదా. శ్రీకృష్ణభక్తులు శంకరభక్తులు నృత్తగీతముల కభిముఖులు కావలయునని పురాణములు తెలుపుచున్నవి. గాన మద్భుతానందజనకము.

"వీణావాదనతత్త్వజ్ఞశ్శ్రుతిజాతివిశారదః,
తాలజ్ఞశ్చాప్రయాసేన మోక్షమార్గం..."

అని యాజ్ఞవల్క్యస్మృతి తెలుపుచున్నది. ఏల? గానము భగవత్స్వరూపమనియేకదా దానిభావము. కనుకనే మునుల యాశ్రమములయందు దుఃఖజనకములగువిషయములు లేక యానందజనకములగు విషయములే కలిగియుండుననియు నయ్యవి తపోభంగమునకుఁ గారణములు కావనియు విశేషించి యానందజనకము లనియు మనము తెలిసికొనవలయును. మనుజులసంగతి మాత్రమే తపోభంగహేతువనుట నిర్వివాదము. నిర్మానుష్యభాగము తపోయోగ్యము. కాని మృగపక్షివిహీనము తపోయోగ్యము కాదు.

"స దృష్ట్వా రాఘవశ్శ్రీమాన్ తాపసాశ్రమమండలమ్,
అభ్యగచ్ఛన్మహాతేజా విజ్యం కృత్వా మహద్ధనుః."

అని మూలము. "శ్రీమాన్" అనువిశేషణము మహర్షి యిచ్చో నుపయోగించెను. సీతాయుతుఁడని కదా యర్థము. ప్రకృతి సర్వకార్యనిర్వహణమునందు దక్షత నొప్పియుండ నిరంజనుఁ డగుభగవంతుఁడు తనసర్వసాక్షిత్వము ప్రకటించుచుండునని మనము గ్రహింపవలయును. కనుకనే "విజ్యం కృత్వా మహాద్ధనుః" అని కవి ప్రయోగించెను. ఎక్కుపెట్టియున్న విల్లును సడలించెనని యర్థము కదా. మహారణ్యమున మహామునుల యాశ్రమము లున్నందున నందు ధనుఃకర్మము లేదనియే యట్లు చేసెను. ఘోరారణ్యములయందు మును లుండనేల? అని ప్రశ్నింపరాదు మనుజులసందడి లేనితావులే తపోయోగ్యములు. అందు దుష్టులబాధ లుండినను దపశ్శక్తికలిమి గలవార లవ్వానిని లెక్కింపరు. నిరంతరము గలుగు మనుజులవలనిబాధలకంటె నెప్పుడో యొకప్పుడు కలుగు రాక్షస బాధలే క్షంతవ్యములని యెఱుంగవలయును. సంసారబాధలు

దుష్టమృగరాక్షసబాధలకంటె మిగుల శ్రమదాయకము లనియే యిందుఁ గలసారము.

"దివ్యజ్ఞానోపపన్నాస్తే రామం దృష్ట్వా మహర్షయః. ౧౦
అభ్యగచ్ఛంస్తథా ప్రీతా వైదేహీం చ యశస్వినీం,
తే తం సోమమివోద్యంతం దృష్ట్వా వై ధర్మచారిణః. ౧౧

లక్ష్మణం చైవ దృష్ట్వా తు వైదేహీం చ యశస్వినీం,
మంగళాని ప్రయుంజానాః ప్రత్యగృహ్ణన్ దృఢవ్రతాః." ౧౨

అని మూలము. శ్రీరామావతారతత్త్వ మెఱింగినమహర్షులు శ్రీరాముని లక్ష్మణుని యశస్విని యగు సీతను గాంచి యెదు ర్కొనిరి. "యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ" అన్నయట్లు వారు హృదయసరసిజముల నిలిపి ధ్యానించు ప్రకృతి పురుషులు సాక్షాత్కరింపఁగా మహానందమున నోలలాడిరి. ఏల యనఁగా దివ్యజ్ఞానసంపన్నులు గనుక. ఇందు సీతకు "యశస్వినీమ్" అన్న విశేషణ ముపయోగింపఁబడినది. యశస్సు కలది. అనఁగా సర్వజగత్సృష్టిపాలనసంహారకారిణి యను ఖ్యాతి గలదని భావము. ఆమునులు ధర్మచారులు నియత వ్రతులు కావుననే శ్రీరాముని నుదయించుచంద్రునివలెఁ గాంచిరని సామాన్యార్థము. "సోమమివోద్యంతమ్" పొడ సూపిన పార్వతీపతివలె నున్నవానినిగాఁ జూచిరని విశే షార్థము. దుష్టరాక్షసులఁ బొలియింప మృత్యుంజయుఁ డరు దెంచినట్లు వేంచేసిన శ్రీరాముని గాంచిరని విశేషార్థము. సర్వలోకభయంకరులగు రాక్షసుల నిర్మూలించుట కవతరించె నని యెఱింగిరనియే భావము. భగవంతుఁ డాసమయమున నీశ్వరకార్యమును జేయఁ బూనియున్నట్టు లెఱింగిరనునదియే

యిందలి సారము. ఇందును "యశస్వినీమ్" అనువిశేషణము సీతకు నీయఁబడినది. తత్సాన్నిధ్యమున నాప్రకృతియే సర్వకార్యముల నొనరించుననియే యిందుఁ గలభావమని మన మెఱుంగవలయును. అట్టివారి నాశీర్వదించుట లోకాచార పరిపాలనార్థమే కాని వేఱొండు కాదు. భగవంతుఁ డాయాయి కాలములఁ జేయఁదగినకార్యముల ననుసరించి సత్త్వరజస్తమో గుణములను బ్రధానముగా ధరియించుననియు నాకార్యము తీఱినవెంటనే ప్రకృతి తనయందు విలీనతనొందఁగా నిర్లిప్తుఁడుగ నుండుననియుఁ బ్రధానార్థము. ఈవిషయమును మన సునఁ బదిలముగా నెలకొలిపిన దేవతాదూషణమున కవకాశమే యుండదు. శివకేశవాదు లెంతటివారో స్పష్టముగాఁ దెలియును. అది తెలిసినఁగాని దుర్వాదములు నశింపవు. భేదబుద్ధి యున్నయంతకాలము నిర్మలజ్ఞాన మలవడదు. అది యలవడినఁగాని భగవదుపాసనము చేయుయోగ్యత కలుగదు. పరతత్త్వవిషయకవిచారము కూడ నొకయుపాసనమే కదా.

"ధర్మపాలో జనస్యాస్య శరణ్యస్త్వం మహాయశాః,
పూజనీయశ్చ మాన్యశ్చ రాజా దండధరో గురుః. ౧౮
ఇంద్రస్యేహ చతుర్భాగః ప్రజా రక్షతి రాఘవ,
రాజా తస్మాద్వరాన్ భోగాన్ భుంక్తే లోకనమస్కృతః. ౧౯
తే వయం భవతా రక్ష్యాః భవద్విషయవాసినః,
నగరస్థో వనస్థో వా త్వం నో రాజా జనేశ్వరః." ౨౦

అని మూలము. ఇందు రాజమాహాత్మ్యము వర్ణింపఁబడినది. ఇంద్రునినాలవభాగముకలవాఁడు రాజని యిందుఁ జెప్పఁబడినది.

"వస్తుతస్తు ఇంద్రశబ్దోఽయం పరమాత్మపరః. ఇది పరమైశ్వర్య ఇతి ధాతోః తత్రైవ ముఖ్యత్వాత్. ఇంద్రో మాయాభిః పురురూప ఈయత ఇతి శ్రౌతప్రయోగాచ్చ. ఇంద్రస్య పరమాత్మనః చతుర్భాగశ్చతుర్థాంశః తదవతార భూతే వ్యక్తిచతుష్టయే. ఏకవ్యక్తిభూతః భవాన్ భోగాన్ భుంక్తే ఇత్యర్థః. పూర్వాపరశ్లోకానుగుణ్యా చ్చాయమేవార్థః. న హ్యన్యస్మై ఋషయః ప్రాంజలయో భవంతి; న చాశ్రమం నివేదయంతి; నాపి గర్హ్యభూతశ్వాం వసంతి." అని గోవిందరాజవ్యాఖ్య.

ఈయర్థము పూర్వాపరశ్లోకానుగుణ్యమని వారు వ్రాసిరి కదా. దీనితరువాతిశ్లోకమున "భవద్విషయవాసినః" అనుదానికి "భవద్విషయవాసిన ఇతి భవద్దేశవాసిత్వమేవ భవద్రక్ష్యత్వే హేతుః నాన్యః" అని వ్రాసిరి. భగవంతున కొకదేశమని నియమము కలదా? ఒక్కదేశమునకే ప్రభువగునేని భగవంతుఁడే కాఁడు. కావున నీయర్థ మసంగత మనవలసివచ్చునేమో. వైకుంఠలోకాధిపతి విష్ణువను వారు కావునఁ దదనుగుణముగా నెట్లో శ్రమంపడి యర్థము చెప్పుదురు. భగవంతుఁడు సర్వబ్రహ్మాండాధిపతి యనువారి కీయర్థ మెట్లు సరిపడును? అది యుండనిండు. రాజపక్షమున నీశ్లోకము స్మృతివిరుద్ధముగాఁ గనంబడుచున్నది.

"ఇంద్రానిలయమార్కాణామగ్నేశ్చ వరుణస్య చ,
చంద్రవిత్తేశయోశ్చైవ మాత్రా నిర్హృత్య శాశ్వతీః. ౪
యస్మాదేషాం సురేంద్రాణాం మాత్రాభ్యో నిర్మితో నృపః,
తస్మాదభిభవత్యేష సర్వభూతాని తేజసా. ౫
బాలోఽపి నావమంతవ్యో మనుష్య ఇతి భూమిపః,
మహతీ దేవతా హ్యేషా నరరూపేణ తిష్ఠతి. ౮

స్వే స్వే ధర్మే నివిష్టానాం సర్వేషామనుపూర్వశః,
వర్ణానామాశ్రమాణాం చ రాజా సృష్టోఽభిరక్షితా.” ౩౫

మను. ౭ అధ్యా.

అను నీవనుస్మృతికిని రామాయణమునకును గల భేదము పరిశీలింపుఁడు. విషయాంతరమును దడవక ప్రకృతము నరయుదము. మునులకుఁ గల రాజభక్తి సూచింపఁబడెను. వర్ణాశ్రమధర్మపాలకుఁడు రాజు గావున నతఁడు గురువని మునులనిరి. అట్టిరాజభక్తి వారలకుఁ గల్గినందుననే వారు హాయిగా నుండిరి. రాజభక్తి లేనివారలకు సుఖమే లేదు. అరాజకమగుదేశమున సుఖమనునది శశవిషాణతుల్యముగ నుండును. ఈశ్లోకము లన్నియుఁ బ్రవృత్తిని సూచించుననుట కథవంటిది. ఋషులు శ్రీరామాగమనమును బ్రశంసించి తరువాతఁ జేయఁదగుకార్యమును సూచించిరి. నీవరణ్యమున నున్న నయోధ్యయందుండినను సమానమే. ప్రజారక్షణము నీకు విధియని వారిభావమును దెల్పిరి.

“న్యస్తదండా వయం రాజన్ జితక్రోధా జితేంద్రియాః,
రక్షితవ్యాస్త్వయా శశ్వద్గర్భభూతాస్తపోధనాః.” ౨౧

అని మూలము. ఇది ఋషులస్వభావమును దేటపఱచును. తపశ్శక్తిగలవారల కితరుల రక్షింపనవసర మేమి కలదను నాశంక కిది సమాధానము. శాపమొసంగి యొరులదండించువృత్తి మానవలయు క్రోధము నిలుపుకొనరాదు. ఇంద్రియనిగ్రహమావశ్యకము. కావునఁ దల్లి పిల్లల రక్షించునట్లు తపోధనులు రక్షింపఁదగినవారు. కనుకనే రాజుక్షేమమును మహర్షులు కోరుచుందురు. వారు చేయుసత్కర్మఫలములఁ గొంతభాగము

రాజునకుం జేరుచుండు. మునులను రక్షించుట యనఁగా వారితపస్సుల కెంతమాత్రము భంగము లేకయుండఁ గాపాడు టయే గాని వేఱుమార్గములఁ గాదు. వారు తపోధనులు కదా. అట్లు రాజు పాలించుచుండు దేశమే రాజన్వంతమనం బడును. ఎల్లమానవులు నెమ్మదిగ నివసింతురు. ఇఁకఁ దరు వాతికథను బఠించి యందలి విశేషముల నరయుదము.

## విరాధసమాగమము.

* శ్రీరామమూర్తి యమ్మునులవలన నాతిథేయసత్కా రములఁ బడసి సూర్యుఁ డుదయింపఁగనే యాహ్నికకృత్య ములను దీర్చుకొని వారియనుమతింబడసి యడవిలోఁ బ్రవే శించెను. అది విశేషించి మృగభూయిష్ఠము ఘోరమృగములే మిక్కిలి తిరుగుచుండును. మార్గము చక్కఁగా నుండక లతా గుల్మములు నిండియుండును. నీటిపట్టులు తేటగా నుండక యసహ్యములై యుండును. మృగాదులవలనిభయమునఁ బక్షులు నిశ్శబ్దముగ నుండెను. ఈలపురుగులు మాత్రము కూయుచుండెను. లక్ష్మణుఁడు వెంట రాఁగా రాముఁడు పోవుచు నాయడవిని గాంచెను. అందొక్కచోఁ గొండశిఖ రమువలె నెత్తుగానుండి పెడబొబ్బలిడుచున్న రాక్షసుఁడు వారికిం గనంబడియె. లోఁతుగానుండుకన్నులు పెద్దనోరు విశాలతనువు హెచ్చుతగ్గులుగానుండు కుక్షియుఁ గలిగి యతఁడు భయము గొలుపుచుండెను. వానిదేహమునందంతట రక్తమాంసము లలముకొని యుండుటంజేసి చూచువారికి

---

*ఇది రెండవసర్గమునఁ గలదు. అధ్యాత్మరామాయణకథయు నిం దిమిడియుండును.

సేవగింపు కలుగుచుండెను. రక్తమాంసములు గల పులిచర్మమును ధరించి బెదరుగొలుపునట్లు నోరు తెఱచుకొని యముఁడో యన వాఁడు కనఁబడుచుండెను. వానియినుపగుదియకు సింహములు మూఁడును, బెబ్బులులు నాలుగును, దోఁడేళ్లు రెండును, జింకలు పదియు, మదపుటేనుంగు తలయొకటియుఁ గ్రుచ్చఁబడియుండెను. వానిధ్వని బెదరుపుట్టించుచుండెను.

వాఁడు సీతారామలక్ష్మణులం గాంచి భరింపరానిక్రోధమున లయకాలభుజగమునిచందమున వారిపైఁ గవిసెను గట్టిగా నార్చి వాఁడు సీతను బట్టుకొని చంక నునిచికొని కొంచెము పోయి నిలిచి సోదరులంగని మీరు జడలను వల్కలములను గట్టి యొకయాఁడుదానిని వెంటనిడుకొని ధనుర్బాణములను దాల్చి ఖడ్గములను బూని మీకు నాయుస్సు నశించుటంజేసి యీదండకారణ్యమునకు వచ్చితిరి. ఇఁక మీకాయుస్సు దక్కదు. మీరు మునులే కదా. స్త్రీనేల కూడియున్నారు? మునివృత్తికి విరుద్ధముగా విల్లులోనగువానిని ధరించి యధర్మము నాచరించుచున్న పాపులగు మీరెవ్వరు? నాపేరు విరాధుఁడని ఆయుధములను బట్టుకొని మునులను బట్టుకొని వారిమాంసములఁ దినుచు నీగహనమునఁ దిరుగుచున్నవాఁడ. ఈవనిత నాకు భార్య కాఁగలదు. యుద్ధమునఁ బాపాత్ములగు మీరక్తమును ద్రాగుదును. అని యాదురాత్ముఁడు పలుకఁగా విని జానకి కలవిలంపడుచు భయమున నరఁటిచెట్టువలె వడంకెను.

శ్రీరాముఁడు విరాధుని చంకం జిక్కియున్న జానకిం గాంచి నోటితడి యాఱఁగా సోదరా! పాతివ్రత్యములోనగు సద్గుణము లెన్నియేనిగల యీజానకి నేఁ జూచుచుండ విరా

ఘునిచంకం జిక్కి వగచుచున్న దే. చూడుమా. కైక మనయం దేయభిప్రాయము గలిగి యున్న దో. వరవ్యాజమున దేనిని యాచించినదో అదియంతయు నీతరుణమున నామెకు లభించినది. దూరదృష్టి గలిగి కొమరునకు లభించిన రాజ్యముతో సంతృప్తినొందని నామధ్యమాంబ యగు కైకవాంఛితము నేటికి ఫలించినది. పరపురుషుఁడు జానకిని స్పృశించుటం జేసి కలిగినంతదుఃఖము పితృవియోగరాజ్యనాశనములచేఁ గలుగ లేదు. అని రామమూర్తి వగచి కన్నీరు వదలఁగా శోకాతిరేకమునఁ గుందుచున్నను గని సౌమిత్రి కోపగించి మంత్రబద్ధ భుజంగమువలె నిట్టూర్పులు వదలుచు నన్నా ! సకలలోకాధినాథుఁడు. దేవేంద్రతుల్యుఁడవు చెప్పినపని చేయ నే నుండ నే యున్నాఁడను. ఇట్లుండ నేల పరితపించెదవు? క్రోధమూని నే నిపుడు బాణమున వీనిం ద్రుంచి వీనిరక్తము భూమికిఁ ద్రాగనిచ్చెదను. రాజ్యవాంఛగలభరతునిపై నాకుఁ గలకోపమంతయు నింద్రుఁడు కొండలపై వజ్రమును వైచునట్లు వీనిపైఁ గ్రుమ్మరింతును. ఆకర్ణాంతముగా లాగి వైచిననాబాణము వీనిపృథువక్షమును జీల్చి దేహమునుండి ప్రాణములఁ బాఱఁదోలఁగా వీఁడు తిరుగుచు నేలంబడుంగాక. అని పలికెను.

మహాశయులారా ! ఈభాగమునఁ గొన్ని విషయములు విమర్శింపఁదగినవి కలవు. వానిం బరిశీలింతము.

"స కృత్వా భైరవం నాదం చాలయన్నివ మేదినీం. ౯
అంకేనాదాయ వైదేహీమపక్రమ్య తతోఽబ్రవీత్,"

అని మూలము.

"అత్ర విరాధేన సీతాగ్రహణం స్వాఘౌఘపరిహారార్థమేవ. న తు దారబుద్ధ్యా. తదుక్తం స్కాందే. సోఽపి తాం జానకీం దృష్ట్వా శీఘ్రం సంజాత విక్రమః, ఇయం పరా మహాశక్తిస్సేయం స్వర్గస్య కారణం. అస్యా విబోధో మోక్షేఽపి కారణం బంధనేఽపి చ, తస్మాదిమాం భజిష్యామి దిష్ట్యా ప్రాప్తం హి దర్శనం. ఇతి దర్శనమాత్రేణ విముక్తాఘౌఘపంజరః, భక్తియుక్తో జహౌ రైనాం సీతాం చైతన్యరూపిణీమ్" అని తిలకవ్యాఖ్య.

సీతారామలక్ష్మణు లడవులం బ్రవేశించిరి కదా. సృష్టిస్థితిలయకర్త్రియగు మహాప్రకృతి సీతారూపమున వెలసెననియు నిర్లిప్తుఁడగు భగవంతుని సాన్నిధ్యమునఁ దానే యెల్లకార్యములు చేయుననియు నీగ్రంథమునఁ బెక్కుతావులందుఁ దెలుపఁబడినది కదా. ప్రకృతి తాఁ జేయఁబూనినపనియం దిది తొలికార్యము. శాపవశమున మహాసురుఁ డయి శాపమోక్షకాల మాసన్నము కాఁగా శ్రీరామాదులం గాంచెను. ఇఁక క్షణకాలమునకు స్వశరీరము కలుగఁబోవుచుండఁగా నాతని చిత్తవృత్తి యించుక పక్వము కాక యథాపూర్వముగా నుండునా? కనుక నిత్యసేవ్యురాలగు సీతను శరణుసొచ్చెను. కాముఁడని యేల యనరాదని ప్రశ్నింపరాదు. "అంకే నాదాయ" యని కదా మూలము. కటిప్రదేశమునం దాజననిం జేర్చెను. మదోన్మత్తుఁడగువానికృత్యములు వేఱని వేఱుగాఁ జెప్పవలయునా? అవ్వల నించుకదూరము తొలఁగి రామాదులం బల్కరించెను. సకలకార్యకర్త్రి యని ప్రకృతి యని స్కాందపురాణమే కాక

"మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరం,
హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే." ౧౦ గీ. ౯ అ.

అనునీ భగవద్గీతావాక్యము కూడఁ దేటపఱచుచున్నది. ఈ భావమునే శ్రీశంకరభగవత్పాదులుగారు

"శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం,
న చేదేవం దేవో న ఖలు కుశలస్స్పందితుమపి."

అను నీసౌందర్యలహరీశ్లోకమూలమునఁ దేటపఱచిరి. భగవతి మహామాయ తానొనరింపఁబూను కార్యములలో నిది మొదటిదగు దుష్టశిక్షణరూపకార్యమని మన మెఱుంగవలయును.

కథం తాపసయోర్వాం చ వాసః ప్రమదయా సహ. ౧౧

అధర్మచారిణౌ పాపౌ యువాం చ మునిదూషకౌ. ౧౧౪

అనునిది విరాధప్రశ్నము. విరాధుఁ డిపుడు స్వరూపప్రాప్తికి సమీపమున నున్నాఁడు కావున నట్టివానినోటనుండి మహర్షియొకనీతిని దెలుపుచున్నాఁడు. తఱచుగా మునులనఁగా స్త్రీవార్తావిరహితులనియే లోకప్రతీతి. స్త్రీని గూడి వర్తించుచున్నవారు కావున మీరు పాపాత్ముల రనియు మునుల యాచారములకు దూషకులనియు విరాధుఁ డాక్షేపించెను. స్త్రీసన్నిధి మునులమనస్సులను గూడఁ జలింపఁజేయఁ జాలుననియు నద్దానికి దూరముగా నుండుటయే యుత్తమమనియు నూర్ధ్వరేతస్కులగువారు చిరకాలము జీవించి బుద్ధిబలము కలవార లగుదురనియు నిందుండి మన మెఱుంగఁదగినసారము.

"అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలం,
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ తు గృహ్యతే. ౩౫
అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః,
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః. ౩౬" గీ. ౬ అ.

అను నీశ్రీకృష్ణవాక్యములు మనోనిగ్రహమునే బోధించును.

అట్టిమనోనిగ్రహమునకు స్త్రీసన్నిధి పరమశత్రుప్రాయమని యీభాగము మనకు బోధించుచున్నది.

"అహం వనమిదం దుర్గం విరాధో నామ రాక్షసః. ౧౨
చరామి సాయుధో నిత్యమృషిమాంసాని భక్షయన్,
ఇయం నారీ వరారోహా మమ భార్యా భవిష్యతి. ౧౩
యువయోః పాపయోశ్చాహం పాస్యామి రుధిరం మృధే."

అని మూలము ఇవియు విరాధునిమాటలే. ఆతనిదేహము నశింపవలయును. శ్రీరామునకుఁ గోపమును గల్గింపవలయును. తన్మూలమునఁ గాని శాపవిముక్తి కానేరదు. ఆతనువు విన శ్యము. తత్ప్రయత్నము నే యతఁడు చేసెను. శ్రీరామా! ఈదుర్గమారణ్యమున నాయుధముల ధరించి మునిమాంస ముల భక్షించుచున్నాను. ఈపురంధ్రీమణి నాకు భార్య కాఁగలదు. భా = కాంతి చే, ఆర్యా = పూజ్యురాలు. నిరుప మానతేజోవిరాజితయగు నీజానకి "మమ భవిష్యతి" నాకు రక్షకురాలు కాఁగలదు. ఈమెమూలముననే నాకు శాప విముక్తి కలుగఁగలదు. ఎట్లు? రామలక్ష్మణులకు నాగ్రహము కలిగింపఁగా వారు వధింతురు. ఆకార్యమునకే మీరక్తమును గ్రాగుదునని వాఁడు పల్కెను పరదేవీసందర్శనము వ్యర్థ మగునా?

"అవిద్యానామంతస్తిమిరమిహిరద్వీపనగరీ
జడానాం చైతన్యస్తబకమకరందస్రుతిఝరీ,
దరిద్రాణాం చింతామణిగుణనికాజన్మజలధౌ
నిమగ్నానాం దంష్ట్రా మురరిపువరాహస్య భవతి."

అను నీశంకరభగవత్పాదవర్యకృతభగవతీస్తుతి పైవిషయ మునే తెల్పుచున్నది. విరాధుఁడు పరమేశ్వరి యగుసీతాదేవిని

శరణు సొచ్చి శ్రీరామునిమూలమున శాపవిముక్తిని గాంచ నెంచెనని భావము. ఇంతజ్ఞానము వానికిం గలదా యని ప్రశ్నింపవచ్చును. ఆతనిదుష్కర్మము నశించుకాల మాసన్న మయ్యెను. సత్కర్మము ఫలోన్ముఖమయ్యెను. అట్టితఱి నాతని సంభాషణము లెట్లుండవలయునో యోజించిన నీయర్థ మసంగ తము కాదనియు సుసంగతమే యగుననియుఁ దెల్లమగును. సాధువుల హింసించుస్వభావముగల యీపాడుదేహము వదలఁ జేయుమా యనియే కర్మప్రోత్సాహమున విరాధుఁడు పలుకఁగలిగెనని మన మూహింపవలయును.

"పశ్య సౌమ్య నరేంద్రస్య జనకస్యాత్మసంభవాం.
మమ భార్యాం శుభాచారాం విరాధాంకే ప్రవేశితాం. ౧౭
అత్యంతసుఖసంవృద్ధాం రాజపుత్రీం యశస్వినీం."

అని మూలము. "అత్యంతసంవృద్ధాం, యశస్వినీం, విరాధాంకే ప్రవేశితాం" = అనునీవిశేషణములు సాభిప్రాయములు. సీత సర్వకారణస్వరూపిణి యనుభావమును దేటపఱచుచున్నవి. రాక్షసునంకమున సంకటపడు భార్యను జూచి త్వరపడి బాణ ప్రయోగము నొనరింపక యీవినుతి యేల ? అనఁగా భర్తుఁ డగులక్ష్మణునకుఁ దన్మాహాత్మ్యమును దెలుపుచున్నాఁడు. యశస్వినీమ్. ఇయ్యది శౌర్యాదులనుండి కలిగిన ప్రఖ్యా తినే తెలుపును. కీర్తి యనునది దానాదులచేఁ గలుగువిఖ్యా తినే తెలుపును

"దానాదిప్రభవా కీర్తి శ్శౌర్యాదిప్రభవం యశః." ఇతి మాధవీ.

ఇందు శ్రీరామమూర్తి కీర్తిశబ్దము నుపయోగింపక యశ శ్శబ్దము నుపయోగించుట సాభిప్రాయమనియే బోధించు చున్నది. శౌర్యవంతురాలయ్యు మిక్కిలి సుఖానుభూతికలది

యయ్యు విరాధునికటిభాగమున నున్నది చూడుమా. అనఁగా వీఁడు నాభక్తుఁడు. నీమూలమున నీశరీరమును వదలఁ గోరు చున్నాఁడని సీత యభిప్రాయమని శ్రీరామమూర్తి తమ్మునకుఁ దెలిపెను. మహాక్రూరుఁ డెత్తుకొనిపోవుచుండఁగాఁ జూచి ప్రతిక్రియ వెంటనే చేయఁబూనక కైకావృత్తాంతమును గూడఁ జెప్పఁబూను టేల ? విరాధశాపవిముక్తి నెఱింగియే యనక తప్పదు. దాని నంగీకరింపనిచో వాల్మీకిమహాముని సమ యజ్ఞుఁడు కాఁడనవలసివచ్చును. కావుననే పైనివ్రాసినయర్థము సుసంగతమే యని యంగీకరింపవలయును.

"యదభిప్రేతమస్మాసు ప్రియం వరవృతం చ యత్. ౧౮
కైకేయ్యాస్తు సుసంపన్నం క్షిప్రమద్యైవ లక్ష్మణ,
యా న తుష్యతి రాజ్యేన పుత్రార్థే దీర్ఘదర్శినీ. ౧౯
యయాహం సర్వభూతానాం హితః ప్రస్థాపితో వనం,
అద్యేదానీం సకామా సా యా మాతా మమ మధ్యమా. ౨౦
పరస్పర్శాత్తు వైదేహ్యా న దుఃఖతరమస్తి మే,
పితుర్వియోగాత్సౌమిత్రే స్వరాజ్యహరణాత్తథా." ౨౧

అని మూలము. సామాన్యార్థము సుగమము. విశేషార్థ మీ భాగమున నేది యని విమర్శింపకపోయిన శ్రీరాముఁడు లోక సామాన్యుఁడే యగును గాని లోకాతీతగుణోత్తరుఁడు కాఁడు. అట్టివాఁడు కావలదా యన్న నీమాటలలో నామహానీయుని భావ మేమని యాలోచింపవలయును. కైక యేకార్యమునకై వరము లడిగి నన్ను నడవులకుం బంపెనో యాకార్య మిపుడే నెఱవేఱినది. సకలభూతహితుఁడ నగునన్నేల యడవులకుఁ బంపినదో యనఁగా నెన్నియో ప్రాణికోటులహితము గోరుదు

నని యెఱింగియే పంపినది. దుష్టరాక్షసు లుండుతావులు మహా రణ్యములు కాన నచ్చటి కరిగి యందలి దుష్టుల సంహరించి శిష్టులను రక్షించుటకొఱకే కాన నాకార్య మిపుడే ఫలించి నది. మునిమాంసభక్షకుఁడు మనకుఁ దొలిముద్ద యగును. దీర్ఘదర్శినీ = అనఁగా దూరపుటాలోచనము గలకైక యని యర్థము. యా పుత్రార్థే రాజ్యేన న తుష్యతి = పుత్రునకు రాజ్యము లభించినదని సంతోషింపదు. మఱెద్దాన సంతోషిం చును? సర్వభూతములకు హితము గోరు నే నడవుల నుండు టకే సంతోషించును. కనుకనే సౌమిత్రీ! కైక దీర్ఘదర్శిని యగు. మమ యా మధ్యమా మాతా అద్య ఇదానీం సకామా= అనఁగా నామె దూరమాలోచించి యడవులకు నన్నుఁ బంపెనుగదా యని యెంచితివి కదా. ఏయుద్దేశమున నామె నన్నుం బంపెనో యాయూహ నేఁ డిదే ఫలించును. ఇట్టి క్రూరాత్ముల వధించుటకే సుమీ నన్నుఁ బంపినది. అని తెలిపి సౌమిత్రిని బురికొలుపుచున్నాఁడు పితృవియోగమున కంటె రాజ్యచ్యుతికంటె సీతను బరపురుషుఁడు స్పృశించు టయే దుఃఖముగా నున్నది. అనఁగా వీని నిఁకఁ బరిమార్ప వలయుననియు నీసీతయే నాకుఁ బ్రధానసహాయభూతురా లనియుఁ దండ్రియు రాజ్యము క్షణకాలసుఖకరము లనియు నీసీత నన్నెడఁబాయనిదనియు ననఁగా మహాప్రకృతి యనియు శ్రీరామమూర్తి తెటపఱచెను. దీనిచేఁ గైక తనకార్యమున కెంతయో తోడ్పడెననియు నామె పుత్రునకు రాజ్యలాభమున సంతోషించునది కాదనియు సర్వభూతహితముపొందెు నావన వాసముననే యానందించునది యనియు శ్రీరాముఁడు తెలిపె నను నీసారమును మన మెఱుంగవలయును. అట్లు లేకయున్న

శ్రీరాముఁడు మనుష్యసామాన్యుఁ డనునర్థమే రామాయణము బోధించునని మన మంగీకరింపవలసి యుండును గదా.

అనాథ ఇవ భూతానాం నాథస్త్వం వాసవోపమః,

మయా ప్రేష్యేణ కాకుత్స్థ కిమర్థం పరితప్యసే. ౨౩

అనునివి లక్ష్మణవాక్యములు. సౌమిత్రి యా శ్రీరామునాశ్రయము కనుఁగొనఁ జాలక పురికొలుపుచున్నాఁడు. సకలభూతములను గాపాడఁజాలిన నీవశక్తునివలె నేల పరితపింతువు? నావంటివాఁడు సేవకుఁడుగ నుండగా ననఁగా నీతని వధించుటకు నన్నుం బంపుమాయని భావము. భగవత్సన్నిధిని వసించు టూరకపోదు. తెలియకపోయినను లక్ష్మణునినోట శ్రీరాముఁడు పరాత్పరుఁ డనునర్థము గలపదములు వెలువడినవి. ఇట్టులీభాగము మనకు శ్రీసీతారాముల ప్రకృతిపురుష తత్త్వమును బోధించుచున్నది ఇట్టు లీభాగమును బఠించి భక్తితాత్పర్యములచే వారి నారాధింపవలయును ఇఁకఁ దరువాతికథను బఠింతము.

## విరాధుఁడు రామలక్ష్మణుల నెత్తుకొని పోవుట.

* ఇట్లు పలికి సౌమిత్రి విరాధునిం గని నవ్వుచున్నట్టులే యోరీ! ఇమ్మహాటవి స్వేచ్ఛముగాఁ దిరుగుచున్నాఁడవే? ఎవ్వఁడవు? అని ప్రశ్నింపఁగా వాఁడు మహాధ్వని గావించి మీవార్తల నే నడిగితిఁ గదా. తెల్పుఁడు మీ రెవ్వరు? ఎందుఁ జనుచున్నారు? అని యడిగెను. మహాతేజుఁడగు రాముఁ డంతటఁ గ్రూరవీక్షణముల మండిపడుచు వాఁడట్లడుగఁగాఁ దమవృత్తాంతమునంతయుఁ జెప్పఁబూని యయ్యా!

* ఇయ్యది మూఁడవ సర్గమునఁ గలదు.

మేము రాజులము. సదాచారవంతులము. వనవాసులము.
ఇఁక నీవార్త వినిపింపుము. అని యడిగెను. విరాధుఁడా శ్రీ
రామునిం గాంచి రాజా! నేను జయునికుమారుఁడను. నాతల్లి
శతహ్రద. నన్నిందుఁ గలరాక్షసు లందఱు విరాధుఁడని పిలు
తురు. నేను దపముచేసి బ్రహ్మకరుణకుం బాత్రుఁడ నైతిని.
దాన నన్నుశస్త్రమునఁ జంపఁ దరముగాదు. ఛేదింపను శక్యము
కాదు. భేదింపనలవియే కాదు. మీరీస్త్రీయం దాశ మాని
పాఱిపొండు. మంచి కాంత దొరకినందున మిమ్ముఁ జంపక
వదలెద ననెను. అమ్మాటలకు శ్రీరాముఁడు క్రోధతామ్రా
క్షుఁడై వికారరూపు నారక్కసుంగని నీచరాక్షసుఁడా!
ఛీ! నీచకార్యమునకుం బూనితివే. నీవు మరణమును గోరి
దాని వెదకుచున్నాఁడవు. యుద్ధమున నీదువాంఛితము ఫలిం
చును. నిలువుము. నాబారిం బడి బ్రదుకవు. అనుచుఁ గోదం
డము సజ్యముచేసి తీవ్రనారాచముల నప్పుడ కూర్చి వానిపై
వైచెను. అవి గరుడానిలవేగముగలిగి నిగిడెను. మయూర
పత్రాంకితములగు నానారసములు నిష్పుంకణముల వెడలఁ
గ్రక్కుచు నారక్కసునిశరీరమును జొచ్చి రక్తము బయట
రాకముందే వెడలిపోవుటంజేసి రక్తమున స్నానముచేసి
నేలంబడెను.

విరాధుఁడా దెబ్బలకుం గోపగించి సీతను డించి శూల
మెత్తుకొని సోదరులపైఁ గవిసెను. పెడబొబ్బలిడుచు నింద్ర
ధ్వజమురీతి నుండుశూలముఁ దాల్చి నోరు తెఱచుకొని
యమునిరీతిఁ జూపరులకుం గనంబడుచుండెను సీతను వదలి
వాఁడు వచ్చుటంజేసి సోదరు లిరువురు వాని నిష్టానుసారము
బాణముల నొప్పింపఁ జాలిరి. వారు వైచుబాణములు విలయ

కాలమున భూతములఁ జంపుజమునిరీతినుండు నాతనిపై వర్ష ధారలవలె నుండెను. విరాధుఁడు "వీరునా కెంతమాత్రము" అని తలంచుచు నావులించుచు శరీరమును విఱుచుకొను చుండఁగా నందు నాటుకొనియుండునంబులు వీడి క్రిందఁ బడియె. వరప్రభావమున వాఁడు నిర్భయుఁడై బలమలర శూలముఁ దాల్చి వారిపైకి వచ్చెను. కోదండదీక్షాగురుం డగు శ్రీరాముఁడు నిప్పువలె మండునాశూలమును రెండు నారాచముల ఖండించెను. అది తుంటలై నేలంబడియెను. వాఁడు తమమీఁదికి వచ్చుచుండు టెఱింగి వారిరువురు త్రాఁచుఁబాములవలె నుండుఖడ్గములచే వాని నొంచిరి. వాఁ డంతమాత్రమునఁ బట్టు వదలక మహాబలుల వారిని బట్టి బాహువులఁ గౌఁగిలించుకొని యెత్తుకొని పోఁజాచెను. వనాంతరమునకుఁ దమ్ము నెత్తికొనిపోవనున్నాఁడని గ్రహించి రాముఁడు లక్ష్మణా! ఇంక నూరక యుండుము. మనము పోఁదగుమార్గముననే వీఁడు మనల మోచికొని పోవుఁగాక వీఁడు కోరినట్లే మోచికొని పోనిత్తము. వనములకే మనము పోవుచున్నారము. మనకు మార్గము తెలియదు. వీఁడు మార్గదర్శకుఁడై నట్లగును. అనుచుండ నారక్కసుఁడు వారం గీకరించిన కతన తనగురుబలమలర శిశువులంబోలె వారి నెత్తు కొని మూఁపులపై నుంచుకొని పెడబొబ్బలిడుచుఁ దానూహిం చినవనమునకుఁ బోయెను. వాఁడంత నొకమహాభయంకరా రణ్యముం బ్రవేశించెను.

మహామతులారా! ఈఘట్టమున ననేకవిషయములు విమర్శింపఁదగినవి కలవు. పరిశీలింతము.

"ఇత్యుక్త్వా లక్ష్మణశ్శ్రీమాన్ రాక్షసం ప్రహసన్నివ,
కో భవాన్ వనమభ్యేత్య చరిష్యసి యథాసుఖం."

అను నీమూలము ప్రక్షిప్తముగాఁ బరిగణింపఁబడినది. గోవింద రాజులు వ్యాఖ్యానము వ్రాయక వదలిరి మహేశ్వరతీర్థులు వ్రాసిరి. ఇంచుక బుద్ధిబలమును వ్యయించి పరిశీలింతము. రెండవసర్గమునంతమున లక్ష్మణుఁడు రామచంద్రునితోఁ గొన్నిమాటలు పలికి విరాధు నాబాణములు వధించుననియె. అని యున్నది. ఈసర్గాదియం దీశ్లోకము లేక,

"అథోవాచ పునర్వాక్యం విరాధః పూరయన్వనమ్,
ఆత్మానం పృచ్ఛతే బ్రూతం కౌ యువాం క్వ గమిష్యథః."

అనియే యున్న "తీర్థమునకుఁ దీర్థము ప్రసాదమునకుఁ బ్రసాదము" అన్నట్లుండును. కావున నిది యుండఁదగినదియే. పూర్వాపరసంబంధమును దెలుపునదియుఁ గథకు నవిరుద్ధముగ నున్నయది కదా. ఇందొక్కవిషయమును బ్రశ్నింతము. సమాధాన మిట్లుండఁ దగుననియు వచింతుము.

విరాధుఁడు క్రూరరాక్షసుఁడు. దండకారణ్యము మొదటనే వసించువాఁడు. అందనేకమునులు కూడ నున్నవారు. శ్రీరామాదులు నాచోటు చేరిరి. విరాధుఁడు శ్రీరామాదుల నాక్షేపించి కొన్నివిషయములఁ బ్రశ్నించెను. వారును బదులు చెప్పిరి. వీరెల్ల రేభాషతో మాటలాడిరి? సంస్కృతభాషతోఁ బ్రశ్నోత్తరములు వారివి సాగినవా? లేక దేశభాషతో సాగినవా? అనునదియే యిందుఁ గల ప్రశ్నము. సుందరకాండమునందు నీప్రశ్నమున కవకాశము కలదు. ప్రతిస్థలమున నీప్రశ్నమునకు సందు కలదనియే పలుకవచ్చును. సంస్కృతభాషయే యప్పుడు దేశభాషగానుండెనని

కొందఱందురు. సంస్కరింపఁబడినకాల మెప్పుడను ప్రశ్నము వచ్చును. ప్రాకృతభాషనుగదా సంస్కరించిరి. అదియే సంస్కృతమనంబడియె. గీర్వాణభాషయు నిదియే యగునను వారును గలరు. అపుడు సంస్కర్త లెవ్వరు? అన్న ప్రశ్నము రాక మానదు. దేవతలే యగుదురన్నచో నావాదము నిలువదు. మానవులే యగుదురన్ననే యావాదము కొంత బాగుండును. విరాధునిమాటలను శ్రీరాముడు తెలిసెంగిరి కదా. రామాదులయుత్తరములను విరాధుఁ డెఱింగెను. ఆటవికులకు నాగరికులకు సమానముగా నొకభాష యుండవలయు. అందుత్తమమధ్యమాధమనామకభేదము లుండవలయును. ఆభాష వానరములుకూడ నెఱుంగఁజాలినదియు నగుననవలయు. దానిని బరిశుద్ధముగాఁ గొందఱు, నించుకభేదముగా ననఁగా మధ్యమభాషగాఁ గొందఱును, కేవల గ్రామ్యపదభూయిష్ఠముగాఁ గొందఱును మాటలాడుచుందురు. ఉత్తమపద్ధతిగా మాటలాడువారు తక్కుంగల మార్గముల మాటలాడువారితోఁ దదుచితముగా మాటలాడుదురనియు నూహింపవలయును. అది యిప్పటి ప్రాకృతాది భేదములలో నొక్కటిగాఁ బరిగణింపఁదగిన దైయుండును. అని యిట్టులా కాశపంచాంగమురీతి నూహించి మదికి సరిపడినట్లు తలంపవలయును. గత్యంతరము దొరకినంతదనుక నిట్లే యూహించి మంచిమార్గము దొరకినదని నిశ్చయించి సంతృప్తులము కావలయును. ఇక్కాలమునం దున్నయట్లు గాక యేదే నొకభాష భారతమునందంతటను వ్యాపించి యుండవలయును. యుద్ధములయం దట్టిభాషయే లేకున్న నెట్లు పని

సాగును? ఇంతమాత్రపుఁ జర్చచే నిపుడు సంతృప్తినంది మఱి యొకచో నింకొక్కరీతి విమర్శింతము.

"తమువాచ విరాధస్తు రామం సత్యపరాక్రమం,
హంత వక్ష్యామి తే రాజన్ నిబోధ మమ రాఘవ."     ౪

అని మూలము."సత్యపరాక్రమమ్" అనుదానికి నిచ్చోట "సతి అపరాక్రమమ్." సజ్జనునివిషయమునఁ బరాక్రమము చూపని వాఁడని భావము. అనఁగాఁ దనయందుఁబరాక్రమమునుపయోగించువాఁడనియే విరాధుఁడు గ్రహించెను. "హంత" అను నవ్యయము నాయీతుచ్ఛవార్తను నీమ్రోల వచింపవలసి వచ్చెఁ గదా యనుదానవునివిచారమును దెలుపునది. గర్వమున విఱ్ఱవీఁగుదానవుఁ డిట్లు భావించునా యని యడుగుదు రేని తనతపోవృత్తాంతము నాతఁ డాసమయమునఁ దెలిపి యుండునా యనియు నడుగవచ్చును. తన్నుఁ దరింపఁజేయు వాఁడగు శ్రీరాముని దర్శనమున మనస్సు మార్పునొందఁగా నతఁడు నిలువంబడి మాటలాడఁ గలిగెను. లేకున్న నింతసేపు మాటల్లాడునా? కనుక నిట్లు గ్రహించుట పొరపాటు గాదు. "రాజన్ రాఘవ" యను సంబోధనపదములు నీయర్థమునే సూచించుచున్నవి. క్షత్రియులముని రాముఁడు తెలుపఁగా నాదానవుఁడు రాఘవ యని సంబోధించెను. అనఁగాఁ బరిపక్వమై యంతఃకరణము విలసిల్లనున్నదని మన మూహింపవలయును.

"పుత్రః కిల జయస్యాహం మమ మాతా శతహ్రదా,
విరాధ ఇతి మామాహుః పృథివ్యాం సర్వరాక్షసాః.     ౫
తపసా చాపి మే ప్రాప్తా బ్రహ్మణో హి ప్రసాదజా,
శస్త్రేణావధ్యతా లోకేఽచ్ఛేద్యాభేద్యత్వమేవ చ.     ౬

ఉత్సృజ్య ప్రమదామేనామనపేక్షో యథాగతం,
త్వరమాణౌ పలాయేథాం న వాం జీవితమాదదే.” ౭

అని మూలము. ఇది విరాధునివృత్తాంతము. బ్రహ్మానుగ్రహమున నశస్త్రత్వాచ్ఛేద్యాభేద్యత్వములు తనకు లభించినవని యతఁడు చెప్పెను. ఈజ్ఞానము భగవత్సందర్శనజనితమని యెఱుంగవలయును. కేవల తమోగుణప్రధానుఁడగు నతఁడింతసేపు మాట్లాడుట యెట్లు?

“న హ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః,
తే పునంత్యురుకాలేన దర్శనాదేవ సాధవః.” ౮

అన్న భారతభాగవతసూక్తి యెల్లఱెఱింగినదియే. సాధుసందర్శనమే యట్టిది కాఁగా నిఁక భగవత్సందర్శన మనంతఫలప్రదము కాకపోవునా? తత్ఫలమే యాతనిసంభాషణమని మనము నమ్మవలయును. “న వాం జీవితమాదదే” యని యేల పలికెను? అనరాదు. సీతామూలముననే యతనికిఁ దరణోపాయము కలుగవలయును. శ్రీరామునకుఁ గ్రోధమంకురించినఁగాని తనకుఁ దరణోపాయము దొరకదు. అందులకై యాతఁడు ప్రయత్నించెనని యెఱుంగందగు. క్రిందిశ్రీరామునియుత్తరమే యీవిషయమును దేటపఱచును.

“క్షుద్ర ధిక్త్వాం తు హీనార్థం మృత్యుమన్వేషసే ధ్రువం,
రణే సంప్రాప్స్యసే తిష్ఠ న మే జీవన్ గమిష్యసి. ౯

అనునది శ్రీరామునివాక్యము. ఓరీ! మృత్యువును వెదకుచున్నాఁడవు. నిజము. అనఁగా మృతి యెపుడు కల్గునను చున్నాఁడవనికదా దీనిభావము. దానినిరణమునఁ బొందఁగలవు. ప్రాణము లీదేహమున నుండఁగా నాయెదుటఁ బోవఁజాలవు.

అనఁగా నిన్నుఁ బ్రాణములతో వదలనని శ్రీరాముఁ డనుగ్ర హించెనని మన మెఱుంగవలయు.

"తస్యాభిప్రాయమాజ్ఞాయ రామో లక్ష్మణమబ్రవీత్,
వహ త్వయమలం తావత్పథానేన తు రాక్షసః. ౨౨
యథా చేచ్ఛతి సౌమిత్రే తథా వహతు రాక్షసః,
అయమేవ హి నః పంథా యేన యాతి నిశాచరః." ౨౩

అని మూలము. శ్రీరాముఁ డారాక్షసు ననుగ్రహించుచున్నాఁడు. సీత మహారణ్యమున నొంటిగా నుండునని యెఱింగియు లక్ష్మణా! మనల మోచికొని వీఁడు పోయిన మంచిదే యనునా? సీతకుఁ గ్రూరమృగబాధ కలుగకుండునా? సర్వ మెఱింగినవాఁడుగావున నతని యారాధనవిశేషము ననుగ్రహింపఁ దలఁచియే లక్ష్మణుఁడు శస్త్రములఁ బ్రహరించునేమో యని యూహించి క్షణకాలసేవాఫల మనుగ్రహింపఁ గాంక్షించి యిట్లు పలికెను. ఇదియే కదా లక్ష్మణా మన మార్గము. అనఁగా వీనివలె మనల సేవించినవారి ననుగ్రహించుటయే మనమార్గము. అవతారఫలమన నిదియే యని శ్రీరామునిభావము.

"అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్,
సాధురేవ స మంతవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః. ౩౦
మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః,
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాం గతిం." ౩౨
గీత. ౯ అ.

అనునీగీతావాక్యములభావమే యిందు శ్రీరామునిచేఁ జెప్పఁబడినది. మనల నించుకసేపు మోచిన నదియొక సేవ యగును.

దాననే యీతని ననుగ్రహింపవచ్చుననియే యిట శ్రీరాముని సదాశయము. ఇట్టు లీభాగము భగవంతునియాశ్రితరక్షాపరత్వమును వెల్లడించుచున్నది సారమేమనఁగా నెంతపాపాత్ముఁడైన నంత్యకాలమునఁ దదేకనిష్ఠచే సర్వేశ్వరు నించుకయే నారాధించిన వాఁడు కృతపుణ్యునివలెఁ దదనుగ్రహపాత్రుఁడగుననునదియే. ఇఁకఁ దరువాతికథ నారయుంజను.

## విరాధునకు శాపవిముక్తి కలుగుట.

* శ్రీరామలక్ష్మణులను విరాధుఁడు కొనిపోవుటంగని దుఃఖాతిరేకమునఁ జేతులు పిసికికొనుచు గట్టిగా సకలసద్గుణమణిఖని యగు నీరామచంద్రుని లక్ష్మణునితోడ నీక్రూరుఁడు పట్టుకొనిపోవుచున్నాఁడే దైవమా! ఇఁకేమి గతి? ఓరాక్షసవర్యా! నన్నిందుఁ గ్రూరమృగములు పట్టుకొని భక్షించును. అవి యేల నన్నుఁ దినవలయును. నీ కిదె నమస్కరించెదను. వారిని విడిచి నన్నుఁ బట్టుకొని పొమ్మా యని విలపించెను. సీత యార్తస్వరము నాలకించి యాదురాత్ముని వధింపఁ దలంచిరి. లక్ష్మణుండు సవ్యహస్తమును శ్రీరాముఁడు కుడిచేతిని ఖండించిరి. వాఁ డంత భయంపడి వజ్రాయుధనిహాతమగు భూధరముభంగి నేలంబడియెను. సోదరులిరువురు వానిని బిడికిటిపోటులను మోఁకాలిపోటులను బాదఘాతములను ముద్దగావించిరి. ఎంత బాధించినను వాఁడు చావఁడయ్యెను. శ్రీరాముఁడు శస్త్రాదుల వానికిమృతి కలుగదని యోజింగి లక్ష్మణా! వీఁడు తపస్సు చేసినవాఁడు కాన నాయుధములఁ జంప నలవికాదు. వీని నేలఁ బూడ్చుము. అనుమాటల నాల

---

* ఇది నాల్గవసర్గమునఁ గలదు.

కించి యావిరాధుఁడు వినయముతో నోపరమపురుషా! మహా బలశాలివగునీవు నన్నుఁ బొలియించితివి. ఇంతకు ముందు నే నజ్ఞానమూలమున నీవు భగవంతుఁడవని యెఱుంగనైతిని. ఇపుడు కౌసల్యానందనుఁడవగు శ్రీరామచంద్రుఁడవని యెఱిం గితిని. మహాభాగ్యవతియగు సీతాదేవి తత్త్వము లక్ష్మణుని సారము తెలిసికొనఁ గల్గితిని. ఇంతదనుక నేల తెలిసికొనఁ జాలవైతివందువేమో నావార్త నాలకింపుము.

నేను దుంబురుఁ డనుగంధర్వుఁడను. కుబేరశాపమున నీభయంకరరాక్షసాకృతిని బొందితిని. తొల్లి రంభయందా సక్తుఁడనై కుబేరునకుఁ గొలువు సేయకుంటిని. ఆతఁడు మిగులఁ గోపగించి రక్కసుండవు కమ్మని శపించెను. నేను మిక్కిలి వేఁడుకొనఁగా దశరథకుమారుఁడు నిన్నెపుడు రణమున క్రందించునో యప్పుడు నీపూర్వరూపము నొందఁగలవని శాపవిముక్తిఁ దెలిపెను. మహాత్మా! నీయనుగ్రహమున శాప విముక్తి నందఁ జాలితిని. నాలోకమునకుఁ బోవ ననుమతిఁ గోరెద. మీకు శుభంబగుఁగాక. ఇచ్చోటికి సార్ధయోజన మాత్రదూరమున మహానుభావుఁడగు శరభంగముని యున్న వాఁడు. ఆమునిపతి నీకు మేలు చేకూర్చును. శ్రీరామా! పల్లము త్రవ్వి యందు నన్నుఁ బూడిచి పిదప నరుగుమా ప్రాణముల వదలినరాక్షసుల నిట్లు భూమియందుఁ బూడ్చుట పూర్వకాలమునుండి వచ్చునాచారము. ఇదియు నొకధర్మము. భూమియందుఁ బూడ్వఁబడినశరీరములు గలరక్కసులకు శాశ్వతపుణ్యలోకములు కలుగును జుమీ యని ప్రార్థించెను. ఇట్లు వేఁడి బాణప్రపీడనమున నాతఁడు శరీరమును వదలి తనలోకమునకుఁ బోఁజాలెను.

శ్రీరాముఁ డంత సౌమిత్రీ! వీనిభూరిశరీరమునకుఁ దగినంతలోఁతు గలగర్తమును ద్రవ్వుమా యని తెలిపి వానింగదలనీయక కంఠమును గాలనదిమి పట్టి నిలిచియుండెను సౌమిత్రి వానిప్రక్కనే యొకబిలమును బెద్దదిగాఁ ద్రవ్వెను శ్రీరాముఁడు సౌమిత్రియు వాని నందుఁ బడవైచిరి. వాఁడు ధ్వనిచేయుచునే యుండెను. వాఁడాయుధములచేఁ జావఁడని యెఱింగి యందుఁ బడవైచి పూడ్చిరి. వాఁడసువుల వదలి తనలోకమున కరిగెను. విరాధుఁడే యిట్లు పూడ్పుఁడని కోరినందున వారట్లు చేసిరి. వాఁడాయడవియంతయు మాఱు మ్రోఁగ నఱచుచుఁ బ్రాణములం బాసెను. వారవ్వనమున మహానందమున నుండి యాతనిశరీరమునకు జంతుబాధలు కలుగకయుండఁ బాషాణముల నాచ్ఛాదించిరి. పిదప వారు జానకింగూడి సంతుష్టులై యందే విహరించుచుండిరి.

మహామతులారా! ఈఘట్టమున నేమివిశేషము లున్న వని విమర్శింతము.

"మాం వృకా భక్షయిష్యంతి శార్దూలా ద్వీపిన స్తథా,
మాం హరోత్సృజ్య కాకుత్థ్సౌ నమస్తే రాక్షసోత్తమ." 3

అని మూలము. సీతావాక్యమిది. రాక్షససంహారమునకు రామలక్ష్మణులను సీత పురికొల్పుచున్నది. "రాక్షసోత్తమ! తే నమః" అనియె గదా. ఏల? ఇంతకుముందు నీచరాక్షసుఁడవే. ఇపుడుత్తముఁడవైతివి. మానుషాచారము నీమూలమున ననుసరించుచు నుత్తములు దేవతలుగాన వారికి నమస్కరింపవలయు ననుసదాచారమునే సీతాదేవి తెలుపుచున్నది. భగవత్సేవాపరాయణు లెవ్వారలైన నుత్తములే యని భావము.

రక్కసులందఱు దుష్టులు కారు. దేవతలెల్లరు నుత్తములు కారు అందునిందు నుత్తము లున్నవారు. ఎవ్వార లుత్తములో వారికి నమస్కరింపవలయును. నీచమనస్కులకుఁ గాదు. తన్ను రామలక్ష్మణులను స్పృశించి విగతపాపుఁడగు విరాధుఁ డుత్తముఁడు గాక మఱెవ్వరని సీతావాక్యమే తెలుపుచున్నది. ఈసీతావాక్కులు రామలక్ష్మణులను శీఘ్రముగా నాతని వధింపుఁడని పురికొలుపునని యీక్రిందిశ్లోకమే తెలుపుచున్నది.

"తస్యాస్తద్వచనం శ్రుత్వా వైదేహ్యా రామలక్ష్మణౌ,
వేగం ప్రచక్రతుర్వీరౌ వధే తస్య దురాత్మనః." ౮

ఈమూలముం గాంచిన పైని వ్రాసినదే సీతాభావమని తేటపడును. ప్రకృతి ప్రోత్సాహమే పురుషులకు మిగుల సాయము చేయును.

"హతోఽస్మి పురుషవ్యాఘ్ర శక్రతుల్యబలేన వై,
మయా తు పూర్వం త్వం మోహాన్న జ్ఞాతం పురుషర్షభ. ౧౨
కౌసల్యాసుప్రజా రామ తాత త్వం విదితో మయా,
వైదేహీ చ మహాభాగా లక్ష్మణశ్చ మహాయశాః." ౧౩

అనునివి విరాధవాక్యములు. ప్రాణములు పోవకమునుపే పూర్వస్మృతి కలుగుట కేమికారణమని మన మనుమానింపవలయు. భగవంతుఁడు స్వాభిన్నరూపిణియగు ప్రకృతింగూడి దర్శనమిచ్చినపుడు పూర్వజన్మజ్ఞానము కలుగుట కబ్బురంపడనేల యనుభావమే సమాధానము. ఆరాక్షసుఁడు శ్రీరామపాదస్పర్శమునఁ బవిత్రుఁడయ్యెను. మహామునీంద్రులకే దర్శింపలభింపనియాదేవాదిదేవుని దివ్యపాదారవిందద్వంద్వము తల

వనితలంపుగ నెన్నియోసారులు శరీరమున సోఁకుట కంటెం బుణ్యమేమున్నది? సకలాంగకముల నాపాదసరోజరజము సోఁకిన కారణమున నతనికి దివ్యజ్ఞానము కలిగెను. కనుక నే కౌసల్యాగర్భమునుండి యవతరించిన భగవంతుఁడవని యెఱుంగఁ జాలెను. ప్రకృతితత్త్వము లక్ష్మణునిసారమునుగూడఁ దెలిసికొనఁగల్గెను. ఏవాఁడుగాని ప్రాగ్జన్మసుకృతవిశేషమున భగవంతుని ధ్యానించిననే నిర్మలజ్ఞానము కల్గుననఁగాఁ బ్రత్యక్షమున నెట్టిజ్ఞానము గలుగునో వచింపవలయునా? విరాధుఁడెంత దుర్వృత్తిగలవాఁడైనను భగవంతుని యనుగ్రహమునకుఁ బాత్రుఁ డయ్యెను.

> "తవ ప్రసాదాన్ముక్తోఽహమభిశాపాత్సుదారుణాత్. ౧౭
> భువనం స్వం గమిష్యామి స్వస్తి వోఽస్తు పరంతప,
> ఇతో వసతి ధర్మాత్మా శరభంగః ప్రతాపవాన్. ౧౮
> అధ్యర్ధయోజనే తాత మహర్షిస్సూర్యసన్నిభః,
> తం క్షిప్రమభిగచ్ఛ త్వం స తే శ్రేయో విధాస్యతి." ౧౯

అనునివియు విరాధునివాక్కులే. నీయనుగ్రహమువలన భయంకరశాపవిముక్తుఁడ నైతిని. మీకు మేలు గలుగుఁగాక. ఒకటిన్నరయామడదూరమున శరభంగముని యున్నవాఁడు. మీకు శ్రేయస్సు గలిగింపఁగలఁడు. అనియు నాతఁడు తెలుపఁగల్గెను. మునిమాంసభక్షకుఁడగునాతఁడాశరభంగముని నేల చంపి తినలేదని ప్రశ్నింపరాదు విరాధునిచే మృతినొందఁదగుప్రాణులే యతనిబారి కగ్గమగుదురు తక్కినవారు కనంబడిన నాతనిమది వధేచ్ఛ జనింపదు. "గహనా కర్మణో గతిః" అన్నసూక్తిని మఱువకయున్న నీశంకలు జనింపవు. జంతువు

కర్మనిబద్ధము. మృత్యువాసన్నమైనపుడే దాని నొదవించు దానిని గనఁబఱచును. లేకున్న నట్టిది కనఁబడినను బాధ యొదవదు. ఔరా! కర్మసిద్ధాంత మెంత బలవత్తరము? శరభంగముని మీకు శ్రేయస్సు గలిగించుననఁగా భావమేమి? తన్మూలమున మీకు లోకమునఁ బ్రఖ్యాతి గలుగుననియే. మీకరుణకుం బాత్రుఁడు నావలెనే శరభంగమునియుఁ గలఁడని యాతఁడు సూచించెను.

"అవటే చాపి మాం రామ ప్రక్షిప్య కుశలీ వ్రజ,
రక్షసాం గతసత్త్వానా మేష ధర్మస్సనాతనః. ౨౦.
అవటే యే నిధీయంతే తేషాం లోకాస్సనాతనాః."

అని మూలము. భూమిని ద్రవ్వి యాబిలమున నన్నుఁ బూడ్పుఁడని యతఁడు కోరెను. ఇది రాక్షసులకుఁ బూర్వము నుండి వచ్చుచున్నసదాచార మనియె. భూస్థాపితు లేవార లగుదురో వారి కక్షయలోకము లందుఁ గలుగుననియు నతఁడే బోధించెను. ఏల ? అగ్నిదగ్ధు లగుటకదా లోకస్వభావము. దాని నేల యతఁ డంగీకరింపలేదు? రెండుసారులు కాల్పు టుచితముకాదు. తపస్సు చేసి జ్ఞానము నార్జించినవారలు. లౌకికాగ్నిదగ్ధులు కారాదు.

"యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున,
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా. ౩౭
న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే,
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి." ౩౮ గీ. ४ అ.

అని భగవంతుఁ డుపదేశించెను. సకలపాపకర్మములను భస్మము చేయఁజాలినది జ్ఞానాగ్నియే కదా. దానిచే దహింపఁబడిన

వానిని లౌకికాగ్నిచే మరలఁ గాల్పఁబూనరాదు. సన్న్యాసులను గాల్పకుండుటకుం గలకారణ మిదియే. విరాధుఁడు శాపవశమునఁ గ్రూరుఁడైనను స్వభావమున నుత్తముఁడే కదా. కావున నాతనికి నగ్నిదాహ మక్కఱలేదని తోఁచుట యుక్తమే.

"ససందతుర్వీతభయా మహావనే శిలాభిరంతర్దధతుశ్చ రాక్షసం." 31

ఆర్తత్రాణపరాయణత్వమే మహాత్ములకు హర్ష కారణము. ఉత్తమప్రకృతికుఁడైనను దుష్కర్మలేశమునఁ గ్రూరతనువు లభింపఁగాఁ గుందుచున్నవిరాధునకు యథాపూర్వమగు లోకనివాసమును గల్పించుటే సంతోషము. పరోపకారమొనరించుటకన్న నుత్తమకార్యము సంతోషప్రదమైనదియు వేఱొండు లేదని మన మెఱుంగవలయును. ఇదియే దండకారణ్యప్రవేశమున శ్రీరామచంద్రుఁ డొనరించినమహాకార్యము. దీనిచేఁ గర్మగతి దురవగాహమని తేటపడును. కావున దీనింబఠించి యావిరాధునకు ముక్తి నొసంగిన శ్రీరామభద్రుని సీతాసమేతుని జక్కఁగ నారాధించి మనము కూడ సంసారసాగరమునుండి తరింపవలయును. ఇఁకఁ దరువాతికథాభాగమును బరికింతము.

## శరభంగుని శ్రీరాముఁ డనుగ్రహించుట.

* శ్రీరాముఁడు విరాధు ననుగ్రహించి సీత నాశ్వాసించి లక్ష్మణునింగని ప్రియానుజా! యీయరణ్యము దుర్గమము. విశ్రమింప నర్హము కానిది. మనకరణ్యవాసము వాడుకపడినది కాదు. కాన నిందుండక శీఘ్రముగా శరభంగముని

* ఇది యైదవ సర్గమునఁ గలదు.

యాశ్రమమునకుం బోవుదము. అని సీతాలక్ష్మణులం గూడి శరభంగమునిపర్ణశాలకుం బోయెను. శ్రీరాముఁ డామునిసమీపమున మిక్కిలి ప్రకాశించుతేజస్సుచే సూర్యాగ్నుల వలెఁ గనఁబడు నొకవ్యక్తిని గాంచెను. తాను దగ్గరకు వచ్చుటం బట్టి రథమునుండి దిగి భూమిని స్పృశింపక దేవతలు గొలువ శరభంగముని చెంత నున్నదేవేంద్రుని గాంచెను. ఇంద్రునిరూప మత్యద్భుతము. కూడనున్నవారు నట్టిరూపము కలవారే. ఆయాశ్రమముచెంతఁ బచ్చనిగుఱ్ఱములను బూన్చిన యరదము మధ్యాహ్నభాస్కరునిచందమున మెఱయుచు నంబరమున నుండఁగా రాముఁడు చూచెను. చంద్రబింబముం బోలి శ్వేతచ్ఛత్రము రామునకుం గనంబడియెను. వింజామరలు దాల్చి యుత్తమకాంత లాయింద్రునిశిరమున వీచుచుండిరి. ఆయింద్రుఁడు శరభంగునితో మాటలాడుచుండఁగా శ్రీరాముఁడు సౌమిత్రి కతని జూపుచు వత్సా! అంబరమున నున్నరథ మెంత మనోజ్ఞముగ నున్నదో చూడుము. యాగము చేయువా రింద్రునశ్వముల భక్షింబిలువఁగా మున్ను వినియున్నాము కదా. అవియే యివి వచ్చియున్నవి. నిశ్చయము. మహారథికులు దీని చుట్టును బలసియున్నవారు. వీరే దేవతలు. వీరియురముల దివ్యమణిహారములు గలవు. వీరెల్లరు నిరువదైదుసంవత్సరములవయస్సుగలిగి యున్నారు. దేవతల కెల్లప్పుడు నింత వయస్సే యుండును. దేవతలందఱు నిట్లే ప్రకాశించుచుందురు. నీవిందే జానకితో నుండుము. నేను బోయి యితఁ డెవ్వఁడో స్పష్టముగాఁ దెలిసికొని వచ్చెదను. అని వెంటనే వచ్చు లక్ష్మణుని మరల నిందే యుండుమని నిలిపి తానాశ్రమమునకుఁ బోయెను.

ఇంద్రుఁడా రాముఁడు వచ్చుటం గని మునిచెంత కరిగి రహస్యముగా నిదిగో శ్రీరాముఁడు వచ్చుచున్నవాఁడు. నాతోడ రామమూర్తి మాటలాడకమునుపే తనయవతారఫలమును సాధింపవలయును. ప్రతిన నెఱవేర్చి పిదప నన్నితఁడు చూడవచ్చును. ఈరామచంద్రుఁడు రావణు నిర్జించి దేవతాకార్యమును సాధించినమీఁద నేనే యాతనిం జూచెదను. అనన్యసాధ్యమగుమహాకార్యము నీరాముఁడు సాధింపవలసియున్నది కదా. ఆవల నన్నుఁ జూచుట మంచిది. ఇట్టులా శ్రీరాముని సమ్మానించి శరభంగుని బూజించి వీడుకొని రథమెక్కి దేవపతి స్వర్గమునకుం బోయెను. అంత శ్రీరాముఁడు సీతాలక్ష్మణులతో మునికడ కరిగెను. ఆసమయమున నాముని యగ్నిఁ బ్రవేశింపఁ బూని యాదేవు నారాధించుచుండెను. ఈమువ్వురు నామునిపాదములకు నమస్కరించిరి. ఆముని సంజ్ఞచేయఁ గూరుచుండిరి. రాముఁ డమ్మునితో నింద్రాగమన నిర్గమనములఁ బ్రశ్నించెను. ఆవిషయమెల్ల నమ్ముని తెలుపం బూని శ్రీరామా! నాతపోనియతికి మెచ్చి వరము లీయఁ గోరి యింద్రుఁడు వచ్చి యాత్మవిదులకుఁ బొందశక్యముగాని బ్రహ్మలోకమునకు నన్నుఁ గొనిపోవఁ గోరెను. నీవీచెంతనే యున్నందునఁ బ్రియాతిథివగు నిన్నుఁ జూడక పోవరాదని బ్రహ్మలోకమునకుఁ బోవక నిలిచితిని ధార్మికాగ్రగణ్యుఁడవై సత్యశీలుండవగు నిన్ను దర్శించి తరువాత బ్రహ్మలోకమున కరుగ నున్నాఁడను. బ్రహ్మస్వర్గలోకముల నక్షయభోగములను దపోనియమమున నార్జించితిని. వానినెల్ల నీకు సమర్పించెదను. ప్రతిగ్రహింపుమా యని ప్రార్థించెను.

సర్వశాస్త్రవేత్తయుఁ బురుషోత్తముఁడు నగు శ్రీరాముఁ డామునిపలుకులాలకించి మహాత్మా! నీవర్ణించినలోకములనెల్లఁ బరిగ్రహించితిని. నాకీమహారణ్యమున నీవు చూపినచోటున నుండఁగోరెదను. అనఁగా నాముని శ్రీరామచంద్రా! ఈయడవి యందే సమీపమున సుతీక్ష్ణుఁ డనఁబడు మహర్షి గలఁడు. ఆముని నీకు మేలు చేకూర్చు. కాన నామునికడ కరుగుము. ఆముని పరమపావనస్థలము గనఁబఱచు అందు నీవు నివసింపుము. ఇదిగో మందాకినిం బోలుపుణ్యనది కనంబడుచున్నది. ఇది ప్రాగ్వాహిని. దీని కెదురుగాఁ బడమర దెసకుం బోవుత్రోవ ననుసరించి యరుగుము. త్రోవ వినోదముగా నుండును. మార్గమది యిదియేసుమీ. మహాత్మా! క్షణకాలము నిలిచి నన్నుం జూడుము. కుబుసమును సర్పము వదలునట్లే యీశిథిలశరీరమును వదలుదును అని పలికి మహాత్ముఁడగు నమ్ముని సవిధిగా నగ్నిపూజ యొనరించి బ్రహ్మమేధమంత్రములను జపించుచు హోమముచేసి యాయగ్నిదేవతలోఁ బ్రవేశించెను. అందమ్మునిశిరోజములు, జీర్ణచర్మము, నస్థులు సరక్తమాంసము దగ్ధమయ్యెను. వానిం దిలకించి సీతారామసౌమిత్రులచ్చెరువందిరి. అంత నాముని యగ్నివలెనే ప్రకాశించుచు ముప్పదియేండ్లుగలవానివలెం గాననై యాయగ్నినుండి లేచి సర్వలోకంబులను దాఁటి బ్రహ్మలోకమునకుం బోయెను. అట నాపరమేష్ఠిం గాంచెను. అతఁ డమ్ముని నర్చించి స్వాగతమును బ్రశ్నించెను.

మహాశయులారా! ఈభాగమున ననేకవిషయములు విమర్శింపఁ దగినవి కలవు. శరభంగముని మహాతపస్సొనరించి సిద్ధినొందినవాఁడు. పాంచభౌతికశరీరమును వదలఁ దగిన సమ

యమున నుండెను. శ్రీరామదర్శనము చేయుకర్మము నతఁడు చేసియుండెను. ఆసమయమునకే శ్రీరాముఁడు లచ్చోటి కరిగిరి. అపుడే యింద్రుఁడమ్మునికడ కరుదెంచి యుండెను. ముని స్వర్గాదిలోకముల మించి బ్రహ్మలోకమున కరుగఁదగినవాఁడు. అట్టివాని నాదరించుట కింద్రాదులు వచ్చుట యొక యలవాటు. అపుడే రాముఁడు పోయి దూరమున లక్ష్మణుని సీత నుండుఁడని తాను బోయెను. శ్రీరామునితో నింద్రుఁడు మాటలాడుట కిది యదనుకాదని యెఱింగి మునితో నా వార్తం దెలిపి రాముఁడచటికిఁ బోవకమును పే తానరిగెను. ఇందు

"ఇహోపయాత్యసౌ రామో యావన్మాం నాభిభాషతే,
నిష్ఠాం నయతు తావత్తు తతో మాం ద్రష్టుమర్హతి. ౨౨
జితవంతం కృతార్థం చ ద్రష్టాహమచిరాదిమం,
కర్మ హ్యనేన కర్తవ్యం మహదన్యైస్సుదుష్కరం. ౨౩
నిష్పాదయిత్వా తత్కర్మ తతో మాం ద్రష్టుమర్హతి."

అని మూలము కన్పట్టెడు. ఇతరులకు సాధ్యముగాని మహాకార్యము నొనరించినపిదప సఫలమనోరథుఁడనై నేను శ్రీరామునిం జూడఁగలను. శ్రీరాముఁడు నన్నుఁ జూచుననఁగా భావమేమి? దేవకార్యమును దీర్ప నవతరించితివి. కాన నీ వా కార్యము ననఁగా దుష్టదానవనిగ్రహమును జేయుమని రామునకుం దెల్పుమని శరభంగునిఁ బ్రోత్సహించెననియే కదా. రావణాదివధానంతరము శ్రీరామునిఁ దాను దర్శించి వినుతించి కృతార్థుఁడనయ్యెదననియుఁగదా.దీనిచేత శ్రీరాము నింద్రుఁడు చూడకపోవుటచేత భావికష్టములు సూచింపఁ

బడియెడిని. దేవతాదర్శనము సకలాపత్పరిహారదక్ష మనుప్రా చీనసూక్తి మన మెఱుంగవలయు. దాని కన్యథాత్వము కలుగఁ గూడదనియే యింద్రుఁడు పోయెనని మన మీభాగమునఁ గలసారమును గ్రహింపవలయు. శరభంగముని యింద్ర పూజితుఁ డయ్యెననుటం జేసి స్వర్గాదిలోకసుఖములకంటె నుత్తమలోకసుఖంబుల నొందఁదగిన ఫలము నొసంగు సత్కర్మముల నాతఁ డొనరించెననియు మన మూహింపవలయును.

"మామేష వరదో రామ బ్రహ్మలోకం నినీషతి. ౨౮
జితముగ్రేణ తపసా దుష్ప్రాపమకృతాత్మభిః,
అహం జ్ఞాత్వా నరవ్యాఘ్ర వర్తమానమదూరతః. ౨౯
బ్రహ్మలోకం న గచ్ఛామి త్వామదృష్ట్వా ప్రియాతిథిమ్,
త్వయాఽహం పురుషవ్యాఘ్ర ధార్మికేణ మహాత్మనా. ౩౦
సమాగమ్య గమిష్యామి త్రిదివం దేవసేవితమ్.

అని మూలము. శరభంగముని మహత్తరతపోనియతి స్వర్గాది లోకముల జయించి బ్రహ్మలోకవసతిఁ గల్పింపఁజాలు సత్తపము నొనరించితిననియు బ్రహ్మాజ్ఞచే నింద్రుఁడు తనను బ్రహ్మలోకమునకుఁ దీసికొనిపోవ నరుదెంచెననియుఁ దెల్పుచు సమీపముననే వచ్చుచున్న ప్రియాతిథివగు నిన్నుఁ జూడక బ్రహ్మలోకమునకుఁ బోనొల్లక నిలిచితిననియు రామునకుఁ దెల్పెను. ఇచ్చట,

"దేవసేవితం యత్ర పూర్వే సాధ్యాస్సంతి దేవా ఇత్యుక్తరీత్యా నిత్యసూరిసేవితం త్రిదివం త్రిపాద్విభూతిం బ్రహ్మలోకాదుత్కృష్టం. గమిష్యామి. బ్రహ్మలోకం న గచ్ఛామి త్రిదివం దేవసేవితమిత్యనేనాయ మర్థోఽవగమ్యతే"

అని గోవిందరాజులు వ్యాఖ్య వ్రాసిరి.

వైకుంఠమునకుం బోవుదుననియే శరభంగముని యా శయమని గోవిందరాజులభావమని మన మూహింపవలెను. వైకుంఠలోకమున దేవశబ్దవాచ్యులగు నిత్యసూరు లుందురని విశిష్టాద్వైతమతానుయాయులసిద్ధాంతము. వారు సారూప్య ముక్తివాదులు కదా. వైకుంఠ మొకలోకము. అందొక పెద్ద సౌధము. దానిచుట్టు తులసీవృక్షములు లోనగునవి కలయా రామము. అందు ననేకకమలాకరములు వానిచుట్టు నిత్యసూరు లకు విహారస్థానములు. మందమలయానిలములు ఆలోకము. చుట్టు పాలసముద్రము. (అనఁగా నావులు పాలీయక తన్ను చుండుతఱి నాసముద్రమున నొకటియో రెండో తులసీదళ ములు వైచి పాలు తెచ్చి చక్కెరపొంగలి చేయుచు నాదేవ దేవునకుఁ జూపి తామారగించుటకుఁగాననిభావము) లోనగు నవి కలవని వారినమ్మకము అందుండువారందఱు మహావిష్ణువుం బోలి శంఖచక్రగదాపద్మములను ధరించి యుందురు. పొంగలి భుజించునపుడు మాత్రము క్రిందిచేతులలోని యాయుధ ములఁ బాఱవైతురు. "శతం విహాయ భోక్తవ్య"మ్మను ప్రాచీన సూక్తి కలదు కదా. దానిని సార్థకము చేయవలదా. విష్ణువు నకు వీరికిని భేదము లక్ష్మీసాహచర్యవిషయముననే. అది తప్పఁ దక్కినరూపమున నొక్కవిధముగనే యుందురు. మఱొక్క రహస్యము. ఆనిత్యసూరు లార్తత్రాణమునఁ బనికిరారు. దుష్ట సంహారమున నసమర్థులే. వైకుంఠమున నుండి వండని కూడు వడకని బట్టలు దొరకుటంబట్టి యూర్ధ్వపుండ్రములు ధరించి యేకర్మములు లేక హాయిగాఁ బ్రసాదమును దినుచు "నోం నమో నారాయణాయ" యనుకొనుచు నుందురు. వారికాధి వ్యాధులు లేవు. వేయిగాళ్లమండపము లనేకము లుండుటం

బట్టి శయనమున కేబాధయు లేదు. అట్టిపరమపదమనంబడు వైకుంఠలోకమునకుఁ బోవుదునని శరభంగముని యాశయ మనియే కదా వ్యాఖ్యానాభిప్రాయము. ముక్తిస్థాన మదియే యనియుఁ దత్కర్తయాశయ మనంజను.

ప్రాయికముగా నపునరావృత్తికము బ్రహ్మలోకమనియే పూర్వులయాశయ మనంజను. "పునరావృత్తి రహితశాశ్వత బ్రహ్మలోకనివాససిద్ధ్యర్థ"మ్మని కన్యాదానకాలమునఁ బలుకుదురు. మర్త్యలోకమునఁ జేయు సత్కర్మములకు ఫలభూతములనంబడు సుఖానుభూతులకు బ్రహ్మలోకము పరమావధి యనియే పై మాటలలోనిసారము. ముక్తిస్థానము వైకుంఠమనుట పొరపాటే. ఒక్కలోకము దానియం దిట్టి సుఖములు కలవు. అనుమాట ముక్తికిం జెల్లదు. ముక్తుఁ డనుభవించుసుఖము లివి యని యెందును గానరాదు. సుఖానుభూతివాంఛయు ముక్తి కాదు. ముక్తుఁ డుండఁదగు లోక మిది యని యెందు వెదకినను గానరాదు. ఒక్కలోకమున కధిపతి యనఁబడువాఁడు సర్వవ్యాపియగు భగవంతుఁడు కానేరఁడు. సర్వలోకాధిపతియు, నిరంజనుఁడు, సర్వభూతాంతర్యామియు నగువాఁడే పరమాత్మ. అతని కొక్కలోకమే ముఖ్యనివాసమనుట యొకలోపము ఒక్కకార్యము చేయునధికారముకలవాఁడు భగవంతుఁడు కాఁడు. ఆతఁడు ప్రకృతిబద్ధుఁ డనంబడఁదగినవాఁడు. త్రిమూర్తు లనంబడు బ్రహ్మవిష్ణుమహేశ్వరు లధికారపురుషులు. ప్రకృతిబద్ధులు.- ప్రకృత్యతీతులు కాఁజాలరు. రూపనామక్రియాశూన్యుఁ డనంబడుచు నాయాయికాలములందుఁ బ్రకృతిమూలమున (ఇచ్ఛాశక్తిద్వారా) సర్వకార్యములను జేయించుచుఁ

దా నెద్దాని నంటక సాక్షీభూతుఁడై యుండువాఁడే! భగవం తుఁ డనియుఁ బరమాత్మ యనియుఁ జెప్పఁబడువాఁడు. ఆ తత్త్వము నెఱింగి సర్వదా తలపోయుచు ఫలాభిసంధిరహిత సత్కర్మముల నాచరించుచు వైరాగ్యసంపదగలిగి ద్వంద్వ ములకు లొంగక యుండువాఁడే ముక్తుఁ డనంబడువాఁడు. అతని పాంచభౌతికశరీరము నశింపఁగా నందున్న జ్యోతి దివ్యజ్యోతియందు లీనమగుటయే ముక్తి. వేఱులోకమున కరుగుట, అందు సుఖముల ననుభవించుట, అందొక దేహ మును దాల్చి దేహిని బూజించుట యను నూహలు నిరర్థ కములు. ఈవ్రాఁత వైకుంఠ ముత్తమోత్తమలోకమనుట కడ్డు పడునది కాదు. అందుఁ జొచ్చినవారు మరల రారనుట మాత్ర మసంగతప్రసంగము. ఆపక్షమునఁ గైలాసము సత్య లోకము నట్టివే యనవలసివచ్చును. అన్నను బాధ యేమను దురే నవి సమానములే యనవలయు. అందొక్కటి యుత్తమ మనుటయే యందుఁ గల లోపము. ఈమూఁడును బునరా వృత్తిరహిత నిత్యానందప్రదములు కాఁజాలవు.

ప్రకృత మనుసరింతము. శరభంగముని బ్రహ్మలోకమున కరిగెనని యీమూలము తెల్పుచున్నది.

"స చ పావకసంకాశః కుమారస్సమపద్యత,
ఉత్థాయాగ్నిచయాత్తస్మాచ్ఛరభంగో వ్యరోచత. ౪౨

స లోకానాహితాగ్నీనామృషీణాం చ మహాత్మనాం,
దేవానాం చ వ్యతిక్రమ్య బ్రహ్మలోకం వ్యరోహత. ౪౩

స పుణ్యకర్మా భవనే ద్విజర్షభః పితామహం సానుచరం దదర్శహ,
పితామహశ్చాపి సమీక్ష్య తం ద్విజం ననంద సుస్వాగతమిత్యువాచహ."

ఈమునివాక్యలంబట్టి యూహించిన శరభంగముని ముక్తి నొందెనని చెప్ప వలనుపడదు.

"బాలోఽథ పంచదశభిస్త్రింశద్భిస్తు కుమారకం".

అను ప్రమాణమును బట్టి ముప్పదియేండ్ల యీడుగల వాఁడై బ్రహ్మలోకమునకుం బోయి యందు బ్రహ్మను దర్శించెననియు నాతఁడు స్వాగతము నిచ్చెననియు నీరామాయణ భాగమే తెల్పుచున్నది. "అత్ర పితామహశబ్దోఽపి సవిగ్రహపరమాత్మపరః." అని గోవిందరాజులు వ్రాసిరి. ముక్తుఁడు ముప్పదియేండ్లవయస్సును గనఁబఱచు రూపముగలవాఁడై పోవుటకంటె నచ్చెరువేది గలదు? మతాభిమానపిశాచావేశమున దోఁచినట్లు వ్రాయుట యెల్లరకు నైజమే. వీరి భావము కూడ నట్టిదే యని యెంచవలయును. శరభంగముని మహోత్తరసత్కర్మముల నాచరించి యందులకు ఫలముగా శ్రీరామమూర్తిని దర్శించి తత్సాన్నిధ్యమున నగ్నింబడి ప్రాణముల వదలి దేవత్వము నొందెననియే యిచ్చటం గల యథార్థము. సంస్కారవశమున నాముని యగ్నినారాధించి తన్మూలముననే పాంచభౌతిక శరీరమును వదలెను. అగ్నిప్రవేశ మాత్మహత్య కాదా యన్న,

"వృద్ధశ్చాచక్రియాలుప్తః ప్రత్యాఖ్యాతభిషక్క్రియః,
ఆత్మానం ఘాతయేద్యస్తు భృగ్వగ్న్యనశనాదిభిః".

అను ప్రమాణము ననుసరించి శరభంగముని యాత్మహత్య చేసికొన్న వాఁడు కాఁడని మహేశ్వరతీర్థులు వ్రాసిరి. యోగాభ్యాసాదులమూలమునఁ గుండలినీశక్తి నుద్దీపింపఁజేసి యాయగ్నిజ్వాలలచే శరీరము దహింపఁబడఁగా యోగి దివికేగు

ననుట శాస్త్రసిద్ధము. అట్టివా రాత్మహత్యాదోషమునకుం బాత్రులు కారని యెఱుంగవలయును.

"అక్షయా నరశార్దూల మయా లోకా జితాశ్శుభాః. 30
బ్రాహ్మ్యాశ్చ నాకపృష్ఠ్యాశ్చ ప్రతిగృహ్ణీష్వ మామకాన్."

అనియు,

"అహమేవాహరిష్యామి సర్వలోకాన్మహామునే. 33
ఆవాసం త్వహమిచ్ఛామి ప్రదిష్టమిహ కాననే."

అనియు మూలములు కనంబడుచున్నవి. వీనింబట్టి ముని చిత్తవృత్తిని మన మూహింపవచ్చును. పెక్కుపుణ్యలోకములు నాచే నార్జింపఁబడినవి. వానినెల్లఁ బరిగ్రహింపుమా యని శ్రీరాముని బ్రార్థించెను కాని

"సమాగమ్య గమిష్యామి త్రిదివం దేవసేవితమ్."

అని మాత్రము పలికెను. తానార్జించిన పుణ్యలోకముల శ్రీరామునకు సమర్పించెను. మరల నగ్నిపూజ చేసి తనువు హోమము చేసి బ్రహ్మలోకమున కరిగెను. కావున ముక్తికర్హుఁడు కాఁడనియు బ్రహ్మలోకమున వసియింప నర్హములగు సత్కర్మముల నాచరించిన మహాపుణ్యాత్ముఁడనియు మన మూహింపవలయును. సత్కర్మముల నాచరించునపుడే స్వార్థమును గోరక పరమేశ్వరార్పణబుద్ధితోఁ జేసినవారు నాపుణ్యలోకముల నీకొసంగెదననుమాటలఁ బలుకఁజాలరు. ముందే భగవంతునకవి యర్పింపఁబడినవి కదా.

"త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః,
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః. 20
నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః,

శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్. ౨౧
యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః,
సమస్సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే." ౨౨ గీ. ४అ.

అను నీగీతావాక్యము లిప్పట్టున స్మర్తవ్యములు. పుణ్య కర్మములకు ఫలము భగవత్సందర్శనముగాని భగవద్ధ్యానము కాని కలుగునన్న సూక్తికి శరభంగమునిచరిత్రము దృష్టాంతము. భక్తరక్షణదీక్షాపరతంత్రుఁడగు శ్రీరాముఁడు తానే శరభంగమునికడ కరిగి దర్శనమొసంగి కృతకృత్యునిగా నొనరించెను కావున మనమాపరమేశ్వరుని శ్రీరాముని సర్వవ్యాపకునిగా భావించి ధ్యానించిన నామహాత్మునికృప మనపైఁ గలుగును. నిశ్చలభక్తియే భగవత్కృపాపాత్రులనుగా మనలఁ జేయఁగల్గును. భేదబుద్ధి వదలి మనమాపరమాత్మ నారాధింపవలయును. ఇఁకఁ దరువాతికథకు మరలుదము.

## శ్రీరాముఁడు మునుల కభయదానము చేయుట.

* శరభంగముని బ్రహ్మలోకమున కరిగినపిదప మునులందఱు వచ్చి శ్రీరాముని దర్శించిరి. అందు బ్రహ్మనఖసంభవులగు వైఖానసులును, బ్రహ్మరోమజనితులగు వాలఖిల్యులును, శరీరాంతర్భాగమును జలముచే సంక్షాళనము చేయునలవాటుగల మునులును, సూర్యచంద్రులకిరణముల నాహారముగాఁ గైకొని కాలముపుచ్చువారును, శరీరమును బాషాణఘాతముల నొప్పించుకొనువారును, పర్ణభక్షకులును, ధాన్యములను దంతముల నమిలి పొట్టు వదలి గింజలు దిను

* ఇది యాఱవ సర్గమునఁ గలదు.

వారును, కంఠదఘ్న జలములనుండి తపము చేయువారును, శరీరమందే హృదయము మీఁదఁగాని, భుజము మీఁదఁగాని తల యుంచుకొని నిదురించువారును, శీతకాలమున బయలనుండి తపస్సు చేయువారును, జలము మాత్రమే త్రాగి యుండువారును, నిరాధారముగా నాకాశమున నుండువారును, భూశయనము చేయువారును, వ్రతముకొఱకు నిరంతరోపవాసము చేయుచునే యాహారము లేక యుండువారును, జితేంద్రియులును నార్ద్రవస్త్రధారులును బహువిధమంత్రజపము చేయువారును, వేదపారాయణపరాయణులును, గ్రీష్మర్తువునఁ బంచాగ్నిమధ్యమున నుండి తపముగావించువారు నుండిరి. శరభంగాశ్రమమున నుండు శ్రీరాముని దర్శించి యాతనితో మహారథా! దేవతల కింద్రుఁ డెట్లో యిక్ష్వాకువంశ సంభవులకు నీవు నట్లే ప్రధానుఁడవు భూమండలమున కెల్ల నాథుండవు. శరభంగు ననుగ్రహించుట విరాధుని సంహరించుట యను మహాకార్యముల చేత ముజ్జగములఁ బ్రఖ్యాతిఁ గాంచితివి. నీపితృభక్తి పరమపావనము. నీప్రతిజ్ఞ నిర్మలమైనది. ధర్మము నీయందుఁ గొఱఁత లేక నిలిచియున్నది. శరణ్యుఁడవగు నిన్నొకకోటి యాచింప వచ్చితిమి. నిన్ను శరణు వేఁడుటయే మాకు ఫలసిద్ధి. అయినను మాబాధలు విశేషించి యున్నందున విన్నవించుకొందుము క్షమింతువు గాక. మహాత్మా! ఆఱవపాలు పన్ను గ్రహించి ప్రజలను బుత్త్రులభంగి బోషింపనిరాజునకు మిగుల నధర్మము కలుగును. ప్రజలను న్యాయమార్గమునఁ బోషించురాజున కత్యంతకీర్తి కల్గును. తుది బ్రహ్మలోకమున నతఁడు సత్కృతుఁ డై యుండును.

ఋషులమగు మేము ఫలమూలము లాహారములుగా నాచరించుధర్మమునందుఁ గూడ ధర్మాత్ముఁడగు రాజునకు నాల్గవ భాగము కలదు. కాన మమ్ముఁ గూడఁ గాపాడవలసియే యున్నది. ఈవచ్చినవానప్రస్థులంజూడుము. ప్రాయికముగా నిందెల్లరు బ్రాహ్మణులే. నాథుఁడవై నీవుండియు వీరెల్లరు దుర్భరబాధల పాలగుచున్నారు. వధింపఁబడుచున్నారే. శ్రీరామా! కొంచెమూవలకు రమ్ము. ఆత్మధ్యాననిష్ఠులగు మునులు రాక్షసులచే బహుభంగులం జంపఁబడిరి. వారి దేహములు పడియున్నవి చూడుమా. రాక్షసులు చెలరేఁగి పంపాసరోవరమందాకినీతీరవాసులగుమునులను జిత్రకూట వాసులను భయంకరముగా హింసించుచున్నారు. వారిదుష్కృత్యములు భరింపరానివిగా నున్నవి. శ్రీరామా! అకారణమున మేమందఱము రక్షణార్థము సర్వశరణ్యుఁడవగు నిన్ను శరణు వేఁడుచున్నవారము. మమ్ము రాక్షసులు వధింపక యుండఁ గాపాడుము. వీరాగ్రణీ! నీకంటె మాకు గత్యంతర మెచ్చటను గానఁబడదు. ఈబాధలనుండి తొలఁగించి మమ్మెల్ల రక్షింపుమని యభ్యర్థించిరి. ధార్మికోత్తముఁడగు శ్రీరామచంద్రుఁడు తపోధనుల పలుకు లాలకించి వారలం గని మహాత్ములారా! నన్ను నింతగా ప్రార్థింపనేల? ఈకార్య మొనరింపుమని యాజ్ఞాపింపుఁడు, ప్రార్థింపకుఁడు. రాక్షసబాధల నుండి మమ్ముఁ దొలఁగించునది నాకృత్యమే. నే నందులకే యడవికి రావలసివచ్చినది. దైవికముగాఁ దండ్రిమాటను పాలింపవలసి రాఁగా నానెపమున మీకార్యమును దీని నెఱవేర్పఁ గాంక్షించియే వనమున కరుగుదెంచితిని. అందు నిచ్చటికే తెంచుట యందులకే. నే నిందుందును. మీకు మేలు కలు

గును. తపస్విజనవిరోధులగు రాక్షసులఁ జంపఁ గోరు చున్నాను. నావీర్యమును నాతమ్ముని శౌర్యమును దపోధను లెల్లరుఁ గనుఁగొందురుగాక. ఇట్టులా రామమూర్తి వారల కభయ మొసంగి లక్ష్మణుని సీతాదేవిం గూడి సుతీక్ష్ణముని యుండుచోటికిం బోయెను.

మహామతులారా! ఈభాగమున శ్రీరామమూర్తి తన యవతారఫలమును వెల్లడించెను. మహర్షులు భగవంతుని దర్శించి తమయాపత్సంతతుల విన్నవించుకొనిరి. కావున నీభాగమున ననేకవిషయములు పరిశీలింపఁదగినవి కలవు.

"వైఖానసా వాలఖిల్యాస్సంప్రక్షాళా మరీచిపాః,
అశ్మకుట్టాశ్చ బహవః పత్రాహారాశ్చ ధార్మికాః. ౨
దంతోలూఖలినశ్చైవ తథైవోన్మజ్జకాః పరే,
గాత్రశయ్యా అశయ్యాశ్చ తథైవాభ్రావకాశకాః. ౩
మునయస్సలిలాహారా వాయుభక్షా స్తథాపరే,
ఆకాశనిలయాశ్చైవ తథా స్థండిలశాయినః. ౪
వ్రతోపవాసినో దాంతా స్తథార్ద్రపటవాససః,
సజపాశ్చ తపోనిత్యా స్తథా పంచతపోఽన్వితాః. ౫
సర్వే బ్రాహ్మ్యా శ్రియా జుష్టా దృఢయోగాస్సమాహితాః,
శరభంగాశ్రమే రామ మభిజగ్ముశ్చ తాపసాః." ౬

అని మూలము.

వైఖానసులు లోనగుమును లరుదెంచి శ్రీరాముని దర్శించిరి. వీరెల్లరు మునిశబ్దమున కర్హులే. కాని బహు విధతపోభేదములఁ బరమేశ్వరు నారాధించువారని మన మూహింపవలయును. ఇందేది యుత్తమమార్గ మనునదియే

యుట విమర్శింపఁదగినవిషయము. యోగము లనేక భేదము లుగ నుండును. వారివారి కర్మానుసారముగ నాయాయి భేద ములు వారలకు నిష్టపడును. అన్ని వ్రతము లందఱకు నిష్ట పడవు. కర్మానుసారమే వ్రతాసక్తియుఁ గలుగునని యిందలి సారము. వైఖానసులనఁగా బ్రహ్మనఖములనుండి కలిగినవా రనునర్థము సాధారణము.

"అకృష్టపచ్యౌషధీభి ర్గ్రామబహిష్కృతాభిరగ్నిహోత్రాది కుర్వన్."

అని సర్వతంత్రసిద్ధాంతపదార్థలక్షణసంగ్రహమునఁ గలదు. తమయంతనే మొలిచి పెరిగిన యడవియందుఁ గలయోష ధులచే నగ్నిహోత్రాదికర్మముల నాచరించు వానప్రస్థులని తాత్పర్యము. "విఖనసం బ్రాహ్మణం వేత్తి తపసా స వైఖానసః. వానప్రస్థః" అని శబ్దకల్పద్రుమము. "విఖనసమునినా ప్రోక్తం సూత్ర మధికృత్య తన్మార్గానుసారిణో వైఖానసాః." అని మహేశ్వరతీర్థులవ్యాఖ్య. సత్కర్మనిరతులై వనముల నుండి సంసారమును ద్యజించువారని దీనిభావము. తపో నిరతులని సారము. వానప్రస్థాశ్రమధర్మముల నవలంబించు వారు కారు. అందొక తెగవారు వీరని మనము గ్రహింప వలయు. ఏలయనఁగా వరుసగా బ్రహ్మచర్య గృహస్థాశ్రమ ముల నడపి మూఁడవదగు వానప్రస్థాశ్రమమున నుండు వారు వీరు కారు. తపోనిరతులు. కర్మానుష్ఠానతత్పరులునగు దురు. కొంద ఱగ్నిహోత్రాదులమాని కేవలతపోనిరతినుండు వారు కలరు. వారు మును లనఁబడుదురు వీరును గ్రమముగా మునులగుదురు. అని మన మెఱుంగవలయును.

"న ఫాలకృష్టమశ్నీయా దుత్సృష్టమపి కేనచిత్,

న గ్రామజాతాన్యార్తోఽపి మూలాని చ ఫలాని చ. ౧౬
అగ్నిపక్వాశనో వా స్యాత్కాలపక్వభుగేవ వా,
అశ్మకుట్టో భవేద్వాపి దంతోలూఖలికోఽపి వా. ౧౭
సద్యః ప్రక్షాలకో వా స్యాన్మాససంచయికోఽపి వా,
షణ్మాసనిచయో వా స్యాత్సమానిచయ ఏవ వా. ౧౮
నక్తం చాన్నం సమశ్నీయాద్దివావాహృత్య శక్తితః,
చతుర్థకాలికో వా స్యాత్స్యాద్వాప్యష్టమకాలికః. ౧౯
చాంద్రాయణవిధానైర్వా శుక్లకృష్ణే చ వర్తయేత్,
పక్షాంతయోర్వాప్యశ్నీయాద్యవాగూం క్వథితాం సకృత్. ౨౦
పుష్పమూలఫలైర్వాపి కేవలైర్వర్తయేత్సదా,
కాలపక్వైస్స్వయం శీర్ణైర్వైఖానసమతే స్థితః. ౨౧
భూమౌ విపరివర్తేత తిష్ఠేద్వా ప్రపదైర్దినం,
స్థానాసనాభ్యాం విహరేత్సవనేషూపయన్నపః. ౨౨
గ్రీష్మే పంచతపాస్తు స్యాద్వర్షాస్వభ్రావకాశికః,
ఆర్ద్రవాసాస్తు హేమంతే క్రమశో వర్ధయంస్తపః. ౨౩
ఉపస్పృశం స్త్రిషవణం పితౄ౯ దేవాంశ్చ తర్పయేత్,
తపశ్చరం శ్చోగ్రతరం శోషయే ద్దేహమాత్మనః. ౨౪
అగ్నీనాత్మని వైతానా౯ సమారోప్య యథావిధి,
అనగ్ని రనికేతస్స్యా న్మునిర్మూలఫలాశనః." ౨౫

మను. ౬ అధ్యా.

"దాంతస్త్రిషవణస్నాయీ నివృత్తశ్చ ప్రతిగ్రహాత్,
స్వాధ్యాయవా౯ దానశీలః సర్వసత్త్వహితే రతః. ౪౮
దంతోలూఖలికః కాలపక్వాశీ వాశ్మకుట్టకః,
శ్రౌతం స్మార్తం ఫలస్నేహైః కర్మ కుర్యాత్తథాక్రియాః. ౪౯
చాంద్రాయణై ర్నయేత్కాలం కృచ్ఛ్రైర్వా వర్తయేత్సదా,

పత్నీ గతే వాప్యశ్నీయా త్స్నాసేవాహనివా గతే. ౫౦
యః కంటకై ర్వితుదతి చందనై ర్యశ్చ లింపతి,
అక్రుద్ధోఽపరితుష్టశ్చ సమస్తస్య చ తస్య చ." ౫౩
యాజ్ఞవల్క్యము. ప్రాయశ్చిత్తకాండము.

అను నీ స్మృతులవాక్యములు పైనివ్రాసినభావమునే తెలుపును. వీనిభావ మేమని విచారింతము. మానవుఁడు తొలుదొలుత ఫలమునుగోరియే కర్మముల నాచరించును. సత్కర్మాచరణమునఁ గ్రమముగా ఫలాకాంక్ష నశించును. ఫలాభిసంధిరహితముగా లోకోపదేశార్థము సత్కర్మములను జేయునూహ కలుగును. కొంతకాల మట్లు లాచరించుచు సర్వ సంగపరిత్యాగము చేయుశక్తి గలుగ నిస్సంగుఁడై

"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః.

అను గీతాశాస్త్రముచెప్పిన సర్వకర్మాచరణఫలభూత మగు సమదర్శనత్వమునకుఁ బాత్రుఁడగును. ఒక్కజన్మమున నింతటిజ్ఞానము కొందఱకుం గలుగకపోవచ్చును. జన్మాంతర మున నదియు లభించును. కాని చేసినకృషిమాత్రము వ్యర్థము కాదు. ఈవైఖానసులు లోనగువారు కర్మఠు లనంబడుదురు. పూర్ణజ్ఞానము కలవారుకారు. అది లభించుటకే తమతమ యోగ్యత ననుసరించి పాటుపడువారు.

దీనిసారమేమి? శ్రీరాముని దర్శించినవారెల్ల ననేక విధములగునియమములకు లోనై కర్మముల నాచరించువారు. ఇందేది యుత్తమ మనుప్రశ్నము చేయరాదు. వారివారి కర్మము ననుసరించి యొక్కొక్కటి వారికి హితముగాఁ

దోఁచును. కాని తమకు హితముగఁ దోఁచినదియే యందఱకు హితముగఁ దోఁచునని భావింపరాదు. ఇతరుల కింకొకమార్గము హితముగఁ దోఁచునని బుద్ధిమంతుఁ డూహింపవలయును. ఏమార్గమైనను సమానమే. యథావిధిగ నద్దానినే యనుసరించిన ఫలము గలుగును. ఉద్దేశము మంచిదియైన నేదియైననేమి? ఫలము సమానమే. పౌండరీకమను యజ్ఞవిశేషమును ఫలమును గోరక చేయుసద్బ్రాహ్మణునకును, అశ్వమేధము నొనరించురాజునకు, కల్లమున భక్తిశ్రద్ధలచే యథాశక్తిన్యాయము ననుసరించి ధాన్యదానము చేయుశూద్రునకు భగవదనుగ్రహరూపఫలము సమానముగనే కలుగును. ఇందేదిగాని భక్తిశ్రద్ధలులేక యాచరింపఁబడునేని నిష్ఫలమే యగును గదా. ఇట్లనుటంజేసి యెవ్వారు భక్తిశ్రద్ధలచేఁ దమశక్తి ననుసరించి భగవంతు నారాధించిన నతనికరుణకుం బాత్రులగుదురని యెఱుంగవలయు ననునదియే ముఖ్యము.

పూర్వ మెవ్వారుగాని విగ్రహమును బూజించువారు మునులలో లేరని తేలెడిని. కర్మరూపమున భగవంతు నారాధించుచుఁ గ్రమముగా జ్ఞానము పూర్ణము కాఁగా మానసవీథిని బ్రహ్మమును నెలకొల్పి తద్దర్శనమున నవ్యయానందము ననుభవించు చుందురనియే స్పష్టమగును. అట్టిమార్గమునఁ బ్రవర్తించువారు తక్కువ కాఁగా ననఁగాఁ బామరులసంఖ్య వృద్ధికాఁగా విగ్రహపూజ యారంభింపఁబడి దానియందైనను శ్రద్ధాభక్తులు కుదిరినఁ బురోవృద్ధి కది దారిచూపునని యూహించి పెద్దలు దేవాలయముల నిర్మించిరని యూహింపఁదగును. ఇపు డదియే ప్రధానమై పురోవృద్ధిమార్గమను

మాట విస్మృతిగాంచ నవకాశమిచ్చుచున్నది. విగ్రహార్చనమే
ప్రధానమని బోధించు కపటనాటకసూత్రధారులు వృద్ధియైరి.
వారివలనఁ గలుగుచుండు చెడుగు లసంఖ్యలు కాని యవియే
తరణోపాయములని భావించువార లెంతపామరులో వేఱుగాఁ
జెప్పవలయునా? భక్తిమార్గము లనేకవిధములున్న నందు

"మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః,
భజంత్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయం. ౧౩
సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః,
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే., ౧౪
జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మాముపాసతే,
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖం. ౧౫
అహం క్రతురహం యజ్ఞస్స్వధాహ మహమౌషధం,
మంత్రోఽహ మహమేవాజ్య మహమగ్నిరహం హుతం. ౧౬
... ... ... ... ...
యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం. ౨౭ గీత. ౯ అ.

అను నీశ్రీకృష్ణోక్తి ననుసరించి సర్వదేవతామయునిగా
నభీష్టదైవమును ధ్యానించు టుత్తమమని గ్రహింపవలయును.
మార్గభేదము లెన్నియున్న గమ్యస్థాన మొక్కడే యగుట
నెవరి కేది రుచించునో దానినే యాతఁడు పాటింపవచ్చును.
దానినే శ్రద్ధాభక్తులతో నాశ్రయించిన ఫలము సమానమే.
అను నీవిషయము శ్రీరామాయణభాగమునుండి తేలెడిని.
ఎన్నెన్నియో భేదములగువ్రతము లాచరించుమునుల కెల్ల
భగవంతుఁడు దర్శనమొసంగెను. ఎల్లరు నారామమూర్తికి
సమానులే. కాని శ్రీరామదర్శనజనితఫలము వారందఱకు

సమానము కాదు. అయ్యది వారివారిభక్తిపై నాధారపడి యుండును. ఎల్లరు దృఢభక్తులే యైనఁ దత్ఫలముకూడ సమానమే యగును సామాన్యధర్మములకన్న విశేషధర్మము లుత్తమములు. ఇందుల కొక్కయుదాహరణము నాలకింపుఁడు. తడిబట్ట కట్టుకొనుట యనాచారము. దశవిధనగ్నులలో (దిగంబరులలో) నతఁడు నొక్కఁడు. అయ్యది విశేషవిధి ననుసరించి సదాచారమగును. "ఆర్ద్రవాసా స్తు హేమంతే" అనుమనుస్మృతివాక్యమును బరికింపుఁడు. హేమంతర్తువునందుఁ దడిబట్టగట్టుకొని భగవంతు నారాధింపవలెను. అనఁగా భావమేమి? దిగంబరుఁడై భగవంతు నారాధించు టుత్తమము కాఁగా నితర కాలముల నయ్యది సదాచార మేల కాదు? ఇందలిసార మే మనఁగా శరీరకష్టములను మఱచి మనస్సు సత్కార్యాచరణమునకుఁ గడంగవలయును. అపుడే తన్మయత్వము సిద్ధించును. సామాన్యశాస్త్రము ననుసరించిన నయ్యది దురాచారమే యనవచ్చును. కాన యట్లనరాదు.

"త్వా మాసాద్య మహాత్మానం ధర్మజ్ఞం ధర్మవత్సలం,
అర్థిత్వా న్నాథవక్ష్యామ స్తచ్చ నః క్షంతుమర్హసి." ౧౦

అని మూలము. ఇది యామునులమాటలు. దివ్యదృష్టిగలవారలుగాన మునులు శ్రీరాముని భగవంతునిగా నెఱింగియు మే మొక్కటి కోరుదుము. అది యపరాధమే యగును. ఐనను క్షమింపుమనిరి. ఇందపరాధ మేది? సర్వజ్ఞుఁడు భగవంతుఁడు కదా. ఎవ్వరెవ్వరి కేదేది కావలయునో యాతఁ డెఱుంగును. అట్టివానిని మరల నడుగుటేల? ఇదియే యిందలియపరాధము. అనఁగా నో శ్రీరామా! నీవు భగవంతుఁడవు. మాకొఱంతలు

దీర్చి యనఁగా దుష్టదానవుల సంహరించి తన్మూలమున నధర్మము నడంచి ధర్మము నుద్ధరింపనే యవతరించితివని భావము. అట్టి నీమ్రోల నిలువఁబడుటయే (సత్సు కార్యవతాంపుంసామలమే వాగ్రతస్థ్సితిః అనున్యాయము ననుసరించుటయే) చాలును. అది చాలక నిన్నడుగుట నీసర్వజ్ఞత్వము నడంచినట్లగును. ఇంతకంటె మహాపరాధ మేది? కావున దానిని క్షమింపుమనిరి. ఈవిషయమునే శ్రీశంకరభగవత్పాదులు

"త్వద్యాత్రయా సర్వగతాహతా తే ధ్యానేన చేతః పరతాహతా తే,
స్తుత్యానయా వాక్పరతాహతా తే క్షమస్వ శంభో త్రివిధాపరాధమ్."

అనుదాని మూలమునఁ దేటపఱచిరి. పురుషప్రయత్నము చేయక భగవంతుఁడు ఫలము నీఁబూనఁడనియు నయ్యది న్యాయ్యముగ నుండవలయుననియు నీభాగమునుండి తేలెడి సారమని మన మూహింపవలయును. ఈమునులు ముముక్షువులే యైనను లోకోపకారమునకై యిట్లు ప్రార్థించిరనియు మన మెఱుంగుట తెఱంగు.

"సోఽయం బ్రాహ్మణభూయిష్ఠో వానప్రస్థగణో మహాన్,
త్వన్నాథో నాథవద్రామ రాక్షసై ర్బాధ్యతే భృశం. ౧౫
ఏహి పశ్య శరీరాణి మునీనాం భావితాత్మనాం,
హతానాం రాక్షసైర్ఘోరై ర్బహూనాం బహుధా వనే. ౧౬
పంపానదీనివాసానా మను మందాకినీమపి,
చిత్రకూటాలయానాం చ క్రియతే కదనం మహత్. ౧౭
ఏవం వయం న మృష్యామో విప్రకారం తపస్వినాం,
క్రియమాణం వనే ఘోరం రక్షోభి ర్భీమకర్మభిః. ౧౮
తతస్త్వాం శరణార్థం చ శరణ్యం సముపస్థితాః,
పరిపాలయ నో రామ వధ్యమానా న్నిశాచరైః. ౧౯

పరా త్వత్తో గతిర్వీర పృథివ్యాం నోపపద్యతే,
పరిపాలయ నస్సర్వాన్ రాక్షసేభ్యో నృపాత్మజ." ౨౦

అని మూలము. ఇందలిచరిత్రవిషయము మనకిపు డావశ్యకము. రక్కసులు పంపామందాకినీచిత్రకూటాదిప్రాంతముల నివసించినమునులను వధించిరి. ఆకళేబరము లందందుఁ గనఁబడుచుండెను. వానిని శ్రీరామునకుం గనఁబఱచిరి. అనఁగా రక్కసులు మునులను జంపుట మాంసలోభమునఁ గాదనియు నీర్ష్యచేతనే యనియు నాయీర్ష్య మునులమూలమునఁ దమకు విరోధులగుదేవతలకు బలముగలుగుచున్న దను కారణముననే యనియు భావము. మునులం జంపి విసరివైవఁగా నాకళేబరము లందందుఁ బడియుండెను. అట్టియన్యాయప్రవర్తకులం బొలియింపుమా యని శ్రీరాముని బ్రార్థించిరి. నీకంటె నుత్కృష్ట గతి వేఱొండు లేదనిరి. అనఁగా భూభారహరణధర్మసంస్థాపనార్థ మవతరించిన సగుణబ్రహ్మము నీవే యని వారిభావము. ప్రకృతిపురుషులకంటె వేఱొకయుత్తమరక్షకస్థానమే లేదని దీనిహృదయము.

రామాయణము భారతమునకుఁ బిదప జరగినకథను దెల్పునన్న వాద మెక్కఁడందందు మ్రోఁగెడిని. ఇట్టి దుష్కార్యములు మహాభారతకాలమునఁ దఱచుగా లేవనవలయును. అప్పుడును గొలఁదిగ రక్కసు లుండిరి. మానవులను వారును జంపి భక్షించుచుండిరి. కాని ధర్మధ్వంసనార్థము మానవవర్యుల వధించువారు కారని సామాన్యదృష్టిం బలుకవచ్చును. రామాయణకాలమునఁ జిత్రకూటము మహారణ్యమధ్యస్థము. ప్రయాగము నగరము కాదు. కేవల భరద్వాజాశ్రమమే. భారతకాలమునఁ బ్రయాగాదులు నగరమ్ములు.

దండకారణ్యము దేశముగ మార్పునొందియుండెను. కావున రామాయణకథాకాలము ప్రాచీనమనియే తేలెడిని. ఏవో నాలుగుయుక్తులు పన్నినంతమాత్రమున నిట్టివిషయములు సిద్ధాంతములు కానేరవు. శ్రీరామాయణకాలమున మహా రణ్యములు మహర్షిభూయిష్ఠములై యుండె ననువిషయము మనము మఱువరాదు. వారిధర్మకార్యములను రూపుమాపఁ గోరి రక్కసులు వేనవేలు దండకారణ్యమున నుండిరి. జన స్థానమన్న నదియేకదా. అరణ్యములు దేశములుగా మాఱుట స్వాభావముగాని దేశము లరణ్యములుగా మాఱుట స్వాభావ మనరాదు. హతవాదులు ప్రాచీనౌన్నత్యవిషయకవార్తా ద్వేషులు దేశము లరణ్యములే యగునన్నచో మనవంటివా రూరకుండవలసినదేకాని బదులు పలుకరాదు. రాజమూల మునసే యాకాలపుఁ బ్రజలు తమయిక్కట్టులఁ దీర్చుకొను చుండిరి. అనఁగా రాజభక్తిప్రపూర్ణహృదయులే యాకాలపు మానవులని భావము. బహునాయకత్వ మప్పటివారికి రుచింప దనియుఁ దేటపడును. కావుననే వారు నిశ్చింతముగ నుండఁ గల్గిరి.

"పరా త్వత్తో గతిర్వీర పృథివ్యాం నోపపద్యతే"

ఈభూలోకమున నీకన్న నుత్కృష్టశరణ్యము వేఱొండు లేదు. అనఁగా నిన్నారాధించుటకంటె నుత్తమకర్మము వేఱొండు లేదని తాత్పర్యము ఇయ్యది "యజ్ఞానాం, జప యజ్ఞోఽస్మి" అన్నగీతావాక్యమునర్థమునే తెలుపుచున్నది. నిన్నుపాసించుటయే యత్యుత్తమమార్గమని సారము. "నృపా త్మజ, వీర" అను రెండువిశేషణములు మునులుపయోగించిరి.

ఏల? రాజపుత్త్రుఁడవుగా నవతరించి పరాక్రమమును జూపక యూరకుండరాదని మునులు హెచ్చరించిరి. పరాక్రమము ప్రదర్శించుకాల మాసన్నమైనదని దీనిహృదయము.

> "నైవమర్హథ మాం వక్తు మాజ్ఞప్తోఽహం తపస్వినాం,
> కేవలేనాత్మకార్యేణ ప్రవేష్టవ్యం మయా వనం. ౨౨
> విప్రకారమపాక్రష్టుం రాక్షసై ర్భవతామిమం,
> పితుస్తు నిర్దేశకరః ప్రవిష్టోఽహమిదం వనం. ౨౩
> భవతామర్థసిద్ధ్యర్థ మాగతోఽహం యదృచ్ఛయా,
> తస్య మేఽయం వనేవాసో భవిష్యతి మహాఫలః. ౨౪
> తపస్వినాం రణే శత్రూన్ హంతుమిచ్ఛామి రాక్షసాన్,
> పశ్యంతు వీర్యమృషయ స్సభ్రాతుర్మే తపోధనాః." ౨౫

అని మూలము. ఇది శ్రీరాముఁడు మునుల కొసఁగినయభయ ప్రదానము. మునులారా! నాకార్యము కొఱకుఁగా నిచ్చటికి రాలేదు. నాకుఁ గోరఁదగిన దేదియు లేదని భావము. తపో నిరతులకుఁ గలుగు నపకారములఁ దొలఁగించుటకే. తండ్రి యాజ్ఞను పాగించుట యొకవ్యాజము. తన్మూలమున ధర్మ ద్వేషుల నిర్మూలించుటకే వచ్చితిని. అందు నీయడవియందే వసింతును. దాన మహాఫలము మీకుఁ గలుగఁగలదు. నాపౌరుషమును జూతురుగాక. సీతాపహరణము కాఁగా రక్కసుల నిర్మూలింతునన్న భావ మీవాక్యములచే సూచింపఁబడినది. సీతాపహరణమే నాపౌరుషప్రదర్శనమునకు మూలము. ప్రకృతి మూలముననే నాకార్యములు సాగునని సారము.

> "పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం,
> ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే."

అన్నది కదా భగవంతుని ప్రతిజ్ఞ. అదియే యిందును గలదు. నిస్సంగుఁడ నైనను బ్రకృతింగూడి మహాకార్యములు చేయువాఁడననియు నాకార్య మీయరణ్యమున నుండుటం జేసి సాగఁగలదనియు నవ్వల నాచేయు శత్రుధ్వంసనము మీరే చూతురుగదా యనియు నిందుఁగల సారతరార్థము. ఉపాసకుఁడు రూపనామక్రియావంతునిగ భగవంతు నారాధింపవలయు ననుభావ మీమూలమున మనము గ్రహింపవలయును. ఈవిషయమునే శ్రీశంకరభగవత్పాదులు

"శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
న చేదేవం దేవో న ఖలు కుశలస్స్పందితుమపి,
అతస్త్వామారాధ్యాం హరిహరవిరించాదిభిరపి
ప్రణంతుం స్తోతుం వా కథమకృతపుణ్యః ప్రభవతి.
త్వదన్యః పాణిభ్యా మభయవరదో దైవతగణ
స్త్వమేకా నైవాసి ప్రకటితవరాభీత్యభినయా,
భయాత్త్రాతుం దాతుం ఫలమపి చ వాంఛాసమధికం
శరణ్యే లోకానాం తవ హి చరణావేవ నిపుణౌ."

అను నీశ్లోకములమూలమునఁ దేటపఱచిరి. ప్రకృతి నుపాసించుటయే భగవంతు నారాధించుట యనియు వేఱుగా వారినిరువురి నుపాసించుట కవకాశమే లేదని ప్రకృతిపురుషుల వేఱుచేయ సాధ్యమే కాదనియు సారము.

"వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే,
జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ."

అని కాళిదాసమహాకవియు స్పష్టపఱచెను. ఇట్లు లీసర్గమున భగవంతునాశయ మిట్టిదని గ్రహింపందగును. ఇఁకఁ దరువాతి చరిత్రము నరయుదము.

## శ్రీరాముఁడు సుతీక్ష్ణమునిం గాంచుట.

* శ్రీరాముఁ డామునులంగూడి సుతీక్ష్ణమునియాశ్రమమునకుం బోవుచు జలములు నిండఁగలిగిన పెక్కుమహానదుల నుత్తరించి యొకపర్వతమును దానిచెంతనున్న మహారణ్యమును జూచెను. పూవులు పండ్లు నిండియుండఁ గనంబడు మహావృక్షములం గాంచుచుఁ బోయిపోయి వల్కలములు వరుసఁగాఁ గట్టియున్నయాశ్రమము నాయడవియందొకభాగమునఁ గాంచెను. అందు సుఖాసీనుఁడై యున్నముని రామునకుం గనంబడియెను. అభ్యంగాది సంస్కారములు లేమి నాతనిదేహము దుమ్ముఁగప్ప జడలు కనఁబడనుండెను. వృద్ధువగుట నమ్ముని కన్నులు తెలియరామి నూరకుండఁగా రాముఁడు విధిమంతముగా నమ్మునితో మహానుభావా! తపోధనా! నేను శ్రీరాముఁడను. నిన్ను దర్శింప నరుదెంచితిని. నమస్కరించుచున్నాఁడ నని మ్రొక్కెను. ధర్మజ్ఞుఁ డగునాముని ధార్మికోత్తముఁ డగురాముని గాంచి కౌఁగిలించుకొని వీరవర్యా! శ్రీరామచంద్రా! నీకు స్వాగతము. నీయాగమనమున నీ యాశ్రమము నాథవంతము. నీ వరుదెంతువని నిన్ను దర్శింతునని నేను సదా నిన్నే ధ్యానించుచు వేచియున్నవాఁడను. నీదర్శనమగునని యే శరీరమును వదలకయున్నవాఁడను. చిత్రకూటమును నీవు చేరినదాదిగా నీవార్త నాలకించుచున్నవాఁడను. నాస్వర్గగమనప్రసక్తి నాలకింపుము. శరభంగమునికొఱకు వచ్చినయింద్రుఁడు నన్నుఁ జూడ వచ్చి పుణ్యకర్మములచేత సమస్తలోక

---

* ఇది యేడవసర్గమునఁ గలదు.

ములు జయింపఁబడినవని నాకుం దెల్పి పోయెను. శ్రీరామా! నా ప్రసాదమున నీవు సీతను సౌమిత్రి నిగూడి తపస్సమార్జితము లగు నాలోకములందు సుఖముగాఁ గ్రీడింపుమని ప్రార్థించెను.

శ్రీరాముఁ డామహామునిం గాంచి నేను నాయంతన లోకముల నార్జించుకొనియెదను. కాని యీయడవియందు మాకు నివసింపఁదగినచోటునుమాత్రము నీవు నిర్దేశింపం దగుదువు. శరభంగమునివరుఁడు మీయోగ్యతను దెలి పెను. అనఁగానే మహానందమున మునిఁగి మంచిమాటలతో మహానుభావా! ఇందుఁ బెక్కండ్రు మును లుందురు. ఫల మూలములు వలసినన్ని కలవు. ఇది గుణవంతమగు నాశ్ర మము. ఇందే యుండుము. విఖ్యాతిం గాంచిన యో శ్రీరామా! మృగములు గుంపులుగాఁ జేరి భయంపడక యీయాశ్రమ మునఁ దిరుగుచు వింతవింతరంగులుగల తమ శరీరములచే మాకెంతో యాసలు గల్గించి మాసమాధికి భంగము కల్గించు చుండును. ఈమృగబాధతప్ప వేఱొండుబాధ యిందు లేదు. అనఁగా శ్రీరామమూర్తి కోదండము సజ్యముచేసి ముని వర్యా! నే నిందే యుండినయెడల మృగములు రాఁగా వధిం తును. దాన నీకు విషాదము కలుగకమానదు. నే నపరాధి నగుదును. అది నాకు మహాకష్టము గాదా. కాన నిందుఁ జాలకాలము నివసింపఁదలంపను. అని యమ్ముని యనుమతి నొంది సంధ్య నుపాసింప నందలి సరోవరముచెంతకుంబోయి జపించుచుఁ బిదప నాయాశ్రమమున నారాత్రి సీతాసౌమిత్రు లం గలిసి నివసించెను. రాత్రి యరుదెంచెను. మహామునియు వారల బహూకరించి మునిజనయోగ్యములగు ఫలమూలము లను దానే యార్జించి వారికి నొసంగెను.

మహాత్ములారా! ఇందలివిశేషముల నరయుదము

"ప్రతీక్షమాణస్త్వామేవ నారోహేఽహం మహాయశః,
దేవలోకమితో వీర దేహం త్యక్త్వా మహీతలే.
చిత్రకూట ముపాదాయ రాజ్యభ్రష్టోఽసి మే శ్రుతః,"

అను నీమూలము సుతీక్ష్ణమునివాక్యసంతతికలది. చిత్రకూటము చేరినదిమొదలు నీరాజ్యభ్రంశమును విన్నాఁడను. అనఁగాఁ గోసలదేశము పొలిమేర చిత్రకూటముదనుకనని యర్థముకదా. రాజ్యభ్రంశము రాజ్యమును వదలి యన్యరాష్ట్రమునఁ బ్రవేశించుట యనికదా భావము. పాంచభౌతిక శరీరమును వదలి స్వర్గమున కరుగ మాని నీరాకనే వేచియున్నాఁడను. అనఁగా నాయురంతము పామరులకుంబోలె యోగులకు లేదనియు వారెంతకాలమైన శరీరమున నసువిసరమును నిలుపుకొనఁజాలుదురనియు భావము. కావుననే "తస్మాద్యోగీ భవార్జున" అని శ్రీకృష్ణమూర్తి తెలిపెను. యోగమహత్త్వ మపారమని యిందుమూలమున మన మెఱుంగవలయును. నిన్ను దర్శించి పిదప శరీరమును వదలఁ దలఁచియున్నాఁడను. అనఁగా స్వర్గసుఖము నీదర్శనజనితమహానందానుభవమునకంటె నల్పమని భావము ఉపాసకుఁడు స్వేష్టదేవతాసాక్షాత్కారమే తపస్సిద్ధియని భావించును. తన యిష్టదేవతాదర్శనమే మహానందజనకము ఈయానంద మవిచ్ఛిన్నము. స్వర్గవాసానంద మల్పకాలికము. కావున జ్ఞానులెందుండిన నానందమునే యనుభవింపఁజాలుదురు. అజ్ఞానులు స్వర్గమునే కోరుదురు. ఫలాభిరహిత సత్కర్మానుష్ఠానమే సంతృప్తిని మహానందమును గల్పించునని మన కీభాగము తెల్పుచున్నది. సత్కర్మములనఁగా విధివిహితములని యర్థము.

అంతియకాని తమకు బాగని తోఁచినవి కావు. అందు జప యజ్ఞము ముఖ్యతమమని గీతోపనిషత్తు బోధించుచున్నది కదా. కాయికములగు కర్మములకంటె మానసికములగు కర్మము లుత్తమములనియే యిట సారము. కాఁబట్టియే విగ్రహారాధనము లోనగునవి యల్పతమ ఫలదములనియు మానసిక పూజాదు లుత్తమోత్తమఫలదంబులనియు భగవంతుఁడు వాక్రుచ్చెను.

"ధ్యానేనేత్థం సుతీవ్రేణయుంజతో యోగినో మనః,
సంయాస్యత్యాశు నిర్వాణం ద్రవ్యజ్ఞానక్రియాభ్రమః." ౪౬
శ్రీ భాగ. ౧౧ స్కం. ౧౪ అధ్యా.

"నిర్విణ్ణానాం జ్ఞానయోగో న్యాసినా మిహ కర్మసు,
తేష్వనిర్విణ్ణచిత్తానాం కర్మయోగస్తు కామినాం. ౭
యదృచ్ఛయా మత్కథాదౌ జాతశ్రద్ధస్తు యః పుమాన్,
న నిర్విణ్ణో నాతిసక్తో భక్తి యోగోఽస్యసిద్ధిదః. ౮
తావత్కర్మాణి కుర్వీత న నిర్విద్యేత యావతా,
మత్కథాశ్రవణాదౌ వా శ్రద్ధా యావన్న జాయతే." ౯
శ్రీ భాగ. ౧౧ స్కం.

ఈ ప్రమాణములు పైనవ్రాసినభావమును దృఢపఱచుచున్నవి కదా.

"ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా"

అనువాక్యము భగవంతునియాకారమహత్త్వమును దెలుపును. ఈ ప్రమాణములన్నియు ధ్యానయోగ ముత్తమమనియు నెవ్వఁ డేరూపమున భగవంతుని ధ్యానించినను దద్రూపమున నతనికిం బ్రత్యక్షమగుననియు సిద్ధాంతము.

చేయుచున్నవి. వైకుంఠమే భగవంతునకు స్థానమనువాదము దుర్వాదమని తెలుపుటకే యిన్నిపురాణములు మహర్షిప్రణీతములయ్యెననియు సర్వలోకములాపరాత్పరునకు నివాసస్థానములే యనియు సర్వభూతముల నాతని తేజస్సు గలదనియు మన మెఱింగిన మతద్వేషముల కించుకంతయే నవకాశము గలుగదు.

"తేషు దేవర్షి జుష్టేషు జితేషు తపసా మయా,
మత్ప్రసాదా త్సభార్య స్త్వం విహరస్వ సలక్ష్మణః. ౧౭
అహమేవాహరిష్యామి స్వయంలోకాన్ మహామునే,
ఆవాసం త్వహమిచ్ఛామి ప్రదిష్టమిహా కాననే." ౧౮

అని మూలము. ఇయ్యది ముని సర్వకర్మములను భగవంతున కర్పించుట. వానిని భగవంతుఁ డంగీకరించుట యనుకార్యమును దెలుపుచున్నది.

"చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః,
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ." ౫౭

గీ. ౧౮ అధ్యా.

అను నీభగవద్వాక్యతాత్పర్యమే యీ రామాయణమునందును గలదు. శ్రమించిచేసిన సర్వకర్మముల భగవంతున కర్పించుటయే మహాత్యాగము. అదియే భగవద్దాస్యము. నిస్సంగత్వమన నదియే. అట్టివారినే భగవంతుఁడు కరుణించునని మన మెఱుంగవలయును.

"ఇమమాశ్రమమాగమ్య మృగసంఘా మహాయశః,
అటిత్వా ప్రతిగచ్ఛంతి లోభయిత్వాకుతోభయాః. ౧౮

నాన్యో దోషో భవేదత్ర మృగేభ్యోఽన్యత్ర విద్ధివై.”

అని మూలము. మృగములు గుంపులుగా నరుగుదెంచి రూప కాంతిగతిచేష్టావిశేషములచే మానసమాధికి భంగముగావించి. నిర్భయముగాఁ దిరుగుచుఁ బోవుచుండును. అని ముని తెల్పెను. దీనిభావమేమి? తపోవిఘ్న మనేకమార్గముల సాగుచుండును. వానికి జంకక నియతి సాగింపవలయును. ఇంద్రియవిజయమే తపఃఫల మనందగును. మనోనిగ్రహము లేనితపస్సు స్వల్ప ఫలదమే యగును. యోగము నభ్యసించి మనస్సును వశమునం దుంచుకొనిననే తపఃఫలము సమగ్రముగాఁ గలుగును. అంతరాయములకు నెవ్వనితపస్సు లొంగునో యతఁడు జితేంద్రియుఁడు కాఁడని స్పష్టముగా నెఱుంగఁదగును. బాహ్యదృష్టి నెన్నివిఘ్నములుగలిగినను లెక్కింపక భగవంతు నారాధించువాఁడే యోగి.

“న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియం,
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః. ౨౦
బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖం,
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయ మశ్నుతే. ౨౧
యేహి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే,
ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః. ౨౨
శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్,
కామక్రోధోద్భవం వేగం స యుక్త స్స సుఖీ నరః.” ౨౩

గీ. ౫ అధ్యా.

అనునీ శ్రీకృష్ణోపదేశమే పైవిషయమును దృఢపఱచుచున్నది.

"తానహం సుమహాభాగ మృగసంఘాన్ సమాగతాన్. ౨౦
హన్యాం నిశితధారేణ శరేణాశనివర్చసా,
భవాంస్తత్రాభిషజ్యేత కిం స్యాత్కృచ్ఛ్రతరం తతః. ౨౧
ఏతస్మిన్నాశ్రమే వాసం చిరంతు న సమర్థయే."

అను నీవాక్యములు శ్రీరామమూర్తివి. ప్రతీతికార్థము సులభము. విశేషార్థము నరయుదము. మృగసంఘముల వధింతును. కాని దాన మీమనస్సు నొచ్చును. అదియే నాకు విశేషవిషాదజనకము. కాన నిందుఁ జిరకాలము నివసింపననికదా రామచంద్రుఁడు పలికెను. దుష్టమృగవధము రాజధర్మము దుష్టమృగహింసారతి విప్రధర్మము కాదు. అనఁగాఁ దన్ను బాధించుజంతువులకుంగూడ హాని కోరరాదని విప్రధర్మము తెలుపుచున్నది.

"అహింసయైవ భూతానాం కార్యం శ్రేయోనుశాసనమ్,
వాక్చైవ మధురా శ్లక్ష్ణా ప్రయోజ్యా ధర్మమిచ్ఛతా. ౧౫౧
యస్య వాఙ్మనసీ శుద్ధే సమ్యగుప్తే చ సర్వదా,
సవై సర్వమవాప్నోతి వేదాంతోపగతం ఫలమ్." ౧౫౨

అధ్యా॥ ౨

"అహింసా సత్యమస్తేయం శౌచమింద్రియనిగ్రహః,
ఏతం సామాసికం ధర్మం చాతుర్వర్ణ్యేఽబ్రవీన్మనుః." ౬౩

అధ్యా. ౧౦

అని మనుస్మృతి హెచ్చరించుచున్నది.

"సింహవ్యాఘ్రమృగజాదీని లోకహింసాకరాణి తు,
నృపో హన్యాచ్చ సతతం దేవార్థే బ్రాహ్మణార్థకే. ౫౦

... ... ... ...

ఏతద్గృహాశ్రమస్థానాం క్రియాఫల మభీప్సితాం,
పశుయజ్ఞో న చాన్యేషా మిష్టాపూర్తికరం భవేత్. ౬౯
జపహోమార్చనాద్యైస్తు తేషా మిష్టం హి సిద్ధ్యతి,
భగవంత్సర్వమాఖ్యాతం హింసాఘస్య తు లక్షణం." ౭౦

లలితోపాఖ్యానము. ౨.అధ్యా.

"అహింసా సత్యమస్తేయం శౌచమింద్రియనిగ్రహః,
దానం దమో దయాక్షాంతిస్సర్వేషాం ధర్మసాధనమ్. ౧౨౨
వయోబుద్ధ్యర్థవాగ్వేషశ్రుతాభిజనకర్మణాం,
ఆచరేత్సదృశీంవృత్తి మజిహ్మామశఠాం తథా." ౧౨౩

యాజ్ఞవల్క్యము.

ఈ ప్రమాణములన్నియు విప్రున కహింసావ్రతమే యుత్తమోత్తమమని శాసించుచున్నవి. కనుక మునియగుసుతీక్ష్ణుఁడు మృగబాధ తెల్పినను శ్రీరామమూర్తి భగవంతుఁడు కాన నతని మనోభావము నెఱింగి క్రూరమృగముల నేను వధించినచో నీవు వెతచెందుదువు. అయ్యది నాకు శ్రమముం గల్గించును. కాన నిందుండనని యుత్తరమొసఁగెనని మన మెఱుంగవలయు. అన్నివ్రతములకంటె భూతహింసఁ గోరకుండుటయే యుత్తమమనియు నెవ్వఁడు భూతము హింసింపఁబడఁగా వెత నొందఁడో యతఁడు బ్రాహ్మణధర్మరహితుఁడనియు మన కీభాగమున శ్రీరామోపదేశము బోధించుచున్నది.

"తతశ్శుభం తాపసభోజ్యమన్నం స్వయం సుతీక్ష్ణః పురుషర్షభాభ్యాం,
తాభ్యాంసుసత్కృత్య దదౌ మహాత్మా సంధ్యానివృత్తౌరజనీమవేక్ష్య." ౨౪

అని మూలము. భగవదారాధనమునకు భక్తి యెట్లు ప్రధానమో యట్లే శ్రమించి తాను సంపాదించినవస్తువులు కూడఁ

ప్రధానములనియు భక్తిశ్రద్ధావిరహితులు తెచ్చిన యవి నిష్ఫలములనియు మన కీభాగము తెల్పుచున్నది. కొందఱు పూజార్థము విపణివీథినుండి పూవులందెప్పించి యుపయోగింతురు. ఎందఱో వాసనచూడఁగా నవి యయోగ్యములయియుండును. కాన వానిచేఁ బూజింపరాదు. ఫలములో యని ప్రశ్నింతురేమో. ఫలములు పరిమళప్రధానములు కావు. భక్షితావశిష్టఫలభాగము లెట్లు పనికిరావో యట్లే వాసన చూడఁబడినపూవులు పనికిరావనియే తాత్పర్యము. కనుకనే యమ్ముని శిష్యులు తెచ్చినవానింగాక తానే యడవి కరిగి దొరకినఫలముల నా శ్రీరాముని కొసంగెను. కనుక మనము కూడ నట్టిసదాచారమును నేర్చుకొనవలయును. ఇఁకఁ దర్వాతిచరిత్రముఁ బరికింతము.

## ⸻ శ్రీరాముఁడాశ్రమమండలములం గాంచఁబోవుట. ⸻

*రాఘవు లందారాత్రి గడపి ప్రభాతమున మేల్కాంచిరి. రామమూర్తి జానకింగూడి కలువపూవులపరిమళములఁ గలిసినశీతలోదకములస్నానము గావించెను మున్నే సౌమిత్రి స్నానముచేసియుండెను. అంత వారు మూవురు తత్కాలార్హమగునగ్నికార్యమును సాధించి భగవంతు నుపాసించి రవి యుదయింపఁగాఁ గాంచి మునికడ కరిగి మధురవాక్కులతో మహాత్మా! తమదయచే నీరాత్రి యిందు సుఖముగాఁ బుచ్చితిమి. ఇఁకఁ బనివిన వచ్చినారము. మావెంటవచ్చినమౌనులు మమ్ముఁ ద్వరపెట్టుచున్నారు. ఈయడవింగలమునులయాశ్రమములఁ జూచుకోరిక గలదు. మహాత్ములగు నీమునులు మేము

---

* ఇది యెనిమిదవసర్గమునఁ గలదు.

నీయాజ్ఞను బొందఁగోరితిమి. దుర్వంశమున నుద్భవించి సాధు సంగతిలేనివిభుఁ డన్యాయమున నైశ్వర్యము నార్జించి గర్వించు నట్టు లీసూర్యుఁడు పొడసూపి యాతపమును భీతిగొలుపఁ జూపఁగలఁడు. కాన ముందే పయనము సాగింపఁగోరుదుము. అని నమస్కరింప వారిని లేవనెత్తి కరుణపొలయఁ గౌఁగిలించు కొని శ్రీరామా! తోడునీడవలె నున్నజానకిని లక్ష్మణునిం గూడిపొమ్ము. నీకుఁ ద్రోవ నిరుపద్రవమగుంగాక. తపోధనుల యాశ్రమములం గనుఁగొనుము. ఇందలిమును లాత్మధ్యాన నిరతులు పరిపక్వాంతఃకరణులు సుమీ! వారుండువనములు మనోహరములు. మృగము లెన్నియే నందుండును. పక్షులు పరస్పరవిరోధములేక యుండును. సరసులు కమలాలయములే. జలము నిర్మలము. జలపక్షు లందుఁ గొలకొలఁ గూయుచుం డుటంజేసి మనోహరముగా నుండును. లక్ష్మణా! శ్రీరాముని గూడి పొమ్ము. శ్రీరామా! మరల నొక్కపర్యాయ మీ యాశ్రమమునకు రావలయుఁ జుమీ. అనఁగా శ్రీరాముఁ డందుల కంగీకరించి వలగొని మ్రొక్కి పయనముచేయనుండ సీతాంబయు నాసోదరుల కిరువురకు మేటియంబులపొదులును ధనుస్సులను మంచిపిడులుగలఖడ్గముల నందిచ్చెను. అంత వారు ప్రయాణము సాగించిరి. జానకియు వారివెంబడిం బోయెను.

బుద్ధిసంపన్నులారా! ఈభాగమునఁ గలవిశేషముల నెఱుకుదము.

"అథ తేఽగ్నిం సురాంశ్చైవ వైదేహీ రామలక్ష్మణౌ,
కాల్యం విధివదభ్యర్చ్య తపస్విశరణే వనే. 3.

ఉదయంతం దినకరం దృష్ట్వా విగతకల్మషాః,
సుతీక్ష్ణమభిగమ్యేదం శ్లక్ష్ణం వచనమబ్రువన్." ౪

అని మూలము సూర్యోదయము కాకమునుపే యగ్నిపూజ దేవతోపాసనాదులు జరపిరనియు నుదయించురవిని గాంచి పయనమునకు సన్నద్ధులైరనియు నిందుఁ బొడకట్టెడు.

"వశే కృత్వేంద్రియగ్రామం సంయమ్య చ మనస్తథా,
సర్వాన్ సంసాధయేఽర్థానక్షిణ్వన్ యోగతస్తనుం. ౧౦౦
పూర్వాం సంధ్యాం జపంస్తిష్ఠే త్సావిత్రీమార్కదర్శనాత్,
పశ్చిమాం తు సమాసీన స్సమ్యగృక్షవిభావనాత్." ౧౦౧

అనియు,

"ఏతదక్షరమేతాం చ జపన్వ్యాహృతిపూర్వికాం,
సంధ్యయోర్వేదవిద్విప్రో వేదపుణ్యేన యుజ్యతే. ౭౮
విధియజ్ఞా జ్జపయజ్ఞో విశిష్టో దశభిర్గుణైః,
ఉపాంశుస్స్యాచ్ఛతగుణస్సాహస్రో మానసస్స్మృతః. ౮౫
యే పాకయజ్ఞాశ్చత్వారో విధియజ్ఞసమన్వితాః,
సర్వే తే జపయజ్ఞస్య కళాం నార్హంతి షోడశీం. ౮౬
జప్యేనైవ తు సంసిద్ధ్యేద్బ్రాహ్మణో నాత్ర సంశయః,
కుర్యాదన్యన్నవా కుర్యా న్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే." ౮౭

మనుస్మృతి. ౨ అధ్యా.

అని స్మృతి తెలుపుచున్నది. విషయము విమర్శింతము. ఉషః కాలమున స్నానముచేసి సంధ్య నుపాసింపవలయు. సంధ్యావందనమనునది వేదవిహితకర్మము. అది నిత్యము. ఆసంధ్యాకర్మము భాగత్రయాత్మకము. అందర్ఘ్యప్రదానముదనుక నిత్యము. జపోపస్థానములు నైమిత్తికములు. ఆశౌచము రాఁగా నర్ఘ్యప్రదానముదనుక నొనరించి యవ్వల మానసికముగా

స్మరింపవలయును. అనఁగా నది నిత్యము కాదని తాత్పర్యము. గాయత్రీజపము నియతసంఖ్యాకము కాదు. యథాశక్తి న్యాయము ననుసరించి యది యుండును. అనధ్యాయముల యందది,

"అష్టావింశత్యనధ్యాయే స్వాధ్యాయే తు యథేచ్ఛయా."

అనుసూక్తి ననుసరించి యనధ్యాయములందు నిరువదెనిమిది పర్యాయములే జపము చేయవలయును. అమవసయందు దశవారములనియే పెద్దలు పలుకుదురు. ఉషఃకాలమున స్నానము చేసినవాఁడు సూర్యోదయముదనుక నేమి చేయవలయు నన్న ప్రశ్నము సముచితమేకదా. కొందఱు గాయత్రి గాక తక్కినమంత్రముల నుపాసింపరాదందురు. సర్వమంత్రములు గాయత్రి కంగములగును. కావున నాకాలమున నేవి యే మంత్రముల నుపాసింపవచ్చును. ఇచట గాయత్రజపము సర్వమంత్రజపోపలక్షణమని గ్రహింపవలయును. ఇఁక నగ్నిపూజ యెట్టులనఁగా "ఉదితే సూర్యే ప్రాతర్జుహుయాత్. అనుదితే సూర్యే ప్రాతర్జుహుయాత్" అని రెండువిధముల శ్రుతులు కనంబడుచున్నవి. వేదద్వైవిధ్యమున నెవరి యాచారమును వా రవలంబింపవచ్చును. శ్రుతిస్మృతిపురాణేతిహాసము లుత్తరోత్తరన్యూనప్రమాణములు. శ్రుతివిధింపనితఱి స్మృతియే ప్రమాణము; అది లేనిచోఁ బురాణము. ఇట్లే ఇతిహాసము. ఇందేదిగాని రెండుతెఱఁగులఁ బ్రతిపాదించు నేని అపు డిచ్ఛానుసారముగా దాని నాచరింపవచ్చును. శిష్టాచారమనునది,

"శిష్టాచారః పరిగ్రాహ్యశ్శ్రుతిస్మృత్యోరభావతః".

అను ప్రమాణము ననుసరించి శ్రుతిస్మృతిపురాణేతిహాసములు విధింపని విషయమునఁ బెద్దలయాచారము ప్రమాణముగ గ్రహింపఁదగును. శాస్త్రవిరుద్ధముగ శిష్టాచారముండునే నది భ్రష్టాచారమే యగును. ప్రకృతము సీతారామలక్ష్మణులు వారివంశమునఁగల యాచారము ననుసరించి యది శ్రుతిసమ్మతమేగాన సూర్యోదయమునకు ముందే యుపాసనాదికార్యములు ముగించి యగ్ని నారాధించిరనియు నది శాస్త్రసమ్మతమే యనియు మన మెఱుంగవలయు. మఱియు నొక్క విషయము నెఱుంగవలయు. ప్రభాతకాలము ధ్యానమునకు నుత్తమోత్తమకాలము. లోకప్రవర్తనమున మనస్సు సంబంధము గలుగఁజేసికొనక యుండుతఱి నే ధ్యానము ముఖ్యము. బహువిధముల మనస్సు పరుగిడుచుండఁగాఁ జేయుధ్యానము వ్యర్థమే యగును.

> "న హి ధ్యానేన సదృశం పవిత్రమిహ విద్యతే,
> శ్వపాకేష్వపి భుంజానో ధ్యానేనైవాత్ర లిప్యతే.
> ధ్యానమేవ పరో ధర్మో ధ్యానమేవ పరం తపః,
> ధ్యానమేవ పరం శౌచం తస్మాద్ధ్యానపరో భవేత్.
> సర్వపాపప్రసక్తోఽపి ధ్యానం నియతమభ్యసేత్,
> సర్వదా ధ్యానయుక్తశ్చ తపస్వీ పంక్తిపావనః."

ఆత్రేయస్మృతి ౪ అధ్యా.

అను నీస్మృతివాక్యములఁబట్టి ధ్యాన ముత్తమోత్తమమని తేలెడిఁగదా. అట్టి ధ్యానము మనస్సాధ్యముకదా. అయ్యది కడుంగడుం జంచలము. కావున నయ్యది ప్రభాతమున నించుక స్థిరతం గాంచఁ గల్గుననియు నాకాలమే ముఖ్య

మనియుఁ బెద్దలందురు. శాస్త్రములు నట్లే విధించును. కావున భగవంతుని ధ్యానించుటయే తపస్సు. విగ్రహారాధన మధమాధమమే యని మన మెఱింగిన మేలుగాంతుము. మధ్య వైష్ణవులయు వేషధారులయుఁ గపటనాటకసూత్రధారులయు వంచకాగ్రేసరులయు బాహ్యాచారనిరతులయు మాటల నాలకించిన నధోగతియే యని మన మెఱుంగవలయును.

"అవిషహ్యాతపో యావత్సూర్యో నాతి విరాజతే,
అమార్గేణాగతాం లక్ష్మీం ప్రాప్యేవాన్వయవర్జితః."   ౮

అని మూలము. ఇందు సూర్యుఁడు దుష్ప్రభువుతోఁ బోల్పఁబడియెను. నీచకులసంభవుఁడై యన్యాయమార్గమున నార్జించిన లక్ష్మినొందిన దుష్టప్రభు వితరులకు బాధాకరుఁడే యగును. అట్లే సూర్యుఁడు కూడఁ దనయాతప మితరులకు నోర్వరానిదగురీతి వ్యాపింపఁజేయును పరులబాధించుట యనునది యిరువురకు సమానధర్మము. ఇట్లు శ్రీరాముఁడు పోల్చుటంజేసి యిందేదో నీతియొక్కఁ డుండక తప్పదు. అది యేది? అన్యాయమార్గమున మహర్షులకు బాధలఁ గల్గించుచుఁ గులాచారముల మానిన రాక్షసు లిందున్నవారు కదా. వారి ప్రతాప మింకను వేండ్రముగాక ముందే పయనము సాగింతుమనుభావమే యిందుఁ గలవిశేషము. అనఁగా నధర్మవృద్ధికరులగురాక్షసు లింక నెక్కొనఁజాలరని శ్రీరాముఁడు మునికి నభయదానముచేసె ననువిషయము మన కీభాగము బోధించుచున్నది.

"అరిష్టం గచ్ఛ పంథానం రామ సౌమిత్రిణా సహ,
సీతయా చానయా సార్థం ఛాయయేవానువృత్తయా."   ౧౧

అనునిది సుతీక్ష్ణమునివాక్యము. నీకు మార్గ ముపద్రవము లేక యుండుఁగాక అనునది సామాన్యార్థము. విశేషార్థ మేమనఁగా, ఓ శ్రీరామా! నీడవలె ననువృత్తురాలగు నీసీతంగూడి లక్ష్మణుని తోడ న్యాయమార్గమునఁ బొమ్ము. రిష్టమన నుపద్రవము. అరిష్ట మనుపద్రవము. ఎం దుపద్రవము లుండవు? న్యాయ మార్గముననే. ఇట్లనుటచే నొకవిశేషార్థ మిందు మునిచే నుప దేశింపఁబడియెను. నీడ మన కగపడిన నగపడకయున్న మనల ననుసరించియే యుండును. అట్లే మహాప్రకృతి పరమేశ్వరు ననుసరించియే యుండును. వారి కెడఁబాటు గల్గింప బ్రహ్మా దులకేఁ దరంబుగాదు. అగ్నికి నుష్ణమునకును, జంద్ర చంద్రి కలకు, సూర్యాతపములకు నెట్లు వేఱుపాటు గల్గింప శక్య మగును? అట్లే ప్రకృతిపురుషులకు నని భావము. దీనిచే సీతా రాముల కెడఁబాటు కలుగనేరదనియు రావణుఁడు సీత నప హరించుట లోకసామాన్యదృష్టికే యనియు వాస్తవముగా సీత శ్రీరామునికడనే యుండుననియుఁ దెలెడిని. అనఁగా నామహాప్రకృతి లోకులకు ధర్మ ముపదేశింపఁబూని యధర్మ ప్రవర్తకులకుం గల్గుపాట్లు తెలుపుటకై యొకశరీరమును గల్పించి రావణునిదృష్టి కామె సీతయే యని తోఁపఁజేసి తదప హారణమున నాతని శ్రీరామునిమూలమున వధించెనని సారము. అట్లు గానిచో శ్రీరాముఁడు భగవంతుఁ డనుట చెల్లదు. సీత యయోనిజాత యనుటయు నసంగతమగును. కనుకఁ బైన వ్రాసినదే వాస్తవార్థము. ఇట్లు ముని పలుకుటంబట్టి యూహిం పఁగా సీత సర్వకార్యనిర్వాహకురాలగు ప్రకృతి యనియు శ్రీరాముఁడు సర్వసాక్షియగు భగవంతుఁ డనియుఁ దేలు చున్నది. ఈయర్థమునే శ్రీశంకరభగవత్పాదులు,

"త్రయాణాం దేవానాం త్రిగుణజనితానాం తవ శివే
భవేత్పూజా పూజా తవ చరణయోర్యా విరచితా,
తథా హి త్వత్పాదోద్వహనమణిపీఠస్య నికటే
స్థితా హ్యేతే శశ్వన్ముకుళితకరోత్తంసమకుటాః. ౨౫
విరించిః పంచత్వం వ్రజతి హరిరాప్నోతి విరతిం
వినాశం కీనాశో భజతి ధనదో యాతి నిధనం,
వితంద్రీ మాహేంద్రీ వితతిరపి సమ్మీలితదృశా
మహాసంహారేఽస్మిన్ విహరతి సతి త్వత్పతిరసౌ." ౨౬

అను నీశ్లోకములమూలమునఁ జేటపఱచిరి. అనఁగా త్రిమూర్తు లనఁబడు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు కూడ మహాప్రళయమున నశింపఁ బ్రకృతిపురుషులు మాత్రమే యవ్యయానందమున నుందురని భావము. ఇట్లనుటంజేసి సీతాపహారణము లోక సామాన్యదృష్టికి మాత్రమే తోఁచునదియనియే సారము. అని మన కీభాగము బోధించుచున్నది.

"తతశ్శుభతరే తూణీ ధనుషీ చాయతేక్షణా,
దదౌ సీతా తయోర్భ్రాత్రోః ఖడ్గౌ చ విమలౌ తతః. ౧౮
ఆబధ్య చ శుభే తూణీ చాపౌ చాదాయ సస్వనౌ,
నిష్క్రాంతావాశ్రమాద్గంతుముభౌ తౌ రామలక్ష్మణౌ. ౧౯
శ్రీమంతౌ రూపసంపన్నౌ దీప్యమానౌ స్వతేజసా,
ప్రస్థితౌ ధృతచాపౌ తౌ సీతయా సహ రాఘవౌ." ౨౦

అని మూలము.

"ఆశ్రమప్రవేశే కిమస్మాకమాయుధైరితి మన్యమానా సీతా ఆయుధాని మునిగృహే కుత్రచిన్నిహితవతీ. అథ అమార్గేణేత్యాది రామ వాక్యేన అరిష్టం గచ్ఛేత్యాది మునివాక్యేన చ తయోర్హృదయం విదిత్వా స్వయమేవాదాయ పునర్దత్తవతీతి."

అని గోవిందరాజులు వ్రాసిరి. ఈయూహా సీతకుం గల్గుట యీ యాశ్రమమునందే కాఁబోలు. ఆయుధములను దాఁచి పెట్టుట మరల నిచ్చుట సీతకే యధికారము కాఁబోలు. ఇది సుసంగత ముగాఁ దోఁపదు. వాస్తవార్థ మేమనఁగా దండకారణ్యమున నింతదనుక రాక్షసవీరులు కనఁబడలేదు. విరాధుఁడు రక్కసుఁడు కాఁడు. శాపవశమున నట్లయ్యెను. ఇఁకఁ దమయవతార ఫలమగు రాక్షససంహారము కానున్నది జనస్థాన మాచెంతనే కలదు. ఖరదూషణాదులసంహారము కావలయును. ప్రకృతి యగు సీత తానుగా యుద్ధముచేయఁదగిన యవతార మిది కాదు. శ్రీరామునిమూలమునఁ జేయించి లోకమున గృహస్థులకుధర్మమురీతి నెఱిఁగింపవలయును. కావున సర్వజ్ఞురాలగు నాదేవి యుద్ధసాధనములను వారి కొసంగెను. ఇట్లర్థమును గ్రహించిననే యసంగతము లుండవు. భగవంతుని సర్వసాక్షిత్వమున కించుకంతయు బాధ రానేరదు. ఇఁక నవ్వలిచరిత్రము బఱింతము. అం దీయాశయము స్పష్టము కాఁగలదు.

## శ్రీరామునిశపథము, సీతాప్రార్థనము

* మునియనుమతినొంది పయనము సాగింపఁగా నాథుం గాంచి సీతాంబిక హితములు ప్రియములు నగుపలుకుల నిట్లు లడిగెను. శ్రీరామభద్రా! నీవనుష్ఠించు నీమునిధర్మ ముత్తమమైనది. ఈధర్మమును సూక్ష్మమార్గమున విచారించి ధర్మనిరతులు గ్రైకొందురు. ఆమార్గ మెద్దియనఁగా, స్వకామజనితములగువ్యసనముల విసర్జింపవలయును. అట్టివారే దీని నార్జింప శక్తులగుదురు. అత్యంతకామజనితములగు వ్యసనములవి

* ఇది తొమ్మిదవ సర్గమునఁ గలదు.

మూఁడే యున్నవి. అసత్యభాషణము గొప్పవ్యసనమే యగు. పరభార్యాగమనము వైరము లేక హింసచేయుట యను నీ రెండును దానిని మించినవియే యగును. మహాత్మా! ఇంత దనుక నబద్ధము నీవు పలుకలేదు. ఇఁక ముందును బలుకవు. అధర్మరూపమగు పరభార్యాభిలాషము నీకుం గలుగదు. అయ్యది యిపుడు లేదు. పూర్వము కలుగలేదు. భావికాలము నందును గలుగఁబోదు. దీనికి హేతువు కలదు. నీవు నిరంతరము భార్యయందే యాసక్తికలవాఁడవు. పరమధర్మాత్ముఁడవు. సత్యవచనుఁడవు. కనుకఁగదా పితృవాక్యము నెఱవేర్చితివి. వైరాగ్యమున సౌమిత్రికంటె నధికుఁడవు. ధర్మము సత్యము నీయందే నిలిచియున్నవి. ఐశ్వర్యవైరాగ్యప్రముఖములు నిన్నే యాశ్రయించి యున్నవి. ఇట్టివన్నియు జితేంద్రియుల యందే యుండుఁగాని యితరులయం దుండఁజాలవని నే నెఱుంగుదును. నీవు జితేంద్రియుఁడవని నే నెఱుంగుదును. ఇందులకు శుభతమమగు నీరూపమే ప్రమాణము. వైరములేక యొరులప్రాణములను హింసించుట మహారౌద్రవ్యసనము. దానిని పామరులే యాచరింతురు. అది యిత్తఱి నీవు చేయఁ దగియున్నది. దండకారణ్యమున నుండుమునులను రక్షింప రాక్షసుల నందఱ వధింతునని శపథముచేసితివి కదా. మునుల వేఁడికోలు లేకయే సోదరుంగూడి శరశరాసనములఁ దాల్చి యిచటి కరుదెంచితివి. ఇపుడు నీ కీవ్యసనజనితకష్టములు వదలి సుఖ మెట్లు కలుగును? తత్సాధనము లిందేమి కలవు? అని యాలోచింపఁబూన నామనస్సు చింతాసాగరనిమగ్న మగుచున్నది. ఇఁకను ముందున కరుగ నాకిష్టము కలుగకున్నది. ఏల యన్న వచింతును.

ధనుర్బాణముఁ దాల్చి సోదరుంగూడియున్న నీవిందుఁ గనఁబడు రాక్షసులపై శరవర్షముఁ గురియింపకుందువా? అగ్నికి దారువులు చెంతనున్న నెట్లో రాజులకుఁ దగ్గర ధనుస్సున్నఁ దేజోబలములు వర్ధిల్లును. ఒక్కకథ నుదాహరణ ముగా వినిపింతును మున్నొక్కతఱి మృగపక్షులు హాయిగా నుండు నొకయడవియం దొకముని యుండెనఁట. సత్య వాదియుఁ బరమపావనుఁడు నతఁ డగునఁట. ఇంద్రుఁ డాతని తపమును బాడుచేయఁ బూని భటరూపమును దాల్చి ఖడ్గ హస్తుఁడై యతనికడ కరుదెంచెను. తనఖడ్గమును గొంత కాలము దాఁచియుంచి నాకిమ్మని వినయమునఁ బ్రార్థించి యమ్ముని సమ్మతింపఁగా నతఁ డరిగెను. ఆముని దానిం గాపాడుటయందు హెచ్చరిక కలిగి దానిం బట్టుకొనియే తిరుగు చుండెను. ఫలమూలాదులం దెచ్చుటకుఁ బోయినపుడును దానిని వదలకయుండెను. దాన నతనికిఁ గ్రమముగాఁ దపో నిరతి తొలఁగి యాయుధధారులకుం గల్గురౌద్రబుద్ధి కల్గుడు నాతఁడు నరకకూపమునఁ బడియెను. ఆయుధసంబంధమున మున్నిట్టివృత్తాంతము సాగెను. అగ్నిసంబంధ మెట్లో ఆయుధ సంబంధ మట్టిదియే యని యార్యులందురు. నీయందుఁ గల ప్రీతిం బట్టియు నాయందు నీకుండుగౌరవమునుబట్టియు నీవెఱింగిన దానినే జ్ఞాపకముచేయుచున్నాను. అంతియగాని వేఱుగాదు. నిరపరాధులను బగలేక చంపరాదు. దండకారణ్యమున వసించు మునులు బాధింపఁబడుదురేని వారికి బాధగల్గించువారిని దఱిమి మునులఁ గాపాడుటయే వీరక్షత్రియులధర్మము ధనుః కృతకార్య మదియే. అంతియగాని యాబాధకులనెల్ల హింసిం చుట న్యాయ్యముకాదు.ధనుర్ధారణము రాజ్యపాలనకాలమున

నొప్పును. అడవిఁ దపముసేయుతఱి రాజధర్మమునకు నూఁత యగుధనుర్ధారణ మెందులకు? ఇది విరుద్ధముకదా. మన మిప్పు డెందున్నామో దానికిఁ దగినధర్మమునే పాటింపవలయును. ఈదేశమునకుఁ దగినది తపస్సే. మహాత్మా! ఆయుధధారణమున బుద్ధి తాలుమాలగును. కనుక దాని మాని తపము నూనుము. మరల నయోధ్యకుం బోయినతఱి నాయుధధారణముఁ గావింపవచ్చును. ఇఁక నీవెప్పటికిని రాజ్యము వలదని సర్వదా మునివృత్తి నుందువేని అత్తయగుకైకకు మామయగుదశరథు నకు నవ్యయానందము కలుగును నీబుద్ధియు నిర్మలమై యుండును. ధర్మమే సుఖజనకము. సర్వము ధర్మసంభవమే కదా. కనుక నీలోకమునకు ధర్మమే సారము. కుశలురగు వారు చాంద్రాయణాదివ్రతములఁ దనువును గృశింపఁజేసి ధర్మము నార్జింతురు. ఏకాలమునఁగాని సుఖమువలన సుఖము కలుగదు. కాన నిరంతర మీతపోవనములనుండి ధర్మము నాచరింపుము. త్రిజగద్వృత్తాంతములు నీవెఱుంగనివి లేవు. స్త్రీసమాజమగుచాపలమున నే నిట్లు పలికితిని. సర్వవిదుఁడవగు నీకు ధర్మము తెలుపువాఁ డెవఁడు? నీబుద్ధినే సాయముగాఁ గొని లక్ష్మణునితో నాలోచించి యిచ్ఛానుసారముగా నొన రింపుము.

ఆర్యులారా! ఈభాగమున విశేషము లెన్నియో కలవు. వానిని విమర్శించి కనుఁగొందము. పూర్వాధ్యాయమున సీత యాయుధముల నొసంగి శ్రీరామునిఁ బురికొలిపెనని తెలిసి కొంటిమి. దానికి విరుద్ధముగా సీతోపదేశ మిందుఁ గలదని సామాన్యదృష్టికిందోఁచు. నిక్కమేమి యని పరికించుటయే మనపని. ధర్మస్వరూప మిందుఁ గలదు. శ్రీరామునకు సీత

ధర్మ ముపదేశించుట స్థూలదృష్టికిని లోకాచారమునకు విరుద్ధముగా నుండును. కాని సూక్ష్మదృష్టిం బరికింప నయ్యది న్యాయ్యముగఁ దోఁచును. శ్రీరాముఁడు పరమేశ్వరుఁడనియు సీత ప్రకృతియనియు నీగ్రంథమున మొదటనుండి మనము విమర్శించుచున్నాము. పరమాత్మ నిర్గుణుఁడు. నిర్లిప్తుఁడు. సర్వసాక్షి. ప్రకృతియే సర్వకార్యనిర్వాహకురాలు. తత్సాన్నిధ్యమున నేయసాధ్యకార్యమ్మునైన సాధించును. భగవత్సాన్నిధ్యము లేనిచో నశక్తురాలగుఁగదా యని ప్రశ్నించువారనభిజ్ఞులు. వారి కవినాభావసంబంధము కదా. ఎడఁబాయు టెట్లు? ఇఁక మూలమును విమర్శింతము.

"త్రీణ్యేవ వ్యసనాన్యత్ర కామజాని భవంత్యుత,
మిథ్యావాక్యం పరమకం తస్మాద్గురుతరావుభౌ. 3
పరదారాభిగమనం వినా వైరం చ రౌద్రతా."

అని మూలము ప్రాయికముగా నిందలిధర్మములు క్షత్రియోచితములే. మునులకు నుచితములు కావు.

"కామజేషు ప్రసక్తో హి వ్యసనేషు మహీపతిః,
వియుజ్యతేఽర్థధర్మాభ్యాం క్రోధజేష్వాత్మనైవ తు. ४६
మృగయాక్షో దివాస్వప్నః పరివాద స్త్రియోమదః,
తౌర్యత్రికం వృథాట్యాచ కామజో దశకో గణః. ४७
పైశున్యం సాహసం ద్రోహ ఈర్ష్యాసూయార్థదూషణం,
వాగ్దండజం చ పారుష్యం క్రోధజోఽపి గణోఽష్టకః. ४८
పానమక్షాః స్త్రియశ్చైవ మృగయా చ యథాక్రమం,
ఏతత్కష్టతమం విద్యా చ్చతుష్కం కామజే గణే. ౫౦
దండస్య పాతనం చైవ వాక్పారుష్యార్థదూషణే,
క్రోధజేఽపి గణే విద్యా త్కష్టమేతత్త్రికం సదా. ౫౧

సప్తకస్యాస్య వర్గస్య సర్వత్రైవానుషంగిణః,
పూర్వం పూర్వం గురుతరం విద్యాద్వ్యసనమాత్మవాన్. ౫౨
వ్యసనస్య చ మృత్యోశ్చ వ్యసనం కష్టముచ్యతే,
వ్యసన్యధోఽధో వ్రజతి స్వర్యాత్యవ్యసనీ మృతః." ౫౩

మనుస్మృతి ౭ అధ్యా.

అని మనుస్మృతి బోధించెడిని. దీనికి విరుద్ధముగా నీరామాయణమునఁ జెప్పఁబడినది కదా. ఇందేది గ్రాహ్యమనునదియే యెఱుంగఁదగినది. సీత అసత్యభాషణపరదారాభిగమన నిర్నిమిత్తరౌద్రతలు కామజములగువ్యసనములని మూఁడింటినే నొక్కి చెప్పెను. ఇది స్మృతివిరుద్ధము కాదా యన్నఁ గాదనవలయు. ఏలయనఁగా సామాన్యమానవధర్మములు భగవదవతారమునం దన్వయింపవు. ప్రస్తుతము సీత శ్రీరాములఁ బ్రోత్సహించునెపమున లోకులకు ధర్మ ముపదేశించుచున్నది. ఈయవతారమునఁ బరదారాభిగమనము, అసత్యభాషణము, నిష్కారణ రౌద్రత్వము ననువానికిఁ దగినశిక్షలు విధించి వాని నడంప నూహించెను. కనుకనే యామూఁడింటిని జేర్కొనెను. క్రమముగా వైరములేక పగవానిపైనను గోపమూనుట. పరభార్యను గవయఁగోరుట. అసత్యము మాటలాడుట యొకదానికంటె నొకటి యల్పపాపములని సీత వక్కాణించెను. అనఁగాఁ బరహింసయుఁ బరభార్యారతియు నసత్యభాషణము దుష్కార్యములనియే సీతోపదేశసారము. కావున స్మృతి విరుద్ధమని మనము తలంపరాదు.

"మిథ్యావాక్యం న తే భూతం న భవిష్యతి రాఘవ. ౪
కుతోఽభిలాషణం స్త్రీణాం పరేషాం ధర్మనాశనం,
తవ నాస్తి మనుష్యేంద్ర న చాభూత్తే కదాచన. ౫

మనస్యపి తథా రామ న చైతద్విద్యతే క్వచిత్,
స్వదారనిరతస్త్వం చ నిత్యమేవ నృపాత్మజ. ౬
ధర్మిష్ఠ స్సత్యసంధశ్చ పితుర్నిర్దేశకారకః,
సత్యసంధ మహాభాగ శ్రీమన్ లక్ష్మణపూర్వజ. ౭
త్వయి సత్యం చ ధర్మశ్చ త్వయి సర్వం ప్రతిష్ఠితం,
తచ్చ సర్వం మహాబాహో శక్యం ధర్తుం జితేంద్రియైః. ౮
తవ వశ్యేంద్రియత్వం చ జానామి శుభదర్శన."

అనునివి సీతావాక్యములు. సీత యీవాక్యములమూలమున శ్రీరామప్రవృత్తిం దెలుపుచు లోకులకు ధర్మ ముపదేశించుచున్నది. ఎవం డసత్యము పలుకలేదో యింకఁ బలుకకుండఁ గలఁడో ఎప్పుడుగాని పరభార్యలధర్మము ననఁగాఁ బాతివ్రత్యమునకు భంగము గల్గించునభిలాషము నూనఁడో వాఁడే యుత్తమపురుషుఁడు. స్త్రీలయందుఁగూడ నిది యన్వయింపవలయు. మనోవాక్కాయకర్మములయందుఁ బరపురుషుని గోరక దబ్బఱలాడకయుండుస్త్రీ యుత్తమస్త్రీ యనంబడు నని భావము. శ్రీరామావతారమునందు భగవంతుఁడు మహాప్రకృతియు నీపాపాచారములను మూఁడింటిని స్వప్రవృత్తి మూలమున నడంపఁబూనిరి. ఉపదేశించునవతార మిది కాదు, అది సులభము. తమరు నిర్దుష్టముగాఁ బ్రవర్తించి తన్మూలమున లోకులు సత్ప్రవర్తనముగలవార లగునట్లు చేయుట మహాకష్టకార్యము. కాని యపుడపుడు లోకులకుఁ బ్రస్తావవశమున స్వప్రవృత్తినే తెలుపుచు బుద్ధిమంతులు దానిసారమెఱుంగునట్లు చేయుటయు నీయవతారమునఁ గలదు. ఆపద్ధతియే యిందు ననుసరింపఁబడినది. ఎన్నిధర్మము లాచరించినను పైనిబేరుకొనిన మూఁడింటిని మానలేని వారు ధర్మము నాచ

రించినవారు కానేరరు హింసాకర్మమును మాని పరదారాభి
రతిని వదలి క్రోధ మూనకయుండువారే ధర్మాత్ములని సీతోప
దేశమనుదానిని మన మెఱుంగవలయును. రామా! నీయందు
సత్యధర్మములు ప్రతిష్ఠింపఁబడినవి. ఇవి జితేంద్రియులకే
శక్యములు. నీయందుఁగల వశ్యేంద్రియత్వము నే నెఱుంగు
దును. అని సీత పలికెను. జితేంద్రియులు కానివారలు సత్య
ధర్మములను జక్కఁగా ననుష్ఠానమున నిలుపుకొనఁజాల
రనియేకదా భావము. భగవంతునిదగుశక్తి నెఱుంగఁజాలు
వా రెవరు? భగవతియగు మహాప్రకృతియే. అను నీవిష
యము సీత మనకు బోధించెను. దీనిచే సీతయందుఁ గల
ప్రేమము లోకాచారానుసారము కాదనియు సయ్యది లోకు
లకు నుపదేశింపఁ గనఁబఱుపఁబడినదనియు వారనాదిదంపతు
లనఁగా నవినాభావసంబంధము కలవారనియు నిచ్ఛామాత్ర
ముననే సృష్టిచేయువారేకాని మైథునకర్మమూలమునఁ గాద
నియు మన మిందలి సారమని తెలిసికొనవలయు. లోకమున
భార్యాభర్తలు కూడ

"ఇయ మంబా జగద్ధాత్రీ పురుషోఽహం సదాశివః. ౩౧
పంచవింశతి తత్త్వానాం ప్రీతయే మత్యతేఽధునా,
ఏతన్మంత్రానుభావస్యోన్మథనా క్రియతే యది. ౩౨
తావుభౌ పుణ్యకర్మాణౌ న దోషో విద్యతే తయోః."

అనుసూక్తి ననుసరించియే ప్రవర్తింపవలయుననియు నిట్లు
ప్రవర్తింప నలవాటుచేసికొనువారలకుఁ బరదారాభిగమన
వాంఛయే నశించుననియు సీతాదేవి మనకు నుపదేశించెనని
మన మూహించి యట్టి సదాచారవంతులము కావలయును.
ఈసంభాషణమూలమున సీతారాములకు విరహామే యసం

భవమని తేలెను. దీనిని మనము షట్కుపకయుండినయెడల సీతాపహరణాదులు కల్పితములనియే స్పష్టములగును. ప్రకృతి పురుషులనుగా సీతారాములను మనము ధ్యానించుటయే రామాయణపారాయణఫలము.

"తృతీయం యదిదం రౌద్రం పరప్రాణాభిహింసనం. ౯
నిర్వైరం క్రియతే మోహాత్తచ్చ తే సముపస్థితం,
ప్రతిజ్ఞాతస్త్వయా వీర దండకారణ్యవాసినాం. ౧౦
ఋషీణాం రక్షణార్థాయ వధస్సంయతి రక్షసాం,
ఏతన్నిమిత్తం చ వనం దండకా ఇతి విశ్రుతం. ౧౧
ప్రస్థితస్త్వం సహ భ్రాత్రా ధృతబాణశరాసనః,
తతస్త్వాం ప్రస్థితం దృష్ట్వా మమ చింతాకులం మనః. ౧౨
త్వద్వృత్తం చింతయంత్యా వై భవేన్నిశ్శ్రేయసం హితం,
న హి మే రోచతే వీర గమనం దండకాన్ ప్రతి." ౧౩

అని మూలము. ఈసీతోపదేశముపూర్వము పల్కినదానికి విరుద్ధముగాఁ దోలుతఁ దోఁచును. కాని విమర్శించిన న్యాయ్యముగానే తోఁచును. ఎట్లనఁగా వినుఁడు. మునులు ప్రార్థింపఁగా రామమూర్తి రక్కసుల వధింతుననియె కదా. ఆప్రతిన సామాన్యధర్మము ననుసరించి యోజింపఁగా నధర్మమనియే తేలును. విశేషధర్మము ననుసరించియే మనము విమర్శింపవలయు. ఈవాక్కులనుండి తేలెడుధర్మమేది యనుటయే మనవిమర్శమునకు ఫలముగా నుండవలయు.

"అదీర్ఘసూత్ర స్మృతిమానక్షుద్రోఽపరుషస్తథా,
ధార్మికోఽవ్యసనశ్చైవ ప్రాజ్ఞశ్శూరో రహస్యవిత్." ౩౧౦

అను యాజ్ఞవల్క్యస్మృతి ననుసరించి యపరుషత్వము అవ్య సనిత్వము రాజధర్మములు. ఇపుడు రాముని ప్రతిన ననుసరించిన నవిరెండు విపరీతములయ్యెనని తోఁచును. ఇట్టివిపరీతములు మానవులకు శ్రీరామునివిషయమునఁ దోఁపకయుండఁ జేయుటయే సీతాంబికకార్యము. కనుకనే దండకారణ్య ప్రవేశము నే నిష్టపడనని తెలిపెను. నీకతినప్రతిజ్ఞ నామనస్సును గలవరపెట్టుచున్నదని యామె పలికెను. ఈప్రశ్నమునఁ గలసార మేమనఁగా, మానవు లెవ్వరుగాని సామాన్యధర్మము ననుసరించువారలు కూడఁ దన కపకారము చేయని వారిపై నాగ్రహము పూనరాదనియు వెగటుగా శపథములు పలుకరాదనియు నిష్కారణవైర మన్యాయ్యమనియు దాన నార్జించిన యశస్సు క్షీణించుననియు సారమని తెలిసికొనవలయును. పతి దుర్వృత్తిఁ బ్రవర్తించునపుడు భార్య యాక్షేపించి హితము తెలుపుట తప్పుగాదనియు నయ్యది పతి కెదురాడరాదన్నధర్మమునకు విరుద్ధముకాదనియు మన మెఱుంగవలయును. హింసాకర్మ మత్యుగ్రకర్మముగాన దాని మానుపఁ బ్రయత్నించువారే మేలుకోరినవా రనువిషయము మన మెఱుంగుటయే తెలుఁగు.

సీత యిట్లు తెలుపుచు నొకకథ నుదాహరించెను. కథ మున్నే వ్రాయఁబడియెఁగదా.

"నిత్యం శస్త్రం పరివహన్ క్రమేణ స తపోధనః. ౨౧

చకార రౌద్రీం స్వాం బుద్ధిం త్యక్త్వా తపసి నిశ్చయం,
తతస్స రౌద్రేఽభిరతః ప్రమత్తో ధర్మకర్శితః. ౨౨

తస్య శస్త్రస్య సంవాసా జ్జగామ నరకం మునిః.

... ... ... ... ...

అగ్నిసంయోగవద్ధేతుశ్శస్త్రసంయోగ ఉచ్యతే,
స్నేహాచ్చ బహుమానాచ్చ స్మారయే త్వాం న శిక్షయే. ౨౪
అపరాధం వినా హంతుం లోకాన్ వీర న కామయే,
క్షత్రియాణాం తు వీరాణాం వనేషు నిరతాత్మనాం. ౨౬
ధనుషా కార్య మేతావదార్తానా మభిరక్షణం,
క్వచ శస్త్రం క్వచ వనం క్వచ క్షాత్రం తపః క్వచ. ౨౭
వ్యావిద్ధ మిదమస్మాభి ర్దేశధర్మస్తు పూజ్యతాం,
తదార్య కలుషాబుద్ధి ర్జాయతే శస్త్రసేవనాత్. ౨౮
పునర్గత్వా త్వయాయోధ్యాం క్షత్రధర్మః చరిష్యసి."

అని మూలము. దీనిసారమేమి? హింసాకర్మము నాచరింప కుండుటయే కాక దాని కనుకూలమగుసాధనముల దగ్గరఁగూడ నుండరాదు. వానిసాంగత్యము శాంతము నడంచి క్రూరకర్మాభి రతిని బుట్టించును. కావున బుద్ధిమంతులు హింసాకర్మానుకూల వస్తువుల చెంతఁగూడ నుండరాదు. పూర్వార్జితపుణ్యాత్మ ఫల ములుగూడ నశించును. క్రూరవస్తుసంసర్గ మగ్నిసంసర్గమువలెఁ గాల్చివేయును. అనునదియే కదా. మఱొక్కవిషయ మీ మూలమున సీతాదేవి స్త్రీలకుఁ దెలుపుచున్నది. పతి దుర్వృత్తి నాచరించునపుడు భార్య యిది తప్పని శాసింపక మరియాదగా మైత్రి నెఱపుచుఁ బలుకవలయునే కాని దండించునట్లు పలుక రాదను సదాచారమును స్త్రీలు నేర్చుకొనవలయును.

"సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాన్న బ్రూయాత్సత్యమప్రియం,
ప్రియం చ నానృతం బ్రూయా దేష ధర్మ స్సనాతనః."

అన్న మనుస్మృతిధర్మము ననుసరించి నిజము పల్కినను హితము గాఁ బలుకవలయును. ఇది భార్యకే కాదు. భర్తయు భార్య

యజ్ఞానమున నొకయపరాధము గావించుచో హితమితోక్తులచే స్నేహము నెఱపుచుఁ దెలుపవలయు నే కాని పరుషవాక్యములఁ బలుకరాదు. ఈధర్మము స్త్రీపురుషులకు సమానమే యగును. అంతియగాని పురుషులకు వారిభార్యలు ధర్మము తెలుపఁ గూడదనుట యజ్ఞానమూలమే యగును. "బాలాదపి సుభాషితమ్" అను మనుస్మృతివచనము వ్యర్థము కారాదు.

"అక్షయా తు భవేత్ప్రీతిశ్శ్వశురశ్వశురయోర్మమ. ౨౮
యది రాజ్యం పరిత్యజ్య భవేస్త్వం నిరతో మునిః."

అని మూలము. ఈమాట సీత పలుకుటంజేసి అత్తయందు మామయందా మెకసూయ యున్నదని కొందఱూహింప నవకాశము కలదు. తత్త్వమయ్యది కాదు. దశరథుఁడు మృతుఁడగుట సీత యెఱుఁగునుగదా. అట్టి మామప్రస్తావ మేల చేసెను? అనఁగా నాలకింపుఁడు. పుత్త్రశోకమున మృతుఁడగు దశరథుఁ డుత్తమలోకమున కరిగి యందు దేవతాకార్యమునకై శ్రీరాముఁ డడవుల కరుగుట నాలకించి రాజ్యవియోగదుఃఖము పోవఁగా నానందించును. ఆయానంద మక్షయము. ఏల? భగవంతుఁడు తనకొడుకుగా నవతరించెనని తెలియుటంజేసి యవ్యయప్రీతి కలుగును. శ్రీరాముని సత్యసంధత్వభ్రాతృవాత్సల్యాదిసద్గుణముల నెఱింగి వనవాసము లోకోపకారకమని తెలిసికొని కైక యానందించును. అనియే సీత యీమాటలు పలికెను. మహాప్రకృతియగుసీత కైకవ్యాదయము నెఱుంగఁజాలదా. తనప్రోత్సాహముననే యాకైకయవ్వరముల నడిగెనని తా నెఱుంగునుగదా. కావున శ్రీరామా! నీవనవాసము తల్లిదండ్రులకే యానందకరమగుచుండ నిఁక దేవమానులకు నానందజనకమే యని వేఱుగాఁ జెప్ప

వలయునా? అని సీతాదేవ్యభిప్రాయమని మన మెఱుంగ వలయును.

"ధర్మాదర్థః ప్రభవతి ధర్మాత్ప్రభవతే సుఖం. 30
ధర్మేణ లభతే సర్వం ధర్మసారమిదం జగత్,
ఆత్మానం నియమైస్తైస్తైః కర్శయిత్వా ప్రయత్నతః. 31
ప్రాప్యతే నిపుణై ర్ధర్మో న సుఖా ల్లభ్యతే సుఖం,
నిత్యం శుచిమతిస్సౌమ్య చర ధర్మం తపోవనే." 32

అని మూలము. ధర్మమే సర్వసంపన్మూలమని సీత యిందుమూలమున నెల్లరకు నుపదేశించుచున్నది. పెక్కునియమములచేం దనను గృశింపంజేసి (అనంగాం గామసంకల్పములను క్షీణింపంజేసి యని యర్థము) యోగులు ధర్మము నార్జింతురు. సుఖమువలన సుఖము కలుగదు. అనంగా శ్రమించినంగాని సుఖము లభింపదని భావము. కుడిచి కూరుచుండి చచ్చువేదాంతపుమాట లుపదేశించుచుండు కపటయోగులకు వేషధారులకు ధనార్జనాసక్తులకుం దుదకు దుఃఖమే కాని శాంతరూపసుఖమేలాగు లభించును? నియమములకు లోనై యోగము నభ్యసించి జితేంద్రియుండైనవానికే సుఖము అనంగా మనశ్శాంతి లభించునని భావము. ధర్మార్జనమనంగా భగవంతు నార్జించుట. అనంగా భగవత్కరుణకుం బాత్రులమగుట యనియే దీని సారము.

"వృషో హి భగవాన్ ధర్మ స్తస్య యః కురుతే హ్యలం,
వృషలం తం విదుర్దేవా స్తస్మా ద్ధర్మం న లోపయేత్. 16
ఏక ఏవ సుహృద్ధర్మో నిధనేఽప్యను యాతి యః,
శరీరేణ సమం నాశం సర్వమన్యద్ధి గచ్ఛతి." 17

మను. 8 అధ్యా.

అని స్మృతి బోధించునర్థమే యీ రామాయణముకూడఁ దెల్పు చున్నది.

"సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ,
అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాంతం చ నిగచ్ఛతి. 36
యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమం,
తత్సుఖం సాత్వికం ప్రోక్త మాత్మబుద్ధిప్రసాదజం. 37
విషయేంద్రియసంయోగాద్య త్తదగ్రేఽమృతోపమం,
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతం. 38
యదగ్రే చానుబంధే చ సుఖం మోహనమాత్మనః,
నిద్రాలస్యప్రమోదోత్థం తత్తామసముదాహృతం." 39

భగవద్గీత. ౧౮ అధ్యా.

"న సుఖాల్లభ్యతే సుఖమ్" అను నీసీతోపదేశార్థసారమే యీ గీత బోధించెడిని. ధర్మాచరణశ్రమాంతమే సుఖమని భావము. ఓ రామా! నిరంతరము శుచిమతివై అనఁగా మానవత్వము మానుమని భావము. తపోవనమున ధర్మమునుగుణించియే చరింపుము. ఏధర్మమునకై యవతరించితివో యాధర్మమును స్థాపింపఁ బ్రయత్నింపుమని సీత హెచ్చరించెను. ధర్మము నుద్ధరింపఁ బ్రయత్నింపుమని సారము. శ్రీరామున కీవిషయము తెలియదా యందురేమో. ప్రకృతిమూలముననే సర్వకార్యములు సిద్ధింపఁజేయుటయే పరమేశ్వరుని నైజము. కావునఁ దనపనిని దాఁ జేయఁబూని యాసీత హెచ్చరించెనని మన మూహింపవలయును. సర్వజ్ఞుఁడగుపరమేశ్వరుఁ డిచ్ఛామాత్రమున నెల్లకార్యములు సిద్ధింప నిర్లిప్తుఁడై సాక్షిమాత్రుఁడై మహానందము ననుభవించుచుఁ దనను దానే ధ్యానించుకొనుచు సర్వకార్యముల నాసక్తి నొనరించునట్లు నటించుచుండును.

"సర్వం హి విదితం తుభ్యం త్రైలోక్యమపి తత్త్వతః,
స్త్రీచాపలాదేతదుదాహృతం మే ధర్మం చ వక్తుం తవ కస్సమర్థః,
విచార్య బుధ్యా తు సహానుజేన యద్రోచతే తత్కురు మాచిరేణ." 33౫

అని మూలము. సర్వేశ్వరత్వసర్వజ్ఞత్వములుగలవాఁడు శ్రీ రాముఁడని సీత తెలుపుచున్నది. నీవెఱుంగునదియే యిది యంతయు అనఁగా మనము చేయఁబూనునదంతయు నింతకు ముందే నిశ్చితముకదా. తెలుపున దెందులకందువో. స్త్రీసహజ మగు చాపలమున నీమాటలు తెలిపితిని. ధర్మము నీకుఁ దెలుప నెవఁడు సమర్థుఁడగును? అనఁగా ధర్మస్వరూపుఁడవే నీవగుదు వని భావము. సోదరునితో నాలోచించి యేది యెట్లుచేయ సమ్మతమో దాని నట్లే యొనరింపుము. జాగుచేయవలదు. అనఁగా బాహ్యదృష్టికి నింకఁ గొంతకాలము నే నుండనట్లుం దునుగదా. సోదరునితో యోజించి గ్రొడ్డలి నాన పెట్టున ట్లూరకుండక త్వరపడి కార్యమును సాగింపుము. అనుటంజేసి లంకానివాసము నాకుఁ గలుగునపుడు దుఃఖాభినయనమునఁ గార్యము లొనరింపఁబూనకుందువేమో. చేయఁదగినకార్యము లనేకములు గలవు. వానినెల్ల సత్వరుఁడవై యొనరింపుము. అనఁగా మనవలన ముక్తులు కాఁదగినవారు పెక్కండ్రు గలరు గదా. వారికి సకాలమున నుచితరీతి నుపకారము చేయుమా యని హెచ్చరించెను. భార్య భర్తకుఁ దెలుపఁదగినపద్ధతి యిందుఁ గలదు. పతి ప్రమాదంపడి యకార్యము చేయుచుండుతఱి భార్య హితము తెలుపవలయును. కాని యూరకయుండరాదు. ఆపద్ధతి యిందు సీత శ్రీరాములకుఁ దెలిపినట్లుగ నుండ వలయును. కాని శాసించినట్లుండరాదనువిషయ మీభాగము నుండి మన మెఱుంగవలయును.

ఇంతదనుకఁగల యీకథకు నధ్యాత్మరామాయణమునఁ గలకథకు విశేషభేదము కానరాదు. సుతీక్ష్ణముని సంభాషణమున నించుకవిశేష మందుఁగలదు. దాని నుదాహరించెదను.

"త్వం సర్వభూతహృదయేషు కృతాలయోఽసి
త్వన్మంత్రజాప్యవిముఖేషు తనోషి మాయాం,
త్వన్మంత్రసాధనపరేష్వపయాతి మాయా
సేవానురూపఫలదోఽసి యథామహీపః. ౨౯

విశ్వస్య సృష్టిలయసంస్థితిహేతురేక
స్త్వం మాయయా త్రిగుణయా విధిరీశ విష్ణూ,
భాసీశ మోహితధియాం వివిధాకృతిస్త్వం
యద్వద్రవిస్సలిలపాత్రగతోఽప్యనేకః. ౩౦

ప్రత్యక్షతోఽద్యభవతశ్చరణారవిందం
పశ్యామి రామ తమసః పరతస్థ్సితస్య,
త్వద్రూపత స్త్వమసతామవిగోచరోఽపి
త్వన్మంత్రపూతహృదయేషు సదా ప్రసన్నః. ౩౧

పశ్యామి రామ తవ రూప మరూపిణోఽపి
మాయావిడంబనకృతం సుమనుష్యవేషం,
కందర్పకోటిసుభగం కమనీయచాప
చాపం దయార్ద్రహృదయం స్మితచారువక్త్రం. ౩౨

సీతాసమేతమజనాంబరమప్రధృష్యం
సౌమిత్రిణా నియతసేవితపాదపద్మం,
నీలోత్పలద్యుతిమనంతగుణం ప్రశాంతం
మద్భాగధేయమనిశం ప్రణమామి రామం. ౩౩

జానంతు రామ తవ రూపమశేషదేశ
కాలాద్యుపాధిరహితం ఘనచిత్ప్రకాశం,

ప్రత్యక్షతోఽద్య మమ గోచర మేతదేవ
రూపం విభాతు హృదయే న పరం వికాంక్షే. 34

... ... ... ... ... .

మునే జానామి తే చిత్తం నిర్మలం మదుపాసనాత్. 35
అతోఽహ మాగతో ద్రష్టుం మదృతే నాన్యసాధనం,
మన్మంత్రోపాసకా లోకే మామేవ శరణం గతాః. 36
నిరపేక్షా నాన్యగతాస్తేషాం దృశ్యో హమన్వహం,
స్తోత్ర మేతత్పఠేద్యస్తు త్వత్కృతం మత్ప్రియం సదా. 37
సద్భక్తి ర్మే భవేత్తస్య జ్ఞానం చ విమలం భవేత్."

అధ్యాత్మ. అరణ్య. 3 సర్గము.

ఇందలిసార మిదియే.సూర్యుఁడు స్థలభేదమున ననేకరూపములఁ గనంబడినట్లు సర్వకారణకారణుఁడవైన (సర్వకారణము ప్రకృతి. దానికిం గారణము భగవంతుఁడని భావము) నీవు సర్వత్ర వెలయుచుందువు త్రిగుణాత్మికయగుమాయచేఁ గల్పింపఁబడిన బ్రహ్మవిష్ణుమహేశ్వరులుగా నీవేం తోఁచు చుందువు. అనఁగా భావమేమి?

"మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరం,
హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే."

అన్నగీతావాక్యము ననుసరించి త్రిమూర్తులు శాశ్వతులు గారనియుఁ బ్రకృతిసంభవులనియు వారికిని బ్రకృతికిని మించినతత్త్వ మొక్కఁడుకలదనియు నదియే సర్వకారణకారణ మనియు సారముగదా. త్రిమూర్తులు నందు విష్ణువే శాశ్వతుఁ డనువా రెంతవారో వచింప నలవిగాదు. ఒక్కొక్కబ్రహ్మాండమునకు నధికారపురుషులుగా నీత్రిమూర్తు లుందురు.

ఏ బ్రహ్మాండమున నుండువిష్ణువు శాశ్వతుఁ డనఁబడును? ఇది వెట్టివెంగళిప్పవాదము.

"ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి,
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్." ౧౯
అధ్యా. ౧౩.

అని గీతాశాస్త్రమున శ్రీకృష్ణమూర్తి తెలిపినయట్లు రూప నామక్రియావంతమగునదంతయుఁ బ్రకృతికల్పితమే యగు నని తేలెడింగదా. ప్రకృతిపురుషు లిరువురే శాశ్వతులు. తక్కినభూతకోటియంతయు నస్థిరమే. స్థిరాశబ్దము భూమి యందు, అచలశబ్దము పర్వతమునందు రూఢమైనట్లు, శాశ్వత శబ్దము విష్ణ్వాదులయందు రూఢమని యెఱుంగవలయును. అశ్వత్థామాదులు చిరకాలజీవులుకదా. అట్లే విష్ణ్వాదులునని తెలిసికొనుటుత్తమము. శాశ్వతతత్త్వ మొక్కటియే అది ప్రకృతిమిశ్రము. అవినాభావసంబంధముగలది. తద్భిన్న మంతయు నస్థిరమే.

శ్రీరామా! అరూపుఁడవైనను నీరూపమును జూడఁ గంటినని ముని యనియెఁగదా. "ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా"యన్న యుపనిషద్వాక్యము ననుసరించి యెవ్వరెవ్వ రేయేరూపముల నాత్మయం దాభగవంతుని ధ్యానింతురో వారి కారూపముల నాపరాత్పరుఁడు తోఁచును. దానిచే నతని కొక్కరూపము నియతముకాదని యర్థముకదా కావున నీయిప్పటి సీతాసమేతమై రామనామమునఁ బిల్వఁ బడు నీరూపమే నామనస్సునందు నెల్లపు డుండుఁగాక. మఱొకవాంఛ నాకు లేదని ముని పలికెను. దీనిభావమేమి?

సర్వకర్మఫలత్యాగమే కదా. భగవదర్థమై చేసినతపస్సు ఫలింపఁగా ననఁగా నభీష్టదేవతాదర్శనము కాఁగా నంతకంటె నుత్కృష్టఫలము గోరువాంఛ యడంగును. కోరఁదగినది తత్సందర్శనమే. అదియే యవ్యయానందమిచ్చును.

"ధన్యానాం గిరికందరే నివసతాం జ్యోతిపరం ధ్యాయతాం,
మానందాశ్రుకణాన్ పిబంతి శకునా నిశ్శంకమంకేశయాః."

అన్న భర్తృహరిసూక్తి యీవిషయమునే కదా తెల్పుచున్నది. దీనింబట్టి యూహింపఁగా సర్వవ్యాపకుఁ డగుభగవంతుని నొక్కరూపవంతునిగా భావించి భక్తుఁడు నిశ్చలభక్తి నుపాసించిన నాపరతత్త్వ మారూపముననే తోఁచును. తద్దర్శనమే మహానందప్రదమగును. ఓమునీ! నీవు నిర్మలమనస్కుఁడవు నాయుపాసనమున నైతివని యెఱింగి నిన్నుఁ జూడవచ్చితినని శ్రీరాముఁడు పలికెను. వీనిహృదయ మేమి? శ్రీభగవత్కథాశ్రవణాదులకంటె ధ్యాన ముత్తమోత్తమమనియు నయ్యదియే భగవంతుని సంతుష్టుని జేయఁజాలుననియు బాహ్యపూజాదులంతగా తృప్తినొందఁజేయఁజాలవనియు నియతమనస్కుఁడై ధ్యానయోగమున భగవంతు నారాధించువాఁడే సంపూర్ణ ఫలము నొందఁజాలుననియు నీరామవాక్యసారమని మన మెఱుంగవలయునుగదా. ఈయుపదేశానుసారము కాయకర్మమునకంటె మానసికకర్మ ముత్తమోత్తమమని యర్థము.విగ్రహపూజ యధమమనియే యిందుఁగలసారము. ఆమంత్రోపాసనమునందును ఫలముగోరు టధమపక్షము. నిరపేక్షుఁడై భగవంతు నారాధింపవలయుననుటయే యీభాగమునుండి మన మెఱుంగఁదగినవిషయము. ఇఁకఁ దరువాతికథను బఠింతము.

## శ్రీరాముఁడు సీతాప్రశ్నములకు సమాధానము చెప్పుట.

* సీతాదేవి ప్రీతిపురస్సరముగా నిట్లు తెల్పినమాటల నాలకించియు శ్రీరాముఁడు ధర్మము విడనాడువాఁడు కాఁడు కాన నామె సంశయముల నడంచి యామూలమున లోకులకు నీతిఁ దెల్పం దలంచి యిట్లు పలికెను. జానకీ! నీవు ధర్మజ్ఞురాలవు. కనుక హితవాక్యలం బల్కితివి. నీసద్వంశమర్యాద వెల్లడియయ్యెను. ఇఁక నాయభిప్రాయము నాలకింపుము. ఆర్తుల రక్షింప రాజులు ధనుస్సుల ధరింతురని పల్కితివికదా. నియతవ్రతులై శరణ్యులై దండకాటవిం గలమునులు వారుగా నాకడకు వచ్చి శరణుచొచ్చిరి. ధర్మపరాయణులై ఫలమూలాశనులై యుండుమునులు క్రూరరాక్షసులకు భయంపడి సుఖము నొందనేరకున్నవారు. మాంసాహారప్రియులగు రక్కసులు విచ్చలవిడి యిందుఁ దిరుగుచు మునులంబట్టి భక్షించుచున్నారు. వారిబాధలకుఁ దాళఁజాలక నాకడకు వచ్చి మమ్ముఁ గరుణింపుమని వేఁడుకొనిరి. వారలకు నమస్కరించి నేనే వచ్చి మిమ్ము సేవింపఁదగినవాఁడను. మీరే దయచేసి నన్ను వేఁడుట నాకే లజ్జగా నున్నది. నేనేమి చేయవలయునని పల్కితిని. వారియడవినుండు కామరూపరాక్షసులనుండి మమ్ముఁ గాపాడుమా యని వారివెతలఁ దెల్పిరి. తపఃప్రభావమున వారల మునులు చంపఁజాలుదురు. ఐన శ్రమించి చేసిన తపఃఫలము నశించునని వారట్లు శపింపరు. సీతా! తపస్సు చేయు టత్యంతకష్టము. విఘ్నము లనేకములు దానికిం

---

* ఇది పదియవసర్గమునుండి గ్రహింపఁబడినది.

గలుగు. కాన వాని నన్నింటి నడంచి చేసినతపస్సును దమ్ముఁ జంపుచున్నను రక్కసుల శపించి వ్యయింపఁబూనకున్న వారు. కాఁబట్టియే మనలను దిక్కుగా నమ్మి ప్రార్థించిరి. నేను వారలఁ గాపాడుదునని మాటయిచ్చితిని. నా మేనఁ బ్రాణము లుండఁగా నామాటను నెఱవేర్పక వదలఁజాలనుజుమీ. సత్యము సర్వ కాలముల సర్వావస్థల నాకుం బ్రియమని నీవెఱుంగుదువుకదా. ప్రేయసీ! ప్రాణముల లెక్కింపక వదలుదును. నిన్నైనను సౌమిత్రినైన వదలుదును. కాని యిచ్చినమాటను వదలను. విశేషించి మునులకడఁ జెప్పినమాట విడువనని చెప్పవలయునా వారు తెలుపకపోయినను నే నవశ్యము వారిని రక్షింప వలసినదే. వారు ప్రార్థించి నేను శపథముచేసి వదలఁదగునా! నాకు నీయందుఁ గలస్నేహము నీకు నాయందుఁగలయను రాగము ననువానిమూలమున నీమాటలు తెల్పితివి. సంతోషించితిని. లోకమునఁ బ్రీతిపాత్రమగుచోటనే యుపదేశింతురు. నీమాట నీమనస్సునకుఁ దగినదే. నీవంశమున కనురూపమైనది. నీవు నా ప్రాణాధికురాలవు. అయినను నే నేయేధర్మములను సంకల్పింతునో నీవును వానినే సంకల్పింపవలయును. వేఱుమార్గము కూడదు. అని జానకికి స్వాభిప్రాయముం దెల్పి కోదండమును బూని సౌమిత్రి వెంటరా జానకింగూడి తపోవనములకుఁ బయనము సాగించెను.

మహాశయులారా! ఈభాగము చాల ముఖ్యమైనది. అనేకవిషయము లిందు విమర్శనార్హములు గలవు. వానిని బరిశీలించి యథాశక్తి న్యాయము ననుసరించి కనుఁగొందము. ఇందు సీత తనను బ్రశ్నించుట లోకుల కుపకారకమని శ్రీరాముఁ డెఱింగి తనయాశయమును దెలుపుచున్నాఁడు.

ప్రధానముగా సత్యధర్మరక్షణమే యీ యవతారఫలమని రామోపదేశసారము. మఱియు నార్తరక్షణము నట్టిదియే యనియునగు. అనపరాధుల వధింపఁబూను ప్రతిజ్ఞ న్యాయ్యమా యని సీత ప్రశ్నించెను? ఈప్రశ్నము మానవసామాన్యమునకే యనుకూలము గాఁ గలదని ప్రశ్నించెను.

"సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహం. ౨౯
అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్,
సాధురేవ స మంతవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః." ౩౦.

గీ. ౯ అధ్యా.

అనుభగవద్వాక్యము ననుసరించి శ్రీరామునకుఁ బగవాఁ డెవ్వఁడు లేఁడు. మిత్రుఁడు లేఁడు. వారిదృష్టి కెల్లరు సములే. ఐన నేల యీయవతార మందురేమో. కర్మాను సారము వారువారు ఫలముల నందుచుండఁగా నొకవ్యాజము వలయునుగాన దానిం గల్పించుటయే భగవంతుని కార్యము. దుష్కర్మములకు దుష్ఫలముల ననుభవించుచునుండువారిం గాంచినఁగాని యట్టి కార్యముల నెల్లరు మానరు ఆనీతిని లోకులకుఁ దెలుపుటకే యీయవతారము గలిగినది. కనుక నీసీతాప్రశ్నము లోకులకొఱకే యని మన మూహింపవలసినదియే. ఇపుడు శ్రీరాముఁడు సమాధానము చెప్పవలసియున్నది. ఆసమాధానము మూఁడు విధముల లోకుల కుపకరింపవలయు. దుష్కర్మరతులకు దుష్ఫలానుభవము తప్పదు. భక్తులకు నెన్నికష్టములు కలిగినను వానిని భగవంతుఁడే దొలఁగించును. శుభాశుభకర్మములవలని

ఫలములను లోకు లెఱుంగవలయు. అనునవియే యామూఁడు విధములు.

"వసంతో ధర్మనిరతా వనే మూలఫలాశనాః,
న లభంతే సుఖం భీతా రాక్షసైః క్రూరకర్మభిః. ౫
కాలే కాలే చ నిరతా నియమైర్వివిధైర్వనే,
భక్ష్యంతే రాక్షసైర్భీమైర్నరా మాంసోపజీవినః. ౬
తే భక్ష్యమాణా మునయో దండకారణ్యవాసినః,
అస్మానభ్యవపద్యేతి మామూచుర్ద్విజసత్తమాః. ౭

... ... ... ... ...

ప్రసీదంతు భవంతో మే హ్రీరేషా హి మమాతులా,
యదీదృశైరహం విప్రైరుపస్థేయైరుపస్థితః. ౯

... ... ... ... ...

ఆర్దితాస్మ్యః దృష్ఠం రామ భవాన్నస్తత్ర రక్షతు.
హోమకాలేషు సంప్రాప్తాః పర్వకాలేషు చానఘ,
ధర్షయంతి సుదుర్ధర్షా రాక్షసాః పిశితాశనాః. ౧౨
రాక్షసైర్ధర్షితానాం చ తాపసానాం తపస్వినాం,
గతిం మృగయమాణానాం భవాన్నః పరమా గతిః. ౧౩
కామం తపః ప్రభావేన శక్తా హంతుం నిశాచరాన్,
చిరార్జితం తు నేచ్ఛామస్తపః ఖండయితుం వయం. ౧౪

... ... ... ... ...

రక్ష నస్త్వం సహ భ్రాత్రా త్వన్నాథా హి వయం వనే. ౧౬
అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే సలక్ష్మణాం,
న తు ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః." ౧౯

అని మూలము, ఇందలిసార మేమని విచారింతము. హింసా కర్మమును మాని మూలఫలాదికముల భక్షించువారు

మునులు. అనఁగాఁ దనకొఱకు నితరప్రాణిహింస గావింప రాదనియే నీతి. అహింసావ్రతనిరతియే భగవదనుగ్రహ పాత్ర మగునని సారము. అట్టిసాధువుల హింసించువారే రాక్షసులు. భగవదారాధనమునకు భంగముచేయువారు దుష్టులు. వారు వధ్యులగుదురు. మాంసమునఁ గలప్రీతిచేత నొరులను హింసించుట తపోవిఘ్నముగావించుటకు సాధువుల బాధించుట యనునివి దుష్కృత్యములని సారము.

"యోఽహింసకాని భూతాని హినస్త్యాత్మసుఖేచ్ఛయా,
స జీవంశ్చ మృతశ్చైవ న క్వచిత్సుఖమేధతే. ౪౫
యో బంధనవధక్లేశాన్ ప్రాణినాం న చికీర్షతి,
స సర్వస్య హితప్రేప్సు స్సుఖమత్యంత మశ్నుతే. ౪౬
యద్ధ్యాయతి యత్కురుతే ధృతిం బధ్నాతి యత్ర చ,
తదవాప్నోత్యయత్నేన యో హినస్తి న కించన. ౪౭
నాకృత్వా ప్రాణినాం హింసాం మాంసముత్పద్యతే క్వచిత్,
న చ ప్రాణివధస్స్వర్గ్య స్తస్మాన్మాంసం వివర్జయేత్. ౪౮
సముత్పత్తిం చ మాంసస్య వధబంధౌ చ దేహినాం,
ప్రసమీక్ష్య నివర్తేత సర్వమాంసస్య భక్షణాత్. ౪౯
స్వమాంసం పరమాంసేన యో వర్ధయితుమిచ్ఛతి,
అనభ్యర్చ్య పితౄన్ దేవాంస్తతోఽన్యో నాస్త్యపుణ్యకృత్. ౫౦
ఫలమూలాశనైర్మేధ్యై ర్మున్యన్నానాం చ భోజనైః,
న తత్ఫల మవాప్నోతి యన్మాంసపరివర్జనాత్." ౫౪

మను. ౫ అధ్యా.

అను నీమనుస్మృతివాక్యములు పైనవ్రాసినభావమునే బోధించుచున్నవి. పవిత్రాహారముల భక్షించువారేఫలము నొందుదురో దానిని మాంసమును మానినవారు పొందు

దురు. మహాదుష్కార్యము మాంసభక్షణమని దీనిసారము. ప్రాణిహింస స్వర్గప్రాప్తిప్రతిబంధకము. అను నీభావమునే శ్రీరాముఁడు తెలిపెను. హింసాకర్మము నాచరించుచు సత్కర్మముల నాచరించుటకంటె దానిమానినవాఁడే యుత్తముఁడనికదా దీనిసారము. సర్వమానవసోదరత్వము మాంసభక్షణరూపమున నశించుట సిద్ధాంతమనునదియే యిందలి నిశ్చితార్థము. హింసాకర్మము నిష్కరుణాహృదయమునకు దృష్టాంతముకదా.

శ్రీరామా ! హోమాది సత్కర్మముల నాచరించుకాలమున మాంసలుబ్ధులగు దానవులు మమ్ము బాధించుచున్నారు. దిక్కెవరని వెదకు మాకు నీవే పరమగతివి. వేఱొండు లేదని మునులు తన్ను వేఁడినట్లు సీతకు రాముఁడు తెలిపెఁగదా.

"క్షత్రియాణాం తు వీరాణాం వనేషు నిరతాత్మనాం,
ధనుషా కార్యమేతావదార్తానామభిరక్షణమ్."

అని పూర్వసర్గమున సీత శ్రీరామునకుఁ దెల్పెను. దానికే యీయది యుత్తరమగును. సీతా! యిపుడు మునులు నన్ను ననాథరక్షకునిగా నెఱింగి వేఁడుచున్నారే. వారి రక్షింపవలయునా? నాకపకారము చేయలేదే యని యూరకుండవలయునా? అని రాముఁడు ప్రశ్నించుచున్నాఁడు. అనఁగా క్షత్రియధర్మములకు నితరజాతులకు విధించినధర్మములకును జాలభేదము కలదు. లోకరక్షణము సామాన్యకార్యము కానేరదు. దానియందే నియతిగలరాజులు చేయుకార్యములు కొందఱకు బాధాకరములు కావచ్చును. కాని లోకరక్షణైకదృష్టిగలరాజు లట్టివానిని లెక్కింపరాదు.

"అదండ్యాన్ దండయన్ రాజా దండ్యాంశ్చైవాప్యదండయన్,
అయశో మహదాప్నోతి నరకం చైవ గచ్ఛతి. ౧౨౮
వాగ్దండం ప్రథమం కుర్యాద్ధిగ్దండం తదనంతరం,
తృతీయం ధనదండం చ వధదండ మతఃపరం. ౧౨౯
"వధదండో నామ తాడనాంగచ్ఛేదనరూపమ్" అని వ్యాఖ్య.
మను. ౮ అధ్యా.

దశబ్రాహ్మణభృత్యర్థమేకం హన్యాద్ద్విజం నృపః,
శతబ్రాహ్మణభృత్యర్థం బ్రాహ్మణో బ్రాహ్మణం తు వా. ౪౨
పంచబ్రహ్మవిదామర్థే వైశ్యమేకం తు దండయేత్,
వైశ్యం దశవిశామర్థే విశం వా దండయేత్తథా ౪౩
తథా శతవిశామర్థే ద్విజమేకం తు దండయేత్,
శూద్రాణాం తు సహస్రార్థే దండయే ద్బ్రాహ్మణం తు వా. ౪౪
తచ్ఛతార్థే తు వా వైశ్యం తద్దశార్థే తు శూద్రకం."
లలితోపాఖ్యానము. ౨ అధ్యా.

అను నీప్రమాణములు శిక్షాభేదములను వాని కారణములను దెలుపుచున్నవి. కనుక క్షత్రియధర్మము లితరుల ధర్మములతో సమానము లనరాదు. ఆకారణమున రాముఁడు సీతప్రశ్నమునకు సమాధానము చెప్పఁబూని ఎవఁడు నీవే నాకు రక్షకుఁడవని వేఁడునో వానిం గాపాడుటకే యీశస్త్రధారణమని యెఱుంగుమనియె. అనఁగా నీవు తెలిపినట్లే యార్తులగుమునులం గావఁబూని యీశస్త్రమును బట్టితినని పలికెను.

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే."

అనునదికదా నాశపథమని హెచ్చరించెను. ఈభావమునే మహాకవి కాళిదాసు

"ఆర్తత్రాణాయ వశ్శస్త్రం న ప్రహర్తు మనాగసి."

అనుశ్లోకరూపమున బోధించెను. దీనిసారమేమి? రాజు తన కపకారముచేయకున్నను ధర్మమునకుంగాని తత్కర్తలకుంగాని యపకారముచేయువారిని వధింపవలయుననియు నయ్యది పాప కారణము కాదనియు నిందలిముఖ్యార్థము.

ఓరామా! సోదరుంగూడి మమ్ముం గాపాడుము నీవే మాకు రక్షకుఁడవు. అని మునులు ప్రార్థింప నట్లే యని యంగీకరించితిని. నేను జీవించి యుండునంతదనుక నాశపథ ము ను మానుకొనను. ఏలయనంగా నాకు సత్యమే సర్వదా యిష్టమగునది. అని సత్యమునందుఁ గల తనప్రీతిని దెలిపెను. అనంగాఁ బ్రాణములకంటె నెక్కుడుగ సత్యమును బ్రేమింప వలయుననియే దీనిసారము.

ఓసీతా ! ప్రాణములనైన వదలుదును. లక్ష్మణుని నిన్నును వదలుదును. కాని పలికి బొంకనని రాముఁడు తెలి పెను. తనకంటెఁ బ్రాణాధికురాలగు భార్యకంటె సోదరుని కంటె నుత్కృష్టప్రేమాస్పదమైనది సత్యమని భావించి ప్రవ ర్తింపవలయునని శ్రీరాముఁడు సీతోపదేశరూపమున లోకు లకు బోధించెనని మన మెఱుంగవలయును.

"మమ స్నేహాచ్చ సౌహార్దాదిదముక్తం త్వయానఘే,
పరితుష్టోఽస్మ్యహం సీతే న హ్యనిష్టోనుశిష్యతే. ౨౧
సదృశం చానురూపం చ కులస్య తవ చాత్మనః,
సధర్మచారిణీ మే త్వం ప్రాణేభ్యోఽపి గరీయసీ." ౨౨

అని మూలము. సీతాప్రశ్నములకు సంతోషించినట్లు తెలుపు చున్నాఁడు. నీకుఁ గులమునకు నీమాట తగినది. బదులు పలుకక నాధర్మమునే యనుసరింపుము. ప్రాణాధికురాలవు కదా యనియెను. దీనిసారమేమి? మానవులకు వంశమునఁ గలమర్యాదలు కొన్ని యనుసరించును. తమకర్మము ననుస రించి కొన్నియాచారము లలవడును. వానిని వలదన్నను వదలవు. ఎన్నికులములలోఁ గలిసినను స్వకులాచారములు గొన్నియైన నుండక మానవు. కులములే వలదన్నవారు దీర్ఘాలోచనము లేనివారనవలయునని యీభాగమే తెల్పు చున్నది.

"సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్,
సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః. ౪౮
అసక్తబుద్ధిస్సర్వత్ర జితాత్మా విగతస్పృహః,
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి." ౪౯

గీత. ౧౮ అధ్యా.

అను నీశ్రీకృష్ణోపదేశము శ్రీరామోపదేశమునే తెలుపు చున్నది. అనఁగా సాధారణబుద్ధికి దోషములుగాఁ దోఁచినను జన్మకర్మములు వదలరానివి. కులధర్మములు సర్వదా పరి పాలింపఁదగినవియే కాని త్రోసివేయరానివి. మూర్ఖులు కుల ధర్మము లేలయని తూలనాడిన నలవాటులు కొన్నియైన వదలక వారినంటియుండును. వానిస్వరూపము లిట్టివని తెలిసి కొననివారే పామరులు. ఈవిషయము నీరామునివాక్యాలే తెలుపుచున్నవి. నే నేయేధర్మముల నాచరింతునో నీవట్టి వానినే యనుసరింపుమని సీతకు శ్రీరాముఁ డాజ్ఞాపించెను. అనఁగాఁ బ్రకృతిపురుషుల మగుమన మెట్టివర్తనముకలవార

మగుదువో యట్లు మానవులు (స్త్రీపురుషులు) వర్తింపవలయు నని శ్రీరామునిహృదయమని మన మెఱుంగవలయును. సహధర్మచారిణి యనఁగా నర్థ మియ్యదియే.

"పతిం యా నాభిచరతి మనోవాగ్దేహసంయతా,
సా భర్తృలోకానాప్నోతి సద్భిస్సాధ్వీతి చోచ్యతే." ౯ అధ్యా. ౯.

అన్న మనువాక్యమే రామాయణమునఁ గలదని మన మెఱుంగవలయును. దంపతులకు సదాచారాదరణమునకు నుదాహరణము ప్రకృతిపురుషులగుసీతారాములుగాక మఱెవ్వరు కలరు? శ్రీరామోపదేశమునకంటె శ్రేష్ఠము వేఱెద్ది కలదు? భర్త యే ధర్మము నాచరించునో యద్దానిని భార్యయు ననుసరింపవలసినదే. ఒకప్పుడు భర్త దురాచారనిరతుఁడైన భార్యయు నట్టిదియే కావలయునా? అన్నచో నది విశేషవిధింబట్టి వదలవలయును. భార్యను భర్త యేకార్యకారణములంబట్టి వదలవలయునో భార్యయు నట్టికారణములంబట్టియే పతిని వదలవలయునని యూహింపవలయును. ఈత్యాగ మిరువురకు సమానమేనా యన్న నించుక భేదముగలదిగా నుండు ననవలయును. వేఱొక్కతరుణమున దీనిని విమర్శింతము. ఇఁకఁ దరువాతి చరిత్రమునకు మరలుదము.

## శ్రీరాముడు లాయామునులయాశ్రమములంగాంచుట.

* అంత శ్రీరాముఁడు సీతయు లక్ష్మణుఁడును వరుసఁగా నొకరివెంట నొకరుగాఁ బయనము సాగించుచు మునులును వెంటరాఁగాఁ బర్వతసానువులను వనములను నదులను, నందలి పక్షులను, వన్యమృగవిశేషములను జూచుచుం బోయిరి. చాల

* ఇది పదునొకండవ సర్గమునఁ గలదు.

దూరము పోయి సూర్యుఁ డస్తమింప నున్నతఱి విశాల తటాకము నొక్కచోఁ గాంచిరి. జలమృగపక్షు లందుండెను. జలపుష్పము లెంతో వింతగొలుపుచుండెను. తేటనీటితో నది చెలువారుచుండెను. ఆకొలఁకుననుండి గీతవాద్యములచప్పుడు వినవచ్చెను. కాని యం దెవ్వరును గానరారైరి. అంత రాఘవు లిరువురును సంతోషమున దానిమహిమమును వినఁగోరి తమ వెంటనున్న ధర్మభృతుం డనుముని నిట్లు ప్రశ్నించిరి. మహాత్మా! ఈధ్వని యచ్చెరువు కలిగించెడిని. కాన దీనింగూర్చి వినఁ గుతూహల ముదయించెడిని. వివరింపుము. ఇది వచింపఁదగిన దేని పరమరహస్యము కాదేని తెల్పుము. ఆప్రశ్నమున కానందించి తద్వార్త నెఱిఁగించుతలంపున నమ్ముని యిట్లనియె. శ్రీ రామా! ఈతటాకము పంచాప్సర మను పేరఁబరఁగు. సర్వదా యిట్లే గీతవాద్యధ్వనులుగలిగియే యిది యుండును. మాండకర్ణి యనుముని దీని నిర్మించెను. ఆముని యయుతవత్సరములు వాయుభక్షకుఁడై తానిర్మించిన యీతటాకోదకములనుండియే ఘోరతపం బొనరించెను. అగ్ని లోనగుదేవతలు దానిచే వ్యథితులై యొండొరులంగూడి యిట్లు చెప్పుకొనిరి ఈముని మనలో నొకరిస్థానమును బడయఁగోరుచున్నవాఁడు. అనుచుఁ గొందలంపడిరి. అంత వారందఱు మేటియచ్చర యనుఖ్యాతిని గాంచువారి నైదుగురినచ్చరల నాతనితపోవిభూతి నడంప నియోగించిరి. వారును దేవకార్యము నెఱవేర్పఁగోరి జీవాత్మ పరమాత్మలను జూడఁజాలినవాఁడైన నమ్ముని నెట్లో కాము వశంగతునిగా నొనరించి లోఁబఱచుకొనిరి. వారైదుగు రాత నికి భార్యలైరి. ఇం దాతరుణులకు గృహము లోపలనే నిర్మింపఁ బడినది. ఆగృహమున వారంద ఱమ్మునింగూడి సుఖముగా

నివసించుచుఁ దపోబలమున జవ్వనుఁడగునామునికి సుఖసంతో షములఁ గూర్చుచున్నారు. వారు క్రీడించుచుండఁగా వారి భూషణధ్వనులం గలిసి గీతవాద్యధ్వని వినంబడుచున్నది.

ధర్మభృతుఁ డిట్లు పలికినమాట నాలకించి వారిరువురు మహాశ్చర్య మిది యని యంగీకరించిరి. అంత నారాముఁడు మునులయాశ్రమములం బోఁడఁగాంచెను. అందు నందఱుం బ్రవేశించి పూజితులై హాయిగ నుండిరి. ఆయాశ్రమముల నివసించి శ్రీరాముఁడు రాక్షసబాధలుగల్గుచో మరలఁ బోయి వానినడంచుచు నొక్కయాశ్రమమునఁ బదుమూఁడునెలలును, వేఱొకపర్ణశాలయం దొకవత్సరమును, ఇంకొక్కయెడ నాలుగునెలలును, వేఱొక్కచోట మాసపంచకమును, మఱియు నొక్కతావున నాఱునెలలును, వెండియు నొక్క యుటజమున సప్తమాసములును, ఒక్కయెడ సపాదమాస మును, ఒక్కచోట నొక్కపాదము తక్కువగా మాసమును, మఱొకచోటఁ ద్రిమాసములు, ఇంక నొకమునివాసమున మా సాష్టకమును హాయిగా నివసించియుండెను. ఒక్కొక్కచో ద్వివారములు నివసించుచు సుఖముగా శ్రీరామాదులుండఁగాఁ బదిసంవత్సరము లయ్యెను. సీతాలక్ష్మణాదులంగూడి యారాఘ వుఁడు మరల సుతీక్ష్ణాశ్రమమునకు మరలి వచ్చెను. సత్కార ముల నందుచు నందుఁ గొంతకాల ముండెను. ఒకనాఁడు రాముఁ డమ్మునిం గని మహాత్మా! ఇవ్వనమునందే భగవంతుఁ డగునగస్త్యమునివరుఁ డున్నవాఁడని వినుచున్నాఁడను. ఈ తపోవనము విరివిగలది. ఇందమ్ముని యెచ్చో నున్నవాఁడో కనుంగొనుట కష్టము. ఆయాశ్రమ మెందుండునో తెల్పితిరేని సీతాసౌమిత్రులంగూడి వారిని సేవింపఁబోయెదను. వారికి

శుశ్రూష చేయుకోరిక నాకు మిక్కిలి కలదు. అని శ్రీరాముఁడు పలుకఁగా సుతీక్ష్ణముని యానందించి భగవంతుఁడా! సీతాసహితముగా నగస్త్యముని దర్శింపఁబోమ్ము. ఈవార్త మీకెల్లరకుఁ దెలుపవలయునని నేనే తలంచియుంటిని. దైవికముగా నీవే నన్నడిగితివి. ఆయాశ్రమమును దెలిపెదను. ఇందుండి దక్షిణమునకు యోజనచతుష్టయ మరుగవలయు. అందుఁ దదనుజాతుఁ డగుసుదర్శనముని యాశ్రమము గలదు. అది స్థలీప్రాయముగా నుండును. పిప్పలీవనమున నాపర్ణశాల యుండు. సరస్సులు విశేషించి కలవు. అందొక్కరాత్రియుండి తెల్లవాఱఁగాఁ బయనముసాగింపుము అందుండి మఱియు దక్షిణదిక్కుంగుఱించి వనములకుఁ బ్రక్క నోరగా నొకయోజనమాత్రము పోవఁగా నగస్త్యాశ్రమ మున్నది. ఆవనము సర్వర్తుపుష్పఫలమూలసాంద్రము. సీతాదేవింగూడి నీ వందుండవచ్చును. మునివరు నాతని దర్శింప వాంఛగలదే నిపుడే తరలిపొమ్ము.

శ్రీరాముఁ డది విని సీతాసౌమిత్రులంగూడి పయనము సాగించెను. మునిచెప్పినచొప్పుననే పోయి వనసరస్సులు లోనగునవి సంతసము రెట్టింపఁజేయఁగా సౌమిత్రిం గాంచి తమ్ముఁడా! ఇదిగో అగస్త్యమునిసోదరుఁ డగుసుదర్శనముని యాశ్రమము. సంశయమే లేదు. అది యిదియే. సుతీక్ష్ణముని చెప్పినగుఱుతులన్నియు నిందుఁగలవు. పిప్పలీవృక్షములయందు దట్టముగా నున్నపండ్లవగరువాసన లివిగో గాలిమూలమునఁ దెలియవచ్చుచున్నవి. మునులు కూర్చిపెట్టియున్నకట్టలు రాసులుగా నందందుఁ గనఁబడుచున్నవి. వైదూర్యమణుల రంగుగల దర్భలమొక్కలు మునులు కోయఁగా నున్నవి. చూడుము. నల్లనిమేఘాగ్రముభంగి హోమధూమముచివర

యదిగో గనఁబడుచున్నది. మునులు స్నానముచేసి పూవులు
గోసి వానిచే బలికర్మము నాచరించుచున్నవారు. ముని చెప్పి
నట్టి యగస్త్యానుజునియాశ్రమ మిదియే. పుణ్యకర్మముల
నాచరించినయగస్త్యముని లోకహితార్థము తపోవిభూతిచే
వాతాపి, ఇల్వలుఁ డనునిరువురరాక్షసులం జంపి, వారి
బాధలు నశింపఁగా నీదిక్కు వాసయోగ్యము గావించెను.
ఆరాక్షసు లిరువురు పూర్వము బ్రాహ్మణుల వధించుచుండిరి.
అందు నిల్వలుఁడు దయయే లేక విప్రరూపమున సంస్కృత
భాషం బలుకుచు శ్రాద్ధము పేరుచెప్పి బ్రాహ్మణులం బిల్చును.
అంత నాయిల్వలుఁడు మేఁకవంటి యాకారముదాల్చిన
యనుజుఁ డగువాతాపిం జంపి వండి శ్రాద్ధవిధానమున
విప్రులకుం బెట్టును భోజనముకాఁగా నిల్వలుఁడు వాతాపీ!
వెడలి రమ్మాయని పెద్దగొంతుకతోఁ బిల్చును. వాఁ డంత
మేఁకవలె నఱచుచు వారికుక్షులను భేదించుకొని వెడలి
వచ్చును. కామరూపులు మాంసలుబ్ధులు నగువారిరువురు
ప్రతిదిన మీరీతిఁ బెక్కండ్రను విప్రులను వధించిరి. దేవత
లంత నగస్త్యముని వేఁడఁగా నతఁ డాతఁడు పిలువ నంగీ
కరించి శ్రాద్ధమున నాక్రూరుని వాతాపిని భక్షించెను.
ఇల్వలుఁడు తృప్తియైనదికదా యన నైనదని యతఁడు పలుక
నుత్తరాపోశనమిచ్చి వెడలిరమ్మా యని వాతాపిం బిలిచెను.
బుద్ధిమదగ్రేసరుం డగుముని తమ్మునిం బిలుచు నాయిల్వలుం
గని పరిహాసము నొనరించుచు నీతమ్ముఁడు మేఁకవంటిరూప
మును దాల్చి వాఁడు నాకడుపున జీర్ణించి యమునియింటఁ
జేరినవాఁడుగదా వాఁడిఁక నెట్లు రాఁగలఁడు? వాఁ డమ్మా
టల కలిగి సోదరమృతికై వగచి యమ్మునిని హింసింపం దల

పడియెను. క్రోధారుణితనయనంబుల వాని నమ్ముని చూడ
నాయగ్నిజ్వాలలు వాని భస్మముగావించెను. అట్టి దుష్కర
కార్యమున మహోపకారము గావించిన మునితమ్మునియా
శ్రమమే యిది. అనుచుండఁగాఁ బ్రొద్దు గ్రుంకెను. సంధ్య
వార్చి యమ్ముని యాశ్రమముం బ్రవేశించెను. ఆమునికి
నమస్కరించి యామునిపూజించి ఫలమూలముల నొసంగ
భుజించి యారేయి యందుండెను. తెల్లవాఱఁగా భానుఁడు
పూర్వాద్రిపయిం జూపట్టుడు మహర్షిని బ్రార్థించి సెలవంది
పోవుతలంపున నోమహాత్మా! నమస్కారము. రాత్రి సుఖ
ముగా నిందుఁ గడపితిమి. మీకు గురువు నన్నయునగు
నగస్త్యమునిని దర్శింపఁగోరెదను. సెలవే. అన నమ్మునియు
నంగీకరింప నారామమూర్తి యామహావనమును గాంచుచు
సుతీక్ష్ణముని తెల్పినమార్గముననే యందఱుగూడి పోయెను.
త్రోవయందు నీవారధాన్యములను, బనసలను దక్కుంగల
ఫలవృక్షములను వాని నల్లుకొని పూచియున్నలతావితతు
లను గాంచెను. కొన్నిచెట్లందు నేనుఁగులచే విఱువఁబడి
యుండెను. వానరము లందందు విహరించుచుండెను. సరోవర
ములు పెక్కుతావులఁ గనఁబడుచుండెను. జలవిహంగమము
లందుఁ గూయుచు నాడుచుండెను.

అంత శ్రీరాముఁడు సౌమిత్రిం గని సోదరా! ఈవృక్ష
ములు పూచి కాచియుండుటయు మృగపక్షులు శాంతములై
యుండుటయుఁ బరిశీలింపఁగా మహర్షియాశ్రమ మీచెంతనే
యున్నదని తోఁచెడిని. వింధ్యపర్వతము పొంగునడంచిన
స్వకార్యముననే యగస్త్యుఁడను లోకప్రసిద్ధిం గాంచిన యా
మాననీయునియుటజ మిదిగో చూపట్టుచున్నది. మార్గా

యాసము నీయది తొలఁగించునట్టిదియే. హోమధూమములే యెల్లయెడల వ్యాపించియున్నవి. నారచీరలలోలిఁ గట్టఁబడి యున్నవి. చూడంజూడఁ గన్నులకు హాయిని గూర్చుచున్నవి. మృగములు శాంతమును వహించియున్నవి. పక్షిరుతములు శ్రవణానందమును గూర్చుచున్నవి. రక్కసు లీమునివరు ప్రభావమున దక్షిణపుదిక్కును భీతిచేఁ జూచుచుందురుగాని నిర్భయముగాఁ జూడఁజాలరు. అట్టి మునిపతి యాశ్రమమే యిది. ఈమహాత్ముఁ డీదిక్కునకు వచ్చినదిమొదలు రక్కసులు మునులపై వైరములు వదలి శాంతులైరి సుమా. అగస్త్యుని పేరనే యీదిక్కు ప్రఖ్యాతిగాంచియున్నది. వింధ్యాద్రి సూర్యగమనము నడ్డగింపఁబూనియు నెవ్వనియానతికి లోనై యట్లే నిలిచియున్నదో యాశ్రీమంతునిదే యీయాశ్రమము. మనకీమహర్షి శ్రేయస్సుల నొడఁగూర్చును సోదరా! ఈమహర్షిని సేవించుచు వనవాసశేషదినముల నిందే పుచ్చుట కుద్దేశించితిని. దేవత లీమహర్షికడ నుందురు. అనృతవాది, క్రూరుఁడు, వంచకుఁడు, ఘాతుకుఁడు, శాస్త్రదూరవర్తనుఁడు నీయాశ్రమమున బ్రదుకఁడు. ఈముని నారాధించుచు దేవత లెందఱో యున్నవారు. అనేకు లిందుఁ దపోనిరతిం బూని దివ్యదేహములఁ దాల్చి స్వర్గమునొందిరి. ఇందుఁ దపస్సొనరించువారలకు దేవతలు దేవత్వాదు లొసంగుదురు. ఆశ్రమమునకు వచ్చితిమి. సీతంగూడివచ్చిన నారాక నీ వామహర్షికిం దెలుపుమా యని యాజ్ఞాపించెను.

మహాశయులారా! ఈభాగమునుండి తెలిసికొనఁదగిన విషయము లనేకములు గలవు తొలుతఁ జరిత్రాంశములను గనుఁగొందము. సుతీక్ష్ణముని యగస్త్యాశ్రమమునకు మార్గము

రాముునకుం దెల్పెను. నాలుగుయోజనము లరిగిన నందు నా యగస్త్యముని తమ్మునియాశ్రమ మున్నదనియె. దానిరీతియుఁ దెల్పెనుగదా. ఆమాటలంబట్టి యూహింపఁగా రామాయణ కాలమున దేశస్థితి తెలియవచ్చెడిని. పదాఱు క్రోశములదనుక మునులయాశ్రమములు కూడ లేవు. మహారణ్యమే. మార్గము మానవులు సంచరించుటంజేసి సుబోధముగాలేదు. కొండలు వృక్షరాజములు మార్గమును దెలుప గుఱుతుగాఁ జూపఁబడు చుండెను. ఎందేనాశ్రమమున్నయెడల దానిచెంత ఫలవృక్షములు లతావిశేషములు మెండుగా నుండును. సరోవరములు తడాకములు నెల్లయెడల నుండును. మృగములు మత్తిల్లి తిరుగాడుచుండు ననుటంజేసి మానవసంచార మరుదనికదా తేలెడిని. వనగజములసంచారము తఱచుగా నుండుట మిక్కిలి ప్రాణాపాయకరముగా నుండును. కాన నెప్పుడో యెట్లో మును లందందుఁ దిరుగాడుచుందురు. మునులుండుతావుల వన్యఫలములు మూలములు కందములు పూవులు సమృద్ధిగా నుండును. కావున వా రాహారవస్తువులను సంపాదింప దూరము పోవనక్కఱలేదు. వర్షములకుఁ గొఱంతలేదు. మును లందందు నేకరించినయెండుకఱ్ఱలు ప్రోవులుగా నున్నవను నీ

“తత్రతత్ర చ దృశ్యంతే సంక్షిప్తాః కాష్ఠసంచయాః,”

మూలము మునులసదాచారమును దెలుపుచున్నది.

“ఇంధనార్థమశుష్కాణాం ద్రుమాణా మవపాతనమ్.”

అనుమనుస్మృతివాక్యము ననుసరించి పచ్చిచెట్లను ఛేదింపక యెండినవృక్షములు పడిపోవఁగా వానిని సంగ్రహించి కొని

పోయి యగ్నికృత్యము నొనరించుచుండిరి. అనఁగా నాకాల మున నగ్నిపూజయే ప్రధానముగా నుండెనని తేటపడు చున్నది. "అగ్నిముఖా వై దేవాః" అన్న శ్రుతి ననుసరించి యగ్ని నుపాసించుచుండిరని మన మెఱుంగవలయు. "దీపం వినా పూజన మప్రశస్త" మ్మను ప్రాచీనసూక్తి వినఁబడుచుండుఁ గదా. షోడశోపచారములలో దీపము ప్రధానమనుటకుఁ గారణమేమి? భగవంతుని తేజోరూపునిగా ధ్యానించుట మునులయాచారమని స్పష్టమగును. భగవదాగమనమునకు ముందుగాఁ దేజోరాశి కనఁబడెనని పురాణములయం దెన్నియో యుదాహరణములు కనఁబడుచున్నవి కదా.

"ధ్యేయస్సదా సవితృమండలమధ్యవర్తీ నారాయణః"

అనుటంజేసి భగవంతుఁడు తేజోరూపుఁడని స్పష్టమగును. మునులు యజ్ఞరూపముఁ గొందఱును, గేవలోపాసనరూపముఁ గొందఱును భగవంతు నారాధించువారని తెల్లమగు చున్నది. విగ్రహములఁ బూజించువారు మునులయందుఁ దఱచుగా లేరనియే మన మెఱుంగవలయును. "యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి" అనుగీతావాక్యము జపయజ్ఞప్రాశస్త్యమును వెల్లడిచేయుచున్నది.

"ప్రాజ్యధూమాకులవన శ్చీరమాలాపరిష్కృతః." ౨౦

అనుమూలమువలన హోమధూమము చెట్ల నావరించియున్న దనియు నారచీరలు వరుసగా వృక్షశాఖలకుఁ గట్టఁబడి యున్నవనియుఁ దెలియవచ్చును. సాయంప్రాతఃకాలముల యందు హోమకార్యము సాగించు టగ్ని నారాధించుటగాక మఱేమగును? అగ్గిపుల్లలు లేవు కాన నిప్పును సర్వదా రక్షించు

చుందురని యొక్క కొందఱు పలుకుదురు. కాని హోమధూమ
మనుదానికది యర్థము కానేరదు. "స్థితస్య గతిశ్చింతనీయా"
యన్నట్లున్న మూలము ననుసరించి యర్థము చెప్పవలయును.
తోఁచినట్లు పలుకరాదు. భారతమునకు వెనుకనే రామాయణ
కథ యనువాదమును దృఢపఱుపంబూని తోఁచినట్లు ప్రేలుట
న్యాయ్యమా. రెండు గ్రంథము లసత్యములన్నచో వారి
వాదము సరిపడునేమో యని యూహించెదను. ఎవరేతఱిం
బోయినను ఆతిథ్యము సాగుచుండె ననుటంబట్టి వలసినపు
డెల్లఁ బూవులు ఫలమూలాదికములు దొరకుచుండెననియుఁ
దృణధాన్యములు లోనగునవి కొఱంతలేక యుండెననియుఁ
దెల్లమగును. పండ్రెండునెలలయందును బుష్పించులతాద్రు
మములు ఫలవృక్షములు వలసినన్ని యుండెననియే దీని
సారము. నారచీరలు కొఱంతలేక యుండెను. వానిని దడిపి
యాఱవేయుచుందురు. అనఁగా నావస్త్రములు నేయఁబడినవియే
యని యూహింప నవకాశము కలదు. ఒక్కజాతివా రప్పని
చేయుచుందురు. అల్పమూల్యమునకో రాజాజ్ఞంజేసి మూ
ల్యము గొనకయో మునుల కవి లభించుచుండుననియుఁ
దోఁచుట వింతగొలుపదు. నారనుండి తంతువులఁదీసి నేయు
వస్త్రములకు నారచీరలని పేరయి యుండవచ్చును. జాతికి
వృత్తికల్పన మాకాలముననున్న మంచియాచారము కదా.
ఈలోనగువిషయములంబట్టి చూడఁగా దండకారణ్యము మను
ష్యాకీర్ణము కాకుండుటయే గాక నిర్మానుష్యమనియుఁ జెప్ప
వచ్చును. ఎందరో మహర్షు లుందురు. వారు కూడఁ బ్రాణములు
కరతలములయందుండ భగవంతునే నమ్మి వైరాగ్యసంపత్తుచేఁ
గాలము గడపుచుండిరని తోఁచెడు. కావున మహారణ్యము

లచే దేశము చాలభాగ మావరింపఁబడియున్నదని స్పష్ట మగును. భారతకాలమున నీదండకారణ్యభాగము చాల వఱకు గ్రామసంయుతమే. కావున రామాయణకాలము ప్రాచీనమని సిద్ధాంతితమగుచున్నది.

## పంచాప్సరము.

"ఇదం పంచాప్సరో నామ తడాకం సార్వకాలికమ్."

అని మూలము. ఆతడాకమునడుమ ననఁగా నీటిలోపల దివ్య హర్మ్యము. అందైదుగురు దేవకన్యకలతో ముని విహరించుట యను నీకథ సామాన్యదృష్టిం బరికింపఁ బరిహాసపాత్రముగాఁ దోఁపక పోదు. ఇంచుక దూరదృష్టిం బరికించిన నది యల్ప కార్యముగనే తోఁచును. వినుఁడు. మునివరుఁడు మాండ కర్ణి తీవ్రతపస్సొనరింప నగ్నిలోనగు దేవతలు భయంపడి దానికి నంతరాయమును గల్పింపఁబూనిరఁట. ఇందు నచ్చెరువుగ నుండున దేమున్నది? లోకసహజకార్యమే యిది. అసూయ దేవతలయందుఁగూడ గన్పట్టుననుట కిదియు నొకయుదాహ రణము. వారచ్చరలం బంపుటయు వాడుకయే కదా.

"అప్సరోభిస్తతస్తాభిర్మునిర్దృష్టపరావరః. ౧౬
నీతో మదనవశ్యత్వం సురాణాం కార్యసిద్ధయే,
తాశ్చైవాప్సరసః పంచ మునేః పత్నీత్వమాగతాః. ౧౭
తటాకే నిర్మితం తాసా మస్మిన్నంతర్హితం గృహం,
తత్రైవాప్సరసః పంచ నివసంత్యో యథాసుఖం. ౧౮
రమయంతి తపోయోగాన్మునిం యౌవనమాస్థితం,
తాసాం సంక్రీడమానానా మేష వాదిత్రనిస్స్వనః. ౧౯
శ్రూయతే భూషణోన్మిశ్రో గీతశబ్దో మనోహరః."

అని మూలము. మహాజ్ఞానసంపన్నుఁడైనను ముని యాయచ్చ
రలకు లోనై కాముకుఁడయ్యెను. వారు మునికి భార్యలైరి.
అనుటయం దచ్చెరువేదియుఁ గానరాదు. ఫలాభిసంధిరహిత
సత్కర్మముల నాచరించువారే కామమును జయింపఁజాలు
దురు ఫలాభిసంధిసహిత కర్మాచరణపరాయణులు కామమును
జయింపఁజాలరు. ఈముని నిష్కామకర్మము నాచరించువాఁడని
స్పష్టమగుచున్నది. కనుకనే యాతనితపము పరుల కీర్ష్యాజనక
మయ్యెను. విఘ్నములకు లోనుగూడ నయ్యెను. అతితుచ్ఛ
సుఖము నది యీయఁజాలెను. జితాత్ముఁ డగువానితపస్సు
సర్వజనానందకమే యగును. అది విఘ్ననిహన్యమానము
కాఁజాలదు.

"యదా వినియతం చిత్త మాత్మన్యేవావతిష్ఠతే,
నిస్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా. ౧౮
యథాదీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా,
యోగినో యతచిత్తస్య యుంజతో యోగమాత్మనః ౧౯
యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా,
యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి." ౨౦

గీత. ౬ అధ్యా.

అను నీశ్రీకృష్ణోపదేశము ననురించి యోజింపఁగా మాండ
కర్ణిముని నిర్జితేంద్రియుఁడు కాక యేదోఫలమున్గోరియే
తపమొనరించెననియు నయ్యది యంతరాయములపాలయ్యె
ననియు స్పష్టమగును. చేసినది విఫలము కాదుగాన నతిస్వల్ప
ఫలమే కలిగెను. ఇందు విశ్వాసపాత్రము గానివిషయ మేమి
కలదు? భగవదారాధనముచేసి దానికి ఫలముగా జవ్వనము

నెవఁడు కోరునో వాని కది తప్పక ఫలించును. తపస్సున కిది యత్యల్పఫలముకదా. తటాకోదకములనడుమ నితరాదృశ్యముగ నొకభవనము నిర్మింపఁబడియెనని యున్నది ఇది నమ్మఁదగినదా యని ప్రశ్నించువారు కలరు. వారి కీసమాధానము తగును. ఇంద్రజాలమని మహేంద్రజాలమని రెండువిద్యలు గలవు. ఇంద్రజాలము మర్త్యలోకవస్తువుల నంతర్హితములఁ జేయుట. అచ్చటలేనివానిం గనఁబఱచుట లోనగునచ్చెరువుఁ గల్పించుకార్యములఁ జేయఁజాలు. మహేంద్రజాల మిట్లే లోకాంతరగతవస్తువులను జేయఁజాలును. అందు జలస్తంభనాదు లొకభాగమున నుండునవి. క్షుద్రమంత్రోపాసకులే యిట్టియద్భుతకార్యము లొనరించుచుండఁగా నిఁకఁ దపోనిరతులగువారల కీసిద్ధులు గల్గుట యొకగొప్ప గాదు. మన బోంట్లకవిషయమే తెలియదుకాన విశ్వాసము కలుగలేదు గాని యించుక యాలోచించినచో నిట్టిసిద్ధు లల్పములని స్పష్టమగును. భగవదారాధనము చేయుచుండుముని కామము నకు లోఁబడెఁగదా యనునదియే వగపునకుఁ గారణమగును. ఇఁక విశేషముల నెమకుదము.

"అగ్రతః ప్రయయౌ రామస్సీతా మధ్యే సుమధ్యమా,
పృష్ఠతస్తు ధనుష్పాణి ర్లక్ష్మణోఽనుజగామ హ." ౧

అని మూలము.

"అనేనశ్లోకేన ప్రణవార్థః ప్రకాశిత ఇతి సంప్రదాయః. తత్ర అగ్రత ఇతి అవర్ణ ప్రాథమికత్వం. అగ్రతః ప్రయయావిత్యర్థః. ప్రాథమ్యం రామ ఇతి సత్తాసంపాదనరక్షణాదినా రమయతీతి కారణత్వేన రక్షకత్వేచ రమాసంబంధిత్వేన శ్రీశబ్దం చ. సుమధ్యమేతి ప్రణవద్వితీయవర్ణశ్చ. మధ్య ఇతి తస్య వర్ణద్వయమధ్యవర్తిత్వమ్. సీతా మధ్యే ఇతి లక్ష్మ్యాః పురుషకారత్వం.

లక్ష్మణ ఇతి. మన జ్ఞానే ఇతి ధాతోః అసాధారణధర్మవత్త్వం. ధనుష్పాణిరితి నిరంతరకైంకర్యవత్త్వం. అనుజగామేతి అహంకార మమకార విరహేణానుసరణం. పదాంతమకారేణ ప్రణవతృతీయవర్ణశ్చ వ్యజ్యత ఇతి సంక్షేపః. తౌ పశ్యమానావిత్యాదినా. నారాయణపరార్థః ప్రకాశిత ఇతి సంప్రదాయః.”

తనిశ్లోకి.

ఇందుఁ బ్రణవాక్షరములు గలవనియు నిందేమో సంప్రదాయార్థము గలదనియు వ్యాఖ్యాతృభావము. ఇది రామాయణకావ్యమున నాల్గువేదము లిమిడియున్నవనువారు చెప్పునట్లున్నది. ప్రతిశ్లోకమునందును దఱచుగా అకారము ఉకారము మకారము లుండును. అన్నియుఁ బ్రణవార్థబోధకము లేల కావో? ఇట్లే నాల్గువేదములు నాఱుశాస్త్రములు నింకను బురాణేతిహాసములు నిందుఁ గలవనవచ్చును. వలసిన తావులనుండి వర్ణముల ననియమముగా గ్రహింప నన్నియుఁ దేలును. ఈరామాయణమునమాత్రమే కాదు. పెద్దబాలశిక్ష యనుపొత్తమునుండియుఁ దేలును. ఇట్టి యసంగతార్థముల బోధించుచు నీకావ్యము విశిష్టాద్వైతపరమని వాదించుట కంటెఁ బరిహాసపాత్ర మింకొక్కటి లేదు. సర్వమతానుష్ఠేయ సామాన్యధర్మము లిందుఁ గలవన్న నొప్పనవలయును. అంతియ కాని మతాభిమానమున నితరమతముల కీరామాయణమున ననుకూలధర్మములు లేవన్నచో నిది ప్రమాణగ్రంథమే కాకపోవును. ఏదో పాండిత్యము చూపఁబూనుట “వినాయకం ప్రకుర్వాణో రచయామాస వానరమ్” అన్నట్టులగును. వినాయకునిఁ జేయఁబోయినఁ గోఁతియాయె నన్నట్లే. సర్వత్ర విమర్శించిన నిట్టియర్థములనే యీతనిశ్లోకి తెలుపుచుండు ననుటకంటె మిక్కిలి యనఁజాలము. “తేభ్యోఽఽఉతి.

దృగ్భ్యో నమః” అన్నట్లు వీరిని సమ్మానించి విషయాంతరమును దడవి విశేషముల నరయుదము.

“ఏవం కథయమానస్య దదర్శాశ్రమమండలం. ౨౧
కుశచీరపరిక్షిప్తం బ్రాహ్మ్యా లక్ష్మ్యా సమావృతం,
ప్రవిశ్య సహ వైదేహ్యా లక్ష్మణేన చ రాఘవః.” ౨౨

అని మూలము. ఇందలి విశేషమేమి? శ్రీరామచంద్రుఁడు మాండకర్ణిచరిత్రము నాలకించి యవ్వలంబోయి మునుల యాశ్రమమండలముం గాంచెను. మాండకర్ణి కేవలైహిక సుఖాభిముఖుఁడని యెఱింగి రాముఁ డవ్వలం బోయెను. అనఁగా నతనికి దర్శన మీయఁబూనఁడయ్యెను. ఏల? అపరిపక్వాంతఃకరణులకు భగవద్దర్శనము కాదు. శ్రీరామునిం జూచినవారెల్లఁ బరిపక్వాంతఃకరణులా యనుదురేమో. కారు. మునియయ్యుఁ దీవ్రతపోనిరతుఁడయ్యుఁ దుదకు నాఁడువారికి లోఁబడియెఁగదా. అట్టివానికి దర్శనమిచ్చి లాభము లేదు. ఆతుచ్ఛసుఖములనుండి ముని విముఖుఁడై వైరాగ్యసంపదను బూనినపుడే దర్శనమీయ నగునని యే రాముఁడు తలంచెనని మన మూహింపవలయును ఎవ్వారు శ్రీరాముని భగవంతునిగ భావింతురో వారలకే దర్శనఫలము సంపూర్ణముగ లభించును. రాజకుమారుఁడనిగాని సుందరాకారుఁడనిగాని భావించి చూచినవారల కట్టిఫలమే లభించును. “యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ” అన్న సూక్తి యందఱెఱింగినదియే కదా.

“యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహం,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః.” ౧౧

అన్న గీతావాక్యము పరిశీలించిన నీయర్థమేకదా యది బోధించు నని తేలెడిని. మునులయాశ్రమమండలమును రాముఁడు చూచినపు డందు దర్భలు నారచీరలు నుండెను. బ్రాహ్మణసంబంధి లక్ష్మి నిండియుండెను. అనఁగా జ్ఞానసంపద వెలయుచుండెనని యర్థము. ఆశను దెలుపువస్తువు లందు లేవు. ఐహికసుఖవిముఖతనే బోధించునవియే యందు వెలయుచుండెను. జ్ఞానసంపద కనఁబడునోకో యని ప్రశ్నించువా రుందురు. తపోనిలయముల నొకతేజస్సు ఆవరించియుండును. పరిశుద్ధాంతఃకరణు లుండుతావులనే యది వృద్ధియగుచుండును. ఏస్థలములను జూచినపుడు మానసములు నిశ్చలములై దుఃఖవిరహితములై నూతనానందము నొందునో యాచోటులయం దా తేజస్సుండునని మన మెఱుంగవలయును. యోగదృష్టి కది కనఁబడుననియు నాకాశవర్ణముగా నది తోఁచుననియుఁ గొందఱు పెద్దలు పలుకుదురు. భగవత్తేజము సామాన్యదృష్టికిఁ గోచరించునా? అట్టి దివ్యమగునాత్మతేజస్సును రాముఁడు గాంచి యందుఁ బ్రవేశించెను. మునులయాశ్రమముల నట్టితేజస్స్వాకరించియుండుట స్వభావముకదా. పవిత్రస్థలముల నాతేజస్సు వెలయుటంబట్టి మనము పవిత్రమనస్కులమై భగవంతు నారాధించిన నామహాత్ముఁడు తనకుఁ దానై యరుదెంచి దర్శనమిచ్చి కృతార్థులను జేయు ననువిషయమును మన మీభాగమునుండి గ్రహించి యట్లు మెలంగఁ బ్రయత్నింపవలయును.

"తథా సంవసత స్తస్య మునీనామాశ్రమేషు వై. ౨౭
రమతశ్చానుకూల్యేన యయుస్సంవత్సరా దశ."

అని మూలము. చిత్రకూటవాసమాదిగా నింతదనుకఁ బది సంవత్సరము లయ్యెనని యెఱుంగందగు. కిష్కింధాకాండ మున నీవిషయము స్పష్టము కాఁగలదు. పదిసంవత్సరములు మునులసంగతి మెలంగుచు వారికష్టసుఖముల తెలిం గెఱుం గుచు సీతారాములు లక్ష్మణునింగూడి యుండిరనియు విరా ధుఁడు తప్పఁ దక్కినవిఖ్యాతరాక్షసులు వారికంటఁ బడలేదని యు మన మెఱుంగవలయును. "గహనా కర్మణో గతిః" అను గీతాప్రమాణము ననుసరించి దండకారణ్యవాసులగురక్కసు లకు ఖరదూషణాదులకు సమయము సమీపింపనందున సీతా రాములు వారిచెంతకుం జేరక యందందుఁ గాలముఁ బుచ్చు చుండిరి. కర్మసిద్ధాంత మెంత బలవత్తరమో దీనిచే స్పష్టము కాఁగలదు. భగవంతుఁడు స్వాజ్ఞారూపములగు కర్మముల ప్రకారమే ప్రవర్తింపఁ దలంచుచుండఁగా నిఁక మానవులు వాని నతిక్రమించి యేకార్యమునైన సాధింపఁగలరా యను సందియమొంద నక్కఱలేదు. కర్మబద్ధులయియే ప్రవర్తింతు రని మన మెఱుంగవలయునని యీభాగము తెల్పుచున్నది.

## వాతాపి, ఇల్వలుఁడు.

వీరు సోదరులు. కరుణాలేశములేనిక్రూరులు ఇల్వలుఁడు విప్రరూపమును ధరించి సంస్కృతభాష నుచ్చరించుచు శ్రాద్ధ భోజనమునకు రావలయునని విప్రులం బిలుచును. వా రంగీక రింతురు. వాతాపి మేఁక యగును. దానిం జంపి వండి వార లకుం బెట్టి భుజించినపిదప "వాతాపీ! రమ్మా" యని పిలుచును. వారికుక్షులం జించుకొని వాఁడు రాఁగా నావిప్రులమాంస మును భక్షింతురు. ఇట్లు పెక్కువేలవిప్రులఁ జంపిరి. వారిం

బొలియింపఁబూని దేవత లగస్త్యుని బ్రార్థింప నందుల కంగీకరించి యాత్రోవంబోయి యథాపూర్వ మతఁడు పిలువ నంగీకరించి భుజించి వాతాపీ! యని యిల్వలుఁడు పిలువ నిం కెట్లు రాఁగలఁడు? జీర్ణించెనని ముని బదులుచెప్పి క్రోధాగ్ని నిల్వలునింగూడఁ బొలియించెను. అని రాముఁడు సౌమిత్రికిం దెలిపెను. రక్కసు లిరువురు మార్గమున నిలిచి పోవువారిని వచ్చువారిని శ్రాద్ధమునకు రమ్మని పిలుతురు. ఏల? వారు మాంసాశనులుగాన వారిం జంపియే తినఁగూడదా? వాతాపి మేషరూపముం దాల్ప వానిం జంపనేల? వాఁడు వారిపొట్టలఁ జించుకొని రానేల? రెండుమూఁడురూపములుగా వాఁడెట్లు రాఁగలిగెను? ఇంతశ్రమంపడనేల? ఒక్కసారియే వారిని జంపి భుజింపరాదా? అనుశంకలు గలుగకమానవు. సమాధాన మేమనఁగా నాలకింపుఁడు.

వచ్చుచుంబోవుచునుండువారిని బట్టి చంపుచుండిన మునులు శపింతురు. కనుక నారీతి వారి కనుకూలము కాదు. అనుమానింప నవకాశము లేనిమార్గ మేదియని యాలోచించి యీకపటముం బన్నిరి. ఆకాలమునఁ బంక్తిపావనులగువిప్రుల శ్రాద్ధభోజనమునకు నియమించు టాచారము. ప్రార్థించినచో వలదనరాదను నియమము కలదు. వైదికకర్మములు శ్రేష్ఠములు కదా. అట్టివానియం దయోగ్యుల నియమింపరాదు.

"అపాంక్త్యోపహతా పంక్తిః పావ్యతే యైర్ద్విజోత్తమైః,
తన్నిబోధత కార్త్స్న్యేన ద్విజాగ్ర్యాన్ పంక్తిపావనాన్. ౧౮౩
అగ్ర్యాస్సర్వేషు వేదేషు సర్వప్రవచనేషు చ,
శ్రోత్రియాన్వయజాశ్చైవ విజ్ఞేయాః పంక్తిపావనాః. ౧౮౪

త్రిణాచికేతః పంచాగ్ని స్త్రిసుపర్ణ షడంగవిత్,
బ్రహ్మ దేయాత్మసంతానో జ్యేష్ఠసామగ ఏవ చ. ౧౮౫

వేదార్థవిత్ప్రవక్తా చ బ్రహ్మచారీ సహస్రదః,
శతాయుశ్చైవ విజ్ఞేయా బ్రాహ్మణాః పంక్తిపావనాః. ౧౮౬

పూర్వేద్యురపరేద్యుర్వా శ్రాద్ధకర్మణ్యుపస్థితే,
నిమంత్రయేత త్ర్యవరాన్ సమ్యగ్విప్రాన్ యథోదితాన్. ౧౮౭

నిమంత్రితో ద్విజః పిత్ర్యే నియతాత్మా భవేత్సదా,
న చ ఛందాంస్యధీయీత యస్య శ్రాద్ధం చ తద్భవేత్. ౧౮౮

నిమంత్రితాన్ హి పితర ఉపతిష్ఠంతి తాన్ద్విజాన్,
వాయువచ్చానుగచ్ఛంతి తథాసీనానుపాసతే. ౧౮౯

కేతితస్తు యథాన్యాయం హవ్యకవ్యే ద్విజోత్తమః,
కథంచిదప్యతిక్రామన్ పాపస్సూకరతాం వ్రజేత్. ౧౯౦

మనుస్మృతి. 3 అధ్యా.

అను నీమనుస్మృతి నిమంత్రణీయబ్రాహ్మణస్వరూపము. అతఁడుండవలసినపద్ధతి. నియమాతిక్రమణమునఁ గలుగుపాపము తెలుపఁబడుచున్నది కావున నాయిరువురుదనుజులు శ్రాద్ధపద్ధతుల నెఱింగినవారు కావున నీమార్గము నవలంబించిరి.

పూర్వకాలమున బ్రాహ్మణులు కూడ దేవపితృకార్యములయందు మాంసమును భక్షించువారలని స్మృతిపురాణములు తెల్పెడిని. అందు మేధ్యమాంసములే భక్ష్యములు.

"నాత్మార్థం పాచయేదన్నం నాత్మార్థం పాచయేత్పశూన్,
దేవార్థే బ్రాహ్మణార్థే వా పచమానో న లిప్యతే."

పురాణము.

"మన్యన్నాని పయసోస్సోమో మాంసం యచ్చానుపస్కృతం,
అక్షారలవణం చైవ ప్రకృత్యా హావిరుచ్యతే. ౫౫౭

హవిర్యచ్చిరరాత్రాయ యచ్చానంత్యాయ కల్పతే,
పితృభ్యో విధివద్దత్తం తత్ప్రవక్ష్యామ్యశేషతః. ౨౬౬
తిలైర్వ్రీహియవైర్మాషైరద్భిర్మూలఫలేన వా,
దత్తేన మాసం తృప్యంతి విధివత్పితరో నృణాం. ౨౬౭
ద్వౌ మాసౌ మత్స్యమాంసేన త్రీన్మాసాన్ హారిణేన తు,
ఔరభ్రేణాథ చతుర శ్శాకునేనాథ పంచ వై. ౨౬౮
షణ్మాసం ఛాగమాంసేన పార్షతేన చ సప్త వై,
అష్టావేణస్య మాంసేన రౌరవేణ నవైవతు. ౨౬౯
దశమాసాంస్తు తృప్యంతి వరాహమహిషామిషైః,
శశకూర్మయోస్తు మాంసేన మాసానేకాదశైవతు. ౨౭౦
సంవత్సరంతు గవ్యేన పయసా పాయసేన చ,
వార్ధ్రీణసస్యమాంసేన తృప్తిర్ద్వాదశవార్షికీ. ౨౭౧
కాలశాకం మహాశల్కాః ఖడ్గలోహామిషం మధు,
ఆనంత్యాయైవ కల్పంతే మున్యన్నాని చ సర్వశః. ౨౭౨
యత్కించిన్మధునా మిశ్రం ప్రదద్యాత్తు త్రయోదశీం,
తదప్యక్షయమేవ స్యాద్వర్షాసు చ మఘాసు చ." ౨౭౩

మనుస్మృతి 3 అధ్యా.

"దశమాసా నారణ్యసూకరమహిషమాంసై స్తృప్యంతి" అని వ్యాఖ్య. కొందఱు "వరాహమహిషామిషైః" అనుచోఁ గల మహిషశబ్దమును గాంచి మహిషమాంసమును భక్షించు నాచారము పూర్వమే కలదు గాన నిపుడేల చండాలు రస్పృశ్యు లనుచున్నా రందురు. ఆరణ్యకములని వా రెఱుంగరు. ప్రకరణమునుబట్టియైన నాలోచింపనివారిమాటల మనమేల స్మరింపవలయును? వ్యాఖ్యానము కూడ వా రెఱుంగరు కాఁబోలు. ఈభాగమునఁ బితృకార్యములం దుపయోగింపఁదగు

మాంసములు తెలుపఁబడినవి. నిమంత్రితుఁడగుబ్రాహ్మణుఁ డెట్లుండవలయునో యిందుఁ గనఁబడును. నిమంత్రితుఁ డగు విప్రుఁడు విధి నించుకంతయు మీఱరాదనియు నతిక్రమించిన సూకరయోనిం బుట్టుననియు స్మృతి చాటుచున్నది. కావున మునులు పితృకార్యనిమంత్రితులై విధి నతిక్రమింపక యుందురు. అది యెఱుంగుదురు కాన వాతాపీల్వలులు వారిని శ్రాద్ధభోజనమున కాహ్వానించు చుండిరి. ప్రార్థితుఁడై రా ననరాదు. కనుక యోగ్యవిప్రు లప్పని కంగీకరించుచుండిరి. వా రాకపట మెఱింగి శపించునంత యవకాశము లేదు. వాతాపీ యని పిలువఁగా నతఁడు వారిపొట్టలు చీల్చుకొని వచ్చువాఁడు. కాన వా రీవిషయ మెఱింగి శపించునంత యవకాశము నొందఁజాలక మృతులగుచుండిరి. ఇంద్రజాల మహేంద్రజాలములవంటివిద్య లెన్ని యేని గలవు. వానినెల్ల నేర్చిన వాతాపి యొక్కసారి యిరువురమూవుర పొట్టలు చించుకొనివచ్చుట గొప్పవిషయము కానేకాదు. ఈవృత్తాంతము నెఱింగి దేవత లగస్త్యునిం బ్రార్థించిరి. ఆమునియు నామార్గముననే పోయి వారియాహ్వానము నంగీకరించి భుజించి "వాతాపీ! రమ్మా" యని యిల్వలుఁడు పిలువఁగానే ముని నవ్వుచు

"కుతో నిష్క్రమితుం శక్తిర్మయా జీర్ణస్య రక్షసః,
భ్రాతుస్తే మేషరూపస్య గతస్య యమసాదనమ్." ఉశ్లో

అని బదులు పలికెను. భుజింపఁగనే యగస్త్యముని జీర్ణించుఁ గాక యనుకొన్నంత నతఁడు జీర్ణించెను. ఇల్వలుఁ డాగ్రహించి పైఁబడ రాఁగాఁ జుఱుకుఁజూపుల దహించెను. ఈ కథను బఠించినఁ బ్రాచీనకాలమునఁ గలదురాచారములు

మహర్షులతపశ్శక్తియు మనకుఁ దేటపడఁగలవు. ఆధర్మము ననుసరించి యిపుడేల బ్రాహ్మణులు మాంసమును భుజింపరా దని ప్రశ్నింపరాదు. మహర్షులతపశ్శక్తి యిపుడేల లేవనియే ప్రశ్నింపవలయును.

"అగస్త్య ఇతి విఖ్యాతో లోకే స్వేనైవ కర్మణా,
ఆశ్రమో దృశ్యతే తస్య పరిశ్రాంతశ్రమాపహః. ౮౦
అని మూలము.

"అగం వింధ్యపర్వతం స్యతి స్తంభయతీత్యగస్త్యః"
అని వ్యుత్పత్తి. తనకర్మప్రభావముననే యీముని యగస్త్యుఁ డను వేరు గాంచెనని శ్రీరాముఁడు పలికెను. ఈవేరు నడుమ వచ్చిన దనవలయు. తొలుతఁ గుంభసంభవుఁడనియే. దాని కంటె నిది లోకములఁ బ్రసిద్ధిగాంచెను.

## వింధ్యపర్వతగర్వాపహరణము.

వింధ్యపర్వతము సూర్యున కడ్డముగాఁ దనమేను పెంచెననియు దాన రవిగతి యడ్డిపోఁగా దేవత లద్దానిఁ దీర్పఁజాలక యగస్త్యమునిని బ్రార్థింప నతఁడు తనశిష్యుఁ డగు వింధ్యపర్వతముకడకు రాఁగా నతఁడు మ్రొక్కఁగానే మరలివచ్చునంతదనుక నీవిట్లే యుండుమని యాజ్ఞయొసఁగి పోయి మరల రాఁడయ్యెననియుఁ దదాదిగా నాపర్వతము వంగియున్నదనియు నితిహాసము. దీనిం జదివినవెంటనే నవ్వు రాకమానదు. ఇట్టి యసంగతకథలు కల్పించుట పూర్వులకు నైజమనియుఁ దోఁపకపోదు. దీనిమూలమున నన్నికథలు నిట్టివే యనుభావ ముదయింపకపోదు. కాని యంతమాత్ర మున మనము పూర్వకథల దూషింపరాదు. ఈకల్పనయందుఁ

గలరహస్య మేమని తొలుతఁ దర్కింపవలయును. అసత్య కథలఁ బెద్దలు వ్రాయుదురా యనియు నూహింపవలయును. సమాధాన మిఁక నాలకింపుఁడు. చంద్రబుధశుక్రరవిమండల ములు వరుసఁగా నొకదానికంటె నొకటి భూమికి దూరముగా నుండును. వానిని నిరోధింప నెవ్వారికిని దరముకాదు. భగవంతుఁడు సంకల్పించినచో నాపని సాగును. పరిదృశ్య మానము లగుచంద్రబుధశుక్రరవిమండలములు లోకములే. భూలోకమువంటివే. బ్రహ్మాండ మనవచ్చును. ఆమండలము లను బురుషులనుట వ్యవహారార్థమే కాని వేఱు కాదు. ఒక్కొక్కలోకమున కధిష్ఠాత యొకఁడు గలఁడు. భూమండ లాధిదేవత భూదేవి. చంద్రమండలాధిదేవత చంద్రుఁడు. ఇట్లే తక్కినవారు నని యెఱుంగవలయును. మనము నివసించు భూమి యెట్లు భూదేవి కాదో యట్లే సూర్యమండలము సూర్యుఁడు కాఁడు.

"తేజసాం గోళకస్సూర్యో గ్రహర్క్షాణ్యంబుగోళకాః"

అనికదా ప్రమాణము. చంద్రాదిసప్తగ్రహాలోకములకు నీ భూమికి సంబంధము కలదు. కాననే వానినిమాత్రమే మన మెఱుంగుదుము. అనేకబ్రహ్మాండములు మనకు నక్షత్రరూప ములఁ గనఁబడుచున్నవి. భూలోకమునఁగల యోషధులకు వనస్పతులకుఁ బర్వతములకు నధిదేవతలు గలరు. వింధ్యపర్వ తాధిదేవతయే వింధ్యుఁ డనంబడును. సాగరాధిదేవతయే సముద్రుఁడు జలములు పురుషుఁడు కాదు. శ్రీరామునకు సలిల మధ్యముననుండి కనఁబడి ప్రార్థించినపురుషుఁడే సాగరాధి దేవత యగుసముద్రుఁడు. వింధ్యపర్వతాధిదేవత రవిమండలాధి

దేవతపై ద్వేషమూనెను. దేవత లొండొరులపై నీసువూనుట భూలోకవాసులకు మేలు కాదు. కావున నతనికి గురువగు నగస్త్యముని దేవతలప్రోత్సాహమున నతని శాంతిల్లఁజేసెను. అంతియ యిందలి రహస్యము. "కథాచ్ఛలేన బాలానాం నీతిస్తదిహ కథ్యతే" అన్న సూక్తి కలదు కదా. నీతి కథారూపమునఁ దెలిపిననే యెల్లరకు మనస్సుల నాటునని పూర్వు లిట్టి చమత్కారముగనుండుగాథలం గల్పింతురు. ఎంతవాఁడైనను బరులకుఁ గష్టములఁ గల్గించిన నవమానమునొందు ననునీతి మన కీకథ బోధించుచున్నది. బలదర్పముల విఱ్ఱవీఁగువారి నవిలేనిసాధువు లడంతురనువిషయము మన మెఱుంగవలయు. రజోగుణాటోపము సత్వగుణముకడఁ బనికిరాదనునీతి నీకథ మనకు బోధించుచున్నది. ఇట్లే మన మసంగతము లనుకొను గాథ లిట్టివిశేషనీతులను మనకుఁ దెల్పఁజాలియుండును కావున నట్టివానిని ద్రోసిపుచ్చక యందలి విశేషములఁ బరిశీలించి యెఱుంగవలయును.

"యదాప్రభృతి చాక్రాంతా దిగియం పుణ్యకర్మణా,
తదాప్రభృతి నిర్వైరాః ప్రశాంతా రజనీచరాః. ౮౩
నామ్నా చేయం భగవతో దక్షిణా దిక్ప్రదక్షిణా,
ప్రథితా త్రిషు లోకేషు దుర్ధర్షా క్రూరకర్మభిః." ౮౪

అని మూలము. అగస్త్యుఁడు దక్షిణదిశ, నాశ్రయించినది మొదలందలిరాక్షసులు విరోధబుద్ధిని మాని శాంతము గలిగియుండిరి. క్రూరకర్మములు చేయువారు భయంపడుచున్నవారని శ్రీ రాముఁడు పలికెను. మునిచెంతనుండురక్కసులు తపఃప్రభావమునఁ బ్రశాంతచిత్తులైరి అనఁగాఁ దనపై విరోధమూని

మృతిగాంచి ముక్తులు కాఁదగినవారు తప్ప మిగిలినవారెల్లరు శాంతమూని పూర్వము చేయుదుష్కార్యములను మానిరని శ్రీరాముఁడు తెలిపెను. అనఁగాఁ దాఁ జంపఁదగిన రాక్షసులు మిగిలియున్నవారనియుఁ దక్కుంగలవారు స్వప్రవృత్తిని మానిరని యీభాగము తెలుపుచున్నది.

"అత్ర దేవాస్సగంధర్వాస్సిద్ధాశ్చ పరమర్షయః,
అగస్త్యం నియతాహారం సతతం పర్యుపాసతే. ౮౯
నాత్ర జీవేన్మృషావాదీ క్రూరో వా యదివా శఠః,
నృశంసః కామవృత్తో వా మునిరేష తథావిధః. ౯౦
అగతాస్స్వాశ్రమపదం సౌమిత్రే ప్రవిశాగ్రతః,
నివేదయేహ మాం ప్రాప్తమృషయే సీతయా సహ." ౯౪

అని మూలము. నియతాహారుఁ డగునగస్త్యుని దేవత లెందఱో సేవించుచున్నవారని రాముఁ డనియెను. ముని యోగనిరతుఁడు. కాననే యుక్తాహారుఁడై యుండెను. యోగి సర్వోత్కృష్టుఁడు కనుక నతని నెల్లరుఁ గొలుతురు.

"నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంతమనశ్నతః,
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున. ౧౬
యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు,
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా. ౧౭
యదా వినియతం చిత్త మాత్మన్యేవావతిష్ఠతే,
నిస్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా. ౧౮
తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున." ౪౬

గీత. ౬ అధ్యా.

అను నీశ్రీకృష్ణోపదేశములు యోగిమహత్త్వమును వెల్లడించు చున్నవి. వేయిశాస్త్రములు పఠించుటకంటె యోగాభ్యాసము నొనరించు టుత్తమము. కనుకనే ఆతనిచెంత నసత్యవాది లోనగువా రుండఁజాలరని శ్రీరాముఁడు తెల్పెను. ఆతని దివ్యతేజస్సు వారిని భయభ్రాంతులఁ జేయునని దీనిభావము. సీతతోడనే వచ్చితినని లక్ష్మణా ముని కెఱింగింపుమని రాముఁడు సౌమిత్రిని బంపెను. దేవకార్యమును సమగ్రముగా సాధింప ననువుగా సీతాదేవింగూడియే వచ్చితినని తెల్పుమని శ్రీరామునిభావము. దానవసంహారరూపమగు నీమహాకార్యము సీతాప్రధానముగనే సాగవలయునని శ్రీరాముఁడు ముని కెఱింగించెననియుఁ దగినపరికరములు దయచేయవలయునని హెచ్చరించుటకే యీసందేశమనియు మన మూహింపవలయును. ఇట్టు లీభాగము మన కనేకవిషయ రత్నముల నొసంగుచున్నది. భగవంతు నారాధించుపద్ధతిని దెల్పుచున్నది. యోగమహత్త్వమును గొనియాడుచున్నది. ఆహారనియమమును దేటపఱచుచున్నది. ఇఁకఁ దరువాతిభాగ మును బఠింతము.

## అగస్త్యమునిని శ్రీరాముఁడు దర్శించి వైష్ణవచాపాదులఁ గైకొనుట.

* అంత సౌమిత్రి యాశ్రమముఁ బ్రవేశించి ముని శిష్యుంగాంచి దాశరథి జానకింగూడి మునిని దర్శింప వచ్చి యున్నవాఁడు. నే నతనిసోదరుఁడ. లక్ష్మణుఁడని నన్నుఁ బిలుతురు. తత్ప్రియార్థము వచ్చినాఁడ. తండ్రియానతి సీతా

* ఇయ్యది పండ్రెండవ సర్గమునఁ గలదు.

రాములంగూడి వనములకు వచ్చితిమి. మారాక మునికిం దెల్పుమా. అన నతఁ డగ్నిశాలకుంబోయి వార్తం దెల్పెను. మహాత్ములరాక నెఱింగి నాభాగ్యము ఫలించుటంజేసి సీతారామసౌమిత్రు లరుదెంచిరి. వారిరాకనే కోరుచుందును. అని సంతసించి వత్సా! త్వరగఁ జని పూజార్హులగువారిం గొని రమ్మా. తొలుతనే పిలుచుకొని రాక యాలస్య మేల చేసితి వయ్యా. అనఁగా నతఁడు మ్రొక్కి పోయి లక్ష్మణా! శ్రీరాముఁడు ముని దర్శించుఁగాక. వెళ్లుట కభ్యంతరమేమి గలదు? అన సౌమిత్రి యతనిం బిలుచుకొనిపోయి రామునిం గనఁబఱచెను. ఆశిష్యుఁడు శ్రీరాముని సత్కృతులం దనిపి పిలుచుకొనిపోయెను.

శ్రీరాముఁడు సీతాలక్ష్మణులతో నందుఁ జొచ్చుచు నాటలందేలు హరిణశాబకములం దిలకించుచు నందొక్కచో బ్రహ్మావీతిహోత్రులయు, విష్ణుదేవేంద్రులయు, సూర్యచంద్రులయు, భగకుబేరధాతృవిధాతృవాయుశేషానంతగాయత్రీ వసువరుణకుమారధర్ములయుస్థానములను గాంచుచుంబోయెను. మహర్షియు శిష్యులతో శ్రీరామున కెదురు రాఁగా నాతని దమ్మునకుం జూపి రాముఁ డదిగో మహానుభావుఁడు వచ్చుచున్నాఁడు. కనుమా యాతని దివ్యతేజస్సును. అనుచుఁ దానతనిం జేరఁబోయి భక్తిమెయి నమస్కరించెను. సీతాలక్ష్మణులును మ్రొక్కిరి. లేచి మూవురు నంజలిబంధముల నిలువఁబడిరి. మునియు నాతిథేయముల నాచరించి కుశలమడిగి కూరుచుండ నియమించి ఫలమూలములను వానప్రస్థధర్మమురీతి నొసంగెను. ధర్మవేత్తయగు నమ్ముని తొలుదొలుతఁ దాఁగూరుచుండి శ్రీరామా! వైశ్వదేవకర్మము నాచరించి యష్టుఁ

మొసంగి యతిథులఁ బూజింపవలయు. ఋషి యీరీతి నొనరింపకపోయినఁ గూటసాక్షివలెఁ బరలోకమున స్వమాంసభక్షకుఁడగును. శ్రీరామచంద్రా! సర్వజ్ఞాదిలక్షణములుగల నీవు ప్రియాతిథివైతివి. విశేషించి నిన్నుఁ బూజింపవలయు. అని ఫలమూలాదుల మరలఁ బూజించి పరమేశ్వరా! సువర్ణమయమై రత్నఖచితమై దివ్యమునగు నీచాపవర్యము విష్ణుదేవునిది. విశ్వకర్మ నిర్మించినది. సూర్యతుల్యమగు నీబాణ మమోఘము. ఇది బ్రహ్మదత్తము. అగ్నివలె మండుబాణముల నిండియుండు నీయక్షయతూణీరములు రెండు నింద్రదత్తములు. ఒఱ బంగారుదిగాఁగలిగి స్వర్ణలిప్తమగు నీఖడ్గము నింద్రదత్తమే. మున్ను శ్రీవిష్ణు వీచాపమూనియే యసురులఁ జంపి దేవతలకు రాజ్యమొసంగెను ఇంద్రుఁడు తనవజ్రాయుధమును బ్రతిగ్రహించుచందమున శత్రుజయార్థము వీనిం బ్రతిగ్రహింపుమా. అని ప్రార్థించి యాయగస్త్యమహాముని వాని నొసంగి మరల నిట్లు ప్రార్థించెను.

పరమసాధువులారా! ఇం దనేకవిషయములు గలవు. అందుఁ గొన్నియే విమర్శించి సారమును గ్రహింతము.

"రాజా దశరథో నామ జ్యేష్ఠస్తస్య సుతో బలీ,
రామః ప్రాప్తో మునిం ద్రష్టుం భార్యయా సహ సీతయా. ౨
లక్ష్మణో నామ తస్యాహం భ్రాతా త్వవరజో హితః,
అనుకూలశ్చ భక్తశ్చ యది తే శ్రోత్రమాగతః." 3

అను నీవాక్యములు సౌమిత్రివి. ఇందొక్కవిశేషము గలదు. అది వాల్మీకిముని లక్ష్మణునిమాటలమూలమున మనకుఁ దెలిపెను. "రామః సీతయా భార్యయా సహామునింద్రష్టుంప్రాప్తః"

అని యన్వయక్రమము. "జానక్యా" అని ప్రయోగింపక 'సీతయా' యనుటంజేసి యుత్పత్తిలయశూన్యురాలని యర్థము సూచింపఁబడుచున్నది. "భార్యయా" యనుటచేఁ దేజస్సుచేఁ బూజ్యురాలగు ననుభావము వెల్లడియగుచున్నది. "రామః" అనుటచేత విహరించువాఁడనునర్థ మగుచున్నది. తేజస్స్వరూపిణియగు మహాప్రకృతింగూడి వేడుకగా నొకరూపమును బూని మునికి దర్శనమీయ వచ్చె ననుభావము వెల్లడియగు చున్నది. అనఁగా బహుజన్మసుకృతఫల మీదర్శనము. దానిం బొందుయోగ్యతగలవాఁడు మీగురువు. నేను వారి కను కూలుఁడను. భక్తుఁడను. నీవీవార్తను వినియుందువు. అనఁగా వారిని సేవించుచు వచ్చినాఁడను. శ్రీరాముని తమ్ముఁడను. అనఁగా మామావురిరాక మహర్షి యెఱుంగందగును. ఈ వార్తచే వారు తమకృత్యము నెఱుంగఁగలరు. అను నీభావ మీభాగమునఁ గలదని యెఱుంగవలయును.

> "తే వయం వనమత్యుగ్రం ప్రవిష్టాః పితృశాసనాత్,
> ద్రష్టుమిచ్ఛామహే సర్వే భగవంతం నివేద్యతామ్." ౪

అని మూలము. ఆ మేము భయంకరమగు నీదండకారణ్యముం బ్రవేశించితిమి. మూవురము వారిని జూడఁగోరుచున్నాము. భగవంతుఁ డగుమునికి మారాక విన్నవింపుము. అని లక్ష్మణుఁడు పలికెను. భీకరారణ్యమునకు వచ్చితిమి. అనుటంజేసి యీయాత్ర కనుకూలమగుకార్యము మునివలనఁ గాఁదగి యున్నదనియు నది సర్వజ్ఞుఁడుగాన నతఁడే యెఱుంగుననియు లక్ష్మణుఁడు సూచించెనని మన మూహింపవలయును.

> "దిష్ట్యా రామశ్చిరస్యాద్య ద్రష్టుం మాం సముపాగతః,
> మనసా కాంక్షితం హ్యస్య మయాప్యాగమనం ప్రతి." ౧౧

అనునిది మునివాక్యము. ఇయ్యది పైన వ్రాసినభావమును దృఢపఱచుచున్నది. ఎట్లనఁగా: నాభాగ్యవశమున శ్రీరాముఁడు నన్నుఁ జూడఁ జిరకాలమున కరుదెంచెను. నేనును శ్రీరామాగమనమును మనస్సుచేఁ గోరుచునే యున్నాఁడను. అనఁగా భావమేమి? ఎంతకాలమునుండియో నాచేయు తపస్సు ఫలింప ననువగుకాల మిది. కాననే రామమూర్తి దర్శనమీయ నరుదెంచెను. మనస్సుచే ననఁగా మనోదృష్టిచే దానినే కోరుచున్నాఁడను. అని. లక్ష్మణుఁడు భగవంతున కెఱిఁగింపు మన్నభావమే యిమ్మునియు మనస్సునఁ గోరు చున్నాఁడ ననియె సార మిందేది? చిరకాలము భగవంతుని నిష్కల్మషస్వాంతమున నారాధింపఁగాఁ దత్ఫలముగా నభీష్ట దేవత. భక్తకాంక్షానురూపమగుమూర్తిని ధరించి ప్రత్యక్ష మగును. ఏనాఁటి కాతపస్సు పరిపక్వమగునో యాసమయ ముననే దర్శనమిచ్చుట భగవంతునిస్వభావము. మనస్సు నిర్మలము కాదేని ఫలము శూన్యము. ఇది ఫలాభిసంధిసహిత మగు సత్కర్మము కాదా యనికొందఱనవచ్చును. కాని భగవ ద్దర్శనము కోరఁదగినది. అది నిరీహులకుఁగూడఁ గోరఁదగినదే. అది దుర్వాంఛయనువా రజ్ఞానులు.

"వాంఛాసజ్జనసంగతౌ పరగుణే ప్రీతిర్గురౌ నమ్రతా
విద్యాయాం వ్యసనం స్వయోషితి రతిర్లోకాపవాదాద్భయం,
భక్తిశ్శూలిని శక్తిరాత్మదమనే సంసర్గముక్తిః ఖలే
యేష్వేతే నివసంతి నిర్మలగుణాస్తేభ్యో నరేభ్యో నమః." ౬౨

నీతిశతకము

అని భర్తృహరి తెల్పెను

"అనన్యచేతాస్సతతం యో మాం స్మరతి నిత్యశః,
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః. ౧౪
మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతం,
నాప్నువంతి మహాత్మానస్సంసిద్ధిం పరమాం గతాః. ౧౫

అధ్యా. ౮.

అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం. ౨౨
పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః." ౨౬

గీత. ౯ అధ్యా.

అను నీభగవద్వాక్యములు వాంఛాదులు భగవద్విషయమున నుండఁదగినవనియే బోధించుచున్నవి. అగస్త్యమునియుఁ జిరకాల మాచరించిన తనతపస్సునకు ఫలముగా శ్రీరాముఁడు దర్శనమీయ నరుదెంచుట మనకుఁ దపోనియతిం దెల్పుచున్నది.

"స తత్ర బ్రహ్మణస్థ్సాన మగ్నేస్థ్సానం తథైవ చ. ౧౭
విష్ణోస్థ్సానం మహేంద్రస్య స్థానం చైవ వివస్వతః,
సోమస్థానం భగస్థానం స్థానం కౌబేరమేవ చ. ౧౮
ధాతుర్విధాతుస్థ్సానే చ వాయోస్థ్సానం తథైవ చ,
నాగరాజస్య చ స్థాన మనంతస్య మహాత్మనః. ౧౯
స్థానం తథైవ గాయత్ర్యా వసూనాం స్థానమేవ చ,
స్థానం చ పాశహస్తస్య వరుణస్య మహాత్మనః. ౨౦
కార్తికేయస్య చ స్థానం ధర్మస్థానం చ పశ్యతి."

అని మూలము. ఇందు వెదకి తెలిసికొనఁదగిన విషయములు లేవు. కాని యొకవిచిత్రవృత్తాంత మిందుఁ గలదు. దానిని

దెలిసికొను టత్యుత్తమము. ఈసర్గము నారంభమునే గోవిందరాజులు "రుద్రస్యాపూజ్యత్వమాహ స ప్రవిశ్యేత్యాది" అని వ్రాసిరి. "సతత్ర" అనునది యారంభముగా "ధర్మస్థానంచ పశ్యతి" అనునంతవఱకుఁ గలశ్లోకచతుష్కమునకు వ్యాఖ్య యిట్లు వ్రాసిరి.

"ఇమే బ్రహ్మాదయః పూర్వసర్గే ఫలప్రదత్వేనోక్తాః. అన్యే అగస్త్యోపాసకత్వేనోక్తాః. ఏతే బ్రహ్మాగ్నివిష్ణుమహేంద్రవివస్వత్సోమభగకుబేరధాతృవిధాతృవాయ్వనంతగాయత్రీవసువరుణకార్తికేయధర్మాఖ్యాస్సప్తదశ దేవాః. యో వై సప్తదశమిత్యనువాకోక్త సప్తదశాక్షరదేవతాః యాయజూకేన మునినా పూజార్థం ప్రతిష్ఠితా ఇతి బోధ్యం. అత్ర పూజ్యత్వవిశేషు రుద్రస్యానుపాదానాదపూజ్యత్వముక్తం. అధునా జనైః కైశ్చిత్పూజ్యమానతా తు తామసశాస్త్రానురోధేనేతి బోధ్యం. నను విష్ణోస్థానం మహేశస్యేతి పాఠాత్ స్థానానుక్త్యసంభవ ఇతి చేత్. తదా పూర్వం రామేణ "అగస్త్యం నియతాహారం సతతం పర్యుపాసత" ఇత్యుక్తావపి స్థాననిర్దేశే ఉపాస్యోపాసకయోరుభయోరపి నిర్దేశో న విరుధ్యతే. యద్వా ఉపాసనం సమీపావస్థానం. స త్వారాధనం. ధర్మమారాధయిష్యవ ఇత్యుక్తేః. ధర్మస్యారాధనం పరిపాలనమేవ."
అని గోవిందరాజులభావము. ఇప్పట్టున

"తత్రాగస్త్యాశ్రమే సః శ్రీరామః బ్రహ్మాదిదేవతాస్థానాని పశ్యతీత్యన్వయః".

అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి.

మహాశయులారా! ఇచ్చో నిష్పక్షపాతబుద్ధిని విమర్శింతము. సర్గప్రారంభమున రుద్రునకు నపూజ్యత్వ మిందుఁ జెప్పఁబడునని వ్రాసిరిగదా. ఇది దుర్మతాభిమానపిశాచ మీతని నావహించుటం జేసి కాక వేఱుకారణ మేమి కలదు? ఇంతకు

ముందే వీరివ్రాఁత లెట్టివో తెలిపియే యున్నాను. మరల నిచ్చోఁ దెలిసికొందము. పూర్వసర్గమునందు,

"అత్ర దేవాస్సగంధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః,
అగస్త్యం నియతాహారం సతతం పర్యుపాసతే." ౮౯

అనియు,

అత్ర దేవాశ్చ యక్షాశ్చ నాగాశ్చ పతగైస్సహ,
వసంతి నియతాహారా ధర్మమారాధయిష్ణవః. ౯౧

యక్షత్వమమరత్వం చ రాజ్యాని వివిధాని చ,
అత్ర దేవాః ప్రయచ్ఛంతి భూతై రారాధితాశ్శుభైః." ౯౩

అనియుఁ గలదు. పూర్వసర్గమున బ్రహ్మాదిదేవతలు ఫలప్రదులుగాఁ జెప్పఁబడిరనియు నితరు లగస్త్యు నుపాసింపనున్నవారనియుఁ జెప్పఁబడిరని వీరు వ్రాసిరి. ఈబ్రహ్మాది దేవతలు పదునేడుగురు యజ్ఞములుచేయఁమునిచే స్థాపింపఁబడిరనియు వ్రాసిరి. వీరియందు రుద్రుఁడు చెప్పఁబడకపోవుటం జేసి పూజార్హుఁడు కాఁడని యెఱుంగవలయునని చక్కఁగా వ్రాసిరి. అంతతోఁ దృప్తినొందక "విష్ణోస్థ్సానం మహేశస్య" అనుపాఠము కలదుకదా యని కొందఱందురని యూహించి రుద్రుఁడు పూజార్హుఁడనువారు తామసశాస్త్రము ననుసరించువారని తెగించి వ్రాసిరి. ఉపాసనమనఁగా సమీపమున నుండుట యనియేగాని యారాధనము కాదనియు, ధర్మారాధనమనఁగాఁ బరిపాలనమే యనియు వ్రాసిరి. అక్కటా! వీరిమౌగ్ధ్యమునకు మనము చింతింపవలసియున్నది. శాస్త్రములలోఁ దామసశాస్త్రములని చెప్పఁబడలేదు. వీరిభావము శాస్త్రములనఁగా నాగమములనియు నందు శైవాగమములు తామసములనియు వైష్ణవాగమములు సాత్త్వికములనియు

నైయుండనోపు. శైవాగమములు తామసములని వైష్ణవాగమములయందుఁ బ్రమాణము లుండుననుకొందము. వైష్ణవాగమములు తామసములని శైవాగమములయం దుండక మానదనుకొందము. ఈరెండింటిలో నేది ప్రమాణము? ఏది యప్రమాణము? ఈరెండును బ్రమాణములే కావని త్రోసివైచి మఱికొన్ని ప్రమాణముల నరయుదము. కారణము లేని కలహమునకుఁ గాలుద్రవ్విన వీరు పాషండులుగాక మఱేమగుదురు? ఇందుఁ బేర్కొనినపదునేడుగురు దేవతలను బూజార్థము ముని ప్రతిష్ఠించెనని యెఱుంగవలయుననిరి ప్రతిష్ఠించెననఁగా శిలావిగ్రహముల నిర్మించి దేవాలయములఁ గట్టిరని వీరిభావమని యూహించుట పొరపాటుగాదు. అగస్త్యునివంటి మహాజ్ఞాని పామరులంబోలి విగ్రహముల నారాధించు నను టుచితము కాదు. ప్రాయికములుగా మునులుచేయునవి సత్రయాగములు. యాయజూకు లెందుఁ గాని తమగృహములయం దిన్నిమందిరములు కట్టించుకొన్నజాడ గానరాదు. వీరెల్లరకు హవిర్భాగములు కలిగియున్న నుండుఁగాక. ఈదేవతలనామములందు రుద్రనామ్నము లేనందున నీశ్వరునకు పూజ్యత్వము పోసంగునను టత్యంతానుచితము. శివునకు యజ్ఞమున భాగము లేకయుండఁజేసిన దక్షుఁ డేఫలమును మూటఁగట్టుకొనియెనో భాగవతము బోధించుచున్నది. యజ్ఞభాగము వేదప్రతిపాదితము. దానిమార్ప నెవ్వారికిని దరముకాదు. కనుక గోవిందరాజు లీవిషయమున మహావిద్వాంసులయ్యును పాషండత్వమున నకృతజ్ఞానులైరి. యజ్ఞము చేయువార లీపదునేడుగురనుమాత్రమే ప్రతిష్ఠింతురన్నయుక్తి యెగిరిపోయెను. దీనివాస్తవ మేమనఁగా మునియాశ్రమమునఁ

బెక్కండ్రుమును లున్నవారని రామాయణమే తెల్పు
చున్నది. ప్రతిమునియు నొకదేవతనే యుపాసించువాఁడుగ
నుండును. ఎవ్వాని కేదేవతయందు భక్తియుండునో వాఁ
డద్దేవత నుపాసించును. ఇది సర్వపురాణేతిహాససమ్మతము.
అగస్త్యునికడ నుండువారు పైఁ బేర్కొనినదేవతల నుపా
సించువారు. వారికి నియతస్థానములే యవి. భూభూతశుద్ధు
లెట్లో యాసనశుద్ధియునట్లే యని యెఱుంగవలయు. ఒక్కొక్క
రొక్కొక్కచోటఁ గూరుచుండి నియమానుసార మభీష్ట
దేవతామూర్తిని మది నిడుకొని ధ్యానింతురు. అంతియకాని
పాషాణవిగ్రహములఁ జేయించి యాగమానుసారము ప్రతి
ష్ఠించి దానికడఁ గూరుచుండి యుపాసింపరు. విగ్రహపూజా
నిరతు లత్యంతబాలిశులు. ధ్యాననిరతులు మహాత్ములు.

"యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే,
ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః. ౨౨
శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్,
కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః. ౨౩
యోఽన్తస్సుఖోఽన్తరారామ స్తథాన్తర్జ్యోతిరేవ యః,
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి. ౨౪
లభంతే బ్రహ్మనిర్వాణమృషయః క్షీణకల్మషాః,
ఛిన్నద్వైధాయతాత్మానస్సర్వభూతహితే రతాః. ౨౫
భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరం,
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి." ౨౯

గీత. ౫ అధ్యా.

అను నీ శ్రీకృష్ణవాక్యములు అంతర్బాహ్యోపాసనాభేదముల
సూచించుచున్నవి. కావున నీపదునేడుస్థానములాయాదేవతో

పాసకులకు నియతస్థానములని యెఱుంగుట మంచిది. ఏచోట నెవఁ డేదేవత నుపాసించునో యాచోటునం దాదేవతా తేజస్సు వ్యాపించియుండుననుట యోగమతము.

ఇఁక రుద్రున కపూజ్యత్వము ప్రతిపాదిత మనువిషయ మును బరిశీలింతము. గోవిందరాజు లెంతపండితుఁడైనను బూర్వదుష్కర్మవశమునఁ బాషండత్వ మలవడఁగా శివదూష ణమున కారంభించెను.

"తదాద్యిమధ్యాంతవిహీనమేకం విభుం చిదానందమరూపమద్భుతం. ౫

ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం త్రిలోచనం నీలకంఠం ప్రశాంతం,

ధ్యాత్వా మునిర్గచ్ఛతి భూతయోనిం సమస్తసాక్షిం తమసఃపరస్తాత్. ౬

సబ్రహ్మా సశివస్సేంద్రస్సోఽక్షరః పరమస్స్వరాట్,

స ఏవ విష్ణు స్సప్రాణ స్సకాలోఽగ్ని స్సచంద్రమాః. ౭

స ఏవ సర్వం యద్భూతం యచ్చ భవ్యం సనాతనం,

జ్ఞాత్వా తం మృత్యుమత్యేతి నాన్యః పంథా విముక్తయే." ౮

కైవల్యోపనిషత్తు.

"యో రుద్రో అగ్నౌయో అప్సు య ఓషధీషు యో రుద్రో

విశ్వాభువనావివేశ తస్మై రుద్రాయ నమో అస్తు."

యజుర్వేదము.

"తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః,

స బ్రహ్మా సశివ స్సహరి స్సేంద్రస్సోఽక్షరః పరమస్స్వరాట్." ౩౦

నారాయణోపనిషత్తు.

"అవిద్యామోహితాత్మానః పురుషా భిన్నదర్శినః,

వదంతి భేదం పశ్యంతి చావయోరంతరం హర. ౪౯

ప్రసన్నోఽహం గమిష్యామి త్వం గచ్ఛ వృషభధ్వజ."

విష్ణుపురాణము. ౫ అం. ౩౩ అధ్యా.

పైశ్రుతులు త్రిమూర్తుల కాదియగు తత్త్వము గలదని తేట పఱచుచున్నవి. విష్ణుపురాణమున శ్రీకృష్ణుఁడే శివునితో మన కిరువురకు భేదమును గల్పించువా రజ్ఞానులని పలికెను. కావున నీగోవిందరాజులమతము పాషండమతముగాక మత్తే మగును? ఈపదునేడుగురు సామాన్య దేవతలనియు సదా శివుఁడు వీరలకుఁ బ్రభువుగాన నిందుఁ జెప్పఁబడలేదనియుఁ గొంద ఱర్థము తెల్పుదురు. అదియుఁ బాషండమతవాదమే యని మన మూహింపవలయు.

"గుణమయ్యాం స్వశక్త్యాస్య సర్గస్థిత్యప్యయాన్ విభో,
ధత్సే యయా సదృగ్భూమన్ బ్రహ్మ విష్ణు శివాభిధాం. ౨౩
త్వం బ్రహ్మ పరమం గుహ్యం సదసద్భావభావనం,
నానాశక్తిభిరాభాతస్త్వమాత్మా జగదీశ్వరః." ౨౪

శ్రీభాగవతము ౮ స్కం. ౭ అధ్యా.

"ఆదావభూచ్ఛతధృతీ రజసాస్య సర్గే
విష్ణుస్స్థితౌ క్రతుపతిర్ద్విజధర్మసేతుః,
రుద్రోఽప్యయాయ తమసా పురుషస్సఆద్య
ఇత్యుద్భవస్థితిలయాస్సతతం ప్రజాసు."

౧౧ స్కం. ౪ అధ్యా.

"యోఽసృజద్దక్షిణాదంగా ద్బ్రహ్మాణం లోకసంభవం,
వామపార్శ్వాత్తథా విష్ణుం లోకరక్షార్థమీశ్వరం. ౩౫౧
యుగాంతే చైవ సంప్రాప్తే రుద్రమీశో జగత్ప్రభుః." ౩౫౨

శ్రీమహాభారతము. అనుశాసనికప. ౧౪ అధ్యా.

విష్ణుకృతశివస్తుతిః.—

"త్వం వై బ్రహ్మా చ రుద్రశ్చ వరుణోఽగ్నిర్మనుర్భవః,

ధాతా త్వష్టా విధాతా చ త్వం ప్రభుస్సర్వతోముఖః.” ౪౧౩
అను. ౧౪ అధ్యా.

“త్రయాణా మేకభావానాం యో న పశ్యతి వై భిదాం,
సర్వభూతాత్మనాం బ్రహ్మన్ స శాంతి మధిగచ్ఛతి.” ౫౪
శ్రీభాగవతము. ౪ స్కం. ౭ అధ్యా.

“బ్రాహ్మణాస్సాధవశ్శాంతా నిస్సంగా భూతవత్సలాః,
ఏకాంతభక్తా వ్యాస్మాసు నిర్వైరాస్సమదర్శినః. ౨౦
సలోకలోకపాలాస్తాన్ స్తువంత్యర్చంత్యుపాసతే,
అహంచ భగవాన్ బ్రహ్మా స్వయంచ హరిరీశ్వరః. ౨౧
న తే మయ్యచ్యుతేఽజే చ భిదామణ్వపి చక్షతే,
నాత్మనశ్చ పరస్యాపి తద్యుష్మాన్వయమీమహి.” ౨౨
శ్రీభాగ. ౧౨ స్కం. ౧౦ అధ్యా.

అను నీపురాణములు త్రిమూర్తులను గల్గించినవాఁడొక్కఁడు కలఁడనియు వీరు తదంశములే యనియుఁ దేటపఱచుచున్నవి. కావున గోవిందరాజులుగారిభావము సమంజసము కాదనియే స్పష్టము. “కొందఱు రుద్రుఁడు పూజార్హుఁడందురు. వారు తామసశాస్త్రము నమ్మువారలు” అని గోవిందరాజులు వ్రాసిరి. వీరు ప్రమాణములను భాగవతవిష్ణుపురాణములందే ప్రమాణములు గలవుకదా. ఇపుడు వీరివాదము దుర్వాద మనవచ్చునుగదా. ఏవిధమున నూహించినను వీరు పాషండులలో నొక్కరని స్పష్టమయ్యెడిని. “అవిద్యామోహితాత్మానః పురుషా భిన్నదర్శినః” అను విష్ణుపురాణవచనమునకు వీ రుదాహరణభూతులే యగుదురు. ఇంక నీవిషయమును

వదలుదము. విషయాంతరమును విమర్శించి యందలిసారమును గ్రహింతము.

> "అగ్నిం హుత్వా ప్రదాయార్ఘ్యమతిథిం ప్రతిపూజయేత్,
> అన్యథా ఖలు కాకుత్స్థ తపస్వీ సముదాచరన్. ౨౯
> దుస్సాక్షీవ పరే లోకే స్వాని మాంసాని భక్షయేత్,
> రాజా సర్వస్య లోకస్య బ్రహ్మచారీ మహారథః. ౩౦
> పూజనీయశ్చ మాన్యశ్చ భవాన్ ప్రాప్తః ప్రియాతిథిః."

అని మూలము. నియమము నతిక్రమింపక యథాశాస్త్రము గనే యతిథిపూజ చేయవలయు ననునాచార మీభాగము మనకుఁ దెలుపుచున్నది. వైశ్వదేవము చేసి యర్ఘ్యమొసఁగి యతిథిని బూజింపవలయునన్న శాస్త్రమర్యాదను దపస్వి మీఱ రాదనియు, అట్లు మీఱినఁ గూటసాక్షివలె నరకమునొందు ననియు దీనిభావము. ఇది మనుస్మృతికి విరుద్ధముగ నున్నది.

> "న బ్రాహ్మణస్య త్వతిథిర్గృహే రాజన్య ఉచ్యతే,
> వైశ్యశూద్రౌ సఖా చైవ జ్ఞాతయో గురురేవ చ. ౧౧౦
> యది త్వతిథిధర్మేణ క్షత్రియో గృహమావ్రజేత్,
> భుక్తవత్సు చ విప్రేషు కామం తమపి భోజయేత్." ౧౧౧
>
> మను. 3 అధ్యా.

అని మనువు తెల్పెను. ఇందేది ప్రమాణమని శంకింపరాదు. మనువాక్యము క్షత్రియపరము. శ్రీరామాయణవాక్యము భగవదవతారపరము. మునివరుఁడు శ్రీరాముని తత్త్వమెఱుంగును గదా. సర్వశాస్త్రములు భగవత్పరమున విసంవాదులుగఁ దోఁచినను వాని నతిక్రమించి భగవంతు నారాధింపవచ్చునని మన మెంచవలయును. "భవాన్ ప్రాప్తః ప్రియాతిథిః"

అను మునివాక్యమే యీయర్థమును సూచించుచున్నది. నీవు అనఁగాఁ బరమేశ్వరుఁడు ప్రియాతిథిః అనఁగా ప్రియమును గల్గించుచుఁ జాలకాలము నిలువనివాఁడవు. ప్రాప్తః=వచ్చితివి నీవంటి యతిథివచ్చుటయే తపఃఫలమని మునియాశయము.

"త్వం రజోగుణతో బ్రహ్మా జగతస్సర్వకారణం. ౨౮
సత్త్వాద్విష్ణుస్త్వమేవాస్య పాలకస్సద్భిరుచ్యసే,
లయే రుద్రస్త్వమేవాస్య త్వన్మాయాగుణభేదతః. ౨౯
జాగ్రత్స్వప్నసుషుప్త్యాఖ్యా వృత్తయో బుద్ధిజైర్గుణైః,
తాసాం విలక్షణో రామ స్త్వం సాక్షీ చిన్మయోఽవ్యయః. 30

... ... ... ... ...

కిం రామ బహునోక్తేన సారం కించిద్బ్రవీమి తే,
సాధుసంగతిరేవాత్ర మోక్షహేతు రుదాహృతా.
సాధవస్సమచిత్తా యే నిస్స్పృహా విగతైషణాః,
దాంతాః ప్రశాంతా స్త్వద్భక్తా నివృత్తాఖిలకామనాః,
ఇష్టప్రాప్తివిపత్త్యోశ్చ సమాస్సంగవివర్జితాః,

... ... ... ... ...

అద్య మే సఫలం జన్మ భవత్సందర్శనాదభూత్,
అద్య మే క్రతవస్సర్వే బభూవుస్సఫలాః ప్రభో,
దీర్ఘకాలం మయా తప్త మనన్యమతినా తపః,
తస్యేహ తపసో రామ ఫలం తవ యదర్చనం.
సదా మే సీతయా సార్ధం హృదయే వస రాఘవ,
గచ్ఛత స్తిష్ఠతో వాపి స్మృతిస్స్యాన్మే సదా త్వయి."

అధ్యాత్మరామాయణము.అరణ్యకాం. 3 అధ్యా.

అను నీభాగము శ్రీరామతత్త్వమును శివకేశవాభేదమును సీతామాహాత్మ్యమును దెలుపుచున్నవి. ఈభాగము గోవింద

రాజులమతము న్యాయ్యము కాదనియే దృఢపఱచుచున్నది. దుర్మతాభిమానపిశాచ మావహించినచో భేదబుద్ధి పొడమక మానదుకదా. దాని నడఁగించుసత్కర్మముల నాచరించి భగవంతు నారాధింపవలయును.

## శ్రీరాముఁడు పంచవటికిఁ బోవుట.

*శ్రీరామా! సౌమిత్రీ! మీరు సీతాదేవియు నాకు మ్రొక్క నిచటికి వచ్చితిరి. పరమానందమందితిని. మార్గాయాసమున శ్రమంపడితిరి జానకి విశ్రాంతిని గోరుచున్నట్లు స్పష్టమగుచున్నది ఎన్నఁడు నిట్టిశ్రమముల నొందినది కాదు. పతివగు నీయందుఁగలస్నేహమున దోషాలయమగునడవికి వచ్చినది. అట్టి యీసాధ్వి యాశ్రమమున నెట్లు సుఖముగా నుండునో యట్లు గావింపుము నీవెంటవచ్చుటంజేసి దుష్కరకార్యముచేసిన దనవలయును. శ్రీరామా! స్త్రీలు పెనిమిటిని భాగ్యదశయందు సంతోషపెట్టుదురు. విషమావస్థయందుండు తఱి నతని విడనాడుదురు. ఇది యనాదిగా స్త్రీలకు సహజమైనదిగా నమ్ముము. స్త్రీలమనస్సు శంపాలతికవలెఁ జంచలతమముగ నుండును. చిరకాలకృతస్నేహమునైన వదలుదురుగాన వారిచిత్తము శస్త్రమువలెఁ దీక్ష్ణముగ నుండును. ముందు వెనుక లాలోచింపక యెట్టిపనికైన సాహసించుఁగాన వారి మనస్సు గరుడపవమానులకంటె వేగవంతమనందగు. నీసహధర్మచారిణికన్నటో యట్టిదోషము లేమియుఁ బొసఁగవు. అంతమాత్రమేకాక యీజానకి స్తుతి కర్హురాలు. అరుంధతీదేవిరీతిఁ బతివ్రతలలో మేలుబంతియని గణింపఁదగినదియే

---

*ఇయ్యది పదుమూఁడవ సర్గమునఁ గలదు.

యగు. నీ వీసీతాసౌమిత్రులతోవచ్చి నివసించుటం జేసి మా యీయాశ్రమప్రదేశ మలంకరింపఁబడినదే. అని పలికెను.

అగస్త్యముని యిట్లు పలుక శ్రీరాముఁ డంజలింబట్టి నాసోదరునియు నాకళత్రమగుసీతవియు గుణములను నాగుణములను మహాత్ముఁడవగునీవు కాంచి సంతోషించితివి కావున నేను ధన్యుఁడ నైయితిని అనుగ్రహింపఁబడితిని. ఇఁక నెందుండి నిరంతరానందమును గాంతునో యట్టి వాసార్హస్థలము నుపదేశింపుము. జలసమృద్ధిగలిగి వనరాజి వెలయఁగా నాయది యుండందగు. అనఁగా నాధర్మాత్ముఁడు విని కాఁగలవిషయములఁ దలంచి యించుక చింతించి చక్కఁగా నిశ్చయించి వత్సా! యిచ్చోటికి రెండుయోజనములదవ్వున ఫలమూల జలసమృద్ధిగలిగి మృగసముదయజుష్టమై సిరుల కాటపట్టగు పంచవటి యనుస్థలము గలదు. అందు వీరింగూడి నీవాశ్రమముఁ గల్పించుకొని తండ్రియానతిం బాలించుచుఁ గ్రీడింపుము. దశరథునిసమయముచొప్పున వనవాసమున గడపఁదగిన పదునాలుగేండ్లకాలమునఁ జాలభాగము చెల్లెను. సమయము నెఱవేర్చి రాజ్యమునొంది సుఖింపఁగలవు. యయాతి తనతనయుని మూలమున నెట్లో యట్లే దశరథుఁడు నీమూలమునఁ బ్రతినదీర్చుకొనియె. తపోమహత్త్వమున నంతయు నెఱింగియే యున్నవాఁడను. మఱియు నీమనస్సంకల్పమునుగూడఁ దెలిసికొంటిని. కానఁ దొలుత నిందు నీవుండ నంగీకరించియు నిపుడు పంచవటికిఁ బొమ్మనుచున్నవాఁడను. ఆస్థలము మనోహరముగాన సీత యందు వేడుకగ నుండఁగలదు. శ్లాఘ్యమగు నాస్థలము దాపుగాఁగూడ నున్నది. గౌతమి యచ్చటికి దాపున నున్నది. సీత యానదిదాపున విహరింపఁగలదు. అందు ఫల

మూలాదులు సమృద్ధిగ నుండును. మీనివాసమున కాపంచవటి మిక్కిలి తగియున్నది. శ్రీరామా! నీ వాపన్నులఁ గాపాడఁ జాలినవాఁడవౌట నందుండినఁ దపస్వులను రక్షింపఁగలవు. ఈచెంతనే యిప్పచెట్లవన మగపడుచున్నది. చూడుము. అందుండి యుత్తరముగఁ బోయిన వటవృక్ష మగపడును. ఆమూలముననే పోవఁగా నున్నతస్థలము కనఁబడును. దాని నెక్కిన నొకకొండ యాదండ కనంబడు. దానికి దాపుగనే పంచవటి కలదు. పుష్పితారణ్యము లందుఁగలవు. అని తెలుపఁగా నాయగస్త్యముని నారాధించి సెలవంది పాదవందన మాచరించి సీతాసహితముగాఁ బంచవటికిఁ బోయిరి. ధనుర్బాణములం దాల్చి మహర్షి చెప్పినత్రోవనే పోయిరి.

మహామతులారా! ఇందలివిశేషములఁ బరిశీలింతము.

"ప్రాజ్యదోషం వనం ప్రాప్తా భర్తృస్నేహప్రచోదితా. 3
యథైషా రమతే రామ ఇహ సీతా తథా కురు,
దుష్కరం కృతవ త్యేషా వనే త్వామనుగచ్ఛతీ. ४
ఏషాహి ప్రకృతిస్త్రీణామాసృష్టే రఘునందన,
సమస్థమనురంజంతి విషమస్థం త్యజంతి చ. ५
శతహ్రదానాం లోలత్వం శస్త్రాణాం తీక్ష్ణతాం తథా,
గరుడానిలయోశ్శైఘ్ర్య మనుగచ్ఛంతి యోషితః. ౬
ఇయం తు భవతో భార్యా దోషైరేతైర్వివర్జితా,
శ్లాఘ్యాచ వ్యపదేశ్యాచ యథా దేవీ హ్యరుంధతీ." ౭

అని మూలము. ముని గూఢార్థముగలపల్కుల శ్రీరామునకు సీతామహత్త్వమును దెలుపుచుఁ దన్మూలమున స్త్రీధర్మముల నుపదేశించుచున్నాఁడు. శ్రీరామా! నీయందుఁగల స్నేహముచేఁ బురికొలుపఁబడి యనఁగా నీకు నీలోకమున ఖ్యాతిని

గల్గించుకోరిక తన్ను నడవులకుఁ బొమ్మని త్వరపెట్టఁగా మహా దోషములుగల యీయడవుల కరుదెంచెను. కావున నేవిధమున నీవు వర్తించిన నీదేవి యానందించునో యట్లు వర్తింపుము. అనఁగా నిర్లిప్తుఁడవగు నీవామె యానందింపఁగాఁ గాంచుటయే నీ కానందము. ఆమె యానందించునట్లు చేయుమనఁగా నామెచెప్పినట్లు వర్తింపుము. దీనిచే సీతారాములు ప్రకృతిపురుషు లనుభావము సూచితము. ప్రకృతిబద్ధుఁడే భగవంతుఁడు. భగవదిచ్ఛయే ప్రకృతి. ప్రకృతి యంతర్లీనమైన భగవంతుఁడు స్థాణువగును. ఈయర్థమునే

"శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
న చే దేవం దేవో నఖలు కుశలస్స్పందితుమపి,
అతస్త్వామారాధ్యాం హరిహరవిరించాదిభిరపి,
ప్రణంతుం స్తోతుం వా కథ మకృతపుణ్యః ప్రభవతి."

అని శ్రీశంకరాచార్యులుగారు తెలిపిరి. రామా! ఈసీత దుష్కరకార్యమును జేసినదగును. అశక్యమనఁ దగినకార్యమును సాధించినదగు. ఎపుడు? నిన్ననుసరించివచ్చును. అనఁగా నీవెంటవచ్చుచున్నదియేయైన మహాకార్యమును సాధించినదగును. నిన్ననుసరించినట్లు నటించుచు నశక్యకార్యముల నొనరించినదే యగునని భావము. రాఘవా! ప్రాయికముగా సృష్ట్యాదిగా స్త్రీలు ధనధాన్యాదిసమృద్ధుఁ డగుభర్తను రంజింపఁజేయుదురు. అవి లేనివానిని వదలిపెట్టుదురు. ఏలయనఁగా వారిమనస్సులు మెఱపుఁదీఁగలవలె నిలుకడలేనివి. చిరకాలాగతస్నేహమును వదలుదురని భావము. కనుక నే శస్త్రముల వాడిగలవి. గరుడునియు పవనునియు వేగమును మించునవి.

అనఁగాఁ ద్వరపడి విచారింపకయే కార్యమును జేయునవని భావము. ఇది లౌకికస్త్రీలధర్మము సుమా. ఈ నీభార్యయన్ననో సాధ్వీమణులలోఁ దొలుత లెక్కపెట్టఁదగినది. పైఁజెప్పిన దోషములు లేనిది. కనుకనే శ్లాఘ్య యగును అనఁగా వినుతి కర్హురాలని భావము. లోకములోని స్త్రీలవంటిది కాదనియు మహాప్రకృతియనియు నిందలిసారము. ఈభాగము మనకు

"పాంశ్చల్యాచ్చలచిత్తాచ్చ నైస్నేహాచ్చ స్వభావతః,
రక్షితా యత్నతోఽపీహ భర్తృష్వేతా వికుర్వతే. ౧౫
ఏవం స్వభావం జ్ఞాత్వాసాం ప్రజాపతినిసర్గజం,
పరమం యత్నమాతిష్ఠేత్పురుషో రక్షణం ప్రతి. ౧౬
నాస్తి స్త్రీణాం క్రియామంత్రైరితి ధర్మే వ్యవస్థితిః,
నిరింద్రియా హ్యమంత్రాశ్చ స్త్రియోఽనృతమితిస్థితిః." ౧౮

మను. ౯ అధ్యా.

అనునీమనుస్మృతివాక్యలయాశయమునే బోధించుచున్నది.

"మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః,
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాం గతిం." ౩౨

గీత. ౯ అధ్యా.

అను నీభగవద్గీతాభిప్రాయముకూడ స్త్రీలస్వభావమును దేట పఱచుచున్నది. స్త్రీలమనస్సు చంచలమనియు స్నేహమును ద్వరగ వదలుట వారిస్వభావమనియు నైశ్వర్యమునే ప్రే మించుట వారినైజమనియు నట్టి యసంగతగుణములులేని వారే పతివ్రతలనియు సీతను స్త్రీసామాన్యమున గణింప రాదనియు దుష్కరకార్యముల నొనరించు నేర్పుకలమహా ప్రకృతియనియు శ్రీరాముఁడు నిర్లిప్తుఁడై సాక్షీమాత్రుఁ

డగుభగవంతుఁ డనియు నగస్త్యముని మనకుఁ దెలిపెనని మన మెఱుంగవలయును.

"తతోఽబ్రవీన్మునిశ్శ్రేష్ఠశ్శ్రుత్వా రామస్య తద్వచః,
ధ్యాత్వా ముహూర్తం ధర్మాత్మా ధీరో ధీరతరం వచః." ౧౨

అనునిది మునివిషయము. నివాసార్హమగుస్థలముఁ దెల్పుమని రాముఁ డడిగెను. మునియు ముహూర్తము ధ్యానించి ధర్మాత్ముఁడు ధీరుఁడునగుట ధీరతరమగుపలుకు తెలిపెను. భావికార్యములకు ఫలము నొసంగఁజాలుస్థాన మెద్దియని యాలోచించెనని కదా దీనిభావము. దివ్యజ్ఞానముచే మునులకుఁ గృత్య మిద్దియని తోఁచును. జ్ఞానదృష్టికి నెఱుంగరానివిషయము లుండవు. ధ్యానమాదృష్టికిం బ్రధానము. బాహ్యపూజలు దేవాలయములు గట్టించి మహోత్సవములుచేయుట లోనగుకార్యము లప్పునికిఁ బనికిరావు. ధ్యానమునకు నిశ్చలమనస్సు గావలయును. వేఱుపరికరము లక్కఱలేదు. ఇతరుల సాయము వాంఛింపఁబనిలేదు. నిర్మలమనస్సు దొరకుభాగ్యము బహుజన్మకృతసత్కర్మమూలముననఁ గాని కలుగదు. ఆకర్మములు కూడఁ బ్రతిఫలములఁ గోరకయే చేయఁబడియుండవలయు. అట్టు లొనరించువారికి నిశ్చలమనస్సు కుదిరి ధ్యానముచేయుపుణ్యము గలుగును. ధ్యానముచే సకలవృత్తాంతము లెఱుంగందగును.

"తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్." ౨

"యత్ర ధారణావిజాతీయవృత్తిపరిహారే యత్నాపేక్షా భవతి. "తత్ర" ఏవయా ప్రత్యయానాం, వృత్తీనాం ఏకతానతా యత్నమనపేక్ష్యైకవిషయతా తత్ ధ్యానమ్. ఇత్యర్థః." అని మణిప్రభ.

"తదేవార్థమాత్రనిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః. ౩
త్రయమేకత్ర సంయమః. ౪
తజ్జయాత్ప్రజ్ఞాఽఽలోకః. ౫
తస్య భూమిషు వినియోగః. ౬
పరిణామత్రయసంయమాదతీతానాగతజ్ఞానమ్. ౧౬
ప్రత్యయస్య పరచిత్తజ్ఞానమ్." ౧౯

పాతంజలదర్శనము. విభూతిపాదము.

అను నీయోగశాస్త్రము ధ్యానమహిమమును త్రికాలజ్ఞానము గలుగుపద్ధతిని దేటపఱచుచున్నది.

"నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన,
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున. ౨౭

వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టం,
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా యోగీ పరం స్థానముపైతి చాద్యం." ౨౮

భగవద్గీత. ౮ అధ్యా.

అను నీ శ్రీకృష్ణోపదేశము యోగమహిమమును దెల్పుచున్నది. మహర్షి యగు నగస్త్యుఁడు యోగబలమున ముహూర్తకాలము ధ్యానించి రాఁగల కాలఫలముల నెఱింగి రామునకు నుత్తరము పలికెనని యిందుఁగలయర్థము. శాస్త్రపఠనముచేఁగాని నిరంతర బాహ్యపూజాపురాణపారాయణలచేతఁగాని జ్ఞానదృష్టి లభింపదని యోగాభ్యాసముచేతనే యది కలుగునని యోగి కానివాఁడు నిర్మలాంతఃకరణుఁడు కాఁడని యిందుఁగలసారమని మన మెఱింగి తదనురూపముగాఁ బ్రవర్తింపవలయును.

"యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః,
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే. ౨౨
తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితం,
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా. ౨౩
సంకల్పప్రభవాన్ కామాంస్త్యక్త్వా సర్వానశేషతః,
మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమంతతః. ౨౪
శనైశ్శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా,
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్. ౨౫
యతో యతో నిశ్చరతి మనశ్చంచలమస్థిరం,
తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్. ౨౬
ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖముత్తమం,
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూతమకల్మషం." ౨౭

గీత. ౬ అధ్యా.

అను నీశ్రీకృష్ణోపదేశవాక్యములు పైనవ్రాసినవిషయములనే తేటపఱచుచున్నవి.

"ధన్యస్తే జనకో రామ స రాజా రఘునందన.
యస్త్వయా జ్యేష్ఠపుత్త్రేణ యయాతిరివ తారితః, ౧౬
విదితో హ్యేష వృత్తాంతో మమ సర్వస్తవానఘ. ౧౭
తపసశ్చ ప్రభావేన స్నేహాద్దశరథస్య చ,
హృదయస్థశ్చ తే ఛందో విజ్ఞాతస్తపసా మయా. ౧౮
ఇహ వాసం ప్రతిజ్ఞాయ మయా సహ తపోవనే,
అతశ్చ త్వామహం బ్రూమి గచ్ఛ పంచవటీమితి." ౧౯

అను నీమూలము పూర్వోక్తభావము సిద్ధాంతము చేయుచు యోగమహిమమును వెల్లడించుచు ముని యాశయమును దేటపఱచుచున్నది. తపోదృష్టిచే నీమనోభావము నెఱింగి

తిని. అనఁగా ఖరాదిదానవులం జంపి తన్మూలమున రావణా దులం బొలియింపఁజేయవలయు ననునీభావము నెఱింగితినని కదాభావము. కనుకనే యిందుండఁ గోరినందులకుఁ దొలుత సమ్మతించియు నిపుడు పంచవటికిఁ బొమ్మనుచున్నాఁడనని ముని తెలిపెను. మహర్షులకెల్ల శ్రీరామునిప్రవృత్తి తెలిసియే యున్న దనియు దానిని దెలుపకయుండిరనియు మన మెఱుంగవల యును. దీనిచేత సీతాపహారణము బాహ్యదృష్టికిం దోఁచు నదియే యనియు స్పష్టము. తపఃప్రభావ మనుపమానమని మన కీభాగము బోధించుచున్నది. సీతాపహారణాదులు శ్రీ రామునకుఁ దెలియనివి కావనియు దుఃఖించుట లోనగునవి నటనరూపములే యనియు నవ్వానిమూలమునఁ బామరులకు లోకప్రవృత్తిని బోధించుటకే రాముఁ డట్టులొనర్చెననియు మన మెఱుంగవలయును. జ్ఞానులకు దురూహములు లేవని మన మెఱుంగుటయే రామాయణపారాయణ ఫలమనుటయే యిందుండి గ్రహింపఁదగినసారము. "రామ తే జనకః ధన్యః" అనుచో శ్రీరామా! నీతండ్రి ధన్యుఁడు. అనఁగాఁ గైక కిచ్చినవరములమూలమున నిన్నడవులకుం బంపి దేవకార్య మును సాధించి ధర్మసంస్థాపనముచేసినకారణమునఁ గృతకృ త్యుఁడే యయ్యెను అనునర్థముసూచింపఁబడియెనని యెఱుంగ వలయును.

"భవానపి సదారశ్చ శక్తశ్చ పరిరక్షణే. ౨౨
అపి చాత్ర వసన్ రామ తాపసాన్ పాలయిష్యసి."

అని మూలము. ఇందొకవిశేషము గలదు. భార్యతోఁగూడిన నీవును రక్షింప శక్తుఁడవు నగుదువు. అనఁగా నో శ్రీరామా! సర్వసాక్షివై నిస్సంగుఁడవగునీవు ప్రకృతింగూడినపుడే లోక

రక్షణాదికృత్యముల సమర్థుఁడవగుదువు. ప్రకృతి బహిర్గత మగుడు సృష్టియగును. భగవంతునియందది లీనమగుడు లయం బగు. కావునఁ బ్రకృతింగూడిన సగుణబ్రహ్మమా! పంచవటి యందుండి తాపసుల రక్షింపుము. ఖరాదిక్రూరదానవవినాశన మూలమునఁగాని ధర్మరక్షణరూపమగుకార్యము సాగదను నర్థము సూచింపఁబడినది. ఇందొక్కవిశేషము కలదు. తాప సుల రక్షింపవలయునని పెక్కుతావులం గనఁబడియెడిని. అదేల యనుప్రశ్నము రాఁగలదు. కారణ మాలకింపుఁడు. సర్వకాలసర్వావస్థలయందు భగవంతునే యారాధించుచు లోకక్షేమమును ధర్మవృద్ధిని గోరువారు మహర్షులు వారిని రక్షింపకయున్న రాజు చేయఁదగిన మహాకార్య మింకేమి కలదు? వారికొఱకే దేవతలు పాటుపడుదురు. కావున నేకాల మునఁగాని యట్టి సాధువులను సర్వవిధములఁ గాపాడవల యును. "బ్రాహ్మణాన్ భర రాజేంద్ర పునశ్చ బ్రాహ్మణాన్ భర" అన్నసూక్తియే యిందులకు నిదర్శనము. పూర్వకాలము బ్రాహ్మణులు తక్కుంగలజాతులవారి యోగక్షేమములకొఱకు భగవంతు నారాధించుచుండిరనియు వారల నెల్లరు రక్షించు చుండిరనియు నంతకంటె మంచిపని లేదని భావించుచుండి రనియు నాకారణమున జాతివైరములు లేక సుఖముగాఁ గాలముపుచ్చుచుండిరనియు మన మెఱుంగవలయును.

"దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః,
పరస్పరం భావయంతశ్శ్రేయః పరమవాప్స్యథ. ౧౧
ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః,
తైర్దత్తానప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః." ౧౨

గీత. 3 అధ్యా.

అను నీగీతావాక్యము లీయర్థమును సూచించుచున్నవి. ఎవ్వారు లోకక్షేమమును గోరువారో వారికంటెc బూజ్యు లెవరు గలరు? అట్టివారలయం దగ్రగణ్యులు మునివర్యు లగుదురు. కావుననే "తాపసాన్ పాలయిష్యసి." అన్నవచనము యుక్తమే యని మన మెఱుంగవలయును.

"గృహీతచాపౌ తు నరాధిపాత్మజౌ విషక్తతూణౌ సమరేష్వకాతరౌ,
యథోపదిష్టేన పథా మహర్షిణా ప్రజగ్మతుః పంచవటీం సమాహితౌ." ౩౭

అని మూలము. అగస్త్యునిపల్కులంగల గంభీరార్థము నెఱింగి రామలక్ష్మణులు తదనురూపము లగుసన్నాహములు గలవార లైరి. ముని యెట్లు పంచెనో యట్లే యనcగా నామార్గముననే నడువ జతనముంబూనిరి. నిశ్చలమనస్కులైరి. అనcగాc దమ ధర్మమును నెఱవేర్ప మనోబలము ప్రధానము కావున దానిని సంపాదింపcబూనిరి. బహువిషయములయందు మనస్సును బ్రవర్తింపcజేయక మనస్సును నిగ్రహింపc బూనిరని భావము. మహాకార్యములను సాధింపcగోరువారు మనస్సును నియమించి మనోబలము వృద్ధికాcగా నారంభించినకార్యమును సాగింతురు. మనోబలము లేక యేపనిని సాధింపc దరము కాదనియే యిందుండి గ్రహింపవలయును.

"శ్రుత్వా తదాగస్త్యసుభాషితం వచస్స్తోత్రం చ తత్త్వార్థసమన్వితం విభుః,
మునిం సమాభాష్య ముదాన్వితో యయౌ ప్రదర్శితం మార్గమశేషవిద్ధరిః."
అధ్యాత్మ. అరణ్యకాం. 3 స.

అను నీయధ్యాత్మరామాయణవాక్యముగూడc బైనవ్రాసిన దానినే స్పష్టీకరించుచున్నది. "అశేషవిత్. హరిః." సర్వజ్ఞుడగు శ్రీహరి సంతసమునc జనియెనని యర్థము. ముని యెఱిcగించిన

విషయము స్తోత్రము నాలకించి సర్వజ్ఞుఁడు కావున మునియ తీంద్రియజ్ఞుఁడని తలంచి సంతోషించుచుంబోయెను. అనఁగాఁ దాసంకల్పించినదే ముని తెలిపినదగుట నానందమునకు హేతువు. భగవంతునియాశయము నన్నిగ్రంథములొక్కరీతిగాఁ దెల్పుచుండును. వానియర్థమునఁ గలవిశేషములను గ్రహింప వలయును. దుర్మతాభిమానము లేకయున్న నన్నియు నొక విధముననే తెల్పుచున్నవని యర్థమగును. దుర్మతాభిమాన తిమిర మడ్డుపడఁగా వేఱువిధముగా నర్థమగుచుండును. కనుక దురభిమానమును వదలుటయే యుత్తమము. ఇఁకఁ దరువాతికథను బఠింతము.

## శ్రీరామాదులు పంచవటిని జేరుట.

* శ్రీరాముఁడు సీతాసౌమిత్రులంగూడిపోవుచు మార్గమునడుమ భయంకరశరీరముగల యొక పెద్దగ్రద్దను గాంచెను. అది యగస్త్యముని చెప్పిన వటవృక్షమున నుండెను. వారు దానిం గని రక్కసునిగ భావించి నీ వెవఁడవని యడిగిరి. అయ్యది నెయ్యమ్ము తీయఁదనము గలపలుకు లలర శ్రీరాముని గని తండ్రీ! మీతండ్రి దశరథునకు నేఁ జెలికాఁడను. అన్యుఁడఁ గానని తలంపుము. అనఁగ నమ్మాటల చేఁ దండ్రికి మిత్రమని యెఱింగి మర్యాద చేసి దాని కులనామములఁ బ్రశ్నించెను. ఆపక్షి సృష్ట్యాదిగఁ గలచరిత్రమును దెల్పుకోరికతో శ్రీరామా! మున్ను బ్రజాపతు లనఁబడువారెవ్వారలుండిరో వారిని దొలుతనుండి వచియింతు. వారిలోఁ దొలివాఁడు కర్దముఁడు. తరువాతివారు వరుసఁగా విక్రీతుఁడు,

* ఇది పదునాలవసర్గమునఁ గలదు.

శేషుఁడు, సంశ్రయుఁడు, స్థాణుఁడు, మారీచియు, నత్రియుఁ, గ్రతువు, పులస్త్యాంగిరసులు, ప్రచేతసుఁడు, పులహుఁడు, దక్షుఁడు, వివస్వతుఁడు ననఁ బ్రసిద్ధులు. అరిష్టనేమి యను రెండవపేరుగలకాశ్యపుఁడు ప్రజాపతి యనునధికారి య య్యెను. దక్షునకు నఱువదిసంఖ్యగలతనయ లుండిరనుట ప్రసిద్ధమేకదా. వారిలో దితి, అదితి, దనువు, కాళిక, తామ్ర, క్రోధవశ, మనువు, అనల అనువారల నెనమండుగురఁ బెండ్లి యాడెను. ప్రీతుండై యమ్ముని వారలతో నన్నుఁబోలిన కుమారులను ద్రిలోకమును బాలించువారలగుధీరులంగనుఁడు. అనఁగా నదితియు దితియుఁ గాళియు నందులకు సమ్మతించిరి. తక్కినవారు సమ్మతింపరైరి. అదితి ద్వాదశాదిత్యులను వసువుల నెనమండ్ర, నేకాదశరుద్రులను అశ్వీదేవత లిరువురను గలిసి ముప్పదిమూవురఁ గాంచెను. దితి దైత్యులను గనియె. వనసాగరములంగూడిన యీభూమియెల్ల నాదైత్యులవశమున నుండెను దనువు హయగ్రీవుఁ డనువానిం గాంచెను. కాళిక నరకకాళికులను గనియెను. తామ్ర యనునంగన క్రౌంచి, భాసి, శ్యేని, ధృతరాష్ట్రి, శుకి యను నేవురుకన్యకలం బ్రసవించెను. అందుఁ గ్రౌంచి యులూకములం గాంచెను. భాసి భాసపక్షులం గనియెను. శ్యేనికి డేగలు గ్రద్దలు గలిగెను. ధృతరాష్ట్రికి హంసకలహంససముదయము గల్గెను. ఆధృతరాష్ట్రికి మఱియుఁ జక్రవాకము లుదయించెను. శ్రీరామా నీకు భద్రములు గలుగుఁగాక శుకినత యనుదానిం గాంచెను. ఆమె వినతను గనియెను క్రోధవశకు మృగి, మృగమంద, హరి, భద్రమద, మాతంగి, శార్దూలి, శ్వేత,సురభి,సురస, కద్రువ యనుకుమారీదశక ముద్భవించెను.

వారిలో మృగికి జింకలు గలిగెను. మృగమందకు నెలుఁగు బంట్లును,సృమరములను మృగములును, చమరీమృగములును బుట్టెను. హరి యనునది సింహములను, వానరములను గనియెను. భద్రమద యిరావతి యనుసుతను గాంచెను. ఆయిరావతి యైరావతమను మహాగజమును గనియెను. మాతంగి కేనుఁగులు గల్గెను. శార్దూలి గోలాంగూలములను వ్యాఘ్రములను బ్రసవించెను. శ్వేత దిగ్గజములఁ గనియెను. సురభియను కశ్యపపత్ని రోహిణిని గంధర్విని గాంచెను. రామా! నీకు మేలు గలుగుఁగాక. రోహిణి గోవులం గాంచెను. గంధర్వి యశ్వములకుఁ దల్లియయ్యెను సురస పెక్కుతలలుఁగల పాములం గనియెను. కద్రువ సామాన్యసర్పములకు జనయిత్రి యయ్యెను. మనువను కాశ్యపునిపత్ని బ్రాహ్మణక్షత్రియవైశ్య శూద్రులను పేరఁ బరఁగుమానవులం గాంచెను. అనల యను నింతి ఫలవృక్షములం గనియెను. శుకి యనుదానిమనుమరాలు వినత. కద్రువ సురసకుఁ జెల్లెలు. అంతఁ గద్రువ సహస్రఫణామండితుఁ డగునాదిశేషువును గాంచెను. వినత గరుడుని, ననూరుని గాంచెను. శ్రీరామా! జటాయువను నే నాయనూరునకు శ్యేనియందుఁ గల్గినకుమారుఁడను. మాయన్న సంపాతి యనువాఁడు. నీ వంగీకరించిన వనవాసమందు నీకు నే సహాయుఁడనుగా నుందును. ఈయడవియందుఁ గ్రూరమృగములుండును. రాక్షసు లట్టివారుగ నుందురు. కనుక నిదిభయంకరగహన మనంబడు. నాదుసాయమున నీకుఁ బ్రయోజనము కలదు. సౌమిత్రియు నీవు మృగయావిహారార్థ మెందే నరిగిన నేను జానకి రక్షింతును. అనఁగా శ్రీరాముఁ డాతని బహూకరించి సంతోషభరమునఁ గౌఁగిటంజేర్చుకొని తండ్రికి నత

నికిం గలనెయ్యము నతఁడు తెలుపఁగా నాలకించుచు నతనికి మ్రొక్కెను. సీతారక్షణ మాజటాయువున కప్పగించెను. జటాయువు సౌమిత్రియుఁ దోడుగ నుండ శలభముల నగ్ని కాల్చునట్లు శత్రువులను దహింపఁ గోరుచుఁ బంచవటిం బ్రవేశించెను.

మహానుభావులారా! ఈభాగమున ననేకసంశయములు గలుగవచ్చును. కొన్ని విషయము లిందు నసంగతములే యనియుఁ గొందఱకుం దోఁపవచ్చును. కనుక నించుక విమర్శింతము. తొలుత భగవంతుఁ డవతరింపఁగా నామహాత్మునకుఁ దోడ్పాటుచేయఁగోరి భూలోకమునఁ బెక్కుప్రాణు లవతరించెననుదానిని మాత్రము మఱువకుఁడు. ఆవల సిద్ధాంతములం బరిశీలింతము.

"తం దృష్ట్వా తౌ మహాభాగౌ వటస్థం రామలక్ష్మణౌ,
*మేనాతే రాక్షసం పక్షిం బ్రువాణౌ కో భవానితి."

అని మూలము. సీతాపహరణనాటకమున కిది ప్రస్తావ మనవచ్చును. పంచవటికిఁ బోవుచుండువారు మఱ్ఱిచెట్టుపై నొక పక్షి భయంకరాకారము గలిగియుండఁగా రాక్షసుఁడే యని తలంచి యెవఁడవు నీవని ప్రశ్నించిరని యర్థము. పక్షిశబ్ద మికారాంతముగా నిందుఁ బ్రయోగింపఁబడినది. ఛాందసమగు రూపమని వ్యాఖ్యాత వ్రాసెను. ఒక్కచోఁ దాళపత్ర గ్రంథము నేను బఠించుచుండ "ఖేటమ్"=అని కనఁబడినది. అపశబ్ద మేల యుండవలయునని మార్చిరో తెలియ వలను పడదు. కామరూపులు రాక్షసులని యెఱింగినవారు కాన నట్లు

* మేనాతే రాక్షసం ఖేటం బ్రువాణౌ కో భవానితి. అని పా.

పక్షిరూపమునఁ బాంథుల మోసపుచ్చి భక్షింప రక్కసుఁ డున్నవాఁ డని భావించిరని తాత్పర్యము. ఎవరు నీవని ప్రశ్నించిరని మూలమునఁ గలదుకదా! ఏభాషతోఁ బ్రశ్నించిరి? పక్షులభాష వీరికిఁ దెలియునా ? దేశభాషలు పక్షులకు వచ్చునా యనువిషయము చర్చింపఁదగనిది కాదు. పురాణములయందుఁ బక్షులు మానవులు పరస్పరము మాటలాడినట్లు పెక్కుతావులం గలదు. లోకమున లేనియాచార మున్నయట్లు కల్పింపఁజాలరు. ఉన్నదానిని లేనట్లు చెప్పవచ్చును. గోరంతదానిని గొండంతచేసి చెప్పవచ్చును.అంతియకాని సృష్టి లేనిదానిని గలిగినట్లు పలికినవారు కానరారు. ఇక్కాలమునఁ గల పక్షిసర్గమునకుఁ బూర్వకాలిక పక్షిసర్గమునకుఁ జాల భేదము కలదు. ప్రాయికముగా మనము చూచుపక్షులకుఁ బూర్వమున్నయట్లు పురాణములయందుఁ జేర్కొనఁబడిన పక్షులకుఁ జిహ్వాములయం దెంతయో భేదము కలదు. ఉడుతలను జంతువులను మనము చూచుచున్నాముకదా. పక్షములు వానికి నుండెనని యెవ్వరేఁ జెప్పిన విశ్వసింతుమా? అది దబ్బఱయందుము. మహోత్తరహిమాలయ శిఖరమునఁ (ఎవరెస్టు అనుదానియందు) బక్షము లుడుతలకుఁ గలిగి యున్నయట్లు పరీక్షించిన తెల్లదొరలు వ్రాయఁగా నిపు డౌనని తలలూఁచుచున్నాము. వానిభేదము లెన్నియో కలవఁట. ఆవిషయమే పురాణములయం దుండినయెడలఁ జప్పరింతుము. ఏల ? లోకసృష్టిప్రకారము మన మెఱుంగక యుండుట వలన ననక తప్పదుకదా. నిన్నగాక మొన్న సాగరమునడుమ నొక్కయెడ డెబ్బదిరెండుమూరలపొడవు రెండుమూరల వెడలుపుగలిగి చిత్రవర్ణములుగలిగి యెవ్వరే నింతదనుకఁ

జూచి యెఱుంగనిజంతు వొక్కటి కనఁబడియెనని తెలియ వచ్చెను. అది యేజాతిలోఁ జేర్పఁదగినదో నిర్ణయింప వలను పడదనిరి. తుదకు సర్పజాతిలో దానిని జేర్చిరి. లోకమున సృష్టి భేదవైచిత్ర్యము తర్కింపఁదరముకానిదని యిదియే మనకు బుద్ధిగఱపుచున్నదికదా. కొంతకాలముక్రింద "ఈజిప్టు" అను దేశమున నొకచోట భూగర్భశోధకులు త్రవ్వుచుండఁగా నిసుకలో నొకపక్షికాలు కనఁబడియెననియు దానిపొడవు రమారమి నెనుబదిమూరలని తెలియవచ్చెను. దానికిం బూర్వము గండభేరుండములనుపక్షులు గలవనియు నవి యేనుఁగలను గోళ్లతోఁబట్టుకొనిపోవు ననుసూక్తుల నాలకించి నపుడు చప్పరింపనివారును మాతి త్రిప్పనివారును బురాణ ముల దూషింపనివారును లేకుండిరి. ఈపక్షివిధము తెలియ రాఁగా నూఁ ఆఁ అనక యూరకుండక తప్పకపోయెను మన కున్నయల్పజ్ఞానము సృష్టివైచిత్ర్యముల నెఱుంగఁజాలదని యంగీకరించిన నిట్టిపాట్లు రాకయుండుఁగదా. కనుక నిప్పటి కాలలక్షణములంబట్టి సృష్ట్యాదినుండి యీలక్షణములే యున్న వనియు వానికి మార్పే లేదనియు వాదించుట మొండివాదు గాక మఱేమగును?

చాలకాలముక్రిందఁ బక్షులు మానవులు ప్రాయికముగా నన్యోన్యస్నేహసంబంధము కలవారుగనుండిరి. పక్షులు మాట లాడుచుండును మానవులభాషయే వానిభాషయు నై యుం డెను. ఇతరేతరసాహాయ్యముకూడఁ గలుగుచుండెను. కాల వైపరీత్యమున నాహారాదులు మాఱుట మానవులు మాంస లుబ్ధులగుట యనులోనగు కారణములమూలమున నాసంబం ధము తొలఁగెను. వానిభాష వేఱుగ నేర్పడియెను. ఇప్పటి

కిని జిలుకలు లోనగువానికి నేర్పిన మనభాష కొంత యలవడు చున్నదికదా. గరుడజాతిపక్షులమాటలధ్వని కృష్ణా యన్నట్లు తెలియవచ్చుచున్నదికదా.

తే. "ప్రమదమునఁ దేఁటవెలుఁగె త్తి పాడుచోట
శారిక లనంగశాస్త్రముల్ చదువుచోటఁ
గీరకలకంఠములు క్రొవ్వి కేరుచోటఁ
బావురము లారజంబులు పలుకుచోట"

అని మనుచరిత్రమునఁ గలదు కదా.

"పృచ్ఛంతీ వా మధురవచనాం శారికాం పంజరస్థాం,
కచ్చిద్భర్తుస్స్మరసి రసికే త్వం హి తస్య ప్రియేతి." ౨౫
ఉత్తరమేఘము.

అని కాళిదాసు చెప్పెను. ప్రాయికముగాఁ బక్షులలోఁ గొన్ని మానవభాష నేర్వఁజాలునవి కలవని యిట్టివి తెల్పుచున్నవి. గరుడజాతులు దేవయోనివిశేషములలో లెక్కింపఁబడుట యేటికి? ఉత్తమజాతిపక్షులు మానవులతోటి నెయ్యము నెఱపుచు వారికిఁ దోడుపడుచుండెనని విదితమయ్యెడిని. దేవకాంతలకుం గొందఱకుఁ బక్షులు సంతతిగా నున్నయట్లీసర్గమున నే మనము చదివితిమికదా. ఈకాలమునఁ గలవాడుకలంబట్టియే పూర్వకాలమున నిట్లే యుండెనని సిద్ధాంతముచేయుట పొరపాటనవచ్చును. శ్రీరామసౌమిత్రులు పక్షిని గని నీవెవ్వఁడవని ప్రశ్నించిరనుట సుసంగతమే కాని యసంగతము కాదని మన మెఱుంగవలయును.

"స తౌ మధురయా వాచా సౌమ్యయా ప్రీణయన్నివ,
ఉవాచ వత్స మాం విద్ధి వయస్యం పితురాత్మనః." 3

అని మూలము. మంచిమాటలచే వారల నానందింపఁజేయు నట్లు వత్సా! యని సంబోధించి మీతండ్రియగుదశరథునకు నన్ను మిత్రునిగా నెఱుంగుఁడని పలికెను. రామసౌమిత్రులు దాశరథులని యెట్లు గుఱుతించె ననుశంక కలుగకపోదు. ఒక్కవిషయము నవధరింపుఁడు. ఇక్కాలమునఁగూడ నొక పక్షి తెల్లవాఱుజామున శకునములఁ దెల్పునది కలదు.

"జరగుగుబ్బిలికాఁడు సకినాలు వెలయించు
పక్కి పగటిచీకు పైఁడికంటి."

అని సాంబనిఘంటువునఁ గలదు. ఆపక్షి భావిఫలములఁ బలుకుచుండునని వానియర్థ మెఱింగినవారు పలుకుదురు. రే పీగ్రామమున వాపికాజలంబులంబడి యొకవనిత మృతి నొందునని యాపైఁడికంటిపక్షి తెలిపెనని యొకఁడు తెలిపెను. ఆదినమట్లే మంచినీళ్ళకుఁబోయిన యామె యందుం బడి మృతినొందెను. ఈవిషయము నేనే యెఱుంగుదు. గౌళి యనుతెగబల్లి శకునములు తెలుపునని యావిధముఁ దెలుపు శాస్త్ర మొకఁడు పాడకట్టెడు. దేవయోనిభేదములకుఁ జేరిన పక్షులకు జ్ఞానము మెండుగనుండునని కొందఱందురు. అదియు గ్రాహ్యమే యనవచ్చును. భగవద్దర్శనము కాఁగానే ప్రాగ్జన్మ సుకృతవిశేషమున నల్పజ్ఞానము కలవారలకు విజ్ఞానము కలుగు టచ్చెరువు కాదుకదా. అందును దశరథుని చెలిమి కలిగియుండుట భావిఫలముగ శ్రీరామదర్శనమూలమున ముక్తి కలుగనుండుట యనునవిగలయాపక్షికి నీపాటిజ్ఞానము కలుగుట యొకవిశేషము కాదు.

"ధృతరాష్ట్రీ తు హంసాంశ్చ కలహంసాంశ్చ సర్వశః.
చక్రవాకాంశ్చ భద్రం తే విజజ్ఞే సాపి భామినీ,
మాతంగీమపి శార్దూలీం శ్వేతాం చ సురభిం తథా.

ఆపత్యం తు మృగాస్సర్వే మృగ్యా నరవరోత్తమ,
ఋక్షాశ్చ మృగమందాయాస్స్రమరాశ్చమరాస్తదా. ౨౩
హర్యాశ్చ హరయోపత్యం వానరాశ్చ తరస్వినః."

అని మూలము. దక్షప్రజాపతిదుహితలఱువదిసంఖ్యగలవారు గలరనియు వారలలోఁ గొంద ఱిందుఁ జెప్పఁబడిన మృగపక్షివానరాదులఁ బ్రసవించిరని తెలియనయ్యెడు. ఇది యచ్చెరువు కల్గింపకయు ననుమానము పెంపొందింపకయు మానదు. ఇది యిట్లు సాగియుండదనియే కొందఱు పలుకుదురు. పరికింతము. సృష్టియందుఁ దొలుత నిన్ని జాతులపురుషులు స్త్రీలుండినఁగదా యీసృష్టిభేదము లుప్పతిల్లవలయు. ప్రళయమున కపు డర్థమే వేఱుగాఁ జెప్పవలసియుండును. వారివారి కర్మానుసారముగా వెలువడుచుందురు. స్వేదజాదు లెట్లు గల్గినవి? అదియే భగవచ్ఛక్తి మనోగమ్యము కానిది. తొలుదొలుత దేవతాస్త్రీలమూలముననే వృక్షాదులుకూడ వెలసెను. తరువాత సృష్టిభేదమే యిప్పటివిధముగా నుండునది. ఇందు విశేషించి సంశయింపఁదగిన దేదియు లేదు. బీజవృక్షములలో నేది ముందని కొందఱు వాదులాడుట జ్ఞానముననే యనవలయుఁగదా. పాషాణాంతర్భాగమున మండూకముండుటం గన్నారముకదా. దానిజననీజనకనామముల నెవ్వారు నిర్ణయింపఁగలరు? ఈశ్వరేచ్ఛ దుర్జ్ఞేయమని యెఱింగినవారలకీస్వల్పసంశయము లుండఁజాలవు. "ఇచ్ఛామాత్రం ప్రభోస్సృష్టిః" అను నానుడి కలదుకదా. భగవంతుఁ డిచ్ఛయింతనే బ్రహ్మాండములు వెలయుట యడఁగుట సాగును. ఈవిషయమునఁ బ్రశ్నించువారు "నెమిళ్ల కంఠముల కన్నిరంగు లెవరు వ్రాసిరి." అనువారివంటివారలే.

"జగత్సూతే ధాతా హరిరవతి రుద్రః క్షపయతే
తిరస్కుర్వన్నేతత్స్వమపి వపురీశ స్తిరయతి,
సదా పూర్వస్సర్వం తదిదమనుగృహ్ణాతి చ శివ
స్తవాజ్ఞామాలంబ్య క్షణచలితయోర్భ్రూలతికయోః." ౨౪

అను నీశంకరభగవత్పాదోక్తి నెఱింగినవారల కిందలివిషయమున నేశంకలు పొడసూపవు.

"తస్మాజ్జాతోఽహమరుణాత్సంపాతిస్తు మమాగ్రజః,
జటాయురితి మాం విద్ధి శ్యేనీపుత్రమరిందమ, ౩౨
సోఽహం వాససహాయస్తే భవిష్యామి యదీచ్ఛసి,
ఇదం దుర్గం హి కాంతారం మృగరాక్షససేవితం. ౩౩
సీతాం చ తాత రక్షిష్యే త్వయి యాతే సలక్ష్మణే."

అని మూలము. శ్రీరామా! నీ వంగీకరించిన నిందు నివసించు నీకుఁ దోడ్పడుదును. ఇది క్రూరమృగరాక్షససేవితము. మీ రిరువు రెండేనేగిన సీతాదేవిని రక్షించుచుందును. అని జటాయువు పలికెను. 'మృగరాక్షససేవితమ్' అనుసాభిప్రాయ విశేషణము దైవికముగా నతనినోటినుండి వెలువడియె. మారీచుఁడు రావణుఁడు నిట సూచింపఁబడిరి. 'సలక్ష్మణే త్వయి యాతే' అనుటంజేసి మీరిరువురు నింటలేనితఱి సీతను రక్షింపఁగలననియె. దీనిచే భావికార్యము సూచింపఁబడియెనని యెఱుంగవలయు.

"పితుర్హి శుశ్రావ సఖిత్వమాత్మవాన్ జటాయుషా సంకథితం పునః పునః,
స తత్ర సీతాం పరిదాయ మైథిలీం సహైవ తేనాతిబలేన పక్షిణా. ౩౫
జగామ తాం పంచవటీం సలక్ష్మణో రిపూన్ దిధక్షన్ శలభానివానలః."

అని మూలము. 'ఆత్మవాన్' అనఁగా స్వకార్యము నెఱింగిన వాఁడని యర్థము. దశరథునకుఁ దనకుఁ గల్గినస్నేహసంబంధము నాజటాయువు చెప్పుచుండఁగా విని స్వకార్య మిదియే కదా యని యెఱింగెను. అనఁగాఁ దండ్రికిఁ దాను దగ్గరనుండి సంస్కారము చేయకపోయినను దన్మిత్రునకుఁ దా నాకార్యము చేయ ననువుపడు నెఱింగెనని భావము. రిపూన్ దిధక్షన్ అనలశ్శలభానివ=పంచవటికిఁ జెంతనుండుదుష్టులరక్కసులనిర్మూలింపఁదలంచెను. అనఁగా నిశ్శేషముగా శత్రువితతి నొనరింపఁదలంచెనని భావము. పంచవటీప్రవేశము జనస్థానవాసులగు ఖరదూషణాదులవినాశనార్థమే యనియు వారికి భగవంతుని చే మృతినొందవలసినతరుణము సమీపించుచున్నదనియుఁ గర్మము శ్రీరాముని బురికొలిపి తోడితెచ్చెననియు మన మెఱుంగవలయును. జటాయువుకూడ సందుఁ జేరుటచేఁ బరికరములన్నియు సిద్ధములయ్యెనని తెలిసికొనుటయే మనపని. ఈభాగమున నధ్యాత్మరామాయణమునందు "లక్ష్మణునితో శ్రీరాముఁడు మృగభక్షకుఁడగునీరాక్షసుని బొలియింతు ననఁగా నేను నీపితృసఖుఁడనుగాన నవధ్యుఁడనని జటాయువు పలికెనని యున్నది. విశేష మీభాగమున నెక్కుడుగఁ గానరాదు. ఇఁక ననంతరభగవచ్చరిత్రమును బఠింతము.

## పంచవటియందు శ్రీరామాదులు నివసించుట.

*అనంతరము శ్రీరామచంద్రుఁడు నానావిధదుష్టమృగనిబిడమగుపంచవటిం జేరి సోదరా! అగస్త్యముని తెల్పిన యీ భాగముం జేరితిమి. ముని తెల్పినగుఱుతు లిందుఁ గన్పడుటం

* ఇది పదునైదవసర్గమునఁ గలకథాభాగము.

జేసి యిదియే పంచవటియగు. తగినచోట నాశ్రమము నిర్మింప నీవెఱుంగుదువు. అందు నీకుఁ గౌశలము మెండు. మనకంద ఱకిఁ దగిన దేశప్రదేశమో కనుఁగొనుము. సరసులు చెంత నుండుట మంచిది. ఫలవృక్షములు గలిగి మెత్తనియిసుకగలిగి సమస్థలముగా నుండవలయుఁ గదా. చెంతనే వలయుపరికర ములు దొరకున ట్లుండవలయు. అని యన్న తెలుపఁగా సౌ మిత్రి సీతాదేవియెదుటనే శ్రీరామునితో మహాత్మా! నీవిందు నూఱేండ్లు నివసించినను నీయధీనుఁడనుగానుండి పనులు చేయుదును. ఏచోటు నీకు నింపుగా నుండునో యందే యాశ్రమము నిర్మింతును. అను లక్ష్మణునిమాటల నాలకించి సంతసించి చక్కఁగా యోజించి సమస్తగుణములుగల యొక స్థలము నారసి సౌమిత్రి యంజలిం దనచేతఁ బట్టుకొని ప్రియ సోదరా! యీభాగ మన్నివిధముల బాగున్నది. పుష్పములు గలచెట్లు గలవు. ఇందు యథాశాస్త్రముగ నాశ్రమము నిర్మిం పుము. సరోవర మత్యంతరమణీయమై చెంతనే కనఁబడు చున్నది. ముని చెప్పినట్లే యిదిగో గోదావరి గనంబడుచున్నది. పుష్పములు పక్షులు దానియందుఁ గనంబడియెడు. ఆహా! ఎంతయో మనోహరముగా నీచోటున్నది. మిక్కిలి చెంత దూరమునఁగాక యున్నతపర్వతములు కనఁబడియెడు. మృగ ములు గుంపులుగాఁ దిరుగుచున్నవి. నెమిళ్లు కేకారవములు చేయుచున్నవి. గుహలెన్నియో కనఁబడుచున్నవి. పలువిధము లగువృక్షములు సాంద్రముగా నున్నవి. కనుక నిది పరమ పావనము. ఇం దీపక్షివర్యుని గూడి యుందము.

శ్రీరామమూర్తి యీరీతిం బలుకఁగా సౌమిత్రి తదను సారముగా నాశ్రమమును నిర్మించెను. అది వెదుళ్లచేఁ గట్టఁ

బడి యన్ని విధముల నివాసార్హముగ నుండెను. సీతారాములం గూడి గౌతమీనదికిం బోయి స్నానముచేసి కమలములు గొని వచ్చి వాస్తుకల్పము ననుసరించి పూజగావించి శాంతిప్రక్రియ జరపి సౌమిత్రి యాశ్రమమును శ్రీరామునకుం గనఁబఱచెను. ఆతఁడు పరితుష్టుఁడై తమ్ముని౯ గౌఁగిలించుకొని చక్కని కార్య మొనరించితివి. నీయెడ నత్యంతప్రీతుఁడనైతిని. ఈకార్యము నకుగాఁ బారితోషిక మీయాలింగనమని యెఱుఁగుము. లక్ష్మణా! నాయాశయముల నెఱింగి నాకుఁ గావలసినపనుల నెఱవేర్చుచు ధర్మవిదుఁడవై పుత్త్రశబ్దమున కుదాహరణభూతుఁ డవయి నీవుండుటంజేసి తండ్రి మృతుఁడుగాక జీవించియున్నట్లే యున్నది. అని పలికి యావాసస్థానమున మనశ్చింతలు లేక హాయిగా నుండెను. ఇంద్రునివలె సుఖములఁ గాంచుచుండెను.

మహనీయులారా! ఈభాగమున విశేషములు విశే షించి లేకున్నను గొన్నిభాగములు విమర్శింపవలసివచ్చినది. పరిశీలింతురుగాక.

> "ఏవముక్తస్తు రామేణ లక్ష్మణస్సంయతాంజలిః,
> సీతాసమక్షం కాకుత్థ్సమిదం వచనమబ్రవీత్. ౬
> పరవానస్మి కాకుత్థ్స త్వయి వర్షశతం స్థితే,
> స్వయం తు రుచిరే దేశే క్రియతామితి మాం వద." ౭

అని మూలము. దీనికి తనిశ్లోకివ్యాఖ్యయు గోవిందరాజులు తోఁచినరీతి విశేషార్థములు వ్రాయుచుఁ గైంకర్య మిటఁ బ్రతి పాదింపఁబడిన దనిరి. 'సీతాసమక్షం కాకుత్థ్సమ్' అనుటంజేసి ప్రకృతిం గూడియున్నరాముని నిట్లు ప్రార్థించెను. సేవాంజలి సగుణబ్రహ్మమునకే యని భావము. సర్వవ్యాపకునకు నమస్క రించు టెట్లు? రూపవంతునకే నమస్కారము. భగవంతుఁడు

నామరూపయుతుండయి సగుణబ్రహ్మ మనఁబడును. కనుక నే సౌమిత్రి 'త్వయి పవానస్మి' అనియెను. 'వర్ష శతం స్థితే' అనఁగా బహుకాలమని యర్థము ఇట్లెంతకాలముందువో అనఁగా మహాప్రకృతింగలిసి యీరూపమున నీపేర నుందువో యని యర్థము. అంతదనుక నీవశమున నుందును. ఏచోటు నీకనుకూలమో యాచోట నాశ్రమముం గల్పింపుమని నా కాజ్ఞాపింపుము. నీకేది సమ్మతమో యది నాకు సమ్మతమని భావము.

"భావజ్ఞేన కృతజ్ఞేన ధర్మజ్ఞేన చ లక్ష్మణ,
త్వయా పుత్రేణ ధర్మాత్మా న సంవృత్తః పితా మమ." అ॥

అని మూలము. శ్రీరాముఁడు తనకుఁ దగినయట్లు పర్ణశాలను నిర్మించినసోదరుని గొనియాడునెపమున సత్పుత్రలక్షణములు మనకుఁ దెలుపుచున్నాఁడు. పెద్దలభావముల నెఱిఁగి వారి వలనఁ గలిగినమేలెఱింగి దాఁజేయఁదగిన దెట్లని విచారించి మనస్సు ధర్మమునందే నిలుచునట్లు చేయువాఁడే సత్పుత్త్రుఁడు. అట్టికుమారుని గన్నతండ్రి మృతజీవుఁడే యగును. అనఁగా నెంతయో పుణ్యము నాచరించియుండినఁగాని సత్పుత్త్రుఁడు కలుగఁడు. పుణ్యకర్మఫలము పుత్త్రుఁడే యని తాత్పర్యము. ఇఁకఁ దదనంతరకథాభాగమును బఠింతము.

## భరతుని గైకను నిందించులక్ష్మణునకు రాముఁడు హిత ముపదేశించుట.

*శ్రీరాముఁడు లందు హాయిగా నుండఁగా శరదృతువుపోయి సర్వమనోహరమగు హేమంతసమయము వచ్చెను.

*ఇది పదునాఱవసర్గమునఁ గలదు.

ఒక్కనాఁడు తూర్పు తెలతెలవాఱుచుండఁగా శ్రీరాముఁడు స్నానమునకై గోదావరికిఁ బోయెను. సీతయు వెన్నాడి పోవు చుండ లక్ష్మణుఁడు కలశమెత్తుకొని యన్న వెంటఁ బోవుచు నిట్లు పలికెను. ప్రియంవదా! శ్రీరామా! నీకేది ప్రీతిపాత్ర మో సంవత్సరమునకంతయు నలంకార మేదియో యట్టిహేమంత ఋతువువచ్చినది. ఈతరుణమునందే యెల్లరశరీరములుహిమముచేఁ గాఠిన్యము వహించియుండును. భూమి యుర్వరయను తన పేరు సార్థకముగనుండును. జలము స్పృశింప నలవిగాకున్నది. అగ్ని యెంతయు నింపుగా నున్నది. సాధుపురుషులు నూత్న ధాన్యముల ననుభవించుటకు ముందుగ నొనరింపవలసిన "ఆగ్రయణ" మనుయజ్ఞవితతిచేఁ బితృదేవతలను బూజించి విగతపాపులై యొప్పుదురు. ఇక్కాలమున జానపదులు కాము కులై గోక్షీరసమృద్ధిగలవారలై యుందురు. రాజులు జైత్ర యాత్రారతిగలిగియుందురు. దక్షిణభాగమున సూర్యుఁడుండు టంజేసి సౌమ్యదిక్కు ముఖాలంకారమగుతిలకము లేనినారి వలె నేమాత్రము ప్రకాశింపకున్నది ఇక్కాలమున మంచు ఘనీభవించియుండును. ఇక్కాలమున నయ్యది దూరమున సూర్యుఁ డుండుటచే మిగుల నధికమై హిమవంతమను పేరు సార్థముగఁ గల్గియున్నది ఇది సత్యము. మధ్యాహ్నసమయ ములే యిపుడు బాగుగ నుండును. రవియు నింపుగనే యుండును. ఛాయయు జలము మఱింత శీతలముగా నుండుటం జేసి యింపుగూర్పఁజాలవు. భానుఁ డుష్ణరశ్మి యంతుఁడుగాక మృదువుగ నుండును. భాస్కరు నావరించి హిమము మిక్కిలి గాఁ గురియుచున్నది. శీతవాతములు వీచుచున్నవి. ఆటవికులు వెలుపలఁ దిరుగఁజాలకయున్నందున సందడిలేకున్నది. వెలుపలి

భాగములు మంచుచేఁ గప్పఁబడుటంజేసి జనులు శరీరములను ముఁడుచుకొని పెంపుమానియున్నారు. ఇప్పటిరాత్రులయందు నాచ్ఛాదనములేని బహిర్భాగముల నెవ్వరు శయనింపరు. పౌషమాసము సమీపించినది. పుష్యనక్షత్రయుతపూర్ణిమ ముఖ్యము. రాత్రికాలము మంచుచే బూడిదరంగు గలిగిన ట్లుండును. రాత్రులందు జాములు మిక్కిలి పొడవుగా సాగు చుండును. చంద్రునకుఁ గలసొంపు సొగసు నిక్కాలమున సూర్యునకుఁ జిక్కియున్నవి చంద్రుఁడవ్వానింబోఁగొట్టుకొని మంచుచేఁ దనబింబ మావరింపఁబడి యొఱ్ఱగాఁ గనంబడ నిట్టూర్పుసోఁకుటంజేసి మెఱయనియద్దమువలె నున్నాఁడు. పున్నమరేయిగూడ మంచుచే నలరారకున్నది. ఎండ సోఁకి నల్లఁబాఱినసీతవలెనే యది కనఁబడుచున్నది. కాని సీతాదేవి వలె సొబగులేకున్నది. పశ్చిమవాయువు నైజముగాఁ జల్లగా నుండును. అది యిక్కాలమున హిమస్పర్శమునఁ బ్రాతః కాలమునందు ద్విగుణీకృతశీతలత్వముగలిగి వీచుచున్నది. రవి పొడసూపఁగా వనము లావిరితోఁ గూడి యవలు లోనగుధాన్యములు మెండుగ నుండఁగాఁ గ్రౌంచాదిపక్షులు సొంపుగాఁ గూయుచుండఁగా వింతగా నున్నవి శాలిసస్యములు పండుటంజేసి బంగరురంగుగలిగి వెన్నులబరువునఁ గొంత వంగి వింతగా నున్నవి. మంచుతోఁటికాంతులు చల్లగా నుండ రవి పొడసూపి యాకసమునఁ జాలదూరము ప్రాఁకియుఁ జంద్రునిభంగిఁ జల్లఁగనే కనంబడుచున్నవాఁడు. పగటి తొలి భాగమున నెండ వేండ్రముగ నుండక చంద్రికవలె నుండి రెండవభాగమున శరీరమున సుఖముగఁ దాఁకుచు భూతల మున నించుక యొఱ్ఱగా నుంత తెల్లగాఁ గాయుచున్నది. అడ

వులయందు భూతలము మంచుచేఁ దడిసిన పచ్చికపట్లు గలిగి పైన లేయెండ పొలయఁగా వెలయుచున్నది. వనగజము దప్పిగొని చల్లనితేటనీటిని దాఁకి దానిచల్లఁదనమునకుఁ దాళఁ జాలక తొండమును వెనుక కీడ్చుకొనుచున్నది. ధీరులుగాని వారు రణమునకుఁ బూననిరీతి జలములఁ దిరుగునవియేయైన నీపక్షులు నీటిచెంతఁ గూరుచుండియు శీతమునకు భీతిల్లి జలముల దిగఁజాలకున్నవి. వనములు చీఁకటిరీతి దట్టముగా మంచునీరుపడుటచేఁ బల్లవములు ముడుచుకొని కట్టువడి కదలలేక పూవులులేక దట్టముగువస్త్రము కప్పుకొని నిదురించు వారివలెఁ గనంబడుచున్నవి.

ఇక్కాలమున నదీజలము లావిరిచేఁ గప్పఁబడియున్నవి. మంచు మిక్కిలి యావరించుటంజేసి యందుఁగలసారసాది పక్షులు కానరాక వానిరుతములంబట్టియే తెలియఁదగియున్నవి. మంచు విశేషించి వ్యాపించుట సూర్యునికిరణములు నాత్యుష్ణములై యుండుట శీతము మిక్కిలిగల్గుట యను నీకారణముల చేతఁ బర్వతోపరిభాగములందలి శిలాతలములంగల జలము కూడ విషమురీతిఁ బానముచేయఁ దరముగాకున్నది. పద్మపత్రములు రాలిపోవుటంబట్టి కాడలుమాత్రమే మిగిలియుండు సరస్సులు సంతోషమును జూచువారలకుఁ గల్గింపఁజాలక యున్నవి

ఇట్టితఱి ధర్మాత్ముఁడగుభరతుఁడు నీవిరహమువలన వగ చెంది నీయందుఁ గలభక్తితో నయోధ్యాపురమునఁ దపము సల్పుచున్నవాఁడు. ఆతఁడు రాజత్వమును, రాజాభిమానమును, నానావిధభోగములను వదలి మునివేషధారియై జటాజినవల్కలముల ధరించి ఫలమూలముల భక్షించుచు బాహ్య

స్థలముల శీతవాతాతపములకు లోనై భూతలమున శయనించి యుండువాఁడు. ఇప్పు డతఁడు స్నానార్థము సేవకులు వెంట రాఁగా సరయూనదికిఁ బోవును. గోమునఁ బెరిఁగినవాఁడు సుకుమారుఁడు. సుఖార్హుఁడు నగుట నిట్టి యపరరాత్రముల యందు లేచి సరయూజలంబుల నెట్లు మునుంగును? మహా పురుషలక్షణలక్షితుఁడు సత్యాత్ముఁడు నగుభరతుఁడు తాఁ జేయరానికార్యములయందు లజ్జవూనువాఁడు. జితేంద్రి యుఁడు నగుట నానావిధభోగముల వదలి యన్నవగు నిన్నే యనుకరించువాఁడు. శ్రీరామా! మహాత్ముఁడైన నీప్రియ సోదరుఁడు నీవడవియందు మునివేషధారివై యున్నను దాను నీవలె వేషమును ధరించుటంజేసి స్వర్గమును గూడ లభింప నున్నను వదలును జుమీ. ప్రాయికముగా మానవులు తల్లి నైజము ననుసరించువారుగాని జనకస్వభావము ననుసరించు వారుకా రనుకింవదంతి కలదుకదా! మనభరతుఁ డట్లుగాక పితృస్వభావము ననుసరించుటచే నాకింవదంతిని వ్యర్థముచేసిన వాఁడయ్యెను. దశరథుఁడు పతి, భరతుఁడు కొడుకు గాఁగల యాకైక యేల యిట్టిక్రూరస్వభావము కలదయ్యెనో తెలియ రాకున్నది.

అని ధర్మాత్ముఁ డగుసౌమిత్రి యీరీతి నన్నయందుఁ గలనెయ్యమునఁ బలుకుచుండఁగా శ్రీరాముఁడు కైకను నిందించుటకు నోర్వక సౌమిత్రిం గని యిట్లు పలికెను. వత్సా! మధ్యమాంబ నిట్లు నీవు దూలనాడరాదు సుమీ. ఇంతకు మునువు చెప్పినట్లు భరతునిగూర్చియే ముచ్చటింపుము. నేను దృఢవ్రతుఁడనై వనవాసనిరతిం బూనియున్నను భరతుని యందుఁగల నెయ్యమున వానిని స్మరించినపుడెల్ల నాయంతః

కరణము చంచలతఁ గాంచుచున్నది. ఆసోదరునిమాటలు ప్రియములై శ్రుతికటువులుగాక మధురములై హృదయము నుండి యెడఁబాయకుండును. మఱియు నమృతధారలవలె హ్లాదములై మనస్సును వికసింపఁజేయుచున్నవి. రఘువంశాభరణా! మహాత్ముఁడగుభరతుని శత్రుఘ్నుని పెరుఁడవగునిన్ను జానకిని నొక్కటిగాఁగూడి యెపుడుందును? అని యీరీతి భరతునియందుఁ గలప్రీతిచేఁ బెక్కుభంగుల వగచుచు గౌతమికింబోయి సీతాసౌమిత్రులం గూడి స్నానము గావించెను. పితృదేవతలకుఁ దర్పణములు గావించి భాస్కరుని సంధ్యాధిదేవతలను నియతిమీఱఁ బ్రార్థించిరి. శ్రీరాముఁడు స్నానము చేసి నందీశుని బార్వతిని గూడియుండు పరమశివునిరీతిఁ బ్రకాశించెను.

మహాత్ములారా! ఈభాగమునఁ గలవిశేషములఁ బరికింతము. ఈభాగము హేమంతకాలవర్ణనము ప్రధానముగాఁ గలది. లక్ష్మణుఁడు హేమంతర్తువును వర్ణించుచుఁ గైకను దూషించెను. మహారణ్యమున నుండులక్ష్మణుఁడు

"ఖర్జూరపుష్పాకృతిభిశ్శిరోభిః పూర్ణతండులైః,
శోభంతే కించిదానమ్రాశ్శాలయః కనకప్రభాః." ౧౭

అని వరిపైరు నెట్లు చూపఁగల్గెనో యనుశంక పొడమును. ఆమహారణ్యమునఁ గృషీవలులుండి రనరాదుకదా. ఆటవికులేల యుండఁగూడ దందు రేని వారు రక్కసులుగా నుందురు. మానవులుకూడ ననఁగా మునులుకానివా రందుండరాదా యందు రేని వారు కృషీవలులే యైనచో నది దుర్గమారణ్యము కాక పల్లియలు గ్రామములుగలదిగా నుండవలయును. రాక్షసు

లోక్కమూలయందుఁ గృషికు లింకొక్కమూలయందు మును లొక్కభాగమునందు నుండరనవలయు. సాధారణారణ్యమే యది యపుడగును కాని నిర్జనారణ్యమనరాదు రాజసంచారము కలదనియే చెప్పవలయును. దండకారణ్య మట్టిది కాదు. వాల్మీకి లక్ష్మణునిమాటలమూలమున మనకు హేమంతకాల లక్షణములను దెలిపెనని యెుఱింగిన నేయాక్షేపము లుండవు.

"వాపీ కాపి స్ఫురతి గగనే తత్పరం సూక్ష్మపద్యా
సోపానాళీమధిగతవతీ కాంచనీమైంద్రనీలీ,
అగ్రే శైలా సుకృతిసుగమా చందనచ్ఛన్నదేశా
తత్రత్యానాం సులభమమృతం సన్నిధానాత్సుధాంశోః."

అని కువలయానందమున నుదాహరించినప్రకార మీభాగమునఁ గలవర్ణనములంబట్టి యర్థాంతరములను గల్పించి గోవిందరాజులు వ్రాసిరి. కాని యట్టియర్థము లెచ్చోనైనఁ జెప్పవచ్చును. దానిచే రామాయణమునకుఁ గలయుత్కృష్టత్వ మేదియో దోఁపకున్నది. వినను జమత్కారముగా మాత్ర మది యుండక మానవు. వానిని బాటింపక యిందుఁ గలసార మేమనిమాత్రమే మనము ప్రధానముగా గ్రహింతము.

"స కదాచిత్ప్రభాతాయాం శర్వర్యాం రఘునందనః,
ప్రయయావభిషేకార్థం రమ్యాం గోదావరీం నదీం."

అని మూలము. "భాతుమ్ ప్రవృత్తం ప్రభాతమ్" ప్రకాశింపనున్నది "ప్రకృష్టం భాతం దీప్తిరత్రేతి ప్రభాతమ్" అని సమాసము. విశేషించి చీఁకటిలేకయుండుకాలమని తాత్పర్యము. అంతకుముందే యనఁగా బ్రాహ్మముహూర్తమున లేచి ధ్యానాదికృత్యములు సలిపి స్నానార్థము పోవుసమయమని యాశ

యము. ఒక్కనాఁటియుషఃకాలమున శ్రీరాముఁడు సీతా సౌమిత్రులంగూడి గౌతమీనదికి స్నానార్థ మరుగుచుండెనని దీనిభావము నదీస్నాన ముత్తమమనువిధి ననుసరించి రాముఁ డరిగెను సమీపమున సరస్సులుండినను నదీస్నాన మారోగ్య ప్రదమనియే రాముఁ డరిగె ననవలయును. "ఆచారః ప్రథమో ధర్మః. శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్" అనునీవిధులు పరస్ప రము తోడ్పడుచుండును. సదాచారమనునది యారోగ్యము ప్రధానముగాఁగలదిగ నుండును. సూర్యకిరణములు జలముల సోఁకకముందే శీతోదకముల స్నానము చేయవలయునన్న శాస్త్ర మారోగ్యమార్గమునుగూడ బోధించుచున్నదికదా. శిరస్స్నా నమే ప్రధానమని "స్నానం మూర్ధ్ని బలప్రదమ్" అనువైద్య శాస్త్రోక్తి తెలుపుచున్నదికదా. సీతారాములు మహత్తరశీత కాలమున స్నానార్థము గోదావరీనది కరుగుట

"యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే."

అనుగీతాశాస్త్రోక్తిని బలపఱచుచు లోకులకు సదాచారము నేర్పుటకే యని మన మెఱుంగవలయు. శ్రీరామావతార మున నుపదేశము లేక స్వాచారమూలముననే ధర్మము నేర్పుటయేకదా ప్రధానకార్యము.

"అయం స కాలస్సంప్రాప్తః ప్రియో యస్తే ప్రియంవద,
అలంకృత ఇవాభాతి యేన సంవత్సరశ్శుభః." ౪

అని మూలము. లక్ష్మణుని యీవాక్యములమూలమున వాల్మీకి మనకు శ్రీరామునాశయ మిదియని వెల్లడించుచున్నాఁడు. సామాన్యార్థము స్పష్టమే. విశేషార్థమేమనఁగా. ఆశ్రితులకుఁ

ప్రియముగమాటలాడు నో రామచంద్రా! ఏది నీకుఁ బ్రియమో ఆ కాల మిదిగో వచ్చినది. ఏ కాలముచేత ననఁగా నే ఋతువుచేత సంవత్సరమెల్ల శుభములఁగల్గించుచు నలంకారమువలె నుండునో, అనఁగా నీయవతారమునకు ఫల మీవత్సరమే. దీనినేకదా నీవు కోరుచుందువు. దుష్టరాక్షసవధరూపమున ధర్మస్థాపనమున కనుకూలమగుకాల మిదియే. వచ్చినది. దేవమునులు లోనగుసాధువులమానసము లలంకరింపఁబడినట్టులుండును. సీతాపహరణరావణాదివధముల కిదియే ప్రోత్సాహమును గలిగించుకాలము. కనుక దీనినే నీవు కోరుచుందువు. అదియు వచ్చినదను నీయర్థమే యిందుఁ బ్రతిపాదింపఁబడినదని మన మెఱుంగవలయును. లక్ష్మణునకు భావికార్యములు తెలిసినవా యని యడుగరాదు. వాల్మీకి యట్టియర్థముగల మాటలచే మనకుఁ దెలిపెను. దీనిచే శూర్పణఖరాకయు ననంతరకార్యములు శ్రీరామావతారఫలములు చేకూరనున్నవనుట సూచింపఁబడినవి.

"నవాగ్రయణపూజాభి రభ్యర్చ్య పితృదేవతాః,
కృతాగ్రయణకాః కాలే సంతో విగతకల్మషాః." ౭

అని మూలము. ఆగ్రయణమనునది హవిర్యజ్ఞము. క్రొత్తధాన్యము ఫలింపఁగా వానిని భుజించుటకుముందే యీయాగ్రయణకర్మము నొనరింపవలయును. ఈహవిర్యజ్ఞముచే దేవతలను దృప్తిపఱచి పితృకర్మములఁ బితరులను దృప్తులనుజేసి విగతకల్మషులు కావలయును. క్రొత్తవస్తువులు రాఁగా దేవతలకుఁ బితృదేవతలకు నివేదింపక భుజింపరాదనునియమము కలదు. ఆయజ్ఞము మూఁడువిధములుగ నుండును.

"వ్రీహ్యగ్రయణాం యవాగ్రయణం శ్యామాకాగ్రయణం చేతి. ఏషాం కాలశ్ప్రుతో గృహమేధీ వ్రీహి యవాభ్యాం శరద్వసంతయోర్యజేత. శ్యామాకైర్వార్షికై ర్వర్షాస్వాపత్కాలేనాన్యేన పురాణైర్వా ఇతి. ఆప స్తంబోఽపి. వర్షాసు శ్యామాకైర్యజేత శరది వ్రీహిభిర్వసంతే యవైర్యథర్తు వేణుయవైరితి."

అని ధర్మశాస్త్రమునఁ గలదు. ఈయజ్ఞము చేయనిచోఁ బ్రాయశ్చిత్తము చెప్పఁబడినది.

శ్లో. "నిత్యయజ్ఞాత్యయే చైవ వైశ్వదేవద్వయస్య చ,
అనిష్ట్వా నవయజ్ఞేన నవాన్నప్రాశనే తథా,
భోజనే పతితాన్నస్య చరుర్వైశ్వానరో భవేత్."

అని. ఈయజ్ఞ మొనరింపఁ దాత్పర్య మేమనఁగా:

"ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః,
తైర్దత్తానప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః. ౧౨
యజ్ఞశిష్టాశినస్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః,
తే త్వఘం భుజతే పాపా యే పచంత్యాత్మకారణాత్." ౧౩

అను నీగీతాశాస్త్రము ననుసరించియుఁ బైనఁ బేర్కొనఁబడిన స్మృతుల ననుసరించియు యోజింపఁగా భగవదంశములై మనకు సర్వథోపకారులగు దేవతలకుఁ బితరులకు సమర్పింపక యే నూత్నవస్తువును గ్రహింపరాదనియుఁ గృతజ్ఞత వదలరాదని యుఁ దేటపడియెడిని. ఇట్లు భగవదర్పణము చేయునలవాటు గలిగియుండుట స్వాహంకారనివృత్తికి హేతువనువిషయము మనము మఱువరాదు.

"జ్యోత్స్నాతుషారమలినా పౌర్ణమాస్యాం న రాజతే,
సీతేవ చాతపశ్యామా లక్ష్యతే న తు శోభతే." ౧౪

అని మూలము. విశేషార్థమేమి? తుషారమలినా జ్యోత్స్న= మంచు కప్పఁగా మలినముగాఁ దోఁచువెన్నెల పున్నమయందుఁ బ్రకాశింపకున్నది. మానవులదృష్టులకు నించుక యడ్డముగా నుండునది మంచు. పరిశీలించిన నది చుట్టుకొనియున్నవస్తు వగపడును. అట్లే సీతాదేవి పామరులదృష్టులకు నీ చెంత లేనియ ట్లగపడును. నిన్ను వదలియుండ దనువిజ్ఞానముగలవారలకుఁ గనఁబడుచుండునని భావము. అజ్ఞానమునఁ బరిశీలించుశక్తి లేనిపామరులకుఁ గనఁబడకపోఁగా నపహరింపఁబడినయట్లు దోఁచును. వాస్తవమేమని పరిశీలించు జ్ఞానముగలసాధువు లకుఁ గనంబడుచుండునని సారము.

"ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి,
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్. ౧౯
య ఏవం వేత్తిపురుషం ప్రకృతిం చ గుణైస్సహ,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే." ౨౩

అనుగీతావాక్యముల ననుసరించి యోజించిన నీకును సీతకును వియోగము సంభవింపదు. కాని పామరు లావిషయ మెఱుంగఁ జాలరు. "ఆతపశ్యామా సీతేవ దృశ్యతే" అనఁగా నెండసోఁకు టంజేసి నల్లఁబాఱినసీతవలె నిది కనఁబడుచున్నది. రావణుఁడు కొనిపోయినవ్యక్తి సీతవలెనే కనఁబడును. కాని సీతవలెఁ బ్రకాశింపదు. దుఃఖమునఁ గుందినట్లు తోఁచుచుండును. ఆమెకు దుఃఖ మెక్కడిది? అనుటంజేసి సీతావియోగము కల్పితమే కాని నిక్కము కాదనునర్థ మిటఁగలదని లక్ష్మణుని వాక్యములమూలమున మహాజ్ఞాని వాల్మీకి మనకుఁ దెలిపెను. హేమంతవర్ణనానంతరము లక్ష్మణుఁడు భరతునిగూర్చి తెలిపిన విషయము లసూయను వెల్లడింపవు.

"న పిత్ర్య మనువర్తంతే మాతృకం ద్విపదా ఇతి,
ఖ్యాతో లోకప్రవాదోఽయం భరతేనాన్యథాకృతః. 38
భర్తా దశరథో యస్యాస్సాధుశ్చ భరతస్సుతః,
కథన్ను సాంబా కైకేయీ తాదృశీ క్రూరశీలినీ." 39

అని మూలము. తఱచుగా మానవులు తల్లినే యనుకరించు వారు తండ్రిస్వభావము ననుకరింపరు. అను లోకప్రవాదము కలదని లక్ష్మణుఁడు తెల్పెను. ఈప్రవాద మాకాలమున నుండెనేమోకాని యీకాలమునఁ గానరాదు. ఈమిషచేఁ గైకను దూషింపఁబూనితొలుతనే దూషించిన శ్రీరామునకుఁ గోపమువచ్చునేమో యనుసందియమున భరతునియందుఁగల సద్గుణములఁ బొగడి పిదపఁ దల్లిస్వభావము ననుసరింపక భరతుఁడు లోకప్రవాదమును వ్యర్థముచేసెనని తేటపఱచి మనస్సునఁ గలయీసునఁ గైక నాక్షేపించుచున్నాఁడు. దశరథుని వంటియుత్తమశ్లోకుఁడు భర్త.సాధుమతియగుభరతుఁడు కుమారుఁడు ఇట్టి సౌభాగ్యముకలిగియుఁ గైకయెందుచేఁ గ్రూర స్వభావము కలదయ్యెను? అని ప్రశ్నించెను. మహాపుణ్యాత్ములగుదశరథభరతులు పతిపుత్త్రులుగాఁగల యామధ్యమాంబ యేల క్రూరస్వభావురాలయ్యె నను లక్ష్మణుని ప్రశ్నమునుబట్టి యొకరికర్మఫలముల వారే యనుభవింతురుగాని సాహచర్యమున నవి యితరులకుఁ గలుగవనుకర్మసిద్ధాంతము స్పష్టమగుచున్నది. ప్రాయికముగా "ప్రారబ్ధ మనుభోక్తవ్యమ్" అను సిద్ధాంతమునకు మార్పు గలుగదుకదా.

"ఇత్యేవం లక్ష్మణే వాక్యం స్నేహాద్బ్రువతి రాఘవే,
పరివాదం జనన్యాస్తమసహన్ రాఘవోఽబ్రవీత్. 36

న తేఽమ్బా మధ్యమా తాత గర్హితవ్యా కథంచన,
తామేవేక్ష్వాకునాథస్య భరతస్య కథాం కురు." 3౭

అని మూలము. శ్రీరామునివాక్యములసార మేమని పరిశీలింతము. తనయందలి నెయ్యమునకే తమ్ముఁ డిట్లు పలికెనని రామమూర్తి యెఱింగెను. కాని కైకస్వభావ మెట్టిదని యెఱుంగఁడయ్యెఁగదా యనువిచారమున బదులు పల్కుచున్నాఁడు. ఎప్పుడుగాని మధ్యమాంబ యగుకైకను దూషింపకుము. అనిమాత్రమే తెలిపి యామెయాశయ మెట్టిదని తెలుపక భరతునిం బొగడుమనియె. ఏల? కైకయాశయ మిదియని తమ్మునకుఁ దెలుపరాదు. అందులకు సమయ మిది కాదు. అనఁగా నామెమూలముననే మనపుట్టుకకు ఫలము కలుగును. ఈవిషయమును నీవెఱుంగవు. కావునఁ జిత్రకూటమున ననుభవించిన భరతునిస్వభావమును వర్ణింపుమని తెలిపి కైకను దూషించుపద్ధతిని మాన్పించెను.

"సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహం." ౨౯
గీ. ౯ అ.

అనుగీతావాక్యమును సార్థకముచేసెనని మన మెఱుంగవలయును.

"సంస్మరామ్యస్య వాక్యాని ప్రియాణి మధురాణి చ,
హృద్యాన్యమృతకల్పాని మనః ప్రహ్లాదనాని చ." 3౯

అని మూలము. భరతవాక్యప్రశంసచే సాధువులవాక్యము లుండుపద్ధతిని శ్రీరాముఁడు తెలుపుచున్నాఁడు. ప్రియాణి, మధురాణి, హృద్యాని, అమృతకల్పాని, మనఃప్రహ్లాదనాని చ

అస్య భరతస్య వాక్యాని సంస్కరామి అని యన్వయము. హృద్యాని మనఃప్రహ్లాదనాని అనుచో హృదయము మనస్సు అను వానిని దెలుపుటకుంగల కారణమేమి?అని మన మూహింపవలయును ఇందవస్థాభేదము కలదు. మనస్సు చంచలమందుము. హృదయము చంచలమనుట తఱచుగా లేదు.

"చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢం,
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్. 34
ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా."

అనియు గీతావాక్యములు కనఁబడుచున్నవి. హృదయదౌర్బల్యము మనశ్చంచలత్వము అనునవి వాడుకలో నున్నవి. "హృదయకమలమధ్యే నిర్వికారం నిరీహం" అని ధ్యానించుట యోగులవాడుక. మనస్సునకుఁ జాంచల్యము లేకయుండుట తటి హృదయకమలమున నుపాస్యదేవతాతేజోరూపమును నిలిపి ధ్యానింపవలయుననుట యోగమతము.

"యతో యతో నిస్సరతి మనశ్చంచల మస్థిరం,
తత స్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్." 26

గీ. 6 అధ్యా.

మనస్సు చలింపకయుండ నియమించి యాత్మ వశ్యమగునట్లు చేయవలయుననఁగా భావమేమి? "ఏవం యోగాభ్యాసబలాద్యోగిన ఆత్మన్యేవ ప్రశామ్యతి మనః" అని శంకరభాష్యము. మనస్సు ఆత్మయనునవి దేహమునఁగలభాగములు కావని యెఱుంగవలయు. చంచలత్వరహిత మగుకాలముననే యద్దానినాత్మ యనవచ్చును.

"ఇంద్రియాణి పరాణ్యాహురింద్రియేభ్యః పరం మనః,
మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః. ౪౨
ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా,
జహి శత్రుం మహాబాహో ! కామరూపం దురాసదమ్." ౪౩

గీత. 3 అధ్యా.

అనునీగీతావాక్యమె పైదానిని దృఢపఱచుచున్నది. కావున హృదయంగమములనఁగాఁ బలుమాఱు తలంపఁదగినవి. మనః ప్రహ్లాదనములనఁగా మనోదోషముల నడంచునవిగ సాధు వాక్యములుండును. ఎవరివాక్కుల నాలకించిన మనోదోషములు తొలఁగి భగవంతుని ధ్యానించుట కవకాశము కలుగునో అట్టివాక్యములు భక్తులవాక్కులు అట్టిమాటలంబల్కువారే భక్తులని శ్రీరాముఁడు మనకుఁ దెలిపెనని మన మెఱుంగవలయును. లక్ష్మణా ! నీవన్నమాటలు కైకదూషణామువలన మనశ్చాంచల్యమును వృద్ధిచేయుచున్నవి. కాన నింక నట్టివానిం బలుకకుమా యని శాసించెను. పరదూషణ మాత్మశాంతికే హానికరమని శ్రీరామునియాశయము. ఇట్టులుండ మధ్వవైష్ణవులు దేవతాంతరదూషణము గావింతురు కదా. అది యెంత నీచఫలదమో వర్ణింపఁదరమా? వారికేజన్మముననైన నది వదలినదాఁక భగవదనుగ్రహము కలదా? అన్న నది సున్నయనియే తేలెడిని. వార లట్టినీచభావముల మాని సర్వదేవతాస్వరూపునిగా భగవంతుని ధ్యానింతురు గాక.

"చక్రేఽభిషేకం కాకుత్స్థస్సానుజస్సహ సీతయా. ౪౧
తర్పయిత్వాథ సలిలైస్తే పితౄన్ దైవతాని చ,
స్తువంతి స్మోదితం సూర్యం దేవతాశ్చ సమాహితాః." ౪౨

అని మూలము. సకాలమున గోదావరికిం బోయి సీతాలక్ష్మ ణులంగూడి స్నానమొనరించెను. వారు మూవురు జలములఁ బితృదేవతాతర్పణములు చేసిరి పిదప నుదయించినసూర్యుని స్తుతించిరి నిర్మలమనస్కులై దేవతలను స్తుతించిరని దీని యర్థము. ఇందుఁ దర్పణము చెప్పఁబడినది. పితృదేవతలకును, దేవతలకును ఉపలక్షణవిధి ననుసరించి ఋషులకును జలతర్పణ ముచేసిరనికదా దీనితాత్పర్యము 'తే' అనుబహువచనముంబట్టి మూవురు ననియే యర్థము. తర్పణము స్త్రీలకుం గలదా యను శంక కలదు. సూర్యుఁ డుదయించుటకుముందే దేవర్షిపితృ తర్పణములు చేయవచ్చునా? అనునవి ప్రశ్నింపరానివి కావు కదా. మనుస్మృతియందు,

"యదేవ తర్పయత్యద్భిః పితౄన్ స్నాత్వా ద్విజోత్తమః,
తేనైవ కృత్స్నమాప్నోతి పితృయజ్ఞ క్రియాఫలమ్.,  ౨౮౩
అధ్యా. ౪

అమంత్రికా తు కార్యేయం స్త్రీణామావృదశేషతః,
సంస్కారార్థం శరీరస్య యథాకాలం యథాక్రమమ్.  ౬౬
వైవాహికో విధిస్త్రీణాం సంస్కారో వైదికస్మృతః,
పతిసేవా గురౌ వాసో గృహార్థోఽగ్నిపరిక్రియా.  ౬౭
అధ్యా. ౨

నాస్తి స్త్రీణాం క్రియా మంత్రైరితి ధర్మే వ్యవస్థితిః,
నిరింద్రియా హ్యమంత్రాశ్చ స్త్రియోఽనృతమితి స్థితిః."  ౧౮
అధ్యా. ౯

అను ప్రమాణములు కన్పట్టుచున్నవి. శ్రీరామాదులు చేసిన తర్పణములు సంధ్యాంగతర్పణములందురేని అవియు స్త్రీలకుం గలవా యనుసందియమునకు మనుస్మృతి బదులుచెప్పుచున్నది.

శ్రీరాముఁడు తర్పణము చేయుచుండఁగా సీతయుఁ బతివలె నీళ్లు వదలుచుండెననుట యుక్తియుక్తము కాదు. కావున నిట సామాన్యవిధుల నతిక్రమించి విశేషవిధి ననుసరించి లోక రక్షణార్థ మవతరించిన ప్రకృతిపురుషు లగుసీతారాములు లోకులకు స్వప్రవర్తనమున సదాచారముల నేర్పఁబూనిన వారు కావున సకలక్రియలు భర్తకడనుండి భార్య పతివలెఁ జేయవలయునని నేర్పుటకై యట్టులొనరించిరనుట సముచితముగఁ గనంబడుచున్నది. స్త్రీలకుఁ దర్పణాదికార్యములు లేవనుటయే సిద్ధాంతము. "సమాహితాసూర్నర్యం దేవతాశ్చ స్తువంతిస్మ"అనుటం జేసి జపము స్తుతులు లోనగునవియన్నియు నిశ్చలమనస్సు గలిగియుండినపుడే ఫలమునిచ్చునని మనము గ్రహింపవలయును. సమాహితచిత్తుఁడు కాక యనఁగా యోగాభ్యాసమున మనశ్చాంచల్యమును బోఁగొట్టుకొనక జపము చేసిన నది యత్యల్పఫలదాయకమే యని తేలెడిని. సర్వధర్మక్రియామూలము యోగవిద్యయనియే యిటఁగల సారము.

"కృతాభిషేకస్స రరాజ రామస్సీతాద్వితీయస్సహ లక్ష్మణేన,
కృతాభిషేకో గిరిరాజపుత్ర్యా ఋద్రస్సనందీ భగవానివేశః." 43

అని మూలము.

"ఋద్రస్సనందీత్యుపమయా దుష్ప్రధర్షణత్వముచ్యతే. ఋద్రస్సవిష్ణుర్భగవా నివేశ ఇతి న క్వచిదపి కోశే దృశ్యతే. క్వచిద్దృశ్యత ఇత్యాహ.తదా అభూతోపమేతి యుక్తమితి జ్ఞేయమ్."

అని గోవిందరాజులు. ఈతనికింబట్టిన దుర్మతాభిమాన పిశాచ మింకను వదలలేదు. సీతారాములు స్నానాదికృత్యములందీర్చి భగవంతుఁడై నందీశ్వరునింగూడి పరభయంకరుఁడై

యుండు శంకరుఁడు పార్వతింగూడియున్న చందమునఁ బ్రకా శించిరి. అని యుండఁగా పార్వతీపరమేశ్వరసామ్యము, అందు "భగవానీశః" అనుశివవిశేషణములు నీతని కోర్వరానివయ్యె ను. కనుకనే అభూతోపమ యని వ్రాసెను.

"త్రయాణామేకభావానాం యో న పశ్యతి వై భిదాం,
సర్వభూతాత్మనాం బ్రహ్మన్ స శాంతి మధిగచ్ఛతి."
స్కం. ४. అధ్యా. ౭

బ్రాహ్మణాస్సాధవశ్శాంతా నిస్సంగా భూతవత్సలాః,
ఏకాంతభక్తా మ్యస్మాసు నిర్వైరా స్సమదర్శినః.
సలోకలోకపాలాస్తా స్తువంత్యర్చంత్యుపాసతే,
అహం చ భగవన్ బ్రహ్మా స్వయం చ హరిరీశ్వరః.
న తే మయ్యచ్యుతేఽజే చ భిదామణ్వపి చక్షతే,
నాత్మనశ్చ పరస్యాపి తద్యుష్మాన్ వయమీమహి."
స్కం. ౧౨. అధ్యా. ౧౦

అను నీశ్రీభాగవతప్రమాణములను,

"అవిద్యామోహితాత్మానః పురుషా భిన్నదర్శినః,
వదంతి భేదం పశ్యంతి చావయోరంతరం హర."

అను విష్ణుపురాణప్రమాణమును గోవిందరాజులు పఠించి బుద్ధి మంతులకడ వానియర్థముల నెఱింగియుండిన నిట్టిపాషండ త్వము వదలియుండునుగదా. ఈభాగమున నధ్యాత్మరామా యణమునఁ గలవిశేషములం బరికింతము.

"ఏకదా లక్ష్మణో రామమేకాంతే సముపాస్థితం,
వినయావనతో భూత్వా పప్రచ్ఛ పరమేశ్వరమ్.

భగవన్ శ్రోతుమిచ్ఛామి మోక్షస్యైకాంతికీం గతిం,
త్వత్తః కమలపత్రాక్ష సంక్షేపాద్వక్తుమర్హసి.

... ... ... ... ...

తస్య జీవస్య విజ్ఞానే సాధనాన్యపి మే శృణు,
మానాభావ స్తథా దంభహింసాదిపరివర్జనం. 3౧
పరాక్షేపాదిసహనం సర్వత్రావక్రతా తథా,
మనోవాక్కాయసద్భక్త్యా సద్గురోః పరిసేవనం. 3౨
బాహ్యాభ్యంతరసంశుద్ధిస్థిరతా సత్క్రియాదిషు,
మనోవాక్కాయదండశ్చ విషయేషు నిరీహతా. 33
నిరహంకారతాజన్మజరాద్యాలోచనం తథా,
అసక్తిస్స్నేహశూన్యత్వం పుత్రదార ధనాదిషు. 3౪

... ... ... ... ...

చిదాత్మాహం నిత్యశుద్ధో బుద్ధఏవేతి నిశ్చయం,

... ... ... ... ...

అతో మద్భక్తియుక్తస్య జ్ఞానం విజ్ఞానమేవ చ,
వైరాగ్యం చ భవేచ్ఛీఘ్రం తతో ముక్తిమవాప్నుయాత్.

... ... ... ... ...

న వక్తవ్యమిదం యత్నాన్మద్భక్తివిముఖాయ హి,
మద్భక్తాయ ప్రదాతవ్య మాహూయాపి ప్రయత్నతః."

ఆరణ్య కాం. ౪ సర్గము.

నేను నిత్యశుద్ధబుద్ధముక్తుఁడను. నన్నాశ్రయించుమార్గములనేకములు. బాహ్యాభ్యంతరశుద్ధి నిరహంకారత్వము సత్క్రియాశూరత్వము లోనగుమార్గములు ముఖ్యములు. నాభక్తునకు వైరాగ్యము కలుగును. దాన ముక్తి కలుగును. అనునవియే శ్రీరామోపదేశమున నిట ముఖ్యములు. ఇందుఁ జెప్పఁ

బడిన వందలకుఁ గావలసినవియే. దీనిచేత మధ్వవైష్ణవులకుఁ గలవాదలాభ మించుకంతయుఁ గానరాదు.

పంచవటి యిపు డెద్ది?

అను ప్రశ్నము కలదు. దానింగూర్చి నాల్గుమాటలు వ్రాసెదను. చిత్రకూటమునుండి శ్రీరామాదులు పయనమై మునుల యాశ్రమములను జూచుచు నగస్త్యముని యుండుతావు చేరెను. అందు మునితో నాకు నివాసార్హ మగుప్రదేశమును దెల్పుమని యడుగ నమ్ముని యిట్లు తెలిపెను.

"గోదావర్యాసమీపే చ మైథిలీ తత్ర రంస్యతే. ౨౧
ఏతదాలక్ష్యతే వీర మధూకానాం మహద్వనం. ౨౩
ఉత్తరేణాస్య గంతవ్యం న్యగ్రోధ మభిగచ్ఛతా,
తతస్థ్సల ముపారుహ్య పర్వతస్యావిదూరతః. ౨౪
ఖ్యాతః పంచవటీత్యేవ నిత్యపుష్పితకాననః.

౧౩ సర్గము.

తం దృష్ట్వా తౌ మహాభాగౌ వటస్థం రామలక్ష్మణౌ,
మేనాతే రాక్షసం పక్షిం బ్రువాణౌ కో భవానితి." ౨

౧౪ సర్గము.

అనుమూలములు కనుపట్టుచున్నవి. దండకారణ్యమున నగస్త్యాశ్రమ మెందున్నదని విచారింపవలయును. ప్రాయికముగా మునులయాశ్రమములు శ్రీరాముఁ డేయేయాశ్రమములకుం బోయినదియు నేదిక్కుగాఁ బయనము చేసినదియు స్పష్టముగా రామాయణమునుబట్టి నిర్ణయింప నవకాశములేదు. కొంద ఱిప్పచెట్లయడవిమీఁదుగాఁ బోమ్మని యగస్త్యముని తెల్పి నందున భద్రాచలమున నాచెట్లు సమృద్ధిగానున్నందున నా

పంచవటి భద్రాచలమే యందురు. పంచవటి నాసిక యనఁ బడుపురమునకుఁ జెంతనున్నది. నాసికాచ్ఛేదకారణమున దాని కా పేరుగల్గెనని పలుకుదురు. ఇప్పచెట్లు త్రేతాయుగమునాఁటివి నశింపకుండ నవిలేకున్నను వానిసంతతియు నున్నదనుట విశ్వాసపాత్రమా యని సంశయించుచున్నాఁడను. నాసికకుఁ బడమట త్ర్యంబకమనుమహాస్థలము కలదు. దానిపశ్చిమభాగమునఁ గొండఁగలదు దానియందే గోదావరి యుత్పత్తిస్థానము కలదు. పంచవటికిఁ జెంతనే గోదావరి ప్రవహించుచున్నది. దీని నేను గన్నులారఁ జూచితిని. నాసికకు మూఁడు క్రోశములదూరమున ఖరదూషణాదులవధించినస్థలము కలదు. అందుఁ ద్రవ్విన శల్యము లగపడును. ఆస్థలముకూడ దర్శించితిని. భద్రాచలమునందు నీగుఱుతులనఁగా గుహాలోనగునవి కలవందురు. ఆచోటున నున్న వారలకు గోదావరియుండు దిక్కుఁగపడును. ఇట్టిగుఱుతుల నటుండనిచ్చి పూర్వులవాడుకం బట్టి యాలోచించినను బంచవటికి భద్రాచలమునకు సంబంధమే లేదు. భద్రాచలమునకు దాపున సీతస్నానముచేసినసరస్సు కలదు. అది యుష్ణకుండ మనఁబడును. ఉదక ముష్ణముగనే యుండును. ఈగుఱుతు ముఖ్యముకాదా యందురు. ఇట్టి పామరులయూహల కంతము లేదు.

"చక్రే౽భిషేకం కాకుత్స్థస్సానుజస్సహ సీతయా." సర్గము. ౧౬

హేమంతర్తువున నుష్ణకుండమున స్నానముచేయక సీత గోదావరికి స్నానార్థముపోవుట విచిత్రముగనే యుండును. మండు వేసవిదినములలో నుష్ణకుండమున స్నానముచేయుం గాఁబోలు. బదరీనారాయణక్షేత్రమున నుష్ణకుండము కలదు. అందుఁగూడ సీతయో అట్టి సాధ్వియో స్నానముచేసెఁ గాఁ

బోలు. వీనిమాట యటుండనిత్తము రామదాసు కాలముననే భద్రాచలము ప్రసిద్ధికెక్కెను. మహారాజాశ్రయమున నది ప్రబలెను. పంచవటియే యిదియని భావించినఁ బాపము లేదు. కాని చారిత్రవిషయసిద్ధాంతమున నది యొప్పదు. దీనింగూర్చిన చర్చ మఱొక్కపర్యాయము చేయఁదలఁచినవాఁడఁగాన నిపు డింతటితో ముగింతును. ఈచర్చలమూలమున నీ నాప్రయత్న మునకుం గల్గులాభముకూడ నుండదు. రామాయణకావ్యమే యసత్యమనుమహాత్ములముం దిట్టివి చేయుటయు హాస్యాస్పదమే.

కొందఱు రామాయణమునఁ గలసీతాపహరణమునకు రహస్యార్థము కలదనియు సీత యనఁగా లాంగలపద్ధతి కాన సీతాపహరణమనఁగా దక్షిణదేశమున వ్యవసాయ మాకాల మున నారంభింపఁబడినదని గ్రహింపవలయుననియు నిదియే యిందలిపరమార్థమనియు నీరహస్యమును వెలిపుచ్చక రావ ణుఁడు సీత నపహరించెనని కావ్యరూపమున వెలయించి రనియుఁబలుకుదురు. ఇంతటిరహస్యమును గనుఁగొన్నందులకు మన మెంతయు సంతసింపవలసినదే. అట్టివారు నాస్తికులవంటి వారు. భగవద్భక్తులంబోలి నటింతురు. స్వానుష్ఠానమున భక్తిలేకున్న నుపన్యాసవేదికలం దద్దాని గ్రుమ్మరింతురు. వారి పల్కులు వేదవాక్కులంబలెఁ గొందఱు గ్రహింతురు. అంతటి రహస్యపరమార్థములు మనకు వలదు శ్రీరాముఁడు భగవం తుఁడని సీత ప్రకృతియని భావించి వారికార్య మగుధర్మ రక్షణమునకుఁ దోడ్పడ నవతరించినదేవతలే వానరభల్లూ కములని నిశ్చయించి వారిప్రవృత్తిని బరిశీలించినచో మనకుఁ గీడు రాఁబోదు.'నాస్తి చేన్నాస్తి మే దోష అస్తి చేన్నాస్తికో హతః'' అనుశంకరోక్తిని స్మరించుచు భగవంతుఁడగుశ్రీ

రాముని దివ్యచరిత్రమును బఠించి దానిని స్మృతులతో సమన్వయము చేసికొని దానియం దేలేశమాత్రమైనను మన మనుసరింప వలనుపడు నేనట్టులాచరింతము. దాననే మనకు నుత్తమ జన్మము లభించును. అంతియ కాని యిట్టి యవకతవక గా నర్థములు గ్రహించి మనభావముల వెలిపుచ్చి లోకము నుద్ధరింతమని ప్రయత్నింపఁదగినవారము కాము. ఇఁక నవ్వాలిదగు శ్రీరామచంద్రునిచరిత్రమును బరికింతము.

## శూర్పణఖ వచ్చి శ్రీరాముని భర్తగాఁగోరుట.

* శ్రీరామాదులు పర్ణశాలకుంబోయి ముందుఁ గూరుచుండిరి. రామసౌమిత్రులు బ్రహ్మయజ్ఞము లోనగు పగటియందుఁ దొలియర్ధభాగమునఁ జేయఁదగువాని నొనరించి లోపలఁ బ్రవేశించిరి. దర్శింపవచ్చినమహర్షులు రాము నారాధించిరి. సోదరునితో విలాసముగ మాటలాడుచు సీతంగూడి యున్న రాముఁడు చిత్రానక్షత్రయుతశీతాంశునిబోలి వెలయుచుండెను. వినోదకథాగోష్ఠినుండు శ్రీరామచంద్రునికడకుఁ దనదారినఁబోవుచు నొక్కరక్కసివనిత వచ్చెను. అది శూర్పణఖ యనఁబరఁగునది. రావణుని చెల్లెలు. పేరుచేతనే యామె యందము స్పష్టమగును. అట్టి యారక్కసి దేవతాప్రతిముఁడగు శ్రీరామునిం గాంచి చెంతకుం బోయెను. ఆరాముని రూపము కన్నులపండువు చేయంజూచెను. సకలమహారాజలక్షణము లాశరీరమున ముద్రింపఁబడినట్లుండెను. కావున నాదివ్యసుందరవిగ్రహుని జూడఁగనే యామెచిత్తము చంచలించి మరులు గలుగఁజేసెను. ముద్దుమోము గుండ్రనినడుము

---

* ఇది పదునేడవసర్గమునఁ గలదు.

విశాలనయనములు మృదువులును బొడవులు నగువెండ్రుకలుమ
నోహరగళస్వనము వయస్స్ఫూర్తియు మధురవాక్సమత్కృతి
సదాచారనిరతి యనునవిగల్గిన శ్రీరామునిశరీరమును వికారపు
ముఖము పృథూదరము, వికారపుఁగన్నులు కుఱుచలై యెఱ్ఱగ
నుండువెండ్రుకలు వికటరూపము భీతినిగొలుపుకంఠధ్వనియు
ముదుసలితనము వికటవాక్కులు చెడునడత, ఏవగింపుగలి
గించునాకారము లోనగుచిహ్నములుగల యాశూర్పణఖ
చూచి మన్మథుఁడు మదిఁ గొందలంపఱుప నిట్లు పలికెను.

ఓయీ! మునివేషమున జడలుదాల్చి యున్నాఁ
డవు. కాముకునివలె భార్యంగూడి యున్నాఁడవు. క్షత్రి
యునిచందమున ధనుర్బాణములఁ బూనియున్నావు. ఇట్టి నీ
వీరాక్షసనివాసమునకు నేల వచ్చితివి? ఏపనికొఱకు వచ్చి
తివి? నిజము చెప్పుము. అనఁగా నాపరంతపుఁడు బుద్ధియం
దించుకంతయుఁ గపట మెఱుంగనివాఁడు కావునఁ దన
వృత్తాంతమంతయుఁ జెప్పఁబూనెను. అసత్యముపలుకు తలంపు
గూడలేని యారాముఁ డోయబలా! దశరథరాజేంద్రుని
కుమారుఁడను. రాముఁడని నన్నందఱుం బిలుతురు. ఇతఁడు
నాయనుజుఁడు. లక్ష్మణుఁడను పేరుగలవాఁడు. నన్నెడఁ
బాయకయుండును. నాతండ్రి నియోగింపఁగాఁ దల్లియుఁ బురి
కొలుపఁగా ధర్మాచరణపరాయణుఁడనై మునివేషమున వచ్చి
తిని. ఇది నావృత్తాంతము. ఇఁక నీవార్తఁ దెలియఁగోరెద.
నీపేరేమి? నీతల్లిదండ్రు లెవరు? ఇంతమనోహరములగు
దేహభాగములుగల నీవు రక్కసివిగాఁ దోఁపలేదు. ఏల యిచ్చ
టికి వచ్చితివి? యథార్థమంతయుఁ దేటపఱుపుము. ఆమెయుఁ
గామపరవశయై శ్రీరామా! శూర్పణఖ యనుదానవాంగ

నను. కామరూపిణిని నా పేరువిన్నంత నెల్లవారు భీతినొందు దురు. ఒంటిగా నీయడవిఁ గ్రుమ్మరుచుందును. విశ్రవసఃపుత్త్రుఁడు శూరుఁడునగు రావణుఁడు నాకు సోదరుఁడు నీ వాతని వినియే యుందువనుకొందును. సదా నిదురించుచుండు కుంభకర్ణుఁడును నాసోదరుఁడే. ధర్మాత్ముఁడగు విభీషణుఁడు కూడ నాసహోదరుఁడే. కాని యతని కించుకంతయు రక్కసులచర్య లలవడినవి కావు రణశూరులని పేరుగన్న ఖరదూషణులు నాసోదరులే. ఇట్టివారు నాకుఁ సోదరులనిమాత్రము భీతిల్లకుము. వారియానతికి లోఁబడక యిచ్ఛానుసారముగా వర్తించుచుందును. ఇపుడు వారినివదలి యపూర్వదర్శనుఁడవు, పురుషోత్తముఁడవు నగునిన్ను నామదిఁ బతిగాఁ దలంచితిని. సీత యున్నదనుకొనకుము. మహాప్రభావముగలిగి స్వేచ్ఛాప్రవర్తకురాల నగునాకుఁ జాలకాలము భర్తవుగా నుండ నంగీకరింపుము. దీనితో నీకుఁ బనియేమి? ఈసీత వికారముగా రూపవిహీనగా నున్నది. కాన నిట్టిది నీకుఁ దగదు. నేనే నీకర్హురాలను. భార్యనుగా నన్నుఁ గాంచుము. రూపము ఆచారము చక్కఁగాలేని యీమనుష్యకాంతను నీసోదరునితోడ భక్షింతును. కాంతుఁడా! తరువాత నీవు నన్నుంగూడి పర్వతశిఖరములను దివ్యతరారామములను జూచుచు నీయరణ్యమున విహరింపఁగల్గుదువు. మాటనేర్పరి యగురాముఁడు దానిమాట లాలకించి యిట్లు బదులుచెప్పెను.

మహాశయులారా! ఈభాగము శ్రీరామావతార ప్రయోజనమును మానవలోకమునకుఁ గల్గించునది. కాన నిందలిరహస్య మెఱుంగఁదగినదియే. ఇంతదనుక వనవాసమున శ్రీరామాదులు పదుమూఁడువర్షములు గడపిరి. అందును

బంచవటీనివాసమున మూఁడువత్సరములు నివసించిరి. కాని మహాకార్యము లింతదనుక సాగింపక వారు నియతులై యుండిరి. పంచవటియందు సంతకుమునుపు మునులయాశ్రమముల యందును శ్రీరాముఁడు సీతయు సహారయోగనిష్ఠనుండి స్వాభిన్నమూర్తులం దలంచుకొనుచుండిరి. ఒక్కసంవత్సరము వనవాసనియమమునఁ గలదు ఇంతదనుక నేల తమయవతార ఫలములను సీతారాములు లోకమునకుఁ గల్గింపరైరని ప్రశ్నింపరాదు. కర్మసిద్ధాంతమును గల్పించినవారే దాని నతిక్రమింపరాదుగదా. ఎవ్వరెవ్వరి కేయేసమయముల దేహ పతనము కావలయునో యాసమయములకే కారణాంతరము లచే నిమిత్తమాత్రులై కార్యమొనరింతురు. ఖరాదిదుర్దాంత దానవుల కాయురంతము సమీపించెను. వారికర్మమే శూర్పణ ఖను బ్రోత్సహించి శ్రీరాముని చెంతకుం గొనివచ్చెను. "నహి కారణం వినా కార్యస్యోత్పత్తిః" అనున్యాయము సుప్రసిద్ధమే కదా. శూర్పణఖరాకకై యానాఁడు శ్రీరాముఁడు వేచి యుండెను. నాఁటి శ్రీరామునాకార మత్యద్భుతముగనుండెను. దర్శనమాత్రమున మనస్సు మాఱునట్లు చేయఁజాలియుండెను. ఆవిధమే యీభాగమునఁ గలదు. కనుక నాయాఘట్టములఁ బరికింతము.

"స రామః పర్ణశాలాయా మాసీన స్సహ సీతయా,
విరరాజ మహాబాహుశ్చిత్రయా చంద్రమా ఇవ. ౪
తథాసీనస్య రామస్య కథాసంసక్తచేతసః,
తం దేశం రాక్షసీ కాచిదాజగామ యదృచ్ఛయా." ౫

అని మూలము. ఎపుడెపుడు తమకార్యములకు నుపకరణభూత యగుశూర్పణఖ యరుదెంచునా యని సీతారాములు కాచి

యుండిరి. కాలక్షేపమున కేవో కథల నాలకించుచు శ్రీరాముఁ డుండెను. "చిత్రయా చంద్రమా ఇవ విరరాజ." అనుచోఁ జిత్రానక్షత్రము పొత్తుగలచంద్రుఁడువలె రామమూర్తి ప్రకాశించెను. సీత చిత్రానక్షత్రముతోఁ బోల్పఁబడినది. ఏల? చిత్రానక్షత్ర మల్పప్రకాశము కలది. స్వాతియద్దానికంటె మిక్కిలి ప్రకాశముకలది. కావునఁ జిత్రతో సీతను బోల్చుటంజేసి యామె యాసంవత్సరకాల మల్పప్రకాశముకలదిగా నొరులకుఁ దోఁపవలయుఁగాననంతకుఁబూర్వమువలెఁ బ్రకాశింపక తనకిరణము లడంచుకొనియుండెనని యీ భాగము సూచించుచున్నది శ్రీరాముఁ డెంతయుఁ బ్రకాశించుచుండె ననుటంజేసి ముందు ఖరదూషణాదుల వధింపవలయునుగాన నందులకుం దగినయట్లు ప్రకాశించెనని మన మెఱుంగవలయును. ఇద్దానిచే నితరులకుఁ దెలియకయుండ సీత శ్రీరామునికడ నుండెననియు ఛాయారూపమున లంకకుం బోవుననియు మన మెఱుంగవలయును. ఈయర్థమును మనము మఱచిన "విష్ణోరేవానపాయినీ" అన్నసూక్తి యేటగలియును.

"ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి,
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్."

అన్నగీతావాక్యము వ్యర్థమగును. అంతియకాక

"వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే"

అన్నసూక్తియు సార్థకము కానేరదు. అగ్నికి దాహికాశక్తికి నభేదమున్నయట్లు భగవంతునకు మహాప్రకృతికి ననపాయిత్వము సిద్ధింపవలయును. లోకదృష్టికే భేదము గనంబడును గాని జ్ఞానదృష్టికి భేదమే కానరాదు. ఇంద్రజాలము చేయు

వానిమాయాసృష్టితద్రహస్యవిదునకుఁగనఁబడనట్టులు ప్రకృతి పురుషులకు వియోగము గనంబడుననియే మన మెఱుంగ వలయును.

"మహీం మూలాధారే కమపి మణిపూరే హుతవహం
స్థితం స్వాధిష్ఠానే హృది మరుతమాకాశముపరి,
మనోఽపి భ్రూమధ్యే సకలమపి భిత్వా కుళపథం
సహస్రారే పద్మే సహ రహసి పత్యా విహరసి."

అనుశంకరభగవత్పాదోక్తి యిట ధ్యేయము. బాహ్యదృష్టికే సీత యల్పతేజస్సుగలదిగా నుండెనని మన మీభాగమునుండి యెఱుంగుటయే తెఱంగు. ఆప్రదేశమున కొకానొకరాక్షసాంగన యాదృచ్ఛికముగా వచ్చెననఁగాఁ గర్మప్రేరితురాలై యరుదెంచెనని భావము. మార్గమున నెచ్చటికో పోవుచు నచ్చటికే తెంచెననియే సారము.

"సా తు శూర్పణఖా నామ దశగ్రీవస్య రక్షసః,
భగినీ రామమాసాద్య దదర్శ త్రిదశోపమం. ౬
సింహోరస్కం మహాబాహుం పద్మపత్త్రనిభేక్షణం,
ఆజానుబాహుం దీప్తాస్యమతీవ ప్రియదర్శనం. ౭
గజవిక్రాంతగమనం జటామండలధారిణం,
సుకుమారం మహాసత్త్వం పార్థివవ్యంజనాన్వితం. ౮
రామమిందీవరశ్యామం కందర్పసదృశప్రభం,
బభూవేంద్రోపమం దృష్ట్వా రాక్షసీ కామమోహితా." ౯

అని మూలము. ఆమె పేరు శూర్పణఖ. చేఁటలవంటిగోళ్లుగలది. పేరుచేతనే యామె సౌందర్యము తేటపడియెడిని. రావణునకుఁ జెలియలు. ప్రాయికముగా దానవులరూపము కురూపమే. అట్టి యారాక్షసి 'త్రిదశోపమం దదర్శ'. నిర్జరసమానుఁ డగు

రామునిం గాంచెను. "త్రిదశోపమమ్"అనునది సాభిప్రాయ విశేషణము. త్రిదశులకు దానవులకు సహజశత్రుత్వము. తమపగవానివంటివానిని గాంచెననఁగాఁ దనకోరికకుఁ బ్రతికూలుఁడగురామునిం గాంచెనని యర్థము. అనఁగాఁ దన కోరిక నన్యథాకరించువాఁడని యెఱుంగకపోయెనని భావము. పదుమూఁడుసంవత్సరములు వనవాసముచేసినను దీసిపోవని శరీరకాంతి యలరనుండెను. "పార్థివవ్యంజనాన్వితమ్" =రాజలక్షణములతోఁ గూడినవాఁడు. అనఁగాఁ దనమహత్త్వమును మఱుఁగుపఱచి రాజపుత్త్రునివలెఁ గనఁబడుచుండెనని భావము. "ఇంద్రోపమం దృష్ట్వా రాక్షసీ కామమోహితా బభూవ." ఇంద్రుఁడు తమజాతికిఁ బరమశత్రువు. అట్టివానితో నుపమింపఁదగిన శ్రీరాముని గని కామమోహిత యయ్యెను. అనఁగా భావమేమి? తనకామము స్వాపకారకము. అయినను గర్మము పురికొలుప నకార్యమును గార్యముగా నాపె యెంచెను. దీనిచే నకార్యకరణము హానికరమనియే తేలెడిని. కర్మము బలవత్తరమగుట దానికి లొంగనివారే లేరని మన మెఱుంగవలయు. శూర్పణఖామూలమునఁ బ్రకృతి రామమూర్తిచే ధర్మరక్షణము చేయింప నెంచెననియే యిందలి సారము. 'ప్రకృతేః పరః' అన్న ప్రమాణము వ్యర్థముకాదా యందురేమో. ఇపుడు భగవంతుఁడు ప్రకృతికి లోఁబడినవాఁడే. ప్రకృతివిశిష్టుఁడని భావము. నిర్లిప్తుఁ డనుపేరునకుఁ దగినయవస్థ యిదికాదు. ప్రకృతి ప్రోత్సహించెననఁగా నామహనీయుఁడు తలంచెననియేకదా తాత్పర్యము. ఇచ్ఛయే కదా ప్రకృతి. వేఱొకవ్యక్తికాదు. ఇందలికర్మసిద్ధాంతమునే యీక్రిందిశ్లోకములు దృఢపఱచుచున్నవి.

"సుముఖం దుర్ముఖీ రామం వృత్తమధ్యం మహోదరీ,
విశాలాక్షం విరూపాక్షీ సుకేశం తామ్రమూర్ధజా.
... ... ... ... ...
తరుణం దారుణా వృద్ధా దక్షిణం వామభాషిణీ.
... ... ... ... ...
శరీరజసమావిష్టా రాక్షసీ వాక్యమబ్రవీత్."

అని మూలము. లోకసామాన్యదృష్టిచేఁ బరికించినను శ్రీరాముని శూర్పణఖ కోరఁదగదని తేలెడిని. వయస్సుగలవాఁడు రాముఁడు విగళితవయస్క రాక్షసి. ఆమెకు నతఁడు లభించుననునాశయుఁ బుట్టరాదు. కర్మము క్రూరఫలమునీయఁగోరియే యిట్టిదుస్సంకల్పములఁ బుట్టించును. ఇచ్చోట వాల్మీకిమహర్షి కావ్యమును జక్కఁగా నలంకరించి తన్మూలమున "గహనాకర్మణోగతిః" అనుసిద్ధాంతమును వెల్లడించెను. ఇందు "శరీరజసమావిష్టా" అనుప్రయోగము కలదు. శరీరజుఁడు అనఁగా మన్మథుఁడని యర్థము గ్రహింపవలయును. 'శరీరజో మన్మథః' అని గోవిందరాజులు. 'శరీరజసమావిష్టా మదనాకులా' అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి. లక్షణచే శరీరమనఁగా శరీరాంతర్గతమనస్సు అని యర్థము గ్రహింపవలయును. 'గంగాయాం ఘోషః' అనుచో నిట్లేకదా యర్థము గ్రహించిరి.

"జటీ తాపసరూపేణ సభార్యశ్శరచాపధృత్,
ఆగతస్త్వమిమం దేశం కథం రాక్షససేవితం ౧౩
కిమాగమనకృత్యం తే తత్త్వమాఖ్యాతుమర్హసి."

అని మూలము. శూర్పణఖమనస్సు తాఱుమాఱయ్యెను. శ్రీరామదర్శనమున సకలపాపములు నశింపవలయుఁ గదా. ఆ

కార్యమునకు హేతువు కావలయును. దుష్కర్మ ఫలము లను భవమునఁగాని తొలంగ వనుసిద్ధాంతమునకు భంగము కలుగ రాదు. భగవద్దర్శనము వృథ కారాదు. కోరరానికోరికలు కోరువారలకు నాపదలు తప్పవను పెద్దలపలుకు లసత్యములు కారాదు. కావున నామనసలిమనస్సు మార్పునొంద నిట్లు లడిగెను. తపస్విచిహ్నము లగపడుచున్నవి. తద్విరుద్ధచిహ్నము లగపడుచున్నవి. ఇది రాక్షసు లుండుతావు. ఏటికి వచ్చితివి? వచ్చినపని యేమి? అనఁగా దేనిని సాధింప వచ్చితివి? 'తత్ త్వమ్ ఆఖ్యాతు మర్హసి' తత్ అవ్యయము. తస్మాత్ అని యర్థము. ఇది సామాన్యార్థమునఁ జేయఁదగుపదవిభాగము. తత్త్వమ్ తత్త్వమును వాస్తవమును. వచింపఁదగుదువు. అనఁగా దాఁపక యున్నదున్నట్లు వచింపుమని భావము. మహాత్మా! నేనిందుల కరుదెంచినది యీకార్యము సాధించుట కని నాకుఁ దెలుపుమా యని యామె తద్దర్శనసంజనితజ్ఞాన మునఁ బ్రార్థించెనని సారము. ఈయాశయమును

"ఋజుబుద్ధితయా సర్వమాఖ్యాతు ముపచక్రమే."

అను మూలము దృఢపఱచుచున్నది. కుటిలచిత్తురాలైనను నా దర్శనమున భాగ్యవతియే యైనదనుభావముచేఁ దనకార్య ములనెల్ల వచింపఁ దలఁచెననికదా దీనిభావము.

"అనృతం న హి రామస్య కదాచిదపి సమ్మతం. ౧౫
విశేషేణాశ్రమస్థస్య సమీపే స్త్రీజనస్య చ."

అను నీవాక్యము వాల్మీకిది. కథకు సంబంధములేనిది. అయి నను శ్రీరాము నాశయములన నిట్టివని మనకుఁ దెలుపవలయు ననియే మునియాశయము ఎట్టికట్టడిసమయములయందుఁగాని యబద్ధము శ్రీరామునకు సమ్మతము కాదు. ఆశ్రమమున నున్న

వానికి సమ్మతమగునా? అంతియగాక స్త్రీజనసమీపముననున్న రామునకు సమ్మతమగునా? అని ముని తెలిపెను. ఆశ్రమవాసము స్త్రీసమ్ముఖము లేనిచో సమ్మతము కావచ్చునేమో యనుశంక పొడమగలదు. కావున నింతటియల్పవాక్కు మునివరునినోటి నుండి వెలువడునా? ఇందేదో యొకవిశేషము గలదనియే నమ్మవలయును. ఇది వాల్మీకి యుపదేశము. ఎపుడుగాని యసత్య మాడరాదు. అది శక్యముకానిదని తోఁచుదుర్బలమనస్కుఁడు ఆశ్రమమనఁగా సత్కర్మానుష్ఠానయోగ్యస్థలము. అందైనఁ బలుకకుండుట మంచిది. అనఁగా విశేషించి జాగరూకుఁడై సత్యవిషయమున నట్టి స్థలముల నుండవలయునని భావము. స్త్రీజనస్య చ. అనుచోఁ గల చకారముచేత విశేషించి యను నర్థము గ్రహింపవలయునని తెలియవలయును. స్త్రీలకడ నసత్యము పలుకరాదు. ఏల?

"సూక్ష్మేభ్యోఽపి ప్రసంగేభ్యస్స్త్రియో రక్ష్యా విశేషతః,
ద్వయోర్హి కులయోశ్శోకమావహేయురరక్షితాః. ౫
ఇమం హి సర్వవర్ణానాం పశ్యంతో ధర్మముత్తమం,
యతంతే రక్షితుం భార్యాం భర్తారో దుర్బలా అపి. ౬
స్వాం ప్రసూతిం చరిత్రం చ కులమాత్మానమేవ చ,
స్వం చ ధర్మం ప్రయత్నేన జాయాం రక్షన్ హి రక్షతి. ౭
పౌంశ్చల్యాచ్చలచిత్తాచ్చ నిస్స్నేహాచ్చ స్వభావతః,
రక్షితా యత్నతోఽపీహ భర్తృష్వేతా వికుర్వతే. ౧౬
అపత్యం ధర్మకార్యాణి శుశ్రూషారతిరుత్తమా,
దారాధీనస్తథా స్వర్గః పితౄణామాత్మనశ్చ హ." ౧౮

మను. ౯ అధ్యా.

"స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః." గీత.

అనువానింబట్టి యాలోచింప సంసారయాత్ర స్త్రీప్రధాన
మనియే తేలెడిఁగదా. అట్టియుభయకులాధారభూతలగుస్త్రీల
యెదుట నసత్యమాడుట విశేషించి యాపత్కరమని భావము.
ఆశ్రమములయం దెట్లో వనితలసమక్షమున నిట్లే యసత్య
మాడరాదని భావము. వారిచిత్తము లత్యంతచంచలములు
గావున నట్టివానియం దసత్యబీజమును బురుషుఁడు నాటరాదని
తాత్పర్యము. మహర్షి యెట్టినీతి నుపదేశించెనో తెలిసికొని
యానందింపవలయును. ఒకానొకచో రాముఁ డసత్యము
పలుకునని గ్రహింపరాదు. అనృతము సర్వథా సర్వదా పలుక
రాదనియే భావము. ఒకప్పు డట్టుచేయఁజాలని చంచలాత్ము
లిట్టితావులనైనఁ బలుకకుండిన మేలని మనకు ముని తెలిపెను.

"ఇయం భార్యా చ వైదేహీ మమ సీతేతి విశ్రుతా,
నియోగాత్తు నరేంద్రస్య పితుర్మాతుశ్చ యంత్రితః. ౧౮
ధర్మార్థం ధర్మకాంక్షీ చ వనం వస్తుమిహాగతః,
త్వాం తు వేదితు మిచ్ఛామి కథ్యతాం కాసి కస్యవా. ౧౯
న హి తావన్మనోజ్ఞాంగీ రాక్షసీ ప్రతిభాసి మే,
ఇహ వా కిన్నిమిత్తం త్వమాగతా బ్రూహి తత్త్వతః." ౨౦

అని మూలము. ఇందు 'భార్యా చ' అనుచోఁ గలచకారము
విశేషార్థద్యోతకము. మహాకవికదా వాల్మీకి. "విగతః దేహో
యస్య స విదేహః, స ఏవ వైదేహః, తస్యాపత్యం స్త్రీ వైదేహీ"
దేహములేనివానికూఁతురు. అనఁగా నయోనిజ. తనంతన
తానైనదని భావము. కనుకనే 'సీతేతి విశ్రుతా' నాఁగటి
చాలునఁ గనఁబడినదని ప్రసిద్ధమయ్యెను. అట్టి 'ఇయం' ఈ
నాచెంతనుండు నీయంగన 'మమ భార్యా చ' నాకు భార్యయు

నయ్యెను. అనఁగా నేను భరింపఁ దాను మెలఁగఁదగినట్లున్న దని భావము. ఇది వ్యపదేశమే కాని వాస్తవము కాదు. అనఁగా నన్నుఁ బోషించునదియే ప్రకృతి. నే నామెను బోషించు టెట్లు? అభిమానశూన్యుఁడనగు నేను భరింపవలసిన వాఁడ ననునభిమానము గలవాఁడ నగుటెట్లు? రూపనామ క్రియాశూన్యుఁడనగు నేనీమెమూలమున రూపనామక్రియా వంతుఁడ నగుదును. కాన నిది వ్యపదేశమే యని భావము.

"శివశ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుం,
న చేదేవం దేవో న ఖలు కుశలస్స్పందితుమపి." ౧

అనియు,

జగత్సూతే ధాతా హరిరవతి రుద్రః క్షపయతే
తిరస్కుర్వన్నేతత్స్వమపి వపురీశస్తిరయతి,
సదా పూర్వస్సర్వం తదిదమనుగృహ్ణాతి చ శివ
స్తవాజ్ఞామాలంబ్య క్షణచలితయోర్భ్రూలతికయోః." ౨౪

అను శ్రీశంకరభగవత్పాదాచార్యులవారివాక్కులీయర్థ మునే తెలుపుచున్నవి. నేను సాక్షిమాత్రుఁడనుగా నున్న వాఁడను. నా యీపురుషరూపము కల్పితము. సర్వరూపములు గలవాఁడనగుట యీప్రకృతిమూలముననే యని యెఱుం గుము. అనఁగా నాకు నీమెకు వేఱుగా నుండునవస్థ యసత్య మైనను గల్పితమయ్యెనని సారము. అని గూఢముగా స్వాభి ప్రాయమును దెలిపి మరలఁ బలుకుచున్నాఁడు. "నరేంద్రస్య పితుర్మాతుశ్చ నియోగాద్యంత్రితః, ధర్మార్థం ధర్మకాంక్షీచ వస్తుం వనమిహాగతః" తండ్రియొక్కయుఁ దల్లియొక్కయు నియోగమునఁ గట్టుపడినవాఁడనై ధర్మమునే కాంక్షించునేను

ధర్మసంస్థాపనముకొఱకు వనమున నివసింప నిచ్చటికి వచ్చితిని. అనఁగా ధర్మరక్షణమే నాకాకాంక్ష గాన దానికొఱకు వననివాసము చేయ నిచ్చటికే తెంచితినని భావము. ధర్మమనఁగా ధనుస్సు దానినిగోరి. అనఁగా నగస్త్యమునికడనుండ నాదగుచాపమును గైకొని దానిచే ధర్మము నిలుపఁగోరుచు ననఁగా దుష్టధ్వంసనము చేయుచు నిందు వసింపవచ్చితిననియే శ్రీరామాశయము. ఇంతసొగసుగా నుండునవయవములు కలదానవగుట రక్కసివని యూహింపను. ఎవ్వతెవు? ఎవ్వారు నీతల్లిదండ్రులు? ఎందుల కిచ్చటికి వచ్చితివి? సత్యము వచింపుము. అనఁగా నింతయందముగా నీశరీరము లేదనియు, దీనింబట్టి నీవు రక్కసిగా నాకుఁ దోఁపకయున్నదానవనఁగా నీయందము కేవల కల్పితమే యని రామునభిప్రాయము. తత్త్వము వచింపుము. నేను వచించినట్లే గూఢము పనికిరాదు. మఱుఁగుపఱచియు లాభము లేదు. దీనింబట్టి యాలోచింపఁగా రామసాన్నిధ్యమునఁ గామరూపిణి కావున హృద్యశరీరముగలదిగా నగపడెననియు నావిధ మెఱింగియు నెఱుంగనియట్లు శ్రీరాముఁడు ప్రశ్నించెననియు మన మూహింపవలయును.

"శ్రూయతాం రామ వక్ష్యామి తత్త్వార్థం వచనం మమ. ౨౧

రావణో నామ మే భ్రాతా బలీయాన్ రాక్షసేశ్వరః,

వీరో విశ్రవసః పుత్త్రో యది తే శ్రోత్రమాగతః. ౨౩

ప్రవృద్ధనిద్రశ్చ సదా కుంభకర్ణో మహాబలః,

విభీషణస్తు ధర్మాత్మా న తు రాక్షసచేష్టితః. ౨౪

ప్రఖ్యాతవీర్యౌ చ రణే భ్రాతరౌ ఖరదూషణౌ,

తానహం సమతిక్రాంతా రామ త్వా పూర్వదర్శనాత్. ౨౫

సముపేతాస్మి భావేన భర్తారం పురుషోత్తమం,"

అని మూలము. తత్త్వము పలుకుమా యని రాముఁ డాజ్ఞా పింపఁగాఁ దద్వాక్యములచేఁ గపటము నశింపఁగా నిట్లుపలికెను. రావణకుంభకర్ణులయు విభీషణునియు స్వభావములఁ దెలిపెను. ఖరదూషణులశక్తియుఁ దెలిపెను. వారియానతి మీఱుందు ననియుఁ దేటపఱచెను. దీనిభావమేమి? 'ధర్మార్థం ధర్మకాంక్షీ చ' అని రాముఁడు తెలిపియుండెను గదా. కాన రాక్షస చర్యలు లేనిధర్మాత్ముఁడు విభీషణుఁడని తెలుపుటం జేసి యాతఁడే మీకను గ్రాహ్యుఁడనియుఁ దక్కినవారు నిగ్రాహ్యులనియు వారియానతి మీఱి వర్తింతుననఁగా నాకు వారికినిగల యీశరీరసంబంధము తీఱునుగాన నిఁక ముందు నాయంతన వర్తింపఁగలదాన నగుదుననియు భావము. తొలుత నిన్ను దర్శింపఁగనే భావముచేతనే భగవంతుఁడ వగు నీవే నన్ను భరింపవలసినవాఁడవని యాశించితినసెను. అనఁగా నన్యచింతలు నాకుఁ గలుగవు. నీవే రక్షకుఁడవు. అను భావము నాకుఁ గలిగెననియే యామెభావము. భగవద్దర్శన మునఁ దెలియకయే యామె యీభావమును వెల్లడించెనని మన మూహింపవలయును.

> "చిరాయ భవ మే భర్తా సీతయా కిం కరిష్యసి.
> వికృతా చ విరూపా చ న చేయం సదృశీ తవ. ౨౭
> అహమేవానురూపా తే భార్యారూపేణ పశ్య మాం.
> ఇమాం విరూపామసతీం కరాళాం నిర్ణతోదరీం. ౨౮
> అనేన సహా తే భ్రాత్రా భక్షయిష్యామి మానుషీం."

అని మూలము. చిరకాలమునకు భర్తవు గమ్ము. అనఁగా శ్రీకృష్ణావతారమున నేను గుబ్జ నగుదును. అపుడు నావాంఛి తముఁ దీర్పుము. అపుడు సీతతోఁ బనియుండదు. ఈసీత

వికారరూపముగలది. మహాకాళి చండి లోనగు నవతారములనెత్తి లోకులకు భయముగల్గించును. నీకు సమానురాలు కాదాయేమి? అని కాకువు. నీకీమెయే సమానురాలనిసారము. 'భార్యారూపేణ పశ్య మాం' భార్యనుగా నన్నుఁ గనుము. నీవు తలంచినంతన నాకు రూపమనఁగా మూఁడువంకరలుగల నాశరీరము నశించును. అపుడు నీకు నేనే తగినదాన నగుదును. తక్కినభార్యల మించినయందము గలదాననగుదునని భావము. భావిజ్ఞానము గలదా యన్నఁ బరమేశ్వరుదర్శనమున నది కలుగు టాశ్చర్యము కాదనియే సమాధానము. 'మాం పశ్య' అన్నంతనే శ్రీరాముఁడు మరల మాయచే నాచ్ఛాదించెననియుఁ గనుకనే సీతాలక్ష్మణులను మ్రింగుదుననియె ననియు నెఱుంగవలయును. ఇట్లు ప్రతిక్షణవిలక్షణములగువాక్కుల నామె పలికెను. సీతయు వికారము లేక యాలకించుచుండెను. కర్మగతుల నెఱుంగుజాణగదా మహాప్రకృతి. ఆమెకేల భయము గలుగును? అధ్యాత్మరామాయణమున నీభాగమున నింతదనుకఁ గలకథాభాగమున విశేషములు లేవు.

## శూర్పణఖాగర్వభంగము.

*ఆమాట లాలకించి కామపాశనిబద్ధురాలగు శూర్పణఖం గని శ్రీరాముఁడు తేటగా నర్థముతోఁచునట్లు మధుర వాక్కులఁ జిఱునవ్వు మోమునఁ దోఁపఁగా నిట్లనియె. ఆర్యా! నేనొకతుకం బెండ్లియాడితిని. భార్యపై నాకత్యంత ప్రీతి గలదు. నీవంటి యుత్తమాంగనలకు సపత్ని యుండుట కష్టముకాదా. ఇతఁడు నాయనుజుఁడు. లక్ష్మణుఁడనువాఁడు.

---

* ఇది పదునెనిమిదవ సర్గమునఁ గలదు.

సదాచారవంతుఁడు, రూపవంతుఁడునగు. శ్రీమంతుఁ డగువీఁ డిపుడు భార్యాసుఖ మెఱుఁగనివాఁడు. పరాక్రమశాలి. ఇతనికి భార్య యిపుడు కావలసియున్నది. ప్రాయముగలవాఁడు. కనుక నీకనురూపుఁడగు భర్త కాఁగలఁడు. సుందరీ! మేరువు రవికాంతినొందునట్లు నాతమ్ముని బెనిమిటెనిగఁ బొందుము. నీకు సపత్నులు లేక సుఖముగ నుందువు. అనఁగానే యా శూర్పణఖ కామమోహితయగుట సతని వదలి సౌమిత్రికడ కరిగి యిట్లనియె. ఆర్యా! నీకుఁ దగినభార్య నగుదును. సుందరాకృతిగలదానను. నన్నుఁగూడి యీయడవులయందెల్ల విహరింపుము. అనఁగా నాలకించి మాటాడునేర్పుగలయాతఁ డిట్లు బదులు పలికెను. సుందరీ! నేను దాసుఁడను. నాకు భార్యవైన దాసివి కావలయును. అద్దాని గోరనేల? నేను శ్రీరాముని కు లోఁబడి యుండువాఁడను. విశాలాక్షివగునీవు సంసిద్ధ సర్వార్థుఁడగు నాయార్యునే చేపట్టి వాంఛలు ఫలింప రెండవ భార్యవై యుండుము. విరూపయు నసతియుఁ గరాళియు నిర్ణతోదరియు వృద్ధయునగు నాభార్యను వదలి నిన్నే యా ర్యుఁడు సమ్మతించును. నీవుత్తమాంగనవు నీరూపాతిశయము నెఱింగినవాఁ డెవ్వఁడు మానవకాంతను గోరును? అని సౌమిత్రి పలుక భీకరాకారయగు నారక్కసి విని పరిహాస మనఁగా నెట్టిదో తెలియనియజ్ఞురాలుగాన నాపలుకులన్నియు యథార్థములనియే తలంచి వాంఛలు పయింబయిం బొలయఁ గాఁ బర్ణశాలయందు సీతాయుక్తుఁడై నిర్భరప్రతాపశాలియుఁ బరంతపుఁడు నయియున్నరామునిం గాంచి శ్రీరామా! ఏవిష యమునను గొఱగాని యీముదుసలిభార్య యుండుటవలన నన్ను మన్నింపకయున్నాఁడవు. నీవు చూచుచుండ నీమానవ

స్త్రీని బట్టుకొని భక్షించెదను. అంత సపత్నీసహాయము లేక నిన్నుంగూడి నేను హాయిగా విహరించెదను. అని కన్ను లెఱ్ఱగాఁజేసి ప్రళయకాలోల్కారోహిణి పైఁబడునట్టులు హారి ణాక్షియగు సీతాదేవిపైఁ బడవచ్చెను. మృత్యుపాశమువలె భీతికరముగవచ్చుచున్న యాక్రూరరాక్షసిం గాంచి కుపితుఁడై యడ్డముగ నిల్చి యామె వేగమును నిలిపి సౌమిత్రిని గాంచి సౌమ్యా! క్రూరదుష్టస్వభావముగలవారలతోఁ బరిహాసము పనికిరాదు. సీత యీరక్కసి దౌష్ట్యమును గాంచియు నెట్లో మనసును నిలువఁబెట్టుకొని యున్నది. నీవును జూడుము. మొదలే వికృతస్వరూపురాలగు దీనిని మఱింత విరూప యగునట్టు లొనర్పుము.

అను శ్రీరామునిమాట లాలకించి క్రుద్ధుఁడై తత్పార్శ్వ మునున్న కృపాణమును గైకొని శూర్పణఖ ముక్కును జెవులను గోసివైచెను. ఆకార్యము ముగియఁగనే యారక్కసి వికారస్వరూపముతోఁ గూయుచు వచ్చినచొప్పుపట్టుకొని పాఱిపోయెను. ఇట్లు వికృతతరాకారముగలదిగాఁజేయంబడి రక్తసిక్తాంగియై వానకాలమున మబ్బువలె నెన్నియోవిధ ముల నాక్రోశించెను. రక్తము ప్రవహించుచుండఁ జేతులు పైకెత్తుకొని యార్చుచు మహారణ్యముం జొచ్చెను. అట్లు పోయి జనస్థానమున ననేకరాక్షసులు తన్నుంగొలువ భయం కరుఁడుగఁ గన్పట్టు సోదరుని ఖరుని గాంచెను. పిడుగుపడి నట్లు తటాలున వానిముందు వ్రాలెను. రక్తధారలొలుకు చుండఁగా నాక్రూరచిత్త సోదరునితో రాముఁడు సీతతో నడ వులకువచ్చుటయుఁ దనను వికృతాకారముగలదానినిగా నొన రించుట లోనగువార్తలం దేటపడ నెఱిఁగించెను.

మహాత్ములారా! ఈభాగమునఁ గలవిశేషముల నెఱుంగఁ గమకింతమని చెప్పనక్కఱయే లేదుకదా. అవతారఫలమును లోకులకుం గల్గింప నదనొదవెను. కర్మసిద్ధాంతము ననుసరించి ఖరాదుల కాయువు ముగియుకాలము సమీపించెను. వారి కర్మము ఘోరఫలము నీయఁబూనియున్నది. దానికై వేచి యున్న పరమేశ్వరుఁడు సమయానుకూలముగాఁ గార్యము నిర్వహించి శేషించినభాగమును బూర్తిచేయఁబూనెను. ఈ భాగమును విమర్శించునపుడు ముందుగా నొక్కవిషయమును దలపోయుదము. పంచవటికి జనస్థానమునకు నెన్నియో యోజనములదూర మున్నయట్లు కథాధోరణింబట్టి కాన రాదు. మునుల బాధింపఁ గడుంగడుం బూనియున్నఖరా దులు పంచవటియం దించుమించుగా మూఁడుసంవత్సరములు కాఁపురమున్న శ్రీరామాదులం గనఁజాలక పోయిరి శ్రీరాముఁ డెందో యొకగుహాలో డాఁగియుండ లేదు కదా. ఆశ్రమము నిర్మించుకొని సరస్సులయందు గోదావరియందు విహారములు సలుపుచున్న వాఁడు. లక్ష్మణుఁ డాయడవిం దిరిగి కందమూల ములం దెచ్చుచున్న వాఁడు.

"ఉవాస సుఖతస్తత్ర పూజ్యమానో మహర్షిభిః."

అనుపదునేడవసర్గమునఁగల వాక్యముంబట్టి యాయాశ్రమ మునకు మునులు వచ్చుచుం బోవుచున్నట్టు తేలుచున్నదికదా. శూర్పణఖ మహారణ్యమును జొచ్చెనని యున్నది. అందే ఖరా సురుని వాసస్థానమగుజనస్థానము గలదు. ఇట్లుండఁగా మూఁడు సంవత్సరము లందుండు శ్రీరామాదులను ఖరాదులు కనుఁ గొనఁజాలరనుట వింతగాఁ దోఁపకపోదు. రాక్షసుల కంద గమ్యస్థలములుండుటయు విచిత్రమే యనవలయును. ఈప్రశ్న

ములకు సమాధాన మొకకర్మసిద్ధాంతమే కాని వేఱుగాన రాదు. ఎవరిమూలమున నెవ రెవరికి మేలుగాని కీడుగాని కలుగవలయునో యాసమయము వచ్చినంతదనుక నెంత చెంత నున్నను గనుఁగొనఁజాలరు. "గహనాకర్మణోగతిః" అన్న శ్రీ కృష్ణవాక్యమే యిందులకుఁ బ్రమాణము. ఇఁకఁ బరిశీలింతము.

"తతశ్శూర్పణఖాం రామః కామపాశావపాశితాం,
స్వచ్ఛయా శ్లక్ష్ణయా వాచా స్మితపూర్వ మథాబ్రవీత్." ౧

అని మూలము. సీత విరూప యని వృద్ధురాలని తాను సురూప యని తరుణి నని పలికిన శూర్పణఖమాటలకు శ్రీరాముఁడు నవ్వవలసినవాఁడయ్యెను. కామిలారోగికిఁ దెల్లనివస్తువులు పచ్చగాఁ గనంబడినట్లు సీతాదేవి యసదృశలావణ్య మారక్క సికి వేఱుగాఁ గనంబడియెను. దుష్కర్మఫలానుభవము కానున్నను దానిం దెలియఁజాలకపోయినందులకే రామునకు నవ్వువచ్చెను. కర్మ మెంతబలవత్తరమని యచ్చెరువంది శ్రీ రాముఁడు తేటతెల్లముగా నిట్లు పలికెను. పదుమూఁడుసంవత్స రములు దాఁటగనే తనయవతారఫలమును లోకములకుఁ గల్గింపవచ్చినశూర్పణఖం గాంచినంతనే సంతోష ముదికెను. గూఢార్థము లేకయుండునట్లే మాటలాడెను. శూర్పణఖ మాటలాడుభాషయు శ్రీరామునిభాషయు నొకటియే కావ లయుఁగదా. ప్రాకృతాదులలో నేదో యొకటిగ నది యుండ వచ్చును. సాధారణముగా నెల్లచోటులఁ దెలియఁదగినభాష యొకటి యుండె ననవలయును. అది యిదియే యని నిర్ణ యింప వలనుపడదనుటయు సిద్ధాంతమే కదా.

"కృతదారోఽస్మి భవతి భార్యేయం దయితా మమ,
త్వద్విధానాం తు నారీణాం సుదుఃఖా ససపత్నతా." ౨

అని మూలము. భవతి యనుసంబుద్ధి మర్యాదను దెలుపును. అసత్కార్యము చేయఁబూనినను బరస్త్రీలయందు శ్రీరాముని నకుఁ గోపములేదని యిదియే తెలుపుచున్నది. ఆర్యా! యని దానియర్థము. ఇయం భార్యా మమదయితా=చెంతనే యున్న యీభార్య నాప్రీతికిఁ బాత్రము. సవతిపోరు నీవంటిస్త్రీలకుఁ దుఃఖము గల్గించునది కానఁ బనికిరాదు. అనఁగా నా యీ భార్యకు నీవంటివారు సపత్నులుగా నుండఁదగరని భావము. భవతి యనుసంబోధనముచేత నన్నుఁ గోరుట నీకుఁ దగదని తేలెడిని. లోకాచారము ననుసరించి పెండ్లిచేసికొంటిని. నేను భరించునదిగా నీప్రియురాలున్నది. ఈమెకంటెఁ బ్రియమైన వస్తువు నాకు లేదని తాత్పర్యము.

"అనుజస్త్వేష మే భ్రాతా శీలవాన్ ప్రియదర్శనః,
శ్రీమానకృతదారశ్చ లక్ష్మణో మమ వీర్యవాన్. 3
అపూర్వభార్యయా చార్థీ తరుణః ప్రియదర్శనః,
అనురూపశ్చ తేఽభర్తా రూపస్యాస్య భవిష్యతి." ४

అని మూలము. ప్రాతీతికార్థము స్పష్టము. భగవంతుఁ డబద్ధ మాడునా? వ్యర్థవాక్కు పలుకునా? కావున నామె పరిశీలించిన మంచియర్థము తేటపడునట్లుగను, బరిశీలింపకపోయిన దుష్కార్యానురూపమగునర్థము తోఁచునట్లు పలికెను శ్రీమాన్= బుద్ధిమంతుఁడు. శీలవాన్=సదాచారవంతుఁడు. ప్రియదర్శనః= మంచినే చూచువాఁడు. ఈపలుకులంబట్టియే యామె నిరాశురాలు కావచ్చును. అయినను మఱియుఁ బలుకుచున్నాఁడు. అకృతదారశ్చ = కృతదారుఁడుకానివాఁ డకృతదారుఁడు. అనఁగాఁ బరదారను గోరనివాఁడు. చెంత భార్యలేనివాఁ

డనియు నర్థమగును. 'అపూర్వభార్యయా చార్థీ' = అనియుఁ బాఠము కలదు. ప్రథమభార్యచేతనే చరితార్థుఁడైనవాఁడు. రెండవభార్యను గోరువాఁడు కాఁడని యర్థము. అల్పదృష్టికిఁ గ్రొత్తభార్యను గోరువాఁ డనునర్థ మగును. ఇట్టి యతఁడు తే భర్తా=నీకు భర్త. తే అభర్తా=నీకు భర్తకాఁడు. అనునర్థములుగలుగ మాటలాడెను. తొలుతనే యేల మమ్ముఁ గోరక పొమ్మనరాదు? అని ప్రశ్నింపరాదు. లక్ష్మణునిమూలమున వికృతరూపముగలదిగాఁ గావలయునని కర్మము నాశయము. కావున లక్ష్మణుఁడు నిరపరాధి కపకారముచేయరాదుకదా. కర్మానుభవకాలము దాఁపుననున్నందున నంతదనుకఁ గాలముఁ బుచ్చుటకై రాముఁడామెతో సంభాషించెననియు నారక్కసి క్రూరకార్యమునకుం బూనఁగా నద్దానికిఁ బాచితముగా నాజ్ఞాపించెననియు మన మెఱుంగవలయును.

"ఏనం భజ విశాలాక్షి భర్తారం భ్రాతరం మమ,
అసపత్నా వరారోహే మేరుమర్కప్రభా యథా." ౫

అని మూలము. 'విశాలాక్షి'=అనునది సాభిప్రాయవిశేషణము. పొడవులగుకన్నులుగలదని యర్థము నిటగాదు. వెడలుపుగా నున్నకన్నులుగలది. కుత్సితరూపవతిగదా యాదనుజాంగన. లక్షణచే నక్షిపదమునకు దృష్టియని యర్థము చెప్పవలయును. గొప్పచూపుగలదానా యనఁగా దూరదృష్టిగలదానవైన యెడల ననునర్థము గ్రాహ్యము. మమ భ్రాతరమేనం భజ=నా సోదరుఁడగు నీతని సేవింపుము. అనుగ్రహింపుమని ప్రార్థింపుమని భావము అసపత్నా=సవతిలేనిదానివై, అనఁగా నీతనిఁ బతిగా భజింతువేని సపత్ని కలదు కాన దానిమాని రక్షకునిగా నాశ్రయింపుమని తాత్పర్యము. సూర్యకాంతి మేరు

పర్వతమునొందినట్లు, అనఁగా స్థిరచిత్తుఁడగు నాసోదరునికడ కీయభిలాషమునఁ బోయి మరలుదువని హెచ్చరించెను. సూర్యకాంతి మేరువునొంది తనకుఁదానే నివర్తించునుగదా. అట్లే నీవుకూడ నని శ్రీరామునాశయము.

"కథం దాసస్య మే దాసీ భార్యా భవితుమిచ్ఛసి,
సోఽహమార్యేణ పరవాన్ భ్రాత్రా కమలవర్ణిని. ౯
సమృద్ధార్థస్య సిద్ధార్థా ముదితామలవర్ణినీ,
ఆర్యస్య త్వం విశాలాక్షి భార్యా భవ యవీయసీ. ౧౦
ఏనాం విరూపామసతీం కరాళాం నిర్ణతోదరీం,
భార్యాం వృద్ధాం పరిత్యజ్య త్వామేవైష భజిష్యతి. ౧౧
కో హి రూపమిదం శ్రేష్ఠం సంత్యజ్య వరవర్ణిని,
మానుషీషు వరారోహే కుర్యాద్భావం విచక్షణః." ౧౨

అని మూలము. లక్ష్మణుఁడు తొలుత స్పష్టార్థముగా మాటలాడి యవ్వల గంభీరార్థము గలపలుకులఁ దనభావమును దెలుపుచున్నాఁడు. కమలవర్ణిని కమలమనఁగా జలమనునర్థమిట గ్రహించుట సరసము. జలమునకు వర్ణములేనట్లు నీకును వర్ణము నిలుకడగాలేదని భావము. నీచవర్ణముకలదానా యని లక్ష్మణునిభావము. మహాత్ముఁడగు శ్రీరామమూర్తికి లోఁబడినవాఁడను. దాసుఁడను. నాకు భార్యవై దాసిగా నేల కాఁగోరుదువు ? నన్నుఁ గోరిననీకు లాభము లేదు. నీకుఁ గలుగఁగలలాభము శ్రీరామునివలనఁ గాఁదగినది. దాసుఁడ ననుటచే శ్రీరాము నానతింబూని పనిచేయువాఁడనని సారము. మరల నచటికింబోయినఁగాని తత్ఫలము సిద్ధింపదని లక్ష్మణుని యాశయము. పూజ్యుఁడగుమాయన్న సమృద్ధార్థుఁడు. సక

లార్థసమృద్ధిగలవాఁడని భావము. పరమేశ్వరుఁడని తాత్ప ర్యము. ఆర్యస్య=పూజ్యునకు సకలలోకగురువు సుమీ యని భావము. సిద్ధార్థా=నివృత్తి సిద్ధముగాఁగలదానవు. అనఁగా మరలించుకొనఁదగిన కోరికగలదానవని భావము. అముదితా= మలవర్ణినీ=సంతోషము లేనిదానవు. దుఃఖభాగినివని భావము. మంచివర్ణముకూడ లేనిదానవు యవీయసీ = అధమురాలవు. కనుకనే భార్యా భవ = తేజస్సుచేఁ బూజ్యురాలవు కమ్ము. తేజస్సు సత్కార్యానుష్ఠానముననే వెలయును. అట్టి కార్యము చేసి తేజస్సు నార్జించి పూజ్యురాలవు కమ్ము. అనఁగా నిట్టి దుర్వాంఛలు వదలిపెట్టుమని యిట సౌమిత్రియాశయము. సీతంగూర్చి యిట్లే పలుకుచున్నాఁడు. శూర్పణఖ కొకయర్థ మగును. బుద్ధిబలముగలవారికి వేఱొకయర్థమగును. రాము నకు భార్యగలదు కాన నన్నతఁడు గ్రహించునా యని సంది యము గల్గకుండఁ దనయాశయమును దెలుపుచున్నాఁడు. విరూపాం=ప్రతీతికార్థము స్పష్టమే. కాన దానిని వ్రాయను. విశేషార్థ మిట్లు గ్రహింపవలయును. విశేషరూపముకలది. అనఁగా ఇట్టిరూప మెవ్వారికి లేదని భావము. అసతీం=సాటిపతి వ్రతలేనిదనుట. శాశ్వతమగు పతిసంబంధముకలదని భావము. కరాళాం=విశాలమైనది. అనఁగా సర్వత్ర వ్యాపించునదని భావము. నిర్ణతోదరీమ్=అగాధమగునుదరముగలది. అనఁగా సకలలోకముల నుదరమున నుంచుకొనునదని భావము. వృద్ధామ్ జ్ఞానశీలప్రముఖగుణములచే నధికురాలనుట. అట్టి 'ఏనాం పరిత్యజ్య ఏషత్వాం భజిష్యతి' = అని కాకువు. అట్టి యీ ప్రకృతిని వదలి నిన్ను నంగీకరించునా యని భావము. అని మరల నామె రాముని చెంతకుఁ బంపందలంచి యిట్లు పలికెను.

ఇట్టి చక్కనిరూపమును వదలి మానవస్త్రీలయం దెవ్వఁ డభి
ప్రాయము నునుచును ? అని పరిహాసముగాఁ బలికెనని మన
మెఱుంగవలయును. ఇట్లు శ్రీరామలక్ష్మణు లసత్యములు పలు
కనివారలైనను వ్యర్థములగుమాటలాడనివారైనను దాని
మనస్సు నొవ్వకుండఁ బలికి చూతమని పలుకుటచేత వారి
యాశయములు తమ్ము దర్శించినవారలకుఁ బ్రాయికముగా
దుఃఖము గలుగరాదనుభావము గలవారలనియే మనము
నిర్ణయింపవలయును. అంతియకాని పరకాంతలతో వేడుకగా
మాటలాడువారని గ్రహింపరాదు.

"అద్యేమాం భక్షయిష్యామి పశ్యత స్తవ మానుషీం,
త్వయా సహ చరిష్యామి నిస్సపత్నా యథాసుఖం. ౧౬
ఇత్యుక్త్వా మృగశాబాక్షీమలాతసదృశేక్షణా.
అభ్యధావత్సుసంక్రుద్ధా మహోల్కా రోహిణీమివ." ౧౭

అని మూలము. సీతామూలముననే రామచంద్రునకుఁ దన
యందుఁ బ్రీతి కలుగ లేదని నమ్మి యాదుష్టరాక్షసి యీమానవ
కాంతను నీవు చూడఁగ భక్షింతును. సవతిపోరులేక నిన్నుఁ
గూడి విహరింతును. ఎట్లు ఎట్లు సుఖముగల్గునో యట్లు. భగవద్ద
ర్శన సంభాషణము లూరకపోవుగదా. పాపములకుఁ బ్రాయ
శ్చిత్తము. భావిభాగ్యోదయము గల్గఁజేయునవియే యగును.
క్రూరకర్మఫలము పక్వమైనది. కావున నది పురికొలుప నాదానవి
యాతురపడెను. భగవంతున కాగ్రహమునుగూడ దానికర్మమే
కల్పింపవలయును. "న మే ద్వేష్యోఽస్తి న ప్రియః" అను
భావముగలభగవంతునకుఁ గల్గుకోపము నటనరూపమనియే
గ్రహింపవలయును. అలాతసదృశేక్షణా = క్రూరదృష్టిగల

దయ్యెనని భావము. కోపావేశమున నయనము లగ్నిరూపము లయ్యెననికదా దీనిసారము. సుసంక్రుద్ధా=సువర్ణ మధికమే. ఐన నొడలెఱుఁగని దయ్యెనని యీయది తెలుపును. మహోల్కా రోహిణీమివ = చంద్రునకుఁ బ్రియపత్ని రోహిణి. దాని నలముకొనఁబోవు క్రూరగ్రహామువలె సీతచెంతకుం బరుగిడెను. అనఁగా శ్రీరామునకు సీత ప్రియపత్ని యని యెఱుంగక పోవునంతకోపము తన్నలముకొనఁగాఁ బరుగిడెనని తాత్పర్యము.

"అత్యుత్కటైః పుణ్యపాపైరిహైవ ఫలమశ్నుతే."

అన్నసూక్తి ననుసరించి శీఘ్రమే కర్మఫలము ననుభవింప నట్టి దుష్కార్య మొనరించెననియే యిటఁగలసారము.

"క్రూరైరనార్యైస్సౌమిత్రే పరిహాసః కథంచన,
న కార్యం పశ్య వైదేహీం కథంచిత్సౌమ్య జీవతీం. ౧౯
ఇమాం విరూపామసతీమతిమత్తాం మహోదరీం,
రాక్షసీం పురుషవ్యాఘ్ర విరూపయితుమర్హసి." ౨౦

అని మూలము. వచ్చినది శూర్పణఖ. అయినను శ్రీరాముఁడు లోకులకు హితము దెలుప మర్యాదలేక క్రూరులగుజనులతోఁ బరిహాసము పనికిరాదనెను. అనఁగా వేడుకమాటల కిది కాలముకాదు. త్వరపడవలయును. సమయము సమీపించెను. అని లక్ష్మణునకుఁ గోపము గల్గింపఁబూని జానకి యెట్లో జీవించియున్నదనియె. మనకన్నులయెదుట నిది యిట్టి దుర్వృత్తి నవలంబింపఁ జూచుచుండరాదని భావము. ఏమి చేయుదునని యతఁ డడుగునంత యవకాశము లేదు. కావునఁ బురుషవ్యాఘ్ర యని సంబోధించెను. వెనుక ముందు లాలో

చింపరా దనునర్థ మీసంబోధనమే తెలుపుచున్నది. తొలు తనే విరూపయగు దీనిని మఱింత విరూపగా నొనరింపుమని హెచ్చరించెను. ఎవ్వారిమూలమున నేకార్యము కావల యునో వారిమూలముననే యాపని సాగించుటయే కర్మసిద్ధాంతము. కావున లక్ష్మణునిమూలమున నామెకు ఫలము గల్గింప భగవంతుఁడు పూనెనని మన మెఱుంగందగు.

"తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధం,
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్."

అను భగవద్గీతావాక్యము మన కీసిద్ధాంతమును దేటపఱచు చున్నది. ఆమె దుష్కర్మ.

"ఇత్యుక్తో లక్ష్మణః స్తస్యాః క్రుద్ధో రామస్య పార్శ్వతః,
ఉద్ధృత్య ఖడ్గం చిచ్ఛేద కర్ణనాసం మహాబలః." ౨౧

అని మూలము. 'విరూపయితుమర్హసి' అని శ్రీరామునాజ్ఞ. సౌమిత్రి రామపార్శ్వమున నుండుఖడ్గము నెత్తి యామెచెవులను ముక్కును గోసివైచెను. విరూపకరణమనఁగా చెవులు ముక్కుకోయుటయే యని శ్రీరాము నాశయమని మన మూహింపవలయును. స్త్రీలకుఁ దాటంకములు ప్రధాన భూషణములని ప్రాచీనమగు నాచారము.

"సుధామప్యాస్వాద్య ప్రతిభయజరామృత్యుహారిణీం
విపద్యంతే విశ్వే విధిశతమఖాద్యా దివిషదః,
కరాళం యత్క్ష్వేళం కబళితవతః కాలకలనా
న శంభో స్తన్మూలం తవ జనని తాటంకమహిమా."

అని శ్రీశంకరాచార్యులవారు తేటపఱచిరి. శూర్పణఖ గత భర్తృకకాన సౌభాగ్య మామెకు లేదనవచ్చును. స్త్రీ సౌందర్య సౌభాగ్యములు తాటంకాధీనములని పూర్వులభావము. కనుకనే వాల్మీకిమహర్షి కర్ణపదము తొలుతనే తెలిపెను. కర్ణచ్ఛేదమున విరూపత్వము స్త్రీల కలవడునని మన మెఱుంగవలయు. సౌభాగ్యమనునది దీనికి లేకుండుఁగాక యనియే యతఁ డట్టు లొనరించెను సౌందర్యము నాసికామూలమునఁ దుడుచుకొనిపోవుననియు నతనిభావము ఇఁకమీఁద నిట్టి మాటలు వెలువడకుండవలయునని ముక్కును, సౌభాగ్యము లేకుండుఁగాక యని చెవులను ఛేదించెనని మన మెఱుంగందగు. ఎవరిని గామింపకయుండను, ఎవరుగాని దానిమోమైనఁ జూడకయుండను జేసెనని దీనిభావము

"ఉపేత్య తం భ్రాతరముగ్రదర్శనం
పపాత భూమౌ గగనాద్యథాశనిః." ౨౫

అని మూలము. "గగనాదశనిరివ భూమౌ పపాత" అని యన్వయము. ఆకసమునుండి పిడుగుపడఁగనే యపాయమును గల్గును. దాని ప్రకాశము క్షీణించును. ఖరునిముందు శూర్పణఖ వ్రాలుట స్వబాధాపూర్వకపరబాధాకల్పనార్థమని తేలెడిని. తనకు నాతనికిఁ దన్మూలమున దానవులకందఱకు హాని గల్గింపఁబడియెనని భావము. నామూలముననే మీరు నశింతురని తెలుపుటకే దానిపాటని మహర్షి మనకుం దెల్పెను.

"తతస్సభార్యం భయమోహమూర్ఛితా
సలక్ష్మణం రాఘవమాగతం వనం,
విరూపణం చాత్మని శోణితోక్షితా
శశంస సర్వం భగినీ ఖరస్య సా." ౨౬

అని మూలము. భార్యతోఁ గూడి తమ్ముని వెంటనిడుకొని రాముఁడు వచ్చెనని, తన్ను విరూపగా నొనరించెనని పొగడెను. శశంస=శంసు స్తుతౌ. అని ధాతువు. విశేషించి తెలిపెనని తాత్పర్యము. పొగడిచెప్పిన మఱింత రామునిపై ఖరుఁ డాగ్రహించునని యాపె భావము. భగవద్దర్శనరూపసత్కర్మ ఫలమే యది యని వాల్మీకిభావము. శ్రీకృష్ణావతారకాలమున నీమెయే కుబ్జగాఁ బుట్టి భగవంతునే వాంఛించి తత్కృపకుఁ బాత్రురాలగును గావుననే యిపుడు తెలియకపోయిన నామెనోటినుండి శ్రీరామస్తుతి వెలువడెనని మనము నిశ్చయింపవలయును. అన్నిసర్గములకు ఫలముల వ్రాయక యీసర్గమునకే మహేశ్వరతీర్థులు ఫలస్తుతి వ్రాసిరి.

> "కర్ణనాసాపహారం చ శృణ్వతాం పఠతామపి,
> న జాతు మానభంగస్స్యాద్రఘునాథప్రసాదతః." స్కాందము.

వైష్ణవులు మధ్వవైష్ణవులును దామసపురాణములని తూలనాడుచు వలసినపుడెల్ల నందుండి భాష్యములు లోనగువాని యందుఁ బ్రమాణము లుదాహరించుకొనుట యెంత మర్యాదయో వచింపవలయునా? ఏవిషయమునందు దానినే సర్వోత్కృష్టముగా వచించు టుత్తమముగాని పక్షపాతమూని విషయాంతరముల నిందించుచు నొకవిషయమును భూషించుచుండుట పురాణములలక్షణమే కాదు. స్కాందమహాపురాణము ప్రధానస్థానము నాక్రమించునని వేఱుగాఁ జెప్పవలయునా? ఈసర్గమునకే యేల ఫలస్తుతి తెలుపఁబడినదని యించుక విచారింతము. దుష్టనాశనకర్మముమూలమున ధర్మసంస్థాపనమునకు భగవంతుఁడు పూనెను. కాన దీనిని బఠించి

నను వినినను శ్రీరాముఁ డనుగ్రహించి యట్టిమానభంగము వారికిఁ గలుగకుండఁజేయు ననఁగా భావమేమి? 'రఘునాథ ప్రసాదతః' అనఁగా శ్రీరామానుగ్రహమునకుఁ బాత్రుఁడైన వార లట్టిదుష్టఫలముల నొందరు. ఎవ్వా రామహాత్ము ననుగ్రహమునకుఁ బాత్రులగుదురు? నిష్కామకర్మాచరణపరాయణులు. శూర్పణఖ కాముకురాలు. అట్టివారు కారాదు. అనఁగా నేకోరికలు లేక సాధుకర్మముల నాచరించువారలు శ్రీరామచంద్రానుగ్రహమునకుఁ బాత్రులగుదురు. వారికేల మానభంగముకలుగును? ఎందును గలుగదని భావము. మధ్యవైష్ణవులీయర్థము స్కాందోక్తముగాన నంగీకరింపరు కాఁబోలు. సకలపురాణములు ప్రమాణములే యని సకలదేవతలు భగవదంశములే యని సకలరూపములు తద్రూపములే యని సకలనామములు లాపరాత్పరునివే యని భావించువారలే భగవద్భక్తులు.

"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. ౨౯
యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి. ౩౦
సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే. ౩౧

గీత. ౬ అధ్యా.

మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః,
నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాండవ." ౫౫

అధ్యా. ౧౧

అను నీగీతావాక్యములే పైనవ్రాసినభావమును విశదీకరించు చున్నవి. 'నిర్వైరః' అనునది చక్కఁగాఁ దలంపవలసినవిష యము. ఇట్లు పురాణములన్నియు రీతిభేదములచేత నొక్క తత్త్వమునే బోధించునని మనము నమ్ముటయే తరణోపాయము నెమకుట యని నిశ్చయింపవలయును. ఇట్టు లందందు శ్రీరామాయణమున విశేషముల గ్రహించిననే తత్పారత ఫలము. లేకున్నఁ గాలక్షేపమే ఫలమగును. అధ్యాత్మరామా యణమున నీవిషయమున విశేషములు గానరావు. ఇఁకఁ దరు వాతిభగవచ్చరిత్రమును బఠింతము.

## ఖరుఁడు రామునిపైకి రక్కసులం బంపుట.

* అంతట ఖరుండు విరూపయై రక్తమునఁ దడిసియుండు సోదరిం గాంచి క్రోధావేశమున వగచుచు సోదరీ! లెమ్ము లెమ్ము. తొలుత నీవార్త నెఱిఁగింపుము. మూర్ఛ మునుంగకుము. తత్తఱపాటు వదలుము. ఈరీతిగా నిన్ను విరూపగా నొన రించినవాఁ డెవ్వఁడు? దంష్ట్రలయందు విష ముప్పొంగుకృష్ణ సర్పము తన్నించుకంతయుఁ గారింపక యెదురుగా నుండఁగా విలాసముగా దానిఁ గొనవ్రేలితో నెవ్వఁడు కొరించు చున్నాఁడు? తెలియక కంఠభాగమున మృత్యుపాశముం దగి లించుకొని యెవఁడూరకయున్నాఁడు? నీకిట్లపకార మొనరించి భీకరవిషము నెవ్వాఁడు త్రావినాఁడు? బలపరాక్రమములు గలదానవుకదా నీవు. కామగతిగలదానవు. కామరూపమున నలరుదానవు. మృత్యువుతో నీడు చేయందగినదానవు. ఇట్టి నిన్నెవ్వఁ డీదురవస్థలపాలుగా నొనరించెను? దేవగంధర్వ

* ఇది పందొమ్మిదవ సర్గమునఁ గలదు.

భూతములలోను, మహర్షులలోను మిగులఁ బరాక్రమము గలవాఁ డెవఁడు నిన్నిట్లవమానించినాఁడు? లోకములయందుఁ బాకవైరియగు సహస్రాక్షుఁడు తప్ప నాకు నపకారము చేయువాఁ డెవఁడును లేఁడు. సారసమనుపక్షి నీటితోఁగూడిన పాలు త్రాగురీతిఁ బ్రాణములఁ దీయు నాబాణములచే వాని ప్రాణములఁ దీయుదును. నాబాణఘాతముల మర్మములు భేదిల్లగాఁ బడిపోవఁగా స్రవించురక్తమును నురుఁగులతోడ భూమి త్వరలోఁ బానము చేయఁగలదు. రణమున నాచే హతుఁడై కూలఁగాఁ బక్షులు సంఘముగఁ జేరి వానిశరీరము నుండి మాంసమును లాగుకొని వేగమ భక్షింపఁగలవు ఇపుడే నేను వానిని రణమునకుఁబిలువఁగా దేవగంధర్వాదులు గాపాడఁజాలరని నమ్ముము. పరాక్రమమున నెవ్వఁ డడవుల నిన్నిట్లు చేసినాఁడో తెలివిం దెచ్చుకొని వాని నాకుం దెల్పుము.

అని యిట్లు నిర్భరాగ్రహమున సోదరుఁడు పలుకఁగా నాలకించి యాక్రూరరాక్షసి నేత్రములనుండి యుదకధారలు నిరంతరము స్రవింపఁగా నిట్లనియె. దాశరథులు రామలక్ష్మణులను నిరువురు గలరు సోదరులు. యుక్తవయస్కులు. సుందరాకారులు. సుకుమారగాత్రులు. మహాబలసంపన్నులు. పుండరీకనయనులు. వారిరువురు వల్కలాంబరముల ధరించి కృష్ణాజినములను దాల్చి ఫలమూలాశనులై జితేంద్రియులై మునివృత్తిం గైకొని ధర్మాచరణమున నాసక్తులై యున్నవారు. గంధర్వరాజునకు సాటి చేయందగి రాజలక్షణలక్షితులై వారున్నవారు. వారు దేవతలో మానవులో తలపోసి నిశ్చయింపఁజాలను. నిండుజవ్వనము కనంబడఁగా సౌందర్యరాశియై సకలభూషణభూషితాంగియై యొకనారీమణి వారిరువు

రనడుమ నుండఁగాఁ గనుఁగొనినదాన. ఆమెకోఱకు వారిరువు రొక్కమాటగా నన్నునాథరీతిని గులటవలె నిట్టి దురవస్థపాలు గావించిరి. ఆదుర్వృత్తరక్తమును రణనిహతులగు వారిరక్తమును వేఁడి నురుఁగులతోఁ ద్రావ నాశించెద. ప్రియసోదరా! నేను యుద్ధమునందు వారియందఱ రక్తమును బానముచేయ వలయు ననునిదియే నాప్రథమవాంఛ. దీని నీవు సఫలము చేయవలయును. అని యాపె తెలిపినంతనే ఖరాసురుఁ డాగ్ర హించి బలవంతులు యమతుల్యులు నగుపదునల్వురు రాక్షసులం జూచి యిరువురుమానవు లాయుధములఁ దాల్చి వల్కలాజిన ములనుధరించి యొకస్త్రీని వెంటనిడుకొని యీదండకారణ్య మును జొచ్చిరి. వారినెల్లరఁ బొలియించి తేవలయును. నాతోఁబుట్టువు వారిరక్తమును బానముచేయును. ఈమెకోర్కి నాకుసమ్మతమే. మీరిపుడే పరాక్రమము నెఱపి వారిఁ జంపి యీమెవాంఛను ఫలవంతముగాఁ జేయవలయును. అని యిట్లు తీవ్రకోపమున మండిపడుచు నాజ్ఞాపింపఁగా వా రాతని యానతిం గొని శూర్పణఖ త్రోవ చూపఁగా వాయుప్రేరిత మేఘములరీతి నతిజవమున రాముఁడున్నతావున కరిగిరి. నిశితాశుగములు గలవారలయ్యును దమ్ముం గాంచినంతనే మహాతేజమున నెదుర్కొనుశ్రీరామునిం గని వనగజములు దవదహనుం గని భయంపడునట్లు భీతిల్లి త్వరగ నతని నొప్పిం పఁజాలక యూరకుండిరి.

మహామహులారా! ఈభాగమున విశేషములుండునా యని సంశయింపనక్కఱ లేదు. పరిశీలించి గ్రహింతము.

"న హి పశ్యామ్యహం లోకే యః కుర్యాన్మమ విప్రియం,
అంతరేణ సహస్రాక్షం మహేంద్రం పాకశాసనమ్." 2

అని మూలము. ఖరాసురునివాక్య మిది. ఇంద్రుఁడుతప్ప నాకప కారముచేయువానినిగానను, అనఁగా ఖరునిదృష్టి కింద్రుఁడే యధికుఁడని తోఁచినది. గర్వమున నొకప్పు డింద్రుఁ డపకారము చేసినఁ జేయుఁగాక. ఇతరుఁ డెవఁ డట్టివాఁడున్న వాఁడు? అని యతఁడు ప్రశ్నించెను. ఎవనినో యొకదానవుని వధించితినని పరమైశ్వర్యము కలవాఁడనని, వేయికన్నులు గలవాఁడనని గర్వించి యొకప్పు డతఁడు చేసినఁజేయుఁగాక యని యాతని యాశయము. అజ్ఞానమున నంతకంటె నధికులున్నట్లుకూడ నతఁ డెన్నినవాఁడు కాఁడు. ఇంద్రునిమించినవాఁడైనచో జయింపఁ గలనను ధైర్యముకూడ వానికి లేదు. కనుకనే వాఁడు నోటికి వచ్చినట్లు ప్రేలెను.

"తరుణౌ రూపసంపన్నౌ సుకుమారౌ మహాబలౌ,
పుండరీకవిశాలాక్షౌ చీరకృష్ణాజినాంబరౌ. ౧౪
ఫలమూలాశనౌ దాంతౌ తాపసౌ ధర్మచారిణౌ,
పుత్రౌ దశరథస్యాస్తాం భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౧౫
గంధర్వరాజప్రతిమౌ పార్థివవ్యంజనాన్వితౌ,
దేవౌ వా మానుషౌ వా తౌ న తర్కయితుముత్సహే. ౧౬
తరుణీ రూపసంపన్నా సర్వాభరణభూషితా,
దృష్టా తత్ర మయా నారీ తయోర్మధ్యే సుమధ్యమా. ౧౭
తాభ్యాముభాభ్యాం సంభూయ ప్రమదామధికృత్యతాం,
ఇమామవస్థాం నీతాహం యథానాథాఽసతీ తథా." ౧౮

అని మూలము. ప్రత్యక్షరమున నొక్కయర్థముగల్గునట్లు నుడి విన యర్థముల మాని యిందలిసార మేమని పరికింతము. శూర్పణఖ సీతారాముల దర్శించెను. సంభాషించెను. ఆసంభా షణమున శ్రీరామునిసౌహార్ద మెఱింగెను. కర్ణానురూపమగు

ఫలమును గాంచెను. కావున భగవద్దర్శనము వృథ కాదు. కర్మ ఫలానుభవమునఁ గేవలపరిశుద్ధాంతఃకరణముకలదికాలేదు. జన్మాంతరమునసుగూడ నించుక యనుభవింపవలసియున్నకర్మ శేషమున వారల హింసింపఁ బ్రయత్నించెను. కాని పరమేశ్వరదర్శనభాగ్యమున నాడలు తెలియక వర్ణించెను. ఈ వర్ణనము ఖరున కాగ్రహము గలిగింపఁబూని చేసినదిగ నుండ వచ్చును. లేక తద్దర్శనభాగ్యమునఁ బరవశయై చేసినదిగ నుండవచ్చును. సర్వకార్యములకు మూల భూతయగుట యామె వారి వధింప నతనిఁ బురికొలిపెననియు, నదియు భగవదుద్దేశమనియు మన మెంచవచ్చును. సీతనుగూడ నట్లే వర్ణించెను.

"ప్రమదాం తా మధికృత్య తాభ్యామిమామవస్థాం నీతాహం అనాథా అసతీ యథా"

అని తుదను వచించెను. కోపావేశమునఁ దన్నుఁ గానని యామెనోట సత్యమే వెలువడినది. ఆసీతకొఱకేకదా శూర్ప ణఖ నిట్టులు విరూపగా నొనరించిరి. ఆమెయే యిందులకు నిమిత్తము. సర్వకారణభూతకదా ప్రకృతి. ఆమెకొఱకేకదా రాముఁ డవతరించినది. దుష్టదానవసంహారమంతయు నామె మూలముననే సాగును. కావున శూర్పణఖ తెలిసియో తెలి యకయో యెట్లు చెప్పినను యథార్థమే యామెమాటలనుండి వెలువడెనని మన మూహింపవలయును. 'అనాథా అసతీ యథా' దిక్కుమాలినదానికి దుర్వృత్తిగలదానికి జరగవలసిన మర్యాద నాకు జరగెననియె.

రామాజ్ఞాప్రకారము సౌమిత్రి చేసిన యీ దండనము న్యాయ్యమా కాదా యని తర్కింతము. సామాన్యముగా

స్త్రీని దండింపరా దనునియమము కలదు. అది స్మృతిసిద్ధమే యనవలయు. కాని విశేషవిధులం బరిశీలింపక వదలరాదు కదా.

"పితాచార్యస్సుహృన్మాతా భార్యా పుత్రః పురోహితః,
నాదండ్యో నామ రాజ్ఞోఽస్తి యస్స్వధర్మే న తిష్ఠతి." 33శ్లో
మను. ౮ అధ్యా.

"ఏతైస్సమాపరాధానాం తత్రాప్యేవం ప్రకల్పయేత్,
బాలవృద్ధాతురస్త్రీణాం న దండస్తాడనం దమః.
స్త్రీబాలోన్మత్తవృద్ధానాం దరిద్రాణాం చ రోగిణాం,
శిఫావిదళరజ్వాద్యైర్విదధ్యా న్నృపతిర్దమః."
"దరిద్రోత్ర కర్మణ్యశక్తో నిర్ధనః." అని వివాదరత్నాకరము.
"స్త్రీధనం దాపయేద్దండం ధార్మికః పృథివీపతిః,
నిర్ధనా ప్రాప్తదోషా స్త్రీ తాడనం దండమర్హతి."
"యది ధనవతీ స్త్రీ. తదా దోషే ధనం దండః. అధనాయాస్తు తాడనమేవేత్యర్థః." వివాదరత్నాకరము, కాత్యాయనస్మృతి.

ఇవి విశేషవిధులు. సామాన్యవిధు లెవ్వియనఁగా.

"అదండ్యౌ మాతాపితరౌ స్నాతకపురోహితౌ పరివ్రాజకవానప్రస్థౌ జన్మకర్మ శ్రుతశీల శౌచాచారవంతశ్చ ఏతేహి ధర్మప్రతికరారాజ్ఞః స్త్రీబాలవృద్ధాస్తపస్వినస్తేభ్యః క్రోధం నియచ్ఛేత్." శంఖలిఖితస్మృతి.
వీనిని బరికించినయెడల సామాన్యశాస్త్రము ననుసరించి స్త్రీలు దండింపఁదగరనియు విశేషశాస్త్రము ననుసరించి పరిశీలించిన దండింపఁదగినవారనియు స్పష్టమగును. ధనహీనురాలగుస్త్రీ యపరాధ మొనరించినచోఁ గశాదులచేఁ గొట్టవలయునని తేలెడిని. స్వధర్మమున నిలువనియెడల స్త్రీలు రాజుచే దం

డింపఁ దగుదురు. అంతియకాని వదలరాదని మనుస్మృతి శాసించుచున్నది యాజ్ఞవల్క్యస్మృతియు నీయర్థమునే యనుసరించుచున్నది. లక్ష్మణుఁడు రామాజ్ఞచే దండించెననఁగా నాలుగుదెబ్బలతో సాగనంపక ముక్కుచెవులుకోయుట యేటిశాస్త్ర మనవచ్చును?

"ఆత్మానం హంతుమారబ్ధం బ్రాహ్మణం క్షత్రియంవిశం,
గాం వా తురంగమన్యం వా హత్వా దోషైర్న లిప్యతే."

అను ప్రమాణము ననుసరించి శూర్పణఖ యొనరింపఁబూనిన యపరాధము తాడనములకుఁ దగినది కాదనియే తేలెడిని. వధింపవలసినదేకదా. ఐనను భగవంతుఁడు శ్రీరాముఁడు తన్నది యాశ్రయించినది కామపరతంత్రయగుటను, ఈయవతారమున నది శోనసాగఁజేయ ననువుపడమిని, భావిజన్మమున దాని ననుగ్రహింప నవకాశము కలుగుటంబట్టియు "విరూపయితుమర్హతి" అని యాజ్ఞాపించెను. శ్రీరామానుజ్ఞయే లక్ష్మణునిం బురికొలిపి యారీతిగాఁ జేయించెను. కావుననే భవిష్యజ్జన్మమున నది త్రివక్రగా జన్మించును. కుబ్జయనునది యదియే. కర్మగతుల ననుసరించియేకదా భగవంతుఁడాజ్ఞాపించుచుండును. కనుక నీవిషయమును దలంచినయెడల నీదండనము న్యాయ్యమే యని స్పష్టమగును.

"ఇతి తస్యాం బ్రువాణాయాం చతుర్దశ మహాబలాన్,
వ్యాదిదేశ ఖరః క్రుద్ధో రాక్షసానంతకోపమాన్. ౨౧

అని మూలము.

"ఇతి తస్యాం బ్రువాణాయాం రామవృత్తాంత మితి శేషః. ఖరః.

'తస్మాద్యూః క్రూరరూపేణ దేహేన హరతామృతం,
విష్ణుర్దాశరథిర్భూత్వా మోక్షయిష్యతి సువ్రత.'

ఇతి శివశాపాద్రాక్షసత్వం ప్రాప్తయాజ్ఞవల్క్యసుతశ్చంద్రకాంత ఇత్యర్థః. అత ఏవ శూర్పణఖాముఖా ద్రామవృత్తాంతశ్రవణానంతరం విష్ణుత్వేన జ్ఞాత్వా సపరివారస్య స్వస్య రామహస్తా ద్వధేచ్ఛు స్సన్ భగినీ ప్రియ ఇవ రామేణ సహ యుద్ధార్థం రాక్షసాన్ వ్యాదిదేశేత్యర్థః. అస్మిన్నర్థే శేషధర్మే భీష్మయుధిష్ఠిరకథానుసంధేయా. భీష్మః.—యాజ్ఞవల్క్యసుతా రాజన్ త్రయోవై లోకవిశ్రుతాః, చంద్రకాంత మహామేధ విజయా బ్రాహ్మణోత్తమాః. ఖరశ్చ దూషణశ్చేతి త్రిశిరా బ్రహ్మవిత్తమాః, ఆసన్ తేషాం చ శిష్యాశ్చ చతుర్దశ సహస్రధేతి. అత ఏవ బాహ్యదృష్ట్యా పరుషోక్తివత్ప్రతీయమానాని తస్య వాక్యాని సౌమ్యరూపాణ్యేవ తథా వ్యాఖ్యాస్యామః."

అని మహేశ్వరతీర్థులు. ఈఘట్టమున నీశ్వరప్రస్తావము కలదు కనుక గోవిందరాజులు శివద్వేషి కాన నూరక వదలెను.

యాజ్ఞవల్క్యని పుత్రులు మువ్వురు. చంద్రకాంతుఁడు, మహామేధుఁడు, విజయుఁడు అని వారిపేరులు. వారలు శివశాపమువలన ఖరదూషణత్రిశిరసు లైరి. వారి శిష్యులు పదునాలుగువేవురును రాక్షసులైరి. మొదటివాఁడు చంద్రకాంతుఁడే ఖరుఁడు. ఆతనికి శివుఁడు దశరథకుమారుఁడుగ విష్ణుమూర్తి యవతరించినపుడు శాపమోక్షమును బ్రసాదించెను. కనుకనే యతఁడు శూర్పణఖ రామవృత్తాంతము నెఱిఁగింపఁగనే శాపవిముక్తి కాలముగాన నంతరంగమున నాగ్రహము లేకున్నను జెల్లెలికిఁ దృప్తిగలిగించుపొంటె నట్లు పలికెను. తదనుసారముగా నర్థము కనఁబడుచున్నదని మహేశ్వరతీర్థులు వ్రాసి శేషధర్మములను బ్రమాణములుగాఁ జూపిరి.

ప్రాయికముగా భగవదవతారము కారణోపాత్త రాక్షసశరీరు లగువారిం బోలియించుటకే కలుగును. వారికిఁ దోడ్పడ దేవతలు స్వాంశముల నాకార్యమున కనుకూలించు నట్లు ప్రాణికోటులఁ బుట్టఁజేయుదురు. రాక్షసులుకూడ భగవత్కార్యమునకు సాయముచేయువారే యనవలయును. వారు లేకున్న నీమహాకార్యములమూలమున లోకులకు నీతిగఱపుటకవకాశమే కలుగదు. ఇరుదెగలవారును భగవదనుగ్రహపాత్రులే. కానిఫలానుభవమునఁ బద్ధతులు వేఱుగా నుండును. ఖరాదిదానవేంద్రులు మూవురు యాజ్ఞవల్క్యునికొడుకులు. శివునిశాపమున రాక్షసత్వ మొందిరి. తచ్ఛిష్యులు రాక్షసులైరి. పదునాలుగువేలసంఖ్యచే వారుండిరి. ఖరాదులు వారల కధినాథులు. శాపవిముక్తియు శ్రీరామావతారకాలమున నని శంకరుఁ డనుగ్రహించియే యుండెను. ఆకాలము సమీపించెను. వారిసత్కర్మము శూర్పణఖను బురికొలిపెను. ఆమె దుష్కర్మముకూడ దానికిఁ దోడ్పడియెను. ఆమె విరూపగాఁ జేయఁబడి ఖరునికడ కరిగెను. శ్రీరామాదులు జనస్థానమునకుఁ జెంతనే మూఁడుసంవత్సరము లుండినను బరస్పర సంఘర్షణము కలుగలేదు. కారణమేమి? ఖరాదిదానవుల కాయురంతము దాపునకు రాలేదు. అది సమీపింపఁగనే శూర్పణఖవచ్చుటయు నామె శ్రీరాముని గామించుటయు వారు దానికిఁ బ్రాయశ్చిత్తముగాఁ గర్ణనాసికలఁ దెగఁగోయుటయు ననుకార్యములు సాగెను.

"సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేః జ్ఞానవానపి,
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి."

అనుగీతావాక్యము సార్థకము కాకపోవునా. మనము ఖరాదుల నూరక దూఱక వారును భూభారహరణమహాకార్యమునకు సహాయభూతులనియే భావించి వారిచరిత్రములఁ బరికింతము.

"మానుషౌ శస్త్రసంపన్నౌ చీరకృష్ణాజినాంబరౌ,
ప్రవిష్టౌ దండకారణ్యం ఘోరం ప్రమదయా సహ. ౨౨
తౌ హత్వా తాం చ దుర్వృత్తామపావర్తితుమర్హథ,
ఇయం చ రుధిరం తేషాం భగినీ మమ పాస్యతి. ౨౩
మనోరథోఽయమిష్టోఽస్యా భగిన్యా మమ రాక్షసాః,
శీఘ్రం సంపాద్యతాం తౌ చ ప్రమథ్య స్వేన తేజసా." ౨౪

అని మూలము. మానవశరీరముల ధరించి యాయుధములఁ దాల్చి నారచీరలు జింకచర్మములు వస్త్రములుగాఁ గలిగి యొకప్రమదతో ఘోరారణ్యమును దీనిఁ బ్రవేశించిరి ఈవర్ణన మేల? శాపవిముక్తికాల మాసన్నమయ్యెను. భగవద్దర్శనము కానున్నది.

"సతాం హి సందేహపదేషు వస్తుషు ప్రమాణమంతఃకరణప్రవృత్తయః."
అనుసూక్తి యేనాఁటికిని వ్యర్థము కాదుకదా. అట్లుండఁగా ఖరునిచిత్తము మార్పునొంది దానికనుగుణముగా భావములు మాటలలో నచ్చెరు వేమున్నది? ఇయం 'భగినీ ప్రమథ్య మమ రుధిరంచ పాస్యతి.' అని యతనిభావము.-ఈనాతోఁబుట్టువు నన్ను మథించి యనఁగాఁ బురికొలిపి నారక్తమును ద్రాగఁ గలదు. అనఁగా నన్నుఁ జంపింపఁగలదని సారము కావున

"రాక్షసాః తయోస్సమీపం గత్వా స్వేన తేజసా శీఘ్రం తౌ సహోదరౌ రామలక్ష్మణౌ దుర్వృత్తాం దుర్లభం వృత్తం ఆచారో యస్యాస్సా తాం సీతాం చ హత్వా జ్ఞాత్వా అపావర్తితుం ప్రతినివర్తితు మర్హథ. అయం మమ భగిన్యాః ఇష్టః మనోరథః."

అని యన్వయము. ఓరాక్షసులారా! మీరు వారికడ కరిగి స్వకీయతేజస్సుచేఁ ద్వరగఁబోయి సోదరులగు నాదాశరథులను లోకాతీతాచారవంతురాలగు నాసీతను దెలిసికొని యనఁగా సామాన్య మానవాకృతుల నున్నను నావంటిదుష్కర్ములను దరింపఁజేయ నవతరించినవారిగా నెఱింగి మరలి రాఁదగు దురు. ఇదియే నాతోఁబుట్టువు నిష్టము. 'హత్వా' వధించి యను నది సామాన్యార్థము. 'హన హింసాగత్యోః' అనియు 'చర గతిభక్షణయోః' అనియు ధాత్వర్థములు గలవు. కావునఁ దెలిసికొని యని యర్థము చెప్పఁబడినది. అనఁగా మీరింత కంటెఁ జేయఁదగిన దందేదియు లేదు. ఈమె మనోరథముకూడ నిట్టిదే. కావునఁ గూడఁబోయి దర్శించి మరలి రండు. అని ఖరుని భావమని మహేశ్వరతీర్థులు వ్రాసిరి. శాపాంతమునందు దాని కనుగుణముగా బుద్ధి మాఱుచుండుట స్వభావమే కాని యచ్చెరువు గాదు. రాఁగలశుభకర్మము ననుసరించి మానవుల బుద్ధులు మాఱుచుండుట గానమా. ఇట్లు మన మర్థమును గ్రహించినచోఁ గర్మసిద్ధాంతమునకు ననుకూలముగనే యుండును. భగవన్నామస్మరణమున సకలపాపములు తొలఁగు నను వారు లేకుండరు కదా. అట్టివార లీసిద్ధాంతమును గూడ నంగీకరింపవలసినదే.

"తతస్తు తే తం సముదగ్రతేజసం తథాపి తీక్ష్ణప్రదరా నిశాచరాః,
న శేకురేనం సహసా ప్రమర్దితుం వనద్విపా దీప్తమివాగ్నిముత్థితం."

అని మూలము. ఖరునిభావము నీమూలము దృఢపఱుచు న్నది. శూర్పణఖంగూడిపోయిన యాపదునల్వురురక్కసులు శ్రీరాముని మార్కొనఁజాలక పోయిరి. ఏల? 'సముదగ్ర

తేజసం తం' = మహాతేజోరాశిగా శ్రీరాముఁడు వారికిం దోఁచెను. పాపకర్మములు దారువులతోఁ బోల్పఁబడును. జ్ఞాన మగ్నితోఁ బోల్పఁబడును.

"జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మ సా త్కురుతే తథా."

అన్న గీతోక్తి స్పష్టమే కదా. వారిదుష్కర్మదారువుల దహింప భగవంతున కదియే సమయము. కావున శ్రీరాముఁ డత్తఱి వారికన్నులకుఁ దేజోరూపుఁడుగా నగపడెను. ఈయర్థమునే యిందుత్తరార్ధమున "వనద్విపా దీప్తమివాగ్నిముత్థితం" అను దానిచే మహాకవి సూచించెను. దావాగ్ని ప్రజ్వరిల్లఁగా నడవి యేనుఁగులు చూచి భయంపడునట్లు తత్తేజోరాశిం గాంచి భీతినొందిరని భావము. ప్రథమదర్శనమున వారినయనము లాతేజస్సును జూడఁజాలకపోయెననియే సారము.

"తస్య మధ్యే మహానగ్ని ర్విశ్వార్చి ర్విశ్వతోముఖః."

అనుశ్రుతి భగవద్రూపము తేజస్సని తెలుపుచున్నది.

"న తు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా,
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరం."

అన్న గీతావాక్యము ననుసరించి యారక్కసు లాపరమేశ్వరుని తేజోరూపమును జూడఁజాలక భయంపడిరనఁగాఁ గన్నులు మూసికొనిరని భావము. దీనింబట్టి వారిదుష్కర్మనాశనమునకు సమయము చేరువకు వచ్చెనని మన మూహింపవలయును. భగవంతుని దేజోరూపునిగా నుపాసించినవారలకుఁ బ్రాగ్దు ష్కర్మములు నశించుననియే యిటఁగలసారము. తేజోరూపు నిగా నుపాసించు టెట్టులని ప్రశ్నించువారుందురు. తేజోరా శిని ధ్యానించి తన్మధ్యమున స్వాభిమతరూపమును గల్పించు

కొని దానియందు మనస్సును నెలకొలిపి యందుండి వదలనే రనిరీతిని బంధించి దానినే గాంచుచు నుండుటయే యుపాసన మని భావము.

> "తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః,
> స బ్రహ్మా ... ... ..."

అన్నశ్రుతి యీయర్థమును దెలుపును.

> "ధన్యానాం గిరికందరే నివసతాం జ్యోతిః పరం ధ్యాయతా
> మానందాశ్రుకణాన్ పిబంతి శకునా నిశ్శంకమంకేశయాః."

అన్న భర్తృహరిసూక్తియు నీయర్థమునే విశదీకరించుచున్నది. కనుక మనవంటివారెల్లరు విగ్రహాదిపూజలు మాని పరమేశ్వరుని జ్యోతీరూపునిగా ధ్యానించి తదానందము ననుభవింపఁ బ్రయత్నము చేయవలయునని యీభాగమునుండి గ్రహింపవలయును. అధ్యాత్మరామాయణమునం దీభాగమునుండి వ్రాయఁదగినవిశేషము లేవియును లేవు. ఇఁకఁ దరువాతి శ్రీరామచరిత్రమును బఠింతము.

## శ్రీరాముఁడు దానవులం జంప శూర్పణఖ మరలి ఖరునికడ కరుగుట.

*అంత భయంకరరూపము గలశూర్పణఖ రామచంద్రు నాశ్రమమున కేతెంచి సీతారామలక్ష్మణులను వారలకుం జూపెను. ఆరక్కసులు సీతం జూచి నవ్వుచున్న శ్రీరాము నందుఁ గాంచిరి. శ్రీరాముఁడును జుప్పనాతిని రక్కసులను జూచి మహాతేజుఁడగు లక్ష్మణునితో నిట్లనియె. లక్ష్మణా! రవంత సేపు నీవు సీతయొద్ద నుండుము. దీనిమాటల వినివచ్చిన వీరిం

* ఇది యిరువదవ సర్గమునఁ గలదు.

బోలియించెద. అనఁగాఁ జెప్పినదానితత్త్వ మెఱుంగు నాసౌ
మిత్రి యట్లే యనియె. రామమూర్తి ధనుస్సు నెక్కిడి రక్క
సుతో మేము దాశరథులము. సహోదరులము. రామలక్ష్మణు
లను పేరులఁ బిల్వఁబడువారము. ఈకాంత సీత. ఈమెతోడ
నీమహారణ్యమునకు వచ్చితిమి. ఫలమూలాశనులమై జితేం
ద్రియులమై తపోనియతిగలిగి ధర్మము నాచరించుచు నిందు
న్నారము. ఇట్టి మమ్మేల హింసించెదరు. నేనో మహర్షులయాన
తిమెయి ధర్మాత్ముల హింసించు మిమ్ము వధింపఁబూనియే శర
శరాసనములఁ దాల్చి యిచ్చోటికి వచ్చితినని నమ్ముఁడు. పరమ
దుర్మార్గులరగు నోరక్కసులారా! అందే యుండుఁడు. ఈవ
లకు రావలదు. పరుగెత్తరాదు. ప్రాణములపై నాశ మీకుఁ
గలదేని దొలఁగిపొండు. అని పలుకఁగనే బ్రాహ్మణులహింసించు
నాపదునలువురు కోపమునఁ గన్నులెఱ్ఱవాఱఁగాఁ బలికిన
శ్రీరాముని పలుకు లాలకించి శూలములు చేతులఁ గంపింపఁగా
మిక్కిలి క్రుద్ధులై యిట్లు పలికిరి. మహాత్ముఁడై మాప్రభువగు
ఖరునకుఁ గోపము గల్గించితివి. కనుక నిపుడు సంగరమున నీవే
మాచే వధింపఁబడుదువు. నీవొక్కడవే. మే మనేకులము.
మాముందు నిలువఁదగినబలము నీకెక్కడిది? ఇఁక యుద్ధము
మాతో నెట్లు చేయఁగలవు? రణమునకు రమ్ము. మాయా
యుధముల వ్రేటులకు ధనుస్సు వదలి ప్రాణముల వదలఁ
గలవు.

అని పలుకుచుఁ గోపము దీపింపఁగా వారు దుర్జయుఁ
డని యెఱింగియు శ్రీరామునిపైఁ దమశూలముల వైచిరి.
ఆదాశరథి బాణముల వానినడుమన ఖండించి క్రుద్ధుఁడై
సూర్యప్రకాశముగల వాడిబాణములఁ బదునాలుగింటిని

నైకొని సంధించి యాకర్ణాంతముగ జ్యాలత నాకర్షించి లక్ష్య శుద్ధి యలరారఁ బ్రయోగించెను. అవి వారిని భేదించి రక్త సిక్తములై యవ్వలికిం బోయెను. పెద్దధ్వనితో నవి క్రిందఁ బడియెను. వా రా దెబ్బలకుఁ దాళఁజాలక మూలచ్ఛేదమునఁ బడువృక్షములవలె నవనిం బడిరి. వారిపాటు గని యాచుప్ప నాతి పట్టరానికోపముకలదయ్యు నేమియుఁ జేయఁజాలక గట్టిగాఁ గూయిడెను. త్వరగఁ బరుగిడి ఖరునికడ కరిగి నేలం బడియెను. రోదనముచేసెను. అశ్రుధారల వదలెను. దానవుల చావు లోనగు నచ్చటివార్తలం దెలిపెను.

మహాశయులారా! లోపలవ్రాసినవిషయమునకు దీనికి నెట్టిసంబంధముకలదని యించుక విమర్శింతము.

"తతశ్శూర్పణఖా ఘోరా రాఘవాశ్రమమాగతా,
రక్షసామాచచక్షే తౌ భ్రాతరౌ సహ సీతయా."		౧

అని మూలము. పర్ణశాలకుంబోవఁగనే కనఁబడువారు మానవుల వారెలుంగఁజాలరా? ఆతేజోరాశికి లోఁబడి వారూరకుండిరి. శూర్పణఖ వారల వారికిం దెల్పెను. అనఁగా హెచ్చరించెనని యర్థము. భయాతిరేకమున వారొడలు తెలియకుండఁగా నామె వారల మేలుకొలిపెనని యర్థము. ఈశ్లోకములోపల వ్రాసినభావమునకుఁ బ్రోత్సాహకము కాదన వలనుపడునా?

"ముహూర్తం భవ సౌమిత్రే సీతాయాః ప్రత్యనంతరః,
ఇమానస్యావధిష్యామి పదవీమాగతానిహ."		౪

అని మూలము శాపవిముక్తి శ్రీరామునిమూలమునఁ గా వలయుననియే శంకరాజ్ఞకదా. శూర్పణఖను విరూపనుగాఁ

జేయుమన్న శ్రీరాముఁడు లక్ష్మణునితో వీరిం బొలియింపుమని యేల పలుకలేదు? వారికర్మము శ్రీరామునిం బ్రేరేపించెననియు దాన నాతఁడు తానే వారిని జంపం దలంచెననియు మన మెఱుంగవలయును. లక్ష్మణా! క్షణకాలము సీతచెంత నుండుము. దీనివారలగువీరిని వచ్చినవారలను వధించెదనని రాముఁడు పలికెను. శాపవిముక్తికాల మెంతదూరముననో లేదు. దగ్గరకు వచ్చినది. కనుకనే ముహూర్తమాత్ర మని రాముఁడు పలికెను. అంత చాలక 'ఇహ' ఇందే యనియే. వారిశరీరపతనస్థల మదియే యని భావము. ఇది రాముని వాక్కులఁ బరికించిన నింకను దేటపడఁగలదు.

"పుత్రౌ దశరథస్యావాం భ్రాతరౌ రామలక్ష్మణౌ,
ప్రవిష్టౌ సీతయా సార్థం దుశ్చరం దండకావనం. ౨
ఫలమూలాశనౌ దాంతౌ తాపసౌ ధర్మచారిణౌ,
వసంతౌ దండకారణ్యే కిమర్థ ముపహింసథ." ౭

అని మూలము.'నవితథాపరిహాసకథాస్వపి" అనియు,"అనృతం నోక్తపూర్వం మే నచ వక్ష్యే కదాచన" అనియుఁ దాను జేసిన ప్రతిజ్ఞలను సిద్ధాంతముచేయుచు శ్రీరాముఁడు తెలిపినమాట లివి. లేకున్న నీగోడవ యేటికి? తమప్రవృత్తిని దెలిపి ప్రాగ్జన్మ శాపమును స్మృతికిఁ దెచ్చుచున్నవాఁడు. దానిచే వారికిఁ గర్మ పరిపాకమునఁ గోపము హెచ్చును. తన్నుం బ్రహరింతురు. వారిం జంప ననువగును. అనుభావము శ్రీరామునకుఁగల దని తేటపడును. "ప్రవిష్టౌ సీతయాసార్థమ్"=అనుటం జేసి ప్రక్రృతియే యిన్నింటికిం గారణభూతరా లనుభావము తేలును. ఫల 'మూలాశనౌ' అనులోనగువిశేషణములచే నెట్టివారికిఁ జేయు

హింస మహాఘోరపాపమో యనువిషయమును దేటపడఁ జేయును. ధర్మచరులకుఁ జేయుహింస మహాపాపమనియుఁ దానికిఁ బ్రాచితము దెల్పుటకే మేమిందున్న వారమనియుఁ దోఁచును. ఏల మమ్మును మావంటిధర్మవృత్తులను హింసించెదరు? అనుటచే దాన నించుకయు మీకుపకారము కలుగదని భావము. ఇట్టి సంభాషణమున భగవంతుఁ డగుశ్రీరాముఁడు కపటమున నేకార్యము చేయరాదనియు నయ్యది నిరర్థకమగుటయేగాక దుష్ఫలమునుగూడ నీఁజాలుననియు మనకుఁ దెలిపెనని మన మెఱింగి యట్టి దుష్కార్యముల నొనరింపక యుండవలయును.

"యుష్మాన్ పాపాత్మకాన్ హంతుం విప్రకారాన్ మహాహవే,
ఋషీణాం తు నియోగేన ప్రాప్తోఽహం సశరాయుధః." ౯

అను నీమూలము భగవంతుని ప్రతిజ్ఞ యగు

"అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్,
ప్రకృతిం స్వామవష్టభ్య సంభవామ్యాత్మమాయయా. ౬
యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత,
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహం. ౭
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే." ౮

గీత. ౪ అధ్యా.

అను నీవాక్యజాలమునే తెలుపుచున్నది. మునివర్యులు నియోగింపఁ బాపాత్ములు సదా పరాపకారతత్పరులునగుమిమ్ము యుద్ధమున వధించుటకే శరశరాసనముల ధరించి యీయడవిం బ్రవేశించితిని. ధర్మరక్షణార్థమే యవతరించితినిగానఁ దద్ధనకర్మవ్యాపృతుల వధింతుననికదా శ్రీరాముఁడు

పలికెను. సజ్జనరక్షణమే పరమధర్మమని తాత్పర్యము. ఈపలుకులు సామాన్యనరపతిపలుకులు కావనియు భగవంతుఁడ ననుభావమునే తేటపఱచునవనియు మన మెఱుంగవలయును.

"సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహం."

అన్నగీతోపనిషత్తునందలి భగవద్వాక్య మీరామవాక్యము నకు విరుద్ధముకాదా యనరాదు. సత్యమున కాపరమాత్మున కెల్లరు సమానులే. అందఱను రక్షించుమార్గము మాత్ర మొక్కవిధము కాదు. సర్వజనుల రక్షించుటయే భగవంతు నాశయమని మన మెఱుంగవలయు. వారివారికర్మము ననుస రించి మార్గములు కాలము వేఱుగా నుండును. ప్రకృత మారాక్షసులకు శాపవిముక్తి ననుగ్రహించుటకే వారిభీతి మాన్పి క్రోధ ముద్దీపింపఁజేసెనని మన మెఱుంగుటయే మంచిది. ఈపైని వ్రాసినభావమునే యీక్రింద నుదాహ రించినమూలము వెల్లడించుచున్నది.

"తిష్ఠతైవాత్ర సంతుష్టా నోపావర్తితు మర్హథ,
యది ప్రాణైరిహార్థో వా నివర్తధ్వం నిశాచరాః." ౧౦

అని. 'సంతుష్టాః' అని గోవిందరాజులపాఠము. 'సందుష్టాః' అని మహేశ్వరతీర్థులపాఠము. 'సంతుష్టాః' అభీతా ఇతియావత్' అని గోవిందరాజులు. 'హేసందుష్టాః అతిదుష్టాః' అని మహే శ్వరతీర్థులు వ్రాసిరి. అభిప్రాయ మొక్కటియేకాని భేదము లేదు. దుష్టులఁ జేరనీయరాదన్నన్యాయమును బరిపాలింపఁ గోరి రాముఁ డిట్టు లనియెను. అందే నిలువుఁడు దగ్గఱకు రావలదు. రానర్హులు కారు. సహచరులగుయోగ్యత మీ కీ

పుట్టువునందు లేదని భావము. ఇంకను బ్రదుకవలయు నన్నయ పేక్ష మీకుండినఁ దొలఁగిపొండు. అనుటచే మీరు శాప మున దుష్టులగుటఁ జెంతకు రాఁదగరనియుఁ బురుషులరైన యుద్ధము చేయుఁడనియు రామభద్రుఁడు వారలం బురికొలి పెను. క్రోధోద్దీపకములగుమాటలాడుట భగవంతునకు న్యాయమా యని ప్రశ్నింపరాదు. వారల కాపాపవిశిష్టజన్మ మును దొలఁగించుటకే యాప్రయత్నము. అది కరుణయే కాని మఱొకటి కాదని మన మెన్నఁదగును.

"క్రోధముత్పాద్య నో భర్తుః ఖరస్య సుమహాత్మనః,
త్వమేవ హాస్యసే ప్రాణానద్యాస్మాభిర్హతో యుధి." ౧౨

అని మూలము. శాపవిముక్తికాల మాసన్నము కాఁగా శ్రీరాముఁడు కోపముగల్గఁ బురికొలుపఁగా వారలు భీతివాసి యాగ్రహమున యుద్ధము చేయ నుంకించిరి. రాముని దివ్య తేజస్సును జూడఁజాలకయుండి క్రమముగా నారూపము సౌమ్యము కాఁగా భీతి వదలి యథాపూర్వస్థితినొంది యెదిరించిరి. కర్మ మెంత బలవత్తరమో దీనిమూలమునఁ దెలియఁ గలదు. "సుమహాత్మనః భర్తుః ఖరస్య క్రోధముత్పాద్య అస్మాభిర్హతః త్వం ప్రాణా నోహాస్యసే ఏవ" అని యన్వయము. మావిభుఁడగుఖరునకు నాగ్రహము కల్గించి యతనిసేవకులమగు మాచేఁ గొట్టఁబడినను నీవు ప్రాణముల వదలవనుట నిజము. అని యర్థము గ్రహింపందగు

"కా హి తే శక్తిరేకస్య బహూనాం రణమూర్ధని,
అస్మాకమగ్రతస్థ్సాతుం కిం పునర్యోద్ధుమాహవే." ౧౩

అను నీమూలమునకు వాస్తవార్థము

"రణమూర్ధని ఏకస్య తే అగ్రతః స్థాతుం బహూనామప్యస్మాకం కా శక్తిః? బాహుప్రయుక్తైః పరిఘైః శూలపట్టిసైః అస్మాకం ప్రాణాన్ వీర్యం చ త్యక్ష్యసి."

అని యన్వయము. యుద్ధమునందు నద్వితీయుఁడవగు (భగవంతుఁడవగు) నీయెదుటఁ బెక్కండ్రమైనను మాకు నిలువ శక్తి యెక్కడిది? లేదనుట నిక్కము. ఖరునియాజ్ఞపై వచ్చి యాయుధములతోఁ గూడిన మాప్రాణముల వదలింపఁగలవు. నిస్సంశయము. నీతో యుద్ధము చేయుట మాకుఁ బ్రాణాపాయముకొఱకే అని వారిభావము. తెలియక చెప్పిరనియే మనము గ్రహింపవలయును. కాని వారిమనసులు పరవశములై భావికర్మఫలప్రచోదితములైనవి కావున వారు భగవంతునిం గాంచుచు నట్లు పలికిరని యంగీకరించిన నే ప్రాయశ్చిత్తమురాదు. ఇట్లు మహేశ్వరతీర్థులు వ్రాసిరి. ఇది యితర పురాణకథకు ననుకూలము. కర్మసిద్ధాంతసమ్మతము. రామాయణతత్త్వమున కిద్దానిమూలమున మహోపకార మేదియుఁ గలుగదు. రామునిహాతులగురక్కసు లెల్లరు సకారణముగ రామునితో ద్వేషించినవారలే కాని వేఱుగాదు. ప్రాక్కర్మఫలములు శ్రీరామునిమూలమున వారలకుఁ జావు గల్గింపఁబూనినవి. వారల నుద్ధరించుకొఱకే శ్రీరాముఁ డవతరించెననుట సర్వజనాంగీకృతవిషయముకదా. అధ్యాత్మరామాయణమున నిందు విశేషములు లేవు.

## శూర్పణఖ ఖరునకు రక్కసులమృతిని దెల్పుట.

* శూర్పణఖ పరుగున వచ్చి నేలంబడియుండఁ గాంచి ఖరుఁడు క్రుద్ధుఁడై రాక్షసుల నశింపఁజేయ వచ్చిన యామెతో నిట్లు పలికెను. సోదరీ! ఇపుడే నీకుఁ బ్రీతిని గూర్పఁగోరి క్రవ్యాదులను బంపినాఁడఁగదా. మరల నెందుల కేడ్చెదవు? ఆరక్కసులు నాకుం బ్రియముచేయువారు. శత్రువులఁ జంప దక్షులు. అవధ్యులు. వారు నాయానతిని మీఱుదురా? నీ విపుడు వచ్చి యేడ్చుచు సర్పమువలె నేలంబడి పొరలాడు చున్నదానవే? కారణము వినవలతు. నీకు దిక్కుగ నే నుండఁగా ననాథవలె నేల యాక్రోశించుచున్నదానవు? లెమ్ము. లెమ్ము. భీతిల్ల నేల? నిర్భీతి వచింపుము. అని ఖరుఁడు ప్రశ్నింపఁగా నామె యించుకతడవుండి యిట్లు పలికెను. సోదరా! ఇంతకు నించుకమునుపే యిట్లు విరూపనై రక్తము స్రవింపఁగా వచ్చితినిగదా. నన్నాశ్వాసించి పగవారిం జంప రక్కసులం బంపితివి. వారాగ్రహమున రామునిపైఁ బడఁ బోవఁగా నాతఁ డందఱ నొకక్షణకాలమునఁ జంపెను. అతని శౌర్యముం జూడ నాకచ్చెరువగుచున్నది. రాక్షసవర్యా! నేను భయమున మునింగియున్నదానను. ఎందు దృష్టి నిగుడించి నను రాముఁడే గనంబడుచున్నాఁడు. కనుక మరల నీకడకే వచ్చితిని. దుఃఖగ్రాహ మంతరంగమునఁ బొదలుచుండఁగా భయతరంగములు పెంపొందుచుండఁగా నేనిపుడు మహోత్తర శోకపారావారమున మునింగియున్నదానను. నన్నుఁ గాపాడ కూరక వదలుదువా యేమి? నావెంట వచ్చిన మహారాక్షసు

---

* ఇది యిరువదొకండవ సర్గమునఁ గలదు.

లతనివాడితూపులఁ బొడవడంగిరికదా. నీకు దయ నాపై నున్నయెడలఁ జచ్చినయారక్కసులపైఁ బ్రీతియుండిన నా రామునివంటిపరాక్రమశక్తులు నీకునున్న నీదండకారణ్యమున రాక్షసులకుఁ బరమశత్రువగు నారామునిం జంపుము. నీవట్లు నాపగవానిం జంపవేని నీయెదుట నిపుడే నేను బ్రాణముల వదలుదును. నీవు నీబలములు నారామునియెదుట నిలువఁజాలవని నాకుం దోఁచెడిని. కేవలమానవులగు నాసోదరులఁ జంపఁజాలకున్నవాఁడవే ? శూరుఁడనని నీవె నిన్నుఁ బొగడుకొనుచుందువు. అంతియకాని నిక్కమగు శౌర్యము నీకు లేదు బింకములుమాత్రమే పలుకుచుందువు. రాక్షసకులపాంసనా! బలపరాక్రమములచే నీవు రామునకు సాటివత్తువేని దండకారణ్యమందే యున్నరాముని వధింపుము. కనుఁగొందును. నీకంత శక్తిలేదు. శౌర్యము రవంత నీకుఁ గలదేమో. ఇట్టి నీ వీజనస్థానమున నుండ నర్హుఁడవగుదువా ? సత్వరమ నీవు బంధువులతోడఁ దొలఁగి యందే వసింపఁబొమ్ము. ఇందే యుండిన నాతనిశక్తిచే నశింతువు. ఆదాశరథి మహాశక్తిమంతుఁడు. నన్నిట్లు విరూపగా నొనరించిన యతనితమ్ముఁడు లక్ష్మణుఁడు మహాపరాక్రమశాలియే. అని పలికి పొట్టపొంగ దుఃఖించి మాటలాడఁజాలక కడుపు చేతుల మోఁదుకొనుచు విలపించెను.

మహామతులారా! ఈభాగమున భగవత్తత్త్వము గలదు. విమర్శించి తెలిసికొందము.

"స పునః పతితాం దృష్ట్వా క్రోధాచ్ఛూర్పణఖాం ఖరః,
ఉవాచ వ్యక్తయా వాచా తామనర్థార్థమాగతాం." ౧

అని మూలము. గతసర్గాభిప్రాయవిశేషమును మఱువకుఁడు. "అనర్థార్థమాగతాం" అనర్థముగ బాహ్యదృష్టికిం దోఁచుచు నిక్కముగఁ బరికింప భగవత్కార్యమును సాధింప నరుగు దెంచిన యాశూర్పణఖం గని ఖరుఁ డిట్లు ప్రశ్నించెను. "అనర్థ అర్థో యస్యాస్తామ్" అని సమాసము. అనర్థమే ప్రయోజనముగాఁగలది. అనఁగా ఖరాదినిర్మూలనమే యామెపుట్టుకకు ఫలమని భావము. భగవత్కార్యము నెఱవేర్ప నరుదెంచిన దని సారము. ఎంతకాలమునుండియో వేచియుండు రావణాదులకుఁ బరమపురుషార్థమును గల్పింపనే యామె జన్మించినది. కనుకనే పరమేశ్వరుఁ డామెను జన్మాంతరమునఁ గరుణించెను. ఇపుడే యేల కరుణింపరాదనరాదు. సత్కర్మదుష్కర్మములఫల మనుభవించుతరుణము రావలెను ఆకాలము భావిజన్మమున శూర్పణఖకు వచ్చును. కావున నిపుడు ఫలముల ననుభవించువారల కవ్వానిని భగవంతుఁ డనుగ్రహించు నని మన మెఱుంగవలయును.

"భక్తాశ్చైవానురక్తాశ్చ హితాశ్చ మమ నిత్యశః,
ఘ్నంతోఽపి న నిహంతవ్యా ననకుర్యుర్వచో మమ." 3

అనునది ఖరునివాక్యము.

"మమ సేవకాః భక్తాశ్చ అనురక్తాశ్చ నిత్యశః హితాశ్చైవ భవంతీతి శేషః. తే ఘ్నంతోఽపి పరైర్న నిహంతవ్యాః. మమ వచః న కుర్యురితి న."

అని యన్వయము. శూర్పణఖా! నేనంపినదానవులు భక్తులు. మహానురాగముగలవారు. హితమునే చేయువారు నగుదురు సుమీ. ఎవ్వారికిఁగాని జయింప సాధ్యముకానివారు. నా పలుకు తప్పక చేయుదురు. శాపాంతమునఁ బలుకఁగ నమాట

లనే యతఁడు పలికెను. భక్తానురక్తహితశబ్దములే తద్భావమును దేటపఱచును. అజేయులనఁగా నితరయోధులచే నని కదా భావము. భగవంతునకుంగూడ దుర్జయులగువార లుందురా? అట్టివారు నామాటను జేయకపోరు. అనఁగా వారిదేహాముక్తివార్తలఁ దెలుపుమా యని యతఁ డడిగెను.

"కిమేతచ్ఛ్రోతు మిచ్ఛామి కారణం యత్కృతే పునః,
హానాథేతి వినిర్దంతీ సర్పవల్లుఠసి క్షితౌ. ౪
అనాథవద్విలపసి నాథే తు మయి సంస్థితే,
ఉత్తిష్ఠోత్తిష్ఠ మా క్షైషీర్వై క్లబ్యం త్యజ్యతామిహ." ౫

అని మూలము. "సర్పవల్లుఠసి క్షితౌ" అనుటం జేసి సర్పము భూమింబొరలాడుట సంతోషమునఁ జెలరేఁగి యొరుల బాధించుటకే. అట్లే నీవు పుడమింబడియుండుట మాబాధకొఱకే యనునర్థము తోఁచును. తానంపినరక్కసులు రాక యామె మాత్రము వచ్చుటంజేసి యేదియో అనర్థము దాఁపరించెనని యతఁ డూహించెను. మయి = నాయందు, నాథేతు = భగవంతుఁడు, సంస్థితేసతి=ఉండఁగా, ననఁగా నాయెడ భగవంతుఁడనుగ్రహించియుండఁగా ననునర్థము తోఁచెడిని. అనాథవద్విలపసి = దిక్కులేనిదానివలె నేడ్చుచున్నదానవు? అనఁగా నెల్లరకు దిక్కగుభగవంతుఁడు నిన్నుమాత్ర ముద్ధరింపఁడా. ఏడువకుము. దుఃఖముచే నిఁక లాభము లేదు. లేలెమ్ము. భయంపడకుము. త్వరితముగాఁ గార్యమునకుఁ గడంగుము. భయంపడి లాభమేమి? వితాకు వదలుము. అని యూరకుండక ఇహా=ఇపుడనియుఁ బలికెను. ఇపుడు వితాకుపడనేల? కాఁగల కార్యము కాకమానదు. నిర్భయముగా నుండుము. రాక్షస

వినాశనకాల మాసన్నమైనను సద్వృత్తిగలవా రుండక పోరు. అట్టిచో భయంపడనేల? అని ఖరునియాశయము.

"క్లైబ్యం మాస్మ గమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే,
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప." 3

అని శ్రీకృష్ణుం డర్జునునకుఁ దెల్పెనుగదా. అట్లే శాపపరిపాకమున విముక్తికిఁ జెంతనున్న ఖరుఁ డిట్లు పలుకుట యసంగతమని యూహింపరాదు.

"ఇత్యేవ ముక్తా దుర్ధర్షా ఖరేణ పరిసాంత్వితా,
విమృజ్య నయనే సాస్రే ఖరం భ్రాతర మబ్రవీత్." ౬

అను నీమూలమునందుఁగల 'పరిసాంత్వితా' అనుపదమే పైని వ్రాసినభావము సూచించుచున్నది. ఖరుఁడు శూర్పణఖవలె నాతురంపడలేదు. ఏల? విముక్తికాల మాసన్నమగుచున్నది. కనుక నతనిచిత్తవృత్తి భావికర్మఫలమునకుఁ దగినట్లు మార్పునొందుట సహజమే కదా,

"అహమస్మి సముద్విగ్నా విషణ్ణా చ నిశాచర,
శరణం త్వాం పునః ప్రాప్తా సర్వతోభయదర్శినీ." ౧౧

అనునిది శూర్పణఖయుత్తరము. "సర్వతోభయదర్శినీ" = ఎల్లయెడల భయకారణుఁ డగురామునే చూచుచున్న దానననియె. నిన్ను రక్షకునిగ భావించి మరల వచ్చితిని. అనఁగా నన్నుఁ గాపాడవచ్చినవా రచ్చటనే ముక్తినొందిరి. మరల నీకడకు వచ్చితిని. అనుటంజేసి నీకు నద్దాని సమకూర్పవచ్చితి ననుభావ మామెమాటలధోరణింబట్టి యూహింపవచ్చును. శూర్పణదృష్టికి "సర్వం రామమయం జగత్" అన్నట్లు రామరూపమే యెల్లతావులఁ గనంబడుచుండెను. రాముని

జయింపఁగలవారును గలరా యనుభావ మామె కంఠురించె నని తాత్పర్యము.

"విషాదనక్రాధ్యుషితే పరిత్రాసోర్మిమాలిని,
కిం మాం న త్రాయసే మగ్నాం విపులే శోకసాగరే." ౧౩

అని మూలము. విషాద మనఁగా, ఖేదమని నిఘంటువులందుఁ గలదు. ఖేదమనఁగా మనోరోగమని యర్థమగును. ఏ కార్యము చేయుటకుఁ దోఁపకుండుట ఖేద మనంబడును. శోకసాగరము విషాదమను మొసళ్లతో నిండియుండునది. భయమను తరంగమాలికలు గలది. అట్టిసముద్రమున మునింగితిని. నన్నుద్ధరింపుమా యని ఖరుని వేఁడుచున్నది. నిజమునకు నీసమయమున నామెకు భరింపరానికోపమే యుండవలసినది. దానికి బదులుగా రాఁగలరాక్షసమరణమును దెలుపుచు శోకమే యామె నడంచెను. భావిఫలానుసారముగా మనస్సు మాఱుచుండు ననుట కిది యొకదృష్టాంతముకదా.

"మయి తే యద్యనుక్రోశో యది రక్షస్సు తేషు చ,
రామేణ యది తే శక్తి స్తేజో వాస్తి నిశాచర. ౧౪
దండకారణ్యనిలయం జహి రాక్షసకంటకమ్,"

అని మూలము. ఖరుని శూర్పణఖామూలమునఁ గర్మము పురి కొలుపుచున్నది! స్త్రీలప్రోత్సాహమున లోకమునఁ బురుషు లెంతఘాతుకులైన నగుట మనము చూచుచున్నాము కదా. ఈప్రకరణమునఁ బ్రకృతి యొకస్త్రీమూలమున భగవత్కార్యము నొనఁగూర్పఁ బ్రయత్నించుచున్నది. దానిని దప్పింప నెవరికి సాధ్యము? ఒడలెఱుఁగని శివ మన్నట్లు చుప్పనాతిమాటలసందడిలో రాక్షసకంటకమ్=రాక్షసులకు విరోధి యనియు

బాధించువాఁడనియు నర్థమిచ్చుపదమును బ్రయోగించెను. వీర్యము తేజము రామున కుండునట్టివి కలవా? అని ప్రశ్నించు చున్నది. దండకారణ్యమును నిలయముగాఁగలవాఁ డనఁగా నింత కాల మిందుండఁగా నేల యూరకయున్నాఁడవని నిందించు చున్నది. దీనితరువాతిశ్లోకమునందు

"యది రామం మమామిత్రం న త్వమద్య వధిష్యసి. ౧౫
తవ చైవాగ్రతః ప్రాణాంస్త్యక్ష్యామి నిరపత్రపా,"

కనఁబడు నకారమును జేర్చి "నజహి" అని యన్వయించి తీర్థులు వ్యాఖ్య వ్రాసిరి. అనఁగా నిఁక మీరు వారిని జయింపఁ జాలరని యామెకుఁ దోఁచెననియే దీనిభావము. భగవద్దర్శ నము రెండుసారులు కాఁగా నెంతపాపాత్మురాలైన నించుక మార్పునొందక మానదు కదా!

"బుద్ధ్యాహ మనుపశ్యామి న త్వం రామస్య సంయుగే. ౧౬
స్థాతుం ప్రతిముఖే శక్తస్సబలశ్చ మహాత్మనః,
శూరమానీ న శూరస్త్వం మిథ్యారోపితవిక్రమః. ౧౭
మానుషౌ యౌ న శక్నోషి హంతుం తౌ రామలక్ష్మణౌ,
రామేణ యది తే శక్తి స్తేజో వాస్తి నిశాచర. ౧౮
దండకారణ్యనిలయం జహి తం కులపాంసన,
నిస్సత్త్వస్యాల్పవీర్యస్య వాసస్తే కీదృశస్త్విహ. ౧౯
అపయాహి జనస్థానాత్త్వరితస్సహ బాంధవః,
రామతేజోఽభిభూతోహి త్వం క్షిప్రం వినశిష్యసి. ౨౦
సహి తేజస్సమాయుక్తో రామో దశరథాత్మజః,
భ్రాతా చాస్య మహావీర్యో యేన చాస్మి విరూపితా." ౨౧

అను నివి శూర్పణఖవాక్కులు. మహాపకారమునొందిన యాఁడుది, అందును రాక్షసి పగవానిని బొగడుట లోక

సామాన్యదృష్టిచేఁ గాంచిన సహజ మనందగునా? ఖరునకుఁ గ్రోధముగల్గింప నట్లు పలికెఁగాని వినుతి గాదని కొంద అందురుగాక. ముక్కు చెవులు తెగి రక్తము పాఱుచుండుతఱి స్తుతించు టబ్బురమే. కాని యింతశాంతముగాఁ బలుకుట మహాత్మనః అని రామునకు విశేషణ ముపయోగించుటకుఁ గారణ ముండకమానదు.

"న హ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః,
తే పునంత్యురుకాలేన దర్శనాదేవ సాధవః."

అను భాగవత ప్రమాణము ననుసరించి యోజించిన సాధుదర్శనమే యంతఫలము నీఁజాలినపుడు సాధుశరణ్యుఁ డగుభగవంతునిదర్శన మెంతఫలము నీయఁజాలునో యోజింపఁదగి యుండును. కనుక భగవంతుని శ్రీరామచంద్రుని నేత్రఫలముగాఁ గాంచి వాక్ఫలముగా మాటలాడి పాపాపనోదకమగు పాచితము గాంచినదగుటఁ దత్పుణ్యమున నంతఃకరణము మార్పునొందఁగా నప్రయత్నముగ నిట్లు సంభాషించి యుండును. మహాత్ముఁడగు శ్రీరామునెదుట యుద్ధమున నిలువఁ జాలవని నాకుఁ దోఁచెడిని. బలము లట్టివే యగును. అనఁగా భావమేమి? బలములంగూడి నీవు రణమునకుఁ బోయినను శ్రీరామునెదుట నిలువఁ జాలక మృతినొందుదువనియేకదా. 'బుద్ధ్యాహమనుపశ్యామి' అనియెఁ గదా. అనఁగాఁ జక్కఁగా నాలోచించితిననియేకదా భావము.

"ఇంద్రియాణి పరాణ్యాహురింద్రియేభ్యః పరం మనః,
మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః." ౪౨

గీ. 3 అధ్యా.

అనుగీతావాక్యము ననుసరించిన నున్నజ్ఞానమునంతయు నుప
యోగించి యాలోచించితివనికదా తాత్పర్యము. రామలక్ష్మ
ణులు మానవులుగా నవతరించినవారని యెఱుంగకపోతివి.
కనుక శూరమానివికాని సత్యముగా శూరుఁడవే కావు.
శూరుఁడవే యైనచో నీవు పంపినదుర్దాంతవిక్రములగురక్క
సుల నుక్కడంపఁగనే వారిపౌరుష మిట్టిదని యెఱుంగఁ
జాలక యుందువా? నీవు కులపాంసనుఁడవు. అనఁగాఁ గుల
గౌరవమును బాడుచేయఁ బుట్టినవాఁడవని యర్థము. కనుకనే
రాముని మానవసామాన్యునిగా గ్రహించితివి. అట్టిశక్తి అట్టి
తేజస్సు నీకుఁ గలదేని ఇంతకాలము దండకాటవిఁ గాఁపుర
ముండెఁగదా యేల వధింపకుంటివో యెఱుంగఁజాలనని
యామెహృదయగతార్థ మనవచ్చును. అల్పవీర్యుఁడవై సత్త్వ
రహితుఁడవునగు నీవిందేల కాఁపురమున్నాఁడవు? వీర్యము
శిరోబలమును సూచించును. సత్త్వము బుద్ధిబలమును దెలు
పును. మంచియాలోచనము చేయఁజాలుమెదడుగాని తత్త్వ
మెఱుంగఁజాలు బుద్ధిబలముగాని నీకు లేదు. ఈయరణ్యము
మహర్షిసంకీర్ణము. అట్టితావున నీవుండఁదగవని యాక్షేపించు
చున్నది. త్వరితముగా నీవారలంగూడి పాఱిపొమ్ము. శ్రీ
రామునితేజస్సు మిమ్ము దహింపఁగలదు. దశరథసూనుఁ డనఁ
గానే సామాన్యుఁ డనుకొంటివా యేమి? తేజోరాశిసుమీ
రామచంద్రుఁడు. ఆతనితమ్ముఁడో సామాన్యుఁడు కాఁడు.
నన్నిట్లు విరూపగా నొనరించిన దతఁడే. అని నీయుపన్యాస
మును బరికింపఁగాఁ దెలిసియో తెలియకయో శూర్పణఖ
శ్రీరామమహత్త్వమును వినుతింపఁజాలెను. ఖరాదిదానవుల
కర్మము తన్నుఁ బురికొలుపఁ గోపమునఁ గొన్నినుడులుకూడఁ

బలికెను. దీనిచే భగవద్దర్శన మెంతటిక్రూరులకైన నించుక విజ్ఞానమును గలిగించి తరింపఁజేయు ననువిషయమును మన మీభాగమునుండి తెలిసికొనవలయును. అధ్యాత్మరామాయణమున నీవిషయమున విశేషము కనఁబడదు. తరువాతి శ్రీరామచరిత్రమును బరిశీలింతము.

## ఖరాదిదానవులు సబలులగుచు యుద్ధమునకు వెడలుట

*శూర్పణఖ బంధువుల చెంతఁ దన్నిట్లు దూఱఁగా విని ఖరాసురుఁడు క్రూరాకార మొప్పఁగా భయంకరముగా నామె కిట్లు తెలిపెను. నీయవమతి నాకు నిర్భరాగ్రహమును గల్గించెను. పర్వములఁ బొంగుసంద్రమును నిలుపరానియట్లులు నాయాగ్రహమును నిలుపుకొనఁజాలకున్నాఁడను. ఆయువు క్షీణించిన మానవునిపౌరుషమును లెక్కింతునా? అతఁడు తన దుష్కృత్యమునకు ఫలముగా నాచే హతుఁడు కాఁగలఁడు. కన్నీరు తుడుచుకొనుము. ఆయన్నదమ్ముల నిపుడే యమపురమునకుఁ బంపెద. వారి వేఁడిరక్తమును ద్రావఁగలవు అన్నంతనే యామె సంతసిల్లి మనస్సునఁ గలయుత్సాహము పెల్లున ఖరుని బొగడెను. అంత ఖరుఁడు సేనాపతి దూషణునిం గని మనరాక్షసులు పదునాల్గువేలసంఖ్యగలవారు రణకర్మనిపుణులు కదా. వారు యుద్ధమునకు సిద్ధమగునట్లు చేయుము. నారథ చాపబాణఖడ్గాదిసాధనములను సిద్ధము చేయింపుము. పులస్త్యవంశోత్పన్నులకెల్ల ముందుగా రణపండితుఁడ నగునేను దుష్టుఁడగురాముని వధింపఁ బోవ నెంచియున్నాను. ఇట్లు ఖరుఁడు చెప్పుచుండఁగనే దూషణుఁ డుత్తమాశ్వములు గట్టి

* ఇది యిరువదిరెండవ సర్గమునఁ గలదు.

సూర్యునివలె మెఱయుచున్న రథము సిద్ధము చేసితినని చెప్పెను. ఆరథము వర్ణనాతీతమై యుండెను. ఆరథమును ఖరాసురుఁ డధిష్ఠించెను. ఎల్లరు నాతనిం జుట్టుకొని రక్కసులు నిలిచిరి. ఖరుఁడా రక్కసులు రణసిద్ధులై యుండఁ గాంచి పయనము చేయుఁడని యాజ్ఞాపించెను. వా రాతనియానతిమెయి సకలాయుధములను ధరించి జనస్థానమునుండి బయలువెడలిరి. వారు ముందుగాఁ బోవుచుండ ఖరునిరథము వెనుకఁబోయెను. సారథి వేగముగాఁ దోలఁగా నట్టహాసము చేయుచు శత్రువుల వధింపఁ బోయెను. ఎపుడెపుడు యుద్ధమగునా యనుతలంపున ఖరుఁడు వడిగాఁ బోవుచుండెను.

మహాశయులారా! ఈభాగమున విశేషములు గలవు. పరిశీలింతము.

> "తవావమానప్రభవః క్రోధోఽయమతులో మమ,
> న శక్యతే ధారయితుం లవణాంభ ఇవోత్థితం." ౨

అని మూలము. ఖరునివాక్కిది. నాకిపుడు కల్గిన యీకోపము నీయవమానజనితమే కాని వేఱుగాదు. దానిని భరింపఁ జాలకయున్నాఁడను. అనఁగా భావమేమి? నీయవమతిరూపమున నీదుష్కృత్యము నన్నుఁ బ్రోత్సహించి మహాకోపమును గల్గించినది. దానిని భరింపఁజాలను. సముద్రము పొంగినట్లు పొంగుచున్నది. నన్ను నిలువనీయదు.

> "క్రోధాద్భవతి సమ్మోహస్సమ్మోహాత్స్మృతివిభ్రమః,
> స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి." ౬౩
>
> గీత. ౨ అధ్యా.

అను శ్రీకృష్ణవాక్యము ననుసరించి ఖరుని గోపము రూపు మాపఁ జూచుచున్నది. వాఁడు కాలమాసన్నమగుట నిలుపు కొనఁజాల ననుచున్నవాఁడు. కర్మ మెంత బలవత్తరమో చూడవచ్చునుగదా. సర్వాపన్మూలకము క్రోధ మనునదియే యిటఁ గలసారము. ఖరుఁ డిపుడు తదనుగుణముగా మాట లాడుచున్నాఁడు.

"న రామం గణయే వీర్యా న్మానుషం క్షీణజీవితం,
ఆత్మదుశ్చరితైః ప్రాణాన్ హతో యోఽద్య విమోక్ష్యతి." 3

అని మూలము. తొలుతనున్న బుద్ధి ఖరునకు నశించినది. ఆయు వంతమొంద నున్నది కదా. కాననే నారాముని లెక్కింప ననుచున్నాఁడు ఇది ప్రాణులకు నైజము. భయహేతువు నిర్భయహేతువుగాఁ దోఁచుట స్వభావము. "ప్రాయస్సమా పన్నవిపత్తికాలే ధియోఽపి పుంసాం మలినా భవంతి" అన్న సూక్తి కలదు కదా. ముందున్నజ్ఞానము క్రోధోల్బణమునఁ గప్పఁబడినది. యుద్ధము కావలయునుగదా. శాంతము పొనుగు పడవలయు. క్రోధాగ్ని ప్రజ్వలింపవలయును. కనుకనే తదను గుణముగా బుద్ధి మార్పునొందుచున్నదని మన మెఱుంగ వలయును.

"బాష్పస్సంహ్రియతామేష సంభ్రమశ్చ విముచ్యతాం,
అహం రామం సహ భ్రాత్రా నయామి యమసాదనం." ౪

అను నీనాలుగుశ్లోకములకు విశేషార్థము లేవనఁగా: రాముని జయింపఁజాలను. ఆరాముఁడే నాప్రాణములను బాపఁగలఁడు. ఓక్రూరురాలా! నీయపచారవ్యాపారములచే నాక్షేమము హతమయ్యెను. నాయైశ్వర్యము క్షణజీవితము నష్టమయ్యెను.

ఇంకఁ గన్నీరు వదలనేల? త్వరపడుటయేల? నేను సోదరుం గూడి రాముని చెంతకుం బోయెద. యమసదనమునకుంగూడఁ బోవుదును. సంశయమే లేదు. అను నీయర్థము వాల్మీకిపదముల కూర్పువలనఁ దేలుచున్నదని మహేశ్వరతీర్థులు వ్రాసిరి. ఈ సందర్భమున మనకొక్కవిషయము స్పష్టమగుచున్నది. ఆసన్న మరణులకు బుద్ధి మార్పునొందును. భావిఫలానుగుణముగ నయ్యది మాఱునని భావము. తత్పూర్వమున్న యూహా లన్నియు నపుడు తాఱుమాఱగును. కావున మనకు స్వాతంత్ర్యమే లేదనియుఁ గలదనుకొనుట వెఱ్ఱితనమనియుఁ దేలుచున్నది. ఈవిషయమును జక్కఁగా నెఱింగితిమేని కర్మము బలవత్తరమనియు మనము పరవశులమనియు నెఱుంగఁ జాలుదుము. ఈజ్ఞానమున దుఃఖము క్రమముగా క్షీణించును. దుఃఖనివృత్తియే కదా భగవత్సేవకు ఫలము. కావున రామా యణమును బఠించునపుడు దానియర్థమును దత్సారమును విమర్శించి గ్రహింపవలయును.

"అగ్రే నిర్యాతు మిచ్ఛామి పౌలస్త్యానాం మహాత్మనాం,
వధార్థం దుర్వినీతస్య రామస్య రణశోభినః." ౧౭

అని మూలము. లోపల వ్రాసినతాఁపులఁ గలవిశేషార్థమును గోవిందరాజులు వ్రాయకపోయినను, ఈశ్లోకమున విధిలేక వ్రాసిరి. కావున లోపలియర్థములుకూడ సమంజసములే యని యొప్పినట్లే యెన్నఁదగును. "పౌలస్త్యానాం వధార్థమితి దైవీ వాక్ భావిసూచనీ" అని గోవిందరాజులు. "దుర్వినీతస్య దుష్టేషు వినీతస్య రామస్యాగ్రే పౌలస్త్యానాం రాక్షసానాం వధార్థం నిర్యాతుమిచ్ఛామీతి సంబంధః" అని మహేశ్వర తీర్థులు. రామునిముందఱ పులస్త్యవంశజులగు రావణాది

రాక్షసులవధముకొఱకుఁ బ్రయాణము చేయఁ గోరుచున్నాను. అనునర్థము నిరువురు నంగీకరించిరి దైవవాక్కు ఖరునినోట నుండి వెడలెనని గోవిందరాజు లంగీకరించినపుడు పెక్కు తావుల నట్టియర్థము గలదన్న వాదమునకు వారు బదులుపలు కఁజాలరు. ఖరుఁడు శాపవిముక్తికాలము రాగా భావిఫలము పురికొలుపుచుండఁగా ముందున్న తలంపులు మాని రావణాది రాక్షసులకుఁ జావు గూర్పఁగోరి నేను ముందుగాఁ బోవు చున్నాఁడనని పలికెను. అనునదియేకదా దైవీవాక్కనునది. భగవతి మహాప్రకృతి ప్రోత్సహింపఁగా నతఁడు శ్రీరాముని మూలమున మృతిగలదని యెఱింగినట్లే పలికెనని మనము గ్రహించిన నించుకంతయు బాధ లేదు. మొత్తముమీఁద మన కీభాగము పౌరుషమునకన్న దైవమే బలమైనదని బోధించు చున్నది. కర్మసిద్ధాంతతత్త్వమును విశదీకరించుచున్నది. ఇఁక నీకథాఫలభూతమగు శ్రీరామప్రవృత్తిని బరికింతము.

## ఖరాదుల కనేకదుశ్శకునములు తోఁచుట.

* మహాసేనయు ఖరాదివానవోత్తములు జనస్థానము నుండి పయనము కాఁగానే గార్దభవర్ణముగల గొప్పమేఘ మాసైన్యముపయి రక్తజలమును గురిసెను. ఖరునిరథము నకుఁ గట్టియున్న వేగవంతము లగునశ్వములు నడుచునపుడు మార్గము సమముగానుండి యందుఁ బూవులు చల్లఁబడి యున్నను దైవవశమున నేలఁబడినవి. సూర్యునిమండలము నకుఁ జుట్టును నల్లగను గొసలయం దెఱ్ఱగను జక్రాకారముగ నున్నకొఱవివలెఁ బరివేషము పొడసూపెను. పెద్దగ్రద్ద

* ఇది: యిరువదిమూఁడవసర్గమునఁ గలదు.

బంగరు స్తంభముపైఁ గట్టఁబడినధ్వజము నాక్రమించి నిలిచెను. మాంసముం దినుమృగములు పక్షులును జనస్థానముచెంతఁ జేరి ఘోరధ్వను లొనరించెను. నక్కలు సూర్యున కభిముఖముగా నుండి యమంగళమును దెలుపుచుఁ గూసెను. పగిలినకొండల పిండువలె భయంకరముగా మేఘములు రక్తజలమును గురి యుచు నెల్లయెడల నల్లుకొనెను. చీఁకటి యెల్లతావుల నిండెను. దిగ్విదిక్కులు నదృశ్యములయ్యెను. సాయంకాలము కాకపోయెను. సాంధ్యరాగము తోఁచెను. క్రూరసత్వములు పక్షులు రాపులుఁగులు నక్కలు గ్రద్దలు ఖరున కభిముఖములై భయము రాఁగలదని తెలుపుచుఁ గూయిడెను. యుద్ధము తప్పక గలిగించునవియు భయమును దెలుపునవియు నగుసృగాల ములు సేనలయెదుట నోటినుండి నిప్పుకణములు వెడలుచుండఁ గూయసాగెను. సూర్యునకు దగ్గరఁగా నినుపగుదియవంటి నీల వర్ణముగల మనుష్యశరీరము శిరోహీనమై కనఁబడెను. పర్వ కాలము కాకయున్నను రాహువు సూర్యుని గబళించెను. ప్రతికూలవాయువులు విసరసాగెను సూర్యుని కాంతి మాసెను. నక్షత్రము లగపడెను. సరస్సులు చేపలు జలపక్షులు జలముల నడంగఁగాఁ దామర లెండిపోవఁగాఁ గాంతిమాయ నొక వింతగాఁ గనంబడియెను. ఆసేనలయందు గాలిలేకున్నను బూడిదరంగుగలధూళి లేచెను. పారావతములు చీచీ కూచి యను పలుకులు కఠినములుగాఁ బలుకసాగెను. కనులకు భీతి గొలుపుచుఁ బిడుగులు పడసాగెను. వనపర్వతములతో భూమి కంపించెను.

ఖరాసురుఁడు రథముపైనుండి గర్జించుచుండఁగా వాని యెడమ భుజము కంపించెను. కంఠరవము తొలుమాఱి

య్యెను. వాఁడు నాల్గుప్రక్కలఁ జూడఁగాఁ గారణములేకయే కన్నులనుండి జలము స్రవించెను. వానిశిరస్సునం దొకవింత మార్పు పొడసూపెను. ఇన్ని దుశ్శకునములు తోఁచుచున్నను యుద్ధాభిలాషము నతఁడు మానఁడయ్యెను. ఆయుత్పాతముల సరకుచేయక నవ్వుచు రాక్షసులం గని యీయుత్పాతముల నే నించుకంతయు లెక్కింపను. నాకుఁ గోపము పొడసూపిన యెడల నానిశాతమార్గణములు నక్షత్రములఁ గూల్పఁగలవు. మృత్యువునకు మృతిని గూర్పఁజాలుదును. వాఁడిబాణములు వైచి గరువమున విజృంభించు రామలక్ష్మణులఁ జంపక మరలి రాను. నాతోఁబుట్టువు చుప్పనాతి వారిరక్తము త్రావి తన వాంఛను దీర్చుకొనుఁగాక. ఆమెమూలముననఁగదా వారలకుఁ గష్టములు గలిగెను. ఇంతదనుక నాకెందు నపజయము కల్గినదే లేదు. ఇది మీకుం గ్రొత్తది కాదుకదా. నే నసత్యమాడ లేదు. కోపించితినేని నే నైరావతముపైనున్న వజ్రిని వధింపఁ జాలుదును. ఇఁకఁ దుచ్ఛమానవు లగువారిమాట యేటికి? వా రామాటలకు మృత్యువశమున నున్నవారలాట సంతోషించిరి.

దేవతలు మునులు లోనగువారు యుద్ధమును జూడఁ గోరి యచ్చోటికి వచ్చిరి. దేవర్షులెల్లరు నొక్కటిగాఁ గూడి పరస్పరము గోవులకు బ్రాహ్మణులకు లోకహితముగోరు మహాత్ములకు శుభమగునుగాక. చక్రపాణి విష్ణువు రణమున నసురుల జయించినరీతి రామమూర్తి పౌలస్త్యుల నందఱ జయించుంగాక. అని చెప్పుకొనిరి. వారెల్లరు విమానారూఢులై గోబ్రాహ్మణులకు మేలు గలుగుఁగాక యను మొదలగుమాటలు చెప్పుకొనుచు నాయురంతమును గాంచనున్న యారక్కసులం గాంచిరి.

ఖరుఁడంత రథముపై నుండి సేనలు కొలువఁగా ననికి నడచెను. సేనలు వెడలెను. శ్యేనగామియుఁ, బృథుగ్రీవుఁడు, యజ్ఞశత్రుఁడు, విహంగముఁడు, దుర్జయుఁడు, కరవీరాక్షుఁడు, పరుషుఁడు, కాలకార్ముకుఁడు, మేఘమాలియు, మహామాలియు, సర్పముఖుఁడు, రుధిరాశనుఁడు నను నీద్వాదశసంఖ్యగల మహారాక్షసులు ఖరునిం జుట్టుముట్టి సేవించుచు నడచిరి. మహాకపాలి, స్థూలాక్షుఁడు, ప్రమాథియుఁ,ద్రిశిరుఁడు నను నలువురు సేనాపతులు దూషణుని బరివేష్టించి ప్రయాణము సాగించిరి. మహారాక్షసులు వారెల్లఁ గుజాదిగ్రహములు చంద్రసూర్యులం బొందునట్లు శ్రీరామలక్ష్మణులకడకుం బోయిరి.

మహామతులారా! ఈభాగమున నేమి కలదనరాదు. అనేకముఖ్యవిషయము లిందుఁ గలవు. వానిం బరికింతము.

"కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తు మిహ ప్రవృత్తః,
ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః.　　3౨
తస్మాత్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధం,
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్.　　33
ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాన్యానపి యోధవీరాన్,
మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్." 3౪.　　గీత. ౧౧ అధ్యా.

అను నీభగవద్వాక్యములు సత్యములు కదా. వారివారికర్మ ములననుసరించి యాయాఫలముల నాయారూపముల భగ వంతుఁడే వారికిఁ గల్గించుచుండును. సుఫలదుష్ఫలములకు నొరులు కర్తలు గారు. తమకుఁ దమరే కర్తలు. ఇతరులు నిమిత్తమాత్రముగ నుందురు. ప్రాకృతులు వారిమూలమున నాదుష్ఫలములు తమకుఁ గల్గినవని భావించి వారిని దూషించి మరల నట్టిఫలములనే వారలకుం గల్గింపఁబూనుదురు. అప్రా కృతులు కర్మములతత్త్వ మెఱుంగుదురుగాన నొరుల దూఱక విశేషించి వారలం బొగడుదురు. పండితపామరులకుం గలభేద మీయదియే. కర్మఫలముల నాభగవంతుఁడే కల్గించువాఁడు. ప్రకృత మీసిద్ధాంతమును సమన్వయము చేయుదము భగ వంతుఁడు ఖరాదులగు దానవులకు శాపవిముక్తిని బ్రసాదింప నెంచెను. శ్రీరామరూపమున నిలిచెను. శూర్పణఖ యించుక కారణభూతురాలయ్యెను. ఆమెమాటలకు వారు లోఁబడిరి. వారికర్మము క్రోధమును గల్గించెను. దానిచే వారెల్ల నొడలు తెలిసికొనఁజాలకపోయిరి. భావిఫలమును శకునములు తెలుపు ననువిషయ మిందుఁ గలదు. కర్మము బలవత్తరముగ నుండఁగా నెన్నిదుశ్శకునము లైనను బ్రాణులు వానిని లెక్కింపరు. అదృశ్యపాశము లవ్వారిని లాగుచుండును. మృత్యువు చెంతకే వారు లాగఁబడుదురు. పరవశులుగావున స్వబుద్ధిబలముపై వారాధారపడియుండఁజాలరు. లక్షణములు గురూపదేశములు మిత్రహితవాక్కులు వారికి వెగటుగా నపుడు తోఁచును. జ్ఞాని యొక్కనికే అట్టితఱుణముల శాంతి నెలకొనును. కాని యాతఁడు కూడఁ గర్మబద్ధుఁడే. కాని సుఖదుఃఖములు సమము

లుగా భావించువాఁడు కాన గష్టములయందు దుఃఖింపక దానిని సుఖముగానే యనుభవించును.

"యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః,
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః. ౧౯
త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః,
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః." ౨౦. గీత. ౪ అధ్యా.

అను నీగీతావాక్యముల ననుసరించి తత్త్వవేత్త యుండి భగవదనుగ్రహమునకుఁ బాత్రుఁడగును. సామాన్యు లట్లుగాక పలువిధముల వెతలఁ గుడుతురు. ప్రకృత మనుసరింతము.

"జనస్థానసమీపే తు సమాగమ్య ఖరస్వనాః,
విస్వరాన్ వివిధాం శ్చక్రుర్మాంసాదా మృగపక్షిణః. ౫
వ్యాజహ్రుశ్చ ప్రదీప్తాయాం దిశి వై భైరవస్వనం,
అశివం యాతుధానానాం శివా ఘోరా మహాస్వనాః." ౬

అని మూలము. మృగపక్షిజాతులలోఁగూడ మాంసభక్షణము చేయునవి క్రూరములేయని యీరామాయణము తెలుపుచున్నది. మీమాంసము మాకాహారము కాఁగలదు. త్వరగఁ బొందు. అని రాక్షసుల నవి ప్రోత్సహించుచున్నవని మన మూహింపవలయు. సూర్యుఁడున్నదిక్కును జూచుచు ధ్వని చేయు క్రూరమృగపక్షు లశుభఫలమునే తెలుపుననికదా దీని నుండి మనము గ్రహింపవలయును. ఇందొకవిచిత్రము కలదు. పరికింపుఁడు.

"ప్రభిన్నగిరిసంకాశాస్తోయశోణితధారిణః,
ఆకాశం తదనాకాశం చక్రుర్భీమా వలాహకాః. ౭
బభూవ తిమిరం ఘోరముద్ధతం రోమహర్షణం,
దిశో వా విదిశో వాపి న చ వ్యక్తం చకాశిరే. ౮

క్షతజార్ద్రసవర్ణాభా సంధ్యాకాలం వినా బభౌ,
ఖరస్యాభిముఖా నేదుస్తదా ఘోరమృగాః ఖగాః. ౯

కబంధః పరిఘాభాసో దృశ్యతే భాస్కరాంతికే. ౧౧

జగ్రాహ సూర్యం స్వర్భానురపర్వణి మహాగ్రహః,
ప్రవాతి మారుతశ్శీఘ్రం నిష్ప్రభోఽభూద్దివాకరః. ౧౨

ఉత్పేతుశ్చ వినా రాత్రిం తారాః ఖద్యోతసప్రభాః,

అను నీమూలము లొకదానికి నింకొకఁడు విసంవాదములుగా నున్నవి. ఆకాశమంతట మేఘము లావరించెను. అంధకార బంధురముగా నాకాలముండెను. దిక్కులు తెలియకయుండెను. సంధ్యాకాలముననుండు రక్తకాంతి వ్యాపించెను. సూర్యుని చెంత శిరస్సులేనిదేహముకనఁబడెను. గాలిగాఢముగావీచెను. సూర్యుఁడు కాంతి హీనుఁడయ్యెను. ఈగుఱుతు లెట్లు కల్గును? ఒకదానికింకొకటి విరోధముకదా. అనిప్రశ్నించువా రుందురు. క్షణకాల మంధకారము. క్షణకాలము రవిప్రకాశము. రవంత సేపు మేఘాడంబరము కలిగెనని మనము గ్రహించినయెడల మనకీచిక్కులుకలుగవు. ఉత్పాతములు క్షణకాలముండునవియే గాని నెలలకొలఁదిగ నుండవుకదా. అర్థము గ్రహించుటలో నీభేదము కనంబడును. ఎల్లతావుల నిందుఁ గలవిషయ మేమి యని పరికింపవలయుఁగాని యెట్లుగా నిందాక్షేపింపవచ్చునా యని పరికింపరాదు. దోషజ్ఞుఁడు కావలయునుగాని దోషైక దృక్కు గారాదు. పున్నమ అమవస కాకపోయినను రాహువు సూర్యుని మ్రింగె ననువిషయ మిందుఁగలదు. గ్రహణమనఁగా రాహుకేతువు లను నిరువురు రక్కసులు చంద్రసూర్యుల మ్రింగుదురని పురాణమున గాథలు కలవు పర్వములు కాని యపుడు వారికి వీరిపైఁ గోపమేల రాదో తెలియరాదు. పామరు

లకు గ్రహణకాలములయందు సూర్యచంద్రగ్రహములఁగూర్చి ప్రార్థింపవలయు నను విషయమును బోధించుటకే యీ విషయము కల్పింపఁబడినది. అంతియకాని గ్రహణతత్త్వము వారలకుఁ దెలియక కాదు.

"ఛాదకో భాస్కరస్యేందు రధస్థో ఘనవద్భవేత్,
భూచ్ఛాయాం ప్రాఙ్ముఖశ్చంద్రో విశత్యస్య భవేదసౌ."

అని సూర్యసిద్ధాంతము తెలుపుచున్నది.

"ఛాదకః పృథురతస్తతో విధో రర్ధఖండితతనోర్విషాణయోః,
కుంఠితా చ మహతీ స్థితిర్యతో లక్ష్యతే హరిణలక్షణగ్రహే.    ౭
అర్ధఖండితతనోర్విషాణయో స్తీక్ష్ణతా భవతి తీక్ష్ణదీధితేః,
స్యాత్స్థితిర్లఘుతరో లఘుః పృథక్ ఛాదకో దినకృతోఽవగమ్యతే.    ౮
దిగ్దేశకాలావరణాదిభేదా న్నచ్ఛాదకో రాహురితి బ్రువంతి,
యన్మానినః కేవలగోలవిద్యా స్తత్సంహితా వేదపురాణబాహ్యం.    ౯
రాహుః కుభామండలగశ్శశాంకం శశాంకగశ్ఛాదయతీ న బింబం,
తమోమయశ్శంభువరప్రదానా త్సర్వాగమానామవిరుద్ధమేతత్."    ౧౦
సిద్ధాంతశిరోమణి, గోళాధ్యాయము.

అని ఖగోళశాస్త్రము తెల్పుచున్నది. పురాణములయందు దీనికి విరుద్ధముగా నుండ నేల? అనరాదు. "కథాచ్ఛలేన బాలానాం నీతి స్తదిహ కథ్యతే" అన్నయట్లు పురాణములు విషయము కథారూపముగాఁ దెలుపుచుండును. కాని పురాణకర్తల కీవిషయము తెలియదనుట మహాపచారము. గ్రహణకాలముల రవిచంద్రబింబములను జూడరాదనియు నియతుఁడై మంత్రముల నుపాసింపవలయుననియుఁ బురాణములు హెచ్చరించుచుండును. అట్టికాలముల నుపాసకునకు ధ్యాననిష్ఠనొందు

టయే విధి. గ్రహణము చూడరాదనుటకుఁ గారణముగా సర్పము మ్రింగును. వారు శ్రమంపడుదురు కానఁ జూడ రాదని కల్పింపఁబడినది. ఇంతమాత్ర మాలోచింపక మనము పురాణముల నిందించుట పొరపాటు గాక మఱేమగును? రంధ్రాన్వేషణమునకుఁ బ్రయత్నించు టుత్తమస్వభావము కాదు.

"తాన్ సమీక్ష్య మహోత్పాతానుత్థితాన్ రోమహర్షణాన్,
అబ్రవీద్రాక్షసాన్ సర్వాన్ ప్రహసన్ స ఖర స్తదా." ౧౭

అని మూలము. అవి యుత్పాతము లనఁగాఁ బీడాకరములని యెఱింగియు ఖరుఁడు నవ్వుచు నిట్లు పలికెను. ఖరున కవి శుభకరములే. తుచ్ఛశరీరము నశించి యుత్తమశరీరము రానున్నది. కనుకనే వాఁడు నవ్వెను. ఆగామిఫలముల ననుస రించి స్వభావము మాఱుచుండునుగదా. భావిఫల మత్యుత్త మము. భగవత్సందర్శనము కానున్నది. వారియెదుట మరణము సంభవింపఁబోవుచున్నది.

"అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరం,
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః. ౫
యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరం,
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః. ౬. గీత. ౮ అధ్యా.

అన్న భగవద్వాక్యము వృథ గాదుకదా. భగవంతుని గన్నులారఁ గాంచుచునే ప్రాణము వదలఁజాలుభాగ్యము రానై యున్నది. వాఁ డానందించుకాలమే యది కావుననే 'ప్రహసన్' అని మహాకవి ప్రయోగించి ధన్యుఁడయ్యెను.

"రాఘవం తం బలోత్సిక్తం భ్రాతరం చాస్య లక్ష్మణం,
అహత్వా సాయకైస్తీక్ష్ణైర్నోపావర్తితుముత్సహే." ౨౧

అని మూలము "వస్తుతస్తు. అహత్వా నోపావర్తితుముత్సహే ఇత్యనేన హత్వైవోపావర్తితు ముత్సహ ఇత్యభిప్రాయః. హంతు మసమర్థః అతో నోపావర్తత ఇతి వ్యజ్యతే." అని మహేశ్వరతీర్థులు. భగవంతు నెఱుంగక మరలిరా. నన్ఁగా భగవంతుని జక్కఁగా నెఱింగి మరలుదునని భావము.

"నను రామస్య అమానుషచరిత్రం జ్ఞాత్వా యుద్ధాగమనవేళాయాం స్వస్య దుర్నిమిత్తాని దృష్ట్వా చ ఖరో నిర్భీకః ప్రవృత్తః కిమర్థమభూదిత్యాశంకాయా ముచ్యతే. పురా తు యాజ్ఞవల్క్యసుతాశ్శివేన శప్తాః పునరను గృహీతాః రాక్షసత్వమోక్షాయ. తే చ ఖరదూషణత్రిశిరసో బభూవుః. తచ్ఛాపనివృత్త్యర్థం శివస్త్రిగుణాత్మకే రామే స్వాంశం ఖరాదివధకాలే న్యవేశయత్. తస్మాచ్ఛాపనివృత్తి ర్భవిష్యతీతి. తద్వాసనావశాత్ ప్రమోహో జాత ఇత్యవిరోధః. శేషధర్మస్థభీష్మయుధిష్ఠిరసంవాదకథాత్రానుసంధేయా." అని టీక. ఈకథ ముందే వ్రాసితిని. ఖరాదివధకాలమునందు శంకరుఁడు స్వాంశమును రామునియందుఁ బ్రవేశింపఁజేసెను. అద్దానిచే శాపవిముక్తి యగునని. ఈటీక యాశయము.

"ఆదావభూచ్ఛతధృతీ రజసాస్య సర్గే
విష్ణుస్థితౌ క్రతుపతిర్ద్విజధర్మసేతుః,
రుద్రోఽప్యయాయ తమసా పురుషస్స ఆద్య
ఇత్యుద్భవస్థితిలయాస్సతతం ప్రజాసు." ౫

భాగ. ౧౧ స్కం. ౪ అధ్యా.

"యోఽసృజద్దక్షిణాదంగా ద్బ్రహ్మాణం లోకసంభవం,
వామపార్శ్వా త్తథా విష్ణుం లోకరక్షార్థ మీశ్వరం: ౩౫౧

యుగాంతే చైవ సంప్రాప్తే రుద్రమీశోఽసృజత్ప్రభుః." ౩౫౨
అనుశాస. పర్వ. ౧౪ అధ్యా.

"త్రయాణామేకభావానాం యో న పశ్యతి వై భిదాం,
సర్వభూతాత్మనాం బ్రహ్మన్ స శాంతి మధిగచ్ఛతి." ౫౪
భాగ. ౪ స్కం. ౭ అధ్యా.

"స ఏష రుద్రభక్తశ్చ కేశవో రుద్రసంభవః,
సర్వరూపం భవం జ్ఞాత్వా లింగమర్చయతి ప్రభుః." ౯౭
ద్రోణ పర్వ. ౨౦౨ అధ్యా.

అను నీమొదలగు ప్రమాణముల ననుసరించి శివకేశవబ్రహ్మల కభేదము. వీరు మూవు రస్వతంత్రులు. వీరు భగవదంశములే. ప్రకృతివశంగతులు. కనుక నే యొకరిచ్చినవరము నింకొకరు పాలింతురు. ఖరాసురునివధకాలమున శ్రీరామునియందు శంకరునంశము ప్రవేశించెననఁగా శ్రీరాముఁడు తమోగుణప్రధానుఁడుగా నపుడుండెనని భావము. ఇంతమాత్ర మర్థము మనము గ్రహింపఁజాలక పోయినచో మనకు భగవంతుఁడొసంగినబుద్ధి నిరుపయోగ మనవలసినదే. మధ్వవైష్ణవు లిద్దానిం గాంచి యెగిరిపడుదురేమోగాని మతిమంతు లానందింపక మానరు. శ్రీకృష్ణుఁడు శివభక్తుఁడు. శివుఁడు హరిభక్తుఁడు. అని వారివాక్కులనుండియే స్పష్టమయ్యెడిని. ఇరువురకభేదమే యనియుఁ దేలెడిని. భేదము కల్పించువారు మూఢులనియు వారిమాటలనుండియే స్పష్టమగుచున్నది. ఇట్టు లుండఁగా మధ్వవైష్ణవు లులికిపడనేల? శ్రీభాగవతము విష్ణుపురాణము మహాభారతము హరివంశములోనగు గ్రంథములన్నియు నొక్కవిధముగా శివవిష్ణ్వభేదమునే తెలుపుచున్నవి కనుక

శ్రీరామునియందు శివుఁడాత్మాంశమును ఖరాదులవధించు కాలమునఁ బ్రవేశపెట్టె ననువిషయమున ననుమానింపఁదగిన దేదియుఁ గానరాదు.

"సకామా భగినీ మేఽస్తు పీత్వా తు రుధిరం తయోః,
యన్నిమిత్తస్తు రామస్య లక్ష్మణస్య విపర్యయః." ౨౨

అని మూలము.

"యా శూర్పణఖా నిమిత్తం యస్య విపర్యయస్య స తథోక్తః. విపర్యయో నాశః. సా భగినీ యన్నిమిత్త ఇతి. వస్తుతస్తు రామస్య లక్ష్మణస్య చ జయ ఇతి శేషః. మే మమవిపర్యయః నాశశ్చ యన్నిమిత్తః యా శూర్పణఖా నిమిత్తం యస్య సః సా భగినీ తయోస్తాభ్యాం మృతస్య మమేతి శేషః. రుధిరం పీత్వా సకామాస్తు."

అని మహేశ్వరతీర్థులు. నామరణమునకు నేశూర్పణఖ కారణ భూతురాలగునో యామె శ్రీరామలక్ష్మణులు జయింపఁగా సఫలమనోరథ యగును. అని ఖరుని భావము. ఈభావము సుసంగతమే యనుటకుమున్ను చూపిన యుదాహరణము లే చాలును. దీనిఫలము రాఁగలశ్లోకమునఁ దేలెడిని.

"న క్వచిత్ప్రాప్తపూర్వో మే సంయుగేషు పరాజయః,
యుష్మాకమేతత్ప్రత్యక్షం నానృతం కథయామ్యహం." ౨౩

అని మూలము. ఖరాసురుఁ డిందుమూలమున స్వాభిప్రాయ మును విశదీకరించెను. సైనికులారా!యుద్ధములయం దెప్పుడు గాని నాకుఁ బరాజయము పూర్వము కలుగలేదనుమాట మీ రెఱింగినదియే కదా. నే ననృతము వచింపను. అనఁగా భావ మేమి? ఇంతకుముం దెన్నఁడు యుద్ధములయందు నాకుఁ బరాజయము కల్గినది లేదు. ఇపుడేమో యనియే కదా యీ ఖరునిభావము. ఇంకను బరికింపుఁడు.

"దేవరాజమపి క్రుద్ధో మత్తైరావతయాయినం,
వజ్రహస్తం రణే హన్యాం కిం పునస్తౌ కుమానుషౌ." ౨౪

అని మూలము. కుమానుషౌ = నీచమానవులనునది ప్రాతీతికార్థము. వాస్తవార్థము- కు=భూమియందు మానుషౌ=మనుష్యులుగా నవతరించినవారని యర్థము. అవతారపురుషులని యర్థమయ్యెను గదా. ఖరుఁ డిట్లు రెండర్థములుగా మాటలాడెనా యనరాదు. పదములకూర్పునుబట్టి యూహింపవలసి యున్నది. భావికర్మప్రచోదితుఁ డగునరుఁడు పలుకు టసంగతము కాదు.

"సమీయుశ్చ మహాత్మానో యుద్ధదర్శనకాంక్షిణః. ౨౬
ఋషయో దేవగంధర్వాస్సిద్ధాశ్చ సహ చారణైః,
సమేత్య చోచుస్సహితా స్తేఽన్యోన్యం పుణ్యకర్మణః. ౨౭
స్వస్తి గోబ్రాహ్మణేభ్యోఽస్తు లోకానాం యేఽభిసంగతాః,
జయతాం రాఘవస్సంఖ్యే పౌలస్త్యాన్ రజనీచరాన్. ౨౮
చక్రహస్తో యథా యుద్ధే సర్వానసురపుంగవాన్,
ఏతచ్చాన్యచ్చ బహుశో బ్రువాణా పరమర్షయః. ౨౯
జాతకౌతూహలా స్తత్ర విమానస్థాశ్చ దేవతాః,
దదృశుర్వాహినీం తేషాం రాక్షసానాం గతాయుషాం." ౩౦

అని మూలము. ఇందు విశేషాంశ మొక్కండు కలదు. "జయతాం జయతు. ఆర్షమాత్ర మేపదమ్." అని గోవిందరాజులు. ఋషులప్రయోగమనఁగాఁ దప్పులేదని యాభావము. "ప్రమాదో ధీమతామపి" అనుట యింతకన్న మిన్నయని యెన్నువాఁడను. "సమేత్య చోచుస్సహితా స్తేఽన్యోన్యం" అనుటంజేసి మునులు దేవతాదులు విమానముపై నుండిరనియేకదా భావము. క్రింద మునులు పైన దేవగంధ

ర్వాదు లుండిన మాటలాడు టెట్లు? మును లెందులకో దేవ లోకమునకుంబోయియుండి దేవతలంగూడి వచ్చియుందు రను కొనవలయును. గోవులకు బ్రాహ్మణులకు లోకముల కుప కారము చేయు మహాత్ములకును మేలు కలుఁగునుగాక. అనఁగా రాక్షసభయము నశించి శాంతి నెలకొనుఁగాక యని కోరిరి. తక్కినవారికి నమంగళముం గోరిరా యనరాదు. "గోబ్రాహ్మణేభ్యశ్శుభమస్తు నిత్యమ్." అను పెద్దలవాక్యము పక్షపాత మును సూచింపలేదా యని ప్రశ్నింపరాదు. 'గోమానవేభ్యః' అనిన బాగుండునుగదా యనియు నడుగరాదు.

"స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీంద్రాః,
గోబ్రాహ్మణేభ్యశ్శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తాస్సుఖినో భవంతు."

అనునదియే ప్రాచీనులవాక్యము. దీనియర్థమేమని విమర్శింపక పక్షపాతము కదా యనరాదు. గోవులకొఱకు బ్రాహ్మణుల కొఱకు నిరంతరము శుభము కలుగుఁగాక అని యందఱు కోరవలెననియే వాక్యసారము సమస్తా లోకాః తక్కినవారం దఱు సుఖవంతులుగా నుందురుగాక. అనియుఁ గోరవలయు ననియేకదా దీనితాత్పర్యము. విమర్శింపుఁడు. "శోభత ఇతి శుభం. శుభ శోభనే" అని ధాత్వర్థము. ఒప్పెడునది యని దానియర్థము. 'శుభ దీప్తౌ' అనియు ధాత్వర్థము కలదు. ప్రకాశము కలదని భావము. గోవులకు బ్రాహ్మణులకు శాంతమే యొప్పుఁగాక యని భావము. పశుజాతిలో గోవులకు మానవజాతిలో బ్రాహ్మణులకు శాంత మొప్పియుండవలయు నని భావము. దీప్తి యనునది శాంతమూలకమని భావము.

సుఖమనఁగా "సుఖయతీతి సుఖం ఆత్మవృత్తిగుణవిశేషః" అని తర్కమతము. 'మనసో ధర్మః' అని వైదాంతికులు. తర్కమతమునందు "జగతాం కామ్యం ధర్మజన్యమిదమ్. సుఖం తు జగతామేవ కామ్యం ధర్మేణ జన్యతె, అధర్మజన్యం దుఃఖం స్యాత్ప్రతికూలం న చేతసామ్. మనోగ్రాహ్యం సుఖం దుఃఖమిచ్ఛాద్వేషో మతిః కృతిః." అని శబ్దకల్పద్రుమము. "శోభనాని ఖానీంద్రియాణ్యస్మిన్నితి సుఖమ్." ఇంద్రియముల నాప్యాయనము చేయునది. పదప్రయోగ మెంత చక్కఁగా నున్నదో యూహింపుఁడు.

"విప్రాణాం జ్ఞానతో జ్యైష్ఠ్యం క్షత్రియాణాం తు వీర్యతః,
వైశ్యానాం ధాన్యధనతశ్శూద్రాణా మేవ జన్మతః." ౧౫౫
మను. ౨ అధ్యా.

అని మనుస్మృతి విప్రులకు జ్ఞానమువలననే పెద్దతనమని తెలుపుచున్నది జ్ఞానము శాంతిమూలకము. తేజస్సు జ్ఞానమూలకము. 'బ్రహ్మతేజో బలం బల'మ్మనుసూక్తి ప్రసిద్ధమే కదా. పౌరుషప్రధానులు కారాదనికదా దీనిభావము. తక్కిన వారలు "సుఖినో భవంతు" ఇంద్రియసుఖము ప్రధానముగా నొందుదురుగాక యని యాశీర్వాదము. బ్రాహ్మణులకు సుఖమే వలదనియు నితరులకు జ్ఞానమే పనికిరాదనియు దీనితాత్పర్యము కాదు. సామాన్యధర్మమునే యిది తెలుపును. ఇంతయర్థముగల యీప్రాక్తనవాక్యము నీకాలపువా రోర్వఁజాలక మార్పులచే నింపిరి. 'గోబ్రాహ్మణేభ్యః' అనుచోట 'గోభ్యః బ్రాహ్మణేభ్యః అబ్రాహ్మణేభ్యః' అనియు పదవిభాగము చేయవచ్చును. ఎల్లరకు ననునర్థముకూడ నందే కలదు. 'గోసజ్జనేభ్యః' అని మార్చిన

పక్షమున 'గోభ్యస్సజ్జనేభ్యః అసజ్జనేభ్యః' అనియుఁ జెప్ప వచ్చునే. అప్పుడీవాంఛ దుర్వ్యయముచేసిన ట్లగునుగదా. ప్రాచీనుల కిట్టిదుష్పతపాతము లేదు. వారివాక్యములఁ గల యర్థమును గనుఁగొనఁజాలని మనకే యిట్టి పట్టిపతపాతము లుండును. మఱియు దేవతలు ఋషులు వచ్చుచున్న రక్కసులు గతాయుషులని తెలిసికొనిరి. భగవంతుని మహత్త్వ మెఱుంగుదురు. గావున వారింకఁ బొలియుటకే వచ్చుచున్నారని యెఱింగిరని భావము. తేజోవిశేషమున మహర్షులు భావికర్మ ఫలములఁ గనుఁగొనఁగలరు. విష్ణు వెట్లు రాక్షసులం జంపెనో యట్లే యీరాముఁడు ఖరాదులం జంపుఁగాక యని కోరుటం జేసి శ్రీరామునియందుఁ త్రిమూర్తుల ప్రధానగుణములగు సత్త్వరజస్తమస్సులు ప్రధానములుగా నెలకొనియున్నవని యేర్పడును. లేకున్న విష్ణువే రాముఁడైనప్పుడీకోరిక లెందులకు?

"సా భీమవేగా సమరాభికామా మహాబలా రాక్షసవీరసేనా,
తౌ రాజపుత్రౌ సహసాభ్యుపేతా మాలాగ్రహాణామివ చంద్రసూర్యౌ" 3౯

అని మూలము. అంగారకాదిగ్రహములగుంపు చంద్రసూర్యుల నొందినట్లు రక్కసులసేన శ్రీరామలక్ష్మణులుండు తావును జేరెనని వాక్యగతార్థము. కుజాదిగ్రహములు చంద్రసూర్యులచెంతకుం బోవఁగాఁ గాంతిహీనము లగును. వారి తేజస్సుముం దివి ప్రకాశింపక యడంగునని భావము. అట్లే ఖరుని వాహిని రామచంద్రుని లక్ష్మణుని జేరఁగనే తేజోవిహీనమగుటయే కాని క్షణమైన నిలువఁజాలదని తాత్పర్యము. గమ్యస్థానమును జేరినఖరాదులు వారిబలముకూడ శ్రీరామ తేజోవిశేషమున నైక్యముకావలసిన మహాయోగ మున్నం

దున వారెల్లరు కృతకృత్యులే యనవలయును. భగవంతుఁడే కదా యెల్లరకు సత్యమగు ప్రాప్యస్థానము. దానినే పొందిరి. కనుక సఫలవాంఛితులు శాపనిర్ముక్తులు నగుదురని మన మెన్న వలయును. అధ్యాత్మరామాయణమున నీభాగమున విశేష మేమియు లేదు. ఇఁక శ్రీరామమహత్త్వమును బరికించి యానందింతము.

## శ్రీరాముఁడు జయనిమిత్తములం గాంచి యుద్ధమున కాయత్తపడుట.

*ఖరాదులు రామునాశ్రమముకడకు వచ్చుచుండఁగా రాముఁడు సౌమిత్రియు మున్ను చెప్పఁబడినయుత్పాతము లనే చూచిరి. దుష్ఫలదములగు నాదుర్నిమిత్తములం గని లక్ష్మణునితో రాక్షసనాశార్థము భూతవ్రాతనాశార్థముగా నీ గొప్పదుర్నిమిత్తములు కనఁబడుచున్నవి. చూడుము. గార్దభ వర్ణము రక్తజలము గలిగిన యీమేఘము లెల్లకడల నావ రించినవి. నాయాయుధములెల్ల ధూమము వెడలఁగా సంగర మునే వాంఛించుచున్నవి. నాధనుస్సులు యుద్ధోత్సాహ మును గనఁబఱచుచు మెఱయుచున్నవి. ఇపుడు ధ్వనులు చేయు వనపక్షులను బరికింపఁగా ముందు మనకు భయము ప్రాణసంశయము గలుగునని తోఁచెడిని. గొప్పసంగరము మాత్రము సాగును. నిస్సంశయము. నాదక్షిణబాహువు పెక్కుసారులు కంపించుటంబట్టి యాలోచింపఁగా నీయుద్ధము తేటపడినది. ఇఁక వేగమ మనకు జయము శత్రువులకుఁ బరా జయము తప్పక కలుగును. లక్ష్మణా! నీమోముకూడఁ గాంతి

* ఇది యిరువదినాల్గవ సర్గమునఁ గలదు.

వెలయ సుప్రసన్నముగానున్నది. యుద్ధసమయమున నెవ్వారి మోము కాంతిశూన్యమగునో వారికిఁ బ్రాణహానియే కల్గును. రాక్షసులసింహనాదములు లోనగునవి భీతిని గల్గించునవిగా ఇవిగో వినవచ్చుచున్నవి. ఆపదవచ్చునని భయింపఁడువాఁడును, శుభము గోరువాఁడును, బండితుఁడు నగుపురుషుఁడు ఆపద రాకముందే ప్రతీకారము చేయవలయును. కావున నీవు ధనుర్బాణములు ధరించి జానకిం దోడుకొని తరువరసమాచ్ఛాదితమగు దుర్గమగుహం బ్రవేశించి కాపాడుచుండుము. ఈ మాటకు నీవు బదులు పలుకకుము. నాపాదములతోడు. ఆలసింపకుము. త్వరగఁ బొమ్ము. శూరుఁడవు, బలవంతుఁడవు నగు నీ వీదానవులనెల్లరఁ జంపఁజాలుదువు. శంక లేదు లేదు. కాని నేనే వీరినెల్లఁ జంపం దలంచియున్నాఁడను.

అనఁగా లక్ష్మణుఁడు శ్రీరామునిపలుకు లాలకించి ధనుశ్శరములఁ దాల్చి దుర్గమగుహం జొచ్చెను. అవ్వల శ్రీరాముఁ డాహా సమంజసమగు నుపాయము తోఁచినది.తమ్ముఁడు నాయానతి నొనరించినాఁడు. అని దివ్యకవచముఁ దొడిగి యయ్యది యగ్నివలె మెఱయుచుండఁగా నంధకారమందు ధూమములేక మండునగ్నివలె వెలుంగుచుండెను. భూరిశరాసనమును శరములను గ్రహించి జ్యాలతికాఘోషమున దిక్కులఁ బ్రతిధ్వనింపఁజేయుచు నందుండెను. అంతలో మహర్షులు దేవగంధర్వాదులు వచ్చి యచ్చటం గూడిరి. త్రిలోకములఁగల పుణ్యకర్ములందఱు నచ్చోఁ గూడి గోవులకు బ్రాహ్మణులకు లోకోపకారకులకు మంగళమగునుగాక. రాక్షసులను విష్ణువు జయించినట్లు శ్రీరాముఁడు పౌలస్త్యులగు రాక్షసుల నందఱ జయించుంగాక. అని యొండొరులతోఁ

జెప్పుకొనుచుండిరి. వారు పరస్పరము "క్రూరకర్ములగు రాక్షసులు పదునాలుగువేలసంఖ్యగా నున్నారు. ధర్మచిత్తుఁడు శ్రీరాముఁ డొక్కఁడే. సంగర మెట్లు సాగునో" అని మెల్లఁగాఁ జెప్పుకొనిరి. దేవత్వమునొందినరాజర్షులు సిద్ధులు బ్రహ్మర్షులు లోనగువారు తమసాధనములతో విమానారూఢులై సంగరమును జూడ నంబరమున నుండిరి. అత్తఱి నత్యంత తేజస్సమాక్రాంతి మెఱయుచు యుద్ధాగ్రముననుండు శ్రీరామునిం గని భూతజాలములు భయంపడినవి. ఇతరులకుఁ గష్ట మించుకయేఁ గల్గింపని శ్రీరాము నసదృశాకార మాతరుణమున మహాత్ముఁ డగురుద్రుఁడు క్రుద్ధుఁడై యుండునపు డుండు నట్టి రూపమువలె మహాభయంకరముగాఁ గనంబడుచుండెను. మింటనుండు దేవతలు మునులు మాటలాడుకొనుచుండునపుడే రాక్షససేనలు సింహనాదములు చెలంగ రాసాగెను. నేను జయింతును నేను గెల్తునని వారొండొరులతోఁ బలుకుచు రాసాగఁగా నాధ్వని యావనమందంతటఁ గ్రమ్ముకొనియె. వన్యమృగము లాధ్వనులకు భీతిల్లి యున్నతావుననే యడఁగి యుండెను. సాగరమువలె నాసేన యాశ్రీరామునిదాపున కరుదెంచెను. శ్రీరాముఁడు రణకౌశలముకలవాఁడు కాన దృష్టి నలుదిక్కులకుం బఱపి యుద్ధముచేయవచ్చు నాఖర సైన్యముం గాంచెను. ధనుస్సు సజ్యము చేసి బాణములంగూర్చి సకలరాక్షససంహారము చేయుకోరికఁ దీవ్రక్రోధ మూని యుండెను తేజోవిశేషం బావహింప దుర్నిరీక్ష్యుండై వెలుంగు శ్రీరామునిం గాంచి వనదేవతలు భయంపడి పాఱిపోయెను. అత్తఱి నా శ్రీరాము నాకారము దక్షాధ్వరధ్వంసమునాటి మహాక్రుద్ధరుద్రాకారమువలెఁ జూడఁదరముగాకయుండెను.

ఆరాము నాకృతిం గని భూతజాలములు భయంపడినవి. సక లాభరణములఁ దాల్చి ధ్వజములు మెఱయవచ్చు నాఖరా సురుని సేన నీలమేఘమువలెఁ జెలంగుచునుండెను.

మహాశయులారా! ఈభాగమునఁ గొన్ని విశేషములు గలవు. వాని నెఱుంగుటయే మనకుఁ గృత్యము. అనతార ఫలారంభ మీభాగముకదా. ఇందు వాల్మీకిహృదయము మెఱుం గందగును. కాన జాఱవిషుపకె పరిశీలింతము.

"సధూమాశ్చ శరాస్సర్వే మమ యుద్ధాభినందినః,
రుక్మపృష్ఠాని చాపాని విచేష్టంతే చ లక్ష్మణ." 9

అని మూలము. "అభిమంత్రితతత్తద్దేవతాసాన్నిధ్యాచ్చా పేషు స్వయమేవ శరాస్సంసక్తా భవంతీత్యర్థః" అని మహేశ్వర తీర్థులు. మంత్రములయుపాసించుమార్గము రెండువిధములు. అస్త్రరూపముగా శత్రుధ్వంసము చేయుకోరిక నుపాసించుట క్షత్రియోచితము. చతుర్విధపురుషార్థములఁగోరి దేవతల నుపాసించుట సర్వవర్ణోచితము. అస్త్రమంత్రోపాసనమునకు మఱొక్కదానికిని విధులయందు భేదము కలదు. మంత్రవర్ణ ములయందు నించుక మార్పుగలదు. అస్త్రవిద్యోపాస మించుక తీవ్రరూపముగ నుండును. తక్కినవి శాంతరూపమున నుండును. విధులు నట్టివే. శ్రీరామునకు విశ్వామిత్రుఁ డుప దేశించినమంత్రాధిదేవతలు పిలిచినపు డపుడెంతుమని పలికి యంతర్ధానములయ్యెను. ఇపుడు యుద్ధమారంభము కానున్న దని యెఱింగియే యవి శరములం బ్రవేశించి యనఁగాఁ దేజో రూపముల నాయుధములయం దావహించి మెఱయుచుండు టయేగాక ధనుస్సున నెక్కుపెట్టిన ట్లుండెను. తమయంతన తామే ధనుస్సంగతములయ్యె ననుటం జేసి రాక్షససంహారము

నకు సిద్ధముగ నున్నవారము. మమ్ము సాయముగఁ గైకొను మని శ్రీరాముని హెచ్చరించుచున్నవని మనము గ్రహింప వలయును. దేవతల నుపాసించుట కార్యమునఁ దోడుపడ వలయుననియేకదా. రాఁగలకార్యగతుల దేవత లెఱుంగుదు రనుట గొప్పవిషయముకాదు. భగవంతుఁ డగురాముఁ డీవిష యము నే లక్ష్మణునకుఁ దెలుపుమూలమున మన కెల్ల నెఱిం గించెనని మన మెఱింగి దేవతల నుపాసించి తత్కారుణకుఁ బాత్రులము కావలయును.

"యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్యాంతి పితృవ్రతాః,
భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపి మాం." ౨౫
గీత. ౯ అధ్యా.

అను నీభగవద్వాక్య మీవిషయము నే సూచించుచున్నది.

"యాదృశా ఇహ కూజంతి పక్షిణో వనచారిణః,
అగ్రతో నో భయం ప్రాప్తం సంశయో జీవితస్య చ." ౬

అని మూలము. లక్ష్మణు నచ్చోటు వదలి సీతను గొనిపొమ్మను టకే యీయుపదేశము. వనములనుండుపక్షులనుటం జేసి మాన వులసంపర్కమే లేనివనిభావము. పక్షులు భావిఫలములఁ దెలు పుట సుప్రసిద్ధమే కదా. శత్రువులకుఁ బ్రాణసంశయమని శ్రీరామునితాత్పర్యము. ఈయర్థమును

"అయమాఖ్యాతి మే బాహుస్స్ఫురమాణో ముహుర్ముహుః. ౭
సన్నికర్షే తు నశ్శూర జయం శత్రోః పరాజయం."

అనుమూలము దేటపఱచుచున్నది. పురుషులకు దక్షిణ బాహువు కంపించుట శుభమనియు స్త్రీలకు వామబాహు స్పందనము క్షేమమనియు శాస్త్రము తెలుపుచున్నది.

"సప్రభం చ ప్రసన్నం చ తవ వక్త్రం హి లక్ష్యతే.     ౮
ఉద్యతానాం హి యుద్ధార్థం యేషాం భవతి లక్ష్మణ,
నిష్ప్రభం వదనం తేషాం భవత్యాయుఃపరిక్షయః."     ౯

అని మూలము. ముందు మేలుగలుగునెడల శిరస్సు నావరించి యుండు భగవత్తేజము లోనఁ బ్రవేశించును. అనఁగా నవి భగవత్సహాయమని మన కెఱుకపఱచును. జీవితాంతము కలుగువారల కాతేజస్సు క్షీణించును. అనఁగా భగవత్సహాయము వారలకు లేదని భావము. "అసావాదిత్యోబ్రహ్మ" అను శ్రుతివాక్యమే శిరస్సు నావరించి యొకతేజస్సుండునని తెలుపుచున్నది. యోగుల కది కనంబడును. మనవంటివారల కది కనఁబడదు. సత్కర్మముల నాచరించువారల కది వృద్ధియగును. దుష్కర్మముల నాచరించువారల కది క్షీణించును. ఇది సర్వజనులకు ననుభవమున నుండునదియే కాని వేఱు కాదు కదా. ఈరహస్యవిషయమునే శ్రీరాముఁడు సోదరునకుఁ దెలుపునెపమున మన కెఱుకపఱచెనని విశ్వసింపవలయు.

"అనాగతవిధానం తు కర్తవ్యం శుభమిచ్ఛతా,
ఆపదం శంకమానేన పురుషేణ విపశ్చితా."     ౧౧

అని మూలము. కష్టములు రాఁగలవని యనుమానించి మతిమంతులు ముందే పరిహారకర్మము నాచరింతురని శ్రీరాముఁడుపదేశించెను. ఇందు వాల్మీకిమహాకవి 'విపశ్చితా' అని ప్రయోగించెను. "విశేషేణ పశ్యన్ చేతతీతి విపశ్చిత్ చితీ సంజ్ఞానే" విశేషముగాఁ జూచుచుఁ దెలిసికొనువాఁడని యర్థము. శాస్త్రోక్తవిధము ననుభవముచే నెఱుంగువాఁడనియే దీనిసారము. అప్పటిపరిస్థితుల నాలోచించి ముందిట్టి కష్టములు కలుగునని యెఱింగి తత్పరిహారముగాఁ దగినకర్మ

ముల నాచరించువాఁడు మతిమంతుఁడని శ్రీరాముని యుపదేశము. అట్టికర్మమున రాఁగలయాపదలు రాకయుండునా యనునది నీచప్రశ్నము. భగవంతుని నమ్మి శాంతిచేయుట మనవిధి. దానిఫలము దైవాధీనము.

"తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర,
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః."

అన్న భగవద్వాక్యము మఱువరాదు. దృఢమూలములగు కర్మములు శాంతిచేసినను ఫలము నీయకమానవు. కాని శాంతిచేఁ గొంత యుపశమించును. అదృఢమూలము లగునవి శాంతిచే నివర్తించును. అనునదియే యిందు నెఱుంగఁదగిన విషయము.

"తస్మాద్గృహీత్వా వైదేహీం శరపాణిర్ధనుర్ధరః,
గుహామాశ్రిత్య శైలస్య దుర్గాం పాదపసంకులాం. ౧౨
ప్రతికూలితుమిచ్ఛామి న హి వాక్యమిదం త్వయా,
శాసితో మమ పాదాభ్యాం గమ్యతాం వత్స మాచిరమ్." ౧౩

అని మూలము. లక్ష్మణునితో సీతను దోడ్కొని గుహఁ బ్రవేశింపుమన నేల? అంతతో మానక యొట్టుపెట్టనేల? అనుశంక రాకమానదు. మహాప్రకృతి సీత ఆమె చెంతనున్నంతన భయంపడునది కాదు. ఏల పంపెననఁగా లోకమున కొకనీతిఁ దెలుపుటకై యట్టు లొనర్చెను.

"ఇమం హి సర్వవర్ణానాం పశ్యంతో ధర్మముత్తమం,
యతంతే రక్షితుం భార్యాం భర్తారో దుర్బలా అపి. ౬
స్వాం ప్రసూతిం చరిత్రం చ కులమాత్మానమేవ చ,
స్వం చ ధర్మం ప్రయత్నేన జాయాం రక్షన్ హి రక్షతి." ౭

మను. ౯ అధ్యా.

అనుస్మృతివచనములఁబట్టి ప్రధానముగా భార్యను రక్షింప వలయు ననుధర్మము తెలుపడును. ఆధర్మమును స్వాచార మునఁ దెలుపుటకే యట్టివిపత్కాలమునందుఁగూడ సోదరుని సాయముకూడఁ గోరక యాతనిఁ దోడిచ్చి పంపెను. అంతి య కాని సీత భయంపడునని కాదు తానే యేల యామెను గాపాడఁగూడదు? లక్ష్మణు నేల యుద్ధమునకుఁ బంపరాదు? అని ప్రశ్నింపరాదు. ఖరాదులకు శాపవిముక్తి రామునివలనఁ గావలయుననికదా శంకరువాక్యము. దానికొఱకుఁ దానే నిలిచి లక్ష్మణుని సీతారక్షణార్థము నియోగించెను. అని మన మెఱుంగవలయును. ప్రవేశింపరానిగుహాలో నుండుమనుట సాధారణము. స్త్రీలు భీరువులు కాన వారిని భయంకరములగు యుద్ధములను జూడనీయరా దనునియమమును లోకులకుఁ దెలుపుటకే యని యెఱుంగవలయును.

"త్వం హి శూరశ్చ బలవాన్ హన్యా హ్యేతాన్న సంశయః,
స్వయం తు హంతుమిచ్ఛామి సర్వానేవ నిశాచరాన్." ౧౮

అని మూలము.

"తస్మాద్యః క్రూరరూపేణ దేహేన వారతామృతం,
విష్ణుర్దాశరథిర్భూత్వా మోక్షయిష్యతి సువ్రత."

అని శంకరుఁ డాజ్ఞాపించినందున నాశాపమోక్షకాలము సమీ పించినకతన వారినెల్లఁ దానే వధింపఁబూని శ్రీరామచం ద్రుఁడు సౌమిత్రీ! మహాశూరుఁడవగు నీవు చంపఁగలవు. కాని నేనే వారిని జంపఁదలఁచితినని స్వాశయమును దెలి పెను. ఈపలుకు లోపల వ్రాసిన శేషధర్మస్థవిషయమును దృఢ పఱచుచున్నది.

"ఆవిష్టం తేజసా రామం సంగ్రామశిరసి స్థితం,
దృష్ట్వా సర్వాణి భూతాని భయాద్విప్రవ్యధిరే తదా. ౨౫
రూపమప్రతిమం తస్య రామస్యాక్లిష్టకర్మణః,
బభూవ రూపం క్రుద్ధస్య రుద్రస్యేవ పినాకినః." ౨౬

అని మూలము. ఇందు గోవిందరాజులు చేయునది లేక చల్లగా విషయమును వదలెను. 'తేజసా ఆవిష్టం రామమ్' అనుచోఁ దేజోవంతుఁడగు శ్రీరాముఁ డని యర్థము కాదు "తచ్చాప నివృత్త్యర్థం శివస్త్రిగుణాత్మకే రామే స్వాంశం ఖరాదివధకాలే న్యవేశయత్" అన్నవాక్యము ననుసరించి రుద్రతేజస్సుచే నావరింపఁబడినవాఁడనియే యర్థము. ఇందులకుఁ బ్రమాణ మును మహేశ్వరతీర్థులు కనఁబఱచిరి.

"రుద్రతేజోవిలసితం దృష్ట్వా రామకళేబరం
శంఖం చక్రం చ శూలం చ పినాకం ఖేటమేవ చ,
ఖట్వాంగం ఘంటాం చ డమరుం బాణపాశాంకుశం తథా,
చాపం వజ్రం చ ఖడ్గం చ పరశుం త్రాసకారణం,
జయశ్రియం చ గంగాం చ దదృశుస్సిద్ధచారణాః."

అని స్కాందమహాపురాణమునఁ గలవిషయమునే చూపిరి. కావుననే, వాల్మీకిమహర్షియు "ఆవిష్టం తేజసా రామమ్" అని వాక్రుచ్చెను. కనుకనే యాశ్రీరాము నాకారమును గాంచి సకలభూతములు భీతిచెందెను. లయకాలమునఁ బినాకచాప మును ధరించియున్న క్రుద్ధుఁ డగురుద్రునివంటిరూప మాసమ యమున శ్రీరామునకు నొప్పియుండెనని భావము. ఈవిష యము స్కాందమహాపురాణమునందున్నది. కనుకనే వాల్మీ కియు నాయర్థమును సూచించెను. రుద్రతేజస్సు రామునందుఁ

ప్రవేశించె ననువిషయమున సారమేమనఁగా శత్రుసంహారము చేయుకాలమునఁ దమోగుణము విజృంభించును. రజోగుణము వృద్ధినొందును సత్వగుణము విజృంభింపదు. ప్రళయకాలమున శంకరుఁడు కేవలతమోగుణప్రధానుఁడై యుండును. అట్లే శ్రీరాముఁడు కూడఁ దమోగుణప్రధానుఁడు కాఁగాఁ బూర్వము శాంతముగా నుండురామరూపమును జూచిన భూతము లిపుడు రౌద్రముగా నుండఁగాఁ జూచి భయంపడెనని సారము. త్రిమూర్తులును గార్యము ననుసరించి త్రిగుణములలో నేది యుద్రేకించిన నాకార్యము ఫలించునో యద్దానిం బ్రధానముగాఁ గైకొందురని భావము. ఇట్లు గ్రహించి నచోఁ బాషండులకుంగూడ విషాదము తొలఁగు ననుకొనుచున్నవాఁడను.

"తం దృష్ట్వా తేజసావిష్టం ప్రాద్రవన్ వనదేవతాః,
తస్య క్రుద్ధస్య రూపం తు రామస్య దదృశే తదా.     35
దక్షస్యేవ క్రతుం హంతుముద్యతస్య పినాకినః.
ఆవిష్టం తేజసా రామం సంగ్రామశిరసి స్థితం.     36
దృష్ట్వా సర్వాణి భూతాని భయార్తాని ప్రదుద్రువుః."

అని మూలము. మున్ను చెప్పినవిషయమునే ప్రకారాంతరమున మరల వాల్మీకి తెలిపెను. దక్షయజ్ఞము నాశనము చేయఁబూనిన రుద్రునిరూపమువలె శ్రీరామునిరూప మప్పుడొప్పెను. సకలభూతసంహారము చేయఁబూనినట్టులారాముని శాంతరూప మత్తఱి నుగ్రతరమై చూపట్టెను. ఇపుడు రుద్రాంశమే రామునియం దుద్రేకించెనని మన మెఱుంగవలయు.

భగవంతుఁడు కార్యము ననుసరించి సత్త్వరజస్తమోగుణము లలో నొక్కదానిని ప్రధానముగాఁ జేసికొనును. అంత మాత్రమున నాగుణమే ప్రధానమని మన మూహింపరాదు. భగవద్దృష్టికిఁ ద్రిగుణములు సమానములే. అందేది యుద్రే కించిన నా కార్యము సాగునో దాని నంగీకరించును. దీనిచేఁ ద్రిమూర్తులును గార్యమునుబట్టి గుణములమార్పు గలవా రలే యగుదురు. అట్టిచో నుత్తమాధమభావము లెట్లు వారి యెడల నారోపింపవచ్చునో తెలియఁజాలక యున్నాఁడను. సత్త్వగుణము విష్ణువుదనియు నక్కారణమున నుత్కృష్టుఁడన్న మధ్యవైష్ణవులయాశయ మీరామాయణము ననుసరించి నీచ మని తేటపడుచున్నది. శివకేశవులకు భేదము గల్పించువా రజ్ఞులని విష్ణుపురాణశ్రీభాగవత ప్రముఖపురాణములు సకల శ్రుతులు బోధించుచున్నవి. ఇట్లుండిన నింకను భేదముగల దనువారు పాషండశబ్దవాచ్యులుకాక మతేమగుదురు? భగ వత్తత్త్వము నెఱుంగువారు సమబుద్ధులుకావలయునుగాని విషమబుద్ధులు కారాదు.

"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః."

అన్న శ్రీకృష్ణవాక్యము వారికిఁ బ్రమాణ మగునేని భేద భావముగలవారు కారాదు. అది ప్రమాణముకాదేని వారు పాషండులు కాకపోరుగదా! అధ్యాత్మరామాయణమునం దీభాగమున విశేషములు గానరావు. ఇఁకఁ దరువాతికథను బఠింతము.

## శ్రీరాముఁడు రాక్షసులఁ బొలియించుట.

*అంత ఖరాసురుఁడు తనబలములంగూడి శ్రీరాము నాశ్రమమున కేతెంచి ధనుర్బాణములం బూని శత్రునిషూదనుఁడుగ నుండురామునిం గాంచెను. వెంటనే మహారక్కసుఁడు ధనుర్ఘోషము పరుషముగా వినంబడఁగా బాణముల సంధించి రథము రామాభిముఖముగాఁ బోనిమ్మని సారథిని హెచ్చరించెను. వాఁడట్లె కావించెను. ఖరుఁడు రాముని పైకి నురువడించుటం గని యతనిమంత్రులు శ్యేనగాములోనగువారు సింహనాదముల నతనివెంట నురువడించిరి. నక్షత్రాంతరమున నంగారకునింబోలి ఖరుఁడు వారినడుమ వెలుఁగుచుండెను. అంత నారక్కసుఁడు రామునిపై సహస్ర బాణములు వైచి నొప్పింపఁగాఁ దక్కినరక్కసులు క్రుద్ధులై దుర్జయుఁడగు శ్రీరామునిమీఁద ననేకాయుధములఁ గురియించిరి, శూలాదుల నెన్నియేభంగుల రాము నొప్పించిరి. రాము నడంపఁగోరి వారిలోఁ గొందఱు రథములనెక్కియు నశ్వములపై నుండియు గజోపరిగతులయియు రాము నొంపఁ బూనిరి. పర్వతముపై మేఘములు వర్షించునట్లు బాణవర్షములఁగురియించిరి. అంత శ్రీరాముఁడు వారిబాణములనడుమ దేజరిల్లుచుండెను. సాగరమున నదులు ప్రవేశించి మాయమగు రీతి రాక్షసులయాయుధములు రాముని బాధింపఁజాలక నశించినవి. ఆయాయుధములవ్రేటులకు నించుక నొచ్చియుఁ బిడుగులుపడినను గదలనిమహాపర్వతమురీతి బడలక యేయుచుండెను. అవయవములనుండి రక్తములు చిప్పిలసాగఁగా మంచుగ్రమ్మ

*ఇది యిరువదైదవసర్గమునఁ గలదు.

నున్న రవిబింబమువలెనుండిన శ్రీరాముని గని మింటనున్న దేవతలు విషాదమునొందిరి.

అంతలో శ్రీరాముఁ డత్యంతక్రుద్ధుఁడై కోదండము మండలాకారముగా నుండ శతములు సహస్రములుగా నర్ధచంద్రాకారబాణములఁ బ్రయోగించుచుండ లక్ష్యశుద్ధిగలిగి వైచినయాబాణములు యమపాశములవలె రక్కసులప్రాణములఁ బెక్కింటిని బీల్చెను. వారిదేహములఁ జీల్చుకొని రక్తసిక్తములై వెడలి మండునగ్నివలె వెలుఁగుచుండెను. రథగజాదులయవయవములు తెగిపడుచుండెను. ఎందఱురాక్షసులో యమపురికిఁ బరుగిడుచుండిరి. ఆబాణఘాతములకుఁ దాళఁజాలక వారు పెలుచనార్చిరి. శుష్కారణ్యము నగ్ని నాశనముచేయునట్లు బాణములు వారిఁ ద్రుంచుచుండఁగా నుత్సాహము వారియందుఁ గనఁబడదయ్యెను. కొందఱు రాక్షసవీరులు శ్రీరామున కెదురుగా నిలువఁబడి నిశాతసాయకములను బెక్కువిధములగునాయుధములను బ్రయోగించిరి. వానినడుమన యతఁడు వాఁడిబాణములఁ ద్రుంచి శిరస్సుల ఛేదించెను. హతశేషులు భయమున ఖరునికడకుఁ గాహాకుమా యని పరుగిడిరి. దూషణుఁడు వారలభయము వాపి మరలించి రుద్రు నెదిరింపఁబోవుయమునివలె రామభద్రుని దలపడియెను. మరలినరాక్షసులు రామునిపై శిలాద్రుమబాణవర్షములను గురియించిరి. ఆయుద్ధము భయంకరముగా నుండెను. నలుఁగడలఁ గ్రమ్ముకొనిన యారక్కసులయాటోపము గని శ్రీరాముఁడు గాంధర్వాస్త్రముం బ్రయోగించెను. దానినుండి జనించినబాణము లనేకములు దిక్కుల విదిక్కులం గప్పెను. వానిచేఁ బీడితులై యారక్కసులు దిక్కులు తెలియక

యుండిరి. కొంతసేపటికే వారందఱు పొలిసిరి. కొందఱు ప్రాణావశిష్టులు కొందఱు శిథిలాంగులు నై నానాభంగులఁ బడియుండిరి. ఆయుధములు హయగజరథములు సేనలు శిథిలములై యాయుద్ధభూమి నెల్లయెడలఁ బడియుండెను.

## రాముఁడు దూషణాదులం ద్రుంచుట.

* శ్రీరామునిచేఁ దనసేనలు పడినపాట్లు గని దూషణుఁడు దుర్జయులగు పంచసహస్రయోధవర్యుల రామునిపై నురవడింప నానతిచ్చెను. వారును రాము నావరించి శూలాద్యాయుధముల వర్షముపలెఁ గురియించిరి. వృక్షవర్షము కురియించిరి. ధర్మమతిగాన రాముఁడు వానినెల్ల బాణములఁ ద్రుంచివైచెను. వృషభరాజము వానకు జడియని రీతి నాయంపవెల్లిని లెక్కగొనక తద్వధమునకుఁ బూని క్రుద్ధుఁడై వారిపై నారాచములఁ బ్రయోగించెను. సేనాపతి క్రుద్ధుఁడై యశనితుల్యము లగుబాణముల శ్రీరామునిపైఁ బ్రయోగించెను. అంత నాదాశరథి తీవ్రనారాచమున నతని ధనుస్సును ఖండించి నాలుగుబాణములచే గుఱ్ఱముల నాలుగింటిని బొలియించెను. వెంటనే సారథి నొక్కయమ్మునఁ జంపెను. అంత మూనక యతనియురమ్ము నారాచముల నొంచెను. విరథుఁడై యతఁడు పరిఘాయుధమును హస్తమునఁ దాల్చెను. అయ్యవి ఘోరతరమై యెందఱినో వధించినదాట నద్దాని సాయమున రామునిం దలపడియెను. రాముఁ డాతని రాకఁ గని రెండుబాణములు వైచి యతని రెండుబాహువులను ఖండించెను. వాఁడును గ్రిందఁబడెను. సకలభూత

* ఇది యిరువదాఱవసర్గమునఁ గలదు.

ములు శ్రీరామునిం బొగడెను. మహాకపాలస్థూలాక్ష ప్రమాథి నామకదానవేంద్రులు మృత్యుపాశబద్ధులై మహాకోపమున రామునిపైఁ బడవచ్చిరి. శూలపట్టిసపరిఘములఁ బూనియుండిరి. రాముఁడు వారింగాంచి యతిథుల కర్ఘ్యపాద్యాదు లొసంగు చందమునఁ దీవ్రనారాచములం బ్రయోగించి గౌరవించెను. వెంటనే వాడిగలబాణమున మహాకపాలునిశిరమును ఖండించి పెక్కుశరములచేఁ బ్రమాథియంగమును దునియలుచేసెను. వారిద్దఱు పడఁగనే యాలసింపక స్థూలాక్షుని కన్నులనిండ శరముల నాటెను. దూషణు వెంటవచ్చిన యైదువేలయోధుల నన్నిబాణముల నిమేషమాత్రమునం జంపెను, దూషణుఁడు తద్బలము హతముకాఁగా ఖరుఁడు మహాకోపమునఁ దనసేనాధిశులం గని కంటిరిగదా దూషణుఁడు ససైన్యముగఁ జచ్చెను. ఇఁక మీరు సకలాయుధములతో సేనలం గొనిపోయి యా నీచమానవుని వధింపుఁడు. అని యాజ్ఞాపించి తానును రామునిపైకిఁ బోయెను, శ్యేనగామి లోనగువారు పండ్రెండు గురు సేనలతో రాముం దలపడి సకలవిధశరములం బ్రయోగించిరి. రాముఁడు సువర్ణలిప్తబాణముల వైచి మిగిలినసేనను బొలియించెను. శతసంఖ్యరాక్షసులను శతసాయకములం జంపి సహస్రసంఖ్య దానవులను సహస్రాంబకములం బ్రయోగించి యంతకపురికిం బంపెను. ముడులువీడిన వెండ్రుకలచే వారు పడియుండ నాభూమి దర్భలంగూడిన యజ్ఞవేదికరీతి నుండెను. అత్తఱి నాకాననము నరకమువలెఁ గన్పడుచుండెను. రథము కూడ లేక పాదచారిగా నుండురాముఁ డొక్కఁడు పెక్కువేలరాక్షసులం జంపెను. ఖరత్రిశిరసులు శ్రీరాముఁడు ననుమూవు రే యపుడు మిగిలి యాయుద్ధభూమి నుండిరి. తక్కిన

దుర్జయదైత్యులు శ్రీరామునిచే హతులైరి. తనసైన్యము హతము కాఁగా ఖరుఁ డత్యంతక్రుద్ధుఁడై మహారథమెక్కి వజ్రివలె రామునిపై నురవడించెను.

## శ్రీరాముఁడు త్రిశిరుని జంపుట.

* ఖరాసురేంద్రుఁడు రాముని దలపడఁ బోవుచుండు తఱి సేనానాయకుఁడగు త్రిశిరుఁడు వానిచెంత కరిగి శౌర్య నిధీ! నన్నాజ్ఞాపింపుము. నీవేల సాహసించెదవు? మరలుము. ఇపుడే రాముని వధించెదను. చూడుము. నేనిపుడు రాక్ష సులకు వధ్యుఁడగురామునిం జంపెద. ఇటు లొనర్తునని శస్త్ర మును స్పృశించి ప్రమాణము చేసెదను. నేను రామునినో నన్ను రాముఁడో గెలువవలయును. నీవు రవంతసేపు సాక్షి విగా నుండుము. రాముఁడు హతుఁడైన సంతుష్టుఁడవై నీవు జనస్థానమునకుఁ బోవఁగలవు. నేనే హతుఁడనైన రామునిం దలపడుము. అని వేఁడుకొనఁగా నతఁడు రణయత్న మప్పటి కుడిగి పొమ్మని సెలవిచ్చెను. త్రిశిరుఁడు రాముని మార్కొనఁ బోయెను. ఉత్తమాశ్వములం బూన్చినయరద మధిరోహించి త్రిశిఖరముల నొప్పుకొండవలె మూఁడుతలలతోఁ దేజ రిల్లుచు బాణజలధారలఁ గురియించుచు జలములం దడిసినభేరి ధ్వనివలె సింహనాద మొనర్చెను. త్రిశిరునిరాకఁ గాంచి యాతని కెదురేగెను. వారల కిరువురకు సింహమదగజము లకుబలె ఘోరరణము సాగెను. త్రిశిరుఁడు నొసట మూఁడు శరములు నాటి బాధింపఁగా రాముఁడు మిగులఁ గ్రుద్ధుఁడై వీనిబలము గొప్పదిగనున్నది. ఈబాణములు నాఫాలమునఁ

---

* ఇది యిరువదేడవసర్గమునఁ గలదని యెఱుంగవలయును.

బూవులవలె నున్నవి. ఇఁక నాబాణములచవి వీఁడు చూచుఁ గాక. అని తలఁచుచు సర్పములువోని క్రూరబాణములఁ బదు నాలుగింటిని వైరియారమ్మున నాటసేసి యతనిగుఱ్ఱముల నాల్గునారసములం గూల్చి యెనిమిదింట సారథి వధియించి ధ్వజము నొక్కయమ్మునఁ జక్కడంచి యాతఁడు రథము నుండి దిగఁగా ననేకనారాచముల వక్షము నొంప నతఁడు మూర్ఛిల్లెను. వెంటనే మూఁడుకలంబముల నతనిశిరస్సులను మూఁడింటిని ఖండించెను. మూర్ఛపోయి పడుట శిరములు తెగుట యొక్కపర్యాయమే సాగెను. రక్తము స్రవింప నేలఁగూలి వాఁడు చచ్చెను. అంత ఖరాసురునిబలములలోఁ జావఁగా మిగిలినవారు భీతిల్లి పులికి భయంపడినజింకలవలెఁ బాఱిపోయిరి. ఖరాసురుం డదిగాంచి వారిని మరలించి భయము వాపి రాహువు చంద్రునిపై కరుగుచందమున రామునిపైకిఁ బోయెను.

మహామతులారా! ఈభాగమును బరికింతము.

"మాం నియోజయ విక్రాంత సన్నివర్తస్వ సాహసాత్,
పశ్య రామం మహాబాహుం సంయుగే వినిపాతితం. ౨
ప్రతిజానామి తే సత్యమాయుధం చాహమాలభే,
యథా రామం వధిష్యామి వధార్హం సర్వరక్షసాం. ౩
అహం వాస్య రణే మృత్యురేష వా సమరే మమ,
వినివృత్య రణోత్సాహాన్ముహూర్తం ప్రాశ్నికో భవ. ౪
ప్రహృష్టో వా హతే రామే జనస్థానం ప్రయాస్యసి,
మయి వా నిహతే రామం సంయుగాయోపయాస్యసి." ౫

అను నీమూలమునకు విశేషార్థము మహేశ్వరతీర్థులు తెల్పిరి. దాని ననుసరించి వ్రాసెదను.

"మహాబాహుం రామం చ తేన వినిపాతితం సైన్యం చేతి శేషః. పశ్య. (అతస్త్వం) సాహసాన్నివర్తస్వ. మాం నియోజయ. తర్హి త్వం తం హనిష్యసి కిం? తత్రాహ. ప్రతిజానామీత్యాది. సర్వరక్షసాం వధార్థం సర్వ రక్షసాం హంతారమిత్యర్థః. రామం యథాయథావత్ అహం ప్రతిజానామి, సమ్యగ్జానామీత్యర్థః. అతః తం వధిష్యామీతి. సర్వమాయుధమాలభే గ్రహీ ష్యామి కేవల మిత్యర్థః. హంతుమశక్యశ్చే దనేన కిం తత్రాహ. అహామితి. అస్య రామస్య అహం వా రణే మృత్యుః కింతు ఏషవా ఏష రామఏవ సమరే మమ మృత్యుః అతస్త్వం మహోత్సాహాద్వినివర్తస్వ. ముహూర్తం ప్రాశ్నికో భవేతి సంబంధః. ప్రహృష్ట ఇతి. ప్రహృష్టో వా హత ఇత్యత్ర అహత ఇతి పదచ్ఛేదః. రామేఅహతే సతి మే మయిచ నిహతే సతి ప్రహృష్టస్త్వంరామం ప్రతి సంయుగాయోపయాస్యసి. అథవాజనస్థానంవా ప్రయాస్యసీతి సంబంధః."

శ్రీరాముని నతనిచేఁ జంపఁబడిన సేనలం జూడుము. కావున నీవు సాహసము మానుము. నన్నుఁ బొమ్మని యాజ్ఞా పింపుము. సకలరాక్షసహంతయగు శ్రీరామునితత్త్వమును నే నెఱుంగుదు. కాన నతనిం జంపుదునని సర్వాయుధముల నూరక తాఁకుచున్నవాఁడ. నిజముగా నే నాతనిం జంపఁ గలనా? ఈరామునకు నేను మృత్యువునగుదునా? అతఁడే నాకు మృత్యువు. కనుక నీవు యుద్ధోత్సాహమునుండి మర లుము. కొంతసేపు చూచుచుండుము. రాముఁడు నాచేఁ జంపఁబడకపోఁగా సంతుష్టుఁడవై నీవు రాము నుద్దేశించి యుద్ధమునకుం బోవుదువు. జనస్థానమునకైనం బోవుదువు.

ఈయర్థము సమంజసమూ కాదా యని విచారింతము. మహాపాపాత్ముఁడగు త్రిశిరసుఁ డిట్లు చెప్పఁగలఁడా యను నదియే మొదట విచారింపవలసినది. బుద్ధిపూర్వకముగా నాతఁడు తెలుపకపోయినను గర్మ మాతనినోట నట్టియర్థమును

దోఁపఁజేయుమాటలఁ జెప్పించెను. లేకున్న రెండవయర్థము నకు ననుకూలముగా విభజింపఁదగినపదము లేల వానినోటి నుండి వెడలును? ఎల్లతావుల నిట్లే మన మెఱుంగవలయును. అతీంద్రియజ్ఞానసంపన్నుఁడగు మహర్షి వాల్మీకి వారివారినోట నిట్లు చెప్పింప నేలవూనును? ప్రాయికముగా మననోటనుండి యొకానొకప్పుడు భావిఫలమును సూచించుమాట లప్రయత్న ముగా వెడలును. ఇది పెక్కండ్ర కనుభవము. విధిప్రేప్పాలకు లోనుగానివారెవరు? ఇట్టిమాటలు దుష్టరాక్షసునినోటినుండి వెలువడవనిమాత్రము పలుకరాదు. రెండర్థములగునట్లు లిట్టి తావులనే వాల్మీకివంటిమహాత్ముఁ డేల చెప్పవలెను? అనఁగాఁ గర్మము బలవత్తరమగుట నెన్నిభంగులనైన నది ప్రాణులఁ ద్రిప్పఁగలదనునర్థమును బోధించుటకే మునితాత్పర్యమని మన మెఱింగిన మేలుగాంతుము. ఈవిషయము మీఁది సర్గ ములయందు స్పష్టముకాఁగలదు.

## శ్రీరాముఁడు ఖరుని సకలాయుధముల రూపుమాపుట.

* రామమూర్తి దూషణత్రిశిరసుల వధింపఁగనే ఖరా సురుఁడు మది భీతిల్లెను. ఒక్కనిచే దుర్జయులగు నిందఱు రక్కసులు తెగుటం గాంచి గర్వము తగ్గి నముచిదనుజుఁడు శతమఖునిపైకిఁ బోవునట్లు రామునిపైకిఁ బోయెను. సర్ప ములంబోని మార్గణముల రామునిపైఁ బఱపెను. రథమున నుండి యాదనుజుఁడు ధనుర్విద్యాకౌశలం బేర్పడ జ్యావల్లిక మొరయించుచు ననేకేషువులవైచెను. ఖరుఁడు విక్రమించు

---

* ఇయ్యది యిరువదియెనిమిదవసర్గమునఁ గలదు.

టంగని యాకోదండదీక్షాగురుఁడు రాముఁడు నారి సారించి నిశాతప్రక్ష్వేడనములఁ బఱపెను. ఆపీరుని యగ్నిబాణముల నాకసమెల్ల నావరింపఁబడి దిక్కులు ప్రతిధ్వనులఁజేయునట్లు చేసెను. ఖరుఁడుకూడ నట్లే యంపవెల్లిఁగవియింపఁగా వారి చుట్టునుండు నాకాశమంతయు నిరవకాశమయ్యెను. పరస్పర వధేచ్ఛలఁ బోరాడుచుండఁగా వారిబాణములు గప్పినందున రవి ప్రకాశింపకయుండెను. అంకుశమున నేనుఁగు నలయించు రీతి ఖరుఁడు రామమూర్తిని దీవ్రకలంబముల నలయించెను. అత్తఱి నాదుష్టదానవుఁడు పాశహస్తుఁడగుయమునిపోలిక నెల్లరకుఁ గనుపట్టెను. శ్రీరామమూర్తి ధీరాగ్రేసరుఁడయ్యె మహాబలులగుయోధులఁ బెక్కువేలను సమయించినందునఁ గడుబడలియుండునని యాదనుజుఁడు తలంచెను. అట్లు పరా క్రమించి వచ్చుచున్న యాఖరుని గని మృగేంద్ర మల్పమృగ మును గని చలింపనట్లు రవంతయుఁ జలింపకుండెను. అంతలో శలభ మగ్నిపైఁ బడఁబోవునట్లు ఖరుఁడు రామునిపైకి నడ చెను. రామమూర్తి యించుకబడలికఁ బరాకుపడి యుండిన చందమున నుండ దానవుఁ డతని సశరచాపమును ఖండించి వజ్రముంబోని యేడుబాణముల నతనికవచమును ఛేదించెను. అది తునుకలై క్రిందఁబడెను. కవచములేమి శ్రీరాముఁడు భాస్కరునివలె వెలింగెను. ఖరుం డంత సింహనాదము గావిం చుచు సహస్రాంబకముల రామమూర్తిశరీరమంతయు నొప్పిం చెను.

అంత నారామమూర్తి శత్రువుం బరిమార్పం దలంపు గొని యత్యంతభాసురంబగు కోదండవర్యము నందుకొని సజ్యము గావించెను. ఆయది యగస్త్యదత్తమైన వైష్ణవ

చాపము. దాని మోరయించుచు మిగులఁ గ్రుద్ధుఁడై స్వర్ణపుంఖనారాచములం బఱపి ఖరునిధ్వజమును ఖండించెను. అది శకలములై ధరఁబడి సూర్యకాంతులవలె మెఱయుచుండెను. ఖరుఁ డుచితజ్ఞుఁడు కాన వాడిబాణముల నాలుగింటిని బఱపి రామునిశరీరమెల్ల నొప్పించెను. దాన రామశరీరమునుండి రక్తము స్రవించెను. దాన రోషాక్రాంతమనస్కుఁడై యాఱుశరము లరివోసి వైరిశిరమున నొక్కటియు బాహువుల రెండును వక్షమున నర్ధచంద్రాకారములగునవిమూఁడును నాటనేసెను. అంత నూరకుండక క్రుద్ధుఁడై వానిని బొలియించుతలంపున సూర్యప్రకాశములగు పదుమూఁడుబాణములఁ గైకొని నవ్వుచున్నరీతిగనే యందొకదానిచే కాఁడిమ్రాకును ఖండించి నాల్గింట నశ్వములఁ బైలోకమునకు సాగనంపి యొకబాణమున సారథిని శిరోహీనునిగాఁ జేసి మూఁడుబాణముల నొగలు తుత్తునియలుగ నొనర్చి రెండుబాణముల దానియిరుసును ధ్వంసముచేసి వజ్రమును దిరస్కరించు నొకబాణమున నతనిచాపమును ఖండించి మిగిలిన పదుమూఁడవబాణముచేత నతనిశరీరము రక్తసిక్తముగావించెను. ఖరుఁ డంత విరథుఁడై నేలపై నిలిచెను. మింటనున్నదేవతలు లోనగువారందఱు సంతుష్టులై దోసిలులొగ్గి శ్రీరాముని బూజించిరి.

మహామనీషులారా! ఈభాగమునుండి యొకవిషయము మనము స్మరింపవలయును. పరశురాముఁ డొకధనుస్సు నిచ్చెను. మరల నగస్త్యుఁ డొకచాపము నొసంగెను. ధనుర్విద్య నభ్యసించిననాఁటిధను స్సొకటి కలదు. ఇపుడు శకలము

లైనది ప్రాకృతచాపము. ఈవిషయ మెఱింగియే యగస్త్య మహర్షి

"పూజయిత్వా యథాకామం పునరేవ తతోఽబ్రవీత్,
ఇదం దివ్యం మహచ్చాపం హేమరత్నవిభూషితం. ౩౨
వైష్ణవం పురుషవ్యాఘ్ర నిర్మితం విశ్వకర్మణా,
అమోఘస్సూర్యసంకాశో బ్రహ్మదత్తశ్శరోత్తమః. ౩౩
దత్తౌ మమ మహేంద్రేణ తూణీ చాక్షయసాయకౌ,
సంపూర్ణౌ నిశితైర్బాణైర్జ్వలద్భిరివ పావకైః. ౩౪
మహారజతకోశోఽయమసిర్హేమవిభూషితః,
అనేన ధనుషా రామ హత్వా సంఖ్యే మహాసురాన్. ౩౫
ఆజహార శ్రియం దీప్తాం పురా విష్ణుర్దివౌకసాం,
తద్ధనుస్తౌ చ తూణీరౌ శరం ఖడ్గం చ మానద. ౩౬
జయాయ ప్రతిగృహ్ణీష్వ వజ్రం వజ్రధరో యథా."

అరణ్యకాం. ౧౨ సర్గము.

అనురీతిఁ దన్మహాత్మ్యమును దెలిపి యొసంగెను. మహర్షులకుఁ గలభవిష్యత్కాలజ్ఞాన మత్యద్భుతము కదా. ఖరాసురుఁడు రాముని ప్రాకృతచాపమును ఖండింపఁజాలెను. అత్తఱి శ్రీరాముఁడు

"సుమహద్వైష్ణవం యత్తదతిసృష్టం మహర్షిణా,
వరం తద్ధనురుద్యమ్య ఖరం సమభిధావత." ౨౧

ముని యొసంగినవైష్ణవచాపమును గ్రహించెను. ఆధనువును బూనియే మహావిష్ణువు రాక్షసులం జంపి దేవరాజ్యలక్ష్మిని దీసికొని సురల కొసంగెను. ఆధనుస్సును దేవేంద్రున కిచ్చెను. దానిని నింద్రుఁడు సపరికరముగా నగస్త్యున కొసం

గెను. ఈచరిత్రము ననుసరించి యాలోచింపఁగా విష్ణ్వాదులు కార్యము ననుసరించి రణపరికరముల ధరించి యాపని ముగియ గనే వానిని వదలివేయుదురు. కాఁగలకార్యగతుల నెఱింగి వానిని దాఁచియుంచి సురలు వాని నెవరికే నిత్తురు. ఖరాది దానవులు శాపమువలనఁ బుట్టినవారనియు నాశాపవిముక్తి రామునిమూలమున నగుననియు నెఱింగినవారు కాననే రామునకుగా బలవత్తరచాపాదికముల డాఁచియుంచి ముని మూలమున నిప్పించిరి ఇంతప్రయత్నము భావికాలజ్ఞానము గలవారు గాననే యెంతకాలమునుండియో దేవమునులు చేయుచున్నవారనియుఁ గర్మపరిపాకకాలముదనుక వేచి యుండి సమయము రాఁగా వాని నుపయోగించిరనియు మన మెఱుంగవలయును.

## శ్రీరాముఁడు ఖరునితో న్యాయ్యములు పరుషములు నగుమాటలాడుట.

* విరథుఁడై గద చేతం గొని ఖరుఁడు నిలువఁగాఁ గాంచి శ్రీరామమూర్తి న్యాయ్యములగుట మృదువులు మర్మముల నలయించుటంజేసి పరుషములు నగుమాట లొప్పఁగా నిట్లు తెలిపెను. చతురంగబలముల కధిపతివగునీవు సకల లోకము లేవగింపఁదగిన క్రూరకర్మములఁ బెక్కింటిఁ గావించితివికదా. ప్రాణులకు దుఃఖమును గలుగఁజేయుచు ఘాతుకుఁడై పాపములు చేయుచుండువాఁడు త్రిలోకాధిపతియైనను బ్రదుకఁడు. ఇఁక నీవంటివాఁ డెంత? దయగలవారైనను మానవులు దుష్టసర్పమును జంపునట్లుగా లోకవిరుద్ధ

---

* ఇది యిరువదితొమ్మిదవసర్గమునఁ గలదు.

కర్మ మొనర్చు పరమక్రూరుని నెల్లరు వధింతురు. లోభము కామముననువానికి లోఁబడి పాపములు చేయుచుఁ దరువాత నెఱింగియుఁ బరితాపపడక యెవ్వరుందురో వారు భ్రష్టులై వడిగల్లు రాయిడిన్న క్రూరసర్పముభంగి దానిఫలమును బొందుదురు దానవా! ధర్మచారులయి దండకాటవినుండు ఋషుల వధించితివి కాదా. వారిని వధించి యేమిఫల మనుభవించితివి? కేవలపాపాచరణులు జన్మాంతరమున దానిఫలము నొందుదురు. పాపకర్ములుగాక క్రూరులై లోకులచే నిందింపఁబడుచు నుండువారన్న రవంతపుణ్యమున నైశ్వర్యమునొంది జీవించినను జాలకాల మట్లు సుఖముగ జీవింపరు. మూలవిహీన మహీజములవలె వేవేగ నశింతురు. ఋతుసముదాయములయందుచితరీతిగా వృక్షములు పూవులు గలిగియుండునట్లే పాపము చేయు ప్రాణి యేదియైనను సమయము రాఁగాఁ బాపకర్మమునకు దుఃఖరూపముగాఁ గలుగుఘోరఫలము నొందును. విషాన్నమును భుజించినయెడలఁ దత్ఫలమును వేగమ పొందనట్లు లుత్కృష్టపాపము లొనరించువారలకు వానిఫలము తప్పక శీఘ్రకాలముననే కలుగును. ఘోరపాపము లాచరించుచు లోకాపకారమును గోరుచుండుదురాత్ముల ప్రాణములఁ దీయుటకే రాజగు దశరథునియానతిచే వచ్చియున్నాఁడను. ఇత్తఱి స్వర్ణపుంఖములగు బాణములు నాచే విడువఁబడి నిన్ను ఛేదించి సర్పములు వల్మీకములంజొచ్చునట్లే నాతూణీరముల యందుఁ బ్రవేశింపఁగలుగుఁజుమీ. నీవీవనమున నెవ్వరెవ్వరిని భక్షించితవో కదా అట్టి నీవిపుడు యుద్ధమున హతుఁడవై సబలుఁడవై వారికడకే పోవఁగలవు. నీచేత మున్ను చంపఁబడినమహర్షు లిపుడు విమానములపై నంబరమునుండి నాబాణ

నిహతుఁడవై నరకమున దుఃఖములఁ గుడుచుచుఁగాఁ గాంచఁ గలరు. కులపాంసనా! నీయిష్టానుసారముగ నన్ను బాణములఁ గొట్టుము. నీశక్తినంతయుఁ గనఁబఱపుము. ఇత్తఱిఁ దాళ ఫలమువలె నీశిరస్సు నేలఁ బడఁజేసెదను.

అని పలుకఁగా ఖరాసురుఁడు కోపమున నెఱ్ఱవాఱిన కన్నులతో నవ్వుచు భరింపరానికోపమున నొడలు తెలియక రామునిం గని దాశరథీ! సంగరమున నీవు సాధారణరాక్షసులఁ గొందఱిఁ జంపి యంతమాత్రమున స్తోత్రమునకుఁ దగనినిన్ను నీవే పొగడుకొనుచున్నాఁడవే! ఏల? వీరులగు పూరుషులు తమపౌరుషమునకుఁ బొగరెక్కి తమ్ముఁ దామే సుంతయుఁ బొగడుకొనరు. అల్పులై ధైర్యములేనిక్షత్రియాధములు నిష్ప్రయోజనముగాఁ దామే తమ్ముఁ బొగడుకొందురు. ఏవీరుఁడు ప్రవిదారుణమున మరణమాసన్నమగునంత దుస్థితి చేకూరినను దనకులీనతను బ్రకటించుకొనుచుం దన్నుఁదాఁ బొగడుకొనును? నీవే నిన్ను వినుతించుకొనినందున నీనీచత్వము తెలియనయ్యెను. దర్భలోఁబడిన యగ్ని చక్కఁగా మండినను త్వరగా నాఱిపోయి మఱియేవస్తువును గాని గాల్పలేనిచందమున నాత్మస్తుతిపరాయణుఁడు తదనుగుణమగుశౌర్యమును గనఁబఱుపఁజాలఁడు. ఇదిగో నీమ్రోలఁ గలవిలపాటొందక నిలిచి శత్రురక్తమును రుచిచూచుచున్నగదాయుధమును బట్టుకొనియుండు నన్ను గైరికాది ధాతువులు గలిగియుండు మహాపర్వతమురీతి నప్రకంప్యునిగా నెఱుంగఁజాలకున్నాఁడవు. కనుకనే నిన్ను వినుతించుకొంటివి. పాశహస్తుఁ డగునంతకునిబోలి గదాయుధధారినై నేను నీప్రాణములేకాక మూఁడులోకములఁ గలవారలప్రాణ

ములను నపహరింప నొక్కండనే చాలుదును. ఆత్మస్తుతి చేసి కొనువారివిషయమున నెంతయో పరుషముగాఁ జెప్పవలసియే యున్నది. దాని కిది యదను కాదు. చెప్పఁబూనినయెడలఁ బ్రొద్దు గ్రుంకును. విఘ్నము యుద్ధమునకుఁ గల్గును. చతుర్దశ సహస్రసంఖ్యాకులదానవులఁ జంపితివి. ఇత్తఱి నేను నిన్నుఁ గడ తేర్చి వారిబంధుజాలముల దుఃఖాశ్రువులఁ దుడిచి వై చెదను. ఆయాయుధము, శత్రుమారణమున నెంతయు శక్తి గలదియే యగు ఆఖరదానవేంద్రుఁడు కినుక మిక్కిలి ఘోరంగఁగా నాగదను శ్రీరామునిపైఁ బ్రయోగించెను. ఆమహా గదాయుధము నడుమఁగలతరుగుల్మాదులఁ జూర్ణము చేయుచు రాముని చెంత కడరెను. మృత్యుపాశముంబోలిన యాగద వచ్చుచుండఁగా శ్రీరామమూర్తి దాని నంబరముననే తీవ్రాశుగములఁ బెక్కుశకలములుగ నొనరించెను మంత్రౌషధ ములబలమునఁ బడుసర్పమువలె నది నేలంబడియెను.

మహాశయులారా! ఈభాగమున ననేకవిషయములు విమర్శించి తెలియఁదగినవి కలవు. ఇందు శ్రీరాముఁడు పరుష ముగా మృదువుగను మాటలాడును. ఇది న్యాయ్యమా. అనఁగా శ్రీరామునకుఁ దగునా యని భావము.

"సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాన్న బ్రూయాత్సత్యమప్రియం,
ప్రియం చ నానృతం బ్రూయాదేష ధర్మస్సనాతనః."

అన్న మనుస్మృతివాక్యమునకు శ్రీరాముఁ డుదాహరణ భూతుఁడు కావలయుఁ గదా. అని ప్రశ్నించువారు కలరు. ఇందలిసంభాషణములు శ్రీరామునకుఁ దగినవియే. ఖరాసురు నకు శాపవిముక్తికాలము. పాపములకుఁ బ్రాయశ్చిత్తము ప్రాయికముగాఁ బశ్చాత్తాపము చెప్పఁబడినది. ఉత్తమజన్మము

కలుగఁబోవుచున్న ఖరునకు నతఁడు మున్ను చేసినదోషములఁ దెలుపుట విహితమే. తన్మూలమున నట్టిపాపముల నొనరించిన ఖరునిగతియే పట్టునని లోకులకుఁ దెలుపుటకే యని మన మెఱుంగవలయు. మాయామానుషవిగ్రహుఁడగు శ్రీ రామునకుఁ కీజ్ఞానముకలదా యనరాదు భగవంతుఁ డెఱుంగఁ డనుట పొరపాటు. కాని శ్రీరామావతారమునఁ దనతత్త్వము తానెఱుంగనట్లు నటించుట సహజము విశేషవిధుల ననుస రించి తద్వ్యాఖ్యలఁ దేలినవిశేషాంశములు మన మెఱుంగఁ దగినవియే కావున నాయాయితావుల శ్రీరాముఁ డెఱింగియే యుండియు నెఱుంగనట్లు నటించునని మనము గ్రహింప వలయును.

"ఉద్వేజనీయో భూతానాం నృశంసః పాపకర్మకృత్,
త్రయాణామపి లోకానామీశ్వరోఽపి న తిష్ఠతి. 3
కర్మ లోకవిరుద్ధం తు కుర్వాణం క్షణదాచర,
తీక్ష్ణం సర్వజనో హంతి సర్పం దుష్టమివాగతం." ౪

అని మూలము. పాపకర్మముల నాచరించుచు నితరులను హిం సించుచు నెల్లర కేవగింపఁదగినట్లు వర్తించువాఁ డెంతవాఁ డైనను జీవింపఁజాలఁడు. అనుటంజేసి అహింసావ్రతము సత్కార్యానుష్ఠానము సుజనహితప్రవర్తనము ముఖ్యములని భావము. దుష్కర్మరతుని నెంతదయగలవారైన హింసింతురు. ఇందొకవిశేషము కలదు. దుష్టసర్పమనఁగా విషవేగమునఁ బ్రాణములఁ దీయునదనియే భావము. అయ్యది కృష్ణసర్పమే. అట్టివానిని జంపుట లోకాచారమనియు దయగలవారు కూడ వానిని బొలియింతురనియు శ్రీరాముఁడు పలికెను. దీనింబట్టి దుష్టసర్పమును జంపవచ్చుననువిషయము తోఁచును.

"ఆత్మార్థం వా పరార్థం వా హత్వా దోషైర్న లిప్యతే,
గృహోపిష్టకరాన్వాపి నాగాఖుబలవృశ్చికాన్. ౬౮
ఏతద్గృహాశ్రమస్థానాం క్రియాఫలమభీప్సతాం,
పశుయజ్ఞో న చాన్యేషామిష్టాపూర్తికరం భవేత్." ౬౯

బ్ర. ౨ అధ్యా.

గృహస్థులు శిశువులు లోనగువారిని రక్షించుకొనవలసిన వారుగాన సర్పాదులను జంపవచ్చును. ఇతరులగు బ్రహ్మచర్యాద్యాశ్రమస్థులు వానింగూడఁ జంపరాదనియుఁ దేలెడిని.

"ఉరగేష్వాయసో దండష్షండకే త్రపుసీసకమ్. ౨౭౩

యాజ్ఞ. ప్రాయ. కాం.

"సరీసృపేషు వ్యాపాదితేషు అయోమయో దండస్తీక్ష్ణప్రాన్తో దేయః."

అని మితాక్షరవ్యాఖ్య.

"అభ్రిం కార్ష్ణాయసీం దద్యాత్సర్పం హత్వా ద్విజోత్తమః,
పలాలభారకం షండే సైసకం చైకమాషకం." ౧౩౩ అధ్యా. ౧౧ మను.

"కృత్వా పాపం హి సంతప్య తస్మాత్పాపాత్ప్రముచ్యతే,
నైవం కుర్యాం పునరితి నివృత్త్యా పూయతే తు సః. ౨౩౦
ఏవం సంచింత్య మనసా ప్రేత్య కర్మ ఫలోదయం,
మనోవాఙ్మూర్తిభిర్నిత్యం శుభం కర్మ సమాచరేత్. ౨౩౧
అజ్ఞానాద్యది వాజ్ఞానాత్కృత్వా కర్మ విగర్హితం,
తస్మాద్విముక్తిమన్విచ్ఛన్ ద్వితీయం న సమాచరేత్." ౨౩౨

మను. ౧౧ అధ్యా.

దుష్టసర్పములవధింపవచ్చునని పురాణోక్తియుఁ జంపిన యెడలఁ బ్రాయశ్చిత్తము చేయవలయునని స్మృతులు తెలుపుచున్నవి. ఇట్లు విరుద్ధములుగా నుండునపు డెద్ది సరిగ్రాహ్యమనుశంక

కలుగక మానదు. గృహస్థులు గృహానిష్టకరములగు సర్ప వృశ్చికాదులఁ జంపవచ్చుననునది సామాన్యశాస్త్రము కాదు. విశేషధర్మబోధకమే. ప్రాయశ్చిత్తము తెలిపినస్మృతు లంత కన్న విశేషధర్మమును దెలిపెను. ప్రాణివధము గత్యంతరము లేక చేసి యంతతో నూరకుండక ప్రాయశ్చిత్తము చేసికొను టత్యుత్తమమనియే తేటపడును. హింసాకర్మమున కలవాటు పడరాదనియే యిందలిసారము. ప్రాయశ్చిత్తము చేసికొనుట చేత మరలమరల నట్టికర్మము చేయునలవాటు వరుసగా క్షీణించుననువిశేషమును మన మెఱుంగుట మంచిది. హింసా కర్మము విధివిహితమైనను దానిని మాను టత్యుత్తమమనియే యీభాగము మనకు బోధించెనని యెఱుంగవలయును. ఈ పై రెండుధర్మములు మనకు శ్రీరామమూర్తి బోధించెనని మనము నేర్చుకొనిన రామాయణపారాయణఫలము మనకుఁ జక్కఁగాఁ గలుగును.

"లోభాత్పాపాని కుర్వాణః కామాద్వా యో న బుధ్యతే,
భ్రష్టః పశ్యతి తస్యాంతం బ్రాహ్మణీ కరకాదివ." ౫

అని మూలము. "అప్రాప్తస్య ప్రాప్త్యాశా కామః ప్రాప్తపరాత్యా శాలోభః. బ్రాహ్మణీరక్తపుచ్ఛికా." అని వ్యాఖ్య. ఎఱ్ఱనితోఁక గలపాము. అనఁగా నలికండ్లపాము. నలికీఁచు అని తుదకుఁ దేలినసారము. నలికిరి అని కొందఱు వాడుదురు. ఈరెండును సాధువులే. వడగండ్లు నలికిరి తినిన నది చచ్చును. అవి దానికి విషతుల్యములని భావము. లభింపనివస్తువులఁ గోరుట కామ మనఁబడును. దొరకినవానిని వదలరాదనునదియే లోభము. ఈరెండింటివలనఁ బాపము లొనరించి వెనుకనైన నయ్యో యిట్టు లొనరించితినిగదా యని యనుతాపపడని

వాఁడు భ్రష్టుఁడై నశించును. ఆపాపము వానిం జంపునని భావము

"కామాత్మానస్స్వర్గపరా జన్మకర్మఫలప్రదాం.
క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి. ౪౩
భోగైశ్వర్యప్రసక్తానాం తయాపహృతచేతసాం,
వ్యవసాయాత్మికా బుద్ధిస్సమాధౌ న విధీయతే." ౪౪ అధ్యా. ౨
"కామమాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః,
మోహాద్గృహీత్వాసద్గ్రాహాన్ ప్రవర్తంతేఽశుచివ్రతాః. ౧౦
ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః,
ఈహంతే కామభోగార్థమన్యాయేనార్థసంచయాన్." ౧౨ అధ్యా. ౧౬
"కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః,
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణం." ౩౭ అధ్యా. ౩
"లోభః ప్రవృత్తిరారంభః కర్మణామశమస్స్పృహా,
రజస్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ." ౧౨ అధ్యా. ౧౪

అను నీభగవద్గీతావాక్యముల ననుసరించి కామము లోభము రజోగుణసముద్భవములు వానియుద్రేకమునఁ జేసినకర్మము లధఃపతితునిగా నొనరించును అవియే వాని వినాశనమునకు హేతువులగునని భావము తేలెడిని.

"అవశ్యం లభతే జంతుః ఫలం పాపస్య కర్మణః,
ఘోరం పర్యాగతే కాలే ద్రుమాః పుష్పమివార్తవం. ౧
న చిరాత్ప్రాప్యతే లోకే పాపానాం కర్మణాం ఫలం,
సవిషాణామివాన్నానాం భుక్తానాం క్షణదాచర."

అని మూలము. ఇయ్యది

"యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోయం కర్మబంధనః,
తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగస్సమాచర." ౯ అధ్యా. ౩

"యజ్ఞో నామ ఈశ్వరః తదర్థం యత్క్రియతే తద్యజ్ఞార్థం కర్మ"
అని భాష్యము. అను నీగీతావాక్యమునఁ గలయర్థమునే తెలుపును. భగవత్ప్రీతికరమగు కర్మము తప్పఁ దక్కినకర్మమంతయు బంధించునదియే. భగవద్విషయకకర్మము ముక్తిదము. అట్టికర్మము నాచరింపక పాపకర్మము నాచరించితివి. సమయము రాఁగా నసఁగాఁ గర్మఫలానుభవకాలము రాఁగా వృక్షములు ఆయాయిఋతువులు రాఁగాఁ దదుచితపుష్పములు గలవగురీతిఁ దత్ఫలము ఘోరరీతిని బొందును. అత్యుత్కటపాపకర్ముల ఫలము శీఘ్రమే పొందును. విషము కలిపినయన్నమును దినినవాఁడు దానిఫలము నతిశీఘ్రమే పొందునట్లని శ్రీరాముఁడు తెలిపెను. ఈవాక్యమునఁ గలయర్థమే.

"త్రిభిర్వర్షైస్త్రిభిర్మాసైస్త్రిభిః పక్షైస్త్రిభిర్దినైః,
అత్యుత్కటైః పుణ్యపాపై రిహైవ ఫలమశ్నుతే."

అన్నసూక్తియందుఁ గనంబడును. అనఁగాఁ దొలిజన్మమున నీవు శంకరు నాగ్రహామునను బ్రాతుఁడవగు నంతదుష్కర్మము నాచరించితివి. దానిఫలము ననుభవించితివి. ఇఁక శీఘ్రము శాపవిముక్తి రూపఫల మనుభవింపఁగల వనునర్థము సూచింపఁబడుచున్నది. అనఁగా క్రూరకర్ముల ఫలములు తీవ్రరూపముగా ననుభవమునకు వచ్చుననియే యిటఁగలసారము.

"పాపమాచరతాం ఘోరం లోకస్యాప్రియమిచ్ఛతాం,
అహమాసాదితో రాజ్ఞా ప్రాణాన్ హంతుం నిశాచర." ౧౦

అని మూలము. అయ్యది

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే."

అనుస్వప్రతిజ్ఞను దెలుపుచున్నది. "రాజ్ఞా అహమాసాదితః" దశరథమహారాజుచే నియోగింపఁబడితిని. అనునది భగవంతుని మాయామానుషవిగ్రహత్వమును దేటపఱచుచున్నది. ఇట్లనుటంజేసి దశరథుఁ డిట్టివారిని శ్రీరామునిమూలమునఁ బొలియింపఁజేయుమని వారిదుష్కర్మము ప్రోత్సహింపఁ బంపెననుసిద్ధాంతము సూచింపఁబడుచున్నది. దశరథుఁడిందులకుఁ బంపినట్లు లేదుకదా యని కొందఱడుగుదురు. శ్రీరాముఁడు సాగనున్నపట్టాభిషేకము భంగమగుటయేగాక దానిస్థానమునఁ బదునాలుగేండ్లు వనవాసము సంభవించుటచేత నిట్టు లూహించెననియు నీయూహ సమంజసమే యనియు మనము నిశ్చయింపవచ్చును.

"అద్య త్వాం పతితైర్బాణైః పశ్యంతు పరమర్షయః,
నిరయస్థం విమానస్థా యే త్వయా హింసితాః పురా."  ౧౩

అని మూలము. ఈయది కర్మసిద్ధాంతమును దృఢపఱచుచున్నది

"మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతం,
నాప్నువంతి మహాత్మానస్సంసిద్ధిం పరమాం గతాః.  ౧౫
ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున,
మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే." ౧౬  అధ్యా. ౮

"ప్రాప్య పుణ్యకృతాన్ లోకానుషిత్వా శాశ్వతీస్సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే.  ౪౧
అథవా యోగినామేవ కులే భవతి ధీమతాం,
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశం.  ౪౨
తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికం,
యతతే చ తతో భూయస్సంసిద్ధౌ కురునందన." ౪౩  అధ్యా. ౬

అనుగీతావాక్యములు కూడఁ బైని వ్రాసినకర్మసిద్ధాంతమునే సువ్యక్తముచేయుచున్నవి.

"క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి."

అను నీశ్రుతియుఁ బైని వ్రాసినయర్థమునే తెలుపుచున్నది. మర్త్యలోకమునఁ జేసినసత్కర్మదుష్కర్మములకు ఫలములు స్వర్గాదిలోకముల ననుభవింపవలయును. దుష్కర్మముల నొనరించిన నీవు నరకమునఁ గష్టముల ననుభవించుచుండఁగా మహాతపస్సంపన్నులగు మునులు నీచే వధింపఁబడి విమానములపైనుండి నిన్నుం గాంతురుగాక తపస్వుల కిట్టి దుర్మరణమేల వచ్చెనని ప్రశ్నింపరాదు. తత్పూర్వజన్మమునఁ జేసిన దుష్కృతఫలశేషమే యది. దానఁ బ్రారబ్ధము నశించెను. మిగిలినది సత్కర్మఫలమే. దీనిచేతఁ గర్మఫలానుభవ మెంతవారికైనఁ దప్పదనియే యేర్పడుచున్నది ఆసిద్ధాంతమునే శ్రీరామమూర్తి ఖరునకుఁ దెలుపునెపమున లోకులకు నుపదేశించెను.

"ప్రాకృతాన్ రాక్షసాన్ హత్వా యుద్ధే దశరథాత్మజ,
ఆత్మనా కథమాత్మానమప్రశంస్యం ప్రశంససి." ౧౬

అనునది ఖరాసురుని వచనము. ఆత్మస్తుతియుఁ బరనిందయు నకృత్యములు అందు రెండింటిని నీవు చేయుచున్నావే అని ఖరుఁడు రాము నాక్షేపించెను ఇవి రెండుకార్యములును బాతకములే యని స్మృతులు పురాణములు తెలుపుచున్నవి.

"కామం బహ్వపి వక్తవ్యం త్వయి వక్ష్యామి న త్వహం,
అస్తం గచ్ఛేద్ధి సవితా యుద్ధవిఘ్నస్తతో భవేత్." ౨౩

అని మూలము. రాత్రించరులకు రాత్రి బలదాయకము. అయినను మాటలతో నిఁకఁ గాలముఁ బుచ్చరాదు. యుద్ధ

విఘ్నమగునని ఖరుఁడు పలికెను. రాముని వధింపఁబూనిన ఖరుఁ డిట్లు పలుకఁ గారణమేమని విచారింతము. శాపాంతకాల మాసన్నమైనది. అతనిమనోభావములు మాఱుచున్నవి. ఆతనికి భావికర్మము ననుసరించి బుద్ధితత్త్వము మార్పు నొందుచున్నది. తనశాపవిముక్తికాల మిదియని వానికిఁ దెలియకపోయినను ప్రాక్కర్మ మాతనిఁ దాఱుమాఱుచేయు చున్నది. కావునఁ దానేమి చేయవలయునో యతఁ డెఱుంగఁడు.

"స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్.
ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయంత్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా."

అను నీగీతావాక్యముల ననుసరించి కర్మమాతనిస్వాతంత్ర్యము నరికట్టుచున్నది. కనుకఁ దానేమి చేయుచున్నాఁడో యతఁ డెఱుంగఁడని భావము. దీనింబట్టి జీవులు కర్మబద్ధులనియు స్వాతంత్ర్యమనునది నామమాత్రమనియుఁ దేలుచున్నది. ఆభావము స్థిరపడుటయే కర్మఫలమని మన మెఱుంగవలయును

ఈభాగమున నధ్యాత్మరామాయణమున విశేషమేదియుఁ గనఁబడలేదు. తర్వాతిరామునికథను బఠింతము.

## ఖరాసురుని శ్రీరాముఁడు వధించుట.

* ధర్మవత్సలుఁడగు శ్రీరాముఁడు నిరాయుధుఁడుగా నున్న ఖరాసురునిపై బాణప్రయోగము చేయనొల్లక వేడుకగా

*ఇది ముప్పదియవసర్గమునఁ గలదు.

మాటలాడఁబూని యాగదపోయినందునఁ దొట్రుపడుచుండు
టెఱింగి యిట్లనియె. రాక్షసాధమా ! నీబలమంతయుఁ గనఁ
బఱచితివే. ఇఁక నేమి చేయఁజాలుదువు? బలమున నాకంటె
నల్పుఁడవయ్యు వ్యర్థముగాఁ బ్రేలెదవు. ఇంతదూరము పలికితివి
కదా. వ్యర్థోక్తులయందు ధీరుఁడవే. ఇంతదనుక నీగద
శత్రువులఁ జంపుచుండెను. అది నీకు విజయము కల్గించుననియే
నమ్మియుంటివి. అది యిదిగో శకలములై పడినదికదా. నిన్ను
వధింతునని నాతో నేమో వికత్థనములు పలికితివే. అవియు
వ్యర్థములైనవి నీవు కేవలము వావదూకుఁడవు. నీచస్వభా
వుఁడవు. సదాచారసంపద్విహీనుఁడవు. గరుత్మంతుఁ డమృత
మును హరించునట్లు నీప్రాణములు హరింతును. నీవక్షము నా
బాణములు భేదింపకంఠము తెగిపడఁజేయ నూత్నరక్తము స్ర
వింపఁగా దాని భూమి త్రాగఁగలదు. పొరలాడుచు నీవు నల
ఖ్యయువతినిబోలిభూమి నాలింగనము చేసికొని దీర్ఘనిద్ర పోవఁ
గలవు. నీవు చావఁగా మునుల కీదండకాటవి సుఖనివాసము
కాఁగలదు. ఇందుఁగల రాక్షసనివాసములన్నియు మునులకు
నివాసములై సుఖదాయకములగునట్లు నేఁజేసెదను.పరభయం
కరప్రవర్తనముగల రాక్షసాంగనలు తమవారెల్లరు చావఁగా
దుఃఖించుచు భీతిల్లి పాఱిపోవఁగలరు. నీవంటి దుర్వృత్తిగల
నీభార్యలు దుఃఖ మేనాఁడు నెఱుంగనివారయ్యు నిపు
డద్దానిం జక్కఁగా నెఱిఁగి నిష్కామలగుదురు నీచవృత్తీ!
పరమద్రోహీ! మునులు హోమము చేయునపుడు నీవలన నేమి
శంకలు కలుగునో యని శంకించుచుండువారు అట్టిపాపాత్ముని
నిన్ను వరియించినందులకు భార్యలు దుఃఖమన నిట్టిదికదా
యని యెఱుంగుదురు.

అని విజృంభించి శ్రీరాముఁడు పలుకుచుండఁగా ఖరుఁడు రోషావిష్టుఁడై మహాధ్వనితో నారామునిం గని రామా! గర్వించితివి. కావున భయకాలము దాపున నున్నం గూడ దానిమాని మృత్యువశుఁడ వగుటం జేసి వక్తవ్యావక్తవ్యములు తెలియఁజాలకున్నావు. మృత్యుపాశనిబద్ధులగువారు షడింద్రియవ్యాపారములు తప్పి కర్తవ్య మిదియని తెలియఁజాలరు. అని పలికి భ్రూభంగముగదుర రణము చేయ నాయుధములకై నలుదెసలు పరికించుచుఁ జెంతనున్న మహావృక్షముం గని దాని బలముకొలఁదిగా నూఁకఁ బెల్లగించెను. మహాధ్వనితో దానిని రెండుచేతులంబట్టి రామునిపై వైచి దీన నీవు మృతినొందితివని పలికెను. దాని నడుమున శ్రీరాముఁడంబుల ఖండించి విగతరణపరికరుఁడయ్యు నించుకయు నను కూలుఁడుగా వాఁడు రాకుండుటం జేసి తీవ్రరోషమున రక్తాంతనయనుఁడై యతనిమేన సహస్రబాణములు నాటెను. రక్తధారలు ఫేనయుతములై వెడలినవి అప్పుడు వాఁడు దేహము శోషిల్లినను రామునిపై నురవడించెను. ఆయుధములఁ దీసికొని ప్రయోగింప ననువుపడనియంత చెంతకు రాఁగా బాణము ప్రయోగించునంత యంతరము గల్గుటకును, వానిశరీరరక్తము తనకుఁ దగులు ననునేవగింపువలనఁ ద్వరపడి వెనుక కడుగులిడుచు నించుక యరిగెను.

అంతఁ దద్వధేచ్ఛమై నగ్నివలె వెలుంగుచు ద్వితీయ బ్రహ్మదండముపలెనుండు నొకబాణవర్య మందికొనియెను. మతిమంతుఁ డగునింద్రుఁడు భావికాలగతుల నారసి యాబాణము నగస్త్యమునిమూలమున శ్రీరామునకు నిచ్చెను. దానిని సంధించి ఖరాసురునిపైఁ బ్రయోగించెను అయ్యది

మహానినాదము చెలంగ నద్దానవుని వక్షముం జొచ్చెను. శ్రీరామబాణాగ్నిసందగ్ధుండై పూర్వము శ్వేతారణ్యక్షేత్రమున శ్రీరుద్రనేత్రాగ్నిచే దగ్ధుండగునంధకాసురునిచందమునం బుడమింగూలెను. ఇంద్రప్రయుక్తవజ్రహతుం డగువృత్రుని రీతిగను, ఫేననిహతుం డగునముచిచందమునను, వజ్రమునం బడిన బలాసురునిపగిదిని ఖరుండు నేలంగూలెను. రాజర్షులు బ్రహ్మర్షులు వచ్చి పరమానందమున రాము నారాధించి దేవేంద్రుం డీఖరాదివధార్థమే శరభంగు నాశ్రమమున కరుదెంచెను. వీనిం జంపించునిమిత్తమే మును లుపాయము వెదకి నిన్నీస్థలమున నుండంజేసిరి. దాశరథీ! మాకార్యమే యిది. దీనిం జేసితివి. ఇంక నీయరణ్యమున మునులు సుఖముగా నుండంగలరు. అనునంత దేవతలు చారణులు విస్మయమున భేరికానినాదములు చెలంగం బూలవానం గురియించిరి. సార్ధఘటికామాత్రమున మహాపరాక్రములగు పదునాల్గువేలరక్కసులు రామునిచే హతులగుట యెంతయు నాశ్చర్యము. ఎంత గొప్పకార్యమును శ్రీరాముం డొనరించెను.అని పలుభంగులం బొగడుచుం దమతమనెలవులకుం బోయిరి.

అత్తఱి శ్రీరామునిపరాక్రమ మెఱింగి సౌమిత్రి సీతాదేవిని బిలుచుకొని పర్వతగుహానుండి వెడలి యాశ్రమమును బ్రవేశించెను. అన్న విజయంబుగొని మహర్షిపూజితుం డగుచుండ సౌమిత్రి యెదుర్కొని సేవింప నాశ్రమముం జొచ్చెను. సీతాదేవియు శత్రుసంహార మొనరించి మహర్షి సుఖావహుండై యుండు శ్రీరామభద్రునిగాంచి పరమసంతుష్టురాలై భర్తను సమాలింగన మొనరించెను. ఆజానకి రాక్షసులు హతులగుటకు సంతుష్టినొంది రాముం డాహవంబున నుంతయు

గాసినొందకుండుటం గని మహానందము నొందెను. ఇట్లు రక్కసుల నుక్కడంచి మహర్షులు పూజింప నలరారు శ్రీరామ మూర్తిం దిలకించి శీతాంశుముఖియగు నాసీత మరల మరలఁ గౌఁగిలించుకొనెను.

మహాశయులారా! అనేకవిషయములు విమర్శింపఁదగినవి కల యీభాగమును జక్కఁగాఁ బరిశీలించి నీతుల గ్రహింతము. ఇందు శ్రీరామునిస్వభావ మెట్టిదని తేలఁ గలదు. ఖరాసురునకుఁ బ్రాణపద మనఁదగినదిగద. అనేకశత్రువులఁ బొరిగొన్నదది. ఆవిశ్వాసమే దానియం దతనికిం గలదు. తొలుత దానిం బ్రయోగింపక పాదచారియైనపుడింక నీతఁడు సామాన్యసాధనములఁ జావఁడని యెఱింగియే దానిం బ్రయోగించెను. అది వైరిబాణముల విదారితమయ్యెను. అత్తఱి నతఁడు విభ్రాంతుఁ డయ్యెను. ధర్మవత్సలుఁ డగురాముఁడు నవ్వుచు మాటలాడెనని రామాయణమునఁ గలదు అట్టితఱి నవ్వుట మహానాయకలక్షణము కాదనవచ్చును. శత్రువధమునఁ దప్పేమియు లేదు. కాని పరిహాసాలాపములకు శ్రీరామున కది సమయమా యని కొందఱకుం దోఁచు. ఆసంశయము మంచిదిగాదు. దాన భగవంతునియందుఁ గలవిశ్వాసము తొలఁగును.

"భిత్వా తు తాం గదాం బాణై రాఘవో ధర్మవత్సలః,
స్మయమానః ఖరం వాక్యం సంరబ్ధమిదమబ్రవీత్." ౧

అని మూలము. "ధర్మవత్సల ఇత్యనేన నిరాయుధవధోఽనుచిత ఇతి శ్రీరామోఽమన్యత ఇత్యవగమ్యతే." అని గోవిందరాజులు వ్రాసిరి. ఇదెంతయు ననుచితము. ఇట్లు వ్యాఖ్యాత

యీతావున వ్రాయరాదు. తుదకు నిరాయుధునే వధించెను గదా. అనుచిత మనునభిప్రాయము రామునకుఁ గలదని మన మూహింపరాదు. కనుక 'ధర్మవత్సలః' అనుదానికి నింకొక్క రీతిగా నర్థము చెప్పవలెను మాయామానుషవిగ్రహుఁ డగుట రామావతారలక్షణము. భగవంతుఁ డొకప్పుడైన స్వరూపజ్ఞానవిలసితుఁడు కాఁడని మన మూహించుటయుఁ బొరపాటు. శంకరువాక్యము రామునిమూలమున మీకెల్ల రకు శాపవిముక్తి యగుననియేకదా. ధర్మవత్సలుఁ డనఁగా ధర్మమునఁ బ్రీతికలవాఁడని యర్థము సామాన్యము

"వృషో హి భగవాన్ ధర్మస్తస్య యః కురుతే హ్యలం,
వృషలం తం విదుర్దేవాస్తస్మాద్ధర్మం న లోపయేత్." ౧౬. అధ్యా. ౮

అని మనుస్మృతి తెలుపుచున్నది. ధర్మరక్షణమున వత్సలుఁ డనునర్థము సముచితము. ధర్మము భగవంతుఁడే. దానియందుఁ బ్రీతి యనఁగా శంకరనామమును ధరించిన తాఁ జెప్పిన శాప విముక్తి యని దీనిభావము. దానియందుఁ బ్రీతికలవాఁడు. కనుకనే నవ్వుచు నని యర్థము. ఇంతకాలమున కీతఁడు పాప కర్మఫలానుభవమునుండి తొలఁగఁజాలెఁగదా యనుభావమే నవ్వువచ్చుటకుఁ గల కారణము. "సంరబ్ధం ఖరం ప్రతి ఇదం వాక్య మబ్రవీత్." అని యన్వయక్రమము. భ్రాంతినొందిన ఖరుని ననఁగా నీయాయుధ మిట్లు వ్యర్థమయ్యెనే యని విభ్రాంతుఁడయ్యెను. ఆకాలమున నారాక్షసునిబుద్ధి యెట్లు న్నదో యెవరు తెలుపఁగలరు? శాపవిముక్తికాలము మిక్కిలి దాపుననే యున్నది. సంధికాలమే యది. రాఁగలమహాఫలము నకుఁ దగినయూహాలు క్రమ్ముకొననున్నవి. రాక్షసోచితము లగునూహాలు వదలిపోవ సిద్ధముగానున్నవి. ఆరెండింటి కది

సంధికాలము కదా. కావున నతనికి మహోపకారము చేయఁ బూనినరాముఁడు పక్కున నవ్వెను. దీనిచే నతనికిఁ గోపము కలుగఁ దనపై కరుదెంచుఁగాక. అపుడు వధింతుననియే రాముఁడు తలంచెను. ఈనవ్వు పరమానుగ్రహముకాని వేఱు కాదు.

"ఏతత్తే బలసర్వస్వం దర్శితం రాక్షసాధమ,
శక్తిహీనతరో మత్తో వృథా త్వమవగర్జసి."

అని మూలము. "రాక్షసః అధమో యస్మాత్సః తస్య సంబుద్ధిః రాక్షసాధమ" రాక్షసోత్తమా యని యర్థము. నీకుఁగల బల సారమంతయుఁ గనఁబఱచితివి. అది యింతయే కదా. "శక్త్యా అత్యంతంహీనః శక్తిహీనతరః"అని వ్యుత్పత్తి. నీయందుఁ గల ప్రకృత్యంశ మల్పతరము సుమీ 'మత్తః' నాకంటె అనఁగా నిన్నుఁ బ్రకృతిహీనునిగా నొనరించెనని భావము.

"యద్యహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి."　　గీ

అను నీగీతావాక్య మీవిషయమునే తెలుపుచున్నది. ప్రకృతి నీచేత నీపని చేయించుననఁగా భావమేమి? నీవు స్వతంత్రుఁడవు కావు. పరతంత్రుడవు. కాన నీచేత నేయే కార్యములు చేయించవలయునని ప్రకృతి యూహించెనో యవియన్నియు ముందే చేయించినది. ఇఁక నీయందు శక్త్యంశము తొలఁగు చున్నది. కనుక నే వ్యర్థముగా వదరుచున్నాఁడవు. నీగతి నీవే యెఱుంగవే యని రాముఁడు హితముపదేశించెను. ఇది పరిహాసమా, కానే కాదు. హితోపదేశము.

మున్ను శ్రీశంకరభగవత్పాదాచార్యులు మతములఁ జక్కఁజేయఁబూని పండితులను మెప్పించుచుఁ దిరుగుచుండి కాశీనగరమునకుం బోవుచుండెనఁట. అందొకపురమున శక్త్యారాధనము చేయువారితో వాదముచేసనపుడు శాక్తమవైదిక మగుట హేయమనిరఁట. మఱుదినమే కాశీనగరమున కరుగు చుండఁగా నొకనీటికాలువ కనఁబడెనఁట. అది కడుఁజిన్నది యయ్యు వారిదృష్టికి విశాలముగను గంభీరముగను దోఁచెను. దాఁటఁజాలక కూరుచుండిరఁట. అపు డొకముద సలి పురంధ్రీమణి తా నాకాలువ వీరు చూచుచుండఁగనే దాఁటి యేల కూరుచున్నారని ప్రశ్నింపఁగా దీనిని దాఁటు టకు శక్తిలేదని బదులు పలికిరఁట. ఆమె నవ్వుచు నీమతమున శాక్తమే లేదేమో యనుచు నదృశ్యయయ్యెనఁట. స్వాము లాలోచించి ముక్కు చెంపలు వైచుకొని భగవతిని ధ్యానించి సర్వమతసారమే శాక్తమని నిశ్చయించుకొని కాలువందాఁటి కాశీనగరముం జేరి సభలో,

"అలింగకమచక్రాంకమజటాస్థ్యసురామిషం,
అరక్తకమనాచ్ఛిష్టం షడస్త్రాభిరనుష్ఠితమ్."

అని షణ్మతధర్మములం దెలిపి భగవతీమాహాత్మ్యమును స్తుతిం చుచు.

"కదా కాలే మాతః కథయ కవితారక్తకరసం
పిబేయం విద్యార్థీ తవ చరణనిర్ణేజనజలం,
ప్రకృత్యా మూకానామపి చ కవితాకారణతయా
కదా ధత్తే వాణీ ముఖకమలతాంబూలరసతాం.
గిరామాహుర్దేవీం ద్రుహిణగృహిణీమాగమవిదో
హరేః పత్నీం పద్మాం హరసహచరీమద్రితనయాం,

తురీయా కాపి త్వం దురధిగమనిస్సీమమహిమా
మహామాయా విశ్వం భ్రమయసి పరబ్రహ్మమహిషి.
ప్రదీపజ్వాలాభిర్దివసకరనీరాజనవిధి
స్సుధాసూతేశ్చంద్రోపలజలలవైరర్ఘ్యరచనా
స్వకీయైరంభోభిస్సలిలనిధిసౌహిత్యకరణం
త్వదీయాభిర్వాగ్భిస్తవ జనని వాచాం స్తుతిరియం."

అని మహాప్రకృతిమహాత్త్వమును విశదీకరించి యందుఁ బ్రకృతి విశిష్టుఁ డగునపుడే భగవంతుఁడు కార్యకరణదక్షుఁ డగు ననియు లేకున్న నేకార్యము నొనర్పఁ బూనకయుండుననియు

"శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం,
న చేదేవం దేవో న ఖలు కుశలస్స్పందితుమపి."

అనుమూలము మూలమునఁ దేటపఱచిరి. ఈకథాసర్వస్వము నే శ్రీరాముఁడు ఖరునకు హితముపదేశించునెపమున మనకుఁ దెలిపెను. అనఁగా నీశక్తి హీనమయ్యెను. అది యెఱుంగక యింక నేమేమో ప్రేలుచున్నాఁడవే రాఁగలసుగతిని దెలిసి కొనరాదా. అనఁగాఁ ద్వరపడి నన్నాదరించి శరీరమును వదలి సద్గతినొందుమా యని బోధించెననియే యిటఁగలసారము.

"ఏషా బాణవినిర్భిన్నా గదా భూమితలం గతా,
అభిధానప్రగల్భస్య తవ ప్రత్యరిఘాతినీ." 3

అని మూలము. "తవ ప్రత్యయఘాతినీ." అని మహేశ్వర తీర్థులవా రంగీకరించినపాఠము. "తవ ప్రత్యరిఘాతినీ" అని గోవిందరాజులుగారిపాఠము. ఇంచుమించుగా నివిరెండును గథకు సమానోపకారకములే. ప్రత్యయఘాతినీ=నీవిశ్వాసము

నడంచునది. సకలలోకములను జయింతునన్న విశ్వాసము తీఱి పోయెఁగదా. అనఁగా నీకిఁక దేనియందును విశ్వాసము కలుగ రాదు. ఇది నశించినమూలమున నీకుఁగల సకలవిశ్వాసములు నశింపవలసినవే యని భావము. నీదుష్కర్మ ఫలానుభవ కాలము తుదముట్టెనని రాముని మాటలనుండి తేలెననియే యిందుఁ గలసారము.

''పాంసురూషితసర్వాంగస్స్రస్తన్యస్తభుజద్వయః,
స్వప్స్యసే గాం సమాలింగ్య దుర్లభాం ప్రమదామివ.'' ౭

అని మూలము. "దుర్లభాం ప్రమదామ్. ప్రకృష్టో మదశ్చేతో వికారోఽస్యా ఇతి ప్రమదా." అని యమరము. ''ప్రమదో హర్షోఽస్త్యస్యా ఇతి ప్రమదా ఉత్తమయోషిత్.''ఇతి మేదినీ కోశః. ఈయర్థమునే కాళిదాసు గ్రహించెను.

''నయనాన్యరుణాని ఘూర్ణయన్ వచనాని స్ఖలయన్ పదేపదే,
అసతి త్వయి వారుణీమదః ప్రమదానామధునా విడంబనా.'' ౧౨

కుమారసం. ౪ సర్గము.

ఉత్తమకాంతారత్న మతిప్రయత్నలభ్యము. అట్టిది లభించి నపు డాదరాతిశయమున నాలింగనసుఖమునఁ దేలినట్లు భూమిని గౌఁగిలించుకొని శయనింపఁగలవనఁగా నాసాన్నిధ్య మునఁగల్గు నీమృతి నీకు శాశ్వతానందదాయక మగుముక్తి నొసంగునని భావము.

''దుర్లభం ప్రాకృతం వాక్యం దుర్లభః క్షేమకృత్సుతః,
దుర్లభా సదృశీ భార్యా దుర్లభస్స్వజనః ప్రియః.'' ౫౪

చాణక్యునివాక్యము.

''తమేవమభిసంరబ్ధం బ్రువాణం రాఘవం రణే,
ఖరో నిర్భర్త్సయామాస రోషాత్ఖరతరస్వనః. ౧౩

వృథం ఖల్వవలిప్తోఽసి భయేష్వపి చ నిర్భయః.
వాచ్యావాచ్యం తతో హి త్వం మృత్యువశ్యో న బుధ్యసే. ౧౪
కాలపాశపరిక్షిప్తా భవంతి పురుషా హి యే.
కార్యాకార్యం న జానంతి తే నిరస్తషడింద్రియాః." ౧౫

అని మూలము. ఖరాసురుఁడు రాము నాక్షేపింపఁ బూనియుఁ గాలకర్మములకు లోనగుబుద్ధిగలవాఁడు కావున స్వాభిప్రాయము నిట్లు తెలిపెను. విశేషార్థమే యిట వ్రాయఁబడును.

"మృత్యువశ్యః ఖరః రామ త్వం వాచ్యావాచ్యం న బుధ్యసే. ఇతి దృఢం అవలిప్తోఽసీతి చ. నిర్భర్త్సయామాస ఇతః. లోకే కాలపాశవశం గతాః పురుషా మహాత్మానమపి నిర్భర్త్సయంత్యేవేతి భావః."

అని వ్యాఖ్య. ఈభావ మాతనికుండెనా యనరాదు. ఆయర్థమగునట్లు మాటలకూర్పు పొడకట్టెడు. కర్మము సత్ఫలము నీఁబూనియున్నదికదా. కావున మనోభావములు మాఱుచుండును. ఇది విరుద్ధము కాదు. స్వభావమే. శ్రీరాముని భావము ఖరునిభావము నిపుడు మార్పునొందినవి. పూర్వకర్మసంబంధముననే యని మన మెఱుంగవలయును. లోకమున మరణకాల మాసన్నమయ్యెనని యెఱింగి రోగి తనపగవాఁడు కనఁబడఁగా మంచిమాటలాడును. ఏల? కర్మమే యాతని నట్టులాడించునని మనము నిశ్చయింపవలయును.కనుకనే "మరణాంతాని వైరాణి" అన్నసూక్తి వెలసెను. "నిరస్తషడింద్రియాః" అనఁగా వదలివేయఁబడిన జ్ఞానేంద్రియములయు నంతఃకరణము యొక్కయు వ్యాపారములు గలవారలై కార్యాకార్యముల నెఱుంగఁజాలరు. ఏల? కాలపాశపరిక్షిప్తులయి అనఁగాఁ

గాలపాశములు తనను బంధింపఁగా జ్ఞానేంద్రియాంతఃకరణ వ్యాపారములు నిలిచిపోవు. అనఁగాఁ దనకు లోఁబడక వాని యిష్టానుసారము ప్రవర్తించునని భావము. కావున నట్టివారు కృత్యాకృత్యముల నెఱుంగఁజాలరు. అనునది న్యాయ్యమే. ఈనియమము ననుసరించి ఖరునిదురూహాలు తొలుమూఱయ్యె నన నందు విచిత్ర మేమున్నది?

"తమాపతంతం సంరుద్ధం కృతాస్త్రో రుధిరాప్లుతం,
అపాసర్పత్ప్రతిపదం కించిత్త్వరితవిక్రమః." ౨౩

అని మూలము. శూరుఁడు వెనుకంజవేయరాదు. ఇపుడు రాముఁడు వెనుక కడుగులు పెట్టెను. వీరధర్మమా యను ప్రశ్నము మంచిది కాదు. ఖరుఁడు బాణములు దేహమున నాటఁగా రక్తధారలు వెడలుచుండఁగా రాముని చెంతకుఁ బరుగిడెను. ఆరక్తదేహమును దానిదుర్గంధమును గాంచి యేవగింపు కలుగఁగా సకలాస్త్రముల శిక్షణమునఁ బండితుఁడగురామచంద్రుఁడు త్వరగా నడుగులిడుచు బాణమువదలు నంతయే నంతరములేకుండ వాఁడు పైఁబడ రాఁగా నించుక వెనుక కడుగులు పెట్టెను. ఇది భయంపడినజాడను గనఁ బఱచునా? వీరపురుషోచితమే యిదని వ్యాఖ్యాతలు వ్రాసిరి. ఇట్లు ఖరాసురుఁడే చేసియుండినఁ బాఱిపోయె ననుదురుగదా యని కొందఱడుగుదురు. దీనివాస్తవార్థమేది? అనఁగా ఖరాసురుఁడు పడిపోవవలసినచోటునకు వాఁడు రావలయును. ఆచోట నపుడు శ్రీరాముఁ డున్నవాఁడు. మృత్యువాతని నీస్థలమునకుఁ బొమ్మని త్రోయుచున్నది. మృత్యువు పాశములఁ దగిలించి వాని నీడ్చుకొనివచ్చుచున్నది. శ్రీరాముఁ డది యెఱింగి కొన్నియడుగులు వెనుకకు జరగెను. ఇంతకుముందే

రాముఁడు తెల్పుచున్నాఁడు. నీవు భూమిని కౌఁగిలించుకొని నిదురింతువని. ఆమాటప్రకారమే మృత్యుదేవత యీడ్చుకొనివచ్చుచుండఁగాఁ దానేమిచేయవలయునో ఆలోచించెను. ఆతని దీర్ఘనిద్రకుఁ దగినచోటిదియని యెంచెను. అంత దూరము వెనుక కరిగెను.సకలాయుధములు పోవ దుర్బలుఁడై యుండు నాతనికి భయంపడి కాదని మనము గ్రహించుట పొరపాటుగాదు. ఈభాగమునఁగల "అపాసర్పత్ప్రతిపదం కించిత్" అనుదానికి మూఁడడుగులు వెనుకకుఁబోయెను అను నర్థమును గ్రహించి ఉత్తరరామచరిత మనునాటకమున భవభూతిమహాకవి

"వృద్ధాస్తే న విచారణీయచరితా స్తిష్ఠంతు కిం వర్ణ్యతే
సుందస్త్రీదమనేప్యఖండయశసో లోకే మహాంతో హి తే,
యాని త్రీణ్యపరాఙ్ముఖాన్యపి పదాన్యాసన్ ఖరాయోధనే,
యద్వా కౌశలమింద్రసూనునిధనే తత్రాప్యభిజ్ఞో జనః."

అని వ్రాసెను 'ప్రతిపదం కంచిత్' అనుదానికి "ద్విత్రాణి పదాని కించిత్పృష్ఠతో గచ్ఛతీత్యర్థః" అని వ్యాఖ్యాతలు కూడ వ్రాసిరి.

"తతః పావకసంకాశం వధాయ సమరే శరం,
ఖరస్య రామో జగ్రాహ బ్రహ్మదండమివాపరం." ౨౮

అని మూలము. అగ్నివలె వెలుఁగుచు రెండవబ్రహ్మదండము వలెనున్న యొకబాణమును దీసికొనెను. "బ్రహ్మదండం బ్రహ్మశాపమ్" అని గోవిందరాజులు వ్రాసిరి.బాణమగ్నివలె వెలయుటెట్లనుశంక పొడమవచ్చును. ఇది బ్రహ్మాస్త్రముకాదు. ప్రకృతిబాణమే. ప్రాయికముగా శూరులు యథాశక్తి న్యాయము

ననుసరించి కొన్నిమంత్రముల నుపాసించియుందురు. అవి సిద్ధింపఁగాఁ దదధిదైవతము ప్రత్యక్షమగు. నాఁటంగోలె నతనియాహ్వానము ననుసరించి యవి సాన్నిధ్య మొసంగుచుండును. వలసినతఱి సాధకుఁ డెట్టిబాణమునైనను గ్రహించి దానియం దా మంత్రము నభిమంత్రించును. అత్తఱి నాదేవతతేజస్సు దాని యందావహిల్లు. కనుక నాకాశమున నది మిక్కిలి తేజోవంత ముగాఁ గనంబడును. ప్రకృత మాబాణము బ్రహ్మదండమంత వీర్యము గలదియగుచు నగ్నివలె మెఱయుచుండెనని భావము.

" స తం దత్తం మఘవతా సురరాజేన ధీమతా,
సందధే చాపి ధర్మాత్మా ముమోచ చ ఖరం ప్రతి." ౨౯

అని మూలము. దేవేంద్రుఁ డాబాణమును రాఁగలయుద్ధము నెఱింగి యగస్త్యమునిమూలమున రామున కిచ్చియుండెను. అనఁగా ఖరాదిదానవులు దుర్దాంతులగుటచేఁ దీవ్రనారాచములు వారిం జంపఁగలవాని నేర్పఱచి యింద్రుఁడు దండకారణ్యమునకు శ్రీరాముఁడు రాఁగా నీయవలయునని యగస్త్యమునికడ నుంచియుండెననియు దాని నతఁ డిచ్చెననియు మన మెఱుంగవలయును.

"వ్యాఖ్యాతల యభిప్రాయము మూలకర్తది కాకపోవచ్చు ననువాదము తుచ్ఛము" అని నేను వ్రాయఁగా దానిని వావిలికొలను సుబ్బారావుగా రుదాహరించి "అనువాక్య మెంతతుచ్ఛాతితుచ్ఛమో కంటిరి కదా యని" తమ శ్రీరామావతారతత్త్వతత్త్వమున వ్రాసిరి. ఇంచుక సమాధానము వ్రాసెదను. ఇందు బాణమును దేవేంద్రుఁడు రామున కీయలేదు. అగస్త్యముని యిచ్చెను. ఇంద్రుఁ డగస్త్యముని మూలమున నిచ్చెనని వ్యాఖ్యాతలు వ్రాసిరి. "అగస్త్యముఖే

నేతి" శేషః. అని ఇంద్రుఁడు మునియాశ్రమముకడకు రాముఁడు రాఁగాఁ దా నాతని నపుడు చూడక పోయెనని లోపలఁ బాఠకులు చదివియే యుందురు. ఇచ్చో భాషాంతరీకరణములం బరిశీలింపుఁడు. పాఠకమహాశయులకు శ్రమమీయ నిష్టము లేక మఱొకచోట వ్రాసినదయ్యు నామూలము నిట మరల వ్రాయుచున్నాఁడను.

"తమాపతంతం సంరబ్ధం కృతాస్త్రో రుధిరాప్లుతం,
అపాసర్పత్ప్రతిపదం కించిత్త్వరితవిక్రమః. ౨౩
తతః పావకసంకాశం వధాయ సమరే శరం,
ఖరస్య రామో జగ్రాహ బ్రహ్మదండమివాపరం. ౨౪
స తం దత్తం మఘవతా సురరాజేన ధీమతా,
సందధే చాపి ధర్మాత్మా ముమోచ చ ఖరం ప్రతి." ౨౫

అను నీమూలములకుఁ బద్యములఁ బరికింపుఁడు.

సీ. "ఖరుఁ డట్లు జృంభించి కార్ముకమున సాయ
కముఁ గూర్చుటకుఁగాని కడఁగిదాని
విడుచుటకుంగాని తడవు లేకుండఁగఁ
దనమీఁదఁబడివచ్చుటను రఘూత్త
ముఁడు చూచి తానప్డు తొడిగినయాసాయ
కము వైచుటకు సందుగల్గుటకును
దనుజునిమేనిరక్తము తనతనువును
నంటునో యనునసహ్యమున నడుగు
తే. లిడుచు నొకకొంత వెనుకకు నేగె; నంత
ఖరునిఁ జంపంగఁ బూని విక్రమము మెఱయ
నగ్నివలె మండుచుఁ బొల్చి యపరమైన
బ్రహ్మదండమువలె నున్న బాణము గొని. ౭౭౫

క. నారిం గూర్చెను మునుజం
భారియు మతివిభవయుక్తుఁడై రామునకున్
దా రాఁదగు కాలస్థితి
నారసి యాశరమగస్త్యుఁ డనుమునివలనన్. ౭౭౬

ఆ. కలుగునట్లుచేసె;" ఆంధ్ర శ్రీమద్రామాయణము.

ఉ. "చిల్లులువోవ మేను వెసఁ జేసిన నెత్తురుకొండవంక నాఁ
బెల్లుగఁ దోర్లవే దనను బెల్కుఱి తాళఁగ లేక మత్తుసం
ధిల్లఁ గృతాస్త్రపైఁబడఁగఁ దేఁకువ ఱివ్వన రాఁగ నెత్రు
చి, ప్పిల్లెడు మేనివానిఁ గని వెన్కడుగుంచి జవైక
గామియై. ౭౬౭

ఉ. కాంతిని బ్రహ్మదండమునకంటె ఘనంబగుపావకాభదు
ర్దాంతశరంబు శక్రగము గ్రక్కున వైవఁగఁ బిడ్గువోలె నా
శాంతము మాఱుమ్రోయఁ జని."

అని వావిలికొలనువారి రామాయణము.

"మఘవతా సురరాజేన ధీమతా భావజ్ఞేన దత్తమగస్త్యముఖే నేతి శేషః" అని వ్యాఖ్య. ఇపుడు వీరు మూలార్థమును బాడు చేసినారు కదా. వీరిపద్యము దేవేంద్రునిబాణమని యర్థ మిచ్చును. ఎట్లు వచ్చెనన్న నిందు లేదు. ఇంద్రుఁ డిచ్చినట్లే యర్థమగు. వ్యాఖ్యానాభిప్రాయము నెఱుంగక నేను బద్యము పాడుచేసితినని యాక్షేపించిన సుబ్బరావుగారే యీభాగ మంతయుఁ బాడుచేసిరికదా. తుచ్ఛాతితుచ్ఛమని వ్రాసిన వీరి వ్రాఁతయే వారిపద్యమును దుచ్ఛాతితుచ్ఛముగా నొనరించు చున్నది. మాటకుమాట యనునానుడిని బురస్కరించుకొని వ్రాయవలసివచ్చెఁగదా యని విచారించుచు నింతట నీవిష యమును వదలి ప్రకృతమునకుం గడంగెద.

"స పపాత ఖరో భూమౌ దహ్యమానశ్శరాగ్నినా,
రుద్రేణేవ వినిర్దగ్ధః శ్వేతారణ్యే యథాంతకః." ౨౭

అని మూలము. "శ్వేతారణ్యం కావేరీ సింధు సంగమ నికట దేశః" అని వ్యాఖ్య. 'రుద్రేణ రుద్ర నేత్రాగ్నినా దగ్ధోఽంతక ఇవ.' అని వ్యాఖ్య. ఈశ్వరుని తృతీయ నేత్రాగ్ని యప్రతిహతమగు నట్లు శ్రీరామునిబాణాగ్ని యాపరాక ఖరుని గూల్చెనని కదా భావము. ఇపుడు భగవంతుఁడు రుద్రుఁడే యగును. శరాగ్ని చే వాని ప్రాణములఁ దీసెను.

"ఆదావభూచ్ఛతధృతీ రజసాస్య సర్గే
విష్ణుస్స్థితౌ క్రతుపతిర్ద్విజధర్మసేతుః,
రుద్రోఽప్యయాయ తమసా పురుషస్స ఆద్య
ఇత్యుద్భవస్థితిలయాస్సతతం ప్రజాసు." ౧౧ స్కం. ४ అధ్యా.

"అహం భవో రుద్ర ఇమే ప్రజేశాః దక్షాదయో యే భవధాదయశ్చ,
స్వర్లోకపాలాః ఖగలోకపాలా నృలోకపాలా స్తలలోకపాలాః,
యత్కించ లోకే భగవన్మహస్వదోజస్సహస్వద్బలవత్క్షమావత్." ४౫
౨ స్కం. ౬ అధ్యా.

అను శ్రీభాగవత ప్రమాణములకు

"నమోస్తు తే శాశ్వతపుణ్యయోనే బ్రహ్మాధిపం త్వామృషయో వదంతి,
త్వామేవ నారాయణశబ్దసంజ్ఞం నరం చ సత్యం ప్రవదంతి సంతః."
త్వత్తో జాతాని భూతాని స్థావరాణి చరాణి చ,
త్వయా సృష్టమిదం కృత్స్నం త్రైలోక్యం సచరాచరం. ४౧४
విద్మః కృష్ణ! పరాం భక్తిమస్మాసు తవ శత్రుహన్,
వృణీష్వాష్టౌ వరాన్ కృష్ణ! దాతాస్మి శివ సత్తమ,
బ్రూహి యాదవశార్దూల యానిచ్ఛసి సుదుర్లభాన్." ४3४
శ్రీమహాభార. అను ౧४ అధ్యా.

శ్రీకృష్ణుఁడు శంకరుని వినుతించిన యీమహాభారతప్రమాణములకు,

"ఇతి సంచింత్య మనసా పురాణం రుద్రమీశ్వరం. ౨౮
పుత్త్రార్థమారాధితవానహమాత్మానమాత్మనా,
న హి విష్ణుః ప్రణమతి కస్మైచిద్విబుధాయ చ. ౨౯
యత ఆత్మానమేవేతి తతో రుద్రం భజామ్యహాం,"

శాంతి. ౩౪౧ అధ్యా.

అని శ్రీకృష్ణుఁడు శంకరుం గూర్చి తపస్సుచేసి శంకరుఁడు ప్రత్యక్షము కాఁగా వినుతించిన యీమహాభారతమునఁ గల ప్రమాణములకు,

"స ఏష రుద్రభక్తశ్చ కేశవో రుద్రసంభవః,
సర్వరూపంభవం జ్ఞాత్వా లింగమర్చయతి ప్రభుః." ౯౭

ద్రోణ. ౨౦౧ అధ్యా.

అని ద్రోణపర్వమున వ్యాసులు తెల్పిన యీవాక్యములకును మధ్యవైష్ణవులు మధ్యదాసులు మధ్యయోగులు నగుపుణ్యజనులు, రుద్రునకు విష్ణువునకు భేదము కలదనియు, రుద్రుఁడు విష్ణుభక్తుఁడనియు, విష్ణువు రుద్రభక్తుఁడు కాఁడనియుఁ బామరులకు బోధించుచు ధనార్జనముచేయుచుండుజాల్ములు నగు వేదాంతులు సమాధాన మేమిచెప్పుదురో? ఇట్లు గ్రంథములు పరిశీలించుకొలందినిదుర్మతాభిమానపిశాచావేశమున నొడలు తెలియక యుండువావదూకుల ముఖపిధానముచేయుచు వీరిరువురొక్కతత్త్వమునుండి వచ్చినవారనియుఁ గార్యార్థము వేఱురూపములుగా నుండువారే యనియు ఒక్కరికొకరు భక్తులని పురాణములు చెప్పుట యిందొక్కరిని సేవించిన నిరు

వురను సేవించినట్లే యని తెల్పుటకే యగును. వారివారి కర్మము ననుసరించియే దైవమునుగొల్చినను భగవంతుఁ డతఁడే యని భావింపవలయునని సకలశ్రుతిస్మృతిపురాణేతిహాసముల తాత్పర్యమనియు నట్లు భావించువాఁడే భక్తుఁడుకాని భేద భావముగలవాఁడు భక్తుఁడు కాఁడనియు మన మెఱుంగవల యును. ఈప్రమాణములయర్థము ననుసరించి యీచోట శ్రీరాముఁడు తనశాంతమును దాఁచి రాక్షసుని శాపవిముక్తి ననుగ్రహించి కృతార్థుని చేయందలంచి రుద్రరూపమును దాల్చెనని మన మర్థము చేసికొనవలయును. దీనిచేఁ బాఠకుల కిసుమంతయుఁ బాపమురాదు. భక్తిదృఢముగా నెలకొనును. రుద్రుఁడే రాముఁడన్నను, రాముఁడే రుద్రుఁడన్న నెగిరిపడు వారు వేఱుగా వారిదుష్కర్మముల ననుసరించి భావింతురు గాక. సర్వేశ్వరుఁ డెల్లర నేకరీతిగా ననుగ్రహించుఁగాక యనియే మన మాపరాత్పరుని బ్రార్థింపవలయును.

"అహో బత మహత్కర్మ రామస్య విదితాత్మనః,
అహో వీర్యమహో దాక్ష్యం విష్ణోరివ హి దృశ్యతే. 3౬
ఇత్యేవముక్త్వా తే సర్వే యయుర్దేవా యథాగతం,"

అని మూలము. 'విష్ణోరివ హి దృశ్యతే'అనుచో నర్థము విష్ణు మూర్తికున్నయట్లే రామునకుం గలదనికదా యర్థము. ఇరువ దేడవశ్లోకమునందు రుద్రుఁడే శ్రీరాముఁడయ్యెనని నావ్రాసిన యర్థ మసంగతమనుమూఢదాసులు క్షుద్రవేదాంతులు కపట యోగులు ధనదాసులు 'విష్ణోరివ' యను నీచోట నేమందురు? రుద్రునివలె ననునది యుపమానమనినచో నిచ్చోటఁగూడ నంతియకదా. రాముఁడు విష్ణువను టెట్లు? ఇట్టితావుల బుద్ధి మంతులు విష్ణువుతో శ్రీరాముని సాటిచెప్పుట విష్ణుసంబం

థములగుకథలు స్మృతికిం దెచ్చుటకే. ఈయిరువు రొకతత్త్వ మే యని మనము భావింపవలయును. మఱియు సర్వరూప ములు నాపరమేశ్వరునివే యని తలంపవలయును. కాని మన మొక్కయాకృతినే మది నిల్పుకొనుచు నారూపమున నాభగ వంతుఁడు వెలసెనని తలంచుచు ధ్యానింపవలయును. అప్పుడే దేవతాద్వేషము మతద్వేషము నశించును. ఇట్లే యీరామా యణమున నెల్లతావులను శ్రీరాముఁడే భగవంతుఁడుగ సీతయే మూలప్రకృతిగాఁ దలంపవలయును. భిన్నములగు నర్థములు తోఁచుతావులంగూడ నిట్లే సమన్వయము చేసికొన వలయును. దానిచేఁ బరమతములయందుఁ గలయేవగింపు తొలంగును. సర్వమతములు తరణోపాయములను భిన్నభిన్న మార్గములచే బోధించు ననువిషయము తేటపడును. అట్టి నిష్కల్మషజ్ఞానము కలుగుటకే సద్గ్రంథములం బఠించుట ఇంకను మతద్వేషములఁ బెంపొందించుకొనుటకుంగాదు.

"తం దృష్ట్వా శత్రుహంతారం మహర్షీణాం సుఖావహం. ౩౯
బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే,
ముదా పరమయా యుక్తా దృష్ట్వా రక్షోగణాన్ హతాన్. ౪౦
రామం చైవావ్యథం దృష్ట్వా తుతోష జనకాత్మజా,
తతస్తు తం రాక్షససంఘమర్దనం సభాజ్యమానం ముదితైర్మహర్షిభిః,
పునః పరిష్వజ్య శశిప్రభాననా బభూవ హృష్టా జనకాత్మజా తదా."౪౧

అని మూలము. ఇందు మొదటిశ్లోకమునకు వ్యాఖ్యాతలు విశేషార్థములఁ బెక్కుభంగుల వ్రాసిరి. వానిసారము నా యాంధ్రశ్రీమద్రామాయణమున వ్రాయఁబడినది. ఇందు విశే షములను మాత్రమే పరిశీలించి వానితత్త్వమును గ్రహింపఁ దగును. "శత్రుహంతారమ్" దర్శనమూలమున సంభాషణ

మూలమున ఖరాసురుని యంతశ్శత్రువులంగూడి హరించిన వాఁడు. అనఁగా రాముఁడు పలికిన యొక్కొక్కమాటయు నాజన్మమున నతఁ డరిషడ్వర్గమునకు లోనై చేసినదుష్కర్మ ముల నావిష్కరించునదియే. ఏటికది? ఆమూలమున నెల్లరకు శ్రీరాముఁ డుపదేశించెననికదా సారము. బాహ్యశత్రువులఁ బరిమార్చుట యొకగొప్ప యనఁదగునా? బాహ్యశత్రువులం బోలె నంతశ్శత్రువుల నడంచువాఁడు కదా భగవంతుఁడు. కనుకనే "మహర్షీణాం సుఖావహమ్" ఋషతి ప్రాప్నోతి సర్వాన్ మంత్రాన్ జ్ఞానేన పశ్యతి సంసారపారం వా ఇతి ఋషిః. జ్ఞానసంసారయోః పారగంతా" జ్ఞానసారమును సం పూర్ణముగా నెఱింగినవాఁడు. సంసారసాగరమును దరించిన వాఁడు ఋషి యనఁబడును ఇదియే దీనివ్యుత్పత్తి. లోక మున నీఋషు లేడువిధములఁ బిలువఁబడుదురు.

"సప్త బ్రహ్మర్షి దేవర్షి మహర్షి పరమర్షయః,
కాండర్షిశ్చ శ్రుతర్షిశ్చ రాజర్షిశ్చ క్రమావరాః." రత్నకోశము.

వీరొకరికంటె నింకొకరు తొలుతనుండి యల్పఖ్యాతిగలవారని చెప్పఁబడినది. కాని యది లోకవ్యవహారార్థము. జ్ఞానపారము నెఱింగినవారికి సుఖమును గల్గించువాఁడు. 'ఆనందో బ్ర హ్మేతివ్యజానాత్'అనునుపనిషద్వాక్యము ననుసరించి మహర్షు లకు సుఖమనఁగా శాశ్వతానందమును గలిగించువాఁడని యర్థము. అరిషడ్వర్గవినాశనమే యానందదాయకము. ఆనం దమే బ్రహ్మస్వరూపము. భగవద్దర్శనము సంభాషణము కామ క్రోధాదుల నాఱింటిని మొదలంటఁ బెఱికి శాశ్వతానంద మును గలిగించునది యనియేకదా యిందలిసారము. 'తం భర్తా రం' ఆశ్రీరాముని దృష్ట్వా చూచి,

"ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి,
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్. ౧౯
య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ,
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే. ౨౩
సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరం,
వినశ్యత్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి." ౨౭ గీత. ౧౩ అధ్యా.

అను శ్రీకృష్ణోపదేశము ననుసరించి తన్నెడఁబాయక భరించు నట్టి యీశ్వరుని, రామనామమున నిప్పు డలరు భగవంతుని, దా వ్యాపింపకున్న నామరూపక్రియలులేక తా వ్యాపింప నామరూపక్రియావంతుఁడై యుండు సద్వితీయుని, లీలార్థము భిన్నరూపముననున్న సీత యను పేరఁ బిలువంబడు నామహాప్రకృతి చూచి తానపుడు వైదేహి గావున మహానందమంది 'పరిషస్వజే' =కౌఁగిలించుకొనెను. అనఁగాఁ దేజోరూపమున నతనియం దైక్యమయ్యెనని యర్థము. లక్ష్మణుఁడు చూచుచుండఁగా రక్త సిక్తాంగుఁడై యుండు

"స రామో బహుభిర్బాణైః ఖరకార్ముకనిస్సృతైః,
విద్ధో రుధిరదిగ్ధాంగో బభూవ రుషితో భృశం." ౨౯ స్క౦. ౨౮

వానిని గౌఁగిలించుకొనెనన లోకాచారవిరుద్ధము గాదా. కావున దగ్గరకుఁ బోయి నిలిచెనని ప్రాతీతికార్థము చెప్పవల యును. వాస్తవార్థము. ప్రకృతిపురుషుల కభేదమే కాన నందైక్యమయ్యెనని గ్రహింపవలయును. ప్రకృతిపురుషులు వేఱుగా నుండరాదా యనువారుండ రనుకొందును. ప్రకృతి యన భగవదిచ్ఛయే. అగ్నికి దాహకశక్తికి భేదము చేయ రానియట్లు ప్రకృతిపురుషులకు వాగర్థములకు భేదము వచింప రాదు. కార్యార్థము వేఱువేఱుగా జగమున నవతరించిరి.

సకలరూపములు తదంశములే కదా. ఇది "తం దృష్ట్వా" అను మొదటిశ్లోకమునకర్థము. ఇచ్చోటఁ దేజోరూపమున నాతనిం బ్రవేశించె ననునర్థము సంగతమూ యను వాదుండదు.

'రామం వినా గుహాంగతా సీతా తతో నిర్గత్య నిరస్తసమస్తశత్రుం రామం పరిషస్వజ ఇత్యనేన హృదయగుహాంగతో జీవః పరతంత్రః ఆచార్యముఖేన పరమశేషిణం దృష్ట్వా తేన సకలవిరోధివర్గే నివర్తితే తతో నిర్గత్య సూరిపరిషదాసీనం శేషిణమాసాద్య తద్భోగపరివాహానమనుబభూవేతి ధ్వన్యతే.'

అని గోవిందరాజులు వ్రాసిరి. ఈభావ మెట్లు వారికిఁ దోఁచెనో యట్లే నేవ్రాసినయర్థము కూడ నని గ్రహింపఁదగుననియే ప్రశ్నమునకు సమాధానము.

ఇఁక రెండవదగు "ముదా పరమయా యుక్తా" అను దానికి విశేషార్థ మేమనఁగా. హతులగురాక్షసులం గని పరమప్రీతినొంది, యించుకేనియు వ్యథనొందకున్న రాముం గాంచి జానకి తుష్టినొందెను. తమయవతారఫల మాపన్న పరిత్రాణమే కనుక శాపాగ్నిదహ్యమానులగు చతుర్దశసహస్ర సంఖ్యాకుల రాక్షసకులజనితుల శీఘ్రకాలమున శాపవిముక్తులనుగా నొనరించి హాయిగూర్చినందులకే యానందించెను. ఆఘోరయుద్ధమున శ్రీరామమూర్తి యించుకేనియు వ్యథనొందకయే యుండెను. అందఱఁ జంపి యయ్యో యనక సంతోషమున రాముఁడుండెను. ఏల? దుర్గతుల నలయువారికి సుఖము చేకూర్చితిననియే రాముని యానందము కాన మనశ్చింత నొందకుండెను. అనఁగా వారికర్మమున వారే హతులైరి ఉత్తమఫలములఁ దనసందర్శనసంభాషణముల నొందఁగల్గిరి. ఇఁక మనశ్చింత యేటికి?

"అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తాశ్శరీరిణః,
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుద్ధస్వ భారత. ౧౮
య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతం,
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే." ౧౯

అను నీగీతోపదేశసారము నెఱింగినపండితులకే విచారము కలుగదన నిఁక నట్టియుపదేశములు చేసినభగవంతునకు విచార మేల కలుగును? అందు మృతినొందిన దనఁబడునది తుచ్ఛశరీరము. భగవత్కళ నశించునది కాదు. శాశ్వతము కదా. ఇఁక దుఃఖ మెందులకు? అను నీగీతోపదేశమును జక్కఁగా నెఱింగినవారికి విచారమే యుండదని భావము.

మూఁడవశ్లోకమగు "తతస్తు తం రాక్షససంఘమర్దనమ్." అనుదాని భావమేమని విచారింతము. "ముదితైర్మహర్షిభిః" సంతుష్టులగుమహర్షులచేఁ గొనియాడఁబడుచున్న రామభద్రుని గాంచి సీత· చెంతకేగి యానందించెనని ప్రాతీతికార్థము. పరమ కరుణాళువులగు మహర్షుల కందఱు చచ్చి పడియుండఁగా నానంద మేల యనుశంక కలుగవచ్చును. కర్మఫలముల ననుభవింపఁజేసిన భగవంతుని గన్నులారఁ గాంచఁగల్గిరికదా మహర్షులు.

"సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ,
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః. ౫౨
మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః,
నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాండవ." ౫౫ గీత.౧౧ అధ్యా.

అన్నగీతావాక్యముల ననుసరించి యప్పటి శ్రీరామునియాకారము సుదుర్దర్శమే. అనఁగా దివ్యతేజోవిరాజమానమయ్యుఁ గల్పితాకస్మికక్రోధసంయుతము. కాని దివ్యదృష్టిగలమహర్షు

లకు సుదర్శనమే. దేవతలుకూడ సర్వదేవతాత్మకమగు నారూప
మును జూడఁగోరుదురు. ఆతేజ స్సద్భుతము. అట్టిరూపమును
గాంచినవారు ప్రాణులకుం గలశక్తియుక్తుల నెఱుంగుదురు.
అపుడు "మత్కర్మకృన్మత్పరమః" అన్నయట్లు భగవత్కా-
ర్యాదరులే యగుదురు. కనుకనే మహర్షు లాఘోరయుద్ధ
మును జూడఁగోరి వచ్చిరి. అహింసావ్రతము నవలంబించిన
వారలయ్యుఁ గర్మసిద్ధాంతమును బ్రత్యక్షముగా నెఱుంగఁ
గోరి యరుదెంచిరి. వారికర్మము వారిఁ బురికొలుపుట. వారి
యుద్రేకము లోనగునవి కాంచినపుడు పరమేశ్వరునియాశ
యము స్పష్టమయ్యెను. కాననే మహానందమంది భగవంతు
నారాధించిరి. "శశిప్రభాననా" అనువిశేషణము జానకి కీయఁ
బడినది. "తదా శశిప్రభాననా జనకాత్మజా హృష్టా బభూవ"
అని యన్వయము. ఇచ్చో "శశిబింబాననా" యనక "శశిప్రభా
ననా" యని మహాకవి యేల ప్రయోగించెనని విచారింతము.

"ముక్తౌ ధ్యేయా శశిజ్యోత్స్నా ధవళాకృతిరంబికా. ౭౧
రక్తసంధ్యకరోచిస్స్యాద్వశీకరణకర్మణి,
కవిత్వే విశదాకారా స్ఫటికోపలనిర్మలా. ౭౨
ధనలాభే సువర్ణాభా చింత్యతే లలితాంబికా,
సర్వసంపత్తిలాభే తు శ్యామలాంగీ విచింత్యతే. ౭౩
నీలా చ మూకీకరణే పీతా స్తంభనకర్మణి,
ఆమూలమాబ్రహ్మబిలం జ్వలన్మాణిక్యదీపవత్. ౭౪
యే ధ్యాయంతి మహః పుంజం తే స్యుస్సంసిద్ధసిద్ధయః,
ఏవం బహుప్రకారేణ ధ్యానభేదేన కుంభజ. ౭౫
విభావయంతశ్శ్రీదేవీం భజంతే మహతీం శ్రియం,
ప్రాప్యతే సద్భిరేవైషా నాసద్భిస్తు కదాచన." ౭౬

బ్రహ్మాండ. ౪౨ అధ్యా.

"శ్వేతవర్ణా సాంఖ్యాయనసగోత్రా గాయత్రీ" అనుట క్రొత్తది కాదు కదా. ఆకాశమున నిలిచి భగవంతునిఁ గాంచువారు మహర్షులు ఫలాభిసంధిరహిత కర్మాచరణపరాయణులు. వారు కోరఁదగినది ముక్తి. అచ్చోఁ బ్రకృతిపురుషు లిరువురు లీలార్థము వేఱురూపముల నున్నవారు. ఇట్టులుండు టరుదు. విపన్నులగు యాజ్ఞవల్క్యమునితనయులను వారిపరివారమును శాపవిముక్తులను జేసి తమయవతారఫలమును బ్రసాదించియున్నారు. అట్టిచోట వారిని గన్నులారఁ గాంచు మునులు ధ్యానింపవలయును. శ్రీరాముని తేజస్సిపుడు రుద్రతేజస్సుగనే యున్నది. చెంతనే మహాప్రకృతి యున్నది. ఆమెను "ముక్తా ధ్యేయా శశిజ్యోత్స్నా" యనుశాస్త్రము ననుసరించి వెన్నెలవంటి తేజస్సుగలదానినిగా ధ్యానింపవలయును. కనుకనే మహర్షియు మహాకవియునగు వాల్మీకి "శశిప్రభాననా" అని వచించెను. కనుకనే,

"లౌకికానాం హి సాధూనామర్థం వాగనువర్తతే,
ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోనుధావతి."

అన్నసూక్తి ప్రసిద్ధమయ్యెను.

"ఏతస్మిన్నంతరే విష్ణురుపయాతో మహాద్యుతిః."

అని బాలకాండమునందుఁ గలదు కదా. 'మహాద్యుతిః' అనునదియే యందునుఁ గనంబడును. ఉపాసకు లిష్టదేవతారూపమును ధ్యానించునపుడు తమవాంఛల ననుసరించి కాంతిగల బింబమును ధ్యానింపవలయును. దేవతాకాంతి మాఱుచుండునా యనరాదు.

"ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా."

అన్న ప్రమాణము ననుసరించి భగవంతునకు రూపమును గల్పించుట ధ్యానార్థమే. ఏభక్తున కెట్టిరూప మెట్టినామధేయ మెట్టిచిహ్నము లిష్టములగునో వారట్లు కల్పించుకొనవచ్చును. ఆస్థితియుఁ గొంతకాలమే అవల ననఁగా నాసిద్ధి కుదిరిన పిదప

"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః."

అన్న గీతావాక్యము ననుసరించి పరబ్రహ్మమే యెందును గనంబడునంతస్థితికి నుపాసకుఁడు రాఁగా దృశ్యమంతయు భగవంతుఁడుగానే భావింపఁదగుననికదా శ్రీకృష్ణునాశయము. 'భావనామాత్రసంతుష్టహృదయః పరమేశ్వరః' అనునది యెల్లరకుం గ్రొత్తదికాదు కదా. ఈవిషయమును శ్రీశంకర భగవత్పాదులు,

"కిరంతీమంగేభ్యః కిరణనికురుంబామృతరసం
హృది త్వామాధత్తే హిమకరశిలామూర్తిమివ యః,
స సర్పాణాం దర్పం శమయతి శకుంతాధిప ఇవ
జ్వరప్లుష్టాన్ దృష్ట్వా సుఖయతి సుధాధారసిరయా." ౨౦

"దృష్ట్వా చాతుర్థికాదీంశ్చ జ్వరాన్నాశయతే క్షణాత్, చంద్రకాంతశిలామూర్తిం చింతయిత్వా వినాశయేత్. తాపజ్వరాన శేషాంశ్చ క్షిప్రం తార్క్ష్య ఇవాపరః, గరుడధ్యానయోగేన స్మరణాన్నాశయేద్విషమ్."

చతుశ్శతి. అనివ్యాఖ్య.

అని తేటపఱచిరి.

" యేత్వక్షరమనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే,
సర్వత్రగమచింత్యం చ కూటస్థమచలం ధ్రువం. 3

సన్నియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః,
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః." ౪

అను నీగీతావాక్యముల సారమేమి? ధ్యానయోగమునే యాశ్రయించి సమబుద్ధులై యుండువారు నన్నే పొందుదురని భగవంతుఁ డనెను. విషమబుద్ధులై లోకవంచకులై బహువిధోపాయముల ధనార్జన మొనరించి రహస్యపుత్త్రులను బోషించుచు ధనమీయనివారలఁ దోఁచినట్లు దూషించుచు ధన మొసంగినవారి నింద్రుఁడవే నీవని భూషించుచు యోగుల మని చెప్పుకొనుచుఁ బామరుల కేవో చచ్చువేదాంతముల నుపదేశించుచుఁ దిరుగువారు నన్నుఁ గాంతురని భగవంతుఁడు చెప్పెనా? లేదుకదా. అట్టివారు పాషండులే యనవలయుగదా. ప్రకృతమున సీతమోము చంద్రికాధవళముగ నుండెను. మహర్షులు ముక్తికాములుగదా. వారు ధ్యానింపఁ దగునవియే మహాకవి భావమని మన మెఱుంగందగును. అంతియకాక మనము భగవంతుని ధ్యానించునపుడు శ్వేతకాంతిగలవానినిగా మనఃపంకజమున నిష్టరూపకల్పితుని నిలిపి తదేకదృష్టులమై యుండవలయును. అదియే చక్కని యుపాసనము. విగ్రహపూజ యత్యల్పఫలప్రదమగుట నద్దానికే మన మలవాటుపడరాదు. కొలఁదికాల మొనరించినను దానిని వదలి యాత్మధ్యానమున కలవాటుపడవలయును. ఇదియే యిందుఁగల ముఖ్యాంశము. కథమాత్రమే విని యానందింపక యిందుఁగలవిశేషాంశముల నెఱింగి యాపరమేశ్వరుని ధ్యానింప నభ్యసింపవలయును. అదియే శ్రీరామాయణపారాయణ ఫలము. ఈభాగమును బఠించినందులకు

ఫలము స్కాందమహాపురాణమునుండి మహేశ్వరతీర్థులుదాహరించిరి.

"శ్రుత్వా శ్రీరామవిజయం పాపబంధాత్ప్రముచ్యతే,
తథైవ శృంఖలాబంధాదృణబంధాద్విముచ్యతే.
శ్రుత్వా పుష్పవతీ నారీ తనయం వంశవర్ధనం,
లభతే రాఘవేంద్రస్య ప్రసాదాత్కీర్తివర్ధనమ్."

అనఁగా భావమేమి? ఈసర్గములు విన్నంతమాత్రముననే సకలపాపములు నశించునని కాదు. ఆయర్థమే తప్పు. మహాపాపము లొనరించి యీనాలుగుసర్గము లొకగడియకాలము చదివించుకొని విని మాపాపములు పోయెను. పరిశుద్ధులమే యని భావించువారు మూఢులు.

"శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే,
సహస్రనామతత్తుల్యం రామనామ వరాననే."

అనున దెంతయో.

"కోటయో బ్రహ్మహత్యానామగమ్యాగమకోటయః,
సద్యః ప్రళయమాయాంతి మహాదేవేతి కీర్తనాత్."

అనునదియు నంతయె. ఈఫలస్తుతులన్నియుఁ గామ్యఫలరూపముగా భగవంతునియందు భక్తిని గల్గింపఁ దోడ్పడును. అంతియకాని సకలపాపము లొనరించుచు భగవంతునామస్మరణము చేసినంతన యవి నశించు ననుభావము కలవారలకుఁ దోడుపడవు. ఇట్టి ఫలస్తుతులం దెలిపి పామరులను వంచించి ధనము నార్జించు పరమదాంభికశిరోమణులు దాసులు యోగులు వేదాంతులును.

"ధర్మధ్వజీ సదా లుబ్ధశ్ఛాద్మికో లోకదంభకః,
బైడాలవ్రతికో జ్ఞేయో హింస్రస్సర్వాభిసంధకః.

అధోదృష్టిర్నైష్కృతికస్స్వార్థసాధనతత్పరః,
శఠో మిథ్యావినీతశ్చ బకవ్రతచరో ద్విజః. ౧౯౬

యే బకవ్రతినో విప్రా యే చ మార్జారలింగినః,
తే పతంత్యంధతామిస్రే తేన పాపేన కర్మణా. ౧౯౭

న ధర్మస్యాపదేశేన పాపం కృత్వా వ్రతం చరేత్,
వ్రతేన పాపం ప్రచ్ఛాద్య కుర్వన్ స్త్రీశూద్రదంభనం. ౧౯౮

ప్రేత్యేహ చేదృశా విప్రా గర్హ్యంతే బ్రహ్మవాదిభిః,
ఛద్మనా చరితం యచ్చ వ్రతం రక్షాంసి గచ్ఛతి. ౧౯౯

అలింగీ లింగివేషేణ యో వృత్తిముపజీవతి,
స లింగినాం హరత్యేనస్తిర్యగ్యోనౌ చ జాయతే." ౨౦౦ అధ్యా. ౪

అను నీమనుస్మృత్యుక్తఫలములకుఁ బాత్రులగుదురు. అంతియకాని భక్తులకు లభించుఫలములకుఁ బాత్రులు కాఁజాలరు. అట్లు సీతాదేవి భగవంతుని యప్పటిరూపమును రజోగుణప్రధానమని తోఁపఁజేయుదానిం గాంచి

"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా"

అనుభగవదుక్తిరీతిగా స్వాంశ ముద్రేకించి లోకోపకారకార్యముమ జేసినందులకుఁ బరమానందభరితురాలయ్యెను. 'తదా' అని మూలమునఁ గలదు. ఈయవతారమునం దింతదనుక నిట్టియానందము ననుభవింపలేదని దానిభావము. పదునాల్గువేల ప్రపన్నుల నుద్ధరించుటకంటె భగవంతునకుఁ దదభిన్నమహాప్రకృతికిఁ గల యానందజనకకార్యము వే ఱెద్ది యుండును? ఆకాలమునకు నీశ్వరానుగ్రహరూపమగు శాపనివృత్తిమహాఫలముం గాంచి యారాక్షసులెల్లరుఁ గృతార్థులై పూర్వకర్మశేషోచితఫలము లందఁబోయిరి. కాని తమవలెఁ బ్రపన్నులగు రావణాదులకు మహోపకారము చేయ

మార్గదర్శకులు కూడ నైరి. ఈమహాయుద్ధమే రావణాసుర ప్రాణాపహారణ మహాయజ్ఞమునకు నంకురారోపణమువంటి దయ్యెనని మన మెఱుంగవలయు. ఎంతటిక్రూరాత్మకులైనను దుదకు భగవద్దర్శన సంభాషణము లొనరించుచుఁ బ్రాణములు వదలినయెడల

"అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరం,
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః. ౫
యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరం,
తం తమేవేతి కౌంతేయ సదా తద్భావభావితః. ౬
తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుద్ధ్య చ,
మయ్యర్పితమనోబుద్ధిర్మామేవైష్యస్యసంశయః." ౭ అధ్యా. ౮

అను నీగీతావాక్యముల ననుసరించి భగవదనుగ్రహమునకుఁ బాత్రులగుదురనియు మనము నమ్మి యట్టికాలమున నట్టి సచ్చింతనము కలుగున ట్లనుగ్రహింపుమా యని భగవంతుని సర్వదా ప్రార్థింపవలయును. భక్తుఁ డెట్టి సద్వాంఛలనైనఁ గోరవచ్చు ననుట కుదాహరణముగా నొకభక్తాగ్రేసరుని పద్యము తద్దయు హృద్యమని వ్రాయుచున్నాఁడను.

మ. "తనువే నిత్యముగా నొనర్చు మది లేదా చచ్చి జన్మింపకుం
డనుపాయంబు ఘటింపుమీగతుల రెంట న్నేర్పు లేకున్న లే
దని నాకిప్పుడె చెప్పు చేయఁగలకార్యంబున్న సంసేవచే
సి నినుంగాంచెదఁగాక కాలముననో శ్రీకాళహస్తీశ్వరా."

ఇది వ్యంగ్యకావ్యోత్తమ మనఁ దగుపద్యము. ఎంత తలఁచిన నంతయర్థవిశేష మిందుఁ గనవచ్చును. ఈభక్తవర్యునివలె మనము కూడ భగవంతుని నెంతకఠినభావముననైన నీయను

గ్రహపాత్రునిఁ జేయుమా యని వేఁడుకొనవచ్చును. కాని వాంఛలు శాస్త్రవిహితములు మాత్రము కావలయును

"తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి."

అను శ్రీకృష్ణోపదేశమునందు విశ్వాసము లేనివారు గలరా? భగవంతుని ప్రతిజ్ఞకూడ

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం."

అనునదియే కదా. అనఁగా ఫలాభిసంధిరహిత కర్మానుష్ఠానమున భగవంతుఁడు తృప్తుఁడై భక్తునకుఁ బ్రాక్కర్మానుసారముగా ఫలముల నొసంగును. వానిఁ గావలయునని మన మడుగనేల? అట్టివిశ్వాసము లేనివారే మహాసంకల్పపూర్వముగాఁ గర్మము నాచరింప నారంభించిన నది భగవత్సంతృప్తికరము కానేరదు. ఏల? తమవాక్యమునందు భక్తునకు దృఢవిశ్వాసము లేదని భగవంతునకుఁ దోఁచుటయే యందులకుఁ గారణము. ఇఁక నీభాగమున నధ్యాత్మరామాయణమునఁ గల విశేషములఁ బరికింతము.

"లక్ష్మణోఽపి గుహామధ్యాత్సీతామాదాయ రాఘవే,
సమర్ప్య రాక్షసాన్ దృష్ట్వా హతాన్విస్మయమాయయౌ.
సీతా రామం సమాలింగ్య ప్రసన్నముఖపంకజా,
శస్త్రవ్రణాని చాంగేషు మమార్జ జనకాత్మజా." ౫ సర్గము.

లోకాచారము ననుసరించి యాలోచించినచో నట్లు శవాంతరమున నిలిచి శస్త్రవ్రణితదేహుఁడై రక్తధారలు వెలువడుచుండు భర్తను జూడఁగానే నిలువున నట్లే పడి మూర్ఛిల్లి

స్మృతిరాఁగా సీత నిశ్చేష్టురాలు కావలదా యనియే తోఁచును. కాని యది లోకమునఁ గలసామాన్యస్త్రీలవిషయమని మనము నిర్ణయింపవలయును. జగదేకజననియగుసీత యట్లు వితాకు నొందునా? వగచునా? తమయవతారఫలమును లోకులకుం గల్గించుకాల మరుదెంచెను గదా యని యామహామాయ యానందించెను. నవ్వు ముఖరాజీవమునఁ దోఁపఁగాఁ గౌఁగిలించుకొని ఆయుధములచేఁ గల్గినవ్రణములను దుడిచెను. అనఁగా సారమేమి? హస్తస్పర్శమాత్రమున నయ్యవి నశించుఁగాక. యథాపూర్వముగా దివ్యమంగళవిగ్రహము వెలయుఁగాక యనుసంకల్పమునఁ దనహస్తపంకజమున నిమిరెను. తత్స్పర్శమాత్రమున నయ్యవి యడంగెను. భగవంతుఁడు నిరీహుఁడు. ఆమహనీయుని బాధించువిషయములే లేవు. ఆయుధములును దత్స్వరూపములే యైనపు డవి తదంగమును బాధించు టెట్లు? సర్వశక్తులు తదధీనములు. ఈవ్రణచిహ్నములు బాహ్యదృష్టిగోచరములు. ఆశరీరమే ప్రకృతికల్పితము. సర్వేశ్వరుఁ డందు మహానంద మనుభవించుచున్నాఁడు. ప్రకృతికి లోఁబడినట్లు నటించుచున్నాఁడు. ఇట్టు లుండఁగా నామహాప్రకృతియుఁ గల్పితరూపాంతరమున వేఱుగా నున్నట్లు నటించుచుఁ బ్రాణేశ్వరుని వ్రణములం గని వగవక యానందించుచు మోముఁదమ్మి వికసింపఁగాఁ గరసరోజమున నిమిరెను. దాన నవి యడంగెను. ఇదంతయు హుళిక్కి. ఈనటన మేల? లోకులకు మంచియలవాటుల నేర్పుటకు. పతి కష్టదశలో నుండినపుడు సాధ్వి పరమాదరమున నుపచరించుచు నతని కాకష్టము కనఁబడక యుండఁజేయవలయును.

"అపత్యం ధర్మకార్యాణి శుశ్రూషా రతిరుత్తమా,
దారాధీనస్తథా స్వర్గః పితౄణామాత్మనశ్చ హ." ౹ఇం అధ్యా. ౯

అను నీస్మృతివాక్యము ననుసరించి పతిని శుశ్రూషలం దన్పుట భార్యకృత్యము. దానిని నెఱపి జానకీదేవి స్త్రీలకు సదాచారమును నేర్పెను. భార్య చెంతనుండఁగా నామె చేయఁదగిన కార్యమును వేఱొకఁడు చేయరాదనునీతిని లక్ష్మణునిచరిత్రమే తెల్పెడిని. సీత వ్రణములను జేనిమురుట అవి యడంగుట యనునదియే సీతామహత్త్వమును దెలిపెడిని. ఈవిషయమా మెకు గొప్పదికాదని శ్రీశంకరభగవత్పాదులవారిశ్లోకము తెల్పుచున్నది.

"సుధామప్యాస్వాద్య ప్రతిభయజరామృత్యుహారిణీం
విపద్యంతే విశ్వే విధిశతమఖాద్యా దివిషదః,
కరాళం యత్క్ష్వేళం కబళితవతః కాలకలనా
న శంభోస్తన్మూలం తవ జనని తాటంకమహిమా." ౹ఇం

ఇందొక్కవిశేషము కలదు. స్త్రీలకుఁ దాటంకములే ప్రధానాభరణములు. సౌమంగల్యద్యోతకములు. పతియోగక్షేమములు తదధీనములు. అవి కూడ లేకుండుట స్త్రీలకు వేఱొకకాలమున నలంకారమగునేమో. కాని సర్వకాలము వారికిఁ దాటంకము లుండవలయును. ఇందు శ్రీశంకరభగవత్పాదులు భగవంతుని నిరీహత్వము ప్రకృతిమహత్త్వము తేటపఱచిరి. అట్టి మహాప్రకృతికి శ్రీరాముని మేనఁగలశస్త్రకృతవ్రణనిర్మూలన మొకలెక్కగాదని మన మెఱింగి యాయాదిమదంపతుల నారాధింపవలయును. ఇఁకఁ దరువాతి శ్రీరామచరిత్రమును బఠింతము.

## అకంపనుఁడు ఖరాదినిధనమును రావణునకుఁ దెలుపుట.

*రావణాసురునిగూఢచారుఁ డకంపనుఁ డనురక్కసుఁడు జనస్థానము వదలి త్వరపడి లంక కరిగి తమ ప్రభువును దర్శించి యిట్లు పలికెను. రాక్షసేంద్రా! జనస్థానమున వసించి యుండు రక్కసులు ఖరదూషణాదులును హతులైరి. ఎట్లో వారివలెఁగాక తప్పించుకొని నేను రాఁగల్గితిని. అనుపలుకులు చెవిసోఁకినంతనే సహజరక్తాంతనేత్రుఁడగు నారావణాసురుఁడును మఱింత కోపమూనుటంజేసి నేత్రము లగ్నిగోళముల వలె నుండఁగా లోకములఁ గాల్చఁబూనిన ట్లగపడుచు నిట్లు ప్రశ్నించెను. చావఁదలఁచుకొన్న యెవ్వఁడు నాజనస్థానమును రాక్షసశూన్యము గావించెను? వాఁ డేలోకమునఁగాని యిఁక నిలువఁగలఁడా? నా కపకారమే చేసినచో నింద్రకుబేర యములుగాని విష్ణుమూర్తిగాని సుఖ మేమాత్రము పొందఁజాలరు. యమునకు యముఁడను జుమా. అగ్నిని దహింపఁగలను. మృత్యువునకు మృత్యువును గల్పింతును. నేనే యొకప్పుడు క్రుద్ధుఁడనగుదునేని నాతేజోవిశేషమున సూర్యాగ్నులను దహింతును. నాజవశక్తిచే వాయువేగము నడంతును. అని కోపవేగమునఁ బలుక నకంపనుఁడు చేమోడ్పుతో భయమునఁ బలుకులు సరిగ వెడలక యుండఁగా నభయదానము నాతని యాచించెను. పిదప నించుక ధైర్యము తెచ్చుకొని కంఠమును సవరించుకొని ప్రభు వభయమీయఁగా నిట్లు విన్నవించెను

* ఇది ముప్పదొకఁడవసర్గమునఁ గలదు.

మహాప్రభూ! దశరథకుమారుఁడు శ్రీరాముఁడు కలఁడు. లోకోత్తరరూపవంతుఁడు. వయస్స్ఫురితుఁడు. సర్వ లక్షణసంపన్నుఁడు. ఆతఁడే జనస్థానము రాక్షసశూన్యముగా నొనరించెను. అను నకంపనుని పలుకుల కుగ్రుఁడై ఫణిపతి వలె నిట్టూర్పులుపుచ్చుచు నోయకంపనా! ఆరాముఁ డింద్రాదు లంగూడివచ్చెనా? అట్లు లేకున్న నెవ్వఁడే నింతకార్యమును సాధింపఁగలఁడా? విశదీకరింపుమని ప్రశ్నించెను. వాఁ డిట్లు విన్నవించెను. శ్రీరాముఁడు పరమతేజస్వి. కోదండధారులలోఁ బ్రథమగణ్యుఁడు. దివ్యాస్త్రసంపన్నుఁడు. సమస్తకళ్యాణగుణ విరాజితుఁడు. రణమున నింద్రునితో సాటియే. ఆతని కనురూపుఁడుగా లక్ష్మణుఁ డనుసోదరుఁడు కలఁడు. అట్టితమ్ము నింగూడి శ్రీరాముఁడు వాయు వగ్నింగూడునట్లున్నాఁడు. ఆరాముఁడే మనజనస్థానము నిర్మూలించెను. దేవత లించుకయు దోఁడుసూపలేదు సంశయ మిందు నించుకంతయు లేదు. స్వర్ణ పుంఖములగు నారాముని బాణభుజంగములు జనస్థానమునఁగల మనవారినెల్లర భక్షించెను. ఎందేని రక్కసులు పాఱిపోవు దురో అందెల్ల రాముఁడే కాన్పించెను. మహాప్రభూ! ఈరీతి నారాముఁడు జనస్థానమున నెందునకైన రక్కసు లుండక యుండఁజేసెను.

అను నకంపనునిమాటల నాలకించి నేను వారినిరువుర వధింప జనస్థానమున కేగెద ననెను. ఆమాట విని యాయ కంపనుఁడు మహారాజా! ఆరామునిబలపౌరుషముల నొక్క యక్షరమైనఁ దప్పకుండ వచింతు. ఆలకింపుఁడు. ఆరాముఁడు పరాక్రమింపఁబూనిన నతని నాప నెవ్వరి కలవిగాదు రాముఁ డాగ్రహించెనా నదీవేగము నిలుపఁగలఁడు. గ్రహమండ

లముతో నక్షత్రరాశితో నితరజ్యోతిస్సులతో నంబరమును జీకాకుపఱుపఁగలఁడు. సముద్రమును భూమి మునిఁగినయెడల దాని నుద్ధరింపఁగలఁడు. స్వతంత్రుఁడౌట నారాముఁడు చెలియలికట్టను బ్రద్దలుచేసి సముద్రోదకముల లోకముల ముంచఁగలఁడు. సముద్రవిజృంభణమును వాయువేగమును బాణముల నిలుపనేర్చును. పరాక్రమమున లోకములంగూల్చి మరలఁ బ్రజలను సృజింప నేర్పుగలవాఁడగును. రాక్షసేంద్రా! పాపులకు స్వర్గము పొందరానిదగునట్లు నీకును రాక్షసులకును సంగ్రామమున నారాముని జయింప శక్యమే కాదు. దేవదానవులందఱు నొక్కటిగాఁగూడిన నాతని వధింప నశక్యము. రాముని వధించునుపాయ మొకఁడు నాకుఁ దోఁచినది దాని సావధానముగ నాకర్ణింపుము. ఆతనిభార్య సీత. మహోత్తమురాలు. ఆమెయందము వర్ణనాతీతము. ఆమెవంటివనితయే లోకమున నెవ్వరియందును గానరాదు. నీ వాఘోరారణ్యమున బలాత్కారముగ నామె నపహరించి తీసికొనిరమ్ము. ఆమెయందే ప్రాణముల నునుచువాఁడు కాన నెడఁబాసియుండఁజాలక యతఁడసువులం బాయు. ఇదితప్ప వేఱొండుమార్గము లేదు.

అంతట రావణుఁ డాచారునిమాటలఁ బాటించి యోజించి యతనితో నేనొక్కండనే రథము నెక్కిపోయి నీచెప్పినయట్లాసీత నపహరించి తెత్తును. అని పలికి యప్పుడే రథమునెక్కి ప్రయాణమయ్యెను. మారీచుఁడుండు నాశ్రమమునకుం బోయి రథమునుండి యవతరించి తాటకానందనుని కడ కరిగెను. మారీచుఁడు దుర్లభములగుపదార్థముల నాతని సత్కరించెను. ఆతిథేయసత్కారముల నాచరించి మంచి

మాటలతో రాక్షసరాజేంద్రా! కుశలమా? నీ విట్లురెంచుట నాకు సంశయింపఁదగియున్నది. అనఁగా మహాతేజుఁడగు నారావణుఁడు మాటలయందుఁ జమత్కారముకలవాఁడగుట నిట్లు బదులు పలికెను. వత్సా! రాముఁడు ఖరుని బొలియించెఁగదా. జనస్థానమునఁ గలదుర్జయాసురుల రూపడంగించెను గదా. కాన వానిభార్యను దొంగిలింప నరుదెంచితిని. బంధువులం బోఁగొట్టుకొనియుండు నాకు నీ వీవిషయమునఁ దోడు పడవలయును. అని రావణుఁడు పలుకఁగానే తత్తఱంపడుచు మారీచుఁ డిట్లు పలికెను. కృత్రిమమిత్రుఁ డెవ్వాఁడు నిన్నుఁ బాడుచేయందలంచి యాసీతపేరు నీకుం దెల్పెను? నీ వవమానింప నెవ్వాఁడు నీభాగ్యమున కోర్వఁజాలకయున్నాఁడు? సీతను దెమ్మని నీకుఁ దెల్పువాఁ డెవ్వఁడు? వానిపేరు నాకుఁ దెల్పుము. ఎవ్వఁడు రాక్షసులకెల్ల దిక్కుగానుండు నిన్ను జంపఁ దలఁచినాఁడు? ఈకార్యము చేయ నిన్నుఁ బురికొలుపు వాఁడే నీకు శత్రువని నమ్ముము. నిస్సంశయము. క్రూరభుజంగము మోమునుండి దంష్ట్ర నూడఁదీయింపఁ నెవ్వఁడు చూచుచున్నాఁడు? ఈపనిచేయుమని నిన్నుం బురికొల్పి కీడుగల్గఁ జేయుమార్గము నిన్నుఁ ద్రొక్కింప నెవ్వాఁడు పూనినాఁడు? రావణా! హాయిగా నిదురించుచుండఁగా నెవ్వఁడు నీశిరస్సు లపైఁ గొట్టినాఁడు? పావనవంశమున జన్మించుటయే తుండముగా నుండఁగాఁ బ్రతాపమదము వెలయఁగా విశాలబాహువులే పొడవుగానుండుదంతములుగా నుండఁగాఁ దనవాసన సోఁకినంత నితరగజములఁ బరువెత్తఁజేయఁజాలు శ్రీరామ మదగజమును దేఱిచూడ :శక్యము కాదు. యుద్ధముమాట శక్యమని చెప్పవలయునా? శ్రీరాముఁడే సింహాసనుకొమ్ము.

అయ్యది యిపుడు నిద్రపోవుచున్నది. దాని నీసమయమున మేలుకొలుపరాదు. నీవా రామునిబాణముల వాతఁబడకుము. ఆయాలోచనము వదలుము. లంకకు వేగమ పొమ్ము. భార్య లంగూడి హాయిగా నుండుము. రాముఁ డడవుల భార్యం గూడి క్రీడించుంగాక. అని మారీచుఁడు పలుకఁగా నారావణుఁడు బదులు పలుకక లంకకుంబోయి యంతఃపురముఁ జొచ్చెను.

మహాశయులారా! ఈభాగమునఁ గలవిశేషముల వరయుదము. ఈరామాయణము శరణాగతిమంత్రవివరణరూపమని గోవిందరాజులతాత్పర్యము. ధర్మరక్షణార్థ మవతరించిన పరమేశ్వరచరిత్రమని మహేశ్వరతీర్థులమతము. ఈరెండు నించుమించుగా సమానములే. కాని మొదటిదాని యందు శిష్యసంపాదనము తన్మూలమున ధనార్జనము ప్రధానములు. రెండవదానియం దవి లేవు. కావున మనము ప్రకృతిపురుషు లొనరించిన ధర్మరక్షణరూప మహాకార్యము విని యానందించుచు వారి నుపాసింతము ఆచార్యుల నుపాసించుటే ముఖ్యమనియు భగవంతు నారాధించిన నతఁడు కర్మమున భక్తుని బడఁద్రోయుననియు నాచార్యు నమ్మినఁ దరణోపాయమును బోధించుననియుఁ గావున భగవదారాధనము కంటె నాచార్యు నారాధించుటే యుత్తమమగునను వంచకుల యుపదేశమును వీటిఁబుచ్చి సకలపురుషార్థసాధకులగు ప్రకృతిపురుషుల నారాధింతము. ఆచార్యు నారాధించుట నీచమని మనము భావింపరాదు. కాని భగవంతుఁడు సంసారమునఁ బడఁద్రోయునని ఆచార్యుఁడు ముక్తిమార్గమును జూపి దాసుని బిలుచుకొని యాముక్తి మండపకవాటమును దెఱచి

జుట్టుపట్టుకొని వీని ద్రోసివేసి తలుపుమూయును గాన నాచార్య
సేవ ముఖ్యమను నాశయము నీచమే యనియు దాని దూర
ముగా వదలవలయుననియు భావింపవలయును శిష్యవిత్తాప
హారకులగు దాసులమాటలు వేదాంతులయుపదేశములు
యోగుల ఛాయాపటములు హేయములని నిశ్చయింప
వలయును. భక్తుఁ డెక్కాలమునందు ధనార్జనైకతత్పరుఁడు
కాఁడు. యదృచ్ఛాలాభసంతుష్టుఁడు. ద్వంద్వసహిష్ణువుగా
నుండును. ధనము కొలఁదిగ నిచ్చినఁ దెగఁదిట్టి ధన మధిక
మొసంగిన నోడలెఱుఁగక భూషించుచు, దేవతాదూషణము
చేయుచుఁ, బరమతముల దూషించుచుండువారు భక్తులు
కాఁజాలరు. వారు కపటనాటకసూత్రధారులు, మధ్యవైష్ణ
వులు, మధ్యశైవులు, మధ్యశాక్తులు నగుదురు. వారి నస్పృ
శ్యులుగా మనము భావింపవలయును. ఇఁక విషయము
నెఱుంగఁ బ్రయత్నింతము.

అకంపనుఁడు రావణుని గూఢచారుఁడు. ఖరాదివధ
వృత్తాంతమును రావణునకుం దెలుపఁబోయెను. వార్తా
హారుఁడు జనస్థానమున లేఁడని యీమూలమునఁ దేలును.
అనఁగా రాక్షసుఁ డొక్కఁడైన మిగుల లేదనికదా దీని
భావము. ఖరదూషణాదులు రావణునకు మేలుఁగూర్చువారు.
సాయముగ నుండువారు. దుర్జయులు నగుదురు. వారినెల్ల
నొక్కఁడే రాముఁడు వధింపఁగాఁ గాంచి సత్వరము లంకకుఁ
బోయెను.

"జనస్థానస్థితా రాజన్ రాక్షసా బహవో హతాః,
ఖరశ్చ నిహతస్సంఖ్యే కథంచిదహమాగతః." ౨

అని మూలము. "కథంచిదితి స్త్రీవేషధారిణేతి భావః. అత ఏవ శూర్పణఖా వక్ష్యతి. 'ఏకా కథంచిన్ముక్తాహం పరిభూయ మహాత్మనా, స్త్రీవధం శంకమానేన రాఘవేణ మహాత్మనా' ఇతి" అని గోవిందరాజులు. వీరివెనుకఁ జేరి తనిశ్లోకి తాళము వేసినది. "కథంచిదహమాగతః కేవలం ప్రేక్షకతయా స్థితత్వా ద్రామశరావిషయీకృత ఇత్యర్థః" అని మహేశ్వరతీర్థులు. ఇప్పట్టున బుద్ధిమదగ్రగణ్యులగుపాఠకులు సుంత యోపికంగొని యాలకింతురుగాక. కథంచిత్ = అతిప్రయాసముగా, అహం= నేను, ఆగతః = వచ్చినాఁడను. అని యర్థము జనస్థానము నిశ్శేషరాక్షసబృందమైనది. అందుఁగల పదునాలుగువేలరాక్షసులు బ్రహ్మచారులుగాని యపత్నీకులుగాని కారు. ఏల కాఁగూడదందురేమో.

"అద్య విప్రసరిష్యంతి రాక్షస్యో హతబాంధవాః,
బాష్పార్ద్రవదనా దీనా భయాదన్యభయావహాః. ౧౦
అద్య శోకరసజ్ఞాస్తా భవిష్యంతి నిరర్థకాః,
అనురూపకులాః పత్న్యో యాసాం త్వం పతిరీదృశః." ౧౧

సర్గము. ౩౦

అని పూర్వసర్గముననే రామవాక్యములు గలవు. శూర్పణఖనే నొక్కతుకను విడువఁబడితినని రావణునితోఁ బల్కుట దానిదురుద్దేశముననేకాని వేఱుకాదు. యుద్ధరంగమున నోహటించువారింగూడ రాముఁడు వధింపఁడనుటసత్యము. ఇందులకు.

"తిష్ఠతైవాత్ర సంతుష్టా నోపావర్తితుమర్హథ,
యది ప్రాణైరిహార్థో వా నివర్తధ్వం నిశాచరాః." ౧౧ సర్గము౨౦.

అను రామునివాక్కులు ప్రమాణములు గాఁగలవు. కావున నకంపనుఁడు స్త్రీవేషమునఁ బోయె ననునది యంత యుక్తముగాఁ దోఁపలేదు. యుద్ధము చూచువారిని వధించుట యెట్టిరాజులకును ధర్మము కాదన నిఁక శ్రీరామునివిషయమున వచింపనేల? ఖరాది నిఖిలదానవులు చావఁగా నా ఘోరవార్తను దెలుప నకంపనుఁడు లంక కరిగెననుటయే యుక్తము. శూర్పణఖావాక్యమగు "ఏకాకథంచిన్ముక్తాహమ్" అనుదాని నుదాహరించి యకంపనుఁడు స్త్రీవేషముననే లంకఁ జేరెననుట "పృష్ఠతాడనాద్దంతభంగః" అనున్యాయమున కుదాహరణ మనవచ్చును ఇందుఁ గలసారమేమి? భగవంతు నుద్దేశము ననుసరించి రావణాసురుని భావిఫలప్రదానదక్షమగు కర్మ మకంపనుని లంకకుం బోవఁ బురికొలిపెను. అంతియ గాక సీతాహరణరూపదుష్కర్మమున కతనిఁ బ్రోత్సహింపఁ జేయునూహల నకంపనునకుఁ దోఁపఁజేసెను. దీనిచే "కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్" అనుగీతాశాస్త్రవిహితకర్మసిద్ధాంతము స్పష్టమగుచున్నది. కర్మసిద్ధాంతమునే యీరామాయణము తేటపఱచుచున్నది.

"న హి మే విప్రియం కృత్వా శక్యం మఘవతా సుఖం,
ప్రాప్తుం వైశ్రవణేనాపి న యమేన న విష్ణునా." ౫

అని మూలము. ఇది యొడలు తెలియక పలికిన రావణవాక్యము. ఈ కాండమునఁ బండ్రెండవసర్గమున నగస్త్యాశ్రమమును శ్రీరాముఁ డాయాదేవతాస్థానములం గాంచుచుఁ బోవుచుండు తఱి రుద్రస్థానము చెప్పఁబడలేదను కారణమున "రుద్రస్యాపూజ్యత్వమాహ" అని సర్గాదియందే యారంభించి "తత్ర

పూజ్యదైవతేషు రుద్రస్యానుపాదానాదపూజ్యత్వముక్తమ్"
అని వ్రాసిన గోవిందరాజు లెందు నుూకిత్వమునవహింప నేమి
గ్రహాచారమో తెలియఁజాలకున్నాఁడను. ఇందు నింద్రుకుఁజెప
ధర్మరాజులతోఁడ విష్ణువును జెప్పఁనుటంజేసి యపూజ్య
త్వము విష్ణువున కేల ప్రాప్తింపదు? ఇందీశ్వరుని జెప్పఁన
నందున నగణ్యత్వమేల ప్రస్తావింపఁబడలేదు? దుర్మతాభి
మాన మెంతపండితులనైన నీచమార్గముఁ బ్రవర్తింపఁజేయక
మానదు కదా. ఈచోట బ్రహ్మ శంకరుఁడు పేర్కొనఁబడక
పోవుటచే మహాపూజ్యులనియుఁ జెప్పఁబడుటంజేసి
విష్ణువపూజ్యుఁడనియుఁ బలుకవచ్చునా? అట్లు లారోపించు
వారికి శ్రీరామాయణము దుష్ఫలమునే ప్రసాదించునుగాని
సత్ఫలమును బ్రసాదింపదు. విష్ణువునందు నిరతిశయభక్తి
యుండవచ్చునుగాని శంకరద్వేష మనునది యుండవచ్చునా?
ఈయిరువురు భగవదంశసంభూతులను భాగవతవాక్యము
పనికిరాదనువా రుండరని నానమ్మకము. మహాభారతమున శివ
సహస్రనామము లుపదేశించుఘట్టమున శ్రీకృష్ణవాక్యములు
స్మరించిన నిట్టిదుర్మతాభిమానము తొలఁగును. కొందఱాఘట్ట
మును బురాణముఁ జెప్పుచు నిది చమత్కారముగా వ్యాసులు
చెప్పిరికాని వారిభావ మదికాదని పలికిరి. విష్ణుసర్వోత్తమ
త్వము చెప్పుఘట్టమునఁగూడ నిట్టిసమాధానమే చెప్పినపుడు
వారేమందురో తెలియఁజాలకున్నాఁడను. ఇట్టివారు దుష్కర్మ
ఫల మనుభవించువారని మనము నిశ్చయించుకొనవలయును.
మనముమాత్రము విష్ణుశంకరాదు లాపరమేశ్వరు నంశభూతు
లనియు, వారిలో నెవరి నారాధించినను దన్నామమున వెలసిన

భగవంతుఁడే యతఁడనియు నారాధించిన, నేకొంతలును గలుగక సత్ఫలములు గలుగుంగాన, యట్లు చేయవలయును. పరమతదూషణముకాని పరదేవతానిందగాని యెకప్పుడైనఁ జేయరాదు. అది భక్తి నున్మూలించుటయేగాక పాపమును గూడఁ గల్గించును.

"స సురేంద్రేణ సంయుక్తో రామస్సర్వామరైస్సహ,
ఉపయాతో జనస్థానం బ్రూహి కచ్చిదకంపన. ౧౩
రామో నామ మహాతేజాశ్శ్రేష్ఠస్సర్వధనుష్మతాం,
... ... ... ... ...
కనీయాన్ లక్ష్మణో నామ భ్రాతా శశినిభాననః. ౧౬
స తేన సహ సంయుక్తః పావకేనానిలో యథా,
శ్రీమాన్ రాజవరస్తేన జనస్థానం నిపాతితం. ౧౭
నైవ దేవా మహాత్మానో నాత్ర కార్యా విచారణా."

అని మూలము. ప్రాక్కర్మ మెంతటివానినైన బాధించును. రాముఁడు జనస్థానము నాశనమొనర్చె నన్నంతనే యింద్రాదులంగూడి వచ్చి పాడుచేసెనా యనియే రావణుఁడు ప్రశ్నించెను. మనమున నిరంతరద్వేషము దేవతలపై నున్నదిగాన వారిమూలముననే తనవారలకుం గల్గెనని యతఁ డూహించెను. అకంపనుఁ డాశంక నివారించెను. కాని భగవద్దర్శనమున నకంపనునిచిత్తము మార్పునొందెను. తమవారిం జంపినందులకై రాముని దూషించుటకు మాఱుగా నోడలు తెలియక పొగడెను. అగ్నితోడంగూడినవాయువువలె లక్ష్మణునింగూడినరాముఁ డింతటికార్యము నొనరించెనని యకంపనుఁడు తెలిపెను. లక్ష్మణుఁ డగ్నితోఁ బోల్పఁబడియెను. శ్రీరాముఁడు వాయువుగాఁ దెల్పఁబడియెను. శ్రీరాముఁడు రూపధారిగా

నున్నవాఁడుకాని యరూపుఁడు. అనఁగా నారూప మతని సత్యరూపము గాదని భావము. దీనిచేఁ బరమేశ్వరత్వము సూచింపఁబడినది. సర్వవ్యాపకత్వముకూడ నిందుమూలమున సూచింపఁబడినది. లక్ష్మణునియందుఁ దక్షత్వ మారోపితము. భగవంతునియం దది యుండరాదుకదా. రామున కపుడపుడు కలుగుకోపము లక్ష్మణునిసంగతిం జేసియే కాని స్వాభావికము గాదనియే దీనిఫలము.

"సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్. ౨౯
అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్,
సాధురేవ స మంతవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః." ౩౦ గీత. ౯ అధ్యా.

అను నీశ్రీకృష్ణవాక్యమే యిందుఁ గూడఁ గలదు. కనుకనే యకంపనుఁడు క్రూరరాక్షసానుచరుఁడైనను బ్రాక్సుకృతవిశేషమున భగవంతునిం గాంచినంతనే సత్కర్మఫలముగా మనస్సు మార్పునొందఁగా నాశ్రీరామునిం బొగడెను. కావున భగవత్సందర్శన మించుకయైన సత్ఫలము నెంతక్రూరునకైన నొసంగును. ఇఁక సజ్జనునకు ముక్తి నొసంగునని వేఱుగాఁ జెప్పనేల?

"శరా రామేణ తూత్సృష్టాః రుక్మపుంఖాః పతత్త్రిణః. ౧౮
సర్పాః పంచాననా భూత్వా భక్షయంతి స్మ రాక్షసాన్,
యేన యేన చ గచ్ఛంతి రాక్షసా భయకర్శితాః. ౧౯
తేన తేన స్మ పశ్యంతి రామమేవాగ్రతః స్థితమ్,
ఇత్థం వినాశితం తేన జనస్థానం తవానఘ." ౨౦

అని మూలము. విశేషార్థ మిందేదిగలదని విచారింతము.

రామునిబాణము లైదుతలలుగల పాములై రాక్షసుల భక్షించెననునది ప్రాతీతికార్థము. విశేషార్థ మేమనఁగా 'సర్పతీతి సర్పః' అనువ్యుత్పత్తిచే సంచరించునది యని దాని యర్థము. ఈరామాయణమునఁ బెక్కుతావుల నైదుతలల పాములు చెప్పఁబడును. ఇచ్చోట నది యర్థము కాదు. రాముఁడు వైచిన బాణములు "పంచాననాస్సర్పా భూత్వా" రుద్రరూపములై 'రాక్షసాన్ భక్షయంతి స్మ' రక్షసుల ప్రాణములఁ దీయుచుండెను. రామమూర్తి నిమిత్తమాత్రమే. మృత్యుంజయుఁడగు రుద్రుఁడు బాణరూపమునఁ బోయి వారి నాశనము చేసెను.

"ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః. 32
తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్,
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్. 33
ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాన్యానపి యోధవీరాన్,
మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్." 34 గీత. ౧౧ అధ్యా.

అన్న భగవద్వాక్యములు వ్యర్థము లగునా ? భగవంతుఁడు కర్మానుసారమే ఫలముల నొసంగును. నిస్సంగుఁడగువాఁ డెట్లు ఫలముల నీయఁబూనునన రాదు. తదిచ్ఛాశక్తియగు మహాప్రకృతియే సకలకార్యముల నొనరించును.

"నిజాజ్ఞారూపనిగమా పుణ్యాపుణ్యఫలప్రదా."

అను ప్రమాణము కలదుకదా. శ్రీశంకరభగవత్పాదులుఁగూడ

"త్వదన్యః పాణిభ్యామభయవరదో దైవతగణ
స్త్వమేకా నైవాసి ప్రకటితవరా భీత్యభినయా,
భయాత్త్రాతుం దాతుం ఫలమపి చ వాంఛాసమధికం,
శరణ్యే లోకానాం తవ హి చరణావేవ నిపుణౌ."   ४

అనుశ్లోకమునఁ దెలిపియే యున్నారు ఆపరాశక్తి సంహరించునపుడు రుద్రాంశమగు తమోగుణమును బ్రధానముగా నంగీకరించును. కనుకనే రుద్రాణి యనునామ మొకసమయమునఁ గలిగెను. ఇట్లే బ్రహ్మావిష్ణ్వంశములను గూడ నంగీకరించును. అనఁగాఁద్రిమూర్తులును ద్రిగుణజనితులే యగుటనాకార్యమున నాపేరఁబరఁగునని సారము.

"త్రయాణాం దేవానాం త్రిగుణజనితానాం తవ శివే
భవేత్పూజా పూజా తవ చరణయోర్యా విరచితా,
తథా హి త్వత్పాదోద్వహనమణిపీఠస్య నికటే
స్థితా హ్యేతే శశ్వన్ముకుళితకరోత్తంసమకుటాః."   ౨౫

అని శ్రీశంకరాచార్యవర్యు లుపదేశించియే యున్నవారుకదా. ఇపుడు రామబాణములుగా నారుద్రమూర్తులు పరుగిడి వారిని సంహారించెననుట సమంజసమనియే యంగీకరింపవలయును. రుద్రుఁడనఁగా మృత్యుంజయుఁడు కదా. ఈవిషయము మహాభారతమునందుఁ గలదు. వ్యాసు లగపడఁగా నర్జునుఁడిట్లు ప్రశ్నించెను.

"యదృచ్ఛయాఽఽగతం వ్యాసం పప్రచ్ఛ భరతర్షభ.   3

అర్జునః.

సంగ్రామే న్యహానం శత్రూన్ శరౌఘైర్విమలైరహం,
అగ్రతో లక్షయే యాంతం పురుషం పావకప్రభం. ౪

జ్వలంతం శూలముద్యమ్య యాం దిశం ప్రతిపద్యతే,
తస్యాం దిశి విశీర్యంతే శత్రవో మే మహామునే. ౫

తేన భగ్నానరీన్ సర్వాన్మద్భగ్నాన్ మన్యతే జనః,
తేన భగ్నాని సైన్యాని పృష్ఠతో నుదదామ్యహం. ౬

భగవంస్తం మమాచక్ష్వ కో వై స పురుషోత్తమః,
శూలపాణిర్మయా దృష్టస్తేజసా సూర్యసన్నిభః. ౭

న పద్భ్యాం స్పృశతే భూమిం న చ శూలం విముంచతి,
శూలాచ్ఛూలసహస్రాణి నిపేతుస్తస్య తేజసా. ౮

వ్యాసః.

ప్రజాపతీనాం ప్రథమం తేజసాం పురుషం ప్రభుం,
భువనం భూర్భువం దేవం సర్వలోకేశ్వరం ప్రభుం. ౯

ఈశానం వరదం పార్థ దృష్టవానసి శంకరం,
తం గచ్ఛ శరణం దేవం వరదం భువనేశ్వరం. ౧౦

... ... ... ...

స శివస్తాత తేజస్వీ ప్రసాదాద్యాతి తేఽగ్రతః. ౨౦

కస్తాం సేనాం తదా పార్థ మనసాపి ప్రధర్షయేత్,
ఋతే దేవాన్మహేష్వాసాద్బహురూపాన్మహేశ్వరాత్."

ద్రోణపర్వము. ౨౦౩ అధ్యాయము.

అని వ్యాసు లుపదేశించెను. భగవద్గీతలలో శ్రీకృష్ణమూర్తియే.

"మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్,"
అని పలికెను. అర్జునునకు శూలపాణిగాఁ గనఁబడినవాఁ

డెవఁడు? శంకరుఁడు. ఇపు డీయిరువురమాటలలో నేది సత్యము? ఈరెండుభాగములు వ్యాసప్రోక్తములే. పరస్పర విరుద్ధములుగా నున్నవే యని ప్రశ్నింప నవకాశము కలదు. కాని బుద్ధిమంతు లించుక యోజించిన నింతకుముందు వ్రాసినదే సమాధానమని విశ్వసింపఁగలరు. విష్ణుమూర్తి మావాఁడని పలుకు మధ్వవైష్ణవులకు నిట్టిఘట్టముల విరుద్ధముగా సమాధానము తోఁచును. దుర్మతాభిమానపిశాచ మావేశింప వారు పాషండులగుదురు. వారికిం దోఁచునది కుమార్గమే. ఏగ్రంథములం బరిశీలించినను శివకేశవులకు భేదము గాన రాదని తోఁచును. అజ్ఞానాంధకారము కన్నులకుం గప్ప నిరువురకు భేదము కలదనియు నం దెవరినో యొకరిని దూషించు నిరుతెగల పాషండులు గలరు. వారలకుఁ బూర్వజన్మకృత దుష్కర్మవశమున

"అవిద్యామోహితాత్మానః పురుషా భిన్నదర్శినః,
వదంతి భేదం పశ్యంతి చావయోరంతరం హర."

అను విష్ణుపురాణవచనము,

"త్రయాణామేకభావానాం యో న పశ్యతి వై భిదాం,
సర్వభూతాత్మనాం బ్రహ్మన్ స శాంతిమధిగచ్ఛతి."

అను భాగవతవాక్యము,

"రుద్రో నారాయణశ్చైవ సత్త్వమేకం ద్విధాకృతం,
లోకే చరతి కౌంతేయ వ్యక్తిస్థం సర్వకర్మసు."

అను శాంతిపర్వమునఁగల శ్రీకృష్ణవాక్యము, మఱియు నిట్టి వెన్ని వాక్యములైన రుచించునా?

"తావుభౌ నరకం యాతో యావచ్చంద్రదివాకరౌ"

అన్నవాక్యమున కుదాహరణభూతులగుదురు!

ఇఁక నీశ్లోకార్థసారమును బరిశీలింతము. శివుఁడు భక్తులకు నుపదేశించునపుడు విష్ణువే భగవంతుఁడని తెల్పును. విష్ణువు భక్తులకు హితోపదేశము చేయునపు డీశ్వరుఁడే భగవంతుఁడని తెల్పును. దీనింబట్టి వీరిరువుర కభేదమనియే తేలును. అనఁగా నొక్కతత్త్వమే కార్యవశమున రెండు రూపములుగా నయ్యెనని మన మెఱుంగవలయును. అజ్ఞానము గలిగిన భేదబుద్ధి నశించును. పరమతద్వేషమున కవకాశ మెక్కడిది? కనుక మనము పరమతద్వేషము దేవతాంతరదూషణము ననువానికి మనసునఁ జోటీయరాదు. మధ్యవైష్ణవాది పాషండుల మాటలకుఁ జెవియొగ్గరాదు. "యేన యేన చ గచ్ఛంతి" అనుమూలమునఁ గలవిశేషార్థములఁ బరిశీలింతముః. శ్రీరాముని కల్పితరౌద్రాకారముం గని భయంపడి రక్కసులేయేవస్తువుల నాశ్రయించి ప్రాణములఁ దక్కించుకొనఁ జూచిరో ఆదృష్టిచే నావస్తువులయందంతట శ్రీరామునే చూచిరి. రామావతారమున మీకు శాపవిముక్తి కలుగునని యీశ్వరుఁడు చెప్పినపల్కు వారి కయ్యదనున ననుభవమునకు వచ్చెను. ప్రళయకాలరుద్రు నాకారమే యప్పటిరాము నాకారము. భయంపడి యేచాటుననో దాఁగియుందు మను కొని పోవఁగా నచ్చోట వారి ముందు శ్రీరాము నాకారమే గోచరించెను. రక్షకమనుభావమున రక్కసు లెందుఁ బోయిన నయ్యది వారికి రామునాకృతిగనే కనంబడెనని తాత్పర్యము. గాఢభయము భక్తిగా మాఱెను గానఁ బ్రాణభయమునం బరుగిడి శ్రద్ధచే నేవస్తువు నాశ్రయించి రామునకుం గనఁబడక యుండ నుందమన్న నావస్తువు లెల్ల భగవద్రూపములే యయ్యెనని సారాంశము.

"యో యో యాం యాం తనుం భక్తశ్శ్రద్ధయార్చితుమిచ్ఛతి,
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహం. ౨౧
స తయా శ్రద్ధయా యుక్తస్తస్యారాధనమీహతే,
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్." ౨౨

గీత. ౭ అధ్యా.

అను నీగీతావాక్యము పైభావమునే తెలుపుచున్నది ఇయ్యది సత్యమైన వారేల మృతినొందిరని ప్రశ్నింపరాదు. వారికి రానున్నది సత్ఫలము అయ్యది యీతనువున ననుభవింపఁ దగినది కాదు. కావున నావస్తువులన్నియు శ్రీరామునాకృతులం దాల్చి మహోపకారము చేయఁబూని వారితుచ్ఛతనువుల ఛేదించి యానందసంధాయకములగు తనువులం గల్గఁజేసెనని మన మీభాగమున గ్రహింపఁదగును. దీనిచే భగవంతుని సర్వవ్యాపకత్వము వ్యక్తమగుచున్నది. ఒక్కరూపము, ఒక్కస్థలము, ఒక్కనామము భగవంతునకుఁ బ్రీతిదాయకము లన్న తుచ్ఛభావము దీనిచే విధూతమయ్యెను. అనఁగా శ్రద్ధాభక్తులచే నేరూపనామములు గలవానినిగాఁ దన్ను ధ్యానించిన నారూపమునఁ బొడసూపి వారి ననుగ్రహించుట భగవంతుని స్వభావమని మన కీభాగము తెలుపుచున్నది.

"ఇత్థం వినాశితం తేన జనస్థానం తవానఘ." ౨౧

అని మూలము. అనఘ! అని రావణు నకంపనుఁడు సంబోధించెను. ఆతనిచిత్తవృత్తి యిపుడు మాఱియున్నది. భగవద్దర్శనజనితానందము ననుభవించుచున్నది. కావనే పాపరహితా! అని సంబోధించెను. ఇట్లు జనస్థానము రామునిచే వినాశము నొందింపఁబడినదనియె. దీనిభావమేమి ? ఇందుపల

క్షుణ విధిచే జనస్థానమనఁగా జనస్థానగతరాక్షసబృందమని యర్థము గ్రహింపవలెను. జనస్థానమును శ్రీరాముఁడు పాడు చేయలేదు. అందలి ఖరాదిరాక్షసులనేకదా. ఇట్లు వినాశ మొందింపఁబడిరి యనఁగా భావమేమి? శాపవిముక్తిరూపమునఁ బాపులకెల్లఁ బుణ్యరూపములు ప్రసాదింపఁబడెనని భావము. వి = పోయిన, నాశితం = నాశనముగలదిగాఁ జేయఁబడినది. నాశరహితపుణ్యలోకప్రాప్తిగలవారుగాఁ జేయఁబడిరనియే కదా దీనియర్థము. మరల నిట్టిపాపములు చేయునూహలు గలు గని తనువులు ప్రసాదింపఁబడియెననియే దీనిసారము. ఇచ్చోట నాంధ్రీకరణము లెట్లున్నవని పరికింతము.

"యేన యేన చ గచ్ఛంతి రాక్షసా భయకర్శితాః, ౨౦
తేన తేన స్మ పశ్యంతి రామమేవాగ్రతస్థితం,
ఇత్థం వినాశితం తేన జనస్థానం తవానఘ." ౨౧

అనుమూలమునకు నింతదనుక నర్థవిశేషములు వ్రాసితిని గదా. వ్యాఖ్యాతలభావములఁగూడఁ దెల్పితిని. ఈయర్థవిశేష ముల నెట్లు గ్రహించి తెలిఁగించిరో పరికింపుఁడు. ఇది విమర్శ కులకు సమాధానము కాదు. వాసుదాసుగారే నేను విశే షార్థములఁ దెలిసికొనఁజాలకపోతినని వ్రాసినందున వ్రాయ వలసివచ్చెను.

క. "ఏయే తెఱఁగుల దిగులున
నేయే తెరువులను బోవు నెల్లపగఱక
య్యాయి తెఱంగుల మఱి నా
యాయిపథంబులును దోఁచు నని రాముండున్.

క. ఈనెఱిఁ బాడయ్యె జన, స్థానంబన; నాలకించి"

వావిలికొలనువారి రామాయణము.

మఱినాయాయి = మఱి ద్రుతప్రకృతికముగాఁ బఠుట పొర పాటుగ నుండును.

మ. "దనుజేంద్రాళిఁ గ్రసించె; సాధ్వసమునన్ దా రెంతయుం
దూలి య,ద్దనుజవ్రాతము లెన్నిత్రోవలను నుద్ధామ్యత్రైచేఁ
బాఱెనో. ౧౦౮

సీ. శ్రీరాముఁడే మీఱి వారికాయాయిత్రో
వల ముందుగా నిల్చి వరుసఁ గానఁ
బడుచుండె ననఘాత్మ! ప్రబలుఁడై తగు రాముఁ
డిట్లు జనస్థాన మెల్లనంత
మొందించె; ..." ఆంధ్ర శ్రీమద్రామాయణము.

మహాశయు లీతెనుంగులఁ బరికించి యిందలిగుణాగుణముల నిర్ణయించి మనసుల నానందింతురుగాక. ఏపదములు మానిన రసహీనమగునో యనువిషయము పెద్దలగుమీఁరలే యెఱుంగుదురు.

"అథైవముక్తే వచనే ప్రోవాచేదమకంపనః,
శృణు రాజన్ యథావృత్తం రామస్య బలపౌరుషమ్.
... ... ... ... ...
సంహృత్య వా పునర్లోకాన్ విక్రమేణ మహాయశాః,
శక్తస్స పురుషవ్యాఘ్రస్స్రష్టుం పునరపి ప్రజాః. ౨౮
న హి రామో దశగ్రీవ శక్యో జేతుం త్వయా యుధి,
రక్షసాం వాపి లోకేన స్వర్గః పాపజనైరివ. ౨౭
న తం వధ్యమహం మన్యే సర్వైర్దేవాసురైరపి,"

అని మూలము. ఇవి యకంపనునిమాటలు. యుద్ధమున రాముని జయింపఁబోవురావణున కుపదేశించుచున్నాఁడు. అకంపనుఁడు కన్నులార భగవంతుని రుద్రాకృతిం గాంచెను. కావుననే

కన్నుమిన్నెఱుఁగక తనప్రభువు నెదురఁ బొగడుచున్నాఁడు. ఇపుడు రావణునికర్మమే యకంపనునినోట నీమాటలఁ బలికించుచున్నది. రావణుఁడు యుద్ధముచేయఁ బ్రయత్నింపక యుండఁ బలికించుచున్నది. ఆమాటల నాలకించి రావణుఁడు భయంపడఁజేయుచున్నది. ఇందు భగవంతుఁడు సర్వకార్యకరణశక్తుఁ డనుభావము స్పష్టమగుచున్నది. ప్రాయికముగా నసాధ్యకార్యములని మనకుఁ దోఁచునవి భగవంతునకుఁ దృణప్రాయములని మనమెఱుంగవలయును. నిశ్చయముగా నకంపనుఁ డనునల్పసేవకుఁడు దిక్పాలకుల గెల్చినరావణు నెదుర యుద్ధమున నీ వా రాముని జయింపఁజాలవనెను. పాపము చేసినవారలకు స్వర్గము సాధ్యముకానియట్లు స్వర్గము రాముఁడుగను, పాపజనుఁడు రావణుఁడుగను జెప్పఁబడినది. నీపాపము నశించుసమయము వచ్చినఁగాని శ్రీరామునితో సంగతి కుదురదని తాత్పర్యము దేవాసురులచే నారాముఁడు చంపఁబడ నర్హుఁడు కాఁడని నేనెంచెదననియె. అనఁగా సర్వథా సర్వదా అవధ్యుఁడనియేకదా యతనిభావము. భగవంతుఁడనియేకదా దీనిసారము. అకంపనున కంతటిజ్ఞానము లేకున్నను భగవద్దర్శనసుకృతమే యాతని నట్లు పలికించెనని మన మూహింపవలయును.

"అయం తస్య వధోపాయస్తం మమైకమనాశ్శృణు. ౨౮
భార్యా తస్యోత్తమా లోకే సీతా నామ సుమధ్యమా,
శ్యామా సమవిభక్తాంగీ స్త్రీరత్నం రత్నభూషితా. ౨౯
నైవ దేవీ న గంధర్వీ నాప్సరా నాపి దానవీ,
తుల్యా సీమంతినీ తస్యా మానుషీషు కుతో భవేత్. ౩౦
తస్యాపహార భార్యా త్వం ప్రమథ్య తు మహావనే,

సీతయా రహితః కామీ రామో హాస్యతి జీవితం." 30

అని మూలము. అకంపనుఁ డిట్టి దురుద్దేశము కలవాఁడుకదా. అట్టివాఁడు పైనఁ జెప్పినరీతి శ్రీరామమాహాత్మ్యము నెట్లు బోధించును? అని ప్రశ్నింపవచ్చును. ఇంతదనుక నాయకంపనుని పూర్వసుకృతకర్మమే యాతనిం బలికించెను. భగవదిచ్ఛయు రావణాసురునికర్మము నాతనినోట నిట్లు పలికించి దానిని రావణుఁడు సమ్మతింపఁజేసెనని మన మూహింపవలయును. ఈకర్మసిద్ధాంతము నెఱింగినయెడల నిందసంగతమగునదించుకంతయు లేదని తోఁచును. రాముని వధించునుపాయమియ్యదియే. దాని నేకాగ్రచిత్తుఁడవై యాలకింపుమని యకంపనుఁ డనియెను. విశేషార్థ మేమనఁగా 'అయం మమ' నాకుఁ దోఁచిన వధోపాయః=చంపునుపాయము, తస్య=ఆరామునకు, పరాకులేక వినుము. అతని కిదియే వధోపాయము.'తవ' అనునది యధ్యాహారము. నీవధోపాయ మారాముని కిదియే. నాయొక్క మనస్సునకుఁ దోఁచినది. నాయూహ నాలకించి యట్టు లొనరించితివేని నీ కీతనుభరణభావము తొలఁగును. ఈయర్థము ద్రావిడప్రాణాయామమువంటిది గాదాయన్నఁగావచ్చును. ముందు సాగుకథ ననుసరించి యిట్లూహింప నవకాశముకలుగవచ్చును తాఁజెప్పునదితనకే తెలియక వాఁడట్లు పలికెనని మన మెంచవలయును ఆతఁడు సీతను వర్ణించెను. లోకమున నుత్తమకాంత లేయేజాతులలోఁ గలరని యతఁడూహించెనో వారినెల్లరఁ దెలిపెను. వారిలో నట్టిసీమంతినీ రత్నము లేదనియె. సుందరీకాంతేత్యాదిపదముల నుపయోగింపక యతఁడు సీమంతినీశబ్దము పలికెను. దేవతలలోనే యట్టి

సీమంతిని లేదన నిఁక మనుజస్త్రీలయం దెట్లుండును? అని ప్రశ్నించెను. సీమంతమనఁగా కేశవీథి అని యర్థము. నాసిక నుండి చక్కఁగా బ్రహ్మరంధ్రముదనుక నొకసరళ రేఖ లిఖించిన యెడల నది కురులను సమముగా విభజించుమార్గముగా నుండును. దానికే పాపట యందురు. ఇక్కాలమున నయ్యది తాఉుమాఉుగా నుండును. అయ్యది యీకాలమున నొక శృంగారముగా నెంచఁబడుచున్నది. కాని యద్దాని కర్థము వేఉు. అయ్యది ప్రకృతిపురుషసమష్ట్యారాధనరహస్యముం దేటపఱచును. శ్రీశంకరభగవత్పాదు లీవిధముగాఁ జెప్పి యున్నారు:

"మహీం మూలాధారే కమపి మణిపూరే హుతవహాం
స్థితం స్వాధిష్ఠానే హృది మరుతమాకాశముపరి
మనోఽపి భ్రూమధ్యే సకలమపి భిత్వా కులపథం
సహస్రారే పద్మే సహ రహసి పత్యా విహరసి." — సౌందర్యలహరి.

"సజీవః ప్రాకృత ఏవ. శుద్ధవిద్యాతు సదాశివేన సంయుక్తా సతీ సాదాఖ్యకళేతి వ్యవహ్రియతే. అతో భగవతీ చతుర్వింశతితత్త్వాన్యతిక్రాంతా సదాశివేన పంచవింశేన సార్థం విహరంతీ షడ్వింశతితత్త్వమాపన్నా పరమాత్మేతి గీయతే, ఏత దుక్తం భవతి. సాదాఖ్యకళా పంచవింశేన సదాశివేన మిళితా షడ్వింశా భవతి మేళనస్య తత్త్వాంతరత్వాత్. న చోభయోర్మేళన ముభయాత్మకం. తస్య తదాత్మరూపత్వా త్తత్త్వాంతరమేవేతి రహస్యం. యత్తు శ్రుతివాక్యం, పంచవింశ ఆత్మా భవతీతి, తత్తు సదాశివతత్త్వప్రతిపాదనపరం న మేళన పరమితి జ్ఞేయం."

అని వ్యాఖ్య. ప్రకృతిపురుషైక్యమే బ్రహ్మరంధ్రస్థానమని యోగమతము. బ్రహ్మరంధ్రమునఁ దేజోరూపమున వెలయు వారిని ధ్యానింపవలయు ననునదియే సమయమతము. సమయ

మతమున బాహ్యపూజాదులు లేవు. మానసికధ్యానమే యని యెఱుంగవలయు. యోగమతము నదియేయని యిందలి రహస్యము ప్రకృతము సీమంతిని యనఁగా భగవంతుని ధ్యానించుస్థానమే యలంకారముగాఁగలది. అనఁగా సాధకుని బరమానందజనకమగు పరతత్త్వమున ధ్యానించుమార్గమును సుబోధముగాఁ దెలుపునది యని సారము

"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే."

అని గీతావాక్యముకూడ నీయర్థమునే బోధించును. నామాయ దురత్యయ. నన్నుఁ బొందువారు మాయను దరింతు రనఁగా భావమేమి? మాయ నుపాసించి తదనుగ్రహమునకుఁ బాత్రుఁడైనవాఁడు నన్నుఁ జేరఁగలఁడు. ఆతని మరల మాయ బాధింపదు. భగవత్యుపాసన మజ్ఞానధ్వాంతభాస్కరోదయమనియుఁ దన్మూలమున నిర్మలజ్ఞానము కలుగుననియు వీనియంతరార్థము. ప్రకృత మనుసరింతును. సీమంతినీరత్నము సీత యని యతఁడు తెలిపెను సీమంత మనుదానియర్థమును శ్రీశంకరభగవత్పాదాచార్యు లిట్లు వివరించిరి.

"తనోతు క్షేమం న స్తవ వదనసౌందర్యలహరీ
పరీవాహస్స్రోతస్సరణిరివ సీమంతసరణిః,
వహంతీ సిందూరం ప్రబలకబరీభారతిమిర
ద్విషాం బృందైర్బందీకృతమివ నవీనార్కకిరణం." ४४

అని పాపట నిట్లు శ్రీమచ్ఛంకరాచార్యులుగా రిట్లు వినుతించుట కేదేని హేతువుండవలయును. కానఁ దదుక్తమగుపూర్వశ్లోకము నన్వయించుకొనవలయును. సీమంతసరణి మాకు

క్షేమము నొసంగుఁగాక యనఁగా దాసియం దేదోమహత్త్వ ముండియే యుండును.

ఆరామునకు నిన్ను వధించునుపాయ మిదియే యను నర్థము ఆశబ్దములవరుసనుండి తేలదని మొండివాదము చేసి నను ఆయర్థమేమో సత్యమే కాన నద్దాని కనుకూలముగా నతఁడుమాత్ర మాలోచనము చెప్పెను. "మహావనే ప్రమథ్య తస్య భార్యాం త్వం అపహర." సామాన్యార్థము స్పష్టము. విశేషార్థము పరిశీలింతము. నిర్మనుజమగువనమున నేయుపా యముచేనైన శ్రీరాముని వంచించి యామహాదేవిని బలా త్కరించి కొనితెమ్ము. అపహరింపుమని తాత్పర్యము. భార్య యనఁగా భా=అన దీప్తి. దానిచేఁ బూజ్యురాలు. అనఁగా స్వప్రకాశముచేఁ బూజ్యురాలు. తేజస్స్వరూపిణి యని భావము. రావణా! తేజస్స్వరూపిణియగు నాసీతాదేవి నపహ రింపుము. భక్తులు నాచిత్త మపహరించికొని పోవుదురని భగ వంతుఁ డెన్నియోసారులు తెల్పియున్నట్లు పురాణములు తెలుపును. శ్రీరాము నిచ్ఛాశక్తి యగుసీతాదేవిని గొనిరమ్ము. అనఁగా నామె నీయింటనున్నయట్లు భావింపుము. రూపనామ రహిత నపహరించుటెట్లు? నటింపుమని భావము. లోకుల కట్లు కనంబడఁజేయుము. దాన నీకు మేలు గలదు. సీత యెట కో పోవఁగాఁ గాముకుఁడగు నారాముఁడు జీవితమును వద లును. మృతినొందునని సామాన్యార్థము. జీవిత మనఁగాఁ బ్రాణము. ప్రాణాధిదేవత వాయువు. వాయువును వదలు నఁగా వాయుపుత్త్రుని బంపునని భావము. లక్షణచే నీయ ర్థము సిద్ధింపఁగలదు. సీతలేక రాముఁ డారూపమున నుండఁ డనియుఁ జెప్పవచ్చును. సారమేమనఁగాఁ బ్రకృతివిశిష్టుఁడైన

చో దూపవంతుఁడగును. తద్విరహితుఁడైన నిర్వికారుఁ డగు ననియేకదా. కనుక సీతం గొనిపోయిన నామెంగూడి యాయ నయు నీకు దక్కునని యర్థము తేలెడిని అకంపనుఁ డింతయుఁ దెలిసిచెప్పెనని నాయూహకాదు. వానినోటఁ గర్మవశమున వెడలినమాట లిట్టియర్థమున కవకాశము గల్గించునని మన మూహింపఁదగు. దాన దోషమేమియు లేదు.

"ఆలోచయత తద్వాక్యం రావణో రాక్షసాధిపః,
చింతయిత్వా మహాబాహురకంపనమువాచ హ." 3.

అని మూలము. "గహనా కర్మణో గతిః" అను భగవద్వాక్యము సార్థకమే యగునుగాని యన్యథా యేలయగును. అకంపనుని మాటలు రావణునకు రుచించెను. చాలసేపాలోచించెను. త్రేతాయుగమున శ్రీరామనామమున భగవంతుఁ డవతరించును. నిన్ను వధించును. అని సనత్కుమారుఁడు చెప్పిన వాక్యము మదికిం దోఁచెను. కనుక రామునిచేఁ దావధింపఁ బడుదునని యెంచెను. దానినే కోరువాఁడు కావున నాదూత వాక్యముల నామోదించెను.

"ఏతదర్థం మహాబాహో రావణేన దురాత్మనా,
సుతా జనకరాజస్య హృతా రామ మహామతే,
లంకామానీయ యత్నేన మాతేవ పరిరక్షితా,"

అని యగస్త్యముని రామునకు నుత్తరకాండమునఁ దెల్పును. దీనింబట్టి రావణాసురుఁడు తనకు భగవంతునిచే మృతిగలుగ వలయునని కోరుచుండెననియుఁ దదనుగుణముగా నకంపనుఁడు తెల్పినమాట యతనికి రుచించెననియు మన మిట గ్రహింప

వలయును. "బుద్ధిః కర్మానుసారిణీ" అనుసూక్తి యందలి తెలిసింగి నదియే కదా.

"కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః,
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి."

అనుగీతావాక్యమురీతి మహాజ్ఞానులుకూడఁ గర్మాధీనులై తరించిరి. సామాన్యులు కర్మాధీనులు కాక తద్విరుద్ధముగాఁ బ్రవర్తింపఁగలరనుట పాటింపరానిమాట. అకంపనుఁడు పల్కిన మాటలు వానిని రావణుఁ డంగీకరించుట యను నీభాగము మనకుఁ గర్మమునకు సర్వము వశమే యని తెలుపుచున్నది. కర్మముల నాచరింపక భగవంతుని సేవించినఁ దరింతు మను మధ్యవైష్ణవులమాటలు స్వార్థలాభమును గోరినవని మన మెఱుంగవలయుఁగదా.

"అర్థోపహితయా వాచా మారీచో వాక్యమబ్రవీత్. 38
కచ్చిత్సుకుశలం రాజన్ లోకానాం రాక్షసేశ్వర,
ఆశంకే నాథ జానే త్వం యతస్తూర్ణమిహాగతః." 39

అని మూలము. రావణాగమనమున మారీచున కెద్దియో యపమృత్యువు కలుగునని తోఁచెను. కాననే యతఁడు తన మాటలలో నెంతయో విశేషార్థ మిమిడియుండునట్లు పలికెను. ఏలయనఁగా మారీచునకు మృత్యు వాసన్నమగుచున్నది. తలవనితలంపుగా రావణుఁడు తనయున్నతావున కరుదెంచెను. ఆతనిం జూడఁగనే యేదోకార్యము నావలనఁ గాఁదగినది యుండియే వచ్చియుండునని యూహించెను. రాక్షసరాజా! మనజాతికిం గుశలమా? నీవిట్లు తటాలున వచ్చుటంజేసి యద్దాని ననుమానించెదను. అని మారీచుఁ డనియెను. దీనిని

బట్టి యాతనిమనస్సు తత్తఱపాటొందెనని మన మూహింప వలయును. ఆసన్నమృతిగలవానిలక్షణములలో నిది యొకటి. మార్గవశమున బాంధవము ననుసరించి యతఁడు వచ్చెనని యూహింపఁగూడదా. అట్లూహింపలేదు. రాక్షసులకుం గుశలమా యని యడిగెను. అందఱకు మృతిని గల్పించు ప్రయత్న మేదో రానున్నదని యతఁ డూహించెనని మన మెఱుంగ వచ్చునుగదా.

"అరక్షో మే హతస్తాత రామేణాక్లిష్టకర్మణా,
జనస్థానమవధ్యం తత్సర్వం యుధి నిపాతితం. ४०
తస్య మే కురు సాచివ్యం తస్య భార్యాపహారణే."

అనునిది రావణవాక్యము. తమబంధువులనెల్లరఁ జంపె నన్న కోపమున మండుచున్నహృదయముగల రాక్షసుఁడు 'అక్లిష్ట కర్మణా రామేణ' అని పలికెను ఎవరికిఁ గష్టమును గలిగింపని కార్యములు చేయురాముఁడు. అనికదా యర్థము. ఈమాట ఏల వెలువరించెను? సనత్కుమారోపదేశమున రామావతార మున కెదురుచూచుచుండువాఁడని యీమాటలంబట్టి తేలెడిఁ గదా. "అవధ్యం జనస్థానం సర్వం యుధి నిపాతితమ్" అని యెను. ఎవ్వారికిఁగాని వధింపరానిదానవుల వధించి జనస్థాన మును బాడుచేసెననఁగా భావమేమి? అక్లిష్టకర్ముఁడగురాముఁడు భగవంతుఁడగునుగాని సామాన్యుఁడు కాఁడని యాతని యాశయముకదా. దీనిచే నతనిమూలమున మృతిని గోరియే యీ యకార్యమునకుఁ గడంగెనని మన మెన్నవలయును.

"సీతామిహానయస్వేతి కో బ్రవీతి బ్రవీహి మే,
రక్షోలోకస్య సర్వస్య కశ్శృంగం ఛేత్తుమర్హతి. ४३

ప్రోత్సాహయతి కశ్చిత్త్వాం స హి శత్రురసంశయః,"

అని మూలము. ఇది మారీచవచనము. జ్ఞానశూన్యుఁడయ్యు నతఁడు రామునిశక్తి స్వానుభవమున నెఱింగినవాఁడు కావున హిత ముపదేశించుచున్నాఁడు. ఎవ్వఁడు నీ కీయుప దేశము చేసెనో వాఁడు రాక్షసులశిరస్సుల ఛేదింపఁగోరిన వాఁడు. ఆతఁడే నీకు శత్రువు. అనఁగా రామున కపకారము చేయఁబూనినవాఁడు బ్రదుకఁడనికదా భావము. రాక్షసు లలోఁగూడ శ్రీరామునకుఁ గలశక్తి నెఱింగినవారు కలరు. కాని వారెల్లరుఁ గర్మబద్ధులయి బుద్ధిపూర్వకముగాఁ జావ నెంచియే యపకార మొనరించిరి. దీనిచే శ్రీరాముని సర్వేశ్వ రత్వము స్పష్టమగుచున్నది.

"ప్రసీద లంకేశ్వర రాక్షసేంద్ర లంకాం ప్రసన్నో భవ సాధు గచ్ఛ,
త్వం స్వేషు దారేషు రమస్వ నిత్యం రామస్సభార్యో రమతాం వనేషు."

అనునది మారీచోపదేశసారము. 'లంకేశ్వర రాక్షసేంద్ర' యనునవి సాభిప్రాయములు. లంకేశ్వరా! రాక్షసేంద్రా! ప్రసన్నుఁడవు కమ్ము. అనఁగా నీవు కుటిలబుద్ధివైతివేని లంకకు రాక్షసులకు సిరితొలంగుననికదా భావము. 'ప్రసన్నో భవ' అనఁగా నిర్మలాంతఃకరణుఁడవు కమ్మా. అనఁగా శ్రీరాముని తత్త్వ మెఱుంగుము. కృతకృత్యుఁడ వగుదువు. నీపత్నుల యందే ప్రీతిగలవాఁడవుకమ్ము. నిత్యమ్మనునది సాభిప్రాయము. కాల మెంతయో లేదు. సర్వకాలము భార్యలంగూడియుం డుము. ఆకాంక్షలం దీర్చుకొమ్ము. అనునర్థము సూచింపఁ బడును. ఈజన్మమున భార్యలంగూడి చాలకాల ముండఁ జాలవు. కాన నితరచింతల మానుమని భావము. మహాకవి

వాల్మీకి మారీచునినోటంగూడ నీమాటను జెప్పించి కృత కృత్యుండయ్యెను. "సభార్యస్సః రామః వనేషు రమతామ్" శ్రీరాముఁడు భార్యంగూడి వనముల విహరించుఁగాక. అని మారీచుఁ డనియెను. రామభార్యాపహరణప్రయత్నము మానుమనునది సామాన్యము. శ్రీరాముఁడు భార్యంగూడియే యుండును. ఆమె నెడఁబాసియుండు టసంభవము. ఆనందమున నుండుటయే యామహనీయుని నైజము. సీతాపహరణాదులు మిథ్యలనియు శ్రీరామునిదుఃఖము నటనమనియు సూచితము. ఇట్లు మారీచుఁడు హితముపదేశించి సాగనంపెను. మారీచుని మృతి కించుక యవకాశము కలదుగాన రావణుఁ డాతని మాటల నాలకించి వెనుకకు మరలెనని మన మూహింపవల యును. అకంపనునిలంకాగమనము రావణుఁడు వచ్చి మారీ చుని పలుకులవిని మరలి లంక కరుగుట యధ్యాత్మరామాయ ణమునఁ గానరాదు ఇఁకఁ దరువాతికథను బఠింతము.

## శూర్పణఖ లంకకుం బోవుట.

* అంతట శూర్పణఖ యొక్కఁడే రాముఁడు పదునాల్గు వేలరాక్షసుల ఖరాదులం దునుముటఁ గన్నులారఁ జూచి మహాధ్వనిచేయుచు రాముని పరాక్రమమునకు నోర్వఁజాలక లంకకుం బోయెను. అత్తఱి విమానముపై మంత్రులంగూడి రావణుఁడు కూరుచుండియుండెను. మహావైభవమున నతఁ డుండఁగా మహాపరాక్రమశాలియై దేవాసురులకు జయింప నలవిగాక సకలాభరణభూషితాంగుఁడై యుండెను. పరస్త్రీ హరణాదులయం దాఱితేఱినవాఁడు. ఘోరతప మాచరించి

* ఇయ్యది ముప్పదిరెండవసర్గమునఁగల కథాభాగము.

బ్రహ్మను మెప్పించి మనుజులవలనఁ దప్పఁ దక్కినవారివలన మృతిలేకయుండ వరముల నందెను. దేవతాప్రీతికరములగు యజ్ఞములు సాగకుండఁ జేయువాఁడు. ఎట్టిపాపకర్మములకుఁ గాని వెనుదీయనివాఁడు. అట్టి తనతోఁడఁబుట్టువును శూర్పణఖ చూచి లోకసంహారము చేయఁబూనిన మృత్యువుంబోలి యుండఁగా దగ్గరకుఁ బోయి భయమున నవయవములు చెదరి పోవుచుండఁగా నిట్లు పలుకరించెను. ఎల్లలోకములయందు నేభీతియు లేక చరించు నాశూర్పణఖ లక్ష్మణుఁడు తన్ను విరూపము గలదానిం జేయఁగా దిక్కులేనిదై పోయి వినువార లకు భయముగలుగునట్లుగా నిట్లు పలికెను.

మహామతులారా! ఈభాగమున విశేషములు లేవని వదలరాదు.

"విష్ణుచక్రనిపాతైశ్చ శతశో దేవసంయుగే,
అన్యైశ్శస్త్రప్రహారైశ్చ మహాయుద్ధేషు తాడితం." ౧౦

అని మూలము. ఇంతదనుక విష్ణువుతో రావణుఁడు యుద్ధము చేసినజాడ గానరాదు రావణుఁడు స్వర్గమును ముట్టడింపఁగా నింద్రుఁడు విష్ణుమూర్తిం గానఁబోయి,

"అపి చక్రసహాయస్త్వం యోత్స్యసే రావణం ప్రభో. ౧౩
ఏవముక్తస్స శక్రేణ దేవో నారాయణః ప్రభుః,
అబ్రవీన్న పరిత్రాసః కార్యస్తే శ్రూయతాం చ మే. ౧౪
న తావదేష దుర్వృత్తశ్శక్యో జేతుం సురాసురైః,
హంతుం యుద్ధే సమాసాద్య వరదానేన దుర్జయః. ౧౫
సర్వథా తు మహత్కర్మ కరిష్యతి బలోత్కటః,
రాక్షసః పుత్రసహితో దృష్టమేతన్నిసర్గతః. ౧౬
యత్తు మాం త్వమభాషిష్ఠ యుధ్యస్వేతి సురేశ్వర,

నాహం తం ప్రతియోత్స్యామి రావణం రాక్షసం యుధి. ౧౭
నాహత్వా సమరే శత్రుం విష్ణుః ప్రతినివర్తతే,
దుర్లభశ్చైవ కామోఽద్య వరగుప్తాద్ధి రావణాత్. ౧౮
ప్రతిజానామి దేవేంద్ర త్వత్సమక్షం శతక్రతో,
భవితాస్మి యథాస్యాహం రక్షసో మృత్యుకారణం. ౧౯
అహమేవ నిహంతాస్మి రావణం ససుతం యుధి,
దేవతాస్తోషయిష్యామి జ్ఞాత్వా కాలముపస్థితం." ౨౦

ఉత్తరకాండము. ౨౭ సర్గము.

తోడుకమ్మని వేఁడఁగా నిపుడు పోరి జయింప శక్యము కాదనియు భావ్యవతారమున వానిం బొలియింతుననియుఁ జెప్పి మెల్లఁగా నతని సాగనంపెను. కావున నిచోఁగలవిష్ణు శబ్దమునకు వేఱొకయర్థము గ్రహింపవలయును. దేవతలలో నాదిత్యులనుతెగవారు పండ్రెండుగురు కలరు. ఇంద్ర ధాతృ పర్జన్య త్వష్టృ పూషార్యమ భగవివస్వద్విష్ణ్వంశు మద్వరుణ మిత్రులని వారిపేరులు ఇంద్రునింగూడి వారు రావణునితో యుద్ధముచేసిరి విష్ణుశబ్దమునకు వాయువుకూడ నర్థమే. సప్త మరున్నాయకులు నతనితోఁ బోరాడిరి. కావున నిట విష్ణు చక్రమునకు మరుదాదిత్యుల చక్రములప్రేటులు పెక్కు సారులఁ బడసినవాఁడని యర్థము చెప్పవలయును.

"తక్షకస్య ప్రియాం భార్యాం పరాజిత్య జహార యః,
మంత్రైరభిష్టుతం పుణ్యమధ్వరేషు ద్విజాతిభిః. ౧౯
హావిర్ధానేషు యస్సోమముపహంతి మహాబలః.
ఆప్తయజ్ఞహరం క్రూరం బ్రహ్మఘ్నం దుష్టచారిణం. ౨౦
కర్కశం నిరనుక్రోశం ప్రజానామహితే రతం,

రావణం సర్వభూతానాం సర్వలోకభయావహం." ౨౧

అని మూలము.

"అకుర్వన్ విహితం కర్మ నిందితం చ సమాచరన్,
ప్రసక్తశ్చేంద్రియార్థేషు ప్రాయశ్చిత్తీయతే నరః. ౪౪
ఇహ దుశ్చరితైః కేచిత్కేచిత్పూర్వకృతైస్తథా,
ప్రాప్నువంతి దురాత్మానో నరా రూపవిపర్యయం." ౪౮
మను. ౧౧ అధ్యా.

అను నీమనుస్మృతివాక్యముల ననుసరించి రావణుఁడు యజ్ఞములఁ బాడుచేయుట పరభార్యల నపహరించుట లోనగు మహాపాతకముల నొనరించినందునఁ దత్ఫలము ననుభవించు సమయము రాఁగా శూర్పణఖ యరుదెంచెను. రావణుని దుష్కర్మజాలములు పురికొలుపఁగా నాశూర్పణఖవచ్చెననియు, నామాటలకు నతఁ డంగీకరించెననియు మన మూహింపవలయును. పాపములు త్రివిధములు. మనోవాక్కాయకృతములు. వానికన్నింటికి మనస్సే కారణము.

"తస్యేహ త్రివిధస్యాపి త్ర్యధిష్ఠానస్య దేహినః,
దశలక్షణయుక్తస్య మనోవిద్యాత్ప్రవర్తకమ్. ౪
పరద్రవ్యేష్వభిధ్యానం మనసానిష్టచింతనం,
వితథాభినివేశశ్చ త్రివిధం కర్మ మానసం. ౫
పారుష్యమనృతం చైవ పైశున్యం చాపి సర్వశః,
అసంబద్ధప్రలాపశ్చ వాఙ్మయం స్యాచ్చతుర్విధం. ౬
అదత్తానాముపాదానం హింసా చైవావిధానతః,
పరదారోపసేవా చ శారీరం త్రివిధం స్మృతం. ౭
మానసం మనసైవాయముపభుంక్తే శుభాశుభం,

వాచావాచాకృతం కర్మ కాయేనైవ చ కాయికం." ౮

మను. ౧౨ అధ్యా.

అను నీమనుస్మృతి వాక్యములంబట్టి రావణుఁ డీత్రివిధ దుష్కర్మముల నాచరించినందున నాయాయిఫలముల మనో వాగ్దేహములచే ననుభవింపఁదగియున్నాఁడు. వాని ననుభవించుకాల మాసన్నమయ్యెను. దానికిం గారణభూతురాలుగా శూర్పణఖ వచ్చెను. కావున "ప్రాయస్సమాపన్న విపత్తికాలే ధియోఽపి పుంసాం మలినా భవంతి" అన్నసూక్తి సార్థకమే యని మన మెఱుంగవలయును. పాపకర్మఫలానుభవకాలము రాఁగాఁ బుణ్యకర్మములు వానిని మరలింపఁజాలవనియు మనము తెలిసికొనవలయును. ఇన్నివరములుగల రావణుఁడే దుష్కర్మఫలముల ననుభవింపనుండ మన మెంతవార మనుబుద్ధి గలిగి మనము మెలంగవలయు ననుభావము నీభాగము బోధించుచున్నది. తరువాతికథను బఠింతము.

## రావణుని శూర్పణఖ దూఱుట

*శూర్పణఖ విరూపిత యగుటచే దుఃఖితయగుచు నన్నంగని పట్టరానికోపమునఁ బరుషభాషణముల నిట్లనియె. రావణా! గర్వమున నెదురులేక కోరినసుఖముల నొందుచున్నాఁడవు. కాని యిప్పుడు రానున్నమహాభయము నెఱుంగలేకున్నాఁడవు. చారులమూలమున దీని నీవే తెలిసికొనవలసినదే. గర్వివి కాన నాపని చేయకున్నాఁడవు. విషయభోగపరుఁడగుచుఁ దోఁచినట్లు వర్తించురాజును బ్రజలు శ్మశానాగ్నినిగాఁ దలంతురు. రవంతయు మన్నింపరు. ఏరాజు

* ఇయ్యది ముప్పదిమూఁడవసర్గమునఁ గలదు.

తగినకాలమునఁ దనకార్యములఁ దానే యొనరింపకుండునో యతఁడు వానిం బోఁగొట్టుకొనుటయేగాక రాజ్యమును గూడఁ బోఁగొట్టుకొని తాఁగూడ నశించును. ఏటియందుండి తనయందు మెలంగువానికి లోకునగాక కనఁబడకయుండు నడుసులోనికి నేనుఁగులు పోయినఁ దగులుకొందు మన్నభయమున దూరముననే నిలుచునట్లు స్వపరరాజ్యవృత్తాంతములపై గూఢచారుల నియోగింపక యర్హకాలమునఁ బ్రజలకు దర్శనమీయక స్త్రీలకు లోఁబడి స్వబుద్ధిపోవ నితరులమాటలకు లోఁబడియుండురాజును బ్రజలు వానిసంగతిని దాముఁ జెడుదుమని వానిం ద్యజింతురు. స్త్రీపరతంత్రులగుచుఁ జక్కని రీతి రాజ్యము నేలనిరాజులు వృద్ధిఁగాంచుచున్నను సముద్రజలనిమగ్నపర్వతములంబోలి వెలుంగరు. దేవగంధర్వాదులు సర్వదా నీకపకారముచేయనే పూనియున్నవారు. నీవన్నచో చారులమూలమున విషయములం దెలిసికొనక యింద్రియసుఖరతి నున్నాఁడవు. అట్టి నీవు సురలతోఁ బగఁబెట్టుకొని యెట్లు రాజ్యము నిల్పుకొనఁగలవు? నీవు కడుంగడుం బాలస్వభావముగలవాఁడవు. వివేకవిహీనుఁడవు. అల్పబుద్ధివి. ముఖ్యముగా దేని నెఱుంగవలయునో దానినైనఁ దెలిసికొనకున్నాఁడవుకదా! నీవెట్టు లింకఁ బ్రభువుగా నుండఁగలుగుదువు? జయముగలవారలలో నీవే మొదటివాఁడవు. చారులను గోశమును నీతిని దమవశమున నుంచుకొననిరాజులు వారు సామాన్యమనుజులతో సమానులే. చారచక్షువులుగదా రాజులు. నీవట్లుగాక జనస్థానవార్తల నెఱుంగకయున్నాఁడవే. క్రూరకర్ములగు చతుర్దశసహస్రదనుజవీరులు ఖరదూషణులు త్రిశిరుఁడు నొక్కనిచేతనే తెగిరి. ఆరాముఁడు ఋషుల కభయ

దానము చేసినవాఁడు. దండకారణ్యమంతయు మునులకు సుఖస్థానముగఁ గావించినాఁడు నీవు లుబ్ధుఁడవగుచుఁ జారుల వదలుకొంటివి. స్త్రీలకు లోఁబడితివి. కాన నీరాజ్యమునఁ గల్గినమహాభయమునైనఁ దెలియకయున్నాఁడవు. క్రూరుఁడు, కార్యమునకుఁ దగినపసదన మీయనివాఁడు, ప్రమత్తుఁడు, గర్వి, రహస్యముగా నప్రియము గావించువాఁడు నయియుండు రాజునకుఁ గష్టకాలమున మంత్రులు లోనగువా రెవ్వారును దోడ్పడరు. మఱియు నిట్టివేయగు నవగుణములుగలరాజును వానిప్రజలే వధింతురు. జాగరూకుఁడై యుండనిరాజు రాజ్యభ్రష్టుఁడగు. తృణప్రాయునిగా నాతని నెల్లరుం జూతురు. ఎండినకొయ్యలచేతను మట్టిగడ్డలచేతను ధూళిచేత నేదే నొకపని యగును. కాని పదభ్రష్టువగురాజులమూలమున నేకార్యము కాఁజాలదు. కట్టివిడిచినగుడ్డయు, ధరించినందున నలంగినపూవులుఁ బనికిరానిచందమున రాజ్యభ్రష్టుఁడగురాజు ధీరుఁడైనను బనికిరానివాఁడే యగును. ప్రమాదముం బొరయక జితేంద్రియుఁడై కృతజ్ఞుఁడై ధర్మశీలుఁడై యుండురాజు చాల కాలము సుఖవృద్ధిగలిగి రాజ్యము నేలును. మాంసనేత్రములచే నిదురించుచున్నను నీతినేత్రమున జాగరూకుఁడై యుండి కోపానుగ్రహముల వెల్లడించుచు నుండువాఁడు సర్వజనపూజితుండగును.

ఓరావణా! జనస్థానరాక్షసవినాశ మెఱుంగకున్నాఁడవే. దుర్బుద్ధివనియు రాజయోగ్యగుణహీనుఁడవనియు దీని మూలమున స్పష్టము కాలేదా? దేశకాలపాత్రాపాత్రముల నెఱుంగఁజాలనివాఁడవు. కాన నీవు త్వరగ రాజ్యమును బోఁగొట్టుకొని దుఃఖము లనుభవింపఁగలవు. అని శూర్పణఖ

పలుకఁగా ధనబలగర్వమున విఱ్ఱవీఁగునా రావణుఁడు శూర్పణఖ స్పష్టముగాఁ దెలిపిన యాదోషముల నన్నింటిని స్వబుద్ధి నాలోచించుచు నూరకుండెను.

మహాశయులారా! ఈభాగమునందు వాల్మీకిమహాకవి శూర్పణఖావాక్యములమూలమున రాజధర్మములఁ గొన్నింటిఁ దెల్పెను. సామాన్యదృష్టిం బరిశీలింపఁగా నిది యసంగతముగనే తోఁచును. ముక్కుచెవులు మూలముట్టుగాఁ దెగిపోవఁగాఁ దనబంధువులెల్లరు నశింపఁగా దుఃఖమున మునింగి నిరంతరము యథేచ్ఛముగా విహరించినశూర్పణఖ యింత యోర్పుగలిగి యిన్నిరాజనీతులు తెలుపఁబూనె నన్న నవ్వు రాకమానదు. కాని సమయోచితముగా సకలధర్మములు తెలుపుటయే రామాయణకావ్యకర్తృతాత్పర్యము. శూర్పణఖ యిన్నినీతులు నేర్చెనా యన్నప్రశ్నము రాఁగూడదు. ఆమె నోటఁ జెప్పించినవి రాజనీతులా కావా యనునదియే విచారింపఁదగినది. ఈసమయ మాధర్మముల నుపదేశింపఁ దగినది యా కాదా యన్నఁ దగినదే యనవలయుఁగదా.

"ప్రమత్తః కామభోగేషు స్వైరవృత్తో నిరంకుశః,
సముత్పన్నం భయం ఘోరం బోద్ధవ్యం నావబుధ్యసే. ౨
సక్తం గ్రామ్యేషు భోగేషు కామవృత్తం మహీపతిం,
లుబ్ధం న బహుమన్యంతే శ్మశానాగ్నిమివ ప్రజాః. 3
స్వయం కార్యాణి యః కాలే నానుతిష్ఠతి పార్థివః,
స తు వై సహ రాజ్యేన తైశ్చ కార్యైర్వినశ్యతి. ४
అయుక్తచారం దుర్దర్శమస్వాధీనం నరాధిపం,
వర్జయంతి నరా దూరాన్నదీపంకమివ ద్విపాః." ౫

అని మూలము.

"ఇం|ద్రియాణాం జయే యోగం సమాతిష్ఠేద్దివానిశం,
జితేంద్రియో హి శక్నోతి వశే స్థాపయితుం ప్రజాః. ౪౪
కామజేషు ప్రసక్తో హి వ్యసనేషు మహీపతిః,
వియుజ్యతేఽర్థధర్మాభ్యాం క్రోధజేష్వాత్మనైవ తు. ౪౬
మృగయాఽక్షో దివాస్వాపః పరివాదస్స్త్రియో మదః,
తౌర్యత్రికం వృథాట్యా చ కామజో దశకో గణః. ౪౭
పైశున్యం సాహసం ద్రోహ ఈర్ష్యాసూయార్థదూషణం,
వాగ్దండజం చ పారుష్యం క్రోధజోఽపి గణోఽష్టకః. ౪౮
ద్వయోరప్యేతయోర్మూలం యం సర్వే కవయో విదుః,
తం యత్నేన జయేల్లోభం తజ్జావేతావుభౌ గణౌ. ౪౯
దూతం చైవ ప్రకుర్వీత సర్వశాస్త్రవిశారదం,
ఇంగితాకారచేష్టజ్ఞం శుచిం దక్షం కులోద్గతం. ౬౩
సవిద్యాదస్యకృత్యేషు నిగూఢేంగితచేష్టితైః,
ఆకారమింగితం చేష్టాం భృత్యేషు చ చికీర్షితం. ౬౭
బుధ్వా చ సర్వం తత్త్వేన పరరాజచికీర్షితం,
తథా ప్రయత్నమాతిష్ఠేద్యథాత్మానం న పీడయేత్." ౬౮

మను. ౭ అధ్యా.

అను నీమనుస్మృతి వాక్యములయర్థమే రామాయణము నందుఁ గలదు. రాజు దేహసుఖమున నాసక్తుఁడుగ నుండ రాదనియు, స్వేచ్ఛాప్రవర్తకుఁడు కారాదనియుఁ దన్ను దండించు వారు లేరని విఱ్ఱవీఁగరాదనియు, సన్మానింపఁదగినవారి నాద రింపక ధనముఁ గూడఁబెట్టరాదనియు, నట్టులుండు రాజును బ్రజ లాదరింపరనియుఁ దాత్పర్యము. సకాలమునఁ బని నాచ రింపని రాజు రాజ్యమునే పోఁగొట్టుకొనును.

"ఆదానస్య ప్రదానస్య కర్తవ్యస్య చ కర్మణః,
క్షిప్రమక్రియమాణస్య కాలః పిబతి సంపదః."
అను సూక్తి రామాయణార్థమునే బోధించును.

"ప్రేషయేచ్చ తతశ్చారా న్స్వేష్వన్యేషు చ సాదరాన్"

అని యాజ్ఞవల్క్యస్మృతి తెల్పుచున్నది. "రాజానశ్చార చక్షుషః" అన్నసూక్తి ప్రసిద్ధమేకదా. ఈనీతిసార మేమనఁగా రాజు లుబ్ధు వనిపించుకొనక జితేంద్రియుఁడై స్త్రీసుఖ నిమగ్నుఁడుకాక దేశవృత్తాంతముల నరయుచుఁ జేయఁదగు పనుల నాలసింపకచేయుచు నప్రమత్తుఁడై యుండవలయు ననియే. రావణా! నీవట్లుగాక స్త్రీలోలుఁడవై సర్వకాలము గ్రామ్యసుఖములయందే గడపుచు రానున్నభయము నెఱుఁగఁ జాలకున్నాఁడవని హెచ్చరించెను. దీనిచే భవిష్యల్లంకా భయము సూచింపఁబడినది. ఇందు జితేంద్రియత్వము రాజులకుంగూడఁ బ్రధానమని తెల్పఁబడినది. మనుస్మృతియు నీయర్థమునే వెల్లడించినది. దీనిమూలమున యోగాభ్యాసము ప్రధానమనుభావము తేలెడిని. జితేంద్రియుఁడు కానివాఁడే కార్యమును జేయఁజాలఁడని సారము తేలుచున్నది. ఇంద్రియజయ ముత్తమోత్తమమని మన మెఱుంగవలయును.

"యే న రక్షంతి విషయమస్వాధీనా నరాధిపాః,
తే న వృద్ధ్యా ప్రకాశంతే గిరయస్సాగరే యథా." ౬

అని మూలము. స్త్రీలకు లోఁబడి చక్కఁగా దేశమును బాలింపనిరాజులు సంపద్యుక్తులైనను సాగరమున మునింగిన పర్వతములవలెఁ బ్రకాశింపరనునది ప్రాతీతికార్థము. బుద్ధినిజయింపక యేరాజు లింద్రియార్థమును రక్షించుకొనరో వారెంతగా

శాస్త్రాదులయందుఁ గృషి చేసినను జ్ఞానప్రసిద్ధులు కారను నదియే యిట విశేషార్థముగా మనము గ్రహింపవలయును. ఇందుఁ బర్వతము లెంతగొప్పవైనను సాగర నిమగ్నములై ప్రకాశింపనట్లని యుపమానము చెప్పఁబడినది. దీనిచే విషయ సుఖము శాస్త్రజ్ఞాన మెంతగొప్పదిగానున్నను లోఁగొనునని తేలెడిని "బలవా నింద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి" అనుసూక్తి యేనాఁటికి వ్యర్థము కాదుకదా. విషయసుఖము నకు లోఁబడక దాని నియమించుచుండవలయునని మన మెఱుంగవలయును.

"ఆత్మవద్భిర్విగృహ్యాత్వం దేవగంధర్వదానవైః,
అయుక్తచారశ్చపలః కథం రాజా భవిష్యసి.            ౬
త్వం తు బాలస్వభావశ్చ బుద్ధిహీనశ్చ రాక్షస,
జ్ఞాతవ్యం తు న జానీషే కథం రాజా భవిష్యసి."       ౭

అని మూలము. "ఆత్మవద్భిః=ప్రశస్తధైర్యైః"అనియు "యత్న వద్భిః" అనియు వ్యాఖ్యాత లర్థము వ్రాసిరి. దుష్కార్య రతుఁడై ప్రమత్తుఁడగువానిని బంధువులు కూడ వదలుదు రనున్యాయ మియ్యది బోధించును. "బాలస్యేవ స్వభావో వివేకశూన్యత్వం యస్య" అని వ్యాఖ్య. 'గ్రహణధారణపటు ర్బాలః' అని తర్కమతము. బాలస్వభావమనఁగా నిట వివేక శూన్యత్వమే యర్థము. 'వివేకహేతుర్బుద్ధిః' అని యర్థము. అట్టి నీవు తెలియఁదగినవిషయమును దెలియఁజాలకున్నాఁ డవే నీవెట్లు రాజుగా నుండఁగలవని శూర్పణఖ యధిక్షే పించెను. రాజుగా నుండువాఁ డెంతయోగ్యుఁడుగ నుండ వలయునో దీనిమూలమున స్పష్టముకాఁగలదు.

"ఇంద్రియాణి పరాణ్యాహురింద్రియేభ్యః పరం మనః,
మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః."

అనుగీతాశాస్త్ర ప్రకారము బుద్ధిమంతుఁడు కావలయును. ఇందు బుద్ధి యనఁగా "బుద్ధి ర్నిశ్చయాత్మికా" అని శంకరాచార్యులు వ్రాసిరి. కాన నట్టిబుద్ధిమంతుఁడు కావలయునని భావము. దీనింబట్టి రాజు ఋషికంటె నధికుఁడని తేలెడిని. ఇన్నివిధములఁ బరిజ్ఞానము కలవాఁడుగదా రాజుగ నుండవలయును. కనుకనే

"బాలోఽపి నావమంతవ్యో మనుష్య ఇతి భూమిపః,
మహతీ దేవతా హ్యేషా నరరూపేణ తిష్ఠతి."

అని మనుస్మృతి బోధించుచున్నది. ఇట్టిరాజు పాలించుదేశము రాజన్వంత మనంబడును. ధర్మపాలనము ప్రధానకృత్యమనుటయే రాజధర్మసారము.

"అప్రమత్తశ్చ యో రాజా సర్వజ్ఞో విజితేంద్రియః,
కృతజ్ఞో ధర్మశీలశ్చ స రాజా తిష్ఠతే చిరం." ౨౦

అని మూలము. ఈశ్లోకమునఁ జెప్పఁబడినగుణములే మహాత్మునికిని జెప్పఁబడినవి. వీరల కిరువురకు సర్వజ్ఞత్వ జితేంద్రియత్వ కృతజ్ఞత్వ ధర్మశీలత్వములు సమానములు. అట్టిరాజే చిరకాలము నివసింపఁగలఁడు.

"ఇతి స్వదోషాన్ పరికీర్తితాం స్తయా సమీక్ష్య బుద్ధ్యా క్షణదాచరేశ్వరః,
ధనేన దర్పేణ బలేన చాన్వితో విచింతయామాస చిరం స రావణః."

అని మూలము. శూర్పణఖ ప్రమత్తుఁడై రాజధర్మముల వదలియుండుటచేఁ జెడగుచున్నాఁడని పరితాపపడి యన్నచిన్నతనమునుండి చేసినదోషముల వెలువరింపఁగా రావణుఁడు తన

బుద్ధిబలమున నన్నింటిని స్మరించి తత్కాలమునఁ దన్నుఁ గ్రమ్మి యున్న ధనదర్పబలములచేఁ జాలసే పాలోచించెను. ఏమని? సనత్కుమారుని హితోపదేశ మీ కాలమున ఫలింపనున్నదని. తాఁ బాపకార్యములను విశేషించి యొనరించుటయు భగవంతునిచే మృతిని గోరియే కావున నత్తఱి జరగినవిషయముల నెల్ల మరల మరల స్మరించెనని మన మూహింపవలయును. మృతిని గోరువారును గలరాయందు లేని యాతనిపుట్టుకకు హేతువగుశాపము మృతిమూలమునఁగాని పూర్వస్థితి రాఁ జాలదు కదా. కావున స్వకర్మములు ఫలింపనున్నవని యతఁ డెఱింగెననిభావము. ఈభాగమున నధ్యాత్మ రామాయణమున విశేషము లేవియు లేవు.

## శూర్పణఖ శ్రీరామాదులసౌందర్యాదుల వర్ణించి రావణుని సీత నపహరింపఁ బురికొలుపుట.

*దశకంఠుఁడు ఖరాదులు పొలియుట నాలకించి మహా కోపమునఁ దనతో నొడలు తెలియనంతయాగ్రహమునఁ బలుకు సోదరిం గని యిట్లనియె. రాముఁ డెవ్వఁడు? వానివీర్యాదు లెట్టివి? రూప మెట్లుండును? ఏపాటిపరాక్రమముగలవాఁడు? దుర్గమదండకాటవులకు వాఁడు రానేల? ఏయాయుధములచే రాక్షసులను ఖరాదివీరాగ్రేసరులం దునిమెను? అని ప్రశ్నింపఁగా నాశూర్పణఖ రామాదులరూపవిశేషములు లోకసు వానిని వినిపింపఁ దలంచి కోప మందులకుఁ దోడుపడఁగా నిట్లనియె. దశరథకుమారుఁడు సుమీ రాముఁడు. ఆజాను

---

* ఇది ముప్పదినాల్గవ సర్గమునఁ గలదు.

బాహుఁడు. విశాలాక్షుఁడు. జటావల్కలములం దాల్చి మన్మథునిమించిన యాకారము గలిగియున్నవాఁడు. ఇంద్ర చాపముం బురుడించు కోదండము నాకర్షించి యాశీవిషములం బోని నారసములవైచువాఁడు. ధనుస్సు నాకర్షించుట, బాణ మును సంధించుట, దానిని వైచుట కనఁబడదు. కాని యా యుద్ధమున నాబాణవర్షమున రక్కసులు చచ్చిపడుచుండుటయే నాకుఁ గనంబడియె. పదాతియగు నతఁ డొక్కఁడే సార్ధ ముహూర్తకాలమునఁ బదునాల్గువేలరక్కసుల నుక్కడంచి ఖరదూషణులం గూల్చెను. అంతియగాదు మునివరుల కభయ దానమిచ్చెను. మహాత్ముఁడుగాన స్త్రీవధమున కిష్టపడక నన్ను మాత్ర మవమానించి వదలఁగా నతిప్రయాసమున వచ్చితిని. రామునకు లక్ష్మణుఁడనుపేరుగల యనుజుఁడు కలఁడు. అన్ని విషయములయందు నన్నను బోలువాఁడు. ప్రేమాతిరేకమున నన్న సేవించుచుండును. పరాక్రమాదుల రామునకుఁ గుడి భుజముగా నుండును. ఆరామునకు ధర్మపత్ని యొకతుక కలదు. ఆమెయందము వర్ణనాతీతము. ప్రేమమునఁ బతికి హితమునే కావించుచుండును. ఆయమ దండకారణ్యదేవ తయో లేక యపరలక్ష్మియో యనఁదగి యొప్పును. ఉత్త మోత్తమ పురంధ్రులకు నుండఁదగులక్షణము లన్నియుఁ గొఱంతయనునదిలేక యామెయందు నెలకొనియున్నవి. ఆమె నామము సీత. విదేహదేశపురాజున కామె కూఁతురు. అట్టి సుందరాంగి యేజాతియందు నేలోకమునందును లేదు. ఆలింగనసౌఖ్య మొక్కసారియే నబ్బకయున్నను భార్యగా సీత యెవ్వనికి నుండునో యంతమాత్రముననే యతఁడు సమస్తలోకములయందును బరమసుఖజీవనముఁ బడయుఁ

గల్గును. ఆసీత భార్యగానుండ నంగీకరింపక పోయినను ఒక్కమా రెవ్వాని నాలింగనము చేసికొనునో వాఁడు దేవేంద్రునిమించి సుఖముగా బ్రదుకును. ఆసీత సుశీల. ఆమె శరీరము నేమని వర్ణింతును? ఎన్నిమాటలేల? ఆమెసౌందర్యము లోకాతీతము. అట్టికాంతామణి నీకుఁ దగినది. నీవు నామెకుఁ దగినభర్తవు. ఆమె యవయవసౌష్ఠవమును గాంచి నీకు భార్యగా నుండిన మేలని నేఁదలంచి యామెను దేఁబ్రయత్నించితిని. నే నాయత్నము సేయుచుండఁగా, క్రూరాత్ముఁడగు నాలక్ష్మణుఁడు నన్నిట్లు వికృతాకృతినిగాఁ గావించినాఁడు. ఆపూర్ణచంద్రబింబాననఁ గాంచితివేని అప్పుడే మన్మథాస్త్రములకు లక్ష్యమవగుదువు. ఆయుత్తమాంగన భార్యగాఁ గోరుదువేని యాయన్నదమ్ముల జయింప దక్షిణపాదమును ముందుపెట్టి మాటలాడుము. పరమఘాతుకుఁడై యాశ్రమములయందు నివసించురాముని వధించి వానిచేఁ జచ్చిన మనవారలకుఁ దృప్తిగావింపుము. పతి చావఁగా నామె యనాథయగును గాన నామెం దెచ్చుకొని సుఖముగఁ గాలముం బుచ్చుము. సౌమిత్రినికూడ వధించినఁగాని మన కార్యము సాగదు. నా యీమాటలు నీకు హితములగునేని సంశయింపక యీకార్యముఁ జేయుము నీకుఁ గలబలము నెఱింగి యాసీతను బలాత్కారముగఁ గొనితెచ్చుకొమ్ము. జనస్థానమును ధ్వంసముగావించినవార్త నాలకించియు ఖరాదులను వధించు టెఱింగియు నీకుఁ జేయవలసినకార్యము లివియని నిశ్చయించుకొనుము.

ఆర్యులారా! ఈభాగమునఁ గలవిశేషములఁ బరిశీలింతము. శూర్పణఖ రావణాసురుని ముక్తికి హేతువగును.

రావణునకుఁ గాలము సమీపించుచున్నది. దుష్కర్మఫలశేష మనుభవించి సత్కర్మఫల మనుభవింపవలయునుగదా. దానికిం బరికరములన్నియు సిద్ధములగుచున్నవి. అందుఁ బ్రేరకురాలు శూర్పణఖయే యగునట్లు కర్మ మాలోచించెను. అకంపనుఁడు తెలిపినపుడు రావణుఁడు ప్రయత్నించి మారీచునిహితము నాలకించి నివృత్తప్రయత్నుఁ డయ్యెను. ఏల? ప్రధానప్రేరకురాలు శూర్పణఖ. కాన నామెమూలమునఁ గాని యాకార్యము సాగరాదను కర్మసిద్ధాంతము వ్యర్థము కారాదుకదా. ఇప్పు డతఁడు కార్యమును సాధించుటకే శ్రద్ధగలవాఁడగును. ఎవ్వరి యుపదేశములు పనికిరానంతపట్టుదల యాతనికిం గలుగఁదగి యుండవలయును. ఆవిధమే యీభాగమునఁ గలదు. మహామతులారా! అకంపనుని మూలమునఁ దెల్లమైనవార్తను గూడఁ గ్రొత్తదానినిగా నాలకించి వాఁడెట్టు లామెను బ్రశ్నించెనో యారయుఁడు. విన్నదానియందుఁ గలవిశేషముల నడుగుటయే ప్రాయికముగా నెల్లర కలవాటుగాని క్రొత్తదాని వినఁగోరి ప్రశ్నించునట్లడుగుట యస్వాభావము. ఈవిషయ మీక్రింది మూలమునుబట్టి తేలును. బలవంతముగా నతనికర్మము పురికొలిపి వానిచే నాకార్యమును జేయింపఁ దలంచెను.

"యద్యహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి. ౫౯
స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్." ౬౦ అధ్యా. ౧౮

అను నీభగవద్గీతావాక్యము లివిషయమునే సిద్ధాంతము చేయుచున్నవి.

"కశ్చ రామః కథం వీర్యః కిం రూపం కిం పరాక్రమః. ౧
కిమర్థం దండకారణ్యం ప్రవిష్టస్సుదురాసదం. ౨
ఆయుధం కిం చ రామస్య నిహతా యేన రాక్షసాః,
ఖరశ్చ నిహతస్సంఖ్యే దూషణస్త్రిశిరా స్తథా." ౩

అని మూలము. ముందీవార్త వినినట్లు తెలిపిన సోదరి కాగ్రహాముకలుగునని యిట్లు ప్రశ్నించెననఁగూడదా యని కొంద అనవచ్చును. కాని యాధోరణి వేఱు. ఆయుద్దేశముకలవాఁడు సోదరిం గాంచినంతనే పౌరుషములు పలికి నేనాప్రయత్నము ననే యున్నాఁడనని పలుకవలసియుండును. కాని యిట్లు ప్రశ్నింపరాదు. ఈప్రశ్నప్రకార మాలోచించినంతనే యతని యజ్ఞానము తేటపడును ఇపుడు రావణుఁడు కింకర్తవ్యతా మూఢుఁడుగ నున్నవాఁడనవలయును. కర్మము బలవత్తరమనుట కింతకంటె నుదాహరణాంతరము లేమి కావలయును?" "కరిష్యస్యవశోఽపి తత్" అనుగీతావాక్య మెంతబాగున్నదో తెలియవచ్చెఁగదా.

"దీర్ఘబాహుర్విశాలాక్షశ్చీరకృష్ణాజినాంబరః,
కందర్పసమరూపశ్చ రామో దశరథాత్మజః, ౪
నాదదానం శరాన్ ఘోరాన్న ముంచంతం శిలీముఖాన్,
న కార్ముకం వికర్షంతం రామం పశ్యామి సంయుగే. ౫
హన్యమానం తు తత్సైన్యం పశ్యామి శరవృష్టిభిః,
ఇంద్రేణేవోత్తమం సస్యమాహతం త్వశ్మవృష్టిభిః." ౬

అని మూలము. బంధువుల నందఱిం దునుమాడిన రాముని దూషించి చెప్పుటకుబదులుగా నాతని వర్ణించుచున్నది. పరాక్రమమును వర్ణించి యట్టివాఁడుండఁగా నంతకంటెఁ బరాక్రమముగల నీవేల యూరకున్నాఁడవని హెచ్చరించుట యర్థము

కాని శ్రీరాముని సౌందర్యము వినుతించుటేల? ఇందలితత్త్వ మేమనఁగా శూర్పణఖ కాముకురాలై శ్రీరామునిం గాంచెను. "ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా" యన్నట్టు లామె కామము దృష్టిం బ్రవేశించి యాభగవంతునిసౌందర్యమునుమాత్రమే కోరునట్టు లొనరించెను. కనుకనే యామె రావణునకుఁ గామోద్దీపనమునే చేయంబూనెను. భక్తునిచిత్తవృత్తి ననుసరించి భగవంతుఁడు దర్శనమిచ్చును. మహాఘోరరూపముగ నుండుమహాకాళి భక్తునివాంఛ నెఱింగి వీణాధారిణియై కనంబడఁగాఁ గాళిదాసు,

"మాణిక్యవీణాముపలాలయంతీం మదాలసాం మంజులవాగ్విలాసాం,
మాహేంద్రనీలద్యుతికోమలాంగీం మాతంగకన్యాం మనసా స్మరామి."

అని వినుతించెను. దీనింబట్టి ప్రకృతిపూరుషు లరూపులు సర్వరూపులునని స్పష్టమగును. వారిరూపము భక్తునికర్మము ననుసరించియే యుండుననియుఁ దేలెడిని. ఈసిద్ధాంత మెఱింగినవాఁ డెవ్వఁడైన నొకదేవత నెట్లు దూషింపఁజాలును? ఈ తత్త్వ మెఱుంగనిమధ్యవైష్ణవుఁడే శంకరుని దూషించును. అట్టి మధ్యశైవుఁడే విష్ణువును దూషించును. వారిరువురు పాషండులే యనఁదగుదురు.

"మద్భక్తశ్శంకరద్వేషీ మద్ద్వేషీ శంకరప్రియః,
తావుభౌ నరకం యాతో యావచ్చంద్రదివాకరౌ."

అన్నసూక్తి తప్పదుకదా! 'విశాలక్షః కందర్పసమరూపశ్చ' అను నీవిశేషణము లాశూర్పణఖ యుపయోగింపనేల? తనకుఁగల కామమును మాత్రమే తీర్ప నాతనిం గోరెను. తుదకు శ్రీకృష్ణావతారమున నామనోరథమునే పడయం గల్గెను.

"యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః."

అను నీశ్రీకృష్ణవాక్యము తప్పునది కాదుకదా. శ్రీరాముఁడు ధనుస్సు నాకర్షించుట బాణములఁగూర్చుట వానిం బ్రయోగించుట నాకగపడలేదు. అని శూర్పణఖపలికెను. దీనిభావమేమి? రుద్రుఁడే వారిం జంపెను. శ్రీరాముఁ డూరక యుండెను. అనఁగా సారమేమి? శూర్పణఖ దృష్టికి శ్రీరాముని సుందరాకార మపుడు గోచరింపదయ్యెను. ఏల? తమోగుణప్రధానుఁడై యపుడు రుద్రరూపమున నతఁడుండెను. ఆరూపమానవుజాంగనకు నిష్టము కాదుకదా. స్వస్వకర్మనిహతులై దానవులు పడిరనియు హేతువుగా రాముఁడుండెననియు దీని నుండి తేలెడిసారము.

"మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్,"

అనుభగవదుక్తి కుదాహరణ మీభాగమేల కాకపోవును? "మయైవైతే నిహతాః పూర్వమేవ" అనఁగాఁ "దత్తత్కర్మరూపిణా మయా ఏతే పూర్వమేవ నిహతాః" అనియేకదా యర్థము. లేకున్న భగవంతుని నిర్లేపత్వ మూడిపోవును

"ఋషీణామభయం దత్తం కృతక్షేమాశ్చ దండకాః. ౧౦
ఏకా కథంచిన్ముక్తాహం పరిభూయ మహాత్మనా,
స్త్రీవధం శంకమానేన రామేణ విదితాత్మనా." ౧౧

అని మూలము. 'మహాత్మనా విదితాత్మనా' అను నీరెండువిశేషణములు శూర్పణఖ నోటినుండి రాఁదగినవియా? అంతటి మహోపకార మొనరించినభగవాని నీరీతిగా వర్ణించుటకుం గలకారణము పైన వ్రాసినదిగాక మఱి యేమి యుండును?

కాకవులు కొందఱు వాల్మీకి యుక్తాయుక్తపరిజ్ఞానశూన్యుఁడగునుగాన రహస్యార్థముల వెలిపుచ్చరాదనిరి. ఈవర్ణనము వారిగ్రుడ్లకు రామాయణమునఁ గనఁబడలేదు కాఁబోలు? బుద్ధిబలములేక యథార్థమును గ్రహింపఁజాలకపోయినవారముకదా యని మనలనే మనము దూషించుకొనవలయుఁగాని మహాకవియగువాల్మీకిని నిందింపవచ్చునా? భక్తులకభయదానము చేయుచుఁ దన్మూలమున దుర్గమారణ్యముల సుగమములుగా నొనరించెను. స్త్రీ యెట్టిపాపముల నొనరించినను వధింపరాదనున్యాయము నెఱింగిన మహాత్ముఁడు కాననారాముఁడు నన్నవమానించి వదలిపెట్టెను.'ఏకా కథంచిన్ముక్తాహమ్'=ఒక్కదాననే యెట్లో వదలివేయఁబడితిని. తక్కినస్త్రీల వధించెనని భావము కాదు. నీకొఱకుగా నేనొక్కతుకనే వదలిపెట్టఁబడి వచ్చితిననియే యామె తెల్పెనని మన మూహింపవలయును.

"అపహృత్య చ నిఃక్షేపం కృత్వా చ స్త్రీసుహృద్వధం." ౧౧

మను. ౧౧ అధ్యా.

"అప్రదుష్టాం స్త్రియం హత్వా శూద్రహత్యావ్రతం చరేత్." ౨౬౯

యాజ్ఞ. ప్రాయశ్చిత్తకా.

అను నీలోనగుస్మృతుల ననుసరించి స్త్రీవధము మహాపాపము నొసంగునది కాన విశేషించి వారు చేయుపాపములకుఁ బ్రాయశ్చిత్తము.

"స్త్రీబాలోన్మత్తవృద్ధానాం దరిద్రాణాం చ రోగిణాం,
శిక్షావిదలరజ్వాద్యైర్విదధ్యాన్నృపతిర్దమమ్."

అను స్మృతివాక్యానుసారము దండింపవలయునని భావము. ఈభావమే రామాయణమున శూర్పణఖను రామమూర్తి దండించి యెఱింగించెనని మన మెఱుంగవలయును.

"రామస్య తు విశాలాక్షీ పూర్ణేందుసదృశాననా,
ధర్మపత్నీ ప్రియా భర్తుర్నిత్యం ప్రియహితే రతా. ౧౪
సా సుకేశీ సునాసోరుస్సురూపా చ యశస్వినీ,
దేవతేవ వనస్యాస్య రాజతే శ్రీరివాపరా. ౧౫
నైవ దేవీ న గంధర్వీ న యక్షీ న చ కిన్నరీ,
నైవం రూపా మయా నారీ దృష్టపూర్వా మహీతలే," ౧౬

అనునవి శూర్పణఖమాటలు."ధర్మపత్నీ, భర్తుః ప్రియా నిత్యం ప్రియహితే రతా" అను నీవాక్యములు రావణునకుఁ గామోద్దీపనార్థము చెప్పఁబడినవి కావు. తటాలున నాడానవినోట సీతాసందర్శనపుణ్యవిశేషమున వెలువడినవి 'నిత్యం ప్రియహితే రతా' అనునది భగవంతున కామె యనపాయిని అనునర్థము దేటపఱచుచున్నది. 'యశస్వినీ'అనునది సీతామహాత్త్వము బోధించును. వనదేవతవలె రెండవలక్ష్మివలెఁ బ్రకాశించుచున్నది. వనదేవత యనఁగా మహారణ్యములయందు వృక్షాధిదేవతలై దేవతాస్త్రీ లుందురు. ఒంటరిగాఁ బట్టపగటివేళ నడికిరేయి యందు నెవ్వరైనఁ బోవుచున్న వార లగపడుదురు వారిం గాంచఁగనే యద్భుతంపడి యతఁడు ప్రాణముల వదలును. వారు స్త్రీలకుంగూడ దర్శనమిచ్చుట కలదు. నిర్మల తరుగుల్మములచెంతఁ గూరుచుండియుండఁగా స్త్రీపురుషులలో నెవరికే నగపడుటయుఁ గలదు. వారిం గాంచినంతనే నవ్వుచు స్మృతిదప్పి పడిపోవుదురు. ముహూర్తమాత్రమునఁ బ్రాణము లెడఁబాయఁగలవు. వనదేవతాదర్శనము హానికరమని యా

వ్రాఁతవలనఁ దెలిసినదికదా. ఉపాసకుల కత్యంతశుభములు తద్దర్శనమునఁ గలుగును. ఈవిషయము స్వానుభవమున నెఱుఁగందగియుండును. ప్రమాణము లెందే వెదకవలయును. వన దేవత లున్నవారనుట కెన్నియో ప్రమాణములు చూపవచ్చును. ఈరామాయణమున భావికథయందవి కానఁబడును. కాన నిందు వదలుచున్నాఁడను. 'శ్రీరివాపరా' = శ్రీదేవి రూపాంతర మనఁదగియున్నది. అనఁగా శ్రీదేవియే యీలోకమున నవతరించెననికదా యామె భావము. ఆనొకన్నుల కట్టి వనిత లేలోకమున నుండరనియేకదా తోఁచియుండును. అదియే యామె పుణ్యవిశేషఫలమని మన మెఱుంగవలయును. ఇట్టి రూపముగల నారీమణి నే నిదివఱ కెన్నఁడు చూడ లేదనఁ గారణమేమి? అనేకజన్మములయందుఁ జేసియున్న పుణ్యకర్మములఫలమే యది. శూర్పణఖకూడఁ బుణ్యకర్మముల నాచరించియుండునా యను ప్రశ్న మసంగతము. పుణ్యకర్మములకు ఫలమేకదా భగవద్దర్శనము. కానిచో నద్దానిమహత్త్వమేమి?

"మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః,
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేఽపి యాంతి పరాం గతిం." 3౨
భ. గీ. ౯ అధ్యా.

ఈగీతావాక్యమున నొక్కసంశయము పొడముచున్నది. పాపపుఁబుట్టుకగలవార లెవరో వారుకూడ నన్నాశ్రయించి పరమగతి నొందుదురు. స్త్రీలు వైశ్యులు శూద్రులుకూడ నన్నాశ్రయించిన ముక్తు లగుదురనియే శ్లోకార్థము. పాపజన్ములకు భగవదారాధనము చేయుబుద్ధి కలుగు టెట్లు? పుణ్యకర్మఫలము సద్బుద్ధి. పాపకర్మఫలము దుర్బుద్ధియు నగుం

గదా. ఏకాలమునందు నట్టిపాపజన్ములకు భగవదారాధ
నము చేయువాంఛ పొడమకయే పోవలయుఁ గదా.
అప్పుడు గీతావాక్యము వ్యర్థమేకదా కావలయును? అట్లు
గునా? సమాధాన మేలాగు? ఏప్రాణియుఁ గేవలపాపకర్మ
ములనే యాచరింపఁజాలదు. రవంతయేఁ బుణ్య మాచ
రించును. దానిఫల మల్పముకానఁ బాపకర్మఫలానుభవమున
నది తెలియదు. ఆయల్పపుణ్యకర్మముల ఫలముగాఁ బూర్వ
జన్మాధికపుణ్యకర్మనిరతిఁ గల్గు. ఇట్లు కొన్నిజన్మములకుఁ బుణ్య
కర్మనిరతియుఁ బాపకర్మవైముఖ్యము పొడసూపు. అత్తరిఁ
భగవదనుగ్రహపాత్రునిగాఁ జేయఁదగిననిష్కామకర్మముల
నాచరించుశ్రద్ధ యుప్పతిల్లు. దాన నిర్మలజ్ఞానము గలిగి ముక్తి
దొరకును. అనుభావమే యీభగవద్గీతావాక్యమున నిమిడి
యున్నది. ఇట్లర్థమును గ్రహించిన నేశంకలకు నవకాశము
కలుగదు. శూర్పణఖయు ననేకజన్మములనుండి పాపకర్మము
లొనరించుచున్న నేవో పుణ్యకర్మముల నాచరించియుండును.
తత్ఫలముగా భగవద్దర్శనము. భగవంతునిమూలమునఁ బాప
కర్మఫలమగు కర్ణనాసికాచ్ఛేదనరూపప్రాయశ్చిత్తము కుది
రెను. అట్లయిన నిర్మలజ్ఞానము కలుగవలదా యందురేని
భగవత్సంకల్పమగు దుష్టదానవవధరూపాధర్మనిర్మూలనము
నకుఁ దోడుపడుటకే రావణు నిట్లు ప్రోత్సహించెను. కాని
భగవంతుని వినుతించుమహాభాగ్యము కూడఁ గలదయ్యెను.
అని మన మెఱుంగవలయును. అట్టిభాగ్యవంతురాలు కను
కనే మహాపతివ్రతయు నిరుపమానలావణ్యవతియు నగుమహా
ప్రకృతి నీలోకమున నెన్నఁడు చూడలేదనియెను. అనఁగా
నారూపము శూర్పణకశ్రుతాదృష్టచరమనియే భావము.

"యస్య సీతా భవేద్భార్యా యం చ హృష్టా పరిష్వజేత్,
అతిజీవేత్స సర్వేషు లోకేష్వపి పురందరాత్. ౧౮
సా సుశీలా వపుశ్లాఘ్యా రూపేణాప్రతిమా భువి,
తవానురూపా భార్యా స్యాత్త్వం చ తస్యాస్తథా పతిః. ౧౯
తాం తు విస్తీర్ణజఘనాం పీనశ్రోణీపయోధరాం,
భార్యార్థే చ తవానేతుముద్యతాహం వరాననాం. ౨౦
విరూపితాస్మి క్రూరేణ లక్ష్మణేన మహాభుజ."

అని మూలము. పైన వ్రాసినభావము నీమూలమున యర్థము తేటపఱచుచున్నది. సామాన్యార్థము సుగమము. 'భార్యా'= తేజోవిశేషమునఁ బూజ్యురాలగు, 'సీతా' = మహాప్రకృతి, 'యస్య భవేత్'=ఎవనికగునో (ఎవనిచెంతనుండునో) యనఁగా నేభక్తునియం దనుగ్రహించునో యని భావము. మఱియు 'హృష్టా'=సంతోషముగలదియై, పరిష్వజేత్=శరీరమునం దెల్ల యెడల నావేశించునో. అనఁగాఁ దన తేజశ్శరీరము నెవనియం దావేశింపఁజేయునో యని భావము. 'సః' ఆతఁడు. అనఁగా ధన్యుఁడగునాపుణ్యపురుషుఁడని భావము. 'సర్వేష్వపి లోకేషు' సకలలోకములయందు అనఁగా స్వర్గమర్త్యపాతాళ ములయందని భావము. చతుర్దశభువనము లీలోకత్రయమున నంతర్భూతములే యని యార్యులమతము. 'పురందరాత్' = ఇంద్రునికంటె, 'అతిజీవేత్'=అతిశయించియుండును. అనఁగా నేపుణ్యాత్ముఁ డాపరమేశ్వరీకటాక్షపాత్రుఁడగునో యతని కంటెఁ ద్రిలోకాధిపతియగు నింద్రుఁ డధముఁడని తాత్ప ర్యము. 'వపుశ్శ్లాఘ్యా' = శరీరముచేఁ బొగడఁదగినది. వపు వనఁగా, 'ఉప్యతే ప్రాక్కర్మభిరితి వపుః.' తాఁజేసినకర్మము లనఁగా సృష్ట్యాదులు. వానిచేతఁ బుట్టింపఁబడునది. అనఁగా

వానికొలకు ధరించినదని యర్థము. సృష్టిపాలనసంహారాదుల కొలకుఁ దాల్చినదని భావము. దానిచే శ్లాఘింపఁదగినది. అనఁగా నాయాయి కార్యములను సాధించుటంజేసి మహాత్ముల మెప్పుగాంచినదని భావము. 'సుశీలా.' మంచివర్తనముకలది. అనఁగా ధర్మమార్గముననే వర్తించునది. ధర్మమార్గమునే వృద్ధి చేయఁబాటుపడునదని సారము. "భువి రూపేణ అప్రతిమా"= "సర్వంభవత్యస్యామితిభూః తస్యాంభువి."సకలమును నుత్పత్తి చేయుశరీరమునందని యర్థము. "రూపేణ" = స్వభావముచేత "అప్రతిమా"=సాటిలేనిది. "రూపం స్వభావే సౌందర్యే నామ గేపశుశబ్దయోః" అని మేదినీకోశము. "రూపమ్ స్వభావః సౌందర్యం నామకం పశుః శబ్దః గ్రంథావృత్తిః నాటకాదిః ఆకారః" అని శబ్దకల్పద్రుమము. 'సా'=అట్టి యామహాదేవి. (సీతానామముదాల్చిన మహాప్రకృతి)'తవ'=నీకు. (రావణునకు) 'భార్యా' = దీప్తిచేఁ బూజింపఁదగిన, 'అనురూపా' = తగిన రూపము కలది. 'స్యాత్' = అగును. నీ వాపరదేవిని దేజ స్స్వరూపిణిగా ధ్యానింపఁదగినది. నీకుఁ దగినది. ఇప్పటి నీకర్మమునకుఁ దగినదని భావము. అనఁగా

"సుధాధారాసారైశ్చరణయుగళాంతర్విగళితైః,
ప్రపంచం సించంతీ పునరపి రసామ్నాయమహసః,
అవాప్య స్వాం భూమిం భుజగనిభమధ్యుష్టవలయం,
స్వమాత్మానం కృత్వా స్వపిషి కుళకుండే కుహరిణి." ౧౦

అను శ్రీశంకరభగవత్పాదప్రతిపాదితధ్యానయోగము ననుస రించి యర్చింపఁదగినదని సారము. 'తస్యాః' = ఆపరదేవికి, 'త్వంచ' = నీవును, 'తథా'=అట్లే. అనఁగా ననురూపుఁడవగు 'పతిః'=పాలకుఁడవు. 'పాతీతి పతిః.' అనువ్యుత్పత్తి ననుసరించి

నీయింటనుండు నంతకాలము రక్షింపఁదగినవాఁడవు. తచ్చరణ కమలయుగళ నిష్యందామృతమును గ్రోలఁదగినవాఁడవని సారము. (పా=పాలనే. పానే చ) "విస్తీర్ణజఘనాం పీనశ్రోణీ పయోధరాం వరాననాం తాం తవభార్యార్థే ఆనేతు మహా ముద్యతా" అని యన్వయము. అను నీవర్ణనము కేవలస్త్రీవర్ణనము కాదు. ప్రపంచోత్పత్తినిరత యగుభగవతీరూపము.

"జంఘాయాః పంచభూతాని జగన్మాతుశ్చ జజ్ఞిరే. ౧౯
గుల్ఫేన సప్తజలధీన్పార్ష్ణినా చక్రవాళకం,
పాదాంబుజతలేనాపి రసాతలమథాసృజత్. ౨౦
పాదేన పాదగుల్ఫేన జంఘయా జానునాపి చ,
ఊరుణా చోరుమూలేన నితంబాజ్జఘనేన చ. ౪౧
మధ్యేన స్తనయుగ్మేన బాహుభ్యామంసదేశతః,
కంఠేన శిరసా చైవ యథాసంఖ్యం ససర్జ సా. ౪౨
మహాపాతాళకం లోకం తథా పాతాళమప్యథ.
... ... ... ... ..."

లలితోపాఖ్యానము. ౨౨ అధ్యా.

"ద్యావాపృథివ్యోరిదమంతరం హి
వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః,
దృష్ట్వాద్భుతం రూపమిదం తవోగ్రం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్. ౨౦
రూపం మహత్తే బహువక్త్రనేత్రం
మహాబాహో బహుబాహూరుపాదం,
బహూదరం బహుదంష్ట్రాకరాళం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితా స్తథాహం."

గీత. ౧౧ అధ్యా.

"నాభ్యా ఆసీదంతరిక్షం శీర్ష్ణో ద్యౌస్సమవర్తత,
పద్భ్యాం భూమిర్దిశశ్శ్రోత్రాత్ తథాలోకాగ్ం అకల్పయన్." ౯
పురుషసూక్తము.

ఇవన్నియు నాపరమతత్త్వము సృష్టిక్రమమునే తెలుపును గదా. అట్టి మహాప్రకృతిని నీ వారాధింపఁదగినట్టు లున్న రూపవతిని దేఁ బ్రయత్నించితిని. "వరాననాం"=వరములనిచ్చు ముఖముగలదని యర్థము. మధ్యమపదలోప కర్మధారయసమాసము. ఇట్టి ప్రయత్నముచేసిన నేను "క్రూరేణ లక్ష్మణేన విరూపితాస్మి" లక్ష్మణుఁడు క్రూరుఁడై రూపమునఁ గొంత కల్గించెను. ఇట్లు విశేషార్థము గ్రహింపవలయును. ఇట్లు భగవద్దర్శనజనిత పుణ్యవిశేషమున శూర్పణఖ పలికెననుట యుక్తము కాదనువారు పామరులు. తత్త్వార్థమును గ్రహించిననే రామాయణార్థము తేటపడును.

"తాం తు దృష్ట్వాథ వైదేహీం పూర్ణచంద్రనిభాననాం. ౨౧
మన్మథస్య శరాణాం వై త్వం విధేయో భవిష్యసి,
యది తస్యామభిప్రాయో భార్యార్థే తవ జాయతే. ౨౨
శీఘ్రముద్ధ్రియతాం పాదో జయార్థమిహ దక్షిణః,"

అని మూలము. "తాం యదృచ్ఛయా రూప మాపన్నాం పూర్ణచంద్రనిభాననాం, వైదేహీం తు దృష్ట్వా" అని అన్వయము. తచ్ఛబ్ద మిటఁ బ్రసిద్ధార్థబోధకము. పున్నమచంద్రతుల్య వక్త్రముఁగల యాపరదేవిని గాంచి 'మన్మథస్య శరాణాంవై' = మన్మథబాణములకు, 'త్వం' = నీవు 'విధేయో భవిష్యసి'=లోఁబడఁగలవు.

"అరవిందమశోకం చ చూతం చ నవమల్లికా,
నీలోత్పలం చ పంచైతే పంచబాణస్య సాయకాః."

అను నీపుష్పములకు లోఁబడఁగలవనుటం జేసి వాసంతకాలిక పూజానిరతుఁడ వగుదువని భావము. వాసంతోత్సవము దేవీ ప్రీతికరమనుట సుప్రసిద్ధము. ఆమహాదేవిని నిర్మలప్రసూనముల నారాధింపఁగలవని సారము. మన్మథుఁడు శివుని కంటిమంట భస్మమయ్యెను. ఆతనికి బ్రహ్మశాపము కలదు.

"తమాహ కమలోద్భూతో దివ్యభామా పితామహః,
అహో దురాత్మన్ మదాంధ మామన్యాయప్రవర్తినం. ౯౦
కృతవానసి దుశ్చేష్టా దుహితుర్భోగమోహితం,
తద్భవిష్యసి సంక్రుద్ధనీలకంఠలలాటజైః. ౯౧
జ్వాలాజటాలైర్జ్వలనైర్భస్మమాత్రతను స్స్మర,
అథ భీతేన కామేన రత్యా చ భయలోలయా. ౯౨
శాపాంతం పద్మభూః పృష్ట ఇదమాహ తదాంగజం.

... ... ... ... ...

ఉద్భూయ సా మహాదేవీ లలితా పరమేశ్వరీ,
కామేశ్వరాంకనిలయా త్వాం స్మరోత్పాదయిష్యతి." ౯౬

బ్రహ్మాండ. ౧౯ అధ్యా.

లలితాంబాకరుణచేఁ బునరుజ్జీవితుఁడగు మన్మథుఁడు భగవతీ భక్తుఁ డయ్యెను. తత్ప్రియసూనము లనఁబడు పంచప్రసూనములు కమలాదులు భగవతీప్రీతికరములని యెఱుంగవలయును రావణా! నీ వాసీతాదేవిని దర్శించినంతనే భక్తుఁడవై దివ్యకుసుమముల నారాధింపఁగలవని శ్లోకగతతత్త్వము. "తస్యాం భార్యార్థే అభిప్రాయ స్తవ యది జాయతే, శీఘ్రం పాద ఉద్ధ్రియతామ్" ఆదేవి నారాధించుకోరిక నీకుం గలదేని, ఆలసింపక ప్రయాణముచేయఁ గుడిపాదమును ముందుగఁ బెట్టుము. ఎందులకు? 'జయార్థమ్' = స్వకార్యసిద్ధికొఱకు.

స్వకార్యసిద్ధియేది ? శీఘ్రకాలమున సీతకుఁ దేహవిముక్తి కావలయుననునదియే. ఇన్ని విషయములు తెలిసి శూర్పణఖ తెలిపెనా యందురేని శ్రీరామరూప పరమేశ్వరసందర్శన జనిత పుణ్యవిశేష మామె నట్లు పలికించెననియు రావణుని వాంఛయు నదియే యనియుఁ గావుననే అకంపనుఁడు చెప్పి నపుడు ప్రయత్నించి వెనుకకు నిస్పృహుఁడై పోయిన రావణుఁ డీసంబోధనమున మరలనిప్పూన్కి కలవాఁడయ్యె ననియు మన మూహింపవలయును.

"నిశమ్య రామేణ శరైరజిహ్మగై
ర్హతాన్ జనస్థానగతాన్నిశాచరాన్,
ఖరం చ బుద్ధ్వా నిహతం చ దూషణం
త్వమత్ర కృత్యం ప్రతిపత్తుమర్హసి." ౨౬

అను నీమూలము పైన వ్రాసినభావమును దృఢపఱచుచున్నది. ఎట్లనఁగా: ఘోరబాణములు వైచి జనస్థానగతదనుజేంద్రుల నెల్లర శ్రీరాముఁడు వధించినవార్త విని, ఖరదూషణులు దుర్జయులయ్యు రాముని బాణములతోఁనన మృతినొందు టెఱింగి, యిప్పుడు చేయఁదగినదేది యని యోజింపఁదగుదువు. అని శూర్పణఖ తెలిపెను. రావణా! ఖరాదిదానవవర్యులు మడిసిరి. వారిసాయమేకదా నీకు హెచ్చుగానుండెను. వారు మరణించిరి. ఇఁక నారామునకుఁ బ్రతీకార మేమి చేయఁదగునో యోజించుకొమ్ము. నీగతియేమి యనియు నాలోచించుకొనుము అనఁగా భావమేమి ? మునులకభయమిచ్చి రన్నవార్తఁ దెలిపితినిగదా. దానియుద్దేశమేమి? దానవసంహార మొనరింతుననియే కదా. కావునఁ జక్కఁగా నెన్ని పనికిఁ బూనుమని సోదరి ప్రోత్సహించెను. ఈయుపదేశముం

బట్టిచూడఁగా నక్కలకు రక్కసినోట రావణునికర్మమే నిలిచి యట్లు భాషింపఁజేసెనని సంభావించుటకంటె వేఱుగా నాలోచింపఁదగిన దేమున్నది? ఇప్పట్టున నధ్యాత్మరామాయణమునఁ గలవిశేషముల నరయుదము.

"యది రామో మనః కుర్యాత్త్రైలోక్యం నిమిషార్ధతః,
భస్మీకుర్యాన్న సందేహ ఇతి భాతి మమ ప్రభో.
యది సా తవ భార్యా స్యాత్సఫలం తవ జీవితం,
అతో యతస్వ రాజేంద్ర యథా తే వల్లభా భవేత్.
సీతా రాజీవపత్రాక్షీ సర్వలోకైకసుందరీ,
సాక్షాద్రామస్య పురతస్థాతుం త్వం న క్షమః ప్రభో.
మాయయా మోహయిత్వా తు ప్రాప్స్యసే తాం రఘూత్తమం,
శ్రుత్వా తత్సూక్తవాక్యైశ్చ దానమానాదిభిస్తథా.
ఆశ్వాస్య భగినీం రాజా ప్రవివేశ స్వకం గృహం,
తత్ర చింతాపరో భూత్వా నిద్రాం రాత్రౌ న లబ్ధవాన్.
ఏకేన రామేణ కథం మనుష్యమాత్రేణ నష్టస్సబలః ఖరో మే,
భ్రాతా కథం మే బలవీర్యదర్పయుతో వినష్టో బత రాఘవేణ.
యద్వా స రామో మనుజః పరేశో
మాం హంతుకామస్సబలం బలౌఘైః,
సంప్రార్థితోయం ద్రుహిణేన పూర్వం
మనుష్యరూపోఽద్య రఘోః కులేఽభూత్.
వధ్యో యది స్యాం పరమాత్మనాహం
వైకుంఠరాజ్యం పరిపాలయేఽహం,
నో చేదిదం రాక్షసరాజ్యమేవ
భోక్ష్యే చిరం రామమతో వ్రజామి.

ఇత్థం విచింత్యాఖిలరాక్షసేంద్రో
రామం విదిత్వా పరమేశ్వరం హరిం,
విరోధబుద్ధ్యైవ హరిం ప్రయామి
ద్రుతం న భక్త్యా భగవాన్ ప్రసీదేత్." ౬౧

ఆరణ్యకాం. ౫ సర్గము.

ఈవాక్యములన్నియు వాల్మీకి గూఢముగాఁ జెప్పినయర్థము నే స్పష్టముగాఁ దెలుపుచున్నవి. పూర్వకర్మము ననుసరించి విరోధబుద్ధిగలవాఁ డయ్యెను. భక్తిచే భగవంతుఁడు శీఘ్రమునఁ బ్రసన్నుఁడు కాఁడని యిందుఁ గలదు.

"భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున,
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప. ౫౪
మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః,
నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాండవ." ౫౫

గీత. ౧౧ అధ్యా.

అని గీతావాక్యములు కనంబడుచున్నవి ఇందేది ప్రమాణ మగునాశయము? అనఁగా నధ్యాత్మరామాయణమునఁ దెల్పఁబడుభావము సామాన్యము. గీతాశయము విశేషము. రావణునికోరిక యల్పము. గీతాశాస్త్రమునఁగల భక్తిమార్గము ముక్తిప్రదము. రావణుఁడు ముక్తిని గోరువాఁడు కాఁడు. రాక్షసదేహవిముక్తి నభిలషించువాఁడు. కావున నీరెండును విరుద్ధములుకావని మన మెఱుంగవలయును. మార్గములు భిన్నములుగా నున్నను లక్ష్య మొక్కటియే యగునని మనము నిశ్చయించుకొనవలయు. అట్టినిశ్చయజ్ఞానమున భేదభావము నశించును. దాన మతధర్మములతత్త్వ మొక్కటియే యని తేలును. మఱియు దేవతాదూషణము నశించును. ఇంత

కన్నఁ గావలసినదేమి? భేదభావము లేకదా భగవత్కరుణా లాభప్రతిబంధకములు. ఎన్ని వేషములు వేసినను, ఎన్ని ఛాయా పటములు తీయించుకొన్నను, యోగులమని దాసులమని జ్ఞానులమని యెన్ని యుపన్యాసము లిచ్చుచున్నను సమదర్శిత్వము లేదేని నిరర్థకములే యివియన్నియు ననుట స్పష్టము.

"జటిలో ముండీ లుంఛితకేశః కాషాయాంబరబహుకృతవేషః,
పశ్యన్నపి చ న పశ్యతి మూఢో హ్యుదరనిమిత్తో బహుకృతవేషః. 2
అంగం గళితం పలితం ముండం దశనవిహీనం జాతం తుండం,
వృద్ధో యాతి గృహీత్వా దండం తదపి న ముంచత్యాశాపిండం. 3
కురుతే గంగాసాగరగమనం వ్రతపరిపాలనమథవా దానం,
జ్ఞానవిహీనస్సర్వమతేన ముక్తిం న భజతి జన్మశతేన." 4

అను నీసూక్తులంబఠించి వేషధారులు కపటయోగులు కల్పిత భక్తులు ధనాశాపరవశులు తమదుష్ప్రథమును విడనాడి పెద్దలం గాంచి సదభ్యాసముల నలవఱచికొని భగవత్కరుణకుం బాత్రు లగుదురుగాక. కపటనాటకసూత్రధారులు గాక యుందురుగాక.

భగవంతు నారాధించుమార్గము లనేకములు. అందు భగవచ్చరిత్రమును బఠించుటయు నొకమార్గమే. కాని కేవల పారాయణము మంచిదిగాదు. దానియం దిమిడియుండు విశేషార్థమూలమునఁ దత్త్వమును గ్రహించుటయే ప్రధానము. ఎన్నిసారులు పారాయణము చేసిన నందలిసారము తెలియదేని బిచ్చగాండ్రపాటవలె నుండును. ఫలము తావన్మాత్రమే. "యోఽర్థవిత్సకలం భద్రమశ్నుతే" అని శ్రుతి చాటుచున్నది. అధీతిబోధాచరణప్రచారణము లుండినఁగాని ఫలము కలుగదు. భగవచ్చరిత్రమును బఠించి దానియర్థము నెఱింగి

తదనుసారముగఁ దాఁ బ్రవర్తించి యితరుల కావిధమును దెలిపి వారు ప్రవర్తించునట్లు చేయవలయును. తానాచరింపక వేషధారియై యితరులకుఁ దెలుపుచుఁ దానాచరించినట్లు నటించుచు నుండువాఁడు వంచకుఁ డనంబడు. అట్టివారికి భగవత్కృప గగనకుసుమమే యనవలయు. అట్టివారి కపటోక్తుల నాలకించి చెడక సాధువుల నాశ్రయించి భగవంతు నారాధించు నుత్తమమార్గము నెఱింగి తరింపవలయును. మతభేదములను బరమేశ్వరుఁడు పాటింపఁడు. మతదూషకుల నాదరింపఁడు. దేవతాదూషకులకుం బొడసూపఁడు. వేషములకు లొంగఁడు. కపటనాటకసూత్రధారులఁ బ్రేమింపఁడు. సమదృష్టిగలవారినే యాదరించును. నిష్కపటులఁ బ్రేమించును. సద్భక్తిగలవారలచెంతనే యుండును. అట్టిభగవంతు నాశ్రయించి కృతార్థులము గావలయును. దేవు నాశ్రయించుటకు సాధనము లక్కఱలేదు. భక్తిసాధన మొక్కఁడు చాలును. అదియు నిష్కపటముగ నుండవలయును. శ్రద్ధయు దానికిఁ దోడుపడవలయును. అవి రెండును గుదిరినచో ఫలాభిసంధిరహిత సత్కర్మానుష్ఠాన తత్పరుండగును. దానఁ జక్కని జ్ఞానము తనంతన యలవడును. అయ్యది ముక్తిని గలిగించును. కావున మనమందఱము సీతారామచంద్రులను బ్రకృతిపురుషులని నమ్మి వారిచరిత్రములఁ దెలిసికొనుచు భవ్యతమమార్గమున వారల నారాధించుచునుండుటయే యత్యుత్తమమార్గము. అనపాయమగు నీమార్గమున వర్తించి శ్రీసీతారాములకరుణ కెల్లరు పాత్రులుగావలయును.

జగతి విశదమంత్రం జానకీప్రాణమంత్రం
విబుధవినుతమంత్రం విశ్వవిఖ్యాతమంత్రం,

దశరథసుతమంత్రం దైత్యసంహారమంత్రం
రఘుపతినిజమంత్రం రామరామేతి మంత్రం.
బ్రహ్మామృతానందఫలప్రదాయినం
వేదాంతవిజ్ఞానసుగంధపుష్పితం,
సీతాశుభాంగాంచితబాహుశాఖినం
శ్రీరామకల్పద్రుమమాశ్రయామః.
కనకనికషభాసా సీతయాలింగితాంగో
నవకువలయదామశ్యామవర్ణాభిరామః,
అభినవయుతవిద్యున్మండితో మేఘఖండ
శ్శమయతు మమ తాపం సర్వదా రామచంద్రః.
అలం శాస్త్రాభ్యాసైరలమసకృదామ్నాయపఠనై
రలం తీర్థస్నానైరలమఖిలయాగవ్రతజపైః,
అలం యోగాభ్యాసైరలమపి మహాపాతకభియా
యదస్మాకం రామస్మరణమహిమా సో విజయతే.
సీతామనోమానసరాజహంస సంసారసంతాపహరక్షమావన్,
శ్రీరామదైత్యాంతకశాంతరూప శ్రీతారకబ్రహ్మ నమోనమస్తే.

శరణాగతరక్షణరూపధర్మనిర్వహణమను
నాలవప్రకరణము
సంపూర్ణము.
శ్రీ. శ్రీ. శ్రీ.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1934.

శ్రీః

# శ్రీరామావతారతత్త్వము

## ఏడవ ప్రకరణము.

ఇయ్యది


కడప మునిసిపల్ హైస్కూలునందు ప్రధానాంధ్రపండితుఁడగు

కావ్యస్మృతితీర్థ:

జనమంచి శేషాద్రిశర్మ విరచితము.



చెన్నపురి:

శ్రీ 'రామ' ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1934.

తోడుపాటు వలసియుండును. పోషకులస [illegible] యీగ్రంథమే తమకుఁ దెలుపును. కాలస్థితి ననుసరించి కొం బోలు పెక్కండ్రు తోడ్పాటు చూపలేదు. ఐన నీశ్వరుని యనుగ్రహమున సాధువుల తోడుపాటు గలుగునని నమ్మి యున్నాఁడను. నాలుగుభాగముల సంపుటించి గ్రంథమును బ్రకటించుటకు నవకాశము చాలకయున్నది. అట్లని యూరకుండుట కూడ నాకింతదనుక లేదు. భగవత్సేవయే యిదని నమ్మియున్నా డను. పలువురు మహాశయులు చేయూఁత యొసఁగి దీని నుద్ధ రింతురుగాక యని కోరుచున్నాఁడను.

"నిందతు నందతు వా సన్నసూయురనసూయురత్ర కిం తేన,

యత్సన్మానసగమనార్థమె వేదం మమ తు పాథేయమ్."

అన్నసూక్తి నాకు శరణ్యము. ఇంతకంటె పీఠికలో నేమి వ్రాయఁదగిన విషయము లిందు లేవు. [illegible] స్వహానమే భూషణముగఁ గలవారు కదా. అట్టివారలు [illegible] ములం బరిశీలించి నాకుఁ దెలిపి నాయెడ [illegible] యత్యుత్తమకార్యము. "కిం వా ప్రార్థనయా [illegible] స్వాభావికస్తద్గుణః" అన్నసూక్తి [illegible] ప్రమా దములు క్షంతవ్యములని మహాత్ముల వేఁడనేల? సకలజనము నాలోపములఁ బాటింపక ముద్రించి యిచ్చిన [illegible] కులు, పరోపకారపారీణులు నగు మ-రా-రా-శ్రీ, వావిళ్ల వేంకటే శ్వరశాస్త్రులుగారి కేతన్ముఖమున నాకృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాఁడను.

ఇట్లు విన్నవించు విద్వద్విధేయుఁడు,

జనమంచి శేషాద్రిశర్మ,

శ్రీ. శ్రీ. శ్రీ.

డను వనచరునికుమారుఁడు శూరుఁడు నగుసుగ్రీవుఁ డుం
దున్నవాఁడు. నీవచటికిఁ బొమ్ము." అని పలికి మరల "నా[illegible] నా!
రాజ్యము పోఁగొట్టుకొని దుఃఖములపాలై సీతను గా[illegible]
వానిని మఱచి యుంటిని. ఆసీతను నవలి గుట్టు [illegible]ను?
అని పలికెను. అంతఁ దమ్మునిం గూడి యాపం[illegible]
స్నానముగావింపఁబోయెను. త్రోవబడలిక లడంగ నుప[illegible]
మధ్యభాగమునఁగల యాసరోవరమును దర్శించెను.

మహాశయులారా! ఈభాగమునఁ గలవిశేషములఁ
బరిశీలింతము.

> "ప్రణష్టమశుభం తత్తత్కల్యాణం సముపస్థితం,
> తేన తత్త్వేన హృష్టం మే మనో లక్ష్మణ సంప్రతి. ౫
> హృదయేహి నరవ్యాఘ్ర శుభమావిర్భవిష్యతి,
> తదాగచ్ఛ గమిష్యామి పంపాం తాం ప్రియదర్శనాం." ౬

అని మూలము. తీర్థములను దర్శించినందున సంతోషము [illegible]
నది. శుభ మాసన్నమైనది. కనుకనే నామనస్సు [illegible]
ననుభవింపఁదగినదిగా నున్నదని రాముఁడు [illegible]. ప్ర[illegible]
ముగా నెల్లరమనస్సులు భావిఫలముల ననుభ[illegible]
డును. దుష్ఫలానుభవము కానున్నయెడల ముందే మనస్సు
మలినముగానుండును. సత్ఫలానుభవము కానున్న[illegible]
లములుగా నుండును. దానింబట్టియే భావిఫలము [illegible]
మనము నిర్ణయించుకొనవచ్చును. "ప్రాయస్సమాసన్న[illegible]
కాలే ధియోఽపి పుంసాం మలినా భవంతి" అను న్యాయము
నకు నాధారణము రామాయణమే యని తోఁచుచున్న[illegible].
"సతాం హి సందేహపదేషు వస్తుషు ప్రమాణ[illegible]
ప్రవృత్తయః" అని కాళిదాసవచనము కలదు కదా. [illegible]

భక్తులు కాఁజాలరు. అట్టి నీచవిషయములు [illegible] నుపదేశించి ధనము సంపాదించువారలకు [illegible] మాత్రము రాఁబోదు. జన్మరాహిత్యమగు [illegible] యంతకంటెఁ బొరపాటు వేఱొకఁ [illegible]. కావున భగవ త్తత్త్వము నారాధించు మార్గమునకు నిష్క[illegible], భేదభావము లేకుండుటయుఁ బ్రధానో[illegible]. [illegible] లేనిచో భగవదనుగ్రహమును బడయఁజాలరని [illegible] సారులు గట్టిగాఁ జెప్పవచ్చును. [illegible]! భగవం తుని మానవుఁ డేరూపనామములు [illegible] భక్తిచే నేమార్గమున నారాధించినను ప్రసన్నుఁ[illegible] దరింపఁజేయునను సిద్ధాంతమును [illegible] దరముగాదు. ఈకాండమును ముగించుచు [illegible] జేయుదము.

"నిత్యం శ్రీరామమంత్రం నిరుపమమధికం నీతిసుజ్ఞానమంత్రం
సత్యం శ్రీరామమంత్రం సదమలహృదయే సర్వదారోగ్యమంత్రం,
స్తుత్యం శ్రీరామమంత్రం సులలితసుమనస్సౌఖ్యసౌభాగ్యమంత్రం
సర్వం శ్రీరామమంత్రం పవనజవరదం పాతు మాం రామమంత్రం.

రామచంద్ర దయాసాంద్ర రఘువీర నృపోత్తమ,
లోచనాభ్యాం కృపాపూరపూర్ణాభ్యాం మాం విలోకయ."

మాయామానవతత్త్వప్రవర్తనమను నేడవప్రకరణము సంపూర్ణము.

అరణ్యకాండము సమాప్తము.

శ్రీ. శ్రీ. శ్రీ.

చెన్నపురి: శ్రీ 'రామ' ముద్రణాలయమున ముద్రితము:—1934—1000.

# విషయసూచిక.

శ్రీ

# శ్రీరామావతారతత్త్వము

## ఆరణ్యకాండము.

### సప్తమప్రకరణము.

శ్లో. వల్లీప్రవాళనవపల్లవపాదపద్మం
కంజేక్షణం జలదనీలసరోరుహాభం,
సీమంతినీనయనమోహనమూలమంత్రం
రామం నమామి మునిమానసరాజహంసమ్. ౧

అలం వివాదేన న మానుషోఽయం
రామాత్మనా రాక్షసమర్దనాయ,
భుజంగశయ్యాం పరిముచ్య సాక్షా
న్నారాయణో భూతల మాజగామ. ౨

వ్యామోహప్రశమౌషధం మునిమనోవృత్తిప్రవృత్త్యౌషధం
దైత్యోన్మూలకరౌషధం భవభయప్రధ్వంసనైకౌషధం,
భక్తానందకరౌషధం త్రిభువనే సంజీవనైకౌషధం
శ్రేయఃప్రాప్తికరౌషధం పిబ మనః శ్రీరామనామౌషధమ్. ౩

సంపూర్ణచంద్రవదనం సరసీరుహాక్షం
మాణిక్యకుండలధరం మకుటాభిరామం,
చాంపేయగౌరవసనం శరచాపహస్తం
శ్రీరామచంద్రమనిశం మనసా స్మరామి. ౪

## సగుణనిర్గుణోపాసకులు.

ఎవ్వారు సగుణోపాసనమున కర్హులు? ఎవ్వారు నిర్గుణో
పాసనమున కర్హులు? అను విషయ మిం [illegible]
రింపవలసి యున్నది. పెంచి వ్రాయక [illegible]
వ్రాసెదను. ఎట్టివారు సమదర్శిత్వమున [illegible]
సగుణోపాసనమునకే యర్హులు. అనఁగా విగ్రహా[illegible]
కర్హులని కాదు. ఒక్కరూపమును భగవంతు[illegible]
దానినే మనస్సున నిలిపి ధ్యానింపవలసిన[illegible]
కాదను విశ్వాసము గలవారలనఁగా సర్వమును [illegible]
ముగా భావించుచు నట్లె కాంచుచు [illegible]
యెఱుంగుచు నుండువారు సగుణధ్యానమును [illegible]
పాసన మొనరింపఁదగినవారు. వారలే యోగులు. [illegible]
నధికులు లేరని భగవంతుఁడు నిర్ణయించెను.

> "తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
> కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున."

అనికదా గీతావాక్యము. ఇందు జ్ఞాని యనఁగా [illegible]
త్యము కలవాఁడనియే యర్థము. తపస్వి యోగి [illegible]
డనియో, జ్ఞాని యోగి కాఁడనియో [illegible]
జన్యజ్ఞానము కలవారికంటె దాని [illegible]
గించి తదానందానుభూతి కలవాఁ[illegible]
వాఁడే యోగి యనంబడును. తపస్సు యజ్ఞ[illegible]
సగుణోపాసనములే. యోగి నిర్గుణో[illegible]
యుత్తమోత్తముఁడు యోగియని భగవం[illegible]

సర్వోత్కృష్టుఁడని గీతావాక్యము తెలుపుచున్న [illegible]
సకలశాస్త్రసారతరవిషయము. దీని నెఱిఁగిన [illegible]
యో తెలిసికొని తా నీరెండింటిలో [illegible]
యించుకొనవలయును. ఇతరుల [illegible]
యింపఁజాలరనుట సర్వసమ్మతసిద్ధాంతము.

ఇట్టులుండఁగాఁ గేశవులు [illegible]
దలు యోగులమని ధనము ప్రోగుచేసి [illegible]
ధర్మవ్యాజములఁ గల్పించుకొనుచు [illegible]
దేశరూపమున వంచించి భేదబుద్ధి [illegible]
సిద్ధిని గాంచుచుఁ, జచ్చు [illegible]
నన్యమతములను దత్కర్తలను దూషించు [illegible]
వారికి నుపాసనమన్న ధనార్జనమే. [illegible]
తరింతుమని యాశించు సమూహములు [illegible]
గాంతురు. కాని వాస్తవ మగుచు [illegible]
తమే. కపటయోగులమూలమున [illegible]
నభ్యసించి జ్ఞానధనము నార్జించినవారలను [illegible]
పోవుచుండును. దంభధర్మములమూలమున [illegible]
ముల నాచరింపఁగోరి ధనసంతతుల నాశ్రయించిన [illegible]
లాభము కలుగకున్నది. కావున సట్టి [illegible]
రింప నెల్లరుఁ బ్రయత్నింపవలయును. ఇట్టి [illegible]
లోనగువారు పూర్వకాలమునఁ గూడ [illegible]
గుఱించియే శ్రీశంకరభగవత్పాదాచార్యులవారి [illegible]
తోటకాచార్యులు

నన్ని నామములు గలవాఁడొకఁడు కలఁడని, కొన్ని నామములు కొన్ని తావులు వానికిఁ బ్రియములని, యొకఁడు భగవంతుఁడే కాఁడు.

"అశబ్దమస్పర్శమరూప మవ్యయం
తథా రసం నిత్యమగంధవచ్చ యత్,
అనాద్యనంతం మహతః పరం ధ్రువం
నిచాయ్య తం మృత్యుముఖాత్ప్రముచ్యతే." 3-వల్లి.

"అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో
రూపంరూపం ప్రతిరూపో బభూవ,
ఏకస్తథా సర్వభూతాంతరాత్మా
రూపంరూపం ప్రతిరూపో బహిశ్చ." కఠోపనిషత్తు. ౫-వల్లి.

"ప్రపంచోపశమం శాంతం శివమద్వైతం
చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః." ౭. మాండూ. ౧-ఖండము.

యద్వాచా నభ్యుదితం యేన వాగభ్యుద్యతే,
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిదముపాసతే."
౫-మంత్రము. కేనోపనిషత్తు.

"యత్తదద్రేశ్యమగ్రాహ్య మగోత్రమవర్ణ
మచక్షుశ్శ్రోత్రం తదపాణిపాదం,
నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం
తదవ్యయం యద్భూతయోనిం పరిపశ్యంతి ధీరాః."
౬-ముండకోపనిషత్తు.

"సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్." ౨౯

"అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్,
సాధురేవ స మంతవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః." 30. గీత-౯.

తిచ్చెను. ఆతఁడు వేవేగ సమ్మతమగుసవనమును [illegible]
తెచ్చెను. ధనపతి సోదరుఁడు కాఫున [illegible]
తులకుఁ దగినయట్టు లొప్పు కామగతిగల [illegible]
రింపఁబడి పిశాచవక్త్రములు [illegible]
లంగట్టిన యాయరదమును మేఘధ్వనులు [illegible]
సాగరప్రాంతమున కరిగెను. [illegible]
పతి రాజోపచారములు గలిగి కన్నులకుఁ [illegible]
నిరువదిచేతులు పదిశిరస్సులు గల గొప్ప[illegible]
చుచు నాయరదమునెక్కి మెఱుపులతోఁ [illegible]
గూడిన మేఘమువలెఁ బ్రకాశించెను.

సాగరప్రాంతము పర్వతనికరము [illegible]
గాంచుచుఁ బోయెను. ఆతీరము [illegible]
గంధర్వాదు లందు విహరింతురు. అచ్చరలమిన్న [illegible]
కొన్న సరస్సుల వినోదింతురు. [illegible]
విహారములు సల్పుదురు. అందుఁగల సరోవరములు [illegible]
రాయంచలు లోనగు జలపక్షులరొదలు [illegible]
ఓషధివిశేషములు ద్రుమవిశేషములు [illegible]
చేయుచుండును. ఉపవనము లనేకము [illegible]
చుండును. సెలయేళ్లు సాగరమున సంగమించుచున్న [illegible]
కనఁబడుచుండును. ఆత్రోవ నరుగునపు [illegible]
వాతపోతములు సంతోషభరితము గావించెను. [illegible]
నొక్కవటవృక్షము మేఘమువలె నుండెఁగా [illegible]
గొనియెను. ఋషు లందుండిరి. నూఱుయోజనముల [illegible]
గలశాఖ లద్దానికిం గలిగి యచ్చెరువుగ [illegible]

ఏల? అని ప్రశ్నముచేయఁగా వాల్మీకి మహర్షి నా రావణుం డిట్లు బదులుచెప్పెను.

మహామతులారా! ఈభాగమున ననేకవిషయములు విమర్శింపఁదగినవి కలవు. యథామతిఁ బలికెదను.

"తతశ్శూర్పణఖావాక్యం తచ్ఛ్రుత్వా రోమహర్షణం,
సచివానభ్యనుజ్ఞాయ కార్యం బుద్ధ్వా జగామ సః." ౧

అని మూలము. "శూర్పేణ శోణితభాజనేన ... యాం నఖయతి దూషయతీతి శూర్పణఖా. ..." అనునదియే మంచి వ్యుత్పత్తి. "శూర్పాకారాణి నఖాని యస్యాస్సా." అనునది సాధారణముగాఁ జెప్పఁబడిన వ్యుత్పత్తి. సత్కార్యభంగ మొనరించుటయే దానిస్వభావము. దేవతల కార్యమును సాగింప నాశూర్పణఖయే ప్రధానపాత్రమును వహించె ననవలయు. కనుకనే సీతాసౌందర్యమును ... వర్ణించి రావణునకు గగురుపాటు గలిగించెను. ... వాక్యము లాతనిమనస్సు గలంచివైచెనని ... రావణుఁడు కర్మపాశబద్ధుఁడై యాత్మనాశము ... చేయ సిద్ధపడియున్నవాఁడని మన మెఱుంగవలయును.

"ప్రాయస్సమాపన్నవిపత్తికాలే ధియోఽపి పుంసాం మలినా భవంతి."

అనుసూక్తి క్రొత్తది కాదు. ఎంతటి బుద్ధిమంతుఁడైనను గర్మగతుల ననుసరించి తప్పని సరిగా కార్యములు ... శ్రీకృష్ణమూర్తియే గీతలయందుఁ దెలిపెను.

"స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్." ౬౦-గీత. ౧౮-అ.

విధి యిట్టులుండఁగా నాతఁ డేమి చేయంగలఁడు? రావణుఁ డిపు డస్వతంత్రుఁడని మన మెఱుంగఁదగునని యీ క్రింది మూలమే తెలుపుచున్నది. నిపుణముగాఁ బరికింతము.

"తత్కార్యమనుగమ్యాథ యథావదుపలభ్య చ,
దోషాణాం చ గుణానాం చ సంప్రధార్య బలాబలమ్. ౨

ఇతికర్తవ్య మిత్యేవ కృత్వా నిశ్చయమాత్మనః,
స్థిరబుద్ధిస్తతో రమ్యాం యానశాలాం జగామ హ." 3

అని మూలము. శూర్పణఖ తెలుపకముందే మారీచునికడ కరిగి నిరుత్సాహుఁడై మరలి వచ్చినవాఁడేకదా రావణుఁడు. మరల శూర్పణఖ తెలిపినంతన యెట్లు ముగ్ధుఁ డయ్యెను? కర్మబద్ధము లోకముకదా. అను సిద్ధాంతమును

"నహి కశ్చిత్క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్,
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః." భ.గీ. 3-౫.

అను నీ గీతావాక్యము తెలుపుచున్నది. రాక్షసాధిపతి విద్వద్వరిష్ఠుఁడు గాని సామాన్యుఁడు కాఁడు. వేదరహస్యము లెఱింగిన ప్రౌఢ. కావుననే గుణములను దోషములను దాఁ జేయఁబోవు కార్యమునఁ దర్కించెను. ఆవిమర్శ మేరూపమైనది? పౌరుషసాధ్యమా? లేక చౌర్యసాధ్యమా? అనునట్టిదియే. గుణదోషబలాబలవిమర్శమునందుఁ బరాక్రమమునఁ జేయఁబూను దోషములు మెండని ఖరాదివధవృత్తాంతశ్రవణమున నెఱింగెను. ఇఁకఁ బురికొలుపుచున్న కర్మపాశముల వదలించుకొనఁజాలమి చౌర్యమున గుణము లధికములని తలంచెను. ఈకార్యము చౌర్యసాధ్యమే కాని పౌరుషసాధ్యము

"ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహం,
సంకరస్య చ కర్తా స్యా ముపహన్యామిమాః ప్రజాః. ౨౪
సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత,
కుర్యాద్విద్వాం స్తథాసక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్." ౨౫-గీ. 3-అ.

అను నీవాక్యములు భగవంతునివే యని యెఱుంగుఁడు. ఈ రెండువిషయములం బరికింపఁగా భగవంతుని తాత్పర్యమే మని బుద్ధిమంతులకుం దెలియకపోదు. శ్రీరామచంద్రుఁడు కర్మబద్ధుఁడై నట్లు నటించుటయే కర్మము త్యాజ్యము కాదగ నిదని తెలియఁజేయుచుండలేదా. కర్మబద్ధుఁడు కానివాఁడొక్కఁడె భగవంతుఁడే యని మన మెఱింగిన నీయుపదేశములు స్వార్థపరులపలుకులని తోఁచకపోదు. కావున రావణునంతటి పండితునిగూడ నిట్టినిష్కార్య మొనరింపఁ బురికొలిపినది వాని కర్మమనియే మనము నిశ్చయింపవలయును.

"మిథ్యైష వ్యవసాయ స్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి."

అను భగవద్వాక్య మెక్కాలమునను వ్యర్థము కాదనియును నమ్మి తెలియనుగుణము పుట్టెనని యూహింపవలయును.

"మానశాలాం తతో గత్వా ప్రచ్ఛన్నో రాక్షసాధిపః,
సూతం సంచోదయామాస రథస్సంయోజ్యతామితి." ౪

అని మూలము. "ప్రచ్ఛన్నః. ప్రకాశే హ్యేవద్వాద్ధా మందోదర్యా దయశ్చ నానుమన్యంతేతి భావః. యద్వా పౌరుషం విహాయ చౌర్యమార్గాశ్రయణాం లజ్జావహామితి ప్రచ్ఛన్నమార్గాశ్రయణమ్"అని గోవిందరాజులు వ్రాసిరి. "ప్రకాశేంచేద్వృద్ధా వారయిష్యంతి ఇత్యభిప్రాయః."అని మహేశ్వరతీర్థులు. రావణుఁడు లంకావాసులు కెవ్వరికిని దెలియకయుండ నీకార్య మొనరింపఁ

స్సుతాః. ఇతి రామాయణే." అని [illegible] స్పష్ట
చుగా రాక్షసుల కిట్టివే వాహనము[illegible] పురా
ణాదులయందును గనంబడుచున్నవి.

"అశ్వారోహా గజారోహా గర్దభారోహిణః పరే. ౧౫
ఉష్ట్రారోహా వృకారోహా శ్వనకారోహిణ స్తథా.
కాకాధిరోహిణో గృధ్రారోహాః సింహాధిరోహిణః, ౧౬
వ్యాఘ్రాదిరోహాశ్చ పరే తథా సింహాధిరోహిణః.
శరభారోహిణశ్చాన్యే భేరుండారోహిణః పరే. ౧౭
సూకరారోహిణో వ్యాళారూఢాః ప్రేతాధిరోహిణః,
ఏవం నానావిధైర్వ్యాహా వాహిభిర్గలితాం ప్రతి." ౧౮

ఇట్టి వెన్నియో తావులం గనంబడును. [illegible]
కూడ వాహనములా యని [illegible]
దేల యోగ్యవాహనము [illegible]
లకు నని మన మూహించిన [illegible]

"దేవదానవసంఘైశ్చ చరితం త్వమృతాశిభిః". ౧౬

అని మూలము. "అమృతాశిభిః [illegible]"
అని యన్వయక్రమము. "అమృతా[illegible]
దేవదానవసంఘైః."అనుచో నమృత[illegible]
లకుం గూడఁగలదని యేర్పడుచున్నది. [illegible]
చేసిరనుట యసంగతమే యగు. [illegible]
శిభిః."అనువిశేషణము దేవతలకే [illegible]
సంఘైః." అను నీ సమాసమునందు [illegible]
నన్వయించుట ప్రాయికము గాఁ జెల్లదు.

"నలోపస్సుప్స్వరసంజ్ఞాతుగ్విధిషు కృతి." అని సూత్రము.

సేవితం దేవపత్నీభిశ్శ్రీమతీభిశ్శ్రియావృతం,
దేవదానవసంఘైశ్చ చరితం త్వమృతాశిభిః. ౧౭

హంసక్రౌంచప్లవాకీర్ణం సారసైస్సంప్రణాదితం,
వైదూర్యప్రస్తరం రమ్యం స్నిగ్ధసాగరతేజసా. ౧౮

పాండరాణి విశాలాని దివ్యమాల్యయుతాని చ,
తూర్యగీతాభిజుష్టాని విమానాని సమంతతః. ౧౯

తపసాజితలోకానాం కామగాన్యభిసంపతన్,
గంధర్వాప్సరసశ్చైవ దదర్శ ధనదానుజః. ౨౦

నిర్యాసరసమూలానాం చందనానాం సహస్రశః,
వనాని పశ్యన్ సౌమ్యాని ఘ్రాణతృప్తికరాణి చ." ౨౧

ఈమూలమునకు ఆంధ్రవాల్మీకి రామాయణమునందు ఈ

సీ. "ఆటలఁబాటలఁ ♦ బాటనవేలుపు
బోటలాధరలెల్ల ♦ నీటుమెఱయ
నంచలఁ గ్రౌంచులు ♦ నంచితముగ స్వర
సంచయంబులఁ జెవుల్ ♦ నించుచుండ
హారసంభారముల్ ♦ హారివిశాలముల్
నీహారతుల్యముల్ ♦ నిర్మలములు
వరమనోహరగీత♦వాదిత్రసంజుష్ట
దేవయానంబులు ♦ తేజరిల్ల

తే. నచ్చరలను గంధర్వవి♦యచ్చరులను
నిజతపోబలజితలోక ♦ నిచయసునుల
మఱియు నిర్యాసమూల ♦ మహితచంద
నాగరుధరారుహంబుల ♦ నందమగుచు."

అను సీపద్యమొందు కనుపట్టెను. ఆర్యులారా! ఈమూలమును ౫౫౬

క. సిరులలరారఁగ నంబుధి, దరియది శోభిల్లుచుండెఁ • దగినవిధమునన్
సురలమృతాస్వాదనమునఁ, బరఁగియటన్ సంతతంబు • భాసిలి దివిలోన్.

సీ. దేవతలును క్రీడఁ • దేలుచునుండంగ
జలకుక్కుటములు క్రౌం•చములు హంస
లందుఁ గ్రీడింపంగ • నట్లె సారసవిహం
గములు కూయఁగ సొంపు • లమరఁ జెలఁగ;
వైదూర్యరత్నముల్ • భాసిల్లనందమై
సాగరకాంతి నె•సంగి మించి
యుండె; నంతట రావ•ణుండు పాండరములు
నాయతంబులును ది•వ్యములు నగుచు
మాల్యయుక్తంబులై • మఱియుఁ దూర్యధ్వనుల్
సంగీతసాధుని•స్వనము లొప్ప

తే. నందమునఁ జూడఁగాఁ దరి • నట్టిదగుచుఁ
గామగమనంబులై తపో•ఘనబలమున
దివ్యలోకంబు సాధింపఁ • దేజరిల్లు
పురుషులెక్కువిమానముల్ • పొదలుచుండ. 910

క. కనియెన్ గంధర్వగణం
బును నప్సరసలను మఱియుఁ • బొలుపారెడు వ
స్తునికరమును దశవదనుఁడు
కనియెన్ సంద్రంబుదరిని • గడురమ్యముగన్. 911

సీ. చారునిర్యాసర•సంబుతోఁగూడు మూ
లములను నోషధు•లను, మనోజ్ఞ
ములు ఘ్రాణతృప్తిద•ము లగువాసనలను
జల్లుచుఁ జందన•స్తోరుహమ్ము
లలరార నొప్పు వ•నాళి.........." ఆంధ్ర శ్రీమద్రామాయణము.

పౌరాణికమహాశయులు లించేటి మూలార్థమును బోధించునో యద్దాని నిశ్చయింపఁ గలరు. పురికొల్పఁబడి విమర్శింపఁ బూనినవారలకుఁ గనఁబడునవి సత్యదూరము లగువిషయములే యని యంత తెలుంగుదురు. ఇఁకఁ గథావిషయమును విమర్శింపఁ బూనుదము.

"తత్రాపశ్యత్స మేఘాభం న్యగ్రోధమృషిభిర్వృతమ్. ౨౭
సమంతాద్యస్య తాశ్శాఖా శ్శతయోజన మాయతాః,
యస్య హస్తిన మాదాయ మహాకాయం చ కచ్ఛపమ్. ౨౮
భక్షార్థం గరుడశ్శాఖా మాజగామ మహాబలః,
తస్య తాం సహసా శాఖాం భారేణ పతగోత్తమః. ౨౯
సుపర్ణః పర్ణబహులాం బభంజ చ మహాబలః,
తత్ర వైఖానసా మాషా వాలఖిల్యా మరీచిపాః. ౩౦
అజా బభూవు ర్ధూమ్రాశ్చ సంగతాః పరమర్షయః,
తేషాం దయార్థం గరుడ స్తాం శాఖాం శతయోజనామ్. ౩౧
జగామాదాయ వేగేన తౌ చోభౌ గజకచ్ఛపౌ,
ఏకపాదేన ధర్మాత్మా భక్షయిత్వా తదామిషమ్. ౩౨
నిషాదవిషయం హత్వా శాఖయా పతగోత్తమః,
ప్రహర్ష మతులం లేభే మోక్షయిత్వా మహామునీన్. ౩౩

... ... ... ...

తం మహర్షిగణైర్జుష్టం సుపర్ణకృతలక్షణం,
నామ్నా సుభద్రం న్యగ్రోధం దదర్శ ధనదానుజః." ౩౬

అని మూలము. ఈభాగ మనేకసంశయములు గలుగఁజేయఁ జాలినది. సముద్రతీరపర్వత మింతవఁ గలదు. ఈపర్వతమునసే పదునాల్గుసహస్రములనంటే అజవైఖానసులు మాషవాలఖిల్యులు

పేర్కొనఁబడిరి. వారెల్లరు సముద్రతీరమునఁ గాపురముం
న్నవారనియే కదా యర్థము. రామాయణము [illegible]
దక్షిణసముద్రతీరముననే యనవలయును. ఆగ్నేయము కొంత
తూర్పుసంద్రముదరిని గావచ్చును. అందే కదా సుతీక్ష్ణుఁడు
తపస్సు చేయునాశ్రమము కలదు. ప్రాగ్దక్షిణసముద్రా[illegible]
గావలయు. సముద్రతీరమునం దడవులుండుటయు నందు
మృగపక్షు లుండుటయు నందు విశేషించి మహర్షులుండు
టయు నందుఁ గమలము లుండుటయు స్వాభావికమైనదియ
కాదు. దేవతలు విమానములపై సంచరించుటయుఁ బ్రసిద్ధము.
మహర్షులరణ్యములయందే యుందురనుటయు సర్వవిదితము.
వాలఖిల్యు లనుమును లఱువదివేలసంఖ్య గలవారనియు
నంగుష్ఠమాత్రశరీరులనియు విందుము కదా. వారెల్ల నొక్క
చోట నుండువారనియుఁ బెద్దలందురు. ఈసర్గమున వాల
ఖిల్యులు వనముల నున్నయట్లు పేర్కొనఁబడినది. [illegible]
లతో వారు నడవులఁ దపోనిష్ఠ నున్నయట్లు తెలియుచున్నది.
అది యసంగత మనరాదు. సాగరతీరమునఁ జనుచున్న రావణుఁ
డొకమఱ్ఱిచెట్టును గాంచెను. అందొక్క మహాశాఖ విఱిగి
నట్టిగురుతు కనఁబడుచుండెను. దానికొమ్మలు నూఱుయోజన
ములు వ్యాపించినవి. అనుభాగము పఠింపఁగనే కొందఱు
విచిత్రమే యిది యనకమానరు. శతశబ్దము విస్తృతిబోధక
మని గ్రహించిన నచ్చెరువున కవకాశమే కలుగదు. కోట్ల
యోజనములయెత్తుగలది హిమాలయమని యుండుతావుల
నిట్లే గ్రహింపవలయును. పంచాస్యము సింహమనఁగా నైదు
మోములు గలదికాదని వెడలుపైన మోముగలదని యట్లు

గ్రహింతుమో యక్షే యిట్టితావులయందును గ్రహించిన నే బాధలును గలుగవుకదా. ఆ మఱ్ఱిచెట్టునందు విఱిగియున్న గుఱుతు కనఁబడియెనని యున్నది. ఆకొమ్మ నాశ్రయించియే పూర్వము వాలఖిల్యులు తపస్సాచరించుచుండిరని చెప్పఁబడినది. ఇదియే సందియమును గల్గించుభాగము. ఈవిషయము మహాభారతమున విస్తరించి చెప్పఁబడినది. దానిం బరిశీలింతము.

"సాగరాంబుపరిక్షిప్తాన్ భ్రాజమానాన్ సహద్రుమాన్,
తమువాచ ఖగశ్రేష్ఠం తత్ర రోహిణపాదపః. ౪౨
అతిప్రవృద్ధస్సుమహా నాపతంతం మనోజవం,
యైషా మమ మహాశాఖా శతయోజన మాయతా. ౪౩
ఏతామాస్థాయ శాఖాం త్వం ఖాదేమా గజకచ్ఛపౌ."

ఆదిపర్వము, ౨౯-అధ్యా.

"స గత్వా పర్వతశ్రేష్ఠం గంధమాదనమంజసా. ౯
దదర్శ కశ్యపం తత్ర పితరం తపసి స్థితం,
దదర్శ తం పితా చాపి దివ్యరూపం విహంగమమ్. ౧౦

... ... ... ...

తతః ప్రసాదయామాస కశ్యపః పుత్రకారణాత్. ౧౬
వాలఖిల్యాన్ మహాభాగాం స్తపసా హతకల్మషాన్,
కశ్యపః:—ప్రజాహితార్థ మారంభో గరుడస్య తపోధనాః. ౧౭
చికీర్షతి మహత్కర్మ తదనుజ్ఞాతుమర్హథ,
ఏవముక్తా భగవతా మునయ స్తే సమభ్యయుః. ౧౮
ముక్త్వా శాఖాం గిరిం పుణ్యం హిమవంతం తపోర్థినః,
తత స్తేష్వపయాతేషు పితరం వినతాసుతః." ౧౯

ఆదిపర్వము, ౩౦-అధ్యాయము.

ఈభాగముంబట్టి పరిశీలింపఁగా సముద్రతీరమున మఱ్ఱిచె
ట్టుండుట స్పష్టము. వాలఖిల్యమహర్షులు దాని కొమ్మయందు
వ్రేలాడుచునుండఁగా గరుత్మంతుఁడు దానిపైఁ బోయి కూర్చుండి
నంతనే యవి విఱిగెను. దాని నోటఁగఱచుకొని గంధమాదన
పర్వతమునఁ దపోనిష్ఠనుండు తండ్రికడ కరుగఁ దలఁచెను. కశ్యప
ముని యావిధ మెఱింగి వాలఖిల్యులం బ్రార్థించి వారిని దొ
లఁగా నొనరింప వారు హిమాలయమునందుఁ దపస్సొనరింపఁ
బోయిరి. రావణాసురుఁడు మారీచునికడకుఁ బోవుచుండఁగ
సాగరప్రాంతారణ్యముల వాలఖిల్యాదిమహర్షులు తపస్సొనర్చుచు
నుండఁగాఁ గాంచెనని రామాయణమునఁ గనంబడుచున్నది.
హిమాలయమునఁ దపస్సొనరింపఁ బోయినవారు తిరిగి యెట్లు
వచ్చిరని కొందఱు ప్రశ్నింతురు. ఈప్రశ్నము సమంజస
ముకాదని తోఁచెడిని. యుగాంతరములయందును గూడ నున్న
తావు మార్పక మునులుండుట కయ్యది [illegible]
సమార్జించిన కాణాచియా. కాదు కాదు. కల్పసర్గారంభ
మున నే యవి కాని మార్పునొందక యట్లేయున్నవని చెప్పు
టయు నొకపొరపాటే యనవచ్చును. భారతమునఁ బేర్కొ
నిన వటవృక్షము రోహిణనామకము. రామాయణమునఁ
జెప్పఁబడినది సుభద్రనామకము. ఇట్లుండఁగా నదియే యిది
యని యెట్లు చెప్పవచ్చును? అనుప్రశ్నము కలదు. మహాత్ములకే
నామాంతరము లనేకము లుండఁగా వృక్షములకేల యుండ
రాదు. అని సమాధానము చెప్పవచ్చును. పురాణాంతరముల
యందు రోహిణమను మఱ్ఱిచెట్టు హిమాలయప్రాంతమున
గలదనియు గరుత్మంతునిచరిత్రమున దానిప్రస్తావనమే కల

వనియుఁ గనంబడిన నేమి సమాధానమని ప్రశ్నింపవచ్చును. ప్రాయికముగా నతిశయోక్త్యలంకారముల కుదాహరణము లెల్లతావులఁ గనంబడును గదా. దానిచే శ్రీరామాయణకథా తత్త్వమున కపకారమేదియుఁ గల్గదనుకొనుచో నే శంకలును గలుగవు.

"కచ్చిత్సుకుశలం రాజన్ లంకాయాం రాక్షసేశ్వర,
కేనార్థేన పునస్త్వం వై తూర్ణమేవ మిహాగతః." ४१

అనునిది మారీచవాక్యము. రావణుని గాంచినంతనే యేదో మహావిపత్తు కలిగియుండునని యతఁడు భావించెను. పూర్వము నా హితోపదేశమున శ్రీరామునితో విరోధింపఁ బూనక మరలిపోయితివి గదా. మరల నీతఁ డేల వచ్చెను? అని యను మానించి లంకయందెల్లరకుం గుశలమా యని ప్రశ్నించెను. మరల నింతలోనే యేల వచ్చితివయ్యా యనియు నడిగెను. శ్రీరామవిరోధమున నీతఁడు రాక్షసనాశము గలుగుటకు హేతుభూతుఁ డగునని యే మారీచునివిశ్వాసమని మన మెఱుంగవలయును. శ్రీరామమహత్త్వమును మారీచుఁడు స్వానుభవముననే యెఱుంగుననుట నిర్వివాదము. దీనిచే భగవత్తత్త్వమును శ్రీరామునిచరిత్రము వెల్లడించెనని యేర్పడియెడి. సహజవిరోధి యగుమారీచుఁడు హిత ముపదే శించుటయే యిందులకు నిదర్శనము.

"సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి కశ్చన,
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్."

అను గీతావాక్యమే యీవిషయమును దెల్పుచున్నది. అట్టి మారీచుఁ డేల యపకారమును శ్రీరామునకుఁ జేసెనని.

ఖ్యాపింపఁబడెను. విరూపనుగాఁ గావింపఁబడెను. అట్టి యాక్రూరుని
గృహించి సచ్చరింపఁబోలు నువగత్తైన సీతను జనస్థానమునుండి
విక్రమించి తేవలయుననియే యున్నవాఁడను. ఆపనికి నీవు
తోడుపడవలయును. నీవు నాతమ్ములు తోడుగనుండఁగా రణా
ంగణమున దేవతలుగూడ లెక్కపెట్టనుగాదే. కాన నీవిపుడు
తోడుపడుము. సమర్థుఁడవని నే నెఱుంగుదును. వీర్యదర్ప
యుద్ధములనీకు సరిపోల్పఁ దగువాఁ డెవ్వఁడు గలఁడు? సర్వో
పాయములు నీహస్తగతములు. మాయాసర్వస్వవేత్తవు. ఇందు
లకే నీకడ కేతెంచితిని. నీవు తోడుచూపఁ దగువిధ మెఱిఁ
గింపవలెను. ఆలకింపుము.

వెండిచుక్కలు పొగసుగాఁ గనంబడ నొకబంగారుజింక
వలె నగపడవలయును. ఆరూపమున నీవా శ్రీరామునాశ్రమము
నను సరిగి జానకియెదుట విహరింపుము. బంగారుజింకగనున్న
నిన్ను నాసీత చూచినంతన దీనిని బట్టియిమ్మని శ్రీరాముని
లక్ష్మణుని నడుగును. వారిరువురు నాయాశ్రమమునుండి
దానిఁ బట్టఁబోవఁగనే యెవ్వరు లేని యా యాశ్రమమునుండి
యేయంతరాయము లేక చంద్రప్రభను రాహువు గ్రహించు
నట్లు సీత నపహరించెదను. అంత రాముఁడు భార్యావిరహ
మునఁ బరితపించి కృశించిపోవును. అవల నతఁడు యుద్ధము
నకు వచ్చినను నిస్సంశయముగా నాతనిం గొట్టుదు. అను నీ
మాటలు విన్నయంతనే మహాబలుండైనను మారీచుఁడు
నోరెండఁగా నడఁకెను. పెదవులెండఁగా నాకుకొనుచు నిలిం
పుండై శోకమునఁ గనంబడుచు నాష్టుఁడై రావణుని
జూచెను. మున్నుదే రామునిపరాక్రమము నాతనికిఁ జెప్పి
యున్నాఁడు కావున రామునిమాట వినఁ జెవిబడఁగాఁ

ద త్తఱంపడుచు నంజలి గీలించి రావణుం గాంచుచు నాతని కి
దనకును హితము కల్గించునట్లు మాటలాడం బూనెను.

మహాశయులారా! ఈభాగమున విశేషాంశములు గలవు. వానిం దెలిసికొందము. రావణుఁడు తన [illegible] గిన ప్రౌఢయే కాని కేవలమూర్ఖుఁడు కాఁడని మహేశ్వర తీర్థు లనువ్యాఖ్యానకర్త భావము. అది [illegible] గోవింద రాజుల భావము. ఉత్తరరామాయణమున [illegible] స్పష్టము కాఁగలదు. కాని నాకాండిది [illegible] కాదని గోవిందరాజులభావ మనవచ్చును. మహాజ్ఞాని యనియే నే నూహించువాఁడను. కాని నామతము ననుసరించియే మహే శ్వరతీర్థులయాశయము నిందు వ్రాయుచున్నాఁడను. రావ ణుఁడు కేవలాజ్ఞుఁడే యగుననువారల కీ రామాయణభాగము బాధింపకమానదు.

"తేన సంజాతరోషేణ రామేణ రణమూర్ధని. ౭
అనుక్త్వా పరుషం కించిచ్ఛరైర్వ్యాపారితం ధనుః,
చతుర్దశసహస్రాణి రక్షసాముగ్రతేజసామ్. ౮
నిహతాని శరైస్తీక్ష్ణైర్మానుషేణ పదాతినా,
ఖరశ్చ నిహతస్సంఖ్యే దూషణశ్చ నిపాతితః. ౯
హతశ్చ త్రిశిరాశ్చాపి నిర్భయా దండకాః కృతాః."

అని కదా మూలము. ఒక్క కఠినవాక్యమైనను [illegible] తీవ్రబాణముల నెల్లర మహాబలు లగురక్కసుల రాముఁడు వధించెను. అనఁగా భావమేమి? రామచంద్రుఁడు తన్ను వధింప నవతరించెనని యెఱింగినవాఁ డనియే కాక మఱేమగును? శత్రువును వంచింపఁబూని తనబంధువులతో వానిం

భోగములు వాఁడును గలఁడా! ఈరీతిగా స్తుతించుట రామాయణ మునం దంతటను జూపట్టును. ఆయాసమయముల దానిని విస్తరించి వ్రాయుదను. దీనింబట్టి రావణుఁడు వివేకసంపన్నుఁ డనియే స్పష్టమగును. సనత్కుమారుఁడు బోధార్థియై వచ్చిన రావణునకుఁ దెలిపినవిధము నుత్తరకాండమున మన మూహింపం తుమేని రావణుఁడు తన చావును గోరియే దుష్కార్యములు చేయఁజొచ్చెననియు, శాపాంతమును నిరీక్షించువాఁ డనియుఁ దోఁచకపోదు. విరోధమున శాపవిముక్తి శీఘ్రముగ నగునని కొందఱు భగవంతుఁ డొసఁగిన వరము. ఈవిషయమును భాగవతమే బోధించును గాదె. భగవత్సేవ చేయువారలు జన్మాంతరమునందు నిందుక జ్ఞానధనము కలవారుగా నందురనియే నా విశ్వాసము. ఉత్తరకాండము వాల్మీకికృతమే కాదనుచో గాయత్రీమంత్రసమ్మిళితము రామాయణ మనుమాట దొలగిపోవును. కాన నుత్తరకాండము వాల్మీకిప్రోక్తమనియే విశ్వసింపవలయును. అందే శ్రీరామసేవాఫలము భక్తులకెల్లఁ గలిగెననువిషయము కలదు. అది లేనిచో లాభ మేమి? ఇంక రావణుఁ డెటులేంగియే శాపవిమోచనార్థ మీ దుష్కార్యము నాచరించెనని మనము గ్రహింపవలయును. దాని ననుసరించి వ్రాసిన పెద్దలభావము నరయుదము.

"పిత్రా నిరస్తః క్రుద్ధేన సభార్యః క్షీణజీవితః. ౧౦

స హంతా తస్య సైన్యస్య రామః క్షత్రియపాంసనః,

దుశ్శీలః కర్కశస్తీక్ష్ణో ఽమూర్ఖో ఽలుబ్ధో ఽజితేంద్రియః. ౧౧

త్యక్తధర్మో హ్యధర్మాత్మా భూతానా మహితేఽరతః."

అని మూలము. ఈమాటలధోరణిం బట్టి చూడఁగా వాల్మీకి

సహజమే కాని దానిచే దుశ్శీలుఁ డనఁబడఁడు. సుశీలుఁడే యగునని సారము. కర్కశః = కఠినుఁడు. అనఁగా శత్రువుల యందు మృదువుగా వర్తింపరాదు. కనుకఁ గఠినుఁడే యగు నని భావము.

"స్వరాష్ట్రే న్యాయవృత్తస్స్యాద్భృశదండశ్చ శత్రుషు,
సుహృత్స్వజిహ్మస్స్నిగ్ధేషు బ్రాహ్మణేషు క్షమాన్వితః." అధ్యా-౭. ౩౨

అను మనుస్మృతివాక్యముచొప్పున శత్రువులవిషయమునఁ గఠినుఁడుగ నుండుట న్యాయమే యని సారము. తీక్ష్ణః = కార్యములయం దలసుఁడు కాఁడని యర్థము. కనుక, అమూర్ఖః = మూర్ఖుఁడు కాఁడు. అలుబ్ధః = పేరాసకలవాఁడు కాఁడు. జితేంద్రియః = ఇంద్రియములకు లోఁబడువాఁడు కాఁడు. త్యక్తధర్మః = క్షత్రియవిరుద్ధధర్మములను వదలినవాఁడని యర్థము. కనుక, అధర్మాత్మా కిమ్ = ధర్మాత్ముఁడు కాఁడా యేమి? ధార్మికుఁడే యని భావము. ఇట్టివాఁడు కనుకనే భూతానా మహితే అరతః = భూతములకు కపకారముచేయు నుత్సాహము లేనివాఁడు. అని రావణుని భావము. మారీచుఁ డీయర్థమును గ్రహింపఁజాలెనా యనరాదు. మృతి సమీపించుచున్నందున రావణునిభావమును విపరీతముగనే గ్రహించెనని మన మెఱుఁగవలయును. ఈయర్థము పై శ్లోకమునకు విరుద్ధము కాదా యందురేమో వినుఁడు.

"యేన వైరం వినారణ్యే సత్త్వమాశ్రిత్య కేవలమ్. ౧౨
కర్ణనాసాపహరణా ద్భగినీ మే విరూపితా."

అని మూలము. విశేషార్థ మిద్ది యని గ్రహింపఁదగు. ఏయమ మూర్ఖ విరోధము లేక కేవల మనస్సు నాశ్రయించి యుండఁగా

దానికర్మమున కనుగుణ మగుఫలము నిచ్చునుగాక నాశ్ర యించి యని భావము. ముక్కుచెవులు కోసి నాతోబుట్టువు విరూపిణిగాఁ జేయఁబడినది. ఈయర్థము ముందు చెప్పఁ బోవు భావమునకు విరుద్ధము కాదా యన్నఁ గాదు. ఎట్లు? అనఁగా

> "తస్య భార్యాం జనస్థానాత్సీతాం సురసుతోపమామ్. ౧3
> ఆనయిష్యామి విక్రమ్య సహాయస్తత్ర మే భవ."

అని కదా మూలము. భార్యాం = తేజోసంబంధురాలు. అనఁగాఁ దేజస్స్వరూపిణి. సురసుతోపమామ్ = దేవతాస్త్రీసదృశ. సుర శబ్దప్రయోగముచేఁ బూజ్యత్వము తోఁచుచున్నది. పూజ్యు రాలగు, సీతామ్ = అయోనిజయగు మహాప్రకృతిని అని భావము. "జనస్థానాద్విక్రమ్య ఆనయిష్యామి." అనఁగా జనస్థా నమునుండి లంకకుఁ దీసికొనిపోయెదను. నేను [illegible]. సనత్కుమారుని హితోపదేశము ననుసరించి భగవంతుఁడగు శ్రీరామునివలన మృతినొంది యథాపూర్వస్థానము నొందఁ గోరి యామహాత్మునిచ్ఛాశక్తియగు ప్రకృతిని [illegible] దేఁ బ్రయత్నించుచున్నాను. నీ వీకార్యమునకు తోడు పడుమా యని రావణునియాశయము. "త్యక్తధర్మః" అను చోట "త్యక్తాః విరుద్ధాః ధర్మాః యేన సః." అని యిట్లు సమాసము చెప్పవలయునని కొందఱు ప్రశ్నించిరి. "జనా ర్దనః" అనుచోట "జనాః శత్రుజనానర్దయతీతి జనార్దనః." అనుట యెట్టిదో యిదియు నట్టిదే యని సమాధానము.

ఈభావముగలవాఁడు కనుకనే రావణుఁడు పోరాట మున కిది కాలముకాదని యెంచి యిట్లు పలుకుచున్నాఁడు.

జేయఁజాలఁడు. అనఁగాఁ జేయఁ జాలఁడని. భగవంతుఁ డాజ్ఞాపించి నంతనే ప్రకృతి సర్వకార్యముల నొనరించును. కనుకనే ప్రకృతిబద్ధుఁ డైనపుడనఁగా రూపమును ధరించినప్పుడని తాత్పర్యము. ఏకార్యమునైనఁ జేయఁబూనును. ప్రకృతి తదంతర్భూత యగునేని భగవంతుఁ డరూపుఁ డగును. అట్టివా నారాధించు టెట్లు? కార్యకారి యోగ్యుఁ డగుట యెట్లు! కావునే ప్రకృత్యుపాసన మావశ్యకమయ్యెను. అనఁగా

"ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా."

అన్న న్యాయము ననుసరించి కల్పితరూపము నెవ్వరికి వారు నొనరించుకొని ధ్యానింపవలయునని సారము. అందరు డొక్కొక్క రూపమును గల్పించుకొనుచున్నారు. ఎల్లరూపము లాపరమాత్మయే కాన నెల్లరకు భక్తులకు ఫలము లబ్బు గును. విగ్రహ మొకటియే కదా, యది యెల్లరి కెట్లు ఫలించును? కనుకనే పామరులకు విగ్రహారాధనము కాని జ్ఞానులకుఁ గాదని మన పెద్దలు తెలిపిరి. వాని కేది యుక్తమో యా రూపమునే యతఁడు కల్పించుకొనును. ఎల్లర కొక్క విగ్రహమునకు నుండు శిలావిగ్రహ మెట్టు లందఱికిఁ బనికివచ్చును.? కనుక రానేరాదు. అను నీవిషయము నీభాగము తెల్పుచున్నది. ఈ భావము ననుసరించియే ఇంద్రునిగూర్చి తపస్సు చేయఁగా నొకముని కతఁడు సకలవిద్యల ననుగ్రహించెనన్న పురాణకథ సుసంగత మగుచున్నది. అనఁగా విద్యాకాంక్షచే నప్పని వా భక్తుఁ డింద్రు నుపాసింపఁగాఁ బరాత్పరుఁ డా యింద్రరూపమున సాక్షాత్కరించెనని మన మెఱుంగవలయును. ఇంద్రుఁడే యైన సకలవిద్యాప్రదాత కాఁజాలఁడు కదా. కావుననే భక్తులు

వారలకు మామూలుకథ యున్నదియే కదా. దానను వారు సంతృప్తులు కావచ్చును. "యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ" అను నానుడిచొప్పున నెట్టివారల కట్టిసిద్ధియే కలుగును.

**"తతస్తయోరపాయే తు శూన్యే సీతాం యథాసుఖం,**
**నిరాబాధో హరిష్యామి రాహుశ్చంద్రప్రభామివ."** ౨౦

అని మూలము. ఇందు రావణుభావము స్పష్టముగాఁ దెలియఁ గలదు. అపాయమనఁగా నెడఁబాటు. రామలక్ష్మణు లాశ్రమము వదలిపోవఁగాఁ బురుషశూన్యముగా నాశ్రమముండఁగా నాకెట్టులైన సుఖమో యట్టుగానే యెట్టి ప్రతిబంధములు లేనివాఁడనై సీత నపహరింతును. రాహువు చంద్రప్రభను హరించినట్లు అని రావణుఁడు పలికెను. ఉపమానముం బరికింపుఁడు. రాహువు చంద్రప్రభ నెట్లు హరించునో యట్లు. అనికదా యతఁడనియె. రాహువనఁగా భూచ్ఛాయయే. చంద్రప్రభను భూచ్ఛాయ హరించుట యెట్టిదో నేను సీతను హరించుటయు నట్టిదే. ఇతరులదృష్టికి భూచ్ఛాయ చంద్రప్రభను మ్రింగి క్రక్కిన ట్లగపడును. అట్లే యితరులకు రావణుఁడు సీత నపహరించినట్లే కనఁబడును. వాస్తవముగ నయ్యది యబద్ధము. అనఁగా నపహరణము లోకదృష్టికే వేద్యము. జ్ఞానులకు నయ్యది గౌరవార్థమనియే తోఁచును. ప్రకృతిని బట్టుకొనిపోవు టెట్లు? భూమజ్యోతిస్సును బట్టుకొనినట్లే అని దీనిసారము. దీనింబట్టి రావణుఁడు సీతావిషయమునఁ గాముకుఁడు కాఁడనియుఁ దన్మూలమునఁగాని కామస్మృతి సంభవింపదని యక్కార్యమునకుం బూనెననియు మనము ఎఱుంగవలయును.

"తతః పశ్చాత్సుఖంరామే భార్యాహరణకర్శితే,
విస్రబ్ధః ప్రహరిష్యామి కృతార్థేనాంతరాత్మనా." ౨౧

అని మూలము. విశేషార్థ మేలాగనిన "రామేభార్యాహరణ కర్శితే" అని యేకవాక్యము. "రామ ఏవేభః తస్య ఆర్యా తస్యాః హరణం తేన హేతునా కర్శితే నాశితే సతి మచ్ఛరీరః రామేణ కృతార్థేనాంతరాత్మనా ఉపలక్షితస్సన్ పశ్చాద్విస్రబ్ధం నిష్కళంకం సుఖం పరమానందసుఖం మోక్షమితియావత్ ప్రహరిష్యామి ప్రకర్షేణాహరిష్యామి ప్రాప్స్యామీత్యర్థః. ఇదమాత్మగతమ్" అని యన్వయము. రామమూర్తియను రాజేంద్రుని పూజ్యురా లగుసీత నపహరించుటచే నా శరీరము కృశింపఁజేయఁబడిన దగుచుండఁగా ధన్యమగు నంతరాత్మగలవాఁడనై పిదప నిష్కళంకముగా ముక్తిని మిక్కిలి పొందుదును. సీతాపహరణ నటనానంతరము నాశరీరము రాముని చే కర్శితము కాఁగా మోక్షమునొందెదను. అని రావణు నభిప్రాయము. ఇదియే సనత్కుమారోక్తహితవాక్యసారము.

"తస్య రామకథాం శ్రుత్వా మారీచస్య మహాత్మనః,
శుష్కం సమభవద్వక్త్రం పరిత్రస్తో బభూవ హ." ౨౨

అని మూలము. మహాత్మనస్తస్య మారీచస్య = అనుచో మారీచునకు మహాత్ముఁ డనువిశేషణము వాల్మీకి ప్రయోగించెను. ఏల? శ్రీరామతత్త్వ మాతఁ డెఱుంగును. కావున మహాత్ముఁడే యతఁ డగును. పుట్టుకచేఁ గ్రూరజాతిఁ జేరినవాఁడైనను దపశ్చరణమున నుత్తముఁ డేలకారాదు? జాతి స్వభావము కొంత యుండవచ్చును. కాని తపశ్చర్య యెట్టి వానినైనఁ బరమపావనునిగా నొనరింపకపోదు. అట్లైనను

ప్రారబ్ధకర్మఫల మనుభవమునకు రాక తప్పదని యీ సూత్రము
మన మెఱుంగవలయును. శ్రీరాముని శౌర్యపరాక్రమములను
నామారీచుఁడు మహాత్ముఁడైనను వానిమూలమున [illegible].
భయము పొడసూపెను. ఏల? రాముని జాతి [illegible] నిలువఁ
జాలదని తోఁచెను. దానిచే భయము కలిగెను. రావణునకుం
గూడ నిఁకఁ గాలము సమీపించుచున్నది యను [illegible]
గల్గెను. ఎంత తపశ్శాలురకైనను దేహాత్మాభిమానము [illegible]
కాకపో దన్నరీతి మన కీభాగము తెలుపుచున్నది. ఇట్టి
దుఃఖము లేనివారే జ్ఞానైకధనులగు పరమహంసలు. సనత్కుమా
రాదులు. తక్కినవారలకే నింతయో [illegible]
యుండకమానదు. ఇట్టు లీభాగము మనకు [illegible]
మును భగవంతునియెడ భక్తులకుంగల్గు [illegible]
దెల్పుచున్నది. కాన నీభాగమును జదివినప్పుడు [illegible]
దుష్టమతి యని దూషింపక యాతని [illegible]
యతఁడేల యిట్టి క్రూరకర్మముచేయఁ [illegible]
మూహింపవలయును. కథామాత్రమునఁ [illegible].
ఇఁకఁ దరువాతివృత్తాంతమును జదివఁ బూనుదము.

మారీచుఁడు రావణునకు హితోపదేశ మొసఁగుట.

* మారీచుఁడు రావణునకు మాటలయందు [illegible]
వాఁడు కాఁడు. మిగులఁ బ్రాజ్ఞుఁడు నేర్పరి యగును. [illegible]
డీరీతిఁ బల్కఁగా నాలకించెను. హితము పలుకనెంచి యిట్లు
చెప్పెను. ప్రభూ! ప్రభువునకుఁ గష్టము [illegible]
కీడు నెంచక యిచ్చకములు పలుకువారు [illegible]

* ఇయ్యది ముప్పదియేడవసర్గమునఁ గలదు.

కారణమునఁ గాదు. తండ్రీ! ఇంద్రియలోలత్వాదిదుర్గుణములు
రామునకు లేవు. అసత్యముల నీవిట్లు పలుకరాదు. రాముఁ
డనఁగా ధర్మస్వరూపుఁడే. సత్పురుషుఁడు. సకలజనులఁ
బాలించువాఁడు. సీతాదేవి పాతివ్రత్యసంపత్సంపన్న. ఆమెను
నీవెట్లు బలాత్కారమున నపహరింపఁ గోరెదవు. సూర్యుని
నుండి తత్ప్రభ నపహరింప శక్యమా? బాణజ్వాలలు [illegible]
ధనుఃఖడ్గములు దారువులు కాఁగా రణరంగమున [illegible]
మారోర్కాఁదరముగాక ప్రజ్వలించు శ్రీ[illegible]లోఁ
బడుట ధర్మము కాదుసుమీ. శ్రీరామదర్శనము [illegible]
యమదర్శనమువంటిది. దాని నేల కోరెదవు? రాజ్యసుఖములు
నేల వదలఁ బూనెదవు? శ్రీరామతేజ మనంతము సుమీ. ఆ
రామచంద్రునిసాయముగల యామహాపతివ్రత నపహరింప నీకు
శక్యము కాదు. శ్రీరామునకా సీతాదేవి బహిఃప్రాణము
వంటిదే. ఆమె యనువ్రత. ప్రజ్వలజ్వలనజ్వాలలను [illegible]
చందమున నామహాతేజోవిరాజితను సీతను [illegible]
కాదు. మహారాజా! దుస్సాధ్యమగు నీకార్యము [illegible]
రణమున రాముని కగపడుదువేని ప్రాణముల [illegible]
చివరయని నమ్ముము. జీవితసుఖరాజ్యములఁ జిరకాలము నిలుపు
కొనఁ గోరుదువేని శ్రీరామున కహితమును జేయఁ దలంప
కుము. ధర్మాత్ముఁడగు విభీషణుఁడు లోనగునాప్తులఁ గూడి
యాలోచించి యావల నేకాంతమున నీవు నాలోచించుకొని
గుణదోషబలాబలముల నిర్ణయించుకొని మేలు కీడు విచా
రించుకొనుచు యుక్తమగునది యెద్దియో దాని నొనరిం
పుము. దాశరథితో యుద్ధము నీవు చేయు టుచితముకాదని
నాకుఁ జక్కఁగాఁ దోఁచుచున్నది. త్రివారము లీమాటనే

చెప్పెద. యుక్తియుక్తము దేశకాలములకుఁ దగిన నా యీ మాటను విశ్వసింపుము.

మహాశయులారా! ఈ భాగమునఁ గొన్ని విశేషములు కలవు. జనులకు జనపతులకుఁ దగిననీతులను మహాకవి వాల్మీకి మారీచునిమాటలవలనఁ దెలిపెను. కాన వాని నెఱుంగుట మంచిది.

**"ప్రత్యువాచ మహాప్రాజ్ఞో మారీచో రాక్షసేశ్వరమ్".** ౧

అని మూలము. "ప్రకర్షేణ జానాతీతి ప్రాజ్ఞః మహాంశ్చాసౌ ప్రాజ్ఞశ్చ మహాప్రాజ్ఞః" అని కదా సమాసము.

**"స్మృతిర్వ్యతీతవిషయా మతిరాగామిగోచరా,**
**బుద్ధిస్తాత్కాలికీ జ్ఞేయా ప్రజ్ఞా త్రైకాల్యగోచరా."**

అన్నసూక్తి జగద్విదితము. త్రికాలజ్ఞానసంపన్నులలో నుత్తముఁడను నర్థమిచ్చువిశేషణము మహాకవి వాల్మీకి మారీచున కొసంగెఁ గదా. ఏల? భగవన్మహత్త్వ మమేయమని యెఱుంగుటయే ప్రాజ్ఞత్వము. సకలోపనిషత్సారభూతజ్ఞాన మదియే కదా. దాని మించినజ్ఞానమే లేదు. కాన మారీచుఁడు జ్ఞానియే యని మన మూహింపం దగును. కనుకనే భగవంతుని స్మరించుచుఁ జూచుచుఁ బ్రాణముల వదలఁగల్గెను. అదియే కదా మహాదృష్టము. రాక్షసస్వభావ మాతనియం దపుడు లేదని మనము నిశ్చయించినఁ దప్పేమి? ఇచ్చో మహాకవి ప్రయోగించిన విశేషణము సార్థకమే.

**"సులభాః పురుషా రాజన్ సతతం ప్రియవాదినః,**
**అప్రియస్య తు పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః."** ౨

అని మూలము. ఈనీతి పంచతంత్రము లోనగు గ్రంథముల

యందుఁ గనంబడుచున్నది. నీతిసారము శ్రీరామాయణమని గ్రహింపవలయు. ఒరులకు మేలుగోరి వారిమనస్సుల కప్పటికి నొప్పికలిగినను గలుగనిమ్మని తెగించి మోమోటములేక పలుకు వారును, చెప్పినది తనమేలుగోరియే యని యెంచి నోపలలఁ దాల్చువారును జగంబున నరుదు. పరమకార్యమని తెలిసి యుండియు నతనికి దాన నష్టము కలుగునని యెఱింగియు నప్ప టికిమాత్ర మాతని రంజింపఁజేయఁగోరి యసత్యము పలుకుచు నీచు లనేకులుందురు. ఆ స్తోత్రములు నిర్వ్యాజములని యాల కించువారును పెక్కండ్రుందురు. అను నీతిని రామాయణము వెల్లడించుచున్నది. ఇదియే పంచతంత్రమున నిట్లున్నది:—

ఉ. "అప్పటి కప్రియంబయి నిజాత్మకు మీఁదటికిం బ్రియంబుగాఁ
జెప్పెడువాక్యముల్ వినును • చిత్తుఁడు నిచ్చకముల్దగించి మేల్
తప్పక చెప్పు నుత్తముఁడు • ధారుణిఁ బుట్టరు పుట్టిరేని య
య్యొప్పెడివారలల్ వదల • కుండు రమాపతి యెల్లకాలమున్."

ప్రకృత మనుసరింతము. రావణా! శూర్పణఖాదులు నీ మేలు గోరినవారు కారు. వారిమాటల నాలకించి వచ్చితివి. తప్పక నీకు ముప్పు గల్గును జుమీ. ఇట్లు నావలెఁ బలుకువారు నీకు వే ఱొకరు దొరకరు. నామాటల నాలకించిన నీకును నాకును మేలు కలుగును. లేనిచో నిరువురకు హాని కల్గును. అను నీతినయమును నెఱింగియే మారీచుఁడు తెలిపెనని "మహాప్రాజ్ఞో మారీచః" అనువాక్యము మనకుఁ దెలుపుచున్నది. తపఃఫల మనఁగా నిదియే కదా. ఈపై వ్రాసినభావము నీ క్రింది మూలము సిద్ధాంతము చేయుచున్నది.

"అపి స్వస్తి భవేత్తాత సర్వేషాం భువి రక్షసాం,
అపి రామో న సంక్రుద్ధో కుర్యాల్లోకమరాక్షసమ్. ౪

అపి తే జీవితాంతాయ నోత్పన్నా జనకాత్మజా,
అపి సీతానిమిత్తం చ న భవేద్వ్యసనం మమ. ౫
అపి త్వా మీశ్వరం ప్రాప్య కామవృత్తం నిరంకుశం,
న వినశ్యేత్పురీ లంకా త్వయాసహ సరాక్షసా." ౬

అనఁగా భావమేమి? సకలరాక్షసులను క్రోధమునొందిన రామమూర్తి వధింపఁ బూనెడననియు, సీత నీవధమునకే పుట్టినదనియు, సీతను మోసపుచ్చుదుర్బుద్ధి నీకుఁ గల్గుట మృతి కొఱకే యనియు, లంకానగరము నీకారణమున రాక్షసగణముతో నీతో నశించుననియు భావము కదా. ఈజ్ఞానము మారీచునకుఁ గల్గియుండకపోయిన నేల పలుకును? వీరల కిద్దఱకు నీజ్ఞానము కలదు. కర్మప్రచోదితులు కావున మనః ప్రకృతి యిచ్ఛానుసారము ప్రవర్తించిరని మన మెఱుంగవల యును. ఈభాగము మనకుఁ గర్మము బలవత్తరమని తేటపఱచుచున్నది. కర్మము బలవత్తరమగుట దానిని మీఱఁ దరము కాదు. దానికి లోఁబడి కార్యములు చేయుచుండవలెను. ఇట్లే సర్వకాలము సాగుచుండ నికఁ దరించు టెట్లని ప్రశ్నింపవచ్చును.

"చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః,
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ. ౫౭
మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి,
అథ చేత్త్వమహంకారా న్న శ్రోష్యసి వినంక్ష్యసి. ౫౮
ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయం త్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా. ౬౧
త మేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత,
తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్." ౬౨

గీత. ౧౮-అధ్యా.

అను నీగీతావాక్యములు పైవ్రాసినప్రశ్నమునకు సమాధాన మొసంగుచున్నవి. కర్మముక్తుఁడు కావలయు ననఁగా నర్థ మేమి? తా నాచరించు విధివిహితకర్మములఫలమును నామీశ్వ రార్పణము చేయుచు నుండుటయే ముక్తలక్షణమనియే యిదా.

“గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః,
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే.” ౨౩

గీ. ౪-అధ్యా.

అను వాక్యముకూడ నీయర్థమునే తెలుపుచున్నది. ఆశ్రయ కాని వేఱొకమార్గమునఁ గర్మమును జయించుట సాధ్యముకాదని సారము తేలుచున్నది. మధ్యవైష్ణవులు కొందఱు నామవేష ధారులు భగవంతు నాశ్రయించినయెడలఁ గర్మమునఁ బడఁ ద్రోయును గాన నాచార్యు నాశ్రయించిన మోక్షము గాని మోక్ష సాధకవాటమును దెఱచి లోపలికిఁ ద్రోసివేయునని వారు మ లగుశిష్యుల కుపదేశింతురు. ఇంతకంటె మూఢులు కలరా! “మత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్.” అని శ్రీకృష్ణమూర్తి యుపదేశించెను. ఇంత దానితో వ్యాసునఁ దిలోదకము లీయఁబడెను గదా. లోకమున నెందఱు మాయావులు కలరు! వీరెల్ల ధనదాసులు గాక మఱే మగుదురు? వీరిముందు మహావిష్ణువు నిలువఁబడవలయును నఁట. చిత్రపటరూపమునఁ గాఁబోలు. లేక పాషాణరూపము ననో. అల్పబుద్ధు లీధనదాసులమాటలను దెలుపఁబోయి వారి నాశ్రయించి సంసారతాపవినిర్ముక్తు లగుటకు మాఱుగా సర్వ స్వనిర్ముక్తు లగుదురు. ఇట్టి మాయావు లెప్పుడు నశింతురో యపుడు దేశము బాగుపడి వాస్తవభక్తులు బయలుదేరుదురు. ఈవిషయము నీక్రిందిమూలము సూచించుచున్నది.

"త్వద్విధః కామవృత్తో హి దుశ్శీలః పాపమంత్రితః,
ఆత్మానం స్వజనం రాష్ట్రం సరాజా హంతి దుర్మతిః." ౭

కామవృత్తుఁ డనఁగా ధనవాంఛాసంపూర్ణకామస్తుఁడు. దుశ్శీలుఁ డనఁగాఁ గపటవర్తనుఁడు. పాపమంత్రియుఁ డనఁగా దుర్వ్యాపారము గలవాఁడు. దుర్మతి యనఁగా నితరుల వంచించువాఁడు. ఇట్టి యాచార్యబ్రువుఁడు తనభాగ్యఫలమును న న్నాశ్రయించినవారలను దానున్నదేశము నశింపఁజేయుచున్నాఁడు. అనఁగా దానున్నదేశమున నిజమగుభక్తిని దూఱుపఱుచున్నాఁడని భావము. దుష్టభావాలునినతని మనము గ్రహింపవలయును. యజ్ఞములకని, అన్నదానమునకని, బ్రహ్మోత్సవములకని, దేవాలయములకని, లక్ష్మీదేవి భూషణములు గోరినది కాన నందులకని, విద్యాభివృద్ధికని ధనమార్జించువార లెందఱో కలరు కదా. సిరిమూలమున వాస్తవముగా నీకార్యములు చేయువారలను ధన మభావ మగుచున్నది. ఇంతకంటె దేశమున కనిష్ట మేమి కావలయును? ఇట్టి యనిష్టములు నశించి భగవద్భక్తి వృద్ధియగుఁ గాక.

"న చ పిత్రా పరిత్యక్తో నామర్యాదః కథంచన,
న లుబ్ధో న చ దుశ్శీలో న చ క్షత్రియపాంసనః. ౮
న చ ధర్మగుణైర్హీనః కౌసల్యానందవర్ధనః,
న తీక్ష్ణో న చ భూతానాం సర్వేషా మహితే రతః. ౯
వంచితం పితరం దృష్ట్వా కైకేయ్యా సత్యవాదినం,
కరిష్యామీతి ధర్మాత్మా తాత! ప్రవ్రజితో వనమ్. ౧౦
న రామః కర్కశస్తాత నావిద్వాన్నాజితేంద్రియః,
అనృతం దుశ్శ్రుతం చైవ నైవ త్వం వక్తు మర్హసి. ౧౧

రామో విగ్రహవాన్ ధర్మ స్సాధు స్సత్యపరాక్రమః,
రాజా సర్వస్య లోకస్య దేవానాం మఘవానివ." ౧౩

అని మూలము. రావణునివాక్యములు గంభీరార్థబోధకములని భావింపక మారీచుఁడు శ్రీరామస్వభావమును వెల్లడించు చున్నాఁడు.

"వృషో హి భగవాన్ ధర్మ స్తస్య యః కురుతే హ్యలం,
వృషలం తం విదుర్దేవా స్తస్మాద్ధర్మం న లోపయేత్."

అను మనుస్మృతివాక్యమునఁ గలయర్థమునే శ్రీరామాయణము బోధించుచున్నది కదా. రాముఁడు దేహముగాఁ గల్గిన ధర్మమనఁగా భావమేమి? భగవంతుఁ డనికియే కదా. కనుక భగవంతుఁడు మర్త్యలోకమున ధర్మపాలన కలుగఁజేయువాఁడు గాపాడ నవతరించెననియే కదా మన మెఱుంగఁదగును? మారీచుఁడు జ్ఞానహీనుఁడని మనము భావింపవచ్చునా! శ్రీరామతత్త్వము నెఱింగినవాఁడే యనియుఁ గర్తవ్యమున నతనికి దోడుపడెననియు మనము నిశ్చయింపవలయును. అట్లు గానిచో భగవత్కార్యము సాగి ధర్మము నిలుపంబడదు కదా. రామాయణము పఠించునపుడు రాక్షసులున్నంతనే కోపమూనక వారిమూలముననే కార్యము సాగి ధర్మము నిలిచి లోకులు సద్వృత్తులగుట కవకాశము కలిగెనని మన మెఱుంగవలయును.

"కథం త్వం తస్య వైదేహీం రక్షితాం స్వేన తేజసా,
ఇచ్ఛసి ప్రసభం హర్తుం ప్రభామివ వివస్వతః." ౧౪

అని మూలము. దీనిమూలమున వాల్మీకిమహాకవి ప్రకృతిపురుషులకుఁ గల యవినాభావసంబంధమును దెలుపుచున్నాఁడు.

ఈ భాగమునుబట్టి సీత మూలప్రకృతి యని శ్రీరామమూర్తి భగవంతుఁడని మనముగ్రహించి తదారాధనమున బద్ధసంకల్పులము కావలయును.

"అప్రమేయం హి తత్తేజో యస్య సా జనకాత్మజా,
న త్వం సమర్థస్తాం హర్తుం రామచాపాశ్రయాం వనే. ౧౮

తస్య సా నరసింహస్య సింహోరస్కస్య భామినీ,
ప్రాణేభ్యోఽపి ప్రియతరా భార్యా నిత్యమనువ్రతా. ౧౯

న సా ధర్షయితుం శక్యా మైథిల్యోజస్వినః ప్రియా,
దీప్తస్యేవ హుతాశస్య శిఖా సీతా సుమధ్యమా. ౨౦

కిముద్యమమిమం వ్యర్థం కృత్వా తే రాక్షసాధిప,
దృష్టశ్చేత్త్వం రణే తేన తదంతం తవ జీవితమ్." ౨౧

అని మూలము. "జనకాత్మజా యస్య యత్సంబంధినీ తత్తేజః తస్య తేజః అప్రమేయం అపరిచ్ఛేద్యం. శ్రద్ధయా దేవో దేవత్వమశ్నుత ఇత్యుక్తరీత్యా సీతాసంబంధేన రామస్య ప్రభావ ఉక్తః. వనే సావధానతయా రక్షణీయప్రదేశే. రామచాపాశ్రయా మితి రామవైభవోక్తిః. ఉభయథాపి సహర్తుం న శక్యేత్యర్థః. జనకాత్మజేతి కులప్రభావాదపి సహర్తుం న శక్యేత్యర్థః" అని గోవిందరాజులు వ్రాసిరి. అయ్యో! పాపము! ఇచ్చట సీతాసంబంధమున రాముని కతిశయము చెప్పఁబడినదని యొప్పుకొనిరి. దీనిభావ మేమి? ప్రకృతిసంబంధము లేని పురుషుఁడే కార్యము చేయఁజాలఁడనియే కదా. ఈమాటయే శ్రీశంకరాచార్యులుగారు తెల్పిరి.

"శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
న చేదేవం దేవో న ఖలు కుశలస్స్పందితుమపి,

అతస్త్వామారాధ్యాం హరిహరవిరించాదిభిరపి
ప్రణంతుం స్తోతుం వా కథ మకృతపుణ్యః ప్రభవతి.''

అని. ఈ యిరువురయాశయ మొక్కటియే. భేద మేమాత్ర మనఁగా మహాలక్ష్మి యన్నమాత్రమున గోవిందరాజులు తృప్తి నొందుదురు. ఏపేరునఁ బిల్చిననేమి? మహాప్రకృతి సర్వవ్యాపిని యని శంకరాచార్యులుగారు. ఈభేదము తప్ప నితరభేదములు గానరావు. "సనే రామచాపాశ్రయాం తాం హర్తుం న త్వం సమర్థః." అని యన్వయక్రమము. చాపశబ్దముచే నేత్రమని గ్రహింపవలయు. ఎట్లనఁగా సౌందర్యలహరియందు శంకరా చార్యులు

"భ్రువౌ భుగ్నే కించిద్భువనభయభంగవ్యసనిని
త్వదీయే నేత్రాభ్యాం మధుకరరుచిభ్యాం ధృతగుణం,
ధనుర్మన్యే సవ్యేతరకరగృహీతం పశుపతేః
ప్రకోష్ఠే ముష్టౌచ స్థగయతి నిగూఢాంతరముమే." ४२

అని. ఆలంకారికులు కూడ

"వాపీ కాపి స్ఫురతి గగనే తత్పరం సూక్ష్మపథ్యా
సోపానాళీమధిగతవతీ కాంచనీ మైంద్రనీలీం."

అని యుదాహరించియున్నారు. కావున రామచాపాశ్రయాం =రాముని నేత్రము నాశ్రయించినది యని యర్థము. అనఁగా పరమాత్మ నేత్రసంజ్ఞచేసిన యంత మహాప్రకృతి ప్రపంచ నిర్మాణమున నుద్యుక్తురా లగునని భావము.

"జగత్సూతే ధాతా హరిరవతి రుద్రః క్షపయతే
తిరస్కుర్వన్నేతత్స్వమపి వపురీశ స్తిరయతి,
సదా పూర్వస్సర్వం తదిదమనుగృహ్ణాతి చ శివ
స్తవాజ్ఞామాలంబ్య క్షణచలితయోర్భ్రూలతికయోః." ౨४

అని శంకరాచార్యవర్యులు వేర్కొనిరి. త్రిమూర్తులు మహా ప్రకృతి కనుసన్నచే స్వస్వకార్యములొనరించినట్లు భగవంతుని కనుసన్నచే మహాప్రకృతి సకలభువననిర్మాణాధికారిణి యగుచున్నదని భావము. ఇట్లే యీచోటునసర్థము గ్రహింపకున్న నింకొకయుంచు

"కథం త్వం తస్య వైదేహీం రక్షితాం స్వేన తేజసా,
ఇచ్ఛసి ప్రసభం హర్తుం ప్రభామివ వివస్వతః." ౧౪

అను మూలము నిరర్థక మగును గదా. మఱియును సీతాస్తనము నందే పూర్వార్ధమునందు

"అప్రమేయం హి తత్తేజో యస్య సా జనకాత్మజా."

అనునదియు నిరర్థక మగును. సీతాసంబంధమున శ్రీరాముని తేజస్సు అప్రమేయ మెలాగున నగును! [illegible] వాక్యము నిరర్థకము కారాదు.

"లౌకికానాం హి సాధూనా మర్థం వా గనువర్తతే,
ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి."

అనుసూక్తి ప్రథితమే కదా. రావణా! శ్రీరాముని కనుసన్నచే సకలకార్యములు చేయఁగల యామహా[illegible] శక్తుఁడవు కావని మారీచుఁడు బోధించెనని యుండునని [illegible] మని మన మెఱుఁగవలయును. తర్వాతిమూలమును గూర్చి మరయుదము. "నరసింహాస్య సింహోరస్కస్య తస్య సా భామినీ ప్రాణేభ్యో ఽపి ప్రియతరా భార్యా నిత్యమనువ్రతా తేజ స్వినః ప్రియా సా మైథిలీ ధర్షయితుం శక్యా దీప్తస్య హుతా శస్య శిఖేవ సీతా సుమధ్యమా." అని యన్వయము. ఇందుఁ గల విశేషార్థ మేమి? ఓ రావణా! రామమూర్తి మనుష్య మాత్రుఁ డనుకొంటివి కాఁబోలు. పొరపాటు [illegible]. నర

సింహాస్య=అనఁగాఁ గార్యముననుసరించి యెంత భయంకరరూప మునైనను దాల్చును జుమీ. సింహోరస్క=స్య = దయారసము ప్రధానముగాఁ గలమనస్సు గలవాఁడైనను శత్రుసంహారము నందు భయానకరసప్రధానమగు నాశయముకలవాఁ డగును. సింహామునంటి సత్త్వముగలవాఁ డనఁగా నేసారము గలదు ? ఇందు రాముని దేహావర్ణన మేల ? ఉరశ్శబ్ద ముపలక్షణవిధిచే హృదయగతభావ మనునర్థము నిచ్చును. ఇది వీని హృదయ మనఁగా సారమని యర్థమును గ్రహించినట్లే యిందుఁగూడ గ్రహింపవలయును. అట్టి పరమేశ్వరునిభార్య. ప్రాణములకంటె నధికురాలు - అనఁగా నిచ్ఛాశక్తి కదా. సర్వకార్యనిర్వహణా ధురీణ యని సారము. ఓజస్వినః ప్రియా=తేజస్వరూపుఁ డగు భగవంతునకుఁ బ్రియురాలు. అనఁగా శ్రీరామునితేజ స్సపా రము. దానిని గాంచినంతనే భస్మ మగుదువు. అట్టి రాము నకుఁ బ్రియురాలు. అనఁగా నాయిరువురు తేజస్స్వరూపము గలవారలని సారము.

> "క్షితౌ షట్పంచాశద్ద్విసమధికపంచాశదుదకే
> హుతాశే ద్వా షష్టిశ్చతురధికపంచాశదనిలే,
> దివి ద్విః షట్త్రింశన్మనసి చ చతుష్షష్టిరితి యే
> మయూఖా స్తేషా మప్యుపరి తవ పాదాంబుజయుగమ్." ౧౪

అని సౌందర్యలహరియందు శ్రీ శంకరభగవత్పాదులు నిర్వ చించిరి.

> "జ్వాలమాలా కులం భాతి విశ్వస్యాయతనం మహత్,
> సంతతగ్ం శిలాభిస్తు లంబత్యాకోశసన్నిభమ్.
> తస్యాంతే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితం.
> తస్య మధ్యే మహానగ్నిర్విశ్వార్చిర్విశ్వతో ముఖః.

తిర్యగూర్ధ్వమధశ్శాయీ రశ్మయ స్తస్య సంతతా,
తస్య మధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః.''

అని శ్రుతియుఁ దెలుపుచున్నది. భగవంతుఁడు భగవతియును తేజ
స్స్వరూపము గలవారనియు నట్టి యోజనకు నెట్లు ఉపాసించు
వనియు నిందలిసారము. మండుచున్న యగ్ని జ్వాలను బట్టుకొనఁ
జాలనట్లని యుపమానము కూడఁ జెప్పఁబడినది. అనఁగా నగ్ని
జ్వాలను బట్టుకొనఁ బూనుటెట్టిదో నీ ప్రయత్నమును నట్టిదే
యని సారము. రణే త్వం తేన దృష్టశ్చేత్ తవ జీవితం గతం
తం = యుద్ధమున నా భగవంతుని కంటఁబడితివా నీయాయువు
పూర్తియైనట్లే యని తెలిసికొనుము.

''ససర్వై స్సచివై స్సార్ధం విభీషణపురోగమైః,
మంత్రయిత్వా తు ధర్మిష్ఠైః కృత్వా నిశ్చయ మాత్మనః.'' ౨3

అని మూలము. విభీషణుఁడు లోనగు మంత్రులం గూడి
యోజించి, వారు ధర్మరతులు గాన వారియాలోచనను విని
ఆమీఁద నీవు కూడ నేకాంతమునఁ గూరుచుండి యోజించి
కార్యము నిశ్చయించుకొనుము. ఇపుడు నీ కీయుపాయ మెఱిఁగించి
నవారు ధర్మనిరతులు కారు. కాన మరల లంకకుం బోయి
విభీషణాదులను గూర్చుకొని యోజించి వారియుపాయం
గనుఁగొని నీవు కూడ మనస్సాక్షిగా నాలోచించి యేమి చేయఁ
జేయఁదగిన దిది యని నిశ్చయించుకొనుమని మారీచుఁ డుప
దేశించెననియే యిందుఁ గల భావము. ఈభావము నీ క్రింది
రామాయణవాక్యమే దృఢపఱచుచున్నది.

''అహం తు మన్యే తవ న క్షమం రణే
సమాగమం కోసలరాజసూనునా,

డును. దేవతలం గాపాడితివి. ఎంతయో నేను సహించగలను. కాని యాతనిం దెగటార్పం దరముగాదు. మీ రింక వేగకుండుడు. బాలుఁడైననేమి. శ్రీరాముఁడు మహాతేజశాలి. కావున నతనిం దోడ్కొనిపోవుడు. నీకు మేలే కలుగఁగలదు. అని రాముని దోడ్కొని ముని తనయాశ్రమమునకుం బోయెను. శ్రీరాముఁ డాయాశ్రమమున ముని యజ్ఞదీక్షబూనఁగాఁ గాపాడుచుండెను. అత్తఱి నాశ్రమమంతయు నయోగ్యములగు మాంసములు లోనగునవి లేకయుండెను. బ్రహ్మచారి వేషమునకు నుచితములగు లక్షణములతో నొప్పు కన్నుల పండువు చేయుచుండెను.

అత్తఱి నేను నల్లమబ్బువలె దేహము కనఁబడఁగా నాభరణములందాల్చి గర్వమునఁ గన్నుమిన్నుఁగానక యావిశ్వామిత్రు నాశ్రమమునకుం బోయితి. ఆయుధధారియైన రాముఁడు చూచుచుండఁగనే యందుఁ బ్రవేశించితిని. నన్నుం జూడఁగనే యతఁ డించుకయుఁ గలఁతనొందక ధనుస్సును మ్రోయించెను. అజ్ఞానమున నేనాతని బాలుఁడను నూహకలుగఁగా లెక్కంపక యాగముఁ జెఱుపఁబూనితిని. శత్రుసూదనుఁడగు నారాముఁడు తీవ్రశరమును బ్రయోగించెను. ఆబాణఘాతమునను శతయోజనములకుఁ దరువాతనుండు సముద్రమునఁ బడితిని. తండ్రీ! రావణా! ఆవీరాగ్రగణ్యుఁడు వధింపనొల్లనందున బ్రదికితిని. సముద్రమునఁ బడఁగనే మూర్ఛిల్లితిని. గంభీరజలములం బడి చాలసేపటి కామూర్ఛ తొలఁగఁగా లంకాపురిం జేరితిని. అత్తఱుణమున రాముఁడు బాలుఁడు. అస్త్రసామర్థ్య మంతగా లేదు. అక్లిష్టకర్ముఁడు. అట్టియాతఁడునను నాయంతటి వానిని బాణమునఁ జిమ్మివైచెను. నాతోడివారలం బొరి

నీప్రాణములు శ్రీరామబాణముల కప్పగించి యమపురిఁ జేరఁ గలవు.

మహామతులారా! ఈభాగమునఁ గల విశేషములం బరిశీలింతము.

> "విశ్వామిత్రో ఽథ ధర్మాత్మా మద్విత్రస్తో మహామునిః. 3
> స్వయంగత్వా దశరథం నరేంద్ర మిదమబ్రవీత్."

అనిమూలము. ఇది రావణునితోఁ దనపూర్వవృత్తమును దెలుపునపుడు మారీచుఁడు పలికెను. ఇందొక సంశయము మనస రింపఁజేయునది కలదు. విశ్వామిత్రుఁడు దశరథుని కడ కరిగి యడిగినవిషయము. అతఁడు చెప్పినయుత్తరము మారీచుఁ డెట్లెఱింగెను? అని కొందఱు ప్రశ్నించి యిట్టిలోపము లనేకములు రామాయణమునఁ గలవందురు. ఇదియొక ప్రశ్నయే కాదు. వీరలప్రవృత్తి నెఱింగిన వాల్మీకియే రామాయణమున నీవిషయముం దెల్పెను. రావణునకు శ్రీరామునిమహత్త్వమును మారీచుఁడు తెలిపినట్లు మనకెల్లరకు బోధించును. ఇందు సుబాహువు ప్రస్తావమే లేదు. రామబలపౌరుషకీర్తనమే యిందుఁ బ్రధానము కాని యప్పుడు జరగినవిషయము నానుపూర్వికముగా నెఱింగించుటకాదు. మహర్షులు చెప్పుకొను చుండఁగా మునివేషముననున్న మారీచుఁడు విని యుండవచ్చును. ఆతొందఱలో రావణునకుఁ గథను వదలకయుండ నతఁడు తెలుపఁబూనఁడు. అది యందులకు సమయముకూడఁ గాదు. ఏవిషయమును దెలుపుట కేచోటు ముఖ్యమో యందే యది చక్కఁగాఁ దెలుపఁబడును. ఇతరస్థలముల నయ్యది సంగ్రహరూపముగా నుండును. కర్ణాకర్ణికగ

కొనవలయును. బాలచంద్రోపమానము నిష్కళంకప్రకాశత్వ ద్యోతకము. 'ఉదితః' అనునది ఆగామ్యాసంపల్లాభద్యోతకము. దండకారణ్యమ్ = అనుటంజేసి లోకమునెల్ల నని భావము. భగవంతుఁ డగురాముఁడు నైజనిష్కళంక తేజస్సుచే స్వపక్షపరపక్షభేదములు లేక యెల్లర వికసింపఁజేయుచుం గనఁబడె నని మారీచునిభావమై యుండు నని మన మూహింపవలయును. శత్రువుగానుండు మారీచునకుంగూడ భావి పుణ్యలోకప్రాప్తిరూపమహాలాభము గలుగఁ జేయువాఁడు కావున శ్రీరాముఁ డానందప్రదుఁడే యయ్యెను. భగవద్దర్శన మెల్లరకు నానందజనకమే. దాని యనుభవము మాత్రము కర్మానుసారము వేఱుగా నుండును. ఇతరులదృష్టికి నప్పటికిఁ గష్టఫలదాయకముగా నుండినను భావిశుభఫలదముగా నని వాస్తవమున కుండును. కావున భగవద్దర్శన మెల్లరకు సత్ఫలప్రదమే యనవలయును. వేఱొకపల్కు సచింప వలసియున్నది.

"సుదుర్దర్శ మిదం రూపం దృష్టవానసి యన్మమ,
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః. ౫౨
నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా,
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా. ౫౩
భక్త్యాత్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున,
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప. ౫౪
మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః,
నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాండవ." ౫౫

గీతా. ౧౧-అధ్యాయము.

ణాపాత్రునిగాఁ దమ్మాశ్రయించినవానిని జేయఁజాలననియు, వేదాదుల నాశ్రయించినవా రెల్లరు నట్టి భక్తిగలవారలై యదియు నొకభగవదారాధనమని గ్రహింపవలయుననియు, నట్టితఱినే యవి సంపూర్ణఫలదము లగు ననియు నీభాగము నుండి మనము గ్రహింపవలయును.

> "మాం తు దృష్ట్వా ధనుస్సజ్యమసంభ్రాంతశ్చకార సః. ౧౭
> అవజానన్నహం మోహా ద్బాలోఽయ మితి రాఘవం,
> విశ్వామిత్రస్య తాం వేది మభ్యధావం కృతత్వరః. ౧౮

అని మూలము. నన్నుంగాంచి శ్రీరాముఁడు తొందరపడక ధనుస్సు సజ్యముచేసెను. అను నీమారీచుని వాక్యము నొక యర్థము కలదు. అసంభ్రాంతః = అనునది గంభీరార్థబోధకము. మునియాగమును బాడుచేయ నరుదెంచిన మారీచునింగాంచి త్వరపడక ధనుస్సును శ్రీరాముఁ డెక్కుపెట్టెను. అనఁగానే శ్రీరాముఁడు సమయోచితజ్ఞానము లేనివాఁ డనియే సామాన్యులకుఁ దోఁచవచ్చును. కాని యందుఁగల విశేషార్థమును గ్రహించిన నది యదృశ్యమగును. శ్రీరామునికంట మారీచుఁడుపడఁగనే యీతని కిది మృతికాలము కాదని గ్రహించి భావికర్మగతుల నెఱింగి మెల్లఁగా ధను స్సెక్కుపెట్టెను. సుబాహుప్రభృతు లప్పటికి రాలేదు. వారు వచ్చినఁగదా త్వరపడవలయును? ఇది యీభాగమునుండి గ్రహింపవలయు. ఇది యాశ్రీరాముని సర్వజ్ఞత్వమును బ్రకటించుచున్నది. ఈ యర్థము మారీచుఁ డెఱింగియే యిపుడు తెలుపుచున్నాఁ డనుట కీక్రిందివాక్య ముదాహరణమగును. "మోహాదహం బాల ఇతి రాఘవమవజానన్" అజ్ఞానమున శ్రీరాముని బాలుఁ డని తిరస్కరించితిని. ఇపు డేమి తోఁచినది. ? భగవంతుఁ

భక్తిశ్శూలిని శక్తిరాత్మదమనే సంసర్గముక్తిః ఖలే
యేష్వేతే నివసంతి నిర్మలగుణాస్తేభ్యో నరేభ్యో నమః."

అని నీతిశతకమున "సంసర్గముక్తిః ఖలే" అనువాక్యముచే వెలిఁబుచ్చిరి. ఈవిషయమే మనుస్మృతియందు

"బ్రహ్మహత్యా సురాపానం స్తేయం గుర్వంగనాగమః,
మహాంతి పాతకాన్యాహు స్సంసర్గశ్చాపి తైస్సహ." ౫౪
అధ్యా-౧౧.

నాలుగు మహాపాపములను దెలిపి తత్సంసర్గమైదవదగు మహాపాపమనుట యది తప్పక చేయరానిదనియే కదా. శ్రీరామాయణము నీతిసారమనుభావము నిది తెలుపుచున్నది. మారీచుఁడు తపస్సానరించి భగవంతుని దర్శించినందున నిట్టినిర్మల జ్ఞానము కలవాఁ డయ్యె నని మన మూహింపవలయును.

## మారీచుఁడు రామమహత్త్వమును రావణునకుఁ దెలుపుట.

* బాల్యమున శ్రీరాముఁ డట్టి యుద్ధసమయమున నెట్లో మన్నించి నన్ను వదలిపెట్టెను. అతనిచేఁ బ్రాయము వచ్చినపిదప సాగినవృత్తాంత మొకదానిం దెలిపెద. చక్కఁగా నాలకింపుము. ఆనాఁడు దెబ్బలుతినిన నేనంతట నూరకయుండక మరలఁ బూర్వవైరమున మృగరూపమును ధరించి యిరువురు రక్కసులంగూడి దండకాటవిం జొరఁబడితిని. మునుల నగ్నిహోత్రముల యొద్దను బుణ్యతీర్థాదులయొద్దను ధర్మకార్యములకు విఘ్న మాచరింపఁ దిరుగుచు సదల్పుచుంటిని. ఋషులం గొందఱం జంపి రక్తపానము చేయుచు మాంస

* ఇయ్యది ముప్పదితొమ్మిదవసర్గమునఁ గలదు.

ములం దినుచుంటిని. గర్వమున విఱ్ఱవీఁగుచుంటిని. ఒకప్పుడు
ముని వేషమున ధర్మకార్యనిరతుఁడగు శ్రీరాముని, మహాభాగ
యగు సీతను లక్ష్మణుని దారసిల్లితిని. వాడి కొమ్ములుగల జింక
వలెఁ గనంబడుచు నానాఁడు రాముఁడు కొట్టిన దెబ్బకు నాగ్ర
హించి వైరమును మఱువక తెలివిలేక యిపుడు డీరాముఁడు
మునివేషధారి గానున్నాఁడు. నన్నేమియు నిపుడు చేయఁజాలఁ
డని యూహించి యీసమయమునఁ జంపఁ దగు నని తలంచి
సర్వభూతహితుఁడగు రాముని ధిక్కరించి యాతని పైఁబడ
నుంకించితిని. ఆరాముఁ డాకర్ణాంతము నారిలాగి మహావేగము
గల మూఁడు వాఁడిబాణములు వైచెను. అవియొక్కసారి
మాప్రక్కఁ బరుగిడెను. ఆతనిశక్తి నెఱింగినవాఁడ నగుటఁ బాఱి
పోతిని. పాఱిపోయిన వారి నా శ్రీరామునిబాణము లించుకేని
బాధింపవు. కాన నాప్రాణములు నిలిచినవి. నాయనుచరు
లిరువురు [illegible] మృత్యువైరి. ఆనాఁ డట్లు ప్రాణ
ములఁ దక్కించుకొని యిఁక నిట్టి దుష్కార్యములు చేయరా
దని నిశ్చయించి తపోనిష్ఠనుండఁబూని యోగాభ్యాసము
చేయుచు నిచ్చోట నున్నాఁడను. ఇప్పటికి నాకన్నులకు
మాత్రము ప్రతిక్షణమునందు నా శ్రీరాముఁడు నారచీరలు
కృష్ణాజినము ధరించి ధనుర్ధారియై యమునిరీతిఁ గనంబడు
చున్నాఁడు. శ్రీరాముఁ డొక్కఁడే ప్రతివృక్షముకడ నిలిచియున్న
ట్లగపడువాఁడు కాఁడు సుమా. సంఖ్యాతీత శ్రీరామరూప
ములు నాకుఁ బొడసట్టుచున్నవి. ఇంతయేల? ఈయరణ్యా
మంతయును శ్రీరామమయముగనే నాకుఁ గనంబడుచున్నది.
ఇది శ్రీరామమాయచేఁ గలిగినది కాదు. ఆతఁడు లేనిచోటను
గూడ రాముఁడే నాకుం గనంబడుచున్నాఁడు. జాగ్రదవస్థ

యందు మాత్రమే కాదు. స్వప్నమునందును రామునినే కాంచుచు నులికిపడుచున్నవాఁడను. శ్రీరామునివలని భీతిచే రేఫము మొదటఁగల రత్నాదిశబ్దములు వినఁబడినంతనే రాముని పేరే వినఁబడునేమో యన్న భయము నాకుఁ గలుగు చుండును. ఆపదమున రెండవయక్షరము మకారపటిగా వినఁ బడినపిదప నాభయము నివర్తించుచున్నది. రామునిమహా త్త్వము నేను జక్కఁగా నెఱుంగుదు. కాన నీవాతని మార్కొనఁదగదు. బలి నముచి లోనగువారిని సహింపఁ జాలును. రావణా! నీకుఁ గల పగఁదీర్చుకొనఁ గోరుదువేని రాముని మార్కొని పోరాడుము. అతి శౌర్యము కాదని తోఁచిన ఖరాదివధమునకు నోర్చుకొని యూరకుండుము. నన్ను బ్రదుకనీయఁగోరుదువే నా శ్రీరాముని వార్త మాత్ర మిటఁ జేయకుము. లోకమునందు ధర్మానుష్ఠానతత్పరులగు సాధువు లనేకులు తాము నిర్దోషులయ్యు నితరుల యనర్థ ముల మూలమున నాశనము నొందినవారున్నారు. నేను గూడ సాధువర్తనము కలవాఁడనై నను నీయనర్థమువలనఁ జత్తును. ఏది యుక్తమని నీకుఁ దోఁచునో యట్లే సత్వర మొన రింపుము. ఆప్రస్తావము నాకక్కఱలేదు. నీపాలబడి నేను మాత్రము రాను. మహాబలపరాక్రమాఢ్యుఁడు సత్యసంధుఁడగు నారాముఁడు రక్కసులకందఱకు యముఁడు కాకపోవునా? పరులకు శ్రమముకల్గించుపనుల నాతఁడు చేయఁడు. మనుష్యులయు మున నపకారము చేసినవాఁ డయ్యెఁ గదా యని తలఁతు వేమో. శూర్పణఖ సీతను జంపఁబూనఁగా రాముఁ డట్లు చేసెను. ఖరుఁడు మార్కొనరాఁగా నాత్మరక్షణ మావశ్యకము గాన ససైన్యముగ నాతని వధించెను. ఈకార్యమునం దాతని యప

రాధ మేమి గలదు? సత్యము పలుకుము. బంధువవగు నీకు హితము నేనుగోరి పలుకుచున్నవాఁడను. దాని నొప్పుకొనవేని యుద్ధరంగమున రామబాణహతుఁడవై సబంధువుఁడవై యసువులఁ బాయఁగలవు.

మహామతులారా! ఈభాగమునఁగల విశేషార్థములఁ దెలిసికొనవలయును.

"ఇదానీమపి యద్వృత్తం తచ్ఛృణుష్వ నిరుత్తరమ్. ౧
రాక్షసాభ్యా మహం ద్వాభ్యా మనిర్విణ్ణ స్తథాకృతః,
సహితో మృగరూపాభ్యాం ప్రవిష్టో దండకావనమ్." ౨

అని మూలము. శ్రీరాముఁ డరణ్యవాసమున కరుదెంచి యించుమించుగాఁ బదియూఁడుసంవత్సరము లైనవని తేలెడిని. ఈ నడుమ మారీచునివార్త లేదు. ఈవిషయమిపు డెట్లు చెప్పఁబడెను? అని సంశయింప నవకాశము కలదు. మారీచునివార్త రాముఁడు వినియున్నవాఁ డని నలుపదిమూఁడవసర్గమునందు

"ఏతేన హి నృశంసేన మారీచేనాకృతాత్మనా,
వనే విచరతా పూర్వం హింసితా మునిపుంగవాః." ౩౮

అను మూలము దెలుపును. శ్రీరామునకు మారీచునివృత్తాంతము మునులమూలమునను స్వానుభవమునను దెలియు ననియుఁ దేలెడిని. ఆసమయముల నావార్తలం దెలుపక యిపు డేల చెప్పవలయు ననరాదు.అది గ్రంథకర్తల యిచ్ఛాధీనము. కథాక్రమమునకు భంగము రాకయున్నంజాలును.

"అగ్నిహోత్రేషు తీర్థేషు చైత్యవృక్షేషు రావణ,
అత్యంతఘోరో వ్యచరం తాపసాన్ సంప్రధర్షయన్. ४
ఋషిమాంసాశనః క్రూర స్తాపసాన్వనగోచరాన్,
తథా రుధిరమత్తోఽహం విచరన్ ధర్మదూషకః. ౬

**ఆసాదయం తదా రామం తాపసం ధర్మచారిణం,**
**వైదేహీం చ మహాభాగాం లక్ష్మణం చ మహారథమ్."** ౭

అని మూలము. అగ్నియుఁ దీర్థములు చైత్యవృక్షములు మును లకుం బ్రియములని యిది తెలుపుచున్నది. పాంథులు విశ్ర మింప మార్గములు కలియుతావుల నిలిపిన వృక్షములు చైత్యము లనఁబడును. అందు వనదేవతలు రుద్రసేవకులు నివ సించియుందురు. మును లందుఁ గూరుచుండి సత్కథాకాలక్షేప ములు చేయుదురు. అత్తఱి వారిని బాధించుట రాక్షసులకుఁ బ్రీతి. ఏల? అనఁగా దేవతల కీసత్కార్యములు బలాభివృద్ధి జనకములు. కావున నాకార్యముల కోర్వక రక్కసులు మును లను బాధింతురని మన మెఱుంగవలయును.

**"యే వృక్షేషు సస్పింజరా నీలగ్రీవా విలోహితాః."**

అని శ్రుతియు బోధించుచున్నది. వృక్షరాజములయందు రుద్రానుచరు లుందురనుట సత్యము కదా. మహాత్ములమాంసు ముల దినువాఁడ నగుచుఁ గ్రూరుఁడనై మహాత్ములను భయ పెట్టుచు ధర్మదూషకుఁడనై చరించుచుండితి నని మారీచుఁడు పల్కెను. తాను దుష్టుఁడ నని చెప్పుకొనునా యని కొందఱు అందురు. ధర్మదూషకుఁడ నని చెప్పుకొనుటయే యసంగత మని కొందఱందురు. తాఁ జేయు కార్యము నీచమైనదని తెలిసి నంతనే దానిని మరలఁ జేయఁగలఁడా యని కొందఱందురు. కాని యీప్రశ్నములన్నియు వెఱ్ఱివారివే యనవలయును. రాక్షసులు తమకార్యములు శాస్త్రసమ్మతములా కావా యని యెఱుంగనంత మూర్ఖులు కారు. విద్వాంసులే. కాని దేవత లపైఁ గలద్వేషమున వారికిఁ దోడ్పడువారలనే బాధింతురు.

క్రూరకార్యములు చేయువా రెల్లరును దమచేయుకార్యములు మంచివని భావించువారు కారు. తెలిసియుఁ గ్రూరకర్మ ఫలముగ నట్టి దుష్కార్యముల నొనరింతురు. మారీచుఁడు తపోనిరతుఁడు. శ్రీరామునిచే మృతినొందఁగలభాగ్యము గలవాఁడు. తపోబలముగలవాఁడైనను గర్మానుసారము వధింపఁబడఁదగినవాఁడు కావునఁ దదనుకూలములగు కార్యములనే చేయుచుండెను. ఎట్టితపస్సు నొనరించినను దత్ఫలము కర్మానురూపముగనే యుండును గాని విరుద్ధముగా నుండఁజాలదని మన మెఱుంగవలయు.

> "సముద్భ్రాన్త స్తతో ముక్త స్తావుభౌ రాక్షసౌ హతౌ,
> శరేణ ముక్తో రామస్య కథం చిత్ప్రాప్య జీవితమ్. ౧౩
> ఇహ ప్రవ్రాజితో ముక్త స్తాపసో ఽహం సమాహితః."

అని మూలము. మూవురు రాక్షసులపై శ్రీరాముఁడు మూఁడువాఁడి నారాచములు వైచెను. నేనవ్వానిశక్తి నెఱింగినవాఁడను గావునఁ బాఱిపోయితిని. వారు నిలిచినందునం జచ్చిరి. ఎట్లో బ్రతికి యిందుఁ దపస్సొనరించుచున్నాఁడను. అని మారీచుఁడు పల్కెను. "ముక్త ఇతి. పలాయితేషు రామశరాప్రవృత్తేరితి భావః." అని వ్యాఖ్య. రాముఁడు వైచిన బాణములు పాఱిపోయినవారిని బాధింపవు. బాణములకుఁ బ్రాణము గలదా? ఏల బాధింపవు? అనఁగా భావమేమి? భగవంతుఁ డేమి సంకల్పించునో యారీతి నా బాణములు పనిచేయును. వాని శక్తియు లేదు. భగవత్సంకల్పమే సకలశక్తులు గలది. అట్లేని శ్రీరామునిసంకల్పము మారీచుఁడు చావరాదు. తప్పఁగల యిరువురు జీవింపరాదు. భావికార్యమున మారీచుఁడు నాకుఁ దోడ్పడఁగలఁడు. వధించుట కదియే సమయము.

అనునదియే శ్రీరాముని సంకల్పము. అని మన మెఱుంగ నగు. దీనిచేత శ్రీరాముని సర్వజ్ఞత్వము తేటపడుచున్నది. ఇందుఁ బరువెత్తినవారిని శ్రీరామబాణము వధింపఁజాలదనునదియే ప్రధానముగా గ్రహింపఁదగినది. ఇప్పట్టున భాషాంతరము నొనరించినవారి విధ మెఱుంగుదము. విమర్శకులను బహుపాత్ర మూనకుఁడని ప్రార్థింతము.

తే. "చాప మెక్కిడి నాయున్న • చాయఁ జూచి
గరుడ మారుత నిస్వన • కలితవజ్ర
సన్నిభాశుగములమూఁటి • సరగ విడువ
నుఱికితిని వాని వేగంబు • నెఱుఁగుకతన." ౬౧౩

క. కావున నే బ్రదికితి నా
తో వచ్చిన వారు వాఁడి • తూపులం దాఁకన్
బో విడిచిరి ప్రాణంబుల
నేవానికి వశము రాము • నెదిరియుం బ్రదుకన్." ౬౧౪

వావిలికొలనువారి రామాయణము.

క. "పరుగెత్తితి శ్రీరాముని
శరము పలాయితుని జంపఁ • జన దనునియతిం
బరఁగుట దద్బాధను గన
కరయంబునఁ బాఱినాఁడఁ • గ్రవ్యాదేశా." ౧౦౦౨

అనునది నారామాయణమునఁ గలపద్యము.

ఇందుఁ జేఁటభారత మన నెద్దియో విమర్శకు లెఱుంగుట తెలంగు. శ్రీరామాయణమునుండి యేయేయర్థములు ముఖ్యముగా గ్రహింపఁదగునో వాని నెఱుంగకయున్న నవేటి ఫలము?

"వృక్షేవృక్షే చ పశ్యామి చీరకృష్ణాజినాంబరమ్. ౧౪
గృహీతధనుషం రామం పాశహస్తమివాంతకం,
అపి రామసహస్రాణి భీతః పశ్యామిరావణ. ౧౫
రామభూతమిదం సర్వమరణ్యం ప్రతిభాతి మే,
రామమేవ హి పశ్యామి రహితే రాక్షసాధిప. ౧౬.
దృష్ట్వా స్వప్నగతం రామముద్భ్రమామి విచేతనః."

అని మూలము. తఱచుగా భగవంతుని దూషించువారు తత్కారణమున నితరులకంటెఁ బాత్రులే యగుదురు. దానియను భావము సాధువులనంటెవి గా దని తోఁచును. లోకదృష్టికిం గ్రూరముగనే తోఁచినను సత్యమరయ నది దయారసఫలమే యని పొడకట్టును.

"సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థితమీశ్వరం,
న హినస్త్యాత్మనాత్మానం తతో యాతి పరాం గతిమ్." ౨౮

అధ్యా-౧౩.

అను సీగీతావాక్యము పైనవ్రాసినయర్థమునే సూచించును. కాని సాధుబుద్ధిచే నట్లు భగవంతుని జూడవలయునని కదా దానిభావము. దుష్బుద్ధుల కెట్లు లది స్థిరపడును? అందు రేని సార్వకాలికభావము కూడ నట్టిదే యగును. ఎందుఁ జూచి నను భగవద్రూపమే కనంబడుటయు నొకపుణ్యవిశేషమే యననలయు. అది లేకయున్న నాస్మరణము తద్రూపదర్శనము కలుగు టెట్లు? కావునఁ బ్రాక్సుకృతవిశేషముననే యది కలు గును. దుష్కర్మఫలముగా భగవంతునియందు వైరము కలు గును. ఫలము సత్కర్మఫలమే యగును. కావున నెవ్విధమునఁ గాని భగవంతుని స్మరించుభాగ్యము తద్రూపమును దర్శించు పుణ్యము కలుగుట తత్కృపాపాత్రతఁ గల్గించుటకే యని మన

మెఱుంగవలయును. నాస్తికులందఱు భగవత్కృపాపాత్రులే యగుదురా యనరాదు. విరోధముగాని భక్తిగాని యాస్తికులకే కుదురుంగాని నాస్తికుల కది యలవడదనుట సత్యము. స్వప్నమునఁగూడ రామరూపమును గాంచి భయంపడుదు నని మారీచుఁడు పల్కెను. భగవంతునివిషయమున స్మృతినొందఁ గలవాఁడు కావుననే యారూపము భీతికరమయ్యెను. అదియే మహర్షులకు మహానందజనకమగుచుఁ గన్పడును. మహాభక్తుఁడగు నర్జునుఁడు

**"రూపం మహత్తే బహువక్త్రనేత్రం**
**మహాబాహో బహుబాహూరుపాదం,**
**బహూదరం బహుదంష్ట్రాకరాళం**
**దృష్ట్వా లోకాః ప్రవ్యథితా స్తథాహమ్.** ౨౪
**దంష్ట్రాకరాళానిచ తే ముఖాని దృష్ట్వైవ కాలానలసన్నిభాని,**
**దిశో న జానే న లభే చ శర్మ ప్రసీద దేవేశ జగన్నివాస."** ౨౫

అని భగవంతునిరూపముం గాంచినపుడు ప్రార్థించెను. ఏల? అనఁగా యుద్ధసమయమున నట్లే కనఁబఱుపవలయు నని యెంచినకారణమున భీతికరముగాఁ జూపట్టెను. ప్రార్థింపఁగనే సౌమ్యముగఁ గనఁబడియెను.

**"దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన,**
**ఇదానీ మస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః."** ౫౧

అని యర్జునుఁడు పలికెను. కార్యమునుబట్టియు భావికర్మఫలములనుబట్టియు భగవద్రూపము కనఁబడుచుండు నని మన మెఱుంగం దగు.

**"అహం తస్య ప్రభావజ్ఞో న యుద్ధం తేన తే క్షమమ్."** ౧౦

అని మారీచుఁడు పల్కెను. "ప్రతాపజ్ఞః" అనక "ప్రభావజ్ఞః" అనుటం జేసి తపోనిష్ఠునుబట్టి శ్రీరామమాహాత్మ్యము నవఁగా నాతని యవతారకారణము నెఱింగె నని తోఁచుచున్నది. ఎట్టిదుష్కర్మునైనను దపస్సు జ్ఞానిగాఁ జేయు నని మనము నమ్మవచ్చును.

"బహవస్సాధవో లోకే యుక్తా ధర్మమనుష్ఠితాః. ౨౦
పరేషా మపరాధేన వినష్టా స్సపరిచ్ఛదాః,
సోఽహం తవాపరాధేన వినశ్యేయం నిశాచర. ౨౧
కురు యత్తే క్షమం తత్త్వ మహం త్వా నానుయామి హ."

అని మూలము. పరులదుష్కర్మమూలమున ధర్మానుష్ఠానతత్పరులగు సాధువులుకూడ నశింతురు. అట్లే నేనుగూడ నీయపరాధమున నశింతును. నీకేది యిష్టమో యట్లు చేయుము. నేను మాత్రము నీవెంట రాను. అని మారీచుఁ డనియెను. దీనిచే మారీచుఁడు దనకుఁ జావు దప్పదనియు రావణుఁడు మృతి నొందుననియు నెఱుంగునని పొడకట్టెడును. సాధువులు పరుల యపరాధములచే నశింతురనునది యుక్తమా యని ప్రశ్నించువారు కలరు. ఎవ్వారుకాని కర్మఫలము ననుభవింపక తప్పించుకొనరాదు. పూర్వజన్మములఁ గొన్ని దుష్కృతములు చేయుటంబట్టియే దుష్టులసంగతి కుదురును. అదియే వారిదుష్కర్మములను దెలుపును. తత్ఫల మనుభవింపక మాను టెట్లు?

"అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః."

అను భగవద్వాక్యము వ్యర్థము కాదుకదా.

"యది శూర్పణఖాహేతో ర్జనస్థానగతః ఖరః. ౨౩

**అతివృత్తో హతః పూర్వం రామేణాక్లిష్టకర్మణా,**
**అత్ర బ్రూహి యథాతత్త్వం కో రామస్య వ్యతిక్రమః.''** ౨౮

అని మూలము. శూర్పణఖమాటల నమ్మి ఖరాసురుఁడు దుర్వృత్తుఁడై రాముని మార్కొనెను. ఇతరుల బాధింపని కార్యము లొనర్చువాఁడైనను శ్రీరాముఁడు వానిని వధించెను. ఇందు శ్రీరాముని యకార్య మేమిగలదో నిజముగా నెంచి పల్కుమా యని మారీచుఁడు ప్రశ్నించెను. దుర్వృత్తులందఱు హతులైరి. నీవు నట్టివాఁడవే యగుదువేని అట్లే యగుదువు. భగవంతుఁ డొరులను బాధింపఁడు. చంపుట బాధాకరకృత్యము కాదా యన్నఁ గాదు. అదియు ననుగ్రహమే యగును ఔషధ మప్పటికి హితముగాకున్నను పిదప మహాశ్రేయమును గల్గించునట్లు భగవత్కృతశిక్షకర్మానురూపమై భావిశుభోదయ హేతువగును. కాన నయ్యది యనుగ్రహవిశేషమే యన వలయు నని మారీచుఁడు తెలిపెను. ఇట్టు లీసర్గమున మహాముని వాల్మీకి మారీచునియుపదేశమూలమున భగవత్తత్త్వ మును దెలిపెను. కర్మసిద్ధాంతమును వెల్లడించెను. కావున మన మీభాగమును బఠించి సత్కర్మానుష్ఠానతత్పరులమగుచు భగ వంతుని సర్వవస్తుస్వరూపునిగాఁ గాంచ నభ్యసింపవలయును. అంతియకాని కొన్నిరూపము లాయనవి కావని మధ్య[illegible]వులు పల్కురీతి ననుసరింపరాదు. ఏరూప మెవ్వానికి సుందర ముగాఁ దోఁచునో యారూపమున నాసర్వవ్యాపకు నారా ధింపవలయు ననియే యిందుఁగలసారము.

ఇట్లు మారీచుఁడు రావణునకు శ్రీరామచంద్రప్రభావ మును బోధించెను. రాఁగలయాపదలనెల్ల నెఱిఁగించెను. తన

చావు తప్పదనియుఁ దెలిపెను. ఈవిషయమునే యధ్యాత్మ రామాయణ మేలాగు బోధించెనని పరిశీలింతము. ఇందు రావణుఁడు రెండుసారులు మారీచునికడ కరిగినట్లు లేదు.

> "కేనేద ముపదిష్టం తే మూలఘాతకరం వచః,
> స ఏవ శత్రుర్వధ్యశ్చ యస్త్వన్నాశం ప్రతీక్షతే.
> దండకేఽపి పునరప్యహం వనే పూర్వవైర మనుచింతయన్ హృది,
>
> ... ... ... ...
>
> రక్ష రాక్షసకులం చిరాగతం తత్స్మృతౌ సకలమేవ నశ్యతి.
> తవ హితం వదతో మమ భాషితం పరిగృహాణ పరాత్మని రాఘవే,
> త్యజ విరోధమతిం భజ భక్తితః పరమకారుణికో రఘునందనః.
> అహమశేషమిదం మునివాక్యతోఽశృణవమాదియుగే పరమేశ్వరః,
> బ్రహ్మణార్థిత ఉవాచ తం హరిః కిం తవేప్సిత మహం కరవాణితత్,
> బ్రహ్మణోక్త మరవిందలోచనం త్వం ప్రయాహి భువిమానుషంవపుః.
>
> ... ... ... ...
>
> అతో న మానుషో రామస్సాక్షాన్నారాయణోఽవ్యయః,
> మాయామానుషవేషేణ వనం యాతోఽతినిర్భయః.
> భూభారహరణార్థాయ గచ్ఛ తాత గృహం సుఖం,
> శ్రుత్వా మారీచవచనం రావణః ప్రత్యభాషత.
> పరమాత్మా యదా రామః ప్రార్థితో బ్రహ్మణా కిల,
> మాం హంతుం మానుషో భూత్వా యత్నాదిహ సమాగతః.
> కరిష్యత్యచిరాదేవ సత్యసంకల్ప ఈశ్వరః,
> అతోఽహం యత్నతస్సీతా మానేష్యామ్యేవ రాఘవాత్.
> వధే ప్రాప్తే రణే వీర ప్రాప్స్యామి పరమం పదం,
> యద్వా రామం రణే హత్వా సీతాం ప్రాప్స్యామి నిర్భయః.
> అతోత్తిష్ఠ మహాభాగ విచిత్రమృగరూపధృక్,

రామం సలక్ష్మణం శీఘ్ర మాశ్రమాదతిదూరతః,
ఆక్రమ్య గచ్ఛ త్వం శీఘ్రం సుఖం తిష్ఠ యథాపురా.

... ... ... ...

మారీచస్తద్వచశ్శ్రుత్వా స్వాత్మన్యేవానుచింతయత్,
యది మాం రాఘవో హన్యాత్తదా ముక్తో భవార్ణవాత్."

అధ్యాత్మరామాయణము, ౬-వ అధ్యా.

రామాయణకథకు దీనికిని ప్రధానాంశమున భేదము కాన రాదు. సనత్కుమారుఁడు రావణున కుపదేశించినదియు నీవిషయమే కదా. మారీచునకు రావణునకుఁ గూడ శ్రీరాముఁ డవతరించిన దెందులకో తెలియుననియే యిందుఁగల సారము. అట్టివారల ప్రవర్తన మెట్లుండునో మన మెఱుంగవలయును.

## రావణుఁడు మారీచు నిర్బంధించుట.

* మారీచుఁడు హితముగా నెన్నివిధములఁ పనసుఁ దెల్పినను మృతినొందఁ దలఁచినవాఁ డౌషధమును గైకొనని యట్లు తదుపదేశమును గ్రహింపక కాలచోదితుండై మాట నిరపాయముగను సుఖావహముగ నుండు మాటలను వేఱుగ భావించి పరుషము నయుక్తము నగునట్లుగా నిట్లు పలికెను. మారీచా! ప్రభుచిత్తమునకు సరిపడని యనుచితార్థమును నాకుఁ దెలిపితివికదా. ఊషరక్షేత్రమున నాటిన బీజములువలె నవి నిరర్థకములు సుమీ. నిష్కారణముగా ఖరాదులఁ జంపిన పాపస్వభావుఁడు కదా శ్రీరాముఁడు. మఱియు మూఢుఁడు. అంతియ కాక మర్త్యమాత్రుఁడు. అట్టి రామునితో సంగర మొనరింపఁదగునా ? సీతాపహరణప్రయత్నమునుండి నన్ను

* ఇయ్యది నలువదియవసర్గమునఁ గలదు.

మరలింప శక్యము నీకుఁ గాదు. అట్టిక్రూరునకు భార్యాపహార
ణామే తగినప్రతీకారము. ఒక్క స్త్రీవాక్యము విని వెంటనే
మిత్ర రాజ్యజనసీజనకులఁ బరిత్యజించి వనములకు వచ్చినాఁడు
కదా రాముఁడు. యుద్ధమున ఖరునిం జంపిన యాఘాతుకునకుఁ
బ్రాణాధికురాలగు భార్యను సీతాబాల నపహరించి బదులు
చేయవలయును నని బద్ధకంకణుఁడ నైతిని. ఈయాశయమును
నెరవేర్చుకొన్నాఁడను. ఇంద్రాదులు రాక్షసులు నొక్కటిగా
వచ్చి యడ్డిపినను దీని మరల్పఁజాలరు. ఈకార్యమున గుణ
దోషములఁ జెప్పుమని నిన్నడిగిన నీవు తోఁచినట్లు చెప్ప
వచ్చును. వృద్ధింగోరుమంత్రి రాజు తన్ను నేదియైన నడిగిన
యపుడె వెంటనే యంజలిబంధించి తోఁచినది తెలుపవలయును.
అడుగనియెడల నాయూహ యిది యని తెలుపరాదు. అహి
తము గాకయుండ విరుద్ధముగాకయుండ మృదువుగ నుపచార
పూర్వకముగను సాధువాక్యముల రాజునెదుట వచింపవలయును.
అట్లుగాక తిరస్కారభావమునఁ బలికిన నది మేలు కలిగించు
నదియైనను సన్మానమును గోరు రాజు దాని నంగీకరింపఁడు.
ప్రతాపనిధులగు భూపాలురు అగ్నీంద్రచంద్రయమవరుణుల
రూపములను ధరించియుందురు. వా రగ్నియందలి యుష్ణ
మును, నింద్రునియందలి పరాక్రమము, చంద్రునియందలి చల్లఁ
దనము, యమునిదండమును, వరుణుని ప్రసన్నతను దాల్చి
యుందురు. కాన వారినెల్ల తఱుల గౌరవించుచు నారాధించుచు
నుండందగును. మారీచా! నీవారాజధర్మముల నెఱుంగక
యజ్ఞానమునే యాశ్రయించి దౌష్ట్యమున నీయింటికి వచ్చిన
రాక్షసేంద్రుని నన్నుఁ గాంచి పరుషములాడఁ బూనెదవా?
ఈకార్యమున గుణదోషములను యుక్తాయుక్తములను నిన్ను

నేనడుగలేదే. నే నొకకార్యము నీకుఁ జెప్పితిని. పరాక్రమ
వంతుఁడవుగాన దానిఁ జేయవలయును. బదులు పలుకరాదు.
ఆకార్యము నాలకింపుము.

మారీచా! వెండిచుక్కలుగలిగిన బంగారుజింకవై సగ
పడుచు నారామునాశ్రమమున కరిగి సీతమ్రోలఁ దిరుగుము.
సీతకు నీపై మిక్కిలి యాదరణము కల్గఁజేయుము. ఆవల నీ
యిచ్చచొప్పునఁ బొమ్ము. స్వర్ణమృగరూపుఁడవగు నిన్నుం
గాంచినంతనే యాజానకి యచ్చెరువంది దానిం దెచ్చి యిమ్మని
రాము నడుగఁగలదు. నిన్నుంబట్టి నారాముఁ డాసీతను వదలి
వచ్చినవెంటనే నీవు దూరముగాఁబోయి శ్రీరామునిమాటయే
యని తోఁచునట్లుగా 'హాసీతా! హాలక్ష్మణా!' యని గట్టిగాఁ
బలుకుము. ఆధ్వని విన్నంతనే సౌమిత్రి యేమియుందోఁచక
సీతయుం బ్రోత్సహింపఁగా రామునిజాడనుబట్టిపోవును. అప్పటికి
నొంటరిగానున్న జానకిం దెచ్చెదను. ఈపని యిట్లు చేసి
యవల నీయిచ్చవచ్చినచోటి కరుగుము. అందులకు నారాజ్య
మున నీకు సగమిత్తును. మృగరూపమున దండకారణ్యమున
కరుగుము. రథమునెక్కి నీవెంట నేనును వత్తును. రాముని
వంచించి జానకి నపహరించి మరల నిన్నుంగూడి లంకకుం
బోవుదు. దీనిం జేయననిన నిన్నిందే వధింతును. బలాత్కార
ముననైన నీచే నీపనిని జేయింతును. రాజప్రతికూలున కెవ్వరికి
నైన సుఖము కలుగదు కదా. నీవు రామునికడ కేగినఁ బ్రాణ
ములు నిల్చిన నిలువచ్చును. నాతో విరోధింతువేని మృతి
మాత్రము తప్పదు. ఇఁక నీవే యాలోచించుకొని యేది
యిందు మంచిదియో యద్దాని నొనరింపుము.

మహాత్ములారా! ఇందును విశేషములు గలవు. పరికింతము.

"మారీచేన తు తద్వాక్యం క్షమం యుక్తం నిశాచరః,
ఉక్తో న ప్రతిజగ్రాహ మర్తుకామ ఇవౌషధమ్." ౧

అని మూలము. రావణునిచిత్తవృత్తిని వాల్మీకి దీనిమూలమున వెల్లడించెను. "చావఁబూనుకొనువాఁడు మందును బుచ్చుకొనని యట్లు" అను సుదాహరణమునుబట్టి యాలోచించిన, మరణమునే కోరుచున్నవాఁడు రావణుండనియు, సీతాహరణము వానికి సాధనమగునని తలంచెననియు, హితమగుమారీచుని వాక్యసముచయము సత్కారణముననే యంగీకరింపకపోయెననియుఁ దెలుచున్నది. రావణుఁడు మూర్ఖుఁడు కాఁడని భగవంతునివలన మృతినొందఁ గోరియే యిట్టు లొనరించె ననియు నిందుఁ గలసారము.

"అప్రతీత్పరుషం వాక్య మయుక్తం కాలచోదితః. ౨
యత్కిలైతదయుక్తార్థం మారీచ మయి కథ్యతే,
వాక్యం నిష్ఫలమత్యర్థముప్తం బీజమివోషరే." 3

అని మూలము. కాలచోదితుఁ డనఁగా "కాలో హి భగవాన్" అన్న న్యాయము ననుసరించియు, "లోకానామంతకృత్కాలః" అను సౌరోపనిషద్వాక్యము ననుసరించియు,

"ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయంత్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా."

అను గీతాశాస్త్రవాక్యము ననుసరించియు నాలోచింపఁగా, భగవంతుఁడు కర్మఫలము ననుభవింప రావణుని బ్రోత్సహింపఁగా నతఁడు తద్వశుఁడై మారీచునిహితవాక్కుల నంగీకరింపక

పోయె నని భావము. కనుకనే యుక్తార్థము నయుక్తార్థము నుగా భావించెను. మారీచా! నీమాట నిరర్థకము సుమీ యని పలుకఁజాలెను. నీ కెంత హితముగా నయ్యది తోఁచినను జవుటి నేల నాటిన విత్తనమువలె నాకది రుచింపదనియెను. అనఁగా నాయందది ఫలింపఁజాలదని భావము. దీనింబట్టి నెట్టన యూహింపఁగ నొక్కవిశేషము తోఁచెడిని. గురువు మంచి శిష్యుని వెదకి యతనిపరిశుద్ధహృదయమునందు మంత్రబీజమును నాటిననే యది ఫలించుననియు, లేకున్న నాయుపదేశము నిరర్థకమనియుఁ దేలెడిని.

"న దేయం పరశిష్యాయ దేయం వత్సరవాసినే."

అన్నసూక్తి ననుసరించి యొకసంవత్సరము పరీక్షించి యతని హృదయక్షేత్రము మంచిదని యెఱింగియే యుపదేశింప వలయు ననియు,

"న శఠాయ న దుష్టాయ నావిశ్వాసాయ కర్హిచిత్."

అను న్యాయము ననుసరించి దుర్వృత్తున కుపదేశింపరాదనియును సిద్ధాంతితమగుచున్నది. మధ్యవైష్ణవాదులు కొందఱు వేష ధారులు ధనార్జనమునకై మంత్రోపదేశము చేయుదురు. వారి హృదయభావము పరీక్షించుటకు నవకాశ మెక్కడిది? రజత ముద్రికను బాదములకడ నుంచినంతనే తమ కనుభవములేక యెందో చూచి వ్రాసికొన్న మంత్రము నుపదేశింతురు. ఈ యిరువుర కయ్యది నరకమునే కల్గించును.

"అనేకగురవస్సంతి శిష్యవిత్తాపహారకాః."

అన్నసూక్తి యెల్ల రెఱింగినదియే కాని క్రొత్తది కాదు కదా. గురువు సచ్ఛిష్యుని సంపాదించి వానిఁ దరింపఁజేయ మంత్రోప

దేశము చేయవలయు. అట్టి సద్గురువును శిష్యుఁడు, అట్టిసచ్ఛిష్యుని గురువు సంపాదించుకొనవలయు ననియు నప్పుడే యయ్యది ఫలించుననియు నిందలిసారము.

రావణమారీచు లిరువురును శ్రీరామప్రభావము నెఱింగినవారే యని స్పష్టమయ్యెను. రావణుఁడు సనత్కుమారుని యుపదేశము నాలకించి తనవధమునకై భగవంతుఁ డెప్పు డవతరించునా యని కోరుచుండెను. ఇపు డావాంఛ నెఱవేఱిన ట్లయ్యె. శీఘ్రమ శరీరనివృత్తికిఁ దగునుపాయము సీతాపహారణమే యని నిశ్చయించుకొనియె. మారీచునితోఁ దనభావ మెఱుకపడకయుండ సంభాషింపఁబూనెను. ఆవాగ్ధోరణిని బరికింపుఁడు. రావణుఁడు కేవల మూర్ఖుఁడనుభావమును వదలి రామాయణమును బఠింపందగు.

> "య స్త్యక్త్వా సుహృదో రాజ్యం మాతరం పితరం తథా,
> స్త్రీవాక్యం ప్రాకృతం శ్రుత్వా వనమేకపదే గతః. ౫
> అవశ్యం తు మయా తస్య సంయుగే ఖరఘాతినః,
> ప్రాణైః ప్రియతరా సీతా హర్తవ్యా తవ సన్నిధౌ. ౬
> ఏవం మే నిశ్చితా బుద్ధిర్హృది మారీచ వర్తతే,
> న వ్యావర్తయితుం శక్యా సేంద్రైరపి సురాసురైః." ౭

అని మూలము. విశేషార్థ మేమనఁగా: "ప్రకృతిసంబంధి ప్రాకృతం. స్త్రీవాక్యం." త్వరపడి పల్కిన దని యర్థము. ఇఁక క్షణమైన నాలస్యము చేయక వెడలవలయునన్న వాక్యమని భావము. దాని నాలకించి యనఁగాఁ దనయవతారఫలమును లోకమునకుఁ గలిగించునది యని యర్థము. దాని నెఱింగి సర్వమును వదలి యడవులఁ జేరెను. ఖరఘాతినః = కఠినాత్ముల

హింసించునట్టి యారామునకుఁ బ్రాణాధికురాలయిన యా జానకి, తవ సన్నిధౌ = నీయెదుట, హర్తవ్యా = అపహరింపఁ దగినదే. అనఁగా మహాప్రకృతి పురికొలుపఁగాఁ బాసు జేయఁ దగిన దిది కదా యని యెంచి పురములోనగువానిని వదలి యడవులకేతెంచిన శ్రీరామునిప్రాణేశ్వరిని దొంగిలికొనిపోగల దను. నీవు చూచుచుండుము. ఈయాలోచనము శతమఖ ప్రముఖదేవతలు కూడ మరలింపఁజాలరు. పగవారగు దేవతలు కూడ నామేలు గోరి వాస్తవ మెఱుంగక యీపని మాను మన్నను మానుకొనను. నాకు రానున్న ఫలమును వారెఱుం గరు కాన వారిమాటలు విశ్వాసపాత్రములు కావు. కాన నీవు నాయానతి నెఱవేర్పుమని రావణుఁడు పలుకుటయే యిందలిసారము.

"దోషం గుణం వా సంపృష్టస్త్వమేవం వక్తుమర్హసి,
అపాయం వాప్యుపాయం వా కార్యస్యాస్య వినిశ్చయే. ౯

సంపృష్టేన తు వక్తవ్యం సచివేన విపశ్చితా,
ఉద్యతాంజలినా రాజ్ఞే య ఇచ్ఛేద్భూతిమాత్మనః. ౧౦

వాక్యమప్రతికూలం తు మృదుపూర్వం హితం శుభం,
ఉపచారేణ యుక్తం చ వక్తవ్యో వసుధాధిపః. ౧౧

సావమర్దం తు యద్వాక్యం మారీచ హితముచ్యతే,
నాభినందతి తద్రాజా మానార్హో మానవర్జితం." ౧౨

అని మూలము. వాల్మీకిమహాముని రావణునివాక్యములమూల మున లోకులకు మాటలాడుపద్ధతిని దెల్పుచున్నాఁడు. ఈ కార్యము నెట్లు చేయుమనుదువని తన్నడిగినయెడలఁ దోఁచి నది చెప్పవలయును. అడుగనిదానిం బలుకరాదు. ఎంతమిత్రున

కైన నడుగనితఱి నాలోచనము తెలుపరాదు. అట్లు తెలిపిన మర్యాదపోవును. అడిగిన నుత్తరము చెప్పవలసినపద్ధతి యెట్టి దనఁగాఁ బ్రతికూలముగాఁ దోఁపరాదు. మృదువుగా నుండ వలయు. హితముగా నుండఁదగు. శుభముగ నుండవలయు. మర్యాదను దెలుపుచుండవలయు. తిరస్కారయుతమయ్యె నేని యది హితమైనను అంగీకరింపరు. ఇది నేర్చుకొనవలసిన విషయము.

''సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాన్న బ్రూయాత్సత్యమప్రియం,
ప్రియం చ నానృతం బ్రూయా దేష ధర్మస్సనాతనః. ౧౩౮
భద్రం భద్రమితి బ్రూయాద్భద్రమి త్యేవ వా వదేత్,
శుష్కవైరం వివాదం చ న కుర్యాత్కేనచిత్సహ. ౧౩౯
క్షత్రియం చైవ సర్పం చ బ్రాహ్మణం చ బహుశ్రుతం,
నావమన్యేత వై భూష్ణుః కృశానపి కదాచన. ౧౩౫
ఏతత్త్రయం హి పురుషం నిర్దహేదవమానితం,
తస్మాదేతత్త్రయం నిత్యం నావమన్యేత బుద్ధిమాన్.'' ౧౩౬
మను. ౪-అధ్యా.

అను సీమనుస్మృత్యర్థమే రామాయణమునందుఁ గలదు. రామాయణము సమయానురూపముగా ధర్మములను బ్రవృత్తి మార్గము లోనగువానిని దెల్పుచుండును. కావున మనము చానింబఠించునపు డట్టివిశేషముల నెఱుంగవలయును. కథ మాత్రము తెలిసికొన్నం జాలదు.

''తస్మాత్సర్వాస్వవస్థాసు మాన్యాః పూజ్యాశ్చ పార్థివాః.'' ౧౩

అని మూలము. ఈయర్థమునే విస్తరించి,

''బాలోఽపి నావమంతవ్యో మనుష్య ఇతి భూమిపః,

> మహతీ దేవతా హ్యేషా నరరూపేణ తిష్ఠతి. ౮
>
> యస్య ప్రసాదే పద్మా శ్రీర్విజయశ్చ పరాక్రమే,
> మృత్యుశ్చ వసతి క్రోధే సర్వతేజోమయో హి సః.'' ౧౧
>
> మను. ౭-అధ్యా.

అను మనుస్మృతి తెలుపుచున్నది. మానవప్రవర్తనముఁ జక్కఁగాఁ జేయుమార్గము లెల్ల రామాయణమునఁ గలవు.

> ''త్వాం తు మాయామృగం దృష్ట్వా కాంచనం జాతవిస్మయా,
> అనయైనమితి క్షిప్రం రామం వక్ష్యతి మైథిలీ. ౧౯
>
> అపక్రాంతే తు కాకుత్స్థే దూరం యాత్వాప్యుదాహర,
> హా సీతే లక్ష్మణేత్యేవం రామవాక్యానురూపకం. ౨౦
>
> తచ్ఛ్రుత్వా రామపదవీం సీతయా చ ప్రచోదితః,
> అనుగచ్ఛతి సంభ్రాంతస్సౌమిత్రిరపి సౌహృదాత్.'' ౨౧

అని మూలము. ఇయ్యది రావణుని స్థిరభావమును దెలుపుచున్నది. భావికార్యము లిట్లు జరగునని రావణుఁ డెట్లు లెక్కించెను? ఒక్కయక్షరమైనఁ దప్పకయుండనట్లే కార్యము సాగును గదా. మూర్ఖుఁడే రావణుఁడైన నట్లే సాగుట కేమి హేతువు? సనత్కుమారునిహితోపదేశము మది నాటుటంజేసి శ్రీరాముఁడు తనకొఱకే యవతరించె నని నమ్మెను. వేదవేదాంగ పారంగతుఁ డగురావణుఁడు తదనురూపముగాఁ బ్రవర్తించెను. బుద్ధిబలమున రాఁగల కార్యగతుల నూహించెను. దీనిం బట్టి యాలోచింపఁగా, రావణుఁడు కాముకుఁడై సీతను గొనిపోవ లేదనియుఁ, దన్మూలమునఁ దనకు మృతి గల్గుననియే కొనిపోయె ననియు మన మెఱుంగవలయును. కనుక రామాయణము పఠించునపుడు కామాంధుఁడే యని భావించి దూషింప

రాదు. "త్వాం తు మాయామృగం దృష్ట్వా" అనునది రావణునియూహను దెలుపును. మోసపుమృగమని చూచి యనఁగా భావమేమి? దానితత్త్వమును జానకి యెఱుంగుననియే కదా. అదెట్టు లందురేమో. "మైథిలీ" యనుపదమును మహాకవి ప్రయోగించెను. మహాజ్ఞానియగు జనకరాజుకూఁతురు. "జాతవిస్మయా" అనునది యీభావమునకు బాధకము కాదాయందురేని కాదు. "జాతవిస్మయేవ" అని యూహింపవలయును. ఆనన్దైన మితి శీఘ్రం=త్వరగా దీనిని దెచ్చియిమ్మని రామునకుఁ దెలుపును. ఈజోస్యము రావణునకుఁ జక్కఁగాఁ దెలియును. త్రికాలజ్ఞుఁడగు సనత్కుమారుఁడు బోధించెను. ఆమహాత్ముని మాట తప్పదన్న నమ్మకము గలుగుటంబట్టి తనమృతిని గోరియే యతఁడు మారీచుని నిర్బంధించెనని మనము తెలిసికొనవలయును. రామలక్ష్మణు లింట నుండరనునంతదనుక రావణుఁడే చెప్పెను. విశేషించి సీతయే లక్ష్మణుని బురికొలుపుననియు వెల్లడించెను.

"ఆసాద్య తం జీవితసంశయ స్తే మృత్యుర్ధ్రువో హ్యద్య మయా విరుధ్య,
ఏతద్యథావత్పరిగృహ్య బుద్ధ్యా యదత్ర పథ్యం కురుత త్తథా త్వం." ౨౭

అని మూలము. శ్రీరామునికడ కరిగితివేని బ్రదుకు సంశయము. పోవకున్న నాచేత మృతి తప్పదు. ఈ రెండువిషయములు చక్కఁగా నూహించి నీకేది హితమని తోఁచునో యట్టులొనర్పుము. అని రావణుఁడు మారీచునకుఁ దెలిపెను. అనఁగా మాయామృగరూపధారివగు మారీచుఁడవని యెఱింగినను శ్రీరాముఁడు శరణాగతపరిత్రాణబిరుదాంచితుఁడు కరుణాసంపన్నుఁడు గాపున నిన్నుఁ జంపక వదలినను వదలును. నేను మాత్రము వదలను జుమీ. కాన మాయిరువురిలో నెవరి

మూలమునఁ జూపుకల్గిన మంచిదో యోజించుకొమ్ము. అనియే కదా రావణుని భావము.

"సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్." ౙ౯

అను గీతావాక్యముచొప్పున భగవంతుఁడు తప్పుచేసినవాఁడు ప్రార్థించినను దండింపక వదలును. ఏలయనఁగా నతనికి విరోధియే లేఁడు. నేనట్టివాఁడను గాను జుమీ. నిన్నుఁ జంపక వదలను. నామనోరథములం దీర్చు శ్రీరామునితోఁ బగగల్గినఁ గాని నాకుఁ దరణోపాయము లేదు. ఇట్టి మహాలాభము నాకుం గల్గనుండఁగా దానికిఁ దోడ్పకయున్న నీకంటె నాకుఁ బగవాఁ డెవఁ డుండును? కాన వదలక వధింతునని భయ పెట్టెను. మారీచుఁడు తనచావు తప్పదని యోఁచింగిన నయ్యది భగవంతునిమూలముననైన మంచిదికదా యని నిశ్చయించుకొని మాయామృగమై రామునాశ్రమమునకే పోవ్పు నను నదియే రావణునిసిద్ధాంతము. ఇట్టివాఁడు మూర్ఖుఁ డనుట కంటె మూర్ఖత్వ మేమి యున్నది? ఈవిషయమున నధ్యాత్మ రామాయణమునఁ గలవిశేష మేమి యని పరికింతము.

"అతః పరంచే ద్యతిక్రించిద్భాషసే మద్విభీషణం,
హనిష్యామ్యసినానేన త్వామత్రైవ నసంశయః.
మారీచ స్తద్వచశ్శ్రుత్వా స్వాత్మన్యేవానుచింతయత్,
యది మాం రాఘవో హన్యా త్తదాముక్తోభవార్ణవాత్.
మాం హన్యాద్యదిచేద్దుష్ట స్తదా మే నిరయో ధ్రువం,
ఇతి నిశ్చిత్య మరణం రామాదుత్థాయ వేగతః." ౬-సర్గము.

అను నీమూలము శ్రీరామాయణార్థమునే తెలుపుచున్నది.

గలిగినఁ గలుగవచ్చును. తదనుభవమునఁ గూడ సాధకుఁడు నిస్పృహుఁడే కావలయు. ఎవ్వని మనస్సున నీశ్వరుఁడు సర్వత్ర నిండియున్నవాఁ డనువిశ్వాసము కుదురునో యతఁడే యోగాభ్యాసమున కర్హుఁడు. శిష్యులం జేర్చుకొని ఛాయా పటములు తీయించుకొనుటకు ముక్కుచెవులును బిగించు కొనువారు కపటయోగులు. వారికి లాభము ధనరూపమే యని యెఱుంగవలయును. మారీచుఁ డిట్టియోగము నభ్య సించుచున్నవాఁడు కావుననే

"యది మాం రాఘవో హన్యాత్తదా ముక్తో భవార్ణవాత్."

అని భావించెను. కావున మారీచుఁడు రావణుఁడు శ్రీరాముఁడు భగవంతుఁ డనియు, దుష్టరాక్షససంహారము కొఱకే యవతరించెననియు, ధర్మము స్థాపించుటయే యీయవ తారఫలమనియుఁ, దమకా పరమేశ్వరునిమూలమున మృతి గల్గుట మేలనియు భావించిరని మనము తెలిసికొనవలయును. ఇఁకఁ దర్వాతికథను బఠింతము.

## మారీచుఁడు కడపటిసారిగా హితము చెప్పఁబూనుట.

* ప్రభుత్వగర్వమున రావణుఁడు తన్నీరీతి నాజ్ఞాపింపఁగా మారీచుఁ డతనింగని కఠినవాక్యములొప్ప నిట్లనియె. రావణా! నీకు నీసంతతికిని మంత్రులకు వినాశమును గల్గింపఁ బూని యేపాపాత్ముఁడు నీ కీయుపాయమును దెలిపెను. నీసుఖము నెవఁడు చూడఁజాలకపోయెను. మృత్యుద్వారమే యనఁదగు నీదుష్కార్యము నీమది కెక్కున ట్లెదుష్టుఁడు తెలిపెను? పాప

* ఇయ్యది నలువదొకఁడవసర్గమునఁ గలదు.

షము లేనివా రెవ్వరో రాక్షసులు నీకుఁ బగవారు కలరు. సంది
యమిందు లేదు. బలవంతుఁ డగు శ్రీరామునకుఁ జిక్కి నీవు
నశింపవలయునని యే వారు కోరిరి. కేవలవిరోధి యిట్లు చేయఁ దల
చునా? ఆవిరోధులలో మిక్కిలి క్షుద్రబుద్ధి గలవాఁడే యిట్లు
చేయును. వాఁ డెవ్వఁడో తెలుపుము. నీ ప్రయత్నమున నీవే
నశింపవలయు నను కోరికచే నీకు నహితమును గోరువాఁ డెవ్వఁ
డో నీ కీ యాలోచనము చెప్పెను. వానిం జెప్పుము. రావణా!
లోకమునకు శాస్త్రమునకును విరుద్ధమగు త్రోవఁ ద్రొక్కిన
నిన్ను మంత్రు లెవ్వరు కాని నివారింపకున్నవారే. ఏల? అట్లఁ
బూనకయున్నందున వారెల్ల వధ్యులే. వారిఁ జంపవేల?
రాజు స్వేచ్ఛాప్రవర్తకుఁడై దుష్పథములఁ బ్రవర్తింపఁ బూ
నినయెడల సాధుమతు లగు మంత్రు లాతని సర్వథా నిగ్రహింప
వలయు. వారేల యాపనికిఁ బూనరు? జయశీలురలో నీవ
యగ్రగణ్యుఁడవు. రాజు నిర్దోషిఁడై సుగుణశోభితుఁ డగునేని
అతనిమంత్రులకు ధర్మకీర్తులు గలుగు. రాజు దుష్టుఁడగునేని
మంత్రులకు ధర్మకీర్తులు గలుగవు. ఒక్క మంత్రులకే కాదు దుష్ట
ప్రభువుమూలమున జనులు కూడ వ్యసనములపాలై యుందు
దురు. ధర్మ జయములకాధారము ప్రభువే యగును. కావున
సర్వథా రాజు నెల్లరును గాపాడవలయును. క్రూరుఁడు గాని
ప్రజాప్రతికూలుఁడుగాని, అజితేంద్రియుఁడు కాని, రాజ్యమును
బాలింప నర్హుఁడు కాఁడు. పాటవహీనుఁ డగు సారథి తోలఁగాఁ
గుఱ్ఱములు నిమ్నోన్నతప్రదేశముల వేగముగాఁ బోవును
నతనితోడను గూలుచందమునఁ గ్రూరోపాయములఁ బ్రయో
గించుమంత్రులు సమర్థత లేక తమ యాలోచనముల నాలించు
రాజుతోడ నశింతురు.

రాక్షసేశ్వరా! ఈలోకమునందు నీతిమార్గమునం దాసక్తిగలిగి ధర్మము నాచరించుసాధువులు పరుల నమ్ముకొని వారల యపరాధములమూలమునఁ దారు సపరివారముగా నశించిరి. మేషములు విరోధియు ఘాతుకస్వభావము గలనక్క పరిపాలనమునకు లోఁబడునేని క్రమముగా నశించురీతిఁ బ్రజలకు విరోధియు దుష్టుఁడు నగురాజు నేలుబడికి లోఁబడినవారు క్షీణింతురు. రాజా! క్రూరుఁడవై విషయలోలుఁడవై యుండు నీవు రాజవు కాఁగా రక్కసులందఱు నశింపకమానరు సుమీ. దైవికముగా నాకీకార్యము నీవిపత్తు గలిగినవి. వలయునని నేను దెచ్చిపెట్టుకొనిన వివి కావు. కాన నాయొక్కనినాశము నకు వగవఁ బనిలేదు. నీవనఁగా దీనిని బుద్ధిపూర్వకముగాఁ దెచ్చిపెట్టుకొన్నవాఁడవు. సబాంధవముగా నీవు నశింతువు కదా. కనుక నిన్నుఁ గూర్చియే దుఃఖింపవలసి యున్నది. శ్రీరాముఁడు నన్నుఁ జంపినపిదప వేగముగా నిన్నుం బొలియఁ జేయును. నీమూలమున నేను శ్రీరామునిచేఁ జచ్చుటం జేసి ధన్యుఁడ నయ్యెదను. రామదర్శనమాత్రమున నేను మృతినొందిన ట్లే నిశ్చయింపుము. సీత నపహరించినయంత నీవును సపుత్ర బాంధవముగా నశింతువు. ఇది యెఱుంగుము. నన్నుం గూడి పోయి యాశ్రమమునుండి సీత నపహరింతువేని నీవిఁక బ్రదికి యుందు వనుట కల్ల. నేను నంతియ. లంకమాత్రము నశింపక యుండునా? అదియు నశించును. రాక్షసు లంతియ. నీమేలు గోరియే యింతగా నొక్కి చెప్పుచున్నాఁడను. నామాట మంచి దని యూహింపక యున్నాఁడవు. ఆయుస్సు నశించుకాలమున మృతి సమీపింపఁగాఁ బ్రాణులు శవములే యగును. శవముల వలె వారును మిత్రవాక్యములు హితములని యాలకింపరు.

అని యాదరణము విచారము కలుగ మారీచుడు రావణు
నకు హితము చెప్పెను.

మహాశయులారా! దీనితో మారీచునుపదేశము పూర్తి
యగును. ఆవల శ్రీరామకార్యము సాగును. ఇందేమేని విశేష
ములు కలవా యని విమర్శింతము.

"కేనాయ ముపదిష్టస్తే వినాశః పాపకర్మణా,
సపుత్రస్య సరాష్ట్రస్య సామాత్యస్య నిశాచర. 2
కస్త్వయా సుఖినా రాజన్నాభినందతి పాపకృత్,
కేనేదముపదిష్టం తే మృత్యుద్వారముపాయతః." 3

అని మూలము. మారీచుడు రావణుని నాశ మెఱిగెనని
యీమూలము తెల్పుచున్నది. సాధువులతోడి విరోధము
సపుత్రమంత్రిబాంధవరాష్ట్రముగ నశింపఁజేయునని యతఁడు
నమ్మెను. క్రూరరాక్షసునకీ యూహలు కల్గునా? పూర్వజన్మ
మున నతని కాజాతియందుఁ బుట్టుక కల్గెను గాని యదుష్కర్మ
ఫలానుభవము పూర్తియయ్యెను. సత్కర్మఫలానుభవకాలము
సమీపించెను. కావుననే యిట్టి హితోపదేశ మొసరించెను.

"సతాం హి సందేహపదేషు వస్తుషు
ప్రమాణమంతఃకరణప్రవృత్తయః."

అనుసూక్తి వ్యర్థము కాదు కదా. దుష్టబుద్ధి యగువాఁడును
సత్కర్మఫలము లనుభవించుకాలము దాపురించు నప్పుడు సాధు
మతియే యగును. దీనింబట్టి లోకమున దుష్టులనఁబడువా
రెల్లవారును దుష్కర్మఫలానుభవకాలమున దుష్టులు గనఁ
బడుదురనియు, వారే సత్కర్మానుభవకాలమున సజ్జనులు గనఁ
బడుదురనియు మనము నమ్మవచ్చును.

"అమంత్ర మక్షరం నాస్తి నాస్తి మూలమనౌషధం,
అయోగ్యః పురుషో నాస్తి యోజకస్తత్ర దుర్లభః."

అను నీతిశాస్త్రవాక్యము సిద్ధాంతమే యగును. దుష్కార్య ములుచేయువారు సర్వకాలము దుష్టు లనఁబడరు. వారే మంచికార్యము లొనరించి సజ్జనులగుదురు. దీనింబట్టి దుష్టత్వ సాధుత్వములు కర్మాధీనములే యనఁదగును.

"న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్,
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః." ౫

అను నీగీతాశాస్త్రవాక్యము పైని వ్రాసినభావమునే సూచించె డిని. ఇది సామాన్యసిద్ధాంతము. విశేషసిద్ధాంతము కలదు.

"న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా,
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే. ౧౪
ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః,
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతం." ౧౫
అధ్యా-౪.

అనునవియే విశేషసిద్ధాంతము. ఈఘట్టమున నీరెండవది పనికి రాదు. కర్మసిద్ధాంత మెంత బలవత్తరమో మన కీభాగము తేటపఱచుచున్నది. ఒక్కకార్యము నెఱవేఱుటకై యెందఱినో ప్రోత్సహించుచు నందఱిమూలమున నాయొక్కమహాకార్య మును గర్మము సాధించును. ఆకార్యమున మేలో కీడో యనుభవింపఁ గలవారలంద ఱొక్కప్రక్కనఁ జేరుదురు. ఇరుపక్షములుగా నుండఁగా నొకపక్షమునకు మేలు వేఱొక పక్షమునకు హానిరూప నుగులాభము కలుగును. లోకు లొకపక్షమువారి నాక్షేపింతురు. కాని యాపక్షమే లేకున్నఁ

బాపకర్మములు చేయరాదన్న నీతి కుదాహరణము దొరకక పోవును. కనుకనే సాధువు లేపక్షమును దూషింపరు. మారీ చాదులు లేకున్న ధర్మస్థాపనము చేయుటకు నధర్మము నశింపఁ జేయుటకు భగవంతున కవకాశ మెక్కడిది? కర్మబద్ధ మీ ప్రపంచమనుటయే సిద్ధాంతము.

"అమాత్యైః కామవృత్తో హి రాజా కాపథమాశ్రితః,
నిగ్రాహ్యస్సర్వథా సద్భిర్న నిగ్రాహ్యో నిగృహ్యసే. ౭
ధర్మమర్థం చ కామం చ యశశ్చ జయతాంవర,
స్వామిప్రసాదాత్సచివాః ప్రాప్నువంతి నిశాచర. ౮
విపర్యయే తు తత్సర్వం వ్యర్థం భవతి రావణ,
వ్యసనం స్వామివైగుణ్యాత్ప్రాప్నువంతీతరే జనాః. ౯
రాజమూలో హి ధర్మశ్చ జయశ్చ జయతాంవర,
తస్మాత్సర్వాస్వవస్థాసు రక్షితవ్యా నరాధిపాః. ౧౦
రాజ్యం పాలయితుం శక్యం న తీక్ష్ణేన నిశాచర,
న చాపి ప్రతికూలేన నావినీతేన రాక్షస." ౧౧

అని మూలము. రాజు తనకుఁ దోఁచినట్లు ప్రవర్తింపరాదు. కుమార్గమున నడువరాదు. అట్లు వర్తించురాజును మంత్రులు నిగ్రహింపవలయును. అనఁగా రాజ్యపాలనార్హుఁడవు కావని తొలఁగింపవలయును. ధర్మార్థకామములు యశస్సు ప్రభువుమూలమున సిద్ధించును. నాల్గవపురుషార్థ మగుమోక్షము మాత్రము స్వాయత్తమే. అనఁగా భావమేమి? ధర్మార్థ కామము లనుమూఁడును ముక్తికి సాధనములు కావలయు ననియే. దానిని బాధించునవిగా నుండరాదు. ధర్మము నాచరించుట, అర్థము నార్జించుట యనునవి రెండును గామము

నరికట్టవలయును. అపు డది ధర్మార్థయుక్తమగును. దానిచే ముక్తికి సాధనమగుప్రవృత్తి యలవడును. అట్లు గానిచో నెంతశ్రమపడినను ముక్తి కుదురదు. వేదాంతవాక్యపాఠము నిరర్థక మగును. ధర్మార్థకామములు సముచితములు గావలయు నన్న జితేంద్రియుఁడు కావలయును. అది యోగాభ్యాససాధ్యము. అట్టివానికే ముక్తి కరతలామలకము. అది యభావ మగునే నియ్యది యత్యంతాభావమగుననియే యిందలిసారము. "స్వామివైగుణ్యాత్ ఇతరే జనాః ప్రాప్నువంతి" అనుచో విశేష మేమనఁగా: నడిపించువాఁడు రాజుకదా. అతఁ డవగుణుఁ డయ్యెనేని జనులందఱు నట్టివారలే యగుదురు. "కారణగుణాః కార్యే సంక్రామంతి"యనున్యాయము క్రొత్తది కాదు. కనుకనే

"తమాహు స్సంప్రణేతారం రాజానం సత్యవాదినం,
సమీక్ష్యకారిణం ప్రాజ్ఞం ధర్మకామార్థకోవిదం. ౨౮
తం రాజా ప్రణయన్ సమ్యక్ త్రివర్గేణాభివర్ధతే,
కామాత్మా విషమః క్షుద్రో దండేనైవ నిహన్యతే. ౨౯
శుచినా సత్యసంధేన యథాశాస్త్రానుసారిణా,
ప్రణేతుం శక్యతే దండస్సుసహాయేన ధీమతా. ౩౦
స్వే స్వే ధర్మే నివిష్టానాం సర్వేషామనుపూర్వశః,
వర్ణానా మాశ్రమాణాం చ రాజా స్పృష్టోఽభిరక్షితా. ౩౫
ఇంద్రియాణాం జయే యోగం సమాతిష్ఠే ద్దివానిశం,
జితేంద్రియో హి శక్నోతి వశే స్థాపయితుం ప్రజాః. ౪౪
మౌలాన్ శాస్త్రవిదశ్శూరాన్ లబ్ధలక్షాన్ కులోద్భవాన్,
సచివాన్ సప్తచాష్టౌ వా ప్రకుర్వీత పరీక్షితాన్. ౫౪

త్రైస్యార్థం చింతయేన్నిత్యం సామాన్యం సంధివిగ్రహం,
స్థానం సముదయం గుప్తిం లబ్ధప్రశమనాని చ. ౫౬
నిత్యం తస్మిన్ సమాశ్వస్తః సర్వకర్మాణి నిక్షిపేత్.
తేన సార్థం వినిశ్చిత్య తతః కర్మ సమాచరేత్. ౫౭
అమాయయైవ వర్తేత న కథంచన మాయయా,
బుద్ధ్యేతారిప్రయుక్తాం చ మాయాం నిత్యం సుసంవృతః." ౧౦౪
మను. ౭-అధ్యా.

అను నీమనుస్మృతివాక్యములఁ గలభావమే రామాయణభాగ మునఁ దెలియనగు. అనఁగా రాజప్రవర్తనము ననుసరించియే ప్రజలప్రవర్తన ముండుననియు, నట్లగుటంజేసి మంత్రులందఱు రాజు దుష్ప్రవర్తకుఁడు గాకయుండఁ జూచుచుండవలెనని యు, సకలధర్మములు శాస్త్రప్రతిపాదితములుగనే యుండ వలయుననియు, మానవబుద్ధి యల్పముగాన నుదారబుద్ధులగు మహాత్ముల వాక్కులభావమును దెలుపు శాస్త్రములనాలో చింపవలయుననియు, మహాత్ములనఁగా

"లౌకికానాం హి సాధూనా మర్థం వాగనువర్తతే,
ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి."

యన్నయట్లు సిద్ధవాక్కులు గలవారలే యనియు, గాంభీర్యాను కూలముగా మాటలాడువారు సామాన్యులే కాని మహాత్ము లేకాలమునను గాఁజాలరనియు భావము. అట్టిమంత్రులు నీకుఁ గలిగియుండియు నిట్టి దురాలోచనము చేయు నిన్నేల యుపేక్షించినట్టు కున్నవారో తెలియఁజాలకున్నాఁడనని మారీచుఁ డాక్షేపించె నని ప్రకృతకథానుబంధము. ఈభాగము లౌకికవిషయమును గూడ సూచించుచున్నది. రాజప్రవృత్తి ననుసరించి ప్రజల

ప్రవర్తనము కుదురునని కదా యిందుఁ జెప్పఁబడినది. ఇష్ట దేవతాస్వభావమే ఉపాసకున కలవడును. మహోగ్రప్రకృతి కలుగునట్లుగా దేవతను భావించి యుపాసించిన నట్టిప్రకృతియే సాధకున కలవడును. శ్రీరాము నుపాసించువారు "క్రోధదుర్నిరీక్ష్యుఁడై రావణసంహారముచేయ నుద్యమించు వీరరాముఁడు నాకార్యము నెఱవేర్చుఁగాక" అనునర్థముగల ధ్యానశ్లోకము నేర్చుకొని యాయర్థమునకుఁ దగినట్లున్న రూపముననే రాముని ధ్యానించి మంత్రజపముచేసిన భ్రమరకీటన్యాయము ననుసరించి యాసాధకునిచిత్తవృత్తియు రౌద్రమగును. కావుననే ఫలాభిసంధిరహితముగా నుపాసింపవలయునని పెద్దలు శాసించిరి.

> "త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః,
> కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః." ౨౦

అని భగవంతుఁడు గీతాశాస్త్రమునందుఁ దెలిపెను. ఫలము గోరనపు డేరూపమైనను శాంతమే యగుచు, భావనయే కార్యకారిణి యగుఁగదా. కనుక నుపాసకుఁడు తపఃఫలమును భగవదర్పణముచేయుచు భగవత్ప్రసాదసిద్ధికొఱకని సంకల్పించిన యెడలఁ దప్పక యది ఫలించును. మఱియుఁ దద్దేవతాభిన్నమేదియు లేదనియు(అనఁగాఁ బరాత్పరుఁడా రూపమున వెలసినట్లు భావించుచునని సారము.) నుపాసింపవలయు. సర్వాంతర్యామి యగుమహాతత్త్వమే యుపాసకుని భావనాబలమున "ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా" అన్న ప్రమాణము ననుసరించి యాతని కారూపముసే ధరించి ప్రత్యక్ష మగును. కావున సాధకుఁడు భేదబుద్ధిని మాని యుపాసింపవలయు ననునభిప్రాయ మీభాగమునుండి మనము

గ్రహింపవచ్చును. గ్రహింపవలయునని సిద్ధాంతము కాద నియుఁ గొందఱు గ్రహింపవచ్చును.

"స్వామినా ప్రతికూలేన ప్రజాస్తీక్ష్ణేన రావణ,
రక్ష్యమాణా న వర్ధంతే మేషా గోమాయునా యథా. ౧౪
అవశ్యం వినశిష్యంతి సర్వే రావణ రాక్షసాః,
యేషాం త్వం కర్కశో రాజా దుర్బుద్ధి రజితేంద్రియః. ౧౫
తదిదం కాకతాళీయం ఘోరమాసాదితం మయా,
అత్రైవ శోచనీయస్త్వం ససైన్యో వినశిష్యసి. ౧౬
మాం నిహత్య తు రామశ్చ న చిరాత్త్వాం వధిష్యతి,
అనేన కృతకృత్యోఽస్మి మ్రియేయమరిణా హతః. ౧౭
దర్శనాదేవ రామస్య హతం మా ముపధారయ,
ఆత్మానం చ హతం విద్ధి హృత్వా సీతాం సబాంధవం. ౧౮
ఆనయిష్యసి చేత్సీతా మాశ్రమాత్సహితో మయా,
నైవ త్వమసి నాహం చ నైవ లంకా న రాక్షసాః." ౧౯

అని మూలము. "యథా మేషా గోమాయునా రక్ష్యమాణాః న వర్ధంతే ప్రతికూలేన స్వామినా తథా ప్రజా న వర్ధంతే" అని యన్వయము. క్రూరుఁడు న్యాయప్రతికూలుఁడును నగు రాజు రక్షింపఁగా నుండు ప్రజలు నశింతురు. నక్క రక్షించుచున్నదిగా నుండఁగా దాని యేలుబడిలో నుండు మేఁకలు నశించునట్లు, మేషములఁ జంపుట నక్కకు సహజగుణమని ప్రసిద్ధి. ఇట నక్క యనఁగా "తోఁడేలు" అని గ్రహించుట మంచిది. తోఁడేలును పెద్దనక్క యనుట ఆబాలగోపాలవిదితము. రెండు నొక జాతికిం జేరినవియే. నీవు రాజవుగా నుండఁగా రాక్షసులు నశింపఁగలరని మారీచుఁడు రావణునకు చెప్పె

ననుట ప్రకృతకథార్థము. ఇది గురుశిష్యసంబంధమును సూచించుచున్నది. తీక్ష్ణేన = శిష్యద్రవ్యాపహారణమున నిర్దయుఁడై, ప్రతికూలేన = గురుధర్మప్రతికూలుఁడైన, స్వామినా = గురువుచేత, రక్ష్యమాణాః = సంసారసాగరమునుండి యుద్ధరింతు నను వాగ్దానముచే మాత్రము కాపాడఁబడు, ప్రజాః=శిష్యులు, న వర్ధంతే = వృద్ధినొందరు. అనఁగా మేలుపొందరు. అని యర్థము. వేషధారులుకొందఱు గురువులమగుదుమని యాచించుచుఁ బామరులకు మంత్రోపదేశము చేయుచు భగవత్సేవకన్న గురుసేవయే ప్రధానమని బోధించుచు, భగవంతుఁడు కర్మమునఁ బడఁద్రోయుననియు, నాచార్యులు కర్మమునుండి యుద్ధరించుననియుఁ దెలివిమాలినపలుకులు తెలుపుచు, సర్వస్వము గుర్వధీనముచేసినఁగాని తరించుమార్గము దొరకదని నొక్కి చెప్పుచు, శిష్యులుగాఁజేరిన పామరుల వంచించి ధనము నపహరించుచుందురు. వారి యధీనమున నున్న శిష్యులు నశింపక యెట్లు కృతార్థు లగుదురు? శిష్యద్రవ్యము గ్రహించి యుపదేశించినవాఁడు పిశాచమగునని శాస్త్రములు ఘోషించెడిని. పాత్రుఁడగు శిష్యుని గోరి సంపాదించి యుపదేశింపవలయునని కదా శాస్త్రమర్యాద. దానినివదలి ధనార్జనోపాయములు వెదకుచుఁ గొందఱఁ దమవంటివంచకులను శిష్యులనుగాఁ గూర్చుకొని తనమాహాత్మ్యమును వా రితరులకుఁ దెలుపుచుండఁగాఁ బామరులు మోసపోయి శిష్యులుగాఁ జేరఁగా నెన్ని యో పేరుల ధర్మములు చేయుచున్నట్లు నటించి కొలదిభాగము వంచకశిష్యుల కొసంగి మిగిలినదానిని గ్రహించి బంధువులకు రహస్యముగా నొసంగుచుండు నీచాతినీచులు గురువులుగా నుండఁ బామరు లేల నశింపరు? ముక్తి దొరకదు గాని ధన

విముక్తి తప్పదు. అను నీతి నీభాగము సూచించుచున్నది. "దుర్బుద్ధి రజితేంద్రియః, త్వాం కర్తాసి రాజా" అని మారీచుఁ డనెను. ఈయర్థమునే మనుస్మృతియుఁ దెలుపు చున్నది

"జితేంద్రియో హి శక్నోతి వశే స్థాపయితుం ప్రజాః."

అని. రాజు జితేంద్రియుఁడు కావలయును. సుబుద్ధి కాఁడం దనఁగా భావమేమి? అతనిగుణములు భ్రమరకీటన్యాయము ననుసరించి ప్రజలయందు సంక్రమించునని యే కదా. అట్లే గురువుసద్గుణములు శిష్యులయందు సంక్రమించునని వచన మూహించుట పొరపాటగునా? జితేంద్రియుఁడు కానివాఁడు గురువు కానేరఁడని యీక్రింది ప్రమాణములు తెలుపు చున్నవి.

"శ్రీగురుః పరమేశాని శుద్ధవేషో మనోహరః.
సర్వలక్షణసంపన్న స్సర్వావయవశోభితః,
అగ్రగణ్యో గభీరశ్చ పాత్రాపాత్రవిశేషవిత్.
శివవిష్ణుసమస్సాధుర్న చ దర్శనదూషకః,
నిత్యే నైమిత్తికే కామ్యే రతః కర్మణ్యనిందితే.
యదృచ్ఛాలాభసంతుష్టో గుణదోషవిభేదకః,
ఇత్యాదిలక్షణోపేతశ్శ్రీగురుః కథితః ప్రియే."

కులార్ణవము.

నింద్యగురుమాహ:—

"శ్విత్రీ చైవ గళత్కుష్ఠీ నేత్రరోగీ చ వామనః,
కునఖీ శ్యావదంతశ్చ స్త్రీజితో హ్యధికాంగకః.

హీనాంగః కపటీ రోగీ బహ్వాశీ బహుజల్పకః,
ఏతైర్దోషైర్విహీనో యస్స గురుశ్శిష్యసమ్మతః.''

క్రియాసారము.

''గురుర్గృహస్థ ఏవైకో న కదాచిత్పతిర్గురుః,''

కేవలకామిపరోఽయం నియమః.

తథా చ సూతసంహితాయామ్:—

''ఉత్తమః పంచధా ప్రోక్తో గురుర్బ్రహ్మ సువేదిభిః.
బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థశ్చ బిక్షుకః,
అతివర్ణాశ్రమీ చేతి క్రమాత్ శ్రేష్ఠో విచక్షణః.

జ్ఞానార్ణవే:—

''నిందితస్తు పితుర్మంత్రస్తథా మాతామహస్య చ,
సోదరస్య కనిష్ఠస్య వైరిపక్షాశ్రితస్య చ.''

నారదతంత్రే:—

''నాస్తికాన్ భిన్నమర్యాదాన్ కృతఘ్నాన్ వేదనిందకాన్,
మంత్రాక్షరోపదేశే తు దూరతః పరివర్జయేత్.''

అని గురుపరీక్ష చెప్పఁబడినది. పైనవ్రాసిన గురుదోషము లిందు ''కపటీ'' అనుపదముచేఁ దెల్పఁబడినవి. 'శివ విష్ణు సమః' అను టంజేసి దేవతాంతరదూషకులు పనికిరారని తేలెడిఁగదా. ఇట్టివా రాచార్యులు కాఁదగరు. అనాచార్యులే యగుదురు. ఈవిషయమంతయు రామాయణమునందలి యీభాగము సూచించుచున్నది. రావణా! నన్నుఁజంపి రామమూర్తి సత్వరముగ నిన్నుం జంపును. నీకుఁ బగవాఁడగు శ్రీరామునిచే నేను వధింపఁబడుటచేఁ గృతకృత్యుఁడ నగుదును. నీకుఁ బగవాఁడనఁగా నిన్ను వధింపనే యవతరించినవాఁడని యర్థము.

తొలుత నన్నుఁ దరువాత నిన్నుఁ జంపును. నీచేతఁ జచ్చుట కంటె నాకు రామునిచేఁ గలుగుమృతి శ్రేష్ఠము. అనఁగా విముక్తిదమని భావము. మారీచుఁ డవివేకియై యైన నిట్లు పలుకునా? స్వకర్మప్రోత్సాహితుఁడై మారీచుఁడు ముక్తుఁడు కాఁబోవుచున్నవాఁడు. కాన శ్రీరామునిచేఁ దనకు మృతి గలుగనున్నదనియు, నామూలమునఁ దనకీజన్మము నశించి పున రావృత్తిరహితశాశ్వతానందానుభవరూపముక్తి దొరకుననని యు నమ్మెను. రక్కసునియూహాలే యతనికుండిన దుఃఖింపఁడా? 'తవారిణా హతః.' అనుటంజేసి రావణుని శత్రువనియే సూచింతునన్న భగవద్వాక్యము నామారీచుఁడు కర్మప్రోత్సాహమున స్మరించెనని మన మెఱుంగవలయు. దీనిచే భగవంతునకు విరోధి లేఁడని స్పష్టమగును. "న మే ద్వేష్యోఽస్తి న ప్రియః" అనునూక్తి భగవంతుఁడే తెలిపెంగదా. శత్రుత్వప్రవర్తనము నాటకమనియే మనము నమ్మవలయును. శాపవశమునఁ బరితపించుభక్తు నుద్ధరించుమార్గ మదియే కాన, లేనివిరోధము గలిగి నట్లు నటించెననియే మనము విశ్వసింపవలయును. "పర్శనా దేవ రామస్య హతంమా ముపధారయ." అనఁగా నాకర్మము శాశ్వతానందసుఖప్రదానోన్ముఖము గానున్నది. కాన నింక నతియో కాలము నిలువఁబోను. రామచంద్రదర్శన మాత్రముననే అనఁగా నేకాంతదర్శనమున నని భావము. సీతాలక్ష్మణులు లేనితావున భగవంతుని గన్నులారఁగాంచుచు శరీరము విడుతునని సారము.

"అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరం,
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః.  గీ

అను నీ గీతావాక్యమునఁ గలయర్థ మిదియే కదా. స్మరించుచుఁ బ్రాణములు వదలిన నన్నుఁ జేరునని పరమేశ్వరుఁడు పలికెఁ గదా. స్మరించుచుఁ బ్రాణములు వదలిన ముక్తి గలుగును. ఇఁకఁ గన్నులారఁ గాంచుచు భగవంతుఁ డనుభావమున శరీరమును వదలినఁ జెప్పవలసిన దేమి? 'ఆత్మానం చ హతం విద్ధి హృత్వా సీతాం స బాంధవం' అనుచో భావమేమి? సీత నపహరించినంతనే నిన్నుఁగూడ మృతినొందినవానిగనే నిశ్చయించుకొనుము. నీవొక్కఁడవే కాదు. సబాంధవముగా నని మారీచుఁడు పల్కెను. భావిఫలములు మారీచునోటనుండి కర్మమే పలికించెనని మన మెఱుంగ నలయును.

> "నివార్యమాణస్తు మయా హితైషిణా
> న మృష్యసే వాక్యమిదం నిశాచర,
> పరేతకల్పాహి గతాయుషో నరాః
> హితం న గృహ్ణంతి సుహృద్భిరీరితం." ౨౦

అని మూలము. నీమేలు గోరి యెంతదూర ముపదేశించినను నీ వంగీకరింపకున్నాఁడవు కదా. మృతినొందఁ దగుమానవులు మిత్రవాక్యములను గూడ నాలకింపరు. అని మారీచునిచే వాల్మీకి పలికించి కర్మసిద్ధాంతమును దృఢపఱచెను.

> "యద్యహంకార మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే,
> మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి."

అను భగవద్గీతావాక్యార్థమునే యీ రామాయణభాగము తెల్పుచున్నది. కర్మ మెంతవారినైన నిర్బంధించి వారిమూల

మున నాకార్యమును సాధించుమనియే కదా యీభాగమునం గలసారము. అత్తఱి మిత్రవాక్యము కూడ నహితముగాం దోంచును. అనుటచే మానవులు కర్మబద్ధులు నస్వతంత్రులు ననియే యిందలివిషయము.

"దీపనిర్వాణగంధం చ సుహృద్వాక్యమరుంధతీం,
న జిఘ్రంతి న శృణ్వంతి న పశ్యంతి గతాయుషః."

అను నీతివాక్యము నీయర్థమునే తెలుపుచున్నది. ఇట్టినీ మారీచహితోపదేశము కర్మసిద్ధాంతమును శ్రీరామమాహాత్మ్యమును దెలుపుచున్నది. ఈవిషయమున నధ్యాత్మరామాయణమున విశేషమేదియు లేదు. ముందె యంపలివిశేషము వ్రాయంబడినది కదా. తపవాతి శ్రీరామచరిత్రమును బఠింతము రండు.

**రావణమారీచులు రామాశ్రమమున కరుగుట.**

* అంత మారీచుండు రావణునకు ధైర్యముగ నాగొనకుమా బోవుదము లెమ్ము. అని ధనుర్బాణఖడ్గములనంది నన్ను జంపుటకు బాణమును దీసిన శ్రీరామునికంట నేనుబడుటయే యవశ్యము. ఆతండు శరవిమోచనము చేయ నక్కఱలేదు. నమాటుగనే నాప్రాణములు పోవును జుమీ. శ్రీరాముని మొగాలం బౌరుషమును గనంబడుచి యసువులతో మరలివచ్చినవాండుండండు. నీవే యమదండహతుండవై చావ సిద్ధముగ నున్నవాండవు. నీవలె నేనొక్కండ నున్నాండను. దుర్బుద్ధి నీకట్లు కలుగ నేనేమి చేయంజాలుదును? ఇదిగో ప్రయాణము చేయుచున్నాండను. నీకు భద్రమగుంగాక అని పలికెను. ఆమాటలను

* ఇయ్యది నలువదిరెండవసర్గమునం గలదు.

మిక్కిలి తుష్టినొంది గాఢాలింగనపురస్సరముగా నీయీ మాటలు నేను జెప్పినట్లే యున్నవి. ఇపుడే నీవు మారీచుఁడ వైతివి. ఇంతకుముం దెవఁడో రాక్షసుఁడవుగా నుండితివి. ఈ రథమున నన్నుంగూడి కూరుచుండుము. సీతకు మిక్కిలి యాశఁ గలుగఁజేసి నీవంతట స్వేచ్ఛగాఁ బొమ్ము. రామలక్ష్మణులు లేనితఱి నేను సీత నపహరింతును. అని మారీచునింగూడి రథమెక్కి యాయాశ్రమమునుండి పయనము సాగించెను. వారిరువురు రథమెక్కి పోవుచుఁ బత్తనములు, నుద్యానములు గలపురములను, గొండలను, పెక్కునదులను, రాజ్యములను, స్వల్పపత్తనములను గాంచుచుం బోయిరి. దండకారణ్యముఁ జేరి శ్రీరామునాశ్రమముం గాంచిరి. రావణుఁ డందు రథము డిగ్గి మారీచుని చేయిపట్టుకొని మిత్రమా! కదళీవృక్షపరివృత మగురామాశ్రమ మిదిగో చూడుము. మన మరుదెంచినపని నెఱవేర్పుము.

మారీచుఁ డిట్లు రావణుఁడుపలుకఁగా నాలకించి మృగరూపమును ధరించి రామునాశ్రమద్వారమున సంచరింపఁ జొచ్చెను. ఆరూపము చూచువారలను విస్మయమున మునుంగఁజేయఁ దగియుండెను. దాని కొమ్ముల చివరభాగము లింద్రనీలరత్నములే. మోముపైఁ గొన్ని తెల్లని నల్లని రేఖలు ప్రకాశమును గలిగించుచుండెను. ముఖపుటములలో నొకభాగ మెఱ్ఱనికమలముఛాయను రెండవది నల్లఁగలువరంగును బోలియుండెను. శ్రవణములు కలువలవలె నుండి యింద్రనీలచ్ఛాయ గలిగి మెఱయుచుండెను. గొంతు రవంతయెత్తుగానుండెను. పెదవు లింద్రనీలశకలములవలె రంగారుచుండెను. దానికడుపు మొల్లపూవులవలెను జంద్రబింబమువలెను వజ్రమువలెను దెల్లగాఁ

ప్రకాశించుచుండెను. దాని యొకపార్శ్వ మిప్పపూవురంగు గలిగియుండెను. తక్కిన శరీరభాగము లెల్లఁ గమలకింజల్కచ్ఛాయ గలిగియుండెను. ఖురములు వైడూర్యమణుల కాంతుల నీనుచుండెను. జంఘలు సూక్ష్మములుగ నుండెను. సంధిబంధములు దృఢములుగ నుండెను. వాలము పలురంగులగు నింద్రధనుస్సు వర్ణములుగలిగి మెఱయుచుండెను. దాని శరీరమునం దందందు రత్నబిందువులు వెలయఁగా నచ్చుపడియుండెను. మారీచుఁ డీరీతిగా వనరామాశ్రమపదముల వెలయించుచుఁ బరమానందజనకమగు సుందరమృగరూపమును దాల్చెను. ఆరూపమున వాఁడు సీతను మోసపుచ్చనెంచి మనోహరగతు లలరారఁ బోయెను. వెండివంటి రంగుగలబిందువులు పెక్కులు శరీరమునిండ నుండఁగాఁ గన్నులవిందు గూర్పఁ జాలుచు వృక్షపల్లవములఁ దినుచుండెను. ఆరక్కసుఁడు గృహమువలెనే యున్న యరఁటిచెట్లు గుంపుగానుండ నచటికరిగి కొండగోఁగులచెంతఁ జేరి నడకసొబగునఁ దిరుగుచు జానకిం జూచునవకాశము గలచోట్ల కరిగి యుండు మెల్లమెల్లగా విహరించుచుండెను. కమలకింజల్కములరంగుగల వెన్నుచెలఁగ ముద్దులు మూటఁగట్టుచు నాశ్రమముచెంత హాయిగాఁ దిరుగుచుండెను. అయ్యది యందుండి యున్నదిశ కరిగి వెంటనే మరలి యచటికే వచ్చుచు నీరీతిఁ బెక్కురీతుల గమనాగమనములు సాగించుచుండెను. ఇట్లు సంచరించుచు నేలపై నొకతావునఁ గూరుచుండును. ఆశ్రమద్వారముచేరి యందలి మృగములఁ జేరఁదలంచును. అవి తన్నుఁ గలియరాఁగా మరలి వచ్చును. చిత్రముగ మండలాకారములుగాఁ దిరుగుచుండును. ఆయడవింగల యితరమృగగణములు చిత్రముగానుండు నా

మృగముంగాంచి చెంతఁ జేరి మూర్ఖుని తమ్ము భక్షించు రాక్షసుఁ డని యెఱింగి భీతిగొని నలుదెసలకుఁ బరుగెత్తెను. ఆతఁడు మృగవధమున నాహారకృత్యము జరపుకొనువాఁ డయ్యుఁ దనకుఁగల యాక్రూరస్వభావమును మఱుగుపఱచు టకై యందలిమృగములఁ దాఁకియుఁ దినకుండెను.

జానకి యాతరుణమునందు నయనసౌందర్యము హెచ్చుఁగాఁ బుష్పాపచయమున కాచెట్టుకడకు వచ్చెను. వామాక్షియగు నాసుందరవదన పుష్పములను గోయుచుఁ గొండగోఁగులు లోనగు చెట్ల దగ్గరకుఁ బోయెను. ఉత్తమ నాయికామణి యాసీత యడవుల నివసింపఁదగనిదియే. కాని యందుండవలసి వచ్చెను. కాన నానావిధరత్నమయమైె ముత్తి యముల బిందువులచేఁ జిత్రింపఁబడిన శరీరము హర్షము నిం పఁగా నుండునామృగమును గని తనకన్నులు వికసిల్ల దాని నాదరమునఁ గాంచెను. ఇంతకుం బూర్వమెన్నఁడును దత్తుల్య మృగమును జూడని దౌట దానిం గాంచినంతన పరమాశ్చర్య భరితాంతఃకరణ యయ్యెను.

మహాశయులారా! మహాప్రకృతి సంకల్పము నెఱవేఱు కాల మాసన్నమయ్యెను. సంకల్పించినంతన బ్రహ్మాండములు వెలయునన్న నిది యేపాటిపని? అఘుట్టమే యిది. ఇఁకఁ గడుం గడు జాగరూకులమై పఠింపవలయు. భగవద్విలాసముల నించు కయే నెఱింగి యానందింపవలయు. కర్మము బలవంతమైెన దను విషయము నెఱుంగవలయు. ఈరామాయణపఠనమునకు ఫల మదియే కదా.

"దృష్టశ్చాహం పునస్తేన శరచాపాసిధారిణా,
మద్వధోద్యతశస్త్రేణ వినష్టం జీవితం చ మే. ౨

న హి రామం పరాక్రమ్య జీవన్ ప్రతినివర్తతే,
వర్తతే ప్రతిరూపోఽసౌ యమదండహతస్య తే." 3

అని మూలము. ఇవి మారీచవాక్యములు. శరచాపఖడ్గము లను ధరించి రాముఁ డరుదెంచుననియు, నతనికంటఁ బడెఁగా జీవితాంత మగుననియు నతఁడే తెల్పెను. నన్నుఁ జంపుటకే యాయుధముల ధరించుననఁగా భావమేమి?

"కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః."

అన్న గీతాశాస్త్రమునందలి భగవద్వాక్యమే కదా. కార్యార్థము రూపశస్త్రాదిధారణమే గాని వేఱొకటి కాదనియే దీని సారము. రాముని మ్రోల పరాక్రమించి ప్రాణములతో నెవ్వఁడును మరలి రాఁడనఁగా నర్థమేమి? పౌరుషముచే దైవమును జయింపఁ బూనినవాఁడు కృతార్థుఁడు కాఁడనియే యిందలి సారతరార్థము. పౌరుషమనఁగా రజస్తమోగుణసమ్మిళిత జనితాజ్ఞానయుతాహంకారము. దానిచేఁ బరమేశ్వరు నారాధించి వశపఱచుకొన శక్యము కాదు.

"భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున,
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప."

అన్న గీతావాక్యము ననుసరించి యహంకారవిశిష్ట మగునారాధనము ఫలవంతము కాదని తేలెడిని. భగవంతునకు రూపనామశస్త్రాదిధారణము కార్యమునుబట్టియే యని యీభాగము మనకుఁ దెలుపుచున్నది. సర్వరూపములు కార్యమునుబట్టియే పరమేశ్వరుఁ డంగీకరించునని మనము తెలిసికొనందగు. ఈ తెలివివలన సర్వదేవతలు భగవత్స్వరూపులే యని యేర్పడుచు

దేని నారాధించినను భగవంతుఁ డానందించునని కలుగుఫల ములు. ఇట్లు లుండఁగా శివకేశవులలో నొక్కఁ డెక్కుడను వాదము నిస్సారమనియే కదా తేలినసిద్ధాంత మగును? యమ దండహతుఁడవగు నీకు సమానుఁడను నేనున్నాఁడనని మారీ చుఁడు పలికెను.

"మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్."

అన్న గీతాశాస్త్రవాక్యము ననుసరించి రావణా! మనమిరువు రము స్వస్వకర్మహతులమైతిమి. శ్రీరాముఁడు నిమిత్తమాత్రుఁడే సుమీ. మన మీదుష్ప్రయత్నమును గావలయుననియే చేయుచున్నాము. మనచావునకు మనమే కర్తలము. భగ వంతుఁ డగురామమూర్తి పేరునకుమాత్రమే. అని మారీచుని యాశయము. దీనిచే జనులు తమలాభనష్టములకుఁ దమరే కర్తలనియు, నొరులకందు భాగమే లేదనియు, నొరుల నిందిం చుట తెలివిచాలకయే యనియుఁ, గర్మగతులనెఱిఁగినవా రట్లు దూషింపరనియు నీభాగమునుండి మన మెఱుంగవలయును.

"ఏష గచ్ఛామ్యహం తాత స్వస్తి తేఽస్తు నిశాచర."    ౪

అని మూలము. 'నిశాచర' అని సంబోధించెను. ఇందు మారీ చుని భావమేమి?

"యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ,
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః."    ౬౯
అధ్యా-౨.

అను గీతావాక్యము చొప్పున 'నిశా' అనఁగా అవివేకమును గల్గించునది. అట్టి యవస్థయం దున్నవాఁడవు నీవు రావణా!

అని యాశయము. నిశాలక్షణము తమస్స్వరూపత్వము కదా. తమస్స్వభావము కలవాఁడవు. కాన నీకు స్వస్తి యగుఁగాక. భగవంతునిచే మృతి గలిగి దాన శాశ్వతభద్రము గలుగుఁగాక యని మారీచుఁడు తెలిపెను. నాకుఁ గలుగ నున్నట్లే నీకును శ్రీరామునిచే మృతి గలుగుఁగాక యని మారీచుఁడాశీర్వదించెను. మృతి గలుగుఁగాక యనుట యాశీర్వాదమా యనుపామరులు గలరు. శాశ్వతానందకరమగు భగవద్దర్శనము గలుగుటకంటెఁ గోరఁదగిన దేమున్నది? భద్రమనఁగా నదియే యనఁదగు.

**"ప్రహృష్టస్త్వభవత్తేన వచనేన స రావణః,**
**పరిష్వజ్య సుసంశ్లిష్ట మిదం వచనమబ్రవీత్."** ౫

అని మూలము. సనత్కుమారునిశిష్యుఁడు రావణుఁ డని మాత్రము మఱువకుఁడు. సనత్కుమారుఁ డెట్టిజ్ఞానియో వ్రాయ నక్కఱలేదు కదా. మారీచునివాక్కుల నాలకించి ప్రహృష్టమొందెను. గాఢాలింగనము చేసికొనెను. ఏల? మారీచుఁడే తనకురాఁగల మహాభాగ్యమునకు మూలకందము. కృతజ్ఞుఁడు కావలయుఁ గదా. అట్టి మహాభాగ్యమగు ముక్తిని గల్గింపఁ బ్రధానహేతువగుట మారీచుఁడు మహోపకారి యని రావణునంతటివాఁ డెఱుంగక పోవునా? ఇరువురు పుణ్యకర్మఫలముల ననుభవింపఁ బోవుచున్నవారలే. కావునఁ బరస్పరము సంభావించుకొనుచున్నారు.

**"ఏతచ్ఛౌండీర్యయుక్తం తే మచ్ఛందాదివ భాషితం,**
**ఇదానీమసి మారీచః పూర్వమన్యో నిశాచరః."** ౬

అని మూలము. మయశంబరమారీచుల నుదాహరణముగా

నిప్పటికి గ్రహించునాచారము కలదు. అఘటనాఘటనసమర్థు లని భావము. తమయాశయ మితరులకుఁ దెలియనీయక కార్యమును సాధించువారిని మయశంబరమారీచులతోఁ బోల్తురు. వత్సా! నామతమున కనురూపముగా నిపుడు పలికితివి. కావున నిపుడు మారీచుఁడవే యైతివి. ఇంతకుమున్ను పలికినమాటలనుబట్టి యోజింపఁగా వేఱొకరాక్షసుఁడవే. శౌండీర్యమనఁగాఁ బౌరుషమని యర్థము. నీమాట యిపుడు పురుషప్రయత్నమునకుఁ దగినదే. నా యాశయము కూడ నట్టిదే. కాన నవి రెండు సమానార్థము కలవియే యైనవి. ఏ ప్రయత్నము చేయఁబూనితినో యద్దాని కనురూపమైన దీ మాటయే. పరమపురుషార్థసాధనైకార్థ మిదియే. దీని కాతంకముఁ గల్గించినది నాయంగీకారముఁ బడయునా? ఏనాఁటికిఁ బడయదు. అని కదా రావణాసురునియాశయము. దీనింబట్టి విరోధిగా భగవంతుని భావించి స్మరించినను గరుణాసాగరుఁడు కావునఁ గాపాడునని తేలెడిని. రక్షించుపద్ధతిమాత్రము వేఱుగా నున్నయ ట్లగపడును. కాని ఫల మొక్కరూపము గనే యుండును.

> "అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్,
> సాధురేవ స మంతవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః. 30
> మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః,
> స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాం గతిం." 32
> కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయస్తథా,
> అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వ మామ్." 33

అధ్యా-౯.

అను నీగీతాశాస్త్రము పైనఁ గలభావమునే సూచించెడిని. సేవించుటలో నొకవిశేషము కలదు. 'అనన్యభాక్' అనునది విశేషార్థబోధకము. మహాభక్తులు మహావైష్ణవులు నగువారే భగవంతుని సర్వకాలసర్వావస్థలయందును స్మరింపఁగలరు. ఇతరులట్లు స్మరింపఁజాలరు. వారిరువురే తరించువారనియు మన మెఱుంగవలయు. ఎందులకు? అనఁగా నిరంతరధ్యానమే యద్దానికి మూలాధారము. అది కుదురుటెట్లు? పూర్వసత్కర్మవాసనాబలముచేతనే. కర్మభేదము ననుసరించి జ్ఞానము భక్తియు వేఱుగా నున్నయట్లు మనకుఁ దోఁచునుగాని వారిరువురు ముక్తులే యగుదురు. ఘంటాకర్ణునిచరిత్రమే యిందుకు నుదాహరణము కాఁగలదు.

"తథైవ తత్ర పశ్యంతౌ పట్టణాని వనాని చ,
గిరీంశ్చ సరితస్సర్వాః రాష్ట్రాణి నగరాణి చ." ౧౦

అని మూలము. నగరపట్టణశబ్దములు గలవు. వీనికి భేదము కలదు. అది పరికింతము.

"నగరపట్టణాదిలక్షణముక్తం వాస్తుశాస్త్రే:-గ్రామశ్చ నగరం చైవ పట్టణం ఖర్వటం పురం, ఖేటకం కుసుమం చైవ శిబిరం రాజవాసికం. సేనాముఖమితి త్యేవం దశధా కథితం బుధైః, విప్రాణాం చ సభృత్యానాం వాసో గ్రామ ఇతీరితః. స ఏవ విప్రైరాకీర్ణ అగ్రహార ఇతి స్మృతః, కుటుంబిభేదైః రేకోన త్రింశద్భిశ్చ సమన్వితః. అనేకనారీసంబద్ధం నానాశిల్పిజనైర్వృతం, క్రయవిక్రయకైః కీర్ణం సర్వదేవైస్సమన్వితం. నగరం త్వితి విఖ్యాతం పట్టణం శృణు సాంప్రతం, ద్వీపాంతరాగతద్రవ్యక్రయవిక్రయకైర్యుతం. పట్టణం త్వబ్ధితీరే స్యాత్తయోర్మిశ్రంతు ఖర్వటం, క్రయవిక్రయకైర్యుక్తం నానాజాతిసమన్వితం. తంతువాయసమాయుక్తం తత్పురం త్వితి కథ్యతే,

విత్తైరధిష్ఠితం యత్తత్ఖేటకం పరికీర్తితం. తేషా మేకాం తరేష్వేవ వాసః కుసుమముచ్యతే. ఇతి" గోవిందరాజులు.

ఈయభిప్రాయమునకు విరుద్ధముగా వాస్తురత్నాకరమున నీ నిర్ణయము కొన్నింటివిషయమునఁ గలదు. నూటునుగురుమానవు లుండునది పల్లి. అయిదువందలజను లుండునది గ్రామము. సహస్రజననివాసము మహాగ్రామము. పదివేలజను లుండునది పురము. రాజుండునది నగరము అని. శబ్దకల్పద్రుమమున నిట్లు గలదు.

"నగా ఇవ ప్రాసాదాదయస్సంతి యత్ర నగరం, బహులోకవాస స్థానమ్, యత్రాష్టశతగ్రామీయ వ్యవహారస్థానం మధ్యవర్తి తత్ నగరం, యత్ర రాజా తత్పరిచారకాశ్చ తిష్ఠంతి తత్పత్తనం, ప్రాకారాదినా దుర్గం యోజనవిస్తీర్ణం నగరం స్థానీయం. కేచిత్తు పురనగరయోరపి భేదమాహుః, బహుగ్రామీయ వ్యవహారస్థానం పురం, తత్ర ప్రధానభూతం నగరం. ఇతి భరతః. అపి చ. 'నృపావాసః పురీ ప్రోక్తాం విశాం పురమపీష్యతే, ఏకతో యత్ర తు గ్రామో నగరశ్చైకతస్థితం. మిశ్రం తు ఖర్వటం నామ నదీగిరి సమాశ్రయం,విప్రాశ్చ విప్రభృత్యాశ్చ యత్ర చైవ వసంతి హి. సతు గ్రామ ఇతి ప్రోక్త శ్శూద్రాణాం వాస ఏవ చ, పణ్యక్రియాదినిపుణై శ్చాతుర్వర్ణ్య జనైర్యుతం. అనేకజాతిసంబంధం నైకశిల్పిసమాకులం, సర్వదైవతసంబంధం నగరం త్వభిధీయతే.' ఇతి విష్ణుపురాణటీకాయాం శ్రీధరస్వామిధృత భృగు వచనమ్."

ఇంచుకభేదముగా నిది పై వాస్తుప్రమాణమునకు సరి పోవుచున్నది.

"స్థిరరాశిగతే భానౌ చంద్రే చ స్థిరభోదయే,
శుద్ధే కాలే దినే చైవ నగరం కారయేన్నృపః."

అను భవిష్యోత్తరపురాణవచనము ననుసరించి రాజే నగరమును నిర్మించి ప్రజల కీవలయునని పూర్వాచారము. ఇపుడట్టి సదాచార మీకాలమునఁ గలదా ?

రావణమారీచులు పురాదులు చూచుచు దండకారణ్యమునకుఁ బోయి శ్రీరామునాశ్రమమును గాంచిరని ప్రస్తుత కథాభాగము. దీనిచేత సాగరప్రాంతమునుండి దండకారణ్యమునకుఁ బోయిరనియు నీనడుమ ననేకరాష్ట్రములు గలవనియు మన మెఱుంగవలయును.

"హస్తే గృహీత్వా మారీచం రావణో వాక్యమబ్రవీత్. ౧౨
ఏతద్రామాశ్రమపదం దృశ్యతే కదళీవృతం,
క్రియతాం తత్సఖే శీఘ్రం యదర్థం వయమాగతాః." ౧౩

అని మూలము. ఇఁక మరల నీజన్మమున మన సుహృత్తులను కలిసికొనఁజాలము. అనుభావమును గనఁబఱచుచుఁ గరము కరమునఁ బెనచి మిత్రమా! ఇదియే శ్రీరామునాశ్రమపదము. చూడుము. అరఁటిచెట్లు చుట్టునున్నవి. ఏపనికై మనము వచ్చితిమో యాకార్యము నెఱవేర్పుము. అని రావణుఁడు ప్రార్థించెను. ప్రాణాంతకర మగుకార్య మిదియని యతఁ డెఱుఁగును. కాని కర్మపాశబద్ధుఁ డగుట నవశేంద్రియుఁ డయ్యెను. కొందఱు వలదన్న నొకఁ డొకకార్య మొనరించి శ్రమఁ బొందుచుండ నలువు రాతని దూషింతురు కదా. వారు కర్మసిద్ధాంతము పద్ధతి నెఱుంగనివారే యగుదురు. కర్మ మదృశ్యపాశములను దగిలించి యీడ్చుచుండఁగాఁ బాప మాతఁడేమి చేయఁ గలఁడు? ఆవిషయమే మన మూహింపవలయును. వానిని దూషించిన లాభమేమి? కర్మసిద్ధాంతము నెఱుంగుటయే యెల్లరకుఁ బ్రధానము.

"స రావణవచశ్శ్రుత్వా మారీచో రాక్షసస్తదా,
మృగో భూత్వాశ్రమద్వారి రామస్య విచచార హ. ౧౪
సతు రూపం సమాస్థాయ మహదద్భుతదర్శనమ్."

అని మూలము. తనరూపము మహాశ్చర్యకరమగు జింకవలె నొప్పఁగా నాశ్రమముకడ విహరింపఁజొచ్చెను. ఇదియెట్టులని సంశయము కొందఱకుఁ గలుగవచ్చును. ఉపాసకునకుఁ గామ్య కర్మసంకల్పము కలుగుచో నివి లభించును. యోగశాస్త్రము నందు నణిమాదిసిద్ధులు లభించునని కలదు కదా. అట్లే మంత్రోపాసకునకు లభించును. ఒక్కొక్కదేవత యొక్కొక్కసిద్ధి నొసంగఁజాలును. ఒక్కొక్కసిద్ధి కొక్కొకదేవత యధిదేవత యయి యుండును. వారి నుపాసించినయెడల నయ్యది ఫలించె నేని యాసిద్ధి యలవడును. ఇయ్యవి పరమపురుషార్థమునకు భంగకరములౌటఁ బ్రాజ్ఞు లివ్వానిజోలికిం బోవరు. ప్రాకృతులు యశఃకాములై వారి నుపాసించి తత్సిద్ధిం బడయఁగల్గుదురు. ఈయుపాసనము మహాప్రమాదకరము నగు. సిద్ధింపకపోయినఁ బ్రాణాంతమే యగును. ఈవిషయము బహుప్రకారములఁ దంత్రములయం దుపపాదింపఁ బడియున్నది.

"రససిద్ధి ర్లోకసిద్ధి ర్బలసిద్ధి స్తథైవ చ. ౫౬
ఖడ్గసిద్ధిః పాదుకాయాస్సిద్ధి రంజనసిద్ధికా,
వాక్సిద్ధి ర్లోహసిద్ధిశ్చ దేహసిద్ధి రనంతరం. ౫౭
ఏతాదృశ్యస్సిద్ధయస్తు బహ్వోన్యా యోగిసమ్మతాః,
అత్రాంతరే తు పరితస్సేవంతే పరమేశ్వరీం. ౫౮
కోటిశస్సిద్ధయస్తస్మి న్నణిమాద్యంతరే శుభే,
నవలావణ్యసంపూర్ణాస్స్మయమానముఖాంబుజాః. ౫౯

జ్వలచ్చింతామణికరాస్పదా షోడశవార్షి కాః,
అత్యుదారప్రకృతయః ఖేలంతి మదవిహ్వలాః." ౬౦

లలితోపాఖ్యానము. ౪౦-అధ్యా.

దీనింబట్టి పరిశీలింపఁగా నైహికఫలములు విచిత్రవర్ణనము లగుట మాయాపాశములఁ దగిలించి సాధకు నధఃపతితునిగా నొనరించునని తేలెడిని. మోహజనకములు కావుననే సాధు మతు లవ్వానిం గోరరు. ఇంద్రజాలతంత్రమున నీవిషయ ములు విస్తరించి చెప్పఁబడియున్నవి. ఆయుపాసనకు ఫలసిద్ధి యెట్లున్నను మహాపాపఫలసిద్ధి మాత్రము తప్పక లభించును. కనుకనే

"త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః,
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః. ౨౦
నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః,
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్." ౨౧

అధ్యా-౪.

అని శ్రీకృష్ణమూర్తి యర్జునున కుపదేశించుచు. కర్మఫలాభి సంధి పరమపురుషార్థవిధ్వంసనక్షమ మైనది. కాన దానిమానుట మేలు. మారీచుఁడు మాయల నేర్చినవాఁడు. అనఁగా క్షుద్ర ఫలములఁ గోరి తపస్సొనరించి యాసిద్ధఫలమూలమున నితరుల బాధించుచుండువాఁడు. తఱచుగా రాక్షసులందఱు నిట్టివారే. అందు మయశంబరమారీచు లగ్రతాంబూలమున కర్హులు.

"సముద్వీక్ష్యచ తం సర్వే మృగా హ్యన్యే వనేచరాః. ౨౮
ఉపాగమ్య సమాఘ్రాయ విద్రవంతి దిశోదశ."

అని మూలము. అడవియందుఁ గలమృగములనఁగా నాజాతి

మృగము లద్దానికడ కరుదెంచి మూరుకొని యనఁగా వాసన
చూచి పరుగెత్తెను. ఇందు 'దశదిశః' అనునది యతిశయార్థ
బోధకము. అన్నిదిక్కులకుఁ బాఱిపోయెనని భావము. తిర్య
గ్జంతువులకు ఘ్రాణశక్తి మిక్కిలి కలదు. మూర్కొనినంతన
యవి యెఱుంగును. భగవంతుఁ డొక్కొక్కవిషయమున
శక్తికలుగఁజేసి జీవయాత్ర సాగునట్లు చేయును. వృషభములు
గాఢాంధకారమునఁ దమయజమానుఁడు చెంతకుఁబోయి నిలు
చున్న నవి మూర్కొని యతని గుఱుతించును. క్రొత్తవాఁ
డైన బెదరును. మానవులకుఁ జక్షుశ్శ్రోత్రజిహ్వాలనుండి
తెలిసికొనుశక్తి కలదు. అనఁగా నీ మూఁడవయవములమూల
మునఁ గాని నిర్ణయింప నవకాశము లేనంతటి కపటస్వభావము
మానవులకుం గలదని దీనిభావము. ఈమూఁడింటితో మన
స్సును జేర్చి యోజించినను బరులయింగితముల నెఱుంగఁ
దరముకాదు. తిర్యగ్జడముల కంత కృత్రిమస్వభావము లేదు.
ఏల? ధనేచ్ఛయే మోసముచేయునూహలఁ గల్పించును. అది
మానవేతరసృష్టికి లేదు. జీవికకొఱకు నాహారమును సంపా
దింపఁ బాటుపడుటయే వానికిఁ గార్యము కాని ధనాశ లేదు.
కావున మాయ వానియందంతగా లేదనవచ్చును. వనమృగము
లనఁగా హరిణములు (జింకలు). ఈక్రొత్తమృగమును గాంచి
తమజాతికిఁ జేరినదిగా నుండఁగా దాపునకు వచ్చి మూరు
కొనెను. పశుజాతియే కాదని యెఱుంగుటయే గాక తమ్ము
వధించి భక్షించురక్కసుఁడని కూడ నెఱిఁగెను. లేకున్నఁ
బాఱిపోవఁ గారణమేమి? తమజాతిమృగము కాకపోయినచో
మృగములు దాని బాధించుట స్వభావము. కాని పరుగెత్తవు.
తమ్ము బాధించు మృగజాతియని యెఱింగిన బెదరును. అంతియ

కాని దూరముగాఁ బాఱిపోవు. తమ్ము భక్షించు క్రూరమృగ
మైన దాపునకే పోవు. ఇది వానిస్వభావము. మృగమును
సమీపించి మూరుకొనినంతన యెఱింగి నలుదెసలకుఁ బాఱి
పోయెనని కదా యిం దున్నది. అవి యెఱింగెనుగాని శ్రీరా
మునకుఁ దెలుపఁజాలవు కదా. మనోభావముల నొరుల కెఱిఁ
గించుశక్తి యుండుటం జేసియే మానవు లుత్తములనఁబడిరి.
సామాన్యజ్ఞానము పశ్వాదులకుం గలదని యెల్ల రెఱింగినవిష
యమే కదా. ఈభాగమున నాంధ్రీకరణ మింకను పరిశీలిం
తము. మూలము పైన వ్రాయఁబడియేఁ గదా.

ఉ. "మందలనుండి వచ్చు నవ మండల చిత్రగతిం జరించు నా
సుందరి చూడ నిట్టటులు చూచును నిట్లు చరింపఁ గాననం
బందలి యన్యజంతుచయ మాదట డాసియు మూరుకొంచు వే
చిందఱవందలై భయము చేఁ బఱచుక్ దశ దిక్తటంబులన్." ఇట్టి
వావిలికొలనువారి రామాయణము.

మహామనీషు లగువిమర్శకులు నాపద్యములు వినుచున్నపుడు
"ద్రుతముపై ద్రుతము" అను వ్యాకరణదోషములు తెలిపిరి.
వావిలికొలనువారి రామాయణమును బొగడిరి. ఈపద్యము
రెండవపాదమునందు "నిట్టటులు చూచును నిట్లు" అను చో
ద్రుతముపై ద్రుతము కలదని వారికిఁ దోఁచలేదు కాఁబోలు.
పక్షపాత మెంతసాహసమునకైన నొడిగట్టఁజేయునని తేలెడిని.

చ. "అరుదుగ మండలాకృతుల నందుఁ జరించుచునుండె; నావని
దిరుగు మృగంబులెల్లఁ జను దెంచి మహాద్భుతరీతినున్న దా
ని రమణిఁ జేరఁబోయి కరుణించినమాడ్కిని మూరుకొంచు భీ
కరుఁడగు రాక్షసుం డితఁడు కాదు మృగంబని తా రెఱుంగుటన్.

సీ. ఎల్లదిక్కులకేఁగ............"

ఆంధ్ర శ్రీమద్రామాయణము.

మహాశయు లిందలి గుణదోషముల నెఱుంగుదురు. నేనిందు వ్రాయఁబూనినది పక్షపాతము పురికొల్ప విమర్శించుట న్యాయ్యము కాదనియే. గ్రంథవిమర్శనము నా కక్కఱలేదు. గ్రంథకర్తల నే నాక్షేపింపను లేదు. ఎవరియిష్టము వారిదని నే నెఱుంగనా ? విమర్శకమహాశయులనుగూర్చియే యీ యభ్యర్థనము.

"రాక్షసస్సోఽపి తాన్వన్యాన్ మృగాన్ మృగవధేరతః. ౨౯
ప్రచ్ఛాదనార్థం భావస్య న భక్షయతి సంస్పృశన్."

అని మూలము. మారీచుఁడు శ్రీరామునిచే మృతితప్పదని నిశ్చయించుకొనియే వచ్చెను. ఆసన్నమృతుఁ డనియే కదా మన మెఱుంగందగు. అట్టితనికిగూడ మృగవధనిరతి యతనిని వదలినది కాదు. అయిన నాతఁడు తనయాశయము తెలియకుండుటకై యాజంతువుల వధింపక మానెను. దీనిచే నెట్టిస్థితి యందుఁగూడ నైజము మాఱదని మన మెఱుంగందగు. దానిని మార్చుకొనుటకే యెన్నియో తపోయోగాదులు మార్గములుగాఁ జెప్పఁబడినవి.

"స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్."

అని శ్రీకృష్ణమూర్తి గీతాశాస్త్రమున నర్జునున కుపదేశించెను గదా. ఫలోన్ముఖమయి సత్కర్మము వెలసినను మారీచుఁడు నైజము ననుసరించి సీతాదేవిని మోసపుచ్చం దలంచుకొని మృగమాంసభక్షణనిరతిని దగ్గించుకొనియె. అనుటం జేసి

దుష్కర్ముఁడని యర్థము కాదు. దానిచే నతనికి మృతి గలుగ దని యెఱిఁగిన యాతనిసత్కర్మమే యతనికి సద్బుద్ధి పుట్టించె నని మన మెఱుంగవలయును. రాగిలశుభమునను దేహాంతము సత్కర్మమనియే చెప్పఁబడును గదా.

"తస్మిన్నేవ తతః కాలే వైదేహీ శుభలోచనా. 30

... ... ... ...

కుసుమాపచయవ్యగ్రా పాదపా నభ్యవర్తత,
అనర్హారణ్యవాసస్య సా తం రత్నమయం మృగం. 32
ముక్తామణివిచిత్రాంగం దదర్శ పరమాంగనా,
విస్మయోత్ఫుల్లనయనా సస్నేహం సముదైక్షత. 33

అని మూలము. శుభలోచనా = శుభమునే చూచు కన్నులు గలది. అనఁగా దర్శనమాత్రమున శుభముల ననుగ్రహించు నదియని భావము. కనుకనే వైదేహియయ్యెను. జ్ఞానులెల్లరును శుభమునే కోరుదురుగదా. శత్రుమిత్రభేదములు వారికి లేవని తాత్పర్యము. కుసుమాపచయవ్యగ్రా = పూవులు కోయఁ దొందఱకలదియై. ఎప్పుడు? తస్మిన్నేవ కాలే = మారీ చుఁడు మృగరూపమున సీతను జూచి జూడఁగోరి వచ్చినప్పుడే. ఇది కాకతాళీయన్యాయమున కుదాహరణము కాదు. త్రికాల జ్ఞానసంపన్నత్వమున కుదాహరణము. మారీచునియాగమన మెఱింగి తనయవతారఫలము గల్గింపనెంచి తత్కారణముననఁ బతిచే దుష్టరాక్షసులఁ జంపింపఁదలంచి "న హి కారణం వినా కార్యస్యోత్పత్తిః." యను న్యాయము ననుసరించి పూవులు కోయునెపమున నాశ్రమాంతరమునుండి వెడలివచ్చెనని తాత్ప ర్యము. అరణ్యవాసస్యానర్హా = అడవుల నుండఁదగనిది సీత యనునది సామాన్యార్థము. భక్తమనఃపద్మవనమున విహరింపఁ

దగినదని విశేషార్థము. అట్టిసీత (సా=ప్రసిద్ధార్థము) పరమాంగనా = (పరమా చాసావంగనా చ) ఉత్కృష్టస్త్రీ యని యర్థము. విస్మయోత్ఫుల్లనయనా = సంకల్పించినంతన పొడసూపెఁగదా యనునదియే విస్మయము. ఇఁక సత్వరము కార్యము ఫలించునను నానందము. కనులు వికసింపఁగా, సస్నేహం = స్నేహముతోఁ గూడినట్లుగా, సముద్వీక్షత=చూచెను. కార్యార్థము రూపమును దాల్చిన యామహాప్రకృతి తాఁ దలంచిన కార్యము కొనసాగనున్నదను నచ్చెరువున నాదరమున నామృగమును గాంచెనని భావము. భగవత్సంకల్పము తప్పక ఫలించుననియే యిందుఁ గలవిషయము. సంకల్పానుసారముగాఁ గార్యము సాగుటయే కదా పరమేశ్వరత్వఫలము. ఏదో ఒకరీతి సాగుట లౌకికమే. ఇఁక నీభాగము నధ్యాత్మరామాయణమేరీతిగా ననువదించెనని పరిశీలింతము. వాల్మీకిరామాయణమునందు శ్రీరాముని పరమేశ్వరత్వము గూఢముగఁ జెప్పఁబడినది. అధ్యాత్మరామాయణమునఁ దేటగా నయ్యది వచింపఁబడినది. భగవదవతార ఫలమనఁగా నదియే కదా. దాని ననుసరించి కొంతవిషయమును గ్రహింతము. శ్రీరామమూర్తి భగవదవతారమనుట నిర్వివాదాంశము కదా. అట్టి మహాపురుషుఁడు తనకృత్యమును ముందే తెలిసికొని లోకాచారము ననుసరించి సాగించెననుట దోష మెట్టులగును ? స్వరూపజ్ఞానమే లేనియవతారము శ్రీరామావతార మనువారు కొందఱు గలరు. వారిని సంతుష్టులను జేయఁబూనుటకంటె వెఱ్ఱిపని వేఱొకటి కానరాదు. దానికి మనము కడంగక సారగ్రహణమున బద్ధాదరుల మగుదము.

“అథ రామోఽపి తత్సర్వం జ్ఞాత్వా రావణచేష్టితం,
ఉవాచ సీతా మేకాంతే శృణుజానకి మే వచః. ౧
రావణో భిక్షురూపేణ ఆగమిష్యతి తేఽంతికం,
త్వం తు ఛాయాం త్వదాకారాం స్థాపయిత్వోటజే విశ. ౨
అగ్నావదృశ్యరూపేణ వర్షం తిష్ఠ మమాజ్ఞయా.
రావణస్య వధాంతే మాం పూర్వవత్ప్రాప్స్యసే శుభే. ౩
శ్రుత్వా రామోదితం వాక్యం సాఽపి తత్ర తథాకరోత్,
మాయాసీతాం బహిస్థాప్య స్వయమంతర్దధేఽనలే. ౪
మాయాసీతాం తథాపశ్యన్మృగం మాయావినిర్మితం,
హసంతీ రామ మభ్యేత్య ప్రోవాచ వినయాన్వితా.” ౫

౭_సర్గము.

అని యధ్యాత్మరామాయణమూలము. ఇందలిసార మూహింపుదము. శ్రీరాముఁడు భగవదవతార మనుమాటనుమాత్రము మఱువకుఁడు. సీత మహామాయయనియు విస్మరింపకుఁడు. అట్టి భావము మీకు లేనిచో రామాయణమే వ్యర్థమగు. అట్టిపాపమున కొడిఁగట్టరని నమ్మెదను. అథరామోఽపి. పిదప శ్రీరామమూర్తికూడ. అనుటంజేసి సీత యంతయుముందే యూహించెననియుఁ దరువాత శ్రీరామభద్రుఁడు నాలోచించెననియుఁ దేలెడిని. ఏల? సగుణబ్రహ్మము కదా రాముఁడు. నిరంజనుఁడు. ప్రకృత్యధీనుఁడుగా నున్నయట్లు నటించుచున్నవాఁడు. ఆమెయో తదిచ్ఛాశక్తి. ఈ యిరువురవియోగ మత్యంతాసంభవము. ఈవిషయ మెఱింగినవా రిద్దాని కచ్చెరువందరు. అంతియకాక మహానంద మొందుదురు. రావణచేష్టితము నెఱింగి యేకాంతమున సీతాదేవితో శ్రీరాముఁ డిట్లు పలికెను. ఏకాంత మేల? లక్ష్మణునకుఁ దెలియఁగూడదనియే

భావము. జానకి మేవ చ శ్శృణు=నామాట వినుము. అనఁగా ముందు నామాట నీ వాలకింపుము. వెనుక నీమాట విని యట్లే చేయుదును. అనఁగా మాయామృగము వెంట నరుగుదునని భావము. మహాప్రకృతీ! రావణుఁడు భిక్షురూపమున నీసన్నిధికి రాఁగలఁడు. నీవు నీవంటిఛాయను బర్ణశాలయం దునిచి యగ్నిం బ్రవేశించి యితరాదృశ్యరూపమున నొకవత్సర ముండుము. రావణవధానంతరము యథాపూర్వముగా నా కడ నుండవచ్చును. అని శ్రీరాముఁడు సీతకుం దెలిపెను. దీని భావ మేమి? రావణుఁడు భిక్షురూపమున నీసన్నిధి కరు దెంచును. అనుటం జేసి

"అధ్యాత్మరతిరాసీనో నిరపేక్షో నిరామిషః,
ఆత్మనైవ సహాయేన సుఖార్థీ విచరేదిహ. ౪౯
ఇంద్రియాణాం నిరోధేన రాగద్వేషక్షయేణ చ,
అహింసయా చ భూతానా మమృతత్వాయ కల్పతే. ౬౦
అనేన క్రమయోగేన పరివ్రజతి యో ద్విజః,
స విధూయేఽహ పాప్మానం పరం బ్రహ్మాధిగచ్ఛతి." ౮౫
అధ్యా-౬

అను మనుస్మృతివాక్యముల ననుసరించి మనమూలమునఁ బరమపదప్రాప్తిం గోరి నిన్నాశ్రయింపవచ్చును. తొలుత నీ యనుగ్రహపాత్రుఁడు కావలయుఁ గదా.

"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే. ౧౪
నాహం ప్రకాశస్సర్వస్య యోగమాయాసమావృతః,
మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్." ౨౫
గీత. ౭_అధ్యాయము.

అను నీగీతావాక్యముచొప్పున నాలోచింప భగవతి దుర
త్యయురాలు. మీఱ శక్యముకానిది. నన్నాశ్రయించువా
రామాయను దరింతురు. అనఁగా భావమేమి? త్రిగుణాస్వరూ
పిణి భగవన్మాయ. ఆమెను మీఱిపోవరాదు. నన్నే సేవించు
వార లామాయకు లోఁబడరు. అనుదానిసార మేమనఁగా:

"తదను ప్రధానద్వారా రాజదర్శనం కర్తవ్యమ్."

అను న్యాయముచొప్పునఁ బ్రకృతిని దొలుత నుపాసించి దాని
గ్రహామునకుఁ బాత్రుఁడై నిర్గుణు నాశ్రయింపఁగల్గును. దాన
సంసారనివృత్తి యగును. అనియే దీనిసారము. కొందఱు భగ
వంతునాశ్రయించినవా రీమాయకుఁ జిక్కరని యర్థమందురు.
అపుడు 'దురత్యయా మమమాయా' అనుదాని కర్థమేమి? భగ
వంతు నాశ్రయింపనివారికి దురత్యయరాలని యర్థమా. అది
యెంతమాత్రము సరిపడునది కాదు. రెండవభగవద్వాక్యముం
బఠింపుఁడు. యోగమాయాసమావృతుఁడనగు నేనెల్లరకుఁ
దెలిసికొన శక్యుఁడనుగాను. మూఢు లీవిషయము నెఱుఁగరు.
దేనిని? పుట్టుకయు మృతియు లేనివాఁడనని. యోగమాయ
నన్ను నాచ్ఛాదించి యుండుననఁగా రూపనామక్రియాసంతుఁ
డనుగా నుండును. ఇవి నన్నంటవని యెల్ల రెఱుంగరు. అని
కదా భావము. మానవులకుఁ గల్గినయజ్ఞానము దొలఁగుటెట్లు?
గుణమయునిగా నుపాసించి దానిచేఁ గలిగినజ్ఞానమున నాత్మ
తత్త్వము నెఱుంగవలయును. తొలి యుపాసనములేక రెండ
వది లభించుటెట్లు? తొలుదొలుత సగుణోపాసనము ఫలాభి
సంధిరహితముగా నొనరించి దానివలనఁ గలిగిన నిర్మలజ్ఞాన
మున

"సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః."

అను గీతావాక్యమురీతిగాఁ గనఁబడువస్తువులెల్ల భగవత్స్వరూపములని భావింపవలయును. అది సిద్ధించినేని ముక్తుఁడే యగును. ప్రకృత్యుపాసనమనఁగా సగుణోపాసనమని యే యర్థము. భగవతి స్త్రీయనునది పామరులభావము. భగవంతుఁడు పురుషుఁ డనునదియు నట్టిదే. ఎవరెట్లు భావించిన నట్లు లగుటయే భగవత్త్వము. పురుషుఁడే భగవంతుఁ డనువారలు పామరులలో నగ్రగణ్యు లనఁదగినవారే. ఒకటి యగును. ఒకటి కాదు. అన్నచో భగవత్త్వమే యడుగిపోవును. కావున స్త్రీపున్నపుంసకభేదము లాతత్త్వమునను నుండరాదు. ఈ విషయమున శ్రీశంకరభగవత్పాదాచార్యులు

"త్రయాణాం దేవానాం త్రిగుణజనితానాం తవ శివే
భవేత్పూజా పూజా తవ చరణయోర్యా విరచితా,
తథాహి త్వత్పాదోద్వహనమణిపీఠస్య నికటే
స్థితా హ్యేతే శశ్వన్ముకుళితకరోత్తంసమకుటాః." ౨౫

అని సగుణోపాసనము తెల్పిరి. మఱియు

"జపో జల్పశ్శిల్పం సకలమపి ముద్రావిరచనా
గతిః ప్రాదక్షిణ్యక్రమణ మశనాద్యాహుతివిధిః,
ప్రణామస్సంవేశస్సుఖమఖిలమాత్మార్పణదృశా
సపర్యాపర్యాయస్తవ భవతు యన్మే విలసితమ్." ౨౭

అనియుఁ దెలిపిరి. సకలసత్కార్యములు భగవత్సేవగా భావించుటయే. పూజయనఁగాఁ దానిపర్యాయమేమి? భగవత్సేవకే నా ప్రవృత్తియంతయు నని భావించుటయే కదా. సర్వదేవతా

స్వరూపునిగా నారాధించుటయే సగుణోపాసన మనఁబడునని యేకదా. గీతార్థమే యీ శ్లోకద్వయార్థము. భేద మేమి? బుద్ధి భేదమున విషయభేదము గలదని వాదించువారినే మనము పామరు లందుము. ఒక్కవిధమగు రోగముగలవారికి శర్కర చేఁదుగా నుండును. అది సత్యమగునా? అట్లే సత్కర్మానుష్ఠానము లేనివారలకే శివవిష్ణ్వాదిదేవతాభేదములు లోనగునవి గోచరించును. వారిని మనము దూషింపరాదు. అట్టి భేదబుద్ధి చేనైన నిష్కాములై తమయభీష్టదైవము నుపాసించినయెడలఁ గొంతకాలమున కాదైవమే వారలను సమదర్శనులనుగాఁ జేయును. ఏల? అనఁగా ఆరూపముకూడ భగవంతునిదే కదా.

"న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినాం,
జోషయేత్సర్వకర్మాణి విద్వాన్ యుక్తస్సమాచరన్."

అని గీతాశాస్త్రమున భగవంతుఁడే తెలిపెను. శివకేశవాది దేవతాదూషకులు భక్తిభరితాంతరంగులై యుపాసించినచో నాదైవమే వారలకుఁ జక్కనిజ్ఞానము నొసంగకమానదు. వారును సమదర్శను లగుదురు. ఆభేదబుద్ధి కొలఁదికాలమున నశించును. కనుకనే వారలకున్న భేదజ్ఞానమును మాన్పఁబూనరాదని భగవంతుఁడు తెలిపెను. అట్లు లోనరించిన వారు నాస్తికు లగుదురేమో యని సంశయింపవలసి యుండును. దీని సారమేమనఁగా వాదోపవాదములు మానుకొని యెవరిశక్తి కొలఁదిని వారు సత్కర్మముల నాచరించుచుండిన నెప్పటికైన నిర్మలజ్ఞానము కలుగక మానదు. కాన నీనడుమ వార లొనరించుసుపాసనము విధి కించుక వ్యతిరేకముగా నున్నను భక్తి కలదు కాన వారి నాక్షేపింపరాదనియుఁ గొంతకాలమునకు వారే యాత్మజ్ఞానము కలవార లగుదురనియు ననునదియే.

రావణుఁడు భిక్షురూపమున వచ్చునని శ్రీరాముఁడు తెలుపుచున్నాఁడు. ధర్మార్థకామములను గోరక నాల్గవపురుషార్థమగు మోక్షమునే కోరినవాఁడు రావణుఁడని మన మెఱుఁగవలయు. లేకున్న మునివేషమున నేల రావలెను! సర్వసంగములనుండి నన్ను మరలించి యపునరావృత్తిరూపగు పదమునొందింపఁజేయుమనునదియే భిక్షులవాంఛితము. దానినే కోరినవాఁడు రావణుఁడు. కనుకనే తపోయుతమగు ప్రకృతి నాశ్రయించి యుపాసించి తత్కరుణచే నిర్గుణుని ధ్యానించు జ్ఞానము నలవఱచుకొనఁ గోరియే మహామాయ నాశ్రయించు వచ్చును. అనునది యిందలి ప్రధానవిషయము. మాయనే యొకరూపము నునిచి నీవగ్నిం బ్రవేశింపుమని రాముఁడు [illegible] తెలిపెను గదా. దీని భావమేమి? నీ తేజోరూపముతో నగ్నియం మున నుండుమనియే భావము.

"తటిల్లేఖా తన్వీం తపనశశివైశ్వానరమయీమ్."

అని శంకరభగవత్పాదులవారు చెప్పినట్లు భగవానుని [illegible] ప్రకృతికి రూపము తేజస్సే. ఈవిషయము ఎన్నోసారులు [illegible] వ్రాయఁబడియెను గదా. తేజోరూపమున నుండుమని భగవంతుఁ డాజ్ఞాపించుట విచిత్రమేమి? ఒక్కసంవత్సరమే [illegible] డుము. అనఁగా సంవత్సరాంతమున రావణుఁడు [illegible] చును. నాచే వధింపఁబడును. తపస్వినీరూపమున యథాపూర్వముగా నాకడ నుండఁగలవు. నీప్రతిచ్ఛాయ [illegible] శ్రీరాముఁడు పలికినంతనే యాలోకమాత [illegible] చెను. తనఛాయను నియమించి తాను సంవత్సరము తేజోరూపమున శ్రీరామునికడ నుండెను. తనఛాయ [illegible]

కార్యము లొనరింపుమని నియమించు టద్భుతమే యని కొంద ఱిందు సంశయమునొందుదురు. సూర్యపత్ని సంజ్ఞాదేవి సూర్య కాంతుల భరింపఁజాలక తనవలెనే ఛాయనునిచి పుట్టినింటికిం బోయెనని పురాణములయందుఁ గలదు. ఇది మానవులకుం గూడ నసాధ్యము కాదు. తపశ్శక్తియే దీనికి హేతువు. సర్వ బ్రహ్మాండముల నిర్మించుపరాంబ తనవంటి యొకయాకృతిని నిర్మించుట సులభతమ మగుకార్యము. ఎందుల కీకార్యము? అనఁగా లోకులకు నీతినేర్పుటకని యెఱుంగవలయును. ఇఁక సీతఛాయయే యనియు జానకి తేజోరూపమున శ్రీరామునెడఁ బాయక యుండెననియు మనము భావించుచుఁ గథను బఠిం చిన నెంతయో ఉపకారముకలుగును. కావున నట్లు చేయుదము.

## జానకి మాయామృగమును బట్టి తెమ్మనఁగా రామమూర్తి బయలుదేఱుట.

* తప్తకాంచనవర్ణాభయగు నాజానకీదేవి పూవుల కోయుచుండి యొక్కప్రక్క బంగరురంగు వేఱొకపార్శ్వము వెండిరంగుగలిగి ముద్దులుమూటగట్టు నా మృగవర్యమును గాంచి సంతుష్టయై ప్రాణనాథుని లక్ష్మణుని నాయుధములఁ దాల్చి రండని గట్టిగాఁ బిలిచెను. ఆమె పిలువగనే వారిరువురు వచ్చి నలుప్రక్కలఁ గాంచుచు నామాయామృగమును జూచిరి. సౌమిత్రి దానిం జూచినంతనే సంశయాకులితచిత్తుఁడై శ్రీరామ చంద్రా! ఈమృగమే యామారీచుఁడని నాకుఁ దోఁచుచున్నది. కామరూపి మారీచుఁడు మృగతనుధారియై వనులందు వేఁటా డురాజుల వధించినాఁడు. వాఁ డనేకమాయల నెఱింగిన

* ఇది నలువదిమూఁడవసర్గమునఁ గలదు.

వాఁడు. వానిమాయయే యిది. గంధర్వనగరముభాతిఁ గల్లయై మిగుల వింతగొలుపుచుండు నీమృగరూప మెత్తిన దాతని మాయయే. రజతబిందుచిత్రితమై యచ్చెరువుగానున్న యీ మృగము ప్రపంచమున లేనిది. కావున నిది మాయామృగమే. నిస్సందేహము. అను లక్ష్మణుని నివారించి సుస్మితాస్య యగుచు సీత యా మృగచర్మసౌందర్యమునకుఁ జిక్కి బుద్ధి బలము తగ్గఁగా శ్రీ రామునితో నిట్లు పలికెను.

ఆర్యపుత్రా! ఈమృగము మిక్కిలి యందమైనది. నా మనస్సు దీనియందే తగిలియున్నది. దీనింబట్టి తెచ్చి నాకిమ్ము. మన వేడుకల కిది యుపకరించును. ఈయాశ్రమమున సుందర మృగము లెన్నియో గలవు. కోఁతులు కిన్నరమృగములు లోనగునవియు నిందు సంచరించుచునే యున్నవి. ఈమృగ మునఁ గనఁబడు మేలివర్ణములు శరీరసౌష్ఠవము గలమృగము నింతవనుకఁ జూడలేదు. ముందైనఁ జూడఁగలననునాశయు లేదు. ఎన్నియోరంగులుగలిగి రత్నబిందువులు వెలయనుండు నిది చందమామవలె నేత్రములకుఁ జల్లనై యీవనమునెల్ల నలరించుచున్నది. ఆహా! ఇదేమి వర్ణము! ఏమి దీనికాంతి! కంఠ ధ్వని యెంతమధురముగా నున్నది! ఏమి యవయవలావణ్యము! మంచి యవయవములుగలిగి యచ్చెరువుగల్గించు నీమృగము నామనస్సు నాకర్షించుచున్నది. ప్రాణములతో నిది దొరకునేని మనకెల్ల నచ్చెరువు కలిగించును. వనవాసానంతరము రాజ్య మునసుండుతఱి నెంతయో వింతలఁ గల్గింపఁగలదు. మఱియు మనయంతిపురమున కిది యొకయలంకారముగా నుండఁగలదు. ప్రభూ! ప్రశస్తమగు నీమృగరూప మయోధ్యానగరము నందు భరతునకు నాయత్తలకు నాకును నిశ్చయముగా

నాశ్చర్యమును గలిగించుచుండఁ గలదు. ప్రాణములతో నిది నీకు దొరకకపోవునేని చచ్చిన దీనిచర్మము కూడ నాకు సంతోష మును గల్గింపఁజాలును. దీని వధించి తెత్తువేని బంగరురంగుగల దీనిచర్మమును శాద్వలములయందు మునులయాసనములపైఁ బఱచుకొని దానిమీఁద నిన్నుంగూడి కూరుచుండఁ గోర దను. పురంధ్రులీరీతిగా నిచ్చచొప్పునఁ బతులఁ బురికొలుపు నట్టివృత్తి భయంకరమైనది. అది యెంతమాత్రము తగినది కాదు. అయిన నీమృగశరీరముం జూడఁగా నిర్భరకుతూ హలము నాకుదయించుచున్నది. దానిని దెచ్చియిమ్మని యాజ్ఞా పింపరాదు. నావలెనే నీవు కూడఁ గుతూహల మొందుదువేని దానిందెమ్ము.

అని సీత మాటచమత్కృతి యలరఁ బ్రార్థింప శ్రీరా ముని కా మృగశరీరము గాంచఁగనే యాశ్చర్యము కలిగెను. సీత తన్ను వేఁడుటయుఁ దా నద్దానిని జూచుటయుఁ గారణ ములుగాఁ దన్ను సీత పురికొలుపుట న్యాయ్యమే యని తలఁచి మిక్కిలి సంతుష్టుఁడై లక్ష్మణునింగని యిట్లు పలికెను. "వత్సా! సీత కీమృగముపై విశేషప్రీతి యెట్లు కలిగినదో పరికింపుము. ఇట్టి యద్భుతమును గలిగించుమృగ మెందైనఁగలదే. ఈవనము నందును దొరకదు. ఇట్టిది నందనచైత్రరథవనములందును గూడ దొరకదు. భూమియం దిది దొరకుననుట యెట్లు? ప్రతిలో మానులోమములుగానుండు దీనిబెందుకలు రుచిరతరములుగ నున్నవి. వానియందుఁ గనకబిందువులు చిత్రితములై యున్నవి. ఇది యావులించుతఱి నాలుక ముఖమునుండి వెడలి యగ్ని జ్వాలవలె వెలుంగుచు మేఘనిర్గతతటిల్లతికవలె వెలయు చున్నది. చూడుమా. ఇంద్రనీలనిర్మిత మగుపాత్రమువలె

మొగ మొప్పుచున్నది. శంఖముక్తామణులవలెఁ దెల్లఁగాఁ గడుపు కనఁబడుచున్నది. వర్ణనాతీతసౌందర్యముగల యీ మృగముం గాంచఁగనే యెట్టివారిమనసైన నాసక్తము కాక మానదు. కార్యసమర్థుఁడవగు నోసహోదరా! కనకమయము బహురత్నబిందుయుతము సుందరమును దీనిరూపము మనోజ్ఞ మగుటం జేసి కాంచినంతనే యెవ్వరిమనసైన నబ్బురంపడక మానదు. వత్సా! ప్రభువులు మహారణ్యములయందు మాంస లోభమునను, గోదండవిద్యను బ్రదర్శించుచు విహరించు నిమిత్తమునను మృగయాకేళిందవిలి మృగముల వధింతురు. ఇట్టి బహుచిత్రవస్తువుకొఱకుఁ బ్రయత్నించుట క్రొత్తగా వచింపవలయునే? మహాటవులయందు మృగయోద్యోగమున నేనుఁగులశిరస్సులం గలముక్తామణులను మఱియుంగల వజ్రాది రత్నములను సువర్ణమును గ్రహింతురు. ఈమృగము కూడ నీ వనమున మహాధనమే. కాన దీనివేఁటాడి సంగ్రహించుట కార్యమేకదా. సౌమిత్రీ! మానవులు మానసమునఁ గోరుకోరి కలు ధనము శుక్రునికోశమును నిండించుచందమున వనమున దొరకు నానావిధద్రవ్యములలో మేలైనవన్నియు రాజుల కోశాగారమును నిండించును. పదార్థమును గోరువాఁడు ఏ వస్తువు మేలుగనుండునో ప్రీతిపాత్రముగ నుండునో దానిని ముందువెనుక లాలోచింపక సంపాదింప నిష్టపడును. నీతిశాస్త్ర వేత్తలు అర్థవంతులు నగువారు దానినే అర్థమని (ఆశింపఁదగిన వస్తువు) పలుకుదురు. ఈమృగము కూడ నట్టిదియే కావున విచారింప నక్కఱలేదు. ఈమృగవిశేషమునందు నమూల్య చర్మము కలదు. దానిపై నాతోఁడజానకి కూరుచుండఁ గలదు. నల్లచాఱలు గలయిఱ్ఱియు బొట్లయిఱ్ఱియు ప్రవేణి యను

మృగము, ఆవికమగు నా స్తరణముకాని మృదువగుస్పర్శన మున దీనికి సాటిగానేరవని తోఁచెడిని. మిగులువన్నెగల యీమృగమును నాకసమునఁ దిరుగుమృగశీర్షమను మృగ మును, అను నీభూమృగనక్షత్రమృగములు రెండు నుత్త మములైన మృగములు. వత్సా! నీవు పలికినట్లిది మారీ చునిమాయయే యైనఁ దప్పక దీని వధింపవలసినదే కదా. తొల్లి క్రూరుఁడై దుస్స్వభావుఁడు నగు నీమారీచుఁడు దండ కారణ్యమున సంచరించుచుఁ బెక్కండ్ర మునులం జంపి యున్నాఁడు. ఇయ్యదియు వేటాడుధానుష్కు లగు రాజుల నెందఱనో చంపియున్నది. కానఁ దప్పక దీనిం జంపవలసినదే. మున్నీ మహాటవియందు వాతాపినామకదానవుఁ డొక్కఁడు మహర్షుల నిరాకరించి మేఁకవలెఁ దానుండి వారలకు నాహా రమై వారియుదరభాగముం బ్రవేశించి యశ్వతరి ప్రసవించు నపుడు దూడ కడపును భేదించుకొని వచ్చి దానిం జంపురీతిగా మహర్షుల కుక్షులంజించి చంపుచుండెను. అట్లు వాఁడు చేయు చుండఁగా నొక్కకాలమున మాంసలోభమున నగస్త్యముని కడకుఁ బోయి వాఁడాహార మయ్యెను. భగవంతుఁ డగునా ముని శ్రాద్ధాంతమున కుక్షిని దడవుకొని కుక్షి భేదనప్రయత్న మున వాఁ డుండుటెఱింగి నవ్వుచు వానిం బిలిచి వాతాపీ! నీవు పాపమని తలంపక విప్రోత్తములనెందఱనో చంపితివి. కాన నాకడుపున జీర్ణించితివి. అని పలికెను. ధర్మనిరతిగలిగి యింద్రియముల జయించియున్న నాయట్టివాని నతిక్రమించె నేని యీమారీచుఁడు వాతాపివలె నీభూమి నుండఁజాలఁడు. సౌమిత్రీ! నీవిందు సన్నద్ధుఁడవై జాగరూకుఁడవై జానకి రక్షించుచుండుము. చేయఁదగుకార్యము లెల్ల మన కీసీతయందే

యాయితము లైయున్నవి కదా. మనకార్యములెల్ల నీ సీతా రక్షణార్థమే సుమా. దీని నేను బట్టుకొందును. పట్టుపడ దేని చంపుదును. ఇపుడే దీనిం దీసికొనిరాం బోయెద. దీనిచర్మము నం దీ సీతకుంగల యాసక్తిని బరికింపుము. కాంబట్టి చర్మమును బట్టియే యిది యిఁక బ్రదుకదు. ఒక్క బాణమున నేను దీనిం జంపివచ్చుదాఁక నీవు సీతకొఱకు నాశ్రమముననే నిలిచి యే మాత్రముగాని యేమఱుపాటొందక కాచియుండవలయును. సత్వరముగా వచ్చెద. మహాసమర్థుఁడు బుద్ధిమంతుఁడు నగు జటాయువుతోడ నీవు నలుఁగడలఁ గాంచుచు రాక్షసులమూల మున నేమివిపత్తు కలుగునో యని శంకించుచు నప్రమత్తుఁడవై సీతను గాపాడుచుండుము.

జ్ఞానధనులారా! మాంహాసీతాచేష్టితములఁ బరిశీలిం తము. భగవంతునికార్యముం దిలకింతము. సామాన్యపురంధ్రి వలె సీత సంభాషించును. కాని యందందు మహాప్రకృతిలక్షణ ములు వదలదు. భగవంతుఁడు నట్లే.

"భర్తారమభిచక్రంద లక్ష్మణం చాపి సాయుధమ్." ౨

అని మూలము. దానిని హరిణమనియే సీత భావించెను. క్రూర సత్త్వమని భావింపలేదు. మృగజాతులలో హరిణము మిక్కిలి సాధుజంతువనుట నిర్వివాదాంశము. దానిలో నిది యపూర్వ ముగాఁ గనఁబడునది. దానిం జూడఁగనే సీత ప్రాణేశ్వరుని దత్సోదరుని సాయుధులరై రండని గట్టిగాఁ బిలిచెను. 'క్రది' అనుధాతువు ఆహ్వానమునందు రోదనమునందు నుపయో గింపఁబడును. అభియను నుపసర్గము కూడినందున గట్టిగాఁ బిలిచెననియే మనము గ్రహింపవలయును. ఆయుధములను

దీసికొనిరండు. అని పిలుచుటంజేసి యింక సంగరమునకు సిద్ధపడుఁడని యామె హెచ్చరించెనని ధ్వని యిందుఁ గలదని మన మెఱుంగవలయు. మీకు నాకు నెడఁబాటు గలుగును. మీకింక సాయ మాయుధములే. వానితోటి పనితీఱినఁగాని నన్నుం జూడఁజాలరను నర్థ మియ్యది సూచించుచున్నది.

"శంకమానస్తు తం దృష్ట్వా లక్ష్మణో రామ మబ్రవీత్,
తమేవైన మహం మన్యే మారీచం రాక్షసం మృగమ్. ౪
చరంతో మృగయాం హృష్టాః పాపేనోపాధినా వనే,
అనేన నిహతా రాజన్ రాజానః కామరూపిణా. ౫
అస్య మాయావిదో మాయా మృగరూపమిదం కృతం,
భానుమత్పురుషవ్యాఘ్ర గంధర్వపురసన్నిభమ్. ౬
మృగో హ్యేవంవిధో రత్నవిచిత్రో నాస్తి రాఘవ,
జగత్యాం జగతీనాథ! మాయైషా హి న సంశయః." ౭

అని మూలము. "సతాం హి సందేహపదేషు వస్తుషు ప్రమాణమంతఃకరణప్రవృత్తయః" అనుసూక్తి వ్యర్థమగునా? రామలక్ష్మణు లామృగమును దిలకించిరి. లక్ష్మణుఁడు చూడఁగనే దానితత్త్వ మిది కదా యని యెఱింగెను. భగవత్సేవాఫలమన నిట్టిదియే కదా. భక్తులకుఁ బ్రతివిషయమునందును నిర్మలము లగుతలంపులే కలుగవలయును. అది లేనిచో నాభక్తి వ్యాజమూలమే యనవలయును. అవ్యాజప్రేమమున శ్రీరాముని చరణములను సేవించులక్ష్మణునకు మృగరూపతత్త్వము తోఁచుట యొకవిశేషము కానేకాదు. సామాన్యమే యనవలయు. కష్టానుభవములు సీతారాములకుబలె సౌమిత్రికి సహజములు కావుకదా. కష్టసుఖములనునవి ప్రకృతిపురుషు

లకు నుండవు. కావుననే సౌమిత్రి దానిం జూడఁగనే యను మానించెను. వినిర్మలాంతఃకరణుఁడు కాన నతనికి దర్శనమాత్రమున దానితత్త్వమే గోచరించెను. సజ్జనులు నాకిట్లు తోఁచుచున్నది. అని యందురే కాని సిద్ధాంత మిదేయని నొక్కి పలుకరు. ఆసదాచారముననే యనుసరించి యీమృగము మారీచుఁడని నేను దలంచెద ననియె. ఆతని దండకారణ్యచరిత్రము విన్న దానిం దెలిపెను. ఈమృగము "భానుమత్ గంధర్వపురసన్నిభమ్." అని తేటపఱచెను. సొగసై యచ్చెరువు గలిగించుచు ననేకాకారసంస్థానమై క్షణభంగురమగునాకాశము గంధర్వపుర మనంబడును. భానుమత్ = ప్రకాశవంతముగ నయ్యది కనంబడును. కాని క్షణకాలమున నయ్యది మార్పు నొందును. ఈమృగము కూడ నట్టిదే. ఈసౌందర్యము కేవల మోహజనకమే. ఇట్టి రత్నవిచిత్రమైనమృగ మెందు నుండదు. అని తెలిపెను. మారీచుని గంధర్వనగరముతోఁ బోల్చినందున నయ్యది తనంతన క్షీణించునట్లు మారీచుఁడును ఆత్మదోషమున నే నశించుననునర్థము సూచింపఁబడును. ప్రాణితతి స్వకర్మముననే నశించును. నీవిపుడు నిమిత్తమాత్రమే యాతనిమృతికి హేతువు కాఁగలవనుభావము వాల్మీకిమహాకవి సూచించెను. "ఏషా మాయా హి నసంశయః" ఇది మాయయే. సంశయమే లేదు. హి శబ్దమే చాలియుండఁగా 'న సంశయః' అనుట యిది యంతయు మాయాచేష్టితముగ నున్నదికదా. ఏల సంశయింప వలయును. అనఁగా నీవే యిట్లు పురికొలిపి చేయఁదలఁచిన కార్యము సాధించులాగు కనఁబడుచున్నది కదా యనుధ్వని యిందుఁగలదని కొందఱందురు. అదియు నంగీకరింపఁదగినదే. సత్య మదియే కదా. భగవంతుఁడు సర్వకారణము కదా.

మాయాతత్త్వ మెఱింగినవాఁడు పరమేశ్వరుఁడే. కాన ధర్మ రక్షణ మేయేమార్గములఁ జేయఁదగునో యవ్వాని నలవరింప సంకల్పించెను. సంకల్పమాత్రమున నన్ని కార్యములు సాగును. అదియే పరమేశ్వరత్వ మనఁబడును. దీని సారమేమి? లోక మున నొకరి కొకకార్యమునందు హానికలుగఁబోవునని తోఁచి నచో సాధువు లాప్రయత్నమునుండి విరమింపుమా యని హితము తెలుపుదురు. తత్ఫలానుభవ మాతనికిఁ దప్పనియెడల నాతఁ డప్పలుకుల లెక్కింపఁడు. ఏల? కర్మము బలవత్తరము. కాన నవశుఁడై యట్టులే చేయఁబూనును. ఇయ్యది మానవ సామాన్యధర్మము. శ్రీరాముఁ డాయాచారము నవలంబిం చుట, మానవు లస్వతంత్రులు, కర్మపాశబద్ధులు, స్వతంత్రుల మనుకొనుట పొరపాటు, కర్మము బలవత్తరమని తెలిసికొని విధివిహితకర్మముల నాచరింతురు గాక యనునీతిని లోకులకుఁ దెలుపుటకొఱకే యని మన మెఱుంగవలయును.

"న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన,
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి. ౨౨
యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః. ౨౩
ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహం,
సంకరస్య చ కర్తా స్యాముపహన్యా మిమాః ప్రజాః. ౨౪
సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత,
కుర్యాద్విద్వాంస్తథాసక్తశ్చికీర్షుర్లోకసంగ్రహమ్." ౨౫

అధ్యాయము-3.

అను గీతావాక్యములను శ్రీరాముని ప్రవృత్తి సార్థకము చేయు

చున్నది. గీతోపదేశసర్వస్వము శ్రీరాముని ప్రవర్తనాయత్త మనియే యిందుఁ గల ప్రధానవిషయము.

"ఏవం బ్రువాణం కాకుత్స్థం ప్రతివార్య శుచిస్మితా,
ఉవాచ సీతా సంహృష్టా చర్మణా హృతచేతనా. ౮

ఆర్యపుత్త్రాభిరామోఽసౌ మృగో హరతి మే మనః,
ఆనయైనం మహాబాహో క్రీడార్థం నో భవిష్యతి. ౯

న చాస్య సదృశో రాజన్ దృష్టపూర్వో మృగః పురా,
తేజసా క్షమయా దీప్త్యా యథాయం మృగసత్తమః. ౧౦

... ... ... ...

నానావర్ణవిచిత్రాంగో రత్నబిందుసమాచితః,
ద్యోతయన్ వనమవ్యగ్రం శోభతే శశిసన్నిభః. ౧౩

... ... ... ...

మృగోఽద్భుతో విచిత్రాంగో హృదయం హరతీవ మే." ౧౮

అని మూలము. ఏవం బ్రువాణం కాకుత్స్థం = ఇట్లు పలుకుచున్న సౌమిత్రిని. అనఁగా మన కార్య మెట్టిదో యనుదాని నెఱుంగక తాను సంశయమును గల్గింపఁ బలుకుచున్న సౌమిత్రిని యని భావము. ప్రతివార్య = ఇంచుకయు నవకాశము లేకుండ నాపివేసి యని యర్థము. శుచిస్మితా = పరిశుద్ధమగు చిఱునవ్వుగలది. అనఁగా మాయావతారఫలము లోకులకు లభించుకాల మాసన్నమయ్యెఁ గదా యను సంతోషమునఁ గపటములేని స్మితముగలదయ్యెనని భావము. సంహృష్టా = లోపలియుత్సాహము నిండ ప్రకాశించుచున్నది. చర్మణా హృతచేతనా = చర్మముచే హరింపఁబడిన తెలివిగలదిగ్గా, చర్మమునందే యాసక్తిగలదిగ్గా యనునది సామాన్యార్థము. దానిచర్మమునే

కోరినదియై. అనఁగా నిఁక నిది జీవింపదను నూహాగలదియై యని ధ్వని. అసౌ మృగః మే మనో హరతి=ఈమృగము నా మనస్సు హరించుచున్నది. అనఁగా నామనస్సునం దాసక్తి గలిగించుచున్నదని భావము. త్వరితముగా నాకష్టములఁ బాయఁ జేయుమా. ఉత్తమగతిని గల్పింపుమా యని కోరి నన్ను నాశ్రయించుచున్నదని సారతరార్థము.

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే."

అన్న మన ప్రతిజ్ఞప్రకార మీతని గర్మము ననుసరించి వధించి తత్కాలమున నుత్తమగతిఁ గల్పించుటకు నన్నాశ్రయించుచున్నదనియే సీతాహృదయము. "మహాబాహో! ఏన మానయ. నః క్రీడార్థం భవిష్యతి" మహాబాహుఁడనఁగాఁ బొడవు చేతులుగలవాఁడని యర్థము కాదు. అభయవరద ముద్రాంకితబాహువుఁడని భావము. ఎవ్వనిచేతులు విపన్న రక్షదక్షములో యతఁడే మహాబాహువని మన మెఱుంగుట మంచిది.

"కరే శ్లాఘ్యస్త్యాగశ్శిరసి గురుపాదప్రణయితా."

అని భర్తృహరి తెల్పెను. సత్పాత్రదానమే కరభూషణము. అనఁగా భగవంతునివిషయమున నిది సమన్వయముచేసిన నభయవరదానమే శ్లాఘ్యత్యాగ మగును గదా.

"త్వదన్యః పాణిభ్యామభయవరదో దైవతగణ,
స్త్వమేకా నైవాసి ప్రకటితవరాభీత్యభినయా."

అని శ్రీశంకరభగవత్పాదులు తెల్పిరి. ఓ పరమేశ్వరా! దీనిని గొనిరమ్ము. మనకు విహారార్థము కాఁగలదు. అనఁగా మన

విహారమని సీతయన నర్థమేమి? దుష్టసంహారశిష్టరక్షణమే ప్రకృతిపురుషులకు విహారము. దానికిఁ గారణభూతమే యీ మృగము. దీనిం దెచ్చితివేని మనక్రీడ సాగును. దీని నీవు తేఁ జనఁగా నన్నికార్యములు సాగి మనయవతారమునకు ఫలము గలిగించునని సారము.

ఇట్టిదానిని మున్నెన్నఁడు చూడలేదు. ఇది క్రొత్త సృష్టి యనఁదగు. తేజస్సుచేత ననఁగాఁ దోలుతఁ బౌరుష మునుబూని పయనమై త్వరపడి వధింపక యోర్పుచేతఁ గొంత కాలముపుచ్చి యామీఁద స్వప్రకాశముచేత నెట్లు లీమృగ వరమును సాధింపనగునో యట్లు సాధింపుమనునది యథ్యాహార్యము. ఈకార్యముననే మనప్రయత్నము ఫలించునని సీతాహృదయము. శోభతే శశిసన్నిభః=ఈమృగము చంద్ర సదృశమైనది. మిగులఁ బ్రకాశించుచున్నది. అని చంద్రోప మానము చెప్పుటంజేసి వృద్ధిక్షయములు చెప్పఁబడినవి. అతి వృద్ధికాఁగా వెంటనే క్షీణము కలుగును. దీనివృద్ధికాలము గత మయ్యెను. క్షయకాలము సమీపించెనని సీత శ్రీరామునకుఁ దేటపఱిచెను. తనంతన కార్యములొనరించుట నిరంజనునిలక్ష ణము కాదు. ప్రకృతియే యన్నిపనులు తత్సాన్నిధ్యమున నొనరించును. అనుభావ మిత్యాది సూచించుచున్నది. నాహృద యమును హరించునదివలెఁ గనఁబడుచున్నది. తనమాయా బలమున నన్ను నాసపడునట్లు చేయఁబూనినచందము గనఁ బఱచుచున్నది. అనఁగా దీనిమాయ నే నెఱింగితిని. కాని దీని వ్యాజమునఁ గదా రావణుని వధింపవలయు. కాన నెఱుఁగ నట్లే యున్నదాననుభావముఁ దెలిపెను.

"యది గ్రహణమభ్యేతి జీవన్నేవ మృగ స్తవ,
ఆశ్చర్యభూతం భవతి విస్మయం జనయిష్యతి. ౧౫

సమాప్తవనవాసానాం రాజ్యస్థానాం చ నః పునః,
అంతఃపురవిభూషార్థో మృగ ఏవ భవిష్యతి. ౧౬

భరతస్యార్యపుత్త్రస్య శ్వశ్రూణాం చ మమ ప్రభో,
మృగరూపమిదం వ్యక్తం విస్మయం జనయిష్యతి." ౧౭

అని మూలము. ప్రాణములతో నియ్యది దొరకినచో నచ్చెరువుగదా. విస్మయజనకము కూడఁ గాఁగలదు. పైవ్రాసినదాని కిది విరుద్ధము కాదా యందురేమో చెంతనున్న లక్ష్మణున కీ వార్త తెలియఁగూడదని గూఢముగాఁ దెలుపుచున్నది. ఇది ప్రాణములతో దొరకు టసంభవమే యని సీతాభావము. వనవాసము తీఱిచి రాజ్యమునొందిన మనకు నంతఃపురాలంకార మీమృగమే కాఁగలదు. అనఁగా మనము వనవాసనియమము సాగించి రాజ్యము చేకొన్నపిదప నంతఃపురమున నుండఁగా నిట్టిరావణవధాది మహాకార్యములకు నొకజింక యేకదా కారణ మయ్యెను. అని పలుమాఱులు మనము తలంచుకొనుచుందుము. అపుడెల్ల మన కాశ్చర్యము కలుగుచుండును. అని జానకి తెలిపెను. భరతునకు నీకు నత్తలకు నాకుంగూడ నొక మృగముమూలము నింతటికార్యము సాగెఁ గదాయని విస్మయము కలుగుచుండును. అట్టిది యీమృగము. దీనింగొని తేఁ బ్రయత్నింపుము.

"నిహతస్యాస్య సత్త్వస్య జాంబూనదమయత్వచి,
శష్పబ్రుస్యాం వినీతాయా మిచ్ఛామ్యహ ముపాసితుం. ౧౮

అని మూలము. శష్పబ్రుసి యనఁగా దర్భాసనము. దానిపై

నజినముంబఱచుకొని కూరుచుండి నిన్ను పాసింప నిచ్ఛగింతును. అని సీతాహృదయము. దీనిచే భావిరావణాశోకవనమున మున్యాసనమునఁ గూరుచుండి నిన్ను ధ్యానింపఁ గోరెద నను భావము సూచించెనని మన మూహింపవలయును.

> "కామవృత్తమిదం రౌద్రం స్త్రీణామసదృశం మతం,
> వపుషా త్వస్య సత్వస్య విస్మయో జనితో మమ." ౨౦

అని మూలము. ఈ సీతావాక్యములమూలమున వాల్మీకిమహాకవి స్త్రీలకు ధర్మము నుపదేశించుచున్నాఁడు. స్వేచ్ఛగాఁ బతులను బ్రేరేపించుట భయంకరకార్యము. ఇది స్త్రీలకుఁ దగదు. ఈ మృగశరీరమును జూడఁగా నాకు విస్మయము జనించెను. కానఁ గోరితినని జానకి పలికెను. తోఁచినట్లు స్త్రీలు భర్తలను బురికొలుపరాదనియు, నయ్యది క్రూరకార్యమనియు దీని భావము. పతి నీకార్యము చేయుమని భార్య పురికొల్పుటయు సత్కార్యముకాదని యాకాలమున నియమము కలదు. ఈ కాలమున నద్దానిస్వరూపము కూడ నశింపఁజేయఁబడినది.

> "పతిం యా నాభిచరతి మనోవాగ్దేహసంయతా,
> సా భర్తృలోకానాప్నోతి సద్భిస్సాధ్వీతి చోచ్యతే."

అన్న మనుస్మృతివాక్యము రామాయణార్థమునే సూచించుచున్నది కదా.

> "తరుణాదిత్యవర్ణేన నక్షత్రపథవర్చసా. ౨౧
> బభూవ రాఘవస్యాపి మనోవిస్మయమాగతం."

అని మూలము. రాఘవస్యాపి మనః=అనుటంజేసి సర్వజ్ఞుఁడైన శ్రీరాముని మనస్సుకూడ విస్మయమునొందెను. అనునది కర్మ

వశుఁ డయ్యెననియు, నదియుఁ దనసర్వజ్ఞత్వము మఱుఁగుపడఁ జేసి యట్లు నటించెననియుఁ దెలుపుచున్నది.

"అసంభవం హేమమృగస్య జన్మ తథాపి రామో లులుభే మృగాయ,
ప్రాయస్సమాపన్నవిపత్తికాలే ధియోఽపి పుంసాం మలినా భవంతి."

అనునదియుఁ గర్మసిద్ధాంతమును దృఢపఱచుచున్నది. కాని శ్రీరామచంద్రుఁడు వలయుననియే లోలత్వమును గాంచెనని మన మెఱుంగందగు.

"శోభిత స్తేన రూపేణ సీతయా చ ప్రచోదితః,
ఉవాచ రాఘవో హృష్టో భ్రాతరం లక్ష్మణం వచః." ౨౩

అని మూలము. 'తేన రూపేణ కర్మణా' యని యన్వయించుట మంచిదని కొందఱు పెద్ద లందురు. తచ్ఛబ్దమిటఁ బూర్వశబ్ద పరామర్శకము కాదు. ప్రసిద్ధార్థద్యోతక మనవలయు. మారీచరూపకర్మము విశేషించి సీతయుఁ దన్నుం బురికొలుపఁగా ననఁగా నిఁక నీ నిర్లిప్తత్వమును దాఁచి కర్మఫలప్రదాతృత్వ మునకుం గడంగుమని విశేషించి సీత తన్నుఁ బురికొలుపఁగా శ్రీరాముఁ డంగీకరించి హృష్టః = సంతోషించి-అనఁగాఁ దన వలన మృతిఁగోరిన మారీచునకుఁ బుణ్యకర్మఫలమునీయ నిదే సమయమనియే హర్షమునకుఁ గారణమని యెఱుంగవలయు.

"పశ్య లక్ష్మణ వైదేహ్యాస్స్పృహాం మృగగతామిమాం,
రూపశ్రేష్ఠతయా హ్యేష మృగోఽద్య న భవిష్యతి." ౨౪

అని మూలము. విదేహరాజపుత్త్రిక కీమృగముపయిం గల యిచ్ఛం జూడుము. చక్కనిరూపముకలదగుటచే నిది దొరకునది కాదు. అలభ్యమని సామాన్యార్థము. ఈరూప మీలోకమున నుండఁదగినది కాదు. కావున నిది యుండఁబోదని ధ్వని.

ఈరూపమున నిది మృతినొందవలయునన్నకర్మము నన్నుఁ బ్రేరేపించుచున్నది. కాన నీక నిది యుండఁబోదని విశేషార్థము. అతిసౌందర్యము హానికరమను నానుడి సరియేయని యీభాగము మనకు బోధించుచున్నది.

"పశ్యాస్య జృంభమాణస్య దీప్తా మగ్నిశిఖోపమాం,
జిహ్వాం ముఖాన్నిస్సరంతీం మేఘాదివ శతహ్రదాం." ౨౯

అని మూలము. ఆవులించునపుడు దీనినోటినుండి యగ్నిజ్వాల వంటినాలుక వెలువడుచున్నది. మేఘమునుండి మెఱపుఁదీఁగ వెలువడునట్లు. అనుటంజేసి యిది యింక క్షణకాలమున నశింపఁ గలదనునర్థము తేలెడిని. మెఱపుఁదీఁగ యెట్లు లడంగునో యట్టులని శ్రీరాముని గంభీరాశయము. మృగము నాలుకను జాఁచుట ప్రార్థించుటకో. ఆయాసమును గనఁబఱచుటకో. వేఱొండుహేతువునఁ గాదు. త్వరగ రమ్ము. కృతార్థునిం జేయుము. నాసత్కర్మ ఫలము ననుగ్రహింపుమనియే యా ప్రార్థనము కావచ్చునని మన మూహింపవచ్చును.

"మాంసహేతోరపి మృగాన్ విహారార్థం చ ధన్వినః,
ఘ్నంతి లక్ష్మణ రాజానో మృగయాయాం మహావనే. ౩౦
ధనాని వ్యవసాయేన విచీయంతే మహావనే,
ధాతవో వివిధాశ్చాపి మణి రత్నసువర్ణినః. ౩౧
తత్సారమఖిలం నృణాం ధనం నిచయవర్ధనం,
మనసా చింతితం సర్వం యథా శుక్రస్య లక్ష్మణ." ౩౨

అని మూలము. రాజులు మాంసలోభముననొండె విహారము కొఱకునొండె వనములయందు మృగములను హింసింతురు. అనునది శ్రీరామవాక్యము. కాన నిది రాజులకు నుచితమే

యనవచ్చునని కొంద ఱందురు. రాముని యాశయ మదియే యనరాదు.

"స్వమాంసం పరమాంసేన యో వర్ధయితు మిచ్ఛతి,
అనభ్యర్చ్య పితౄన్ దేవాంస్తతోఽన్యో నాస్త్యపుణ్యకృత్. ౫౨
వర్షేవర్షేఽశ్వమేధేన యో యజేత శతం సమాః,
మాంసాని చ న ఖాదేద్యస్తస్య పుణ్యఫలం సమమ్. ౫౩
ఫలమూలాశనైర్మేధ్యైర్మున్యన్నానాం చ భోజనైః,
న తత్ఫలమవాప్నోతి యన్మాంసపరివర్జనాత్." ౫౪

మను. ౫-అధ్యా.

అనునిషేధము సామాన్యము. కాని మాంసము వదలినవాని కతిశయపుణ్యము లభించుననియు నిందుఁ గనంబడు. పితృదేవతార్థముగాఁ దప్ప మాంసమునకై జంతుహింస చేయరాదని చెప్పుటం జేసి తేలెడుసార మేమి? నిరంతరము హింసాకర్మమున జీవించుదురాచారము మాన్పింపఁ దరముకాదు కానఁ గ్రమముగా నద్దానిని సంకుచితము చేయునుపాయమే యిది యని మన మూహింపవలయును. ఇది రాజధర్మప్రకరణము కాదు కావున నిచ్చో నన్వయింపఁదని కొందఱనవచ్చును.

"దశ కామసముత్థాని తథాష్టౌ క్రోధజాని చ,
వ్యసనాని దురంతాని ప్రయత్నేన వివర్జయేత్. ౪౫
కామజేషు ప్రసక్తో హి వ్యసనేషు మహీపతిః.
వియుజ్యతేఽర్థధర్మాభ్యాం క్రోధజేష్వాత్మనైవ తు. ౪౬
మృగయాఽక్షో దివాస్వాపః పరివాదస్స్త్రియో మదః,
తౌర్యత్రికం వృథాట్యా చ కామజో దశకో గణః. ౪౭

పైశున్యం సాహసం ద్రోహ ఈర్ష్యాసూయార్థదూషణం,
వాగ్దండజం చ పారుష్యం క్రోధజోఽపి గణోఽష్టకః. ౪౮
ద్వయోరప్యేతయోర్మూలం యం సర్వే కవయో విదుః,
తం యత్నేన జయేల్లోభం తజ్జావేతావుభౌ గణౌ. ౪౯
పానమక్షాః స్త్రియశ్చైవ మృగయా చ యథాక్రమం,
ఏతత్కష్టతమం విద్యాచ్చతుష్కం కామజే గణే. ౫౦
దండస్య పాతనం చైవ వాక్పారుష్యార్థదూషణే,
క్రోధజేఽపి గణే విద్యాత్కష్టమేతత్త్రికం సదా. ౫౧
సప్తకస్యాస్య వర్గస్య సర్వత్రైవానుషంగిణః,
పూర్వం పూర్వం గురుతరం విద్యాద్వ్యసనమాత్మవాన్. ౫౨
వ్యసనస్య చ మృత్యోశ్చ వ్యసనం కష్టముచ్యతే,
వ్యసన్యధోఽధో వ్రజతి స్వర్యాత్యవ్యసనీ మృతః." ౫౩

మను. ౭-అధ్యా.

ఇవి రాజధర్మప్రకరణమునఁ గలవచనములు. వీనిం బట్టిచూడఁగా, వేఁట రాజులు ప్రయత్నముచే వదలవలయుననియు, నిట్టిదుష్కార్యములకు హేతువు లోభము కాన దానినెట్టి గట్టిప్రయత్నముచేనైన వదలవలయుననియు స్మృతిభావము. దీనిసార మేమి? మాంసభక్షణార్థము రాజు వేఁటాడరాదనియు, జనులహింసించు క్రూరమృగములను వధించుపొంటె మృగయ రాజులకు విధివిహితమనియు సారమని, యెఱింగినవారికిఁదోఁపక మానదు. రాజులు మాంసార్థము విహారార్థము మహావనముల వేఁటాడుచందమున నేను దీనిని వేఁటాడఁ దలఁచుకొనలేదని హృదయము. "రాజానః మృగాన్ మృగయాయాం ఘ్నంతి" అనుచో సామాన్యమగు రాజులయాచారమని కాదా యని యర్థము. శ్రీరాముఁడు రాజులలో నొకఁడుగా గణుతింపఁ

బడఁ దగినవాఁడని యనువా రుండరనుకొందును. ముత్తె ములు మణులు సువర్ణము గలధాతువులను రాజులు మహా వనమున సంపాదింతురు. "మణయ స్సువర్ణాని చ ధాతుషు భవంతీతి ప్రసిద్ధిః" అని గోవిందరాజులు. "వజ్రాదిమణిసువర్ణ రజతాద్యాకారాః ధాతవః లక్షణయా గైరికాదిధాత్వాధార పర్వతప్రదేశా ఇత్యర్థః." అని మహేశ్వరతీర్థులు. ధాతువు లనఁగా నెట్టివో పరికింతము.

"సువర్ణరూప్యమాణిక్యహరితాలమనశ్శిలాః,
గైరికాంజనకాసీససీసలోహాస్సహింగుళాః,
గంధకోఽభ్రకమిత్యాద్యా ధాతవో గిరిసంభవాః." శబ్దమాల.

వీనింబట్టి చూడఁగా మహారణ్యములు తఱచుగాఁ బర్వత సమీపముల నుండుటంజేసి యందు వేఁటలాడుచు రాజులు ధాతువులను బరిశీలించి సంగ్రహించి ధనాగారమును బెంపొం దించి ప్రజాపాలనము న్యాయరీతి నొనరింపనలయునని యేర్పడుచున్నది. ఉత్తమపదార్థముల నేకరించుట రాజుల స్వభావమనియే యిందలిసారము.

"ఏతస్య మృగరత్నస్య పరార్థ్యే కాంచనత్వచి,
ఉపవేక్ష్యతి వైదేహీ మయా సహ సుమధ్యమా." 38

అని మూలము. లక్ష్మణునకుఁ గలసంశయమును దొలఁగించి తప్పక దీనిం దేవలయునని రాముఁడు తెల్పుచున్నాఁడు. దీని చర్మముపై జానకి నన్నుంగూడి కూరుచుండఁగలదు. జింక చర్మము జ్ఞానప్రదమని యాసనప్రకరణమునఁ జెప్పఁబడిన యట్లు దీనిపైఁ గూరుచుండి నన్నుపాసింపఁగలదని భావము.

కేవలము స్త్రీకాముల వచనము ముఖ్యమనియే యిందుండి నేర్చుకొనవలసినవిషయము.

> "ఏష చైవ మృగశ్శ్రీమాన్ యశ్చ దివ్యో నభశ్చరః,
> ఉభావేతౌ మృగౌ దివ్యౌ తారామృగమహీమృగౌ." 3౬

అని మూలము. ఆకాశమున మృగశీర్షమను నక్షత్రమెట్లు మృగము కాదో యిదియు నట్లే మృగము కాదని శ్రీరాముని భావము. నోపసునిర్మృష్టికై యదియు నిదియు సమానములగు దివ్యమృగములని చెప్పెనని మన మూహింపవలయును.

> "యది వాయం తథా యన్మాం భవేద్వదసి లక్ష్మణ,
> మాయైషా రాక్షసస్యేతి కర్తవ్యోఽస్య వధో మయా. 3౭
> ఏతేన హి నృశంసేన మారీచేనా కృతాత్మనా,
> వనే విచరతా పూర్వం హింసితా మునిపుంగవాః. 3౮
> ఉత్థాయ బహవో యేన మృగయాయాం జనాధిపాః,
> నిహతాః పరమేష్వాసా స్తస్మా ద్వధ్య స్త్వయం మృగః." 3౯

అని మూలము. ఇందు శ్రీరామమూర్తి తన నిశ్చితార్థముం దెలుపుచున్నాడు. లక్ష్మణా! సీతప్రార్థన మటుండనిమ్ము. నీవిపుడు నాతోం జెప్పినట్లే మారీచునిమాయయే యిదగునే నవశ్యము వధింపవలసినదే. దురాత్ముండగు నీమారీచుండే మునిపుంగవుల ననేకులను వధించెను. వేటయం దాసక్తులై వచ్చిన రాజుల ననేకులను వీడు వధించియున్నాడు. కాన వీని వధ్యము చేయవలసినదే. అనంగా నేరూపమున వీడున్నను జంపందగినవాడే యనియే నీమాటలధోరణి తెలుపుచున్నది కదా. కావున సీతయు నీవును చెలిపినపలుకు లీతని వధింప

వలయుననియే నన్ను హెచ్చరించుచున్నవి. కావున మీ యిరువురును

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే."

అను నా ప్రతిజ్ఞ కనుకూలముగనే మాటలాడుచున్నారు. కాన నిఁక నే నీతని వధింతునని శ్రీరాముఁడు తెల్పెనని మన మెఱుంగవలయును.

"తదేతన్న భవేద్రక్షో వాతాపిరివ లక్ష్మణ,
మద్విధం యోఽతిమన్యేత ధర్మనిత్యం జితేంద్రియం. ౪౪
భవేద్గతోఽయం వాతాపిరగస్త్యేనేవ మాం గతః."

అని మూలము. ధర్మమునందే నిత్యము వర్తించుచు జితేంద్రియుఁడనైన నన్ను నతిక్రమించునేని యగస్త్యముని వాతాపిం జంపినట్లు వీనిం జంపుదు. మరణమును గోరియే వాతాపి యగస్త్యునికడ కేగినట్లు వీఁడు వెదకుకొనుచు నాకడకు వచ్చినాఁడు కదా. అనఁగాఁ గర్మము పాశబద్ధునిఁగాఁజేసి వీని నాకడ కీడ్చుకొనివచ్చినది. వీఁడిఁక మనఁజాలఁడు. వాతాపి నగస్త్యుఁడు మ్రందించినరీతి నేను వీని నడంచెదనని శ్రీరామమూర్తి యాశయము. 'ధర్మనిత్యం జితేంద్రియమ్.' అను నీరెండు వాక్యము లాత్మస్తుతిపరములు కావా యని యడుగుదు రేమో. కావు. ఏల? అనఁగా భార్య పురికొలుపఁగా మాయన్న నావాక్యములు వీటిఁబుచ్చి పోవుచున్నాఁడు కదా యనుసంశయము సోదరునకుం గలుగకుండఁజేయుటకై ధర్మమునందే నిత్యప్రీతిగలవాఁడను. జితేంద్రియుఁడను గానఁ గామినీవా

గ్యాగురలనుం జిక్కువాఁడను గాను. అనుభావము తెలుపు టకే యని యెఱుంగవలయును.

> "ఇహ త్వం భవ సన్నద్ధో యంత్రితో రక్ష మైథిలీం. ౪౫
> అస్యా మాయత్తమస్మాకం యత్కృత్యం రఘునందన,
> అహమేనం వధిష్యామి గ్రహీష్యామ్యపి వా మృగం. ౪౬
> యావద్గచ్ఛామి సౌమిత్రే మృగమానయితుం ద్రుతం,
> పశ్య లక్ష్మణ వైదేహీం మృగత్వచి గతస్పృహాం. ౪౭
> త్వచా ప్రధానయా హ్యేష మృగోఽద్య న భవిష్యతి,
> అప్రమత్తేన తే భావ్య మాశ్రమస్థేన సీతయా. ౪౮
> యావత్పృషత మేకేన సాయకేన నిహన్మ్యహం,
> హత్వైతచ్చర్మ చాదాయ శీఘ్రమేష్యామి లక్ష్మణ." ౪౯

అని మూలము. ఇది శ్రీరామునిసర్వజ్ఞత్వమును సూచించుచున్నది. పరిశీలించి యుక్తాశక్తిన్యాయము ననుసరించి కనుఁగొనవలెను. "[illegible]" అనుసూక్తిని స్వప్రవర్తనమును సార్థకముగాఁ జేయుం దలంచి లక్ష్మణునితో శ్రీరాముఁడిట్లు పలుకుచున్నాఁడు. త్వమిహ సన్నద్ధో భవ=[illegible] యని శస్త్రాస్త్రముఖముల ధరించి యుండుము. ఏమఱుపాటులేక కడు జాగరూకుఁడవై జానకిని రక్షింపుము. రక్షణమనఁగా నాపహారాదులలో నంగి కాపాడుట. రక్షణమనఁగా నాపత్పరిహారరూపమునఁ గాచుట యని ప్రాచీనులభాషణము. ఆపద లోనవకయుండఁ గాపాడుము. సర్వజ్ఞుఁడగు రాముఁడు రావణుఁడు రాఁగలఁడు. మారీచుఁడు నాధ్వనివలె గన్నట్లు మిమ్ముం బిలుచును. మోసపోఁగూడదు సుమీ యని యేల చెప్పలేదందురేమో. ఆసంశయము నీక్రింది వాక్యము తొలఁగించుచున్నది. "యత్కృత్యమస్మాకం విద్యతే

ఇత్యధ్యాహారః తత్సర్వమస్యామాయత్తమ్.” మనకు నేయే కార్యములు గలవో యవియెల్ల నీ జానకియందే యున్నవి. మనకార్యములెల్ల నీమె మూలముననే ఫలింపవలయు నని సామాన్యార్థము. రావణాదిదుష్టదానవసంహార మీసీతామూలముననే కావలయునని కదా దీనిభావము. విశేష మేమనఁగా, మన మేమి చేయఁదగునో యదియంతయు నీసీతా సాహాయ్యముననే కావలయును. నీ వస్వతంత్రుఁడవు. నేనో ప్రకృతిబద్ధుఁడను. ప్రకృతిమూలముననే నాకార్యములెల్ల సాగును. ప్రకృతివిరహితుఁడ నగుదునేని నామరూపక్రియా శూన్యుఁడ నగుదును. కావునఁ బ్రకృతి నాశ్రయించితినని శ్రీరామునియాశయము. ఇదియే శ్రీశంకరాచార్యవర్యులచే సౌందర్యలహరియందు

> “జగత్సూతే ధాతా హరిరవతి రుద్రః క్షపయతే
> తిరస్కుర్వన్నేతత్స్వమపి వపురీశ స్తిరయతి,
> సదా పూర్వస్సర్వం తదిదమనుగృహ్ణాతి చ శివ
> స్తవాజ్ఞామాలంబ్య క్షణచలితయోర్భ్రూలతికయోః.” ౨౪

అని తేటపఱుపఁబడినది. నామరూపక్రియావంత మగునదంతయుఁ బ్రకృతిస్వరూపమే యగుట మనకార్యములనియు సీతామూలకములే యని యెఱుంగవలయును. ఆమె లేక మనమే కార్యమును జేయఁజాలమని శ్రీరామునిహృదయము. లక్ష్మణా! ఇదిగో త్వరితముగా మృగానయనార్థము వెళ్లుచున్నాను. సొగసైనచర్మము కలిగియుండుటచేతనే యిది జీవింపదు. అను శ్రీరామవాక్యమునఁ గలభావమేమి? “న హి కారణం వినా కార్యోత్పత్తిః”అనున్యాయము ననుసరించి కర్మము

దీనిసొంపగు చర్మమూలమున సీతకు నిచ్చగల్పించి తన్మూలమున నన్నుఁ బ్రోత్సహించి దీనిఁ జంపింపనున్నది. కావున నీఁక నితఁడు జీవింపఁడు. అనియే శ్రీరామునభిప్రాయము. ఇదియే కర్మసిద్ధాంతము బలవత్తరమని తేటపఱచుచున్నది. 'తే త్వయా' అని యర్థము చెప్పవలయును. ఆశ్రమమునందు సీతతో నప్రమత్తుఁడవై యుండుము. (పొరపాటుపడక) అనఁగా నెట్టి మాయలను లోఁబడకయుండుమనియే యర్థము. ముందు మారీచుఁడు నాధ్వనియని తోఁచునట్లు అఱచును. దానికి జంకకుమా యని శ్రీరామునియభిప్రాయము కావచ్చుఁ గదా. స్పష్టముగా నేల తెలుపలేదని కొందఱడుగుదురేమో. లోకమునఁ దన్ను నకార్యమునకుఁ బంపెనని యాక్షేపింపక యుందురుగాక యను నుపాయమునే కాని లక్ష్మణుఁడు రాకయున్నఁ దనప్రయత్నమే ఫలింపదని శ్రీరాముఁడెఱుఁగఁడా యేమి? సర్వజ్ఞుఁడు కదా శ్రీరాముఁడు. కావున లోకులు శ్రీరాముఁడు సీతారక్షణమునం దప్రమత్తుఁడు కాలేదని తనప్రవృత్తిని నిందింపకయుండఁ బలికెను. కాని లక్ష్మణునితో నేపొరపాటులు లేకయుండుమా యని పలికెనని మన మెఱుంగందగు. ఈభావము తెలిపెను గాననే "ఒక్కబాణమున నీమృగమును వధించి నేను వచ్చువాఁడను. సత్వరమ వచ్చెదను. అంతవఱకు సీతను రక్షించుచుండుమా" అని తెలిపెను. దీనింబట్టి శ్రీరామునుద్దేశము న్యాయ్యమనియే మనము నమ్మవలయును. తనయంతవాఁడని లోకులు నమ్మఁదగిన వీఁడని లక్ష్మణుని సీతకు సాయమునిచ్చి ముందుఁ దాఁ జేయుకార్యమును స్పష్టముగాఁ దెలిపి ప్రయాణము సాగింపనెంచెను. కావున శ్రీరామప్రయత్నము న్యాయసమ్మతమే యనక తప్పదు.

"ప్రదక్షిణేనాతిబలేన పక్షిణా జటాయుషా బుద్ధిమతా చ లక్ష్మణ,
భవాప్రమత్తః పరిగృహ్య మైథిలీం ప్రతిక్షణం సర్వత ఏవ శంకితః."

అని మూలము. ఇందు శ్రీరామమూర్తి తనభావమును చేట పఱచుచున్నాఁడు. జటాయువునకు రాఁగలయుత్తమగతియు లక్ష్మణునకు రానున్న భయము తెలుపుచున్నాఁడు. మహాసమర్థుఁడు మిగులబలవంతుఁడు బుద్ధిమంతుఁడు నగు జటాయువనుపక్షిరాజు గలఁడు కదా. ఆతనింగూడి సీతను వెంటనునిచి కొని ప్రతినిమేషము సర్వదిక్కులనుండి యేయాపద వచ్చునో యని యనుమానించుచు నేమఱుపాటులేనివాఁడవు కమ్ము. అనునది సామాన్యార్థము. స్థలము దాఁటుమా యని యాజ్ఞాపింపలేదు. కాని పొరపాటుపడకుమని పలికెను. విశేషార్థము. ప్రదక్షిణేన = పరప్రయోజనము వేగముగాఁ జేయువాఁడు. "దక్షతే పరకార్యం శీఘ్రం కరోతీతి దక్షిణః. దక్ష వృద్ధౌ శీఘ్రార్థేచ."అని సమాసము. "దక్షిణస్సరళోదారపరచ్ఛందానువర్తిషు, వాచ్యవద్దక్షిణావాటీయజ్ఞదానప్రతిష్ఠయోః" అని విశ్వనిఘంటువచనము. అత్యుత్తముఁడని దీనిభావము. బుద్ధిమతా = అపుడు చేయఁదగినదేదియో తెలిసినవాఁడని యర్థము.

"స్మృతిర్వ్యతీతవిషయా మతిరాగామిగోచరా,
బుద్ధిస్తాత్కాలికీ జ్ఞేయా ప్రజ్ఞా త్రైకాల్యగోచరా."

అనుసూక్తి ననుసరించి తాను మనకుఁ దోడ్పాటు సేయఁదగిన కాలమునందు స్వశక్తిపరశక్తుల నాలోచించి యశక్యమని మానక యప్పుడు తాను చేయఁదగిన యుత్తమమగుపని యేదో దానిం జేయువాఁ డని భావము. అట్టిజటాయువుతో

ననఁగా నాతనిసాయుముంగొని యనిభావము. ప్రతిక్షణంసర్వత ఏవశంకతేఃసర్వకాలము సర్వదిక్కులనుండి యాపత్సమాగమ మును శంకించువాఁడవై, అనఁగా నేదిక్కునుండి యేకూ్రరుఁ డేయాపద గలిగించునో యనుశంకగలవాఁడవై యని తాత్ప ర్యము. అప్రమత్తోభవఃఏమఱుపాటు పొందకుండుము యని శ్రీరామునాశయము. దీనిచే సీతాపహరణము జటాయు స్సాహాయ్యము సూచింపఁబడియెను. ప్రమత్తుఁడనఁగా మదిం చినవాఁడు. అనఁగా బుద్ధివైభవములేనివాఁడు. అట్టివాఁడవు కావలదు. అనఁగా నజ్ఞానివి కావలదు. అనుటంజేసి యేయాప దలు గలిగినను బామరునివలె దుఃఖింపవలదు. మనకార్యము లన్నియు సీసీతయందే యాయత్తములై యున్నవని ముందే చెప్పితిని గదా. అని శ్రీరాముఁడు గూఢముగా లక్ష్మణునకుఁ గార్యగతు లెఱిఁగించె నని మన మెఱుంగవలయును. ఇఁక సీభాగమున నధ్యాత్మరామాయణమున నెట్లున్నదని విచా రితము.

"తథేతి ధనురాదాయ గచ్ఛన్ లక్ష్మణమబ్రవీత్,
రక్ష త్వమితి యత్నేన సీతాం మత్ప్రాణవల్లభాం. ౭
మాయినస్సంతి విపినే రాక్షసా ఘోరదర్శనాః,
అతోఽత్రావహితస్సాధ్వీం రక్ష సీతామనిందితాం. ౮
లక్ష్మణో రామమాహేదం దేవాయం మృగరూపధృక్,
మారీచోఽత్ర న సందేహ ఏవంభూతో మృగః కుతః. ౯

శ్రీరామః:—

యది మారీచ ఏవాయం తదా హన్మి న సంశయః,
మృగశ్చేదానయిష్యామి సీతావిశ్రామహేతవే. ౧౦

గమిష్యామి మృగం బధ్వా హ్యానయిష్యామి సత్వరః,
త్వం ప్రయత్నేన సంతిష్ఠ సీతాసంరక్షణోద్యతః. ౧౧
ఇత్యుక్త్వా ప్రియయా రామో మాయామృగమనుద్రుతః,
మాయా యదాశ్రయా లోకమోహినీ జగదాకృతిః. ౧౨
నిర్వికారశ్చిదాత్మాపి పూర్ణోఽపి మృగమన్వగాత్,
భక్తానుకంపీ భగవా నితి సత్యం వచో హరిః. ౧౩
కర్తుం సీతాప్రియార్థాయ జానన్నపి మృగం యయౌ,
అన్యథా పూర్ణకామస్య రామస్య విదితాత్మనః. ౧౪
మృగేణ వా స్త్రియా వాపి కిం కార్యం పరమాత్మనః."

సప్తమసర్గము.

కథాభాగమున నీరెండుకృతులు సమానములే. ఇందుఁ గథాతత్త్వము తెలుపఁబడినది. వాల్మీకిరామాయణమున గూఢముగా నీవిషయమే సూచింపఁబడినది. అని మనము తెలిసికొనిన నీరామాయణపారాయణఫలమును బూర్ణముగా నందఁజాలము. ఇందలివిశేషమును బరికింతము. "మాయా యదాశ్రయా" అనునది మొదలుకొని విమర్శింపఁదగు. "లోకమోహినీ జగదాకృతిః మాయా యదాశ్రయా నిర్వికారశ్చిదాత్మా పూర్ణస్సోఽపి తం మృగమన్వగాత్."అని యన్వయక్రమము. ఈయర్థమునే శ్రీశంకరభగవత్పాదులవారి "జగత్సూతే ధాతా" అను శ్లోకరత్నము తెలుపుచున్నదని ముందె వ్రాసితినిగదా. ఎవనియాధారమున జగదాకృతియగు మాయయున్నదో ఆపరమాత్మ నిర్వికారుఁడు జ్ఞానాత్మకుఁడు పరిపూర్ణుఁడునయ్యు నామృగమువెంటఁ బోయెను. ఏల? "భగవాన్ హరిః భక్తానుకంపీ ఇతి వచస్సత్యం కర్తుం సీతాప్రియార్థాయ మృగం జానన్నపి యయౌ." అనఁగా సర్వజ్ఞుఁడగు శ్రీరామ

మూర్తి భక్తులయందుఁ బ్రీతిగలవాఁ డనుమాట యథార్థమే యని తెలుపుటకే సీతాప్రియముకొఱకు మృగ మెట్టిదో యెఱింగినవాఁ డయ్యుఁ బోయెను. అనఁగా భగవంతుఁడు భక్తులకార్యములయందే బద్ధాదరుఁ డనుభావమును వెల్ల డించుటకే మారీచుఁడు మృగరూపమున నున్నవాఁడని యెఱిం గియు దాని వెంటఁబోయె నని భావము. దీనిచే మాయాదేవి యగు సీత భగవదాశ్రయముకలది. ఆశ్రయమునకు నామెకు విరహామెట్లు ? లోకదృష్టిచే నెడఁబాటు గలిగియున్నట్లు తోఁచును. అగ్నినుండి యుష్ణగుణమును వేఱుచేయఁదరమా. చల్లార్చిన వేఱుచేసినట్లు కాదా యన్న నది యపు డగ్ని యెట్లు లగును? అట్లే పరమేశ్వరునుండి పరమేశ్వరిని వేఱుచేయఁ దరమేనాఁటికిని గాదు. కనుక సీతాపహరణమనునదియే వాం ళిక్కు. తేజోరూపిణిగ శ్రీరామునియందే నిలిచియుండెనని మన మెఱుంగుట మంచిది. అపుడే మనము భక్తకోటియందు లెక్కింపఁబడఁదగుదుము. ఏకోరికలులేని పరమేశ్వరునకు మృగ మేటికి? స్త్రీవాక్యమేల? ఇపుడాయవస్థ భగవంతునకు మాఱి నది. ఏల? ప్రకృతికి లోఁబడినందున. అనఁగా సగుణత్వము నంగీకరించినకతన యనిభావము. నిర్వికారుఁడుగా నున్నపుడు ఈనామరూపక్రియలెక్కడివి? ఈభాగమునుండి ప్రకృతి పురి కొలుపఁగా భగవంతుఁడు తెలియనివానివలె మృగమువెంట నరిగె ననియు, నక్కారణమునఁగాని తదవతారఫలము లోకు లకుం గలుగదనియు, నిందు శ్రీరామునిప్రమత్తత యించు కంతయు లేదనియు, మనము సారమును గ్రహింపవలయు. ఈ భావమును మనస్సున నిడుకొనియే నామరూపములు గల వానినిగా భగవంతు నుపాసించినను ఫలము కలుగును. విష్ణు

రూపునిగా ధ్యానించిననేకాని ఫలము గలుగదన్న వాదము తుచ్ఛవాదము. అట్టివాదముల నాదరింపక యేభక్తున కేష్టే రూపము సమ్మతమో యవ్విగలవానినిగా నాసర్వేశ్వరుని నారాధించి తత్ఫలమును గోరకయుండిన నా పరాత్పరుఁడు ఆ రూపనామములు గలవాఁడుగా నాభక్తునకు దర్శనమిచ్చు నని యుపనిషత్సారముగాని యూర్ధ్వపుండ్రములు చక్రాంకనము లేకున్న దర్శనమీయఁడనుటకంటె దుర్వాదము వేఱొకటి యీ ప్రపంచమున లేదు. అట్టివారు పాషండులు. ఇట్టి పాషండు లన్ని మతములయందుఁ గనఁబడుదురనుటయు విచిత్రముకాదు. భగవంతుఁడు బాహ్యచిహ్నములను ప్రేమింపఁడనియు, మానసమునే పరికించి యది శుద్ధమగునేని ప్రేమించు ననియు, మన మెఱుంగవలయు. వేషభాషలచే మానసము పరిశుద్ధము కానేరదు. ఫలము నాశింపని సత్కర్మానుష్ఠానము ననే యది పరిశుద్ధమగు ననుట నిర్వివాదము. ఇఁకఁ బరువాతి శ్రీరామాయణకథను బఠింతము.

## శ్రీరాముని బాణమునఁ గూలుచు మారీచుఁడు రామకంఠధ్వని వినఁబడ నఱచుట.

* మహాతేజుఁ డాశ్రాముఁ డట్లు సోదరునకు విహితకృత్యము దెలిపి ఖడ్గము నడుమున బిగించి యలంకారముగా మూఁడువంకలుగా మెఱయు ధనుస్సును గ్రహించి తూణీర యుగము మూపుల బంధించి పయనమయ్యెను. శ్రీరామమూర్తి తనపై కరుగుదెంచుటంగని మారీచుఁడతని వంచింపఁబూని భీతిచేఁ గొంతసేపు కనఁబడకయుండి మరల నాతనికిందోఁచెను.

* ఇయ్యది నలువదినాల్గవసర్గమునఁ గలదు.

అదిపోవుచారిన శ్రీరాముఁడు వేగమపోయెను. అయ్యది తేజః
పుంజమున ముందఱ వెలుంగఁజేయుచు నా మహాటవి నారా
మునింగాంచి కాంచి పరువెత్తుచు నాధనుర్ధరునిం గని జంకు
మానియుండియుఁ దక్కిన మృగములవలె బెదరుగాంచుచుఁ
బ్రయోగించుశరములు తన్నుఁ దాఁకకయుండునట్లు తప్పించు
కొనందలఁచి దూరముగా దాఁటుచుఁ గొంతవడికిఁ జేఁజిక్కు
నట్టు లాశను గల్పించుచు నొక్కతఱి సంభ్రమమునఁ బరు
వెత్తుచు నాకసమున కెగసిపోవు చందమున నెగురుచు శర
త్కాలమునందు మేఘశకలములయంతరమునఁ జిక్కి నడుమ
నడుమఁ గనఁబడుచు మరల మఱుఁగుపడుచునుండు చంద
మామవలె వనమున నొక్కచోఁ గనఁబడుచు నొక్కయెడ
నగపడకయుండుచు రాముని గొనిపోవుచుండెను.

ఆమృగము క్షణకాలము దగ్గఱ నగపడును. రెండవ
క్షణమున దవ్వులఁ దోఁచును. మృగరూపుఁడగు నాదానవుఁ
డట్లు దర్శనాదర్శనముల శ్రీరాము నాశ్రమమునకుఁ గడు
దూరముగాఁ దీసికొని పోయెను. శ్రీరాముఁ డద్దానివర్తన
మునకు నొకప్పుడు క్రుద్ధుఁడగును. మరల దాని యాకారము
నకు మోసపోయి కుతూహలపడును. కొంతవడి కా శ్రీరా
ముఁడు దూరముపోయి యంతఁ గలవిలంపడుచు నొకవృక్ష
చ్ఛాయయందుఁ బచ్చికగలనేలపై నిలుచుండియుండ మృగ
రూపుఁడగు నామారీచుఁడు రాముని మనస్సు చీకాకుపడఁ
జేసినవాఁ డయ్యెను. మఱియు నాతనికిఁ దనపై నాశగలుగు
నట్టులు తన్ను వెంబడించునట్టులుగాఁ జేయువాఁడై వనమృగ
ములం గలిసి చెంతనే కనఁబడెను. రామమూర్తి యద్దిగాంచి
పట్టుకొన నుంకించెను. వాఁడు చివాలున దాఁటెను. వెంటనే

భయంపడినట్లు కనఁబడకపోయెను. మఱొక క్షణకాలమునకే వేఱొక చెట్లగుంపునుండి వెడలెను. ఆవిధముంగాంచి దీనిం జంపవలయు నని రాముఁడు తలంచెను. బాణమెత్తుకొని క్రుద్ధుఁ డయ్యెను. వెంటనే సూర్యరశ్మింబోలి మండుచున్న యొకబాణమును నారింగూర్చి యాకర్ణాంతమాకర్షించి భీతిచేఁ బామువలె నిట్టూర్పులుపుచ్చుచున్న యామృగమును గుఱిపెట్టి ప్రయోగించెను. ఆయస్త్రము బ్రహ్మనిర్మితము. తీవ్రప్రకాశకము. కావున నది వెడలి యామృగశరీరమును భేదించి తదంతర్వర్తియగు రక్కసశరీరమును భేదించెను. అంతట నాదానవుఁడు శ్రీరామబాణప్రపీడితుఁడై తాళవృక్షప్రమాణము పైకెగసి భయంకరముగా ధ్వనించుచుఁ బ్రాణములు వెడల నేలపైఁ బడియెను. వాఁడు మృతినొందువాఁడుగనుండి కృత్రిమమృగరూపమును విడిచి రావణుఁడు చెప్పిన దానిని స్మరించి సీతాపహరణము లక్ష్మణుఁడు లేకుండినఁగాని సాగదని తలంచెను. ఇదియ తగినసమయమని యూహించి శ్రీరామునికంఠధ్వనియే యని తోఁపఁజేయు స్వనముతో 'నక్కటా! సీతా! లక్ష్మణా!' యని యార్చెను. శ్రీరామునితీవ్రబాణము మర్మముల భేదింపఁగా గొప్పశరీరముగల యామారీచుఁడు మృగరూపముంబాసి తనరూపమునే ధరించి ప్రాణములు వదలెను. పిదప నామృగము సర్వాలంకారశోభితుఁడగు రాక్షసుఁడుగా మార్పునొందెను. శ్రీరాముఁడు పొరలుచు రక్తమునఁ దడిసిన శరీరముగల యా రక్కసునింగాంచి లక్ష్మణునివాక్కులను స్మరించి జానకి తలంపునకుఁ దగులఁగా నంతఁ దనలో నిది మారీచుని మాయయే కాని వేఱొకటి కాదని సోదరుఁడు మున్నే చెప్పెను. అట్లే

ధ్యైనదే. వీఁడు మారీచుఁడే. వీఁడు నాకంఠస్వనమున 'హాసీతా! హాలక్ష్మణా!' అని గట్టిగా నఱచి ప్రాణముల వదలెను. ఈధ్వని నాలకించి సీత యేమగునో సౌమిత్రి యేయవస్థల పాలగునో యని మిగుల విచారించుచుండునంతలో నాధర్మాత్మునకు భయమువలన శరీరము వణంకెను. దాన నాశ్రీరాముఁడు నిదియు నొక యశుభసూచనమే యనుకొనుచు మఱింత భయంపడెను. అంత నారామమూర్తి వేఱొకమృగమును వధించి దానిమాంసమును గ్రహించి తనయాశ్రమమార్గముం బట్టి పోయెను.

మహామనీషులారా! ఈభాగమునఁ గల విశేషముల నెమకుదము.

> "ముమోచ జ్వలితం దీప్తమస్త్రం బ్రహ్మవినిర్మితం,
> శరీరం మృగరూపస్య వినిర్భిద్య శరోత్తమః. ౧౫
> మారీచస్యైవ హృదయం బిభేదాశనిసన్నిభః."

అని మూలము. ఇందుఁ గల యస్త్రశరశబ్దములు బాణవాచకములే. బ్రహ్మవినిర్మిత మనఁగా బ్రహ్మ సొంతముగా నీబాణమును జేతపోసెనని యర్థము కాదు. బ్రహ్మధరించుదానిలో నొకదానిపేరు గలది. అని కాని, బ్రహ్మనామముల నొకదానిచే వెలయునది. అని గాని యర్థమూహింపందగు. అస్త్రమునన దెట్టిదైనను మంత్రసంయోజనమున నాదైవతము దని చెప్పవచ్చును. "వికృష్య బలవద్బలీ" అని యుండుటం బట్టి యిది బాణమే యని మన మూహింపందగు. బ్రహ్మాస్త్రాదులలోనిది కాదనవచ్చును. ఆబాణము మృగరూపమును భేదించుచు దాని లోపలనుండు రాక్షసుని శరీరమును బిడుగు

వలె ఛేదించెను. అనఁగా భావమేమి ? మారీచుఁడు జింకగా మాఱెనన్న రెండు శరీరములుండ వలనుపడదు. "మృగరూపస్య శరీరం వినిర్భిద్య మారీచస్యైవ హృదయం బిభేద" జింక శరీరమును జించి మారీచుని హృదయమును ఛేదించె ననుటం జేసి రెండుశరీరములని యేర్పడును. లేకున్న శరీరము వేఱు హృదయము వేఱు అని యర్థము చెప్పవలసివచ్చును.అది సుసంగత మగునా? హృదయమనఁగా గుండె యని యర్థమందురేని మృగశరీరమున నది యుండదా ? యనుశంక కలుగును. దీని భావ మేమనఁగా: మంత్రబలమున మృగశరీరము కలుగఁగా దాని యంతరమున మారీచుఁ డిమిడియుండెను. మహాకాయు మాతనిది మంత్రశక్తిచే నల్పముగ నుండెను. మృగదేహము కవచమువలె దానవుని తనువుపై నుండెను. కాన నాబాణము పైనున్న జింకశరీరమును జించుకొని దాని క్రిందనున్న మారీచునిశరీరమును గూడ హృదయస్థానమున ఛేదించెనని యేర్పడుచున్నది. శాంబర మనఁగా మాయ. ఇంద్రజాలాదికము. మంత్రబలమే లేదనువారు దీని నమ్మరు. వారు రామాయణమునే నమ్మనివారు గావలయును. వారల నమ్మింప మనము ప్రయత్నింపరాదు. ఇంచుమించుగా వారు నాస్తికప్రాయులు కదా. ఉపాసకుల కీ వాక్యము వేదతుల్యమే యగు. కాన వారు దీనిని విశ్వసింపక మానరు.

"మ్రియమాణస్తు మారీచో (జహౌ తాం కృత్రిమాం తనుం,
స్మృత్వా తద్వచనం రక్షో) దధ్యౌ కేన తు లక్ష్మణం. ౧౭
ఇహ ప్రస్థాపయేత్సీతా శూన్యే తాం రావణో హరేత్,
స ప్రాప్తకాలమాజ్ఞాయ చకార చ తతస్స్వనం. ౧౮

సదృశం రాఘవస్యైవ హా సీతే లక్ష్మణేతి చ,
తేన మర్మణి నిర్విద్ధశ్శరేణానుపమేన చ. ౧౯

మృగరూపం తు తత్త్యక్త్వా రాక్షసం రూపమాత్మనః,
చక్రే స సుమహాకాయో మారీచో జీవితం త్యజన్. ౨౦

తతో విచిత్రకేయూరస్సర్వాభరణభూషితః,
హేమమాలీ మహాదంష్ట్రో రాక్షసోఽభూచ్ఛరాహతః." ౨౧

అని మూలము. ఇచ్చట దేహద్వయ విషయమును దృఢ పఱచుచున్నది. పూర్వకాలమున బుద్ధి రాఁగల ఫలముల కను రూపముగు కర్మప్రయో[illegible]మున పొం[illegible]ండును. మారీచు నకు భగవంతుని దర్శనము గలిగెను. కాన నుత్తమపదప్రాప్తి కలుగనున్నది. కనుక ప్రారబ్ధకర్మఫలము ననుభవించు కాలము ముగియుచున్నది. రామబాణము దేహద్వయమును భేదింపఁగా నా[illegible] వచ్చెను. మనస్సున జీవిత సంస్కారములు తొలఁగెను. వెంటనే మాయామంత్రశక్తి సమావృత శరీరము [illegible]. ఏలయనఁగా మారీచుని మనస్సు [illegible] శ్రద్ధకలదిగా లేదు. శ్రద్ధ లేనిచో మంత్రములు ఫలింపవు. కనుక నాదేహము నెడఁ బాయఁగా నైజశరీరమే యితరులకుం గనంబడవలయును గదా. [illegible]కర్మశేషము రానున్న సత్ఫలప్రద కర్మముతోఁ జేరెను. ఇప్పుడాతని మనస్సు సంకులతం గాంచు చున్నది. [illegible] ననుసరించి ప్రారబ్ధకర్మము వదలనున్నది. శేషకర్మము రానైయున్నది. ఈ రెండింటి యనుభవము లాతనికిఁ గలుగవలయును. కనుక రావణకార్య మును జేయు[illegible] కలిగెను. రామదర్శనము మహాప్రకృతి

నామోచ్చారణమను శుభకర్మ ఫలము నొందు నుద్దేశము కలిగెను. మిశ్రకర్మమని దీనికిం బేరుపెట్టవలయును. అక్కారణమున మారీచుం డిదియే సుసమయమని యెంచి ప్రారబ్ధకర్మ ప్రోత్సాహముచే దీనత్వము కనఁబడునట్లు శ్రీరాముని కంఠరవముంబోలు కంఠస్వరమున 'హయ్యో సీతా! హాలక్ష్మణా!'యని గట్టిగా నఱచెను. తొలుత సీతనే పేర్కొననేల? ఓ సీతా! త్వరగా లక్ష్మణుని బంపుము. ఆతఁ డందుండినయెడల మీ యవతారఫలములు లోకములకుం గలుగవు. శ్రీరామునిం బురికొలిపి నాకు నుత్తమపదముఁ గల్పించితివి. అట్లే నీవు లంకం బ్రవేశించి రావణుని కృతార్థునిగా నొనరింపుమను భావమే యాతనికి సత్కర్మప్రోత్సాహమునఁ గలిగెనని మన మూహింపవలయును. సాధారణముగా లోకులు ప్రాణేశ్వరినే యాపత్కాలమునఁ దలంతురు. భార్యకంటె నధికప్రీతిపాత్రు లుండరాదు గదా. ఆన్యాయము ననుసరించి తొలుత సీతా యని శ్రీరాముఁడే పిలిచినట్లే యాతఁ డాహ్వానించెను. పిదప లక్ష్మణునిం జీరెను. ధర్మసంరక్షణమహాకార్యమునకు సీత యాధారభూతురాలనియు, లక్ష్మణుఁ డుపకరణమనియు, వాల్మీకిమహాకవి యెఱిఁగించెననియే మన మూహింపవలయును.

మారీచుఁడు సీతాలక్ష్మణులం బేర్కొని శ్రీరాముఁడు పిలిచినట్లే దీనస్వరమునఁ బిలిచి ప్రాణముల వదలునపుడు సర్వాభరణభూషితుఁడై యున్నట్లు కనుపట్టు. తపోనిరతుఁడై యున్నపుడు యుద్ధమునకుఁ బోవునపుడు నాభరణము లుండునా? అనుశంక కలుగును. సహజాలంకారములతో యుద్ధము రాజులు సైనికులు చేసినట్లే పురాణములు తెలుపుచున్నవి. యుద్ధమృతి వీరస్వర్గము నొసఁగును. కాన శుభకార్యమే

యగు. వాని కలంకారము లావశ్యకములే. తపోనిరతుల
కలంకారములు పనికిరానివి కొందరు అందురు. అదియుఁ
బాటింపఁబడఁగని మాటయే. "తాంబూలామోది సన్ముఖః" అని
యున్నది. ఉపాసకుఁడు చందనముఁ బూసికొని తాంబూలపు
సువాసనలు గుబులుకొనుచుండఁగా సంతోషభరాక్రాంతస్వాం
తుఁడై యిష్టదేవత నుపాసింపవలయును. అంతియగాని తడి
పినవస్త్రమును ధరించి ప్రతిదినము చేయున ట్లుపాసింపవలయు
నని యెందును గానరాదు. ఏయలంకారమున మనస్సు సంతో
షము నొందునో యాయలంకారము దూష్యము కాదు.
మనస్సు నిశ్చలముగా నుండవలయుఁ గదా. సంతోష మద్దా
నికి సాయపడును. పంచాగ్నిమధ్యమము. జలాధివాసము
తపోధనుల యాచారములుగాఁ జెప్పఁబడినవి కదా యందు
రేమో. అవి సహజతపస్సులు గాక క్రూరతపస్సు లనఁబడును.
శాంతిధను లట్టివానిని బూనరు. ఏదే నొకమహార్థము నర్థించి
యట్టి ప్రయత్నములఁ బూనుదురు. విశ్వామిత్రాదులు రావణా
దిరాక్షసు లట్టితపస్సులు నాచరించినట్లు పురాణములు తెలుపు
చున్నవి. అట్టివారు పరమశాంతఃకరణులు కారు. అది లభిం
చుటకే యంత ఘోరప్రయత్నములు చేసిరి. నిష్కాము లగు
వారియుపాసనమునకే యీ యలంకారములని యెఱుంగవల
యును. "స్నాత్వా కల్పస్సంకల్పాకల్పో వా" అని కలదు. అలం
కారములు లేనివారు తమ రలంకృతులైనట్లు భావించుకొన
వలయునని దీనిభావము. కావునఁ జందనచర్చలు లోనగునవి
మనశ్శాంతిని బాడుచేయవు.

"తం దృష్ట్వా పతితం భూమౌ రాక్షసం ఘోరదర్శనం,
రామో రుధిరసిక్తాంగం వేష్టమానం మహీతలే. ౨౨

జగామ మనసా సీతాం లక్ష్మణస్య వచస్స్మరన్,
మారీచస్యైవ మాయైషా పూర్వోక్తం లక్ష్మణేన తు. ౧౩
తత్తథా హ్యభవచ్చాద్య మారీచోఽయం మయా హతః,
హా సీతే లక్ష్మణేత్యేవ మాక్రుశ్య చ మహాస్వనం. ౧౪
మమార రాక్షసస్సోఽయం శ్రుత్వా సీతా కథం భవేత్,
లక్ష్మణశ్చ మహాబాహుః కామవస్థాం గమిష్యతి. ౧౫
ఇతి సంచింత్య ధర్మాత్మా రామో హృష్టతనూరుహః,
తత్ర రామం భయం తీవ్రమావివేశ విషాదజం." ౧౬

అని మూలము. శ్రీరామమూర్తి సోదరునివాక్యములను స్మరించెను. ఇది మారీచునిమాయయే. సోదరుఁడు ముందే తెల్పెను గదా. అది యట్లే సాగినది. నాచేఁ జంపఁబడిన వీఁడు రక్కసుఁడే. మారీచుఁడే. అని రాముఁ డూహించెను. ఈ భాగము "దుష్కర్మఫలము లనుభవమునకు రానుండఁగా మిత్రవాక్యముల మానవు లాలకింపరు." అనునీతి బోధించు చున్నది. శ్రీరామున కిది దుష్కర్మఫలానుభవకాలము కాదు. భగవంతుఁడు కదా. లోకమంగళము చేకూరనున్నది. 'హా! సీతా! అక్కటా! లక్ష్మణా!' అను నీస్వరము నాకంఠస్వరమును బోలియున్నది. కాన దీని వినినంతన సీత యేయవస్థకుఁ బొల్పు డునో లక్ష్మణుఁ డెంత పరితపించునో యని యూహించెను. అనునూహ కలుగఁగనే రామునిమనస్సున భయ మావేశించెను. అది విషాదజనితము. అనఁగా భావమేమి? విషాదము నకు మనస్సునఁ జోటీయరాదు. దానికి నుండఁ దావిచ్చిన యెడల దాని యనుచరము లగుభయాదు లావేశించును. అపుడు ధైర్యములోనగు నుత్తమగుణము లామనస్సున

నిలువలేక పాఱిపోవును. కావున విషాదమునకుఁ జోటీయక
కర్మసిద్ధాంతము నెఱింగి సంతుష్టుండై యుండవలయుననియు,
లేకున్న మానవుండు క్రమములపాలగుననియు, మన కీ
భాగము తెలుపుచున్నది.

"విహత్య పృషతం చాన్యం మాంసమాదాయ రాఘవః. ౨౭
త్వరమాణో జనస్థానం ససారాభిముఖ స్తదా."

అని **మూల**ము. భగవంతుని మానుషక్రీడ యిదియని యీ
భాగము తెలుపుచున్నది. మారీచుండు మృతినొందఁగా
మఱొకదుప్పిని జంపి దానిమాంసమును దీసికొని త్వరపడు
మనస్సుగలవాఁడై యాశ్రమాభిముఖుండై పోయెను. తన
యెలుంగున రక్కసుఁ డఱచి మృతినొందఁగనే యాశ్రమ
మునకుఁ బయనగత్తన మఱొకమృగముం జంపి దానిమాంసము
గ్రహించి పయనమగుటయే శ్రీరాముని నిర్వికారత్వ
మును బోధించుచున్నది. సీతకోరినది మృగమునుగాని మృగ
చర్మమునుగాని తెచ్చియిమ్మనియే కాని యదియొకపుడు రక్క
సుండైన నింకొకదానినైనఁ జంపి మాంసము తెచ్చి నాయాఁకలి
తీర్పుమని కాదు. ఇక్కార్యమేల శ్రీరాముఁడు చేయవల
యును? అనఁగా లక్ష్మణుఁ డాశ్రమమును వదలి దూరము
రావలయును. అట్లువచ్చినఁగాని రావణునిపని సాగదు. తాను
ద్వరగాఁ బయనిపోయినగాడల లక్ష్మణుఁ డాశ్రమముదాపుననే
కనఁబడును. సీతాపహరణకార్యము సాగదు. అని యాలో
చించి యించుకయాలస్యము చేయుతలంపున నేదోవ్యాజము
దొరకవలయుఁ గానఁ దత్కాలమునఁ గనఁబడినమృగమును

వధించి దానిమాంసమును గ్రహించి యాతురంపడువానివలెఁ బరుగువాఁడైనని తోఁచెడు.

శ్రీరాముఁడు మృగముచర్యలం గాంచినపుడే దాని నేల వధింపక యింతదూరము వచ్చెనను ప్రశ్నము కలదు. మారీచున కెంతదనుక నాయువుగలదో యంతవనుక వధింపఁ దరముకాదు. భగవంతునకుంగూడ నలవికాదా యన్న

> "శ్రుతిస్మృతీ మమైవాజ్ఞే యస్తే ఉల్లంఘ్య వర్తతే,
> ఆజ్ఞాచ్ఛేదీ మమ ద్వేషీ స మే వధ్యతమో మతః."

అన్నసూక్తిననుసరించి కర్మసిద్ధాంతము తనదేగాన దాని నతిక్రమించి తానే ప్రవర్తించిన మంచిదికాదని యెంచి యారక్కసుఁడుదేహము నేభూభాగమున నదలవలయునో యేయే పక్షులు మృగములు దాని నాహారింపవలయునో యాచోటు చేరునంతదనుక దానిత్రిప్పులకు లోఁబడి పామరునివలెఁ బోయి తుదికాలము రాఁగా బాణమునఁ ద్రుంచెను. కావున నేప్రాణి యేచోటున మృతినొందవలయునో యచ్చోటికేపోయి పడుట మనము చూచుచున్నారము కదా. సర్వజ్ఞుఁడగుభగవంతుఁడు కర్మసిద్ధాంతకర్త గావునఁ దనయాజ్ఞ లోకులకెట్టు లనుల్లంఘ్యమో యట్లే తనకుంగూడ నని భావించి పామరునివలె దాని వెంటనంటి కడుదూర మరిగెనని మన మెఱుంగవలయును. మృత్యువు కర్మానుసారముగా నదృశ్యపాశములం దగిలించి ప్రాణికోటి నాయాయిస్థలములకుఁ దీసికొనిపోయి వధించునను సిద్ధాంతమును మనము మఱువరాదు. ఇప్పట్టున నధ్యాత్మ రామాయణమున నేమే విశేషము కలదా యని పరికింతము.

"యన్నామాజ్ఞో౽పి మరణే స్మృత్వా తత్సామ్యమాప్నుయాత్,
కిముతాగ్రే హరిం పశ్యం స్తేనైవ నిహతో౽సురః. ౧౯

తద్దేహాదుత్థితం తేజ స్సర్వలోకస్య పశ్యతః,
రామమేవావిశద్దేవా విస్మయం పరమం యయుః. ౨౦

కిం కర్మ కృత్వా కిం ప్రాప్తః పాతకీ మునిహింసకః,
అథవా రాఘవస్యాయం మహిమా నాత్ర సంశయః. ౨౧

రామబాణేన సంవిద్ధః పూర్వం రామమనుస్మరన్,
భయాత్సర్వం పరిత్యజ్య గృహవిత్తాదికం చ యత్. ౨౨

హృది రామం సదా ధ్యాత్వా నిర్ధూతాశేషకల్మషః,
అంతే రామేణ నిహతః పశ్యన్ రామమవాప సః. ౨౩

ద్విజో వా రాక్షసో వాపి పాపీ వా౽ధార్మికో౽పి వా,
త్యజన్ కళేబరం రామం స్మృత్వా యాతి పరం పదం. ౨౪

ఇతి తే౽న్యోన్యమాభాష్య తతో దేవా దివం యయుః."

**సప్తమసర్గము.**

ఈయది పైనవ్రాసినసిద్ధాంతమును దృఢపఱచుచున్నది. కాని యిం దనేకసంశయములు గలుగుటకుం దావు కలదు. దానిం బిదపం బరికింతము. ముందు విశేషముల నెమకుదము. బాలిశుండైనను మృతికాలమునం బరమేశ్వరనామమును స్మరించి భగవంతునియందు లీనతనొందు. ముందుం దేజస్స్వరూపుండై వెలుంగుచున్న పరాత్పరుం గాంచుచు మృతినొందువాని మాట యింకం జెప్పనేటికి? రామబాణనిహతుం డగుమారీచుని దేహమునుండి వెలువడి యొకతేజ మెల్లరుం జూచుచుండంగా శ్రీరామునియందే ప్రవేశించెను. దానిం గాంచి దేవతలు విస్మయంపడిరి. ఏమి విస్మయము? ఎట్టిదుష్కర్మము లాచరిం

చెను? ఎట్టిసత్ఫలము నొందెను? మునిహింసకుఁ డగునీపాపాత్ముఁడు పరమస్థానము నొందెనే? ఇయ్యది శ్రీరామమాహాత్మ్యము గాక మఱేమగును? సంశయమే యిందులకు లేదు. రామబాణవిద్ధాంగుఁడై రామునే స్మరించుచు భయమున గృహవిత్తాదికమంతయుఁ బరిత్యజించి హృదయమున రామునే ధ్యానించుచు సకలపాపనిర్ముక్తుఁడై శ్రీరామునిం గలిసెను. బ్రాహ్మణుఁడుగాని రక్కసుఁడుగాని పాపాత్ముఁడుగాని అధార్మికుఁడుగాని భగవంతుని స్మరించుచుఁ బ్రాణములు వదలినఁ బరమపదము లభించును. అని యొండొరులతోఁ జెల్పుకొనుచు దేవత లరిగిరి. ఈవిషయము వాల్మీకిరామాయణమున ధ్వనిరూపమున నున్నది. ఇందు స్పష్టముగాఁ జెప్పఁబడినది. దీనిసార మేమనఁగా నంతకుముం దెన్ని పాపము లొనరించినను గడపట భగవంతుని దలంచుచు మృతినొందిన ముక్తి సమకూరుననియే.

> "అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరం,
> యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః. ౫
> యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరం,
> తం త మేవైతి కౌంతేయ సదా తద్భావభావితః." ౬
>
> గీత. ౮-అధ్యా.

అని శ్రీకృష్ణోపదేశము కూడ నీమతమునే బోధించుచున్నది. సర్వపాపక్షయకరము శ్రీపరమేశ్వరస్మరణమనియే కదా పై ప్రమాణముల సారము. ఇదియే సిద్ధాంతమైనయెడల స్వకృత పాపకర్మములఫల మనుభవింపక తప్పదనున్యాయము వ్యర్థమే కదా యని కొందఱు ప్రశ్నింపకమానరు. దీనికి సమాధాన

కదా! అట్టివారు ముక్తులగుట యెట్టులని మనము శంకింప రాదు! సామాన్యశాస్త్ర మిట్టితావుల సమన్వయము చేయరా దని యెఱుంగుట మంచిది. ఈకారణముల ననుసరించి మారీ చాదులు సామాన్యదృష్టికి మహాపాపులుగాఁ గనఁబడినను వాస్తవమునకు భగవత్కార్యమును సాధింపఁ దోడుపడిన వారే. కనుకనే భగవంతుని గాంచుచు మృతినొందుట వారి తేజస్సు భగవంతునియం దైక్యమగుట సంభవించును. సహజ దుష్కర్మరతులకుఁ దత్ఫలము లనుభవమునకు రాకపోవు. ప్రస్తుతము మారీచునియాత్మ తేజోరూపమున శ్రీరాముని యందుఁ గలియుట సహజమే కాని విశేషము కాదు. ద్రోణుని తేజస్సు కర్ణునితేజస్సు నిట్లే కలిసినట్లు భారతము సూచించును గదా! సహజపాపకర్మరతులకు భగవంతుని స్మరించుమనస్సు మృతికాలమునఁ గలుగదనియు మన మెఱుంగవలయును. ఇఁకఁ దరువాతి శ్రీరామచరిత్రమును బఠింతము.

## సౌమిత్రి జానకీప్రోత్సాహమున రామునికడ కరుగుట.

* జానకి శ్రీరాముని కంఠధ్వనివలె వినఁబడిన యాదీన ధ్వని నాలకించి లక్ష్మణునితో సౌమిత్రీ! పయనము కమ్ము. శ్రీరామున కేమికష్టము కలిగెనో కనుఁగొనుము. ఆర్తుఁడై శ్రీరాముఁ డఱచినట్టిధ్వని వినఁబడియెను. ఇంక నామనః ప్రాణములు స్థిరతం గాంచఁగలవా! మహాటవి సాయ మెవ్వఁడును లేక విలపించు నీయన్నను గాపాడుము. అయ్యది సింహఁ

* ఇది నలువదియైదవసర్గమునం గలదు.

గ_ర్తన్యము కదా. సింహాము బారింబడిన మహావృషభమువలె రక్కసులనుంజిక్కి రక్షించువా రెవ్వరును లేక వగుచు నీయన్న కడ కిపుడే యరుగుము. ఆలసింపకుమని దీనరాయై పలికెను. సీతా దేవి యీరీతిగా నెంత నొక్కి చెప్పిన నాతఁడు శ్రీరామునానతిం దలంచి పోవక యుండెను. అవ్విధ మెఱింగి యాసీత మేను వణంకుచుండ నాతనిం గని యిట్లు పలికెను. ఏమయ్యా! అన్న యిట్టిదురవస్థలపా లగుచుండ రక్షింపఁబోవక యూర కున్నాఁడవే. దీనింజూడఁగా నీవు మిత్రునివలె నగపడుచున్నాఁ డవు కాని సత్యదృష్టిం జూడ నీవన్నకుఁ బగవాఁడవే. సౌమిత్రీ! నీవు నాకొఱకుగా శ్రీరాముఁడు నశింపవలెనని కోరెదవు. నాయం దభిలాషము కలవాఁడవుగా నున్నావు. కాననే నన్ను నుద్దేశించి యన్నయున్న చోటునకు నరుగక యున్నావు. ఇది నిజము. శ్రీరామునకుఁ గష్టము ప్రాప్తించుటే నీకు నిష్టమని నా కిపుడు తోఁచుచున్నది. నీకు భ్రాతృ వాత్సల్య మిసుమంతయు లేదు. కాఁబట్టియే యమ్మహాతేజున కెంతయాపదవచ్చినను బోయి చూడఁ దలంపక నిశ్చింతముగా నున్నాఁడవు. నిన్ను రక్షించుకార్య మెట్లు మానిపోవఁదగు నని యందువేమో యయోధ్యనుండి శ్రీరామునిబట్టియే యిచ్చటికి వచ్చినాఁడవు. నన్నుఁగూర్చి కాదు కదా. అట్టి నీ యన్న శ్రీరాముఁడు ప్రాణసంశయము నొందినతర్వాత నేను నీయాశ్రమముననుండి చేయఁదగిన దేమున్నది? కనుక నారక్ష ణముకొఱకు నీ విందుండవలసినది లేదు.

సీత యిట్లు పలుకుచుఁ గన్నీటిధారలు వెడలుచుండ విలపించుచు భీతహరిణాంగనం బోలి చపలాత్మికయై యుండఁ గాఁ గాంచి సౌమిత్రి యిట్లు పలికెను. అమ్మా! వైదేహీ!

పన్నగాసురగంధర్వాదులు నీప్రాణనాథుని శ్రీరాముని జయిం
పఁజాలుదురా? సంశయ మేల? మంగళాకృతీ! దేవీ! రణమున
నింద్రసంకాశుఁ డగుశ్రీరాముని నెదిరింపఁజాలువాఁడు దేవ
గంధర్వమానవాదులలో రక్షఃపిశాచాదులలో మృగము
లలో భయదదానవులలో నుండఁడు. శ్రీరాముని వధింప
నెవ్వారికి నలవికాదు. కనుక నీవిట్లు పలుకరాదు. రామ
మూర్తి లేకుండుతఱి నీవనమున నిన్ను వదలిపోవుసాహసము
నాకుఁ గలుగదు. త్రిలోకములు తదధిపతులు నొక్కటియై
వచ్చినను శ్రీరాముని వారింపఁ దరమే కాదు. మనస్స్థిరతం
గాంచుము. ఇప్పటిసంతాపమును బాయుము. శ్రీరాముఁ
డామృగముం జంపి వేగమ వచ్చును. ఇపుడు మనము విన్న
కంఠధ్వని శ్రీరాముని కంఠధ్వని కాదు. ఎవఁడో మాయచే
నిట్లు లఱచెను. నిస్సంశయము. మారీచునిమాయయే యిది.
జననీ! నిన్ను శ్రీరాముఁడు రక్షింప నాచెంత నునిచిపోయి
నాఁడు. ఆపని మాని నిన్నొంటరిగా నునిచి పోవరాదు.
ఇందలిరక్కసులు తమరాజగు ఖరాసురుని జంపినందునను,
జనస్థానమున సాగిన రాక్షససంహారము మనస్సుల నిడుకొని
యందఱు మనపైఁ బగఁబూని యున్నారు. వారందఱు హింసా
పరాయణులు. మనలను హింసింపఁగోరియే మోసపుచ్చుటకుగా
నిం దెన్నియో మాయలు పన్నుచున్నారు. ఇంతమాత్ర
మాలోచింపకున్నావు కదా.

సౌమిత్రి యీరీతి శాంతముగాఁ బలుకఁగా నాలకించి
జానకి యెంతయుఁ గ్రుద్ధయై కన్నులు మిక్కిలి యెఱ్ఱగనుండఁగా
సత్యమునే భాషించు నాలక్ష్మణునిం గని యిట్లు పరుషముగాఁ
బలికెను. "సౌమిత్రీ! అకార్యమును జేయఁబూనితివా? క్రూర

బుద్ధీ! కులపాంసనుఁడా! రామునకు మహావిపత్తు సంభవించి
నదియు నీకుఁ బ్రియమే యని తోఁచుచున్నది. కావుననే
యిట్టితఱి నతని రక్షింపఁ బోనక యిట్టిమాట లాడుచున్నావు.
మిత్రవ్యాజమునఁ గపటవర్తనముగలిగి చరించుచు శాత్రవులు
క్రూరులు నగు నీవంటివారి కిట్టిదుర్బుద్ధి పుట్టుట యొకయాశ్చ
ర్యమా? పరమదుష్టుఁడవు. కావుననే నీకే తోఁచియో. భర
తుని ప్రేరణంబుననో నాకొఱకుఁ గపటవేషమున నీవొక్కరుఁ
డవే యంపఁబడవలె యన్న నొక్కని వెంబడించి వచ్చుచున్నావు.
నాయందలి యభిలాషము నీకడంక నీకుఁగాని భరతునకుఁ
గాని సిద్ధింపదు సుమీ. కువలయస్నిగ్ధకాంతికలిగి సారసదళ
ములవంటి కన్నులుగల రాముని ప్రాణనాథునిగా గ్రహించి
వేఱొకయల్పపురుషు నభిలషింతునా? సౌమిత్రీ! నీమ్రోలనే
యసువుల వదలుదును. నిస్సంశయము. శ్రీరాముని వదలి
ముహూర్తమాత్రమైనను భూతలమున బ్రదికియుండననుట
నిజము." అని యాజానకి దేహము కంపింపఁ జేయునట్టి
పరుషవాక్యములఁ బల్కఁగా వినియు జితేంద్రియుఁడు
కావునఁ గలవిలపాటొందక దోసిలొగ్గి "తల్లీ! నేను నీకు
నుత్తరము చెప్పఁబూనను. నీవు నాకు దేవతవు. అత్యం
తానుచితమైన పలుకు పలుకుట స్త్రీలయందు విశేషము
కాదు. ఇది స్త్రీస్వభావము. ఎల్లలోకముల నిది యిట్లే కనంబడు
చున్నది. వినయాదిధర్మములు వదలినవారు స్త్రీలే. మఱియుఁ
జంచలచిత్తలు. వారిహృదయములు క్రూరములు. ఎట్టినెయ్యు
రకైన విరోధము కలిగింతురు. వైదేహీ! జనకరాజనందన
వయ్యు నిట్లు సాహసించి పలికినమాటలు నా రెండుచెవుల
యందు నగ్నింగాల్చిన నారసమువలె నున్నవి. ఇట్టివానిని

సహింపఁజాలను. న్యాయవర్తను నన్నుం గాంచి యీరీతి న్యాయవిరుద్ధముగాఁ గఠినపుమాట లాడితివి. వీనిని వనదేవత లెల్ల సాక్షులై విందురుగాక. నాయన్న యానతి నిలిచియున్న నన్ను నెఱింగియు నిట్లు సంశయించుచున్నావే. అక్కటా! నీ విపుడే నశించిపొమ్ము. స్త్రీత్వము స్వభావముననే దుష్టమైనది. వరాననా! నేను మా యన్నయున్న చోటికిఁ బోయెదను. నీకు భద్రమగుఁగాక. విశాలనయనా! నిన్ను వనదేవత లందఱు జాగరూకులై రక్షింతురు గాక. తల్లీ! ఇత్తఱి నాకుందోఁచు దుర్నిమిత్తములు భీతి నొదవించుచున్నవి.కనుక నేను మరలివచ్చి రామచంద్రునితోడ నిన్నుఁ గాంతునో లేదో" యనియెను.

సౌమిత్రి యిట్లు పలుకఁగా సీత విలపించుచు బాష్ప ధారల మునుంగుచు నాతనిం గాంచి "లక్ష్మణా! శ్రీరామునిం బాసి క్షణకాలము నిలువఁజాలను. గౌతమీనదింబడి యసువుల వదలెదను. కాదేని రజ్జుబంధనముననైనఁ జత్తును. అత్యున్నతభాగమునుండి కఠినస్థలముసఁబడి శరీరమును వదలెదను. అంతియకాని ప్రాణములతో నుండను. శ్రీరామునిం దప్పఁ దక్కినవారిని వ్రేలితోనైన స్పృశింపను" అని యిట్లు సౌమిత్రి నిందించి మిగుల దుఃఖితయై సీత యావగ బెల్లున నేడ్చుచుఁ జేతులతోఁ గడుపు మోఁదుకొనియెను. ఆవిశాలాక్షి యత్యంతార్తయై కనఁబడుచు విలపించుచుండుటం జూచి సౌమిత్రి తొందఱపడుచు నూఱడించెను. ఆమెయు నాతఁ డూఱడించునెపమున రామునికడకుం బోవక యాలసించుచున్నాఁడని కుపితయై మరల నతనితో నొక్కమాటయుఁ బలుకకుండెను. పిదప ధీరుఁడగు నాసౌమిత్రి యామెకు నమస్కరించి దోసిలొగ్గి కోపపరవశత్వమున నించుకయే మ్రొక్కి

యొంటిగావిడిచి యెట్లు పోవచ్చునా? యని యాజానకిని మరలి మరలి గాంచుచు నాశ్రమమును వదలి శ్రీరామునికడ కరిగెను.

మహాశయులారా! ఈభాగము మిక్కిలి యక్కఱతో విమర్శింపఁదగినది. ఇం దనేకధర్మము లిమిడి యున్నవి. వాల్మీకి మనోభావ మెట్టిదో యిది తెలుపును.

"ఆర్తస్వరం తు తం భర్తుర్విజ్ఞాయ సదృశం వనే,
ఉవాచ లక్ష్మణం సీతా గచ్ఛ జానీహి రాఘవం. ౧
న హి మే హృదయం స్థానే జీవితం నావతిష్ఠతే,
క్రోశతః పరమార్తస్య శ్రుతశ్శబ్దో మయా భృశం. ౨
ఆక్రందమానం తు వనే భ్రాతరం త్రాతుమర్హసి,
తం క్షిప్రమభిధావ త్వం భ్రాతరం శరణైషిణం. ౩
రక్షసాం వశమాపన్నం సింహానామివ గోవృషం."

అని మూలము. మాయాజానకివాగ్ధోరణిం బరికింతము. సీతారాములు ప్రకృతిపూరుషు లనువిషయమును మాత్రము మఱువకుఁడు. "భర్తుస్సదృశం తమార్తస్వరం విజ్ఞాయ, సీతా లక్ష్మణముపాచ." అయోనిజయగు నాదేవి పెనిమిటిధ్వనితో సమానమైనదాని నెఱింగి లక్ష్మణునితోఁ బలికెను. "సదృశం విజ్ఞాయ." అను వాగ్ధోరణిం బరికింపుఁడు. సమానముగా నున్న దాని నెఱింగి యనఁగా భర్తదే యని యెఱుంగలే దనుట. పొమ్ము. రాము నెఱుంగుము. అనఁగా నేగతి నున్నవాఁడో తెలిసికొనుము.

"విద్వానేవ విజానాతి విద్వజ్జనపరిశ్రమం,
న హి వంధ్యా విజానాతి గుర్వీం ప్రసవవేదనామ్."

అన్నసూక్తి ననుసరించి సీతాహృదయము నెట్టిదని శ్రీరాముఁడే యెఱుంగఁజాలు. రామహృదయమును సీతయే యెఱుంగఁ జాలు. ఇతరుఁ డెట్లెఱుంగఁ గలఁడు? ఇప్పుడు సీత తనయవ తారఫలముం గల్గింప నాతురపడుచున్నది. సౌమిత్రి కావిష యము తెలియదు. కావున నా యభిప్రాయమును సామాన్య దృష్టినే గ్రహించెను. ఇఁక నే నింతకయేఁ నడవుచేయరాదు. ఆర్తుఁడు భక్తుఁడు నగు రాముని పట్టుదలయునను సహా కలసీత లక్ష్మణుని సాగనంపనఁగాని కార్యము సాగదని యెఱింగి పరుషోక్తు లాడుచున్నదని మన మెఱుంగవలయును. ఇఁకఁ గథ చక్కఁగా నడచును. లక్ష్మణా! నా హృదయము స్థానమున నిలువదు. జీవిత మంతయు. పరమార్తస్వరమున నాక్రో శించు రాముని శబ్దము వింటిని. దీనుఁడగు నన్నను మహారణ్యా మునఁ గాపాడఁదగుదువు. ఆతనికడకుఁ ద్వరపడి పొమ్ము. శరణుగోరువాఁడు కదా. లోకమున భర్తృప్రాణాపాయస్థితి యం దుండుటెఱింగినపతివ్రత యతనిం జూడఁ బరుగిడుట స్వభావము. కాని నీవు పొమ్ము. నే నిందే యుండుదునని నడుఁ దిని సాగనంపునా? అట్టియాచార మెందే నుండునా? సీత యే మాటయందైన నేను పత్త్యనుభావముఁ గనంబఱచెనా? లేదు కదా? అట్టిచో నామె భావ మేమని మన మెఱుంగవలయును. యథాశక్తిగా సహానముచేయు పతివ్రతవంటిది సీతాదేవి కాదు కదా? పతివ్రతాశిరోమణి యగుసీత తాఁ బతికడకుం బోవఁ దలంపక సౌమిత్రిని సాగనంపుటం జూచి మన మేమని యూహింపవలయును? తనయవతారఫలములను లోకులకుఁ గల్పింపఁ దలంచి శ్రీరాము నెడఁబాయనిరూపమున నుండియు రూపాంతరమును గల్పించి యీనాటకము సాగించుచున్న

దనియే మనము కాదనలేనము గదా. ఈతలంపు గల మనసు నాయము లక్ష్మణునితోఁ బలికిన కర్కశోక్తులు కార్యపరత్వమునే సూచించునుగాని యెట్టియు స్త్రీస్వభావతను సూచింపవని తోఁచును గదా. ఈభావమును నిక గ్రంథమును పాఠింతము.

నాహృదయము నీయందే నిలుచును. జీవిత మట్లే. అని సీత పలికెను. సర్వప్రాణులకు హృదయము యొకచోట నిలుచు నెట్లు? సర్వప్రాణులకును మీ యందే జీవితము. అది నిశ్చలముగా నుండు నెట్లు? మనసులను నాస్వాధీనగు సన్ను రక్షింపఁ దగుదువు. అనఁగా సౌమిత్రిని సాగనంపఁ దలఁచినమాట లివి కావా? స్తుతిరూపములుగా నగపడును. "శరణైషిణం తం భ్రాంతరం ప్రతిఅభిధావస్వ" యనుచుని గోరువాఁడనుట సామాన్యార్థము. వధము గోరువాఁడని. అనఁగా దుష్టరాక్షసవధము గోరువాఁడని విశేషార్థము. "విత్రాసమానం వనే" = వనమున నఱచు చున్నవాఁడు. అనఁగా రాక్షససంహారార్థము నిస్సుఁ ద్వరితముగ రమ్మని పిలుచుచున్నాఁడు. కాని నతనికిఁ దోడ్పడఁ బోవద్దు. అనునదియే సీతాహృదయము. ఉపమానమును బరిశీలింతము. "సింహానాం వశమాపన్నం గోవృషమివ స్థితం రక్షసాం వశమాపన్నం భ్రాతరం ప్రత్యభిధావ" = సింగములకుఁ జిక్కిన వృషభరాజమువలె నున్నవాఁడు. సింహములు గంధసింధురములఁ జంపఁ దలఁచుననుటయే కదా ప్రసిద్ధము. అనఁగా నవి చంపునేమో యని వృషభరాజము భయపడునట్టు లనియే చెప్పవలయును. ఎట్టు లబ్ధానిభయము వాస్తవము కాదో అనఁగా నవి చంపవో అట్లే రక్కసులబాధ రామునకు లేదని యర్థము. భయము కార్యార్థము గ్రహింపఁబడిన దనియే యాభావము.

"న జగామ తథోక్తస్తు భ్రాతురాజ్ఞాయ శాసనం. ౪
తమువాచ తతస్తత్ర కుపితా జనకాత్మజా,
సౌమిత్రే మిత్రరూపేణ భ్రాతుస్త్వమసి శత్రువత్. ౫
యస్త్వమస్యామవస్థాయాం భ్రాతరం నాభిపత్స్యసే,
ఇచ్ఛసి త్వం వినశ్యంతం రామం లక్ష్మణ మత్కృతే. ౬
లోభాన్మమ కృతే నూనం నానుగచ్ఛసి రాఘవం."

అని మూలము. అన్నశాసనము చక్కఁగా నెఱింగినవాఁడు కావున నామెమాటల విన్నంతనే ప్రయాణము సాగింపక సౌమిత్రి యందే యుండెను. దాన నాసీత కుపితురా లయ్యెను. ఏల? అతఁడు శీఘ్రముగా వెడలవలయును. కార్యము సాగవలయుఁ గదా. తన్నుఁ దోడ్కొనిపోవు రావణునిసత్కార్యము దాపున నున్నది. అది సాగవలయు. కాఁదగినకార్యము లనేకము లున్నవి. కబంధాదులకు శాపవిముక్తికాల మాసన్నమైనది. ఆకాలమునకు నచ్చుటికి శ్రీరాముఁడు పోవలయు. ఇందే జాగొనర్చిన నెట్లు అది సాగును? వీనినన్నింటి నెఱింగిన లోకమాత యూరకున్న నెట్లు? కాననే కోపమును దెచ్చుకొని భాషించుచున్నది. కాని తనభావమునందు ధ్వనిగాఁ దోఁపఁజేయుచునే యున్నది. లక్ష్మణా! "భ్రాతుస్త్వమపి మిత్రరూపేణ శత్రువత్"=మిత్రరూపముచే శత్రువుగా నున్నావు. ఇట్టియవస్థలో నున్నయన్నను రక్షింపఁబోవకయున్నావే. కాన శత్రురూపుఁడవే. అనునది సామాన్యార్థము. సౌమిత్రీ! ఈ కాలమునందుండు నన్నకుఁ దోడుపడఁ బోవక యున్నాఁడవు కాన నీవు శత్రుతుల్యుఁడవే. మిత్రరూపమునఁ గనఁబడుచున్నావు. అనఁగా నీవీ యాశ్రమమున నుండఁదగదు. సత్వ

రమే యచటి కరుగుము. అప్పుడే మిత్రుఁడ వగుదువు. నీవిం
దున్న శత్రుఁడవే యగుదువు. నీవచ్చటి కేగినఁగాని శ్రీరామా
వతారకార్యము సాగదని విశేషార్థము. "మత్కృతే వినశ్యం
తం రామం త్వమిచ్ఛసి. మమ కృతే లోభాద్రాఘవం నానుగ
చ్ఛసి" మత్కృతే = నాకొఱకు, వినశ్యంతం = కనఁబడకయుండు,
రామం = రాముని, త్వం = నీవు, ఇచ్ఛసి = కోరుచున్నావు. నా
కార్యముకొఱకు దూరముగాఁ బోయియుండు రాముని గోరు
చున్నాఁడవు అనఁగా నచటికిఁబోవక యిందేయుండి రామునానతి
యంతటి యుద్ధవిశేషమును గనుఁగొనలేక యున్నావనుట.
దానినే మఱింత స్పష్టపఱచుచున్నది. లోభాన్మమకృతే రాఘ
వం నానుగచ్ఛసి = నాయందలి యాశవలన ననఁగా నన్ను
రక్షించు శ్రద్ధవలన రామునికడ కరుగకున్నావు. ఇట్లు నీవుం
డుట నాకార్యమునకు శ్రీరాముకార్యమునకును హానియగును.
కాన నీవరుగు పొమ్మని సీతాహృదయము.

> "వ్యసనం తే ప్రియం మన్యే స్నేహో భ్రాతరి నాస్తి తే. ౭
> తేన తిష్ఠసి విస్రబ్ధస్తమపశ్యన్ మహాద్యుతిం,
> కిం హి సంశయమాపన్నే తస్మిన్నిహ మయా భవేత్. ౮
> కర్తవ్యమిహ తిష్ఠంత్యా యత్ప్రధానస్త్వమాగతః."

అని మూలము. పైనఁ జెప్పినభావమునే ప్రకారాంతరముగా
సీత తెల్పుచున్నది. నీకు శ్రీరామునకుఁ గల్గువ్యసనమే ప్రియ
ముగా నున్నదని యెంచెద. స్నేహము నీ కన్నయందు లేదని
నీవరుగమి తెల్పుచున్నది. శ్రీరాముని వ్యసనమనఁగా నిష్ఫల
ప్రయత్నమని యర్థము. రాముని ప్రయత్నము నిష్ఫలమగుట
నీకిష్టమని యెంచుదాననని సీతయాశయము. అందులకే స్నేహ

దిగా నామహాద్యుతిని జూడఁబోవక యున్నావు. అనఁగా
నీరాకఁ గోరి మహాద్యుతిచే రాముఁడు వెలుఁగుచున్నాఁడు.
నీవిందు నేమియుఁ దెలియక కూరుచున్నావు. శ్రీరాముని
తేజము నీవరిగిననే మిక్కిలి ప్రకాశించును. ఊరక యేల
యిందుఁ గూరుచున్నావు? పొమ్ము. అనియే సారము. "తస్మిన్
సంశయమాపన్నే ఇహ కిం హి మయా భవేత్." అనుటచే
నిట తస్మిన్=అనఁగా శ్రీరామునికార్యమని యర్థము. "గంగా
యాం ఘోషః" అనునట్లు శ్రీరామునిప్రయత్నము నెఱ
వేఱునా? లేదా? యనుసంశయమున సంకోచము కలుగుచో
నేనిందుండి చేయవలసినదేమి? ఇందనఁగా నీయవతారమునియను
నర్థము. నా యవతారమునకు ఫలమేమని భావము. యస్యవి
ధానస్త్వమాగతః=లక్ష్మణా! ఎవరినిబట్టి నీవిచ్చటికి వచ్చితివి?
భ్రాతృశుశ్రూష చేయఁగదా వచ్చితివి? అట్టి రామునిసేవకుఁ
బోవక నన్నుఁగని పెట్టుకొని యేల యున్నాఁడవయ్యా! అనఁగా
నేను జానకి ననుకొంటివి కాఁబోలు. మీయన్నభార్య జానకి
యన్నకడనే యున్నది. నన్నుఁ గావఁ బూనితివే. వలను
వలదు. పొమ్ము. పొమ్మని మాయాసీత హెచ్చరించుచున్నది.

ఈమాటలజాడలఁ బరిశీలింపుఁడు. భగవంతు నెడఁ
బాయని సీతను రావణుఁ డెత్తుకొనిపోవుటయు భగవంతుఁ
డగు శ్రీరాముఁడు సామాన్యమానవునివలె నేడ్చుటయు
నను నివి వాస్తవములా? కావా? యని విమర్శింపుఁడు. ఇది
యంతయు నటనమే యన్నపుడే సీతారాములు లక్ష్మీనారా
యణులని తేలును. మనకు వారి పాదారవిందములయందు
భక్తి కుదురును. లేనిచో నుత్తమదంపతు లనుభావమే పొడ
కట్టును. ఈ యర్థము కొందఱకే హితముగఁ దోఁచునని నే

నెఱుంగుదురు. దీని నంగీకరింపనివారికి మామూలుకథ యున్న దియే కదా. దానిని బట్టియైనను వారానందింపవచ్చును. భక్తులాయర్థమును బాటింపక వారు వలయుననియే యిట్టి కార్యములు చేసి తమ యవతారఫలములను లోకులకుం గల్గించి రనియు, మాయాసీతాపహరణ కడఁబోటు సత్యదూరమనియు నమ్మి, యిట్టి సీతారామరూపనామములఁ బరఁగిన ప్రకృతిపురుషుల నుపాసింపవలయును. తనలోపాయ మదియే. ఈనటన మంతయు లోకులకు హితోపదేశము చేయుటకని మనము నమ్మవలయును. లక్ష్మణుఁడు సీతాహృదయము నెఱుంగక పలికెడి పలుకుల నెఱింగి యవ్వానిమూలమున లోకులకు వాల్మీకి యేయుపదేశము చేసె నన్నది పరిశీలింతము.

"అవధ్యస్సమరే రామో నైవం త్వం వక్తుమర్హసి. ౧౩
న త్వామస్మిన్వనే హాతుముత్సహే రాఘవం వినా,
అనివార్యం బలం తస్య బలైర్బలవతా మపి. ౧౪
త్రిభిర్లోకైస్సముద్యుక్తైస్సేశ్వరైరపి సామరైః,
హృదయం నిర్వృతం తే ఽస్తు సంతాపస్త్యజ్యతామయం. ౧౫
ఆగమిష్యతి తే భర్తా శీఘ్రం హత్వా మృగోత్తమం,
న చ తస్య స్వరో వ్యక్తం మాయయా కేనచిత్కృతః. ౧౬
గంధర్వనగరప్రఖ్యా మాయా సా తస్య రక్షసః."

అని మూలము. ఈ యిరువురవాగ్ధోరణులఁ బరికింపుఁడు. లక్ష్మణున కించుకంతయేని సీతాహృద్గతభావము తెలియదయ్యెను. సామాన్యస్త్రీలకుఁ జెప్పునట్లు హితము దెల్పఁబూనెను. ఇందు శ్రీరాముని జయింప నింద్రాదులకు నశక్యమను భావమే కలదు. ఊఱడిల్లుము. లేనిపోని సంతాపము నొందవలదని

నొక్కి చెప్పిన జాడయే తోఁచును. మనము విన్నస్వరము శ్రీరాముని కంఠధ్వని మాత్రము కాదు. ఎవఁడో యట్లు లఱచెను. ఇదిమాయ. ఆకాశమున మేఘములు నగరాకార ముగాఁ గనఁబడును. క్షణకాలమున కవి మాఱి వేఱొక రూపమగపడును. ఇదియు నట్టిదే. ఇది మారీచుని మాయయే కాని వేఱుకాదు. అను నీభావము మహాత్ముఁడగు లక్ష్మణుఁడు వెల్లడించెను. బుద్ధిబలముచే నెఱుంగఁదగిన లక్షణముల నెఱిం గెను. కాని సౌమిత్రి భగవదుద్దేశ మేమని యెఱుంగఁ డయ్యెను. ఈయిరువుర మాటలయందు మహాకవి వాల్మీకి యుపయోగించిన పదములం బరికింపుఁడు. భావము తేట పడును.

"న్యాసభూతాసి వైదేహి న్యస్తా మయి మహాత్మనా. ౧౭
రామేణ త్వం వరారోహే న త్వాం త్యక్తుమిహోత్సహే,
కృతవైరాశ్చ వైదేహి వయమేతైర్నిశాచరైః, ౧౮
ఖరస్య నిధనాదేవ జనస్థానవధం ప్రతి,
రాక్షసా వివిధావాచో విసృజంతి మహావనే. ౧౯
హింసావిహారా వైదేహి న చింతయితుమర్హసి."

అని మూలము. "న్యాసభూతాసి = నిక్షేపరూపాసి" అని గోవిందరాజులు వ్రాసిరి.

న్యాస మనఁగా:—

"యాచితాన్వాహితన్యాస నిక్షేపాదిష్వయం విధిః." ౬౭

యాజ్ఞవల్క్యస్మృతి.

"వివాహాద్యుత్సవేషు వస్త్రాలంకారాది యాచిత్వా నీతం యాచితం. యదేకస్య హస్తే నిహితం ద్రవ్యం తేనాప్యనుపశ్చాదన్యహస్తే స్వామినే

దేహీతి నిహితం తదన్వాహితం. న్యాసో నామ గృహస్వామినే ఉదర్శయిత్వా తత్పరోక్షమేవ గృహజనహస్తే ప్రక్షేపో గృహస్వామినే సమర్పణీయమితి. సమక్షంతు సమర్పణం నిక్షేపః."

ఈస్మృతి ననుసరించి న్యాసమనఁగా నిక్షేపమని గోవిందరాజులు వ్రాసిన యర్థముకాదు. న్యాసమనఁగా నిక్షేపమని సామాన్యముగా నర్థము చెప్పుదురు.

> "యో భుంక్తే బంధకం లోభా న్న స లాభో భవేత్పునః,
> న్యాసవత్పరిహార్యోసౌ వృద్ధిర్నశ్యతి హాపితే."

అను బృహస్పతి స్మృతివచనము ననుసరించి దాఁచిపెట్టిన ధనమని యర్థమేర్పడుచున్నది. దాని ననుసరించియే గోవిందరాజులు వ్రాసిరని మన మూహింపవలయును. దేవీ! నిన్నుఁ గాపాడుమని నా చెంతనుంచి శ్రీరాముఁడు వనమునకుఁ బోయెను. అట్టి నిన్ను విడిచి పోవరాదు. రక్కసులు మనపై ద్వేషము గలిగియున్నవారు. వారెన్నివిధములనో మనకు హాని చేయఁబూనియున్నవారు. వారికి హింసయే విహారము. తల్లీ! చింతనుండి మరలుము. రాక్షసభయమును దెలుపుచు రాముని విషయమున నిర్విచారముగా నుండుమని తెలిపెను.

> "లక్ష్మణేనైవ ముక్తా సా క్రుద్ధా సంరక్తలోచనా. ౨౦
> అబ్రవీత్పరుషం వాక్యం లక్ష్మణం సత్యవాదినం,
> అనార్యకరుణారంభ నృశంస కులపాంసన. ౨౧
> అహం తవ ప్రియం మన్యే రామస్య వ్యసనం మహాత్,
> రామస్య వ్యసనం దృష్ట్వా తేనైతాని ప్రభాషసే. ౨౨
> నైతచ్చిత్రం సపత్నేషు పాపం లక్ష్మణ యద్భవేత్,
> త్వద్విధేషు నృశంసేషు నిత్యం ప్రచ్ఛన్నచారిషు. ౨౩

సుదుష్టస్త్వం వనే రామ మేకమేకోఽనుగచ్ఛసి,
మమ హేతోః ప్రతిచ్ఛన్నః ప్రయుక్తో భరతేన వా. ౨౪

తన్న సిధ్యతి సౌమిత్రే తవ వా భరతస్య వా,
కథమిందీవరశ్యామం పద్మపత్త్రనిభేక్షణం. ౨౫

ఉపసంశ్రిత్య భర్తారం కామయేయం పృథగ్జనం,
సమక్షం తవ సౌమిత్రే ప్రాణాంస్త్యక్ష్యే న సంశయః. ౨౬

రామం వినా క్షణమపి న హి జీవామి భూతలే."

అని మూలము. శ్రీరాముఁడు ఆశ్రమమునకు వచ్చుచున్నాఁడు. రావణుఁడు తనకొఱకుఁ గాచుకొని యున్నాఁడు. కబంధునకు శాపవిముక్తికాల మాసన్నమగుచున్నది. ఇంక నాలసింపరాదు. లక్ష్మణుఁడు తన భావమెఱుంగఁజాలక రక్షణకార్యమునందే బద్ధాదరుఁడై కూరుచున్నవాఁడు. విననిని మాటలు పలికినఁగాని వదలిపోవఁడు. గూఢార్థములగు సామవచనములకు లోఁబడునట్లు కనఁబడలేదు. అని యూహించి యత్యంతాగ్రహము నొందినట్లు పలుకుచున్నది. "లక్ష్మణం సత్యవాదినం" అని మహాకవి ప్రయోగించెను. లక్ష్మణుఁడు చెప్పిన దంతయు సత్యమే. అది సీతయు నెఱుంగును. కాని యారీతిగాఁ దానుండినచో నీయవతారమునకు ఫలమేమి? కాన నిఁక సామవచనములకు సమయము కాదని యాగ్రహించెను. ఆమె కన్నులెఱ్ఱవాఱెను. "అకార్యకరణారంభ" యనుచోట "అనార్యాకరణారంభ" అని పాఠాంతరము. ఇదియే గోవిందరాజులచే గ్రహింపఁబడినది. "నృశంస కులపాంసన" అని యున్నందున మరల "అనార్య"అనునది వ్యర్థమని మహేశ్వరతీర్థ లభిప్రాయపడి యుండవచ్చునని వారు గ్రహించిన

మూహింపవలయును. అట్లు గ్రహింపకున్న మహాపతివ్రతయు విదుషీమణియు నగుసీత యింత నీచముగా మాటలాడినట్లు మన మెఱుంగవలసియుండును గదా. అది న్యాయమా? లక్ష్మణునిచిత్తవృత్తి యెఱుంగఁజాలనంత యవివేకురా లగునా? కావున నీ వాక్యములన్నియు నాతని నటనుండి సాగనంపుటకుఁ బన్నినవని మనము తెలిసికొనవలయును.

> 'ఇత్యుక్తః పరుషం వాక్యం సీతయా రోమహర్షణం. ౨౭
> అబ్రవీల్లక్ష్మణస్సీతాం ప్రాంజలిర్విజితేంద్రియః,
> ఉత్తరం నోత్సహే వక్తుం దైవతం భవతీ మమ. ౨౮
> వాక్యమప్రతిరూపం తు న చిత్రం స్త్రీషు మైథిలి,
> స్వభావస్త్వేష నారీణామేవం లోకేషు దృశ్యతే. ౨౯
> విముక్తధర్మాశ్చపలాస్తీక్ష్ణా భేదకరాస్స్త్రియః,
> న సహే హీదృశం వాక్యం వైదేహి జనకాత్మజే, 30
> శ్రోత్రయోరుభయోర్మేఽద్య తప్తనారాచసన్నిభమ్.''

అని మూలము. సీతాభావ మెఱుంగక లక్ష్మణుఁడు స్త్రీజాతినే దూషించుచున్నాఁడు. కాని సీతయందు దేవతాభావమును వదలక దూషింపక మాటలాడుచున్నాఁడు. పరుషమ్మను దానిని వాక్యమునకు విశేషణముగా నన్వయింపరాదు. పరుషముగా నని యర్థము చెప్పవలయును. దీనిచే లాభ మేమనఁగా: నామె వలయుననియే మాటలాడినదనియు, మనస్సున నేమియుఁ దొందఱ లామెకు లేవనియు నిది యెఱిఁగించును. లక్ష్మణునకు సీతపై నాగ్రహము కలుగలేదని యెట్లు పలుకవచ్చు నన రాదు. "విజితేంద్రియః"=అను పదముం గాంచుఁడు. వశీకృత మనస్కుఁడు. కనుకనే,ప్రాంజలిః=దోసిలొగ్గినవాఁడై, ఈ రెండు

పదములు నాతనిసౌజన్యమును దెలుపును. క్రోధయుక్తునకు వినయముండునా? ఇపుడు లక్ష్మణుని సీతావాక్యము ప్రయాణమునకుఁ ద్వరపెట్టుచున్నది. క్షణమైన నిలువరాదు కదా. ఆసమయమున మహాకవి వాల్మీకి లోకులకు లక్ష్మణుని మూలమునఁ గొన్నిధర్మములు తెల్పుచున్నాఁడు. భవతీ=తల్లీ! అని సౌమిత్రి సంబోధించెను. ఏల? బాగోగులు విమర్శింపక చేయఁదగినది కదా తల్లిమాట. కావున నిఁక నేఁ బోయెదను. అను భావము నీపదము సూచించును. తల్లీ! నీమాటకు బదులు చెప్పఁ దలంపను. నీవు నాకు దైవతమవు కదా? "మాతృదేవో భవ" అన్న శ్రుత్యర్థమునే యిది బోధించును. దైవతమనఁగాఁ బూజ్యమని కదా యర్థము. నాకు నీవు జానకీ పూజ్యురాలవు. కాన నీకు నే బదులు పలుకను. దైవతము కర్మానుసారముగా ఫలముల ననుగ్రహించును. వరముల నిచ్చునని భావము. నీ మాటలే నాకు వరములు. అనఁగా నాకు శ్రేయస్కరములని సారము. 'వాక్యమప్రతిరూపం తు న చిత్రం స్త్రీషు మైథిలి' సామాన్యార్థము స్పష్టముకదా. ఉచిత మెంతమాత్రము కాని మాటచెప్పుట స్త్రీజాతియం దొకచిత్రము కాదని భావము. విశేషార్థ మేమి? "అప్రతిరూపం ('ఏతద్విధ' మ్మని యధ్యాహార్యము.) వాక్యంతు"=సాటిలేని యిట్టివాక్యమో, స్త్రీషు=సామాన్యస్త్రీలయందు లేదు. ఇది చిత్రమ్ = ఆశ్చర్యము. సామాన్య స్త్రీ లిట్లు పలుకఁజాలరు. నీవిట్లు పలుకుటయే విచిత్రము. ఏల? ఉపమానము లేనిమాటయే యిది. మహారణ్యమునడుమ మహాభూతము లుండుతావున నుండియుఁ బ్రతిక్షణము భయము గలుగునని యెఱింగియు భర్తృపరాయణత్వమున నిట్లు పొమ్మనుచున్నావే. ఇదియే నీగొప్పఁదనముఁ దెల్పెడు.

అని పలికి సామాన్యస్త్రీలవిషయము మరలఁ దెలుపుచున్నాఁడు. ఇట్టు లనుచితములాడుట స్త్రీస్వభావము. ఇది లోకమునఁ గనఁబడునాచారమే. ఇందులకుఁ గారణమును గూడఁ దెలుపుచున్నాఁడు. విముక్తధర్మాః=ధర్మమును వదలినవారు, చపలాః = స్థిరబుద్ధి లేనివారు, క్రూరహృదయులు. భేదకరాః = పరస్పరస్నేహకార్యవిచ్ఛేదమును జేయువారు, స్త్రియః = స్త్రీలు. ఈలాటివారు స్త్రీలు. అని లక్ష్మణుఁడు తెలిపెను. అనఁగా వాల్మీకిమహర్షి స్త్రీలమనోధర్మములను దెలిపెను. ఇట్లు గాకయున్న సీతను నీవు నాకు దేవతవని పలికిన లక్ష్మణుఁడు మరల నామాటను మఱచి దూషించునా? రామాయణము మూలమున ధర్మములను దెలుపుటయు మునిభావమని మన మెఱుంగందగు. "వైదేహి జనకాత్మజే! ఈదృశం హి వాక్యం న సహే." ఇట్టిమాటను నే నోర్వఁజాలను. ఇది పైని వ్రాసినభావమునకు విరుద్ధము కాదా యందురేమో కాదు. పైనఁ జెప్పినట్టి లక్షణములు గల స్త్రీలవాక్యమునకు నే నోర్వఁజాలను. రెండుచెవుల కిది కాల్చినబాణమువంటిది. అనఁగాఁ గఠినముగా, అద్య = ఇపుడు తోఁచుచున్నది. అద్య అనునదియే యీ విశేషార్థమున కవకాశ మిచ్చును. ఇపుడనఁగా నర్థమేమి? తల్లీ! నీమాట యిపుడు తప్తనారాచము వలెఁ దోఁచెడు. పిదప నమృతముగా నుండఁగలదు. అనియే దీనిసారము. "మైథిలి! జనకాత్మజే!" అను రెండువిశేష్యములు శ్లోకము కుదురక కవి ప్రయోగింపలేదు. మిథిలేశజనకశబ్దములు రెండును మహాజ్ఞాని యనుటను దెలుపును. తత్పుత్రివి కదా నీవు. అట్టి నీమాటలు వినఁజాలనన్నచో నేమి బాగుండును? సజ్జనోక్తి తొలుత విషతుల్యముగాఁ దోఁచి పిదప

నమృతతుల్య మగునని కదా ప్రాచీనులయాశయము. ఆరీతి నను సరించియే సౌమిత్రి పలుకుచున్నాఁడు. ఇపుడు నీమాటలు హితముగా లేవు. అని. ఇందుఁ బేర్కొనఁబడిన స్త్రీలక్షణ ములు మనుస్మృతియందు

"పౌంశ్చల్యాచ్చలచిత్తాచ్చ నిస్నేహాచ్చ స్వభావతః,
రక్షితా యత్నతోఽపీహ భర్తృష్వేతా వికుర్వతే. ౧౫
ఏవం స్వభావం జ్ఞాత్వాసాం ప్రజాపతినిసర్గజం,
పరమం యత్నమాతిష్ఠేత్పురుషో రక్షణం ప్రతి. ౧౬
శయ్యాసనమలంకారం కామం క్రోధమనార్జవం,
ద్రోహభావం కుచర్యాం చ స్త్రీభ్యో మనురకల్పయత్." ౧౭

అధ్యాయము-౯.

అని చెప్పఁబడినది. ఇవి సామాన్యస్త్రీస్వభావములు. ఉత్తమ స్త్రీలలక్షణము లివి కావు కదా. స్మృతిసారమే రామాయణ మని మన మెఱుంగవలయును.

లక్ష్మణుఁ డీరీతిగా సీతాదేవి తన్నుఁ బురికొలుపఁగాఁ బోవనెంచుచుఁ గర్తవ్యమును నిర్వహించుచున్నాఁడు.

"ఉపశృణ్వంతు మే సర్వే సాక్షిభూతా వనేచరాః. ౨౧
న్యాయవాదీ యథాన్యాయముక్తోఽహం పరుషం త్వయా,
ధిక్త్వామద్య ప్రణశ్య త్వం యన్మామేవం విశంకసే. ౨౨
స్త్రీత్వం దుష్టం స్వభావేన గురువాక్యే వ్యవస్థితం,
గమిష్యే యత్ర కాకుత్థ్సస్స్వస్తి తేఽస్తు వరాననే. ౨౩
రక్షంతు త్వాం విశాలాక్షి సమగ్రా వనదేవతాః,
నిమిత్తాని చ ఘోరాణి యాని ప్రాదుర్భవంతి మే. ౨౪

అపి త్వాం సహ రామేణ పశ్యేయం పునరాగతః,
(న వేత్స్యేతన్న జానామి వైదేహీ జనకాత్మజే.)"

అని మూలము. "లోకాపవాదాద్భయమ్" అనుసూక్తి ననుసరించి తనయందే లోపములు లేవని యెల్లరకుఁ దెలియఁ జేయుచున్నాఁడు. వనదేవతలు నాకు సాక్షిభూతులై వినుదురు గాక. న్యాయవిరుద్ధముగాఁ గఠినముగా నీవిట్లు న్యాయవాది నగు నన్నుఁగూర్చి పలికితివో దాని నని సామాన్యార్థము. వన దేవత లనఁగా వనమున సంచరించుదేవతలని కాదు. వృక్షాధి దేవతలని భావము. "వనేచరాణాం వనితాసఖానాం" అన్న కాళిదాసోక్తి ననుసరించి భార్యలంగూడి వనముల విహరించు దేవతలని యర్థ మేల కాదని యడుగుదురేమో. వా రదృశ్య రూపులు గారు. కనఁబడుచుండినచో వారినేల సౌమిత్రి ప్రార్థించి సీతను గాపాడుచుండుఁడని కోరఁడు ?

"యే వృక్షేషు సస్పింజరా నీలగ్రీవా విలోహితాః."

అని శ్రుతి తెలుపుచున్నది. వృక్షములయందే యుండువా రనఁగా వృక్షాధిదేవతలనియే మనము గ్రహించు టుత్తమము. వృక్షములను ఛేదింపరాదనుటకుఁ గలకారణ మిదియే.

"ఇంధనార్థమశుష్కాణాం వృక్షాణామవపాతనమ్,
ఫలదానాం తు వృక్షాణాం ఛేదనే జప్యమృక్ఛతం."

అని మనుస్మృతియందు నెండనిచెట్లను వంటకొఱకు ఛేదించుట యుపపాతకములలో నొకటిగాఁ జెప్పఁబడినది. ఎండినవాని నా దేవత వదలిపెట్టును. జీవుఁడు శరీరమును వదలునట్లు. అపుడే యది యెండిపోవును. వాస్తుశాస్త్రమునందు గృహోపకరణాము లకు నడవికిం బోయి వృక్షమూలమున శయనించి ప్రార్థించి

పిదప ఛేదింపవలయునని కలదు. ప్రార్థన మేల? అందుఁ గల దేవత నీవృక్షమును వదలి వెళ్లుమా యనియే దానిభావము. అందును వల్మీకాశ్రయములు లోనగువానిని ఛేదింపరాదని వాస్తుశాస్త్రము తెలుపుచున్నది. పూజకుఁ బూవులుకోయు నపుడు లతల వంచరాదనుట యేటికి? అందుఁగలదేవతల కే బాధ కలుగునో వారు కోపగింతురోయది శ్రేయస్సుగాదనియే పెద్దలభావము. ఎవ్వ రేమన్నను మీరు సాక్షులుగా నుండుఁ డని సౌమిత్రి వనదేవతలను బ్రార్థించెననియే దీని తాత్ప ర్యము. మానవులుచేయు పాపకార్యములను బుణ్యములను దేవత లదృశ్యమూర్తులఁ బరిశీలింతురు. కావున లోకమును వంచించితిమని సంతోషపడక భయంపడవలయును. ఎందఱో మనముచేయుపనులకు సాక్షులున్నారని గ్రహింపవలయును. అనునదియే యిందలిసారము.

"త్వాం ప్రతి ధిక్. త్వమద్య ప్రణశ్య. యస్మాన్మామేవం విశంకసే" అని యన్వయము. నిన్నుఁగూర్చి నింద యగుఁగాక. ధిక్ నిందార్థకము. నీవు ఇపుడే నశించుము. ఏకారణమున నన్ని ట్లనుమానించితివో. అను నీ సామాన్యార్థమునుబట్టి లక్ష్మణుఁడు సీత ననరానిమాట యాడెనని తోఁపకమానదు. నీవు నశింతువుగాక. అనఁగా నర్థమేమి? ఇంతకంటె దూషింపఁ దగుమాట హెచ్చుగా నేమి కలదు? భగవత్పాదసేవ యింత కాలము చేసిన సౌమిత్రి యిట్లే యను నేని సేవాఫలము దుష్ఫ లమే యనవచ్చును. సౌమిత్రివంటి భక్తునినోట త్రికాలవేత్త యగు వాల్మీకిమహర్షి పలికించునా? ఏదో ఇందు విశేషార్థము కలదు. త్వాం=నిన్నుగుఱించి, ధిక్=నింద. అనఁగా లోకమున నిందఁ కలుగుఁగాక. అని భావిజనాపవాదము సూచింపఁబడియె

నని యెఱుంగందగు. అద్య త్వం ప్రణశ్య=ఇపుడు నీవు నాశముం గనంబడకుము. నాశమనుదాని కదృశ్యార్థము కలదు. అను దానిచే రావణాపహరణము సూచింపఁబడినది. న న్నిట్లు శంకించుచున్నావు. భగవత్కార్యమునకు విఘ్నకర్త నగుదు నని న న్ననుమానించుచున్నావే. అనఁగా నట్టివాఁడను గాను. ఇదిగో వెడలిపోవుచున్నాఁడను. అనుభావ మిందుఁ గలదని తెలియవలయు. ఇది సౌమిత్రి యెఱింగి యనెనా? యెందు రేని దైవికముగా నిట్టియర్థము గలపదములే యాతనినోటినుండి వెలువడియెను.

"స్వభావేన స్త్రీత్వం దుష్టం. గురువాక్యే వ్యవస్థితం మామేవం విశంకసే" అని లోపలివాక్యముతో నన్వయింప వలయు. పైనవ్రాసినదాని కిది విరుద్ధము కాదాయందు రేని కాదు. స్త్రీత్వము నైజముగా దుష్టమైనది. ప్రకృతి స్త్రీవ్యక్తియే యగునా? భగవంతుఁడు పురుషుఁడే యగునా? తల్లి! సామాన్య లక్షణములు నీయందు సమన్వయము కాఁజాలవనియే కిదం సౌమిత్రియాశయముగా మహాకవి తెలిపెను. ప్రకృతి భగవ దిచ్ఛ. కాన స్త్రీయే కాదు. పురుషుఁడుకూడ నగును. కార్యము ననుసరించి యేరూపమునైన ధరించును. లోకధర్మము ననుస రించి స్త్రీస్వభావము దుష్టమే. విశేషశాస్త్రమే లేదా ? కనుక నిది సామాన్యస్త్రీజాతినిందయే కాని సీతాదూషణము కాదని యెఱుంగవలయును. ఎందులకనఁగా పై వాక్యమునుజూడుఁడు- స్వస్తి తేఽస్తు వరాననే = నీ విపుడే నశింపుము. అమ్మా నీకు మేలు గలుగుఁగాక. అని లక్ష్మణుఁ డనునేని ఉన్మత్తుఁడే యతఁ డగును. అతఁ డంతటి యవివేకుఁడా ? వరాననే యనుపద ముం బరికింపుఁడు. 'సత్యపూతం వదేద్వాక్య' మ్మనునట్లు శ్రేష్ఠ

మైన మోము కలదానా! అనుటంజేసి సత్యవాక్యమునఁ బరి శుద్ధమగు మోముకల యోసీతా! అనఁగా నీపలుకులు సత్యములే. నీకు మేలు గలుగుఁగాక. అవతారఫలసిద్ధియే మేలు గాక మఱే మున్నది? తల్లీ! నీమనోరథము ఫలించుఁగాక యని భావము గ్రహింపవలయు. "యత్ర కాకుత్థ్సః తత్ర గమిష్యే"=శ్రీరాముఁ డున్న తావునకుఁ బోవుదు. నేను బోయినఁగాని నీకు మేలుకలుగదు. అని తాత్పర్యము. విశాలాక్షీ! లక్షణచే దూరదృష్టిగలదానా యని యర్థ మేర్పడును. నిన్ను సంపూర్ణ లగువనదేవతలు కాపాడుదురు గాక. అనఁగా వననివాసము వనదేవతలసహాయము నీకుఁ గలుగుఁగాక. మా సహాయ మిఁకఁ గొంతకాలము కలుగదనునర్థ మిట సూచితము. రావణోద్యాననివాసము కలుగునను భావ మిద్దానిమూలమున సూచింపఁబడినది. కనుకనే నిన్నందును గాపాడువారు తనదేవతలే. రాక్షసస్త్రీలు కారు. రక్షణమనఁగా నాపదలు కలుగకుండఁ గాపాడుట యనియు. భరించుటనఁగా ధనాదిరూప సాహాయ్యము చేయుట యనియు నర్థములని ప్రాచీనులయాశయము. ఈయర్థ మెట్లు సంగత మగునందురా? "నిమిత్తాని చ ఘోరాణి యాని ప్రాదుర్భవంతి మే." దుర్నిమిత్తము లనేకములు పొడసూపుచున్నవి. "అపి త్వాం సహ రామేణ పశ్యేయం పునరాగతః"=అని సౌమిత్రి యనుచున్నాఁడు. శ్రీరామునితోఁ గూడియుండు నిన్నిందు మరలివచ్చిన నేమి చూతునా? ఈ ప్రశ్నకునముల నాలోచించిన నీపర్ణశాలయం దిఁక మీఁదంపతుల నొక్కచో నుండఁగాఁ జూతునని తోఁపదనికదా భావము. కనుక వననివాసమే నీకని యూతనిమాటలు సూచించుననున దేల యసంగత మగును? సీతాదేవీ! నే నరుగుదును. నీకిఁక

నిందుండు నదృష్టము లేదు. వననివాసము వనదేవతలమూల మునఁ గష్టనివృత్తియుఁ గలుగఁగలదని సౌమిత్రి సైనికముగాఁ బలికెననియే యిందుఁ గలసారము. ఈభాగమునుండి యొక్క విశేషమును గ్రహింపవలయు. తాను లేకున్న నిఁక దిక్కెవ్వ రును లేరనుభావమును వదలి దేవతలు సర్వస్థలముల నిండి యుండి కర్మానుసారముగా ఫలముల నొసంగుచుఁ గాపాడుదు రనువిషయమే మన మెఱుంగఁదగినది. దీనిచే మానవసామా న్యాహంకారము తొలఁగును.

"గోదావరీం ప్రవేక్ష్యామి వినా రామేణ లక్ష్మణ,
ఆబంధిష్యేఽథవా త్యక్షే విషమే దేహమాత్మనః. 32
పిబామ్యహం విషం తీక్ష్ణం ప్రవేక్ష్యామి హుతాశనం,
న త్వహం రాఘవాదన్యం పదాపి పురుషం స్పృశే. 3౦
ఇతి లక్ష్మణమాక్రుశ్య సీతా దుఃఖసమన్వితా,
పాణిభ్యాం రుదతీ దుఃఖాదుదరం ప్రజఘాన హ." 3౯

అని మూలము. సీతావాక్యములమూలమున వాల్మీకి యా కాలపుటాచారములఁ దెలుపుచున్నాఁడు. ఇవి దురాచార ములు కావా యందురేమో. కావు. ఎట్లనఁగా: జలములు, ఉరిత్రాడు, శిలాదిపతనము, విషము, అగ్నిప్రవేశము అను వానిమూలమున నిందుప్రాణముల వదలుట దురాచారమని సామాన్యదృష్టిని జూడఁ దోఁచును. అది నైజమే. ఇవేల యట్టి ధర్మకాలమునఁ దొలఁగింపఁబడక యుండెను? అను ప్రశ్నము మంచిదే. ప్రాయికముగాఁ బతివ్రతలే యిట్టికారణ ములచే శరీరమును వదలుదురు. భర్తృమరణానంతరము జీవింపరా దనున్యాయమే వారు ప్రధానముగాఁ దలంచిరని

తోఁచెడిని. బలవన్మరణము పాపము కాదా యన్నఁ గాదు. కులట కది పాపమే యగును. భర్తృపాదములఁ దలంచు కొనుచు శరీరముల వదలినసాధ్వి యుత్తమలోకములందుఁ బతింగూడి విహరించునని స్మృతులే తెలుపుచున్నవి. సహగమనమున కవకాశము లేనిస్థితియందే యివి మృతిహేతువు లగును. కాన నామెభావన మంచిదికాన దానిబలమునఁ బాపలోకప్రాప్తి కలుగనేరదని మన మెఱుంగవలయు. అట్టి సద్భావమే లేనివారల కవ్వానిమూలమున మృతి పాపహేతువే యగుననుటయు సిద్ధాంతమే.

"యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరం,
తం త మేవైతి కౌంతేయ సదా తద్భావభావితః."

అను నీగీతాశాస్త్రోక్తి దీనికాధారము కావచ్చును గదా. సీత యిట్లు పలికి రోదనముచేయుచు రెండుచేతులఁ గడుపు మోఁదుకొనియెను. దీనిచేత సీత సామాన్యస్త్రీలవలె నిట్టి కార్యము చేసెఁగదా యని యూహింపరాదు. ఇందలివిశేష మేమనఁగా: స్వాధిష్ఠానచక్రమును బాధించెనని యర్థము. స్వాధిష్ఠానచక్రము అగ్నితత్త్వాత్మకము. దాని నుద్దీపింపఁ జేయుదునని తెలియఁజేసెనని భావము. ఇఁకనిం దించుకంత యాలసించిన దహింతునని యామెయాశయము. ఈవిషయ మీక్రింద వ్రాసిన శ్రీశంకరాచార్యశ్లోకమును గాంచి తెలియఁ దగినది.

"తవ స్వాధిష్ఠానే హుతవహమధిష్ఠాయ నిరతం
తమీడే సంవర్తం జనని మహతీం తాం చ సమయాం,

యదా లోకే లోకాన్ దహసి మహసి క్రోధకలితే
దయార్ద్రా యా దృష్టిశ్శిశిరముపచారం రచయతి." 38

అని సౌందర్యలహరి.

"స్వాధిష్ఠాన మగ్నితత్త్వోత్పత్తిస్థానం. తత్రోత్పన్నమగ్నిం సంవర్తాగ్ని తయా ఆరోప్య తత్రైవ మహాసంవర్తాగ్నిజ్వాలాం శక్తిరూపతయా ఆరోప్య తత్రస్థితా శక్తిస్సంభావ్యా. తత స్తయోరాలోకేన జగంతి దగ్ధాని తాని పునః ప్రసన్నాయా భగవత్యా ఏవ కృపారసపరిపూరితా దృష్టి ర్మణిపూరకచక్రే ప్రతిపాదిత శిశిరోపచారం రచయతీతి." వ్యాఖ్య.

స్వాధిష్ఠానప్రదర్శనము శీఘ్రగమనము సాగింపుమనుటకే యని మన మెఱుంగవలయును.

"తాముత్తరరూపాం విమనా రుదంతీం
సౌమిత్రిరాలోక్య విశాలనేత్రాం,
ఆశ్వాసయామాస న చైవ భర్తు
స్తం భ్రాతరం కించి దువాచ సీతా." 38

అని మూలము. "సౌమిత్రిర్విమనాస్తా మాశ్వాసయామాస. తం సీతా కించిన్నోవాచ." అని యన్వయక్రమసంగ్రహము. ఆకుటిలతాడనము చూడఁగనే సౌమిత్రి మనస్సు చెదరఁగా నూఱడించెను. అమ్మా! నీయానతిమెయి నొనరించెద. ఆగ్రహింపకుమా!అని ఆలక్ష్మణునితో నింకేమియు నామె పలుకదయ్యెను. అనఁగా భావమేమి? తనక్రోధము నెఱింగెనని యిఁక సత్వరము యాతఁడు పోవుననియే కదా యామె యూరకుండుటకుం గారణము. అట్లే గాకయున్న నాలసింపకపొమ్మని మరలఁ బలుకకుండునా? మఱది వెళ్లెను. కాఁగలకార్య మగును. అని

యామె యెఱింగెనని యీవాక్యమే తెలుపుచున్నది. ఈ భావమును వెల్లడించు నీమూలమును బరికింపుఁడు.

> "తతస్తు సీతా మభివాద్య లక్ష్మణః
> కృతాంజలిః కించిదభి ప్రణమ్య చ,
> అన్వీక్షమాణో బహుశశ్చ మైథిలీం
> జగామ రామస్య సమీపమాత్మవాన్." ४०

'కించిదభి ప్రణమ్య'=సుంతవంగి, 'అభివాద్య'=నమస్కరించి. అనఁగా నిఁకనాలసించిన సీతాకోపాగ్ని దగ్ధుఁడ నగుదుననియే చక్కఁగా నమస్కరించునంత యవకాశము లేక. ఈయర్థ మెద్ది దృఢపఱచు ననఁగా 'ఆత్మవాన్' అనునది. తత్త్వమెఱింగిన యా సౌమిత్రి యాశ్రమముదాఁటి పలుమాఱు లాసీతనుజూచుచు శ్రీరాముని చెంత కరిగెను. అదియే కదా సీతారాములు తమ యవతారఫలము గల్గించుకాలము. సీత యూఱడిల్లెను. మన మీయర్థమును గ్రహించినఁ గలుగులాభ మేమి? అందు రేని. సీతారాములు ప్రకృతిపురుషు లనుసద్భావము కుదుపుటచే వారి నుపాసింప సంసారసాగరము తరింతుమనువిశ్వాస ముదయించును. దాన మనస్సు మహానందము నొందును. దానిచే నిరంతరతత్త్వస్ఫూర్తి యుదయించును. అది సమదర్శిత్వము గలుగఁ గారణ మగును. అదియేకదా లభింపఁదగినది. అయ్యది భగవదనుగ్రహపాత్రునిగాఁ జేయును. దాన ముక్తి దొరకును. ఇంతకంటెఁ గావలసినదేమున్నది? భగవత్సేవకుఁ బ్రధానపరికర మభేదబుద్ధి. అది లభింపనిచో నెన్నితపస్సులు చేసినను ఫలింపవు. సర్వదేవతాసమత్వ మలవడకున్న మరల మరల మానవలోకమునఁ బుట్టుటయే కలుగుఫలము. కావున సీతా

రాములు మహాప్రకృతిపురుషులని భావించి వారి నారాధింప వలయును. వారలకిరువురకు నవినాభావసంబంధ మనుమాట మఱువరాదు. అట్టిసద్భావమున వారిని నిరంతరము స్మరించిన సంసారసాగరము మనల బాధింపఁజాలక గోష్పదతుల్య మగును. ఈవిషయమున నధ్యాత్మరామాయణమున నింత కంటె విశేష మేదియు లేదు.

## రావణుఁడు పరివ్రాజికవేషమున సీతంజూడ నరుదెంచుట.

* శ్రీరామునిసోదరుఁ డిచ్ఛలేకపోయినను విధిలేక యాశ్రమమునుండి ప్రయాణమై పోనసాగెను. కాని గమ నము నిరుత్సాహమున సాగకయుండిన నెట్లో పర్ణశాల దాఁటి పోయెను. అవకాశమున కెదురుచూచుచున్న రావణుఁడు సౌమిత్రి పయనము సాగించుటం జేసి యిదియ యదనని యెంచి కల్పితసన్న్యాసివేషమున సీతయున్నయెడ కరిగెను. ఆ దురాత్ముఁడు కావిరంగు గలవస్త్రముం గట్టుకొని జడలముడి యొప్పఁగా ఛత్రముఁ బట్టుకొని పాదుకలు దొడిగి వామాంస మునఁ ద్రిదండమునకుఁ గమండలువు దగిలించి యునుచుకొని యిట్టివేషమున సీతయొద్దకుఁ బోయెను. సూర్యచంద్రప్రకా శము లేనితఱి భయదాంధకారము సంధ్యాకాలము నావరిం చినచందమున మహాబలశాలి రావణుఁ డతఁడు సోదరులు లేని తఱి జానకిం జేరం బోయెను. దారుణాంగారకగ్రహము చంద్రు నెడఁబాసియున్న రోహిణిని జూచునట్లు భయంకరుఁ

* ఇది నలువదాఱవసర్గమునఁ గలదు.

డతఁడు శ్రీరాము నెడఁబాసియున్న యశస్విని నా రామ పత్నిని గాంచెను. భయముఁగల్గించు తేజఃకృత్యములు గలవాఁ డగుట నాతనిం గని జనస్థానగతవృక్షములెల్ల వడవడ వడం కెను. వాయువు సాజముగా వీవఁజాలకుండెను. శీఘ్రగతిగల గోదావరియు రక్తాక్షుఁడై వాఁడు చూడఁగా భీతిగొని చలముమాని మందగతిం గాంచెను. దుర్జనుండయ్యు సుజన వేషుఁడై పతికొఱకు విచారంపడు నాజానకికడకుఁ జిత్ర యను తారచెంతకు శనిగ్రహము పోవురీతిఁ బోయెను. పచ్చిక కప్పు కొనఁగా నుండుబావివలె లోపలఁ బాపచిత్తుఁడు బాహ్య మున సాధువేషముగలవాఁడు నగురావణుఁడు మహాకీర్తిమతి యగు శ్రీరామపత్నిం గని నిలువఁబడెను. సర్వాలంకార భూషితాంగియై పతియార్తస్వరము విన్నదిమొదలు మన స్థైర్యము లేక కన్నీటిధారలు ప్రవహించుచుండ నాశ్రమ మునఁ గూరుచుండియున్న జానకీదేవిచెంత కా దుష్టాత్మకుఁడు పోయెను. మదనశరార్తుఁడై వేదమును బఠించుచు నొంటిగా నున్న యాలోకజననిం గని యడఁకువ యుట్టిపడఁగా నిట్లు పొగడసాగెను.

సువర్ణకాంతిగల్గి పీతాంబరధారిణివగు నో కాంతామణీ! ముఖనేత్రహస్తములు కమలములవలె నుండుటంజేసి కమల మాలికనుధరించిన పద్మలతవలె నున్నదానవు. ఎవ్వతవు? శుభా స్యా! భూదేవివా? కీర్తివా? శ్రీదేవివా? స్వతంత్రురాలవగు రతిదేవివా ? కాంతికధిష్ఠానదేవత వగులక్ష్మివా ? అచ్చరవా? భూతి కధిష్ఠానదేవతవా? **సుదతీ!** నీయూరుభాగములు హస్తి హస్తసంకాశములై యుండెడు. నీపయోధరములు వర్ణనా

తీతము లై యున్న వి. సొంపుగులుకునట్టి స్మితామలరారఁ గనుదో యిమురువు చూపనుండునో మగువా! తరంగిణి తనజలపూర మున గట్టును హరించురీతి నీసౌందర్యముచే నామనస్సు నప హరించుచున్న దానవు. నీసౌందర్యము వర్ణనాతీతము. నీయట్టి యందగత్తెను దేవగంధర్వాదులజాతులకాంతలలో నెప్పు డును జూచినదియే లేదు. లోకవిఖ్యాత మగునీలావణ్యము సౌకుమార్యము. నవయౌవనము నను వాని కెల్లఁ బ్రతికూల ముగా నీవీ యడవియం దుండుట చూడఁగా నిట్టి సులక్షణ వతి యీయడవి కేలవచ్చెనని నామది నిశ్చయింపలేక తత్తఱ పడుచున్న ది. నీవిందుండఁ దగదు. నీయింటికి మరలి పొమ్ము. ఇయ్యది భీతికరరూపులు కామరూపులు నగురక్కసులు నివ సించుతావు. నీవో సర్వశుభవస్తుప్రశస్తము లగుప్రాసాదాగ్ర ములయం దుండఁదగుదువు. ఉపవనములయందు సంచరింపఁ దగుదువు. మంగళాంగీ! పరిమళపుష్పదామములు మంచిభో గ్యద్రవ్యములు విమలామూల్యాంబరములు లోకోత్తరపురు షుఁడు నీకుఁ దగునని నే నెంచువాఁడను. నిన్నుంజూడఁగా దేవతాంగనవని తోఁచెడు. రుద్రులకో మరుత్తులకో సంబం ధించినదానవా యేమి? వస్వాదిత్యులకుఁ జేరినదానవా? దేవగంధర్వకిన్నరులుగాని వేఱొక రిచ్చటికి రాఁజాలరు. ఇది రాక్షసాశ్రయస్థలము. నీవె ట్లిచ్చటి కేతెంచితివి? ఇందు వానరములు సింహాదిమహామృగములు సంచరించుచుండును. వానింజూచిన నీకేల భయము కలుగకున్నది? మదగజము లిం దుండును గదా. వానికి భయంపడక యొక్కతవే యె ట్లున్న దానవు? కల్యాణీ! నీ వెవ్వతవు? నీపే రెయ్యది? ఎవ్వరి దానవు? ఎచ్చటనుండి యిచ్చటి కేతెంచితివి? భయదక్క,

వ్యాధులు తిరుగు నీ దండకారణ్యమున నొక్కదానవే యేల చరించుచున్నదానవు? అని ప్రశ్నించెను.

దుష్టమతి రావణుండు ప్రశంసింపఁగా నాసీతాదేవి కపటసన్న్యాసియగు నతనింగని భిక్షుకుఁడే యని పొరపడి యాతిథేయసత్కారము లాచరించెను. అతనిముం దొకపీఠ మునిచి పాద్య మొసఁగి సౌమ్యాకారమునఁ గనుపట్టునతని గని యార్యా! పక్వాన్నము సిద్ధమయ్యెను. భుజింపుఁడని వేఁడెను. కపటయతి వేషధారియగు నారావణుఁడు సీతాపహరణము నందే యాసక్తిగలవాఁడు కనుక భోజనముసేయ నిష్టపడునా? అది తెలియక పాప మాసీత భుజింపఁ బిలిచెను. మఱియు నాజానకి యార్యా! మునుల కర్హమగునాసన మిదిగో. యథేచ్ఛముగాఁ గూరుచుండుము. పాద్య మిదిగో. కందమూలఫలము లివిగో. ఇవి పక్వము చేయఁబడినవి. కొదువలేకుండునట్లు భుజింపుము. అని యీరీతి సర్వము సుసంపన్న మను నతిథికిఁ జెప్పఁదగుమాటలం బిలుచుచున్న యాశ్రీరామపత్నిని జక్కఁగాఁ గాంచి యారక్కసులఱేఁడు తన మృతికొఱకు తెగించి బలాత్కారమున నపహరింపఁ దలంచెను. అంత నాసీతాదేవి వేఁటకుఁ బోయియున్న పతిని శ్రీరాముని, దత్సోదరుని లక్ష్మణు నెదురుచూచుచు, వారు కానరానందున మఱెంతపట్టుదలతో వారిరాక కెదురుచూచుచుండెను.

మహామతులారా! అనేకవిషయములు విమర్శనార్హము లిందుఁ గలవు. వానియందలి సారము నెఱింగి తరణోపాయము దానియాధారమునఁ దెలిసికొందము. సీత యాడినమాటలు సౌమిత్రికిఁ బరుషములుగాఁ దోఁచెను. ఆతఁడు నించుక తూలనాడినట్లు మాటలాడెను. కాని యామాటలు నిందాస్తుతిపర

ములుగనే వెడలెను. ఆశ్రమమును దాఁటిపోవుచు వనదేవత లను బ్రార్థించెను. పర్ణశాల దాఁటిపోయెను. ఆశ్రమమునకు నలుదెసల మహారణ్యమే కదా. వాస్తవముగా సీతారక్షణమే ప్రధానకార్య మనురామాజ్ఞను వలఁదాల్చినవాఁడైనయెడల నాచెంత యించుకసేపు నిలిచియుండవలసినది కదా. అట్లు చేయక యాంహాశ్రమమును దాఁటి త్వరగఁ బోయెను. దీనిచే నతఁడు శ్రీరామునానతి లెక్కచేయనివాఁ డనరాదు. అందు నిలువక పోవుటయే సర్వభూతసమ్మత మగుకార్యము. సీతా రాములయాశయము కూడ నట్లు చేయవలయుననియే. కర్మ మదృశ్యరూపపాశములం దగిలించి ప్రాణికోటి నీడ్చుకొనిపోవు చుండ నస్వతంత్ర మగుప్రాణిబృంద మేమిచేయంగలదు? అతని పోకకే దేవతలు సంతోషించిరి. దీనింబట్టి యోజింపఁగా

"ఇంద్రియాణాం హి చరతాం యన్మనోనువిధీయతే,
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి."

అను భగవద్గీతావాక్యము స్మృతిగోచరము కావచ్చును గదా. ప్రాణికోటి యస్వతంత్రమే యని యీభాగము మనసుఁ దేటపఱచుచున్నది. కనుక లక్ష్మణుఁ డకార్య మొనరించెనని మన మూహింపరాదు. లోకులకుఁ గర్మగతి దెలియఁ దరము గాదని తెల్పుటకే యీకార్య మిట్లు సాగెనని మన మెఱుంగ వలయును.

"తదాసాద్య దశగ్రీవః క్షిప్రమంతరమాస్థితః,
అభిచక్రామ వైదేహీం పరివ్రాజకరూపధృత్. ౨
శ్లక్ష్ణః కాషాయసంవీతశ్శిఖీ ఛత్రీ ఉపానహీ,
వామే చాంసేఽవసజ్యాథ శుభే యష్టికమండలూ. 3
పరివ్రాజకరూపేణ వైదేహీం సముపాగమత్."

అని మూలము. "పరివ్రాజకరూపధృత్" అనుచోఁ గొన్ని సంశ యములు గలుగుచున్నవి. మునివేషముధరించి రాక సన్న్యాసి వేష మేలయని, త్రేతాయుగమున సన్న్యాసాశ్రమస్వీకారము కలదా యని, ఇతఁ డేవిధి ననుసరించెనని. ఇవియే ప్రధాన సంశయములు. మునులు తురీయాశ్రమ మనఁబడు సన్న్యాస మును స్వీకరించువారు కారు. బ్రహ్మచారులు కొందఱు, వాన ప్రస్థులు కొందఱు నగుదురు. సన్న్యాసులకుఁ దఱచుగా నాకాలమున నవధూతనామము ప్రసిద్ధముగ నుండెనని యూ హింపవచ్చును. కృతత్రేతాద్వాపరములయందు బ్రాహ్మణులు సాధారణముగా నుపాసకులు. యజ్ఞాదిసత్కర్మనిరతులుగ నుండిరని పురాణపఠనము తెలుపును. అనేకు లందు దేవతో పాసకులే యగుదురు. ఇప్పటి సన్న్యాసులవంటివా రప్పుడు లేరనియే చెప్పవచ్చును. మఠాధిపతులు లేనేలేరనక తప్పదు. వైరాగ్యసంపన్నులను మునులన్న సన్న్యాసులన్న ననవచ్చును. కాని దండకమండలుధారులుగాని, వానిని వదలిన పరమహం సలుగాని యాకాలమున విశేషించి యున్నయట్లు పురాణ ములయందుఁ దఱచుగాఁ గానరాదు. యోగులని మహర్షు లని యప్పటిజ్ఞానులకుఁ బ్రసిద్ధి యుండును. ప్రకృతమనుసరించి యోజింతము. శిఖాచ్ఛత్రములు పాదుకలు త్రిదండము కమండలువు కలవని యున్నందున నారావణుఁడు సన్న్యాసి వేషము ధరించెననవలయు. ఆస్థితియం దాతనిని ద్రిదండి యన వలయు.

"వాగ్దండోఽథ మనోదండః కాయదండ స్తథైవ చ,
యస్యైతే నిహితా బుద్ధౌ త్రిదండీతి స ఉచ్యతే. ౧౦

త్రిదండమేతన్నిక్షిప్య సర్వభూతేషు మానవః,
కామక్రోధౌ తు సంయమ్య తతస్సిద్ధిం నియచ్ఛతి." ౧౧

మను. ౧౨-౧౦.

"వాఙ్మనఃకాయానాం దండా నిషిద్ధాభిధానాసత్సంకల్పప్రతిషిద్ధద్రవ్యాపహరణత్యాగేన బుద్ధావస్థితాః. స త్రిదండీత్యుచ్యతే. న తు దండత్రయధారణమాత్రేణేత్యాభ్యంతరదండత్రయప్రశంసా." అని వ్యాఖ్య.
త్రిదండి యనువానిలక్షణము లివి. ఎంత బాగున్నవో. ఇట్టి లక్షణములు లేక కేవల దండకమండలువుల ధరించినవాఁడు పామరుఁడే కాని సన్న్యాసి యగునా?

"యతేర్లింగం ప్రవక్ష్యామి యేనాసౌ లక్ష్యతే యతిః,
బ్రహ్మసూత్రం త్రిదండం చ వస్త్రం జంతునివారణం.
శిక్యం పాత్రం బ్రసీ చైవ కౌపీనం కటివేష్టనం,
యస్యైతద్విద్యతే లింగం స యతిర్నేతరో యతిః."

అని యంగిరస్స్మృతి తెలుపుచున్నదని గోవిందరాజులు వ్రాసిరి. ఈవిషయము పెంచివ్రాయుట యేలయని తోఁచినది. ముఖ్యముగా రావణుఁడు "కాషాయదండమాత్రేణ యతిః పూజ్యః" అన్న సామాన్యశాస్త్రము ననుసరించి తన్నుఁ జూచినంతనే జానకి సత్కరించి మాటలాడు నన్నభావముననే యీవేషము ధరించెననియే మన మూహింపవలయును. మనుస్మృతి తెలిపినవియే యతికి విహితములు గాని బాహ్యచిహ్నములు కావనియు మన మెఱుంగవలయును.

"తామపశ్యత్తతో బాలాం రామపత్నీం యశస్వినీం. ౫
రోహిణీం శశినా హీనాం గ్రహవద్భృశదారుణః,
తముగ్రతేజః కర్మాణం జనస్థానరుహా ద్రుమాః. ౬

సమీక్ష్య న ప్రకంపంతే న ప్రవాతి చ మారుతః,
శీఘ్రస్రోతాశ్చ తం దృష్ట్వా వీక్షంతం రక్తలోచనం. ౭
స్తిమితం గంతుమారేభే భయాద్గోదావరీనదీ.''

అని మూలము. ఇందుఁ గనఁబడినసీత మాయాసీతయే గాని వేఱు గాదని వాల్మీకియే సూచించుచున్నాఁడు. "బాలామ్" అనఁగా సాధారణముగా వయసునఁ జిన్నదని యర్థము. దుఃఖించుచు నొంటరిగానుండి రాముఁ డెటులున్నవాఁడో యని కలవిలపాటొందు సీతకు "బాలాం" అనువిశేషణము మహాకవి యిచ్చోఁ బ్రయోగింపఁడు. కావునఁ బ్రకృతిపురుషుల కవినాభావసంబంధ మని యెఱింగిన మహాముని యీ యర్థమునే మదినిడుకొని బాలాశబ్దము ప్రయోగించె నని మన మెఱుంగవలయు. చంద్రవిరహిత యగు రోహిణి నంగారకాదిగ్రహములు గాంచినట్లు రావణుఁడు సీతాదేవిం గాంచెను. ఇటఁ బాపగ్రహములలో సూర్యుఁడు పరిగణింపఁబడఁడు. "యథా రోహిణ్యాః క్రూరగ్రహవీక్షణం లోకానర్థకరం తథా రావణస్య సీతావీక్షణమితి భావః"అని వ్యాఖ్యయందుఁ గలదు. ఇందలి సారమేమి ? రోహిణియే యిటఁ జేర్కొనఁబడుట యేలయనఁగా నాలకింపుఁడు. ఖగోళమునందు రోహిణి యాకారము శకటమువలె నుండును. కుజశను లారోహిణీశకటమును భేదించిన లోకమునకుఁ గీడు మూడునని జ్యోతిశ్శాస్త్రము తెలుపుచున్నది. అందు నంగారకుఁడు రోహిణీశకటమును భేదించిన మఱెంత కీడు గలుగునని ప్రాచీనులమతము. ఇందు నాప్రస్తావము లేదే యందురేమో రోహిణిం గాంచగనే దానిని భేదించునేమో యనునను

మానము లోకులకుం గలుగకమానదు. అదియే కారణముగా
నిట నయ్యదియే పేర్కొనఁబడియెను.

"దక్షిణతో రోహిణ్యాశ్చరన్ మహీజోఽర్ఘవృష్టినిగ్రహకృత్,
ధూమాయన్ సశిఖో వా వినిహన్యాత్పారియాత్రస్థాన్." ౧౦

అనియు,

"భిత్త్వా మఘాం విశాఖాం భిందన్ భౌమః కరోతి దుర్భిక్షం,
మరణం కరోతి ఘోరం యది భిత్త్వా రోహిణీం యాతి." ౯

బృహత్సంహిత. ౬-అధ్యా.

అని కుజచారమునందును,

"రోహిణ్యాం కోసలమద్రకాశిపాంచాలశాకటికాః." ౪

౧౦-అధ్యాయము.

అని శనిచారమునందును వరాహమిహిరాచార్యులు చెప్పిరి.
రోహిణీ శకటభేదమనఁగా,

"వృషే సప్తదశే భాగే యస్య యామ్యోంశకద్వయాత్,
విక్షేపోఽభ్యధికో భింద్యాద్రోహిణ్యాశ్శకటం తు సః." ౧౩

సూర్యసిద్ధాంతమున నక్షత్రగ్రహయుతియందుఁ జెప్పఁబడినది.

"గవినగకులవేఖగోఽస్య చేద్యమదిగిషుః ఖశరాంగులాధికః,
కభశకటమసౌభినత్త్యసృక్కనిరుడుపోయది చేజ్జనక్షయః. ౭

స్వర్భానావదితిభతోఽష్టబుక్షసంస్థే
శీతాంశుః కభశకటం సదా భినత్తి,

భౌమారోహిణ్యాశ్శకటభిదా యుగాంతరే స్యా
త్సేదానీం న హి భవతీదృశి స్వపాతే." ౧

గ్రహలాఘవము. నక్షత్రచ్ఛాయాధికారము.

ఈగ్రంథము శాలివాహనశకము పదునాలుగువందల నలువది రెండవసంవత్సరమున రచింపఁబడినది. ఈరోహిణీ శకటభేదనము యుగాంతరమున నగును. కాని యీకాలమునఁ గాదని గ్రంథకర్త గణేశదైవజ్ఞుఁడు తెలిపెను. ఈయోగమునకు ఫలము ప్రజానాశమని యెఱుంగవలయు. శనికంటె నంగారకుఁ డీఫలదానమున నధికుఁడని ప్రాచీనులయాశయము. ఇరువు రొకటియే యని యిందుఁ గలదు.

రోహిణి నంగారకుఁడు చూచినట్లు రావణుఁడు సీతాదేవిని గాంచెననుటంజేసి ప్రజానాశమే యిందులకు పలమని తేలెడిని. అందులకే కదా సీతారాము లవతరించినది. అట్టి ఫలము లోకోపకారకమే యగును. దుష్టాత్ముఁ డగు రావణుని గాంచి వృక్షములు కదలకయుండెను. గోదావరి మెల్లఁగాఁ బ్రవహించెను. వాయువు నైజమగువృత్తి మానియుండెను. భయంపడియే యిట్లుండెనని సామాన్యార్థము. వృక్షాదులకు భయ మెట్టులనఁగా,

"అంతస్సంజ్ఞా భవంత్యేతే సుఖదుఃఖసమన్వితాః."

అనుసూక్తి ననుసరించి సుఖదుఃఖములుగలిగి కర్మముల నుచితరీతి నాచరించువృక్షాదులు భయంపడినవనుట విచిత్రము కాదు. వృక్షాధిదేవత లాతనిం గాంచి భయంపడఁగా వారి వృత్తి ననుసరించువృక్షములు మ్రాన్పడుట సాజమే కాని యచ్చెరు వేదియులేదు. జలాధిదేవతయు నట్లే యని యెన్నఁ

దగును. ఆదానవుని యప్పటిరూపము సౌమ్యముగా నున్నను నైజము భయంకరము గాన భయంపడినవి. వృక్షాదులను సీతారాములయవతార మెందులకని తెలియదని మన మూహింపవలయు. అధిదేవతలకును దెలియదా యందురేని వార లెఱింగినను దాత్కాలికసాధ్వసము దేహధారులకెల్ల నైజము కాన నట్లు తోఁచినదని మన మూహించిన నీశంకల కవకాశము కలుగదు. దశగ్రీవునియాకృతియే సర్వభూతభయంకర మని యిటఁ గలసారము.

"అభ్యవర్తత వైదేహీం చిత్రామివ శనైశ్చరః." ౯

అని మూలము. చిత్రానక్షత్రమును శనైశ్చరుఁడు సమీపించిన నందుండినను హానికరుఁ డగునని భావము.

"చిత్రాస్థైప్రమదాజనలేఖక చిత్రజ్ఞ చిత్రభాండాని."

'క్షయం యాంతి' అని యుత్తరశ్లోకముతోడ నన్వయింపవలయు. అని బృహత్సంహితయందలి శనైశ్చరచారమున వరాహమిహిరాచార్యులు వ్రాసిరి. ఈయర్థమే శ్రీరామాయణమునను గలదు.

"రూపమగ్ర్యం చ లోకేషు సౌకుమార్యం వయశ్చ తే,
ఇహ వాసశ్చ కాంతారే చిత్తమున్మాదయంతి మే. ౨౩
సా ప్రతిక్రామ భద్రం తే న త్వం వస్తు మిహార్హసి,
రాక్షసానామయం వాసో ఘోరాణాం కామరూపిణాం. ౨౪

ప్రాసాదాగ్ర్యాణి రమ్యాణి నగరోపవనాని చ,
సంపన్నాని సుగంధీని యుక్తాన్యాచరితుం త్వయా." ౨౫

అని మూలము. ఇందు రావణునిహృదయాభిప్రాయము తేట

పడుచున్నది. నీరూపసౌకుమార్యవయస్సులకీవనవాస ముచి
తము కాదు. ఇందుండుటం జూడఁగా నాహృదయ మున్మాదా
వస్థ నొందుచున్నది. అనఁగా నిన్ను దర్శించినంతన నామనస్సు
పరవశత్వము నొందెనని భావము. లోకోత్తరవస్తుదర్శనమున
మనస్సు తదేకాగ్రతనొందుట న్యాయ్యము. "సీతా! అట్టి నీవు
మరలిపొమ్ము. నీకు మేలుగలుగును.ఇందు మాత్రము నివసింపఁ
దగవు" అని రావణుం డనెను. దీనిభావ మేమి? ఇందున్న
నీకు మేలుగలుగదు. నీయవతారమునకు ఫల మిందుండఁగలు
గునా? కావున నిట నివసింపకుము. నాయింటికి విచ్చేయుము
అనియే కదా. కామార్తుఁడై పిలిచెనని కాముకులు, మహా
భక్తిచేఁ బిలిచెనని సాధువులు తలంతురుగాక. ఈయర్థమునే
తెలిపెడు నీక్రిందివాక్యములఁ జిత్తగింపుఁడు. "ఇందుఁ గామ
రూపులు క్రూరమతులు నగురక్కసు లుందురు. కాన నీకిట
నివాసము పనికిరాదు. దివ్యసౌధాదులు మహోద్యానములు
నీకు సంచారయోగ్యములు" ఇందలిసార మేమి? భక్తుఁడు
నిర్మలస్థలమునఁ గూరుచుండి యుపాస్యదేవతారూపమును
మదినిడుకొని ధ్యానించును. ఏస్థలమైన నేమి యనరాదు.
మనశ్చాంచల్యమునకు నివారకములు మనోహరస్థలములు.
కావుననే "నగరోపవనాని చ" అని రావణుం డనెను. నీ
వుండఁదగుచోటు లంకానగరమునఁ గలయశోకవనమే. అను
భావ మిట సూచింపఁబడియె. ఉద్యానపరివృతమగు మహా
సౌధాగ్రమున నాసీనురాలవగు నిన్నుపాసింతునని యిందలి
విశేషము. ఈయర్థము రావణుఁడు పరమదుర్మార్గుఁ డనునూహ
గలపెద్దలకు సరిపడదు. ఆతనిపుట్టుక, అతఁడు సనత్కుమారు
నితో నేమని ప్రశ్నించినది, ఆముని చెప్పినయుపదేశవాక్యము

లెవ్వి? అని తలంచువారికే యీయర్థము రుచించును. ఈవిష యమునే శ్రీశంకరభగవత్పాదాచార్యులు

"సుధాసింధోర్మధ్యే సురవిటపివాటీపరివృతే
మణిద్వీపే నీపోపవనవతి చింతామణిగృహే,
శివాకారే మంచే పరమశివపర్యంకనిలయాం
భజంతి త్వాం ధన్యాః కతిచన చిదానందలహరీం."

అనుశ్లోకమునఁ దేటపఱచిరి. మహావనసమావృతదివ్యహర్మ్య మున నున్నయట్లేల ధ్యానింపవలయుననఁగా నింపైనవస్తువులు మనస్సు నాకర్షించి యిటునటు పాఱాడక యుండఁజేయును. కనుకనే నగరోపవనములు నీనివాసమున కర్హములని తెలుపును. ఇట్లర్థమును గ్రహించినపుడే రామాయణము పఠనార్హ మగును. లేనిచో నెట్లగును? విజనస్థలమునఁ గూరుచుండి యుపాస్యదేవతామూర్తి నిచ్ఛానుకల్పితమును భావించి మనోమాలిన్యము తొలఁగించుకొని ధ్యానింపవలయుననియు, సుందరారామములు సౌధాదులు దేవతకు నివాసమునకుఁ దగినవని తలంపవలయుననియు, నట్లు ధ్యానించి యుండు నిష్ణాతుఁడై యవ్వల మనఃపద్మమునందే దేవతను నెలకొలిపి ధ్యానింపవలయుననియు సారము.

"నిమంత్ర్యమాణః ప్రతిపూర్ణభాషిణీం
నరేంద్రపత్నీం ప్రసమీక్ష్య మైథిలీం. 36
ప్రసహ్య తస్యా హరణే ధృతం మన
స్సమార్పయత్స్వాత్మవధాయ రావణః."

అని మూలము. తన చావుకొఱకు నాసీతాదేవి లంకకుంగొని

పోవ యత్నించెననికదా యిందలిభావము. సనత్కుమారుని కడకేగి యిదియే కదా రావణుం డడిగినది. అందులకే యీ ప్రయత్నము. అనఁగాఁ గాముకుఁడై కాదనియుఁ, దనదేహము కడతేలుటకే యనియు మన కీభాగము తెలుపుచున్నది. ఇఁకఁ దరువాతి శ్రీరామచరిత్రమును బఠింతము.

## రావణునిదుర్భాషణములకు సీత బదులుచెప్పుట.

* రావణుం డిట్లు ప్రశ్నింపఁగా నాతనివేషముంబట్టి పూజ్యబుద్ధిచే సీత యిట్లు తమ వృత్తాంతమును దెలిపెను. తొలుత నీతఁడు బ్రాహ్మణుఁడు. అతిథి. బదులు పలుకకున్న శపించును. అని యోజించి యిట్లు పలికెను. బ్రాహ్మణవర్యా! మిథిలాధిపతియగు జనకుఁడు నాతండ్రి. సీత యని నన్నుఁ బిలుతురు. నీకు భద్రము గలుగుఁగాక. శ్రీరామచంద్రుఁడు నాపతి. మామగారియింటఁ బండ్రెండువత్సరములు సుఖముగ నుంటిని. పదుమూఁడవయేఁడు రాగా నాభర్తకుఁ బట్టాభిషేకము చేయఁబూని నామామ దశరథుఁడు మంత్రిముఖ్యులతో నాలోచించెను. ఆవిధమెఱిఁగి కైక తన కతఁ డిచ్చినవరముల శ్రీరాము నడవులకుఁ బంపుట, భరతునకుఁ బట్టాభిషేకము చేయుట ననురీతిగా ఫలింపఁజేయవలయునని కోరెను. పట్టుపట్టి సత్యముమీఁద నొట్టుపెట్టి యిట్టులడుగఁగా దశరథుఁ డెన్నియో మంచిమాటలు పలికి ఫలముగానక పరితపించెను. అప్పటికి నాపతి కిరువదియైదేండ్ల వయస్సుండెను. సకల సద్గుణభూషితుఁడని శ్రీరాము నెఱుంగుము. దశరథుఁడు చేయునది

* ఇది నలువదేడవసర్గమునఁ గలదు.

నేరక యూరకుండెను. తండ్రికడకు వచ్చిన రామచంద్రుని గని యాకైక రామా! నీవడవులలోఁ బదునాలుగేండ్లు నివసింపవలయు. త్వరగ వెడలుము. భరతుఁడు రాజ్యమేలును. తండ్రిని సత్యవాదిగా నొనరింపుము. ఇది నీతండ్రి నామూలమున నీకుఁ దెలుపుచున్నాఁడు. అనఁగా నేజంకును లేని శ్రీరాముఁ డందుల కంగీకరించి వనముల కరుదెంచెను. నాపతి యిచ్చునే కాని ప్రతిగ్రహింపఁడు. సత్యవచస్కుఁడు. అసత్యము పలికియే యెఱుంగఁడు. నాపతి సవతితల్లికొడుకు లక్ష్మణుఁడు కలఁడు. అన్న యడవులకుఁ బోవుటెఱిఁగి ధనుర్ధారియై యతఁడు సేవార్థ మరుదెంచెను. సౌమిత్రి శూరాగ్రేసరుఁడు. నేను రాముఁడు సౌమిత్రియు నడవులకు వచ్చితిమి. మహాత్మా! కొంచెమిట విశ్రమింపుము. నాపతి వన్యపదార్థములం గొని శీఘ్రముగ నరుదెంచును. ఇఁక నీగోత్రము లోనగువానిం దెలుము. ఈయడవుల నొంటరిగ నేల తిరుగుచున్నావు? అని ప్రశ్నించెను.

ఆప్రశ్నమునకు దారుణముగా బదులుపలుకువాఁడై యారక్కసుఁడు "జానకీ! సకలలోకముల భీతిగొనఁజేయు రావణుఁడను నేనే సుమా. నిన్నుఁ జూచినదాదిగా నాభార్యల యందుఁ బ్రీతి కలుగకున్నది. పెక్కుతావులనుండి పెక్కండ్రను గాంతామణులఁ దెచ్చియున్నవాఁడను. నీకు భద్రములు గలుగుఁగాక. వారందఱకు నధిపురాల వగుము. సాగరాంతరమున నొకకొండపైన మహాపట్టణము కలదు. లంక యని దానిం బిలుతురు. జానకీ! సాగరపరివృతయగు నాలంకలో నుద్యానముల నన్నుంగూడి విహరింపఁగలవు. అపుడు నీకీ యరణ్యవాసము రుచింపదు. సీతా! నాకు నీవు

భార్య వగుదువేని యచ్చరలవంటిదాసిక లైదువేలు నిన్ను సేవింతురు.

అని వాఁడు పలుకఁగా నిష్కళంకచరిత్రయగు నా జానకి యత్యంతకుపితయై వాని నించుకేని లెక్కింపక యిట్లు పలికెను. అల్పమతీ! మహాపరాక్రమాదిగుణముల కాటపట్టగు శ్రీరామున కేను భార్యను. నన్ను గుఱించియా యిట్లు పలుకుదువు? న్యగ్రోధమండలమువంటివాఁ డగురామున కనువ్రత నైనదానను. ఇట్టి నేను నిన్నుఁ జూడనైనఁ జూతునా? శ్రీరాముని పత్ని నగునన్ను దుర్భాషణ లాడెదవా? నీవు జంబుకము వంటివాఁడవు. ఆఁడుసింగమును నన్నుఁ గోరెదవా? సూర్యుని గాంతి యెడఁబాయనట్లు రామచంద్రు నెడఁబాయని నన్ను స్పృశింప నెవ్వని కలవిగాదు. రావణా! శ్రీరామపత్నిని నన్నుఁ గోరుచున్నాఁడవే. మందభాగ్యుఁడవు కదా. కనుకఁ ద్వరగ బంగారుచెట్లను జూడఁగలవు. నిజమిది. నీయీకోరిక ఆఁకలి గొనియున్న సింహమునోటినుండియుఁ, గ్రోధమునఁ జెలరేఁగు భుజంగమునోటినుండియుఁ గోఱపెఱుక నూహించుచున్నావు. మందరపర్వతరాజమును జేతఁ బట్టుకొనిపోవ నూహించుచున్నాఁడవు. అవియెట్టు లశక్యకార్యములో నన్నుఁ గొనిపోవుటయు నశక్యమే. అంతియగాదు. కాలకూటమును ద్రావి సుఖముగా నిల్లుచేర నెంచుచున్నావు. శ్రీరామపత్నిని బడయఁ గోరుచున్నాఁడవే. సూదితోఁ గన్నుఁదుడుచుకొనుట యెట్టిదో యిదియు నట్టిదే. తీవ్రఖడ్గమును నాలుకతో నాఁకుచున్నాఁడవే. తరువాతి దగునాశనము తెలియకున్నావు. నన్నుఁ దిరస్కరింపఁ గోరునీవు పాషాణము కంఠమునకుఁ గట్టుకొని సముద్రమును దాఁటఁ గోరుచున్నావు. రవిచంద్రులఁ జేతఁ

బట్టుకొన నాశించుచున్నాఁడవు. ఇది యశక్యమని యెఱుంగఁ జాలవు కాఁబోలు. సదాచారసంపన్నయగు శ్రీరామపత్ని నభిలషించుటం జూడఁగా మండుచున్ననిప్పును వస్త్రమునఁ గట్టుకొనిపోవఁ జూచినట్లున్నదే. నన్నుఁ గోరుట లోహనిర్మితములగు వాడిశూలములపై నడవఁ గోరినట్టిదే. రాఁగలయుపాయము నెఱుంగవు. జంబుకమునకు సింహామునకు నెంతభేదమో. ఎండిపోయిననదిలో నీటికిఁగాఁ ద్రవ్వినపల్లమునకు సాగరమునకు నెంత యంతరమో మేటిమద్యమునకుఁ గడుగునీళ్లకు నెంత వాసియో శ్రీరామునకు నీకు నంత యంతరమున్నది. నీవు నన్నపహరించినచో ఈఁగ బియ్యపుగింజయని వజ్రశకలమును మ్రింగినట్లు ధనుర్బాణములఁ దాల్చిన శ్రీరాముఁ డుండఁగా నీకు లోఁబడుదునా? తప్పక నీకు మరణమునే కల్గింతును. అని పరిశుద్ధాంతఃకరణయగు నాజానకి పలికి నణఁకెను. ఆతఁడాసీత యట్లు వణకుచుండుట యెఱింగి యింకను భీతి గల్గింపఁబూని తనవంశాదికీర్తనము చేయఁబూనెను.

మహాశయులారా! ఈఘట్టమును విమర్శింతము. విశేషాంశము లెన్నియో యిందున్నవి.

"బ్రాహ్మణశ్చాతిథిశ్చాయ మనుక్తో హి శపేత మాం,
ఇతి ధ్యాత్వా ముహూర్తం తు సీతా వచనమబ్రవీత్." ౨

అని మూలము.

"అతిథిర్యస్య భగ్నాశో గృహాత్ప్రతినివర్తతే,
తస్మాత్సుకృతమాదాయ దుష్కృతం తు ప్రయచ్ఛతి.
ఏకరాత్రం హి నివసన్నతిథిర్బ్రాహ్మణస్స్మృతః,
అనిత్యాహి స్థితిర్యస్మాత్తస్మాదతిథిరుచ్యతే.

స్వాధ్యాయేనాగ్నిహోత్రేణ యజ్ఞేన తపసా తథా,
న చాప్నోతి గృహీ లోకాన్ యథా త్వతిథిపూజనం.
సాయంప్రాత స్త్వతిథయే ప్రదద్యాదాసనోదకం,
అన్నం చైవ యథాశక్త్యా సత్కృత్య విధిపూర్వకం.''

విష్ణుస్మృతి.

''భిక్షామప్యుదపాత్రం వా సత్కృత్య విధిపూర్వకం,
వేదతత్త్వార్థవిదుషే బ్రాహ్మణాయోపపాదయేత్. ౯౬
నశ్యంతి హవ్యకవ్యాని నరాణామవిజానతాం,
భస్మీభూతేషు విప్రేషు మోహాద్దత్తాని దాతృభిః. ౯౭
విద్యాతపస్సమృద్ధేషు హుతం విప్రముఖాగ్నిషు,
నిస్తారయతి దుర్గాచ్చ మహతశ్చైవ కిల్బిషాత్. ౯౮
సంప్రాప్తాయ త్వతిథయే ప్రదద్యాదాసనోదకే,
అన్నం చైవ యథాశక్తి సత్కృత్య విధిపూర్వకం. ౯౯
శిలానప్యుంఛతో నిత్యం పంచాగ్నీనపి జుహ్వతః,
సర్వం సుకృతమాదత్తే బ్రాహ్మణోఽనర్చితోవసన్. ౧౦౦
నవై స్వయం తదశ్నీయా దతిథిం యన్న భోజయేత్,
ధన్యం యశస్య మాయుష్యం స్వర్గ్యం చాతిథిపూజనం.'' ౧౦౬

మనుస్మృతి. 3-అధ్యా.

''అతిథిత్వేన వర్ణానాం దేయం శక్త్యనుపూర్వశః,
అప్రణోద్యోఽతిథిస్సాయమపి వాగ్భూతృణోదకైః.'' ౧౦౭

యాజ్ఞవల్క్యస్మృతి. ఆచారకాండము.

''దూరాచ్చోపగతం శ్రాంతం వైశ్వదేవ ఉపస్థితం,
అతిథిం తం విజానీయాన్నాతిథిః పూర్వమాగతః. ౪౧

నైక గ్రామీణమతిథిం సంగృహ్ణాతి కదాచన,
అనిత్యమాగతో యస్మా త్తస్మాదతిథిరుచ్యతే. ౪౨

అతిథిం తత్ర సంప్రాప్తం పూజయేత్స్వాగతాదినా,
తథాసనప్రదానేన పాదప్రక్షాళనేన చ. ౪౩

అతిథిర్యత్ర భగ్నాశో గృహాత్ప్రతినివర్తతే,
పితర స్తస్య నాశ్నంతి దశవర్షాణి పంచ చ. ౪౪

కాష్ఠభారసహస్రేణ ఘృతకుంభశతేన చ,
అతిథిర్యస్య భగ్నాశ స్తస్య హోమో నిరర్థకః. ౪౬

అపూర్వస్సువ్రతీ విప్రో హ్యపూర్వశ్చాతిథి స్తథా,
వేదాభ్యాసరతో నిత్యం త్రయోఽపూర్వా దినేదినే." ౪౯

పరాశరస్మృతి.

అను నీస్మృతులు బ్రాహ్మణపూజయు నతిథిపూజయుఁ, బ్రధానములనియు, సకలపుణ్యములు ఈకార్యము చేయకపోయిన నశించుననియుఁ దెలుపుచున్నవి. సీతాదేవియు నీసదాచారమును బాటించియే యాకపటవేషధారికి మర్యాదలుచేసి మాటలాడెను. మంచిమాటలాడుటయు నందు నసృతము పలుకకుండుటయు సాధుధర్మములని

"తృణాని భూమిరుదకం వాక్చతుర్థీ చ సూనృతా,
ఏతాన్యపి సతాం గేహే నోచ్ఛిద్యంతే కదాచన." ౧౦౧

అధ్యాయము- 3.

ఈ మనుస్మృతివాక్యము తెలుపుచున్నది. సీతయాచారమే యాస్మృతులును ముఖ్యమని తెలుపుచున్నవి. కావున సీతారాముల ప్రవృత్తియే సకల ధర్మశాస్త్రసారమని మన మెఱుంగవలయును.

"దుహితా జనకస్యాహం మైథిలస్య మహాత్మనః,
సీతానామ్నాస్మి భద్రం తే రామభార్యా ద్విజోత్తమ." 3

అని మూలము. ఈమూలమువలన వాల్మీకిహృదయ మెట్టి దని మన మెఱుంగవచ్చును. జనకరాజుకొమరితను. సీతానామమున నున్నదానను. రామభార్యను. నీకు భద్రములు గలుగుం గాక. అని కదా సీత పలికెను. సామాన్యదృష్టిం బరిశీలించిన నీవాగ్ధోరణి నిస్సారముగాఁ దోఁపకపోదు. సీతానామ్నా=సీత యను పేరుచే, అస్మి=అయితిని. అనఁగా సీతానామమున నున్న దానను. అని కదా వాక్యార్థము. అనఁగాఁ దాత్పర్య మేమి? మహాప్రకృతి నగునేను నిందు సీతానామమున నవతరించి యున్నదాన. రామభార్యను. నీకు మేలుగలుగుఁ గాక. అనుచో రావణా! ఎంతకాలమునుండియో యీశరీరభార ముసు వదలించుకొనఁ గోరు నీకు నేను రామచంద్రుఁడు మేలు చేకూర్ప నవతరించితిమి. ఇఁక మేలు గలుగును. నిస్సం శయమనునర్థమును గ్రహింపవలయును. లేకున్న "భద్రం తే" అని సీత యాముని నాశీర్వదించిన ట్లగును. ఈవాగ్ధోరణిచే నిట్టివిశేషార్థము వాల్మీకిమహర్షి మన కెఱింగించెను.

"ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి."

అన్నసూక్తి మనకుఁ గ్రొత్తది కాదు కదా. మహర్షి వాగ్ధోరణినే విశేషార్థ మనుసరించుననుట సత్యమే. అధ్యాత్మరామాయ ణము కూడ నీయర్థమునే కదా చాటుచుండును.

"మమ భర్తా మహాతేజా వయసా పంచవింశకః. ౧౦
అష్టాదశ హి వర్షాణి మమ జన్మని గణ్యతే."

అని మూలము. ఇందు సీతారాములవయోనిర్ణయము గలదు.

కాని యిది చదువగనే విశ్వాసపాత్రముగాఁ దోఁపదు. పరిశీ
లింపుఁడు. సంశయములనే పెంచుకొనక వాని వదలించుకొను
నుపాయమే యోజింపఁదగినది. సీత తమ యరణ్యవాసగమన
కారణము తెలుపుచున్నది. అయోధ్యనుండి యడవికిఁ బయ
నము చేయునప్పటికి శ్రీరాముఁ డిరువదై దేండ్లవయస్సు గల
వాఁడు. సీత పదునెనిమి దేండ్లవయస్సు గలది. సీత కాఱవయేట
వివాహమయ్యెను. పండ్రెండుసంవత్సరము లయోధ్యయం దుం
డెను. పదునెనిమిదియేండ్లు దాఁటఁగనే యడవులకు వచ్చెను.
పదివత్సరములు పంచవటికిఁ జేరునప్పటికి గడచెను. మూఁడేం
డ్లుండుట కలిసి శ్రీరామునకు నప్పటికి ముప్పదియెనిమి
దేండ్లు. సీతకు ముప్పదియొకసంవత్సరములు వయస్సునఁ జెల్లె
నని మన మూహింపవలయును.

"దద్యాన్న ప్రతిగృహ్ణీయాత్సత్యం బ్రూయాన్న చానృతం. ౧౭
ఏతద్బ్రాహ్మణ రామస్య ధ్రువం వ్రతమనుత్తమం,
తస్య భ్రాతా తు వైమాత్రో లక్ష్మణో నామ వీర్యవాన్. ౧౮
రామస్య పురుషవ్యాఘ్రః సహాయస్సమరేఽరిహా."

అని **మూలము.** అనుత్తమవ్రతమనఁగా నిది యని సీత తేట
పఱచుచున్నది. ఇచ్చుట ప్రతిగ్రహింపకయుండుట. సత్యమునే
చెప్పుట. అనృతము భాషింపకుండుట అనునవి. ఇది శ్రీరా
మునిమహత్త్వమును దేటపఱచుచున్నది. దానమనునది పర
పోషణరూపము. ప్రతిగ్రహణ మాత్మపోషణరూపము. ఇత
రునివలన గ్రహింపఁదగినదే లేదు. అనఁగా ఇతరుఁడిచ్చు వస్తువే
లేదని తాత్పర్యము. దీనిచేఁ బరమేశ్వరత్వము సిద్ధాంతితము

సత్యమునే భాషించుట. అనఁగా స్వస్వరూపమునే స్మరించుట అని భావము.

"సత్యేనాదిత్యో రోచతే దివి సత్యం వాచః ప్రతిష్ఠాసత్యే,
సర్వం ప్రతిష్ఠితం తస్మాత్సత్యం పరమం వదంతి."

తైత్తిరీయము.

అసత్యమును బలుకకుండుట. అనఁగా స్వప్రయోజన మెద్దియు లేకుండుట అని భావము. ఏదియే నొక్కలాభము లేకున్న నసత్యమాడిన లాభమేమి కలదు? ఇన్నిలక్షణము లుండుటం బట్టియే రాముఁడు భగవంతుఁడని తేటపడియెడు. రాముని సవతితల్లికొడుకు లక్ష్మణుఁడు యుద్ధమున శత్రువుల నాశము చేయువాఁడు. అను సీతావాక్యము భావి మేఘనాదవధమును సూచించెడిని. లేకున్న నతనిప్రస్తావమున శౌర్యప్రకటనమేల? యుద్ధమున నతఁ డన్నకుఁ దోడుపడువాఁడు. అని జానకి సెూచ్చరించెను. ఆ యిరువురమూలముననే నీకు మేలు చేకూరు ననునాశయమును దేటపఱచెను.

"స భ్రాతా లక్ష్మణో నామ ధర్మచారీ దృఢవ్రతః. ౧౯
అన్వగచ్ఛద్ధనుష్పాణిః ప్రవ్రజంతం మయా సహ,
జటీ తాపసరూపేణ మయా సహ సహానుజః. ౨౦
ప్రవిష్టో దండకారణ్యం ధర్మనిత్యో జితేంద్రియః,
తే వయం ప్రచ్యుతా రాజ్యాత్కైకేయ్యాస్తు కృతే త్రయః. ౨౧
విచరామ ద్విజశ్రేష్ఠ వనం గంభీరమోజసా,
సమాశ్వస ముహూర్తం తు శక్యం వస్తు మిహ త్వయా. ౨౨
ఆగమిష్యతి మే భర్తా వన్యమాదాయ పుష్కలం."

అని మూలము. "ధర్మచారీ దృఢవ్రతః" అను నీరెండువిశేషణ

ములు లక్ష్మణునిస్వభావమును మనోనిశ్చయమును వెల్లడిం
చును. "మయా సహ ప్రవ్రజంతం రామం ధనుష్పాణి రన్వ
గచ్ఛత్." అను నన్వయముం బట్టి సర్వకార్యకర్తృత్వము
ప్రకృతిదే యని తేలుచున్నది. నా యనుగమనము లేకున్న నవ
తారఫలమే లేదని తాత్పర్యము. "తాపసరూపేణ మయా సహ
అనుజేన సహ దండకారణ్యం ప్రవిష్టః" అనుటంజేసి శ్రీరామ
మూర్తి సర్వకార్యములయందు నాసక్తి లేనివాఁడనియుఁ,
ప్రకృతి సర్వకార్యముల నిర్వహించుచుండఁ దాను నందుఁ
బ్రవేశించినరీతిఁ గనంబడుచుండుననియు భావము తేలు
చున్నది. సీత యదృశ్య కాఁగా సోదరుఁడు కర్తవ్యమును
దెలుపుచుండును. కాని తానుమాత్ర మసంగుఁడుగనే యుం
డును. ఇదియే నిర్లిప్తత్వ మనఁబడును. "రాక్షసానా మయుం
వాసో ఘోరాణాం కామరూపిణాం" అను లక్ష్మణుని
మాటకు బదులు చెప్పుచున్నది. "గంభీరం వనమోజసా విచ
రామ" మేము తేజస్సుచేతనే గంభీరమగు నీవనమునఁ దిరుగు
చున్నాము. అని. "తేజస్తేజస్వినామహమ్" అను భగవద్గీతా
వాక్యము ననుసరించి తేజస్సు మాకు సహాయమని తాత్పర్య
మగుటంజేసి, యితరసహాయము లేనివారమని తలంపఁ జన
దనియు,మా తేజస్స ప్రతిహతమనియు, భావముగలదని గ్రహిం
పవలయును. "ముహూర్తం సమాశ్వస! విప్ర" క్షణకాలము
విశ్రాంతినొందుమా ? ఆవల నీకు విశ్రాంతియే దొరకదు.
ఒక్కక్షణకాలము నాప్రోల నిలువుము. అద్దాన నీకు మేలు
గలుగఁ గలదనుభావమును జానకి తెలిపెనని మన మెఱుంగ
వలయు. "ముహూర్త మిహ త్వయా వస్తుం శక్యమ్" అనునది
యీభావమునే దృఢపఱచుచున్నది. ఇందు క్షణకాలమే నీ

వుండఁ దరము. ఆవల నీకు నుండఁ దరముకాదని భావము. క్షణకాలానంతరము దుఃఖసమయము భయంకరముగా రాఁ గలదని సూచించెనని మన మెఱుంగందగు.

> "త్వాం తు కాంచనవర్ణాభాం దృష్ట్వా కౌశేయవాసినీం. ౨౬
> రతిం స్వకేషు దారేషు నాధిగచ్ఛామ్యనిందితే,
> బహ్వీనాము త్తమస్త్రీణా మాహృతానామిత స్తతః. ౨౭
> సర్వాసామేవ భద్రం తే మమాగ్రమహిషీ భవ."

అని రావణుఁడు పలికెను.'అనిందితే' సామాన్యార్థము స్పష్టము. రావణునిహృదయ మిది. ఎద్దియనఁగా,"కౌశేయవాసినీం కాంచనవర్ణాభాం త్వాం తు దృష్ట్వా స్వకేషు దారేషు రతిం నాధిగచ్ఛామి" నాయిష్టదేవతవగు నిన్నుం గాంచితిని. నీదర్శన భాగ్యమున నా పుత్రమిత్రకళత్రాదులయందు నిచ్ఛనొందను. చిరకాలకాంక్షితమగు నీదర్శనమున నాకుండిన సంసారతాప జాలములు రూపుమాసెనని భావము. ఉపాసకుఁడు ధనలాభ మును గోరి యిష్టదేవతను సువర్ణచ్ఛాయగల్గినట్లు ధ్యానింప వలయును.

> "ధనలాభే సువర్ణాభా చింత్యతే లలితాంబికా."

అని బ్రహ్మాండపురాణమునఁ గలదు. ధనమనఁగా ముక్తిధన మనియె భావము. ఇష్టదేవతాసాక్షాత్కారము సంసారతాప నివృత్తికరము కాదేని దాన లాభ మేమి?

> "తటిల్లేఖాతన్వీం తపనశశి వైశ్వానరమయీం
> నిషణ్ణాం షణ్ణామప్యుపరికమలానాం తవ కళాం,
> మహాపద్మాటవ్యాం మృదితమలమాయేన మనసా
> మహాంతః పశ్యంతో దధతి పరమానందలహరీం." ౨౧

అని శ్రీశంకరభగవత్పాదులు తెల్పిరి. "మృదితాః క్షపితాః మలాః కామాదయః మాయా అవిద్యాస్మితారాగాదయః" అని వ్యాఖ్య. ఇష్టదేవతాధ్యానమునకు ఫలము కామాదినివృత్తి కాక మఱే మగును? "ఇతి స్తుతిః అహృతానాం ఉత్తమస్త్రీణాం సర్వాసాం మమ మేయా అగ్రమహిషీ తస్యాశ్చ మమ చ భవ. ఈశ్వరీతి శేషః." అని వ్యాఖ్య. దేవీ! నీసేవార్థ మాయాలోకములనుండి దేవతాస్త్రీలను దెచ్చి యుంచినాను. వారలకు నాప్రియపత్నియగు మండోదరికి నధిపు రాలవు కమ్ము. అనఁగా నాగృహమున కరుదామున విజయం చేసి మాసేవల నంగీకరించి మమ్ముఁ గృతార్థులను జేయుమని తాత్పర్యము.

> "లంకా నామ సముద్రస్య మధ్యే మమ మహాపురీ. ౨౧
> సాగరేణ పరిక్షిప్తా నివిష్టా నగమూర్ధని,
> తత్ర సీతే మయా సార్ధం వనేషు విహరిష్యసి. ౨౯
> న చాస్యారణ్యవాసస్య స్పృహయిష్యసి భామిని."

అని మూలము. గ్రహింపఁదగినదియు మనసుఁ గరఁగింపఁదగినదియు నగునర్థ మియ్యది. లంకానగరము సాగరమునడుమ నొకకొండపై నున్నది. అందుఁగల మహోద్యానముల యందు నెందఱో దాసికలు సేవింపఁగా నాచేఁ జేయఁబడు నుపచారముల నంగీకరించుచు విహరింపఁ గలవు. అప్పు డీయ రణ్యవాసము నీకు స్మృతిగోచరమే కాఁజాలదు. అని. ఇందలి సారమేమి? ఇష్టదేవతోపాసనమునకు విజనసిర్మలస్థల మావశ్యకము. అందుఁ బర్వతమహారణ్యాము లుత్తమములు. నిర్బాధకస్థలమే తపోయోగ్య మనుట నిర్వివాదాంశము.

అందుఁ దద్భక్తులు గూడి యుపచారపూర్వకముగా భగవత్పూజ యొనర్చు టుత్తమము. ఇందు ధ్యానము ప్రధానము కాక పూజ ప్రధానముగాఁ జెప్పఁబడినది. హోమము, జపము, పూజ, న్యాసము అనునవి నాలుగుభాగములు. పూజయే ప్రధానముగాఁ గలవారికి జపాదులు ముఖ్యములు కావు. ఈ నాలుగుభాగములయం దేది యెవ్వనికిఁ బ్రధానమగునో వానికిఁ దక్కినమూఁడును ముఖ్యములు కావని భావము. ఇన్నింటికి ఫల మొక్కటియే. ప్రధానము దేవతామూర్తి యందు భక్తి. అది యెన్ని మార్గముల నుండిన నుండుఁగాక. వారివారియిష్టము ననుసరించి యది యుండును. కాని దేవతా దర్శనము బాహ్యదృష్టి, అంతర్దృష్టి అనువానిమూలమునఁ జేయఁబడుచుండును. అంతర్దృష్టి ప్రధానమని భావము. సర్వదా తద్గతమనస్కుఁడై యీ నాలుగుపద్ధతులలో నెద్దాని నవలంబించిన నది సత్ఫలప్రదమే యగునని మనము గ్రహించి కృతార్థులము కావలయును.

"పంచ దాస్యస్సహస్రాణి సర్వాభరణభూషితాః. 30
సీతే పరిచరిష్యంతి భార్యా భవసి మే యది."

అని మూలము. ఇందు రావణునిభావము స్పష్టమగును. సాధారణార్థమును మఱచి విశేషార్థమునే యూహింపుఁడు. "హే సీతే యది (త్వమ్) మే భార్యా యది భవసి,తదా సర్వాభరణభూషితా దాస్యః పంచసహస్రాణి పరిచరిష్యంతి (త్వాం)" అని యన్వయక్రమము. నాకు జననీ! నీవు భా = తేజస్సుచే, ఆర్యా=పూజ్యురాల వగుదువేని, నాకడనుండు నైదువేలదాసికలు నీకు సేవచేయుదురు. ఇందుఁ దేజోరూపధ్యానమే చెప్పఁబడినది. ఇంతకు ముందు వ్రాసిన "తటిల్లేఖాతన్వీం" అనుశ్లోక

మునఁ బరమానందలహరి నగునిన్ను మహాత్ములు చూచు చున్నారు. అనుధ్యానమే యిందును గలదు. దీనిచే బాహ్య పూజాదులకంటె ధ్యానయోగమే యుత్తమోత్తమమని చెప్పఁ బడినది.

> "న హి ధ్యానేన సదృశం పవిత్రమిహ విద్యతే,
> శ్వపాకేష్వపి భుంజానో ధ్యానేనైవాత్ర లిప్యతే.
> ధ్యానమేవ పరో ధర్మో ధ్యానమేవ పరం తపః,
> ధ్యానమేవ పరం శౌచం తస్మాద్ధ్యానపరో భవేత్.
> సర్వపాపప్రసక్తోఽపి ధ్యానం నియతమభ్యసేత్,
> సర్వదా ధ్యానయుక్తశ్చ తపస్వీ పంక్తిపావనః."
>
> ఆత్రేయస్మృతి, ౪-అధ్యాయము.

ప్రతివిషయమును చెలువునపు డిద్దానికంటె నుత్తమము లేదని పల్కుట సాజమే. కాని యించుక యోజించిన నిది యుత్తమోత్తమమని తెలకపోదు. యోగమనఁగా ధ్యానరూపమే కదా. ముక్కుమూయుటయే యందు ముఖ్యము. ఇష్టదేవతామూర్తిని మనోవీథి నిలిపి యేకదృష్టి నుంచుటయే కదా యోగాభ్యాసఫల మనంబడును. కనుక "ప్రణానా ముత్తమవ్రత" మ్మన్నయట్లు గాక యిది ప్రప్రధానమనియే మనము తలంపవలయును. ప్రకృతము రావణుఁడు జనని! నన్ను నాయింటికి విజయంచేయుము. నీయీ బాహ్యరూపమును గన్నులకఱవుదీఱ నావారలెల్లఁ జూతురు. నేను నానందింతును. నామూలమున నెందఱో త్వత్సేవాఫలమును గాంతురు. అని యాతనిహృదయమని మన మెఱుంగవలయును. ఇందే యిది గ్రహింపవలసినవిషయము.

ఉపాసకుఁడు సద్గురుమూలమున మంత్రమును గ్రహించి దానిని జపించుచు బహుముఖములుగానుండు మనోవృత్తిని మంత్రాధిదేవతయందు మంత్రజపసంఖ్యయందు నిలిచియుండఁ జేయవలయును. ఇదియే భగవద్గీతాశాస్త్రమునందు

"శనైశ్శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్. ౨౫
యతోయతో నిశ్చరతి మనశ్చంచలమస్థిరం,
తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్." ౨౬

అను వాక్యములచేఁ జెప్పఁబడినదని యెఱుంగవలయును. ఆ మీఁద జపసంఖ్యయం దున్నవృత్తిని మరలించి దేవతయందే నిలుపవలయును. ఆయభ్యాసము దృఢత్వము నొందినమీఁద దేవతామూర్తిని దేజఃపుంజముగాఁ గాంచుట కభ్యసింపవలయును. అది చిరకాలమునకో కొన్నిజన్మములకో సిద్ధించును. అదియే యోగఫలము. తపఃఫల మదియే. అను నీవిశేషవిషయమునే యీభాగమునుండి మనము గ్రహింపవలయును. ఈవిషయమే యాజ్ఞవల్క్యస్మృతియం దీరీతిగాఁ

"వీణావాదనతత్త్వజ్ఞశ్శ్రుతిజాతివిశారదః,
తాలజ్ఞశ్చాప్రయాసేన మోక్షమార్గం నియచ్ఛతి." ౧౧౫

ప్రాయశ్చిత్తకాండము.

జెప్పఁబడినది. "తత్స్వరూపజ్ఞశ్చ తదనువిద్ధబ్రహ్మోపాసనతయా తాలాదిభంగభయాచ్చిత్తస్యాత్మైకాగ్రతాయాః సుకరత్వా దల్పాయాసేనైవ ముక్తిపథం నియచ్ఛతి ప్రాప్నోతి" అని విజ్ఞానేశ్వరభట్టారకుఁడు. సంగీతపాఠకుఁడు వీణావాదనము శ్రుతి షడ్జాదిజాతులు తాలము అనువానియందుఁ

దనచిత్తము నిలుచునట్లు చేయును. ఆయభ్యాసమే యోగ
ముగా మార్చిన సులువుగా ముక్తిని బడయును. అనఁగా
భావమేమి? సంగీతపాఠకుఁడు యోగియే యగును కాని భావ
మున భేదము గలదు. ఆతఁ డాయభ్యాసమును భగవంతునిపై
మరలించిన నిమేషమాత్రమున ముక్తుఁడు కాఁగలఁడు. ఇదియే
యోగాభ్యాస మనఁగా. చెవులు ముక్కు మూసి వేషధారులు
ఛాయాపటములఁ దీయించుకొనుట కాదు. ఈవిషయమును
చక్కఁగా నెఱింగి యేమంత్రము జపించినను దేవతానుగ్ర
హము కరతలామలక మగునని యెఱుంగవలయును. లేకున్న
మంత్రజపాదులకు ఫలమైహికము అత్యల్పము నగును. ఈ
వాక్యలు జానకి యెఱింగియుఁ బ్రాకృతులను గతి బోధించు
బాహ్యావర్తనము గాపాడఁబూని క్రుద్ధయైనట్లు పలుకుచున్నది.

> "సర్వలక్షణసంపన్నం న్యగ్రోధపరిమండలం. 33
> సత్యసంధం మహాభాగమహం రామమనువ్రతా."

అని మూలము. సామాన్యార్థము స్పష్టము గదా. రాముని వట
వృక్షముగా నిందు జానకి రావణునకుఁ జెప్పెను. ఏల? శ్రీరా
ముని భగవంతునిగా నన్ను మహాప్రకృతిఁగాఁ నెఱుఁగుమా
యని తెల్పుటకే. ఎట్లు? వటబీజ మత్యల్పము. దాని ఫలమగు
వృక్ష మపారశాఖాసమావృతము. అట్టే పరమాణువుగా నుండు
నది భగవద్రూపము. తలంచుకొన్న క్షణమాత్రమున సకలలోక
ముల వ్యాపింపఁగలదు. అనఁగా సకలభూతాశ్రయమని
భావము. అట్టిదాని ననుసరించినదాన ననఁగా సర్వత్ర వ్యాపిం
చుదానను. నీయింటియం దుందును. ఇందు నుందును. పెక్కు
లేల? ఎల్లతావుల నుందును. అను భావమును సీత తెల్పెనని
మన మెఱుంగవలయు. ఇందు గ్రహింపఁదగువిషయ మేది?

వటబీజము నాశ్రయించు టెట్లు? వటవృక్షము నే యాశ్రయింపవలయు. దాన భవదుఃఖము నివర్తించును. మనశ్శాంతి చేకూరు. పిదప దీనికెద్ది బీజమని యాలోచింపవలయును. అత్యల్పతమమగు తద్బీజము గోచరించును. దాని నాశ్రయించు నుపాయము తోఁచును. అట్లే తొలుదొలుత భగవతి నుపాసించి తత్ఫలముగా భగవంతు నెఱింగి తదాశ్రయణమున మానవుఁడు తరించును. అంతియగాని గత్యంతరము లేదు. సకలదేవతాదులు వటశాఖలవలె ననంతములుగానున్న నొక్క మూలమునం దాధారపడినవి. అనఁగాఁ బ్రకృతిమయములే యని యెఱుంగవలయు. ప్రకృత్యతీఁ డొక్కభగవంతుఁడే యని మన మెఱుంగవలయును.

''త్వం పునర్జంబుకస్సింహీం మామిచ్ఛసి సుదుర్లభాం. 3౬
నాహం శక్యా త్వయా స్ప్రష్టుమాదిత్యస్య ప్రభా యథా.''

అను మూలమున సీతాదేవి రావణునకుఁ గలభ్రాంతిని బోలఁగించి తనతత్త్వమును దెలుపుచున్నది. జంబుకశబ్ద మల్పబుద్ధి ద్యోతకము. రావణా! యల్పమతివయి లంకలో నుపవనముల న స్పర్శింపఁ గోరుచున్నావు. అది వదలుము. ఒక్క లంకోపవనాదులయందే కాక సర్వస్థలముల నుండుదానను. అల్పబుద్ధులకు భయంకరురాలను. ఇట సింహీశబ్దము భయంకరార్థ ద్యోతకము. ఇట భావ మేమనఁగా: నల్పబుద్ధు లత్యల్పవాంఛలను గోరి న న్నారాధించిన వారలకు భయంకరాకారమునఁ గనంబడి వారితపస్సును బాడుచేయుదును. ఉత్తమబుద్ధులు నాకరుణనే కోరుదురు. వారలకు సౌమ్యరూపమున దర్శనమిచ్చి కృతార్థులను జేయుదును. కనుక నన్ను ననఁగా నాసత్యరూపము ను స్పృశింపఁ జాలవు. అనఁగా నట్టిరూపము నీవంటివా...

కానఁజాలరు. ఆదిత్యస్య ప్రభా యథా = సూర్యప్రకాశము దర్శనయోగ్యమే కాని స్పృశింప సర్హ్యమా? అట్లే నేను రూపధారిణినిగాఁ గనంబడుదునే గాని దహనాదులు నాకును భగవంతునకును లేవు. అన్ని రూపములు అన్ని పేరులు నావియే. మే మిరువుర మవినాభావసంబంధము కలవారము. అని సీత బోధించెనని మనము తెలిసికొనవలయును. దీని చే రావణుఁడు కొనిపోయినసీత కృత్రిమసీతయే యని తెలియుచున్నది. లేకున్న మహాపతివ్రత సీత నన్ను ముట్టుకొనఁజాలవన్నమాట వట్టి అదే యగును గదా. కనుక నిదియే యథార్థ మగునర్థమనియే మనము నమ్మవలయును.

"పాదపాన్ కాంచనాన్నూనం బహూన్ పశ్యసి మందభాక్. ౨౭
రాఘవస్య ప్రియాం భార్యాం యస్త్వమిచ్ఛసి రావణ."

అని మూలము. వాల్మీకిమహాముని యీరామాయణమూలమున లోకులకు సకల విషయములను దెలుపఁ దలంచినవాఁడు కావున నిపుడు సీతావాక్యములమూలమున స్వప్నఫలములను దెలుపుచున్నాఁడు. మృతి యెవ్వారికి సమీపమున నుండునో వారికి స్వప్నమునందు బంగారువృక్షము లనేకము లగపడును. అవి కనఁబడఁగనే తమకు మృతి చెందనే యున్నదని భావించి వారు సంసిద్ధులు కావలయును. ప్రస్తుతమునకిది యెట్లు లన్వయించుననఁగా: రావణా! బంగారువృక్షములను జూచినట్లు నన్నుఁ గాంచితివి. ఇఁక నీకు మృతి సమీపమున నున్నది. నీకోరికలు ఫలించును. అని యన్వయించిన సరిపడును. ఇట్లే తక్కినవియు నని తలంపఁజను. మఱియు సీతాదేవి రావణునకు భావివృత్తాంతముఁ దెలుపుచున్నది.

"తాం వేపమానా ముపలక్ష్య సీతాం
స రావణో మృత్యుసమప్రభావః,
కులం బలం నామ చ కర్మ చ స్వం
సమాచచక్షే భయకారణార్థం." ౬౦

అని మూలము. ఛాయారూపిణియగు నాజానకి యిట్లు యుపదేశించి భయంపడ నేలయని ప్రశ్నింతు రేమో వినుండు. శ్రీరామలక్ష్మణులు వచ్చుకాలము సమీపించుచున్నది. లంకానగరమునకు వేగ పోవలయును. కబంధాదులకు శాపవిముక్తికాలము సమీపించుచున్నది. దాని కంతరాయము కలుగరాదు. కావున రావణునకు మనోధైర్యము కలుగుట కామె నడచెను. ఈ యర్థ మెట్లు చెప్ప వలసువడునందు రేమో. పూర్వశ్లోకమునందు

"గాత్రప్రకంప వ్యథితా బభూవ వాతోద్ధతా సా కదళీవ తన్వీ."

అని యున్నది. గాలితాఁకున వణఁకు నరఁటిచెట్టువలె సీత వడఁకెను. అని యర్థము. అరఁటిచెట్టు గాలిసోఁకఁగా భయంపడునా? అట్లే సీతయు భయంపడినట్లు నటించినని యీయనుమానమే మనకుఁ దెలుపుచున్నది. కావున నిదియంతయు నటించుటయే గాని వాస్తవము కాదని మన మెఱుంగవలయును. ఇఁకఁ దరువాతివృత్తాంతమును బఠింతము.

### రావణుఁడు నిజరూపమును జూపి తన్ను వరింపుమన సీత నిందించుట.

* సీతావాక్యముల నాలకించి రావణుఁడు క్రుద్ధుఁడై పరుషవాక్యముల నిట్లు పలికెను. కుబేరుఁడు నాయన్న. దశకంధరుఁడను. రావణుఁడని నన్నందఱు పిలుతురు. ఎల్లరు

* ఇది నలువదెనిమిదవసర్గమునఁ గలది.

నన్నుఁ గాంచి భయంపడుదురు. ఒకకారణమున నాసవతితల్లి కుమారుఁ డగుకుబేరునకు నాకుఁ బగకల్గెను. నేనాతని జయించితిని. ఆతఁడు కైలాసపర్వతమున నున్నాఁడు. నేనిపు డాకాశమునఁ దిరుగుచున్నవిమానము కుబేరునిపుష్పకమే. నాకుఁ గోపము కలిగెనా యింద్రాదులు భయంపడి పాఱిపోవుదురు. వాయువు నేనుండుతావులఁ జల్లఁగా వీఁచును. సూర్యుఁడు లక్ష్మే యని తలంపుము. తుదకుఁ జెట్లయాకులు గూడ నన్నుంగాంచినఁ గదలవు. సముద్రాంతరమునఁ ద్రికూటాద్రిపయి నుండులంకపట్టణవర్యము. దానికోటలు వర్ణనాతీతములు. సకలసంపదలనది విలసిల్లుచుండును. జానకీ! నీవందు వసింతువేని మనుష్యాంగనల నించుకయు స్మరింపకుందువు. అందు నీవు దివ్యభోగముల నన్నుంగూడి యనుభవింతువేని మానవుఁడై యల్పాయుర్దాయము గలరాము నెంతమాత్రము తలంపవు. దశరథుఁడు ప్రియకుమారుని భరతునిరాజ్యమున నిలుపుకొని జ్యేష్ఠుఁ డగురాము నడవులకుఁ బంపినాఁడు. అట్టిరాముఁ డెక్కడ? నే నెక్కడ? అట్లు రాజ్యభ్రష్టుఁడై యడవిపాలై పరాక్రమాదులులేని రామునిం గూడి నీవేమి చేయఁగలవు? నేను రాక్షసరాజను. నీవై నన్నుఁ గోరవలసియుండ నేనే మన్మథశరపీడితుఁడనై వచ్చి ప్రార్థింపఁగా నిరాకరించుట నీకుఁ దగదు. రామునకు భయంపడి నన్ను నిరాకరించినను పొలుత నిరాకరించి మరల నూర్వశి పురూరవుని గోరినట్లు నీవు పశ్చాత్తప్తురాలవు కాఁగలవు. వరవర్ణినీ! కేవల మానవమాత్రుఁ డా రాముఁడు. రణమున నాకు సాటియా? కనుక నతనికి నీవు భయంపడవలదు. నీభాగ్యవశమున నేను లభించితిని. నన్నంగీకరింపుము.

అని రావణుఁడు పలుకఁగా విని క్రోధాతిరేకమునఁ గన్నులెఱ్ఱకాఁగా మహాసాధ్వి కావున నించుకంతయును జంకక కఱకుమాటల నతని కిట్లు బదులుచెప్పెను. భువనారాధ్యుఁడగు కుబేరుఁడు నాకు నన్నయని చెప్పుకొను నీ వెట్టిపాపమునకు ఁ గట్టితివి? రావణా! నీవి ట్లింద్రియలోలుఁడ వగుట చిత్రము. ఇట్టి నీవు ప్రభువుగానుండు రాక్షసులు సత్యముగా నశింతురు. శచీదేవిని జెనకిన్నైనఁ బ్రాణముల నిలుపుకొనవచ్చును. కాని శ్రీరామపత్ని నన్నపహరించితివేని ప్రాణము లుండవుసుమీ! ఇంద్రునివజ్రాయుధనిహతుల కోర్వవచ్చుఁగాని నాయట్టిపతివ్రత నవమానించి అమృతమును బానముచేసియు మృతి నొందక బ్రదుకుట దుర్లభము సుమా! యని పలికెను.

మహాశయులారా! ఈభాగమును నిపుణముగాఁ బరిశీలింపవలయు. సీతావాక్యములయందలి విశేషార్థము రావణుని పలుకులఁ గలయంతరర్థము తెలిసికొనవలయును.

"భ్రాతా వైశ్రవణస్యాహం సాపత్న్యో వరవర్ణిని,
రావణో నామ భద్రం తే దశగ్రీవః ప్రతాపవాన్."

అని మూలము. కుబేరునకు నేఁ దమ్ముఁడను. మాఱుతల్లి కొడుకను. తండ్రి యిరువుర కొక్కఁడే. రావణుఁడని నన్నందురు. పదితలలు గలవాఁడను. జానకీ! నీకు భద్రమగుఁగాక. ఇదేల? శ్లోకము కుదురక మహర్షి చేర్చెననవచ్చునా? అట్లనుట మహాపరాధము కదా. కుబేరునిప్రస్తావ మిపుడేల? దాని విమర్శింతము. సీతాదేవి రావణునెదుట నున్నది. రావణుఁడు దేవీభక్తుఁడు. తనయుపాసన మంబమది కెక్కెనో లేదో యని సంశయించి భగవతీభక్తులలోఁ బరిగణింపఁబడుచు

ఖ్యాతివహించిన కుబేరునిపేరు దెల్పి వానితమ్ముఁడ నేనే నని తెలుపుకొనియెను. ప్రమాణములఁ జూడుఁడు.

"తల్లోకపూర్వభాగస్థే యక్షలోకే మహాద్యుతిః. ౭౯
యక్షేంద్రో వసతి శ్రీమాన్ తద్ద్వారద్వంద్వమధ్యగః,
నిధిభిశ్చ నవాకారైర్వృద్ధివృద్ధ్యాదిశక్తిభిః. ౮౦
సహితో లలితాభక్తాన్ పూరయన్ ధనసంపదా,
యక్షీభిశ్చ మనోజ్ఞాభిరనుకూలప్రవృత్తిభిః. ౮౧
వివిధైర్మధుభేదైశ్చ సంపూజయతి చక్రిణీం,
మాణిభద్రః పూర్ణభద్రో మణిమాన్ మణికంధరః. ౮౨
ఇత్యేవమాదయో యక్షసేనాన్యస్తత్ర సంతి వై."

లలితోపాఖ్యానము, 32-అధ్యాయము.

శ్రీచక్రమునందు ముక్తాసాలనీలమణిసాలాంతరమున నింద్రాది లోకపాలకు లుందురు. వారు భగవతీసేవకులు. సర్వదా పరమేశ్వరీభక్తులకు నర్థారితి వరము లొసంగుచుండువారు. కాననే రావణుఁ డాకుబేరునితమ్ముఁడ నని తెల్పుకొనుచున్నాఁడు. అట్టి నీభద్రుఁడను. నీకు మేలు గలుగుఁ గాక. నేను భక్తుఁడనని నమ్మవలయు. నాపూజవలన నీకు మేలుగలుగును. అనఁగా లోకమున ఖ్యాతిగలుగును. నామేలుకోరినదేవతవు కాన నను గ్రహించుమని భావము సూచింపఁబడియెడిని.

"యస్య తత్పుష్పకం నామ విమానం కామగం శుభం,
వీర్యాదేవార్జితం భద్రే! యేన యామి విహాయసం." ౯

అని మూలము. సామాన్యార్థము స్పష్టము. కుబేరుని జయించి పుష్పకమును సంపాదించితిని. ఇష్టానుసార మదిపోవుదును.

మంగళస్వరూపిణీ! దానినెక్కియే తిరుగుచున్నాను. అను నీ
వాగ్ధోరణింబట్టి భావిపుష్పకారూఢులై మీరు విహరింతురను
నర్థము సూచింపఁబడుచున్నది. భద్రసౌమ్యప్రభృతిశబ్దములు
మర్యాదనే తెలుపునవికాని కామాతిరేకమును దెలుపునవి
కావు. "ఓ కల్యాణీ! లంకను విజయంచేసి నావాంఛితమును
దీర్చి నామూలమునఁ గృతార్థులు కాఁదగినవారినెల్ల ధన్యుల
నుగా నొనరించి పుష్పకమెక్కి పయనముచేయుదుమా?" అను
రావణునాశయ మిట సంగ్రహముగాఁ జెప్పఁబడినది.

"తత్ర త్వం వసతీ సీతే రాజపుత్రి మయా సహ,
న స్మరిష్యసి నారీణాం మానుషీణాం మనస్వినీ. ౧౩
భుంజానా మానుషాన్ భోగాన్ దివ్యాంశ్చ వరవర్ణిని,
న స్మరిష్యసి రామస్య మానుషస్య గతాయుషః." ౧౪

అని మూలము. విశేషార్థమును దెలిసికొందము. తత్ర వసతీ
త్వం=ఆ లంకానగరముననుండు నీవు, మయా = నాచే నర్పింపఁ
బడు, మానుషాన్ దివ్యాంశ్చ భోగాన్=మానవసుఖదివ్యసుఖ
ములను, భుంజానా = అనుభవించుచున్నదై, మానుషీణాం
నారీణాం = మనుష్యకాంతలను, (ద్వితీయార్థమున షష్ఠి) న
స్మరిష్యసి = స్మరింపవు. మానుషస్య = నరరూపము నవతరించి
నట్టియు, గతాయుషః = పదునొకండువేలయేండ్ల యాయుస్సు
గల్గిన, రామస్య = భగవంతుని సంబంధుల మగువమ్ము, స్మరి
ష్యసి = తలంతువు. మానవలోకమునఁ గలభక్తులలో నుత్త
ముల మగువమ్ము మాసేవామూలమున నెఱింగి తక్కిన
భక్తులను స్మరింపకయే యుందువు. శ్రీరాముఁడు పదునొకండు
వేలవత్సరములు భూమి నరరూపమున నుండి సంచరించిన

వాఁడు. అంతకాలము మానవకాంతలు నిన్నారాధింతురు. కొలఁదిదినములు మాలంకలో నివసించి మమ్ము ధన్యులనుగాఁ జేసి పుష్పకవిమానము నారోహించి దయచేయుమా యని రావణుఁడు ప్రార్థించెనని యెఱుంగందగు.

"స్థాపయిత్వా ప్రియం పుత్త్రం రాజ్ఞా దశరథేన యః,
మందవీర్యస్సుతో జ్యేష్ఠస్తతః ప్రస్థాపితో హ్యయం. ౧౫
తేన కిం భ్రష్టరాజ్యేన రామేణ గతచేతసా,
కరిష్యసి విశాలాక్షి తాపసేన తపస్వినా. ౧౬
సర్వరాక్షసభర్తారం కామాత్స్వయమిహాగతం,
న మన్మథశరావిష్టం ప్రత్యాఖ్యాతుం త్వమర్హసి. ౧౭
ప్రత్యాఖ్యాయ హి మాం భీరు పరితాపం గమిష్యసి,
చరణేనాభిహత్యేవ పురూరవసమూర్వశీ. ౧౮
అంగుళ్యా న సమో రామో మమ యుద్ధే స మానుషః,
తవ భాగ్యేన సంప్రాప్తం భజస్వ వరవర్ణిని." ౧౯

అని మూలము. వరుసగా నొకొక్కశ్లోకమునకు నర్థవిశేషములం బరిశీలింపుఁడు. మందవీర్యః = ముదుసలితనముచే వీర్యహీనుఁడై, "స్థాపయిత్వా అప్రియం పుత్త్రం" అని పదవిభాగము. ప్రియుఁడు కాకున్నను విధిలేక భరతుని రాజ్యమునందు, రాజ్ఞా= అంతర్యామివగు నీచేతఁ బురికొలుపఁబడినవాఁడైన దశరథుని చేత, జ్యేష్ఠస్సుతః=సర్వేశ్వరుఁడగు భగవంతుఁడు సర్వక్రూర రాక్షసాదిసంహారముకొఱకు, ప్రస్థాపితః = అడవికిఁ బంపఁబడి యెను. దశరథుఁడు భరతుని రాజ్యమునం దుంచుట కిష్టపడక పోయినను భగవతివగు నీవు ప్రోత్సహింపఁగా సర్వదుష్టరాక్షసుల నిర్మూలించుటకై దండకారణ్యములకుఁ బంపఁబడినవాఁడు

రాముఁడని రావణునాశయము. మారీచుఁ డిపించుమే యుప దేశించెను గదా. రావణుఁడు చిరకాలముగాఁ దనవిముక్తికై ప్రయత్నించుచున్నవాఁ డనుట ఉత్తరకాండము తెలుపును.

భ్రష్టరాజ్యేన = శత్రురాజ్యములఁ బాడుచేయునట్టి, గతచేతసా=మాయోపాధిమూలమున సిద్ధించిన శ్రీరామమూర్తి కంతఃకరణము కలుగదు కావున నంతఃకరణము లేని వాఁడు. ఈ యర్థమునందు "న తస్య కార్యం కరణం చ విద్యతే" అను శ్రుతి ప్రమాణము. తాపసేన=తాపసులకుఁ బ్రభునగు, తపస్వినా=తపోవేషము నూనినరామునితో, సహా=కూడ, త్వం= నీవు (నా యీ విజ్ఞాపనమును), కరిష్యసి కం= చేయుదువా? అనఁగా

"మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే స చరాచరమ్."

అను భగవద్వాక్యము ననుసరించి నిర్గుణునిసాన్నిధ్యమున నీవే కదా సృష్టిస్థితిసంహారముల నొనరించుచున్నావు. అట్టి సీతా జానకీ! నాయీ ప్రార్థనమును జెల్లింపుమా యని రావణుఁడు వేఁడెను. నిన్నాశ్రయించిన నన్ను ధన్యుంగాఁ జేయుమా యనియే యిందుఁ గలసారము. "సర్వరాక్షసభర్తారం కామా త్స్వయ మిహాగతం, మాం మన్మథశరావిష్టం ప్రతి ఆఖ్యాతుం నార్హసి." ఇందుఁ జెప్పఁబడిన కామము చతుర్విధపురుషార్థ ములలోనిదని యెఱుంగవలయు. నీకు భృత్యుఁడ నయ్యెదనను నదియే ఆకామము. సకలరాక్షసప్రభుఁడనై నాయంతట నే వచ్చిన నన్నుఁ గామార్తునింబోలె నీవు (నాకిష్టదేవతవు) చెప్పఁ దగదు. నాయీవాంఛిత మీడేర్పవలయునని రావణునిహృద

యము. పూర్వము కాముఁడగు పురూరవసుని ఉర్వశి పాద ప్రహారమున నదలించి పశ్చాత్తాపము నొందెననుట న్యాయ్యమే. నిష్కాముఁడను, నీపాదభక్తుఁడ నగు నన్నుఁ దల్లివగు నీవు దిరస్కరించి పరితాపమొందుదువనుట యుక్తము కాదు. శ్రీరాముని వదలియుండఁ జాలననుజానకిని బ్రార్థించుచున్నవాఁడు. ఎట్లనఁగా; "యుద్ధే యస్య అంగుళ్యా సమో నాస్తి, యస్సరామః మానుషః తం మమ భాగ్యేన సంప్రాప్తం భజస్వ." అని యన్వయము. ఏ శ్రీమన్నారాయణమూర్తి మనుష్యలోకమున నవతరించెనో ఆభగవంతుని వ్రేలికి సమానుఁడెవ్వఁడు లేఁడు. ఆశ్రీరాముఁడు నాయదృష్టవశమున లంకకు రాఁగా నామహాత్ముని సేవింపుము. అనఁగా నోజానకీ! నీవు లంకకు రాఁగా నీకారణమున లంక కాశ్రీరాముఁ డరుదెంచును. అంతట నాకార్యములు ఫలించును. ఆమహాత్ము ననుసరింపుమా యని తనయాశయమును దెలిపెనని భావము.

"అవశ్యం వినశిష్యంతి సర్వే రావణ రాక్షసాః,
యేషాం త్వం కర్కశో రాజా దుర్బుద్ధిరజితేంద్రియః." ౨౨

అని మూలము. రావణునాశయ మెఱిఁగినసీత లోకదృష్టిచే నెఱుంగందగినట్లు పలుకుచు స్వాభిప్రాయమును గూఢముగఁ బలుకుచున్నది. రావణ! నీవంటి దుర్బుద్ధి నగురాజునకు వశంగతు లగురాక్షసులు మృతినొందుదురు. ఏల? జితేంద్రియుఁడవు కావు. నీమూలముననే దుష్టరాక్షసులు నాశమందుదురు. నీవు కూడనని యర్థము ధ్వనించును. అనఁగా సర్వరాక్షసులఁ దొలుతఁ జంపి పిదప నిన్నుంగూడ శ్రీరాముఁడు వధించునని భావము.

> ఇంద్రియాణాం జయే యోగం సమాతిష్ఠేద్దివానిశం,
> జితేంద్రియో హి శక్నోతి వశే స్థాపయితుం ప్రజాః.”    ౪౪
>
> మను, ౭-అధ్యాయము.

అను నీమనుస్మృతియు నీరామాయణార్థమునే తెలుపుచున్నది. స్మృతులసారమంతయు నీరామాయణమునం దిమిడియే యున్నది.

> “అపహృత్య శచీం భార్యాం శక్యమింద్రస్య జీవితుం,
> న చ రామస్య భార్యాం మామపనీయాస్తి జీవితం.    ౨౩
> జీవేచ్చిరం వజ్రధరస్య హస్తాచ్ఛచీం ప్రధృష్యాప్రతిరూపరూపాం,
> న మాదృశీం రాక్షస దూషయిత్వా పీతామృతస్యాపి తవాస్తి మోక్షః.

అని మూలము. సీతాదేవి స్వాభిప్రాయమును ఆవిష్కారముగను దేటపఱచుచున్నది. ఇంద్రునిభార్య నపహరించినయెడల బ్రదుక వచ్చు. శ్రీరాముని తేజస్సువంటి యుజ్జ్వలమగు మహాలక్ష్మి నపహరించి జీవింప ననకాశము కలుగదు చెప్పుచున్నది. రావణా! ఇది శ్రీరాముని తేజస్సు. అనఁగా భగవంతునికి శోభయైనది భగవతి. అట్టి నన్నపహరించిన నీకు నీవనుకొనినట్లు జీవితము లేదు. అనఁగా బ్రదుకవు. శచీదేవి మహాపతివ్రత. ఇంద్రుని జయించి యతని చెఱఁబెట్టినపుడేల మహాకాముఁడగు రావణుఁడు శచీదేవిని బలవంతముగాఁ దీసికొనిరాలేదు? అనఁగా ఇంద్రునికంటె బలవద్విరోధి లేఁడుకదా. ఏల యతనిభార్యను అపహరింపలేదో. దీనింబట్టియే సీతాపహరణము స్వస్మృతికొఱకేయని స్పష్టమగును. ఆభావము నెఱింగియే సీత నీకిక బ్రదుకు లేదని తెల్పెను. మరల నీవిషయమునే జానకి స్పష్టము చేయుచున్నది

ఇంద్రునినుండి తత్పత్నిని నెడఁబాపి కొంతకాలముజీవించినను జీవింపవచ్చును. కాని నావంటిదాని ననఁగా శ్రీరామప్రకృతి నపహరించి నీవమృతపానముచేసినను మోక్షములేదు. రావణా! నన్నపహరింతువు. మృతినొందుదువు. కాని నీకు మోక్షములేదు. ఏల యనఁగా నీ కింకొకజన్మము కలదు. ఇది రెండవజన్మము కదా. మూఁడవజన్మమునఁగాని ముక్తి దొరకదు. నాయారాధనమున ముక్తి దొరకునని యూహించుచున్నావేమో. అది యుళక్కి. వేఱొకజన్మమున నది నీకుఁ గల్గింతునని సీతాభావము. ఇట్టు లీభాగమున నర్థమును మనము గ్రహించిననే శ్రీసీతారాములమహత్త్వము తేటపడును. దాన మనకు భక్తి నిలుకడఁగాంచును. అదియే మనకుఁ దరణోపాయమును బ్రసాదించును. ఈభాగమునందు నధ్యాత్మరామాయణమున విశేషమేదియు లేదు. ఈయర్థమే సంగ్రహముగ నందును జెప్పఁబడినది. తరువాతివృత్తాంతమును బరికింతము.

## సీతాపహరణము.

* రావణుఁ డాజానకీవాక్యముల నాలకించి కోపమున హస్తముపై హస్తమునుగొట్టి భయకృద్రూపమును ధరించెను. మఱింతకఠినముగా నిట్లు పలికెను. వెఱ్ఱిదానా! నాబలపరాక్రమముల నెఱుంగవు. ఆకసమున నిలిచి రెండుచేతులతో నీభూమి నెత్తుదు. సముద్రజలమును ద్రావి నిశ్శేషము గావింతు. మృత్యువును జంపుదును. ఎన్నియని వినిపింతును?

* ఇయ్యది నలువదితొమ్మిదవసర్గమునఁ గలదు.

వెఱ్ఱిదానవు. నావార్త నీవెఱుంగవు. కామరూపము గలవాఁ
డను. ఏమి కోరినను వానినెల్ల నిచ్చువాఁడను. నీకుం దగిన
వాఁడను. నాయాకారమును విలోకింపుమా. అని కన్నులగ్ని
గోళములవలెఁ గాఁగా సౌమ్యమగు నారూపమును వదలి
యమునివంటి భయదరూపమును ధరించెను. దాని కనురూప
ముగా నాయుధాదులుండెను. ఆరూపమున నా క్రూరనిష్ఠుల
నాపతివ్రతారత్నమును బరికించి యీనారూపమును గాంచి
యైన నన్నుఁ జేపట్టునేమో యను తలంపున నిలుచుండెను.
మరల నాజానకింగని యిట్లు పలికెను. జానకీ! త్రిలోకవిఖ్యా
తుఁడగు పతి కావలయునని కోరుచుంటివేని నన్నుఁ గైకొనుము.
నీకుందగినవాఁడను నేను. చాలకాలమునకు నీకుఁ దగినవాఁ
డను నేను దొరకితిని. కావున నన్నంగీకరింపుము. ఎప్పుడు
గాని నీకప్రియమగు కార్యమును జేయను. మనుష్యుఁడగు
రామునిపై మనస్సు వదలి నాయందు స్నేహము నునుపుము.
సీతా! నీకేదియుఁ దెలియదు. కాని సర్వము తెలిసినదానవని
నీవే యనుకొనుచున్నదానవు. ఒక స్త్రీవాక్యమునకై సమృద్ధ
రాజ్యమును వదలి సుహృత్తుల నెడఁబాసి క్రూరమృగసంకీర్ణ
మగు నీమహాటవిం దిరుగుచున్నాఁడు కదా. రాజ్యభ్రష్టుఁడై
యేకార్యము చేయక యల్పాయుష్కుఁడయి యున్న యా
రామునియందు నేమంచితన మున్నదని ప్రీతిగలదానవుగ
నున్నావు? అని పలికి దుష్టాత్ముఁడు కావున దగ్గఱకుఁ బోయి
బుధగ్రహ మాకాశమునఁ జరించు రోహిణిం బట్టునట్లు తానా
సీతను బట్టుకొనెను. పూర్వమునఁగల శాపమువలన నామె
దేహము తనకుఁ దగులకుండునట్లుగా వామకరమున నామె

శిరోజలములను, దక్షిణహస్తమున నూరువులను బట్టుకొనెను. మృత్యువువలె భయంకరుఁడై మహాద్రిభంగిఁ గనఁబడుచు భయదదంష్ట్రలు మెఱయఁగానుండు నారావణుఁడాసీతను బట్టుకొనుచుండఁగాఁ గాంచి దేవతలు భయంపడి పాఱి పోయిరి. అంతర్ధానము లోనగువానికిందగిన యాతని యరదమంతకు మున్ను కనఁబడకయుండి యంతటఁ గనఁబడియెను. వాఁడంతఁ గఠినవాక్కుల నామెను బెదరించుచుఁ దన యరదముపైఁ గూరుచుండఁబెట్టెను.

పాతివ్రత్యమున మిక్కిలి విఖ్యాతిగాంచిన యాజానకి యట్లు పట్టుపడి దూరాటవినున్న శ్రీరామునిగూర్చి శ్రీరామా యని పేర్కొని యెంతయు విలపించెను. తన్నెంతమాత్రము నంగీకరింపని యాసీతను బొరలాడి దాని నెట్లో రథముపైఁ జేర్చి పయనము సాగించెను. తన్నపహరించుకొని యాకసమునఁ బోవుచుండఁగా నాజానకి మిక్కిలి యార్తయై మత్తుగొన్న యట్లు మనశ్చాంచల్యము గల్గినట్లు గట్టిగా నేడ్చెను. హా లక్ష్మణా! ఖరాసురుని వధముంబట్టి రాక్షసుఁడు కుపితుఁడై నన్నిపు డెత్తుకొని పోవుచున్నాఁడని యిపుడు నీకుఁ దెలియదు కదా. రఘువంశోద్ధారకా! శ్రీరామా! ఆశ్రితరక్షణము నీధర్మము. దానికై యితరులకొఱకుఁ బ్రాణముల నర్పింతువు. ఇట్టి నీవు నిన్నే యాశ్రయించిన నన్ను నొక్కదురాత్ముఁడు కొనిపోవుచుండఁ జూడకున్నావే. దుర్జన శిక్షకుఁడవు కదా నీవు. వీనినేల శిక్షింపవు? శిక్ష వెంటనే కలుగదు. ఓదురాత్ముఁడా! ఈచెడుపని చేసినయెడల నీపాపకర్మమునకు ఫలము తోడనే కనఁబడదు. పైరు వెంటనే ఫలింపదు కదా. కాలము

రాఁగా నది ఫలించును. అట్లే యీపాపము ఫలించుటకుఁ గాలము కారణమైయున్నది. అకాలము రావలయును. దుర్జనుఁడవగు నీవు కాలవశమున మతిచెడఁగా నీదుష్కార్యము నొనరించితివి. దీనికి ఫలము నీకుఁ బ్రాణాంతకరమగు నాపద రామమూర్తివలన రాఁగలదు. కీర్తిమంతుఁడగు శ్రీరామునిపత్నినగు నన్ను నక్కటా! యీరాక్షసుఁడు దొంగిలించుకొని పోవుచున్నాఁడే. కనుక నిత్తఱి మాయత్తకైకయుఁ దద్బంధువులును సంతోషింతురు గాక. జనస్థానమునఁ జక్కఁగాఁ బూచిన యోకొండగోఁగు వృక్షములారా! మిమ్ముఁ బ్రార్థించుచున్నదానను. ఈవార్త త్వరగా శ్రీరామునకుఁ దెలుపుఁడు. ఓప్రస్రవణపర్వతమా! నీకిదే నమనము. నాయీయాపద శీఘ్రము శ్రీరామున కెఱిఁగింపుము. హంసనాదములుగల గోదావరీ! నిను నమస్కరించెదను. రావణుని యీదుష్కార్యమును రామున కెఱిఁగింపుము. వనదేవతలారా! మీకందఱకును మ్రొక్కెద. నాదుకష్టము దీనిని నాప్రాణనాథునకుఁ దెలుపుఁడు. సమస్తజంతువులారా! పక్షులారా! మిమ్ము శరణుచొత్తును. సీత వనవాసమున రావణునిచే నపహరింపఁబడినదని రామునికడ కఱిగి తెలుపుదురు గాక. నేను స్వర్గమున నున్నను, యముఁడు పిలుచుకొని పోయిన, నామహాబాహుఁడు శ్రీరామచంద్రుఁడు శౌర్యమున నన్నుఁ దెచ్చుకొనును. అని గట్టిగా ధ్వనిచేసెను. జాలి గలిగించుచు నేడ్చుచుఁ బోవుచుండఁగా సందొక భూరుహామున జటాయువు కనఁబడెను. సీత మాటలు వినఁబడుచుండఁగా వగ వెల్లువ నోయని పేర్కొని ఆర్యా! జటాయూ!

నన్నుఁ జూడుమా. అనాథంబోలె నన్నీ పాపకర్ముఁడు కొని పోవుచున్నాఁడే. వీఁడు శూరుఁడు. సాయుధుఁడు. వీని నడ్డగింప శక్యముకాదు. నీవింకేమియుఁ జేయవలదు. ఆర్యా! పక్షివర్యా! నాయీవార్తను యథాతత్త్వముగా శ్రీరామలక్ష్మణులకుఁ దప్పక తెల్పుమా అని గట్టిగాఁ జెప్పెను.

మహాత్ములారా! ఈభాగమును బరికింతము. సీత లోకాచారము ననుసరించి దైన్యమును వెలిపుచ్చుచున్నది. కాని తన పలుకులయందు సత్యవార్త నందంపుఁ బ్రాజ్ఞులకుఁ గనఁబడఁ జేయుచున్నది. ఆలకింపుఁడు.

> "సీతాయా వచనం శ్రుత్వా దశగ్రీవః ప్రతాపవాన్,
> హస్తే హస్తం సమారోప్య చకార సుమహద్వపుః." ౧

అని మూలము. హస్తముపై హస్తమును గొట్టుట యేటికనఁగా: "అయం చ కోపాకృతివిశేషః" అని గోవిందరాజులు.

> "మహాపుణ్యస్య పరమభాగవతాగ్రగణ్యస్య శ్రీహనుమతోఽపి రూపాంతరస్వీకరణసమయే ఆగ్రహపూర్వకత్వస్య శ్రూయమాణత్వేన ఆగ్రహం వినా క్రూరరూపస్వీకారాయోగాద్రావణోఽపి దేవీనికటే కపటమనుచితమితి మత్వా దేవ్యై స్వరూపం దర్శయితుం స్వసామర్థ్యప్రశంసాపూర్వకం నిజరూపం స్వీకరోతి"

అని మహేశ్వరతీర్థులును వ్రాసిరి. ఇప్పటి రావణునిరూపము శాంతస్థానము. నైజరూపము రజస్తమోగుణఫలము లగు నహంకారాజ్ఞానములకు నిలయము. భిక్షురూపము నిజముఁ గానేరాదు. అది సమదర్శనమునకు నాస్పదము. రావణున కిప్పుడు కావలసినది శాపలబ్ధదేహనాశము కదా. కావున నట్టి దేహము

రాకకు నాగ్రహమూనెను. చేతిపైఁ జేతిని గొట్టుట పౌరుష
ద్యోతకము. పౌరుషము క్రోధమూలము.

"ధ్యాయతో విషయాన్ పుంసస్సంగస్తేషూపజాయతే,
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే. 62
క్రోధాద్భవతి సమ్మోహస్సమ్మోహాత్స్మృతివిభ్రమః,
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి. 63

అను గీతాశాస్త్రము ననుసరించి చెడుగులకు మూలము క్రోధ
మని యేర్పడును. రావణుఁడు జ్ఞాని కదా. ఆతఁడేల సురూప
ముననే దేవిని బిలుచుకొని పోవరాదు? ఈ క్రూరరూప
ధారణమేల? అని ప్రశ్నింతురేమో. శాంతమూని వినుఁడు.
లోకులకు సన్మార్గమును బోధించుటకే యీ మహాకావ్యమును
వ్రాయఁబూనినది. కవిత్వప్రసిద్ధిం గోరి కాదు. ఇదియొక
నాటక మనుకొనుఁడు. ఇరుదెగలవారును వేషధారులే. అం
దొకపక్షము న్యాయ్యము. వేఱొక్కపక్ష మన్యాయ్యముగా
నుండినఁగాని న్యాయపక్షము జయించునని రెండవది నశించు
నని లోకులకు నందును పామరులకుఁ దెలియదు. ప్రాజ్ఞులకిది
యక్కఱలేదు. దుష్కార్యము లొనరించినట్లొకపక్షమునఁగల
వేషధారులు నటించినఁగాని రెండవపక్షమువారిన్యాయము
విజయమందినట్లు తోఁపదు. అధర్మపక్షము నశించినట్లు గూడఁ
దోఁపదు. ఇవి రెండును వలయునని భగవంతుఁడు చేయించు
నవియే. కావున మహాభక్తుఁడు సకలవేదవేదాంగపారగుఁ
డగురావణుఁడు భగవదుద్దేశనిర్వహణార్థ మట్లు ప్రవర్తించె
నని మనము తలంచిననే కాని సారము తెలియదు. ఇందలి
రహస్యమేది? ఐంద్రజాలికుఁడు తాఁజేయఁబోవు కార్యమునకు

ముందొక మాట చెప్పి యొక సంజ్ఞచూపును. ఆరెండు లేక యున్నఁ బనిసాగదని యతని యూహ. పనిసాగుటకు నీరెండిం టికి సంబంధమే లేదు. కాని యిది ప్రాచీనమగు నాచారము.

"లలనా! యీయెలనాఁగఁ బెండ్లియగు వాంఛాయత్తు చేదిక్ష్మా
తలనాథుం డిది నమ్మవేని నిజమంత్రప్రౌఢి రప్పింతు నా
నలనాసత్యసమానుఁ జూడుమని పంతంబొప్ప మాయాజపా
కలనాదంభము గూని మాని దిశ లాకర్షించి మణ్ణా యనన్."

అని వసుచరిత్రమునం దుదాహరణము కనంబడుచున్నది. ప్రత్యక్షముగా నెల్లరు చూడవచ్చును. ఆ యాచారము ననుసరించి మంత్రబలమున భిక్షురూపమును సపరికరముగాఁ గనఁబఱచిన రావణుఁడు దానిని వదలి రూపాంతరమును ధరింపవలయునన్న మరల నా యలవాటును జూపవలయును. దానిని బాటించుటకే హస్తముపై హస్తము గొట్టెను. మఱొక విధముగా సమాధానము చెప్పవచ్చును. ఏకోరికలు లేనిది భిక్షురూపము. తన పని కది సాధనము కాఁజాలదు. వీనికి వాంఛలు గలవు. కావున నావాంఛలు ఫలింపవలయు ననియే సీత నపహరింపఁబూనెను. ఆమెకు భయము గల్గింప వలసియున్నది. తాను క్రోధము తెచ్చుకొన్నఁగాని రూపము భీషణము కాదు. ఎంతటి శాంతునకుంగూడఁ గ్రోధసమావేశ సమయమున రూపము మార్పునొందును. అనఁగా మోము మొదలగునవి నైజవృత్తిని మాని వికారము నొందును. ఇది యందఱకుఁ దెలిసినవిషయమే. కాన నాతఁడు క్రోధమున హస్తద్వయతాడనము చేసెనని మన మూహింపవలయును.

"నోన్మత్తయా శ్రుతౌ మన్యే మమ వీర్యపరాక్రమౌ." ౨

అని మూలము. విశేషార్థమేమనఁగా. ఉన్మత్తప్రమత్తజనవిరుద్ధరాలవగు (నీచేత), శ్రుతావితి స మన్యే వీర్యపరాక్రమౌ. వీర్యమనఁగా సంగరమున భయము లేకుండుట. పరాక్రమమనఁగాఁ బగవారిని తిరస్కరించుశక్తి. ఈ రెండును నాకుఁ గలవని నీచే వినఁబడలేదని తలంచెదను. అని తన పౌరుష కార్యములను దెలిపి నన్ను "కామరూపిణముస్మత్తే పత్యే మాం కామదం పతిమ్." అని తెలిపెను. రక్కసులయెడఁ గోరినవాని నెల్ల నొసంగు నన్నుఁ జూడుమా యని వేఁడెను. ఇట్లన్వయించుట క్లిష్టము కాదా యని యడుగుదురేమో. ఉపనిషత్తులలోఁ గొన్ని వాక్యములకు "నాసికాయాః కేశాకర్షణాత్" అన్నట్లు భాష్యములు వ్రాసిరి కదా. అట్లే లోకులకు దురూహలు కలుగకయుండ విషయమును దెలుపుటకై చేయు కృషి న్యాయ్యమనియే పెద్దలిట్లన్వయించిరని మన మెఱుంగవలయు. ఇట్లు భావించిననే శ్రీరామాయణము సాధారణకావ్యములలోఁ జేరదనియుఁ, బరమపవిత్రగ్రంథమనియు, నిహపర సాధనమనియు మనకుఁ దోఁచును. లేకున్న భక్తి కుదురుటకు నిందుఁ జోటెద్ది? ఈలాటి యర్థముల కనకారాని మొసంగునది యుత్తరకాండమే యని తలంచి దానిం బఠించునపుడు శ్రద్ధ గలవారు కావలయును.

"రక్తాంబరధరస్తస్థౌ స్త్రీరత్నం ప్రేక్ష్య మైథిలీం,
స తామసితకేశాంతాం భాస్కరస్య ప్రభామివ. ౧౦
వసనాభరణోపేతాం మైథిలీం రావణోఽబ్రవీత్."

అని మూలము. మహాకవి వాల్మీకిమహర్షి యందందుఁ దత్త్వమును దేటపఱచుచుండును. రావణుఁడు నిజరూపమును దాల్చి

సీతను జూచెను. అని చెప్పుచు "భాస్కరస్య ప్రభామివ" అను వాక్య ముచ్చరించెను. దీని భావ మేమనఁగా సూర్యునిభార్య సంజ్ఞాదేవి. ఆమె యొకపుడు జనకునింటికిం బోవుచుఁ దన ఛాయనందు నిలిపి పోయెను. ఆమె ఛాయాదేవి యనఁబరఁగెను. ఆమె సత్యమున సంజ్ఞాదేవి కాదు కదా. అట్లే యీ సీతయు సీతాదేవిఛాయయే గాని సీత కాదనియు, నామె తేజోరూపమున నుండెననియు, భగవతికిఁ బరమేశ్వరునకు నవినాభావసంబంధముగల దనుట సర్వాంగీకృతమనియు నిందలి భావము. అట్టి మాయాజానకిం గాంచి రావణుఁ డిట్లు పలికెను.

"త్రిషు లోకేషు విఖ్యాతం యది భర్తారమిచ్ఛసి. ౧౧
మామాశ్రయ వరారోహే తవాహం సదృశః పతిః,
మాం భజస్వ చిరాయ త్వమహం శ్లాఘ్యః ప్రియస్తవ. ౧౨
నైవ చాహం క్వచిద్భద్రే కరిష్యే తవ విప్రియం,
త్యజ్యతాం మానుషో భావో మయి భావః ప్రణీయతాం. ౧౩
రాజ్యాచ్చ్యుతమసిద్ధార్థం రామం పరిమితాయుషం,
కైర్గుణైరనురక్తాసి మూఢే పండితమానిని. ౧౪
యస్స్త్రియా వచనాద్రాజ్యం విహాయ ససుహృజ్జనం,
అస్మిన్ వ్యాళానుచరితే వనే వసతి దుర్మతిః." ౧౫

అని మూలము. "భర్తారమ్. బిభర్తీతి భర్తా. భృత్య ఇత్యర్థః. పతిః రక్షస్వామితి శేషః." జానకీ! నేను రాక్షసులకుఁ బ్రభుఁడనై ననుసీకుఁదగిన భృత్యుఁడను. తగినసేవకుని గోరుదువేని ముల్లోకములయందుఁ బ్రసిద్ధ మగునట్లుగా నన్నంగీకరింపుము. ప్రియ

సేవకుఁడ నగుదును. "చిరాయ తవ శ్లాఘ్యః ప్రియః తవాహం
మా భజస్వ" అని యన్వయము. చాలకాలముగా నీ సేవా
లాభ నిమిత్తము కాచియున్న జయుఁడను ద్వారపాలకుఁడ
నగు నన్నంగీకరింపుము. మానుషే భావస్త్వజ్యతాం = మాన
వుఁడే రక్షింపఁదగినవాఁడన్న యాశయమును వదలుము.
మఱేమన్నఁ బూర్వానుగ్రహముచేత, మూఢే పండితమాని
న్యపి మయి రాక్షసే భృత్యే భావః ప్రణీయతామ్ = నీద్వార
మును గాచి యెంతోకాల ముండినవాఁడను గాన నప్పటి
కృపచేత నిపుడు మూఢుఁడను. పండితుఁడ నను దురభిమా
నము కలవాఁడను భృత్యుఁడనగు నేను రక్కసుఁడనైన నా
యందు నీ యాశయమునుపుము. నీఁవు నిక్కముగా రక్షింపఁ
దగినవాఁడన్న భావము నునుపుము. రాజ్యాచ్చ్యుతం=అనఁగా
రాజ్యభోగములేల యని వదలుకొన్నవాఁడని యర్థము.
అసిద్ధార్థమ్. అశ్చాసౌ సిద్ధార్థస్తం = సకలకామములు గల
వాఁడు. అని మహేశ్వరతీర్థులు. "యస్మాత్సిద్ధో నాస్తి సోఽసిద్ధః
సచాసావర్థశ్చ. తం. అసిద్ధార్థమ్" అనియు సమాసము చెప్ప
వచ్చును గదా. అపూర్వము లోనగు వానియందు నిట్టే కదా
సమాసము. అని మన మూహించినను బాధయేమియు లేదు.
పరిమితాయుషం. పరిగతం పరిత్యక్తం మితమల్ప మాయుర్యేన
తమ్ అపరిమితాయుష మిత్యర్థః=మితములేని యాయుస్సుగల
వాఁడనుట. కైర్గుణైః = అనిర్వచనీయగుణములచేతఁ గూడిన
వానియందును, రక్తాసి=అనురాగము కలదానవైతివి. దుర్మతిః
దుష్టేష్వపి మతిః అనుగ్రాహికా యస్య సః అతఏవాపి స్త్రియా
వచనాత్సుహృజ్జనం రాజ్యం విహాయ వనే వసతి. తాదృశం త్వ

మనురక్తాసి. యతః.అతస్సర్వోత్తమా లక్ష్మీస్త్వం అతఏవ మాం భృత్యత్వేనాంగీకుర్వితి తాత్పర్యం. దుర్మతి యనఁగా దుష్టుల యందుఁ గృపయునుచు బుద్ధిగలవాఁడు. అనఁగా శ్రీరాముఁడు సర్వజనులయందు దయగలవాఁడనుట. అట్టివాని నాశ్రయించిన నీవు మహాప్రకృతివి నన్ను భృత్యునిగా నంగీకరింపుమా యని రావణుఁడు ప్రార్థించె ననుభావమిందిమిడియున్నదని గ్రహింపవలయును. అట్టి కరుణాసముద్రుఁడు కనుకనే యొక యాఁడుదానిమాట విని ఘోరారణ్యములయందు రాముఁడున్నాఁడని రావణుఁడనియె ననునదియే యిటఁగల ప్రధానార్థము. ఈ యర్థమునే యీ క్రిందివాక్యము దృఢపఱచుచున్నది.

''ఇత్యుక్త్వా మైథిలీం వాక్యం ప్రియార్హాం ప్రియవాదినీం,
అభిగమ్య సుదుష్టాత్మా రాక్షసః కామమోహితః. ౧౬
జగ్రాహ రావణస్సీతాం బుధః ఖే రోహిణీమివ.''

అని మూలము. చంద్రుని ప్రియభార్య రోహిణి. బుధుఁడు చంద్రుని కుమారుఁడు. బుధుఁడాకాశమున రోహిణిని గ్రహించునట్లు రావణుఁడు సీతను గ్రహించెను. అనఁగా బుధుఁడు తనతల్లి నెట్లు పూజార్థము గ్రహించెనో యట్లే రావణుఁడును జానకిని త్రిలోకమాతయగు భగవతిని గ్రహించెను. దుష్టాత్ముఁడు కామమోహితుఁడైనను దద్దర్శనమాత్రమునఁ బరిశుద్ధభక్తియుక్తాంతరంగుఁడై యామెను గ్రహించెనని సారము. ఈయర్థము నంగీకరింపకున్న బుధుఁడు మాతృగమనము చేసెననుటకుఁ గథ పురాణాంతరములఁ జూపవలసియుండును గద. అట్టి ప్రసిద్ధి కలదా? ఇచ్చోఁ సియర్థమే

గ్రహింపఁదగినది. సనత్కుమారోపదేశమున కిదియే యను గుణము.

నలకూబరుఁడు రంభను బలాత్కారముగా గ్రహించిన పిదప రావణుని శపించెను. దానఁ దన్నంగీకరింపని కాంతలఁ బట్టరాదని రావణుఁ డెఱుంగును. సీత నెట్లు పట్టుకొనిపోయె నని ప్రశ్నింపవచ్చును. సమాధాన మేమనఁగా: రావణుఁడు జానకిని స్పృశింపలేదు. రక్కసులు ఛాయలను గ్రహించు శక్తిగలవారు. ఆ శక్తి నుపయోగించి జానకి శిరోజములయు నూరువులయు నీడలఁ బట్టి యామెను గొని పోయినాఁడు.

> "ఛాయాగ్రాహిత్వమప్యస్తి సర్వవిద్యావిశారదే,
> కేశచ్ఛాయాం పరామృశ్య జానుచ్ఛాయాం తథైవ చ,
> గృహీత్వా జానకీం హృష్ట్వా లంకాం ప్రాయాత్స రావణః.
> సీతాపహరణం చైవ యే శృణ్వంతి నరోత్తమాః.
> న తేషామశుభం దేవి భవిష్యతి కదాచన."

అని స్కాందమహాపురాణమునఁ గలదు. అని మహేశ్వర తీర్థులు వ్రాసిరి. రామాయణమునఁగల యీభాగమున నీ యర్థము నంగీకరింపకయున్నఁ బారాయణఫల మేమి? స్కాందమున నీభాగమును బఠించినవారల కశుభము కలుగ దని వ్రాయఁబడినది. ఒక్క పతివ్రతను మహాదుర్మతి బలవంతముగాఁ గొనిపోయిన గాథను బఠించిన మేలు గలుగునేని యింకఁ జెప్పవలసినదేమి? రావణుఁడు భక్తుఁడనియు, సీతాపహరణ మనునది కేవల వ్యాజమనియుఁ, బ్రకృతి పురుషులమూలమునఁ దనకు సద్గతి కలుగునని యతఁడు నమ్మె

ననియు, మన మంగీకరించిననే రామాయణశ్రవణపఠనఫలము కలుగును.

మఱొక్కవిషయము. సీత మహాసాధ్వి. శాపానుగ్రహ సమర్థురాలు. దమయంతి యడవిలోఁ దన్ను గామించిన యాటవికుని శపించి దహించెనని కథకలదు కదా. దమయంతిగ మహాలక్ష్మి యవతరించెనని ప్రమాణము కనఁబడదు. అట్టి పతివ్రత యా యాపత్కాలమున స్వమర్యాదా సంరక్షణము చేసికొనియెఁ గదా. భగవంతు నెడఁబాయని మహాదేవి సకల లోకజనయిత్రి మహాలక్ష్మి తన్నుఁ గామాంధకారమున నొడలెఱుంగక కొనిపోవుటకు వచ్చిన రావణుని దెలిసికొన్నప్పుడే అనఁగా యతిరూపమును మాని రావణుఁడుగాఁ గనఁబడినపుడే యేల సమీపమునకు రాకయుండ శపింపరాదు? భయముచే దేహము తెలియకయుండె ననుకొన నవకాశము లేదు. వృక్షములను వనదేవతలు లోనగువారిని శ్రీరామలక్ష్మణులను బేర్కొని తన దుర్గతిని దెలిపినట్లు రామాయణముననే కలదు. ఇపు డేమనవచ్చును? సీత పతివ్రత కాదనవచ్చునా? ఇచ్చోఁ సమాధాన మేమని? రావణుఁడు భక్తుఁడని గ్రహింపవలసినదే. సీతాపహరణమూలమునఁగాని భగవంతునిచే మృతి కలుగదని యతఁ డెఱింగెనని యొప్పుకొనవలసినదే. ఆ పక్షమున నందే నిలిచి శ్రీరామునితో యుద్ధముచేసి యేల చావ లేదను ప్రశ్నము వచ్చును. ఈ ప్రశ్నము కర్మసిద్ధాంత మెఱుంగనివారు చేయునదియే. తనతోడ ననఁగాఁ దనమూలమున మృతినొందవలసినవా రనేకులున్న వారని యతఁ డెఱుఁగును. తనమూలముననే శ్రీరామప్రఖ్యాతి యిల వెలయ

కామాతిరేకమున జానకిం బట్టుకొనిపోయెనన్నచో సీతా పాతివ్రత్య మేటఁ గలిసిపోవును. పోయిన నేమి నష్టమని యే యాస్తికుఁడు ననఁడని నా విశ్వాసము. కావున నీభాగముల నిట్లే వాస్తవార్థమును గ్రహించి రావణుఁడు కామోద్దీపక భాషణములు పల్కినతావులయందు లోకమోహనార్థము రాక్షసనాశార్థము నట్లు తెలిపెనని మన మెన్నవలయును. సీతయు శ్రీరామునిమూలమున సర్వదుష్టరాక్షస నాశము చేయనెంచి తన ఛాయారూపమున నట్లు నటించెనని మనము నమ్మి కథను బఠింపవలయును.

"తామకామాం స కామార్తః పన్నగేంద్రవధూమివ. ౨౨
వివేష్టమానామాదాయ ఉత్పపాతాథ రావణః."

అని మూలము. మహాకవి యిందు సీతాహృదయమును దెలుపుచున్నాఁడు. "అకామాం = అవిద్యమానః కామ అన్యస్మిన్ యస్యాస్సా"అని సమాసము. భగవంతునియందుఁ దప్ప నొరులయం దేవాంఛయు లేనిదని యర్థము. కోరఁదగినదే లేదని తాత్పర్యము. నేను ఛాయను. నన్ను వీఁడు కొనిపోవుచున్నాఁడే. ఎంతటి మూఢుఁడు? నన్నుఁ బరదేవియనియే భావించినాఁడు కదా. యని యా మాయాసీతతలంపని సారము. కామార్తః=కోరికచే నార్తుఁడు; అత్యంతాసక్తుఁడని యర్థము. పన్నగేంద్రవధూమివ = సర్పరాజసతివలె అనుటం జేసి యించుకే నపరాధ మొనర్చినను దగ్ధము చేయునది యని తాత్పర్యము. అట్టి యా మాయాసీతను మానవస్త్రీచర్యల నభినయించుచున్నదానిని గ్రహించి యాకాశమున కెగసెనని కథాసంవిధానము. తరువాతి సీతాప్రలాప మంతయు కేవల

నటనమే యని యెఱుంగవలయు. ఏల యందురేని లోకము తఱచు తత్త్వమెఱుంగఁ జాలదు కాన వారికి విశ్వాసము గల్గించుటకు, సాధ్వీగణ మాపత్కాలమున నేమి చేయఁదగునో దానిం దెల్పుటకు నని సమాధానము.

> "నను సద్యోఽవినీతస్య దృశ్యతే కర్మణః ఫలం. ౨౭
> కాలోఽప్యంగీభవత్యత్ర సస్యానామివ పక్తయే,
> సకర్మకృతవా నేతత్కాలోపహతచేతనః,
> జీవితాంతకరం ఘోరం రామాద్వ్యసనమాప్నుహి."

అని మూలము. మహాముని సందర్భానుసారముగా లోకులకుఁ గర్మఫలానుభవము తప్పదని తెలుపుచున్నాఁడు. సత్కర్మములకు ఫలము తోడనే కలుగదు. పైరు పెట్టగనే ఫలింపదు కదా. కర్మఫలము లనుభవించు కాలము రావలయును. ఏల యనఁగా: ననుభవించుచున్నవియుఁ గర్మఫలములే కదా. ప్రారబ్ధకర్మమనియే దానికిఁ బేరు. అని పూర్తిగ్గాను పిదపఁగదా నూత్నఫలానుభవమున కవకాశము కలుగును. ఇట్లనుటచే స్వకృతకర్మఫలములు తప్పక యనుభవింపవలయు ననుసిద్ధాంత మీభాగము సూచించుచున్నదని మన మెఱుంగవలయు.

> "హంతేదానీం సకామాస్తు కైకేయీ సహ బాంధవైః. ౨౮
> ప్రియే యద్ధర్మకామస్య ధర్మపత్నీ యశస్వినః."

అని మూలము. నన్ను రావణుఁడు కొనిపోవుచున్నందునఁ గైకయు నామె బంధువులు సంతోషింతురు గాక యనునది సామాన్యార్థసారము.విశేషార్థ మేమనఁగా వినుఁడు. "యత్ = యస్మాత్ కారణాత్, ధర్మకామస్య = ధర్మరక్షణమేన కామో యస్య తస్య, యశస్వినః = అభయదానాదిమహాదానసమార్జిత

ప్రఖ్యాతిమతః రామస్యేతి శేషః. ధర్మపత్నీ అహం ప్రియే.అత ఇతి శేషః. ఇదానీం ఏతద్వార్తాశ్రవణానంతరమిత్యర్థః. కైకేయీ = కేకయాత్మజా, బాంధవైస్సహ సకామాస్తు. హంత= సంభ్రమార్థేఽవ్యయః." అని మూలార్థము. దీనిం బట్టి సీతకుం గైకపైఁ గోపము లేశమైనను లేదని యూహ్యాము. నేను లంకకుం బోవుటయే మాయిరువురి యవతారఫలము. మాకత్యంతసహాయురాలు కైక. ఆమె తనప్రయత్నము లోకోపకార మగుట విని యానందించునని సీత తలంచుటలో నచ్చెరు వేది గలదు? ఈయాశయమే లేకున్న నీమహాపత్నమ యమున నాలుఁగు చీవాట్లుపెట్టక ధర్మకాముఁడు యశస్వి యనుస్తుతు లేల తోఁచును? మహాప్రకృతి ప్రతికృతి గావున నామె యథార్థమునే తెలిపెను. సామాన్యదృష్టిం బరికింప నది మఱొకరీతిగా నర్థమగును. వాస్తవమిదియే యని యెఱింగిననే సీతారాము లవతరించిరని తేటపడును. లేకున్న సామాన్య మానవులనియే స్పష్టమగును.

> "ఆమంత్రయే జనస్థానే కర్ణికారాన్ సుపుష్పితాన్. 3౧
> క్షిప్రం రామాయ శంసధ్వం సీతాం హరతి రావణః."

అని మూలము. ఈభాగము సీత మహాప్రకృతి యని బోధించుచున్నది. వృక్షాదు లంతస్సంజ్ఞావంతములే యైనను సామాన్యదృష్టి కది గోచరింపదు. ఈసమయమున సీత వానిం బేర్కొనుటచే నామె సామాన్యస్త్రీ యనియే తోఁచును. అట్లు కాక యామె పరదేవి యని మనము నమ్మితిమేని సర్వము తన్మయము కాన మీరెల్ల శ్రీరామమూర్తితో నాగమనవార్తం దెల్పుఁడు. ఫలించె మనకార్యమని తేటపఱుపుఁడని హెచ్చ

రించె ననునర్థము స్ఫురించును. దీనిచే మనసు భక్తి యా మహాదేవిపాదారవిందములయందుఁ గుదురును. అదియే కదా శ్రీరామాయణఫలము.

"వనస్పతిగతం గృధ్రం దదర్శాయతలోచనా,
సా తముద్వీక్ష్య సుశ్రోణీ రావణస్య వశం గతా. 38
సమాక్రందద్భయపరా దుఃఖోపహతయా గిరా,
జటాయో పశ్య మామార్య హ్రియమాణామనాథవత్. 39
అనేన రాక్షసేంద్రేణ కరుణం పాపకర్మణా,
నైవ వారయితుం శక్య స్తవ క్రూరో నిశాచరః. 40
సత్త్వవాన్ జితకాశీ చ సాయుధశ్చైవ దుర్మతిః,
రామాయ తు యథాతత్త్వం జటాయో హరణం మమ. 41
లక్ష్మణాయ చ తత్సర్వమాఖ్యాతవ్యమ శేషతః."

అని మూలము. అయ్యలారా! మునుపు వ్రాసిన యర్థమంతయు సుసంగతమే యని యీభాగము తెలుపును. విమర్శింతము. సీత యిపు డాకాశమునఁ బోవుచున్నది. దీనికి ముందుగల శ్లోకపాదమున "విలపంతీ సుదుఃఖితా" అని యున్నది. పక్షి యొక మహావృక్షమున నున్నది. రావణుఁ డాసమయమున మెల్లగాఁ బోవఁడు కదా. శ్రీరామునిశక్తి యెఱింగినవాఁడు గావుననే భయంపడి యీమోసము చేయుచుండెను. వాఁ డతివేగముగాఁ బోవుచుండును. అట్టిచోటికి నాపక్షి కనఁబడు టయుఁ గష్టమే. కనఁబడినను గట్టిగా వినఁబడునట్లు పలుకుట కవకాశము దొరకదు. ఒకప్పుడు గట్టిగా మాటలాడినను నాశబ్దము దూరముగా వినఁబడియుండును. ఆకాశమున నున్నందున నందుఁ బుట్టినధ్వని యెల్లతావుల వ్యాపించునను

పదార్థవిజ్ఞానశాస్త్రసిద్ధాంతము విదితమే కదా. కావున నిందలి వాస్తవార్థమేది యని పరిశీలించు టుత్తమము. జటాయువున కాయుశ్శేషము రవంత కలదు. తనమూలమున రావణునిచే దెబ్బ తినవలసిన కర్మ మాతఁ డొనరించి దాని ననుభవింప సిద్ధముగా నున్నాఁడు. శ్రీరామదర్శన స్పర్శనజనితభాగ్యము నకుఁ బాత్రుఁడు కావలసిన కర్మము నాతఁ డొనరించెను. ఆ రెండింటిఫల మాతనికిఁ గలుగవలసిన సమయ మాసన్నమైనది. సర్వజ్ఞురాలయి మహాప్రకృతియగు నాసీత యాతని నాహ్వానించెను. సర్వజ్ఞురాలు కావుననే జటాయూ! నీవితని నివారింపఁజాలవు. నాయీవార్త రామునకుం జెప్పుమా యనియుఁ దెలిపెను. లేకున్న మహాపత్సమయమున నెవఁడైనఁ దోడ్పడు నా యని యుండువారు కనఁబడినవానిశక్తి నాలోచింపక రక్షింపుమా యందురుకాని నీచేతఁగాదు. నాయాపద నొరు లకుఁ దెల్పుమా యని చెప్పువా రుందురా? అది లోకాచార విరుద్ధము కాదా? ప్రపంచజ్ఞానము కలవారలది సంగతమేయం దురా? కనుకఁ దత్త్వమాలోచింతము. "ఆర్య జటాయో! అనాథవత్ హ్రియమాణాం మాం పశ్య" అని పలికెను. అనాథవత్ అనుమాట సర్వజ్ఞురాలగు సీత యేల చెప్పును ? అని యందురేమో. దిక్కులేనిదానివలె ననుటచే వీఁడు నన్ను దిక్కులేనిదానినిగాఁ దలంచె ననునర్థమే తోఁచును. జటాయు వామాట విన్నఁగాని యశక్యకార్యమునకుఁ బూనఁడు. పూనుకొనునట్లు చేసినఁ గాని యతనికర్మ ఫల మనుభవమునకు వచ్చుమార్గము లేదు. కనుకనే "ఆర్య" యని సంబోధించెను. నే ననాథను గాను. కాని యిపుడట్టు లున్న

దాన నని తెలిపెను. "సత్త్వపాక్ జితకాశీ సాయుధః" అను స్తుతి
వాక్యము లిపుడేల? నీవీతని మార్గ్యానం జాలవని మెల్లంగాం
దెలిపెను. "యథాతత్త్వం మమహారణం జటాయో రామాయ
ఆఖ్యాతవ్యమ్." అనియు. "తత్. త్వం మమ హారణం యథా
తథా ఆఖ్యాతవ్యమ్." రావణుండ ప్రతిహారణరూపుండు కాననే
నీవు నాయీహరణ మెట్టిదో శ్రీరాముం దెలుంగును. ఐన
నీవు చెప్పుము. లక్ష్మణునకుం దెల్పుము. అని తేటపఱచెను.
"అథ స్వామివిషయే దాసేన యావచ్ఛక్తి శేషవృత్తి రవశ్యం
కర్తవ్యేత్యముమర్థం లోకే ప్రవర్తయితుం జటాయు వృత్తాం
తముపక్షిపతి సర్గద్వయేన" అని గోవిందరాజులు వ్రాసిరి.
దాసుండు తనచేతనైనయంత శేషవృత్తి ననంగా దాస్య
మును తనస్వామికిం దప్పక చేయవలసినదని జటాయువు
వృత్తాంతము తెలుపుచున్నదని యర్థము. పరిహాస మసంగత
మన వలనుపడదు. కాని దీని నాధారముగాం గైకొనియే
కాంబోలు శ్రీవైష్ణవశిఖామణులు కొందఱు మాత్రము
శిష్యుండు సర్వస్వము దేశికేంద్రమున కర్పణముల కల్పించినం
గాని పెరుమాళ్లయనుగ్రహము కలుగదని యుపదేశింతురు.
వారిపాపము శాంతించుం గాక. మోసము కాదేని మంచిదే.
శిష్యవిత్తాపహారణమే వారియుద్దేశమేని,

"నాస్తి చేన్నాస్తి మే హానిరస్తి చేన్నాస్తికో హతః."

అని శ్రీశంకరాచార్యులుగారు సూచించినట్లు దాంభికులు
నశింతురనుట వాస్తవమే యగును గదా. సర్వస్వత్యాగమే
మంచిదని దానముక్తి దొరకునని శిష్యుల కుపదేశించువారు
తమ రేల యప్పని చేయరాదో. అట్లు చేయనిపోఁగులుం జేసియే

వారు వంచకు లనవలసివచ్చు చున్నది. ఈ భాగమున నధ్యాత్మ రామాయణమున విశేష మేదియుఁ గానరాదు. తరువాతి కథను బఱింతము.

## జటాయువు రావణున కడ్డపడి హితముఁ దెల్పుట.

* అందొక వృక్షముమీఁద నిదురించుచున్న జటాయువు సీత తన్నుఁ బిలిచినది వినెను. ఆయాక్రోశవాక్యములు విన్నంతన లేచి తొలుతఁ బెనుగాత్రముగల రావణునింగాంచి యంతట జానకిం గాంచెను. పెనుశరీరము వాడి గోళ్లుగల యా జటాయువు వృక్షమునందుండియే రావణునితో నిట్లు మంచిమాటలు పల్కెను. దశగ్రీవా! సనాతనధర్మ మెన్నఁడు నేను దప్పనివాఁడను. సత్యవ్రతుఁడను: జటాయువను పేరఁ బరఁగు గృధ్రనాయకుఁడను. నామాట నాలకింపుము. దాశరథి యగు రాముఁడు సకలలోకవిభుఁడు సుమీ! మహాత్ముఁడు. సర్వలోక హితకారి. నీవిపుడు కొనిపోవుచున్న యీ జానకి యాజగత్పతిధర్మపత్ని. మహా కీర్తిమంతురాలు. సీత యని యీమె నామధేయము. ధర్మానుష్ఠానతత్పరుఁడగు నీవంటి రాజు పరదారల స్పృశింపవచ్చునే? విశేషించి రాజపత్నులను గడుంగడు రక్షింపవలయును. రాముఁడు రాజుగాఁడందు వేమో. పరదారల స్పృశింపవచ్చునే? అయ్యది నీచకృత్యము. ఆ బుద్ధి వదలుమా. పండితుఁడు దూష్యకార్యము నొనర్ప రాదు. తనభార్యను బరుఁడంటకుండఁ గాచునట్లే పరభార్య

* ఇయ్యది యేఁబదియవసర్గమునఁ గలదు.

లను దాఁ గాపాడవలయును. పులస్త్యవంశసంజాతుఁడవు కదా. శిష్టులగువారు శాస్త్రవిహితధర్మమును వదలరు. అధర్మకామముల నెప్పుడు గోరరు. సామాన్యులమాట యటుండ నిమ్ము. నిన్నుంబోలు రాజుల కిప్పని మిక్కిలి యనుచితము. సకలవిధధర్మములకు మూలము రాజే కదా. అర్థధర్మములకుఁ బ్రధానము రాజు గదా. శుభమునకుఁగాని పాపమునకుఁగాని యాధారము ప్రభువే. రాజునుగాంచియే లోకులు ధర్మాధర్మముల ననుసరింపఁ బ్రవర్తింతురు. కనుక రాజు ముఖ్యముగా లోకులను బట్టియైనఁ బాపముల వదలి ధర్మాదులయందే ప్రవర్తింపవలయును. రాక్షసేశా! నీ స్వభావము పాపమే. కనుకనే విషయలోలుఁడవు. దుష్కృత్యుఁడవగు నిట్టి నీకు నైశ్వర్య మెట్లు యోగ్యమగును? నీ యైశ్వర్య మిద్దానిమూలమునఁ దొలంగును. పుట్టుకతో వచ్చినది యుపదేశాదులతో నశింపదు. శత్రుపత్నుల నపహరించుట నాయకులవారికి యందు వేని, ధర్మాత్ముఁ డగు రాముఁడు నీ కేయపరాధమును గావింపఁడు కదా. శత్రువే కాని యా రాముననునీవేల యపరాధము చేసెదవు? ఖరాదుల వధించినందున నట్టి రాముని పత్నిని గొనిపోవుచున్నా నని యందువేమో. ఆ విషయమందు శ్రీరాముని యపరాధ మేమున్నది? సత్యముగఁ బలుకుమా! అపరాధమున్నట్లనుకొని యీచెడుకార్యము చేయుచున్నాఁడవు కదా. వేగమ యీదేవిని వదలుము. వజ్రము వృత్రాసురునిఁ జంపినట్లు శ్రీరామునిక్రోధదృష్టి నిన్నుఁ గాల్పక యుండుఁ గాక. మహావిషాహిని గొంగునఁ గట్టుకొని యది యెట్టిదో తెలియఁజాలకున్నాఁడవే. కాలపాశము కంఠమునకుఁ దగులు

కొని యున్నట్లు తెలిసికొనలేక యున్నావే. సౌమ్యా! మోయం
దగినంత బరువే మోయవలయును. అజీర్ణరోగమును గల్గింప
నంత యాహారమునే భుజింపవలయు. ధర్మకీర్తిహానికరము
గానికార్యమునే చేయవలయు. ముదుసలి నీకేమి తెలియు
నని నన్నాక్షేపింతువేమో. నేను వంశపరంపరాగత గృధ్ర
రాజ్యమును బాలించుచున్నాఁడను. అఱువదివేలయేండ్లు
గడచినవి. ధనుస్సులోనగు నాయుధములు నాకు లేవు. నేను
వృద్ధును. నీవు వయోవంతుఁడవు. శరశరాసనముల ధరించి
యున్నాఁడవు. కవచధారివి. రథివి. అయినను జానకింగొని
క్షేమముగాఁ బోఁజాలవు. పోనీయను. దుర్వాది వేదవిద్వ
ర్యుఁ డుండఁగా శాస్త్రసిద్ధములైన యనుమానాదిప్రమాణ
ములచేతను జలింపని ప్రామాణ్యముగల వేదమునకుఁ దోఁచిన
ట్లర్థముచేయ శక్యముగాక యుండులాగున, నేఁ జూడఁగా నీ
వీమెను గొనిపోవఁజాలవు. రాక్షసేశా! శూరుఁడవైతివేని
నిలిచి పోరాడుము. లేకున్న శ్రీరాముఁడు వచ్చుదనుక నిం
చుకసేపు నిలువుము. ఖరునిపోలిక హతుఁడవగుదువు. దైత్య
దానవుల నెన్నియోసారులు వధించిన జటావల్కలధారి
యగు నారాముఁడే నిన్ను వధించును. పరుగెత్తుచున్నావేమి?
నీచాత్మా! ఆ రాకొమరులు దూరమున నున్నారు. వారలఁ
బిలుచుకొని వేగమ రాఁజాలను. నావచ్చునంతలో నీవు పాఱి
పోవుదువు. వారు రాకున్న నేమి? నే జీవించియుండఁగా నీవీ
జగన్మాతను దీసికొని పోవఁజాలవు. నాప్రాణమునైన నిచ్చి
శ్రీరామునకు నాతని తండ్రియు నామిత్రుఁడునగు దశరథు
నకుఁ బ్రియము చేయందగు. నిలు నిలు. రవంతసేపుండుము.

యుద్ధాతిథేయసత్కారము గావింతును. ఊరక నిన్నుఁ బోనీయఁ జాలా. రథమునుండి నిన్ను నేలఁ బడఁజేయుదు ననియెను.

మహాశయులారా! ఈభాగమున మహాముని వాల్మీకి తెలుపఁజేసిన విశేషములం బరికింతము. జటాయువుమాటల మూలమున మహర్షి యెన్నియో సంగతులఁ దెలిపెను. మానవుల ధర్మములు పక్షి యెట్లెఱింగనని కాని, ఆసమయమున నిన్నిమాటలు పలుకునంత యవకాశము కలిగినదా యని కాని, రావణాసురునకు నరనిభాష తెలియునా యని కాని, ప్రశ్నింపరాదు. జటాయువృత్తాంతము ముందే వచ్చినది కదా! అప్పుడే యీవిషయమై వ్రాసినాఁడను. ఆకాలమునఁ గల యలవాటు లీకాలపు టలవాటులతోఁ బోల్చి యసంగతములని తూలనాడరాదు. ఇప్పు డసంగతములుగాఁ దోఁచునవి యప్పుడు సుసంగతములుగా నుండెను. ఇప్పటివారి యూహాయుఃపరిమితియు నలవాటులు ఆకాలపు వారి యలవాటులు లోనగువానితోఁ బోల్చిన నసంగతములుగనే తోఁచును. కాని ప్రపంచజ్ఞానముకలవార లట్లు లూహింపరు. గండభేరుండ పక్షులు గజములఁ దన్నుకొనిపోయి భక్షించునను నానుడిని విని నవ్వని నాగరికులు లేరు. నిన్న మొన్న "యీజిప్టు" అను దేశమునందు భూపరిశోధకు లిసుకదిబ్బలను త్రవ్వుచుండఁగా నించుమించుగా నెనుబదియడుగుల పరిమాణముగల పక్షి కాలు కనఁబడఁగాఁ బదిలపఱచిరఁట. దాని శరీరమంతయుఁ దక్కువ పక్షము నూఱడుగు లుండునని యూహింపఁబడినది. అంతటి యాకృతిగలపక్షి యేనుఁగును దన్నుకొనిపోవు టొక

యబ్బురము గాదని యని వసంతమాంబగారు వ్రాసిరి. ఆ నవ్వినవా రిపు డూరక క్రిందు చూచుచుండవలసినదే కదా. కనుక మన మెఱుంగని విషయము లసత్యము లనరాదు. ఇంక విమర్శనమునకుఁ గడంగుదము.

"వనస్పతిగతః శ్రీమాన్ వ్యాజహార శుభాం గిరం. ౨
దశగ్రీవ స్థితో ధర్మే పురాణే సత్యసంశ్రయః,
జటాయుర్నామ నామ్నాహం గృధ్రరాజో మహాబలః." ౩

అని మూలము. జటాయువున కాయుశ్శేషము రవంతయే కలదు. దశరథునివంటి మహారాజులతో స్నేహించియున్న వాఁడు. దండకావనవాసి. అంద నేకులు మహామునులు గలరు. వారి సహవాసమునఁ గొంతయే నధ్యాత్మవిద్య గ్రహించి యుండును. సత్సహవాసము నిష్ఫలము కాదు కదా. తుదకు శ్రీరాముని సీతాదేవిని దర్శించెను. మూఁడువత్సరముల కాలము తద్దర్శనాదులఁ గృతార్థుఁ డైనవాఁడే కదా. ప్రకృతి పురుషదర్శనస్పర్శనసహస్థిత్యాదులు నిష్ఫలములు కావనుట సిద్ధాంతము. అట్టియాతఁ డారావణుం గాంచి మంచిమాట లాడుటకు జంకవలసినవాఁడు కాఁడు. లోకజ్ఞానము తనకుఁ గలవని యతఁ డెఱుంగుటకే యీవచనములు పలికెను. ఇవి యాత్మస్తుతిపరములు కావని మన మెఱుంగవలయును. చెట్టు మీఁదనుండియే శుభవాక్కులఁ బలికెను.

"భద్రం భద్రమితి బ్రూయాద్భద్రమిత్యేవవా వదేత్,
శుష్కవైరం వివాదం చ న కుర్యాత్కేనచిత్సహ." ౧౩౯
అధ్యా-౪.

అని మనుస్మృతి తెలుపుచున్నది. ఆయాచారము ననుసరిం చియే యందేయుండి సామవచనము లుపయోగించెను. "పురాణే ధర్మేఽహం స్థితః" అనఁగాఁ బెద్దలసహవాసము చేసినవాఁడ నని యర్థము. పురాణధర్మ మనఁగా సనాతనధర్మమని యర్థము. సత్సంగతి యని భావము. దానిచే యుక్తాయుక్తములు తెలిసి కొన్నవాఁడనని యాశయము. సత్యసంశ్రయః=సత్యము నాశ్ర యించినవాఁడను. మనోవాక్కాయములఁ బరిశుద్ధుఁడ నని తాత్పర్యము.

"సత్యేన పూయతే సాక్షీ ధర్మస్సత్యేన వర్ధతే,
తస్మాత్సత్యం హి వక్తవ్యం సర్వవర్ణేషు సాక్షిభిః. ౮3. అధ్యా-౮.
సత్యపూతాం వదేద్వాచం మనఃపూతం సమాచరేత్." ౪౬.

అధ్యా-౬.

అని మనుస్మృతి తెల్పుచున్నది. సృత్యుక్తపద్ధతి మీఱక సత్య వ్రతుఁడనుగా నున్నాఁడనని భావము. నామ్నాహం జటా యుర్నామ = జటాయువను పేరఁ బ్రసిద్ధి గలవాఁడను. అనఁగా నాపేరు నీవును వినియుండువని భావము. గృధ్రరాజః= నీవెట్లోకజాతికిఁ బ్రభుఁడవో నేనట్లే ప్రభుఁడనని యాశ యము. మహాబలః = పక్షిమాత్రుఁడ ననుకొనకుము. బలవం తుఁడను గూడ నగుదును. రాజధర్మముల నెఱుంగువాననియు, మానవులతో మైత్రిగలదనియుఁ గావున వారల యాచార ముల నెఱుంగుదు ననియుఁ, గనుకనే నీవును బ్రభువుఁడవోట నాధర్మముల నాధారముచేసికొని హితముఁ దెలుపుచున్నాఁడ ననియు, జటాయువుభావమని మన మెఱుంగవలయును.

"రాజా సర్వస్య లోకస్య మహేంద్రవరుణోపమః,
లోకానాం చ హితే యుక్తో రామో దశరథాత్మజః. ౮
తస్యైషా లోకనాథస్య ధర్మపత్నీ యశస్వినీ,
సీతా నామ వరారోహా యాం త్వం హర్తుమిహేచ్ఛసి." ౯

అని మూలము. జటాయువు రావణునకుఁ గలభ్రాంతిని నివారించుచున్నాఁడు. రాముని సామాన్యరాజపుత్రునిగాఁ దలంచితివేమో భగవంతుఁడు సుమీ! యని తేటపఱుచుచున్నాఁడు. సర్వస్య లోకస్య రాజా = నీ వాక్యభాగమునకే విభుఁడవు. రాముఁడు సర్వజగత్పతి యగు. లోకానాం హితే యుక్తశ్చ = విశేషించి మానవుల హితమునే కోరువాఁడు. అనఁగా మానవుఁడుగా నవతరించుట మానవుల మూలమున నీకు మరణము గలుగఁగలదని నీవరములనుండియే తేలినది కాన నాజాతియందు జనించి వారి మేలుకోరెనని భావము. నీవరములఁ దలంచుకొమ్ము. మనుష్యులనుండి మృతి కలుగక యుండ వరమును బ్రహ్మనడుగలేదు కదా. ఆకారణమును బట్టియే నిన్నుం జంప మనుష్యుఁడుగా నవతరించెనని సారము. దశరథాత్మజః = దశరథునికొడుకు. అనరణ్యమహారాజు శాపము నీమూలమున స్మృతికిఁ దెచ్చుచున్నాఁడు. నావంశమునఁ బుట్టినవానిచే మృతి కలుగునని కదా యనరణ్యుఁడు శపించెను. ఆతఁడే యీరాముఁడు సుమీ! ఆజగత్పతి కీమె ధర్మపత్ని. యశస్విని అనుటచే మహాలక్ష్మియని ప్రసిద్ధి గాంచినదే. సీతా = అయోనిజాత. ఆమెనే యపహరింపఁ గోరుచున్నావే అని భావము. దీనిచేత నీవీమె నపహరించుట

మానవుఁడుగా నవతరించిన భగవంతునిచే మరణమును గోరియే యని తేటపఱచెను.

"కథం రాజా స్థితో ధర్మే పరదారాన్ పరామృశేత్,
రక్షణీయా విశేషేణ రాజదారా మహాబల. ౬
నివర్తయ మతిం నీచాం పరదారాభిమర్శనాత్,
న తత్సమాచరేద్ధీరో యత్పరోఽస్య విగర్హయేత్. ౭
యథాత్మన స్తథాన్యేషాం దారా రక్ష్యా విపశ్చితా."

అని మూలము. సందర్భము ననుసరించి మహాముని ధర్మోపదేశము లోకమునకుఁ జేయుచున్నాఁడు.

"ఇమం హి సర్వవర్ణానాం పశ్యంతో ధర్మముత్తమం,
యతంతే రక్షితుం భార్యాం భర్తారో దుర్బలా అపి. ౬
స్వాం ప్రసూతిం చరిత్రం చ కులమాత్మానమేవ చ,
స్వం చ ధర్మం ప్రయత్నేన జాయాం రక్షన్ హి రక్షతి." ౭

మను, ౯-అధ్యాయము.

"పరదారాభిమర్శేషు ప్రవృత్తాన్ నౄన్ మహీపతిః,
ఉద్వేజనకరైర్దండైః ఛిన్నయిత్వా ప్రవాసయేత్. ౩౫౨
తత్సముత్థో హి లోకస్య జాయతే వర్ణసంకరః,
యేన మూలహరోఽధర్మస్సర్వనాశాయ కల్పతే." ౩౫౩

అను మనుస్మృతిభావమునే యీ రామాయణభాగము బోధించుచున్నది. పరదారగమనము మహాపాపమనియుఁ జేటపడుటయే గాక దానిచే వర్ణసంకరము, దాని మూలమున నధర్మవృద్ధియు, నద్దాన సర్వనాశము కల్గునని స్మృతి హెచ్చరించుచున్నది.

"ప్రజనార్థం మహాభాగాః పూజార్హా గృహదీప్తయః,
స్త్రియశ్శ్రియశ్చ గేహేషు న విశేషోఽస్తి కశ్చన."

అను మనువాక్యము మఱువరాదు కదా. ధర్మమంతయు స్త్రీ మూలముననే నిలిచియుండును.

"స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః,
సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ."

అని యర్జునుఁడు శ్రీకృష్ణునకు దుఃఖించుచుఁ దెలియఁజేసెను. కనుకనే రాజు పరదారల కేయాపదలు రాకుండఁ గాపాడ వలయునని స్మృతులు తెలుపుచున్నవి. శ్రీరామాయణము కూడ నా విషయమునే బోధించుచున్నది. విశేషించి రాజ దారలు రక్షింపఁదగుదురు. అనఁగా భావమేమి? సకల ధర్మా చరణమునకు నుదాహరణము రాజకుటుంబము. కనుక నందే దోషము కలియకుండ నుండవలయునని కదా దీని సారము. జటాయు వీవిషయమునే తేటపఱచెను. తనభార్యను రక్షించు నట్లే పరభార్యలను రక్షింపవలయుననఁగా సర్వకార్యముల కంటె స్త్రీరక్షణమున జాగరూకుఁడు కావలయునని కదా భావము.

"అర్థం వా యది వా కామం శిష్టాశ్శాస్త్రేష్వనాగతమ్. ౮
వ్యవస్యంతి న రాజానో ధర్మం పౌలస్త్యనందన,
రాజా ధర్మశ్చ కామశ్చ ద్రవ్యాణాం చోత్తమో నిధిః. ౯
ధర్మశ్శుభం వా పాపం వా రాజమూలం ప్రవర్తతే."

అని మూలము. ధర్మార్థకామములు మూఁడును శాస్త్రములను బరిశీలించినను సూక్ష్మదృష్టి లేనివారలకుఁ దేటపడవు. కావున

రాజు నాచారముల ననుసరించి వారాచరింతురు. రాజు ధర్మ సూక్ష్మముల నెఱుంగందగు బుద్ధిసాటవము కలవాఁడు. ప్రజలు శాస్త్రములయందు ధర్మార్థకామముల లక్షణములు తెలిపిన వానిని స్పష్టముగాఁ దెలిసికొనఁజాలకున్నను రాజు ననుసరించి యాచరింతురు. కనుక రాజు కడుజాగరూకుఁడై మెలఁగినఁగాని లోకము బాగుపడదు. లోకాచారము రాజమూలముగాఁ బ్రవర్తించును. రాజే పుణ్యపాపములకుఁ గర్తయని భావము. అట్టి రాజవగు నీవో రావణా! యిట్టి దుష్కార్యమును జేయఁబూనుట మంచిదికాదని కథానుబంధము.

> "పాపస్వభావశ్చపలః కథం త్వం రక్షసాంవర. ౧౦.
> ఐశ్వర్యమభిసంప్రాప్తో విమానమివ దుష్కృతిః."

అని మూలము. పాపకర్మములు చేయువాఁడు దేవలోకగమనార్హమగు విమానమును బడయఁజాలనియట్లు పాపాచారాదిదుర్గుణములుగల నీకెట్టు లింత యైశ్వర్యము గల్గెను? అని జటాయువు ప్రశ్నించెను. ఇంతటి యైశ్వర్యసంపన్నుఁడవు గావున నీ దురాచారమును మానుమా యని ప్రార్థించెననియే యిందలిభావము.

> "కామం స్వభావో యో యస్య న శక్యః పరిమార్జితుం. ౧౧.
> న హి దుష్టాత్మనామార్య మా వసత్యాలయే చిరమ్."

అని మూలము. దుష్టస్వభావము సదుపదేశాదులచే మార్పఁదరము కాదు. దుష్కృతుల మనస్సునందు సదుపదేశము చాల కాలము నిలువదు. అని ప్రతీతికార్థము. ఇందలి సారమేమి? సదుపదేశము దుస్స్వభావమును మార్పఁజాలదు. ఏలనఁగాఁ

బ్రారంభించిన పాపకర్మములఫల మనుభవమునఁగాని తీఱదు. దానిని బుణ్యకర్మఫలరూపమగు ధర్మోపదేశ మెట్లు మాఱ్చును? అనఁగాఁ గర్మఫలానుభవము తప్పదని యిందలి సారము. కొందఱియందు సదుపదేశము ఫలించుచుండుట చూచుచున్నారము కదా యందురేమో. ఆ పాపకర్మాను భవము ముగియవచ్చు కాలమున సదుపదేశము చేసినయెడల నది ఫలించుననియు, లేనిచో ఫలింపదనియు సిద్ధాంతము. కనుకనే కొందఱియందు సదుపదేశము ఫలించుటయు, మఱి కొందఱియందు ఫలింపకుండుటయు జరగుచున్నది. ఈ యను భవమే పైసిద్ధాంతమును వెల్లడించును.

"విషయే వా పురే వా తే యదా రామో మహాబలః. ౧౨
నాపరాధ్యతి ధర్మాత్మా కథం తస్యాపరాధ్యసి,
యది శూర్పణఖాహేతోర్జనస్థానగతః ఖరః. ౧౩
అతివృత్తో హతః పూర్వం రామేణాక్లిష్టకర్మణా,
అత్ర బ్రూహి యథాతత్త్వం కో రామస్య వ్యతిక్రమః. ౧౪
యస్య త్వం లోకనాథస్య భార్యాం హృత్వా గమిష్యసి."

అని మూలము. అనపరాధకున కపరాధము చేయఁగూడదను నీతి నిందుమూలమున మహర్షి యుపదేశించుచున్నాఁడు. నీ రాజ్యమునకుఁ గాని లంకకుఁగాని శ్రీరాముఁ డపకారము చేయలేదే. అతనికేల యపకారము చేయుచున్నాఁడ వని ప్రశ్నించెను. అనఁగా నీకపకారము చేసినట్లు నటించి మహోప కారము చేయుననుభావ మీ వాక్యమునుండి ధ్వనించు చున్నది. శాపవిముక్తియే మహోపకారము. శూర్పణఖమూల మున ఖరుని వధించుట యన్యాయము కాదు. అనుటంజేసి

భగవంతుఁ డత్యాచారుల రూపుమాపుటకే యీరూపమున నవతరించె ననియు, నాకార్యమునకెల్ల సీసీతయే ప్రధాన సాధనమనియు, నీవిపుడామెనే యపహరించితివనియు, జటాయువు నుపదేశవాక్యములయం దిమిడియుండు భావమని మన మూహింపవలయును.

"క్షిప్రం విసృజ వైదేహీం మా త్వా ఘోరేణ చక్షుషా. ౧౫
దహేద్దహనభూతేన వృత్రమింద్రాశనిర్యథా,
సర్పమాశీవిషం బద్ధ్వా వస్త్రాంతే నావబుద్ధ్యసే. ౧౬
గ్రీవాయాం ప్రతిముక్తం చ కాలపాశం న పశ్యసి,
సభారస్సౌమ్య భర్తవ్యో యో నరం నావసాదయేత్. ౧౭
తదన్నమపి భోక్తవ్యం జీర్యతే యదనామయం."

అని మూలము. ఇంద్రునివజ్రాయుధము వృత్రాసురుని రూపు మాపినట్లు శ్రీరామునిక్రోధవీక్షణ మగ్నిరూపమున నిన్ను దహింపకమునుపే సీతను వదలుమని జటాయువు తెలిపెను. వజ్రము వృత్రదానవునిసంహారము కొఱకని నిర్మింపఁబడినది. అద్దాని నుపమానముగాఁ జెప్పుటంజేసి శ్రీరామమూర్తి నీ కొఱకే యవతరించెనని సూచింపఁబడియె. ఎప్పుడు క్రోధవీక్షణము రామమూర్తి నీపై వ్యాపింపఁజేయునో అప్పుడే నీకుఁ బతనము సంభవించునని భావము. అనఁగా శ్రీరాముఁడు రుద్రమూర్తిగా మార్పునొందఁగనే నీకు మృతికల్గునని సారము.

"రుద్రోఽప్యయాయ తమసా పురుషస్స ఆద్య
ఇత్యుద్భవస్థితిలయాస్సతతం ప్రజాసు." ౫

శ్రీభాగవతము, ౧౧-స్కం. ౪-అధ్యాయము.

"యుగాంతే చైవ సంప్రాప్తే రుద్రమీశో జగత్ప్రభుః." 3౫-౨

శ్రీ మహాభారతము, అనుశాసనికపర్వము, ౧౪-అధ్యాయము.

అను నీ ప్రమాణములు భగవంతుఁడు కార్యము ననుసరించి బ్రహ్మవిష్ణురుద్రులుగా మాఱుండుననియు, నావ్యక్తులు శాశ్వతములు కావనియు, మనకీవాక్యములే తెలుపుచున్నవి. ఇట్లు శ్రీభాగవతాదులే చాటుచుండ నిఁక విష్ణుశంకరులలోఁ దారతమ్యము కలదని వాదించువా రెంతమందులో వచింపఁదరము గాదు కదా. కొంగునఁ గ్రూరసర్పమును గట్టుకొని యది బాధించునని యెఱుఁగకున్నయట్లు. కంఠమునకుఁ గాలపాశము తగులుకొనఁగా దానిని జూడకున్నట్లు నీవీసీతను జెంత నుంచుకొని సంతసించుచున్నాఁడవే. ఎంత బుద్ధిలేనివాఁడవు? అని జటాయువు రావణుని హెచ్చరించెను. కాలపాశమేలాగు ప్రాణముతీయ సాధనమో యట్లు సీత నిన్నుఁ జంపించుటకుగా నవతరించినదని యిందలిభావము. ఈసందర్భమున మహర్షి యొక నీతిని దెల్పుచున్నాఁడు. తనకు బాధకల్గింపనంత బరువే మానవుఁడు మోయఁదగును. అజీర్ణరోగమును గల్గింపనంత యన్నమునే భుజింపవలయును అని. అశక్యకార్యమును సాధింపఁ బూనరాదనియు, నత్యాశకు లోఁబడి భుజింపరాదనియు నవిరెండును దనకుఁ బీడాకరము లగునని భావింపవలయుననియు దీనిసారము.

"నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంతమనశ్నతః,
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున. ౧౬
యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు,
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా." ౧౭

అను నీగీతావాక్యములుకూడ నీయర్థమునే తెలుపుచున్నవి. శక్యముగాని పని కెంతటివాఁడైనను బూనరాదనునదియే యీభాగమునుండి తేలెడిసారము.

> "యత్కృత్వా న భవేద్ధర్మో న కీర్తిర్న యశో భువి. ౧౯
> శరీరస్య భవేత్ఖేదః కస్తత్కర్మ సమాచరేత్."

అని మూలము. ఏకార్యముఁ జేసినను ధర్మము కీర్తి యశస్సు గలుగవలయు. శరీరమునకు దుఃఖము కలుగరాదు. అట్టి కార్యమునే చేయవలయు ననియే వాల్మీకి యుపదేశము. కీర్తి యశశ్శబ్దములు రెండు ప్రయోగింపఁబడినవి. వీనికి భేదముండి తీరవలయుఁ గదా. "కీర్తిః ఐశ్వర్యాదిజనితా ప్రథా. యశః భోగిత్వకృతప్రథా" అని గోవిందరాజులు, కీర్తిర్విక్రమాది జనితా ప్రథా యశస్సౌజన్యాదిజనితా ప్రథేతి విశేషః" అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి.

"దానాదిప్రభవా కీర్తి శ్శౌర్యాదిప్రభవం యశః." ఇతి మాధవీ.

"అత ఏవ యశః కీర్త్యోర్భేదస్యాపి దర్శనాత్. 'యశః కీర్తిపరిభ్రష్టో జీవన్నపి న జీవతి' ఇతి కస్యచిత్ప్రయోగః. జీవతః ఖ్యాతి యశో మృతస్య ఖ్యాతిః కీర్తిరితి కేచిత్. తన్నసాధు. కీర్తిస్తే స్వపదూతికేతి ప్రయోగదర్శనాత్. ఇత్యమరటీకాయాం భరతః." అని శబ్దకల్పద్రుమము.

ఈ మూఁడుమతములు మూఁడురీతుల బోధించుచున్నవి. ఈ రెండుశబ్దములు ప్రఖ్యాతిబోధకములేగాని యెన్నటి భేదమును సూచించునవి యనిమాత్రము తేలెడిని.

> "షష్టిర్వర్షసహస్రాణి మమ జాతస్య రావణ. ౧౯

పితృపైతామహం రాజ్యం యథావదనుతిష్ఠతః,
వృద్ధోఽహం త్వం యువా ధన్వీ సశరః కవచీ రథీ. ౨౦
తథాప్యాదాయ వైదేహీం కుశలీ న గమిష్యసి,
న శక్యస్త్వం బలాద్ధర్తుం వైదేహీం మమ పశ్యతః. ౨౧
హేతుభిర్న్యాయసంయుక్తై ర్ధ్రువాం వేదశ్రుతీమివ."

అని మూలము. దీనింబట్టి మానవులకు రాజున్నట్లే పక్షులలో నొక్కొక్కజాతి కొక్కొక్క రాజుండుననని లేలెడిని. భగవత్సృష్టిలో నొక్కని రక్షకునిగా భావించి కొందఱుండవలయు నను సిద్ధాంతము కనఁబడుచున్నది. అడవిపందులలో నొంటిగాఁ డను పేరఁ బరఁగునది యాగుంపున కధిపతిగా నుండును. అది ముందుగాఁ బోవుచుండ దాని ననుసరించి తక్కినవి పోవుచుండుననుట వినుచున్నారము. ఏనుఁగులలో నిదేయాచారము కలదనియు వినికి గలదు. గృధ్రజాతిలో నీ యాచారమే కలదని యీ రామాయణము తెలుపుచున్నది. ఇదేల? అని ప్రశ్నించువారు పామరులని నాయాశయము. ఎందుల కందురేమో. నిరంకుశప్రవృత్తిత్వమే వారికైన హానికరము. వినయము కావలయునన్నఁ దనకంటె నధికులున్నవారను నూహ కలుగవలయును.దానిచేఁ గలుగు లాభమేది యనఁగా నొకఁ డధిపతిగాఁ బ్రవర్తింపనేర్చి యైహికఫలములనొంది యా యభ్యాసమున సర్వరక్షకుఁడగు భగవంతునిఁ బ్రభువుగా భావించి శాశ్వతములగు నాముష్మికఫలముల నొందవచ్చును. కనుక సృష్టియందే యీ సదాచారము చేర్పఁబడినది. అఱువదివేలయేండ్లు జీవించితినని పక్షి చెప్పినవిషయ మవిశ్వాస

పాత్రము కాదని యీసఱకే దశరథుని యాయుర్విషయమునఁ దెలిపియున్నాను. కాన మరల నిట వ్రాయుటలేదు.

> "అసకృత్సంయుగే యేన నిహతా దైత్యదానవాః. ౨౩
> న చిరాచ్చీరవాసాస్త్వాం రామో యుధి వధిష్యతి,
> కిన్ను శక్యం మయా కర్తుం గతౌ దూరం నృపాత్మజౌ. ౨౪
> క్షిప్రం త్వం నశ్యసే నీచ తయోర్భీతో న సంశయః."

అని మూలము. జటాయువు శ్రీరాముఁడిపుడు రుద్రావతారమే యనియు, నిన్ను వధింపఁగలఁడనియుఁ దెలుపుచుఁ దా నాసీతను విడిపింపలేనని యెంచి రక్కసుని శపించుచున్నాఁడు. "సంయుగే రామో యుధి శీఘ్రం న వధిష్యతి అపితు వధిష్యతీత్యర్థః. అనేన రామస్యేశ్వరత్వం వ్యంగ్యమ్" అని తిలకవ్యాఖ్య. దైత్యదానవాది క్రూరసంహారము లయకర్తృకార్యము కదా. లయకర్తయగు నాథుఁడీ రాముఁడే. కావున నిపుడు శ్రీరాముఁడు మృత్యుంజయుఁడే యని తలంపుము. నిన్నుఁ జంపకమానఁడు. మునివేషమున యుద్ధమున నిన్ను వధించును. రామలక్ష్మణులు దూరమున నున్నారు. వారు లేని తఱి నీచుఁడవుగాన నీపని భయపడుచుఁ జేసితివి. కాన శీఘ్రము నశింతువు. అనఁగా నీవీజానకిని గొనిపోవుచున్నావు. కొలఁది కాలమున శ్రీరామునిచే వధింపఁబడుదువు. అని జటాయువు పలికెను. పాపకర్మము తత్కాలమున ఫలము నీయకున్నట్లుండినను శీఘ్రముగనే ఫలమును గల్గించునను సిద్ధాంతమే యిందుఁ బ్రతిపాదింపఁబడినదని మన మెఱుంగవలయును. పై భావమునే యాపక్షిరాజు వ్యక్తపఱచుచున్నాఁడు.

"యుద్ధాతిథ్యం ప్రదాస్యామి యావత్ప్రాణం నిశాచర."

అని మూలము. బ్రదికియుండుదనుక యుద్ధము చేయుదును. అనఁగా భావమేమి? నాప్రాణశక్తి యుండుదనుకఁ బోరాడుదు ననియే కదా. ఇప్పట్టున జటాయువాక్యములు గంభీరార్థ బోధకములై యున్నవి.

"యాంతి న్యాయప్రవృత్తస్య తిర్యంచోపి సహాయతామ్."

అన్నన్యాయ మీతనిమూలముననే కదా పుట్టినది. ఇఁకఁ దద్వాలికథను బఠింతము.

## జటాయువు నేలఁగూలుట.

* ఇట్టులాజటాయువు న్యాయ్యముగాఁ జెప్పఁగా రావణునకుఁ గోపము మించి కన్నులు నిప్పులవలె నయ్యెను. కోపమున నెఱ్ఱని కన్నులతో నారాక్షసుఁడు జటాయువు మాటల కోర్వక యతనిపైఁబడ నుంకించెను. మేఘము లొండొంటిఁ దాఁకినట్లు వారిరువురు మార్కొని పోరిరి. మాల్యవంతములు రెండు పెనఁగిన చందమున వారచ్చెరువుగాఁ బోరిరి. పక్షిపై ననేక క్రూరసాయకములు కురియించెను. ఆతఁడు వానిని లెక్కింపక రావణు దేహమును గోళ్లతో గీఱి గాయములు గావించెను. రక్కసుఁడు వాని వధింపఁగోరి తీవ్ర బాణదశకమున నతని నొంచెను. దాన నాపక్షి నొచ్చియు వగచుచున్న జానకింగాంచి మరల వాని మార్కొనియెను. రావణునికోదండమును దనపాదప్రహారముల ఖండించెను.

* ఇది యేఁబదియొకఁడవసర్గమునఁ గలదు.

దాన నొడలు తెలియని కోపముం జెప్పుకొని రావణుఁడు పక్షిపై శతసంఖ్యలు బాణములను వేటొక వింటం గురియించెను. వానిని పాదప్రహారములఁ జెండి మరల ధనువును బాదప్రహారములఁ ద్రుంచెను. మఱియుఁ బక్షహాతుల నాతని కవచమును జించెను. అంత సుపర్ణుఁడైన యాతని ఖరవాహనములఁ జంపెను. రథసర్వమును గూడ విఱిచెను. శ్వేతచ్ఛత్ర చామరములం బట్టుకొనియున్న రాక్షసులను తుండముచే వధించెను. ఆతుండమునసే సారథిని జంపెను. ఆ సాహసమునకు భూతములెల్ల జటాయువును మెచ్చుకొనియె. అంత ముదుసలితనమున నలసియున్న పక్షిరాజుఁగని సీతనెత్తుకొని రావణుఁడు నభమున కెగసెను. ఆ విధమెఱింగి కూడ నెగిరి అడ్డగించి యోతుచ్ఛుఁడా! రాక్షసనాథ యీసీత నపహరించి కొనిపోవుచున్నావు సుమీ! దప్పిగొనువాఁడు జలమును ద్రావురీతి సీతాపహరణరూపవిషమును ద్రాగుచున్నావు. నీవారందఱకు నిది నాశమును గల్గింపక మానదు.

రావణా! నీవుఁ గాలపాశము కట్టఁబడియున్నవే. మత్స్యము తన్నుఁజంపు నెరగ్రుచ్చియున్న గాలమును మ్రింగి తప్పించుకొని పోయినను దానిని వదలలేక చచ్చునట్లు నీవీ కాలపాశముతో నెందుఁబోయినను వదలక యది వధించును జుమా! ఎవ్వారికే మార్కొనఁ దరముగాని యీ రామలక్ష్మణులు నీవు గావించిన యీ యవమానము నోర్వరు సుమీ! వధింపక మానరు. భీతుఁడవై యెవరు లేనితఱి లోకనింద్యమగు కార్య మొనరించితివికదా. ఇది చోరులపని. వీరు లెవ్వరు నిట్లు చేయరు. నీవు శూరుఁడవైన యుద్ధము చేయుము. రామ

లక్ష్మణు లరుదెంచుదాఁక నిలువుము. అప్పుడు ఖరునివలెఁ బుడమి శయనింతువు. మృత్యువాసన్నముకాఁగాఁ బురుషుఁడు స్వనాశనార్థమునకై యెట్టి యధర్మకార్యము నొనరించునో యట్టిదానిఁ జేయ నీవు పూనుకొంటివి. మృతి సమీపించినది. ఎవఁడుకాని పాపకార్యము నొనరింపఁడు. బ్రహ్మయుఁ జేయఁడు. అని పలుకఁగా వాని లెక్కింపక రావణుఁడు పాఱిపోవుచుండఁగాఁ గని వానివీఁపుపై వ్రాలి నిలిపి మావటివాఁడు సృణిముచే గజమును బొడుచునట్లు గోళ్లచే వీఁపుగీఱెను. అప్పుడు నఖపక్షతుండాయుధుఁడు కానఁ దుండము వానివీఁపుపైనుండి నఖముఖముల వానిగీఱి శిరోజములఁ బెఱికివైచెను. పలుమాఱు తన్నిట్లు బాధింపఁగా నోర్వఁజాలక వాని వధింప మరలెను. సవ్యపార్శ్వమున జానకి నునుచుకొని పక్షిని హస్ততలమునఁ గొట్టెను. పక్షియు వానిచుట్టును దిరిగి తుండమున వాని సవ్యకరములు పదింటిని చెండెను. అవి తెగిపడఁగా మరల నవి యథాపూర్వముగాఁ బొడసూపెను. అంతట వాఁ డాగ్రహించి సీత నదలి యాపక్షిని ముష్టిఘాతముల నొంచి పాదహతుల నొంచెను. అత్తఱి వా రిరువు రొకగడియ కాలము పోరిరి. అట్టులాపక్షి శ్రీరామకార్యార్థము పోరుచుండఁగా రావణుఁడు ఖడ్గమెత్తి పక్షిపార్శ్వములను బాదములను ఛేదించివైచెను. అంత నాగ్రద్ధ రక్తము స్రవించుచుండఁగాఁ బ్రాణావశిష్టమై ధరణింబడియెను. జానకి యత్యంతార్తయై యాపక్షికడకుఁ బరువెత్తెను. ఆ పక్షిం గాంచి కౌఁగిలించుకొని సీత విలపించెను.

మహాశయులారా! ఈభాగమును బరికింతము. ఎవిధమే నీతులు తేలఁగలవు. మహర్షివాక్యములయందును సారము గలుగకమానదు. "ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి" అని యుండుట సర్వజనవిదితమే కదా.

> "స రాక్షసరథే పశ్యన్ జానకీం బాష్పలోచనాం,
> అచింతయిత్వా తాన్ బాణాన్ రాక్షసం సమభిద్రవత్." ౧౦

అని మూలము. జటాయువు రావణుబాణములచేఁ గొట్టఁబడి జవసత్త్వము లుడిగియుండియును బాష్పపూరితనయన యగు జానకింగాంచగనే యాయలజడి లెక్కింపని సత్త్వము కల్గఁగా మరల యుద్ధమునకు సంసిద్ధుఁడయ్యెను. అని ప్రాతీతికార్థము. దీనింబట్టి సజ్జనాగ్రగణ్యుఁడనియే తేలెడిని.

> "దాక్షిణ్యం స్వజనే దయా పరజనే శాఠ్యం సదా దుర్జనే
> ప్రీతిస్సాధుజనే నయో నృపజనే విద్వజ్జనేష్వార్జవం,
> శౌర్యం శత్రుజనే క్షమా గురుజనే నారీజనే ధూర్తతా
> యే చైవం పురుషాః కలాసు కుశలాస్తేష్వేవ లోకస్థితిః."

అని భర్తృహరి తెల్పెను. సజ్జనులవలననే లోకమర్యాద నిలుచునని కదా భావము. ఇందొకవిశేషము కలదని తోఁచెడిని. పక్షిరాజు శ్రమించెను. కాని యిఁక నీని నోడింపఁజాలను. అని మానుకొనును నేమో యని జానకి యోజించెను. ఏల యనఁగా నాతనికి మృతి యాసన్నమగుచున్నది. తనకై ప్రాణముల వదలవలసినవాఁడని యాదేవి యెఱుంగును. కర్మఫలము ననుభవింపఁజేయ నెంచి యాతనికం బట్టరానికరుణఁగల్గింప నెంచెను. ఆదేవిం గాంచగనే యశక్యము శక్యమే యనునూహ

యతనికిం గల్గెను. అను భావమును మనము గ్రహించుట సమంజసము. పరజనోద్ధరణమునకై స్వప్రాణవ్యయము చేయుటయు మహాపుణ్యమనియే యిందలిసారము.

> "వజ్రసంస్పర్శబాణస్య భార్యాం రామస్య రావణ. ౨౪
> అల్పబుద్ధే హరస్యేనాం వధాయ ఖలు రక్షసాం,
> సమిత్రబంధుస్సామాత్యస్సబలస్సపరిచ్ఛదః. ౨౫
> విషపానం పిబస్యే తత్పిపాసిత ఇవోదకం,
> అనుబంధమజానంతః కర్మణామవిచక్షణాః. ౨౬
> శీఘ్రమేవ వినశ్యంతి యథా త్వం వినశిష్యసి,
> బద్ధస్త్వం కాలపాశేన క్వ గతస్తస్య మోక్ష్యసే. ౨౭
> వధాయ బడిశం గృహ్య సామిషం జలజో యథా."

అని మూలము. వజ్రము మహావిషము. ప్రాణములఁ దీయుననుట స్పష్టమే కదా. రామబాణము నిన్ను స్పృశింపఁగనే మహావిషపానము చేసినవానివలె మరణింతువని భావము. అది తెలియఁదగు బుద్ధిలేక యీసీత నపహరించుచున్నాఁడవు. ఇది నీకు మాత్రమే కాక సకలరాక్షససంహారమునకే యగును. దప్పిగొన్నవాఁ డుదకము త్రాగినట్లు లీ సీతాహరణ రూపవిషయమును ద్రాగుచున్నాఁడవు. ఈయుపమానము సామాన్యదృష్టిం బరికింప సమంజసమని తోఁపదు. జలపాన మారోగ్యమునకే యగును. అట్లే విషపానము కూడ మేలునకే యగునని తోఁచును. ఇందొకవిశేషమున్నట్లు తోఁచును. మహర్షి భావ మతిగంభీరము కదా. ఈ సీతాపహరణరూప విషము రావణుని మేలుకొఱకే యగును. బాహ్యదృష్టికిఁ గీడుగాఁ దోఁచిన నాతని క్షేమమునకే యగునను భావము

మహర్షి తెలుపఁబూనియే యీయుపమానము చెప్పెను. భగవంతుఁడగు శ్రీకృష్ణమూర్తి తన్నాశ్రయించువారి సర్వధనముల నపహరింతునని చెప్పెను. ఆయపహరణము వారి లాభమునకే యని యెట్లు గ్రహింతుమో యట్లే యిందును గ్రహింపవలయును. ఇదియే యించలి విశేషము. మిత్రబంధు మంత్రిప్రముఖులతో నశింతువని తెల్పునప్పుడు సోదరులఁ జెప్పకపోవుట విభీషణుని స్థితికే యని గ్రహింపవలయు. విభీషణుఁడుతప్పఁ దక్కిన రాక్షసులు రావణుపక్షమునఁ గలవా రెల్ల నశింతురని మనము గ్రహింపవలయును. సీసహవాసమును దెలియక చేయు దక్కినవారెల్ల నీతో నశింతురనుటం జేసి దుష్టసహవాసము హానికర మనుసీతిని మహర్షి తెల్లడించెను. రావణా! కాలపాశ మెక్కడికిఁ బోయినను విడువనిరీతిగా నీమృతివఱకు నీజానకి నిన్ను వదలదు. నీవిప్పుడీమెనపహరించి కొనిపోయినను గాలమును మ్రింగిన చేప యెప్పటికిఁ జిక్కకుండఁ దప్పించుకొన్నను వదలని యాగాలముచేతనే నశించునట్లు లంకలోనే నీవు శ్రీరామునిచేఁ జావఁగలవని తెలిపినట్టులు మన మూహింపవలయు. ఆమహాదేవి సీత యాపక్షినోట భావిఫలములఁ జెప్పించెననియే యీభాగమునుండి మన మెఱింగి యట్టి మహాలక్ష్మిని బరదేవిని మనము ధ్యానించి కృతార్థులము గావలయును.

"ధర్షణం చాశ్రమస్యాస్య క్షమిష్యేతే తు రాఘవౌ."

అని మూలము. ఆశ్రమమునకుఁ జేసిన యవమానమనఁగా నర్థమేమి? ఆశ్రమశబ్దము లక్షణచే నాశ్రమస్థ సీతాదేవి పరము. "గంగాయాం ఘోషః" అనుచో గంగాశబ్దము గంగా

తీరపరమని యర్థము చెప్పినట్లే యిందునని గ్రహింపందగు. "ఆశ్రమకర్మకం త్వత్కర్తృకపరిభవానుకూలవ్యాపారః" అని శాబ్దబోధము. సీతను నీవొనరించిన యీ మహావమానమును రాఘవులు క్షమింపరనియే తాత్పర్యము.

> "జటాయుస్సమభిక్రమ్య తుండేనాస్య ఖగాధిపః. 3౮
> వామబాహూన్ దశ తదా వ్యపాహరదరిందమః,
> సంచ్ఛిన్నబాహోస్సద్యైవ బాహవస్సహసాభవన్. 3౯
> విషజ్వాలావళీయుక్తా వల్మీకాదివ పన్నగాః."

అని మూలము. జటాయువు తనను రావణుఁడు కుడిచేతితోఁ గొట్టఁగా సవ్యహస్తములను ఛేదించుటయేల? అని ప్రశ్నింప రాదు.

> "స పరిష్వజ్య వైదేహీం వామేనాంకేన రావణః."

అని పూర్వశ్లోకమునఁ గలదు. శీఘ్రముగా జానకిని విడిపింపఁ గోరియే యాహస్తములఁ ద్రుంచెను. అనఁగాఁ వనరక్షణము ప్రధానముగా భావింపక యార్తస్త్రీరక్షణమే ముఖ్యముగా జటాయువు భావించెనని మన మెఱుంగవలయు. ఇట్టివారే

> "ఏతే సత్పురుషాః పరార్థఘటకాస్స్వార్థం పరిత్యజ్య యే
> సామాన్యాస్తు పరార్థముద్యమభృతస్స్వార్థావిరోధేన యే,
> తేఽమీ మానుషరాక్షసాః పరహితం స్వార్థాయ నిఘ్నంతి యే
> యే నిఘ్నంతి నిరర్థకం పరహితం తే కే న జానీమహే."

అని భర్తృహరి పేర్కొన్న సత్పురుషులు. కొందఱు స్వగౌరవ స్థాపనార్థము పరులమర్యాదను దూషింతురు. వారు మానవ రూపరాక్షసు లనఁదగుదురని కదా భర్తృహరి తెల్పెను.

అట్టివారల మాయావాగురలకుఁ జిక్కఁడు. రావణుని బాహువులు త్రుంపఁబడఁగా సీత యేల త్రుంపఁబడలేదని శంకింపరాదు. అవి స్వస్థానమునుండి పడఁగనే బాహువులు పొడసూపెను. అది సాధ్యమా యను ప్రశ్నము రాక మానదు. వరప్రభావ మనునది యట్లుండనిండు. లోకమునఁ గలవాని నుదాహరణములుగాఁ గైకొందము. వృక్షశాఖలు ఛేదింపఁబడఁగా మరల నందుండియే శాఖలు పొడముచున్నవి. లతలం ద్రుంపఁబడఁగా నాచోటుననుండియే రెండురెట్లుగా నంకురించుచున్నవి. మానవులయం దిట్లు గలుగు నాచారము కానముకదా యనవలదు. ఒక్కొక్క యుగమున నొక్కొక్క విశేష మున్నయట్లు చూపట్టును. శిరస్సున శృంగముకల వారిపుడు లేరుకదా. పూర్వమున్నయట్లు కలదు. చతుర్భుజు లిపుడు నాటకములలోఁ దప్పఁ గానరారు కదా. దానిచేఁ బూర్వము కూడ లేదని తలఁతుమా? ఎల్లరాక్షసులకు నిట్టి వరము గలదా? రావణునకు మాత్రమే కలదు. లోకమున నిట్లుండుట సంభవ మనరాదు. ఇప్పటిపరిశోధకులు సముద్రాంతర్భాగమున విద్యుద్దీపముల నెన్నింటినో మించు నేత్రప్రకాశము గలజంతువు లున్నట్లు, ఆ సృష్టిజ్వాలాప్రసారమున జంతువులు వశములు కాఁగా వాని నవి భక్షించుననియుఁ దేటపఱచిరి. మనము వినియుంటిమా? సృష్టిలోనిచమత్కారము లిట్టివని యిన్నియని యెన్న నెవ్వారికేని వశముగా దనుట సిద్ధాంతము. కనుక వింశతిభుజుని భుజములు మరల మొలిచి యథాపూర్వముగా నుండెనన్న నచ్చెరుపడ నక్కఱ లేదు. దేవతాప్రసాదమున నట్టిశక్తులు గలుగుట వింతకాదు.

"తం దృష్ట్వా పతితం భూమౌ క్షతజార్ద్రం జటాయుషం. ౪౪
అభ్యధావత వైదేహీ స్వబంధుమివ దుఃఖితా,
... ... ... ... ...
తతస్తు తం పత్త్రరథం మహీతలే నిపాతితం రావణవేగమర్దితం,
పునః పరిష్వజ్య శశిప్రభాననా రురోద సీతా జనకాత్మజా తదా."

అని మూలము. జటాయువుపై నాగ్రహించి రావణుఁడు వదలి యుద్ధము చేసి ఖడ్గమున నతనిఁ బడఁగొట్టెను. ఆతఁడు పడఁగా జానకి తనకొఱకు హతుఁడగు నాపక్షిరాజును రక్త సిక్తాంగుని గని యతనికడకుఁ బరువెత్తెను. మిగుల దుఃఖించుచుఁ గౌఁగిలించుకొని విలపించెను. అనునది ప్రాతీతికార్థము. కౌఁగిలించుకొనుట యేల యనఁగా మహారణ్యమున నొక ఘోరకార్యము సాగుచుండఁగా రక్షించువా రెవ్వరుందు రనుసందియముఁ బాపుటకే యాదేవి యాపక్షిం బురికొలి పెను. ధర్మమార్గమునకుఁ దోడుపడువా రెందుఁగాని యుం డకపోరని దీనిచే దృఢపడినది. అట్టివారు పుణ్యపూరుషులు కదా. ఆతనిశరీరమునుండి యసువులు వెడల నుంకించుచున్నవి. రామచంద్రహస్తములస్పర్శమును గాంచుభాగ్యము కల వాఁడే యతఁడు. ఆ సత్కర్మఫలము లనుభవింపఁ జేయఁగోరి యాసీతాదేవి యాతనిం గౌఁగిలించుకొనియె. ఆమెస్పర్శమున నాతనిప్రాణములు శ్రీరామాగమనపర్యంతము నిలిచెను. ఆ రక్తప్రవాహబాధ కలుగకుండుటకే యామె యాతనిం గాంచెను. ఈయర్థమును "శశిప్రభాననా" అన్నవిశేషణము తెలుపుచున్నది. లేకున్న దుఃఖించుచుండుతఱి నాదేవికి "శశి ప్రభాననా" యనువిశేషణమును సిద్ధకవి ప్రయోగించునా?

సాధ్వీని విడువుము విడువు మని హెచ్చరించుచుఁ దనజీవితాంతమునకై వెండ్రుకల నారావణుఁడు పట్టుకొనియెను. ఆచర్యంగాంచి ప్రపంచమెల్ల నిశ్చేష్టిత మయ్యెను. వాయుసూర్యులు తమ విచారమును దెలిపిరి. బ్రహ్మ యాకార్యమును దివ్యదృష్టిం గాంచి యత్నము ఫలించెనని సంతసించెను. మహర్షులు దుఃఖసంతోషముల వెల్లడించిరి. అంత రావణుఁడు సీతను గ్రహించి యాకసమున కెగసెను. అత్తఱి జానకి ప్రకాశింపకుండెను. కన్నీరు ప్రవహింపఁగా నామె మిక్కిలి దుఃఖించెను. వాఁ డామెను గైకొని త్వరపడిపోవుచుండఁగా నామెయుత్తమాంగమునుండి పూవులు క్రిందఁబడినవి. సీత వామపాదమునందు రత్నస్థగితమై మెఱయు నాభరణమూడి నేలఁబడియెను. వేగముగా నతఁడు పోవునపు డామెయాభరణములు నక్షత్రములవలె నందందుఁ బడినవి. ముత్తెములహార మొకఁడు పడినది. సింహవ్యాఘ్రాదిజంతువులు పక్షులు రాక్షసుపైఁ గల యాగ్రహమున నీడననుసరించి సీతతోడఁ బరుగెత్తినవి. సూర్యకాంతి మాసినది. భూతము లాకార్యమును గాంచి సత్యధర్మాదుల కికఁ జోటులేదని విలపించినవి. వనదేవత లామెకష్టమును గాంచి వడఁకెను. విలపించు నాజానకిని గైకొని రావణుఁడు పాఱిపోయెను.

మహాత్ములారా! ఈభాగమునఁ గలవిశేషములఁ బరికింతము.

> "నిమిత్తం లక్షణజ్ఞానం శకునిస్వరదర్శనం,
> అవశ్యం సుఖదుఃఖేషు నరాణాం ప్రతిదృశ్యతే. ౪
> నూనం నామ న జానాసి మహద్వ్యసనమాత్మనః,
> ధావంతి నూనం కాకుత్స్థం మదర్థం మృగపక్షిణః." ౫

అని మూలము. శరీరము కర్మజ్ఞానేంద్రియయుక్తము. కరచరణాదులైదు కర్మేంద్రియము లనంబడును. అవి రాంగల శుభాశుభఫలములం దెలుపుటకే కదలును. దానింబట్టి పురుషుండు రాంగలఫలముల నెఱుంగవలయును. కొన్ని పక్షులు తనువులకుల స్వరముచేతనే శుభాశుభములం దెలుపును. బుద్ధిమంతులవ్వానిమూలమున రాంగల కర్మఫలముల నెఱింగి సిద్ధముగ నుందురు. రామచంద్రా! నీవు విషయములవలన నాకష్టముల నెఱుంగకున్నావు కదా యని సీత పలికెను. నాకౌటను ననంగా నాకష్టము నీకుం దెలుపుటకు మృగములు పక్షులు వచ్చుచున్నవి అనంగా నిన్నింట వ్యాపించియుండు నీవీకష్టము నెఱుంగఁజాలవా యని యామె హెచ్చరించును. అనంగా రావణునాశయము, నాయాశయము, సకలభూతాశయముల నెఱుంగుదువు కదా. ఉచితమైనట్లు వర్తింపుమనియే మహాప్రకృతి సీత పురుషోత్తముని హెచ్చరించుననియే మన మిందుండి గ్రహింపవలయును.

"అయం హి పాపచారేణ మాం త్రాతుమభిసంగతః,
శేతే వినిహతో భూమౌ మమాభాగ్యాద్విహంగమః."

అని మూలము. ఈజటాయువు నన్నుం గాపాడ నరుదెంచి యీపాపిచే హతుండై నాదురదృష్టమునం గ్రిందంబడియున్నదని సీత పలికెను. సీత యిచ్చోట సామాన్యస్త్రీవలెం బలికినది కదా. ఈమె మహాప్రకృతి యనున దెట్లు సరిపడును? అని ప్రశ్నింతురేమో. "మమాభాగ్యాత్." అనంగా సీతకొఱకు రావణునితోం బోరాడి జటాయువు చచ్చెనన్న యపకీర్తి నాకుం గలుగును. కాన నీతనికి సుత్తమగతులు కల్పింపుమా

యని శ్రీరామునకుఁ దెలిపెను. అని మనము గ్రహించిన నీ ప్రశ్నమునకు సమాధాన మగును. అపకీర్తికలుగుట దురదృష్టముననే కదా.

"క్రోశంతీం రామ రామేతి రామేణ రహితాం వనే,
జీవితాంతాయ కేశేషు జగ్రాహాంతకసన్నిభః. ౧౦
ప్రధర్షితాయాం సీతాయాం బభూవ సచరాచరం,
జగత్సర్వమమర్యాదం తమసాంధేన సంవృతమ్." ౧౧

అని మూలము. సర్వజ్ఞుఁ డగువాల్మీకి సకలసంశయవిచ్ఛేదము నీభాగమునుండి చేయుచున్నాఁడు. జీవితాంతాయ జగ్రాహ = తనచావుకొఱకే యీ సీతాపహరణకార్యము నొనరించెను. కాముకుఁడై కాదనికదా యిద్దాని కర్థము. సీత యవమానింపఁ బడఁగా సర్వప్రపంచము మూఢత్వము నొందెను. అనఁగా భావ మేమి? సకలప్రపంచము ప్రకృతినిర్మితము. ప్రకృతి వ్యాపృతము. కాన నామె యేయవస్థనొందిన నదియు నట్లే యగును. "యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ."అని కదా న్యాయము. మూర్తిమంత మెల్లఁ బ్రకృతినిర్మితమే కాదా.

"దృష్ట్వా సీతాం పరామృష్టాం దీనాం దివ్యేన చక్షుషా. ౧౨
కృతం కార్యమితి శ్రీమాన్ వ్యాజహార పితామహః,
ప్రహృష్టా వ్యథితాశ్చాసన్ సర్వే తే పరమర్షయః. ౧౩
దృష్ట్వా సీతాం పరామృష్టాం దండకారణ్యవాసినః,
రావణస్య వినాశం చ ప్రాప్తం బుద్ధ్వా యదృచ్ఛయా." ౧౪

అని మూలము. పైన వ్రాసినభావము సిద్ధాంతమే యనుట నీమూలమే దృఢపఱచుచున్నది. రావణుఁడు సీత నెత్తుకొని పోవుట జ్ఞానదృష్టిం గాంచి బ్రహ్మదేవుఁడు కార్యము నెఱ

వేఁటౌనని పలికెను. అనఁగా భావమేమి? అనుకొన్నయట్లు పని సాగినది. వీఁ డంతమొందును. ధర్మము నిలుచును. అనియేకదా యాబ్రహ్మయాశయము. మఱియు దండకారణ్యమున నుండు మహర్షులు సీతాపహరణము నఱింగి మొలుత సంతోషించిరి. పిదప లోకులతృప్తికొఱకు విచారించుచుండిరి. ఏల? తలంచినట్లే యైనది. దానవుఁడు నశించుననియే కదా వారియానందము. సీతాపహరణతత్త్వ మెఱింగినవారు కనుకనే మొలుత నానందించిరి. పామరులకొఱకు విచారమును వెలయఁజేసిరి. అని గ్రహింపక తప్పదు కదా.

> "తప్తాభరణవర్ణాంగీ పీతకౌశేయవాసినీ,
> రరాజ రాజపుత్రీ తు విద్యుత్సౌదామినీ యథా. ౧౬
> ఉద్ధూతేన చ వస్త్రేణ తస్యాః పీతేన రావణః,
> అధికం ప్రతిబభ్రాజ గిరిర్దీప్త ఇవాగ్నినా. ౧౭
>
> ... ... ... ... ...
>
> "తస్యా భూషణఘోషేణ వైదేహ్యా రాక్షసాధిపః,
> బభౌ స చపలో నీలస్సఘోష ఇవ తోయదః." ౨౮

అని మూలము. ఈ పదుమూఁడుశ్లోకములు విలపించుచున్న జానకియొక్కయు, సంతోషించు రావణునియొక్కయు వర్ణనము. ఇచ్చోట నిది సముచితము కాదని యాలంకారికుల మతము.

> "అప్రస్తుతరసం యత్స్యాద్విరసం తన్నిగద్యతే." ౫౦

సరస్వతీకంఠాభరణము.

> "తపవనవాసో౽నుచితః పితృమరణశుచం జహీహి కిం తపసా,
> సఫలయ యౌవన మేతత్సమ మనురక్తేన సుతను మయా."

"అత్ర పితృమరణసంతప్తాయాస్సంభోగప్రవర్తన మప్రకృతరసత్వాద్విరసం. అప్రస్తుతః ప్రస్తావమంతరేణ సూచితో రసో యత్ర తత్తథా, వికరసప్రక్రమే హి విరోధిరసాంతరప్రస్తావ ఏవ క్రియమాణోఽనౌచిత్యవాన్. న చౌచిత్యమంతరేణ రసస్య పదసంబంధస్సంభవతి. యదాహ.—'అనౌచిత్యాదృతే నాస్తి రసభంగస్య కారణం, ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యోపనిషత్పరా' ఇతి. తవ వనవాస ఇత్యాదౌ పితృమరణానుభవప్రాప్తశోకప్రకర్షాయాశ్శృంగారప్రస్తావనా విరసాయతే." అని వ్యాఖ్య.

"అకాండే ప్రథనచ్ఛేదావంగస్యాప్యతివిస్తృతిః,
అంగినోఽననుసంధానం ప్రకృతీనాం విపర్యయః."

"వృత్తి. అకాండే అనుచితేఽవసరే ప్రథనం ప్రకటనం. యథా వేణ్యాం ద్వితీయేఽంకే అనేకవీరసంక్షయే ప్రవృత్తే దుర్యోధనస్య భానుమత్యా ప్రమోదవర్ణనం." అని కావ్యదీపిక. పంచమశిఖ.

ఈవిషయములను జూడఁగనే యీచోట నీవర్ణన మనుచితమే యని తోఁచును. కాని మహర్షియు మహాకవియు నతీంద్రియజ్ఞానసంపన్నుఁడు నగు వాల్మీకిభావ మెఱింగినచో నిది యనుచితము కాదనియు విశేషించి యుచితమే యనియుఁ దోఁపక మానదు. వారిభావ మేలాగుండును? అని మనము చర్చింపవలయును. శ్రీరామావతార మెందులకు? రావణాది దుష్టదానవనిర్మూలనార్థము. అందులకే దేవతలు బ్రహ్మయు భగవంతునిఁ బ్రార్థించిరి. వారలవేఁడికోలు చిత్తగించియే నిరంజనుఁడు సగుణబ్రహ్మ మయ్యెను. ప్రకృత్యధీనుఁ డైనయట్లే మనమంగీకరింపవలయు. ఇపుడు సీతాదేవియే మహాప్రకృతి. శ్రీరామమూర్తియే పరమపురుషుఁడు. ప్రకృతి నపహరించువాఁ డెవఁడు? ఏలోకముననైనఁ గలఁడా? ఆమెకు రూపమేది?

లోకసృష్టికిఁ గనఁబడు సీతారూపమాయా మహాప్రకృతి రూపము. ఇచ్ఛకు రూపము కలదా? బ్రహ్మము అనుశబ్దము నపుంసకలింగము. ప్రకృతిశబ్దము స్త్రీలింగము. భర్త నపుంసకుఁడు. కళత్రము స్త్రీ. ఎంత విచిత్రము? రావణుఁ డపహరించి కొనిపోవునది మహాప్రకృతిచ్ఛాయారూపము. అదియే సీత యని వాఁడు కొనిపోయెను. వాఁడేమి మూర్ఖుఁడా? కాఁడు. మహాభక్తుఁడు. భగవత్సేవకుఁడు. కారణోపాత్తాంశుస దేహుఁడు. తద్దేహనాశార్థము జ్ఞాననిధియగు సనత్కుమారుని ప్రార్థించెను. అతని కర్మమునారసి యొక నుపాయము చెప్పెను. ఆయుపాయమే సీతాహరణము. ఈవిధ మెఱిఁగినమహాత్ముల కీకార్యము విచిత్రముగాఁ నధర్మముగాఁ దోఁపదు. దేవతలు బ్రహ్మయు నెఱుంగుదురు. ఎప్పు డిప్పని సాగునా యని వేచియుండిరి. ఆకార్యము సాగినదని వినఁగానే బ్రహ్మదేవుఁ డానందించెను? మనసృష్టిచే బ్రహ్మ మహాపాపాత్ముఁడే యగును గదా. మహర్షులు హర్షించిరి. విమానము నధినయించిరి. అంచొక్కఁ దగువాల్మీకి యుచ్చోన్న మనశ్శుభభగవత్కాంతఃకరణుఁడై యుండవలయునా? ధర్మసంస్థాపన మహామంగళ కార్యమున కంకురారోపణ మైనదని యానందింపవలయునా? మీరే యాలోచింపవలయును. ఇప్పుడు హర్షాంబుధి నోలలాడుచున్నాఁడు. ఐంద్రజాలికుఁడు విచిత్రసృష్టి నగపఱచి యందొకప్రాణిం జంపును. ఆవిద్య నెఱుంగనిపామరులు వగతురు. దానితత్త్వ మెఱింగినవారు వగతురా? సంతోషమునకుఁ గొఱంత గల్గకుండనుందురు. ఏల? దానియాథార్థ్య మెఱుంగు ప్రోడలు కనుకనే యని ప్రాజ్ఞు లూహింపరా? అట్లుగాట మహాముని వాల్మీకి లోకమంగళకార్యరూపమగు నీ సీతాప

హరణమున నిట్లు వర్ణించెనని మన మెఱింగిన నీ యాలంకారి కుల దోషప్రకరణము మనల బాధింపఁజాలదు.

> "సాతు రావణవేగేన పుష్పవృష్టిస్సమంతతః,
> సమాధూతా దశగ్రీవం పునరేవాభ్యవర్తత. 30
> అభ్యవర్తత పుష్పాణాం ధారా వైశ్రవణానుజం,
> నక్షత్రమాలా విమలా మేరుం నగమివోన్నతమ్." 31

అని మూలము. సీతశిరస్సునుండి పూవులు సోనవలెఁ బడుచు రావణుని గమనవేగమున నంతటం జిమ్మంబడి వానికంటె ముందుగాఁ బోయి వాఁడు సమీపింపఁగా వానిచుట్టుఁ గనఁ బడినవి. మేరువుచుట్టు నక్షత్రమాల యావరించునట్లు రాక్షస రాజుచుట్టు నాపూవులు పరివేష్టించినవి. అని యిందలి యర్థ సంగ్రహము. ఇందలివిశేషములం బరికింతము. ఇక్కాలపు రాజవిద్యావిద్వాంసులలోఁ గొందఱు మనపూర్వులకు విశేష శాస్త్రములు తెలియవనియు, (Gravity) ఆకర్షణశక్తి యొకటియుండుటే యెఱుంగరనియుఁ దూలనాడుదురు. కాని ఆదూషణములకు మనము వగవఁబనిలేదు గాని వారితెలివికి మనము దుఃఖింపవలయును. వారు మనగ్రంథముల విశేషించి పరిశీలించినవారు కారని మాత్రమే మన మనవలయుఁ గాని వారివలె మనము వారల నిందింపరాదు. మనపూర్వులు కనుఁ గొనినవిషయములలో శతాంశమునుగూడ నింతవనుకఁ గనుఁ గొన్నవారు లేరు. ఇది సత్యము. ఆకర్షణశక్తి భూమికిం గల దనియు, నిట్టి యెన్నింటికో కలదనియు, దానిచే సకలలోక ములు నిరాధారముగా నున్నట్లు తోఁచినను నిలిచియున్న వనియు మనవారు తెల్పిరి. పండ్రెండువందలయేండ్లక్రిందనే ఆర్యభట్టు

"అనులోమగతిర్నౌస్థః పశ్యత్యచలం విలోమగం యద్వత్,
అచలాని భాని తద్వత్సమపశ్చిమగాని లంకాయాం."

అని తెలుపఁబడెను. భూమి తిరుగుచున్నదనియు, దానిచుట్టు నక్షత్రాదులు తిరుగుట లేదనియు, నట్లు తిరుగుచున్నట్లు భూమించుట తత్తత్త్వ మెఱుంగనివారికి స్ఫుటం జేసెను యనియు దీని భావసారము.

"యథా నౌస్థో నావా యానం కుర్వన్ పురుషోఽనులోమగతిస్స్వాభిమతాం పశ్చిమాం దిశం గచ్ఛన్నచలం నద్యా ఉభయపార్శ్వగతమచలం వృక్షపర్వతాదివస్తు విలోమగం ప్రాచీం దిశం గచ్ఛదివ పశ్యతి, తథా భాని నక్షత్రాణి లంకాయాం సమపశ్చిమగాని కర్తృభూతాని అచలాని భూమిగతాన్యచలవస్తూని కర్మభూతాని విలోమగానీవ ప్రాచీం దిశం గచ్ఛంతీవ పశ్యంతి. లంకాదివిషువద్దేశే హ్యేవ నక్షత్రపంజరస్య సమపశ్చిమగత్వం. ఏవం తారాణాం మిథ్యాజ్ఞానవశాదుత్పన్నం ప్రత్యగ్గమనప్రతీతిమంగీకృత్య భూమేః ప్రాగ్గతిరభిధీయతే" అని వ్యాఖ్య.

"ఆకృష్టశక్తిశ్చ మహీ తయా యత్ఖస్థం గురుస్వాభిముఖం స్వశక్త్యా,
ఆకృష్యతే తత్పతతీవ భాతి సమే సమంతాత్క్వపతత్వియం ఖే."

సిద్ధాంతశిరోమణి, గోళాధ్యాయము.

"ఆకృష్టశక్తిశ్చ మహీత్యనేన భూమేరధఃపతనం తత్తిర్యగధస్థితానాం చాధఃపతనశంకా నిరస్తా." అని వాసనాభాష్యము.

అని భాస్కరాచార్యులుగారు సుమా రెనిమిదివందలసంవత్సరముల క్రిందటనే తెలిపిరి.

"భగవన్ కిం ప్రమాణా భూః కిమాకారా కిమాశ్రయా,
కిం విభాగా కథం చాత్ర సప్తపాతాళభూమయః."

అను ప్రశ్నమునకు

మధ్యే సమంతా దండస్య భూగోళో వ్యోమ్ని తిష్ఠతి,
బిభ్రాణః పరమాం శక్తిం బ్రహ్మణో ధారణాత్మికా.'' 3౨

సూర్యసిద్ధాంతము, గోళాధ్యాయము.

అని సమాధానము చెప్పఁబడినది.

ప్రోక్తాస్తిర్యగధస్తథోపరిచయే లోకాస్సురాస్సాసురా
రక్షోభూతపిశాచకిన్నరనరా విద్యాధరా నాయకాః,
జ్యోతిష్కాగగనేచరాస్సపితరస్సిద్ధాస్తథా తాపసా
స్తేషాం బ్రహ్మకటాహధామ్ని వసతా మేకోఽస్య వర్ధిపకః.'' ౪౬

లల్లసిద్ధాంతము, భువనకోశము.

ఈ లల్లాచార్యమతము సూర్యాకర్షణమునకు లోఁబడినవే భూగోళములని స్పష్టమగు. ఈ సిద్ధాంతములన్నియు నాకర్షణ శక్తిని చెప్పుచున్నవి. ఎన్నియో వేలసంవత్సరముల క్రింద నాకర్షణశక్తియే యున్నింటికి నాధారభూతమని కనుఁగొనిరి. వారి నాక్షేపించుటకంటె దుష్కార్య మేమి కలదు? ఇఁక విషయాంతరమున నడుగుదము. ఈభాగమునఁ గల సార మేమి?

రావణాసురుఁ డరుగుచుండ సీతాదేవి తలలోనిపూవు లాతనిచుట్టు పడినవి. ఆకాశమునఁ బోవుచుండఁగా నందేస్థలమునఁ బడినవని ప్రశ్నింపరాదు. రాలిన యాపూవులు పడునపు డాతని గమనవేగజనితవాయువశమున నాతనిచుట్టు నుండెననియు, మరలఁ గ్రిందఁ బడియెననియు మన మెఱుంగవలయును. మహాభక్తుఁ డగురావణుఁడు చిరకాలమునకు స్వేష్టదేవతను గనుఁగొనఁ గల్గెను. ఆతఁడు భక్తుఁడని యాదేవి యెఱుంగును. కనుకనే యామె ధరించినపుష్పము లాతని కనుగ్రహముం దెలుపుచు, ననఁగా నేఁటికి భగవత్యనుగ్రహ

పాత్రుఁడవైతివని తెలుపుచుచు నలుక్షేపుల వ్యాఖ్యపంచననియే యిందుఁ గలసారము. ఇష్టదేవతార్చనమునకై వనమాలయ మున కలిగినపు డర్పుపంపు పూవులను బ్రసాదముగా నిచ్చు నాచారము రామాయణకాలమునుండి వచ్చినదేమో యని తోఁచుచున్నది. ఇట్లు మహర్షి వర్ణించుట సీతాపహరణతత్త్వ మెఱింగిన కారణముననే యని తెలుపఁబడుచున్నది.

> "చరణాన్నూపురం భ్రష్టం వైదేహ్యా రత్నభూషితం,
> విద్యున్మండలసంకాశం పపాత మధురస్వనమ్. 32
> తాం మహోల్కామివాకాశే దీప్యమానాం స్వతేజసా,
> జహారాకాశమావిశ్య సీతాం వైశ్రవణానుజః. 33
> తస్యాస్తాన్యగ్నివర్ణాని భూషణాని మహీతలే,
> సఘోషాణ్యవకీర్యంత క్షీణాస్తారా ఇవాంబరాత్." 34

అని మూలము. "చరణాత్ వామచరణాత్ భ్రష్టః" అని వ్యాఖ్య. ఎడమకాలియందు మధురధ్వనితోఁ గ్రిందఁ బడిన దనుటం జేసి యిఁక జగములకు మంగళములు కలుగునని తెలియంజేయుటకే మహర్షి యిట్లు చెప్పెనని మన మూహింప వలయును. స్వకీయతేజోవిశేషమునఁ బ్రకాశించు నా సీతా దేవిని మహోల్కవలెఁ గొనిపోయెననుటం జేసి రావణుఁడు వేవేగమ దహింపఁబడునని సూచింపఁబడినది. వైశ్రవణానుజుఁ డని యీ ప్రకరణమునఁ బెక్కుసారులు చెప్పుటచేత దుర్వృత్తి శూన్యుఁడనియు, భగవదనుగ్రహపాత్రుఁడు శీఘ్రకాలమునఁ గాఁగలఁడనియుఁ దెలుపఁబడుచున్నది. ఆమె యాభరణములు కొన్ని ధ్వనిచేయుచుఁ గ్రింద నాకాశమునుండి తారకలు క్రిందఁబడునట్టులు పడియెననుటం జేసి రావణుని రాజసత్త్వము

నశించుననియు, రాఁగలజన్మమున భూసంచారమే కలుగు ననియుఁ దోఁచుచున్నది.

"స తా మాకులకేశాంతాం విప్రమృష్టవిశేషకామ్. ౪౫
జహారాత్మవినాశాయ దశగ్రీవో మనస్వినీం."

అని మూలము. రావణుఁడు మనస్వినీం తాం=దృఢమనస్సు గల యాసీతను, ఆత్మవినాశాయ = తనమేలుకొఱకు, జహార= గ్రహించెను. "విగతో నాశో యస్య సః" అని సమాసము. ఈమూలమున భగవదాగమనము స్వజన్మక్లేశహారణము కలుగుననియే యతఁడు కొనిపోయెనని మన కియ్యది తెలుపు చున్నది. ఈభాగమున నధ్యాత్మరామాయణమున విశేష ణము లేవియు లేవు. తరువాతికథను బఠింతము.

## సీత రావణు నిందించుట.

* అంత జానకి తన్నుం గొనిపోవు రావణునింగని భీతిల్లి వడఁకుచు దుఃఖించుచు రోషమున నరుణనయనయై యిట్లు లాతని దూషించెను. నీచా! నాథుఁడు లేనితఱి దొంగి లించుకొని నన్నుం గొని పరుగువాఱుచున్నావే. దీన నీకు సిగ్గు గలుగలేదా. దుష్టాత్మా! నన్నపహరింపఁగోరి పిఱికివాఁ డవు కనుక మాయామృగరూపమున నానాథుని లేకుండఁ జేసి తివి. నన్నుఁ గావవచ్చిన గృధ్రరాజు మిక్కిలి వృద్ధు. ఆతనిం జంపితివి. ఎంత శూరుఁడవు ? ఎవ్వరులేనితఱిఁ బరపత్ని నప హరించితివే. ఈకార్యమునొనరించి సిగ్గుపడకున్నావేమి? ఈనీ నీచకార్యము నందఱు చెప్పుకొనఁ గలరు. నన్నపహరించు

* ఇది యేఁబదిమూఁడవసర్గమునఁ గలదు.

నపుడు నీవు చెప్పుకొన్న నీబలపౌరుషములు లరయేన్యా! సహింపఁ
బడుఁ గాక. కులపాంసనుఁడవు. పాపాత్ముఁడ వైనాఁడవు. క్షణ
కాలము నిలువుము. ప్రాణములతోఁ బోవఁజాలవు. సైన్యము
లతో నారాజకుమారులచే నిటుల జయింపఁబడి క్షణమాత్ర
మున భస్మమైపోవుదువు. దావాగ్నిస్పర్శమును బడసి యోర్వఁ
జాలనిరీతి నా రామలక్ష్మణుల బాణస్పర్శము నోర్వఁజాలవు.
నీమేలు గోరి నన్ను విడువుము. నన్నిట్లు బాధించినందు
లకై రోషించి నాపతిమిట నిన్ను జంపఁబోవును. నన్ను
నపహరించుట నిష్ఫలమే. నావలని గనక చాలకాలము జీవింపఁ
జాలవు. మరణకాలమున విపరీతములు మనుష్యులకు గనుపించును.
అట్లే నీవు విపరీతకార్య మాచరించుచున్నాఁడవు. మృతి
యాసన్నము కాఁగాఁ బథ్యపానము తోఁచదు. చావనున్న
నీకు నామాటలు హితములుగాఁ దోఁచవు. నీకు భయము
గల్గుసమయము. కాని భయపడకున్నావు. నీమృతి నీకు
సమీపించుచున్నది. త్వరగా సువర్ణవృక్షములఁ గాంచఁగలవు.
రక్తప్రవాహముగల వైతరణీనది నరకత్రాసమును యమ
లోకమునందుఁ జూడఁగలవు. అనేక ఘోరనరకములఁ జూచు
భాగ్యము నీకుఁ గలదు. శ్రీరామున కపకారము గావించి
చాలకాలము జీవింపఁజాలవు. ఎందేని పోవుదువు నశింతువు
వేమో. కాలపాశము దగిలియుండఁగా నెందుఁ బోయినను బ్రదు
కనట్లు రామబాణముల కెందున్నను బ్రాణము పోవలసినదే.
ఒక్కఁడే కదా పదునాలుగువేల మహాసురుల నుక్కడంచెను.
ఆశ్రీరాముఁడు తనయిల్లాలి నపహరించిన నిన్నుఁ దీవ్రబాణగ
ములఁ బొరిపుచ్చక వదలునా? ఇట్టిమాటల నింక ననేకములను

విలపించుచు నామె పలుకఁగా వాఁడాపలుకుల లెక్కింపక యాసాధ్విని గొనిపోయెను.

మహాత్ములారా! ఈభాగమున విమర్శింపఁదగిన మహా విషయములు లేవు. ఒకానొకటియున్నను లోపల విమర్శించిన వానిలో నంతర్భూతముగనే యుండును. సీత చెప్పిన యీ మాటలం బట్టి యామె సామాన్యమానవకాంత సంభాషించిన ట్లగుసుగదా. రావణునాశయ మెఱుంగునని యెట్లు నమ్మఁదగు ననుకొనరాదు. ఇదంతయు మహాప్రకృతి నటించుచున్నదని మన మెఱుంగందగు. తరువాతికథను బఠింతము. అధ్యాత్మరామాయణమునందు నీభాగమున విశేషములు లేవు.

## జానకి తనసొమ్ముల మూటఁగట్టి విసరివైచుట.

* రావణుఁ డట్లు లపహరించికొని పోవుచుండఁగా సీత యెందును రక్షించువారిని గానక యొకకొండశిఖరముననుండు వానరపుంగవుల నేవురఁ గాంచెను. ఆమె యావానరు లొకప్పుడు దైవాధీనముగా శ్రీరామునిం గనుఁగొందురేని నా వార్తను జెప్పినను జెప్పవచ్చునని తలంచి బంగరురంగుగల తన యుత్తరీయమునం దాభరణములను మూటగట్టి వారి నడుమఁ బడునట్లు పాఱవైచెను. ఆవిషయము నారావణుఁడు వేగముగాఁ బోవుచుండుటం దెలియఁజాలఁడయ్యె. గోరోజనపురంగుగల యాకపిపుంగవులు సామాన్యులు గారు. "రామా! రామా" యని విలపించుచుఁ బోవునాసాధ్విని నిలిం

* ఇయ్యది యేఁబదినాల్గవసర్గమునఁ గలదు.

పులంబోలి వారు చూచుచుండిరి. ఆరక్కసుఁడు పంపాసరస్సును గడచి యంతదనుక రామాశ్రమమునందుంచిన చూపును మరల్చికొని లంకాభిముఖముగాఁ బోయెను. క్రూరపన్నగమును దీసికొనిపోవు చందమున నాసాధ్విని చంకనిడుకొని వెనుసంతసమునఁ బోయెను. వేగముగా నన్ని యుపవనములను సరస్సులను దాఁటి పోయెను. పిదప సముద్రమును గూడ దాఁటెను. వానిపోకడం గనిపెట్టి చారణులు "వీని కాయుస్సు ముగిసిన"దని పలికిరి. సిద్ధులు "తథాస్తు" అనిరి. మృత్యువును బలె నా సీత నెత్తుకొని లంకానగరముం జొచ్చెను. అంతఃపురమును జొచ్చి మయుఁడు స్వయంప్రభ నొకబిలమున నునిచిన రీతిగా దీనురాలగు నాసీత నందునిచెను. పిశాచములవలె భయంకరముగాఁ గనంబడు రాక్షసస్త్రీలతో నాయాజ్ఞను బడయక పురుషుఁడుగాని స్త్రీగాని యీసీతను జూడరాదు. మీరు కావలియుండవలయును. సీత యేవస్తువును గోరునో యద్దానిని నాకు నిచ్చునట్లే వెంటనే యియ్యవలయును. ఎవ్వతుకగాని యీసీతను నప్రియముగాఁ దెలిసియో తెలియకయో పలుకునేని దానికిఁ బ్రాణము లుండవు.

అని రావణుఁడా స్త్రీలకు నుత్తరవుచేసి యంతిపురి వెడలి యింకేమి చేయవలయునని విచారించి యందుండు మహాబలశాలుర నెనమండ్రుగురను రాక్షసులం గాంచి వారింబొగడి మీరు సకలాయుధముల ధరించి వేగముగాఁ బయనము చేయుఁడు. ఖరుఁడున్న జనస్థానమిపుడు శూన్యమై యున్నది. అందుఁ గాపురముండుఁడు. మున్నందుండు ఖరప్రముఖ రాక్షసులను రాముఁడు చంపెను. కాన నాకుఁ గ్రోధము నిర్భరముగా నున్నది. దేహము తెలియక యున్నందున నేఁ

బోవరాదు. ఆరామునిపైఁ గలవిరోధమును దీర్చుకొనఁ దలఁచియున్నాను. వానిం జంపకున్నచో నాకు నిద్రపట్టదు. అందులకే బలపౌరుషముల మీరు పూనియుండుఁడని చెప్పెదను. ఖరదూషణాదుల నతిక్రూరముగాఁ జంపిన యారాముని జంపుదు నేని దరిద్రునకు నిధి దొరకినట్లు సుఖము నొందుదు. మీరందుండి యాతనిప్రవర్తనము లన్నియుఁ దెలిసికొని నాకుఁ దెలుపుచుండవలయు. ఆతనిం జంప వేచియుండవలయు. రణరంగముల మీపరాక్రమముల ననేక పర్యాయములు చూచితిని. కనుకనే మిమ్మీకార్యమునకు నియోగించుచున్నాను. వారాపలుకుల కుబ్బి యాజనస్థానమునకుఁ బోయిరి. అంతట రావణుఁడు సీతను గని యత్యంత కామవికారమునొంది రామునితో విరోధము గొన్నందులకు దుఃఖపడవలసినవాఁడయ్యు సంతోషమున నుండెను.

మహాశయులారా! ఈభాగమును విమర్శింతము.

"దదర్శ గిరిశృంగస్థాన్ పంచవానరపుంగవాన్. ౧
తేషాం మధ్యే విశాలాక్షీ కౌశేయం కనకప్రభం,
ఉత్తరీయం వరారోహా శుభాన్యాభరణాని చ. ౨
ముమోచ యది రామాయ శంసేయురితి మైథిలీ,
వస్త్రముత్సృజ్య తన్మధ్యే నిక్షిప్తం సహభూషణం. ౩
సంభ్రమాత్తు దశగ్రీవస్తత్కర్మ న స బుద్ధవాన్,
పింగాక్షాస్తాం విశాలాక్షీం నేత్రైరనిమిషైరివ. ౪
విక్రోశంతీం తథా సీతాం దదృశుర్వానరర్షభాః." ౪౫

అని మూలము. జానకి రావణుఁడు తన్నుఁ గొనిపోవుచుండ నొక కొండశిఖరముపై వానరేంద్రపంచకమును జూచి వస్త్ర

మును జించి యాభరణములు కొన్ని కట్టి వారినడుమ పడవై
చెను. వారు రామునకుఁ జెప్పినను జెప్పవచ్చునని. సీతాపహరణ
సంభ్రమమున రావణుఁ డావిషయము నెఱుంగఁడయ్యె. అని
యిందలి కథాసారము. రాముని యెడమప్రక్కయందు సీత
యున్నది. పదిచేతు లాప్రక్కన వాని కున్నవి. వాఁడామెను
కదలకుండఁ బట్టుకొనియే యుండునుగదా. అట్టుండ నామె వస్త్ర
మునఁ గొసభాగమును జింపి సొమ్ములు మూటఁగట్టి వేయఁ
జాలునా? అనుశంక కలుగకపోదు. సీతను సామాన్యమానవ
కాంతగా భావించునెడల నిది యసంగతమే యగును. భగవతి
యగుప్రకృతిగా భావించునెడల నిది యత్యల్పకార్యమని తెల్ల
మగును. ఎవ్వారు సీతారాములు మానవులని భావింతురో
వారల కీరామాయణమే రుచింపదు. భగవదవతారములని
వారిని భావించువారల కిది సుసంగతమే యని తోఁపకపోదు.
ఆవానరేంద్రులేవురు చక్కఁగా సీతను గాంచిరి. అత్తఱి
వారనిమేషులైయుండిరి. ఇందలిసార మేమనఁగా: జానకి
సుగ్రీవాదులతో స్నేహము చేయవలయుననియు, వారిమూల
మునఁ గార్యము సాగింపవలయునని శ్రీరాముని హెచ్చరిం
చెను. ఆత్రోవననే వచ్చును రాముఁడని యామె యెఱుంగును.
తనయాభరణములను వారు చూపుదురు. దాన శ్రీరాముఁడు
వారికి మిత్త్రుఁ డగును. అని. విశేషార్థ మేమనఁగా: వారు
శ్రీరామభక్తులు కాఁగలరు. అం దొక్కఁడగు సుగ్రీవుఁడు
వానరప్రభువు కాఁగలఁడు. ఆతనికి భావిశుభఫలములకుఁ
జిహ్నముగా నాశీర్వచనపూర్వకముగాఁ దనయాభరణముల
నొసంగి వీని నర్చించుచుండుఁడు. మేలుగలుగునని భావింపుఁడు.
అని యాభరణముల వైచెనని. రాజ్యలక్ష్మి యాతని వరింప

నున్నది. దానికిఁ జిహ్వామే యారత్నమయాభరణములు. లోకమున భాగ్యము రానుండఁగా నతనికిముందు ధనము దొరకు ననుట సుప్రసిద్ధము కదా. అట్లే సుగ్రీవునిభావిభాగ్యము నెఱింగి సీతాదేవి యనుగ్రహించెనని మన మెఱుంగవలయును.

"తత్ర తామసితాపాంగాం శోకమోహపరాయణాం. ౧౩
విదధే రావణస్సీతాం మయో మాయామివ స్త్రియమ్."
"మయో మాయామివాసురీం" అనియుఁ బాఠము.

అని మూలము. మయుఁడు ఆసురిమాయనువలె రావణుఁ డంతఃపురమున నునిచెను. మాయాదేవియేకదా సీత. ఆప్రకృతిని దనయంతఃపురమున నునిచెనని భావము. దీనిచే శ్రీరామపత్ని రామునికడనే యున్నదని సూచింపఁబడినది.

"అబ్రవీచ్చ దశగ్రీవః పిశాచీర్ఘోరదర్శనాః. ౧౪
యథా నేమాం పుమాన్ స్త్రీవా సీతాం పశ్యత్యసమ్మతః,
ముక్తామణిసువర్ణాని వస్త్రాణ్యాభరణాని చ. ౧౫
యద్యదిచ్ఛేత్తదేవాస్యా దేయం మచ్ఛందతో యథా,
యాం చ వక్ష్యతి వైదేహీం వచనం కించిదప్రియం. ౧౬
అజ్ఞానాద్యది వా జ్ఞానాన్న తస్యా జీవితం ప్రియం."

అని మూలము. రాక్షసకాంతలం బిలిచి యీసీతాదేవిని గాపాడుచుండవలయు. నాయనుమతి లేక పురుషుఁడుగాని స్త్రీగాని సీతను జూడరాదు. ఈదేవి యెప్పు డేమి కోరునో యప్పుడే దాని నీవలయును. తెలిసికాని తెలియకకాని జానకి కప్రియము చేసినవారు జీవింపరు. అని యాజ్ఞాపించెను. దీని భావ మేమి? రావణుఁడు సీతాదేవిని దెచ్చుట యైహికసుఖా

ర్థము కాదు. తనజన్మము తరించునిమిత్తము. కావున శ్రీరామాగమనపర్యంతము సీతాహృదయము నెఱింగి వర్తింప వలయు. ఎవ్వరైన నట్లు వర్తింపరేని వారు మృతినొందుదురని గట్టియుత్తరువు చేసెను. ఈయుత్తరువుసార మేమి? సామాన్యముగా నిర్బంధింపఁదగినదియే సీతయని తెలుసు. ఎలయనఁగాఁ బోలుతనే తన్నంగీకరింపనిచో సీతయని . యాతఁడెఱుంగునుగదా. మంచిమాటలను లొంగపనియు నతఁ డెఱుంగును. కడపటియుపాయము ప్రయోగింపఁదగినదేకదా. నిర్బంధించి చూతమని యతఁ డూహింపవలసియుండును. అట్లుండఁగా నెవరుగాని సీతను జూడఁగూడదని యేల యుత్తరు విచ్చెను? అనఁగా నేకాంతవాసమే యామెను సుచితమనియు, నద్దానఁ దనకు మేలు గలుగుననియు నాతఁ డూహించెను. కావున నాతఁ డాదేవిని గాముకుఁడై తోలేసని మన మూహింప నవకాశము కలుగుచున్నది.

"తం త్విదానీమహం హత్వా ఖరదూషణఘాతినం,
రామం శర్మోపలప్స్యామి ధనం లబ్ధ్వేవ నిర్ధనః. ౨౫
జనస్థానే వసద్భిస్తు భవద్భి రామమాశ్రితా,
ప్రవృత్తిరుపనేతవ్యా కిం కరోమీతి తత్త్వతః. ౨౬
అప్రమాదాచ్చ గంతవ్యం సర్వైరపి నిశాచరైః,
కర్తవ్యశ్చ సదా యత్నో రాఘవస్య వధం ప్రతి. ౨౭
యుష్మాకం చ బలజ్ఞోఽహం బహుశో రణమూర్ధని,
అతశ్చాస్మిన్ జనస్థానే మయా యూయం నియోజితాః." ౨౮

అని మూలము. శ్రీరాముఁడు ఖరదూషణప్రముఖులఁ జంపి నవాని జంపి నిర్ధనుఁడు ధనము దొరకినపుడువలె సుఖము

నొందుదును. అనఁగా భావమేమి? "హాత్వా"అనఁగా నాతనిం బొంది యని యర్థము. "హానహింసాగత్యోః" అని ధాత్వర్థము. శ్రీరాముని కడఁ జేరినఁగాని సుఖమునొందనని తాత్పర్యము. మీరు మాత్రము జనస్థానమున నుండి శ్రీరాముని ప్రవృత్తిని గనిపెట్టి యథార్థము నాకుఁ దెలుపుచుండవలయు. ప్రమాదము లేక పోవలయు. నిరంతరము రామవధప్రయత్నమునే చేయువలయును. ఇది పై భావమునకు విరుద్ధముగాదా యందురేమో కాదు. రాక్షసులను బంపుచు వారలు రాము నోడింపఁజాలరని యోజించినవాఁడు కాన ఖరదూషణాదుల చావును దెలిపి వారద్దానిచే నిస్పృహులగుదురేమో యని రామవధప్రయత్నమున నుండుఁడని తెలిపెను. అంతియకాని రాముని మార్గోన్ముఖుఁడని యాజ్ఞాపింపలేదు. కాన నీభావము పైదానికి విరుద్ధము కాదు. మఱియు మీ బలములు నెఱుంగుదును. కాననే జనస్థానమున నివసించుటకుఁ బంపుచున్నానని గుఱు. ఈభావము నీక్రిందిమూలము దృఢపఱచుచున్నది.

"విహాయ లంకాం సహితాః ప్రతస్థిరే
యతో జనస్థానమలక్ష్యదర్శనాః."    ౨౮

వారు రామవధమునకే పోవునెడలఁ గనఁబడకయుండఁ బోవనేల? ఎనమండ్రుగూరే ఏల పోవుదురు? సైన్యమేది? కావున శ్రీరామప్రవృత్తిని గనిపెట్టుటకే రావణుఁడు వారిని బంపెనని తాత్పర్యము గ్రహింపం దగును. ఈభాగశ్రవణపఠనఫలము వినుఁడు. "సీతాపహారమారభ్య లంకాయాం స్థాపనావధి, శ్రవణాచ్ఛాస్త్రవిహితాత్ జ్యేష్ఠాదేవీ వినశ్యతి." అని. తరువాతి కథ వినుఁడు.

## రావణుఁడు సీతాదేవికిఁ దనయైశ్వర్యమును జూపుట.

* రావణుఁడు రక్కసులను జనస్థానమున కనిపి తన్నుఁ గృతార్థునిగాఁ దలంచుకొనియెను. అంతఃపురమున రక్షస్త్రీల నడుమ వగచుసీతం గాంచెను. ఆమె తలంపఁబడని దుఃఖముల పాలై యుండఁగా నామెకుఁ దన యంతఃపురమునంతయుఁ జూపెను. అనేకవిమానము లందుండెను. వనితలందు నుండిరి. పక్షులు కూయుచుండెను. నవరత్నఖచితభాగములు గల యామేటిసౌధము నాసీతకుఁ జూపెను. బంగరుసోపానము లెక్కెను. అందుఁగల గవాక్షములమూలమున విచిత్రస్థలముల నాజానకికిఁ జూపెను. ఎన్నియోవిచిత్రము లగుభాగములనుజూపి యామెను సంతోషపఱుపం గోరి, "జానకీ! పదికోట్లరాక్షసు లున్నారు. వారలను నేను భరింతును. నాకుఁ గల దివ్యవస్తువులు నీయధీనము చేసెదను. నాప్రాణములు నీ యధీనములే. నీవు నాకుఁ బ్రాణములకంటె నెక్కుడు. నీవు నాకు భార్యవు కమ్ము. నాభార్యలకెల్ల నీవె యధిష్ఠాత్రివి యగుదువు. నామాట నాలకింపుము. రాముఁడేను నేలుబుద్ధి నిలుపఁడిన లాభ మేమి? కావున నన్నంగీకరింపుము. మన్మథపీడితుఁడనగు నామీఁద ననుగ్రహ ముంచుము. ఈలంకానగరము సాగరాంతరమున నున్నది. దేవాసురు లొక్కటిగ వచ్చిన సాధింపఁజాలని పురమిది. నన్ను మార్కొనువారే లేరు. రాజ్యభ్రష్టుఁడు, దీనుఁడు, తాపసి, అల్పాయుష్కుఁడు, అల్పతేజస్కుఁడు, కేవలమానవుఁడు నగు రామునితో నీకుఁ బనియేమి? నీవు నన్నే

* ఇయ్యది యేఁబదియైదవసర్గమునఁ గలదు.

చేపట్టుము. నేనే నీకు భర్తను గాఁదగినవాఁడను. భీరూ! యౌవనము శాశ్వతముగ నుండునది కాదు కదా. నాతోడ నిందు విహరింపుము. రాముని జూడఁదగునని మది నాశ యునుపకుము. అతని కిచ్చటికి రావలయునని తలంచుటకుఁ గూడ శక్తి యేది యున్నది? వాయువును బంధింపను, అగ్నిని బట్టుకొన నలవిగానియట్లు నా బాహువులచేఁ బాలింపఁబడు నిన్నుఁ బరాక్రమమునఁ గొనిపోవువాఁ డీలోకత్రయము నందుఁ గానరాఁడు. ఇందుండి యీరాజ్యమును బాలింపుము నాయట్టివారును దేవతలు జంగమస్థావరములు నీకుఁ బరిచార కుల మగుదురు.నీవు పట్టమహిషివిగా నభిషిక్తురాలవై సంతో షమున నన్ను రంజిల్లం జేయుమా. పూర్వపాపకర్మము వన వాసముచే నశించినది. ఇఁకఁ బుణ్యఫలముల నిం దనుభవిం పుము. నా వేఁడికోలు నంగీకరింపుము. సీతాదేవీ! నాతోడ దివ్య గంధాదిభోగ్యవస్తువుల నెన్నియే ననుభవింపుము. నాయన్న యగు కుబేరునను విమానము గలదు. సూర్యసంకాశ మగు దానిని జయించి తెచ్చితిని, అది యనుపమానము. అందుఁ గూరుచుండి నన్నుఁగూడి విహరింపుము. మనోహరమగు నీ మోము దుఃఖమునఁ బ్రకాశింపకున్నదే? దుఃఖము నింక మానుము.”

అని పలుకఁగా నాజానకి చేలాంచలము మోమున కడ్డ ముగా నుంచుకొని యశ్రువుల వదలెను. అట్టి యాసాధ్విం గాంచి రక్షఃపతి,“చంద్రవదనా! పతిని వదలి వేఱొకని గ్రహిం చిన ధర్మలోపమని తలంపకుము. దైవవశమునఁ గల్గిన యీ మనసంబంధ మధర్మము కాదు. ఋషులచే నంగీకరింపఁబడినదే. నీచరణారవిందములు నలఁగునట్లు పెక్కుసారులు మ్రొక్కితిని.

నాపై ననుగ్రహ మునుపుమా. నీకు లోనైతిని. నీ దాసుఁడనైతిని. మన్మథతాపార్దితుఁడనగుట నీ నీచోక్తులం బల్కితిని. ఈనే నింతదనుక నెట్టిస్త్రీకిని మ్రొక్కనెఱుంగను." అని పలికి యెన్ని యోభంగులఁ బ్రార్థించెను.

మహాశయులారా! ఈభాగమున విమర్శనార్హములగు విషయము లనేకములు గలవు. పరిశీలింతము. ఈసర్గమున లోకదృష్టిచే సీతాశోకప్రదర్శనము రావణప్రార్థనము చెప్పఁబడుచున్నది.

"యదిదం రాజ్యతంత్రం మే త్వయి సర్వం ప్రతిష్ఠితం,
జీవితం చ విశాలాక్షి త్వం మే ప్రాణైర్గరీయసీ." ౧౬

అని మూలము. "విశాలాక్షి!" అనునది భక్తభావబోధకముగా గ్రహింపవలయును. "కమలాక్షః" అనునది భగవద్విశేషణముగా గ్రహించునట్లు. విశాలనయనములనఁగా గరుణాపూర్ణములని యర్థము. కామాక్షి, మీనాక్షి, విశాలాక్షి లోనగు పేరులు దేవికిఁ బ్రసిద్ధములు గదా. శృంగారరసపూరితములా యవి? కావు. కామాక్షి యనఁగా గోర్కులనిడెడు కన్నులుగలదియనియే యర్థము. కరుణాపూర్ణనయనములు గల యోదేవీ! నాయీ రాజ్యతంత్రమెల్ల నీయందే యుంచితిని. నీవు న న్నంగీకరించినయెడల నారాజ్యము నీకిత్తునని యాతని భావము కాదు. ఇఁక జీవితము చాలకాలము నిలువదు. కాన నిన్నాశ్రయించితిని. నీసేవ చేయఁబూనితిని. నారాజ్యలక్ష్మి నీకు సమర్పించితినని భావము. నాజీవితమును గూడ నర్పించితిని. "మే ప్రాణైర్గరీయసీ త్వమ్" నాకీలోకమున నిపుడు ప్రాణములకంటె మిక్కిలి గౌరవింపఁ దగినవస్తువు నీవే. "అన్యథా

శరణం నాస్తి త్వమేవ శరణం మమ, తస్మాత్కారుణ్యభావేన రక్ష రక్ష మహేశ్వరి" అనుభావమే యిందును గలదని యెఱుంగవలయును. ఈయర్థమును గ్రహింపనిచో నుత్తర కాండమున సనత్కుమారుని రావణుఁ డడిగినప్రశ్న మసంగతంబగు. కావున నిట్లే గ్రహింపవలయును.

"బహూనాం స్త్రీసహస్రాణాం మమ యోఽసౌ పరిగ్రహః,
తాసాం త్వమీశ్వరా సీతే మమ భార్యా భవ ప్రియే." ౧౭.

అని మూలము. విశేషార్థ మిట్లు. "భార్యా భవ ప్రియే" అనుచోట, "భార్యా అభవప్రియే" అని పదవిభాగము. భవ మనఁగా సంసారము. అభవము మోక్షము. మోక్షప్రియురాలా! "భార్యా = భా చాసావార్యా." అని సమాసము. చిద్రూపిణివియుఁ బూజ్యురాలునని యర్థము. జ్ఞానస్వరూపిణివి. సర్వమునిపూజ్యురాలవు అని తాత్పర్యము. త్వం = నీవు, "మమ యోఽసౌ పరిగ్రహః తాసామీశ్వరా భవ"పరిగ్రహ శబ్దము పుంలింగము. భార్యార్థబోధక మిటనగు. నేను వివాహము చేసికొనిన భార్యలకెల్ల నధిపతివి కమ్ము. నాకెట్లుపాస్య దేవతవో నాభార్యలగు మందోదరి లోనగువారలకెల్ల నుపాస్యదేవతవు కమ్ము. నేను భార్యలు నీదునేవచేయ సిద్ధముగ నున్నామని భావము. ఈశ్వరీశబ్దము సాధారణముగా నీకారాంతముగనే వాడఁబడుచున్నది. "ఈశ్వరస్యేయ మీశ్వరీ" అని సమాసము. ఇచ్చోట నాకారాంతముగాఁ గనుపట్టుచున్నది.

సూ. స్థేశభాసపిసకసోవరచ్. 3. ౨. ౧౭౫.
స్థావరః ఈశ్వరః భాస్వరః పేశ్వరః కస్వరః.

సూ. అజాద్యతష్టాప్. ౪. ౧. ౪

దీనిచే నాకారము రాఁగా ఈశ్వర్యం యని యయ్యెనని యెఱుంగందగు. ఓకమలాక్షీ! నేను నాభార్యలు నీవే దేవత వని నమ్మియున్నారమని సారము.

"సాధు కింతేఽన్యయా బుద్ధ్యా రోచయస్వ వచో మమ,
భజస్వ మాభితప్తస్య ప్రసాదం కర్తుమర్హసి." ౧౮

అని మూలము. అభితప్తస్య = చిరకాలమునుండి నిన్ను నారాధింపఁగోరుచు నది యొదవు టన్నఁడు యని తెలుపఁబోలగు చున్న, మమ వచః రోచయస్వ=నామాటను సమ్మతింపుము. తే అన్యయా బుద్ధ్యా కిం = నీఁడు భర్తుఁడా కాఁడా యనుభిన్న భావము నీకేల? సాధు ప్రసాదం కర్తు మర్హసి = చక్కఁగా ననుగ్రహింపుము. అని యర్థము. తేఽయుక్త ఇట్లుపలబ్ధ మగు ననరాదు. అన్యయా బుద్ధ్యా=రామవిషయకబుద్ధి చేత, అనునది యె ట్లుపలబ్ధమో యిదియు నట్లే యని యెఱుంగవలయు. దేవీ! చిరకాలమునుండి నిన్ను సేవింపఁ గోరుచున్నాఁడ. నాయీమాట నంగీకరింపుము. భర్తుఁడు కాఁడేమో యను సంశయము మానుము. చక్కని యనుగ్రహమునిచ్చి నన్ను రక్షింపుము. అని దీనిసారము.

"రాజ్యభ్రష్టేన దీనేన తాపసేన గతాయుషా,
కిం కరిష్యసి రామేణ మానుషేణాల్పతేజసా. ౨౧
భజస్వ సీతే మామేవ భర్తాహం సదృశస్తవ,
యావనం వ్యాఘ్రవం భీరు రమస్వేవ మయా సహ." ౨౨

అని మూలము. విశేషార్థము. రాజ్యభ్రష్టేన = రాజ్యాద్భ్రష్టా శ్ఛత్రవో యస్మాత్తేన. అని సమాసము. ఎవ్వానివలన శత్రువులు

రాజ్యమునుండి పాఱిపోయిరో అట్టి పరాక్రమశాలియు, దీనేన తాపసేన గతాయుషా = అనున దేకపదము. దీనానాం ఇనః ప్రభుః దీనేనః=దీనరక్షకుఁడు. తాపసానాం ఇనః ప్రభుః తాపసేనః = మహర్షుల కీశ్వరుఁడు. గతం ఆయుర్యస్మాత్సః గతాయుః=భూలోకమున ధర్మసంస్థాపనము చేయునంతదనుక నాయుస్సు నొందినవాఁడు, మానుషేణ = మనుష్యరూపమున నవతరించినవాఁడు, అల్పతేజసా అల్పమన్యేషాం తేజో యస్మాత్సః=ఎవనికంటె నెల్లరతేజ స్స్వల్పమో యట్టివాఁడు.

"తమేవ భాంతమనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి"

అనుశ్రుతి ననుసరించి భగవంతుని మించినతేజస్సు గలవారు లేరనియె సిద్ధాంతము. రామేణ కిం = భగవంతునిగూర్చి యేల విచారించెదవు. శీఘ్రము వచ్చునని యారావణునాశయము.

మామేవ=అనుచోట, మా మే అవ. అని పదవిభాగము. లక్షణచేత నింపుఁగల యౌవనశబ్దము సర్వావస్థోపలక్షణము. అనుటంజేసి యౌవనపూర్ణాయుమంతయు నని యేర్పడుచున్నది. 'యతః' అని యధ్యాహార్యము. ఏకారణమువలన మే=నా యొక్క, యౌవనము = త్వత్పాదారవిందసేవానుకూలమగు నాయుస్సంతయు, అధ్రువమ్=స్థిరముకాదో. యతః=ఎక్కారణమున, అహం=నేను. తవ=నీకు, సదృశః-సమానుఁడనగు, భర్తా= భృత్యుఁడనో, "బిభర్తి శుశ్రూషాదినా స్వామినమితి భర్తా" యని వ్యుత్పత్తి. అతః=ఆకారణమువలన. "యత్తదోర్నిత్య సంబంధః" అనున్యాయము ననుసరించి యాకారణమువలనను నది తోఁచుచున్నది. మా=నన్ను, భజస్వ=కింకరునిగా నంగీకరింపుము. అవ=కాపాడుము. ఆకార్యమునకై, మయా సహ=మా

శబ్దము లక్ష్మీవాచకము. దాని తృతీయావిభక్తి యిది యగు. రాజ్యలక్ష్మితోఁ గూడనని యర్థము. రమస్వ=విహరింపుము. ఓ జగజ్జననీ! నాజీవితము స్థిరము కాదు. కాన నెంతో కాలము నీ పాదారవిందములకడ సేవ చేయఁజాలను. నీవు నేను దగిన సేవకుఁడను. కాన నన్నుఁ బాదసేవచేయుభక్తునిగాఁ గైకొనుము. నన్ను రక్షింపుము. ఈకావ్యమునకే యీయలంకారనగరమునందు రాజ్యలక్ష్మితోడ విహరింపుము అని యర్థ మేర్పడుచున్నది. రమస్వ=అనునది శృంగారార్థద్యోతకమగుట నిట వ్రాసినయర్థము ప్రాసంగికమందురేమో. ఇంచుక యాలకింపుఁడు. రమాశబ్దము లక్ష్మీవాచకము. దానిసమాస మేమి? రమయతీతి రమా. రముక్రీడాయాం. లక్ష్మీః. ఇతి మేదినీ. భాగవతే.

"ఏధ ప్రసన్నవరదో రమయాత్మశక్త్యా
యద్యత్కరిష్యతి గృహీతగుణావతారః. 3స్కం. ౯ అ. ౨3శ్లో.
రమా యత్ర న వాక్తత్ర యత్ర వాక్తత్ర నో రమా,
తే యత్ర వినయో నాస్తి సాచ సాచ సచ త్వయి."

అని యుద్భటుఁడు.

ఇందు రమాశబ్దమునకు విహరించునది యని యర్థ మెట్లు మర్యాదను బోధించునదిగాఁ దెలుపఁబడినదో, రామశబ్దమునకు మునిమనఃపద్మముల విహరించువాఁ డనునర్థ మెట్లు చెప్పఁబడినదో యిందు నట్లే యేల గ్రహింపరాదో తెలియఁజాలకున్నాఁడను. తెలివి తక్కువగా నాక్షేపింపరాదనియే సమాధానము.

"దర్శనే మా కృథా బుద్ధిం రాఘవస్య వరాననే,
కాస్యశక్తిరిహాగంతు మపి సీతే మనోరథైః. ౨3

న శక్యో వాయురాకాశే పాశైర్బద్ధుం మహాజవః,
దీప్యమానస్య వాప్యగ్నేర్గ్రహీతుం విమలాం శిఖాం. ౨౮
త్రయాణామపి లోకానాం న తం పశ్యామి శోభనే,
విక్రమేణ నయేద్యస్త్వాం మద్బాహుపరిపాలితాం. ౨౯

అని మూలము. ఇందలివిశేషార్థ మిట్లు. వాయువును త్రాళ్లం గట్టుటను అగ్నిజ్వాలను బట్టుకొనుటకు శక్యమే కానిచంద మున లంకాప్రవేశ మెవ్వానికి నూహింపనైనఁ దరముకాదు. "రామం వినా" అనునది స్వతస్సిద్ధముగాఁ దోఁపకమానదు. శ్రీరాముఁడుతప్ప నితరు లిందుఁ బ్రవేశింపఁజాలరని యర్థము. అట్లే నాబాహుపరిపాలిత వగునిన్ను హరించువానిని శ్రీరాముని దప్ప నొండొక్కనిఁ జూడఁజాలను. "రాఘవస్య దర్శనే మా కృథా బుద్ధిమ్" శ్రీరామదర్శన మెప్పుడని తొందఱపడక యుండుమా యని యతఁడు ప్రార్థించెను.

"లంకాయాం సుమహద్రాజ్యమిదం త్వమనుపాలయ,
త్వత్ప్రేష్యా మద్విధాశ్చైవ దేవాశ్చాపి చరాచరాః." ౩౬

అని మూలము. దీనిచే రావణుఁడు సర్వస్వముఁ దన్నును దన కులదేవతయగు సీతాదేవికి సమర్పణము చేయుచున్నాఁడు. నావంటివారు పరిచారకు లగుదురనుటయే యాత్మార్పణము. లంకారాజ్యమును బాలింపుమనుటయే ఆత్మీయసర్వస్వసమర్పణము. అని తెలియందగు.

"దుష్కృతం యత్పురా కర్మ వనవాసేన తద్గతం. ౩౭
యశ్చ తే సుకృతో ధర్మస్తస్యేహ ఫలమాప్నుహి."

అని మూలము. వనశబ్దము జలవాచకము. వనవాసేన= (మయా) జలములనుండు లంకాపురి నివసించునాచేత, పురా

యద్దుష్కృతం కర్మ=కృతం అని యథ్యాహార్యము. మున్నే దుష్కర్మ మొనరింపఁబడెనో, తత్ గతం = అది గతించెను. ఏల? నీదర్శనముచేత నని తాత్పర్యమానము. "పురా మయా యో సుకృతో ధర్మః" నాచే మున్ను చేయఁబడినధర్మము. తస్యఫలం = దానిఫలమును, తే=నీకు నివేదించుచున్నాఁడను. అప్నుహి=పొందుము. అనఁగాఁ బరిగ్రహింపుము. ఇచ్చో స్వకృతసత్కర్మఫలసమర్పణము చెప్పఁబడినది.

"ఇమా మాల్యాని సర్వాణి దివ్యగంధాని మైథిలి. ౨౮
భూషణాని చ ముఖ్యాని సేవస్వచ మయా సహ."

అని మూలము. మయా=నాచేత సర్పింపఁబడిన మాల్యాదులను, సహ ఏకదైవ = ఒక్కసారిగనే, సేవస్వ=అనుభవింపుము. ఇట సకల భోగపదార్థత్యాగము చెప్పఁబడినది.

"అలం వ్రీడేన వైదేహి ధర్మలోపకృతేన చ. 3౮
ఆర్షోయం దైవనిష్యం యస్త్వామభిగమిష్యతి."

అని మూలము. అలం వ్రీడేన=సిగ్గు చాలును. ఈసేవకరక్షణమున సంశయ మేలయని భావము. ధర్మలోపభయ మేలయని సారము. అయం దైవనిష్యందః=దైవప్రతిపాదితమగు సీసేవ్యసేవకరూపసంబంధము, ఆర్షః = అనాదిసిద్ధము. ఇయ్యదియే. త్వామభిగమిష్యతి=నీకుఁ గలుగుచున్నది. అనఁగా నియ్యది క్రొత్తది కాదని భావము. ఇట్లు రావణుఁడు తెలుపఁగా నామాయాసీత యతనిప్రార్థనమును నిరాకరించి బదులుచెప్పకుండెనని కలదు. అదేలయన్న. నందున్న తమోగుణప్రధాన స్త్రీజనుల కీతత్త్వము తెలియఁగూడదనియే సీతాహ్వాదయము.

---

"తతస్సముద్రముల్లంఘ్య లంకాం గత్వా స రావణః,

స్వాంతఃపురే రహస్యే తామశోకవిపినేఽక్షిపత్,
రాక్షసీభిః పరివృతాం మాతృబుద్ధ్యానుపాలయత్." ౬౫

అధ్యాత్మరా. అర. ౭-సర్గము.

అను నీయధ్యాత్మరామాయణవచనములు శ్రీరామాయణమున వ్రాసిన విశేషార్థమునే సిద్ధాంతము చేయుచున్నది. మాతృబుద్ధి ని రక్షించెననునదియే కదా వాల్మీకిరామాయణ విశేషార్థసారము. ఈయర్థమును గ్రహించినయెడల రామాయణ ముత్తమోత్తమగ్రంథ మగును. ఇఁకఁ దరువాతికథను బఠింతము.

## రావణుఁడు సీత నశోకవనమున నునుచుట.

* రావణుమాట లాలించి జానకి భయంపడుట మాని పతివ్రత పరపురుషునితో విస్తరించి మాటలాడరాదన్న నియమము ననుసరించి నేనముం దొకతృణము నునుచుకొని రావణునితో నిట్లు పలికెను. దశరథమహారాజు సత్యసంధుఁడు. ఆతని కుమారుఁడు శ్రీరామచంద్రుఁడు. ఆకులమునకు వచ్చిన యీసీత యాసదాచారమును దప్పి ప్రవర్తించునా? శ్రీరామమూర్తి ధర్మాత్ముఁడని త్రిలోకప్రసిద్ధిని గాంచినవాఁడు. ఆమహాత్ముఁడే నా హృదయేశ్వరుఁడు. నాకు దైవమగును. అట్టివానిపత్ని మర్యాద దప్పునా? ఆరామునకు సౌమిత్రి తమ్ముఁడు. వారిరువురు వచ్చి నీప్రాణములఁ దీయఁగలరు. రామచంద్రునెదుట నన్నుఁ గొని తెచ్చియుందువేని ఖరునివలె జనస్థానమున శయ

* ఇయ్యది యేఁబదియాఱవసర్గమునఁ గలదు.

నించియుందువు. అనేకవీరరాక్షసులు నీకుఁ గలరంటివి కదా. గరుత్మంతునియందు సర్పవిషము నిరర్థకమైనయట్లు రాముని కడ వారిపరాక్రమము పనికిరాదు. ఆ రాముని బాణములు నీప్రాణములను దీయఁగలవు. దేవదానవమానవధృష్యుఁడ వగు నీవు శ్రీరామునకు విరోధివైతివి. కావున నారామబాణములను తప్పించుకొనుశక్తి కలవాఁడవు కావు. యూపస్తంభబద్ధపశువునకు జీవితాశ లేనిచందమున నీకు బ్రదుకుపై నాశ లేదు. రావణా! శ్రీరాముఁడు రోషమున నిన్నుం జూచునేని దగ్ధుఁడవగుదువు సుమా! శ్రీరాముఁడు చేయఁజాలనికార్యములుండునే? ఆరాముఁడు నన్నిచ్చోటనుండి కొనిపోవునని చెప్పవలయునా? ఆయుర్భాగ్యబలములు నీవి నశించినవి. పరకాంతాపహరణమున నీలంక వైధవ్యము నొందఁగలదు. నా యాగమనము నీకు నిచ్చో సుఖమును గల్గింపక దుఃఖమునే కల్గించును. రాముఁడు దీనుఁడు తాపసుఁడని యేమేమో పలికితివే. దైవము, మహాతేజస్వియు నగు నారాముఁడు నిన్ను వదలఁడు. మృత్యువాసన్నము కాఁగా లోకులు విపరీతకార్యములఁ బ్రవర్తిల్లుదురు. రాక్షసాధమా! నన్నిట్లు నిరసించితివి. కాన నీవు నీరాక్షసులందఱు మృతినొందఁదగువారే. మీకును గాలము సమీపించినది. మంత్రపూతమగు యాగశాలను చండాలుఁడు స్పృశింపఁజాలఁడు కదా. అట్లే శ్రీరామపత్నిని నన్ను మహాపాపమతివగు నీవు స్పృశింప నర్హుఁడవు కావు. హంసి పద్మసరోవరమునఁ గ్రీడించును. అది గడ్డితుంపరల సంచరించు జలవాయసమును గన్నెత్తి చూచునా? అట్లే నేను నని తెలిసికొమ్ము. ఈదేహము నైజముగా జడము. దీనిని బంధించిన బంధింపుము. భక్షించినను భక్షింపుము. ఈదేహమును

ప్రాణములను రక్షించుకొనుట యెంతమాత్రము ప్రియము కాదు. నాకు నీభయ మిసుమంతయు లేదు. సీత పాతివ్రత్యమును వదలె నన్న యపవాదమును సహింపఁజాలను. అని క్రోధమునఁ బలికి యూరకుండెను.

రావణుఁ డమ్మాటలకుఁ గ్రుద్ధుఁడై యిఁకఁ బండ్రెండు నెలలు నిరీక్షించుచుందును. సుస్మితాననా! ఇంతలోపల నన్నంగీకరింపవేని ప్రాతఃకాలభుక్తికై నావంటవారు నిన్ను ఛేదింతురు. అని పలికి రాక్షసాంగనలం గాంచి మాంసరక్తాహారలగు నో రాక్షసాంగనలారా! మీరు భయంకరాకారములఁ దాల్చి యీసీత గరువము నడంతురుగాక. అప్పుడే వారామె చుట్టు నిలిచిరి. ఈసీత నశోకవనమునకుఁ దోడుకొనిపోయి యునిచి మీరు చుట్టునుండి కాపాడుచుండుఁడు. భయమును గల్గించుచుఁ జక్కనిమాటల నూఱడించుచు నాడుగజమును వశమునకుఁ దెచ్చునట్లు వశమునకుఁ దేవలయును. అని యాజ్ఞాపింపఁగా వార లాజానకి నశోకవనమునకుఁ గొనిపోయిరి. ఆయది మనోహరముగా నుండెను. పక్షినాదములు చెలరేఁగుచుండెను. అందు జానకి భయాక్రాంతస్వాంత యయ్యెను. వారి వికృతపుఁబలుకుల కేవగించుచు శ్రీరామునే తలంచుకొనుచు నెఱుకతప్ప మూర్ఛిల్లెను.

మహామతులారా! ఈభాగమును విమర్శింతము.

> "సా తథోక్తా తు వైదేహీ నిర్భయా శోకకర్శితా,
>
> తృణమంతరతః కృత్వా రావణం ప్రత్యభాషత." ౧

అని మూలము.

"సూక్ష్మేభ్యోఽపి ప్రసంగేభ్యస్త్రియో రక్ష్యా విశేషతః,
ద్వయోర్హి కులయోశ్శోకమావహేయురరక్షితాః. ౫
పానం దుర్జనసంసర్గః పత్యా చ విరహోఽటనం,
స్వప్నోఽన్యగేహవాసశ్చ నారీసందూషణాని షట్. ౧౩
పౌంశ్చల్యాచ్చలచిత్తాచ్చ నిస్స్నేహాచ్చ స్వభావతః,
రక్షితా యత్నతోఽపీహ భర్తృష్వేతా వికుర్వతే." ౧౫

మను. ౯-అధ్యాయము.

అను మనుస్మృతివాక్యముల ననుసరించి పరపురుషసంభాషణా దులు దూష్యములని యేర్పడుచున్నది. కనుకనే సీత యా రావణుని జూచుచు సంభాషింపదాయెను. గడ్డిపరకను నెదుట నునుచుకొని దానిని జూచుచు మాటలాడినది యది దూష్యము కాదని ప్రాచీనులయాశయము. సీతాచారముల ప్రవర్తనము లోకుల కుదాహరణము కావలయును గదా. కనుకనే ప్రతివిష యమునను సీత స్త్రీలసదాచారములకు నుదాహరణముగఁ బ్రవర్తింపఁబూనును. విధిలేక పరపురుషునితో భాషింపవలసి నపుడు పతివ్రత వేఱొకపదార్థమును జూచుచు భాషింప వలయు నను సదాచార మీభాగము మనకుఁ దెలుపుచున్నది. దీనిచేఁ బరపురుషపరాఙ్ముఖత్వము స్త్రీలకుఁ బ్రధానాచారమని మన మెఱుంగవలయును. నిశ్చయాంతతత్త్వమెఱుంగునుగాన నించుకంతయు భయము లేనిదై, శోకకర్శితా = శోకమునఁ గృశించినట్లు నటించునదియై యనియర్థము. లేనిచో నొక్క ముహూర్తమునకే కృశించుట లోకాచారవిరుద్ధము కదా. కనుకనే పైని వ్రాసినది సుసంగతము.

"అసురైర్వా సురైర్వా త్వం యద్యవధ్యోఽసి రావణ,
ఉత్పాద్య సుమహద్వైరం జీవంస్తస్య న మోక్ష్యసే. ౧

స తే జీవితశేషస్య రాఘవోఽంతకరో బలీ,
పశోర్యూపగతస్యేవ జీవితం తవ దుర్లభం. ౯
యది పశ్యేత్స రామస్త్వాం రోషదీప్తేన చక్షుషా,
రక్షస్త్వమద్య నిర్దగ్ధో గచ్ఛేస్సద్యః పరాభవం.'' ౧౦

అని మూలము. పరప్రభావమున గర్వింపకుము. దేవదానవాదులకే నీవవధ్యుఁడవు. శ్రీరాముఁడు మానవాకృతిగలవాఁడు. ఆమహానీయునితోఁ బగ తెచ్చుకొంటివి. ప్రాణములతో వదలఁబడవు. నీకొఱకే మానవరూపమును దాల్చినవాఁడు రామచంద్రుఁడు. కనుక నీకోరిక సిద్ధించును. శీఘ్రమ మృతినొందుదువని భావము. యజ్ఞార్థము సంపాదించిన పశువును యూపస్తంభమునకుఁ గట్టుదురు. దానికి మరల జీవితము లేదు. అట్లే యజ్ఞానుఁడవైనను నాపాలఁబడితివి. నీయాయుశ్శేషము రామునిమూలమున ముగియఁగలదు. రణయజ్ఞము కానున్నది. అందు వధింపఁబడుదువని భావము. రాముఁడు రాఁగానే చంపునా? లేక కొంతకాలమునకా? యనుసందియ మొందు రావణునకు సీత సమాధానము చెప్పుచున్నది. ఏక్షణమున శ్రీరాముఁడు రోషాగ్నిజ్వాలావృతమగు దృష్టింగాంచునో అనఁగా మృత్యుంజయత్వము నంగీకరించునో అప్పుడే భస్మమగుదువని భావము.

''యదా వినాశో భూతానాం దృశ్యతే కాలచోదితః,
తదా కార్యే ప్రమాద్యంతి నరాః కాలవశం గతాః. ౧౬
మాం ప్రధృష్య తతః కాలః ప్రాప్తోఽయం రాక్షసాధమ,
ఆత్మనో రాక్షసానాం చ వధాయాంతఃపురస్య చ.'' ౧౭

అని మూలము. దైవకృతిచే భూతములకు నాశము కనుపట్టు

కాలమునఁ గాలవశంగతులై మానవులు విపరీతముగాఁ గార్యములు చేయుదురు. దీనిచే నెల్లరు కర్మాధీనులై తత్ఫలానుభవము దాపునకు రాఁగాఁ దదనురూపముగాఁ గృత్యముల నొనరింతురని భావము. దీనిచే నెవ్వరు స్వతంత్రులు కారనియుఁ గర్మమునసుసరించి తిరుగుచుందురనియుఁ దాత్పర్యము. "మాం ప్రధృష్య స్థితస్య తవ కాలో౽యమేవ ఆత్మనో రాక్షసాదీనాం చ వధాయప్రాప్తః."అనియన్వయము. నన్నిటకుఁ దెచ్చుటయను పరాభవముగా లోకులకుఁ దోఁచు నీవ్యాపారము గలనీకు నీవారికి మృతికాలము సమీపించినది. నీవు కోరుచున్న కాలము దాపునకు వచ్చుచున్నదని తాత్పర్యము.

"న శక్యా యజ్ఞమధ్యస్థా వేదిస్స్రుగ్భాండమండితా,
ద్విజాతిమంత్రపూతా చ చండాలేనావమర్దితుం. ౧౮
తథాహం ధర్మనిత్యస్య ధర్మపత్నీ పతివ్రతా,
త్వయా స్ప్రష్టుం న శక్యాస్మి రాక్షసాధమ పాపినా. ౧౯
క్రీడంతీ రాజహంసేన పద్మషండేషు నిత్యదా,
హంసీ సా తృణషండస్థం కథం పశ్యేత మద్గుకం." ౨౦

అని మూలము. సీతాదేవి యీయంతఃపురమున నేనుండను. స్థలాంతరమున నాకు నివాసమును గల్పింపుమను భావమును సూచించుచున్నది. మంత్రపూతమై పరమపావనవస్తుభూయిష్ఠమగు యజ్ఞవేదికను బాపాత్ముఁడు స్పృశింపరానియట్లు ధర్మమే నిత్యవ్రతముగాఁగల శ్రీరామధర్మపత్నిని నేను బాపాత్ములగు రాక్షసాధముల సంస్పర్శము నాకు రుచింపదు. ఇది భోగసాధనభూయిష్ఠమగు నంతఃపురము. కాన నే నిందుండను. హంసి నీరుకోడిపొందు గోరనిచందమున నిందలివారిపొందు

నాకుఁ బనికిరాదని సీతాహృదయము. సరోవరములు గల యొకవనమున న న్నునుపుమని యామె తెలిపెనని మనము గ్రహింపవలయును.

> "ఇదం శరీరం నిస్సంజ్ఞం బంధ వా ఖాదయస్వ వా,
> నేదం శరీరం రక్ష్యం మే జీవితం వాపి రాక్షస. ౨౧
> న తు శక్ష్యామ్యుపక్రోశం పృథివ్యాం దాతుమాత్మనః."

అని మూలము. జానకి తత్త్వముఁ దెలుపుచున్నది. ఈశరీరము చేష్టలుకూడ లేనిది. అనఁగా మాయ యని భావము. అనఁగా నిది కల్పితశరీరము. దీనిని భక్షించినను బంధించిన నొక్కటియే. ఈ ఛాయాశరీరమును దీనిజీవితమును గాపాడ నెంచను. అనఁగా నిది నీకొఱకుఁ గల్పింపఁబడినది. కాని వాస్తవమగు నామానవరూపముకూడఁ గాదని సీత యితరుల కర్థముకానియట్లు రావణునకుఁ దెలియునట్లు పలికెను. ఈ రూపమున లోకులకు మహాముని వాల్మీకి నీతిని దెలుపుచున్నాఁడు. భూలోకమున లోకాపవాదము నోర్వరాదు. అనఁగా మానవులు జనాపవాదము లేకయుండ జీవింపవలయును. ఇదియే నీతి. "లోకాపవాదాద్భయ"మ్మను భర్తృహరి వాక్యమున శ్రీరామాయణమే యాధార మనవచ్చుఁ గదా.

> "శృణు మైథిలి మద్వాక్యం మాసాన్ ద్వాదశ భామిని. ౨౪
> కాలేనానేన నాభ్యేషి యది మాం చారుహాసిని,
> తతస్త్వాం ప్రాతరాశార్థం సూదాశ్ఛేత్స్యంతి లేశశః. ౨౫
>
> ... ... ... ... ...
>
> శీఘ్రమేవ హి రాక్షస్యో వికృతా ఘోరదర్శనాః,
> దర్పమస్యా వినేష్యధ్వం మాంసశోణితభోజనాః. ౨౭

వచనాదేవ తాస్తస్య సుఘోరా రాక్షసీగణాః,
కృతప్రాంజలయో భూత్వా మైథిలీం పర్యవారయన్. ౨౮
... ... ... ... ...
అశోకవనికామధ్యే మైథిలీ నీయతామియం,
తత్రేయం లక్ష్యతాం గూఢం యుష్మాభిః పరివారితా. ౩౦
తత్రైనాం తర్జనైర్ఘోరైః పునస్సాంత్వైశ్చ మైథిలీం,
ఆనయధ్వం వశం సర్వా వన్యాం గజవధూమివ." ౩౧

అని మూలము. జానకీహృదయ మెఱింగి రావణుఁడు రాక్షస కాంతలు వినుచుండఁ బలుకుచు నా మెకోరినట్లు నివాస మేర్ప ఱచుచున్నాఁడు. జానకీ! పండ్రెండు నెలలు గడు విచ్చుచున్నాను. అంతకు లోపల నన్ను ననుగ్రహింపవేని అనఁగా భర్తృత్వ నింట నుండ నంగీకరింపవేని, ప్రాతఃకాల ప్రారంభముననే, ఆశాగ్రందిక్కుల యందుఁగల కంకగృధ్రాదులకొఱకు, మాంసఛేత్సువంత సూదంఃః నా యనుమతినొంది నన్ను ఛేదింపఁగలరు. అనఁగా సీయను గ్రహ మొకసంవత్సరముదనుకఁ గలుగనిచో నవ్వల జీవింపఁ జాలనని రావణునాశయము. పదుమూఁడుసంవత్సరములు సీతాపహరణమునకు ముందే గడచిపోయెను. సంవత్సరము కొఱంత కలదు. రావణునినోట నావిషయమే వెలువడినది. రావణవధకాల మొక్కసంవత్సరమే కలదు. పదునాల్గుసంవ త్సరములు వెళ్లిన మఱుదినము శ్రీరామమూర్తి భరతుని జూడవలయును. కావున రావణుఁడు కర్మప్రేరితుఁడై సీతతో నొకసంవత్సరమే నీకు గడువిత్తునని తేటపఱచెను. అవ్వల సహింపఁజాలనని రావణునిభావము. "రాక్షస్యః మాంసశోణిత భోజనాః ఘోరదర్శనాశ్చ యూయం శీఘ్రమేవ అవికృతా ఘోరదర్శనా భూత్వా దర్పంవినా అస్యాస్సమీపే తిష్ఠధ్వం

సేవార్థం స్థాతు మిచ్ఛత." ఈధాతుప్రయోగ మార్షమగుట సాధువే. అని యన్వయము. ఓ రాక్షసకాంతలారా! మీరు దుష్టాహారలు ఘోరాకార లైనను నాయానతిచేత సౌమ్యరూపములతో దర్పము మాని యీసీతాదేవిని సేవింపఁ బూనవలయును. ఈయర్థము సత్యమగునా యందురేమో. ఈ క్రింది మూలము దీనిని దృఢపఱచుచున్నది. ఆరాక్షసస్త్రీలు దోసిలొగ్గుచు జానకిని బరివేష్టించిరి. అనఁగా నామె సేవింపఁబూనిరని కదా భావము. అశోకవనమునకుఁ దోడ్కొనిపోయి రహస్యముగా ననఁగా నితరులఁ జేరనీయక యని భావము. సర్వదా పరివేష్టించి రక్షించునది. వినా యని యధ్యాహార్యము. భయము గల్గింపక సాంత్వనోక్తుల మన కభిముఖురా లగునట్లు చేయుఁడు. వన్యాం గజవధూమివ=అను నీయుపమానమే లోఁ బఱచుకొనుట యెందులకో తెలుపుచున్నది. గజవధువును మెల్లగా లోఁబఱచుకొనుట స్వసంరక్షణార్థమే. అట్లే యీ జానకీరక్షణ మాత్మరక్షణార్థమే యని యెఱుంగవలయును. ఆవనమున సీత శోకించుట లోనగునవి లోకులకుఁ బాతివ్రత్య ధర్మములు తెలుపుటకే యని మన మూహింపవలయు. లేక యున్న నాబాధలకెల్ల నోర్చుకొని యుండనేల? ఒక్కశాపమున లంకను భస్మముగఁ జేయరాదా? అట్టిశక్తి లేదందురేమో యాపక్షమున సీతారాములు మానవమాత్రులే యగుదురు. అవతరించినవారే కాకపోవుదురు. అవతరించిన మహాలక్ష్మీనారాయణులే యని యంగీకరించిన నిదియంతయు నటనమే యని యెఱుంగవలయును. ఈభాగమున నధ్యాత్మ రామాయణమున విశేషము లేవియు లేవు. తరువాతి కథను బఠింతము.

## శ్రీరాముఁడు లక్ష్మణుని జూచుట. దుశ్శకున ములఁ గాంచి వగచుట.

* శ్రీరాముఁ డయ్యరణ్యమునందు మాయామృగమును వధించి మారీచుఁడని యెఱింగి వేగముగా నాశ్రమమునకుం బ్రయాణమయ్యెను. సీతను జూచుసంభ్రమమునఁ బోవుచుండఁగా నొక జంబుకము భీకరముగాఁ గూసెను. మారీచుని కంఠస్వరమునకే యేమి కీడు కలుగునో యని శంకించు రాముఁ డాజంబుకారావమునకు మఱింత సందియము గలవాఁడై యీ జంబుకధ్వని యేదోయొక యశుభమును దెలుపుచున్నదనుకొనుచు జానకి రాక్షసభక్షిత కాకుండెనా యని తలంచెను. మారీచుడు నా కంఠస్వరముననే "హాజానకీ! అయ్యో లక్ష్మణా!" యని కేక వేసినందున నద్దాని విని సౌమిత్రి యూరకుండఁడు. సీతయు భయంపడి నాకడకుఁ బొమ్మని పలుకక యూరకుండదు. ఆమెనువదలి నన్ను వెదకుచు నతఁడు రాఁగలఁడు. మారీచుఁడు నన్నింతదూరము నంచుకొని తెచ్చి చచ్చునపుడు "హా! సౌమిత్రీ! హతుఁడనైతినే" అను మాట పలికెను. దీనింబట్టి యూహింపఁగా రక్కసులెల్ల జానకిని జంపి వేయఁ దలఁచిరనుట నిజమేయని తోఁచుచున్నది. జనస్థాన నివాసనిమిత్తమున రాక్షసులతోఁ బగ సాధించుకొంటిని. మహాటవి సీతాసౌమిత్రులు క్షేమముగా నుందురా? దుర్నిమిత్తము లనేకము లగపడుచున్నవి. అని శ్రీరాముఁడు విచారింపసాగెను. ఈవిచారముననే తన యాశ్రమమునకుఁ బయనము సాగించుచుండెను. మృగపక్షులు దీనస్వరముల రాము

* ఇది యేఁబదియేఁడవసర్గమునఁ గలదు.

నకుఁ బ్రదక్షిణముగఁ దిరుగుచుఁ గూసెను. వానికి మఱింత యనుమానపడి వేగముగాఁ బోవుచుండెను.

అంత లక్ష్మణుఁడు దీనవదనుఁడై రాముని కగపడెను. తనవలెనే దీనుఁడై వచ్చు శ్రీరాముని నతఁడు కలిసికొనియెను. ఈ మహారణ్యమున సీత నొంటరిగా వదలివచ్చుటం జేసి సౌమిత్రిని రాముఁడు కడుంగడు దూఱెను. రాముఁడనుజుని యెడమచేతిని బట్టుకొని తొలుతఁ గఠినముగాఁ బిదప శాంతముగానుండు పలుకుల నార్తుఁడై యిట్లు పలికెను. అక్కటా! సౌమిత్రీ! జానకి నొంటిగా వదలివచ్చితివే. దూష్యకార్యము కదా యిది. మన కిందు క్షేమమే కలుగుంగదా. వీరా! నాకిందనేక దుర్నిమిత్తములు పొడకట్టుచున్నవి. జానకిని రక్కసులపహరించుకొని యైనఁ బోయియుందురు. భక్షించిరైన నుందురు. సందియ మిందుఁ గనఁబడదు. జానకి జీవించి క్షేమముగా నుండఁజూడఁ గల్గుదుమా! జింకలగుంపులు జంబుకము పక్షులు సూర్యాభిముఖముగాఁ గూయుచున్నవి. ఆరాకొమరితకు క్షేమము గలుగునా యేమి? మాయామృగరూపుఁడగు రక్కసుఁడు మోసమున నన్నెంతో దూరము తీసికొనిపోయి నా బాణముచేఁ జచ్చుచు నిజరూపము నొందెను. ఇపుడు నా చిత్తము సీతావిషయమున దీనతం గాంచుచున్నది. నాసవ్యనేత్రము కంపించుచున్నది. దీనిచే సీత రాక్షసాపహృతయై కొనిపోఁబడుచున్నదో భక్షింపఁబడినదియో కావలయు. కాని యాశ్రమమున నుండదు. సంశయమే లేదని పల్కెను.

మహామతులారా! ఈభాగమున శ్రీరాముని యాశయమేమని విమర్శింతము.

"అశుభం బత మన్యేఽహం గోమాయుర్వాశ్యతే యథా,
స్వస్తి స్యాదపి వైదేహ్యా రాక్షసైర్భక్షణం వినా." ౪

అని మూలము. నక్కకూత విని శ్రీరాముఁ డిట్లు తలంచు చున్నాఁడు. "రాక్షసైర్భక్షణం వినా వైదేహ్యాః స్వస్తి స్యాత్ అపి" అని యన్వయక్రమము. "అపి" యను నవ్యయ మిందను జ్ఞార్థబోధకము. అనుజ్ఞార్థము నపి యనునవ్యయము బోధించు నని శబ్దకల్పద్రుమమునఁ గలదు. ఈగోమాయుధ్వని యశుభ ఫలమును దెల్పునని యూహించుచున్నాను. రాక్షసులచే భక్షింపఁబడక సీత యుండుఁగాక. అని యనుమతించెద నని యర్థము. అనఁగా సీతను భక్షించునట్టి రక్కసులును గలు గక యుండును. వేఱొకరూపమున సంభావ్యము త్తమునకు నశుభఫలము కలుగవలయునని రాముఁ డనుమతి యిచ్చెను. ఈభావమును దెలుపు శ్రీరామునిమాట లీభాగమునఁ గనంబడఁగలవు. మఱియు సౌమిత్రిని సీత నన్వేషింపఁ బంపు ననియు రాముఁడు నిశ్చయించెను.

"స సౌమిత్రిస్స్వరం శ్రుత్వా తాం చ హిత్వా చ మైథిలీం,
తయైవ ప్రహితః క్షిప్రం మత్సకాశమిహైష్యతి." ౬

అను లోనగుశ్లోకము లీయర్థమును దెలుపుచున్నవి కదా.

"గృహీత్వా చ కరం సవ్యం లక్ష్మణం రఘునందనః. ౧౭
ఉవాచ మధురోదర్కమిదం పరుషమార్తిమత్."

అని మూలము. లక్ష్మణునెడమచేతిని బట్టుకొని రాముఁడు పలుకుచున్నాఁడు. సవ్యహస్తగ్రహణమేల! అని ప్రశ్నించు కొందము. రాముఁ డాశ్రమమునకు వచ్చుచున్నాఁడు. లక్ష్మణుఁడు రాముని జూడఁ బోవుచున్నాఁడు. ఆశ్రమము

నకు వీరిపు డేదిక్కున నున్నారని విచారించి నిశ్చయించు టకుఁ దగినన్ని యాధారములు లేవు. నాల్గుదిక్కులలో నే దిక్కునుండి వచ్చుచున్నను శ్రీరామున కభిముఖముగాఁ బోవు లక్ష్మణునికుడిచేయియే రామునికుడిచేతి కనురూపముగాఁ బట్టుకొన నుండును. అట్లుండఁగా నెడమ చేతి నేల పట్టుకొనెను ? ఎడమచేతితో నెడమచేతిని బట్టుకొనె ననుకొందమన్న నది యసంగతములలో నసంగత మనఁదగినదే. కుడిచేతితోఁ బట్టుకొనెననియే మన మూహింతము. అందులకుఁ గారణ మరయుదము. పురుషులకు సవ్యభాగమునఁ దోఁచుస్పందనాదు లశుభఫలద్యోతకములు. స్త్రీలకు దక్షిణభాగమునఁ దోఁచునవియు నట్టే. కనుక శ్రీరాముఁడు లక్ష్మణునిసవ్యహస్తమును బట్టుకొనుట రాఁబోవు దుష్ఫలమును దెలుపుటకే యని మన మూహించుట పొరపాటు కాదు. పటుపుం మధురోదర్కమువాచ=తొలుతఁ గఠినముగా నప్పల రాఁగలఫలములు శుభములని తోఁచునట్లు పలికెను. దీని చేత సీతాపహరణము భగవంతుఁడగు శ్రీరామునకుఁ దెలిసినవిషయమే. విషాదాభినయనము లోకము కొఱకే యని గొలుఁగవలయు.

"అసంశయం లక్ష్మణ నాస్తి సీతా
హృతా మృతా వా పథి వర్తతే వా." ౨౮

అని మూలము. ఇది శ్రీరామునివాక్యము. "సీతా మృతా వా హృతా పథి వర్తతే వా అసంశయమ్. ఆశ్రమే సీతా నాస్తి." భక్షింపఁబడి యుండునా ? అపహృతయై మార్గమున నుండినా? ఆశ్రమమున మాత్రము లేదు. నిశ్చయము. అని. రామలక్ష్మణుల సమాగమకాలమునకు జటాయువుతో రావణు

నకు యుద్ధము సాగి సీత కొనిపోవఁబడుచుండఁ దగునని తోఁచెడిని. కాని లంకానగరప్రవేశము కాలేదు. ఆశ్రమము నందు లేదని శ్రీరామమూర్తి తెలిపెను గదా. అది నిజమే యని కూడఁ దెలిపెను. ఈభాగమును జక్కఁగాఁ బరిశీలించిన సీతారాములకు సకలవిషయములు తెలిసియే యున్నవని తోఁచెడిని. తర్వాతికథను జదువుదము.

## రాముఁడు శోకించుట.

* దాశరథి శూన్యారణ్యమున సీతను విడిచి వచ్చి దీనుఁడై యున్న తమ్మునింగాంచి యిట్లు పలికెను. సౌమిత్రీ! భయంకరాటవులకు నావెంట వచ్చినదే. అట్టిజానకిని విడిచి వచ్చితివి కదా. ఆసీత యిపు డెందున్నది? రాజ్యమును బోఁ గొట్టుకొని దీనుఁడనై దండకాటవులఁ దిరుగుచుండఁగా నాతో సరిగా దుఃఖముల ననుభవించుచుఁ దోడుగానున్న యా జానకి, ముహూర్తమైన నన్నెడఁబాసి బ్రదుకఁజాలని యా సాధ్వి, నా ప్రాణాధికురాలు, ఎక్కడనున్నది? ఆసీతయే లేకున్న దేవతాధిపత్యమునుగాని భూమండలేశ్వరత్వమునుగాని నే నొల్లను. నాప్రాణేశ్వరి బ్రదికియున్నదే కదా. ఆమ నెడఁబాసితి నేని నాప్రాణములు పోవును. నావనవాసవ్రతము పదునాలు గేండ్లు సాగింపకపోదును. ఈవిపత్తిచే నాప్రతి మసత్యము కాదు కదా! అది జరపియే తీర్తునుగాదా! సీత నశింపఁగా నా కారణమున నేను మరణమునొంద నీవయోధ్యకుఁ బోయిన వెంటనే యాకైకేయి సఫలమనోరథయై సంతోషమున

---

*ఇది యేఁబదియొనిమిదవసర్గమునఁ గలదు.

నుండునుగాదా. నామృతిచే నాతల్లి కౌసల్య సర్వసంపన్నయగు కైకను సేవింపవలసినదే కదా. సౌమ్యా! సీత జీవించియుండిన నే నాశ్రమమునకు వత్తును. లేకున్న నేల రావలయును? ప్రాణముల విడుతును. నే నచటికి రాఁగానే సుస్మితాస్యయై మాటలాడుచు నెదురుగా సీత రాదేని నే నందే నశింతును. సీత బ్రదికియున్నఁ జెప్పుము. జీవించి యున్నదా? లేదా? నీవు ప్రమాదపడఁగా రక్షస్సులు భక్షించిపోయిరా? పసిది. సుకుమారాంగి. దుఃఖమే యెఱుఁగనిది. నన్నెడఁబాసినందులకే తల్లడం పడుచుండును. ఇది నిజముసుమా! దుర్మతి రక్కసుఁడు లక్ష్మణా యని గట్టిగానఱచుటం జేసి శూరునకు నీకుంగూడ భయము కలిగినది. నాధ్వనిగా భావించి నీవు వచ్చితివి. కాన నాధ్వని సీతయు విని భయంపడి నిన్నుఁ బంపియుండు నని యూహించెదను. మహాటవి డించివచ్చి కష్టములఁ గల్గించితివి. క్రూరులగు రక్కసులకుఁ బగ తీర్చుకొన నవకాశము లేకుండెను. అద్దాని నీవు వారికిం గల్గించితివి కదా. ఖరవధజనితక్రోధమున మాంసాహారాశగలవారు జానకిం జంపియుందురు. నిజము. ఇప్పుడే యిట్లు దుఃఖమున మున్గితిని. ఏమిచేయఁగలను? విధి యిట్లున్నదని తలంచెద. అనుచు సౌమిత్రింగూడి త్వరగా జనస్థానమున కరిగెను. మార్గాయాసమువలన క్షుత్పిపాస లలముకొనఁగా దుఃఖించుచు నాశ్రమముచెంతకరిగి సీతంగానక, లోపలి కరిగి యందును జానకి లేకపోఁగా, నామె విహరించుతావులం గాంచి యామె లేకపోవుటం జేసి మిగుల దుఃఖితుఁ డయ్యెను.

మహనీయులారా! ఈభాగమునందును శ్రీరాముని యాశయ మెట్టిదో కనుఁగొందము.

"యాం వినా నోత్సహే వీర ముహూర్తమపి జీవితుం,
క్వ సా ప్రాణసహాయా మే సీతా సురసుతోపమా. ౪
పతి త్వమమరాణాం వా పృథివ్యాశ్చాపి లక్ష్మణ,
తాం వినా తపనీయాభాం నేచ్ఛేయం జనకాత్మజామ్." ౫

అని మూలము. శ్రీరాముఁడు గూఢముగా స్వాభిప్రాయమును దెలుపుచున్నాఁడు. సౌమిత్రీ! రూపనామక్రియాశూన్యుఁడను. స్థాణువును. ఆమె ప్రకృతి. కాన నామెమూలముననే రూపనామక్రియావంతుఁడనైతిని. ప్రాణసహాయురాలామెయే. అట్టి నాదేవి లేనిచో క్షణమైన బ్రదుకను. అనఁగా నీరూపము నిలువదు. ఈభావమే శ్రీశంకరాచార్యపాదులు

"శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
న చేదేవం దేవో న ఖలు కుశలస్స్పందితుమపి."

అను దానిచే వెల్లడించిరి. ఆబంగరుబొమ్మ లేనిచో నట్టివైభవము నేనొల్లను. అని రాముఁడు చెప్పెను. రూపము లేని నాకేది లభించిననేమి లాభము? అనుభవైకయోగ్యమగుశరీరము నిర్మించుట ప్రకృతికార్యము. ఇంక ప్రకృత్యుపాసనార్హమగు శరీరము "తపనీయాభామ్ తామ్." అనుదానిచేఁ జెప్పఁబడినది.

"తటిల్లేఖాతన్వీం తపనశశివైశ్వానరమయీం
నిషణ్ణాం షణ్ణామప్యుపరి కమలానాం తవ కలాం,
మహాపద్మాటవ్యాం మృదితమలమాయేన మనసా
మహాంతః పశ్యంతో దధతి పరమానందలహరీమ్." ౨౧

అని సౌందర్యలహరియందు శ్రీశంకరభగవత్పాదులు తేటపఱచిరి. క్షపితమలమాయమగుమనస్సుచే యోగులు స్వర్ణ

వర్ణశరీరముగలదానినిగా భగవతి నారాధింతురు. అనఁగా ధ్యానింతురు. బాహ్యపూజ యిందు నిరసింపఁబడినది. "తవ కళాం సాదాఖ్యాం బైందవీం కళాం" అని యర్థము. ఆధార స్వాధిష్ఠానమణిపూర కానాహత విశుద్ధాజ్ఞానామకషట్చక్రముల పైన సహస్రారపద్మమున వెల్గు నీకళను యోగు లారాధింతు రనుట ధ్యానమునే యుత్తమముగాఁ దేటపఱచుచున్నది. ఇదియే సమయాచార మనునది. యోగుల మత మిదియే. మల మనఁగా కామాదులు. మాయయనఁగా అవిద్యాస్మితాహం కారాదులని యెఱుంగవలయు. ఇవి తొలఁగించుకొనిన మన స్సుచే ననఁగా నిర్మలాంతఃకరణముచే భగవతి నారాధింప వలయుననియే సారము.

> "కచ్చిజ్జీవతి వైదేహీ ప్రాణైః ప్రియతరా మమ,
> కచ్చిత్ప్రవ్రాజనం సౌమ్య న మే మిథ్యా భవిష్యతి." ౬

అని మూలము. "వైదేహీ." అనునది సాభిప్రాయవిశేషణము. "ప్రాణైః ప్రియతరా మమ" అనుటచే నంతకంటెఁ బ్రియమగు వస్త్వంతర మెందును లేదని భావము సూచింపఁబడును. ఆజానకిమూలముననే నాప్రాణము లున్నవి. ఆమె లేనిచో నాప్రాణములుండవు.ఆమెను నమ్ముకొనియే పదునాల్గువర్షములు దండకారణ్యమున నుండ నెంచితిని. అది మిథ్యకాదు కదా. అనుటంజేసి యామె కపాయము లేదు. నాకీవ్రతభంగము కాదు. అనుభావము సూచింపఁబడియె.

> "సీతానిమిత్తం సౌమిత్రే మృతే మయి గతే త్వయి,
> కచ్చిత్సకామా సుఖితా కైకేయీ సా భవిష్యతి. ౭
> సపుత్త్రరాజ్యాం సిద్ధార్థాం మృతపుత్త్రా తపస్వినీ,

ఉపస్థాస్యతి కౌసల్యా కచ్చిత్సౌమ్య న కైకయీం. ౮
యది జీవతి వైదేహీ గమిష్యామ్యాశ్రమం పునః,
సువృత్తా యది వృత్తా సా ప్రాణాంస్త్యక్ష్యామి లక్ష్మణ. ౯
యది మామాశ్రమగతం వైదేహీ నాభిభాషతే,
పునః ప్రహసితా సీతా వినశిష్యామి లక్ష్మణ." ౧౦

అని మూలము. శ్రీరాముఁడు తననిశ్చితమును దెలుపుచున్నాఁడు. తన యవతారతత్త్వమును వెలపఱచుచున్నవాఁడని మన మెఱుంగవలయును. "మయి మృతే సీతానిమిత్తమ్." అని యర్థము. నేను మృతుఁడనగుటకు సీతయే కారణము. అనుటంజేసి భావిసీతాపురాగమనము పశ్చాత్స్వగమనము సూచించెను. నీవయోధ్యకుఁ బోయినయెడల మాతల్లి కైక సుఖపడునా యేమి? అనఁగా మాయిద్దఱకుఁ గీడు గోరినది కైక యనుదుర్భావమును వదలుమా యని రామునాశయము. నాతల్లి నామృతికి వగచుచు సర్వసుఖసమృద్ధయగు కైకను సేవించునా యేమి? అనఁగా సేవింపదనుట. నాతల్లి మున్ను కైకవలన నవమానము గలుగునని తెలిపెనే దాని నీవు నంగీకరించితివికదా. ఆభావమును మాన్పుకొనుమా యని హెచ్చరించెనని మన మెఱుంగవలయును. సీత జీవించినంత దనుకనే నే నాశ్రమధర్మముల ననుసరింతును. "సువృత్తా సా వృత్తా యది మృతా చేత్" అని యర్థము. చక్కనివర్తనముగల యాసీత దేహమువదలిన నేనును వదలుదును. అనఁగా లోక ప్రవృత్తి నెఱింగినది మహాప్రకృతి. ఆవిషయము ప్రకృత్యధీనము చేసితిని. కాన నేను నిర్లిప్తుఁడను. పాంచభౌతికమగు నీశరీరము ప్రకృతికల్పితము. ఆప్రకృతి శరీరము వదలఁగనే

నేనును వదలుదునని శ్రీరామమూర్తి తెలిపెను. అవినశ్వరులకు నాశమెట్లనఁగా; దానిలక్షణము దెలుపుచున్నాఁడు. ఎపుడు ప్రకృతి సంతోషమున మాటలాడుచు నెదురువచ్చునో అనఁగా నభిముఖురాలగునో అనఁగా లోకప్రవర్తనార్థము నన్ను హెచ్చరించునో యంతదనుక నీశరీరముండును. లేనిచో ననఁగాఁ బ్రకృతి నిస్సంకల్పురాలగుచో నశింతును. అనఁగా నీశరీరమును వదలుదును. అని శ్రీరామమూర్తి యాత్మతత్త్వము నెఱింగించెను.

"సర్వథా తు కృతం కష్టం సీతాముత్సృజతా వనే,
ప్రతికర్తుం నృశంసానాం రక్షసాం దత్తమంతరం." ౧౫

అని మూలము. ఈసందర్భమున మహాముని సాధుమతులకుఁ బ్రవర్తనము నేర్పుచున్నాఁడు. బుద్ధిమంతులు దుష్టుల కపకారము చేయు నవకాశము కలుగకుండఁ బ్రవర్తింపవలయును. అనఁగాఁ దమప్రవృత్తియే యపకారమో యుపకారమో యితరులమూలమునఁ జేయించును. కాన నితరులవలనఁ గలుగుకష్టములకు మూలము స్వప్రవర్తనమే. కనుక దానిని జక్కఁగా నిర్వహించునెడల నొరులేమియుఁ జేయఁజాలరని సారమే. దీనిచేఁ గర్మసిద్ధాంతము తేటపఱుపఁబడినది. ఈభాగమున నధ్యాత్మరామాయణమునందు

"ఆయాంతం లక్ష్మణం దీనం ముఖేన పరిశుష్యతా,
రాఘవశ్చింతయామాస స్వాత్మన్యేవ మహామతిః. ౨
లక్ష్మణస్తన్న జానాతి మాయాసీతాం మయా కృతాం,
జ్ఞాత్వాప్యేనం వంచయిత్వా శోచామి ప్రాకృతో యథా. ౩
యద్యహం విరతో భూత్వా తూష్ణీం స్థాస్యామి మందిరే,

తదా రాక్షసకోటీనాం వధోపాయః కథం భవేత్. ౪

యదా శోచామి తాం దుఃఖసంతప్తః కామతో యథా,

తదా క్రమేణానుచిన్వన్నీతాం యాస్యేఽసురాలయం. ౫

రావణం సకులం హత్వా సీతామగ్నౌ స్థితాం పునః,

మయైవ స్థాపితాం నీత్వా యాతాయోధ్యామతంద్రితః. ౬

అహం మనుష్యభావేన జాతోఽస్మి బ్రహ్మణార్థితః,

మనుష్యభావమాపన్నః కంచిత్కాలం వసామి కౌ." ౭

అరణ్య. ౮-సర్గము.

వాల్మీకివాక్యములయం దేది విశేషార్థ మని వ్రాయఁబడినదో యదియే యిందు స్పష్టముగాఁ జెప్పఁబడినది. మనుష్యాకారమున భగవంతుఁడు నటించె నని మనము నమ్మకపోయినచో నాయవతారమే యసత్యమూలమని తెలిసికొనుఁడు. ముందువారి కథను బఠింతము.

## లక్ష్మణుఁడు రామునకుఁ దనరాకకుఁ గారణము తెల్పుట.

* శ్రీరాముఁడు లక్ష్మణుని గాంచినంతనే సంతాపమొంది యిట్లు ప్రశ్నించెను. సోదరా! నీసాయము కలదనుచుం యని నమ్మి నేను మృగము వెంటఁ బోయితిని. నీ వేల జానకిని విడిచి వచ్చితివి? నిన్నుఁ జూడఁగనే సీత కనిష్టమేదియో కలిగి యుండునని శంకించుచు నామనస్సు మిగుల వెతల నలఁగుచున్నది. దూరమున నీవు కనఁబడఁగనే నాయెడమకన్ను వడఁకినది. సవ్యబాహువు కూడ నట్లే. నాహృదయము కూడ

* ఇయ్యది యేఁబదితొమ్మిదవసర్గమునఁ గలదు.

నదరెను. అనఁగా సౌమిత్రి సీతపలికినపలుకులకుఁ గల్గిన వగచే మాటలు తడఁబడుచునుండఁగా నిట్టి యకార్యమొనరించి వచ్చితివని యన్న యన్నందులకు మఱింత దుఃఖము క్రమ్ముకొనఁగా నిట్లనియె. శ్రీరామా! నేనుగా నామెను వదలి రాలేదు. వినరానిమాటలాడి ఆమెయే నన్ను త్వరగాఁబొమ్మని పంపఁగా విధిలేక వచ్చితిని. ఆరాక్షసుని ధ్వని సీత వినియెను. నీకేదో యాపద కల్గెనని యేడ్చుచు నన్నుఁ బొమ్మని త్వర పెట్టెను. నేను నీవిషయమై ధైర్యపుమాట లెన్నిసారులు తెల్పినను నీశౌర్యాదుల నెంతగట్టిగాఁ దెలిపినను, రాక్షసమాయ యని యెంత యొత్తిపల్కినను, సీత మతి కలవిలపాటొందఁగా యుక్తాయుక్తముల నెన్నక యన్న నశింప నన్నుఁ గోరనున్నావను మొదలగు కర్ణకఠోరములు స్మర్తవ్యములు కానివియు నగుమాటలాడెను. ఆమాటలు వినఁజాలక దుఃఖించుచు వచ్చితిని.

అనఁగానే రామమూర్తి దేహము తెలియనంతదుఃఖమున నాయనా! నీవిట్లువచ్చు టక్రమము. రాక్షసనివారణమున నాశక్తిని నీవెఱింగియు సీతపల్కినంతనే వదలి వచ్చితివే! ఇదెంతమాత్రము తగదు. సీత కఠినముగా మాటలాడిన నోర్చుకొనవలయును. లేదా చాటుననుండి కాపాడుచుండవలయును. అంతియకాని యామాటలకుఁ గోపగించి నాయానతి చేయవైతివి. ఎట్టులెంచినను నీయది యవినీతి. నన్ను వంచించి తెచ్చిన రక్కసుఁడు వీఁడో నాబాణమునఁ జచ్చెను. వాఁడు మృగరూపమునువదలి రక్కసుఁడై చచ్చుచు నట్లఱచినాఁడు. దానిని విని నీవు సీతను వదలివచ్చితివి. అని శ్రీరాముఁడు పల్కెను.

ఈభాగమునఁ గలవిషయ మంతయుఁ బూర్వసర్గమున సంగ్రహముగా నున్నదియే. ఆశ్రమమును జేరక మునుపటిదే యీకథ. ఆశ్రమప్రవేశము కూడ నైనట్లు పూర్వసర్గమునఁ జెప్పఁబడినది. ఇది త్రోవయందే సాగిన కథగ నున్నది. ఇది యసంగతముగా నున్నట్లు తోఁచును. కాని యిది ప్రాచీనుల యాచారము. కావున దీని నాక్షేపింపరాదు. ఇంకను విమర్శించి తెలిసికోనఁదగినవి కలవు కాని యవి లోపల విమర్శించిన వగుటఁ జర్వితచర్వణమనుసూక్తి కుదాహరణమగునని నవలి తరువాతికథను బఠింతము.

## ఆశ్రమమున సీత లేకపోఁగా రాముఁడు దుఃఖించుట.

* సౌమిత్రిం గూడి రాముఁడు పర్ణశాలకుఁ బోవుచుండఁగా సవ్యనేత్రము క్రింది రెప్ప మిగులఁ గదలించెను. నడక తాఱుమాఱయ్యెను. దేహము వడఁకెను. దుర్నిమిత్తము లనేకములు తోఁచెను. కాని రాముఁడు సీత క్షేమముగా నుండునా యని యూహించెను. అతివేగముగా నాశ్రమము నకుఁ బోయెను. సీత యందు లేకుండెను. ఆమె కానరాక పోఁగా రామమూర్తి యనేకదురవస్థల పాలయ్యెను. సీతలేని యాపర్ణశాల సిరితొలంగిన సరోవరమువలె నుండెను. అందలి చెట్లపైనుండు తుమ్మెదలు హీనస్వరములు గలుగుటం జేసి రోదనము చేయుచున్నట్లే తోఁచుచుండెను. సీత రామునకుఁ బఱచి వైచిన కృష్ణాజినము దర్భలు పూర్వమున్న చోటున లేక చెదరి పడియుండెను.

---

* ఇది యఱువదవసర్గమునఁ గలకథ.

కళాహీనమై యున్న యాయాశ్రమమును గాంచి శ్రీ రామమూర్తి సీత భీతచిత్త. దాని నెవరైన నపహరించిరో, లేక యామె మృతినొందినదో, లేక యాదృచ్ఛికముగాఁ గానరాలేదో, భక్షింపఁబడినదో, లేక యెందైన దాఁగి యున్నదో, లేక మేము లేకుండుటంజేసి భీతిల్లి గూఢముగా వనమునకే పోయియున్నదో. నాసీత పుష్పఫలాహారణార్థము పోయియుండునా? స్నానార్థము పద్మసరస్సునకుఁ బోయి నదియా? జలము తెచ్చుటకు గోదావరికేగినదా? అని యూహించుచుఁ దుదకు విలపించెను. ఎంతవెదకినను సీత కానరాక పోయెను. కన్నులెఱ్ఱగానుండఁగా శోకవేగమున నున్మత్తునివలె నుండెను. ప్రతివృక్షమును బ్రతిపర్వతమును, నదులను బరికించుచు శోకకలుషసాగరమున మునింగెను. ఒక్కొక్కచెట్టు కడకరిగి దానిపేరు నుచ్చరించి సీతయేమైన నీకడకు వచ్చినదా యని యడుగసాగెను. మృగములంగాంచి యొక్కొక్క దానితో నాప్రియురాలిం గాంచితివా యని యడుగసాగెను. ఇట్టులడుగుచుఁ దుద కెందును సీతలేదు. ఎవరో చంపియే యుందురు. మాంసాహారప్రియులగు రాక్షసులు భక్షించి యుందురు. సకలశుభలక్షణలక్షితయగు సీత యొంటరిగా విలపించుచుండఁగా రాక్షసులు తినియుందురు. నాప్రియాణ మామెను రాక్షసులు భక్షించుటకొఱకే యయ్యెనే. ఓలక్ష్మణా! నాప్రియురాలింగాంచితివా? సీతా! ప్రేయసీ! ఎందున్నదానవు? అని రామమూర్తి విలపించెను. అడవులంబడి వెదుకసాగెను. శ్రమములకు లోనై వెదుక నారంభించెను.

మహాత్ములారా! ఇందుఁ గొన్నివిశేషములు గలవు. ఆలకింపుఁడు.

"శోకరక్తేక్షణశ్శోకా దున్మత్త ఇవ లక్ష్యతే. ౧౦

వృక్షాద్వృక్షం ప్రధావన్ స గిరేశ్చాద్రిం నదాన్నదీం,
బభూవ విలపన్ రామశ్శోకార్ణవపరిప్లుతః." ౧౧

అని మూలము. ఇచ్చోట మహేశ్వరతీర్థులు వ్రాసిన భావము నాలకింపుఁడు. "ఉన్మత్త ఇవ లక్ష్యతే" అనుచోఁ గల ఇవశబ్దమును శ్లోకమందట సంబంధింపఁ జేయవలయును. "శోకరక్తేక్షణ ఇవ" అనునట్లు ఉన్మత్తుఁడువలెఁ గనఁబడెను. శోకరక్తేక్షణుఁడుగాఁ గనఁబడెను అనియర్థము. దీనిచే వాస్తవముగా రామమూర్తి శోకాదులుగలవాఁడు కాఁడని చెప్పఁబడుచున్నది. సీతను వెదకునపుడు వృక్షాదుల నడుగుట లోకసగు కార్యము రాముఁడు లోకశిక్షార్థము నటించినాఁడని తెలుపుటకే మహాత్ముఁడగు వాల్మీకి "ఉన్మత్తమివ" అను ఇవశబ్దముతోఁ జేర్చెను. దీనిచే వలయునవియే యొనరించిన కార్యములే కాని వేఱుగాదను నర్థము వెలువడును. శ్రీ శుకులు నుడివె

"రక్షోఽధమేన వృకవద్విపినేఽసమక్షం
వైదేహరాజదుహితర్యపయాపితాయామ్,
భ్రాత్రా వనే కృపణవత్ప్రియయా వియుక్త
స్త్రీసంగినాం గతిమితి ప్రథయంశ్చచార.
మర్త్యావతారస్త్విహ మర్త్యశిక్షణం
రక్షోవధాయైవ న కేవలం విభోః,
కుతోఽన్యథా స్యాద్రమతస్స్వ ఆత్మని
సీతాకృతాని వ్యసనానీశ్వరస్య.
నవైస ఆత్మాత్మవతామధీశ్వర
స్సక్తస్త్రిలోక్యాం భగవాన్ వాసుదేవః,

న స్త్రీకృతం కశ్మలమశ్నువీత
న లక్ష్మణం చాపి విహాతుమిచ్ఛతి.'' ౨౮౨

అని తెలిపిరి. సీతావిషయకదుఃఖమంతయు మానవుల శిక్షార్థము నటించినదే కాని వాస్తవము కాదు. భగవంతునకు స్త్రీదుఃఖ మెట్లు కలుగునని దీనిసారము. స్కాందమహాపురాణము నందుమాసంహితయందు దేవతలకు విష్ణువాక్యము

''అహం దాశరథిర్భూత్వా హన్మి రావణమాహవే,
శ్రీమద్రామావతారేఽస్మిన్నజ్ఞవత్క్రియతే మయా.
తత్ర శంకా న కర్తవ్యా సర్వజ్ఞేనాపి మాయయా,
మన్మాయామోహితం రక్షో మనుష్యం మామవేష్యతి.
అన్యథా తస్య సానూనం న భవేద్యత్ర కుత్రచిత్.''

అని. దీనిచే రామావతారమున నజ్ఞుఁడు చేయునట్లు కార్యము లొనర్తును. రావణుఁడు నామాయచే మోహితుండగును. వానికి మృతి వేఱువిధముగాఁ గలుగదు. కాన నాతో యుద్ధమొనరించి చచ్చును. అని దీనిసారము. కనుక శ్రీరాముని శోకాదులన్నియు నటనమే కాని వేఱుగాదనియుఁ,దనప్రవృత్తి లోకుల కుదాహరణభూతము కాఁగలదనియు, నుత్తమపురుషుఁడు కాఁగోరువాఁడు తనమానవప్రవృత్తి నుదాహరణముగాఁ గైకొనుననియు భావించి రాముఁడు వర్తించె నని మన మెఱుంగవలయును.

''అపి కాచిత్త్వయా దృష్టా సా కదంబప్రియా ప్రియా,
కదంబ యది జానీషే శంస సీతాం శుభాననామ్.'' ౧౨

అని మూలము. తొలుత శ్రీరాముఁడు కదంబవృక్షముకడకుఁ బోయి సీతావార్తను బ్రశ్నించెను. ఏల? ''కదంబప్రియా సా

ప్రియా త్వయా దృష్టాకిమ్ ?" అనియర్థము. సీత భగవతి యనుట కిది యొక యుదాహరణము. కదంబవనవాసిని పరమేశ్వరి యనుటకుఁ ప్రమాణములు చూప నక్కఱలేదు. కనుకనే భగవంతుఁడా చెట్టుకడకే పోయి సీతావృత్తాంతము నడిగెను. వృక్షముల నడుగుటచేఁ బ్రకృతిమయమే సృష్టియంతయు ననుభావమును వెల్లడించుటకే యని యెఱుఁగవలయు.

> "శార్దూల యది సా దృష్టా ప్రియా చంద్రనిభాననా,
> మైథిలీ మమ విస్రబ్ధం కథయస్వ న తే భయం." ౨౫

అని మూలము. రాక్షసభయమున నేవియు సీతావార్తను దెలుపలేదు. ఓవ్యాఘ్రమా! నీకు భయమే లేదు కదా. నీవైన సీతవార్తను దెలుపుమా యని యడిగెను. శార్దూలాదు లుత్తరణమునఁ బాఱిపోవక నిలిచియుండవనియు, శ్రీరాముని కష్టమెట్టిదో యని యెఱుంగనేపోయిననియు భావము. ఈ సర్గమున శ్రీరామునిచర్యను బట్టి సకలము యీశ్వరరూపమే కాన నన్నింటిని ప్రశ్నించె నని యెఱుంగవలయును.

## సౌమిత్రి శ్రీరాముని నూఱడించుట.

* నిర్జనమగు నాయాశ్రమపదమును గాంచి యంతయు వెదకి సీతం గానక ఆమెను గట్టిగాఁ బిలిచి దుఃఖభారమునఁ జేతులు పిసికికొనుచు నత్తా! సీత యెక్కడ నున్నది ? ఎక్కడి కేగినది ? ఎవ్వఁ డపహరించెను. ఎవ్వఁడు భక్షించెను ? జానకీ ! చెట్టుచాయననుండి కనుఁగొనలేని నన్నుఁ బరిహాసముగాఁ గలవిలపాటొందింపకుమా. "నవ్వులు

---

* ఇది యఱువదొకఁడవసర్గమునఁ గలదు.

చాలును. దుఃఖితుఁడ నగునాకడకు రమ్ము. జింకపిల్ల నిన్నే తలంచుకొనుచుఁ గన్నీరుగాఱ వగచుచున్నది. లక్ష్మణా! ఇఁక బ్రతుకఁజాలను జుమీ! సీతాపహరణదుఃఖమున నేను మృతినొంద స్వర్గమున నాతండ్రి చూడఁగలఁడు. నే నచ్చటికిఁ బోవఁగా నాయానతిఁ బదునాలుగేండ్లు నిండకమునుపే వచ్చితివే అసత్యవాదివి. అని బహువిధముల నన్ను నిందించును. జానకీ! న న్నొంటరివానినిగాఁజేసి పోవలదు. నిన్ను వదలి క్షణకాలము జీవింపఁగలనా? ప్రాణముల వదలుదును. అని శ్రీరాముఁడు పలవించెను. కాని యామె మాత్రము కనఁబడ దయ్యెను.

సౌమిత్రి శ్రీరామునివగపు కాంచి యాయనహితముఁ గోరి యిట్లు పలికెను. "మహాబాహూ! శూరుఁడవు. దుఃఖింపకుము. నేను సీతాదేవిని వెదకఁ బ్రయత్నింతును. నాతోడ నీవు నాపనిచేయుము. ఈమహాగహనభాగముల నెందే నుండవచ్చును. వనవిహారమునందు స్నానములయం దామెకుఁ బ్రీతి మెండు. ఏకారణముననైన నెందో దాఁగి యుండును. త్వరగా నామెను వెదక యత్నింతము. వనమంతయు నన్వేషింతము. దుఃఖింపకుము." అని స్నేహము దొలకాడఁ బలుకఁగా విని శ్రీరాముఁడు సమాధానమొంది యతనింగూడి వెదక నారంభించెను. సరోవరములు లోనగు వానినెల్ల వెదకిరి. ప్రస్రవణాద్రియందు వెదకిరి. కాని యామె కనఁబడలేదు. రాముఁడు "సోదరా! ఇందు జానకి కనంబడ లేదు."అని దండకారణ్యమునం దంతట వెదకుచుండ,సౌమిత్రి "శ్రీరామా! శ్రీమహావిష్ణువు బలిచక్రవర్తిని బంధించి యీ విశ్వమును బొందినట్లు నీవును జానకి నపహరించినవారిని

శిక్షించి యాసీతను బడయఁగలవు." అని పలికెను. అది విని రాముఁడు "వత్సా! ఇందెల్లతావుల వెదకితిని. అయ్యన్నుల మిన్న కనఁబడలేదు."అని విలపించుచు మూర్ఛిల్లెను. నిట్టూర్పులు పుచ్చెను. దురవస్థల పాలయ్యెను. సౌమిత్రి పెక్కుభంగుల నూఱడించెను. కాని రామునిదుఃఖము హెచ్చుటకే పోయెను.

## శ్రీరాముఁడు వగచుట.

* ఆమహాబాహువు సీతం గానఁజాలక స్మృతి తప్పి మిక్కిలి వగచెను. అనురాగాతిశయమున నామె యున్న యట్లే భావించి ప్రేయసీ! యని యామెం బిలిచి యేమేమో మాటలాడెను. పరిహాసముల కవి యనువుగా నెంచెను. అంతలో "వత్సా! సీతను రక్కసులు భక్షించియుండరు. లేకున్న నా కడకు రాకయుండునా? మృగములగుంపులు నన్నుఁ జూచి గాంచఁగా సీతను రక్కసులు భక్షించిరని చెప్పునట్లు తోఁచుచున్నవి. సీతా! నీవు నశించుటం జేసి కైక వాంఛితము సఫలమైనట్లయ్యెను. జను లిఁక నన్నుఁ బరాక్రమహీనుఁడు నిర్వీర్యుఁడు నని యందురు. వనవాసము ముగించి యయోధ్య చేరఁగా మిథిలాధిపతి వచ్చి కుశలవార్తఁ బ్రశ్నింపఁగా నాతని నేనేమని చూతును? పుత్రికాప్రేమమున నాతఁడు విలపించి మూర్ఛిల్లును. సీత లేక నే నయోధ్యకుఁ బోనొల్ల. వత్సా! నన్ను విడిచి యయోధ్యకుఁ బొమ్ము. సీత లేక నే రాఁజాలను. నీవు భరతునిఁ గౌఁగిలించుకొని నీకు రాముఁ డనుజ్ఞ యిచ్చినాఁడు. భూమిని యథేచ్ఛముగాఁ బాలింపుము. అని నామాటగాఁ జెప్పుము.

* ఇది యఱువదిరెండవసర్గమునఁ గలదు.

నాకు బదులుగాఁ దల్లులకు నమస్కరింపుము. నీవు నేఁ జెప్పినట్లు చేయువాఁడవు. కాన నాతల్లిని జక్కఁగా రక్షింపుము. ఇక్కడివార్తలన్నియుఁ దెల్పుము." అని పల్కెను. లక్ష్మణుఁడా రామునిదుఃఖము గాంచి యోర్వఁజాలక తానును దుఃఖించెను.

## శ్రీరాముఁడు విలపించుట.

* రాజపుత్రుఁడా రాముఁడు వగపెల్లిదమునఁ దమ్మునకును దుఃఖమును గల్గించుచుండెను. సోదరునిశోకము గని మఱింత దుఃఖము తనకుఁ గలుగఁగా నాతనితో "వత్సా! నావలెఁ బాపకార్యములు చేసినవాఁడీలోకమున వేఱొక్కఁడుండఁడు. ఏలన; అనుబంధముగా నొకదాని వెంట నొకఁడుగా దుఃఖములు నాహృదయమును భేదించుచున్నవి. ఎవరికైన నిట్లు కలుగునా? ప్రాగ్జని నేను వలయుననియే పెక్కుపాపములు చేసినాను. దుఃఖముపై దుఃఖములు గల్గుట వాని ఫలమే. నాకష్టపరంపరలు తలంపునకు రాఁగా దుఃఖరాశి పెరుగును. సీతాముఖదర్శనమున నీనిర్జనారణ్యవాసకష్టములు నాకుఁ దోఁపకుండెను. ఆసీత యెడఁబాయఁగనే అవి పైకివచ్చినవి. భయస్వభావముగల యాసీత తన్ను రక్కసుఁడపహరించుకొని యాకాశమునఁ బోవుచుండ వికృతస్వరమున విలపించియుండును. నిజము. కోమలకంఠమును విఱిచి రక్కసులు రక్తమును ద్రావియుందురే. సాధుస్వభావముగల నాసీత యీశిలాఫలకముపై నాతోఁ గూరుచుండి నవ్వులంకురింపఁగా నిన్నుఁ జూచి పెక్కుపలుకులు చెప్పుచుండెను. గోదావరియం

* ఇది యఱువదిమూఁడవసర్గమునఁ గలదు.

డాజానకి కత్యంతప్రీతి. అచ్చటి కేమైనఁ బోయియుండునా? పోయియుండదు. నన్ను వదలి పోవునది కాదు. పుష్పావచయనము లోనగు కార్యముల కీయడవికిం బోయెనా? అదియు నిజము కాదు. సీత పిఱికితనముగలది. ఓసూర్యుఁడా! లోకవృత్తాంతవేత్తవు. పుణ్యపాపకర్మసాక్షివి. నాప్రేయసి యెందుఁ బోయినది? అపహృతయయ్యెనా? సర్వదా దుఃఖములే నాపాలు. నాకు నంతమాత్రమైనఁ జెప్పుము. ఓవాయూ! సర్వలోకముల నీవెఱుంగనిదే లేదు. సత్కులప్రసూతయగు నాభార్యవార్తఁ దెల్పుము. ఎవరో నపహరించుకొనిపోయినారా? తానే మరణించెనా? ఏత్రోవయందైన నున్నదియా?" అని యడుగుచు విలపించెను. అంత వగచుచు మూర్ఛిల్లిన శ్రీరాము నోదార్చుచు లక్ష్మణుం "డార్యా! శోక ముడుగుము. ధైర్యము నవలంబింపుము. ఉత్సాహము నూనుము. అదిగలవాఁడు దుష్కరకార్యములను జేయఁగలఁడు." అని బోధించినను శ్రీరాముఁడు ధైర్య మూనఁడయ్యెను.

మహాశయులారా! ఈభాగమునఁ గొన్ని విశేషములఁ బరికింతము.

"పూర్వం మయా నూనమభీప్సితాని
పాపాని కర్మాణ్యసకృత్కృతాని,
తత్రాయమద్యాపతితో విపాకో
దుఃఖేన దుఃఖం యదహం విశామి. ౪
రాజ్యప్రణాశస్స్వజనైర్వియోగః
పితుర్వినాశో జననీవియోగః,

సర్వాణి మే లక్ష్మణ శోకవేగ
మాపూరయంతి ప్రవిచింతితాని.                                                 ౫

సర్వం తు దుఃఖం మమ లక్ష్మణేదం
శాంతం శరీరే వనమేత్య శూన్యం,
సీతావియోగాత్పునరప్యుదీర్ణం
కాష్ఠైరివాగ్నిస్సహసా ప్రదీప్తః."                                                 ౬

అని మూలము. శ్రీరాముఁ డప్పటి తనయవస్థ ననుసరించి సౌమిత్రి కుపదేశించు నెపమున లోకులకుఁ గర్మసిద్ధాంతమును దెలుపుచున్నాఁడు. వలయునని నేను పోలిజన్మమున ననేక పాపములు వరుసగాఁ జేసితిని. దానికి ఫలముగా దుఃఖముపై దుఃఖము కలుగుచున్నది. రాజ్యచ్యుతి లోనగునవియే వాని ఫలములని తాత్పర్యము.

"కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః,
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా."                                                 ౧౨

అను గీతావాక్యము ననుసరించి ఫలములను గోరి కర్మముల నాచరించువారలకు వానికనుగుణములగు ఫలములు మానవ లోకమునఁ గలుగుచుండును. అనఁగా ఏయుద్దేశమునఁ గర్మము లాచరించిన నవ్వాని కనురూపములగు ఫలములు కలుగునని కదా భావము. తఱచుగాఁ బరహింసాపూర్వక స్వలాభమును గోరి కర్మముల నాచరించుచుందురు. వానికి ఫలములుగా రెండవజన్మమున దుఃఖములే కలుగుచుండును. అవియు నాతఁ డనుభవించుచుఁ బూర్వపాపముల స్మరింపఁ జేయునవిగా నుండును. కనుకనే

"న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా,
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే."

అని భగవంతుఁడు గీతాశాస్త్రమునఁ దెలిపెను. అనఁగా ఫలములను భగవదర్పణముచేయుచు శాస్త్రవిహితకర్మముల నాచరింపవలయు నని కదా తాత్పర్యము. కనుకఁ బూర్వ జన్మమునఁ జేసిన కర్మఫలముల ననుభవించుచు వానిని స్మరించుచు నికనైన నిట్టివి చేయరాదని నిశ్చయించుకొనుచు దుష్కర్మముల నాచరింపక యుండవలయు ననుసీతని శ్రీరాముఁడు తేటపఱచెను. నిర్జనారణ్యమున నుండినను సీతా సాన్నిధ్యమున సకలకష్టములను మఱచియుంటిని. తద్వియోగమున మరల నవి స్మృతికి వచ్చుచున్నవని రామమూర్తి తెలిపెను. మహాప్రకృతిసాన్నిధ్యమున నేను సుఖిని. తద్విరహమున దుఃఖవంతుఁడను. అనుటంజేసి లోకమున గృహస్థులలో ననుకూలభార్యావంతుఁడు సుఖి యని తేలెడిని. ఈ యర్థము ననుసరించియే.

"అర్థాగమో నిత్యమరోగితా చ ప్రియా చ భార్యా ప్రియవాదినీ చ,
వశ్యశ్చ పుత్రోఽర్థకరీ చ విద్యా షడ్జీవలోకేషు సుఖాని రాజన్."

అనుసూక్తి ప్రసిద్ధ మయ్యెను.

"పతిం యా నాభిచరతి మనోవాగ్దేహసంయతా,
సా భర్తృలోకానాప్నోతి సద్భిస్సాధ్వీతి చోచ్యతే."

అని మనుస్మృతియుఁ దెలుపుచున్నది. భార్య భర్తృతత్పరయే కావలయు ననియు, నపుడే యాతఁడు సుఖి యనఁబడుననియు మనము తెలిసికొనవలయు.

"అస్మిన్మయా సార్ధముదారశీలా
శిలాతలే పూర్వముపోపవిష్టా,
కాంతస్మితా లక్ష్మణ జాతహాసా
త్వామాహ సీతా బహువాక్యజాతం." ౧౨

అని మూలము. ఇచ్చోట తనిశ్లోకి తెగబాఱెడు భావమును దెలిపినది. కాని యది రామాయణమహిమనుగాని యద్దాని నుండి నేర్చుకొనఁదగిన నీతినిగాని బోధింపఁజాలదు. ఊహల పై నూహలుగా నాకాశరామన్న పంచాంగమల్లినట్లున్నది. భగవత్తత్త్వమును గాని లోకమర్యాదలను గాని తెలుపని తావులఁ బెంచి వ్రాయుట, యీ గ్రంథముతాత్పర్యము కాదు. కాన నిద్దాని వదలవలసివచ్చినది. ఈవృత్తాంతమును రామమూర్తి తెలుపుటచేతఁ బ్రీతిపాత్రమగు భార్య సకలదుఃఖ ములను దొలఁగించునదియౌట సర్వదా స్మృతికిఁ దగులు చుండు నను విషయము మాత్రము గ్రహింపవలయును.

"ఆదిత్య భో లోకకృతాకృతజ్ఞ లోకస్య సత్యానృతకర్మసాక్షిన్,
మమ ప్రియా సా క్వ గతా హృతా వా శంసస్వ మే శోకవశస్య నిత్యం.
లోకేషు సర్వేషు తవాస్తి కించిద్యత్తేన నిత్యం విదితం భవేత్తత్,
శంసస్వ వాయో కులశాలినీం తాం హృతా మృతా వా పథి వర్తతే వా."

అని మూలము. శ్రీరాముఁడు సూర్యవాయువులను మాత్రమే యిచ్చోట సీతావిషయమై ప్రశ్నించెను. ఇంద్రాదిదేవతల నేల ప్రశ్నింపలేదని యడుగుదురేమో. భగవంతుఁడు సర్వజ్ఞుఁడు కావున నొక్కొక్కమాటను గూడ సార్థకముగాఁ దెలుపును. తనకార్యమునకు ముందుఁ దోడ్పడువారు ప్రాణముల నర్పింప సిద్ధముగానున్నవారు సుగ్రీవహనుమంతులు. సూర్యవాయు

వులు వారికిఁ దంత్రులు కనుక వారిని బ్రశ్నించెనని యూహింపవలయును. సూర్యుని గర్మసాక్షియనియు, వాయువును నీ వెఱుంగనిది యేదియు లోకమున లేదనియుఁ దెలుపుటంజేసి యాజ్ఞచేయువాఁడు సుగ్రీవుఁడనియు, సీతాన్వేషణావ్యాజమున లంకానగరవృత్తాంతమెల్ల నెఱుంగువాఁడు హనుమంతుఁడనియు సూచింపఁబడియె. ఇచ్చో మనము గ్రహింపఁదగిన దేది? మానవులు తామొనరించుపాపము లితరు లెఱుంగకయుండఁ జేయఁజాలరు. సకలకర్మములకు సాక్షి సూర్యుఁడు. మనోదోషముల నెఱింగెడువాఁడు వాయువు. కనుక మనయుక్తి యితరు లెఱుంగఁజాలరను దుర్భావమును విడువవలయును. ఎంతరహస్యముగా నేపని చేసినను దాని నెఱుంగు దేవతలు భగవదాజ్ఞను దలఁదాల్చియున్నవారు. వారెఱుంగకుండ మన మేమియుఁ జేయఁజాలము. అని యోచించి దుష్కర్మముల నాచరింపక యుండవలయును అను విషయము నీభాగమునుండి యెఱుంగవలయును.

## శ్రీరాముఁ డందందుఁ గనఁబడుగుఱుతులచే సీతాపహరణము నిశ్చయించుట.

* శ్రీరాముఁడు దీనుఁడై లక్ష్మణా! జానకి కమలముల కొఱకు గౌతమికరిగి యుండునో, కనుఁగొని వేగ రమ్మనియె. అతఁ డట్లుపోయి వచ్చి యందుఁ గనఁబడలేదని తెలిపెను. రాముఁడు శోకవేగమునఁ దానేపోయి నదిం గాంచి సీత యెందున్నదని యడిగెను. రావణభయమున నానది పలుకకుండెను.

---

* ఇది యఱువదినాల్గవసర్గమునందలి కథ.

అందలి జంతువు లట్లే యుండెను. అంత నారాముఁడు సౌమిత్రీ! నది తెలుపకున్నది. సీత లేక జనకరాజును గౌసల్యను జూడఁజాలను. చూచి వారలకప్రియవార్త నేమని చెప్పుదును? నాదుఃఖములఁ దూలించుసీత యగపడునే నిందు విహరింతును గదా. కనఁబడకయే యున్న నొకరాత్రి యొకయుగముగా నుండు నని తలంతును. ఈమృగములు నన్ను మాటిమాటికిఁ జూచుచున్నవి. సీతావార్తను దెలుపఁబూనిన ట్లున్నవని తలంతు. అని వానితో సీత యెందున్నదని యడిగెను. అవి వెంటనే దక్షిణాభిముఖములై యాకాశభాగమును జూచుచు సీతపోయినమార్గముననే పరుగెత్తుచు రామునిం జూచెను. ఆ విషయమును సౌమిత్రి యెఱింగెను. ఆమృగములచేష్టలు మాటలతోఁ జెప్పినట్లుండఁగా వానియాశయము నూహించి మిగుల నార్తితో నన్నా! నీవడుగఁగనే యివి లేచి దక్షిణ భాగమును జూపుచున్నవి. కనుక మనమాభాగమునకే పోవు దము. సీతావార్త నెఱుంగుట తెలుసుకొనుట దొరకవచ్చును. సీతయు దొరకవచ్చును. అనఁగా నారామమూర్తి యంగీకరించి సౌమిత్రింగూడి క్రిందుగఁ జూచుచుఁ బోవుచుండెను. పూవులు రాలియుండు తావులు కనఁబడియెను. వానింగని వగచి రాముఁడు. ఈపూవులగుఱుతు లెఱుంగుదు. నేనే కోసి యీయఁగా నాసీత ధరించెను. అని ప్రస్రవణపర్వతమును సీత వార్త నడుగ నది యూరకుండఁగా నాగ్రహించి నేను నీసాను భాగముల విదళింపకముందే నాబంగరుబొమ్మవార్తఁ దెలిపి యామెను జూపుమనియెను. ప్రతిధ్వనితప్ప మఱేదియు లేక పోఁగా మరల నాబాణాగ్నిచే నిన్ను నీఱుగాఁజేసెదను. అని సౌమిత్రింగని వత్సా! యీనది సీతపోకడఁ దెలుపకున్న

శోషిల్లఁజేయుదు ననెను. అంతలోఁ జూచో రాక్షసుని పెద్దపాదములు, వాఁడు వెంటనంటగా నాశ్రమమునకుఁ బరుగిడు సీత యడుగులును గనఁబడియెను. అందందుఁ దూనిఁగిన ధనుశ్శకలములు, అమ్ముపొదులు, విచ్ఛిన్నరథభాగములు కనఁబడఁగాఁ దొట్రుపాటున లక్ష్మణా! వీనిం జూడుము. సీతసొమ్ములనుండి సువర్ణశకలములు రాలినవి. పూలహారములు రాలినవి. రక్తబిందువులు భూమియం దెల్లెడలఁ గ్రమ్ముచున్నవి. దుష్టులా సీతం జంపి భాగములుగాఁ దినియుందురు. ఆమె కొఱకై యిద్దరు రక్కసులు యుద్ధము నొనరించిరి. ఈ రత్నఖచితధనుస్సు విఱిగిపడినదే? ఎవనిదిది? ఈ కవచ మెవ్వనిది? ఈ ఛత్త్ర మెవ్వనిది? ఈ కంచరగాడిదలు చచ్చియున్నవే. ఎవ్వనివి? ఈ ధ్వజముం జూడుము? యుద్ధార్థమై యరదము విఱిగియున్నది. ఈ సారథి యెవ్వనివాఁడు? ఇరువురు పడియున్నవారు. ఎవని చామరములు పట్టువారు? సీతంగొని యరుగు రాక్షసునిదే. నా కింత దనుక వారిపై నాగ్రహము కలుగలేదు. ఇప్పుడు కలిగినది. ఇఁక వారి బ్రదుకనీయను. క్రూరరాక్షసులు జానకిని భక్షించియో యపహరించియో యుందురు.

ఆపదలయందు ధర్మము రక్షించునందురు కదా. ఇప్పుడది రక్షింపకపోయెఁ గదా. దేవతలెవరును నాకుఁ దోడ్పడరైరి. ఎట్టిశక్తిగలవాఁడైనను దనశక్తిని వెల్లడింపకున్న లోకులతని నవమానింతురు. ఇది లోకస్వభావము. లోకహితకారి నగునన్ను దేవతలు వీర్యహీనునిగాఁ దలంచుచున్నారు. ఇది కారుణ్యాదులదోషము సుమా! ఇఁక నయము వదలి కోపమును గ్రహింతును. చంద్రుని తేజము నపహరించిన యుదయ సూర్యుఁడు వెలుంగునట్లు నాయపారతేజము మృదుత్వాదిగుణ

ముల వదలి బయల్పడి వెలుంగుఁగాక. వత్సా! దేవతలేమి, యక్షాదు లేమి యిఁక సుఖమునొందఁజాలరు. బ్రహ్మాస్త్రాదులచే నాకాశమును నింపెదను. త్రిలోకవాసులసంచారము నరి కట్టెదను. గ్రహసంచారాదుల నిలిపి పర్వతమునఁ గల సర స్సులు లోనగువాని నింకునట్లుచేసి ముల్లోకముల నాశనము చేసెదను. దేవతలు నాదేవిని యథాపూర్వముగా నాకొసంగక యున్నారు కదా. కాన రెండుగడియలలో వారు నాపరా క్రమమును జూడఁగలరు. నాబాణాగ్నిజ్వాలల సెల్లర మాడ్చి వైచెదను. చూడుము. సీతానిమిత్తము బాణములఁ బ్రయో గించి బ్రహ్మాండమునఁగల పిశాచరాక్షసాదుల నిర్మూలము గావింతును. కోపమున నేఁ బ్రయోగించుబాణములు బహు దూరము పోవుచుండ వానిశక్తిని దేవతలు చూతురు గాక. రాక్షసాదులు గలలోకము లిఁకనుండవు. సీతను యథాపూర్వ ముగా దేవతలు నాకొసంగరేని లోకములు నశించును. అని పలుకుచు మహాకోపమునఁ బ్రళయకాలరుద్రునికై వడి నారి మీటుచు బాణములంగూర్చి వత్సా! ఇఁక నన్ను నివారింప నెవ్వారికిఁ దరముకాదు. నాధర్మపత్నిని సీతను దెచ్చి దేవతలు నాకీయకున్న నెవ్వరు మిగులకుండ నాశనము గావింతు ననెను.

మహాత్ములారా! ఈభాగమున విమర్శనార్హవిషయ ములు లేవు. శ్రీరాముఁడు శత్రుసంహారమునకుఁ బూని రుద్ర రూపమును ధరించెననియు, నేయేపనులు చేయుదునని తెల్పెనో యవిచేయుట యామహాత్మునకు సులభమే యనియు మనము తెలిసికొనవలెను.

"కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః."

అన్న గీతాశాస్త్రవిషయమే యిందును గలదు. ఇవి ప్రల్లవములు కావా? ఇట్లు చెప్పుకొనుట శూరులలక్షణమా? యని మీరడుగుదురేమో. భార్యనెవరో హరించిరని తెలియఁగనే శూరుఁడగు మానవుని ప్రవృత్తి యెట్లుండునో ఆవిధమే యిందు శ్రీరామునిచేఁ దెలుపఁబడెను. భార్యాపహరణమున నశక్యకార్యములు శక్యములే యగునని తోఁచుట మానవస్వభావమను విషయము నీభాగము తెలుపుచున్నది.

## సౌమిత్రి శ్రీరాము నూఱడించుట.

* శ్రీరాముఁడు రుద్రావతారమెత్తినయట్లు నటింపఁగా సౌమిత్రి దోసిలొగ్గి శ్రీరామా! ఇంతకుముందు మృదుస్వభావుఁడవు జితేంద్రియుఁడవు కరుణాకరుఁడవు నను ప్రసిద్ధినొందితివి. ఇపు డిట్లు కోపమొందుట న్యాయము కాదు. చంద్రసూర్యాదులయందుఁ గాంతి లోనగుగుణములు నియతములై యుండును. అవి యన్నియు నీయందున్నవి. ఒక్కరథమే కనుపట్టుచున్నది. ఒక్కఁడు పోయినజాడయే కనఁబడుచున్నది. ఒక్కనియపరాధమునకు నిరపరాధుల నెల్ల సాధించుట న్యాయము కాదు. శకలములగు నీరథాదు లెవనిచే నిట్లు చేయఁబడెనో యేకారణముననో తోఁచకున్నది. ఇచ్చోఁగల రక్తబిందువులు లోనగువానిచే మహాయుద్ధము జరిగినట్లు కనఁబడుచున్నది. ఒక్కరథికునిదిగా నీయుద్ధము కనుపట్టుచున్నది. ఈగురుతులెల్ల నట్లే సూచించుచున్నవి. రాజులపరాధినే దండింతురు. మృదుస్వభావులుగ నుండెదరు. నీవు రాజ

---

* ఇయ్యది యఱువదియైదవసర్గమునఁ గలదు.

మాత్రుఁడవు కావే. సర్వభూతశరణ్యుఁడవు. నీభార్యాపహారణ మంచిదని యెవ్వఁడైన నూహించునా? లోకరక్షకుఁడవగు నీ కపకారము చేసినఁ దమకే నాశము కల్గునని దేవతలు లోనగువా రపకారము నీకుఁ జేయుదురా? లోకనాశనప్రయత్నమును మాని నాతోడరమ్ము. ఋషులు తోడ్పడుదురు. సీతను వెదకుదము. సామమున దేవతలు సీతజాడను దెలుపరేని ఆవల బాణజ్వాలలఁ దలంచిన కార్యమును జేయఁబూనవచ్చునని యూఱడించెను.

మహామతులారా! ఈభాగమున విషయసార మొక్కఁడు కలదు.

"సదా త్వం సర్వభూతానాం శరణ్యః పరమా గతిః. ౧౦
కో ను దారప్రణాశం తే సాధు మన్యేత రాఘవ."

అనునది. శ్రీరాముని సేవించులక్ష్మణుఁడు జ్ఞానసంపన్నుఁడగుట నైజమే. ఆరూపమును జూడఁగనే యిఁక లోకములఁ జంపునని భయంపడి స్తుతించుచున్నాఁడు. నీవెల్లప్పుడు సర్వభూతములకు శరణ్యము, పరమగతియు నగుదువు. అని హెచ్చరించెను అనఁగా నీయవతార మిాయది దుష్టదానవసంహారార్థముగాని సకలభూతసంహారార్థము కాదుప్రభూ యని తెలిపెను.అనఁగా పరమగతినగు నీవు చంపిన నీకడకే వత్తురు. మరల సృష్టిచేయ వలసినదే కదా. ఏమిలాభమని తలంపునకుఁ దెచ్చెను. భగవత్సేవవలనఁ దత్త్వము తెలియఁగలదనియే కదా దీనిసారము. శ్రీరామునియాకార మక్కాలమున రౌద్రమని యెఱుంగవలయును. భగవంతునకు రూపము కార్యార్థము కల్పితమగు

ననియు, నొక్కరూపమును భావము నిస్సారమనియు మనమీ
భాగమునుండి నేర్చుకొనవలయును. సర్వరూపములు భగవంతుని
వే యని నమ్మినచో మతద్వేషము నశించును. సర్వమానవ
సోదరత్వ మలవడును. సమదర్శనుఁ డగుట కనుకూల మేర్ప
డును. ఏజన్మమునకైన నది యలవడెనేని ముక్తి లభించును.
అంతియ కాని చచ్చువేదాంతములవలన ముక్తి దొరకదు. ధన
విముక్తిమాత్రము లభించును. కావున వంచకులమాటలకు
లోఁబడక మన మెంతమాత్రము జ్ఞానము కలవారమని యాలో
చించుకొని యోగ్యతానుసారము భగవంతుని సేవించుచు
నైహికఫలముల నాశింపక సర్వకార్యములనిష్కామముగానే చేయువారల
సర్వలాభములు కర్మానుసారముగా లభించును.

## లక్ష్మణుఁడు శ్రీరామునకుఁ గొన్నిసత్యములను విన్నవించుట.

* సీతనుగూర్చి వగచుచున్న శ్రీరాముని నూఱడించి
సౌమిత్రి పాదములపై వ్రాలి శ్రీరామా! దేవతలందఱు గూడి
యమృతమును సంపాదించినట్లు దశరథుఁడు సకలవ్రతాదుల
ఫలముగా నిన్నుఁ బడసెను. నిన్నెడఁబాసినంతనె దేహత్యాగము
నొందెను. భరతునిమూలమున నిన్నట్టిభాగాన నలసము కాదు.
నీవప్రాకృతుఁడవు. ఈదుఃఖమును భరింప నీవే చాలవేని
యల్పుఁ డెవ్వఁడు భరింపఁగలఁడు? ఈశోకమున లోకులఁ జం
పుదువేని వా రెందుఁ బోయి సుఖింతురు? అర్థనష్టములు నొం
దుట లోకులకు నైజమేకాని యస్వాభావము కాదు. [illegible]

---

* ఇయ్యది యఱువదాఱవసర్గమునఁ గలదు.

పుత్త్రుఁడగు యయాతి సురలోకము నొందియు, అవినయమున స్వర్గచ్యుతుఁడై దుఃఖముల నొందెను. మన కులగురువగు వసిష్ఠపుత్త్రులు శతసంఖ్యులు విశ్వామిత్రకోపాగ్ని నొక్కట దగ్ధులైరి. ఈభూమికింగూడఁ జలనము కనఁబడుచున్నది. ఈవిషయములు నీవే నాకుపదేశించితివి. లోకసాక్షులకు రవిచంద్రులకును గ్రహణము కలుగుచున్నది. మాంధాతృప్రముఖులును దైవసంకల్పము నతిక్రమింపఁజాలరు. దేవతలకు దుఃఖములు గల్గును. కాన నీవు దుఃఖింపఁదగదు. సీత నశించిన నపహృతయైనను క్షుద్రునివలె నీవార్తి నొందరాదు. నెమ్మది నాలోచింపుము. ఈకష్ట మేల వచ్చెనో తేటపడఁగలదు. ప్రాక్కృతకర్మముల గుణదోషములు ప్రత్యక్షముగాఁ దెలియ శక్యములు గావు. కర్మ మెట్లు చేసినదియుఁ దెలియఁ దరముగాదు. ఫలముల ననుసరించియే యూహింపవలయును. చేయనికర్మములకు ఫలములు కలుగవు. తొలిజన్మమునఁ జేసిన కర్మముల ఫలములే యిపు డనుభవింపఁదగినవి. ఇఁక వానికై దుఃఖింపనేల? నాకీవిషయముల మున్ను నీవే యుపదేశించితివి కదా. వీనిని సర్వజ్ఞుఁడవగు నీకెవ్వఁడు బోధింపఁగలఁడు? దుఃఖమున నీబుద్ధి భ్రాన్తపడినది. కావున స్మృతికిఁ దెచ్చుచున్నాను. స్వర్గమునఁ గల సాత్త్వికమగు దేవతాదిప్రాణిసముదాయమును మర్త్యలోకమున బ్రాహ్మణాదిప్రాణిసంతతిని జూడుము. సర్వలోకనాశనదక్షమగు నీపరాక్రమమును జూడుము. ఎందు దీనిఁ బ్రయోగింపవలయునో యూహింపుము. తొలుత శత్రువు లెవరో నిర్ణయింపందగును. పాపాత్ముఁడగు పగవానిని జంపందగునని హితమును దెలిపెను.

మహాశయులారా! ఈభాగమునఁ గొన్ని విషయములు విమర్శింపఁదగును. పరికింతము. శక్తి కనురూపముగా సార మును గ్రహింతము.

"మహతా తపసా రామ మహతా చాపి కర్మణా,
రాజ్ఞా దశరథేనాసి లబ్ధోఽమృతమివామరైః. ౪

... ... ... ... ...

యది దుఃఖమిదం ప్రాప్తం కాకుత్స్థ న సహిష్యసే,
ప్రాకృతశ్చాల్పసత్త్వశ్చ ఇతరః కస్సహిష్యతి? ౫
దుఃఖితో హి భవాన్ లోకాం స్తేజసా యది ధక్ష్యతే,
ఆర్తాః ప్రజా నరవ్యాఘ్ర క్వను యాస్యంతి నిర్వృతిమ్." ౬

అని మూలము. సర్వఫలముల నిచ్చునది కర్మమే యని శ్రీరా మోపదేశమునే లక్ష్మణుఁడు తెలుపుచున్నాఁడు. దేవతలు శ్రమించి మృతిని దొలఁగించుమందును బడసిరి. వారామృత మును బడసినట్లు దశరథుఁడు నిన్నుఁ బడసెను. నీవమృత స్వరూపుఁడవు. అనఁగా ముక్తి యని భావము. పరమగతియని సారము. బహుశ్రమములకు లోనై దేవతలు అమృతమును సంపాదించిరి. దశరథుఁ డనేక యజ్ఞదాన తపస్సు లాచరించి బహువిధకర్మములకు ఫలముగా నిన్నుఁబడసెను. అనఁగాఁ బాపనిర్వాపణమునకై యజ్ఞాదు లాచరించుచు గొప్పతపస్సు చేసి నీయనుగ్రహమునకుఁ బాత్రుఁడై నిన్నుఁ గాంచెను. కర్మములకుఁ దపస్సునకు ఫలము కలదని యిందు మూల మునఁ దెలియనగు. సత్కర్మములఫలము తపోనిష్ఠ. దానికి ఫలము భగవదనుగ్రహము. అని స్పష్టమగుచున్నది. కనుకనే "యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి" అని భగవంతుఁ డనియెను. దీనిచే

యజ్ఞాదిసత్కర్మము లల్పములని తేలలేదా యనరాదు.బహు వస్తుసాధ్యములగు యజ్ఞాదులకంటెఁ గేవల మనశ్శక్తి సాధ్య మగుతపస్సు శ్రేష్ఠమని భావము. ఆతపస్సు కూడ ఫలాభిసంధి రహితము కావలెను. "తపస్విభ్యోఽధికో యోగీ"అని భగ వంతుఁడే గీతాశాస్త్రమునందు బోధించెను గదా. విగ్రహారా ధనమునకంటె మానసికపూజయే యుత్కృష్టమని దీనిసారము. భగవదనుగ్రహమును గోరుట మాత్రము ఫలాభిసంధి కావా యనుదురేమో. ఉత్తమపురుషార్థనిరతియే కావలెననియు, నదియుఁ గామ్యమనఁబడదనియుఁ బెద్దలమతము. ఏలయనఁగా ముక్తి యొకవస్తులాభమువంటిది గాదు. కావుననే దానిని గోరి చేయునది శ్రేష్ఠమని తాత్పర్యము. ఓరామా! యీదుఃఖ మును నీవు సహింపనిచో నిఁకఁ బ్రాకృతు లెట్లు లోర్చు కొందురు.

> "యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః,
> స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే."

అన్నవాక్యమునే కదా నీవుపదేశించితివని లక్ష్మణుఁడు శ్రీరా మునకుఁ దెలుపుచున్నాఁడు. అనఁగా దుఃఖముసహించి కార్యా రంభమునకుఁ బూనిన నన్నుఁజూచి యితరులు నేర్చుకొందురు గాన నీదుఃఖ ముడుగుమనియు, నింక నీనటనము చాలు ననియు లక్ష్మణునియాశయము. సర్వజ్ఞుఁడవగు నీవే దుఃఖ మున లోకనాశనము చేయఁబూనిన శరణ్యుఁ డెవ్వఁడనియు బోధించెను. సోదరుఁడు శిష్యుఁడు నగులక్ష్మణుఁ డిట్లు పలుక వచ్చునా యని సందేహింపరాదు.

> "విషాదప్యమృతం గ్రాహ్యం బాలాదపి సుభాషితం,
> అమిత్రాదపి సద్వృత్తమమేధ్యాదపి కాంచనమ్.

"స్త్రియో రత్నాన్యథో విద్యా ధర్మశ్శౌచం సుభాషితం,
వివిధాని చ శిల్పాని సమాదేయాని సర్వశః." ౨౪౦

మను. ౨-అధ్యాయము.

అని మనుస్మృతి తెలుపుచున్నది. బాలుఁడు చెప్పినను మంచి మాట గ్రహింపఁదగు నను నీతిని బోధించుటకే వాల్మీకి లక్ష్మ ణునిమూలమున నీన్యాయమును జెప్పించె నని మన మెఱుంగ వలయును.

"తత్త్వతో హి నరశ్రేష్ఠ బుద్ధ్యా సమనుచింతయ,
బుద్ధ్యా యుక్తా మహాప్రాజ్ఞా విజానంతి శుభాశుభే. ౧౫
అదృష్టగుణదోషాణామధృతానాం చ కర్మణాం,
నాంతరేణ క్రియా తేషాం ఫలమిష్టం ప్రవర్తతే. ౧౬
త్వమేవ హి పురా రామ మామేవం బహుశోఽన్వశాః,
అనుశిష్యాద్ధి కో ను త్వామపి సాక్షాద్బృహస్పతిః. ౧౭
బుద్ధిశ్చ తే మహాప్రాజ్ఞ దేవైరపి దురన్వయా,
శోకేనాభిప్రసుప్తం తే జ్ఞానం సంబోధయామ్యహం. ౧౮
దివ్యం చ మానుషం చ త్వమాత్మనశ్చ పరాక్రమం,
ఇక్ష్వాకువృషభావేక్ష్య యతస్వ ద్విషతాం వధే." ౧౯

అని మూలము. ఇందు లక్ష్మణుఁడు శ్రీరామునకు స్వరూపజ్ఞాన మునఁ గార్యమును జూపుమా యని బోధించుచున్నాఁడు. "బుద్ధ్యా సమనుచింతయ" బుద్ధిచేఁ జక్కఁగా నాలోచింపుము.

"ఇంద్రియాణి పరాణ్యాహురింద్రియేభ్యః పరం మనః,
మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః." ౪౨

అను గీతావాక్యము ననుసరించి బుద్ధి నిశ్చయాత్మిక గావున

మనస్సునకంటెు (సంకల్పవికల్పాత్మకము) బుద్ధి యుత్కృష్టము గనుక దానిచే నాలోచింపుమనుచున్నాఁడు. అనఁగా నీ దుఃఖము నీ కెట్టిదో యించుకయాలోచింపుమా యని భావము. అని తెలిపి లోకులకుఁ గర్మసిద్ధాంతమును దెలుపుచున్నాఁడు. ఎందులకు? అనఁగా మానవులు తమ రనుభవించుఫలములను బట్టి మున్ను తమ రెట్టికర్మముల నాచరించిరో వాని ననుమానించి తెలిసికొనవలయుననియే.కర్మములు కనఁబడవు. ఫలముల ననుసరించి ప్రాగ్జన్మమునందు నెట్టికర్మముల నాచరించితి మని యూహింపవలయు. దానినుండి దుష్కృతసుకృతకర్మములలో నేవి యని తేలెడిని. దుష్ఫలము లనుభవించువారు మరల నిట్టి ఫలముల నిచ్చుకర్మములను జేయరా దని తెలిసికొందురు. దాన నించుకయైన లాభము కలుగకపోదు. ఆచరణమున నించుక మార్పు గలుగును. జన్మాంతరమున కీకృషి మఱెంత లాభించును. శ్రీరామా! నీబుద్ధి దేవతలకుఁ గూడఁ గలుగదే. ఇపుడీ దుఃఖాభినయముమూలమున నది ప్రకాశింపఁజేయ కున్నాఁడవు. దానిని మేలుకొలుపుచున్నానని సౌమిత్రి తెలిపెను. భగవంతుఁడే రామరూపమున నవతరించె నని లక్ష్మణుఁ డప్పు డెఱింగె ననవచ్చును గదా. అనఁగా నీయూహాలు దేవతలకుంగూడఁ దెలియవే. ఇఁక మానవుల కెట్లు తెలియఁ గలవు? అనఁగా దేవాదిదేవుఁడవగు నీతత్త్వ మెఱుంగ మా బోంట్లకు సాధ్యమా యనియే కదా దీనిభావము. ఈబోధమున మానవులు దుఃఖము కలుగుతఱిఁ దమరుచేసిన దుష్కర్మములను దలంచుకొని యిఁకనైన వానిని జేయరాదను బుద్ధి గలవారు కావలయు ననియే యిందుఁగలసారము. సుఖానుభవకాలమునందును సుకృతకర్మముల ఫలమిది కదా యని

యూహించి యాసుఖము లల్పములగుట శాశ్వతసుఖమును బడయఁదగిన కర్మముల నాచరింపఁ బ్రయత్నింపవలయును. అను నీరెండువిషయముల నీభాగము మనకుఁ దెల్పుచు చున్నది. ఈభాగమున నధ్యాత్మ రామాయణమునందు విశేషములు లేవు. తరువాతి కథను బరింతము.

## శ్రీరాముఁడు జటాయువును గని దుఃఖించుట.

* సారవంతమగు ననుజునిమాటల నారాముఁడు సారగ్రాహి యగుట నంగీకరించెను. అప్పుడే కోపము నడంచుకొని చిత్రకార్ముకమును బట్టి లక్ష్మణా! ఇఁక మన మేమిచేయుదము? ఎందుఁ బోవుదము? సీతను జూడఁగలుగు నుపాయము నాలోచింపుము. అనఁగానే సౌమిత్రి శ్రీరామా! ఈజనస్థానమున రక్కసులు పెక్కండ్రు తిరుగుచుందురు. బహువిధతరువులు గలవు. ఇందే వెదకవలయు. ఇందనేక రహస్యస్థలములు గలవు. నన్నుఁగూడి వెదకవలయును. శ్రీరామా! మీవంటి మహాత్ములు పర్వతములంబోలి చలింపకుందురు. అనుటయు నా రామమూర్తి సీత కనఁబడకపోవుట కాగ్రహము కలుగఁ దీవ్ర నారాచమును సంధించి తమ్మునితో నావనమంతటఁ దిరిగెను. అందొకచో రక్తసిక్తాంగుఁడై పర్వతశిఖరమువలె దేహ మొప్పఁ బడియున్న యొకపక్షిపతిని జూచెను. సౌమిత్రీ! ఈతఁడే సీతనుభక్షించినాఁడు. నిస్సంశయము. ఈరక్కసుఁడు గ్రద్దవలె రూపమొప్పఁగా నిందున్నాఁడు. నాబంగరుబొమ్మను భక్షించి సుఖముగా నున్నాఁడు. ఈతీవ్ర నారాచమున వీనిం

* ఇది యఱువదియేడవసర్గమునఁ గలదు.

ద్రుంచెదను అని వేగముగా నాతని కెదురుగాఁబోయెను. ఆ
పక్షియు దుఃఖసాగరపతితుఁడగు రామునింగాంచి ఫేనరక్త
ములు గ్రక్కుచు దీనవాక్యముల నాయుష్మంతుఁడా! నీ
వెవ్వతుకను మహారణ్యమున వెదకెదవో యాసీతను నాప్రాణ
ముల నీరెండింటిని రావణుఁ డానురుఁ డపహరించినాఁడు.
శ్రీరామా! మీరిరువురు లేనితఱి వాఁడు జానకి నపహరించు
కొనిపోవుచుండఁగాఁ గని యాసీత కభిముఖముగాఁ బోయి
వానిని మార్కొని వానిరథమును బొడిచేసి వానిని భూమికి
దిగునట్లు చేసితిని. నే ఖండించిన యావిల్లు రావణునిది. శకల
మగు కవచము వానిదే. నాపక్షఘాతమున మ్రందిన వీఁడాతని
సారథియే. నేనలసియుండఁగా వాఁడు ఖడ్గమున నన్నుఁ బడఁ
గొట్టి జానకిం గొనిపోయెను. వాఁడే నన్నుఁ జంపెను. నీవును
జంపకుము.

శ్రీరాముఁ డాసీతావృత్తాంతమును వినఁగానే బాష్ప
ధారలు స్రవింప మిక్కిలి దుఃఖించెను. అంత నాపక్షిరాజును
కౌఁగిలించుకొని ధనస్సును బాఱవైచి దుఃఖభారమున
మూర్ఛిల్లి నేలంబడి రోదనముచేసెను. సౌమిత్రియు విలపిం
చెను. జటాయువు దురవస్థనుగాంచి రాముఁడు దుఃఖము
ద్విగుణముకాఁగాఁ దమ్మునితో నాయనా! రాజ్యము పోయెను.
వనవాసము గల్గెను. సీతయుఁ గానరాకపోయెను. ఈజటా
యువు హతుఁడయ్యెను. ఈనాదౌర్భాగ్యము హవ్యవహుని
గూడ దహించును కదా. ఈతాపము పోవ నేను సాగరమును
ప్రవేశించిన నాదురదృష్టమున నాసముద్రము శుష్కించును
గదా. ఇన్ని దుఃఖములు నన్నలముకొనఁగా నాకంటె దౌర్భా
గ్యము గలవాఁ డెవఁడున్నాఁడు? నాపితృసఖుఁడగు నీపక్షి

రాజు ముదుసలితనమున హతుఁడై నేలంబడియున్న వాఁడు.
అని పలికి తానును దమ్ముఁడును దండ్రియందుఁ జూపు స్నేహ
గౌరవములఁ గనఁబఱచుచు జటాయువు దేహామంతయుఁ దన
కరతలమునఁ దడవెను. పక్షములు ఛేదింపఁబడి రక్తమునఁ
దడిసిపడియున్న యాజటాయువును గౌఁగిలించుకొని శ్రీ
రాముఁడు నాకుఁ బ్రాణములతో సాటియగు సీత యెందున్న
న్నది? అని యడిగి దుఃఖవేగమున నేలవ్రాలఁబడెను.

మహాశయులారా! ఇందుఁగల విశేషముల నర
యుదము.

> "పూర్వజోఽప్యుక్తమాత్రస్తు లక్ష్మణేన సుభాషితం,
> సారగ్రాహీ మహాసారం ప్రతిజగ్రాహ రాఘవః. ౧౦
> సన్నిగృహ్యాత్మనో బాహూః ప్రవృత్తం కోపమాత్మనః,
> అవష్టభ్య ధనుశ్చిత్రం రామో లక్ష్మణమబ్రవీత్." ౧౧

అని మూలము. "బాలాదపి సుభాషితమ్" అన్నను మనుస్మృతి
వాక్యమును బూర్వసర్గమున నుదాహరించితిని గదా. అదియే
యిందును సమన్వయింపఁదగును. "పూర్వజోఽపి సారగ్రాహీ
రామః లక్ష్మణేన మహాసారముక్తం సుభాషితం ప్రతిజగ్రాహ"
అని యన్వయము. తాను జ్యేష్ఠుఁడైనను సారమును గ్రహిం
చువాఁడు కానఁ దనతమ్ముఁడు తెల్పినదియు, మహాసారము
గలదియు నగుసుభాషితమును గ్రహించెను. శ్రీరామావ
తారము మానవప్రవృత్తికి లక్ష్యము. కాన దానిని స్థిరపఱ
చుటకై తనకంటెఁ జిన్నవాఁడైనను హితవాక్యము తెల్పి
నపుడు గ్రహింపఁదగునను భావమును స్థిరపఱచెను. తమ్ముని
మాట నంగీకరించెను. న్యాయ్యము ముఖ్యము కాని వయస్సు

ముఖ్యము కాదనియే యిందలినీతి. అంతఁ దనకుఁ గలిగినక్రోధ ముపసంహరించెను. ధనుస్సుదాల్చి తమ్మునిం బ్రశ్నించెను. "ప్రవృత్తం ఆత్మనః క్రోధమ్" తెచ్చిపెట్టుకొన్న క్రోధము నాపి అని యర్థము. అనఁగా లేనిక్రోధ మున్నట్లు నటించెనని భావము. సత్త్వరజస్తమోగుణములను వలయునపుడు భగవంతుఁ డంగీకరించుననియు, "దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా" అన్నసోక్తి ననుసరించి ప్రకృతి పురికొల్పఁగాఁ గార్యార్థ మవ్వానిని గొనినను వానికి లోఁబడఁడనియు, మన కీభాగము తెలుపుచున్నది.

> "త్రిభిర్గుణమయైర్భావై రేభిస్సర్వమిదం జగత్,
> మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్."

౧౩-గీ. ౭-అ.

అన్న భగవద్వాక్యమునే యీరామాయణభాగము మనకుఁ దెలుపుచున్నది. శ్రీరామావతారమున నాచరణమున నునిచిన యర్థమునే శ్రీకృష్ణావతారమున వాగ్రూపమున వెల్లడించెనని మన మూహింపవలయును. కనుకనే రాముఁడు చేసినట్లు శ్రీకృష్ణుఁడు చెప్పినట్లు చేయవలయునని పెద్దలు శాసించిరి.

> "అనుష్ఠితం తు యద్దేవై ర్మునిభిర్యదనుష్ఠితం,
> నాచుష్ఠేయం మనుష్యై స్తదుక్తం కర్మ సమాచరేత్."

అనునదియే పెద్దలశాసనము. దానిం దెలిసి మనము వర్తించినఁగాని కృతకృత్యులము కాఁజాలమని యెఱుంగుటయే మంచిది.

> "త్వద్విధా బుద్ధిసంపన్నా మహాత్మానో నరర్షభ. ౭
> ఆపత్సు న ప్రకంపంతే వాయువేగైరివాచలాః."

అని మూలము. ఇది లక్ష్మణోక్తి. మహాత్ములెవరు? అను ప్రశ్నమున కిది సమాధానము. ఎవరాపత్తులయందు మాఱ్పునొందరో వారు మహాత్ములు.

"రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్,
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి." ౬౪-గీ. ౨-అ.

అను గీతావాక్యార్థమునకు మూల మిదియే కదా.

"విపది ధైర్యమథాభ్యుదయే క్షమా
సదసి వాక్పటుతా యుధి విక్రమః,
యశసి చాభిరుచిర్వ్యసనం శ్రుతౌ
ప్రకృతిసిద్ధమిదం హి మహాత్మనాం." ౬౩

అను భర్తృహరిసుభాషితమునకు శ్రీరామాయణమే మూలము కావచ్చును గదా.

"ఇత్యుక్త్వాఽభ్యపతద్గృధ్రం సంధాయ ధనుషి క్షురం,
క్రుద్ధో రామస్సముద్రాంతాం కంపయన్నివ మేదినీం. ౧౩
తం దీనం దీనయా వాచా సఫేనం రుధిరం వమన్,
అభ్యభాషత పక్షీ తు రామం దశరథాత్మజం. ౧౪
యామోషధిమివాయుష్మన్నన్వేషసి మహావనే,
సా దేవీ మమ చ ప్రాణా రావణేనోభయం హృతం. ౧౫
... ... ... ... ...
రక్షసా నిహతం పూర్వం న మాం హంతుం త్వమర్హసి. ౨౦
... ... ... ...
గృధ్రరాజం పరిష్వజ్య పరిత్యజ్య మహద్ధనుః,
నిపపాతావశో భూమౌ రురోద సహలక్ష్మణః." ౨౨

అని మూలము. జటాయువు పలుకు లివి. జటాయువును గాంచి

నంతనే సీతాభక్షకుఁడని చంపఁబూని యాతనికడకుఁ బరు గిడెను. ఆపక్షియు నాపత్సముద్రనిమగ్నచిత్తుఁడగు రామునిం గాంచి తాను మృతికి సమీపమం దున్నవాఁడు కావున ఫేనముతోడ రక్తమును గ్రక్కుచు నిట్లు పలికెను. అని ప్రాతీతి కార్థము. జటాయువు నీవఱకే రాముఁ డెఱుంగును. ఇప్పు డాతనిం జంపఁబోవుట భగవత్త్వమే యగునా యని ప్రశ్నింతు రేమో. అది భగవంతుని నైజము. ఏది? రక్షింపుమని వేఁడు వానిని రక్షించుట. "దైవం నిహత్యకురు పౌరుషమాత్మశక్త్యా" అను ప్రాచీనసూక్తిని బాలించుట కని తెలియవలయును. మాన వులప్రార్థన మక్కఱలేకయే భగవంతుఁడే కష్టములను దొలఁ గించుచుండినయెడల వారు నాస్తికులగుదురు. స్వభావవాదమే ప్రబలును. సత్కార్యానుష్ఠాన మడుగంటును. కనుక దీనుఁడై నీవే దిక్కని వేఁడినయెడల నట్టివానికుండిన పూర్వాగర్వమును బాటింపక యతనికర్మమున కనురూపముగా ఫలములొసం గుట భగవంతునియాశయము. అయ్యదియే మానవుల యభి వృద్ధికి హేతువు. కనుకనే జటాయువు నెఱింగియు, నతనిచరమ దశను గాంచియు నతనికి శాశ్వతానందపద మొసంగుటకే చంపఁ బోయెను. ఆతఁడు రాముఁడని యెఱింగి మహాత్మా! సీతా వృత్తాంత మిది. నాగతి యిది యని తేటపఱచి రాక్షసుఁడే నన్ను వధించెను. నీవు నన్నిఁకఁ జంపఁదగదని తెలిపెను. ఆ మాట నోటినుండి వెడలఁగనే పక్షిరాజును కౌఁగిలించుకొని కోదండమును సజ్యమును బాఱవైచి నేలఁబడియెను. విల పించెను. ఏల? మానవప్రవృత్తి నభినయించుటకు మాత్రమే కాదు. అట్టి పరోపకారనిరతుఁ డీలాటికష్టముల పాలయ్యెనని తెలుపుటకే యని యెఱుంగవలయును. తనసంస్పర్శమున నా

పక్షివర్యుఁడు పవిత్రుఁడు కావలయుననియే శ్రీరామునా
శయము.

> "ఈదృశీయం మమాలక్ష్మీర్నిర్దహేదపి పావకం. ౨౪
>
> ... ... ... ... ...
>
> అయం పితృవయస్యో మే గృధ్రరాజో జరాన్వితః,
> శేతే వినిహతో భూమౌ మమ భాగ్యవిపర్యయాత్. ౨౭
>
> ఇత్యేవముక్త్వా బహుశో రాఘవస్సహలక్ష్మణః,
> జటాయుషం చ పస్పర్శ పితృస్నేహం విదర్శయన్. ౨౮
>
> నికృత్తపక్షం రుధిరావసిక్తం
> స గృధ్రరాజం పరిరభ్య రామః,
> క్వ మైథిలీ ప్రాణసమా మమేతి
> విముచ్య వాచం నిపపాత భూమౌ." ౨౯

అని మూలము. శ్రీరాముని వాక్కులివి. ఈనాదౌర్భాగ్య మగ్ని నిగూడఁ గాల్చివేయును. అనఁగా దుష్కర్మములు దహింపనివస్తువే లేదనిభావము. అగ్ని పరమాత్మస్వరూపులను గాల్పఁజాలదు. ఇచ్చోఁగల తనిశ్లోకతాత్పర్యము తత్త్వసంబంధముగాదు. దుష్కర్మాగ్ని సముద్రములు తుద నగ్ని నిగూడఁ గాల్చివేయును. అనఁగా దుష్కర్మములు తెలిసికొని చేయక గాని చేసినను తత్ఫలము తప్పక భయంకరముగా ననుభవింపక తప్పించుకొనఁ దరముగాదనియే దీనిసారము. నాకుం బ్రియుఁ బరమమిత్రుఁడగు నీముసలిపక్షిరాజు నాదురదృష్టవశమున భూమిపై శయనించె నని పలికి శ్రీరాముఁడు తనహస్తమున నాతనిశరీరమును స్పృశించెను. జనకునియందుంగల స్నేహమును బ్రకటింపఁజేసెను. నాప్రాణసమానురాలగు సీత

యెందున్నదని యడుగుచుఁ గ్రిందఁబడియెను. సకలదుష్కర్మ నాశార్థమే కరమున నిమిరెను. ఈభౌతికశరీర మింక నీకు రాదని తేటపఱచె నని భావము. భూపతనాదు లన్నియు నటనమే యనుట స్పష్టము కదా. ఈశ్రీరామచర్యలనుబట్టి కరుణాపరతంత్రత తేటపడుచున్నది. దీనావనోద్ధరణము ప్రధాన కృత్యము భగవంతున కనుట స్పష్టమగుచున్నది. సద్వర్తనమే ప్రధానముకాని జాత్యాదులు కావని భగవంతుని తాత్పర్యమని సిద్ధాంతమగుచున్నది. పరోపకారార్థమై శరీరము నర్పించుటయే యుత్తమోత్తమ పవిత్రకార్యమనుట తెల్లమగుచున్నది. ఈభాగమునుండి మన మీవిషయములను గ్రహించి వాని నలవఱచుకొనవలయును.

"యాంతి న్యాయప్రవృత్తస్య తిర్యంచోఽపి సహాయతామ్."

అనుసూక్తిని మనము తలంచుచుండవలయును. నిర్జనారణ్యమునందుఁ గూడ న్యాయమార్గమునకుఁ దోడుపడువారు గలరని యీకథాసారమనుట ఫలితార్థము.

## శ్రీరాముఁడు జటాయువు నుద్ధరించుట.

* శ్రీరాముఁడాజటాయువును గాంచి ప్రియసోదరునితో నిట్లు పలికెను. ఈపక్షివర్యుఁడు నాకార్యమునకుఁ దోడ్పడి రక్కసునిచే హతుఁడై ప్రాణములను వదలనున్నాఁడు. ఈశరీరమున నింకను బ్రాణములు నిలిచియున్నవి. కనుకఁ గంఠస్వరము సన్నము కాఁగా విహ్వలించుచున్నాఁడు. ఓ జటాయూ! మాట్లాడ శక్తియున్న సీతావృత్తాంతముఁ జెప్పు

* ఇది యఱువదెనిమిదవసర్గమునఁ గలదు.

మా. శుభములు నీకుఁ గలుగుఁగాక. రావణుఁడు నిన్ను వధించినవార్తయుఁ దెలుపుము. ఎందులకు వాఁడు సీతనపహరించెను? అంతటి యపకారము నేనేమి చేసితిని? పక్షివర్యా! చంద్రానన యప్పు డెట్లుండినది? సీత యేమని చెప్పెను? తండ్రీ! ఆ రక్కసుని ప్రతాప మెట్టిది? వానియాపక్రియ యెట్టిది? వాఁడుండుచో టెద్ది? నే నడుగుచున్నాను. చెప్పుమా. అను శ్రీరాముని ప్రశ్నముల నాలించి యాజటాయువు దీనచేతస్కుండై యారాముని దుఃఖము నెఱింగి యల్పకంఠస్వరముతో రావణుఁడు మాయచేఁ బెద్దగాలిని మేఘములను గల్పించి యంధకారము వ్యాపింపఁజేసి సీత నపహరించి కొనిపోయెను. తండ్రీ! నేను బడలికలఁగాంచునపుడు నాపక్షములను ఛేదించెను. ఆమెం దీసికొని దక్షిణపుదిక్కునకుం బోయెను. శ్రీరామా! నాప్రాణములు మరణవేదనచేఁ దల్లడించుచున్నవి. దృష్టి వేఱు విధముగా నున్నది. సువర్ణవృక్షములు నాకుం గనఁబడుచున్నవి. రావణుఁడు కొనిపోయినపు డుగ్ర మాముహూర్తబలమున నొంతగానిం జేయను. దీనికి విందమని పేరు. ఇది యాతఁ డెఱుంగఁడు. నీసీత నీకడం జేరును. వాఁడు గాలము మ్రింగిన చేపవలె నశించును. నీ వామెంగూర్చి వ్యథఁ గలుగఁజేయుట కావలదు. అనిమొన వానిం జంపి జానకిని వేగఁ బొందువు. అని తెలివితోఁ గూడియే పలికి మృతిచెందెను రాఁగ నోటినుండి నంజుఁడు నెత్తురు వెలికి రాఁగా రావణుఁడు విశ్రవసునికుమారుఁడు, కుబేరసోదరుఁడు. అని మాత్రము పలికి మఱింకను బలుకఁజాలక రామునింగాంచుచు విగతజీవుఁ డయ్యెను. శ్రీరాముఁడు కృతాంజలియై చెప్పుమా చెప్పుమా యని యడుగుచుండఁగనే యాజటాయువు ప్రాణముల విడిచెను. అంతట నరి

మును నేలనుంచి కాళ్లుసాఁచి శరీరమును దన్నుకొనుచుఁ బ్రాణముల వదలి నేలంబడియుండెను. తలవాల్చి దొరలి దొరలి రక్తనయనుఁడై మృతినొందిపడియున్న పర్వతాకారుని జటాయువుం గాంచి శ్రీరామమూర్తి పరమదుఃఖితుఁడై సౌమిత్రితో నిట్లనియె.

వత్సా! రాక్షసనివాసమగు నీమహాటవియందు ననేక వత్సరములు సౌఖ్యమున నివ్సితుఁడై యుండి యిందే మృతి నొందెను. ఇంతకాలము జీవించిన యీమహాపక్షి నేలంబడి యున్నవాఁడు కదా. కాల మెవ్వరికిని గడవ శక్యముకాదు సుమీ! నా కుపకారమగు సీతారక్షణమునందుఁ బ్రయత్నము చేసి దుష్టునిచే హతుఁ డయ్యెను. వంశపరంపరాప్రాప్తమగు గృధ్రరాజ్యమును వదలి నాకొఱకు నసువుల విడిచినాఁడు. ఎల్లయెడల మృగపక్షిజాతులయందును సాధువులు ధార్మికులు శూరులు శరణ్యులు నగపడుచున్నవారు. సీతాహరణ జటాయుమరణసంజాతదుఃఖములలో రెండవదియే యెక్కువగా నాకుం దోఁచెడిని. దశరథమహారా జెట్టివాఁడో యీ పక్షినాథుఁడు కూడ నట్టివాఁడుగాఁ గనఁబడుచున్నాఁడు. సౌమిత్రీ! సమిధలను జేర్పుము. వాని మథించి యగ్నిని గల్పించి నాకొఱకు మృతినొందిన గృధ్రరాజునకు దహన సంస్కార మొనర్పఁ దలంచెద. భయంకరరాక్షసహతుఁ డైన యీజటాయువును జితిపైనుంచి దహనము చేయ నెంచుచున్నాఁడను. ఓగృధ్రరాజమా! యజ్ఞములు చేయువారలకు, పంచాగ్నిమధ్యమునఁ దపస్సుచేయు వానప్రస్థులకు నేపుణ్య లోకములు కలుగునో, సన్న్యాసుల కేలోకములు గమ్యములో, యైహికభోగముల వదలిన నైష్ఠికు లేలోకమున కరు

గుదురో యట్టి పుణ్యలోకములు నాచే సంస్కరింపఁబడిన నీకుఁ గలుగును. నాయనుజ్ఞనొంది యత్యుత్తమలోకముల నొందుము. అని పలికెను.

ధర్మాత్ముఁడగు శ్రీరామచంద్రుఁ డిట్లు పలికి యాపక్షినాథుని దీపనార్హమగు చితిపై నెత్తిపెట్టి దుఃఖించుచు బంధువుంబోలె సమంత్రకముగా దహించెను. అంత సౌమిత్రింగూడి యడవికింబోయి కేసరిమృగములను జటాయువుకొఱకుగా వధించి పిండదానముకొఱకు దర్భలు పఱచెను. శ్రీరాముఁడా కేసరిమాంసమును ముద్దలుగాఁ జేసి పచ్చికనేలపయిని జటాయువున కొసంగెను. మృతినొందినవానికి స్వర్గప్రదమని బ్రాహ్మణులు జపించు యామ్యసూక్తాదిమంత్రములను పదస్థమై శ్రీరాముఁడు జపించెను. ఆమంత్రములు పితృతృప్తికరములు. పిదప నాయన్నదమ్ములు గౌతమీనదికిం బోయి జటాయువునకు జలతర్పణము గావించిరి. వారానదీజలములందు విధివిహితముగా నాపక్షినాథుని గూర్చి స్నానముచేసి జలతర్పణముల విడిచిరి. సీతానిమిత్తమై యుద్ధముచేసి హతుఁడైన కారణమున నితరాసాధ్యకార్యము నొనరించి మహాశయుఁడన్న కీర్తి నాజటాయువు సంపాదింపఁగల్గెను. మహాత్ముఁడగు రామునిచే సంస్కరింపఁబడిన కారణమున నప్పుడే పుణ్యలోకముల నొందెను. వార లతనికిఁ బిండోదకముల నొసంగి యాతని మాటను విశ్వసించి సీతాన్వేషణమున బుద్ధినిలిపి వనముల కరిగిరి.

మహాశయులారా! ఈభాగము చాల ముఖ్యము. శ్రీరామునికరుణాదికములు తేటపడును. అప్రతిహతమగు వాగ్దానము స్పష్టమగును. కాన నిందలివిశేషముల నెఱుకుదము.

"జటాయో యది శక్నోషి వాక్యం వ్యాహరితుం పునః,
సీతామాఖ్యాహి భద్రం తే వధమాఖ్యాహి చాత్మనః. ౪
కిం నిమిత్తోఽహరత్సీతాం రావణ స్తస్య కిం మయా,
అపరాధం తు యం దృష్ట్వా రావణేన హృతా ప్రియా. ౫
కథం తచ్చంద్రసంకాశం ముఖమాసీన్మనోహరం,
సీతయా కాని చోక్తాని తస్మిన్ కాలే ద్విజోత్తమ." ౬

అని మూలము. చచ్చిపోవనున్న జటాయువునుగూర్చి యీ ప్రశ్నములను శ్రీరాముఁ డడుగుచున్నాఁడు. ఈప్రశ్నము లం గాంచినంతనే కేవల స్వార్థపరుఁడని తోఁపకమానదు. నీవు చచ్చుచున్నను నాకార్యము చేసి మఱి చచ్చిపొమ్మనినట్లు కదా యిది యున్నది. అని యూహింతురేమో. అట్లు కాదు. ప్రాయికముగా మానవులకే మరణకాలమున నైహికవిషయములయందే యాసక్తి యుండును. పక్షులకు నట్లే యని యూహించుట పొరపాటుగాదు. తిర్యగ్జన్మము పాపమూలము కదా.

"పురుషోఽనృతవాదీ చ పిశునః పరుష స్తథా,
అనిబద్ధప్రలాపీ చ మృగపక్షిషు జాయతే." ౧౩౫

యాజ్ఞవల్క్యస్మృతి, ప్రాయశ్చిత్తకాండము.

అనుస్మృతి ననుసరించి పక్షిజన్మము పాపమూలకమే యని తేలెడిని. అట్టిపక్షికి మరణకాలమునందు భగవత్స్మృతి లభింపవలయును. దానిచేఁగాని యాజాతిపాపములు తొలఁగవు. వేఱుమార్గము కానరాదు.

"అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరం,
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః. ౫

యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరం.
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావ భావితః.”   ౬

అన్న గీతావాక్యములు భగవదుక్తములే కదా. ప్రాణోత్క్రమణకాలమున సీతాసంస్మరణము కలుగఁజేయ నెంచెను. కనుక శ్రీరాముఁడు జటాయువు! మాటలాడుటకు శక్తి యుండినయెడల “సీతామాఖ్యాహి భద్రం తే” అనియెను. సీతను గుఱించి చెప్పుము. నీకు మేలు గలుగు ననియెను. స్మరణ కారణమును జెప్పుమని పిదప నడిగెను. ఏల? పరమేశ్వరస్మరణ మూలమున నుత్తమగతికిఁ బోవలసిన సత్కర్మము నాచరించినవాఁడని యెఱింగియే యిట్లు శ్రీరాముఁడు ప్రశ్నించెను.

“ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి.”

యను గీతావాక్యము ననుసరించి వారిద్దరు నొకరే యనియు, నెవరిని స్మరించిన నుత్తమగతి లభించుననియు మన మెఱుంగవలయును. జటాయువునకు బుద్ధిస్థైర్యము కలదో లేదో పరీక్షింతమని యిట్లు శ్రీరాముఁడు ప్రశ్నించెను. నా భార్య నపహరించుకొనిపోవునంతటి యపకారము నతనికి నేనేమి చేసితిని? అని. పైని వ్రాసిన యాంధ్రయము సరిపడదు వారికీప్రశ్నమే యసంగతముగాఁ దోఁచవచ్చును. నేనే మపకారము చేసితినని యాతని నడుగుటచేఁ గలుగులాభము లేవి? అనఁగా రావణునితో సంభాషించితివేని యాతఁడేమైనఁ దెలిపినచో వానిం జెప్పుమా యనియే కదా ప్రశ్నతాత్పర్యము. ఆ ప్రశ్న మేల? అన నతనికి స్మృతిగలదో లేదో కనుఁగొనుటకు. ఉత్క్రమణకాలమునం దాతనికి భగవద్విషయక

స్మృతి కలిగింతమనియు నాశ్రీరామునియాశయము. చంద్ర బింబమువంటి యాసీత మొగ మపు డెట్లుండినది? ఏమని యా సీత చెప్పినది? అను నీప్రశ్నము రాముఁడు చేయుట పరిహాస పాత్రమనక తప్పదు. జటాయువు మృతినొంద నున్నాఁడు. మాటలాడుశక్తి లేదు. దురవస్థలపా లగుచున్నాఁడు. అట్టి తరుణమునఁ జంద్రునివంటి సీత మొగ మెట్లున్నదని యేల ప్రశింపవలయును? కొందఱు సీత సంతోషముగానున్న నామె కోరియే వానివెంటఁబోయిన ట్లూహింతమనియు, దుఃఖముతో నున్న బలవంతముగా వాఁ డెత్తుకొనిపోయినట్లు తెలిసికొన వచ్చు ననియు రాముఁ డడిగెనందురు. సీ! సీ! ఇదేటి భావము? అట్టి దుర్భావము సీతయందు శ్రీరామునకుఁ గలుగ నవకాశ మపుడున్నదియా? అట్లనరాదు. మఱేమనఁగా

"క్వచిత్కాంచీదామా కరికలభకుంభ స్తననతా,
పరిక్షీణా మధ్యే పరిణతశరచ్చంద్రవదనా."

అను మహాప్రకృతిధ్యేయరూపమును జటాయువునకు స్మృతి గోచరమగునట్లు చేయుటకు. ఆమె యేమిపలికినది? అనుట నీకే మైనా హితము దెలిపినదా. లేక నాతో నేమైనఁ జెప్పుమని నదా. అనఁగా నామూలమున నీకు మేలుగలిగింపఁ బూనినదా యని ప్రశ్నించెనని మన మూహింపందగును. ఈయాశయ మును "సీతామాఖ్యాహి భద్రం తే" యన్న వాక్యము తెలు పును.

"హృతా సా రాక్షసేంద్రేణ రావణేన విహాయసా,
మాయామాస్థాయ విపులాం వాతదుర్దినసంకులాం.

... ... ... ... ...

యేన యాతో ముహూర్తేన సీతామాదాయ రావణః,
విప్రణష్టం ధనం క్షిప్రం తత్స్వామీ ప్రతిపద్యతే. ౧౨
విందో నామ ముహూర్తోఽయం స చ కాకుత్స్థ నాబుధత్,
త్వత్ప్రియాం జానకీం హృత్వా రావణో రాక్షసేశ్వరః. ౧౩
ఝషవద్బడిశం గృహ్య క్షిప్రమేవ వినశ్యతి,
న చ త్వయా వ్యథా కార్యా జనకస్య సుతాం ప్రతి. ౧౪
వైదేహ్యా రంస్యసే క్షిప్రం హత్వా తం రాక్షసం రణే."

అని మూలము. రావణుఁడు మాయాబలమున మహావాయువును మేఘమును గల్పించి సీత నపహరించినట్లు పూర్వసర్గములయందుఁ గానరాదు. ఇపు డిట్లు జటాయువు చెప్పుటకుఁ గారణమేమని యడుగుదురేమో.

"హ్రియమాణాం తు వైదేహీం దృష్ట్వా దీనో దివాకరః,
ప్రతిధ్వస్తప్రభశ్శ్రీమానాసీత్పాండరమండలః,
జగత్సర్వమమర్యాదం తమసాంధేన సంవృతమ్."

అని చెప్పఁబడినది. సూర్యచంద్రాదులు పవనుఁడు లోనగువారు సీతాదుఃఖమును జూడఁజాలక దీనులైరి. అని యున్నందున నాయుత్పాతములను రావణాకల్పితములుగా జటాయువు భావించెనని మన మూహింపవలయును. శ్రీరామా! యే ముహూర్తమునందు రావణుఁడు సీత నపహరించెనో యది పోయినసొమ్ము మరల స్వస్థానమును జేర్చునట్టి ముహూర్తము. దానిఫల మారావణుఁ డెఱుంగఁడు. ఇది విందనామక ముహూర్తము. కావున నీభార్య నిన్నుఁ జేరును. వాఁడు గాలమును మ్రింగినచేపవలె నశించునని జటాయువు పలికెను. పగటిముహూర్తములు పదునైదు. రాత్రిముహూర్తములు

పదునైదు గలవని వానిపేరు లివ్వియని జ్యోతిశ్శాస్త్రము తెల్పుచున్నది. రామాయణములోని విందమనుపే రందుఁ గానరాదు. మహేశ్వరతీర్థులు

"విందతే అనేన నష్టం ధనమితి విందః విద్‌ల్ లాభ ఇతి ధాతుః స చ ఏకాదశో ముహూర్తః. ముహూర్తలక్షణం తూక్తం పురాణే.—'రౌద్రశ్శ్వేతశ్చ మైత్రశ్చ తథా సారభటస్స్మృతః, సావిత్రో వైశ్వదేవశ్చ గాంధర్వః కుతపస్తథా. రౌహిణస్తిలకశ్చైవ విజయో నైరృతస్తథా, శంబరో వారుణశ్చైవ భగః పంచదశస్స్మృతః.' ఇత్యేతే అహ్నో ముహూర్తాః. అత్ర విజయస్యైవ నామాంతరం వింద ఇతి జ్ఞేయం. యద్వా విందః ఘటికా."

అని వ్రాసిరి. విజయముహూర్తమున సీత నపహరించినందున ముహూర్తబలము ననుసరించి యావస్తు వెవరిదో వారికి విజయముకల్గు ననుఫలశాస్త్రము ననుసరించి సీత నీకే చేరునని జటాయువు జ్యోతిశ్శాస్త్రఫలమును దెల్పెను. పక్షులకు భావిఫలములు తెలియుననుట సర్వజనవిదితము కదా.

"అనేకవార్షికో యస్తు చిరకాలసముత్థితః. ౨౧
సోఽయమద్య హతశ్శేతే కాలో హి దురతిక్రమః,
పశ్య లక్ష్మణ గృధ్రోఽయముపకారీ హతశ్చ మే. ౨౨
సీతామభ్యవపన్నో వై రావణేన బలీయసా,
... ... ... ... ...
సర్వత్ర ఖలు దృశ్యంతే సాధవో ధర్మచారిణః. ౨౪
శూరాశ్శరణ్యా సౌమిత్రే తిర్యగ్యోనిగతేష్వపి,
సీతాహరణజం దుఃఖం న మే సౌమ్య తథాగతం. ౨౫
యథా వినాశే గృధ్రస్య మత్కృతే చ పరంతప,
రాజా దశరథశ్శ్రీమాన్ యథా మమ మహాయశాః. ౨౬
పూజనీయశ్చ మాన్యశ్చ తథాయం పతగేశ్వరః."

అని మూలము. శ్రీరాముఁ డింపుఁ గాలమహాత్మ్యమును దెల్పుచున్నాఁడు. అనేకసంవత్సరములు బ్రదికి యింగదే నసించిన యీపతకి మృతినొంది పడియున్నాఁడు. చూచుము లక్ష్మణా! కాలమెవ్వారికి మీఱరానిది అని. ఇందలిసారమేమి? కాలము భగవత్స్వరూపము. "కాలస్సృజతి భూతాని కాలస్సంహరతి ప్రజాః" అను ప్రమాణము ననుసరించి కాలమే సర్వకార్యముల కాధారము. కాలమునకె భగవంతుఁ డాద్యంతములు లేనివాఁడు. కాలమును లోకవ్యవహారార్థము సంవత్సరాది విభాగములుగ నొనరించినట్లే యుపాసకులు భగవంతుని నామరూపవిశిష్టునిగాఁ జేయుదురు. సర్వకార్యముల నొనరించువాఁ డొక్కఁడైన నన్నిరూపములుగాఁ దోఁచుటంబట్టి బహురూపనామములు గలవాఁడుగాఁ దోఁచును. కాలము నుపాసించువా రనఁగా భగవంతు నారాధించువారే. కాలోపాసనమనఁగా నేకాలమున కేకార్యము చేయఁదగునని నిశ్చయించుకొందుమో యాకాలమున కాకార్యములు చేయుట యని యర్థము. భగవంతు నేరూపనామముల నిష్టముగలిగి యారాధింతుమో ఆరూపమే సర్వవ్యాపకమని భావించుట. కాలోపాసకులే భగవదుపాసకులు. భగవత్సేవకు భక్తి యెట్లు ముఖ్యమో కాలోపాసనమునకు నియమము ముఖ్యము. అది తప్పక యాచరించువాని కాకాలమే శుభమునిచ్చును. పాశ్చాత్యులిక్కాలమునఁ జూడఁగాఁ గాలోపాసకులు. కాలము నకుఁ దలంచుకొన్న పనుల నిర్వహించువారు.

> "ఆదానస్య ప్రదానస్య కర్తవ్యస్య చ కర్మణః,
> క్షిప్రమక్రియమాణస్య కాలః పిబతి సంపదః."

అనుసూక్తి ననుసరించి కాలమునకుఁ జేయుదుమన్న పనులను జేయనివారలసంపదలు క్షీణించును. ఎవ్వరు కాలము తప్పక నియతకార్యముల నాచరింతురో వారలకు సంపదలు స్థిరములుగ నుండును. కనుకనే పాశ్చాత్యులభాగ్యము శాశ్వతముగా నెలకొనియున్నది. ఇందు శ్రీరాముఁడు కాలము భగవత్స్వరూపమనియే బోధించెను. దాని మీఱరాదనఁగా నర్థమేమి? భగవచ్ఛక్తి నతిక్రమింపఁ జాలుశక్తి యొక్కటియు లేదని తాత్పర్యము.

ఓలక్ష్మణా! పరోపకారకరణతత్పరుఁడగు నీగ్రద్ద నాకుపకారముచేయఁబూని సీతానిమిత్తము రావణునిచే హతుఁడయ్యెను. అనఁగా నాకొఱకుగాఁ దనప్రాణముల నర్పించెను. ఇదియొక యారాధనవిశేష మనవలయును. సాధువులు ధార్మికులు శూరులు పరరక్షకులు నగువారు పశుపక్ష్యాదులయందు నెల్లయెడలఁ గనఁబడుచున్నారు. అనఁగా మానవులయందే యిట్టివారున్నవా రన్నది దుర్భావము. ఎల్లప్రాణులయందును గలరని భావము. కర్మవిశేషము ననుసరించి సకలజీవరాసులయందు నున్నవారని శ్రీరాముఁ డనియెను. తాను నడచునది న్యాయమార్గమేయైన నెల్లయెడలఁ దోడ్పడువా రుందురనియే దీనిసారము. జాత్యుత్కర్షత ప్రధానము కాదనియు, సత్కార్యానుష్ఠానతత్పరత్వమే ముఖ్యమనియు దీనినుండి మనము గ్రహింపవలయును. గృధ్రరాజమృతివలని దుఃఖమే సీతాపహరణదుఃఖమునకంటె నధికమని రామమూర్తి పలికెఁగదా. దానిభావమేమి? సీత యపహృతయైనఁగదా యాదుఃఖము గలుగుట. అది కల్పితము. దానిమూలమున నిది కలిగినది. కాన నిదియే యధికమని భావము. దశరథునివలె నీతఁడు

నాకుఁ బూజ్యుఁడని రాముఁ డనుటకు హేతువేమి? సమాన ప్రీతిగలవారందఱు సమానగౌరవమున కర్హులని. అందు త్తమ మధ్యమాధమభేదకల్పనము మాత్ర మయుక్తమనియే కాక మఱేమి? శ్రీరామాగమనపర్యంత మాపక్షి ప్రాణములతో నుండుట యెట్లని ప్రశ్నించుకొని మహేశ్వరతీర్థులు. "తస్యా స్సీతాయా అనుగ్రహవశాదిత్యనుసంధేయం. ఉక్తంచ స్కాందే.— 'దేవీ మాం ప్రాహ రాజేంద్ర యావత్త్వంభాషణం మమ, భవతస్తావదాసన్నే ప్రాణా ఇత్యాహ జానకీ'" అని వ్రాసిరి. అదియు సమాధానమే. ఈరామాయణమునందే సీత జటాయువును గనినంతనే

"జటాయో పశ్య మామార్య హ్రియమాణామనాథవత్. 30
అనేన రాక్షసేంద్రేణ కరుణం పాపకర్మణా,
నైవ వారయితుం శక్యస్తవ క్రూరో నిశాచరః. ౩౯
సత్త్వవాన్ జితకాశీ చ సాయుధశ్చైవ దుర్మతిః,
రామాయ తు యథాతత్త్వం జటాయో హరణం మమ. ౪౦
లక్ష్మణాయ చ తత్సర్వమాఖ్యాతవ్యమశేషతః."

సర్గము-౪౯.

అని సీతాదేవి యాజ్ఞాపించెను. రావణుఁడు నన్నపహరించిన వార్త రామునకు జరగినది జరగినట్లుగాఁ జెప్పుము. నీవతని నివారింపఁజాలవు అని. కనుక నీయానతి ననుసరించియే రావణాపహరణవార్తను దెలిపెను. అతని బలపౌరుషములను దెల్పఁజాలక మృతినొందెను. ఏల? సీతాదేవి యానతి యెంతవఱో అంతవఱకు నాతనిశరీరమునఁ బ్రాణము లుండెను. సృష్టిస్థితిలయములు ప్రకృత్యధీనములు. కాన నది యట్లే జరగెను. మఱొక్కటి. ఎంతవఱకు నాయుశ్శేషము కర్మానుసారము

కలదో యంతదనుక మాటలాడఁ గల్గెను. అది ముగియఁగనే మృతినొందెను. ఎవనిచే సంస్కారము కావలసియున్నదో యది సాగక మానునెట్లు? ఆకర్మమంతయు నట్లే జరగెను. కనుకఁ గర్మసిద్ధాంతతత్త్వము నెఱింగినవారు తరువాత నేల మాటలాడఁ జాలకపోయె ననుకొనరు.

"సౌమిత్రే వార కాష్ఠాని నిర్మథిష్యామి పావకం. ౨౭
గృధ్రరాజం దిధక్ష్యామి మత్కృతే నిధనం గతం."

అని మూలము. ఉత్తమకర్మములకు లౌకికాగ్ని పనికిరాదని భావము. దారువుల మథించి యగ్నిని సంపాదించి దానిచే నీతనికి సంస్కారముచేయుదును. ఈతఁడు నాకొఱకు మృతి నొందెను గదా. పశుపక్ష్యాదులకుఁ గర్మాధికారము లేదని స్మృతులు ఘోషించుచున్నను భగవదాజ్ఞ యన్నింటికంటె నుత్తమము కాన శ్రీరాముఁ డాపక్షిని దహించుచు నిట్లు పలికెను.

"యా గతిర్యజ్ఞశీలానామాహితాగ్నేశ్చ యా గతిః. ౩౮
అపరావర్తినాం యాచ యాచ భూమిప్రదాయినాం,
మయా త్వం సమనుజ్ఞాతో గచ్ఛ లోకాననుత్తమాన్. ౩౯
గృధ్రరాజ మహాసత్త్వ సంస్కృతశ్చ మయా వ్రజ,
ఏవ ముక్త్వా చితాం దీప్తామారోప్య పతగేశ్వరం. ४०
దదాహ రామో ధర్మాత్మా స్వబంధుమివ దుఃఖితః."

అని మూలము. యజ్ఞములు చేయుస్వభావముగలవారలకుఁ గలుగు గతులు నీకుఁ గలుగుఁగాక. అని శ్రీరాముని యాశీర్వాదము. "యజ్ఞాశ్శీలం యేషాం తేషాం" అని సమాసము. నిరంతరయజ్ఞకరణ మిందర్థము. ఇందు యజ్ఞములనఁగాఁ బంచ

మహాయజ్ఞములా? లేక సోమాదులా? యని విమర్శింపవల యును.

> "ఋషియజ్ఞం దేవయజ్ఞం భూతయజ్ఞం చ సర్వదా,
> నృయజ్ఞం పితృయజ్ఞం చ యథాశక్తి న హాపయేత్. ౨౧
> ఏతానేకే మహాయజ్ఞాన్ యజ్ఞశాస్త్రవిదో విదుః,
> అనీహమానాస్సతతమింద్రియేష్వేవ జుహ్వతి. ౨౨
> వాచ్యేకే జుహ్వతి ప్రాణం ప్రాణే వాచం చ సర్వదా,
> వాచి ప్రాణే చ పశ్యంతో యజ్ఞనిర్వృత్తిమక్షయాం. ౨౩
> జ్ఞానేనైవాపరే విప్రా యజంత్యేతైర్మఖైస్సదా,
> జ్ఞానమూలాం క్రియామేషాం పశ్యంతో జ్ఞానచక్షుషా." ౨౪

మను. ౪-అధ్యాయము.

> "సస్యాంతే నవసస్యేష్ట్యా తథర్త్వంతే ద్విజోఽధ్వరైః,
> పశునా త్వయనస్యాదౌ సమాంతే సౌమికైర్మఖైః. ౨౬
> నానిష్ట్వా నవసస్యేష్ట్యా పశునా చాగ్నిమాన్ ద్విజః,
> నవాన్నమద్యాన్మాంసం వా దీర్ఘమాయుర్జిజీవిషుః." ౨౭

మను. ౪-అధ్యాయము.

> "స్వాధ్యాయేన జపైర్హోమైస్త్రైవిద్యేనేజ్యయా సుతైః,
> మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః." ౨౮

మను. ౨-అధ్యాయము.

> "మహాయజ్ఞైః పంచభిర్బ్రహ్మయజ్ఞాదిభిః, యజ్ఞైః జ్యోతిష్టోమాదిభిః."

అని కుల్లూకభట్టు.

> "బలికర్మస్వధాహోమస్వాధ్యాయాతిథిసత్క్రియాః,
> భూతపిత్రమరబ్రహ్మమనుష్యాణాం మహామఖాః." ౧౦౨

యాజ్ఞ. ఆచారకాండము.

"ఏతే పంచమహాయజ్ఞాః అహరహః కర్తవ్యాః,నిత్యత్వాత్. యత్తున రేషాం ఫలశ్రవణం తదేషాం పావనత్వఖ్యాపనార్థేన కామ్యత్వప్రతిపాదనాయ."

విజ్ఞానేశ్వరులు.

"యే పఠంతి ద్విజా వేదం పంచయజ్ఞరతాశ్చ యే,
త్రైలోక్యం తారయంత్యేతే పంచేంద్రియరతా అపి." ౨౧

పరాశరస్మృతి. ౮-అధ్యాయము.

బ్రహ్మాయజ్ఞాదులు మహాయజ్ఞము లనఁబడును. ఆయైదును హింసాపూర్వకములు కావు. తక్కినయజ్ఞములు కామ్యములు. హింసాప్రవృత్తి యందుఁ బ్రధానము. పంచమహాయజ్ఞము లనఁబడు బ్రహ్మాదేవర్షిపితృభూతయజ్ఞములు చేయకున్న మహాదోషము. చేసినయెడలఁ గామ్యఫలములు సిద్ధింపవు. పాపనివృత్తిమాత్ర ఫలము గలదు. కావున నీరామాయణమున శ్రీరాముఁడు పేర్కొన్న "యజ్ఞశీలానామ్" అనుచోటఁ గల యజ్ఞశబ్దము పంచమహాయజ్ఞపరమని యెఱుంగవలయు. ఆహితాగ్ను లనఁగా నిట వానప్రస్థులని యర్థము. "అపరావర్తినాం యాచ గతిః" అనఁగా యుద్ధమునుండి పలాయనపరాయణులు కానివారు లోనగువారల కేగతులో యాపుణ్యలోకములు నీకుఁ గలుగుఁగాక. అని యాశీర్వదించెను. పాపానుభవార్థము తిర్యగ్జన్మము కలుగును. కాన నాజన్మముగలవానికి ముక్తిలేదను సామాన్యశాస్త్రము ప్రవర్తింపరాదని శ్రీరాముఁడు వాగ్దానము చేయుచున్నాఁడు. ఎన్నిశాస్త్రము లుండినను నామాట ననుసరించి యపునరావృత్తికమగు పదమునకుఁ బొమ్మని యాజ్ఞాపించుచున్నాఁడు. దానములలో భూదానము త్తమమని స్మృతులు ఘోషించెడిని.

"దానమితి సర్వాణి భూతాని ప్రశగ్ంసంతి దానాన్నాతి దుష్కరం తస్మాద్దానే రమంతే"
అని శ్రుతి.

"దానం యజ్ఞానాం వరూథం దక్షిణా లోకే దాతారగ్ం సర్వ భూతాన్యుపజీవంతి : దానేనారాతీరపానుదంత దానేన ద్విషంతో మిత్రా భవంతి దానే సర్వం ప్రతిష్ఠితం తస్మాద్దానం పరమం వదంతి."

అనియు శ్రుతి. దానములందు బహువిధఫలభేదము లున్నను భూదానము దాతృప్రతిగ్రహీతలకు నుత్తమఫలమని మహాభారతము తెల్పుచున్నది. కావున రామమూర్తి భూప్రదాతలకుఁ గల్గు నుత్తమలోకములు నీకుం గల్గుఁగాక యని యాశీర్వదించెను. పక్షుసగు నాకు నుత్తమలోకములు కలుగునా? యని సంశయింపకుము. నేను సంస్కరించితిని. నాయాజ్ఞ మరల్పఁబడదు. కాన నుత్తమోత్తమలోకముల కరుగుమని భావము. ఫలానుభవ మొక్కచోట నగును గాన నుత్తమలోకమనక యుత్తమలోకము లనుటేల యని ప్రశ్నగావచ్చును. ఏయే ఫలముల ననుభవింప నిష్టమగునో యప్పని కేయేపుణ్యలోకములు కల్పింపఁబడియున్నవో యందెల్ల నీయిచ్ఛానుసారముగ ననుభవించుచు మరలఁ బుట్టువును గాంచకయుండుమా యని శ్రీరాముఁడు వర మొసంగెనని మన మీభాగమునుండి గ్రహింపవలయును. ఇందు "లోకానుత్తమాన్" అనుచోట విష్ణులోకములనని యర్థము వ్రాయఁబడినది. అది యంత సరసమని తోఁపదు. ఉత్తమోత్తమలోకములు కొన్ని విష్ణుమూర్తికి నుండినయెడల నతఁడు భగవంతుఁడు కానేరఁడు. పునరావృత్తిరహితము లగులోకము లనేకము లుండవు. ముక్తియనున దొక్కటిగాక యనేకము లుండినయెడల నవి

యొల్లరకు లభించునవిగనే యుండును. విష్ణులోకములనుట యిట నంతగా బాగుండదు. ఇపుడు శ్రీరాముఁడు తనకొఱకుఁ దనువునువదలిన జటాయువునకు వరము లిచ్చుచున్నాఁడు. కావున నో యుత్తమకార్యదక్షా! ఓ పక్షివర్యా! నీయిచ్చాను సారము ఫలముల ననుభవించుచు నుత్తమతమలోకముల నుండుమూ యనియే వర మొసంగెను. పూజ్యార్థమున బహు వచనమని గ్రహింతుమందురేని యపుడు ముక్తియని యర్థము చెప్పవలెను. అది యొకలోకము గాదు. అందు గృహాదు లుండవు. ముక్తినొందుటకు లోకము నొకదానిని గల్పించుట కంటె నధమకార్యము వేఱొకటి గానరాదు. దాన నేమిబాధ యందురేమో. ఫలానుభవమునకు నుపయోగించుశరీరమును గల్పింపవలయును. అపుడు ముక్తియనుమాటకుం గలయర్థము వ్యర్థమే యగును. కాన దేవతాభిమానమున విపరీతార్థములఁ గల్పింపకయుండుట మంచిది. విష్ణుశబ్దము భగవద్వాచకమే యన్నచో నట్టిభగవంతున కొకలోకము కలదని కల్పింప రాదు.

"ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా."

అన్నట్లిదియు నందురేని "తథాస్తు" అనవలసినదే. ఉశక్కి సంతర్పణమునకు మంచి యరఁటియాకు లన్నట్లే యగును. కావునఁ బైనవ్రాసినదే సరసము.

"స్థూలాన్ హత్వా మహారోహీనను తస్తార తం ద్విజం.
రోహిమాంసాని చోత్కృత్య పేశీకృత్య మహాయశాః. 33
శకునాయ దదౌ రామో రమ్యే హరితశాద్వలే,
యత్తత్ప్రేతస్య మర్త్యస్య కథయంతి ద్విజాతయః. 34

తత్స్వర్గగమనం తస్య పిత్ర్యం రామో జజాప హ,
తతో గోదావరీం గత్వా నదీం నరవరాత్మజౌ. ౩౫

ఉదకం చక్రతుస్తస్మై గృధ్రరాజాయ తావుభౌ,
శాస్త్రదృష్టేన విధినా జలే గృధ్రాయ రాఘవౌ. ౩౬

స్నాత్వా తౌ గృధ్రరాజాయ ఉదకం చక్రతుస్తదా.
స గృధ్రరాజః కృతవాన్ యశస్కరం
సుదుష్కరం కర్మ రణే నిపాతితః,
మహర్షికల్పేన చ సంస్కృతస్తదా
జగామ పుణ్యాం గతిమాత్మనశ్శుభాం.'' ౩౭

అని మూలము. జటాయువునకు నౌర్ధ్వదైహిక క్రియల నిర్వర్తింపఁ బూని యడవికిఁ బోయి రోహీమృగములను జంపి (ఒక్కవిధములగు హరిణజాతిలోఁ జేరినవి) వానిమాంసమును ముద్దలుచేసి పచ్చికనేలపై దర్భలు పఱచి విధివిహితముగాఁ బిండదానము చేసెను. ప్రేతత్వనివృత్తికొఱకును పితృదేవతాప్రీతికరములగు యామ్యసూక్తనారాయణసూక్తములఁ బఠించెను. అనికదా యర్థము. ఈకర్మ మేల? అనునదియే యిటఁ బ్రశ్నము. భగవంతుఁ డాశీర్వదించి యుత్తమలోకములను జటాయువునకుఁ బ్రసాదించును. దాన నతనికి నుత్తమలోకములు గలుగుననుట సిద్ధాంతమే కదా. ఈపిండప్రదానజలతర్పణము లేల? యనఁగా

"యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే.''

అనుప్రమాణము ననుసరించి యితరులకు సదాచారము నుపదేశింపఁ బూనినయవతారము గాన శ్రీరాముఁడు లౌకికము

నెల్ల జరపెననియుఁ, బక్షుల కీకర్మవిధానము శాస్త్రసిద్ధము కాకున్నను దండ్రివలె నీపక్షిమాన్యుఁడు నాకగునని రాముఁడే తెల్పినందునఁ దత్తుల్యముగా నాతనికిఁ గర్మ మొనరించెననియు మన మెఱుంగవలయును. శ్రీరామునియాచారమే శాస్త్రము గాన దానిని లోకు లనుసరింపవలయునని తలంచి యట్లు లొనరించెననియే యిటఁ గలసారము. ఈయర్థమున కాధారము గలదా యని యడుగుదురేమో. "మహర్షికల్పేన చ సంస్కృత_స్తదా" అనునదియే యిందులకుఁ బ్రమాణము. మహర్షిసమానుఁ డైనరాముఁ డనఁగా భావమేమి? ఋషు లెట్లు శాస్త్రము నతిక్రమింపక కర్మముల నాచరింతురో యట్టు లనిగ్రహింపవలయును. ఆకర్మములమూలమున నాపక్షి యుత్తమగతులకుఁ బోయెనని కథాసారము. ఇఁక నీభాగమున నధ్యాత్మరామాయణమునఁ గలవిశేషములఁ బరికింతము.

"దిష్ట్యా దృష్టోఽసి రామ త్వం మ్రియమాణేన మేఽనఘ,
పరమాత్మాసి విష్ణుస్త్వం మాయామనుజరూపధృక్.
అంతకాలేఽపి దృష్ట్వా త్వాం ముక్తోఽహం రఘుసత్తమ,
హస్తాభ్యాం స్పృశ మాం రామ పునర్యాస్యామి తే పదం. 3౭
తథేతి రామః పస్పర్శ తదంగం పాణినా స్మయన్,
... ... ... ... ...
హత్వా వనే మృగం తత్ర మాంసఖండాన్ సమంతతః,
భక్షంతు పక్షిణస్సర్వే తృప్తో భవతు పక్షిరాట్. 3౯
ఇత్యుక్త్వా రాఘవః ప్రాహ జటాయో గచ్ఛ మత్పదం,
మత్సారూప్యం భజస్వాద్య సర్వలోకస్య పశ్యతః. ౪౦
తతోఽనంతరమేవాసౌ దివ్యరూపధరశ్శుభః,
విమానవరమారుహ్య భాస్వరం భానుసన్నిభం. ౪౧

... ... ... ...

కృతాంజలి పుటో భూత్వా తుష్టావ రఘునందనం.

అగణితగుణమప్రమేయమాద్యం సకలజగత్స్థితిసంయమాదిహేతుం,
ఉపరమపరమం పరాత్మభూతంసతతమహం ప్రణతో౽స్మి రామచంద్రం.

నిరవధిసుఖమిందిరాకటాక్షం క్షపితసురేంద్రచతుర్ముఖాదిదుఃఖం,
నరవరమనిశం నతో౽స్మి రామం వరదమహం వరచాపబాణహస్తం. ౪౫

త్రిభువనకమనీయరూపమీడ్యం రవిశతభాసురమీహితప్రదానం,
శరణదమనిశం సురాగమూలే కృతనిలయం రఘునందనం ప్రపద్యే. ౪౬

భవవిపినదవాగ్నినామధేయం భవముఖదైవతదైవతం దయాళుం,
దనుజపతిసహస్రకోటినాశం రవితనయాసదృశం హరిం ప్రపద్యే. ౪౭

అవిరతభవభావనాతిదూరం భవవిముఖైర్మునిభిస్సదైవ దృశ్యం,
భవజలధిసుతారణాంఘ్రిపోతం శరణమహం రఘునందనం ప్రపద్యే. ౪౮

గిరిశగిరిసుతామనోనివాసం గిరివరధారిణమీహితాభిరామం,
సురవరదనుజేంద్రసేవితాంఘ్రిం సురవరదం రఘునాయకం ప్రపద్యే. ౪౯

పరధనపరదారవర్జితానాం పరగుణభూతిషు తుష్టమానసానాం,
పరహితనిరతాత్మనాం సుసేవ్యం రఘువరమంబుజలోచనం ప్రపద్యే. ౫౦

స్మితరుచిరవికాసితాననాబ్జం మతిసులభం సురరాజనీలనీలం,
సితజలరుహచారునేత్రశోభం రఘుపతిమీశగురోర్గురుం ప్రపద్యే. ౫౧

హరికమలజశంభురూపభేదా త్త్వమిహ విభాసి గుణత్రయానువృత్తః,
రవిరివ జలపూరితోదపాత్రే ష్వమరపతిస్తుతిపాత్రమీశమీడే. ౫౨

రతిపతి శశికోటి సుందరాంగం
శతపథగోచర భావనావిదూరం,
యతిపతిహృదయే సదా విభాంతం
రఘుపతిమార్తిహరం ప్రభుం ప్రపద్యే.'' ౬౨

అని కలదు. రామాయణార్థమునకు దీనికి నించుకభేదము కలదు. కథాభాగమున కది విరుద్ధము కాదు. కాని తత్త్వ మిందు విస్తరించి చెప్పఁబడినది. తత్త్వము తెలుపుటయే కదా యధ్యాత్మరామాయణహృదయము. త్రిమూర్తులుగా వెలయు వాఁడవని తెలుపుటయే యిందలి విశేషము. త్రిమూర్తులు భగవదంశములనియు, స్వతంత్రులు గారనియు, మూవురు సృష్టిస్థితిసంహారము లనుకార్యములు చేయువారలనియు, నిందుత్తమమధ్యమాధమభేదములు లేవనియు మన మెఱిఁగితిమేని మతభేదములు నశించుటయే గాక దేవతాదూషణ జనితపాపమునుండి తొలంగుదుము. ఇఁకఁ దరువాతికథను బఠింతము.

## అయోముఖిని విరూపగాఁజేసి కబంధుని జూచుట.

* జటాయువునకు నుత్తమగతులు కల్పించి రామలక్ష్మణులు సీతాన్వేషణమునఁ బయనము సాగించిరి. నైరృతిదిక్కున కరిగిరి. మహాలతాదిపరివేష్టితమగు నా దండకారణ్యమునందు సీతను వెదకుచుఁ బోయిరి. మహాభయంకరముగా నుండు నా జనస్థానమును దాఁటి మూఁడుక్రోశము లేగిరి. క్రౌంచారణ్యముం బ్రవేశించిరి. అందుఁ గలయ వెదకిరి. అద్దాని దాఁటి మతంగాశ్రమమునఁ దూర్పుగా మూఁడుక్రోశములు పోయి

* ఇది అఱువదితొమ్మిదవసర్గమునఁ గలదు.

క్రౌంచారణ్యమతంగాశ్రమాంతరమునందు నొక ఘోరా రణ్యమును దిలకించిరి. భయంకరమై యది దుర్గమముగా నుం డెను. అందొక మహాగుహను గాంచిరి. అది గాఢాంధకార నిబిడము. సోదరు లచ్చోటికిం బోయి యం దొకరక్కసిని గనుఁగొనిరి. అది మహత్తరశరీరము కలిగి వికృతవక్త్రము గల దిగా నుండెను. చూచినంతన భయమునుగల్గించు రూపము గల యారక్కసి సింహాదిమృగములను భక్షించుచు వెండ్రు కలు విరియఁబోసికొని యారామలక్ష్మణులనుఁ గనఁబడెను. అది యావీరులదగ్గరకు వచ్చి ముందుగానడచు లక్ష్మణునిం గని రమ్ము. మనము విహరింతము. అని పలుకుచు నాతనిం బట్టుకొని యెను. గాఢాలింగన మొనరించుచు నే నయోముఖియను పేరు గలదానను. నీకు లభించితిని. నాకుఁ బ్రియుఁడవు వైతివి. ప్రాణనాథా! నీజీవితాంత మీపర్వతశిఖరములందును నదీపులిన తలములందును నాతో విహరింపుము. అని [illegible] పలుకఁగా నాసౌమిత్రి యాగ్రహించి ఖడ్గమెత్తి దానినాసి కయుఁ గర్ణములు స్తనములు ఖండించెను. అంత నయ్యది బొబ్బలిడుచు వచ్చినదారింబట్టి పాఱిపోయెను.

ఆయన్నదమ్ములు సీతను వెదకఁబోవుచుండ నీ దుర్ని మిత్తము లగపడెను. అంతఁ దేజమున వెలయున్న రామునిం గాంచి సౌమిత్రి దోసిలొగ్గి శ్రీరామచంద్రా! నా సవ్యబా హువు కంపించుచున్నది. నామనస్సు తాఱుమాఱగుచున్నది. అనేకదుశ్శకునములు తోఁచుచున్నవి. కాన నీవు సిద్ధపడియుం డుము. ఇవియెల్ల నాకిపుడే యశుభము గలుగునని తెలుపు చున్నవి. వంచులకమను నీభయంకరపక్షి యఱచుటం గాంచిన మనకు యుద్ధమున విజయముగలుగునని తోఁచుచున్న దనెను.

వారందు సీతను వెదకుచుండఁగా నంతొక మహాధ్వని భయము గల్గించుచుం బొడమెను. వాయువాకాశమున నిండినట్లు ధ్వని యది యాయడవినంతయు వ్యాపించెను. ఎందుఁగల్గెనో రాముఁ డెఱుంగఁగోరి సోదరుం గూడి పోయి యందొకపొదయందు మహాకాయము గలిగి విశాలవక్షుఁడగు నొకరాక్షసునిం గాంచెను. వానికడకుం బోయిరి. తల మెడ యనునవి లేక నోరు కడుపునందే యుండఁగా నొకమొండెమువలె వాఁ డుండెను. అతిభయంకరాకారము గలవానిధ్వని మేఘధ్వనిని బోలియుండెను. వానిఱొమ్మునందుఁ గలనొసటిలో నొక కన్నుండెను. అగ్నిజ్వాలవలెనది మండుచుఁ బెద్దఱెప్పగలిగి గోరోజనపుఁజాయ గలిగి పెద్దదిగా నుండెను. పెద్దకోఱలుగలిగి వాఁడు సెలవుల నాకుచుండెను. వాఁడు క్రూరమృగములఁ దినుచుండెను. యోజనమంత పొడవుగల రెండుచేతులను దులుపుచు నానా మృగములను బట్టుకొనుచుఁ దినుచుండెను. ఇష్టము లేనివానిని వదలుచుండెను. వాఁ డాయన్నదమ్ములమార్గము నడ్డగించి యుండెను. వారాతనికిఁ గ్రోశమాత్ర దూరమున నుండిరి. ఆనిడుదబాహువులతో రామలక్ష్మణులను బలముతో నొక్కటిగా నదుముచుఁ బట్టుకొనియెను. సకలాయుధధారులగు నా యన్నదమ్ములు వాఁ డిట్లు పట్టుకొనఁగాఁ బరవశులైరి. ఆదుర వస్థయందు శ్రీరాముఁడు ధైర్యమును వదలక యించుకంతయే వగవకయుండెను. సౌమిత్రి బాలుఁడగుట వ్యథనొందెను. అంత లక్ష్మణుఁడు దీనుఁడై రామునింగాంచి మహావీరా! నేను వీనికిం జిక్కి పరవశుఁడనైతిని. చూడుము. నన్నువదలి నీవు తప్పించు కొనుము. ఈభూతమునకు నన్ను బలియిచ్చి సుఖముగాఁ బరుగెత్తిపొమ్ము. వేగముగా సీతను బడయఁగలవని నాయా

శయము. నీవు పోయి వంశపరంపరాప్రాప్తమగు రాజ్యమును బొంది పాలింపుము. నన్ను సర్వదా స్మరించుచుండుమని పలికెను.

ఇట్లు సౌమిత్రి పలుకఁగా శ్రీరాముఁడు వీరా! లక్ష్మణా! భయంపడకుము. నీవంటివాఁ డిట్లు విషాదమునొందరాదు. అనఁగా నింతలో క్రూరరాక్షసుఁడు ఆకబంధుఁడు మేఘధ్వని వలెనుండు కంఠధ్వనితో మీ రెవ్వ రెదరు? ఏ శస్త్రాస్త్రములఁ బూనియున్నారు? ఈమహారణ్యమునకు వచ్చి నాకాహారమైతిరి. ఇం దేపని యున్నది? చెప్పుఁడు. ఇం దేపని లేదుగాని నా యాఁకలిఁ బాపుటకే యిచ్చటికి వచ్చితిరి. ధనుశ్శస్త్రాదిధారు లయ్యు నాహారంబైతిరి గాన మీప్రాణము లింకఁ దక్కవు. అను నాదుష్టరాక్షసునిమాట విని రాముఁడు శుష్కవద నుఁడై లక్ష్మణా! ఒకదానివెంట నొకటిగాఁ గష్టములు వచ్చు చున్నను బ్రియురాలిని సీతను గాంచకుంటిమి. అది చాలక మనప్రాణములు తీయుటకే యీయాపద కల్గినది. సమస్తభూత విషయమందును గాలమే బలవత్తరమైనది. దాని బలమునకు మాఱులేదు. చూడుము. మనము బలవంతులమైనను నది వ్యసన ములమూలమున మోహము గలుగఁజేయుచున్నది కదా. కాలమునకంటె మిక్కిలి ప్రేఁగైనదియే లేదు. కాలము రాఁగా నెంత బలవంతులైనను సైకతసేతువువలె నశింతురు. అని పలికి దీనుఁడైన లక్ష్మణునిగాంచి తాను ధైర్యమును వదలకుండెను.

మహాశయులారా! ఈభాగమున విమర్శనాంశములు పెక్కులు గలవు. వానిం బరిశీలించి రామాయణతత్త్వమును యథాశక్తిన్యాయమునఁ గనుఁగొందము.

"దదృశాతే తు తౌ తత్ర దరీం దశరథాత్మజౌ,
పాతాళసమగంభీరాం తమసా నిత్యసంవృతాం. ౧౦
ఆసాద్య తౌ నరవ్యాఘ్రౌ దర్యాస్తస్యావిదూరతః,
దదృశాతే మహారూపాం రాక్షసీం వికృతాననాం. ౧౧

... ... ... ...

సా సమాసాద్య తౌ వీరౌ వ్రజంతం భ్రాతురగ్రతః,
ఏహి రంస్యావహేత్యుక్త్వా సమాలంబత లక్ష్మణం. ౧౪

... ... ... ...

అహం త్వయోముఖీ నామ లాభస్తే త్వమసి ప్రియః. ౧౫
నాథ పర్వతకూటేషు నదీనాం పులినేషు చ,
ఆయుశ్శేషమిమం వీర త్వం మయా సహ రంస్యసే. ౧౬
ఏవముక్తస్తు కుపితః ఖడ్గముద్ధృత్యలక్ష్మణః,
కర్ణనాసౌ స్తనౌ చాస్యా నిచకర్తారిసూదనః. ౧౭
కర్ణనాసే నికృత్తే తు విస్వరం సా వినద్య చ.
యథాగతం ప్రదుద్రావ రాక్షసీ భీమదర్శనా." ౧౮

అని మూలము. ఇందు విశేషార్థములు లేవు. మఱేల యీ విషయ మిచ్చోట? అందురేమో వినుఁడు. జనస్థానము దాటి దక్షిణపశ్చిమాంతర్భాగమున నారామలక్ష్మణులు సీతను వెదకుచుండిరి. మహాగుహ యొండు వారికిఁ గనఁబడియెను. ఎల్లపుడది యంధకారావృతమే. అందొక్కరాక్షసి యయోముఖి యుండెను. లక్ష్మణుని గని మోహించి విహరింతము. రమ్మని పిలిచెను. అది సింహాదిక్రూరమృగములను భక్షించునది. కాని కామమున లక్ష్మణునిం బతిగాఁ గోరెను. అంత నతఁడు కోపించి ముక్కు చెవులు స్తనములు కోసివైచెను. అనునది కథాభాగము.

రామాయణకాలమున దేశస్థితిని విచారింతము. మహా
టవులలో వృక్షమూలములయందు, గుహాలయందును, పర్వత
ములయందు బహువిధప్రాణు లుండుననిి యేర్పడుచున్నది.
మానవులు రాక్షసులు కలిసియేయున్నట్లు స్పష్టము. మానవుల
భక్షించునాచారము రాక్షసులకుఁ గలదు. వారిని తప్పించు
కొని మునులు లోనగువారు తిరుగుచుండిరి. సాంద్రారణ్యము
లలో నేమూల నెవరుండునదియుఁ దెలియక యుండెను.
కొందఱు మునులు ఆశ్రమములు కల్పించుకొని యుండిరి.
వారితపశ్శక్తియే రాక్షసులబాధల నాపుచుండెను. భూవివర
ములయందు నుండువారు గలరు. వారిరూప మత్యంతభయం
కరము. ఆహారము తదనురూపముగనే యుండునుగదా.
కామ మెల్లరకు సమానమే యనవలయును. కనుకనే లక్ష్మణుఁడు
తొలుతఁ గనఁబడఁగనే మోహించి భక్షించుప్రయత్నము
మాని విహరింతము రమ్ము. అని పిలుచును. సౌందర్యమనునది
సర్వజీవమోహజనకమనుట దీనింబట్టి యేర్పడుచున్నది. గాఢా
లింగన మొనరించి యీకొండశిఖరములయందు నదులలోని
యిసుకతిన్నెలయందును విహరింతమని కోరెను. ఈభాగమును
పరికింపఁగా నాగరికతయనునది లేశమైనను లేనికాల మని
యేర్పడును. భారతమునకంటె రామాయణకథ తరువాత సాగిన
దనువారివాద మెంత న్యాయశూన్యమో యిది తెలుపు
చున్నది. ఆహారమునుబట్టి నివాసస్థలము నిర్ణయింపవచ్చు
ననియు నొక యూహతోఁచును. ఏయేతావుల నెవరున్నదియుఁ
దెలియనికాలము రామాయణకాలమని స్పష్టమగుచున్నది.
సర్పదుష్టమృగబాధ లాప్రాణికోటికిఁ గలుగవు. దుష్కర్మవశ
మున నట్టిరూపములు కలుగును. ఆహారవిహారములు తదను

రూపములుగ నుండును. పుట్టుక లోనగువానిని గనుఁగొన సాధ్యముకాదు. పశువులవలెనే స్వార్జితాహారమున జీవించువారనేకులాకాలమునఁ గలరు. ఈవృత్తాంతమును బట్టి పరిశీలించినయెడల రామాయణకథ యతిప్రాచీనమనియు, మహాభారతకథ యధునాతనమనియు బుద్ధిమంతులు గ్రహింపకపోరు. కాఁబట్టినకుండేటికి మూఁడేకాళ్లనువారి వాదము నకుఁదలతోఁకయు నుండక వాగాడంబరమే యందుఁ బ్రధానముగా నుండును. కర్ణనాసికాకుచచ్ఛేదము దుష్కామసుఖాతిరేకత్వనిరాసార్థమని యెఱుంగవలయును.

"తం శబ్దం కాంక్షమాణస్తు రామం కక్షే సహానుజః,
దదర్శ సుమహాకాయం రాక్షసం విపులోరసం. ౨౬
ఆసేదతుస్తతస్తత్ర తావుభౌ ప్రముఖే స్థితం,
వివృద్ధమశిరోగ్రీవం కబంధముదరేముఖం. ౨౭
... ... ... ...
అగ్నిజ్వాలానికాశేన లలాటస్థేన దీప్యతా,
మహాపక్ష్మేణ పింగేన విపులేనాయతేన చ. ౨౯
ఏకేనోరసి ఘోరేణ నయనేనాశుదర్శినా,
మహాదంష్ట్రోపపన్నం తం లేలిహానం మహాముఖం. ౩౦
భక్షయంతం మహాఘోరాన్ ఋక్షసింహమృగద్విపాన్,
ఘోరౌ భుజౌ వికుర్వాణముభౌ యోజనమాయతౌ. ౩౧
కరాభ్యాం వివిధాన్ గృహ్య ఋక్షాన్ పక్షిగణాన్ మృగాన్,
ఆకర్షంతం వికర్షంతమనేకాన్ మృగయూథపాన్." ౩౨

అని మూలము. కబంధమనఁగా శిరస్సులేనిదేహ (మొండెము) మని యెఱుంగవలయును. ఇచ్చో శిరస్సులేని మొండెము

కాదు. కడుపులో శిరస్సుగలిగి యగ్నిజ్వాలవలె గనంబడు నొక్కకన్నుగలిగి యోజనమాత్రము పొడవులుగానున్న చేతులుగల యొక రక్కసుఁడు కనఁబడెను. సామాన్యసృష్టి గాక యిది యొకవిచిత్రసృష్టియని తేలెడిని. ఇట్టివి కలదా యనుసందియ ముదయింపకమానదు. కాని విమర్శించిన నిట్టివి మనకుఁ దెలిసినవియే కలవు. కర్కాటకమునకు శిరస్సు గలదా? లేకపోలేదు. విచిత్రముగా నది యమర్పఁబడియుండును. పాములకుఁ జెవులు లేవు. శబ్దగ్రహణమునకు సాధనముగా నేత్రములే శ్రోత్రములుగా నవి యుపయోగింపఁగలవు. ఒకా నొకయుష్ణదేశమున నొకమృగము గలదు. దానిముక్కురంధ్రములనుండి వచ్చు గాలి మంటవలెనుండును. ఒక్కదేశభాగమున నొకపక్షి గలదు. అది కోడివలెనుండును. నిప్పుల నది భక్షించును. సాధారణములుగాని మనదేశపుటడవులలో నొకమృగము గలదు. అది చాలపొట్టిది. రాత్రులయందది సంచరించును. పుట్టలు పెంటదిబ్బలు అది శోధించుచోటులు. దాని రెండుకన్నులు చింతనిప్పులవలె నుండును. దాని ముక్కురంధ్రము లెఱ్ఱగానుండును. అది పెద్దది కాఁగా దానిముక్కురంధ్రముల నొకవస్తువు పాషాణమువలె నుండును. దానిని దెచ్చి పాముకఱచినచోట నుంచిన విషము నిర్విషమగును. దాని పేరు మండ్లగరడయందురు. ఇక్కాలమున నొకపాశ్చాత్య మహాశయుఁడు సముద్రాంతర్భాగములను బరిశీలించుచుండఁగా నొకజంతువు కనఁబడెను దాని కన్నులవెలుతురు విద్యుల్లతల నెన్నింటినో మించినట్లుండుననియు, దానిని వ్యాపింపఁ జేయఁగా జంతువులు నిశ్చేష్టితంగాంచుననియు, వానిని బట్టుకొని యది భక్షించుననియు నామహాశయుఁడు తెల్పెను. ఇట్టివి

లెక్క లేక యున్నవి. ఇపు డున్నసృష్టిలో సహస్రాంశము మనము కనుఁగొనలేదని తేలెడిని. హిమాలయపరిశోధకులు పక్షములుగల యుడుతలం జూచిరఁట. మనపురాణములలో నశ్వములకుఁ బక్షములున్నవని యున్నది. ఆమాట వినఁగానే కొందఱు నవ్వుదురు. ఉడుతలకుఁ బక్షములున్నవని పరిశోధకులు వ్రాయఁగా మౌనము వహింపవలసినదే కదా. ఇన్నింటిలో నీకబంధునిసృష్టియు నొకటి. ఇందద్భుతావహమగు విషయమేది? కొండచిలువ యేఁబది బారలదూరమందున్న నేజంతువునైన ముఖమారుతమున దగ్గరకు లాగుకొనఁగలదు. ఆశక్తి భగవద్దత్తము. ఆహారవస్తుసంపాదనమునకుఁగాఁ గల్పింపఁబడినది. కబంధుఁడు నట్టే యని మన మూహించిన నచ్చెరువొందుమార్గ మేదియుఁ గానరాదు. లోకజ్ఞానము లేనివారే యిట్టివసంగతములని యందురు. ఇట్టియద్భుతముల నెఱింగియే మనవారు "యతో విచిత్రా బడవస్తుశక్తయః" అని పలికిరి. సృష్టియందుఁ గల వైచిత్ర్యము మానవులమానసమున కగమ్యమే యని యెంచవలయును. ఆయాయికర్మముల ననుసరించి యాయారూపములు గలుగుచుండు నని మన మెఱింగిన విచిత్రముగా నేదియుఁ దోఁపదు.

"ఉవాచ చ విషణ్ణస్సన్ రాఘవం రాఘవానుజః,
పశ్య మాం వీర వివశం రాక్షసస్య వశం గతం. ౩౭
మయైకేన వినిర్యుక్తః పరిముంచస్వ రాఘవ,
మాం హి భూతబలిం దత్వా పలాయస్వ యథాసుఖం. ౩౮

... ... ... ... ...

మాస్మ త్రాసం కృథా వీర న హి త్వాదృగ్విషీదతి,

... ... ... ... ...

ఉవాచ లక్ష్మణం రామో ముఖేన పరిశుష్యతా,
కృచ్ఛ్రాత్కృచ్ఛ్రతరం ప్రాప్య దారుణం సత్యవిక్రమ. ౪౭
వ్యసనం జీవితాంతాయ ప్రాప్తమప్రాప్య తాం ప్రియాం,
కాలస్య సుమహాద్వీర్యం సర్వభూతేషు లక్ష్మణ. ౪౮
త్వాం చ మాం చ నరవ్యాఘ్ర వ్యసనైః పశ్య మోహితౌ,
నాతిభారోఽస్తి దైవస్య సర్వభూతేషు లక్ష్మణ. ౪౯
శూరాశ్చ బలవంతశ్చ కృతాస్త్రాశ్చ రణాజిరే,
కాలాభిపన్నాస్సీదంతి యథా వాలుకసేతవః.” ౫౦

అని మూలము. ఇందు లక్ష్మణుని భ్రాతృప్రీతియు శ్రీరాముని సోదరవాత్సల్యము తేటపడుచున్నవి. నేను వీనికి జిక్కితిని. ఇఁక బ్రదుకునుపాయము కానరాదు. నన్ను వీనికాహార మొసఁగి నీవు తప్పించుకొని పొమ్ము. నన్ను మాత్రము స్మరించు చుండుమని లక్ష్మణుఁడు పలికెను. నీవంటి శూరుఁడిట్లు భయం పడరాదని రాముఁడు పలికెను. ఇంతలో వాఁడు వీరువురను బట్టుకొని లాగసాగెను. అపుడు శ్రీరాముఁడు వ్యసనపడుచుఁ దమ్మునితో నాయనా! ఒకదానివెంట నొకటిగా వ్యసనములు కనఁబడుచున్నవి కాని సీతమాత్రము కనఁబడలేదు. సర్వ భూతవిషయమునందుఁ గాలమునకు మహావీర్యము కలదు. కాలరూపమగు దైవమునకంటె గొప్పది కానరాదు. ఎంతబలవంతులైనను గాలమునకు లొంగబడకమానరు. ఇసుకతోఁ గట్టిన కట్ట జలస్పర్శమున నశించినట్లు బలశాలురందఱు కాలవశంగతులే యని నమ్ముమని రాముఁడు తెలిపెను. అనఁగాఁ గష్టకాల

మును గూర్చి శోకింపరాదు. మానవుశక్తి యెంత గొప్పదిగాఁ దోఁచినను దైవమును మించఁజాలదు. ఒక్కక్షణమున లోఁబడి పోవును. కనుక దానింగూర్చి దుఃఖింపరాదనియే దీని భావము. సోదరా! ఈదానవునకుఁ గాలబలము కలదు. కొంచెమోర్చు కొనుము. తెలియఁగలదు. దైవదత్తశక్తి దీనికిఁగలదు. దానికి మనము లోఁబడవలసినదే. అని యుపదేశించె ననునదియే సారము. కష్టపరంపరలయందే దైవశక్తి నెఱింగి స్వాహంకార మును మాని తరింపవలయు ననునదియే యీభాగమునుండి గ్రహింపఁదగిన విషయము.

"అవేక్ష్య సౌమిత్రిముదగ్రపౌరుషం
స్థిరాం తదా స్వాం మతిమాత్మవాన్ కరోత్." ౫౧

అని మూలము. ఇది పైనవ్రాసినవిషయమును దృఢపఱచు చున్నది. మహాపౌరుషముగల లక్ష్మణుని గాంచి యాత్మవేత్త గాన రామచంద్రుఁడు తనమతిని స్థిరపఱచెను.

"స్మృతిర్వ్యతీతవిషయా మతిరాగామిగోచరా,
బుద్ధిస్తాత్కాలికీ జ్ఞేయా ప్రజ్ఞా త్రైకాల్యగోచరా."

యనున్యాయము ననుసరించి రాముఁడు తనమతి ననఁగా రాఁబోవుఫలముల నెఱింగినదానిని దృఢము చేసికొనియెను. అనఁగా నాకబంధచరిత్రము నెఱింగిన మతిగలవాఁ డయ్యెనని భావము. ఆతనికి శాపవిముక్తికాలము సమాసన్నమయ్యె నని తెలిసికొనియెనని సారము. వాల్మీకిమహాముని సార్థకపదముల నుపయోగించు మహాకవిశిరోమణి యని మన మీభాగము నుండి తెలిసికొనవలయును.

## కబంధుఁడు శాపవిముక్తి నొందుట.

* అంతఁ గబంధుఁడు బాహుపాశములచే బంధింపఁగా రామలక్ష్మణు లూరక నిలుచుండిరి. అది చూచి వాఁడు రాజకుమారులారా! దైవము మిమ్ము నాకాహారముగాఁ జూపి యున్నది కదా. ఆఁకలిచే బాధపడు నన్నుం జూచి యూరక యున్నారే. ఏల? ఇఁక మీరుఁ బ్రాణములు దక్కనుట కల్ల. అనఁగా సౌమిత్రి యిట్లు పరాక్రమమహాని తత్కాలానుకూలముగా నన్నా! వీఁడు మనల నిఁక మ్రింగును. కాన నీబాహుద్వయము ఖండింతము. ఈ పెనుబాహువులతో వీఁడెల్లర లోఁబఱచుకొని మ్రింగుచు మనల నష్టు చేయఁదలంచెను. అశ్వమేధయజ్ఞమధ్యమునుండి కొనిపోఁబడిన పశువులఁ జంపఁదగని యట్లు బదులు చేయలేనివారలను రాజు వధింపఁడు. అనఁగా వారిపరిహాస్యభాషణముల విని కోపమున నోరు విప్పి మ్రింగఁబూని చేతులతో లాగెను. దేశకాలపరిజ్ఞానకార్యతత్పరులు గాన వారు ఖడ్గములు గైకొని వానిహస్తముల మూఁపులదాఁక ఖండించిరి. కుడిభుజమును రాముఁడు, నెడమ భుజమును సౌమిత్రియుఁ ద్రుంచిరి. వాఁడు కటపీనుఁగై యార్చుచు నేలఁబడెను. రక్తసిక్తాంగుఁడై పీనుఁగై మీరెవ్వరని యడిగెను. లక్ష్మణుఁడు తమవార్త నెఱిఁగింపఁబూని యీపుణ్యాత్ముఁడు దాశరథి. రాముఁ డనఁబడు వాఁడు. లక్ష్మణుఁ డనుపేరుగలనే నీతని తమ్ముఁడను. వనవాసము చేయుచుండఁగా నీ శ్రీరామునిభార్యను రక్కసుఁ డొక్కఁ డపహరించి కొనిపోయెను. మేమామెను వెదకుచు వచ్చితిమి. నీవెవ్వఁ

* ఇయ్యది డెబ్బదియవసర్గమునఁ గలదని యెఱుంగవలయు.

డవు? ఈవికారరూపమున నున్నావే. ఏల? అని యడిగెను. అంత నాతఁడు తన కింద్రుఁడు చెప్పినమాట తలంపునకు రాఁగా శాపాంత మగుటచే సంతుష్టుఁడై మహాత్ములారా! మీకు స్వాగతము. నాయదృష్టవశమున మీదర్శనము లభించెను. నాభాగ్యముననే నాచేతులు ఖండించితిరి. శ్రీరామా! నాయవినయపాపమున నాకీవికృతరూపము గల్గినది. దానిం జెప్పెద. ఆకర్ణింపుము.

## కబంధుఁడు శ్రీరామునకుఁ దనవృత్తాంతమును దెలుపుట.

* శ్రీరామా! తొల్లి నాకుఁ జంద్రేంద్రసూర్యులకుం బోలెఁ ద్రిలోకప్రసిద్ధదివ్యరూప ముండెను. అట్టి నేను లోకభయంకరమగు నిట్టిరూపమును దాల్చి మునులను భయపెట్టుచుంటిని. ఒకనాఁడు స్థూలశిరుఁ డనుముని కందమూలాదుల కొఱకుఁ బోవఁగా నాతఁడు సేకరించిన యావస్తువుల నే నీరూపమున నపహరించి యవమానపఱచితిని. ఆతఁ డాగ్రహమూని ఘోరశాపమీయఁబూని క్రూరమై నిందితమైయుండు నీరూపముననే నీవుందువుగాక. అనఁగానే నే నమ్మునిఁ బ్రార్థించి యీశాపాంతము ననుగ్రహింపుమా యని వేఁడితిని. ఆముని శాంతమూని శ్రీరాముఁ డెపుడు వనమునకు వచ్చి నీహస్తములు ఖండించునో యపుడు నీవు శాపము తొలఁగఁగా నీసురూపము నొందుదువు ఈకబంధరూపమెట్లువచ్చెనందువేమో లక్ష్మణా! ఆలకింపుము. దనువంశజుఁడు

* ఇది డెబ్బదియొకఁడవసర్గమునఁ గలదు.

శ్రీనామధేయునకు నన్నుఁ బుత్త్రునిగా నెఱుంగుము. శాపమున
ఘోరరూప మలవడుటయేగాక రణమున నింద్రునికోపమున
నీకబంధరూపము కూడ నలవడినది. ఎట్లన మునిశాపమున
ఘోరాకారము రాఁగా నాకులవైరియగు నింద్రుని జయింప
నుగ్రతపస్సుచేసి బ్రహ్మ నలరించితిని. ఆబ్రహ్మ నాకు దీర్ఘాయువు
లిచ్చెను. పిదప నాకజ్ఞానగర్వములు కలిగెను. దీర్ఘాయువుగల
నన్నింద్రుఁ డేమిచేయఁగలఁడని తలంచి యాతని మార్కొని
నాఁడను. ఆతఁడు వజ్రమును పైనఁగొ వానిచే నాయూరు
వులు కుక్షిలోపలికిని నాశిరస్సు వక్షములోపలికిని బోవునట్లు
చేయఁబడియె. మొండెమువలె నైతిని. వాని కోర్వఁజాలక
నన్నింకఁ జంపుమా యని యెంత ప్రార్థించిన నింద్రుఁడు నన్ను
యమునిదాపునకుఁ బంపఁబూనఁడు. బ్రహ్మవాక్యము సత్యమే
యగుంగాక. అనఁగా నేను ఇట్టిరూపమును బొందితిని. ఆహార
మెట్లువచ్చును? నిరాహారముగా నెంతకాలము జీవింపఁగలను?
అనియడుగ నతఁడు యోజనమాత్రవిస్తృతములగు బాహ
వుల నొసంగెను. దంష్ట్రాతిభయంకరమగు నోటుఁ గల్పించెను.
దాన నిందుఁ గ్రూరమృగములఁబట్టి తినుచున్నవాఁడను. శ్రీ
రామలక్ష్మణులు వచ్చి నీబాహువుల ఖండింపఁగా స్వర్గము
నొందఁగలవని పలికెను. ఇం దభక్ష్యమని దేనిని విడువక తిను
చున్నాఁడను. శాపాంతము నిరీక్షించుచున్నాఁడను. శ్రీరా
ముఁడు నాబారిఁబడునా యని వేచియున్నాఁడను. స్వామీ!
నీవు రాముఁడవే. నీకు భద్రము గలుగుఁగాక. ఇతరుఁడు నన్ను
వధింపఁజాలువాఁడు లేఁడు. ఇది యాముని చెప్పినమాటయే.
మహాత్మా! మీరిరువురు నాకగ్నిసంస్కార మొసరించిన మీ
కాలోచనమును దెలిపి బుద్ధిసాహాయ్య మొసరించెద. మఱియుఁ

దగినమిత్రుని దెలిపెదను. ఆమాట లాలకించి రాముఁడు తమ్ముఁడు వినుచుండఁగా నార్యా! మేమింట లేనితఱి నాసతిని రావణుఁ డపహరించి కొనిపోయెను. ఆతనిపేరును మాకాప్తుఁడగు జటాయువు తెలిపెను. తక్కిన విషయము లాతనివి తెలుపఁజాలకపోయెను.మాయందు దయయుంచుట నీకర్హము. మేము శుష్కదారువులందెచ్చి పల్లము త్రవ్వి నిన్ను దహింతుము. నీకు నిజముగాఁ దెలిసిన నాభార్య నపహరించి కొనిపోయినవాని విధమెల్లఁ దెలుపుము. ఈమేలు మాకుఁ జేయుము. మాటాడు నేర్పు గలయాతఁడు శ్రీరామా! నాకు దివ్యజ్ఞానము లేదు. కనుక సీతజాడ నెఱుంగఁజాలను. నన్ను దహింపఁగా నిజరూపము గలుగును. అవ్వల సీతావార్త నేనుగాఁ దెలుపలేకున్న నావృత్తాంత మెఱింగినవాని నెఱిఁగింతును. ఈదేహము కాల్పఁబడకముందు రాక్షసు నెఱుంగ శక్యముకాదు. శాపమున నాజ్ఞానము నశించినది. అస్తమయము కాకముందే నన్నుఁ గాల్పుము. పిదప సీతావార్త నెఱింగినవానిం దెల్పెద. నీకతఁడు మిత్రుఁడు గాఁదగినవాఁడు. నీకతఁడు తోడ్పడును. ఆతఁ డెఱుంగనితావు లీలోకత్రయమునను లేవు. ఆతఁ డెల్లతావులఁ దిరిగియున్నాఁడు. అని తెల్పెను.

మహాశయులారా! ఈభాగమునఁ గల విశేషాంశముల నెమకుదము.

''సోఽహం రూపమిదం కృత్వా లోకవిత్రాసనం మహత్. 2
ఋషీన్వనగతాన్ రామ త్రాసయామి తత స్తతః,
తతస్స్థూలశిరా నామ మహర్షిః కోపితో మయా. 3
సంచిన్వన్వివిధం వన్యం రూపేణానేన ధర్షితః,

తేనాభిముక్తః ప్రేత్యైవం ఘోరశాపాభిధాయినా. ౪

ఏతదేవ నృశంసం తే రూపమస్తు విగర్హితం,

స మయా యాచితః క్రుద్ధశ్శాపస్యాంతో భవేదితి. ౫

అభిశాపకృతస్యేతి తేనేదం భాషితం వచః,

యదా ఛిత్త్వా భుజౌ రామ స్త్వాం దహేద్విజనే వనే. ౬

తదా త్వం ప్రాప్స్యసే రూపం స్వమేవ విపులం శుభం.''

అని మూలము. కబంధుఁడు శ్రీరామలక్ష్మణులకుఁ దనకుఁ గల్గిన శాపము దానిముక్తియు నిట్టిదని తెలుపుచున్నాఁడు. ఇందలి నీతి యెట్టిదని విమర్శింతము. ముని నిరపరాధి. తనకార్యము కొఱకుఁ బోవుచుండ గంధర్వపుత్త్రుఁడు సౌందర్యగర్వాతిరేకమున స్థూలశిరుఁ డనుముని నపహసించి యతని కంఠమాలముల నపహరించెను. ఆముని యతని యవివేకమును బాపనెంచి యేరూపమున నిప్పుడున్నాఁడవో యట్టి రూపమే నీకలవడుఁగాక. ఎల్లరకు నేవగల్పించునది యగుఁగాక. అని శపించెను. అపుడు బుద్ధివచ్చి యతఁడు ప్రార్థింపఁగా జ్ఞానదృష్టిగలవాఁడు కావున శ్రీరామావతారము మనోగోచరము కాఁగా నోయీ శ్రీరాముఁడు నీబాహువులను ఖండించును. అపు డీశాపవిముక్తి కలుగును. మరల యథాపూర్వరూపము నొందుదువని యనుగ్రహించెను.

''తేభ్యోఽధిగచ్ఛేద్వినయం వినీతాత్మాపి నిత్యశః,

వినీతాత్మా హి నృపతిర్న వినశ్యతి కర్హిచిత్. ౩౯

బహవోఽవినయాన్నష్టా రాజానస్సపరిచ్ఛదాః,

వనస్థా అపి రాజ్యాని వినయాత్ప్రతిపేదిరే. ౪౦

వేనో వినష్టోఽవినయాన్నహుషశ్చైవ పార్థివః,

సుందాః పైజవనశ్చైవ సుముఖో నిమిరేవ చ. ౪౧

పృథుస్తు వినయాద్రాజ్యం ప్రాప్తవాన్మనురేవ చ,
కుబేరశ్చ ధనైశ్వర్యం బ్రాహ్మణ్యం చైవ గాధిజః.'' ౪౨

మను. ౭-అధ్యాయము.

అను నీస్మృతివాక్యముల ననుసరించి యోఁజింపఁగా నెంత వారైన వినయము కలిగి ప్రవర్తింపవలయు ననియు, నది లేనిచో సకలైశ్వర్యశూన్యు లగుదురనియుఁ దేలుచున్నది. మఱియు

''భూతానాం ప్రాణినశ్శ్రేష్ఠాః ప్రాణినాం బుద్ధిజీవినః,
బుద్ధిమత్సు నరాః శ్రేష్ఠా నరేషు బ్రాహ్మణాస్స్మృతాః. ౯౬
బ్రాహ్మణేషు చ విద్వాంసో విద్వత్సు కృతబుద్ధయః,
కృతబుద్ధిషు కర్తారః కర్తృషు బ్రహ్మవేదినః.'' ౯౭

మను. ౧-అధ్యాయము.

అను మనువాక్యములఁ బట్టి బ్రహ్మవేత్తలకుఁ జేసిన యపకారము విశేషించి దుష్ఫలము నొసంగుననియు నన్నింటికంటె బ్రహ్మము నెఱుంగుటయే యుత్తమజ్ఞాన మనఁబడుననియు దానికే మపకారముచేసినను మహాపరాధఫలము గలుగక మానదనియు బ్రహ్మవేత్తలను బరమభక్తులనుగా భావించి సమ్మానింపవలయునని స్పష్టమగుచున్నది.

''అహం హి తపసోగ్రేణ పితామహమతోషయం. ౮
దీర్ఘమాయుస్స మే ప్రాదాత్తతో మాం విభ్రమోఽస్పృశత్,
దీర్ఘమాయుర్మయా ప్రాప్తం కిం మే శక్రః కరిష్యతి. ౯
ఇత్యేవం బుద్ధిమాస్థాయ రణే శక్రమధర్షయం,
తస్య బాహుప్రయుక్తేన వజ్రేణ శతపర్వణా. ౧౦
సక్థినీ చైవ మూర్ధా చ శరీరే సంప్రవేశితం,

చింప నుపకారులే యగుదురు. కాని మనకట్టి యాలోచనము కలుగదు. దీనింబట్టి

"కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః,
లోకసంగ్రహ మేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి."

అన్న గీతావాక్యము ననుసరింపవలయునని స్ఫురించుచున్నది. ఇఁక నిందలి సంశయముల వినుఁడు. మునిశాపము నొందిన గంధర్వుఁడు తపస్సు చేసి బ్రహ్మ నలరించుటెట్లు? తపస్సు చేసినను ఆతని క్రౌర్యము నెఱింగిన బ్రహ్మ వరమిచ్చుటెట్లు? సమాధాన మిద్ది. బ్రహ్మను దర్శించుభాగ్యము దీర్ఘాయుస్సు గలిగియుండు భాగ్యమును గలిగించు కర్మము నాచరించెను. క్రూరకర్మము లధికములుగాఁ జేసినకతన నీభాగ్యద్వయము వానిఫలముల ననుభవింపఁ దోడ్పడెను. అవి లేకయున్నఁ జిరకాలానుభవము కలుగుటెట్లు? చిరకాల మనుభవించినఁగాని మహాక్రూరములుగా నవి ఇతరులకుఁ దోఁచినఁగాని యట్టి కర్మముల నొనరింపరాదను భావము కొందఱకైనఁ గలుగదు. అది కలుగుటయే లోకోపకారక మనఁబడును. ఎవ్వరెవ్వరి మూలమున నేయే ఫలము లనుభవింపఁజేయవలయునో వారివారి నారాధించుటయో విరోధించుటయో సాగును. అట్లగునెడల నింద్రుఁడు పాదవు చేతులు ప్రసాదించుట యేల? అనరాదు. వాని మూలమునఁగాని కొన్ని జంతువులప్రాణము పోదు. శాపవిముక్తి కాదు. రామలక్ష్మణులను దూరమందుండఁగాఁ బట్టుకొని లాగినఁగాని వారు ఖండింపఁబూనరు. ఇక్కార్యములన్నియుఁ గర్మమూలమున సాగినవనియుఁ గావునఁ గర్మమార్గమునఁ జక్కఁగాఁ బ్రవర్తించినంగాని జ్ఞాన మలవడదనియు మన

దగును. దానఁగాని కార్యము గాదని నావిశ్వాసము. అట్టి వానిం దెల్పెద.

సుగ్రీవుఁడను వానరుఁడు గలఁడు. అన్న రాజ్యమును వెడలనడుపంగాఁ బంపాసరఃప్రాంతమున ఋశ్యమూకమను కొండపై నున్నాఁడు. నలువురు మహావీరులు వానరులతనికడ నున్నవారు. సకల సద్గుణములా సుగ్రీవునకుఁ గలవు. వాఁడు నీకుఁ దగినమిత్రము. నీకాతఁడన్ని విధములఁ దోడ్పడును. వగ పేటికి. ఏది యెట్లగాఁ గావలయునో యదియట్లు సాగకుండఁ జేయ నెవ్వారికిఁ దరము కాదు. కాలము దుస్తరము కదా. ఇచటనుండి పయనమై సుగ్రీవునికడకుఁ బొమ్ము. మీ రిరువురు బుద్ధిభేదము లేకుండుట కగ్నిసాక్షికముగాఁ జెలిమి చేసికొన వలయు. వానరమాత్రుఁడని యవమానింపకుమా. వానరేంద్రుఁడు. దయాదిసుగుణగణభూషితుఁడు. స్వకార్యము మీ వలన నైనను గాకున్నను మీ కార్యము నెఱవేర్పఁగలఁడు. వాలిభయమునఁ బంపాసరస్సుకడ నుండువాఁడు. ఋశ్య మూకముదగ్గర నుండునడవులఁ దిరుగుచుండును. అగ్ని యాయుధములును సాక్షులుగా శపథము చేసి మైత్రి చేసి కొనుము. ఆతఁడు రాక్షసులుండు తావులనన్నింటి నెఱుం గును. సూర్యరశ్మి సంచరించునంతదనుక నాతఁ డెఱుంగును. సీపత్ని యుండుతావు వెఱుంగఁగలఁడు. సీపత్ని యుండుతావు తెలిసికొని రమ్మని మహావీరవానరుల నెల్లదిక్కులకు నతఁడు పంపును. రావణరక్షితను సీత నెఱుంగఁగలఁడు. ఎందేయుండి నను రక్కసుల నుక్కడించి తెచ్చి నీకు సీత నీఁగలఁడు.

మహామతులారా! కొన్ని ధర్మము లీభాగమునుండి మన మెఱుంగవలయు.

"రామ మధ్యుక్తమో లోకే యాభిస్సర్వం విసృజ్యతే,
పరిపృష్టో దశాంశేన దశభాగేన సేవ్యతే. ౮
దశాభాగగతో హీనస్త్వం హి రామ సలక్ష్మణః,
యత్కృతే వ్యసనం ప్రాప్తం త్వయా దారప్రధర్షణం. ౯
తదవశ్యం త్వయా కార్యస్సుహృత్సుహృదాంవర,
అకృత్వా హి న తే సిద్ధిమహం పశ్యామి చింతయన్." ౧౦

అని మూలము. ఇందు రాజనీతి చెప్పఁబడినది. సంధివిగ్రహయానాసనద్వైధీభావసమాశ్రయము లనునవి షడుపాయములు. ఆయుపాయముల నెఱింగి వర్తించినఁగాని ప్రజాపాలకుఁడు కృతార్థుఁడు కాఁజాలఁడు. ఆపదలోనుండువాఁడు తనవంటివానితో స్నేహము చేసి తనపనిని సాధించుకొనవలెను. నీవిపుడు విపన్మధ్యగతుఁడవు. కాన నొకమిత్రుని సంపాదించుకొనవలయును. అది లేక నీకార్యము సఫలము కాదని యూహించెదను. అని బోధించెను. దీనిచే సుగ్రీవుని నుపాయమునకై జజ్ఞానమునఁ బరికించెను. కర్మమే యాతనినోట యిట్లాగు చెప్పించె ననవలయును. భార్యను బోఁగొట్టుకొనినవానికే అందలికష్టము తెలియఁబడును. కాన నట్టివాఁడు తొందఁబడిన గట్టిగాఁ బ్రయత్నించి కార్యము నిర్వహించును. అని యాతని భావము. ఇది యొక సిద్ధాంతము కానేరదు. ఏకార్యము కావలసిన నట్టివానినే యాశ్రయింపవలసి వచ్చును. శ్రీరాముని సుగ్రీవునితో మైత్రిని గలిగించుటకే యాతని ప్రయత్నము. ఉభయులకర్మములు గంధర్వుని బ్రోత్సహించి యిట్లు పలుకఁజేసెననిన బాగుండును. మిత్రుని సంపాదించుట ప్రధానమనునీతి యీభాగమునఁ జెలెడిని. మిత్రునికంటె మించిన యుపకారి యుండఁడు కదా.

"స తే సహాయో మిత్రం చ సీతాయాః పరిమార్గణే,
భవిష్యతి హి తే రామ మాచ శోకే మనః కృథాః. ౧౫
భవితవ్యం హి యచ్చాపి న తచ్ఛక్యమిహాన్యథా,
కర్తుమిక్ష్వాకుశార్దూల కాలోహి దురతిక్రమః." ౧౬

అని మూలము. ఏది యెట్లు కాఁదగునో యది యట్లేయగును. దాని మఱొకరీతిగా మార్పఁ దర మెవ్వారికిని గాదు. కాలము దురతిక్రమము. అనఁగా భావమేమి? కర్మానుసారము కార్యములు సాగుచుండును. సాగకుండఁజేయ సాధ్యమే కాదు. కాలము దాఁటరానిది. అనగా భావమేమి?

"కాలస్సృజతి భూతాని కాలస్సంహరతి ప్రజాః."

అను సిద్ధాంతమునే యీరామాయణము తెలుపుచున్నది. కాలము భగవత్స్వరూపమనియే కదా దీనిసారము. కాలోపాసకులనఁగా నిర్గుణోపాసకులని భావము. వారికి సంకల్పాదులక్కఱలేదు. చేయఁదగినవానిని గాలము తప్పక చేయుచుండిన నదియే యాభక్తులఁబోషించును. లోకమున నెవ్వరెవ్వరు సకాలమునఁ దారు పూనినకార్యముల నొనరింతురో వారు నిర్గుణోపాసకులనియే మన మెఱుంగవలయును. తరువాతి చరిత్రము నాలకింపుఁడు.

## కబంధుఁడు శ్రీరామునకు దారిచూపి తనలోకమున కరుగుట.

* ఇట్లు తెలిపి యాకబంధుఁడు మరల నర్థవంతముగా నిట్లు పలికెను. శ్రీరామా! ఇదిగో పడమటిదెస జంబూప్రముఖవృక్షసాంద్రవనము కనఁబడుచున్నది. చూడుము. ఇదియే

* ఇది డెబ్బదిమూఁడవసర్గమునఁ గలదు.

నీకు మేలుగల్గించుమార్గము. సుస్వాదుఫలము లందుఁగలవు. వాని భక్షించుచుఁ బోవఁగుదు. ఆవనము దాఁటఁగా మనోజ్ఞమగు వనాంతరము కనంబడును. సర్వర్తుఫలము లందుండును. అందుండి కొండలను వనములను గాంచుచుంబోయినఁ బంపాసరోవరము చేరఁగలవు. అది కమలాకరము. హంసలు లందుండును. అద్దాని పరిసరభాగములు సొంపైనవి. అనేకవిధమత్స్యము లందుండును. లక్ష్మణుఁడు వానిని బక్వము చేసి నీ కర్పింపఁగలఁడు. అందలి జలము నిర్మలము. స్వాదుతమము. దానింజూడఁగా నీమది యానందించును. అందుఁగల పూవులు వాడిపోవునవి కావు. అందున్నను సమాధినిష్ఠగల మతంగమహాముని శిష్యులుండిరి. వారి గురువునకు వన్యపదార్థములు కొనిపోవుచుండ వాని బరువుచే వారలసి పోయిరి. వారిదేహములనుండి చెమటబిందువులన్నియు వృక్షములపైఁబడి వారి తపశ్శక్తిచేఁ బుష్పములయ్యెను. వారెల్లరు దివంగతులైరి. వారలపరిచారిక శబరి చిరజీవిని యిప్పటికి నున్నది. ఆశబరి సర్వభూతనమస్కృతురాలగు నీదర్శనమున దివ్యపదము నొందఁగలదు. శ్రీరామచంద్రా! ఆపంపాపశ్చిమభాగమునఁ బోయిన శబర్యాశ్రమము కనఁబడును. అది రహస్యభూభాగమున నున్నది. ఆచోటునను మదగజములు లోనగునవి రాఁజాలవు. ఆవనమున దుఃఖము మాని విహరింపఁగలవు. ఆసరస్సుముందటనే ఋశ్యమూక మున్నది. అది యెక్కుటకుఁ గష్టముగనుండును. బ్రహ్మ మున్ను యీపర్వతమెక్కినమాత్రమునఁ బ్రఖ్యాతినొందునని యనుగ్రహించెను. ఆప్రఖ్యాతి యేదనఁగా నాకొండశిఖరమున శయనించినపురుషుఁ డేధనమును బడసినట్లు కలఁగాంచునో యది తప్పక వానికి లభిం

చును. మఱియొక్కవిశేషము కలదు. పాపాత్ములు దురాచారులు దాని నెక్కఁజాలరు. ఎవ్వఁడే నెక్కునేని నిదురఁబోవుతఱి రక్కసులు వానిం జంపుదురు. అందు మృగసందోహములు చరించుచు ధ్వనులు చేయఁగా వినఁబడును. అందొకగుహా గండశిలాచ్ఛాదితంబై యుండు. అది దుష్ప్రవేశము. దాని తూర్పుదిక్కున నొకమడుగు నిర్మలజలపూరిత మున్నది. సుగ్రీవుఁడు వానరచతుష్టయయుక్తుఁడై యందున్నవాఁడు. ఆకొండ కొమ్మునను దిరుగుచుండును. భూమియందును సంచరించును.

అని పలికి యాకబంధుఁడు శ్రీరామానుజ్ఞకై యించుక నిలిచెను. సోదరు లాతనింగాంచి నీవింకఁ బోవచ్చుననిరి. వాఁడు మీ కార్యసిద్ధికై యరుగుఁడు. అని పలికి వారియనుమతిం గైకొని పోయెను. మరల శ్రీరామునింగని ఋశ్యమూకమార్గమును జూపుచు సుగ్రీవునితో సఖ్యము తప్పక చేయుమా యని తెలిపి తనలోకమున కరిగెను. ఈభాగమున నధ్యాత్మ రామాయణమున విశేషములు లేవు.

## శబరి శ్రీరామలక్ష్మణులఁ బూజించి యూర్ధ్వలోకమున కరుగుట.

* రామలక్ష్మణు లాకబంధుఁడు చూపినమార్గమును బట్టి పోయిరి. వనములఁ గాంచుచు సుగ్రీవుని జూచువేడుకల నరిగిరి. పంపాసరోవర పశ్చిమభాగమును జేరి యందు సొంపుగా నున్న శబరి యాశ్రమమును గాంచిరి. దాని రామణీయక మచ్చెరువు గొలుపఁగా శబరియొద్దకుఁ బోయిరి. యోగసిద్ధి

* ఇది డెబ్బదినాల్గవసర్గమునందుఁ గలదు.

నొందియుండు నా శబరి వారలం గాంచఁగనే లేచి దోసిలొగ్గి రామచంద్రపాదారవిందములకు వందన మాచరించి మతిమంతుఁడగు సౌమిత్రిపాదములకు మ్రొక్కెను. యథావిధిగా వారల కర్ఘ్యపాద్యాచమనీయముల నర్పించెను. శ్రీరాముఁడు తీవ్రనియమముల వ్రతము లాచరించు నా సన్న్యాసిని గాంచి తపోధనురాలా! తపోవిఘ్నముల నెల్ల నీవు జయించితివి కదా. తపోవృద్ధి యగుచున్నదియే కదా. కోపాహారముల నిగ్రహించు కొనినదానవు కదా. నీవు చాంద్రాయణాది తపోవ్రతముల నాచరించితివా యేమి? నీమనస్సునకు సుఖము గలుగునుగదా. నీ గురుశుశ్రూష ఫలించినదే కదా. అని యడిగెను. వృద్ధురాలు తపస్విని సిద్ధురాలు నగు నా శబరి శ్రీరామునియెదుట నిలిచి నీదర్శనభాగ్యమున నాతపస్సిప్పుడు ఫలించినది. నాతపస్సెల్ల సఫలమే. నాగురువు లిప్పుడు పూజితులైరి. వారికి నేఁ జేసిన శుశ్రూషయు ఫలించినది. పరమపురుషా! దేవతలలో నుత్తముఁడవగు నిన్నుఁ బూజించుటం జేసి నాజన్మ మిప్పుడు సఫలమైనది. ఇంకఁ బరమపదము నాకు లభింపఁగలదు. అరివర్గహరా! నీ శీతలదృష్టిచే నాపాపములన్నియు నశింపఁ బావనాత్మిక నైతిని. నీప్రసాదమున నక్షయపుణ్యలోకముల నొందెద. నీ గురువులతో నేల పోలేదని యడుగుదువేమో. మతంగశిష్యులు నా కాచార్యులు. నీవు చిత్రకూటము చేరినపుడే విమానముల నెక్కి దివ్యలోకమునకుఁ బోయిరి. సర్వజ్ఞులు వారగుదురు. వారు నాతో శ్రీరాముఁడు నిన్నుఁ జూడ రాఁగలఁడు. అపుడు నీవు శ్రీరామలక్ష్మణుల నాతిథ్యముల నాకర్షింపవలయు. నీవా శ్రీరాముని గాంచి యాకారణమున నక్షయపుణ్యలోకముల నొందఁగలవనిరి. ఈ పంపాతీరమందుఁ

గలఫలములను ననస్యపదార్థములను మేలైనవానినిగా నేర్చి
కూర్చియున్న దాన. మంచిఫలములే యవి యగు. అనఁగా నది
హీనజాతిదైనను గురుప్రసాదమున జ్ఞానవంతురాలగుట సిద్ధ
రాలుగ నున్నందున నామెంగాంచి అమ్మా! కబంధునివలన
నీవార్త విన్నాను. ఆప్రభావమును జూప నీ కిష్టముండినఁ
జూడఁగోరెదను. అని శ్రీరాముఁ డనఁగా నే యాశబరి వారల
కాననమంతయుఁ జూపెను. శ్రీరామా! అంధకారబంధుర
ముగా నున్న యీవనముం జూడుము. ఇదియే మతంగవనము.
తత్త్వవేత్తలగు నాగురువులు మంత్రవేత్తల మంత్రములచేఁ
బవిత్రమగు తీర్థమును గావించిరి. దేవపూజాస్థానములు
ఎక్కడఁ గనుపట్టుచున్నవి. పడమటిభాగమున నున్నవి
చూచితివా. నాగురువులు జరాబాధచేఁ జేతులు వణఁకు
చుండఁగా వీనిని బూవులఁ బూజింతురు. వారి తపశ్శక్తి
నిప్పుడుగూడ నీ వేదులు ప్రకాశించుచునే యున్నవి. వారు
పోవఁజాలక యాకర్షింప సాగరసప్తక మిచ్చటికే వచ్చియున్నది.
చూచితివా. వారీసముద్రముల నేడింట స్నానము చేసి యారఁ
వేసిన నారచీరలు వారి శక్తిచే నిప్పటికి నెండకయున్నవి.
కాంచుమా. వారు కట్టిన యీ పూదండలు భక్తిభరమున
నర్పింపఁబడినవి కావుననే యిపుడు కూడ వాడక యున్నవి.
మహాత్మా! నీవీ వనమంతయుఁ జూచితివి. ఆకర్ణింపఁదగిన విషయ
ముల నాలకించితివి. ఇఁక నీయానతిం గైకొని యీ దేహమును
వదలఁ గోరెద. ఎవ్వరి దీయాశ్రమమో, నే నెవ్వరిసేవకు
రాలనో ఆత్మవేత్తలగు నామునులపాదమూలముల నొందఁ
గోరుచున్నాను.

ఆశబరి యీరీతిగా న్యాయ్యముగాఁ బలికిన మాటల నాలకించి యచ్చెరువంది యాసోదరు లానందించిరి. శ్రీరాముఁడంత నాశబరింగాంచి యామెయందుఁ గల గురుభక్తికి నానందించి భక్తురాలా! నీవు సద్భక్తి నన్నర్చించితివి. నీ కోరిక కనురూపములగు లోకముల కనుగుము. శ్రీరామువాక్యమిట్లు వినఁబడఁగనే మునివేషధారిణి యగు నాశబరి శ్రీరామచంద్రాజ్ఞనొంది యామహార్థమునందే తన జీర్ణశరీరమును వదలనెంచి యగ్నియందు వైచి యగ్నివలెఁ బ్రకాశించు శరీరము నొంది దివ్యలోకమునకుఁ జనెను. ఆమెశరీర మత్యంత తేజఃపుంజమా యనునట్లుండెను. మతంగమునిశిష్యు లెందు విహరించుచున్నారో ఆ పుణ్యస్థానమును జేరెను. ఆత్మసమాధి యోగబలమున నాచోటు చేరెను.

మహాశయులారా! ఈభాగమున ననేకవిషయములు విమర్శించి తెలిసికొనఁదగినవి కలవు. వానిని బరిశీలింతము.

"తౌ చ దృష్ట్వా తదా సిద్ధా సముత్థాయ కృతాంజలిః,
రామస్య పాదౌ జగ్రాహ లక్ష్మణస్య చ ధీమతః. ౬
పాద్యమాచమనీయం చ సర్వం ప్రాదాద్యథావిధి,
తామువాచ తతో రామశ్శ్రమణీం సంశితవ్రతాం. ౭
కచ్చిత్తే నిర్జితా విఘ్నాః కచ్చిత్తే వర్ధతే తపః,
కచ్చిత్తే నియతః క్రోధ ఆహారశ్చ తపోధనే. ౮
కచ్చిత్తే నియమాః ప్రాప్తాః కచ్చిత్తే మనసస్సుఖం,
కచ్చిత్తే గురుశుశ్రూషా సఫలా చారుభాషిణీ. ౯
రామేణ తాపసీ పృష్టా సా సిద్ధా సిద్ధసమ్మతా,
శశంస శబరీ వృద్ధా రామాయ ప్రత్యుపస్థితా. ౧౦

అద్య ప్రాప్తా తపస్సిద్ధిస్తవసందర్శనాన్మయా,
అద్య మే సఫలం తప్తం గురవశ్చ సుపూజితాః. ౧౧

అద్య మే సఫలం జన్మ స్వర్గశ్చైవ భవిష్యతి,
త్వయి దేవవరే రామ పూజితే పురుషర్షభ. ౧౨

చక్షుషా తవ సౌమ్యేన పూతాస్మి రఘునందన,
గమిష్యామ్యక్షయాంల్లోకాంస్త్వత్ప్రసాదాదరిందమ." ౧౩

అని మూలము. శబరివిషయ మిది. శ్రీరామలక్ష్మణులకు నమస్కరించి పూజించెను. ఆశబరింగని శ్రీరాముఁ డిట్లు ప్రశ్నించెను:—౧. తపోవిఘ్నముల జయించితివా? ౨. తపస్సు వృద్ధి నొందుచున్నదియా? ౩. కోపము నాహారమును నిగ్రహించితివా? ౪. చాంద్రాయణాది మహావ్రతముల నాచరించితివి కదా? ౫. మనస్సుఖము కలుగునుగదా? ౬. గురుశుశ్రూష సఫలమేకదా? అనునవి యాఱును శ్రీరాముని ప్రశ్నములు. శబరి సమాధాన మిట్లు:—౧. నీదర్శనమున నాతపస్సు ఫలించినది. ౨. నాతపస్సంతయు నేఁటికి సఫలమయ్యెను. ౩. గురువులు పూజితులైరి. ౪. వారికి నాచేసినశుశ్రూష సఫలమే యైనది. ౫. నాకు స్వర్గము లభింపఁగలదు. అనునివి శబరియుత్తరములు.

శ్రీరాముని ప్రశ్నములసార మేమి?

తపోవిఘ్నములను జయించితివి కదా? అనఁగాఁ జిత్తవిక్షేపహేతువులగు నరిషడ్వర్గములను శీతవాతాతపాదిద్వంద్వములను గెలిచితివి కదా యని యర్థము.

"జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః,
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః."

అను గీతావాక్యమురీతిగా నీయాత్మ నెట్టిదియే కదా యని భావము. ఈప్రశ్నముచే యోగ మభ్యసించితివా? యనియు, నయ్యది ఫలించినదా? యనియు రాముఁ డడిగెననియు, యోగము నభ్యసింపక తపస్సు ఫలింపదనియు, నాయుపకర్తుని భావమనియు మన మెఱుంగవలయును. తపస్సు వృద్ధినొందు చున్నది కదా. అను నొక ప్రశ్నము కలదు.

> "యుంజన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః,
> శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి."

అను నీగీతార్థము సఫలమైనదియా? యనియే ప్రశ్నార్థము. అనఁగా యోగాభ్యాసము సిద్ధింపఁగా ధ్యానమునందు నిలుకడ కలుగును. అదియే యోగాభ్యాసఫలము. అది సిద్ధించెనా? యని రాముఁ డడిగెను. బాహ్యపూజాదులయందుఁ గలయిచ్ఛ నశించి సమదర్శనత్వము సిద్ధించినదా? యని ప్రశ్నసారము. బాహ్యపూజాదులయందు విరక్తి కలుగవలయుననియు, ధ్యానముచే భగవంతు నారాధింపవలయుననియు మన మెఱుంగవలయును. కోపము నాపకరమును నిగ్రహించితివా? యనునది యొక ప్రశ్నము. ధ్యానయోగము సిద్ధించినను గోపమును జయించుట శక్యముగాని పని. అది దుష్కరకార్యము. ఆహారాభిలాషము నట్టిదే. ఆరెండింటిని జయించుట యనఁగాఁ గర్మాసక్తి వదలుట. అనఁగా సత్కర్మానుష్ఠానవిముఖత్వమని యర్థము కాదు. వానిఫలముల నాశింపక భగవదర్పణబుద్ధిచే వాని నాచరించుట యనియే వాస్తవార్థము. మహావ్రతము లను చాంద్రాయణాదికముల నాచరించితివా? అనునది ప్రశ్నము.

"తిథివృద్ధ్యా చరేత్పిండాన్ శుక్లే శిఖ్యండసమ్మితాన్,
ఏకైకం హ్రాసయేత్కృష్ణే పిండం చాంద్రాయణం చరన్." ౩౨౩
యాజ్ఞవల్క్యస్మృతి-ప్రాయశ్చిత్తకాండము.

"చాంద్రాయణాఖ్యం వ్రతం కుర్వన్ మయూరాండపరిమితాన్ పిండాన్ శుక్లే ఆపూర్యమాణపక్షే తిథివృద్ధ్యా చరేద్భక్షయేత్. యథా ప్రతిపత్ప్రభృతిషు చంద్రకళానామేకైకశో వృద్ధిరర్ధమాసే తద్వత్పిండానపి ప్రతిపద్యేకో ద్వితీయాయాం ద్వావిత్యేవమేకైకశో వర్ధయన్ భక్షయే ద్యావత్పౌర్ణమాసీ. తతః పంచదశ్యాం పంచదశగ్రాసాన్ భుక్త్వా,తతః కృష్ణ పక్షే చతుర్దశ ప్రతిపది ద్వితీయాయాం త్రయోదశేత్యేవమేకైకశో గ్రాసాన్ హ్రాసయన్ అమ్నియాద్యావచ్చతుర్దశీ. తతశ్చతుర్దశ్యామేకం గ్రాసం గ్రసిత్వా ఇందుక్షయేఽర్థాదుపవసేత్. తథా చ వసిష్ఠః—'ఏకైకం వర్ధయేత్పిండం శుక్లే కృష్ణే చ హ్రాసయేత్, ఇందుక్షయే న భుంజీత ఏష చాంద్రాయణో విధిః.' ఇతి చంద్రస్యాయనమివాయనం చరణం యస్మిన్కర్మణి హ్రాస వృద్ధిభ్యాం తచ్చాంద్రాయణం, సంజ్ఞాయాం దీర్ఘః." విజ్ఞానేశ్వరులు.

"యథా కథంచిత్పిండానాం చత్వారింశచ్ఛతద్వయం,
మాసేనైవోపభుంజీత చాంద్రాయణమథాపరం. ౩౨౪
కుర్యాత్త్రిషవణస్నాయీ కృచ్ఛ్రం చాంద్రాయణం తథా,
పవిత్రాణిజపేత్పిండాన్ గాయత్ర్యా చాభిమంత్రయేత్. ౩౨౫
అనాదిష్టేషు పాపేషు శుద్ధిశ్చాంద్రాయణేన తు,
ధర్మార్థం యశ్చరేదేతచ్చంద్రస్యైతి సలోకతాం." ౩౨౬ యాజ్ఞ.

అను స్మృతి చెప్పినట్లు చాంద్రాయణాది మహావ్రతములనాచరించితివా? యని రాముఁ డడిగెను. ఈ మొదలగు వ్రతములు దేహశోధనార్థము పాపపరిహారార్థమైనదియుఁ గామ్యమే యగును. ఈ వ్రతములనాచరించుట యేలననఁగా నాహారమునఁ

గల మహేచ్ఛ ఖండించి యాహారనియమ మేర్పడును. జితేం
ద్రియత్వమలవడుట కట్టివి పరీక్షలని మనమెఱుంగవలయును.
మనస్సుఖము కలుగుచున్నదా యనునది శ్రీరాముని ప్రశ్నము.

"ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖముత్తమం,
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూతమకల్మషం.
యుంజన్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః,
సుఖేన బ్రహ్మసంస్పర్శమత్యంతం సుఖమశ్నుతే."

అను గీతోక్తిప్రకారము మనస్సు విచంచలమై యున్నదికదా.
కాంక్షావిరహితమే కదా యని ప్రశ్నసారము. గురుశుశ్రూష
సఫలమేనా యనునది శ్రీరామప్రశ్నము. అనఁగా నీశుశ్రూష
వలన సంతుష్టులై నిన్ననుగ్రహించిరి కదా యని దాని
యర్థము.

"శివే రుష్టే గురుస్త్రాతా గురౌ రుష్టే న కశ్చన."

అను ప్రమాణము ననుసరించి మంత్రాధిదేవతా కోపగించినను
గురువు కాపాడఁగలఁడు. గురువు కోపగించిన మంత్రము పనికి
రాదని యర్థము. గురుభక్తి లేనివారికి నేమియు ఫలించదని
సారము.

## శబరి యొసఁగిన యుత్తరములు.

నీదర్శనమున నాతపస్సంతయు ఫలించినది. అనునవొకటి.
ఇదియే నాల్గు ప్రశ్నములకు నుత్తరము. ధ్యానఫలము ఇష్ట
దేవతాసాక్షాత్కారమే కదా. భగవంతుఁడవగు నీదర్శనము
నాకు లభించుటంజేసి నాతపస్సు సంపూర్ణముగ ఫలించినది.
నేఁటి కది ఫలించినది. అని శబరి పలికెను. గురువులు ప్రీతి
తులైరి. వారికి నాచేసిన శుశ్రూష సఫలమే యైనది. అనునది

శబరియుత్తరము. అనఁగా గురువులు నాశుశ్రూషచే సంతుష్టు లైరనుటకు వారిమార్గమునకు గమ్యస్థానమగు నీసందర్శనము నాకు లభించుటయే ఫలము. కనుక నిది నెఱవేఱినది. కాన నదియు ననఁగా గురువులు సంతుష్టులైరనునదియు సఫలమే అని భావము. స్వర్గము లభింపఁగలదు. "స్వర్గః బ్రహ్మలోకః" అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి. స్వర్గశబ్దమునకు నానార్థ ములు గలవు. దేవలోకము, స్వర్లోకము, ఊర్ధ్వలోకము సుఖాధారము అనునివి ముఖ్యములు. కావున నూర్ధ్వలో కము నాకు లభింపఁగలవని యామె పలికె ననవచ్చును. "దేవవరే విష్ణౌ. అనేన శబర్యాః పరమార్థజ్ఞానం వృత్త మితి సూచ్యతే" అని గోవిందరాజులు వ్రాసిరి. "దేవానాం వరః" అనుసమాసముచే విష్ణువే కాదు శంకరుఁడు బ్రహ్మయు నర్థము కావచ్చును. దేవవరుఁడవగు నీవు పూజింపఁబడి తివి. "సౌమ్యేన తవ చక్షుషా నిర్హేతుకకటాక్షేణ పూతాస్మి. అనేన పూర్వాఘవినాశ ఉక్తః. అరిందమేత్యనేన ఉత్తరాఘా శ్లేష ఉచ్యతే. త్వత్ప్రసాదాత్ ధాతుః ప్రసాదాన్మహిమాన మాత్మన ఇత్యుక్తత్వాదాచార్యప్రసాదోపబృంహితాత్త్వ త్ప్రసాదాత్ అక్షయాన్ లోకాన్ గమిష్యామి. పునరావృత్తి రహితం పరమపదం ప్రాప్స్యామీత్యర్థః." అని గోవింద రాజులు. "అక్షయాన్ లోకాన్ అపునరావృత్తికాన్ బ్రహ్మ లోకాన్" అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి. పూజ్యేషు బహు వచనమ్మనున్యాయము ననుసరించి కాని స్థానవిశేషసద్భావాద్బ హువచనమ్మనున్యాయము ననుసరించి కాని 'లోకాన్' అనుచో బహువచనమనియనవచ్చును. పునరావృత్తిరహితమగు బ్రహ్మ లోకమనఁగా, "పునరావృత్తిరహితం పరమపదం" అనఁగా

శబరియుత్తరము. అనఁగా గురువులు నాశుశ్రూషచే సంతుష్టులైరనుటకు వారిమార్గమునకు గమ్యస్థానమగు నీసందర్శనము నాకు లభించుటయే ఫలము. కనుక నిది నెఱవేఱినది. కాన నదియు ననఁగా గురువులు సంతుష్టులైరనునదియు సఫలమే అని భావము. స్వర్గము లభింపఁగలదు. "స్వర్గః బ్రహ్మలోకః" అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి. స్వర్గశబ్దమునకు నానార్థములు గలవు. దేవలోకము, స్వర్లోకము, ఊర్ధ్వలోకము సుఖాధారము అనునివి ముఖ్యములు. కావున నూర్ధ్వలోకము నాకు లభింపఁగలవని యామె పలికె ననవచ్చును. "దేవవరే విష్ణౌ. అనేన శబర్యాః పరమార్థజ్ఞానం వృత్తమితి సూచ్యతే" అని గోవిందరాజులు వ్రాసిరి. "దేవానాం వరః" అనుసమాసముచే విష్ణువే కాదు శంకరుఁడు బ్రహ్మయు నర్థము కావచ్చును. దేవవరుఁడవగు నీవు పూజింపఁబడితివి. "సౌమ్యేన తవ చక్షుషా నిర్హేతుకకటాక్షేణ పూతాస్మి. అనేన పూర్వాఘవినాశ ఉక్తః. అరిందమేత్యనేన ఉత్తరాఘాశ్లేష ఉచ్యతే. త్వత్ప్రసాదాత్ ధాతుః ప్రసాదాన్మహిమానమాత్మన ఇత్యుక్తత్వాదాచార్యప్రసాదోపబృంహితాత్త్వత్ప్రసాదాత్ అక్షయాన్ లోకాన్ గమిష్యామి. పునరావృత్తిరహితం పరమపదం ప్రాప్స్యామీత్యర్థః." అని గోవిందరాజులు. "అక్షయాన్ లోకాన్ అపునరావృత్తికాన్ బ్రహ్మలోకాన్" అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి. పూజ్యేషు బహువచనమ్మనున్యాయము ననుసరించి కాని స్థానవిశేషసద్భావాద్బహువచనమ్మనున్యాయము ననుసరించి కాని 'లోకాన్' అనుచో బహువచనమనియనవచ్చును. పునరావృత్తిరహితమగు బ్రహ్మలోకమనఁగా, "పునరావృత్తిరహితం పరమపదం" అనఁగా

లకు గృహములో సౌధములో హర్మ్యములో కుటీరము లో పటగృహములో ఆశ్రమములో కట్టించి యుండవలయు. ఎప్పు డెందఱు వత్తురో ముందే తెలిసి ప్రళయమునుక వచ్చిన వారి కెల్ల నివాసములు కల్పించి యుండవలయును. వచ్చు వారలకొఱకుఁ గట్టించియున్న యిండ్లలో నుండకున్నను ధూళి ప్రవేశింపక యుండునట్లు చేసి యుండవలయు. లేకున్నఁ జేటి కల నియమించి యలికి మ్రుగ్గులు పెట్టుచుండ నియమించి యుండవలయును. వారల కందఱకు నమృతము నిచ్చి త్రాగించి యుండవలయును. వైద్యులతోఁ బనిలేకుండ భగవంతుఁ డాజ్ఞాపించునట్లు బలవంతము చేసి యుండవలయును. శీత వాతాదులు కావలసినపు డవి పొడసూపునట్లు కట్టుదిట్టములు చేసి యుండవలయును. ఎందఱు సేవకు లుండవలయునో లెక్కింపవచ్చునుగాదు. వారిపనులు చక్కఁగా నున్నవా లేవా యని పరిశీలించువా రుండవలెను. వారియానందమునకుఁ గొఱంత లేక యుండఁజేసి యుండవలయు. అట్లు గాకున్న "తుడుము మొదలు దేవతార్చనమువఱకు" అన్నసామెత ప్రకారమాభగవంతుఁడే నడుము కట్టుకొని అన్ని రూపములఁ దానే సేవచేయుచున్నాఁడని యైనఁ బలుకవలెను. అట్టి పాడుమోక్షము నెవఁడు కోరును ? సీ! సీ! ఇసీ! ఇస్సీ! అదేటి మోక్షము? ఈ యర్థము సర్వథా అసంగత మనవలయునే కాని యనరాదు.

"న మోక్షో నభసః పృష్ఠే న పాతాళే న భూతలే,
సర్వాశాసంక్షయే చేతఃక్షయో మోక్ష ఇతి శ్రుతేః."

అని సాంఖ్యసారమున నున్నది. ఇది సారమేమనఁగా: మోక్ష మొకలోకము గాదు. అం దేవిహారమునను వా లేకుండదు. అది యొకలోకమని కల్పించుట పామరులను బోధపఱచుటకయి యే కాని వాస్తవము కాదు. భగవత్తత్త్వ మెఱింగి యనన్య యానందసుఖ మనుభవించుచు సర్వశరీరములు తానుగా నుండుటయే మోక్షము. మోక్షలోకమనుట మర్యాదార్థమని గ్రహింపవలయును.

శబరి యాయాశ్రమమునఁ జూపిన ప్రభావము లన్నియుఁ దపశ్శక్తిచే సాధ్యములే కాని యసాధ్యములు గావు. శరీరత్యాగమున కనుజ్ఞను గోరుట బ్రహ్మజ్ఞానముచేతనే యని యెఱుంగవలయును. ఆ యనంతరమునకే శ్రీరాముఁ డచ్చోటికిఁ బోయెనని కర్మసిద్ధాంతమున నెఱుంగనగును. భగ వంతుని దర్శించి శరీరమును వదలవలసిన నిర్బంధము శబరి పూర్వజన్మమున నొనరించిన కతన గురువులగు మునులు దివ్య దృష్టిచే శ్రీరామాగమనము నెఱింగి శబరిని నిలుపు నియ మించి వారరిగిరని యెఱుంగుట లెస్సగు. కొందఱు శబరి శ్రీరామునికొఱకు నానావనమునఁగల మంచిఫలములను గోసి సగము తాఁ దిని యందవి రుచ్యములని తోఁచినవానిని దెచ్చి రామున కిచ్చెననియు,

"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః."

అన్న న్యాయము ననుసరించి శ్రీరాముఁడు గ్రహించి భక్షించె ననియుఁ గొందఱు పలుకుదురు. రామాయణమునందు

"మయా తు వివిధం వన్యం సంచితం పురుషర్షభ,
తవార్థే పురుషవ్యాఘ్ర పంపాయా స్తీరసంభవమ్." ౧౭

అని యీసర్గమునందే కలదు.

"ఆచార్యోక్తిశ్రద్ధామాత్మనస్సూచయతి మయాత్వితి. తీరసంభవం వివిధం వన్యం సంచితమ్. వన్యశబ్దేన ఫలమూలాదిక ముచ్యతే. వివిధ మిత్యనేన ఫలమూలాదిభేద ఉచ్యతే. సంచితమిత్యనేన రామస్య చిత్రకూటాగమనాత్ ప్రభృతి సంపాదితత్వం ఆదరేణ గుప్తత్వం చ తత్తత్ఫలజాతీయమాధుర్యం పరీక్ష్య స్థాపితమితి సంప్రదాయః."

అని గోవిందరాజులు.

"ఏవముక్తా యతోఽహమతో మయా త్వదర్థం వన్యం సమ్యక్పరీక్ష్య, మాధుర్యయుక్తం సంచితమిత్యర్థః. తదుక్తం పాద్మే శబరీం ప్రస్తుత్య.— 'ప్రత్యుద్గమ్య ప్రణమ్యాథ నివేశ్య కుశవిష్టరే, పాదప్రక్షాళనం కృత్వా తత్తోయం పాపనాశనం. శిరసా ధార్య పీత్వా చ వన్యైః పుష్పైరథార్చయత్, ఫలాని చ సుపక్వాని మూలాని మధురాణి చ. స్వయమాస్వాద్య మాధుర్యం పరీక్ష్య పరిభక్ష్య చ, పశ్చాన్నివేశయామాస రాఘవాభ్యాం దృఢవ్రతా. ఫలాన్యాస్వాద్య కాకుత్స్థస్తస్యై ముక్తిం పరాం దదా'వితి."

అని తిలకవ్యాఖ్య.

వాల్మీకిమతము ననుసరించి రామాగమనమును బ్రతీక్షించుచు నేవేవి వన్యములలో మంచివస్తువులో వానిని దాఁచియుంచి శబరి రాఘవుల కర్పించెనని యున్నది. పాద్మము ననుసరించి తాను భక్షించి యాస్వాదించి మంచిమంచి ఫలములు నర్పించెనని యున్నది. ఈరెండును బరస్పర విరుద్ధములు కావా యని యడుగుదురేమో. కావు. సమన్వయముచేయుట

యెట్లన్న నాలకింపుఁడు. కొన్ని ఫలములు వాసనచూచి వాని గుణమును గనుఁగొనవచ్చును. కొన్నింటిని భక్షించి వాని గుణమును గనుఁగొనవచ్చును. శబరి మహాభక్తసంపన్నురాలు కావున శ్రీరామున కట్టిఫలములఁ బరీక్షించి యర్పించెనని భావము గ్రహింపవలయును. ఒక్క చెట్టుపండ్ల నొక్కదానిని భక్షించి స్థాలీపులాకన్యాయము ననుసరించి తక్కినపండ్లు మంచివని గుర్తించెను. ఒక్కచెట్టుపండ్ల నొక్కదానిఁ బరిమళమును బరికించి మంచివని తెలిసికొనెను. తాను భక్షించినది వాసన చూచినది కాక తక్కినవానినే శ్రీరామున కర్పించె నన్నఁ బరస్పర విరుద్ధము లేదు. ఒక్క పండును గొంతభాగము తాను దిని మిగిలినభాగ మర్పించెననుట సముచితము కాదు. ఆటవికులజాతికిఁ జేరినది గాన శబరి యుచ్ఛిష్టమనుదాని నెఱుంగక భక్తితో నిచ్చెననియు, భక్తినే పరీక్షించు శ్రీరాముఁ డవ్వానిని భక్షించెననియు నేల చెప్పఁగూడ దందురా యది యుక్తము కాదు. ఏల? అనఁగా; శబరి మహాత్ములసేవ నున్నది. తపోనిరతి కలది. యోగాభ్యాసము కలది. ఆమగురువులు బ్రహ్మర్షులు. స్మృతుల నెఱుంగనివారు కారు. సదాచారములయం దాఱితేఱినవారుగా నుందురు. వారికడఁ జిరకాలమున్న శబరి యింతమాత్రము తెలివి కలది గాదనుట యించుకయు న్యాయసమ్మతము కాదు. ఇది విచిత్రముగా హరికథలకు నుపయోగముగా నుండుటకుఁ గల్పింపఁబడినకథ గాని వేఱుగాదు. ఆకల్పనయందలి సారమేమనఁగా బాహ్యాచారముల భగవంతుఁడు సమ్మతింపఁడనియు, మనస్సునే సమ్మతించుననియు, భక్తి ప్రధానము కాని జాత్యాచారాదులు ప్రధానములు కావనియు, నేజాతివాఁడైనను భక్తిగా సమర్పించినది యమూ

ల్యమని గ్రహించుననియు నైయున్నది. అదియు మంచిదే యనవచ్చును. ఇఁక నధ్యాత్మరామాయణమునఁ గలవిశేషములఁ బరికింతము.

"తవ సందర్శనం రామ గురూనామపి మే నహి,
యోషిన్మూఢాఽప్రమేయాత్మన్ హీనజాతిసముద్భవా. ౧౭

తవ దాసస్య దాసానాం శతసంఖ్యోత్తరస్య వా,
దాసీత్వేనాధికారోఽస్తి కుతస్సాక్షాత్తవైవ హి. ౧౮

కథం రామాద్య మే దృష్టస్త్వం మనోవాగగోచరః,
స్తోతుం న జానే దేవేశ కిం కరోమి ప్రసీద మే.
౧౯

శ్రీరామ ఉవాచ:---

పుంస్త్వే స్త్రీత్వే విశేషో వా జాతినామాశ్రమాదయః,
న కారణం మద్భజనే భక్తిరేవ హి కారణం. ౨౦

యజ్ఞదానతపోభిర్వా వేదాధ్యయనకర్మభిః,
నైవ ద్రష్టుమహం శక్యో మద్భక్తివిముఖైస్సదా. ౨౧

తస్మాద్భామిని సంక్షేపాద్వక్ష్యేఽహం భక్తిసాధనం,
సతాం సంగతిరేవాత్ర సాధనం ప్రథమం స్మృతం. ౨౨

ద్వితీయం మత్కథాలాపస్తృతీయం మద్గుణే రతిం,
వ్యాఖ్యాతృత్వం మద్వచసాం చతుర్థం సాధనం భవేత్. ౨౩

ఆచార్యోపాసనం భద్రే మద్బుద్ధ్యాఽమాయయా సదా,
పంచమం పుణ్యశీలత్వం యమాదినియమాది చ. ౨౪

నిష్ఠా మత్పూజనే నిత్యం షష్ఠం సాధనమీరితం,
మమ మంత్రోపాసకత్వం సాంగం సప్తమముచ్యతే. ౨౫

మద్భక్తేష్వధికా పూజా సర్వభూతేషు మన్మతిః,
బాహ్యార్థేషు విరాగిత్వం శమాదిసహితం తథా. ౨౬

అష్టమం నవమం తత్త్వవిచారో మమ భామిని,
ఏవం నవవిధం భక్తేస్సాధనం యస్య కస్య వా. ౨౭

స్త్రియో వా పురుషస్యాపి తిర్యగ్యోనిగతస్య వా,
భక్తిస్సంజాయతే ప్రేమలక్షణా శుభలక్షణే. ౨౮

భక్తౌ సంజాతమాత్రాయాం మత్తత్త్వానుభవస్తదా,
మమానుభవసిద్ధస్య ముక్తిస్తత్రైవ జన్మని. ౨౯

స్యాత్తస్మాత్కారణం భక్తిర్మోక్షస్యేతి వినిశ్చితమ్,
ప్రథమం సాధనం యస్య భవేత్తస్య క్రమేణ తు. ౩౦

భవేత్సర్వం తతో భక్తిర్ముక్తిరేవ సునిశ్చితం,
యస్మాన్మద్భక్తియుక్తా త్వం తతోఽహం త్వాముపస్థితః. ౩౧

ఇతో మద్దర్శనాన్ముక్తిస్తవ నాస్త్యత్ర సంశయః,
యది జానాసి మే బ్రూహి సీతా కమలలోచనా. ౩౨

కుత్రాస్తే కేన వా నీతా ప్రియా మే ప్రియదర్శనా."

అరణ్యకాం. ౧౦-సర్గము.

దీనియం దనేకవిషయము లున్నవి. ప్రధానము స్త్రీపురుషాది భేదములను భగవంతుఁడు పాటింపఁడనియు, మనసుపాటవ మునే పాటించుననియు, బాహ్యాచారములు ప్రధానములు కావనియు, భక్తిమాత్రమే ప్రధానమనియుఁ దెలుపు. నాదర్శనమున ముక్తి గలుగు నన్ను భగవంతుఁడు నాభార్య నెవ రపహరించిరి? ఎందున్నది? తెలుపుమా. యని యడుగుట సర్వథా అసంగతముగాదా యని యడుగుదురేమో మాయా

మానుషత్వ మభినయించుటకే యనుటకన్న వేఱుసమాధా నము రాఁజాలదు. అది తృప్తికరమా యన్న నించుక సంశ యింపవలసియే యుండును. తరువాతికథను బరింతము.

## శ్రీరామలక్ష్మణులు పంపాసరస్సున కరుగుట.

* శబరి దివ్యలోకమునకుఁ బోయి నంత సౌమిత్రితో నాలోచించి యాయాశ్రమమహత్వమున కబ్బురంపడుచు నిఁక శుభములు సమీపించుచున్నవి కానఁ దన మనస్సు సంతోషము గలిగియున్నదని తెలుపుచు "లక్ష్మణా! శుభములు కలుగునేని యవి మునుపే మనస్సునకుఁ దోఁచును. అట్లు మిత్ర లాభాదిశుభములు మదిఁ దోఁచుచున్నవి. త్వరగఁ బోవుదము రమ్ము. పంపాసరస్సును నేత్రానందము గలుగఁజూతము. ఋశ్య మూక మాచెంతనే కదా యుండును. అందే కదా వాలిభయ మున సుగ్రీవుఁడుండును. ఆతనింజూడ మది త్వరపడుచున్నది." అని పలికెను. అంత వారిరువురు పంపాసరస్సునకుఁ బోయిరి. అది దూరమున రామునకుఁ గనఁబడెను. మునివరు లందుండిరి. సాంద్రారణ్య మద్దానిచెంత నుండెను. ఆసరస్సున ననేకజల విహంగములు సంతోషమున నుండెను. దానిచెంత మతంగ సరోవరముండెను. అందు స్నానముచేసి దానిచుట్టును గల మహావృక్షముల ననేకములం గాంచెను. అంత వారిరువురు పంపారణ్యమును జూచుచు నందలి జలపక్షుల ధ్వనుల నాలకిం చుచుఁ బోయిరి. చెంతకుం బోయిరి. అందుఁగల మహామహీ రుహముల శ్రీరాముఁడు కాంచెను. కమలములు లోనగు జలకుసుమములఁ జూచెను. సౌమిత్రితో "వత్సా! దీనిచెంతనే ఋశ్యమూకపర్వతమున్నదని కబంధుఁడు చెప్పెను. ఋక్షరజుఁ

---

* ఇది డెబ్బదియైదవయధ్యాయమునఁ గలదని యెఱుంగవలయును.

డను వనచరునికుమారుఁడు తోఁడుఁడు నగుసుగ్రీవుఁ డుం దున్నవాఁడు. నీవచటికేఁ బొమ్ము." అని పలికె నవల "నాయనా! రాజ్యము పోఁగొట్టుకొని దుఃఖముఁ బొందు సీతను గాంచుచు వానిని మఱచి యుంటిని. ఆసీతను వనిలో యెట్లు జీవించును? అని పలికెను. అంతఁ బమ్మునిఁగూడి యామహాపాపనాశనమున స్నానముగావింపఁబోయెను. త్రోవనబడి వెడలంగ మహారణ్య మధ్యభాగమునఁగల యాసరోవరమును దర్శించెను.

మహాశయులారా! ఈభాగమునఁ గలవిశేషములఁ బరిశీలింతము.

"ప్రణష్టమశుభం తత్తత్కల్యాణం సముపస్థితం,
తేన తత్త్వేన హృష్టం మే మనో లక్ష్మణ సంప్రతి. ౫
హృదయేహి నరవ్యాఘ్ర శుభమావిర్భవిష్యతి,
తదాగచ్ఛ గమిష్యామి పంపాం తాం ప్రియదర్శనాం." ౬

అని మూలము. తీర్థములను దర్శించినందున నశుభము పోయి నది. శుభ మాసన్నమైనది. కనుకనే నామనస్సు శుభఫలముల ననుభవింపఁదగినదిగా నున్నదని రాముఁడు పలికెను. ప్రాయిక ముగా నెల్లరమనస్సులు భావిఫలముల ననుభవింపఁదగినట్లుం డును. దుష్ఫలానుభవము కానున్నయెడల ముందే మనస్సు మలినముగానుండును. సత్ఫలానుభవము కానున్నయెడల నిర్మ లములుగా నుండును. దానింబట్టియే భావిఫలము లెట్టివని మనము నిర్ణయించుకొనవచ్చును. "ప్రాయస్సమాపన్నవిపత్తి కాలే ధియోఽపి పుంసాం మలినా భవంతి" అను న్యాయము నకు నాధారణము రామాయణమే యని తోఁచుచున్నది. "సతాం హి సందేహపదేషు వస్తుషు ప్రమాణమంతఃకరణ ప్రవృత్తయః" అని కాళిదాసవచనము కలదు కదా. అట్టి

శ్రీరాముఁడు సౌమిత్రింగూడి పంపాసరస్సునుఁ జేరెను. ఇట్టు
లీయారణ్యకాండమును వాల్మీకిమహాముని విశేషార్థోపబృం
హితముగఁ బూర్తినొందించెను. ఇందుఁ బరమపురుషుఁడు
శ్రీరాముఁడు మహాప్రకృతియగుసీతాదేవింగూడి వనములవిహ
రించుటయు, రక్కసు లెవ్వరెవ్వరికిఁ గాలమాసన్నమైనదో
సకారణముగా వారలకు మరణరూపశిక్ష విధించి పవిత్రు
లనుగా నొనరించుటయు, సీతాపహరణరూపమున మానవ
ప్రవృత్తి నభినయించుచుఁ దక్కుంగలమానవులకు సత్ప్ర
వృత్తి నేర్పుటయు, ననేకులకు శాపవిముక్తి మూలమున
నుత్తమలోకములు ప్రసాదించుటయు నీమొదలగు విషయము
లనేకములు గలవు. రామాయణము పారాయణముచేయు
నపుడు విశేషవిషయము లేవి యని యూహింపక కథ బాగు
న్నదనుకొనుచు రావణాదులను దిట్టుచుండినచో దానిఫలము
నిష్ఫలమే యగును. భగవంతునిచర్య లెట్టివని విమర్శించుచు
రావణాదులు కూడ భగవత్కార్యమునకు నొకరీతిగాఁ దోడు
పడి దుష్కార్యములు చేయకుండుట కుదాహరణభూతులైరని
యూహించుచు భగవత్తత్త్వమును శక్తికనురూపముగా
గ్రహించుచుఁ గథను బఠించిన నది యుత్తమఫలము నొం
దును. నీతులకు సత్ప్రవృత్తికి భక్తికి నీకాండము మహోపకారక
మగుట నిస్సందేహము. భేదబుద్ధిగలిగి భగవదవతారములలోఁ
గొన్నింటిని దూషించు కపటాత్ముల కిది కంఠపాశమే యగు
ననవచ్చును. శ్రీరాముఁడు దుఃఖించుట నటనముగాదనియు,
వాస్తవమే యనియు భావించువారల కీరామాయణ మిసు
మంతయు నుపకారకము గాదనుట సిద్ధాంతము. భగవదా
రాధనముకంటె నాచార్యారాధనము ముఖ్యమనుకృత్రిములు

భక్తులు కాఁజాలరు. అట్టి నీచవిషయములు పామరులకు నుపదేశించి ధనము సంపాదించువారలకు మానవజన్మము మాత్రము రాఁబోదు. జన్మరాహిత్యమగు ననుకొందురేమో యంతకంటెఁ బొరపాటు వేఱొకఁ డుండదు. కావున భగవత్తత్త్వము నారాధించు మార్గమునకు నిష్కళంకకరణము, భేదభావము లేకుండుటయుఁ బ్రధానోపకరణములు. అవి లేనిచో భగవదనుగ్రహమును బడయఁజాలరని మూఁడు సారులు గట్టిగాఁ జెప్పవచ్చును. మహాశయులారా! భగవంతుని మానవుఁ డేరూపనామములు గలవానినిగా భావించి భక్తిచే నేమార్గమున నారాధించినను బ్రసన్నుఁడై యతనిఁ దరింపఁజేయునను సిద్ధాంతమును గదలింపఁ బ్రహ్మకుఁగూడఁ దరముగాదు. ఈకాండమును ముగించుచు శ్రీరామస్తవమును జేయుదము.

"నిత్యం శ్రీరామమంత్రం నిరుపమమధికం నీతిసుజ్ఞానమంత్రం
సత్యం శ్రీరామమంత్రం సదమలహృదయే సర్వదారోగ్యమంత్రం,
స్తుత్యం శ్రీరామమంత్రం సులలితసుమనస్సౌఖ్యసౌభాగ్యమంత్రం
సర్వం శ్రీరామమంత్రం పవనజవరదం పాతు మాం రామమంత్రం.
రామచంద్ర దయాసాంద్ర రఘువీర నృపోత్తమ,
లోచనాభ్యాం కృపాపూరపూర్ణాభ్యాం మాం విలోకయ."

మాయామానవతత్త్వప్రదర్శనమను నేడవప్రకరణము సంపూర్ణము.

అరణ్యకాండము సమాప్తము.

శ్రీ. శ్రీ. శ్రీ.

చెన్నపురి : శ్రీ 'రామ' ముద్రణాలయమున ముద్రితము:—1934—1000.

# వి ష య సూ చి క.

విషయము. | పుట.

శ్రీః

# శ్రీరామావతారతత్త్వము

## కిష్కింధాకాండము.

### అష్టమప్రకరణము.

శ్లో. సకలభువనరత్నం సర్వశాస్త్రార్థరత్నం
సమరవిజయరత్నం సచ్చిదానందరత్నం,
దశముఖహరరత్నం దానవారాతిరత్నం
రఘుకులనృపరత్నం పాతు మాం రామరత్నమ్. ౧

రామాభిరామం నయనాభిరామం వాచాభిరామం వదనాభిరామం,
సర్వాభిరామం చ సదాభిరామం వందే సదా దాశరథిం చ రామమ్. ౨

జయజయ రఘురామ శ్రీముఖాంభోజభానో
జయజయ రఘువీర శ్రీమదంభోజనేత్ర,
జయజయ రఘునాథ శ్రీకరాభ్యర్చితాంఘ్రే
జయజయ రఘువర్య శ్రీశ కారుణ్యసింధో. ౩

శ్రీరామేత్యేకదా వక్తుం మనో యస్య ప్రవర్తతే,
వైకుంఠవాసినస్తస్య కులమేకోత్తరం శతమ్. ౪

శత్రుచ్ఛేదైకమంత్రం సరసముపనిషద్వాక్యసంపూజ్యమంత్రం
సంసారోత్తారమంత్రం సముచితసమయే సంగనిర్యాణమంత్రం,
సర్వైశ్వర్యైకమంత్రం వ్యసనభుజగసందష్టసంత్రాణమంత్రం
జిహ్వే శ్రీరామమంత్రం జపజప సఫలం జన్మసాఫల్యమంత్రమ్. ౫

విజ్ఞానధనులారా! నిష్పక్షపాతమతులారా!

శ్రీరామావతారతత్త్వమునందు సప్తమప్రకరణమును జక్కఁగాఁ జదివియుందురు. అందుఁ గల భగవత్కార్యవిశేషములం గనుఁగొని యానందించియే యుందురు. శ్రీరామచంద్రుఁడు మాయామానుషుఁడని మీమనస్సులకుఁ దట్టియుండు ననుట నిక్కము. రావణుఁడు మారీచునికడ కేగి యతని హితమును బాటింపక శ్రీరామునిమహత్త్వము నెఱింగియు దానిని లెక్కింపక వానిని శ్రీరామాశ్రమమునకు సాగనంపి తన్మూలమున శ్రీరామలక్ష్మణుల నాశ్రమమున లేకుండఁజేసి సీతాదేవి సంభాషణముల కలరియు నామెను జేకొని జటాయువుం బడఁగొట్టి లంక కరుగుటయు, నామె నం దశోకవనమున నునిచి రాక్షసస్త్రీలను గాఁపుంచుటయు, శ్రీరామమూర్తి మారీచుని వధించి యాశ్రమమునకుఁ దమ్ముని గూడివచ్చి సీతఁగానక వగచుచు జటాయువునకు సత్పదము ననుగ్రహించి కబంధుని వధియించి శబరిపూజలం గైకొని యామె ననుగ్రహించి పంపాసరస్సున కరుగుట యనునీకథలం బఠియించి తత్తద్విశేషార్థములఁ జక్కఁగా విమర్శించియే యుందురు. దానం జేసి మాయామానవత్వప్రదర్శనము తేటపడియెఁగదా. ఆశ్రితత్రాణవిషయమున శ్రీరాముఁ డెట్టిపరాయణత్వమును వహించెనో యీప్రకరణమున స్పష్టమయ్యెంగదా. రావణుఁడు సీతావచనముల కెట్టి యర్థముగలమాటలచే బదులు చెప్పెనో మీ రెఱింగితిరి. ఆతనిచిత్తవృత్తి యెట్టిదై యుండు నదియు మీ యూహలకుఁ దగిలియే యుండును. ఇట్టి భాగములయందు మూలమునుండి యీయర్థమును గ్రహింపవలసియుండునని వ్రాసిన విశేషార్థములను నిష్పక్షపాతమతి మీరు విమర్శించి

యుందు రనుకొనియెదను. మతతత్త్వ మెద్ది యని విమర్శింపఁ జాలక దానిం దూలనాడు స్వర్ణాకర్షణభైరవోపాసకుల యూహాలు సత్యేతరములని మీకుఁ దోఁచియే యుండును. నీటిపై భాగమువలె భక్తి యుండవలయునుగాని తన యిష్టదైవము గాని దేవతలయందు నైచ్యమారోపించి తద్భక్తులను దూలనాడరాదు.

"సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. ౨౯
యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి. ౩౦
సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే." ౩౧

గీత. ౬-అధ్యా.

అను శ్రీగీతావాక్యములను బరికించినచో నితరుల యిష్టదేవతలకుఁ దనయిష్టదేవతకు భేదమునుగల్పింప నవకాశ మెట్లొదవును? భగవంతుఁడే సర్వరూపముల నెల్లయెడల నిండియుండఁగాఁ దద్భిన్నమగునది యేదియు లేదనియే భక్తుఁడు చూడవలయును. లేనిచో నాతఁడు భక్తుఁడే కాకపోవును. భక్తి యనునది జ్ఞానవైరాగ్యసత్కర్మానుష్ఠానఫలరూపముగాని వానిని వదలియుండఁజాలదు. వాని సమష్టిరూపమే భక్తి. అహంకారశూన్యత్వమే భక్తికి ఫలము. నేను గర్తను. అనుభావము నశించినఁగాని భక్తి ఫలవంతము గానేరదు. కనుక భక్తుని లక్షణము సమదర్శనత్వమే. భిన్నదర్శనత్వము పామరలక్షణము. "ఒక్కరూపముననే భగవంతుఁ డుండును. ఒక్క నామమే యతనికిష్టము. ఒక్కలోకమునందే యతఁడుండును.

కొన్నిచిహ్నములే యతనికిం బ్రీతిని గల్గించును. అవి లేనిచో నెట్టివానినైన నతఁ డంగీకరింపఁడు" అను నీపలుకులు స్వల్ప బుద్ధులకు సమ్మతములేగాని మహాత్ములు జగత్కుటుంబులు నగువారికి సమ్మతములు కాఁజాలవు. బాహ్యచిహ్నములను బ్రేమించువారు పామరులు. అవి లేకున్న భగవంతుని కృప గలుగదేమో యనుభీతి వారలకు నుండును. ఏల ? సాపాటు రామన్నలు గురువులయి యుపదేశించుటంజేసి యాంభీతి వారలమనస్సులయందు నాటుకొన్నది. అట్లుగాక భక్తున కే రూపనామచిహ్నము లిష్టములో వానిని గలవానినిగా నిష్ట దైవమును భావించి యారాధింపవలయు నని గురువు లుపదే శించియున్న నిట్టిదుష్టవర్తనము వారల కలవడియే యుండదు. శిష్యవిత్తాపహారకులగు గురువులు పెక్కండ్రు ప్రబలుటం జేసియు శిష్యహృత్తాపహారకులు విరళముగ నుండుటం జేసియు నిట్టి యుపద్రవములు తఱచుగాఁ గల్గుచుండును. ఆ యుపద్రవములే లేనియెడల భక్తి యెంత నిర్మలముగా నుండునో వేఱుగాఁ జెప్పవలయునా ?

## అవైదికమతములు.

ఇప్పట్టున నొక్కవిషయము స్మృతిగోచర మగుచున్నది. దాని వదలుట న్యాయ్యము గాదని తోఁచెను. కాన వ్రాయు చున్నాను. ద్వైతము, విశిష్టాద్వైతము, అద్వైతము ననునీ మూఁడు మాత్రమే వైదికమతములు. అనఁగా వేదసమ్మతము లవి. తక్కినవి కావు. ఏలయనఁగా నవి వేదములు పౌరు షేయము లనునవి. అను నీవాదము క్రొత్తదికాదు. వైదికము లనఁబడు మూఁడుమతములయందును దన్మతావలంబకులు

కొందఱు స్వేతరమత మవైదికమనువారు బయలుదేఱిరి. వారి దృష్టి యెంత యల్పమో మన మూహింపఁజాలము. వారి వాదము నిస్సారమగుట మాత్రమే కాక దుస్సారమగుట దానిని మనము స్పృశింపఁ దలంపరాదు. దూరదృష్టి మనకుం గలదేని సర్వమతములు వైదికములే యనవలయును. ఎట్లనఁగా యోజింతము. భగవంతుఁ డొక్కఁడని, సర్వమున నతఁ డున్నాఁడని, తద్భిన్నమగున దేదియు లేదని సర్వమతము లంగీకరించును. ఉపనిషత్తులసార మిదిగాక వేఱేమున్నది? కాదన్నచో సర్వాంతర్యామిత్వాదిలక్షణము లెగిరిపోవును. కావున సర్వమతములు వేదసమ్మతములే యనవలయును. ఏల మనవా రట్లు వానిని భావింపలేదు? అని యడుగుదురేమో. వేదోక్తకర్మానుష్ఠానమున నామతస్థులకు వీరికిని భేదము గలదు. దానిచేత వా రట్లు భావించిరి. ప్రధానసిద్ధాంతముల యం దన్నియు సమానత నంగీకరించుచున్నవి. మోక్షవిషయమునఁ గొంతభేదము కలదు. అతీంద్రియవిషయములందు మానవబుద్ధి యొకసిద్ధాంతమును దెలుపఁజాలదని కొందఱు తెలిపిరి. అది యయుక్త మనరాదు. పరికింపఁగా నొక్కొక్క మానవస్థితి కొక్కొక్కమతము తోడుపడుచున్నది. అద్వైతము జ్ఞానపర్వతశిఖరమువంటిది. అది యెల్లరకు సాధ్యము కాదు. తక్కినవన్నియు బహుజనానుష్ఠేయములు కావచ్చును. లోకమున ముక్తిసామ్రాజ్యమునకుఁ దగినవారు పెక్కండ్రుండరు. భేదబుద్ధిగలవారల కొక్కమతము పనికివచ్చును. అది విశేషించి లేక భగవంతునే నమ్మిన మనకష్టము లన్నియు నతఁడే తీర్చుననుకొనువారి కొక్క మత ముపకరించును. ఆ స్థితిని మించినవారలకే యద్వైత ముపకరించును. కావుననే

దాని కర్థములు కొలఁదిగ నుండురు. మతమనఁగా నుత్తమస్థితికి మానవునిఁ దెచ్చు సాధన మనవలయును. ఉత్తమము, ఉత్తమోత్తమము, అత్యుత్తమము ననుస్థితులు సమానములు కావు. ఏదాని నాశ్రయింప నర్హు లెవ్వరో వారి కామతము పనికివచ్చును. ఇతరుల కది యసంగతముగాఁ గనంబడును. వార లద్దాని నాక్షేపించుట సహజమే. దానికి బెదరుట పాడి గాదు. దూరదృష్టిగల మహనీయులు మతములన్నియు మానవు నున్నతస్థితికిఁ దేఁ బ్రయత్నించు సోపానములవంటి వనియు వారివారి యోగ్యతల ననుసరించి యందందు మెలఁగుదురనియు భావింతురు. కావున మతములెల్ల వైదిక ములే యనవలయును. వేదములను దూషించువారు దాని తత్త్వము నెఱుంగనివారే యని మన మూహించినచో వారిపై నాగ్రహించు నవకాశమే యుండదు. ఆయవకాశమే లేదేని యంతకంటె మహానంద మేదియు నుండదు.

మతములన్న పేరునఁ బామరులు పరస్పరము దూషించు కొను నాచారము ప్రబలుచున్నది. అయ్యది భగవంతుని యనుగ్రహమునకు మనల దూరముచేయుచు నుండును అది తొలంగినఁగాని సర్వజనకుఁ డగుపరాత్పరుఁడు మనల ననుగ్రహింపఁడు. మతసిద్ధాంతసారము తెలిసినవా రెవ్వరుగాని పరమతమును దూషింపఁ బూనరని నా విశ్వాసము. అందుఁ గొంతభాగమున నే లవమో తెలిసినవారే కంఠమును యించి దూఱుచుందురు. వారలకు బదులు చెప్పఁబూనిన దఱు వారితోఁ గలహించుచుందురు. ఇరువురు నొక్క రీతివారే యనవచ్చుం గదా. కనుక నట్టివారితో ననవరతము చర్చింపక మౌనమూనుట యత్యుత్తమకార్యము.

## చిహ్నములు.

ఊర్ధ్వపుండ్రాదులే ప్రధానములనియు నవి లేకయున్న దేవతానుగ్రహము కల్గదనియుఁ గొందఱు ఘోషింతురు. "సమస్తేష్వేషు భూతేషు న లింగం ధర్మకారణమ్" అని మను స్మృతి తెల్పుచున్నది. బాహ్యచిహ్నములు ప్రధానములే కావు. కేవల పామరులకవి యుపయోగించును. గుహాంతరాళ ములనుండి భగవంతు నుపాసించువారలకు వేలసంవత్సర ములు గతించును. ఐహికస్మృతియే వారలకు నుండదు. అట్టి వారికి సకాలస్నానాదులు లేవే యనవచ్చునా? తొలుదొలుత బాహ్యచిహ్నములు కొంత యావశ్యకములై తోఁచినను బిదప నితరులకు మార్గదర్శకములని ధరింపఁదగినవియే యయి యుండును. ఊర్ధ్వపుండ్రము ధరించినఁగాని విష్ణువుకృపకుఁ బాత్రుఁడు కాఁడనువారును, త్రిపుండ్రము ధరించినఁగాని శివానుగ్రహపాత్రుఁడు కాఁడనువారును మూఢాగ్రేసరులే యనవలయును. ఈ నెపమున నుపన్యాసవేదికలయందుఁ గోలాహలము గలిగించుట ధనార్థమేకాని వేఱుగాదు. శివ విష్ణ్వాదులు భగవంతునంశములుగాని పరతత్త్వ మిందెవ్వ రును గాఁజాలరు. ఇట్టులుండఁగా విష్ణుపాదభక్తుఁడు శివుఁ డనియు, శివభక్తులకు మోక్షము కలుగదనియుఁ గేవల విష్ణు భక్తులకే నది కరతలామలకమనియు వాదించువా రిఁకెంత పామరులో వచింప శక్యమే కాదు. మధ్యవైష్ణవులు కొంద ఱీవిషయమున బద్ధకంకణులు. అద్వైతమతోద్ధారకుఁ డగు శంకరభగవత్పాదాచార్యులు విష్ణుసహస్రనామములకు భా ష్యము వ్రాయుటచేతనే వారు విష్ణుభక్తులని వారి యాశయము. ఇంతకంటెఁ దెలివితక్కువ యేమియే నుండ

నవకాశము కలదా? తన యిష్ట దైవమగు శివుని సహస్రనామ ములకు భాష్యమేల వ్రాయలేదని వారి ప్రశ్నము. ఇంత కంటెఁ గుప్రశ్నము వేఱొకటి లేదనవలయును. వారి కిష్ట దైవమనఁగా వీరివలె వారు పాషండులుగారు. సర్వసముఁడు. శివవిష్ణ్వాదిభేదములు వారికి లేవు. విష్ణుశబ్దమునకు సర్వ వ్యాపకుఁడనియే యర్థము. వైకుంఠలోకేశ్వరుఁ డగు విష్ణు నామధారియని కాదు. ఈ విషయమును బరికింపుఁడు.

"కి మేకం దైవతం లోకే కిం వాప్యేకం పరాయణం,
కం స్తువంతః కమర్చంతః ప్రాప్నుయుర్మానవాశ్శుభం. ౨
కో ధర్మస్సర్వధర్మాణాం భవతః పరమో మతః,
కిం జపన్ ముచ్యతే జంతుర్మృత్యుసంసారబంధనాత్." 3

అని భీష్ముని ధర్మరాజు ప్రశ్నించెను.

"జగత్ప్రభుం దేవదేవమనంతం పురుషోత్తమం,
స్తువన్నామసహస్రేణ పురుషస్సతతోత్థితః."

అని ప్రారంభించి భీష్ముఁడు సహస్రనామములఁ దెల్పెను.

ఆ ధర్మరాజే

"త్వయాపగేయ నామాని శ్రుతానీహ జగత్పతే,
పితామహేశాయ విభో నామాన్యాచక్ష్వ శంభవే." ౧

అని భీష్ముని బ్రశ్నించెను.

"అశక్తోఽహం గుణాన్వక్తుం మహాదేవస్య ధీమతః,
యో హి సర్వగతో దేవో న చ సర్వత్ర దృశ్యతే. 3
బ్రహ్మా విష్ణు సురేశానాం స్రష్టా చ ప్రభురేవ చ,
బ్రహ్మాదయః పిశాచాంతా యం హి దేవా ఉపాసతే. ४

... ... ... ... ...

కోహి శక్తో భవం జ్ఞాతుం మద్విధః పరమేశ్వరం. ౮
ఋతే నారాయణాత్పుత్ర శంఖచక్రగదాధరాత్,
ఏష విద్వాన్ గుణశ్రేష్ఠో విష్ణుః పరమదుర్జయః. ౯
దివ్యచక్షుర్మహాతేజా వీక్ష్యతే యోగచక్షుషా,
రుద్రభక్త్యా తు కృష్ణేన జగద్వ్యాప్తం మహాత్మనా." ౧౦

అను మొదలగు వాక్యములను భీష్ముఁడు తెలిపెను. విష్ణు సహస్రనామములను దెలిపిన భీష్ముండు శివసహస్రనామములఁ దెలుపునధికారము నాకు లేదనియె. అంతియగాక రుద్ర భక్తుఁడగు శ్రీకృష్ణమూర్తియే వానిని దెలుప నధికారియని యుఁ దెలిపెను. మఱియు నాభీష్ముఁడే

"సురాసురగురో దేవ విష్ణో త్వం వక్తుమర్హసి,
శివాయ విష్ణురూపాయ యదపృచ్ఛద్యుధిష్ఠిరః. ౧౮

... ... ... ... ...

ఏవముక్త్వా తు భగవాన్ గుణాంస్తస్య మహాత్మనః,
ఉపస్పృశ్య శుచిర్భూత్వా కథయామాస ధీమతః." ౨౫

వాసుదేవః:—

"త్వం చాపగేయ నామాని శృణుష్వేహ కపర్దినే. ౨౯
యదవాప్తం మయా పూర్వం సాంబహేతోస్సుదుష్కరం,

... ... ... ... ...

నమోఽస్తు తే శాశ్వతపుణ్యయోనే
బ్రహ్మాధిపం త్వామృషయో వదంతి,
త్వామేవ నారాయణశబ్దసంజ్ఞం
నరం చ సత్త్వం ప్రవదంతి సంతః." ౪౧౨

అనుశాసనికపర్వము. ౧౪-అధ్యా.

శ్రీకృష్ణుఁడే శివసహస్రనామములు చెప్పుట యేల ? భీష్ముఁడప్పనికిఁ దాఁ జాల ననుటయేల? శివుని వరములవలన మహిమముగలవాఁడ నైతినని శ్రీకృష్ణుఁడే యేల చెప్పవలెను ?

"యదా పుమాన్నస్వాంగేషు శిరఃపాణ్యాదిషు క్వచిత్,
పారక్య బుద్ధిం కురుత ఏవం భూతేషు మత్పరః. ౫౩
త్రయాణామేకభావానాం యో న పశ్యతివై భిదాం,
సర్వభూతాత్మనాం బ్రహ్మన్ స శాంతి మధిగచ్ఛతి." ౫౪

శ్రీభాగ. ४-స్కం. ౭-అధ్యా.

"ప్రకాశం చాప్రకాశం చ జంగమం స్థావరం చ యత్,
విశ్వరూపమిదం సర్వం రుద్రనారాయణాత్మకం. ౨౦
త్వం చ మే హృదయం విష్ణో తవ చాహం హృది స్థితః,
భవాన్ సర్వస్య కార్యస్య కర్తాహమధిదైవతం. ౨౫
త దేహి స్వస్తి తే వత్స గమిష్యామ్యంబుదప్రభ,
ఏవముక్త్వా గతో విష్ణో ర్దేవోఽంతర్ధానమీశ్వరః." ౨౬

వాయుపురాణము. ౨౫-అధ్యా.

"న తే మయ్యచ్యుతేఽజే చ భిదామణ్వపి చక్షతే,
నాత్మనశ్చ పరస్యాపి తద్యుష్మాన్వయమీమహి." ౨౧

శ్రీభా. ౧౨-స్కం. ౧౦-అధ్యా.

"ధర్మే దృఢత్వం యుధి శత్రుఘాతం యశస్తథాగ్ర్యం పరమం బలంచ,
యోగం ప్రియత్వం తవ సన్నికర్షం వృణే సుతానాంచ శతం శతాని."

ఆనుశాసనికపర్వము. ౧౫-అధ్యా.

"స ఏష రుద్రభక్తశ్చ కేశవో రుద్రసంభవః,
సర్వరూపం భవం జ్ఞాత్వా లింగమర్చయతి ప్రభుః." ౯౭

ద్రోణ. ౨౦౨-అధ్యా.

ఈ భాగవతమహాభారతాదిప్రమాణములను బరికించిచూడఁగా విష్ణువు శివలింగపూజాతత్పరుఁడని శివభక్తవర్యుఁడని స్పష్టమే యగు. ఇట్లే శివుఁడు విష్ణుభక్తుఁడనియుఁ దేలును. ఇట్లు విరుద్ధములుగాఁ బ్రమాణము లుండనేల యని ప్రశ్నించువా రుందురు. దీనిసార మిదియని వారు గ్రహింపవలయును. ఒక్కరిని వేఱొక్కరుగా శివకేశవులు నుతించుట మేమిరువురము భగవదంశము గలవారమే. ఉపాస్యమా తత్త్వమే. అదియే పరతత్త్వ మనంబడును. భేదబుద్ధి మాయందుఁ గలవారే పామరులని పాషండులనియుఁ జెప్పఁబడుదురు. మాయిరువురకు భేదము లేదు గాన మాలో నెవరి నారాధించినను సమానమే. మాయందు భేదమును గల్పించువారు ముక్తులు కాఁజాలరు. అనియే కదా సారము. ఈవిషయమునకు శ్రీ శంకరభగవత్పాదు లుదాహరణభూతులు. వాసుదేవుఁడన్నను శంకరుఁడన్నను సమముగా భావించువారు గనుకనే భక్తానుగ్రహార్థము విష్ణుసహస్రనామములకు భాష్యము వ్రాసిరి.

"నారాయణః పరోఽవ్యక్తా దండమవ్యక్తసంభవమ్,
అండస్యాంతస్త్విమే లోకా స్సప్తద్వీపా చ మేదినీ."

అను భగవద్గీతాదియందలి శంకరాచార్య కృతస్తుతిఁ గాంచి మధ్వవైష్ణవులు కొందఱు బుజము లప్పళించుచు శంకరాచార్యులు విష్ణుభక్తులని ప్రలపింతురు. నారాయణశబ్దము శివపరమన్నఁ గాదనువాఁడు పశుప్రాయుఁడే కావలయును. విష్ణువునందు రూఢమందురేమో ఆపక్షమున

"ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయంత్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా."

అన్న భగవద్గీతావాక్యమునందుఁ గల "ఈశ్వర" శబ్దము శివుని యందు రూఢమేలకాదు? కానందురేని శ్రీకృష్ణుఁడు శివపాద కింకరుఁడనియే తేలును గదా. ఇందుఁ గల యీశ్వరశబ్దము రూఢము గాదందురేని శంకరాచార్యకృతస్తుతిగత నారా యణశబ్దము రూఢము గాదనవచ్చును. అప్పుడా దేవానాం ప్రియులు నోరు మూసికొనవలసినదే. కనుక శ్రీశంకరా చార్యులమతమున సర్వము భగవన్మయమనియే. కాఁబట్టి వారు విష్ణుభక్తులని చెప్పరాదు. శంకరాచార్యులవారు భస్మధారణము చేయక యూర్ధ్వపుండ్రములను ధరించిరనుట యున్మత్తప్రలాపము. అట్టివారివిషయమునందు

> "ప్రతివచన మముష్మై తస్య కో వక్తు విద్వాన్,
> న్నహి రుతమనుకౌతి గ్రామసింహస్య సింహః."

అను మధుసూదనసరస్వతులవాక్య ముదాహరణీయము కా వచ్చును.

ఇట్టి దుర్వాదము లనేకములు గలవు. వానింగూర్చి విశేషించి వ్రాయుట పాడిగాదు. స్థాలీపులాకన్యాయము ననుసరించి యించుక వ్రాసి పాషండముఖపిధానము గావించి తిని. ఈ యుపోద్ఘాతసార మేమనఁగాఁ ద్రిమూర్తులు భగవ దంశములు. ప్రతిబ్రహ్మాండమునకును వీరు గలరు. కార్యా ర్థము భక్తానుగ్రహార్థము భగవత్కల్పితులు. ఇందేరూపమున నారాధించినను భగవంతుఁ డానందించును. ఈరూపములన్ని యు నుపాసకులకొఱకు కల్పింపఁబడినవి. ఎవ్వరి కేది యిష్టమో వా రద్దానిని భగవంతుఁ డనుభావన గల్గి యుపాసింపవల యును. ఫలము సమానమే. ఈవిషయమున జాతి మతభేద ములు లేవు. ఒకజాతికి నొకమతమునకుఁ జేరినవారికే భగవ

దనుగ్రహము గల్గుననువారలకంటె నీచు లుండరు. మనస్సు నిర్మలమై ద్వైతభావన మాని సర్వేశ్వరు నారాధించువారు తత్కారణముచే బాత్రు లగుదురు. పూజాభేదములన్నియు సమానఫలము నొసంగునవియే. భక్తియనునది యోగజ్ఞాన వైరాగ్యములు సత్కర్మానుష్ఠానము ననువానిరూపమే కాని వేఱుగాదు. కేవల యోగమునఁగాని జ్ఞానమునఁగాని మోక్షము లేదనువారికంటె దేవానాంప్రియులు వేఱుగనుండ నవకాశము లేదు. వీని సమ్మేళనమే భక్తియనునది. ఈభక్తికలిగి పఠించినవారికి శ్రీరామాయణము ఫలము నొసంగును. లేనిచోఁ గాలక్షేపమే దానికి ఫలము. శ్రీరామాయణ మిట్టి విషయమునే బోధించును గాని శరణాగతిని బోధింపదు. శ్రీరామాయణము వైష్ణవజాతికే యేర్పడినదనువారే పామరులు, వంచకులు నగుదురు. ఎల్లవారలకు నది సమానమే యగును. అందెవ్వరు భేదబుద్ధి మాని శ్రీరాముని బ్రకృతి యగు సీతాంబ నారాధింతురో వారికి సత్ఫల మొసంగును. వంచకుల మాటలకు లోఁబడి యూర్ధ్వపుండ్రములే ధరింపవలయునని తలంపరాదు. ఈ చిహ్నములు నిరర్థకములు. పామరులకొఱ కేర్పడినవి. అవి యుండినను బాధలేదు. లేకున్నను బాధలేదు. నిర్మల మనస్సుమాత్రము కుదురవలయును. సురాభాండమును బైభాగమున నెంత పరిశుద్ధము చేసినను వానిదుర్వాసన పోదు. లోపలిభాగమును శుద్ధముగాఁ జేయవలసియుండును. అట్లే దేహమును స్నానాదులచే బాగుచేసి నామధారణాదుల నలంకరించిన లాభములేదు. మనోమాలిన్యములను దుడిచివేయవలయును. అది మతద్వేషము లుండునంతదనుక శక్యమే కాదు. దేవతాభేదభావము నశింపవల

యును. పరమతముల సహించు నలవాటు కుదురవలయును. అంతదనుక నెంతమాత్రము పరిశుద్ధముగా మనస్సు చేయ శక్యముకాదు. అద్వైత పరబ్రహ్మము శ్రీరాముఁడని భావింప వలయు. సమస్తము తన్మయమే యనుతలంపు కుదురవల యును. ఇట్టి యోగ్యతలు కలవారు రామాయణమును బఠించి దాని తత్త్వము నెఱింగి యందుఁగల యర్థము ననుస రించి తమరు ప్రవర్తింప నభ్యాసము చేసికొనువారలకే రామాయణము ఫలవంతమగు. అవి లేని సాపాటురామన్న లకు నయ్యది నిష్ఫలమే యగును. ఇఁక శ్రీరామచరిత్రమును బఠింతము.

## శ్రీరామలక్ష్మణులఁగాంచి సుగ్రీవుఁడు భయంపడుట.

* శ్రీరాముఁడు సోదరుంగలిసి పంపాసరస్సున కరిగి యం దలి కమలాదులను జేపలను గాంచి వానితో నుపమింపఁ దగిన సీతావదనదృష్టులు స్మృతికిం దగులఁగా నింద్రియము కలంగ విలపించెను. సరోదర్శనమున హర్ష ముదయించెను. దాన నింద్రియములు చంచలించెను. సీత తలంపునకు రాఁగాఁ గామవశుఁడై తమ్మునింగని యిట్లు పలికెను. వత్సా! ఇందలి జలము వైడూర్యమణివలె నిర్మలముగా నున్నది. అరవింద ములు పూచియున్నవి. తటములయందుఁ జెట్లు సొంపుగా నున్నవి. ఈసరస్సు చెంతనుండు నరణ్యము సొగసుగనున్నది. ఇందలిచెట్లు పెనుశాఖలతోఁ గూడి శిఖరములుగల కొండల వలె నున్నవి. భరతుఁడు మనవలెనే నగరబహిఃప్రదేశమున

*ఇయ్యది కిష్కింధాకాండమున మొదటిసర్గమునఁ గల కథ. ఇం దధ్యాత్మరామాయణకథయుఁ గలిసియుండును.

నియమముల నెట్లు శ్రమంపడుచున్నాఁడని, సీత యపహరింపఁ బడియెనని యీ రెండుదుఃఖములు నన్ను బాధించుచున్నవి. ఇట్టి నన్నీవసంతుఁడు మిగుల బాధించున ట్లున్నది. దుఃఖపడు వాని మనస్సున కేవియు బాగుండదు. దుఃఖితుఁడ నగు నాకుం గూడ మహారణ్యపరివృతమగు నీసరస్సు రమ్యముగా నున్నది. ఇందుఁ గొండచిలువలు సర్పములును దిరుగుచున్నవి. కమలోత్పలములు సందులేక క్రందుకొని యున్నవి. మృగ పక్షులు విశేషించి యున్నవి. ఇక్కారణములవలన నీయది చూడఁదగియున్నది. శాద్వలములు నీలపీతవర్ణములు గలిగి పువ్వులు పైనుండి రాలి నిండియుండుటంజేసి రత్నకంబళము పఱచిరా యన్నట్లున్నవి. వృక్షాగ్రములు పుష్పములచే నిండి యున్నవి. నిండుగఁ బూచియున్నలతలు వృక్షములను జుట్టు కొనియున్నవి. సౌమిత్రీ! వసంతర్తువు వచ్చినది. వాయువు హాయిని గల్గించుచు వీచుచున్నది. కామవికారము పెరుగు చున్నది. సువాసనలు వ్యాపించుచున్నవి. పుష్పఫలములు చెట్లనిండ నున్నవి. నీటిధారల వదలు మేఘముల రీతిగాఁ బూలసోనలఁ గురియు నీవనములం గాంచుమా. నిర్మలశిలా ఫలకములందు వృక్షములు వాయుకంపితములై పూవులు చల్లుచున్నవి. గాలికిఁ గొన్నిపూవులు నేలఁబడియుఁ గొన్ని పడుచుఁ గొన్ని చెట్లయందే నిలిచియు నెట్లు సొంపుగా నున్నవో కనుఁగొనుము. దీనిం జూడఁగా వాయుదేవుఁ డెల్ల యెడలఁ బూలతోఁ గ్రీడించుచున్నట్లున్నది. వాయువు పుష్ప శాఖలను గదలింపఁగా నాపూలయందున్న తుమ్మెదలు చెల రేఁగి వాయువును జుమ్మజుమ్మని గానము చేయుచున్నవి. నటులచే నాట్యము చేయించుచు వెనుకనుండి పాడుచుండు

వానింబోలి వాయువు వృక్షములచే నాట్యముచేయింపఁ, గ్రొవ్విన కోకిలలనినాదములనెడు చక్కని గానము చేయుచుఁ, గొండగుహానుండి వెడలి యరుదెంచుచున్నాఁడు. ఆవాయు వతివేగముగా వీచుచుఁ గదలించుచుండఁ జెట్లశాఖ లివ్వియొండొంటితోఁ గలిసి గ్రుచ్చఁబడినదండవలె నున్నయవి. చూడుమా యీగాలి సుఖముగా సోఁకుచు మలయజముచేఁ జల్లనై మంచి వాసనలుగలిగి మార్గాయాసాదులు పోవునట్లు విసరుచున్నది. మకరందములు పరిమళించు వనములం దీ చెట్లు గాలి కదలింపఁగా తేఁటులరొదలచే మొట్టపెట్టుచున్నట్లున్నవి. కొండలు చఱియలయం దొప్పుశిలాఫలకముల మొలిచి పూవులు నిండుగాఁ బూచి సొంపుగానుండు నీవృక్షములు తమ కొసభాగము లొండొంటితోఁ గలియఁగా నెంతో వింతగాఁ గనంబడుచున్నవి. అంతియగాక యివి కొనలయందుఁ బూవుజొంపము లావరింపఁగా గాలితాఁకునకు నూఁగుచుఁ గొసలఁ దుమ్మెదలు మూఁగి నల్లగ నుండుటంజేసి పూలు ముడుచుకొని నల్లని తలగుడ్డలు చుట్టుకొని తలలాడించుచుం బాడుచునుండు గాయకులవలెఁ గానఁబడుచున్నవి. కొండగోఁగులు పయిని బూవు లలముకొనఁగాఁ గనకాభరణములఁ దాల్చి పీతాంబరమును గట్టిన మానవులంబోలి యెల్లయెడలఁ గనఁబడుచున్నవి.

సౌమిత్రీ! యీవసంతము నానాజాతిపక్షులు రొదలు చేయుటంజేసి సీతావియోగమున నున్న నన్ను శోకమున ముక్కఁజేయుచున్నది. మన్మథుఁడు శోకాక్రాంతుఁడ నగు నన్ను నెంతయుఁ దపింపఁజేయుచున్నాఁడు. కోయిల వగ పెల్లున నుడుకు నన్నుం గాంచి పెల్లుబ్బి సంతసమునఁ గూయుచు

నాతో మచ్చరించున ట్లున్నది. తమ్ముఁడా! యీనెలయేటి యందు జలకుక్కుట మార్చుచు మన్మథార్తింగుందు నన్నుం గని సంతసించి యింకను దుఃఖింపఁ జేయుచున్నది. పూర్వా మాశ్రమమున నున్నపుడు ప్రేయసి జలకుక్కుటధ్వని నాల కించి ప్రియముగొని నన్నుఁబిల్చి నానాక్రీడల ననుభవించెను. పలువిధములగు రంగులుగలపక్షులు పలుభంగుల నినాదము లొనర్చుచు వృక్షములను గుల్మములను లతలను వ్రాలుచు న్నవి. కనుఁగొనుము. ఆఁడుపిట్టలు పతులచేఁ గౌఁగిలింపఁబడి తమజాతిపక్షులు ప్రియుని దగినవానిని బొందితివని నుతిం పఁగా మదించిన తుమ్మెదలఝుంకారములకుఁ దృప్తిపడి రతిక్రూ జితముల సొంపుగాఁ జేయుచున్నవి. జలకుక్కుటధ్వనులచే, పుంస్కోకిలములరుతములచే నీభూరుహములు ధ్వనించునట్లు కనఁబడుచుచు నాకెంతయుఁ బ్రీతి గొలుపుచున్నవి. ఈ వసంత ర్తువే యగ్నిగా నన్నుఁ గాల్పఁగలదు. ఈయగ్నికి రక్తాశోక పుష్పగుచ్ఛమే కొఱవి. భ్రమరఝుంకారములే జ్వాలామాలికా సమయధ్వనులు. చిగురులే యెఱ్ఱనిమంటలు. సౌమిత్రీ! నయన శిరోరుహములయందము మధురభాషణములుగల యాజానకిం గాంచకయేయున్న నీకిఁక జీవితముతోఁ బ్రయోజన మేమి యుఁ గలుగదు. ఈవసంతము సకలవిధముల సొంపుగా నున్నం దున నాప్రేయసికెంతయు నిష్టమైనది. ఇప్పటి నాయీదుఃఖాగ్ని మన్మథపీడాసంజనితము. అది యీవసంతర్తు రామణీయక మున వృద్ధియైనది. కాన నన్నిది యిఁక వేగమ కాల్పఁగలదు. నాప్రేయసిం గాంచక యీవసంతర్తు సంపత్సంపూర్ణములగు నీవృక్షాదులను జూచుచుండు నాకీసంతాపము మఱింత వృద్ధి కాఁగలదు. ప్రాణేశ్వరి కనఁబడకయుండుట, యీ వాసంతిక

పుష్పాదులు నిరంతరము కనఁబడుట యను హేతువులచే నా సంతాపము వరుసఁగా వృద్ధినొందుచున్నది.

ఈ వనవసంతవాయువులు హరిణాయతలోచన యగు ప్రియురాలిని స్మరించుచు దుఃఖించు నన్నించుకయైనఁ గని కరములేక యెంతయు బాధించుచున్నవి. మయూరములెంత యు వింతగా నాడుచున్నవి. వనమయూరములివి తమప్రియు రాండ్రు చుట్టుకొనియుండ వేడుకగా నలరుచుఁ బూర్వమే సంతప్తుఁడ నగునాకు మఱింత సంతాపమును గల్గించుచున్నవి. తమ్ముఁడా! కొండచఱియలయందు లీలానర్తనముచేయు తన ప్రియునింగాంచి యీయాఁడునెమిలి ప్రేమాతిరేకమున నతని రావింపఁగోరి చెంత నర్తనము చేయుచున్నది. చూడుము. పురుషమయూరముకూడఁ గలయికకొఱకు శృంగారపక్షద్వ యము విప్పి సొగసగు మొగమున విరహవేదనాయత్తచిత్తుఁడ నగు నన్నుఁ బరిహసింపఁగోరినట్లు తనప్రియురాలి చెంతకరుగ నుంకించుచున్నది. ఈ యాఁడునెమిలిని రాక్షసుఁడు వని నప హరించుకొనిపోలేదు. కావున నీదంపతులు సంతసమున నర్తనము చేయుచున్నవి. ఈవసంతకాలమున జానకింగూడని నేను వనవాసముఁ జేయఁజాలను.

వత్సా! పురుషుఁడు కాంతను వెంబడించునని లోక మున విఖ్యాతమే. ఈవైపునకు దృష్టిని మరలింపుము. ఈ యాఁడునెమిలి నికామకామమునఁ దానే ప్రియునిచెంత కరు గుచున్నదే. తిర్యక్కులయందును స్త్రీలకెంత యనురాగము దో చూచితివా. కామినులకుం గూడ నీప్రేమాతిశయ విశిష్టభావమును గల్గించుచుండు నీవసంతవైభవ మెంత వర్ణ నార్హమో పరిశీలింపుము. జానకియు రాక్షసాపహృతయే

గాకయున్న నన్నిట్లే యెదుర్కొనియే వచ్చునుగదా. వాసంతికపుష్పగుచ్ఛము లెంత సొంపుగానున్నను వీనిప్రయోజనము నాకు లేకున్నది. ఈపూవుగుత్తులు తేనియలఁ గ్రోలుటకై వ్రాలుతుమ్మెదలతో నిరర్థకముగాఁ గ్రింద రాలుచున్నవి. పక్షులును నాకుఁ గామవికారమును గల్గింపఁ గోరికాఁబోలు గుములుగాఁగూడి సంతసమున రుతములు గావించుచున్నవి. ఎందు నాసీతయుండునో యందీ వసంతర్తువుండిన నావలె నెంతయు దుఃఖించును గదా. రక్కసు లాజానకి నెందో రహస్యస్థలమున నునిచియుందురు. కనుక నాచోట నీఋతు వుండదనుట నిశ్చయము. వసంతర్తువు లేనికతన జానకికి వగవేదన వచ్చునో? నావియోగమున నాసీత బ్రదుకనేర్చునే. నాపైఁ గల ప్రీతిని బ్రాణముల నందే విడువఁగలదు. జానకి మహాపతివ్రత. నాకడ లేదు. కాన జీవింపఁజాలదు. మేమిరువురము పరస్పర దృఢానురాగము కలవారము. కాన నీవాయువు సుఖముగలుగ వీచుచున్నను సీతలేమి నాకు నగ్నిస్పర్శమువలె నున్నది. సీత నాచెంత నుండుతఱి సుఖముగూర్చు నీమంద మారుతము తద్వియోగమునఁగుందు నాకిత్తఱి దుఃఖప్రదమే యగుచున్నది. ఏకాకి పైనుండి బిట్టుగాఁ గూయుచు సీతావియోగమును దెలిపెనో యాకాకియే యిపుడు సంతసమునఁ గూయుచు సీతాయోగమును దెలుపుచున్నది. ఇదియే జానకి నెడఁబాపినది. ఇపుడు నన్నటకుం గొంపోవఁ గలదు. వృక్షాగ్రములపయిఁ బక్షులు మధురరుతము లొనరించుచున్నవి. ఆనాదము నాకుఁ గామోద్దీపకముగా నున్నది. గాలింగదలు బొట్టుగుచెట్టు పూవుగుత్తిని దీని నీభ్రమరము మదమున నటునిటు నల్లలలాడుప్రియురాలినిం బోలి త్వరపడి పైకొను

చున్నది. అశోకవృక్ష మీయది నైజముగా విరహులకుఁ దాప
వృద్ధికరము. అది ఎఱ్ఱనిపూగుత్తులు కదలుచుండఁగా రామా!
నిన్నడంపఁగోరి యీ దీప్తబాణములను గాముఁడు నాయం
దునిచినాఁడని నన్ను భయపెట్టున ట్లూహింపఁదగియున్నది.
పూచిన యీరసాలవృక్షము చందనచర్చలుగల కాముకుల
వలెఁ గనఁబడుచున్నది.

పంపాతీరమున గలవనములయందు నందందుఁ గిన్నరు
లును విహరించుచున్నవారు. నలుదెసలఁ బరికింపుము. పరిమళ
ముల వెదఁజల్లు నీతామరలు జలతరంగములయందుఁ బ్రతి
ఫలించు బాలభానులవలె నొప్పుచున్నవి. నిర్మలోదకము
కమలోత్పలములు సౌగంధికములును గలిగి యీ పంపాసరో
వరము జలవిహంగములతో నెంతో వింతగ నున్నది. చక్ర
వాకములతోఁ గూడి కట్టుకొన్న వస్త్రమువలెఁ దీరగతవనములు
విలసిల్లుచు జలములం గ్రోలవచ్చిన గజవిసరములచే మృగ
సముదయములచేతను నిరంతరము సొగసుగానుండు నీపంపా
సరస్సును జూడుము. పద్మపత్రాయతాక్షములుగలిగి నిరంతర
కమలవిషయకప్రీతి గలిగియుండు సీతను జూడక నేను బ్రదికి
యుండుట మేలు కానేకాదు. ఆహా! మదనునిదౌష్ట్యము!
మృగమును బట్టి నాకిమ్మనిన యాకల్యాణి నన్ను వదలి దూర
ముగా నరిగి దుర్లభయైయున్నను నాకుఁ బ్రతిక్షణ మామెను
స్మృతికిం దెచ్చుచున్నాఁడే. ఈపుష్పవనములు నన్ను నింతగాఁ
బీడింపకయున్న నేనీమన్మథతాపము నోర్చుకొనియుండుదును.
ఆజానకి నాచెంత నుండునపుడు ప్రియములుగా నున్నపదా
ము లామెనెడఁబాసియుండు నాకు మిక్కిలి వగపుఁ గల్గించు

చున్నవి. కమలకుట్మలములపయిని దళములఁ జూడఁగనే సీత నేత్రపక్ష్మములు స్మృతికిం దగులుచున్నవి.

పంకరుహకేసరములం గూడి వృక్షములయంతరముల నుండి వచ్చువాయువు జానకినిట్టూర్పువలెఁ బరిమళములతో సొంపుగా వీచుచున్నది. పంపాదక్షిణతీరమునఁ బర్వతసాను తలమునఁ గర్ణికారలత విశేషించి పుష్పించి సొగసుగానున్నది. చూచితివా. సకలధాతుసంయుతుఁడగు నీపర్వతరాజు వాయు వత్యంతము వీచుచుండఁగా విచిత్రవర్ణరజస్సును వదలుచున్న వాఁడు. కమియఁబూచిన పలాశవృక్షములు పత్రములే లేక యెంతో సొంపుగా నున్నవి. ఆసానువు లావృక్షములచే జ్వాలామాలికల మండువానివలెఁ గనంబడుచున్నవి. ఆసాను వులయం దెన్ని యోవిధము లగువృక్షములు వికసించియున్నవి. తీఁగలు చుట్టుకొనఁగా నీపుష్పవృక్షములు విశేషించియుండు నీసరోవరమును జూడుము. గాలికిఁ గొమ్మ లల్లాడఁగాఁ బ్రియ కాంతలు ప్రియు లెటుపోయినను వదలక వారి ననువర్తించు నట్లు లతలుకూడ ననుసరించుచున్నవి. వాయువు తరువునుండి తరువునకుఁ గొండనుండి కొండకు వనమునుండి వనమునకుఁ బోవుచుఁ దీయనిరసములం గ్రోలి తృప్తినొందనివానిరీతి మందముగా వీచుచున్నది. వృక్షము లెన్నోవిత్తముల వింత వింతగాఁ గనఁబడుచున్నవి. తుమ్మెదలు రుచిఁదగిలి దేనిని వదలఁజాలక క్రొత్తపూవులపై వ్రాలుచున్నవి. ఎల్లతావులఁ గ్రమ్మరుచున్నవి. పూవులురాలి మెత్తనిపాన్పుపఱచిన ట్లున్నది.

ఈ వసంతర్తువునందుఁ దరువులు కమియఁబూచి యొక దానిని వేఱొకటి మించవలయునను తలంపుగలిగిన ట్లున్నవి. ఈ సరోవరమునకుఁ గలరూపమువలె మందాకినికిం గూడ

రూపము సొంపుగానుండును. అట్టి గుణములు కనఁబడుచు న్నవి. పరాపహృతయైన నేమిగాని యాసీత మహాసాధ్వి. ఆజానకి కనఁబడునేని మనమందఱ మిచ్చటనుండుమేని నే నయోధ్యనే కాదు మహేంద్రపదముఁ గూడ నాశింపను. ఈశాద్వలముల నే నామెం గూడియుందునే నయోధ్యలేని చింత నాకుఁ గలుగనే కలుగదు. మఱి దేనియందు నా కాశ యుండదు. తటములయందు వరాహములు హరిణములు విహ రించుచున్నవి. పక్షులెంతయు మనోజ్ఞరుతములు చేయుచుం డఁగా నీసరస్సు సంతోషమును గల్గించునదియై యున్నది. ఇందలి మనోహరపదార్థములన్నియు నాకు వింత పరితాప మును గల్గించుచున్నవి. ప్రియురాలు నాకుఁ గనఁబడునేని నెమ్మదిగ నుందును. ఈ మలయమారుతమును బ్రియురాండ్రతోఁ గూడినపుణ్యాత్ములే యనుభవింతురు. ప్రాణత్యాగ మున స్వతంత్రురాలు గాక పరవశయై సీత నన్నువదలి యెట్లు ప్రాణముల నిలుపుకొనియుండును ?

ధర్మజ్ఞుఁడగుజనకరాజు సీతాకుశలవార్తను నన్నడుగఁగా నేమని బదులుచెప్పుదును? తండ్రి నన్నడవికిఁ దోలఁగా నిర్భాగ్యుఁడ నగు నన్ను సాధ్వియగు సీత యనుస రించివచ్చినది కదా. ఆసాధ్వి యిపుడెం దున్నది? నే నామె లేక యెట్లు బ్రదుకుదును ? శుభములొనఁగూర్చు నామె నగుమో మును జూడకయున్న నామనస్సు స్రుక్కక యుండఁగల్గునా? ఆసతి ప్రియవచనములు పలుక నెపుడు వినఁగలను? నాసంతాప మును హరించు నా సీతమాటలు వెండియు వినఁగల్గుటెప్పుడు? రాజకుమారా! అయోధ్యకు నేనుబోవఁగనే దుఃఖాతురయగు కౌసల్య నన్నుఁ గాంచినంతనే నాముద్దుల కోడలేది? అనిన

నేమందును? వత్సా! నీవరిగి భరతుని గాంచుము. నేనాజానకి విడిచి రాఁజాలనని విలపించెను. అనాథునిం బోలి విలపించు నాజానకీధవుం గాంచి యుక్తవాక్కుల నిట్లు మందలించెను. పురుషోత్తమా! ధైర్యము దెచ్చుకొనుము. నీకు భద్రమగుఁ గాక. మీవంటివారిబుద్ధి యించుకయుఁ గలుషితము కాదు. మిగుల నెయ్యముంచినందున నొకప్పుడు వియోగము కలుగ దుఃఖము కలుగునన్న నానుడి తలంచుకొని యధికస్నేహము విడువుము. అధికస్నేహముండినఁ దడిసినవత్తియు దహింపఁ బడుఁగదా. శ్రీరామభద్రా! పాతాళమునకుఁగాని యంతకు మించిన యున్నతస్థలమునకుఁగాని పోయినను రావణుఁ డింక బ్రదికియుండఁజాలఁడు. ఆదురాత్ముని జాడయొక్కటియే మనకుఁ దెలియఁదగినది. అంతట వాఁడు జానకినో ప్రాణములనో యీయక యుండ లేఁడు. సీత నపహరించి యదితిగర్భమును బ్రవేశించిన నందుఁగూడ సీతనీకున్న వాని వధింతును. ధైర్యము భద్రప్రదము. కాన దాని నూనుము. ఈదైన్యమును వదలుము. ధైర్యము మాని యత్నము చేయకయుండువారల కేదియు సిద్ధింపదు. ఉత్సాహము ప్రబలము. దానికన్న నెక్కువబలము లేదు. అదిగలవారికి దుర్లభ మేదియు లేదు. ఉత్సాహవంతుఁ డెంత్తైనను క్లేశముం గనఁడు. మనమాయుత్సాహము గలవారమైన జానకిని బడయఁగలము. దుఃఖమును ద్యజించి యీ మన్మథవికారమును జయింపుము. మహాబుద్ధి సంపన్నుఁడవగు నీవిపుడు నిన్నే మఱచియున్నాఁడవు. అని యన్న కూఱటగలుగునట్లు పలికెను.

శోకమున బ్రుంగియున్న శ్రీరాముఁడు తమ్ముఁ డట్లుబోధింపఁగా శోకమోహములు వదలి ధైర్యము నాశ్రయించెను.

అంత నాసరస్సును దాటి యవ్వలిచోటికిం బోయెను. అట్లు సోదరు లంతట వెదకిరి. శ్రీరాముని కూటగలుగ రాజనీతులం దెలుపుచుం దనబలమును బ్రశంసించుచు నతనివగపునాపుచు లక్ష్మణుండు భ్రాతృసేవాతత్పరుండై యుండెను. సుగ్రీవుండను వానరరాజొక్కరుం డన్నభయమున ఋశ్యమూకాద్రి దాపునం దిరుగుచుండెను. పంపాసరస్సమీపమునం దిరుగుచుండంగాం జూచువారల నచ్చెరువందంజేయు నాసోదరులం గాంచెను. భయమున నిశ్చేష్టితుం డయ్యెను. పంపాసమీపమునం దిరుగు నాసోదరులం జూచి వారియాకారవిశేషమునకుం జింతిల్లి భయసాగరమున మునింగి విషాదమునొందెను. ఆతండేకాక వాని మంత్రులును సోదరులంగాంచి వారు వాలిపనుపున మునివేషముల నరుగుదెంచి రన్న శంకచే దిగులుపడి మహాపుణ్యవంత మగు మతంగాశ్రమములోనికిం జొచ్చిరి.

మహాశయులారా! ఈసర్గమున విశేషాంశములు లేవనియే తోలుతం దోంచు. విమర్శించిన ననేకధర్మము లిందుంగలవని యేర్పడును. వాని నెమకుదము. "రామాన్వేషణేన భగవతశ్చేతనో' వనోపాయచింతనం చోక్తమారణ్యకాండే. అథాచార్యముఖేన చేతనస్య స్వవిషయభక్త్యుత్పాదనకృతే తదన్వేషణ ముచ్యతే కిష్కింధాకాండే" అని గోవిందరాజులు వ్రాసిరి. "ఇదానీమస్మిన్ కిష్కింధాకాండే తదేవ సుగ్రీవసఖ్యం చ వక్తుమనాః ప్రసంగాత్పురుషధౌరేయాణామ ష్టజనవియోగినాం కామోద్దీపకదర్శనేన చిత్తవిభ్రమో భవతీతి సూచనాయ పంపావర్ణనముఖేన రామస్య చిత్తవిభ్రమం దర్శయితు ముపక్రమతే" అని టీకాశిరోమణి వాకొనియెను. ఆచార్యముఖముననే భగవత్కృప లభింపవలయుంగాని మా

ర్థాంతరము లేదను న్యాయము ననుసరించి తదనుకూలముగా నర్థమును గోవిందరాజులు వ్రాసిరి. ఎట్టిపురుషులకుఁగాని కామోద్దీపకములగు పదార్థములను జూడఁగనే చిత్తము చంచలించును గాన నట్టివస్తువులు కనఁబడినందున లోకాచారము ననుసరించు రామమూర్తికి నార్తికలైనని టీకాశిరోమణి తాత్పర్యము. ఈరెండింటియందు యుక్తమేది యని విచారింతము. గోవిందరాజులుగారి భావమునకుఁ బ్రకృతవిషయమునకు సంబంధము లేదు. రెండవవారిభావమునకు సంబంధము కలదు. తొలుతటివారిభావ మాకాశరామన్న పంచాంగమువంటిది. మతాభిమానము ననుసరించి రామాయణ మావిషయమునే బోధించునని తెలుపఁబూనినవారు గోవిందరాజులు. వీరివ్రాఁతల నాధారముచేసికొనియే కాఁబోలు పెక్కుండ్రు రామాయణము వైష్ణవులకొఱకే యేర్పడిన గ్రంథమందురు. శరణాగతినే బోధించునందురు. భగవత్కథ యొక్కమతమువారికే ముఖ్యమగునెడల నది యుత్తమమే కాదు. ఆతఁడు భగవంతుఁడే కాఁడు. సర్వమతములవారి కది సమానముగనే యుండవలయు. ఈధర్మమునే యీశ్రీరామావతారతత్త్వము బోధించుచున్నది. ఇఁకఁ బరికింతము. ఇందుఁ బ్రధానములనే తెలిసికొందము.

> "శోకార్తస్యాపి మే పంపా శోభతే చిత్రకాననా,
> వ్యవకీర్ణా బహువిధైః పుష్పైశ్శీతోదకా శివా." ౬

అని మూ. "సర్వేషు మర్త్యక్షేత్రేషు సుఖం వసత్సు కిమర్థమేతే సంసారిణః క్లిశ్యంతీత్యభిప్రాయేణాహ" అని గోవిందరాజులు. ఇది యసంగతమే యనవలెను. తనభక్తులు సుఖముగ నుం

డఁగాఁ దానేల శోకార్తుఁడు కావలయునో తెలియదు. అపుడు భక్తులకన్నఁ దానే యపరిశుద్ధమనస్కుఁడని యర్థమేర్పడును. మన మిట్లు గ్రహింతము. సొంపైనయడవులు పుష్పముల రాల్చుచుండఁగా శివజలములు గల సరస్సు కనఁబడినయెడల నెట్టిదుఃఖములైన నివర్తించును. పరోపకారమున కుదాహరణభూతములు వృక్షములు. , నిర్మలాంతఃకరణము నిచ్చునవి జలములు. కావున నట్టివాని దర్శించినంతనే శోకములు తొలంగును. సంసారబాధలనుండి విముక్తిగాంచుటకే సాధువు లడవుల కరుగుదురు. అందుఁ బ్రాయికముగా దుఃఖములు బాధింపవు.

"అధికం ప్రతిభాత్యేతన్నీలపీతం తు శాద్వలం,
ద్రుమాణాం వివిధైః పుష్పైః పరిస్తోమైరివార్పితం." ౮

అని మూ. "అనేన నానాగురుముఖలబ్ధజ్ఞానతయా భగవద్వ్యాసయోగ్యః పురుష ఉచ్యతే" అని గోవిందరాజులు. పెక్కుగురువుల నాశ్రయించి వారిమూలమున జ్ఞానము సంపాదించుకొన్నపురుషుఁడు భగవద్వ్యాసయోగ్యుఁ డగునని ఆచార్యులగారి భావము. ఉన్నధనమంతయు నాచార్యులకుఁ బెక్కండ్రకిచ్చి విజ్ఞానవంతుఁడయినఁగాని భగవంతుఁడు వానియందుఁ గాపురముండఁడు కాఁబోలు. మెచ్చవచ్చు నీభావము. మన మిట్లు భావింతము.పచ్చికపట్లు విశాలభావమును గనఁబఱచును. వృక్షములు పువ్వుల నొసంగి చిత్రవర్ణముగా వానింగావించి నట్లు విశాలభావముగలవారలు ప్రార్థింపకున్నను సాధువులతోడ్పడి పరితుష్టులఁగావింతురు. నిర్మలమన స్సాకల్యటియున్నయెడల నయ్యది సర్వజనుల నాకర్షించును. దాననే కొఱంతలు కలుగకయుండునను భావము నియ్యది తెలుపుచున్నది.

"పుష్పభారసమృద్ధాని శిఖరాణి సమంతతః,
లతాభిః పుష్పితాగ్రాభి రుపగూఢాని సర్వతః." ౯

అని మూ. "అనేన గార్హస్థ్యేఽపి నిరవధికబోధా ఉచ్యంతే" అని గోవిందరాజులు. ఇది సమంచితముగా లేదు. మన మిట్లు గ్రహింపందగు. వృక్షములకుఁ బుష్పములే భాగ్యము. లతలవ్వానిం బెనుచుకొనుట స్వభావము. వానింజూడఁగా ధన సమృద్ధినిగల పురుషులనే సాధారణముగా స్త్రీలు కామింతురనియు నది లేనివారల నంతగా నభిలషింపరనియుఁ మన మెఱుంగవలయు.

"పశ్య రూపాణి సౌమిత్రే వనానాం పుష్పశాలినాం,
సృజతాం పుష్పవర్షాణి తోయం తోయముచామివ." ౧౧

అని మూ. "అనేన పరోపదేశప్రవృత్తా ఆచార్యా ఉచ్యంతే" అని గోవిందరాజులు. ఆచార్యులవదలి మనమి ట్లూహింతము. మేఘము జలముల నొసంగును. వృక్షములు పూవులనొసంగును. అట్లే సాధుమతులగువారు తమకున్న యుత్తమవస్తువులను దామనుభవింపక యితరుల కుపకరింపఁజేయుదురు అని. దీనిచే స్వపరభేదరహితులే జ్ఞానులని మన మెఱుంగవలయును. సద్వస్తుత్యాగబుద్ధియే జ్ఞానులయందలి గొప్పతనమని సారము.

"మత్తకోకిలసన్నాదైర్నర్తయన్నివ పాదపాన్,
శైలకందరనిష్క్రాంతః ప్రగీత ఇవ చానిలః." ౧౪

అని మూలము. "అనేన వేదప్రవర్తనముఖేన లోకస్య భక్త్యుత్పాదనాయ వైకుంఠాదవతీర్ణో భగవా నిత్యుచ్యతే" అను నీ గోవిందరాజోక్తి స్వమతాభిమానద్యోతకమే. ఇందలి సార

మేమనఁగా. ధనమదమున నోడలెఱుఁగక విఱ్ఱవీఁగుచు నిచ్ఛానుసారముగా వర్తించుచుండువారలఁ బర్వతముం బోలినదనఁగా నీలవర్ణముగల దుష్కర్మము ఆడించుచుం డును. భయంకరకర్మముల నాచరించువారే మత్తులగుదు రనియు వారికి సంసారమే సంతోషప్రదమగు నర్తనాగార మనియు మన మెఱుంగవలయును. అట్టివారి స్థితిగతుల నెఱుంగఁదగుననియు దానిమూలమున నద్దానినుండి విరక్తుఁడు కావలయుననియు మనము నేర్చుకొనవలయు. వైకుంఠము శాశ్వతలోకమని ఆచార్యులవారిభావము కాఁబోలు. అట్టివి యెన్నియో యుండును. అన్నియు శాశ్వతములైన నశించునది యేదియో తెలియదు.

"తేన విక్షిపతాత్యర్థం పవనేన సమంతతః,
అమీ సంసక్తశాఖాగ్రా గ్రథితా ఇవ పాదపాః." ౧౬

అని మూలము. "అనేన భగవత్కృపయా పరస్పరమనురక్తా భాగవతా ఉచ్యంతే" అని స్వాములు. సత్కర్మము నానా ముఖముల వ్యాపింపఁగా దానిచేఁ బ్రోత్సహింపఁబడి సాధు వులు దర్శనమాత్రమునఁ దమవంటి సత్కర్మానుష్ఠానపరుల నెఱుంగఁగలరు. అను నీనీతిని వృక్షములు మనకు బోధించు చున్నవి.

"పుష్పితాగ్రాంస్తు పశ్యేమాన్ కర్ణికారాన్ సమంతతః,
హాటకప్రతిసంఛన్నాన్నరాన్ పీతాంబరానివ. ౨౧

అని మూలము. "అనేన భగవత్సారూప్యం గతా ఉచ్యంతే" యాచార్యులు. పీతాంబరమును భగవంతుఁడు ధరించు

నని వైకుంఠమున నుండునని వారిభావమై యుండు. పీతాం
బరమే వారికిం బ్రియమైనయెడల సర్వసమత్వ మెగిరిపోవును..

"దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనం,
సర్వాశ్చర్యమయం దేవమనంతం విశ్వతోముఖం."

అను గీతావాక్యము సుసంగతము కాకపోవును. దివ్యవస్త్ర
మనఁగాఁ బీతాంబరమనియే యర్థమని యాచార్యులు వ్రాయు
దురేమో. అపుడు వారసితవస్త్రధారణముచేయు బల
రాముఁడు విష్ణ్వవతారము కాఁడనవలసివచ్చును. భగవం
తున కొక వస్త్రమేమి? ఒక్క యాభరణ మేమి? భక్తుఁ
డేవస్త్రమునర్పించిన నదియే ప్రియము. రూపమే కల్పితమైనపు
డేదియు నియతము కాదని యేర్పడును. మనమీభాగము
నుండి యిట్లు గ్రహింపఁదగు. భూరుహములకు భూషణ
ములు పూవులు. మానవులకు యశస్సు. పూవులు శిరోధా
ర్యములు. అట్లే యెవ్వారికీర్తి సర్వజనులచే నుత్తమమని కొని
యాడఁబడునో వారే భూషణములుగలవారు. పూలచెట్లను
జూడఁగనే కీర్తిగలవారము కావలయునని మనము కోర
వలయును.

"మాం హి శోకసమాక్రాంతం సంతాపయతి మన్మథః,
హృష్టః ప్రవదమానశ్చ మామాహ్వయతి కోకిలః." ౨౩

అని మూలము. "జ్ఞానైకవత్సలం మామవిజ్ఞాయ కేవలం
కర్మతా మాం దుఃఖీకుర్వంతీత్యాహ" అని యాచార్యులు.
దీనిచేత

"కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్."

అన్న శ్రీకృష్ణవాక్యము నిరర్థక మగును. "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" అనునదియే చరమశ్లోకమని భావించు నాచార్యులకు సత్కర్మము లవశ్యానుష్ఠేయములని యెట్లు తోఁచును? ఇద్దానినుండి గ్రహింపఁదగునది యేదని ప్రశ్నము. సంతుష్టులగువారు ఇతరులను దమవలెనే భావింతురు. ఇతరులశ్రమములు తెలిసికొనఁజాలరు. శ్రమంపడు వారిని దెలిసికొనుటయే యుత్తమకార్యము. కోకిలము నుదాహరణముగాఁ జూపి శ్రీరాముఁ డీనీతిని మనకుఁ దెలుపుచున్నాఁడు. కర్మఠులు భగవంతుని నుచ్చరింపరు. సత్కర్మముల నారాధింతురు. "కర్మిభ్యశ్చాధికో యోగీ"అన్న భగవద్వాక్యము నరయుఁడు. సకలలోకములు కర్మాధీనములు. కర్మ మత్యధికము. "గహనా కర్మణో గతిః"అని భగవంతుఁడే తెలిపెను.

> "భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరం,
> సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి.
> కాయేన మనసా బుద్ధ్యా కేవలైరింద్రియైరపి,
> యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాత్మశుద్ధయే."

అను నీగీతావాక్యములు కర్మస్వరూపమును దెలుపుచున్నవి. కర్మఠు లెపుడును సత్కర్మముల నాచరించి తత్ఫలములను భగవంతున కర్పింతురు. ఆత్మశుద్ధి సత్కర్మానుష్ఠానము లేక కలుగనేరదు. శరణాగతి యనుదంభమున సకలకర్మముల వదలుకొనువారు భ్రష్టులే యగుదురు. భక్తి యనునది వారికి భుక్తిగా మాఱును. కర్మమార్గమున భగవంతు నారాధించు వారికి భగవదనుగ్రహము కలుగదనుటకంటె నసంగతప్రలా

పము లుండవు. సోమరులే యట్లు పలుకుదురు. ద్రవ్యార్జన మునకుఁ ద్రికాలరహస్యభక్తికి నిట్టిభక్తి చాల నుపకరించును. మన మట్టివాక్కులను విశ్వసింపక సత్కర్మములమూలముననే భగవంతు నారాధింపవలయు. యోగాభ్యాసములేని కర్మాను ష్ఠానము సంపూర్ణ ఫలవంతముకాదు.

"ఏష నత్యూహకో హృష్టో రమ్యే మాం వననిర్ఝరే,
ప్రణదన్ మన్మథావిష్టం శోచయిష్యతి లక్ష్మణ." ౨౮

అని మూ. "అనేన కేవలజపపరా ఉచ్యంతే. జ్ఞానభక్త్యోరేవ భగవతస్సద్యః ప్రీత్యావహత్వాత్ సాధనాంతరపరోనాతి ప్రియ ఇతి రహస్యం. జ్ఞానీత్వాత్మైవ మే మతమ్. భక్తిప్రీతో జనార్దనః. ఇతివచనాత్." అని ఆచార్యులు వ్రాసిరి. వీరికిని గర్మానుష్ఠానమునకును శతయోజనముల దూరమని యీ వ్రాఁతవలన నూహింపవచ్చును. నీరుకోడి సంతసమునఁ గూయుచుఁ గామినగు నన్ను దుఃఖపెట్టుచున్నదను రామచంద్రునిమాటల నుండి వీరిసారమును దీసిరి. సెబాస్. మెచ్చవచ్చు. నీరు కోయిలలవంటివారు జపపరాయణులని వీరిభావము. భగవన్నామపారాయణముచేయువారెవరు? జప మనఁగా నెద్ది? అష్టాక్షరమంత్రజపముకూడ నీమాటలవలన వ్యర్థము కాదా. "భక్తిప్రీతోజనార్దనః"అనుమాటను బ్రమాణముగాఁ జూపిరి. "తపః ప్రీతో జనార్దనః" అనియున్నచో నపుడేమందురు?

"అభయం సర్వసంశుద్ధిర్జ్ఞానయోగవ్యవస్థితిః,
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్. ౧
అహింసా సత్యమక్రోధస్త్యాగశ్శాంతిరపైశునం,
దయా భూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీరచాపలం.

తేజః క్షమా ధృతిశ్శౌచమద్రోహో నాతిమానితా,
భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత. 3
దైవీ సంపద్విమోక్షాయ నిబద్ధాయాసురీ మతా,
మా శుచస్సంపదం దైవీ మభిజాతోఽసి పాండవ." 5
గీత. ౧౬ అధ్యా.

అని శ్రీకృష్ణవాక్కులు గలవు. తపశ్శబ్దముచే జపము చెప్పఁబడి నది. "యజ్ఞశ్చ" అనుటంజేసి సత్కర్మానుష్ఠానము చెప్పఁబడి నది.జ్ఞానభక్తులే భగవంతున కతిప్రియములు. తక్కినవి కావను నాచార్యులమాటలు జల్పములు. జ్ఞానభక్తులు కలిసియే యుం డవలయు. సత్కర్మానుష్ఠానమునందు వాని నుపయోగింపవల యును. యోగి కాకయున్న నివన్నియు నిరర్థకములు. చచ్చు వేదాంతవాక్యములు వల్లించుట పొట్టకూటికొఱకే యగును. "జ్ఞానం నామ శాస్త్రోక్తపదార్థానాం పరిజ్ఞానమ్." అని భా ష్యము. "ప్రత్యగాత్మని దేహాద్వ్యతిరిక్తత్వప్రకారకో దేహ దావా ప్రత్యగాత్మాతిరిక్తత్వప్రకారకో నిశ్చయః" అని సర్వ లక్షణసంగ్రహము. జ్ఞానభక్తులు యోగము కర్మానుష్ఠానము ననునివి కలిసిననే యుపాసనమనఁబడును. కుడిచి కూరుచుండి శరణాగతియని నిరర్థకప్రసంగములు చేయుచున్నవా రధో గతిపా లగుదురు. ఇందేది కొఱఁతపడినను భగవదారాధనము సంపూర్ణము కానేరదు. ఈశ్లోకసారమేమి? వత్సా! లోక మున ధర్మరక్షణమను కామమునఁ బ్రవేశించిన నన్నుంగాంచి నాతత్త్వ మెఱుంగక యీనీరుకోడి తనసంతోషమునే వెలి పుచ్చుచున్నది. కాని నన్నారాధింపఁజాలకున్నదని భావము. మంచిమార్గము నుపదేశించినను గూడ నపరిపక్వజీవులు తెలిసి కొనఁజాలరనియే యిందలిసారము.

"విమిశ్రా విహగాః పుంభిరాత్మవ్యూహాభినందితాః,
భృంగరాజప్రముదితాస్సౌమిత్రే మధురస్వరాః." ౨౭

అని మూ. "అనేనాచార్యపరతంత్రా స్సామగానపరా ఉచ్యంతే" అని గోవిందరాజులు. ఆచార్యుని నమ్మినభక్తులు సామగానము చేయుచుందురు. అనుభావము నిది సూచించుచున్నదఁట. ఆఁడుపిట్టలు శిష్యులను మగపిట్ట లాచార్యులను దెలుపునఁట. ఆఁడుపిట్టలు మగపిట్టలఁ గౌఁగిలించుకొనునట్లు శిష్యు లాచార్యులను వదలక తమకున్నయంత ధనము వారియధీనముచేసి శరణాగతి నొందవలయునని కదా వీరి యూహ యనవచ్చును. ఈయాచారమును బాటించియే కాఁబోలు ఇప్పటికిని గొందఱు శిష్యసంచారము చేయుచున్నారమని తిరుగుచుఁ దారక ముప దేశింతుమని ధనము లాగుచుఁ దమ రర్థవంతులగుచు వారిని నిరర్థకులనుగాఁ జేయుచున్నారు. సులభమైనపనియే యిది. నష్టములేని బేహారము. సోమరుల కిదియే జీవనము నగు. దీనివదలి సారమేమి యని విమర్శింతము. ఆఁడుపక్షులు తమ జాతిగల మగపక్షులంగలిసి మనోహరముగాఁ గూయుచున్నవి. అనుటంజేసి యేకజాతికింజేరిన స్త్రీపురుషుల దాంపత్యమే మనోహరముగా నుండుననియు, నట్లుగాకయున్న నాచార భేదముల నిరువురిమనస్సులు కలియక భేదములుగా నుండు ననియు నద్దాన దాంపత్యసుఖ మలవడదనియు నది జాతికే సమ్మతముకాదనియుఁ దెలెడిని. మనస్సుఖ మేకాలమునఁ గలిగి యుండునో యదియే యుత్సాహకాలమగును. కంఠస్వరము సంతోషమును దెలుపుచుండును అని.

"అశోకస్తబకాంగారష్షట్పదస్వననిస్స్వనః,
మాం హి పల్లవతామ్రార్చిర్వసంతాగ్నిః ప్రధక్ష్యతి." ౨౮

అని మూ. "అనేన స్వప్రేమజనకభక్తియుక్తా ఉచ్యంతే" అని యాచార్యులు. మనమిట్లు గ్రహింతము. రక్తపుష్పములచేఁ గఠోరవర్ణములుగల మంత్రము లుచ్చరించుచుఁ బంచపల్లవాదులచే నర్చించుచు హోమము చేయువారు నాకు ద్వేషులని రామునాశయము. ఇట్టి హోమములే యాభిచారికములు. అవి పరహింసాప్రయోజనములు. నన్నారాధించువారు క్రూరకార్యములను జేయరాదనియు దుష్ఫలములను గోరరాదనియుఁ దాత్పర్యము.

"న హి తాం సూక్ష్మపక్ష్మాక్షీం సుకేశీం మృదుభాషిణీం,
అపశ్యతో మే సౌమిత్రే జీవితేఽస్తి ప్రయోజనమ్." 30

అని మూ. "ఏతేష్వేవం మత్ప్రేమపరతంత్రేషు సంసారిచేతనో దుఃఖ మనుభవతీత్యేతన్మమాసహ్య మితి భావః" అని గోవిందరాజులు. మన మీరీతిఁ దెలియవలయును. నాకు సర్వవిధములఁ దోడుపడునది ప్రకృతి. ఆమె యిపుడు కారణాంతరమున నాకడ లేనట్టులున్నది. బాహ్యదృష్టి కామె కనఁబడినఁగాని నాయవతారమువలని ప్రయోజనము కలుగదు. అని శ్రీరామునాశయము. సీత రామునికడ లేకుండుటయే యసంభవము. కాని ప్రకృతి రూపమును ధరించి నాకడనున్ననే నాకు నానందము కలుగును. అది లేకున్న నాకు రూపమే యలవడదని సారము. దీనిచేత లోకమున సాధ్వియగు పత్ని యుండిననే సంసారసుఖ మలవడుననియు నట్లుగాకయున్న దుఃఖమే కలుగుననియు లోకుల కుపదేశము.

"పశ్య లక్ష్మణ నృత్యంతం మయూరముపనృత్యతి,
శిఖి ఘార్తైషా భర్తారం గిరిసానుషు. 38

తామేవ మనసా రామామ్మయూరోప్యుపధావతి,
వితత్య రుచిరౌ పక్షౌ రత్తైరపహాసన్నివ." 3౯

అని మూలము. "అత్ర శిష్యాచార్యయోరన్యోన్యప్రావీణ్య ముచ్యతే" అని యాచార్యులు. శిష్యులు లేక యాచార్యులకు గతి సాగదు కాఁబోలు. మనమీరీతిగా గ్రహింతము. భర్తృహితమును బాటించుటయే భార్యకు ధర్మము. భార్యాహితమును గోరి వర్తించుటయే భర్తకు ధర్మము. ఇట్టు లన్యోన్యహితమునుగోరి వర్తించువారికే సంసారసుఖ మలవడును. ధర్మకార్యములు చేయసాధ్యమగు. అట్లు లేకయున్నఁ గాదు. కావున లక్ష్మణా! దంపతులు మావలె ననఁగాఁ బ్రకృతిపురుషులవలె నన్యోన్యసంబంధముకలవారలుగా నుండవలయు. ఏకార్యమైనను భార్యకుఁ దెలియకయుండఁ బతి యొనరింపరాదు. ధర్మపత్ని యన్నమాట యిందులకే వచ్చినది. విధివిహితకార్యములయం దిరువు రేకమనస్కులై ప్రవర్తింపవలయునని శ్రీరామునియాశయమని మనము తెలిసికొందము.

"అపత్యం ధర్మకార్యాణి శుశ్రూషా రతిరుత్తమా,
దారాధీనస్తథా స్వర్గః పితౄణామాత్మనశ్చ హ".

అన్న మనుస్మృతివాక్యము నీయర్థమునే తెలుపుచున్నది.

"పశ్య లక్ష్మణ పుష్పాణి నిష్ఫలాని భవంతి మే. ౪3
పుష్పభారసమృద్ధానాం వనానాం శిశిరాత్యయే."

అని మూలము. "సంసారిదుఃఖం పశ్యతో మే జ్ఞానిలాభోఽపి కించిత్కర ఇవ భాతీత్యర్థః" అని గోవిందరాజులు.

"సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ,
తతో యుద్ధాయ యుజ్యస్వ నైనం పాపమవాప్స్యసి." 3౮

అను భగవదుపదేశ మీయాచార్యులుగారిభావము ననుస రించిన నెగిరిపోవును అంతియగాక నిర్లిప్తత్వము భగవంతు నకు నూడిపోవును. ఈభాగమునుండి మన మీలాగు తెలిసి కొందము. లోకమున నెందఱు సత్పురుషులు కనఁబడుచున్నను యశోభారమున వారు వెలయుచున్నను, వారిసద్వృత్తిని గ్రహింపలేని యీర్ష్యాళువులకుఁ బ్రయోజనము కలుగదు. దుష్కర్మరతులకు సాధుసందర్శనము లాభమును గల్గింపఁజాల దని సారము.

"శృణు లక్ష్మణ సన్నాదం వనే మదవివర్ధనం, ౫౬
పుష్పితాగ్రేషు వృక్షేషు ద్విజానాముపజాపతాం."

అని మూ. "అనేన పరమపదే జ్ఞానప్రధానే సామగాయినాం నిత్యముక్తానాం స్థితిరుక్తా" అని యాచార్యులు. పరమపదము జ్ఞానమే ప్రధానముగాఁగలది. భక్తి కందుఁ జోటు లేదేమో. ముక్తిం బొంది మరలువారు కొందఱును పాషాణములవలెఁ గదలనివారు కొందఱు నుందురు కాఁబోలు. ముక్తియనులోక మొకఁడుకలదనుకొనినందునఁ గల్గినయనర్థ మిది. ఇది కేవలము పరిహాసాస్పదము. మనమీభాగమునుండి యిట్లు గ్రహింతము. లోకమునఁ దిర్యక్కులు కూడ సుఖమునేకోరుచున్నవి. పుష్పితాగ్రములగు వృక్షములపయిం గూరుచుండి సంతోష మున ధ్వనిచేయుచున్నవి కదా యీపక్షులు. ఆపుష్పము లెంత యస్థిరములో యీసుఖము కూడ నంత యస్థిరమే. అనుటంజేసి యైహికసుఖ మస్థిరమని యెఱింగినవారు కూడ దానినే కోరుట విచిత్రము. దాని మాని శాశ్వతానందము గల్గఁగోరు టుత్తమమని శ్రీరాముని హితబోధమని గ్రహింపం దగు.

"పద్మ సౌగంధికవహం శివం శోకవినాశనం. ౧౦౮
ధన్యా లక్ష్మణ సేవంతే పంపోపవనమారుతం."

అని మూలము. దీనికి గోవిందరాజులు విశేషార్థములు వ్రాసిరి. కాని యవి యీగ్రంథమునఁ జేర్పఁదగినవి కావు. మనమీవిధముగా గ్రహింతము. ఎంత మనోహరవస్తువు కనఁబడినను దాని మంచిని గ్రహించువారు కొందఱే. కాని యందఱు గారు. తద్విషయమున నెవ్వరు కృషి సల్పియుందురో వారలే దానిని గ్రహింపఁగల్గుదురు. సీతారాములయవతార మెందుల కని యెఱుంగఁగోరిన తత్త్వజ్ఞులే దాని నెఱుంగఁగలరు. ఇతరు లెఱుంగఁగోరరు. కోరినను గ్రహింపఁజాలరు. దీనిచేఁ గర్మసిద్ధాంతము తేటపడుచున్నది. ఎట్టికర్మముల నాచరించిన వారు తదనురూపముగాఁ బ్రవర్తింపఁగల్గుదురు. భగవత్తత్త్వ మిట్టిదని యెఱుంగఁగోరి సత్కర్మములను ఫలముల నాశింపక యాచరించినవారే ధన్యులు. వారలే మాతత్త్వమును గ్రహింపఁగలరని శ్రీరాముని యభిప్రాయమని మన మెఱుంగఁ దగు.

"స్వాస్థ్యం భద్రం భజస్వార్య త్యజ్యతాం కృపణా మతిః. ౧౨౦
అర్థో హి నష్టకార్యార్థైర్నాయత్నేనాధిగమ్యతే,
ఉత్సాహో బలవానార్య నాస్త్యుత్సాహాత్పరం బలం. ౧౨౧
సోత్సాహస్యాస్తి లోకేఽస్మిన్న కించిదపి దుర్లభం,
ఉత్సాహవంతః పురుషా నావసీదంతి కర్మసు. ౧౨౨
ఉత్సాహమాత్రమాశ్రిత్య సీతాం ప్రతిలభేమహి,
త్యజ్యతాం కామవృత్తత్వం శోకం సన్న్యస్య పృష్ఠతః. ౧౨౩
మహాత్మానం కృతాత్మాన మాత్మానం నావబుద్ధ్యసే,

ఏవం సంబోధితస్తత్ర శోకోపహతచేతనః. ౧౨౮
న్యస్య శోకంచ మోహంచ తతో ధైర్యముపాగమత్."

అని మూ. ఇవి లక్ష్మణవాక్యములు. ఈరూపమున మహర్షి వాల్మీకి లోకులకు సదాచారములను బోధించెను. ధైర్యము కలుగుటయే భావిశుభసూచనము. దైన్యము సర్వదా త్యజింపఁదగినది. ధైర్యము మాని యేయత్నము చేయకయుండువారే మూఢులు. వారికిఁ గార్యసిద్ధి కలుగనేరదు. ఉత్సాహశక్తి యన్నింటికంటె నుత్కృష్టము. దానిని మించఁదగు బలమే లేదు. అట్టి యుత్సాహము గలవాఁడు దుర్లభకార్యములను సాధింపఁగలఁడు. వానికిఁ గ్లేశమే యుండదు. కామాసక్తి సకలసత్కార్యభంగకరము. దానిని జయింపవలయును. శ్రీరామా! నీవెట్టివాఁడవో మఱువక స్మరింపుము. అనఁగా మాయామానవనటనము వదలుమని భావము. అనఁగానే శ్రీరాముఁడు సమాహితాంతఃకరణుఁ డయ్యెను. ఇట్లనుటం జేసి విజితేంద్రియుఁ డుత్సాహవంతుఁడు కార్యకరణాసక్తుఁడు నగువానికి సిద్ధి కలుగునని సారము. తన్నుఁ దాఁ దెలియందగు ననుటం జేసి

"ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయంత్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా."

అను ప్రమాణము ననుసరించి నేనను నహంకారమును మాని గవంతుఁడు నన్నీ కార్యము చేయఁబూనిచె నన్న విశ్వాసము కలవాఁడు కావలయునని యెఱుంగందగు. అనఁగా నీభావము గలవానికి భగవత్సహాయము కలుగకపోదని తాత్పర్యము. ఈశ్వరుఁడు కలఁడని తనప్రయత్నము తాఁజేయక యలసుఁడు

కారాదని యిది మనకుఁ దెలుపుచున్నది. నాచేత నేపనియుఁ గాదను నూహ దుర్లక్షణము.

"నాత్మాన మవమన్యేత పూర్వాభి రసమృద్ధిభిః,
ఆమృత్యోశ్శ్రియమన్విచ్ఛేన్నైనాం మన్యేత దుర్లభామ్."

అని మనుస్మృతియు బోధించుచున్నది. ఈభావమునే రామాయణము కూడ సూచించుచున్నది.

## సుగ్రీవుఁడు రాఘవులకడకు మారుతిం బంపుట.

*అచ్చోట నారామలక్ష్మణులు దివ్యాకృతులు వెలయ ధనుర్బాణాదిధారులై వీరులై యుండుటంగాంచి సుగ్రీవుఁడు శంకితుఁడయ్యెను. నలుదెసలు చూచుచు నొక్కచో నిలువఁ జాలకపోయెను. వారిని జూచుకొలఁది నతనికి మనోధైర్యము తగ్గెను. దాన దుఃఖము పాదుకొనియె. రాజధర్మవేత్తకాన మంత్రులతో నాలోచించి కార్యనిశ్చయమున భీతినొందెను భీతి మిక్కిలి కాఁగా మంత్రులతో నీవీరులు వాలిపంపినచారులు. మునివేషముననుండుట మోసము. ఈగహనమున కేతెంచిరనుట నిక్కము. అనఁగా వారును మహాధనుర్ధరుల వారలం గని ప్రభువు పలికినది నిజమే యని తలంచి వేఱొకపర్వతశిఖరమున కరిగిరి. చెల్లాచెదరుగఁ బోయి మరల నందఱొకచోఁ జేరిరి. ప్రభువుచుట్టు నుండిరి. మరల నొకకొండనుండి యింక నొకకొండకు శిఖరముల వడఁకించుచుఁ దుద కొకచోఁ గూడి తమవలెఁ బాఱిపోయి యొంటిగానుండు సుగ్రీవునిఁ గొలిచి యుండిరి. మఱియు భయమున నెగురుచుఁ బూవుల రాల్చుచు

*ఇయ్యది రెండవసర్గమునఁ గలదు.

మృగములు భయమునొందఁజేయుచు ఋశ్యమూకమును జేరి రాజుకడఁ గరములు మోడ్చి కొలిచియుండిరి.

అంత వాగ్విశారదుఁడగు పావని వాలివలన శంకితుఁడగు సుగ్రీవుని గని మీరెల్లరు నిట్లు వాలినిమిత్తమున నుద్వేగమొందవలదు. ఇది ఋశ్యమూకము కదా. ఇందు వాలి భయమున కవకాశమే లేదు. ప్రచ్ఛన్నరూపమున వాలి వచ్చినాఁడని కదా భయంపడుచున్నారు. ఆతనిజాడలు వీరియందుఁ గానరావు. రాజా! నీపత్ని నపహరించిన పాపకర్ముఁడగు వాలి జాడ లించుకయు వీరియందు లేవు కాన భయ ముడుగుము. అల్పబుద్ధింగొని యిట్లు కలఁతనొందుచున్నావే. నీవానరత్వము విస్పష్టము కాలేదా. ఇంగితములచే బుద్ధిమంతులు పరుల భావములను గ్రహింతురు. బుద్ధిబలములేని రాజు రాజ్యమును బాలింపఁజాలఁడు. సుగ్రీవుఁ డాహనుమపలుకులు విని మంచిమాటలతో హనుమంతా! ఆజానుబాహువులు లోనగు లక్షణములుగల వీరు దేవకుమారులం బోలియున్నారు. వీరిం గాంచిన నెల్లరు భయపడవలసినవారలే. వాలియని భయపడ లేదు. ఆతఁడు వీరిఁ బంపెనని యనుమానించుచున్నాఁడను. వాలి కిట్టి మిత్రులుందురా యందువేమో రాజులకు స్నిగ్ధులు పెక్కండ్రుందురు. కనుక వారియెడ విశ్వాస మునుపరాదు. విరోధులుగలవాఁడు తనపైఁ బగదీర్ప రహస్యవృత్తిం దిరుగు పగవారల జాగరూకుఁడై తెలిసికొనవలయు. లేనిచో వారు వానిని నమ్మించి వానిని దమరు నమ్మక యేమఱి యుండుతఱి హింసింతురు. వాలి స్వకార్యనిర్వాహణదక్షుఁడు. దూరదృష్టి యతనికి మెండు.

కపివరా! సామాన్యవేషముం దాల్చి పోయి భావ సూచకకాయికవ్యాపారములఁ బరికించి వానిలోని పరస్పర భేదములను బట్టియుఁ దిన్నఁదనము పారుష్యము లోనగు నాకారముల చేతను, బరస్పరసంభాషణముల చేతను వారి యున్నరూపు తెలిసికొనవలయు. వారియాశయములఁ దెలిసి కొనుము. హానిచేయు నూహ వారికింగలదేని యది పోవఁదగు నుపాయముల నొనరించి మన కనుకూలురగునట్లు చేసి పిదప ధనుర్ధరులరై యేల యిందుఁ జొచ్చితి రని ప్రశ్నింపుము. వారి తలంపులు మంచివేయైన మనపక్షమున నుండఁజేసి రాకకుఁ బ్రయోజన మడుగుము. మాటల చేతనే వారు సాధువులో యసాధువులో తెలిసికొనవచ్చుఁగదా. హనుమంతుఁ డాల కించి యచ్చటికిఁబోవ సమ్మతించెను. రాజువాక్యములఁ గొని యాడి యట్లే యొనరింతునని పలికి రాఘవులకడ కరిగెను.

ఆర్యులారా! ఇందలివిశేషముల నరయుదము. భగవ త్సందర్శనము కాగానే సంతోషావిష్టుఁడు కావలసినందు లకు బదులుగా భయశంకితుఁ డేల కావలయును? అని ప్రశ్నింపరాదు. ఎంతవారికైనను స్వభావము మీఱఁ దరము కాదు. వానరములకుఁ జాంచల్యము సహజము. దాని త్రిప్పు లకుఁ దొలుత లోనై పిదప భగవద్దర్శనజాతసుకృతము నను భవింపఁ దగు. సుగ్రీవుఁ డట్లే యనుభవించె నని యీభాగము మనకుఁ దెలుపుచున్నది. తొలుత హనుమయు నతనియట్లే భయంపడి కొండలవెంటఁ దిరిగెను. కాని తనయవతారమునకు ఫలము గల్గింపఁ దగిన యదను సమీపింపఁగా స్వస్థమనస్కుఁ డయ్యెను.

"సంభ్రమ స్త్యజ్యతా మేష సర్వైర్వాలికృతే మహాన్,
మలయో௨యం గిరివరో భయం నేహా స్తి వాలినః. ౧౪
యస్మాదుద్విగ్నచేతా స్త్వం ప్రద్రుతో హరిపుంగవ,
తం క్రూరదర్శనం క్రూరం నేహ పశ్యామి వాలినం. ౧౫
యస్మాత్తవ భయం సౌమ్య పూర్వజాత్పాపకర్మణః,
స నేహ వాలీ దుష్టాత్మా న తే పశ్యామ్యహం భయం." ౧౬

అని మూలము. భగవంతుని జక్కఁగాఁ జూడక హను మయుఁ గలవిలంపడియెను. ఏకాలమున నతనితోఁ గార్యము కావలసియున్నదో యాసమయమురాఁగా నితరులకు హితముఁ దెలుపువాఁడు కూడ నయ్యెను. ఋశ్యమూకమునకు మలయ పర్వతమను నామాంతరము గలదు. అది యీకాండమునందే ముందు స్పష్టము కాఁగలదు. దర్శనమాత్రమున సాధువులు సాధువుల నెఱుంగఁగలరు. పాపకర్మరతుఁడు దుష్టాత్ముఁడు నగు వాలి యిట లేఁడే. ఏల భయపడెదవు? అనఁగా భావ మేమి? ఎన్ని కపటోపాయములు పన్నినను దేటగ్రైన తేజము వారియాననముల నెట్లు నిలువఁగలదు, మనోమాలిన్యమును మోము తేటపఱచునని ప్రాజ్ఞులు తెలుపుదురు. అది సత్యమే యని యీభాగము మనకుఁ దెలుపుచున్నది. దీనినుండి గ్రహింపఁదగినదేది? దుష్కర్మముల నాచరించువారల మొగముల యందలి తేజస్సు మలినముగఁ దోఁచుచుండు. సాధుకర్మముల నాచరించువారిమోముల వెలయు తేజము నిర్మలముగ నుండు. ఈవిషయము యోగశాస్త్రగమ్యము. కనుక శ్రీరామ లక్ష్మణులు దుఃఖాభిభూతులుగాఁ దోఁచుచున్నను వారిభావ ములు సమంజసములుగాన దివ్యతేజస్సు కనంబడుచుండెను. హనుమంతుఁడు నట్టివాఁడే కాన నతఁడే తెలుపఁబూనెను.

మనము పరోపకారాదికార్యనిరతులమగుచు భగవంతు నాశ్ర యించిన నిర్మలతేజస్సు గనంబడుచుండును. లేనిచో నది మలి నమై కనఁబడుచుండు.

"వాలిప్రణిహితావేతౌ శంకేఽహం పురుషోత్తమౌ,
రాజానో బహుమిత్రాశ్చ విశ్వాసో నాత్రహి క్షమః. ౨౧
... ... ... ... ...
తౌ త్వయా ప్రాకృతేనైవ గత్వా జ్ఞేయౌ ప్లవంగమ,
ఇంగితానాం ప్రకారైశ్చ రూపవ్యాభాషణేన చ. ౨౪
లక్షయస్వ తయోర్భావం ప్రహృష్టమనసౌ యది,
విశ్వాసయన్ ప్రశంసాభి రింగితైశ్చ పునఃపునః." ౨౫

అను నీమూలములు పైన వ్రాసినయాశయమునే బోధించు చున్నవి. మనస్సు ననుసరించి యింద్రియములు వర్తించును. అది ప్రసన్నమైయుండునేని యింద్రియములు ప్రసన్నములు గనేతోఁచును. ఎట్లు? తేజోవ్యాపారముననే. కనుక సత్సంకల్ప ముల నొనరించుచు సాధుకర్మముల నాచరించుచు సదా భగ వంతు నభీష్టరూపనామముల ధ్యానింపవలయు ననుటయే యిందలిసారము.

## హనుమంతుఁడు శ్రీరామసౌమిత్రులం గని భాషించుట.

* మతిమంతుఁడగు నాహనుమంతుఁడు ప్రభువుమా టను విని యాఋశ్యమూకమునుండి రామలక్ష్మణులుండు చోటి కెగిరిపోయెను. వానరరూపమును వదలి సన్న్యాసి రూపమును దాల్చెను. రామలక్ష్మణు లున్నయెడకు నరిగి.

* ఇది మూఁడవసర్గమునఁ గలదు.

నమస్కరించి మధురభాషణముల వారిం బ్రశంసించెను. ఆ యిరువురను యథాశాస్త్రముగఁ బూజించి యిట్లు పలికెను. వన్యమృగాదులఁ గలఁగఁజేయుచుఁ బంపాతీరమునఁ గల భూరుహములం గాంచుచునుండు మీయాకారములు శుద్ధములై మెఱయుచున్నవి. మీరు రాజర్షులవలె దేవతలవలె నున్నారు. ఇట్టులుండు మీరు తీవ్రవ్రతములఁబూని తపస్వివేషములఁ దాల్చి దుర్గమమగు నీప్రదేశమున కేల వచ్చితిరి? ఈపంపాపావనజలములను మీ తేజముల వెలిఁగించుచున్నారు. మీ వేషములు తపస్వులవంటివి. అద్భుతములగు మీరూపములను జూచి యిందలి మృగపక్షులు పాఱిపోవుచుండ సింహమునతిక్రమించు బలపరాక్రమములతో నొప్పుచున్నవారు. ధనుస్సులంబూని మహాతేజముల మించుచున్నారు. ఇట్టి పురుషసింహులగు మీ రెవ్వరు? మీయీతేజ మీపర్వతమును వెలిఁగించుచున్నది. దేవలోకమునుండి వచ్చినవారలని మీ యీదేవపరాక్రమమే తెల్పుచున్నది. తమ నయనారవిందములను జూడఁగా దైవికముగా భూమి కవతరించిన చంద్రసూర్యులవలె నొప్పుచున్నారు. రాజ్యార్హులయ్యు దానిని వదలి జటామండలముల ధరించి యీప్రదేశమున కేల వచ్చితిరి? ఈ బటువైన భుజము లలంకరింపఁబడక యున్నవే ఏటికి? మీ రిద్దఱు సముద్రప్రావృతభూచక్రమేలం జాలుదురని తలంచెదను. మీయీకోదండము లింద్రుని వజ్రాయుధమువలె వెలుఁగుచున్నవి. భయంకరవైరిప్రాణములఁదీయు నారాచము లమ్ములపొదులయందు నిండియున్నవి. ఈ రెండు ఖడ్గములు వికంచుకవిషధరములవలెఁ గనఁబడుచున్నవి. నాయీనుడులకు మీ రేల యుత్తరము పల్కకయున్నారు?

ధర్మాత్ముఁడు సుగ్రీవుఁడను నొకవానరేశ్వరుఁడు తన యన్న వంచింపఁ దఱుమఁగా భూతలంబున దుఃఖమునఁ దిరుగు చున్నాఁడు. ఆతఁ డనుప వచ్చితిని. హనుమంతుఁడని పిల్వఁ బడు వానరుఁడను. మారాజు మీతోఁ జెలిమి చేయఁగోరు చున్నాఁడు. నేనతని మంత్రిని. వాయుపుత్త్రుఁడను. రాజునకుఁ బ్రియము చేయుకోర్కి భిక్షురూపమున ఋశ్యమూకమునుండి వచ్చితిని. పోఁదలంచినచో నెందైనఁ బోవఁగలను. కామ రూపుఁడను అని పలికి మఱియుఁ బలుకక యూరకయుండెను. హనుమంతునిమాటల నాలకించి శ్రీరాముఁడు మోము తెల్వి నొంద లక్ష్మణునితో నిట్లు పలికెను, ఇతఁడు సుగ్రీవసచివుఁడు. అతనింజూడఁ దలంచు నాకడ కతఁడే యీతనిం బంపెను. వాక్కుశలుఁడగు నితఁడు మాయిరువురియందు స్నేహముకల వాఁడు. ఇతనితోఁ జక్కఁగ మాటలాడుము. ఋగ్వేదము నేర్వక యజుర్వేదము నెఱుంగక సామవేదపరిచయము లేని వానికి నిట్లు పలుక నించుకయు శక్యము కాదు. వ్యాకరణపరి చయ మతనికి మెండు. ఏలయందువేమో. ఇంతసేపు మాట లాడుచున్నను సుంతయే నపశబ్దము దొరలదు. మాటలాడు తఱి నీతని ముఖనేత్రభాలములయందు భ్రూలతలయందు నితరావయవములయందు నెందుఁగాని నవంతయు వికారము కానరాదు. మాట శబ్దవిస్తృతిగాంచక పదవర్ణసందేహములు లేక కుంటువడక వేగములేక వక్షోజన్యమయి మంద్ర మయ్యును గంఠజనితమై మధ్యమమయ్యు నా రెండింటికి నడిమి స్వరమున మిక్కిలి యుచ్చముగాక నీచమునుగాక వర్తించు చున్నది. వ్యాకరణసమ్మతమై మనోహరమై తగుశబ్దజాలము నుచ్చరించుచున్నాఁడు. వర్ణములు వ్యంజితములగు నురఃకంఠ

శిరస్సుల నాశ్రయించిన యుదాత్తానుదాత్తస్వరితములతోఁ గూడి వింతగలిగించు నీతనిమాట లాలకింపఁగా ఛేదింప ఖడ్గ మెత్తినవానికైనను మనస్సు సంతోషించును. మనలను బ్రశ్నించినట్టి సమర్థుఁడే రాజునకు దూతగానుండఁడో యట్టి రాజునకుఁ గార్యములు ఫలింపవు. అని రాముఁడు పలుకఁగాఁ దానును వ్యాకులచిత్తుఁడు గావున నాహానుమంతుని గాంచి విద్వాంసుఁడా! సుగ్రీవుని మహాగుణముల నెఱింగియే యున్నాము. ఆవానరేంద్రునే మేమును వెదకుచున్నాము. రాజాజ్ఞచే నేమి చెప్పితివో యట్లు మేము గావింతుము. ఆ మాటలకు హనుమ సంతుష్టుఁడై వాలివధమున కవకాశము గలుగునని నిశ్చయించి వారలతో సుగ్రీవునకు మైత్రిని గలిగింపఁగోరెను.

మహాశయులారా! ఈభాగమునఁ గల విశేషముల విమర్శింతము. "ద్వితీయే చేతనస్య భగవదపరాధభీతస్య తస్మిన్నాభిముఖ్య ముక్తం. అథ తల్లాభహేతాచార్యకృత్యం దర్శయతి తృతీయే." అని గోవిందరాజులు వ్రాసిరి. రెండవ సర్గమునఁ జేతనుఁడు భగవదపరాధమువలని దండమునకు భీతుఁడై యభిముఖుఁడు కాకపోవుట ప్రతిపాదింపఁబడిన దనియు, నతఁడు భగవంతుని బడయుటకై యాచార్యుఁడు చేయు కృత్య మీమూఁడవసర్గమునఁ బ్రతిపాదింపఁబడుచున్న దనియు వ్రాసిరి. దీనింబట్టి చూడఁగా నాచార్యుఁడు లేక భగవదనుగ్రహము గలుగు నవకాశమే లేదని వీరిమతమని తెలిసెడిని. శరణాగతిని సాధించుట కిదియే మార్గమేమో. సర్వ ధనము నాచార్యాయత్తము గావించి తదుచ్ఛిష్టశేషమును మహాప్రసాదమని భుజించినఁగాని భగవదనుగ్రహము కలుగ

నాచార్యుఁ డనుగ్రహింపఁడు. ఎన్ని కట్టుదిట్టములు చేయఁబడి నవో చూడుఁడు. ఇన్ని యుక్తులు పన్నినఁగాని డబ్బు రాలదు. మన మాత్రోపను వదలి యిందేది సారమని పరికింతము.

"కపిరూపం పరిత్యజ్య హనూమాన్మారుతాత్మజః,
భిక్షురూపం తతో భేజే శఠబుద్ధితయా కపిః. ౨
తతస్స హనుమాన్వాచా శ్లక్ష్ణయా సుమనోజ్ఞయా,
వినీతవదుపాగమ్య రాఘవౌ ప్రణిపత్య చ. 3
ఆబభాషే తదా వీరౌ యథావత్ప్రశశంస చ."

అని మూ. "శఠబుద్ధితయా వంచకబుద్ధితయా" అని గోవింద రాజమహేశ్వరతీర్థులు వ్రాసిరి. "భిక్షురూపం నైష్ఠికబ్రహ్మచర్యరూపమ్" అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి. "భిక్షురూపం సన్న్యాసివేషం" అని గోవిందరాజులు వ్రాసిరి. సన్న్యాసి రామలక్ష్మణులకు నమస్కరించె ననువిషయమున నేమెమో తర్కించి తర్కించి తుదకు నేదో సమాధానము వ్రాసి గోవిందరాజులు చల్లగా దాఁటిరి. కాని నైష్ఠికబ్రహ్మచర్య రూపమను దాని నంగీకరింపరైరి. 'భిక్షురూప'మ్మనుచో నర్థమే మని విచారింతము.

"బ్రహ్మచారీ యతిశ్చైవ విద్యార్థీ గురుపోషకః,
అధ్వగో క్షీణవృత్తిశ్చ షడేతే భిక్షుకాః స్మృతాః."

అని అత్రి పలికెను. హనుమంతుఁ డీవేషమును ధరింపక పూర్వము భూషితాంగుఁడు. మంత్రులలో నొకఁడు కదా. ఈ కార్యమునకుఁ బూని యామంత్రిరూపమును మార్చుకొని బ్రహ్మచారి యెట్లుండవలయునో అట్టి యాకృతి ననుసరించెను. కటకకుండలాదుల వదలెనని భావము. తాను శాఖామృగ

జాతికిఁ జేరినవాఁడు గావున మానవుల నత్యద్భుతతేజోవిరాజితులంగాంచి నమస్కరించెనని మన మూహింపవచ్చును. 'శఠబుద్ధితయా' అనుచో విచారింతము. వంచించు నభిప్రాయముచే నని యర్థము గ్రహించిన నించుక లోపము వాటిల్లక మానదు. రామలక్ష్మణుల వంచించు తలంపునఁగాదు. తనరూపమును వంచించు తలంపుననని భావము. ఈరూపమున నేగిన వారిమనోభావముల నెఱుఁగ శక్యముగాక పోవునేమో యని యెంచినైష్ఠిక బ్రహ్మచారివేషమూని వారియాశయములఁ గనుఁగొనఁ గోరెనని తాత్పర్యము. నైజరూపముదాఁచుటయే యిట వంచనమని యెఱుంగందగు. కేవల బ్రహ్మచారియే యను భావము వారికిం గల్గఁజేయఁబూనె ననియే సారము. ఇట హనుమత్కృతనమస్కారమే భావి తత్కార్యపరత్వమును దెల్పును.

''ఏవం మాం భాషంతం కస్మాద్వై నాభిభాషథ.'' ౧౬

అని మూ. హనుమంతుఁడు రామలక్ష్మణులరూపము నాయుధాదులను వ ంచెను కాని వారు మాటలాడరైరి. అత్తఱి నేనిట్లు పలుకుచున్నను మీరేల బదులు పల్కకున్నవారని మరల నతఁడే ప్రశ్నించెను. రామలక్ష్మణు లేల బదులు చెప్ప లేదు? అని విచారింతము. ఆంజనేయుఁడు శఠబుద్ధిత్వమునఁ దనరూపమును మఱుగుపఱచెను. మీరేల యిచ్చటికి వచ్చితిరి? అను లోనగు ప్రశ్నములఁ గావించెను. భగవంతుఁడగురాముఁ డీమాత్రమేని కపటము పూనినాఁడు కాన నదియు మాని మాటలాడిన బదులు పలుకుదమని యూరకుండెనని మన మెఱుంగవలయును. అంతదనుక మాటలాడి రామ

చంద్రునిస్వరూపమును దర్శించినందున శఠబుద్ధిత్వము నశింపఁగా హనుమ తనవార్తను దాఁపక తెలుపఁబూనెను.

"యువాభ్యాం సహ ధర్మాత్మా సుగ్రీవస్సఖ్యమిచ్ఛతి,
తస్య మాం సచివం విత్తం వానరం పవనాత్మజం. ౨౨
భిక్షురూపప్రతిచ్ఛన్నం సుగ్రీవ ప్రియకామ్యయా,
ఋష్యమూకాదిహ ప్రాప్తం కామగం కామరూపిణం. ౨౩
ఏవముక్త్వా తు హనుమాం స్తౌ వీరౌ రామలక్ష్మణౌ,
వాక్యజ్ఞౌ వాక్యకుశలః పునర్నోవాచ కించన." ౨౪

అని మూలము. పైనవ్రాసినభావము నీమూలము దృఢపఱచుచున్నది. నేనీవేషమును సుగ్రీవుని మేలుకోరి చేకొంటిని. ఆతనిమంత్రిని. వాయుపుత్త్రుఁడను. అని తన వాస్తవవృత్తాంతమును దెలిపి మరల మాటలాడక యూరకుండెను. హనుమ శఠబుద్ధిత్వము నెడఁబాసి యున్నదున్నట్లు పలుకఁగనే భగవంతుఁడుత్తరము చెప్పఁదలంచెను. దీనింబట్టి భగవంతుఁడు వేషాదుల మెచ్చఁడనియుఁ, బరిశుద్ధాంతఃకరణమునే మెచ్చుననియుఁ, గనుకనే యంతదనుక బదులు పలుకక యపుడు బదులుపలుకఁబూనెననియు మన మెంచవలయును.

"చతుర్విధా భజంతే మాం జనాస్సుకృతినోఽర్జున,
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ. ౧౬
తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే,
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః." ౧౭

అను నీ భగవద్గీతావాక్యములను బరిశీలించిన నీయర్థమే పొడకట్టెడు. ఇందొక్కవిశేషము గలదు. జ్ఞానము భక్తియు వేఱు వేఱు మార్గము లనువాదము సరసము కాదని పెక్కు

తావుల వ్రాసియుంటిని. జ్ఞానియే యేకభక్తిశబ్దవాచ్యుఁడు తత్త్వమెఱింగినవాఁడు కావున నిత్యయుక్తుఁడు. ఏకభక్తిశ్చ భజనార్హమును వేఱొకదానిని గాంచనివాఁడని భావము జ్ఞాని కానిచో భక్తుఁ డెట్టులగును? భక్తుఁడు కానిచో జ్ఞాని యెట్టులగును? కర్మరతుఁడు కానివాఁడు భక్తుఁడు జ్ఞానియు నెట్లగును? అగుచో నతఁడు వంచకుఁడే యగును. మాటల వేదాంతము నేర్చుకొన్న వంచకుఁడని తాత్పర్యము. ఇవన్నియు నొకదాని వదలి యొకటి యుండ వలనుపడవనియు నిన్నియుం డినఁగాని భగవంతునికరుణకుఁ బాత్రుఁడు కాఁడనియు భావము. యోగికానిచో నీమూఁడును ధృఢతం గాంచవు.

"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః."

అను గీతావాక్యము ననుసరించి యోగికానిచో సమదర్శనుఁడు కాఁజాలఁడు. యోగము నభ్యసించి సత్కర్మానుష్ఠానమును నభక్తులు గలిగి ఫలములను భగవదర్పణము చేయుచు నాచరించిననే భగవదనుగ్రహమును గాంచఁగలఁడని తేలుచున్నది. ఈగీతావాక్యము ననుసరించి యోజించిన దేవాలయములను గట్టించి పాషాణములను స్థాపించి వానిమూలమున ధనము నార్జించుట వ్యర్థమని యేర్పడుచున్నది. సర్వభూతములయందున్న భగవంతుని గాంచువాఁడే భక్తుఁడు.

"సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే."

అని గీతావాక్యమే యీయర్థమున కాధారము. అట్టివాఁడే యనఁగా నేకత్వమును గాంచువాఁడే నాకుఁ బ్రియుఁడని

కదా భావము. విగ్రహారాధనము ఫలవంతము కాదనియు యోగదృష్టిచే భగవంతు నెల్లతావుల నొక్కరూపునఁ జూచుటయే ఫలవంతమనియు దీనిభావము. పాషాణలోహాది నిర్మితవిగ్రహములం జూపి యివియే ముక్తినొసంగుననుట యెట్టిదో యోజింపవచ్చును. అది పామరులను వంచించి ధనము సంపాదించుటకు, ముక్కు చెవులు మూసికొని కూరుచుండి ఛాయాపటములఁ దీయించుకొనుటకు, వారిమూలమున మర్యాదనొందుటకుఁ బన్నిన పన్నాగములనియే మన మూహింపవలయును.

> "సచివోఽయం కపీంద్రస్య సుగ్రీవస్య మహాత్మనః,
> తమేవ కాంక్షమాణస్య మమాంతికముపాగతః. ౨౬
> తమభ్యభాష సౌమిత్రే సుగ్రీవసచివం కపిం,
> వాక్యజ్ఞం మధురైర్వాక్యైస్స్నేహయుక్తమరిందమ. ౨౭
> నానృగ్వేదవినీతస్య నాయజుర్వేదధారిణః,
> నాసామవేదవిదుషశ్శక్యమేవం ప్రభాషితుం. ౨౮
> నూనం వ్యాకరణం కృత్స్నమనేన బహుధా శ్రుతం,
> బహు వ్యాహరతానేన న కించి దపశబ్దితం. ౨౯
> న ముఖే నేత్రయోర్వాపి లలాటే చ భ్రువోస్తథా,
> అన్యేష్వపి చ గాత్రేషు దోషస్సంవిదితః క్వచిత్." ౩౦

అని మూలము.ఇవి శ్రీరామవాక్యములు. శతబుద్ధిత్వముమాని హనుమ సత్యమును వచింపఁగా రాముఁ డానందించి యిట్లు పలుకుచున్నాఁడు: ఎవనికొఱకు మనము వెదకుచున్నామో ఆతనిమంత్రి మనకడకే వచ్చినాఁడు. కాన వత్సా! చక్కఁగా స్నేహయుక్తముగా మాటలాడుము. ఈతఁడు వాక్యజ్ఞుఁడు.

వేదత్రయము నెఱుంగనివాఁడైన నిట్లు మాటలాడఁ జాలఁడు. వ్యాకరణము పెక్కుసారులు విన్నాఁడు. లేనిచో నిన్నిమాటలు మాటలాడిన నపశబ్దము కలియనీయఁడు. వేదములు వేదాంగములు కూడ నేర్చినవాఁడని రాముఁ డెఱింగెను. వర్ణములు స్పష్టములుగా నుచ్చరించుట ఋగ్యజుర్వేదపఠనము వలని ఫలమనియు, మధురముగా నుచ్చరించుట యనఁగా నించుక దీర్ఘముగానుచ్చరించుట సామవేదపఠనఫలమనియు నేశబ్దము లెట్లుచ్చరింపవలయునో యావరుస తప్పకుండఁ బలుకుట వ్యాకరణశాస్త్రవిజ్ఞానఫలమనియు శ్రీరాముఁడు వెల్లడించెను. మంత్రముల భగవంతు నుపాసించి తత్త్వము నెఱింగి భగవంతుని సంకీర్తించినవాఁడు హనుమంతుఁడని తేటపఱచెను. ఋగ్వేద ముపాసనమంత్ర బాహుళ్యము. యజుర్వేదము కర్మముల ననుష్ఠించి భగవంతుని సంప్రీతునిం జేయఁ దెలుపునది. సంకీర్తనరూపమునఁ బరమేశ్వరు ననుగ్రహపాత్రుని జేయునది సామవేదము. ఈమూఁడును వేఱువేఱుమార్గములు. ఇన్నిమార్గముల నెఱుంగువాఁడు హనుమంతుఁడని శ్రీరాముఁడు తెలిపెను. ఈతని శరీరభాగములన్నియు నిర్దోషములుగా నున్నవి. అనఁగా ముఖవర్చస్సు, నేత్రములయందు సుప్రసన్నతయు, ఫాలభాగమున నిర్వక్రతయుఁ గనుబొమలయందను నితరావయవములయందు నకుటిలత్వము కనఁబడుచున్నవి. కావున నిష్కళంకుఁడని యీతనిశరీరమే తెలుపుచున్నది. మనోదోషములు గలవారల కాదోషములను శరీరభాగము లే తెలుపును నిర్దోషుల కవయవములు తేటగా సుప్రకాశములై యుండును. కపటనాటకసూత్రధారులకు ముఖనేత్రాదుల యందు మాయాకౌశలము నర్తనము చేయుచుండును. ఎంత

దాఁచిన నది దాఁగునా? అట్టివారి ముఖాదులనుబట్టియే మనము కనుఁగొన వచ్చును.

"అనయా చిత్రయా వాచా త్రిస్థానవ్యంజనస్థయా,
కస్య నారాధ్యతే చిత్త ముద్యతాసే రరేరపి." 33

అని మూలము. వాక్పారిశుద్ధ్య మిందుఁ జెప్పఁబడినది. చక్కఁగా మాటలాడుట యనఁగా నిష్కపటముగాఁ గరుణారసపూర్ణముగాఁ బలుకుట. దీనిచే వాగ్దేవీకృపాపాత్రత తేటపడును. వాక్కు నారాధించుట యెట్లనఁగా "సత్యపూతాం వదేద్వాచమ్" అని మనుస్మృతి తెలిపినట్లు సత్యహితముగాఁ బల్కుటయే శారదోపాసనమని తాత్పర్యము. అట్టివాక్కు వినఁబడఁగాఁ జంపఁ గత్తినెత్తినవాఁడుకూడ సంతోషించును. అనఁగా నతనివాక్కు పగవానిని గూడ రంజింపఁజేయునని భావము. సత్యము భగవత్స్వరూపము. సత్యవాక్కు భగవద్ధితమని పెద్దలందురు. అట్టివాక్కు వినువాఁ డంతకుముం దెంతదుష్టుఁడయినను దచ్ఛ్రవణమున మీఁజిపోవునని భావము. భగవత్తేజ మెట్టివారినైన శాంతచిత్తులనుగాఁ జేయుఁ గదా. మనము శ్రమించి యట్లు సత్యపూతమగువాక్కులఁ బలుక నేర్చుకొన వలయునని మన కీభాగము తెలుపుచున్నది. ఈవిషయము నధ్యాత్మరామాయణమునఁ బరికింతము.

"సుగ్రీవస్తు గిరేర్మూర్ధ్ని చతుర్భిస్సహ వానరైః,
స్థిత్వా దదర్శ తౌ యాన్తావారురోహ గిరేశ్శిరః,
భయాదాహ హనూమంతం కౌ తౌ వీరవరౌ సఖే,
గచ్ఛ జానీహి భద్రం తే వటుర్భూత్వా ద్విజాకృతిః.
వాలినా ప్రేషితౌ కిం వా మాం హంతుం సముపాగతౌ,

> తాభ్యాం సంభాషణం కృత్వా జానీహి హృదయం తయోః,
> ... ... ... ... ...
> ద్యోతయంతౌ దిశస్సర్వాః ప్రభయా భాస్కరావివ,
> యువాం త్రైలోక్య కర్తారావితి భాతి మనో మమ,
> శ్రీరామో లక్ష్మణం ప్రాహ పశ్యైనం వటురూపిణం,
> శబ్దశాస్త్రమశేషేణ శ్రుతం నూన మనేకధా,
> అనేన భాషితం కృత్స్నం న కించి దపశబ్దితం."

౧-వ సర్గము.

దీనింబట్టి చూడఁగా నైష్ఠికబ్రహ్మచారిరూపమును గైకొని పోయి వారిభావముల నెఱింగి రమ్మని హనుమకు సుగ్రీవుఁ డాజ్ఞ చేసెనని కనుపట్టు. కావున రామాయణమునందును భిక్షుశబ్దమునకు నైష్ఠికబ్రహ్మచారి యనునర్థ మసంగతము కానేరదు.

### (సౌమిత్రి తమవృత్తాంతమును హనుమంతున కెఱింగించుట.)

* సౌమిత్రి పలుకు లాలకించి శ్రీరామునకుఁ దమ ప్రభువుతోఁ బనియున్నదని తెలియుటం జేసి సంతుష్టుఁడై తన మది సూర్యపుత్రుని గూర్చి రామునకుఁ బనియున్నది గాన నిఁక నాప్రభువునకు రాజ్యప్రాప్తి కలుగును. అదియు సిద్ధించి నట్లే. అని తలంచి మాటాడనేర్చినవాఁడు గాన హనుమంతుఁడు సంతుష్టుఁ డగుచు రామునిం గాంచి యిట్లు పలికెను.

* ఇయ్యది నాల్గవసర్గమునఁ గలదు. అధ్యాత్మరామాయణవిశేషము లిందుఁ గలవు.

మీ రిరువురు భయంకరమగు దండకారణ్యమునకు విశేషించి పంపాతీరమునకు నేల వచ్చితిరి? అనఁగా రామానుమతి సౌమిత్రి యిట్లు బదులుచెప్పెను. ఆర్యా! దశరథుఁ డనుమహారాజు ప్రజారంజకుఁడై న్యాయ్యముగ రాజ్య మేలుచుండెను. పగ వాఁడనువాఁడే యాతనికి లేకుండెను. ఎవరియందు నతనికి ద్వేషములేదు. సుదక్షిణల నిచ్చి యనేకయజ్ఞము లాచరించెను. ఈరాముఁ డామహారాజునకుఁ దొలికొమరుఁడు. సకల సుగుణములుగల యీరాముఁడు తండ్రియానతిమై వన వాసముచేయ నన్నుం గూడివచ్చెను. సూర్యునిఛాయ యనుస రించునట్లు జానకియుఁ బతిననుసరించి వచ్చెను. నే నీతనితమ్ముఁ డను. లక్ష్మణుఁడనని నన్నుఁ బిలుతురు. మహాత్ముఁడగు నీరాము నకు దాసుఁడనై యుండువాఁడను. మేమిరువుర మాశ్రమ మున లేనితఱిఁ గామరూపధరుఁ డగురక్కసుఁ డాసీత నప హరించెను. ఆతఁ డెవఁడో తెలియరాదు. దనువంశజుఁడు శ్రీ యనువానికొడుకు శాపమున రక్కసుఁడై యుండెను. వాఁడు సుగ్రీవుఁడు సమర్థుఁడని తెలిపెను. మఱియు నాసుగ్రీవుఁడు నీభార్య నపహరించినవానిని దెలిసికొనఁగలఁడని పలికి యా కబంధుఁడు రక్కసునితనువు వదలి దేవరూపమున స్వర్గమున కరిగెను. మావృత్తాంత మున్నదున్నట్లు తెల్పితిని. మేమిరువు రము సుగ్రీవుని శరణుచొచ్చితిమి.

మహాత్ముఁడగు నీరాముఁ డర్థిజనమందారుఁడయ్యుఁ ద్రిలోకనాథుఁడయ్యు సుగ్రీవుని దనకు నాథుఁడుగాఁ గోరు చున్నాఁడు. ఏరామునితండ్రి ధర్మవత్సలుఁడై యందఱికి శరణు నొందఁ దగియుండెనో యట్టిదాశరథి శరణ్యుఁడయ్యును వానరనాథుని శరణు నొందినాఁడు. మున్ను సర్వలోక

ప్రాప్యుఁడై రక్షకుఁడై ధర్మాత్ముఁడగు నాయన్న శ్రీరాముఁ డిత్తఱి శాఖామృగపతిని శరణుపొందినాఁడు. ఏవాఁడు సుప్రసన్నుఁడైన నెల్లరకు సకలపురుషార్థములు లభించునో యట్టి శ్రీరామభద్రుఁ డిపుడు కపిరాజు ప్రసాదమును గోరుచున్నాఁడు. ఎల్లరాజులను మన్నించిన యాదాశరథి ముల్లోకముల సుప్రసిద్ధినిగాంచిన శ్రీరాముఁడు వనములఁ దిరుగుకోఁతులకు విభుఁడగు సుగ్రీవుని మఱుఁగు చొచ్చినవాఁడు. శోకపరతంత్రుఁడై వగపునఁ దనమఱుఁగు చొచ్చిన శ్రీరాముని సుగ్రీవుఁ డనుగ్రహమునఁ జూడవలయును. అని కన్నీరు మున్నీరుగాఁ గాఱఁబలుకు సౌమిత్రిం గాంచి మారుతిమాటల సొంపు తేటపడ నిట్లు పలికెను. బుద్ధివైభవముగలిగి జితేంద్రియులై యక్రోధనులై యుండు మీవంటివారల వానరాధిపతియే వెదకుకొనుచు రావలయును. మీరే యతని భాగ్యవశమున దర్శనమొసంగ విజయంచేసితిరి.

సుగ్రీవుఁడు తనయన్నయగు వాలితోఁ బగగొని యతఁ డిల్లాలి నపహరించి తన్ను మిగుల వంచించి తఱుమఁగా రాజ్యభ్రష్టుఁడై వనమున నున్నవాఁడు. ఆతఁడు మమ్ముం గూడి సీతాదేవి నన్వేషించువిషయమున మీకుఁ దోడుపడఁ గలఁడు. అని పలికి రామునింగని యిఁక సుగ్రీవునికడకుం బోవుదము. అని హనుమ పలుకఁగా లక్ష్మణుఁడు దూతను బూజింపఁదగు రీతిని బూజించి రామునితో నామాటల కితఁడు సంతుష్టుఁడగుటం జేసి సీతాన్వేషణకార్యమున సత్యమునే పలుకుచున్నట్లు తోఁచును. మనతోఁ గార్య మాసుగ్రీవునకుఁ గలదు. కాన మనకార్యముఁ దీర్పఁబూనును. నీవు కృతకృత్యుఁడవు. వాయుసూనుఁ డీతఁడు ప్రసన్నముఖచ్ఛాయతో సంతుష్టి

నొంది స్పష్టముగాఁ బలుకుచున్నాఁడు. కాన నీతఁ డబద్ధము పలుకఁడు. అంత మహాప్రాజ్ఞుఁడగు హనుమంతుఁడు వీరులగు నారాఘవులం దోడుకొని వానరేంద్రునికడ కరిగెను. భిక్షు రూపమును వదలి పూర్వరూపమును గైకొని వారిని వీఁపు మీఁదఁ గూరుచుండఁబెట్టుకొని పోయెను. సుగ్రీవునింగూడ నియమించు శక్తిగలహనుమ సుగ్రీవుని కార్యము సిద్ధించునని తుష్టుఁడై ఋశ్యమూకమును జేరెను.

మహనీయులారా! ఇందు విమర్శింపఁదగినవిషయము లనేకములు గలవు. వాని నరయుదము.

"యదయం కృత్యవాన్ ప్రాప్తః కృత్యం చైతదుపాగతం." ౨

అని మూలము. "యత్ కృత్యవానయం ప్రాప్త స్తత్కృత్యం చైతదుపాగతమ్." అనికదా యన్వయక్రమము. మారాజుతోఁ బనిగల యీరాముఁడు వచ్చినాఁడు. కనుక మారాజు కార్య మైనట్లే. మారాజు రాజ్యమును భార్యను గూడఁ బోఁగొట్టు కొన్నవాఁడు. ఆతనిమూలమునఁ దనభార్యను సాధించుకొను పనిగలిగి యీతఁడు వచ్చినాఁడు. కనుక శత్రువధము రాజ్య భార్యాద్వయప్రాప్తియు మారాజునకుఁ దొలుత కలుగును. సంశయము లేదు. కలిగినట్లే యని హనుమ తలంచెను. ఇందలిసార మిది. భగవంతుఁ డల్పునిమూలమున మహాకార్య మును సాధించును. ఏల? గర్వాంధులగువారి కాగర్వము నశించుటకు. దీనిచే దైవశక్తి యప్రతిహత మగునది యని యేర్పడుచున్నది. శ్రీరామదర్శనము కాఁగానే హనుమంతు నకు బుద్ధి వికసించెను. సన్నికర్షప్రభావ మట్టిది. కనుకనే యుపాసకుఁ డుపాస్యదేవతామూర్తి హృదయపీఠమున నున్న

యట్లు భావించును. దాన బుద్ధి వికసించి తనపని నిర్వహింపఁజాలును. సహజమగు పిఱికితనము మొదలంట నశించును. "తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితం" అని. "యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి" అనియు, గీతావాక్యములను మనము పరిశీలింపవలయు. జపయజ్ఞమున మనస్సు పరిశుద్ధమగును. దాన భగవదనుగ్రహము గల్గును. అను నీయర్థ మీభాగమునఁ గలసారమని మన మూహింపవలయును. ఎందో వైకుంఠాదిలోకముల నున్నవానినిగా భగవంతుని దలంపక స్వహృదయారవిందమున నెలకొనినవానినిగా భావింపనేల యనఁగా సర్వగతత్వము తేటపడుటకే. "భావనామాత్ర సంతుష్టహృదయః పరమేశ్వరః" అన్న సూక్తి యీనాఁటిది కాదు కదా. భగవద్దర్శనము సకలవిషయకజ్ఞానదమనియే మన మెఱుంగవలయును.

"తతః పరమసంహృష్టో హనూమాన్ ప్లవగర్షభః,
ప్రత్యువాచ తతో వాక్యం రామం వాక్యవిశారదః. 3
కిమర్థం త్వం వనం ఘోరం పంపాకాననమండితం,
ఆగతస్సానుజో దుర్గం నానావ్యాళమృగాయుతం." 4

అని మూలము. సౌమిత్రి తనతో మాటలాడుచుండ హనుమ సంతోషమున నతనితో భాషింపక రామునిం బ్రశ్నించు టసంగతము కాదా యందురేమో. కాదు. హనుమ శ్రీరాముఁడే నేర్పుఁడని యెఱింగెను. కనుకనే రామునితో నీవేల తమ్మునిం గూడి యీయరణ్యములకు వచ్చితివని ప్రశ్నించెను. లోకమున నొకఁడు పెక్కండ్రం గాంచిన నందొక్కనియందే విశ్వాసము కలుగును. ఏటికనఁగా నన్యోన్యము ప్రాక్సంబంధమే యందులకుఁ

గారణము. రామకార్యమును సాధింప నవతరించిన హనుమ
తత్సందర్శనమున నత్యంతప్రీతుఁడై తన కతఁడే పరమగతియని
భావించి మాటలాడెను. రాముఁడేల బదులుపలుకక సౌమిత్రి
మూలమున నుత్తరము చెప్పించెనందురేమో. దూతగా వచ్చి
నపుడు లోకాచారము ననుసరించి ప్రభువులు చెంతనున్న వారి
మూలమున బదులు చెప్పింతురు. అది రాజమర్యాద. ఇచ్చో
నతనిని సేవకునిగా గ్రహించుకాల మింకను రాలేదు. సమ
యము రాఁగా మాటలాడఁదగును. గురువు శిష్యుని బరీక్షించి
మంచితరుణమున ననుగ్రహము నిచ్చును. అనఁగా నుపదేశిం
చును. అట్లే భగవంతుఁడు సర్వజ్ఞుఁడయ్యు భక్తుని బరీక్షించి
గ్రహించును. ఆసమయ మింకను రానందున నూరకుండి
తమ్మునిచే బదులుచెప్పించెనని మన మెఱుంగవలయును.

"తస్యాయం పూర్వజః పుత్రో రామో నామ జనైశ్శ్రుతః. ౯
శరణ్యస్సర్వభూతానాం పితుర్నిర్దేశపారగః,

... ... ... ... ...

రాజ్యాద్భ్రష్టో వనే వస్తుం మయా సార్ధ మిహాగతః. ౧౦
భార్యయా చ మహాతేజాస్సీతయానుగతో వశీ,
దినక్షయే మహాతేజాః ప్రభయేవ దివాకరః." ౧౧

అని మూలము. లక్ష్మణవాక్యములివి. "రామో నామ జనైశ్శ్రు
తః." జనులు రాముఁడని పిలుతురని సాధారణముగాఁ జెప్పఁ
దగినయర్థము. ఈయవతారమున రాముఁ డని పిలువఁబడు
వాఁడు. అనఁగా సర్వనామవాచ్యుఁడగు భగవంతుఁడే. కాని
యిపుడు జనులు రామునిగా భావింతురు. ఈయర్థమెట్లు తేలు
ననఁగా "సర్వభూతానాం శరణ్యః" అను తరువాతివాక్యము

మూలమున నని సమాధానము. సర్వభూతశరణ్యుఁడు రాజు కాఁజాలఁడు. భగవంతుఁడే యగును. దీనిచేతఁ గొన్ని నామము లే భగవత్ప్రియములను మధ్యవైష్ణవులతుచ్ఛవాక్కు లెగిరి పోవును. ఎవ్వరేపేరునఁ బిల్చిన ననఁగా వినుతించినను ఏరూపమున ధ్యానించినను భక్తియున్న నాపరమేశ్వరుఁ డానందించునను భావము తేలుచున్నది. విష్ణ్వాదినామములు మాతాతగారి సొమ్మని, యవి యితరమతస్థులకు ఫలము నీఁజాలవనియుఁ బలుకు కుమతులయాశయము నీచాతినీచమని మన మెఱుంగవలయును. వారిమాటల ననుసరించిన నతఁడు భగవంతుఁడు కానే కాఁడని స్పష్టమగును. మామతమే యుత్కృష్టము. ఇతరమతములు నీచములు. అనుభావము నశించినఁగాని భగవదనుగ్రహము కలుగదని మన మెఱుంగం దగునని యీ భాగము మనకు బోధించుచున్నది. రాజ్యాద్భ్రష్టః=రాజ్యము నుండి విడివడినవాఁడై, అనఁగాఁ దన కిది యీడుగా దిపుడని వదలె నని భావము. ధర్మరాజ్యమును స్థాపించుట కిందుండఁ దగదని భావించెనని సారము. వనే వస్తుం మయా సార్థమిహాగతః = వనమ్మున నుండ నన్నుఁగూడి యిచ్చటి కనఁగా దండకాటవికి వచ్చెను. తక్కిన సోదరులున్నను నావలనఁ గాఁదగిన పనులు కొన్ని యున్నందున నన్నుం బిలుచుకొని వచ్చెనని గూఢార్థము. వశీ = జితేంద్రియుఁడు. ఇంద్రియాతీతుఁ డని భావము. నిర్లిప్తుఁ డని సారము. కనుకనే భార్యయా సీతయా చ మహా జాః అయమనుగతః = భరింపఁదగిన దనఁగా వదల వలనుపడనిది. అనపాయిని యని భావము. సీతయా చ= సీతచేతను, అనఁగా నితఁడు రమ్మని పిలువలేదు. ఆమెయే వెంటనంటిన దని భావము. రాముఁ డొక్కఁడే యడవికింబోయిన

నే కార్యము కాదని యెఱింగినది కాన నామహాప్రకృతి యీ మహాత్ముని సాన్నిధ్యమునఁ దానే కార్యభారముం బూనం దలఁచి యనుసరించె నని సారము. ఈయర్థము "దినక్షయే మహాతేజాః ప్రభయేవ దివాకరః." అను వాక్యము స్పష్టము చేయుచున్నది. సాయంకాలమున సూర్యుని ప్రభ యనుసరించు నట్టులు అని. ఇందొక విశేషార్థము కలదు. సూర్యున కుదయాస్తమయములు లేవు. లోకదృష్టి కవి యున్నట్లు తోఁచును. అట్లే రాజ్యభ్రంశాదులు నిర్లిప్తుఁడగు శ్రీరామునకు లేవు. సూర్యుని వదలి ప్రభ యుండనట్లు సీత యీ పరమాత్మను వదలి యుండదని భావము. లోకు లీరామున కిట్టికష్టములు కలిగినవని భావింతురు. కాని వాస్తవమున లేవని యిందలి సారస్యము. దీనిచేత సీతారాముల నన్యోన్యవియోగము లోకదృష్టికిం దోఁచునదియే కాని వాస్తవము కాదని తేటపడి యెడిని. సర్వకార్యములు మహాప్రకృతి తానొనరించుచున్నను నిర్లిప్తుఁడగు భగవంతుని మూలమున సాగునట్లు లోకులకుఁ గనఁబడఁజేయుచున్నదని తాత్పర్యము.

"అహమస్యావరో భ్రాతా గుణైర్దాస్యముపాగతః,
కృతజ్ఞస్య బహుజ్ఞస్య లక్ష్మణో నామ నామతః. ౧౨
సుఖార్హస్య మహార్హస్య సర్వభూతహితాత్మనః,
ఐశ్వర్యేణ విహీనస్య వనవాసాశ్రితస్య చ. ౧౩
రక్షసాపహృతా భార్యా రహితే కామరూపిణా,
తస్య న జ్ఞాయతే రక్షః పత్నీ యేనా స్య సా హృతా." ౧౪

అని మూలము. సౌమిత్రికి శ్రీరాముఁడు భగవంతుఁ డని తెలియకపోయినను వాల్మీకిమహర్షి యతనినోట నీమాటలు పలికిం

చెను. అస్యాహ మవరో భ్రాతా=ఈరామునకు నేఁ దమ్ముఁడను. ఏకగర్భజనితులు కారుకదా యనరాదు. రాముఁడు జనించిన పిదప జనించినవాఁడ నని యర్థము. తల్లులు వేఱుగానున్నను దండ్రియొకఁడేయగుట నిట్లు చెప్పెను. గుణైర్దాస్యముపాగతః=పాయసగుణములచేత ననఁగాఁ బాయసప్రదానకాలమునఁ గౌసల్య యొసఁగినభాగముచేత నని యూహ్యము. దాస్యమ్=దాసత్వమును, ఉపాగతః=పొందితిని. చిన్నతనమునుండి నే నీతనినే యనుసరించి సేవచేయుచున్నాఁడ నని భావము.

"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా."

అనుప్రమాణము ననుసరించి, గుణైః=త్రిగుణములచేత ననఁగా శరీరమును ధరించుటచేత (ప్రకృతివిశిష్టుఁడౌట రూపవంతుఁ డయ్యెను. ఈరూపమున నవతరించె ననుట.)దాస్యముపాగతః=సేవకుఁడ నైతిని. ఈమహాత్ముని సేవించుభాగ్యము గలవాఁడ నైతి నని సారము. ఈయభిప్రాయము నీక్రిందివిశేషణములు సమర్థించుచున్నవి. కృతజ్ఞస్య=చేసినయుపకారమును మఱువనివాఁడు.

"పత్త్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః. ౨౬
యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్." ౨౭

గీత. అ. ౯

అను గీతాప్రమాణము ననుసరించి ప్రీతిచే నేమి యొసంగిన నాదరమున గ్రహించి దానిని మఱువనివాఁడు. తన్నుఁ బ్రేమించువారిని మఱచిపోఁ డని తాత్పర్యము. బహుజ్ఞస్య=

విశేష మెఱింగినవాఁడు. ఇంతకంటె నెక్కువగ నెఱింగిన వాఁడు లేఁడని భావము. సుఖార్హస్య=సుఖములకే తగిన వాఁడు. దుఃఖరహితుఁ డనుట. మహార్హస్య=ఉత్సవములకే తగినవాఁడు. మహానందము గలవాఁడని భావము. సర్వభూత హితాత్మనః=సకలభూతముల హితముగోరు మదిగలవాఁ డనుట. దీనిచేఁ బరమేశ్వరత్వము ప్రతిపాదితము. సర్వభూత ముల హితముగోరువాఁడే కదా భగవంతుఁడు. ఒక్కజాతి యందే ప్రీతిగలవాఁడని వాదించు పాషండుల కిది కంఠ పాశము గాకమానదు. ఏజాతిగాని యట్లు తలంచి గర్వింప రాదు. గర్వించిన నాజాతి మర్యాద గాంచనేరదు. భగవంతుఁ డెల్లజాతులను బ్రేమించి తత్తత్కర్మానుసారము ఫలముల నొసంగువాఁడు. అట్టి యీరామునిభార్యను గామరూపి యగు రక్కసుఁ డపహరించెను. మేమిరువుర మత్తఱి నింట లేము. వానివృత్తాంతము తెలియరాకున్నది. అని లక్ష్మణుఁడు పలికెను. జటాయువు కబంధుఁడు తెలిపిరి కదా. తెలిసియుఁ దెలియదను టసత్యము కాదా యందురేమో. కాదు. శత్రు వృత్తాంతము సర్వము తెలియలేదు. సుగ్రీవునిమూలమునఁ దెలియఁదగు ననియే యింతకు లోపల వారికిఁ దెలిసియుండె నని యెఱుంగవలయు.

"అహం చైవ హి రామశ్చ సుగ్రీవం శరణం గతౌ." ౧౭

అని మూలము. మేమిరువురము మీరాజు శరణుచొచ్చితిమి. అనఁగా మీరాజు గృహమునకు వచ్చితి మని భావము. "శరణం గృహరక్షిత్రోః"=అని యమరము.

"ఏష దత్వాచ విత్తాని ప్రాప్య చానుత్తమం యశః,
లోకనాథః పురా భూత్వా సుగ్రీవం నాథమిచ్ఛతి." ౧౮

అని మూలము. లక్ష్మణునిదుఃఖ మిందుఁ దేటపడును. సామా న్యార్థము సుగమము. ఇందుఁ గర్మసిద్ధాంతము ప్రతిపాదితము. లోకములకు నాథుఁడుగా నుండి యిపుడు సుగ్రీవుని నాథునిగాఁ దలంచి వచ్చినాఁ డనుటం జేసి యెట్టివారికిని గర్మగతులు దురూహాములని తేలెడిని. కర్మము త్రిప్పులకు లోను గానివాఁడు లేఁడనిభావము. ఈయర్థమునే మఱికొన్ని యుదాహారణములచేఁ దెల్పుచున్నాఁడు.

"పితా యస్య పురా హ్యాసీచ్ఛరణ్యో ధర్మవత్సలః,
తస్య పుత్త్రశ్శరణ్యశ్చ సుగ్రీవం శరణం గతః. ౧౯
సర్వలోకస్య ధర్మాత్మా శరణ్యశ్శరణం పురా,
గురుర్మే రాఘవస్సోఽయం సుగ్రీవం శరణం గతః. ౨౦
యస్య ప్రసాదే సతతం ప్రసీదేయురిమాః ప్రజాః,
స రామో వానరేంద్రస్య ప్రసాదమభికాంక్షతే." ౨౧

అను నీ మూలము లన్నియు నెంతటివారికైనను గర్మగతుల మీఱఁ దరముకాదనుసిద్ధాంతము తెలుపుచున్నవి. కనుకనే "గహనా కర్మణో గతిః" అని భగవంతుఁడే తెలిపెను. "భగవంతుఁడు కర్మసిద్ధాంతమును దాను వానరరాజును శరణు చొచ్చునెపమున లోకులకు బోధించెను. ఎవఁడుకాని యీ పదవినుండి తొలంగమని విఱ్ఱవీఁగరాదనియు, నెప్పటికెయ్యది కర్మవశమున లభించునో దాని ననుసరించువాఁడనని భావింపవలయుననియు, నీజాతి యాశ్రయింపఁదగినది. ఈజాతి యాశ్రయింపఁ దగనిదనునది దుర్భావమనియు, నట్టి దుర్భావమును వదలి ప్రాక్కర్మఫలముల సంతోషమున ననుభవింప సిద్ధముగా నుండవలయుననియు మన కీభాగము బోధించుచున్నది. అంతియకాని శరణాగతిని బోధింపదు.

"ఈదృశా బుద్ధిసంపన్నా జితక్రోధా జితేంద్రియాః,
ద్రష్టవ్యా వానరేంద్రేణ దిష్ట్యా దర్శనమాగతాః. ౨౬

అని మూలము. ఇది హనుమద్వాక్యము. లక్ష్మణునిశోకమును దొలఁగించుచున్నాఁడు. "జితక్రోధులు జితేంద్రియులు నగు మిమ్ములను సుగ్రీవుఁడు వచ్చి చూడఁదగినవాఁడు. అదృష్టవశమున మీరే దర్శనమిచ్చితిరి." అని పైవిశేషణములచే దుఃఖము నొందఁదగినవారు కారని యతనిభావము.

"ఏవం బ్రువాణం ధర్మాత్మా హనూమంతం స లక్ష్మణః,
ప్రతిపూజ్య యథాన్యాయమిదం ప్రోవాచ రాఘవం." 30

అని మూలము. లక్ష్మణుఁ డిపుడు దూతయగు హనుమంతుని యథావిధిగాఁ బూజించెను. దీనింబట్టి నైష్ఠికబ్రహ్మచారివేషమును వదలి హనుమ యున్నట్లు తేలెడిని. కపినని తెల్పెను గదా. ఆవిషయమును ముందుఁ గనంబడును.

"ప్రసన్నముఖవర్ణశ్చ వ్యక్తం హృష్టశ్చ భాషతే,
నానృతం వక్ష్యతే వీరో హనుమాన్మారుతాత్మజః." 3౨

అని మూలము. ముఖవర్ణము నిర్మలముగా నున్నది. సంతోషి యని తేలెడిని. ఈతఁ డనృతము పలుకఁడు అనియెను. అనఁగాఁ బ్రసన్నుఁడగువాని ముఖకాంతి పరిశుద్ధముగా నుండును. సంతోషమే నిర్మలాత్ములకుఁ బ్రధానము. అనృతాదులు పాపమూలకములు. కాన నవి పలుకువారలకుఁ బరిశుద్ధముఖకాంతి యుండదు. మోమున వర్చస్సు కనఁబడఁగనే వారు సాధువులని యోగ్యులు కనుఁగొందురు. హనుమయు భగవత్కార్యనిర్వాహణదక్షుఁడు కాఁబోవుచుండఁగా నతనిమోమున దివ్య

తేజస్సు లేకపోవునా. అది కనఁబడుటం జేసియే యీవీరుఁ డనృతవాది కాఁడని సౌమిత్రి కనుఁగొనెను.

"భిక్షురూపం పరిత్యజ్య వానరం రూపమాస్థితః,
పృష్ఠ మారోప్య తౌ వీరౌ హరిరాజాయ రాఘవౌ." 38

అని మూలము. "భిక్షురూపం ప్రతిచ్ఛన్నం సుగ్రీవ ప్రియ కామ్యయా, ఋశ్యమూకాదిహ ప్రాప్తం కామగం కామరూపి ణమ్." అని పూర్వసర్గమునఁ జెప్పినాఁడు. కనుకనే బ్రహ్మచారి రూపమును వదలి వానరుఁడుగాఁ గనఁబడఁగనే వారు సంశ యింపలేదు. "వచస్యేకం మనస్యేకం కర్మణ్యేకం మహాత్మనామ్." అన్నసూక్తిని వారు విశ్వసించిరి. వారి పూర్వకర్మములు ఫలోన్ముఖములు కాఁగా సంశయము గలుగునవకాశ మెట్లుం డును? సేవ్యసేవకభావము లన నిట్టివే. దండకారణ్యమున నెందఱో మాయికులుండఁగా వారినుండి యెన్నియో బాధలు కలుగఁగా ననుభవించియు హనుమంతుని గాంచగనే వారు విశ్వసించిరనఁగా సకలము కర్మాధీనమనుసిద్ధాంతము ప్రబలతర మని మన మెఱుంగవలయుఁ గదా. అధ్యాత్మరామాయణ మునందును విశేష మీభాగమున నేమియుఁ గనంబడదు.

## రామసుగ్రీవసఖ్యము.

* హనుమంతుఁడు ఋశ్యమూకమునుండి మలయగిరి కరిగి వానరరాజుం గాంచి రామలక్ష్మణుల యాగమనము నిట్లు తెలిపెను. మహాప్రాజ్ఞుఁ డగు రాముఁడు తమ్ముఁడు వీరె వచ్చియున్నారు. శ్రీరాముఁడు సత్యపరాక్రముఁడు. ఇక్ష్వాకు వంశప్రభవుఁడు. దాశరథి. అను మొదలగువారివార్తలఁ

* ఇది యైదవసర్గమునఁ గలదు.

దెలిపి యిపుడు నిన్ను శరణుఁ జొచ్చినాఁడు. సకలయజ్ఞముల నొనరించిన దశరథునికుమారుఁడు స్త్రీనిమిత్తమై నిన్ను శరణుఁ జొచ్చినాఁడు. ఆసోదరు లిరువురు నీసఖ్యమును గోరుచున్న వారు. పూజ్యతములు కాన వీరిని బూజింపుము. అనఁగా సుగ్రీవుఁ డానుడులకు హర్షించి మదిఁగల దుందుడుకు మానఁగా వారివలనిభయమును విడిచెను. అంత మానవ రూపమునొంది సొంపుగాఁ గనఁబడుచు శ్రీరాముని దర్శించి సంతసమున మహాత్ములారా! ధర్మపరాక్రమాది సద్గుణము లన్నియుఁ గలవారు. తమప్రభావాదుల నీహనుమ తెలిపెను. ప్రభువరేణ్యా! కనుకనే కేవల వానరుఁడనగు నాతో నీవంటి మహాత్ముఁడు సఖ్యమువాంఛించుట నాకే మహాలాభకరము. నీకు స్నేహమే యిష్టమేని యిదిగో చేయిచాఁచితిని. నీచేత దీనిం గ్రహింపుము. ఇది యనుల్లంఘ్యముగఁ గావింపుము. అని సుగ్రీవుఁడు వచింపఁగా శ్రీరాముఁ డాలకించి సంతుష్టుఁడై యతనికరమును దనకరమున గ్రహించెను. బిగియం గౌఁగిలించుకొనియె.

హనుమయు నచ్చోట మరల ధరించిన బ్రహ్మచారి వేషమును వదలి నైజరూపమును ధరించి యరణులగు శమీవృక్షశాఖలం జిలికి యగ్నిఁ బుట్టఁజేసెను. మండుచున్న యాయగ్ని నర్చించి దానిని శ్రీరామ సుగ్రీవులయంతరమున నుంచెను. రామసుగ్రీవులు చేతులుపట్టుకొని దానికిం బ్రదక్షిణముచేసి తత్సాక్షికముగా స్నేహము గావించిరి. అంత వా రత్యంతప్రీతచిత్తులై యొండొరులం జూచుకొనుచుఁ దృప్తి నొందఁజాలకుండిరి. సూర్యతనయుఁ డారాముం గని హర్షమున శ్రీరామా! ప్రియమిత్రుఁడ వైతివి. నీ నాదుఃఖమొక్కటియే.

నీనాసుఖము నొక్కటియే యని పలికెను. అంతఁ జక్కఁగాఁ బుష్పించియున్న మద్దిచెట్టుకొమ్మ నొకదానినుంచుకొని దానిపై రామునింగూడి కూరుచుండెను. హనుమయు సౌమిత్రికొఱకుఁ జందనవృక్షశాఖను దెచ్చి వైచెను. దానిపై నతఁడు కూరుచుండెను. సుగ్రీవుఁడు నయనము లానందబాష్పకణసంకలితములు కాఁగా మంజులవాక్కు లలర శ్రీరామా! నాయన్న నన్ను మోసగించి భార్య నపహరింపఁగా నతనివలని భయమునఁ గుంది వెతనొంది యీదుర్గమారణ్యమున నిన్నాశ్రయించితిని. వాలి వైరముఁ బూనియున్నందున నేమియుఁ దోఁపక భయమున నిందున్నాఁడను. నాకభయ మొసంగుము. భయములేకుండఁ జేయవలయును. అని సుగ్రీవుఁడు వేఁడఁగా ధర్మవేత్తయు ధర్మవత్సలుఁడు నగు రాముఁడు మహాతేజస్వి గాన నాయర్కజునింగని యిదెంతటికార్యము? అని మోమున సుస్మితమంకురింప నుపకారము చేయుటయే మిత్రలక్షణమని నే నెఱుంగుదును. కావున నీభార్య నపహరించినవానిని వధించెదను. నాబాణము లమోఘములు. కంకపత్త్రయుతములై వజ్రాయుధసమానములై కుపితసర్పములభంగి మహావేగము గలిగినవి. అవి దుర్వృత్తుఁ డగువానిని వధింపఁగలవు. వేగమ యతఁడు కూలఁగలఁడు. చూతువు గాక. అని మిగుల వినసొంపుగా నలుచు హితములగు నప్పలుకులను విని సుగ్రీవుఁడు ప్రీతుఁడై యిట్లు పలికెను. శ్రీరామా! నీయనుగ్రహమున నాప్రేయసిని రాజ్యమును బడయఁజాలుదు. నాపగతు నడంచుయత్నమును గావింపుము. వారిరువురు చెలిమిచేయు తఱి జానకి సవ్యనేత్రము, వాలి పచ్చనిరంగుగల యెడమ

కన్ను, నిప్పువంటి రావణుని యెడమకన్ను నేకకాలమునందే చలించెను.

మహాత్ములారా! ఈఘట్టమును బరికించి విశేషములను గనుఁగొందము. "అథ పాపభీతస్య కర్మానురూపం ఫలం దిశతో భగవతో ఽపి త్రస్తస్య ఆచార్యముఖాత్ భగవద్గుణాన్ శ్రుత్వా తదేకోపాయనిష్ఠా సూచ్యతే పంచమే" అని గోవిందరాజులు వ్రాసిరి. పాపభీతుఁడై భగవంతుఁడు కర్మానురూపముగా ఫలము లొసంగువాఁడైనను అతనికి భయపడి ఆచార్యముఖమువలన భగవంతునిగుణముల నాలకించి పిదప నతఁడే యేకోపాయముగా నిష్ఠ గలిగియుండుట యీ యైదవ సర్గమున సూచితమని వ్రాసిరి. దీనితాత్పర్య మేమి? భగవంతునకు భక్తునకు నడుమ నొకయాచార్యుఁ డుండవలయును. ఆచార్యులముఖముననే భగవద్గుణముల వినవలయు. లేకున్న నవి వినఁబడవు. కాన నాచార్యులపాదములఁ బట్టినఁగాని భగవత్కృప గలుగదు. అనియే కదా. ఈయుపాయముచేతనే శిష్యపరంపరను సంపాదించుకొని బ్రదుకవచ్చునను సిద్ధాంతము వెలికివచ్చెను. సోమరిపోతుల కిదియే మంచివ్యాపారము. దీనిచే

"నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా,
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా. ౫౩
భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధో ఽర్జున,
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప. ౫౪
మత్కర్మకృన్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః,
నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాండవ." ౫౫

గీత. ౧౧-అధ్యా.

అను నీభగవద్గీతావాక్యము లసత్యములు కావలసివచ్చును. సత్కర్మానుష్ఠానమున భక్తి కుదురును. శాస్త్రము పఠించుట సత్కర్మానుష్ఠానపరత్వము గల్గించును. ఈ గీతాశాస్త్రమునం దాచార్యుఁడు లేకున్నఁ గొంప మునుఁగునని లేదే. పెద్దవ్యాపారము చేయుట కీసిద్ధాంతము చేయఁబడినది. పామరులను మోసపుచ్చుట కిది చాలవఱ కుపయోగించు ననవచ్చును. నిర్వైరస్సర్వభూతేషు=అనుటం జేసి సర్వభూతములయందు సమబుద్ధిగలవాఁడు కావలయునని కదా భావము. అన్యమత స్థులను దూషింపుమని కాదు. ఊర్ధ్వపుండ్రము ధరింపకున్న శ్రీకృష్ణప్రసాదము దొరకదన్న తుచ్ఛవాద మేటఁ గలిసినది. పాషండులవాదమే యది. భగవంతుఁ డొక్కఁడని నమ్మువారితరమతస్థులను దూషింపరు. ఎల్లరకు సమానుఁడే భగవంతుఁ డన్న బుద్ధిలేనివారు పశుతుల్యులుగాక మఱే మగుదురు?

"సమోఽహం సర్వభూతేషు నమే ద్వేష్యోస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహం. ౨౯
అపి చేత్సు దురాచారో భజతే మా మనన్యభాక్,
సాధురేవ స మంతవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః. ౩౦
మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః,
స్త్రియో వైశ్యాస్తథా శూద్రా స్తేఽపి యాంతి పరాం గతిం. ౩౧
కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా,
అనిత్య మసుఖం లోకమిమం ప్రాప్య భజస్వ మాం." ౩౨

గీత. ౯ అ.

అను నీగీతావాక్యముల మతద్వేషము పనికిరాదనియు, సర్వమతస్థులను సమానముగా భగవంతుఁడు భావించుననియుఁ దేలెడిని. అంతియకాని ఆచార్యు నాశ్రయింపకున్న నేను

లభింపనని శ్రీకృష్ణుఁడు పలుకలేదే. అనువిచారము దేవానాం ప్రియులకు నిచ్చోటఁ గలుగక మానదు. అట్టియూహాలు వదలి మనము భగవంతు నారాధింతము.

> "ఋశ్యమూకాత్తు హనుమాన్ గత్వా తు మలయం గిరిం,
> ఆచచక్షే తదా వీరౌ కపిరాజాయ రాఘవౌ." ౧

అని మూలము. ఋశ్యమూకమున నొకభాగమునకు మలయ పర్వత మనియుఁ బేరు. లేకున్న మతంగమునిశాపము వాలి ఋశ్యమూక మెక్కరాదనియే కాని మలయగిరిని గూడ నెక్కరాదని కాదు. రామలక్ష్మణులను గాంచి భయపడిన సుగ్రీవుఁ డందువృక్షషండమండిత మగుభాగమున నుండెననియు నచ్చోటికే రామలక్ష్మణులను దోడుకొని హనుమ పోయెననియుఁ దోఁచుచున్నది.

> "తపసా సత్యవాక్యేన వసుధా యేన పాలితా,
> స్త్రీహేతో స్తస్య పుత్రోఽయం రామస్త్వాం శరణం గతః. ౨
> భవతా సఖ్యకామౌ తౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ,
> ప్రతిగృహ్యార్చయస్వైతౌ పూజనీయతమావుభౌ." ౩

అని మూలము. తపస్సత్యవాక్యనిరతుఁ డగు దశరథుని కుమారుఁ డీరాముఁడు, స్త్రీహేతువువలన నీమఱుఁగుచొచ్చెను. ఈపరమేశ్వరునవతారము స్త్రీహేతువు కలదియే. లేకున్న నామరూపక్రియాశూన్యున కవి యెట్లు కల్గును? ప్రకృతిబద్ధుఁ డగు నీభగవంతుఁడు నిన్నాశ్రయింప వచ్చెనని హనుమ ద్వాక్యములయందుఁ గలభావము. భగవంతుఁడు భక్తులకు మంచికర్మముల ఫలముల నీయఁదగుకాలమునఁ దానే వెదకికొనుచు వచ్చును. మనము ప్రార్థింప నక్కఱలేదు. మనము

ద్వేషించినను దర్శన మిచ్చి యాదోషభావమును దొలఁగించును. సూర్యకిరణములు తమయంతన మనకవాటముకడ నుండునట్లని గ్రహింపవలయును. అది భగవంతునకు నైజము. తద్దర్శనమున మనము విగతకల్మషుల మగుదుము. మన యిరువురకునడుమ నొకయాచార్యుఁడుండ నక్కఱయే యుండదు. మన మవివేకులమైనయపుడే యాచార్యులు ధనాపహరణోద్యోగపరాయణుఁడు చేరును. కాన నట్టి ధనాపహరణపరాయణుల పలుకులు విని చెడరాదు.

"స కృత్వా మానుషం రూపం సుగ్రీవః ప్లవగర్షభః,
దర్శనీయతమో భూత్వా ప్రీత్యా ప్రోవాచ రాఘవం."

అని మూలము. హనుమంతుఁడా రాఘవుల నొకచోట నునిచి సుగ్రీవునికడకేగి తెలుపఁగా నతఁడు మానవరూపమును ధరించి వచ్చి భాషించెనని తోఁచుచున్నదని వ్యాఖ్యాతలు వ్రాసిరి. న్యాయ్యముగనే యున్నది. హనుమంతుఁ డెట్లు బ్రహ్మచారి రూపమును ధరించి తొలుత రాఘవులతో భాషించెనో సుగ్రీవుఁడు నట్లే మానవాకారమున నరుదెంచి వారిం గాంచెను. ఈరూపధారణము నాటకములలోని వేషాంతరములం బోలినదని కొంద అందురు. అది చాలఁ బొరపాటు. ఉపాసకులు ఫలములను భగవదర్పణము చేయు బుద్ధినుపాసించిన నది ముక్తిసాధనమగు. ఫలసిద్ధింగోరి యుపాసించువారల కట్టిఫలములు గలుగును. ఒక్కొక్కసిద్ధి కొక్కొక్కదేవత కలదు. ఆదేవత వేఱుఫలము సిద్ధింపఁజేయఁ జాలదు. సర్వసిద్ధులనొసంగు దేవతలుకూడఁ గలరు. అట్టిదేవతల నుపాసించి యా ఫలసిద్ధిం గాంచుట కడునరిది. ప్రాయికముగా నీకాలమున నవి పుక్కిటిపురాణములైనవి. అలసులకు నుపాసనమునకుఁ జాలదూరము.

వేదాంతవాక్యములు చెప్పుచు శిష్యులసంగ్రహించి ధనాప హారణమున మెలంగువా రలసులే యనఁబడుదురు.

"రససిద్ధి ర్గోష్ఠసిద్ధి ర్బలసిద్ధి స్తథైవ చ. ౫౬
ఖడ్గసిద్ధిః పాదుకాయా సిద్ధిరంజనసిద్ధికా,
వాక్సిద్ధి ర్లోహసిద్ధిశ్చ దేహసిద్ధి రనంతరం. ౫౭
ఏతాదృశ్యస్సిద్ధయస్తు బహ్వోవ్యన్యా యోగిసమ్మతాః,
అత్రాంతరే తు పఠిత స్సేవంతే పరమేశ్వరీం. ౫౮
కోటిశస్సిద్ధయ స్తస్మిన్మణిమాద్యంతరే శుభే,
నవలావణ్యసంపూర్ణా స్మ్నయమానముఖాంబుజాః. ౫౯
జ్వలచ్చింతామణికరా స్సదా షోడశవార్షికాః,
అత్యుదారప్రకృతయః ఖేలంతి మదవిహ్వలాః." ౬౦
లలితోపాఖ్యానము. ౪౦-అధ్యా.

అను నీప్రమాణములు పైన వ్రాసినభావమును దెలుపు చున్నవి. ఏసిద్ధికోరిన నాదేవత నానామరూపాదుల ధ్యానించి తన్మంత్రము నియతిమై జపింపవలయు. ఈ యుపాసకులే యోగిసమ్మతులు. నియతచిత్తులై జపించిననే యది ఫలించు. చచ్చుమాటలచే లాభము కలుగదు. తపస్సు సామాన్య కార్యము కాదు. అట్టి యుపాసకులకే కామరూపము లల వడును. ఎల్లరకు లభింపవు. హనుమత్సుగ్రీవాదు లట్టివారే యని మన మెఱుంగవలయును. రణరంగమున బ్రహ్మాస్త్రాదు లెట్లు లభించును. మంత్రోపాసకులకే కదా యవి లభించును. శిల్పిచేసిన యమ్ములవియైన నెల్లర కేల లభింపవు? తపశ్శక్తిచే నవి సాధ్యము లగును. కావుననే యెల్లర కవి లభింపకపోవు టకుఁ గారణమయ్యెను.

"తస్మై మైవైష సత్కారో లాభశ్చైవోత్తమః ప్రభో,
యత్త్వమిచ్ఛసి సౌహార్దం వానరేణ మయా సహ. ౧౧
రోచతే యదివా సఖ్యం బాహురేష ప్రసారితః,
గృహ్యతాం పాణినా పాణిర్మర్యాదా బధ్యతాం ధ్రువా." ౧౨

అని మూలము. వానరుఁడ నగునాతోఁ జెలిమిఁగోరు నీవరుదెంచుట నాకు సత్కారము ఉత్తమలాభము కాని నీకుఁ గాదు. అనఁగా నీ వరుదెంచుటం జేసి నేను నలువురిలో సత్కారార్హుఁడ నైతిని. ఇంతకంటె నుత్తమలాభము వేఱొండు లేదు. అనియే కదా దీనిభావము. సర్వతపఃఫలము భగవద్దర్శనము. అది దొరకినది. ఇంతకంటె లాభము లేదు. దీనిచేత ఫలాభిసంధిరహితసత్కర్మానుష్ఠాన ముత్తమమని చెప్పఁబడినది. రామునాగమనము సుగ్రీవుఁడు కోరలేదు. ఐన లభించినది.

"తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర,
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః." ౧౯

అను నీగీతార్థమునే యీభాగము మనకుఁ దెల్పుచున్నది.

"మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతా స్తేమే యుక్తతమా మతాః."

అను గీతావాక్యముప్రకార ముపాసించినవారలకుం గలుగు ఫల మిట్టిదియే యనవలయు. "ఉపాసనా=వస్తుస్వరూపానపేక్షంపురుషేచ్ఛామాత్రతంత్రం మానసప్రవాహః" అని సర్వతంత్రసిద్ధాంతపదార్థలక్షణసంగ్రహము.

"ఉపాసనా=సేవా, యోఽస్య విశ్వస్య ఆకాశవత్ సర్వదా సర్వత్ర ఓతప్రోతరూపేణ అంతర్బహిర్విరాజతే తస్య సర్వవ్యాపినః సర్వాంతర్యామినః పరమపురుషస్య స్వరూపభావే యావన్న సాధకస్య స్వహృదయే

ధారణాధ్యానాదిభిః స్థైర్యమాపద్యతే తావదర్చాదావేవోపాసనా కార్యా. దుర్బలాధికారిణేత్యేవ నిష్కర్షః. యథా హి కుళార్ణవతంత్రే. ౬-ఉల్లాసే.

"చిన్మయస్యాప్రమేయస్య నిర్గుణస్యాశరీరిణః,
సాధకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా.
అరూపం రూపిణం కృత్వా కర్మకాండరతా నరాః,
బ్రహ్మజ్ఞానామృతానందపరాస్సుకృతినో నరాః."

కించ తత్రైవ, ౯-ఉల్లాసే.

"నిర్విశేషం పరం బ్రహ్మ సాక్షాత్కర్తుమనీశ్వరాః,
యే మందాస్తేనుకల్పంతే సవిశేషనిరూపణైః."

అధికారిభేదేనాలంబనీయోపాస్యదేవస్యాపి భేదః ప్రదర్శితః, యథా తత్రైవ, ౯-ఉల్లాసే.

"అగ్నౌ తిష్ఠతి విప్రాణాం హృది దేవో మనీషిణాం,
ప్రతిమా స్వల్పబుద్ధీనాం సర్వత్ర విదితాత్మనాం."

అపిచ కతిదినాని యావత్ కర్మాణి కర్తవ్యాని అర్చాద్యధిష్ఠానేఽర్చనం వా కర్తవ్యమితి విచికిత్సాయాం మూఢాన్ ప్రత్యనుకంప్య తదప్యుపదిదిశుః పూర్వాచార్యాః "యథా భాగవతే" ౧౧-౨౦-౯.

"తావత్కర్మాణి కుర్వీత న నిర్విద్యేత యావతా,
మత్కథాశ్రవణాదౌవా శ్రద్ధా యావన్న జాయతే."

యథా తత్రైవ. 3-౨౯-౨౫.

"అర్చాదావర్చయేత్తావదీశ్వరం మాం స్వకర్మకృత్,
యావన్న వేద స్వహృది సర్వభూతేష్వవస్థితం."

యది నిశ్శ్రేయసార్థినాం సాధకానాం యది ప్రథమతః క్రియాయోగ ఏవ కర్తవ్యః. తర్హి అలం ప్రమాణశతవిస్తారేణ తత్ర పరంపరాకర్తవ్య మేవ

విధీయతామితి చేత్ అవధేహి యత్ప్రథావలంబనేన సత్త్వే శోధితే సతి దుర్బ
లాధికార్యపి సత్వరం సబలాధికారిత్వం యాతి.”

అను నీ ప్రమాణములనుబట్టి యోజింపఁగా నుపాసన యనఁగా సర్వవ్యాపకుఁడై రూపనామక్రియాశూన్యుఁ డగు భగవంతుని దేజోరూపునిగా మనఃకమలమునందు ధ్యానించుట యని సారము. యోగశాస్త్రవిహిత మిదియే. పరమాత్మకురూపనామాదికల్పన ఉపాసకుల యుపయోగార్థము. యోగసిద్ధిలేనివిప్రుల కగ్నియందును, విద్వాంసులకు హృదయమందును, అల్పబుద్ధులకుఁ బ్రతిమలయందును, జ్ఞానులకు నెల్లతావులను భగవంతుఁ డుపాస్యుఁ డగుచున్నాఁడు. శ్రీభాగవతమునందుఁ గూడ నిట్లే స్పష్టముగాఁ జెప్పఁబడినది. సర్వభూతాంతర్యామి భగవంతుఁడని యెంతదనుకఁ దెలియరాదో యంతదనుక నర్చారూపములయందు నారాధనము సాగింపవలయునని. దీని తాత్పర్య మేమి. ధ్యానయోగమే ప్రధానమనియు, నద్దాని కర్హులుకానివారలకు నగ్ని మొదలగువాని నారాధించుట తగుననియే కదా. విగ్రహారాధనమున కర్హులు పామరులే. అనఁగా నది యత్యల్పఫలప్రదమని కదా సారము. అదియే ము_నొసంగునని బోధించువారలు పామరులలో నగ్రగణ్యు లగువారు కారన వలనుపడునా? ఎంతదనుక నీ విగ్రహార్చనము సాగుచుండునో యంతదనుక నీపామరులకు జ్ఞానమే కలుగదేమో యనుశంక పొడముచున్నది.

“సందర్శ్యార్థ శిలాం శిలామయగృహే సాక్షాదయం శ్రీహరి
ర్భక్తేభ్యో వివిధార్ ప్రయచ్ఛతి వరాన్ సంసేవ్యమానస్త్వితి,
ఉక్తాం దేవలకస్య వాచమధికం విశ్వస్య సంసేవతే
త్వర్థం తత్త్వమిసీతి వేదగదితం నో విశ్వసత్యల్పధీః.”

అను శంకరభగవత్పాదాచార్యులుగారివాక్యము మిక్కిలి తగియేయున్నది. పాషాణవిగ్రహమును గనఁబఱచుచు నిదియే వైకుంఠమునుండి దిగివచ్చిన శ్రీమహావిష్ణువు నాకృతి యని చెప్పుట యెంతయు క్తముగ నున్నదో యోజింపవచ్చును. అన్నివిధము లగువిగ్రహము లిట్టివనియే యెఱుంగవలయు. విగ్రహారాధనమే పనికిరాదని నాభావము కాదు. తొలుదొలుత నించుక యుపకారము చేయవచ్చును. పిదప నున్నతగతికిఁ బోనీయకున్నదే యన్నవిచారమే బాధించెడిని. ప్రకృత మనుసరింతును. ఉపాసనాఫలమే భగవత్సందర్శనమనియు నదియే యుత్తమలాభమనియు సుగ్రీవునిమూలమున వాల్మీకి బోధించెను. ఇదిగో నాహస్తము. శ్రీరామా! నీహస్తమున దీని గ్రహింపుము. నాతోడిసఖ్యము నీకు సమ్మతమైనచో. ననికదా సుగ్రీవుఁడు పలికెను. కరము కరమునఁ బెనచుట మైత్రిలక్షణము. అది యాకాలపుటాచారము. ఇపుడు నట్టియాచారము కలదుగాని దానియర్థ మిద్దానియందు లేదనుట నిశ్చయము. వాడుకయే యిది యనవచ్చు. అది ప్రమాణమువంటిది. అదియే యీరెండింటికిం గలభేదము. చేతిలోఁ జేయివైచుట యనఁగా నయ్యది యనుల్లంఘ్యమని యాకాలపువారి సిద్ధాంతము. ఆసఖ్యము దృఢమని సారము. అద్దాని నడిగెను. "పుర త్యయస్స్వభావః" అను నానుడి క్రొత్తది కాదు. సుగ్రీవుఁ డెంత తెలివిగలవాఁడైనను భగవంతు నిదికోరుట వానర స్వభావముచేతనే యనుటకంటె వేఱు సమాధాన మేది యుండును ?

"తతో హనూమాన్ సంత్యజ్య భిక్షురూప మరిందమః. ౧౪
కాష్ఠయోస్స్వేన రూపేణ జనయామాస పావకం,

దీప్యమానం తతో వహ్నిం పుష్పైరభ్యర్చ్య సత్కృతం. ౧౫
తయోర్మధ్యేఽథ సుప్రీతో నిదధే సుసమాహితః,
తతో ఽగ్నిం దీప్యమానం తౌ చక్రతుశ్చ ప్రదక్షిణం. ౧౬
సుగ్రీవో రాఘవశ్చైవ వయస్యత్వ ముపాగతౌ."

అని మూలము. హనుమ జమ్మికొమ్మలు తెచ్చి చిలికి యగ్నిని బుట్టించెను. ఆయగ్నిని మండఁజేసి రామసుగ్రీవులనడుమ నుంచెను. పూవులఁ బూజించెను. దానికి నపుడు సంస్కృతాగ్ని యని పేరు. దీనింబట్టి చూడఁగా నాకాలమునఁ బదార్థవిజ్ఞానశాస్త్రము తెలిసినవారు విశేషించి గలరని తేటపడియెడిని. దారువులను మథించిన నగ్ని సంభవించునని తెలిసి యాయాచారమును బాటించువా రిప్పటికిం గలరు. యజ్ఞములయం దాయగ్ని నుపయోగింతురు. పాషాణములనుండి యగ్నిం బుట్టించి దాని నుపయోగించువా రిప్పటికిని గలరు. అది లౌకికాగ్ని యనఁబడును. ఇపుడిపు డది మాఱి యనాగరికత యనఁబడుచున్నది. దాని నాక్షేపించుట యవివేకమనుకాలము రాఁగలదని యాశించుచున్నాను. ఆయగ్నికిఁ బ్రదక్షిణముచేసి సఖ్యము చేసికొనిరి. అగ్నిసాక్షికముగా నాసఖ్యము పొడకట్టెను. దేవతలలోఁ బ్రధానుఁడగ్ని యనువిశ్వాసమున నతనియెదుటఁ జేసిన వాగ్దానము తప్పరాదని పూర్వాచారము. ఇదియొక యనాగరకతయని యిప్పటివారిలోఁ గొందఱ యభిప్రాయము. వివాహాదులయం దగ్ని సాక్షిగా నుండును. అది మార్పరాదనునదియే దానిఫలము. కాలనియమము నేర్పఱచుకొని వివాహము చేయునాచార మాకాలమున లేదు. కావున నప్పటివారి కగ్ని దేవుఁడుగాఁ దోఁచెను. ఇప్పటివారిలోఁ

చెక్కుండ్ర కదిలేదు. కనుకనే వాగ్దానములు జల్పములుగా మాఱుచుండుట తటస్థించుచున్నది.

"ఉపకారఫలం మిత్రం విదితం మే మహాకపే. ౨౬
వాలినం తం వధిష్యామి తవ భార్యాపహారిణం,"

అని మూలము. ఇదియే శ్రీరామునిశపథము. వాలివధమునకుఁ గారణము సుగ్రీవునిభార్య నపహరించుట యగు. అది క్రూర కార్యము. పాపమూలము నగు. కావుననే పాపాత్ములను ద్రుంచుటయే కదా భగవత్కార్యము. అది మాన నయితి గానిది. వాలి యేల హరించెనో విచారించి కదా శపథము చేయవలయు? సుగ్రీవునిమాటలంబట్టి యెట్లు శ్రీరాముఁడు శపథముచేసెనని కొందఱు ప్రశ్నింతురు. సర్వజ్ఞత్వాదులు గల భగవంతునివిషయమున నీప్రశ్నము చేయరాదు. కేవలమాన వులయం దీప్రశ్న ముచితమే యగు. స్త్రీవిషయమున నొన రించిన పాపము సహింపఁదగినది కాదు.

"గోవధో ఽయాజ్యసంయాజ పారదార్యాత్మవిక్రయాః."

అని మనుస్మృతి తెలుపుచున్నది. పరదారాభిగమన ముపపాత కముగాఁ జెప్పఁబడినది. అట్టి యుపపాతకముల నొనరించిన వారిని జంపుట ధర్మరక్షణమే యగును. కాన సర్వజ్ఞుఁడు కావునఁ దద్వార్తయందలి సత్యము నెఱింగియే శపథము చేసె నని మన మూహింపవలయును.

"సీతాకపీంద్రక్షణదాచరాణాం రాజీవహేమజ్వలనోపమాని,
సుగ్రీవరామప్రణయప్రసంగే వామాని నేత్రాణి సమం స్ఫురంతి."

అని మూలము. శ్రీరామసుగ్రీవులకు సఖ్యము కుదురఁగా నపు డేకకాలమునందే లంకలోని సీతాదేవికి (సీతాప్రతికృతికి),

వాలికి, రావణునకు వామనేత్రములు కంపించెను. ఎడమ కన్నదరుట పూరుషులకు మంచిదిగాదనియు, స్త్రీలకు శుభ సూచనమనియు నిమిత్తవిదుల యాశయము. ప్రాయికముగా నిమిత్తములు దైవికము లనవలయును. అవి నిష్ఫలారంభములు కావు. రోగజన్యములుగ నవి యుండును. అట్టివి కాక నిర్నిమిత్తముగా నిట్టిగుఱుతులు గలిగిన నవి ఫలించునని ప్రాచీనుల మతము. అది శాస్త్రసమ్మతమే. ఈనిమిత్తములు రాఁగల కాల ఫలమును బోధించును. వానిని ప్రమాణముగాఁ బరీక్షింపవల యును. ఆపరీక్షవలన మేలే కలదుగాని కీడు కలుగదు. దైవ పరుఁడుగా నుండ రాదు. ఈవిషయమును మన కీభాగము బోధించుచున్నది.

## రాముని కార్యమునకుఁ దోడ్పడ సుగ్రీవుఁడు సమయము చేయుట.

* అంత సుగ్రీవుఁ డత్యంతహర్షమున శ్రీరామున కి ట్లనియె. శ్రీరామా! నామంత్రినికరమున మేలుబంతియగు నీహనుమంతుఁడు నీ యరణ్యవాసవిధమంతయుఁ దెలిపెను. మీరిరువురు నాశ్రమమున లేనితఱి రావణుఁడు సీత నపహ రించి నిలువరించిన జటాయువుం జంపి తీసికొనిపోయెను. నీకా దుఃఖము వేగమ తొలఁగు. వేదములను హరించికొనిపోయిన మధుకైటభులను జంపి విష్ణువు వేదములఁ దెచ్చినట్లు నే నాజానకిని దెచ్చియిచ్చెదను. నాయీమాట సత్యము. నీభార్య నపహరించిన యింద్రుఁడే సురాసురులే నిలుపుకొనఁ జాలరు. ఇఁక శోకము వదలుము. క్రూరకర్ముఁ డగునారాక్షసుఁడు పట్టి

* ఇది యాఱవసర్గమునఁగల కథ.

కొనిపోవుచుండ 'రామా! రామా! లక్ష్మణా' యనుచు వికార స్వరమున నేడ్చుచు నాగరాజకన్యకవలె రావణునంకభాగ మున నల్లాడు నొకస్త్రీని జూచితిని. ఊహింప నామెయే సీత యనుకొనుచున్నాను. సందియ ముండదు. నలువురు వానరు లతోఁ బర్వతతటముననున్న నన్నుఁగాంచి తనయాభరణముల నుత్తరీయమునఁ గట్టి మాప్రక్కఁ బడవైచెను. మే మవ్వానిని బదిలపఱచియున్నాము. వానిం దెచ్చి యిచ్చెదను. గుఱుతు పట్టఁగలవు.

శ్రీరాముఁ డాతని ప్రియవచనములాడు సుగ్రీవుని గని మిత్రమా! వానిఁదవ్వరగఁ దెప్పింపుము.జాగు చేయవలదు. అను నంతలో గుహాలోని కరిగి యా మూటం దెచ్చి యిచ్చెను. రాముఁడు వానింగైకొని కన్నీరు వదలెను. హాప్రేయసీ! యని నేలఁబడియె. వానిని వక్షమున నిడుకొని నిట్టూర్పులువుచ్చెను. కన్నీటిధారలతో సౌమిత్రింగాంచి వగచెను. ఆక్రూరుఁడు కొనిపోవునపుడు సీత వీనిం బాఱవైచెను. చూడుము. వీనిని బచ్చికనేలపై వైచియుండును. కనుకనే యేమియు నలఁగక యున్నది. సౌమిత్రి యన్నా నేనామె యంగదముల నెఱుం గను. కుండలముల నెఱుంగను. మ్రొక్కుచుందును గాన నందెలనే యెఱుంగుదును. అనఁగా రాముఁడు సుగ్రీవా! రౌద్రాకారుఁడగు నారక్కసుఁ డాజానకి నెచ్చోటికిఁ గొని పోవుచుండఁగా వీక్షించితివి. నాకిట్టి మహాదుఃఖమును గల్గిం చిన యాక్రూరుఁ డెందుండునో యద్దానినైనఁ జెప్పుము. వాని కొఱ కందఱరక్కసులం జంపెద. వాడీదుష్కార్యమున నాకుఁ గోపమును బుట్టించెను. తనచావు తానే తెచ్చుకొన్నాఁడు.

ఆత్మనా పంచమం మాం హి దృష్ట్వా శైలతటే స్థితం. ౧౦
ఉత్తరీయం తయా త్యక్తం శుభాన్యాభరణాని చ,
తాన్యస్మాభిర్గృహీతాని నిహితాని చ రాఘవ." ౧౧

అని మూలము. రావణునంకమున నెట్లు సీతయుండఁజాలును? రథము పోవఁగా నారావణుఁ డాసీత నెత్తుకొనిపోవుచుండెను. తొడ. పై నెట్లుండ నవకాశము కలదు? అని ప్రశ్నించువా రుందురు అంబరమున రావణుఁ డరుగుచున్నవాఁడు. క్రిందుగ వానరులుండి చూచుచున్నవారు. సీత శ్రీరాముని సౌమిత్రిని సంబోధించి దుఃఖించుచున్నది. ఇఁక నన్ను రక్షించువారు లేరని నిస్స్పృహురాలై "మొలబంటిదుఃఖమున మోఁకాలిబంటిసంతోష" మనునట్లు శ్రీరామునకుఁ దనవార్త నెవరైనఁ దెలుపువా రుందురా యని వాంఛించి యంతలోఁ గొండపై నలువురు వానరులు కూడ నుండ నున్న సుగ్రీవునింగాంచెను.సాధారణవానరములవలెఁ గాక వారు పెద్దగానుండఁ గాంచెను. అందు జాంబవంతుఁడు భల్లూకజాతికిం జేరినవాఁడు. దూరమునుండి చూచువారలకుఁ బెద్దకోఁతులు చిన్నమానవులవలెఁ బొడకట్టుట సహజము. రాముఁడు నన్ను వెదకుచు రాకమానఁడు. వీరిచ్చోటనుండఁగాఁ జూచు భాగ్య మాతనికిం గల్గిన నావార్తఁ దెలుపకపోరు. అన్న యాశ యామెకుం గలుగునన్న సంశయింప నవకాశము లేదు. ఈభూషణములను వైచుట తప్ప వేఱొకయానవాలు కనఁబఱచునవకాశ మా సీత కత్తఱి లేదు. మృదుతమవస్త్రమునఁ గొన్ని భూషణములు ముడిచి పాఱవైచియుండును. శ్రీరాముని భయమున మతిచెడియున్న రావణుఁడు ప్రాణములు సీతయుఁ దక్కెఁ గదా యను నాశమైఁ జేతఃజిక్కిన సీత యెందుఁబోవఁగలదను నుత్సాహ

మున నూహాలపై నూహాలు పొలయుచుండఁగాఁ బోవుచుం డును. ఆస్థితియందున్న రక్కసుఁడు రోదనము చేయుచుండు సీత యేమిచేయుచున్నదని పరికించునా ? ఇఁక దిక్కు లేదను నిరాశపొడమియున్న రాజపుత్త్రి విదుషీమణి రోదనము చేయు చున్నను పాతివ్రత్యమహిమమునను మనశ్శక్తిలేనిదిగానుండు ననుట యంత మంచిది గాదు. అట్లు వగచుచు రామనామ ముచ్చరించుచు దీనస్వరమునఁ దన యవస్థను ప్రాణేశ్వరునకుఁ దెలుపుకొనుచున్న యాఁజానకి క్రిందనున్న కపులకు రావణు నంకమున నున్నయట్లు కనంబడుటయు విచిత్రము కాదు. వాఁడు పద్మాసనమునఁ గూరుచుండినఁగదా యంకమున సీత యుండ ననువుపడునని ప్రశ్నింతురు. వియద్గమనము గలదని యంగీకరించినపుడు నిలువఁబడినట్లు పోవు నట్లేల యూహింప వలయునో తెలియకున్నాను. కూరుచున్నయట్లుండినఁగాని వాయుధారణముచేయ నవకాశము లేదని యోగము నభ్య సించువా రెఱుంగుదురు. రావణునిచంకయందే యుండినను వాఁ డామెను సవ్యకరములఁ బట్టుకొని యుండిన నధోభాగముననున్న వారలకు నంకమున నున్నయట్లే కనఁబడుట విచిత్ర ము కాదు. కాన నీప్రశ్నముల కవకాశమే లేదు. వాస్తవ మేమనఁగా, మాయాసీతదుఃఖము నభినయించుచున్నది. రావ ణుఁడు భక్తుఁడు. తనచావు భగవంతునిచే నెప్పుడు కలుగునా యని వేచియున్నాఁడు. ఈకారణమునఁగాని యది సిద్ధింపదని నమ్మియున్నాఁడు.అట్టివాని కాసీతయం దెంతవాంఛయుండునో వేఱుగఁ జెప్పవలయునా? మాయాజానకి కాతనిగాంచిన నెంత భయముండునో వచింపవలయునా? ఇట్టి రెండువిషయముల నాలోచించినను అసంగత మిం దించుకంతయుఁ గానరాదు.

ఈయాభరణము లమూల్యములు గావున వీ రపహరింతురన్న జంకు సీత కేల లేకపోయెనో యన్న నించుక సంశయింపవలసి వదే. ఆకాలమున నిపుడున్నంత ధనాశ, యందు నాటవికులకు లేదని సమాధానమని పలుకుట తెలివితక్కువ యనిపించు కొనదు. వింధ్యపర్వతముల వసించు కోయజాతు లొక్కయబ ద్ధము పలుకని జిహ్వాలు కలవా రిప్పటికిం గలరని నాయనుభవ మునఁ జెప్పఁగలను.

> "పశ్య లక్ష్మణ వైదేహ్యా సంత్యక్తం హ్రియమాణయా. ౧౮
> ఉత్తరీయ మిదం భూమౌ శరీరాద్భూషణాని చ,
>
> ... ... ... ...
>
> నాహం జానామి కేయూరే నాహం జానామి కుండలే,
> నూపురే త్వభిజానామి నిత్యం పాదాభివందనాత్." ౨౨

అని మూలము. ఈయుత్తరీయము నీయాభరణములను జూడు మా యని రాముఁడనఁగా సౌమిత్రి కేయూరకుండలముల నే నెఱుంగను. నిత్యము మ్రొక్కుచుండుటవలనఁ బాదాలంకార ములనే యెఱుంగుదు నని బదులు పల్కెను. కొంద ఱిది యబద్ధ మందురు. పదుమూఁడువత్సరములు సీతారాములకు సేవ చేసిన లక్ష్మణుఁడు సీతను గన్నెత్తి చూడక వందనకాలమునఁ బాదములనే చూచుచుండె ననుట సంగతముగ నుండునా యని కొందఱందురు. కాని వారు వాల్మీకిభావ మిది యని యాలోచింప లేదనవలయు. "అహం కేయూరే న జానామి. కుండలేచ." అనిపలికిన సౌమిత్రి "నూపురేత్వహమభిజానామి" అని యేల పలికెనని యోజించిన నీసందియము గలుగదు.పాదా భరణములను బాగుగా నెఱుఁగుదు. అనఁగాఁ దక్కినవాని

నంతగాగుఱుతింపఁజాల నని యర్థము. చూడలేదని కాదు. శ్రద్ధగావానిని జూడలేదని యతనిభావమని వాల్మీకియాశయము. భక్తుఁడుపాస్యదేవతాపాదారవిందములనే ధ్యానించుచు, హస్తపల్లవములను నయనోత్పలములను బాహులతలను దక్కినవానిని ధ్యానింపఁడు. నమస్కారమనఁగా "మత్తస్త్వముత్కృష్టస్త్వత్తో౽హామపకృష్టః" అనియే కదా. (నాకంటే నీవు గొప్పవాఁడవు. నీకంటే నేనల్పుఁడను.) ఈభావము కలవాఁడే వందనముచేయును. ఇది లోకాచారమున సమన్వయముచేయరాదు. లోకాచారము కల్పితప్రేమచిహ్నము. ఉపాసకునిది వాస్తవప్రీతిచిహ్నము. కావున భక్తుఁడు ఇష్టదేవతాచరణసరసిజముల హృదయపీఠమున నిలిపి ధ్యానించును. కావున సౌమిత్రి వదినెను అన్నను భక్తిచే సేవించువాఁడు కావునఁ దత్పాదములనే విశేషించి ధ్యానించుచున్నవాఁడనియుఁ గాన నవ్వానినే చక్కఁగాఁ జూచియున్నవాఁడనియు నెఱుంగవలయును.

> "శ్రుతీనాం మూర్ధానో దధతి తవ యౌ శేఖరతయా
> మమాప్యేతౌ మాతః శిరసి దయయా ధేహి చరణౌ,
> యయోః పాద్యం పాథః పశుపతిజటాజూటతటినీ
> యయోర్లాక్షాలక్ష్మీరరుణహరిచూడామణిరుచిః."

అని శంకరభగవత్పాదులు వచించిరి. "ప్రపంచజనయిత్ర్యాస్త్వదాఖ్యాయాః ప్రపంచాంతఃపాతినః హరి విరించి పశుపతి వేదాంతాః పాదాంబుజం శిరసి ధారయంతీతి. తన్నిర్ణేజనజలేన పవిత్రితగాత్రాస్తన్మహిమ్నా తత్తదధికారాన్ భజంత ఇతి యుజ్యత ఏవేతి" వ్యాఖ్య. హరిహరబ్రహ్మాదులు ప్రపం

చాంతఃపాతులు. మూలప్రకృతి, పరమపురుషుఁడు ననువారలు వీరలకు జననీజనకులని మన మెఱింగినచో దుర్మతాభిమాన పిశాచము మనల బాధింపదు. త్రిమూర్తులకన్న మిన్నలు లేరని కొందఱును, అందు విశేషించి విష్ణువే యధికుఁడని కొందఱును బొడ్డున జందెమువేసి వాదించుట వెఱ్ఱితనము గాక మఱేమిటి దగును? రూపనామధారులందఱు ప్రకృత్యతీతులు కారు. పరభార్యలను గాంచినపుడు పాదములపై దృష్టినిలిపి మాతృతుల్యలనుగా భావింపవలయునని యీ భాగము నీతిని దెలుపుచున్నదని మనము భావింపవలయును.

> "క్వవా వసతి తద్రక్షో మహాద్వ్యసనదం మమ. ౨౪
> యన్నిమిత్తమహం సర్వాన్నాశయిష్యామి రాక్షసాన్,
> హరతా మైథిలీం యేన మాంచ రోషయితా భృశం. ౨౫
> ఆత్మనో జీవితాంతాయ మృత్యుద్వార మపావృతం."

అని మూలము. ఇది శ్రీరాముని శపథము. ఏవాని హేతువున నే నందఱరక్కసులఁ జంపుదునో వాని నివాసము తెల్పుము. మైథిలి నపహరించి నా కాగ్రహమును గల్పించెను. తన మృత్యువును దానే తెచ్చుకొనెను. అని కదా దీనిభావము. దీనిచే

> "ఉద్ధరేదాత్మనాత్మాన మాత్మాన మవసాదయేత్,
> ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః. ౫
> బంధురాత్మాత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః,
> అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్." గీత. ౬-అధ్యా.

అను నీగీతావాక్యములు తలంపునకు వచ్చెడిని. నాకపకార మును గల్గించి తనచావునకుఁ ద్రోవ తానే చూచుకొన్నాఁ

డనఁగా నర్థమేమి? స్వకర్మమే శ్రేయోమృత్యువులను గల్పించును. రావణేతరరాక్షసులకు వారివారికర్మమే మృత్యువును గూర్పనున్నది. రావణుఁ డొకహేతువు. వారియందలి మృతికిందగినకర్మముల నీతఁడు చేయలేదు. వారే చేసికొనిరి. కాని

"మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవసవ్యసాచిన్."

అను గీతావాక్యము ననుసరించి కర్మఫలముల ననుభవింపవారు సిద్ధముగనే యున్నారు. రావణుఁడు వ్యాజము మాత్రమే. సీతాపహారణము నిమిత్తము. శ్రీరాముఁడు తత్తత్కర్మఫల ప్రదాత. ఈవిషయమునే శ్రీరామమూర్తి "ఆత్మనో జీవితాంతాయ మృత్యుద్వార మపావృతమ్" అనువాక్యమునఁ దెలిపెను. సుగ్రీవా! వారువారు మరణింప సిద్ధముగానున్నారు. ఆసుసమయమునకు నేఁబోయి సంగర మొనరింతును. అదృశ్యరూపములు కర్మఫలపాశములు మృత్యువుచేఁ దగిలింపఁబడుచుండఁగా నాబాణములు చంపినట్లు లోకులకుఁ దోఁపఁ జేయును.

"ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః,
యజంతే నామ యజ్ఞైస్తే దంభేనావిధిపూర్వకం. ౧౭
అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః,
మామాత్మ పరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః. ౧౮
తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్,
క్షిపామ్యజస్రమశుభా నాసురీష్వేవ యోనిషు." ౧౯

గీ. ౧౬-అధ్యాయము.

అను శ్లోకములంబట్టి భగవంతుఁడే కొందఱను శాశ్వతపుణ్యలోకములయందును గొందఱను నరకలోకములయందును బడ

ద్రోయుడు నన్నందున నతనికిఁ బక్షపాతమనునది కలదు కాన నతఁడేల కారణము కాఁగూడదని యనుదురు. సర్వసాక్షిత్వ నిర్లిప్తత్వాదు లెట్లు చెల్లుననియు ఘోషింతురు. అనఁగా భగవంతుఁడు కొందఱకు నరకమే గల్గించును. కొందఱకుఁ బుణ్యలోకములే కల్గించును. ఈ నరకప్రాప్తులకు నెన్నఁటికిని బుణ్యలోకప్రాప్తి లేదు. ఈపుణ్యలోకప్రాప్తుల కెన్నటికి నరక లోకప్రాప్తి లేదు. శాశ్వతనరకవాసులు శాశ్వతపుణ్యలోక వాసులు నను రెండుతెగలుగ భగవంతుఁడే విభజించెను. అనున దొకమతము. ఇట్లుండఁగాఁ బైసిద్ధాంత మెట్లు నిలుచు నని కొందఱు ప్రశ్నింతురు. ఆమతము ననుసరించి యోజిం చినయెడల

> "సమోఽహం సర్వభూతేషు నమే ద్వేష్యోఽస్తి న ప్రియః,
> యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహం. ౨౯
> అపి చేత్సుదురాచారో భజతే మా మనన్యభాక్,
> సాధురేవ సమంతవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః. ౩౦
> మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః,
> స్త్రియో వైశ్యాస్తథా శూద్రా స్తేఽపి యాంతి పరాంగతిం. ౩౧
> కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా,
> అనిత్యమసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మాం." ౩౨
>
> గీత. ౯-అధ్యా.

అను నీగీతావాక్యముల నాలోచించినచో వారిసిద్ధాంత మెగిరిపోవును. నే నెల్లరకు సముఁడను. నాకు ద్వేష్యుఁడు ప్రియుఁడు కూడ లేఁడని కదా భగవంతుఁ డనెను. అంతియ కాక విశేషదురాచారుఁడైనను నన్ను సేవించినచో వాఁడు

సాధువే యగును. పాపయోనిసంభూతులైనను నన్నాశ్రయించిన ముక్తినొందుదురనియుఁ గూడ భగవంతుఁడే పలికెను. పాపాత్ములను శాశ్వతనరకములఁ బడద్రోయుదుననియెఁ గదా. అట్టిపాపాత్ములు సేవించిన ముక్తి నిత్తుననియు ననియె. ఇదెట్లు పొసఁగును? తేజస్తిమిరన్యాయమున కీ రెండువాక్యములుదాహరణము లగును. పరస్పరవిరుద్ధములు. పాపాత్ములు భజించుటెట్లు? వారు ముక్తులగుటెట్లు? సర్వాసంభవము. ఈ రెండింటి తాత్పర్య మేమనఁగా వినుఁడు. కరుణామయుఁ డగుభగవంతుఁ డెవ్వనినిగాని శాశ్వతకష్టములనే యనుభవింపుమని యాజ్ఞాపింపఁడు. వాని దుష్కర్మఫలముల ననుభవింపఁజేయును. ఎట్టివానికిఁగాని క్రూరఫలానుభవకాలమునఁ దెలివి కలుగును. పశ్చాత్తాపము పొడసూపును. అంతమాత్రముననే వారిని గ్రమక్రమముగా నుత్తమకర్మరతులను గావించును. వారును జిరకాలమునకైనను దరింతురు గాక యనియే భగవంతుఁడు కోరును. అంతియగాని పాపులు పాపులుగనే యుందురని కాని, పుణ్యవంతులు పుణ్యవంతులుగనే యుందురని కాని భగవదాజ్ఞ యుండదు. ఉండుననుకొనువారు జ్ఞానదుర్విదగ్ధులు. ఈరీతిగాఁ గాకున్నచో భగవంతునకుంగల సర్వసమత్వ కరుణానీరరాశిత్వ నిర్లిప్తత్వ సర్వసాక్షిత్వాదిగుణములూడిపోవును. మతమునఁగల దురభిమానమున నించుకయేనాలోచింపక మొండిపట్టుదలతోఁ దమదుష్కర్మము ప్రోత్సహింపఁగా నితరమతములను దత్స్థాపకులను నిందింతురు. శాశ్వతనరక శాశ్వతపుణ్యలోకములు గలవని వాదించుచు మాది వైదికమత మనుకొనువారు ప్రచ్ఛన్న మహమ్మదీయులే యగుదురని కొంద అందురు. అది యించుమించుగా సరిపోవు

నేమో యని మన మూహించుట మంచిదిగాదు. అట్లు నిందించుట వారి... జ మనుకొనవలయును. ఆదూషణముచే నా మతమునకు గౌరవముగాని యితరమతముల కమర్యాదగాని కలుగదు. ఈవిషయమును వదలి తరువాతివిషయ మేదియని తడవుదము.

"మమ దయితతరా హృతా వనాంతాద్రజనిచరేణ విమథ్య యేన సా,
కథయ మమ రిపుం త్వమద్య వై ప్లవగపతే యమసాదనం నయామి."

అని మూలము. పైనవ్రాసిన "న మే ద్వేష్యోఽస్తి న ప్రియః" అనుసిద్ధాంతమున కిది విరుద్ధము కాదా యని కొందఱందు రేమో. ఏమాత్రము కాదు. సుగ్రీవు నార్తివాపుట కిట్లు రామమూర్తి పలుకుచున్నాఁడు. అట్లు గాకయున్న "యమసాదనం నయామి" అనునా? యమునియింటికిఁ బంపుదుననఁగా నర్థమేమి? చంపుదుననియే యర్థము. భగవంతునిచేఁ గల్గు మృతి యమలోకవాస ఫలముగలది కాఁజాలదు. ముక్తి ఫలముకలది కదా. అట్లే "మమ రిపుం త్వమద్య కథయ" బాహ్యదృష్టికి నాకు శత్రువుగాఁ గనంబడు రావణుని నివాసాదులు తెల్పుము. అని శ్రీరాముఁ డడిగెననియే మనము భావింపవలయు. ఇట్టు లీభాగము మనకుఁ గర్మసిద్ధాంతతత్త్వమును బోధించుచున్నది. ఈభాగమున నధ్యాత్మరామాయణమున విశేషము లెవ్వియు లేవు.

## శ్రీరామసుగ్రీవులశపథములు.

* ఆర్తుఁడై శ్రీరాముఁ డిట్లు పలుకఁగా సుగ్రీవుఁ డతనిస్థితిం గని కన్నీరు కంఠస్వరమునాపఁగా దోసిలొగ్గి యిట్లు

*ఇయ్యది యేడవసర్గమునఁ గలదు.

పలికెను. శ్రీరామా! దుష్కులజుఁడగు దనుజుఁడు సీత నప హరించినవాఁ డెందుండునో వాని సామర్థ్య మెట్టిదో విక్రమ మెట్టిదో కులమెయ్యదియో నే నెఱుంగను. నీవు నిశ్శోకుఁడవు కమ్ము. ప్రతిన చేయుచున్నాను. సీతాదేవి నీకు లభించునట్లుగా నేను సకలప్రయత్నములు చేసెదను. సపరివారునిగా రావణుని వధించి పౌరుషమున నిన్ను సంతోషపఱచెదను. ఈదీనత్వ మింక వలదు. సహజధైర్యమును దలంపుము. మీవంటివారి కిది యుండఁదగదు. నేను నీవలెనే భార్యావియోగ దుఃఖములకు గుఱియైతిని. ఐన నీవలె నిట్లు వగవలేదు. ధీరత్వమును వదలలేదు. నేను వానరమాత్రుఁడనేయైన నాభార్యం గూర్చి వగవకయున్నవాఁడఁ గదా. మహాత్ముఁడవగు నీవు దుఃఖించుట యేల? వ్యవసాయవంతులకుగా ధైర్యము పుట్టినది. ధీరులకు దుఃఖము లోనగునవి పొడసూపినను బుద్ధిబలమునఁ గృత్యాకృత్యముల నిర్ణయించి వారు కలంత నొందకుందురు. ఎల్లప్పుడు దీనత్వమునూనినవాఁడు మహాభారముగల నౌక జలముల మునుఁగునట్లు శోకాబ్ధి మునుంగు. ఇదిగో దోసిలొగ్గితిని. ప్రార్థించెద. స్నేహమున నిన్నూఱడించుచున్నాను. అంతియగాని వేఱుగాదు. పౌరుషము నాశ్రయింపుము. శోకమునకుఁ జోటీయకుము. దానికిఁ జోటొసంగిన సుఖమే కలుగదు. తేజస్సు క్షీణించుచు. సదా శోకముగలవానికిఁ బ్రాణసంశయము కూడఁ గలుగును. చెలికానివలె హితము దెలుపుచున్నాఁడఁగాని గురువువలె నుపదేశింపలేదు. నాస్నేహమును గౌరవించుటకైన నామాట విని వగవకుము.

మిత్రుఁడు కపిరాజు మధురోక్తుల నిట్లూఱడింపఁగా రాముఁడు చేలాంచలమున నశ్రువులఁ దుడుచుకొని పూర్వ

స్వభావము నాశ్రయించి వానిఁ గౌఁగిలించుకొని మిత్త్రుఁడు స్నిగ్ధుఁడు మేలుదలంచువాఁడు నగు నొకఁ డేమిచేయవల యునో యాకార్యము నీవు తగినట్లు కావించితివి. సఖా! నీ మాటలవలన నాకిదిగో పూర్వధైర్యము కలిగినది. నీవంటి బంధు విట్టి యాపత్కాలమున దొరకుట దుర్లభము సుమా. సీత యెందున్నదని రక్కసుఁ డెందుండునని వెదకింపఁ బ్రయత్నము చేయవలయును. ఇంక నేనేమి చేయఁదగియుండునో విశ్వాసమునిచి వచింపుము. వృష్టికాలమున సుక్షేత్రమున నెల్ల సస్యములు ఫలించురీతి నీవాంఛించు కార్యములన్నియు నాయందుఁ దప్పక సిద్ధిగాంచు. నేను నిపు డభిమానమున నీ మాట చెప్పితిని గదా. ఇది సత్యమని దృఢముగా నమ్ముము. ఇంతదనుక నేనసత్యము పల్కినదియే లేదు. ఇఁక నెప్పుడైనఁ జెప్పఁబోవునదియు లేదు. వాలిని వధింతునని యిదిగో ప్రతిన చేయుచున్నాను. సత్యముమీఁద నొట్టుపెట్టి మరలఁ జెప్పు చున్నాను. అనఁగా సుగ్రీవుఁడు నతని సచివులు తక్కుంగల వానరులు శ్రీరామునివాక్కులను బ్రతిజ్ఞను విని హర్షించిరి. ఇట్లా రామసుగ్రీవులు నేకాంతమున సఖ్యముగావించి యొండొరుల దుఃఖములను జెప్పుకొనిరి. తెలివి మిగులగల యాకపిరాజు శ్రీరామవాక్కుల విని తనకార్యము ఫలించినట్లే భావించెను.

మహాశయులారా! శ్రీరాము నాశయ మెట్టిదో యీభాగమునఁ గలదు. విమర్శించి తెలిసికొనఁ బ్రయత్నింతము.

"న జానే నిలయం తస్య సర్వథా పాపరక్షసః,
సామర్థ్యం విక్రమం వాపి దౌష్కులే యస్యవాకులం. 2
సత్యం తే ప్రతిజానామి త్యజ శోక మరిందమ,
కరిష్యామి తథా యత్నం యథా ప్రాప్స్యసి మైథిలీం." 3

అని మూలము. ఇం దనేకసంశయముల కవకాశము కలదని వ్యాఖ్యాతలు వ్రాసినారు.సమాధానముకూడ వ్రాసిరి. ఆసంశయముల సార మిది. ఆపాపాత్ముఁడగు నారావణుని నివాసాదులు నేనేమియు నెఱుంగనని సుగ్రీవుఁడు రామునకుఁ దెలిపెను. ఇది ద్రోహమే యగును. వానరుల వెదుకఁ బంపునపుడు లంకానగరమునుగూర్చి తెలిపెను. ఇపుడు నాకేమియుఁ దెలియదను టసత్యమే యగును అని. తొలుదొలుతఁ దనకార్యములను శ్రీరామునిమూలమున ఫలింపఁ జేసికొనవలయుననియు, నిపుడే రావణుని నివాసాదులం దెలిపిన నిప్పుడే వానరుల వెదుకఁబంపుమని రాముఁడు పలుకఁగాఁ దనకార్యము వెనుకఁబడుననియు, వాలిని జంపినఁగాని వానరులందఱుఁ దనవశమున నుండరనియు నీమొదలగు సమాధానములఁ జెప్పిరి. ఈశ్లోకమునకు వ్యాఖ్యానము వ్రాయుచు మహేశ్వరతీర్థులు "సర్వథా న జానే. సర్వప్రకారేణ న జానే కించిజ్జానామీత్యర్థః. ఉత్తరత్ర సీతాన్వేషణార్థం హనుమదాదివానరప్రేషణసమయే—శ్లో. 'సహి దేశస్తు వధ్యస్య రావణస్య దురాత్మనః, రాక్షసాధిపతేర్వాసస్సహస్రాక్షసమద్యుతేః.' ఇతి వచనేన రావణావాసస్య సుగ్రీవావగతత్వప్రతీతేరేవం వ్యాఖ్యాతమ్" అని వ్రాసిరి. ఇదియే చాలును. ఇట్టి స్థలములలో విశేషించి పెంచి వ్రాయుట భగవత్తత్త్వముఁ దెలియఁదగు తావుల జాఱవిడచుట సుసంగతము గానోపదు. వాలి స్మృతిగోచరుఁడగుట భార్యాపహరణము లోనగు విషయములు జ్ఞాపకమునకు రాఁగా నాదుఃఖవేగమున నట్లని యుండవచ్చును. వాలివధానంతరము వశీకృతరాజ్యుఁడనై సకలవానరులం బిలువనంపి నానాదిక్కులకుం బోయి వెదకి

రండని యాజ్ఞసేయవచ్చు. ఇపు డట్లు లాజ్ఞాపింప నవకాశము లేదు కదా. అనుభావమున నట్లు పలికి యుండవచ్చు. ఇట్టి వెన్నియో సమాధానములు చెప్పవచ్చును. ఇన్నింటికంటె సమగ్రముగానే నెఱుంగననియెనని యర్థము గ్రహించిన యిన్ని శంకలు కలుగవు. ఈమాటచెప్పినది మొదలు వానరులఁ బంపినంతదనుక నెన్నియోదినములు గడచెను గదా. ఎందఱ మూలముననో యున్నదున్నట్లు తెలిసికొనియుండి వానరుల కట్లు తెలిపియుండవచ్చు. దీనిచేతఁ దెలిసికొనఁదగిన తత్త్వము నకుఁ బ్రమాదము లేదు.

ఇందొకవిశేషము గలదు. అది తెలియఁదగినది. "త్యజ శోకమరిందమ = శత్రుధ్వంసకుఁడవుగదా నీవు. కాన శోక ము వదలుము." అని సుగ్రీవుఁడు తెలిపినట్లు మహర్షి మనకు బోధించెను. పీని వివరణముగా నిట్లు తెలిపెను.

"అలం వైక్లబ్యమాలంబ్య ధైర్యమాత్మగతం స్మర,
త్వద్విధానామసదృశ మీదృశం విద్ధి లాఘవం. ౫
మయాపి వ్యసనం ప్రాప్తం భార్యాహరణజం మహత్,
న చాహ మేవం శోచామి న చ ధైర్యం పరిత్యజే. ౬
నాహం తా మనుశోచామి ప్రాకృతో వానరోఽపి సన్,
మహాత్మా చ వినీతశ్చ కింపునర్ధృతిమాన్ భవాన్. ౭
బాష్పమాపతితం ధైర్యాన్నిగ్రహీతుం త్వమర్హసి,
మర్యాదాం సత్వయుక్తానాం ధృతింనోత్స్రష్టుమర్హసి. ౮
వ్యసనే వార్థకృచ్ఛ్రేవా భయేవా జీవితాంతకే,
విమృశన్ వై స్వయా బుద్ధ్యా ధృతిమాన్నావసీదతి. ౯
బాలిశస్తు నరో నిత్యం వైక్లబ్యం యోనువర్తతే,

స మజ్జత్యవశో శోకే భారాక్రాంతేవ నౌర్జలే. ౧౦

... ... ... ... ...

యే శోకమనువర్తంతే న తేషాం విద్యతే సుఖం,
తేజశ్చ క్షీయతే తేషాం న త్వం శోచితుమర్హసి. ౧౨
శోకేనాభిప్రపన్నస్య జీవితే చాపి సంశయః,
సశోకం త్యజ రాజేంద్ర ధైర్యమాశ్రయ కేవలం." ౧౩

అని మూలము. ఇవి సుగ్రీవునివాక్యములు. శ్రీరామునకుఁ గపిరాజుపదేశించునంతటివాఁడా? యని కొందఱు ప్రశ్నింతురు. లోకాచారమును సూచింప మహర్షి యీభాగమును వ్రాసెనని యెఱుంగవలయు. ఎంతటివిద్వాంసులైనను గర్మగతులకు దొరకి పరితపింతురు. పామరులు వారల కపుడు హితము బోధింతురు. ఇది యందఱకుఁ దెలిసినదియే కాని క్రొత్తదికాదు.

"విపది ధైర్య మథాభ్యుదయే క్షమా
సదసి వాక్పటుతా యుధి విక్రమః,
యశసి చాభిరుచిర్వ్యసనం శ్రుతౌ
ప్రకృతిసిద్ధమిదం హి మహాత్మనామ్."

అను నీభర్తృహరి నీతుల కీరామాయణమే మూలమని యూహింపవచ్చును. దీని సారమేమి? దైవగతిం జేసి వ్యసనాదులు రాఁగా వానికి లోఁబడకయుండువాఁడే ధీరుఁడు, అనఁగా విద్వాంసుఁడు. శోకాదులు బుద్ధిని ధైర్యమును హరించును. కాన వానికి లోఁబడకయుండవలయును. శోకము ప్రాణములను దీయఁగలదు. తేజస్సు లోనగువానిని హరించుట దాని కెంతపని? శోకవంతునకు సుఖమే లేదు. కావుననే దానిని జ్ఞానబలమున వదలవలయును. కర్మము ననుసరించి వచ్చినశోకమును వదలఁదరమా యనికొందఱందురు. "మనసి

విచింతయ వారం వారమ్" అను శంకరభగవత్పాదా చార్యోక్తి ననుసరించిన నది తోఁచును. శోకమును రా నిమిత్తమేమని తోలుత నాలోచింపవలయును. దాన నది తాఁజేసినకర్మమునకు ఫలమని పొడకట్టును. మఱియు నాలో చింపఁగా నద్దానిని వదలునుపాయము పొడకట్టును. అదియే జ్ఞానము. విమర్శించుకొనుటచే నివి కలుగును. ఒకరియుపదేశ ములకంటె నిది యుత్తమోత్తమము. ఈమార్గమున స్వకీయ కర్మఫలము లివి యగుఁ గదా యని స్పష్టమగును. కర్మము ఫలముల నొసంగక వదలదనియుఁ దోఁచును. ఇట్లు చిరకాల మభ్యసింపఁగా దుష్కర్మములు చేయరాదను నిశ్చయ మొకటి యుదయించును. దాన సత్కర్మానుష్ఠానమునకు నభి ముఖత్వము కలుగును. ఇదియే మంచి యుపాయము. ఇతరుల యుపదేశము క్షణకాలమున నశించును. స్వీయకృషి యెల్లప్ప టికి నిలుచును. కానఁ గష్టసుఖములు కర్మాధీనములని నమ్మి యవి యొనరించినఁ గలుగు కీడుమేలులనెఱింగి మానవుఁడు కృతా ర్థుఁడు కావలయుంగాని రిత్తమాటలచేఁ గృతకృత్యుఁడు కాఁజాలఁ డని నీతి యీభాగము మనకు బోధించుచున్నది.

"కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః,
తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసే ఽశుభాత్. ౧౬

కర్మణోఽహ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః,
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః." ౧౭

గీత. ౪-అధ్యా.

అను నీగీతావాక్యములు పైభావమునే తేటపఱచుచున్నవి. "కర్మణో హ్యఽపి బోద్ధవ్యం" అనఁగా నర్థమేమి? తెలియఁ

దగినదనఁగా నాలోచించి దానిసారమును గ్రహింపఁదగినదని కదా తాత్పర్యము. కనుకనే స్వకృషి యన్నింటికంటె నత్యుత్తమము.

"ప్రకృతిష్ఠస్తు కాకు త్స్సుగ్రీవవచనాత్ప్రభుః,
సంపరిష్వజ్య సుగ్రీవ మిదం వచన మబ్రవీత్. ౧౬
కర్తవ్యం యద్వయస్యేన స్నిగ్ధేన చ హితేన చ,
అనురూపంచ యుక్తంచ కృతం సుగ్రీవ తత్త్వయా. ౧౭

... ... ... ... ...

మమాచ యదిదం వాక్య మభిమానాత్సమీరితం,
తత్త్వయా హరిశార్దూల తత్త్వమిత్యుపధార్యతాం. ౨౧
అనృతం నోక్తపూర్వం మే న చ వక్ష్యే కదాచన,
ఏతం ప్రతిజానామి సత్యేనైవ చ తే శపే." ౨౨

అని మూలము. ఇందు స్నిగ్ధవయస్యశబ్దములు ప్రయోగింపఁబడినవి. "స్నిగ్ధో వయస్యస్సవయా అథ మిత్రం సఖా సుహృత్" అను నివి సమానార్థబోధకములుగాఁ జెప్పఁబడినవి. కాని యించుక యర్థభేద మవ్వానికిఁ గలదు. "స్నిహ్యతీతి స్నిగ్ధః= ప్రీతిగోరువాఁడు. వయసా తుల్యో వయస్యః"అని సమాసము. నాయందుఁ బ్రీతిగలిగి నావయస్సంతవయస్సుగలిగి నాహితము గోరువాఁ డెట్టి యుపకారము చేయవలయునో యద్దాని నీవు చేసితివి. అది తగినది న్యాయ్యమైనదియుగ నుండవలయును. సుగ్రీవునివాక్కులకు శ్రీరాముఁ డానందించె నని భావము. తనయవతారవిశేష మతఁ డెఱుంగకపోయినను మేలుగోరి లోకసదాచారము ననుసరించి వచింపఁదగినదంత

యుం జెప్పె నని యానందించెను. అంతఁ దనయవతారమునఁ బ్రధానముగా స్థాపింపఁ బూనినవిషయము నిట్లు తెలిపెను. కపిరాజా! నాచెప్పినమాట సత్యమే యని నమ్ముము. ఇంత దనుక నసత్యము పలికినది లేదు. ఎట్టి యిక్కట్టులయందును గూడ నిఁకముందు వచింపను. ఇదియే నాప్రతిజ్ఞ. సత్యముపై నొట్టుపెట్టి చెప్పుచున్నాను. అని రాముఁడు పలికెను. శ్రీరాము నకుఁ బ్రియమైనది సత్యమే యని యీయది బోధించెడిని. ప్రియమైనదనఁగాఁ దనస్వరూపమే యది యని భావము. సత్యము భగవత్స్వరూపము. "సత్యాన్నాస్తిపరో ధర్మః" అని పెద్దలందురు. శ్రీరామావతారము సత్యమునకుఁ జేటువాటి ల్లకయుండఁ గాపాడఁ బాటుపడునదని తెలుచున్నది. కాలో చితముగా సత్యమును మార్చి పలికి కార్యమును సాధించుట రామావతారపద్ధతి కాదనియే యిట సారము. పితృవాక్య పరిపాలనమనఁగా సత్యరక్షణమే యని మన మెఱుంగుదుము కదా. తండ్రి సత్యవాక్యనిబద్ధుఁ డనుకీర్తిని గాపాడఁగదా పూనెను. కాన రామావతారమునందు సత్యరక్షణము ప్రధా నముగాఁ జేయఁబడునని మనము నమ్మవలెను. అసత్యవాదులు శ్రీరామభక్తులు కారనియు నమ్మవలయును. శ్రీరాముని కహితమేది? అసత్యము. దాని నాశ్రయించువారు రాముని కప్రియు లగుదురు. వా రెట్లు భక్తులగుదురు? అసత్యము లాడుచుఁ దమకుఁ బ్రతిక్షణము శ్రీరాముఁ డెదుటనుండునని చెప్పుకొను చు నామూలమున స్వర్ణము నార్జించుచుఁ దిరుగువారు రామ భక్తులు కాఁజాలరని మన కీభాగము సూచించును గదా. తఱ చుగా నట్టి భక్తులు శ్రీరాముఁడు విగ్రహరూపముననో చిత్ర ప్రతిమగనో కనఁబడుచుండవచ్చును. అదియే భగవంతు

నాకారము కాఁబోలు నని వారు భ్రాంతినొందవచ్చును. కాని యద్దానిం జెప్పుకొని ధనము నార్జింపరాదు. అది భగవంతుని వంచించిన ట్లే యగును.

"కృతం స మేనే హరివీరముఖ్య,
స్తదా స్వకార్యం హృదయేన విద్వాన్." ౨౫

అని మూలము. స్వకార్యమనఁగా వాలివధపూర్వకదార రాజ్య లాభరూపమును విద్వాంసుఁడగుట ఫలించినట్లే మది నమ్మెను. అనఁగా నాసల్లాపమున సుగ్రీవునకుఁ జక్కని జ్ఞానము కల్గెను. భగవత్సందర్శనభాగ్యము సఫలమే కదా. వాస్తవముగా భగవద్దర్శనము కాఁగా జ్ఞానము పొడమదే నది కల్పితమే యనవచ్చును.లోకులను వంచింపఁబూనిన మహావంచకవ్రతమే యనవచ్చును. ప్రతికార్యము భగవంతుఁడు చెప్పుచుండు ననియు నట్లే తమరు చేయుచుందుమనియు బీరములు పల్కు వారు వంచకులే యగుదు రేమో. యోగులకుం గూడ నెప్పుడో యొకక్షణము దర్శనమిచ్చు భగవంతుఁ డనుక్షణము సేవకుని వలెఁ గనఁబడుచు నెల్లకార్యములు చేయుచుండుననుట వింత లోని వింత. దబ్బుఱయే యనవచ్చు. లేక యేపిశాచమో వారి కిందోఁచుచు నట్లుగా వారికిఁ ద్రోవచూపుచుఁ గష్టపెట్టు చుండునేమో. తత్త్వమాపరాత్పరునకే తెలియవలయును. మన కిచ్చోట భగవత్సందర్శనమహాభాగ్యము సుగ్రీవునకుం గల్గఁగా నతఁడు జ్ఞానము కలవాఁ డయ్యెనని తెలియుచున్నది. అధ్యాత్మరామాయణమున నీభాగమున విశేషము లెవ్వియుఁ గానరావు.

## శ్రీరామునితో సుగ్రీవుఁడు తనకష్టపరంపరలఁ జెప్పుట.

* అంత నాకపివరుఁడు రామునివాక్కుల కలరి శ్రీరామా! సకలసుగుణరాశివగు నీవు సఖుఁడవైతివి. దాన నేను సకలదేవతానుగ్రహపాత్రుఁడనే యైతిని. నిస్సంశయము. నీవు సఖుఁడవు కాఁగా దేవరాజ్యము కూడ లభ్యమే కదా. నాకపిరాజ్యము మాట వచియింపనేటికి? రాఘవుఁడవగు నీకు మిత్రుఁడనైతిని గాన నెల్లరకుఁ బూజ్యుఁడనే. నేను నీకుఁ బ్రియమిత్రుఁడ నని నీవే తెలిసికొనఁగలవు. నాసుగుణముల నేఁజెప్పుకొనుట న్యాయ్యముకాదు. మహాత్ములగు మీయట్టి వారలకుం గల్గిన ప్రీతి ఆత్మజ్ఞానులకుఁ గల్గు ధైర్యము భంగి నిశ్చలముగానుండును. మిత్రులగువారు తమరజతసువర్ణభూష ణాంబరముఖ్యముల నివిభక్తములుగనే తలంతురు. కాని యెవరిది వారిదే యని మాత్రము తలంపరు. ధని దరిద్రుఁడు సుఖి దుఃఖి దోషి నిర్దోషి యనువారిలో నెవ్వఁడైనను దమకు మిత్రుఁడే పరమగతి యనుకొందురు. స్నేహము నే పరికింతురు గాన దానికై తమకుంగల సర్వస్వమును వదలుకొందురు.

అని పలుకు సుగ్రీవుని శ్రీరాముఁడు సౌమిత్రిమ్రోలం గాంచి నీవాక్యము మంచిదే యనియె. వారు నిలుచుండి యుండుటం గని సుగ్రీవుఁడు వారి కాసనము చేకూర్ప మంచి వృక్షశాఖకై నలుదెసలు పరికించెను. దగ్గరనే యోగ్యమగు శాఖ కనఁబడెను. దానియం దొక కొమ్మను విఱిచి తెచ్చి వైచి రాముఁడు కూరుచుండఁ దాను నందే కూరుచుండెను. హనుమ

* ఇది యెనిమిదవసర్గమునఁ గలదు.

సౌమిత్రికి నట్టిశాఖను వైచి కూరుచుండఁ జేసెను. ఫలపుష్పా న్వితములగు వృక్షలతలుగల యాకొండపైఁ గూరుచుండి సాగరుం బోలి గంభీరుఁడుగా నున్న రామునితో సుగ్రీవుఁ డిట్లు పలికెను. నాయన్న వాలి నన్ను మోసగించి నాపత్ని నప హరింపఁగా దుఃఖభారమునను భయమునను బీడింపఁబడుచు నీకొండపైఁ దిరుగుచున్నాను. వాలిభయమున నేమియుం దోఁపకయున్నాఁడను. సర్వలోకముల కభయప్రదాతవు కాన నాకు నభయదానము చేయుము. అనాథుఁడ నైయుండు నాయందు విశేషించి మిత్త్రుఁడ వగుటం జేసి కృపయుంపుము. ధర్మవత్సలత్వాదిగుణవిశిష్టుఁ డగు నారాముఁడు సుగ్రీవుని పలుకులాలకించి కపిరాజు నేను శపథము చేసియుండఁగా మరల నడుగనేల? అని తలఁచి స్మిత మంకురింపఁగా రాజా! మిత్త్ర లక్షణ ముపకారము చేయుట, శత్త్రులక్షణ మపకారము చేయుట యనఁబడును. నీదారాపహర్తను వధించెదను. ఇవిగో నా వాడినారసములు. అన్న యన్న పేరున శత్త్రువై నీయెడ నింతటిపాపము గావించినవాలి యింక నాబాణముల హతుఁడై వజ్రహతపర్వతమువలె నేలం గూలఁగలఁడు. అను పలుకులు సుగ్రీవుఁ డాలకించి హర్షభరమున మంచిది మంచిదని కొని యాడెను. శ్రీరామా! నేను శోకార్తుఁడను. నీవు శోకార్తు లకు నాథుఁడవు. మిత్త్రుఁడవగు నీకడ నాకష్టపరంపరలఁ బలు సారులు చెప్పుకొనుచున్నాను. మన మగ్నిసాక్షికముగా మిత్త్రులమైతిమి. కనుకఁ బ్రాణాధికుఁడవే యైతివి. సత్యము మీఁద శపథము చేయుచున్నాను. మిత్త్రునికడ దుఃఖములఁ జెప్పుకొనుట మంచిదే. అనిమాత్రము పలికి మఱి మాటాడఁ జాలక యూరకుండెను. ధైర్యము తెచ్చుకొని దాని నడంచు

కొనెను. రామునింగాంచుచు బలశాలి యగువాలి రాజ్యము నుండి నన్ను వెడలఁగొట్టినాఁడు. ప్రాణాధికయగు నాదార నపహరించెను. నామిత్రులను జెఱఁబెట్టెను. దుర్బుద్ధి నన్నుం జంపఁ దలంపుగొని ప్రయత్నము లద్దానికిం దగినవానిని గావించుచున్నాఁడు. వాఁడు పంపినవానరుల నెందఱనో నేను వధించితిని. వాలియే పంపెనన్న కారణమునఁ బరమకరుణాబ్ధి వగు నిన్నుం గనినంతన భయంపడి నీకడకు రానైతిని. భయ కారణముగల్ల నెవ్వరును రారు కదా. ఈ హనుమదాదులు మాత్రమే నాకు సహాయులు గాని మఱెవ్వరును లేరు. వారి మూలముననే యిన్నికష్టములలో నసువుల నిలుపుకొనఁ గల్గితిని. వీరు నన్నే మఱక రక్షించుచున్నారు. నన్ను వదలియుండరు. మహానుభావా! సంగ్రహముగా విన్నవించెదను. పరాక్రమాధికుఁడు వాలి నాయన్న. అతఁడే విరోధి. వాఁడు నశించిననే నా యీదుఃఖము తీఱును. తన్నాశనమునఁగాని నాకు సుఖజీవితము లుండవు. నా దుఃఖమిది. ఎల్లవిషయములందు మిత్రుఁడే దిక్కు కదా. అనఁగా శ్రీరాముఁడు సుగ్రీవా! మీయిరువురకుఁ బగ రాఁగతంబేమి? యథాతత్త్వముగ వినఁగోరుదు. వైరకారణమును విని తరువాత వైరము బలవత్తరమా, తత్కారణము బలవత్తరమా యని యీరెండింటిబలాబలముల విమర్శించి యనంతరము నీకు సుఖము గల్గించెదను. నీయవమానము వాలి కృతమని విన్నంతనే నా కధికకోపము గల్గినది. నాబాణముచే వాలి చచ్చినట్టే తలంచి వచింపుము. బాణము నేను విడుచుటయే యాలస్యముకాని పిదప నుత్తరక్షణముననే వాలి మృతుఁడగునని తలంపుము. అని పలుక నాలకించి సుగ్రీవుఁడు

నతని నలువురుమంత్రులు సంతసిల్లిరి. సుగ్రీవుఁ డంతట నిట్లు శ్రీరామునకుఁ దనవృత్తాంతమును జెప్పఁబూనెను.

విజ్ఞానధనులారా! ఇందలి నీతుల నెమకి తెలిసికొందము.

"సర్వథాహమనుగ్రాహ్యో దేవతానా మసంశయః,
ఉపపన్నగుణోపేతస్సఖా యస్య భవాన్మమ. ౨
శక్యం ఖలు భవేద్రామ సహాయేన త్వయానఘ,
సురరాజ్యమపి ప్రాప్తుం స్వరాజ్యం కిం పునః ప్రభో. ౩
సోఽహం సభాజ్యో బంధూనాం సుహృదాం చైవ రాఘవ,
యస్యాగ్నిసాక్షికం మిత్రం లబ్ధం రాఘవ వంశజం. ౪
అహమప్యనురూపస్తే వయస్యో జ్ఞాస్యసే శనైః,
నతు వక్తుం సమర్థోఽహం స్వయమాత్మగణాన్ గుణాన్. ౫
మహాత్మనాం తు భూయిష్ఠం త్వద్విధానాం కృతాత్మనాం,
నిశ్చలా భవతి ప్రీతిర్ధైర్యమాత్మవతా మివ." ౬

అని మూలము. ఇవి సుగ్రీవభాషణములు. శ్రీరామా! నీకు నేను సఖుఁడ నైతిఁగాన దేవతల కనుగ్రాహ్యుఁడనే. సర్వదేవతలదయకు నర్హుఁడనే యని భావము. సకలదేవతలు నీయంశములు. సూర్యమండలముం బోలి నీవు ప్రధానుఁడవు. అట్టి నీకు నేను మిత్రుఁడనుగాఁగా నెల్లవారిదయకుఁ బాత్రుఁడనే కదా. నీదయకు నెపుడు పాత్రుఁడనైతినో యపుడే యెల్లరు నాపై దయాదృష్టిఁ బఱపుదురు. అని దీనితాత్పర్యమును గ్రహింపఁదగు. ఇది యుపాసనాస్వరూపమును దేటపఱచుచున్నది.

"చిన్మయస్యాప్రమేయస్య నిర్గుణస్యాశరీరిణః,
సాధకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా."

అను కులార్ణవతంత్రోక్తప్రకారముగా జ్ఞానస్వరూపుఁడై పాంచభౌతికాదిశరీరములు లేక నిర్గుణుఁడు నగు భగవంతునకు రూపకల్పన ఉపాసకుల హితముకొఱకే. అనఁగా నుపాసకుఁడు భగవంతుని సర్వవ్యాపిగాఁ బూజింపఁజాలఁడు. ధ్యానింపఁజాలఁడు. అట్లు చేయఁగల్గిన సిద్ధుఁడే యగును. తొలుత నది సాధ్యము కాదు. కాన నొకరూపము నామము కల్పించుకొని యాకల్పితమూర్తిని దనహృదయారవిందపీఠమున ననఁగా ననాహత చక్రమున నని యర్థము. అనాహత నాదస్థానమగుట అనాహతచక్రమని పేరుగల్గినది. అది మరుత్తత్త్వము. చంచలస్వభావము. దాని నిగ్రహించుటకే యోగాభ్యాస మావశ్యకమని గ్రహింపఁదగు. ఆహృదయపీఠమున నాకల్పితమూర్తి నావేశింపఁజేసి తన్మంత్రమును జపించుచు దానినే చూచుచుండవలయు. సమాహితుఁడే కావలయుననుట యిందులకే యని యెఱుంగవలయు. నిశ్చలమనస్కుఁడై జపము చేయుచు దానినే వీక్షించుచు నుండుటయే యుపాసకుని లక్షణము. ఉపాసన యనఁగా నిదియే. మంత్రజపము మాత్రము చాలదు. ప్రధానము ఇష్టదేవతామూర్తిని గాంచుచుండుటయే. ఆదేవతయే భగవంతుఁడని భావింపవలయు. ఆసిద్ధి కాఁగా సర్వదేవతలు నతని నను గ్రహింతురు. ఏల? సర్వదేవతాస్వరూపుఁ డగుభగవంతుఁడే తన యభీష్టదైవమని భావించినకారణమున. అట్లుగాక వైకుంఠలోకాధిపతియగు విష్ణువనికాని, కైలాసవాసుఁడగు శంకరుఁడనికాని యిట్లే యితరులను భావించిన నందఱు నతని నను గ్రహింపరు. ఏలయనఁగా నతనిబుద్ధి భిన్నభావముకలది కనుక. ఇదియే యుపాసనాతత్త్వము.

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ."
అను గీతాశాస్త్రవాక్యము నీయర్థమునే తెలుపుచున్నది. "ఏక మద్వితీయం మామ్" అని కదా యర్థము. సర్వము మన్మయ మని కదా సారము. అట్టిభావముకలవాఁడే యుపాసకుఁడు. అ వానికి సర్వమంత్రాధిదేవతలు వశ్యులే యగుదురు. రాజు మిత్త్రుఁడు కాఁగా నెల్లరును మిత్త్రులైనయట్లు. ఈపద్ధతిగాక మధ్యవైష్ణవుల మాయాబోధము ననుసరించినచో ఫలము ధనవ్యయమే. వేఱొండు కలుగదనుట సిద్ధాంతము. ఈభావము నీరామాయణమే తెల్పుచున్నది. నీకు సఖుఁడనైతిని గాన నెల్లదేవతలకృపకుఁ బాత్రుఁడనైతి ననఁగాఁ దాత్పర్య మిదియే యగుంగాని వేఱొండు కాదు.

"అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే,
ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః. ౮
మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరం,
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ. ౯
తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం,
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే. ౧౦
తేషామేవానుకంపార్థ మహమజ్ఞానజం తమః,
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా." ౧౧

గీత. ౧౦ - అధ్యా.

అను నీగీతావాక్యము లీయర్థమునే కదా తెలుపుచున్నవి. సర్వము నామయమనఁగా నర్థమేమి?

రామా! నీసాయమున్న సురలోకమున కధిపతిని గాఁగలను. కపిరాజ్యము లభించుటెంత? అనఁగా సాధారణ ముగా వానరములకు మానవజన్మము లభించినమీఁదఁగాని

స్వర్గలోకప్రాప్తిలేదని పెద్దలందురు. మర్కటజన్మము పాపమూలమని భావము. అట్టినాకు నీసాయమున స్వర్గరాజ్యముకూడ లభించునని సుగ్రీవుఁ డనెను. అనఁగా భగవత్కృప గలిగిన యెడల నెట్టిజంతువైన నుత్తమలోకములఁ బొందునని యీ భాగము మనకు నెఱిఁగించుచున్నది. అగ్నిసాక్షికముగా నీకు నే మిత్రుఁడనగుట బంధుపూజ్యుఁడ నైతినని కపిరాజనియె. మర్యాదగలవాఁడు మిత్రుఁడుగా నుండినఁగాని బంధువులు లోనగువారు గౌరవింపరని దీనివలన మన మెఱుంగవలయు. రామా! నీమైత్రి నిశ్చలము. అనఁగా సజ్జనసహవాసము నశించునది కాదు. "ఆత్మవతాం ధైర్యమివ" భగవత్తత్త్వ మెఱింగినవారలకు ధైర్య ముండినట్లు. అనఁగా నశింపనిధైర్యము వారికిఁ గలుగునని భావము. ఇతరులు మానవుల నాశ్రయింతురు గాన నిశ్చలధైర్యము కలుగ నవకాశమే లేదు. భగవంతు నెఱింగినవారలకు నితరులనుండి భయపడవలసిన యవసరమే లేదు. అనఁగా నెల్లరు భగవంతు నాశ్రయించిననే ధీరులగుదురు గాని యితరాశ్రయణము పనికిరాదని సారము. ఇట్టు లీభాగము శ్రీరామునితత్త్వమును దేటపఱచుచున్నది. భగవంతునియం దునిచినమైత్రియే శాశ్వతఫలద మనునీతి నిద్దానినుండి గ్రహింపందగును.

"రజతం వా సువర్ణం వా వస్త్రాణ్యాభరణాని చ,
అవిభక్తాని సాధూనా మవగచ్ఛంతి సాధవః. ౭
ఆఢ్యో వాపి దరిద్రో వా దుఃఖితస్సుఖితోఽపి వా,
నిర్దోషో వా సదోషో వా వయస్యః పరమాగతిః, ౮
ధనత్యాగస్సుఖత్యాగో దేహత్యాగోఽపి వా పునః,
వయస్యార్థే ప్రవర్తంతే స్నేహం దృష్ట్వా తథావిధం." ౯

అని మూలము. సాధుజనమైత్రిలక్షణ మిందుఁ గలదు. సాధు జనులు తమమిత్రులవియుఁ దమవియునగు ధనాదివస్తువుల నిరువురవిగా భావింతురు గాని 'యివి నావి, యివి నాసఖునివి' అని భావింపరు. ఇరువు రొక్కటియే యని వారిభావము. లోకమున మిత్రుఁడే దిక్కు. వేఱొకఁడు కాఁడని భావము. మిత్రునికొఱకు సజ్జనులు దేహమైన నొసంగుదురు. అనఁగాఁ దనయాపదవలె మిత్రునాపదను భావింతురని భావము.

"ఉపకారఫలం మిత్ర మపకారోఽరిలక్షణం,
అద్యైవ తం హనిష్యామి తవ భార్యాపహారిణం." ౨౧

అని మూలము. భర్తృహరి లోనగువారి మహాశయముల కన్నింటికి రామాయణమే మూల మనవలయును. మిత్రలక్షణ ముపకారము చేయుట. శత్రులక్షణ మపకారము చేయుట. మిత్రుఁడ నైనందులకు నీకుపకారము చేయఁ దలఁచితిని. నీశత్రుమారణమే నీ కుపకార మగును. ఆకార్యము నొన రింతునని శ్రీరాముఁ డనియెను. వాలిదుర్వృత్తిని దెలిసికొనక యుండ నిట్లు శపథము శ్రీరాముఁడు చేయవచ్చునా యని కొందఱు ప్రశ్నింపవచ్చును. శ్రీరాముఁడు పరమేశ్వరుఁడని యంగీకరించువారల కీప్రశ్నముచేయు నవకాశమే లేదు. కాదనువారలకు సమాధానముచెప్పియు లాభములేదు. వాలి తనచేతఁ జచ్చువాఁడని యెఱింగియు సుగ్రీవునిమూలమున వరుసగా నావిధ మెఱుంగఁగోరియు నిట్లు పలికెనని మన మనుకొనవచ్చును. వాలికర్మమే శ్రీరామునినోటనుండి యీ మాటల వెడలించినదన్నను న్యాయ్యమే. సర్వజ్ఞత్వము నియ్యదియే ప్రకటించుచున్నది. కర్మసిద్ధాంత మప్రతిహతమని యుఁ దేటపఱచుచున్నది.

"స మే జ్యేష్ఠో రిపుర్భ్రాతా వాలీ విశ్రుతపౌరుషః. ३०
తద్వినాశాద్ధి మే దుఃఖం ప్రణష్టం స్యాదనంతరం,
సుఖం మే జీవితం చైవ తద్వినాశనిబంధనం." ३౯

అని మూలము. పగవాఁడు జీవించియుండఁగా నాకు సుఖము బ్రదుకువలని లాభము లేదని సుగ్రీవుని యాశయసారము. ప్రాయికముగా నిది లోకమునఁ గలయాచారమే కాని క్రొత్తది కాదు. ఫలములకొఱకుఁ గర్మము లాచరించువార లకుఁ బరుల హింసింపఁగోరి దుష్కర్మముల నాచరించువారలకు నిట్టికష్టములు సంభవించును. వానికొఱ కెన్ని యో శ్రమము లొందవలసియుండును. ఫలాభిసంధిరహితముగ సత్కర్మముల నాచరించువారల కీకష్టము లుండవు.

"రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్,
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి. ౬४
ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే,
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే. ౬౫
నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా,
నచాభావయతశ్శాంతి రశాంతస్య కుతస్సుఖం." ౬౬

గీత. ౨-అధ్యాయము.

అను నీగీతావాక్యములను బరికించిన నీసిద్ధాంతతత్త్వ మెఱుకపడును. ఇట్టికష్టములనుండి తప్పించుకొనుట కొకవిధానము పెద్దలు పలుకుదురు. శత్రువుండుచోటికిం జాలదూరమున నుండి పూర్వవైరమును స్మరింపక కొంత కాలముపుచ్చిన నా వైరము నశించును. వైరిసందర్శనము వైరమును స్మరించుట

యనునివి తదభివృద్ధికి దోహదము లగును. ఇందలిసారమే గీతావాక్యములయందు ధ్వనించుచున్నది.

"కిం నిమిత్త మభూద్వైరం శ్రోతుమిచ్ఛామి తత్త్వతః. ౪౧
సుఖం హి కారణం శ్రుత్వా వైరస్య తవ వానర,
ఆనంతర్యం విధాస్యామి సంప్రధార్య బలాబలం." ౪౨

అని మూలము. "అనల్పాపరాధే స్వల్పవైరం చేత్సమాధాన ముఖేన సుఖం విధాస్యామీతి భావః." అని గోవిందరాజులు. మానవత్వమును బ్రకటించుచు రాముఁడు ప్రశ్నించుచున్నాఁడు. మీ యిరువురకుంగల విరోధకారణముల విని యందలి బలాబలముల నాలోచించి యవ్వల నీకు సుఖమెట్లు చేకూర్పనగునో యట్లే చేయుదునని రాముని ప్రశ్నసారము. ఇద్దానిచే సుగ్రీవునకు సంశయము జనించునవకాశము కలదు కదా. ఇట్లేల యడిగెనని కొంద ఱందురు. ప్రభువు అపరాధుల నిరువురను సమానదృష్టిం బరిశీలించి యపరాధాల్పత్వ బహుత్వములఁ జక్కఁగా నెఱింగి పిదప న్యాయమునకు సాయము చేయవలసినవాఁడు. భగవంతుఁడు నాపద్ధతినే యనుసరించి విచారింపవలయును. లోపలఁ దాఁ జేసిన వాగ్దానమును దప్పకయుండునట్లు "తవ సుఖం విధాస్యామి"అనియె. ఎట్లు నీకు సుఖము కలుగునో యట్లు చేయుదును. వాలియందేదియు దోషములేనిచో నాతని సాంత్వనోక్తులం దేర్చి ప్రసన్నుని గావింతునని ప్రాతీతికార్థము. సర్వజ్ఞుఁడు కనుకనే వాలిని వధించెదనని ముందే పలికెను. వాలిని వధించి నీకు సుఖముం గూర్తునని చెప్పినట్లు మనము గ్రహించిన దోషము లేదు. ఈభావమునే యీ క్రిందిశ్లోకములు తెలుపుచున్నవి.

"హృష్టః కథయవిస్రబ్ధో యావదారోప్యతే ధనుః,
సృష్టశ్చ హి మయా బాణో నిరస్తశ్చ రిపుస్తవ." ౪౪

అని మూలము. ఏవిధముననైన వాలిని వధింతును. కాన విశ్వాసమునిచి వైరకారణము వచింపుమా యని రాముఁ డడిగెను. దీనిచేత సమాధానముఖమున సుఖమును గల్పింతునన్న భావ మంతసమంజసము కాదని తోఁపఁ గలదనవచ్చునేమో.

## వాలిదుర్వృత్తులను సుగ్రీవుఁడు రామునకుఁ దెల్పుట.

*నాతండ్రి శత్రుహంతకుఁ డగు నాయన్నను వాలిని మిక్కిలి గారవించుచుండువాఁడు. నేనును గారవించువాఁడనే. తండ్రి మృతుఁడుకాఁగా మంత్రులు కపిరాజ్యమున కభిషిక్తుం గావించిరి. వాలి రాజ్యముం బాలించుచుండ నెల్లకడల సేవకుఁ డనై నే నుంటిని. దుందుభియనువాని తొలికొడుకు మాయావి యనురక్కసుఁ డొకఁ డుక్కుమిగిలి యుండెను. వానికి వాలికిని స్త్రీహేతువువలనఁ బగ గలిగినది. అంద తెటింగినదే యది. ఆమాయావి యొకనాఁడు నడికి రేయివచ్చి కిష్కింధా నగరద్వారముకడ నార్చుచు వాలిని యుద్ధమున కాహ్వానించెను. నిద్రవోవు నాయన్న యానాదము నాలకించి యతని పొగరున కోర్వక ప్రయాణమయ్యెను. మేమందఱ మెంతయో ప్రయత్నించి నివారించితిమి. కాని యతఁడు పట్టు వదలక తద్వధమునకై వెడలెను. నేనును వెంటనరిగితిని. వాఁడు మా యిరువురిని దూరమునఁ గని భీతిల్లి పరువెత్తెను. మేమును వెంబడించితిమి. చంద్రుఁ డుదయించెను. త్రోవ కనఁబడుచుండెను. వాఁడు తృణసమాచ్ఛాదిత దుర్గమ మహాబిలముం

* ఇది తొమ్మిదవసర్గమునఁ గలదు.

బ్రవేశించెను. మే మచ్చటికిం బోయితిమి. రోషమున మా యన్న నన్నుంగని సుగ్రీవా! నేఁ బగవానిం జంపివచ్చుదనుక జాగరూకుఁడవై యీద్వారముకడనే యుండుమనియె. నేను ను వత్తునని యెంత వేఁడుకొన్నను వినక తనపాదములపై నొట్టు పెట్టించుకొని నన్ను నిలిపి తాఁ బ్రవేశించెను. ఒక్కసంవత్సర మందే యుండితిని. అతఁడు రాఁడయ్యెను. నాకతఁడు మరణిం చెనన్న శంక కలిగినది. అంతఁ గొంతకాలమున కాబిలమునుండి ఫేనసహిత మగురక్తము వెలువడియె. దానింగని వగచితిని. అంత నసురులు గర్జించుటయుఁ బరాజితుండై నాయన్న యఱచుధ్వనియు వినవచ్చినవి. వారిచే వాలి హతుఁడయ్యెనని తలంచి పర్వతాకారమగు శిల నాబిలద్వారమున మూఁతగా నునిచి వగచి జలతర్పణముగావించి కిష్కింధం జేరితిని.

అంత సత్యము నేనెంత దాఁచినను మంత్రులు కష్టముపై నావలన వాలి మృతినెఱింగి నన్నుఁ బట్టాభిషిక్తుని గావించిరి. రాజ్యమును నేఁ బాలించుచుండఁగా వాలియు మాయావిం జంపివచ్చెను. నన్నుంగాంచి పట్టరానికోపమునఁ గఠినపుమాట లాడెను. ప్రకృతిబలము నాకున్నను భ్రాతృగౌరవమున న్యాయముచొప్పున గౌరవించి వందన మొనరించితినిగాని యతఁ డాశీర్వచనము కూడఁ జేయక యాగ్రహము వదల కుండెను.

## వాలి సుగ్రీవుని వెడలఁగొట్టుట.

* అంత నాయన్న కోప మతిశయింపఁగాఁ ద్వరపడు చుండుటం గని. నేనతనికోపము దీర్పఁగోరి యన్నా! నాయ

* ఇది పదియవసర్గమునఁ గలదు.

దృష్టమునఁ గుశలివై వచ్చితివి. పగవానిం జంపితివి. అనాథ
నాథుఁడవు. ఈ శ్వేతచ్ఛత్రముం బట్టెద. ఈచామరముల వీచెద.
అంగీకరింపుము. నేనాబిలముకడ నొకయేఁడు కాచియుంటిని.
నీవు రాకపోవుట రక్తధారలు వెడలుట యనునివి నాకార్తిని
గల్గించెను. అంత వగపున నేనాబిలమును బాషాణమునఁ
గప్పివచ్చితి. పౌరులు మంత్రులు రాజ్యము చెడునని యభి
షిక్తుం గావించిరి. నేఁ గోరలేదు. నాయం దేదియేఁ దప్పున్నను
క్షమింపుము. రాజవు నీవే. నేను మున్నువలె యువరాజనై
సేవింతును. నీవు లేనితఱి నేనీరాజ్య మేలితిని గాని వేఱు
తప్పులేదు. నీరాజ్యముం గైకొనుము. రోషము వదలుము.
మ్రొక్కెదను. అని బతిమాలితిని. నేనెంత ప్రార్థించినను వినక
యనరానిమాటలాడెను. పౌరులను మంత్రులను రప్పించి
మిత్రులనడుమ నన్ను నిందించుచు మాయావి కిష్కింధ కరు
దెంచినదాదిగా బిలప్రవేశముదనుకం దెల్పి నేను వానింజంపి
వెడలి రాఁ బ్రయత్నింప ద్వారము మూయఁబడియుంటం జేసి
త్రోవ కనఁబడకపోయెను. సుగ్రీవా యని యెన్నిసారులు
పిలిచినను బదులు లేకపోయెను. నే దుఃఖించి కాలందన్ని తన్ని
యాపాషాణము భేదించి యిచ్చటికి వచ్చితిని. ఈసుగ్రీవుఁడు
రాజ్యముంగోరి భ్రాతృవాత్సల్యము విడిచి యాబిలమునుండి
నేను రాకుండవలయునని కప్పి వచ్చినాఁడు. అని యేకవస్త్ర
ముతో నన్ను వెడలఁగొట్టెను. అంతియగాక భార్య నపహ
రించెను. వాలిభయమున నేనీభూమినెల్లం దిరిగితిని. తిరిగి
తిరిగి వాలికిం బ్రవేశింపరాని యీఋశ్యమూకమున నున్నాఁ
డను. ఈవృత్తాంతమంతయుఁ దెల్పితిని. నాయం దనుగ్రహము
చేయందగుదువు. సుగ్రీవుఁ డిట్లు పలుకఁగా విని మహాతేజస్వి

యగు రాముఁడు స్మితాననుఁడై రాజా! ఈయమోఘసాయ కము లావాలిపైఁ బడఁగలవు. ఆదురాత్ముఁడు నాకంటఁబడక యుండునంతదనుక జీవించియుండఁగలఁడు. నాదుఃఖము ననుస రించి యూహింప నాకంటె మిక్కిలి దుఃఖమున నున్నాఁడవని తెలియవచ్చెడిని. దుఃఖసాగరమునుండి నిన్నుద్ధరించెదను. నీయభీష్టము సిద్ధించును. అనఁగాఁ గపిరాజాపలుకులకు సంత సించి శ్రీరాముని వినుతించెను.

మహాశయులారా! ఈరెండుసర్గములయందు విశేష విషయములు లేవు. కాని కొన్నికొన్ని యెఱుంగఁదగినవి లేక పోలేదు.

"మాయావీ నామ తేజస్వీ పూర్వజో దుందుభేస్సుతః,
తేన తస్య మహాద్వైరం స్త్రీకృతం విశ్రుతం పురా." ౪

అని మూలము. వాలికిని మాయావి యను దానవునకును స్త్రీవిషయమున గొప్పవైరము కలిగియుండెననుట ప్రసిద్ధమే కాని రహస్యవార్త కాదని సుగ్రీవుఁడు పలికెను. మాయావి రాక్షసుఁడు. వాలి వానరుఁడు. స్త్రీనిమిత్తమై వీరికి విరోధము పొసంగుట యెట్లు? అనునది యొక సందియము. ఈయిరువురు కామరూపులే. కావున నొకజాతిస్త్రీని మోహించి యుండ వచ్చుననియు నందొకరినే యామె ప్రేమించియుండుననియు నాకారణమున వారికిఁ బగ గలిగి యుండవచ్చుననియుఁ గొందఱు సమాధానము చెప్పఁబూనుదురు. అది యంతగాఁ బొసఁగదని నాయూహ. వాలి తనజాతిస్త్రీనే వివాహము చేసి కొనెను. కామరూపులు గాన నేకాంతను బ్రేమించిరో యా జాతిదేహములనే ధరించి రని చెప్పఁబూనుదురేమో. ఆకాంత

యిం దెవరికిని భార్యయైనట్టు లాధారము కనఁబడదు. వ్యభిచార కార్యమున విరోధము కల్గెనందు రేని దానికి నాధారము లుండవలయును. అవి దొరకినంతదనుక నీవిమర్శమును మానుదము.

మాయావి నడికిరేయి యుద్ధమునకుఁ బిలువఁగా నతఁడుపోవుట సుగ్రీవుఁడు వెనుకఁబోవుట మొదలుగా వాలి వచ్చినంతదనుకఁ గల కథ నాలోచింపఁగా నిరువురవాదము న్యాయ్యములే యనఁదగియున్నవి. ఆసమయము ననుసరించి యిరువురకుఁ గల్గిన యూహ లసంగతములు కానేరవు. ఒకరి యూహ వేఱొకరికి నప్పటిస్థితి ననుసరించి విరుద్ధముగాఁ దోఁచుటయు ధర్మము. వాలి సుగ్రీవు నిగ్రహించుటయుఁ దప్పనగాదు. వాలి మనసునఁ దమ్ముఁడు ద్రోహి యనుభావ ముదయించెను. ఈవార్త నాలకించిన శ్రీరామునకు నెద్ది తోఁచుట న్యాయమని విచారింతము. సుగ్రీవునిమాటల ననుసరించి యోజించిన మహాపరాధము కనఁబడదు. వాలి యెట్టి భావమున వెడలఁగొట్టెనో యనునదియు సుగ్రీవునిమాటలఁ బట్టి యోజించినను మహాపరాధము కానరాదు. అట్టులుండ వాలిని వధింతు నని శపథముచేయనేల? అనునదియే శంక. ఈయిరువురి యపరాధములు సమానములే యైనను సోదరుని దఱుముటయేగాక యతనిభార్యనుగూడ నపహరించుట యను మహాపరాధము వాలిపైఁ గలదు. అది మహాక్రూరకార్యము. భార్య పగవానికడ నున్నదన్న సంతాపమునఁ గుందికుంది తమ్ముఁడు చచ్చుఁగాక యనుభావము వాలికిం గలిగియుండు నని యూహింపవచ్చును. ఆయూహకుఁ దగినకారణము లున్నవి. కావున మహాపాపకార్యరతుఁడు వాలి యను

భావము శ్రీరామునకుఁ దోఁచెను. మహాపాపాత్ముని వధిం చుట తనయవతారఫలమని నిశ్చయించి యపరాధముల విని పింపు మని యడిగియు నతనిమూలమున వినియు నయ్యది క్షమింపఁదగని యపరాధమని నిశ్చయించి వధింతునని వాగ్దా నము చేసెను. మునివృత్తినున్న రామునకు న్యాయ్యమా యనుశంకకు సమాధానము వాలివధఘట్టమున వ్రాసెదను.

"వాలినస్తు భయార్తస్య సర్వలోకాభయంకర,
కర్తుమర్హాసి మే వీర ప్రసాదం తస్య నిగ్రహాత్. 30

... ... ... ... ...

యావత్తం నాభిపశ్యామి తవ భార్యాపహారిణం,
తావత్స జీవేత్పాపాత్మా వాలీ చారిత్రదూషకః. 33
ఆత్మానుమానాత్పశ్యామి మగ్నం త్వాం శోకసాగరే,
త్వామహం తారయిష్యామి కామం ప్రాప్స్యసి పుష్కలం." 34

అని మూలము. శ్రీరాముని శపథకారణము లిందుఁ గలవు. 'సర్వలోకాభయంకర' అను నీవిశేషణము సామాన్యులయం దుపయోగింపఁ దగినదికాదు. సర్వేశ్వరత్వమును దేటపఱచు నది. శ్రీరామదర్శనసహవాససల్లాపములచే నాకపిరాజునకు భగవంతుఁడే యనుభావము కల్గెను. కనుకనే నాయం దను గ్రహ మునుపుమా యని కోరెను. అది వాలినిగ్రహరూప మైనదని. ఆవాంఛితము న్యాయ్యమే యని రాముఁడు గ్రహిం చెను. నన్ను వాలి పాఱఁదోలినట్లే నేనతనిఁ బాఱఁదోలి నిష్కంటకముగా రాజ్యమేలునట్లు లనుగ్రహింపుమని సుగ్రీ వుఁ డేల కోరరాదు? అని యడుగువా రుందురు. అట్లతఁడు కోరఁజాలఁడు. వాలికి మృతికాల మాసన్నమైనది. తత్క ర్మము సుగ్రీవుని బురికొల్పక యూరకుండదు. తద్వశీకృతచిత్తుఁ

డగు సుగ్రీవుఁ డేదికోరుటకు నధికారి కాఁజాలఁడు. అది యాడించినట్లెల్ల నతఁ డాడుచుండువాఁడే. ఎవరిమూలమున నతఁడు చావవలయునో నట్టివ్యక్తి వేఱొకవిధముగ నెట్లు మాటలాడఁగల్గును? తత్కార్యానురూపముగనే మాటలాడును. కాననే శ్రీరాముఁ డతనికర్మము నెంచి తదనురూపముగ శపథము వధింపఁజేసెనని మన మూహింపవలయును. ఈవిషయమునం దధ్యాత్మరామాయణముకూడ సంవాదిగనే యున్నది.

సుగ్రీవుఁడు వాలికిఁగలశాపముం దెల్పి శ్రీరాముని బలము తెలియఁగోరుట.

*సుగ్రీవుఁడు శ్రీరాముని యాపలుకుల నాలించి దోసిలొగ్గి యిట్లు వినుతించెను. నీవు కోపమునొందినచోఁ బ్రళయార్కునివలె నుందువు. వాఁడితూపుల లోకంబుల దహింతువు. నిస్సంశయము. వాలి బలపరాక్రమాదుల నాలకించి పిదపఁ జేయఁదగిన కార్య మొనరింపుము. వాలి బ్రాహ్మముహూర్తమున లేచి రవి పొడములోపల సంధ్యావందనకర్మమునకుఁ బ్రాక్పశ్చిమదక్షిణోత్తరసముద్రములకు నశ్రమమునఁ బోవుచుండును. పర్వతాగ్రములపై కేగి యాశృంగములను గందుకములవలె నెగురవైచి పట్టుకొనును. బలప్రదర్శనార్థము వనములఁ గల తరువరములఁ బెక్కింటిని విఱిచియున్నవాఁడు. పరాక్రమశాలి దుందుభి యనునొకరక్కసుఁ డుండెను. వానికి మహిషము నాకృతియందుఁ బ్రీతిమెండు. కైలాసశిఖరమువలె వాఁడగపడును. సహస్రగజబల మాతనికిం గల్గియుండు. వరబలమునఁ జెలరేఁగి సాగరము నాక్రమింపంబోయి దానిం గని

* ఇది పదునొకండవసర్గమునఁ గలదు.

యుద్ధ మొసంగుమా యని యడిగెను. ఆసాగరము మానవా కారమునఁ దోఁచి మృత్యుప్రోత్సాహితుఁడగు నతనితో నీవు రణపండితుఁడవు. నీతోఁ బోరఁజాలను. ఐన నట్టివాని వీరు నొక్కనిఁజెప్పెద. శంకరునిమామయుఁ బర్వతరాట్టునగు హిమ వంతుఁడు నీకు యుద్ధమునఁ దృప్తిని జక్కఁగాఁ జేయఁగలఁడు. అనఁగా వేగమున నచటికిఁబోయి తనకొమ్ములఁగ్రుచ్చి బండల నెగఁజిమ్మి యార్చెను. పర్వతరాజు తనశిఖరముననుండి దుం దుభీ! నన్ను బాధింపకుము. యుద్ధశూరుఁడను గాను. మఱియు విశేషించి మునులు నాయందు నివసించియున్నారు గాన సంగ రముచేయ ననువుపడదు. అనఁగా నారక్కసుఁడు భయపడిన వానితో రణముచేయను. నాకు రణకాంక్ష మిక్కిలి కలదు. కాన యుద్ధశూరుని దెల్పుము. నా విని యట్లేని కిష్కింధా పురమున వాలి యనుకపిరాజు కలఁడు. ఇంద్రతుల్యపరా క్రముఁడు. నముచికి నింద్రుఁ డిచ్చినట్లు నీకాతఁడు రణభిక్ష మొసంగును. వేగమునఁ బొమ్ము. అతని నెదిరింపఁ దరము గాదు. అనఁగా మహాకోపమునఁ గిష్కింధకుంబోయి భయం కరమహిషాకారమున ద్వారముకడ భూమి వడఁకునట్లు సింహ నాద మొనరించెను. మదగజమువలె వృక్షములఁ జెండుచుం డఁగా నాతనిధ్వని నాలకించి సహింపక వాలి కాంతలంగూడి తారాపరివృతుఁడగు చంద్రునివలెఁ బ్రయాణముచేసి వానిం గాంచి దుందుభీ! మహాబలుఁడవగు నీవు నాకుఁ దెలిసినవాఁ డవే కదా. ఏల యిట ధ్వనిచేయుచున్నాఁడవు. ప్రాణములఁ గాపాడుకొనుము. అను వాలిపలుకులు విని క్రోధతామ్రాక్షుఁ డై దుందుభి వాలీ! స్త్రీలయెదుట బింకము లాడకుము. రణము చేయుము. ఆవల నీబల మెఱుంగుదును. కాదేని యీరాత్రి

యంతయు నవకాశ మిత్తును. ఇంతలో భోగముల ననుభ
వించి యెల్లబంధువులం గని చరమకాలమున నీదగువాని
నెల్ల వారికపుడే యొసంగి పురమును బాఱఁజూచి మఱియొకని
బురమున కధిపతిగా నియమించి రమ్ము. నీమదం బడఁగించెదను.
మత్తుఁగొనియున్న వానిని, ఏమఱియుండువానిని, నిద్రపోవు
వానిని, నిరాయుధుని, స్త్రీలనడుమ నీవలెనుండి కామమద
మత్తుఁడుగానుండువాని నెవ్వాఁడు వధించునో వానికి భ్రూ
ణహత్యచేసినపాపము గలుగును. అను నారక్కసుని మాట
లాలకించి తార లోనగు భార్యల నంతఃపురమునకుఁ బంపి
కోపమున నాతనిం గని నవ్వి నీకు రణమున భయములేక
పోయిన నన్ను మత్తుఁడ నని తలంపకుము. ఈమదమే చేయఁ
బోవు యుద్ధమునకు వీరపాణమని తలంపుము. అని హెచ్చ
రించెను. అంత వాలి కోపమున నింద్రుఁడు తనకొసంగిన
కాంచనమాలికను దాల్చి యెగఁద్రోసికొని యుద్ధముచేయఁ
బూనెను.

వాలి పర్వతాకారుఁడగు దుందుభిం గని కొమ్ములంబట్టు
కొని గర్జించుచు గిఱగిఱం ద్రిప్పి నేలంబడఁగొట్టి సింహనాదము
చేసెను. ఆతని చెవులనుండి రక్తము స్రవించెను. వాఁడు లేచి
యుద్ధముచేయఁగా నది ఘోరమయ్యెను. వరుసగా దుందుభి
బలము క్షీణించెను. ఆవిధ మెఱింగి వాలి వానిని బైకెత్తి
క్రిందఁబడఁగొట్టెను. కాయము ముద్దకాఁగా వాఁడు మృతి
నొంది నేలంగూలెను. వాలి యాకళేబరమును బైకెత్తి యిట్ట
టులాడించి విసరి యోజనదూరమునఁ బడునట్లు వైచెను.
వాయువేగమున నా దానవునినోటనుండి రక్తబిందువులు
మతంగమునివరు నాశ్రమమునం బడినవి. ఆముని యందు

లకుఁ గోపగించి యీకార్య మెవ్వఁడు చేసె నని తలంచి నాపై నిట్లు రక్తబిందువులు పడునట్లు చేసిన యాదుష్టుఁ డెవఁ డని పలికి యాశ్రమమునుంచి వెడలి వచ్చి యొక్కచోఁ జచ్చి పడిన యాదనుజుని యాకారమును గని తపోదృష్టి నాపని చేసినవాఁడు వాలియే యని యెఱింగి శాపము నిచ్చెను. ఎవ్వఁడు నాతపోవనము నెత్తురుచుక్కలచేఁ జెడునట్లు, వృక్షములు విఱుగునట్లు రాక్షసశరీరమును జిమ్మివైచెనో యాతఁ డింక నీవనమును బ్రవేశింపరాదు. వచ్చినఁ జచ్చును. ఆదుర్మతి నాయాశ్రమమునకుఁ జుట్టు నామడలోగా వచ్చునేని జీవింపఁ జాలఁడు. సత్యము. వానిబంధువు లెవ్వరేని నిందున్న వెడలి పోవలయు. నేనీవనమును సంతానముం బోలి యెల్లకాలము కాపాడుచున్నాను. ఇందా వాలిబంధువులుండిన వారలను శపింతును. ఒకదినము వ్యవధి నొసంగెదను. రేపట్టివాఁడు నాకంటఁబడునేని పెక్కువేలవత్సరములు పర్వతమై యుండఁ గలఁడు. అని శాపమిచ్చెను. దాని విని యందున్న వానరులు వాలి కడ కరిగిరి. వారివలన నా శాపకారణమంతయు నెఱింగి మునికడ కరిగి యంజలింబట్టి శాపమోక్షం బనుగ్రహింపుమా యని యవ్వాలి యర్థించెను. ముని పలుకక యాశ్రమమును బ్రవేశించెను. వాలి శాపభీతుఁడై పురి కరిగెను. శ్రీరామా! ఆకారణమున వాలి యిందుఁ బ్రవేశింపఁజాలఁడు. కాననే నేను మంత్రులతో నిశ్చింతముగా నిందున్నాఁడను. ఆదుందుభికళేబర మిపు డెండిపోయి యస్థిశేషమై పర్వతశిఖరమువలె నిదిగో యున్నది. కనుమా. ఇవిగో స్థూలసాలసప్తకము కొమ్మలు మిక్కిలి వ్రేలాడఁగా నున్నవి. వాలి కేవలబాహుబలమున నొక్కసాలముం జీల్చి యావివర

ములో బాణమును దాని తెక్కలూడిపోవ నుచ్చికొనిపోయి యింక నొకవృక్షములో నాటుకొనునట్టులు గ్రుచ్చంజాలు సామర్థ్యము కలవాఁడు. అసదృశవాలిపరాక్రమ మిది వివరించితిని. అట్టివానిని రణమున నీవెట్లు సంహరింతువు? అని యడిగెను.

ఆమాటలు విని లక్ష్మణుఁడు నవ్వుచు శ్రీరాముఁ డే కార్య మొనరించినయెడల వాలిని జంపఁగలఁ డని నమ్మెదవు? అన నాకపిరాజు సాలవృక్షములవిషయము చెప్పితిని గదా. దీనిలో నొక్కదాని నొకబాణమున రాముఁడు చీల్చునేని, దుందుభి యస్థిపంజరము నొక్కకాలితో రెండువందల ధనుస్సుల దూరమునఁ బోయిపడునట్టు చిమ్మునేని యపుడు రామపరాక్రమముం గని వాలి హతుండైనట్లే తలంచెదను. అని యించుక యాలోచించి శ్రీరామునిం గని శూరుఁడై శూరుల మర్దించి బలపౌరుషముల వినుతింపఁబడుచు నపజయ మెఱుంగక దేవతలకు నలవికాని కార్యముల నొనరించుచునుండు వాలికి నే భయంపడుచుందును. ఋశ్యమూకముననుండుట భయముననే కదా. నాకు మంచి మిత్రమవగు నీవు దొరకితివి. దుష్టభ్రాతయగు వాలిబల మెఱుంగుదును. నీశౌర్యమును యుద్ధమున నేనింతదనుకఁ జూచినది లేదు. వాలి యొనరించిన భయంకరకార్యములం గని భయముగొని యున్నవాఁడఁ గావున నీమాటలు పలుకుచున్నాను. నీకుఁ జలనము కల్గింపఁ గోరికాదు. భయపెట్టుటకుఁ గాదు. నిన్నవమానింపను గాదు. వాగ్బుద్ధిధైర్యాదులు నివురుగప్పిన నిప్పువలె నీ మహాతేజస్సును దెలుపుచున్నవి. నిస్సందేహము.

అంత శ్రీరాముఁ డాసుగ్రీవునిమాటలు విని స్మిత మున నతనితోఁ గపిరాజా! మావిక్రమమున నీకు విశ్వాసము లేదేని నీకిపుడు విశ్వాసము కల్గించెదను. అని యతని నూఱ డించుచు దుందుభియస్థిపంజరమును బాదాంగుష్ఠమాత్రమున నెత్తి యాడించి దశయోజనములదూరమునఁ బడఁజిమ్మెను. అది గని సుగ్రీవుఁడు లక్ష్మణునితో మిత్రమా! మున్నీ శరీరము రక్తపూరముగలిగి మాంసమునిండియుండఁగా వాలిచేఁ జిమ్మఁ బడినది. ఇపు డిది శుష్కమై తృణకల్పమైయుండి విసరివైవఁ బడినది. దీనిమూలమున బలాబలముల నిర్ణయింపఁజాలను. అని రామునితో ఈపనిచే నాసందియము పోవకున్నది. ఒక సాలవృక్షమును శరమున భేదింపుము. అపుడు బలాబలములు కనుఁగొనఁదగియుండును. ధనుస్సును సజ్యముచేసి యొకబాణ మును విడువుము. అది దాని భేదింపఁగలదు. సంశయమే లేదు. ఈయది విశ్వాసోత్పాదనార్థము కాదు. నాసంతోషముకొఱ కని నమ్మవలయును. ఈయది సత్యమే యని ప్రమాణము చేసె దను. తేజస్సులలో సూర్యుఁడు, కులపర్వతములయందు హిమాలయము, నాలుగుకాళ్లజంతువులయందు సింహము నుత్తమములని నుతిగాంచినరీతిఁ బరాక్రమమున మానవు లలో నుత్తమోత్తముఁడవు. అని పలికెను.

మహాశయులారా! ఈభాగమును బరిశీలింపక తప్పదు. "స్వభావో దురతిక్రమః" అనుసూక్తి యంద తెలిఁగినదియే.

"స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్."

అను గీతావాక్యము కలదు కదా. సుగ్రీవుఁ డెంత బుద్ధిమంతుఁ

డైనను శ్రీరామసందర్శనసల్లాపసహవాససుఖానుభూతికల వాఁడైనను జాతిస్వభావమునుండి విడివడఁ జాలఁడు. వాలి వలని భయము తత్ఫలము ననుభవమునఁ దెలిసినవాఁడు. కావున శ్రీరామునిఁ బరీక్షించి కాని నమ్మఁజాలకపోయెను. ఎంతవారినైన స్వభావకర్మము లోఁబఱచుకొను నని మన మెఱుంగవలయు. కర్మమే బలవత్తరమని యేతన్మూలమున నెఱుంగవలయును.

"సముద్రాత్పశ్చిమాత్పూర్వం దక్షిణాదపిచోత్తరం,
క్రామత్యనుదితే సూర్యే వాలీ వ్యపగతక్లమః." ౪

అని మూలము. "అనుదితే సూర్య ఇత్యుత్తరావధిరభిహితః. పూర్వావధిస్తు బ్రాహ్మే ముహూర్తే ఉత్థాయేత్యనుష్ఠానాం గత్వేన విహితః కాలః. చతుస్సముద్రపరిక్రమణస్యానుష్ఠానార్థత్వమ్."అని మహేశ్వరతీర్థులు. బ్రాహ్మముహూర్తమున లేచి స్నానముచేసి సూర్యోదయముకాకముందే ప్రాతస్సంధ్యా కృత్యము గావింపవలెనన్న శాస్త్రము ననుసరించి వాలి కర్మము నాచరించెనని యిందలిసారతరార్థము. బ్రాహ్మముహూర్త మెద్ది? అప్పుడు లేచి చేయఁదగినదెద్ది? ఏల? అని విచారింతము.

"బ్రాహ్మో ముహూర్తః. బ్రహ్మో బ్రహ్మదేవతాకో ముహూర్తః, అరుణోదయకాలస్య ప్రథమదండద్వయం. బ్రహ్మముహూర్తమాహ పితామహః."

"రాత్రేశ్చ పశ్చిమే యామే ముహూర్తో బ్రాహ్మ ఉచ్యతే."

"పశ్చిమే యామే శేషార్థప్రహరే. శేషార్థప్రహరే బ్రాహ్మోముహూర్త ఇతి మదనపారిజాతాత్. తత్రాపి సూర్యోదయాత్ప్రాక్ అర్థప్రహరే ద్వౌ ముహూర్తౌ. తత్రాద్యోబ్రాహ్మః ద్వితీయోరౌద్రః."ఇత్యాహ్నికతత్త్వమ్.

"బ్రాహ్మే ముహూర్తే చోత్తిష్ఠేత్సుస్థో రక్షార్థమాయుషః,
శరీరచింతాం నిర్వర్త్య మైత్రం కర్మ సమాచరేత్."

ఇతి రాజవల్లభః.

"బ్రాహ్మే ముహూర్తే ఉత్థాయ ధర్మమర్థం చ చింతయేత్,
కాయక్లేశం తదుద్భూతం ధ్యాయేత్తం మనసేశ్వరం.
ఉషఃకాలేఽథ సంప్రాప్తే కృత్వా చావశ్యకం బుధః,
స్నాయాన్నదీషు శుద్ధాసు శౌచం కృత్వా యథావిధి." ఇతి.

"బ్రాహ్మే ముహూర్తే బుద్ధ్యేత ధర్మార్థౌ చానుచింతయేత్,
కాయక్లేశాంశ్చ తన్మూలాన్వేదతత్త్వార్థ మేవచ." ౯౨

మను. ౪-అ.

"బ్రాహ్మో ముహూర్తో రాత్రేః పశ్చిమో యామః బ్రాహ్మీ భారతీ. తత్ప్రబోధహేతుత్వాత్. ముహూర్తశబ్దోఽత్ర కాలమాత్రవచనః. తత్ర బుద్ధ్యేత. దక్షేణాపి. ప్రదోషపశ్చిమౌ యామౌ వేదాభ్యాసేన తౌ నయేత్, ప్రహరద్వయం శయానో హి బ్రహ్మభూయాయ కల్పతే. ఇతి బ్రువతా తత్ర ప్రబోధోఽభ్యనుజ్ఞాతః. ధర్మార్థౌచ పరస్పరావిరోధేన అనుష్ఠానార్థ మవధారయేత్. తథా ధర్మార్థార్జనహేతూన్ కాయక్లేశాన్నిరూపయేత్. యది మహాన్ కాయక్లేశః అల్పౌచ ధర్మార్థౌ వా తదా తం పరిహరేత్. వేదస్య తత్త్వార్థం బ్రహ్మకర్మాత్మకం నిశ్చిమయాత్. తస్మిన్ సమయే బుద్ధి ప్రకాశాత్." అని కుల్లూకభట్టు.

"బ్రాహ్మే ముహూర్తే చోత్థాయ చింతయేదాత్మనో హితం,
ధర్మార్థకామాన్ స్వేకాలే యథాశక్తి న హాపయేత్." ౧౧౫

యాజ్ఞవల్క్యస్మృతి. ఆచారకాండము.

"తతో బ్రాహ్మే ముహూర్తే ఉత్థాయ పశ్చిమేర్ధప్రహరే ప్రబుద్ధ్యాత్మనో హితం కృతం కరిష్యమాణంచ వేదార్థసంశయాంశ్చ చింతయేత్, తదానీం

చిత్తస్యా వ్యాకులత్వేన తత్త్వప్రతిభానయోగ్యత్వాత్, తతో ధర్మార్థకామాన్ స్వోచితకాలే యథాశక్తి న పరిత్యజేత్, యథాసంభవం సేవేతేత్యర్థః. పురుషార్థత్వాత్. యథాహ గౌతమః. న పూర్వాహ్ణమధ్యాహ్నాపరాహ్ణానఫలాన్ కుర్యాత్ ధర్మార్థకామేభ్యస్తేషు ధర్మోత్తరః కుర్యాదితి. అత్ర యద్యప్యేతేషాం సామాన్యేన సేవనముక్తం. తథాపి కామార్థయోర్ధర్మావిరోధేనానుష్ఠానం. తయోర్ధర్మమూలకత్వా దేవం ప్రతిదినమనుష్ఠేయమ్." అని మితాక్షరావ్యాఖ్య.

రాత్రి నాల్గవజాము సామాన్యముగా బ్రాహ్మముహూర్త మనవచ్చును. అందు మేల్కాంచి మనసున నీశ్వరుని ధ్యానింపవలయు. మనసు స్థిరతంగాంచుకాలమది. రాత్రి శయనించి తెల్లవారుజామున మేల్కాంచి కూరుచుండి భగవంతుని ధ్యానింపవలయును. అనఁగా దంతధావనాదులకంటెఁ బూర్వమే అని యర్థము. ఏలయందురేని సంసారతాపములకు లోనుగాని మన స్సపుడే యుండును. అట్టి తఱి నిష్టదేవతను ధ్యానింపవలయును. దీనిచే బాహ్యాచారములకంటె మనశ్శుద్ధియే ప్రధానమని యర్థము తేటపడును గదా. ఉషఃకాలము రాఁగా దేహకృత్యముల నిర్వర్తించి స్నానము చేయవలయును. ఉషఃకాలమనఁగా సూర్యోదయమునకు ముందు నాలుగుగడియలకాలమని యర్థము. ఐదుగడియలని కొందఱి మతము. బ్రాహ్మముహూర్తమున మేల్కాంచి యిష్టదేవతాధ్యానాదుల నిర్వర్తించి పిదప స్నానముచేయవలయు నని భావము. ఇది నిత్యకృత్యము. సామాన్యముగా నెల్లరకని తాత్పర్యము. యోగులలోఁ గొందఱ కిది యన్వయింపదు. వారు దేహమే తెలియక మహానందమనుభవించువారు. ఆయోగులకు నీగృహస్థులధర్మములు లోనగునవి యన్వ

యింపవు. ఎందులకనఁగా నీనియమాచరణఫలసర్వస్వమే యా చిత్తైకాగ్రత. అది కుదిరినపిదప నివి యక్కఱలేదు.

వాలి సూర్యోదయము కాకముందే నాల్గుసంద్రముల మునింగి నియమమును దీర్చి కిష్కింధఁ జేరును. నాల్గుసముద్రములలోఁ జేయఁదగు కార్యమేదని విచారింతము. పశ్చిమసముద్రమును దొలుతఁ బేర్కొనుటంజేసి ముందాపశ్చిమసాగరమున స్నానముచేసె నని యర్థముకాదు. ఏల యాయర్థము పొసఁగదు? అందురేని. ఉత్తరకాండమునందు

"అథవా త్వరసే మర్తుం గచ్ఛ దక్షిణసాగరం. ౧౦
వాలినం ద్రక్ష్యసే తత్ర భూమిష్ఠమివ భాస్కరం,
... ... ... ...
రావణో వాలినం దృష్ట్వా సంధ్యోపాసనతత్పరం,
పుష్పకాదవరుహ్యాథ రావణోఽంజనసన్నిభః. ౧౩
... ... ... ...
పరాఙ్ముఖోఽపి జగ్రాహ వాలీ సర్పమివాండజః,
గ్రహీతుకామం తం గృహ్య రక్షసామీశ్వరం హరిః. ౨౧
ఖముత్పపాత వేగేన కృత్వా కక్షావలంబినం,
... ... ... ... ...
క్రమశస్సాగరాన్ సర్వాన్ సంధ్యాకాలమవందత,
సభాజ్యమానో భూతైస్తు ఖేచరైః ఖేచరో హరిః. ౨౫
పశ్చిమం సాగరం వాలీ హ్యాజగామ సరావణః,
తత్ర సంధ్యాముపాసిత్వా స్నాత్వా జప్త్వాచ వానరః. ౨౬
ఉత్తరం సాగరం ప్రాయా ద్వహమానో దశాననం,
... ... ... ... ...

ఉత్తరే సాగరే సంధ్యాముపాసిత్వా దశాననం. 3౧
వహమానోఽగమద్వాలీ పూర్వం వైన మహోదధిం,
తత్రాపి సంధ్యామన్వాస్య వాసవిస్స హరీశ్వరః. 3౨
... ... ... ... ...
చతుర్ష్వపి సముద్రేషు సంధ్యామన్వాస్య వానరః,
రావణోద్వహనశ్రాంతః కిష్కింధోపవనేఽపతత్."

3౬-అధ్యాయము.

అను నీశ్లోకములు కనఁబడుచున్నవి. వాలినియమము చతుస్సముద్రజలముల స్నానమొనర్చుటయే యనఁదగియున్నది. ప్రతి సముద్రమునందును స్నానముచేసి సంధ్యనుపాసించె ననఁగా నర్థమేమి? సూర్యోపస్థానము చెప్పరాదు కదా. అర్ఘ్యప్రదానము నాల్గుసారులు చేయవలసిన విధియు లేదు కదా. ఇంక నేమి? జపమే మిగిలియున్నది. ఏదో గురువుచెప్పినరీతిగా సంధ్యోపాసనముచేసి యనుభావమే యేర్పడుచున్నది. ఆకాలపు వారికి నందును వానరములకు నెట్టి సంధ్యావిధులు గలవో యని కొందఱు ప్రశ్నించిరి. మర్త్యలోకవాసులకెల్ల స్మృతులొక్కరీతిగా బోధించును. వానరజాతికి వేఱుగా నున్నయట్లు గానరావు. వానరములు సంధ్యోపాసనము నొనరించెనన్న విచిత్రమే. రాజ్యముచేయుటయు వింతయే. మనకిపుడు కనఁబడువానరములం గని యాకాలపు వానరములు నిట్లే యుండుననియు నీబుద్ధియే వారికినుండుననియు నూహించుట కేవలము పొరపాటు. అది యొకజాతియని యొప్పుకొనవలయును. వారికిని వివాహాదులు మనవలెనే యుండవలయును. ఏవో యాచారములు కొన్ని వ్యత్యాసముగా నుండవచ్చును. విశేషించి కామరూపులై వనములనుండు నొకజాతి యని

యూహింపఁదగియున్నది. వారిభాషయు నప్పటిమానవజాతి భాషయు నొకవిధమున సాజాత్యమునొంది యుండఁదగును. లోకవ్యవహారసిద్ధికొఱకు సమానభాష యొకఁ డుండవల యును. ఇది యంగీకరించినఁగాని వ్యవహారము సాగదు. కిచ కిచమని సుగ్రీవుఁడును హిందీభాషతో శ్రీరాముఁడును మాట లాడిరనుకొనుటయు నొండొరుల భావము లద్దానిమూల మునఁ దెలిసికొను నవకాశము కలిగెననియు నంగీకరించుట పరిహాసాస్పదమే యగును. ఆఱుగడియలలోపల నాల్గుసము ద్రముల స్నానముచేసి సంధ్యనుపాసించి నిరాయాసముగ సూర్యోదయమునకు ముందే కిష్కింధకు వాలి యరుదెంచె నను టసంగతప్రసంగము గాదా యనువారికి సమాధానము నెన్నియోసారు లీగ్రంథమున నీఁబడినవియే. వరదానసంజనిత మహిమమనియే యంగీకరింపవలయును. మేమద్దాని నంగీకరింప మనువారికి మీ ప్రశ్నములను మేము పాటింపమనునదియే సమాధానము. వానరజాతికెల్ల నిట్టిశక్తి యుండెనన్నచో నది సందేహింపఁదగినది కాని యొకానొకరికిఁ గలదన్నచో నది తపశ్శక్తిఫలమని యాదల ధరింపవలసినదియే. తపశ్శక్తియే యసత్యమనువారికి "తేభ్యోఽతిదృగ్భ్యో నమః" అన్నమాట నుచ్చరించి యూరకుండుటయే సమాధానమనఁదగు. ఈశ్లోక మునఁ గలయర్థము వాలివేగాతిశయము కర్తృత్వపరత్వము ప్రతిపాదించుచున్నది. అట్టివాలిని వధింపవలయు నని సుగ్రీ వుని యభ్యర్థనము.

"మహిషో దుందుభిర్నామ కైలాసశిఖరప్రభః,
బలం నాగసహస్రస్య ధారయామాస వీర్యవాన్. ౭

వీర్యోత్సేకేన దుష్టాత్మా వరదానాచ్చ మోహితః,
జగామ సుమహాకాయస్సముద్రం సరితాంపతిం. ౮
ఊర్మిమంతమతిక్రమ్య సాగరం రత్నసంచయం,
మహ్యం యుద్ధం ప్రయచ్ఛేతి తమువాచ మహార్ణవం. ౯
తతస్సముద్రో ధర్మాత్మా సముత్థాయ మహాబలః,
అబ్రవీద్వచనం రాజన్నసురం కాలచోదితం. ౧౦
సమర్థోనాస్మి తే దాతుం యుద్ధం యుద్ధవిశారద,"

అని మూలము. ఇదియు నిక్కాలపువారికి విచిత్రముగాఁ దోఁపక మానదు. విమర్శించిన నిందేదియు విచిత్రము కాన రాదు. దుందుభియను రక్కసుఁడు మహిషాకారమున నుండు వాఁడు. వరదానజనితగర్వమున విఱ్ఱవీఁగువాఁడు. ప్రాక్తనకర్మ వశమున మహిషాకారమునందు వానికిఁ బ్రీతి మెండు. ప్రాయి కముగా నొక్కొక్కని కొక్కొక్క ప్రాణియం దిష్టముండును. తక్కినవానికంటె దాని నెక్కుడుగ నతఁడు ప్రేమించును. దానికిఁ గారణమేమని యడుగుదురేని కర్మమే యనక తప్పదు. వేఱొక్కసమాధానము రాఁజాలదు. అనఁగా నాజాతి కను రూపమగు కర్మము నొనరించె ననవలయును. వాఁడు సము ద్రునింగాంచి యుద్ధమునకు రమ్మని పిలిచెను. ఈవాక్యము విని నంతనే పూర్వులు వెఱ్ఱివారని యీకాలపు నాగరికులలోఁ గొందఱకుఁ దోఁపకపోదు. కాని వారికి లోకజ్ఞానమే లేదని పూర్వులేల తలంపరాదో తెలియఁజాలను. ఈనాగరకులమాట యేటికి? వారెఱింగినది యత్యల్పము. కాన వారిమాటలకు జంకరాదు. పర్వతసాగరాదులు జడము లనుకొనువారలకుఁ బ్రపంచతత్త్వము తెలియదు. జలములకు సముద్రనామము కాదు. జలాధిదేవతయే సముద్రుఁ డనఁబడును. పర్వతాధి

దేవత పర్వతుఁ డనఁబడును. లతాదుల కొక్కొక్క యధిదేవత కలఁడు. మనమారాధించుట వృక్షాధిదేవతనుగాని వృక్షమును గాదు. ఈవిషయము నాగరకులకుఁ దెలియదు. కనుకనే పూర్వులు చెట్లను తాలను బాములను బూజింతురని వివేకము చాలనివారు పలుకుచుందురు. కాని దానితత్త్వ మేమని మాత్ర మాలోచింపరు. అంతటి వివేకము గలిగినఁగదా! ప్రతివిషయమును జక్కఁగా నాలోచించి తెలియనంతట వెటొకరి నడుగవలయును. నదీస్నానమునఁ బాపములు పోవు ననఁగా నాతీర్థాధిదేవతను ధ్యానించినఁ దదనుగ్రహమున నవి తొలఁగుననియే. భావనయందే శక్తిగాని వాక్కులయందు లేదు.

"అహం కాశీం గమిష్యామి తత్రైవ నివసామ్యహం,
ఇతి బ్రువాణస్సతతం కాశీవాసఫలం లభేత్."

అనుసూక్తి యీయర్థమునే తెలుపును.

"న హ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః,
తే పునంత్యురుకాలేన దర్శనాదేవ సాధవః."

అను శ్రీభాగవతశ్లోకమునఁ గల సార మిదియే కదా. "భావనామాత్రసంతుష్టహృదయః పరమేశ్వరః" అనుట క్రొత్తది కాదు కదా. ఈన్యాయము ననుసరించి యోజించిన సముద్రాధిదేవత యొకఁ డుండకపోఁడని పొడకట్టక పోదు. ఈరాక్షసుఁ డాదేవతనే పిలిచెనని మన మూహింపవలయు. ఏల పిలిచె ననఁగా దేవాసురులకు సహజద్వేషము గలదు. ప్రతిపదార్థకమునకు నొకదేవత యధిపతిగ నుండును. కాని రక్కసుఁడుగ నుండఁడు. సముద్రము విశాలముగాన దానియధిపతి గొప్ప

వాఁడుగా నుండునని యతఁ డూహించుట పొరపాటుగాదు. ఆదేవత నై జరూపమున నతనికిం దోఁచి యుద్ధము చేయఁజాల నని పలికెను. భీతునితో యుద్ధము చేయుట యనుదురాచార మాకాలమునఁ దఱచుగా నున్నయట్లు తోఁపదు. కనుక వాఁడాతని బాధింపలేదు. హిమవంతుని విషయమునందుఁ గూడ నిట్లే యని యెఱుంగవలయును.

"అంతఃపురగతో వాలీ శ్రుత్వా శబ్దమమర్షణః,
నిష్పపాత సహస్త్రీభిస్తారాభిరివ చంద్రమాః.    ౨౮

...    ...    ...    ...    ...

న త్వం స్త్రీసన్నిధౌ వీర వచనం వక్తుమర్హసి,
మమ యుద్ధం ప్రయచ్ఛాద్య తతో జ్ఞాస్యామి తే బలం.    ౩౨

...    ...    ...    ...    ...

యో హి మత్తం ప్రమత్తం వా సుప్తంవా రహితం భృశం,
హన్యాత్స భ్రూణహా లోకే త్వద్విధం మదమోహితం."    ౩౬

అని మూలము. ఆకాలపు యుద్ధధర్మము లెట్టివో పరికింపుఁడు. దుర్వృత్తుఁడగు దుందుభి కూడ మత్తప్రభృతుల వధించుట మహాపాతకమని తెల్పెను. కనుక నాకాలమున శాస్త్రమునందు నమ్మక మధికముగనుండెను. ఈకాలమున హేతువాదు లెక్కుడుగ నుండుటంజేసి ప్రశ్నము లెక్కువయు నాచరణము శూన్యము నైయున్నది.

"తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి."

అన్న గీతావాక్యము ననుసరించి శాస్త్రములయందు విశ్వాస ముంచి యీకాలపువారు కృతార్థు లగుదురుగాక.

"ప్రపేతుస్తారుతోత్క్షిప్తా మతంగస్యాశ్రమం ప్రతి. ౪౮
యేనాహం సహసా స్పృష్టశ్శోణితేన దురాత్మనా,
కోఽయం దురాత్మా దుర్బుద్ధి రకృతాత్మా చ బాలిశః. ౫౦

... ... ... ...

సమంతాద్యోజనం పూర్ణమాశ్రమం మామకం యది. ౫౪
ఆగమిష్యతి దుర్బుద్ధి ర్వ్యక్తం స న భవిష్యతి,
యే చాపి సచివాస్తస్య సంశ్రితా మామకం వనం. ౫౫
నచ తైరిహ వస్తవ్యం శ్రుత్వా యాంతు యథాసుఖం,
యది తేఽపీహ తిష్ఠంతి శపిష్యే తానపి ధ్రువం. ౫౬
వనేఽస్మిన్మామకే నిత్యం పుత్రవత్పరిరక్షితే,
పత్రాంకురవినాశాయ ఫలమూలాభవాయ చ. ౫౭
దివసశ్చాస్య మర్యాదా యం ద్రష్టా శ్వోఽస్మి వానరం,
బహువర్ష సహస్రాణి సవై శైలో భవిష్యతి." ౫౮

అని మూలము. మతంగముని శాప మిందుఁ గలదు. ఈశాపము కలుగఁజేసినదేది?. కర్మమే. మునిని బురికొల్పెను. ఆశాపము శ్రీరామసుగ్రీవసహవాసమునకు హేతువయ్యెను. ఎంత కాలమునకో కాఁదగినకార్యమున కిపుడే హేతువును శాపమను పేరఁ గల్పించెను. కనుకనే "గహనా కర్మణో గతిః" అని గీతావాక్యము ప్రసిద్ధమయ్యెను. వాలికాని తద్బంధువులు తత్పరివారంబు లెవరుగాని యాతపోవనమునకు నలువైపుల యోజనమాత్రమునకు లోపలభాగమునఁ బ్రవేశింపరాదని యది శాసించెను. శాపమనునదియు నాశీర్వాదమే. తొలుత కారముగల్గించి యుపకారమును బిదపఁగల్పించును. ఆయుపకారము మేలని తోఁపదు. కాని నిక్కముగ కదియు నుప

కారమే యనవలయును. ఆశీర్వాదము వరము సమానములే. అవి తొలుత మేలు పిదపఁ గీడును గల్గించును. వరములగర్వించినవారే మిక్కిలిగ నున్నారు. రావణుఁ డెట్టివాఁడు? వరగర్వమున మిట్టిపడువాఁడే కదా. ఏప్రాణి కేరూపమున నేఫలముల ననుభవింపఁజేయవలయునో దాని కనుగుణముగాఁ దత్కర్మమే కార్యము నొనరించునని భావము. శాపమునఁ దపస్సునను యీసిద్ధాంతము ననుసరించి పారపాటే యనవలయును. అంతటితోఁ దృప్తినొందరాదు. శాపమియ్యాక ముం దాతనిమనసున నాగ్రహము పాదుకొనును. పరాపకారకరణసంకల్ప ముదయించును. ఈరెండును దపోభంగములే యనవలయును. కాని యితరునికర్మము ప్రోత్సహించుటయే యిట మిక్కిలి హేతువు. ఇం దొక్కవిశేషము కలదు. "వనే ఽస్మిన్మామకే నిత్యం పుత్రవత్పరిరక్షితే, పత్రాంకురవినాశాయ" అని మతంగముని పలికెను. ఆహారముకొఱకు వనమును బెంచుచుండుట మునులవాడుకలని కొందఱందురు. అది కాదనరాదు కాని మఱొకహేతువుకూడ నున్నది. వృక్షములను లతావిశేషములు పెంచుట తపోభంగమునకుఁ గారణముకాదు. మహావృక్షపోషణము తపస్సాధనము. ఎట్లనఁగా మహావృక్షములు లతావిశేషములు వాయువుమూలమున నందలివారలమనస్సులఁ బరిశుద్ధములుగాఁ జేయును. వనముల నివసించు టందులకే. మనస్సు పరిశుద్ధతఁగాంచినఁగాని తపము సాగదు. మంచిగాలి వీచునపుడు తాపములడంగఁ జిత్తము హాయిచెందు. సమాహితాంతఃకరణుఁడనఁగా నట్టి వాఁడేకదా. మఱియు మహావృక్షములపై వనదేవతలు నివసింతురు.

వారుండుతావుల రక్షఃపిశాచబాధ లుండవు. నియమము సాగిం పఁబూనినవాఁడు తొలుత భూతోచ్చాటనము చేయందగును.

"అపసర్పంతు తే భూతా యే భూతా భూమిభారకాః,
యే భూతా విఘ్నకర్తారస్తే నశ్యంతు శివాజ్ఞయా."

అనఁగా నర్థమిదియే కదా. తపోవనములయందు దేవాలయ ములయందు నీయది యక్కఱలేదు. ఏలయనఁగా నందు దేవతలుందురు. భూతములు నిలువఁజాలవు. ఇతరస్థలములయం దది చేయవలయు నని శాస్త్రము ఘోషించుచున్నది. పుష్ప ఫలప్రధానవృక్షములు రక్షకులకు మేలుగోరుచుండుననియు నవి యున్నఁగాని యారోగ్యాదులు కలుగవనియు వృక్ష శాస్త్రతత్త్వము నెఱింగిన యీకాలపుఁబండితులు కూడఁ జెర్కొనుచున్నారు. మనకీవిషయము నీరామాయణభాగమే బోధించుచున్నది.

"ఇంధనార్థ మశుష్కాణాం ద్రుమాణామవపాతనమ్."

అను మనుస్మృతి యుపపాతకములయందు వృక్షచ్ఛేదనము పేర్కొన్నది. కారణమేమి? మనకు మహోపకారము చేయు వానిని ఛేదించుట మంచిదికాదనియే కదా.

"ఏతచ్ఛ్రుత్వా తదా వాలీ వచనం వానరేరితం,
స మహర్షిం తదాసాద్య యాచతే స్మ కృతాంజలిః. ఉ॥
మహర్షిస్తమనాదృత్య ప్రవివేశాశ్రమం తదా,"

అని మూలము. శాపమోక్షమును ప్రసాదించుట మునుల [illegible]జముకదా. వాలి దోసిలొగ్గి యెంత వేఁడుకొన్నను బదులు పలుకక యాశ్రమములోనికిం బోయెను. ఏల? శాపవిముక్తి ప్ర దించు నవకాశము లేదని యామునిని యెఱింగెను. జ్ఞాన

్రష్టికలవాఁడు కదా ముని. రిత్తమాటలచే మునులము
ావలె ననుకొను కపటాత్ములకు నిట్టిజ్ఞాన మలవడదు కాని
ోషమునకుఁ గొదువయుండదు. కన్నులు మూసినంతనే యిష్ట
్వము మాటలాడునఁట. కాని యామాటలు మానవవా
్కులకంటె నెన్నియో మడుంగులు నీచములు నసత్యములు
గుచుండును. అట్టివారిని నమ్మియే పామరులు ధనముక్తి
ాంచుచున్నారు. వారిశిష్యులకు విమానమును ముక్తిలోక
ునుండి తెప్పింతుమని యీగురువులు, వచ్చుననియు నెక్కి
ోయి యందు స్వేచ్ఛముగా విహరింతుమని పామరులగు
ష్యులును బలుకుచుఁ దలంచుచుందురు. నరవాహనము
మాత్రము తప్పక వచ్చుట తప్పదు.

"ఏషోఽసినిచయస్తస్య దుందుభేస్సంప్రకాశతే,
వీర్యోఽన్నకాన్నిరస్తస్య గిరికూటోపమో మహాన్. ౬౬
ఇమే చ విపులాస్సాలాస్సప్తశాఖావలంబినః,
యత్రైకం ఘటతే వాలీ నిష్పత్రయితుమోజసా." ౬౭

అని మూలము. ఏడుసాలములు గలవు. మద్దిచెట్లని కొందఱు
భావింతురు. సర్వశబ్దసంబోధినియందు సాలమనఁగా ఏపె
చెట్టు అని వ్రాయఁబడియున్నది. శబ్దరత్నాకరమునందు ఏపె.
సాలము. అని పొడకట్టెదు.. సాలము అనుతావున మద్ది అని
కనఁబడియెడిని. "సాలః. తత్పర్యాయః, ౧ సర్జః, ౨ సర్జరసః,
౩ కలః, ౪ కలలజోద్భవః, ౫ వణ్ణవృక్షః, ౬ చౌరపర్ణః,
౭ రాలకార్యః పుస్తకాంతరే రాలః కార్యశ్చేతి శబ్దద్వయం,
౮ అజకర్ణకః, ౯ వస్త్రకర్ణః, ౧౦ కషాయీ, ౧౧ లలనః,
౧౨ గంధవృక్షకః, ౧౩ వంశః, ౧౪ రాలనిర్యాసః, ౧౫
దివ్యసారః, ౧౬ సురేష్టకః, ౧౭ శూరః, ౧౮ అగ్నివల్లభః,

౧౯ యక్షధూపః, ౨౦ సిద్ధికః” అని శబ్దకల్పద్రుమమున వ్రాయఁబడి యున్నది. రామాయణమునందు “శాఖావలంబినః” అని కలదు. “శాఖావలంబినః లంబితశాఖాః శాఖావృతత్వేన దుర్జ్ఞేయలక్ష్యాః” అని వ్యాఖ్యయందుఁ గనఁబడును. వ్రేలాడుకొమ్మలుగలవని తేలెడిని. ఏపెచెట్టునుండి నారతీయుదురు. దానికొమ్మలు వ్రేలాడుచుండును. ఆకులు జొంపముగా నుండును. మద్దిచెట్లకుంగూడ వ్రేలాడు కొమ్మలుండును. ఇం దేదియని విచారించిన నెవరి కెయ్యదితోఁచిన నది యని చెప్పవచ్చును. నేను రామాయణము తెనిఁగించునపుడు సాలములనియే వ్రాసితిని. విద్యార్థులకొఱకు సంగ్రహరామాయణమను వచనగ్రంథము వ్రాయునపుడు “తాడులు” అని వ్రాసితిని. కొందఱు మహాశయులు పత్రికలలో నీవిషయము వ్రాసిరి. ఒకనగరమున సభచేసి యీవిషయమును జర్చించినట్లు పత్రికలలోఁ జదివితిని. సంగ్రహరామాయణమున “తాడులు”అని వ్రాయ నేమికారణమనఁగా, శ్రీరామాష్టోత్తరశతనామములయందు “సప్తతాలప్రభేత్తా చ దశగ్రీవశిరోహరః” అని కలదు. తాటిచెట్ల నేడింటి నని యెల్లరుఁ జెప్పుకొందురు. ఆ శ్లోకములు చిన్ననాఁటనుండి పారాయణము చేయఁబడుచుండుటం జేసి తాడులని వ్రాసితిని. ఇపుడాపాఠమును “సప్తసాలప్రభేత్తా” అని మార్పఁగూడదా యనుదురేమో అంత పనిచేయనేల యనునదియే దానికి నుత్తరము. అధ్యాత్మరామాయణమునందు

> “ఏతే తాలా మహాసారాస్సప్త పశ్య రఘూత్తమ,
> ఏకైకం చాలయిత్వాసౌ నిష్పత్రాన్కురుతేంజసా.
> యది త్వమేకబాణేన విద్ధ్వాచ్ఛిద్రం కరోషి. చేత్.

హత స్త్వయా తదా వాలీ విశ్వాసో మే ప్రజాయతే.
తథేతి ధనురాదాయ సాయకం తత్ర సందధే,
బిభేద చ తదా రామస్సప్తతాలాన్మహాబలః.
తాలాన్ సప్త వినిర్భిద్య గిరిం భూమిం చ సాయకః,
పునరాగత్య రామస్య తూణీరే పూర్వవత్థ్సితః."

కిష్కింధాకాం. ౧౨-సర్గము.

అను నీశ్లోకములు గనంబడు. ఇందు మూఁడుచోట్టులందు తాలశబ్దము కనుపట్టుచున్నది. ఆస్తోత్రమున నిట్లే కలదు. ఈ రెండింటి ననుసరించి సంగ్రహరామాయణమునందు "తాడులని" వ్రాసితిని. రామాయణమునందు సాలశబ్దము కలదుగాన నేను సాలశబ్దమునే యుపయోగించితి నని గ్రహించి ప్రాజ్ఞులు మన్నింతురుగాక. సాలములన్నను, తాళములన్నను శ్రీరామునిచరిత్రమునకు నాధిక్యముగాని న్యూనముగాని రాదుకదా. అధ్యాత్మరామాయణమునఁ బొరపాటుగాఁ దాలశబ్దము పడియుండునందురేని రామాయణమున నది యేల పొసఁగియుండరాదో. ఇట్టి విషయములను మహాకార్యముగాఁ జర్చించినఁ గలుగు లాభము విశేషించి కానరాదు. ఇంక నీభాగమున నధ్యాత్మరామాయణమునఁ గల విశేషములను బరికింతము.

## సుగ్రీవకృత రామస్తుతిః.

"తతోఽతిహర్షాత్సుగ్రీవో రామమాహాతివిస్మితః. ౭౫
దేవ త్వం జగతాంనాథః పరమాత్మా న సంశయః,
మత్పూర్వకృతపుణ్యౌఘైస్సంగతోఽద్య మయా సహ. ౭౬
త్వాం భజంతి మహాత్మానస్సంసారవినివృత్తయే,

త్వాం ప్రాప్య మోక్షసచివం ప్రార్థయేఽహం కథం భవమ్. ౭౭
దారాః పుత్త్రా ధనం రాజ్యం సర్వం త్వన్మాయయా కృతం,
అతోఽహం దేవదేవేశ నాకాంక్షేఽన్యత్ప్రసీద మే. ౭౮
ఆనందానుభవం త్వాద్య ప్రాప్తోఽహం భాగ్యగౌరవాత్,
మృదర్థం యతమానేన నిధానమివ సత్పతే. ౭౯
అనాద్యవిద్యాసంసిద్ధం బంధనం ఛిన్నమద్య నః,
యజ్ఞదానతపఃకర్మ పూర్తేష్టాదిభిరప్యసౌ. ౮౦
న జీర్యతే పునర్దార్ఢ్యం భజతే సంసృతిః ప్రభో.
త్వత్పాదదర్శనాత్సద్యో నాశమేతి న సంశయః. ౮౧
క్షణార్ధమపి యచ్చిత్తం త్వయి తిష్ఠత్యచంచలం,
తస్యాజ్ఞానమనర్థానాం మూలం పశ్యతి తత్క్షణాత్. ౮౨
తత్తిష్ఠతు మనో రామ త్వయి నాన్యత్ర మే సదా,
రామరామేతి యద్వాణీ మధురం గాయతి క్షణం. ౮౩
స బ్రహ్మహా సురాపో వా ముచ్యతే సర్వపాతకైః,
న కాంక్షే విజయం రామ నచ దారసుఖాదికం. ౮౪
భక్తిమేవ సదా కాంక్షే త్వయి బంధవిమోచనం,
త్వన్మాయాకృతసంసారస్త్వదంశోఽహం రఘూత్తమ. ౮౫
స్వపాదభక్తిమాదిశ్య త్రాహి మాం భవసంకటాత్,
పూర్వం మిత్త్రార్యుదాసీనాస్త్వన్మాయావృతచేతసః. ౮౬
ఆసన్మేఽద్య భవత్పాదదర్శనాదేవ రాఘవ,
సర్వం బ్రహ్మైవ మే భాతి క్వమిత్రం క్వచ మే రిపుః. ౮౭
యావత్త్వన్మాయయా బద్ధస్తావద్గుణవిశేషతా,
సాయావదస్తి నానాత్వం తావద్భవతి నాన్యథా. ౮౮
యావన్నానాత్వమజ్ఞానాత్తావత్కాలకృతం భయం,
అతోఽవిద్యాముపాస్తే యస్సోఽంధే తమసి మజ్జతి. ౮౯

మాయామూల మిదం సర్వం పుత్త్రదారాదిబంధనం,
అతోఽత్సాదయ మాయాం త్వం దాసీం తవ రఘూత్తమ. ౯౦
త్వత్పాదపద్మార్పితచిత్తవృత్తి స్త్వన్నామసంగీతకథాసు వాణీ,
త్వద్భక్తసేవానిరతౌ కరౌ మే త్వదంగసంగం లభతాం మదంగం.
త్వన్మూర్తిభక్తాన్ స్వగురుంచ చక్షుః పశ్యత్వజస్రం సశృణోతుకర్ణః,
త్వదంగకర్మాణిచ పాదయుగ్మం వ్రజత్వజస్రం తవ మందిరాణి.౯౧
అంగాని తే పాదరజోవిమిశ్ర తీర్థాని బిభ్రత్వహిశత్రుకేతో,
శిరస్త్వదీయం భవపద్మజాద్యైర్జుష్టం పదం రామ నమత్వజస్రం."

అని. ఈ స్తుతియందు వాంఛితములు తేటపడును. ఈస్తుతిలోని భావములకుఁ దరువాతిదగు నతనిప్రవృత్తికిని సంబంధము కలదా యని ప్రశ్నింపకుఁడు. ఇది వైరాగ్యత్రయమని చెప్పఁబడుచుండుదానిలో నొకటి. పురాణవైరాగ్యమనందగు నన వచ్చును. కాని మహాత్ములను దర్శించినపుడు మంచియూహాలు గలుగుట స్వభావము. అవి కర్మమునను సరించి మార్పునొందుటయో నిలిచి వృద్ధినొందుటయో జరగును. కాని యెట్టిపాపాత్ములకుంగూడ సాధుసంగమము చేకూరినతఱి సదభిప్రాయములు గలుగుట నైజము. అది ప్రాక్తనకర్మము ననుసరించి నిలువవచ్చు. నామమాత్రావశిష్టము కావచ్చును. సన్నిధిప్రభావమున సంకల్పోదయమున కెట్టియాటంకము లుండవు. ఇందలి సారమేమి? "మాయా మూల మిదం సర్వం పుత్త్రదారాదిబంధనమ్, అతోత్సాదయ మాయాం త్వం దాసీం తవ రఘూత్తమ" అనునది యీస్తుతియందుఁ బ్రధానభాగము. సంసారమనఁబడు పుత్త్రదారధనాదిబంధనము మాయామూలము. అజ్ఞానమూలమని భావము. అనఁగా నిది శాశ్వతమనుకొనుట తెలివితక్కువ యని సారము. కావున నో రామచంద్రా! నీకు

లోఁబడియుండు మాయను దొలఁగింపుమా యని సుగ్రీవుఁడు ప్రార్థించెను. మాయను దొలఁగించుట కాపరమేశ్వరునకుం దక్క నితరులకు శక్యముకాదని కదా దీనిభావము.

"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే."

అన్న గీతావాక్యమునఁ గలయర్థము నిదియు సమానమే. భగవంతునాశ్రయించినఁగాని యది తొలఁగదనియు నితరులగు హరిహరబ్రహ్మాలకుంగూడ దానిం దొలఁగింప శక్యముకాదని యుఁ దేలెడిని. భగవంతు నాశ్రయించు టెట్లు? అతఁడు దానిని దొలఁగించు టెట్లు? అనియే యిందుఁగలసందియము.భగవంతుఁడు నిర్లిప్తుఁడు,నిస్సంగుఁడు, సర్వసాక్షియు నగు.మాయ యనఁగా భగవదిచ్ఛాశక్తి యనఁబడు. అది యావరింపఁగా భగవంతు నాశ్రయించుటెట్టు లనునదియే మహాసంశయము. మాయనే యారాధించి తదనుగ్రహమునకుఁ బాత్రుఁడైనఁగాని పరాత్పరు నారాధించువెరవు దొరకదు. "ప్రధాన ద్వారా రాజదర్శనం కర్తవ్య" మ్మను న్యాయ మున్నదియే కదా. దానినే యనుసరింపవలయు. భగవదారాధనమనఁగా సగుణబ్రహ్మమునే కదా యారాధించుట. అనఁగాఁ బ్రకృతి వశంగతుని భజించుట యని యర్థము. ఈవిషయమునే శ్రీశంకరభగవత్పాదులు సౌందర్యలహరియందు

"క్వచిత్కాంచీదామా కరికలభకుంభస్తననతా
పరిక్షీణా మధ్యే పరిణతశరచ్చంద్రవదనా,
ధనుర్బాణాన్ పాశం సృణిమపి దధానా కరతలైః
పురస్తాదాస్తాం నః పురమథితురాహో పురుషికా."

అను శ్లోకరూపమునఁ దెలిపిరి. ప్రకృతిమంత్రమునందుఁగూడ నజ్ఞానావరణమును దొలఁగించి భగవద్దర్శనముఁ జేయింపుమా యనియే యున్నది. సగుణోపాసన చేయక నిర్గుణోపాసనము శక్యము కాదనియే దీని భావము. ఉపాసన యనఁగా ధ్యానమనియే యర్థము. దేవాలయమున నలికి ముగ్గులు పెట్టుట లోనగుకార్యములు కావు. అవి కేవల పామరులకొఱకేర్పాటుచేయఁబడినవి. మంచిమార్గమునఁ బ్రవర్తింపఁజేయఁ దొలుత నవి సాధనములే కాని మరణాంత మట్లే చేయఁదగునని కానే కాదు. అట్లేచేసిన నెన్నిజన్మములకైన నదియే ఫలము. భుక్తికి లోపము కలుగక యుండవచ్చు. దేవాలయము నాశ్రయించియుండు పతంగములకు వీనికిని రూపభేదమే కాని వేఱొండుభేదము కానరాదు. ఇఁకఁ దరువాతిచరిత్రమును బఠింతము.

## వాలిసుగ్రీవుల తొలియుద్ధము.

* మహాతేజస్కుఁడగు శ్రీరాముఁ డాకపిరాజుపలుకు లాలకించి విశ్వాస మతనికిం గల్గింపఁగోరి కోదండము గైకొని సజ్యముగావించి బాణముం గూర్చి సాలము లక్ష్యముగఁ బ్రయోగించెను. ఒక్కదానిం గుఱించివైచిన యాశరము సప్తసాలములను భేదించి యాగిరిసానువు నుచ్చుకొని భూమిం జొచ్చి మరలఁ దూణీరమునఁ జేరెను. దానికా కపిరాజచ్చెరువంది యారఘువీరునకు నమస్కరించి నిలుచున్న రామునితో మహాత్మా! సురలతో నింద్రుని జంపఁజాలుదువు. ఇఁక వాలి మాట యేటికి? ఒక్కబాణమున నీయేడుసాలములను భేదిం

* ఇది పండ్రెండవసర్గమునఁ గలదు.

-చిన నీముందట నిలిచి యని చేయువాఁ డెవ్వఁడు? ఇట్టి నిన్ను మిత్త్రునిగా సంపాదించుకొంటిని. కాన నాశోకము మాయ మయ్యెను. సోదరరూపశత్త్రువును వాలిని నాప్రీతికొఱకు వధింపుమా. దోసిలొగ్గితిని. అనఁగా నారాముఁ డతనిం గౌఁగిటం జేర్చుకొని యిందుండియే కిష్కింధకుం బోవుదము. నీవు ముందుగఁ బోయి వాలిని సంగరమునకుం బిలువుము. అని హెచ్చరించి యతని సౌమిత్త్రిని గూడి కిష్కింధకుం బోయెను. వారొకగహనమున దాఁగియుండిరి.

సుగ్రీవుఁడు వస్త్రము నడుమున బిగించుకొని వాలిని బిలుచునెపమున గట్టిగా ధ్వనిచేసెను. అది తమ్ముని ధ్వనియని యెఱింగి క్రుద్ధుఁడై వాలి యస్తాద్రినుండి సూర్యునింబోలి వెడలివచ్చెను. అంతట వా రిరువురకు నంగారకునకు బుధునకు నాకాశమున యుద్ధముసాగునట్లు తుములాహవము సాగెను. భయంకరముగఁ బోరాడిరి. శ్రీరాముఁడు చాపముం దాల్చి యశ్విదేవతలంబోలె నాయన్నదమ్ము లిరువురు నొక్క రీతిగా నుండఁగాంచి వీఁడు సుగ్రీవుఁడని వీఁడు వాలియని గుఱుతింప నసువుపడమిఁ బ్రాణములఁ దీయుబాణమును వైవక యూరకుండెను. అంతలో వాలిచే దెబ్బలుతిని సుగ్రీవుఁడు తనకు రక్షకుఁ డగుశ్రీరామునిం గానక ఋశ్యమూకము నకుఁ బాఱిపోయెను. సుగ్రీవుఁడు వాలిదెబ్బలచే రక్తము గాఱఁ బరుగిడుచు వెంటఁబడి వాలి తఱుముచుండఁగా మతంగముని తపోవనమును జొచ్చెను. వాలి యోరీ! తప్పించుకొంటివిపో. అని శాపభయమున నందుఁ జొరనొల్లక కిష్కింధకు మరలెను. రాఘవు లిరువు రావనమున కరిగిరి. వారిరాకం గని సుగ్రీవుఁడు ల ంచి నేలంగనుచు దుఃఖవచన

ముల నిట్లనియె. వాలిని యుద్ధమునకుం బిలువుమని నాకుం జెప్పి వాలిచే నన్నుఁ గట్టిగాఁ గొట్టించితివే. నీవేమి తలంచితివి? స్వామీ! నన్ను వేఁడినప్పుడే నేను వాలిం జంపనని చెప్పియుండిన బాగుండునే. అట్లైన నే నచ్చటికే పోవకయుందును గదా. శ్రీరాముఁ డాతని దీనవాక్యము లాలకించి సుగ్రీవా! బాణమును నే విడువకుండుటకుం గలకారణమును వినుము. మీరిరువురు సకలవిధముల నొక్కరీతిగా నున్నారు. కంఠధ్వనిలోనగువాని చేతంగూడ మీకించుకయు భేద మగపడదు. కాన మోసపోయితిని. బాణమువైచిన మనస్నేహమున కేమిభంగము కల్గునో యని సంశయించి శత్రువినాశకర మగుబాణము వైనకయుంటిని. కాని మఱేకారణమునఁ గాదు. నాయజ్ఞానలాఘవముల నీకేదే నాపదకల్గిన నాబాల్యమూఢత్వములు సకలదిశల వెల్లడియగుం గదా. అభయమిచ్చి వానినే వధించుట మహాపాపమని పెద్దలందురు. మేమిరువురము సీతయు నీ యధీనులము. మాకిందు నీవే శరణము. కాన మరలఁ బోయి యుద్ధ మొనర్పుము. నామీఁద ననుమానముంచుకొనకుము. ఒక్కబాణమున వాలిఁ జంపి పుడమిపయిం దొరలించెదను. కనుఁగొనుము. ద్వంద్వాహవమున నిన్ను గుఱుతించునట్లు గుఱుతు నుంచుకొనుము. లక్ష్మణా! శుభలక్షణములుగలిగి పూచియుండు నీ గజపుష్పికాలతను దెచ్చి యితనికంఠమున నలంకరింపుమా. అనఁగానే యతఁ డట్లు చేసెను. దానిని ధరించి నక్షత్రమాలావృతిచే నంతరిక్షమున వెలుంగు సూర్యునివలె నాసూర్యసూనుఁడు వెలింగెను. స్వర్ణవర్ణముగల యాకపిరాజు తన్మాలికచే సాంధ్యరాగమున నలరుమేఘము బకనికరమున మెఱయునట్లు ప్రకాశించుచు

రామవాగ్దానమున సంతుష్టినొంది వారింగూడి కిష్కింధకుఁ బోయెను.

మహాశయులారా! ఇం దనేకవిషయములు చర్చింపఁ దగియున్నవి. చూతము.

"తమద్యైవ ప్రియార్థం మే వైరిణం భ్రాతృరూపిణం,
వాలినం జహి కాకుత్స్థ మయా బద్ధోయ మంజలిః." ౧౧

అని మూలము.

"సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః."

అను గీతావాక్యమున కిది బాధకము కాదా యనవచ్చును. కాని కాదు. ఎట్లనఁగా "మే ప్రియార్థం భ్రాతృరూపిణం వైరిణం తం వాలినమద్యైవ జహి" అనఁగా నీ కతఁడు శత్రువు కాదు. నేను మిత్త్రుఁడను గాను. నీదృష్టికి మే మిరువురము సమానులమే. కాని నాప్రియముకొఱకు వాలిని వధింపుము. నాకర్మము ఫలింపఁజేయుటయే వాలిని జంపుట. అనుభావము సుగ్రీవునినోటఁ దత్కార్మమే వెడలించెను. రామా! నాకడకు నీవువచ్చుటయే నాకు మేలు గలుగునను దానిం దెలుపుచున్నది. నాకిచ్చిన యభయదానమును సార్థకముచేయుమా యని యతఁ డడిగెను. దోసిలొగ్గితి ననియె. భగవంతుఁడు కర్మము ఫలములనీయఁగాఁ దాఁ జూచుచుండును. హేతువు దానైనయట్టులుగ నటించునని మన మూహింపనగును.

"తం శ్రుత్వా నినదం భ్రాతుః క్రుద్ధో వాలీ మహాబలః,
నిశ్చక్రామ సుసంరబ్ధో భాస్కరోఽస్తతటాదివ." ౧౬

అని మూలము."యథా సూర్యోఽస్తతటాదవతరన్న దృష్టరశ్మి ర్భవతి, తథేదానీం కిష్కింధానిర్గమనం వాలినోఽల్పకాలేన నాశహేతురితి ద్యోతనార్థమస్తతటాదిత్యుక్తం. అస్మద్దేశోదయ గిరిః ప్రదేశాంతరాపేక్షయా అస్తగిరిరిత్యుక్తమిత్యప్యాహుః" అని గోవిందరాజులు. "అస్మాకముదయపర్వతస్సిద్ధపురవాసి నామస్తగిరిరితి తదపేక్షయా అస్తతటాదిత్యుక్తం, ఉదయో నాలంకాయాం సోఽస్తమయస్సవితురేవ సిద్ధపుర ఇత్యార్య భటోక్తేః" అని రామానుజీయవ్యాఖ్య. "మేరోరుత్తరవాసిన అధికృత్యేదముచ్యతే. అస్మాకమస్తమయపర్వతో మేరోరుత్తర పార్శ్వస్థానాముదయగిరిః, తేషామస్తగిరిరస్మాక ముదయగిరిః. అతోఽస్తగిరేరపి భానోర్నిర్గమనం సంభవతి."అని మహేశ్వర తీర్థులు. ఇచ్చోట నాలుగుమాటలు వ్రాయవలసియున్నది.

సూర్యుఁడు మేరువుచుట్టు తిరుగుచుండుననియు మన దేశము దానికి దక్షిణభాగమనియు మనకెందు నస్తమయ మగునో యది దానికి నుత్తరముననుండువారలకు నుదయ పర్వతమగుననియుఁ బురాణములయందుఁ గలదు. కనుకనే "సర్వేషాం మేరురుత్తరః" అనువాక్యము ప్రసిద్ధికెక్కెను.

"ఇవ హి మేరుగిరిః కిల మధ్యగః కనకరత్నమయస్త్రిదశాలయః,
ద్రుహిణజన్మకుపద్మజకర్ణికేతి చ పురాణవిదోఽముమవర్ణయన్."
సిద్ధాంతశిరోమణి-గోలాధ్యాయము.

ఇట్లు వ్రాసినభాస్కరాచార్యులు "యదిదముక్తం తత్సర్వం పురాణాశ్రితం" అని వ్రాసిరి. పైనఁ జెప్పఁబడినవిషయము లుపపత్తిరహితములు. కాన నంగీకరింపఁబడవనియే భావము.

"లంకాపురేఽర్కస్య యదోదయస్స్యా
త్తదాదినార్ధం యమకోటిపుర్యాం,
అధస్తదాసిద్ధపురేఽస్తకాల
స్స్యాద్రోమకే రాత్రిదలం తదైవ. ౪౪
యత్రోదితోఽర్కః కిల తత్ర పూర్వా
తత్రాపరా యత్ర గతః ప్రతిష్ఠాం,
తన్మధ్యతోఽన్యే చ తతోఽఖిలానా
ముదగ్గతో మేరురితి ప్రసిద్ధం." ౪౫

భాస్కరాచార్యులు.

"యథోజ్జయిన్యాః కుచతుర్థభాగే
ప్రాచ్యాం దిశి స్యాద్యమకోటిరేవ,
తతశ్చ పశ్చాన్న భవేదవంతీ
లంకైవ తస్యాః కకుభి ప్రతీచ్యామ్. ౪౬
తథైవ సర్వత్ర యతో హి యత్స్యా
త్ప్రాచ్యాం తతస్తన్న భవేత్ప్రతీచ్యాం,
నిరక్షదేశాదితరత్ర తస్మా
త్ప్రాచీ ప్రతీచీ చ విచిత్రసంస్థే." ౪౭

శిరోమణి-భువనకోశము.

ఖగోళశాస్త్ర మీవిషయమునఁ బ్రమాణము. పురాణముల లోనివిషయ మేమందురేని "కథాచ్ఛలేన బాలానాం నీతిస్త దిహాకథ్యతే" అన్నట్లు నీతికొఱకే యని యెఱుంగవలయు. కనుకనే వ్యాసులు ఖగోళశాస్త్రమునందు "యద్యదుద్దేశేన ప్రవృత్తస్తదంశ ఏవ ప్రమాణమ్" అని వాక్రుచ్చిరి. ఏగ్రంథ మేయుద్దేశమున నారంభింపఁబడినదో యదియే యందుఁ బ్రమాణము. అవాంతరవిషయములు కావు. పురాణములు

ధర్మోపదేశార్థ మారంభింపఁ బడినవి. కాని జ్యోతిశ్శాస్త్ర మంతయు నం దిమిడించుటకుఁ గాదు. కాన నందుఁ జెప్పఁ బడిన గ్రహగతులవిషయములు ప్రమాణములు కావు. బాలు రకుఁగాఁ గల్పింపఁబడినవి. మేరుపర్వత మొకఁడు లేదు. అందు బంగారు దొరకదు. మేరువనఁగా నత్యున్నతభాగమని యర్థ ము. దానిచుట్టు సూర్యుఁడు తిరుగుటయు నసత్యమే. ఏచోట నున్నవారి కెందు సూర్యుఁడు కనఁబడునో యది యాభాగ మునకుఁ దూరుపు. అస్తమించిన ట్లెందుఁ గనఁబడునో యది పశ్చిమదిక్కు. దక్షిణోత్తరము లాభాగమునకుఁ దోఁచునవి యితరభాగముల నుండువారికిఁ గానేరవు. తూర్పుపడమరలు నట్లే. భూమిచుట్టును సూర్యుఁడు సంచరించుటయు లేదు. భూగోళమున సమానదూరముల నాలుగుపట్టణము లున్నవి. భూమధ్యభాగమున లంకయు దానికిఁ దూర్పున యమకోటి పురము. పడమరభాగమున రోమకపురము. అధోభాగమున సిద్ధపురము. ఈనాలుగు సమానయోజనదూరమున నున్నవి. ఉత్తరమున సుమేరు వనుభాగము దక్షిణమున బడబానలము. లంకనుండిచూచిన నివియన్నియు సమానదూరమున నున్నవి. మేరు వొకకొండకాదని ముందే వ్రాసితిని గదా. హిమాలయ మున వెండిదొరకినట్లే యందు బంగారు దొరకును. హిమాల యమున నొకభాగమునకు మేరువను పేరుగలదని కొంద అందురు. ఆవాదము.

"రాహుః కుభామండలగశ్శశాంకం శశాంకగశ్ఛాదయతీనబింబం,
తమోమయశ్శంభువరప్రదానా త్సర్వాగమానామవిరుద్ధమేతత్."

అనుట యెట్టిదో అట్టిది. సర్పము. రవిచంద్రుల మ్రింగుట యొకి కల్పనమో యీకథయు నట్లే బాలకులకుగాఁ గల్పింపఁబడిన

దనియే యెఱుంగవలయును. ప్రకృతమున నేయర్థము గ్రహింపవలయును? రవిబింబమువంటి వక్త్రము గలవాలి పడమరదిక్కునుండి వెడలివచ్చెను. రామాదులు కిష్కింధకుఁ దూర్పుభాగమున నుండునడవిలో నుండిరనియు సుగ్రీవుఁడు సింహనాదము చేయఁగా వాలి పురినుండి వెడలివచ్చెననియు మనము గ్రహింపవలయును.

"తతో రామో ధనుష్పాణిస్తావుభౌ సముదీక్ష్యతు,
అన్యోన్యసదృశౌ వీరావుభౌ దేవావివాశ్వినౌ. ౧౯
యన్నావగచ్ఛత్సుగ్రీవం వాలినం వాపి రాఘవః,
తతో న కృతవాన్ బుద్ధిం మోక్తుమంతకరం శరం." ౨౦

అని మూలము. వృక్షములయంతరమున నున్న రాముఁడాయిరువు రొక్కరీతిగా నుండుటంబట్టి ప్రాణాపహరణక్షమమగు నాబాణమును విడువ నిష్టపడక యుండెను. ఇందుఁ దోఁచు సందియములకుఁ గ్రింద వ్రాయఁబడువిషయమునఁ జో టొసంగఁబడును.

"ఏతస్మిన్నంతరే భగ్నస్సుగ్రీవస్తేన వాలినా,
అపశ్యన్ రాఘవం నాథమృశ్యమూకం ప్రదుద్రువే. ౨౧
క్లాంతో రుధిరసిక్తాంగః ప్రహారైర్జర్జరీకృతః,
వాలినాభిద్రుతః క్రోధాత్ప్రవివేశ మహావనం. ౨౨
తం ప్రవిష్టం వనం దృష్ట్వా వాలీ శాపభయార్దితః.
ముక్తోహ్యసి త్వమిత్యుక్త్వా సన్నివృత్తో మహాద్యుతిః. ౨౩
రాఘవోఽపి సహభ్రాత్రా సహ చైవ హనూమతా,
తదేవ వనమాగచ్ఛత్సుగ్రీవో యత్ర వానరః. ౨౪
తం సమీక్ష్యాగతం రామం సుగ్రీవస్సహలక్ష్మణం,
హ్రీమాన్ దీనమువాచేదం వసుధామవలోకయన్. ౨౫

ఆహ్వాయస్వేతి మాముక్త్వా దర్శయిత్వా చ విక్రమం,
వైరిణా ఘాతయిత్వా చ కిమిదానీం త్వయా కృతం. ౨౮
తామేవ వేలాం వక్తవ్యం త్వయా రాఘవ తత్త్వతః,
వాలినం న నిహన్మీతి తతో నాహమితో వ్రజేత్. ౨౯

... ... ... ... ...

అలంకారేణ వేషేణ ప్రమాణేన గతేన చ,
త్వం చ సుగ్రీవ వాలీ చ సదృశౌ స్థః పరస్పరం. ౩౦
స్వరేణ వర్చసా చైవ ప్రేక్షితేన చ వానర,
విక్రమేణ చ వాక్యైశ్చ వ్యక్తిం వాం నోపలక్షయే. ౩౧
తతోఽహం రూపసాదృశ్యాన్మోహితో వానరోత్తమ,
నోత్సృజామి మహావేగం శరం శత్రునిబర్హణం. ౩౨
జీవితాంతకరం ఘోరం సాదృశ్యాత్తు విశంకితః,
మూలఘాతో నసౌస్యాద్ధి ద్వయోరపి కృతో మయా. ౩౩
త్వయి వీరే విపన్నే హి అజ్ఞానాల్లాఘవాన్మయా,
మౌఢ్యం చ మమ బాల్యం చ ఖ్యాపితం స్యాద్ధరీశ్వర. ౩౪
దత్తాభయవధో నామ పాతకం మహదుచ్యతే."

అని మూలము. సుగ్రీవుఁడు వాలిచే దెబ్బలు తిని తన్ను రక్షించు శ్రీరాముఁ డగపడమి నిఁక నిలువరాదని పాఱిపోవుటయు వాలి యాతనిం దఱుముకొనిపోవుటయు నతఁడు మతంగమునివనముం జొరఁగానే తప్పించుకొంటివి పో యని వాలిపలికి వెనుకకు మరలి కిష్కింధకుఁ బోవుటయు రామసౌమిత్రులు సుగ్రీవునికడ కరిగి యాతఁడు దుఃఖింపఁగా గుఱుపట్టఁ జాలనియట్లు మీరెల్లభంగుల నొక్కటిగా నుండుటంగని నా బాణము నిన్నే వధించిన మహాపాతకము వాటిల్లునన్న

భయమున నూరకుంటిని గాని వేఱుగాఁ దలంప వలదని రాముఁడు పలుకుటయు నిందలి విషయసారము. ఇందుఁ బెక్కుసందియములు తోఁచెడిని. వానినివ్రాసి సమాధానముఁ వ్రాసెదను. సాలపతనానంతర మిప్పుడే కిష్కింధకుం బోవుద మని సుగ్రీవుని రాముఁడే పురికొలిపెను. అందఱు పోయిరి. రామసౌమిత్రు లాయరణ్యానియం దొకచో దాఁగియుండిరి (వృక్షై రాత్మాన మావృత్య వ్యతిష్ఠ న్గహనే వనే) కదా. దాఁగి యుండుట మోసముగా నతనిం జంపుటకే కదా. ఇది న్యాయ్యమా యనున దొక్కసందియము. సుగ్రీవుఁడు వాలియుఁ బోరాడుచుండఁగా గుఱుతుపట్ట వలనుపడనియట్లు వారి రూపము లుండుటంజేసి బాణమువిడువక రాముఁ డూరకుం డెనని యున్నది కదా. సుగ్రీవుఁడు నిష్కింధచెంతకుం బోయి "గాఢం పరిహితో వేగాత్" బలము తగ్గకుండుటకుఁ బై వస్త్రము నడుమున బిగించుకొని వాలిఁ బిలిచెనని యున్నదే. ఈగుఱుతు చాలదా? ఏల రాముఁడు బాణమును విడువ లేదు. అనున దొక్కసంశయము. పోనిందు వాలియు నక్లే వచ్చియున్నవాఁ డనుకొందము. తాను బాణప్రయోగము చేయమి, వాలిదెబ్బ లెక్కువగాఁ దగులుటం జేసియు నిలువ లేక రక్తము గాఱుచుండఁగా సుగ్రీవుఁడు పాఱిపోయెను. వాలియు వెనుకొని తఱుముచుండెను. మతంగముని తపోవన మునుజొచ్చిన తమ్మునింగని తప్పించుకొంటి పో. అని వాలిపలికి శాపభీతి నందుఁ జొరనొల్లక కిష్కింధకుఁ బోయెను. (వాలి నాభిద్రుతః క్రోధాత్ప్రవివేశ మహావనం, తం ప్రవిష్టం వనం దృష్ట్వా వాలీ శాపభయార్దితః, ముక్తోఽహ్యాసి త్వ మిత్యుక్త్వా సన్నివృత్తో మహాద్యుతిః.) తఱుముచున్నవాఁడు వాలియని

యుఁ బాఱిపోవుచున్నవాఁడు తనమిత్రుఁడనియు రాముఁ డెఱుంగఁడా? ఇది తెలిసికొను టెంతయు సులువుకదా. అపు డేల బాణము వైవరాదు?అనున దొకసందియము. వాలిసుగ్రీవులు కవలపిల్లలు కారు. దేహప్రమాణాదులు తూఁచినట్లుగ నొక్కరీతిగా నున్నవనుటయు సరిపడదు. కాన నేల వాలిని వధింపలేదనున వొక్కశంక. ఇట్లిచోట నాక్షేపించువారు గలరు. ఈసందియము లిచోఁ గలుగవన వలనుపడదు. సమాధానమునకుం బ్రయత్నింతము. చాటున నుండ నేల యనుసందియమునకు రామవాలిసంభాషణము జరగుతఱి సమాధానము వ్రాయుదును. వాలిసుగ్రీవు లాకాశమున యుద్ధముచేయ లేదు. భూమిపైననే. యుద్ధము తుములముగా సాగుచుండెను. రామాదు లామహారణ్యమునఁ జెట్లచాటున నుండిరి. నడుమునఁగల వస్త్రమును గుఱుతుపట్టి వాలికాఁడనుకొని బాణము వేయ నవకాశము లేదు. రక్తము స్రవించుచుండఁగాఁ గటివస్త్రమును దూరమున నున్నవారు గురుతింపఁజాలరు. వారు సవ్యాపసవ్యములుగాఁ దిరుగుచుందురు. మహాక్రోధావిష్టులగుట పరస్పరవిజయకాంక్షులఁ బోరాడుచుందురు గదా. అట్టితఱి బాణప్రయోగముచేయ శ్రీరాముఁడు శంకించుట సకారణమే. సావకాశముగాఁ బరిశీలించునంతలో సంగరము మాని పాఱిపోయియుండవచ్చును. వాలి తఱుముచుండఁగా నేల కొట్టరాదను శంక యంత మంచిదిగాదు. వృక్షాంతరితుఁ డగువానిని లక్షించి బాణము వైవ వలనుపడుననుట యు ... సాధ్యము కాదు. ప్రాణభీతుఁడు సుగ్రీవుఁడు. ఈర్ష్యాగ్రస్తుఁడు వాలి. వీరిరువురు మాటలాడుచు మెల్లఁగాఁ బోయి యుండరు. ఆమహాటవి ననేకవృక్షములు సాంద్రముగా నున్నవి. కాన

శరసంధానమున కవకాశము దొరకదు. పరుగెత్తువానిని వెనుక నుండి కొట్టుట మహాశూరలక్షణము కాదు. కావున నపుడు రాముఁడు శరప్రయోగమున మందప్రయత్నుఁడగుటయే న్యాయ్యము. దేహప్రమాణాదు లించుకభేదముగా నుండ వచ్చును. యత్కించి ద్భేదమును గ్రోత్తవారు, విశేషించి దూరమున వృక్షముల మఱుఁగనున్నవారును గనిపెట్టుట శక్యమా? ఇట్లు మనమూహించిన నిందలిసందియములు బాధింపఁజాలవు. ఇన్నింటియందలి సారమేమి? వాలి మృతికాల మించుక దూరమున నున్నది. సుగ్రీవుని దుష్కర్మము శేషించి యున్నది. ఇట్టులుండఁగా

"మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్."

అను వాక్యానుసారము కర్మఫలముల నొసంగఁజాలు కారణమగు రాముఁడు చంపుటెట్లు? ఎవ్వరి కెచ్చోటమృతి కలుగవలయునో యేసమయమునందో అవి రెండు సమకూడవలయును. కర్మసిద్ధాంతము మార్పఁదరముగాదు కదా. కావున నిచ్చోట రాము పొరపాటులేదు. కర్మసిద్ధాంత మెఱుఁగని వారల కిన్నిశంకలు గలుగునేమో కాని యద్దాని నించుక యెఱింగినవారికి నిట్టిసందేహములు గలుగవు.

"అహం చ లక్ష్మణశ్చైవ సీతా చ వరవర్ణినీ. 3౫
త్వదధీనా వయం సర్వే వనేఽస్మిన్ శరణం భవాన్."

అని మూలము. నేను లక్ష్మణుఁడు సీతయు నీయధీనులమే. ఈవనమున మాకు నీవే శరణము. అని రాముఁడు పలికెను. ఇపుడు సీత లేదుకదా. వచ్చినతర్వాత నని యందురేని అపుడు కూడ నిందేయుండఁదరమా? భరతునకొసంగిన వాగ్దాన మేమ

గును? కాన నిందొకవిశేషార్థము కలదనియే యూహింపవల యును. ఇందు "వరవర్ణిని" అనువిశేషణము వాల్మీకి యుపయో గించెను. "వరశ్శ్రేష్ఠో వర్ణో రూప మస్యా ఇతి వరవర్ణినీ"అని విగ్రహము. "శీతే సుఖోష్ణసర్వాంగీ గ్రీష్మేతు సుఖశీతలా, భర్తృరక్తా చ యా నారీ సా భవేద్వరవర్ణినీ"అని రుద్రుఁడు నిర్వచించెను. వరవర్ణినీ. గౌరి.

"మహాకాళి నమస్తుభ్యం మహాకాళి నమోస్తు తే,
చండి చండే నమస్తుభ్యం తారిణీ వరవర్ణిని." మహాభారతే.
"సరస్వతీ, లక్ష్మీః ఇతి శబ్దరత్నావళీ."

అని శబ్దకల్పద్రుమమునఁ గలదు. లక్ష్మియగు సీతయు నేను లక్ష్మణుఁడును నీ యధీనులము. ఈవనమున నీవే దిక్కు. అనుచో సీత తనయొద్దనే ప్రచ్ఛన్నరూపమున నున్నదను భావమును శ్రీరాముఁడు తెలిపెను. లంకకుఁ బోయినది మాయాసీతయే యనునధ్యాత్మరామాయణాభిప్రాయము నీ భాగము సూచించుచున్నది. ప్రకృతి లేక పురుషుఁ డుండు టెట్లు? భగవతి అనపాయిని గదా. ప్రకృతి పురుషుల కెడఁ బాటు లోకదృష్టికే కాని వాస్తవము కాదు. రాముఁడే యిన్ని కార్యములు చేసినట్లు కనఁబడుచుఁ దానే యన్నింటి నొనరించునది ప్రకృతియే యని మన మెఱింగినయెడల వారి నారాధించుపద్ధతియు నెఱుంగఁబడును. లేకున్న నంతియే.

"తతో గిరితటే జాతా ముత్పాట్య కుసుమాకులాం,
లక్ష్మణో గజపుష్పీం తాం తస్య కంఠే వ్యసర్జయత్." ౪౦.

అని మూలము. పుష్పభారముగల నాగపుష్పీలతను సుగ్రీవుని

కంఠమున సౌమిత్రి వైచెను. అది వ్రేలాడుచుండుటంజేసి గుఱుతుపట్టుకొన వలనుపడునని శ్రీరాముని యాశయము. పుష్పితలతను గంఠమున వైచుటంజేసి భావిపట్టాభిషేకము సూచింపఁబడుచున్నది. అధ్యాత్మరామాయణమున నీభాగమునఁ గల విశేష మేమనఁగాఁ దన్ను స్తుతించు సుగ్రీవుని మాయామోహితునిగ నొనరించి కార్యనిరతునిగఁ జేసెనను నదియే.

## రామాదులు రెండవసారి కిష్కింధ కరుగుట.

*రామలక్ష్మణులు సుగ్రీవునింగూడి కిష్కింధకరిగిరి. ధనుర్బాణములఁ దాల్చి శ్రీరాముఁడు ముందుగాఁ బోవఁ దక్కినవా రతనివెనుకఁ బోయిరి. హనుమంతుఁడు నలనీలతారులు పోయిరి. త్రోవనడుమ ననేకవిచిత్రకాననభాగములం గాంచుచుఁ గొలంకులం గని యానందించుచు వనగజములు లోనగు మృగవిశేషములం దిలకించుచుఁ బోవుచుండఁగా రాముఁడు సుగ్రీవునిం గని యీసాంద్రారణ్యము మేఘమండలమువలె నొప్పుచున్నది. దీనిం దెలియఁగోరుచున్నాను. అనియడుగఁ బయనముసాగించుచు నావనవృత్తాంతమును జెప్పఁబూని సుగ్రీవుఁ డిట్లు పలికెను. ఇది యొక యాశ్రమము. ఉద్యానతుల్యము. సప్తజనులను మును లేడుగురు నివసించుచుండిరి. వారు తలక్రిందుగా జలములనుండి నియతిమీఱఁ దపమొనరించుచుండిరి. ఏడురాత్రుల కొక్కసారి వారు వాయువు నాహారించుచు సప్తశతవత్సరములు తపము సలిపి సశరీరస్వర్గసుఖము నొందిరి. ఈవృక్షప్రాకార మింద్రాదులకేఁ

* ఇది పదుమూఁడవసర్గమునఁ గలదు.

జొరఁ దరముగాదు. మృగపక్షులుంగూడ నిందుఁ బ్రవేశింపఁ జాలవు. తెలియక ప్రవేశించిన మరలివచ్చుట యనునది లేదు. ఇందచ్చరమిన్నల నర్తనాదులు వారియాభరణధ్వనులు విన వచ్చుచుండును. దివ్యగంధము గుబులుకొనుచుండును. త్రేతాగ్నులింద్రెడ తెగక యుండును. అందులకు నిదర్శనముగా నీ సాంద్రధూమము చుట్టుకొనుటఁ జూడుము. మీరిరువురు నియతచిత్తముల నంజలింబట్టి యేదే నొకఫలము నుద్దేశించి యీ మహర్షులంగూర్చి నమస్కరింపుఁడు. దాన నాధివ్యాధులు నశించును. అనఁగా వారిరువు రట్లే నమస్కరించిరి. సంతోష మున నవ్వలంబోయి కొంతదూరమున నున్న కిష్కింధానగర ముం గాంచిరి.

ఆర్యులారా! ఇందేదియైన విశేషముండునా యని నెమకుదము.

> "తేషాంతు గచ్ఛతాం తత్ర త్వరితం రఘునందనః,
> ద్రుమషండవనం దృష్ట్వా రామస్సుగ్రీవమబ్రవీత్. ౧౩
> కిమేతత్ జ్ఞాతుమిచ్ఛామి సఖే కౌతూహలం హి మే."

అని మూలము. ఇపుడు రామాదులు పోవుమార్గము క్రొత్త దని తేటపడును. మతంగమునివనమునుండి ప్రయాణముచేసిరి గాన వేఱొకమార్గముగ నుండవచ్చును. ఋశ్యమూకమునకుఁ గిష్కింధానగరమునకు నాతిదూరమని కనుపట్టును. ఇపుడు కిష్కింధ యనఁబడుదానికిని బూర్వపుఁ గిష్కింధకు నెంతయో - త్యాసము కన్పట్టవచ్చును. సాంద్రారణ్యమునఁ బోవువారికి నడుగొక యామడఁగాఁ దోఁపవచ్చును. ఇది యేమో క్రొం వనమనుట మాత్రము సత్యము.

"ఏతద్రాఘవ విస్తీర్ణ మాశ్రమం శ్రమనాశనం,
ఉద్యానవనసంపన్నం స్వాదుమూలఫలోదకం. ౧౭
అత్ర సప్తజనా నామ మునయస్సంశ్రితవ్రతాః,
సప్తైవాసన్నధశ్శీర్షా నియతం జలశాయినః. ౧౮
సప్తరాత్రకృతాహారా వాయునా వనవాసినః,
దివం వర్షశతైర్యాతాస్సప్తభిస్సకళేబరాః. ౧౯
తేషామేవం ప్రభావానాం ద్రుమప్రాకారసంవృతం,
ఆశ్రమం సుదురాధర్ష మపి సేంద్రైస్సురాసురైః. ౨౦
పక్షిణో వర్జయంత్యేత త్తథాన్యే వనచారిణః,
విశంతి మోహాద్యే తత్ర నివర్తంతే న తే పునః. ౨౧
విభూషణరవా స్తత్ర శ్రూయంతే సకలాక్షరాః,
తూర్యగీతస్వనాశ్చాత్ర గంధో దివ్యశ్చ రాఘవ." ౨౨

అని మూలము. ఇది యాశ్రమమాహాత్మ్యము. సరోవరములు లోనగునవి కలిగియుండుట నుద్యానలక్షణము. సప్తజను లను పేరఁ బరఁగు నేడుగురుమునులు ఘోరతప మొనరించి స్వర్గమున కరిగిరి. ఇందు దేవతలు గూడఁ జొర వెఱతురు. మృగపక్షులు చొరవు. తెలియకపోవునే నందే నశించును. ఆమునులు శరీరములతో దివ మలంకరించిరి. స్త్రీల యలంకారముల చప్పుడులు గీతవాదిత్రాదిశబ్దములు వినవచ్చును. అనుటంజేసి స్వర్గమునకుంబోయి తపఃఫలముగా నచ్చరమిన్న లంగూడి పూర్వనివాసాదరణమున నచ్చటికి వచ్చి విహరించుచుందురని తోఁచెడిని. ఇంకొక్క విశేషము కలదు. తపోవనమును మృగపక్షులు చొర వెఱచుననఁగా నర్థమేమి? వాని కందేదో యముగలుగునట్లు తోఁచుననియే కదా. మహర్షులయాశ్రమములయందు నివాసము ప్రాయికముగా సాధుజంతువులకే

యని కనుపట్టు. దుష్టసత్త్వముల కయ్యది భయావహాముగఁ గనుపట్టు. పామరుల కీవార్త దబ్బఱగాఁ దోఁచును. కాని యిందసత్యము లేదు. తిరుపతికొండకు నల్లమల యని పేరు. శ్రీశైలము మొదలు తిరుపతిదనుక నది వ్యాపించియున్నది. ఆ పర్వతముపైనఁ బశువులు మందగానుండుటకు విశాలభాగములు గలవు. పగలు పచ్చిక మేసి రాత్రికాలమున నందుఁ బరుండును. వానికిఁ బెంటలనిపేరు. పెంటలనఁబడు నాభాగములయందుండు గోవులను మేకలను బులిమొదలగు క్రూర జంతువులు బాధింపవు. అనఁగా నాచోటికి నవి రాఁజాలవు. చుట్టు తిరిగి యార్చుచుండును. నిర్భయముగాఁ దద్రక్షకు లుందురు. తొలుత నాస్థలమునం దొక యంత్రమును స్థాపింతురు. దానికే కట్టుయంత్రమని పేరు. ధేనువులుగల ధనికులప్పని చేయించియుందురు. వేసవికాలమం దందే యవి శయనించును. అందుఁ బ్రవేశింప భయంపడుచుఁ గ్రూరమృగములు చుట్టుతిరిగి పోవుచుండును. ఏల? యంత్రబల మది. ఈవిషయము నే నెఱుఁగుదును. ఈకాలపువారికే యింతమాత్రపు శక్తి యుండఁగా నప్పటిమునుల కదియుండెనన్న సంశయించువారికంటెఁ బామరులు లేరు. ఏఁబదివత్సరములకు ముందుఁ గడపమండలముననఁగల పల్లియలలోఁ గొందఱు మాంత్రికు లుండిరఁట. ఒకరిని నడవికింబిలుచుకొనిపోయి మాంత్రికుఁడు చెట్టెక్కి యిసుకమంత్రించి చల్లిన వాఁడు పెద్దపులియై వానిం జంపనుంకించునఁట. జాముకాకమునుపే మరల నిసుక చల్లిన మనుష్యుఁ డగునఁట. అట్లుచేయువారి కిపుడు నింటిపేరు పెద్దపులివారని కలదు. ఇట్టివిద్య లిపు డంతరించినవి. నమ్మఁదగని యట్లు లేర్పడినవి. మంత్రవిద్యలకు వినాశనకాల మిది. చచ్చు

వేదాంత ముపదేశించు మహాత్ములను మంచికాలము. కనుక నన్నియు సంశయింపందగియే యుండును.

"త్రేతాగ్నయోఽత్ర దీప్యంతే ధూమోఽప్యత్ర ప్రకాశతే,
వేష్టయన్నివ వృక్షాగ్రాన్ కపోతాంగారుణోపమః. ౨౩

... ... ... ... ...

కురు ప్రణామం ధర్మాత్మన్ తాన్ సముద్దిశ్య రాఘవ,
లక్ష్మణేన సహ భ్రాత్రా ప్రయతస్సంయతాంజలిః. ౨౫
ప్రణమంతి హి యే తేషాం మునీనాం భావితాత్మనాం,
న తేషామశుభం కించిచ్ఛరీరే రామ దృశ్యతే. ౨౬
తతో రామస్సహ భ్రాత్రా లక్ష్మణేన కృతాంజలిః,
సముద్దిశ్య మహాత్మానస్తానృషీనభ్యవాదయత్." ౨౭

అని మూలము. ఇందుఁ ద్రేతాగ్నులు మండుచున్నవి. అనఁగా నర్థమేమి? తేజస్తత్త్వోపాసకు లాకాలమునఁ బెక్కండ్రు గలరు. ప్రాయికముగా మునులు తేజస్సు నుపాసించువారు. అనఁగా ధ్యానించువారు. ఉపాసించుపద్ధతులు నాలుగు. మంత్రజపప్రధానము, పూజాప్రధానము, న్యాసప్రధానము, హోమప్రధానము నని వానిభేదములు. తఱచుగా నాకాలపు వారు హోమము జపము ప్రధానముగాఁ గలవారే యుండిరని పురాణములఁ బరిశీలింపఁ దేటపడును. ఈనాలుగుమార్గములు సమానఫలదములే. ఇందు న్యాసజపములు వస్త్వంతరానపేక్షకములు. హోమపూజలు వస్త్వంతరసాపేక్షకములు. పైనఁ బేర్కొనిన మహర్షులు హోమప్రధానోపాసకులు. వారి శిష్యులు నట్టివారుగనే యుందురు. కనుకనే వారు సిద్ధినొంది సురపురికరిగిన నగ్నులు చల్లారకయున్నవి. ఆమునులు స్వర్గ

సుఖమునుగోరినవారు కావున నచ్చరమిన్నలు లభించిరి. వారి కెవరు నిశ్చలమనస్కులై నమస్కరింతురో వారికి శరీరబాధ లుండవని సుగ్రీవుఁడు తెలుప శ్రీరామలక్ష్మణు లట్లే కావించిరి. రాముఁ డేమికోరి యట్లు నమస్కరించె నని ప్రశ్నింపరాదు.

"కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః,
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి. ౨౦
యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే. ౨౧
యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః,"

అన్న గీతావాక్యముల ననుసరించి యోజించిన మహర్షు లిహాముత్రఫలభోగవిరాగు లైనను లోకులకు సత్కర్మాచరణ పరాయణత్వ మలవడఁజేయఁ దా మూరకే సత్కర్మముల నాచరించుచుందు రని తేటపడియెడిని. ఈతత్త్వము నేటఁ గలిపి కొందఱు దేవాలయములే ముక్తిదాయకములనుచు విగ్రహారాధనమే ప్రధానమని బోధింతురు. అదియే మోసమని మన మెఱుంగవలయును. శ్రీరాముఁడు తమ్మునింగూడి వారికి నమస్కరించె ననఁగా నితరులు తన్నుంజూచి యట్లు పెద్దలకుఁ గాార్యార్థులైయైన నమస్కరింతురని దా నమస్కరించెఁ గాని వాలిఁ జంపుశక్తి నాకుఁ గల్పింపుమను లోనగు వాంఛలంగోని కాదని మన మెఱుంగందగు. ఇందు మహాతపోధనులైనను స్వర్గాదిసుఖములంగోరిన నవి లభించుననియుఁ గాని చాలకాల మాసుఖము లుండవనియుఁ గావున నిష్కామకర్మముల నాచరించినవారే పరమేశ్వరానుగ్రహైకపాత్రు లగుదురనియు ముఖ్యముగాఁ దనమేలు కోరినవార లట్టిపద్ధతి ననుసరించి

సత్కార్యముల నాచరింపవలయుననియుఁ దేటపడుచున్నది. అధ్యాత్మరామాయణమునం దీభాగమున విశేషములు కానరావు.

## శ్రీరాముఁడు సుగ్రీవుని భీతిమాన్పుట.

* శ్రీరామాదులు వేగమ కిష్కింధం దరిసి దుర్గమారణ్యమున నొకవృక్షమూలమున గుప్తముగా నుండిరి. సుగ్రీవుఁడు వనమున నాల్గుప్రక్కలు కలయంజూచి నిర్భరక్రోధముఁ దెచ్చుకొనెను. ఎల్లరుఁ దన్నుఁ బరివేష్టించియుండఁగా సింహనాదము గావించి వాలిని సంగరమునకాహ్వానించెను. శ్రీరామునిం గని వాలిపాలితమగు పురమునకు వచ్చితిమికదా. ఇది సామాన్యముగాక పగవారికి మిగుల దుర్భేద్యమైనది. ఇందు శత్రుహంత లనేకులున్నారు. మహావీరా! వాలిని వధింతునని ప్రతిన చేసితివి కదా. దానికి సుసమయ మిదె వచ్చినది. సుగ్రీవుఁ డిట్లు పలుకఁగా గుఱుతుకొఱకు నీమెడలో గజపుష్పికామాలికను వైచియున్నాఁడు. దీన సులువుగా నిన్ను గుఱుతింపందగును. వీరాగ్రేసరా! ఈలతను గంతమున ధరించి యాకాశమున నక్షత్రమాలాపరివృతుఁడగు సూర్యునివలె మిక్కిలి వెలుంగుచున్నాఁడవు. నీభయము నాతనివైరము నొక్కనారసమున నిపుడు తీర్చెదను. భయంపడకుము. సోదరాకృతినున్న నీశత్రువును జూపుము. వానిని జూచుటయే యాలస్యము. చూచినంతన హతుఁడై నేలఁబడి పరాగమునఁ బొరలాడఁగలఁడు. నాకన్నులకుం దోఁచి మరలఁ బ్రాణములతో వాలి పోవునేని అట్టిదోషము నేఁజేసినందులకు నన్ను

* ఇది పదునాల్గవసర్గమునఁ గలదు.

నిందింపుము. వాఁడు మృతినొందిన నిర్దోషినని నిందింపకుండుము. సాలములంజీల్చినబలముననే వాలిని గూల్చితినని తెలిసికొనుము. ఎట్టికట్టిడికాలమునందైనను ధర్మలోపమున కోర్వ లేక యింతవఱ కెన్నఁడుగాని యబద్ధమాడి యుండలేదు. ముందునుగూడ నెంతటికష్టములు వచ్చినను అనృతము పలుకఁ బోవునదియు లేదు. అంకురించిన సస్యము నింద్రుఁడు వర్షమున ఫలింపఁజేయులాగున వాలివధవిషయమునఁ జేసిన ప్రతిజ్ఞను బరాక్రమమున సఫలము గావించెదను. ఇంచుకయుఁ బ్రతినఁ దప్పను. కనుకఁ దొట్రుపడకుము. వాలి వెడలివచ్చునట్టి ధ్వని చేయుము. విజయశీలియగు వాలిని నీవు మార్కొనియున్నావు కదా. కనుక నాకోపమున నీధ్వని వినఁబడఁగానే జాగుచేయక వచ్చును. శూరులు యుద్ధమున శత్రుకృతతిరస్కారమును సహింపరు. తమ రధికులమని తెలియుదురేని విశేషించి స్త్రీల యెదుటనుందురేని యించుకంతయు నోర్వరు. అని రామమూర్తి పలుకఁగనే కపిరాజు గట్టిగానార్చెను. అరాజకత్వదోషముచేత నిది యేమని యడుగువారే లేక పరపురుషులు శిరోజములంబట్టుకొనఁగాఁ గులకాంతలు పోఁదగినతావునకుం బోలేక విచారంపడుచందమున నాతనిధ్వనికి గోవులు బెదఱి పాఱెనవి. యుద్ధమున నంగవైకల్యమునొందిన గుఱ్ఱములపోలిక జింకలు భీతిచేఁ బరుగెత్తఁజాలకపోయెను. ఆకసమున నక్షత్రరూపమున నలరు పుణ్యాత్ములు పుణ్యము క్షీణింపఁగా భూమిం బడునట్లు పక్షులు పెనుభీతి నేలంబడియె. సముద్రధ్వనివలె నాతఁ డార్చి పౌరుషమున ననికి సిద్ధపడియుండెను.

మహనీయులారా! ఈభాగమును బరిశీలింతము.

"సర్వే తే త్వరితం గత్వా కిష్కింధాం వాలిపాలితాం,
వృక్షైరాత్మానమావృత్య వ్యతిష్ఠన్ గహనే వనే." ౧

అని మూలము. నలనీలతారహనుమంతులు రామలక్ష్మణులు సుగ్రీవుఁడు కిష్కింధంజేరి యందొకవనమునఁ జెట్టుచాటున సుగ్రీవుఁడుకాక తక్కినవారు దాఁగియుండిరి. అని కదా యర్థము. తమ్ముఁగాంచి వాలిభయపడి పాఱిపోవునేమో యను నూహ వారలకున్నట్లు కనుపట్టుంగదా. ఇది శూరలక్షణమా యని కొందఱు ప్రశ్నించిరి. కాని యంత మంచిప్రశ్న మిది కాదు. సరివానితోఁ బోరాడుతఱి నిట్టులొనర్చుట హేయము కాని శాఖామృగములవిషయమున నిది హేయము కానేరదు. ఇది వేఁటవంటిదే కాని సాధారణ సంగరమువంటిది కాదు.

"లక్ష్మణేన సముత్పాట్య యైషా కంఠే కృతా తవ,
శోభసే హ్యధికం వీర లతయా కంఠసక్తయా. ౯
విపరీత ఇవాకాశే సూర్యో నక్షత్రమాలయా."

అని మూలము. ఇది శ్రీరామవాక్యము. పూర్వమురీతిగాదు. నిన్ను గుఱుతుపట్టుటకే యీలత నీమెడలో వేయఁబడినది. దీనిచే మునుపటికంటె మిన్నగాఁ బ్రకాశించుచున్నవాఁడవు. నక్షత్రమాలచే నావృతుఁడగు సూర్యుఁ డాకాశమున వెలుంగునట్లని రాముఁడు పలికెను. నక్షత్రమాలాపరివృతుఁడుగ సూర్యుఁ డుండుటెట్లని సందేహింతురు. విపరీతే = ఉత్పాత కాలమునందు నక్షత్రమాలావృతుఁడుగ సూర్యుఁ డగ పడును. దాన నారాజ్యనాథుఁడు మరణించునన్న జ్యోతి శ్శాస్త్రము ననుసరించియే శ్రీరాముఁ డీయుపమానము తెల్పె ననుటయే చక్కగానున్నది.

"రాత్రా వింద్రధనుర్దర్శే దివా నక్షత్రదర్శనే,
తద్రాష్ట్రనాథనాశస్స్యాదితి గర్గస్య భాషితం."

అను ప్రమాణ మంగీకరింపఁదగినది. "పరీతం తు దివాప్రోక్తం విపరీతం తు శర్వరీ, రాకామధ్యగతశ్చంద్రస్సూర్య ఇత్యభిధీయతే." ఇత్యాదులు రసవంతములుగా లేవు. భావివృత్తాంత సూచకముగా శ్రీరామవాక్య ముండునని మన మెఱుంగుటయే న్యాయ్యము. తక్కినవన్నియు నిట్టియర్థములే. ఈభావముచే భావి వాలిమృతి సూచింపఁబడుచున్నది.

"ప్రత్యక్షం సప్త తే సాలా మయా బాణేన దారితాః. ౧౩
తేనావేహి బలేనాద్య వాలినం నిహతం మయా,
అనృతం నోక్తపూర్వం మే వీర కృచ్ఛ్రేఽపి తిష్ఠతా. ౧౪
ధర్మలోభపరీతేన న చ వక్ష్యే కథంచన,
సఫలాంచ కరిష్యామి ప్రతిజ్ఞాం జహి సంభ్రమం." ౧౫

అని మూలము. ఏబలమున సప్తసాలముల భేదించితినో యాబలమున నొక్కబాణమున వాలిని వధింతును. ఎట్టికట్టడికాలములయందుఁగాని యనృతము పలికినదిలేదు. ధర్మలోపభయముననుగూడ నసత్యము చెప్పినది లేదు. కాన నాప్రతిజ్ఞను సఫలముగాఁ జేసెదను. అని రాముఁడు పలికెను.

"సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాన్న బ్రూయాత్సత్యమప్రియం,
సత్యం చ నానృతం బ్రూయాదేష ధర్మస్సనాతనః."

అను మనుస్మృతివాక్యమునకు రామవాక్యమునకు సంబంధము లేదని యెఱుంగవలయును. ఎట్టికట్టిడితఱినైన నసత్యమాడినది లేదు. ధర్మలోపభయమునను గూడఁ బలుకను. అనఁగా నర్థమేమి? కేవలసత్యమే ప్రధానముగాని పరచిత్తము

నొచ్చుననుభయము లేదని భావము. సత్యమువలన ధర్మము లోపించినను దానికొఱకై యసత్యమాడ నని శ్రీరామ వాక్యము. శుద్ధసత్యమే నాకిష్టముగాని మిశ్రసత్యము కాదని రామమూర్తి యాశయము. సత్యమే భగవత్స్వరూపము. దానియందుఁ గళంకలేశము లుండునా? కావున సత్యము నాశ్రయించువారినే భగవంతుఁ డాశ్రయించును. సమయోచితముగా సత్యముపలుకువారికి భగవదనుగ్రహామునకుఁ గొన్ని యోజనముల యంతరము కలదని మన మెఱుంగం దగు.

"ప్రసూతం కళమం క్షేత్రం వర్షేణేవ శతక్రతుః." ౧౫

అని మూలము. క్షేత్రమున మొలిచిన పైరు నింద్రుఁడు వర్షముచేఁ బోషించునట్లు ప్రతిజ్ఞను సఫలమొనర్తును. అనఁగాఁ దాత్పర్యమేమి? నీసత్కార్యము ఫలింప మొనెత్తియే యున్నది. దానిని బ్రకాశింపఁజేయుదును. వాలివధమునకు నీవిజయమునకు మూలములు మీయిరువుర ప్రాక్కర్మములు. అవి ఫలింప వేచియున్నవి. దానిని జక్కఁగా ఫలింపఁజేయ నేఁ బ్రయత్నించెదను. నిమిత్తమాత్రమే నేను. మీరిరువురు మీమీ కర్మఫలముల ననుభవించువా రని సారము.

"జానంతస్తు స్వకం వీర్యం స్త్రీసమక్షం విశేషతః." ౧౬

అని మూలము. శూరులు తమను బలాధికులమని యెఱింగినవారేని విశేషించి స్త్రీలయెదుటనుండిరేని శత్రుకృతతిరస్కారము నెంతమాత్రము సహింపరు. స్త్రీలయెదుటఁ దమ పౌరుషమును బ్రకటించుకొనుట సామాన్యపురుషులకుంగూడ నైజము. ఇఁక శూరులమాట చెప్పనేల?

నొచ్చుననుభయము లేదని భావము. సత్యమువలన ధర్మము లోపించినను దానికొఱకై యసత్యమాడ నని శ్రీరామ వాక్యము. శుద్ధసత్యమే నాకిష్టముగాని మిశ్రసత్యము కాదని రామమూర్తి యాశయము. సత్యమే భగవత్స్వరూపము. దానియందుఁ గళంకలేశము లుండునా? కావున సత్యము నాశ్రయించువారినే భగవంతుఁ డాశ్రయించును. సమయోచితముగా సత్యముపలుకువారికి భగవదనుగ్రహమునకుఁ గొన్ని యోజనముల యంతరము కలదని మన మెఱుంగం దగు.

"ప్రసూతం కళమం క్షేత్రం వర్షేణేవ శతక్రతుః." ౧౫

అని మూలము. క్షేత్రమున మొలిచిన పైరు నింద్రుఁడు వర్షముచేఁ బోషించునట్లు ప్రతిజ్ఞను సఫలమొనర్తును. అనఁగాఁ దాత్పర్యమేమి? నీసత్కర్మము ఫలింప మోనెత్తియే యున్నది. దానిని బ్రకాశింపఁజేయుదును. వాలివధమునకు నీవిజయమునకు మూలములు మీయిరువుర ప్రాక్కర్మములు. అవి ఫలింప వేచియున్నవి. దానిని జక్కఁగా ఫలింపఁజేయ నేఁ బ్రయత్నించెదను. నిమిత్తమాత్రమే నేను. మీరిరువురు మీమీ కర్మఫలముల ననుభవించువా రని సారము.

"జానంతస్తు స్వకం వీర్యం స్త్రీసమక్షం విశేషతః." ౧౬

అని మూలము. శూరులు తమను బలాధికులమని యెఱింగినవారేని విశేషించి స్త్రీలయెదుటనుండిరేని శత్రుకృతతిరస్కారము నెంతమాత్రము సహింపరు. స్త్రీలయెదుటఁ దమ పౌరుషమును బ్రకటించుకొనుట సామాన్యపురుషులకుంగూడ నైజము. ఇఁక శూరులమాట చెప్పనేల?

శ్యము లగును. అవియే పుణ్యఫలానుభవము ముగియఁగా మర్త్యలోకమున మరలఁ బుట్టవచ్చునవి యని మన మెఱుంగ వలయును. " క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి." అని శ్రుతి తెలుపుచున్నది.

"త ఇహ వ్యాఘ్రోవా సింహోవా వృకోవా వరాహోవా కీటోవా పతంగోవా దంశోవా మశకోవా యద్యద్భవం తదా భవంతి." 3-మం. ఛాందోగ్యోపనిషత్తు. ౬-ప్రపాఠకము.

"కచ్చిన్నోభయవిభ్రష్టశ్ఛిన్నాభ్రమివ నశ్యతి,
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి."

అను నర్జునుని ప్రశ్నమునకు

"పార్థ నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే,
న హి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి. ౪౦
ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీస్సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే. ౪౧
అథవా యోగినామేవ కులే భవతి ధీమతాం,
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశం. ౪౨
తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికం,
యతతే చ తతో భూయస్సంసిద్ధౌ కురునందన." ౪౩

అను శ్రీకృష్ణమూర్తి చెప్పినసమాధానమును బరిశీలించి పైశ్రుతుల నాలోచించిన నీవిషయము స్పష్టమగును. ఏజన్మము గలజీవుఁ డాజన్మమునందే హెచ్చరికగలవాఁడై యుండును. మఱుజన్మ మట్టిదే లభించును. అది మార్పునొందవలయునన్న విజ్ఞానము పెంపొందవలయును. కర్మముల నాచరించువారు ఫలముల నీశ్వరార్పణము చేసిన నిట్టిపునరావృత్తు లుండవు.

దీనిం బరిశీలించి తెలిసికొనఁదగిన చరిత్రాంశ మెద్ది? ఆకాలమునఁ బ్రాయికముగా ద్వంద్వయుద్ధములు సాగుచుండెను. ఎవరి కెపుడు బలముగలుగునో తటాలునఁ బోయి శత్రుపత్తనములపైఁ బడుట వారించుకయుఁ బ్రయత్నపరులు గానిచో నోడుటయో ప్రయత్ననిరతులైన గెలుచుటో సమానముగఁ బోరుటో జరగుచుండెను. బలవంతుఁడనని గర్వించువాఁ డొక్కఁడే నిక్కుచుం బోయి యొకని నాహ్వానించుట ఆతఁ డొక్కఁడే వచ్చుట పోరుట యలవాటుగ నుండెను. మహిషాదిరూపములయం దుండుటయు నలవాటుగ నుండెను. భూవివరములలో దాఁగుట ప్రాయికముగా నలవాటు. యుద్ధమున శాస్త్రమునననుసరించి కాలనియమముగాని ధర్మనియమముగాని లేకుండెను. అడవులలో నివసించి క్రూరబుద్ధులు సాధువులఁ జంపి భక్షించుచుండిరి. ధర్మాత్ము లెందో దాఁగియుండువారు. వైదికక్రియలకు విశేషించి బాధలు కలుగుచుండెను. అడవులు మెండు. జనులు నివసించుగ్రామాదులు కొలఁదిగ నుండెను. ఇట్టి కారణముల నెన్నిరీతులఁ బరికించినను భారతకాలమునకంటె ముందు రామాయణకాలమని యేర్పడునే కాని భారతకాలమునకుఁ బిదప రామాయణకాలమని యేర్పడదు. భారతకాలమే ముందనుటకంటె హాశవాదము వేఱొకటి లేదు.

## వాలి యుద్ధమునకుఁ బయనము చేయఁబూనఁ దార వలదని హితముఁ దెలుపుట.

* సోదరుఁ డిట్లు మహాధ్వనిగావింప నంతగపురమున

* ఇది పదునేనవసరమునఁ గలదు.

నున్న వాలి యాలించి సైరింపలేక కామోద్రేకమత్తత యంత రింపఁ గోపావిష్టుఁ డయ్యెను. కన్నులెఱ్ఱవాఱఁగా రాహుగ్రస్తసూర్యునిరీతిఁ గాంతిహీనుఁ డయ్యెను. శూరులకు సైరింపరాని యాధ్వని చెవులఁ బడినంతనే భూమిని బ్రద్దలుచేయునట్లు పాదములు పెట్టుచు వాలి యుద్ధముచేయఁబోవ నుంకించెను. తార యత్తఱి భయాతిరేకమునఁ ద్వరపడుచుఁ బ్రీతి మీఱఁ బతిఁ గౌఁగిలించుకొని మంచితనము తేటపడునట్లు హితము వెడలించువాక్కుల నిట్లు పలికెను. ధీరోత్తమా! నిదురలేచినంతన తలలోని పూలహారమును బాఱవేయు చందమునఁ బెచ్చుపెరుఁగు నీకోపమును వదలుము. తమ్మునితోఁ బోరఁగోరుదువేని రేపుదయ మతనితోఁ బోరుము. దాన నీకు లాఘవము రాఁబోదు. పగవానికి గొప్పతనము గలుగఁబోదు. ఇట్టు తటాలున రణమునకు వెడలుట నాకించుకయు సరిపడక యున్నది. ఎందుల కిట్లు పలుకుచున్నానో వివరించెద. ముందు రణమునకు నిన్నుఁ బిలిచి పోరాడి నీచే దెబ్బలు తిని పాఱిపోయి మరల వచ్చి రణము చేయ రమ్మని నిన్నుఁబిలుచుట యాలోచింపఁగా బలమైన యొకకారణము గలుగవలయును. ఆతని యుత్సాహమే దానిని దెలుపుచున్నది. సహాయములేక రాఁజాలఁడని తోఁచెడిని. ఇంతలో నేదో సాయము చిక్కినది. కాననే యట్లు గర్జించుచున్నాఁడు. ఊరక యనిమాత్ర మూహింపరాదు. గొప్పసాయము దొరకినదని నాకెట్లు తెలిసినదో చెప్పెదను. బుద్ధిమంతుఁడు కాన నీతమ్ముఁడు తనకుఁ దోడుపడువానిఁ బరీక్షింపక యతని మాట నమ్మి రాఁడు. నీకంటె నధికుఁ డనునమ్మక మాతని యందుఁ గలుగుటంబట్టియే యతనివెంటవచ్చియుండు. ఇది

కేవలము నాయూహ కాదు. మన యంగదునిమూలమున వినియున్న దానను. నీహితముగోరి చెప్పెదను.

కుమారుఁ డంగదుఁడు విహారముకొఱ కడవికిం బోయి వచ్చెను. ఆప్తులవలనఁ దా విన్న మాటలఁ దెలిపెను. అయోధ్యాపాలకుఁడు దశరథుఁడు కలఁడు. ఆతనికుమారులు రామలక్ష్మణు లనువారు మహాశూరులు. దుర్జయులు. వారిసాయము సుగ్రీవునకుఁ గలిగినది. ఆరాముఁ డింతకుముందే విరాధాది దానవులం జంపినాఁడు.ఎల్లరకు నీడనిచ్చి తాపమును బోఁగొట్టు నివాసభూరుహమట్లు సాధువులకు గొప్పసాయము చేయువాఁడు. ఆపన్నులకు దిక్కు. ఆరాముఁడు లోకశాస్త్రజన్యజ్ఞానములుగలిగి జనకాజ్ఞను మీఱక సద్గుణరాశియై యొప్పువాఁడు. అట్టిరామునితోఁ బగగొనుట మన కర్హముకాదు. ఒక్కమాట విను. నీయం దేదే దోష మారోపింపఁ గోరుదానఁగాను. హితము నేఁ దెలుప దోషము నాపై నీవు మోపవలదు. నాహితము ననుసరింపుము. సుగ్రీవుని యావరాజ్యమున నిపుడే పట్టముగట్టుము. బలవంతుఁ డగుతమ్మునితోఁ బగవూనకుము. శ్రీరామునితోఁ జెలిమిచేయుటయు సుగ్రీవునితో వైరముమాని మైత్రి పాటించుటయు యుక్తములని నాకుఁ దోఁచెడిని. సోదరుఁడు లాలింపఁదగినవాఁడే కదా. అతఁడు ఋశ్యమూకమున నున్నను గిష్కింధ నున్నను బంధువే కదా. అన్యుఁడు కాఁడు. అతనికి మించినబంధు వీలోకమున వేఱొకఁడు నీకు లేఁడుకదా. ధనకనకాదు లొసఁగి గౌరవించి రెండవవానిగాఁజేసి చెంత సుగ్రీవు నుంచుకొనుము. తమ్మునితో స్నేహముచేయుటకంటె వేఱుగతి నీకు లేదు. నాకుఁ బ్రియము చేయఁ గోరుదువేని హితము నే నీకుఁ గోరుదానననని తెలి

యుదువేని నా వేఁడికోలు నంగీకరించి నాచెప్పినట్టు లొనరింపుము. రామునితోఁ బోరాటము నీకు నర్హము కాదు. అని తారపలుక మృత్యువశంగతుఁ డగువాలి కది రుచింపకుండెను.

మహాశయులారా! ఈభాగమునఁ గలవిశేషములఁ దెలిసికొందము.

"సతు రోషపరీతాంగో వాలీ సంధ్యాసమప్రభః,
ఉపరక్త ఇవాదిత్యస్సద్యో నిష్ప్రభతాం గతః." 3

అని మూలము. పరివేషమునకు నడుమనున్న సూర్యునివలె వాలి కాంతిహీనుఁ డయ్యెననుటంజేసి రాఁగల మహాపద సూచింపఁబడుచున్నది. భవిష్యదనర్థకసూచనలు తోఁపఁజేయు గుఱుతులు కనఁబడఁగాఁ బండితులు తన్నివారణోపాయము లాలోకింతురు. పామరులు వానిని లెక్కచేయక యూరకుండి వానికిం జిక్కుదురు. "ప్రాయ స్సమాపన్న విపత్తికాలే ధియో ఒపి పుంసాం మలినా భవంతి"అనున్యాయము ప్రసిద్ధమే కదా. అకారణముగాఁ గర్మములు ఫలముల నీయవు. ముందే హెచ్చరించును. వానిని బ్రాజ్ఞులు తెలిసికొందురు. ప్రతిక్రియలఁ జేయుదురు. అశక్యము లైనచో నవి దృఢమూలములని యెఱుంగుదురు. పామరు లవ్వానిం దెలిసికొనఁజాలక దైవపరులై ఫలానుభవకాలమున దుఃఖింతురు. కనుకఁ గర్మఫలములను బ్రతిక్రియలమూలమునఁ గొన్నింటిని దప్పించుకొనవచ్చును.

"అపి చేదసి పాపేభ్యస్సర్వేభ్యః పాపకృత్తమః,
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి. 3౬
యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున,

జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా. 32

న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే,

తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి." 3౮

అను నీగీతావాక్యములు పైనవ్రాసిన యాశయమునే సూచించును గదా. ప్రతికర్మమునకుఁ దగిన ప్రతిక్రియలఁ జేయవలయును. అవి దృఢమూలములైనఁ బ్రతిక్రియలమూలమున నశింపవు. అదృఢమూలములైన నశించునని యిందలిసారము.

"కాల్యమేతేన సంగ్రామం కరిష్యసి చ వానర,

వీర తే శత్రుబాహుళ్యం ఫల్గుతావా న విద్యతే." ౮

అని మూలము. ఈపూటమాని రేపుప్రాతఃకాలము తమ్మునితో సంగ్రామము చేయుము. వీరుఁడవగు నీకింతమాత్రమున లాఘవముగాని పగవానికి గౌరవముకాని లేదు. కనుక "సాధు క్రోధ మిమం వీర త్యజ" అని లోపలి కన్వయము. ఈపూట మాని రేపుప్రొద్దునఁ జేయుమనుటలోఁ గలభావమేమి? క్రోధము మనస్సున నిలువఁజాలదు. కానఁ గ్రోధము కలుగఁగనే కార్యమునకుఁ బూనక యాలసింపవలయును. నిద్రపట్టినచో నాకోప ముపశమించును. క్రోధ మంకురింపఁగనే గర్భగోళమునఁ గత్తులవంటి వేఁడికళలు బయలువెడలును. అవి దేహమంతయు వ్యాపించును. అవి యగ్నిజ్వాలలం బోలియుండును. కనుకనే క్రోధాగ్నిజ్వాలలని మనవా రుపయోగించిరి. దానికిఁ బ్రవృత్తి కలుగనీయక యాలసించిన నాకత్తులవంటివేఁడికళలు [illegible]ణించును. నిద్రపోయినయెడల నాకోపము నశించును. క్రోధవేగముకలవారలకు నిద్రపట్టదు. ఏల? క్రోధపావకజ్వాలలు ప్రత్యవయవమును గాల్చినట్లు

బాధించుటం జేసియే. దాని నుపశమింపఁజేయు మార్గమెట్లో కార్యమును జేయఁబూని దానియందలి యభిరుచిచేఁ గాలమ్ముం బుచ్చిన నాక్రోధాగ్నికీలలసంతాప మాఱును. కనుకనే పెద్దలు మిక్కిలి క్రోధమావేశింపఁగా స్నానము చేయమం దురు. స్వాధిష్ఠానచక్రమునందు దృష్టినిలిపి యోగము నభ్య సించువారల కీవిషయ మనుభవమునఁ దేటపడును. ఈవిషయ మునే శ్రీశంకరభగవత్పాదాచార్యులు

> "మహీం మూలాధారే కమపి మణిపూరే హుతవహం
> స్థితం స్వాధిష్ఠానే హృది మరుతమాకాశముపరి,
> మనోఽపి భ్రూమధ్యే సకలమపి భిత్వా కులపథం
> సహస్రారే పద్మే సహ రహసి పత్యా విహరసి."

అనుశ్లోకముచేఁ దెలిపిరి. "భగవత్యా కుండలిన్యా స్వయమధి ష్ఠాయగ్రంథికృత్వావస్థానం స్వాధిష్ఠానం:—.శ్లో. 'రుద్రగ్రంథి రయం శక్తిస్స్వాధిష్ఠానాగ్రసీమనీతి.' యోగదీపికాయాం." అని వ్యాఖ్య. ఆయుపాసనయు నందే యిట్లు చెప్పఁబడినది.—

> "తవ స్వాధిష్ఠానే హుతవహమధిష్ఠాయ నిరతం
> తమీడే సంవర్తం జనని మహతీం తాం చ సమయాం,
> యదాలోకే లోకాన్ దహసి మహసి క్రోధకలితే
> దయార్ద్రాయా దృష్టిశ్శిశిరముపచారం రచయతి."

"స్వాధిష్ఠాన మగ్నితత్త్వోత్పత్తిస్థానం తత్రోత్పన్న మగ్నిం సంవర్తాగ్నితయా ఆరోప్య తత్రైవ మహాసంవర్తాగ్నిజ్వాలాం శక్తిరూపతయా ఆరోప్య తత్రస్థితా శక్తిస్సంభావ్యా. ఇతి." ఇట్లు యోగశాస్త్రసారము పరమకారుణికు లాచార్యులు తేటపఱచిరి. ఈభావమునే రామాయణమునందు వాల్మీకి

మహర్షి తారావాక్యరూపముగా సంగ్రహించి తెలిపెను. రేపుదయము సంగర మొనరింపుమనుట వాలికోపోపశమ నార్థమే యని యిందలి సారము. ప్రాయికముగా నోడలేముఁ గని కోపము సంభవింపఁగా దాని నాపుకొనఁజాలనని తోఁచిన తఱి శీతోదకములఁ జాలసేపు స్నానము చేయవలయును. ఇష్టదేవతోపాసనారూపమున నద్దాని నించుక తగ్గించుకొన వలనుపడును. అట్టితఱుణమునఁ గార్యము దేనినిగాని చేయఁ బూనకయుండవలయు. కోపకారణ మెద్ది యగునో దానికి దూరముగానుండుట యంతకంటె నుత్తమకార్యము. ఇది పామరులకృత్యము. ఉపాసకుఁ డట్టి దుష్కర్మము నపుడు స్వాధిష్ఠానచక్రమున నిష్టదేవతను నెలకొలిపి ధ్యానించి తద్ద యార్ద్రదృష్టులు తనపైఁ బడుచున్నయట్లు తలంపవలయును. మఱుక్షణమునకే యాక్రోధానల సంతాపము చల్లారును. ఇట్టి మార్గములచేఁ గోపముం జల్లార్పవలయునే కాని తత్ప్రతీకార గవేషణమున దాని మానుపఁజూచుట తెలివితక్కువయే. ఆమార్గ మేనాఁటికి క్షేమకరము కానేరదని మనము దృఢ ముగా నమ్మవచ్చును. ఇదియే యీభాగమునుండి తేలెడు నీతి. వాలీ! నీవిప్పుడు సంగరమునకుం బోక నిలిచినంత మాత్రమున నీకు లాఘవముగాని సుగ్రీవునకు మర్యాదగాని కలుగదు. వాలి యోడుదునని యనికి రాలేదని యెవ్వ రనుకొనరు. సుగ్రీ వుఁడు వాలికంటె బలాఢ్యుఁడనియు ననుకొనరని తార తెలి పెను. ఉత్తమస్త్రీ గాన నాతార మంచిమార్గమున నతని కోప ముపశమింపఁ జేయఁజూచెనని మనమూహింపవలయును.

"రామః పరబలామర్దీ యుగాంతాగ్నిరివోత్థితః,
నివాసవృక్షస్సాధూనా మాపన్నానాం సదాగతిః. ౧౯

ఆర్తానాం సంశ్రయశ్చైవ యశసశ్చైకభాజనం,
జ్ఞానవిజ్ఞానసంపన్నో నిదేశే నిరతః పితుః." ౨౦

అని మూలము. పూర్వపుణ్యకర్మవశమునఁ దార భగవ ద్వార్త నాలకించెను. శ్రీరామభక్తిపరాయణురాలు కాఁబోవు చున్నది. కానఁ దనపతిం జంప వచ్చినాఁడని యెఱింగియు విను తించుచున్నది. పరులను దనకు ద్వేషులని కాదు. అట్టివారే లేరు. తన్ను ద్వేషించువారని యర్థము. పాపాత్ములంద అట్టి వారేకదా. వారిబలము నడంచువాఁడు. శత్రుసేనలఁ దునుము వాఁడనుట సామాన్యము. పరుల దుష్కర్మబలము నా మూల ముగ ఛేదించువాఁడని సారము. యుగాంతాగ్ని రివోత్థితః= ప్రళయకాలాగ్ని చెలరేఁగిన ట్లున్నవాఁడు. తన తేజస్సున నందఱు లోఁబడునట్లు చేయువాఁడని భావము. అన్నింటిని గాల్చువాఁడని కాదు. మహాతేజస్వియనియే యర్థము. సాధూ నాం నివాసవృక్షః= నీవే రక్షకుఁడవని తన్నుఁ జేరినవారలకు నిలువ నీడయిచ్చి పిదప క్షుత్పిపాసలు లేకయుండఁజేయు వాఁడు. అనఁగాఁ దాపత్రయము నిర్మూలించి యానందమును గలిగించువాఁడని యాశయము. "అశ్వత్థస్సర్వవృక్షాణామ్" అని గీతోక్తి కలదు కదా. అశ్వత్థము సర్వజనోపయోగి ఫల వృక్షము కాదే యందురు. కాని దానివాస్తవార్థమది కాదు. వృక్షములలో రావిచెట్టు పూజ్యము. బాధలనడంచి యిష్ట ఫలముల నొసంగునది. అంతియకాక. "మూలతో బ్రహ్మ రూపాయ మధ్యతో విష్ణురూపిణే, అగ్రతశ్శివరూపాయ వృక్ష రాజాయ తే నమః." అను సూక్తి ననుసరించి త్రిమూర్త్యాత్మ ము. అనఁగా భగవత్స్వరూపము. బ్రహ్మవిష్ణు మహేశ్వరులు

మూవురు భగవదంశములు కాని స్వతంత్రులు కారు. త్రిమూర్త్యాత్మకుఁ డద్వితీయుఁడగు పరమేశ్వరుఁడని భావము.

"చతుర్విధా భజంతే మాం జనాస్సుకృతినోఽర్జున,
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ. ౧౬
తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే,
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః." ౧౭

అని గీతోక్తి ననుసరించి సాధువులనఁగా జ్ఞానులు నన్నాశ్రయింతురు. వారియందుఁ బ్రీతి నాకు మెండుగ నుండును. అన్నయట్లు రాముఁడు భక్తులయం దత్యంత ప్రీతిగలవాఁడనుట. ఆపన్నానాం పరా గతిః = ఆపన్నులనఁగా నాపదల నొందినవారని యిట నర్థము. ఆర్తుఁడని గీతయందుఁ జెప్పిన వాఁడు వీఁడేయని గ్రహింపందగు. ఆపన్నులకుఁ బరమగతి. చక్కనిదారి చూపువాఁడు. అనఁగా నాయాపత్తులు తొలఁగు నుపాయముఁ దెలుపువాఁడు. ఆపదుద్ధారకుఁడని తాత్పర్యము. "ఆర్తానాం సంశ్రయస్థానం" సంసారభయమున దారి యెఱుంగనివారలకు నాశ్రయింపఁదగినచోటు. "సంసారపంకనిర్మగ్నసముద్ధరణపండితా" అను న్యాయము ననుసరించి యట్టి యాపత్తులను బోఁగొట్టువాఁ డనుట. పైనామము స్త్రీ విశేషణమని కొందఱందురు. పరదేవతయనఁగా భగవంతుఁడనియే యర్థము. స్త్రీపున్నపుంసకలింగ భేదము లాభగవంతుని యందు లేవని యెఱుంగవలయును. "యశసశ్చైకభాజనమ్." పౌరుషమున నార్జించునది యశస్సు. స్వతంత్రతకుఁ బ్రధానస్థానమని యర్థము. ఒరుల సాయ మక్కఱలేక యేకార్యము నైన క్షణమాత్రమున సాధించువాఁడని సారము. జ్ఞానవిజ్ఞాన సంపన్నః = లోకసంబంధిజ్ఞానము అలౌకిక నము పూర్ణము

గాఁ గలవాఁడని యర్థము. సర్వజ్ఞుఁడని సారము. అట్టివాఁ డేల సుగ్రీవునకు సాయముచేయవచ్చినాఁడని యడుగునేమో యని తెల్పుచున్నది. "నిదేశే నిరతః పితుః"=తండ్రియానతిపైఁ బ్రీతిగలవాఁడు. తండ్రియానతిమై నిటకు వచ్చెనని భావము. ఈమాటల సారమేమి? భగవత్సహాయము సుగ్రీవునకుఁ గలిగినది. నీకది కలుగలేదు. కాన నామాట విని నేఁడు మానుకొమ్మని యామె హితముఁ దెలిపెను. ఇట్టిగుణములు గలవాఁడు విష్ణువని అతఁడు వైష్ణవులనే ప్రేమించునని పలుకు మధ్యవైష్ణవులమాట లెంత తుచ్ఛములో యోజింపుఁడు. అట్టివాఁడు భగవంతుఁడే. సర్వసముఁడుకదా. ఒక్కజాతియందు నొక్కమతమునందుఁ బ్రీతిగలవాఁడు భగవంతుఁ డెట్టు లగును? అట్టివాఁ డెవఁడో తుచ్ఛుఁ డగును. మహాత్ముల కట్టి దురభిమానము లుండవని మన మెఱింగి యావంచకుల మాటలు త్రోసివేయుట మంచిది.

> "క్షమం న విరోధస్తే సహ తేన మహాత్మనా. ౨౨
> దుర్జయేనాప్రమేయేన రామేణ రణకర్మసు."

అని మూలము. "దుర్జయేన అప్రమేయేన మహాత్మనా రామేణ తే విరోధః న క్షమం." అని తార పలికెను. ఓడింపఁదరముకాక, ఇయత్తావచ్ఛిన్నపరిమాణరహితుఁడై మహాత్ముఁడై యొప్పు శ్రీరామునితో విరోధము నీకనర్హము. తనపతికి విరోధి యగు సుగ్రీవునకుఁ దోడ్పడువానిని బగవానిగా భావింపవలసి యుండఁగా నా తార యట్టి వానిని భగవంతునిగా నెఱుంగుట మహాభాగ్యము కదా. "భార్యా భర్తృహితే రతా" అన్నసూక్తి తారయందుఁ జక్కఁగా సమన్వయించుట యుక్తము కాదే.

"అహం హి తే క్షమం మన్యే తేన రామేణ సౌహృదం. ౨౪
సుగ్రీవేణ చ సంప్రీతిం వైరముత్సృజ్య దూరతః,
లాలనీయోహి తే భ్రాతా యవీయానేష వానరః. ౨౫
తత్ర వా సన్నిహస్థో వా సర్వథా బంధురేవ తే,
నహి తేన సమం బంధుం భువి పశ్యామి కంచన. ౨౬
దానమానాదిసత్కారైః కురుష్వ ప్రత్యనంతరం,
వైరమేతత్సముత్సృజ్య తవ పార్శ్వే స తిష్ఠతు." ౨౭

అని మూలము. తారాహితోపదేశరూపమున వాల్మీకి మనకు నీతి నుపదేశించుచున్నాఁడు. భగవంతునియందు సౌహృదము గల్గియుండవలయును. సౌహృదమనఁగా నిట స్నేహమర్థము కాదు. మంచిహృదయము గల్గియుండఁదగును. అనఁగా నిర్మలముగా బుద్ధియుండునపుడెల్ల నితరులఁ దలంపక భగవంతునే తలంపవలయు ననియే భావము. ఏలయనఁగా

"ఇంద్రియాణి పరాణ్యాహురింద్రియేభ్యః పరం మనః,
మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః. ౪౨
ఏవం బుద్ధేః పరం బుధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా,
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదం." ౪౩
గీ. 3-అధ్యా.

అను శ్రీకృష్ణోపదేశముచొప్పున బుద్ధికి సమీపమునందువాఁడు. అనఁగా బుద్ధిని జక్కఁగా భగవంతునియందు లయింపఁజేయవలయు నని యర్థము. దానికి ఫలమేమి? "దురాసదం కామరూపం శత్రుం జహి" = కామవిముక్తియే. అది వేఱుసాధనమునఁగాదు. ఈయర్థమే రామాయణమునఁ గనఁబడుచున్నది కదా. ప్రాయికముగా నర్థాదులచేతఁ జుట్టములగువా రనేకు

లుందురు. జన్మముచేత బంధువులగువారు సోదరులే. సోదర ప్రీతి ముఖ్యమని కదా శ్రీరాముని భావము. అది ముందు మనకు శ్రీరాముని మాటలవలననే తేటపడఁగలదు. సోదరునితోఁ బగమాని యతనిని సమానునిగా భావించి గౌరవించి నీపార్శ్వమున నుంచుకొనినఁ గాని నీకు మేలులేదని తార హితముపదేశించెను. దీని సారమేమన, సోదరుని ద్వేషించుట యనఁగాఁ దన్నుఁ దా ద్వేషించుట యని కదా యర్థము. విరోధమున కంటె నపకారము చేయునదెద్దియు లోకమునలేదు. అదియే మనోనైర్మల్యమును బాడుచేయునది. కాన దానిని దొలఁగించుకొనవలయును. అది వలనుపడదే నాతఁడేపురుషార్థమును సాధింపఁజాలఁడు. కనుక భగవంతునిపై బుద్ధినిలిపి విరోధము నెవ్వరిపైనఁగాని నిలుపక యెవఁడుండునో యతఁడు ముక్తుఁడనియే యిటఁగల సారము.

"న రోచతే తద్వచనం హి తస్య కాలాభిపన్నస్య వినాశకాలే."

అని మూలము. తారపలికిన హితమాతని కపుడు రుచింపలేదు. వినాశకాలము సమీపించిన కారణమున నని రామాయణము తెలుపుచున్నది. "ప్రాయస్సమాపన్నవిపత్తికాలే ధియోఽపి పుంసాం మలినా భవంతి" అన్న ప్రాచీనసూక్తి ప్రసిద్ధమే కదా. ఇట్టి సూక్తులకు నాధారము శ్రీరామాయణమే యని యూహింపవలసియుండును. అధ్యాత్మరామాయణమునం దీ విషయమున విశేషమేదియు లేదు.

## వాలి శ్రీరామబాణమునకు లక్ష్యమగుట.

*తార యిట్లు హితము తెలుపఁగా వాలి యామె నద

* ఇది పదునాఱవసర్గమునఁ గలదు.

లించి యిట్లనియె. వరాననా! పగవాఁడు గర్జించుచున్నాఁడు. సోదరుఁడై శత్రుత్వమూని యతఁడు సింహనాదము చేయు చుండ దాని విని యూరకుండుటెట్లు? భీరువవుగాన నీకుఁ దెలియదు. అపజయ మెఱుఁగక యని మొన వెనుదీయని శూరులకు నెవ్వరేఁ దిరస్కరించిన దాని నోర్చుటకంటెఁ జావు మేలు. నేను యుద్ధాసక్తుఁడను. సుగ్రీవుని పిలుపునకుఁ దాళి యుండఁగలనా? రాముని మూలమున నాకు బాధగలుగునని నీవు భయంపడవలదు. రాముఁడు ధర్మజ్ఞుఁడు. ఎవ్వఁడెద్ది చేసిన నెఱుంగువాఁడు. కాన నేయపరాధము చేయనినన్ను వధించు నంత పాపమెట్లు చేయఁగలఁడు? స్త్రీలంగూడి మరలిపొమ్ము. మరల నన్నేల వెంబడించెదవు? నాయందలి ప్రీతిని గనఁబఱ చితివి. భక్తియుఁ బ్రకటించితివి. ఇదియ చాలును. నేను సుగ్రీ వునితో నని చేసెదను. త్వరపడకుము. క్రొవ్వడఁగింతును గాని చంపను జుమీ. ఆమహాసంగ్రామమునఁ బ్రాణములను గాచుట శక్యమాయని సందియమందకుము. ప్రాణములు తీయకుండు టయే మన యభిమతము. నాతో వాఁడు పోరాడినను జంపక యుండఁ గావఁగలను. నాదెబ్బలకు వాఁ డులికి మరలి పోవఁ గలఁడు. నన్నోర్వఁజాలఁడు. తారా! నీకుఁ దెలిసినది చెప్పి తోడుపడితివి. నాప్రాణములపై నొట్టుపెట్టుచున్నాను. గెలు చునట్లు మంచిమాటలాడి మరలుము. వాని గెలిచివచ్చెదను.

అని వాలిపలుక మోమోటమికలదు కావున బదులు పలుకఁజాలక పతిఁ గౌఁగిలించుకొని యమంగళముగదా యను భయమున నించుకగ రోదనము చేయుచుఁ బ్రదక్షిణము గా వించి పతికి స్వస్త్యయనము గలుగవలయునని పౌరాణికోక్తిని స్వస్త్యయన మొనర్చి వగపెల్లున నించుకయుఁ దోఁపమి స్త్రీలం

గూడి యంతిపురికరిగెను. పిమ్మట వాలి వారు భయపడుదురని కోపమును దగ్గించికొనియున్నవాఁడు గావున వారంతిపురికరుగఁగా రోషము పెల్లుగనడర నగరము వెడలెను. పగవానికొఱకు నాలుగుప్రక్కలకుఁ జూడ్కి నిగుడించెను. యుద్ధమునకు సిద్ధముగానుండు సుగ్రీవుఁడతని కంటఁబడెను. తానును నడుమున వస్త్రము బిగించుకొని పిడికిలిపట్టుకొని తమ్మునిపైకి నడచెను. అతఁడు నట్లే యురవడించెను. దానికిఁ గోపము రెట్టింప వాలి యిదిగో యీ పిడికిలిం జూడుము. దీని పోటునకుఁ బ్రాణములు పోఁగలవు. అనఁగా సుగ్రీవుఁ డీనాపిడికిటిపోటు నీ నెత్తిమీఁదఁబడి ప్రాణములఁదీయఁగలదు. అనుచుండ వాలి తమ్మునిఁ బిడికిటఁబొడిచెను. దాన రక్తము ప్రవహింపఁగా నిర్భరకోపమున సుగ్రీవుఁడు సమూలముగ నొకసాలవృక్షమును బెకలించి దానఁ గొట్టెను. దాన నతఁడు చలించెను. ఆ వాలి సుగ్రీవులు పున్నమనాఁటి చంద్రసూర్యులవలె నురవడించుచుఁ బరస్పరరంధ్రాన్వేషణతత్పరులుగ నుండిరి. క్రమముగా వాలి బలము హెచ్చసాగెను. సుగ్రీవుని బలము తగ్గసాగెను. బలము తగ్గిన నమర్షమున సుగ్రీవుఁడు పోరుచుండెను. వారి యప్పటిపోరు ఘోరముగ నుండెను.

శ్రీరాముఁ డత్తఱి బలముఱుఁ గణింపఁగాఁ దనగతి తెలియఁజేయ నలుప్రక్కలను జూచుచున్న సుగ్రీవుని గాంచెను. ఆతఁ డార్తుఁడని యెఱింగి వాలివధమున కనువగుబాణమేది యని యాలోచించుకొనియెను. మహావిషసర్పముంబోలిన బాణమును వింట సంధించి యముఁడు కాలచక్రముం బోలె నాకర్ణాంతముగ నాకర్షింపఁగా దాని ధ్వనికి వృక్షములు మృగములు ప్రళయకాలమునందుంబోలె భీతిల్లి యేమియుం దోఁపక

నలుదెసలకుం బాతెను. దానిని శ్రీరాముఁడు వదలగనే వజ్రముంబోలె ధ్వనిచేయుచుఁ బోయి వాలి యురస్థ్సలమున నాటుకొనెను. మహాతేజస్వియగు వాలి దాని స్పర్శమునఁ గాంతిపాయ క్షతిచెడ ఆశ్వయుజమాసమునందుఁ బున్నమ నాఁటియుత్సవాంతమున నేలఁద్రోయంబడు నింద్రధ్వజమువలె నాతఁడు పడియెను. ప్రళయముతటి రుద్రుఁడు పొగలతోఁగూడి రగులు నగ్నిని గ్రక్కునట్లు శ్రీరాముఁడు యుగాంతమృత్యు తుల్యమైన యాక్రూరనారాచమును వాలిపయిం బ్రయోగిం చెను. వాలిదేహము రక్తమునఁ దడువఁగా రక్తపూరమున మునిఁగి యెఱుకలేక పూచినయశోకవృక్షము గాలిచేఁ గూలు నట్లు భూమిపై వ్రాలెను.

మహాశయులారా! ఈభాగమును జక్కఁగా విమర్శింప వలయును.

"అధర్షితానాం శూరాణాం సమరేష్వనివర్తినాం,
ధర్షణామర్షణం భీరు మరణాదతిరిచ్యతే. 3
సోఢుం న చ సమర్థో౾హం యుద్ధకామస్య సంయుగే,
సుగ్రీవస్య చ సంరంభం హీనగ్రీవస్య గర్జతః. ౪
న చ కార్యో విషాదస్తే రాఘవం ప్రతి మత్కృతే,
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ కథం పాపం కరిష్యతి." ౫

అని మూలము. వాలిమాటలివి. మర్యాదయే ప్రధానము గాని బ్రదుకు ప్రధానముకాదు. తిరస్కరింపఁబడి యోర్చు కొనుటకంటె మరణము మంచిది. అల్పుఁడు తిరస్కరించు చుండఁగా నోర్చుకొనుట శూరలక్షణము కాదు. అని వాలి తెలిపెను. ఈధర్మము సర్వజన ప్రతిపాదితము కాదు.

"బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ పరంతప,
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః. ౪౧
స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మనిరతస్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు. ౪౫
యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతం,
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః." ౪౬
గీత. ౧౮-అధ్యా.

అనుగీతావాక్యముల ననుసరించి యొక్కొక్కజాతికి వేఱువేఱు ధర్మము లేర్పఱుపఁబడినవి. అన్ని జాతుల వారి యూహ లొక్కరీతిగా నుండవు. ఏలయనఁగా వారివారి కర్మములు వేఱుగానుండును. వాని కనుగుణముగా ఫలానుభవముండును. దాని ననుసరించి యూహాలుండును. కావున జాతుల కన్నింటికి నుచితములగు ధర్మములు విధింపఁబడియే యున్నవి. వానిని మాన వలనుపడదు. జాతిభేదములే పనికిరావనువారి యూహ లెంత నిస్సారములో చెప్పవలయునా? సర్వజాతు లొక్కరీతిగా నుందురనుటకన్నఁ దెలివితక్కువ వేఱొకటి గానరాదు. వారివారి కర్మముల ననుసరించి వారి యూహాలు సాగునుగాని యొక్కరీతిగా నుండఁగలవా? అందఱ కొక్కజాతి. ఒక్కధర్మమే యనువారికి లోకజ్ఞానమే శూన్య మన వలయును. శత్రుకృత తిరస్కారము నోర్చుట బ్రాహ్మణ జాతి ధర్మము కాని క్షత్రియధర్మమది కాదు. కాన వాలి పల్కినది క్షత్రియోచితధర్మము. కనుక మనకీభాగము జాతిభేదములను లక్ష్యలక్షణపురస్సరముగాఁ దెలుపుచున్నది. తారా! నా కొక్కకీడు శ్రీరాముని మూలమునఁ గలుగునని విచారింపకుము. శ్రీరాముఁడు ధర్మవేత్త. చేసిన మేలు మఱువనివాఁడు.

కావున నట్టి మహాత్ముఁడు పాపకార్య మొక్కఁడానిం జేయఁడు. అనఁగా సుగ్రీవుని మేలుమఱువఁడు. ధర్మవిరుద్ధముగా నేపనిని జేయఁడు. విచార ముడుగుమనఁగా భావమేమి? ధర్మముగాఁ జేయఁదగినదానిని జేయునప్పుడది మనకుఁ గీడు గల్గించినను విచారింపరాదు. ధర్మరక్షకుఁడు కదా రామమూర్తి. అనువాక్కులు వాలినోటఁ గర్తానురూపముగా వెడలెనని మన మెఱుంగవలయును. నా కపకారము చేసిన నయ్యది యుపకారమే యగుననుభావ మిందు సూచింపఁబడినది.

"నివర్తస్వ సహ స్త్రీభిః కథం భూయోనుగచ్ఛసి,
సౌహృదం దర్శితం తారే మయి భక్తిః కృతా త్వయా. ౬
ప్రతియోత్స్యామ్యహం గత్వా సుగ్రీవం జహి సంభ్రమం,
దర్పమాత్రం వినేష్యామి న చ ప్రాణై ర్విమోక్ష్యతే. ౭
అహం హ్యాజిస్థితస్యాస్య కరిష్యామి యథేప్సితం,
వృక్షైర్ముష్టిప్రహారైశ్చ పీడితః ప్రతియాస్యతి. ౮
న మే గర్వితమాయస్తం సహిష్యతి దురాత్మవాన్,
కృతం తారే సహాయత్వం సౌహృదం దర్శితం మయి. ౯
శాపితాసి మమ ప్రాణై ర్నివర్తస్వ జయేన చ,
అహం జిత్వా నివర్తిష్యే తమహం భ్రాతరం రణే." ౧౦

అని మూలము. తారా! స్నేహము భక్తిని గనఁబఱచితివి. ఇఁక మరలిపొమ్ము. అనఁగా వారి హృదయమేమి? నీవు చేయఁదగు పని నొనరించితివి. దాన లాభము లేదు. మరలి పొమ్ము. అనఁగా నీసౌహృదము భక్తియు నా కుపకరింపఁ జాలవు. వేఱొకరి కుపకరింపఁగలవను భావము ధ్వనించుచున్నది. సుగ్రీవుని మార్గ్గాని రణము చేయుదును. వాని

పొగరడఁతును. ప్రాణములఁదీయను. అని వాలి పలికెను. ప్రాణములను దీయకుండుటకుం గారణ మూహింపఁదగును. తారచూపిన భక్తిస్నేహములకుఁ బ్రతిఫలముగా నీ వాగ్దానము వాలి చేసెను. భావికర్మఫలమువలన నతని కంతయే తోఁచెను. చంపుదునన్నమాట వెడలకపోయెను. దీనింబట్టి చూడఁగా మానవుల యూహలు భావికర్మము ననుసరించి కలుగుననియే తోఁచెడిని. కర్మమును వదలి యెవ్వరుఁ బ్రవర్తింపఁజాలరని యీ భాగము తెలుపుచున్నది. వాలిభావ మిదియేయని యీ క్రిందిమూలము తెలుపుచున్నది. ప్రాణములపై నొట్టుపెట్టి తెలుపుచున్నాను. మేలుగలుగఁబలికి మరలి పొమ్ము. సుగ్రీవు నోడించి మరలుదును. అనఁగా మరలివచ్చి నిన్ను సంతోషపఱతునని పలుకఁజాలక పోయెను. సుగ్రీవు నోడింతును. మరలుదును. కిష్కింధకుఁగాదు. అనుభావము ధ్వనించెడిని. దీని సారమేమి? మానవుఁడు తన కర్మవశమునఁ దాననుభవింపఁబోవు ఫలముల కనుగుణముగాఁ బలుకుచుండును. కర్మపాశము లదృశ్యాకారములుగానుండి యాతని బంధించును. వానికి లోఁబడియుండును. కాని యించుకంతయు స్వాతంత్ర్యము నొందఁజాలఁడు. అనుభావమును మన మెఱింగి యొరులు నిందించిన నపుడది స్వకర్మఫలమనియే తలంపవలయును.

"తం తు తారా పరిష్వజ్య వాలినం ప్రియవాదినం,
చకార రుదతీ మందం దక్షిణా సా ప్రదక్షిణం. ౧౧
తతస్స్వస్త్యయనం కృత్వా మంత్రవద్విజయైషిణీ,
అంతఃపురం సహ స్త్రీభిః ప్రవిష్టా శోకమోహితా." ౧౨

అని మూలము. "మంత్రశ్చ వైదికాదన్య ఇతిజ్ఞేయః." అని గోవిందరాజులు. ద్విజేతరులకు వేదాధికారము లేదను న్యాయము ననుసరించి యిట్లు వ్రాసిరని తోఁచెడిని. తార తెలివి తేటలు గలది. కానఁ బతియత్నము విపరీతఫలదమని యెఱింగి సాధ్వీగాన నంతకంటె యుక్తముగాఁ బలుక వలనుపడమి నిం చుక యేడ్చెను. ఏలయనఁగా మరలి పతిరాఁగలఁడన్న యూహ లేకయే. ఐనను మానవప్రయత్న మెట్లు మాఱునో యను సంశయమున విలాప మశుభసూచనమని యెఱింగి కన్నీరు వదలెను. వలగొనియెను. మంత్రయుక్తముగా స్వస్త్యయ నము గావించెను. స్త్రీలతో నంతఃపురమును శోకవిహ్వలయై ప్రవేశించెను. మంత్రములు రెండువిధములు. నిగమప్రతిపాది తములు. ఆగమప్రతిపాదితములని వానిభేదములు. నిగమ ములు పారాయణార్హములు. ఆగమము లుపాసనార్హములు. నిగమమంత్రములు పరబ్రహ్మమువంటివి. నిరంగములని య ర్థము. ఆగమములనఁగా, నిగమమునుండియే గ్రహించి దాని నుపాసింప ననువగునట్లులనఁగా నిరాకృతియగు భగవంతున కా కృతిని గల్పించినట్లుచేసి ధ్యానించి దానిని శిష్యులకు బోధించి మహర్షులు కృతార్థులైరి. కనుక నవియు మంత్రము లనఁబడియె నని భావము. "మననాత్త్రాయత ఇతి మంత్ర"మ్మనువ్యుత్పత్తి ననుసరించి జపముచేయ నర్హమైనదని యర్థము. ఇవియే ఋషిచ్ఛందః ప్రభృతులు గలిగి మంత్రములనఁబడుచు లోక మునఁ బ్రసిద్ధిగాంచునవి. అట్టి శాంతికరమంత్రముల నాతనికి మేలుగలుగఁగోరి నుచ్చరించెనని భావము. ఈభాగమున భాషాంతరము నొనరించినవారి పోలికలఁ గనుఁగొందము. పై రెండు శ్లోకములకు

క. "అన విని ప్రియవాదిని యా
వనితామణి తార యంత • స్వపరవిషయమం
దున మోమోటము గలదియె
గనుకన్ బదులేమిపల్కకయె ప్రాణేశున్.

క. తనివారఁగ నాలింగన
మును జేసికొనుచును మందముగ నేడ్చుచు నా
తనికిఁ బ్రదక్షిణ మొనరిచి
తనవిభునకు స్వస్త్యయనము • తగఁ గలుగుటకై.

క. తనకున్ వచింపఁదగు మం
త్రనికరమున జయముగోరి • తద్దయుఁ బూనిక్కన్
బని దాని నొనర్చుచు వగ
పున నేమియుఁ దోఁప కేడుపున నంతిపురిన్.

క. తరుణులతోఁ జొచ్చెను...;"

అని నారచించిన యాంధ్ర శ్రీమద్రామాయణము.

ఉ. "...భామిని పొమ్ము జయంబుగోరి; నా
జాణ ప్రదక్షిణించియు భృశవ్యథఁ గొఁగిటఁ గ్రుచ్చి ప్రోదినీ
పాణిజు మంత్రవంతముగ • స్వస్త్యయనంబు ఘటించి స్త్రీలతోన్.

తే. అంతిపురమునకరిగె నా • యంబుజాక్షి
యీరెలుంగున నేడ్చుచుఁ • దార యిట్లు."

అని వావిలికొలను రామాయణము.

ఇందలి విషయములు పండితులే యెఱుంగఁగలరు. ఎవరికెట్టు లిష్టమో యట్లు వ్రాయుదు రనుదానిని శిరసావహింపందగు. విమర్శకులు నారామాయణమునఁగల "బ్రాహ్మణౌఘనముచి సూదనుఁడు" విప్రేంద్రుఁడని యర్థము. ఈప్రయోగమును

బరిహసించిరి. వారు మెచ్చుకొనిన రామాయణమునందుఁగల "ప్రాదినీపాణిజుఙ్" = వాలిని. అనుదానిని జూడలేదు కాఁబోలు. డొంకతిరుగుడు పద మిది కాదని వారి భావము కాఁబోలు. ఈవిషయమును బండితులకుఁ దెలుపుటకే యీ పద్యముల నుదహరించితి. నాపద్యములు మూలార్థమును బోషింపఁజాలవనిరి. ఆవిషయమును బండితులు పరిశీలింతురు గాక. "శోకమోహితా తారా స్త్రీభిస్సహాంతఃపురం ప్రవిష్టా" అను మూలము ననుసరించి యోజింపఁగా శ్రీరాముని బాణిఁబడి వాలి బ్రదికివచ్చుట దుర్లభమని తలంచి శోకాతిరేకమున నోడలెఱుంగక యెట్లో యంతిపురిం బ్రవేశించెనని తోఁచెడిని.

"వాలినా భగ్నదర్పస్తు సుగ్రీవో మందవిక్రమః. ౨౭
వాలినం ప్రతి సామర్షో దర్శయామాస లాఘవం,

... ... ... ... ...

హీయమానమథో పశ్యత్సుగ్రీవం వానరేశ్వరం,
వీక్షమాణం దిశశ్చైవ రాఘవస్య ముహుర్ముహుః. ౩౦.
తతో రామో మహాతేజా ఆర్తం దృష్ట్వా హరీశ్వరం,
శరం చ వీక్షతే వీరో వాలినో వధకారణాత్." ౩౨

అని మూలము. బలదర్పము లుడిగినను వాలివలని యమర్షమున లాఘవము గనఁబఱచి పోరాడెను. కాని బలము సన్నగిల్లుచు రాఁగాఁ దన్నుఁ గాచువా రెందున్నారో యని దిక్కులు చూడసాగెను. అట్టివానిని శ్రీరాముఁడు పలుసారులు చూచెను. వాలిని జంపఁదగు బాణమెద్దియని యోజించెను. ఇందు సుగ్రీవుఁ డార్తుఁడా యనుదానిం బరా్య

లోచింతము. దైవికముగాఁ గష్టము లలముకొన్నవాఁ డార్తుఁడనఁబడును. వలయునని సాయము చేయువారింగూడి యుద్ధమునకుఁ బోయినవాఁ డార్తుఁడు కాఁడు. ఆర్తత్రాణ పరాయణత్వ మీవిషయమున సార్థకము కాదు. అని కొందఱం దురు. సుగ్రీవుఁ డీనాఁ డార్తుఁడు కాలేదు. చాలకాలము నుండి యార్తుఁడే. రాజ్యము పోఁగొట్టుకొనుట విపత్తు కాదు. ఈతనికి రాజ్యము లేనే లేదు. అంగదునకే యది రాఁదగును. రాజ్యభోగముల ననుభవించుట వదలిపోయెను. మీఁదు మిక్కిలి భార్య వాలిచే నపహృతయయ్యెను. తా వెడలఁగొట్టఁ బడియెను. ఇందు సుగ్రీవుఁ డార్తుఁడు కాఁడని చెప్పఁదగు కారణములే లేవు. కావున నార్తత్రాణపరాయణత్వము శ్రీ రామునకు నుండుట సహజమే. ధర్మేతరముగా రాజ్యమును బాలించువారిని రూపుమాపుటకే భగవంతుఁ డవతరించెను. కావున నిందు నిందింపఁదగు చరిత్ర మావంతయుఁ గానరాదు.

> "తతో ధనుషి సంధాయ శరమాశీవిషోపమం,
> పూరయామాస తచ్చాపం కాలచక్రమివాంతకః. 33
> తస్య జ్యాతలఘోషేణ త్రస్తాః పత్త్రరథేశ్వరాః,
> ప్రదుద్రువుర్మృగాశ్చైవ యుగాంత ఇవ మోహితాః. 34
> ముక్తస్తు వజ్రనిర్ఘోషః ప్రదీప్తాశనిసన్నిభః,
> రాఘవేణ మహాబాణో వాలివక్షసి పాతితః." 35

అని మూలము. యముఁడు కాలచక్రముంబలె రాముఁడు కాలసర్పముంబోని బాణమును సంధించెను. అనుటచే నా బాణమునకు మాఱులేదని తాత్పర్యము తేలెడిని. ఇపుడు రాముఁడే యముఁడని కదా యర్థమగును. అనఁగా నా

సౌమ్యరూపమునందుఁ గ్రోధమంకురింపఁగాఁ దీవ్రరూపముగ మాఱెనని భావము. భగవంతుఁడే జగత్సంహారమునకు సంకల్పింప నాయా యధికారమును స్వీకరించినవారెల్లఁ దత్కార్యమందుఁ బరాయణత్వమును వహింతురని తేలెడిని. సర్వకారణుఁ డొక్కఁడేకాని యెందఱో కారనియే సారము. బ్రహ్మవిష్ణురుద్రేంద్రయమాదులందఱు ప్రకృతిని దాల్చిన పరమేశ్వరాజ్ఞవలన నాయాకార్యము లొనరింతురని మనము గ్రహింపవలసియుండును.

"ఆదావభూచ్ఛతధృతీ రజసాస్యసర్గే
విష్ణుస్థితౌ క్రతుపతిర్ద్విజధర్మసేతుః,
రుద్రోప్యయాయ తమసా పురుషస్స ఆద్య
ఇత్యుద్భవస్థితిలయాస్సతతం ప్రజాసు." ౫.

శ్రీ భా. ౧౧-స్కం. ४-అధ్యా.

"యోఽసృజద్దక్షిణాదంగాద్బ్రహ్మాణం లోకసంభవం,
వామపార్శ్వాత్తథా విష్ణుం లోకరక్షార్థ మీశ్వరం,
యుగాంతే చైవ సంప్రాప్తే రుద్రమీశోఽసృజత్ప్రభుః." ३౫.

శ్రీమహాభారతము. అనుశాసనికప. ౧४-అధ్యాయము.

"అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః,
అహమాదిశ్చ మధ్యంచ భూతానామంత ఏవచ. ౨౦.

... ... ... ... ...

ఆదిత్యానామహం విష్ణుః. రుద్రాణాం శంకరశ్చాస్మి.
రామశ్శస్త్రభృతామహం. వృష్ణీనాం వాసుదేవోఽస్మి.
యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున,
న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరం." ३౯

గీత. ౧౦-అధ్యాయము.

అనునీ ప్రమాణములంబట్టి యూహింపఁగాఁ బ్రకృతి సర్వసృష్టి స్థితిసంహారకర్త్రియనియు, నదియే భగవంతునిచ్ఛాశక్తియనఁ బడుననియు నొక్క భగవంతునిచ్ఛామాత్రమున సర్వము నా పరదేవతయే యొనరించుననియు బ్రహ్మవిష్ణురుద్రాదు లస్వతంత్రులనియు నామాయికార్యములకై నియమింపఁబడి తదాజ్ఞల శిరములందాల్చి చేయుదురనియుఁ దేలుచున్నది. ఈకాలమునఁగల రాక్షససంహారార్థ మాభగవంతుఁడు ప్రకృతి సీతగా నవతరింపఁ దా రాముఁడుగా నవతరించెననియు, వాలి సంహారమున శ్రీరాముఁడు తన సౌమ్యరూపమును భయదముగాఁ గనఁబడఁజేసెననియు మనము గ్రహింపవల యును. వాలి కర్మమే యతనిఁ బురికొల్పి శ్రీరాముని నిమిత్త మాత్రముగా నునిచి బాణము వైచునట్లు చేసెనను విషయ మును మన మెఱుఁగవలయును. స్వస్వకర్మానురూపఫలముల ననుభవించుచుండఁగా నిమిత్త మొకదానిం గల్పింతుము. ఆ నిమిత్తమును దూషింతుము. ఇదియే పామరులమగు మనకుం గల యవివేకము. కర్మసిద్ధాంతము నెఱింగినయెడల నీమౌ ఢ్యము తొలంగిపోవును.

శ్రీరాముఁ డొనరించిన యాధనుర్ఘోషమునకుఁ బక్షులు భీతిల్లినవి, మృగములు పాఱిపోయెను. ఆబాణమును వాలి వక్షమును లక్ష్యముచేసి వైచెను. అది యతని వక్షమును భేదించెను. అనుచో నొక్కసందియ ముదయింపకపోదు. ఆ ధ్వని వాలికి వినఁబడియుండదా. ఏమిది యని యతఁడు చూచి యుండఁడా. ఏమి యీ యన్యాయమని యడుగఁడా. అని. ఈసందియము కేవల పామరులకుంగల్గఁ దగినది. ఇది యొక వర్ణ నము. ధ్వని యడఁగిన పిదప బాణమును వైవరు. రెండు

నొక్కసారియే సాగును. తఱచుగాఁ గవుల కిది సహజము. దీనిని మించున ట్లొకయాంధ్రకవి

క. "అగురుపొగవాసనన్నృ
వగలాడికిఁ గురులు చాల • బరువైతోఁచెన్."

అని చెప్పినాఁడు. రామాయణము కావ్యముగాన నిట్టి యద్భుతాతిశయోక్తు లందందుఁ గానఁబడఁజేయును. అది యొక లోపముగా మన మాక్షేపింపరాదు.

"తతస్తేన మహాతేజా వీర్యోత్సిక్తః కపీశ్వరః,
వేగేనాభిహతో వాలీ నిపపాత మహీతలే. ౩౬

... ... ... ... ...

అధోక్షితశ్శోణితతోయవిస్రవైస్సుపుష్పితాశోక ఇవానిలోద్ధతః,
విచేతనో వాసవసూనురాహవే విభ్రంశితేంద్రధ్వజవత్క్షితింగతః." ౩౯

అని మూలము. బాణము సోఁకఁగా వాలి పడియెను. రక్తధారలు స్రవించుచుండఁగా భూమిపైఁ బడియెను. చక్కఁగాఁ బూచిన యశోకము గాలిచేఁ గొట్టఁబడినట్లు వాలి బాణవేగమునఁ గొట్టఁబడి భూమిం ద్రెళ్లెను. అనుటంజేసి యొక విషయ మూహింపఁబడును. అశోకము పుష్పించుట యనఁగా జన్మఫలము ననుభవించెనని భావము. అట్లే వాలి జన్మించి నందులకుఁ దగినకర్మఫలముల ననుభవించి పతనసమయమునకు నాకస్మికముగాఁ బెనుగాలి వీవఁగాఁ బడినట్లు రామబాణమునఁ బడియెను. అశోకవృక్షముమీఁద గాలికిఁ గోపము కలదా. అది నైజముగా వీచును. పడనున్నవి పడిపోవును. అట్లే రామునకు వాలిపై నాగ్రహము లేదనియు నతని యాయురంతమునకుఁ దానొక కారణము మాత్రమే యయ్యె

ననియు మన మూహింపందగును. దీనిచేఁ గర్మము సర్వకార్యములఁ జేయించుననని సారము. ఈభాగమున నధ్యాత్మరామాయణమున విశేషములు లేవు.

## వాలి శ్రీరాము నాక్షేపించుట.

*రణధర్మవేత్తయగు వాలి యంత నేలఁ గూలి యవయవములు పుడమిని దాఁకుచుండఁగాఁ జంద్రుఁడు లేని యాకాశమువలె వెలుంగుచుండెను కాని యాతనితనువును గాంతి ప్రాణప్రతాపము లించుకంతయు వదలక యుండెను. వజ్రాలంకృతము నింద్రదత్తమునగు కాంచనమాలిక యతని దేహమునఁ బ్రాణతేజశ్శకాంతుల నిల్పియుంచెను. ఆయస్త్రము తనచే మృతినొందువారలకు స్వర్గమార్గము గల్గించునది. కాని శ్రీరామధనుఃప్రయుక్తమగుటంజేసి మరలిరాని యుత్తమ గతిని గల్పించెను. అత్తఱి జ్వాలలుడిగిన యగ్నివలె నొప్పుచు బాణప్రయోగచమత్కృతిని బొగడి తత్ప్రయోక్త యెందున్నాఁడని తెలియంగోరి వాలి మిక్కిలి బాధనొందుచు మెల్లగా దృష్టి నిగుడించుచుఁ బుణ్యము క్షీణింపఁగా దేవలోకమునుండి భూమింబడిన యయాతివలె, విలయమున దైవముచే భూమికిఁ ద్రోయఁబడిన సూర్యునిచందమున నుండుచు మహాపురుష లక్షణములఁ బ్రకాశించు రాముని జూడఁ గోరు నంతలో శ్రీరాముఁడు లక్ష్మణుని గూడి యతనికడ కరిగెను. వాలియు వారిని గాంచి వినయమొప్పఁ బరుషముగ ధర్మసమ్మతముగా నిట్లు పలికెను. శ్రీరామా! మహారాజకుమారుఁడవు. సుప్రసిద్ధుఁడవు. శాస్త్రప్రియుఁడవు. ఉత్తమకులజనితుఁడవు,

* ఇది పదునేడవసర్గమునఁ గలదు.

బలశాలివి. మహాతేజుఁడవు. సువ్రతములఁ బెక్కింటి నాచరించితివి. నీతోఁ బోరాడక వేఱొకరితో యుద్ధము చేయుచుండఁగా నాహృదయమును బాణమున భేదించితివి. ఇద్దాన నీకేమి గొప్పతనము వచ్చినది. రాముఁడు కరుణ నెఱుఁగును. ప్రజాహితతత్పరుఁడు. ఉత్సాహమును జయించినవాఁడు. పెద్దల యాచారముల నెఱుంగును. శ్రద్ధగా వ్రతముల నాచరించును. అని భూలోకమున నీకీర్తిని భూతజాలమెల్లఁ గీర్తించుచున్నది. రాజా! జితేంద్రియత్వము, చిత్తప్రశాంతి, సహనము, ధైర్యసత్యపరాక్రమములు, అపరాధులవిషయమున దండనము ననునివి రాజులగుణములని పెద్దలందురు. ఆ సద్గుణములను సత్కుల ప్రసూతియుఁ దలంచి తార పోవలదని యెన్నిభంగుల వారించినను నాకేమియు నీవు హానిచేయవని సోదరునితో యుద్ధముచేయ వచ్చితిని.

నిన్నుంజూడక, వేఱొకరితోఁ బోరుచుఁ బరాకున నుండఁగా రాముఁడు నన్నేమిచేయఁడు కదా యని తలంచితిని. నిన్నుంజూడఁగా నీస్వభావము తెలిసినది. బుద్ధిచెడినవాఁడవని, లోకవంచనకై ధర్మచిహ్నము దాల్చినవాఁడవని, అధార్మికుఁడవని, పాపాచారుఁడవని, తృణచ్ఛన్నకూపసదృశుఁడవని నేనెఱుంగను. సత్పురుషవేషముదాల్చి ధర్మవ్యాజమున నైజమును గప్పిపుచ్చి నీఱుగప్పిన నిప్పువలె నున్న ఎ·ఎ·త్ముఁడవని తెలిసికొనకపోయితిని. నీదేశమందుఁగాని పురమునఁగాని నీకు నేనెంతమాత్ర మపకారముచేయను. ఏవిధముననే నిన్ను నేనవమానింపను. ఇట్టు లేయపరాధము చేయక ఫలమూలములఁ దినుచు శరీరభరణము గావించుకొనుచు వనములఁ దిరుగుచుండు వానరమాత్రుని, నీతోఁ బోరరానివానిని, అంతియ

గాక పరాఙ్ముఖుఁడవై వేటకారితోఁ బోరుచున్నవాని నేపాప మెఱుఁగనివాని నన్ను నేకారణమున వధించితివి? ధర్మము నభినయించు నీయందుఁ గపటము గూడ నున్నదియే. అను విషయము నీకార్యమువలనఁ దెలియవచ్చెను. క్షత్రియజాతి సంభవుఁడగు విద్వాంసుఁ డెవఁడు ధర్మవేషమునఁ దన్ను నాచ్ఛాదించుకొని సంశయింపక పాపకర్మము నాచరించును? రామా! రాజవంశమున జనించి ధర్మనిరతుఁడను ఖ్యాతి గాంచితివి? అట్టులయ్యును వాస్తవమునఁ గ్రూరుఁడవై పరవంచనార్థము చూచుటకు మంచివానివలెఁ జరించుచున్నావే. ఏల? సాంత్వనము దానక్షమలు ధర్మసత్యధైర్యపరాక్రమములు అపరాధులదండించుటయు నను నివి రాజగుణములు.

మానవేశ్వరా! మేమనఁగా ఫలమూలాశనులమై యడవులఁదిరుగు మృగములము. ఇది మా ప్రకృతి. నీవనఁగా మానవుఁడవు. విశేషించి మనుజేంద్రుఁడవు. భూమిసువర్ణరజతములు నను నీమూఁడును యుద్ధకారణములు. అట్టివానియందుఁ గాని యీవనమునఁ గల నాయితరఫలములందుఁగాని నీకు నత్యాశ గలిగియున్నదియా యేమి? నీత్యనుగ్రహములు సద్భూపతి ధర్మములు. అవినీతినిగ్రహములు దుష్టనృపతిధర్మములు. ఇట్లు రాజవృత్తులు వేఱువేఱుగా నున్నవేకాని యొండొంటితోఁ గలిసి సాంకర్యము నొందలేదని గ్రహింపందగును. నయానయములను నిగ్రహానుగ్రహములను దోఁచినరీతిఁ గావింపరాదు. కనుక రాజులు విచ్చలవిడిగఁ బ్రవర్తింపరాదు. రామా! నీకనఁగాఁ గామమే ముఖ్యము. మఱి నీవు కోపప్రకృతివి. మర్యాదాహీనుఁడవు. క్రమముతప్పి కృత్యము నాచరించువాఁడవు. దీనింజూడఁగా నీరాజవృత్తము సాంకర్యమునొంది

యున్నది. వేట ముఖ్యకార్యమనుకొని యిష్టానుసారముగా మృగములంజంపుచుండువాఁడవుగ నున్నావు. నీకు ధర్మమున నించుకంతయు శ్రద్ధ లేదు. అర్థవిషయమునఁగూడ నీబుద్ధికిఁ బర ద్రవ్యము పనికిరాదను నియమము లేదు. ఇంద్రియములకు లోఁబడి యవి చెప్పినట్లే వర్తించుచున్నావు కానఁ గామము నందు వ్యవస్థ యేమియు లేదు. పవిత్రమగు కకుత్థ్సవంశమున జనించితివి. ఏయపరాధమును నీకుఁ జేయని నన్ను బాణమువైచి సంహరించితివి కదా. నిందితమగు నిట్టికార్యము నొనరించి సత్కర్మనిరతులయెదుట నిలువఁబడి యేసమాధానము చెప్పఁ జాలుదువు.? రాజును వధించిన యతఁడు బ్రహ్మహత్యగావించి నవాఁడు. గోవుఁజంపినవాఁడు చోరుఁడు. సర్వదా ప్రాణులఁ జంపుచుండు నాతఁడు నాస్తికుఁడు. జ్యేష్ఠునకంటె ముందు వివాహము చేసికొన్న యతఁడు నను వీరెల్ల నరకమునఁ బడుదురు. కొండెములు చెప్పెడువాఁడు లుబ్ధుఁడు మిత్ర ద్రోహి గురుదారగమనుఁడు నను వీరు పాపాత్ములు పొందు లోకముల నొందుదురు. నిస్సంశయము. మేము రాజులము కాన మృగయావినోదము దోషముకాదు కదా. నిందించె దవే ఏల? అని ప్రశ్నింపకుము. ధర్మము నాచరించు నైజము గల మీవంటిసాధువులకు నాచర్మము మృగచర్మమువలె ధరింప నర్హముకాదు. నాలోమములు కూడ నిషిద్ధములే కాని పట్టు వలెఁ బఱచుకొనఁదగవు. నాయెముకలు నేనుఁగులయెముకల వలెఁ బవిత్రములు కావు. నిషిద్ధములే. నామాంసము నిషిద్ధ మే కాని భక్షణార్హముకాదు. పంచనఖము లనఁబడు. మృగ ములలో నేదుపంది, అడవిపంది, ఉడుము, కుందేలు, తాఁబేలు నను నీయైదు మాత్రము బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు

భక్ష్యములు. తక్కినపంచనఖములన్నియు భక్షింపరానివే. పండితులు నాచర్మాస్థులను దాఁకరు. నామాంసముం దినరు. అభక్ష్యములగు పంచనఖములలో నొక్కఁడ నగు నన్ను నిరర్థకముగా సంహారించితివి. ఏమాత్రమైనను బాపచింత నీకు లేకపోయినది.

సర్వజ్ఞురాలగు తార హితము సత్యము నగు మాటనే పల్కినది. అజ్ఞుఁడనై యామాటమీఱి మృత్యువుపాలఁబడితిని. సదాచారసంపన్నయగు పురంధ్రీమణికిఁ బతియుండియు వాఁడు ధూర్తుఁడైనయెడల లేనట్లే యగును. ఆరీతిగా నధర్మనిరతుఁడ వగు నీవు భూమికి నాథుఁడవయ్యును నయ్యది యనాథయే యగును. రామా! గూఢముగా నీవొరుల కప్రియముగావించువాఁడవు. చూచుటకు శాంతమగు మనస్సుగలవానివలె నటించు కుటిలుఁడవే నీవు. పాపాత్ముఁడవు సుమా! ఇట్టి నీవామహాత్ముఁడగు దశరథమహారాజున కెట్లు పుత్త్రుఁడవైతివి? మదపుటేనుఁగు బంధనరశ్మిం ద్రెంచుకొని సాధుగజముల మర్యాద నతిక్రమించి తుద కంకుశముసుగూడ సరకుసేయక యెదురుపడినవారినెల్లఁ జంపునట్లు నీవును సాధుచరిత్రమును బాసి అపరాధుల దండింపవలయునను నార్యులమర్యాద వీటిఁ బుచ్చి ధర్మమును లెక్కింపక నన్నుఁ జంపితివి. అమంగళకరము నయుక్తము సాధువినిందితము నగు నిట్టి కృత్యము నొనరించితివి కదా. ఎప్పుడైన సాధువులం గలిసినపుడు వారలతో నేనిట్టియకృత్యము నాచరించితి నని నీవు చెప్పవలసియుండును. అంతకంటె మిక్కిలిగా వారల కేమి చెప్పఁగలవు? నీవిషయమున నణుమాత్రమైన నపకారము చేయకయుండు మాయందు నీచూపినపరాక్రమము నీకపకృతినొనరించిన రావణాదులయందుఁ గనఁబఱుపఁగా జూడకున్నాను. భూపతి

తనయా! నాముందు నీవు కనఁబడుచు నాతో యుద్ధముగావించి యుండిన నిప్పటికి నాచేఁ జంపఁబడి యముని దర్శించియుందువు. నా మ్రోల నిలువఁబడి యుద్ధము నీవు చేసియే యుండిన నాదగ్గరకు రాశక్యము గాకుండు. సురాపానమున నొడలు తెలియక నిదురించువానిని బాము కఱచి చంపునట్లు నీవదృశ్యుఁడవై నన్నుఁ బొలియించితివి. తొలుత సీతను వెదకి తెచ్చి యీవలయు నని నన్నే యడిగియుందువేని నేనొక్కదినములోపల నీభార్య నెచ్చటనున్నను వెదకి చూచుటయేగాక తెచ్చి యిచ్చియుందును. నీవు సుగ్రీవునకుఁ బ్రియముగావింప నూహించి రావణుని కోఱకుఁగదా నన్ను వధించితివి. అట్టి నీవు నన్నే సాయము గోరియుండిన నాదానవేంద్రుని సంగరమునఁ బొలియించి కంఠమునఁగట్టి యీడ్చుకొనివచ్చి యిచ్చి యుందునే. సీత వెదకికొనిరమ్మా యని నాకే యాజ్ఞ చేసియుండినఁ బూర్వకాలము మధుకైటభులను దానవులచే దాఁచిపెట్టఁబడిన శ్వేతాశ్వతరీరూపమగు శ్రుతిని హయగ్రీవుఁడు సాధించినట్లు రావణుఁడు నీదేవిని సముద్రజలములయందుఁ గాని మఱెందుఁ గాని దాఁచిపెట్టియున్నను నే నశ్రమంబున సాధించి తెచ్చి నీకిచ్చియుందునే. నాపిదప నీసుగ్రీవుఁడు కపిరాజ్యపతిగా వలయు నని కోరుట న్యాయ్యమే. నన్నుఁ జంపి వాఁడు రాజగుటయు యుక్తమే కాని నేను వేఱొకరితోఁ గయ్యము సేయుచుండ నధర్మమార్గమున నీవు నన్నువధించుటమాత్రము యుక్తమనరాదు. లోకమున జన్మించినవాఁడు మృతినొందక తప్పదు. కావున లోకు లిట్లు కాలముచే నైన మృత్యువు పాలగుట సాజముగానే యుండనిమ్ము. అయిన నీవిట్లగపడక కొట్టినది నీకిపుడును యుక్తముగానే తోఁచునేని యందు

లకు న్యాయ్యముగా సమాధానము చెప్పుము. అని యిట్లావాలి బాణహతుఁడై యదియెంతయు నార్తినొందింపఁగా మహాత్ముఁడగుట నిట్లు పలికినంతకంటె నెక్కువగా మాటలాడఁజాలక యాయాసమున నోరెండఁగా సూర్యబింబముంబోలి వెలుంగు రామునింగాంచి యూరకుండెను.

మహాశయులారా! ఈభాగమును జక్కఁగా విమర్శింపఁదగినది. వాలి రాము నాక్షేపించువిషయములే యిందుఁగలవు. వీనితో రామునిసమాధానవాక్యములను బోల్చిచూడవలయును. ఆపని పైసర్గమునఁగాని సాగవలనుపడదు. వాలి పలుకులఁ గల యర్థవిశేషముల విమర్శింతము. అన్యాయమార్గమున రాముఁడు నన్ను వధించెనని యూహించు వాలి కఠినోక్తులఁ బల్కుట సాజము. దానిని మనము లెక్కింపరాదు. కాని యతఁడు నాయీప్రశ్నములకు నుత్తరము లేమిచ్చెదవని యడిగిన విషయములు న్యాయ్యములా కావా యనియే మనము విమర్శింపవలయును. ఈప్రశ్నములు సహేతుకములు న్యాయ్యములుగా నున్నవా, లేక రామునిసమాధానములు సహేతుకములు న్యాయసమ్మతములుగా నున్నవా అనియే మనము యోజింపవలయును. శ్రీరాముఁడు భగవంతుఁడుగాన నతఁడు చేసినపని ' ధర్మసహితముగా నేల యుండదని యోజింపరాదు. రాముఁ డొకమానవాధిపతి యనుకొనుచు నతనిపని శాస్త్రసమ్మతమా కాదా యని విమర్శింపవలయును. కాన నిచ్చోట వాలియాక్షేపములు న్యాయసమ్మతములా కేవల కోపాతిరేకమునఁ జెప్పఁబడినవా యని యిందుఁ బరికింతము.

"శక్రదత్తావరా మాలా కాంచనీ వజ్రభూషితా,
దధార హరిముఖ్యస్య ప్రాణాం స్తేజశ్శ్రియం చ సా." ౫

అని మూలము. రత్నములలోఁ గొన్నిటికి జీవమణులని పేరు కలదు. సామాన్యముగా నపమృత్యువును దొలఁగించి ప్రాణములను గాపాడును. అట్టిరత్నములు స్థాపించియున్న కాంచన హారమును వాలికిఁ దండ్రియగు నింద్రుఁ డొసంగెను. అదియే శ్రీరాముని బాణము తగులఁగనే పోవు ప్రాణములను ముఖవర్చస్సును నిలుపఁజాలెను. రత్నములు నోషధులు నపమృత్యువు గలుగకయుండఁజేయును. వైద్యశాస్త్రమున మరణము లేనిమందులు కొన్ని కలవు. క్షుత్తృష్ణలనాపు నోషధులుగలవు. ఆయుస్సు నీయఁజాలవనియు నపమృత్యువును గలుగకయుండ నవి కాపాడుననియు మనమెఱుంగవలయును. ఈకాలమున నోషధులను శాస్త్రయుక్తముగా సంగ్రహించుపద్ధతి నశించెను. అమ్ముచుండు మందులను గ్రహించు దురభ్యాసము పట్టుపడినది. కావున నోషధులలక్షణముల నెఱుంగు నాచారమే నశించినది. రత్నములమహిమను నీభాగము మనకుఁ దెలుపుచున్నది.

"తదస్త్రం తస్య వీరస్య స్వర్గమార్గ ప్రభావనం,
రామబాణాసనక్షిప్త మావహాత్పరమాం గతిమ్." ౬

అని మూలము. ఆయస్త్ర మందఱికడనుండునదియే. ఎవ్వారు ప్రయోగించినను వైరిమారణక్షమమే. కాని రాముని చేఁ బ్రయోగింపఁబడుటంజేసి వాలికి ముక్తి నొసంగెను. ప్రాయికముగా నస్త్రములు శస్త్రములు స్వర్గాదిలోక సుఖములను గల్పింపఁజాలవు. అవి యచేతనములు. కవులిట్టులు చమత్కృ

తికై కల్పింతురు. ఏయస్త్రముగాని వైరి నెట్టివాఁడైనను జంప లేదు. ప్రత్యస్త్ర నిహతమగును. వానియాయు రంతమగునేని యపుడే సంహరింపఁజాలును. ఇందు శ్రీరామునిచే వధింపఁ బడుటం జేసి పరమగతి వాలికి లభించెనని వాల్మీకిహృదయము. వాస్తవముగా దుర్మరణమువంటిదే యనఁదగును. కాదను విష యము శ్రీరాముని మాటలనుండి తేలెడిని.

"మహేంద్రపుత్త్రం పతితం వాలినం హేమమాలినం,
సింహోరస్కం మహాబాహుం దీప్తాస్యం హరిలోచనం,
లక్ష్మణానుగతో రామో దదర్శోపససర్ప చ." ౧౨

అని మూలము. ఇందు వాలివర్ణన మయుక్తమని యాలంకా రికులందురు. మృతినొంద నున్న వాలికి సింహోరస్కాది విశేష ము అప్రయుక్తములే. ఆలంకారికుల యాక్షేపములకుఁ జోటీయకయుండఁ గవిత్వము చెప్పఁ దరమే కాదు. ఇందు వాలియాకారవిశేష మిట్టిదని లోకులకుం దెలుపుటయే కవి హృదయమని మన మూహింపందగు. వాలి పడఁగనే రాముఁడు తమ్మునింగూడి యచటికిఁ బోయెను. తాను జేసినపని యధర్మ మని రామునకుఁ దోఁపలేదనియే మన మెఱుంగవలయు. వాలికి మరణకాలమున భగవద్దర్శన స్పర్శన సంభాషణములు కలుగవలసినవిగాఁ దత్కర్మము తెలుపుచున్నది. తత్కర్మప్రేరి తుఁడై బాణము వైచి తత్ప్రేరణముననే యచ్చటికింబోయెను.

"స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్."

అను భగవద్గీతావాక్య మీయర్థమునే దృఢపఱచుచున్నది. ఎల్లశరీరధారులు కర్మాధీనులే యనువిషయము మన మెఱుం గందగు.

"తం దృష్ట్వా రాఘవం వాలీ లక్ష్మణం చ మహాబలం,
అబ్రవీత్ప్రశ్రితం వాక్యం పరుషం ధర్మసంహితం." ౧౩

అని మూలము. "ప్రశ్రితం పరుషం ధర్మసంహితమ్" అను మూఁడు విశేషణము లసంగతములుగాఁ దోఁచును. ఏల యనఁగా సుగ్రీవుని జంపు నుద్దేశమున వచ్చి పోరాడుచుండఁగా దొంగవలెఁ జాటుననుండి తన్ను వధించు బాణమును వైచిన శాత్రవుని గాంచినంతనే ప్రాణములు పోవుచున్నను నోటి కసిదీఱ నాలుగు చీవాట్లుపెట్టి శపించుట లోకాచార సిద్ధముగాని నన్నుఁ జంపినదే చాలునని మృదువుగాఁ గొంతసేపు కటువుగాఁ గొంతదనుక న్యాయసమ్మతముగాఁ గొంతవడి మాటలాడెననుట పొసఁగదు. కాని యీమాత్రమున మహర్షి నాక్షేపింపరాదు. ముందు వాలిమాటలంబట్టియే రామునివలన మృతినొందు కోరిక వాలికింగలదని మీరే చదువఁగలరు. ఇది యొక హేతువు. తా నింక జీవింపఁగలనను నాశలేనివాలి గా రాబుకొడుకున కేమి దుర్గతి వాటిల్లునో శత్రువు రాజగును. అన్యథాగతి లేదని బుద్ధిమంతుఁడు గాన నాలోచించుట సహజము. కాన దూరమాలోచించి పట్టరానికోపమును మ్రింగలేని కఠినముగా మాటలాడినను న్యాయసమ్మతముగను మెల్లగను మాటలాడి యంతఁ గుమారునివిషయము రామునితోఁ జెప్పఁదలఁచుకొన్నవాఁడగుట నిట్లు పల్కెనన్న నసంగతమనరాదు. మఱియు భగవత్సందర్శనమహాభాగ్యముగల సత్కర్మముల నాచరించినవాఁడు గాన విశేషార్థ మెద్ది యని యూహించువారలకు నట్లే తోఁచునట్లు మాటలాడె నన్నంతమాత్రమున లోపమెద్దియు లేదు. కాన నీసంభాషణమునందలి వి షము లఁ గనుఁగొందము.

## రామునియందు వాలి యారోపించు దోషములు

౧. "త్వం నరాధిపతేః పుత్త్రః ప్రథితః ప్రియదర్శనః,
కులీనస్సత్త్వసంపన్న స్తేజస్వీ చరితవ్రతః. ౧౪
పరాఙ్ముఖవధం కృత్వా కోఽను ప్రాప్తస్త్వయా గుణః,
యదహం యుద్ధసంరబ్ధశ్శరేణోరసి తాడితః." ౧౫

అని మూలము. ప్రాయికముగా నిందుఁగల విశేషార్థము లనఁబడునవి గోవిందరాజాదులు వ్యాఖ్యాతలు వ్రాసినవి కావు. పనిలేక కూరుచుండిన మహాత్ములలే యని యెఱుంగవలయును. అందందు మనము కూడ నిట్టివానిం జెప్పవచ్చును. శ్రీరామా! నీవు రాజేంద్రతనయుఁడవు. అనేకసద్గుణములు కలవాఁడవు. ఇట్టివాఁడవయ్యు నన్నుం జూడక మఱొకరితో యుద్ధము చేయుచుండడినున్న నన్ను వక్షమున గాడునట్లు బాణమునఁ గొట్టితివే? దీనిచే నీకేమి గౌరవము కల్గినది? రణధర్మము ననుసరించి ద్వంద్వయుద్ధముచేయువారిని వేఱొకఁడు చాటుననుండి కొట్టరాదని కలదు కదా. గొప్పరాజవంశజనితుఁడవయ్యు నీవేల యిట్లు చేసితివి? ఇది నీకు మర్యాదయేనా యని వాలి యాక్షేపించెను.

"రామః కరుణవేదీ చ ప్రజానాం చ హితే రతః,
సానుక్రోశో జితోత్సాహస్సమయజ్ఞో దృఢవ్రతః. ౧౧౬
ఇతి తే సర్వభూతాని కథయంతి యశో భువి."

అని మూలము. "కరుణవేదీ=విచారాది సామగ్రీసమేతస్సన్నాశ్రయార్థ రక్ష్యత్వేన వేత్తీతి కరుణవేదీ"అని మహేశ్వరతీర్థులు. "కరుణవేదీ=కారుణ్యజ్ఞః"అని గోవిందరాజులు వ్రాసిరి. కరుణ కరుణా శబ్దము లేకార్థబోధకములు కావు. అర్థభేదము

కలదు. "కరోతి మనః ఆనుకూల్యాయేతి కరుణః" అనివ్యుత్పత్తి. శబ్దనిష్పత్తియం దీరెండును సమానములే. నవరసములలో నిది కరుణరసము. "ఇష్టనాశాదనిష్టాప్తేః కరుణాఖ్యో రసో భవేత్." రామా! ప్రజలహితము గోరుట లోనగు సకలసద్గుణములు గలవాఁడవని నీ యశస్సును సకలభూతములు నుతించు చున్నవి కదా. అట్టి నీ యశస్సునకు విరుద్ధముగా నేల నన్నుఁ బరాఙ్ముఖుని గొట్టితివను రెండవకారణము కూడఁ బైదోషము నకేచెల్లును. ఇందు మహాకవి కీర్తి యనక యశస్సని ప్రయోగించెను.

"దానాదిప్రభవా కీర్తిశ్శౌర్యాదిప్రభవం యశః."

అనున్యాయము ననుసరించి యనేక యుద్ధములలో నాజి తేజితివని విఖ్యాతి గాంచిన నీవు దానికి భంగము కలుగున ట్లేల కొట్టితివయ్యా యని భావము. రాజకుమారుఁడవయ్యు నందు విఖ్యాతుఁడవయ్యు నిట్లు చేయుట యక్రమమని యిందలిసారము.

౨. "దమశ్శమః క్షమాధర్మో ధృతిస్సత్యం పరాక్రమః. ౧౭
పార్థివానాం గుణా రాజన్ దండశ్చాప్యపరాధిషు,
తాన్ గుణాన్ సంప్రధార్యాహమగ్ర్యం చాభిజనం తవ. ౧౮
తారయా ప్రతిషిద్ధోఽపి సుగ్రీవేణ సమాగతః,
న మామన్యేన సంరబ్ధం ప్రమత్తం యోద్ధుమర్హతి. ౧౯
ఇతి మే బుద్ధిరుత్పన్నా బభూవాదర్శనే తవ."

అని మూలము. ఇందు వాలి రాజులగుణములఁ జెప్పెఁని యవి నీయందుఁ గలవని విని నమ్మి తారవలదన్నను వచ్చి

తిని. నీవు రాజధర్మవిరుద్ధప్రవర్తకుఁడవని యాక్షేపించుచున్నాఁడు.

"వినీతస్సత్త్వసంపన్నః కులీనస్సత్యవాక్ఛుచిః. 309
అదీర్ఘసూత్రస్స్మృతిమా నక్షుద్రో ఽపరుషస్తథా,
ధార్మికో ఽవ్యసనశ్చైవ ప్రాజ్ఞశ్శూరో రహస్యవిత్." 310

యాజ్ఞవల్క్యస్మృతి.

"శుచినా సత్యసంధేన యథాశాస్త్రానుసారిణా,
ప్రణేతుం శక్యతే దండస్సుసహాయేన ధీమతా. 31
ఇంద్రియాణాం జయే యోగం సమాతిష్ఠేద్దివానిశం,
జితేంద్రియో ఽహి శక్నోతి వశే స్థాపయితుం ప్రజాః." 44

మను. 7-అధ్యాయము.

"అదండ్యాన్ దండయన్ రాజా దండ్యాంశ్చైవాప్యదండయన్,
అయశో మహదాప్నోతి నరకం చైవ గచ్ఛతి." 128

మను. 8-అధ్యాయము.

అను నీస్మృతులు వాలి దోషములని యాక్షేపించినవానిని దృఢపఱచుచున్నవి. సత్కులాదులను విని నీవు నన్నేల కొట్టుదువని తలంచి తార వలదన్నను వినక వచ్చితిని. అట్లే నన్ను వధించితివే. ఇది యధర్మము కాదా యని వాలి యాక్షేపించెను.

"న త్వాం వినిహతాత్మానం ధర్మధ్వజమధార్మికం. 20
జానే పాపసమాచారం తృణైః కూపమివావృతం,
సతాం వేషధరం పాపం ప్రచ్ఛన్నమివ పావకం. 21
నాహం త్వా మభిజానామి ధర్మచ్ఛద్మాభిసంవృతం."

అని మూలము. రామా! నిన్నుఁ జూడక ముందున్న భావము చూచిన పిదప మార్పునొందెను. గడ్డిచేఁ గప్పఁబడిన కూపము వలెను, ధర్మాత్మునివలెఁ గనఁబడుచున్నావు. వంచకుఁడవని తాత్పర్యము. పాపవర్తనుఁడవు. ఈవిషయము నెఱుంగక తార మాటల నాదరింపక మోసపోతినని వాలి యాశయము. ఈ దోషము లన్నియు నధర్మమార్గమునఁ గొట్టినది నీకుఁ దగదని తెల్పుటకే యగును.

3. "విషయే వా పురేవా తే యదా నాపకరోమ్యహం. ౨౨
న చ త్వామవజానే చ కస్మాత్త్వం హంస్యకిల్బిషం,
ఫలమూలాశనం నిత్యం వానరం వనగోచరం. ౨౩
మామిహాప్రతియుధ్యంత మన్యేన చ సమాగతం."

అని మూలము. ఇది మూఁడవదోషము నారోపించును.

"గ్రామఘాతే హితాభంగే పథిమోషాభిదర్శనే,
శక్తితో నాభిధావంతో నిర్వాస్యాస్స పరిచ్ఛదాః." ౨౭

అన్న మనుస్మృతి లోనగు స్మృతుల ననుసరించి యోజింపఁగా దేశద్రోహులు పురద్రోహులు శిక్షార్హులని తేలెడిని. రామా! నీదేశపురముల కపకారముచేయను. నిన్నవమానింపను లేదు. ఇట్టిపాపదూరుని నన్నేల వధించితివి? అని ప్రశ్నించెను. అపకారము చేయకున్నను మృగవధము రాజధర్మమని రాముఁడు బదులిడునేమోయని యూహించి చెప్పుచున్నాఁడు. మాంసాహారముగల దుష్టమృగముల వధించుట వేఁటలక్షణము. భక్ష్యములగు హరిణాదులను జంపుటయు రాజస్వభావము. నే నట్లు గాదు. ఫలమూలములశనములుగా వనములఁదిరుగు వానర

జాతి జన్మించినవాఁడను. కావున మృగవధశాస్త్రము నాయందన్వయింపదు.

"హత్వా హంసం బలాకాం చ బకం బర్హిణమేవ చ,
వానరం శ్యేనభాసౌ చ స్పర్శయేద్బ్రాహ్మణాయగామ్." ౧౩॥
మను. ౧౧-అధ్యా.

అను స్మృతివాక్యము ననుసరించి నన్ను వధించుట పాపము. పరులను బాధింపని మృగమును వధింపరాదు. విశేషించి వేఱొకరితోఁ బోరుచు నిన్నెఱుంగని నన్ను వధించితివి కదా. అపకారికిఁ బ్రత్యపకారము చేయుటయు నుత్తమధర్మము కాదు. పోనీ మధ్యమధర్మమనుకొన్నను నిరపరాధియగునన్నుఁ జంపుట రాజలక్షణమే కాదని యాక్షేపించెను.

"లింగమప్యస్తి తే రాజన్ దృశ్యతే ధర్మసంహితం. ౨౪
కః క్షత్రియకులేజాతశ్శ్రుతవాన్నష్టసంశయః,
ధర్మలింగప్రతిచ్ఛన్నః క్రూరం కర్మ సమాచరేత్. ౨౫
రామ రాజకులే జాతో ధర్మవానితి విశ్రుతః,
అభవ్యో భవ్యరూపేణ కిమర్థం పరిధావసి." ౨౬

అని మూలము. ధర్మమున్నట్లు కపటముగా నభినయించుచున్నావు. రాజకులమునఁ బుట్టినవాఁ డెవ్వఁడైన నిట్లు కపటముగాఁ గ్రూరకర్మము నాచరించునా? అట్టిరాజవంశమునఁ బుట్టియు ధర్మమాచరించునట్లు నటించుచునే తిరుగుచున్నావు? అని యాక్షేపించెను. లోకమును వంచింప ధర్మవ్యాజమును బూనరాదని యిందలిసారము.

"ధర్మధ్వజీ సదాలుబ్ధశ్ఛాద్మికో లోకదంభకః,
బైడాలవ్రతికో జ్ఞేయో హింస్రస్సర్వాభిసంధకః. ౧౯౫॥

అధోదృష్టిర్నైష్కృతికస్స్వార్థసాధనతత్పరః,
శఠో మిథ్యావినీతశ్చ బకవ్రతచరో ద్విజః. ౧౯౬
యే బకవ్రతినో విప్రా యే చ మార్జారలింగినః,
తే పతంత్యంధతామిస్రే తేన పాపేన కర్మణా. ౧౯౭
నధర్మస్యాపదేశేన పాపం కృత్వా వ్రతం చరేత్,
వ్రతేన పాపం ప్రచ్ఛాద్య కుర్వన్ స్త్రీశూద్రదంభనమ్. ౧౯౮
ప్రేత్యేహ చేదృశా విప్రా గర్హ్యంతే బ్రహ్మవాదిభిః,
ఛద్మనా చరితం యచ్చ వ్రతం రక్షాంసి గచ్ఛతి. ౧౯౯
అలింగీ లింగివేషేణ యో వృత్తి ముపజీవతి,
స లింగినాం హరత్యేన స్తిర్యగ్యోనౌ చ జాయతే.” ౨౦౦

అను నీమనువాక్యము లీయర్థమునే విస్తరించి బోధించు చున్నవి. ఏవో ధర్మకార్యములు తటాకప్రతిష్ఠాదులు దేవాలయోద్ధరణాదులు అన్నదానాదులు చేయుదుమని నటించి ధనము సేకరించుట మహాపాపమనియు, లోకవంచనచేసి ధనమార్జింపఁగూడదనియు, వారి వ్రతానుష్ఠానాదులు నిష్ఫలములు మాత్రమే కాక దుష్ఫలముల నొసంగుననియు, నట్టివారు పరజన్మమునఁ బశుపక్ష్యాది యోనులయందు జన్మింతురనియు నిందలి సారము. ఇదియే కదా రామాయణమునందును గలదు. వాలివాక్యముల రూపమున మహర్షి మనకు నిట్టి ధర్మసూక్ష్మముల నెఱింగించె నని మనమెఱుంగవలయును. ఇందు పేర్కొనంబడిన ద్విజశబ్ద ముపలక్షవిధిచే సర్వమానవ సామాన్యమని యెఱుంగవలయును. చాటుననుండి బాణమువేయుటచే నిన్నిదోషముల కాధారమయ్యెను. ఒక్కమోసము జన్మమంతయు ననుమానముల

కాకరమగును గదా. కావున ధనార్జనాదుల కొఱకు ధర్మ వేషము వేసి శిష్యకూటమును సంపాదించుకొని తిరుగుట సంపాదించిన ధనమును బంధువులకొఱకు దాఁచిపెట్టుట స్మృతి సమ్మతమగు సదాచారము కాదని రాము నాక్షేపించు వాలి వాక్యములనుండి మనము గ్రహింపవలయును.

"సామదానం క్షమాధర్మస్సత్యం ధృతిపరాక్రమౌ,
పార్థివానాం గుణా రాజన్ దండశ్చాప్యపరాధిషు. ౨౭
వయం వనచరా రామ మృగా మూలఫలాశనాః,
ఏషా ప్రకృతిరస్మాకం పురుషస్త్వం నరేశ్వరః." ౨౮

అని మూలము. రాజగుణము లిందుఁ జేర్కొనఁబడినవే. ఏల? అని ప్రశ్నింతురేమో. రామా! నీవు రాజపుత్త్రుఁడవు కాన నే కారణముననను నన్నుఁజంపరాదని తెలుపుచున్నాఁడు. సుగ్రీవునకు నాకు మైత్త్రి కలదు. మిత్త్రకార్యనిర్వహణము నాకుఁ గర్తవ్యమే యందువేమో అదియుఁ బొసఁగదనుచున్నాఁడు. మా యిరువురకు వైరము మాన్పవలయునన్న నన్నుఁ బిలిపించి మంచి మాటలాడవలసియుండెను. దానికి సాధ్యము కాకయున్నఁ గొంతధనము నిప్పించియైన మాన్పవలసియుండెను. ఓర్పుగలిగి యేపనియైన నొనర్పవలసి యుండెను. ధర్మ సత్య ప్రముఖముల నాశ్రయించి యేదియే నొక యుపాయ మాలోచింపవలసి యుండెను. అపరాధము చేసిన దండనమే కాని నిరపరాధులయం దది ప్రయోగింపరాదు. ఇట్టి పార్థివ గుణములలో నొక్కదానినైన నాశ్రయింపకపోతివి. మేము వనచరులము. మృగజాతికిఁ జేరినవారము. చతుష్పాత్తులమని భావము. ఫలమూలములఁ దినువారము. నీవు మానవుఁడవు.

రాజాన్న భోక్తవు. పురవాసివి. కాన నాయందు విరోధము పొసఁగునవసరమే లేదు. మా ప్రకృతికి మీ ప్రకృతికిఁ జాలభేదముగలదు. ఇట్టులుండఁగా నన్ను దండించుట విచిత్రముగనే యున్నదని వాలి యాక్షేపించెను. నీవు రాజవు మేము సేవకులము ననునర్థముం బురస్కరించుకొని నాకు నీవు న్యాయదండనమే యొనరించితివని వాలిమాటలలోని విశేషార్థమని వ్యాఖ్యాతలు సూచించిరి.

గి. "భూమిర్హిరణ్యం రూప్యం చ విగ్రహే కారణాని చ,
అత్ర కస్తే వనే లోభో మదీయేషు ఫలేషు వా. ౨౯
నయశ్చ వినయశ్చోభౌ నిగ్రహానుగ్రహావపి,
రాజవృత్తిరసంకీర్ణా న నృపాః కామవృత్తయః. ౩౦
త్వం తు కామప్రధానశ్చ కోపనశ్చానవస్థితః,
రాజవృత్తైశ్చ సంకీర్ణశ్శరాసనపరాయణః. ౩౧
న తేఽస్త్యపచితిర్ధర్మే నార్థే బుద్ధిరవస్థితా,
ఇంద్రియైః కామవృత్తస్సన్ కృష్యసే మనుజేశ్వర." ౩౨

అని మూలము. భూమి, కనకము, వెండి యనునీ మూఁడు మాత్రమే కలహహేతువులు. ఈయడవిలో నేపదార్థము నందు నీకుఁ బేరాశగలదు. నాఫలములయందుఁగలదా. ఇందు నొక్కటియు నీవాశింపఁదగినది లేదే.

"అసంతుష్టా ద్విజా నష్టాస్సంతుష్టా ఇవ పార్థివాః."

అను సూక్తి ననుసరించి నీకు రాజ్యాక్రమణము స్వర్ణరౌప్యముల నార్జించుట యనునవి న్యాయ్యములే కావచ్చును. కాని యందొక్కటియు నాయీవనమున లేదే. ఏల కొట్టితివి? సామాన్యరాజులు కూడ స్వేచ్ఛా ప్రవర్తకులు కారు కదా.

నీవంటి మహారాజకుమారుఁ డిట్లు కామవృత్తిగలవాఁడగుట విచిత్రము. నీరాజవృత్తము సంకీర్ణముగానున్నది. ఒకదానికి మాఱుగా నింకొకటి చేయుచున్నావు. ధర్మమునందుఁ బూజ్య బుద్ధి నీకు లేదు. బుద్ధిచాంచల్యము నీకుఁగలదు. జితేంద్రియుఁ డవు కావు. ఇంద్రియములకు లోఁబడియే యున్నాఁడవు. కావున నిట్టి యకార్య మొనరించితివని యాక్షేపించెను.

ప్రాయికముగాఁ బూర్వకాలమున జితేంద్రియత్వము ప్రధానస్థానము నాక్రమించుకొని యుండెడిది.

"ఇంద్రియాణాం జయే యోగం సమాతిష్ఠేద్దివానిశం,
జితేంద్రియో హి శక్నోతి వశే స్థాపయితుం ప్రజాః."

అన్న మనుస్మృతివాక్యము కనఁబడుచున్నది కదా. జితేంద్రి యుఁడు కావలసినది మునియే యనుకొందుఱు యూహా నిర్మాల్యము. ముఖ్యముగానట్టివాఁడు కావలసినది రాజే. జితేంద్రియత్వమే రాజునకుఁ గలశక్తి. ఆశక్తి లేనిచో నతఁ డేకార్యమును సాధింపఁజాలఁడు. తనయవయవములనే లోఁ బఱచుకొనఁజాలనివాఁ డితరుల నెట్లు వశపఱచుకొనఁగలఁడు? కనుకనే యింద్రియజయ మావశ్యకమని స్మృతులు ఘోషించు చున్నవి. కనుక వాలి రాముని జితేంద్రియుఁడవు కావు. కనుకనే కామప్రవర్తకుఁడవని యాక్షేపించెను. ఇందలి సార మేమి? మనోనియమనము చేయకయే యుత్తమకార్యము నెవ్వఁడును జేయఁజాలఁడు. జితేంద్రియుఁడు కానిచో మనస్సు నిలుకడఁగాంచదు. అది నిలుకడగానుండినఁగాని మహాకార్య ములు సాధింప శక్యముకాదు. కావున నెల్లరును జితేంద్రియు లగుటకుఁ బ్రయత్నింపవలయును. అన్నవిషయ మీభాగము మనకుఁ దెలుపుచున్నది.

ఉ. "హత్వా బాణేన కాకు న్మామిహానపరాధినం,
కిం వక్ష్యసి సతాం మధ్యే కర్మ కృత్వా జుగుప్సితం. 33
రాజహా బ్రహ్మహా గోఘ్నశ్చోరః ప్రాణివధే రతః,
నాస్తికః పరివేత్తా చ సర్వే నిరయగామినః. 34
సూచకశ్చ కదర్యశ్చ మిత్రఘ్నో గురుతల్పగః,
లోకం పాపాత్మనామేతే గచ్ఛంతే నాత్ర సంశయః." 35

అని మూలము. ఇందుఁగల ప్రధానవిషయమేది? ఆకాలమున నెల్లరకును బాపభీతి మిక్కుటముగా నుండెను. పాపకార్యముల నొనరించిన నూర్ధ్వలోకములందు నివాసము దొరకదన్న భీతియుండెను. ధర్మమును ద్వేషింపరాదన్న జంకుగలిగి యుండెను. రాక్షసులకుం గూడ నీవిచారము కలదు. ధర్మముపై నొట్టుపెట్టిన నెల్లరు భయంపడి యామాటను సాగించుచుండిరి. మహారణ్యమునను న్నను జూచువారు లేరుకదా యని పాపమాచరింప నెల్లవారు జంకుచుండిరి. కనుక నొక యపరాధము చేసినపు డద్దాని నతఁడు సభాంగణమున నొప్పుకొనుచుండుట యీకాలపువాడుక లనవలయును. ఈవిషయముల నీభాగము తెల్పుచున్నది. శ్రీరామా! నలువురు పెద్దలు చేరియుండుచోట నీవుందువే నపుడు వారు వాలి నతి నీచమార్గము నాశ్రయించి వధించితివికదా యని యడుగ నేమని బదులు చెప్పుదువు? అని ప్రశ్నించెను. అసత్యమాడినను గనుఁగొనువా రుండరు కాని యద్దానిం బలుక జంకువారు కావున నిట్లు ప్రశ్నించెనని మన మూహింపంజను. నలువురు విని నీకార్యమునుగూర్చి పరిహసింతురే. ఇట్లేల చేసితివయ్యా యని వాలి యాక్షేపించెను. కదర్యులనఁగా లుబ్ధులు. నాస్తికుఁడనఁగా స్వభావవాది. పెండ్లికాని యన్నయుండఁ

గాఁ దమ్ముఁడు తాను బెండ్లియాడిన నతఁడు. ఈ చెప్పినవా రెల్ల నరకమునఁ బడువారు.

"దారాగ్నిహోత్రసంయోగం కురుతే యోఽగ్రజే స్థితే,
పరివేత్తా స విజ్ఞేయః పరివిత్తిస్తు పూర్వజః. ౧౭౧
పరివిత్తిః పరివేత్తా యయా చ పరివిద్యతే,
సర్వే తే నరకం యాంతి దాతృయాజకపంచమాః." ౧౭౨

మను. 3-అధ్యాయము.

వివాహోచితుఁడుగ నన్న యుండఁగాఁ దమ్ముఁడు పెండ్లియాడ రాదని సారము. రోగాదులచే జ్యేష్ఠుఁడు వివాహానర్హుఁడగు చుండఁగాఁ దదనుజ్ఞనొంది తమ్ముఁడు పెండ్లిచేసికొన్న దోష ములేదని యార్యులందురు. వాలి పేర్కొనిన దోషములలో రాముఁ డేదోషము చేసినవాఁ డగునని ప్రశ్నించినచో నకా రణముగఁ బ్రాణివధ మొనరించినవాఁడగు. ఇట్టి పాపము నేల చేసితివనియే వాలి ప్రశ్నించెను.

౭. "అధార్యం చర్మ మే సద్భి రోమాణ్యస్థి చ వర్జితం,
అభక్ష్యాణి చ మాంసాని త్వద్విధైర్ధర్మచారిభిః. 3౬
పంచపంచనఖా భక్ష్యా బ్రహ్మక్షత్రేణ రాఘవ,
శల్యకశ్శ్వావిధో గోధా శశః కూర్మశ్చ పంచమః. 3౭
చర్మ చాస్థి చ మే రాజన్ న స్పృశంతి మనీషిణః,
అభక్ష్యాణి చ మాంసాని సోఽహం పంచనఖో హతః." 3౮

అని మూలము. ఆకాలమున బ్రాహ్మణులు క్షత్రియగృహ ములయందు భుజించువారు. ఈ యిరువురకు సమానముగా భక్షింపఁదగిన మాంసములు కొన్ని కలవు. బ్రాహ్మణులకు మాత్రము నిషేధింపఁబడిన మాంసములు కలవు. వారు భోజ

నమునకు రాఁగా నాఁడు దుర్మాంసముల వండకయుందురు. మత్స్యము లాకాలమునఁ గూడ భక్ష్యములు కావు. అందు రెండుజాతులు మాత్రమే భక్ష్యములగును.

"యో యస్య మాంసమశ్నాతి స తన్మాంసాద ఉచ్యతే,
మత్స్యాదస్సర్వమాంసాదస్తస్మాన్మత్స్యాన్వివర్జయేత్. ౧౫
పాఠీనరోహితావాద్యౌ నియుక్తౌ హవ్యకవ్యయోః,
రాజీవాన్ సింహతుండాంశ్చ సశల్కాంశ్చైవ సర్వశః. ౧౬
న భక్షయేదేకచరా న జ్ఞాతాంశ్చ మృగద్విజాన్,
భక్ష్యేష్వపి సముద్దిష్టాన్ సర్వాన్ పంచనఖాం స్తథా. ౧౭
శ్వావిధం శల్యకం గోధాం ఖడ్గకూర్మ శశాం స్తథా,
భక్ష్యాన్పంచనఖేష్వాహు రనుష్ట్రాంశ్చైకతో దతః." ౧౮

మను. ౫-అధ్యా.

దేనిమాంసము నెవఁడు దినునో యతఁడు తజ్జంతుమాంసభక్షకుఁ డనంబడు. మత్స్యములఁ దినువాఁడు సర్వజంతుమాంసభక్షకుఁడగును. కాన దాని మానవలయు. కాని పాఠీన రోహిత నామకమత్స్యములు సముద్రోద్భవములు దేవపితృ కార్యములయందు గ్రాహ్యములు. అట్టివే మఱికొన్నియు గ్రహింపఁదగును. అనుటంజేసి పెద్దచేఁపలను దినవచ్చుననియే కదా భావమని కొందఱందురు. ఈస్మృతితాత్పర్య మదికాదు. నిరంతరమత్స్యభక్షణమును దొలఁగించు నభిప్రాయమున దేవ పితృకార్యములయందందుఁ గొన్ని గ్రాహ్యములని చెప్పఁబడినది. భక్షింపరానివి శ్రాద్ధములయందు దేవకార్యములయం దెట్లు పనికివచ్చునని ప్రశ్నింపరాదు. స్మృతితాత్పర్యము నాలోచించినచో నేయుద్దేశమున నట్లు చెప్పఁబడినదో తేటపడును.

నిరంతరము చేయుదురభ్యాసము నాపుటయే దీనిహృదయము. శల్యకమనఁగా "శుక్తికాకార శాల్యా వృతసర్వాంగో జంతు విశేషః." అని వ్యాఖ్య. తెలుపురంగు ప్రధానముగాఁగల యెముకలవంటి ముండ్లచే నావరింపఁబడిన జంతువు. అనఁగా ఏఁదుపంది. శ్వావిధమనఁగా "కంటకాకార దీర్ఘరోమభిః శ్వానం విధ్యతీతి శ్వావిధః." అడవిపంది. ఊరఁబంది యేల కాదనరాదు.

"మత్స్యాదాన్ విడ్వరాహాంశ్చ మత్స్యానేవ చ సర్వశః."

అను వాక్యమునం దూరఁబంది నిషేధింపఁబడినదియే. కాన నడవిపందియే యని చెప్పవలయును. గోధా=ఉడుము, శశః= కుందేలు, కూర్మము=తాఁబేలు అను నీయైదును బంచనఖముల యందు భక్ష్యములుగాఁ జెప్పఁబడినవి. తక్కినవి వదలఁదగిన వని. ఇవియుఁ గేవల బ్రాహ్మణులకే కాని క్షత్రియులకుఁ గాదని స్మృతులు తెల్పును. ఈజంతువులలో

("న భక్షయేదేకచరా న జ్ఞాతాంశ్చ మృగద్విజాన్,
భక్ష్యేష్వపి సముద్దిష్టాన్ సర్వాన్ పంచనఖాంస్తథా." ౧౭

అనుశ్లోకమున మనువే వానరాదులను నిషేధించియున్నాఁడు.) వానరజాతి చేరదు. కాన నామాంస చర్మాస్థులలో నేదియుఁ బెద్దలకు గ్రాహ్యము కాదు. నీవు క్షత్రియుఁడవైనను వ్రతాచరణపరాయణుఁడవుగా నున్నందున మునులకు భక్ష్యము లగువానినే భక్షింపవలయు. క్షత్రియులకుంగూడ వానరములు భక్ష్యములుకూడఁ గావు. కాన నట్టి నన్ను వధించితివి. న్యాయ్యమా అని యాక్షేపించెను. ఆహారార్థము వధించితి నని చెప్పుటకుంగూడ నీకవకాశము లేదు. వేఁట మాధర్మమం దువేని అందును వానరముల వధించునాచార మీావఱకు

లేదు. అనపకారములను జంపుట వేటలక్షణము కాదు. రాజు వేటకాఁడు కాఁజాలఁడు. దుష్టమృగముల వధించి ప్రజలకష్టములఁ బాపఁదగినవాఁడే కాని జంతువులం జంపి జీవించువాఁడు కాఁడు కదా. కావున రామా! నీకా ర్యము దుష్టమేయగునని యాక్షేపించెను. కొంద ఱిందొక శంకను గల్పింతురు. కృతత్రేతాయుగములు ధర్మప్రధాన ములు గదా. ఆకాలముననే మాంసము భక్ష్యమగునపుడు ధర్మము నశించు కలియుగమున నేల పనికిరావని పాపము! వారికి లోకమర్యాద లెఱుంగఁ దరముగాకున్న వనవలయు. ఆయుగములయం దిన్ని యాహారవస్తువులు లేవు. సురాపాన మప్పటికే నిషేధింపఁబడినది. మాంసభక్షణము తగ్గింపఁబడినవి. క్రమక్రమముగాఁ దగ్గవలయునుగాని యొక్కసారిగా నవి తగ్గదు. ఆకాలమునుండి యారంభింపఁగాఁ గలియుగమున నొక కొన్ని వేలకుఁ దగ్గినది. కాని మరల మొలక లెత్తుచున్నది. ఆకాలమునఁగల సత్యశౌచాదు లీకాలమున మందునకైనఁ గానరావు. దానికిఁగాఁ బ్రయత్నింప వలయుఁగాని వీనికై దుఃఖింపరాదు.

శ్లో. "తారయా వాక్యముక్తోఽహం సత్యం సర్వజ్ఞయా హితం,
తదతిక్రమ్య మోహేన కాలస్య వశమాగతః. ౩౯
త్వయా నాథేన కాకుత్స్థ న సనాథా వసుంధరా,
ప్రమదా శీలసంపన్నా ధూర్తేవ పతినా యథా." ౪౦

అని మూలము. తార సర్వజ్ఞురాలు. కాననే హితవాక్యము తెల్పెను. అవివేకమున దాని వినక కాలమునకు వశుఁడనైతిని. తన్నుఁ దా దూషించుకొనుచున్నాఁడు. "బాలాదపి సుభాషిత" మ్మను న్యాయము ననుసరించి మంచిమాట యెవరు చెప్పినను

గ్రహింపఁదగినదే. అట్టిచో భార్య మేలుగోరి తెల్పిన వినక పోవుట ప్రారబ్ధముచేతనే. కర్మాధీనుఁడు కానివాఁ డుండఁడని భావము. "గహనా కర్మణో గతిః"అన్న గీతావాక్య మిట స్మర్తవ్యమే కదా. శ్రీరామా! నీవంటివాఁడు రాజుకాఁగా నీ భూమి సనాథ కాదు. అనాథయే యగును. ఏల? ఇట్టి యధర్మ కార్యముల నాచరించుటంజేసి యనాథయేకాక సనాథ యెట్లగును? సదాచారవంతురాలగు ప్రమదామణి ధూర్తుఁడు పతిచే ననాథయైనట్లు. అనఁగా నర్హుఁడు పతికానితఱి నాసాధ్వి యనాథయే యగును. దేశము రాజస్వాంతము కావలయును. ధర్మాత్ముఁడగు రాజుండినఁగాని యామేరు గాంచనేరదు. నీవట్టి వాఁడవుకాదు. ధర్మము నుల్లంఘించి నీకుఁ దోఁచినట్లే కార్యముల నాచరించువాఁడవని వాలి యాక్షేపించెను.

శ్లో. "శఠో నైకృతికః క్షుద్రో మిథ్యాప్రశ్రితమానసః,
కథం దశరథేన త్వం జాతః పాపో మహాత్మనా. ౪౧
భిన్నచారిత్రకక్ష్యేణ సతాం ధర్మాతివర్తినా,
త్యక్తధర్మాంకుశేనాహం నిహతో రామహస్తినా. ౪౨
అశుభం చాప్యయుక్తం చ సతాం చైవ విగర్హితం,
వక్ష్యసే చేదృశం కృత్వా సద్భిస్సహ సమాగతః." ౪3

అని మూలము. రహస్యముగ నపకారము చేయువాఁడవు. పరాపకారమున జీవించువాఁడవు. ఈమొదలగు దోషములు గల నీ వెట్లు దశరథమహారాజునకుఁ బుత్త్రుఁడవైతివి? నీ యందుఁ గనఁబడు శాంత మది మిథ్య. అనఁగాఁ దండ్రిగుణములు నీయుందు లేవని భావము. ఇచ్చోటఁ గొందఱు "మహాత్మనా దశరథేన జాతస్త్వం కథం శఠః కథం క్షుద్రః" అని

యన్వయించి వాలి పొగడెననిరి. ఇది సంగతమో యసంగతమో పండితు లాలోచింతురుగాక. గజముతో శ్రీరాముని బోల్చి నడవడిలేక ధర్మమును వదలి పెద్దలమార్గమునఁబోని నీచే హతుఁడనైతినని దూషించెను. పొగరుచే దేహాము తెలియని యేనుఁగు కనఁబడినవారినెల్లఁ జంపునట్లు ధనుర్విద్యావైశద్యరూపగర్వమున విజృంభించుచు నపరాధానపరాధముల నెఱుంగక ధర్మాధర్మములఁ బరిశీలింపక వధించితివని దూషించెను. శాస్త్రజ్ఞానము లేకున్నను బెద్దల యాచారములనైనఁ జూచి నేర్చుకొనవలయునను భావమిం దిమిడియున్నది. శాస్త్రజ్ఞానము గలిగి యట్లు నడుచుకొనువారే పెద్దలనఁబడుదురు. అంతియగాని వయోమాత్రవృద్ధులు కాదని యెఱుంగవలెను. రామా! పెద్దలొకచోఁ గూడియుండఁగా నిట్టియమంగళాయుక్తమగు నీచకార్యమును జేసి వారడిగిన నిట్టి మహాకార్యమును జేసితినని చెప్పఁగలవా? అని ప్రశ్నించెను.

౧౦. "ఉదాసీనేషు యోఽస్మాసు విక్రమస్తే ప్రకాశితః,
అపకారిషు తం రాజన్నహి పశ్యామి విక్రమం. ౪౪

దృశ్యమానస్తు యుధ్యేథా మయా యది నృపాత్మజ,
అద్య వైవస్వతం దేవం పశ్యేస్త్వం నిహతో మయా. ౪౫

త్వయాదృశ్యేనతు రణే నిహతోఽహం దురాసదః,
ప్రసుప్తః పన్నగేనేవ నరః పానవశం గతః." ౪౬

అని మూలము. నీ కించుకంతయు నపకారముచేయని మాయందుఁ గనఁబఱచిన యీవిక్రమము నీకపకారముచేసిన రావణాదులయందుఁ గనబఱచినట్లు లేదే. ఇది యొక విక్రమమాయని వాలి యాక్షేపించెను. అనఁగా రావణాదులను

సంహారింపక యనపకారినగు నన్నేల చంపితివని వాలి యాశ
యము. రావణునివంటి యపకారిని నేనగుదునా యని వాలి
ప్రశ్నించెను. రావణుఁ డేయపరాధము రామునకుఁ జేసెనో
యట్టి యపరాధమును దాను సుగ్రీవునకుఁ జేసినమాటను
వాలి యెఱుంగఁజాలకపోయెను. కనుకఁ దనకుఁజేసినశిక్ష య
క్రమమని యతని భావము. నీకు నిపుడు చేసిన శిక్షయే రావ
ణునకు జరగఁగలదను రామునాశయమును వాలి యెఱుంగఁ
డని మన మూహింపవలయును. కనుకనే యాక్షేపించెను.
లోకమునం దెవ్వరుగాని యాత్మదోషములను బరిశీలించి
కనుఁగొనిరేని మరల నవ్వానిని జేయఁబూనరు. ఆపరిశీలనము
చేయకపోవుటయే మనలోపమని తఱచు మనమూహించు
చుండవలయు. "మనసి విచింతయ వారం వారమ్" అన్న
శంకరభగవత్పాదోక్తి యీయర్థమునే బోధించును.

శ్రీరామా! కనఁబడి నీవు నాతోయుద్ధము చేసియుందు
వేని నిన్నపుడే యమపురికిఁ బంపియుందునని వాలి యనియెఁ
గదా. వాలి కెవరుగాని కనఁబడి యుద్ధము చేయఁబూనిరేని
వారిబలమునందు సగము వాలినిజేరుననియు నది యెఱింగియే
రాముఁడు చాటుననుండి యతనిం జంపెననియుఁ గొందఱు
చెప్పుదురు. కాని రామాయణమున నందులకుఁ బ్రమాణము
కానరాదు. వ్యాఖ్యానమునందు మాత్రము

"ఆహూయ వాలినం బ్రహ్మా దదౌ వరమనుత్తమం,
ప్రతీపవర్తినో భూయా దర్ధం బల మరిందమ."

అని యుదహరింపఁబడినది. ఇది యెందున్నదో నా పరిశీలించి
నంతదనుకఁ గనఁబడదు. ఐన నెందోయుండును. లోకప్రవాద

మీయర్థమునఁ గలదు. బ్రహ్మ వాలిని బిలిచి నీయెదుటనుండు పగవాని బలమున సగము నీయందుఁ జేరునని వరమిచ్చెను. ఆవిధ మెఱింగియో యెట్లో రాముఁడు చాటుననుండి వధించెను. వాలి కనఁబడక యుద్ధముచేయక వేఱొకరితోఁ బోరాడు వానిని వధించితివని యాక్షేపించెను. అనఁగాఁ గూట యుద్ధము శాస్త్రసమ్మతము కాదనియు నది యొనరించువాఁడు పరాక్రమవంతులలోఁ జేరఁడనియు నట్టి కార్యమొనరించిన రాముఁడు వీరులలో గణింపఁదగినవాఁడు కాఁడనియు వాలి యాశయము.

శత్రువులకు నసాధ్యుఁడనైనను త్రాగి యొడలు తెలియనివాఁడు పాముచేఁ గఱవఁబడి చచ్చునట్లు తారాహితోపదేశము నాలకింపక నేను మోసముగా నీచేఁ జంపఁబడితినని వాలి పలికెను. ఈయాక్షేపములన్నియు రాముని నిందించునవియే యైనను శబ్దవిన్యాసము ననుసరించి కనఁబడియే నీవు నన్ను వధించిన బాగుండును గదా యనుభావము వాలిపలుకులనుండి తేలెడినని కొంద అర్థమును దేల్చిరి.

> "న్యస్తాం సాగరతోయే వా పాతాళే వాపి మైథిలీం,
> ఆనయేయం తవాదేశాచ్ఛ్వేతామశ్వతరీమివ." ౪౯

అని మూలము. పాతాళలోకమునందు మధుకైటభులను దానవులచే దాఁచిపెట్టఁబడఁగా భగవంతుఁడు హయగ్రీవుఁడై దానిం దెచ్చెను. అట్లే రావణుఁ డెందు దాఁచియున్నను సీతను నేఁ దెచ్చియిత్తునని వాలి యాశయము. వేదమును దాఁచి పెట్టుట యనఁగా నర్థమేమి? శ్వేతాశ్వతరియను వేదభాగము పాతాళమున నుండెను. స్వర్గమర్త్యలోకముల నయ్యది

వ్యాపింపకయుండెను. హయగ్రీవావతారమున భగవంతుఁడవ్వారి నిర్జించి తెచ్చెను. అనఁగా సర్వలోకములయందు వ్యాపింపఁజేసెనని భావము. వేద మపౌరుషమేయైన నొక్కొక్కభాగము నొక్కొక్కరుగా లోకమున వ్యాపింపఁజేసిరి. కావున వారిపేర నది పరఁగెను. అంతియగాని వేదమును వారు కల్పించినవారు కారు. ఆపేరుల ననుసరించి వేదము నెందఱో మునులు నిర్మించిరనునది నిరర్థకవాదమని మన మెఱుంగవలయును.

౧౧. "యుక్తం యత్ప్రాప్నుయాద్రాజ్యం సుగ్రీవస్స్వర్గ తే మయి
అయుక్తం యదధర్మేణ త్వయాహం నిహతో రణే. ౫౦
కామమేవం విధో లోకః కాలేన వినియుజ్యతే,
క్షమం చేద్భవతా ప్రాప్తముత్తరం సాధు చింత్యతాం." ౫౧

అని మూలము. జ్ఞాతిధర్మము ననుసరించి నా తరువాత సుగ్రీవుఁడు రాజ్యమును గోరవచ్చును. కాని యధర్మమార్గమున నీవు నన్ను వధించుట మాత్ర మయుక్తమని వాలి యాక్షేపము. జనించినదెల్ల మృతిని గాంచును. దానికి వగవఁబనియే యుండదు. రామా! నీవు చేసినది యుక్తమేయని నీకుఁదోఁచినచోఁ జక్కనియుత్తర మాలోచింపుము. అనఁగా లోకులు నీచరిత్రమును దూషింపకయుండ నా ప్రశ్నములకు నుత్తర మాలోచింపుమని వాలి యడిగెను. భగవద్దర్శనము కాఁగా నెట్టివారికైన విజ్ఞాన ముదయించును. వాలి యెందఱో పెద్దల సేవించినవాఁడు. విద్వాంసుఁడు. తపోధనుఁడు. కావున నతనికి శ్రీరామసందర్శనమున విజ్ఞానోదయ మగుట యచ్చెరువును గల్గింపదు. ఏల యాక్షేపించెననఁగా నెట్టివారికైనను

ప్రాయికముగాఁ బ్రాణములయం దాశ మెండుగ నుండును. పగవాఁ డెదుటనుండి వానిం జంపనుంకించి శక్తిగలిగి నడుమ నొక్కరిచేఁ జంపఁబడుట కుమ్మలిక కలుగకమానదు. అయినను శ్రీరాముఁడు సామాన్య రాజకుమారుఁడు కాఁడని వాలి యెఱుఁగును. కావునఁ గర్మసంగతి నెట్లో ప్రశ్నించినను దన యుత్తమగతికిఁ గారకుఁడు శ్రీరాముఁడని నిశ్చయించెనని యీ కడపటిమాట మనకుఁ దెల్పుచున్నది. ఇఁక నధ్యాత్మ రామాయణమున నింతకంటె నీప్రశ్నములయందు విశేషము కలదా యని యోజించినఁ గానరాదు. కావున శ్రీరాముని సదుత్తరము లెవ్వి యని పరికింతము.

## శ్రీరాముఁడు వాలికిఁ జెప్పిన సదుత్తరములు.

* ఇంద్రతనయుఁ డీరీతిఁ గలఁగుండుపడుచున్న బుద్ధివై శద్యమునఁ బలికి కాంతిలేనిసూర్యబింబమువలె నిర్జలమేఘ పంక్తివలె జ్వాలామాలికలు లేనియగ్నివలె నుండెను. అట్టివా లినిగని ధర్మార్థహితమగునట్లు బదులు శ్రీరాముఁడిట్లు పలికెను. ఇంద్రపుత్త్రా! నీవు ధర్మార్థకామములను లౌకికాచారములను జక్కఁగానెఱుంగక వానికి విపద్ధముగా వర్తించియు నీవిష యమున నిర్దోషినగు నన్నజ్ఞానమున నిందించితివే? ఆర్యుల నీవిషయముల నడిగి తెలిసికొనవలయును. అట్లు చేయక జాతి చాపలమున నన్నుంజూచి నిరర్థకముగా నేల యాక్షేపించె దవు? సపర్వతకాననసాగరమగు నీభూమండలమెల్ల నైక్ష్వాకు వులదిగానున్నది. మృగపతత్త్రిమానవులందు నిగ్రహానుగ్రహ ములఁ జూపుట వారికృత్యములే. అట్టి యీభూమండలమును

* ఇది పదునెనిమిదవ సర్గమునఁ గలదు.

ధర్మనిరతుఁడు సత్యవాది నిష్కపటుఁడు నగుభరతుఁ డేలుచున్నాఁడు. నీతియు శిక్షయు సత్యము శాస్త్రహితవిక్రమము నతనియందు నెలకొనియుండు. దేశకాలజ్ఞుఁడు నగు. అట్టియాభరతుఁడు రాజధర్మానుసారముగాఁ జేసిన యాజ్ఞను మన్నించి మేముఁ దక్కుంగలసామంతరాజులు ధర్మవృద్ధినే కోరి యెల్లకడలఁ దిరుగుచున్నాము. భరతుఁడు ధర్మావిరుద్ధముగాఁ బాలించుచుండ ధర్మహానిచేయఁగలవాఁ డెవ్వఁడుండును. అట్టివాఁడే యుండిన శిక్షపొందకమానఁడు.

భరతునిచే ననుజ్ఞాతులమగు మేము నిర్మలస్వధర్మము నూని తదాజ్ఞను బురస్కరించుకొని ధర్మవిరుద్ధవర్తనులను శిక్షించుచున్నాము. నీవనఁగా ధర్మమును దిరస్కరించితివి. నీవు చేసినపనుల నెంచిచూడఁగా నింద్యుఁడవే యగుదువు. కామపరతంత్రుఁడవే నీవగుదువు. రాజమార్గము నవలంబింపలేదు. తండ్రి, అన్న, విద్యనేర్పినవాఁడు ననునీమూవురు తండ్రులని భావింపవలయుఁ గదా. ధర్మమును వారు వదలిరేని వేఱుగా భావించుకొనవచ్చును. కపికులపతీ! ధర్మము మిక్కిలిసూక్ష్మము. ఇంద్రియాగోచరము. సాధువులకుం గూడ నెఱుంగఁదరముగానిది. అట్టిది నీవంటివానికిఁ దెలియఁదరమా? మానవు లాచరించు ధర్మాధర్మములను సకలభూతముల హృదయములందు నిండియుండు పరమాత్మ యెఱుంగు. ఇతరు లెఱుంగఁజాలరు. నీవు కడుఁ జపలుఁడవు. జనుషాంధుఁడు పుట్టుగ్రుడ్డితో నాలోచించు చందమున మతిలేని నీవంటి వానరులతో నెంత యోజించినను ధర్మమార్గము తెలియఁజాలదు. పూర్వము తండ్రులని నేఁజెప్పినమాట స్పష్టముగా నీకుఁ దెలిపెదను. అంతట నీయపరాధము నీకు బాగుగాఁ దెలియఁగలదు. బుద్ధిహైన్యమునఁ

కేవలదోషకార్యముల నొనరించియు నన్ను దూఱుట నీకుఁ దగదు. ఏకారణమున నేను నిన్ను వధించితినో వివరించెదను. చక్కఁగా వినుము.

వాలీ! నీవు సనాతనధర్మమును వదలి యనుజుఁడగు సుగ్రీవుని భార్యతో విహరించుచున్నాఁడవు. ఈ మహాపాపమే నిన్ను వధింపఁదగిన కారణము. సుగ్రీవుఁ డనుజుఁడు కాన నీకుఁ బుత్త్రునివంటివాఁడే. తత్పత్ని కోడలగునుగదా. తమ్ముఁడు ప్రాణములతోనుండ నీ వత్యంతపాపకార్యము నొనరించి తద్భార్యను రుమయను నాతిని గామాతిరేకమున భోగకాంతగాఁ గైకొంటివి. కనుక ధర్మమును మీఱి స్వేచ్ఛఁగాఁ జరించుచుఁ దమ్ముని యిల్లాలిం గైకొని వ్యభిచరించు చున్నాఁడవు. ఆయపరాధమునకే శిక్షనిచ్చితిని. శిక్షింపవలయుఁ గాని వధింపవచ్చునా యని యడుగుదువేమో. ధర్మవిరుద్ధముగా వర్తించి లోకాచారమును గూడఁ దప్పియున్నవాని నిట్లు శిక్షింపవలసినదే కాని మార్గాంతరమున శిక్షింపనుపాయము కానరాదు. నేను సత్క్షత్త్రియుఁడను. కాన నీయపరాధమునకు నర్హమగు శిక్ష చేయక యూరకుండఁజాలను. లోకమున నెవ్వాఁ డాత్మజను, సోదరిని, కనిష్ఠసోదరపత్నిని నిందెవ్వరినిగాని కామాతిరేకమున నొందునో వానికి వధదండమే తగినదని ధర్మశాస్త్రము తెల్పుచున్నది. ఇత్తఱి మహాధర్మాత్ముఁడగు భరతుఁడు రాజు. ఇంచుకంతయు ధర్మమును మీఱనీయఁడు. మేమాతని యాజ్ఞాబద్ధులము కాని స్వతంత్త్రులము కాము. ధర్మము నించుకయు వదలక వర్తింపఁదగువారము. ధర్మము నీవతిక్రమించితివి. ఇట్టి నిన్నూరక వదలుటెట్లు? రాజగు భరతుఁ డెల్లరకన్న నధికుఁడు. కాన ధర్మము నతిక్రమింపకయుండ నెల్లరంగని

పెట్టియుండును. కనుకనే యతఁడు ధర్మాతిక్రమణము చేయు వారిని శిక్షించుటయందు బద్ధకంకణుఁడై యుండు. మేమాభరతాజ్ఞనే శాస్త్రముగాఁ గొని మర్యాదను దాఁటి వర్తించు మీవంటివారిని శాస్త్రప్రకారము శిక్షింప దీక్షగొనియున్నాము. కావున నీయపరాధమును మన్నింపమైతిమి.

సుగ్రీవునకు నాకుఁగల సఖ్యము నాకు సౌమిత్రికిఁగల సఖ్యమువంటిదే. వదలరానిది. మఱియు నది భార్యారాజ్యార్థము కలిగినదియే. సుగ్రీవుఁడు నా క్షేమమందే నిరతుఁడు. అట్టి స్నిగ్ధుని భార్య నపహరించిన నిన్నుఁ జంపక వదలు టెట్లు? సఖ్యము చేయుకాలమున నిన్ను వధింపఁ బ్రతిజ్ఞ చేసితిని. దానిం దప్పరాదు కదా. నా చెప్పిన యీకారణముల ననుసరించి నీవు చేసిన మహాపాపకార్యమునకుఁ దగిన దండనమే సాగినదని యంగీకరింపవలయును. నాయీకార్యము ధర్మసహితమే కాని యధర్మము కాదు. ధర్మనిరతుఁడగు మిత్రుఁడు కూడఁ దన చెలి కాని పగవానిని నిరసింపవలయు. నీవధర్మనిరతుఁడవే యైతివి. నీకుఁ గల్గిన యీశిక్ష నీపాపమునకుఁ బ్రాయశ్చిత్తమగునని యంగీకరింపక తప్పదు. వానరమా! మనువు సదాచారములను బోధించు రెండు శ్లోకములఁ జెప్పెను. ఆరీతిగా నిపుడాచరించితిని. ఆశ్లోకములను ధర్మాత్ములంగీకరించిరి. అవి యివి. పాపములను జేయువారు రాజులచే శిక్షింపఁబడుదురేని ఆపాపమద్దాన నశించుటయేగాక పుణ్యవంతులై సాధువులవలె స్వర్గమును బొందుదురు. భూపతి శిక్షించినను, వదలినను జోరునకు దొంగతనమునఁ గలుగుపాపము మాత్రము నశించును. శిక్షింపక వదలినయెడల రాజా దొంగ చేసిన పాపమును బొందును. ఇవి యా రెండు శ్లోకములు. ఇపుడు నీవెట్లు పాపము చేసితివో

యట్లే పూర్వమొకశ్రమణుఁడు పాపమాచరించెను. అపుడు మావంశమునఁ బూర్వుఁడు పూజ్యుఁడు నగుమాంధాత వానికి ఘోర శిక్షవిధించెను. నీవు నాశ్రమణుఁడునుగాక నితరు లెందఱో రాజు లేమఱియుండుతఱిఁ బాపముల నొనరించియున్నారు. రాజు లాప్రమాదముపీడి విమర్శించునపుడు వారికిఁదగిన వధాదిశిక్షలఁగావింతురు. దాన వారియఘములు తీఱు. ఇది యేకాలమునుండియో వచ్చుచున్న యాచారము. నీవీశిక్షకుఁ బరితపింపకుము. ధర్మానుసారమే నీకు వధదండనము గావింపఁబడినది. మేము స్వతంత్రులముగాము. శాస్త్రబద్ధులము. విధిరీతిగాఁ జరింపవలసినవారమే. కోపకరుణలకు లోఁబడి శిక్షించుట వదలుట యనువానికి లోఁబడఁజాలము. వీరా! మఱొక్కకారణము నాలకింపుము. అది మిగుల సహేతుకము. దాని నాలకింతువేని నాపైఁ గినియకయుందువు.

నన్ను యమలోకమునకుఁ బంపుదునంటివే. డాఁగియుండి వధించితివికదా యంటివి. నీవిట్లు దూఱినందులకు నాకించుకంతయు మనఃపరితాపము కలుగదు. కోపముకూడ లేదు. మానవులు డాఁగియుండియో, అగపడుచుండియో, వలలచేతనో, పాశాదినానావిధకపటవర్తనములచేతనో వనములనుండు ననేకమృగములను బట్టుచుందురు. మాంసార్థులగు మానవులు వనులమృగములు పాఱుచుండఁగాని భయపడియుండుతఱిఁగాని నిర్భయముగానుండునపుడుగాని ఏమఱియున్నతరుణమునఁగాని జాగ్రత్తగా నున్నప్పుడుగాని వదలక చంపుచుందురు. ఇందు దోషమేదియుఁ గన్పట్టదు. ధర్మపరతంత్రులగు రాజర్షులును గాననముల వేఁటకై పోవుచుందురు. నీవో శాఖామృగమవు. కాన మృగజాతియందంత

ఖ్యాతుఁడ వగుదువు. కాన నీవు నాతో నని చేయుచున్నఁ గాని చేయకున్నఁగాని యాలోచింప నక్కఱలేదు. సుగ్రీవు నితోఁ బోరుచుండఁగా నిన్ను బాణమున వధించితిని. దుర్ల భములగు ధర్మజీవనశుభముల నెల్లరకు రాజులే కల్గింతురు. సందియమే యిందు లేదు. దేవతలే మానవాకృతులఁదాల్చి భూమి నవతరించి ధర్మము గాపాడుపొంటె నాయారాజులుగాఁ దిరుగుచుందురు. కనుక వారి నేవిషయమునందును దూఱుట న్యాయ్యముకాదు. ధర్మమును వదలి కేవల రోషమూనితివి. కనుకఁ దండ్రితాతలనాఁటినుండి వచ్చు ధర్మమునం బ్రమా దము లేక వర్తిల్లు నన్ను నెంతయు దూషించెదవు.

శ్రీరాముఁ డిట్లు తెలుపఁగా వాలి ధర్మమును జక్కఁగాఁ దెలిసికొని తనను జంపుట యధర్మముకాదని నిశ్చయించి రాము నంతగా నిందించినందులకుఁ బశ్చాత్తాపమందెను. అంత వాలి శ్రీరాముంగాంచి దోసిలొగ్గి పురుషోత్తమా! నీవు వచించిన దంతయు సత్యము. నిస్సందేహము. ధర్మము సూక్ష్మము. అని గ్రహించుట గొప్పవిషయము. ఆవిషయమం దల్పమతికి నుత్తర మీయఁదరముకాదు. సర్వజ్ఞుఁడవగు నీవు చెప్పినందులకు నత్యల్పుఁడ నగు నేనుత్తరము చెప్పలేనని వచింపనేల? సుగ్రీ వుని విషయమునఁ గావించిన నాయపరాధమును దెలియక నిన్ను దూఱిన తప్పును క్షమింపవలయును. సకలార్థవేత్తవు. తత్త్వజ్ఞుఁడవు. ప్రజలకు హితైకకరణదక్షుఁడవు. శిక్ష యిది యని, దానికి హేతువగు నఘ మిట్టిదని తెలిసికొనువిషయ మున నీబుద్ధి నిర్మలమై నిశ్చయజ్ఞానముకలది. మహాత్మా! చేయఁదగుధర్మమును నేఁజేయనైతిని. ఒనరింపరానియక్ర మము నేచేసితిని. ఇట్టిపాపమతిని నన్ను ధర్మ్యమగు నీమాటచే

క్షమించితి నని పల్కి కాపాడుమా. వధింపఁబడితి నని నిన్నుఁ దారను బంధువులను గూర్చి రవంతయు నాకు దుఃఖము లేదు. గుణులయందు మేటివై బంగరు నంగదములచే నేత్రానంద మును గలిగించు ప్రియపుత్త్రు నంగదుని గుఱించియే నాకు మిగుల దుఃఖము గలుగుచున్నది. జననాదిగా వాఁ డుపలా లింపఁబడుచు నిముసమైన నన్నుం జూడక యుండఁజాలని వాఁడు గాన నేను మృతినొందినవెనుక నన్నుం గానఁజాలమి దీనుఁడై నీరంతయు నింకిపోవఁగాఁ దటాకమెండిపోవు రీతిఁ గృశింపఁగలఁడు. లేక లేక యెన్నియో వ్రతోపవాసాదినియ మములచే వీఁడొకఁడు తారయందుఁ గల్గఁ జూడంజాలితి. అజ్ఞానుఁడు. ప్రియైకపుత్త్రుఁడు. బలశాలి. వీనిని నీవు రక్షింప వలయును. సుగ్రీవాంగదులయందు సమానబుద్ధి నునుపుము. వీ రెవరు తప్పు చేసినను శిక్షించువాఁడవు రక్షించువాఁడవును నీవేకదా. కావున నిరువురిని సమముగాఁ జూడుము. మహాత్మా! భరతలక్ష్మణులయందు నెట్టి ప్రీతికలదో యట్టి ప్రీతినే వీరిద్దఱి యందు నునుపుము. తార నిర్దోషురాలైనను నాకుఁ బత్ని గావున నాదోషముం బట్టి యదియు సుగ్రీవునకు దోషము కావించినట్లే యగును. కానఁ దార నవమానింపకయుండ సుగ్రీవు నాజ్ఞాపింపుము. నీయనుగ్రహపాత్రునకు రాజ్య పాలనమెంత? నీచే మృతినొందవలయునను కోర్కి యున్నం దున నన్నుఁ దార యెంతదూరము పోవలదని వారించినను దమ్మునితో యుద్ధము చేయవచ్చితిని. అని యావానరేశ్వ రుఁడు రామునకు విన్నవించి యూరకుండెను.

అట్లు మోహముం బాసి నిర్మలజ్ఞానసంపన్నుఁడై యుండు వాలింగని శ్రీరాముఁడు ధర్మరూపము విశదమగునట్లు సాధు

వాక్కుల నిట్టులనియె. కపీశ్వరా! నీకుమారుని రక్షణవిష యమై యించుకయు సంతాపము నొందకుము. అకృత్యము చేసితిమని మిమ్ముగూర్చికాని విచారింపవలదు. తమ్ముని భార్య నపహరించి పాతకముచేసితినని నిన్ను గుఱించియేని విచారిం పకుము. నీపాతకమునకుఁ దగినశిక్ష విధించితిమి. ధర్మమని నమ్మినందున మమ్ముఁగూర్చి విచారింపము. తగిన ప్రాయశ్చిత్తము గలుగుటం జేసి నిన్ను గుఱించియు విచారింపము. ఏభూపతి దండ్యునియందు దండమును బ్రయోగించునో, దండ్యుఁ డెవఁడు దండితుఁడగునో వారిరువురును బాపమునకు భయం పడవలసినవారుకారు. వారిరువురు కృతార్థులే. నీవు విధి ప్రకారము శిక్షింపఁబడితివి. కాన నీపాపము నశించెను. కృతార్థుఁడవైతివి. వానరవర్యా! నీమదింగల శోకమోహ భయములను వదలుము. నిరర్థకపరితాపమేటికి? ప్రారబ్ధకర్మ రూపమగువిధి నతిక్రమింప నీకుఁ దరమగునే? అంగదుఁడు నీయందేభావము గలిగియున్నాఁడో సుగ్రీవునియందు నా యందు నట్టిభావమునే కలిగి సుఖించుఁగాక. అని యిట్లు రాముఁడు ధర్మహితముగాఁ బలికిన విని యావాలి మహా ప్రభూ! నీవు దేవేంద్రసమానుఁడవు. భయదవిక్రముఁడవు. కాన నేను నీబాణముచేఁ బ్రజ్ఞదప్పి తెలివిమాలి నిన్ను మిగుల దూషించితిని. ఈయపరాధమున నీమనస్సు కలఁగక యుం డుఁగాక యని వేఁడుచున్నాఁడను. కాన నన్ను ననుగ్రహింపు మని ప్రార్థించెను.

మహాశయులారా! చక్కఁగా విమర్శింపఁదగిన తావిది. ఓపికమై విమర్శింతము. తొలుదొలుత శ్రీరాముఁడు భగవం తుఁడని, అతఁడేమిచేసినను న్యాయ్యమేయని, శాస్త్రచర్చ తద్వి

షయమున నక్కఱలేదని యూహింపక, రాముని సామాన్య మానవునిగా భావించి యీకార్యమున నతఁడుచేసిన పద్ధతి యుక్తమాయని విమర్శింతము. వాలి ప్రశ్నములకు శ్రీరాముని యుత్తరములకు శాస్త్రమెంతదనుకఁ దోడుపడుననియుఁ బరికింతము. ప్రశ్నోత్తరముల బలాబలములను లోకసామాన్యదృష్టిం బరిశీలింతము. ఇందు మొదట రాముని యుత్తరము లేప్రశ్నములకో తెలిసికొనందగుఁగదా.

> "ఇత్యుక్తః ప్రశ్రితం వాక్యం ధర్మార్థసహితం హితం,
> పరుషం వాలినా రామో నిహతేన విచేతసా. ౧
>
> ... ... ... ... ...
>
> ధర్మార్థగుణసంపన్నం హరీశ్వరమనుత్తమం,
> అధిక్షిప్తస్తదారామః పశ్చాద్వాలినమబ్రవీత్." 3

అని మూలము. వాలియాక్షేపములు పరుషములుగానున్నను ధర్మార్థయుక్తములు హితములు నగునని వాల్మీకియే యంగీకరించెను. అనఁగా వాలి యక్రమముగ రాముని దూషింపలేదనియు, శాస్త్రము ననుసరించి నీవుచేసినది న్యాయ్యము కాదని తెలిపెననియు భావము. రాముఁడాయాక్షేపముల కాగ్రహింపక ధర్మార్థయుక్తము గుణవంతమునగు వాక్పుంజముననే యుత్తరము చెప్పెననియు వాల్మీకి తేటపఱిచెను. ఆక్షేప సమాధానములు రెండును శాస్త్రములే యగునేని ఆశాస్త్రము గోడమీఁదిపిల్లివలె నుండుననవలయు. ఎవరికెట్లు లభిప్రాయము కలుగునో యట్లు లర్థమగునెడల నాశాస్త్రము ప్రమాణము కానేరదు. అందు సామాన్య విశేషభావము లుండవలయును. ఆదృష్టిచేఁ బరిశీలింపకయున్న శాస్త్రము వ్యర్థమన

వలయును. అట్లనుట మంచిదగునా? ఏనాఁటికిఁ గానేరదు. కావున ధర్మములు రెండుపక్షముల కనుకూలములుగనున్నను బలాబలముల నిర్ణయించునపుడు సామాన్య విశేషశాస్త్ర మర్యాదల ననుసరింపవలసినదే. వాల్మీకి యీయిరువురు చెప్పినమాటలు ధర్మార్థయుక్తములే యనియెను. కావున వారిమాటను ద్రోసివేయ నెవరికిఁ దరముగాదు.

"లౌకికానాం హి సాధూనామర్థం వాగనువర్తతే,
ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి."

అన్నసూక్తి ప్రసిద్ధమే కదా. కావున నోపికమై విమర్శింతము. వాలి రాముని దూషింపలేదనియు, లోకాచారమును బాటించియే యాక్షేపించెననియు మనము తలంచినఁగాని న్యాయము పాడకట్టదు. ఉత్తమ ప్రాడ్వివాకులము గావలయును. ప్రాడ్వివాకుఁ డనఁగా.

"అర్థిప్రత్యర్థినౌ పృచ్ఛతీతి ప్రాట్. తయోర్వచనం విరుద్ధ మవిరుద్ధం చ సభ్యైస్సహ వివినక్తి వివేచయతి వేతి వివాకః. ప్రాట్చాసౌ వివాకశ్చ ప్రాడ్వివాకః. ఉక్తంచ.

వివాదానుగుణం పృష్ట్వా ససభ్యస్తత్ప్రయత్నతః,
విచారయతి యేనాసౌ ప్రాడ్వివాకస్తతస్స్మృతః." ఇతి.

అను యాజ్ఞవల్క్యస్మృతియం దుదాహరించిన విజ్ఞానేశ్వర పండితాభిప్రాయము చొప్పును మన మనుసరింతము.

"ధర్మమర్థం చ కామం చ సమయం చాపి లౌకికం,
అవిజ్ఞాయ కథం బాల్యాన్మామిహాద్య విగర్హసే. ౪
అపృష్ట్వా బుద్ధిసంపన్నాన్ వృద్ధానాచార్యసమ్మతాన్,
సౌమ్య వానరచాపల్యాత్త్వం మాం వక్తుమిహేచ్ఛసి." ౫

అని మూలము. ఇది సపత్నీకలహమువంటి సమాధానమే. వారియాక్షేపము ధర్మార్థయుక్తము హితము నైనపు డిట్లు రాముఁడు బదులుపలుకుట సవతుల కొట్టులాటవంటిది గాక మఱేమగును? మాటకుమాట బదులుచెప్పుటవంటిదే యన వచ్చును. కాని యించుక విశేషమున్నది. లౌకికములగు నాచారములనెఱుంగవని రాముఁడు పలికెను. సమయమనఁగా నిట నాచారమని యర్థము. ధర్మార్థకామముల మాత్ర మెఱింగినఁ జాలదనియు, లోకులయాచారము లెట్లున్నవనియు నెఱుంగవలయుననియు నిటఁగల విశేషము. ఏధర్మమున కే దేశమున నెట్టియర్థము నూహించి పెద్ద లనుసరింతురో యది యాచారమని తాత్పర్యము. "అయమశ్వారోహకః" అన్న వాక్యమునకుఁ గొన్నితావులనుండు పెద్దలు సురాపానము చేసినవాఁడని యర్థము చెప్పుదురు. ఆయర్థము శబ్దనిష్ఠముగానే రదు. ఆయర్థమున నచ్చటివారావాక్యము నుపయోగింతురని తాత్పర్యము. ధర్మము సూక్ష్మము. దానితత్త్వమును బుద్ధిసంపన్నులై వయోవృద్ధులై ఆచార్యసమ్మతులై యుండువారి నడిగి తెలిసికొనక జాతినైజమున నన్నేల నిందింపఁ దలఁచెదవు? అని రాముఁడు వాలి నాక్షేపించెను. ఇందాచార్యులనఁగా వైష్ణవ శ్రీవైష్ణవ మధ్వవైష్ణవులని యర్థముగాదు.

> "ఉపనీయ తు యశ్శిష్యం వేదమధ్యాపయేద్ద్విజః,
> సకల్పం సరహస్యం చ తమాచార్యం ప్రచక్షతే." మను.

> "స గురుర్యః క్రియాః కృత్వా వేదమస్మై ప్రయచ్ఛతి,
> ఉపనీయ దదద్వేద మాచార్యస్స ఉదాహృతః." యాజ్ఞవ.

అను స్మృతు లనువదించినవారనియే యర్థము గ్రహింపవల

యును. అట్టిమహానుభావు లేయేయర్థముల ననుసరించి వ్యవహారింతురో యావ్యవహారమే సదాచారమనవలయును. దాని నెఱుంగుట ముఖ్యమని రాముఁడు తెలిపెను. శాస్త్రము ద్వివిధముగా నుండునపు డేదేశమునఁ బెద్ద లేధర్మము ననుసరింతురో యది యాదేశపు శాస్త్రవ్యవహారమని యెఱుంగవలయు. ఇతరదేశస్థు లద్దానిని శాస్త్రీయము కాదనరాదని భావము. సదాచారమనఁగా నవియే. శిష్టాచారము వేఱు.

"శిష్టాచారః పరిగ్రాహ్యశ్శ్రుతిస్మృత్యోరభావతః."

అనుస్మృతివాక్యము ననుసరించి శాస్త్రప్రమాణము లేనిచోటఁ బండితు లొకరీతి వ్యవహారింతురు. అవి శిష్టాచారమనఁబడును. ఇట్టి భేదములను జక్కనెఱుంగవలయునని రాముఁడు తెలిపెను. ఇంతదనుక వాలి ప్రశ్నలకు సమాధానము రాలేదు. కాని నన్ను నిందించి లాభము లేదను నర్థము తేలును. "సౌమ్య" యను విశేషణము వాలినిగూర్చి రాముఁడు ప్రయోగించెను. ఇది శ్రీరామున కాతనియందాగ్రహము లేదను విషయమును బోధించును. దూషించినను భూషించినను సమానదృష్టిం గాంచుటయే కదా పరమేశ్వరత్వము సర్వసాక్షిత్వమునగును ? అవి లేనిచో మనవంటివాఁడే శ్రీరాముఁడు ననవలయుఁగదా. దీని సారమేమి ? శాస్త్రమును జదువుటమాత్రమే చాలదు. దాని భావమెద్దియని యాయాయిదేశములనుండు మహాత్ములు నిర్ణయించి యనుసరింతురో దానిని దెలిసికొనవలయుననియు, నప్పటికే దాని యర్థమును జక్కఁగా గ్రహించినవాఁడగు ననియు నిందలిసారమని మన మెఱుంగవలయును.

"ఇక్ష్వాకూణామియం భూమిస్సశైలవనకాననా,
మృగపక్షిమనుష్యాణాం నిగ్రహప్రగ్రహావపి. ౬

తాం పాలయతి ధర్మాత్మా భరతస్సత్యవాగృజుః,
ధర్మకామార్థతత్త్వజ్ఞో నిగ్రహానుగ్రహే రతః. ౭

నయశ్చ వినయశ్చోభౌ యస్మిన్ సత్యం చ సుస్థితం,
విక్రమశ్చ యథాదృష్టస్స రాజా దేశకాలవిత్. ౮

తస్య ధర్మకృతాదేశా వయమన్యే చ పార్థివాః,
చరామో వసుధాం కృత్స్నాం ధర్మసంతానమిచ్ఛవః. ౯

తస్మిన్ నృపతిశార్దూలే భరతే ధర్మవత్సలే,
పాలయత్యఖిలాం భూమిం కశ్చరేద్ధర్మనిగ్రహం. ౧౦

తే వయం ధర్మవిభ్రష్టం స్వధర్మే పరమే స్థితాః,
భరతాజ్ఞాం పురస్కృత్య నిగృహ్ణీమో యథావిధి." ౧౧

అని మూలము. ఇది రామునియుత్తరము. ఇది వాలివగు ప్రథమ ద్వితీయ చతుర్థ పంచ మాష్టమ నవమప్రశ్నరూపాధిక్షేపములకుఁ గొంతభాగమునకు సమాధానమనవలయును. రాజలక్షణములు కనఁబడునుగాని వాస్తవముగా నీయందవి లేవనియుఁ జాటుననుండి కొట్టుట ధర్మవిరుద్ధమనియు నిది నీచ మానవుల కార్యమే యగుననియు దాంభికుఁడవనియు నీయందు మోసమే కనఁబడుచున్నదనియు మహావంశమునఁబుట్టియు నీవిట్లు చేయుట క్రమమగునాయనియు వాలియాశయసారము. దీనికి శ్రీరాముఁడిచ్చినయుత్తరము చాలదనవలయు. యుక్తియుక్తముగను లేదు. ఏదో ప్రశ్నమునకెట్లో సమాధానము చెప్పినట్లే యున్నదిగాని తగినట్లు గానరాదని కొందఱందురు. నిపుణముగా నాలోచింతము. ప్రాయికముగా లోకులొక్కొక్క రొక్కొక్కధర్మమునే ప్రధానముగా భావింతురు. దానిని రక్షించుటయే పరమపురుషార్థమనుకొందురు. జీవితమెల్ల దా

నిక్కై వ్యయింతురు. యశోగ కాయులగుదురు. అంతియగాని సర్వ ధర్మముల నొక్కఁడాచరింపఁజాలఁడు. ఇది సిద్ధాంతము. రాముని జీవితమున మూఁడు ధర్మములను ప్రధానములుగా భావించి వానిని రక్షించుటయే తన కార్య మనుకొనినట్లు మనమూహింప వచ్చును.

ఏకపత్నీవ్రతము.
సోదరప్రీతి.
శరణాగతరక్షణము.

తక్కినవాని వదలనిష్టపడునని కాదు. ఇవ్వి మిక్కిలి ముఖ్య ములని రామునాశయ మనవచ్చు. వాలి సోదరప్రీతి లేనివాఁ డనియుఁ, బరదారరతుఁడనియుఁ, గావున వధ్యుఁడనియు శ్రీరాముఁడు తలంచెను. ఈయర్థ మెద్దానింబట్టి చెప్పుదువని నన్ను మీరడుగవచ్చును.

"కిం నిమిత్తమభూద్వైరం శ్రోతుమిచ్ఛామి తత్త్వతః. ४०
సుఖం హి కారణం శ్రుత్వా వైరస్య తవ వానర,
ఆనంతర్యం విధాస్యామి సంప్రధార్య బలాబలం." ४౨

అని యీకాండమున నెనిమిదవసర్గమునఁ గలదు. త్వరపడి వాలిని జంపఁ బ్రతిజ్ఞ చేయలేదని యీప్రశ్న మే తెలుపును. కావునఁ బైవ్రాసిన యూహ నిరాధారము కానేరదు. వాలి యందుఁగల నీరెండుదోషములు రాముఁడు సహింపఁజాలఁడు. తనయీయవతారమున ముఖ్యముగా రక్షింపవలసిన ధర్మము లే యివియని నిశ్చయించుకొని యున్నవాఁడు కాన లోకమున నింతకన్న మహాపాపములేదని యతఁడు తలంచెను. కావున

నాతని ప్రశ్నములకు నుత్తరము లీరీతిగా నిచ్చెనని మనమెఱుంగవలయు. ఈభూమండల మైక్ష్వాకువులది. అందు భరతుఁడిపుడు పాలకుఁడు. సత్యసంధాది గుణములు కలవాఁడు. ఆతని యాదేశము ననుసరించి మేము తక్కినసామంతరాజులు ధర్మరక్షణార్థము తిరుగుచున్నాము. ఆభరతుని పాలనమునం దెవ్వఁడు ధర్మము తప్పి వర్తింపఁగలఁడు? మేము ధర్మైకపరతంత్రులము. నీవు ధర్మవిముఖుఁడవు. భరతునాజ్ఞననఁగా ధర్మభ్రష్టుల శిక్షింపవలయునన్నదానిని బురస్కరించుకొని శాస్త్రమర్యాద ననుసరించి నిన్ను శిక్షించితిమి. అని రాముని యుత్తరమునఁగలసారము. దీనిని విమర్శింతము. భరతుఁడు రాజగునా? అని కొందఱందురు. కాని యది మంచి ప్రశ్నము కాదు. పాదుకలయందు రాజ్యభార మునిచినను నిగ్రహానుగ్రహములు భరతునివే యగును. కాన భరతుఁడే రాజనవలయు. ఆభరతుఁడు రాజధర్మము ననుసరించి యాజ్ఞనేయఁగా మేమును దక్కినరాజులు (అనఁగా సామంతరాజులుననియే చెప్పవలయు) ధర్మపరంపరను బోషించుచుఁ దిరుగుచున్నాము. అను రామవాక్యము సత్యము కాదు అబద్ధము.

"అనృతం నోక్తపూర్వం మే న చ వక్ష్యే కదాచన,
ఏతత్తే ప్రతిజానామి సత్యేనైవ చ తే శపే." ౨౨

అని యీకాండమున సప్తమసర్గమున రామునివాక్యమే కలదు. కావున నిది యసత్యవాక్యమని కొందఱందురు. అట్టివారు త్వరపడక యీసమాధానము నాలకింపవలయును.

"బాలోఽపి నావమంతవ్యో మనుష్య ఇతి పార్థివః,
మహతీ దేవతా హ్యేషా నరరూపేణ తిష్ఠతి." ౧

ఏకమేవ దహత్యగ్నిర్నరం దురుపసర్పిణం,
కులం దహతిరాజాగ్నిస్సపశుద్రవ్యసంచయం. ౯
కార్యం సంవేక్ష్యశక్తించ దేశకాలౌ చ తత్త్వతః,
కురుతే ధర్మసిద్ధ్యర్థం విశ్వరూపం పునఃపునః. ౧౦
యస్య ప్రసాదే పద్మాశ్రీర్విజయశ్చ పరాక్రమే,
మృత్యుశ్చ వసతి క్రోధే సర్వతేజోమయో హి సః. ౧౧
తం యస్తు ద్వేష్టి సమ్మోహాత్స వినశ్యత్యసంశయం,
తస్య హ్యాశు వినాశాయ రాజా ప్రకురుతే మనః. ౧౨
తస్యార్థే సర్వభూతానాం గోప్తారం ధర్మమాత్మజం,
బ్రహ్మతేజోమయం దండమసృజత్పూర్వమీశ్వరః." ౧౪

మను. ౭-అధ్యా.

అను నీస్మృతివాక్యముల ననుసరించి యోజింపఁగా రాజును దేవతగా భావింపవలయుననియు, నష్టదిక్పాలకుల యంశమే రాజనియు, నతని యాగ్రహమునకుఁ బాత్రులుకారాదనియుఁ దేలెడిఁగదా. రాజువిషయమున జ్యేష్ఠ కనిష్ఠభావము లూహింపరాదు. భరతు నాజ్ఞానుసారమనఁగా రాజధర్మము ననుసరించియని యర్థము. ధర్మరక్షణము చేయుటయే రాజాజ్ఞ. కాన నాతనియానతి యెల్లరకు నున్నయట్లే యర్థము. దండకాటవులకుఁ బోయి వాలిని జంపుమని యాతనియానతియందున్నట్లూహింపవచ్చునా యందురేని, భరతుని సమ్మతింపఁజేసి వనముల నివసింపఁ దానువచ్చినందున నెందుఁగాని దుష్టశిక్షణము శిష్టరక్షణము చేయఁదగునన్నది రాజధర్మమైనందున, నతని యానతిచొప్పునఁ దిరుగుచున్నవాఁడనని రాముఁడు పలుకుట న్యాయేతరము కానేరదు. భరతుఁడు పాలకుఁడుగా నుండఁగా

నెవఁడు ధర్మము తప్పఁగలఁడు? అను రామువాక్యమునఁగల విశేషమేమనఁగా నిక్ష్వాకువంశజుఁడు భూమినేలు నంతకాలము ధర్మమునకు భ్రంశము కలుగదనునదియే. ధర్మైకనిరతులము మేమగుట ధర్మభ్రంశము గావించిన ననఁగా సోదరుఁ బాఱఁదోలి తద్భార్యను గ్రహించి సుఖంచునది యేదియో యదియే ధర్మహానియని యర్థము. అట్టినీకుఁ దగినశిక్ష విధించితిమని రాముఁడన్నది న్యాయ్యమే. రాజధర్మము ననుసరించి నీవంటి మహాపాపకార్యనిరతునకుఁ దగినశిక్ష విధించితిమని శ్రీరాము నాశయము. పరదార సంగ్రహణమునకు మరణదండనము శాస్త్రవిహితమా యన్న ప్రశ్నమునకు సమాధానమా ప్రస్తావముకలచోట వ్రాయుదును.

"త్వం తు సంక్లిష్టధర్మా చ కర్మణా చ విగర్హితః,
కామతంత్రప్రధానశ్చ న స్థితో రాజవర్త్మని. ౧౨
జ్యేష్ఠో భ్రాతా పితా చైవ యశ్చ విద్యాం ప్రయచ్ఛతి,
త్రయస్తే పితరో జ్ఞేయా ధర్మ్యే పథిహి వర్తినః. ౧౩
యవీయానాత్మనః పుత్త్రశ్శిష్యశ్చాపి గుణోదితః,
పుత్త్రవత్తే త్రయశ్చింత్యా ధర్మశ్చేదత్ర కారణం. ౧౪
సూక్ష్మః పరమదుర్జ్ఞేయస్సతాం ధర్మః ప్లవంగమ,
హృదిస్థస్సర్వభూతానామాత్మా వేద శుభాశుభం. ౧౫
చపలశ్చపలైస్సార్థం వానరై రకృతాత్మభిః,
జాత్యంధ ఇవ జాత్యంధైర్మంత్రయన్ ద్రక్ష్యసేను కిం." ౧౬

అని మూలము. ఇది రామునియుత్తరము. వాలి ప్రశ్నముల లోని యాఱవ యెనిమిదవ తొమ్మిదవ ప్రశ్నములలోఁ గొంత భాగమున కిది యుత్తరమగునని యూహింపవలయును. పర

సతీసంగమము భ్రాతృద్వేషము ననునివి శ్రీరాముని మతమున మహాపాతకము లగుటం జేసి యవ్వానికొఱకు వధించితినను టయే యుత్తరసారము. వాలీ ! ధర్మమునకు హానిగల్గించితివి. కర్మము చే నిందితుఁడవు. కామవ్యాపారపరాయణుఁడవు. రాజధర్మభ్రష్టుఁడవు. కావున నీకీశిక్ష తగినదనియేకదా రాము నాశయము. అనఁగా సోదరుని దఱిమివేయుట ధర్మవిరుద్ధము. తద్భార్యనపహరించుట దుష్కర్మము. తద్గమనము కామ వ్యాపారమనికదా భావము. ఈమూఁడుకార్యములు వధదం డమున కర్హములాయని యూహయుదము. వీనికిఁ గారణములు రాముఁ డేమని తెల్పెను ? పితృశబ్దవాచ్యులు మూవురు. తోఁబుట్టువులలోఁ బెద్దవాఁడు. కన్నవాఁడు. విద్యాప్రదాత. వీరు ధర్మమార్గమున నడచువారికిఁ దండ్రులు. అనుజుఁడు, కుమారుఁడు, గుణవంతుఁడగు శిష్యుఁడు వీరు మూవురు పుత్త్రులు. ధర్మమును దాఁటినవారు వేఱుగా భావింపవచ్చును. ధర్మము నాదరించువారు పుత్త్రులుగనే యెంచవలయును. ధర్మమతిసూక్ష్మము. అనఁగా నింద్రియములకు గోచరింపనిది. సాధువులు కూడ దాని నెఱుంగుటకు శక్యముకాదు. నీవంటి వాని కది తెలియఁదరమా ? సర్వభూతముల హృదయగతుఁ డగు పరమాత్మ శుభాశుభకర్మముల నెఱుంగంజాలును. ఇతరులెఱుంగఁజాలరు. చపలస్వభావముగల నీవు చపలులగు వానరులతో నెంత యాలోచించినను లాభములేదు. గ్రుడ్డి వాఁడు మఱొకగ్రుడ్డివాని నాశ్రయించినట్టులగును. అని కదా రామునిమాటలకర్థము. ఈయుత్తరము వాలిప్రశ్నములకుఁ దగినదేనా ? అని విమర్శింతము. సుగ్రీవుఁడు నీకు నంగదుని

వంటివాఁడు. అనఁగాఁ గుమారునివంటివాఁడు. తత్త్యాగము దోషము.

"పితృపుత్రస్వసుభ్రాతృదంపత్యాచార్యశిష్యకాః,
ఏషామపతితాన్యోన్యత్యాగీచ శతదండభాక్." ౨౩౭

యాజ్ఞవల్క్యస్మృతి.

"పరదారాభిమర్శేతు ప్రవృత్తాన్ నౄన్ మహీపతిః,
ఉద్వేజనకరైర్దండైశ్ఛిన్నయిత్వా ప్రవాసయేత్." ౩౫౨

మనుస్మృతి.

గుణవంతుఁడగు సోదరుని ద్యజింపరాదనియుఁ బరభార్యను గోరరాదనియు నట్లుగానిచో శిక్షార్హులనియు వీని భావము. ఈరెండు దోషములు వాలియందుఁ గలవని రాముఁడు తేటపఱచెను. వీనికిఁ బ్రాణాంతకరమగు దండము చెప్పఁబడలేదు. నీవగమ్యాగమనము చేసితివి. అందును బ్రభువవు. నీవంటివాఁడే యిట్లు చేసిన నిన్నుఁ జూచి యితరులు నేర్చుకొందురు. కావున నీకు ఘోరశిక్ష విధింపవలయునని రాము నాశయమని కొందఱందురు. పుత్త్రభార్యను బలవంతముగా గ్రహించిన రాజిక నెట్టి పాతకముల నొనరింప జంకునాయని రాము నాశయమనఁగూడదా. సామాన్యమానవులకంటె రాజున కెక్కువ శిక్షవిధింపఁబడవలయుఁగదా. కావున వధదండనమే రాముఁడు విధించె ననవలయును. ఈసమాధానముకూడ బలహీనమైనదియే కాని ప్రబలము కాదనవలయును. ఆపక్షమున శ్రీరామునికార్య మకార్యమే యనవలయుఁ గదా యని యడుగువారుండకపోరు. శ్రీరాముని యుత్తరమున నొక్క విశేషము కలదు. సర్వభూతముల హృదయమున నెలకొని

యుండు భగవంతుఁడు తప్పఁ దక్కినవారెవ్వరు సూక్ష్మధర్మ
ముల నెఱుంగరు. అనఁగా నర్థమేమి ?

"కర్మణోహ్యాపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః,
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః."

అన్న గీతావాక్యార్థమే కదా. వానరేంద్రా! భూతకోటి
హృదయగతుఁడగు నీశ్వరుఁడను నేను. నీకర్మఫలముల నే
నెఱుంగుదును. శుభాశుభకర్మఫలముల నిచ్చునది కర్మము.
దాని గతులు దురూహములు. నీవంటి చపలాత్ములకుఁ దెలిసి
కొనఁదగినవి కావు. రాఁగలమృతి నెఱుంగక యిదియే శాశ్వత
మనుకొని తమ్ముని బాఱఁదోలి తద్భార్యను గ్రహించి యతఁడు
వగలఁ బొగులుచుండ నామెంగూడి సుఖించుచున్నవాఁడవు.
ప్రారబ్ధకర్మఫల మిదియేయని నమ్ముము. అని శ్రీరాముని
యాశయవిశేషము. లేకున్న నీసమయమున నీశ్లోకమున కవ
కాశమే లేదు. అనఁగా నాబాణము నిమిత్తమాత్రమే. ఆయు
రంతమైనది. ప్రశ్నములడిగి లాభములేదు.ఎన్నియోకర్మముల
ఫల మీరూపమున నీకొడఁ గూడినది. కాన ధర్మమాయని
నన్నుఁ బ్రశ్నింపకుము. ధర్మసూక్ష్మ మిదియే యని యిట
శ్రీరాముని యుపదేశము. అని యంతమానుకొనక లోకులకు
సంశయములు కలుగకుండుటకై రాముఁ డిట్లు పలుకు
చున్నాఁడు.

"అహం తు వ్యక్తతామస్య వచనస్య బ్రవీమి తే,
న హి మాం కేవలం రోషాత్త్వం విగర్హితుమర్హసి. ౧౭
తదేతత్కారణం పశ్య యదర్థం త్వం మయా హతః,
భ్రాతుర్వర్తసి భార్యాయాం త్యక్త్వా ధర్మం సనాతనం. ౧౮

అస్య త్వం ధరమాణస్య సుగ్రీవస్య మహాత్మనః,
రుమాయాం వర్తసే కామాత్స్నుషాయాం పాపకర్మకృత్. ౧౯
తద్వ్యతీతస్య తే ధర్మాత్కామవృత్తస్య వానర.
భ్రాతృభార్యావమర్శేఽస్మిన్ దండోఽయం ప్రతిపాదితః. ౨౦
న హి ధర్మవిరుద్ధస్య లోకవృత్తాదపేయుషః,
దండాదన్యత్ర పశ్యామి నిగ్రహం హరియూథప. ౨౧
న హి తే మర్షయే పాపం క్షత్రియోఽహం కులోద్భవః."

అని మూలము. లోపలఁ దెలిపిన భావమున కిది వ్యాఖ్యానమే యనవలయును. ఒక్కవిశేషము కలదు. సంతానార్థమై నియోగించు పద్ధతి యాకాలమునఁ గలదు. ఎట్లనఁగా:—

"ఔరసానంతరం వశిష్ఠః.—

తదభావే నియుక్తాయాం క్షేత్రజో ద్వితీయః,
నియుక్తాయాంపత్యావాగురుభిర్వాద్వితీయః ఔరసాదీషన్న్యూనః."

అని వ్యాఖ్య.

"విష్ణుః.—

నియుక్తాయాం సపిండేనోత్తమవర్ణేన వోత్పాదితః క్షేత్రజో ద్వితీయః."

"మనుః.—

యస్తల్పజః ప్రమీతస్య క్లీబస్య వ్యాధితస్య వా,
స్వధర్మేణ నియుక్తాయాం స జ్ఞేయః క్షేత్రజస్సుతః.
తల్పో భార్యా. వ్యాధితస్య వేత్యత్ర వ్యాధిరప్రతికార్యో వివక్షితః. స్వధర్మేణ ఘృతాభ్యక్తత్వాదినా."

అని వ్యాఖ్య.

"యాజ్ఞవల్క్యః.—

క్షేత్రజః క్షేత్రజాతస్తు సగోత్రేణేతరేణ వా,
సగోత్రేణ స్వకులోద్భవేన ఇతరేణ ఉత్కృష్టవర్ణేన."

అని వ్యాఖ్య.

"బౌధాయనః.—

మృతస్య చ ప్రసూతో యః క్లీబస్య వ్యాధితస్య వా,
అన్యేనానుమతే స్వక్షేత్రే స క్షేత్రజః. స ఏవ ద్విపితా ద్విగోత్రశ్చ
ద్వయోరపి స్వధాఋ భాగ్భవతి."

"యాజ్ఞవల్క్యః.—

అపుత్రేణ పరక్షేత్రే నియోగోత్పాదితస్సుతః,
ఉభయోరప్యసావృక్థీ పిండదాతా ప్రకీర్తితః."

"నారదకాత్యాయనౌ.—

క్షేత్రికానుమతే బీజం యస్య క్షేత్రే ప్రజాయతే,
తదపత్యం తయోరేవ బీజక్షేత్రికయోర్మతం."

అని వివాదరత్నాకరమునఁ గలదు. ఆపద్ధతి ననుసరించి రుమను గ్రహించితినందువేమో వాలీ యదిగాదని రాముఁడు తెలుపు చున్నాఁడు. సుగ్రీవుఁడు జీవించియుండఁగా మరల్పరాని వ్యాధి బాధితుఁడు గాకయుండఁగా గుర్వాదుల యనుమతి లేకయుండఁగా నీవు సుగ్రీవపత్నిని గ్రహించుట సంగ్రహాణ మేయగుంగాని నియోగముకానేరదు. కనుక నీవు మహాపాప కర్మమును గావించినవాఁడవే యైతివి. అట్టి మహాపాపకార్య మునకుఁ బ్రాయశ్చిత్తముగా నీదండనము విధించితిమి. ధర్మము ను దృజించి లోకాచారమును మీఱి స్వేచ్ఛానుసారముగాఁ జరించు నీకు వధదండనము తప్ప వేఱుదండనము లేదు. కాన

నద్దానిని విధించితిమని రాముఁడనెను. ఇందు గోవిందరాజులు. వ్యాఖ్యవ్రాయుచు

"ధరమాణస్య జీవితం ధారయతః అనేన జీవతో భ్రాతుర్భార్యా భ్రాత్రా న గ్రాహ్యా. మృతస్య తు గ్రాహ్యేతి తత్కులధర్మ ఇతి ప్రతీయతే. అత ఏవహి వాలినో బిలగమనానంతరం మంత్రిభిరభిషిక్తస్య సుగ్రీవస్య తారా పరిగ్రహం రామో న నిందితవాన్. అత ఏవ ప్రాయోపవేశేఽంగదో వక్ష్యతి.—

భ్రాతుర్జ్యేష్ఠస్య యో భార్యాం జీవతో మహిషీం ప్రియాం,
ధర్మేణ మాతరం యస్తు స్వీకరోతి జుగుప్సితం. 3
కథం స ధర్మం జానీతే యేన భ్రాత్రా మహాత్మనా,
యుద్ధాయాభినియుక్తేన బిలస్య పిహితం ముఖం." ౪

కిష్కింధా కాం. ౫౫-సర్గము.

అని వ్రాసిరి. ఆచార్యులుగారికి లోకజ్ఞానము తక్కువయని తోఁచెడి. సుగ్రీవుఁడు బ్రదికియుండఁగా నతని భార్యను వాలి గ్రహించుట పాపమని రాముఁడనియెను. అన్నభార్య నుదారను సుగ్రీవుఁడు గ్రహించుట రామునకు సమ్మతమేయని యాచార్యులు వ్రాసిరి. స్మృతులాచార్యులుగారికిఁ దెలియవు కాఁబోలు. శ్రీరామున కావిషయము సుగ్రీవుఁడు తెలుపలేదు.

"తతోఽహం తైస్సమాగమ్య సమ్మతైరభిషేచితః,
రాజ్యం ప్రశాసతస్తస్య న్యాయతో మమ రాఘవ. ౨౧
ఆజగామ రిపుం హత్వా వాలీ తమసురోత్తమం,
అభిషిక్తం తు మాం దృష్ట్వా వాలీ సంరక్తలోచనః." ౨౨

కిష్కింధా. ౯-స.

అని యున్నది. తారను సుగ్రీవుఁడు సంగ్రహించినది శ్రీరామునకుఁ దెలియదనవలయును. ధర్మాతిక్రమణము నొనరించితివని

రాముఁ డనుచుండఁగా నిది రామునకు సమ్మతమే యని యా చార్యులు వ్రాయుట సుసంగతము కాదు. వాలి చచ్చెనని సుగ్రీవుఁడు తారను గ్రహించెనందురేమో యది యసంగత ప్రసంగముగా నుండును.

"భ్రాతుర్జ్యేష్ఠస్య భార్యాయా గురుపత్న్యనుజస్యసా,
యవీయసస్తు యా భార్యా స్నుషా జ్యేష్ఠస్య సా స్మృతా. ౫౭
జ్యేష్ఠో యవీయసో భార్యాం యవీయాన్వాగ్రజస్త్రియం,
పతితౌ భవతో గత్వా నియుక్తావప్యనాపది." ౫౮

"అనాపది సంతానాభావం వినా నియుక్తావపి పతితౌ స్యాతామ్."

అని కుల్లూకభట్టు.

"దేవరాద్వా సపిండాద్వా స్త్రియా సమ్యఙ్నియుక్తయా,
ప్రజేప్సితాధిగంతవ్యా సంతానస్య పరిక్షయే." ౫౯

మను. ౯-అ.

అని మనుస్మృతి పలుకుచున్నది. ధర్మవిరుద్ధముగా రాముఁ డంగీకరించెనని గోవిందరాజులు వ్రాయుట పాడిగాదు. తెలిసి యుండియు రాముఁడది యంగీకరించియుండిన నతనిచరిత్రమే పాపభూయిష్ఠ మనవలయును. ఆవిషయము శ్రీరామునకుఁ దెలియదు. సంతానార్థమొకరు నియోగింపకున్న నంగీకరింప రాదని స్మృతి తెలుపుచున్నది. వానరజాతియందది యాచార మందురేని శ్రీరాముఁ డద్దాని నాక్షేపింపరాదనియే యంగీక రింపవలయు. ఏజాతియందు నదిధర్మము కాదనియే శ్రీరాముని యాశయము. సమానాపరాధము నొకనియందు లేదని యంగీ కరించుటయు, నొకనియందది కలదని యాక్షేపించి శిక్షించుట యు న్యాయ్యమగునా? కాదు. పరభార్యాపహరణరూపమహా

పాపమును నిర్మూలించుట సోదరప్రీతిని లోకమునఁ బెంపొం దించుట, యెట్టియాపదలందుఁగాని శరణాగతుని విడువక రక్షించుట. దానఁగలుగు కష్టములను సుఖములని తలంచి సంతోషము ననుభవించుట యనునివియే శ్రీరామావతార మున భగవంతుఁన కిష్టములని మన మంగీకరింపవలయును. వాలికి మృతికాలము సమీపించినది. భగవంతునిచే మృతి గల్గునంతటి సత్కార్మము నతఁడుచేసియున్నాఁడు. కాన మృతి గల్గెను. ధర్మసూక్ష్మముల నీవెఱుంగవు. భగవంతుఁడు సకల భూతముల హృద్దేశమునసుండువాఁడే యెఱుంగును. అను మాటలయం దీభావ మిమిడియున్నదని మనము గ్రహింప వలయు.

"ఔరసీం భగినీం వాపి భార్యాం వాప్యనుజస్య యః. ౨౨
ప్రచరేత నరః కామాత్తస్య దండో వధస్స్మృతః,
భరతస్తు మహీపాలో వయం త్వాదేశవర్తినః. ౨౩
త్వం తు ధర్మా దతిక్రాంతః కథం శక్య ఉపేక్షితుం,
గురుర్ధర్మవ్యతిక్రాంతం ప్రాజ్ఞో ధర్మేణ పాలయన్. ౨౪
భరతః కామవృత్తానాం నిగ్రహే పర్యవస్థితః,
వయం తు భరతాదేశ విధిం కృత్వా హరీశ్వర. ౨౫
త్వద్విధాన్ భిన్నమర్యాదాన్ నియంతుం పర్యవస్థితాః."

అని మూలము. ఇదియు నించుమించుగా లోపలియుత్తరమున కనుబంధమే. కాని యించుకవిశేషము కలదు. కూఁతురు, తోఁ బుట్టువు, తమ్మునిభార్య యనువారితోఁ గామవృత్తము సాగిం చినవానికి వధదండమేయని శ్రీరాముఁడు శాసించెను. వాలి రుమను గామియై గ్రహించెను. అట్లే సుగ్రీవుఁడు తారను గూడ గ్రహించెననవలయు కాని ఆవిధమును రాముఁడెఱుం

గఁడు. వాలియు నావిషయమును బేర్కొనఁడయ్యెను. ఇంచు మించుగా నివి మాతృగమనమువంటివేయని రాముఁ డూహించెను.

"పురుషాణాం కులీనానాం నారీణాం చ విశేషతః,
ముఖ్యానాం చైవ రత్నానాం హరణే వధమర్హతి." 323

మను. ౮-అధ్యా.

ఇచట హరణమనఁగా దొంగలించుటయని యర్థము. ఇది సాహసప్రకరణమునఁ జేరును. కాని దొంగతనమునఁ జేరునాయని సంశయింపవలయును. హరణము ప్రధానము కాన రాముఁ డీయపరాధమునకు వధదండమే న్యాయ్యమని తీర్మానించెను. ఇవన్నియు మానవసామాన్యములుగాని శాఖామృగములగుట మృగజాతియందుఁ బరిగణింపఁదగిన వానరములయందు సమన్వయింపఁదగునా యను ప్రశ్నము వచ్చును. ముందు రాముఁడే మృగవధము చేయుపద్ధతిని జెప్పఁబోవును గదా. సమాధాన మేమనఁగా. వానరులందఱుఁ గాకున్నను హనుమదాదులు కామరూపులు. వానరులవలె నుండువారు కారు. స్నానసంధ్యాదులు వానరములకెక్కడివి? కోఁతుల వంటివృత్తి యాయాకారమునం దిష్టముకలవారు. రాజ్యపాలనముచేయుట మొదలగువానింబట్టి మానవజాతివంటిదే యీజాతియని మన మన్వయించుకొనవచ్చును. కొన్ని ధర్మములట్టివి. కొన్ని మానవధర్మములును వారియందుఁగలవు. కావున నీరెండు సమన్వయముచేసి రాముఁ డిట్టిశిక్షను విధించెను. లేనిచో

"హత్వా హంసం బలాకాం చ బకం బర్హిణమేవ చ,
వానరం శ్యేనభాసౌ చ స్పర్శయేద్బ్రాహ్మణస్య గామ్."

అని మనుస్మృతియం దల్పప్రాయశ్చిత్తము చెప్పఁబడినజాతి యందుఁ బుట్టినవాలి యిది యధర్మమని దూషింపనేల? కాన రాజధర్మములుగలవారు వాలిసుగ్రీవులని మనమంగీకరింప వలయు. మాయావి లోనగు దానవులు మహిషాకృతుల నుండఁ గారణమేమి? అనఁగా వారికర్మము ననుసరించి వారి కాజాతిరూపమున నుండుటయే యిష్టము. భరతుఁడు రాజు. మేము తదాజ్ఞానుసారుల మనుట యసత్యముకాదనియు రాజ ధర్మములను శిరసావహించుట రాజకుమారులకు ముఖ్యమని యు ముందేవ్రాసితిని. స్వేచ్ఛాప్రవర్తకుల నడంచుట భరతున కిష్టము. మేమును దదిచ్ఛననుసరించియే మావిధిని నెఱవేర్చి తిమి. అనఁగా వధించితిమని శ్రీరాముఁ డన్నమాట న్యాయ్య మేగాని ధర్మేతరము కానేరదు. ప్రాయికముగా నాకాలమున నిట్టిపాపములు చేయువారే యెక్కువగా నుండిరనియు, వారి వృత్తమునే లోకులుగూడ ననుసరించుచుండిరనియు, నిఁక భయంకరదండనమునకుఁ బూనకయున్న నీయనాచారము నశింపదనియు, శ్రీరాముఁ డూహించెనని మన మెఱుంగ వలయును.

"తం దేశకాలౌ శక్తిం చ విద్యాం చావేక్ష్య తత్త్వతః,
యథార్హతస్సంప్రణయేన్నరేష్వన్యాయవర్తిషు. ౧౯

... ... ... ...

యది న ప్రణయేద్రాజా దండం దండ్యేష్వతంద్రితః,
శూలే మత్స్యానివాపక్ష్యన్ దుర్బలాన్ బలవత్తరాః." ౨౦

అన్న మనుస్మృతివాక్యములయర్థమే శ్రీరాముఁ డనుసరించె ననక తీఱదు కదా.

"ప్రతిజ్ఞా చ మయా దత్తా తదా వానరసన్నిధౌ. ౨౭

ప్రతిజ్ఞా చ కథం శక్యా మద్విధేనానవేక్షితుం,
తదేభిః కారణైస్సర్వైర్మహద్భిర్ధర్మసంహితైః. ౨౮

శాసనం తవ యద్యుక్తం తద్భవా ననుమన్యతాం,
సర్వథా ధర్మ ఇత్యేవ ద్రష్టవ్యస్తవ నిగ్రహః. ౨౯

వయస్యస్యాపి కర్తవ్యం ధర్మమేవానుపశ్యతః,
శక్యం త్వయాపి తత్కార్యం ధర్మమేవానుపశ్యతా." ౩౦

అని మూలము. వాగ్దానము చెల్లించుట ముఖ్యము. "అనృతం నోక్తపూర్వం మే" అన్నది శ్రీరాముని శపథమని వ్రాసియే యున్నాను. నేఁజెప్పినకారణము లనేకములు ధర్మయుక్తము లగుటంజేసి నీకు విధించిన శిక్ష న్యాయమే యని యంగీకరింపు మని రాముఁడు బోధించెను. ఏల?

"అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరం,
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః. ౫
యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరం,
తం త మేవేతి కౌంతేయ సదా తద్భావభావితః. ౬
తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ,
మయ్యర్పితమనోబుద్ధిర్మామేవైష్యస్యసంశయః." ౭

గీత. ౮-అ.

అన్న తన యుపదేశమును సార్థకము చేయుటకే. లేకున్న శ్రీరాముఁడు సుగ్రీవపక్షపాతియై నన్ను నన్యాయ్యముగాఁ జంపెను గదాయని చింతించుచునే ప్రాణములు వాలి వదలిన నతనికిఁ దనచేఁ జచ్చినందునఁ గలుగదగు పదము కలుగదు. పునర్జన్మహేతుభూతమగు పదమున స్థితి కలుగును. అది సమ్మత మగునా? తనచేఁ జచ్చినను బునర్జననము కలుగునెడలఁ దనపర

మేశ్వరత్వ మేటిపాలగును. కనుక నేనొనరించినశిక్ష శాస్త్ర సమ్మతమనియు, నీవు చేసినది మహాపాపకార్యమనియు, దానికిఁ దగినశిక్ష కలిగినదనియు, నిఁక వగచి లాభము లేదనియు, నంగీకరించిన నీవు మేలుపొందుదువు సుమీయని శ్రీరాముసుత్తరమునఁగల సారము.

"శ్రూయతే మనునా గీతౌ శ్లోకౌ చారిత్రవత్సలౌ,
గృహీతౌ ధర్మకుశలైస్తత్తథా చరితం హరే. 3౧
రాజభిర్ధృతదండాస్తు కృత్వా పాపాని మానవాః,
నిర్మలాస్స్వర్గమాయాంతి సంతస్సుకృతినో యథా. 3౨
శాసనాద్వా విమోక్షాద్వా స్తేనస్తేనయాద్విముచ్యతే,
రాజా త్వశాసన్ పాపస్య తదవాప్నోతి కిల్బిషం. 33
ఆర్యేణ మమ మాంధాత్రా వ్యసనం ఘోరమీప్సితం,
శ్రమణేన కృతే పాపే యథా పాపం కృతం త్వయా. 3౪
అన్యైరపి కృతం పాపం ప్రమత్తైర్వసుధాధిపైః,
ప్రాయశ్చిత్తం చ కుర్వంతి తేన తచ్ఛామ్యతే రజః. 3౫
తదలం పరితాపేన ధర్మతః పరికల్పితః,
వధో వానరశార్దూల న వయం స్వవశే స్థితాః." 3౬

అని మూలము. వాలి యొనరించిన తక్కిన ప్రశ్నములలోఁ గొన్నింటికి నీసమాధానరూపమున స్వస్తి చెప్పుచున్నాఁడు. "రాజభిర్ధృతదండాస్తు."అనునదియు, "శాసనాద్వా విమోక్షాద్వా"యనునదియు నీరెండుశ్లోకములు మనుస్మృతియం దెనిమిదవ యధ్యాయమునందు వరుసగా 3౧౮-3౧౬ శ్లోకసంఖ్యలయందున్నవి. "రాజభిః కృతదండాస్తు" అనుపాఠము కుల్లూకభట్టు వ్యాఖ్యసమ్మతము. వీనితర్వాత

"ఐంద్రం స్థానమభిప్రేప్సుర్యశశ్చాక్షయమవ్యయం,
నోపేక్షేత క్షణమపి రాజా సాహసికం నరం." ౩౮౪

అను వచనము కనఁబడుచున్నది. ఈభాగమున నొకసందేహమున కవకాశము గలదు. వాల్మీకిరామాయణ కావ్యరత్నమును రచించుటకుముందు భూలోకమునఁ గవిత్వమే లేదని కదా మనవిశ్వాసము. "మా నిషాద" యనుశ్లోకముకూడఁ దెల్పును. రామునినోటవచ్చిన యీశ్లోకము లెక్కడివి? ఈయర్థమును రాముఁడు తెల్పెననియుఁ దరువాత వాల్మీకి శ్లోకముగా రచించెననియుఁ గొందఱు సమాధానము చెప్పఁబూనవచ్చును. కాని "శ్రూయతే మనునా గీతౌ శ్లోకౌ చారిత్రవత్సలౌ" అన్న రామవాక్య మేటిపాలగునే. అని యాక్షేపకులనవచ్చును. రాముఁడు జన్మింపకముందే వాల్మీకి కావ్యమును రచించెనన్నవాదము నంగీకరింతుమేని, "రామే రాజ్యం ప్రశాసతి" అన్నమాట (రాముఁడు రాజ్యమేలుచుండఁగా వాల్మీకి రామాయణమును వ్రాసె నన్నమాట) యేమగును? తమసాతీరగమనాదులంబట్టి పరికింపఁగాఁ బిదప వ్రాసినట్లే కనఁబడును. కాన నేదో ముఖపిధానము చేయుట కాపప్పుడుకదు. రామాయణములోని శ్లోకములే మనుస్మృతిలో నేల చేర్పఁబడియుండరా దనునది నీచయుక్తిగాని వేఱుగాదు.

"కృతేతు మానవా ధర్మా స్త్రేతాయాం గౌతమాస్స్మృతాః. ౨౮
ద్వాపరే శంఖలిఖితాః కలౌ పారాశరాస్స్మృతాః."

అని పరాశరస్మృతియందుఁ గలదు. త్రేతాయుగముననున్న రామవాక్యములు కృతయుగమునఁ బ్రవృత్తియందుండు మనుస్మృతిలోని కెక్కుట యేమాత్రము ధర్మసమ్మితము కాదు.

ఇఁక నాకుఁదోఁచిన సమాధానమేమనఁగాఁ గవిత్వము వాల్మీకి కాలమునఁ గావ్యరూపముగా నవతరించెను. కాని యంతకు ముందు శ్లోకరూపముగా లేదని కాదు. ఇట్లు విచిత్రవృత్త బద్ధమై చరిత్రప్రధానమై నవరసములచే విరాజిల్లుచునుండు సరస్వతి లేదని మనము విశ్వసించిన నీచిక్కులుండవు. అట్లు గాక తాఁబట్టిన కుందేటికి మూఁడేకాళ్లన్నట్లు వాదించిన మొదటికే మోసము కలుగును. ఇదియే సిద్ధాంతమను భావము నాకు లేదు. ఇంతకంటెఁ దగినదని వ్రాయుటకు నాకు స్ఫురింప లేదని నాయాశయము. రాజదండితులకు యమదండనము లేదను నానుడి యందఱెఱింగినదియే. వాలీ! పాపము లొన రించినమానవులు రాజులచేఁ దగినట్లు దండితులై పాపముల వదలి స్వర్గమునకుఁ బుణ్యాత్ములవలెఁబోవుదురు. రాజు శిక్షించి నను వదలినను జోరునకుఁ బాపనివృత్తియగుచున్నది. రాజు శిక్షింపక విధి ననుసరింపక వదలినచోఁ నాచోరునిపాపమును దాఁబొందును. అనఁగా నాయీశిక్షవలన నీపాపములు నశించి నవి. ఇపుడు నీవు సుకృతవంతుఁడవు. దివ్యపదము నొందుదువు. నిన్ను నేను శిక్షింపక వదలియున్నయెడల నీపాపములు నాకు లభించునని రాముఁడు తెల్పెను.

"అనుబంధం పరిజ్ఞాయ దేశకాలౌ చ తత్త్వతః,
సారాపరాధౌ చాలోక్య దండం దండ్యేషు పాతయేత్."

అను మనుస్మృతివాక్యమే శ్రీరాముని వాక్యము. వదలరాని యపరాధమనితోఁచినందున నిన్ను శిక్షించితిని. దీని నంగీకరింపు మని యుపదేశించెను. నేనే కాదు. మావంశములో నాకుఁ బూర్వుఁడగు మాంధాత నీవలెనే పాపము చేసిన క్షపణకునకు ఘోరశిక్ష విధించెను. ఎందఱో రాజులు ప్రమాదంపడి పాపు

లకు శిక్షవిధింపక కొంతకాలమునకు జాగరూకులై తగినశిక్ష వారికి విధించిరి. ఇది పరంపరగా వచ్చునాచారమై యున్నది. కాన ధర్మశిక్షయే నీకు విధింపఁబడినది. కానఁ బరితపింపకుము. మేము స్వతంత్రులముగామని రాముఁడనుట రాజధర్మస్తుతియే యని యూహింపవలయు.

"శృణు చాప్యపరం భూయః కారణం హరిపుంగవ,
యచ్ఛ్రుత్వా హేతుమద్వీర న మన్యుం కర్తుమర్హసి. 36
న మే తత్ర మనస్తాపో న మన్యుర్హరియూథప,
వాగురాభిశ్చ పాశైశ్చ కూటైశ్చ వివిధైర్నరాః. 37
ప్రతిచ్ఛన్నాశ్చ దృశ్యాశ్చ గృహ్ణంతి సుబహూన్ మృగాన్,
ప్రధావితాన్వా విత్రస్తాన్ విస్రబ్ధాంశ్చాపి నిష్ఠితాన్. 38
ప్రమత్తా నప్రమత్తాన్ వా నరా మాంసార్థినో భృశం,
విధ్యంతి విముఖాంశ్చాపి న చ దోషోఽత్ర విద్యతే. 39
యాంతి రాజర్షయశ్చాత్ర మృగయాం ధర్మకోవిదాః,
తస్మాత్త్వం నిహతో యుద్ధే మయా బాణేన వానర. 40
అయుధ్యన్ప్రతియుధ్యన్వా యస్మాచ్ఛాఖామృగో హ్యసి."

అని మూలము. ఈయుత్తరము వాలి ప్రశ్నములలో సప్తమనవమైకాదశములలోఁ గొంతభాగమున కని యెన్నందగు. ఈయుత్తరము తొలుదొలుత బలహీనముగాఁ గనఁబడును. కొంతదనుక నసంగతముగను గనఁబడును. కాన నోపికమైఁ బరిశీలించి యిందలి న్యాయమును గనుఁగొందము.

"దశ కామసముత్థాని తథాష్టౌ క్రోధజాని చ,
వ్యసనాని దురంతాని ప్రయత్నేన వివర్జయేత్. 41
కామజేషు ప్రసక్తో హి వ్యసనేషు మహీపతిః,

వియుజ్యతేఽర్థధర్మాభ్యాం క్రోధజేష్వాత్మనైవతు. ౪౬
మృగయాక్షో దివాస్వాపః పరీవాద స్త్రియో మదః,
తౌర్యత్రికం వృథాట్యా చ కామజో దశకోగణః. ౪౭

... ... ... ... ...

పానమక్షా స్త్రియశ్చైవ మృగయాచ యథాక్రమం,
ఏతత్కష్టతమం విద్యా చ్చతుష్కం కామజే గణే." ౫౦

అని మనుస్మృతియందు రాజధర్మప్రకరణమునఁ జెప్పఁబడినది. వేఁట మహావ్యసనమని యద్దానినుండి తేలును. అయిన నది సనాతనాచారముగా నున్నది. వేఁట రెండుకారణములచే సాగింపఁబడును. ప్రజలకు దుష్టమృగభీతి గలుగకుండఁజేయు టొక్క కారణము. మాంసాభిలాషము రెండవకారణము. ఇందు మొదటిదే ప్రధానము. రెండవది యప్రధానము. వేఁట నిషిద్ధమైనను బ్రాచీనకాలమునుండి ప్రభువులు సల్పుచునేయున్నారు. వాలి విషయమున నీరెండును సరిపడవు. శాఖామృగము కాన వాలిమృగజాతిలోఁజేరినవాఁడేయైనను దుష్టమృగజాతిలోఁ జేరినవాఁడు కాఁడు. మాంసమునకై యన్నచో వానరమాంసమభక్ష్యము. కాన నివి రెండును సరిపడలేదు. పొంచి చంపుట న్యాయ్యమాయన్న వాలిప్రశ్నమున కిదియుత్తరమే కావలయుఁగదా. వేఁటలక్షణము వేఱు. ఈవేఁటపద్ధతి వేఱు. నలువురుపెద్దలు కూరుచుండఁగా నీవీపని యొనరించి యేమని సమాధానము చెప్పుదువు? అని వాలి ప్రశ్నింపఁగా దానికిగా రాముఁ డీవిషయమును దెల్పెను. కాన నింతకుమించినది యున్నట్లు ఈభాగమునఁ గానరాదు. మఱొక్కమాట. ప్రతిసారియు మేముస్వతంత్రులముగామని రాముఁడనుచున్నాఁడు. భరతుఁడు వేఁటాడి దుష్టమృగములను జంపుమని యాజ్ఞ

యియ్యకున్న మనవిగానైనఁ జెప్పెనా? లేదు. మఱెట్లు ముని వృత్తిని వదలి రాముఁ డిప్పని జేసెను? అనునాక్షేపము గలదు.

"త్వం రాజా భరత భవ స్వయం నరాణాం
వన్యానామహమపి రాజరాణ్మృగాణాం,
గచ్ఛ త్వం పురవరమద్య సంప్రహృష్ట
స్సంహృష్టస్త్వహమపి దండకాన్ ప్రవేక్ష్యే. ౧౭

... ... ... ... ...

చత్వారస్తనయవరా వయం నరేంద్రం
సత్యస్థం భరత చరామ మా విషాదం." ౧౯

అయోధ్యాకాం. ౧౦౭-సర్గము.

అని భరతునితో రాముఁడు చెప్పియుండెను. మృగములకు నేఁ జక్రవర్తినై యుండెదననియేఁగదా. ధర్మాధర్మములఁ బరిశీలించుటయే రాజలక్షణము. కావున వాలిమాంసము భక్ష్యము గాకున్నను ధర్మవ్యతిక్రమరూప మహాపరాధమును క్షమింపరాని మృగజాతివధించుపద్ధతినే రాముఁ డాశ్రయించె నను నదియే యిచ్చట సమంజసముగానుండు సమాధానము. లోపలఁదెల్పిన కర్మసిద్ధాంతము ఇచ్చటఁదెలిపిన నిదియు నతని ప్రశ్నముల కన్నింటికి సమాధానములు. అవాంతరము లంత బలవత్తరములు గాకయున్న నివి మంచివని మనమూహింపవచ్చును. మఱియు శ్రీరాముఁడు వాలితో నీదూషణములకు నాకాగ్రహము లేదు. మనస్తాపము కలుగదనియేఁగదా. దాని యాశయమేమనఁగా నీదుష్కర్మమునకుఁ దగినశాస్తి యొనరింపవలసిన ట్లున్నవిధి జరపితిమి. కర్మతత్త్వమెఱింగినమాకిఁకేల మనస్తాపాదులు గలుగఁగలవు? అనియే కదా.

"తాన్న హింస్యాన్న చాక్రోశేన్నాక్షిపేన్నాప్రియం వదేత్. ౪౩
దేవా మనుష్యరూపేణ చరంత్యేతే మహీతలే,
త్వం తు ధర్మమవిజ్ఞాయ కేవలం రోషమాస్థితః. ౪౪
ప్రదూషయసి మాం ధర్మే పితృపైతామహే స్థితం,
ఏవముక్త స్తు రామేణ వాలీ ప్రవ్యథితో భృశం. ౪౫
న దోషం రాఘవే దధ్యౌ ధర్మేఽధిగతనిశ్చయః,
ప్రత్యువాచ తతో రామం ప్రాంజలిర్వానరేశ్వరః." ౪౬

అని మూలము. వాలి కిదియే రామునిహితోపదేశము. దేవతలే రాజులుగా నవతరించి ధర్మరక్షణము చేయుదురు. వారికి ధర్మస్వరూపము చక్కఁగాఁ దెలిసియుండును. కాన వారిని దూషింపరాదని రాముఁడు పల్కుట.

"యస్మాదేషాం సురేంద్రాణాం మాత్రాభ్యో నిర్మితో నృపః,
తస్మాదభిభవత్యేష సర్వభూతాని తేజసా.
... ... ... ...
మహతీ దేవతా హ్యేషా నరరూపేణ తిష్ఠతి." ౮

అను మనుస్మృత్యుక్తార్థమే కదా. అల్పజ్ఞుఁడవు కాన నీవు నన్ను ధర్మవిషయమున నాక్షేపింపరాదని రాముఁ డుపదేశించెను. దాన వాలి శాంతినొందెను.

"యత్త్వమాత్థ నరశ్రేష్ఠ తదేవం నాత్ర సంశయః,
ప్రతివక్తుం ప్రకృష్టే హి నాప్రకృష్టస్తు శక్నుయాత్. ౪౭
... ... ... ...
తదయుక్తం మయా పూర్వం ప్రమాదాదుక్తమప్రియం,
తత్రాపి ఖలు మే దోషం కర్తుం నార్హసి రాఘవ." ౪౮

అని మూలము. వాలి యీరీతిగా రామోపదేశము సాగగా నాలకించి కోపము వదలి శాంతినొంది క్షమింపవలయునని ప్రార్థించెను. దీనింబట్టి రామునిసదుత్తరములు వాలికి నచ్చె ననియు, నంతఁ దనపాపము దానెఱింగెననియు, దానికిఁ దగిన శాంతి రాజమూలమున సాగుట మేలని నమ్మెననియుఁ, దన్ను దూషించినందులకు మన్నింప వేఁడెననియు మన మెఱుంగం దగు.

> "తచ్ఛ్రుత్వా దండసంయోగాదస్మాద్విగతకల్మషః. ౬౩
> గతస్స్వాం ప్రకృతిం ధర్మ్యాం ధర్మదృష్టేన వర్త్మనా,
> త్యజ శోకం చ మోహం చ భయం చ హృదయే స్థితం. ౬౪
> త్వయా విధానం హర్యగ్ర్య న శక్యమతివర్తితుం,
> యథా త్వయ్యంగదో నిత్యం వర్తతే వానరేశ్వర. ౬౫
> తథా వర్తేత సుగ్రీవే మయి చాపి న సంశయః."

అనిమూలము. శరణాగతరక్షణపరతంత్రత్వము నియ్యది తేటపఱచును. నీకిఁక భయములేదు. అంగదుని నీవలెనే సుగ్రీవుఁడు నేనును గాపాడుదుము. అని రాముఁడనియె. అనృతదోషము రామునియందుఁ బొడకట్టదు. కాన నావా గ్దానము నమ్మదగినదియే. ఈభాగమును బరిశీలించిన శ్రీరాము నాశయము తేటపడును. రామునకుఁ బ్రియములగు కార్య ములేవనుటయు విస్పష్టములగును. ఇట్టు లీభాగమునఁగల విశేషములను గ్రహించి శ్రీరాముని యుత్తరములయందుఁ గల తత్త్వమిట్టిదని గ్రహింపవలయును. ఈవిషయమున నధ్యాత్మరామాయణమునందు

> "తచ్ఛ్రుత్వా భయసంత్రస్తో జ్ఞాత్వా రామం రమాపతిం,
> వాలీ ప్రణమ్య రభసాద్రామం వచనమబ్రవీత్.

రామరామ మహాభాగ జానే త్వాం పరమేశ్వరం,
అజానతా మయా కించి దుక్తం తత్క్షంతుమర్హసి.
సాక్షాత్త్వచ్ఛరఘాతేన విశేషేణ తవాగ్రతః,
త్యజామ్యసూన్మహాయోగిదుర్లభం తవ దర్శనం.
యన్నామ వివశో గృహ్ణన్ మ్రియమాణః పరంపదం,
యాతి సాక్షాత్స ఏవాద్య ముమూర్షోర్మే పురస్థితః.
దేవ జానామి పురుషం త్వాం శ్రియం జానకీం శుభాం,
రావణస్య వధార్థాయ జాతం త్వాం బ్రహ్మణార్థితం.
అనుజానీహి మాం రామ యాంతం త్వత్పదముత్తమం,
మమ తుల్యబలే బాలే అంగదే త్వాం దయాం కురు.
విశల్యం కురు మే రామ హృదయం పాణినా స్పృశన్."

కిష్కింధాకాండము. 3-సర్గము.

అను నీవాలిస్తుతి యొక్కడే విశేషము. తక్కినదంతయు వాల్మీకివాక్యముల కనుకూలమే. ఇకఁ దరువాతికథను బఠింతము.

## తార వాలింజూడ నేతెంచుట.

*వాలి యంత శ్రీరాముని క్షమింపుమా యని వేఁడి మఱేమియుఁ బలుకక యుండెను. సుగ్రీవుని పాషాణాది ప్రయోగములచే నొచ్చియున్న యతఁడు రాముని బాణఘాతమున మఱింత శ్రమంపడి మూర్ఛితుఁడయ్యెను. వాలి బాణహతుఁడయ్యెనను దుర్వార్త తార చెవులఁబడియెను. భీతయై యంగదుని గూడి యంతఃపురమును వెడలివచ్చెను. అంగదుని పరిచరులగు వానరులు ధనుర్ధరుఁడగు రామునింగాంచినంతనే

* ఇది పందొమ్మిదవసర్గమునఁ గలదు.

భీతిల్లి నలుదెసలకుఁ బాఱిరి. వారు పోవుచుండఁగాఁ దార మార్గమునం గని వానరులారా! సుగ్రీవుఁడు క్రూరుఁడై రాజ్యముకొఱకు నన్నను రామునిచేఁ జంపించెను. మీరేల భయపడియెదరు? మీకు రాజ్యము లేదుకదా. మీప్రభువగు వాలిని దిగవిడిచి దిక్కులేక యేల పరుగెత్తుచున్నారు? అని యడుగఁగాఁ గామరూపులగు వారు తారను గని తత్కాలోచితముగా నమ్మా! నీకుమారుఁడు జీవించియున్నాఁడు. మరలిపొమ్ము. కొడుకును రక్షించుకొనుము. మృత్యువే రామాకృతిఁ దోఁచి వాలిని బరలోకమునకుఁ దీసికొనిపోవుచున్నవాఁడు. రామబాణముచే వాలి నిహతుఁడై పడినాఁడు. సైన్యము భీతిల్లి కిష్కింధకుఁ బాఱిపోవుచున్నది. ద్వారములకడ జాగ్రత్తగా సేనల నిలుపవలయు. అంగదునకుఁ బట్టాభిషేకము చేయవలయును. వానరులాతనిం గొలిచియుండఁగలరు. మేము చెప్పినట్లు చేయకపోయిన నీవీ కిష్కింధలోనే యుండరాదని మాయిష్టము. పగవారగు వానరులు దుర్గముల నాక్రమింపఁగలరు. వాలిచే మున్ను వానరులు కొందఱు తఱుమఁగొట్టఁబడిరి. వారు భార్యలఁ బాసియున్నారు. కొంద ఱితరులభార్యలను భార్యలనుగా భావించియున్నారు. భార్యల నెడఁబాసియుండువారును, తమరు ప్రేమించిన యితరులపత్నులయం దాశగలవారును సుగ్రీవాదులును రాఁగా వారిమూలమున మనకెల్ల నిచట సర్వదా భయమే కలుగుచుండునని తెల్పిరి.

తార వారి యల్పబుద్ధి నెఱింగి తన బుద్ధివైశద్యము తేటపడునట్లుగా వారితో నిట్లనియె. వానరసింహుఁడు నాభర్తయే పోవుచుండఁగా నాకు నింకఁ గుమారునితో నేమి పని? రాజ్య

మెందులకు ? ఈశరీరమేల ? రామబాణహతుఁడై పడియున్న
యామహానుభావుని పాదముల కడకే పోయెదను. అని తార
పలికి దుస్సహదుఃఖభారమునఁ గలఁగుచు వక్షమును మోఁదు
కొనుచు వేగముగఁ బోయెను. అందు మాయావిలోనగు దాన
వుల జయించి యపజయ మన్నదియే యెఱుంగక మహాపరా
క్రమశాలియగు వాలి రామబాణనిహతుఁడై పడియుండఁగాఁ
జూచెను. అవ్వాలిం గని ధనుర్ధరుఁడై నిలుచున్న శ్రీరాముని
గాంచి లక్ష్మణుని దిలకించి మఱఁదియగు సుగ్రీవుని జూచి వారి
నించుకంతయు దూషింపక వారిని మీటిపోయి పతిని సమీ
పించి హతుఁడయ్యెనని తలంచి మూర్ఛిల్లి నేలంబడియెను.
అంతలో లేచి పతిం బేర్కొని విలపించెను. కురరివలెఁ
గూయిడుచున్న తారను కుమారునంగదుని జూడఁగనే సుగ్రీ
వునకు దుఃఖము కల్గెను.

## తారావిలాపము.

*తార పతిదగ్గఱకుఁబోయి కౌఁగిలించుకొని యొక్క బాణ
ఘాతమున హతుఁడై మూలవిచ్ఛేదము గావించిన భూరుహ
మువలెఁ గ్రిందఁ బడియుండుటం గని యిట్లు పలవించెను.—
"మహాత్మా! శూరాగ్రగణ్యా! నేనేమియు నపకారము చేయ
లేదే, దీనురాలనుగదా, ఏల యిట్టినాతో మాటలాడకున్నావు?
నీవంటి రాజేంద్రులు నేలఁబడరు. కాన నీవిందు శయనించుట
మంచిది కాదు. లేచి మేలయిన పాన్పుపై శయనింపుమా.
నీవు మృతుఁడవయ్యు నన్నుంగూడ విడిచి యీభూకాంతనే

* ఇది ఇరువదియవ సర్గమునఁ గలదు.

సర్వథా కౌఁగిలించుకొని యున్నావే? నాకంటె నీభూకాంత యత్యంతప్రియురా లయ్యెఁగదా. మహాత్మా! ధర్మమహత్త్వమున నీవు స్వర్గమార్గమునందుఁ గిష్కింధకు మించిన వేఱొక పురవరము నేర్పఱచుకొన్న జాడ తోఁచెడు. కనుకనే దీని వదలిపోవ నెంచితివి. మమ్ముఁ గూడి యారామములందు విహరించితివి. యూథనాథుల వధించితివి. ఇట్టి నీవు మృతినొందితివి కదా. ఇపుడు నాకానందము నశించినది. ఇఁక నెపుడైన నిన్నుఁబొందునాశ నాకు లేదు. దుఃఖసాగరమున మునింగితిని. కూలియున్న నిన్నుం జూచి నాగుండె తిలప్రమాణశకలములుగాఁ గాకున్నదే? ఏమని యూహింతును? సుగ్రీవుని భార్య నపహరించి యతని వెడలఁగొట్టితివి. దానికిఁ బ్రతిఫలమే యిది. మహాత్మా! నీమేలుగోరి చెప్పిన నాహితము నంగీకరింపక నన్ను నజ్ఞానమునఁ దూలనాడితివి. వీరా! వీరస్వర్గము నాక్రమించితివి. ఇఁక స్వర్గమునఁగలయన్ను మిన్నల సంతుష్టిపఱపఁగలవు. ఎవ్వారికిని లోఁబడవు. అట్టి నిన్ను సుగ్రీవుని వశమునఁ జిక్కఁ జేసినది నీప్రాణములఁ గొనఁగోరిన మృత్యువే. నిశ్సంశయము. ఇంతదనుక దీనత్వమనునది యెఱుంగని నేనిపుడు దీనురాలనైతిని. వైధవ్యదుఃఖము ననుభవింపఁగలను. అంగదుఁడు నీచే గారాబముగాఁ బెంపఁబడినవాఁడు. ఇట్టి యీసుకుమారుఁడు నీపిదపఁ బిన్నతండ్రి కోపాతిరేకమున నేమన్న నోర్వవలయును. నశించునే." అని పలికి చెంతనున్న కుమారునిం గని "వత్సా! నీకన్నతండ్రి నిపుడే చక్కఁగాఁ జూడుమా. ఇంక నీవతనిం జూడఁజాలవు." అని మరల భర్తనుగని "నాథా! దూరదేశమునకుఁ బ్రయాణము చేసితివి. కనుక వీని శిరము మూర్కొని యూఱడింపుము. చెప్పఁదగినబుద్ధులు చెప్పిపొమ్ము. నిన్నుం జంపు

టంజేసి శ్రీరాముఁడు వీరకార్యము నొనరించిన వాఁడయ్యెను. ప్రతిన నెఱవేర్చి ఋణమును దీర్చుకొనియెను." అని విలపించి యంత సుగ్రీవుంగాంచి "నీయన్న నీవైరి. హతుఁడయ్యెఁగదా. ఇఁక నీకోర్కిఁ దీర్చుకొనుము. రుమనొందఁగలవు. నిష్కంట కుఁడవై రాజ్యము ననుభవింపుము."

అని పలికి మరల వాలిదిక్కుమొగమై "వానరేంద్రా! దిక్కుమాలి నేనిట్లు పలవించుచున్నను బ్రీతిచే నించుకయుఁ బలుకవేమి? నీపత్నులు పెక్కండ్రు వచ్చియున్నారు. వీరినైన నొకసారి చూడుమా." అని తార విలపింప విని తక్కినవారి భార్యలెల్ల దుఃఖమున బ్రుంగి దీనుఁడగునంగదుం గవుంగలించు కొని వాలింగనుచు విలపించిరి. అందుఁ "దార నాథా! యీసుకు మారు నంగదుని వదలి దూరమునఁగలదేశమున కేల పోయె దవు? గుణవంతుఁడగు కొడుకును వదలిపోవుట యుక్తము కాదు. నాథా! నాయందు నంగదునియందు మిక్కిలి మక్కువ గల నీవు మమ్మిరువురవదలి యెంతయోదూరమున కేగుచున్నా వే. అంతటి యపరాధమును మేమేమి చేసితిమి? నేను దెలియక యేమైన నప్రియము గావించియున్న పాదములు నాశిరము సోఁక మ్రొక్కెదను. క్షమింపుమా." అని యిట్లు తార చూచు వారికి జాలిగలుగ విలపించి పతిపార్శ్వమునఁ బ్రాయోపవేశము చేయ నిశ్చయించుకొనియెను.

## తారను హనుమ యాశ్వాసించుట.

*అంత హనుమంతుఁడు వాలిచెంత నేలఁబడి యంబర భ్రష్టయగుతారవలెనుండు తారనుగని మృదూక్తుల నాశ్వా

* ఇది యిరువదొకటవసర్గమునఁగల కథ.

సింపఁబూని యిట్లు పలికెను. లోకమునఁ బ్రాణికోటియంతయుఁ దెలిసియో తెలియకయో తాఁజేసికొన్న కర్మఫలముల ననుభవించును. ప్రతిప్రాణియుఁ దప్పక కర్మఫలముల ననుభవించుచున్నదే. కాని వేఱొక ప్రాణిమూలమున మంచి సెబ్బరలుగఁ గాదు. ఆనియమము చొప్పున వాలియు స్వకర్మఫలము ననుభవింప హేతుఁడయ్యెను. కాని తమ్మునిమూలమునఁ గాదు. నీవు కూడ నేకర్మమున నేలోకమునకుఁ బోవవలసియున్నదో కదాయని నిన్నుఁగూర్చి నీవేదుఃఖింపవలయుఁగదా. అట్టులుండ నెవ్వరిఁ గూర్చి శోకించెదవు ? నీవే దీనురాలవుగా నుండియు నేదీనుని గాంచి యక్కటా! యని జాలివడుచున్నావు? ఏవిధమునను దీనులుగాక యుండువారు కదా యిట్లు జాలిపడవలసినవారు. నీదేహము జలబుద్బుదప్రాయము. ఎల్లరతనువులట్టివే కావున దేహవిషయమున నెవరిఁగూర్చి యెవరు దుఃఖింపవలయును? దుఃఖించువారెవరో వారిదేహముకూడ నీటి బుగ్గవంటిదే కదా. తారా ! నీకుఁ గొడుకుకలఁడుగాన సహగమనము చేయరాదు. కొడుకును జూచుకొనుభారము నీయందే యున్నది.ముందు నీవు వానికొఱకుఁ జేయవలయున దెద్దియని యోజించుకొనుము. నీవు విద్వాంసురాలవు కదా. మృతులం గూర్చిన రోదనాదులు మంచివి కావు. కాన వానిమాని ప్రేతకృత్యములను గావింపవలయు. ఎవ్వఁ డసంఖ్యాకులగు వానరులకు జీవనములు విభజించి కల్పించుచుండెనో యట్టి మహాత్ముఁడు వాలి కాలధర్మము నొందెను. ఎందఱనో రక్షించిన సుకృతమునకుఁ దగిన ఫలము ననుభవింపఁ బుణ్యలోకమునకుఁ బోవఁగా నతనికై వగచుట న్యాయ్యము కాదు.

వాలి శాస్త్రజ్ఞుఁడై తత్త్వము దెలిసికొని తనవారు దుఃఖితులైన తఱి మంచిమాటల నూఱడించుచు యాచకులకు సమృద్ధిగా నిచ్చుచు నపరాధులను దయనూని క్షమించుచు ధర్మమును హస్తగతము చేసికొన్న పుణ్యాత్ముఁ డుత్తమపదము నొందినాఁడు. అట్టి మహాత్మునికై వగచుట యుక్తమగునా? ఈకపులకందఱకు, నీకుమారునకు వానర భల్లూకరాజ్యమునకు నీవే యధికారము వహించుదానవై యుండవలసినదానవు. నీవే యిట్లు దుఃఖించిననెట్లు? శోకసంతాపముల వరుసగా వద లిపెట్టుము. నీమూలమున నీతఁడు రాజ్యము నేలుఁగాక. సంతాన మెందులకుగానో ఏది యిపుడు చేయఁదగినదో యట్టి యార్ధ్వదైహిక క్రియలనన్నింటిని వాలి కంగదునిచేఁ జేయిం పుము. ఇది యిపుడు కర్తవ్యముకాని దుఃఖముగాదు. వాలికిఁ బరలోక క్రియలు గావింపవలయు. అంగదునకుఁబట్టాభిషేకము చేయవలయు. సింహాసనమెక్కి రాజ్యసుఖముల నొందు కొడుకుంగాంచుచు దుఃఖములమాని సుఖముగనుండుదువు. అని యూఱడింపఁగా వ్యసనకర్శితయగు నాతార యతనిమాటల విని తనమాటల వినఁగోరు హనుమ కిట్టులనియె.—"సహగమ నము మాని కొడుకుంగాపాడుకొనుమంటివి. అంగద సమాను లగు పుత్త్రుల నూరుగురఁ ద్రాసునం దొకప్రక్కను హతుఁడగు నీవీరునంగా శ్లేష నొకప్రక్క నునిచినచో నాపాలిటికి రెండ వదే యెక్కుడుగఁ దోఁచినది. వాలికి సంస్కారములు చేసి యంగదునకుఁ బట్టము గట్టుమంటివి కదా. ఆకార్యములకు నేను సమర్థురాలనుగాను. వాలి పిదప నెల్ల కార్యముల సాగింప వలసినవాఁడు సుగ్రీవుఁడుకాని యింకొకఁడు కాడు. అంగదుని హితముగోరఁదగినదానను నేనంటివికదా. ఈయూహ నీకుఁ

గలుగరాదు. కొడుకు హితముగోరి వానింగాపాడఁదగిన వాఁడు తండ్రియే కాని తల్లిగాదు. అట్టితండ్రి పోయినపిదపఁ బినతండ్రియే కాని తల్లినగు నేను గాదు. వాలి నాశ్రయించుటకంటె నుత్తమమైనది నాకిహపరలోకములలో వేఱులేదు. శత్రువున కభిముఖుఁడై వాలి శయనించియున్న యీశయ్యయే నాకు శయనింప నర్హము. వేఱుగా నెద్దియు లేదు."

మహాత్ములారా! ఈభాగమునఁ గొన్ని విషయము లున్నవి. పరికింతము. హనుమ తార నాశ్వాసించుఘట్టమునఁ గల నీతులు శ్రేష్ఠములు. ఎల్లరకు నవి పనికివచ్చును. కర్మసిద్ధాంతతత్త్వమునే యవి తేటపఱచును వానిని గుఱించి పెక్కుతావుల వ్రాసితిని. మఱికొన్ని విషయములను విమర్శించి తెలిసికొందము.

"గుణదోషకృతం జంతుః స్వకర్మఫలహేతుకం,
అవ్యగ్రస్తదవాప్నోతి సర్వం ప్రేత్య శుభాశుభం. ౨
శోచ్యా శోచసి కం శోచ్యం దీనం దీనానుకంపసే,
కస్య కోవానుశోచ్యోఽస్తి దేహేఽస్మిన్ బుద్బుదోపమే." 3

అను నీమూలములు.

"అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే,
గతాసూనగతాసూంశ్చ నానుశోచంతి పండితాః. ౧౧
అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తాశ్శరీరిణః,
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత. ౧౨
య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతం,
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే." ౧౯

అన్న గీతావాక్యములు గాక భేదమేమి కలదు? దీని తత్త్వ మెఱుంగుటయే కర్మసిద్ధాంతము నెఱుంగుట. కర్మఫలముల ననుభవింపనే లోకాంతర గమనమని తాత్పర్యము.

> "జానాస్యనియతామేవం భూతానామాగతిం గతిం,
> తస్మాచ్ఛుభం హి కర్తవ్యం పండితేనైహలౌకికం." ౧౧

అని మూలము. ప్రాణికోటి గమనాగమనముల నెఱుంగదువు. అమంగళముగ రోదనాదులు చేయక శుభము గలిగించు ప్రేతకృత్యములు గావింపుము అని తాత్పర్యము. కొందఱు మృతులంగూర్చి విలపించినఁగాని యాదుఃఖము పోదందురు. అంతకంటె నీచమగుమాటయే లేదు.

> "శ్లేష్మాశ్రు బాంధవైర్ముక్తం ప్రేతో భుంక్తే యతో వశీ,
> అతో న రోదితవ్యం హి క్రియాః కార్యాస్స్వశక్తితః. ౧౧
> ఇతి సంశ్రుత్య గచ్ఛేయుర్గృహం బాలపురస్సరాః,
> విదశ్య నింబపత్రాణి నియతా ద్వారి వేశ్మనః. ౧౨
> ఆచమ్యాగ్న్యాదిసలిలం గోమయం గౌరసర్షపాన్,
> ప్రవిశేయుస్సమాలభ్య కృత్వాశ్మని పదం శనైః." ౧౩

యాజ్ఞవల్క్యస్మృతి.

" యస్మాదనుశోచద్భిర్బాంధవైర్వదననయననిర్గమితం శ్లేష్మాశ్రువా యస్మాదవశోఽకామోఽపి ప్రేతో భుంక్తే తస్మాన్న రోదితవ్యం కింతు ప్రేతహితేప్సుభిః స్వశక్త్యనుసారేణ శ్రాద్ధాదిక్రియాః కార్యాః."

అని విజ్ఞానేశ్వరులు. ఎవరు మృతులహితమును గోరుదురో వారు వారింగూర్చి విలపింపరాదు. ఆకన్నీటిని ప్రేత యనుభవించును. కాన దానిమాని యతనికి మేలుగలుగఁజేయు

క్రియలను జేయవలయును అని రామాయణమునఁగల యర్థమే యీస్మృతియందుఁ గలదు. స్మృతులయందుఁగల ముఖ్య విషయములు రామాయణమునఁ గలవని మన మెఱింగి పఠించు నపుడు వానిని బరిశీలించిననే రామాయణపారాయణఫలము కలుగఁగలదు.

"సంతతిశ్చ యథా దృష్టా కృత్యం యచ్చాపి సాంప్రతం,
రాజ్ఞ స్తత్క్రియతాం తావదేష కాలస్య నిశ్చయః. ౧౦.
సంస్కార్యో హరిరాజశ్చ అంగదశ్చాభిషిచ్యతాం,
సింహాసనగతం పుత్త్రం పశ్యంతీ శాంతిమేష్యసి." ౧౧

అని మూలము.

"ఋషయః పితరో దేవా భూతాన్యతిథయ స్తథా,
ఆశాసతే కుటుంబిభ్య స్తేభ్యః కార్యం విజానతా." ౮౦.
స్వాధ్యాయేనార్చయేతర్షీ న్ హోమైర్దేవా న్యథావిధి,
పితౄ న్ శ్రాద్ధైశ్చ నౄనన్నై ర్భూతాని బలికర్మణా. ౮౧
కుర్యాదహరహః శ్రాద్ధ మన్నాద్యేనోదకేన వా,
పయోమూలఫలై ర్వాపి పితృభ్యః ప్రీతిమావహ న్." ౮౨

మను. 3-అ.

అను మనుస్మృతి తెల్పినవిషయమే రామాయణమునఁ గలదు. అంగదు నభిషేకింపుమనుట యసత్యము కాకున్నను సర్వథా సత్యమన రాదు. అది శోకనివృత్త్యుపాయము. సుగ్రీవుని పరోక్షమున రాజు కావలయునను భావమున హనుమ పలికెనని కొందఱిమతము.

"అంగదప్రతిరూపాణాం పుత్త్రాణామేకతశ్శతం,
తాతస్యాప్యస్య వీరస్య గాత్రసంశ్లేషణం పరం." ౧౩

అని మూలము.

"పతిం యా నాభిచరతి మనోవాగ్దేహసంయతా,
సా భర్తృలోకానాప్నోతి సద్భిస్సాధ్వీతి చోచ్యతే." ౨౯
మను. ౯-అధ్యా.

అన్న మనుస్మృతి యీరామాయణార్థమునే బోధించుచున్నది. తారపలుకులుగా వాల్మీకి లోకులకుఁ బాతివ్రత్యమహత్త్వమును దేటపఱచెనని మన మెఱుఁగవలయు.

"అభిముఖహతవీరసేవితం శయనమిదం మమ సేవితుం క్షమం." ౧౬.

అని మూలము. దీనింబట్టి సహగమనముచేయుట తార యాశయమని తేలెడిని.

"అంగదస్తు కుమారోఽయం ద్రష్టవ్యో జీవపుత్త్రయా,
ఆయత్యాం చ విధేయాని సమర్థాన్యస్య చింతయ." ౪

అను నీసర్గమునందేకల హనుమద్వాక్యమున నయ్యది వలదని నిషేధింపఁబడినట్లు కనుపట్టు. కుమారు నభివృద్ధికిఁదెచ్చుపని నీతలపైఁ బడినదని హనుమ యుపదేశించెను. ఇందుఁ దార తనకు సహగమనమే యుత్తమమని తోఁచినట్లు తెల్పెను. ఆకాలము సహగమనము విధివిహితముగ నున్నయట్లు, అది యనాచారమగుట నీకాలమున నిషేధింపఁబడినట్లు కొందఱు ఘోషింతురు. అయ్యది స్మృతిజ్ఞానశూన్యత్వమునఁగల్గిన విపరీతజ్ఞానమనవలయు. మూర్ఖులై సహగమనము నంగీకరింపలేదు. సాధుమతులై యంగీకరించిరి. యోగధారణమునఁ బ్రాణత్యాగముచేయుట పూరుషులకెట్టు లుత్తమమార్గమో సహగమనము స్త్రీలకునట్టిదే యని పూర్వులయాశయమని కొందఱందురు.

"పితృమాతృస్వసృభ్రాతృశ్వశ్రూశ్వశురమాతులైః,
హీనా న స్యాద్వినా భర్త్రా గర్హణీయాన్యథా భవేత్." ౦౩

యాజ్ఞవల్క్యస్మృతి.

"ఇతి స్వర్గఫలోద్దేశేనాయుషః ప్రాగాయుర్వ్యయో న కర్తవ్యో మోక్షార్థినా యస్మా దాయుషశ్శేషే సతి నిత్యనైమిత్తికకర్మానుష్ఠానక్షపితాంతః కరణకళంకస్య శ్రవణ మనన నిదిధ్యాసన సంపత్త్యా సత్యాత్మజ్ఞానేన నిరతిశయానందబ్రహ్మప్రాప్తిలక్షణమోక్షసంభవః, అస్మాదనిత్యాల్పసుఖరూప స్వర్గార్థమాయుర్వ్యయో న కర్తవ్య ఇత్యర్థః. అతశ్చ మోక్షమనిచ్ఛత్యా అనిత్యాల్పసుఖరూపస్వర్గార్థిన్యా అనుగమనం యుక్త మితరకామ్యానుష్ఠానవదితి సర్వమనవద్యమ్."

అని విజ్ఞానేశ్వరులు వ్రాసిరి. బలవంతముగా సహగమనము విధింపఁబడలేదు. మోక్షమును గోరిన స్త్రీలకు సహగమన మక్కఱలేదు. కామ్యకర్మములవలె నిది యొకటిగా విధింపఁబడినది. మోక్షమును గోరనిదనఁగా నంతటి జ్ఞానసంపదలేక స్వర్గాదిసుఖముల నపేక్షించువనితకు నిదియు నొక మార్గమనియు దీనియం దాత్మహత్యాపాపము లేదనియు స్మృతుల తాత్పర్యము.

## వాలి తెప్పిఁజెల్లి కర్తవ్యమును దెలియ నియోగించుట.

* ప్రాణమాత్రావశిష్టుఁడైయుండువాలి మెల్లగా నూర్పులు విడుచుచు నన్నిప్రక్కలఁజూచుచుఁ దొలుత నంగదుని ముందున్న తమ్ముని జయముగాంచియున్న వానింగాంచి స్పష్టమగుపల్కులఁ జేరఁబిలిచి స్నేహపూర్వకముగా సోదరా!

* ఇది యిరువది రెండవసర్గమునఁ గలదు.

నిన్ను రాజ్యమునుండి పాఱఁద్రోలి నీ భార్య నపహరించి మిక్కిలి పాపము చేసితిని. ఆవిషయమునఁ గోపము నాపై నూనకుము. ఈఫలమునొందవలసియుండియే యట్లు చేసితిని. వత్సా! మనకిరువురకు నేకకాలమున రాజ్యసుఖములు కలుగఁ గూడదని దైవము సంకల్పించెనని తోఁచుచున్నది. దైవసంకల్పము తప్పునది కాదుకదా. నేనిపుడే యమలోకమున కరుగనున్నానని యెఱుంగుము. నీవిఁక వానరరాజ్యమును గైకొని పాలింపుము ప్రాణములు, రాజ్యము, మహాసంపదయు, అజేయుఁడన్న సద్యశము, నన్నిపుడే వదలిపోవుచున్నవి. అంత్యకాలమున నేనేమి చెప్పఁదలఁచియున్నాఁడనో దానిని గష్టముగఁ దోఁచినను జేయక మానకుము. ఈ యంగదుఁడు నాకు ముద్దులపట్టి. సుఖార్హుఁడు. సుగుణవంతుఁడు. క్రిందఁబడియున్న వాఁడు చూడుము. నాకుఁ బ్రాణములకన్నఁ బ్రియుఁడగు వీని నీకన్నకొడుకును గాఁ జూచుకొనుము. తండ్రినగు నేను వదలుచున్నాను గాన వీనికేవిషయమునను కొఱఁత లేకుండునట్లు నీవు కాపాడందగును. వీనికి నింక నడిగినవాని నెల్ల నిచ్చుదాత, ఆపదలనుండి రక్షించువాఁడు, అభయదాత యనఁదగినవాఁడవు నీవేకదా. ఇంకెవ్వఁడుగలఁడు? పరాక్రమ సంపద నితఁడు నీకుఁ దుల్యుఁడు. సర్వకార్యములందు నీకుఁ దోఁడుపడఁ గలఁడు. రాక్షసులఁ దునుముకాలమున నీకు ముందు నిలువఁగలఁడు. వయోబలపరాక్రమముల నసమానుఁడు. సుషేణుని దుహియగు నీతార సూక్ష్మార్థముల నెఱుంగఁజాలును. ఈతార యేది తలంచునో యది యట్లే జరగును. మంచి దిది యని తెల్పినచో దాని ననుసరించి చేయుటయే లెస్స. రామకార్యము ప్రధానమని చేయఁదగినది. చేయనిచో నధ

ర్మమే కాక యతనికోపము నిన్ను వధింపఁజేయును. దేవేంద్ర దత్తమగు నీ కాంచనమాలిక నిపుడే గ్రహింపుము. నా మృతికిఁ బిదప దీని యుత్తమకాంతి తగ్గును. కానఁ బ్రాణములు పోవకయుండఁగనే గ్రహింపుము. ఆమాటలు విని సుగ్రీవుఁడు దుఃఖభారమునఁ గాంతిహీనుఁడయ్యెను. సుగ్రీవుఁడంత వైరము మాని వాలి యనుమతిప్రకారము వర్తింపఁగలవాఁడై యా కాంచనమాలికను గ్రహించెను.

వాలి యంతఁ గాంచనమాలిక తమ్మున కొసంగి మృతి నొందువాఁడై యెదుటనున్న కుమారునింగాంచి ప్రీతిచే నాయనా! నేను బోయినతర్వాత దేశకాలముల నెఱింగి ప్రియమో యప్రియమో ప్రభువు చెప్పినదానిఁ బ్రియముగనే తలంచుకొనుచు సుగ్రీవునకు లోఁబడి వర్తింపుము. నేను లాలించినట్లే నాతమ్ముఁడు నిన్నుపలాలించును. ఈతనిపగవారికి సంబంధించినవారలఁగాని శత్రువులఁగాని చేరకుమీ. ఈతని యానతిప్రకారము వర్తింపుము. జితేంద్రియుఁడవు కమ్ము. అధికస్నేహము చేయక స్నేహమే లేకయుండక మధ్యస్థవృత్తి నవలంబింపుము. అని పలుకుచు బాణవేదన యధికముకాఁగాఁ గన్నులు గిరగిరఁ దిరుగఁ బ్రాణముల వదలెను. అందుఁగల కపివీరులెల్ల వగపునఁ దేజోహీనులైరి. ఈవాలి గోలభుఁడను గంధర్వునితోఁ బదునైదువత్సరములు భూరిరణముగావించెను. విరామములేక యాయుద్ధము సాగెను. ఆ గంధర్వుని వధించి మాకభయదానముచేసిన యీవాలి యిట్లు గూలుటచ్చెరువుకదాయని వారు చెప్పుకొనిరి. ఆ కపులు భీతిల్లిరి. తార యాతనిం గౌఁగిలించుకొని నేలపైఁ బడియెను.

## వాలి మృతుఁడు కాఁగాఁ దార విలపించుట.

* అంత నాతార వాలిమోము మూర్కొని లోకాంత రమునొందిన పతిశరీరముంగాంచి శూరాగ్రేసరా! నామాట వినకపోతివి గదా. కనుకఁ గఱకునేలఁ బరుండియున్నావే. నాథా! భూమిని గౌఁగిలించుకొని నాతో మాటలాడకున్న వాఁడవుగాన నాకన్న నీకుఁ బ్రియురాలు భూమియే యని యెఱుంగందగు. పెక్కుపర్యాయములు పాఱిపోయిన సుగ్రీవు నకు నేఁడు చిక్కితివి. పిఱికివాఁడే యిపుడు పరాక్రమవంతుఁ డయ్యెంగదా. అక్కటా! దైవము నేమనవచ్చును? ఎందఱో నిన్నుఁగొలువనున్నారు. వారినేల యుపేక్షించెదవు? వీరలయు నంగదునియు నాదియు రోదనధ్వనుల విని మేలుకొనకయు న్నావే? ఏల? శత్రువులం జంపి దేనిపై శయనింపఁజేసితివో యట్టి వీరశయ్యయందే నీవిపుడు శయనించియున్నావు. కపట యుద్ధమున నభిముఖుఁడవు కాని నీబలము కులము పరిశుద్ధ ములు. నన్ననాథగా నొంటిగా దిగవిడిచిపోయితివే. నా కెవరు దిక్కు? పండితుఁ డెవ్వఁడుగాని కన్యకను శూరునకీయరాదు. శూరపత్నినగు నేను విధవనై యున్నాను గదా. ప్రాణేశ్వరుని నిన్ను మృతుని గాంచియు నా హృదయము శకలములు గాకున్నదే. ఏటికో? బ్రహ్మ పాషాణముచే దీని నిర్మించెనేమో. నీవు పోయినవెనుక నెవ్వరుండిన నాకేమి లాభము? పతివ్రత యైనను ధనధాన్యవతియైనను బతిపోయినపిదప దానిని విధ వయే యని పలుకుదురు. నీకుఁ బగవాఁడగు సుగ్రీవునకు

* ఇది ఇరువదిమూఁడవసర్గమునఁ గలదు.

నీవంకఁ గల్గినభయమును రాముఁ డొకబాణముననే దూలిం చెను. కాన సుగ్రీవుఁడు కృతార్థుఁడే అని యేడ్చెను.

అత్తఱి నీలుఁడు పర్వతగుహయందు నిదురించు క్రూర విషముగల సర్పమును లాగునట్లు వాలితనువున నాటియున్న యాక్రూర నారాచమును లాగివైచెను. తనువునుండి రక్త ధారలు స్రవించెను. తార కన్నీటి నతనిశరీరమును దడుపు చుండెను. అంతఁ బింగళాక్షుండగు కొడుకు నంగదుని బిలిచి నాయనా! తండ్రిమరణావస్థం జూడుము. పాపకర్మరూప వైర మియ్యదనునఁ దుదముట్టెను. యమమందిరమున కరుగు మహాశూరునకు నీతండ్రికి నమస్కరింపుమా యని పలికెను. తల్లి యిట్లు బోధింపఁగా నంగదుఁడు లేచి నేనంగదుఁడనని పేరు చెప్పుచుఁ దండ్రిపాదములం బట్టుకొని నమస్కరించెను. పుత్త్రా! దీర్ఘాయుష్మంతుఁడవగుమని మునుపు దీవించిన ట్లేల యిపు డాశీర్వదింపవు? అని తార యెన్నోరీతులఁ బలవిం చెను. దేవేంద్రుఁడొసంగిన కాంచనమాల యిపుడేల కనఁబడ దని యడిగెను. నామాట వినకపోయి హతుఁడవైతివి. కుమా రుఁడు నేను హతులమే యైతిమి. అని మరల మరలఁ దార విలపించెను.

## దుఃఖితుఁడగు సుగ్రీవుని శ్రీరాముఁ డూఱడించుట.

* అంత సుగ్రీవుఁడు వాలిమృతికై దుఃఖసాగర నిమ గ్నయగు తారంజూచి తాను దుఃఖితుఁడయి విశేషించి పరి తపించెను. కన్నీరు ప్రవహించుచుండఁగాఁ దారం గాంచి పలుకనేరక రామునిచెంతకుఁ బోయెను. నరేంద్రా! నీప్రతిన

* ఇది యిరువదినాల్గవసర్గమునఁ గలదు.

నెఱవేర్చి నాకు రాజ్యము గల్గించితివి. కాని నాకు భోగ ములయందే కాక జీవితమునందు నిష్టము లేదు. పట్టపుదేవి తారయుఁ గిష్కింధానగరవాసులు నంగదుఁడు నాయన్న చావునకు వగచుచుండ నీరాజ్యము నాకేల? ఆతనినుండి కల్గి నబాధలంబట్టి యన్నమృతి యిష్టముగనే యుండినది. నీవా తని వధించినపిదప మిక్కిలి సంతాపము కల్గినది. జీవితశేషము నీకొండపైనుండి గడుపఁ దలంచెదను. ఈతని వధించుటవలన స్వర్గము లభించినను నాకది వలదు. మహాత్ముఁడగు నాయన్న సుగ్రీవా ! నిన్నుఁ జంపుట నాకిష్టముకాదు. ఎందైనఁ బొమ్మని మున్ను చెప్పెను. అది యతనికే యర్హము. దురాత్ముఁడనగు నాకిట్టి దుష్కార్యమే తగినది. భ్రాతృవధలబ్ధరాజ్య మధిక మో తద్వ్యథజనితదుఃఖము మిక్కిలియో విచారింపక కేవల కామపురస్కృతుఁడై యెంతటిపాపియైన నన్నను జంపింపఁ గోరునా ? అట్టికార్యము చేయించిన నాకంటెఁ బాపాత్ముఁ డెవ్వఁడు ? గొప్పతనమున నతఁడు నన్నుఁ జంపక వదలెను. దురాత్ముఁడనగుట నేనాపనికిఁ బాల్పడితిని. నేనతనివలన దెబ్బ లుదిని యోర్వఁజాలక యఱచుచుండఁగా నన్నుంగాంచి మంచి మాటలు చెప్పి మరల నిట్లు యుద్ధముచేయ రావలదని చెప్పెను. దీనింబట్టి యతని సుశీలత్వాదులు నాకార్యమును బట్టి నాదుస్స్వభావము తేటపడియెను గదా. పూర్వ మింద్రుఁ డు త్వష్టకుఁగొడుకగు విశ్వరూపుని జంపి పాపమునొందిన చందమున నిపుడు నేనన్నను జంపించి మహాపాపాత్ముఁడ నైతిని. ఇంద్రుఁడు త్రిలోకాధిపతిగాన నాతని పాపమును భూజల వృక్షస్త్రీలు పంచుకొని నిష్పాపునిగా నొనరించిరి. వానరుఁడనగు నాయీపాపము నెవఁడు భరించును ? ఇట్టి

నేను రాజసమ్మానార్హుఁడ నెట్లగుదును? రాజ్యమునకే యర్హుఁడనుగాను. సర్వజన నింద్యమగు పాపకార్యమును గావించిన వాఁడనైతిని. జలప్రవాహము పల్లమునకే వచ్చురీతి నీదుఃఖము నన్నుఁ బొందినది. మదపుటేనుఁగు నదీతీరమును దంతములఁ గ్రుమ్మురీతిగా భ్రాతృవధమే వాలముగను, అతనికి సంతాపము గల్గించుటయే తొండము కన్నులు తలదంతములుగను గలిగిన మహాపాపరూప మత్తద్విరదము నన్ను హింసించుచున్నది. శ్రీరామా! అగ్నియందు వివర్ణమగుబంగారు కాఁచునపుడది తనతోనున్న మలము నోర్వ కెట్లు వేఱుపఱచునో యట్లే ప్రాక్పుణ్యమున సాధువృత్తమేదేని యుండిన నది తన తోడ నన్నుండనీయక వదలిపోవును. మహాత్మా! అయ్యో! నానిమిత్తమునఁ బితృమృతి కాఁగా సంతప్తుఁడగు నీయంగదుం గాంచి యీవానరులు దుఃఖింప సగమువఱకుఁ బ్రాణములిపుడే పోయినట్లు తోఁచెడు. సత్పుత్రులంబడయ వచ్చుం గాని యంగదునివంటి సత్పుత్రుని మాత్రము పడయుట దుర్లభము. ఏదేశమునకేగినను సోదరసన్నిధి లభింపదు గదా. ఒకవేళ నంగదుఁడు బ్రదికిన సీతారమాత్రము జీవింపదు. నిశ్చయము. అంగదునితో స్నేహముగలుగ నేను మండునగ్నిం బడుదును. ఈవానరులు భవదాజ్ఞంగొని సీతాన్వేషణము చేయఁగలరు. నేనే యుండనక్కఱలేదు. మహాశక్తిమంతుఁడుగావున నాయనంతరము నీవు కార్యమును సాధింపఁగలవు. నేనగ్నిం జొర నానతిమ్ము. అని విలపించెను.

పరవీరహంతయగు శ్రీరాముఁడతనిమాటలు విని తాను దుఃఖితుఁడై బదులాడఁదొఁపమి నూరకుండెను. అంత నోర్పు గలవాఁడుగాన శ్రీరాముఁడు వ్యసనార్ణవమున మునింగిన

తార నూఱడింపఁదలఁచి యచ్చోటికిం బోయెను. తార పతికళే బరముపైఁ బడియుండెను. రాముఁడు రాఁగా మంత్రులామెను లేవనెత్తిరి. బలవంతముగా మంత్రులు లేవనెత్తఁగా నాతార శ్రీరాముని ధనుర్బాణధరుని గాంచి రాజలక్షణసంపన్నుఁడు నదృష్టపూర్వుఁడునగు నా శ్రీరామమూర్తిని దర్శించి వాలి వధించినవాఁ డితఁడే యని యెఱింగి యతనిచెంత కాదుఃఖవేగము నొందుచునే పోయెను. వలను పడినంతదనుక నతనితోఁ బరుషముగా మాటలాడఁ దలఁచుకొన్నదయ్యును దత్సాన్నిధ్యవిశేషమున నివృత్తపాపయై శుద్ధసత్త్వస్వభావయై యతని నిట్లు వినుతించెను.—"మహాత్మా! నీవప్రమేయుఁడవు. దురాసదుఁడవు. జితేంద్రియుఁడవు. ధార్మికోత్తముఁడవు. అనంత కీర్తి విరాజితుఁడవు. భూదేవీతుల్యక్షమావంతుఁడవు. ధనుర్బాణహస్తుఁడవు. మహావీర్యసూచక దృఢతమావయవసంస్థానవిశిష్టుఁడవు. రామా! ఈయవి సామాన్యులయందుఁ గనంబడవు. దుష్టసంహారార్థము మానుషశరీరమును విడిచి యప్రాకృతదివ్యదేహసౌభాగ్యమున వెలయుచున్నాఁడవు. ఒక్క బాణమున వాలి నెట్లు వధించితివో దాననే నన్నును వధింపుము. వాలియొద్ద కరుగుదును. నీవెల్లర రమింపఁజేయువాఁడవు. కాన నీకార్యమున వాలిని రమింపఁజేయుమా. నేను లేనిచో వాలి తుష్టిమంతుఁ డగునా? నన్నుం జూడకయే యున్న సురపురి నచ్చరమిన్నలఁ గంటనైనం జూడఁడు. ఋశ్యమూకసమీపమునఁగల నారామముల నీవెట్లు సీతంబాసి పరితపింతువో యట్లే సురపురి వాలియు నన్ను నెడఁబాసి పరితపించును. ప్రాయపుఁబురుషుఁడు తనచేడియ నెడఁబాసి యెంత దుఃఖము నొందునో నీవెఱుంగుదువు. దుఃఖము నెఱింగిన నీవు

నన్నుఁ జంపిన నేను బోయి కనఁబడఁగా వాలి దుఃఖమును వీడును. స్త్రీవధమాయని యనుమానింపకు. ఈతార వాలి యాత్మయేగాని వేఱుగాదు. ఈభావ మెఱింగి నన్నుం జంపుము. స్త్రీవధదోష మపుడు రాదు. భార్యాదానమును మించిన దానము లేదు. ధర్మరక్షణ మొనరించినవాఁడవగుదువు. అనాథను. దీనురాలనుగాన నన్ను వధించుట నీకు న్యాయమే, నాపతిని వదలి జీవింపఁజాలను.” అని పెక్కుభంగులఁ దార పలుకఁగా శ్రీరాముఁ డామెనూఱడించి, “వీరపత్నీ! నీవిట్టిమాటలు పలుక రాదు. ఈలోకము బ్రహ్మనిర్మితమని యెఱుంగుదువు కదా. సృష్టిచేయునపుడే సుఖదుఃఖాదులు నిర్మింపఁబడి యుండును. బ్రహ్మశాసనము మార్పరానిది. దుఃఖింపకుము. వాలి యున్నప్పటివలె నీ వత్యంత సంతోషము ననుభవింపఁ గలవు. అంగదుఁడు యువరాజు కాఁగలఁడు. వాలి కిది విధి. దాని మీఱఁజాలునే? శూరపత్ను లిట్లు దుఃఖింపరాదు.” అని యిట్లు ప్రియోక్తుల నూఱడింపఁగా, సుతునకు యౌవరాజ్య మొసంగఁజాలువాఁడనియు, నతనిశత్రుల రూపుమాపఁగలఁ డనియు నెంచి, శ్రీరామునిమాటల కూఱటనొంది విలపింప మానెను.

మహాత్ములారా! ఈభాగము నించుక విమర్శింతము.

“క్రోధాదమర్షాదతివిప్రధర్షా
ద్భ్రాతుర్వధో మేఽనుమతః పురస్తాత్,
హతే త్విదానీం హరియూథపేఽస్మి
న్సుతీవ్ర మిక్ష్వాకుకుమార తప్స్యే.”

అని మూలము. సుగ్రీవుని పరితాపమును సూచించువాక్య

మిది- అతి విప్రధర్షాత్ = వాలి నన్నెంతయుఁ దూలనాడుట వలనను, క్రోధాత్ = దానిచేఁ గల్గిన క్రోధమువలనను, అమర్షాత్ = ఓర్వలేమివలనను, మున్ను నాయన్న చావునకు నంగీకరించితిని. ఇపు డతఁడు చావఁగా శ్రీరామా! నాకుఁ బరితాపము మిక్కిలిగాఁ గల్గినదని ప్రాతీతికార్థము. ఈయర్థమే

"ధ్యాయతో విషయాన్ పుంసస్సంగస్తేషూపజాయతే,
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే. ౬౨
క్రోధాద్భవతి సమ్మోహస్సమ్మోహాత్స్మృతివిభ్రమః,
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి." ౬౩
గీత. ౨-అధ్యా.

అను నీవాక్యములచే గీతాశాస్త్రమునఁ జెప్పఁబడినది. వాలి తనను దిరస్కరించినందున నమర్షము గలిగెను. దానఁ గ్రోధ ముద్భవిల్లెను. ఇట్లనుటంజేసి దేహాత్మభ్రాంతి వీడినఁగాని సుఖములేదనునీతి తేటపడుచున్నది. తన్నొరులు తిరస్కరించి రనుకొనుట కేవలాజ్ఞానమూలకమే. కర్మసిద్ధాంతము ననుస రించి స్వకీయ దుష్కర్మఫలమే తిరస్కారరూపమున లభించును. దానిని సంతోషముతో నంగీకరించిన నాదుష్కర్మము నశించును. అట్లు చేయకయుండిన దానిని బలవంతముగా నొనరించినట్లగును. దేహాత్మభ్రాంతియే యిందులకుం బ్రధాన కారణమని యీ భాగమునుండి మనము నేర్చుకొనవలయును.

"ప్రాప్తోఽసి పాప్మాన మిమం నరేంద్ర
భ్రాతుర్వధాత్త్వాష్ట్రవధాదివేంద్రః. ౧౩
పాప్మానమింద్రస్య మహీ జలం చ
వృక్షాశ్చ కామం జగృహుస్స్త్రియశ్చ,

కో నామ పాపానమిమం ఋషేత
శాఖామృగస్య ప్రతిపత్తుమిచ్ఛేత్." ౧౪

అని మూలము. త్వష్టయనువాఁడు శిల్పి. అతనికొడుకు విశ్వరూపుఁడు. అతనికి శిరస్సులు మూఁడు. బృహస్పతి యాగ్రహించి తొలఁగిపోవఁగా నతనిని వరించి యింద్రుఁడు గురుకార్యముల సాగించుకొనుచుండెను. దానవశిల్పికొడుకు గావున నసురులపక్షమున నున్నవాఁడని యనుమానించి యింద్రుఁ డతనిం జంపెను. దాన బ్రహ్మహత్యాదోషము గలిగెను. దాని నింద్రునినుండి భూమి జలవృక్షములు స్త్రీలును బంచుకొనిరి. ఇంద్రుఁడు నిష్పాపుఁడయ్యెను. అని పురాణ కథ. ఇపుడు నాపాపము నెవరు గ్రహింతురని సుగ్రీవుని పరితాపము. ఒక్కరిపాపమును వేఱొకరు పంచుకొందురా? అది సాధ్యమా? దాన మొదటి వానిపాపములు నశించునా యని సందేహము గలుగుంగదా యని కొందఱందురు. పామరులకిది యసాధ్యకార్యమనియు నీ కథ కేవలమసంగతమనియుం దోఁచును. సాంక్రామిక పాపములు పుణ్యములును గలవు. తానే యనుభవింపఁదగినవియు నితరులు కూడ నట్లే యనుభవింపఁదగినవియుఁ గర్మములు గలవు. తాననుభవింపకయే యితరులయందు సంక్రమింపఁజేయ నలవికాదు. తాఁ గొంతయనుభవించి పరపాపానుభవమునకుఁ దగిన కొందఱ కవ్వానిం బంచిపెట్టవచ్చును. ఇరువురభావన యొక్కరీతిగా నుండవలయు. భ్రమరకీటన్యాయము గలదుకదా. ఇది భ్రమరము కావలయుననుభావము తుమ్మెదకు నేను దీనివంటిదాన నగుదునన్నభావన పురువునకు నుండుటంబట్టియే యది భృంగమగును. ఎల్లపురువులు నట్లు కాఁజాలవు. ఒక్కవిధమైన పురువే యట్లగును. అట్లే పరుల

పాపానుభవమునకుఁ దగిన కర్మము చేసియున్నవారలయందే యది సంక్రమింపఁజేయఁదగియుండును. కేవల కర్మమునుబట్టి భావన లేకున్న నొకప్పు డది కలుగవచ్చు. తెలియక దొంగల వెంటఁ బోవువానికి రాజభటులమూలమునఁ గల్లు తాడనాదులు కలుగునట్లని యెఱుంగవలయు. ఇక్కాలమున నది శక్యముకాదని కొందఱందురు. పూర్వము తెలిసియు నిపుడు తెలియకయు నది సాగుచునే యుండునని యెఱుంగుట బుద్ధిమంతుని లక్షణము. భావనయనునది యుత్తమమగుట నద్దానిమూలమునఁగాని పనులుండవని మనమెఱుంగవలయునని యీభాగము మనకు బోధించుచున్నది.

> "ఇత్యేవమార్తస్య రఘుప్రవీర
> శ్శ్రుత్వా వచో వాల్యనుజస్య తస్య,
> సంజాతబాష్పః పరవీరహంతా
> రామో ముహూర్తం విమనా బభూవ." ౨౮

అని మూలము. "అనేన రామస్య క్రోధశోకావాశ్రిత క్రోధశోకాయత్తావిత్యయమర్థస్సూచితః" అని గోవిందరాజులు వ్రాసిరి. కాని యిది యసంగతముగ నున్నది. ఆశ్రితుఁ డేడ్చినఁ దాను నేడ్చి, వాఁడు నవ్వినఁ దాను నవ్వి, వాఁడు దుష్కార్యము చేసినఁ దానును జేసినయెడల శ్రీరాముని పరమేశ్వరత్వ మేటఁగలియదా! మఱియు

> "విపది ధైర్య మథాభ్యుదయే క్షమా
> సదసి వాక్పటుతా యుధి విక్రమః,
> యశసి చాభిరుచిర్వ్యసనం శ్రుతౌ
> ప్రకృతిసిద్ధ మిదం హి మహాత్మనామ్."

అను భర్తృహరిప్రోక్తమహాత్ములభావములు కూడ రాముని యందు లేవని తేటపడును. మఱేమనఁగా.

"సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్,
సర్వారంభాహి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః." ౪౮
గీత. ౧౮-అధ్యా.

అను గీతాశాస్త్రభావము ననుసరించి మానవతనుధర్మములను సరింపక మానవు. అంతియగాని శ్రీరాముని యాత్మయం దీశోక మోహములు లేవనియే యిచ్చో నర్థము చెప్పవల యును. ఆచార్యులుగారు గురువుచేసినపాపములు శిష్యాయ త్తములని తేల్చునాచారము గలవారు కాఁబోలు. అందులకే యీయర్థమును వ్రాసిరని తోఁచెడిని.

"సా విస్ఫురంతీ పరిరభ్యమాణా భర్తుస్సకాశాదపనీయమానా,
దదర్శ రామం శరచాపపాణిం స్వతేజసా సూర్యమివ జ్వలంతం. ౨౭
సుసంవృతం పార్థివలక్షణైశ్చ తం చారునేత్రం మృగశాబనేత్రా,
అదృష్టపూర్వం పురుషప్రధాన మయం స కాకుత్స ఇతి ప్రజజ్ఞే. ౨౮
... ... ... ...
సా తం సమాసాద్య విశుద్ధసత్వా శోకేన సంభ్రాంతశరీరభావా,
మనస్వినీ వాక్యమువాచతారా రామం రణోత్కర్షణలబ్ధలక్షం." ౩౦

అని మూలము. ఇచ్చోట గోవిందరాజులు తనిశ్లోకి కనఁబఱ చిన భావములు నిస్సారములని తోఁచెడు. ఇందుఁ గల విశే షమేమి ? అని యూహింతము. మృతుఁడగు పతికళేబరము పైఁబడి విలపించుచుండఁగా మంత్రులు రాముని రాకం గాంచి లేవఁదీసిరి. అత్తఱి నాతార రాముని గాంచినదని ప్రతీతి

కార్థము. పిదప నుతించునని చెప్పఁబడును. ఇచ్చో నామె భావ మెట్టులుండునని యోజింతము. పతిని జంపినరాముఁడు కనఁబడఁగాఁ బతియందే ప్రీతిగల కాంత కెట్టిభావ ముదయించునో పామరులకుంగూడఁ దెలియును. అట్టితార శ్రీరాముని వినుతించు టెట్లు? అనునదియే యిందుఁగల సందియము. ఇచ్చో మహాకవి వాల్మీకి "శరచాపపాణిం స్వతేజసా సూర్యమివ జ్వలంతం రామం దదర్శ" అని వ్రాసిరి. దీనిసారమేమి? శ్రీరాముఁడు నిరుపమాన స్వతేజస్సుచే సూర్యునివలెఁ బ్రకాశించె ననుటంజేసి యాతేజఃప్రధానరూపము కనఁబడఁగనే తార తదావేశమున విమలాంతఃకరణ యయ్యెనని భావము. తారకుఁగనఁబడిన రూపమితరులకు నట్టిదిగాఁ దోఁపదు. కాననే యామె దుఃఖమునడంచుకొనఁ జాలెను. ఆయవస్థ సర్వదా యుండదు. మరల మాయ గప్పఁగా యథాపూర్వముగనే యుండఁగలదు.

> "దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా,
> యది భాస్సదృశీ సా స్యాద్భాసస్తస్య మహాత్మనః."

అను గీతాశాస్త్రాభిప్రాయమే యిట సమన్వయింపఁదగును. భగవద్దివ్యతేజోరూపసందర్శనము తారకుఁగల యజ్ఞానమును దొలఁగింపఁ జాలుననుట. నిర్వివాదాంశము. ఈయర్థమే తరువాత శ్లోకమునందు "విశుద్ధసత్వా మనస్వినీ తారా వాక్యమువాచ" అను వాక్యములు సార్థక మొనరించుచున్నవి. ఇట్టి తావులయందుఁ గేవల విశేష్యవిశేషణపదములయందేమి గలదని పదకృత్యము విచారింపక సారమునే యూహింపఁదగును. ఈభావము మనస్సునందుంచుకొనినచో

"త్వమప్రమేయశ్చ" అను లోనగు శ్లోకములకు సందియ మొందక యర్థము చెప్పవచ్చును. అసంగతమేదియుఁ దోఁపదు.

"యేనైకబాణేన హతః ప్రియో మే తేనైవ మాం త్వం జహి సాయకేన,
హతా గమిష్యామి సమీపమస్య న మామృతే రామ రమేత వాలీ." 33

అని మూలము. ఈమాట తార చెప్పుట కోపముచేతఁగాదు. సాధ్వీత్వముననే. ఇందుఁ బతివ్రతా ధర్మమే తెలుపఁబడును.

"పతిం యా నాభిచరతి మనో వాగ్దేహసంయతా,
సా భర్తృలోకా నాప్నోతి సద్భిస్సాధ్వీతి చోచ్యతే." ౫౯ ౯-అధ్యా.

అను మనుస్మృతివాక్యమే యిందు గ్రహింపఁదగును. తరువాతి శ్లోకములఁగల భావమంతయు నాతారకు భర్తయందుఁ గల ప్రీతినే సూచించును.

"ఇత్యేవముక్తస్తు విభుర్మహాత్మా తారాం సమాశ్వాస్య హితం బభాషే.౪౧
మా వీరభార్యే విమతిం కురుష్వ లోకోహి సర్వో విహితో విధాత్రా,
తం చైవ సర్వం సుఖదుఃఖయోగం లోకో బ్రవీత్తేన కృతం విధాత్రా.౪౨
త్రయోహి లోకా విహితం విధానం నాతిక్రమం తే వశగా హిపస్య,
ప్రీతిం పరాం ప్రాప్స్యసితాం తథైవ పుత్రస్తు తే ప్రాప్స్యతియౌవరాజ్యం.
ధాత్రా విధానం విహితం తథైవ న శూరపత్న్యః పరిదేవయంతి,
ఆశ్వాసితా తేన తు రాఘవేణ ప్రభావయుక్తేన పరంతపేన. ౪౪
సా వీరపత్నీ ధ్వనతా ముఖేన సువేషరూపా విరరామ తారా."

అని మూలము. ఇందు శ్రీరామునియాశ్వాసోక్తులు

"అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే,
గతాసూనగతాసూంశ్చ నానుశోచంతి పండితాః. ౧౧

... ... ... ...

య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతం,
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే. ౧౯

... ... ... ...

వేదావినాశినం నిత్యం య ఏన మజమవ్యయం,
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతి కం. ౨౧

... ... ... ...

జాతస్య హి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మ మృతస్య చ,
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితుమర్హసి. ౨౭
అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత,
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా." ౨౮

అను నీగీతావాక్యసారములే యని మన మెఱుంగవలయు. ఇందు శ్రీరాముని వాక్కులనే యందు శ్రీకృష్ణుఁ డుపదేశించెను. సత్యమున కెప్పటికిని మార్పులేదనునది యీభాగము నుండి యెఱుంగందగినది. కర్మసిద్ధాంతమే యిందుఁ బ్రతిపాదితము. రాముఁ డిట్టు లాతార నాశ్వాసించి తద్భావికర్మగతులను దెలుపుచున్నాఁడు. తారా! నీవు వాలియున్నప్పు డెట్టు లుంటివో యట్లే యిఁక నుండఁగలవు. కొడుకు యువరాజు కాఁగలఁడు. కాన నూఱడిల్లు మనఁగా నా తార వగపుడిగెను. అని కథార్థము. సుగ్రీవుఁడు నిన్నుఁ బరిగ్రహింపఁగలఁడు. అంగదుఁడు యువరాజగును. అనుటంజేసి యామె వగపుడిగె నని భావము. వనచరులకు భ్రాతృభార్యాపరిగ్రహణము సదాచారముగా నున్నదని తేటపడును. సుగ్రీవపత్నిని వాలి పరిగ్రహించెనని యాక్షేపించిన రాముఁడిపు డిట్లేల బోధించె

నను ప్రశ్న మసంగతమని వేఱుగాఁ జెప్పవలయునా! సందర్భమే తెలుపును గదా.

## వాలికి సంస్కారము చేయుట.

* పిదప రాముఁడు లక్ష్మణునితో మిత్రదుఃఖమును సమానముగా ననుభవించుచు సుగ్రీవాంగదుల నాశ్వాసించుచు మనమెంత వగచినను మృతున కూఱటగలుగదు. త్వరితముగా నౌర్ధ్వదైహికక్రియలు గావించుట మంచిది. కన్నీరు వదలుట లోకాచారముగ నుండును. దానిని మీరును గావించితిరి. ఇఁకఁ జాలును. ఇంక దాన లాభము లేదు. మీరేమియు నింతకు మించినదేదియుఁ జేయఁజాలరు. ఈశ్వరాజ్ఞను మీఱి యెవ్వరికి నేది చేయను దరముగాదు. ఈశ్వరుఁడే సర్వలోకములకుఁ గారణము. వారికెల్ల నీశ్వరుఁడే సహకారి సాధనము. భూతనియామకుఁ డీశ్వరుఁడే. ఆతని నతిక్రమించి నది లోకమందేదియు లేదు. లోకము లతనికి లోఁబడి కార్యముల నొనరించును. స్వాతంత్ర్యము వానికి లేదు. ఎవ్వాఁడైన నేకార్యమునకును స్వతంత్రముగా కర్త కానేరఁడు. ఒకని నొకఁడు భేదింపఁజాలఁడు. ఏల యందురేమో లోకములు తద్వశమున నుండునవి. కాఁబట్టి కాలమే లోకములకు గతి. ఈశ్వరుఁడు స్వతంత్రుండౌట దేనికి లోఁబడఁడు. ఆతనికి నాశనవికారములు లేవు. నిరంకుశమగు స్వాతంత్ర్యమాతనికి కలదు. తన నియమమును దానతిక్రమింపఁడని నమ్మవలయు. బంధుత్వమే యతనికి లేదు గాన నీతఁడు పక్షపాతి

* ఇది యిరువదైదవసర్గమునఁ గలదు.

గా నేరఁడు. అతని ననుగ్రహమును బడసి వశము చేసికొన వలయునే కాని వేఱొక సాధనమున శక్యముకాదు. పరాక్రమాసాధ్యుఁడు. సఖిజ్ఞాతిరూపానుబంధ మతనికి లేదు. కాన నపరాధుల దండించుచుండు. ఎవనికి లోఁబడక కర్మానుసారముగా సర్వమును వర్తింపఁజేయుచుండును. శాస్త్రమర్యాదల నెఱింగిన బుద్ధిమంతుఁడు తత్తత్కర్మానుగుణముగా నీశ్వరుఁడు పరిణమించి యుండునని యెఱింగి నెమ్మది నుండవలయు. ఈశ్వరకృత్యమునకు దుఃఖము నొందరాదు. ఆతఁడు మనకేది హితమో దానినే చేయునని నమ్మవలయు. ధర్మార్థకామము లీశ్వరమర్యాదానుసారమే కలుగు. అందేది పొందఁదగునో యద్దాని నతఁడే కలిగించుచుండు

వాలి నాబాణహతుఁడై పాచితము నొందుటచే నపాపుఁడై పారిశుద్ధ్యము నొంది స్వకర్మానుష్ఠానఫలము లొసంగు స్వర్గమున కేగెను. అతఁ డొందినగతి యుత్తమము. కానఁ దపింపరాదు. సద్గతికిం బోయినవారి విషయమున విచారింపరాదు. కృత్యము నెఱవేర్పందగు. అని రాముఁడు చెప్పి యూరకుండఁగా లక్ష్మణుఁడు దుఃఖవేగమున స్మృతి తప్పి యున్న సుగ్రీవునితో వానరరాజా! ఇఁక వాలికిం బ్రేతకృత్యములు కావింపుము. తారాంగదులం గూడి వాలికి దహనసంస్కారము గావింపందగు. అందులకై శ్రీచందనాదికోత్తమ వస్తువులం దెప్పింపుము. వగనొందు తారాంగదుల నూఱడింపుము పురము భవదధీనము కాన దాని క్షేమమారయ వలయు. ఇట్లు లజ్జానునిరీతి దుఃఖించు టుచితము కాదు. అంగదుఁడు పుష్పమాలికాదుల నిపుడే తెచ్చుంగాక. తారా! నీవిపుడే పోయి శిబికను గొనిరమ్ము. తర్వాపదు టెల్ల కార్యము

లందు మంచిది. ఇట్టి పనులయందు మిక్కిలి మంచిది. వాలిని మోయుటకు సమర్థులగు వానరులను సన్నద్ధులను జేయుము. అని హెచ్చరించి రాముని చెంత నిలుచుండెను.

తారుం డా లక్ష్మణునిమాటలు విని త్వరపడుచు శిబికంగొనితేర నగరికరిగెను. దానింగొని వేగ మరలివచ్చెను. వాహకు లరుదెంచిరి. భద్రసింహాసనముగల రథము రీతిగా నాశిబికయుండెను. అది విశ్వకర్మ నేర్పుగనంబఱచి రచించినది. రాముండాశిబికంగని సౌమిత్రితో నింక వేగముగా వాలి నెత్తి శిబికయందుంచి ప్రేతకృత్యము గావింపంబడుంగాక. అంత సుగ్రీవుండు విలపించుచు నంగదునిం గూడి వానినెత్తి పల్లకి పయిం బెట్టెను. వాలి నలంకరించి వానరులతో నాయన్నకు వాలికి నుత్తరక్రియలు చక్కంగావింపుండు. వానరులు రత్నములు చల్లుచు ముందుగం బోవుదురు గాక. వారివెంట శిబిక పోవలయును. అని యాజ్ఞాపించి మహారాజ వైభవమున నుత్తరక్రియలం గావించెను. ప్రియబంధువులగు తారుండు లోనగువారు విలపించుచు నంగదునితో నడిచిరి. వానరకాంతలు వీరా! వీరా! యనుచు విలపించుచుంబోయిరి. ఒక్కచోం జితి గావించిరి. తార శిబికను దింపంగనే యందున్న భర్తను గాంచి శిరము తనతొడపై నునుచుకొని హానాథా యని విలపించెను. వానరకాంత లామెను దూరముగాం గొనిపోయిరి. అంగదుండు శోకాతిరేకమున మృతుండగు తండ్రికి నగ్నిసంస్కారము యథావిధి గావించెను. అంత జలతర్పణముచేయ నెల్లరం గూడి నదికడకు వచ్చెను. జలతర్పణము గావింపం బడెను. రాముండు ప్రేతకార్యములం గొంత లేకయుండం

జేయించెను. సంస్కారములను ముగించి సుగ్రీవుఁడు రాముని కడకు వచ్చెను.

మహామతులారా! ఇందుఁ గొన్ని విశేషములు గలవు. వానిం బరిశీలింతము. పరికించునపు డొకవిషయము సిద్ధాంతము చేయవలయునని పట్టుదలఁ బూనరాదు.

"న శోకపరితాపేన శ్రేయసా యుజ్యతే మృతః,
యదత్రానంతరం కార్యం తత్సమాధాతుమర్హథ. ౨
లోకవృత్తమనుష్ఠేయం కృతం వో బాష్పమోక్షణం.
న కాలాదుత్తరం కించిత్కర్మ శక్య ముపాసితుం. ౩
నియతిః కారణం లోకే నియతిః కర్మసాధనం,
నియతిస్సర్వభూతానాం నియోగేష్విహ కారణం. ౪
న కర్తా కస్యచిత్కశ్చిన్నియోగే చాపి నేశ్వరః,
స్వభావే వర్తతే లోకస్తస్య కాలః పరాయణం. ౫
న కాలః కాలమత్యేతి న కాలః పరిహీయతే,
స్వభావం చ సమాసాద్య న కశ్చి దతివర్తతే. ౬
న కాలస్యాస్తి బంధుత్వం న హేతుర్న పరాక్రమః,
న మిత్రజ్ఞాతిసంబంధః కారణం నాత్మనో వశః. ౭
కింతు కాలపరీణామో ద్రష్టవ్యస్సాధుపశ్యతా,
ధర్మశ్చార్థశ్చ కామశ్చ కాలక్రమసమాహితాః." ౮

అని మూలము. ఇది శ్రీరామునుపదేశము. ఒక్కొక్క వాక్యము సకల స్మృతిసారము. మృతునకు మేలుకోరినవారు తమను దుఃఖింపక యుండవలయు. ప్రేతహితము పొందెడు సత్కర్మముల నాచరింపవలయును. అనఁగా దుఃఖించుట విహి

తము కాదు. సద్హృదయులై మృతునిమేలు కోరి శాస్త్రవిహిత కృత్యము లాచరింపవలయునని తాత్పర్యము. ఈకర్మఫలములు వారికెట్లు చేరునని ప్రశింతురేమో. భావనయే కదా తపస్సు. సద్భావమున నెవరింగూర్చి యెట్టి సత్కర్మముల నాచరింతుమో వారికి నర్హ్మములగు ఫలములు వారికిం గలుగును. పితృదేవతలు తమతమ వంశములవారిమేలు కోరుచుందురు. ఈకర్మముల ఫలముల నాలోకమునం దతనికిం గల్గింతురు. చంద్రలోకమే పితృలోకమని పెద్దలయాశయము. మనభావన భగవంతుఁ డెఱింగినట్లే పితరులు కూడ నెఱుంగుదురు. వారు తృప్తులై మనమూహించినవారి కాఫలముఁ గల్గింతురనియే యిందలిసారము.

మృతునింగూర్చి రోదనముచేయుట లోకమున నాచారము కలదు. ఇది ప్రాయికమే యనవలయును. కాని మంచి యాచారమిది గాదని రాముఁ డనుచున్నాఁడు.

"శ్లేష్మాశ్రు బాంధవైర్ముక్తం ప్రేతో భుంక్తే యతోఽవశః,
తస్మాన్న రోదితవ్యంహి క్రియాః కార్యాస్స్వశక్తితః."

అని యాజ్ఞవల్క్యస్మృతి బోధించుచున్నది. విలపించుట మంచి దనునది కేవల పామరులకుగాఁ జెప్పఁబడియుండునని మన మెఱుంగవలయు. కనుకనే రాముఁడు "కృతం వో బాష్ప మోక్షణ" మ్మనియెను. నియతి యనఁగా నిటఁ గాలమని యర్థము.

"ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహం".

అనియు,

"కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తు మిహ ప్రవృత్తః."'

అనియు, గీతావాక్యములు కలవు కదా.

"లోకానామంతకృత్కాలః కాలోఽన్యః కలనాత్మకః"

సౌరోపనిషత్తు.

వీనింబట్టి కాలమే భగవత్స్వరూపమని యేర్పడుచున్నది. సర్వమునకుఁ గాలమే కారణము. దాని నియమించువారు లేరు. కాలమనఁగా నీశ్వరుఁడే. ఫలప్రదాత యతఁడే. ఎట్లు? వారివారి కర్మముల ననుసరించియే. పొందరాని ఫలములను గోరిన నవి లభింపవు. ఏల? అట్టి కర్మముల నాచరింపని కారణమున నని యర్థము. ఈశ్వరునకు నేలాటి పక్షపాతములు లేవు. బంధుశత్రుమిత్రాదులు లేరు. అనఁగాఁ గర్మానుసారముగ ఫలముల నొసంగువాఁడు గావునఁ బక్షపాతము గలవాఁడు కాఁడని తేలెను. శత్రుమిత్రాదులు లేని కతనఁ గర్మాధీన ఫలప్రదాతయగుట సర్వసాక్షి యయ్యెను. ధర్మార్థకామములు కాలాయత్తములు. ఆయాకాలములయం దనుష్ఠేయములని భావము. కాలాతిక్రమణమున నవి ఫలదాయకములు కాక పోవును. కానఁ గాలము నతిక్రమింపక యవి చేయఁదగునని భావము. సంధ్యావందనాదులు కాలాతిక్రమణమున నొనరించిన నిష్ఫలములగు నని యీయది తెలుపుచున్నది. కాలము మీఱినదని వానిని వదలరాదని కూడఁ దేలెడిని. నిత్యకర్మములత్యాజ్యములు గదా. ఈ యుపదేశసారమేది యనఁగా వాలి స్వకీయకర్మానుసారము నాయస్త్రమున మృతుఁడయ్యెను. మృతి కల్పించునది కర్మమే. దాని కతఁడే యుత్తరవాది. కాన

నద్దానిం గూర్చి విచారింపక సకాలమున నాతని మేలుకొఱకు విధిప్రోక్త సంస్కారముల నాచరింపుఁడని రాముఁ డుపదేశించెను. ఇందుఁ బ్రధానము కర్మసిద్ధాంతమే కదా. ధర్మార్థకామము లెట్టివో ముక్తి యట్టిది కాదనియు మోక్షార్థము కర్మములు లేవనియు సర్వసత్కర్మఫలమే జ్ఞానమనియు నది లభించినఁగాని ముక్తి దొరకదనియు, ముక్తియనఁగా నొక లోకము కాదనియు, వైకుంఠాదిలోకములు ముక్తిస్థానములని చెప్పుట కేవలము పామరులకొఱకనియుఁ, బ్రవృత్తిమార్గమే కాని వేఱొకమార్గమున ముక్తిలభింపదనుట మధ్వవైష్ణవుల యాశయమే కాని యది సత్యము కాదనియు నిందలి సారమని మన మెఱుంగవలయు. ఈయుపదేశము నొక్కదాని నెఱింగినం జాలును. సంసారమునుండి తరింపవచ్చు. విధివిహితకర్మానుష్ఠాన మనుటం జేసి విగ్రహపూజాదులు ముక్తిసాధనములు కాఁజాలవు. అవి పామరులకొఱకు నియమింపఁబడినవి. వాని యభ్యాసమునకు ఫలము ధ్యానము. అది యలవడినచో నిది మానఁదగినది. పెద్దలుకూడ నాచరింతురుగదా యన్న నది పామరులకు గా నని యెఱుంగవలయును. ఇఁక నధ్యాత్మరామాయణవిషయము నించుక పరికింతము.

శ్రీరామః—

"అహంకారాది సంబంధో యావద్దేహేంద్రియైస్సహ,
సంసారస్తావదేవ స్యాదాత్మనస్త్వవివేకినః.
మిథ్యారోపితసంసారో న స్వయం వినివర్తతే,
... ... ... ... ... ...

ఏవం కర్మవశాజ్జీవో భ్రమత్యాభూతసంప్లవం,
సర్వోపసంహృతౌ జీవో వాసనాభిస్స్వకర్మభిః.
అనాద్యవిద్యావశగ స్తిష్ఠత్యభినివేశితః,

... ... ... ... ... ...

యదా పుణ్యవిశేషేణ లభతే సద్గతిం సతాం,
మద్భక్తానాం సుశాంతానాం తదా మద్విషయా రతిః.
మత్కథాశ్రవణే శ్రద్ధా దుర్లభా జాయతే తతః,

... ... ... ...

పూర్వజన్మని తే సుభ్రు కృతా మద్భక్తిరుత్తమా,
అతస్తవ విమోక్షాయ రూపం మే దర్శితం శుభే.
ధ్యాత్వా మద్రూపమనిశమాలోచయ మయోదితం,
ప్రవాహపతితం కార్యం కుర్వత్యపి న లిప్యసే.
శ్రీరామేణోదితం సర్వం శ్రుత్వా తారాతివిస్మితా,
దేహాభిమానజం శోకం త్యక్త్వా నత్వా రఘూత్తమం.
ఆత్మానుభవసంతుష్టా జీవన్ముక్తా బభూవహ,
క్షణసంగమమాత్రేణ రామేణ పరమాత్మనా.
అనాదిబంధం నిర్ధూయ ముక్తా సాపి వికల్మషా."

అధ్యాత్మరా. కిష్కిం. ౪-సర్గము.

"దదర్శ రామం శరచాపపాణిం స్వతేజసా సూర్యమివ జ్వలంతం" అన్న వాల్మీకివాక్యమునే యీ యధ్యాత్మరామాయణ వాక్యము.

"అతస్తవ విమోక్షాయ రూపం మే దర్శితం శుభే."

అనునది దృఢపఱచుచున్నది. తారకుఁ గనఁబఱచిన రూపము క్రొత్తది. తేజోమయము. కావుననే తార దుఃఖవినిర్ముక్త యయ్యె నని మన మెఱుంగవలయును.

## సుగ్రీవపట్టాభిషేకము.

* తరువాత సుగ్రీవుని వానరులెల్లఁ గొలిచి యుండిరి. సుగ్రీవాదులు రాముని కడకుం బోయి దోసిలొగ్గి నిలుచుండిరి. వాయుకుమారుఁడగు హనుమంతుఁడు దోసిలొగ్గి రామునింగని, "ప్రభూ! నీయనుగ్రహవిశేషమున సుగ్రీవుఁడు పిత్ర్యమగు రాజ్యము నొందెను. ఇఁక నతఁడు నీయనుగ్రహమున నగరముం బ్రవేశించి యన్ని కార్యములు చేయుఁగాక. సూర్యసుతుఁడు పట్టాభిషిక్తుఁడై నిన్నుఁ బూజింపఁగలఁడు. మీ రిందుండి కిష్కింధానగరమునకు వచ్చి వానరుల కానందముఁ గలిగించి వానరరాజుగా సుగ్రీవుని జేయుము." అని ప్రార్థింపఁగా, వాగ్విశారదుఁడగు రామమూర్తి హనుమతో "నార్యా! తండ్రి యానతిని బాలింపవలసినవాఁడను. ఈవనవాసకాలమునందు గ్రామనగరములం బ్రవేశింపరాదు. మీరెల్లరు నతని విధిప్రకారము పట్టాభిషిక్తునిం జేయుఁడు." అని పలికి సుగ్రీవునిం గాంచి "వీరా! సుగ్రీవా! ఈయంగదుని యౌవరాజ్యమున నభిషేకింపుము. ఇతఁడు నీయన్న కొడుకు. వీరుఁడు. యౌవరాజ్యమునకుఁ దగినవాఁడు. వర్షాకాలము వచ్చినది. శ్రావణమనునీనెల యందు మొదటి దగు. వార్షికములను నీనాల్గునెలలు యుద్ధప్రయత్నమునకుఁ దగనివి. పురమునకుఁ బొమ్ము. తమ్మునింగూడి నే నీ కొండయందుండెదను. ఈకొండగుహ రమణీయము విశాలమునయి యున్నది. గాలి వెలుతురు గలదు. జలములకుఁ గొదువలేదు. పుష్పములున్నవి. నా కిది వాసయోగ్యము.

* ఇది యిరువదాఱవసర్గమునఁ గలదు.

కార్తికమాసము సమీపింపఁగా రావణవధార్థమై ప్రయత్నింపుము. ఆలసింపక పురమున కరుగుము. వానర రాజ్యమున కభిషిక్తుఁడవు కమ్ము. అని శ్రీరాముఁ డాజ్ఞాపింపఁగా నతఁడు వాలిపాలితమగు కిష్కింధఁ బ్రవేశించెను. వానరు లెల్లరు నతనిఁ బరివేష్టించిరి. నమస్కరించిరి. వారల గౌరవించి సుగ్రీవుఁడు వాలియుండు నంతఃపురమునకుఁ బోయెను. అందుండి వెడలిరాఁగా వానరరాజ్యమున కెల్లరు నభిషేకించిరి. రాజోచిత మర్యాదలు నడపిరి. సర్వాలంకార శోభితుఁడై యెల్లరకు బహుమానము లొసంగి హోమాదులు చేయించెను. కనకమయపీఠమునఁ దూర్పుమొగముగా సుగ్రీవుని గూరుచుండఁబెట్టి మంత్రులు లోనగువారు పవిత్ర నదీ సముద్రాదులనుండి సంగ్రహించిన జలముల సుముహూర్తము నందు యథాశాస్త్రముగ గజగవయగవాక్షగంధమాదన శరభ ప్రభృతులగు వానరులంగూడి వృషభశృంగములతో బంగారు కలశములతో వసువు లింద్రు నభిషేకించినట్లుగ నభిషేకించిరి. జయజయధ్వనుల దిక్కుల నింపిరి. అంత సుగ్రీవుఁడు రామాజ్ఞనొదలందాల్చి యంగదుం గౌఁగిలించుకొని యావరాజ్యమునకుఁ బట్టిముగట్టెను. అంగద పక్షపాతము గలవారెల్లరు నతని యాకార్యమున కానందించిరి. వానరు లానందమున శ్రీరామ సౌమిత్రులఁ గొనియాడిరి. ఆపుర వరము సర్వాలంకార శోభితమయ్యెను. సుగ్రీవుఁడంత శ్రీరాముని కడకుం బోయి జరగిన కార్యములనెల్ల విన్నవించి రుమం గూడి సుఖంబుండెను.

మహామతులారా! ఇందు విమర్శింపఁదగిన విషయ ములఁ బరికింతము.

"పూర్వోఽయం వార్షికో మాసశ్శ్రావణస్సలిలాగమః. ౧౩
ప్రవృత్తాస్సౌమ్య చత్వారో మాసా వార్షికసంజ్ఞికాః,
నాయముద్యోగసమయః ప్రవిశత్వం పురీం శుభాం." ౧౪

అని మూలము. ఇందు వర్షర్తువు నాలుగు నెలలుగాఁ జెప్పఁబడినది. ఋతుత్వము మాసద్వయనియమవత్త్వము గదా. ఇదెట్లు పొసఁగును? అని ప్రశ్నము. పూర్వము పంచర్తువులే యుండెను. "ద్వాదశమాసాః పంచర్తవః" అని శ్రుతి తెలుపుచున్నది. ఈవిషయమునందు బహుపక్షములు గలవు.

"కార్తికాగ్రహాయణ పౌషమాఘాశ్శీతః, ఫాల్గున చైత్రవైశాఖ జ్యేష్ఠాః గ్రీష్మాః, ఆషాఢ శ్రావణ భాద్రపదాశ్వినాః వర్షాః."ఇతి. "ద్వాదశమాసాః పంచర్తవః." ఇతి శ్రుతం. "తత్ర హేమంత శిశిరయోరేకత్రీకరణం వివక్షితమ్."

ఈస్మృతి ననుసరించి యోజింపఁగాఁ గాలానుసారముగా నీఋతువులు మార్పునొందునట్లు నిర్ణయింపఁబడినట్లు తోఁచును. ఇచ్చటఁ గార్తీక మాసమనఁగా నాశ్వయుజ మాసాంతమని గ్రహింపవలయునని కొందఱు.

"ఆషాఢస్య ప్రథమదివసే మేఘమాశ్లిష్టసానుం
వప్రక్రీడాపరిణతగజప్రేక్షణీయం దదర్శ."

అను కాళిదాసోక్తి పై దానినే దృఢపఱచుచున్నది.

"ఋతుః సచ షడ్విధః. షడ్వాఋతవ ఇతి శ్రుతేః.యత్తు ద్వాదశ మాసాః పంచర్తవ ఇతిశ్రుతం, తత్ర హేమంతశిశిరయోరేకీకరణం వివక్షితం, యాజమానేషు పంచప్రయాజానుమంత్రణమంత్రేషు హేమంత శిశిరయోరేకస్మిన్ మంత్ర ఏకేన పదేన వ్యవహారాదేకీకరణం యుక్తం. తథాహి...వర్షాఋతూనాం ప్రీణామి...హేమంత శిశిరావృతూనాం

ప్రీణామీత్యేత దేవాభిప్రేత్య బహ్వృచబ్రాహ్మణే పఠ్యతే. ద్వాదశమాసాః పంచర్తవో హేమంత శిశిరయోస్సమాసేనేతి....అస్తు నామ యథా తదా, పంచసంఖ్యా సర్వథా షోఢా భిద్యంతే.”

అని విద్యారణ్యులు.

“అష్టౌ మాసాన్విహారస్స్యాద్యతీనాం సంయతాత్మనాం,
ఏకత్ర చతురో మాసాన్వార్షికాన్నివసేత్పునః.”

మత్స్యపురాణము.

“ఏకరాత్రం చరేద్గ్రామే నగరే పంచరాత్రకం,
వర్షాభ్యోన్యత్ర వర్షాసు మాసాంశ్చ చతురో వసేత్.”

కణ్వుఁడు.

“సంరక్షణార్థం జంతూనాం వసుధాశలచారిణాం,
ఆషాఢాదీంశ్చ చతుర ఆమాసాత్కార్తికాద్యతిః.”

మేధాతిథి.

ఇట్లు ప్రమాణములు పరిశీలించినయెడల రెండుపక్షములు గలవని తేలెడిని. కాని ప్రాచీనకాలమున నాలుగు నెలలు వర్షర్తువనియే వ్యవహారము. ఆమతమునే యనుసరించి రాముఁడు చెప్పెననరాదు. శ్రావణమాసమిది తొలినెలయని యెను. కార్తికమాసము సమీపింపఁగా సీతాన్వేషణ ప్రయత్నము చేయుమనియెను. ఇదెట్లు సరిపడుననరాదు. ఆ కాలమున నిప్పటివలె సంక్రమణకాలవ్యవహారము లేదు. అయనమే సంక్రమణము. పదునెనిమిదిదినములు సంక్రమణమునకుముం దయనము కలుగును. ఆలెక్కను జూడఁగా నాషాఢమునఁ గొంతభాగము కార్తికమాసమునఁ గొంత భాగము వర్షర్తువునం జేరును. వృష్టికాలము నాలుగునెలలే యనియు నందు శ్రావణ భాద్రపదములు ప్రధానములనియు

నేర్పడుచున్నది. నాల్గుపక్షములు నాలుగు నెలలని వ్యవహరించు వారు గలరు. ఆమతమున నిది నిర్బాధకమే. మాధవాచార్యుల మతము ననుసరించి రెండుపక్షములు సిద్ధాంతములే. కాని యూఱునెల లనునవి ప్రాయికముగాఁ బ్రసిద్ధము. రామాయణకాలమున నెట్టి వ్యవహారము కలదని మన మాలోచించిన నాలుగునెలలే యనియు నదియు సౌరమానము ననుసరించి చెప్పఁబడియెననియు మన మూహింపవచ్చును. నాలుగు నెలలు గుహయందే యున్న యట్లు రామాయణము మనకుఁ దెలుపును.

> "కార్తికే సమనుప్రాప్తే త్వం రావణవధే యత. ౧౬
> వివ నస్సమయస్సౌమ్య ప్రవిశ త్వం స్వమాలయం,
> అభిషిక్తస్స్వరాజ్యేన సుహృదస్సంప్రహర్షయ." ౧౭

అని మూలము. ఈనాలుగునెలలు మేమిందు గుహలో నివసింతుము. సుగ్రీవా! నీవు కిష్కింధ కరిగి పట్టాభిషిక్తుఁడవై సుహృదుల నానందింపఁజేయుమా. అని శ్రీరాముఁడు పలికెను. ఇందు గోవిందరాజులు కాలమును జక్కఁగా నిర్ణయించిరి. ఈగ్రంథమున కదియంత ముఖ్యము గాకపోయినను వ్రాసెదను. కార్తిక మాసమున సుగ్రీవుఁడు సీతాన్వేషణ ప్రయత్నము చేయవలయునని రామాజ్ఞయైనను సుఖముల నడుమ మఱచిపోయెను. వేళ యతిక్రమింపఁగా లక్ష్మణుని గిష్కింధకుఁ బంపి రాముఁడు హెచ్చరించెను. సుగ్రీవుఁడు వానరులఁ బంపెను. అది మార్గశీర్షమాసముగ నుండవలయుఁ గదా. దక్షిణభాగమున కరిగిన వానరులు స్వయంప్రభయుండు గుహలోఁ జాలకాల ముండిరి. "ద్రుమాన్ వాసంతికాన్ దృష్ట్వా" అని వసంతలక్షణములు తరువులయందగ

పడినట్లు చెప్పఁబడినది గదా. బిలమునుండి వెడలినది ఫాల్గు ణము గావలయును. క్రమ మెవ్విధమనఁగా చైత్రమున రాముఁ డయోధ్యనుండి వెడలెననియు, నగస్త్యునికడకుఁ బోవకమునుపే పదిసంవత్సరములు గడచెననియుఁ, బంచవటి యందు మూఁడు సంవత్సరములు గడచెననియు, నవ్వలఁ జైత్రమాసము రాఁగా శూర్పణఖకు నాసికాచ్ఛేదనము, అపుడే సీతాపహరణము, ఆమె లంకయందు సంవత్సరముండె ననియు ఫాల్గుణమున రావణవధమునని యెఱుంగవలయును. ఆషాఢమున వాలివధము, బిలమునుండి వెడలిన పిదప ఫాల్గుణ మున సముద్రలంఘనము హనుమచేసెననియు మనమూహింప వలయును.

## రాముఁడు సీతనుగూర్చి వగచుట- సౌమిత్రి యూఱడించుట.

* శ్రీరాముఁ డనుమతినొసంగ సుగ్రీవుఁ డభిషిక్తుఁడై కిష్కింధయందుండఁగా రాఘవు లిరువురు ప్రస్రవణపర్వత మునకుఁ బోయిరి. అందు సౌమ్య క్రూరమృగధ్వనులు వినఁ బడుచుండెను. లతాగృహములు మెండుగనుండెను. నిర్మ లోదకము లక్షయములై యందుండును. ఆకొండయందొక శిఖరమునందు విశాలగుహయందు రాముఁడు నివసించెను. అంత వినయభూషణుండగు సౌమిత్రింగని రాముఁడో లక్ష్మణా! ఈగుహ మనోహరముగను విశాలముగనున్నది. వాయుప్రసార మనుకూలముగఁ గలదు. ఇందుందము. ఈ శిఖరము చాలసొంపుగా నున్నది. లతాగృహములు గలవు.

* ఇది యిరువదేడవసర్గమునందుఁ గలదు.

పక్షుల కలధ్వనులు వినఁబడుచున్నవి. పెక్కు విధములగు వృక్షము లిందుఁ గనంబడుచున్నవి. సరస్సు సొంపుగా నిదిగో కనఁబడుచున్నది. వృష్టికాలము కాన జలభారమున చెంతకు సాగి మిక్కిలి దగ్గఱగా నుండఁగలదు. నైరృతిద్వారముగలిగిన యీగుహ వాసార్హముగా నున్నది. వానజల్లులు గుహ లోనికిఁ బ్రవేశింపఁజాలవు. ఈగుహ పడమటితట్టు పొడవుగా సాగియుండుటంజేసి తూర్పునుండి వచ్చు చలిగాలి మనకుఁ దగులదు. దీనికి నుత్తరముగాఁ గనుపట్టు శిఖరమును గాంచుమా. కాటుకవలె నల్లనై యున్నది. దక్షిణభాగమున వెండి వలె నగపడు శిఖరము వేఱొండు గలదు. ఇచ్చటనుండి తూర్పుగాఁ బ్రవహించునదిని జూచితివే. దానిచుట్టునుగల వృక్షములను గనుము.

సౌమ్యా! ఈప్రదేశ మెంత సుందరముగా నున్నది! కిష్కింధయుఁ జెంతనే యున్నది. వాద్యధ్వనులు వానరుల ఘోషములు వినఁబడుచున్నవి. సుగ్రీవుఁడు భార్యయగు రుమతో రాజ్యభోగముల ననుభవించుచున్నాఁడు. అని పలికి తమ్మునిం గూడి యందుండెను. ఎంతరమణీయముగా నాభాగ మున్నను సీతావియోగమున రామున కది యింపుగా నుండఁ దయ్యె. విరహతాపవృద్ధిని గలిగించు వస్తువులు కనంబడుటం జేసి నిదురపట్టక రాముఁడు వగచుచుండెను. సీతను స్మరించుచుఁ గన్నీరు ధారలుగాఁ బ్రవహింపఁగా నున్న యన్నను గాంచి తానును దుఃఖించుచు సౌమిత్రి రాము నాశ్వాసింపఁగోరి యిట్లు పలికెను. వీరాగ్రణీ! దుఃఖింపకుము. అది యుక్తము కాదు. దుఃఖితున కెల్లకార్యములు పాడగును. నీవెఱింగి నదియే యిది. లోకాతిశయ కార్యకర్తవు. కార్యసిద్ధి హేతు

భూత దైవనిష్ఠాయుక్తుఁడవు. ఆస్తికుఁడవు. ధార్మికుఁడవు. నిరంతర ప్రయత్నపరుఁడవు. కాన నీవు శోకింపరాదు. ఇట్లున్న శత్రుసంహార మసాధ్యమగు. కపటోపాయ చతురుఁడగు రావణుని జంపుట యిట్లేయున్న శక్యమగునా? శోకము నిర్మూలించి సమిత్ర బాంధవముగా శత్రువును నిర్మూలింపుము. సముద్ర వనపర్వతములతో నీ భూమండలమును దాఱుమాఱు చేయఁ జాలుదువు. రావణవధమనఁగా నీ కెంతమాత్రము. ఇది వృష్టి కాలము. శరత్కాలము దనుక వేచియుండుము. పిదప శత్రుసంహారము చేయవచ్చును. మఱుఁగుపడియున్న నీపరాక్రమము మాటలచే నాహుతులచే నగ్నిని రగులు కొలుపునట్లు ప్రజ్వలింపఁజేయుచున్నాను. ఇది నీకు బోధించునట్టి విధము కాదు.

శ్రీరాముఁ డామాటల నాలకించి యాదృతిమై గ్రహించి సోదరా! అనురాగము స్నేహము హితముగోరువాఁడు సత్యపరాక్రమవంతుఁడు వచింపఁదగిన మాటలను జెప్పితివి. వానిచే శోకమును వదలితిని. పరాక్రమమును గ్రహింతును. శరత్కాలాగమనమును నిరీక్షించియుండెద. వీరుఁడుపకృతికిఁ బ్రత్యుపకృతి నొనరించును. లేనిచో సజ్జన హృదయము నొచ్చును. సుగ్రీవుఁడు ధర్మభీతుఁడు కాన మన కుపకారము చేయును. అనఁగా సౌమిత్రి విని తగినట్లాలోచించి సుగ్రీవుఁడు కార్యము నెఱవేర్చును. కాన శత్రువధార్థము శరత్కాలము దనుక నోర్చియుండుము. ఇఁక నాలుగు నెలలు నన్నుఁ గూడియుండుము. శత్రువధము చేయుదువని తెలిపెను.

## వర్షర్తువర్ణనము.

*ఇట్లు శ్రీరాముఁడు వాలిని వధించి సుగ్రీవు నభిషిక్తునిజేసి మాల్యవంత మనఁబడు ప్రస్రవణపర్వతముననుండి యొకనాఁడు లక్ష్మణునింగాంచి యిట్లు వచించెను. సుగ్రీవుఁడు మనము సంకేతము చేసికొనినయట్లీవర్షర్తువు వచ్చినది. ఆకసమునందంతటం బర్వతాకార మేఘములు గ్రమ్మియున్నవి. చూడుము. నభము సూర్యకిరణముల మూలమున సాగరజలమును ద్రావి కార్తికముమొద లాషాఢము దనుక గర్భమును దాల్చి యిపుడు సకల రసకారణజలమును బ్రసవించుచున్నది. కొండకు దగ్గఱగా మేఘములు వ్యాపించి యున్నవి. ఈమేఘసోపానముల మూలముననెక్కి యాకసమున కరిగి కొండమల్లెలు మొదలగు పూలమాలికలచేత సూర్యభగవాను నలంకరింపవచ్చును. వర్షించి కొంత నీటితోనుండు మొగిళ్లు సాంధ్యరాగము కనుపట్టఁ జివర భాగములందుఁ దెల్లగఁ గొంత మిగిలియున్న జలముచే నార్ద్రముగ నుండుటంజేసి రక్తస్పర్శమున నడుమఁ గెంజాయగలిగి రక్తమునఁ దడిసిన తెల్లనిగుడ్డచే నాకాశపు వ్రణమునకుం గట్టుకట్టిన ట్లున్నది. ఎండకు నుడికి యున్న భూమి క్రొత్తజలము సోఁకఁగాఁ దడిసి విరహతాపమునఁ గుంది కన్నీటఁదడిసినసీత బాష్పములు వదలునట్లు తానును బాష్పములను విడుచుచున్నది. వాయువులు పూలవాసనలం జల్లుచు సుఖమును గల్గించుచున్నవి. తాపప్రశాంతి నొందియున్న యీపర్వతము పూలదండల నలంకృతమై జలధారలను సుగ్రీవుఁడభిషిక్తుఁ డగునట్లు దాను

* ఇది యిరువదెనిమిదవసర్గమునఁ గలదు.

ను వృష్టిధారల నభిషిక్త మగుచున్నది. నీలమేఘములు కప్పఁగాఁ దెల్లని జలధారలుగలిగి వాయువునిండిన గుహాలు ప్రతిధ్వనింపఁగా నుండు నీపర్వతము వేదాధ్యయనము చేయునట్లున్నది. నీలమేఘము నందుఁ జలించుచున్న విద్యుల్లత రావణుని తొడపైనుండి విడిపించుకొనఁ బెనఁగులాడుచు జాలిగలిగించుచున్న సీతవలెనే నాకుఁ దోఁచుచున్నది. పర్వతనదులు విశేషించి ప్రవహించుచున్నవి. పక్షులు సంతోషమున జలవిహారము చేయుచున్నవి. ఆపద్రపురుగులు చిత్రముగాఁ గన్పడుచున్నవి. ఇపుడు యోగనిద్ర మెలమెల్లన విష్ణువునొందుచున్నది. నదులు త్వరగా సముద్రమున కేగుచున్నవి. కాంతలు ప్రియులఁ దారసిల్లుచుఁ గామాతుర లగుచున్నారు. మయూరము లడవుల నృత్యముచేయుచున్నవి. కదంబవృక్షములు పూచినవి. వృషభరాజములు గోవులఁ గవయనుంకించుచున్నవి. సస్యములచే భూమి సొంపుగానున్నది. విరహులు పరితపించుచున్నారు. వానరు లొక్కతావుననే యాహారము దొరకుటంబట్టి హాయిగానున్నారు. పర్వతవనమునకుఁ బోవఁ బయనముచేయు మదగజము మేఘధ్వని నాలకించి శత్రుగజము గావించిన బృంహితమని యనుమానించి యుద్ధముచేయఁ గోరి వెనుకకు మరలినది. తుమ్మెదల ఝంకారమే తంత్రీస్వనముగా, కప్పలరొదలు కంఠతాళముగా మేఘధ్వనులు మృదంగనాదముగా నడవులయందు సంగీతము సాగుచున్నది.

పర్వతములయందు మిక్కిలి వేగముగాఁ బాఱుచున్న సెలయేళ్లు శిఖరములకు దాపటి భాగములు నిర్మలములగునట్లు మీఁదుగాఁ బాఱి ముత్తియపుహారమువలెఁ గ్రిందఁబడుచు భూరిగుహాంతర్భాగముల నెలకొనుచున్నవి. రాజుల

దండయాత్రలు నిలిచినవి.యుద్ధమునకై పోయియున్న రాణువ మరలినది. జలనిరోధమున యుద్ధావకాశము లేక పగ శాంతించినది. భాద్రపదమాసమున వేదాధ్యయనము చేయఁగోరు సామవేదులగు ద్విజులకు నిది హస్తర్క్షయుక్తమగుట వేదారంభసమయము. కోసలాధీశ్వరుఁడగు భరతుఁడు వర్షాకాలము నాలుగు నెలలు గృహోపకరణములఁగాని యన్యవస్తువులఁగాని సేకరించుట కష్టమగుట నాషాఢపూర్ణిమకు మున్నే గృహోపకరణము లొనఁగూర్చు పనులఁ దీర్చుకొని యాషాఢపూర్ణిమను వ్రతాంగముగా గ్రహించి యుండును. నిజము. నేనెచ్చటికైన వెడలిరాఁగా నగరవాసులు మహానందమునఁ జేయు కోలాహలములం బోలి యిత్తఱి సరయూనది ప్రవాహవేగమున వృద్ధినొందుచుండును. సూనృతము. సూర్యపుత్త్రుఁడు శత్త్రువును గెల్చి భార్యను రాజ్యము నొంది యున్నాఁడు. కనుక నుపభోగమునకు మిక్కిలియు గుణవంతమగు నీవృష్టికాలమున సుఖముల ననుభవించుచున్నాఁడు. వత్సా! నేననఁగా భార్యను బోఁగొట్టుకొని రాజ్యభ్రంశము నొంది యింతదనుక శత్త్రువును జయింపలేక యున్నాను. ఈనా శోకము దుస్తరము. వృ కాలమున మఱింత దుర్భరముగా నున్నది. రావణుఁడు ప్రబలవిరోధి. ఈశోకత్రయమును దరించుట మిక్కిలి శ్రమముగా నున్నది. ఇది దండయాత్రకుఁ దగినకాలము కాదు. మార్గములు పంకసంకలితములు. సుగ్రీవుఁ డిప్పుడే పగవానిం బోలియించి సీతను దేఁ బ్రయత్నింతమని నొక్కి చెప్పిన నంగీకరింపనైతిని. చిరకాలమునకు మరల నతఁడు భార్యంగలిసి కొనియెను. మనకార్యమా సామాన్యముగాదు. కావున నతనిఁ బ్రయత్నింపుమని శాసింపఁజాల

కుంటిని. ఇఁక శరత్కాలము రాఁగా నాయుపకారమును స్మరించి స్నేహమున నతఁడు ప్రవర్తింపఁగలఁడు. వీరుఁడు కృతజ్ఞుఁడు కాక మానఁడు. అట్టివాఁడు కాకయున్న సాధువులు మనసున నొచ్చుకొందురు. అని రాముఁడు పలుకఁగా సౌమిత్రి యంగీకరించి శ్రీరామచంద్రా! సుగ్రీవుఁడు వాగ్దానమును జెల్లించును. శరత్కాలాగమనము దనుక నోర్చియుండుమనియె.

మహాత్ములారా! ఈభాగమునఁ గొన్ని విషయములు విమర్శించి సారమును గ్రహింపవలసినవి గలవు. పరికింతము.

"నవమాసధృతం గర్భం భాస్కరస్య గభస్తిభిః,
పీత్వా రసం సముద్రాణాం ద్యౌః ప్రసూతే రసాయనం." ౭

అని మూలము. కిరణముల మూలమున సాగరోదకమును బీల్చి సూర్యుఁడు వర్షరూపమున లోకులకు వాని నొసంగుచున్నాఁడని తాత్పర్యము.

"యాభిరాదిత్యస్తపతి రశ్మిభిస్తాభిః పర్జన్యో వర్షతి."

అని శ్రుతి తెలుపుచున్నది. సూర్యుఁడే పర్జన్యుఁడనఁబడునను భావ మిటఁ గలదు. ఇటులుండఁగా నవీనులు కొందఱు ప్రాచీనుల కిట్టి విషయములు తెలియవనియు నిప్పటి విద్యయే యుత్కృష్టజ్ఞానము నిచ్చుననియు ఘోషించుట యున్మత్త ప్రలాపమువంటిది. ప్రాచీనజ్ఞానమున నిప్పటిజ్ఞానము కోట్యంశముగూడ లేదని వా రెఱుంగవలయునని యీ భాగము వారిని హెచ్చరించుచున్నది. సూర్యుఁడు భూమి నాకర్షించుచున్న వాఁడనియు, "మిత్రో దధార పృథివీముతద్యామ్."అను శ్రుతియే బోధించుచున్నది. భాష్యమునందుఁ గిరణపాశము

లను బట్టుకొని భూమిని నిలిపి యున్నాఁడని యున్నది. ఒక్కొ విషయమును బరిశీలించిన నిప్పటి శాస్త్రములు పూర్వశాస్త్రముల నేకాంశమునకుం బోలవని యేర్పడుచున్నది. పురాణములయం దేల వేఱొకరీతిగా నున్నదనువారలకు వాని యాశయము తెలియదనునదియే సమాధానము.

> "శక్యమంబరమారుహ్య మేఘసోపానపఙ్క్తిభిః,
> కుటజార్జునమాలాభి రలంకర్తుం దివాకరమ్." ४

అని మూలము. ఈభాగము వర్షర్తువర్ణనము. అడవిపూవులు చూచి రాముఁడు సూర్యుని నీపూలమాలలచే నారాధింప వచ్చునని వర్ణించెను.

> "దివాకరం. అస్మత్కులగురుభూతసూర్యమధ్యే సదాధ్యేయం విష్ణుం అలంకారప్రియో విష్ణురితి న్యాయేన అలంకర్తుం శక్యం."

అని తనిశ్లోకి వ్రాసినది.

> "అలంకారప్రియో విష్ణురభిషేకప్రియశ్శివః,
> నమస్కారప్రియో భానుర్బ్రహ్మా ధ్యానప్రియస్సదా."

అనుసూక్తి పామరులకొఱకుగాఁ గల్పింపఁబడినది. సూర్యమండలము తేజోగోళము. "తేజసాం గోళకస్సూర్యో గ్రహర్క్షాణ్యంబుగోళకాః." అని సూర్యసిద్ధాంతము తెల్పుచున్నది. భగవదారాధనము తేజోమూర్తిగ ధ్యానించుటయే యని సారము. సూర్యమండలాంతర్వర్తి నారాయణుఁడే యనుట సాహసము. సూర్యుఁడు త్రిమూర్త్యాత్మకుఁడనుమాట తనిశ్లోకి యెఱుంగదేమో.' మతాభిమానపిశాచికావేశఫల మిట్టిదియే కాఁబోలు. మఱియు నీభాగమునఁ గొన్నిశ్లోకములకు విశే

ష్టార్థములని మతావేశము గలుగ వ్రాసినది నిస్సారము. కాన వానిని మనము విమర్శింపఁబనిలేదు.

"నివృత్తకర్మా యతనో నూనం సంచితసంచయః,
ఆషాఢీమభ్యుపగతో భరతః కోసలాధిపః." ౫౫

అని మూలము. ఆషాఢ పూర్ణిమను భరతుఁడు వ్రతాంగముగా స్వీకరించియుండుననుటంజేసి వార్షికమాసములు నాలుగని యర్థమగును.

"ఆషాఢే తు సితే పక్షే ఏకాదశ్యాముపోషితః,
చాతుర్మాస్యవ్రతం కుర్యాద్యత్కించిత్ప్రియతో నరః,
వార్షికాంశ్చతురో మాసాన్ వ్రతం కించిత్సమాపయేత్,
అసంభవే తులార్కేఽపి కర్తవ్యం తత్ప్రియత్నతః."

అని భారతప్రమాణము నుదాహరించి మహేశ్వరతీర్థులు వృష్టికాలము నాలుగునెలలని తేటపఱచెను. గోవిందరాజులు నీయాశయమే తెలియఁజేసెను. కావున నాకాలముననైదు ఋతువులే వ్యవహారమున నుండునని మన మూహింపవలయును.

## హనుమ రామకార్యము నెఱవేర్పుమని సుగ్రీవునకుఁ దెలుప నతఁడట్లే చేయఁబూనుట.

* ఆకసము మేఘావరణము తగ్గుటంజేసి నిర్మలముగాఁ గనఁబడెను. రాకరాక రాజ్యము లభించుటంజేసి భోగాసక్తి మిక్కుటము కాఁగా రుమను దారను గూడి తదేకాగ్రచిత్తమున నుండెను. ధర్మాగానుష్ఠానతత్పరుఁడు గాకుండెను.

* ఇది యిరువదితొమ్మిదవసర్గమునఁ గలదు.

రాజ్యపాలనము మంత్రులయధీనముగ నొనరించి తాను సుఖాసక్తి నుండెను. హనుమంతుఁ డావిషయ మెఱింగి ధర్మజ్ఞుఁడు కాన సుగ్రీవునికడకుఁ బోయి మంచిమాటలఁ బ్రసన్నునిగా నొనరించి యాప్తునిగా భావించి మహారాజా రాజ్యకీర్తుల నొందితివి. ఇఁక మిత్రకార్యమును బాటింపవలయు. కృతజ్ఞుఁడై మిత్రకార్యములను సఫలము చేయువానికి రాజ్యకీర్తి ప్రతాప వృద్ధికలుగును. కోశసైన్య మిత్రులను బడసిన వాఁడు మహారాజ్యమును బాలింపఁగలఁడు. సకాలమునందు మిత్రకార్యములు చేయువానికి ననర్థములు గలుగవు. కాన సీతాన్వేషణకార్యము నెఱవేర్పవలయు. ఇప్పటికే కాలాతీతమైనది. శ్రీరాముఁడు ప్రతిన తీర్పువాఁడయ్యును సీతను వెదుకఁ దొందరపడువాఁ డయ్యును నీమతమునే యనుసరించి పోవువాఁడు కాన నీకుం జెప్పఁడు. శ్రీరాముఁ డప్రమేయమహిమాఢ్యుఁడు. ఆతనిపని నిర్వహింపుము. ఆతఁడు నీకార్యమొనరించెఁ గదా. రాముఁడు మనలఁ బ్రేరేపించిన పిదప మనము చేసినఁ గాలాతిక్రమణ దోషము గలుగు. ముందే చేసిన నది కలుగదు. ఇంకను సేనల కాజ్ఞాపింపవే? ఏల? రాముఁ డసదృశపరాక్రమశాలి. ఒక్కబాణమున వాలిని వధించెఁ గదా. అట్టివాని యిల్లాలిని వెదకించినఁ బ్రియము గావించినవార మగుదుము. రామునకు భయము గల్గించు వారు ముల్లోకంబులందును లేరు. ఆమహాత్మునియెడఁ గృతజ్ఞుఁడవై యుపకారము చేయుము. నీయానతియైన మాలో నెవఁడే నొకఁడు పాతాళమునఁగాని భూమియందుఁగాని జలాకాశములఁగాని యప్రతిహతముగ సంచరింపఁగలఁడు.

బలవంతులు వానరులు నీవశమున నున్నవారు. ఎవరేపని చేయవలయునో యాజ్ఞాపించిన నిర్వహింతురు.

హనుమంతుఁ డిట్లు న్యాయ్యముగాఁ జెప్పిన యామాటలు విని సుగ్రీవుఁడు మిత్రకార్యనిర్వహణోద్యమకృతనిశ్చయుఁ డయ్యెను. అంత నలుంగాంచి సేనాధీశా! నీవశమున నున్న వానర వీరుల నెల్లర వేగముగా రా నాజ్ఞాపింపుము. సేనాధిపతులు తమ తమ వాహినులంగూడి నీచెంతకు వత్తురు గాక. ఇది మొదలు పదునైదుదినములలో నిచ్చోటికి రాని వారలకు మరణదండనము విధింపఁబడును. ఇందులకు శంకయే లేదు. నీవంగదునితోడ జాంబవంతుని కడ కరిగి నాయాజ్ఞను దెలుపుము. అని యాజ్ఞాపించి యంతఃపురమున కరిగెను.

## శ్రీరాముఁడు సుగ్రీవునిపైఁ గోపమూనుట.

*వర్షర్తువు దాఁటి శరదృతువరుదెంచెను. ఆరాత్రులు చంద్రికాధౌతములై తేటగనుండెను. వానిం జూచి శ్రీరాముఁడు సీత పరవశయగుటయు, రవితనయుఁడు కాముకుఁ డగుటయు, నియమిత కాలమతిక్రమించిన నతఁడు రాకుండుటయుఁ దలపోసి మఱింత దుఃఖించెను. పర్వతకూటమునఁ గూరుచుండి నిర్మలాకాశముం గాంచి ప్రేయసిం దలంచుకొని యార్తవాక్కుల నాప్రాణేశ్వరి సారసపక్షులతో విహరించుచుండి యిప్పుడు కఱకురక్కసులబారిం జిక్కి యెట్లు క్రీడించును? కలహంసపలుకులకు మేలుకొను నాప్రియురాలిపుడెట్లు మేలుకొనునో. మన్మథుఁడు నాసీతను బ్రాణములు పోవుదనుక బాధింపకవదలునా? అని విలపించెను. లక్ష్మణుఁడు ఫలా

* ఇది ముప్పదియవసర్గమునఁ గలదు.

హారణార్థము పోయియుండి మరలివచ్చి యన్నను గాంచి తానును బరితపించెను. శ్రీరామా మనస్సు కామవశమైనను పౌరుషము కృశించినను మనోధైర్యమపుడపుడు కలుగుచుం డును. సుగ్రీవాదుల తోడుపాటు మనకార్యమును ఫలింపఁ జేయఁ గలదు. నీవు సీతను సాధించుటొక పెద్దదిగాదు. అగ్ని జ్వాలను బట్టుకొని యెవఁడు కాలకయుండును? అని హితము తెలుపఁగా విని యతనితో శ్రీరాముఁ డిట్లు పలికెను.

వత్సా! నీవన్నట్లు కార్యము సాధింపవలసినదే. ఉత్సా హాదుల నవలంబింపవలసినదే. మనపూనిన యీదుర్ఘటకార్య ము ఫలించునా యనియు నాలోచింపవలసినదే. అని సీతమదిఁ దగుల దుఃఖము పెల్లున నోరెండఁగా నాయనా! ఇంద్రుఁడు కృతకృత్యుఁ డయ్యెను. మేఘములు వర్షించి వర్షించి యలసిన ట్లూరకున్నవి. గర్జితములు మయూరనృత్తములు గజబృంహిత ములు సెలయేళ్లచప్పుడులు తటాలున నిలిచినవి. నూత్నసంగ మమున నవయువతులు లజ్జపెంపున మెల్లమెల్లన జఘనముల వెలిపుచ్చురీతి శరత్కాలమున నదులు సైకతముల వెలిపుచ్చు చున్నవి. కమలాకరములు సొంపుగా నున్నవి. గజమిథున ములు పక్షిమిథునములు సంతోషమున విహరించుచున్నవి. జైత్రయాత్రకు రాజులుపోవుట కిది మంచి తరుణము. ధన వంతులుగ నుండి కాలవిపర్యయమున దరిద్రులగువారు నూత్నధనికులు చేయునవమానమునకు బదులుచేయక తూలు నట్లు మయూరములు స్వాభరణభూతములగు పింఛములు లేక హంసలు తమ్ముఁ దూలనాడఁగా మదమఱియున్నవి. ఈఋతువైభవ మెంత వర్ణించినను దనివిసనదు.

రాజులు దండయాత్రకై మొదటి ప్రయాణము చేయు సమయమిది. సుగ్రీవుఁ డగపడలేదు. మనపనికై యత్నించినట్లు గానరాదు. పరితపించుచున్న నాకీ నాల్గునెలలు శతవర్షములుగా నగపడినవి. సర్వసుఖములను వదలి యుద్యానమున కరుగు రీతి నన్ను వెంబడించి యడవులకు వచ్చినది. సకలకష్టములకుఁ బాలైన నాయందు సుగ్రీవున కనుగ్రహము రాకయున్నది. దుర్మతి యీ సూర్యపుత్త్రుఁడు మనస్సులో నీరాముఁ డనాథుఁడు. రాజ్యచ్యుతుఁడు. దూరదేశమునకు వచ్చినాఁడు. కుబుద్ధి రావణుఁడు భార్య నపహరింపఁగా నన్నే శరణు చొచ్చినాఁడు. అనుకొని గౌరవ మునుపక యవమానించినాఁడు. శరత్కాలము రాఁగా సీతాన్వేషణ మొనర్తునని శపథము చేసి దుర్బుద్ధియగుటఁ దనపని కాఁగానే నన్నుపేక్షించినాఁడు. సౌమిత్రీ ! నీవు కిష్కింధ కరుగుము. గ్రామ్యసుఖములందే ప్రీతిగల యామూర్ఖునిం గాంచి నామాటలుగా నిట్లు పలుకుము. ఎవ్వఁడు కృతజ్ఞుఁడై యుపకర్తలై తనవలనఁ గాఁదగినకార్యము కొఱకు తన్నాశ్రయించి యున్నవారలకు మాటయిచ్చి దానిం దప్పునో వాఁడు పురుషాధముఁ డనఁబడును. తన బాసతప్పక జరపించువాఁడు పురుషోత్తముఁడనఁబడును.ఎవ్వఁడు మిత్త్రులవలని యుపకారమునకు బదులుచేయ మఱచునో వారి దుఃఖమును దొలఁగింపఁడో వానిని సత్పురుషులు బ్రదికియుండఁగాఁ గాంచరు. అంతియకాక వారి మృతకళేబరమాంసములను దినుజంతువులుకూడ భక్షింపవు. అని నొక్కిపలుకుము. నేను సంగరమున సువర్ణపుంఖమగు బాణము నాకర్షింపఁగా దాని యాకారమును సుగ్రీవుఁడు చూడఁగోరుచున్నాఁడు కాఁబోలు. ఇది నిజమనుకొనియెదను. వజ్రాయు

ధమువలెఁ బరుగెత్తు నా ఘోరాంబకధ్వనిని మఱొకసారి యతఁడు వినఁగోరుచున్నవాఁడేమో. వీరా! సాలవృక్షభేదనమున నాశౌర్య మెఱింగియు నీవు తోడుగానుండుటఁ దెలిసియు సమయభంగము గావించిన తన్నుఁ జంపునుగదా యని తోఁపకున్నదే. ఏల? సఖ్యము చేయుట వాలినిజంపుట యనునివి దేనికై చేయఁబడియెనో దాని నతఁడిపు డెఱుఁగకున్నాఁడు. వర్షాకాలము చనఁగా వచ్చెదనని సమయము చేసిన సుగ్రీవుఁ డింతదనుక భార్యాసంగతి విహరించుచు నాల్గునెలలు గడచినను దెలియకున్నవాఁడు. మంత్రులంగూడి తమసుఖము నే చూచుకొనుచున్నాఁడు గాని వగచుచు దీనులముగా నుండు మనపై దయ యునుపకున్నాఁడు. వత్సా! కిష్కింధకుఁ బొమ్ము. రవిసూనునితో నాకోపమువిధము స్పష్టపఱుపుము. అంతియగాక యీమాటయుఁ జెప్పుము. వాలిమార్గమున దేనఁ బోయెనో యది యిప్పుడు నశింపలేదు. అది నీకు నున్నది. కనుకఁ జేసినప్రతినమఱువకుము. వాలి పోయినత్రోవ ననుసరింపకుము. ప్రతిన మఱువకుము. పూర్వము యుద్ధమున బాణమువైచి వాలినే వధించితిని. వాగ్దానమును మఱచిన నిన్ను బంధుయుక్తముగా వధించి పుచ్చెదను. వత్సా! కార్యము రీతి యీవిధము తెల్పి హితమెద్దియో బోధింపుము. కాలము మించకయుండఁ బొమ్ము. సత్యమును బాలింపుమని గట్టిగాఁ దెలుపుము. మాటతప్పిన వాడి బాణములవైవఁగా వానికిఁ బ్రాణము లర్పించి వాలిని జూడఁగలవనియుఁ దెలుపుము. అని రాముఁడు పలుకఁగా లక్ష్మణుఁడు సుగ్రీవుని విషయమునఁ గ్రోధము గొనియెను.

మహాత్ములారా! ఈభాగమున నొక్క విషయము శ్రీరామవాక్కులంబట్టి తెలియవచ్చును. కృతజ్ఞత ముఖ్యమనియు, నది మానిన నేవిషయమునను మేలు లేదనియు, నంతియకాక యట్టి విశ్వాసఘాతుకుని భగవంతుఁడే వధించుననియు, నేప్రాణియైనఁ గృతజ్ఞత గలిగి యుండవలయుననియు, నాడినపలుకును దప్పరాదనియు, శ్రీరామోపదేశమని మన మీభాగమునుండి గ్రహింపవలయు. భగవంతుఁడగు రామమూర్తి సుగ్రీవుని వధింతుననుటేల? కాఁగల కార్యముల నెఱుఁగకయే కదా యని యాక్షేపింపరాదు. మిత్రుఁడైననుగూడఁ గృతమెఱుఁగనివానిని బరిత్యజింపవలయునను నీతిని లోకులకుఁ దెలుపుటకే యీ యుపన్యాసమని మనము గ్రహింపందగును.

## అంగదుఁడు సుగ్రీవునితో లక్ష్మణునిరాక నెఱిఁగించుట.

* ఇట్లు దీనుఁడుం బోలె శ్రీరాముఁడు పలుక విని సౌమిత్రి యన్నా! మిత్రులతోఁటి సమానముగా సుఖదుఃఖముల ననుభవించుటయే సాధువుల యాచారము. వానరుఁడద్దానియందు నిలువఁడు. శ్రీరామసఖ్యమునఁ గదా యిట్టి సంపదలు నాకుం గలిగెనను తలంపామర్కటమునకుఁ గలుగదు. మనయందనుకూలముగా వర్తింపఁదగునను బుద్ధి వానికి నుండదు. కనుక నిఁక వానరరాజ్యరమ వానికిఁ దక్కదు. రాజ్యలాభమునఁ గేవల సుఖానుభవము గలుగుటంజేసి ప్రత్యుపకారము చేయందగునను స్పృహ లేక యతఁడున్నాఁడు. ఇపుడు నాచే హతుఁడై యన్నను జూచుంగాక. ఇట్టి

* ఇది ముప్పదియొకఁడవసర్గమునఁ గలదు.

కుమతికి రాజ్య మీయరాదు. కోపము నిలువనీయక నన్నుఁ బురికొలుపుచున్నది. సత్యము తప్పిన యాతని నిపుడు వధించెదను. వాలి తనయుఁ డంగదుఁడు వానరవీరులంగూడి సీతను వెదకుంగాక.

అన విని శ్రీరాముఁ డరిందముఁడయ్యును మిత్రధ్వంసకుఁడు గామిం జేసి తమ్ముఁ డాగ్రహామూని ధనుర్ధారియై వెడలుటంగాంచి మంచిమాటలతో వత్సా! నీయట్టి మతిమంతుఁ డెవ్వఁడైన మిత్రవధరూపపాపమును జేయునా? కోపవశమున మిత్రవధమునకుఁ బాలుపడు బాణమును వివేకమున నుపశమించుచున్నాఁడో వాఁడే పురుషశ్రేష్ఠుఁడు. సదాచారవిదుఁడవగు నీవు మిత్రవధము చేయఁబూనరాదు. పూర్వపుఁ బ్రీతినే తలంపుము. ఆతఁడు సకాలమున రాలేదనున దొక్కటియే లోపముగాని మఱేయపరాధము గావింపలేదు. కాన నతనితోఁ బరుషవాక్యము లాడక శీతల వాక్కు లుపయోగింపుము. అనఁగా రామమూర్తి ధర్మయుక్తముగా నియమించెనని తెలిసికొని కిష్కింధకుంబోయెను. తనకోపము నడంచుకొనియే సుగ్రీవునింటికిం జనియెను.

ప్రళయకాలకాలతుల్యుఁడగు నా సౌమిత్రి ధనుర్ధారియై రామాజ్ఞను జెల్లింపంగోరి యందుఁ జెప్పఁదగిన రామవాక్యమును దానికతఁడు చెప్పు నుత్తరమునకుఁ దాఁజెప్పఁదగు ప్రత్యుత్తరము నాలోచించుకొనుచుం బోయెను. ఆ పయనమున నతనికి నడ్డముగా నుండు తరువులు శిలలు నుగ్గయ్యెను: రాజధానింగని వెలుపల సంచరించు భీకర వానరులం గాంచెను. వారతనిని శత్రువని తలంచి తరుపాషాణాదులం గ్రహించి మార్గాన నుండిరి. వారింగని సౌమిత్రి ద్విగుణీ

కృత క్రోధుఁడయ్యెను. వారాతనింగాంచి భయంపడి పాఱి పోయిరి. వారు పరుగిడి సుగ్రీవున కావార్తం దెలిపిరి. తారం గూడి యేకాంతమున నతఁడుండెను. వారిమాట లక్కారణ మున వినఁజాలక పోయెను. మంత్రులు కనుఁగొని రండని కొందఱంబంపఁగా వారుగ్రాకారులై పోయిరి. వారతనికిం గనంబడిరి. వారిం గాంచినంతనే యన్నయవస్థ తలంపునకు రాఁగాఁ గోపావిష్టుఁడయ్యెను. అట్లు కోపమున మండి పడు చున్న లక్ష్మణునికడ కంగదుఁడు పోయి భయమున వగపొం దెను. ఆతనింగని లక్ష్మణుఁ డాగ్రహమున వత్సా! రాముని తమ్ముఁడు లక్ష్మణుఁ డిదిగో వచ్చినాఁడని సుగ్రీవునకుం దెలు పుము. రామునార్తికిఁ దాళఁజాలక వచ్చి వాకిట నున్నాఁ డనుము. ఆతనిమాట విన నిష్టమున్న నీవతనికడకుఁ బోవు టయో రప్పించి మాటలాడుటయో యేది యుక్తమో యది చేయుము. వత్సా! త్వరగాఁ దెలిపిరమ్మనియెను. ఆమాటవిని యంగదుఁడు కోపమున సుగ్రీవుని కడకరిగి ఇదిగో లక్ష్మణుఁడు వచ్చియున్నాఁడని తెల్పెను. తల్లిదండ్రులకు నమస్కరించి రుమకుంగూడ వందన మాచరించి లక్ష్మణునిమాటల విన్న వించెను.

అపుడు సుగ్రీవుఁడు నిద్రావేశమున మతిలేనివాఁడు గాన మేల్కొనఁడయ్యె. వానరు లాలక్ష్మణునిం దేర్పఁబూని గట్టిగా ధ్వనిచేసిరి. ఆమహాధ్వనికి సుగ్రీవుఁడు మేలుకొనియె. మంత్రము తెలుపనేర్చిన ప్లక్షప్రభావు లనుమంత్రు లిద్దఱు నంగదునిం గూడిపోయి సౌమిత్రి యర్థధర్మములవిషయమున మాటలాడ వచ్చినవాఁడని తెలిపిరి. జరగినదంతయుం దెలిపి సౌమిత్రిరాకకు భయంపడి వానరులు వడఁకుచున్నారనియు,

నీపుత్త్రుని నీకడ కతఁడు పంపెననియు, మహాకోపమున వాకిట లక్ష్మణుఁడు కాచియున్నాఁడనియు, బంధుపుత్త్రులం గూడిపోయి మ్రొక్కి యతనికోప ముపశమింపఁజేయుమనియు, సకాలమున నాయాకార్యములు చేయవలయుననియుఁ, బ్రతిజ్ఞ నెఱవేర్పుట ముఖ్యమనియుఁ దెల్పిరి.

## హనుమ రాజునకు హితముఁ దెల్పుట.

* బుద్ధిమంతుఁ డాసుగ్రీవుఁ డంగదాదులమాటల నాలించి లక్ష్మణుఁ డాగ్రహించి వచ్చెనని యెఱింగి సింహాసనము నుండి దిగి మంత్రులం గని యించుకయైన నే నకార్య మొనరింపలేదు. కోపమురాఁ గారణమేమి? నాయందు లోపములనే కనిపెట్టు నావైరులు తెలిపియుందురు. మీరెల్ల రిద్దానికిఁ గారణ మరయందగు. భయముం గొన్నవాఁడఁ గాను. రామ లక్ష్మణులవలన నాకేమియు భయములేదు. మిత్త్రున కాగ్రహముకలిగినచోఁ దొట్రుపాటు గలుగకమానదు. మైత్రి రక్షింపఁ దగినది. దాని కించుకంతయు భంగము కలుగరాదు. ఇక్కారణమునఁ గలంగుచున్నాను గాని మఱెందులకును గాదు. ఆ మాటలు సుగ్రీవుఁడు పలుకఁగా విని మతిమంతులలో మేటి యగు హనుమంతుఁడు మహారాజా! నీవంటి యుదారమతి కృతము మఱువకయుండు టొకవిచిత్రము గాదు. శ్రీరాముఁడు నీకొఱకు వాలిని వధించెను. ఇపుడు నీపైఁ బ్రణయ కోప మూని శ్రీరాముఁడు సోదరుని బంపియుండును. నిస్సంశయము. కాలజ్ఞులలో మేటివి. ఏమఱియుండుటంబట్టి నీకుఁ

* ఇది ముప్పదిరెండవసర్గమునఁ గలదు.

నీపుత్త్రుని నీకడ కతఁడు పంపెననియు, మహాకోపమున వాకిట లక్ష్మణుఁడు కాచియున్నాఁడనియు, బంధుపుత్త్రులం గూడిపోయి మ్రొక్కి యతనికోప ముపశమింపఁజేయుమనియు, సకాలమున నాయాకార్యములు చేయవలయుననియుఁ, బ్రతిజ్ఞ నెఱవేర్చుట ముఖ్యమనియుఁ దెల్పిరి.

## హనుమ రాజునకు హితముఁ దెల్పుట.

* బుద్ధిమంతుఁ డాసుగ్రీవుఁ డంగదాదులమాటల నాలించి లక్ష్మణుఁ డాగ్రహించి వచ్చెనని యెఱింగి సింహాసనము నుండి దిగి మంత్రులం గని యించుకయైన నే నకార్య మొనరింపలేదు. కోపమురాఁ గారణమేమి? నాయందు లోపములనే కనిపెట్టు నావైరులు తెలిపియుందురు. మీరెల్ల రిద్దానికిఁ గారణ మరయందగు. భయముం గొన్నవాఁడఁ గాను. రామలక్ష్మణులవలన నాకేమియు భయములేదు. మిత్త్రున కాగ్రహముకలిగినచోఁ దొట్రుపాటు గలుగకమానదు. మైత్రి రక్షింపఁదగినది. దాని కించుకంతయు భంగము కలుగరాదు. ఇక్కారణమునఁ గలంగుచున్నాను గాని మఱెందులకును గాదు. ఆ మాటలు సుగ్రీవుఁడు పలుకఁగా విని మతిమంతులలో మేటియగు హనుమంతుఁడు మహారాజా! నీవంటి యుదారమతి కృతము మఱువకయుండు టొకవిచిత్రము గాదు. శ్రీరాముఁడు నీకొఱకు వాలిని వధించెను. ఇపుడు నీపైఁ బ్రణయ కోప మూని శ్రీరాముఁడు సోదరుని బంపియుండును. నిస్సంశయము. కాలజ్ఞులలో మేటివి. ఏమఱియుండుటంబట్టి నీకుఁ

* ఇది ముప్పదిరెండవసర్గమునఁ గలదు.

గాలము తెలియరాకున్నది. దిక్కులు లోనగునవి నిర్మలము లైనవి. యుద్ధప్రయత్నసమయ మిది. కాని దాని నీవెఱుంగ కున్నావు. నీవు ప్రమత్తుఁడవని యెఱింగియే లక్ష్మణుఁ డిచ్చటికి వచ్చెను. రాముఁడు భార్యావిరహమునఁ గుందుచుండును. ఆమహాత్ముఁడు తెలుపనంపినమాట పరుషము గాకున్నను నీ వోర్చుకొనవలయును. అపరాధముచేయ మొదలిడియుందు వేని అనుతాపరూపమున సులభముగాఁ బాచితము చేసికొన వచ్చును. అట్లుగాక నీవు సంకేతముతప్పి యపరాధము చేసిన వాఁడ వైతివి. కనుక దోసిలొగ్గి సౌమిత్రిని సుప్రసన్నునిగాఁ జేసికొనుట తప్ప మఱియొకయర్హప్రాయశ్చిత్తము లేదు. రాజ హితము బోధించుట మాపనిగాన న్యాయముఁ దెల్పితిని. మఱియుఁ జెప్పుచున్నాను. రాముఁడే ధనుర్ధరుండైన నెవ్వఁడు నిలువనోపఁడు. కుపితుండయ్యు ననుగ్రహవంతునిగా నెవఁడు చేయందగినవాఁడో యట్టిమహాబలుని గోపమూనునట్లు చేయ రాదు. అందును రామమూర్తి పరమోపకారి కాన నతని కాగ్రహ మించుకంతయుఁ గలిగింపరాదు. సపుత్త్రమిత్రబాంధ వముగా లక్ష్మణునిచరణములు శిరముసోఁక మ్రొక్కి యతని వశముననుండి ప్రతిన నెఱవేర్తువు గాక. శ్రీరామసౌమిత్రుల శక్తి నీవెఱుంగుదువు కదా యని తెలిపి యూరకుండెను.

## తార లక్ష్మణుని బ్రసన్నునిజేయుట.

* అంత నంగదాహూతుఁడై సౌమిత్రి కిష్కింధకుఁ బోయెను. ద్వారపాలకు లతనికి దోసిలొగ్గిరి. ఆతని కోపముం గని చెంతకుఁ బోవఁజాలరైరి. నగరమయ్యది విచిత్రముగా

* ఇది ముప్పదిమూఁడవసర్గమునఁ గలదు.

నుండెను. అంగదాదులగృహములను జూచుచుఁ బోయి రాజగృహమును జూచెను. అందు దేవలోకములోని వృక్షములు గనుపట్టుచుండెను. ఆమందిరమును బ్రవేశించి యద్దాని రామణీయకమును గాంచి యందలి కాంతామణులం దిలకించి భూషితాంగులగు సుగ్రీవానుచరులం బరికించి యంతలోఁ గాంచీదామనూపురధ్వనులు వినఁబడఁగా లజ్జించెను. అప్పటికింగూడ సుగ్రీవుఁడు స్త్రీలోలుఁడయియే యున్నవాఁడని యెఱింగెను. దానఁ గోప మినుమడింపఁగా లోనఁ జూడఁబూని సదాచారమునుగావఁ జొరనొల్లక యించుక యోసరిల్లియుండెను. అంత సుగ్రీవుఁడు ధనుర్నాదమున సౌమిత్రి రాక నెఱింగి భయమున వడఁకెను. అంగదోక్తిని స్మరించి లక్ష్మణుఁ డిదిగో వచ్చియున్నవాఁడని యెఱింగెను. అప్పటికిఁ గల్గిన భయాదులఁ గలంగుచు దర్శనీయురాలగు తారంగని పురంధ్రీ! సౌమిత్రిహృదయము మృదువైనది. ఇపుడు కోపమూనివచ్చినట్లున్నది. కోపకారణమేమని నీకుం దోఁచును? నేనతని కేమే నపకారముచేసితినని నీ వెఱుంగుదువా? యోజించి పలుకుము. అంతకంటె నీవె యచ్చటికేగి ప్రసన్నునిగాఁ జేయుము. వారెవ్వరు స్త్రీలం గాంచినఁ గోపమును వదలుదురు. నిన్ను నతఁడు చూచినంతనే గోపమును వదలిపెట్టును. మంచిమాటలాడుము. ఆతనిమనస్సు నిర్మల మగును. పిదప నేనును జూతును. ఆమాటలు విని యాతార యక్లేపోయిన నాసౌమిత్రి శయ్యాగృహమునుండి వచ్చినగుఱుతు గాంచినంతనే కోపము నిగ్రహించి యవనతాననుండై యుండెను. ఆతార సంభోగచిహ్నముల వచ్చియు, పానమదమున లజ్జవదలి ప్రసన్నదృష్టిఁ దిలకించి ధైర్యమును

మృదువాక్కుల నతని లాలించుచు నర్థవంతము లగుమాటల నిట్లనియె.

రాజకుమారా! కోపము నీకుం గలుగనేల? నీమాట నెవఁ డతిక్రమించెను? ముందువెనుక లాలోచింపక దావాగ్ని చెంతకు నెవ్వఁడు పోవఁగలఁడు? అని మంచిపలుకుల ముందు ముందుచ్చరించుచు వినయము నగపఱచుచు నిష్కపటముగాఁ బలికిన విని లక్ష్మణుఁ డిట్లనియె. తారా! పతిహితాసక్తమతివి. విషయ మిట్టిదని యెఱుఁగవు. నీభర్త కాముకుఁడై ధర్మార్థముల నవలంబింపక నడచుకొన్నాఁడు. ఇది తెలియదో. అతఁడు రాజకార్యములను దుఃఖితులగు మమ్ముంగాంచక మంత్రులతోఁ బానమునే యాశ్రయించుచున్నాఁడు. నాలుగునెలలు గడువు తీసికొనివచ్చి యవి గడచినను గామపరతంత్రత నెఱుంగకున్నాఁడు. ఇది న్యాయ్యప్రవర్తనము కాదు. పాపమువలన ధర్మార్థములు నశించుటయే గాక కామము కూడ నశించును. ఉపకారికి బదులు నుపకారముచేయనిచో ధర్మము నశించు. ప్రత్యుపకారము చేయమి మిత్రుఁడు తొలఁగఁగా విశేషించి యర్థకామములు నశించును. సత్యధర్మములందు స్థిరముగానుండు మిత్రుఁడు అర్థకామములకు మూలమగుటంజేసి వానికంటె నుత్కృష్టుఁ డగుచున్నాఁడు. అట్టిమిత్రుని వదలుటంజేసి నీ పతికి నర్థకామధర్మములు నశించును. తెలివిగలదానవు కాన మమ్ము వదలినపుడు మేము చేయఁదగినదెద్దియో నీవే చెప్పఁగలవు. కానఁ బలుకుము.

అనఁగా నాతార విని రాముఁ డతనిం బంపినందులకుం గారణ మిదియైయుండునని యూహించి యిట్లనియె. రాజకుమారా! కామవశుఁడగు సుగ్రీవునిపై నిది కోపమూనుసమ

యముకాదు. స్వజనునియం దాగ్రహ మూననేరాదు. ఆతఁడు మీకార్యము సాధింప హెచ్చరిక గలిగియున్నాఁడు. ఇపుడు కార్యాంతరములం దవిలియున్నను నీవు సహింపవలయును. వీరుఁడగువాఁ డల్పునిపైఁ గోప మూనవచ్చునా? వ్యవసాయముతోఁగూడి శాంతియను తపోధనముగల నీవంటిమహాపురుషుఁడు కోపవశుఁ డగునా? శ్రీరామునకుఁ గోపము గలిగెనని యెఱుఁగుదు. అందులకుఁ గాలవిలంబమే కారణము. మీ మహోపకారమును గూడ నే నెఱుంగుదును. మేమందుల కేది చేయఁదగుననునదియు నెఱుంగనిదానఁ గాను. శరీరజనితమగు కామబలము సహింప నలవిగాదు కదా. సుగ్రీవుఁ డెవ్వరియం దాసక్తిగలిగియున్నాఁడో యాకాంతల నెఱుంగుదు. నీవిట్లు కోపమొందుటం జూడఁగాఁ గామపరతంత్రతఁ గ్రీడాదులయం దంతఁగా జ్ఞానము నీకుఁజాలదని తోఁచుచున్నది. అట్టి జ్ఞానమున్న నీవతని ద్వేషించియుండవు. కాముకునకు దేశకాలాదు లెఱుంగరావు సుమా. మహాత్మా! మాతో విహరించు సుగ్రీవుని సోదరవాత్సల్యమున క్షమింపుము. తపోధర్మనిరతులగు మానులుగూడఁ గామపరతంత్రు లగుదురు. చంచలస్వభావముగల వానరరా జట్టివాఁడగుట విచిత్రముకాదు. అని పలికి పానమదమునఁ బలుకులుదొట్రిల నిట్లు పలికెను.

మహాత్మా! హీమపరతంత్రుఁడైనను సుగ్రీవుఁ డూరకుండక మీకార్యము చేయఁబూని చాలదినములకు ముందే వానరుల కాజ్ఞచేసెను. ఆయాయితావులనుండి కోట్లకొలఁది వానరవీరులు వచ్చియున్నారు. లోపలికి దయచేయుము. అంతిపురమున స్త్రీలుందురు గానఁ బోఁగూడదని సదాచారమును బాటించితివి. మిత్రపత్నులం జూచుట దోషముగాదు. ఆ

మాటలు విని తమపనియైన దన్న సంతసమున లక్ష్మణుఁడు లోపలి కరిగెను. సుగ్రీవుంగాంచెను. దివ్యభూషణ భూషితుఁడై యతఁ డుండెను. స్త్రీలనడుమనుండు నాతనింగాంచి సౌమిత్రి కోపమున దుర్నిరీక్ష్యుఁడయ్యెను. సుగ్రీవుఁ డట్లు వచ్చిన సౌమిత్రిం గాంచెను.

మహామతులారా! ఈభాగమునఁగల విశేషములఁ బరికింతము.

"వానరేంద్రగృహం రమ్యం మహేంద్రసదనోపమం,
శుక్లైః ప్రాసాదశిఖరైః కైలాస శిఖరోపమైః." ౧౪

అని మూలము. ఈవర్ణనమును బట్టిచూడఁగా వాలియుండు నంతగపురము శతమఖుని సౌధమువలె నుండెడు. వానరుల గృహము లట్టులుండు టశ్రుతదృష్టపూర్వము. ఆకాలమున వానరులు మానవులు కలిసి ప్రవర్తింతురని తోఁచెడి. శాఖామృగములవలె వా రుండినను రాజ్యపాలనాదులు మానవులవలెనె వారలకున్నట్టు శ్రీవాల్మీకికావ్యము మనకుఁ దెలుపుచున్నది. ఇంచుకయైన నుండినఁగాని విస్తరింప వలనుపడదు. లేనివిషయము నెవ్వరు వర్ణింపఁజాలుదురు? వానరమానవులకు నొక భాషయు నాచారములు సమానములుగా నుండును. కాలానుసారము మార్పునొంది యుండును. అప్పటి వానరసృష్టి మార్పునొంది కేవల మృగస్వభావముగ మార్పునొంది యున్నదని మన మూహింపవలయు. ఇప్పటి మనచరిత్రకర్తల పాండిత్య మప్పటి సృష్టి నూహింపఁ బనికిరాదు. ఈజిప్టుదేశమున భూభాగము త్రవ్వుచుండఁగా నించుమించుగా ముప్పదిగజముల పరిమాణముగల పక్షికా

లొకటి కనఁబడినది. అది యిప్పుడును గాపాడఁబడుచున్నదఁట. ఇఁక నాపక్షి యెంతయుండునో యూహింపవచ్చును. గండభేరుండమను పక్షి యేనుఁగులఁ దన్నుకొనిపోయి భక్షించు నన్న కథను విని నవ్వి పూర్వుల నపహసించిన చరిత్రజ్ఞానవంతు లిద్దాని విని నోరు మూసికొనవలసినవారు గదా. పూర్వ సృష్టిలో నెన్నియో మార్పులు కలిగినవని ప్రత్యక్షమునుబట్టియు నంగీకరింపక తప్పదు. అప్పుడు పూర్వపు వైచిత్ర్యములఁ దెలిపినవారల నపహసించుటకంటె మన కది తెలియఁదరము కాదని యూరకుండుటయే వారి కలంకారము.

"వచనైస్సాంత్వయుక్తైశ్చ ప్రసాదయితుమర్హసి,
త్వద్దర్శనవిశుద్ధాత్మా న స కోపం కరిష్యతి. 34
న హి స్త్రీషు మహాత్మానః క్వచిత్కుర్వంతి దారుణం,
త్వయా సాంత్వైరుపక్రాంతం ప్రసన్నేంద్రియమానసం. 36
తతః కమలపత్రాక్షం ద్రక్ష్యామ్యహ మరిందమం.
సా ప్రస్ఖలంతీ మదవిహ్వలాక్షీ
ప్రలంబకాంచీగుణ హేమసూత్రా,
సలక్షణా లక్ష్మణసన్నిధానం
జగామ తారా నమితాంగయష్టిః." 38

అని మూలము. ఈభాగమును బరిశీలించిన వానరాంగనవలెఁ దార యున్నదియా, లేక రాజపత్నివలె నున్నదియా యని తేటపడును. సృష్టి చమత్కృతి యెవ్వారికి నెఱుంగరానిది. నాగకాంతలపాదాగ్రములయందే సర్పాకారత కనఁబడుచుండు నని కలదు. రామాయణకాలమునఁ బక్షులలోఁ గొన్ని జాతులు వానరభల్లూకములలోఁ గొన్ని జాతులును మానవులు నొక

భాష యెఱింగి కలిసియుండఁదగు నూహలు కలవారుగా నుండిరని యేర్పడును. సురాపానము సంభోగాంగముగా బ్రాహ్మణజాతికిం దప్పఁ దక్కినవారికి స్మృతుల యంగీకార మునఁ గనఁబడును. కావున నాతారయుఁ బానమదమునఁ గన్నులు వికృతినొందఁగాఁ గాంచీదామాద్యలంకారములఁ దేజరిల్లుచు లక్ష్మణుని శాంతునిఁ జేయఁదగునను పతియానతిం గొనివచ్చెనని మన మెఱుంగవలయు.

"స తాం సమీక్ష్యైవ హరీశపత్నీం
తస్థావుదాసీనతయా మహాత్మా. 3౮
అవాఙ్ముఖోఽభూన్మనుజేంద్రపుత్త్ర
స్త్రీసన్నికర్షాద్వినివృత్తకోపః."

అని మూలము. సంభోగచిహ్నములతో ననఁగాఁ బడకటింట నుండఁదగు వేషముతో నని యర్థము. తార రాఁగా సౌమిత్త్రి తలవంచుకొనెనని యర్థము. పరభార్యాసందర్శన మనర్థఫల దాయకమని స్మృతులు బోధించుచున్నవికదా. ఈరామాయణ తాత్పర్య మదియే. ఈసదాచారమూలముననే పూర్వులు సద్యశస్సు సంపాదింపఁగల్గిరి. భార్యను భర్తయుఁ గూడఁ గొన్ని సమయములందుఁ జూడరాదని మనుస్మృతి తెలుపుచున్నది.

"నాశ్నీయాద్భార్యయా సార్ధం నైనామీక్షేత చాశ్నతీం,
క్షువతీం జృంభమాణాం వా న చాసీనాం యథాసుఖం. ౪3
నాంజయంతీం స్వకే నేత్రే న చాభ్యక్తా మనావృతాం,
న పశ్యేత్ప్రసవంతీం చ తేజస్కామో ద్విజోత్తమః." ౪౪
అధ్యా-౪.

భర్తయే యీ సమయములయందు భార్యను జూడరాదనఁగా నిఁక నితరునిమాట చెప్పనేటికి?

"న హి ధర్మార్థసిద్ధ్యర్థం పానమేవం ప్రశస్యతే. ౪౫
పానాదర్థశ్చ ధర్మశ్చ కామశ్చ పరిహీయతే,
ధర్మలోపో మహాంస్తావత్కృతే హ్యప్రతికుర్వతః. ౪౬
అర్థలోపశ్చ మిత్రస్య నాశే గుణవతో మహాన్."

అని మూలము. ఇది లక్ష్మణుని భావము. పానాసక్తుఁడై ధర్మార్థముల నెఱుంగక సుగ్రీవుఁ డున్నవాఁడని లక్ష్మణుఁడాక్షేపించెను.

"పానమక్షాస్స్త్రియశ్చైవ మృగయా చ యథాక్రమం,
ఏతత్కష్టతమం విద్యాచ్చతుష్కం కామజే గణే. ౫౦. అధ్యా-౭.
పానం దుర్జనసంసర్గః పత్యా చ విరహోఽటనం,
స్వప్నోఽన్యగేహవాసశ్చ నారీసందూషణాని షట్." ౧౩. అ-౯.

అని మనుస్మృతి స్త్రీపురుషులకు సురాపానము హానికరమని తెలుపుచున్నది. మాంసభక్షణము నిషేధింపఁబడక పూర్వమే సురాపానము నిషేధింపఁబడినది. దాని కభ్యనుజ్ఞ సంభోగకాలమున మఱికొన్ని తావుల నీఁబడినట్లు కనుపట్టు. అదియు విప్రస్త్రీకిఁ గాదు. పూర్వులెంత జాగరూకతగాఁ బ్రవర్తనమును సాధించిరో యిద్దాని మూలమున స్పష్టమగును. ధర్మార్థములకు హానికరము పానమే యనియు దాని వదలవలయు ననియు మనకీ రామాయణభాగము తెలుపుచున్నది.

"కోపం కథం నామ గుణప్రకృష్టః కుమార కుర్యాదపకృష్టసత్త్వే. ౫౧
కస్త్వద్విధః కోపవశం హి గచ్ఛేత్సత్త్వావరుద్ధస్తపసః ప్రసూతిః,"

అని మూలము. ఇది తారావాక్యము. శాంతి తపస్సుగా నిందుఁ జెప్పఁబడినది. శాంతము తపస్సునకు ఫలమని తాత్పర్యము. కోపవశుఁడు క్షుద్రుఁడనియుఁ దాత్పర్యము.

"పైశున్యం సాహసం ద్రోహ ఈర్ష్యాసూయార్థదూషణం,
వాగ్దండజం చ పారుష్యం క్రోధజోఽపి గణోఽష్టకః." ౭ం.అ-౭.

అని మనువు తెలిపెను. క్రోధమువలనఁ గలుగు దుర్గుణములివి. కావున లక్ష్మణా! నీవు కోపమూనకుమా యని తార బోధించెను. పానము క్రోధము మంచివి కావనియు వానిని బ్రయత్నమున వదలవలయు ననియు నిందలి సారము.

## శ్రీరామసందేశము లక్ష్మణుఁడు సుగ్రీవున కెఱిఁగించుట.

* సుగ్రీవుఁ డంతఃపురమున కరుగుదెంచిన సౌమిత్రిం గాంచి భయంపడి కాంచనపీఠమునుండి దిగియెను. కాంత లాతనిం గూడి దిగిరి. రుమంగూడి కాంతాంతరముననున్న యా వానరరాజుం గాంచి లక్ష్మణుఁడు క్రుద్ధుఁడై యిట్లు పలికెను. జితేంద్రియత్వాదిగుణములు గలరాజు వినుతిపాత్రుఁ డగును. అధర్మపరుఁడై మాటతప్పిన నతఁడే పాపిష్ఠుఁడగును. ఒక గుఱ్ఱము విషయమై యసత్యమాడిన శతాశ్వహననపాపము కలుగును. గోవువిషయమై యసత్యమాడిన సహస్రగోవధపాపము నొందును. పురుషవిషయమై యబద్ధము పలికిన నాత్మహత్యయు స్వజనహత్యయు నొనరించిన పాపము గల్గును. ఇట్లుండఁగా మహాపురుషుఁడగు రామునివిషయమున నసత్యమాడిన నీక దానిపాప మింతయని వేఱుగాఁ జెప్పవలయునా? వానరేంద్రా! తొలుత మిత్రమూలమునఁ గార్యము చేయించుకొని వారికిఁ బ్రతిగా నుపకారము చేయఁడో వాఁడు

* ఇది ముప్పదినాల్గవసర్గమునఁ గలదు.

కృతఘ్నుఁడగును. ఎల్లరు వానింజంప నధికారులే. కృతఘ్నుని విషయమున స్వాయంభువుఁ డనుమను వీశ్లోకమును బలికెను. వినుమా దానిని దెలిపెద. బ్రహ్మహత్య నొనరించినవానికి, పాన ముచేసినవానికి, స్వర్ణహర్తకు, వ్రతభ్రష్టునకుఁ బ్రాయశ్చిత్తము కలదు గాని కృతఘ్నునకుఁ గానరాదు. ఇదియే యాశ్లోకము. రామోపకారమును స్మరించి బదు లొనర్పకున్న నపూజ్యుఁ డవు కృతఘ్నుఁడవు నసత్యవాదివియు నగుదువు. కృతజ్ఞుఁడ వైన సీతాన్వేషణకార్యము చేసియుందువు కదా. పాము కప్పలవలె నఱచి వానిని రప్పించును. మ్రింగును. నీవును రామకార్యనిరతి నభినయించి కామాసక్తుఁడవై మాటతప్పి తివి. కప్పల మ్రింగనఱచు సర్పమువంటివాఁడవని నిన్ను రాముఁ డెఱుఁగఁడు. మహాత్ముఁడు కాన దురాత్ముఁడవని యె ఱుంగక నీకీ కపిరాజ్యము నొదవించెను. నీవు బదులుసేయ వేని వాలిని జూడఁ బోవుదువు సుమీ! వాలి పోయిన మార్గము మూయఁబడలేదని నమ్ముము. శ్రీరామబాణముల శక్తి నీకు చక్కఁగాఁ దెలియదు కాఁబోలు. విషయసుఖముల ననుభవించుచు రామకార్యమును దలంపక యున్నావు. అని హెచ్చరించెను.

మహాత్ములారా! ఈభాగమునఁ గొన్ని విశేషము లుం డును. పరికింతము.

"ఉత్పపాత హరిశ్రేష్ఠో హిత్వా సౌవర్ణమాసనం,
మహాన్మహేంద్రస్య యథా స్వలంకృత ఇవ ధ్వజః. 3
ఉత్పతంతమనూత్పేతూ రుమాప్రభృతయస్త్రియః,
సుగ్రీవం గగనే పూర్ణచంద్రం తారాగణా ఇవ." ४

అని మూలము. లక్ష్మణుఁ డంతఃపురముఁ బ్రవేశింపఁగనే బం గరుపీఠమునుండి దిగెను. రుమ లోనగువారును దిగిరి. ఈభావ మునుబట్టి యోజింపఁగా సుగ్రీవుఁడు తన యుత్తమకాంతను రుమను తారను తక్కిన భోగకాంతలను గూడి యిష్టకథా లాపములఁ గాలముం బుచ్చుచుండిరని తేలెడిని. వాల్మీకి యిట్లు వ్రాయుట కేవలవర్ణనమని భావింపఁదగునా? ఆయంతః పురమునఁ గలవారి యలవాటుచొప్పున సురాపానము చేసి యొడలెఱుంగక యేవో సంభాషించుచు విలాసమునను న్న వారలనియే తేలును. ఇది వానరులయాచార మనవచ్చునా? వానరజాతియే కాని వారును దక్కినరాజులవంటి యాచార ములుగలవారే యని స్పష్టము. కావున నాకాలమున మానవ జాతికిని వానరగృధ్రజాతులకు నన్యోన్యసంబంధము గల దనియు వారికి సమానభాషయొక్కటి యుండుననియు స్నేహ బాంధవము సమానముగా వారల కుండుననియు మన మూ హింపవచ్చును.

“సత్త్వాభిజనసంపన్నస్సానుక్రోశో జితేంద్రియః,
కృతజ్ఞస్సత్యవాదీ చ రాజా లోకే మహీయతే. ౭
యస్తు రాజా స్థితే ధర్మే మిత్రాణాముపకారిణాం,
మిథ్యాప్రతిజ్ఞాం కురుతే కో నృశంసతరస్తతః. ౮
శతమశ్వానృతే హంతి సహస్రం తు గవానృతే,
ఆత్మానం స్వజనం హంతి పురుషః పురుషానృతే. ౯
పూర్వం కృతార్థో మిత్రాణాం న తత్ప్రతికరోతి యః,
కృతఘ్నస్సర్వభూతానాం స వధ్యః ప్లవగేశ్వర. ౧౦
గీతోఽయం బ్రహ్మణా శ్లోకస్సర్వలోకనమస్కృతః,
దృష్ట్వా కృతఘ్నం క్రుద్ధేన తం నిబోధ ప్లవంగమ. ౧౧

బ్రహ్మఘ్నే చ సురాపే చ చోరే భగ్నవ్రతే తథా,
నిష్కృతిర్విహితా సద్భిః కృతఘ్నే నాస్తి నిష్కృతిః. ౧౨
అనార్యస్త్వం కృతఘ్నశ్చ మిథ్యావాదీ చ వానర,
పూర్వం కృతార్థో రామస్య న తత్ప్రతికరోషి యత్." ౧౩

అని మూలము. రాజు సత్యవాదీ జితేంద్రియుఁడుగా నుండవలయు. వాగ్దానము తప్పినవాఁడు నృశంసులలో నుత్తముఁడు. ఏజంతువువిషయమునఁగాని యసత్యమాడరాదు. ఉపకారమునకు బదులుచేయనివాఁడు వధార్హుఁడు. ఏపాపమునకైనఁ బ్రాయశ్చిత్తము కలదు కాని కృతఘ్నునకుఁ బ్రాచితమే లేదు. అని సారము.

"పాపానామధికం పాపం హననం జీవజాతినాం, ౭౧
ఏతస్మాదధికం పాపం విశ్వస్తే శరణం గతే,
విశ్వస్య హత్వా పాపం తం శూద్రం వాప్యంత్యజాతికం. ౭౨
బ్రహ్మహత్యాధికం పాపం తస్మాన్నాస్త్యత్ర నిష్కృతిః,"
బ్రహ్మాండపురాణము.

కృతఘ్నునకుఁ బ్రాయశ్చిత్తము లేదని స్మృతిపురాణేతిహాసములు తెలుపుచున్నవి. బ్రహ్మహత్యకుంగూడఁ బ్రాచితముకలదనియుఁ గృతఘ్నునకు మాత్రము ప్రాయశ్చిత్తమే లేదనియు దీని తాత్పర్యము. రామాయణము స్మృత్యర్థమునే బోధించుచున్నది. సదాచారము లెట్టివో సిద్ధాంతము చేయుచున్నది. కథమాత్రమే పఠించి తృప్తిపడక యందలి ధర్మముల నెఱుంగవలయు. లక్ష్మణుని వాక్కులమూలమున వాల్మీకిమహర్షి యహింస, సత్యము, కృతజ్ఞత యనునవి యెల్లరకుఁ బరమధర్మములని బోధించుచున్నారు. ఇవ్వానిలో నేభాగమైన

మన మాచరణమున నునుచుకొనవలయును. లేకున్న రామాయణపారాయణము కాలక్షేపార్థమే యగును.

## తార లక్ష్మణునికోపము నుపశమింపఁజేయుట.

* సౌమిత్రి తేజోవిశేషమున మండుచున్నట్లు కనఁబడఁగాఁ దార యతనింగని మహాత్మా! నీవి ట్లనఁదగునా? పరుషభాషణముల కీవానరాధిపతి యర్హుఁడు కాఁడు. విశేషించి మీకుఁ బ్రియమిత్రుఁ డగుటఁ బరుషోక్తులకు నించుకయుఁ దగఁడు. ఇతఁడు కృతఘ్నుఁడు కాఁడు. వంచకుఁడు, గూఢవిప్రియుఁడును గాఁడు. క్రూరుఁడు నసత్యవాదియుఁ గాఁడు. ఎంతమాత్రము కుటిలుఁడు కాఁడు. తమ యుపకారమును మఱువనివాఁడు. రామానుగ్రహమున రాజ్యాదులను బొందెను. మహాసుఖమునొంది మేనకం బొందిన విశ్వామిత్రునింబోలి కాలము తగినదని యెఱుఁగక యున్నాఁడు.విశ్వామిత్రుఁడు పదివత్సరము లొకపగలుగాఁ దలంచుకొనియెఁ గదా. అంత వాఁడట్లయ్యెనే.ఇతనిమాట యేటికి? ఈతప్పును క్షమించవలయును. మీవంటి మహాత్ములు కోపము బారికిం జిక్కుట తగదు. సకలధర్మవిదుఁడవు. పతికొఱకు నేను నిన్నుఁ బ్రసన్నునిగాఁ జేయుచున్నదానను. త్వరపడకుము. ప్రసన్నుఁడవు కమ్ము. రామప్రీతికొఱకు నీతఁడు రుమను నన్నును సకలమును వదలఁగలఁడు. లంకయం దనేకకోట్లరక్కసు లున్నారు. వారెల్లఁ గామరూపులు. అట్టివారిం జంపక సీతంగొనిరా వలనుపడదు. క్రూరకర్ము నారావణుని సుగ్రీవసహాయము లేక వధింప

* ఇది ముప్పదైదవసర్గమునఁ గలదు.

నలవి కాదు. రావణువార్త నే నెఱుంగనుగాని వాలి నాకుం దెల్పెను. వానరులం దోడ్కొనిరా ననేకవానరులు పంపఁ బడిరి. వారి రాక కీసుగ్రీవుఁ డెదురుచూచుచున్నాఁడు. నీ రాకకుముందే పదునైదుదినములలో వానరులు రాఁదగు నని రాకున్న మరణదండనమని యుత్తరువు చేసియున్నాఁడు. వేయికోటులు భల్లూకములు శతములుగాఁ గొండముచ్చులు పెక్కుకోట్ల వానరులు వచ్చి నిన్ను సేవింపఁగలరు. కోపము వదలుము ఈ రాజపత్నులంద ఱేమి కీడుమూఁడునో యని నిన్నుం గాంచి భయంపడుచున్నారు. ప్రసన్నుఁడవగుమని ప్రార్థించెను.

మహాత్ములారా! ఇంచుక పరిశీలింతము.

"ప్రాప్తకాలం న జానీతే విశ్వామిత్రో యథా మునిః. ౬
ఘృతాచ్యాం కిల సంసక్తో దశవర్షాణి లక్ష్మణ,
అహోఽమన్యత ధర్మాత్మా విశ్వామిత్రో మహామునిః. ౭
స హి ప్రాప్తం న జానీతే కాలం కాలవిదాంవరః,
విశ్వామిత్రో మహాతేజాః కిం పునర్యః పృథగ్జనః. ౮
దేహధర్మం గతస్యాస్య పరిశ్రాంతస్య లక్ష్మణ,
అవితృప్తస్య కామేషు కామం క్షంతుమిహార్హసి". ౯

అని మూలము. ఇవి తారమాటలు. స్వాపరాధము నంగీకరించినఁ గాని యితరులకుఁ గలకోపము తగ్గదు. ఆవిషయ మెఱిఁగి తార పలుకుచున్నది. "బలవా నింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి" అను సూక్తిని మది నిడుకొని తెలుపుచున్నది. లక్ష్మణా! ప్రత్యుపకారము చేయఁదగిన కాలమిది యని యెఱుంగకున్నాఁడు. మున్ను విశ్వామిత్రుఁడు తపశ్చరణమునఁ గాలము

గడపుచుండువాఁడు ఘృతాచియందలి ప్రీతిచేఁ బదివర్షము లొక పగటికాలమంతగా భావించెను. అట్టివాఁ డట్లు కాఁగా నిఁక నీ వానరరాజుమాట వచింపనేటికి? అనియెను.

"కామాత్మతా న ప్రశస్తా న చైవేహాస్త్యకామతా,
కామ్యోహి వేదాధిగమః కర్మయోగశ్చ వైదికః." ౨. అ-౨.

అని మనుస్మృతి తెలుపుచున్నది. విశ్వామిత్రుఁడు కామాసక్తుఁడై తపమును బోఁగొట్టుకొనియెను. కాని ఆజ్ఞానము తర్వాతఁ గలిగెను. పిదప నతఁడు విరాగియే యయ్యెను. అనుటంజేసి సుగ్రీవుఁడు చిరకాలమునకు లభించిన రాజ్యభోగములవలనఁ దృప్తిగలవాఁడు కాఁడు. కావున నిది దేహస్వభావమని తలంచి క్షమింపుమని తార వేఁడుచున్నది. ఇంద్రియములు బలవంతములు. మనస్సునకు లోఁబడవు. దానిని తమవైపునకే లాగుచుండును. వానిని జయించుట మహర్షులకే శక్యము కానియపుడు రాజమాత్రునకు శక్యమా యని తార సమాధానము చెప్పెను. అనఁగా బుద్ధిపూర్వకముగాఁ జేసిన యపరాధ మిది కాదు. కామమునకు లోఁబడుట దేహధారుల స్వభావము. అది క్షంతవ్యమే. అని కదా తారభావము. బుద్ధిపూర్వకాపరాధము క్షంతవ్యము కాదనియే యిందుఁగల ముఖ్యాంశము. కామపరత్వము కర్మాధీనము. అట్టికర్మము తపోనియమమున మునులు జయింతురు.

"కామమాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః,
మోహాద్గృహీత్వా సద్గ్రాహాన్ ప్రవర్తంతే ఽశుచివ్రతాః." ౧౦
గీ. ౧౬-అ.

అని శ్రీకృష్ణుఁ డుపదేశించెను. కామాశ్రయణ మశుచిత్వ

హేతువగును. కాన దాని కెంతదూరముగా నుండఁగలుగుదుమో అదియే యుత్తమమార్గము. దానికి లోఁబడినయెడల సకల సత్కర్మములు పాడగుననియే మన మెఱుంగవలయును.

"శతకోటి సహస్రాణి లంకాయాం కిల రాక్షసాః,
అయుతాని చ షట్త్రింశత్సహస్రాణి శతాని చ. ౧౫
అహత్వా తాంశ్చ దుర్ధర్షాన్ రాక్షసాన్ కామరూపిణః,
న శక్యో రావణో హంతుం యేన సా మైథిలీ హృతా. ౧౬
తే న శక్యా రణే హంతు మసహాయేన లక్ష్మణ,
రావణః క్రూరకర్మా చ సుగ్రీవేణ విశేషతః." ౧౭

అని మూలము. ప్రాయికముగాఁ బురాణాదులలో నిట్టిసంఖ్యలుండును.వానికేదో యర్థముండకపోదు ఒక్క నగరముగాదు భూభాగమున నెందుఁగాని యిందఱు రక్కసులుండ వలనుపడదు. ప్రాచీనుల యాశయ మెఱుంగుట యీవిషయమునఁ గష్టముగానున్నది. సుగ్రీవుని సాయము లేకయుండ రావణుని వధించుట శక్యమే కాదని తార లక్ష్మణునకు భయము గలిగింపఁ బూనెననియే యిందలి ముఖ్యాంశము. ఈమాటల వలన నతనికోపము తగ్గి ప్రసన్నుఁడు కాఁగలఁడనియే తార యాశయమని మన మెఱుంగవలయును.

### లక్ష్మణసుగ్రీవులు మైత్రితో మాటలాడుట.

* వినయము ధర్మము కలియునట్లు తార పల్కిన మాటల విని మృదుస్వభావుఁడగుట సౌమిత్రి యంగీకరించి కోపము వదలి ప్రసన్నుఁడయ్యెను. అంత సుగ్రీవుఁడు భయము

* ఇది ముప్పదాఱవసర్గమునఁ గలదు.

వదలి నెమ్మది గాంచెను. కామప్రమత్తత వదలెను. ప్రీతితో సౌమిత్రీ ! నన్నెడఁబాసిన రాజ్యసంపద లోనగునవి శ్రీరామానుగ్రహమున లభించినవే. దానికిఁ బ్రత్యుపకృతి గావింప శక్యమా! మహావృక్ష సప్తకమును గొండను భూమి నొక్క బాణమున భేదించిన మహావీరున కొకరిసాయ మేమి కావలయును? వైరి సంహారణమునకు ముందు రాముఁడు నడువఁగా వెంట నడువవలసినవాఁడనే గాని వేఱుగాదు. కరుణాళువు గాన రాముఁడు నన్నేమియు బాధింపఁడని హద్దుమీఱి నేను నడుచుకొన్నను భృత్యుఁడను గాన నాతప్పు క్షంతవ్యమే. నిరపరాధి యెవఁడుండును? అనఁగానే సౌమిత్రి సంతుష్టుఁడై వానరేంద్రా! నీమూలమున నాయన్న సనాథుఁడే. నీప్రభావ శౌచములఁ జూడఁగా రాజ్యలక్ష్మికిఁ దగినవాఁడవే. నీసాయమున శ్రీరాముఁడు వైరి సంహారము చేయఁగలఁడు. నీవాడిన మాట ధీరున కర్హముగ నున్నది. నీవుతప్ప స్వదోషము నొప్పుకొనువాఁ డెవ్వఁడుండును? పరాక్రమమున రామునకు సాటియైనవాఁడవు. ఇఁకఁ గార్యమునకుం గడంగుము. నా వెంట రమ్ము. రాము నాశ్వాసింపుము. రామునివిచారమును గాంచి యోర్వఁజాలక పరుషము లాడితిని. మది నునుపక క్షమింపవలయును.

## సుగ్రీవుఁడు వానరుల రావించుట.

*సౌమిత్రి యిట్లు పలుకఁగా సుగ్రీవుఁడు మంత్రి హనుమంతుం గాంచి మహేంద్రహిమవత్కైలాసవింధ్యమందరములను పంచపర్వతములయందుఁ గలవారిని, పడమరదిక్కునందు

* ఇది ముప్పదేడవసర్గమునఁ గలదు.

సముద్రతీరములందు బాలసూర్యసంకాశములగు కొండల నుండువారిని, మఱియు మహారణ్యములు లోనగు తావుల నుండువారిని వానరులను వేవేగ రప్పింపుము. భటులంబంపి వారిని బిలిపింపుము. కామమునకు లోనై పనిచేయకయుండు వానరుల నాకడకుం గొనిరమ్ము. పదిదినములలోపల నెవరు రాకుందురో వారిని వధింపవలయు. ఇందుఁగల వానరులు పెక్కండ్రు వెడలి వారిని దోడుకొనివత్తురుగాక. అని యాజ్ఞాపింప నాహనుమంతుఁ డట్లే చేసెను. రాజాజ్ఞం దెలిపిపోయిన వానరులు మరలి వచ్చిరి. వానరులా రామకార్యార్థమా యాయితావులనుండి బయలువెడలి వచ్చిరి.

నలునిచేఁ బంపఁబడిన వానరులు హిమాలయమున నొక మహావృక్షముం గాంచిరి. అందు మాహేశ్వరయాగమును దేవతలు చేసియుండిరి. అందుఁ గ్రిందఁబడిన హవిస్సులచేఁ బుట్టిన రుచ్యములగు ఫలములం జూచిరి. వాని నొక మాఱు భక్షించిన నొక నెలదనుక నాకలియుండదు. వానిని దివ్యౌషధులను వారు గ్రహించిరి. లక్ష్మణుఁ డందున్నకాలముననే వారును వచ్చిరి. ఆఫలాదులను గానుకగా రాజున కిచ్చిరి. ఎల్లరు వచ్చుచున్నారని తెలుప విని యా కానికలను గ్రహించి సంతుష్టుఁ డయ్యెను.

## లక్ష్మణసుగ్రీవులు రామునికడ కరుగుట.

*అంత సుగ్రీవుఁ డావానరు లర్పించిన కానుకల నంగీకరించి వారి బహుమానపురస్సరముగా వీడ్కొల్పి తన్ను శ్రీరామునిని గృతార్థునిగా నెంచుచుండ సౌమిత్రి యతనిం

* ఇది ముప్పదియెనిమిదవసర్గమునఁ గలదు.

గని సాధుమతీ! నీకిష్టమగునే నిపుడ బయలువెడలుము. రామునికడ కరుగుదము. అని పలుక సంతోషమున నంగీకరించి తార లోనగుభార్యల వీడ్కొలిపి వానరులం బిలిచిన నంతిపురికి రాఁదగిన యాకపులరుదెంచి మరియాదగా నిలువఁబడిరి. సుగ్రీవుఁడు శిబికను దీసికొనిరండనఁగా వారట్లుచేయ లక్ష్మణునిగూడి యెక్కి రాజచిహ్నముల వెలయుచు శ్రీరాముని నివాసమునకుఁ బోయెను. పల్లకినుండి దిగి శ్రీరామునిఁగని యంజలిబంధము కనంబడఁగా నిలుచుండెను. వానరులట్లే నిలిచిరి. శ్రీరాముఁ డానందించి నమస్కరించిన సుగ్రీవుని లేవనెత్తి యాలింగనము చేసికొనియెను. అందఱును గూరుచున్న పిదప రాముఁడు సూర్యతనూజా! ధర్మార్థకామములను విభజించి వానివాని నాయాయికాలములయందుఁ దప్పక సేవించువాఁడు రాజనంబడును. ధర్మార్థముల వదలి కామైకాసక్తుఁడై యుండువాఁ డథగిపతితుఁడై పిదపఁ దెలిసికొనఁ గలఁడు. వైరివధమున నెచ్చరికగలిగి మిత్రులసంపాదించునాసక్తి మిక్కిలి గలిగి ధర్మార్థకామముల వేఱువేఱఁ గాలోచితముగా సేవించుచుఁ దత్తత్ఫలముల ననుభవించురాజు మాత్రమే స్వధర్మపాలకుఁ డనఁబడును. అరినిషూదనా! ఇది యుద్ధమునకుఁ దగిన కాలము. శరదృతువు వచ్చినది. కృత్యమును మంత్రులతో నాలోచింపుము.

శ్రీరాముని వాక్కుల నాలకించి సుగ్రీవుఁడు నాకు సకల విద్యైశ్వర్యములు మీయిరువురమూలమున లభించినవి. ఉపకారిని మఱచి బదులుగా నుపకృతి చేయనివాఁడు పురుషాధముఁడగు. వానరులనెల్ల వీరు పిలిచివచ్చిరి. దేవగంధర్వజనితులయి కామరూపులగు వానరవీరులు తమతమ సేన

లతో వచ్చుచున్నారు. వందలు లక్షలు కోటులుగానుండు తమతమ బలములతో వత్తురు. వింధ్యాదిపర్వతములయం దుండు బలవద్వానరులు వచ్చుచున్నారు. రావణుని సబాంధవముగా హతముచేసి సీతాదేవిని నీకర్పింప శక్తిగలవారే వీరు. అని పలుక నతనిమాటలకు శ్రీరాముఁ డానందించెను.

## వానరులువచ్చి చేరుట.

* అంత రాముఁడు సుగ్రీవు నాలింగనము చేసికొని యింద్రుఁడు వృష్టినొసంగుట సూర్యుఁడు జగత్తును బ్రకాశింపఁజేయుట వారికది సహజధర్మమగుట నంత విచిత్రముగాదు. చంద్రుఁడు కిరణముల మూలమున భూమిని నిర్మలము గావించుచున్నాఁడు. ఉపకారము చేయుట నీవంటివారికి నైజముగాన నదియు నచ్చెరువు గాదు. నీవు తోడుపడఁగా శత్రువులను జయింపఁగలను. నీవే నాకు సాహాయ్యము చేయవలయును. తొల్లి యింద్రుని మోసపుచ్చి పౌలోమిని పులోము ననుమతి ననుహ్లాదుఁ డపహరించినట్లు రావణుఁడు నన్ను వంచించి సీత నపహరించినాఁడు. అనుహ్లాదుని బులోముని శతమఖుఁడు వధించినట్లే నేనును వైరిని వధించెదను. అను రాముని వచనములు ముగియక ముందే ధూళిరేఁగి దిక్కుల నావరించెను. పెక్కువేల వానరులతో నాయా సేనానాయకులేతెంచిరి. రుమకుఁ దండ్రియగు తారుఁడు కోట్లకొలఁది సేనలతోవచ్చి చేరెను. జాంబవంతుఁడు భల్లూకకోటులతో నరుదెంచెను. రుమణ్వంతుఁడు లోనగు నాయకులు తమతమ సేనలతో నరుదెంచిరి. హనుమంతుని సేనలు చేరెను. ఆసంఖ్య

* ఇది ముప్పది తొమ్మిదవసర్గమునఁ గలదు.

యింతయని వచింప నలవిగానట్లే యుండెను. వారినెల్ల సుగ్రీవుఁడు శ్రీరాముని కర్పించి వారితో వానరశ్రేష్ఠులారా! పర్వతాదులయందు మీరుండినబాగు. సేనాసంఖ్య తెలియఁ దరమగును గాన నట్లు గావింపుఁడని యానతిచ్చెను. వారంద ఱట్లు గావించిరి.

## సీతాన్వేషణమునకై వినతుని దూర్పునకుఁ బంపుట.

* సుగ్రీవుఁ డత్తఱి శ్రీరామునింగని మహాత్మా! వానరు లరుదెంచిరి. వీ రత్యంతసమర్థులు. వీరికార్యములు వినుతిపాత్రము లయియున్నవి. వీరింగాంచిన బలపరాక్రమాదు లెట్లుండునో తెలివచ్చును. ఈ సైన్యమెల్ల నీవశమం దుండును. ఆజ్ఞాపింపుము. అని పలుక శ్రీరాముఁ డాతనిం గౌఁగిటం జేర్చి మహాప్రాజ్ఞుఁడవగు నో సుగ్రీవా! నాప్రేయసి జీవించియున్నదియు లేనిదియు వైరియుండు దేశము తెలియఁ దగి యున్నది. అది తెలిసినపిదపఁ గృత్యము నిర్వహింతము. ఈవిషయమై మేమిరువురము నియమించువారము కాఁజాలము. కార్యసాధకుఁడవు నియామకుఁడవు నీవే. నా నిశ్చయము నీవే వీరలకుఁ దెలుపుము. లక్ష్మణునివలెనె నీవు సోదరుఁడవు. సుహృదయుఁవు నగుదువు. కార్యభంగులనెల్ల నెఱుంగు ప్రోడవు. అని యిట్లు శ్రీరాముఁడు పలుక వారెల్లరు వినుచుండ సుగ్రీవుఁడు వినతుండను వానరయూథనాథునిం బిలిచి వానరవీరా! నీసేనలంగల మేటిమగలం గూడి తూరుపు నకుంజని యందుఁగల పర్వతశిఖరములను వననదులను గల యంగాంచి సీతాదేవి రావణునివాసంబును వెదకి చూడుము.

* ఇది నలువదియవసర్గమునఁ గలదు.

గంగాసరయూ ప్రముఖనదులకుఁ, గాలమహీవేశమునకు, బ్రహ్మమాల విదేహ కాశీకోసలాది దేశములకుఁ బోయి సీతను వెదకుఁడు. సముద్రమునడుమఁగల పర్వతారణ్యాదులయందు భయంకరాకారులగు మనుష్యులున్నవారు. కర్ణహీనులు పెదవు లందే చెవులుగలవారు, నిట్లు వికృతాకారములు గలవార లందుఁ గొందఱుందురు. కొందఱు మనుష్యభక్షకులున్నవారు. మరణమే యెఱుఁగనివారును గొంద ఱున్నవారు. కర్ణము నందు శిఖగలిగి బంగరురంగుగల మేనితోఁగనఁబడు కిరా తులు గలరు. చేపలను బక్వముచేయకయే తినుచు మనుజశరీ రము సగము వ్యాఘ్రశరీరము సగము గలిగి భయంకరులగు మఱియొక తెగ కిరాతులు గలరు. వారల నివాసములను వెద కుఁడు. ఇట్లు జంబూద్వీపమునం దంతట వెదకుఁడు.

కొండలనెక్కి పోఁదగిన ద్వీపములు లంఘించియే పోఁ దగిన ద్వీపములు నౌకలసాయమునఁ జేరఁదగిన ద్వీపములును గలవు. అందెల్ల వెదకుఁడు. రత్నముల యాకరములు గలిగి సప్తఖండములుగా విభజింపఁబడియుండు యవద్వీపమున కరుగ వలయు. అందుండి సువర్ణరూప్యకమను ద్వీపమునకుఁ బోవ వలయు. యవద్వీపమును దాఁటఁగా నెత్తుగానున్న శిశిరపర్వ తము కనఁబడు. ఈచెప్పిన తావులనెల్ల సీతాదేవిని వెదకుఁడు. లవణసముద్రము నవలిగట్టుచేరి గంభీరజలముగల శోణనదము గని యందెల్ల వెదకి యంతఁ బ్లక్షద్వీపమున కరిగి యందుఁ గల పర్వతాదులయందు వెదకుఁడు. అవ్వలంబోవ నిక్షుసము ద్రము గనఁబడును. అందసురులు బ్రహ్మవరమున నీడలంబట్టు కొని మానవుల మ్రింగుచుండువారు గలరు. వారలకుఁ జిక్కక మీరు జాగరూకులరై యవ్వలఁబోయి రక్తవర్ణజలం

బుల నొప్పు మధుసముద్రముంగని యందు విశాలమగు కొండ
బూరుగుచెట్టుం గాంచి దాని పేరంబరఁగు శాల్మలిద్వీపముఁ
బొడఁగని యందు శ్వేతవర్ణమగు గరుత్మంతుని నివాసము
దర్శించి యందలి పర్వతములనుండు మందేహులను రాక్ష
సులం గాంచఁ గలరు. వారు ప్రతిదినము నుదయకాలమున
బ్రాహ్మణులు జపించు గాయత్రీప్రభావమున హతులగుచు
సూర్యకాంతులఁ దూలి జలములం బడుచుందురు. మరల లేచి
యట్లే చేయుచుందురు. మీరవ్వారికిం గనఁబడక యుండ
నవ్వలంబోయి క్షీరసముద్రమును గనుఁడు. అందలి వృక్ష
ములు వెండివలె నుండు. తామరలు నట్లేయుండు. అందలి సర
స్సులయందు దేవతాభేదములు విహరించుచుందురు. అవ్వల
శుద్ధజలసముద్రము గానంబడు. అందే బడబాగ్నియుండు.
ఆయగ్నియే యాజలవేగము నాపుచుండునని పల్కుదురు.
దాని కవ్వలఁ గడుదూరమున జాతరూప శిలమను పేరుగల
కొండ యొండుగలదు. అందాదిశేషువుండును. ఆ మహాత్ముని
సహస్రశీర్షుని దర్శింపఁగలరు. ఆతని తాళధ్వజము త్రిశిఖరంబై
వేదికతోడ నందుండును. దానిని ద్రిమూర్తులు తూర్పునకు
సీమాంతముగా నియమించిరి. దాని కవ్వలనుండు పర్వతశిఖ
రాగ్రము స్వర్గమును స్పృశించుచుండు. ఆకొండయందే యో
జనమాత్ర విశాలము దశయోజనోన్నతమునగు సౌమనసం
బను శిఖరముగలదు. వామనుఁడు మొదటిపాదము నాయు
దయపర్వతముపై నునిచి రెండవయడుగును బశ్చిమమునఁగల
సావర్ణిమేరుశిఖరమున నునిచెను. ఆశిఖరమున మహాతేజస్వు
లగు వాలఖిల్యులుందురు. అందొక ద్వీపము సుదర్శంబన
నొప్పుచుండు. అందెల్ల సీతాదేవిని వెదకుఁడు. దాని యవ్వలి

భాగము గాఢాంధకారావృతమై యుంట దేవతేతరులకు నగమ్యము. నా చెప్పిన యీభాగములయందే కాక యింకను గల యనేక భాగములయందు వెదకుఁడు. కార్యసిద్ధి నొంది మరలి రండు. ఒక్కమాసమవధిగా నిచ్చితిని. దానిని మించక యుండ రండు. మీరు జానకిని దర్శింతురేని యానందసాగరమున నోలలాడుచుండఁ గలరు.

మహామతులారా! ఈభాగమున నొక్కసంశయము తోఁచు. ఈద్వీపప్రముఖములు వినుట కచ్చెరువుగలిగించుచుండునే. ఇవి యుండునా? అని. దేవతలు సంచరించు తావులు మనుష్యాగమ్యము లనియు వానిని యోగదృష్టిగలవారు గనుఁగొనఁ గలరనియు సుగ్రీవాదులు దేవతాంశసంభూతులు గాన నెఱుంగఁజాలుదు రనియు మనము విశ్వసింపవలయును. చెఱకు పాలసముద్రము మద్యసాగరము క్షీరసముద్రము శుద్ధజలసాగరమునను నివియుండునా యని యచ్చెరు వొంద నక్కఱలేదు. జలములుండు రీతింబట్టి యీ పేరులుంచఁబడినవి. మంచి నీరుగల సాగరభాగమున్నదని యిపుడు కనుఁగొనఁబడినది కదా. ఇపుడు కూడ నల్లసముద్రము ఎఱ్ఱసముద్రము నను పేరులు గలవు. నీటిరంగు ననుసరించియే కాని వేఱు కారణమునఁ గాదు. వృద్ధోరుంధతీన్యాయము ననుసరించి లోకులకు గుఱుతుపడుటకై చెప్పిన లక్షణములు కాని పాల సముద్రమున నావుపాలున్నవని కాదు. రత్నకంబళ మనుపే రెట్టిది? ఇవియు నట్టివే యని మన మూహించిన నీశంకల కవకాశమే యుండదు.

## హనుమదాదులను దక్షిణదిక్కునకుఁ బంపుట.

*సుగ్రీవుఁ డారీతి వానరులం బంచి దక్షిణదిక్కునకు నగ్నికుమారుఁడగు నీలుని హనుమంతుని బ్రహ్మపుత్త్రుఁడగు జాంబవంతుని సుహోత్ర శరారిశరగుల్మ గజ గవయ గవాక్ష సుషేణాదులను యువరాజగు నంగదుని బోవఁబంచెను. శీఘ్ర గామి యను వానరేంద్రుని వారికిఁ దోడుగాఁబోవ నియమించెను. కపిపుంగవులారా! మీరు వింధ్యాద్రిని నర్మదను, గోదావరీ కృష్ణా వరదానదుల నుత్కలను దశార్ణాదిదేశములను దండకారణ్యమును దద్గతగోదావరిని, మఱియు నాంధ్రపుండ్రచోళపాండ్యాది దేశములను గేరళదేశమును బరిశీలింపుఁడు. అవ్వల సహ్యపర్వతమున కరుగుఁడు. అందుఁ గావేరి కనఁబడును. మలయపర్వతశిఖరమున నుండునగస్త్యుని జూడఁగలరు. తదనుగ్రహమునకుఁ బాత్రులరై తామ్రపర్ణినిగాంచి పోయి సముద్రము దాఁక వెదకి సముద్రముదాఁటు విషయము నాలోచించుకొనుఁడు. అందు మహేంద్రాద్రి కలదు. సాముద్రజలములద్దానిఁ దాఁకుచుండును. దేవసేవితమనందగు. ఆసముద్రమున శతయోజన విస్తృతిందనరు ద్వీపముండు. అందు సీతాంబను వెదకుఁడు. తక్కిన తావులకంటె నెక్కువగ నట వెదకవలయు. అదియే రావణునివాసస్థానము. దానికి నుత్తరముగ నాసంద్రము నడుమ నంగారకయను రాక్షసాంగన యొకతుక కలదు. అయ్యది జంతువుల నీడను బట్టుకొని లాగి తిను. ఎందెందు దురాత్మకుఁ డారావణుఁడు సీత నుంచి యుండునను సందియము కలుగునో యందెల్ల వెదకుఁడు. ఆ

* ఇయ్యది నలువదియొకఁడవసర్గమునఁ గలదు.

దీనికి నవ్వల సముద్రమునం దేపుష్పితకంబను కొండయుండు. అది యొక ప్రక్కఁ జంద్రధవళంబై యొక ప్రక్క సూర్యారుణంబై వెలయుచుండు. దక్షిణాయనమున సూర్యుఁడొక బంగరు శిఖరమును జంద్రుఁడొక తెల్లనిశిఖరమును బొందుదురు. ఆకొండఁ గ్రూరులు నాస్తికులు నగువారు కనుఁగొనఁజాలరు. మీరద్దానికి నమస్కరించి యందు వెదకుఁడు. అవ్వల సూర్యవంతమను నగర మొకఁడు కలదు. అద్దానికి మార్గము దుర్గమముగ నుండు. పుష్పితకమున కది పదునాలుగు యోజనముల దూరమున నుండు. దానికి నవ్వల వైద్యుతమను గిరి కలదు. అందలి భూరుహములు వాంఛానురూప ఫలముల నొసఁగుచు సొంపుగనుండు. మీరవ్వాని భక్షించి కుంజరాత్రి కరుగుఁడు. విశ్వకర్మ యందే యగస్త్యునకు మందిరము నిర్మించెను. అది విశాలాయామముల నధికంబై యుండు. అచ్చట సర్పనివాసమగు భోగవతి యను పురము కలదు. అది యప్రతర్క్యము. భయంకరభుజగము లద్దానిం గాంచుచుండు. అందు వాసుకి యుండు. మీరందన్వేషింపుఁడు. దానికి మీఁద ఋషభపర్వతము కలదు. అది వృషభాకారముగనుండు. చందనతరువరము లందుఁ గలవు. అవి పెక్కువన్నెలు కలిగియుండు. మీరు వానిని స్పృశింపకుఁడు. రోహితులను గంధర్వు లవ్వానికిఁ గావలి యుందురు. అందు శైలూషుఁడు, గ్రామణి, శిగ్రువు, శుభ్రుఁడు, బభ్రుఁడు నను నేవురు గంధర్వరాజులుందురు. సూర్యాగ్ని చంద్రతేజస్సులు గలిగియుందురు. భూమి ప్రళయమున నశింపఁగా మహాపురుషు లందుందురు.

ఆవలఁ బితృలోకముండు. అది యమునిరాజధాని. గాఢాంధకారావృతము. కాన మీరరుగకుఁడు. మీరు వీరు

లుగాన నంతదూరము పోయి వెదకఁగలరు. నేఁజెప్పినతావు లందు నితరస్థలములందును,వెదకి రావలయు. ఒక్కనెలలోపల నెవఁడు వచ్చి "కనఁబడినది సీత" యని చెప్పునో వాఁడు మత్స మానవైభవము నొందఁగలఁడు. వాని కన్నఁ బ్రియుఁడు నా కుండఁడు. ఆతనియపరాధముల క్షమింతును. మీరు బలవం తులరుగానఁ జక్కఁగా వెదకి సీతాదేవిని బరికింపవలయును.

మహాజనులారా! ఇందు నింతకుముందు నగస్త్యావాస ములు చెప్పఁబడినవి. దండకారణ్యమున శ్రీరాముఁ డమ్మునిని గాంచెఁ గదా. ఇవెట్టులుండునని సందియ మొందరాదు. అనేక స్థలముల నమ్ముని యుండవచ్చు. ఆముని ప్రభావ మత్యద్భుతము. ఒక్క తావుననే యుండునని మాత్రము మన మూహించు టయు నంత మంచిదిగాదు.

"విధాయ హరివీరాణామాదిశద్దక్షిణాం దిశం. ౬
సహస్రశిరసం విన్ధ్యం నానాద్రుమలతాయుతం,
నర్మదాం చ నదీం దుర్గాం మహోరగనిషేవితామ్. ౭
తతో గోదావరీం రమ్యాం కృష్ణవేణీం మహానదీమ్."

అని మూలము. సుగ్రీవుఁడు ప్రాగాది దిక్కులకుఁ బంపుట కిష్కింధనుండియే యైనను వింధ్యపర్వతమును మధ్యభాగము గా నునుచుకొని దానికిఁ జతుర్దిక్కులకు వానరులను బంపె నని మన మెఱుంగవలయు.

"ద్వీపస్తస్యాపరే పారే శతయోజనమాయతః,
అగమ్యో మానుషైర్దీప్తస్తం మార్గధ్వం సమంతతః. ౨౮
తత్ర సర్వాత్మనా సీతా మార్గితవ్యా విశేషతః,
సహి దేశస్తు వధ్యస్య రావణస్య దురాత్మనః. ౨౯

రాక్షసాధిపతేర్వాసస్సహ ప్రాక్షసమద్యుతేః,"

అని మూలము. శ్రీరాముఁడు రావణునివాసమడుగఁగా,

"న జానే నిలయం తస్య సర్వథా పాపరక్షసః."

అని తెలిపి యిందు దానిం దెలుపుటయేలయని ప్రశ్నింపరాదు. తెలిపినచో నపుడే యుద్ధమునకుఁ బోవ రాముఁడు ప్రయత్నించినఁ దనకార్యము విలంబముగా సాగునని యెంచి కాని, స్పష్టముగాఁ దెలియనందుననో చెప్పెనని వ్యాఖ్యాతలు వ్రాసిరి. అత్తఱి సుగ్రీవునకు రాజ్యప్రాప్తి కాలేదు. కపిసేనలన్నియు నతని వశమున లేవు. పైఁగా వాలిభయము. ఋశ్యమూకమును విడిచి రాఁగూడదు. కావున నాతని నివాసము నాకుఁ జక్కఁగాఁ దెలియదనెను "సర్వథా" సర్వప్రకారములచే నని కదా యర్థము. సాధారణముగాఁ దెలియునే కాని చక్కఁగాఁ దెలియదనియె నని మన మూహించిన నేమియు దోషము రాదు.

## సుషేణాదులఁ బడమరదెసకుఁ బంపుట.

* అట్టులంగదాదులఁబంపి తారకు జనకుఁడగు సుషేణునిఁగాంచి నమస్కరించి దోసిలొగ్గి మారీచుండను కపివర్యుని వాని సోదరులను బడమరకుం బనుపఁబూని వానరోత్తములారా! మీరు సుషేణుని మున్నిడుకొని రెండులక్షల వానరులంగూడి సీతను వెదకుఁడు. సురాష్ట్రబాహ్లీకశూరాది దేశములందునుఁ గేతకీప్రముఖ వనములందును వెదకుఁడు. నిర్జలప్రాయములగు భూములయందు, కొండలయందును వెదకి

* ఇది నలువదిరెండవసర్గమునఁ గలదు.

యటనుండి పశ్చిమసాగరమును జేరి తిమి లోనగు క్రూరమత్స్య ములు నక్రాదిక్రూరజలజంతువులు గలదాని దర్శింపుఁడు. తత్తీరమునఁ గలవనముల వెదకుఁడు. మురచీనగరము లోనగు నగరములఁ గలయం గ్రుమ్మరందగు. సింధునదము సంగమించుతావున శతశృంగములుగల హేమగిరి కలదు. దాని నెత్తమ్ములందు ఱెక్కలుగల సింగములుండు. అవి సాగరమునఁగల తిమిమత్స్యముల నెత్తుకొనిపోయి మహామహీరుహములం బెట్టుకొనును. అందలి గజములు మదించి కన్నుఁగానక తిరుగుచుండు. కామరూపులుగాన మీరాయాశిఖరములందుఁ గలయ వెదకుఁడు సముద్రమునఁ గొంతదూరము పోఁగా నడుమఁ బారియాత్రపర్వతశిఖర మగపడు. అందగ్నివలె వెలుంగు గంధర్వులు కామరూపులుందురు. పెక్కుకోట్లు గానఁబడుదురు. మీరు వారిచెంతకుం బోరాదు. ఫలములను గూడఁ గోరరాదు. వారా ఫలములఁ గాపాడుదురు. వానిపైఁ జాపలమును మాని వెదకవలయు. సామాన్య వానరులవలె మీరుండిన వారివలని భయము గలుగదు. అందింకను గొంత దూరము పోఁగా వజ్రమయ మహాపర్వతము కనుపట్టు. శత యోజనోన్నతముగ నది కనఁబడు. తద్గుహాదుల వెదకుఁడు. ఆసాగరమున మూఁడువంతులు కడచిన పిదపఁ జతుర్థభాగమునఁ జక్రవంతమను కొండ కనఁబడు. సహస్రారమగు చక్రమునందే విశ్వకర్మ నిర్మించెను. మున్నొకపరి పురుషోత్తముఁడను పేరున భగవంతుఁ డవతరించి చక్రరక్షకుఁడగు హయగ్రీవాసురుని వధించి చక్రమును, పంచజనుఁడను దానవుని జంపి పాంచజన్యము నాఁబరఁగు శంఖమును గ్రహించెను. అందెల్ల వెదకి యవ్వల నఱువదియోజనముల దూరమున

మహాతేజోవిరాజితమగు వరాహపర్వతమును జూడుఁడు. అందే ప్రాగ్జ్యోతిషమను నగరము కలదు. నరకాసురుఁ డుండు. అందెల్లఁ జూచి దాని కవ్వలనుండు వేఱొక కొండయందుఁ గ్రుమ్మరవలయు. ఆకొండయందే దేవత లింద్రునకుఁ బట్టాభిషేకము గావించిరి. దాని పేరు మేఘవంతమని యెఱుంగుఁడు. దాని కవ్వల నఱువదివేల పర్వతములు కనఁబడు. వానినడుమ రాజుగా నున్న సావర్ణిమేరువను కొండ యున్నది. సూర్యుఁడద్దానికి వరమిచ్చెను. నా యనుగ్రహమున నిందలి వృక్షశిలాదులన్నియు రాత్రిందివములు బంగారువలె నుండఁగలవనియే యావరము. విశ్వేదేవతలు లోనగువారు సాయంసమయములందు నా మేటిపర్వతముంజేరి సూర్యోపస్థానము గావింతురు. ఆపూజలను గ్రహించి యస్తగిరి నొంది యదృశ్యుండగు. అస్తగిరి యచ్చోటికిఁ బదివేలయోజనముల దూరమున నున్నది. ఒకగడియలో నతఁ డద్దానింజేరు. దాని శిఖరమున నొక భవనము విశ్వకర్మనిర్మితము గలదు. అది వరుణనివాసము. పూర్వోక్తపర్వతములకు రెండింటికి నడుమఁ బదిశిఖరములుగల తాళవృక్షము వెలయుచుండు. మేరుసావర్ణి యనునతఁడు వసించు సావర్ణిమేరువున వెదకుఁడు. ఆమహర్షికి మ్రొక్కి సీతావార్త నడుగుఁడు. అస్తగిరి కవ్వల నంధకారముగనుండు. మీకగమ్యము. మీరు వెదకి నెలకు లోపల వచ్చి చేరవలయు. రానిచో మరణదండనము కలుగును. సుషేణుఁడు చెప్పినట్లు ప్రవర్తింపుఁడు. సీతాదేవింగాంచి వచ్చితిరేని కృతకృత్యుల మగుదుము. అనఁగా సుగ్రీవునికడ సెలవుగొని వారరిగిరి.

## శతవలిలోనగువా రుత్తరమున కరుగుట.

* సుగ్రీవుఁ డంత వీరుఁడగు శతవలింగాంచి నీవంటి వీరులగు నియుతవానరులం దోడ్కొని మంత్రులంగూడి ప్రయాణమగుము. హిమాలయ విరాజమానమగు నుత్తర దిక్కునకుం బోయి సీతాంబను వెదకుఁడు. సీతా కుశలవార్తఁ దెలిపిన మనము కృతజ్ఞులమగుదుము. మహోపకారియగు రామమూర్తికి బదులుచేయుట మనపని. అది యొనర్చిన మన జన్మములు సఫలములు. కానిచో విఫలములు. మీరుత్తర మున మ్లేచ్ఛ పుళిందదేశములను శూరసేన ప్రస్థలేంద్ర ప్రస్థాది భరతదేశములను దక్షిణకురుమద్రాదులను వెదకుఁడు. చీన పరమచీన విహారదరదదేశములను వెదకి హిమాలయము నందును బరిశీలింపుఁడు. లోధ్రవనములు పద్మకాదివనములు గలవు. అందు వెదకి సోమాశ్రయమునకుఁ బోఁదగు. అందు గంధర్వులుందురు. కాళపర్వతమునందును, సుదర్శనాద్రియం దును, దేవసఖ పర్వతమందును వెదకవలయు. దేవసఖమునకు నలుపార్శ్వముల శతయోజన వైశాల్యముగల శూన్యప్రదే శము గలదు. అందుఁ దడవుండక కైలాసాద్రికరిగి యందుఁ గల కుబేరగృహమును గని దాని చెంతనుండు మానసమను సరస్సును గాంచి యాయాయితావుల జానకిని వెదకి క్రౌంచా ద్రికిం బోయి యందుఁ గుమారస్వామి కల్పించిన దుర్గమబిలం బును గని ప్రవేశించి యందలి భాగములఁ బరికించి యందుఁ గల ప్రదానశిఖరమగు కామపర్వతమును మానసపర్వతంబును వెదకవలయును. అయ్యది రాక్షసులకు నగమ్యము. దాని

* ఇయ్యది నలువదిమూఁడవసర్గమునఁ గలదు.

దాఁటి మైనాకాద్రిని జేరి మయదానవగృహమును దర్శించి యందందు వెదకవలయు. దానిని దాఁటఁగా సిద్ధసేవితమగు నాశ్రమము గలదు. అందు వైఖానసులు వాలఖిల్యులను మహాతపస్వు లుందురు. వారిని వందనపూర్వకముగా ..తా వార్త నడుగందగు. అందు వైఖానసమను సరస్సు గలదు. అందు బంగరుకమలములు గలవు. సార్వభౌమమను కుబేరుని దిగ్గజము భార్యంగూడి విహరించుచుండు. దాని కవ్వల రవి చంద్రకిరణ ప్రసారణము లేదు. లేకున్నను మహాత్ముల తేజ స్సుండును. దాని కవ్వల శైలోదయమున్నది. ఆనది కిరుదరుల యందుఁ గీచకములగు వెదుళ్లు గలవు. దానికిఁ బిదప నుత్తర దేశ మున్నది. అందలి కొలంకులు విచిత్ర తామరసములు గలిగియుండును. నల్లఁగలువలు మెండుగ నుండును. అందలి వృక్షములు కల్పవృక్షములవలె నుండును. ఆదేశమును దాఁటఁగా నుత్తరలవణ సముద్రమున్నది. దానినడుమ సోమ గిరి కలదు. ఇంద్రబ్రహ్మవిష్ణులోకవాసులే యాకొండను గాంచఁగలరు. అందు సూర్యకిరణప్రసారము లేదు. కాని దాని ప్రకాశమే రవిరశ్మివలె నుండును. ఆకొండయందు విష్ణువు ఏకాదశ రుద్రాత్మకుఁడగు శివుఁడు బ్రహ్మయు మహర్షి సేవితులై యుందురు. దానికి నుత్తరముగా మీరు పోవఁ జాలరు. మీరందుండి మరలందగు. మీరిక్కార్యమును సాధింతురేని శ్రీరామానుగ్రహమునకుఁ బాత్రులమగుదుము.

మహానుభావులారా! ఈభాగమునఁ గలవిశేషములను బరికింతము.

"భగవానపి విశ్వాత్మా శంభురేకాదశాత్మకః. ౫౭
బ్రహ్మో వసతి దేవేశో బ్రహ్మర్షి పరివారితః,"

అని మూలము.

"విశ్వాత్మా విశ్వశరీరః భగవాన్ షాడ్గుణ్యపరిపూర్ణో వాసుదేవః. 'ఏవమేవ మహాన్ శబ్దో మైత్రేయ భగవానితి, పరమబ్రహ్మభూతస్య వాసుదేవస్య నాన్యగః.' ఇత్యుక్తేః. న చేదమపి శంభువిశేషణం. ఏకాదశాత్మకత్వవిరోధాత్. న హి విశ్వాత్మకత్వ మేకాదశాత్మకత్వం చైకత్ర సంభవతి. ఏకాదశాత్మకః ఏకాదశమూర్తిః. శంభుః రుద్రః. దేవేశో బ్రహ్మా. బ్రహ్మర్షి పరివారితస్తత్ర వసతి. ఇయం చ క్రియా సర్వత్ర సంబధ్యతే. యద్యత్ర కశ్చిత్ప్రకరణాభావా ద్విష్ణురత్ర నోచ్యత ఇతి కథయేత్, తర్హి రుద్రోఽపి నోచ్యతే. కథమితి చేత్ శం భావయతీతి వ్యుత్పత్త్యా, 'శంభూ బ్రహ్మత్రిలోచనా'వితి కోశకారవచనాచ్చ సర్వాణ్యపి విశేషణాని బ్రహ్మపరాణి భవేయుః."

అని గోవిందరాజులు వ్రాసిరి.

"విశ్వాత్మా విశ్వశరీరః భగవాన్ భగవచ్ఛబ్దేన షాడ్గుణ్యపరిపూర్ణో వాసుదేవోఽభిధీయతే. తత్ర తస్యైవ ముఖ్యత్వాత్. తదుక్తం విష్ణుపురాణే. 'ఏవమేవమహాన్ శబ్దో మైత్రేయ భగవానితి, పరమబ్రహ్మభూతస్య వాసుదేవస్య నాన్యగః' ఇతి. ఏకాదశాత్మకః ఏకాదశమూర్తిశ్శంభుః దేవేశో బ్రహ్మా బ్రహ్మర్షి పరివారితస్తత్ర వసతి. వసతిక్రియా పూర్వత్రాపి సంబధ్యతే. బ్రహ్మర్షి పరివారిత ఇత్యేతచ్చ భగవాన్ శంభు రిత్యత్రాపి సంబధ్యతే. అన్యథా తస్య సన్నిహిత బ్రహ్మమాత్ర సంబంధే ఆద్యయోరేకైక విశేషణత్వం తృతీయస్య ద్వివిశేషణత్వమితి వైరూప్యం స్యాత్."

అని రామానుజీయవ్యాఖ్య.

గోవిందరాజులకుఁ బట్టిన దుర్మతాభిమానపిశాచము నించుక తొలఁగింతము. భగవచ్ఛబ్దమిట విష్ణుపరమని వ్రాసి

యున్న యెడల నమస్కరింతుము. "న చేదమపి శంభువిశేషణం" అని వ్రాసినందున నిట వీరిభావము విమర్శింపవలసివచ్చినది. "భగవాన్" అనునది శంభువునకు విశేషణము కాఁదగదని కదా వీరి భావము. ఇంతకన్న దుర్మతాభిమాన మేది యుండును ? విష్ణుపురాణము నుదాహరించిరికదా.

"అబ్రవీద్భగవాన్ సాక్షాన్మహాదేవో హసన్నివ." ౬3
మహాభారతము-సౌప్తికపర్వము-26.

"వదంతి తత్తత్త్వవిదస్తత్త్వం యద్ జ్ఞానమవ్యయం,
బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి కథ్యతే." ౧౨
శ్రీభాగవతము. ౧-స్కం. ౨-అ.

"యత్కించ లోకే భగవన్మహస్వదోజస్సహస్వద్బలవత్క్షమావత్."
శ్రీభాగవతము. ౨-స్కం. ౬-అ.

"పరమం హర్షమాగత్య భగవంత మథాబ్రవీత్." ౧
ఆనుశాసనికపర్వము, ౫-అధ్యా.

అని విష్ణువాక్యము శివునిగూర్చి.

పరాశరమునిం గూర్చి మైత్రేయవాక్యమిది.

"భగవంస్సమ్యగాఖ్యాతం యత్పృష్టోఽసి మయాఖిలం." ౧
విష్ణుపురాణము. ౨-అం. ౧3-అ.

"ఆబద్ధవాన్ ప్రతిసరం భగవాన్ వశిష్ఠః."
చంపూరామాయణము.

భాగవత భారతాదులయందే కాక గోవిందరాజు లుదాహరించిన విష్ణుపురాణమునందుఁ గూడ "భగవాన్" అను విశేషణము విష్ణువునందే కాక యెల్లరయందు నుపయోగింపఁబడినది. వారి వాదము దుర్వాదమనుటకు వేఱువిశేషణము లేమి కావలయును ? ఈశ్వరునకు భగవద్విశేషణము చెల్లద

నుట కంటె మహాపాపకార్యమింకొకటి లేదు. రామాయణము నందే విశ్వామిత్రుని గుఱించి "భగవన్" అని చెప్పఁబడినది. దానికి వ్యాఖ్యానము వ్రాసినవారు వీరే కదా. అపుడిది చెల్లదని యేల వ్రాయలేదు. సమయము దొరకినపుడెల్ల శంక రుని దూషింపఁగోరుట ప్రాక్తనపాపఫలమనుటకన్న నింకేమన వచ్చును? అన్వయమిట్లు.

"భగవాన్ విశ్వాత్మాపి. భగవానేకాదశాత్మకశ్శంభురపి."

"భగవాన్ దేవేశో బ్రహ్మాపి వసతి." అన్ననే అపిశబ్దము చెల్లును. లేకున్న "భగవానపి=భగవంతుఁడైనను, విశ్వాత్మా" అని వెగటుగ నర్థమగును. ఇట్టి దురూహలు కలుగకయుండ వ్రాయుటయే సమంజసము.

## శ్రీరాముఁ డంగుళీయకమును హనుమ కిచ్చుట.

* సుగ్రీవుఁడు కార్యభారమంతయు హనుమంతునిపై నునుపనిశ్చయించి పరమప్రీతి నతనింగాంచి వాయుకుమారా! సజాతీయవైరులుగల భూమియందేమి, మేఘాదులు తిరుగు నిరాలంబాకాశమందేమి, సుడిగాడ్పులుండు పయి నభమునం దేమి, దేవతలుండు స్వర్గమునందేమి, తిర్యక్కులును దిరుగఁ జాలని జలములయందేమి, అసురాదిలోకములందేమి నిరాతం కముగాఁ దిరుగాడఁగలవు. నీవెఱుంగని లోకములే లేవు. గమనవేగతేజోలాఘువములయం దసమానుఁడగు వాయు పుత్రో సమానుఁడవు. కాన సీతాన్వేషణమున సఫలుఁడవు కావలయు. నీతిముఖములయందు నీ కనర్గళపాండిత్యము కలదు. అనునంత శ్రీరామచంద్రుఁడు సుగ్రీవునాశయ

* ఇది నలువదినాల్గవసర్గమునం దున్నది.

మెఱింగి యతఁడు కార్యసాధకుండని తాను నెఱుంగుం గావునఁ దనలో సుగ్రీవుఁ డీ హనుమ కార్యమును సాధించు నని నిశ్చయించుకొనియే యున్నాఁడు. హనుమ కార్యదక్షుఁ డని తెలిసియే యున్నది. కాననే కపిరాజు గౌరవించు చున్నాఁడు. ఈతని మూలమునఁ గార్యసిద్ధియగుట నిశ్చయ మని యూహించి యాహనుమంతుని జూచి తన్నుఁ గృతార్థు నిగాఁ దలంచుకొనియెను. అంతఁ బ్రీతుఁడై సీతాదేవికి నాన వాలుగా స్వనామాక్షరములుగల నిద్దంపుముద్దుటుంగరము హనుమంతునకు నిచ్చి "వానరేంద్రా! ఈముద్దుటుంగరమును గాంచి జానకి నీవు శత్రువవని సంశయింపక భయంపడక నా దూతయని విశ్వసించును. నీబలపరాక్రమాదులు కార్యసిద్ధి యగునని తెలుపుచున్నవి." అని యనెను. హనుమ యాయం గుళీయకమును బుచ్చుకొని తలఁదాల్చి దోసిలొగ్గి శ్రీరామ పాదములకు నమస్కరించి పయనమయ్యెను. అంత శ్రీరా ముఁడు హనుమంతునితో నార్యా! నీబలము నాశ్రయించి యున్నాఁడను. నీశక్తినంతయుం జూపి సీతను గనుఁగొని రావలయునని పలికెను.

మహాశయులారా! ఈభాగమునఁ గొన్ని విశేషములు గలవు. వాని నాలకింపుఁడు.

"అబ్రవీచ్చ హనూమంతం విక్రాంత మనిలాత్మజం,
సుగ్రీవః పరమప్రీతః ప్రభుస్సర్వవనౌకసాం. ౨
న భూమౌ నాంతరిక్షే వా నాంబరే వామరాలయే,
నాప్సు వా గతి సంగం తే పశ్యామి హరిపుంగవ. 3
... ... ... ...
తద్యథా లభ్యతే సీతా తత్త్వమేవోపపాదయ." ౬

అని మూలము. రావణుఁడు సీత నపహరించెనని యెఱింగిన సుగ్రీవుఁడు హనుమంతునితో విశేషించి సంభాషించుటేల యను శంకకలుగు. దానవుఁడు మాయాశీలుఁడగుట వేఱొం డుచోటుల నెందేని దాఁచియుండునని నలుదెసలకు వానరులం బంపెననియు, నందు విశేషించి యనుమానింపఁదగినది దక్షిణ దిశగాన నచ్చటికి హనుమదాదులం బంపెననియు గ్రహింప వలయు. హనుమంతుఁడు శంకరాంశసంభూతుఁడు. కానఁ దలంచిన కార్యమును సాధింపఁగలఁడని పెద్దలవలన నెఱింగి యే యుండును. కనుకనే యే చోటునందును నీగమనమునకు నడ్డము గలుగదనియె. ఇందు "నాంతరిక్షే నాంబరే వా" అని కలదు. అంతరిక్షమనఁగా మేఘములు పక్షులు సంచరింపఁదగు తావనియు నంబరమనఁగా నద్దానిపై సిద్ధప్రముఖులు తిరుగుతా వనియు వ్యాఖ్యాతలు వ్రాసిరి. ఈ రెండుశబ్దములు సామాన్య ముగా నాకాశపర్యాయములే. ఐన నిట్టి వ్యవస్థ యుక్తమే కదా.

"తం సమీక్ష్య మహాతేజా వ్యవసాయోత్తరం హరిం,
కృతార్థ ఇవ సంవృత్తః ప్రహృష్టేంద్రియమానసః.    ౧౧
దదౌ తస్య తతః ప్రీతస్స్వనామాంకోపశోభితం,
అంగుళీయ మభిజ్ఞానం రాజపుత్ర్యాః పరంతపః.    ౧౨
అనేన త్వాం హరిశ్రేష్ఠ చిహ్నేన జనకాత్మజా,
మత్సకాశాదనుప్రాప్తమనుద్విగ్నానుపశ్యతి."    ౧౩

అని మూలము.

"అనేన త్యక్తసకలధనస్య వన్యవృత్త్యా వర్తమానస్య కుతోఽంగుళీ యకమితి చేత్. ఇదమేతత్కార్యార్థం రక్షితవాన్. అత ఏవాంగుళీయ మున్నచ్యేతి నోక్తం. యద్వా రామనామాంకిత మంగుళీయకం సీతాయాః

కదాచిద్ద్రావణాగమనాత్పూర్వం ప్రణయపరత్వేన రామేణ స్వీకృత మితి బోధ్యమ్. యద్వా భార్యాస్నేహేన కనిష్ఠికాయాం సదా ముద్రికా ధార్యత ఇతి దేశాచారః. యద్వా వివాహకాలే జనకేన దత్తమిదం వరాలంకారత్వేన. గృహీత్వా ప్రేక్షమాణాసా భర్తుః కరవిభూషణ మిత్యుక్తేః." అని గోవిందరాజులు వ్రాసిరి. ఇవన్నియు నసంగతములుగాఁ దోఁచెడిని. "విస్తరేణ సహభోజన"మ్మనున్యాయము ననుసరించి ముద్రిక యుండవచ్చును. ఏదే నొక స్వర్ణకలాపముండవలయు నను ప్రాచీనులమతమే యిట గ్రహింపందగు. ఇందుఁ బ్రధానాంశమిది కాదు. రామాయణకాలమున నక్షరములే లేవనియు,విద్యయంతయుఁగంఠపాఠము చేయఁబడుచుండెననియు, నక్కారణముననే హనుమచేతికి లేఖము వ్రాసి యీయక వార్తనంపెననియు, నొక్క కొందఱు మహానుభావులు పలుకుదురు. వాల్మీకిరామాయణమే ప్రమాణముగా నంగీకరింపమను వారింగూర్చి మనము బదులుచెప్పఁ బ్రయత్నింపరాదు. నాస్తికులతో వాదము వృథాయనుట స్పష్టమే కదా. ఈవాదము చేయువారే భారతకథ సాగిన తరువాత రామాయణము సాగిన దందురు. సెబాస్. మెచ్చవచ్చు. వారియోగ్యత తత్తుల్యజనశిరోధార్యమే యగుఁగాక. ఇఁక వారిని విస్మరించి వారి వాదమునకు బదు లేమనువారికిఁ దగిన యుత్తరమిత్తము. శ్రీరాముఁడు హనుమంతుని ప్రయాణ ప్రయత్నముం గాంచి నంతనే సీతను దర్శింపఁగలఁడను విశ్వాసము గలిగినకతన మహానందపరవశుఁ డయ్యెను.అంగుళీయమిచ్చెను. "స్వనామాంకోపశోభితమ్ - స్వనామ = తనపేరుగల, అంక=గుఱుతులచే, ఉపశోభితమ్ = ప్రకాశించునది." అని కదా యర్థము. ఇతరులకు

దురూహామగునట్లు రత్నము లుంగరమునఁ బొదుగునపుడు "రామ" అను నక్షరములు తెలియునట్లు నిర్మించి జనకుఁ డొసంగును. వలయునని పరికించినను దెలియనివారల కివి యీయక్కఱములని తెలియ వలనుపడదు. ఇది యిక్కాల మునఁగూడఁ గలదని నా యనుభవమునుబట్టి గట్టిగాఁ జెప్పఁ గలను. ఆ యంగుళీయమట్టిది. ఆయక్షరము లున్నయట్లు సీత యెఱుంగును. కనుకనే శ్రీరాముఁడు

"అనేన త్వాం హరిశ్రేష్ఠ చిహ్నేన జనకాత్మజా."

అని తెలిపెను. ఈయక్షరములను గాంచి యనక యీగుఱు తుఁ బరికించి నిన్ను సీత నమ్మునని బోధించెను. అని మనము గ్రహించినచో సత్యమును గ్రహించినవార మగుదుము.

## వానరసన్నాహము.

* అంత సుగ్రీవుఁ డాకపులంబిలిచి మీరెల్లరు నేఁ జెప్పి నట్లు కడుజాగరూకులరై సీతాదేవిని వెదకవలయును. అనఁగా రాజాజ్ఞను శిరములం దాల్చి సంఖ్యకు మించి ప్రయాణము గా సాగిరి. రాముఁడు సోదరునిగూడి వానరులరాకం గోరుచు నానెలదినములు ప్రస్రవణగిరియందే యుండెను. శతవలి లోనగువారు తమ తమ దిక్కులకుం బోవసాగిరి. సూర్య సూనుఁడు కృతకృత్యుఁడై మహానందమున నోలలాడెను. వానరు లార్చుచుఁ బౌరుషములు పలుకుచుఁ బోయిరి. ఒక్కొ క్కఁడును దనశక్తిని గనఁబఱచు నూహను మాటలాడ సాగెను.

---

* ఇది నలువదిమూడవసర్గమునఁ గలదు.

## శ్రీరామునితో సుగ్రీవుఁడు తనకుఁగల లోకజ్ఞానముఁ దెలుపుట.

*వానరులు ప్రయాణము సాగించిన పిమ్మట రామచంద్రుఁడు సుగ్రీవునితో రాజా! ఈభూభాగముల నెట్లెఱింగితివని ప్రశ్నించెను. అంత నతఁడు రామునకు నమస్కరించి విన్నవించెదనని చెప్పఁ దొడఁగెను. దుందుభిమాయావియను దానవులను వాలి జయించిన వృత్తాంతమును మున్నే విన్నవించితిని గదా. నేను రాజ్యమును బాలించుచుండఁగా గుహనుండి వచ్చిన వాలి నాపై నాగ్రహించి పాఱఁదోలఁగా భీతుఁడనై పోయి భూమండలమంతయుం గాంచితిని. వాలి వెంబడించి తఱుమసాగెను. తూర్పుదెసకుఁ బోయి దాని కొసవఱకుఁ గాంచితిని. వాలి నన్ను వదలక తఱుమఁగాఁ దక్కిన దిక్కులం గాంచితిని. వాలి బాధలకుఁ దాళఁజాలక పోవఁగా హనుమంతుఁడు మతంగమహర్షి శాపమున ఋశ్యమూకము వాలి కగమ్యము గదా. ఇపు డది నాస్మృతికిం దగిలెను. అందు నిశ్చయముగా నుండవచ్చును. ఆమాటల కూఱడిల్లి ఋశ్యమూకమునకుఁ బోయితిని. ఇదియే నాభూమండలభ్రమణ వృత్తాంతమని విన్నవించి యూరకుండెను.

## వానరులు వచ్చి తమవార్తలఁ దెల్పుట.

§ రాజాజ్ఞననుసరించి సీతను వెదకఁబోయిన వానరులు కడుంగడు శ్రద్ధమెఱయ నన్నితావుల వెదకివెదకి నిరాశులై

* ఇది నలువదాఱవసర్గమునఁ గలదు.

§ ఇది నలువదేడవసర్గమునఁ గలదు.

వచ్చి సుగ్రీవున కవ్వార్తం దెలిపిరి వారాయాపర్వతముల
కుంబోయినపుడు సర్వర్తుధర్మములుగల తావులు గనంబడఁగా
నందలి సుస్వాదుఫలముల భక్షించిరి. దాన నయ్యవి కృతా
ర్థము లయ్యెను. రావణుఁడేమో అనుసందియమున భీకరాకా
రులఁ గొందఱ నావానరులు వధించిరి. కాని సీతాదేవి యం
దెందును గానరా దయ్యెను. దుర్గమస్థములని మానక
శ్రీరామప్రసాదపాత్రులమైనం జాలునన్న పేరాసల వా
రాయాతావుల వెదకిరి. కాని యెందును జానకి గుఱుతు
పరికింప వలనుపడదయ్యె. భగ్నాశులై వచ్చి తమపడిన ప్రయాస
మంతయు సుగ్రీవునకు విన్నవించి తమయిరవుల కరిగిరి.
వారెల్లరు హనుమంతుఁడు రావణుఁడున్న దిక్కునకే పోయె
నుగాన నతఁడు సఫలమనోరథుఁడై రాఁగలఁ డనియుఁ జెప్పిరి.
రాజు నట్లే తలంచెను.

## హనుమదాదు లొకరక్కసుని జంపుట.

* హనుమ దంగదాదులు వానరవీరులంగూడి దక్షిణ
దిక్కున కరిగి ప్రభువు నానతి చొప్పున సీతాదేవిని వెదకుచుఁ
జాలదూరము పోయిరి. వింధ్యపర్వత గుహాదులయందును
మహాకాననములందును వెదకిరి. ఎందును గానఁజాలరైరి. ఫల
మూలములందినుచు సరోవరజలంబు లానుచుఁ బోవుచు దుర్గ
మములగు నా వింధ్యారణ్యముల వెదకుచు నిర్జల ప్రదేశము
లకుం జని శ్రమములకు లోనై మృగపక్షులుగూడ లేని యా
చోటుల సీతాన్వేషణ మొనరించిరి. అందుఁ గండుఁడను ముని
గలఁడు. సత్యవాది. మహాకోపము గలవాఁడు. ఆతనికొడు

* ఇయ్యది నలువదెనిమిదవసర్గమున గలదు.

కొక్కఁడు పదునాఱేండ్లవాఁ డావనమునఁ జచ్చెను. దాన నవ్వనముపై నమ్మునికిఁ గోపముకలిగెను. మృగాదులు లేకుండుఁ గాక యని శపించెను. అట్టి తావుల నావానరులు పరికించిరి. అచ్చటనుండి వేఱొకవనముం జొచ్చిరి. అందు దేవతల లెక్కింపని రక్కసుఁ డొకఁడు వారింగాంచెను. రక్కసునితో యుద్ధ మొనరింపఁ గపివీరులు సిద్ధపడిరి. ఆవిధ మెఱిఁగి యిఁక మీరు చచ్చితిరని యతఁడు పలికి పిడికిలిం బట్టుకొని వారిపై నురవడించెను. అంగదుఁడు వీఁడే రావణుండని తలంచి వాని హస్తతలమునఁ గొట్టెను. రక్తముం గ్రక్కుచు నతఁడు నేలం గూలెను. వానరులతని రావణునిగా భావించి యందుఁగల గుహయందు సీత యుండు ననుకొని యందుఁ జొచ్చి కలయ వెదకిరి. అందుండి వేఱొక భయంకరగుహం జొచ్చి యందును సీతం గానక యలసి యొక్కవృక్షమూలమునఁ గూరుచుండి దుఃఖించుచుండిరి.

మహాత్ములారా!

"స తు దూరముపాగమ్య సర్వైస్తైః కపిసత్తమైః,
విచినోతి స్మ విన్ధ్యస్య గుహాశ్చ గహనాని చ. ౨
పర్వతాగ్రాన్నదీదుర్గాన్ సరాంసి విపులాన్ ద్రుమాన్."

అని మూలము.

"పర్వతాన్ విన్ధ్యస్య ప్రత్యంతపర్వతాన్ గోమంతత్ర్యంబకాదీన్." అని వ్యాఖ్య. విన్ధ్యపర్వతమునకు సంబంధించినపర్వతముల నన్నింటి నాపేరనే పిలుచువాడుక. కానఁ గిష్కింధకు దక్షిణ భాగమున విన్ధ్య మెక్కడిదని సంశయింపరాదు. ఒక్కపేరే పెక్కుపర్వతములకు నుండుటయుఁ గలదు. ఈభాగమును

బరిశీలించిన భారత కథానంతరము రామాయణ కథ సాగిన దన్న వాద మెంత నిస్సారమో తేటపడును. కిష్కింధకు దక్షిణభాగమునఁ గూడ మహారణ్యములు రక్కసులుండు టయు నీ భాగము తెల్పును. భారతకాలమున నిట్టివి మిక్కిలి తక్కువ కదా.

## హనుమదాదులు మరల వెదుకనారంభించుట.

* అంగదుండు తానలసియుండియు, నలసియుండు నితర కపివర్యులంగని యూఱడించుచు మన మనేకస్థలములంగాంచి తిమి. సీతగాని రావణుఁడు కాని కనఁబడలేదు. నియమితకాల మునఁ జాల గడచినది. సుగ్రీవుఁడు తీవ్రముగా దండించు వాఁడు. కానఁ జక్కఁగా వెదకుదము. విసుగు వదలియు నుత్సాహ ధైర్యములు గలిగియుఁ జేయు ప్రయత్నము ఫలిం చునని పెద్దలందురు. మరల నావనమున వెదకందగు. కార్యము చేయుచుండిన ఫలము గలుగుట కనుఁగొనుచున్నారము. కాన సోమరితనము మాని పరిశీలింతము లెండు. రామసుగ్రీ వుల యాజ్ఞ శిరసావహింపఁదగినది. మీ కింతకంటె మంచిదిగా నేదియేఁ దోఁచిన దానిం దెల్పుఁడు. అని పలికెను.

ఆమాట లాలకించి గంధమాదనుఁడు డప్పిగొన్న వాఁడు గాన సన్నని యెలుంగున నంగదుని మాట యవశ్య కర్తవ్యము. ఫలించును. ఈ కాననాంతరముల నెల్లతావులం జక్కఁగా వెదకవలయును. అనఁగా నందఱు లేచి వెదక నారంభించిరి. ఆపర్వతమున రజతమయంబగు నొక భాగము నారోహించి వెదకిరి. బడలికలు గలవారయ్యు వేసరక వెదకిరి

* ఇయ్యది నలువదితొమ్మిదవసర్గమునందుఁ గలదు.

గాని సీతజాడ కనఁబడదయ్యెను. ఆకొండ దిగి యించుక నిలు వంబడి బడలికలు వాపు కొన నొక చెట్టుక్రిందఁ జేరిరి. అల సట యడఁగఁగా మరల వెదకసాగిరి. వింధ్యాద్రిని గల గుహా దులయందు మరల వెదకిరిగాని యెందును జానకిజాడ గానరా దయ్యెను.

3 { హనుమదాదులు ఋక్షబిలమున స్వయంప్రభను జూచుట. }

* హనుమంతుఁడు తారాంగదాదులంగూడి యాపర్వత భాగములఁ జక్కఁగా వెదకి దక్షిణపశ్చిమముల సంధియందు వెదకఁబోయెను. అప్పటికే సుగ్రీవుఁ డేర్పఱచిన నెల గడచెను. సానువులయందెల్ల వలయాకారముగ నందఱ నిలిపి వెదకిం చెను. వారెల్ల నందందు వెదకుచుం బోయిపోయి విస్తీర్ణమగు నొక బిలముం గనుఁగొనిరి. ఆబిలము మయదానవరక్షితము. ప్రవేశింప నశక్యము. ఋక్షబిలమని దానిం బిలుతురు. లతా గుల్మసమాచ్ఛాదితము. అందుండి క్రౌంచ హంసాది జల పక్షులు వచ్చుచుండెను. పరిమళములు వ్యాపించుచు దుర్గమ ముగా నుండు నాబిలముంగాంచి యచ్చెరువంది బలివాసమగు పాతాళముంబోలి చూడనుంగూడ నశక్యమై యున్నదానిం గని నంతన యిది పాతాళమో లేక రాక్షస మాయయో యని యనుమానించుచు దాని చెంతకుంబోయిరి. హనుమ దుర్గమమార్గాభిజ్ఞుఁడు కావున వారలంగని మన మీదిక్కున వెదకివెదకి వేసరితిమి. సీత గానరాలేదు. ఈ గుహనుండి క్రౌంచాది పక్షులు నీటందడిసి నలుఁగడల వెడలివచ్చు

* ఇది యేఁబదియవసర్గమునఁ గలదు.

చున్నవి. ఈ ద్వారవృక్షములు పచ్చగానున్నవి. కాన నిందు జలాశయము లుండును. సత్యమనియె.

హనుమపలుకు లాలకించి యందఱాబిలముం జొచ్చి చంద్రసూర్యప్రకాశములు లేకుండుట భయము గల్గించుచు గగుర్పాటు గలుగఁజేయుచుండుటం దెలిసికొనిరి. అందుండి వెడలివచ్చు సింహాదిమృగములం గాంచిరి. అంధకార బంధుర మగు నాబిలముం బ్రవేశించిరి. వారినేత్రప్రభావపరాక్రమము లెవ్వియుఁ బనికిరావయ్యె. వారు వాయువు చరించు లాగున దారిలేక యా చీకటిలోఁ దిరిగిరి. కొంతవడి కందు వెలుతురు గలిగి సొగసుగానుండు ప్రదేశము కనఁబడియె. నానావిధభూరుహాయుతి దుర్గమముగా నున్నదాని నంధకార మగుట నొకరి నొకరు వదలి పోవుదుమను భీతింబట్టుకొని యొకయోజన దూరముఁ జొరఁగలిగిరి. డప్పిచే బడలి విసుగు నొందక పోయి పోయి వెలుతురును గాంచిరి. సొంపులు గులుకు నొక వనప్రదేశముంగని యగ్నివలెఁ బ్రకాశించు నర్జునాదిభూరుహములం గాంచిరి. ఫలవృక్షము లనేకములం దుండెను. సరోవరము లనేకములుండెను. రత్ననిర్మితగృహములం గనిరి. బంగారుమయములగు శయనాసనము లుండెను. బంగరుపాత్రలు రాసులుగాఁ బడియుండెను. వెండికంచు పాత్రలు రాసులుగా నుండెను. అగురుచందనములు నతి రుచ్యములగు ఫలమూలములు పానద్రవ్యములు లోనగు నుత్తమపదార్థము లందుండెను. ఆబిలమున వెదకుచు నాయ మూల్యవస్తువులంగాంచి యందొక స్త్రీని గూడఁ జూచిరి. నార చీరలు గట్టి కృష్ణాజినము దాల్చి నియతాహారయై తపస్సు గావించుచుఁ దేజోరూపిణియై యున్నట్లుండెను. వారామెను

గని భయాశ్చర్యములం గాంచి దవ్వుగా నిలువఁబడియుండిరి. అంత హనుమంతుం డమ్మా! నీవెవ్వతవు? ఈబిలమెవరిది? అని ప్రశ్నించెను. చేతులు జోడించి యావృద్ధ తపస్వినికి నమస్కరించి యీయుత్తమపదార్థము లెవ్వరివని యడిగెను.

## ఋక్షబిలవృత్తాంతమును స్వయంప్రభ కపులకుం జెప్పుట.

* ఇట్లు పావని ప్రశ్నించి మరల ధార్మికురాలగు నాయమంగని తల్లీ! మేము మార్గశ్రమముల నలసి జలాదులిందుం డునని ముందువెనుక లాలోచింపక యంధకారావృతమగు దీనిం జొచ్చితిమి. డప్పి బాధింపఁగా నిందులకు వచ్చితిమి. ఇందుఁ గల యీ దివ్యపదార్థములం జూడఁగా నిది దానవ మాయ యగునేమో యని దిగులుతోఁ జేయునది నేర కున్నాము. ఈస్వర్ణవర్ణవృక్షములు తఱ్ఱుంగల యీపదార్థములు నీరజతగృహములు నెవ్వారివి? ఈసరోవరాదు లెవ్వరి ప్రభావమునఁ గల్గినవి? బంగరుతామేలును బంగరు చేఁపలు నున్నవి కదా. ఇవెట్లు కలిగినవి? ఈవిషయము మాకెవ్వరికిని దెలియదు గాన విస్తరించి చెప్పుమని యడుగ సర్వభూతహిత పరాయణురాలగు నాస్వయంప్రభ వారింగాంచి మహాతేజుఁడు మాయావిశారదుఁడు నగు మయదానవోత్తముఁ డిందుం డెను. తన విచిత్రశక్తి వీని నెల్ల నిర్మించెను. కాంచన గృహము నిద్దాని నిర్మించిన మయుఁడు మున్ను దానవశిల్పియై యుండెను. ఆతఁడు మహారణ్యమున ఘోరతపస్సుచేసి బ్రహ్మ

*ఇది యేఁబదియొకఁడవసర్గమునఁ గలదు.

వలన శుక్రప్రణీత శిల్పశాస్త్రమంతయుఁ దన యధీనమున నుండ వరము వడసెను. ఆతఁ డిందుఁ గొంతకాలము సుఖముగానుండి హేమయను నచ్చరమిన్నయం దాసక్తి కలిగి యుండు టెఱింగి యింద్రుఁడు పరాక్రమించి వజ్రమున నతనిం గొట్టెను. ఆతఁ డిందుండ నోడిపోవఁగా నీయుత్తమవస్తువుల బ్రహ్మ హేమ కొసంగెను. వానరోత్తమా! నేను మేరుసావర్ణితనూజాతను. పేరు స్వయంప్రభ యనఁబడు. హేమాయత్తమములగు వీనిని రక్షించుచు నిందున్నదానను. నృత్తగీతప్రవీణురాలగు హేమ నాకుఁ బ్రియసఖి. ఇతరులకు నన్నుఁ దిరస్కరింపనలవిగాని రీతి నాకు నా హేమ వరమిచ్చెను. కనుక నిందున్నదానను. మీ రెందుల కిందుఁ జొచ్చి వెదకుచున్నారు? దుర్గమమగు నీవనము నెట్లు కనుఁగొంటిరి? స్వాదుఫలములం దిని జలములఁ ద్రావి మీవృత్తాంతమంతయు వినిపింపుఁ డనియెను.

మహాశయులారా! ఈభాగమును బరిశీలించి విశేషములం గనుఁగొందము. ఈ రెండు సర్గములయందు ఋక్షబిలమునకు స్వయంప్రభకును సంబంధించిన విశేషములు గలవు.

"తేషాం తత్రైవ వసతాం స కాలో వ్యత్యవర్తత." 3

అను మూలముం బట్టి స్వయంప్రభను జూడకముందే సుగ్రీవప్రకల్పితమాసనియతి గడచెను. ఆమహాకార్యము కాలనియతిని వారికిఁ దోఁపక యుండఁజేసి యుండవచ్చు. ఏలయనఁగా శ్రీరాముఁ డంగుళీయము వారికే యొసంగెను. రావణుం డుండు దిక్కుగూడ నదియే. కాన వారిమూలమునఁ దనపని ఫలించునని శ్రీరాముఁ డాసించుట యొక చిత్రము కాదు.

ఎంతకాలమైనను సరే సఫలప్రయత్నులమై మగిడి పోవల యునే కాని రిత్తగాఁ బోరాదని వారూహించి యుందురన్నను విచిత్రము గాదు. ఏకాలమున నెవ్వారికైన నీయూహ జనిం చుట సహజమే.

"అస్మాచ్చాపి బిలాద్ధంసాః క్రౌంచాశ్చ సహ సారసైః. ౧౬
జలార్ద్రాశ్చక్రవాకాశ్చ నిష్పతంతి స్మ సర్వతః,
నూనం సలిలవానత్ర కూపో వా యది వా హ్రదః. ౧౭
తథా చేమే బిలద్వారే స్నిగ్ధాస్తిష్ఠంతి పాదపాః,
ఇత్యుక్త్వా తద్బిలం సర్వే వివిశుస్తిమిరావృతం. ౧౮
అచంద్రసూర్యం హరయో దదృశూ రోమహర్షణం."

అని మూలము. ఒకచో నొకమహాగుహ కనఁబడియెను. క్షుత్తు డప్పియు నలయింపఁగా వా రా బిలముం గాంచిరి. హంసాది పక్షులా గుహనుండి వచ్చుచుండఁగా స్నానముచేసిన గుఱుతు లం బట్టి హనుమ యిందు జలాశయము లెట్టివియో యుండ వచ్చుననియె. వారందుఁ జొచ్చిరి. అంధకారబంధురముగా నాగుహయుండెనని దీని సామాన్యార్థము. రవిచంద్రకిరణ వ్యాప్తి యందు లేదు. పూర్వమిట్టి వనేకగుహ లుండినట్లు పురాణములయందుఁ గనంబడుచున్నది. మునులు సాధారణ ముగా గుహలలో నుండియే తపస్సొనరించువారు ధర్మధ్వంస కులగు రక్కసు లనేకులు తిరుగుచుండుటం బట్టి యట్టితావులనే మహర్షులు వసించుచుండిరి. గుహాముఖము దుష్ప్రవేశ్యముగా నుండును. లోపలం జొచ్చి కొంతదూరమరిగిన విశాలాంత రాళముగా నది కనంబడుటయు స్వాభావిక గుహాగుణములు. కొంత దూరమరుగ నందు వెలుతురుకూడ నుండును. శేషా

చలమున నొక్కభాగమున నొక గుహ కలదు. దానికిం గ్రోశ
మాత్రదూరమున నొకపల్లియయుఁగలదు. దక్షిణోత్తరముగా
నుండు నా కొండయం దొకభాగ మాచోటఁ దూరుపునకు
సాగియున్నది. ఆగుహకుఁ గ్రింద నూటయేఁబది గజముల
దవ్వున నొక జలాశయము కలదు. ఆగుహ బహువృక్షసమా
చ్ఛాదితము. పది బాహువులంతదూరము విశాలముగా మన
కగపడును. ఎల్లరు నంతదనుకఁ బోవుదురు. గబ్బిలము లా
దాని పైభాగమున నిండ్లు కట్టుకొని యున్నవి. ఉత్తరముఖ
ముగా నాగుహ యున్నది. అంతదనుకఁ బోఁగా మనుష్య
ప్రమాణమంతయెత్తునఁ బడమర దెసయం దొక బిలము కనఁ
బడును. ఎత్తుగానుండు పాషాణములందు వేయఁబడియున్నవి.
ఆబిలమునకు మానిసి కూరుచుండి పోవచ్చును. శ్రమముల
పాలై యాపాషాణములపై నిలుచుండి యద్దాని లోపలిభాగ
ము దీపప్రకాశమునఁ జూడఁగాఁ గొంతదూరము కనఁబడును.
అంతదనుకఁ గూరుచుండియే పోవలయు. కొండఅందుఁ బ్రవే
శింపఁబూనఁగా సర్పఘూత్కారము వినఁబడియె ననియు, వీరు
దిగి వచ్చుచుండఁగా నదియు వీరి వెంటఁబడియెననియు, వెలు
పలికి వచ్చులోపల నొకనిం బట్టుకొనఁగా నితరులద్దానిని దం
డాహతుల నలయింప వదలెననియు, దానిని శ్రమంపడి చంపి
రనియు, నదిమొద లాప్రాంతమున వానలు తక్కువ యనియు
నందలివారు చెప్పుదురు. ఎంతనిజమో దేవుఁడే యెఱుఁగును.
నేనాగుహను జూడఁబోవఁగా నలువురు తోడువచ్చిరి. గొప్ప
దీపముంబెట్టి చూడఁగా నందు సర్పములు లేక గబ్బిలములే
యున్న జాడ పొడకట్టెను. అందఱ మందుఁ జొచ్చితిమి. ఇంచు
మించుగా నిరువది బాహువులదూర మట్లే పోవఁజాలితిమి. ఆ

మార్గమంత నశించెను. గండోపలము కుడ్యమురీతిగా నున్నది. దక్షిణమున నొక్కమనుష్యుఁడు పోఁదగినంతద్వారము కష్ట పడి చూడఁగాఁ గనఁబడియెను. దీపప్రకాశమునఁ బరిశీలిం పఁగాఁ గొంతదూరమున నడ్డముగా నొక చట్రాయి గనఁబడి యెను. సర్పాదు లందు లేకుండును. దుర్గంధము గుబులుకొను చుండెను. అందుఁ జొచ్చితిమి. ఆచట్రాయి దగ్గరకుఁ బోవ పడ మరదెస రెండుమూరల యెత్తున మార్గము కలదు. నిక్కి చూడఁగాఁ జీఁకటి దట్టముగాకయున్నట్లు తోఁచెను. ఆమార్గ మున నిలుచుండియే పోవవచ్చును. మాకడనున్న దీప మద్దా నిని స్పష్టముగాఁ బ్రకటింపఁజాలక పోయెను. సమీపభాగమున జలము లున్నజాడ మాత్రము-కనఁబడియెను. ఇది నేఁజూచిన విషయము. వెనుకకు రాఁగా మరల జన్మించినట్లే భావించితిమి. అట్టి గుహాలయందే మునులుందురని ప్రతీతి గలదు. ఈప్రస్తావ మునఁ గలబిలమునుండి పక్షు లరుదెంచుటగాని లోపల జలా శయము లుండుటగాని యచ్చెరువు కాదు.

"తత స్తం దేశమాగమ్య సౌమ్యం వితిమిరం వనం. ౨౮
దదృశుః కాంచనాన్ వృక్షాన్ దీప్తవైశ్వానరప్రభాన్,

... ... ... ...

నీలవైదూర్యవర్ణాశ్చ పద్మినీః పతగావృతాః. ౨౮
కాంచనాని విమానాని రాజతాని తథైవ చ,
తపనీయగవాక్షాణి ముక్తాజాలావృతాని చ. ౩౧
దదృశు స్తత్ర హరయో గృహముఖ్యాని సర్వశః,

... ... ... ...

తత్ర తత్ర విచిన్వంతో బిలే తస్మిన్ మహాబలాః. ౩౮
దదృశుర్వానరాశ్శూరా స్త్రి(స్త్రి)యం కాంచిదదూరతః,

> తాం దృష్ట్వా భృశసంత్రస్తాశ్చీరకృష్ణాజినాంబరాం. 38
> తాపసీం నియతాహారాం జ్వలంతీమివ తేజసా."

అని మూలము. లోపలం గొంతదూరము నిర్గతజీవితాశులై వారు రహగంగా వెలుతురు గనంబడియెననియు, బంగారురంగు గల వృక్షములు గనంబడియెననియు, దివ్యగృహములు గనంబడియెననియు, సరోవరము లుండెననియు,నందొక మునివృత్తి నుండు స్త్రీ కనంబడంగా వారు భయంపడిరనియుం గథాభాగము. ఇందు సందేహింపందగువిషయములు గలవనియుం గొంద ఱేతత్కాలికవిద్యావంతులు తలంతురు. వారి కివియన్నియు నసత్యములే యని తలంపుండును. ఆకాశగమనాదులు వారికి నిట్టివేయని తోంచును. ఈముగ్ధత్వమునకుం గారణము దేవతోపాసనము లేకుండుటయే. ఆకాలమున నిట్టి సుందరమందిరములుండునా. ఇద్ది సర్వథా సత్యేతరము కాదా యని యొక నూత్నవిద్వాంసుండు నవ్వెను. అంధకారమున కప్పల వెలుతురుండు టసంగతము కాదా యని వేఱొక దేవానాంప్రియుం డట్టహాసము గావించెను. వెలుతురు చీకటియుం గలిసి యుండునేమో యాకాలమున నని యింకొక పండితబ్రువుండు పరిహాసించెను. అట్టివారికి బదులుచెప్ప శక్యమా యని వదలరాదు.

భూగర్భశోధకులు పరిశీలింపంగాం గొన్ని యేండ్లకు ముందు. "ఈజిప్టు" అనంబడు దేశమున నొకదానిక్రింద నొకటిగా నేడు పట్టణములు గనంబడియెననియు, నేడవపట్టణమున నొక సుందరమందిరము కనంబడంగా దాని తలుపు తీసినంతనే లోపలనున్న శవము గాలి కెగిరిపోయెననియు, దానిచుట్టు మట్టి

పలకలపై నక్షరములు వ్రాసి వానిని గాల్చి యుంచినట్లుండె ననియు,దానిని బరిశీలింపఁగా నేఁబది వేలయేండ్లకుముం దామందిరము కట్టఁబడినట్లు తేలెననియు, సూర్యప్రకాశము గాలి తగులనికతన నాశవ మట్లే యుండి యవి తగులగా ధూళిగా నెగిరిపోయెననియు, విమర్శించు నేర్పుగల యనివసంతమాంబ వ్రాసెను. సృష్టి చమత్కార మచింత్యము. మనకుఁ దోఁపని విషయము లెవ్వానికిందోఁపవనుటకంటె నవివేకము వేఱొకటి యుండదు.లోకవైచిత్ర్య మమేయము. ఇంకను గొంతకాలము నకుం గొన్ని కనంబడఁగా నపుడు తలలూచి తమమౌఢ్యము నకు సిగ్గుపడఁగలరు. సాగరముల నూత్న సృష్టి కనఁబడుచున్నది. కనివిననివి ప్రత్యక్షము లగుచున్నవి. పదార్థవిజ్ఞానశాస్త్రము గాని రసాయనశాస్త్రము చారిత్రకశాస్త్రముగాని సృష్టి యింతయే యని తెలుపంజాలదు. తజ్జన్యాల్పజ్ఞానపరిభూతాహంకరణమున నిది యేతన్మాత్రమే యని నిర్ణయింపరాదు.

తపశ్శక్తి యపారవైభవము కలది. దానికి సాధ్యములు కానివి లేవు. గగనగమనము తజ్జన్యము. అది యత్యల్పసిద్ధి యని యోగశాస్త్రము వక్కాణించును. త్రిలోకగతవస్తు సందర్శము యోగఫలమే. సామాన్యులకది యద్భుతముగాఁ దోఁపవచ్చును. "మనసా ప్రకల్పితాః" అని ప్రమాణము విందుము కదా. మనశ్శక్తి భగవదారాధనఫలము. అది యలవడినచో నన్నియు సుగమములే. విశ్వామిత్రచరిత్ర మీవిషయమును బోధించును. ఇక్కాలమునందుఁగూడ "టాల్‌స్ట్రాయ్" అను రష్యాదేశపు మహాత్ముఁడు భావికాల యుద్ధవిషయముల నెట్లు తెలిసికొని చెప్పఁజాలెను? జ్ఞానబలముచేత నేకదా. ఇతరులగు పండితు లట్టులేల తెలిసికొనఁజాలరైరి? శా

జ్ఞానము మాత్రము కలిగి తత్ఫలమగు భగవద్భజనము లేని వారలు వారలకడ మూఢులే యగుదురు. అనాగతవార్తలం దెలిపెడుశక్తి సామాన్యపదార్థముల నిర్మింపంజాలదనుట వెఱ్ఱితనముగాక మఱేమిటి? జ్ఞానదృష్టి లేనివా రదిగలవారి నాక్షేపించుటకంటెం బాపకార్యమెద్ది? బంగారువృక్షములుండు నా యనువారు కలరు. వాని కొమ్మలందీసి యాభరణములు చేయించుకొనవచ్చునా యని ప్రశ్నించుటెట్టిదో యిదియు నట్టిదే. ఆరంగుగల వృక్షములని యర్థము. అగ్నివంటివర్ణము కలవనియు నర్థము. ఇక్కాలమున హర్మ్యములముందు ఫలములు పుష్పములు లేక వివిధవర్ణపత్రములుగల చిన్ని వృక్షములను, అందు రక్తవర్ణము గలవానిని జూచుచున్నాము. అట్టివి గాక యాబిలమునంగలవి యట్టివర్ణముగలవయ్యుం బుష్పఫలనిబిడములై యుండుటేమి యచ్చెరువో తెలియంజాలక యున్నాను. అట్టి యావనమున వెదకుచు నందొక తాపసిని గాంచిరని యున్నది. నారచీరలు కృష్ణాజినములు ధరించియుండెననుటం జేసి భోగపరాఙ్ముఖురాలని తేలుచున్నది.

> "కథం మత్స్యాశ్చ సౌవర్ణాశ్చరంతి సహ కచ్ఛపైః,
> ఆత్మానమనుభావం చ కస్య చైత త్తపోబలం. ౦
> అజానతాం నస్సర్వేషాం సర్వమాఖ్యాతుమర్హసి,"

అని హనుమంతుం డడిగెను. ఇప్పటిభాషాపండితులవలెనే హనుమయు నిట్టిఫలవృక్షములను మే మెఱుంగము. ఎవరితపశ్శక్తిచే నివి కలిగినవి? మాకుం దెలుపుమా యని వేండెను. తపశ్శక్తిచేం గాకయున్న నివి కలుగవను జ్ఞాన రూపావనికిం

గల్గెను. ఇప్పటి కది తప్పుఁ దక్కనజ్ఞానము ప్రకాశించుటంబట్టి యద్దానిం దలపెట్టక యాక్షేపింతురు.

"లతార్క మద్రుమా తత్ర హరితేఽథ మహౌషధమ్."

అని నామలింగానుశాసనమునఁ గలదు. పచ్చని యుల్లిగడ్డలు గలవని తేలెడిని. ఇపు డట్టివి యున్నట్లు గానరాదని నావినికి. ఇప్పుడు లేనంతన యెప్పటికిని లేవనియే భావమా. లేనిదానికి నామకరణము చేయువారు సృష్టియందు లేరనవలయును. కావున నిందలి విషయము లసత్యములని కల్పితములని యను టకంటెఁ బొరపాటు వేఱొకటి లేదు. బంగరురంగు గల చేపలు తాఁబేలు లుండుట యొక విచిత్రమనుటయే విచిత్రము. జలజంతువులసృష్టి యిట్టిదని నిర్ణయింప వలనుపడదని యిప్పటిపరిశీలనసంఘమువారే తెల్పుచున్నారు.

"ప్రత్యువాచ హనూమంతం సర్వభూతహితే రతా,
మయో నామ మహాతేజా మాయావీ దానవర్షభః. ౧౦
తేనేదం నిర్మితం సర్వం మాయయా కాంచనం వనం
పురా దానవముఖ్యానాం విశ్వకర్మా బభూవహ. ౧౧
యేనేదం నిర్మితం దివ్యం కాంచనం భవనోత్తమం,
... ... ... ...
తమప్సరసి హేమాయాం సక్తం దానవపుంగవం. ౧౧
విక్రమ్యైవాశనిం గృహ్య జఘానేశః పురందరః,
ఇదం చ బ్రహ్మణా దత్తం హేమాయై వనముత్తమం. ౧౫
... ... ... ... ...
దుహితా మేరుసావర్ణేరహం తస్యాస్స్వయంప్రభా. ౧౬
ఇదం రక్షామి భవనం హేమాయా వానరోత్తమ,

మమ ప్రియసఖీ హేమా నృత్తగీతవిశారదా. ౧౭
తయా దత్తవరా చాస్మి రక్షామి భవనోత్తమం,"

అని మూలము. ఆగుహాలోనుండు కాంచనగృహాదికములం బాలించుచు స్వయంప్రభ యనుతాపసియుండెను. ఆమె మేరు సావర్ణికూఁతురు. మయుఁడు దానవశిల్పిమాయచే వానిని గల్పించెను. హేమయను నచ్చరమిన్నం దవిలి యతఁడు భోగైక పరాయణుఁ డయ్యెను. ఆవిధమెఱింగి యింద్రుఁ డాతని వజ్రమునఁ గొట్టి పాఱఁద్రోలెను. హేమ కావనమును బ్రహ్మ యిచ్చెను. స్వయంప్రభ హేమవలన వరము లొంది దానిని గాపాడుచు ధర్మపరాయణురాలై యుండెనని కథాసారము. మయుఁడు మాయచే నిర్మించె ననఁగా మంత్రబలమున నిర్మించెనని యర్థము. చిరకాలతపశ్శక్తి యీపాటివానిని నిర్మింపఁ జాలెననుట యొక యబ్బురము కాదు. ఆతఁడు భోగపరాయణుఁడై యింద్రలోకమున నున్న హేమయను నచ్చరం గూడి యుండఁగా నింద్రుఁ డతనిఁ జావఁగొట్టితఱిమెను. సత్కర్మానుష్ఠానము ఫలములం గోరిచేయఁగా నెట్టి దుష్టఫలము గల్గినదో చూడుఁడు.

"కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన,
మా కర్మ ఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి, ౪౭
యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ,
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే. ౪౮
దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ,
బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః. ౪౯
బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే,

తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలం". ౫౦
గీత. ౨-అధ్యా

అను నీగీతాశాస్త్రవచనములు ఫలాభిసంధిరహిత సత్కర్మ ప్రాశస్త్యమును దెలుపుచున్నవి. ఐహికాముష్మికఫలములలో నెనిని గోరక తపస్సొనరించినఁ బ్రాక్తనకర్మానుసారముగా నయ్యవి లభించును. వలదన్న మానవు. ఇట్టులుండ సంకల్ప మేటికో తెలియకున్నది. హేమ యచ్చరమిన్న. మయునికడ నుండెను. మయుఁడు వజ్రహతిఁ దోలఁగ నావస్తువులను బ్రహ్మాయనుమతి నొంది తనచెలియగు స్వయంప్రభ కిచ్చి కాపాడుచు నిందుండుమని వరమిచ్చి పోయెనని కదా యిందు గలదు. అచ్చరకు వరములిచ్చునధికారము గలదా? అధికార మనఁగా యోగ్యత యని గ్రహింపందగు. అచ్చరలు దేవకార్యార్థము నిర్మింపఁబడిన కాంతామణులు. తపోబలమున దేవతలకుం గూడ నుపద్రవమును గల్గింతురన్న వారికడకుం బోయి యైహికసుఖానుభవపరతంత్రులను జేసి మరల దేవలోకమునకు వచ్చుచుండువారు. ఒక్కనికడ నుండుతటి భోగకాంతలకు వేఱొక్కనిపొందు పనికిరాదు. దానికే వ్యభిచార మని పేరు. అట్టిదోషము లేకున్న నామె నియతవ్రతురాలనంబడును. అట్టిలేమ భగవదారాధనమునఁ బుణ్యమార్జింపఁ గలదు. అయ్యది వరప్రదానమునం దధికారమును గల్గించును ఎవరుగాని తనకృత్యమున నియమాతిక్రమణము చేయకయుండిన నట్టివారు యోగ్యులే యగుదురు. వారివాక్కులు ఫలించును. ఎంత తపస్సుచేసినను నియమాతిక్రమణదోషమునకు లక్ష్యమైనచో వారివాక్కులు ఫలింపవు. అనువిషయ మీ భాగమునుండి తేలును. ఏజాతివారైనను భగవంతు నారా

ధించినయెడల వారికి శాపానుగ్రహశక్తి కలుగుననియు, నా యారాధనము ఫలాభిసంధిరహితముగనే యుండవలయు ననియు మన కీభాగము వెల్లడించుచున్నది. స్వయంప్రభ భగవత్కృపాపాత్రురా లగుటకుఁ గారణము "సర్వభూత హితే రతా. ధర్మచారిణీ" అను మూలమునఁగల సద్గుణములే కాని వంశముమాత్రము కాదని మన మెఱుంగుట మేలు.

"కథం చేదం వనం దుర్గం యుష్మాభిరుపలక్షితం,
ఇమాన్యభ్యవహార్యాణి మూలాని చ ఫలాని చ. ౧౯
భుక్త్వా పీత్వా చ పానీయం సర్వం మే వక్తుమర్హథ."

అని మూలము. వారాఁకలిదప్పుల బాధితులమని యెఱిఁగింపఁగా స్వయంప్రభ యాతిథేయ మొసంగెను. ఆఁకలి దప్పులం బాపుకొని పిదప మీవృత్తాంత మెఱిఁగింపుఁడనియె. అతిథి పూజ యెంత శ్లాఘ్యమో యోజింపుఁడు! అతిథి భుజింపఁగా శేషించిన పదార్థముల దంపతులు భుజింపఁదగునని "దంపత్యో శ్శేషభోజన"మ్మను మనువాక్యము మనకుఁ దెలుపుచున్నది.

## స్వయంప్రభకుఁ దమవృత్తాంతమును హనుమ తెల్పుట.

* స్వయంప్రభ దయారసభరితదృష్టుల వారలం గాంచి యీఫలభక్షణమున మీయాఁకలి పోయెనేని మీ వార్త నేను వినఁదగునేని పల్కుఁడు. అనఁగా విని మారుతి కపటము లేక యిట్లు చెప్పెను. సర్వలోకశరణ్యుఁడు దాశరథి శ్రీరాముఁడు భార్య సోదరుఁడు లక్ష్మణుఁడు కూడ రాఁగా

* ఇది యేఁబదిరెండవసర్గమునఁ గలదు.

రక్షింపఁదగుదువు. సీతాన్వేషణము ప్రధానము. ఇందుండుటం జేసి యదియుఁ జేయనివారమైతిమి. అని హనుమ విన్నవింపఁగా నాస్వయంప్రభ వారితో నిట్లు పలికెను. ఈబిలముం బ్రవేశించినవారు ప్రాణములతో వెడలిపోవుట దుష్కరము. ఐన నేననేకనియమములకు లోనై యాచరించిన తపోమహిమమువలన మిమ్మందఱ నిరపాయముగా వెడలించెదను. వానరులారా! కన్నులు మూసికొనుఁడు. అప్పని గావింపనిచో వెలువడఁజాలరు. అనఁగా గట్టిగాఁ గన్నులు మూసికొనిరి. ఆమె తన యోగబలమున క్షణమాత్రమున నామహాగుహనుండి వెడలించెను. వారి నూఱడించి యిది వింధ్యము. ఇది ప్రస్రవణము. ఇది మహాసాగరము. మీకెల్లరకు శుభంబగుఁగాక. నేను గుహకుంబోయెదనని బిలప్రవేశ మొనర్చెను.

అంత నావానరులు మహాతరంగములఁ బెంపారు సాగరముం గాంచిరి. వారాపర్వత పశ్చిమభాగమునఁ గూరుచుండి నెలగడువు దాఁటెఁగదా యని యాలోచింప సాగిరి. వారు వసంతకాలమున ఫలించు సహకారాదిఫలములం గాంచి కాలము చాల గడచెనని భయంపడిరి. వసంతర్తువు రానున్నదనియు నిది శిశిరర్తువనియు నొండొరులతో నాలోచించి కాలము గడచుట సీత గానరాకపోవుట యను కారణములం బట్టి జంకిరి. భయమున నేలఁబడిరి. అంగదుఁడు ప్రాజ్ఞుండు గావున వారినెల్లం జేర్కొని రాజాజ్ఞం బని సాగింప వచ్చితిని. బిలమున వెదకునపుడే కాలము గడచినది. మీరెఱుంగరా యేమి? మనమాశ్వయుజము మొదలుకొని యాయాయి కార్యములయందు నియుక్తులమై యున్నారము. నెలగడువు గడచెఁగదా. ఇఁకఁ జేయఁదగినదేది? సర్వవిషయముల నెఱింగినవారు.

రక్షింపఁదగుదువు. సీతాన్వేషణము ప్రధానము. ఇందుండుటం జేసి యదియుఁ జేయనివారమైతిమి. అని హనుమ విన్నవింపఁగా నాస్వయంప్రభ వారితో నిట్లు పలికెను. ఈబిలముం బ్రవేశించినవారు ప్రాణములతో వెడలిపోవుట దుష్కరము. ఐన నేననేకనియమములకు లోనై యాచరించిన తపోమహిమమువలన మిమ్మందఱ నిరపాయముగా వెడలించెదను. వానరులారా! కన్నులు మూసికొనుఁడు. అప్పని గావింపనిచో వెలువడఁజాలరు. అనఁగా గట్టిగాఁ గన్నులు మూసికొనిరి. ఆమె తన యోగబలమున క్షణమాత్రమున నామహాగుహనుండి వెడలించెను. వారి నూఱడించి యిది వింధ్యము. ఇది ప్రస్రవణము. ఇది మహాసాగరము. మీకెల్లరకు శుభంబగుఁగాక. నేను గుహకుంబోయెదనని బిలప్రవేశ మొనర్చెను.

అంత నావానరులు మహాతరంగములఁ బెంపారు సాగరముం గాంచిరి. వారాపర్వత పశ్చిమభాగమునఁ గూరుచుండి నెలగడువు దాఁటెఁగదా యని యాలోచింప సాగిరి. వారు వసంతకాలమున ఫలించు సహకారాదిఫలములం గాంచి కాలము చాల గడచెనని భయంపడిరి. వసంతర్తువు రానున్నదనియు నిది శిశిరర్తువనియు నొండొరులతో నాలోచించి కాలము గడచుట సీత గానరాకపోవుట యను కారణములం బట్టి జంకిరి. భయమున నేలఁబడిరి. అంగదుఁడు ప్రాజ్ఞుండు గావున వారినెల్లం బేర్కొని రాజాజ్ఞం బని సాగింప వచ్చితిని. బిలమున వెదకునపుడే కాలము గడచినది. మీరెఱుంగరా యేమి? మనమాశ్వయుజము మొదలుకొని యాయాయికార్యములయందు నియుక్తులమై యున్నారము. నెలగడువు గడచెఁగదా. ఇంకఁ జేయఁదగినదేది? సర్వవిషయముల నెఱింగినవారు.

రాజాజ్ఞచే నన్నుం బురస్కరించుకొని వచ్చితిరి. వచ్చినపని సాధింపక నియమ మతిక్రమించితిమి. ఇంకఁజావవలసినవారమే. సందియమిందులకు లేదు. సుగ్రీవు నాజ్ఞచేయక సుఖించువాఁ డెవ్వఁడు? మనకుఁ బ్రాయోపవేశమే యుక్తమగునది. క్రూరుఁ డగు సుగ్రీవుఁ డాతనియానతి మీఱిన మనలనందఱను దండింపక మానఁడు. సీతవార్త నెఱుంగకపోయిన మనల క్షమింపఁడు. చంపును. కాన నిటఁ బ్రాయోపవేశమే మనకు న్యాయ్యము. అందు ఘోరమరణము నొందుటకన్న నిటఁ బ్రాయోపవేశమున మరణమొందుట సముచితము. యువరాజు నగుట వధింపఁడని యూహింపకుఁడు. నాపై నతనికి విరోధము కలదు. కాన ముందే నన్నుఁ జంపును. నామిత్రులు నా చావు నకు వగతురు. కాన నీపవిత్రసాగరతీరమునఁ బ్రాణములు వదలెదను. అనఁగా నందఱు దుఃఖించి యాతనిమాటలు నిజములే యని నమ్మిరి. సీత కుశలమెఱిఁగిపోవుటయే యుక్తము. లేనిచో నిందే మృతినొందుదము. అని భయపడి వారు పలుకు చుండఁగా నాలించి తారుఁడు దుఃఖించుచు మనము మరల నీబిలముం బ్రవేశించి యందే యుందము. ఇతరు లిందుఁ జొరఁజాలరు. ఫలాదులు గలవు. ఇందున్న మన కింద్రాదుల భయముంగూడఁ గలుగదు. ఆమాటలకు సమ్మతించి యెల్లరు నేది యుక్తమో యట్టు లాలోచించి వచింపుఁడని పలికిరి.

మతిమంతులారా! ఒక్క విషయమిందుండి ముఖ్య ముగా విమర్శింపఁదగినది కలదు.

"తపసస్తు ప్రభావేన నియమోపార్జితేన చ,
సర్వానేవ బిలాదస్మాదుద్ధరిష్యామి వానరాన్. ౭

నిమీలయత చక్షూంషి సర్వే వానరపుంగవాః,
న హి నిష్క్రమితుం శక్యమనిమీలితలోచనైః. ౭

... ... ... ... ...

తతస్తాన్వానరాన్ సర్వాన్ తాపసీ ధర్మచారిణీ,
నిష్క్రతాన్విషమాత్తస్మాత్సమాశ్వాస్యేదమబ్రవీత్." ౧౧

అని మూలము. స్వయంప్రభ తనయోగశక్తిని వానరుల నందుండి వెడలించెను. వారు కన్నులు మూసికొనక యున్న వెడలఁజాలరన్న యామె పలుకులనమ్మి కన్నులు మూసికొనిరి. ఆమె క్షణమాత్రమున వారి వెడలించెను. ఇది కాయతోలన మను నొక సిద్ధి. ఆసిద్ధి గలవారు సంకల్పించినంతన వారి తనువులు తూలమువలెఁ దేలిక యగును. సంకల్పమాత్రమున యోగశక్తి మారుతము వారిని గొనిపోయి యాచోట వద లును. దీనికి మనశ్శుద్ధి ప్రధానము. దేహమున నొకభాగమున దృష్టినిలిచి యుండవలయు. అది కొంతకాలమునకు సిద్ధించును. ఆసిద్ధి లభించిన నెంతటివస్తువైనఁ దూలమువలెఁ దేలిక యగు ను. వాయువులో నెగిరిపోవునంత తేలిక యగును. ఇది యణి మాదిసిద్ధులలోనిది కాదు. మనస్సంయమనసిద్ధి యని దీనికిఁ బేరు. మహర్షు లిద్దాని సంపాదించి యుందురు. పరోపకార మునకిది యుపయోగించును. యోగమహిమ మవాఙ్మానస గోచరము. అది యిక్కాలమున నశించినట్లే యనవచ్చును. మాటలవేదాంతమే యిన్ని చెడుగులకు మూలమైన దన వలయు. ఉపాసన నశించుట యనఁగా యోగమునకు ణ దశ యని యెఱుంగవలయును. దీని మూలముననే యోగా సక్తి కుదురును. కనుక యోగమహిమముల నెఱుంగనివారి

కిట్టివన్నియు విచిత్రములుగనే యుండును. కాలమహిమ మిట్లున్నదని విచారింపవలయును.

## హనుమ సుగ్రీవునికడకుఁ బోవుదమనుట.

* అని తారుఁడు పలుకఁగా హనుమంతుఁ డీయంగదుఁడు వానరరాజ్యమెల్ల హరించునని తలంచి, యంగదుఁడు గ్రహణ ధారణస్మరణ ప్రతిపాదనోహాపోహార్థ విజ్ఞానతత్త్వజ్ఞానములను బుద్ధిగుణము లన్నియుఁ గలవాఁడని యెఱింగి, దేశకాలజ్ఞత, దార్ఢ్యము, సర్వక్లేశసహిష్ణుత, సర్వవిజ్ఞానిత, దాక్ష్యము, ఊర్జము, సంవృతమంత్రత, అవిసంవాదిత, శౌర్యము, శక్తిజ్ఞత్వము, కృతజ్ఞత, శరణాగతవాత్సల్యము, అమర్షత్వము, అచాపలము నను పదునాలుగు గుణములచే నొప్పువాఁడనియు, బాహుబలము, మనోబలము, ఉపాయబలము, బంధుబలము నను నాలుగుబలముల నలరువాఁ డనియు నూహించెను. చంద్రుఁడు తొలిపక్షమున వృద్ధి యగునట్లు పరాక్రమమున వృద్ధినొందువాఁడనియు, బృహస్పతిని బుద్ధియందు మించువాఁడనియుఁ,బరాక్రమమున వాలికి నీడనియుఁ దెలిసికొని, సుగ్రీవునకుఁ బ్రతికూలుఁడు గాకయుండునట్లు నీతులు పలుకఁబూనెను. సామదానాద్యుపాయముల మూఁడవది యగు భేదోపాయమున నంగదుని మతమున కనుకూలింపకయుండ వానరులకుఁ దెలిపెను. వారెల్లఁ దనమాట నాదరించిన ట్లెఱింగి కోపరూపమగు దండోపాయమును నీ భీతికరములగు మాటలు కొన్ని పలికి నంగదునకు భీతినిగల్గించెను.

* ఇది యేఁబదినాల్గవసర్గమునఁ గలదు.

యువరాజా! తండ్రినిమించు శూరత్వము గలవాఁడవు. రాజ్య భారసమర్థుఁడవు. చంచలాత్ములగు వానరులు వీరెల్ల దారపుత్త్రాదుల వదలి నీయాజ్ఞకు లోఁబడియుండరు. నీమ్రోలఁ జెప్పెదను. ఈజాంబవంతుఁడు నలుఁడు సుహోత్రుఁడు నిన్నను వర్తించి యుండనట్లు నేను నుండనని యెఱుంగుము. మమ్మెల్ల నెల్లని నీకు లోఁబడి యుండఁజేసికొన నశక్యము కద. బలవంతుఁడు దుర్బలునితో విరోధము గొనియుండవల యునని నీతివేత్తలు చెప్పుదురుగాని బలహీనుఁడు బలవంతునితో విరోధించుటకు సమ్మతింపఁడు. స్వబలము లేకున్నను నీకు రక్షకముగా నేగుహయుండు ననుకొనుచున్నావో యట్టి యీబుఱుబిలమును ధ్వంసము చేయుట సౌమిత్రి బాణములకుఁ గొప్పది కాదు. మయునికొఱకుగా నింద్రుఁడు వజ్రపాతమున దీనిని భేదించినాఁడు. ద్వారశేషముగ నుంచినాఁడు. లక్ష్మణుఁడు తేలికగా దీని భేదింపఁజాలును. రాజుతో విరోధించి యిందుండఁ బూనినంతనే వీరు నిన్ను విడిచి పోవఁగలరు. ఆవల నీవు సర్వహీనుండ వగుదువు. రాజాజ్ఞమీఱిన నిన్ను లక్ష్మణునారాచములు వధించు. మమ్ముఁ గూడి వచ్చి వినీతుఁడవైన సుగ్రీవుఁడు క్రమముగా నీకు రాజ్యము నిచ్చును. సుగ్రీవుఁడు ధర్మాత్ముఁడు గాన నిన్ను వధింపనొల్లఁడు. నీతల్లి కతఁడు ప్రియుఁడు కాన నీప్రియమునే కోరుచుండును. ఆతనిప్రాణములు నీతల్లిస్వాధీనములే. నీ వామెకుమారుఁడవే కాన నతనికిం గుమారుఁడవే. కాన నతనికడకుం బో వచ్చుననియె.

## అంగదాదులు ప్రాయోపవిష్టు లగుట.

* హనుమ యిట్టి న్యాయ్యములుగాఁ బలికిన పలుకుల నాలకించి యంగదుఁడు స్థిరబుద్ధిత్వాదులు సుగ్రీవునియం దెంత మాత్రము కలుగఁజాలవు. జ్యేష్ఠభ్రాత బ్రదికి యుండఁగనే యతని ప్రియపత్నిని బట్టమహిషిని ధర్మమునకుఁ దనతల్లివంటి దానిని లోకు లేవగించునట్లు పరిగ్రహించినాఁడు కదా. అన్న తన్ను బిలద్వారమునఁ గావలిగా నునుప దానిని బాషాణమున మూసివైచెఁ గదా. ఇట్లు నిందితుఁడు ద్రోహియు నగు సుగ్రీవునకు ధర్మమెట్లు తెలియును. మహోపకారియగు రామునే మఱచినాఁడు కదా. అట్టి యతఁడు కృతజ్ఞుఁ డెట్లగును? సౌమిత్రికి భయంపడి సేనల రప్పించెనుగాని యధర్మమునకు భయంపడి కాదు. అతనియందు ధర్మమెక్కడిది? అట్టి వానిని బ్రదుకఁదలంచినవాఁ డెవఁడు నమ్మును? అతఁడు తన కుమారుఁ డెట్టివాఁడైన రాజ్యమునఁ బ్రతిష్ఠించుం గాని శత్రుపుత్త్రుఁడ నగు నన్నెంతమాత్రము బ్రదుకనీయఁడు. మాతండ్రి మూలమున నతని కపరాధము చేసినవాఁడను. మఱియు నతనితో విరోధించి యీబలమున నుండవలయు ననునది వెల్లడి యయ్యెను. ప్రభుమంత్రాది శక్తివిహీనుఁడను. అట్టి నే ననాథునికరణిఁ గిష్కింధకుం బోవుదునేని జీవింపఁజాలను. నే నపరాధిని గాన నట్లు గూఢమార్గమున నెట్లేని అతఁడు చంపించును. ఉరివేయఁబడి చచ్చుటకంటె ప్రాయోపవేశమరణము త్తమము. కాన నాకనుమతి నిచ్చి మీ రెల్ల గృహములకుం బొండు. శపథవాక్యము నాలకింపుడు. కిష్కింధకు రాను. ఇందే

* ఇది యేఁబదియైదవసర్గమునఁ గలదు.

ప్రాయోపవేశమునఁ బ్రాణములు వదలెదను. ఇందుఁ జచ్చుట యే నాకు మంచిది. శ్రీరామసౌమిత్రులకు నాకు మాఱుగా మ్రొక్కి క్షేమమడుగుఁడు. మాపినతండ్రిని గాంచియు నాకు మాఱుగా మ్రొక్కి క్షేమమునే యడుగుఁడు. పినతల్లి రుమను గుశల మడుగవలయు. నాతల్లిని దగుమాటల నాశ్వాసింపుఁడు. మాతల్లిని స్మరించిన నాకు జాలి గలుగుచున్నది. నాయం దెక్కువ ప్రీతిగలది. కాన నావార్త విని యసువుల వదలఁగలదు. నిజము. అని పలికెను.

అని యంగదుఁడు పెద్దలకు నమస్కరించి మనస్సు దుఃఖపరవశమగుడు, విలపించుచు భూమిపయి దర్భలు పఱచు కొని శయనించెను. ఆతనింగని యెల్లవారును దుఃఖించి రాజును నిందించుచు వాలిని నుతించుచు నంగదునిం జుట్టు కొని ప్రాయోపవేశముచేయ నిశ్చయించుకొనిరి. అంత జలము లను స్పృశించి సముద్రోత్తరతీరమున దక్షిణాగ్రములుగా దర్భలు పఱచుకొని తూర్పుమొగముగాఁ బరుండిరి. రాముని యరణ్యాగమనము, దశరథుని మృతియు, జనస్థానమునఁగల ఖరదూషణాదులవధము, సీతాపహరణము, జటాయువధము, యుద్ధమున వాలిని రాముఁడు చంపుట, సుగ్రీవునిపై రాముఁ డాగ్రహించుట, సీతను వెదుక వానరులం బంపుట, తమకు ప్రాయోపవేశముచేయుట లోనుగాఁగల కథలను వారు చెప్పుకొనిరి. వారి వాదోపవాదఘోషము గొప్పగాఁ బర్వత మును బ్రతిధ్వనింపఁ జేసెను.

మహనీయులారా ! ప్రాయోపవేశమును గుఱించి విచారింతము.

"ఆత్మానం హంతుమారబ్ధం బ్రాహ్మణం క్షత్రియం విశం,
గాంవా తురంగమన్యం వా హత్వా దోషైర్న లిప్యతే."

అనుసూక్తి ననుసరించి యన్నింటికంటె మహాపాపమని యేర్ప డును. ప్రాయోపవేశ మట్టిదియే కదా. అని కొందఱందురు.

"బంధనాద్వావసాదాన్మే శ్రేయః ప్రాయోపవేశనమ్,
అనుజానీత మాం సర్వే గృహం గచ్ఛంతు వానరాః." ౧౧

అని మూలము. ప్రాయోపవేశమనఁగా మరణార్థమనశనమ్. అని వ్యుత్పత్తి. మరణముకొఱకుపవసించుట. భగవంతుని ధ్యానముచేయుచు నిట్టికష్టములను గలుగనీయక పయిజన్మ మునందైన నన్ను సుఖవంతునిగాఁజేసి కాపాడుమా యను నదియే ప్రాయోపవేశము.

"ప్రాయో నామ తపః ప్రోక్తం చిత్తం నిశ్చయ ఉచ్యతే,
తపోనిశ్చయసంయుక్తం ప్రాయశ్చిత్తమితి స్మృతమ్."

మను. ౧౧-అధ్యా.

అను స్మృతివచనము కూడఁ గలదు. కావునఁ బ్రాయోపవేశము పాపప్రదము కాదని యెఱుంగవలయు. జ్ఞానవంతులు పాంచ భౌతికశరీరమును వదలుదురు. అది యాత్మహత్య కానేరదని మన మెఱుంగవలయు.

## సంపాతివచ్చుట: వానరులు దుఃఖించుట.

* వానరులు ప్రాయోపవేశమున శయనించినచోటికి స పాతి యనుగృధ్రరాజు రా సాగెను. ఆతఁడు జటాయువునకు జ్యేష్ఠుఁడు. బలపౌరుషవంతుల మేటి. చిరంజీవి. అట్టి సంపా

* ఇది యేఁబదియాఱవసర్గమునఁ గలదు.

వింధ్యగుహనుండి వెడలి ప్రాయోపవిష్టులగు వానరులం గని సంతుష్టుఁడై దైవము ప్రాణికోటికి యోగక్షేమములను దప్పక కూర్చుచుండును. చాలకాలమునకుగా నిత్తఱి నీయాహార మును నాకుఁ గల్పించినది. నేను దీనికొఱకుగాఁ బోవక యున్నను నాకడ కిదియే వచ్చినది. ఉత్తములగు వీరినెల్ల నొక్కనినొక్కనిగాఁ బట్టి చంపితిందును. అని వారలం గాంచి పలికెను. ఆమాట లాలకించి యంగదుఁడు భయంపడి హను మంతా! యముఁడే యీగృధ్రాకృతి వచ్చెను. రామకార్యము చేయలేకపోయితిమి. రాజాజ్ఞయుఁజేసి ధన్యులము గామై తిమి. తటాలున నీయాపద మనకుఁ గల్గినదే. జటాయువు సీతాదేవికి సాయపడంగోరి జనస్థానమునఁ గావించినకార్యము మీరు విన్నారు కదా. జటాయువువలెఁ దిర్యగ్జంతువులు కూడ మనవలెనే రామకార్యార్థము ప్రాణములను వదలుచున్నవి. ధర్మజ్ఞుఁడగు నాజటాయువు రామునికై దేహమును వదలెను గాన నతఁడు రామునకుఁ బ్రియముచేసినవాఁ డయ్యెను. మనమో తిరిగి తిరిగి యలసి యిందుఁ జొచ్చితిమి. సీతయేమో కనఁబడలేదు. రామార్థము రావణునితోఁ బోరి జటాయువు సుగ్రీవుని భయముదప్పించుకొని పరమగతిం బొందెను. జటా యువు మరణము, దశరథమృతి, రావణుఁడు సీతఁ గొనిపోవుట మనకుఁ బ్రాణసంశయమును గల్గించినవి. రామునకుఁ గల్గిన యవస్థలు దశరథుఁడు కైకకు వరమిచ్చుటంజేసి కలిగినవి. మహామతిమంతుఁడగు నాసంపాతి యాదుఃఖవాక్యముల నాల కించి వారియునికింగాంచి మనస్సు కలఁతనొంద దీనుఁడై యిట్లు పలికెను.

## సంపాతి వానరులతో సంభాషించుట.

* అంత నాసంపాతి ముఖకాంతి తఱుగ నంగదుని మాటల నాలకించి గట్టిగా నాకుఁ బ్రాణములకంటెఁ బ్రియుఁడగు సోదరుఁడు జటాయువు హతుఁడయ్యెనని మాహృదయము బ్రద్దలగు రీతి గట్టిగా నెవ్వఁడో పలుకుచున్నాఁడు. ఆతఁ డెవ్వఁడు? నా తమ్మునకు రావణునకు సంగరమేల కలిగెను? చాలకాలమునకు నా తమ్ముని పేరు వినఁగల్గితిని. మీారు నన్నీ శిఖరమునుండి మీారుండుచోటికి దింపఁగోరెద. నా తమ్ముని పేరు చాలకాలమునకు విన్నందులకు సంతోషించితిని. వానరవర్యులారా! నా తమ్ముఁడెట్లు చంపఁబడెనో వినఁగోరెద. శ్రీరాముని తండ్రి నాతమ్మున కెట్లు మిత్త్రుఁడయ్యెను? సూర్యకిరణములచే నా పక్షములు దగ్ధములైనవి. కాన మీాతావునకు వచ్చుశక్తి నాకు లేదు. మీాకడకు రాఁగోరుచున్నాను. అని దుఃఖవేగమున హీనస్వరమున నూరకుండెను. వానరులు ముందే చంపునని భయంపడినవారు గాన నామాటల నమ్మరైరి. వారంత నాగ్రద్దనుగని ఇది మనలనందఱఁ దినివేయును. అని దానిని భయంకరమైనదానినిగా భావించిరి. మఱియు మృతిగోరి కదా యిట్లు శయనించితిమి. ఇది తినిన వేగమ యిష్టసిద్ధి కలుగును అనియుఁ దలంచిరి.

అంత నంగదుఁ డద్దానిని డింపి దానితో నోగృధ్రమా! మాతాత ఋక్షరజుఁడను వానరరాజుండెను. అతనికిఁ బరాక్రమశాలురగు వాలి సుగ్రీవులు కుమారులు గల్గిరి. నాతండ్రి వాలి లోకప్రసిద్ధుఁడై యుండెను. మహారాజగు దశరథుని

* ఇది యేఁబదియేడవసర్గమునఁ గలదు.

కుమారుఁడు రాముఁడు తండ్రియానతిచే లక్ష్మణుఁడను తమ్ముఁడు భార్య సీతయు వెంటరాఁగా దండకారణ్యమునకు వచ్చెను. జనస్థానమున వారుండఁగా రావణుఁ డాతనిభార్యను హరించెను. ఆకాశమున నామెం గొనిపోవుచుండ దశరథుని చెలికాఁడగు జటాయువు మాత్రము చూచి మార్గాని వానిని విరథుని గావించి సీతను నిలిపి తుదకు రావణుని చేఁ జచ్చెను. రాముఁ డాతని సంస్కరించి యుత్తమగతిని గల్పించెను. రాముఁడు నాపిన్నతండ్రితో స్నేహము చేసి నాతండ్రిని వాలిని వధించెను. సుగ్రీవుని బట్టాభిషిక్తుని జేసెను. నాతండ్రికి సుగ్రీవునకు వైరముండెను. అంత నాపినతండ్రి సీతను వెదుక వానరులం బంపెను. మే మీ దిక్కునకు వచ్చి వెదకి కానక ధర్మచారిణియగు స్వయంప్రభయుండు గుహను బ్రవేశించితిమి. అందు వెదకుచుండఁగా మారాజొసంగిన గడువు గతించెను. మే మాతని కడకుం బోవఁజాలక భయమునఁ బ్రాయోపవిష్టుల మైతిమి. ఊరక గడువు దాటించి పోయితిమేని మమ్ము వారు బ్రదుకనీయరు కదా యనిరి.

మహామతులారా! ఈరెండు భాగములఁగల విశేషముల నెఱుంగుదము.

"విధిః కిల పరం లోకే విధానేనానువర్తతే,
యథాయం విహితో భక్ష్యశ్చిరాన్మహ్యముపాగతః." ४

అని మూలము. సంపాతివాక్యమిది. దైవమనఁగా నిటఁ గర్మమను నర్థము గ్రహించుట మంచిది. "కర్మ బ్రహ్మోద్భవం విద్ధి." గీతయందుఁ గలదు. శుభాశుభఫలముల ననుగ్రహించునది

కర్మము. భగవంతుఁడే యిచ్చునను వారు కొందఱు గలరు. ఆయర్థము పొసఁగదు.

"త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః,
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః."

అని భగవంతుఁడే తెల్పెను గదా. పరమేశ్వరుఁడు కర్మముల మూలమున శుభాశుభఫలముల నిచ్చును. కాని తనకుఁ దోఁచినట్టు లీయఁడు. ఫలాభిసంధిరహిత కర్మానుష్ఠానమే కదా భగవత్సమ్మతము. అట్టితటికి నతఁ డిచ్చునది ముక్తి యొకఁడు మాత్రమే కదా. కావున నిచ్చోఁ గర్మమనునర్థము సుసంగత మన వచ్చును. యోగక్షేమములు కర్మాధీనములు. శుభకర్మముల మూలముననే యవి కల్గును. మన ప్రయత్నము లేకయు నాఫలములు గల్గును. సంపాతివాక్కుల మూలమున మహాముని మన కీనీతిని దెల్పెను. తన యంతన ప్రాక్తనకర్మ ఫలములు లభించును.వానికై పాటుపడ నక్కఱలేదు. పండిత లక్షణ మేమనఁగా,

"యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః,
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః."

అను గీతాశాస్త్రము ననుసరించి ఫలాభిసంధిరహితకర్మముల నాచరించుటయే ఫలములు కోరకయున్నను లభించును. వలదన్నను మానవు. ఇంక మనము కోరనేల? సంకల్పములు వృద్ధి ప్రతిబంధకములు. కావుననే వానిమానుట పండిత లక్షణమని భగవంతుఁడు తెల్పెను. ప్రతివిషయము కర్మసిద్ధాంతమునకు లోఁబడినదే యగునని మనము నమ్మి సత్కర్మాను

స్థానమునకుఁ గడంగవలయు ననునీతి యీభాగము బోధించు చున్నది.

"సూర్యాంశుదగ్ధపక్షత్వాన్న శక్నోమ్యుపసర్పితుం,
ఇచ్ఛేయం పర్వతాదస్మా దవతర్తు మరిందమాః."

౭౫ స. ౧౬.

అని మూలము. సంపాతిపక్షములు సూర్యకిరణముల మూల మునఁ గాలెను. కానఁ దాను దిగఁజాలననియుఁ దన్ను దింప వలయుననియు వానరులఁ బ్రార్థించెను. "అరిందమాః" అను ప్రయోగము రసపుష్టిని గల్పించుచున్నది. వారిని భక్షింపఁ గోరిన తన్ను దింపుమనుటయు దానికి వా రంగీకరించిరనుటయు విరుద్ధములుగా నుండును. మహాకవి యిచ్చోట నరిందము లారా! యను నర్థము గలపదమును బ్రయోగించెను. మీరు శత్రుధ్వంసకులు. కాన మిమ్ముఁ జెనకుదునను భయము మీకు నుండరాదని సంపాతిభావము. ఆదిమమహాకవి కదా వాల్మీకి!

"శ్రద్దధుర్నైవ తద్వాక్యం కర్మణా తస్య శంకితాః. ౧
తే ప్రాయముపవిష్టాస్తు దృష్ట్వా గృధ్రం ప్లవంగమాః,
చక్రుర్బుద్ధిం తదా రౌద్రాం సర్వాన్నో భక్షయిష్యతి. ౨
సర్వథా ప్రాయమాసీనాన్ యది నో భక్షయిష్యతి,
కృతకృత్యా భవిష్యామః క్షిప్రం సిద్ధిమితో గతాః." ౩

అని మూలము. ఇందుఁ గర్మమే ముఖ్యమను సిద్ధాంతము గలదు. తొలుత వానరు లాసంపాతి తన్ను దింపుఁడన్న మాటను విశ్వసింపక పోయిరి. అది తమ్ముఁ జంపుననియే తలంచిరి. రాఁగల సత్ఫలములు వారికి మరల మంచితలంపును గల్గించెను. మనము పూనినది మరణార్థవ్రతమే. ఇది మనల

భక్షించునేని వ్రతము శీఘ్రమే ఫలించిన ట్లగును. అనునదియే యాతలంపు. ఆతలంపు సర్వసమ్మతముగాఁ దోఁచెను. భయం పడిన యంగదుఁడే దానిని దింపి మాటలాడఁగల్గెను. దీనిం బట్టిచూడఁగా నంతఃకరణప్రవృత్తి రాఁగలఫలము ననుస రించి యుండుననియు శుభాశుభఫలములనుబట్టి నిర్మలము గనో మలినముగనో మనస్సుపుడుండుననియు మన మెఱుంగ వలయును.

"సతాం హి సందేహపదేషు వస్తుషు ప్రమాణమంతఃకరణప్రవృత్తయః."

అను కాళిదాసోక్తి యెంతయు శ్లాఘ్యము. దీనింబట్టి పురు షుఁడు బొమ్మవలె నాడుచుండువాఁడనియుఁ గర్మమాతనిని దన వలచిన ట్లాడించుచుండుననియు సారాంశము తేలెడు ననియు నెఱుంగనగు.

## సంపాతి సీతయుండుస్థలము వానరులకుఁ దెల్పుట.

* ఆసంపాతి వారల దుఃఖభాషణముల నాలకించి తానును వగచి వారితో మీరు రావణునిచే జటాయువు హతుఁడయ్యెనని చెప్పితిరి గదా ఆతఁడు నా తమ్ముఁడు. ఆ దుర్వార్త వినినను వృద్ధుడనై పక్షములు కాలియున్నందున నోర్చియుండవలసివచ్చినది. రావణుని జంపి పగతీర్చుకొను టకు నాకిపుడు శక్తి లేకున్నది. ఏమిచేయుదును? వృత్రాసుర వధకాలమున మేమిద్దఱమును పరస్పరవేగాతిశయమును బరీ క్షింపఁగోరి సూర్యమండలము చెంతకరిగితిమి. మండలాకార ముగఁ దిరుగుచుఁ జాలదూర మరిగితిమి. మధ్యాహ్నకాల

* ఇది యేఁబదియెనిమిదవసర్గమునఁ గలదు.

మగుట నాతమ్ముఁ డాసూర్యకిరణముల వేఁడిమి నోర్వఁజాలక పోలెను. ఆతని పాటుచూచి స్నేహాభరమున సూర్యరశ్మి బాధ యడంగునట్లు పక్షములచే నాతమ్మునిం గప్పితిని. దాన నా పక్షములు గాలెను. ఈవింధ్యపర్వతమునఁ బడితిని. ఇందే యుండుచు నెందును బోవఁజాలకున్నందున వానివార్తనేమియు నెఱుంగనైతిని. అనఁగానే యువరాజగు నంగదుఁడు నీమాట లాలకించితిమి. మాజటాయువున కన్నవైతివి. నీవెఱింగి యున్న నారావణుఁ డుండుచోటు తెలుపుము. వాఁడు తా నొనరించు పనుల మూలమున రాఁగల హాని నెఱుంగఁడు. ఆ మూర్ఖుని నివాసము దూరమో సమీపమో తెలిసి యున్నం జెప్పుమా యని యడిగెను.

మహాతేజుఁడగు నాసంపాతి వారు సంతసించునట్లు వా నరులారా! నేను గృధ్రరాజను. దగ్ధపక్షుఁడను. వయస్సు దూలి క్షీణవీర్యుఁడనుగా నున్నాఁడ. నేనేమి చేయఁగలను? అట్టులయ్యు శ్రీరామునకు వాక్సహాయమునైనఁ గావించి కృతార్థుఁడనయ్యెద. వరుణదేవుని వగు నతలాద్యధోలోకము లను విష్ణువు కొలిచిన యూర్ధ్వలోకములను దేవాసురుల యుద్ధముల నమృతమథనమును జూచి యున్నాఁడను. ఇది శ్రీరాముని కార్యము. కనుక మీకంటె ముందుమిగిలి చేయఁ దగువాఁడను. ముదిమిని నాతేజస్సు క్షీణించినది. ప్రాణములు సంధిబంధములు బిగువు తప్పియున్నవి. రూపవతియు నాభరణ భూషితయు నగు నొక యువతిని రావణుఁడు దుర్మతియై కొని పోవఁగంటిని. రామా రామా లక్ష్మణా లక్ష్మణా యని నాక్రోశిం చుచు నాభరణములం బాఱవైచుచు విడిపించుకొన నవయవ ముల విదుర్చుకొనుచు నుండఁగంటిని. నల్లనియాపక్షుఃపతియం

దామె పట్టువస్త్రము మేఘముపైన మెఱపుఁదీఁగవలెఁ బ్రకాశించుచుండెను. రామనామసంకీర్తనమును బట్టి యామెయే సీత యని యూహించెదను. ఇఁక రావణ నివాసస్థలము వచింతు. వినుఁడు.

రావణుఁడు విశ్రవసుని కుమారుఁడు. కుబేరునితమ్ముఁడు ఆతని నివాసము లంక. ఇందుండి యది నూఱుయోజనముల దూరమున నున్నది. అయ్యది విశ్వకర్మనిర్మితము. ఆపురమున సీత చిక్కుపడి రాక్షసీగణపరివృతయై యున్నది. ఆజానకిని మీరందుఁ జూడఁగలరు. ఆలంకచుట్టును సాగరమున్నది. శతయోజనములు పారమును దాఁటి దక్షిణతీరముం జేరి లంకం బ్రవేశించినఁ గనుఁగొనవచ్చును. మీరు వేగమ లంకకేఁ పొండు. సీతను జూచి రాఁగలరని నేను దివ్యజ్ఞానమునఁ గాంచితిని. పిచ్చుకలులోనగు ధాన్యమున జీవించుపక్షులు భూమికి సమీపమున నాకసమునఁ దొలిమార్గమున సంచరించును. కాకులు లోనగు ఫలములఁ దిని జీవించునవి దానికి మీఁద రెండవమార్గమునఁ దిరుగుచుండును. జలకాకములు లోనగునవి అంతకుఁ గొంత మీఁద మూఁడవత్రోవయందు సంచరించు. శ్యేనములు నాలుగవమార్గమునఁ జరించు. గృధ్రము లైదవమార్గమునం దిరుగు. బలవీర్యరూపయౌవనసంపన్నము లగుహంస లంతకుమీఁదిదగు నాఱవమార్గమున భ్రమించు. వినతాపుత్త్రులకు నరుణగరుడవంశములఁ బుట్టినవి ఏడవమార్గమునం దిరుగుచుండును. నేను నావంశమునఁ బుట్టినవారను వినతాపుత్త్రుఁడగు నరుణునివలనఁ గల్గినవారము. కావున మాకు సప్తమమార్గము సంచారయోగ్యము. నేనిం దుండియే రావణుని గాంచుచున్నాను. మాకు గరుత్మంతునకు

వలె దివ్యదృష్టిగలదు. ఆహారబలము స్వాభావికశక్తి యుండు టం బట్టి నూఱుయోజనముల దృష్టి మాకుంగలదు. కుక్కుటములకుఁ బాదమూలమందే యాహారముసంగ్రహించుకొను వృత్తి దైవముచే విధింపఁబడినట్లే మాకు దూరప్రదేశమునం దాహారము గ్రహించునట్లు దైవము కల్పించెను. రామునిచే రావణుని జంపింతురేని నాతమ్మునకుగా నేను బగదీర్చుకొన్నవాఁడ నగుదును. సముద్రము దాఁటునుపాయమరయుఁడు. సీతం గాంచి సుఖముగాఁ గిష్కింధకుఁ బోవఁగలరు. స్వర్గగతుఁడగు నాతమ్మునకు జలతర్పణము గావించెదను. అందులకై సముద్రమునకు మీరు నన్నుఁ గొనిపొండు. అనఁగా వానరులు దగ్ధపక్షుఁడగు నాసంపాతిని సాగరతీరమునకుం గొంపోయి జలతర్పణముచేసిన పిదప యథాస్థానమునకుఁజేర్చి సీతావృత్తాంతశ్రవణమున సంతోషము నొందిరి.

మహానుభావులారా! యీభాగమునఁ గొన్ని విశేషములు గలవు.

"పురా వృత్రవధే వృత్తే పరస్పరజయైషిణౌ,
ఆదిత్యముపయాతౌ స్వో జ్వలంతం రశ్మిమాలినం. ౪
ఆవృత్యాకాశమార్గే తు జవేన స్మ గతౌ భృశం,
మధ్యం ప్రాప్తే దినకరే జటాయురవసీదతి. ౫
తమహం భ్రాతరం దృష్ట్వా సూర్యరశ్మిభిరర్దితం,
పక్షాభ్యాం ఛాదయామాస స్నేహాత్పరమవిహ్వలః. ౬
నిర్దగ్ధపక్షః పతితో వింధ్యేచేఽహం వానరర్షభాః,
అహమస్మిన్ వసన్ భ్రాతుః ప్రవృత్తిం నోపలక్షయే." ౭ సర్గ. ౫౮

అని మూలము. మానవులకుఁగల యూహాలకుఁ బక్షులకుం

గల్గు నూహలకు ధనసంపాదనమునఁ దప్పఁ దక్కినసామాన్య విషయములయందు సమానత్వము గలిగియే యుండెను. పర స్పరవిజిగీష సర్వప్రాణిసహజము. సంపాతి జటాయువులను పక్షులకు వేగమున నొండొరుల మిగులు నూహలుకల్గుటయం దచ్చెరువేమి గలదు? కుక్కుటములు మఱికొన్ని పక్షులు పరా క్రమమును జూపుటయంద తెలుంగుదురు కదా. తోఁబుట్టువు లగు నీపక్షులు నెంతయెత్తు పోవఁగలదో యని పందెము వేసి కొని పైకెగురుట సాజమే. చాలదూరము పోఁగా జటా యువు సూర్యకిరణముల వేఁడిమి కోర్వఁజాలక సొమ్మసిల్లెను. సహోదరస్నేహమున సంపాతి యాతనిఁ దనఱెక్కలఁగప్పెను. సూర్యాతపము దానిఱెక్కల శోషింపఁజేసెను. మైమఱచి యంతయెత్తునుండి వచ్చునపుడు వేలువేలుస్థలములఁబడియెను. ఆహారనిద్రాభయాదులు మానవులకుంబోలెఁ దిర్యక్కులకుం గల్గుట విరుద్ధము కాదు. వృక్షములకు లతలకు నట్టివికలదని శాస్త్రము చాటుచున్నది.

"అంతస్సంజ్ఞా భవంత్యేతే సుఖదుఃఖసమన్వితాః."

అని. ఈశాస్త్రము విశ్వాసపాత్రము కాదనువారే యిపుడు మహాత్ములొక్కరు ప్రత్యక్షముగా వానింజూపఁగా మాటః లాడక తలలు వంచుచున్నారు. కావున నీకథ విశ్వాసపాత్రము కాదనుటకంటె నున్మత్తవాదము వేఱొకటి లేదు. సంపాతి చేసినొన్న కర్మమునను సరించి పక్షములు కాలెను. జటాయు వున కది కలుగలేదు. అను నీసిద్ధాంతము నెఱింగిన నిట్టి కుశం కలు కలుగకయుండఁగలవు.

"నిర్దగ్ధపక్షో గృధ్రోఽహం హీనవీర్యః ప్లవంగమాః,
వాఙ్మాత్రేణ తు రామస్య కరిష్యే సాహ్యముత్తమం. ౧౨

జానామి వారుణాన్లోకా న్విష్ణోస్త్రైవిక్రమానపి,
మహాసుర విమర్దాన్వాప్యమృతస్య చ మంథనమ్. ౧౩

రామస్య యదిదం కార్యం కర్తవ్యం ప్రథమం మయా,
జరయా చ హృతం తేజః ప్రాణాశ్చ శిథిలా మమ." ౧౪

అని మూలము. ఊర్ధ్వలోకములని అధోలోకములని మన వారు చెప్పుట జ్ఞానములేమిచే నని నాగరికులలోఁ గొందఱం దురు. అట్లనుటయే పొరపాటు. ప్రాగాదిదిక్కులుకూడ నియతములుగాదు. ఎల్లతావులకు నవి యొకరీతిగానుండవు. ఎందున్న వారు తొలుత సూర్యుఁడుదయింపఁగాఁ జూతురో యదియే తూర్పుగా భావింతురు. ఏభూభాగమున నున్నవారు తమ్ము పైగానున్న వారినిగాఁ దమ క్రిందనుండువా రధోలోకవాసులుగాఁ దమకుఁ బైగానుండువా రూర్ధ్వలోకవాసులుగా భావింతురు. వారు నిట్లే యని యెఱింగినయెడల నూర్ధ్వాధోవిభాగమున శంకలే యుండవు.

"యత్రోదితోఽర్కః కిల తత్ర పూర్వా
తత్రాపరా యత్ర గతః ప్రతిష్ఠాం,
తన్మత్స్యతోఽన్యే చ తతోఖిలానా
ముదగ్గతో మేరురితి ప్రసిద్ధమ్.

యో యత్ర తిష్ఠత్యవనీంతలస్థా మాత్మానమస్యా ఉపరిస్థితం చ,
సమన్యతే ఽతః కుచతుర్థసంస్థా మిథశ్చతే తిర్యగివామనంతి.
అథశ్శిరస్కాః కుదళాంతరస్థా శ్ఛాయా మనుష్యా ఇవ నీరతీరే,
అనాకులా స్తిర్యగధఃస్థితాశ్చ తిష్ఠంతి తే తత్ర వయం యథాత్ర.
సిద్ధాంతశిరోమణి - గోలాధ్యాయము.

అని భాస్కరాచార్యులు తెలిపిరి. ఈవిషయమే సంపాతి

వాక్కులయందును గలదు. అతఁడుండుచోటునుండి యూర్ధ్వాధోభాగములను దెలిపెను. మూఁడులోకములనే పదునాలుగు లోకములుగా విభజించిరని మన మెఱుంగవలయు. భూలోకము సప్తద్వీపములు గలది యని కొందఱు నవద్వీపములు కలదని కొందఱు నవద్వయద్వీపములు గలదని కొందఱు వ్రాసిరి కదా. అట్లే యీయతలాద్యధోకములు భువర్లోకాదులు నని యెఱుంగవలయు. ఇందు సంశయమేమనఁగా నింత కాల మీసంపాతియనుగ్రద్ధ జీవింపఁగలదాయనునదియే. నూట యిరువది వత్సరములుపై నైదుదినములు మానవాయుర్దాయ మని ప్రమాణముకలదు. దానికి విరుద్ధముగా ద్వీపాంతరముల యందు జీవించియుండువారిని జూడకయున్నను వినుచున్నారము. అమితాయుర్దాయము గలుగవచ్చునని బృహజ్జాతకము తెల్పుచున్నది. పక్షులలో నేజాతి వెన్నియేండ్లుండునో వచింపఁదరముకాదు. మనపరీక్షలకు లొంగని విషయము లనేకము లిపుడిపుడు కనఁబడుచున్నవి. వానిమూలమున మనకుఁగల లోకజ్ఞాన మత్యల్పమని యేర్పడుచున్నది. చిరకాలము జీవించునవి కలవనియు వాని నెఱుంగుట శక్యముకాదనియు మనము తెలిసికొనిన నీచిక్కులుండవు కదా. ఒక్కప్రాణి సకలవిషయములను జూడఁజాలదు. కొన్ని చూచియుఁ గొన్నింటిని వినియునుండును. నమ్మిన వానినెల్లఁ దానెఱింగినట్లే తెల్పును. ఇది సాజముగాని యచ్చెరువుగాదు.

"తరుణీ రూపసంపన్నా సర్వాభరణభూషితా,
హ్రియమాణా మయా దృష్టా రావణేన దురాత్మనా. ౧౫
క్రోశంతీ రామరామేతి లక్ష్మణేతి చ భామినీ,
భూషణాన్యపవిధ్యంతీ గాత్రాణి చ విధూన్వతీ." ౧౬

అని మూలము. పక్షికి మానవసౌందర్యమేమి తెలియునని సంశయింపరాదు. గరుడులు దేవతాభేదములలోనివి. గరు డోరగాదులన్నియు దేవతాభేదములే. కావున సామాన్య పక్షి జాతిభిన్నజ్ఞానము వానికిం గలిగియుండు. సామాన్య పక్షిజాతి యనుకొనువారి కిది విశ్వాసపాత్రము కాదు. అశ్వ ముఖము మానవశరీరము కొందఱకు, మానవముఖము అశ్వ శరీరము కొందఱకు నుండును. వారెల్ల దేవయోని విశేష ములేయని యెఱుంగవలయును. సీత యెట్టి స్థితియందున్నదని యోజింతము. పరవశనై తినని యూరకయుండలేదు. తనమేని భూషణము లందుఁ బాఱవైచెను. వెదకునపుడు శ్రీరామలక్ష్మ ణులు గుఱుతింపఁగలరనియుఁ దన పోయిన దిక్కిదియని యెఱుంగుదురనియు నామె యుద్దేశము. అవయవముల విదు ర్చుచు ననఁగా వానినుండి తన శక్తికొలందిఁ దప్పించుకొనఁ బ్రయత్నించెనని భావము. దీనిచే శక్తికిందగినట్లు విడిపించు కొనఁ బ్రయత్నించియు విఫలమనోరథ యయ్యెనని తేలు చున్నది.

"ఆద్యః పంథాః కులింగానాం యే చాన్యే ధాన్యజీవినః,
ద్వితీయో బలిభోజానాం యేచ వృక్షఫలాశినః. ౨౬
భాసా స్తృతీయం గచ్ఛంతి క్రౌంచాశ్చ కురరైస్సహ,
శ్యేనాశ్చతుర్థం గచ్ఛంతి గృధ్రా గచ్ఛంతి పంచమం. ౨౭
బలవీర్యోపపన్నానాం రూపయౌవనశాలినాం,
షష్ఠస్తు పంథా హంసానాం వైనతేయగతిః పరా. ౨౮
వైనతేయాచ్చ నో జన్మ సర్వేషాం వానరర్షభాః,
ఇహస్థోఽహం ప్రపశ్యామి జానకీం రావణం తథా. ౨౯

అస్మాకమపి సౌవర్ణం దివ్యం చతుర్బలం తథా,
అస్మాదాహారవీర్యేణ నిసర్గేణ చ వానరాః. ౩౦
ఆయోజన శతాత్సాగ్రా ద్వయం పశ్యామ నిత్యశః.
అస్మాకం విహితా వృత్తిర్నిసర్గేణ చ దూరతః. ౩౧
వహితా పాదమూలే తు వృత్తిశ్చరణయోధినాం.''

అని మూలము. ఇందొక్క విశేషము కలదు. పక్షులు సంచ రించు తావు లోకదానిని మీఱి యొకటిగా నెత్తుగా నుండు ననియు దృష్టిపాటవము ననుసరించి యాహారసంపాద నార్థ మామార్గములు కల్పితములయ్యెననియుఁ దేలెడిని. ధాన్యము దిని బ్రదికినవి భూమికిఁ జెంతనేయుండును. సమీప మును గనునంత దృష్టి గలవి. వరుసఁగా గ్రద్దలు దూరదృష్టి గలవి. చిన్నిపురుగులు దిరుగుచుండఁగా నెత్తుగాఁ దిరుగుగ్రద్ద తటాలున వానిం గొనిపోవ వ్రాలుట మనము చూచుచు న్నాము. కంటికిఁ గనఁబడనంతదూరముననుండు గ్రద్ద స్వల్పజం తువులను జూడఁగలిగినపుడు దృష్టిపాటవ మెంతగలదో యో జింపవచ్చు. గరుడాంజనమను నౌషధము వైద్యశాస్త్రమునఁ గలదు. దృష్టిపాటవలోపమును బోఁగొట్టునని యది చెప్పఁబడి నది. సృష్టిలో దూరమును జూడఁజాలు దృష్టిపటుత్వముగలవి యుండవచ్చును. సాగరాంతర్భాగమున నొకక్రోశమాత్రమున నుండు జంతువులను దనదృక్ప్రసార మాత్రమున ననఁగా విద్యుల్లతలవంటి దృష్టిప్రకాశమునఁ బరవశములనుగా నొన రించి కబళించునని వినుచున్నారము. క్రోశమాత్రము దృష్టి ప్రసరించినపు డిఁక నింతదూరమునకన్నఁ బ్రసరింపదను నియ మము నిలువఁజాలదు. కాన సంపాతి శతయోజనములయం దుండువానిం జూడఁ గలుగునని చెప్పుట విశ్వాసపాత్రమే

యనవచ్చును. మన మచ్చెరువుగా భావించువిషయములు కొన్ని సహజములే యని యనుభవమునకు వచ్చుచున్నవి.

"సముద్రం నేతుమిచ్ఛామి భవద్భిర్వరుణాలయం. 38
ప్రదాస్యామ్యుదకం భ్రాతుస్స్వర్గతస్య మహాత్మనః,"

అని మూలము. సంపాతి జటాయువునకు నుదకతర్పణము చేయుటం జూడ నతఁడు కేవల పక్షిజాతికిఁ జేరినవాఁడు కాఁడనియు దేవయోనిభేదములలో నొకఁడనియుఁ దేలుచున్నది. ఆకాలమున జలతర్పణమే ప్రధానముగా నాచరణమున నున్నయట్లు గూడ మన మూహింపవలయును.

## జాంబవంతునకు సంపాతి సీతాపహరణవార్త నెఱింగినవిధముఁ దెల్పుట.

*వానరు లంత నాసంపాతి వాక్కులు విని యమృతపు సోనలు సోఁకినట్లు లానందించిరి. జాంబవంతుఁడు ప్రాయోపవేశము మాని యందఱు లేవఁగనే తాను లేచి సంపాతింగని సీత యెందున్నది? ఎవఁ డామె నపహరించెను? వాఁడపహరించి కొనిపోవుచుండ నెవఁడు చూచెను? ఈవిధమంతయుఁ దెలుపుమని ప్రశ్నించుచు వానరులకు నీవేదిక్కు,శ్రీరామలక్ష్మణుల బాణముల తీవ్రత నాదురాత్ముఁ డనుభవించుఁ గాక యని యెను.సంపాతియు సంతుష్టుఁడై వారల నాశ్వాసించుచు సీతాపహరణవార్తను దెలిపెదను. ఆలకింపుఁడని యిట్లు చెప్పెను.

నే నీ గొప్పకొండపయింబడి దుఃఖించుచు ముదుకుఁడనైతిని. నాకష్టమును గని నాకొడుకు సుపార్శ్వుఁడనువాఁడు

* ఇది యేఁబదితొమ్మిదవసర్గమునఁ గలదు.

తలిదప్పక యాహారమును దెచ్చియిచ్చుటకుఁ బూనెను. గంధర్వులకుఁ గామము, సర్పములకుఁ గోపము, మృగములకు భయము మాకు నాఁకలి మిక్కిలిగా నుండును. ఒక్కనాఁడు నేనాఁకలికి నోర్వఁజాలక యుండఁగాఁ బ్రొద్దు క్రుంకినపిదప మాంసము గొనిరాకయే వచ్చెను. నాయాఁకలి తీవ్రముగా నుండుటంజేసి వానిం బరుసములాడితిని. వాఁడు నన్నూఱడించుచు రిత్తచేతులఁ దా వచ్చినందునకుఁ గారణమిట్లు తెలిపెను. తండ్రీ! ఆహారాన్వేషణార్థము పోయి మహేంద్రపర్వతద్వారము నావరించియుంటిని. సాగరమున ననేకపక్షులు తిరుగుచుండును గాన వానిం బట్టుకోరికఁ దలవాంచి మార్గమున కడ్డముగానుంటిని. అపుడు నల్లనిదేహముగల రక్కసుఁ డొక్కఁడు సూర్యోదయమువలెఁ బ్రకాశించు నొకస్త్రీని దీసికొని పోవుచుండఁ గంటిని. వారినే నేనాహారముగాఁ బట్టుకొనం దలంచితిని. వాఁడు మంచిమాటలతో మార్గమును వదలుమని నన్నడిగెను. వినయమున కాగ్రహింపరాదు గదా. వాఁడతివేగముగాఁ బోయెను. అంబరచరములగు భూతములు నన్ను గౌరవించిరి. మహర్షులు నన్నుంగని వత్సా! దైవవశమునఁ దప్పించుకొని బ్రదికితివి. వాఁ డూరకపోవుట నీకు మంచిది. అంత సిద్ధులులోనగువారు వత్సా! వాఁడు రావణుఁడు, ఆమె సీత, ఆమెను వాఁడపహరించి కొనిపోవుచున్నాఁడు. అని తెలిపిరి. ప్రొద్దుపోవుట కిది కారణమని నాకొడుకు తెలిపెను. అది మొదలు పరాక్రమముం జూపి రామునకుఁ దోడు సూపుటకుఁ బక్షముల బలము నాకు లేదుగాన బుద్ధివాక్కు అనువాని బలమున్నను బ్రయోజనము లేకయుంటిని. ఇపుడు నేనేమి సాయము చేయఁగలననఁగా మాటలచేతను మతి

చేతను మీకుఁ దోడుపడియెదను. శ్రీరామకార్యము నా కార్యమే. సుగ్రీవుఁడు సమర్థులరగు మిమ్ముం బంపినవాఁడు. శ్రీరామబాణములు సమర్థములు. రావణుఁ డత్యంతబలము కలవాఁడైన నేమి? మీరు సమర్థులరు గాన మీకుఁజేతఁగాని దేదియు లేదు. కాన నాలసింపక కృత్యము నిర్వహింపుఁడు. అని పలికెను.

## సంపాతి స్వవార్తను దెలుపుట.

*అంత సంపాతి సోదరునకుఁ దర్పణముగావించి స్నానముచేసిన పిదప నప్పర్వతమున వానరులు పరివేష్టింపఁ గూరుచుండి యంగదుని గాంచి నిశాకరముని చెప్పినరీతిగాఁ దనకు వానరులు కనఁబడినందులకు విశ్వాసము కలవాఁడై సంతసించి వానరులందఱు విన నిట్లనియె. మీరెల్లరు నిశ్శబ్దముగానుండి నామాట లాలకింపుఁడు. సీతావార్తను యథార్థముగాఁ దెలిపెదను సూర్యుని వేఁడిమికి నాయవయవములు లక్ష్యములగునట్లు చేసికొని దగ్ధుఁడనై యీకొండకొమ్మున నడవిం బడితిని. ఆఱుదినములకు నంత తెలివిరాఁగా దిటవుతప్పి పరవశుఁడనై దిక్కులం గాంచితినిగాని యిదియేప్రదేశమని తెలిసికొనఁజాలనైతిని. సముద్రతీరమునఁగల కొండలులోనగువానిం గని యిది యీప్రదేశమని తెలిసికొంటిని. వింధ్యపర్వతభాగమే యని తుదకు నిశ్చయించితిని. ఇందొక పవిత్రాశ్రమముండెను. ఉగ్రతపశ్శాలియగు నిశాకరముని యుండెను. ఆమహాత్ముఁడు మృతి నొందిన పిదప నేనొంటిగానుండ నారంభించి యిప్పటి

* ఇది యఱువదియవసర్గమునఁ గలదు.

కెనిమిదివేల సంవత్సరము లైనది. మిక్కిలి శ్రమంపడి యాశ్రమముఁ జేరితిని. ఆమునిం జూడఁగోరితిని. ముందే నేను నా తమ్ముఁడు నతని సేవించుచుందుము. ఆయాశ్రమమునఁ బుష్పములో ఫలములో లేని వృక్షమే లేదు. నేనాయాశ్రమము సమీపింపఁగా మంచివాసనలుగల వాయువులు విసరెను. ఒకచెట్టు క్రిందఁ జేరి మునిని జూడఁగోరి యుండ స్నానముచేసి యుత్తరదిక్కు మొగముగా నాముని వచ్చుచుండఁ గాంచితిని. భల్లూకాదు లాతనిం బరివేష్టించి యుండెను. ముని లోపలికరుగఁగా నవి తమ యిరవుల కరిగెను. నన్నాముని ప్రీతిమీఱఁ గాంచి మరల వచ్చి వచ్చిన పనియేమని నన్నడిగెను. నీపక్షములు కాలియున్నవే. మున్ను కామరూపములగు రెండు గ్రద్దలం గాంచితిని. సంపాతీ! నీవందుఁ బెద్దవాఁడవు కాదా. జటాయువు నీవు నాకు నమస్కరించుచుందురు గదా. నీకు వ్యాధి యేమైనఁ గల్గినదా ? కాకున్నఁ బక్షము లెట్లు పడిపోయినవి? ఎవరైన దండించిరా ? ఎవఁడతఁడు ? అని యడిగెను.

## సంపాతి నిశాకరమునికిఁ దనవార్తఁ దెల్పుట.

* వానరులారా! ఆముని యట్లు నన్నడుగ జంకక నారెక్కలు కాలినవార్తను దెలిపితిని. మేమెగురునపుడు భూమింగల నగరములు బండిచక్రములవలెఁ గనంబడినవి. శ్రోత్రయందు వాద్యధ్వనులు వినఁబడినవి. వేదఘోషములు వినఁబడియె. రక్తవస్త్రములు కట్టుకొన్న స్త్రీలు గానముచేయు

* ఇది యఱువదియొకఁడవసర్గమునఁ గలదు.

చుండఁ బెక్కురంగంటిమి. కొండలు చిన్నరాలవలెఁ దోఁచెను. నదులు దారములవలెఁ గనంబడినవి. హిమాలయములోనగు నవి యేనుంగులంతగా నుండెను. పోఁగాఁబోఁగా దృష్టిపాట వము తగ్గెను. అతిశ్రమమున సూర్యునిం గాంచితిని. జటా యువు నాతోఁబలుకకయే పరవశుఁడై భూమిపైఁ బడసాగెను. వానిని ఱెక్కలం గప్పుటంజేసి నాపక్షములు గాలినవి. నా మూలమున నతనిపక్షములు గాలలేదు. నేనంత మూర్ఛ మునింగి యీవింధ్యమునం బడితిని. తమ్మునిం బాసి పక్షములు కాలి యింక జీవింపఁజాలను. చావవలయుననియే నాకోరిక. ఈకొండ కొమ్మునంబడి మృతినొందెదనని నిశాకరమునికిం జెప్పితిని.

## ముని సంపాతికి ఱెక్కలువచ్చుమార్గము తెల్పుట.

* ఇట్లు మునికిం దెలిపి విలపించితిని. ఆమహాత్ముఁడు రవంతసేపు ధ్యానించి సంపాతీ! నీకు ఱెక్కలు, పిల్లఱెక్కలు, ప్రాణములు నేత్రములు బలపరాక్రమములు మరలఁ గ్రొత్త విగాఁ గలుగఁగలవు. నే నింతకుముందే భావికాలమున నొక మహాకార్యము గలుగఁగలదని వింటిని. అది తపోబలముననే గాక పెద్దలమూలమునను దెలిసికొనినాఁడ. ఇక్ష్వాకువంశ మున దశరథుఁడను మహారాజు గలఁడు. ఆతనికి శ్రీరాముఁ డను కుమారుఁడు పుట్టఁగలఁడు. తండ్రి యానతి భార్య సోదరుఁడును వెంటరాఁగా నడవులకు వచ్చును. రావణుఁ డాతని పత్ని నపహరించు. ఆమె వాని నీసడించును. ఆయమ భుజింపకుండు. ఇంద్రుఁ డామెకు నుత్తమదివ్యాన్నము నొసం

* ఇది యఱువదిరెండవసర్గమునఁ గలదు.

గును. అది యింద్రదత్తమని యామె యెఱింగి యందగ్ర భాగముందీసి నాభర్తయు మఱిదియు జీవించియుందురేనియు. మృతులై దేవత్వమునొంది యుందురేనియు వారిపురకు నీ యన్నము చెందునుగాక యని భూమిపై నుంపఁగలదు. శ్రీరాము నానతి వానరులు సీతను వెదుక రాఁగలరు. వారికి నీవా సీతాదేవివార్తను దెలుపుము. సర్వప్రకారముల నీ విందుండుటుత్తమము. పక్షిహీనుఁడ వెందుఁ బోఁగలవు? నీకుఁ బక్షములు మరల మొలుచును. ఇపుడే పక్షములు వచ్చునట్లు చేయఁగలను. కాని యాపని చేయ నిష్టపడను. ఇందే యుందు వేని లోకహిత మాచరింపఁగలవు. శ్రీరామలక్ష్మణులకే కాక యెల్లవారలకు హితమాచరింపఁగలవు. నేనా సోదరుల దర్శింప వలయునని యూహించితిని గాని యంతకాలము జీవించి యుండుటకు నుత్సహింపను. అంతకుముందే శరీరము వదలు దును. అని తత్త్వవేత్త నాకుం దెలిపెను.

మహాశయులారా! యింకొక్క విశేషము గలదు. పరి కింతము నిశాకరముని భావికాలగతులఁ దెల్పెనన్న నచ్చె రువుగాదు. యోగదృష్టిగలవారల కది సులభమే. కాని యామునిపలుకులలో విశేష మొందు గలదు.

“సా చ కామైః ప్రలోభ్యంతీ భక్ష్యైర్భోజ్యైశ్చ మైథిలీ,
న భోక్ష్యతి మహాభాగా దుఃఖే మగ్నా యశస్వినీ. ౭
పరమాన్నం తు వైదేహ్యై జ్ఞాత్వా దాస్యతి వాసవః,
యదన్నమమృతప్రఖ్యం సురాణామపి దుర్లభం. ౮
తదన్నం మైథిలీ ప్రాప్య విజ్ఞాయేంద్రాదిదం త్వితి,
అగ్రముద్ధృత్య రామాయ భూతలే నిర్వపిష్యతి. ౯

మము నెక్కుడని కోరునది గాన భూమిపై శ్రీరామలక్ష్మ ణుల నుద్దేశించి యుంచెను భూమిపైనుంచుట రావణునకు నష్టము గలుగవలయుననియే. తచ్ఛేష మేమిచేసినది మూల మున లేకయున్నను భక్షించెననియే యూహింపవలయు. ఈవిషయము దేవీభక్తులు పల్కుచుందురు. రామాయణమున దీనికాధారము లేకున్న నిద్ది సుసంగతియే కావచ్చుననునూహా కీమూల మవకాశ మొసంగుచున్నది. ఇంద్రదత్త మన్నమని ఈముని పలుకులమూలముననే తెలియవచ్చెను గాని వేఱుగా నాధారములేదు కదా. ఇట్లే యిందర్థమును గ్రహించిన బాధ లేదు. సుందరకాండమున దీని కాధారము లేదు. లేకయు న్నను వాల్మీకి యీమునివాక్యముగా దానిం దెల్పెను. కాన నప్రమాణమన వలనుపడదు. పైవ్రాసినకథయం దొకవిశే షము గ్రహింపఁదగియుండును. భక్తులు వైరబుద్ధి పాటింప రాదు. సర్వకాలము నట్లుండ వలనుపడకున్నను భగవత్పూ జాసమయమునందైన నైకమత్యము గలిగియుండవలయును. అదిలేనిచో నాపూజ నిరర్థకమగుటయే గాక యనర్థదాయ కముకూడ నగును. భక్తుఁడు చెంతనున్నపుడు పగపాటించి యతనికిం దెలుపకయుండరాదనునదియే యిందు ముఖ్యము. కొంతకాల మట్లు చేయుచునుండఁగా నావిరోధభావము క్రమముగా నశించును. ఈవిషయమునే మన మీభాగము నుండి గ్రహింపవలసి యున్నది. ఏకథనైనఁ ద్రోసిపుచ్చరాదు. దానియం దేనీతి యిమిడియున్నదని గ్రహింపవలయును. కేవల కథాశ్రవణము ఫలవంతమగుననుకొనుట మంచిదిగాదు. భగవద్ధ్యానాదులయందైన విరోధము లేకుండనుండఁజాల రేని వారి తపస్సు నిష్ఫలమనుట కేసందియము లుండవు.

## { సంపాతికిఁ బక్షములు రాఁగా హితముఁ దెలిపి వానరుల వీడ్కొనుట. }

* ఇట్లు లానిశాకరముని పలికి నన్నుఁ బ్రశంసించి నాకు ననుమతినిడి యాశ్రమములోని కరిగెను. మెల్లఁగాఁ బైకెక్కి యీశిఖరముననుండి మీరాక కెదురుచూచు చుంటిని. ఆముని మాటలనమ్మి దేశకాలములఁ బరికించుచు నూఱుసంవత్సరములు గడపితిని. ఆవల నానిశాకరముని మహా ప్రస్థానమను విధి ననుసరించి దేహము వదలఁగా ననేకసంశయ ములు బాధింపఁగాఁ గుందుచున్నాను. మరణవాంఛ కలిగినపు డెల్ల నా నిశాకరముని మాటలు స్మృతికి రాఁగా నూఱడిల్లు చుందును. మరల నీకుఁ బక్షులు రాఁగలవను మునిమాట నా ప్రాణముల నింతదాఁక నిలువఁజేసెను. దురాత్మకుఁడగు రావ ణుని పరాక్రమ మెఱింగియు నాకొడుకుతో సీతను రక్షింపఁ బూని రావణుం జంపక వచ్చితివేల యని యడిగితిని. సీతను వదలించి నాకాతఁడు ప్రీతిగల్గింపక పోయెను. అని సంపాతి వానరులతోఁ జెప్పుచుండఁగా వారు చూచుచుండఁగనే తెక్కలువచ్చెను. రక్తలోమములు కనఁబడియె. సంతోషాతి రేకమున నావానరులంగని యానిశాకరమునిమహత్త్వమున సూర్యకిరణ దగ్ధములగు పక్షములు మొలిచినవి. ప్రాయమున నేనుండఁగా నెట్టి బలపౌరుషములుండెనో యట్టివి నాకిపుడు కలిగియున్నవి. మీరు గట్టిప్రయత్నము గావింపుఁడు. కృతా ర్థుల రగుదురు. నాపక్షములు రాఁగాఁ గాంచితిరిగదా. ఇదియే

* ఇది యఱువదిమూఁడవసర్గమునఁ గలదు.

మీకార్యము నెఱవేఱుననుటకు నుదాహరణము. అని తెలిపి. పక్షముల బలిమిని బరీక్షింప నాకసమున కెగిరెను. వానరులా పక్షిపలుకులు నతనికిం గల్గినమేలును గాంచి సంతసించి యతని మాటల విశ్వసించి ప్రయత్నపరులైరి. అభిజిన్ముహూర్తము దనుక నందే యుండి యదిరాఁగా దక్షిణదిక్కునుగూర్చి పయనము సాగించిరి.

మహాత్ములారా! ఈభాగమునఁగల యొకటి రెండు విషయములను బరిశీలింతము. కాలిపోయిన ఱెక్కలు మొలుచుట సుసంగతమగునా యనున దొకసందియము. మఱికొన్ని యుఁగలవు. విమర్శింతము.

"మహాప్రస్థాన మాసాద్య స్వర్గతే తు నిశాకరే,
మాం నిర్దహతి సంతాపో వితర్కైర్బహుభిర్వృతం." ౪

అని మూలము. మరణప్రయత్న మాత్మహత్య కాదా యని ప్రశ్నింపవచ్చును. ఆహారనిద్రలు మాని శరీరపతనము దనుకఁ బ్రయాణముచేయుచు భగవంతునినే తలఁచుచుఁ బోవుచుండుట యని యర్థము. ఈయాత్ర యుత్తరదిక్కునుగూర్చియే సాగునని పురాణములఁగల వార్తలవలనఁ దెలియందగును. ఇది బలవన్మరణమునకు నుదాహరణము కాఁజాలదు. ఈ వ్రతానుష్ఠానము చేయువారు జ్ఞానులుగ నుందురు. వారికి సంసారతాపము లుండవు. కేవలజ్ఞానమే వారిమదులఁ దాండవమాడుచుండును. యోగబలమున శరీరమును వదలుట మంచిదనియు వారు సూర్యమండలమును భేదించుకొని యూర్ధ్వలోకముల కరుగుదురనియు శాస్త్రములు ఘోషించెడు. కావున ముక్తిదాయకమే యామృతి పాపఫలదాయకము కాదు.

"తస్య త్వేవం బ్రువాణస్య సంపాతేర్వానరైస్సహ. ౭
ఉత్పేతతుస్తదా పక్షౌ సమక్షం వనచారిణాం,
స దృష్ట్వా స్వాం తనుం పక్షైరుద్గతైరరుణచ్ఛదైః. ౯
ప్రహర్షమతులం లేభే వానరాంశ్చేదమబ్రవీత్."

అని మూలము. వానరులతో సంపాతి మాటలాడుచుండఁగనే రెక్కలు మొలిచి పైకుబికెను. ఆతఁడు సంతోషమున నిట్లు పలికెనని భావము. ఇది సర్వథా యసంగతమనువారు కలరు. కాని వారికిఁ గర్మసిద్ధాంతముగాని లోకజ్ఞానముగాని లేదన వచ్చును. ఉన్నట్టులుండి మృతినొందుట గనుచు వినుచు నున్నాము. తటాలున నున్మాదము గల్గుటయు నాకస్మికముగా బుద్ధి మార్పునొందుటయు నెఱుంగుదుము. ఇవి స్వభావము లందు లేని సర్వమానవులకుం గాక యెవరికో యొక్కరికే యేల కలుగును? కర్మఫలమే యనక తప్పదు. ఉన్నట్టులుండి స్త్రీలు పురుషులగుచున్నారు. కొంతకాలము క్రిందట మహిసూరు ప్రాంతమున నొకవైష్ణవకన్యక యోబళమ్మయను నామె వివాహితయై సంసారము చేయ నత్తవారింటి కరిగి కొంతకాలమున కచ్చటఁ బురుషరూపమలవడఁగా నోబళాచార్యుఁడయ్యెనఁట. ఒక యాంగ్లప్రముఖునికడనున్న దాసీపుత్రిక తెల్లవాఱు జామున మగవాఁడయ్యెనఁట. ఇది పత్రికామూలములు. నాలుగైదువత్సరముల క్రిందఁ జెన్నపురమునకుఁ దిరుపతికి నడుమ నిట్లే స్త్రీపురుషుఁడయ్యెనని తెలియవచ్చెను. ఈవార్త లసత్యములు కావు. ఇవి యసత్యములని నమ్మనివారుందురను కొందము. సమాధాన మెట్లు? కర్మఫలములు ముందుగఁ దెలిపి రావు. ఆకస్మికముగఁ బ్రాపించును. ఉన్నట్టులుండి బుద్ధిభ్రంశ

మగుటకుఁ గారణమేమి? సంపాతికిఁ బాపకర్మఫలముగఁ బక్షములు ఖండించెను. ఆఫలము ననుభవించుకాలమంతయుఁ బూర్తికాఁగాఁ బుణ్యకర్మఫలములు సంభవించి యాలోపము లేకుండఁజేసెను. ఇందద్భుతంపడఁదగిన దేదియుఁ గానరాదు. కర్మసిద్ధాంతతత్త్వ మెఱుంగమి యీ ప్రశ్నములకుఁ గారణ మయ్యెను. ఇట్టి ఫలములు లోకమున నెన్నియో కలుగుచుండుటం జూచుచుండియు సందియమందుట మొండితనమన వలయు నేమో.

## వానరులు సాగరముకడ కరుగుట.

* అంత నావానరులందఱు సంపాతివాక్కుల నమ్మి గంతులువైచుచు లంకకరుగు నుత్సాహముల సాగరతీరమున కరిగిరి. మహాసాగరమును గనిరి. దాని యుత్తరతీరమును జేరి కూరుచుండిరి. మహావికారరూపముగల జంతువులు జలమున విహరించుచుండెను. మహాతరంగములు భయంకరములుగా నుండెను. పాతాళవాసులగు దైత్యులందుఁ గనఁబడుచుండిరి. అట్లు భీతిగొలుపు నాపాథోరాశింగని వానరులెల్ల విషణ్ణులైరి. అంద ఱొక్కటిగ దిగులుపడి యిఁకఁజేయఁదగినదేదని యనుకొనిరి. అంగదుఁడు వారి భయముడుగ నూఱడించెను. సమయోచిత వాక్చాతుర్యము గలయతఁడు వానరులారా! విషాదము మనసునఁ దోఁపనీయరాదు. విషాదమే మహావ్యాధి. దానిని మించినవ్యాధి కానరాదు. క్రుద్ధమగు సర్పము బాలునిజంపురీతిగా దుఃఖము పురుషుల న్మ్రందఁజేయును.

* ఇది యఱువదినాల్గవసర్గమునఁ గలదు.

పరాక్రమ ప్రదర్శనకాలమున విషాదము దోఁచెనేని దాని నడంచును. తేజోహీనునకుఁ బురుషార్థములు ఫలింపవు. అని పలుకుచు నారాత్రి యందే గడపి పెద్దలతో సముద్రలంఘన ముంగూర్చి యాలోచించెను. ఎల్లర యనుమతిం గొని యర్థ వంతముగా నిట్లు పలుకసాగెను. సముద్రమునుదాఁటి లంక కరిగి సీతం గాంచి సుగ్రీవునివలని భయము నడంచువాఁ డెవ్వఁడు ? వానరువారా! ఏవీరుఁడు శతయోజనవిస్తీర్ణ సాగరమును దాఁటి కార్యము పండించుకొని వచ్చి మనల నెల్ల భయార్తులము గాకయుండ రక్షించువాఁడు? ఎవ్వాని మహత్త్వమున మరలఁ గిష్కింధకరిగి కుటుంబమును జూడఁ గలము? ఎవ్వని కరుణ మనము ప్రీతిగ నరిగి శ్రీరామలక్ష్మణ సుగ్రీవులఁ జూడఁగలము? అట్టివారు మాకిపు డభయదక్షిణ నొసంగుం గాక యని ప్రోత్సహించెను. ఒక్కఁడైనఁ బలుకఁ డయ్యెను. ఆసేనయంతయు నిశ్చలముగాఁ జిత్రప్రతిమలవలె నుండెను. మరల నంగదుఁడు వనచరులారా! బలవంతులలో మీరు మేటులు. గమనమున నాతంక మనుదాని నెఱుంగని వారు. కాన నెవరెవ రెంతయెంతదూర మెగురఁగలరో తెల్పుఁడని హెచ్చరించెను.

## వానరులు తమశక్తిని దెల్పుట.

* వానరు లాయంగదుని హెచ్చరికం దెలిసికొని గజ గవాక్షప్రముఖులు తమకుఁగలశక్తి నంగదునితో నిట్లు తెల్పిరి. గజుఁడు దశయోజనములును, గవాక్షుఁ డిరువదియు,

* ఇది యఱువదియైదవసర్గమునఁ గలదు.

గవయుఁడు ముప్పదియు, శరభుఁడు నలువదియు, గంధమాదనుఁ డేఁబదియు, మైందుఁ డఱువదియు, ద్వివిదుఁడు డెబ్బదియు, సుషేణుఁ డెనుబదియు దాఁటుదు మనిరి. వృద్ధుఁడగు జాంబవంతుఁడు వారందఱి యనుమతి నొంది మున్ను మాకును లంఘనమున గొప్పశక్తి యుండినది. ఇపుడు జరాభారమున మున్గితిమి. ఎది యెట్లున్నను శ్రీరామకార్యము నుపేక్షింపరాదు. ఇప్పటి నాశక్తి నెఱింగించెద. తొంబది యోజనము లెగురఁ గలను. నిస్సంశయము. అని మరల నిట్లనియె. ప్రాయమున నున్నతఱి నాశక్తిగమనవిషయమున నింతయే కాదు. వామనమూర్తి మూఁడడుగుల మేరను గొలుచుచుండఁగా నాతనికిఁ బ్రదక్షిణముగాఁ జుట్టి వచ్చితిని. అంతటి గమనవేగము నాకు నుండెను. ఇపుడింతమాత్రమే శక్తికలదని యూహించి చెప్పితిని. శతయోజనములు దాఁటవలయుఁ గాన నాశక్తిచేఁ గార్యము సిద్ధింపదు.

అత్తఱి నంగదుఁడు జాంబవంతు ననుమతి నొంది నేను శతయోజనములు దాఁటఁగలను. కాని మరలి రాఁగలనో రాఁజాలనో చెప్పఁజాలను అపుడు జాంబవంతుఁ డతనింగని వానరులలో భల్లూకములలో మేటివగు నంగదా! నీశక్తి లంఘనమున నెట్టిదియో తెలిసియే యున్నది. సహస్రయోజనములు దాఁటి పోఁగలవు. మరలియుఁ రాఁగలవు. ఐనను భృత్యులు స్వామిని బంపునట్టి యాచార మెందైనఁగలదా? నిన్నుఁబంపుట యుక్తము గాదు. వత్సా! స్వామి పంపఁదగినవాఁడే కాని పంపఁబడఁ దగఁడు. మాకు నీవు ప్రభువవు. మమ్మెల్లఁ గార్యమునకుం బూన్పఁదగినవాఁడవు గాని మాచేఁ బంపఁబడఁదగవు. మాకుఁ బ్రభువవు గాన నిన్ను రక్షించు

కొనఁదగుదుము. ఇది మర్యాద. ఈకార్యమునకెల్ల వృక్షము నకు మూలమువలె నీవు ప్రధానుఁడవు. తరువునకు మూల ముండిననే పువ్వులు ఫలములును గనంబడును. నీవు లంకకరి గినయెడల మాకు సిద్ధి యెక్కడిది? ప్రభువవుగాన నీయాజ్ఞను దలఁదాల్పవలసినవారము. అనఁగా నంగదుఁడు నేను బోక వేఱొకఁడు పోవక యీపని సాగుటెట్లు? మరలఁ బ్రాయోప వేశము పూనవలసినదియే కదా. సుగ్రీవు నాజ్ఞమించి కార్యము దీర్పక మనమరిగినఁ బ్రాణములు దక్కవు గదా. కాన నిపుడెట్లు చేయఁదగునో యోజింపుము. అనఁగా నా మాట లాలకించి యీకార్యమును సాధించు మహావీరు నిపుడే పంపుచున్నాను. అని సర్వశక్తులుగలిగి యేకాంతమునఁ గూరు చున్న హనుమంతునిం గని సముద్రలంఘనమునకుం బ్రోత్స హించెను.

మహాత్ములారా! ఈభాగమున నొక్కవిషయము పరి శీలింపఁదగినది. సముద్రమును జూడఁగనే వానరులు భయం పడిరి. అంగదుఁడు ఎల్లర యోగ్యత సాగరలంఘనమున నెంత గలదో తెలియఁగోరెను. వారువారు తమతమ శక్తులను దేట పఱచిరి. జాంబవంతుఁడు.

"పూర్వమస్మాకమప్యాసీత్కశ్చిద్గతిపరాక్రమః,
తే వయం వయసః పార మనుప్రాప్తాస్స్మ సాంప్రతం. ౧౧
కిం తు నైవం గతే శక్యమిదం కార్యముపేక్షితుం,
యదర్థం కపిరాజశ్చ రామశ్చ కృతనిశ్చయౌ. ౧౨
సాంప్రతం కాలభేదేన యా గతిస్తాం నిబోధత,
నవతిం యోజనానాం తు గమిష్యామి న సంశయః. ౧౩

... ... ... ... ...

మయా మహాబలైశ్చైవ యజ్ఞే విష్ణుస్సనాతనః,
ప్రదక్షిణీకృతః పూర్వం క్రమమాణస్త్రివిక్రమం. ౧౫
స ఇదానీమహం వృద్ధః ప్లవనే మందవిక్రమః,
యౌవనే చ తదాసీన్మే బలమప్రతిమం పరైః. ౧౬
సంప్రత్యేతావతీం శక్తిం గమనే తర్కయామ్యహం,
నైతావతా చ సంసిద్ధిః కార్యస్యాస్య భవిష్యతి." ౧౭

అని మూలము. ఒక్కొక్కవానరుఁడు దశయోజనములు మొద లెనుబదియోజనముల వఱకు నెగురఁగల శక్తికల వాఁడనని తెలిపెను. జాంబవంతుఁ డిప్పటి జరాభారము ననుస రించి తొంబదియోజనము లెగురఁగలననియె. వయస్సున గమనశక్తి కిప్పటిశక్తికి సంబంధమే లేదనియె. ఇట్లు పలుకుట ప్రల్లదమగునా సత్యమగునా యన్నసంశయము సామాన్యు లకుఁ గలుగకమానదు. ఇట్టివిషయము లుండుటంబట్టియే మన పూర్వగ్రంథములపై నిప్పటివారికి విశ్వాసము పోయినదని కొంద ఱనవచ్చును. ఇంచుక యుత్తరము నాలకింపుఁడు.

ప్రాయికముగాఁ బ్రతిమానవుఁడును దనకుఁ గల్గినశ నాలోచించియే లోకప్రవృత్తి నూహించును గాని సృష్టిమహ త్త్వము నూహింపఁడు. ఇది నైజము. అది పొరపాటు. మానవునకెద్ది మహాద్భుతశక్తి నీఁగలదు? అని యోజించుట ముఖ్యము. మానవునకుఁ దక్కిన భూతకోటికి నీవిషయము ననే భేదముగలదు. మానవజన్మ ముత్తమమనుట కిది యొక్కఁ డే కారణము. అన్నింటికంటె మనశ్శక్తి యుత్కృష్టమనవల యును. అయ్యది మానవప్రవృత్తి ననుసరించి మించుటయు

ణించుటయు ననునవస్థల నొందుచుండును. సత్కర్మాను ష్ఠానములచేతను దపస్సుచేతను వృద్ధినొందును. దుష్కర్మనిరతి నయ్యది క్షీణించును. మనశ్శక్తి వృద్ధినొందుటకు యోగము ప్రధానము. దాని నభ్యసింపక మాటల వేదాంతమున దాని నభివృద్ధి నొందఁజేయఁ బూనువారు జాల్ము లనఁబడుదురు. కుంఠులునగుదురు. వంచకులను టుత్తమోత్తమము. యోగము రెండు తెఱంగులుగలది. సకామము నిష్కామముననని. సకామ యోగమే అణిమాదిసిద్ధుల నొసంగునది. నిష్కామయోగ మనునదియే కేవలముక్తిహేతువుగాఁ జెప్పఁబడునది. మన స్థైర్య మీా రెండింటికి సమానము. ఫలప్రాప్తియందే భేదము కలదు.

సూ. "కాయరూపసంయమాద్గ్రాహ్య శక్తి
స్తంభే చక్షుః ప్రకాశసంయోగేఽంతర్థానం. ౨౧
ఏతేన శబ్దాద్యంతర్ధానముక్తం. ౨౨
సోఽపక్రమం నిరుపక్రమం చ కర్మ
తత్సంయమా దపరాంతజ్ఞాన మరిష్టేభ్యో వా. ౨౩
మైత్ర్యాదిషు బలాని. ౨౪
బలేషు హస్తిబలాదీని. ౨౫
ప్రవృత్త్యా లోకన్యాసాత్సూక్ష్మవ్యవహితవిప్రకృష్టజ్ఞానం. ౨౬
భువనజ్ఞానం సూర్యసంయమాత్. ౨౭
చంద్రే తారావ్యూహజ్ఞానం. ౨౮
ధ్రువే తద్గతిజ్ఞానం. ౨౯
నాభిచక్రే కాయవ్యూహజ్ఞానం. ౩౦
కంఠకూపే క్షుత్పిపాసానివృత్తిః. ౩౧

కూర్మనాడ్యాం స్థైర్యం. 3౨
మూర్ధజ్యోతిషి సిద్ధదర్శనం. 33
ప్రాతిభాద్వాసర్వం. 3౪
హృదయే చిత్తసంవిత్. 3౫
సత్త్వపురుషయోరత్యంతాసంకీర్ణయోః ప్రత్యయావిశేషో
భోగః పరార్థాత్స్వార్థసంయమాత్పురుషజ్ఞానం. 3౬

... ... ... ... ...

కాయాకాశయోస్సంబంధసంయమా
ల్లఘుతూలసమాపత్తేశ్చాకాశగమనం." ౪3

పాతంజలయోగశాస్త్రము. విభూతిపాదము.

దేహాంతర్భూతములగు నాయాయితావుల మనస్సంయమనము చేయుటవలనఁ గలుగుశక్తు లిందుఁ దెలుపఁబడినవి. ఆకాశగమనము వానిలో నొకటి మన మాపాంతకైనఁ బోవఁ దలంపనివారమగుట నివి క్రొ ̣ ̣గను విశ్వాసపాత్రములు గానియట్లును దోఁచును. ఉపాసనభాగమున నిది ప్రకారాంతరముగఁ దెలుపఁబడినది.

"కిరంతీ మంగేభ్యః కిరణనికురుంబామృతరసం
హృది త్వామాధత్తే హిమకరశిలామూర్తిమివ యః,
స సర్పాణాం దర్పం శమయతి శకుంతాధిప ఇవ
జ్వరప్లుష్టాన్ దృష్ట్యా సుఖయతి సుధాధారసిరయా." ౨౦

అని శ్రీశంకరభగవత్పాదాచార్యులు సౌందర్యలహరియందుఁ దేటపఱచిరి. ఇందు ధ్యానము చెప్పఁబడినది. యోగమునకు ఫలమే ధ్యానమని యెఱుంగవలయు.

"షణ్మాసధ్యానయోగేన జాయతే గరుడోపమః,
దృష్ట్వాకర్షయతే లోకం దృష్ట్వైవ కురుతే వశం,
దృష్ట్వా సంక్షోభయేన్నారీం దృష్ట్వైవ హరతే విషం,
దృష్ట్వా చాతుర్థకాదీంశ్చ జ్వరాన్నాశయతే క్షణాత్.
చంద్రకాంతశిలామూర్తిం చింతయిత్వా వినాశయేత్
తాపజ్వరానశేషాంశ్చ శీఘ్రం తార్క్ష్య ఇవాపరః,
గరుడధ్యానయోగేన స్మరణాన్నాశయేద్విషమ్." చతుశ్శతి.

దీనింబట్టి యుపాసకునకు ధ్యానమే ప్రధానమనియు మంత్ర జపసంఖ్య ప్రధానము కాదనియు నేర్పడుచున్నది. ప్రకృతమున దీని సమన్వయము చేయుదము. గజగవయగవాక్షాదులు వానరాకారముననుండు దేవతాంశములు గదా. కేవల వానరులకీశక్తి యుండకపోవచ్చును. వీరెల్లరు తెల్పినది విరుద్ధమెంతమాత్రము కాదు. ఎల్లరు నేల శతయోజనములు దాఁటఁ గలమని పలుకఁజాలక పోయిరని ప్రశ్నించుటంత మంచిది గాదు. యోగాభ్యాసమున హెచ్చుతగ్గు లుండవచ్చును. దానింబట్టి గమనశక్తియందుఁ దారతమ్యము పొసంగి యుండును. ముదిమినేల యీ యోగశక్తి తగ్గునని ప్రశ్నింపవచ్చును. మనస్సంయమనము వాని యభ్యాసము ననుసరించియే యుండును. కనుకనే "శరీరమాద్యం ఖలు ధర్మసాధన" మ్మని పెద్దలు నిర్వచించిరి. శరీరబలము తగ్గినకొలంది యోగము నభ్యసించుట దుర్భరము. కావుననే జాంబవంతుఁ డారీతిగాఁ బల్కెననియు నిందణుమాత్రమే ననుమానింపఁదగినది లేదని మనము నమ్మవలయును. సకలధర్మములయందుఁ బ్రధానము యోగమనియు దాని ఫలమే ధ్యానమనియు నదియే యుపాసకునకు ముఖ్యమనియు నది లేక బాహ్యపూజ యెంతచేసి

నను ఫలము లేదనియు విగ్రహారాధనము కేవల పామరుల కొఱకే యేర్పఱుపఁబడినదనియు నదియే చతుర్విధపురుషార్థ సాధనమ్మను మధ్య వైష్ణవోక్తులు ధనాకర్షణైకప్రయోజనము లగుట నవి త్యాజ్యములనియు మన మెఱుంగవలయు. మనో నిగ్రహము సాధింపఁదగినదను మాటమాత్రము మఱువరాదు.

జాంబవంతుఁడు హనుమంతుని బ్రోత్సహించుట.

అంత జాంబవంతుఁడు వానరుల విచారముం దొలఁగింపం దలంచి హనుమంతుని గని యిట్లు పలికెను. వానరోత్తమా! ఒంటరిగ నూరక కూరుచున్నాఁడవు గాని యిది యిట్లని పలుకవు. తేజోబలముల నీవు సుగ్రీవరాఘవులకుఁ దుల్యుఁడవు. వినతాకశ్యపులకు గరుత్మంతుఁడు కుమారుఁడు. ఆమహాబలుఁడు సముద్రమునఁగల సర్పములం బట్టుకొని పోవుచుండ నేఁగాంచితిని. ఆతనిపక్షముల కెంతబలము కలదో నీబాహువుల కంతబలము కలదు. ఆతనికి నీశక్తి తీసిపోవునది కాదు. నీయందుఁ గనఁబడు బుద్ధి తేజోబలాదు లింకే భూతమునందును గనంబడవు. నిన్ను నీవెఱుంగవా యేమి? పుంజికస్థలయను నచ్చరమిన్న యొందుఁ గలదు. రూపాదుల నామె మహాప్రసిద్ధిని గాంచినది. ఆమె శాపకారణమునఁ గుంజరుఁడను వానరునకుఁ గూఁతురై కామరూపిణియై యంజనాఖ్యం గాంచెను. కేసరి కామె పత్నియయ్యెను. సర్వాంగ సుందరి యగు నాయంజన కామరూపిణి గావున మానవాకృతిం దాల్చి సర్వాభరణశోభితయై చరించును. పర్వతాగ్రముల

* ఇయ్యది యఱువదాఱవసర్గమునఁ గలదు.

నాయమ విహరించునపుడు వాయువశమున నెట్టని యంచుఁ గల పచ్చని కౌశేయము కొంత తొలఁగెను. అత్తఱి నా యన్నులమిన్న యవయవములఁ గొన్నింటిని వాయుదేవుఁడు చూచి కామావిష్టమతి యయ్యెను. ఏదోష మెఱుంగని యా నారీమణియందుఁ జిత్తము నిలిపి తనయొడలు పరవశము కాఁగా నిడుదబుజముల నామె నాలింగన మొనర్చెను. సాధ్వి గాన నాయంజన నాకార్యములఁ దొట్రుపాటొంది పతివ్రత నగు నావ్రతమును జెఱుపఁబూనినవాఁ డెవ్వఁడు? అని పలుక వాయువుసుందరీ! పాతివ్రత్యమున ఖ్యాతినొందిన నిన్నుఁ గౌఁగి లించిమనస్సుచే నీతో సుఖించితినిగాని యింకొక్కరీతిఁ గాదు. నీవ్రతభంగము చేయలేదు. కనుక భయంపడకుము. పాతి వ్రత్యభంగము కాకుండుటయే గాదు. మహాబలశాలియగు తనయుఁడుకూడ నీకుం గలుగును. లంఘనమునందు నాకాశ మున కెగురుటయందు నిపుణుఁడు గాఁగలఁడు. అని సమా ధానపఱచెను.

ఆవాయువుమాటల నాలకించి నీతల్లి సంతుష్టయై యా పర్వతకందరమున నిన్నుం గనియె. జన్మించినవెంటనే యుద యించిన సూర్యబింబముం గని యది యొకఫలంబని యెగిరితివి. ఎంతయోదూర మరిగి యాతపుని వేఁడిమికి సొమ్మసిల్లియు శ్రమము నొందకుండితివి. నీకార్యముం గని లోకమునకు నీవలన నేమి కీడుగలుగునో యని శంకించి యింద్రుఁడు కుపి తుఁడై వజ్రమును నీపైవైచెను. ఆవజ్రాహతిచేఁ దూలి నీవు పర్వతశిఖరముపైఁ బడఁగా నీవామహనువు నొచ్చినది. దాన హనుమంతుఁడను పేరు గాంచితివి. ఆవిధముంగని వాయువా గ్రహించి ముల్లోకములయందుఁ దాను ప్రసరింపకయుండెను.

దాన లోకము లాకులతనొంద దేవత లాతని నాశ్వాసించిరి. వాయువు ప్రసన్నుఁడు కాఁగా బ్రహ్మ యుద్ధమున నాయుధ మృతి నీకు లేకుండ వరమిచ్చెను. ఇంద్రుఁడు తన యాయుధ నిహతిహతుఁడవు గాకుండు టెఱింగి స్వచ్ఛందమరణము గలుగ వరమొసంగెను. కనుక నీవు కేసరిక్షేత్రమున వాయువునకు నౌరసుఁడ వైతివి. ఎగురుటయందు దాఁటుటయందు నీసామర్థ్య మపారము. రెండవగరుడుఁడవో యనఁదగినవాఁడవు. మాకెల్లఁ బ్రాణదానము చేయుము. వత్సా! వామనావతారము నెత్తి విష్ణువు లోకములను గొలుచుతఱి నీభూవలయమంతయు నిరువదొక్కసాఱి ప్రదక్షిణము గావించితి. క్షీరసాగర మథనకాలమున నోషధుల నెల్లఁ బ్రోవు చేసితిని. అమృతసంభవము నెఱుంగుదు. అట్టి నేనిపుడు ముదుసలినయి నందున నాశౌర్యము తగ్గినది. ఈసమయమున మాయందెల్ల సర్వశక్తులు గలవాఁడవు. పరాక్రమమూని విజృంభింపుము. లంఘనమున నసమానుఁడవు. వీరెల్ల నీపౌరుషముఁ జూడఁ గోరియున్నారు. లెమ్ము. సాగరమును దాఁటుము. ఇట్లు జాంబవంతుఁడు బోధించి ప్రోత్సహింపఁగా హనుమంతుఁడు స్వపరాక్రమముల నెఱింగి వానరు లానందించునట్లు మేను నట్టెపెంచెను.

మహాశయులారా! ఈభాగమునఁ గొన్ని విషయము లెఱుంగఁదగియుండు. వాని నెమకుదము. హనుమదుత్పత్తిని గుఱించి విచారింతము.

"బలం బుద్ధిశ్చ తేజశ్చ సత్త్వం చ హరిపుంగవ,
విశిష్టం సర్వభూతానాం కిమాత్మానం న బుధ్యసే. 2

అప్సరాప్సరసాం శ్రేష్ఠా విఖ్యాతా పుంజికస్థలా,
అంజనేతి పరిఖ్యాతా పత్నీ కేసరిణో హరేః. ౮

విఖ్యాతా త్రిషు లోకేషు రూపేణాప్రతిమా భువి,
అభిశాపాదభూత్తాత వానరీ కామరూపిణీ. ౯

దుహితా వానరేంద్రస్య కుంజరస్య మహాత్మనః,
కపిత్వే చారుసర్వాంగీ కదాచిత్కామరూపిణీ. ౧౦

మానుషం విగ్రహం కృత్వా రూపయౌవనశాలినీ,
విచిత్రమాల్యాభరణా మహార్హక్షౌమవాసినీ. ౧౧

అచరత్పర్వతస్యాగ్రే ప్రావృడంబుధసన్నిభే,
తస్యా వస్త్రం విశాలాక్ష్యాః పీతం రక్తదశం శుభం. ౧౨

స్థితాయాః పర్వతస్యాగ్రే మారుతో౾పహరచ్ఛనైః,
స దదర్శ తతస్తస్యా వృత్తావూరూ సుసంహతౌ. ౧౩

స్తనౌ చ పీనౌ సహితౌ సుజాతం చారు చాననం,
తాం విశాలాయతశ్రోణీం తనుమధ్యాం యశస్వినీం. ౧౪

దృష్ట్వైవ శుభసర్వాంగీం పవనః కామమోహితః,
స తాం భుజాభ్యాం దీర్ఘాభ్యాం పర్యష్వజత మారుతః. ౧౫

మన్మథావిష్టసర్వాంగో గతాత్మా తామనిందితాం,
సా తు తత్రైవ సంభ్రాంతా సువృత్తా వాక్యమబ్రవీత్. ౧౬

ఏకపత్నీవ్రతమిదం కో నాశయితు మిచ్ఛతి,
అంజనాయా వచశ్శ్రుత్వా మారుతః ప్రత్యభాషత. ౧౭

న త్వాం హింసామి సుశ్రోణి మాభూత్తేసుభగే భయం,
మనసాస్మి గతో యత్త్వాం పరిష్వజ్య యశస్వినీం. ౧౮

వీర్యవాన్బుద్ధిసంపన్నస్తవ పుత్త్రో భవిష్యతి,

మహాసత్త్వో మహాతేజా మహాబలపరాక్రమః. ౧౯
లంఘనే ప్లవనే చైవ భవిష్యతి మయా సమః,
ఏవముక్తా తతస్తుష్టా జననీ తే మహాకపే. ౨౦
గుహాయాం త్వాం మహాబాహో ప్రజజ్ఞే ప్లవగర్షభం,"

అని మూలము. ఈభాగమునఁ గలవృత్తాంతము సామాన్య దృష్టిం బరికించిన నీచముగాఁ దోఁచును. ఆదృష్టిమాని తత్త్వ దృష్టిం బరికింపుఁడు. వాస్తవమేది యని తేలెడిని. పుంజికస్థల యను నచ్చర శాపకారణమునఁ గుంజరుఁడను వానరునకుఁ గూఁతురై పుట్టి అంజన యనుపేరం బరఁగెను. సర్వావయవ సుందరియుఁ గామరూపిణియు నగునామె మానవాకృతిం బర్వతముపై విహరించుచుండఁగా నామెవలువ గాలి సోఁకుటం జేసి యించుక తొలఁగెను. అవయవదర్శనమునఁ గామ ముదయింపఁగా వాయువు కౌఁగిలించుకొనియెను. ఆమె యెఱింగి యెవ్వాఁడు నా పాతివ్రత్యమునకు భంగముఁ గలిగింపఁబూనాఁడని యాగ్రహంబునఁ బలికెను. వాయువు మనస్సుచే నిన్నుఁ బొందితిని. కాన దీన నీపాతివ్రత్యమునకు భంగము లేదు. మఱియు నొకకుమారుఁడు మహా బలపరాక్రమోపేతుఁడు కలుగునని పలుక నామె సమ్మతించి యాపర్వతగుహయందే కుమారుంగనియెను. అని సారము.

కామరూపిణి గాన మానవాకారమున నాయంజన పర్వతమునఁ దిరుగుచుండెను. వానరజాతికిఁ గొండలఁదిరుగుట సాజమే కాని విరుద్ధధర్మము కాదు. మఱియుఁ బరపురుషుల

బాధలేని కాలమది. అంతియకాక శపించుశక్తి కలది. కాన నాత్మరక్షణమున భయంపడ నక్కఱలేదు. వాయుదేవుఁ డామెంగని కామపరవశుఁ డయ్యెను. ఏదేని రూపమున నామెకుం గనంబడియెనా లేదు, కౌఁగిటం బొదిగెను. ఆ వాయుస్పర్శమే యామె కనుమానమును గల్గించెను. అనఁగా నామెకుఁ గామాతురుఁడగు నొకని స్పర్శము గలిగినట్లు తోఁచె నని యర్థము. కోప ముదయించెను. ఎవ్వఁడు నందుఁ గనఁబడ లేదు. నాపాతివ్రత్యమునకు భంగము కలిగించినవాఁ డెవ్వఁ డని ప్రశ్నించెను. అనఁగా నాశాపమున కెవఁ డర్హుఁడని యామె భావమని మన మెఱుంగవలయును. పలుకకున్న శపించునని యెఱింగి వాయువు కాంతా! నీపాతివ్రత్యమునకు భంగము కలిగింపలేదు. మనస్సున నిన్నుఁ బొందితిని. దాన నీకు భంగము కలుగలేదు. నీకొక కుమారుఁడు మహాపురుషుఁ డుదయించుననియె. దాన నామె తృప్తినొంది యూరకుండెను. ఏల? అందుల కంగీకరించెననియా, యని ప్రశ్నింపవచ్చును. ఇరువు సారము ప్రశ్నమునకు నుత్తరంబగు.

పుంజికస్థల వానరస్త్రీయగునట్లు ముని శపించెననఁగా భావికాలగతుల నెఱింగినముని దానిని శపించెను. ఉత్తమ కుంజరవంశమున జన్మించెను. ఆమెకుంగల్గు కుమారునివలనఁ గావలసినకార్యముల నాలోచించి పరమేశ్వరుఁడు వాయు ఁ బురికొల్పెను. వాయు వామెను గామించి మనస్సుచేఁ బొందను. అనఁగా నీకార్యములకుఁ దోడ్పడు కుమారుఁడు గలుగుం గాక యని సంకల్పించెను. ఆమెను స్పృశించెను.

ఆమె దానికిం గనలి పలికెను. పాతివ్రత్యభంగము కాలేదు. నీకు మహాత్ముఁడు కొడుకు కలుగునని ధ్వని వినఁబడఁగా నామె సమ్మతించెను. అనఁగా సంకల్పమాత్రమున నీయందొక్క కుమారుని గాంచఁగోరితి ననుమాట వినఁబడఁగనే మహా సాధ్వీగాన నామె దేవకార్యమని యెంచెంగెను. లోకోపకారార్థము కుమారుఁడు గలుగునని నమ్మెను. అదియే జన్మఫలమని యెంచిన గుణవతిగాన నూరకయుండెను. మనోదోషములు గలుగుట ప్రాణిస్వభావము. అయ్యవి పాపహేతువులు కావు. అనఁగా సత్సంకల్పములు నుదయించును గదా. కాన నీరెం డును క్రియారూపమునఁ బరిణమించినపుడే సుకృత దుష్కృత ములుగా మాఱును. ఫలముల నొసంగును. సత్సంకల్పములు దృఢపడి క్రియారూపము నొందినపుడే పుణ్యఫలముల నొసం గును. దుస్సంకల్పములు నట్టులే యని యెఱుంగఁదగు. మన స్సంయోగమున సుతుఁ డుద్భవించునా? అని ప్రశ్న్నము. తొలుత మానససృష్టియే యుండెను. సనకసనందనాదులు బ్రహ్మమానసపుత్త్రు లనఁగా బ్రహ్మ యిట్టివారు పుట్టవల యునని సంకల్పించినంతన కలిగిరని యర్థము. కొంతకాల మున కాశక్తి లోకమున నశించెను. ఆవలఁ గాయికసృ.. "అంగుష్ఠా న్నారదో జ్ఞ" బ్రహ్మాయంగుష్ఠమునుండి నారదుఁ డుదయించెను. అనఁగా మనస్సు ఏయవయవమున నిలిపి ధ్యానింతురో యందు వాంఛానురూపుఁడగు తనయుఁ డుద యించునని యర్థము. ఆరెండుశక్తులు వరుసగా ణించెను అనఁగాఁ గామాతురత్వరహితముగా మనస్సు సంయమనము చేసిన ఫలము గలిగెడు శక్తి యుత్తమోత్తమము. అట్టి

వారిమానసములు నిర్మలములు. పాపపంకరహితములుగ నుం డును. కాననే యట్టి మనస్సంకల్పములు ఫలవంతము లగును. కావున నా కాలమునఁ గలయాచారము ననుసరించి వాయువు నీపాతివ్రత్యమునకు భంగము లేదనియె.

"దృష్ట్వైవ శుభసర్వాంగీం పవనః కామమోహితః."

అనునది యీ వ్రాసినదానికి విరుద్ధము కాదా యని యడు గుదురేమో. కాదు. కామమోహితః అనఁగాఁ గామముచే మూర్ఛనొందినవాఁడని యర్థము. ఒక మహాపురుషుఁ డీమె యందుఁ గలుగవలయునను కోరిక మిక్కిలి కలవాఁడయ్యెనని భావము.కనుక నే "మనసాస్మి గతో యత్త్వామ్"అని వాయువు తెలిపెను. దుర్వాంఛనే నిన్నుఁ గూడఁ గోరలేదు. భావికాల మున మహోపకారము చేయఁగల పుత్త్రుఁడుదయించుఁగాక యని సంకల్పించియే నిన్ను స్పృశించితిననియె. ఆలోచింపఁగా నది దోషముకాదని యెఱింగి యామె యూరకుండెను. ఆ స్పర్శగుహాయందే కుమారుం గనియె. సద్యోగర్భసంభూ తుఁడు హనుమంతుఁడని దీనియందే కలదని కొందఱందురు. పైవిషయమును నమ్మువా రద్దానిని విశ్వసింతురు. మన సృష్టియే లేదనువారికిఁ బ్రపంచజ్ఞానము శూన్యమని మన మూరకుండుటయే గౌరవము. ఈవిషయము నాలోచించియే [illegible]కలు,

"అనుష్ఠితం తు యద్దేవై ర్మునిభిర్యదనుష్ఠితం,
నానుష్ఠేయం మనుష్యైస్తదుక్తం కర్మ సమాచరేత్."

అని తేటపఱచిరి. మనశ్శక్తి యపార ఫలప్రదమని యెఱుంగనివారికిఁ దెలుపుట శక్యముకానిపనియనియే యీశ్లోకముచే

"శక్యో వారయితుం జలేన హుతభుక్ఛత్రేణ సూర్యాతపో
నాగేంద్రో నిశితాంకుశేన సమదో దండేన గోగర్దభౌ,
వ్యాధిర్భేషజసంగ్రహైశ్చ వివిధైర్మంత్రప్రయోగైర్విషం
సర్వస్యౌషధమస్తి శాస్త్రవిహితం మూర్ఖస్య నాస్త్యౌషధం."

భర్తృహరి తేటపఱచెను. లోకజ్ఞానసంపత్తి కలవారలకే యిట్టి విషయము లెఱుకపడఁ గలవు. ఇతరుల కెఱుకపడ శక్యముకూడఁ గావు. ఇట్టి యవస్థకుఁ గారణ ముపన్యాస వేదాంతశ్రవణమే. ఉపాసకుఁడు యోగియుఁ గావలయు. అపుడే ఆత్మశక్తి యెట్టిదని బోధపడును. ఆయనుభవము లేనివారికి లక్ష్యలక్షణపురస్సరముగా నిట్టి విషయములు తెలుపుట సాధ్యమెట్లు? అసాధ్యమనియే నమ్మి వారిని నమ్మింపఁ బూనరాదు. ఈకథనుబట్టి వాయుదేవుని యంశసంభూతుఁడు హనుమంతుఁడని తేలినది. హనుమన్నామము గలుగుటకుంగల కారణము నిట వ్రాయక యది యుత్తరకాండమున విస్తరించి వ్రాయుదును.

## హనుమ తన వృత్తాంతమును దెల్పి లంకకుం బోవఁ బయనమగుట.

*అంత నాహనుమ సాగరము లంఘింపఁబూని శరీరమును దాని కనురూపముగాఁ బెంచుచుండఁ గాంచి వాన

* ఇది యఱువదియేడవసర్గమునఁ గలదు.

అని తేటపఱచిరి. మనశ్శక్తి యపార ఫలప్రదమని యెఱుం గనివారికిఁ దెలుపుట శక్యముకానిపనియనియే యీశ్లోకము చే

"శక్యో వారయితుం జలేన హుతభుక్ఛత్రేణ సూర్యాతపో
నాగేంద్రో నిశితాంకుశేన సమదో దండేన గోగర్దభౌ,
వ్యాధిర్భేషజసంగ్రహైశ్చ వివిధైర్మంత్రప్రయోగైర్విషం
సర్వస్యౌషధమస్తి శాస్త్రవిహితం మూర్ఖస్య నాస్త్యౌషధం."

భర్తృహరి తేటపఱచెను. లోకజ్ఞానసంపత్తి కలవారలకే యిట్టి విషయము లెఱుకపడఁ గలవు. ఇతరుల కెఱుకపడ శక్యముకూడఁ గావు. ఇట్టి యవస్థకుఁ గారణ ముపన్యాస వేదాంతశ్రవణమే. ఉపాసకుఁడు యోగియుఁ గావలయు. అపుడే ఆత్మశక్తి యెట్టిదని బోధపడును. ఆయనుభవము లేని వారికి లక్ష్యలక్షణపురస్సరముగా నిట్టి విషయములు తెలు పుట సాధ్యమెట్లు? అసాధ్యమనియే నమ్మి వారిని నమ్మింపఁ బూనరాదు. ఈకథనుబట్టి వాయుదేవుని యంశసంభూతుఁడు హనుమంతుఁడని తేలినది. హనుమన్నామము గలుగుటకుంగల కారణము నిట వ్రాయక యది యుత్తరకాండమున విస్తరించి వ్రాయుదును.

## హనుమ తన వృత్తాంతమును దెల్పి లంకకుం బోవఁ బయనమగుట.

*అంత నాహనుమ సాగరము లంఘింపఁబూని శరీర మును దాని కనురూపముగాఁ బెంచుచుండఁ గాంచి వాన

* ఇది యఱువదియేడవసర్గమునఁ గలదు.

రులు వగపుడిగిరి. హనుమంతు వినుతించిరి. త్రివిక్రమునిఁ బ్రజలు చూచినట్లే మేనుఁబెంచు నాతనింగని సంతోషాశ్చర్య సమన్వితులైరి. పావని వాలమల్లార్చుచు మిక్కిలి పెరిఁగెను. ఆతని ముఖమరుణకాంతులఁ గ్రక్కునట్లుండెను. లేచి పెద్దలకు మ్రొక్కి వారితో నగ్నిమిత్రుఁడగు వాయుదేవుఁడు గమన శీలుఁడు మహాబలుఁడు నగు. పర్వతశృంగములఁ బడవైచి యున్నాఁడు. నాకు నట్టి గమనవేగము కలదు. వాయుపుత్త్రుఁడను గానఁ దత్తుల్యుఁడనే యగుదు. లంఘనమున నసమానుఁడనే. మధ్యభాగమున విశ్రమింపక మేరువునకుఁ బ్రదక్షిణముగావింతును. బాహువులచే సాగరజలములఁ జల్లి భూమండలమెల్ల జలమయంబు గావింపఁగలను. ఆకాశమున సర్పములం బట్టుకోరిక నతివేగముగా గరుడుఁడు తిరుగుచుండ నేను వేయి పర్యాయము లతనిచుట్టును దిరిగి రాఁగలను. సూర్యుఁడుదయించు తఱి నతనింగూడి పయనమయి యతఁ డస్తమింపఁ బోవు పర్వతమునకు ముందుగఁబోయి మరలి యతఁడు మధ్యాహ్నమునఁ బ్రజ్వలించుచుండఁగా నెదురుగ రాఁజాలుదు. విశ్రమింపక మరల నట్లే యతని కెదురుగ రాఁగలను. గ్రహనక్షత్రాదులకంటె ముందుగాఁ బోవఁగలను. సాగరమును శోషిల్లఁజేసి భూమి భేదించి కొండలఁ బిండిచేసి రాఁగలను. నేనిపుడే [illegible]ఁగా నావేగమునకుఁ బూవులన్నియు లతలనుండి నా వెంట రానోపు. అపుడు బహునక్షత్రములు గల స్వాతీనక్షత్రమువలెఁ గనుంగొనఁ గలరు. మహామేఘమువలె నేఁ బోవు

చుండ మీరును జూడఁగలరు. గరుత్మద్వాయువులు తప్ప నాకాశమున నన్నెదిరించుప్రాణియే లేదు. నాదక్షిణహస్త మదరుచున్నది. నాకుత్సాహము మితిమీఱుచున్నది. సీతా దేవిని దప్పక చూతును. మీరు సంతసమున నుండుఁడు. పది వేల యోజనములైనను దాఁటఁగలనని నాకుఁ దోఁచు చున్నది. ఇంద్రుని బ్రహ్మను జయించి వారిచేతులనుండి యమృతమును దేఁజాలుదు. పెక్కుమాటలేల? లంకను బెల్లగించుకొని తేఁగలనని నాయాశయము. అని యతఁడు గర్జిల్లు చుండఁగా వానరు లచ్చెరువందుచుఁ జూడసాగిరి.

జాంబవంతుఁ డంత నాపావనిం గాంచి వత్సా! బంధువుల దుఃఖములఁ బోఁగొట్టితివి. నీకు వానరులు కార్యసిద్ధ్యర్థము మంగళాశీస్సుల నిచ్చుచుండఁగలరు. పెద్దలయనుగ్రహమున వారిరాశి దాఁటుము. నీరాకం గోరి యిందు మేమె... మొంటికాల నిలిచి యుందుము. మాజీవితములు నీహ...త ములు. వానరవీరుఁ డగునాహనుమ వానరులం గలయం గాంచి నేదాఁటునపుడు నావేగము నీభూమి భరింపఁజాలదు. మహేంద్రశిఖరములు గొప్పవిగా నున్నవి గాన నవియే నా వేగమును భరింపఁగలవు. కాన నవ్వాని నెక్కి నాశక్తిని గ బఱతును.. అని మహేంద్రపర్వతము నెక్కెను. ఆపర్వతము బహువిధసాంద్రవృక్షములతో సరస్సులు లోనగువానితో నిండియుండెను. ఆకొండ యతని పాదఘట్టనమునకుఁ దా జాలక జలములఁ బ్రవహించెను. వృక్షము లూఁగులాడినవి.

విద్యాధరదంపతులు కొండసానువుల వదలి పోవసాగెను. పక్షు లెగురసాగెను. పాములు రంధ్రములలో డాఁగుకొనియెను. అంత నాతఁడు తనజవము నెఱపంబూని సాగరము దాఁటనిశ్చ యించి మనస్సుచే లంకాపురిం బ్రవేశించెను.

మహాశయులారా! ఈభాగమున విశేషవిషయములు లేవు. కాని యించుక హనుమత్ప్రవృత్తి పరిశీలింపఁదగినది.

"సంస్తూయమానో హనుమాన్ వ్యవర్ధత మహాబలః,
సమావిధ్య చ లాంగూలం హర్షాచ్చ బలమేయివాన్. ౪
తస్య సంస్తూయమానస్య వృద్ధైర్వానరపుంగవైః,
తేజసా పూర్యమాణస్య రూపమాసీదనుత్తమం. ౫
యథా విజృంభతే సింహో వివృద్ధో గిరిగహ్వరే,
మారుతస్యౌరసః పుత్త్రస్తథా సంప్రతి జృంభతే. ౬
అశోభత ముఖం తస్య జృంభమాణస్య ధీమతః,
అంబరీషమివాదీప్తం విధూమ ఇవ పావకః." ౭

అని మూలము. ప్రాతిపదికార్థము స్పష్టమే. విశేషమేమని విచా రింతము. హనుమ తన దేహమును బెంచెననఁగా నర్థమేమి?

"విజితే భవతీహ తేనవాయుస్సహజో యస్య సమీతప్రణాదః,
అణిమాదిగుణా భంతి తస్యామితపుణ్యస్య మహాసుఖాప్పదస్య."

త్రిపురాసారసముచ్చయము. 3-వ పటలము.

సూ. "తే సమాధావుపసర్గావ్యుత్థానే సిద్ధయః. 3౮
బంధకారణశైథిల్యాత్ప్రచారసంవేదనాచ్చ
చిత్తస్య పరశరీరావేశః. 3౯

ఉదానజయాజ్జలపంకకంటకాదిష్వసంగ ఉత్క్రాంతిశ్చ. ౪౦

సమానజయాత్ప్రజ్వలనమ్. ౪౧

శ్రోత్రాకాశయోస్సంబంధసంయమాద్దివ్యం శ్రోత్రం. ౪౨

కాయాకాశయోస్సంబంధసంయమాల్లఘుతూలసమాపత్తే శ్చాకాశ
గమనం. ౪౩

బహిరకల్పితావృత్తిర్మహావిదేహా తతః ప్రకాశావరణక్షయః. ౪౪

స్థూలస్వరూపసూక్ష్మాన్వయార్థత్వసంయమాద్భూతజయః. ౪౫

తతోఽణిమాది ప్రాదుర్భావః కాయసంపద్ధర్మానభిఘాతశ్చ. ౪౬

రూపలావణ్య బలవజ్రసంహననత్వాని కాయసంపత్." ౪౭

పాతంజలయోగశా. 3-వ పాదము.

అను యోగశాస్త్రము ననుసరించి యుదాన సమానవాయువు లను హనుమంతుఁడు నిరోధించెను. దాన నతనిదేహము నిశ్శంకముగా నెగురఁజాలు శక్తికలదియై మిక్కిలి తేజోవంత మయ్యెను. నలువదేనవసూత్రమునఁ జెప్పఁబడినట్లు సంయమ నము చేయఁగా భూతజయము, అణిమాదిసిద్ధులు గలుగు నవకాశము కల్గెను. వాయు నిరోధమున నంతర్నాదము వినఁ బడఁగా లంఘన శక్తివంతమయ్యెను. అత్తఱి నాహనుమంతుని శరీర మపూర్వముగాఁ గనుపట్టెను. అనఁగా నత్యద్భుత తేజో వంతమై మహత్తరమై యెగురఁజాలునట్లు తూలమువలెఁ దేలి కయై యొప్పెను. దానిచే నతఁడీసముద్రలంఘన మెంతటిపని యని యూహించువాఁ డయ్యెను. అట్టియూహ గల్గుట గారణము యోగాభ్యాససిద్ధియే. కనుక దానిశక్తిచే

పది వేల యోజనము లెగురఁజాలుదుననియుఁ దెల్పెను. హనుమ తర్వాతఁ గపులకుఁ దెలిపిన పలుకులన్నియు బీరములు కావు. వారికింగల దుఃఖవేగము నుపశమింపఁజేయునవి. అట్టి పరమ జ్ఞానసంపన్నుఁ డూరక డంబములు పలుకునా? ఇతరులు దీనులుగా నుండుటం గాంచి వారికయ్యది తొలంగించుపొంటె ధైర్యము పుట్టించునవి యని మన మెఱుంగవలయు.

మహాశయులారా! యోగవిద్య యెట్టిదో యీభాగము మనకుఁ దెలిపెనుగదా. అట్టి పరమాద్భుతవిద్య యీకాలమున నశించినట్టు లూహింపందగియున్నది. చచ్చువేదాంతము ప్రబలినది. భక్తియనుపేర భుక్తికి నార్జించుచుండ్రు లెక్కువయగుచున్నవారు. కాంచనముల గోరు కపటయోగులు దాసులు మాంత్రికులు యతులు చెలరేఁగుచున్నవారు. భక్తిని బోధింతుమని శిష్యులనుగాఁ బామరులఁ గొందఱంజేర్చుకొని మధ్యవైష్ణవులు లోనగువారు విచ్చలవిడిఁ దిరుగుచున్నవారు. దైవము పేరుచెప్పి యక్రమవృత్తి నూని ధనము సంపాదించి కూడఁబెట్టి బంధుపోషణార్థము రహఃపుత్రసంరక్షణార్థము తిరుగు మహాత్ములు జొన్నవిత్తనములవలెఁ గనఁబడుచున్నవారు. మతద్వేషములు ప్రబలమగునట్టు లుపన్యసించు యతిబ్రువులు తోఁచుచున్నారు. ఛాయాపటములలోఁ దమరూపముల్ చిత్రింపఁబడఁగా వానిం గాంచి యానందించి మేము గొప్పవారమైతిమని తృప్తినొందు కపటయోగులు భూమి యీనినట్టు వెలువడుచున్నారు. పరమతగౌరవమును బాటించు

బుద్ధి సంపన్నులు విరళముగ నున్నట్లు తోఁచెడిని. భగవదా రాధన మనఁగా దధ్యోదనాదికమే యనునూహ గలిగించు నలసు లుపన్యసించుచున్నారు. పరవంచనయందుఁ బ్రవీణులు మత్కుణములవలె వెలయుచున్నారు. దేవతాద్వేషము ప్రబలు చున్నది. ఉపాసనమనునది నామమాత్రావశిష్టము కావచ్చు ననుట కనేక దృష్టాంతములు కనఁబడుచున్నవి. ఇట్లగుటకుం గల కారణము సత్కర్మానుష్ఠాతలు క్షీణించుచుండుటయే యన వచ్చును. భక్తికిఁ బ్రధానము సత్కర్మానుష్ఠానము. దేవతా పూజ లుత్సవాంతము లగుచున్నవి. ధ్యానమునకన్న మిన్న యని విగ్రహారాధన మెన్నఁబడుచున్నది. అట్టి కుక్షింభరుల మాటలకు మోసపోవువా రనేకులు గనఁబడుచున్నారు. ఇట్టి యనాచారములు నశించినఁగాని భక్తి వృద్ధికానేరదు. కృత్రిమ రత్నములవలె భక్తులు చరించుచున్నారు. భగవత్కైంకర్యము కుక్షిపోషణార్థము చేయఁబడుచున్నది. ఇట్లుండ భగవదను గ్రహ మెట్లు కలుగునవకాశము కలదు?

భగవత్కరుణకుఁ బాత్రము కృత్రిమము లేని భక్తి. అది జ్ఞానవైరాగ్యసహితమై సత్కర్మానుష్ఠానమూలము గావల యును. అది పొడసూపిన మతద్వేషములు దేవతాదూషణ ములు నడంగు. పరమతధర్మసహిష్ణుత గలుగు. అది మనశ్శాంత మున కవకాశ మొసంగు. అది తాపత్రయముఁ బాఱఁదోలి దాన నిశ్చలమనస్సంపద కలుగు.అయ్యది యోగాభ్యా [illegible]

కాక తప్పదు. దాన ఫలాభిసంధిరహితసాధుకర్మనిరతి వృద్ధ
మగును. అది భవబంధవిమోచకమగు భగవత్ప్రసాదము గలి
గించు. దానఁ గృతార్థులగుదురు. కావున భగవంతుఁ డొక్కఁ
డయ్యును బహువిధ రూపనామభేదములచే విలసిల్లుననియు,
నందెయ్యది హితమని యెవ్వనికిఁ దోఁచునో ఆరూపనామము
లను దలంచుచు నామూర్తిని హృదయఫలకమునఁ జిత్రించు
కొని దానినే యాశ్రయింపవలయుననియు, నదియే యుత్తమ
తమపూజ యనియు నెఱుంగవలయు. దాన సకల పాప
ములు తొలంగు. భగవదనుగ్రహపాత్రత కలుగు. శ్రీ
రాముఁడు భగవంతుఁ డనియు సీతాదేవి మహాప్రకృతి
యనియు భావించి లోకానుసారములగు వారికృత్యముల
కలరూపెఱింగి వారి నారాధింపవలయును. తచ్చరిత్రమగు
నీకావ్యరత్నమును బఠింపవలయు. వైష్ణవులకే రామాయణ
పారాయణము పూర్ణఫలప్రదము కాని యితరులకుం గాదను
దాసులమాటలు విన రాదు. భగవంతుఁడెల్లర సములుగా
భావించును. ఎవరు నిష్కపటవృత్తులో వారి ననుగ్రహిం
చును. కపటాత్ములు ధనలుబ్ధులు నగు వారి పొంతకుంబోవఁడు.
శ్రీరామచరిత్రము నమ్ముకొని ధనము నార్జింపఁబూనక ఫల
ములఁ గోరక యామహాత్ముని సగుణబ్రహ్మముగా భావించి
ధ్యానింపవలయు. అదియే చక్కనిపూజ. పాషాణపూజ తరణ
సాధనము కానేరదు. పామరులకు భక్తినిగలిగింప మహాత్ములు
చేయుదురు. కాని వారికి ధ్యానమే ప్రధానము. మహాజను

లారా! కిష్కింధాకాండ మిట్లు పూర్ణమయ్యెను. శ్రీరాముని దుఃఖము నటనమే కాని వాస్తవము గాదు. మాయాసీత లంకయందున్నది. సీతాదేవి శ్రీరామునిచెంతనే యున్నది. ప్రకృతి పురుషు లెడఁబాటు గలవారు కారు. ఇతరుల కట్టులున్నట్లు తోఁపఁజేయుదురు. కాన వారి నారాధించి మన మెల్లఁ దత్కారుణ్యంబాత్రులము కావలయును. భగవంతుని స్తవమును బఠింతము.

"అనర్ఘ్యమాణిక్యవిరాజమాన
శ్రీపాదుకాలంకృతశోభనాభ్యాం,
అశేషబృందారకవందితాభ్యాం
నమో నమో రామపదాంబుజాభ్యాం. ౧

ధ్వజాంబుజచ్ఛత్ర రథాంగశంఖ
దంభోళిపాశాంకుశమత్స్యచిహ్నం,
బ్రహ్మేంద్రదేవాదికిరీటకోటి
సంఘృష్టపాదాంబుజయుగ్మమీశే. ౯

రాకాచంద్రనిభాననం రతిపతిద్వేషిప్రియం రాక్షసా
ధీశగ్రీవవిభేదనస్ఫుటపటుప్రఖ్యాతబాణోజ్జ్వలం,
రత్నాలంకృతపాదుకాంచితపదాంభోజం రమావల్లభం
రాగద్వేషవిహీనచిత్తసులభం రామం భజే తారకం. ౧౪

ఆలోలస్ఫుటరత్నకుండలధరం చారుస్మితాలంకృతం
ఆధారాదికచక్రమండలగతం ఆనందకందాంకురం,
ఆవిర్భూతకృపాంతరంగజలధిం ఆక్రాంతవర్ణాశ్రయం
ఆపన్నార్తినిదాఘమేఘసమయం రామం భజే తారకం.

అజ్ఞానగాఢ తిమిరాపహభానుమూర్తి
మార్తచారునయనాంబుజ మాదిబీజం,
అంభోధిమధ్యవటపత్త్ర శయానమాది
మధ్యాంతశూన్యమఖిలాస్పదరామచంద్రమ్." ౨౦

శ్రీరామకర్ణామృతము ౨ ఆశ్వాసము.

ఆశ్రితత్రాణపరాయణత్వప్రదర్శనమను నెనిమిదవప్రకరణము సంపూర్ణము.

కిష్కింధాకాండము సమాప్తము.

శ్రీ. శ్రీ. ౧.



చెన్నపురి: శ్రీ 'రామ' ప్రెస్సున ముద్రితము—1935.—1000.

శ్రీః.

# శ్రీరామావతారతత్త్వము

## తొమ్మిదవ ప్రకరణము.

ఇయ్యది

కడప మ్యునిసిపల్ హైస్కూలునందు ప్రధానాంధ్రపండితుఁడగు

కావ్యస్మృతి తీర్థ:

జనమంచి శేషాద్రిశర్మ విరచితము.

చెన్నపురి:

శ్రీ 'రామ' ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1936.

# కళ్యాణోదంతము.

---

విజ్ఞానధనులారా!

శ్రీరామావతారతత్త్వమునఁ దొమ్మిదవ ప్రకరణము తమకందింపఁగల్గితినని సంతసము నొందుచున్నాఁడను. గ్రంథత్రయావిష్కరణమహోత్సవానంతర మీయదియే మొదటిదిగా వెలువడిన ప్రకరణము. శ్రీరామావతారతత్త్వమునఁ బూర్వార్థమైనదనియు నుత్తరార్ధము ప్రారంభింపఁబడినదనియు నందిది మొదటిదనియు గ్రహింపందగు. ఆలస్యమున కిది కారణమని పలుసారులు వ్రాసి విసిగితిని. కాన నిట నావిషయము వ్రాయక

"కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన,
మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి."

అను గీతావాక్యము నుదహరించి యూరకుండఁ దలంచితిని.

సుందరకాండమున ముప్పదియారుసర్గములకథ యిందుఁ గలదు. హనుమంతుఁడు సాగరలంఘనప్రయత్నము మొదలు సీతాసందర్శనము త్రికాలప్రబోధములదనుకఁ గలకథయే యిందుఁ గలది. శ్రీ ఉపాసనావిషయము వ్రాయఁబడినది. హనుమన్మాహాత్మ్యము ధన్యమగుటకు భగవదనుగ్రహమే

కారణ మనువిషయము ప్రధానముగా వ్రాయఁబడినది. ఈ సుందరకాండము శ్రీరామాయణమునఁ బ్రధానస్థానము నాక్రమించినది. కార్యార్థమున కనుకొనుఁడు, ముక్త్యర్థమున కనుకొనుఁడు భక్తు లిద్దానిని విశేషించి పఠింతురు. కారణము లేక కార్యము పుట్టదన్నసూక్తి యెంత తెలిసిన దదియే కదా. ఈవిషయమునం దాసూక్తిని సమన్వయము చేయుదము. సప్తసర్గనియమమునఁ గొందఱును, ప్రతిదిన మేకావృత్తి పారాయణనియమమునఁ గొందఱు నింక ననేకవిధములుగ దీనిని బారాయణము చేయుదురు. ఆపన్నివారణక్షమమని యాలోచించియే చేయుదురని యూహించెదను. కొందఱు దాసులుగా మాఱి శిష్యులకు నుపదేశించునపుడు సుందరకాండము నిట్లు పారాయణముచేసిన శత్రువిధ్వంసన మగునని చెప్పుచుండఁ గానే నాలకించితిని. పామరు లద్దానిఁ బాటింతురు కదా. నది యెటులున్నను సుందరకాండము ఐహికాముష్మికఫలములను నుపయోగించునన్న నమ్మిక పెక్కండ్రకుం గలదు. ప్రాయికముగా నిట్టిపారాయణము లైహికములు నందుఁ గామ్యములగు కార్యములకే చేయుచుందురని మన మూహించవచ్చును. భక్తియుండుచోట ఫలమిచ్చుదైవమన్న నానుడి వినంబడు చుండును గదా. ఈపారాయణమున నీఫలము సిద్ధించునన్న సిద్ధాంత మంత సమంచితమైనది గాకున్నను బామరుల కాసను గల్పించియైన భక్తి గుదురఁజేయుట కుపకరించు ననవచ్చును. శ్రీరామమంత్రోపాసకులు విశేషించి హనుమన్మంత్రోపాసకులు దీనిం బఠింతురు. మధ్యాహ్నకాల మతిక్రమింపఁగా జపము చేయరాదు గాన నపు డద్దేవతామహిమమును దెలుపుగ్రంథ మును బఠించు టుపాసకులధర్మమని విధి గలదు. అది కామ్య

కర్మము గారాదు. ఫలాభిసంధిరహితకర్మానుష్ఠానము కదా విధివిహితము.

అట్టి యీసుందరకాండము నొకప్రకరణమున నే ముగింపఁజాలక పోయినందులకు మన్నింతురు గాక. ఇందుఁ బెక్కుతావుల నావ్రాసినవ్రాతలు పండితులయాదృతికిఁ బాత్రము లగునని విశ్వసించుచున్నాఁడను. మతమునఁ గల దురభిమానమునఁ గాక సమత్వబుద్ధిఁ బరిశీలించువారల కవిసమ్మతము లేల కాకపోవునన్న గట్టినమ్మకము నాకున్నది. సర్వసమ్మతమగు సిద్ధాంతమే ప్రపంచమున నేకాలమునందు నుండదనువాఁడను గానఁ గొందఱయిన విజ్ఞు లంగీకరించినఁ జాలునని యాశించుచున్నాఁడను. ఇది వాల్మీకిహృదయమా కాదా యనువారికి బదులుచెప్ప నక్కఱయుండదని నాభావము. సత్వరము యీగ్రంథప్రకరణముల వెలువరింప నాశించువాఁడనే కాని సాయము తక్కువ కావున భగ్నోత్సాహుఁడనగుచున్నాఁడను. ఇంచుక తడవైనను భగవదనుగ్రహమును నమ్మి యెట్లో సాగింపఁగల నన్న విశ్వాసము గలవాఁడను. క్రొత్తపోషకులు కొలఁదిసంఖ్యగలవా రిందుఁ గాననగుదురు.

నేనీవత్సరమున వేసవినెలవులలో నెల్లూరునకుఁ బోయితిని. మేనెల 4-వ తేదీ న్యాయవాదులం దుత్తములని పేరు గాంచి సంస్కృతకళాశాల కెంతయో తోడ్పడుచు భాషాభిమాన మూని పండితులెవ్వార లుపదేశించిన నుచితరీతి సత్కరించుచు సనాతనమతమునందు శ్రద్ధ గలిగి వెలయుచుండు మ-రా-రా-శ్రీ మూలుపూరు శివరామయ్య, బి. ఏ., బి. యల్. గారు హస్తభోజనలాభమున నన్నాదరించుటయే గాక

యవ్యాజప్రీతిం జేసి యిరువదియైదురూప్యము లొసంగిరి. "శ్రీరామార్పణమస్తు" అని తలంచుచుఁ బరిగ్రహించితిని. శ్రీరామావతారతత్త్వమున నుద్ధారకులలో వారి నామ ధేయముం జేర్చితిని. ఆశ్రయించిన నిచ్చువా రరుదుగదా. అట్టి యిక్కాలమున నవ్యాజప్రేమమున వారాదరించి నా కార్యమునకుఁ దోడ్పడినందుల కెంతయుం గృతజ్ఞుఁడనై వారికి శ్రీసీతారామచంద్రు లాయురారోగ్యభాగ్యాదుల నొసంగి కాపాడుదురు గాక యని సర్వథా సర్వదా కోరు చున్నాఁడను. సత్వరమ యీగ్రంథమునఁ బ్రకరణములు వెలు వడఁజేయ నాశీర్వదింపుఁడని పెద్దలం గోరుచున్నాఁడను. "కిం వా ప్రార్థనయా పరోపకృతిషు స్వాభావికస్తద్గుణః" అనుట యెఱింగినవాఁడనే. కాని చాపల్యము మరలఁ బ్రార్థింపఁ జేయుచున్నది. అనభిజ్ఞుఁడనగు నావ్రాఁతలయం దెట్టిలోపము లున్నను బండితులు మన్నింతురనియే విశ్వసించుచు నాసకల కార్యములకుఁ దోడ్పడు భాషోద్ధారకులగు మ-రా-రా-శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారి యభ్యుదయమును గోరుచు నింకఁ బెంచి వ్రాయక లేఖిని నింకొకగ్రంథమును వ్రాయఁ ద్రిప్పుచున్నాఁడను.

ఇట్లు, పండితపాదసేవకుఁడు,

జనమంచి శేషాద్రిశర్మ.

శ్రీ. శ్రీ. శ్రీ.

# వి ష య సూ చి క.

---

శ్రీః

# శ్రీరామావతారతత్త్వము

## సుందరకాండము.

### నవమప్రకరణము.

శ్లో. సీతాలోకనతత్పరం మణినిభం వ్యాఖ్యానముద్రాంచితం
వామే జానుని లంబహస్తమనిశం వీరాసనే సంస్థితం,
మూలే కల్పతరోస్సనాదిమునిభిః బ్రహ్మాదిభిస్సేవితం
ముక్తాహారకిరీటకుండలధరం మూర్ధాభిషిక్తం భజే. ౧

సహస్రనేత్రాననపాదబాహుమనంతవీర్యం రవికోటితుల్యం,
ప్రకృందనానాంప్రశదివ్యదేహం భజామ్యహం తే హరివిశ్వరూపమ్. ౨

కోదండమిక్షుజనిశం స్మరపంచబాణాం
శంఖంరథాంగమభయవమంకుశపాశవేణుం
హస్తైర్దధానమరుణద్యుతిముద్వహంతం
ప్రద్యుమ్నకృష్ణమనిశం భజ రామచంద్రమ్. 3

ప్రసూనబాణాంకిత మిక్షుచాపం చక్రాబ్జపాశాంకుశవంశనాళమ్,
కరైర్దధానం ఘనసీలవర్ణం శ్రీకృష్ణరూపం ప్రణమామి రామమ్. ౪

స్మితాననం పద్మదళాయతేక్షణం వినీలమాణిక్యజితాంగశోభితం,
జటాకిరీటం శరచాపలాంఛనం నమామ్యహం భానుకులాబ్ధికౌస్తుభం. ౫

మహాత్ములారా! భగవత్తత్త్వజిజ్ఞాసువులారా!

శ్రీరామావతారతత్త్వమునం దష్టమప్రకరణమును శ్రద్ధమైఁ బరికించి యుందురు. అందలివిశేషములఁ దెలిసికొని యానందసాగరమున నోలలాడుచుందురు. మానవరూపమున నాపరమేశ్వరుఁ డెట్లు నటించెనో, కర్మసిద్ధాంతము ననుసరించి యెవరెవరి కెట్లెట్లు తోడ్పడి యిష్టసిద్ధులఁ జేకూర్చెనో బోధపడియుండును. చంద్రచంద్రికలకుం బోలె నవినాభావసంబంధము గలభగవతి మహామాయ సీతానామధారిణి తన్నెడఁబాసి యెందో యిడుమలం గుడుచుచున్నయట్లు, తానెందో వంతలఁ గుడుచుచున్నట్లు నటించుచు నారూపమున మానవులకుఁ గర్తవ్యకర్మముల నెట్లుపదేశించెనో యింతక యూహించియే యుందు రనుకొనియెదను. సామాన్యధర్మములే కాఁగాక రాజధర్మములు విశేషరీతి ననుకరించియే యుండు ననియు నాధర్మముల రాజు లెట్లు వర్తింపవలయునో యెట్లు మెలంగిన న్యాయ్యమగుసిద్ధి కలుగునో అనువిషయముల శ్రీరాముఁడు సుగ్రీవు నాశ్రయించునెపమున లోకమునకు వెల్లడించెనని మీ రెఱింగియుందురని విశ్వసించెదను. సుగ్రీవునిప్రార్థనమున వాలిని విచారింపకయే వధించి పామరులకుం గలసంశయములను వాలిప్రశ్నములకు సమాధాన మిచ్చునెపమునఁ దనసర్వజ్ఞత్వము నెట్లు చాటెనో మీరు పరిశీలించియే యుందురని నమ్మెదను. సామాన్యధర్మముల నాలోచించి వాలివధమున శ్రీరాముఁ డకార్యమొనరించెనను దురూహలు మీ పావనమానసములఁ బొడకట్టవని తలంచెదను. మృత్యువు ముందుగాఁ దెలుపక తటాలున వచ్చి చంపవచ్చునా యన్నప్రశ్న మెంత యుక్తియుక్తమో వాలిని విచారింపక సుగ్రీ

వునిమాటల నమ్మి వాలిని రాముఁడు వధించి పాపము మూట కట్టుకొనియె నన్న ప్రశ్నముకూడ నంతయుక్తమే. ఏసమయ మున కెవ్వని నెవ్వానిమూలమున నధింపఁదగునో యట్లు చేసి వానిని దరింపఁజేయుటయే సర్వజ్ఞత్వము గాని వాదిప్రతి వాదులను సాక్షులను విచారించి శిక్షించుట కాదు. అది సామాన్యరాజధర్మము.

"యాంతి రాజర్షయశ్చాత్ర మృగయాం ధర్మకోవిదాః,
తస్మాత్త్వం నిహతో యుద్ధే మయా బాణేన వానర.
అయుధ్యన్ప్రతియుధ్యన్వా యస్మాచ్ఛాఖామృగో హ్యసి."

అను మాటలమూలమున వాలివధము సధర్మమనియే రాముఁ డెట్లు వాలిని దృష్టిపఱచెనో యోజించిన విచారింపక చేసె నన్నవాద మెంత నిస్సారమో స్పష్టమగును. శ్రీరామమూర్తి కృతజ్ఞతయను సద్గుణమును మాని కేవల కామపరతంత్రుఁడగు సుగ్రీవునిపై నాగ్రహమూనుట, ఆవిషయ మెఱింగియే ముందు గనే హనుమంతుఁడు వానరరాజునకు హితము దెల్పుట, దాని నంగీకరించి యతఁడు తదనురూపముగాఁ బ్రవర్తింపక మునుపే రామచంద్రుఁడు సోదరుని బంపుట, తార యాతని కోపము నుపశమింపఁజేయుట, సుగ్రీవుఁడు రామదర్శనము చేయఁగా నానందించి భగవంతుఁ డనుగ్రహమునే కనఁబఱ చుట యనువిషయమును బఠించినపుడు శ్రీరాము నాగ్రహా నుగ్రహము లెట్టివనితని లోకులకు బోధించునవియో మీరు విమర్శించినయే యనుభవింపనియుఁ, దత్సారగ్రహణమున నానంద పరవశులై యనుభవింతురనియు విశ్వసించెదను.

సీతాన్వేషణార్థము వానరుల నలుదిక్కులకుఁ బంపు నపుడు శ్రీరామచంద్రుఁడు హనుమంతునకే ముద్రికనొసం

గుట యనువిషయమును విమర్శించి యారాముని సర్వజ్ఞ త్వము నెఱింగియే యుందురు. దక్షిణదిశయందు జానకి యున్నట్టు తలంచి ముద్రికయిచ్చియుఁ దక్కినదిక్కులకు వానరలను సీతాన్వేషణమునకై పంపుట యెందులకనియు, సృష్టి కార్యముచే భావికాలజ్ఞానము లేదని స్పష్టమనియుఁ బలుకు సోమరులయాశయము లెంత నిస్సారములో యనునది మీ మదులకుఁ బొడకట్టియే యుండును. హనుమదాదులు స్వయం ప్రభను గాంచువిషయమునఁ గలతపోమహత్త్వము విమ ర్శించి పూర్వకాలమునఁ గల దేవతాభక్తి యెట్టిదో యిక్ష్వాకులపుభక్తి యెట్టిదో గ్రహించియే యుందురు. అంగదాదులు ప్రాయోపవేశము చేయుట, సంపాతి వారితో భాషించుట యనువిషయమును జదివి యందలిసారము నెఱింగియుందురు.

భగవత్కార్యనిరతులకుఁ బక్షులు కూడ నెట్లు తోడ్పడి వారి కష్టములఁ దొలఁగింపఁదలంచునో "యాంతి న్యాయప్రవృత్తస్య తిర్యంచోఽపి సహాయతామ్" అను నీతి యెంత సత్యమో మీకుఁ దెలిసియే యుండవచ్చు. సంపాతికి మరలఁ బక్షములు వచ్చుట యనుగాథ పామరజనవిశ్వాసపాత్రము కాకపోయి నను బుద్ధిమంతులకు నచ్చెరువు గలిగించుచు సత్యపూతమైన దని గ్రహింపఁ దగినచోట మీ కానందదాయకమై యుండు నని యూహించెదను. వానరులు సముద్రలంఘనవిషయమునఁ దమతమశక్తులఁ దెలుపుచుండ హనుమంతుఁ డూరకుండుట యు జాంబవంతుఁ డీక నూరకయున్నఁ గార్యము సాగదని తలంచి హనుమంతునిఁ బురికొలుపుటయు నందుల కతఁ డీ కొనుటయుఁ బఠించియుందురు. హనుమానునిశక్తియు దృష్ట

భక్తియు భగవత్కార్యానురక్తియుఁ బరికించి పరమానంద సాగరమున నోలలాడియుందురని విశ్వసించుచున్నాఁడను.

ఈప్రకరణమునఁ గిష్కింధాకాండమంతయు ముగింపఁ బడినది. అందందుఁ గొన్నిశ్లోకములకుఁ దమమతమున కనురూపమగు నర్థముం జెప్పి యాచార్యులమూలముననే భగవత్కృప లభించును గాని మార్గాంతరమునఁ గాదనియు, వైష్ణవచిహ్నములే లేకున్న భంగవంతుఁ డాతనిఁ జూడం గూడఁ దలపోయఁడనియు, రామాయణము వైష్ణవులకొఱకే యేర్పడినదనియుఁ గొంద ఱాచార్యబ్రువులు తలంతురు. ఇంతకంటెఁ బొరపాటు వేఱొకటి లేదు. రామాయణము భగవచ్చరిత్రమని యొప్పుకొన్నవా రిప్పలుకుల నంగీకరింపరు. భగవంతునిచరిత్ర మెల్లరకుఁ బఠనయోగ్యమే కాని యొక్కతెగవారికి మాత్రమే కాదు. అట్లే యయ్యెనే నది భగవచ్చరిత్రము కానే కాదు. సర్వప్రాణులను నారాధ్యుఁడు కదా యామహాత్ముఁడు. సర్వభక్తుల కిష్టార్థప్రదుఁడు కదా సర్వేశ్వరుఁడు. సర్వసముఁడుకదా పరమాత్ముఁడు. అట్టివానిచరిత్ర మందఱకుం గాక యొక్కతెగవారికే యనుట తెలివితక్కువప్రసంగమే యగును.

"ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా"

అన్న న్యాయము ననుసరించి యెవ్వాఁ డెట్లు పూజించినను శుద్ధచిత్తుఁడయ్యెనే నతనిపూజ నాపరాత్పరుఁ డంగీకరించును.

"అశబ్దమస్పర్శమరూపమవ్యయం
తథాఽరసం నిత్యమగంధవచ్చయత్,
అనాద్యనంతం మహతః పరం ధ్రువం
నిచాయ్య తం మృత్యుముఖాత్ప్రముచ్యతే." ౧౫. వల్లి. ౩.

నిత్యోనిత్యానాం శాశ్వతశ్శాశ్వతానా
మేకో బహూనాం యో విదధాతి కామాన్,
తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరా
స్తేషాం శాంతిశ్శాశ్వతీ నేతరేషామ్." ౧౩. స్క. ౫.

కఠోపనిషత్తు.

"యత్తదద్రేశ్యమగ్రాహ్యమగోత్రమవర్ణమచక్షుశ్శ్రోత్రం తదపాణి పాదం నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం యద్భూతయోనిం పరి పశ్యంతి ధీరాః."

౬. ముండకోపనిషత్తు.

అద్రేశ్యమదృశ్యమిత్యర్థః......

"ప్రపంచోపశమం శాంతం శివమద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః."

౭. ద్వితీయఖండము. మాండూక్యోపనిషత్తు.

"వదంతి తత్తత్త్వవిదస్తత్త్వం యద్ జ్ఞానమవ్యయం,
బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి కథ్యతే." ౧౧
శ్రీభాగవతము. ౧ స్క. ౨ అధ్యా.

"మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ,
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ." ౭
భగవద్గీత. ౭ అధ్యా.

ఇట్లు ప్రమాణములు లక్షలు చూడవచ్చును. ఎన్ని గ్రంథములు వెదకినను భగవంతుఁ డొక్కఁడెగవారికే ప్రసన్నుఁడగుననియు నాతెగవారే వైష్ణవులనియుఁ జేలదు. అంతియు కాక యట్టివాఁడే యగునేనతఁ డొకానొకఁడనియే స్పష్టమగును గాని పరమాత్మ యని తలంప నవకాశ మీయదు.

ఘేదకల్పనలన్నియుఁ గుక్షింభరులమాటలే యని మనము నమ్మి భగవంతు నారాధింపవలయును. పరిశుద్ధభక్తి గలవారలకందఱ కును నాతఁడు ప్రసన్నుఁ డగు. బాహ్యచిహ్నములు కేవల పామరులకొఱకే కల్పింపఁబడినవని తెలిసికొనుట బుద్ధిమంతుల లక్షణము. వాల్మీకిరచించిన రామాయణమహాకావ్యము కేవల వైష్ణవులకొఱకనుమాట బూటకమే యనియు, నందుఁ గర్మ సిద్ధాంతమే ప్రతిపాదింపఁబడినదనియు, నీకావ్యము సర్వమత ములకు సమానఫలదమనియు, భక్తిననుసరించి యిద్దానిఁ బఠిం చిన ఫలము లుండుననియు, నూర్ధ్వపుండ్రధారణము లేక శ్రీరాముఁడు ప్రసన్నుఁడు కాఁడనుటకంటెఁ దుచ్ఛవాక్య వెఱొకటి యుండదనియు మనము నిశ్చయించుకొనవలయు. అట్లే రాముఁ డగు నేని భగవంతుఁడే కాఁడనియు నెఱుంగుట తెఱంగు. ధనార్జనముకొఱకుఁ గపటనాటకసూత్రధారులు కపటయోగులు నగుమహానుభావులు తెలుపువిషయములు సద్విషయములే కావనియు, రాముఁ డెట్లు సర్వభక్తసమా నుఁడో యట్లే యీకావ్యవర్యము సర్వమతసమ్మతమనియుఁ దెలిసికొనుట మంచిది. మంత్రోపదేశములు చేసి చిహ్నములఁ గొన్నింటిని గల్పించి పరమరహస్యమును బోధించునట్లు నటించి పరమతములను దద్బోధకులను దెగఁడిట్టి కన్నులు మూయుచుఁ దెఱచుచు యోగులచందము నటించి యేదోయొకవ్యాజమున ధనమునార్జించి నిస్సంగులవలె సంచరించుచు నుండు దాంభి కులమాటలు సత్యదూరములని మనము విశ్వసింపవలయు. భక్తుఁ డేనాఁడును బరమతధర్మములఁ దూలనాడఁడు. రాముఁడు మావాఁడనఁడు. మాచేఁ దప్ప నితరులచేఁ బ్రస న్నుఁడు కాఁడని పలుకఁడు. ఈచిహ్నములు ధరింపనున్న

రామునికృప కలుగదని దబ్బఱలాడఁడు. ఇవన్ని యు నాస్తిక పరుల మోసపుఁ బలుకులు. వాని వినఁబూనఁ బాపము లభించును. నిశ్చలభక్తిని శ్రీరాముని భగవంతునిగా భావించి మానవరూపమున నవతరించి పామరులకు సత్కర్మానుష్ఠానాసక్తిని గలిగింపఁ దాసును సత్కర్మముల నాచరించుచు లోకపవిత్రచరిత్రుఁడై వెలసెనని భావించి యనన్యగతికులై యారాధించి కృతకృత్యులు గావలయును. భేదబుద్ధియుఁ బరమతదూషణము స్వమతదురభిమానము భక్తిదూరములు. ఇది సత్యము. మూఁటికి ముమ్మాటికి సత్యము.

ఇఁక రామాయణమున నీప్రకరణమునఁ గల సుందరకాండమును గూర్చి యించుక విచారింతము. సుందరకాండమను పేరు దీనికేల వచ్చెననునది తొలిప్రశ్నము. హనుమంతుఁ డెవనియవతార మనునదియు నొకప్రశ్నము. రామునకాంజనేయుని సాయమేల కావలసివచ్చెననునదియు నిట్టివంటిప్రశ్నమే. తొలుత వీనికి సమాధానము వ్రాయవలయును. మతాభిమానము మాని సత్యాన్వేషణమే చేయవలసినది. రామాయణము శ్రీవైష్ణవులకే యనుమహాత్ములలో నగ్రగణ్యులు గోవిందరాజు లనవచ్చును. వైష్ణవులమనువారును ద్వైతులు మూలరామాయణము ప్రమాణమని వ్రాసిరి. దానిచే నీవాల్మీకిరామాయణము వారి ప్రమాణగ్రంథముల లోనిది కానేరదు గదా. శ్రీరాముఁడు భగవంతుఁడని యంగీకరించువారిలో శ్రీవైష్ణవులు చేర నంగీకరింపరేమో. విష్ణుమూర్తియే భగవంతుఁడని కదా వారిమతము. శంకరాదులు కారని యేర్పడును గదా. అట్టిభేదభావము గలవారగు మహాత్ములందు శ్రీవైష్ణవులందఱు చేరరు. కొందఱు మాత్రమే

చేయుదురు. శ్రీవైష్ణవులలో నద్వైతులుంగూడఁ గలరు. వారి ప్రబంధములే యీవిషయమును బోధించుచున్నవి. ఈక్రింది వానిం బరికింపుఁడు. స్పష్టమగును.

౧. వీలత్తనన్ తిరిప్పురం ఎరిత్తవన్.

తిరిపురం—త్రిపురాసురులను, ఎరిత్తవన్—సంహరించినశివుఁడు, వీలత్తనన్—కుడిభాగము. (పరమాత్మ కని భావము) హరిహరులకు భేదమెంతమాత్రము లేదు. ఒక్కశరీరమునందుఁ గుడిభాగమునకు శివుఁడనియు నెడమభాగమునకు విష్ణువనియుఁ జెప్పు. అని తాత్పర్యము.

క్రింది హరిహరాద్వైతము స్పష్టముగాఁ జెప్పఁబడుచున్నది.

౨. "అరన్ నారణన్ నామం ఆన్విడై పుళ్ళూర్ది
ఉరై నూల్ మఱై యుఱైయుంకోయిల్—వరై నీర్
కరుమం అళిప్పళిప్పు కైయదు వేల్ నేమి
ఉరువ మెరి కార్ మేనియొన్ఱు."

(శరీరము నందొక భాగమునకు) అరన్ = రుద్రుఁడనియు, (మఱియొక భాగమునకు) నారణన్ = నారాయణుఁ డనియు, నామం = పేరు. (ఒకభాగమునకు) ఊర్ది=వాహనము, ఆన్విడై=జ్ఞానములేని (తిర్యగ్జంతువనుట) వృషభము. (మఱియొక భాగమునకు) పుళ్ = పులుఁగు. (గరుడుఁడనుట) ఉరై=ప్రతిపాదకమగు ప్రమాణము. (ఒక్కనికి) నూల్ = ఆగమము, మఱై=వేదము. (ఇంకొకనికి) ఉరై=ప్రతిపాదకము. ఒకభాగమైన శివుఁడు ఆగమప్రతిపాద్యుఁడు, మఱియొకభాగమైన విష్ణువు వేదప్రతిపాద్యుఁ డనుట. ఉఱైయుంకోయిల్=వాసస్థానము.

వరై = కైలాసమును, నీర్ = నీరు (సముద్రము) కడ్ మనం = చేయుపని, అయ్ ప్ప్=సంహరించుట. (ఒకనికి) అళ్ ప్పు=[illegible] చుట. (మఱొక్కనికి) కయ్ ద్=చేతియందుండు నాగము [illegible]. (ఒక్కనికి.) వేల్=శూలము, నేమి=చక్రము. (మఱొక్కనికి) ఉరువం (ఒక్కని) దేహము, ఎరి=అగ్నివంటిది. (ఇంకొక్కని శరీరము) కార్ = నీలమేఘమువంటిది. (శివునిశరీరము సు[illegible] చ్ఛాయగలదని యాగమప్రసిద్ధము. విభూతిపూయుట[illegible] దెల్లగానుండును గాన, గవులు శివశరీరమును వెల్లనిదని వర్ణింతురు. అని యాశయము. ఐనను మేనియొన్ను = శరీర మొక్కటియే (పూర్వోక్తరీతిని విశేషణభేదమున్నను [illegible] శిష్టస్వరూపమునకు భేదము లేదనుట.

3. "పొణ్ తిహాళు మేని పురిశడై అంపుణ్ణియనుం
నిన్నులహాం తాయ నెడుమాలుం—ఎన్నుం
ఇరువరంగత్తాల్ తిరివరేలుం ఒరువ
నొరువనంగత్తు ఎన్నుముళన్."

పొణ్ తిహాళు మేని. బంగారువలెఁ బ్రకాశించు శరీరముగల వాఁడును, పురిశడై=అల్లఁబడిన జడగలవాఁడును, ([illegible]) అం=మిక్కిలి యందగాఁడు నగు, పుణ్ణియనుం = పుణ్యమూర్తి (శివుఁడును) నిన్రు=ఉన్నతుఁడై నిలిచి, (త్రివిక్రమావతార మందు) ఉలహాం = లోకములను, తాయ = నతిుంచిన, నెడు మాలుం=దేవతోత్తముఁడును, (విష్ణువును) ఎన్రుం=ఎల్లప్పుడు, ఇరువరంగత్తాలు = రెండుశరీరములుగల్గిన యొకస్వరూపమే, తిరివరేలుం=ఎల్లచోటుల నుండువారలు, (గుణావయవము[illegible] శరీరములకు శివవిష్ణ్వాదిసంజ్ఞాభేదమే కాని తద్విశిష్టశరీరి

భేదము లేదనుట) ఒరువన్=వారిలో నొకఁడు, ఉరువనంగ త్తాల్=మఱియొకని శరీరమునందు, ఎన్రుం=ఎల్లప్పుడు, ఉళన్= ఉండువాఁడే. (శివశరీరమందు విష్ణువును విష్ణుశరీరమందు శివుఁడును సదా వసించుచుండును) శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే—అనుశ్లోకార్థ మిచ్చుట వర్ణింపఁబడినది.

౪. "మునియే నాన్ముగనే ముక్కణ్ణప్పా ఎన్ పొల్లా
కనివాయ్త్తామరైక్కట్కరుమాణిక్కమే యెన్ కళ్వా
తనియే నారుయిరే యెన్తలైమిశైయాయ్ వన్దిట్టు
ఇనినాన్ పోకలొట్టే నొన్నుం మాయం శెయ్యేల్ ఎన్నైయే."

ఈపద్యమందు మూర్తిత్రయమునకు నైక్యము చెప్పుచున్నాఁడు. మునియే=ప్రపంచసృష్టి కనుకూలమైన సంకల్పము గలవాఁడా! (ఇక్కడ "తదైక్షత బహు స్యాం ప్రజాయేయ" యను శ్రుత్యర్థమే చెప్పఁబడినది) నాన్ముగనే = నాలుగు మొగములు కలవాఁడా! (పిమ్మటఁ జతుర్ముఖబ్రహ్మరూపియై ప్రపంచమును సృజించినాఁ డనుట) ఇక్కడ "ఇదగ్ం సర్వ మసృజత, యదిదం కిం చ" అను శ్రుత్యర్థము చెప్పఁబడినది. ముక్కణ్ణప్పా! మూఁడుకన్నులు కలవాఁడా! (ప్రళయకాలమందు రుద్రరూపియై ప్రపంచమును సంహరించువాఁ డనుట) ఎన్=విషయాసక్తిచే నీయం దనురక్తిలేని నాకు, (నీయందను రక్తి కల్గించుటకై) కనివాయ్=పండిన దొండపండువంటి యధరము కలవాఁడా! (భక్తవత్సలుఁడు గాన భక్తులను విషయాసక్తని బోఁగొట్టి భగవదనుభవమునందు రుచికల్గించుటకై వరమసుందరమూర్తిని ధరించినాఁ డనుట) తామరైకణ్=పుండరీకములవంటి కన్నులుగలవాఁడా! పొల్లా = దోషరహితమైన,

కరుమాణిక్కమే = ఇంద్రనీలమణివలె స్ఫురించుచుండిన వాఁడా! ఎన్=విషయాసక్తుఁడనైన నన్ను, కళ్వా = వంచించినవాఁడా! (విషయోన్ముఖ్యమును బోఁగొట్టి భక్తుని స్వాన శంగతునిగాఁ జేసినాఁ డనుట) తనియేన్ = ఏకాకినైన నాకు, ఆరుయిరే=పరిపూర్ణ ప్రాణమైనవాఁడా! తొనోతనై=నాకడకు, వన్దిట్టు=వచ్చి, మిక్కైయాయ్=అధికముగా (భగవదనుభవమునం దభినివేశము కల్గించి) ఇని = అట్లు కల్గినపిమ్మట, నాన్=నేను, పోహల్ఒట్టేన్=విడిచిపోనీజాలను,(నిన్ను) నీవులేక నేనుండఁ జాలననుట. ఎన్నేనున్ను మాయంశెయ్యేల్=మోసపుచ్చకుము. (విషయాసక్తిని మరల నీయందు వైముఖ్యమును గల్గించి నీకును నాకును ఎడఁబాటు గల్గింపకుము) అని ప్రియోక్తిఁ బ్ర సాయించినాను. వీరే. "ఇరెండు ఒన్ద్రాయుకేన" అని తిరు పతికొండనుగుఱించి పాడిరి.

ఇట్టివి హరిహరాద్వైతప్రతిపాదకములగు పద్యములు ద్రావిడప్రబంధములో నించుమించుగా మూఁడువందలకు మించి కనఁబడుచున్నవి. మచ్చునకై యీనాల్గింటి నుదాహరించితిని. వీనింబట్టిచూడ వీరవైష్ణవులు మహావైష్ణవులు కాని వారలకు హరిహరులయందు భేదము లేదనియు, [illegible] తెగలలోఁ గొందఱ కదియే ముక్తిగాఁగలవనియుఁ దోఁచెడిని. వీరవైష్ణవాగ్రగణ్యులగు శ్రీగోవిందరాజు లిట్లు వ్రాసిరి.

"పూర్వస్మిన్కాండే సర్వథా మిత్రసంరక్షణం కార్యమిత్యుక్తం అత్ర దూతేనపతివ్రతయా వైశసం న ద్రష్టవ్యమిత్యర్థః ప్రతిపాద్యతే. యద్వా పూర్వత్ర సర్వసంరక్షణక్షమస్య విష్ణోరాచార్యరూపపురుషకారలాభ ఉక్తః, అధునా ఆచార్య కృత్య ముచ్యతే. తత్ర ప్రథమే సర్గే శిక్షణీయశిష్యాన్వేషణ

ముపపాఠ్యతే." అని. ఇది ద్రావిడ ప్రాణాయామమువంటిది. ఇందాచార్యశిష్యవిషయము లున్నవనుట కేవల కల్పితము. అట్లు లూహింతుమందు రేని మఱియొకవిషయముగా నూహించువా రుండవచ్చును. అందేది ప్రమాణము? ఎట్లు? ఈరెండును సంగతములుకావని మఱికొంద ఱనవచ్చును. ఇట్టివాదముల కెక్కడికి మందల. ఏవరిమతమునకు వారనుకూలముగా నర్థము చెప్పుకొనుట యపరాధమా. అన్నఁ గాదనువాఁడనే నేను. అపక్షమున నితరుల నేల యాక్షేపింపవలయును? ఒక్క శ్రీవైష్ణవజాతికే యీరామాయణమని యెట్లు చెప్పవచ్చును? భగవంతుఁడనియే వారు నమ్ముదురేని వారివాదము దుర్వాదమే యనవలయుఁ గదా. సర్వమతసముఁడు భగవంతుఁడు కాఁడందురా? అప్పుడతఁడు సర్వేశ్వరుఁ డను టెట్లు? కావున. నీతుచ్ఛవాదములకుం బూనక యథాశక్తిన్యాయము ననుసరించి భగవంతుఁ డగుశ్రీరాము నారాధింతము. మీఁద నుదాహరించిన ప్రబంధమునందలి విషయములం బట్టిచూడఁగా, శ్రీరామానుజాచార్యు లద్వైతులే యనియు, నద్వైత భక్తికి యోగ్యులుగాని శిష్యుల నుద్ధరింపఁబూని యొకమతమును గల్పించి విశిష్టాద్వైతమని పేరు పెట్టిరనియు, వారిలక్ష్యమద్వైతమే యనియుఁ, గావుననే విశిష్టాద్వైతమని పేరుపెట్టిరనియు మన మూహింపవచ్చును. వారియాశయమును జక్కనెఱుంగనివారే మతాంతరుల దూషింతురనియు, గురుమతమును జక్కఁగాఁ దెలిసికొనిన వారిప్రబంధమే యద్వైతమును బోధించుచున్నదనియు మనము నిర్ణయింపవచ్చును.

ఇంక సుందరకాండ మను పేరేల దీనికిఁ బెట్టఁబడియెనని విచారింతము. సుందరములగువస్తువుల హనుమంతుఁడు లంకా

పురిం గాంచినకథ కలదు కాన సుందరకాండ మయ్యెనని కొందరు అందురు. వాల్మీకిమహాముని కవిత్వమే యీ భాగమున నత్యంత సుందరముగా నున్నకతన నాపేరు కలిగెనని మఱికొందఱు పలుకుదురు. ఇందలి వాస్తవ మూహైనమే [illegible]. అవుననికాని కాదనిగాని వచింపఁజాలము. మన సిట్టు లుత్సాహితము. హనుమంతుఁ డీశ్వరాంశసంభూతుఁడు. కావున నుపాస్య దైవత మయ్యెను. శ్రీరామభక్తుఁడౌట నట్టివాఁ డయ్యెనని కొందరేమో. సుగ్రీవుఁడు భక్తుఁడే. విభీషణుఁడును భక్తుఁడే. వారి నేల మంత్రమూలమున నారాధింప శాస్త్రము లేదు! వారలు స్మర్తవ్యులే కాని యుపాస్యులు కారు. పరమభాగవతులగు ప్రహ్లాదాదులు

"న హ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః.
తే పునంత్యురుకాలేన దర్శనాదేవ సాధవః."

అన్నప్రమాణము ననుసరించి ద్రష్టవ్యులు, స్మర్తవ్యులు నగుదురు. అంతియ కాని వారి నుపాసించుమంత్రములు కానరావు. నిగమాగమములను రెండుభేదములు గలవు. రెండును వేదములే. కాని నిగమమంత్రములు పారాయణమంత్రములు. ఉచ్చారణముననే పావనత నాపాదించునవి. వేదమంత్రములు [illegible] గైకొని వానియర్థము నెఱింగి తపస్సమాధిముఖమున మూర్తిని గల్పించుకొని దానిని మది నిలిపి ధ్యానించి యా దేవత సాక్షాత్కరింపఁగాఁ దపస్సిద్ధిం గాంచినమహర్షు లాగమములను గల్పించిరి. ఏమంత్రము లెవరుపాసించి సిద్ధిగాంచిరో వారే యామంత్రమునకు ఋషులగుదురు. ఏమంత్రమే ఛందస్సునుండి గ్రహింపఁబడినదో యది తెలియుటకై యా ఛందస్సే యస్థానం జేర్పఁబడియెను. ఇంక ఋషి ప్రథమమున

స్మర్తవ్యుఁడు. కాన నుపాసకుఁడు తొలుత ఋషిని దెలుపు తఱి శిరస్సున బ్రహ్మరంధ్రస్థానమును స్పృశింపవలెనని విధి తెలుపుచున్నది. ఉపాసకునిదృష్టి నాసికాగ్రమున నుండందగుఁ గావున ఛందస్సు నుచ్చరించునపుడు నాసికాగ్రమును స్పృశింపవలయును. ఉపాస్యదేవతానామ ముచ్చరించునపుడు హృదయమును స్పృశింపవలయును. దేవతామూర్తి హృదయాంబుజమున నిలుపవలయుం గదా.

> "హృదయకమలమధ్యే నిర్వికారం నిరీహం
> హరిహరవిధివేద్యం యోగిహృద్ధ్యానగమ్యమ్,
> సకలభువనభీతి భ్రంశిసచ్చిత్స్వరూపం
> సకలభువనబీజం బ్రహ్మచైతన్యమీడే."

అని కదా యాగమము తెలుపును. ఇవి యుపాసకుని నియమావళి. ఇట్టివెన్నియో గలవు. వాని నిట గ్రంథవిస్తరభీతి ప్రాయు మానవలసివచ్చె. హనుమన్మంత్రము లనేకములు గలవు. శంకరమంత్రము లెట్లు వేదముల నసంఖ్యలుగనున్నవో యట్లే తదంశసంభూతుఁ డగుట హనుమంతు నుపాసించు మంత్రములు గలవు. అందు సువర్చలాహనుమన్మంత్రమని సుందరహనుమన్మంత్రమని రెండుమంత్రములు కనుపట్టెడు. సువర్చల హనుమంతుని భార్య. బ్రహ్మచారి కదా హనుమంతుఁ డని యనుప ఉండెను. అనతాంతరమున నతనికి వివాహమున్న్యాను. అయ్యయే సువర్చల. ఒకముని యుపాసించుచుండఁగా సువర్చలతో హనుమ ప్రత్యక్షమయ్యెననియు నతఁ డడుగ భార్య యీయఁడు. ఇన్నిట్లుపాసింతువే నభీష్టములిత్తునని చెప్పెననియుఁ బ్రతీతి కలదు. వివాహార్థి యగువానికి నట్లు కనఁబడి

యుండవచ్చుననుటయు సంగతమే. కాళిదాసునకు మహాకాళి శారదారూపమునఁ గనఁబడుట యతని వాంఛానుకూలముగ వరమీయఁ గోరియే కదా. సుందరహనుమన్మంత్ర మొకఁడు పరాశరసంహితయం దున్నది. దాని నుపాసించుటకు సుందరకాండమును (అనఁగాఁ దచ్చరిత్రమును) పారాయణము చేయవలయుననియు నట్లైన నాహనుమత్ప్రసాదలాభము కలుగుననియు గురుపరంపరాగతనియమము. రామాయణమున నన్నికాండములవలెఁ గాక సుందరకాండమునే ప్రధానముగాఁ బారాయణము చేయువా రనేకులు గలరని యెల్లరకుఁ దెలిసినవిషయమే. ఏల? సీతాశోకనివారణము చేయు శ్రీరామముద్రికాప్రదానకథ యిందుఁ గలదు గాన నిది ముఖ్యమయ్యెనని కొంద ఱందురేమో. అటులైన శ్రీరామహనుమ సల్లాపాదు లగుభాగములు గలిగి సీతాశోకనిర్మూలనము పట్టాభిషేకముగల యుద్ధకాండ మేల ముఖ్యము కాదు? కాన నీయుక్తి కాళయుక్తియే యనవలయును. హనుమదుపాసకుఁడు కార్యగౌరవమును బాటింపక ఫలసిద్ధిఁ గాంచిన మహాహనుమంతునిచరిత్రమగుట నీకాండమును పారాయణము చేయుదురన్నది యుక్తముగ నున్నది. కేవలపారాయణమునే చేయువారు కొందఱు గలరు. అది యథాశక్తిన్యాయమునకు నుదాహరణమే. ఉపాస్యదేవతామహత్త్వబోధకము కదా చరిత్రము. అది నిరంతరస్మర్తవ్యమే యగు. సప్తసర్గపారాయణాది విధులననుసరించి యీకాండమును బఠించుటఁ గామ్యప్రయోగములు కొందఱు చేయుదురు. వారియోగ్యత ననుసరించి యవి ఫలించును. ఇన్నిటిని ఫలింపఁజేయునది

భక్తియే యనవలయు. కావున సుందరహనుమద్దేవతాకమగుట నిది సుందరకాండమని పేరుగాంచెనని నిర్ణయింపఁదగు.

హనుమంతుఁ డీశ్వరాంశసంభూతుఁడా?

అను ప్రశ్నమునకు నెక్కువగా సమాధానము వ్రాయక సంగ్రహించి వ్రాయుదు.

"నమోఽస్తు రామభక్తాయ గోబ్రాహ్మణహితాయ చ,
నమోఽస్తు రుద్రరూపాయ కృష్ణవక్త్రాయతే నమః." ౬
స్కాందము. బ్రహ్మఖండము. ౩౬ అధ్యా.

ధర్మారణ్యమాహాత్మ్యమున హనుమన్మహర్షి సమాగమమునఁ గలదు. అందే

"తతః ప్రాహాంజనీపుత్రస్సంప్రాప్తే హి కతౌ ద్విజాః,
నాగమిష్యా హం తత్ర ముక్త్వా రామేశ్వరం శివం." ౨౪

అని కలదు. శ్రీరామమూర్తి రావణాదివధజనితపాపక్షయార్థము రామేశ్వరనామకలింగముఁ బ్రతిష్ఠించి యద్దానిసంరక్షణార్థము విప్రులకు వసతులఁ గల్పించి హనుమంతు నందు నిలుపఁగా నా బ్రాహ్మణులవసతుల నందలిరాజు ఈయకపోఁగా వారు శ్రీరామునకుఁ జెప్పుకొనఁ బోవునపుడు హనుమంతునితో మొఱ పెట్టుకొనువిషయమునఁ గలవచనములే యివి యని యెఱుంగవలయు. పాలకుఁడు విష్ణువు సంహర్త యీశ్వరుఁడు నని యంద ఱెఱుంగుదురు. వా రిరువురు కలిసి పనిచేసినఁ గాని ప్రపంచరక్షణము సాగదనుటయు నేమాత్రము లోకజ్ఞానము గలవారలైన నెఱుంగుదురు. కావున హనుమత్సహాయము శ్రీరామున కావశ్యకమే. ఒకప్పుడు విష్ణువు శివునిం గొల్చు

టయు నొకప్పుడు శివుడు విష్ణువుం గొల్చుటయుఁ గలదని పురాణములే తెల్పుచున్నవి.

"న హి విష్ణుః ప్రణమతి కస్మైచిద్విబుధాయ చ,
యత ఆత్మానమేవేతి తతో రుద్రం భజామ్యహమ్."

అను మహాభారతవచన మసత్యము కాదు కదా. విష్ణ్వే శంక రుడు నని యెఱుఁగవలయు. రామనామజపపరాయణుండు శంకరుఁడని యంగీకరించి యొగిరిపడిపాపములు శంకరుని స్తోఁ డు విష్ణువను ప్రమాణములు కనఁబడినప్పుడు నగుదు రేమో. అంతకంటె వారేమి చేయఁగలరు? సకలప్రమాణముల నొకల ధరింపవలయుఁ గాని యందొకఁడు తమమతమును బాధించు దానిని బ్రమాణము కాదనియుఁ బ్రక్షిప్తమనియుఁ బలికిన నితరులు నట్లే యన్నపు డేమిచేయఁగల్గును? అన్నియుఁ బ్రమా ణములే. వారివారి యోగ్యతల ననుసరించి [illegible] చారములయం దాసక్తి గల్గును. [illegible] ప్రమాణములని వారికిం దోఁచును. బుద్ధిమంతు లన్నిటిని బ్రమాణములుగా గ్రహింతురు. అంతియకాని యొక గ్రంథ మునందే శివకేశవులకు నభేదము చెప్పఁబడినను దానిని బ్రక్షిప్తమనియు విష్ణూత్కృష్టత తెల్పునవి మాత్రము ప్రమాణ మనియుఁ బలుకుట తెలివితక్కువప్రసంగమున [illegible] ణము గాక మఱేమగును? ప్రకృత మనుసరింతము. సుందర హనుమద్భక్తులకుఁ దన్మహత్త్వబోధకమగు సుందరకాండము ప్రధానమయ్యెనని తేలెను గదా. శ్రీరామాయణ[illegible] మగుటయుఁ బ్రధానకథ రామునిదగుటయుఁ గారణము లుగా శ్రీరామభక్తులకు నిది ప్రధానమే యగుననుటయు నిశ్శంకము. ఈకాండమునందు హనుమంతుఁడు సాగరోల్లం

ఘనముఁ జేయును. అద్దానింబట్టి భగవద్భక్తుఁడు నిర్భయముగా సంసారోత్తరణము చేయఁగల్గునని యూహింపందగు. ఆంజనేయునకు ననేకవిఘ్నములు గల్గును. కాని వాని నవలీల దాఁటి గమ్యస్థానమును జేరును. అను విషయముంబట్టి భక్తుఁడు సంసారము నుత్తరింపఁబూనఁగా నతని దేవతలు పరీక్షింతురు. ఆపరీక్షల నన్నింటి నాతఁడు దాఁటఁగలఁడని తెలిసికొనందగు. మఱియు భక్తుఁడు స్వామికార్యతత్పరుఁడు కావలయు. తనప్రాణముల నెఱవేర్ప బద్ధకంకణుఁడు కావలయునని హనుమత్కార్యపరత్వము మనకుఁ దెల్పును. ఆయావిషయము లాయాకథాభాగములఁ జర్చింతును. దిఙ్మాత్ర మిచ్చో వ్రాసితిని. ఉపాసకుఁడు హనుమంతు నుదాహరణముగాఁ గైకొని మహాసాగరము నాతఁడు దాఁటఁగలనా యని సంశయింపక కార్యమునకుఁ బూనినట్లు తాను దృఢభక్తిగలిగి భగవంతు నారాధించి యిష్టసిద్ధిం బడయవలయు. ఈపని శక్యమా యని సంశయింపరాదు. "సంశయాత్మా వినశ్యతి" అని కదా భగవద్వాక్యము తెలుపును. ఎప్పటికైన నది సాధ్యము కాకపోదు. కాళిదాసు మహాకాళి నుపాసించి యేడు జన్మముల సిద్ధి గాంచనేరక యెనిమిదవజన్మమున క్షణమాత్ర ప్రయత్నమున సిద్ధిని బొందెనని ప్రాచీనులు పలుకుదురు. సత్యమే. ఒక్కముహూర్త మెంతదృఢభక్తి నారాధించిన నామనోజేవి ప్రత్యక్షమగునని తలంపరాదు.

"ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః,
అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్."

అని కదా గీతావాక్యము కనఁబడుచున్నది? ఈజన్మమున నల్ప ప్రయత్నమున నది సిద్ధించినను దద్విషయకప్రయత్నము

పూర్వజన్మముల సాగియే యుండునని మనము తెలిసికొనవల యును. పూర్వజన్మమే లేదనువా రుందురు. అట్టివారికిఁ గర్మ సిద్ధాంతమే రుచింపదు. "తస్మాత్సర్వప్రయత్నేన ఋణం కృత్వా ఘృతం పిబేత్" అనువారికి జన్మాంతరము గలదను విశ్వాస మెట్లు కలుగును? పాశ్చాత్యమతస్థాపకులు గూడఁ బూర్వజన్మము నంగీకరింపఁ బూనిరి. కావున నాస్తికులయు నాస్తికాభాసులయు వాగ్ధోరణుల మన మంతగా విశ్వసింపక మహర్షులమతము ననుసరించి వర్తింప నిశ్చయింతము. ఇఁకఁ సుందరకాండమునఁ గలకథను బఠించి యందలిసారమును గ్రహింతము.

## హనుమంతుఁడు సాగరమును దాఁటుట.

* జాంబవత్ప్రముఖులు పురికొలుపఁగా హనుమానుఁ డం పగతురనోడించి పనిసాధించువాఁడు కాన నరిపీఁచని లెక్కఁగొనక సీతానివాసమును వియన్మార్గమునం బోయి కాంచ నెంచెను. మహాసాగరము నిరంతరాయముగా దాఁటుట కష్టమే. ఐనను దానిం జేయందలంచి విజృంభించి శిరఃకంఠములు పైకెత్తి నిలుచుండ మత్తవృషభమువలెఁ గన్పట్టెను. శాద్వలములపై నిలుచుండి హుంకరించుచు మృగపక్షుల నదలఁజేయుచు నిటు నటు తిరిగెను. ఆపర్వతమునఁ గలభాగములలో నొక మంచి చోటు గలదు. అయ్యది వివిధవర్ణములుగలిగి ధాతువుల వెలుఁగుచుండు. కామరూపు లగుగంధర్వాదు లందు నప్పు డపుడు వచ్చి విహారము సల్పుచుందురు. మదగజనిబిడమగు

* ఇయ్యది సుందరకాండమునఁ దొలిసర్గమునఁ గలయది.

నాతావున హనుమ నిలువంబడి గజరాజువలెఁ గనఁబడుచుఁ బయనముసేయుకోరికి నిష్టదేవతను బ్రార్థింపఁ బూని సూర్యశచీపతి వాయుబ్రహ్మలకు దేవయోనులగు నితరభూతములకు వందన మాచరించి తూర్పుదెస మోమునునిచి నిలుచుండి తన జనికిం గారణభూతుఁడగు వాయువునకు మరల దోసిలొగ్గి రామునకు మ్రొక్కి సౌమిత్రికి నంజలిబంధించి నదీసాగరములకుఁ దలయొగ్గి చెంతనున్న బంధువులం గౌఁగిలించుకొని ప్రదక్షిణమాచరించి వారి బహూకరించి దక్షిణదిక్కునకుం బోవువాఁడై కార్యసాధనమున సమర్థుఁడు గాన మేను పెంచసాగెను. కపులందఱుం గాంచుచుండ రామాభ్యుదయముం గోరి పర్వకాలమున నింగిందాఁక సాగర ముప్పొంగునట్లు పెరుఁగుచు దాఁట నుంకించుచు బాహువుల నాకొండను బీడింపఁగా నది వడఁకెను. దానఁ బూవులురాలెను. ఆవాసనలలముకొనఁగా నాకొండ పుష్పాద్రివలె నుండెను. ఆబాహుపీడనమున నాకొండనుండి జలము స్రవించెను. ఆకొండయాకులతం గాంచఁగా దానిగుహల నున్న జంతువులు భీతిచే వికృతస్వరముల వెడలింపఁగా నవి యంతట నిండిపోయెను. అందలి క్రూరసర్పములు విషము నుమియుచుఁ గోపమునఁ బాషాణములఁ గోఱలతోఁ గఱువఁగా గండశిలలు విషాగ్నికీలలు రగుల్కొని మండుచు ననేకశకలములుగాఁ బగిలిపోయెను. అందలితాపసులు కొండ కదలఁగా భయపడి పై కెగిరిరి. అందువిహరించు విద్యాధరులు పానపాత్రములఁ బాఱవైచి యమూల్యభోజనభాజనముల దిగనాడి తమకళత్రములంగూడి పై కెగసిరి. మహాత్ములగు విద్యాధరవరులు కొండ అణిమాద్యష్టసిద్ధిరూపమగు మహావిద్య వెలయించుచుఁ

దమవారలంగూడి యాకాశమున నిలుచుండి యాశ్చర్యప్రము
గతిఁ గాంచుచుండిరి. మహర్షులు లోకగురువాని [illegible]
తము నెఱింగి సంతసించుచు నతనింగని యీతఁడు [illegible]
సంకాశుఁడు, ధీరుఁడు, వేగవంతుఁడు కాన నీతని కీసముద్ర
మేపాటిది. దీనిం దాఁటం గోరుచున్నాఁడు. శ్రీరామ[illegible]
ర్థము దుస్తరవారాశి దాఁటఁగోరెను. అని పలికిరి. [illegible]
లాలకించి విద్యాధరు లాహానుమను సంతసమునఁ గనుఁగొనిరి.

అంత హనుమంతుఁడు కదలి మేఘధ్వనివలె [illegible]
పెద్దతోఁకను గరుత్మంతుఁడు పాములం జిమ్మునట్లు [illegible]
మునఁ బడఁజిమ్మెను. అత్తఱి లంఘింపంబూని [illegible]
శము కొండపై గట్టిగానూఁది దేహమును బొడవుగ [illegible]
నడుము సన్నము కాఁగాఁ జరణములను భుజములను [illegible]
యించి మెడనట్లే ముడుచుకొని లోపలనడఁగియుండి తేజము
బలము నాకాశాదిస్థలంబులఁ జరింపవీర్యముఁ బైకి [illegible]
కొని కన్నులఁ బైకెత్తి దూరమార్గముం గాంచుచు [illegible]
టకై యూపిరి బిగియఁబట్టి యంబరమునే చూచుచు [illegible]
బుట్టిపడఁ జుట్టునున్న వానరులం గని యిట్లు పలికెను. కో[illegible]
దీకూఁగుచుండగు శ్రీరాముఁడు విడిచిన బాణము వాయువేగ
మునఁ బోవురీతి నేను రావణపాలిత లంకానగరమునకు [illegible]
అందు సీతదర్శనము కాదేని యట్లే దేవలోకమునకు [illegible]
అందును సీతాదర్శన మబ్బదేని రావణుని బట్టి తెచ్చెద. [illegible]
లైనఁ గార్యము పండించుకొనియే సీతతోఁ [illegible]
కాదేని రావణునితోడ లంకం గొనివచ్చెద. అని పలికి [illegible]
కుఁడు గాన దూరమనియు సాగరమనియు [illegible]
గరుడునిగాఁ దన్నుం దలంచుకొని మీఁదికెగిరెను. [illegible]

నందలివృక్షములు వేగాకృష్టములై యెగసెను. వానిందీసికొని యంబరమునఁ బరుగిడసాగెను. బంధువులు దూరదేశమున కరుగువాని వెంబడించిపోయి మరలునట్లు చెట్లు కొన్ని భారమునఁ గ్రిందఁబడియె. ఆవీరుఁడు సాగరముచేరువఁ బోవఁగా మును బ్రాఁగువానిరీతిగను, బయిగా మింటికెగయుతఱి నంబ సాగరము నొక గ్రుక్కగాఁ గొనకోరునట్లు కనఁబడియెను. ఉత్తరపుదిక్కు చివరనుండి వెలువడి తోఁకతోఁగూడి యంబరమునఁ బడినతోఁకచుక్కవలె వాలము గలిగినహనుమ రావణున కనర్థము కలిగించులాగునఁ గనఁబడెను. సాగరోర్ధ్వభాగమునఁ గనఁబడుశరీరముతో జలములం దోఁచు ప్రతిబింబముతోఁ గూడి యేకాకారుఁడై పోవుతఱి నధోభాగము నీళ్లలోను మీఁదిభాగము తెరచాపలోనగునవి బయటను గలిగి గాలికిం జనునొక యోడవలెం గనఁబడియెను. ఆకసమున కెగురుచున్న యలలపుంజము నింకను పైకిఁ బోనీయక పైనఁ బోవు తనగమనవేగమున దానిని మరల సంద్రమునఁ బడఁజేయుచు హనుమ దాఁటుచుండెను. అలలు లేచుట పడుట యనుకార్యములఁ జేయుచుండఁగా నందలిజలచరము లందఱును స్పష్టముగాఁ గనఁబడుచుండెను. అందలిపాములాహనుమం గాంచి గరుడుఁడని తలంచినవి. పదియోజనములవెడల్పు ముప్పది యోజనముల పొడవు గల యాహనుమంతునినీడ జలములఁ బ్రతిఫలించి యాతనివెనుకఁ బోవుచు నొకమేఘమువలెఁ గనఁబడసాగెను. నిరాధారముగు నంబరమునఁ జను నాకపివీరుఁడు పక్షవంతమగు కొండవలెఁ గనఁబడియె. ఆతనివేగమున కాభాగమందలి జలము క్రిందికిఁ బోయినట్లుండ నది యొకదోనెవలె నూహింపఁబడుచుండెను. ఆతఁడపుడపుడు మబ్బులవలనఁ గనఁ

బడక యవిచ్ఛేటి మరలఁ గనఁబడుచుఁ జంద్రబింబమువలె నుం డెను. ఆతనిపయనముం గని దేవగంధర్వాదులు పూవులవానఁ గురియించిరి. భాస్కరుఁడు సుఖస్పర్శుఁ డయ్యెను. వాయువు చల్లఁగా వీచుచు నతనికిఁ దోడుపడియెను. ఋషులు స్తుతించిరి. వియచ్చరులు పాడిరి. ఆతనిపూన్కి నెల్లరుం బ్రశంసించిరి. రామ కార్యార్థ మాహనుమంతుఁ డరుగుచుండఁగా సగరపుత్త్రులచే వర్ధిల్లినవాఁడు గాన నాకులగౌరవమునుగోరి సముద్రుఁ డిట్టు లాలోచించెను. ఇక్ష్వాకుకులవర్ధనుఁడు రామచంద్రుఁడు. ఆమ హాత్మునికార్యార్థ మీహావని యరుగుచున్నవాఁడు. నేనిపుడు తోడుపడకున్న సర్వథా నింద్యుఁడనే యగుదును. ఇక్ష్వాకు కులసంభూతుఁ డగురాముని కతఁడు సఖుఁడు. కాన నీతఁడు శ్రమపడరాదు. విశ్రాంతి నొందునుపాయము చేయవల యును. నాపై విశ్రాంతినొంది సుఖముగా నితఁడు పోవుఁ గాక. అని యోజించి సాగరుఁడు తనలో దాఁగియుండి హిర ణ్యశృంగవిరాజితుఁ డగు మైనాకపర్వతునిం గని గిరీంద్రా! ఇంద్రుఁడు నాలో నిన్ను నిలిపినాఁడు. పాతాళద్వారము నాన రించి రాక్షసులు రాకుండ నున్నాఁడవు. ఊర్ధ్వాధోర్ధ్వ భాగములఁ బెరుఁగుశక్తి నీకున్నది. కాన నొక్కపనికిఁ బురి కొల్పెదను. లెమ్ము. కపివరుఁ డగుహనుమ యతఁడో శ్రీరాము కార్యార్థము సాగరమును దాఁటుచున్నాఁడు. ఇది భయంకర కార్యము. ఇక్ష్వాకుకులజునకు సాయముచేయఁబూని పోవు నీతినికి నేఁ దప్పక తోడుపడవలయును. నేను నాకులజులచేఁ న వృద్ధినొందితిని. కాన వారు నాకుం బరమపూజ్యులు. నన్నుం బట్టి నీకును వారు పూజ్యులే. ఇపుడు సాయపడుము. మాపని మించిపోవకుండ సాయ మొనరింపుము. చేయఁదగుదానిని

జేయకపోయిన సాధువుల కత్యంతకోపము కలుగు. కాన నీవు లేచి యతఁడు నీపై నిలువఁ జోటిచ్చి నాకోరికిఁ దీర్పుము. ఇతఁడు మన కతిథి కదా. నీవట్లు చేసిన నీపై నితఁడు విశ్రమించి యనాయాసముగఁ బోవఁగలఁడు. శ్రీరామునకు సీతయందుఁ గలయాదరమును, లోకమాతకు సీతకుంగల్గిన పరదేశవాసకష్టమును, రామకైంకర్యపరాయణుం డగు నీతని ప్రయాసము నను వానిం దలంచియైన నీవు త్వరపడి లేచి రాఁదగుదువు.

అని సాగరుఁడు చెప్పఁగా విని మైనాకుఁడు లతావృక్షనిబిడములగు తనకాయము గనంబడ లేచెను. ప్రకాశవంతము లగుశిఖరములతో నొప్పు తనరూపమును బైటఁ గనఁబఱచెను. ఇట్లు సాగరునానతిం గొని పైకివచ్చుచున్న మైనాకునింగని హనుమంతుఁడు భూరివారాశ్యంతరమున నిదియొక విఘ్నము కాఁదగు. అని యెంచి తనవిశాలవక్షమున దానిం దగిలి మేఘమును వాయువువలెఁ జిమ్మెను. దాన నతని వేగాతిశయముంగని మైనాకుఁడు మానవాకృతి శిఖరముపై నిలువంబడి యో వానరోత్తమా! దుష్కరకార్య మొనరించితివి. నా శిఖరముల నించుక నిలిచి శ్రమము వాపికొమ్ము. శ్రీరాఘువుని వంశము వారిమూలమున సముద్రుఁడు వృద్ధినొందెను. కాన నితఁడు రామహితార్థి వగునిన్నుం బూజింపఁ గోరుచున్నాఁడు. ఉపకారమునకుఁ బ్రత్యుపకృతి చేయవలయు. ఇది శాశ్వతధర్మము సుమా. ఈసాగరుఁడు ఇక్ష్వాకుకులజులనుండి యుపకారముఁ బొంది తద్వంశజాతుఁ డగురామునకు దూతవగు నీకు నాతిథ్యమిచ్చి తన్మూలమున వారికిఁ బ్రత్యుపకృతి చేయంగోరుచున్నాఁడు. కాన దాని గ్రహించి యతని మన్నింపం

డగు వాయుదేవుఁడు కరుణచే న న్నతివేగమున విసరి సాగర
మునఁ బడవైచెను. ఆతనికరుణ నాపక్షములు నిలిచినవి. కాన
నీతండ్రి నాకు నారాధ్యుఁ డయ్యె. ఆతనికుమారుఁడ వగు
నిన్ను సత్కరించెదను. నీయీసంబంధము శ్లాఘ్యము. నాయీ
పూజ నంగీకరించి మమ్మిపుర నానందింపఁజేయుము. నాపూజం
గైకొని నాపై నించుక నిలిచి ప్రేమార్ద్రదృష్టి నన్నుం గాంచి
సంతుష్టుని గావింపుము.

అని మైనాకుఁడు పలుకఁ వాయుపావని యిట్లు పలికెను.
ఆర్యా! నీమాటల కానందించితి. నీదర్శనముననే యాతిథ్యము
గైకొనినట్లే తలంపుము. లంకం జూచుపని గలదు. పగలు
గడచుచున్నది. నడుమ నిలువరాదని వానరులకడ మాట
చెప్పితిని. అని పలుకుచుఁ బ్రసన్నముఖుఁడై స్మితముపొడ
సూప నాపర్వతముఁ జేఁ దాఁకి పోవసాగెను. మైనాకుఁడు జల
ధియును దన్నుబహుమానపురస్సరదృష్టిం జూచుచుండ శ్రీ
రామకార్యసిద్ధికై వారి యాశీషములంబడసి హనుమ యంబర
మున దూరమున కెగిరిపోవుచు మైనాకునిం జూచుచు నిరా
ధారపథమునఁ బోవసాగెను. ఆవానరపుంగవుని దుష్కర
స్థితియుకృత్యమునుగాంచి వియచ్చరమానులొండొరులతోఁ
జెప్పుకొనుచుండిరి. సువర్ణశృంగుఁడగు నామైనాకుఁ డొసరిం
చిన మంచికార్యమున కచటిదేవతలు హర్షించిరి. సహస్రాక్షుఁడు
నాగ[illegible]ంచి [illegible]పని మెచ్చుకొని శాంతస్వభావా! నీయం దను
గ్రహ [illegible]. నీ కభయమిచ్చెదను. ఇఁక సుఖం బుం
[illegible]ము. [illegible]కార్యమునకై యపారగంభీరసాగరమును
దాఁటుచు [illegible]మానభయములు లేకపోవుహనుమకు నావలని
[illegible] తోడుపడితివి. రామకార్య

తత్పరుఁడగు నతనికిఁ దోడుపడుటకు నానంపించితిని. అనఁగా నాపర్వతుఁడు సంతసిల్లెను. మనశ్చాంచల్యము మాని యందే నిలిచియుండెను. హనుమయు నాభాగమును దాఁటిపోయెను. దేవగంధర్వాదులు సురసయను నాగమాతం గని వాఁయు పుత్త్రుఁడగు నీహనుమంతుఁడు చాలదూరము పోయినను హెచ్చుచున్న జవసత్త్వములు గలవాఁడయి సాగరముపైఁ బోవుచున్నవాఁడు. నీవు ఘోరతరరాక్షసాకారమును బూని భయము గలిగించుచు నోరు దెఱచుకొని యడ్డముగా నిలిచి యతని కించుక విఘ్నము గావింపుము. నిన్నతఁడు గెల్చునో, ఓడి విచారము నొందునో. అతనిబల మింతయని తెలిసికొను సంశయనివృత్తిం జేసికొనఁ గోరుచున్నాము. అని వారు పురి కొలుపఁగా నది యట్లే యొనరించి హనుమ కడ్డనిలిచె. వాన రోత్తమా! దేవతలు నిన్ను నాకాహారముగఁ జూపి యున్నవారు. భక్షించెద. నావక్త్రబిలముం బ్రవేశింపుము. అనుడు నతఁడు చేతులు జోడించి శరీరకాంతి యొప్ప నమ్మా! దాశరథి యగురాముఁడు సోదరుని లక్ష్మణుని భార్యను సీతం గూడి దండకాటవినుండ రాక్షసవీరులు పగవూనిరి. ఆసీతా దేవిని రావణుఁ డపహరించి కొనిపోయెను. రామాజ్ఞ నాదేవి కడకు దూతనై పోవుచున్నాఁడ. రాముని రాజ్యమున నుండు దానవు గాన నీవామహాత్మునకుఁ దోడుపడవలయును. నేఁడేని యాదేవిం గాంచివచ్చి నీనోరం జొత్తును. అని ప్రమాణము చేయువాఁడ. అనఁగా నాకామరూపిణి యోయీ! ఎంత వాఁడైన నాకడకు వచ్చి నన్ను మీఱిపోవరాదు. ఇట్టి నాకు వరము గలదు. అని యతనిబలముఁ బరీక్షింపఁగోరు నాసురస పోవుచునే యుండు నాయంజనాపుత్త్రుం గాంచి వానరప్రవరా!

నానోరంజొరక యెంతవాఁడును బోవఁజాలఁడు. నీవు నట్లే చేయవలయు. బ్రహ్మవర మిట్లు నాకుఁ గలదు. అని నోరు తెఱచుకొని ముందు నిలువఁబడియె. ఆమాటలకు గాటమగు కోపము రాఁగా సురసా! నన్ను మ్రింగునంత నోరున్నదా! చూపుమని దశయోజనములంత విశాలాయామములు గల తనువు గలవాఁడయ్యె. అట్టిహనుమం గని యానాగజనని యిరువదియోజనములంత తనువు గలదయ్యెను. దానికి ద్విగుణీకృతకోపుఁడై ముప్పదియోజనములంత శరీరము కలవాఁ డయ్యెను. ఆమె నలువదియోజనములు నతఁ డేఁబది యోజనములు నిట్లు మేనులు పెంచుచుండిరి. హనుమ నూఱు యోజనములంత తనువుగల యామెంగని బుద్ధిమంతుఁడు గాన సూక్ష్మరూపమున నోటం జొర నిదియ యదనని తలంచి యంగుష్ఠమాత్రశరీరుఁడై నోటఁ జొచ్చి వెంటనే వెలువడి దాని కిట్లనియె. దక్షపుత్త్రీ! ఇదియే నీనోరఁ జొరఁబడితిని. నమస్కారము. వైదేహి యుండుతావున కరుగుదు. బ్రహ్మ వరము విఫలంబు గాక ఫలించెఁ గదా. అనుటయు రాహు ముఖమునుండి వెలువడిన చంద్రునింబోలి తననోటినుండి వెలు వడిన యాహనుమం గని సౌమ్యా! కార్యసిద్ధికై సుఖముగ నరుగుము. రామునకు సీత నొడఁగూర్పుము. అని యాసురస పలికెను.

అట్లు దుష్కరమగు మూఁడవకార్య మాతఁ డొనరిం చుటం గాంచి భూతావళి బాగుబాగని కొనియాడెను. అంత నతఁడు గగనమునఁ దె జవవిశేషము గన్పడఁ బోయెను. వాయు మార్గమున నొక్కొక్కచో జలధారలు గలుగఁ గైశికాది రాగప్రసక్తులగు తుంబురునారదాదులు సంచరింప, నింద్రా

యుద్ధము పర్వ, విమానములు సంచరింప, నలు[illegible]
వెలయ, స్వర్గనివాసి మహనీయులు కనంబడ, సూర్యాదులు
వెలయ, గంధర్వప్రముఖ వియచ్చరసమూహము [illegible] చరింపం
గాంచుచుం బక్షిరాజువలెం బోయెను. పక్ష[illegible]
వలె నిరాధారాకాశమునందుం బరుగిడు [illegible]రికించి
సింహికయను రక్కసి కామరూపిణి విశాలతనువు గ[illegible]
దనలో నిన్నినాళ్లకిపు డాహారము దొరకినది. పెద్దజంతువుం
తది చాలకాలముగా దొరకలేదు. అని తలంచి [illegible]
వ్యాపించు హనుమంతుని తనుచ్ఛాయను [illegible]
బట్టుకొనియెను. అంత నాతండు ప్రతికూల[illegible]
నిహతమగు నౌకవలెం బరాక్రమము తగ్గి [illegible]
బట్టువడితిం గదా యనుకొనుచుం [illegible]
జలాధోభాగమునుండి లేచు నొకబృహదాకా[illegible]
గోచరమయ్యెను. అద్భుతాకారశక్తులు గల [illegible]
గలదని సూర్యసుతుండు ముందే నాకుం [illegible]
నిస్సంశయము. అమితమంతుండంత దాని సింహికగా [illegible]
వానకాలపు మేఘమువలెం దనశరీరమును [illegible]
అది యెఱింగి విస్తృతవక్త్రముం [illegible]
ధ్వనించుచు మీందికి కడరెను. విస్తృతవక్త్రముం [illegible]
తన్మూలమున దానిప్రాణములున్న [illegible]
తనశరీరమును దగ్గించి మహాబలశాలి [illegible]ని
నోటం దూఱెను. లోనం బ్రవేశించినప్పుడు [illegible]
మ్రింగంబడు పూర్ణచంద్రునివలె నతండు [illegible]
గనంబడియెను. మనోవేగము గలవాండగు [illegible]
కొనకముందే ఖరనఖరముల దానిమర్మముల ఛేదించి [illegible]

పై కెగిరెను. దానిమర్మాదుల ఛేదించి పైకెగిరి పెరుఁగ సాగెను. అది సాగరజలములం గూలెను. దానిపాటు గాంచి వియచ్చరము లగుభూతము లోమహాత్మా! నీకార్య మతి భయంకరము. మహాజంతువుం జంపితివి. ఇఁక సీతాసందర్శన మహాకార్యమును సాధింపుము. ధైర్యము, సూక్ష్మదృష్టి, తత్త్వము నెఱుఁగఁజాలుబుద్ధి, పాటవము నను నీనాలుగు నీవలె నెవ్వానికైనఁ గలుగునే నట్టివాఁ డకృతకార్యుఁడు కాఁడు. అని పొగడఁగా నతఁడు శతయోజనములు గడచి సాగరము నవ్వలివరిం జేరంగల్గెను. తొలుత నందలి వృక్ష వాటికలు మలయాద్రియందుఁ గలయుపవనములు కనం బడియెను.

అంతఁ దన పెనుశరీరమును బరికించి యిట్లే యునిచిన రక్కసులు కనుఁగొన నుంకింతురు. అది కార్యహాని కాకర మని యెన్ని నిజరూపము ధరించెను. త్రివిక్రమావతారమునఁ దనకార్యము నెఱవేర్చి వామనాకారమున నిలిచిన విష్ణువు వలెఁ దనపూర్వరూపముఁ దాల్చెను. ఈరీతి నామారుతి నానారూపముల ననేకకార్యములు సాధించి తన తొల్లింటి రూపముం బడసి కొండశిఖరమున నాకసమునుండి వ్రాలెను. త్రికూటాచలముశిఖరమున నున్న లంకానగరమును జూచి మృగపక్షులు బెదర వ్రాలెను. ఇట్లు సాగరము నవలీల దాఁటి వానిపటమున వ్రాలి యమరావతింబోలు నాలంకానగరమును గాంచెను.

మహామహీశులారా! ఇందలివిశేషము లనేకములు. వానిం బరిశీలింపఁ దొడంగుదము. సాగరము శతయోజనాయతమని కలదు. "యోజనానాం శతస్యాంతే వనరాజిం దదర్శ సః."

౧౯౯-వ శ్లోకమున నీసర్గమునఁ గలదు. యోజనమనఁగా నెంత?

> "ద్వాదశాంగుళికశ్శంకు స్తద్ద్వయం తు శయస్స్మృతః,
> తచ్చతుష్కం ధనుః ప్రోక్తం క్రోశో ధనుస్సహస్రికః,
> తచ్చతుష్కం యోజనం స్యాదిత్యాది మానశాస్త్రమ్."

అని శబ్దకల్పద్రుమము. దీనింబట్టి పదునాలువేలహస్తములు యోజనప్రమాణమని తేలెడిని. ఇందు హస్తమనఁగా నిరువది నాలుగంగుళములని భావము. అంగుళమనఁగా నెనిమిదియవల పరిమాణము. "యవోదరై రంగుళ మష్టసంఖ్యైః." అని భాస్కరాచార్యులు. ఈయంగుళములు పండ్రెండుశంకువగు. అవి రెండు హస్త మనంబడు. ఆహస్తములు పదునాలువేలు యోజనమగు. ఈరీతిగా లెక్కింపఁగా నించుమించుగా నాలు వందలు ముప్పదియేడు (637) మైళ్లు పరిమాణము సముద్రమని తేలును. హనుమంతునంతటివాఁ డీపాటిదూర మెగిరెననుచో నచ్చెరువొందఁ బనిలేదు. శరీరావయవములయం దొక్కచో మనస్సునిలిపిన శరీరము తూలమువలె నగును. దాన నూర్ధ్వ గమనశక్తి గలుగునని యోగశాస్త్రము తెల్పెడు. ఈవిష యము ముందే పెక్కుసారు లీగ్రంథప్రకరణములయందు వ్రాసితిని. యోగశాస్త్రము నెఱింగి తత్ప్రకారముగ నభ్య సించువారల కీవిషయ మత్యల్పముగనే కనంబడును. మూలి కలసాయమున నీశక్తి కలుగును. ఇదిరెండును విశ్వాసపాత్ర ములు గావనువారల కొక్కనమస్కారమే సమాధానముగా మనము భావింపవలయును. ఇఁక నాయూషుట్టములం బరిశీలిం

తము. మానవునకు మనశ్శక్తి ప్రధానము. అది సంపూర్ణముగ నొదవినఁ ద్రిలోకవిజయము చేకూరును. అది లేనిచో నితరశక్తులు గలిగినవనుకొనుట కేవల భ్రాంతియే. మంత్రయంత్రతంత్రసిద్ధులు దానియాధారమునఁ గలుగవలసినవియే. సమాహితాంతఃకరణుఁ డైనఁగాని మంత్రాదిసిద్ధులు గలుగవు. సమాహితాంతఃకరణము యోగాభ్యాసమునఁగాని కలుగదు.

> "నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంతమనశ్నతః,
> న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున. ౧౬
> యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు,
> యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా. ౧౭
> యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే,
> నిస్పృహ స్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా. ౧౮
> యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా,
> యోగినో యతచిత్తస్య యుంజతో యోగమాత్మనః. ౧౯
> యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా,
> యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి. ౨౦
> సుఖమాత్యంతికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీంద్రియం,
> వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః." ౨౧
>
> భగవద్గీత. ౬ అధ్యా.

అను నీశ్రీకృష్ణవాక్యములు యోగమహత్త్వమును, యోగినియమములను, యోగఫలములను దెల్పుచున్నవి. సమాహితాంతఃకరణత్వ మెట్లు లభించునో పై వాక్యములంబట్టి యెఱుంగవచ్చును. కేవల వేదాంతవాక్యశ్రవణము యోగమువలె నంతఃకరణపారిశుద్ధ్యము నీఁజాలదనుట సిద్ధాంతము.

ప్రాగ్జన్మమున యోగిభ్రష్టుడైనవాని కది యీజన్మమున నలవడఁగా వేదాంతవాక్యశ్రవణ ముత్తమమార్గప్రదర్శకము గావచ్చును. అట్టిస్థితియందును సత్కర్మానుష్ఠానము తప్పదు. కర్మఫలత్యాగమే జ్ఞానికి లక్షణము. భక్తి వీనియం దంతర్భూతమే గాని వేఱు గాదు. కర్మజ్ఞానవిరహిత మగుభక్తి భుక్తిసాధనమే యగు. పాషండులు భక్తి యొక్కఁ డుండినఁ జాలుననుట తత్స్వరూపజ్ఞానము లేమిచే నని యెఱుంగవలయు. వారలే కపటనాటకసూత్రధారులు ధనలుబ్ధులు నని యిందుఁ బేర్కొనఁబడువారు. ధర్మవ్యాజమున ధనము నార్జించుచు నిస్పృహులవలె నటించుచు వేషములఁ గాలానుసరణముగా మార్చుచు సర్వము భగవదర్పణమని పల్కుచు నుండుయోగులు వంచకులలో శిరోమణులుగా లెక్కింపఁదగుదురు. వేదాంతవ్యాపార మిక్కాలమున సాగి లాభదాయక మగుచున్నయట్లే కాలమునందును లేదనవచ్చును. శిష్యులను జేర్చికొనుట, బాహ్యచిహ్నములు ప్రధానములని బోధించుట, తమకుఁ దెలియనివిషయములను దెలిసినట్లు పలుకుట పరమభాగవతోత్తము లనిపించుకొనఁ దలంచువారి వ్యాపారలక్షణము లనవచ్చును. ధనము లేనిచో వారిశిష్యులు కాఁజాలరు. ధనవిముక్తియే వారలకు ముక్తి. అట్లుగాక హనుమంతునివలె భగవద్భక్తిగలిగి ప్రాణ్కి నెఱవేర్పవలయునన్న శ్రద్ధ గలిగి యుండవలయును. అశక్యమగునది యట్టివారల కేదియు నుండదు. ఈసర్గమున మహాకార్యమున కనేకవిఘ్నములు గలుగుననియు,నవి పరీక్షార్థము భగవంతుఁడు కల్పించెననియు, నాపరాత్పరునియందుఁ గలభక్తి దృఢమైనచో నవి తూలికలలవములం బోలి నశించుననియుఁ, గార్యము ఫలించుననియుఁ

దేలేదు ప్రధాననీతి. తదనుగుణము లగునీతుల నరయుదము. ఈకాండము వాల్మీకిమహర్షి కవిత్వమును వేయినోళ్ల శ్లాఘ్య మని తెల్పుచున్నది. ఆయాతావుల వాని నెమకుదము.

"తతో రావణ నీతాయాస్సీతాయాశ్శత్రుకర్శనః,
ఇయేష పదమన్వేష్టుం చారణాచరితే పథి." ౧

అని మూలము.దీనికి గోవిందరాజులు. "ఆకాశేఽపి పదన్యాసా న్వేషణసమర్థోఽయమితి బుద్ధిచాతుర్యాతిశయ ఉచ్యతే.అనేన శిష్యస్థానాన్వేషణపరగురుస్వరూప ముచ్యతే" అని వ్రాసిరి. ఆకాశమునందుఁ గాలుంచుటకు వెదకువాఁ డితఁడని చెప్పఁ బడుచున్నది. దీనిచేత శిష్యుఁడుండు చోటెద్దియని వెదక నా సక్తుఁడగు గురుస్వరూపము చెప్పఁబడుచున్నదని దీనిసారము. ఆకాశమనుదానికే నిరాలంబమని యర్థము. అందుఁ గాలూనఁ బూనువాఁ డున్మత్తుఁడే యగు. ఇదేమిచమత్కారము గాన రాదు. కాని శిష్యుఁ డెందున్నవాఁడని వెదకఁగోరు గురు స్వరూప మిటఁ జెప్పఁబడుచున్నదనుచోట నెంత చమత్కార మైన నున్నది. ఆచార్యులకార్యమంతయు నవివేకుఁ డగు శిష్యుఁ డెందుండును. వానికి మంత్రోపదేశము చేసి తనవలలో వైచుకొని ధనము లాగవచ్చునన్నభావమే కాని తరింపఁజేయ వలయు నన్నభావ ముండుటయుదు. శిష్యహృత్తాపహారకుఁ డగు గురువు దొరకుటయే యరుదు. శిష్యుఁడు దొరకునా యని వెదకువా రుండరేమో. "తగినపాత్రమైనఁ దడయకిమ్ము" అని భారతమునఁ జెప్పఁబడినది. జిజ్ఞాసు వగుశిష్యుఁడు లభించిన నధ్యాత్మవిద్య యొసంగవలయుననుట శాస్త్రసమ్మతమే. కాని యిప్పటియాచార్యు లొసంగువిద్య పరమతద్వేష జనకమైనది. అట్టిది విద్య దూష్యము. సర్వమతసమానత్వమే అధ్యాత్మ

విద్యాఫలము. కాని మామతమునకన్న నన్నియుఁ దక్కువ యన్నభావము కానేరదు. అట్టిదుర్భావములను గలిగించువా రాచార్యులనఁ దగరు. సద్భావముగలవాఁ డేమతమున నున్న భగవదనుగ్రహపాత్రుఁడే కదా. "చారణాచరితేపథి రావణ నీతాయా స్సీతాయాః" అనుచో నీస్వాములు వ్రాసిన వ్రాఁత యసంగతముగ నున్నది. ఇట్లర్థము చెప్పఁబూనిన నేమతమున కైన ననుకూలముగాఁ జెప్పవచ్చును. ఇందలిసార మేమని వెదకుదము. శత్రువులజయించు హనుమంతుఁడు. అనఁగాఁ గామక్రోధాదుల నడంచినమహాత్ముఁడు. ఇంద్రియములకు లోఁబడిన రావణుఁడు కొనిపోయిన సీతయుండుచోటును గనుఁగొనఁ గోరి చారణు లనఁగా దేవయోని విశేషములు. "చారయతి ప్రచారయతి నృత్యగీతాదివిద్యాం తజ్జన్యకీర్తిం వా చారణాః" అను వ్యుత్పత్తి ననుసరించి దేవతలలో గంధర్వులు చారణులు గానవిద్యాప్రియులు. అట్టివారు విహరించు తావు. (భగవద్భజనాసక్తు లగు దేవతలు సంచరించుమార్గమున జితేంద్రియుఁ డగుహనుమంతుఁడు రావణుఁడు తీసికొని పోయిన సీతాదేవిని) వెదుకఁబోయెనని భావ మేర్పడుచున్నది. దేవతలు సంచరించుమార్గమనక చారణులు సంచరించు మార్గ మనుట, "సీతాయాః పదమన్వేష్టుమ్" సీతాదేవిపదము వెదకుట కనుట, యను వీనిం బట్టి చూడఁగా జితేంద్రియుఁ డగు హనుమంతుఁడు భగవంతు నెఱుఁగఁగోరి యాఫలముగలుగఁ దొలుతఁ బ్రకృతినాశ్రయింపం దలఁచి తత్పాదముల దర్శింపఁ బోయె ననుభావ మేర్పడుచున్నది. ప్రకృతి నేల తొలుత నాశ్రయింపవలయునందురేని "తదను ప్రధానద్వారా రాజ దర్శనం కర్తవ్యమ్" అనున్యాయము గలదు.

"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే."

అను గీతావాక్యము గలదు. కొందఱు భగవంతుఁడే న న్నాశ్రయించినమాయను దరింతురని చెప్పెను గదా. ప్రకృతి నాశ్రయింప నక్కఱలే దందురు. భగవంతు నాశ్రయించు టెట్లని విచారింతము. రూపనామక్రియాశూన్యుఁ డగుచు సర్వవ్యాపియై యుండువాని నారాధించుమార్గ మేది? నామ రూపక్రియావంతునిగా భావించి యుపాసింపవలయుఁ గదా. "ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా" అన్న న్యాయ మీయర్థమునే కదా తెల్పుచున్నది. నిర్గుణుని సగుణు నిగా నొనరించి యారాధింపవలయునని తేలినది. సగుణబ్రహ్మ మనఁగాఁ బ్రకృతివశుఁ డని కదా భావము. ప్రకృత్యతీతుఁడు ప్రకృతివశంగతుఁ డగుటయే సగుణబ్రహ్మశబ్దార్థమని మనము గ్రహింపవలయును. ప్రకృత్యుపాసన మనఁగా నిదియే యని యెఱింగినచో నీయొగిరిపాటు తొలఁగును. నామరూపక్రియా వంత మగునది యెల్లఁ బ్రకృతివశంగతమే యగు. కావుననే

"సర్వే శాక్తాస్సముద్దిష్టా న శైవా న చ వైష్ణవాః."

అని దేవీభాగవతమునఁ గలదు. అది దేవీపురాణమే కాన నందున్న వాక్య మేమి ప్రమాణమని కొందఱు పలుకుదురు. ఆపక్షమున శ్రీభాగవతమున విష్ణువే యుత్కృష్టుఁడనియున్న వాక్యముమాత్ర మేలాగు ప్రమాణమగును? వేఱొకపురాణ మున నుండవలసియుండును. ఒక్కొక్కపురాణము ఏదోయొక దేవతనే ప్రధానమని తెల్పును. అది ప్రమాణము కాదన్న నన్నియు నప్రమాణములే యగును. కావున నావాదము నిరర్థకము.

"శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
న చేదేవం దేవో న ఖలు కుశలస్స్పందితుమపి,
అతస్త్వామారాధ్యాం హరిహరవిరించాదిభిరపి
ప్రణంతుం స్తోతుం వా కథమకృతపుణ్యః ప్రభవతి ?"

అను శంకరోక్తియే సిద్ధాంతము. "మామేవ యే ప్రపద్యంతే" అనఁగా భావ మేమి? సగుణుఁ డగునన్ను నారాధించినఁ గాని నిర్గుణు నెఱుంగఁ దరముగాదనియేగాని వేఱుగాదు. ఈశ్వర సన్నిధానమును గల్పించుకొనినఁ గాని ధ్యానము చేయునవ కాశము లేదు.

"న హి ధ్యానేన సదృశం పవిత్రమిహ విద్యతే,
శ్వపాకేష్వపి ముంజానో ధ్యానేనైవాత్ర లిప్యతే.
ధ్యానమేవ పరో ధర్మో ధ్యానమేవ పరం తపః,
ధ్యానమేవ పరం శౌచం తస్మాద్ధ్యానపరో భవేత్.
సర్వపాపప్రసక్తోఽపి ధ్యానం నియతమభ్యసేత్,
సర్వదా ధ్యానయుక్తశ్చ తపస్వీ పంక్తిపావనః."

అత్రిసంహిత.

ధ్యానమునకు నేదియోరూపము కావలయు. అది కల్పితము కావచ్చు. దానియందు భక్తి దృఢము గావలయును. భగ వంతునిగా దానిని భావింపవలయును. బాహ్యచిహ్నములు నిరర్థకములు.

"చీరవాసా జటీవాపి త్రిదండీ ముండ ఏవవా,
భూషితో వా ద్విజశ్రేష్ఠ న లింగం ధర్మకారణమ్.
యే నృశంసా దురాత్మాన పాప ధర్మవివర్జితాః,
తేఽపి యాంతి పరం స్థానం నారాయణపరాయణాః.

అన్యథా మందబుద్ధీనాం ప్రతిభాతి దురాత్మనాం,
కుతర్కజ్ఞానదృష్టీనాం విశ్రాంతేంద్రియవర్త్మనాం."

విష్ణుస్మృతి.

ఈ ప్రమాణము లన్నియు రూపకల్పనకు ననుకూలములు. దానికి ఫలము ధ్యానము. ఊర్ధ్వపుండ్రత్రిపుండ్రాదులు నిరర్థకములు. అవి లేకున్న భగవదనుగ్రహము కలుగదనుట వంచకులస్వభావము. అప్రమాణముకూడ నగు. కేవల పామరులకుగా నవి కల్పింపఁబడినవి. వానిం బ్రధానములని వాపోవుట యున్మత్తప్రలాపమువంటిది. శాక్తమనఁగా నిట్టిపూజయే యని యెఱింగిన నేబాధలు నుండవు. సగుణోపాసన యనఁగా శాక్తమే. నారాయణాదినామములన్నియు సగుణబ్రహ్మము నకుం గలవు. కాన నుపాసకులందఱు ప్రకృతి నారాధించువారే యనునది సిద్ధాంతము. ప్రకృతిపురుషుల కభేదము. ప్రకృతియనునది స్త్రీగాదు. ఆశబ్దము స్త్రీలింగము. బ్రహ్మశబ్దము నపుంసకలింగము. దాన బ్రహ్మము నపుంసకుఁడు గాఁడు. బ్రహ్మప్రకృతుల కభేదము. భగవదిచ్ఛయే ప్రకృతి. ప్రకృత్యుపాసనాఫల మజ్ఞానాంధకారమును దొలఁగించి భగవత్సాన్నిధ్యమును జేర్చుమా యనుభావమే యనికాని వేఱుగాదు. ఈ సిద్ధాంతము ననుసరించి మహాభక్తుఁ డగుహనుమంతుఁడు కర్మసిద్ధాంతము ననుసరించి రామునివలన మృతిగనవలసిన రావణునింటఁ జేరియుండు మహాప్రకృతియగు సీతాదేవి పాదములఁ గనఁబోయె ననుభావము ప్రథమశ్లోకసారము. సురామాంసములఁ బరిగ్రహించు శాక్తులు కంచుకోత్సవములయందు మధుపానము లోనగువాని నొనరించు వైష్ణవులు పంక్తిబాహ్యులే. దుర్వృత్తి యేమతమునందును దూష్యమే

యగును. కావున నొకరినొక రుపాలంభించుకొనుట వివేకమని మన మెఱింగి మెలంగు టత్యుత్తమము.

> "స సూర్యాయ మహేంద్రాయ పవనాయ స్వయంభువే,
> భూతేభ్యశ్చాంజలిం కృత్వా చకార గమనే మతిమ్. ౭
> అంజలిం ప్రాఙ్ముఖః కుర్వన్ పవనాయాత్మయోనయే,
> తతోఽభివవృధే గంతుం దక్షిణో దక్షిణాం దిశం." ౮

అని మూలము. సూర్యాదులకు నమస్కరించి ప్రయాణము హనుమంతుఁడు చేయఁబూనెనని దీనిభావము. దీని నిట వ్రాయుటకుం గలకారణ మిది. ఆరణ్యకాండమునఁ బంద్రెండవసర్గమున శ్రీరాముఁ డగస్త్యాశ్రమమునం బ్రవేశించుతఱి దేవతాస్థానములను జూచుచుం బోయెననుఘట్టమున "అత్ర పూజ్యదైవతేషు రుద్రస్యానుపాదానా దపూజ్యత్వముక్తం" అని వ్రాసిన గోవిందరాజు లీస్థలమున హనుమంతుఁడు నమస్కరించినదేవతలలో విష్ణువు లేనందున "విష్ణోరపూజ్యత్వమాహ" అని యేల వ్రాయలేదో తెలియకున్నది. దుర్మతాభినివేశమున "రుద్రస్యాపూజ్యత్వ మాహ" అని వ్రాసినవారేల యిం దూరకున్నారో తెలియఁజాలకున్నవాఁడ. మహాకావ్యమునకుం బూని హనుమంతుఁడు తత్సిద్ధికై సూర్యశతమఖవాయుబ్రహ్మలకుఁ దక్కినభూతములకు నమస్కరించెను. విష్ణువు పేరే తలంపలేదు. తక్కినభూతములలో విష్ణువు చేరియున్నవాఁడని వా రందురా. అపుడు విష్ణువు నతిశయత్వమేమి? వైకుంఠమును మాని శ్రీరామరూపమున భూతలమున నవతరించెనందురా. ఆపక్షమున నతని సర్వవ్యాపకత్వములోనగునవియెల్ల నెగిరిపోవును. కావునఁ గేవల దుర్మతాభి

మానమున వ్రాసినవ్రాఁతలే కాని యిట్టివానియందు సత్యము గాని సారముగాని యించుకంతయు నుండదు. మన మీభాగ మున హనుమంతుఁడు కార్యసాధకుఁడు గావున సూర్యాదు లకు నమస్కరించి యెగురఁబూనెననియు, నహంకారశూన్యుఁ డనియు నెఱుంగందగు. ఎట్టివారైన దేవతలకు నమస్కరించి యీకార్యమునకుఁ దోడ్పడి నిర్వహించువారు మీరనియు, నే నశక్తుఁడననియు నిష్టదేవతలను బ్రార్థించి కార్యారంభము చేయవలయుననియు,దాన శ్రేయస్సు గలుగుననియు గ్రహింప వలయును.

"పానభూమిగతం హిత్వా హైమమాసవభాజనం,
పాత్రాణి చ మహార్హాణి కరకాంశ్చ హిరణ్మయాన్. ౨౩
లేహ్యానుచ్చావచాన్ భక్ష్యాన్ మాంసాని వివిధాని చ,
ఆర్షభాణి చ చర్మాణి ఖడ్గాంశ్చ కనకత్సరూన్. ౨౪

... ... ... ...

రక్తాక్షాః పుష్కరాక్షాశ్చ గగనం ప్రతిపేదిరే. ౨౫
హారనూపురకేయూరపారిహార్యధరా స్త్రియః,
విస్మితాస్సస్మితాస్తస్థురాకాశే రమణైః స్త్రియః." ౨౬

అని మూలము. పూర్వాచారము లిందుఁ గలవు. విద్యా ధరులు వారిభార్యలును మద్యపానముచేయుచు మాంసమును దినుచు నాపర్వతసానువులయందు విహరించుచుండునట్లు భావము తేలెడిని. సురాపానము దోషమనుధర్మము మానవు లకే యన్వయించును. దేవతల కది పాపము కాదు. వస్తువు నందు దోషము లేక దాన మనస్సు దోషభూయిష్ఠమై యకార్య కరణమునకుఁ గడంగఁజేయుటంబట్టియే సురాపానము దోష

మని స్మృతులు శాసించినవి. సురాపానము సంభోగాంగ ముగాఁ జెప్పఁబడినది. అదియు బ్రాహ్మణజాతికి నిషేధింపఁబడి నది. దేవతలమన స్సద్దానివలన పూర్వనొందదనియుఁ గావున నవి వారికి దూష్యము కాదనియు నూహింప నవ కాశము కలదు. మనవా రెన్ని యో ప్రయత్నముల నొనరించి సురాపానము నాపిరి. కాని యది యెంతకాలమో నిలువ లేదు. యథాపూర్వముగా నిపుడు కొన్ని తావులలో సాగు చున్నదని యూహింప నవకాశము కలుగుచున్నది. మతధర్మ ములు సమానముగా నుండవలయునన్న పెద్ద లీదురాచార మును మానుపఁ బ్రయత్నించిన బాగుండును.దేన నపకారము లేదో దానియందుఁ బ్రయత్నము చేయుట, యపకారము కలుగుకార్యమందు వైరాగ్యమునొందుట యను నివి రెండును సముచితములు కావు. మఱొక్కవింత యిందుఁ గానఁబడి యెడిని. విద్యాధరు లాత్మజ్ఞానమున హనుమత్ప్రయత్నమును ముందే యెఱుఁగఁజాలక యాకోలాహలమున నదరిపడి పై కెగిరిపోయిరనుట యొకవింత. మహానందముననుండి యీవిష యము నెఱుంగకపోయిరనుట సమాధానమగునేమో!

> "మార్గమాలోకయన్ దూరాదూర్ధ్వం ప్రణిహితేక్షణః,
> రురోధ హృదయే ప్రాణా నాకాశమవలోకయన్." 3౬

అని మూలము. దూరప్రయాణము చేయువాఁడు గాన దేహము తూలికవలెఁ దేలికగానుండఁజేయ నాహనుమంతుఁడు ప్రాణాయామము చేసెనని తెలియవలయును. ఏమహాకార్యము చేయఁబూనినను మనస్సు స్థిరముగానుండవలయుననియు, నది లేకయున్న నేకార్యము సాధ్యముకాదనియు నీయది మనకుఁ దెలుపుచున్నది. యోగములలో నెల్లఁ బ్రాణాయామ మనునది

ప్రధానమగు. వాయునిరోధమునఁగాని యాకాశగమనము లోనగునవి సిద్ధింపవు. అణిమాద్యష్టసిద్ధులు యోగసాధ్యములే. మనస్సమాధికి సాధనమగునది యోగముగాక మఱే మగును? కనుకనే "తస్మాద్యోగీ భవార్జున" అని భగవంతుఁడు తెల్పెను.

"యథా రాఘవనిర్ముక్తశ్శరశ్శ్వసనవిక్రమః. 3౯
గచ్ఛేత్తద్వద్గమిష్యామి లంకాం రావణపాలితాం,
న హి ద్రక్ష్యామి యది తాం లంకాయాం జనకాత్మజాం. ౪౦
అనేనైవ హి వేగేన గమిష్యామి సురాలయం,
యది వా త్రిదివే సీతాం న ద్రక్ష్యామ్యకృతశ్రమః. ౪౧
బధ్వా రాక్షసరాజాన మానయిష్యామి రావణం,
సర్వథా కృతకార్యోఽహ మేష్యామి సహ సీతయా. ౪౨
ఆనయిష్యామి వా లంకాం సముత్పాట్య సరావణాం,"

అని మూలము. ఇందు హనుమంతుని ప్రతాపోక్తులు గలవు. ఆత్మస్తుతి కాదా అది న్యాయ్యమా యనుప్రశ్న ముదయింపవచ్చు. హనుమ భక్తాగ్రగణ్యుఁడు, నిర్జితేంద్రియుఁడు, ధర్మజ్ఞుఁడు నగు. అట్టిమహాత్ముఁ డాత్మస్తుతిపరాయణుఁడగునా యని యోజింపవలయుఁ గదా. రామునిబాణ మెంతవేగముగాఁ బరుగిడునో కపు లెఱుంగుదురు. వాలివధరూపముగా దానిశక్తియు నెఱుంగుదురు. సమయాతిక్రమ భీతిచేఁ జావనిశ్చయించిరి గదా. వారలకు ధైర్యము చెప్పవలయు. సీతాకుశలవార్తాశ్రవణమునఁ దమయపరాధముల మన్నించునన్న విశ్వాసము వారికిం గలదు. లంకలో నాజననియున్నదో లేదో యన్నసంశయ మాస్థితియం దెంతవారలకు

నుండఁదగినదే. వానరులకు విశేషించి చెప్పవలసినదేమి? ఆభయము తీర్పనెంచి లంకలో లేకయున్న స్వర్గమునకైన నరిగి సీతాకుశలవార్త నెఱింగి వత్తును. లంకలో నెందో యుండ నీవెట్లు కనుఁగొందువని వారికి శంక కలుగునేమో యని యెంచి రావణునితో లంకం గొనివత్తును. ఎన్నివిధములనైన సీతాకుశలవార్త నెఱుంగక రానని వారిచింత లడంపఁ బల్కెనని మనమూహింపవలయు. దీనిచే దురూహాలు పొడమకయుండు.

"సమ త్తకోయష్టిమకాన్ పాదపాన్ పుష్పశాలినః,
ఉద్వహన్నూరువేగేన జగామ విమలేఽంబరే. ४६
ఊరువేగోద్ధతా వృక్షా ముహూర్తం కపిమన్వయుః,
ప్రస్థితం దీర్ఘమధ్వానం స్వబంధుమివ బాంధవాః. ४७
తమూరువేగోన్మథితాస్సాలాశ్చాన్యే నగోత్తమాః,
అనుజగ్ముర్హనూమంతం సైన్యా ఇవ మహీపతిం." ४८

అని మూలము. సామాన్యార్థము సులభము. ఇందలివిశేషమేమనఁగా, ఇక్ష్వాకులమునఁ గొందఱు మనపూర్వులకుఁ బదార్థవిజ్ఞానశాస్త్రము రసాయనశాస్త్రము తెలియదనియుఁ, గావుననే మూఢవిశ్వాసము గలవారనియుఁ దూలనాడుదురు. అంతకంటెఁ బాపకార్యము వేఱొకటి గానరాదు. ఎనిమిదివందలవత్సరముల క్రిందనే భాస్కరాచార్యులు సిద్ధాంతశిరోమణి గోలాధ్యాయమునందు

"ఆకృష్టశక్తిశ్చ మహీ తయా యత్ఖస్థం గురుస్వాభిముఖం స్వశక్త్యా,
ఆకృష్యతే తత్పతతీవ భాతి సమే సమంతాత్క్వ పతత్వియం ఖే."

అని. ఆర్యభటసిద్ధాంతాదులయందు భూమి చలించుచున్నదనియు, నిరువదినాలుగుగంటలలోఁ దనచుట్టుఁ దాను దిరిగి

వచ్చుచున్నదనియు, నన్యోన్యాకృష్టములై ఖగోళములు నిరవకాశమగునంబరమున నున్నవనియు నొక్కి చెప్పఁబడియున్నది. ఆగతిబోధకములే కుహాసరము లనఁబడునవి. నిరాలంబభాగమున నన్యోన్యాకర్షణమహత్త్వమున లోకములు నిలిచియున్నవనఁగా నర్థమేమి ? ఆకృష్టశక్తి మనవారలకుఁ దెలియదనియా? మనవారల కెన్ని యోయుగములకుముందే యీ శాస్త్రమునఁ బాండిత్యము కలదు. దానినే పరమపురుషార్థముగా భావించి యానందించువారు మాత్రము వారు కారన్న నౌననవలయు. అంతియగాక తత్పాండిత్యమున జగదపకారము చేయు గోళములను సిద్ధము చేయువారును గారు. అంతియకాని రసవాదశాస్త్రము నెఱుంగనివారు కారు.

"న చోత్పాతనిమిత్తాభ్యాం న నక్షత్రాంగవిద్యయా,
నానుశాసనవాదాభ్యాం భిక్షాం లిప్సేత కర్హిచిత్." ౫౦ అధ్యా ౬.

అని మనుస్మృతి తెల్పుచున్నది. వాదమనఁగా రసవాదమని యర్థము. బంగారుచేయుట యని యెఱుంగందగు. మనశక్తి నాలోచించి మనపూర్వులశక్తియు నింతయే యనుకొనుట మాత్రము పాపకార్యమనక తప్పదు. ఈభాగము మనకాకర్షణశక్తిప్రభావమును దెల్పుచున్నది. ఊనిలేచినపు డాతనితోడల యురవడిచే నాకర్షింపఁబడిన పుష్పవృక్షములు పైకి నాతనిం గూడి యెగిరెనని కదా దీని భావము. ఆకర్షణశక్తి యెట్టిదో వాల్మీకిమహాకవికిఁ దెలియదా? "ముహూర్తం కపిమన్వయుః" అనఁగా నర్థమేమి? వాయువు తగ్గగా నవియుఁ బడును. ఇట్టి ఘట్టములు మహాముని వాల్మీకిశాస్త్రపాండిత్యముం దేటపఱచును. మనమే కనిపెట్టితిమను నహంకారము వదలి చూచిన మన పూర్వులపాండితి గోచరించును. మనోబలము, దానికి

మంత్రతంత్రములు తోడు కాఁగాఁ బూర్వులుసాధించిన మహా కార్యము లిక్కాలమున నెన్నియంత్రములు తోడ్పడినను సాధింపఁ జాలరు. అట్టి పూర్వులశక్తి నెఱుంగక యాక్షేపించుటకంటె నసంగత మేమున్నది?

"యేనాసౌ యాతి బలవాన్ వేగేన కపికుంజరః. ౭౯
తేన మార్గేణ సహసా ద్రోణీకృత ఇవార్ణవః,"

అని మూలము. పూర్వులకు లోకజ్ఞానము శూన్యమను మహాత్ముల కిది చపేటమువంటి దగును. ఆకసమున హనుమంతుఁడు పోవుచుండఁగా నతని వేగమునఁ గలిగినవాయువు ప్రేటున సాగరజలము తగ్గెననియు, దానియిరుప్రక్కల జల మావరించుటచేత నాయంతరము దోన్నెవలె నుండెననియు దీని భావము. ఇది కేవలము వర్ణనము కాదు. పదార్థవిజ్ఞానము. వేగాతిశయ మిట వర్ణితము. వస్తుతత్త్వజ్ఞానమే యిందలి చమత్కారము. మూఢులు పూర్వులనువా రెంతటి మహాత్ములో యిదియే తెల్పును. ప్రపంచమునఁ గల ప్రతివస్తువుగుణమును గనిపెట్టినమహాత్ములను జ్ఞానశూన్యులనుటకంటెఁ దెలివితక్కువ వేఱుగ నేమున్నది?

"తస్మిన్ ప్లవగశార్దూలే ప్లవమానే హనూమతి. ౮౭
ఇక్ష్వాకుకులమానార్థీ చింతయామాస సాగరః,
సాహాయ్యం వానరేంద్రస్య యది నాహం హనూమతి. ౮౮
కరిష్యామి భవిష్యామి సర్వవాచ్యో వివక్షతాం,
అహమిక్ష్వాకునాథేన సగరేణ వివర్ధితః. ౮౯
ఇక్ష్వాకుసచివశ్చాయం నావసీదితు మర్హతి,
తథా మయా విధాతవ్యం విశ్రమేత యథా కపిః." ౯౦

అని మూలము. రంధ్రాన్వేషణైకపరమార్థు లగుమహాత్ముల కిది సంతోషము నిచ్చునదని కొందఱు మందమతులు భావింతురేమో! వార లిట్లు భావింపఁదగుదురు. ఓపికకలిగి వారు పరికించిన శంకాలేశములు తొలఁగును. హనుమ పైన లంకకుఁ బోవుచుండఁగా సాగర మిట్లు తలంచెను. ఇక్ష్వాకుకుల నరపతులు నాకు సాయమొనరించిరి. అనఁగా నన్నుఁ బెంచిరి. వారికిఁ గృతజ్ఞుఁడనై యుండుట నాకుఁ ధర్మము. లేనిచోఁ గృతఘ్నుఁడ నగుదును. అట్లుగాకయుండఁ దోడుపడవలయును. అని యిందలి భావసంగ్రహము. జలరాశి యిట్లాలోచింపఁ గలదా? అనియే మహాత్ములసంశయము. జలము లిట్లు భావింపలేదు. జలాధిదేవతయే. ప్రతివస్తువునకు నొకయధిదేవత యుండును. అతఁడు జలస్వరూపుఁడు కాఁడు.

“అస్మిన్ మహత్యర్ణవేఽంతరిక్షేభవా అధి,
నీలగ్రీవాశ్శితికంఠాశ్శర్వా అధఃక్షమాచరాః.”

అని శ్రుతి తెల్పుచున్నది. మహార్ణవమునందు నంతరిక్షమునందు నల్లనికంఠము లోనగు గుఱుతులుగల రుద్రసంజ్ఞితదేవతలుందురు. అందొకఁడు జలాధిదేవత యనంబడు. తత్సంకల్పబలమున నది యుప్పొంగుట యడఁగుట యనునవి సాగుచుండు. ఆదేవత యదృశ్యమూర్తియై యుండుననియు నెపుడైన మహాకార్యము కలుగఁగా గోచరించుననియు శ్రుతి తెల్పును. పురాణాదు లీయర్థమునే విశదీకరించును. ఆస్తికత్వమలవడనంతదనుక నిది విశ్వాసపాత్రము గాకయుండును. వితర్కించుకొలఁది నందలితత్త్వము బోధమగుచుండును. నాస్తికుఁడైనను, ఆస్తికుఁ డగును. చంద్రుఁడు ఓషధులకు నధిదేవత. కనుకనే యవి రాత్రులయందే వృద్ధినొందును.

ఓషధులఁ దెచ్చుకాలము రాత్రియని చెప్పఁబడుట కిదియే కారణము. ఈవిషయ మించుక యోపికకలిగి పరిశీలించువార లకుఁగాని తెలియ వలనుపడదు. వేదికలపై కెక్కి యుపన్యసించువారల కిది దుర్గ్రాహ్యమే. దేవతోపాసకుఁడు కావల యును. అపుడిట్టివి చక్కఁగాఁ దెలియనగును. ఇందలి సార మేమి? సద్గుణములలోఁ గృతజ్ఞతయు దుర్గుణములలోఁ గృతఘ్నతయుఁ బేరుగాంచినవి. సజ్జనుఁడు కృతజ్ఞుఁడు. తక్కిన వాఁడు కృతఘ్నుఁడు.

"వాంఛా సజ్జనసంగమే పరగుణే ప్రీతిర్గురౌ నమ్రతా."

అని భర్తృహరి తెల్పెను. స్వోపకారము దెల్పరాదు, పరోప కారము మఱువరాదను నానుడి క్రొత్తది కాదు. సగరుఁడు వృద్ధిచేసినందున సాగర మనుపేరు వచ్చినది. ఆవంశమునఁ బుట్టినవాఁడు శ్రీరాముఁడు. ఆమహాత్ముని కార్యమునకై పోవు చున్నవాఁడు హనుమంతుఁడు. ఆతనికిఁ జేయుసాయము శ్రీరామున కొనరించినట్లే. అని సాగరుఁడు తలంచెను. అనఁగా జలాధిదేవత భావించెను. దేవతలలోఁ గొందఱు జలవృక్ష సర్పపక్షిప్రభృతిరూపముల నుందురనుట పురాణవిదితము. రక్కసులు వ్యాఘ్రభల్లూక మహిషాశ్వాదిరూపముల నుం దురు. వృషభాసురుని బకాసురుని గార్ధభాసురుని శ్రీకృష్ణుఁడు సంహరించెను గదా. వారా రూపములనుండఁ గారణమేమి? ఒక్కొక్కరి కొక్కొక్కరూపమునం దిష్టము. అది గర్భ ధారణకాలమున మాతృచిత్త మేరీతిగానుండునో దాని ననుస రించి యాశిశువు చిత్తవృత్తి యుండునని పెద్దలందురు. శాస్త్రముకూడ నట్లే బోధించెడినని మన మూహింపవచ్చును.

"యథాస్తరాశిర్మిథునం సమేతి తథైవ వాచ్యో మిథునప్రయోగః,
అసద్గ్రహాలోకిత సంయుతేఽస్తే సరోష ఇష్టైస్సవిలాసహాసః."

బృహజ్జాతకము.

గరుడు లురగులును దేవయోని విశేషము లనఁగా నర్థమేమి? నాగకన్యక లనుచో భావ మేమి? వీరెల్లరు దేవయోనివిశేషములు. ఆయారూపముల నుండుదేవతలని యెఱుంగవలయు. అట్లే వృక్షాధిదేవతలు జలాధిదేవతలు పర్వతాధిదేవతలు నని యెఱుంగనగు. కావున జలరూపుఁ డగుసాగరుఁడు కృతజ్ఞుఁడై హనుమకు నుపకారము చేయఁ దలంచెనని మన మెంచవలయును. హనుమంతుఁడు సలీలముగా దాఁటిపోవఁ గలఁడని యతఁ డెఱుంగక, విశ్రాంతినొందఁజేసిన నిరాయాసముగాఁ బోవునని తలంచెనని మన మీభాగమునుండి గ్రహింపవలయు. "యాంతి న్యాయప్రవృత్తస్య తిర్యంచోఽపి సహాయతామ్" అను నానుడి క్రొత్తది కాదు. భగవంతునిపై భారము వైచి కార్యమును బూనినవారి కాపరమేశ్వరుప్రోత్సాహమున సాధుమతులు తోడ్పడుదురనియు, వంచకులై భగవత్కార్య మనుపేర ధనార్జనమునకుం బూనినఁ దత్కాలమున నది బయలుపడకున్న నవ్వలఁ దెలియఁగాఁ దోడ్పడక యెల్లరు నేవగింతురనియు మనకీభాగము బోధించుచున్నది. చేసిన మేలు మఱువరా దనునీతిని మన మెఱుంగవలయును.

"హిరణ్యనాభం మైనాకమువాచ గిరిసత్తమం,
త్వమిహాసురసంఘానాం పాతాళతలవాసినాం. ౯౨
దేవరాజ్ఞా గిరిశ్రేష్ఠ పరిఘ స్సన్నివేశితః,
త్వమేషాం జాతవీర్యాణాం పునరేవోత్పతిష్యతాం. ౯౩

పాతాళస్యాప్రమేయస్య ద్వారమావృత్య తిష్ఠసి,
తిర్యగూర్ధ్వ మధశ్చైవ శక్తిస్తే శైల వర్ధితుం. ౯౪
తస్మాత్సంచోదయామి త్వా ముత్తిష్ఠ గిరిసత్తమ."

అని మూలము. సాగరుఁడు మైనాకపర్వతమునకుఁ దెల్పు విషయ మిది. ఇందుఁ బ్రతిపక్షులకు నాక్షేపించునవకాశము గలదు. రక్కసులకుఁ బాతాళవాసులకు రాకపోకల కనువగు మార్గమునకు నడ్డముగా మైనాకుని నిలిపిన ట్లీభాగము తెలుపుచున్నది. ముందు దీనికి విరుద్ధముగా నొకవిషయము గలదు. దాని నిట మాని యపు డొనరింతును. ఈభాగమును విన్నంతనే మహాత్ములు కొందఱింతకంటె విచిత్రము కలదా యని నవ్వుదురు. వారి కివియే సమాధానము. భూగోళమనుదానియందంతటను మానవులు లోనగు ప్రాణికోటులు కలవు. ఎవరే భాగమున నివసింతురో వారు తమరుండుభాగము మీఁదిదనియుఁ దక్కినభాగము క్రిందిదనియుఁ దలంతురు.

"సర్వతః పర్వతారామగ్రామచైత్యచయైశ్చితః,
కదంబకుసుమగ్రంథిః కేసరప్రకరైరివ.
యో యత్ర తిష్ఠత్యవనీం తలస్థామాత్మానమస్యా ఉపరిస్థితం చ,
స మన్యతేఽతః కుచతుర్థసంస్థా మిథశ్చ తే తిర్యగివామనంతి.
అధశ్శిరస్కాః కుదళాంతరస్థా చ్ఛాయామనుష్యా ఇవ నీరతీరే,
అనాకులాస్తిర్యగధస్థితాశ్చ తిష్ఠంతి తే తత్ర వయం యథాత్ర."
సిద్ధాంతశిరోమణి. గోలాధ్యాయము.

అను నీప్రమాణవాక్యములు పైన వ్రాసినయర్థమును విశదీకరించుచున్నవి. క్రిందుమీఁదులు నియతములు కావు. వారి వారిదృష్టికి గోచరించునవియే. ఒకచోటునుండి వేఱొకచోటికిఁ బోవుటకు వచ్చుటకు మార్గము లుండును. వానికే

పురాణములయందు భూవివరములని పేరు. కొన్నింటికి భూవివరములకే గుహాలనియుఁ బేరులు పేర్కొనఁబడును. అట్టి మార్గములలోఁ గొన్నింటి కడ్డముగా నీ వున్నవాఁడవని సాగరుఁడు పర్వతునితోఁ జెప్పుట విచిత్ర మనఁదగదు. పర్వతాధిదేవతతో జలాధిదేవత పలికెనని యర్థము. మఱియుఁ గ్రిందికి మీఁదికి నడ్డముగాఁ బెరుఁగఁ గలవు. కాన నిన్నొక కార్యము నకుఁ బురికొలుపుచున్నాఁడనని సాగరుఁ డనెను. తాను వేఱొక యాకారమునొందు శక్తిగలవానికి వృద్ధినొందుశక్తియు నుండదనుట వెఱ్ఱితనము. కావున నిం దసంగతప్రసంగమని దంతముల బయల్పడఁ జేయఁదగినంతవిషయమే యిందు లేదు. పూర్వగాథలే యసత్యములన్న వారల మెప్పింపఁ దరముగాదనియు, వారు స్వభావవాదు లగుటంజేసి నాస్తికులో నాస్తికాభాసులో యగుదురనియు మున్దే వ్రాసితిని గదా. వారి నెట్లైన నంగీకరింపఁ జేయఁబూనుటయే గొప్ప పొరపాటు.

> "స ఏష కపిశార్దూలస్త్వాముపర్యేతి వీర్యవాన్. ౯౫
> హనుమాన్ రామకార్యార్థం భీమకర్మా ఖమాప్లుతః,
> అస్య సాహ్యం మయా కార్యమిక్ష్వాకుకులవర్తినః. ౯౬
> మమ హీక్ష్వాకవః పూజ్యాః పరం పూజ్యతమాస్తవ,
> కురు సాచివ్యమస్మాకం న నః కార్యమతిక్రమేత్. ౯౭
> కర్తవ్యమకృతం కార్యం సతాం మన్యుముదీరయేత్,
> సలిలాదూర్ధ్వముత్తిష్ఠ తిష్ఠత్వేష కపిస్త్వయి. ౯౮
> అస్మాకమతిథిశ్చైవ పూజ్యశ్చ ప్లవతాం వరః."

అని మూలము. నాసాయమును గోరెఁగదా యని మైనాకుఁడు గర్వించునేమో యని దాని నడంచుచుఁ గర్తవ్యమును

సాగరుఁడు తెల్పుచున్నాఁడు. ఎట్టి భయంకరకార్యమైనఁ జేయఁజాలుహనుమ శ్రీరామకార్యముకొఱకు కాకసమునఁ జను చున్నవాఁడు. అనఁగా భావ మేమని యోజింపుఁడు. మనము ధర్మమని తోడ్పడవలయునే కాని యతనికి మనసాయ మక్కఱలేదని యిందలిసారము. ధర్మమేమనఁగా నా కిక్ష్వాకు రాజులు పూజ్యులు. నీకును మిక్కిలి పూజ్యులు. నాకంటె నీవు పూజించుట ముఖ్యమని స్తుతించుచున్నాఁడు. ఏల యందురా? "న నః కార్యమతిక్రమేత్" అనుచున్నాఁడు. అతఁడు దాఁటిపోవకముందే త్వరపడుమా యని హెచ్చరించెను. పురికొలుపుటనఁగా స్తుతియే. గర్వించి యాలసించు నేమో యని బెదరించుచున్నాఁడు."సతామ్మన్యు ముదీరయేత్" అనియే యా బెదరింపు. చేయఁదగినదాని నొనరింపకున్నఁ బెద్దలకుఁ గోపముఁనుగల్గించి పోషించిన ట్లగునని. పెద్దలకోపము నిష్ఫలము గాదు. ఇట్లు యుక్తియుక్తముగాఁ బలికి యతిథి పూజ ధర్మమని తెలిపి తనకృతజ్ఞతను వెల్లడించెనని మన మీ భాగమునుండి గ్రహింపఁజను. మహాకార్యము చేయువార లకు నడుగకయున్నను దోడుపడుట విధియనునీతి నీభాగము నుండి నేర్చుకొనవలయు.

"హిరణ్యనాభో మైనాకో నిశమ్య లవణాంభసః. ౧౦౧

ఉత్పపాత తలాత్తూర్ణం మహాద్రుమలతాయుతః,

స సాగరజలం భిత్వా బభూవాభ్యుత్థిత స్తదా." ౧౦౨

అని మూలము. సాగరోక్తుల నాలకించి నానావిధమహాద్రుమ లతాసమన్వితమగు తన పర్వతగాత్రమును గనఁబఱచుచు జల ములనుండి లేచెనని యిట భావము. వృక్షములు లతలు జల

ముల మునిఁగియున్న యాకొండయం దెట్లుండుననుప్రశ్న మొండు కలదు. జలసృష్టియు స్థలసృష్టియు నని రెండువిధము లుగా భూతజాల ముండును. స్థలసృష్టికంటె జలసృష్టి యించుక భేదముగాఁ గనఁబడుటంబట్టి యది వేఱుగా నుండునట్లు తోఁచును. జలముల నుండినంతమాత్రమున వాయుసంస్పర్శము సూర్యకిరణస్పర్శము కూడ లేదని భావింపరాదు. సముద్రమునఁ గల కొండలన్నియు జలసృష్టియుతములు కావు. ఇంతకుఁ గొంత ముందు సాగరమునుండి యొకకొండ తటాలునఁ బైకిఁ గనఁబడియెననియు నందుఁ బర్వతలక్షణములగు వృక్షలతాదులు గలవనియు వినంబడియెఁ గదా. జలములయందుఁ గొంత మునిఁగినను గొంత పైన నుండవచ్చును. జలవృక్షలతాదులు నుండవచ్చును. వానియందు ఫలపుష్పాదులు నుండవచ్చును. అట్లుండరాదనుసిద్ధాంత మెవ్వారును జేయఁజాలరు. సృష్టి వైచిత్ర్యములలోఁ గనుఁగొనినభాగ మత్యల్పమనియుఁ గనుఁగొనవలసినభాగమే యత్యధికమనియు మన మెఱుంగందగు. ఊహింపనివిశేషములు, నసంగతములనునవి సుసంగతము లయినట్టివియుఁ గనఁబడుచునే యున్నవి. వానిం దిలకించి సిద్ధాంతములను మార్చుకొనుచున్నారు. సువర్ణము ఖనిజమే కాని మనప్రయత్నమున 'నేవియు నట్లు మార్పునొందదన్న సిద్ధాంతము మాఱినది గదా. రసవాదము గూడ సత్యమే యన్నది స్పష్టమైనది గదా. పాదరసము సువర్ణముగాఁ గల్పింపఁబడుచున్నపుడు తామ్రము సువర్ణముగా మార్పవచ్చునన్న మన పూర్వులసిద్ధాంత మేల నిలువదో తెలియఁజాలకున్నాను. మనకుఁ దెలియని దసంగతమనుటకంటె మనము తెలియఁజాలకున్నామని విచారమునొందు టుత్తమము.

మైనాకపర్వతముపై వృక్షలత లుండుటయు నందు గంధర్వులు కిన్నరులు లోనగువారు నివసించుటయు నసంగతమనుటయే యసంగతము.

"తముత్థిత మసంగేన హనూమాన గ్రతస్స్థితం. ౧౦౭
మధ్యే లవణతోయస్య విఘ్నోఽయమితి నిశ్చితః,
... ... ... ... ...
ఉరసా పాతయామాస జీమూతమివ మారుతః.
స తదా పాతితస్తేన కపినా పర్వతోత్తమః. ౧౦౯
బుద్ధ్వా తస్య కపేర్వేగం జహర్ష చ ననంద చ,
... ... ... ... ...
మానుషం ధారయన్ రూపమాత్మనశ్శిఖరే స్థితః." ౧౧౧

అని మూలము. ఆరూపముం గాంచి యిది యేదో విఘ్నము చేయవచ్చిన రూపమని యెంచి పావని దానిని వక్షమునఁ బోఁ ద్రోయఁగా నతనిబలవేగముల నెఱింగి మైనాకుఁడు సంతసించి మానవరూపమున శిఖరమునఁ దోఁచి యిట్లు పలికెను. అను నీ సారతరార్థము పర్వతరూపమునుగుఱించి లోపల నేవ్రాసిన యభిప్రాయము న్యాయ్యమని దృఢపఱచుచున్నది. మానవరూప మునఁ దనశిఖరముపైనుండి భాషించెననఁగా భావమేమి? అదియొక యచేతనపాషాణరూపము కాదనియు, దానిరూపము వేఱనియు, నారూపముననుండుట దాని కిష్టమనియు, నేరూప మున నైనఁ గనఁబడుశక్తి దానికిం గలదనియు దీనిభావము కదా. కామరూపు లగు దేవతలు రాక్షసులు వారియిష్టము ననుసరించి రూపములఁ దాల్చియుందురనియు, వలసినతఱి నాయారూపముల గ్రహింతురనియు మన మీభాగమునుండి

గ్రహింపవలయు. మొండిపట్టుదలచే విషయములను సంగ్ర హింపక యాక్షేపించుట మంచిది గాదు.

"రాఘవస్య కులే జాతై రుదధిః పరివర్ధితః,
సత్వాం రామహితే యుక్తం ప్రత్యర్చయతి సాగరః. ౧౧౩
కృతే చ ప్రతికర్తవ్య మేషధర్మ స్సనాతనః,
సోఽయం తత్ప్రతికారార్థీ త్వత్తస్సమ్మానమర్హతి. ౧౧౪
... ... ... ...
తదిదం గంధవత్స్వాదు కందమూలఫలం బహు,
తదాస్వాద్య హరిశ్రేష్ఠ విశ్రాంతోఽనుగమిష్యసి. ౧౧౭
అస్మాకమపి సంబంధః కపిముఖ్య! త్వయాస్తి వై,
... ... ... ...
అతిథిః కిల పూజార్హః ప్రాకృతోఽపి విజానతా,
ధర్మం జిజ్ఞాసమానేన కిం పునస్త్వాదృశో మహాన్." ౧౨౦

అని మూలము. మైనాకునివాక్కు లివి. సముద్రుఁడు తనయభివృద్ధికిఁ దోడుపడిన రాఘవుల గారవించుచు వారిపనికై పోవు నిన్ను నారాధించుచున్నాఁడు. మేలుమఱువక బదులుచేయుట సనాతనధర్మము. ఆపూజను గ్రహింపుము. పరిమళముగలిగి మంచి రుచిగల కందమూలఫలములు నాయందుఁ గలవు. వానిని భక్షించి యలసట దీర్చుకొని పొమ్ము. అను నీభాగము మనకుఁ గలిగినవానితో నతిథులఁ బూజింపవలయుననియు, వారిని ప్రేమమున నారాధించుటయే ముఖ్యముకాని వస్తుబాహుళ్యము ముఖ్యముకాదనియు, మనకుఁ దెలుపుచున్నది. ప్రీతిపూర్వకపూజయే సఫలము. వస్తుబాహుళ్యముగలిగి ప్రీతిపూర్వకము గానిచో నిష్ఫలమగు. అని మనము గ్రహింపవలయు.

"పూర్వం కృతయుగే తాత పర్వతాః పక్షిణోఽభవన్,
తే హి జగ్ముర్దిశస్సర్వా గరుడానిలవేగినః. ౧౨౩
తత స్తేషు ప్రయాతేషు దేవసంఘాస్సహర్షిభిః,
భూతాని చ భయం జగ్ము స్తేషాం పతనశంకయా. ౧౨౪
తతః క్రుద్ధస్సహస్రాక్షః పర్వతానాం శతక్రతుః,
పక్షాంశ్చిచ్ఛేద వజ్రేణ తత్ర తత్ర సహస్రశః. ౧౨౫
స మాముపగతః క్రుద్ధో వజ్రముద్యమ్య దేవరాట్,
తతోఽహం సహసాక్షిప్త శ్శ్వసనేన మహాత్మనా. ౧౨౬
అస్మి న్ లవణతోయే చ ప్రక్షిప్తః ప్లవగోత్తమ,
గుప్తపక్షసమగ్రశ్చ తవ పిత్రాభిరక్షితః. ౧౨౭
తతోఽహం మానయామి త్వాం మాన్యో హి మమ మారుతః,
త్వయా మే హ్యేష సంబంధః కపిముఖ్య మహాగుణః. ౧౨౮
అస్మి న్నేవం గతే కార్యే సాగరస్య మమైవ చ,
ప్రీతిం ప్రీతమనాః కర్తుం త్వమర్హసి మహాకపే." ౧౨౯

అని మూలము. ఇం దనేకసంశయము లున్నవని యిక్కాలపు నాగరికుల యాశయము. ఈవిషయము దత్తోత్తరమే యైనను మరల వ్రాసెదను. పర్వతములకు ఱెక్కలున్నవనుట యచ్చెరువే. ఎవరికి? విషయమేమని యాలోచించువారికి. దేవాసురులలోఁ ఱెక్కలుండ్రు వింతరూపముల నుండురని పురాణములు తెలుపుచున్నవి. ఇక్కాలమున మనకుఁ గనంబడుపర్వతములే యక్కాలమునఁ బక్షములు గలిగియుండెనని యేపురాణము తెల్పదు. ఇవన్నియు సైకతములే. ఎంతకాలమునకో యీ రీతిగా మాఱినది. పెనుకాయముగలిగి పక్షివలె నెగిరిపోవు శక్తికిందగిన ఱెక్కలుగలిగిన దేవరాక్షసులు కొంద ఱుండిరి. క్రూరసంచారులగుట వారివలనఁ గీడుమూఁడునేమో యని

సాధువులెల్లరు సంశయించిరి. వారి మనఃకష్టములను బోఁగొట్టఁదలఁచి యింద్రుఁడు వారికి గమనశక్తి లేకుండఁ జేసెను. ఈమైనాకుఁడు వారిలో నొక్కఁడు. ఇతఁడు సాధుమతి. ఇంద్రుఁ డన్నింటివలె నీయాకారమును భావించి పక్షములు ఛేదింప వచ్చెను. ఈతఁడు వాయుదేవుని మిత్రుఁడు. కావున నీయెడరు తప్పింపకున్న నింద్రునిబాధ తప్పదని వాయు వీతని గమనమునకుఁ దోడై యాబారినుండి తప్పించెను. సాధువులకుఁ దోడుసూపు టుత్తమమని భావించెను. వాయు వింద్రునకు లోఁబడినవాఁడే యైనను మైనాకునిస్వభావ మెఱుంగుం గాన నాకష్టమును దప్పించెను. సాగరజలముల నుండెను. అని మనము గ్రహించిన నేదోషము కలుగదు. ఈసర్గమున నే తొంబదిమూఁడవశ్లోకమును విమర్శించునపుడు ముందు దీని విషయము వ్రాయుదునని తెలిపియుంటిని. దాని నిట వ్రాసెదను.

"దేవరాజ్ఞా గిరిశ్రేష్ఠ పరిఘు స్సన్ని వేశితః,
త్వమేషాం జాతవీర్యాణాం పునరేవోత్పతిష్యతాం." ౯౩

అని లోపల వ్రాసినమూలము.

"స మాముపగతః క్రుద్ధో వజ్రముద్యమ్య దేవరాట్,
తతోఽహం సహసా క్షిప్తశ్శ్వసనేన మహాత్మనా." ౧౨౬

అని యిచ్చోట వ్రాసినమూలము.

"ఉవాచ వచనం ధీమాన్ పరితోషాత్సగద్గదం,
సునాభం పర్వతశ్రేష్ఠం స్వయమేవ శచీపతిః. ౧౩౯
హిరణ్యనాభ శైలేంద్ర పరితుష్టోఽస్మి తే భృశం,
అభయం తే ప్రయచ్ఛామి తిష్ఠ సౌమ్య యథాసుఖం. ౧౪౦

తతః ప్రహర్షమగమద్విపులం పర్వతోత్తమః,
దేవతానాం పతిం దృష్ట్వా పరితుష్టం శతక్రతుం. ౧౪౩
స వై దత్తవరశ్శైలో బభూవావస్థిత స్తదా,"

అని దీని తరువాతిమూలము. "అనేన పక్షచ్ఛేదభయా త్సముద్రప్రవేశానంతరం పాతాళస్థ రాక్షసనిరోధార్థం దేవరాజేన మైనాకస్థాపిత ఇత్యవగమ్యతే" అని తొంబదినాలవశ్లోకవ్యాఖ్యయందు మహేశ్వరతీర్థులు వ్రాసిరి. ఇం దొకదానితో నింకొకదానికి సంబంధము కనఁబడదు. తనచేఁ జావు దప్పించుకొని సాగరమున దాఁగినశత్రువును వేఱొకకార్యార్థ మింద్రుఁడు నియమించియుండునని తోఁచెడుననుటయు నంత బాగుగ నుండదేమో. వాయుదేవుఁడు తనప్రభువగు నింద్రునితో మైనాకుఁడు క్రూరమతి గాఁడని తెలిపియుండుననియు దానఁ గోపము శాంతింపఁగా రాక్షసులు రాకయుండఁ జేయుచుండుమని యింద్రుఁ డాజ్ఞాపించియుండుననియు నొకసమాధానము చెప్పవచ్చును. ఇది యాకాశరామన్న పంచాంగమే గాని తగిన యాధారముగలదిగఁ గానరాదు. మనమిట్లు లూహింతము. ఇంద్రుఁడు నిన్ను రాక్షసనిరోధార్థ మాజ్ఞాపించి నాయందునిచినాఁడని సాగరుఁ డనుట స్తుతి. హనుమత్సహాయార్థమతనిఁ బంపఁబూనిన సముద్రుఁడు త్వరపడి లెమ్మని పురికొల్పుచు నింద్రభయము నీ కిపుడు లేదని తెల్పెనేఁగాని యతఁ డందుల కీకొనఁడని చెప్పియుండవలయు. అది స్వభావము కదా. ఆమాటలు నమ్మి మహాకార్యమునకుఁ బూని తన్నుఁ జాలకాలమునుండి కాపాడిన సాగరునిమాట లసత్యములు కావని నమ్మి పైకి లేచియుండును. హనుమత్కార్యము దేవకార్యమగుట దాన సంతసించి యింద్రుఁడు నీకిఁక భయములేదని

వర మిచ్చియుండును. మైనాకుఁడు భగవత్కార్యమునకుఁ దోడుసూపుట యభివృద్ధిహేతు వయ్యెను. అని. సత్కార్యమునకుఁ దోడుపడుట యాపన్నిర్మూలన మనునీతి మన కీభాగము తెల్పుచున్నది.

"ప్రీతోఽస్మి కృతమాతిథ్యమ్మన్యురేషోఽపనీయతాం. ౧౩౧
త్వరతే కార్యకాలో మే అహశ్చాప్యతివర్తతే,
ప్రతిజ్ఞా చ మయా దత్తా న స్థాతవ్య మిహాంతరే." ౧౩౨

అని మూలము. హనుమద్వాక్యము లివి. రామకార్యతత్పరత్వము నుపకారియందలి గౌరవమును దెలుపుచున్నవి.

"సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాన్న బ్రూయాత్సత్యమప్రియం,
ప్రియం చ నానృతం బ్రూయాదేష ధర్మస్సనాతనః."

అను మనుస్మృతివాక్యమును వ్యక్తము చేయుచున్నవి.

"దాతృత్వం ప్రియవక్తృత్వం ధీరత్వముచితజ్ఞతా,
అభ్యాసేన న లభ్యంతే చత్వారస్సహజా గుణాః."

అన్న సూక్తి కుదాహరణములుగా నివి యున్నవి. మంచిమాటలచే నెదుటివారి నలరించి తనపట్టుదల మానక యాలసింపక కార్యమును సాధింపవలయునన్న యాశయము నీవాక్యములు బోధించుచున్నవని మనము గ్రహింపవలయు.

"అయం వాతాత్మజశ్శ్రీమాన్ ప్లవతే సాగరోపరి,
హనుమన్నామ తస్య త్వం ముహూర్తం విఘ్నమాచర. ౧౪౬
రాక్షసం రూపమాస్థాయ సుఘోరం పర్వతోపమం,
బలమిచ్ఛామహే జ్ఞాతుం భూయశ్చాస్య పరాక్రమం.
త్వాం విజేష్యత్యుపాయేన విషాదం వా గమిష్యతి." ౧౪౭

అని మూలము. ఇవి దేవగంధర్వాదులవాక్కులు. త్వరపడి
పోవునతనికిఁ బ్రతిబంధ మేల కల్పింపవలయు ననుసందియ
ముదయింపవచ్చు. లంకానగరము దుష్ప్రవేశ్యమని, రావణుఁ
డసాధ్యుఁడని స్వానుభవమున నెఱుంగుదురు. అందుఁ జిక్కు
నేమో యనుసందియము దేవతల కుదయించుట నైజము.
కనుక నే మనోదార్ఢ్యార్థమే యీపరీక్ష చేయ వారు పూనిరి.
సురస నాగమాత. కామరూపిణి. కావున నామె నభ్యర్థించిరి.
దేవతలే యేల పరీక్షింపరాదని యడుగుదురేమో. అందఱ
కన్నివిధము లగుశక్తులు నుండవు. కామరూపులు గావచ్చుఁ
గాని వలసినంత పెరుఁగుటకు శక్తి వారికి లేకయుండవచ్చును.
సురస కావిషయమున శక్తి యెక్కుడుగనుండవచ్చును. కాననే
దానిం బ్రార్థించిరి. సురస నుపాయమున జయించునేని లంకా
నగరముం బ్రవేశించి కార్యముం బండించుకొని రాఁగలఁడని
వారికి విశ్వాస ముదయించును. కాన ముహూర్తకాలము
విఘ్నము చేయఁబూనిరి. ఎంత తెలివిగలవారలును భావికార్య
సాధనమున సందేహాస్వాంతు లగుదురనువిధము నీభాగము
మనకుఁ దెల్పుచున్నవి.

"మమ భక్షః ప్రదిష్టస్త్వమీశ్వరైర్వానరర్షభ,
అహం త్వాం భక్షయిష్యామి ప్రవిశేదం మమాననం. ౧౪౧
ఏవముక్తస్సురసయా ప్రాంజలిర్వానరర్షభః,
ప్రహృష్టవదనశ్శ్రీమానిదం వచనమబ్రవీత్. ౧౪౨

... ... ... ...

కర్తుమర్హసి రామస్య సాహ్యం విషయవాసిని. ౧౪౪
అథవా మైథిలీం దృష్ట్వా రామం చాక్లిష్టకారిణం,
ఆగమిష్యామి తే వక్త్రం సత్యం ప్రతిశృణోమి తే. ౧౪౫

... ... ... ...

ప్రవిశ్య వదనం మేఽద్య గంతవ్యం వానరోత్తమ,
వర ఏష పురా దత్తో మమ ధాత్రేతి సత్వరా.
వ్యాదాయ వక్త్రం విపులం స్థితా సా మారుతేః పురః.

... ... ... ...

చకార సురసా వక్త్రం శతయోజనమాయతమ్."

అని మూలము. ఇందు నూటయేఁబదియేడవశ్లోకమునుండి "శతయోజన మాయతమ్" అనునంతదనుకఁ గలవి ప్రక్షిప్త ములని గోవిందరాజులు వ్రాసిరి. "తం ప్రయాంతమిత్యా దయః కేచన శ్లోకాః ప్రక్షిప్తాః. అసంగతాశ్చ శతయోజనా యతత్వే వానరై ర్లంకావాసిభిశ్చ జ్ఞాతస్స్యాదితి విరోధాత్. త ఇమే శ్లోకాః ప్రక్షిప్తాః" అని. పాప మాచార్యులకు గొప్ప సందియమే కల్గినది. సురస శతయోజనములంత విరివిగా మోమును దెఱచియున్న నుత్తరతటమున నున్న వానరులకు దక్షిణతటమున నున్న లంకావాసులకుఁ దెలిసియుండకపోదు. కాన నివి కల్పితములని ఇది వారిభావము. పాపము! ఆచార్యు లకు నిచ్చటఁ గలిగినసందేహము ఈకాండమునందే ముప్పది యేడవసర్గమునందు హనుమంతుఁడు తనదేహము పెంచినప్పు డిట్టిసందియము.

"దర్శయామాస వైదేహ్యాస్స్వరూపమరిమర్దనః. 33

స తస్మాత్పాదపాద్ధీమానాప్లుత్య ప్లవగర్షభః,
తతో వర్ధితుమారేభే సీతాప్రత్యయకారణాత్. 34

మేరుమందరసంకాశో బభౌ దీప్తానలప్రభః,
అగ్రతో వ్యవతస్థే చ సీతాయా వానరోత్తమః. 35

హరిః పర్వతసంకాశస్తామ్రవక్త్రో మహాబలః,
వజ్రదంష్ట్రనఖో భీమో వైదేహీమిదమబ్రవీత్." ౩౬

కలుగలేదు. ఏటికో? ఇచ్చట నేసందియమో అందు నదియే కదా కల్గవలయును? అచ్చోటఁ జల్లఁగా జాఱవిడిచినారు. మేరు మందరపర్వతములంత య్యైనపు డయోధ్యవలకుఁ గనఁబడక యుండునా? మనమిట్టు లూహింపవలయును. ఇది యొక తపశ్శక్తి. అణిమాదిసిద్ధులలోనిది. తనయెదుట నున్నవారి కట్లు కనఁబడునే కాని యెల్లరకుం గానరాదు. త్రివిక్రమావతార కథయు శ్రీకృష్ణవిశ్వరూపసందర్శనగాథయు నీయాచార్యులకుం గల్గిన యనుమానముప్రకార మసంగతములే యన వచ్చును గదా. అట్టివా రిదియు నొక తపశ్శక్తి యని గ్రహింతురు గాక. ఇట్టి సంశయము లుండవు. దేవతలచేత నాకు నాహారముగాఁ జూపఁబడితివి. నిన్ను భక్షింతును. నావక్త్రమునఁ జొరఁబడుము. అనునంతట హనుమ శ్రీరామవృత్తాంతముం దెలిపి సీతాపహరణము తేటపఱచి యట్టి రామచంద్రునకుఁ దోడ్పడఁ దగుదువు. ఆతనిరాజ్యమునం దున్నదానవు కదా. అందుల కంగీకరింపకపోదువే నించుక యవకాశ మిమ్ము. సీతను జూచి వచ్చి యెవ్వారికిఁ గష్టమును గల్గింపనీయని రాముని దర్శించి యావల నీకాహార మగుదును. సత్యముగా నని ప్రమాణము చేయుచున్నాను. అని హనుమ పలికెను. ఇందు హనుమంతు నాశయ మేమి? జన్మించినందులకు మహాత్ములకు నుపకృతిచేయుట. అది నెఱవేఱినచో నది సార్థకమగు. లేనిచో వ్యర్థమగు. అందు నెవరికిని గష్టము గల్గింపనివాఁడనఁగా నేకార్యములు లేనివాఁడని యర్థము. కష్టములఁ గల్గించుట కేదో కారణము గలుగవలెను. ఏఫలములు కావ

లయునని కోరనివారలకు నొరులతో సంబంధము లేదు. అసం గతుఁడని భావము. అట్టివాఁ డెవఁడు? భగవంతుఁడే. అట్టి భగవంతుని దర్శించి యనఁగా వారియానతి నెఱవేర్చి యని తాత్పర్యము. ఆవల నాకేకార్యములు లేనికతన నీకాహార మగుదును. ఈతుచ్ఛశరీర మొరులకుం బనికివచ్చునే నానం దింపవలసినదే కదా. అనుభావ మిం దిమిడియున్నది. ఇది నిశ్చయ మనుచున్నాఁడు. ఇం దసత్య మేదియు లేదని భావము. ఇదియే హనుమంతునిభావమని మన మూహింతము. భగవ త్కార్యము శక్త్యనురూపముగా నెఱవేర్చనపిదప నీభౌతిక శరీరము వదలిన నేవిచారములు నుండరాదు. అనునీతి మన కీభాగము తెలుపుచున్నది. ఓయీ నీవు వానరోత్తముఁడవు. వానరములు చంచలస్వభావము గలవి. వాని నమ్మరాదు. నావదనము నామాటప్రకారము చొచ్చి మరల వెళ్లవలయు. ఇది బ్రహ్మయిడినవరము అని నోరుతెఱచుకొని నిలిచెను. తొలుత నాకాహారము గమ్మనియెఁ గదా. ఇపుడు నామోముఁ జొచ్చి పోఁదగుదు వనుచున్నది. ఏల? శ్రీరామకార్యసంశ్రవ ణమున హృష్టచిత్తయై దేవతలమాట నెఱవేర్పఁగోరి నా మోముఁ జొచ్చి వెళ్లుమనుచున్నది. నీవు నాకాహారము గానక్కఱలేదు. నీశక్తియెట్టిదో చూచెద ననునూహ నాసురస తెల్పుచున్నది. అతనిశక్తి నెఱుంగఁ గోరికదా యామె వచ్చి నది. హనుమ శ్రీరామవృత్తాంతమును దెలుపఁగా నానందించి కోపమును దగ్గించుకొని పలుకుచున్నదనియే యిందుఁ గల తాత్పర్యము. భగవద్భక్తుని జూడఁగనే దురాత్ములమనస్సులు కూడ మార్పునొందును. ఇఁకఁ గల్పితకోపముగల యానాగ జననిమానస మేల మార్పునొందక యుండును. ఎవ్వారిం

గాంచిన దుర్వృత్తులు మాఱునో యతఁడే భక్తుఁడని సారము. అది మన కీసురసవాగ్ధోరణి బోధించుచున్నది.

> "సేవితే వారిధారాభిః పతగైశ్చ నిషేవితే,
> చరితే కైశికాచార్యైరైరావతనిషేవితే. ౧౬౫
> సింహకుంజరశార్దూలపతగోరగవాహనైః,
> విమానైస్సంపతద్భిశ్చ విమలైస్సమలంకృతే. ౧౬౬
> ... ... ... ...
> భేజేఽంబరం నిరాలంబం లంబపక్ష ఇవాద్రిరాట్." ౧౭౨

అని మూలము. ఇది యాకాశవర్ణనము. పక్షులు సంచరించుట వింతగాదు. గంధర్వాదులు తిరుగుటయు వినుచున్నారము. ఎట్లు? పురాణముల మూలముననే. సింహకుంజరశార్దూల వాహనములు గలవార లగుదేవతలు నిరాలంబ మగునంబర మున విహరించుటయే విచిత్రము. ఈభూతములు స్వర్లోకము నందును గలవని చెప్పవలసివచ్చును. ఆపక్షమున నవ్వానికిని మరణము లేదనియో అమృతపానము చేసినవారు తప్పఁ దక్కిన భూతవ్రాతములకు మృతిగలదనియో చెప్పవలయు. అప్పు డవి మృతినొంది పుణ్యపాపానుభవమున కెక్కడికిఁ బోవును? అన్నప్రశ్న ముదయించును. నాకలోక మనఁగా దుఃఖము లేని తావనికదా యర్థము. అట్టిదుఃఖములుండు నే నదియు నొక సామాన్యలోకమనియే యూహింపవచ్చును. మన మిట్లు లూహింతము. ఒక్కొక్కతత్త్వమున కొక్కొక్క దానిపై నిష్ఠము కుదురునని ముందే యనేకపర్యాయములు వ్రాసియుంటిని. దేవతలలో ననేకభేదములు గలవు. అందుఁ గొందఱు గరుడవంశమువారు కలరు. అట్లే కొన్ని భేదములకుఁ

జేరినవారలకు నాయాసత్త్వములపై నిష్టముండును. వారు కామరూపులు. సిద్ధిసంపన్నులు. కాన నాయాజంతువుల నలవ లుచుకొని విహరింతురు. వాల్మీకిమహాకవియు నిట్లే యూహించి చెప్పియుండవచ్చును. వేఱుగా నింతకంటె మంచియూహ తోఁచునంతదనుక నింతమాత్రమునఁ దృప్తినొందుదము. ఈ భాగమును బరిశీలింపఁగా నొకయూహ పొడకట్టుచున్నది. స్థలజలసృష్టులవలె వియద్భాగమున నొకభూతసృష్టి యున్న దనియుఁ జంద్రాదిలోకములకుఁ గ్రిందుగ మేఘమండలము నకు దగ్గరగ నొకసృష్టి యుండుననియుఁ దోఁచెడిని. పతంగ మార్గమున దేవయోని విశేషము లున్నయట్లు శ్రుతి తెల్పు చున్నది. "అస్మిన్నహత్యర్ణవేఽంతరిక్షే భవా అధి" అని. భూమికిఁ బైనఁ బండ్రెండుయోజనములు భూవాయువు వ్యా పించుననియు నింతకులోనుగా మేఘమండల ముండుననియు శిరోమణి తెల్పుచున్నది.

"భూమేర్బహిర్ద్వాదశయోజనాని భూవాయురత్రాంబుదవిద్యుదాద్యమ్."

దీని కించుకపైన నీహానుమంతుని సంచారము సాగెనని యెంచ వచ్చును. ఆచోటఁ బైనఁ బేర్కొనఁబడినసృష్టి యుండవలయు. భౌమములగు సింహాదులం గాంచినవా రాపోలికలంబట్టి యవియు సింహాదులని పేర్కొనుదురు. మేషాదిరాసు లను టయు నట్టిదేకదా. ఆనక్షత్రసముదాయముం గాంచిన మనము సాధారణముగాఁ జూచు మేఁకవలె నుండును. అంతియగాని మేషముగాని దాని యొడలిపైన నశ్విన్యాదినక్షత్రములుగాని లేవు. అట్లే హనుమత్సంచారమునందును సింహకుంజర వ్యాఘ్రాదు లున్నయట్లు వాల్మీకి తెల్పెనని మన మూహించిన శంకలు తొలఁగును. సృష్టియందలిచిత్రము లెప్పటికప్పుడు

విచిత్రములుగాఁ దోఁచుచుండుననియుఁ బరిశీలించుచున్న కొలఁది నవి క్రొత్తవిగనే యూహింపఁ దగియుండుననియు నింతియ సృష్టియని తీర్మానించుటకంటె నజ్ఞాని కార్యము వేఱుగా నుండదనియు మనము తెలిసికొనుట యుత్తమ మార్గము.

"ప్లవమానం తు తం దృష్ట్వా సింహికా నామ రాక్షసీ,
మనసా చింతయామాస ప్రవృద్ధా కామరూపిణీ. ౧౭౩
అద్య దీర్ఘస్య కాలస్య భవిష్యామ్యహమాశితా,
ఇదం హి మే మహత్సత్త్వం చిరస్య వశమాగతం. ౧౭౪
ఇతి సంచింత్య మనసా ఛాయామస్య సమాక్షిపత్,
ఛాయాయాం గృహ్యమాణాయాం చింతయామాస వానరః. ౧౭౫
సమాక్షిప్తోఽస్మి సహసా పంగూకృతపరాక్రమః,
ప్రతిలోమేన వాతేన మహానౌరివ సాగరే. ౧౭౬

... ... ... ...

కపిరాజేన కథితం సత్త్వమద్భుతదర్శనం. ౧౭౮
ఛాయాగ్రాహి మహావీర్యం తదిదం నాత్ర సంశయః,
స తాం బుద్ధ్వార్థతత్త్వేన సింహికాం మతిమాన్ కపిః. ౧౭౯

... ... ... ...

తస్య సా కాయముద్వీక్ష్య వర్ధమానం మహాకపేః. ౧౮౦
వక్త్రం ప్రసారయామాస పాతాళాంతరసన్నిభం,
ఘనరాజీవ గర్జంతం వానరం సమభిద్రవత్. ౧౮౧
స దదర్శ తతస్తస్యా వివృతం సుమహన్ముఖం,
కాయమాత్రం చ మేధావీ మర్మాణి చ మహాకపిః. ౧౮౨
స తస్యా వివృతే వక్త్రే వజ్రసంహననః కపిః,

సంక్షిప్య ముహూరాత్మానం నిష్పపాత మహాబలః. ౧౮౩

... ... ... ...

తత స్తస్యా నఖై స్తీక్ష్ణైర్మర్మాణ్యుత్కృత్య వానరః,
ఉత్పపాతాథ వేగేన మనస్సంపాతవిక్రమః. ౧౮౫
తాం తు దృష్ట్వా చ ధృత్యా చ దాక్షిణ్యేన నిపాత్య చ,
స కపిప్రవరో వేగా ద్వవృధే పునరాత్మవాన్. ౧౮౬
హృతహృత్సా హనుమతా పపాత విధురాంభసి."

అని మూలము. ఇందలి యితివృత్తము స్పష్టము. సాగరమునం దుఁగల భూతజాల మద్భుతావహమనియు మానవదృష్టి కవిజ్ఞేయములనియుఁ దేలెడిని.జలములపై వ్యాపించు నీడనుబట్టుకొనినఁ బైనఁ బోవుప్రాణి నిర్బంధింపఁబడు. ఆవల దానింబట్టుకొని తినును. అట్టిరక్కసి యొక్కఁడు గలదని యీభాగము తెలుపుచున్నది. ఇట్టివిచిత్రము కలదా యని కొందఱు ముక్కుమీఁద వ్రేలిడుకొందురేమో! అట్టిమహాత్ములించుక యోజింపందగియుందురు. సృష్టియందలివిచిత్రము లమేయములు. దుర్విజ్ఞేయములు.ఒక్కదానినొకటి యాకర్షించును. దానికిఁ గారణమడుగఁ జెప్ప వలనుపడకయుండు. అట్టితటి స్వభావమందురు. ఈయాకర్షణశక్తి చేతనాచేతనములయందు నొక్కరూపుగనుండు. మానవులయందుఁ గలయాకర్షణశక్తినే మనశ్శక్తి యందురు. ఒకవిధమగుపాషాణ మొకలోహము నాకర్షించును. నీలమను పేరుగల యొకరత్నము లేఁతగఱిక నాకర్షించును. ఏలయన్న నది దానిస్వభావమనియే సమాధానము గాని వేఱు రా వలనుపడదేమో. ఒకవిధమగు జలజంతువు దృగ్బలమున నగ్నిజ్వాలలు దూరమునఁ బర్వఁజేసి దాన వివశమయి

కదలలేకయుండు జంతువును బట్టి తినుననియు, నాయగ్ని జ్వాలలు విద్యుద్దీపశతముల నతిక్రమించి యుండుననియు, నా జలజంతు వంతపెద్దది గాదనియు నిటీవలఁ బరిశోధించు మహాత్ములు స్పష్టపఱచిరి. వీనింబట్టి చూడఁగా ననేకశక్తులుగల భూతవ్రాత మున్నదనుట సిద్ధాంతము. ఛాయాగ్రాహిణి యొకరక్కసి యున్నదన్న నేల యెగిరిపడవలయునో తెలియఁజాలను. మన మచ్చెరువు పడఁదగినవిషయము లనేకము లున్నవి. పరిశోధించుకొలఁదిని బూర్వశాస్త్రములమహత్త్వము తేటపడుచుండును. దానికి సంతోషింపవలయుం గాని సంశయింప నక్కఱలేదు.

ఆరక్కసి హనుమంతుని ఛాయ నాకర్షించి నిలువరించెను. హనుమ దానిం గాంచి సుగ్రీవుఁడు తెల్పిన దిదియే యయియుండునని తలంచెను. దానిదేహమునకన్నఁ దనశరీరము నెక్కుడుగాఁ బెంచెను. అదియుఁ దనమోమును బెంచి యతని మ్రింగ నురవడించెను. ఆవిధ మెఱింగి సూక్ష్మశరీరుఁడై దానిమోమునఁ బ్రవేశించి మర్మములఁ ద్రెంచి వధించెను. దేవత లానందించిరి. అదియు జలములం బడియెను. అను నీ భాగము హనుమంతుని మేధాసంపత్తి నెఱింగించుచున్నది. ఆ రక్కసి యతఁడు లోనఁజొచ్చుట యెఱుంగఁజాలకపోయెను. ఏల? రక్కసి క్రోధావేశమున నొడ లెఱుంగకపోయెను. కావునఁ బరునివిక్రమము నుపాయమును గ్రహింపఁ జాలకపోయెను. మనస్సు శాంతముగ నుండినఁగాని యేయుపాయము తోఁపదనియుఁ గ్రోధావేశము సర్వాపన్మూలమనియు మనము గ్రహింపవలయు. బుద్ధిమాంద్యమును గల్గించు విషయములన్నియు దుష్టములనుట కిదియే కారణము. మత్తుపదార్థ

ములు వస్తువునుబట్టి నింద్యములు గాకయున్నను గుణమును బట్టి నింద్యము లయ్యెను. మద్యము లోనగునవి పాప మూలములనుట కిదియే కారణము. అభివృద్ధికి క్షయమునకు హేతువు మనస్సనియు దానిని సమలముగాఁ జేయునవన్నియుఁ బాపహేతువులనియు మన మెఱుంగవలయును.

"క్రోధాద్భవతి సమ్మోహస్సమ్మోహాత్స్మృతివిభ్రమః,
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి. ౬౩
రాగద్వేషవియుక్తైస్తు విషయా నింద్రియైశ్చరన్,
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి." ౬౪ అధ్యా. ౨.

అను నీగీతావాక్యములు మన కీవిషయమునందలి తత్త్వముం దెలుపుచున్నవి.

"భీమమద్య కృతం కర్మ మహత్సత్త్వం త్వయా హతం. ౧౮౭
సాధయార్థమభిప్రేత మరిష్టం ప్లవతాంవర,
యస్య త్వేతాని చత్వారి వానరేంద్ర యథా తవ. ౧౮౮
ధృతిర్దృష్టి ర్మతిర్దాక్ష్యం స్వకర్మసు న సీదతి,"

అని మూలము. ఆకాశముననున్న భూతములు పల్కిన వీ వాక్యములు. ధైర్యము, దృష్టియనఁగా సూక్ష్మదర్శనము, మతి యనఁగా నర్థతత్త్వనిశ్చయము, దాక్ష్యమనఁగాఁ జక్కఁగాఁ గార్యమొనరించుట యను నీనాలుగు నెవరికిం గలవో వారే కార్యమును సాధింపఁగలరు. అని సారము. ఇందు మతియే ప్రధానమని తేలెడిని. మతిమంతుఁడు కానిచో నేకార్యమును సాధింపఁ జాలఁడు. కాన నట్టియుత్తమ మగుమతిని మనము గాపాడుకొనవలయు. సద్వర్తనమే దానిని రక్షించునది. వేఱొకటిగాదు.

"తతశ్శరీరం సంక్షిప్య తన్మహీధరసన్నిభం. ౧౯౬
పునః ప్రకృతిమాపేదే వీతమోహ ఇవాత్మవాన్,
త్ద్రూపమతిసంక్షిప్య హనుమాన్ ప్రకృతౌ స్థితః. ౧౯౭
త్రీన్ క్రమానివ విక్రమ్య బలివీర్యహరో హరిః,"

అని మూలము. లంకయందుఁ గలరాక్షసులు తన్ను నెవఁడో తెలిసికొన యత్నింతురు. దాన నాపని సాగదు. అని యోజించి కొండంత తనదేహమును దగ్గించి యథాపూర్వకాయుఁ డయ్యెను. వీతమోహుఁడగు నాత్మవేత్తవలె ననునుపమానము చెప్పఁబడినది. ఆత్మవేత్తకుంగూడ నొకప్పుడు కర్మానుసారముగ నజ్ఞానము గలుగును. దాని నతఁడు జ్ఞానబలమునఁ బాపుకొనఁ గలఁడు. అట్లే హనుమయుఁ దనశరీరమును వృద్ధినొందింపను, తగ్గింపను గలఁడు. ఇది సాధ్యమా యని కొంద అద్భుతం పడ వచ్చును. యోగాభ్యాసము చేయువారల కీవిషయ మద్భుత ముగాఁ దోఁపదు. చాల స్వల్పకార్యమే యిది. ప్రాణసంయమ మొకరీతిగాఁ జేసిన శరీరము తూలికవలె నగును. అట్లే స్థూలము సూక్ష్మము నగును.

సూ. "కాయాకాశయోస్సంబంధసంయమాల్లఘుతూలసమాపత్తేశ్చాకాశగమనమ్. ౪౨
బహిరకల్పితావృత్తిర్మహావిదేహా. తతః ప్రకాశావరణక్షయః. ౪౩
స్థూలస్వరూపసూక్ష్మాన్వయార్థవత్త్వసంయమాద్భూతజయః. ౪౪
తతోఽణిమాది ప్రాదుర్భావః కాయసంపత్తద్ధర్మానభిఘాతశ్చ." ౪౫
విభూతిపాదము.

అను నీపాతంజలయోగసూత్రము లీవిషయమును దెల్పు

చున్నవి. అణిమాద్యష్టసిద్ధులు యోగసిద్ధములే కదా. ముక్తి యోగాభ్యాసికి దొరకదనుమహాత్ములు కలరు. అట్టివారికి,

"యుంజన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః,
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి. ౧౫
ప్రయత్నాద్యతమానస్తు యోగీ విగతకిల్బిషః,
అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాంగతిం." ౪౫ అ. ౬

అను నీ గీతాశాస్త్రమందలి శ్రీకృష్ణవాక్యములు శుష్కవేదాంతులకు ముక్తికి సంబంధము లేదనియు యోగియే ముక్తిఁ గాంచుననియుఁ దేటపఱచుచున్నవి. పరమభక్తుఁడు యోగియు నగుహనుమంతుఁ డీయల్పకార్యము చేసెనన్నఁ జిత్రమని యూహింప నక్కఱయుండదు. యోగి కసాధ్య మెద్దియు లేద నియే యిందలిసారము.

## హనుమంతుఁడు లంకాపరిసరమున కరుగుట.

* ఆంజనేయుఁ డిట్లు దాఁటరానిసాగరమును దాఁటి విచారము మాని త్రికూటమను కొండకొమ్మున నలరారు లంకను గాంచెను. వృక్షములనిండఁ బూవులుండఁగా సాయంకాలమున గాలిసోఁకున నవిరాలి తన్ను ముంపఁగాఁ బుష్పమయశరీరుఁ డయ్యెను. ఈసాగరము నుత్తరించుట యొక గొప్ప పనికాదు. ఎన్ని యోజనములైన దాఁటఁగలనని తలంచెను. అందుఁగల విచిత్రస్థలములం గాంచుచుఁ బోయి తాను దిగిన లంబపర్వతమున నిలిచి త్రికూటగిరియందుఁ గలలంకను గనియె. ఆకొండయందుఁగల బహువిధవృక్షములను బత్తు

* ఇది రెండవసర్గమునఁ గలకథ.

లను సరోవరములను సుందరారామములను జలాశయములను రాజయోగ్యమనోహరోద్యానములను జూచుచుం బోయి లంకను సమీపించెను. ఆపురము వీరభటసంరక్షితము. అనేక సౌధవిరాజమానము. అమరావతికి సమానము. దానిం బావని కాంచెను. అది యేమహానుభావుని చేతనో మనస్సంకల్పవినిర్మిత మైనట్లు లాతనికిం దోఁచెను. దాని యుత్తరద్వారముఁ జేరి యతఁడు తనలో జానకీదేవి నెట్టు లీపురిం గాంతును? ఎట్టు లీపురిం బ్రవేశింతును? అని పలుభంగులఁ దలపోయసాగెను. మఱియు నాలంకయుండువిధము దానిం బాలించు రాక్షస వీరులరూపములను దానిపాలకుఁ డగురావణుని శౌర్యమును దలంచి వానరు లీజలరాశిం దాఁటివచ్చుట మహాకష్టము. ఒక ప్పుడు వచ్చిరిపో దేవతలకుంగూడ నసాధ్యమగు లంకఁ జేరియుఁ బ్రయోజన ముండదు. ఏవ్వారికి నిది ప్రవేశింప రానిది. దీనిపాలకుఁడు త్రిలోకవిద్రావణుఁ డగురావణుఁడు. ఈ లంకం జేరియు వానరు లేమియుఁ జేయఁజాలరు. సప్తసాల ప్రభేదనాది మహాకార్యముల నొనరించి ప్రఖ్యాతినొందిన రాముఁడు మాత్రము వచ్చియు నేమిచేయఁ గలఁడు? రక్క సులు సామసాధ్యులు కారు. ధనమదాంధులు కాన దాన సాధ్యులు కారు. బలదర్పితు లగుట మిత్రభేదమునకు లోఁ బడరు. బుద్ధిపరాక్రమవంతు లగుట యుద్ధమునకు భయం పడరు. అంగదాదులు సాగరమును దాఁటఁగలరు గాని తక్కినవారికి సాధ్యముగాదు. ఆవిచార మిప్పుడేల ?

సీతాదేవి బ్రదికియుండుటయు లేమియు నాకుఁ దెలియ రాదు. ఆమెను గన్నులారఁ గాంచినపిదప నేమిచేయఁదగునో యోజించెద. అని చింతించి సీతాదర్శనోపాయ మాలో

చించుచు నీనగరము నీరూపమునఁ బ్రవేశింప శక్యముగాదు. బలపరాక్రమవంతు లగురక్కసుల వంచింపక తప్పదు. పృథు రూపమున లంకం గలయందిరుగుట కనువుగాదు. కార్యసాధన మున కనువగురూపముం గైకొనందగు. అని పలుమాఱు చింతించుచు దురాత్ముఁడు రాక్షసాధిపతియు నగురావణునకుఁ దెలియరాకుండ నెట్లు జానకిం గనుంగొందును? శ్రీరాముని కార్య మెట్లు చెడకుండును? సీతాదేవి నొక్కర్తుక నేకాంత మునఁ గాంచుటెట్లు? ఏకార్యముగాని పెక్కుసారు లాలో చించి చేయుటయే మంచిది. ఉపాయప్రయోగములవలన నెఱ వేఱు కార్యములుకూడ నవివేకుఁడగు దూతమూలమున నశించును. రాజమంత్రులు చక్కఁగా నాలోచించిచేసిన యుపాయములును వివేకశూన్యు లగుదూతలఁ జెందినచో ననర్థమును గలిగించుటయ గాక రాజున కవివేకిత్వము నాపా దించును. పండితమాను లగుదూతలు స్వామికార్యములఁ బాడుచేయుట స్పష్టమే కదా.

లంకాప్రవేశ మిపుడా? రాత్రికాలమునందా? ప్రవే శించు టెట్లు? ఈరూపముతోడనా? అల్పరూపముననా? రామ కార్యము చెడకుండు టెట్లు? వివేకహీనుఁ డను పేరు నాకెట్లు రాకయుండును? సాగరలంఘనము సఫలమగు టెట్లు? రక్క సుల కగపడితినేని రామకార్యమెల్ల వ్యర్థమే యగు. ఇతరు లెఱుంగకుండ నిందు నెందుఁ గాని యుండఁ దరముగాదు. రక్కసులకుఁ దెలియరాని దేది యుండును? అరూపుఁడగు వాయువుకూడ నీరక్కసుల యనుమతి లేక లంకం జొరఁ జాలఁడని నాయూహ. ఈ రూపముననున్నఁ గీడుగలుగును. దాన స్వామికార్యము చెడు. కాన నారూపము నత్యల్పముగఁ

గావించుకొని రామకార్యార్థము రాత్రి లంకం దిరిగెదను. కలయందిరిగి జానకిం గాంతును అని యోజించి సీతాదర్శనో త్సాహమున సూర్యాస్తమయమున కెదురు చూచుచుండెద. అంత రవి గ్రుంకఁగా రేయి మార్జాలమాత్రశరీరుఁడై యచ్చె రువుగఁ గన్పట్టుచు లంకం జొరనారభించెను. ఆపురము సుందరమందిరాదులచే రమణీయముగ నుండెను. రత్నఖచిత గృహవరము లనేకము లుండెను. నగరప్రవేశ మెవ్విధమున ననువిషాదము. ఆశ్చర్యము నతనికిం గల్గెను. హనుమత్సహా యార్థము చంద్రుఁ డుదయించి చంద్రికల వ్యాపింపఁజేసెను. హనుమయు నాశీతమయూఖుని గని యానందించెను.

ఆర్యులారా! ఇందలివిశేషముల నెఱుకుదము.

"భూతాశ్చార్థా విపద్యంతే దేశకాలవిరోధితాః,
విక్లబం దూతమాసాద్య తమస్సూర్యోదయే యథా. ౩౯
అర్థానర్థాంతరే బుద్ధిర్నిశ్చితాపి న శోభతే,
ఘాతయంతి హి కార్యాణి దూతాః పండితమానినః." ౪౦

అని మూలము.

"దూతం చైవ ప్రకుర్వీత సర్వశాస్త్రవిశారదం,
ఇంగితాకారచేష్టజ్ఞం శుచిం దక్షం కులోద్గతం. ౬౩
అనురక్తశ్శుచిర్దక్షః స్మృతిమాన్ దేశకాలవిత్,
వపుష్మాన్ వీతభీర్వాగ్మీ దూతో రాజ్ఞః ప్రశస్యతే. ౬౪
అమాత్యే దండ ఆయత్తో దండే వైనయికీ క్రియా,
నృపతౌ కోశరాష్ట్రే చ దూతే సంధివిపర్యయౌ. ౬౫
దూత ఏవ హి సంధత్తే భినత్త్యేవ చ సంహతాన్,
దూతస్తత్కురుతే కర్మ భిద్యంతే యేన మానవాః. ౬౬

స విద్యాదస్య కృత్యేషు నిగూఢేంగితచేష్టితైః,
ఆకార మింగితం చేష్టాం భృత్యేషు చ చికీర్షితం. ౬౭

బుద్ధ్వా చ సర్వం తత్త్వేన పరరాజచికీర్షితం,
తథా ప్రయత్నమాతిష్ఠేద్యథాత్మానం న పీడయేత్." ౬౮

మను. ౭ అధ్యా.

అను నీమనుస్మృతి యభిప్రాయమే హనుమన్ముఖమున వాల్మీకి తెలిపెను. దూతమూలముననే రాజకార్యము ఫలించుట విపరీతఫలము నొసంగుట యను రెండురీతుల సాగును. కావున వివేకరహితుఁ డగుదూతను రాజు లుంచుకొనరాదు. హనుమయు లంకాప్రవేశకాలమునఁ దనదూతత్వము నెట్లు సార్థకము చేయఁగలనని యోజించి వేయిభంగుల వితర్కించి స్వామికార్యము భంగముగాకుండునట్లు చేయుటెట్లులని తలపోసి తన కెట్లుచేసినఁ గార్యము ఫలించునో యది నిర్ణయించుకొనెను. దీనిచే నతనికి స్వామియం దెంత దృఢభక్తి కలదో తేటపడుచున్నది. స్వామికార్యము ఫలింపఁజేయుటకంటెఁ బురుషార్థము వేఱొకఁడు లేదనుకొన్నవాఁడే భక్తుఁ డగును. ఈ విషయమే మన మీభాగమునుండి నేర్చుకొనవలయును.

"ప్రాసాదమాలావితతాం స్తంభైః కాంచనరాజతైః,
శాతకుంభమయైర్జాలై ర్గంధర్వనగరోపమాం. ౫౧

సప్తభౌమాష్టభౌమైశ్చ స దదర్శ మహాపురీం,
తలైస్స్ఫటికసంకీర్ణైః కార్తస్వరవిభూషితైః. ౫౨

వైదూర్యమణిచిత్రైశ్చ ముక్తాజాలవిభూషితైః,
తలైశ్శుశుభిరేతాని భవనాన్యత్ర రక్షసామ్. ౫౩

కాంచనాని విచిత్రాణి తోరణాని చ రక్షసామ్,

లంకాముద్యోతయామాసుస్సర్వతస్సమలంకృతాం. ౫౪
అచింత్యామద్భుతాకారాం దృష్ట్వా లంకాం మహాకపిః,
ఆసీద్విషణ్ణో హృష్టశ్చ వైదేహ్యా దర్శనోత్సుకః." ౫౫

అని మూలము. లంకాపురవర్ణన మిది. దీనింగాంచిన నందున్న రక్కసు లెంతనాగరికులో తేటపడును. నాగరికతయే లేనివారైన వారినగర మింత వర్ణనార్హముగ నుండదు. స్వర్గపురమును మించియున్నదని వాల్మీకి వర్ణించెను. ఈవర్ణనము కవులకు స్వభావమనియు నట్లే వాల్మీకియు వర్ణించెననియు నందులేని తక్కినవిషయములు కూడ నట్టివే యనవచ్చును. అంతయు విశ్వాసపాత్రము కాకపోవును. సర్వం మిథ్య యను న్యాయ మనువర్తించును. కావున సిద్ధవాక్కులు గలవాల్మీకి యట్లు చెప్పియుండఁడనియు నారాక్షసులు నాగరికులే యనియు మన మూహింపవలయు. రావణునియం దొక్కదోషము పొడసూపినంతనఁ దక్కినసుగుణములే యుండవని యూహించుట పొరపాటు. అహల్యాజారత్వప్రముఖదుర్గుణము లింద్రునియందును గలవు. అట్లే యీదోషము వదలిన నారావణునిపాలనము ధర్మము ననుసరించినదియై యుండనచ్చునని యూహింపవచ్చును. దోషఫలమతఁ డనుభవించెను గదా. ఆనగరనిర్మాణపద్ధతి యాలోచించిన నాగరికత యనుపమానమని తోఁపకమానదు. కారుణ్యాదిసద్గుణములును వారియందుఁ గలవనియే యేర్పడుచున్నది. ఇప్పటి నాటకప్రదర్శనములయందు రాక్షసులపాత్రములు ధరించువారు భయంకరముగా మాటలాడుట యేటికో తెలియరాకున్నది. రక్కసులు తమయింటఁ గూడనట్లే మాటలాడుదురని వారియభిప్రాయము

కాఁబోలు. ఇది లోకజ్ఞానము చాలమిఁ గలిగిన విపరీతజ్ఞానమనవలయు.

## లంకాధిదేవత హనుమంతు నడ్డగించుట.

* హనుమంతుఁ డంత లంబపర్వతముశిఖరముపైనుండి. లంకాప్రవేశార్హబలవేగములం బరికించి రేయి యందుం బ్రవేశింప నారంభించెను. వీరభటులు తిరుగుచుండిరి. ఆపురము కుబేరపురమును భోగవతిని మించియుండెను. గృహము లత్యున్నతములు రత్నమయములై యుంట నమరావతిని బురుడించుచుండెను. దానింగాంచి తనలో నిది వీరభటరక్షితంబగుట నెవ్వఁడు ప్రవేశింపరాకయున్నది. ఒకప్పుడు కుముదాదివానర వీరులు కొందఱు ప్రవేశింపక శక్యముకాదని తోఁచఁజేయు నీ పురమును జయింపవచ్చునని యోజించి శ్రీరామలక్ష్మణుల కిద్దాని జయించుట యొకపెద్దది కాదనియు నూహించి సంతోషించెను.

అంతం బావని లంకం బ్రవేశించుచుండఁగా నాపురాధిదేవత యతనిం గని వికారరూపమున లేచి నిలువంబడి పెడబొబ్బ యిడి వానరా! ఎవ్వఁడవు? ఎందులకు వచ్చితివి? నాచేఁ జావకముందే నిజము తెల్పుము. కపివగు నీకీపురము చొరనశక్యము. వీరభటనికరపరిరక్షితము గదా. అనియెను. తన యెదుట నిలువంబడి యఱచుచున్న యాదానవిం గాంచి నీ వడిగినదానికి నుత్తరము దాఁపక తెల్పెదను. కాని ముందుగ నీవార్త వినఁగోరెద. విరూపనయనములు గల నీ వెవ్వతవు?

---

* ఇది మూఁడవసర్గమునఁ గలకత.

ఎందుల కీపురమువాకిట నిలుచున్న దానవు? నన్నడ్డగించి భీతి
గొలుపుచు నిలుపనేల? అని యడుగ నాగ్రహించి పరుష
వాక్కుల నతనితో నిట్లనియె. రాక్షసాధీశునానతి నొదల
నిడికొని చరించు కింకరిని. దురాధర్షను. నగరము దీనిం
బాలించుదానను. నన్ను మీాఱి నగరముం జొచ్చుటకు నీకు
శక్యముకాదు. ప్రాణముల నాకు నప్పగించి దీర్ఘనిద్ర నొందఁ
గలవాఁడవు.-ఈలంకానగరమే నేనని తలంపుము. అంతట దీనిం
గాపాడుచుందును. ఇఁక నీవార్తం దెల్పుమని యడుగ దాని
నడంచుపోంటె ధీరుఁడై నిలిచి యోలంకా! తోరణాద్యలం
కారముతోఁగూడిన యీా లంకానగరమును జూడఁ గోరివచ్చి
తిని. లంకాదర్శనమునఁ గుతూహలము కలదు. ఇందలి యాా
రామాదులఁ జూచుటకే నాయాగమనము. అనఁగా నే కామ
రూపిణియగు నాలంక కఠినాక్షరములు గలుగునట్లుగా బుద్ధి
లేనికోఁతీ! యీానగరము నన్ను గెలువక చొర శక్యముగాదు.
అనఁగా హనుమంతుఁ డోమంగళరూపిణీ! నగరమును జూచి
మరల వచ్చినమార్గముననే పోయెద. మఱేమియుఁ జేయను.
ఆమాట విన్నంతనే భీతికరముగా గట్టిగా నార్చి వేవేగ
వానరు నఱచేఁ జఱచెను. ఆదెబ్బతగులఁగా నతఁడు గట్టిగా
ధ్వనించెను. వెంటనే యతఁ డెడమచేతియంగుళులు బిడి
కిలిగాఁ గూర్చి మిక్కిలి కోపమున దానిం బొడిచెను. అది
చంపఁదగినదయ్యును స్త్రీయనునాశయమున వదలిపెట్టెను. ఆ
పిడికిటిపోటున కంగములు నిస్సారములు కాఁగా నేత్రములు
బెడిదములై కనఁబడ నేలవ్రాలెను. దానింజూచి ప్రాజ్ఞుఁ డగు
నతఁ డిది స్త్రీకానఁ జంపరాదు. అని తలంచి కరుణాన్వితుం
డయ్యెను. ఆలంకయు భయంపడి గర్వముమాని తడఁబాటు

మాటలచే నడఁకువమీఱ నో కపివర్యా! మహాబాహుఁడవు. సౌమ్యుఁడవు. నీశౌర్యమును సహింపఁజాలుశక్తి నాకు లేదు. నేను రక్కసులలో నధమురాలను. రక్షింపుము. మీవంటిశూరు లాఁడువారిం జంపరు. శాస్త్రపద్ధతిని వదలరు. కాన నన్నుం బొలియింపకుము. లంకానగరరూపము నాదియే. మహాశూరుఁడవు గాన నన్నోర్చితివి. పూర్వము నాకు బ్రహ్మ వరమిచ్చినరీతిఁ దెల్పెద. సత్యమే యది కాన వినఁదగినదే. వానరుఁ డెపుడు నిన్ను నొంచునో యపుడు రక్కసులకు భయంబు వాటిల్లు. అని నీవెఱుంగుము. మహాత్మా! నీవువచ్చుటం జేసి బ్రహ్మ యానాఁడు తెల్పినకాలము వచ్చినది. ఆమాట తప్పదు. సీత నపహరించి తెచ్చిన రావణునకుఁ దక్కినరాక్షసులకుఁ గీడుమూఁడును. కాన నీనగరము నిష్టమురీతిం బ్రవేశించి చేయఁగలకార్యముల వేగమ చేయుము. మహానుభావా! నందీశ్వరాదుల శాపములపాలై రావణపాలితమగు నీనగరముం జొచ్చి నిరర్గళముగాఁ దిరిగి సాధ్వీమణియగు సీతాదేవిని వెదకుమని తెల్పెను.

మహాత్ములారా! ఈభాగమునఁ గలవిశేషములం బరిశీలింతము.

"అథసా హరిశార్దూలం ప్రవిశంతం మహాబలం,
నగరీ స్వేన రూపేణ దదర్శ పవనాత్మజం. ౨౦
సా తం హరివరం దృష్ట్వా లంకా రావణపాలితా,
స్వయమేవోత్థితా తత్ర వికృతాననదర్శనా. ౨౧
పురస్తాత్కపివర్యస్య వాయుసూనోరతిష్ఠత,
ముంచమానామహానాదమబ్రవీత్పవనాత్మజం." ౨౨

అని మూలము. లంకానగరమే యారాక్షసీరూపమున లేచెను. వికృతాస్యయై పొడసూపెను. నగరమునకు రూపధారణ మెట్లు? అనుప్రశ్న మిందుఁ గలదు. పూర్వము మహాపురములు నిర్మించునపు డష్టదిక్కులను నగరపాలనార్థము దేవతలఁ బ్రతిష్ఠించువారు. వాస్తుశాస్త్రమున వానిం బ్రతిష్ఠించు విధి కలదు. వానికి శక్తులని పేరు. నగరప్రతిష్ఠ చేయువారి యిష్టమునననుసరించి దేవతానామము లుండును. ఆనగరమున నీతిబాధాదులు కలుగకయుండఁజేయ నాశక్తులు సంసిద్ధలై యుందురు. వారినానగరవాసు లారాధింతురు.విశ్వకర్మ నిర్మించునపుడు లంకానామముననే దానిం బ్రతిష్ఠించెను. అదియే లంక. ఇపు డట్టులేల క్రొత్తవారు నగరమునఁ జొరఁబడఁగా నాదేవత లేచి మాటలాడదని ప్రశ్నింపరాదు. యజ్ఞభాగములకు దేవతలే వచ్చి తమతమ హవిర్భాగములఁ గొనిపోవు వారని కలదు. ఇపుడేల లేదు? అట్లే యిదియు ననునదియే సమాధానము. మంత్రము లున్నవి. వాని నుపాసించువిధు లున్నవి. ఆస్తికుఁ డగపడఁడు. కావున నీకలియుగమున నట్టి మహత్త్వములెల్ల నిష్ఫలము లయ్యెనని మన మెఱుంగవలెను. రేయి నూత్నవానరుఁడు బలవంతుఁడు ప్రవేశింపఁ గావణ మేమని యుత్తరభాగముననున్న యాదేవత లేచి ప్రశ్నించె నని మనము గ్రహింపవలయును.

"అహం హి నగరీ లంకా స్వయమేవ ప్లవంగమ,
సర్వతః పరిరక్షామి హ్యేతత్తే కథితం మయా. ౩౦

... ... ... ...

ద్రక్ష్యామి నగరీం లంకాం సాట్టప్రాకారతోరణాం,
ఇత్యర్థమిహ సంప్రాప్తః పరం కౌతూహలం హి మే. ౩౩

వనాన్యుపవనానీహ లంకాయాః కాననాని చ,

సర్వతో గృహముఖ్యాని ద్రష్టుమాగమనం హి మే.” 38

అని మూలము. లంకాస్వరూపము ముందే వ్రాసితిని. హనుమంతుని యుత్తరమునఁ గలసంశయమును వ్రాసెదను. ఏల వచ్చితివని లంక యడుగఁగా లంకానగరమునఁ గల విచిత్రారామాదులను జూడ వచ్చితినని హనుమ తెలిపెను. కాని జానకీదేవ్యన్వేషణార్థమని తెలుపలేదు. ఇది యసత్యము కాదా యను ప్రశ్నము కలదు. సామాన్యధర్మములకు రాజధర్మములకు భేదము చాల గలదు. స్మృతులావిషయమును బోధించును. అహింసావ్రతము రాజవలంబించునేని ప్రజలకే హాని గల్గును. ప్రకృత మనుసరింతము. హనుమంతుఁడు దూతగాని యాత్రార్థ మాపుణ్యానగరమునకుం బోయినవాఁడు కాఁడు. దూతలక్షణములలో, “స్మృతిమాన్ దేశకాలవిత్” అని యున్నది. “దేశకాలౌ జ్ఞాత్వా అన్యదపి సందిష్టం దేశకాలౌచితమన్యథా కథయతి” అని వ్యాఖ్యయందుఁ గలదు. దేశకాలముల నెఱింగి ప్రవర్తింపవలయును. కాని ఘటం భింద్యాత్తనునట్లు వచ్చినపనిని దెలుపరాదు. ఇది రాజనీతి. దీనిని సామాన్యధర్మానుసారముగాఁ దీర్మానింపరాదు. కావున హనుమ దూతగావున శత్రువులతో నెట్లు మాటలాడవలయునో ధర్మముగా నట్లే మాటలాడెనని మన మెఱుంగవలయు.

“ప్రసీద సుమహాబాహో త్రాయస్వ హరిసత్తమ. 44

సమయే సౌమ్య తిష్ఠంతి సత్త్వవంతో మహాబలాః,

... ... ... ...

స్వయంభువా పురా దత్తం వరదానం యథా మమ,

యదా త్వాం వానరః కశ్చిద్విక్రమాద్వశమానయేత్. 42

తదా త్వయా హి విజ్ఞేయం రక్షసాం భయమాగతం,
స హి మే సమయస్సౌమ్య ప్రాప్తోఽద్య తవ దర్శనాత్. ४०
స్వయంభూవిహితస్సత్యో న తస్యాస్తి వ్యతిక్రమః,
సీతానిమిత్తం రాజ్ఞస్తు రావణస్య దురాత్మనః. ४८
రక్షసాం చైవ సర్వేషాం వినాశస్సముపాగతః,

... ... ... ...

యదృచ్ఛయా త్వం జనకాత్మజాం సతీం,
విమార్గ సర్వత్ర గతో యథాసుఖం." ५०

అని మూలము. నేల పైఁబడి రక్షింపుమా యని వేఁడి లంక పలుకుచున్నది. నీ కెపుడు వానరునివలన భయము గలుగునో యపుడు లంకయందుఁ గలరక్కసులకు భయము గలుగును. మృతి భయము గలుగునని భావము. ఆకాల మిదియే యని తెల్పెను. సీతాన్వేషణ మిచ్ఛానుసారముగాఁ జేయుమా యని యాలంక బోధించెను. వృద్ధిక్షయములు సామాన్యములు. పర్వతములకు నివియుండును. నగరముల కేల యుండవు? నాశనకాల మాసన్నము కాఁగా నానగరాధిదేవతకు హాని గల్గెను. ఇఁక నగరమునకు హానియే. నగరమున కనఁగా నందు నివసించు రక్కసులకని భావము. ఎపుడామె కిట్టిస్మృతి కలిగి నదో యపుడు సీతాన్వేషణార్థమై యతఁ డరుదెంచెనని కనుఁ గొనియెను. ఎట్టివానికైనను రూపము గలుగఁగానే క్షయము కలదని మనము నమ్మవలయును.

## హనుమ లంకంజొచ్చి సీతను వెదకుట.

* ఇట్లు హనుమంతుఁడు లంక నశ్రమంబున జయించి

* ఇయ్యది నాల్గవసర్గమునఁ గలదు.

పురప్రాకారమును ద్వారమూలమున దాఁటక గోడపైనుండి యెగిరి సుగ్రీవునకు మేలు రావణునకుఁ గీడు గోరియుండు వాఁడు గావునఁ దనయెడమకాలు శత్రుమూర్ధమునందుఁబోలె నుంచెను. అట్లు మారుతి రాత్రికాలమున లంకంజొచ్చి రాజ మార్గమున మనోహరమగు లంకానగరమం దంతటం దిరుగ సాగెను. నృత్తగీతవాద్యధ్వనులు భయంకరాట్టహాసములు వినఁబడుచుండెను. తెల్లని మేడలు రమణీయములై యున్నం దున మేఘావృతమగు నాకాశమా యనుభ్రాంతిని గలుగఁ జేయుచుండెను. మంగళకరములగు రక్కసులగేహములు పద్మక స్వస్తిక వర్ధమానక నామక సంస్థానభేదములచేఁ గట్టఁ బడిన రాజగృహములు నందు నలరారుచుండెను. ఎవ్వారికేఁ జొరఁ దరముగాని యీలంకయం దెల్లయెడల సీతను వెద కెద. నావాంఛితము ఫలించును. అనుకొనుచుఁ బ్రతిగృహ మును దిరిగితిరిగి యందుఁ బతివ్రతాశిరోమణి యగుసీతను వెదకసాగెను.

అందుఁగల తామరసాక్షులు హృత్కంఠశిరస్థానముల యం దుత్పత్తి గాంచిన మంద్ర మధ్యమ తారములను స్వర ముల మూఁడింటింగూడి రమణీయతం గాంచుచందమున సుర పురమునం దప్సరమిన్నలుంబోలె సొంపుగులుకఁ బాడుచున్న గానము నాలకించుచుం బోయెను. మఱియు రాక్షసోత్తముల మందిరములం జరించు నన్నుమిన్నల కాంచీదామముల నినద ములు నందియలచప్పుడులు, సోపానములయం దాకామినులు సంచరింపఁగదలు కనకనూపురాదులనినదములును, అందు నందు భీతికరములై సింహనాదములు జపము చేయువా రుచ్చ రించు వేదమంత్రములును బావనికి వినఁబడియెను. మూల

బలములను వానినడుమనుండు రావణదూతల నతఁడు చూచెను. యజ్ఞదీక్షితులు, జటాధారులు, ముండులు, వృషభ చర్మపరిధానులు, దిగంబరులు ననిష్టనివారణార్థ మాయుధ ములఁ బోలిన దర్భముష్టులుగలవారు, నాభిచారిక క్రియలచే శత్రువుల వధించి జయమొందఁ గోరి తత్సాధనములగు నగ్ని కుండముల హోమము చేయువారును, కూటముద్గరాదులను దాల్చినవారు బహువిధములుగా వికృతములగు నంగములు గలవారును హనుమంతునికంటం బడిరి. మఱియు ననేకా యుధధారు లగపడిరి. రావణాజ్ఞచే నేమఱుపాటులేక నగర మును గాపాడు మూలబలము ననేకలక్షసంఖ్యలు గలదాని హనుమ కనుఁగొనియె. ఆమీఁద సువర్ణద్వారభూషితం బగు రావణుని గేహావర్యమును గాంచెను. అందు నానానినాద ములు హయహేషలు నారీరత్నముల కంకణాదిభూషణముల రవములు వినఁబడసాగెను. దానిద్వారం బతిమనోహరంబు. బలవంతు లగురాక్షసు లద్దానిం గాపాడుచుందురు. కాలా గురుధూపములు గుబులుకొనుచుండును.

బుద్ధిమంతులారా! ఇందలివిశేషముల నరయుదము. గృహావర్ణన మిందు ప్రధానము.

> "అద్వారేణ మహాబాహుః ప్రాకారమభిపుప్లువే,
> ప్రవిశ్య నగరీం లంకాం కపిరాజహితంకరః. ౨
> చక్రేఽథ పాదం సవ్యం చ శత్రూణాం సతు మూర్ధని,"

అని మూలము. లంకను ద్వారముగుండ ప్రవేశింపక వేఱు మార్గమునఁ బ్రవేశించుట శత్రునాశనార్థమని యొక వ్యాఖ్య యందుఁ గలదు. "శ్లో. గ్రామం వా నగరం వాపి పత్తనం వా

పరస్య హి, విశేషాత్మమయే సౌమ్యే న ద్వారేణ విశేన్నృప." అని. సవ్యపాదమును దొలుత నుంచుట శత్రుపరిభవార్థమనియే వ్యాఖ్యాతలు వ్రాసిరి.

"స మహాపథమాస్థాయ ముక్తాపుష్పవిరాజితం,
తతస్తు తాం పురీం లంకాం రమ్యామభియయౌ కపిః. 4

... ... ... ...

సితాభ్రసదృశైశ్చిత్రైః పద్మస్వస్తికసంస్థితైః,
వర్ధమానగృహైశ్చాపి సర్వతస్సువిభూషితా. 6

... ... ... ...

శుశ్రావ మధురం గీతం త్రిస్థానస్వరభూషితం,
స్త్రీణాం మదసమృద్ధానాం దివిచాప్సరసామివ." 10

అను నీమూలమును బరిశీలించిన లంకానగర మెంత సొంపు గూర్చుచున్నదో తేటపడును. నాగరికతకు నిదాన మనవలయు. సంగీతము నర్తనము శాస్త్రరీతిగా నుండుట, స్త్రీరత్నముల యాభరణధ్వనులు మనోహరముగ వినంబడుట, యెందుల కుదాహరణమో యోజించినఁ దేటపడును.

"శుశ్రావ జపతాం తత్ర మంత్రాన్ రక్షోగృహేషు వై. 12
స్వాధ్యాయనిరతాంశ్చైవ యాతుధానాన్ దదర్శ సః,

... ... ... ...

దీక్షితాన్ జటిలాన్ ముండాన్ గోజినాంబరవాససః,
దర్భముష్టిప్రహరణా నగ్నికుండాయుధాం స్తథా."

అని మూలము. ఉపాసకులు వేదపారాయణము చేయుచుండుట, వేదమంత్రములనే యుపాసించుచుండుట రక్కసులనాగరకులని తోఁపింపఁజేయును గాఁబోలు! దీక్షితులనఁగా

సర్వమంత్రరాజ్యసమ్రాట్టులు. అనఁగా శాక్తులు. జటిలాః. భైర వోపాసకులగు కాపాలికులు. ముండులు యోగాచార్యులు. బౌద్ధులని కొంద అందురు. కాని యోగవిశేషముల నభ్యసించుచుండువా రనుటయే సమంజసము. రామాయణమునఁ గల బౌద్ధశబ్దమునకు వేదనిందకులనియే యర్థము. గోచర్మ వసనులు. అనిష్టపరిహారార్థమాలమున నిష్టసిద్ధ్యర్థముగాఁ బిడికిట దర్భలు పట్టుకొని జపించువారు. ఇదియు నాభిచారిక హోమములలో నొకభేదమని యెఱుంగవలయు. శత్రుమారణముం గోరి తదుపయుక్తవస్తువుల నగ్నికుండమున వేల్చువారు. వీరెల్లరు క్రూరులు గారా యని కొంద అడుగుదురు. ఆపక్షమున యజ్ఞములు క్రూరకర్మములే. లంకంగల రక్కసులందఱు ముక్తులని నాభావము కాదు. వేదవేదాంగవేత్తలు నుపాసకులు నని. పురనిర్మాణాదులం గాంచిన నాగరిక మందే యావిర్భవించిన ట్లుండును. వికారముగా నుండువారు కలరు గదా యందురేని తిరుపతికొండపైనను గలరు. ముక్కులేని వారు, చెవులే మొలవనివారు, ఇంక ననేకవిరూపాంగులు కలరు. అంతమాత్రమున నాపర్వతమున నుండువారెల్లరు వికృతాకారులే యనవచ్చునా? లంకయందు నట్లే యని యెఱింగిన నిట్టియాక్షేపముల కవకాశము కలుగదు. లంకానగరమున నున్నరక్కసులు నాగరికత లేనివారన వలనుపడదు.

### హనుమ వెన్నెలయందు జానకి వెదకుట.

* అంతఁ జంద్రకాంతి చక్కఁగా వ్యాపింప సాగెను. తాపహారుఁ డగుచంద్రుని హనుమంతుఁడు కని సంతోషించుచు

---

* ఇది యైదవసర్గమునఁ గలకథ.

వెదక నారంభించెను. వీణాదివాద్యనాదములు వినఁబడు చుండెను. శీలవతులగు సతివలు పతులంగూడి సుఖనిద్ర చేయు చుండిరి. రాత్రించరము లగుభూతాదులు తిరుగులాడు చుండెను. సురాపానమదమున నొడలు తెలియక యుండు వారిని జూచుచు ననేకగృహములం బరికించుచుండెను. కొందఱురాక్షసు లొండొరులం బరిహసించుకొనుచుండిరి. భుజములొకళ్లొకళ్లపై వైచుకొనియుండిరి. కొందఱు మదించి స్వేచ్ఛగా మాటలాడుచుండిరి. ఇట్లనేకవిధముల నుండురక్కసుల నాయాయిగృహంబులయందుఁ గనియెను. కొన్ని యిండ్లయం దుండు మందగమనలు చందనాదుల నలందుకొనుచుండిరి. కొందఱు నిదురించుచుండిరి. కొందఱు నవ్వుచుండిరి. కొందఱు కోపమున బుసగొట్టుచుండిరి. ఆపురవరమున మహాబుద్ధిమంతులు సరసాలాపచతురులు, పరమాస్తికులు, మనోహరనామధారులు నగునిశాచరు లాతనికిం గనఁబడిరి. కొందఱు వికారరూపులును గనఁబడిరి. కొన్ని తావుల సురత క్రీడలయం దనేకరీతుల వర్తిల్లు స్త్రీపురుషులం జూచెను. రాక్షసకాంత లనియు మానవస్త్రీలనియుఁ దెలిసికొనఁ గోరి వెన్నెలసాయమున వారిముఖములం బరికించి శ్రీరాముఁడు చెప్పిన జానకి యాభరణముల గుఱుతులేమైనఁ గలవా యని పరికించెను. సీతమాత్ర మంతదనుకఁ గనఁబడకయుండెను. శ్రీరామ వియోగఖిన్నయై పలువిధములగు దుఃఖములపాలై యుండు జానకి నెంతవెదకినను గనుంగొనఁజాలక పరితపించెను. ఎంత వెదకినను జానకి కానరాక పోవ నాహనుమ మిగుల విచారింప సాగెను.

## హనుమ రావణాంతఃపురమున వెదకుట.

* మఱియు నాహనుమంతుఁడు కామరూపి గావున నింకను వెదకసాగెను. ఒక్కచో ననేక వీరరాక్షసపరిరక్షితం బగు భవనోత్తమమును జూచెను. దాని రక్షించుమార్గములు వర్ణనాతీతములు. దానియందము వర్ణింపఁ దరమేగాదు. అందుఁ దిరుగాడు వనిత మంజీరధ్వనులు సాగరఘోషము నడఁపఁజాలును. రావణుఁ డాహితాగ్ని. కావున సకాలము లందు హోమము చేయుచుండును. ఆభవనోత్తమము రత్నమయంబై విచిత్రముగ నతనికిం జూపట్టెను. ఇది లంక కెల్ల నలంకారమనవచ్చునని తలఁచి సీతను వెదకుచుఁ దిరుగసాగెను. మహాపార్శ్వాదులయిండ్లకుం బోయి వారివారి సంపత్సమృద్ధిని బరిశీలించెను. అందెల్లఁ గలయందిరిగి మఱియు రావణునింటికిం జనియెను. ఆతఁడు నిదురించుచుండెను. ఆతని చెంత వికృతనేత్ర లగు కొందఱువనిత లుండిరి. కొందఱు శూలాద్యాయుధములఁ దాల్చియుండిరి. ఆమందిరమును గాపాడు రక్కసులు బహుబలాఢ్యులు. అందనేకమందిరము లుండెను. నెమిళ్లుండుచోటు లుండెను. అందు రావణుఁడు సూర్యునివలెఁ బ్రకాశించుచుండెను. మృదంగతాళధ్వనులు బోరుకొను చుండెను. అట్టిగృహము నాహనుమంతుఁడు ప్రవేశించెను.

## హనుమ పుష్పకవిమానమును జూచుట.

† అవ్వల నాంజనేయుఁడు వైడూర్య మణిఖచితజాల మార్గములుగల గృహసముదాయములం గనియె. మఱియు

---

* ఇది యాఱవసర్గమునఁ గలదు. † ఇది యేడవసర్గమునఁ గలదు

రావణుఁడు శౌర్యమున నార్జించిన గృహములం గాంచెను. అత్యంత ప్రయత్నమున విశ్వకర్మాదినిర్మితమై సర్వగృహమనో హరంబై యుండు రావణు సౌధరాజిం జూచెను. అంత వర్ణనా తీతమైనపుష్పకము దృగ్గోచరం బయ్యె. భూతలస్వర్గమా యనున ట్లది యలరారుచుండెను. రత్నమయపర్వతశిఖరమువలె నది చూపట్టుచుండెను. పూజ్యంబై స్వర్గమునకుం బోవు పుణ్య మతులు వియత్తలమున హంసవర్యములు వహింపఁగా నెక్కి పోవు విమానవర్యముం బోలి యలరారుచుండెను. దాని శిల్పము వర్ణింప ననంతునకే నలవిగాదు. గృహములయందెల్ల నుత్తమోత్తమంబై పుష్పకనామమున మహిమముం గాంచిన దాని నాహనుమ పొడగాంచెను. ఇట్లు సొంపులుగులుకుచు శుభప్రదమగు నొకభూధర శిఖరమువలెనే కనఁబడుచున్న యాగృహవర్యమును జక్కఁగాఁ బరిశీలించి రావణుఁడు నతని కాంతలు నుండుచోటు గనఁబడనందున నచ్చెరువొందెను. అందెందును సీతాదేవిం గానక ప్రయత్నమును మానక నీతి మార్గమును వదలక వెదకివెదకి చింతామగ్నుఁ డయ్యెను.

## హనుమ పుష్పకమును మఱియుం గని వినుతించుట.

* ఆపుష్పకమునఁ గృత్రిమపక్షులు లోనగువానిచే నొప్పుచున్న యవ్విమానవరముం గాంచి దాని నిర్మాణచమ త్కృతిం గాంచి దీనిం బోలునది యింకొక్కఁ డుండఁజాలదని తలంచెను. దీని నిర్మించుతఱి విశ్వకర్మ యేతచ్చమత్కృతిని మెచ్చుకొనియుండునవ నిఁక దీనిమహత్త్వము వేఱుగఁ బలుక

* ఇది యెనిమిదవసర్గమునఁ గలకథ.

నేల? అది యాకసము నంటియుండెను. భూమిం దగులలేదు. సూర్యమార్గముం గనంబఱుచు నొకచిహ్నమో యన వెలయు చుండెను. అందుఁగల యేవస్తువుగాని యత్యంతప్రయత్నమున నిర్మింపఁబడినదే గాని యితరము గాదు. అందెందుఁ గాంచిన నమూల్యమణులు పొదిగియుండుట గనంబడు. విచిత్రముగాఁ దోఁపని దందేదియు లేదు. అట్టిదాని నారావణుఁడు నిజభుజా బలమున నార్జించెను. అది యెక్కడికిఁ బోవలయునని మన మునఁ దలంచినను, ఆయాస్థలములకుం బోవంజాలి గోపురాది సన్నివేశములచే విశేషించి దర్శనార్హముగ నుండును. ఆయా తావులఁగల శిల్పవిశేషములు రమణీయములుగా నుండుటం జేసి యది యేతావునం గాంచినను విశేషమనోజ్ఞముగాఁ గానంబడును.

ఆవిమానము తనస్వామి చిత్తవృత్తి నెఱింగి తనను కూలముగా వాయువేగమునఁ బోవును. దాని నిలుప నెవ్వా రికేఁ దరముగాదు. అది మహనీయులు మహాపుణ్యవంతులు నిరుపమానసంపన్నులు కీర్తివిరాజితులు నగునింద్రాదులకు నివాసభూతమగు స్వర్గముం బోలెఁ బ్రకాశించుచుండెను. శారదనిశాకరబింబములాగునఁ గనంబడుచుండెను. అం దనేక ప్రతిమలు కనంబడుచుండెను. అవి యావిమానమును మోయు చున్నట్లు చూపట్టుచుండెను. వసంతకాలమున నలరారు పుష్ప సముదాయమురీతి మనోజ్ఞముగను వసంతర్తువుకంటె మఱింత మంజులముగను గానంబడుచుండెను. అట్టి యద్భుతశిల్పవిశేష పరిదృశ్యమానమగు నా పుష్పకవిమానరత్నమును వాయు నందనుఁ డగు నాహనుమంతుఁడు పరికించి విస్మయావిష్ట చేతస్కుఁ డయ్యెను.

## పుష్పకవిమానప్రభావము.

* అంత హనుమానుఁడు రావణున కత్యంతప్రియమగు నావిమానరాజమున వేఱొక గృహరత్నమును దిలకించెను. అయ్యది యోజనమంత విశాలము. అర్ధయోజన విస్తీర్ణము. అం దెన్నియో మేడలు గలవు. రావణుని బంధుగృహముల యం దెల్లయెడల సీతను వెదకి హనుమ తుద కారావణుఁ డుండు భవనరాజముం గని యది యతని ప్రధానస్థానమని తలంచెను. అందు నాల్గుదంతముల గజములు మూఁడుదంత ములుగల యేనుంగులును, సాధారణగజములును బెక్కు లుండెను. విశాలమగు నాభవనము భయంకరరక్షకపాలితము. అందా రావణునిభార్యలు, పరాక్రమమునఁ గొనితెచ్చిన రాజ కన్యకలు లోనగువారు పెక్కం డ్రుండిరి. ఇంద్రకుబేరుల సంపదలన్నియు నం దగపడుచు నుండెను.

ఆ రావణునిహర్మ్యమున మందిరరాజము నాఁబరఁగు పుష్పకవిమానము హనుమంతునకు గోచరమయ్యెను. అది యనేకద్వారములు గలది. బ్రహ్మనిమిత్తము మున్ను విశ్వ కర్మ యద్దాని నిర్మించెను. కుబేరుఁడు తపఃఫలముగా నద్దానిం బడసెను. ఆతని నోడించి రావణుఁడు దానిం దెచ్చెను. దాని చమత్కృతి వర్ణనాతీతము. ఆకాశమును దాఁకుచునుండు నయ్యది చూడ విచిత్రముగా నుండును. ద్వారములు గవాక్ష ములు సొంపుగానుండు. సకలరత్నములు నందందు స్థాపింపఁ బడియుండుటం జేసి యందేవస్తువునుంచిన నద్దాని రంగుగలది గనే యుండును. దాని నాహనుమంతుఁ డారోహించి అందుండి

* ఇది తొమ్మిదవసర్గమునఁ గలదు.

యతఁడు మనోహరసుగంధము నాఘ్రాణించెను. రావణుం డందుండవలయు నన్న యూహ నది గలిగించుచుండెను. ఇందు రావణుఁడు కలఁడు. నమ్ము. అని యది యతనికిం దెలుపుచున్న ట్లుండెను. ఆచోటికిం బోవనెంచి యాకపివరుఁడు దాని నిర్మాణ విశేషమున కచ్చెరువందుచు నిది స్వర్గమా బ్రహ్మలోకమా యని యూహించి బంగారు స్తంభములయందలి దీపములం గని చిత్రంపడి విచిత్రవస్త్రములం గట్టుకొని సకలభూషణముల నలరారుచు ననేక కామినీమణులు చిత్రకంబళములపై శయనించియుండం గాంచి వారి క్రీడావిశేషములం దేలి మద్య పానమునం గైపెక్కఁగా నిదురరాఁగా దానికి లోఁబడియుండిరి. తనచుట్టు నట్టి నవయువతులు పెక్కం డుండఁగా రావణుఁడు శయనించియుండి నక్షత్రపరివృతుం డగు చంద్రునివలెం గనుపట్టుచుండెను. అనుభవింపఁగా మిగిలియున్న పుణ్యముతోం బుడమిపయింబడిన నక్షత్రములే యీకాంతలని హనుమ తలంచెను. ఒడలు తెలియక వారు నిదురించుచుండిరి. నిద్రా భరమున వారియాభరణములు తాఱుమాఱుగ నుండెను. కొందఱు చూచుట కేవగింపు గలిగించునట్లు శయనించి యుండిరి. సంభోగచిహ్నము లనేకములు వారియందుఁ గనంబడు చుండెను.

రాజర్షులయుఁ బితృదేవతలయు దైత్యగంధర్వరాక్షసులయు స్త్రీలు రావణుని దమయంతన తారే కామించి వచ్చియుండిరి అంతియకాని బలిమిమై నతఁడు తెచ్చినవారు కారు. మఱికొంద ఱట్టివారును గలరు. వారిబంధువులతో సంగరము పొసంగవలయునని రావణుఁ డాకాంతలను దెచ్చినవాఁడే కాని కాముకుఁడై తెచ్చినవాఁడు కాఁడు. యౌవనగర్వమునఁ

గొందఱు రావణుని వలచియే వచ్చిరి. సీతాదేవి తప్పఁ దక్కినవారంద ఱతని వలచి వచ్చినవారే. ఆతని సౌందర్య సంపద వారిని వలచునట్లు లొనరించెను. వేఱొకఁడు వారికి మెప్పుపుట్టించువాఁడు లేకుండెను. కులగుణములచే నొక్కర్త కయు నందుఁ గొఱంతగాంచినది కానరాదు. రావణునిభార్య లగు వీరంద ఱెట్లు తమభర్తంగూడి సకలభోగముల ననుభ వించుచున్నారో యట్లే జానకియు రామచంద్రునిం గూడి భోగముల నొందుచందమున రావణుఁ డాదేవిని శ్రీరాము నకు సమర్పించునేని అతనిజన్మము ధన్యమగునని హనుమంతుఁ డపుడు తలంచెను. మహాసాధ్విని జానకిని సద్వంశసంభూతుఁ డయ్యు నీరావణుఁ డపహరించి తెచ్చి చెడుకార్యమును గావిం చెను గదా. ఎంత కష్టము వచ్చినది. అక్కటా! అని మరల హనుమంతుఁడు చింతించెను.

మహామతులారా! ఈభాగమున విమర్శింపఁ దగు విషయములు విశేషించి కానరావు. విమానవర్ణన మిది. గృహ వర్ణనము స్త్రీవర్ణనము నిందుఁ బ్రధానములు. ఈగ్రంథము వానిసారము గ్రహించి యితరులకు బోధించునది కాదు. ఇందుఁ గొన్నివర్ణనము లత్యంతాసహ్యములుగా నున్నవి. వాల్మీకిమహాకవి మునివర్యుఁడయ్యు నిట్టిఘట్టముల నేల వ్రాసెనని కొందఱందురు. సౌందర్య మెంతజ్ఞానినైన లోఁబడఁ జేయఁజాలును. దాని లెక్కింపక మెలంగుటయే గొప్పగుణ మనునీతిని రావణహనుమత్ప్రవర్తనముల ననుసరించి తెలుపు టకే యని మన మూహింపవలయును. సురాపానము బ్రాహ్మణే తర స్త్రీలకు దూష్యము కాదనియు నది సంభోగాంగమనియుఁ బురాణములు తెలుపుచున్నవి.

"స్త్రీణామపి తృతీయాదిపేయం స్యాద్బ్రాహ్మణీం వినా,
పతిహీనా చ కన్యా చ త్యజేద్వృతుమతీ తథా. ౧౩౬
అథ భర్తృసన్నిధౌ నారీ మద్యం పిబతి లోలుపా,
ఉన్మాదినీతి సా ఖ్యాతా తాం త్యజేదంత్యజామివ. ౧౩౭
దశాష్టషట్చతుస్త్రస్తు ద్విజాదీనామఘం భవేత్,
స్త్రీణామఘం తదర్ధం స్యాత్పాదం స్యాద్భర్తృసంగమే." ౧౩౮
బ్రహ్మాండపు. లలితోపా. ౨ సర్గము.

"భోగేచ్ఛయా యో మద్యం తు పిబతే బ్రాహ్మణాధమః,
ప్రాయశ్చిత్తం న వై వాచ్యం శిలాగ్నిపతనాదృతే.
ద్విజో మోహాన్నతు పిబేత్స్నేహాద్వా కామతోఽపి వా." ౧౪౮

అను నీవాక్యములు పూర్వోక్తార్థమునకుఁ దోడ్పడునవి. ఆ కాలమునందు సురాపానము మాంసభక్షణము స్వభావకార్యములుగా నుండెను.

"న మాంసం రాఘవో భుంక్తే న చాపి మధుసేవతే,
వన్యం సువిహితం నిత్యం భక్తమశ్నాతి పంచమం. ౪౧
నైవ దంశాన్న మశకాన్న కీటాన్న సరీసృపాన్,
రాఘవోపనయేద్గాత్రాత్త్వద్గతేనాంతరాత్మనా." ౪౨

అను హనుమద్వాక్య మీకాండమునందే కలదు. ఇపుడు నీవు చెంతనుండమింజేసి మద్యమాంసములం గొనకయున్నాఁడు రాముఁడన నర్థమేమి? పూర్వము గ్రహించువాఁడనియే కదా. కావున స్మృతులు పురాణములు బ్రాహ్మణేతరులకు విహిత మద్యపానము విధింపఁబడినది. దూష్యము కాదు. కావున నందుండువారందఱు బ్రాహ్మణేతరస్త్రీలే కావున సంభోగాంగముగా సిద్ధమగు మద్యమును ద్రావి విహరించి యొడలుమఱచి

నిద్రించిరి. అట్టివారివర్ణనము యుక్తమే. ఆయుత్తమకాంతా మణులం గాంచియు నించుకంతయు మనశ్చాంచల్యము నొందక యుండె ననువిషయ మాతని మనస్థైర్యమును వెల్లడించును. హనుమంతునివలె మనోనిగ్రహము గలిగియుండువారే భక్తు లగుదురని లోకులకు వెల్లడించుటకే మహాముని వాల్మీకి యట్టి ఘట్టములఁ బెంచి వ్రాసెను. లోకజ్ఞాన మిప్పటివారి కున్నంత లేక కాదనియుఁ ద్రికాలవేత్తయే యనియు మనము విశ్వ సింపవలయును.

> "తస్య హర్మ్యస్య మధ్యస్థం వేశ్మ చాన్యత్సునిర్మితం,
> బహునిర్యూహసంకీర్ణం దదర్శ పవనాత్మజః." ౧౦

అని మూలము.

> "స పుష్పకం తత్ర విమానముత్తమం దదర్శ తద్వానరవీరసత్తమః."

అని పూర్వసర్గాంతమున నున్నది. పుష్పక మనుపేరు గల విమానముం గాంచెనని దాని యర్థము. మరల నాయింటి నడుమనున్న పుష్పకమును జూచెననుట పూర్వోక్తి వ్యాఘా తము కాదా యని యడుగవచ్చును. మన మీరీతిగా గ్రహిం చిన నసంగతము కాదని తోఁచును. తొలుత హనుమంతుఁడు రాజగృహమును దర్శించెను. విమానమున రాజమందిరములఁ గట్టరు. వ్యోమయానము స్థిరముగా నొకచోట నుంచఁదగినది కాదు. వలసినతఱి నెచ్చటికేని పోవ సిద్ధముగా నుండఁ దగినది. అది చాల మనోహరముగ నుండునది. విశేషించి రావ ణుఁడు లోకత్రయ జిగమిష కలవాఁడు. కాన దానినిఁ గుబేరు నోడించి తెచ్చెను. దాని రామణీయకమున కచ్చెరుపడి యందలి

భోగగృహముల (గదుల) నుపయోగింపఁ దలఁచి తనయంతః పురమున నుంచుకొని యందే విహరింపఁ జొచ్చెను. హనుమ తొలుత సౌధరాజమును గని యందు వెదకి సీతం గానక తదం తర్భాగములగు రావణపుత్త్ర బంధుగేహములందును వెదకి విమానమును గాంచెననియు, అందే భోజనవిహారములకు నను కూలము లగుస్థానములు కల్పింపఁబడినవనియు, వెదకునప్పు డాహనుమంతునకు భోజనపదార్థముల పరిమళములు నాసా పుటములకుఁ బండువు లొనరించెననియు నందుఁ గూపచుండి యావిమానమున వెదుకఁ దలంచెననియు మనము గ్రహింప వలయును.

> "బ్రహ్మణోఽర్థే కృతం దివ్యం దివి యద్విశ్వకర్మణా,
> విమానం పుష్పకం నామ సర్వరత్నవిభూషితం. ౧౧
> పరేణ తపసా లేభే యత్కుబేరః పితామహాత్,
> కుబేరమోజసా జిత్వా లేభే తద్రాక్షసేశ్వరః." ౧౨

అని మూలము. పూర్వకాలమునఁ గలవిమానముల నిక్కాల మున నుండువిమానములతోఁ బోల్పరాదు. అవి కామగమన ములు. మంత్రజపైకఫలములు. ఇప్పటివి యంత్రకల్పితములు. సంబంధమే వీనికి లేదు. నామసంబంధ మొక్కటియే కలదు. వీనికిఁ బ్రతిక్షణపతనభయము కలదు. వాని కది లేదు. కామ గమనము విశ్వాసపాత్రమా యనువా రుండకపోరు. తపశ్శక్తి యెట్టిదని యెఱుఁగనివారి కది యవిశ్వాసపాత్రమే యగు. వారిని నమ్మించవలయు ననుప్రయత్నము నిరర్థక మనవలయు. మనశ్శక్తి యెట్టిదో యెఱుంగనివారికి బోధింప శక్యమే కాదని భర్తృహరియుఁ జెప్పెను. వారినే మూర్ఖులని యతఁడు

భావించెను. కష్టసాధ్యమగు కార్యములలో నిది యత్యుత్త మము.

"శక్యో వారయితుం జలేన హుతభుక్ఛత్రేణ సూర్యాతపో
నాగేంద్రో నిశితాంకుశేన సమదో దండేన గోగర్దభౌ,
వ్యాధిర్భేషజసంగ్రహైశ్చ వివిధైర్మంత్రప్రయోగైర్విషం
సర్వస్యౌషధమస్తి శాస్త్రవిహితం మూర్ఖస్య నాస్త్యౌషధమ్."

కావునఁ బెద్దలే వారికొక నమస్కారముచేసి బహూకరించిరి. మన మనేకనమస్కారముల బహూకరింతము. బ్రహ్మకుగా విశ్వకర్మ నిర్మించెననియు, సకలరత్నఖచితమై యది యొప్పు ననియు, దానిని దపమున బ్రహ్మ నలరించి కుబేరుఁడు పొందె ననియు, దానిని బలాత్క్రమమున రావణుఁడు కుబేరు నోడించి సంపాదించెననియు నిందలికథ. విమానమనఁగా విగతః మానో యస్య తద్విమానమని మనము గ్రహింపందగు. దాని యంత స్సార మింతయని యెఱుంగరానిదని యర్థము. ఏలయనఁగా నది కేవల దారునిర్మితము కాదు. రత్నవినిర్మితము. జీవర త్నము లనుట ప్రసిద్ధమే కదా. ప్రాణదానక్షమములు రత్న ములని యెఱుంగందగు. రత్నములమహిమముకూడ నీకాల మున మఱుంగుపడిన దనవలయు. పాకరత్నములు, కృత్రిమ రత్నములు ప్రీతిపాత్రములగుచో నిఁక నీకాలపుమాహా త్మ్యము తెలుప నెవ్వరికిం దరము. రత్నధారణ మడుగంటగా నాయుర్వృద్ధియు నశించినది. ఆవిషయమును బరిశీలింతము.

"ఈహామృగసమాయుక్తైః కార్తస్వరహిరణ్మయైః,
ఇంద్రనీల మహాసెల మణిప్రపర వేదికం. ౧౫
విద్రుమేణ విచిత్రేణ మణిభిశ్చ మహాధనైః,
నిస్తులాభిశ్చ ముక్తాభిస్తలేనాభివిరాజితం." ౧౬

అని మూలము. తొలుత రత్న ధారణఫలముల నెఱుంగుదము.

"రత్నాలంకృతిధారణం రతికరం లక్ష్మీవిలాసాస్పదం
మాన్యం కామఫలప్రదాయి సుభగం మాంగళ్యమాయుష్కరం
ఓజఃకాంతియశఃప్రభావజనకం దోషఘ్నమత్యుజ్జ్వలం
భూతోన్మాదభయభ్రమక్లమవిషక్షీణేంద్రియత్రాపహం."

సకల రోగనివారణదక్షములు రత్నములని సారము. రత్న ధారణము గ్రహములనుబట్టి యనఁగా వారముల ననుసరించి యుండును. అట్లు చేసిన చిరతరాయుర్భాగ్యమనశ్శక్తు లొనఁ గూడును. ఎట్లన.

"ఆదిత్యవారే మాణిక్యం సోమవారే తు మౌక్తికం,
విద్రుమం భౌమవారే తు సౌమ్యే మరకతం తథా. ౨౦
పుష్యరాగం గురోర్వారే వజ్రం వారే భృగోరపి,
నీలం వారే రవేస్సూనోర్గోమేదం రవివాసరే. ౨౧
వైదూర్యం శశినో వారే ఇతి వీక్షావినిర్ణయః,

... ... ... ...

వీక్షకో ధారయేన్మూర్ధ్ని శుచిర్ధర్మపరాయణః,
శుద్ధవస్త్రావృతం పీఠం శుద్ధదేశే నిధాయ చ. ౨౪
మాణిక్యాదీని రత్నాని మండలాకృతి విన్యసేత్,
మధ్యేతు పద్మరాగం చ ముక్తాదీని యథాక్రమం. ౨౫
పూర్వాదిదిక్షు విన్యస్య తత్ర తత్ర సమర్చయేత్,
ఆదిత్యాదిగ్రహాన్నిత్యం తత్తత్పుష్పైస్సమర్చయేత్. ౨౬

... ... ... ...

తస్మాద్వజ్రం తు రత్నానాం శ్రేష్ఠమాహుర్మనీషిణః,

... ... ... ...

విప్రక్షత్త్రియవిట్ఛూద్రా ధారయేయుర్యథాక్రమం,
స్వస్వజాతియుతం వజ్రమగ్రజస్సర్వ మర్హతి. ౭౮

... ... ... ...

మంగళాభరణే వజ్రం కులస్త్రీణాం న యోజయేత్. ౯౦
వర్ణాల్పతా తథా రేఖా త్రాసః కాకపదం చ యత్,
బిందుశ్చేతి పంచైతే మహాదోషా ఉదాహృతాః." ౯౧

స్కాందము. హాలాస్య. ౧౩ అ.

"రత్నాభరణమత్యంతం లక్ష్మీక్రీడాసరోవరం,
కామ్యం సౌభాగ్యదం వృష్యం మాంగళ్యం రాజపూజితం."

గారుడపురాణము.

రత్నములకు జాతులు గలవు. ఆజాతివా రాజాతిరత్నమునే ధరింపవలయు. రత్నములకు నధిపతులగు గ్రహములను దేవతలను బూజించి యేవారమున నేరత్నము ధరింపవలయునో యని యెఱింగి యట్లు చేయవలయు.

"సువర్ణరుద్రాక్షకృతా మనోజ్ఞా మాలా మలానామపకర్షణాయ,
హిరణ్యపద్మాక్షకృతా తథైవ ముక్తిప్రదా సంతత ధారణేన.
సువర్ణసూత్రం వితనోతికాంతిమాయుఃపరార్థ్యం విమలాం శ్రియంచ,
భూతగ్రహక్షోభనివారణం చ వినిర్మితం మారుతపైత్యహారి.
కర్ణాభరణమత్యంతం కామినీజనరంజనం,
దాహాపహరమనోహారి మనోభవనికేతనం.
పవిత్రం పుణ్యజననమంగుళీయకధారణం,
పవిత్రకరణం నృణామానందసుఖదాయకం.
సైవాస్యాంగుళిముద్రా చ సర్వకాంతిం ప్రయచ్ఛతి,
కామినీచిత్తసమ్మోహి న్యస్తముద్రాలిపిర్యతః.

లావణ్య కాంతిజనకం సామ్రాజ్యపదముత్తమం,
లావణ్యపోషణం కుర్యాద్విన్యస్తా పాదముద్రికా,
సౌభాగ్యజననీ దోషశోషణీ మనసః ప్రియా.
మేఖలా నాభిమూలస్థా కింకిణీ రత్నశోభితా,
పైత్యమారుతయోర్మధ్యే సీమాసూత్రమివ స్థితం.
ముక్తావళీవిరచితాభిన్నవైవ ధార్యా
హారావళీవితను తేఽనిలరోగనాశం,
దాహాదివృద్ధిశమనం వితనోతి పైత్యం
హాన్యాద్వరం నయనయోరపి దోషజాతం."

మునిభావబోధిని.

దీనింబట్టి స్త్రీపురుషులు సువర్ణరత్నాభరణములను ధరించిన యెడలఁ గలుగు గుణములు తేటపడును. దేవతారాధనా మూలమునఁగాని రత్నాభరణధారణగుణములు స్పష్టములు కావు. ఆయారాధన భక్తిప్రధానము. భక్తి జ్ఞానప్రధానము. జ్ఞానము వైరాగ్యప్రధానము. వైరాగ్యము ఫలాభిసంధి రహితసత్కర్మానుష్ఠానైకఫలమని తెలియవలయు. దేవతాభక్తి లేనిచో నేదియు ఫలింపదని యిందలిసారము. ఆదేవతా భక్తియు దేవతాంతరదూషణ ప్రధానమగునేని నరక హేతువు. ఓప్పుగలిగి సర్వదేవతాసమభావ మలరార భగ వంతుని బ్రేమించుటయే భక్తి యనఁబడును. రత్నమహిమముం దెలిసికొంటిమి. ఇఁకఁ బ్రకృతము ననుసరింతము.

ఆవిమాన మింద్రనీలమణివినిర్మితవేదికలు గలవని మూలమునఁ గలదు. దానిపరీక్ష చింతామణియందిట్లున్నది.

"క్షీరమధ్యే క్షిపేన్నీలం క్షీరం చేన్నీలతాం వ్రజేత్,
ఇంద్రనీలమితి ఖ్యాతం తదాహి రత్నకోవిదైః."

అని. చిక్కనిపాలలో వైచినయెడ నవి నల్లనిరంగుగలవిగ నగపడునే నవి యింద్రనీలమని మన మూహింపవచ్చును. నీలముఛాయ పడినమాత్రముననే తృణము పైకిలేచునని రత్నకల్పమునఁ గలదు. పూర్వులు రత్నాభరణములు తాల్చుటయే గాక భోజనభాజనములందుఁ గూడ విషహారము లగు రత్నములను బొదిగియుంచుకొనుట రత్నపరీక్షయం దాఱితేఱినవా రగుటఁ గదా. వారియనుభవము లెంతమనోహరములు! వానిని వదలిపెట్టుట యాయురారోగ్యభాగ్యనాశనార్థమే యనవచ్చును. నిర్మాలవస్త్రచ్ఛిద్రముల నాభరణములుగా ధరించుట యెంత యసంగతము! ఏయుపకారము చేయనివానిని ప్రేమించు టెంతయాశ్చర్యము! కృత్రిమరత్నములను స్త్రీలు ధరింపఁజేయుటయు ననుచితము. స్వర్ణాభరణములుకూడ నప్రీతికిం బాత్రము లగుచున్నవి. కనుకనే కలిధర్మముల ననువదించుచు మహాభారతమునఁ బదాఱువర్షము లాయుస్సు మానవులకని చెప్పఁబడినది. పూర్వులు నూఱేండ్లు బ్రదికిరన్నమాటయు నింక రాఁబోవువారల కచ్చెరువుగొలుపక విడుచునా? కావున రాజహర్మ్యములు యానవిశేషములు రత్నఖచితములై యుండునట్లు చేయుట పూర్వులయాచారము. ప్రతిక్షణప్రాణోపద్రవకరములుగా వాని నలవఱచుకొనుట యిక్కాలపువారి యాచారము. అట్టివారు కనుకనే విమానములు కామగమనములన్న నులికిపడుచుందురు. మనశ్శక్తి నశించినకతన మంత్రశక్తియు నశించినది. యోగము నియోగముగాఁ బరిణమించినది. ఇంకముందు మంచిగుణములకు వియోగము కలుగక తప్పదని తోఁచెడిని.

విమానాదులయం దీహామృగములు సువర్ణరజతములు నొనరించి యునుచుట మనపూర్వుల యాచారము. ఈహా మృగమనఁగా "తోఁడేలు." "కృత్రిమమృగాః" అని మాహేశ్వరతీర్థులును, "వృకప్రతికృతియుక్తైః" అని గోవిందరాజులును వ్రాసిరి. తోఁడేలు చూచుట కింపగుజంతువు కాదు. హరిణములు రురుమృగములు లోనగునవి దృశ్యములుగానుండ వానినేల మనోహరస్థానములయం దుంచియుందురని మన మూహింపవలయు. వృకము లాగామి విపత్పరిహారకములని ప్రాచీనులమతము తోఁడేలు సంచరించుతావులఁ గొన్నిరోగము లుండవని పెద్ద లందురు. ఏజంతువునుండి యెట్టియుపకారము మనము పొందుచున్నవారమో తెలిసికొనఁ బ్రయత్నింపకుందుము. ఇదియే మన దురభ్యాసములలోఁ బ్రధాన మనవలయును. ఈవిషయమున కుదాహరణముగా నొకచిన్ని కత వ్రాయుట కనుమతిండు.

"పూర్వము కాశ్మీరదేశము నొకప్రభుశిరోమణి పాలించుచుండఁగా నానాదేశములనుండి వస్తుగుణపరీక్షకు లరుదెంచి సన్మానింపం బడుచుండిరి. ఆదేశమున వర్షాభావమే లేదు. అతివృష్టి కలుగుటయే యాచారము కాని యనావృష్టియన నెట్టిదో యిప్పటికి నాదేశవాసు లెఱుంగరు. వరిపైరు విశేషించి యందుఁ బెట్టఁబడును. ఏకాలమునఁగాని యేహేతువుఁ బట్టికాని యాధాన్యము దేశాంతరములకుం బంపరాదనునది రాజశాసనములలో నొకఁడు. ప్రజ లన్నాతురులు కారాదనియే దానిభావము. ఆదేశమున సర్పములు మెండుగ నుండును. ఆతరుణమున నాదేశము నేలురాజు వాని నిర్మూలింప నెంచెనఁట. విష మవ్వానిదంష్ట్రలయం దత్యల్పముగ నుండు. కాని

చీమలవలె నెందు నవి తిరుగుట యాభూజాని కింపుగాఁ దోఁపకుండెను. కావున వాని నిర్మూలింప నెంచి యొక్కొక్క దానికిఁ బాదరూప్యము బహుమాన మిత్తుమని చాటఁ బంచెను. జంతుహింసాపరాయణులకుఁ బుణ్యార్జనమం దభిప్రాయమే యుండదు గదా. నలుఁగెలంకులం బరుగులిడుచు మచ్చరమున వానిం జంపుచు నింతటిమహాకార్యము నొనరించితిమని బీరములాడుచు రాజోద్యోగుల కవ్వానిశవములం గనఁబఱచుచు ధనము గ్రహించుచుఁ బెచ్చువేడుక మూఁడు నాల్గుసంవత్సరములలో నా దేశము నిర్భుజంగము గావించిరఁట. పాములు నశించుకొలఁదిఁ బంటలు నశింపసాగెనఁట. దానఁ బ్రజ లలజడిఁ బడసాగిరఁట. భూజాని కావిధ మధికారులు తెలిపిరఁట. రాజు తనచేసినపనికి వగచుచు దూరదేశాగతులలోఁ దనప్రీతికిం బ్రథమపాత్రుండుగనున్న "ఫాగ్రిన్సు" అనుదేశవాసుఁ డగుపండితోత్తముని రహస్యగోష్ఠికిం జేరి తన చేసినతంత్రము దానిఫలితముంగూడఁ దెల్పి కృత్య మింకేమని యడిగెనఁట. ఆపండితుఁ డాలోచించి రాజా! వరిపైరునందుఁ దలకప్పలు విశేషించి యుండును. మీ కేదారములు పాఁచి గలభాగములు. కావున నవి యందుండును. తన్మూలమున సస్యములకు విశేషించి తెగుళ్లు పొడసూపును. సర్పసంచారమున నా తలకప్పలు నశించుచుండును. మఱియు పాములు నెమరువేయుచుండఁగా నాగాలిసోఁకినఁ గుష్ఠమను రోగమునఁ గల యనేక భేదములలో నధికసంఖ్యాకములు నశించును.* తద్వాయుప్రసారమున రోగము నుత్పత్తిచేయు కీటకములు క్షీణించును. ఇన్ని యుపకారములకు నాధారభూతములై విషస్ఫూర్తమునఁ గీడుగలిగింపని భుజంగముల రూపు

మాపితివి. కాన నింకనైన నాలోచించి వానిని సేకరించినఁ గాని యీవెత మానదని హిత ముపదేశించెనఁట. ఆరా జెంత ప్రాజ్ఞుఁడో ఆమాటం బాటించి హిమాలయమునుండి యొక్కొక్క సర్పమును దెచ్చిన నర్ధరూప్యమిత్తుమని చాటింపఁ బంచె నఁట. మరల నీరూపమున ధన మార్జింతమని పామరులు అల్ప విషదంష్ట్రిలుగల యామలయందలి పాముల స్త్రీపురుష భేద ములం గొనివచ్చి దేశమున వదలుచుండిరఁట. రెండుసంవత్స రములలో వేలకువేలుగా నవి పొడకట్టసాగెనఁట. ఆయేఁడు సమృద్ధిగా శాలిసస్యము ఫలించెనఁట. రాజా యలజడినాపి మహోపకార మొనరించిన యా "ఫ్రాన్సు" దేశపుఁ బండి తుని రావించి సభాముఖమున బహూకరించెనఁట. అని యొక యుత్తమపత్రిక వాకొనియెను." దీనింబట్టి ప్రతిజంతువునుండి మనుష్యు లుపకారముల నెన్నింటినో పొందుచున్నారని తేట పడకమానదు. తోఁడేలునుండి యెన్నియో యుపకారము లుండుననియు, వానినెల్ల మన మెఱుంగఁజాలక యున్నార మనియు, బ్రహ్మసృష్టియందు నిష్ఫలముగా నొకటియు నుండ దనియు, వానివానియుపకారము లిట్టివని మన మెఱుంగఁ బ్రయత్నించుట మేలనియు, నూరక తిని కూరుచుండి యచ్చో యని పూర్వుల నాక్షేపించుట తెలివితక్కువపని యనియుఁ దెలిసికొనుటయే యుత్తమగుణము. కావున నీహింస్రమృగముల వలన ననేకోపద్రవములు మాయునని యెఱుంగుదురు కాన నే యట్టివానిని మనోహరవస్తువులయందు నలంకారముగా సువర్ణాదులచే వానియాకారములఁ జేయించి యునుతురనియు వానిమూలమున నుపకారము గలుగునాయన్న నది యుప కారస్మృతియనియు మన మూహింపవలయును.

"యాశ్చ్యవంతేఽంబరాత్తారాః పుణ్యశేషసమావృతాః,
ఇమాస్తాస్సంగతాః కృత్స్నా ఇతి మేనే హరిస్తదా." ౪౧

అని మూలము. ఇందు సృష్టిక్రమము చెప్పఁబడినది. స్వర్గాది లోకములఁ గలసుఖముల ననుభవించి పిమ్మట నంబరమునఁ గొంతకాలము తేజోరూపములఁ దారకలా యని తోఁపఁ జేయుచు వెలయుచు నెపుడు మర్త్యలోకమునకుఁ జేరఁదగునో యపుడు ప్రాక్తనకర్మానుసారముగా సుఖదుఃఖముల ననుభవింపందగు శరీరమునొందఁ బ్రాణికోటి యాకాంతిం బాసి మానవలోకమునఁ బడుననియే యిందుఁ గలసారము. జన్మాంతరమే లేదనువార లీవాదము నంగీకరింపరు. నాస్తికాభాసులని యించుమించుగా వారిం జేర్పఁగావచ్చు. రావణుని బరివేష్టించియుండు కాంతామణులు ప్రకాశముల వెలుంగుచుఁ జుక్కలం బోలియుండిరనునది కథాసారము. ఇట్లు చెప్పుటం జేసి వారెల్ల మనోదుఃఖముల నలఁగినవారు కాక సంతోషమున విఱ్ఱవీఁగువారనియే మన మూహింపవలయును.

"రాజర్షిపితృదైత్యానాం గంధర్వాణాం చ యోషితః,
రాక్షసానాం చ యాః కన్యాస్తస్య కామవశం గతాః. ౬౮
యుద్ధకామేన తాస్సర్వా రావణేన హృతాస్త్రియః,
సమదా మదనేనైవ మోహితాః కాశ్చిదాగతాః. ౬౯

న తత్ర కాచిత్ప్రమదా ప్రసహ్య
వీర్యోపపన్నేన గుణేన లబ్ధా,
న చాన్యకామాపి న చాన్యపూర్వా
వినా వరార్హాం జనకాత్మజాం తాం." ౭౦

న చాకులీనా న చ హీనరూపా
నాదక్షిణా నానుపచారయుక్తా,
భార్యాభవత్తస్య న హీనసత్వా
న చాపి కాంతస్య న కామనీయా." ౭౧.

అని మూలము. రావణుఁడు కామవశంగతాత్ముఁడై బలము మీఱఁ బరకాంతలను దెచ్చెననుమాట న్యాయ్యమే కాదనియుఁ, దన్ను నంగీకరింపనివారిని శాపకారణమున వదలిపెట్టెననియుఁ, దాఁగోరకున్నఁ దన్నుంగోరియే వచ్చినవారే యతనిం బరివేష్టించియుండిరనియు, నందఱు సౌందర్యయావనముల నివ్వటిల్లువారే యనియు, నొక్కతెయైన నన్నుమిన్న కాదన్న యపకీర్తికిఁ బాత్రురాలు కాదనియు, కులగుణములు గలవారలేయనియు, నంతకుఁబూర్వమిందొకని బెండ్లియాడినదే యందు లేదనియు, రావణుని గుణసౌందర్యలాభ్యమున నతనింగోరియే వచ్చిరనియు నీభాగమున మహర్షి వాల్మీకి తెల్పెను. ఈభాగము ననుసరించి యూహించినఁ దనమృతికి సనత్కుమారుఁడే హేతువును దెల్పెనో దాని ననుసరించి సీతను దెచ్చెననియుఁ, దన్మూలమునఁగాని భగవద్దర్శనము కాదని యతఁడెఱెంగెననియు మన మూహింపవలయును. ప్రకృతి నుపాసింపక పరమేశ్వరానుగ్రహము కలుగదని తాత్పర్యము. ఈభావమునే మహేశ్వరతీర్థులు తెలిపిరి. భగవంతుని సగుణునిగా భావించి చేయునుపాసనకే శాక్తమని పేరని తెలిసికొనుట బుద్ధిమంతుల లక్షణము. నామరూపక్రియావిశిష్ట మగునదియెల్లఁ బ్రకృతి కల్పిత మనునదియే యుత్తమసిద్ధాంతము. ఇదియే వేదాంత శాస్త్రసమ్మతము దీనిని గాదనువా రుండరని నావిశ్వాసము. శక్తిసంబంధము శాక్తము. శాక్తమనఁగా నేదోయొక మృత్యు

వక్త్రబిలమని భయపడనేలాకో తెలియఁజాలను. శ్రీరామచం ద్రారాధనము శాక్తముగాక మతేమగును? కావుననే,

"సర్వే శాక్తాస్సముద్దిష్టా న శైవా న చ వైష్ణవాః,"

అని పురాణము తెల్పుచున్నది. కావున బుద్ధిమంతులెల్లరును శాక్తమన నెట్టిదో యోజించుకొని దాని ననుసరించి భగవంతు నారాధింపవలయును. అదియే సులభమగుమార్గము. సత్ఫల దాయక మదియే.

"బభూవ బుద్ధిస్తు హరీశ్వరస్య యదీదృశీ రాఘవధర్మపత్నీ,
ఇమా యథా రాక్షసరాజభార్యాస్సుజాతమస్యేతి హి సాధుబుద్ధేః. ౭౨
పునశ్చ సోఽచింతయదార్తరూపో ధ్రువం విశిష్టా గుణతో హి సీతా,
అథాయమస్యాం కృతవాన్మహాత్మా లంకేశ్వరః కష్టమనార్యకర్మ." ౭౩

అని మూలము. ఇందుఁ బ్రథమశ్లోకమునకు మహేశ్వరతీర్థులు విశేషార్థము లెన్నియోపద్ధతుల వ్రాసిరి. ముఖ్యముగా నా సమయమున కట్టి రామభక్తాగ్రేసరున కెట్టిబుద్ధి పుట్టియుండ వచ్చునని యూహించిన నీయర్థమే స్పష్టముగాఁ దోఁచును. ఈరామామణులు తమకుఁ గాంతుఁడగు రావణునింగూడి యెట్లు లానందసాగరకల్లోలమాలాజాలమున నోలలాడు చున్నవారో అట్లే జానకీదేవియు శ్రీరామునిం గూడియుండు నేని మహానందము ననుభవించునుగదా యని, రావణుఁడు కొనిపోయి సీతాదేవిని రామచంద్రున కర్పించిన నెంతబాగుం డునో యనునదియే హనుమంతుని ముఖ్యాశయము. తక్కిన యర్థములు పనిలేనితఱిఁ జెప్పుకొనుచు నిదురవచ్చునా యని వేచియుండఁ దగినవి.' ఆపదలలో మునిఁగియుండువారు సంప దంధులం గాంచినపుడు మనసు నిట్టిసంపదలున్న బాగుండును

గదా యని కోరుదురుగాని యింకొక్కతలంపు వారికి స్ఫురింపదు. ఇట్టి కాంతామణులం గాంచినపుడు హనుమంతునకు సీత తలంపునకువచ్చుటయు నామె శ్రీరామునిచెంతనుండిన బాగుండును గదా యని యెంచుటయు సాజమే. అట్టి మంచి తలంపు హనుమంతునకుఁ గలుగఁగా సద్వంశమునఁ బుట్టిన రావణుఁడు పరభార్యాపహరణరూపమహాపాపకార్యమును గావించెనా. అక్కటా! యను నూహాయుఁ దోఁచెను. సుందరీమణులం గనినంతనే చంచలస్వభావముగల కపివంశమునఁ బుట్టినహనుమంతునకుఁ గామవికారము గలుగక పతివ్రతాతిలక మగుసీత యనుభవించుకష్టములు స్మృతికిం దగులుట యతని మనోధైర్యము తేటపడుచున్నది. ఇదియే యుపాసకుని లక్షణము. సుందరవతులం గనినపుడు వారిని దన యుపాస్యదేవతలనుగా భావింపవలయును.

> "యోషాతిరూపసంపన్నా గర్వితా మదశాలినీ,
> మమ రూపైవ సాక్షేయ్యా."

అని కాళివచనము కలదు. సుందరీమణులం గాంచినపుడించుకయేఁ జలింపక తనకార్యమునే తలంచిన కతన సుందరహనుమన్మంత్రమును జపించిన మనస్సంకల్పములు మంచివి కలుగునను విషయమును మన మెఱుంగవలయును.

### హనుమంతుఁడు మందోదరిం గని సీత యని భ్రమించుట.

* అట్లాగాలికొడుకు కందు నల్గడలం దిరుగుచుఁ బరికిం

---

* ఇది పదియవ సర్గమునఁ గల కథ యని యెఱుంగవలయును.

చుచు రావణునిశయ్యను గాంచెను. అయ్యది బహువిధా లంకారములు గలిగి యందుండి యతఁడు దిగునపుడు మెత్తని యాసనములు సంతోషదాయకములుగా నుండవలయునని యమర్పఁబడియుండఁగా నెంతో వింతగనుండెను. ఆమంచ ముపై మేటిపఁజపులుండెను. వింజామరలు కేలఁబూనిన బొమ్మ లగపడుచుండెను. పరిమళధూపములు వేయఁబడియుండెను. పొట్టేలిచర్మ మూపైఁ బఱువఁబడియుండెను. అందా రాక్ష సాధ్యక్షుఁడు విహరించి బహువిధమద్యములం గ్రావి యుపర తుండై సుఖనిద్ర చేయుచుండఁగా హనుమంతుఁడు కాంచెను. ఆతని భూషణములు వర్ణనాతీతములుగ నుండెను. ఆతని చెంతకుం బోయి పావని యింత చెంతకు నేను రాఁదగునా ! మతిమంతుఁ డిట్లు చేయునా? మేలుకొన్న నాకార్యము పా డగునుగదా యనుకొని తొలఁగిపోయి వేదిక నెక్కి యతనిం జూచెను. రావణుఁడు రెండుబాహువులను బోడవుగా వ్యాపింపఁ జేసియుండ నవి యింద్రధ్వజములం బోలియుం డెను. ఐరావతము కొమ్ములపోటుల గుఱుతులందుఁ గనఁబడు చుండెను. సొగసుఁగులుకు సొమ్ములుగలిగియుండు నాబాహు వులు దేవతలకు భయము గొలుపునవిగా నుండెను. ఆతని తక్కినయాభరణము లనర్ఘములు. ఆతనింజుట్టి శయనించి యున్న భార్యలు హనుమంతునకుఁ గనఁబడిరి. ఆటలఁబాటలఁ గాలముపుచ్చి వారెల్ల మద్యపానమున వివశలై శయనించి యుండిరి. వీణావేణ్వాదివాద్యములఁ గౌఁగిలించుకొని కొం దఱు పవ్వళించియుండిరి. ఒడలు తెలియక నిదురించుచున్నం దునఁ జూడ నేవగింపు గల్గించుచుండిరి. వారలకు మేలు బంతి యనందగిన వేటొక యుత్తమకాంత నాతఁడు తిల

కించెను. ఆయమ రావణునకు మిక్కిలి వేడుకను గూర్చునది. సకలాభరణభూషితదేహయై సౌందర్యరాశి యనందగి జవ్వ నంపుఁబొంగు చెలువార నలరారు నాకాంతామణిం గాంచి నంతన విచారింపక యీామెయే సీతయని యూహించెను. సంతోషభరము తన్నుఁ బరవశుని గావింప మహానందము నను భవింప సాగెను. అది మిక్కిలి కాఁగాఁ గరతలము లప్పళిం చెను. వాలమును ముద్దిడుకొనెను. ఆనందాతిశయమున మై మఱచెను. ఆడెను. ఏవో పాటలుపాడెను. పరుగిడసాగెను. అచ్చటి స్తంభములపై కెగఁబ్రాఁకెను. నేలపైకి దుమికెను. ఇట్లు వానరస్వజాత్యుచితము లగు చేష్టలం దెలుపుచుండెను.

మహాత్ములారా! ఈభాగమున నొకటి రెండువిషయ ములు విమర్శనార్హములు గలవు.

"విక్షిప్తౌ రాక్షసేంద్రస్య భుజావింద్రధ్వజోపమౌ." ౧౫

అని మూలము. "అత్ర ద్విభుజైకముఖత్వోక్తిః స్త్రీణాం కామ నీయత్వాయ"అని గోవిందరాజులు. "భుజాభ్యామితి ద్విభు జత్వం మహాముఖాదితి వక్ష్యమాణ మేకముఖత్వం చ రావ ణస్య కామరూపిత్వా త్సంగచ్ఛతే." అని మహేశ్వరతీర్థులు. "అత్ర ద్విభుజత్వకథనాద్యుద్ధాదికాల ఏవ వింశతిభుజత్వం దశశీర్షత్వం చ బోధ్యమ్"అని తిలకవ్యాఖ్య. మూవురు ముత్తె ఱంగుల వ్రాసిరి. చతుర్భుజుఁడు శ్రీమహావిష్ణువు. సహస్ర బాహుఁడు కార్తవీర్యుఁడు. చతుర్భుజ త్రిపురసుందరి. అని కదా పురాణములు తెల్పును. ఇందు విష్ణువును వర్ణించు నపుడు ప్రధాన బాహుద్వయమే వర్ణింపఁబడును. అట్లే సాధారణములగు బాహుద్వయమే వర్ణింపఁబడినదని గ్రహిం

చినఁ గలుగుబాధ యేమి? అన్నియు సమానములుగా నుండు నని యెందుఁ గలదు? కామరూపిత్వము చెప్పినచో నిద్రా కాలమున యథాపూర్వరూపమే యలవడునని మనుచరిత్రము తెలుపుచున్నది. అది బాధించునేమో! కావునఁ బ్రధాన బాహువులు రెండు నిటఁ జెప్పఁబడినవని గ్రహించుట యుక్తి విరహితము కాదు. ఇందు "కాచిద్వీణాం పరిష్వజ్య" అను శ్లోకము మొదలు "కామిన్యః కాముకానివ" అను నలువది తొమ్మిదవ శ్లోకముదనుకఁగల పదుమూఁడుశ్లోకములచే నిదు రించు స్త్రీలస్థితులు వర్ణింపఁబడినవి. ఇందుఁ గొన్నిశ్లోకము లసహ్యాజనకములుగా నున్నవి. ఇట్లేల మహర్షి చెప్పవలయు నని కొంద అందురు. మహాకవి వాల్మీకి వలయునని యిట్లు చెప్పలేదు. ఆకాలపు టలవాటు లట్టివి. రాజునకు భార్యలు భోగకాంతలు పెక్కం డ్రుందురు. వారెల్లరు గీతవాదిత్ర ములచే నతని రంజింపఁజేసి యలసి యట్లే శయనింతురు. దానికిం దోడు మద్యపానము. ఇఁక వారివ్యాపారము లెట్లుం డునో చెప్పవలసిన దేమున్నది? అందును లంకానగరము. మద్యమాంసముల కయ్యది యునికిపట్టు. కావున నెన్నియేవ గింపుఁ బుట్టించుకార్యము లుండవలయునో యన్నియు నున్నవి. కావునఁ గదా మద్యపానము దూషింపఁబడుట. ఈవిధముగా మనము భావించిన నీశంక కలుగకయుండును.

"గౌరీం కనకవర్ణాభామిష్టామంతఃపురేశ్వరీం,
కపిర్మందోదరీం తత్ర శయానాం చారురూపిణీం. ౫౨
స తాం దృష్ట్వా మహాబాహుర్భూషితాం మారుతాత్మజః,
తర్కయామాస సీతేతి రూపయౌవనసంపదా. ౫3

... ... ... ...

ఆస్ఫోటయామాస చుచుంబ పుచ్ఛం
ననంద చిక్రీడ జగౌ జగామ,
స్తంభానరోహన్నిపపాత భూమౌ
నిదర్శయన్ స్వాం ప్రకృతిం కపీనామ్." ౫౪

అని మూలము.ఆ కాంతలలో నొక త్తుక రామామణి యుండెను. ఆమె మందోదరి. శ్రీరామచంద్రుఁడు చెప్పిన రూపయావన చిహ్నములాహనుమకు సీతయే యగునను భ్రాంతినిగలిగించెను. వచ్చినపని ఫలించెఁ గదా యనుమహానంద ముదయింప నతఁడు ఆటపాటలఁ దనజాతికి నైజము లగుకార్యముల నొనరించెను. స్తంభముల కెగఁబ్రాఁకుట సంగీతముపాడుట యనునవి యసంగతములు కావా యనవచ్చును. సురాపానమున నొడలు తెలియక వికృతముగా శయనించిన వారికడ నేమిచేసినను వారు మేల్కొనఁ జాలరు. "జగౌ మందగానం కృతవాన్ నిత్యర్థః." అని వ్యాఖ్య. నేఁటికి నాపని సఫలమని యనుకొనుటయే యాజాతిపాట. అంతియకాని "కనుఁగొంటిని. సీతమ్మను నేఁడు." అని త్యాగరాయులకృతులు పాడెనని యర్థము గాదు. సీతాదర్శనమే తన తపఃఫలముగా నతఁడు భావించినవాఁ డగుట నది ఫలింపఁగా నానందించెనని తాత్పర్యము. మోదఖేదప్రకటనము నైజముగ నుండును. ఒకరింగని నేర్చుకొనినట్లు మెలఁగనీయదు. ఏది యాజాతికి స్వాభావికమో యదే యపుడు పొడసూపునని మన మెఱుంగవలయు. మహాకవి వ్యాసునకీ పాటివిషయము తెలియక యుండునా ?

## హనుమంతుఁడు మరల నంతట వెదకుట.

* ఆంజనేయుఁడంత నామె సీత యగునని కల్గిన యాదు
రూహను మరలించుకొని కృత్య మెదియని యాలోచించుచు
ఆకాంతామణి సీత రామునెడఁబాసి యిట్లు సుఖముగా నిదు
రింపదు; భుజింపదు; అలంకరించుకొనదు; సురఁ గ్రోలదు. రామే
తరుఁడు త్రిలోకపతియైనఁ గన్నెత్తియైనఁ గాంచదు. రాము
నకు నీడగువాఁడు మనుష్యులయందు లేఁడననేల? దేవతల
యందును లేఁడు. కనుక నాయమ సీత కాదు. ఎవతెయో
యొకతుక యగు. అని యెంచి పానభూమికిం జని తిరుగ
సాగెను. అందును గలయువతులు త్రాఁగి యొడలెఱుఁగక
పరుండిరి. కొంద ఱాడియాడి కూయుచుండిరి. అట్టి యనేకమద
వతులు తన్ను నలుఁగడలఁ జుట్టుకొనియుండ రావణుఁడు శయ
నించియుండెను. ఆపానభూమి సకల వస్తుసంభృతము. పెక్కు
జంతువులమాంసము లందు రాసులుగఁ గనఁబడును. బంగారు
భాజనములయందు మయూరకుక్కుటములను ఛేదింపక యట్లే
పక్వము చేసియుంచఁగాఁ గనుఁగొనియె. అందు సగము దినఁ
గా మిగిలినవియు నుండెను. వరాహాదిమాంసములు సౌవర్చల
మను పేరుగల లవణముచేర్చి పక్వముచేసి యుంచఁబడియుం
డెను. పెక్కువిధములగు వస్తువులు పక్వము చేయఁబడియుం
డెను. మద్యవిశేషములు వివిధనామములు గలవిగ నం దుం
డెను. భోజనభాజనములు పానపాత్రములు బంగారురత్నము
లతోఁ జేయఁబడినవి యందుఁ గనఁబడుచుండెను.

* ఇది పదునొకండవసర్గమునఁ గలకథ యని తెలియందగు.

ఒక్కొక్కతావున విచ్చలవిడిగాఁ ద్రావి మాంసముల నమలి యొడళ్లెఱుఁగక వనిత లుండిరి. పరిమళవస్తువిశేషము లసంఖ్యలుగాఁ గనఁబడుచుండెను. ఎందుఁ జూచినను సీత కనఁబడదయ్యెను. వానరవరుఁ డట్లు స్త్రీజనముం గాంచిన ధర్మము లోపించునని యూహ తట్టఁగా వెంటనే పాపభయ మంకురింపఁగాఁ దోడనే శంక పొడుకొనఁగా నిట్లు చింతించెను. శయనించి విచ్చలవిడిగనుండు పరవనితలం గాంచితిని. ఇది ధర్మలోపము కలిగింపకపోదు. పరస్త్రీదర్శనాసక్తి నాకించుకంతయుఁ గలిగి చూడలేదు కదా. అట్లయ్యు నిటఁ జూచితిని. ఇది యధర్మమా యని మఱిమఱి చింతించెను. అంత మతిమంతుఁ డగునతని కొకయూహ పొడకట్టెను. పురుషుఁ డితరుఁ డెవ్వఁడును రాలేఁడన్న నమ్మకమున విచ్చలవిడి నిదురించు రావణపత్నులఁ జక్కఁగాఁ గాంచితిని. కాని నామది నించుకంతయు మదనవికారము కలుగలేదు. కాఁబట్టి నాకేదోషము రాదు. శుభాశుభకార్యముల నవయవములు ప్రవర్తింప మనస్సే కారణము. ఏది చలించినను మనోహేతువుననే కదా యట్లగు. నామది యెంతయు నిలుకడఁ గాంచియున్నది. వేఱొకతావున వెదకరాదు. స్త్రీలు స్త్రీలచెంతనే కదా యుందురు. పురుషుల కడ నుందురా. ఏజంతు వేజాతిదో యద్దాని నాజాతియందే వెదకవలయును. స్త్రీ కనఁబడకపోవునేని స్త్రీలుండుతావులనే వెదకవలయును గాని లేళ్లగుమియందు వెదకవచ్చునా? కనుకఁ బరిశుద్ధాంతఃకరణుఁడనై యీయంతిపురమున నెల్లెడల వెదకినాఁడను. కాని సీత యగపడలేదు. అని మఱియు నందందు వెదకి సీతం గానక పానభూమిని వదలి యంతిపురమున మున్ను డాఁ జూడనితావుల వెదకసాగెను.

మహోదారులారా! ఈభాగమునుండి కొన్నివిషయములు తెలిసికొందము.

"న రామేణ వియుక్తా సా స్వప్తుమర్హతి భామినీ,
న భోక్తుం నాప్యలంకర్తుం న పాన ముపసేవితుం. ౨
నాన్యం నరముపస్థాతుం సురాణామపి చేశ్వరం,
న హి రామసమః కశ్చిద్విద్యతే త్రిదశేష్వపి. 3
అన్యేయమితి నిశ్చిత్య పానభూమౌ చచార సః."

అని మూలము. తొలుత సీతయని భ్రమించి పిదప నాలోచించుకొని సీతయేయైన వేఱుపురుషునికడ నిదురించునా యని నిశ్చయించుకొని వేఱుకాంతయే యనుకొనియెను. "న పాన ముపసేవితుమ్" అనఁగా మద్యపానము చేయదని యర్థము. రామునికడ నున్నచో మద్యపానము చేయుననియే కదా భావము. మద్యపానము సంభోగాంగమని మున్ను వ్రాసిన దాని నిది దృఢపఱచుచున్నది. క్షత్రియాదులకుఁ గొన్నివిధములగు మద్యములు పేయములనియు, బ్రాహ్మణున కందు నేదియుఁ బనికిరాదనియు శాస్త్రము విధించుచున్నది. జ్ఞానము ప్రధానముగాఁ గలజాతి విప్రజాతి యనికదా దాని భావము. అట్టి జాతియందుఁ గలిగియు శాక్తులమను పేరుపెట్టుకొని సురామాంసముల సేవించుటకంటెఁ బాపకార్య మేది కలదు? షణ్మతములలో నిపుడగపడు ననాచారములు అనుష్ఠాతల లోపము వలనఁ గలిగినవే కాని మతస్థాపకులవి కావు. కనుకనే మనము మతములను దూషింపరాదు. మతస్థాపకుల నాక్షేపింపరాదు. మతస్థాపకులగు మహాత్ములను నిరంతరము దూషించుటయే ప్రధానకార్యముగాఁ జరించు మధ్వవైష్ణవాదులు పాప

మొడిగట్టుకొనుట తప్ప నింకొక్కపురుషార్థమును సాధింపఁ జాలరు. మతస్వరూపము చక్కఁగా నెఱింగినవారు మతస్థాపకుల నాక్షేపింపరు. అది యెఱుంగక యెఱింగినట్లు చరించు దేవానాంప్రియులే వారి నాక్షేపింతురు. అద్దానికంటె దుష్కార్యము వేఱొకటి లేదు. ధనార్జనముకొఱకు వేషములను వేసికొని నిష్కాములవలెఁ దిరుగుచు ధనము నార్జించి రహస్యబంధువులను బోషించుచుఁ జూచువారికి వైరాగ్యసంపద గలవారివలెఁ గనంబడుచునుండు పండితమాన్యులు పెక్కండ్రుందురు. వారికడఁ జేరినశిష్యులు ముక్తికొఱకుఁ బ్రయత్నింతురు. తత్సేవ ధనముక్తిమాత్ర మొసంగుట నిక్కము.

"తాసాం మధ్యే మహాబాహు శ్శుశుభే రాక్షసేశ్వరః. ౦
గోష్ఠే మహతి ముఖ్యానాం గవాం మధ్యే యథా వృషః."

అని మూలము. విమానమున శయ్యామందిరమున మందోదరి చెంత శయనింపఁ దక్కుంగలభార్యలు పరివేష్టించియుండ నిదురించు రావణునిం గాంచి హనుమంతుఁ డామందోదరిని సీతయే యని భావించి మరల సంశయించి వేఱొకతుక యని నిశ్చయించి పానభూమిని సంచరింపఁ బూనెనని గతసర్గమునఁ గలదు. ఆ పానభూమియందుఁ దిరుగుచు నందుఁ బరుండియున్నస్త్రీలను బెక్కండ్రం గాంచి వారిచెంత శయనించియున్న రావణుని గనియెనని యిందుఁ గలదు.

"స రాక్షసేంద్ర శ్శుశుభే తాభిః పరివృతస్స్వయం." ౯

అనునది యీభావమునే కదా తెలుపును. ఈ రెండుతావుల నతఁ డెట్లు శయనించును? అన్నశంక యిచ్చోఁ గలుగును గదా. ఎట్లిది వదలును? వినుఁడు. శయ్యాగృహముననే

యతఁడు శయనించెను. దానికిఁ జుట్టును భోజనపానస్థానము లున్నవి. నలుఁగడల రావణుని బరివేష్టించి స్త్రీలు శయనించి యున్నవారు. హనుమంతుఁ డెచ్చోటవెదకిన నచ్చటికిఁ జెంతనే రావణుఁడు శయనించియున్నవాఁ డగపడును. అంతియగాని యిన్నితావుల నతఁడు కామరూపములఁ దాల్చి శయనించి యుండ లేదు.

"రాక్షేషు చ విశాలేషు భాజనేష్వర్ధభక్షితాన్. ౧౨
దదర్శ హరిశార్దూలో మయూరాన్ కుక్కుటాం స్తథా."

అని మూలము. "మయూరాన్ కుక్కుటానితి స్వరూపేణ నిర్దేశాత్తత్తదాకారవిశిష్టతయా తే పక్వా ఇత్యవగమ్యతే." అని రామానుజీయవ్యాఖ్య.

"మృగాణాం మహిషాణాం చ వరాహాణాం చ భాగశః,
తత్ర న్యస్తాని మాంసాని పానభూమౌ దదర్శ సః."

అని మూలము. ఇచ్చోటఁ బేర్కొనఁబడిన జంతువులమాంసములం గాంచెనని తెలిపి మయూరకుక్కుటములను బంగారు పాత్రములయందు సగము తినఁగా మిగిలినవానిం గాంచెనని చెప్పుటచేత నెమిళ్లను, కోళ్లను అట్లే పక్వముచేసి యుంచిరని తోఁచుచున్నదని రామానుజీయవ్యాఖ్యయభిప్రాయము: రామాయణమునఁ గలవిశేషములనే యీవ్యాఖ్య తెలుపును గాని ప్రతిశ్లోకమునఁ గలయర్థమును బోధింపదు. అట్టి యీ వ్యాఖ్య యిందేమో విశేషమును గనిపెట్టినట్లు తెలుపు చున్నది.

"వరాహవార్ధ్రాణసకాన్ దధిసౌవర్చలాయుతాన్. ౧౩
శల్యాన్ మృగమయూరాంశ్చ హనుమానన్వవైక్షత,

క్రకరాన్ వివిధాన్ సిద్ధాంశ్చకోరానర్ధభక్షితాన్. ౧౪
మహిషానేకశల్యాంశ్చ ఛాగాంశ్చ కృతనిష్ఠితాన్."

అను నీమూలము తర్వాతనే యున్నదే. ఇందుఁ గూడ నట్లే చెప్పఁబడియుండుటంజేసి వరాహాదులను గూడ నట్లే పక్వము చేసి నిలువఁబెట్టి యుండిరని యేల తెల్పఁగూడదు? ఇట్టి విశేషముల నావ్యాఖ్య వ్రాయుట సమంజసముగా లేదనవలసి యున్నది. ఈభాగమును బరిశీలించిన రాక్షసులయాహారము లెంతనీచములో తేటపడును. మహిషములు కూడ నపుడు భక్ష్యములుగా నుండినవి కాఁబోలు. వేదపఠనాధికారము గలిగియుఁ దపస్సంపన్నత వెలసియు దుర్మాంసములఁ దిను నాచారము కలిగియుండె ననవలసి యున్నది. కాని యది స్మృతి సిద్ధముమాత్రము కాదు. మహిషశబ్దమున కారణ్యకములగు కాఱుదున్నలని యర్థము చెప్పుదురు కాఁబోలు. ఆకరములం దట్టియర్థము కానరాదు. ఆరణ్యకము లగు గోవులు కూడఁ గలవు. అట్టి గోమాంసము భక్ష్యమే యనవలసివచ్చును గదా.

"నిరీక్షమాణశ్చ తదా తాస్స్త్రియస్స మహాకపిః. ౩౬
జగామ మహతీం చింతాం ధర్మసాధ్వసశంకితః,
పరదారావరోధస్య ప్రసుప్తస్య నిరీక్షణం. ౩౭
ఇదం ఖలు మమాత్యర్థం ధర్మలోపం కరిష్యతి,
న హి మే పరదారాణాం దృష్టిర్విషయవర్తినీ. ౩౮
అయం చాత్ర మయా దృష్టః పరదారపరిగ్రహః,"

అని మూలము. నిదురించుచుండు రావణునిభార్యలం జూడఁగనే హనుమకొక మహాచింత కలిగెను. అది ధర్మలోప భయ జనితము. నిదురించు పరకాంతలఁ జూచుట యధర్మము. అందు

నంతగపుర కాంతలఁ జూచుట మఱియు నధర్మము. అను శంక గలుగఁగా నాదృష్టి పరదారసంబంధి విషయాసక్తము కాదను కొనుచున్నాఁడు. "ప్రసుప్తస్య పరదారావరోధస్య=దారశబ్ద స్త్రీసామాన్యవాచీ. అవరోధశబ్దస్స్వధర్మయుక్త కులస్త్రీ వాచీ. ప్రసుప్త ఇత్యనేన నగ్నప్రాయత్వం సూచితం. తత్స మయే రసనానాం విపర్యాసాత్" అని మహేశ్వరతీర్థులు. గాఢనిద్రలో నున్నవారికి వస్త్రాచ్ఛాదనాదులయందు స్మృతి యుండదు. వివస్త్రలుగా నున్నవారితో సమానులే యని భావము. అట్టివారిని జూచుట పాపకార్యము.

"నాగ్నిం ముఖేనోపధమేన్నగ్నాం నేక్షేత చ స్త్రియం,
నామేధ్యం ప్రక్షిపేదగ్నౌ న చ పాదౌ ప్రతాపయేత్. ౫౩
నాంజయంతీం స్వకే నేత్రే న చాభ్యక్తామనావృతామ్,"
మనుస్మృతి ౪ అధ్యా.

"అనావృతామ్. స్తనావరణరహితామ్." అని కుల్లూకభట్టు. అనుస్మృత్యర్థమే యీభాగము మనకుఁ దెలుపుచున్నది. మహా భక్తుఁడగుట నతఁడాకార్య మొనరించినందులకై విచారిం చెను. పరదారసక్తి లేకుండుటయే యుత్తమకార్యమని మన స్మృతులు లోనగునవి తెలుపును.

"కామం దృష్టా మయా సర్వా విశ్వస్తా రావణస్త్రియః. ౪౦
న హి మే మనసః కశ్చిద్వైకృత్య ముపపద్యతే,
మనో హి హేతుస్సర్వేషామింద్రియాణాం ప్రవర్తనే. ౪౧
శుభాశుభాస్వవస్థాసు తచ్చ మే సువ్యవస్థితం,
నాన్యత్ర హి మయా శక్యా వైదేహీ పరిమార్గితుం. ౪౨
స్త్రియో హి స్త్రీషు దృశ్యంతే సదా సంపరిమార్గణే,

యస్య సత్త్వస్య యా యోని స్తస్యాం తత్పరిమార్గ్యతే. ౪౩
న శక్యా ప్రమదా నష్టా మృగీషు పరిమార్గితుం,
తదిదం మార్గితం తావచ్ఛుద్ధేన మనసా మయా." ౪౪

అని మూలము. ఇది జితేంద్రియత్వమాహాత్మ్యమును బోధించుచున్నది.

"ఇంద్రియాణి పరాణ్యాహురింద్రియేభ్యః పరం మనః,
మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః.
సంకల్పప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వానశేషతః,
మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమంతతః."

అను నీగీతావాక్యములు రామాయణార్థసారమునే తెలుపుచున్నవి.

"శుభాశుభఫలం కర్మ మనోవాగ్దేహసంభవం,
కర్మజా గతయో నృణాముత్తమాధమమధ్యమాః. ౩
తస్యేహ త్రివిధస్యాపి త్ర్యధిష్ఠానస్య దేహినః,
దశలక్షణయుక్తస్య మనో విద్యాత్ప్రవర్తకం. ౪, అధ్యా. ౧౨.
బుద్ధీంద్రియాణి పంచైషాం శ్రోత్రాదీన్యనుపూర్వశః,
కర్మేంద్రియాణి పంచైషాం పాయ్వాదీని ప్రచక్షతే. ౯౧
ఏకాదశం మనో జ్ఞేయం స్వగుణేనోభయాత్మకం,
యస్మిన్ జితే జితావేతౌ భవతః పంచకౌ గణౌ. ౯౨
ఇంద్రియాణాం ప్రసంగేన దోషమృచ్ఛత్యసంశయం,
సన్నియమ్యతు తాన్యేవ తతస్సిద్ధిం నియచ్ఛతి. ౯౩
న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి,
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే. ౯౪

... ... ... ...

వశే కృత్వేంద్రియగ్రామం సంయమ్య చ మనస్తథా,
సర్వాన్ సంసాధయేదర్థానక్షిణ్వన్ యోగత స్తనుం." ౧౦౦

మనుస్మృతి ౨ అధ్యా.

అను నీ మనుస్మృతివాక్యములు కూడ రామాయణార్థము నే తెల్పుచున్నవి. యోగమునకు మనస్సే కారణము. మనోనిగ్రహమే తపస్సున కాధారము.

"ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున,
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః."

అను భగవదుక్తి విని,

"చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢం,
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరం."

అని అర్జునుఁడు ప్రశ్నింపఁగా,

"అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలం,
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే."

అని కృష్ణమూర్తి సమాధానము చెప్పినవిషయమును బరికించిన మనోనిగ్రహమున సర్వేంద్రియనిగ్రహఫలము కలుగు ననియే కదా. కావున మనస్సు సర్వేంద్రియప్రవర్తనమున కధిపతి యని హనుమంతుఁ డూహించెను. అక్కారణమున దేహదోషములకంటె మనోదోషము లధికములని భావము. దేహదోషములకుఁ దగినశిక్ష విధించువాఁడు రాజు. మనోదోషములకు

"అంతః ప్రచ్ఛన్నపాపానాం శాస్తా వైవస్వతో యమః,"

అనుసూక్తి ననుసరించి యముఁడు. ఇతరులకుఁ దెలియకుండఁ

జేసితిమని గర్వించువా రజ్ఞానులు. తన్నుఁ దా నశింపఁజేసికొనినట్లే యతని యూహాలఫలము పరిణమించును.

హనుమంతుఁడు తాఁ జేసినపని పాపప్రదమని యూహించి తన మనోనైర్మల్యము ననుసరించి యది నిర్దోషమే యని నిశ్చయించుకొనియెను. "నేను దూతను. సీతాన్వేషణార్థ మరుదెంచితిని. స్త్రీజనముకడనే కదా యామె యుండును. ఆపని దోషము కాదు. వెదకుతఱిఁ బరకాంతలు గనఁబడకపోరు కదా. వారిదర్శనమున నామనస్సు కలఁతపడునేని దోష మబ్బును. అట్లు కాక యది నిర్మలముగా నున్నది. కావున నాకార్యమున దోషము లేదు." అని యతఁ డూహించెను.

"సతాం హి సందేహపదేషు వస్తుషు ప్రమాణమంతఃకరణప్రవృత్తయః."
అనుసూక్తి యీ రామాయణార్థమునే తెలుపుచున్నది. ఇఁకఁ దరువాతివిషయమును బరికింతము.

## హనుమంతుఁడు మరల నంతఃపురమున వెదకుట.

* హనుమంతుఁడు జానకిం జూడఁగోరుచు నా యంతఃపురమునందు నడుమఁగల లతామండపాదులయందుఁ గలయ వెదకియు నాజానకిం జూడఁజాలఁ డయ్యెను. నేనెంత పరికించుచున్నను జానకి కానరాదయ్యె. కనుక నిశ్చయముగా నామె మృతినొందియుండును. ఆమె పాతివ్రత్యమును సన్మార్గమును దప్పకుండునది. కాఁబట్టి రావణుఁ డెంతనిర్బంధించినను బాపన

* ఇది పండ్రెండవసర్గమునఁ గలది.

తరమగుమార్గమునఁ దప్పకయుండు. లోఁబడకయే యుం డును. దుష్టుఁడు కావున లోఁబడలేదన్న కోపమున నామెను జంపియుండును. రాజకుమారియగు నాసీత వికారరూపము గలరాక్షసస్త్రీలను జూడఁగా భయంపడి ప్రాణములు విడిచి యుండును. సీతంజూడక నేను వానరులు తిరిగి కాలముఁ గడపి సుగ్రీవునొద్దకుఁ బోవుదుమేని యతఁడు మమ్ముంబట్టి వధించును. అంతఃపురమునంతయుఁ దిరిగితిని. రావణపత్నులం జూచితిని. సీత కనఁబడలేదు. నాశ్రమము వ్యర్థమైనది. సీతఁ జూడక నే నూరక పోవుదునేని అంగదాదు లగువాన రులు నన్నేమి యడుగుదురు? హనుమంతా! మహావీరుఁ డవుగాఁ బోయి యేమి చేసితివి? మాకుం జెప్పుము. అని యడు గఁగా నేమని బదులు చెప్పుదును? నేనిందే యుందునేని కొంత కాలము వేచియుండి యంగదాదులు ప్రాయోపవేశముం బూనుదురు. నాప్రయాణమును గుఱించి జాంబవంతుఁ డెల్ల రకుం దెలుపుచుండును. ఉత్సాహమే సంపన్మూలము. పరమసుఖ మదియే. ఏలన నుత్సాహమే సర్వకార్యములను సాగించును. అదిలేదేనొక్కటియు సాగదు. ప్రాణికోటి చేయుకార్యముల నుత్సాహమే సఫలముగాఁ జేయుచున్నది. కాన నేను నా యుత్సాహమునే యాశ్రయించి నావచ్చినపనిని సఫలముగాఁ జేసికొన యత్నించెద.

నేను నీలంకలోని భాగముల నన్నింటిని వెదకెదను. పానశాలాదుల వెదకితిని. విసుగునొందక మరల వెదకెదను. అని యాలోచించి మరల వెదక నారంభించెను. వివరములఁ జొచ్చుచు వెడలివచ్చుచు నెల్లెడలఁ గలయం దిరిగెను. ఆ యంతఃపురమున నతఁడు చూడనిభాగమే లేకుండెను. ప్రాకా

రాంతర్భాగములు లోనగువానినెల్ల వెదకెను. వికృతాకారముగల రాక్షసకాంతలు కనఁబడిరి గాని సీత మాత్రము కనఁబడదయ్యె దానికి వగచుచుఁ దనజతనమునంతయుం దలంచుకొని వంతనొందుచుఁ దనలో నిట్లూహింపసాగెను.

## హనుమంతుఁ డశోకవనముం బ్రవేశించుట.

* అంత విమానమునుండి ప్రాకారమునకు లంఘించి వెదకి సీతం గానక నేను శ్రీరామహితార్థినై లంకయందుఁ బెక్కుతావులం బలుసారులు వెదకితిని. ఆమె కనఁబడలేదు. గృధ్రరాజగు సంపాతి రావణునింట జానకి యున్నట్లు చెప్పెను. ఎంత వెదకిన నిం దామె కనఁబడకున్నది గదా. విదేహజనపతి పుత్త్రియు నయోనిజయు నగు సీతాదేవియుఁ దనశీలముం దప్పి దురాత్ముఁడగు రావణునితోఁ జెలిమిచేయ నంగీకరించునా? కొనిపోవునపు డతఁడు శ్రీరామబాణములం దలంచుకొని భయపడఁగా నాసమయమున సీత క్రిందఁ బడియుండు నేమో, సిద్ధసంచారయోగ్యంబగు నాకాశమునఁ బోవునపుడాపూజ్యశీల సాగరముంగని భయంపడి యందుఁ బడియుండు నేమో, ఇది యుక్తమని నాకిపుడు తోఁచుచున్నది. దుష్టుఁడు కొనిపోవుచున్నాఁడే యని ప్రాణముల వదలియుండునేమో, తన్ను నంగీకరింపమికిఁ గినిసి సీతను రావణుఁడు భక్షించెనో, రావణునిపత్నులామెను దినిరో, శ్రీరామవిరహార్తి తన్ను ముంపఁగా నామె తనకుఁదానే యసువులం బాసెనో, గర్భాగారాదులయం దుంచఁబడిన సీత దుఃఖపడుచుండును. అంతియ

---

* ఇది పదుమూఁడవసర్గమునఁ గలదు.

కాని రావణునకుమాత్రము లోఁబడదు. త్వరితముగాఁ బోయి శ్రీరామున కీవార్తను దెలుపుద మనుకొన్నచోఁ బ్రియు రాలియం దెక్కుడు మక్కువగల యాశ్రీరామున కీ యాలోచనలలో నేదియుఁ జెప్పరాదు. చెప్పిన నతఁడు విన్నంతనే ప్రాణముల వదలును. నాకది దోషముఁ గలిగించును. చెప్పక యుండిన స్వామిని వంచించినదోషము పొసఁగును. ఈ రెండును బరస్పరవిరుద్ధములుగా నా కగపడుచున్నవి. అని యూహించి యిప్పుడు చేయఁదగిన దెద్ది యనునూహతట్టఁగా నిక్లేకిష్కిం ధకుఁ బోయిన నాకుం గల్గుపురుషార్థ మేది? ఏదియుం గాన రాదు. సుగ్రీవుఁడు నన్నుం గని యేమనునో, వానరులు న న్నేమందురో, శ్రీరామసౌమిత్రులు న న్నేమనుదురో, అకృత కార్యుఁడనై నేఁబోయి కానరాలేదు సీత యను నప్రియ వార్తను దెల్పిన రాముఁడు ప్రాణముల వదలు. లక్ష్మణుఁ డపుడే చచ్చును. ఆవార్త విని భరతుఁడు, ఆపిదప శత్రు ఘ్నుఁడు మృతి నొందుదురు. పుత్త్రమృతిం గని కౌసల్యాదులు మరణింతురు. నిస్సందేహము. కృతజ్ఞుఁ డగుసుగ్రీవుఁ డుండఁడు. రుమయుఁ దారయు నాతనివెంటఁ జత్తురు. అంగదుఁడు మాత్రము జీవించునా? వానరులందఱు దుర్మరణమునకుఁ బాలగుదురు. నేను గిష్కింధకుఁ బోవ నిన్నిఘోర కార్యములు జరగును. కాన నేను గిష్కింధకుఁ బోవఁజనదు. సీతంగని వత్తు నను నాసచేత వారెల్లరు జీవించియుందురు. సీత కనఁబడదే నిందే యదృచ్ఛాలాభసంతుష్టుఁడనై వానప్రస్థుఁడ నయ్యెదను. కాదేని యిందే యగ్నింబడి మరణింతును. లేక ప్రాయోప వేశముఁ బూనియుండి యాత్మం బాయుదునేని నాశరీరమును గంకగృధ్రాదులు భక్షించును. ఇట్టు లాత్మత్యాగము చేయుట

దోషము గాదు. ప్రాయోపవేశము చేసి ప్రాణముల వదలుట మహర్షు లంగీకరించిరని నేఁ దలంతును. జానకి నా కగపడక పోయిన జలములం బడి యసువులం బాయుదు.

ఈరాత్రి తొలుత లంకాధిదేవతను గెలుచుటం జేసి శుభప్రారంభముగా నాకున్నది. వెదకుటకుఁ దగినట్లు వెన్నెల గాయుట సొంపుగా నున్నది. "హనుమంతుఁడు లంకం జొచ్చినరాత్రి" యను ప్రసిద్ధి కలుగఁగలదు. ఈరేయి నిదు రింపని నాకుఁ బెద్దదిగాఁ దోఁచుచున్నది. అట్టి యీరేయి సీత కనఁబడనందున నాపాలిటికి వ్యర్థముగ నున్నది. మృతికన్న జీవించియుండుట మంచిది. కావున నియమ మవలంబించి వృక్షముక్రిందఁ దపము చేసికొనుచుండెదను. అంగదాదుల కడ కరిగినను వారు ప్రాణముల వదలుదురు. పురుషుఁడు చచ్చిన ననేకదోషములు కలుగు. కాన నే బ్రదికియుందునే నిప్పుడు కాకున్న మఱొకప్పుడైనను శుభములను జూడఁ గల్గుదు. అందులకై ప్రాణముల ధరించియే యుందును. ఎప్పటికైన శుభము పొడకట్టకపోదు. అని యూహించెను. మరల వెదక సాగెను. సీత కనఁబడక యుండెను. మరలఁ దనలో. దశకంఠుని జంపక విడువరాదు. సీత కనఁబడక పోవుగాక. వానిని మాత్రము చంపక మానరాదు. దాన బదులుచేసిన ట్లగును. కాదేని రావణుని సముద్రమునకు సమీపముగా నెత్తుకొని పోయి యజ్ఞమునందుఁ బశువు నగ్నికిచ్చునట్లు శ్రీరామునకుఁ గానికగా నిత్తును. అని పెక్కుభంగుల నాలోచించుచు విచార సాగరమున మునుంగుచు నెన్నియిడుములు గలిగినను జానకి కనఁబడునంతవఱకు నిందు వెదకుచునే యుందును. తొలుతనే సంపాతిమాటను నమ్మి శ్రీరాము నిచ్చటికిఁ దీసికొనివచ్చియే

యుండిన జానకిం గానక వానరుల దగ్ధముచేసియుండునే. నే నిపుడు నియమమున నిం దుందును. నాకొఱకు వేచి ప్రాణములతో నంద ఱట నుందురు.

పెనువ్రాఁకులతోఁగూడిన యశోకవన మొకఁడు కనఁబడుచున్నది. అచ్చటికిం బోయెద. ఇంతదనుక నందు వెదక లేదు. వసురుద్రాదిత్యమారుతాశ్వి దేవతలకు నమస్కారము లర్పించి రాక్షసులకు దుఃఖముఁ గలిగించువాఁడనై యీ యశోకవనముం జొచ్చెదను. రాక్షసులను గెలిచి మహర్షికిఁ దపఃఫలము నొసంగునట్లు రామచంద్రున కిక్ష్వాకుకులానందదాయిని యగుసీత నొసంగెదను. అని యూహించి చింతచే వ్యాకులములగు నింద్రియములు గలవాఁడయి ముహూర్తముండి లేచి యశోకవనమున కరుగ నెంచి శ్రీరామునకు లక్ష్మణునకు జానకీదేవికి రుద్రేంద్ర యమ వాయు చంద్రసూర్య మరుద్గణములకు నమస్కారములని పలికి సుగ్రీవునకు మ్రొక్కి యావనము కొలఁది నెఱుంగుటకై దాని నలుప్రక్కలుచూచి శుభముగా నగపడు నావనమున కరుగ నిశ్చయించుకొని చేయఁదగుదానిం గుఱించి చింతించుచు రక్షపటలములు కాచుచుండ నందందుఁ జిన్నియంతర్వనములు గలిగి సంస్కారపూరితమైయున్న యీయశోకవన మవశ్యము నాకుఁ జూడఁదగి యున్నది. కావలివా రిందుఁగల వృక్షరాజములఁ గాపాడుచున్నారు. సర్వవ్యాపకుఁడు భగవంతుఁడగు వాయుదేవుఁడు భయముగలుగ వీవక హితస్పర్శముగా వీచుచున్నాఁడు. ఇందు నాప్రవేశము రామునకుఁ గార్యసిద్ధిని గల్గింపఁగాక. ఇతరులకుఁ గనఁబడకయుండ నాతనువును జిన్నదిగాఁ జేసికొంటిని. కార్యసిద్ధి కనుకూలముగా నా చేతనై నయత్నముఁ

జేసితిని. ఇచ్చట దేవర్షిగణములు నాకార్యము నెఱవేఱఁ జేయఁగలరు. బ్రహ్మయు దేవతలు నగ్నియు వాయువు శతమఖుఁడు వరుణుఁడు చంద్రసూర్యులు నశ్విదేవతలు సర్వమరుత్తులు శివుఁడు నాకుఁ గార్యసిద్ధి నొసంగుదురు గాక. సమస్తభూతములు విష్ణువు మార్గముననుండియుఁ గనఁబడని దేవతలు నాకుఁ గార్యసిద్ధి నొసంగుదురు గాక. పూజ్యురాలగు నా జానకీదేవిని నేనెప్పుడు చూడఁగలనో, దురాత్మునిచే నపహృతయైన యాపరమపతివ్రత నాకుఁ గనంబడుట యెట్లో కదా అని యాలోచించెను.

మహాశయులారా! ఈభాగమునఁ గొన్ని విశేషములు గలవు. వాని నెఱుకుదము. ఇందు హనుమంతుని శీలమెట్టిదో తెలియఁదగు. నైజము నెంత దాఁచినను బ్రమాదముగనైన నది కనంబడునని ముందు వ్రాసియుంటిని. దాని కీభాగము దృఢపఱుచునది యగు. సీత రావణుని ప్రేమించియుండునా యనియు, నేనాఁటికిఁ బ్రేమింపఁదనియుఁ గనఁబడనందున మార్గమున మృతినొందియుండునా యనియు, దురాత్ముఁడే కోపమున భక్షించెనా యనియు నింక నెన్నియోవిధములఁ జింతించెనని యీభాగము తెలుపుచున్నది. ఎన్నివిధముల నాలోచించినను దుద కాతనికి సంశయములు వీడలేదు. మతిమంతుఁడయ్యు ననేకశంకలకు లొంగవలసినవాఁ డయ్యెను. ఆతొందఱలో నెందఱు దేవతలనో ప్రార్థించెను. ఆయాపట్టుల యందలి విశేషముల నెఱింగిన నెంతయో మేలున్నది.

"హస్తాదానో ముఖాదానో నియతో వృక్షమూలికః. ౮౦
వానప్రస్థో భవిష్యామి హ్యదృష్ట్వా జనకాత్మజాం,
సాగరానూపజే దేశే బహుమూలఫలోదకే. ౮౧

చితాం కృత్వా ప్రవేక్ష్యామి సమిద్ధమరణీసుతం,
ఉపవిష్టస్య వా సమ్యగ్లింగినీం సాధయిష్యతః. ౪౨
శరీరం భక్షయిష్యంతి వాయసాశ్శ్వాపదాని చ,
ఇదం మహర్షిభిర్దృష్టం నిర్యాణమితి మే మతిః. ౪౩
సమ్యగాపః ప్రవేక్ష్యామి న చేత్పశ్యామి జానకీం,"

అని మూలము. ఇందు హనుమంతుని విచారభేదములు వర్ణితములు. వానప్రస్థుఁడ నగుదునని యిందు హనుమంతుఁ డూహించిన ట్లున్నది. నాలుగాశ్రమములలో నిది మూఁడవది. హనుమ బ్రహ్మచారి గావున నిట నది పొసఁగదు. స్మృతులయందు

"న ఫాలకృష్టమశ్నీయా దుత్సృష్టమపి కేనచిత్,
న గ్రామజాతాన్యార్తోఽపి మూలాని చ ఫలాని చ. ౧౬
అగ్నిపక్వాశనో వా స్యా త్కాలపక్వభుగేవ వా,
అశ్మకుట్టో భవేద్వాపి దంతోలూఖలకోఽపి వా. ౧౭
సద్యః ప్రక్షాళకో వా స్యా న్మాససంచయికోఽపి వా,
షణ్మాసనిచయో వా స్యాత్సమాని చయ ఏవ వా. ౧౮
పుష్పమూలఫలైర్వాపి కేవలైర్వర్తయేత్సదా,
కాలపక్వైస్స్వయం శీర్ణై ర్వైఖానసమతే స్థితః." ౨౧

అని మనుస్మృతి లోనగువానియం దిట్టిధర్మము లగపడుచున్నవి. కాని యవియన్నియుఁ దృతీయాశ్రమమునకుగాఁ జెప్పఁబడినవి. వానప్రస్థశబ్దమునకు వననివాసము చేయువాఁ డనునర్థ మాకరములయందు నా కగపడలేదు. ఇచ్చోట నెందో యొకవృక్షమూలమునఁ గూరుచుండి చేతులకందినవి నోటిలోఁబడినవి అగుఫలములఁ దినుచు నుందునని హనుమ

భావించిన ట్లగపడుచున్నది. ఇది స్మృత్యుక్తమగు వానప్రస్థాశ్రమము కాదనియు నరణ్యానివాసీ పరమనియు మన మూహింపవలయును. ప్రాణధారణమున కుపయుక్తము లగు వస్తువులం గొని కాలముఁబుచ్చుచుఁ దపోనిరతి నుండవలయు నని హనుమంతు నాశయమని యేర్పడుచున్నది. సముద్రము చెంత ననేక మూలఫలోదకములు గలయిచ్చోటనే చితిఁ బేర్చుకొని అరణినుండి యగ్నిని మథియించి సంపాదించి దరి కొలిపి యందుఁ గూరుచుండి యసువులం బాసెద ననుకొని యెను. ఇది ఆత్మహత్య కాదా యని కొంద ఱడుగవచ్చును.

"ఆత్మానం హంతు మారబ్ధం బ్రాహ్మణం క్షత్రియం విశం,
గాం వా తురంగమన్యం వా హత్వా దోషైర్న లిప్యతే."

అను పురాణవచనము ననుసరించి యెన్ని పాపముల నొనరించి యైనఁ దనప్రాణమును నిలుపుకొనవలయునని యేర్పడుచున్నది. కాని యది యితరులపైఁ గలరోషమునకు ఫలము కలుగక పోఁగా నిర్బంధమరణము నొందువారివిషయము. కాని తపస్సు చేసికాని నియతుఁడై వైరాగ్యముచేఁ బ్రాణముల వదలఁ దలఁచుకొని కాని యుండువారివిషయము కాదు. స్వామి కార్యహతప్రాణులకు స్వర్గము కలుగునని చెప్పుచున్నవాక్యములు వ్యర్థము లగును. ప్రాయోపవేశవ్రతమూని ప్రాణముల వదలితినేని నాయీశరీరమును గాకములుగాని వ్యాఘ్రాదులు గాని భక్షింపఁ గలవు. అని హనుమంతుఁ డూహించెను. ఇందు నాతనిభావ మేమి? బ్రదికియుండి భగవంతుని కార్యమునకుఁ దోడ్పడఁజాలక పోతిని. కనుక నాయీశరీరము తుచ్ఛము. ఇది నాప్రాణములు పోయినతర్వాతనైనను భూత తృప్తిని జేయుఁగాక అని. ఈయర్థ మిపుడు కొన్ని దేశము

లలోఁ గలదు. గ్రామమునకు వెలుపల నెత్తుగా నొకగృహము నిర్మింతురు. పైభాగమును మూయకయుంతురు. వలయాకార ముగా గోడయుండును. శవమునందుఁ బడవేయుదురు. దానిని గంకగృధ్రాదులు భక్షించిపోవును. కాల్చివేయుటకంటెఁ గొన్ని జంతువులకు శరీర మాహార మేల కాఁగూడదని యాదేశ వాసుల యాశయము. ఈ యాశయమునకుంగూడ రామా యణమున నాధారము కనఁబడుచున్నది కదా. ఈప్రాయోప వేశవ్రత ప్రాణత్యాగము మహర్షిసమ్మత మని నావిశ్వాసమని హనుమంతుఁ డూహించెను. నియమమూని భగవద్ధ్యానము చేయుచుఁ దుచ్ఛమీశరీర మనువైరాగ్యము కలుగఁగా నసు వుల వదలు టుత్తమమే యని మహర్షు లంగీకరింతురు. పరీక్షిత్తు లోనగువా రిట్టివ్రతమూలమునఁ గదా యసువులం బాసి శాశ్వతసుఖముం గాంచిరి. ఇది దుర్మరణము కాదు. కోరఁ దగిన మరణమే యిది. జలములం బ్రవేశింతుననియు నతఁ డూహించెను. జలములు భగవత్స్వరూపములని యతఁడు విశ్వసించియే యందుఁ జొచ్చి ప్రాణముల వదలఁ దలంచెనని మనము తలంపఁజను.

"సుజాతమూలా సుభగా కీర్తిమాలా యశస్వినీ. ४४
ప్రభగ్నా చిరరాత్రీయం మమ సీతామపశ్యతః."

అని మూలము. లంకాధిదేవతను జయించుట తొలిశకునము, చంద్రుఁడు వెలుంగుచుండుట రెండవది. వానరుఁడు లంకను బ్రవేశించెనన్నదియే జగద్విఖ్యాతకీర్తి. అది గలుగుట మూఁడ వది. ఈరాత్రి హనుమ లంకంజొచ్చెనని యెల్లరు స్మరింతురను నది నాల్గవది. అట్టి యీశుభశకున పరంపరలు గలదయ్యు నిద్ర లేనికతన చాలఁ బెద్దదిగా నా కగపడినను గడచిపోవు

చున్నది. కాని సీత నా కగపడలేదని హనుమ చింతించెను. శకునము ఫలించునన్న విశ్వాసము హనుమకుం గలదని యీ భాగము మనకుఁ దెలుపుచున్నది. "ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః" అనుట లోకవిదితము. మన స్సుత్సాహపూరిత మగుట రాఁగల శుభసంపద కానవాలు. కావున శుభశకున ములు దైవికములే యైన శుభమును గల్గించునన్న యర్థము నీభాగము సూచించుచున్నది.

"వినాశే బహవో దోషా జీవన్ భద్రాణి పశ్యతి. ౪౭
తస్మాత్ప్రాణాన్ ధరిష్యామి ధ్రువో జీవితసంగమః,"

అని మూలము. ఈ రామాయణార్థమునే "బ్రదికియుండిన శుభములు పడయవచ్చు" అన్న పద్యము తెలుపుచున్నది. ఆత్మ హత్య యనేకపాపములకు మూలము. జీవించియున్నఁ గాలాం తరమందైనను మేలు గనవచ్చును. అనఁగా కేవల పాపకర్మము లనే యెవరు చేసియుండరనియు, శుభకర్మములను గొన్నింటి నైనఁ జేసియుందురనియుఁ, దత్ఫలము కూడ ననుభవమునకు రాఁగలదనియుఁ గావునఁ బ్రాణములను వలయునని వదలక నిలుపుకొనియున్న "తడఁబడ దేనాఁటికొక్క దైవము లేఁడే" అను నానుడి ననుసరించి యెప్పుడైన శుభఫలముల నొందవచ్చుననియు భావము. కావలయునని ప్రాణముల వదలరాదని దీని సారము. శరీరమును దనశక్తి కనురూపముగాఁ గాపాడు కొనవలయునని మన కీభాగము బోధించుచున్నది. "శరీర మాద్యం ఖలు ధర్మసాధన" మ్మను సూక్తి రామాయణార్థమునే గ్రహించి యేర్పడినదని మనము నమ్మవలయును.

"రావణం వా వధిష్యామి దశగ్రీవం మహాబలం. ౪౮
కామమస్తు హృతా సీతా ప్రత్యాచీర్ణం భవిష్యతి,"

అని మూలము. ఇది హనుమంతునివంటి బుద్ధిమంతునకుం గూడఁ గసితీర్చుకొనవలయునను నభిప్రాయము కలుగక తప్పినది కాదనియుఁ, గోపమును జయించుట సామాన్యకార్యము కాదనియుఁ దెలుపుచున్నది. సీతను దొంగిలించిన రావణునిం జంపినవైరమును దీర్చుకొన్నట్లగునని హనుమంతునాశయము.

"బలవా నింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి."

అన్నసూక్తి కీరామాయణభాగమే యాధారము కాఁబోలు. జితేంద్రియుఁడు మహాభక్తుఁడు నగు హనుమంతుఁడు కూడ సీత కనఁబడకపోయినఁ బగయైనఁ దీర్చుకొనవలయు నను నూహ కలవాఁ డయ్యెఁ గదా. సామాన్యుల కది కలుగక యుండ మానునా యనునూహ యెల్లరకుం గలుగ నవకాశము కలుగుట విచిత్రమేమియుఁ గాదు. కార్యాతురులకు యుక్తాయుక్తపరిజ్ఞానము తక్కువ యగునన్నభావము నిది తెలుపును గదా. రావణుని దాఁ జంపఁగలుగుదునా. అది శక్యము కాదా యని యోజింపకపోయెను గదా.

"అథవైనం సముత్క్షిప్య ఉపర్యుపరి సాగరం.    ౫౦
రామాయోపహరిష్యామి పశుం పశుపతేరివ,"

అని మూలము. పశుపతి యనఁగా నిట నగ్నియని తెలియవలయు. అగ్నికాహుతిగా మేఁకను యజ్ఞమున నిత్తురు. అట్లే రామునికడకుం గొంపోయి యీదురాత్ముని వధింపుమని సమర్పించెదనని హనుమ తలంచెను. ఈయూహాయుఁ బైదాని కుదాహరణమే యని తెలియందగు.

"వసూన్ రుద్రాంస్తథాదిత్యావశ్వినౌ మరుతోఽపి చ.    ౫౬
నమస్కృత్వా గమిష్యామి రక్షసాం శోకవర్ధనః,

జిత్వా తు రాక్షసాన్ సర్వా నిక్ష్వాకుకులనందినీం. ౫౭
సంప్రదాస్యామి రామాయ యథా సిద్ధిం తపస్వినే,"

అని మూలము. వసురుద్రాదిత్యాదులు సర్వదా లోకక్షేమ మును గోరువారు. సత్పక్షపాతులు. కావునఁ గార్యసిద్ధినిం గోరువారు వారిని బ్రార్థింపవలయును. దీనిచే నహంకారత్యాగము సూచితము. తన కేకార్యమునందును బరాపేక్ష యక్కఱలేదు. అన్నయహంకారము తొలఁగును. నాకంటె నధికులు మహాత్ములు పెక్కండ్రు గలరు. వారిని బ్రార్థించిన నాకార్యము ఫలించును. అన్నభావమే ప్రతివారికి నుండందగును. ఇందు హనుమ రాక్షసుల నోడించి సీత శ్రీరామున కర్పింతు నను చున్నాఁడు. అనఁగా సీతను దర్శించి యామె నెత్తుకొనిపోయి శ్రీరామునిసన్నిధి నునుపవలయుననియే కదా హనుమంతు నాశయ మని యూహింపవలసియున్నది. "సంప్రదాస్యామి" అనఁగా సీతాకుశలవార్తను శ్రీరామునకుఁ దెలుపుదు నన్న యర్థ మద్దానింబట్టి చెప్ప వలనుపడునా యని సందియమందె దను. ఈభావమునే యతఁడు ముందుఁ దెలుపును. అది మీరు చదువఁగలరు.

"రక్షిణశ్చాత్ర విహితా నూనం రక్షంతి పాదపాన్. ౬౨
భగవానపి సర్వాత్మా నాతిక్షోభం ప్రవాతి వై,
సంక్షిప్తోయం మమాత్మా చ రామార్థే రావణస్య చ. ౬౩
సిద్ధిం మే సంవిధాస్యంతి దేవాస్సర్షిగణాస్త్విహ,"

అని మూలము. "సర్వాత్మా భగవాన్" అను విశేషణములు వాయువున కొసఁగఁబడినవి. సాధారణముగా నుపనిషత్తుల యందుఁ బురాణములయందును భగవచ్ఛబ్దము నుపయోగించు

చుందురు. పరమేశ్వర పరమగునపుడు చెప్పినయర్థ మిటఁ జెప్ప రాదు గదా. వాయువు మందమందముగా వీచుచున్నది. అదియు నొక శుభశకునము. రామకార్యార్థము రావణున కగపడకయుండుట కనుకూలమగునట్లు నాశరీరము సంకోచించితిని. ఇదియు నొక శుభశకునమువంటిదే. కావున నిందలి దేవతలు మహర్షిగణములు కార్యసిద్ధిని గల్గింతురు గాక. అని హనుమ భావించెను. దేవతలు మహర్షులు నెల్లతావుల నుందు రనియు సాధువులకు దర్శనమిత్తురనియుఁ గుమతులకు దర్శన మీయక చరించుచుందురనియుఁ దెలియనగును. రాక్షసనివాసమున దేవతలుండరని భావింపరాదు. "శాంతా మహాంతో నివసంతి సంతో వసంతవల్లోకహితం చరంతః" అని శంకరాచార్యులవాక్య మీయర్థమునే తెలుపుచున్నది. అదృశ్యరూపముల లోకహితమును గోరుదేవమహానులు స్వకార్య మేదియు లేకయున్నను దిరుగుచుందురనియుఁ దమ యాశీఃపాత్రులెం దుండిన నచ్చటఁ గనఁబడి వారి కుపకరింతురనియు మన మెఱుంగవలయు. మహాత్ములనఁగా నట్టివారే. స్వార్థులగు వారిని మహాత్ములనుట వ్యర్థము గదా. అది బిరుదమువంటిదే యగుం గాని సార్థకము గాదు.

"దాస్యంతి మమ యే చాన్యే హ్యదృష్టాః పథిగోచరాః." ౬౭

అనునీమూలము పైన వ్రాసినభావము సూచించుచున్నది. లంకయం దింతకుమున్ను వెదకునపుడు హనుమంతున కీ భావము గాని యీ శుభశకునములుగాని తోఁపలేదు. కార్యసిద్ధి కాఁ గలదనుట కివి నిదర్శనములు.

## హనుమంతుఁడు శింశుపావృక్షమును జూచుట.

* హనుమంతుఁ డిట్లాలోచించి యా యశోకవనమున కుం బోవఁ దలంపుగొని యా రావణమందిరమునుండి యశోకవనప్రాకారముమీఁదికి దుమికెను. అందుఁ గూరుచుండి హర్షపులకితాంగుఁడై పుష్పించి చూడ సొంపుగానున్న వృక్షరాజములం గాంచెను. ఒకచెట్టునుండి వేఱొకవృక్షమునకు దాఁటుచు నావనముం జొచ్చెను. చిలుకలపలుకులు వినఁబడ వివిధవర్ణపతత్త్రులు కలనినాదములు చేయ నది వింతగా నుండెను. వృక్షములపై నతఁడు దుముకుచుండఁగా నందలిపక్షులు మేలుకనియె. వృక్షములనుండి పడుచున్న పూవు లాతనియొడలంతట వ్యాపింపఁగాఁ బుష్పాచలమువలె నుండెను. తనదారి కడ్డముగానున్న తీఁగజొంపములను విదళించుచు నందందు వెదకుచుండెను. సరస్సులు తటాకములు వాపికలు నందెన్నియో కనఁబడియెను. తెలుపుగ నెఱుపుగనున్న యందలి యిసుక ముత్తెములను బగడములను బోలియుండెను. పద్మములు నుత్పలములు వికసించియుండెను. జలపక్షులు కొలకొల కూయుచుండెను. వానిచుట్టును దటములయందు భూరుహము లుండెను. అందొకపర్వతము సొంపుగా నుండెను. అట్టి మృత్పర్వతము. అందు శిలాగృహము లుండెను. అందుండి యొకనది ప్రవహించుచుండెను. వర్ణనాతీతముగా నున్న యా యశోకవనముం గాంచి యెంతయు నానందించెను. అందు శింశుపావృక్షము కన్నులపండువుగా నుండఁ గాంచి దాని

* ఇది పదునాల్గవసర్గమునఁ గలకథ.

నెక్కెను. అంత హనుమంతుఁడు సీతాదేవి యిందెందైనఁ దిరుగుచుండవచ్చును. కనుక నిందుండి చూడవచ్చును. రావణుఁడు దురాత్ముఁడైన నతని యీవనము మిగుల సొంపుగా నున్నది. ఈ తామరకొలఁకునకు సీత తప్పక వచ్చును. శ్రీరాముని సాధ్వి నిస్సందేహముగ నిచ్చటికి వచ్చును. సంతాపమునఁ గ్రుంకియుండు నాజానకి తత్తాపశాంతికై యీచోటికి వచ్చును. ఆసాధ్వీమణి సంధ్య నుపాసించుటకై తప్పక యీ సరోవరమునకు వచ్చును. ఆమె జీవించియే యుండు నేని నిర్మలోదకములు గల యీనదికి వచ్చును. యూహించుచు నందలివిశేషములం గాంచుచుండెను.

మహాశయులారా! ఈభాగమునుండి విమర్శింపఁ దగు విషయము లున్నవి.

"పుష్పితాగ్రాన్వసంతాదౌ దదర్శ వివిధాన్ ద్రుమాన్,"

అని మూలము. పూర్వసర్గమునందుఁ దనసంచారమునకుఁ బూర్ణజ్యోత్స్న తోడుపడినదని హనుమంతుఁడు తలంచెను. ఇపుడు "వసంతాదౌ" అని యున్నది. ఎట్లది సరిపడుననుసందియము కలుగవచ్చును. అమాంతమాసపక్షము పూర్ణిమాంతమాసపక్షము నను రెండుపక్షములు గలవు. అందుఁ బూర్ణిమాంతమాసపక్షము నంగీకరించిన ఫాల్గుణకృష్ణపక్షము వసంతాది యగుననుట సుసంగతమే యనవచ్చును.

"ఫుల్లపద్మోత్పలవనా శ్చక్రవాకోపకూజితాః,
నత్యూహారుతసంఘుష్టా హంససారసనాదితాః." ౨౮

అని మూలము. పుష్పించినకమలములు కలువలు గలిగి చక్రవాకాదిపక్షులు కొలకొలఁ గూయుచుండఁగా సరస్సులు

సొంపుగానుండ హనుమంతుఁడు చూచెనని యిందుఁ బొడ
కట్టెడు. ఇంచుమించుగా నడికిరేయి మించుచున్నది. ఆకాల
మునఁ గమలములు పుష్పించుట పక్షులు ధ్వనులుచేయుట
సంభవించునా యని యడుగవచ్చును.

"అహ్న్యంభోజం నిశాయాం వికసతి కుముదం చంద్రికా శుక్లపక్షే
మేఘధ్వానేషు నృత్యంభవతి చ శిఖినాం నాప్యశోకే ఫలం స్యాత్,
న స్యాజ్జాతీ వసంతే న చ కుసుమఫలే గంధసారద్రుమాణా
మిత్యాద్యున్నేయమన్యత్కవిసమయగతంస్యాత్కవీనాం ప్రబంధే."
సాహిత్యదర్పణము. ౭ ప.

అని కవి సమయములుగాఁ జెప్పఁబడినవి. పగటిపూటయందే
కమలములు వికసించుననియుఁ గలువలు రాత్రియందే వికసించు
ననియుఁ గవులసమయముగాఁ జెప్పఁబడినది వాస్తవము కాదని
యేర్పడుచున్నది. కొందఱు మూఁడుసారులు వికసించినకమ
లము మరల ముకుళింపదని యందురు. నిశలయందుఁ గమల
ములు వికసింపవనుట యంత విశ్వాసార్హము కాదని యీ
వాక్యము మనకుఁ దెలుపుచున్నది.

"సా రామా రామమహిషీ రాఘవస్య ప్రియా సతీ,
వనసంచారకుశలా నూనమేష్యతి జానకీ. ౪౬
అథవా మృగశాబాక్షీ వనస్యాస్య విచక్షణా,
వనమేష్యతి సార్యేహ రామచింతానుకర్శితా." ౪౭

అని మూలము. ఇచ్చోటికి సీతా రాఁగలదు. తప్పక నేనామెఁ
జూడఁగలనని హనుమ తలంచిన ట్లీభాగము తెలుపుచున్నది.
వనసంచారమున నేర్పుగలది కాన సీతాదేవి యీసుందర వన
మునకు రాఁగలదు. మృగశాబాక్షి గావున నీవనశృంగార

మును జూడఁగోరునది కాన శ్రీరామచింతాపనోదనార్థ మిచ్చటికి రాఁగలదు. అను నీ రెండుకారణములు సముచితములా యని యోజింపవలయును. ఆకాలమున నిర్బంధమున నునుపంబడి రామవియోగదుర్భరదుఃఖమున నవయుచుండు సీత యాశ్శింగారవనమునకు రాఁగలదని హనుమ తలంచు టుచితము కాదని కొందఱందురు. అది న్యాయ్యమే. కాని వేఱొక విధముగ నాలోచింపవచ్చును. ఆతనిచిత్తము విచారాయత్తమై యున్నది. సీత కనఁబడలేదన్న చింతయే యతనిని ముంచివేయుచున్నది. సీతాదర్శనభాగ్యము సమకూర్చుకాలము సమీపించుచున్నది. కావున నెన్నియోభంగులఁ దలపోయుచున్న యతనిమదికి నిదియు నొకటిగాఁ బొడకట్టెననుట యంత విరసము కాదు.

> "సంధ్యాకాలమనాశ్శ్యామా ధ్రువమేష్యతి జానకీ,
> నదీం చేమాం శివజలాం సంధ్యార్థే వరవర్ణినీ."

అని మూలము. సంధ్యావందనతత్పరురాలు గావున నీపుణ్యజలపూర్ణముగఁ గనంబడు నదికి తప్పక రాఁగలదు. అనుటచే సీత సంధ్యావందనము చేయునది యని తేలుచున్నది. స్త్రీల కుపనయనము కలదా? లేనిచో సంధ్యావందన మెట్లు? అను ప్రశ్నములు వచ్చును.

> "సాయం త్వన్నస్య సిద్ధస్య పత్న్యమంత్రం బలిం హరేత్,
> వైశ్వదేవం హి నామైతత్సాయంప్రాతర్విధీయతే." ౧౨౧.
>
> అధ్యా 3.

"ఇంద్రాయ నమ ఇతి మంత్రపాఠవర్జం. మానసస్తు దేవతోద్దేశో న నిషిధ్యతే." అని కుల్లూకభట్టు.

"నాస్తి స్త్రీణాం క్రియా మంత్రైరితి ధర్మే వ్యవస్థితిః." ౧౮
అధ్యా ౯.

అను నీ మనువాక్యములం బట్టి యాలోచింప సంధ్యావంద నాది నిత్యకర్మములు సమంత్రకములుగా స్త్రీలకు ననుక్తము లని యేర్పడుచున్నది. మానసికప్రార్థనాదుల కభ్యంతరము లేదు. కావున సీత సంధ్యాకాలమున నదికిం బోయి దేవతా ప్రార్థనము చేసివచ్చు నాచారము కలది యని యేల చెప్పరా దని కొంద అందురు. నిద్రాహారములు మాని రక్షఃస్త్రీలు కావలియుండ దుఃఖించుచుండు నాజానకీదేవికి నదీగమనవనసం దర్శనాదులు రుచించునా యని యడిగిన రుచించు ననరాదు. ఈయూహ హనుమకుం గలుగుట పైవ్రాసిన యూహలవంటిదే యనుకొనిన నేచిక్కులు రాకయుండును.

## హనుమంతుఁడు సీతాదేవిని దర్శించుట.

* పావని శింశుపావృక్షమున నుండి జానకి నన్వేషించు వాఁడై యన్నిప్రక్కలం గలయం జూచుచుండెను. అందుఁ గలభూరుహములు ఋతుషట్కఫలపుష్పాదివిభూషితములు. లోకప్రసిద్ధములగు చైత్రరథాదులతో నది సరిపోలియుండెను. కొంత చెంత నున్నత బౌద్ధాలయమువలె నిర్మితమైయుండు నొకప్రాసాదము నతఁడు కాంచెను. దానినడుమ వేయిస్తంభము లుండెను. కైలాసమువలె నది తెల్లగా నుండెను. దాని సోపానములు పగడములచేత నరుఁగులు పుటముపెట్టిన మృదుస్వర్ణముచేత నిర్మింపఁబడియుండెను.

* ఇది పదునేనవసర్గమునఁ గలకథ.

ఆవనమునందు మలినాంబరమును దాల్చి యెల్లెడల రక్షః కాంతలు పరివేష్టించియుండఁగా నుపవాసనియతిం జిక్కిపోయి దైన్యము దోఁప నిట్టూర్పులు పుచ్చుచు శుక్లపక్షమునఁ బోలి విమలంబగు చంద్రకళవలె తేజోవిహీనతం గుందియుండు సుదతి యొకతుక యతనికిం గనఁబడియెను. శరీరచ్ఛాయ సొంపుగానున్నను మలినాంబరముచే ధూమావృతమగు నగ్ని జ్వాలవలెఁ గనంబడుచుండెను. ఉత్తరీయము లేక మాసిన పచ్చనిపుట్టము కట్టుకొని యామె యుండెను. భూమినుండి యావిర్భవించినట్లు భూషణములు లేక శ్రీరాముఁడు చెంత లేమిఁ బ్రకాశింపకుండెను. పరునకుం జిక్కితిని గదా యన్న సిగ్గు తన్ను ముంపఁ బతివిరహవ్యథాకులితచిత్తయై రావణు బారికిం జిక్కి యంగారకగ్రహపీడిత యగు రోహిణివలెఁ గృశించియుండెను. దుఃఖైకశరణయై యుండెను. మఱియు నా పురంధ్రి ప్రియజనముం జూడఁజాలక శత్రువులగు రక్కసులనే చూచుచుఁ దనజాతింబాసి శునకగణపరివేష్టితయగు నాఁడు లేడివలె వ్యథఁ గుందుచుండెను. ఆమె యేకవేణి నీలసర్పము వలె వ్రేలాడఁగా శరత్కాలమున నీలవనరాజింగూడిన భూమి వలెఁ గనఁబడుచుండెను. కేవల సుఖార్హ యయ్యును వనసంచా రము మున్నెఱుఁగనిదయ్యు నత్తఱి దుఃఖములపాలయి తపించుచుండెను. ఆమెంగాంచి యనేకకారణముల ననుస రించి యీమె సీతయే యని హనుమంతుఁ డూహించెను. ఆనాఁడు రక్కసుఁ డెత్తుకొనిపోవుచుండఁగా నేరూపముం గాంచితిమో యారూపమే యీమె కున్నదని తలంచెను. సర్వావయవసంశోభితయైన యామె కనుపట్టుచుండెను. సందే హార్థములంగల మన్వాదిస్మృతివితతివలె, క్షీణించిన సంపదవలె,

ఫలములేమి విశ్వాసములేని శ్రద్ధవలె, భగ్నమగునాశవలె, విఘ్నములం గొట్టఁబడిన కార్యసిద్ధివలెఁ గలంగినబుద్ధివలె దుర్యశములం దూలినకీర్తివలె స్రుక్కుచు రామప్రాప్తి కేదియు నుపాయము తోఁపకుండుటం జేసి శ్రమంపడుచు జాలిగొలుపు చుండెను అనభ్యాసమున మఱువంబడిన విద్యవలెఁ గృశించి యున్న సీతను మాటిమాటికిం జూచి యతఁడు మనస్సున నింతగాఁ గృశించి మలినాంగియైయున్న యీామె సీతయగునో కాదో యని సంశయించెను. శబ్దవ్యుత్పత్తిని బాగుగా నెఱుంగనివాఁడు తా నొకమాట చెప్పఁగనే నాపలుకు శబ్దవ్యుత్పత్తిచే సంస్కరింపఁ బడనికారణమునఁ జెప్పనెంచినయర్థమును వదలి వేఱొకయర్థమును దెలుపునదై ఆనల నతఁడు శబ్దవ్యుత్పత్తి గలిగినపిదప దానియర్థ మిది యని తెలియునట్లు హనుమంతుఁడు భూషణాదులు లేక యుపవాసాదులచే మాఱురూపము నొందియుండు జానకిని శ్రీరాముఁడు తెలిపిన గుఱుతులననుసరించి యూహించి విశేషకష్టముపైఁ దెలిసికొనియెను. మఱిమంతుఁడు కావున ననేకహేతువులంబట్టి యామెను గుఱుతించెను.

హనుమంతుఁడు రామునాజ్ఞ నొంది ప్రయాణము చేయుతఱి నేయే స్థలముల నేయే యాభరణము లుండునని తెలిపెనో యవియన్నియు నాజానకి పతివ్రతయగుటఁ బతి చెంతలేనితఱిఁ దాల్పఁదగదని వృక్షశాఖకుం గట్టియుండఁగాఁ జూచెను. ఆయాభరణము లామె విరహతాపమునుష్ణమున నల్లఁగా నుండెను. ఆ సొమ్ములులేకున్న నాగుఱుతు లాయా తావులం గనంబడుచుండెను. ఇవి రామచంద్రుఁడు తెల్పిన సొమ్ములచిహ్నములే కాని వేఱుగావని యూహించెను. ఋశ్య

ఋూకమున నాసీత పడవైచిన యాభరణము లేవియో యవి నాకిచ్చుటఁ గానరాలేదు. మిగిలియున్న సొమ్ములే యిం దున్నవి. నిస్సంశయమే. ఆకొండపయి నానాఁడు అమూల్యవస్త్రాంచలమును జాఱవిడువఁగా నది చెట్టుకొమ్మకుఁ దగిలియుండఁగా వానరులందఱుం గాంచిరి. ధ్వనిచేయుచుఁ గ్రిందఁబడునట్లు వేయఁగా సొమ్ములను గనిరి కదా. అవియన్నియు నీమె పాఱవైచినవే యగు. ఈమె వస్త్రము విడువక కట్టుకొనియుండిన కారణమునఁ జాలనలిగి మాసియున్నది. కొండమీఁదఁ బాఱవైచినదానిరంగు కాంతియు నీవస్త్రము కలిగియున్నది. రాము నెడఁబాసి తద్విరహదుఃఖమునఁ గృశించునీదేవి జానకియే. కారుణ్యాక్రూరత్వములు శోకమదనవికారములు నను నీ నాలుగింటిచేతను నెవ్వతెింగూర్చి శ్రీరాముఁడు పరితపించుచున్నాఁడో ఆమెయే యీసుదతి. శరీరాంగప్రత్యంగసౌందర్యము లిరువురకు సమానములుగా నున్నందున నాయన కీదేవియు నీమె కారామచంద్రుఁడును బరస్పరము తగియున్నారు. ఈదేవి మనస్సు శ్రీరామునియందే నెలకొనియున్నది. కాఁబట్టి యామహాత్ము నెడఁబాసి యొకముహూర్తమైనను జీవించియున్నది. శ్రీరాముఁ డట్లే. ఇట్లు పరస్పరానురాగభరమున జీవించియున్నారు కాని లేనియెడల నొకక్షణమైన జీవించి యుండరు.

శ్రీరాముఁడు సీత చెంతలేకుండియు శరీరమును ధరించి యున్నాఁడు కదా. సీతమాత్రము స్వతంత్రురాలు గాదు కాన శరీరమును ద్యజింపఁజాలదు. పురుషుఁడు స్వతంత్రుఁడయ్యును మేను విడువఁజాలక ధరించియున్నాఁడు. దుఃఖమునఁ గృశింపక యున్నాఁడు. ఇది దుష్కరకార్యము. ఇట్టి

దాని నారాముఁడు చేసియున్నాఁడు. ఇతరులెవ్వరు నిట్లుండఁ జాలరు. ఉత్తమకాంతామణి సీజానకి విడిచి యింతదనుక రాముఁడు క్షణమైన బ్రదికియున్నాఁడు. ఇట్టి పురంధ్రీరత్న మును వదలి వేఱొకఁ డుండఁజాలఁడు. కనుక రాముఁ డెవ్వ రికిఁ జేయ శక్యముగానికార్యము నొనర్చినాఁడు. అని యీరీతి నాహానుమంతుఁ డాయన్నులమిన్నం గాంచి వగచుచు నిట్టి సాధువర్తనమున నీమె యుండుటం జేసి యారామమూర్తి మహాభాగ్యవంతుఁడే యని యతనిని వినుతించెను.

మహాశయులారా! ఇద్దాని నించుక విమర్శింతము. ఈ భాగమునఁ గల యశోకవనవర్ణనముం గాంచిన విచిత్రముగాఁ దోఁపక మానదు. అం దనేకగృహరాజములు, నంతర్గృహ ములు, వివిధమృగములు, సరస్సులు, తటాకములు, బావులు మొదలగునవి యున్నట్లు కనఁబడును. పక్షులు కొమ్మలనుండి కొమ్మలపై కెగురుచుండఁగాఁ బత్త్రము లన్నియు లేనియట్టు లాకొమ్మలున్నట్లు పొడకట్టు. రాత్రికాలమునఁ బక్షులు నిదు రింపక యెగురుచుట్టులని సంశయము కలుగక మానదు. గూబ లవంటిపక్షు లనేకము లున్నవనియు నవియే యట్లెగురు చున్నట్లు చెప్పఁబడినదనియు సమాధానము కొందఱు చెప్ప వచ్చును. సర్వర్తు ధర్మములు గలవృక్షము లెల్లతావుల నున్న యట్లు తెల్పుట కవులవాడుక. ఆపద్ధతి యిందును గనంబడు చున్నది. అశోకములు కొన్ని బంగారురంగుగలవిగా నుండుట, కొన్ని నీలవర్ణముగలవిగా నుండుట యిందుఁ గనంబడును. కాని యది యంత విచిత్రము కాదు.

"స దదర్శావిదూరస్థం చైత్యప్రాసాదముచ్ఛ్రితం,
మధ్యే స్తంభసహస్రేణ స్థితం కైలాసపాండురం. ౧౬
ప్రవాళకృతసోపానం తప్తకాంచనవేదికం,"

అని మూలము. "చైత్యం బుద్ధమందిరం. తదాకారం ప్రాసాదమ్"అని గోవిందరాజులు, "బుద్ధాండాకారప్రాసాదం" అని మహేశ్వరతీర్థులుఁను వ్రాసిరి. బుద్ధులను మతమువా రప్పటికే యుండి దేవాలయములు కట్టుకొని వ్యాపించిరా యను శంక పొడముచున్నది. ఆపక్షమున నామత మతిప్రాచీన మనవచ్చును గదా. బుద్ధమతమున నిపుడుగల యభిప్రాయములు గలమత మపు డింకొకటియు నుండవచ్చును. అదిరూపఱి మరలఁ గొంత కాలమున కాయాశయములు గలమతము వేఱొండు పొడచూపి బుద్ధమతమను పేరఁ బరఁగియుండవచ్చును. ఈశబ్దమును బట్టి యీరామాయణము నవీనమనియు భారతకథ ముందు సాగినదనియుఁ జెప్ప వలనుపడదు. చైత్యమనఁగా మృద్వికార మగు దేవాలయమని యర్థము.

"యత్ర యూపా మణిమయా శ్చైత్యాశ్చాపి హిరణ్మయాః,"

అని మహాభారతము. ఉద్దేశవృక్షమనియు నర్థము గలదు.

"వృక్షాః పతంతి చైత్యాశ్చ గ్రామేషు నగరేషు చ,"

అనియు మహాభారతమునఁ గలదని యాకరము తెలుపుచున్నది. ఇందు దేవాలయమురీతిగాఁ గట్టఁబడిన గేహమొకటి యున్నట్లూహింపవలయును. సహస్రస్తంభము లందున్నట్లు చెప్పఁబడినది. కనుక నిట్లే యర్థము గ్రహింపవలయును. దీనిం బట్టి బుద్ధమతమునకుఁ దర్వాత రామాయణము వ్రాయఁబడినదని యెగిరిపడరాదు.

"ఉపవాస కృశాం దీనాం నిశ్వసంతీం పునః పునః,
దదర్శ శుక్లపక్షాదౌ చంద్రరేఖామివామలాం. ౧౯
... ... ... ...
పినద్ధాం ధూమజాలేన శిఖామివ విభావసోః. ౨౦
పీతేనైకేన సంవీతాం క్లిష్టేనోత్తమవాససా,
సపంకామనలంకారాం విపద్మామివ పద్మినీం." ౨౧

అని మూలము. హనుమ సీతనుజూచెడు ఘట్టమిది. శుక్లపక్ష ప్రారంభమునందు ననఁగాఁ బ్రతిపత్తునందని యర్థము చెప్ప రాదు. చంద్రోదయ మేనాఁడు కాదు. కావున ద్వితీయా తృతీయ లందని భావము. శుక్లపక్షాదియందలి చంద్రరేఖవలెనని యుపమానము చెప్పఁబడినందున రాఁగలశుభ మిందు సూచితము. పొగగవిసియున్న యగ్నిజ్వాలవలె నని చెప్పఁబడినకతనఁ దన్మాహాత్మ్యము ప్రకటితము కాలేదనియుఁ దెలియక యంటిన నారావణుఁడు మండిపోవుననియు నర్థము సూచింపఁబడినది. అమూల్యపీతవస్త్ర మొక్కదానినే సీత ధరించియుండెనని చెప్పఁబడినకారణమున నాకాలమున రెండువస్త్రములు స్త్రీలు ధరింతురనియు ననఁగా నొకదానిం దాల్చి వేఱొకదానిం గప్పుకొని దేహాచ్ఛాదనము చేయుదురనియు నాయాచార మిపుడు మాఱి కంచుకధారణరూపమున నున్నదనియు మన మూహింపవలయును. ముసుఁగు వేసికొనుట ప్రాచీనాచారము.

"అపనేష్యామి తావత్తే అవగుంఠనమ్. తతో భర్తా త్వామభిజ్ఞాస్యతి."

అని యభిజ్ఞానశాకుంతలమునఁ గాళిదాసు చెప్పెను. శరీర సౌందర్యరక్షణోపాయము ముఖ్యమనియు నెల్లరకుఁ గనఁబడకయుండ శరీరము నాచ్ఛాదించుకొనుట స్త్రీలకు నుత్తమ

మనియు నీభాగము తెల్పుచున్నది. అవయవసందర్శనమే మంచిదనుభావ మిక్కాలమునఁ బ్రబలుచున్నది. కొన్ని జాతులుమాత్రము పూర్వాచారమును బాటించుచున్నారు. కాని వారి ననాగరికులని యితరు లనఁగా స్వేచ్ఛాప్రవర్తకు లాక్షేపించుచున్నారు. కొంతకాల మీసుఖ మనుభవించినఁ గాని ప్రాచీనాచారమహత్త్వము, ఇక్కాలపు టాచారముల వలని యిడుమలు తెలియరావు. అప్పటివారు మాత్రము ప్రాచీనాచారములను మెచ్చుకొనక మానరు.

"ప్రీళితాం దుఃఖసంతప్తాం పరిమ్లానాం తపస్వినీం,
గ్రహేణాంగారకేణేవ పీడితామివ రోహిణీం." ౨౨

అని మూలము.

"వృషే సప్తదశే భాగే యస్య యామ్యోంఽశకద్వయాత్,
విక్షేపోభ్యధికో భింద్యాద్రోహిణ్యాశ్శకటంతు సః."

అని సూర్యసిద్ధాంతము. రోహిణీ శకటభేదనమనఁగా శకటాకారముగాఁ గనంబడు రోహిణినడుమ క్రూరగ్రహము పోవుటయని యర్థము. నక్షత్రగోళమున గ్రహములు లేవు. చాల క్రిందనుండును. మన దృక్సూత్రమున క ట్లగపడును. ఆశకటభేదన మొకదుర్యోగము. అంగారకగ్రహము క్రూర స్వభావము కలది కనుక నట్టిగ్రహముచేఁ బీడింపఁబడిన రోహిణివలె సీత యున్నదని భావము. రోహిణీనక్షత్రమును క్రూరగ్రహములు బాధించుట యెట్టిదో రావణుఁడు సీతను బాధించుటయు నట్టిదే యని తాత్పర్యము. ఇందున్నది సీత ప్రతికృతి. రావణుఁడు పరమభక్తుఁడు. ఆతఁడామెను బాధిఁ

చుట యెంతవిచిత్రమో తెలిసికొనందగు. మహాప్రకృతి యగు సీత దుఃఖము నభినయించుచున్నదని సారము.

"స్వగణేన మృగం హీనాం శ్వగణాభివృతామివ." ౨౮

అని మూలము. ఒక్కరావణుఁడు తప్పఁ దక్కినవారు క్రూర మతులు. కనుక సీతను మహాకవి శ్వగణావృతమృగితోఁ బోల్చెను. సాధువృత్తులకు దుర్వృత్తులతోటి పొందు క్షేమము గాదనునీతి నీభాగము తెలుపుచున్నది.

"కుర్వంతీం ప్రభయా దేవీం సర్వా వితిమిరా దిశః." ౨౯

అని మూలము. తనతేజోవిశేషమున దిక్కులనన్నింటిని దిమిర విహీనములుగాఁ జేయుచున్నదని భావము. ఏభక్తుఁడామహా దేవిని తేజోరూపిణిగా ధ్యానించునో యతని యజ్ఞానావరణ ములు నశించుననుభావ మిట సూచితము.

"తటిల్లేఖాతన్వీం తపనశశివైశ్వానరమయీం
నిషణ్ణాం షణ్ణామప్యుపరి కమలానాం తవ కళాం,
మహాపద్మాటవ్యాం మృదితమలమాయేన మనసా
మహాంతః పశ్యంతో దధతి పరమానందలహరీం."

అను శంకరభగవత్పాదోక్తి యీభావమునే విస్తరించి తెలుపుచున్నది.

"తాం స్మృతీమివ సందిగ్ధామృద్ధిం నిపతితామివ,
విహతామివ చ శ్రద్ధామాశాం ప్రతిహతామివ. 33
సోపసర్గాం యథా సిద్ధిం బుద్ధిం సకలుషామివ,
అభూతేనాపవాదేన కీర్తిం నిపతితామివ. 3౪
రామోపరోధవ్యథితాం రక్షోహరణకర్శితాం,"

అని మూలము. మన్వాదిస్మృతివాక్యము సందిగ్ధార్థము గలది కాఁగా నెట్లుండునో అనఁగా సంశయావళి కాధారముగా స్మృతివాక్యము లుండరాదు. అట్లుండునే నది యెట్లు ప్రసిద్ధ ము కాదో యట్లని భావము. శ్రద్ధయనునది ఫలాభావమున విశ్వాసపాత్రము కాకపోవును. అట్టిశ్రద్ధ యెట్లుండునో అట్లు న్నది సీత యని యిందలి భావము.సుప్రకాశము కలదయ్యును దత్కాలమున నెంతయు దీనురాలై ప్రకాశింపక యున్నదని తాత్పర్యము. ఆ మెదుగఖమంతయు నొకనాటకమువంటిదని మన మెఱుంగందగు.

"వైదేహ్యా యాని చాంగేషు తదా రామోఽన్వకీర్తయత్.
తాన్యాభరణజాలాని శాఖాశోభీన్యలక్షయత్." ౪౧

అని మూలము. ఆయాయికొమ్మల కాయాయియాభరణములు తగిలించి సీత వగచుచుండెనని తేలెడిని. రామమూర్తి తెలిపి యుండినవే యవి యని హనుమ తెలిసికొనెను. మానవుల యా భరణములు వానరముల కెట్లు తెలిసె ననరాదు. ఆకాలమున మానవులకు వానరములకుఁ బక్షులకుఁ బరస్పర సల్లాపాదిక సంబంధము కలదు. వానరులు రాజ్యమేలుచున్నపు డిది యేమి యసంగతము. దేవతాభేదములలో నొకతెగకుఁ జేరినపక్షులు మానవులతోడి సంబంధ మేల కలిగియుండవు? దేవతలు మాన వులను యుద్ధమునఁ దోడుపడఁ బ్రార్థించుటయు వీరు తోడు పడుటయు నుండినపు డిట్టివేల విశ్వాసపాత్రములు కావో తెలియకున్నవి. ఈకాలపు వ్యవహారములననుసరించి యుగాం తరవ్యవహారము లిట్లే యుండునని పరిశీలించుటకంటె వెఱ్ఱి తనము వేఱొకఁ డుండదు. తాళప్రమాణముగ శరీరములు

గలజంతువు లాకాలమున సాధారణముగా నుండఁగా నిప్పటి వారి కవి యాశ్చర్యజనకము లేల కాకుండును? బుద్ధిమంతులు లక్షలకొలఁదిసంవత్సరములు గడువఁగా నప్పుడు కూడ నిప్పటివలెనే కాలముండునని వాదించుట యజ్ఞానమూలకము. క్రూరజంతువును దర్శనమాత్రమున సాధువుగా మార్చునంతటి మనశ్శక్తి గలవారలకార్యము లిప్పటివారి కెట్లు రుచించును? మనశ్శక్తి మాయమైనది. భగవదారాధనము నామమాత్రావశిష్టమైనది. అధికప్రసంగములు విరివిగా నున్నవి. కావున వీరవ్యానిని విమర్శింపఁజాలరని మన మూహింపవలయును.

> "ఇయం కనకవర్ణాంగీ రామస్య మహిషీ ప్రియా,
> ప్రణష్టాపి సతీయాస్య మనసో న ప్రణశ్యతి. ౪౮
> ఇయం సా యత్కృతే రామశ్చతుర్భిః పరితప్యతే,
> కారుణ్యేనానృశంస్యేన శోకేన మదనేన చ. ౪౯
> స్త్రీ ప్రణష్టేతి కారుణ్యాదాశ్రితేత్యానృశంస్యతః,
> పత్నీ న నష్టేతి శోకేన ప్రియేతి మదనేన చ." ౫౦

అని మూలము. ఈసీత రామునిచెంత లేకున్నను శ్రీరాముని మనస్సునం దెడఁబాయదు. అనఁగా నర్థమేమి? ఆతనిమనస్సున కగపడుచున్నదని భావము. శ్రీరామునకు సీతకు నెడఁబాటు కలుగదు కాన నీమె యతనిహృదయముననే యితరాదృశ్యయై యున్నదని సారము. భగవంతు నిచ్ఛయే కదా ప్రకృతి యనంబడు. ఆమెకు నష్టమన నెట్లు వచ్చును. ఈసీత లోకదృష్టికిం గనఁబడుచుండును. సర్వవ్యాపకురాలు గదా. ఆమె యేరూపమున నెం దుండఁజాలదు? పరాపరహాస్యయో

గిని యని కదా ఆదేవికి నామధేయము కలదు. అట్టిలోకమాత యుండరాని తెలియనితావు లెవ్వి? ఇచ్చోట వాల్మీకిమహర్షి భర్తకృత్యమును దెల్పుచున్నాఁడు. సహధర్మచారిణి మదేక జీవికయగుభార్యను గాపాడుట (సకలకష్టములకు నోర్చుకొని కాపాడవలయునని భావము ) ఆశ్రితరక్షణము పరమధర్మము కదా. అద్దాని నెఱవేర్పకయుండరాదని తాత్పర్యము. తన్ను నమ్మినవారిని గాపాడకుండుట క్రూరత్వము. కాపాడుట ధర్మము.తనశరీరపతనపర్యంత మక్కార్యమున బద్ధాదరుఁడు కావలయునని సారము. శరీరమున సగముభాగమును గాపాడుకొనఁజాలక పోతిని.ఇఁకేటిబ్రదు కనుశోకము కలదని యర్థము. భార్యారక్షణమున నసమర్థుఁ డగువాఁ డేకార్యమును సాధింపఁజాలఁడని పెద్ద లందురు. అట్టిదానికి నుదాహరణభూతుఁడనైతిఁగదా యని శోకముకలవాఁడు కావలయును. అనఁగా అక్కార్యమునకంటె శోకప్రదము వేఱొకటి లేదు గాన దానిం జక్కఁగా నొనరింపవలయునని సారము. మనస్సంతోషకరము లగువానిలోనెల్ల భార్య మిన్న కదా. అట్టిప్రేయసి పరవశతం గాంచెఁ గదా. ఇంకెక్కడి బ్రదుకు? అని మన్మథ వికారము కలవాఁడు కావలయును. ఇది కామము కాదు. మనస్సు మథించువికారము అనఁగా మనస్తాపము. అది కలవాఁడు కావలయు. ఈ నాలుగువిషయములచే శ్రీరాముఁడు దుఃఖించుచున్నాఁడని హనుమ తలంచెనను కథారూపమున గృహస్థుల కివి కృత్యములని బోధించెనని మన మెఱుంగవలయును.

"అస్యా దేవ్యా యథా రూపమంగప్రత్యంగసౌష్ఠవం,
రామస్య చ యథారూపం తస్యేయమసితేక్షణా. ౫౧

> అస్యా దేవ్యా మనస్తస్మిం స్తస్య చాస్యాం ప్రతిష్ఠితం,
> తేనేయం స చ ధర్మాత్మా ముహూర్తమపి జీవతి. ౫౨
> దుష్కరం కృతవాన్రామో హీనో యదనయా ప్రభుః,
> ధారయత్యాత్మనో దేహం న శోకేనావసీదతి.” ౫౩

అని మూలము. ఇందలివిశేషార్థముల నాలకింపుఁడు. ఈసీతా రాముల కంగప్రత్యంగసౌష్ఠవము తుల్యము. ఈ యిరువుర మనస్సు లొండొరుల విడనాడవు అని కదా దీని యర్థ సారము. ఇది ప్రకృతిపురుషాభేదత్వమును బోధించును. అవి నాభావసంబంధమునే తేటపఱచును. ఆపక్షమున సీతకు శ్రీ రామవియోగ మెట్లు సంభవించును? ఇదియంతయు నటనమని కదా సారము. శ్రీరాము నెడఁబాయ దనఁగా నర్థమేమి? భగవంతుఁ డెట్లు సర్వవ్యాపకుఁడో భగవతియు నట్లే యని యే కదా. వలసిన నేరూపముననే నన్నితావుల నుండును. రావణునిహృదయమున నున్నవాఁడు శ్రీరాముఁడు కాఁ డందురా? భగవంతుఁడే కాఁడని యొప్పుకొనిన ట్లగును. లోక మునకు నీతుల నేర్పుటకై రావణుని శత్రువుగా రాముఁడు భావించినట్లు నటించెననక తప్పదు. ఇరువురు నట్లే. అట్టివారిలో నొకరికంటె నొకరన్యులుగా నున్నట్లు భావించుట పొరపాటు. ఇట్టిభావనకే శాక్తమని పేరు. ఎవ్వారి కిట్టిదృఢభావన కలదో వారలే శాక్తులు. ప్రకృతిపురుషాభేదజ్ఞానము కలిగి వారి నేరూపనామముల నారాధించినను దరింతురు. లేనిచోఁ “బునర్ద రిద్రః పునరేవ పాపీ” అన్నట్లే యగును. కావున మన మీ భాగమును బఠించునపు డిందేమి సారమని పరిశీలించి విషయ రత్నమును గ్రహించి దాని నభ్యసించి తరింపవలయును. ఏఁ

బడిమూఁడవశ్లోకమగు "దుష్కరం కృతవాన్" అనుశ్లోకము నకుఁ దనిశ్లోకియం దేవేవో శబ్దములకు నర్థములు విచిత్ర ముగాఁ జెప్పఁబడినవి కాని యవి నీతిని బోధించునవి కాన విమర్శింప నక్కఱయుండదని వదలితిని. ఈభాగములయం దధ్యాత్మ రామాయణమున విశేషము లెవ్వియుఁ గానము.

## హనుమంతుఁడు సీతాదుర్దశకు విచారించుట.

* ఇట్లు లాపావని సీతారాములం బొగడి విచార సాగరమున మునింగి క్షణ మూరకుండి కన్నీరు కాఱఁగా సీతం గూర్చి యిట్లు పరితపించెను. ఈజానకి పరమధార్మికుఁడగు లక్ష్మణునకుఁ బూజ్యయై శ్రీరామప్రభువునకు భార్యయై దుఃఖ ముల పాలయ్యెఁ గదా. కాలము మీఱ నెవ్వరికిని దరము గాదని తోఁచెడిని. శ్రీరామలక్ష్మణులు తనవిషయమై ప్రయ త్నింతురనియుఁ దానేమియుఁ బ్రయత్నింప నక్కఱలేదనియు నెఱింగినది. శ్రీరామునకుఁ బ్రాణాధికురాలయ్యుఁ దనకుఁ బ్రాణవిపత్తు కలిగిననుంగూడఁ గలంతనొందక వానకాలమునఁ గలంగని గంగాతరంగిణిం బోలియున్నది. శీలవయోవృత్తాభి జనలక్షణముల శ్రీరామునకు సరియైన యీజానకి కా శ్రీరామ చంద్రుఁడు నాతని కీబిడయుఁ దగియున్నారు. అని కన్నీరు నించెను. ఈ త్రిభువనలక్ష్మికొఱకే యా శ్రీరాముఁడు బలశాలి వాలింజంపి కబంధుని వధించి విరాధాదులను బొలియించెను. సుగ్రీవునకు రాజ్యప్రాప్తి యేతన్మూలముననే కలిగెను. నేను నీమెకొఱకే సముద్రమును దాఁటి వచ్చితిని. ఈదేవికొఱకే

* ఇది పదునాఱవసర్గమునఁ గలదు.

శ్రీరాముఁడు సకలభూమండలమును దల క్రిందులు చేసినను యుక్తమే యని తలంతును. త్రైలోక్యరాజ్య మధికమా? జానకి యధికమా? అని యెన్నఁగా నీమె కారాజ్యరమ షోడశాంశమునకుఁ బోలదని నానిశ్చితము. అయోనిజయగు నీసీత, లోకైకవీరుఁడగు శ్రీరామునకుఁ బత్నియైన యీదేవి యక్కటా! రాక్షసాంగనలకుం జిక్కి నవయుచున్నది. సకల భోగము లనుభవింపఁదగిన యీదేవి యిట్టికష్టముల పాల య్యెనే. ఇఁక విధి నేమనవచ్చును? ఇఁకఁ ద్వరలో నీమె నారాముఁడు చూడవచ్చును. గతరాజ్యుఁడు మరల దానిం బొంది యానందించుచందమున నీదేవిం బొంది శ్రీరాముఁ డానందించును. ఇది ధ్రువము. ఈసాధ్వి భోగార్హవస్తువు లను గోరక శ్రీరామసమాగమమునే కోరుచున్నది. కాన జీవించియున్న నెప్పుడైనను భర్తను జూడవచ్చునను తలంపు ననే బ్రదికియున్నది. ఈతరులతాదు లెంత రమ్యములుగా నున్నను భర్త నెడఁబాసినకతన రాక్షసాంగనలంబోలె వీనిం జూడకున్నది. శ్రీరామునే ధ్యానించుచున్నది. భర్తయనఁగా స్త్రీలకు నుత్తమభూషణము. ఈబిడను జూడఁగా నావంటి మధ్యస్థునకుంగూడ దుఃఖము గలుగుచున్నదే. రామునకుం గలుగునని యిఁకఁ జెప్పనేల? ఇట్లు ప్రియునెడఁబాసిన యీ మెకు వసంతర్తువునందలి యీలతాదులు చంద్రికయు సంతాప కరములుగా నున్నవి. ఇట్టు లాలోచించి యనేక కారణముల చేత నీమె సీతయే యని నిశ్చయించుకొనియెను.

## హనుమంతుఁడు కావలియుండు రాక్షసస్త్రీలనుజూచుచు నందే దాఁగియుండుట.

* ఇట్టు లాలోచించుచుండఁ జంద్రుఁడు వియత్తలమునఁ జాలదూరము పోయి యపరభాగమును బొందెను. మఱియు నాహనుమ సీతను జక్కఁగాఁ జూడఁగోరి యామె చుట్టును బలసియుండు రాక్షసాంగనలం జూచెను. అందుఁ గొందఱ కొక్కకన్ను, ఒక్కచెవి, పొడవులగు చెవులు, గలవారలం గాంచెను. చెవులే లేనివా రుండిరి. ఎన్నివికారములుండవలయునో యవియన్నియు వారియందుఁ గనఁబడుచుండెను. భయంకరాయుధములను జేతఁ బట్టుకొనియుండిరి. ఇట్టి భయంకరాకారముగల యారాక్షసస్త్రీలను సీత చుట్టునుండఁగా జూచెను. ఆచెట్టుక్రిందఁ గూరుచుండిన జానకిం బరికించెను. ఆమె పాతివ్రత్యబలమున జీవించియుండెను. ఆభరణవిహీనయయ్యు నైజప్రకాశమున వెలుంగు నాజానకిం గాంచి సంతుష్టుఁ డయ్యెను. శ్రీరామలక్ష్మణులను నమస్కరించి జానకీదర్శనమున కానందించి యక్కడనున్న రాక్షసస్త్రీలకుఁ దాఁ గనంబడకుండుటకై యాచోట నాకుజొంపములం గప్పుకొనియుండెను.

## రావణుఁడు సీతను జూడ వనమునకు వచ్చుట.

† ఇట్టు లాహనుమంతుఁడు పుష్పించి ఫలించియున్న వృక్షములుగల యాయశోకవనముం గాంచుచుండఁగా రాత్రి,

---

* ఇది పదునేడవసర్గమునఁ గలదు.

† ఇది పదునెనిమిదవసర్గమునఁ గలకథ.

యందుఁ జాలభాగము గతించెను. ఆ యపరరాత్రియందు శిక్షాదిషడంగములతోడ వేదముల నెఱింగి క్రతువుల నొనరించి చేయింపఁజాలిన బ్రాహ్మణరాక్షసులు చేయు వేదపఠనధ్వనులు హనుమంతునకు వినఁబడుచుండెను అంత శ్రుతిహితములుగానుండ మంగళవాద్యధ్వనులు చెలంగఁగా రావణుఁడు మేల్కాంచెను. ఆతఁడు నిద్రావశమునఁ బుష్పహారములు తాఱుమాఱు కాఁగా సత్వరముగ సీత స్మృతికిం దగులఁగాఁ బాపంబని జంకక మన్మథప్రేరితుఁడై దాని నడంచుకొనుశక్తిలేమి సకలాభరణముల నప్పుడు ధరించి యశోకవనమునకుఁ బయనమయ్యెను. దాని బహిర్ద్వారముం గాంచుచునందుఁ బ్రవేశించెను. దేవగంధర్వాంగన లింద్రునిం బరివేష్టించునట్లు రావణుని శతసంఖ్యాకవనితలు వెంబడించిరి.కొందఱు కరదీపికలను, గొందఱు చామరములను, గొందఱు తాళవృంతములను, గొందఱు సలిలసువర్ణపాత్రములను ధరించి యతని వెంటం బోయిరి. చతురురాలగు నొకజవ్వని మద్యమునింపిన మణిపాత్రమును బట్టుకొనిపోయెను. ఇంక నొకతుక శ్వేతచ్ఛత్రమును బట్టుకొని వెంటఁ బోయెను. వారు మద్యపానమదమునఁ జొక్కుచుఁ బోవుచుండిరి. కామపరవశగతాత్ముఁడై రావణుఁడు సీతను జూడఁబోవుచుండెను. హనుమంతుఁ డా కాంతామణుల యాభరణధ్వనుల నాలకించి మహాబలశాలి రావణుఁడు వచ్చుచుండఁగాఁ జూచెను. పరిమళతైలముం బోసిన కరదీపికల చెంతనడుచు రావణుఁడు హనుమకుఁ జక్కఁగాఁ గనఁబడియెను. ఆతనిసౌందర్య మామారుతి కచ్చెరువు గలిగించెను. పత్త్రములయంతరమున దాఁగి యా హనుమ వానిని జక్కఁగాఁ జూడసాగెను. అతని వెంట నరు

దెంచు నా మచ్చికంటులం గాంచెను. అంతలో నాదాన వుఁడు వనముం బ్రవేశించెను. మఱియు నాతనిం జూచు టకై క్రిందికొమ్మకుం దిగి యందే కనఁబడకయుండెను. అం తలో రావణుఁడు సీతనుజూడ నామెచెంతకు వచ్చెను.

మహామతులారా! ఈభాగమును విమర్శింతము. హను మంతుఁడు సీతం గాంచుప్పటికి మూఁడుభాగములు రాత్రి గడ చెనని యూహింపవచ్చును. ఒకజాము మిగిలియుండునని యూహింతము. ఇది యించుమించుగాఁ గొందఱు నైష్ఠికులు లేచి వేదపారాయణమో వేదపాఠమో చేయుటయో చెప్పు టయో చేయుకాలమని యూహింపవచ్చును. ఈపదునేడవ పదునెనిమిదవసర్గములకుఁ గలిపి విమర్శము వ్రాయుదును.

"స దదర్శావిదూరస్థా రాక్షసీ ఘోరదర్శనాః. ౪
ఏకాక్షీమేకకర్ణాం చ కర్ణప్రావరణాం తథా,
అకర్ణాం శంకుకర్ణాం చ మస్తకోచ్ఛ్వాసనాసికాం." ౫

అని మూలము. ఒక్కకన్ను ఒక్కచెవిలోనగు వికృతాకార ముగల రాక్షసాంగనలం గాంచెనని భావము. ప్రాయికముగా వికారరూపములు భూతప్రేతపిశాచరాక్షసాదుల కుండును. పాపఫలముగా నవి యేర్పడునని మనము గ్రహింపవలయును. ఒకచెవి గలవారుందురా. యని కొందఱు ప్రశ్నించిరి. ఒక సారి తిరుపతికొండకు దయచేసిన నావిషయము స్పష్టమగును. పాపాచరణఫలము వికలాంగత యని స్పష్టమగును.

"సువర్ణచోరః కౌనఖ్యం సురాపశ్శ్యావదంతతాం,
బ్రహ్మహా క్షయరోగిత్వం దౌశ్చర్మ్యం గురుతల్పగః. ౪౯

పిశునః పౌతినాసిక్యం సూచకః పూతివక్త్రతాం,
ధాన్యచౌరోఽంగహీనత్వ మాతిరేక్యం తు మిశ్రకః. ౫౦
అన్నహర్తామయావిత్వం మౌక్యం వాగపహారకః,
వస్త్రాపహారకశ్శ్వైత్రం పంగుతామశ్వహారకః. ౫౧
(దీపహర్తా భవేదంధః కాణో నిర్వాపకో భవేత్,
హింసయా వ్యాధిభూయస్త్వ మరోగిత్వ మహింసయా)
ఏవం కర్మవిశేషేణ జాయంతే సద్విగర్హితాః,
జడమూకాంధబధిరా వికృతాకృతయ స్తథా. ౫౨
చరితవ్య మతో నిత్యం ప్రాయశ్చిత్తం విశుద్ధయే,
నింద్యైర్హి లక్షణైర్యుక్తా జాయంతే నిష్కృతైనసః." ౫౩

మనుస్మృతి. ౧౧ అధ్యా.

ఈస్మృతివాక్యములం బరిశీలించిన నంగహీనతాలక్షణములు గోచరములగు. ప్రాయికముగాఁ బరుల బాధింపఁదలంచుచుండు వారు పూర్వజన్మమునఁ బాపకార్యము లొనరించినవారే యనవలయును. సీతాదేవికడ నునుపఁబడినవారెల్ల వికృతాంగములు గల రక్షస్స్త్రీలే. క్రూరమతులే. కనుకఁ బాపఫలములగు వికృతాంగముల నందుఁబుట్టిరని మన మెఱుంగవలయును. సకలపాపములకు రాజు హింసాకర్మము. అది మానుటకంటె నుత్తమకార్యము వేఱొకఁడు కానరాదు.

"విచిన్వతశ్చ వైదేహీం కించిచ్ఛేషా నిశాభవత్. ౧
షడంగవేదవిదుషాం క్రతుప్రవరయాజినాం,
శుశ్రావ బ్రహ్మఘోషాంశ్చ విరాత్రే బ్రహ్మరక్షసాం." ౨

అని మూలము. "కించిచ్ఛేషా అపరయామమాత్రశేషా." అని మహేశ్వరతీర్థులు. ఒక్కజాము రాత్రి కలదని భావము.

లంకానగరము భూమధ్యమున నున్నందున నందు సూర్యోదయమునకంటె ముందొక జామురాత్రి యప్పటికుండెనని మన మెఱుంగవలయును. లంకానగరమునఁ గల యావిశేషములను జక్కఁగాఁ బరిశీలింపవలయును శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అను షడంగములతో వేదములు పఠించినవా రందుండిరి. మహాయజ్ఞములు చేయించువారు నుండిరి. బ్రహ్మరాక్షసులని వారి నెఱుంగవలయును. రాక్షసజాతి. బ్రహ్మవంశపరంపర గలది. అని కదా భావము. యజ్ఞములు చేయించువారనఁగా నర్థమేమి? దేవలోకముననో మర్త్యలోకముననో యజ్ఞములు చేయువా రుండిన వారి కడకుం బోయి ఋత్విక్కులగువారని యర్థము చెప్ప వలను పడదు కదా. లంకావాసులం బిలిపించి ఋత్విక్కులనుగా వరించువా రుండరు కదా. లంకయందే యజ్ఞములుచేయువా రుందురని మన మెఱుంగవలసియుండును ప్రాయికముగా యజ్ఞ మింద్రాదిదేవతలం గూర్చి యని యెల్ల రెఱుంగుదురు. రాక్షసు లింద్రాదిదేవతలం గూర్చి యజ్ఞములు చేయువా రనఁగా నవ్వకపోరు. రావణేతరులగు కొందఱుదేవతల నారాధించువా రుండఁగూడదా యనువాదము సమంజసము కాదు. హవిర్భాగముల నందుకొనుట కింద్రాదులు లంక కరుదెంచుటయు నసంభవమే. కావున మర్త్యలోకమునఁ గల యజ్ఞవిధానము, లంకయం దుండునదియు నొక్కవిధముకాదని యేర్పడుచున్నది. ఇంద్రుఁడుకూడ నశ్వమేధములు శతము చేసెను. అందు హవిర్భాగములు కొనువా రెవ్వరు? అంతకుముందున్న యింద్రుఁడా? తనపదముంగోరి యాగము చేయువానికడకతఁ డరుదెంచి యింతటిఘనకార్యము చేయుచున్నావా

నాయనా యని హవిర్భాగములను గ్రహించెననుటయుఁ బరి
హాసపాత్ర మగువిషయమే. కావున యజ్ఞము లనునవి మర్త్య
లోకవాసుల కున్నవిధు లితరలోకముల నివసించువారలకు
నుండవనియు మంత్రములును వేఱనియు నూహింపవచ్చును.
అన్నియు నొక్కవిధముగనే యుండుననుటకు బహుళప్రమా
ణము లుండఁబోవు. నేఁ జూచివచ్చితినని సాక్ష్యమిచ్చువారు
నుండరు.

"సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః,
అనేన ప్రసవిష్యధ్వమేషవోఽస్త్విష్టకామధుక్. ౧౦
దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః,
పరస్పరం భావయంతశ్శ్రేయః పరమవాప్స్యథ. ౧౧
ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః,
తైర్దత్తా న ప్రదాయైభ్యో యో భుక్తేస్తేన ఏవ సః. ౧౨
అన్నాద్భవంతి భూతాని పర్జన్యా దన్నసంభవః,
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః." ౧౪

అను నీగీతావాక్యములు పైవిషయము నుద్బోధించుచున్నవి.
అశ్వమేధములు శతమొనరించిన నింద్రత్వము కలుగుననికబా
పురాణములు తెలుపుచున్నవి.ఇంద్రత్వప్రాప్త్యనంతరము చేయు
యజ్ఞములు వేఱుఫలముల నీఁజాలినవిగా నుండవలయుఁ
గదా. కావుననే మర్త్యలోకవాసులకుండు యజ్ఞవిధులు
లోనగునవి యూర్ధ్వలోకవాసుల కన్వయింపవనియే తేలెడిని.
ఆసిద్ధాంతము ననుసరించియే లంకావాసు లింద్రాదులను గుఱిం
చి చేయుయజ్ఞములు చేయక వేఱువిధములుగా నుండు
యజ్ఞములు చేయుదురని మన మూహింపవలయును. కోట్ల

కొలఁదిగ దేవతలుండఁగా నెన్నియజ్ఞము లెవరెవరిని గుఱిం చియో చేయవలసినట్లు విధు లుండును. వానిని మన మంత గా నెఱుంగము. రాక్షసులలో నాభిచారికములు మెండుగఁ జేయువా రున్నవారనియు లోకక్షేమార్థము యజ్ఞములు చేయువారు కూడ నున్నవారనియు మన మెఱుంగందగు. సాంగవేదవేత్తలగు రాక్షసు లాకాలమున లేచి వేదపాఠము చేయుచుండఁగా నాధ్వని హనుమంతునకు వినఁబడియెను. దీనిచే దేవతాభక్తి గలరాక్షసు లనేకులు కలరనియే యిటఁ గలసారము. ఆహారవస్తువులు కూడ రావణగృహమున నున్న యట్లు విభీషణునిగృహమున నుండవు కదా. అట్లే సాత్వికా హారభోక్తలు రక్కసులయం దనేకు లందుఁ గలరనుమాహా కీభాగమే యవకాశ మిచ్చుచున్నది. మహర్షులుకూడ నాకాల మున మేధ్యమాంసముల భక్షించుచుండిరి కదా. మద్యపాన ము బ్రాహ్మణజాతికే నిషేధింపఁబడియుండెను. దేవతల కది నిషేధింపఁబడలేదనుట స్పష్టమే. రాక్షసు లాజాతివారే కాన వారికిని నిషేధింపఁబడలేదని మన మెఱుంగందగు. "బ్రహ్మర క్షసామ్ = బ్రాహ్మణత్వవిశిష్టరాక్షసానామ్" అని మహేశ్వర తీర్థులు వ్రాసిరి.

"స్రస్తమాల్యాంబరధరో వై దేహీమన్వచింతయత్. ४
భృశం నియుక్తస్తస్యాం చ మదనేన మదోత్కటః,
న స తం రాక్షసః కామం శశాకాత్మని గూహితుం." ५

అని మూలము. శ్రోత్రహితములగు మంగళవాద్యధ్వనులకు రావణుఁడు మేల్కాంచెనని యర్థము. దీనింబట్టి నాల్గవజాము ప్రారంభించెనని యూహింప మంచియవకాశము కలదు. వేద

పారాయణము చేయఁబడుటయు నాకాలమునందే కదా. నాల్గవజాము ప్రారంభింపఁగనే ప్రభువులు మేలుకొనుటకు శుభవాద్యములు ధ్వనింపఁజేయఁబడు టాచారము. ఆధ్వనులకు రాజులు కోపగింపరు. ఆయాచారము ఈకాలమునఁగూడ సాగుచున్నది. అట్టియాచారము ననుసరించియే మేలుకొనియెను గాని రావణుఁడు సీతాదేవియందుఁ గామ ముద్రేకింపఁగా మేలుకొనలేదని తేటపడును. కామాతిరేకముననే యైన ముందే మేలుకొనియుండవలయును. ఆజాము కామిక ప్రీతికరము గాదు. కొంద ఱట్టివా రుందురందు రేని వారికి దివానిశాభేదములే యుండవు. ప్రకృత కథాసంబంధము నాలోచించిన నట్లు తోఁచును. సంతత సీతాకామాసక్తుఁడు కాఁడు. ఏలయన నారాత్రి పెక్కండ్రుస్త్రీలతో విహరించిన యతని కాసమయమున సీత మనసికిఁ దగులలేదు. ఏల? తదేకాగ్రత కలవాఁడు కాఁడని యూహింప నది యవకాశము కలిగించుచున్నది. ఈసంబంధము ననుసరించియే మహేశ్వరతీర్థు లిట్లర్థము వ్రాసిరి. "వస్తుతస్తు మదనే సత్యపి మదనోత్కటో న. అతఏవ తస్యాం సీతాయాం నియుక్తః నితరాం యుక్తః వినీత ఇత్యర్థః. అత ఏవ రాక్షసః తం కామమాత్మని గూహితుం న శశాకేతి కాకుః" అని. రావణుఁడు మన్మథుఁడు ప్రేరేపించినను అధిక మదముకలవాఁడు కాఁడు. ఆసీతయందు మిక్కిలి యడఁకువగలవాఁడు. కనుకనే యాకాముని మదినడంచుకొనుటకుఁ జాలఁడా? అనఁగాఁ జాలునని యర్థము. పైన వ్రాసిన కథాసంబంధము ననుసరించిన సీయర్థ మసంగతము కాదు. తిలకవ్యాఖ్య యీయర్థము నాక్షేపించినది. ఈయర్థకల్పనము భ్రాంతిమూలక మన్నది. రావణుఁడు కాముకుఁడై

సీత నపహరింపలేదని వ్రాసిన తావులనెల్ల నాక్షేపింపక యీ వ్యాఖ్య యిచ్చో నాక్షేపించుట యెంతమాత్రము యుక్తము కాదు. భ్రాంతి తిలకవ్యాఖ్యకే యిచ్చోఁ గలిగిన దనవల యును. తనమృతికిఁ బ్రధానకారణముగా స్త్రీలఁ గొనిపోవుట నుంచుకొనినవాఁడు రావణుఁడని యుత్తరకాండమునఁ గలదు కదా.అత్తఱి నీవ్యాఖ్య యేమనఁగలదు? ఈభాగము ప్రక్షిప్త మనునా? లేక యేమియు వ్రాయక యూరకుండునా? చూడ వలసియున్నది. రావణుని కామవికారములన్నియు నటనము లని భావించిన మంచిది.

> "అంగనాశతమాత్రం తు తం వ్రజంతమనువ్రజత్,
> మహేంద్రమివ పౌలస్త్యం దేవగంధర్వయోషితః. ౧౦
> దీపికాః కాంచనీః కాశ్చిజ్జగృహుస్తత్ర యోషితః,
> ... ... ... ...
> బహుమానాచ్చ కామాచ్చ ప్రియా భార్యాస్తమన్వయుః. ౧౮
> స చ కామపరాధీనః పతిస్తాసాం మహాబలః,
> సీతాసక్తమనా మందో మందాంచితగతిర్బభౌ." ౧౯

అని మూలము. నిద్రాపరవశలయ్యును బ్రియపత్నులు శత మా తనివెంటఁ బోయిరి. ఆతఁడు మదించినవాఁడు కావున మంద గమనమునఁ బోయెను. అని యర్థము. ఈకథాధోరణిం గాం చినఁ బ్రియపత్నులంగూడి మందగమనమునఁ బోవుట కాము కునిలక్షణములు గావని తోఁచును. దిక్కుతెలియక పరుగెత్తు టకుబదు లడుగులు మందగతులం దెలుపఁగాఁ బోవుట హేత్వంతరమును దెలుపును. ఇచ్చో నించుక విచారింతము. స్వతంత్రు లెవ్వారును లేరనియుఁ గర్మవశంగతులే యనియు నీగ్రంథమునఁ బెక్కుతావులంగనినఁ దేలెడిని. భగవతి మహా

మాయ తలంచినట్లు కార్యము సాగును. అడ్డమే యుండదు. దాని నాపఁదలంప శక్తిగలవారే యుండరు. హనుమ శింశుపా వృక్షముపైఁ గూరుచున్నవాఁడు. సీతాపాతివ్రత్య మాతనికిఁ దెలియవలయును. రావణుఁడు రాకపోయిన నది యంత స్పష్ట ముగాఁ దెలియదు. మహామాయయూహ యెట్లో యన్ని పను లట్లే సాగును గదా. కావున నామెయూహయు రావణు నాయసమయమునఁ బురికొలిపెను. రావణుఁడు పరమభక్తుఁడు. శ్రద్ధాళువు. ఆసమయము దేవతాధ్యానానుకూలము. "బ్రాహ్మే ముహూర్తే చోత్థాయ" అన్నశాస్త్రము సుప్ర సిద్ధమే. మహామాయ ప్రోత్సహింపఁగనే సీతాదర్శనమునకై యరుదెంచెను. అది దేవతారాధనమే గాక మఱే మగును? లోకమునకు వేఱుగఁ దోఁచునట్లుండును గాని సత్యమున నాతఁడు పరమ శాక్తుఁడు. అనఁగా సగుణబ్రహ్మోపాసకుఁడని యర్థము. కావున నాతఁడు జాముర్రాత్రి మిగిలియుండఁగా సీతాదర్శనము చేయ నాతురంపడి యరుదెంచెను. సచ=ఆరావ ణుఁడు, కామపరాధీనః—కామ = సీతాదర్శనవాంఛకు, పరా ధీనః=లోఁబడినవాఁడని యర్థము. పతివ్రతలగు దేవాదిజాతి పురంధ్రులాతనివెంట నంటిరి. కామైకాసక్తలు కారైరి. ఆ పుణ్యమున కెవరు తగినవారో వారే వాని ననుసరింతురు. కాని యెల్ల రనుసరింపఁజాలరు గదా.

> "యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహం,
> మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః."

అన్నగీతావాక్యము సర్వజనవిదితమే కదా. భగవతియగు సీతా దర్శనము నాపుణ్యకాలమునఁ జేయఁగలభాగ్య మెవ్వారికిం

గలదో వారే రావణువెంట రాఁదలంచిరని మన మెఱుంగ వలయును. ఈభావమే మహేశ్వరతీర్థులవ్యాఖ్యయందు స్పష్టముగాఁ దెలుపఁబడినది.

> "తతః కాంచీనినాదం చ నూపురాణాం చ నిస్స్వనం,
> శుశ్రావ పరమస్త్రీణాం స కపిర్మారుతాత్మజః. ౨౦
> తం చాప్రతిమకర్మాణ మచింత్యబలపౌరుషం,
> ద్వారదేశమనుప్రాప్తం దదర్శ హనుమాన్ కపిః." ౨౧

అని మూలము. దీనిభావ మేమి యని చక్కఁగాఁ బరికింతము. వాల్మీకియాశయము రావణుఁడు దుర్వృత్తుఁడనియే యగునేని యీ భాగము వారియవివేకిత్వమునే వెల్లడించును. జ్ఞానులలో నుత్తముఁడు రావణుఁడు. ఇదియంతయు నటనమే యని వాల్మీకిభావమేని యీభాగము వారిశీలమునే కొనియాడును. ఎట్లు? "అప్రతిమకర్మాణం, అచింత్యబలపౌరుషమ్"అనువిశేషణములు రావణున కీఁబడినవి. దురాత్ముఁడు, దుష్కార్యము చేయఁబూని వచ్చుచున్నాఁడు. అన్నభావము కవికిం గలిగిన నిచ్చో నిట్టివిశేషణములఁ బ్రయోగింపఁడు. ఈరెండువిశేషణములును రావణుని యుత్కృష్టతనే బోధించును. దుష్కర్మముల నాచరించువారికి "అప్రతిమకర్మాణమ్" అను విశేషణమును గవీశ్వరు లనుగ్రహింపరు. భగవంతుఁడు దుష్టనృపతి అన్నట్లు మన మెందైనఁ జూడఁగలమా. కావున వాల్మీకిమహాకవి రావణుని మనస్తత్త్వ మెఱింగియే యాయాయితావుల నాయాయివిశేషణముల నర్హతరాశయబోధకముల నుపయోగించెను. కొన్నితావులఁ నాతనిచర్య యేల యంతనింద్యముగా నుండునందురేని అతఁడు తన మృతిని గోరి మనోభావము నిత

రులకుం దెలుపక యట్లు నటించెనని మన మూహింపవల యును. ఈవిషయ ముత్తరకాండమునం గనుంగొనఁగలము. ప్రకృత మనుసరింతము. హనుమంతుఁ డారావణపత్నుల యొడ్డాణములయుఁ గాలియందెలయుఁ మెచ్చఁదగినధ్వనుల నాలించెను. ఒడ్డాణములధ్వనులు వృక్షాగ్రమునందున్న హను మకు వినఁబడెనన్నఁగా దూరమునకు వినఁబడఁదగినంత వని కదా తేలెడిని. రావణుఁ డాయారామద్వారమున నున్నాఁడు. అది చిన్నితోఁట కాదు. అం దనేకోపవనము లున్నవి. దివ్య సౌధము లున్నవి. బహువృక్ష లతాలతామండపాదులు గలవు. ఆయుద్యానమున మొదటనే సీత యేల యుండరాదని యడి గిన సమాధానము శ్రమంపడి చెప్ప నక్కఱలేదు. తమరే యోజించుకొనుఁడని చెప్పినఁ జాలును. అంతదూరమునుండి వినఁబడవలయునన్న నించుక గొప్పగా నుండవలయుఁ గదా. ఇది పూర్వకాలము నాచారమును దెలుపును. ఒడ్డాణములకు గజ్జెలుండును. "కింకిణి" అని తదర్థము గలశబ్దము. చిఱుగంట లని దానియర్థము. మొలనూలు ప్రధానాభరణము. అంద ఱొక్కసారి నడువఁగా నాధ్వనియుఁ గాలియందెలమ్రోఁత లును వినఁబడియుండును. కాలియందెలప్పుడు దానికంటెఁ బెద్దవి. అదియొక యందమగు నాభరణమా యనిన దాన ననే కలాభము లున్నవి. స్త్రీలు మందగమనలు. ఇంటిలోఁ దిరుగు నపు డాయందెలధ్వను లితరులకు వినఁబడకయుండ నడువ నేర్చుకొనవలయును. పురుషులవలె వడివడిగ నడువరాదు. అట్టి వెన్నియోకారణము లుండును. వాని నాలోచించియే యాకాలపువా రట్టి యాభరణముల నుంచిరి. మందగతియను నది స్త్రీల కాయురారోగ్యముల నిచ్చునది. ఇపుడు బంతియాంట

యాడుటకై ప్రతిబంధకములుగా నాయందె లుండునని కొం బోలు. వానిం దీసివైచిరి. ఆయురారోగ్యధ్వంసకములగు నాచా రములే వృద్ధియగుచున్నవి. ఈకాలపుమార్పులయం దిష్టము గలవారల కాకాలపు టాచారములు నాభరణాదులు రుచిం చునని మనము నమ్మరాదు. ఎగురుట దుముకుట స్త్రీల కవ యవలోపమును కల్పించునని సమర్థులయాశయము. పరు వెత్తిన నారోగ్యభాగ్యము కలుగునని నవీనసంస్కర్తల యాశ యము. వీరి కివియు వారి కివియు సరిపడునవి కావని మన మెఱుంగుట తెఱంగు. అశోకవనద్వారదేశమునకు రావణుఁడు రాఁగా హనుమ కాంచెనని కథాసారము. మృగములు పక్షులు లోనగువానికి దృష్టిపాటవము మెండు. మానవుల కంటెఁ జాలవిశేషదూరము వ్యాపించును. కావున దూరమం దున్న రావణుని హనుమ చూడఁగల్గెనని మన మూహింప వలయును.

"తాభిః పరివృతో రాజా సురాపాభిర్మహాయశాః,
తన్మృగద్విజసంఘుష్టం ప్రవిష్టః ప్రమదావనం." ౨౭

అని మూలము. పైన వ్రాసినభావమునే యీభాగమునఁ గల "మహాయశాః" అను విశేషణము కూడఁ దెలుపుచున్నది. మృగపక్షులుగల ప్రమదావనమును రావణుఁడు ప్రవేశించె నని కథాసారము.

"స తథాప్యుగ్రతేజాస్సన్నిర్ధూత స్తస్య తేజసా,
పత్రగుహ్యాంతరే సక్తో హనుమాన్సంవృతోఽభవత్." ౩౧

అని మూలము. "రూపమేవాస్య మహిమానం వ్యాచష్టే."

అని కదా శ్రుతి. తేజోవిశేషము గొప్పదనమునే సూచించును. హనుమంతుఁడు మహాతేజస్వియైనను రావణుని తేజోవిశేషమున నోడింపఁబడియెను. అనఁగా నంతకంటె నల్పతేజస్సు కలవాఁడని కదా యర్థము. ఇట హనుమంతునకు "సుగ్రతేజాః" అనువిశేషణ మీఁబడినది. అట్టివాఁడయ్యు నాకులజొంపము గలతావున నణఁగి యుండెను. హనుమంతునితేజస్సుకంటె రావణునితేజ మధికమని యిద్దానినుండి తెలిసికొనవచ్చును. ఇచ్చో నధ్యాత్మరామాయణమునఁ గలవిశేషములం బరికింతము.

"తతః కిలకిలాశబ్దో బభూవాంతఃపురాద్బహిః. ౧౩
కిమేతదితి సంలీనో వృక్షపత్త్రేషు మారుతిః,

… … … …

దృష్ట్వా విస్మయమాపన్నః పత్త్రషండేష్వలీయత. ౧౪
రావణో రాఘవేణాశు మరణం మే కథం భవేత్,
సీతార్థమపి నాయాతి రామః కిం కారణం భవేత్. ౧౫
ఇత్యేవం చింతయన్నిత్యం రామమేవ సదా హృది,
తస్మిన్ దినే చార్ధరాత్రే రావణో రాక్షసాధిపః. ౧౬
స్వప్నే రామేణ సందిష్టః కశ్చిదాగత్య వానరః,
కామరూపధరస్సూక్ష్మో వృక్షాగ్రస్థో ఽనుపశ్యతి. ౧౭
ఇతి దృష్ట్వాద్భుతం స్వప్నం స్వాత్మన్యేవానుచింత్య సః,
స్వప్నః కదాచిత్సత్యస్స్యాదేవం తత్ర కరోమ్యహం. ౧౮
జానకీం వాక్శరైర్విద్ధ్వా దుఃఖితాం నితరామహం,
కరోమి దృష్ట్వా రామాయ నివేదయతు వానరః. ౧౯

ఇత్యేవం చింతయన్ సీతా సమీపమగమద్ధ్రువం,
నూపురాణాం కింకిణీనాం శ్రుత్వా శింజితమంగనా. ౨౦
సీతా భీతా లీయమానా స్వాత్మన్యేవ సుమధ్యమా."

సుందరకాం. ౨ సర్గము.

అని. వాల్మీకిభావమునకు దీనికిని విశేషభేదమే యున్నట్లు కానఁ నగును. కాని యించుమించుగా నొకఁడే యనవలయు. ఈ భావమే ముందు వ్రాసియుంటిని గదా. స్వప్న మొక్కఁడే యిం దధికము. ఒక్కవిషయమునే శ్రద్ధతో మనము చింతించు చుందుమేని యది ఫలించుకాలము మనకుఁ గలుగునేని ముందే యెట్లో యది యెఱిఁగించును. అది స్వప్నమూలము కావచ్చును. కారణాంతరము కావచ్చును. "ప్రమాణ మంతః కరణప్రవృత్తయః" అన్నసూక్తి మఱువరానిది. రావణుఁడు విద్వద్వరేణ్యుఁడు. మహాతపస్వి. భగవన్మృతిగాంచనే జన్మించిన వాఁడు. సనత్కుమారునికడ కరిగి మృతి యెప్పుడని యడిగిన వాఁడు. కావుననే సీతాహరణమూలముగా నది యొదవునని నమ్మియున్నవాఁడు. అట్టివాని కిది యీనీవాంఛ నెఱవేఱు టకు సమయమని భగవంతుఁ డేరూపముననో తెల్పుట యాశ్చర్యము కాదు. కర్మ మాతనికి ఫలమునీయ నోరుతెఱచు కొని యున్నది. ఆతనువు రెండునెలలలోఁ బడిపోవ నెంచియు న్నది. కర్మము ననుసరించి యాజీవుఁడు వేఱొకతనువునం దాస వహించియున్నవాఁడు. కావున నాఫలమును దెలుపు స్వప్నము వచ్చుట యొక యద్భుతము కాదు. కావున సీతాసందర్శన మున కతఁడు వచ్చుట కామము చేత కాదని మనము తలంచు టుత్తమము.

## రావణుని గని సీత భయంపడుట.

* రావణుఁడు వచ్చుచుంట దూరముననే కాంచి యోరపగాలికిఁ గదలు నరఁటిచెట్టువలె భయమున వడంకెను. ఆవిశాలాక్షి యాక్రూరునిం గని యూరువులచేఁ గడుపును, బుజములచే హృదయభాగమును గప్పుకొని విలపించుచుఁ గూరుచుండియుండెను. పాతివ్రత్యమే సాయముగలది గావున రిత్తనేలపయిం గూరుచుండి సకలభూషణార్హ యయ్యును భూషణములఁ దాల్పక పంకదిగ్ధయగు మృణాళికవలె రావణునకుం గనఁబడియెను. సంకలాశ్వములం బూన్చిన మనోరథము నధిరోహించి యాత్మవేత్తయగు శ్రీరామునికడ కరుగునది యుం బోలెఁ దన్మామస్మరణముం జేయుచుఁ దదాకారమును ధ్యానించుచు నియమము నూని భూతలమునఁ గూరుచుండి ధూమకేతు గ్రహగ్రస్తయగు రోహిణివలెఁ గుందుచుండెను. శీలాచారములు గలకులమునఁ బుట్టి దుష్కులమునం బెండ్లియై దుష్కులమున మరల జన్మించిన కన్యకరీతి వంతలపాలగుచుండెను. మిథ్యాపవాదములచేఁ గీడ్పడినకీర్తివలె, నభ్యాసబలము లేక విస్మృతమగు విద్యరీతి, అవమానింపఁబడినవానికిఁ దన్నవమానించినవానియెడలనుండు శ్రద్ధయట్లు, పూజాద్రవ్యాల్పత్వమున నొప్పు పూజభంగిని, బ్రతిహతమగు నాశవలె, భృత్యులనుష్ఠింపని రాజాజ్ఞవలె నుత్పాతవేళ జ్వలించు దిక్కువలె దుష్టాపహృత పూజాద్రవ్యములకరణి, హిమావృత పంకజలతయట్టులు, నిహతశూరసముదయ మగు సేనవలె, దేహసంస్కారత్యాగమునఁ గాంతిహీనయై యాజానకీదేవి

---

* ఇది పందొమ్మిదవసర్గమునఁ గలదు.

చూపట్టుచుండెను. అరణ్యానియందు మృగములచేఁ జిక్కి స్తంభమునకుం గట్టివేయఁబడిన యాఁడుగజమువలె నిష్టదేవతలం బ్రార్థించుచున్న ట్లాపురంధ్రీమణి కన్పట్టుచుండెను. అట్టి మహాసాధ్విని రావణుఁడు తనమృతికై తనమీఁద నాసక్తి గలుగు నట్లు చేయఁదొడంగెను.

మహాశయులారా! ఈభాగమున ననేకవిషయములు పరిశీలింపఁదగినవి కలవు.

"ఆచ్ఛాద్యోదరమూరుభ్యాం బాహుభ్యాం చ పయోధరౌ,
ఉపవిష్టా విశాలాక్షీ రుదంతీ వరవర్ణినీ." 3

అని మూలము. కంఠాధోభాగమును నడుమువఱకుఁ గనఁబడకుండఁ జేసికొనుట యుత్తమస్త్రీల కర్తవ్యమనునది ప్రాచీనాచారమని వాల్మీకి తెలుపుచున్నాఁడు. కామాతిరేకజనకములు హృదయభాగములు. వానిని మఱుఁగుపఱచుట మంచిదని పూర్వులభావము. ఆభాగములు కనఁబడుచుండుట యుత్తమమని యిక్కాలమునఁ గొందఱభావము. చూచుచున్న వాని విలువ తగ్గునని వీరి యుద్దేశము. కాని యది యించుకయైనఁ బాటింపఁదగనిమాట.

"న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి."

అనుసూక్తి యంద ఱెఱుంగుదురు. సర్వదా చూచుచున్న వస్తువులమీఁదఁ బ్రీతి తగ్గినదా? తగ్గుననుట యుక్తియుక్తము కాదు. కామజనకము లగువానిం గనఁబడకుండఁ జేయుటే యుత్తమము. చూచువారు తమరు చూచువస్తువుతత్త్వమేమని చిరకాల మాలోచించుచుండిన నప్పటికి వానిమీఁది యాశ తగ్గును.

"నారీస్తనభరనాభీదేశం దృష్ట్వా మా గా మోహావేశం,
ఏతన్మాంసవసాదివికారం మనసి విచింతయ వారంవారం."

అనుసూక్తి మీఁదియర్థమును బోధించును. కామోద్రేకము నకు నేవి మూలములో వానిం గాంచినపుడు వీనితత్త్వ మే మని యూహించువారు పెక్కం డ్రుండరు. కావున నట్టి వానిని మఱుఁగుపఱచుటయే యుక్తమని యెన్నఁదగియున్నది. సంస్కర్తలలోఁ బెక్కం డ్రీవిషయమునే యెఱుంగరనుట యుక్తివిరహిత మగుమాట కాదు. మంచియాచారములను గూడ మనకు రామాయణము బోధించుచున్నదని మన మూహించి యాయాభాగములం బరికింపవలయును. ఊరక పారాయణముచేసిన సంపూర్ణ ఫలము కలుగదు.

"సమీపం రాజసింహస్య రామస్య విదితాత్మనః,
సంకల్పహయసంయుక్తైర్యాంతీమివ మనోరథైః. ౭
శుష్యంతీం రుదతీమేకాం ధ్యానశోకపరాయణాం,
దుఃఖస్యాంతమపశ్యంతీం రామాం రామమనువ్రతాం." ౮

అని మూలము. ప్రాతీతికార్థము స్పష్టము. ఈభాగ మొకవిశేషమును దెలుపుచున్నది. ఉపాసకుఁడు శాస్త్రవిహితపద్ధతి యిది యని యెఱింగి యుపాస్యదైవము దాపునకు మనస్సను పేరిటి రథమునకు సంకల్పహయములం బూన్చి పోవలయును. అనఁగా నభీష్టదేవతాసాన్నిధ్యమును జేర సంకల్పింపవలయును. ఎట్లు సంకల్పింపవలసినదియు శాస్త్రము తెల్పును. దాని ననుసరించి సంకల్పింపవలయు. అనఁగా నెట్టిసంకల్ప మనిష్టదాయకము కాదో యాపద్ధతి శాస్త్రము తెల్పును. ఈయర్థము "విదితాత్మనః" అనుదానినుండి తేలును. శుష్యంతీమ్ = తనువును

గృశింపఁ జేయవలయును. అనఁగా దేహసంరక్షణమే ప్రధానముగాఁ జూచుకొనుచుండరాదని భావము. రుదతీమ్ = ఎట్లీకార్యము నెఱవేఱునోకో యని వగచుచుండవలయునని భావము. అది తదేకాగ్రతను బోధించును. అనవరత తచ్చింతన నీయది తెలుపును. ఏకామ్ = అన్యసహాకారము వదలవలయును. "ఏక స్తపః" అన్నన్యాయ మున్నదియే కదా. ఇతర సహాయాపేక్ష మనోదౌర్బల్యమును బోధించును. భగవంతుఁడు రక్షకుఁడు వలసినచోటఁ దోడ్పడ నుండఁగా నల్పుని వేఁడొకని గోరనేల యనుభావ మీయది కల్పింపఁగలదు. ధ్యానశోకపరాయణామ్=ధ్యానమనుశోకమం దాసక్తి యుండవలయును. ధ్యానమన నేమి ?

"ధ్యానంనామ. అంతరాంతరా వృత్త్యంతరవలి ప్రత్యయైకతానతా."

అని దానిలక్షణము.

"'ధారణా విషయే ఏక ప్రత్యయసంతతిః.' ఇతి హేమచంద్రః.
'అద్వితీయవస్తుని విచ్ఛిద్య విచ్ఛిద్యాంతరేంద్రియవృత్తిప్రవాహః.'
ఇతి వేదాంతసారః.

శ్లో. 'తద్రూపప్రత్యయైకసంతతిశ్చాన్యనిస్పృహా,
తద్ధ్యానం ప్రథమైరంగైష్షడ్భిర్నిష్పాద్యతే నృప.'

'అస్యార్థః తద్రూపస్య ధారణాసిద్ధస్య వస్తునః ప్రత్యయా యస్యాం సంతతౌ సా ఏకావచ్ఛిన్నా సంతతిః, అన్యనిస్పృహా=విషయాంతరేణావ్యవధీయమానా, విజాతీయప్రత్యయాంతరితః సజాతీయప్రత్యయప్రవాహో ధ్యానమిత్యర్థః. తత్ర ప్రథమైర్యమాదిభిర్ధారణాంతైః షడ్భిరంగై ర్నిష్పద్యతే ఇతి తట్టీకా.'

శ్లో. 'బ్రహ్మాత్మచింతా ధ్యానం స్యాద్ధారణా మనసో ధృతిః,
అహం బ్రహ్మేత్యవస్థానం సమాధిర్బ్రహ్మణస్థితిః.' ఇతి గారుడీ."
అని శబ్దకల్పద్రుమము తెల్పుచున్నది. ధ్యానయోగ మను చోట"ధ్యానమేవ యోగః"అని కదా సమాసము. ఇందు నట్లే "ధ్యానమేవ శోకః. తస్మిన్ పరాయణామ్" అని సమాసము. ఇచట శోకమనఁగా నేడ్పుట యని కాదు. నిరంతరచింతన యని యర్థము. అట్టియాసక్తి గలుగవలయునని భావము. దుఃఖస్యాంత మపశ్యంతీమ్ = ఈవిచార మెప్పుడు నశించునో కదా యని యూహించుట యని యర్థము. ఇదియు నాకీ విచార మెప్పుడు పోవునా యను సదుద్దేశమును దెలుపును. రామమనువ్రతామ్=అభీష్టదేవత ననుసరించునదియని యర్థము. ఇష్టదేవతానువర్తనమే తపోలక్షణమని భావము రామామ్= స్త్రీలింగమునుబట్టి బుద్ధియనునర్థ మూహ్యము. ఇట్లు అభీష్ట దేవత నుపాసింపవలయు ననుభావ మీభాగమునుండి తేలె డిని. దేహసుఖమును గోరక (దేహమును రక్షింపక యని యర్థము కాదు. అదియే ప్రధానముగా భావింపక యనియే యర్థము) తాఁబూనినకార్య మెపుడు ఫలించునా యనువిచా రము గలిగి యొంటరిగానుండి యిష్టదేవతా కల్పితరూపమును మదినిడుకొని దానినేచూచుచు మనస్సు చంచలముగా నున్న యపుడు వగచుచు నాకష్టమెపుడు గట్టెక్కునా యనువిచా రము మిక్కిలియుఁ గలిగి భగవంతు ననువర్తించుచు హయ ములవలె వడిగాఁబోవు సంకల్పములుచేయుచు మనస్సును రథ మునెక్కి అనఁగా దానిని లోఁబఱచుకొని తననిష్ఠను సాగింప వలయు నని యిందుండి సారమును గ్రహింపవలయును. ఇట్టి యర్థము ప్రకరణవిరుద్ధము కాదా యందురేమో, కాదు.

సీత చేయుకార్య మేది? శ్రీరామప్రాప్తిరూపతపస్సే కదా. దానింబట్టి పైన వ్రాసినయర్థ మనర్థము కాదని యూహింప వలయును. శ్రీరామాయణమున వాల్మీకి యనేకధర్మము లుప దేశింపఁ దలంపు గొన్నవాఁడని ముందే వ్రాసియుంటిని గదా. దాని ననుసరించి యిచ్చో నీభావ మూహింపఁదగునని వ్రాసి తిని. ప్రకరణవిరుద్ధముగాని విధివిరహితముకాని కాదని మా త్రము విన్నవింతును. దీని నంగీకరించుట మీయిష్టములోనిది. వాల్మీకిముని మఱియుఁ గొన్ని సద్విషయములను దెలుపుచు న్నాఁడు.

"వృత్తశీలకులే జాతామాచారవతి ధార్మికే,
పునస్సంస్కారమాపన్నాం జాతామివ చ దుష్కులే." ౧౦

అని మూలము. పూర్వులమర్యాదను మీఱక సత్స్వభావము గలిగి విహితకర్మానుష్ఠానము గలిగినకులమున జనించినకన్యక దుష్కులమునఁ బుట్టినవానిం బెండ్లియాడి దుష్టవంశమున మరల జన్మించినట్టి దగునని భావము. రెండవజన్మ మనఁగా ద్విజత్వలక్షణమగు నుపనయనము. స్త్రీలకు నుపనయనస్థానీ యము వివాహమని యర్థము. వివాహము కాఁగా ద్వితీయ జన్మము వచ్చును. కనుకనే గృహనామగోత్రాదులు మాఱి పోవును. ఉత్తమకులసంభూత యగు నొకకన్య దుష్కుల మున కీఁబడును. అది వృత్తశీలాచారములు గలదిగాదు. కను కనే దుష్కుల మనఁబడును. అట్టికులమున నట్టివిగలకులమునఁ బుట్టినకన్య వివాహమయి ద్వితీయజన్మము గలదగు. అనఁగా దుష్కులము కలదగునని యర్థము. వృత్తశీలసదాచారములు గలయింటఁ బుట్టినను దుష్కులమున కీఁబడినది గాన జన్మము మాఱఁగా దుష్కులము గలదగునని భావము. ఇందలిసార

మేమి? సదాచారాదులు లేనివంశమునుండి కన్యకలను గ్రహింపవలయు. ఎవరు? సదాచారాదులు గలవారు. దాన లాభమేమి? వివాహముచే నక్కన్యక సదాచారాదులు గలవంశము గలదగును. కనుకనే

"శ్రద్ధధానశ్శుభాం విద్యా మాదదీతావరాదపి,
అంత్యాదపి పరం ధర్మం స్త్రీరత్నం దుష్కులాదపి. ౨౩౮
విషాదప్యమృతం గ్రాహ్యం బాలాదపి సుభాషితం,
అమిత్రాదపి సద్వృత్త మమేధ్యాదపి కాంచనం. ౨౩౯
స్త్రియో రత్నాన్యథో విద్యా ధర్మశ్శౌచం సుభాషితం,
వివిధాని చ శిల్పాని సమాదేయాని సర్వతః." ౨౪౦

మను. ౨ అధ్యా.

"స్త్రీరత్నం. ఆత్మాపేక్షయా నికృష్టకులాదపి పరిణేతుం స్వీకుర్యాత్"

అని కుల్లూకభట్టు. దీనింబట్టి యసవర్ణవివాహము మనుసమ్మతమని నూత్నసంస్కారాభిలాషువు లందురు కాఁబోలు. మను హృదయ మదికాదు. కువివాహములు పనికిరావని శాసించి నందున నిది దానిని బోధింపదు. మఱేమనిన నుత్తమస్త్రీలక్షణములు గలకన్యక తనకంటె భాగ్యాదులచేఁ గొఱంతగాంచిన కులమునుండి తెచ్చుకొనవలయుననియు భాగ్యాదు లున్నంత మాత్రమున నుత్తమలక్షణములు లేనితావున నుండి తెచ్చుకొనరాదనియు మనుస్మృతిభావము. స్త్రీరత్నమ్మనుపదమే యీ యర్థమును బోధించును. బీదయింటినుండి తెచ్చుకొని గొప్ప యింటికిఁ గన్య నీవలయునన్నసామెత యీ శాస్త్రమునుండియే కలిగినది. దుష్కులమునకుఁ గన్య నీయరాదనునదియే యిందలిసారము. ధనముం గాంచి కొందఱు కన్యల నిత్తురు.

అది మంచిది గాదని యిది విధించుచున్నది. మఱియు రెండవ వివాహము స్త్రీలకు ననర్హమని తేటపఱచుచున్నది.

"అనువ్రతాం రామమతీవ మైథిలీం
ప్రలోభయామాస వధాయ రావణః." ౨౩

అని మూలము. ఇట్టి మహాసాధ్విని సీతాదేవి తనమరణము నకై తన్నుఁ గోరఁ దలంపుగొనుచందమున మాటలాడెనని భావము. అధ్యాత్మరామాయణార్థమే కదా యిది తెలుపు చున్నది. తనమరణముకొఱకు రావణుఁ డామెను గోరెననఁగా భావమేమి? ఈసాధ్వి నవమానించి మాటలాడిన శ్రీరాముఁ డాగ్రహించి తన్నుం జంపుననియే కదా యతనిభావము. భగవంతునితో ద్వేషించి మృతి గనవలసినట్లు గదా భగవదాజ్ఞ. అపుడతని దుష్టుఁడని యెట్లు లనవచ్చును? తెలిసియే యిట్లు నటించెనని యంగీకరింపక తప్పదు. తెలిసి వలయునని యపరాధముచేయువాని కాదుష్కార్యమున నాసక్తి యుండు ననుట వెఱ్ఱితనము కాదా. శ్రీరామునిచే మృతిగల్గవలయు ననియే యతఁడు నిందించినట్లు నటించెను గాని కామోపహిత చిత్తుఁడు కాఁడని యీభాగము మనకుఁ దేటపఱచుచున్నది.

## రావణుఁడు సీతను బ్రార్థించుట.

* రావణుఁ డారీతిగా వగచుచుఁ గరుణింపఁదగిన స్థితి యందున్న యాజానకిని సాభిప్రాయములగు మధురభాషణ ముల నాసక్తితోఁ దనహృదయము నిట్లు తెలిపెను. ఓరంభోరూ! నన్నుం గని-భయమున హృదయమును గుఱిని

---

* ఇరువదవసర్గమునఁ గలకథ యిది.

మాటుపడుచుకొని యుండఁ గోరినట్లు గనఁబడకున్న దానవు. విశాలాక్షీ ! శుభాంగి ! నీవు సర్వలోకముల మనముల హరిం చుచున్న దానవు. కాన నాకును మిక్కిలి ప్రీతిని గలిగించు చున్న దానవు. కనుక నిట్టి నిన్నుం గాంచఁ గోరుచున్నాఁడను. నన్ను గారవింపుమీ. ఇచ్చోట మర్త్యులుగాని కామరూపు లగు రక్కసులుగాని నీకు భీతినిగలిగింపఁ గోరువా రెవ్వరును లేరు. నేననఁగా నీకు మిక్కిలి హితుఁడను. కనుక నామాట నమ్మి భయము వదలిపెట్టుము. భీరూ ! పరస్త్రీగమనదోషము నాకుఁ గల్గింపవలదు. పరస్త్రీలను బొందుటయు, బలాత్కార మున వారి నపహరించుటయు రాక్షసులకుఁ గల్గినయాచా రము. ఇది నిశ్చితము. కులధర్మము నాశ్రయించినవారలకు దోషము కలుగదు. విశేషించి పుణ్యము కూడఁ గలుగును. ఈ విషయ మిట్టిది. ఐన నీవు నన్నుఁ గామింపక యున్న దానవు. కాన నిన్నుమాత్రము నే స్పృశింపను. కనుక నావిషయమున నీకత్యంతవాంఛ కలుగుఁగాక. దేవీ! భయంపడకుము. నన్ను విశ్వసింపుము. వాస్తవముగా నాయందు స్నేహ మునుపుము. ఈరీతిగా దుఃఖించుచుండకుము. ఓజానకీ! ఏకవేణిని ధరించి భూతలమున శయనించి చింతాసాగరమున మునింగి మలినాం బరమును దాల్చి యసమయమున నుపవసించి యుండుట నీకు నర్హములు కావు. వీనిని వదలిపెట్టుము. నీవు నన్నుం జేరి వివిధపుష్పమాలికలు దివ్యశ్రీచందనము నమూల్యాంబరములు దివ్యాభరణములు ధరించి యుత్తమపానీయముల నానుచు మేటిశయ్యాసనముల ననుభవించుచు నృత్తగానములచేఁ గాలముంబుచ్చుచు సుఖంబుండుము. సుదతీ! పురంధ్రులలో నుత్తమురాలవు. ఇట్లుండుట న్యాయము కాదు. సొమ్ములం

దాల్పుము. నాకడనుండియు భూషణవిరహిత వయియుండుట యర్హము కాదు. విశేషించి యనర్హము. మనోహరమగు జవ్వనము పోడమియున్నది. అది వ్యర్థముగా గడచుచున్నది. ప్రవహించి పోయినజలము మరల రాదు. అట్లే యీజవ్వనము కూడ మరల రాదు. కాన నిత్తఱినే భోగముల ననుభ వింపుము.

ఓ శుభదర్శనా! లోకమున నెందుఁగాని నీవంటిరూపము గలది మఱొకతుక లేదు. కనుక రూపములు నిర్మించు బ్రహ్మదేవుఁడు నిన్ను సృజించి యింతకంటె రూపాతిశయము గలదాని నిర్మింప వలనుపడదని నిశ్చయించి యాప్రయత్న మునే మానినాఁడని తలంచెదను. సాటిరూపవయస్సుల నివ్వ టిల్లు నిన్నుంగని యానలువయైనఁ బ్రీతిగలవాఁ డగును. ఇఁక నితరులమాట చెప్పనేల ? చంద్రబింబాననా ! నీయంగకము లలో దేనింగాంచినను దృష్టి నద్దానినుండి మరల్పఁ జాలక యున్నాను. దేవీ! నాకు భార్యవగుము. నేను బరపురుషుఁడ ననునజ్ఞానము వదలుము. నీకు శుభంబగుఁ గాక. నేను బెక్కు తావులనుండి యుత్తమస్త్రీలను బెక్కండ్రఁ దెచ్చితిని. నీకు శుభంబగుఁగాత. వారలందఱకన్న నీవు నాకు నగ్రభార్య వుగా నుండుము. భీరూ ! సకలలోకములనుండి తెచ్చిన యుత్తమరత్నములను నారాజ్యము నీ కర్పించితిని. నేను నీకు భృత్యుఁడ నైతిని. నేను నీ భూమినంతయు జయించి నీతండ్రి కిచ్చెదను. నన్నెదిరించువాఁడు నా కగపడ లేదు. నాపరాక్రమ మెట్టిదో వేఱుగఁ జెప్పవలయునా ? నాకు శత్రువులయిన వారిలో దేవాసురు లనేకపర్యాయములు నన్ను మార్కొని యని నొనరించి భంగమునొంది పరువెత్తిరి. ఇఁకఁ దక్కిన

వారిమాట వచింపనేటికి? దేవీ! నాయందలి కరుణావిశేషమున నలంకరించుకొనుము. సకలాభరణముల నంగకములు వెలయుచుండుఁగాక. సకలాలంకృతుల నొప్పు నీరూపమును జూడఁ గోరుదును. వరాననా! చక్కఁగా నలంకరించుకొని వలసిన భోగముల ననుభవింపుము. మద్య విశేషముల నానుము. క్రీడింపుము. నీప్రీతికిఁ బాత్రులగువారికెల్ల యథేష్టముగా భూమిని ధనముల నిమ్ము. నాయందు విశ్వాస ముంచి విశేష ప్రీతి నునుపుము. అనుమానింపక ధైర్యమూని యేయేపనులు వలసిన నన్నింటికి నన్ను భృత్యునిగాఁ బంపుము. నీవు సంతోషమున నిరంతరము క్రీడించుచుండఁగా నీబంధువులందఱుం గని ప్రీతినొందుదురు. కల్యాణీ! నాసమృద్ధిని నాసంపత్తి కీర్తులను జూడుము. వల్కలాజినములను ధరించి వనవాసుఁడయి యుండు రామునితో నీకుఁ బనియేమి? జయములేక సంపద పోఁగా వనవాసుఁడయి వానప్రస్థవ్రతము నూని భూమిపై శయనించియుండు రాముఁడింకను బ్రదికియున్నవాఁడో లేఁడో యనుసందేహము నాకుం గలదు. బలాకపత్త్రులు పురోభాగమున నుండుటవలన నల్లగానుండు మేఘము లావరింపఁగా నంతర్హితుఁడై యుండువెన్నెలనుజూడ నలవిగానియట్లు నా వశమున నున్న నిన్ను రామునకుఁ జూచుటకే శక్యముగాదు.

హిరణ్యకశిపుఁడు ఇంద్రునివశమున నున్న తనభార్యను మరల నారదునిమూలమునఁ బడసినాఁడు. అట్లే నావశమున నుండు నిన్ను రాముఁడు మరలఁ బడయఁగలఁడనుకొంటివి కాఁబోలు? అతఁ డెట్టిప్రయత్నము చేసినను నావశమునందు నిన్నుఁ బడయఁజాలఁడు సుమీ. భీరూ! నీసుస్మిత మెంత మనోహరము? సుదతీ! నీ నేత్రములయందమే యందము.

నీవిలాసములు వచింపఁదరమా? ఇంతటిసౌభాగ్యము కలదాన వయ్యు భీరువుగా నేల యైతివి? ధైర్యము కలుగ లేదు. గరుడుఁడు సర్పముల హరించునట్లు సౌభాగ్యమున నామనస్సు నపహరించుచున్నదానవు గదా. మాసిన పట్టుచీరఁగట్టుకొని కృశించి యించుకయు నలంకరించుకొనక యుండుతఱి నే నిన్నుం గన్నంతనే భార్యలయందు నాకుఁ బ్రీతి కలుగకున్నది. నీవు మంచివస్త్రమును ధరించి చక్కఁగా నలంకరించుకొని సంతోషాంబుధి నోలలాడుచుండఁగాఁ గాంతునేని యిఁక నెట్లుండుదునో? సీతా! నాయంతఃపురమున సమస్తశుభలక్షణ సంపన్నలగు నుత్తమకాంత లెందఱున్నారో వారలకందఱకు నీ వీశ్వరివిగా నుండుము. నీలకుంతలా! ముల్లోకములందు నుత్తమలగు నాభార్యలందఱు నప్సరసలు లక్ష్మీదేవికిఁ బరిచర్య చేయునట్లు నీకుం బరిచర్య చేయుచుందురు. సుభ్రూ! కుబేరుని జయించి తెచ్చిన సకలరత్నములను, నే గెల్చిన లోకములను నీవిగా గ్రహించి చక్కఁగా సుఖముగా ననుభవింపుము. నన్నుం బతిగా గ్రహించి సుఖం బనుభవింపుము. దేవీ! రాముఁడు తపోబలపరాక్రమ ధన తేజః కీర్తులలో దేనియందుఁ గాని నాకు సాటిగాఁడు లలనామణీ! నీయిచ్చవచ్చినట్లు మద్యములం ద్రావి సుఖముగా విహరింపుము. క్రీడింపుము వలసినభోగముల ననుభవింపుము. ధనరాశి నీయధీనము చేసెదను. భూమినంతయు నర్పింతును. నీయందుఁ బ్రీతియునిచి సుఖముగా రమింపుము. నీవిట్లు సుఖముగానుండ నిన్నుం గూడి బంధువు లానందింతురు గాక. రమణీయసాగరతీర కాననములందు సకలాలంకారములతో నాతోడఁ గ్రీడింపుము.

మహాశయులారా! ఈభాగ మీకాండమునకు హృదయస్థానీయము. విమర్శింపఁదగినదని వేఱుగఁ జెప్పవలయునా! సీతారావణసంభాషణ ఘట్టమిది. మహాకవి వాల్మీకిమునిచంద్రుఁడిందుఁ దనభావమును వెల్లడించెను. ఇతరస్థలమున ననఁగా సీతా హనుమత్సంభాషణమునఁ బ్రడిట్టిపదముల నేల యుపయోగింపలేదో యోజింపవలయు. ఇచ్చోట మాత్రమే యెవరికి నేయర్థ మిష్టమో యాయర్థముతేలునట్లు శబ్దముల నుపయోగించుటకుం గతమేమి? రావణుఁడు కామాతురుఁడై సంభాషించెనని వాదించువారికి నిందు సంపూర్ణావకాశము కలదు. అతఁడు మహాభక్తుఁడు. కామి కాఁడు. భగవతియగు సీతాదేవి నారాధింపనెంచెనని వాదించువారికి మిక్కిలి యవకాశ మిందుఁ గలదు. ఇచ్చోట నేల యిట్లు మహాకవి యవకాశముం గల్పించెనని మన మూహింపవలయును. రావణుఁ డనఁగా విష్ణుసేవాపరతంత్రుఁడు. జయవిజయులను ద్వారపాలకులలో నొకఁడు. కుంభకర్ణుఁడు నందొక్కఁడే. ఇది వారికి రెండవ జన్మము. వైరమూనిన మూఁడుజన్మములలో నాచెంతకు రాఁగలరనికదా భగవదాజ్ఞ. కారణజన్ములుగా వీరి నంగీకరింపవలసి యుండును. తక్కినరక్కసులలో వీరొకరని భావింప రాదు గదా. అందును బరమేశ్వరు నలరించినపుణ్యాత్ముఁడు రావణుఁడు. సకలవేదవేదాంగపారగుఁడు రావణుఁడు. పెద్దల సేవించినవాఁడు రావణుఁడు. సనత్కుమారునికడకు బోధార్థియై వెళ్లి తనచావున కేది ప్రధానకారణమని యడిగి వారు చెప్పినమార్గము ననుసరించి ప్రవర్తించుచుండువాఁడు రావణుఁడు. శ్రీరాములబలపరాక్రమముల విని తాఁ బరాక్రమించి మృతినొందనున్నవాఁడు రావణుఁడు. ఇట్టివాఁడు

కామాతిరేకమున సంభాషించెననుట యుత్తమమో, కామము నభినయించుచుఁ దనభక్తిభావము తేటపడునట్లు సంభాషించె ననుటుత్తమమో పెద్దలే యూహింపఁదగినవారు. ముఖ్యముగా నీఘట్టముననే యిట్లు చక్కనియవకాశము కలుగఁ జేయుశబ్దజాల ముపయోగింపఁ గతమేమని మాత్రము మన మూహింపక తప్పదు. విమర్శించునపు డొకసిద్ధాంతము మది నుంచుకొని యదికా దిదియని పలుకరాదు. ఏది యిందుఁ బ్రధానముగా నున్నదని యోజింపవలయును. ఒకసిద్ధాంతము మన కిష్టపడనంతమాత్రమున నది సిద్ధాంతము కాక పోదు. సర్వసిద్ధాంతమే లేదుకదా. తమమతమున కనుకూలము కాని యంతన యది యపసిద్ధాంతము కాదని మన మూహింపవలయు. అట్లూహింపనిచో దేవానాంప్రియులమే మన మగుదుము. ఈనియమముల నాలోచించి యిచ్చో విమర్శింపఁ బూనుకొందము.

"స తాం పతివ్రతాం దీనాం నిరానందాం తపస్వినీం,
సాకారై ర్మధురై ర్వాక్యై ర్న్యదర్శయత రావణః." ౧

అని మూలము. "సాకారైః = సేంగితైః" సాభిప్రాయములని యర్థము. అనఁగా నితరులకుఁ దెలియకయుండఁదాఁ జెప్పఁదలఁచు కొన్నమాటలను వినిపించుట యని భావము. పదుగురుండఁగా నెవరితో నేమాటలు జెప్పఁ దలఁచుకొందుమో వారికే యర్థమగునట్టులు, ఇతరుల కాయర్థము బోధపడకుండునట్లు చెప్పు మాటలకే సాభిప్రాయములని నర్మగర్భములని పేరు. రావణుఁడు కామాతురుఁడని యచ్చటివా రెఱుంగుదురు. సీతను దెచ్చినది భోగేచ్ఛచేతనే యని కావలివారు కూడ నెఱుంగుదురు. అట్టిచోట నలుగురికిఁ దెలియకయుండఁ దనభావమును

సీత కెఱింగించెననఁగా నర్థమేమి? తనహృదయమునఁ గల భావ మచటివా రెఱుంగరాదని కదా. రావణు నుద్దేశము. కామవిషయ మది కాదని కదా సారము. అదియేయైన నెల్ల రెఱింగినదియే కాన నద్దాని కింత గంభీరార్థముగల మాట లేల? నన్నెపుడు పెండ్లియాడుదువు? అన్నం జాలునే. కావున నేదో గంభీరాభిప్రాయమునే రావణుఁడు సీతాదేవి కెఱింగించెననియు నితరుల కాభావము తెలియఁగూడదని యతఁడు భావించెననియు మన మెఱుంగవలయును. కొందఱకొఱకు నిచ్చట సాభిప్రాయము లనఁగా నెట్టివో యొక్కయుదాహరణముచేఁ దెలుపుచున్నాఁడను.

"ఆః కర్ణజ్వరకారి కంకణఝణత్కారం కరా ధూన్వతీ,
కిం భ్రామ్యస్యటవీశుకాయ కుసుమాన్యేషా ననాందా గ్రహీత్."

పుష్పబాణవిలాసము.

కొందఱు నవయువతులు ఎలదోఁటకుఁ బుష్పాపచయవ్యాజమున వెళ్ళిరి. వారివారిసకియ లందం దుండిరి. ఒకయువతి కాంతునింగూడి లతాగృహమున నుండుతఱి నామె యాఁడుబిడ్డ యచ్చోటికిఁ బుష్పాపచయమునిమిత్తము వచ్చుచుండెను. ఆవిషయ మావిహరించు కాంత కెఱిఁగించుట తారుపుఁగత్తియ పని కదా. స్పష్టముగాఁ దెలుపరాదు. తెలుపకున్న మానహాని యగును. అట్టితఱి వచ్చుచున్న స్త్రీకిఁ దెలియక యుండునట్లు, లోపల విహరించుచెలి కావిధము తెలియునట్లు, ఆఁడుబిడ్డ యనుమానము నొందక యుండునట్లు చెప్పవలయుఁ గదా. ఆ మాటలకే సాభిప్రాయములని నర్మగర్భములని పేరు. అడవి చిలుకకొఱ కేల భ్రమించెదవు. ఇదిగో నీయాఁడుబిడ్డ పూలు కోయుచున్నదిలే. అనఁగాఁ గ్రొత్తమగనితో నేల మాట

లాడెదవు. సీయాఁడుబిడ్డ దగ్గరకు వచ్చుచున్నది లెమ్ము. అని తెలిపెను. ఇట్టిసందర్భ మిచ్చోఁ గలదా. కావలియుంచిన స్త్రీలతో సీత తన్నుఁ బెండ్లియాడునట్లు బోధింపుమని స్పష్ట ముగాఁ జెప్పియే యుండెను. ఇఁకఁ గ్రొత్తవా రెవరు? కూడ వచ్చినపత్ను లనవలయు. నాపత్నులందఱు నీకు దాసికలగుదు రని స్పష్టముగా నిందే తెలుపును. కాన నీసాభిప్రాయవాక్యముల కేదో విశేషార్థమొకటి యుండవలయుఁ గదా. అది యేది? తన హృదయమునఁ గలభావము. అది యెట్టిది? భక్తిని దెలుపున దనక తప్పదు. కావుననే యీఘట్టముననే మహాముని వాల్మీకి విశేషార్థోపబృంహితములుగా వాక్యముల నిచ్చోఁ బ్రయోగిం చెను. వాని విమర్శించి మన మెఱింగిననే ఫలము గలుగును.

"మాం దృష్ట్వా నాగనాసోరు గూహమానా స్తనోదరం,
అదర్శన మివాత్మానం భయాన్నేతుం త్వ మిచ్ఛసి." ౨

అని మూలము. విశేషార్థమే వ్రాయఁదగుం గదా. జననీ! నీసేవకుఁడను.పుత్రసముఁడు కదా భృత్యుఁడు. అట్టివాఁడనగు నన్నుం గాంచి భయమునొంది హృదయము నేల మఱుఁగు పఱచెదవు? నీహృదయమున నన్నుఁ దలంపుము. ఉదరమను పదము పుత్త్రుఁడ ననునర్థమున కుద్యోతక మని యూహింప వలయును. నీకడుపు చల్లఁగా నుండుఁగాక. అనఁగా నీసంతా నము క్షేమముగా నుండుఁగాక యని కదా యర్థము. ఇందు నిశ్లేష గ్రహింపవలయు. అనఁగా సీతాదేవీ! నీహృదయమున న న్నుద్ధరించుతెఱం గూహింపుము. నీవు స్మరించినంతన శ్రీరాముఁ డరుదెంచును. శాపవిముక్తిం గావించును. కాన ఆపని త్వరితముగాఁ జేసి నన్ను రక్షింపుమా యని సారము. కరుణాలవాలము హృదయము కదా. దానినేల మఱుఁగు

పటుచెద వనఁగా నేల నన్ను స్మరింపవని భావము. స్తనశబ్దము నకు హృదయమని యె ట్లర్థము చెప్పవచ్చునందు రేమో.

"వాపీ కాపి స్ఫురతి గగనే తత్పరం సూక్ష్మపథ్యా
సోపానాళీ మధిగతవతీ కాంచనీ మైంద్రనీలీం,
అగ్రే శైలా సుకృతిసుగమా చందనచ్ఛన్నదేశా
తత్రత్యానాం సులభమమృతం సన్నిధానాత్సుధాంశోః."

అనుచోట శైలశబ్ద మె ట్లుపమానబలమున స్తనార్థద్యోతకమో యట్లే యిందు హృదయార్థద్యోతక మని గ్రహింపవచ్చును. ఆశ్రయ మొకటి. ఆశ్రయి యొకటి. కావున నీయర్థ మసంగతము కాదు.

"కామయే త్వాం విశాలాక్షి బహుమన్యస్వ మాం ప్రియే,
సర్వాంగగుణసంపన్నే సర్వలోకమనోహరే." 3

అని మూలము.

"విశాలా కల్యాణీ స్ఫుటరుచిరయోధ్యాకువలయైః
కృపాధారా ధారా కిమపి మధురాభోగవతికా,
అవంతీ దృష్టిస్తే బహునగరవిస్తారవిజయా
ధ్రువం తత్తన్నామవ్యవహరణయోగ్యా విజయతే." ४९

అని శంకరభగవత్పాదులు విశాలాశబ్దము సౌందర్యలహరియం దుపయోగించిరి. వాల్మీకి విశేషార్థద్యోతనార్థమే యీ పదము నుపయోగించెను. భగవతి పూజానామములలో విశాలాక్షి యొకటి యని యెఱుంగనగు. ఇది కృపావిశేషార్థద్యోతనార్థము. కృపాసముద్రురాలవనియే నిన్నుఁ గోరుచున్నాను. "మాం బహుమన్యస్వ." కనుక నన్ను విశేషించి యనుగ్రహిం

పుము. నీకటాక్షవీక్షణముల నాపైఁ బొలయింపుమని భావము. ఫలాభిసంధిరహిత సత్కర్మానుష్ఠాన మిదియే. కరుణయుంచు మనఁగా నది యొక కామము కాదా యందురేమో. మోక్షేచ్ఛయు నట్టిదే యనవచ్చును. ఆముష్మికసుఖాభిలాషము కామము కాదనియు నది ఫలాభిసంధిని బోధింపదనియుఁ బెద్దల యాశయము. ఉపాసకుఁడు సంకల్పించునపుడు "పరమేశ్వర ప్రీత్యర్థ"మని చెప్పవలయును. అది కామ్యము కాదు. ఐహికసుఖాభిలాషము పనికిరాదని శాస్త్రహృదయము. ఇచ్చట రావణుఁడు దయాస్వరూపురాలవగు నో సీతాదేవీ! నిన్నే కోరితిని. అనఁగా న న్నుద్ధరించువారలలో నీవే ప్రధానభూతవని నమ్మితిని. కావున నన్ననుగ్రహింపుమని రావణునాశయమని మన మెఱుంగవలయును. తల్లీ! నీవు సర్వాంగగుణసంపన్నవు. సర్వలోకమనోహారిణివి. అనఁగా నీశరీరమంతయుఁ గరుణామయము. సర్వలోకహృదయానందకారిణివి. అనఁగా వీఁడు నిర్జరుఁడని వీఁడు రక్కసుఁడని వీఁడు మానవుఁడని భేదము లేనిదానవని భావము. ఎవ్వఁడు భక్తుఁడో వాని నుద్ధరింతువు. రక్షఃకులసంజాతుఁడ ననుభావము నీకు లేదుగాన భక్తుఁడనగు నన్నుఁ గాపాడుమని సారము.

> "నేహ కేచిన్మనుష్యా వా రాక్షసాః కామరూపిణః,
> వ్యపసర్పతు తే సీతే భయం మత్తస్సముత్థితం." ౪

అని మూలము. "కామరూపిణః మనుష్యా రాక్షసా వా ఇహ న" అనియే యన్వయింపవలయు. కామరూపిణః అనువిశేషణము రాక్షసాః అనుదానితో నన్వయించిన మనుష్యాః అనునది వ్యర్థపదమే యనఁదలసివచ్చును. లంకలో మనుష్యు లుందురని సీత తలంచియున్నఁ గదా యీయుత్తర ముపయుక్త

మగును. ఇట్లు మనము గ్రహింపవలయు. జననీ! ఫలాభిసంధి గల మానవులుగాని రక్కసులుగాని యిందు లేరు. నావలని భయము కలుగదు కదా. కనుక నన్ను విశ్వసించి యుద్ధరింపుము. ఫలాభిసంధిరహిత సత్కర్మానుష్ఠానము చేయు నన్ను గ్రహింపుమని సారము. ఇంకొకవిశేషము కలదు. ఉపాసనుఁడు ఫలార్థు లగువారిచెంతనుండి సత్కర్మముల నాచరింపరాదు. వారు లేనిచోట వాని నాచరించిన సంపూర్ణఫలము గలుగును. కామసంకల్పమూలమగు సత్కర్మానుష్ఠాన మత్యల్పఫలప్రదమని మన కీభాగము బోధించుచున్నది.

"స్వధర్మో రక్షసాం భీరు సర్వథైవ న సంశయః,
గమనం వా పరస్త్రీణాం హరణం సంప్రమథ్య వా." ౫

అని మూలము. ఏజాతికిఁగాని పరస్త్రీగమనము ధర్మముగానుండదు. బలవంతముగా నితరులభార్యలను దెచ్చుటయు ధర్మముగా నుండదు. ఏకాలమునందు నిట్టివార్త లున్నట్లు వినరావు. కావున నిట్టివి వాల్మీకి చెప్పుట కొక హేతు వుండవలయును. ఇందు భీరు! అనుపదము గలదు. ఇయ్యది యిందుఁ గల విశేషార్థమును దేటపఱచును. రాక్షసులు బలవంతముగాఁ బరభార్యలం దెత్తురు. వారిం గోరుదురు. అయూహచే నీరావణుఁడు కూడ నాజాతివాఁడే కాన నితఁడు నట్టివాఁడే యని భయంపడియెదవేమో, తల్లీ! పరదారగమనతదపహరణములు సర్వప్రకారములచేతను రక్కసులకుమిక్కిలి యధర్మములు. "సు+అధర్మః" అని గ్రహింపందగు. వలసినతావుల నేకాక్షరములకు నర్థముచెప్పి మతస్థాపకులు స్వమతమును స్థాపించుకొనలేదా. అట్లే యిందు నంగీకరించిన రామాయణము పవిత్రకావ్య మగును. వాల్మీకి గంభీరార్థములు

గలదిగా నీకావ్యము వ్రాసెనన విందుము కదా. కాన నీయర్థము సుసంగతమే కాని యసంగతము కాదు. ఏకాలమునందుఁ గాని యేగ్రంథములందుఁగాని యధర్మ మొకజాతికి ధర్మమని చెప్పఁదగదు. అట్లుండ నీయుత్తమకావ్యమునందు మహాకవి వాల్మీకిమహర్షి యిట్లేల చెప్పియుండును? వారిభావ మిట్లే యని యేల మనము నమ్మవలయును? ఈసర్గమునఁ దొలుతనే "సాకారై ర్మధురై ర్వాక్యైః" అని తెల్పెను. కాన నీయర్థము సముచితమే యగును. ఈయర్థమునే యీక్రిందిశ్లోకము తేటపఱచుచున్నది.

"ఏవం చైతదకామాం తు న త్వాం స్ప్రక్ష్యామి మైథిలి,
కామం కామశ్శరీరే మే యథా కామం ప్రవర్తతాం." ౬

అని మూలము. జననీ! నన్ను భృత్యునిగా నంగీకరింపని నిన్నుఁ బూజింపనుకూడ (నీయానతినొందక) భయంపడుచున్నాను. ఇట్టిభయము లేకుండఁ జేయవలయునని ప్రార్థించెనని యీ భాగమున నర్థము గ్రహింపవలయు. ఇది సుసంగతమా యని యడుగుదురేమో పూజింపను గూడ భయంపడుటేల ? అని ప్రశ్నము రావచ్చును. ఉపాసకుఁడు ఇష్టదేవతకును దనకు నర్పణము కలదా లేదా యని పరిశీలించుకొనవలయును. దానికి మంత్రార్పణమని పేరు. అది యనుకూలింపనిచో హాని కలుగును.

"సర్వాసామపి దీక్షాణాం ముక్తిః ఫలమఖండితం,
అవిరోధాద్భవంత్యేవ ప్రాసంగిక్యస్తు భక్తయః." నవరత్నేశ్వరము.

"ఉపపాతకలక్షాణి మహాపాతకకోటయః,
క్షణాద్దహతి దేవేశి దీక్షా హి విధినా కృతా."

అత్రాప్యనుకూలమంత్రం దిశేత.

"స్వతారారాశికోష్ఠానా మనుకూలాన్ భజేన్మనూన్,

అన్యచ్చ.

తారాచక్రం రాశిచక్రం నామచక్రం తథైవ చ,
అత్ర చేత్సగుణో మంత్రో నాన్యచ్చక్రం విచారయేత్."

వారాహతంత్రము.

అర్పణ మక్కఱలేనిమంత్రములు.

"నృసింహార్కవరాహాణాం ప్రాసాదప్రణవస్య చ,
సపిండాక్షరమంత్రాణాం సిద్ధాదీన్నైవ శోధయేత్.
స్వప్నలబ్ధే స్త్రియా దత్తే మాలామంత్రే చ త్ర్యక్షరే,
వైదికేషు చ మంత్రేషు సిద్ధాదీన్నైవ శోధయేత్."

మాలామంత్రము లనఁగా,

"వింశత్యర్ణాధికా మంత్రా మాలామంత్రాశ్చ కీర్తితాః,
నపుంసకస్య సిద్ధాదీన్నైవ శోధయేత్."

గ్రంథవిస్తరభీతిచేఁ బెంచి వ్రాయక యిఁక మానుదు. ఈవిధు లంబట్టి దేవతారాధన మర్పణము కుదురకయుండఁ జేయరా దని యేర్పడుచున్నది కదా. నన్ను నారాధింప ననుగ్రహింపు మని వేఁడెను. ఈ వాక్యములమూలమున మనకు మహర్షి దేవ తారాధనావిశేషమును బోధించెనని తెలిసికొనవలయును. మనము కూడ నుపాసించు నూహకలవార మైనపుడు సద్గురు వుల నాశ్రయించి తనవాంఛ యేదేవత నుపాసింపఁగలదో తెలిపి మంత్రార్పణమున నది యనుకూలమే యని వారు తెలి పిన నద్దానిం బరిగ్రహింపవలయు. గాయత్రి లోనగుమంత్ర

ముల కానియమ మక్కఱలేదని శాస్త్రమే విధించుచున్నది. ఇంకొకరహస్యము కలదు. భగవదారాధనకు వర్ణమేటికన్న వినుఁడు. ధర్మార్థకామమోక్షములు నాలుగు కోరఁదగినవే. కాని పరాపకారము లోనగుదుష్టవాంఛలు గలవారలకే యీ నియమములు. అస్త్రవిద్య కివి ముఖ్యములు. భగవత్కరుణ కివియేవియు నక్కఱలేదు.

"దేవి నేహ భయం కార్యం మయి విశ్వసిహి ప్రియే,
ప్రణయస్వ చ తత్త్వేన మైవం భూశ్శోకలాలసా." ౭

అని మూలము. దేవీ! యని సంబోధించుచున్నాఁడు. పరదేవతా యని భావము. ఇందు నీకెద్దియు భయజనకము లేదు. ప్రీతినుంచు స్వభావము కలదానవు. అనఁగాఁ గరుణాస్వరూపవని భావము. నాయందుఁ బ్రీతి నునుపుము. వాస్తవముగా నన్ను ననుగ్రహవిశేషమున నలరింపుము. ఇట్లు శోకింప వలదు. అనఁగా దుష్టస్వభావు లిందుఁ గలరని సంశయింపక నన్ననుగ్రహింపుమని రావణునాశయము.

"ఏకవేణీ ధరాశయ్యా ధ్యానం మలినమంబరం,
అస్థానేఽప్యుపవాసశ్చ నైతాన్యౌపయికాని తే." ౮

అని మూలము. నీయిప్పటియునికి విచారమును దెలుపును. కాన నది యేల? శ్రీరామచంద్రుఁడు సకాలమున నిచ్చటికి రాఁగలఁడు. తదాగమనప్రయోజనములగు నివి యక్కఱ లేకయే యీపరాత్పరుఁ డరుదెంచునని విన్నవించుచున్నాఁడు. ఈసందర్భమునఁ బతివ్రతాలక్షణములను మహర్షి లోకమున కుపదేశించుచున్నాఁడు: ప్రాణనాథుఁ డింటలేనితఱి నెఱికురులు దువ్వుకొనరాదు. భూమిపై శయనింపవలయును. నాథునాగ

మనమునే తలంచుచుండవలయును. శృంగారచిహ్న మగు వస్త్రమును ధరింపరాదు. నిరర్థకముగా నుపవసింపరాదు. అనఁగా నేదే నొకవ్రతాచరణమునకుఁ గాక యుపవాసము స్త్రీలకుఁ బనికిరాదని భావము. ఇవి సాధ్వు లాచరింపఁదగినవి. ఆహా! పూర్వులయలవాటు లెంత పరిశుద్ధములు. ఇపు డిట్టివి రుచించునా? ఎల్లరకు రుచింపక యున్నను గొందఱ కివి యింపుగనే యుండును. ఈనియమముల నుల్లంఘింపనివా రిపుడు కూడఁ బెక్కండ్రు గలరని తెలుప జంకను. సాధ్వీశిరోమణులు కలరు. వారిమూలముననే యార్యధర్మము నిలిచియున్నదని నావిశ్వాసము.

"విచిత్రాణి చ మాల్యాని చందనాన్యగరూణి చ,
వివిధాని చ వాసాంసి దివ్యాన్యాభరణాని చ. ౯
మహార్హాణి చ పానాని శయనాన్యాసనాని చ,
గీతం నృత్తం చ వాద్యం చ లభ మాం ప్రాప్య మైథిలి." ౧౦

అని మూలము. ఇందు రావణుని యుపాసనావిధానము తెల్పఁబడినది. ఉపాసన నాల్గుభాగములుగ నుండు. మంత్రఖండము, పూజాఖండము, హోమఖండము, న్యాసఖండము అని వాని పేరులు. ఇవన్నియు సమానఫలప్రదములే కాని యుత్తమమధ్యమాధమభేదములు గలవి కావు. భక్తి యొక్కటి చక్కఁగా నుండిన నన్నియు నొక్కటియే. రావణుఁడు పూజాఖండమునఁ జెప్పఁబడిన ట్లుపాసింపఁ బ్రీతిగలవాఁడు. ఆజాతివారికి మంత్రజపము ప్రధానము కాదు. అనవరతపూజయే ముఖ్యము. పూజింపఁబూనినవాఁడు సకలాలంకారముల నలంకృతుఁడై కూరుచుండవలయును గాని పితృకర్మకుం గూరుచున్నట్లు

గాదు. కడుబీదవాఁడైన సకల భూషణభూషితునిగాఁ దన్ను భావించుకొనవలయు. "క్లప్తాకల్ప స్సంకల్పాకల్పా హి" అని చెప్పఁబడినది. "భావనామాత్రసంతుష్టహృదయః పరమేశ్వరః" అనుప్రమాణము క్రొత్తది కాదు. సకలాభరణాలంకృతునిగాఁ దన్ను భావించుకొన్నం జాలునని కదా విధి. అట్టి భావనయైన నున్నంజాలునని సారము. పూజకు నఱువదినాలు గుపచారములు కలవు. ఇందుఁ జెప్పఁబడినవన్నియు నందుఁ గలవు. విశేషించి యింకను గలవు. సీతాదేవీ! ఈ సద్వస్తువులను సంపాదించి యుంచితిని. నన్ను దాసునిగా నంగీకరించి నాసమర్పించు వీనిని బరిగ్రహింపుమా యని యారావణుఁడు ప్రార్థించెను. "మహార్హాణి చ పానాని" అని యున్నది కదా. మద్యవిశేషములు పూజయం దర్పించుట శాస్త్రవిహితమే యగునా?" అని యడుగవచ్చు. దేవతలకు రాక్షసులకు నామమాత్రభేదము తప్ప జాత్యాచారములయందు భేదమున్నయట్లు గానరాదు. ఆకాలమునందు మద్యపానము బ్రాహ్మణేతరులకు నిషేధింపఁబడలేదు.

"యదన్నం పురుషో భుంక్తే తదన్నం తస్య దేవతాః,"

అన్నసూక్తి క్రొత్తది కాదు. కనుక రావణుఁడు నిషేధింపఁబడనిమద్యములఁ ద్రాగువాఁడు కావున నవి దేవి కర్పించుట శాస్త్రవిరుద్ధము కాదు. సమయాచారమునఁ దప్పఁ దక్కినపూజాపద్ధతులయందు జాత్యుచితమద్యము చెప్పఁబడినదే. కావున నిచ్చోటఁ జెప్పఁబడిన పానవిశేషములయందు మద్యము లున్నను దూష్యములు కావని యెఱుంగునది.

"స్త్రీరత్నమసి మైవం భూః కురు గాత్రేషు భూషణం,
మాం ప్రాప్య హి కథం ను స్యాస్త్వమనర్హా సువిగ్రహే." ౧౧

అని మూలము. ఉక్తార్థమునే యిది దృఢపఱచుచున్నది. జననీ! నీవు స్త్రీరత్నమవు. ఇట్లుండరాదు సుమా. సర్వాంగాలంకృతభూషణవ్రాతవు కమ్ము. నావంటి సద్భృత్యుఁడు నీకుండఁగా నిట్లుండుట న్యాయవిరుద్ధమే యగును గదా అని ప్రార్థించెను.

"ఇదం తే చారు సంజాతం యౌవనం వ్యతివర్తతే,
యదతీతం పునర్నైతి స్రోతశ్శీఘ్రమపామివ." ౧౨

అని మూలము. "తే తవ. భృత్యస్య మే ఇతి శేషః"అని మహేశ్వరతీర్థు లన్వయించిరి. ఈశేషమేల? క్లిష్టకల్పనము కాదా యందురేమో. వినుఁడు. "తే చారు సంజాతం ఇదం యౌవనం వ్యతివర్తతే" అని కదా సమన్వయము చేయవలయును. ఇదమ్మను హస్తనిర్దేశమునఁ గలుగు లాభమేమో తోఁపక యున్నది. కనుకనే వార ట్లన్వయించుట సమంజసముగనే యున్నది. ఈశ్వరానుగ్రహమున నాయీశరీరమునఁ గల్గి యున్న యీప్రాయము చాలకాలము నిలువదు. అవయవపటుత్వ మున్నపు డీమనఃపాటవ ముండును. మనఃపాటవము తగ్గఁగా నుపాసనాబలము తగ్గఁగలదు. కావున నంతకుముందే నీయారాధనము గావింతును. అనుగ్రహింపుమా యని ప్రార్థించెను. "స్రోతశ్శీఘ్ర మపామివ" అన్నయుపమానము ఆరాధనకాంక్షాతత్పరత్వమును దెలుపుచున్నది. ఏలయనఁగా రావణునకు మృతి మాసద్వయమున రానున్నది. అట్టివానికిఁ దదనుకూలములగు నాలోచనలు పుట్టక మానవు. భగవత్సేవకుఁడు కదా రావణుఁడు. శాపవశమునఁ గదా యీజన్మ మలవడినది. అట్టివానిమనస్సున సత్సంకల్పములు గలుగరాదనుట కేవల మజ్ఞానఫలమే యనవలయును. చిరకాల భగవదారా

ధనఫలము సత్సంకల్పము గానిచో నింక నది యేటికి ? మరణము సమీపింపఁగా నొకయుద్రేకము మదిఁగలుగును. పుణ్యపురుషులకు సదుద్రేకము గలుగును. శ్రీవిష్ణుద్వారపాలకు లగువారలకది కల్గదనుటకంటె హఠవాదము వేఱొకటి గానరాదు.

"త్వాం కృత్వోపరతో మన్యే రూపకర్తా స విశ్వసృక్,
న హి రూపోపమా త్వన్యా తవాస్తి శుభదర్శనే." ౧౩

అని మూలము. రూపకర్తా=ఆకృతి నిర్మాణచతురుఁడు, విశ్వసృక్=ప్రపంచనిర్మాణకార్యనియుక్తుఁడు, త్వాం కృత్వా=నిన్ను మదినునుచుకొని, ఉపరతః=తృప్తినొందినవాఁడు, అని, మన్యే=తలంతును. శుభదర్శనే = శుభప్రదమగు దర్శనముకల యో దేవీ! ఈసంబుద్ధియే పైన వ్రాసినయర్థమును సూచించును. నీవంటిరూపముగల వస్త్వంతర మొకటియు లేదు. అనఁగా భావమేమి? నీవంటిదానవు నీవే. అను ననన్వయాలంకారమున కుదాహరణభూతురాలవని కదా. నీయాజ్ఞానుసారము సృష్టిచేయుబ్రహ్మ యుపమానమగు వేఱువస్తువు లేని నిన్ను మదిని ధ్యానించి తృప్తినొందియున్నాఁడు. అట్లే నేను నిన్ను నారాధించి యుపరతుఁడ నయ్యెదనని రావణుని యాశయము. దీని సారమేమి? పూజాఫలము ధ్యానము. మంత్రజపఫలము ధ్యానము. న్యాసఫలము ధ్యానము. హోమకర్మఫలము ధ్యానము. అది బ్రహ్మవలె నేనుగూడ నొనరించి యీశరీర విషయమై తృప్తినొందెదను. అని తలంచెననఁగా సకలవిధోపాసనాఫలము ధ్యానమనియు,

"ధ్యానేనాత్మని పశ్యంతి కేచిదాత్మానమాత్మనా."

అను గీతావాక్యమురీతిగా బాహ్యపూజాదులు మాని మనః

పద్మమునందు నిష్టదేవతను జూచుటయే తత్ఫలమనియు నిందలి సారమని మన మూహింపవలయును.

"త్వాం సమాసాద్య వై దేహి రూపయౌవనశాలినీం,
కః పుమానతివర్తేత సాక్షాదపి పితామహః." ౧౪

అని మూలము. "యోషాతిరూపసంపన్నా గర్వితా మద శాలినీ, మమరూపైవ సాజ్ఞేయా." అన్న మహాకాళీవాక్యము ననుసరించి యోవైదేహీ! రూపయౌవనశాలినీం = త్రిభువనా నందజనక రూపయౌవనములు గలిగి యవతరించియున్న మహాదేవి వగు, త్వాం=నిన్ను, సీతానామమునఁ దగుమహా ప్రకృతిని, సమాసాద్య = సమీపమునఁ జేరి, నీసన్నిధిని జేరు భాగ్యము గలిగి యని భావము. బ్రహ్మదేవుఁ డయినను, అతి వర్తేత = ఇష్టానుసారము వర్తింపఁగలఁడు? ఇఁకఁ బురుషాంత రునిమాట చెప్పవలసిన దేమని యాశయము. శ్యామా= అనఁగా నిర్భరవయః పరిపూర్ణ యని యర్థము. "రూపయౌవన శాలినీం త్వాం" అనుటంజేసి శ్యామాఖ్యం గాంచిన నిన్ను నని భావము. అనఁగా మహాప్రకృతివని తాత్పర్యము. "సీతా లక్ష్మీర్భవాన్ విష్ణుః" అని ముందు వాల్మీకి చెప్పఁబోవు చున్నాఁడు. కావున దాని కనుగుణమే యీయర్థమని యెఱుంగవలయు. భగవతి కరుణాతరంగితాపాంగయై భక్తు నకుం దోఁచుట తన్మనఃపాటవపరీక్షార్థమని యెఱుంగ వలయు. జగన్మోహనాకారముం గాంచి నిశ్చంచలమనస్సున నెవఁడు ధ్యానించునో వాఁడే కృతార్థుఁ డగునని మహాకాళి తెల్పుచున్నది. ఆభావమునే యిందు మహాకవి సూచించెనని యెఱుంగందగు.

"యద్యత్పశ్యామి తే గాత్రం శీతాంశుసదృశానసే,
తస్మింస్తస్మిన్ పృథుశ్రోణి చక్షుర్మమ నిబధ్యతే." ౧౫

అని మూలము. ఇది యుపాస్యదేవతాభక్త్యతిశయమును దేట పఱచుచున్నది. చంద్రవదనా! వరారోహా! నీమూర్తి విశేషమున నేభాగమును గాంచిన నందుండి దృష్టి మరల్పఁ దరము గాకున్నది. నీమూర్తి నయనానందకరమని తాత్పర్యము. ఇందు మానసికపూజాపద్ధతి సూచింపఁబడుచున్నది. సమయాచారపరుల యుపాసన యిందుఁ జెప్పఁబడుచున్నది. ఆధారస్వాధిష్ఠానమణిపూరకానాహతవిశుద్ధాజ్ఞాచక్రములని షట్చక్రముల పేరులు. ఆయాఱును మూఁడు ఖండములుగ విభజింపఁబడినవి. సోమసూర్యానలాత్మకము లా మూఁడు నని యెఱుంగవలయును. ఇది యవరోహక్రమము ననుసరించి యిట్లు చెప్పఁబడినది. ఆరోహణక్రమము ననుసరించిన వహ్నిసూర్యచంద్రాత్మకము లనవలయు. మూలాధార స్వాధిష్ఠానచక్రములు ప్రథమఖండము. మణిపూరానాహత చక్రములు ద్వితీయఖండము. విశుద్ధాజ్ఞాచక్రములు తృతీయ ఖండము. ప్రథమఖండముమీఁద నగ్నిస్థానము. అదియే రుద్ర గ్రంథి యనఁబడును. ద్వితీయఖండముమీఁద సూర్యస్థానము. అదియే విష్ణుగ్రంథి యనఁబడును. తృతీయఖండోర్ధ్వభాగము బ్రహ్మగ్రంథి యనఁబడును. ప్రథమఖండోపరిస్థితవహ్నిస్వజ్వాలామాలికచే నాఖండము నావరించును. ద్వితీయఖండోర్ధ్వభాగస్థిత సూర్యుఁడు స్వీయకిరణములచే దాని నావరించును. తృతీయఖండోపరిభాగగత శశాంకుఁడు స్వకీయకళలచే నాఖండము నావరించును. ఆచక్రద్వయము తద్వ్యాప్తమని భావము. వహ్నిజ్వాలలు నూటయేనిమిదని యోగమతము.

ఆధారచక్రము భూతత్త్వాత్మకము. అందు వ్యాపించియున్న వహ్నిజ్వాల లేఁబదియాఱు. మణిపూరకచక్ర ముదకతత్త్వాత్మకము. అందు వ్యాపించియున్నది యగ్నిజ్వాల లేఁబదిరెండు. ఈరెండు నూటయెనిమిదని యెఱుంగందగు. అగ్నితత్త్వాత్మకమగు స్వాధిష్ఠానచక్రమందు సూర్యకిరణము లఱువదిరెండు. అనిలతత్త్వాత్మకమగు ననాహతచక్రమందు నేఁబదినాలుగు. ఈ సూర్యకిరణములు మణిపూరకచక్రమును వదలి స్వాధిష్ఠానమునఁ బ్రవేశించును. సూర్యవహ్ను లొక్కటియే యగుట దానికిఁ గారణమని పెద్ద లుపపాదించిరి. అగ్నిసూర్యాంతర్భావము గలవాఁడే కాని తద్భిన్నుఁడు కాఁడని తెలియవలయు. సూర్యాగ్నిస్థానములగు స్వాధిష్ఠానమణిపూరకములకు నడుమనుండు నగ్నిస్థానమున సూర్యప్రవేశమని భావము. సూర్యస్థానమున నగ్నియు నట్లే ప్రవేశించునని తేటపడఁదగు. ఇందులకేమేని ఫలము కలదా? ప్రపంచమును దహించు నగ్ని యను పేరుగలిగి సంవర్తమేఘాత్మకమగు సూర్యకిరణములనుండి వర్షోత్పత్తి యిందులకు ఫలమగు. దీనిని విస్తరించి వ్రాయుదును. సూర్యకిరణములే యగ్నిసంభిన్న మేఘత్వము నొంది జలరూపమునఁ బరిణమించును. కనుక మణిపూరకచక్రమునకు ఆధారస్వాధిష్ఠానముల యంతరమునఁ బ్రవేశము కల్పింపఁబడినది. అనాహతచక్రమునకుఁ బైనున్న సూర్యకిరణములు స్వాధిష్ఠానాగ్ని సంవలితములై మణిపూరచక్రమును బ్రవేశించి జలతత్త్వరూపము నొంది యా జలముచేత స్వాధిష్ఠానాగ్ని కబళితమగు జగమును దడుపుచుండును. ఇదియే యాగమరహస్యము. ఈరీతిగా సూర్యకిరణములు నూటపదాఱు.ఆకాశతత్త్వాత్మకమగు విశుద్ధిచక్రమునఁ జంద్రకళలు డెబ్బదిరెండు.

మన స్తత్వాత్మకమగు నాజ్ఞాచక్రమునందు నలువదినాలుగు నని యెఱుంగవలయు. కలిసి చంద్రకళలు నూటముప్పదియా అగును.

"అష్టోత్తరశతం వహ్నే ష్షోడశోత్తరకం రవేః,
షట్త్రింశ దుత్తరశతం చంద్రస్య తు వినిర్ణయః."

రుద్రయామిళము.

ఇట్లు సోమసూర్యాగ్నులు పిండాండబ్రహ్మాండముల నావరించి యుండును. పిండాండబ్రహ్మాండముల కైక్యమే ప్రతిపాదితము. పిండాండావృత్తియే బ్రహ్మాండావృత్తి యని యిందలి రహస్యము. ఈరీతిగాఁ బిండాండము నావరించి సహస్రకమల చక్ర ముండును. అదియే జ్యోత్స్నామయలోకము. అందుండు చంద్రముఁడు నిత్యకళావిశిష్టుఁడు. ఆజ్ఞాచక్రోపరిగతుఁడు చంద్రుఁడని ముందు చెప్పఁబడినది కదా. అది చంద్రకళావస్థాన మాత్రమే. కాని చంద్రావస్థానము కాదని యెఱుంగవలయు. ఇట్టి మానసికపూజాతత్పరులకే దేవతాకరుణ లభించునని మన మెఱుంగవలయు. "అంతర్ముఖసమారాధ్యా బహిర్ముఖసుదుర్లభా." అని కలదు కదా.

"సత్యవ్రతా సత్యరూపా సర్వాంతర్యామిణీ సతీ." అని మూలము.

"సర్వేషా మంతఃకరణాని యమయతి. ఏషత ఆత్మాన్తర్యామ్యమృత ఇత్యంతర్యామిబ్రాహ్మణాత్, ఏషోఽన్తర్యామ్యేష యోనిస్సర్వస్యేతి మాండూకశ్రుతేశ్చ, సర్వాచ సాంతర్యామిణీ చేతి వా, సర్వస్వరూపా సర్వేషా మంతశ్చ ప్రవిష్టేత్యర్థః. తత్సృష్ట్వా, తదేవానుప్రవిశత్, తదనుప్రవిశ్య,

సచ్చ త్యచ్చాభవదితి శ్రుతిః. స్మృతిశ్చ.—'సర్వస్య సర్వదా జ్ఞానాత్సర్వస్య ప్రభవాప్యయా, సతోఽసతశ్చ కురుతే తేన సర్వేతి కథ్యత' ఇతి.''

సౌభాగ్యభాస్కరభాష్యము.

''నిరామయా నిరాలంబా స్వాత్మారామా సుధాసృతిః,'' అని మూ.

''స్వాత్మేతి. సాచ మూలక్షయకరీత్యస్యా అనాలంబత్వమేవ సాధయతి, స్వాత్మన్యేవారామః, క్రీడనం యస్యాః, స్వాత్మానమేవ ద్వేధా విభజ్య అన్యోన్యం క్రీడమాణేతి యావత్. తథా చ మాధ్యందినా అధీయతే. అథ వై స రేమే తస్మాదేకాకీ న రమతే సద్వితీయమైచ్ఛత్, స హైతం వా నాస యథా స్త్రీమంసౌ సమ్పరిష్వక్తౌ స ఇమమేవాత్మానం ద్వేధా పాతయత్తతః, పతిశ్చ పత్నీ చాభవతామితి. స్వాత్మైవారామః కృత్రిమవన రూపం చిత్రంజగద్యస్యా ఇతి వా, జగన్నిర్మాణసంహారకాలయోః స్వాత్మమాత్రావశేషాత్, ఉక్తం చ వాయుపురాణే.—'ఏకస్తు ప్రభుశక్త్యా వై బహుధాభవతీశ్వరః, భూత్వా యస్మాచ్చ బహుధా భవత్యేకః పునస్తు స' ఇతి. స్వం ఆత్మీయం జగచ్చ ఆత్మా బ్రహ్మ చ అనయోరారామః క్రీడనం విహరణం వృత్తిత్వం యస్యా ఇతి వా. తదుక్తం మార్కండేయపురాణే.—'త్వమక్షరం పరం దేవి యచ్చ సర్వం ప్రతిష్ఠితం, అక్షరం బ్రహ్మ పరమం జగచ్చైతత్క్షరాత్మకం. దారుణ్యవస్థితో వహ్నిర్భూమౌశ్చ పరమాణవః, తథా త్వయి స్థితం బ్రహ్మ జగచ్చేదమశేషత' ఇతి.'' అని భాష్యము.

ఈ ప్రమాణములం బట్టి స్త్రీపురుషాత్మికముగా నుండుమూలప్రకృతిధ్యానగమ్యయనియు, నదియే సమయమతానుసారణులయుపాసనమనియు భావము. ఇందు నధికారిభేదము ననుసరించి యాధారాదిచక్రములయందు నభీష్టదేవతామూర్తిని ధ్యానింతురు. రావణునాశయ మేమనఁగా. జననీ! ధ్యానకాల

మున నాయంతర్దృష్టి ని న్నేచక్రమున ధ్యానించినను మహా నందము కలుగుచుండుననియు వేఱొకచక్రమున నిన్ను ధ్యా నింపం దగుననుబుద్ధియే యుండదనియు నగు. దీనింబట్టి మాన సికోపాసకుల యోగ్యత తేటపడుచున్నది. మహానందజనక మగు నా యుపాసనయే సమయమతసమ్మతమని యెఱుంగ వలయు. ఇదియే శాక్త మనంబడును. అంతియగాని మాంస భక్షణ మద్యపానాదులు శాక్తమతమునకు సమ్మతములు గావు. అట్టివారు శాక్తులలో లేరా యందురేని రామానుజకూట స్థులలోను ఉందురు. అది వారి దుష్కర్మముగాని మతధర్మము కాదని మన మెఱుంగందగు.

> "భవ మైథిలి భార్యా మే మోహ మేనం విసర్జయ,
> బహ్వీనా ముత్తమస్త్రీణా మాహృతానా మిత స్తతః. ౧౬
> సర్వాసామేవ భద్రం తే మమాగ్రమహిషీ భవ,"

అని మూలము. వాస్తవార్థ మిట్లుండం దగు. "మైథిలి, భార్యా భవ ఏనం మోహం విసర్జయ. మే ఉత్తమస్త్రీణాం మమ యా అగ్రమహిషీ మందోదరీ తస్యాశ్చ మమ చ ఈశ్వరీతి శేషః భవ." అని యన్వయక్రమము. భా = కాంతి. దానిచే శ్రేష్ఠు రాలవు. మైథిలీ నీవని భావము. అనఁగాఁ దేజస్స్వరూపిణి వగు నీవిపుడు మైథిలి యను పేర రూపవంతురాల వైతివని భావము. ఈమోహమును వదలుమనఁగా నేను శ్రీరాము నకు శత్రువుఁడనను ననుమానము వదలుమని ప్రార్థన. ఆ యా తావులనుండి రప్పించిన యుత్తమస్త్రీలు కలరు కదా. వారల కగ్రమహిషి మందోదరి యగు. ఆమందోదరికి నాకు నీశ్వరివి కమ్మా. అని యర్థించెనని భావము. ఈయర్థము ముక్కునకుఁ

ద్రాడుగట్టి లాగిన ట్లుండ లేదా. అని యందు రేమో. రావ ణుఁడు కేవల మూర్ఖుఁడనువిశ్వాసము కలవారలకుఁ గథ మాత్రమే రుచించును. వారల కిది యుత్తమకావ్యము కానే రదు. తారాశశాంకవిజయమువంటిదే యగు. ఆతఁడు మహా భక్తుఁ డనువిశ్వాసము గలవారలకే యిది యుత్తమకావ్య మగును. వార లీభావమునే గ్రహింపవలసి యుండును. ఇంత శ్రమంపడి కదా యీయర్థము చెప్పవలయు నను వారును గలరు. ఒక తెగవా రాగమమునందు శంకరశబ్దమునకు శం, భిన్నపదమని, కః ఉః అని విభజించి యర్థము చెప్పిరి. అట్టి దురుద్దేశ మిందుఁ గలదా యని యోజించినఁ జాలు. బోధా ర్థియై రావణుఁడు సనత్కుమారునికడ కేగెనను నుత్తరరామా యణకథను మఱువకున్నం జాలు. ఈయర్థము సుసంగతమే యని తేటపడును. "ఆహృతానా మితస్తతః" అనుచో నానా భాగములనుండి నేఁదెచ్చినవారని కదా యర్థము. అట్టివాఁడు దుష్టుఁడు గాక భక్తుఁ డెట్లగును? అని యందు రేమో.

"రావణే సుఖసంవిష్టే తాః స్త్రియో వివిధప్రభాః,
జ్వలంతః కాంచనా దీపాః ప్రైక్షంతానిమిషా ఇవ. ౬౭
రాజర్షిపితృదైత్యానాం గంధర్వాణాం చ యోషితః,
రాక్షసానాం చ యాః కన్యా స్తస్య కామవశం గతాః. ౬౮
యుద్ధకామేన తాస్సర్వా రావణేన హృతా స్త్రియః,
సమదా మదనేనైవ మోహితాః కాశ్చిదాగతాః. ౬౯
న తత్ర కాచిత్ప్రమదా ప్రసహ్యా
వీర్యోపపన్నేన గుణేన లబ్ధా,
న చాన్యకామాపి న చాన్యపూర్వా
వినావరార్హాం జనకాత్మజాం తాం. ౭౦

న చాకులీనా న చ హీనరూపా
నాదక్షిణా నానుపచారయుక్తా,
భార్యాభవత్తస్య న హీనసత్వా
న చాపి కాంతస్య న కామనీయా." ౭౧.

అను నీకాండముననే తొమ్మిదవసర్గమునఁగల యీశ్లోకములఁ బఠించిన వారెట్టివారో యెవరికుమారికలో ఎట్లు తేఁబడిరో, వారాతనిపై నసూయగలవారో తేటపడును. సత్కులప్రసూత లయి సుందరాకారలయి యొప్పురాజర్షి పితృగంధర్వరాక్షసాదుల కొమరితలా రావణుని సౌందర్యమును గాంచి కామవశంగతలై వచ్చిరని స్పష్టము కాకపోదు. కనుక "ఇత స్తతః ఆహృతానా"మ్మనుదాని కేది యర్థమో వారే గ్రహింపవలసి యుండును. ఇట్లు గ్రహింపుఁడు. శ్రీదేవీపూజాతత్పరుల కొక నియమము గలదు. ఒకఁడు శ్రీచక్రము సర్పింపఁ గోరి తద్భక్తుల నావాహ్వానించును. వారిలోఁ గొంద అతనికి శత్రువులైనను ఆసమయమున నచ్చటికిఁ బోవవలయును. ఇది పూర్వానుగత సదాచారము. ఒక్కశాక్తముననే యీయాచారము కలుగ నేల? అని యడుగుదురేమో. గుర్వారాధన మను నొకపూజ కలదు. దానినే యిపుడు గురప్పనిపూజ యందురు. ఆపూజ కలవారందఱు నాఁ డచ్చటికిం బోవుదురు. యథాశక్తి నారికేళఫలాదులను గొంపోయి యాదిన మాప్రసాదముం గొని వత్తురు. ఈవిషయమైన నెఱింగినవా రిచ్చో శంకనొందరు. ఆయాచారము ననుసరించి యాయాతావులనుండి పిలువంబంచిన యుత్తమస్త్రీలు గలరు. ఈయర్థము చెప్పక మానిన వ్యభిచరింపఁ బూనినవా రుత్తమస్త్రీ లనఁబడుదురు కదా. ఉత్తమస్త్రీలనఁగా సద్వంశాచారముల నలరువారే కదా. అట్టి వార

లకు నాభార్యకు నాకు నీశ్వరివి. ఉపాస్యదేవతవు కమ్మని ప్రార్థించెను. నిన్నారాధించి శ్రీరామానుగ్రహము నొంది యీశరీరమును వదలి యుత్తమగతికిం బోవం దలంచితినని రావణుఁడు కోరుట యుత్తమము కాదని యెవ్వఁ డనఁ గలఁడు? కావున ఇచ్చోట నీయర్థమే సముచితమని యెన్నఁ దగియున్నది. ఇచ్చోటనుండు "భద్రం తే" అనునది నాయీ ప్రార్థనాంగీకారమున నచిరకాలమున శ్రీరామాగమనరూప మంగళము నీకుం గలుగుననునర్థము నిచ్చుచున్నది.

"లోకేభ్యో యాని రత్నాని సంప్రమథ్యాహృతాని వై. ౧౭
తాని మే భీరు సర్వాణి రాజ్యం చైతదహం చ తే,"

అని మూలము. ఇందు సర్వత్యాగము చెప్పఁబడుచున్నది. మహాకార్యము చేయుతఱిఁ దనకుండు సమూల్యవస్తువితతి నీవలయు ననువిధి కలదు. దశరథుని యశ్వమేధమున నావిష యము వ్రాసితిని. ఇం దదియే కలదు. నేను బలాక్రమమున నార్జించిన సకలరత్నములను సమర్పింతును. ఈరాజ్యము నర్పిం తును. తుదకు నన్నుఁగూడ నర్పింతును. ఇవన్నియు నీవేకాని నావి కావు. అనఁగా భావమేమి? "యద్యత్కర్మ కరోమి తత్త దఖిలం శంభో తవారాధనమ్." అనుసూక్తియు,

"సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ,
నవద్వారే పురే దేహే నైవ కుర్వన్న కారయన్. ౧౩
తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః,
గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః."

అను గీతావాక్యములు సుప్రసిద్ధములే కదా. సర్వార్పణ ముత్తమమనియే కదా వీనిసారము. ఈయర్థమునే రావణుఁడు

ప్రార్థనారూపమునఁ దెలుపుచున్నాఁడు. ఉపాసనుఁ డాత్మార్ప
ణము చేయుట త్వచ్ఛిన్నము నాకేదియు నక్కఱలేదను
భావము కలుగుటకని యీభాగమునుండి మనము గ్రహింప
వలయును.

"విజిత్య పృథివీం సర్వాం నానానగరమాలినీం. ౧౮
జనకాయ ప్రదాస్యామి తవ హేతోర్విలాసిని."

అని మూలము. నీకు నర్పింతు ననఁగా భావనయే కదా. దాన
నష్టము కనఁబడదు. అనుభావము కలుగునేమో యనుకొని
రావణుఁడే నాకాభావనయే సత్యముగాఁ గలదని తెలుపు
చున్నాఁడు. ఈభూలోకమంతయు జయించి నీయాజ్ఞయైన
జనకమహారాజున కొసంగెదను. లోకమునఁ గష్టపడి సంపాదిం
చిన వస్తువెట్టిదైన నొరులకిచ్చుట కంగీకరించుట చాలఁ
గష్టము. కావున నట్టిదానినంతయు నిత్తుననఁగా నీకొఱకు సర్వ
స్వము నర్పింప సిద్ధుఁడనని భావము.

"కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః,
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః." ౨

... ... ... ...

నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ,
త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధః సంప్రకీర్తితః. ౪
యజ్ఞో దానం తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్,
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణాం. ౫
ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ,
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమమ్."

అను నీగీతావాక్యములు త్యాగమాహాత్మ్యమును దేటపఱ

చును. జనకున కీయఁ గారణమేమని యడుగుదురేమో. ఇట్టి జగజ్జనని గొమరితగాఁ గాంచ నోచిన మహాపుణ్యాత్ముని కిది యొక కొన్కయని రావణునాశయము. ఇట్లు గ్రహించిన నేశంక లుండవు.

"నేహ పశ్యామి లోకేఽన్యం యో మే ప్రతిబలో భవేత్. ౧౯
పశ్య మే సుమహద్వీర్య మప్రతిద్వంద్వమాహవే,
అసకృత్సంయుగే భగ్నా మయా విమృదితధ్వజాః. ౨౦
అశక్తాః ప్రత్యనీకేషు స్థాతుం మమ సురాసురాః,"

అని మూలము. నాభక్తులు దేవతలు. రాక్షసులు భక్తులు కారు. అని జానకీదేవీ! సందియమందకుము. సురాసురులలో నన్ను లెక్కింపకు మనుభావమును గూఢముగా రావణుఁడు తెలుపుచున్నాఁడు. సురాసురులలో నాతో యుద్ధముచేయఁ గలవారు లేరు. తెలియక మార్కొని యోడిపోయిరి. కావున నావిషయమును వారితెగలలోఁ జేర్పక కారణోపాత్త రాక్షస జాతిశరీరుఁడనని తలంపుమా యని యిందుఁ గల్గినసారము.

"ఇచ్ఛయా క్రియతామద్య ప్రతికర్మ తవోత్తమం. ౨౧
సప్రభాణ్యవసజ్యంతాం తవాంగే భూషణాని చ,
సాధు పశ్యామి తే రూపం సంయుక్తం ప్రతికర్మణా. ౨౨
ప్రతికర్మాభిసంయుక్తా దాక్షిణ్యేన వరాననే,
భుంక్ష్వ భోగాన్యథా కామం పిబ భీరు రమస్వ చ. ౨౩
యథేష్టం చ ప్రయచ్ఛ త్వం పృథివీం వా ధనాని చ,
లలస్వ మయి విస్రబ్ధా ధృష్టమాజ్ఞాపయస్వ చ. ౨౪
మత్ప్రసాదాల్లలంత్యాశ్చ లలంతాం బాంధవాస్తవ."

అని మూలము. "ఇచ్ఛయా క్రియతా" మనుచోట "ఇచ్ఛ

మూం క్రియతామ్" అను పాఠభేదము కలదు. ఇది మహే శ్వరతీర్థులు గ్రహించిరి. తల్లీ! నాసంపద నంగీకరించి యలంక రించుకొనుము. సర్వాలంకారభూషితశరీర వగు నిన్ను నారా ధింతును. అట్లలంకరించుకొన్న నీరూపమును జక్కఁగాఁ జూతును. ఏల? అనఁగా ఆరూపమే నాకు ధ్యానగమ్యము కాఁగలదు. కావునఁ జక్కఁగాంచి మది నిడుకొనియెద.

"ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా."

అన్నసూక్తి యీభావమును దృఢపఱచుచున్నది.

"ధ్యానగమ్యాపరిచ్ఛేద్యా జ్ఞానదా జ్ఞానవిగ్రహా,"

అని కదా సహస్రనామస్తోత్రము తెలుపుచున్నది. ఉపాసకుల కందఱికి నొక్కరూపమునం దభిరుచి యుండదు. భిన్నభిన్న రూపములయం దుండును. సర్వాలంకారవిశేషయుక్తమగు భగవతి శరీరమును ధ్యానింప రావణుఁ డిచ్ఛగించెను. భక్తుఁడ నగు నాయింట నిచ్ఛానుసారము సకలవస్తువుల ననుభవిం పుము. మేధ్యాసవములఁ ద్రావుము. ఆరామములయందు విహరింపుము. చతుష్షష్ట్యుపచారములలో "అమృతాసవ చషకం కల్పయామి" అనునది కలదు. సకలస్వమును గోరినచో వలసినవారి కొసంగుము. ఆవిషయమునుగూడఁ బరీక్షించి సేవకునిగా నంగీకరింపుము. ఏయేపనులకు నన్నాజ్ఞాపింపఁ గోరుదువో యాజ్ఞాపింపుము శిరసావహించి యాయా కార్యము లొనర్చెద. వానిచే నీవు సంతోషింప నీబాంధవు లందఱు నానందింతురు. "యథారాజా తథాప్రజాః." అన్న న్యాయముచొప్పున నాయుపాస్యదేవతవగు నీ వానందించిన మేమెల్లర మానందింతుమని రావణునభిప్రాయము. ఇచ్చోఁ

గలవిశేష మేమి? భక్తులకెల్ల నొక్కరూపమునందే యభి మతము నిలువదు. భిన్నభిన్నరూపములయం దుండును. ఎవ్వరి కెద్దియిష్టమో యారూపము నాదేవతకుం గల్పించి దానిని మదినిడుకొని యారాధింపవలయు. అనఁగా ధ్యానింప వలయు. ఒక్కమంత్రమునకే పెక్కండ్రు ఋషులుందురు. ధ్యానశ్లోకములు వేలువేలుగా నుండును. ఏల? అంద ఉపా సించిరనియు వారువారు తమ కిష్టమున్న రూపమును స్తుతించి రనియు నది తెలుపుచున్నది. భగవంతుని కేరూపము లేకున్నను భక్తులు వాంఛించి కల్పించుకొన్న రూపమునొంది వారలం గరుణించునని తేలెడిని. మనము శ్రీరాముని సీతాలక్ష్మణాది సహితముగా నున్నయట్లు ధ్యానించిన నాభగవంతుఁ డా రామరూపము పృథ్వియం దిపుడు లేకున్నను దద్రూపముననే సాక్షాత్కరించును. అది మన కేవిషయమును దేటపఱచును? మన మేవిధిగా ధ్యానింతుమో ఆరూపముననే భగవంతుఁడు మనలఁ గరుణించునని కదా తెలుపును? అప్పుడే సిద్ధాంతము తేలును? భగవంతునకు మనము కల్పించిన నామరూపాదులు వాస్తవములు కావనియే గాక వేఱేమి కలదు? ఈపాటి యల్పవిషయమును గూడ గ్రహింపలేక విష్ణుచిహ్నములు ధరిం పకయున్న నతనికి భగవదనుగ్రహము కలుగదని వాదించుచుఁ బామరుల కుపదేశించుచు ధనార్జనముచేయు మధ్యవైష్ణ వాదులు వంచకులు కారని యెవ్వరే ననఁగలరా? అట్టి యల్ప మతులయుపదేశము లాలకింపఁ దగునా?

"బుద్ధిం మమానుపశ్య త్వం శ్రియం భద్రే యశశ్చ మే. ౨౫
కిం కరిష్యసి రామేణ సుభగే చీరవాససా,
నిక్షిప్తవిజయో రామో గతశ్రీర్వనగోచరః. ౨౬

ప్రతీ స్థండిలశాయీ చ శంకే జీవతి వా న వా,
న హి వైదేహి రామస్త్వాం ద్రష్టుం వాప్యుపలప్స్యతే." ౨౭

అని మూలము. రావణా! నీకు సకలసంపద లొసంగుదు. శీఘ్రముగ నన్ను శ్రీరామునికడఁ జేర్పుమని సీతాదేవి యన నూహించునేమో యని శంకించుకొని నాకేభాగ్యములు వలదు. మోక్షమే వలయునని రావణుఁడు స్వాభిప్రాయమును విశదీకరించుచున్నాఁడు.భద్రే=సౌభాగ్యస్వరూపిణీ! మమ బుద్ధిం అనుపశ్య=నాసంపదం జూడుము నిక్షిప్తవిజయః-నిక్షిప్త=ఉంచఁబడిన, యనఁగా ధ్రువమగు, విజయః=జయముగలవాఁడు. అపజయమే యెఱుఁగఁడని భావము. వనగోచరః=జలములు నివాసస్థానములుగాఁ గలవాఁడు. అనఁగా నారాయణుఁడని యభిప్రాయము. అట్టివాఁడు కనుకనే, గతశ్రీః = ప్రాప్తలక్ష్మిగలవాఁడు. అనఁగా ననుగతప్రకృతికుఁడని భావము. ప్రకృతివిశిష్టుఁడైన కారణముచేతనే లోకాచారములఁ బాటింపవలసినవాఁ డయ్యెను. దానిచేఁ దండ్రిమాటను నడుపవలసినవాఁడు. ఆమాటను నెఱవేర్చుటకొఱకు, వ్రతీ = వ్రతముగలవాఁడయ్యెనని భావము. స్థండిలశాయీ చ=వ్రతాచరణముకొఱకు దర్భలు పఱచినస్థలమని యర్థము. అందు శయనించినాఁడని యాశయము. "అచీరవాససా" అని పదవిభాగము. "సుభగే చీరవాససా" అనుచోట, "అచీరవాససా" అని విభజించుట బాగులేదని కొంద ఱందురేమో. "అతత్త్వమసి" అని పదవిభాగము చేసి భాష్యము వ్రాసినది అసంగతమగునే నిదియు నట్టిదే. అది సుసంగతమనువారు దీని నాక్షేపింపఁ జాలరు. నారచీరలు కట్టినవాఁడా? • పీతాంబరధారియని గూఢార్థము. శ్రీమహావిష్ణువని భావము. ఇట్టి శ్రీరామునితోఁ గూడి నీవు,

కిం కరిష్యసి=ఏమి చేయఁగలవు? ఇపుడు నాకుఁగల యైశ్వర్యా దులకంటె నెక్కువఁగా నేమిచేయఁ గలవు? అనఁగా సకలై శ్వర్యములు నాకుఁ గలవు. కోరఁదగినయైశ్వర్యము నాకేదియు లేదు. కావున జీవతి (మయి=అధ్యాహార్యము) నేను జీవించి యుండఁగా, రామస్త్వాం ద్రష్టుమపి నోపలప్స్యతే=నాకడనున్న నిన్నుఁ జూడనైనఁ జాలఁడు. మద్వధానంతరమే నిన్నుఁ జూడఁగలఁడు. నావధముదనుక నిన్ను రాముఁడు చూడలేఁ డని భావము. దీనిసార మేమి? నీయనుగ్రహమున నాకు సక లైశ్వర్యములు గలవు. కావలసిన దింక నీశరీరమోక్షమే. శ్రీరాముఁడు మహావిష్ణువని నే నెఱుఁగుదును. ప్రకృతము రాముఁడు లంకనుండి నిన్నుఁ దీసికొని పోవఁజాలఁడు. తుదకుఁ జూడనైనఁ జాలఁడు. నన్ను వధించి నిన్నుఁ జూడవలయును. అనఁగా నీ వనుగ్రహింపవలసినది యీ జన్మవిముక్తినే. వే ఱొకవాంఛితము నాకేదియు లేదని భావము. ధర్మార్థకామ ములు నాలుగు లభించినవి. ఇఁక నాల్గవది కావలెను. అదియే యనుగ్రహింప సంకల్పింపుమని రావణునాశయమని గ్రహింప వలయును.

"పురోబలాకైరసితైర్మేఘైర్జ్యోత్స్నామివావృతాం,
న చాపి మమ హస్తాత్త్వాం ప్రాప్తుమర్హతి రాఘవః. ౨౧
హిరణ్యకశిపుః కీర్తిమింద్రహస్తగతామివ,"

అని మూలము. ఇంద్రుఁడు హిరణ్యకశిపునిభార్యను హరించి నారదునిమూలమున హిరణ్యకశిపుఁడు ప్రార్థింపఁగా నతఁ డామెను వదలిపెట్టెను. అట్లే రాముఁడు నాకడనున్న నిన్ను మాత్రము తీసికొని పోవఁజాలఁడు. నల్లనిమేఘము లాచ్ఛా

దించిన వెన్నెలనుజూడ నలవిగానిచందమున నిన్ను రాముఁడు చూడఁజాలఁడు. అను నీ యుపమానముచేత మేఘాచ్ఛాదనము వెన్నెలకు బాధకలుగఁజేయఁ జాలనియట్లు నేను నిన్ను లంకలోనుంచుట నాకార్యమునిమిత్తమే యనుభావ మిటసూచితము. ఇంద్రుని కార్యము నుపమానముగాఁ జెప్పుటయు సీతాశీలమున కించుకంతయు బాధ లేదనునర్థము స్ఫురించుటకే యని యెఱుంగవలయు. అనఁగా నో సీతాదేవీ! నేను నిన్నుఁ గొనివచ్చినది నామేలుకొఱకే కాని నిన్నుఁ గష్టపెట్టుటకు మాత్రము కాదు. శ్రీరామునను గ్రహము నాపైఁ బొలయు నంతదనుక నీవిట నుండవలసినదే. కాని నాచేతులార నిన్ను శ్రీరామున కొసంగుట పొసంగదు. నన్నుఁ బొలియించి రాముఁడు నిన్నుఁ గొని చనవలయునని రావణునిభావము.

"చారుస్మితే చారుదతి చారునేత్రే విలాసిని. ౨౯
మనో హరసి మే భీరు సుపర్ణః పన్నగం యథా,"

అని మూలము. ఈవాక్యముచేత స్వాభిప్రాయమును సీతకుఁ దెలుపుకొనుచున్నాఁడు. ప్రతిపదము గంభీరార్థము గలదియే యని యూహింపవలయు. చారుస్మితే=సీత రావణునిరూపము చూచినదాదిగ దుఃఖముల పాలయినది. ఆమె కన్నీటిని దప్ప నింకొకదాని నతఁడు చూడలేదు. ఇట్లుండఁగా "చారుస్మితే" అని సంబోధించుచున్నాఁడు కదా. ఏల?

"మందస్మితప్రభాపూరమజ్జత్కామేశమానసా."

అను సహస్రనామస్తోత్ర మతఁ డెఱుంగును. నీవు నవ్వినంతన నీప్రభువగు భగవంతుఁడు సంతోషించును. అట్టిదానవు నీవని యతఁడు నుతించెను.

"స్మితజ్యోత్స్నాజాలం తవ వదనచంద్రస్య పిబతాం
చకోరాణామాసీదతిరసతయా చంచుజడిమా,
అతస్తే శీతాంశోరమృతలహరీ మామ్లరుచయః
పిబంతి స్వచ్ఛందం నిశినిశి భృశం కాంజికధియా."

అని శంకరభగవత్పాదులు సౌందర్యలహరియందుఁ దెలిపిరి. స్మితప్రభావ మిట్టిదని యిది తెలుపును. అట్లే సీతాదేవీ! నీస్మిత ప్రభలు నాపైఁ బొలయింపుమా యని ప్రార్థించెనని మన మెఱుంగవలయు. చారుదతి! సుందరదంతవిరాజితా! అని సంబోధించెను.

"శుద్ధవిద్యాంకురాకారద్విజపంక్తిద్వయోజ్జ్వలా."

అను సహస్రనామస్తోత్రార్థమునే తెలుపఁ బూనెనని భావము గ్రాహ్యము. జ్ఞానదాత్రి వనునాశయ మాతనిమనస్సునఁ బొడ కట్టెనని మన మెఱుంగవలయు. చారునేత్రే! సుందరనేత్రా యని సంబోధించెను గదా. ఆతనిభావ మేమి?

"పవిత్రీకర్తుం నః పశుపతిపరాధీనహృదయే
దయామిత్రై ర్నేత్రై రరుణధవళశ్యామరుచిభిః,
నదశ్శోణో గంగా తపనతనయేతి ధ్రువమయం
త్రయాణాం తీర్థానాముపనయసి సంభేదమనఘం."

అని శంకరభగవత్పాదులవారు సౌందర్యలహరియందుఁ దెలిపినభావమే రావణునాశయమని మన మూహింపవలయును. నీ కటాక్షవీక్షణఫలము నాకుం గలిగింపుమా యనియే రావణునిప్రార్థన మని యిందలిసారము. ఇట్టి నీవు జానకీ! భీరు = భయపడినట్లు నటించుచున్న దానవు. మే మనో హరసి=నామనస్సును హరించుచున్న దానవు. ఇయ్యది కామాతురునిమాట

గాక భక్తునిమాట యగునా యని యడుగుదురేమో. గరుత్మంతుఁడు పన్నగమును హరించునట్లు నామనస్సును హరించుచున్నదానవని యతఁ డనెను గదా. భావమేమి? పామును గరుడుఁ డేల హరించును? భక్షించుటకుగా హరించును. అట్లే నామనస్సును హరించుచున్నదానవు. అనఁగా నతనియభిప్రాయ మేమి? నన్ను వధించుటకే అని గాక మతే మగును? దయావిశేషమున నాకీజన్మము తొలఁగునట్లు చేయుమా యని ప్రార్థించెననియే మనము సారమును గ్రహింపవలయును.

"క్లిష్టకౌశేయవసనాం తన్వీమప్యనలంకృతాం. 30
త్వాం దృష్ట్వా స్వేషు దారేషు రతిం నోపలభామ్యహం,"

తల్లీ! నిన్నుఁ జూడఁగనే స్వేషు=ధనములయందు, దారేషు=భార్యలయందు, రతిం=అనురాగమును, నోపలభామి=పొందకున్నాను, అని పలికెను. అలంకరించుకొనకయున్న నిన్నుఁ జూడఁగనే నా భార్యలయందుఁ బ్రీతికలుగకున్నది. అనునది సమంజసముగా నుండదు. అసంగతమే. కావున నిచ్చో నీదర్శన మాత్రమున సంసారప్రీతి నివర్తించినదని గ్రహించుటయే సుసంగతము.

"అంతఃపురనివాసిన్యస్స్త్రియస్సర్వగుణాన్వితాః. 31
యావంత్యో మమ సర్వాసామైశ్వర్యం కురు జానకి,"

అని మూలము. రావణుఁడు భక్తుఁడని తెలుపుటకై యీఘట్టమున నెన్నియోపదముల నథ్యాహార్యములుగాఁ జేర్చినవారు మహేశ్వరతీర్థ లనువారు కలరు. ఇచ్చో గోవిందరాజులు కూడ విధిలేక "ఐశ్వర్యం స్వామినీ!త్వం కురు ప్రాప్నుహి." అని

వ్రాసిరి. అధ్యాహార్యములు తప్పులు గావు. అర్థద్యోతకము లని గ్రహింపవలయును. జానకీ! నా యంతఃపురకాంతలు సకల సద్గుణములు గలవారు. వారలకందఱకు నైశ్వర్యము చేయు మనఁగాఁ గల్గింపుము. నాసౌందర్యభాగ్యములం గోరి యెంద ఱో స్త్రీలు వలచి వచ్చినవారు. వారెల్ల సద్గుణములు కలవా రలే. వారలకు నామూలమున దుఃఖము గలుగకయుండ జ్ఞాన ధనము ననుగ్రహింపు మని ప్రార్థించెనని యెఱుంగుట మంచిది.

"మమ హ్యాసితకేశాంతే త్రైలోక్యప్రవరాస్త్రియః. 32
తాస్త్వాం పరిచరిష్యంతి శ్రియమప్సరసో యథా,"

అని మూలము. శ్రీదేవికి నచ్చర లుపచారములు చేయునట్లు త్రిలోకములయందును నన్నుఁ గామించియుండు నుత్తమ స్త్రీలు నీకు నుపచారములు చేయుదురు. అనఁగా నీసేవార్థమై వారినెల్లఁ బంపుదు. నీ వంగీకరింపుమని భావము. ఇందుఁ గామాతురత్వమున రావణుఁ డాడిన కఠినవాక్కు లేవి యున్నవి?

"యాని వైశ్రవణే సుభ్రు! రత్నాని చ ధనాని చ. 33
తాని లోకాంశ్చ సుశ్రోణి మాం చ భుంక్ష్వ యథాసుఖం,"

అని మూలము. కుబేరుఁడు శంకరప్రసాదలబ్ధ దిక్పాలకత్వ విశిష్టుఁడు. కావున శంకరభక్తుఁడు. నేను నట్టివాఁడనే. నీ సేవార్థము సకలరత్నాభరణములఁ దెచ్చితిని. ధనము కూడఁ దెచ్చితిని. వానిని నన్ను లోకములను నీకెట్లు చేయనిష్టమో యట్లు లోనరింపుము. వేనిమూలమున నేపనులు గానవలయు నని తోఁచిన నట్లు గావింపుము. నీమనస్సున కేది తృప్తియో యట్లు కార్యమును సాగింపుము.

"న రామ స్తపసా దేవి న బలేన న విక్రమైః. 38
న ధనేన మయా తుల్య స్తేజసా యశసాపి వా,
పిబ విహర రమస్వ భుంక్ష్వ భోగా
న్ధననిచయం ప్రదిశామి మేదినీం చ, 39
మయి లల లలనే యథాసుఖం త్వం
త్వయి చ సమేత్య లలంతు బాంధవా స్తే.
కుసుమితతరుజాలసంతతాని భ్రమరయుతాని సముద్రతీరజాని, 30
కనకవిమలహారభూషితాంగి విహర మయా సహ భీరు కాననాని."

అని మూలము. దీనిచేఁ దనభావమునంతయు విశదీకరించు చున్నాఁడు. జానకీ! తపోబలవిక్రమాదులచే నేను గర్వినైతి నని భావింపకుము. శ్రీరాముఁడు తపఃప్రభృతులచే నాకు సమానుఁడని నే నేనాటికిఁ దలంపను. అసమానుఁడనియే తలంతును. కావున భగవంతునియందు నాకత్యంత భక్తిభావము కలదు. అట్టిభక్తుని నన్ను విశ్వసించి యమృతాసవముం గ్రోలి నాయింటఁగల యేభోగ్యవస్తువును గాని పరిగ్రహించి నారాజ్యమును గూడఁ దీసికొని నాపై విశ్వాస మునిచి ప్రీతునిం జేయుము. నిన్నుఁ గూడి భక్తులందఱు నాయింట సుఖింతురు గాక. భగవతికి మహాకాననవిహార మిష్టముగ నుండును. "కదంబకాననావాసా" అని యున్నది కదా. సకలర్తు పుష్పనిబిడములై భ్రమరసంకులములై సముద్రతీరభూములయందు విలసిల్లు పూఁదోఁటలయందు భక్తుఁడనగు నన్నుఁ గూడి విహరింపుము. భగవదారాధనమునకు నిర్మలములు నిరుపద్రవకరములు నగు నేకాంతస్థలములు కాననములు. అందు విశేషించి దేవత లుందురు. వారినే వనదేవతలని మన మందుము.

వృక్షాధిదేవతలు నందే యుందురు. వారు నిన్ను సేవింతురు. అట్టి సేవాభాగ్యము నాకు ననుగ్రహింపుమా యని రావణుఁ డభ్యర్థించెను.

ఆర్యులారా! ఈసర్గమునఁ గలశ్లోకములన్నియు "సాకారై ర్మధురైర్వాక్యైః" అని సర్గాదియందు వాల్మీకిమహాముని చెప్పినట్లే యర్థములు గలిగియున్నవి. ఆమాటలఁ గల యర్థవిశేష మితరులకుఁ దెలియరాదు. కావున నామాటల నాలకించియు జానకి దుఃఖమున మాటలాడఁబూనుట మీఁది సర్గమునఁ గనుపట్టు. ఈచెప్పిన యర్థమంతయు నామె సంభాషణమును బట్టిచూచినఁ గేవలకల్పితము కాదా యని యందు రేమో. ఇందొకరు విశేషార్థములు గలుగునట్లు మాటలాడు వారు. రెండవవారు దాని గ్రహింపఁజాలనివారు నైన మీఁసందియమున కవకాశము గలదు. సీత మహాప్రకృతి. తన రూపమును దాఁచి ప్రతికృతిరూపమున నిందున్నది. రావణుఁడు భక్తుఁడనియు శాపోపాత్తదేహుఁడనియు శాపనివృత్తికిఁ దానే హేతుభూతురాలననియు నెఱుంగును. కావుననే రావణవధార్హ్మము లగుమాటలనే పల్కనున్నది. ఆమాటల నాలకించినఁ గాని హనుమ రామచంద్రునకు సీతాదురవస్థను దెలుపఁడు. తెలిపినఁ గాని రాముఁడు రాఁడు. రాకున్న రావణశరీరముక్తి కల్గదు. రెండునెలలలో రావణుఁడు శరీరమును వదలనున్నాఁడు. కావున సీతావాక్కులు దుఃఖము నటించుటనే తెలుపునవియని మన మెఱుంగవలయు. ఇందుండి గ్రహింపఁదగినవిషయము లేవి? ఉపాసకుఁ డిష్టదేవతకు సర్వస్వము నివేదింపవలయు. తద్దేవతాసాక్షాత్కారమునే కోరుచుండవలయును. తన కేరూపమునఁ బ్రీతియుండునో యట్టి

రూపమునే యిష్టదేవతకుం గల్పించి ధ్యానింపవలయును. ఆధ్యానమునకు ఫలము సంసారమునందు విరక్తి కలుగుటయే. భార్యాప్రముఖ ప్రీతికరవస్తువులయం దత్యంతప్రీతి నశింపవలయును. సమస్తము తన్మయముగాఁ గనఁబడవలయును. తద్భిన్న మేదియుఁ దనకంటెకిఁ బ్రీతిపాత్రముగ నుండరాదు. బాహ్యపూజ పరోపదేశార్థము. మానసికపూజ సంసారసాగరతరణార్థము. అను నీ లోనగుఫలములే యుపాసకునకుఁ గలుగవలయుననియు నవి కలిగినఁ గాని యాదేవతారాధనము పూర్తికాదని యెఱుంగవలయు. ఇఁక నధ్యాత్మరామాయణమున నీఘట్టమున నేమున్నదో పరికింతము.

"రావణోఽపి తదా సీతామాలోక్యాహ సుమధ్యమే,
మాం దృష్ట్వా కిం వృథా సుభ్రు స్వాత్మన్యేవ విలీయసే. ౨౨
రామో వనచరాణాం హి మధ్యే తిష్ఠతి సానుజః,
కదాచిద్దృశ్యతే కైశ్చిత్కదాచిన్నైవ దృశ్యతే. ౨౩
మయా తు బహుధా లోకాః ప్రేషితాస్తస్య దర్శనే,
న పశ్యంతి ప్రయత్నేన వీక్షమాణాస్సమంతతః. ౨౪
కిం కరిష్యసి రామేణ నిస్పృహేణ సదా త్వయి,
త్వయా సదాలింగితోఽపి సమీపస్థోఽపి సర్వదా. ౨౫
హృదయేఽస్య న చ స్నేహస్త్వయి రామస్య జాయతే,
త్వత్కృతాన్సర్వభోగాంశ్చ త్వద్గుణానపి రాఘవః. ౨౬
భుంజానోఽపి న జానాతి కృతఘ్నో నిర్గుణోఽధమః.
త్వమానీతా మయా సాధ్వీ దుఃఖశోకసమాకులా. ౨౭
ఇదానీమపి నాయాతి భక్తిహీనః కథం వ్రజేత్,
నిష్కృత్త్వో నిర్మమో మానీ మూఢః పండితమానవాన్. ౨౮

నరాధమం త్వద్విముఖం కిం కరిష్యసి భామిని,
త్వయ్యతీవ సమాసక్తం మాం భజస్వాసురోత్తమం. ౨౯
దేవగంధర్వనాగానాం యక్షకిన్నరయోషితాం,
భవిష్యసి నియోక్త్రీ త్వం యది మాం ప్రతిపద్యసే." ౩౦
సుందరకాం. ౨౦వ సర్గము.

అను నీగ్రంథభాగముం గాంచిన వాల్మీకిభావమే స్పష్టమగును. శ్రీరామునియందు నిస్సత్త్వ నిర్వికల్ప నిర్మమత్వాదిగుణములు కలవని రావణుఁ డనుటంజేసి భగవంతుఁ డనుభావము స్పష్టముగా నతనికిం గలదనియు సీత మహామాయ యనువిశ్వాసము కలదనియుఁ దేటపడును. తక్కిన యతనికృత్యమంతయు నటనమనియు మన మూహింప నవకాశము కలదు. ఈభావమున రామచరిత్రమును బఠించినఁ బరమపావనగ్రంథమని తేటపడును. ఇఁకఁ దరువాతి గ్రంథభాగమును బఠింతము. పూర్వసర్గాభిప్రాయమునకు దీనికి సంబంధము లేదను దుర్భావమును వీడి సీతాంబ మూలప్రకృతి యని నమ్మి యామె దుఃఖమును నటించెనని యెఱింగి తచ్చరిత్రమును బఠించిన నుత్తమోత్తమకావ్యపఠనఫలము నందఁగలము.

## సీత రావణునకు హిత ముపదేశించుట.

* భయముఁగొలుపుచు రావణుఁ డాడినమాటల నాలకించి సీతాదేవి యార్తయై స్వరము దీనతను సూచింప నిట్లు పలికెను. మహాసాధ్వియగు జానకి రోదనము చేయుచు భీతిచే వడంకుచుఁ జూచువారల కక్కటా యని తలపోయఁ జేయుచు

* ఇది ఇరువదొకటవసర్గమునఁ గల కథాభాగము.

మనమున శ్రీరామునే ధ్యానించుచు నతనిం జూచుచు మాట
లాడుట పతివ్రతలధర్మమునకు విరుద్ధము గావున నొకతృణము
నెదుట నునుచుకొని దానినే చూచుచు నిట్లు పలుకసాగెను.
రావణా! నావలననుండి మనస్సును మరలించుకొనుము. దానిని
భార్యలయందే యునుపుము. పాపాత్ముఁడు మోక్షలాభము
నాశింపఁడు. అట్లే నీవు నన్నుఁ గోరఁదగదు. నీవెంతగాఁ గోరి
నను బాపికి మోక్షలాభము కలుగునట్లు నీకు నావలని
లాభము కలుగదు. వివాహపద్ధతిని నేను సత్కులమున నడుగు
పెట్టినదానను. సద్వంశమున జన్మించినదానను. పతివ్రతను. ఇట్టి
నేను నిందాపాత్రమైనకార్యము నొనరింతునా? అని తెలిపి
విశాలకీర్తిని గాంచిన యాసీత మరల నిట్లు పలుకఁ బూనెను.
రావణా! నేను బరభార్యను. నియతవ్రతురాలను. కాన నీకు
భార్య గాఁదగను. సాధువులధర్మమును జక్కఁగా నెఱుం
గుము. సత్పురుషులనియమమును జక్కఁగా నెఱుంగుము. ఈ
వర్తనము నీ కనర్హము. రాక్షసా! పరులు నీభార్యలతో
మాటలాడునపుడు నీ కెట్లుతోఁచును? అనుదాని నీవే యో
జించుకొనుము. నీవెట్లు నీభార్యలను నిర్దోషలనుగాఁ జేయఁ
బూనుదువో యట్లే యితరులు పూనుదురని యెఱుంగుము.
అట్లుచేయుట యెల్లపురుషులకు విధి. కావునఁ బరభార్యలం
గోరక స్వదారలయందే యభిరుచి గలవాఁడవు కమ్ము. స్వభా
ర్యలయందు సంతృప్తిచాలక చపలేంద్రియుఁడై గూఢవిప్రియ
పరతంత్రుఁడై పరపత్నులం గోరునేని వాని యాయురైశ్వ
ర్యాదులు నశించును. నిన్ను దుర్వ్యవసాయమునుండి బుద్ధి
చెప్పి మరలించుపెద్ద లిందెవ్వారును లేరా? విభీషణాదు
లున్నారు. కాని వారి ననుసరింపవు కాఁబోలు. కనుక నే

వారు నీకు హితముపదేశింపకున్నారు. విపరీతఫలము నొసఁగు నీదుర్బుద్ధియే యీవిషయమును జాటుచున్నది. నా బుద్ధియెట్టిదో నీవె మెఱుంగుదువందువేమో. శిష్టాచారమును మాని యిట్లు వర్తించుటయే నీబుద్ధి యిట్టిదని తెలుపుచున్నది. పండితులు హితము నీకుఁ దెలిపినను వారిపై స్నేహము నభినయించి యంతరంగమున వారలకు నాశముం గలిగింపఁబూని వారిపలుకుల నాదరింపకున్నావో, దుర్ణయుఁడు వివేకహీనుఁడు రాజగునేని సంపత్సమృద్ధములగు దేశములుగూడ నశించును. అట్లే యీలంకయు నీవు రాజవైనకతన నీ యపరాధమాత్రముననే వేగమ నశింపఁగలదు.

రావణా! పాపకర్ముఁడు దూరదృష్టి లేక స్వపాపకార్యహతుఁడై క్షీణింపఁగాఁ గని తక్కినవా రానందింతురు. అట్లే నీవు నశింపఁ గలవు. నీకు హితము తెల్పి ధన్యులు కానివారెల్లరు ప్రీతు లగుదురు. నీ యంతఃపురకాంతలకు నన్నీశ్వరినిగా నొనరించుట ఆభరణాదుల నొసంగి వానిపై నాకాశగలిగించుట యనునవి నన్ను నీకు లోఁబడఁ జేయఁజాలవు. వెలుతురు భాస్కరుని వదలియుండనట్లే నేనును శ్రీరామునకు వేఱుపడి యించుకయు నుండను. లోకాధినాథుఁడగు శ్రీరామునిమన్ననఁ గన్నదానను. అట్టి నే ననామకుఁడగునొకనిబుజమునఁ దలమోపుదునా? వేదవ్రతస్నాతుఁడై బుద్ధిశాలియు నాత్మజ్ఞానసంపన్నుఁడు నగు బ్రాహ్మణునకు యోగవిద్య తగియున్నట్లు నేను శ్రీరామునకే తగినభార్యను. అంతియకాని వేఱొకరికిం గానని నమ్ముము. రావణా! నీవు మిగుల మంచివాఁడవు గదా. వనగజమును విరహవేదనచే శ్రమంపడు ప్రాయంపుటాఁడుగజముతోఁ గూర్చుచందమున రాము

నెడఁబాసి నవయు నన్ను శ్రీరామునిం బిలుపించి సంధింపుము. నీవీలంకాపురమున మరల నుండ వాంఛింతువేని చావకుండ నుండ నాశింతువేని పరమపురుషుఁడగు శ్రీరాముని మైత్రి సంపాదించుకొనుట మంచిది. ఎందులకందువో ఆ రామమూర్తి సకలధర్మవేత్త, శరణ్యుఁడు, అనుమాట లోకవిదితమే. కాన నీవు జీవించియుండఁదలంచిన శరణాగతవత్సలుఁడగు నా రాముని తో మైత్రి గావించుకొనుము. రాముని బ్రసన్నునిగాఁ జేసికొనుము. నీనిమిత్తము నేను నాతనిఁ బ్రార్థింతును. సహజవత్సలత్వ విశిష్టుఁడు గాన మన్నించును. శరణుచొచ్చుట యొక్కటియే చాలదు. కాలుష్యము వదలి పరిశుద్ధాంతరంగుఁడవై నన్ను రామునకు సమర్పింపవలయు. దాన నీకు మేలు కలుగును. అట్లు చేయవేని తప్పక శ్రీరామునివలన నీకు మరణము కలుగును. ఇంద్రుఁడు వైచిన వజ్రమైన నిన్ను వదలవచ్చు. యముఁడు నిన్నుఁ బట్టికొని విడిచినను విడువవచ్చు. శ్రీరామున కాగ్రహము కలిగెనా చంపక వదలఁడు. వేగమ శ్రీరామధనుర్నినాదము నాలకింపఁ గలవు. శ్రీరామలక్ష్మణులు ఘోరబాణములు మండుచు నీలంకలోఁ బడఁగలవు. అవి కంకపత్త్రాంకితము లగుట వడివడి రక్కసుల నుక్కడఁగించుచు లంకయం దెల్లయెడల వ్యాపింపఁగలవు. శ్రీరామగరుత్మంతుఁడు రాక్షసక్రూరసర్పముల నశింపఁజేయును. నీకడనున్న నన్ను రామునకు మరలఁ గైకొన శక్యమగునా యంటివి కదా. విష్ణువు మూఁడడుగులచే నసురులయొద్దనుండి దేవలక్ష్మిని హరించినట్లు నీకడనున్న నన్నుఁ గొనిపోవఁ గలఁడు. జనస్థానము హతము కాఁగా నందలి రాక్షసు లుక్కడంగఁగా నీ వెదుర్కొనఁజాలక భయముచే దొంగిలి నన్నుఁ దెచ్చితివి.

ఇది దుష్కార్యము కాదనం దరమా! పురుషసింహులగు నా యన్నదమ్ము లాశ్రమమునుండి వెడలిపోవఁగా నీవందుఁ బ్రవేశించి చౌర్యమున నన్నుఁ దెచ్చితివే. హరివాసనయైన నీమీఁదఁ బ్రవహించియుండిన వ్యాఘ్రములజాడఁ గాంచిన బక్కకుక్కవలె నిముసమైన నట నిలిచియుండఁ జాలవు. బల హీనత భయపడియే యున్నావు. అట్టి నీకా యన్నదమ్ములతో యుద్ధము గలుగునేని జయము నీకుఁ గలుగుట యూహింపను గూడ శక్యము గాదు. ఇంద్రవృత్రులకు సంగ్రామము కలుగఁ గా ద్విభుజుఁ డగుట నింద్రునకు నేకభుజుఁ డగుట వృత్రునకు జయాపజయములు కలిగినట్లు వారిద్దఱు నీవొక్కరుఁడవు నగుట నీ కపజయము కలుగకపోదు. నాప్రాణేశ్వరుఁడగు రామభద్రుఁడు సోదరుం గూడి భానుఁడు కిరణములచే స్వల్ప జలమును గ్రహించునట్లు వేగమ యాశుగములచే నీప్రాణ ములం గొనును. రావణా! నీకిది మంచికిఁ దగినకాలము కాదు సుమా! కనుకనే నన్ను నిట్లు తెచ్చితివి. కనుక రామునియెదు టంబడక కుబేరుఁడున్న కైలాసమున కేగినను, మఱియు నే యూర్ధ్వలోకమునకుఁ బోయినను, వరుణసభకుఁ గాని యిం కనుగల యధోలోకములకుఁ బోయినను, మఱియు నేచోటి కరిగినను మహాశనిపాతమునకు మహావృక్షము కూడఁ బడక యుండ లేనియట్లు నీవును దప్పించుకొనఁ జాలవు. అని పలికెను.

మహాశయులారా! యీ సీతావాక్యములయందుఁ గల యర్థవిశేషము నరయుదము.

"తస్య తద్వచనం శ్రుత్వా సీతా రౌద్రస్య రక్షసః,
ఆర్తా దీనస్వరా దీనం ప్రత్యువాచ శనైర్వచః." ౧

అని మూలము. రావణుఁడు రౌద్రాకారుఁడు. సీత మానవ స్త్రీ. అందును భయపడియున్నది. అట్టియామె వానిమాటలకు బదులుచెప్పక యుండఁదగు. పాతివ్రత్యమహిమాతిశయమున వానిని దహింపఁగలనను ధైర్యము గలదని యంగీకరింతుమేని వినరానిమాటల వినినపుడు రోషావేశమునఁ దడఁబాటున నెట్లో పలుకవలయును. అట్టిచోట శనైర్వచః ప్రత్యువాచ. మెల్లఁగా బదులు చెప్పెను. అనఁగా భావమేమి? ఇతరులకుఁ దనభావము తేటపడనియట్లు మెల్లఁగాఁ బలికెను. అనఁగా నాతనిమాటలకుఁ దగిన ట్లుత్తరము చెప్పెను. అని మన మెఱుంగవలయు.

"దుఃఖార్తా రుదతీ సీతా వేపమానా తపస్వినీ,
చింతయంతీ వరారోహా పతిమేవ పతివ్రతా. ౨
తృణమంతరతః కృత్వా ప్రత్యువాచ శుచిస్మితా,"

అని మూలము. ఇందలి దుఃఖార్తా అను లోనగుపదములు పైన వ్రాసినయర్థమును సమర్థింపవు గదా యందురేమో. దుఃఖము నటించునని వ్రాసియుంటిని గదా. ఇందే మీఁదియర్థమును దృఢపఱచుపదముల వాల్మీకియే ప్రయోగించి తన యాశయమును దెలిపెను. పతిమేవ చింతయంతీ=శ్రీరామునే తలంచుచు. ఏభావమున? ఈతఁడు నీకొఱకు వేచియున్నవాఁడు. మృత్యు వాసన్నమగుచున్నది. నీవును సకాలమున రావలయునని ప్రోత్సహించుటకే యని యెఱుంగవలయు. వరారోహా=ఈవిశేషణ మిచ్చో నుండఁదగునా? అవయవసంస్థానవిశేషము గలస్త్రీ వరారోహ యనఁబడును. పృథుతరనితంబములు గలదని భావము. చక్కఁగాఁ గూరుచుండి భర్తయగు

శ్రీరామునే తలంచుచు నని యర్థము పొడకట్టు. ఇంతటి మానక మహాకవి "శుచిస్మితా" అనియుఁ బ్రయోగించెను. ఇచ్చో నీవిశేషణము చేర్పు టత్యంతానుచితమని తోఁపక మానదు. వాల్మీకివంటి మహాకవి వ్యర్థముగాఁ బాదపూరణార్థము ప్రయోగించె ననవచ్చునా? మహాపచారము కాదా యది! ఈసమయమున సీతాప్రవృత్తి కది ప్రత్యక్షవిరుద్ధము. కావున నిందేదో యర్థవిశేష ముండియే తీఱునని తోఁచును. చక్కఁగాఁ బద్మాసనమునఁ గూరుచుండి మోమునఁ జిఱునవ్వు చిందులాడ (విశేషించి పరిశుద్ధమగు చిఱునవ్వు) మెల్లఁగా ననఁగాఁ దొందఱ యేమాత్రము లేక రావణునితో నిట్లు భాషించెననుభావ మేర్పడుచున్నది. పూర్వసర్గవిరుద్ధమనువా రెవ్వరో యోజింపుఁడు. రామాయణ మసత్కావ్య మనువారలే. రావణునాశయ మెఱింగి భగవంతుని స్మరించి నవ్వుచు నది తన పరిశుద్ధభావమును దెలుపుచుండఁగా మంద మందభాషణముల బదులుచెప్పెనని సారము గ్రహింపవలయు. తృణమంతరతః కృత్వా=రావణునకుఁ దనకు నడుమ నొకగడ్డి పోఁచ నునుచుకొని యని యున్నది. ఉత్తమకాంతలు పర పురుషునితోఁ బతి సన్నిధి లేనితఱి సంభాషింపరాదను సదాచారమును బాటింపఁగోరి యని భావము. ఇచ్చోఁ దనిశ్లోకి యందుఁ దోఁచిన భావములెల్ల వ్రాయఁబడియున్నవి. అనేక వికల్పములుగా భావములు తెలిపిన నందేదియు సత్యముగా దని యితరులకుం దోఁపవచ్చు. ఒక్కవిషయమును బ్రధాన ముగాఁ జేసికొని వచించు టుత్తమమని పెద్ద లందురు. రావణా! నీకోరిక నీడేర్పు టొకమహాకార్యము కాదుసుమీ. అది తృణప్రాయము. సులభసాధ్యమని భావము. శీఘ్రకాల

మున నదియు ఫలించును. అనుభావము రావణునకుఁ దెలియు టకై యితరుల కెల్లెట్లూహించిన నట్లెల్లఁ దోఁచునట్లు చేయు టకై గడ్డిపోఁచను నడుమ వైచి మాటలాడెనని భావ మేర్పడు చున్నది. తృణము నడుమ నున్నంతమాత్రమునఁ బరపురుషుఁ డగపడక పోఁడు. కావున నిది యీపైని వ్రాసినభావమును దేటపఱచుటకే యని మన మూహించుట మంచిది. తలుపు చాటుననుండి పరునితో మాటలాడు టొకదేశమున నాచా రము స్త్రీలయందుఁ గలదు. అట్టిది యిది కాదనియే మన మెఱుంగందగు.

"నివర్తయ మనో మత్తః స్వజనే క్రియతాం మనః. 3
న మాం ప్రార్థయితుం యుక్తం సుసిద్ధిమివ పాపకృత్."

అని మూలము. సీతాంబ స్వాశయమును దేటపఱచుచున్నది. రావణా! నావలన నేయేవాంఛలు సిద్ధింపవలయునని కోరితివో యవియెల్ల నిపుడు సాగునవి కావు. నీకు ఫలప్రదానము చేయువాఁడు శ్రీరాముఁడు. నాయారాధనమున కిది యదను గాదు. కాన నాబుద్ధిని మరలించుకొనుము."స్వజనే క్రియతాం మనః." నీభార్యలయందు మనసు నునుపుము. వారి నాదరిం పుము. ఇఁకఁ జాలకాలము నీవు వారి నాదరింపఁ జాలవు. కనుకఁ గాలహరణముచేయక వారి నూఱడింపుము. నన్నుఁ బ్రార్థించి లాభములేదు. నామూలమున నీకు ఫలము కలుగు కర్మము నీవు చేయలేదు. నీయారాధన మిష్టసిద్ధిదమన్న శాస్త్రము సత్యము కాదా యందువేమో కర్మానుసారముగా నారాధనము జరగవలయును. నీకు నారాధ్యము శ్రీరామ రూపమే. అట్టికర్మము నీవు చేసితివి. కాన నన్నారాధించుట లాభము కాదు. పాపాత్ముఁడు తపస్సుచేసిన ముక్తి దొరకదు.

ఆజన్మమునఁ జేసినతపస్సు పాపములనే తొలఁగించును. అశ్లే నీవీజన్మమున నన్నారాధించినను లాభము కలుగదని భావము. దీనింబట్టి యీభావము తేలుచున్నది. ఏరూపనామములు గలదేవత నుపాసించిన మేలు గలుగవలయునో ప్రాక్తనకర్మానుసారముగ నాదేవతనే యుపాసింపవలయు. ఆతపము ఫలించును. దేవతాంతరము నుపాసించిన నది ఫలింపదు. పట్టుదలచేఁ గావింపఁబూనిన నది విరుద్ధఫలముగా మాఱును. కావున మంత్రార్పణము ముఖ్యమని చెప్పఁబడినది. ఉపాసకుఁడు తన కేది యుపాసనార్హదేవతయో సద్గురువులమూలమునఁ దెలిసికొని దానిని గ్రహించి విధిహితముగా నుపాసించిననే ఫలము కలుగును. లేకున్న నిష్ఫలమో మఱియు మాటలాడిన దుష్ఫలమో కలుఁగును. ఈభావ మీభాగము మనకుఁ దెలుపుచున్నది.

"అకార్యం న మయా కార్యమేకపత్న్యా విగర్హితం. ౪
కులం సంప్రాప్తయా పుణ్యం కులే మహతి జాతయా,"

అని మూలము. పతివ్రతనగు నాచే నకార్యము చేయఁబడరాదు. పుణ్యకులమునఁ జేరితిని. అత్తవారు సత్కులులని భావము. సద్వంశమున జనించితిని. కావున నేఁ జేయఁదగని కార్యము చేయరాదని తాత్పర్యము. సకలఫలముల నిచ్చు దానవు నీవే కదా. నావాంఛితముల నేల ఫలింపఁజేయరాదని రావణుఁడు ప్రశ్నించునేమో యని సమాధానము సీతాదేవియే యిచ్చుచున్నది. సకలమునకుఁ గర్తృత్వము నాయందే కలదు. కాని శాస్త్రము నతిక్రమింపరాదు. శాస్త్రము ననుసరించియే కర్మ ఫలముల నీవలయును.

"తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవినిర్ణయే,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి."

అను గీతాశాస్త్రము కలదు కదా. నీవు పురుషరూపముమూల మున నిష్టసిద్ధి గాంచవలసినకర్మము చేసితివి. కాన నదియు నారూపమేయైన నక్లే యుపాసించి యిష్టసిద్ధిని గాంచవలయు నని సీత తెలిపెను. ఇం దొక్క విశేషము కలదు. ఉత్తమకుల సంజాత యగుయువతి యుత్తమకులమున జనించినవానినే భర్తగాఁ బడయవలయును. కాని అల్పకులసంజాతుని బడయ రాదని సీతాదేవి స్త్రీలకు నుపదేశించుచున్నది. అట్టి నేన కార్యముచేయరాదు. అనఁగా నల్పకులమునఁ బుట్టిగాని యల్ప కులజుని బెండ్లియాడిగాని యుండు స్త్రీలకార్యము చేసినను జేయవచ్చును. కాని యుత్తమకులమువారు చేయరాదు. అనఁగాఁ బ్రాణాపాయస్థితియందును గులగౌరవమును గాపాడ వలయునని యిది తెలుపుచున్నది.

"అవిప్లుతబ్రహ్మచర్యో లక్షణ్యాం స్త్రియముద్వహేత్,
అనన్యపూర్వికాం కాంతా మసపిండాం యవీయసీం. ౫౨
అరోగిణీం భ్రాతృమతీ మసమానార్ష గోత్రజాం,
పంచమాత్సప్తమాదూర్ధ్వం మాతృతః పితృతస్తథా. ౫౩
దశపూరుషవిఖ్యాతాచ్ఛ్రోత్రియాణాం మహాకులాత్,
స్ఫీతాదపి న సంచారి రోగదోషసమన్వితాం. ౫౪
ఏతైరేవ గుణైర్యుక్త స్సవర్ణశ్శ్రోత్రియో వరః,
యత్నాత్పరీక్షితః పుంస్త్వే యువా ధీమాన్ జనప్రియః." ౫౫
యాజ్ఞవల్క్యస్మృతి. ఆచారకాం.

లక్షణ్యాం బాహ్యాభ్యంతరలక్షణైర్యుక్తామ్. అని మితాక్షర. తల్లినుండి యైదుతరములు తండ్రినుండి యైదుతరములు

ప్రఖ్యాతిగాంచిన వంశమునుండి కన్యకను గ్రహింపవలయును. సదాచారాదులే విఖ్యాతిహేతువులు కాని స్వేచ్ఛాప్రవర్తనాదులు కావు. అట్లు సద్వంశమును బరీక్షించి యందుండి గన్యకను గ్రహించి పెండ్లియాడవలయునని యేర్పడుచున్నది. తెల్లమచ్చలు పెద్దరోగము అపస్మారము లోనగునవి పరంపరాప్రాప్తములు. అట్టిరోగము లుండెనేని సద్వంశమునుండియుఁ కన్యకను గ్రహింపరాదని స్మృతి తెలుపుచున్నది. వరునకుఁ గూడ నీపరీక్షయే తెల్పఁబడినది. కులముననుసరించి కొన్ని దురభ్యాసము లుండుననియు సత్కులమును బరీక్షించి వివాహముచేసికొనిన నట్టి దురభ్యాసము లుండవనియు భావము. దీనిచే నసవర్ణవివాహము మంచిది గాదని రామాయణము తేటపఱచుచున్నది. అల్పకులజు లెంత చదువుకొనినను బూర్వులమర్యాదల ననుసరించి దురభ్యాసములు వదలవని సారము. కులము ప్రధానము కాదనువాద మెంతయు నిస్సారమని మన కీభాగము తెల్పుచున్నది.

"నాహమౌపయికీ భార్యా పరభార్యా సతీ తవ. ౬
సాధుధర్మమవేక్షస్వ సాధు సాధువ్రతం చర,
యథా తవ తథాన్యేషాం దారా రక్ష్యా నిశాచర. ౭
ఆత్మానముపమాం కృత్వా స్వేషు దారేషు రమ్యతాం,"

అని మూలము. "అహమౌపయికీ న భార్యా." = నేను నీచే భరింపఁదగినదానను గాను. శ్రీరామునిచే భరింపఁ దగినదానను. అనఁగా నన్నింటుకొని యారాధింపఁ జాలవు. కాన వదలిపెట్టుము. లోకమునఁ గొంద ఱుపాసించుచుండ నాదేవతలు మంత్రార్పణమున వారికి శత్రుకోష్ఠములకుఁ జేరినవారగుదురేని వారినిష్ఠకు మెచ్చుకొని మ మ్మారాధింపకుఁడు.

మానుఁడని హిత ముపదేశింతురు. కాదు కూడదని మఱియు నుపాసించినవారికి భయము గల్గింతురు. ఇది యందఱకుఁ దెలిసి నదియే. అట్లే సీతయు రావణున కుపదేశించెను. సాధువు లాచరించుధర్మముం గాంచుము. సాధువులవ్రతమును విలకించి యట్లు సాధుమార్గమున వర్తింపుము. అనఁగా సాధువుల ధర్మ వ్రతము లెట్టివి? మంత్రార్ణవము ప్రకారము సాధ్యాదికోష్ఠ ముల నున్న దేవతల నుపాసింతురు. అరికోష్ఠమున నున్న వారి వదలుదురు. ఉపదేశానంతర మామంత్రముల వదలవచ్చునా యందు రేని వదలరాదు.ఇష్టదేవతల కంగదేవతలనుగా భావించి యారాధింతురని యెఱుంగవలయును. సాధువ్రత మనఁగా సంప్రదాయమునననుసరించి శౌశాద్యాచారముల నెఱింగి నియ మముం బూనుట యని యెఱుంగవలయు. "సతీ అహం తవ ఔపయికీ భార్యా,పరభార్యా న."అని యేల యన్వయింపరాదని యొకమహాత్ముఁడు ప్రశ్నించెను. నేను నీకుఁ దగినభార్యను పరభార్యను గాదు. అని యా యన్వయమున కర్థము. అన్వ యింపవచ్చును గాని యాయర్థము వినఁదగినది మాత్రము కాదని విన్నవించితిని. ఏల యనుప్రశ్నమునకు ననభిజ్ఞుఁడ నగుటనని మనవిచేసితిని. పూర్వాపరవైషమ్యముల నాలో చించియే యన్వయింపవలసియుండును. కాని మాతృభావము గల దేవతలవిషయమున నపార్థములు తెలుపరాదు గదా. రావణునకు సీతాంబ సదాచారములను దెలుపుచున్నది. నీకెట్లు భార్యారక్షణము ప్రీతికరమో యితరులకు నట్లే యని యెఱుంగుము. నిన్నే యుపమానముగాఁ దీసికొని భార్యల విషయమున వర్తింపుము. "త్వాం దృష్ట్వా స్వేషు దారేషు రతిం నోపలభామ్యహమ్." అను రావణునాశయమునకు

బదులు చెప్పుచున్నదని యూహింపందగు. నీవు బ్రదికియుండు దనుక భార్యలఁ జక్కఁగా రక్షింపుము. లోకులు నిన్నుప మానముగా నీవిషయమున గ్రహించునట్లు నీభార్యలయం దానందము ననుభవింపుమని తెలిపెను. అనఁగా లోకులెల్లరు నిన్నుదాహరణముగాఁ గైకొనవలయు నన్నగర్వ మీవిషయ మున నీకు నుండఁదగును. సమబుద్ధిగలిగి వర్తింపుమని తాత్ప ర్యము. భార్య యస్వతంత్రురాలన్నభావము వదలుమని సారము. భార్య ప్రకృతిగాఁ దాను బురుషుఁడుగా భావించు టయే దాంపత్యధర్మమని యిందుఁ గలవిశేషము.

"ఇయమంబా జగద్ధాత్రీ పురుషోఽహం సదాశివః."

అని సూక్తి. ఈభావము గలవానికే దాంపత్యసుఖముగాని యితరులకు లేదని భావము.

"అతుష్టం స్వేషు దారేషు చపలం చలితేంద్రియం. ౭
నయంతి నికృతిప్రజ్ఞం పరదారాః పరాభవం,"

అని మూలము. మనశ్చాంచల్యము కలిగి యింద్రియములు తోఁచినయట్లు చలించుచుండఁ దనభార్యలయందు దుష్టుఁడై తాఁ బట్టినపట్టునందే చిత్తమునిచి యుపాసించువానికిఁ బర దారలే సకలసంపదలఁ బోఁగొట్టుదురు. అనఁగా నుపాసకుఁడు గృహస్థుడైన భార్యం గూడియే యుపాసింపవలయును. అట్లు చేయుటయందుఁ దృష్టిచాలక మోహకతంత్రములలోఁ బ్రతి పాదింపఁబడినరీతి రూపయౌవనసంపదల నలరు పరదారం గొని వచ్చి యారాధించిన సర్వనాశనమే యగుఁగాని యాదేవత వాని ననుగ్రహింపదనియే యిందుఁ గలవిశేషము. బ్రహ్మచారి

ధర్మముల నవలంబింపక గృహస్థువు భార్యను బ్రకృతినిగా భావించి తత్సహితముగా విచంచలతం గాంచి యుపాసింప వలయు. కన్యనుగాని సువాసినిం గాని వ్రతమునకని నియమించి జ్ఞానులు గానివారలకు నుపాసించువిషయమున నాసక్తిని బుట్టించు నుద్దేశమునఁ జెప్పినతంత్రముల ననుసరించి పరదారకు ధనమిచ్చి యామెం బూజించుట యైశ్వర్యనాశన హేతువని భావము. శుభాగమపంచకము ననుసరించి జ్ఞానముంగోరువారు నియమములఁ బాటింపవలయు ననువిశేష మిందుఁ గలదు. వ్యభిచారులు పాపాత్ములు లోనగువారల నుద్ధరించు నిమిత్తము సద్యఃఫలదాయకములగు కొన్ని సిద్ధులు తెల్పఁబడినవి. అవియే మోహకములు. వానిభావములఁ బరిశీలింపక విధులని గ్రహించుటయే యజ్ఞానము. చంచలత మాని సప్రకృతికుఁడై గృహస్థు వుపాసింపవలయు ననుభావ మిందు సూచింపఁబడినది. ఈభావమే యీ క్రిందిమూలములు సిద్ధాంతీకరించుచున్నవి.

> "ఇహ సంతో నవా సంతి సతో వా నానువర్తసే. ౯
> తథాపి విపరీతా తే బుద్ధిరాచారవర్జితా,
> వచో మిథ్యాప్రణీతాత్మా పథ్యముక్తం విచక్షణైః. ౧౦
> రాక్షసానామభావాయ త్వం వా న ప్రతిపద్యసే."

అని మూలము. ఇందు సదాచారవంతులు లేరా? సదాచారమనఁగా నెవ్వరేకర్మముల నాచరించిన మేలు కలుగునో యవి యని భావము. ఎల్లరకు నొక్కవిధముగాఁ గర్మాచరణమున నాసక్తి యుండదు. ఇతరులు పురికొల్పఁగా నొనరించినను శ్రద్ధాభక్తులు లేమి నవి ఫలింపవు. ఏసత్కర్మమున నెవ్వారికిఁ బ్రీతి గలదో వాఁ డద్దాని నాచరింపవలయును. అది ఫల

దాయక మగును అట్టి సదాచారములను బోధించువా రిందు లేరా యని సీత ప్రశ్నించుచున్నది. సద్గురువు శిష్యునియోగ్యత ననుసరించి ధర్మోపదేశము చేయవలయును. తనకుఁ దెలిసినవానినెల్లఁ దెలుపరాదు. దేనియం దతనికి శ్రద్ధాభక్తులు గలవో అట్టి సత్కర్మముల నాచరించుపద్ధతిఁ దెలిపి యతనికేదేవతయం దిష్టముండునో యామంత్రమునే యుపదేశించి యతనిశక్తి కనుకూలమైనయ ట్లనుష్ఠానమార్గములఁ దెలుపవలయునని సారము. అప్పుడే యతఁ డద్దానిఁ జక్కఁగా నవలంబించి చేయఁగలఁడు. ఫలముంగూడఁ బొందఁగలఁడు. లేకున్న నతనియాచారము బాగుండదు. ఫలముంగూడ లేదు. అట్టి సదాచారముల నుపదేశించువా రిందు లేరా? నీకు నేసత్కర్మాచరణము ఫలదమో దానిం దెలుపువారనియే యిందలి భావము. అట్లు తెలిపినను వారిమార్గము నీ వనుసరింపలేదా. యనియుఁ బ్రశ్నించుచున్నది. ఆయుపదేశానుసార మాచరించుకాలము చాలనితఱి ననఁగా మృత్యు వాసన్నమగునేనది రుచింపదని యర్థము. రావణా! ఇప్పటి నీబుద్ధి విపరీతముగా నున్నది. నీయాచారము నీకు శ్రేయోదాయకముగా నుండునదని తోఁపలేదు. ఏయాచారమున నీకు మేలు గలుగునో యట్టియాచారము నీ వవలంబింపలేదని తాత్పర్యము. నన్నుపాసించుపద్ధతి యిప్పుడు నీ వవలంబించినది మంచిది గాదని సారము. నీ యిప్పటివినయము మిథ్య. కావున విచక్షణులు తెలిపినవాక్కుల నిందలిరాక్షసుల నాశనార్థము వినకున్నావు. నిన్నుఁగూడి శ్రీరాముని చేఁ జావఁదగినవారిని నీవశము చేసికొంటివని యాశయము. కాఁబట్టి నీబుద్ధి విపరీతాచారపరాయణతం గాంచెననియే దీనిహృదయము. ఏభక్తుఁడు విధి

విహితములేర్పైన బహువిధములగు నాచారములయందు దేని నాశ్రయించి ప్రవర్తించిన మేలు గలుగునో వాఁడు దానినే యాశ్రయించునట్లు చేయుట సద్గురువులలక్షణము. ధనాశచేఁ గాని మఱియే యితరవాంఛలచేఁ గాని శిష్యునకు మేలుగలుగనిమార్గము బోధించుట వంచకులలక్షణమని భావము తేలెడిని. ఈకాలమున నట్టివారలే పెక్కండ్రు గలరు. వారల శిష్యకూటమే మిక్కిలిగాఁ గనఁబడును. మాటలవేదాంతము, మిథ్యాభక్తి, వారి లక్షణములగు. ధనార్జనాసక్తిచే నట్టి వారికి మంత్రోపదేశములు చేయు కపటయోగు లనేకులు కనఁబడుచున్నారు. శిష్యవిత్తాపహారకులు గాక శిష్యప్రాణాపహారకులు పెక్కండ్రు కనఁబడుసత్కాలము వచ్చునా యని మనము భగవంతుని బ్రార్థింపవలయును. ఈవిషయమునే మన శ్రీరామాయణభాగము తెలుపుచున్నది. నీ వవలంబించు మార్గమే నిన్ను నిన్ననుసరించురాక్షసులను శ్రీరామచంద్రుని మూలమున నుద్ధరింపఁగలదని సీత యుపదేశించెననియే యిందలి కథాభాగము.

"అకృతాత్మాన మాసాద్య రాజాన మనయేరతం. ౧౧
సమృద్ధాని వినశ్యంతి రాష్ట్రాణి నగరాణి చ,
తథేయం త్వాం సమాసాద్య లంకా రత్నౌఘసంకులా. ౧౨
అపరాధాత్తవైకస్య న చిరా ద్వినశిష్యతి,"

అని మూలము. రావణునకు జానకీదేవి ఫలితార్థమును దేటపఱచుచు లోకుల కొకనీతిని బోధించుచున్నది. అకృతాత్ముఁడనఁగా మంచియుపదేశమును గ్రహింపని బుద్ధిగలవాఁడని యర్థము. అనయరతుఁ డనఁగా నీతు లనేకములు. అందుఁ దన కనుకూలింపని నీతియందే యాసక్తుఁడని భావము. నీతుల

యందు నట్టివి కలవా యని యడుగవచ్చును. ధర్మము లనేక
ములు. నీతు లనేకములు. అన్నింటి నొక్కఁడనుష్ఠింపఁ
జాలఁడు. బ్రహ్మకే నది యశక్యకార్యము. ఏనీతి యెవని కాచ
రింపఁబగినదో వాఁడు దానిని వదలరాదు. అదియే యతనిం
గాపాడును. ఆపదలఁ గుడుచువానికి ధనమిచ్చుటయు నీతియే.
అది బీదవాని కశక్యము. కావున శరీరకష్టమున నతఁడు
దోడ్పడఁ గలఁడు. అట్టు లొనర్చుట యతనికి నీతి. ఇట్లే
యన్నియునని యెఱుంగవలయు. అట్టి యనీతిరతుఁడవు నీవని
భావము. ఇట్టి నీ వేరాజ్యమును బాలించిన నది నశించును.
రాజాపరాధమున రాజ్యమంతయు నశించును. రాజుమూల
మున రాజ్యమంతయు వృద్ధినొందును. కావున రావణా!
నీయీ లంకారాజ్యమంతయు సకలైశ్వర్యభరితమయ్యును నీ
యపరాధమున ననఁగా నీయపరాధవ్యాజమున శీఘ్రమే
నశింపఁ గలదు. అనఁగా నీవు నీతోఁ జావఁదగిన పెక్కండ్రు
శీఘ్రకాలమున శ్రీరాముని మూలమున నశించిన ట్లగపడి సద్గతి
నొందుదురని సారముగా నిట గ్రహింపఁ దగునని కథావిశే
షము. లోకమున నొక్కనిమూలమునఁ బెక్కండ్రకు హాని
వాటిల్లును. ఏలయనఁగాఁ గర్మసిద్ధాంతము ననుసరించి తమకు
నెల్ల రాఁగలహానికిఁ గారణముగా నొక్కఁడు దుష్కర్మము
నొనరించి నిందఁ బొందఁదగువాఁ డుండును. వాఁడు లేకు
న్నను వీరికి హాని తప్పదు. కాని యతనికర్మము కూడ ఫల
వంతము కావలయును గదా. ఎల్లరకు వీఁడు హాని యొనరించె
నని లోకు లందురు. యుద్ధము పొసఁగకయున్నను వారెల్లరు
మృతు లగుదురు. కాని యొకఁడు కారణభూతుఁడుగా నుండ
వలయునని కర్మసిద్ధాంతసారము. అది యేనాఁటికిఁ దప్పునది

కాదు. కారణభూతుఁడుగా నుండువాఁడును నిందఁ బొందఁ దగినకర్మమును జేసియే యుండును. అదియు ఫలింపవలదా. కావున నొకరిమూలమునకు మాకు హానికలిగిన దనుకొను వారు కర్మసిద్ధాంతతత్త్వ మెఱుంగనివారే యనవలయును. ఆసిద్ధాంతమునే సీత తేటపఱచెను. మనము కర్మాచరణమున ఫలము భగవదర్పణము చేయుట యిట్టి దుష్కర్మములు చేయు దురుద్దేశము కలుగకయుండుటకొఱకే యని తెలిసికొన వలయును. ఒక్క విశేషము కలదు. ఉపాసకుఁడు క్రూరుఁడైన నాతనిసమీపమున నుండువారలకు బాధ కలుగును. ఒక్క దేవత నుపాసించువాఁ డున్నవీథియందే కాపురము చేయరా దనియు, వేఱొక్కదేవత నుపాసించువాఁ డుండుగృహము నకుఁ బ్రక్కయింటిలో నివసింపరాదనియు నియమము గలదు. క్రూరచిత్తమునఁ బరులకుఁ గీడుగలిగించుపాంటెుఁ గ్రూరస్వభా వము గలదేవతల నుపాసించుట భయావహమనియు నతని సంగతిగాని యతనిచెంత నివసించుటయు శుభముగాదని దీని యాశయము. క్రూరస్వభావులపొంత నివసింప రాదనునదియే యిందలి నీతి.

"స్వకృతైర్హన్యమానస్య రావణాదీర్ఘదర్శినః. ౧౩
అభినందంతి భూతాని వినాశే పాపకర్మణః,
ఏవం త్వాం పాపకర్మాణం వక్ష్యంతి నికృతా జనాః. ౧౪
దిష్ట్యైతద్వ్యసనం ప్రాప్తో రౌద్ర ఇత్యేవ హర్షితాః,"

అని మూలము. పైవిషయమునే మఱింత దృఢపడునట్లు సీతా దేవి పలుకుచున్నది..కర్మసిద్ధాంతసారమే యిందుఁ బ్రతిపాదిత మని యెఱుంగవలయు. స్వకర్మములు పరహింసాకరము లగు

నట్టు లాచరించువారు తత్పాపముచే నిహతులై వగలపాలగు చుండ సకలభూతము లానందించును. తమపాపముచేతనే తమను కష్టములపాలగుదురు కాని యితరులమూలమునఁ గా రనియు నితరు లందులకు నిమిత్తమాత్రముగ నుందురనియు దీనిభావము. రావణా! నీవలెనే శ్రీరామునిచే హతులు గాఁ దగినవా రనేకులు గలరు. వారిని నీవు ప్రీతిగాఁ జూతువు. ముందు నీకు శ్రీరామునిమూలమునఁ గలుగులాభముంగాంచి రావణునిచే వంచితుల మైతిమి. శ్రీరామునిమూలమున మహా లాభమును గాంచఁజాలక యుంటిమని యెందఱో కుందు దురు. అనఁగా లంకానగరమున నిన్నుంగూడి శరీరముల వదలువా రనేకులు గలరు. అట్టిఫలము శ్రీరామునిమూల మునఁ గాంచ నర్హులు కానివారును గలరు. వారు తర్వాత విచారింతురని యభిప్రాయము. నీమూలమున నెందఱో మృతి నొందఁగలరని కఠినముగా నితరులు విన సీత రావణునితోఁ బలికెనని కథాసారము.

"శక్యా లోభయితుం నాహమైశ్వర్యేణ ధనేన వా. ౧౫
అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభా యథా,"

అని మూలము. నాయంతఃపురమున నీ వీశ్వరివిగా నుండు మన్న రావణునిమాట కిది బదులు. ఆధిపత్యముగాని ధనము గాని నన్ను సంప్రీతురాలనుగాఁ జేయఁజాలవు. రాము నెడఁ బాసియున్నదాన ననుకొంటివేమో. యది కేవలము భ్రాంతి. రాము నెడఁబాసి నేను, నన్నెడఁబాసి శ్రీరాముఁడు నుండు టసంభవము. భాస్కరుని వదలి ప్రభ యుండునా? అనఁగా సూర్యునకు నతనిప్రభకు నెడఁబాటు గలుగనట్లు మాయిరువు

రకు నెడఁబాటు గలుగదని భావము. దీనిచే సీత రామ మూర్తి నెడఁబాసియున్నదనుట పొరపాటనియు నది కేవల నటనమనియు నిందు నేనుండుట సర్వవ్యాపిని ననుట కుదా హరణముగా నాయునికి లేనితావే లేదనియు భావము. "సర్వాంతర్యామినీ సతీ" అన్న సహస్రనామస్తోత్ర మిట స్మర్త వ్యము. లంకానగరముననున్న సీతాదేవి రామవియోగమునఁ గృశించుట యనునది నటనమే యని యీవాక్యము మనకుఁ దెలుపుచున్నది. ఇంకొక్కవిశేషము గలదు. భగవంతుఁడు ధనాదులచే నుపాసకునకు వశ్యుఁడు కాఁడు. నిర్మలభక్తి చేతనే.

"నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా,
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా. ౫౩
భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున,
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప." ౫౪

అన్న గీతావాక్యము సర్వజనవిదితము కదా.

"మిత్రమౌపయికం కర్తుం రామస్స్థానం పరీప్సతా. ౧౯
వధం చానిచ్ఛతా ఘోరం త్వయాసౌ పురుషర్షభః,
విదిత స్సహి ధర్మజ్ఞ శ్శరణాగతవత్సలః. ౨౦
తేన మైత్రీ భవతు తే యది జీవితుమిచ్ఛసి,
ప్రసాదయస్వ త్వం చైనం శరణాగతవత్సలం. ౨౧
మాం చాస్మై ప్రయతో భూత్వా నిర్యాతయితుమర్హసి,"

అని మూలము. సకల మెఱింగినదయ్యును జానకీదేవి లోక మున కొక సదాచారమును దెలుపుటకై రావణునకుఁ గ్రొత్త హిత మొక్కదానిని దెలుపుచున్నది. ఇది భావికార్యగతులు

తెలియక సీతచెప్పిన ట్లుండలేదా యని యందురేమో యది పొరపాటు. ఎట్లనఁగా; ఎట్టివారైనను జావ నుద్దేశించువారిని నిలిపి యాయుద్దేశము మార్పఁబూనవలయునన్నదే సీత యుపదేశించువిషయము. రావణా! నీయుద్దేశము మంచిదైనను లోకాచారవిరుద్ధము. కాన నీ వీలంకయందుండి మహా సంగ్రామరంగమునఁ జూచువారికి భయముగలిగించునట్టి మరణమునొందక సుఖముగాఁ గూరుచుండి భగవంతు నారాధింపఁ గోరుదువేని యోగ్యుఁడగు మిత్రునిగా శ్రీరామభద్రుని జేసికొమ్ము. ఈలంక నివాసార్థము. భగవదారాధనార్థము. కావున నిందు నింకను గొంతకాలము నివసించి యారాధనమును గొనసాగింపఁ గోరికయున్న నిట్టు లొనర్పుమని యాశయము. ఆయుస్సు పూర్తికావచ్చినపుడు నివసింప నెట్లు సాధ్యమగును? అనరాదు. భగవదారాధనము విధివిహితముగాఁ జేయువారల కాయువు వృద్ధియగుచుండును. యోగవిద్య యిందులకే యేర్పడినది. మృత్యువు వారిచెంతకు రావెఱచును. భగవత్తేజ మాతనువులయందు నిండియుండ జరామరణముల కవకాశ మెట్లు? తలఁచినచోటికిం బోవచ్చును. ఎంతకాలమైన నుండవచ్చును.

"విషం న దేహే క్రమతే తదీయే దష్టే సుఘోరైరపి పన్నగేంద్రైః."

అనునది యీవిషయమునే మనకు బోధించుచున్నది. కావున నీ కిట్టివాంఛగలదేని తెలుపుము. దానికిఁ దగినయుపాయము శ్రీరామభద్రునిమైత్రి సంపాదించుకొనుటయే. దాన ఘోర మరణాదులన్నియుఁ దొలఁగును. భగవన్మైత్రి యెట్లు లభించును?

"రాగ ద్వేషవియు క్తైస్తు విషయా నింద్రియైశ్చరన్,
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి.            ౬౪
ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే,
ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే.            ౬౫
నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా,
న చాభావయతశ్శాంతి రశాంతస్య కుతస్సుఖం."            ౬౬

అను సీగీతావాక్యములం బరిశీలించిన నిదియే సారమని తేలె డిని. మనోనిగ్రహము గలిగి భగవంతుని హృదయపదమున నెలకొలిపి సమయాచారము ననుసరించి యాజ్యోతిర్మూర్తిని జూచుచుండుటయే తన్మైత్రిని సంపాదింపఁబూనుట యని యర్థము.

"సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః.            ౭౯
యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి."            ౪౦

అను సీగీతావాక్యము లేవిషయమును బోధించుచున్నవి? సామయికులనఁగా సమయాచారసంపన్నులు. వారే యోగులు. వారిపూజ యెట్టిది? ధ్యానరూపము. ధ్యాన మెట్టిది? ఇష్టదేవతాతేజోమూర్తి సంతతసందర్శనము. అది యెట్లు? భగవన్మయము సర్వమనుబుద్ధిచేత. ఈయభ్యాసఫల మెద్ది? దేవతాంతరదూషణము చేయకుండుట, భగవత్కళలే సకల దేవతలను సద్బుద్ధి స్థిరపడుట, తన్మూలమున శాంతియు నను నివి కల్గుటయే. ఇంతకంటె మానవునకు వలయునవి యేవి? ఇదియే భగవన్మైత్రి సంపాదించుకొను ననువగు త్రోవ. వేదోక్తవిధమున దొరకదని మన మెఱుంగవలయును.

నే నట్టు లాచరించిన శ్రీరాముఁ డెట్టు లూరకుండును? తనపనిఁ దాఁజేయఁడా? అని ప్రశ్నించు నేమో యనునూహచే జానకి యిట్లు తెలుపుచున్నది. రావణా! అతఁడు సకలధర్మ ముల నెఱింగినవాఁడు. శరణాగతవత్సలుఁడు. అనఁగా

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం."

అన్న న్యాయము ననుసరించి యేకాగ్రమనస్సున నెవరు ధ్యానింతురో వారియందు వత్సలుఁడని తాత్పర్యము. ఈవిష యము విదితమే. అనఁగా వేదశాస్త్రపురాణాదులయందెల్ల నీవిషయము గలదు కదా. ఇన్నింటి నెఱింగిన నీవేల సంశ యించెదవని సీత యాతనిఁ బ్రశ్నించుచున్నది. ఇట్టియాశ యము నీకున్నఁ దదనుకూలముగాఁ బ్రవర్తింపుము. నియతుఁ డవై నన్నా మహాత్మున కర్పింపుము. అనఁగాఁ బ్రకృతిపురు షైక్యమున నుపాసింపుమని భావము. మాయిరువుర కభేద ముగా భావించి మాతేజోరూపమును ధ్యానింపుమని సారము.

"విరించిః పంచత్వం వ్రజతి హరిరాప్నోతి విరతిం,
వినాశం కీనాశో భజతి ధనదో యాతి నిధనం,
వితంద్రీ మాహేంద్రీ వితతిరపి సమ్మీలితదృశా
మహాసంహారేఽస్మిన్ విహరతి సతి త్వత్పతిరసౌ."

అను శంకరభగవత్పాదోక్తి యిట స్మర్తవ్యము. భేదోపా సనాభ్యాసము సముచితఫలదాయకము కాదనియే యిందుఁగల విశేషము. "ప్రయతోభూత్వా" అనువాక్యమున నీయర్థవిశేష మిమిడియున్నది. ప్రయతుఁడు=అనఁగాఁ బరిశుద్ధాంతఃకరణ ప్రవృత్తిగలవాఁడని కదా యర్థము. మనస్సు పరిశుద్ధమనఁగా

నుండవలయు ననఁగా విషయాభిలాష విరహితముగా నది యుండవలయుననియే భావము. "విధేయాత్మా" అన్న చోటం గూడ నిదేయర్థము చెప్పవలయును. ఇచ్చోటఁగల యీవిశేష ములు మనము చక్కఁగా నెఱుంగవలయును.

"ఏవం హి తే భవేత్స్వస్తి సంప్రదాయ రఘూత్తమే. ౨౨
అన్యథా త్వం హి కుర్వాణో వధం ప్రాప్స్యసి రావణ,
వర్జయేద్వజ్రముత్సృష్టం వర్జయేదంతకశ్చిరం. ౨3
త్వద్విధం తు న సంక్రుద్ధో లోకనాథస్స రాఘవః,
రాఘవస్య ధనుశ్శబ్దం శ్రోష్యసి త్వం మహాస్వనం. ౨౪
శతక్రతువిసృష్టస్య నిర్ఘోషమశనేరివ,"

అని మూలము. ఇది లోపల వ్రాసిన యాశయమునే మఱింత దృఢముగాఁ జేయుచున్నది. రావణా! నాచెప్పినచొప్పునఁ జేసితివేని నీకు మేలు గలుగును. అట్లుగాక యింతదనుక నీ కున్న యుద్దేశమునే కొనసాగింతువేని రామునిచే మృతిగాంచఁ గలవు. త్వరితముగా శ్రీరామునితో సంగరము పొసంగును. ధనుశ్శబ్దము వినఁగలవు. రావణా! వజ్రము మృత్యుదేవతయు భయంకరము లగును గాని యవి యస్వతంత్రములు సుమీ! కర్మసిద్ధాంతము ననుసరించి యవి వధింపఁజాలక రిత్త మరలి పోవును. కాని కోపము నంగీకరించునేని శ్రీరాముఁడు నీవంటి వానిని వదలఁడు. అనఁగా శ్రీరామునకుఁ గోపము గలుగుట కర్మఫలానుభవము గలుగఁదగినకాలమందె. కావున నట్టి కోపము ఫలింపక పోదు. అనఁగా భగవంతున కాగ్రహమే లేదనియు నది కల్పితమే. యొకప్పుడు కలిగినను గావచ్చు ననియుఁ దాత్పర్యము. శ్రీరాముఁ డాగ్రహించి ధనుష్టంకా

రము చేసిన నది పిడుగుపడునపుడు కలుగు ధ్వనివంటి దగును. అనఁగా మృత్యుప్రదమే యగునని భావము. శ్రీరాముఁడు నీవధమునకే ధనుస్సు నెక్కిడునని యాశయము. దర్శనమాత్ర మున మహర్షులు ముక్తి గాంచిరి. నీవు వధింపఁబడవలసిన కర్మము చేసినకతన సంగ్రామరంగమునఁ జావవలసినవాఁడవని యాశయసారము.

"అపనేష్యతి మాం భర్తా త్వత్తశ్శీఘ్రమరిందమః। ౨౫
అసురేభ్యశ్శ్రియం దీప్తాం విష్ణుస్త్రిభిరివ క్రమైః,"

అని మూలము. నీదగ్గరనున్న నన్ను నానాథుఁడు శ్రీరాముఁడు వేవేగ కొనిపోవఁ గలఁడు. విష్ణువు మూఁడడుగులచే రాక్షసులనుండి దేవరాజ్యలక్ష్మిని హరించినట్లు. అనఁగా బలి మృతిలేనివాఁడు. చిరకాలజీవి. నీ వట్టివాఁడవు గావు. మృతి నొందఁదగినవాఁడవు. కాఁబట్టి నీయందు ద్వేషము లేదు. ఆ యర్థము తేటపడుటకే విష్ణు బలిసామ్యము చెప్పఁబడినది. విరోధము లేకపోయినను బలినుండి దేవలక్ష్మిని భగవంతుఁడు సంగ్రహించెను. అట్లే నిన్ను ద్వేషింపకపోయినను నన్నుఁ గొనిపోవఁగలఁడని చెప్పెను. ద్వేషప్రకటనము కేవలనటనమే యని తాత్పర్యము. ఆనాఁటి శ్రీమహావిష్ణువే యీనాఁటి రాముఁడని భావింపుమా యని సీత హెచ్చరించెను.

"క్షిప్రం తవ సనాథో మే రామస్సౌమిత్రిణా సహ। 33
తోయమల్పమివాదిత్యః ప్రాణానాదాస్యతే శరైః,"

అని మూలము. అల్పజలమును సూర్యుఁడు తనకిరణములతోఁ బీల్చునట్లు సౌమిత్రిం గలిసి శ్రీరాముఁడు నీప్రాణములను శరములచే హరించును. "యాభిరాదిత్యస్తపతిరశ్మిభిస్తాభిః పర్జన్యో

వర్షతి” అన్న శ్రుత్యర్థమే యిట సూచితము. ఆకర్షణశక్తిచే నీబ్రహ్మాండము లోకదాని నాశ్రయించి యింకొకటి యున్న దనువిషయము మనవా రెంతకాలము క్రిందనో యెఱింగిరి. క్రొత్తగా నీకాలపువారు కనిపెట్టినది కాదని తేటపడియెడిని. సూర్యుఁడు జలములను గిరణములమూలమున గ్రహించుట మరల వర్షరూపమున లోకులకు నొసంగుటకే. అట్లే శ్రీరాముఁడు నీప్రాణములను శరమూలమునఁ దీయుట తృతీయ జన్మమున నీ కిచ్చుటకే. ఇదంతయు నీక్షేమార్థమే యని సీతాదేవిహృదయమని మన మూహింపఁ దగును. ఇట్టు లీసర్గమున సీతాదేవియాశయ మెట్టిదో తేటపడ వాల్మీకి తెలిపెను. ఇందుఁగలవిశేషములను మనము చక్కఁగా విమర్శించి తెలిసికొనుటయే గాక యుపాసనావిషయమున శ్రద్ధ వహింపవలయును. లేకున్న పుక్కిటిపురాణమువంటిదే యీపఠన మగును. అట్లుగాక యుత్తమమార్గమున కరుగుటకుఁ బ్రయత్నింపవలయును. ఇచ్చోట నధ్యాత్మరామాయణవిషయము నెఱుంగుదము.

“రాఘవాద్బిభ్యతా నూనం భిక్షురూపం త్వయా ధృతం,
రహితో రాఘవాభ్యాం త్వం శునీవ హావిరధ్వరే. 3౨

హృతవానసి మాం నీచ తత్ఫలం ప్రాప్స్యసేఽచిరాత్,
యదా రామశరాఘాతవిదారితవపుర్భవాన్. 33

జ్ఞాస్యసేఽమానుషం రామం గమిష్యసి యమాంతికం,
సముద్రం శోషయిత్వా వా శరైర్బద్ధ్వాథ వారిధిం. 3౪

హంతుం త్వాం సమరే రామో లక్ష్మణేన సమన్వితః,
ఆగమిష్యత్యసందేహో ద్రక్ష్యసే రాక్షసాధమ. 3౫

త్వాం సపుత్త్రం సహబలం హత్వా నేష్యతి మాం పురం,
శ్రుత్వా రక్షఃపతిః క్రుద్ధో జానక్యాః పరుషాక్షరం." ౩౬

అని యున్నది. వాల్మీకిమునిభావమే యిందు సూచింపఁబడు చున్నది. ఇఁకఁ దరువాతికథను బరింతము.

## రావణుఁడు క్రోధించి పలికి సీతకు గడువొసఁగి పోవుట.

* రాక్షసరాజు సీతావాక్యముల నాలకించి ప్రియదర్శనయగు నాదేవిం గాంచి యప్రియముగాఁ దోఁచుచందమున నిట్లు పలికెను. పురుషుఁ డెంతదనుక స్త్రీలను బుజ్జగించునో యంత వారలకు లోఁబడును. ఎంత ప్రియములు పలుకునో యంతపరిభవము వారిమూలమున నొందును. నీయందు నాకుఁ గలకామము, నాకుఁ గల్గినకోపమును సారథి సమర్థుఁడగునేని మార్గమువదలి పరువెత్తు ఘోటకములను లాగిపట్టినట్లు అడంచుచున్నది. ప్రాణికోటికి సంశయములఁ బుట్టించునది కామమే కావున నది ప్రతికూలమైనది. ఎవ్వరియందా కామము దృఢముగా సంబంధించునో వారు శిక్షింపఁదగినవారైనను వారియందే దయ స్నేహము గలుగఁజేయును. వరాననా! నీయందు నాకుఁ గామము గలదు కాన నీవు నన్నుఁ ద్రోసివైచి చూచుటకు వానప్రస్థవేషము ధరించియుండువానియందుఁ గోరికగలదానవయినను బరాభవదారుణశిక్షలకుఁ దగినదాన వైన నూరకున్నాను. సీతా! నీవు నన్ను ఎట్టియెట్టి పరుషభాషణముల నొప్పించితివో వానిలో నొక్కొక్కటియు నిన్ను భయంకరమార్గమున వధింపవచ్చునని పురికొల్పు

* ఇది యిరువదిరెండవసర్గమునఁ గలదు.

చున్నది. అని యింతమాత్రము పలికి క్రోధప్రణయము లంతలోఁ బెనఁగొనఁగా మరల నిట్లు పలికెను. జానకీ! నీకు నేర్పఱచియుండు సంవత్సరమను నియతకాలమున నింక రెండు నెలలు మాత్రము మిగిలియున్నవి. అంతదనుకఁ గాచుకొని యుండవలయు. ఆమీఁదఁ గాచుకొనియుండ వలనుపడదు. కాన నీవు జాగుసేయకుము. నాశయ్య నధిరోహింపుము. రెండునెలలలో నన్ను భర్తగా నంగీకరింపకయున్న నొకనిముస మైన నవ్వలఁ దాళఁజాలను. నాచేసిననియమము ముగియఁ గానే ప్రాతఃకాలభోజనార్థము వంటయింట నిన్ను నాకొఱకు వధింపఁగలరు.

ఇట్లు రావణుఁడు సీతను బెదరించుచుండఁగా రావణునిం గూడి యందున్న దేవగంధర్వకాంతలు మిగుల దుఃఖంచిరి. మఱికొందఱు సంజ్ఞలచే సీతాదేవి నాశ్వాసించిరి. అట్లు వారు తన్నాశ్వాసింపఁగా సీతాదేవి పాతివ్రత్యమహత్త్వమున రావణుని లెక్కింపక హితవాక్యముల నిట్లు స్వాభిప్రాయము నతనికిం దెల్పెను. రాక్షసేశ్వరా! నీమేలు కోరినవారెవ్వరు నిందులేరు. సాధ్విని నన్నిట్లు కష్టములపాలుసేయుచుండ నిట్టి వినింద్యకార్యమునఁ బ్రవర్తింపవలదని నిన్ను మరలించువాఁ డొక్కఁడును లేఁడు. ఇది నిశ్చయము. శచీదేవి యెట్లింద్రునకో యట్లు శ్రీరామునకుఁ బత్నినై యుండు నన్ను నీవొక్కఁడవు తప్పఁ ద్రిలోకములందు నెవ్వఁడుగాని మనస్సునందుఁ గూడ నీవలెఁ గోరఁడు. ఇఁక నీవలెఁ బలుకఁ గలఁడా? రాక్షసాధమా! మహత్తరతేజమున విరాజిల్లు శ్రీరాముని ధర్మపత్నిని నన్నిట్టిమాటలాడితివే? ఈపాప మెట్టులైన నీకుఁ దప్పునా? ఏలోకమున కరిగినను నిన్ను వదలదు. మదించినవన

గజము శశకము పోరాడఁగూడిన నెట్లో యట్లు శ్రీరాముఁడు నీవుపోరాడఁ దారసిల్లినఁ గనఁబడును. బీరము లిట్లు పలికితివి కదా. మాయామృగవ్యాజమున రామలక్ష్మణుల దూరముగాఁ బోవఁజేసి దొంగతనముగా నన్నుం దెచ్చితి వేల? అట్టికార్యమునకు నీకేల లజ్జ కలుగ లేదు? శ్రీరామునకు నింతదనుక నీ వగపడ లేదు. అగపడి తేని యతనిప్రభావము తెలిసికొందువు. అపూజ్యా! సాధ్వినగు నన్నుఁ బ్రేమించి చూచుచున్నావు కదా. నీయీ క్రూరవీక్షణములువీడి యేల క్రిందఁ బడ లేదో. మహాధర్మాత్ముఁ డగు రామునిపత్నియు దశరథునికోడలు నగు నన్ను వచింపరాని మాటలు పలికి యుడికించితివే. ఏల నీజిహ్వ పడకయున్నదో? నిన్ను నే నిపుడే భస్మముగాఁ జేయవలసినదియే. కాని యపకారము చేసినవారిని శపింపుమని నా నాథునియాజ్ఞను బొందనికతనను, పాతివ్రత్యరూపతపోధనము గాపాడుకొను నిమిత్తముననను నాతేజోమహత్త్వమున నిన్ను భస్మము చేయక యున్నాను. మతిమంతుఁడగు శ్రీరామునికడ నుండునపుడు అతనినుండి నన్నపహరింప నీకు శక్యముకాదు. నీమృతికై రాముని దూరమునకుఁ బంపి నీవు నన్ను దొంగతనముగాఁ దెచ్చునట్లు దైవముచేసినది. ఇందులకు సంశయము లేదు. శూరుఁడనని కుబేరానుజుఁడనని బలవంతుఁడనని పొగడుకొంటివి. అంతవాఁడవగుదేని మాయామృగవ్యాజమున వారల దూరమున కరుగఁజేసి యేల నన్నుఁ దెచ్చితివి? శ్రీరాముఁడు చూడఁగనే తేవచ్చును గదా.

అని జానకి పలుకఁగా విని కోపసంవర్ధితరక్తేక్షణుండై యామెం జక్కఁగాఁ జూచెను. ఆశ్రీమంతుఁడు రావణుఁడు జిహ్వాగ్రము కన్నులు ప్రజ్వలింపఁగాఁ గిరీటాగ్రము కూడ నా

కోపమునఁగదలఁగా నాతనిశరీరము దుర్నిరీక్ష్యమైయెన్నియో రీతులఁ గానఁదగియుండెను. అట్లు జానకిం గని భుజంగమువలె నిట్టూర్పులు పుచ్చుచు నామెతో దుర్నయ మతిశయింపఁగా దరిద్రుఁడగు నొకానొకని ననుసరించుచున్నదానవు.నాపలుకులు నీకెట్లు హితములగును ? సూర్యుఁడు నిజతేజమున నాద్య సంధ్యను నశింపఁజేసినట్లు నిన్నిపుడు నశింపఁజేసెదను. అని యతఁ డేకాక్షి లోనగు రాక్షసస్త్రీలనుగని మీరెల్లరు నొక్కటిగాఁ గూడి యీసీత నాశమగునట్లు చేయుఁడు. అనుకూల ప్రతికూల కార్యములలో దేనిచేనైనను, సామదానములచేనైన నవి ఫలింపవేని భేదదండనములలో దేనిచేతనయిన నీమెను నావశమగునట్లు చేయుఁడు. అని యాజ్ఞాపించి కామక్రోధములు మనమునఁ బెనఁగొనఁగా నామెను మరలమరల నదలించెను. అంత రావణునిభార్యలందుఁ జిన్నదిగానుండు ధాన్యమాలిని రావణుని బిగ్గఁ గౌఁగిలించుకొని మహారాజా! నాతోఁ గ్రీడింపుము. రాక్షసపతివగు నీకీ మానవస్త్రీ యేటికి? నిన్నిమె యొల్లననఁగా నీవార్జించిన సకలవిధోత్తమభోగముల ననుభవించుభాగ్యము బ్రహ్మ యీయామెకు లిఖింపఁడని తోఁచెడు. ఈమె యేమి చేయును? ఒల్లనికాంతను గోరిన నొక్కపరితాపమే కాని కార్యాంతరము లేదు. తన్నుఁగోరు నన్నులమిన్నం గోరువానికి నపారానందము కలుగును. నిన్ను మిక్కిలి కోరు నన్నుం గామింపుము. అని ధాన్యమాలిని పలుకఁగా నాలకించి యాలలనాశ్లేషమును విడిచి నవ్వుచు నవ్వలికిం బోయెను. ఆచ్చో నంత నిలువక యడుగులిడి భూమిని వడకించుచు నిజమందిరమున కరిగెను. దేవకాంతాదులాతని వెంబడించి పోయిరి. ఇట్లు ధర్మపరాయణత్వాదిగుణములుగల

యాసీతాదేవిని బెదరించి రావణుఁడు మన్మథమోహితుఁడై సౌధముఁ బ్రవేశించెను.

మహాశయులారా! ఈఘట్టము విమర్శింప మిక్కిలి తగినది. సీత సంభాషించినఘట్టముం జదివితిమి. అందలి విశేషార్థములకు నిందలి దనుజేంద్రునిచేష్టలకుఁ గలభేదము దానియంతరార్థమును విమర్శించి తెలిసికొందము.

"సీతాయా వచనం శ్రుత్వా పరుషం రాక్షసాధిపః,
ప్రత్యువాచ తతస్సీతాం విప్రియం ప్రియదర్శనాం." ౧

అని మూలము. వాల్మీకి త్రికాలజ్ఞానసంపన్నుఁ డనుదానిని మాత్రము మఱువకుఁడు. రావణుని యాశయ మెట్టిదో యాయాయిచోట్ల తెలుపుచుండును. "పరుషం విప్రియం సీతాయా వచనం శ్రుత్వా" అని యన్వయక్రమము. పరుషమ్మనుదానినుండియే యర్థము సిద్ధించుచుండఁగా విప్రియమ్మను విశేషణ మెందులకు? శ్రుతి కటువుగానుండుమాటయే పరుషమనఁబడును. వ్యర్థవిశేషణముల మహర్షి ప్రయోగించునా?

"లౌకికానాం హి సాధూనాం వాచమర్థోనుధావతి,
ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోనుధావతి."

అన్నసూక్తి యనృతము కాదు కదా. కావున నిందొకమహార్థమిమిడియుండవలయు. పరుషమ్ = శ్రుతి కటువుగాఁ దోఁపఁజేయుచు (శ్రోతలకని యర్థము) విప్రియమ్ = విశేషప్రియమైన, సీతాయా వచనం శ్రుత్వా = జానకీవాక్కు నాలకించి, అట్టు లాలకించినవాఁడు కాననే, ప్రియదర్శనామ్=ప్రియమగు దర్శనము కలది. అనఁగాఁ బ్రియమును గలిగించుదర్శన మిచ్చునది యని భావము. ఎంతకఠినముగా వినువారికిఁ దోఁచునట్లు

మాటలాడినను దనమది కత్యంత ప్రియముగానుండు నామహా
ప్రకృతిపలుకు లాలకించి యంతఁ బ్రియదర్శనయగు నాదేవిం
గాంచి రావణుఁడు బదులు చెప్పెనని మనము గ్రహింపవలయు.
ఈశ్లోకమునం దిట్టియర్థము గలపదములను జేర్చుట మాని
యాశయ మెద్దియని విచారించునవకాశమును గల్గించు
చున్నది.

"యథా యథా సాంత్వయితా వశ్యస్త్రీణాం తథా తథా,
యథా యథా ప్రియంవక్తా పరిభూతస్తథా తథా." ౨

అని మూలము. సాంత్వమనఁగా కర్ణమనఃప్రీతిజనక మగు
వాక్యము. అట్లు పలుకువాఁడు "సాంత్వయితా" అనఁబడును.
సామాన్యార్థము స్పష్టము. అనునయించుచు స్త్రీలకడ మాట
లాడువాఁడు వారలకు వశ్యుఁ డగును. ఎంత ప్రియముగా
మాటలాడునో యంత పరిభవింపఁబడును అని కదా దీని య
ర్థము. స్త్రీలకడ నప్రియములు పలుకవలయుననియా భావము!
ఇందేమి సార మున్నది? విశేష మిట్లూహింతము. స్త్రీదేవతల
నుపాసించువాఁడు సహస్రనామస్తోత్రాదులను బఠించునేని
వారలకు వశ్యుఁ డగును. అనఁగా వార లితనిఁ దమ దాసు
నిగా భావింతురు. ప్రియముగా మాటలాడిన ననఁగా స్వకా
ర్యార్థ మూరకే వినుతించిన వారికడఁ బ్రీతిపాత్రుఁడుగా
నుండనేరఁడు. అనఁగా స్వకార్యార్థ మామంత్రముల నుపా
సింపక తరణోపాయమును దెలియఁగోరి యుపాసించిన వార
లాత్మపాదసేవాతత్పరునిగా గ్రహింతురని యిందుండి తేలెడి
విశేషము. ఉపాసకుఁడు ఫలాపేక్ష గలవాఁడు కారాదని
భావము.

"సన్నియచ్ఛతి మే క్రోధం త్వయి కామస్సముత్థితః,
ద్రవతో మార్గమాసాద్య హయానివ సుసారథిః." 3

అని మూలము. రావణుఁడు దేవదర్శనఫలమును వివరించుచున్నాఁడు. దారితప్పిపోవు హయములను నేర్పుగలసారథి సాధించుచందమున నీయందుఁ గలయిచ్ఛ అనఁగా భక్తియని యర్థము. నాక్రోధము నడఁచి వేయుచున్నది. ఇష్టదేవతవగు నీయందు భక్తి కుదురఁగా నాక్రోధాదులు తగ్గిపోయినవని తాత్పర్యము. ఉపలక్షణవిధిచే నిందుఁగల క్రోధశబ్దము అరిషడ్వర్గోపలక్షకమని యెఱుంగవలయు.

"క్రోధాద్భవతి సమ్మోహస్సమ్మోహాత్స్మృతివిభ్రమః,
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి."

అన్న గీతావాక్యముచొప్పునఁ గ్రోధము మిక్కిలి యపకారము చేయునదని భావము. కామశబ్దమునకు ననురాగమని యర్థము చెప్పినయెడల

"కామాత్క్రోధోఽభిజాయతే."

అన్నగీతావాక్యము వ్యర్థమే యనవలయు. క్రోధమునకుఁ గామ ముత్పత్తిస్థానము కాఁగా నది దీనినడఁచుట యసంభవము కాన నది పొసఁగదు. దేవీ! నీయందు నాకుఁ గుదిరిన భక్తి క్రోధాదుల నడఁచినదని రావణునాశయమని మనము గ్రహింతము.

"వామః కామో మనుష్యాణాం యస్మిన్ కిల న బధ్యతే,
జనే తస్మింస్త్వనుక్రోశః స్నేహశ్చ కిల జాయతే. 4

అని మూలము. విశేషార్థ మిది. ఉపాసకునకు నిచ్ఛయనఁగా

ఫలాభిసంధియని యర్థము. అది వామము. అనఁగా శుభేతర మని యర్థము. ఏలయనఁగా నది యెట్టివస్తువునందును దయా స్నేహములను గలిగించి బంధించును. కావున నుపాసకుఁడు ఫలమందలి యిష్టము వదలవలయును. అది బంధమును గల్పింపదు. విశేషించి తరణోపాయముం బొడకట్టఁ జేయును. కావున బంధవిముక్తికి సాధనమగు కామమును వదలవలయునని గ్రహింపవలయు. మఱొక్కవిషయము. "కామః వామః." సుందరమగు కామరాజబీజమని యర్థము. ఏభక్తునిమనస్సున నెలకొలుపఁబడునో యాతనిహృదయమున దయాస్నేహములు నిలుకడఁ గాంచును. కామరాజబీజప్రధానమంత్రము నుపాసించువారికి దయాస్నేహములు తమయంతన తత్ప్రభావమునఁ బొడకట్టునని సారము.

"ఏతస్మాత్కారణాన్న త్వాం ఘాతయామి వరాననే,
వధార్హామవమానార్హాం మిథ్యాప్రవ్రజితే రతాం." ౫

అని మూలము. విశేషార్థ మిద్ది. ప్రవ్రజితే=వనవాసము చేయ వచ్చిన నాదేవుఁడగు శ్రీరామునియందు, రతామ్ = అత్యంతాసక్తిగల, త్వాం=నిన్ను వరాననే=వరములనొసంగు మోము కలదానా! వరప్రదాయినివని భావము. ఏతస్మాత్కారణాత్ = ఈపై వివరించిన కారణమువలన న ఘాతయామి=దండింపను. వధార్హా మవమానార్హాం = వధావమానముల కర్హురాలగు స్త్రీని. వధశబ్దమున కిచ్చట కశాఘాతమని యర్థము. ఈయర్థమే వివాదరత్నాకరమునందు వ్రాయఁబడినది. ఘాతయామి=చంపుచున్నాను. అనునది, మిథ్య = అబద్ధము. స్త్రీహత్యను జేయువాఁడను గాను. స్త్రీజనము దూషించుట యిక్షుఖండమును భక్షించుట నీభక్తుల కనర్హము లనుమాట నే నెఱుంగుదునని

తాత్పర్యము. ప్రకృత్యుపాసనకు ఫలము భగవద్విషయక దృఢజ్ఞానమే కాని వేఱొండు కాదని తన్మంత్రార్థమే బోధించుచున్నది. కావున నాభావ మెద్దియో నీవెఱుంగవా యని రావణుఁడు తెలుపుచున్నాఁడు. అని మన మూహింపందగు.

"పరుషాణీహ వాక్యాని యాని యాని బ్రవీషి మాం,
తేషు తేషు వధో యుక్తస్తవ మైథిలి దారుణః. ౬
ఏవముక్త్వా తు వైదేహీం రావణో రాక్షసాధిపః,
క్రోధసంరంభసంయుక్తస్సీతాముత్తరమబ్రవీత్." ౭

అని మూలము. తవ = నీభక్తిసంబంధముగల, మాం=నన్ను, ఎన్నియెన్ని పరుషవాక్యములు పలికితివో, తేషు తేషు= తేభ్యస్తేభ్యః అని విభక్తి విపరిణామము. వానివలన, దారుణో వధో మమ యుక్తః = నీవన్నమాటలకంటె వధమే నాకు యుక్తము. ఇతరులు వినునట్లు నీవు పలికిన కఠినవాక్కులకంటె నాకు మరణమే యుక్తమని భావము. నాయందు నాగ్రహ మునుపక దయయుంచుము. త్వరితముగా మృతిగల్గునట్లు నీభక్తుఁడ నగునాకు వరమిమ్మనిభావము. ఇంతమాత్రము పలికి మరలఁ బలుకుచున్నాఁడు. ఈశ్లోకము వ్యర్థమని కొంద అందురు. "క్రోధసంరంభసంయుక్తః" అన్నమాటయే యిందుఁ బ్రధానమని కొంద అందురు. ఇంతకుముందే క్రోధ మావేశించియున్నదే. యిదేల మరలఁ జెప్పుట యని యింకనుం గొందఱు పలుకుదురు. ఈశ్లోకాభిప్రాయ మేమనఁగా రావణుఁడు స్వాభిప్రాయము నింతమాత్రము తెలిపి విశేషించి పెంచి గూఢముగాఁ జెప్పుటకంటె వేగమ యాశయసారమును దెల్పుట మంచిదని చూచువారలకు మఱింత తెలియునట్లు గూఢాభి

ప్రాయ మెఱుంగకుండఁ జేయుటకై మఱియుఁ గ్రోధముం దెచ్చుకొని పలుకఁ బూనెనని మనము గ్రహించిన నీయ వాంతరానర్థములు పొసఁగవు.

"ద్వౌ మాసౌ రక్షితవ్యౌ మే యోఽవధిస్తే మయా కృతః,
తతశ్శయనమారోహ మమ త్వం వరవర్ణిని. ౧
ఊర్ధ్వం ద్వాభ్యాం తు మాసాభ్యాం భర్తారం మామనిచ్ఛతీం,
మమ త్వాం ప్రాతరాశార్థ మారభంతే మహానసే." ౧

అని మూలము. మే=అనునది "మా"శబ్దసంబోధనము. ఓలక్ష్మీ అని యర్థము.

"శృణు మైథిలి మద్వాక్యం మాసాన్ ద్వాదశ భామిని,"

అని యరణ్యకాండముననేఁ బ్రార్థించినసమయమున నింక రెండునెలలే మిగిలియున్నవి. ఈరెండునెలలు ప్రతీక్షింపవల సినవాఁడ ననుట. ఆమీఁద, తే భర్తారం మా మితిశేషః. అని చ్ఛతీం మమ మాం=అస్మద్రాజ్యలక్ష్మినని యర్థము. ప్రాప్స్యసి= అనునది "అర్థాత్సిద్ధ" మ్మనున్యాయము ననుసరించి తోఁచును. పొందఁగలవు. నారాజ్యలక్ష్మిని గ్రహింప నిన్నుఁ బ్రార్థించెద నని భావము. ఈరెండునెలలు గడువఁగా ప్రాతరాశార్థం= ప్రాతఃకాలభోజనార్థము. మహానసే=వంటయింటియందు, ఆర భంతే=రలయోరభేదము. ఆలభంతే=పశువుల వధింతురు. వాని మాంసమును గ్రహింపుమని యర్థము. శయనమారోహ= మంచిశయ్యయందుఁ బండుకొనుము. ఓమహాలక్ష్మీ! నిన్ను శ్రీరామునిరాకకై షండ్రెండునెలలు వేచియుండుమని కోరి తిని. పదినెలలు గడచినవి. రెండునెలలు గడువవలయు. ఆమీఁద నీభర్తను గాంతువు. నన్ను వదలనున్న రాజ్య

లక్ష్మిని బొందుదువు గాక అని వేఁడుచున్నాఁడను. నావంటయిం టమేధ్యపశువుల వధింతురు. ఆమాంసము నంగీకరించి సుఖ శయ్య శయనింపుము. ఈదురంతతాపముల నలఁగనేల? ఈ చింత వదలుము. ఈరెండునెలలు సుఖముగా నుండుము. నాకీ వర మనుగ్రహింపుమా యని వేఁడుచున్నాఁడు.

"తాం తర్జమానాం సంప్రేక్ష్య రాక్షసేంద్రేణ జానకీం,
దేవగంధర్వకన్యాస్తా విషేదుర్వికృతేక్షణాః. ౧౦

ఓష్ఠప్రకారైరపరా వక్త్రనేత్రైస్తథాపరాః,
సీతామాశ్వాసయామాసుస్తర్జితాం తేన రక్షసా. ౧౧

తాభిరాశ్వాసితా సీతా రావణం రాక్షసాధిపం,
ఉవాచాత్మహితం వాక్యం వృత్తశౌండీర్యగర్వితం." ౧౨

అని మూలము. ఈవటుకు రావణుని మోహించియే రాజర్షి దేవగంధర్వకాంతలు వచ్చిరని చెప్పఁబడినది. వారెల్ల రాతని మీఁద నతిప్రేమ గలవారే. కావున నాతనిమాటల ననుసరించి యాసీతను బెదరింపఁ దగినవారే. అయినను వారాతఁడా సీతను బెదరించినట్లు మాటలాడఁగా స్వభావమునఁ గరుణగల వారు గావున దుఃఖించిరని తాత్పర్యము. వారినేత్రములు యథాపూర్వకాంతిని బాసియుండెను. ఏల? వారిసౌభాగ్యము రెండునెలలలో నశింపనున్నది. కాన వానికాంతి నశించెను. దీనినుండి తేలెడు నాచార మేమనఁగా. జాతికిఁ దగినస్వభావ మేనాఁడు నశింపదు. ఎన్నిమార్పులు గలిగినను గలుగుం గాక. ఆజాతి కేది యుచితమో దానిస్వభావము మాత్రము నశింపదు. నడుమవచ్చినయలవాటు లెన్ని నశించినను స్వభా వము మాత్రము క్షీణింపదు. అందుఁ గొందఱు పెదవులు

విఱిచిరి. ముఖము కన్నులు త్రిప్పిరి. వీనిరూపమున సీత నూఱడించిరి. అనఁగా నర్థమేమి? ఈతనిమాటలకు భయపడ కుము. నీపాతివ్రత్యమే నిన్నుఁ గాపాడుననియే కదా యా యూఱడింపునకు ఫలము. మావలెనే నీవు నీతనిం గోరుకొను మని యుండదు గదా. అనఁగా నీరావణునిమూలమున నీకే మియు హానిరాదని వారిభావమైనట్టు కనుపట్టు. ఆయూఱడిం పుల నెఱింగి యాసీత తనపాతివ్రత్యబలమున గర్వించినట్లుగాఁ బలికెను. అనఁగా వానిని లెక్కింపక యీతఁడేమియుఁ జేయఁ జాలఁడన్న యాశయము కలదియై యాత్మహితమగుమాట నిట్లు చెప్పెను. "ఆత్మనో హితమ్" అని సమాసము. తనకు హితమగువాక్య మనునర్థము రసపుష్టిగలది కాదు. రావణుని మనస్సునకు హితమగునట్టిమాటను బలికెనన్న బాగుండు నేమో. అదియే మన మంగీకరింప నర్హము. రావణుని గూఢాభి ప్రాయ మెఱింగి సీత యారావణునకు హితముగా (మనస్సు నకుఁ) దోఁచునట్టు లిట్టులు పలికెను.

"నూనం న తే జనః కశ్చిదస్తి నిశ్శ్రేయసే స్థితః,
నివారయతి యో న త్వాం కర్మణోఽస్మాద్విగర్హితాత్." ౧౩

అని మూలము. రావణునకు మేలుగోరియే సీతాదేవి యిట్లు తెలుపుచున్నది. వినువారల కించుకంతయు ననుమానము కలుగరాదనియే యాదేవి యాశయము. రావణా! నీమేలు గోరినవాఁ డొకఁడైన నిందున్నట్లు కానరాదు. ఎట్లెఱింగితి వందువేమో. ఈకార్యమునుండి నివారించినట్లు లేదు. ఏది యాకార్యము? విగర్హితమైనది. కనుకనే యొక్కఁడైనఁ గాన రాఁడని యర్థము. వినువారికిఁ బరదారనగు నన్నుఁ గోరుటయే నీచకార్యము. దీనివలదని వారించువాఁ డొక్కఁడైన లేఁడని

సీత పలికెనని యర్థము కావలయుననియే రావణున కిట్లు భావము పొడకట్టవలయుననియు నామె తలంచెను. దానవ నాయకా! ఇందుండు రక్కసులెల్ల నీకుఁ దోడుపడువారుగా నున్నారు గాని వాస్తవముగాఁ దోడుపడువాఁ డిందొక్కఁ డైన లేఁడు సుమీ. విగర్హితాత్ =గర్హితము కాని, అస్మాత్క ర్మణః = ఈకర్మమునుండి – అనఁగా నీశరీరత్యాగోద్దేశరూప కర్మమునుండి యని యర్థము. నివారించువాఁడు లేఁడు. అనఁగా నీ తరణోపాయమునకుఁ దోడుపడువాఁడు లేఁడు. ఎల్లరు నైహికసుఖాభిలాషులే కాని పారమార్థికసుఖాభిలాషు లిందుఁ గనఁబడకున్నారే యని యామె యాశయము. నీవంటి భక్తుఁ డింకొక్కఁడు కనఁబడకున్నాఁడే యని సారము. న న్నారాధించి నామూలమున భగవంతుఁ డగు శ్రీరాముని శరణు చొరఁగోరునట్టి యలవాటుగలవాఁ డొక్కఁడైనఁ గాన రాఁడు. మాయను జయింప నెల్లరుఁ గోరుదురు. అది హరిహర బ్రహ్మలకేని సాధ్యమా? నన్నాశ్రయించి నాయనుగ్రహపాత్రుఁ డయియే పరమాత్మకడఁ జేరవలయును. "తదను ప్రధాన ద్వారా రాజదర్శనం కర్తవ్యమ్"అని న్యాయము కలదు కదా.

"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే."

౧౪ గీత, ౭ అ.

"దైవీ దేవస్య మహేశ్వరస్య విష్ణోస్స్వభావభూతా హి యస్మాదేషా యథో క్తా గుణమయీ మమ మాయా దురత్యయా దుఃఖేన అత్యయః అతిక్ర మణం యస్యాస్సా దురత్యయా తత్రైవం సతి సర్వధర్మాన్ పరిత్యజ్య మామేవ మాయావినం స్వాత్మభూతం సర్వాత్మనా యే ప్రపద్యంతే తే

మాయామేతాం సర్వభూతమోహినీం తరంత్యతిక్రామంతి. తే సంసార బంధనా న్ముచ్యంతే ఇత్యర్థః."

అని శంకరాచార్యభాష్యము. మాయావినం స్వాత్మభూతమ్ = మాయ గలవాఁడు. అనఁగా మాయ తనదైనవాఁడని యర్థము. తన కభేదముగానుండు మాయగలవాఁడని తాత్పర్యము. అట్టిదానిని దన్నాశ్రయించినఁ దరించుటెట్లు? దానిని వదలి తన్నాశ్రయించు టెట్లు? అనుసందియము రాక మానవు. సమాధాన మెట్లనఁగా, భగవంతు నాశ్రయించుట యనఁగా సత్కర్మానుష్ఠానము ఫలాపేక్షావిరహితముగాఁ జేయుట. ఫలాపేక్ష గలిగిచేయుట మాయ నాశ్రయించుట యని మన మూహింపవలయును. అపుడే యజ్ఞానము తొలఁగును. మాయనాశ్రయింపక సత్కర్మానుష్ఠానము చేయుటెట్లని సందేహము పొడకట్టును. సగుణమంతయుఁ బ్రకృతిమయము గదా. సగుణబ్రహ్మోపాసన మనఁగాఁ బ్రకృతిని జ్ఞానము నిమ్మా యనువాంఛ తప్ప నితరవాంఛలు లేక యుపాసించుట. అపుడు మాయాదేవియే యనఁగా భగవదభేదరూపిణి యగు నిచ్ఛాశక్తియే జ్ఞానదాయిని యగు. అపుడు సమదర్శనత్వ మలవడు. దేనిని గాంచిన నది భగవన్మయముగాఁ జూడఁగల్గును. అదియే భగవదుపాసన యనఁబడును. సగుణబ్రహ్మము నుపాసింపక నిర్గుణోపాసనచేయుట యనఁగా నేతిబీరకాయ యన్నట్లే. ఈవిషయమును శ్రీశంకర భగవత్పాదులవారే సౌందర్యలహరియందు

"త్రయాణాం దేవానాం త్రిగుణజనితానాం తవ శివే
భవేత్పూజా పూజా తవ చరణయోర్యా విరచితా,

తథా హి త్వత్పాదోద్వహనమణిపీఠస్య నికటే
స్థితా హ్యేతే శశ్వన్ముకుళితకరోత్తంసమకుటాః."

"అయం భావః భగవత్యాః పాదపీఠసేవా పూజామాత్రేణ త్రయాణాం బ్రహ్మాదీనాం పూజా ఫలం లభ్యతే, అపితు భగవత్యాః ప్రసాద వశాదేవేతి."

అని వ్యాఖ్య. దీనిం బరిశీలించిన "మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే" అన్న దానిభావ మెద్దియని స్పష్ట మగును. ఈయర్థమునే గూఢముగా "కర్మణోఽస్మాత్" అను దానిమూలమున నామహాదేవి తెలిపెనని మన మెఱుంగుట మంచిది.

"మాం హి ధర్మాత్మనః పత్నీం శచీమివ శచీపతేః,
త్వదన్య స్త్రిషు లోకేషు ప్రార్థయే న్మనసాపి కః." ౧౪

అని మూలము. ధర్మః ఆత్మా యస్య తస్య=అనఁగా ధర్మమే రూపముగాని యొక్కరూపము నాదియనునది లేనివాఁడని భావము. రూపశూన్యుఁడని సారము. సర్వరూపము లతనివే యని దీని హృదయము. అట్టి భగవంతునిపత్నిని. అనఁగాఁ దదిచ్ఛారూపిణి నని భావము. అట్టి నన్ను "త్రిషు లోకేషు త్వదన్యః కః మనసాపి ప్రార్థయేత్?" నీవంటి సకలవేదవేదాంగ వేత్త యగువాఁడు తప్ప మఱెవ్వఁడు మనస్సుచేనైనఁ బ్రార్థించును? రావణా! భగవంతు ననుగ్రహమును గల్గింపుమని న న్నారాధించువారు తఱచుగాఁ గానరారు. నీవిపుడు కనఁబడితివి. ఇఁక నీవంటివాఁ డెవ్వఁడైన నుండుఁగాక యను నర్థ ధ్వనియు నిందుఁ గలదు. భగవతి యారాధన మనఁగా నిర్గుణ పరబ్రహ్మప్రాప్తి లాభమం దిచ్ఛయే యని దీని హృదయము.

ఫలాభిసంధిరహిత తపస్సని కదా దీని తాత్పర్యము. అదియే భగవత్సాయారాధనము కాని పుష్పాదిపూజ కానేరదు. అది యత్యల్పఫలప్రదము. "ధ్యానమేవ పరో జపః" అని కదా పెద్ద లందురు.

"రాక్షసాధమ రామస్య భార్యా మమితతేజసః,
ఉక్తవానసి యత్పాపం క్వ గత స్తస్య మోక్ష్యసే!" ౧౯

అని మూలము. పూర్వశ్లోకమునఁ దెల్పినయర్థ మితరులకు దుర్గ్రాహ్యమగునట్లు బాహ్యదృష్టి గలవారలకుఁ దనవిషయమున శంక కలుగకయుండఁ బలుకుచుఁ దన్మూలమున లోకమున కొకనీతిని దెలుపుచున్నది. మహాత్ములపత్నుల నొక్క మాట యన్నను మహాపరాధ మగుననియు నాపాప మేలోకమున కరిగినను దప్పక యతని బాధించుననునదియే యిందు సీతాదేవి తెలిపిననీతి.

"అసందేశాత్తు రామస్య తపసశ్చానుపాలనాత్,
న త్వాం కుర్మి దశగ్రీవ భస్మ భస్మార్హ తేజసా." ౨౦

అని మూలము. పాతివ్రత్యమహత్త్వము నిందు సీతాదేవి తేటపఱచుచున్నది. వనయాత్రయం దపరాధులను శపింపుమను రామాజ్ఞ లేనందున, శపించినఁ దపోవ్యయ మగునన్న కారణమున నాశాపాగ్నిచే నిన్ను దహింపఁజేయవలసిన దాననే యైన నూరకున్నాను. అని ప్రాతీతికార్థము. రావణుఁడు నిన్నపహరించును. కాన శపింపు మని యాజ్ఞాపింపలేదు. అతఁ డపహరించుట కాముముచేతఁ గాదని రాముఁ డెఱుంగుననునర్థ మిటఁ ధ్వని. కాన నామూలమున నీకీదేహము వదల వలనుపడదు. శ్రీరామునిమూలముననే యది కావల

యును. కావున నారామాజ్ఞఁ దలఁదాల్చి నిన్నేమియుఁ జేయఁ జాలక యున్నదానవని సారము. భర్తయానతినొందక యెంత తపశ్శక్తికలవారైనను శపింపరాదన్న ధర్మము నీమూలమున జానకి తెలిపెనని మన మెఱుంగుట తెలుఁగు. శాపము నిచ్చుటంజేసి తపశ్శక్తి వ్యయించును. పరబాధాసహిష్ణుత్వమే శాంత మనంబడును. అట్టిశాంతము లేకయున్న నాతపస్సు తామసమో రాజసమో యగును. అట్టిదైన నది సంపూర్ణఫల దాయకము కాఁజాలదు. కావున నెవరెన్నిరీతుల బాధించిన నవ్వానికన్నింటికి నోర్చుకొని వారి కపకారముం గోరక చేయుతపస్సే చక్కనిఫలమొసంగునని యీభాగమునుండి మనము నేర్చుకొనవలయును.

"నాపహర్తుమహం శక్యా త్వయా రామస్య ధీమతః,
విధిస్తవ వధార్థాయ విహితో నాత్ర సంశయః." ౨౧

అని మూలము· సీతాదేవి స్వాశయమును స్పష్టీకరించుచున్నది. రావణా! శ్రీరామునికడనుండి న న్నపహరించుటకు నీ కశక్యము. నీమృతికొఱ కిట్లు సీతాపహరణవ్యాజమును విధి కల్పించెను. ఇందులకు సందియమే లేదు. అని యర్థము. ఇచ్చట రామునకు "ధీమతః" అనువిశేషణము ప్రయోగింపఁబడినది. "ధ్యాయంత్యనయేతి ధీః, ధ్యై చింతాయామ్." అను వ్యుత్పత్తి ప్రకారము విషయములను జింతించువాఁడని యర్థము. మహాకవి యిచ్చో నీపదము నేల ప్రయోగించెనని మనము విచారింపవలయును. నేను నీయాశ్రమమున నున్న మాయాసీతాపహరణము సాగదు. అదియే కదా రావణునకు మృతిహేతువు. నావెంటఁగాని సౌమిత్రి రాఁడు. అని యాలోచించి కాఁగల కార్యమునకై యాశ్రమమునుండి వెడలిపోయెను. పిదప లక్ష్మ

ణుఁడు పోయెనను భావ మీభాగము తెలుపుటకొఱకే మహాత్ముఁడు "ధీమతః" అని ప్రయోగించెను. "నాపహర్తు మహం శక్యా" అనఁగా భావ మేమి? నన్నుఁ దీసికొనిరా నీకు శక్యము కాదని కదా. తెచ్చినవాఁ డయ్యెఁగదా. ఈమాట యసత్యమే యనవలయును. కావున నీయపహరణము బాహ్యదృష్టికిఁ గనఁబడునదియే కాని వాస్తవము కాదనియు నీచోట మాటలాడు సీత మాయసీతయే యగు. ఈవిషయము లోపల వ్రాసియే యున్నాను. ఇచ్చోఁ నాయభిప్రాయమే కలదు. ఈవిషయము నంగీకరింపకయున్న సీతావాక్య మనృతమనవలయు. అంత మాట మన మనవచ్చునా? మహాపచారము కదా. "తెలియఁజాలకపోతిమి" అనవచ్చును గాని వేఱొకమాట యన రాదు. ఇందుఁగల సార మేమి? రావణా! నన్ను రామభద్రుని మోసపుచ్చి యపహరించితినని తలంచుచున్నావు. అది తెలివి తక్కువ యూహ. సర్వవ్యాపిని నగు న న్నపహరించుట యనఁగా నర్థ మేమి? ఒక్కరూపమును ధరించియుండఁగాఁ జూచుట యని యర్థము. నీయందు నేనే యున్నాను. నీమూలమున నొక్కనీతిని లోకులకుఁ దెలుపుటకే యీమహా యిరువురయత్నము. దాని నీ వెఱుఁగనట్లు కర్మము ననుసరించి వాదించుచున్నాఁడవు. నీవు నెఱుఁగుదువు. నీమృతికై యీ కార్య మొనర్ప సంకల్పించితివి. ఆసంకల్పము శీఘ్రమే ఫలించును తప్పక ఫలించును. విధియనఁగాఁ గర్మముకాక వేఱెద్ది? అది నీమృతి కేదిమార్గమో యద్దానిని ఫలింపఁజేయ సంకల్పించినది. "గహనాకర్మణో గతిః" అన్నమాట స్పష్టము. ఇంక నిశ్చింతముగా నుండుము. కార్యము ఫలించును. అనునదియే సారమని మన మెఱుఁగందగు.

"సీతాయా వచనం శ్రుత్వా రావణో రాక్షసాధిపః,
వివృత్య నయనే క్రూరే జానకీ మన్వవైక్షత. ౨౩
... ... ... ...
స కల్పవృక్షప్రతిమో వసంత ఇవ మూర్తిమాన్,
శ్మశానచైత్యప్రతిమో భూషితోఽపి భయంకరః. ౨౯
... ... ... ...
ఉవాచ రావణస్సీతాం భుజంగ ఇవ నిశ్శ్వసన్." ౩౦

అని మూలము. ఈభాగమును జక్కఁగాఁ బరిశీలించిన లోపల వ్రాసినయర్థ మెంత సుసంగతమో స్పష్టమగును. మహాకోపము గలరావణు నిచ్చో వర్ణించుట క్షేమేంద్రపండితుఁడు చెప్పిన ట్లసంగతమే యనవచ్చును. కాని యాతని కిది మనస్సంతోషము గలుగుకాలము. క్రోధావేశము నటనము. మహాకవి రావణు భావమంతయు వర్ణనమూలమునఁ దేటపఱచెను. వసంతకాలమునఁ గల్పవృక్షమువలె నుండెను. అనుట మనస్సంతోషావేశద్యోతకము. "భూషితోఽపి శ్మశానచైత్యప్రతిమః" అలంకృతుఁడైనను శ్మశానమున నున్నవృక్షమువలె భయంకరుఁడుగ నుండెను. అనుట సమీపస్థిత మృత్యుద్యోతకము. ఎన్నియలంకారములు శరీరమునఁ గన్పట్టినను రెండు నెలలలో మృతినొందఁగలవాఁడు కావున శరీరకాంతి మాసెనని భావము. ఇఁక సీతాదూషణవాక్యములు హనుమంతునకు సీతయందు విశ్వాసము కలుగుటకై రామునితో రావణుఁడు దుర్భాషణము లాడెనని తెలుపుటకై దానిచేతఁగాని తనకు మృతిగలుగఁజేయ శ్రీరాముఁడు రాఁడనునాశయమును దెలుపుటకయి యనియే గ్రహింపవలయును.

"అనయేనాభిసంపన్న మర్థహీనమనువ్రతే,
నాశయామ్యహమద్య త్వాం సూర్యస్సంధ్యామివౌజసా." 3౧

అను నీమూలము పెక్కుగ్రంథములలోఁ గానరానికతన వ్యాఖ్యానము చేయలేదని మహేశ్వరతీర్థులు వ్రాసిరి. కొందఱది రావణుఁడు భక్తుఁడని తెలుప వలనుపడకపోయినందున వా రట్లు వ్రాసిరని పరిహాసింతురు. అట్టివారికి సంతృప్తి కలుగుటకై యిట్లు మనము గ్రహింపవలయును. భక్తుఁడే యన్న యర్థము తోఁచును. "అనయే, న, అభిసంపన్నమ్, అర్థహీనం, అనువ్రతే." అని పదవిభాగము. అనయే = అవినీతియందు, అభిసంపన్నమ్ = మిక్కిలి సమృద్ధిగలిగిన, అర్థహీనమ్ = ధనవిహీనుఁడగు (రాముని), నానువ్రతే=అనుసరింపని యోసీతా! అనఁగా నయైకసంపన్నుఁడు సమృద్ధార్థుఁడు నగు భగవంతు నాశ్రయించిన దేవీ అని భావము. త్వాం = అట్టి నిన్ను, అద్య=ఇప్పుడు, సూర్యః = భాస్కరుఁడు, ఓజసా = తేజస్సుచేత, సంధ్యామివ=సంధ్యాకాలముంబోలె, నాశయామి=కనఁబడకయుండఁ జేసెదను. ప్రాతస్సంధ్యను సూర్యుఁడెట్లు కనఁబడకుండఁ జేయునో యట్లే నేను నిన్ను నాప్రభావముచేత అనఁగా నాశక్తిచేత నితరాగోచరతం గాంచఁజేసేదను. నా మనస్సున నాదిశక్తి వగు నిన్ను నిలుపుకొనియెదను. అని యర్థము. దీనిచేత మహేశ్వరతీర్థులవారియభిప్రాయమే స్పష్టమయ్యెను. కావున వారు చూచిన పెక్కుగ్రంథములయందుఁ గనఁబడకపోవుటం జేసి వ్యాఖ్యానము వ్రాయలేదని గ్రహింపవలయుం గాని యర్థము కుదురకపోవఁగా నిట్లు వ్రాసిరని పరిహాసించుట యవివేకమే.

"యథా మద్వశగా సీతా క్షిప్రం భవతి జానకీ. 36
తథా కురుత రాక్షస్యస్సర్వాః క్షిప్రం సమేత్య చ,
ప్రతిలోమానులోమైశ్చ సామదానాది భేదనైః. 37
ఆవర్జయత వైదేహీం దండస్యోద్యమనేన చ,
ఇతి ప్రతిసమాదిశ్య రాక్షసేంద్రః పునఃపునః. 38
కామమన్యుపరీతాత్మా జానకీం పర్యతర్జయత్,"

అని మూలము. సీతకుఁ గావలియున్న వికృతాకారలగు రాక్షసస్త్రీలకు రావణుఁ డిట్టు లాజ్ఞాపించుచున్నాఁడు. ప్రాతీతికార్థము వ్రాయ నక్కఱలేదు. రాక్షసకాంతలారా! అయోనిజయయి జనకరాజుకొమరిత యని ప్రసిద్ధిగాంచిన యీదేవి యెట్లు నామాట లాలకించి నాయిచ్ఛనాహారాదులం గొనునో యట్లు చేయుఁడు. అని వారిప్రకృతికిం దగినయ ట్లుపాయములు నేర్పెను. "దండస్యోద్యమనేన చ." దండోద్యమనమునందు, నచ = వలదని యర్థము. దండించుప్రయత్నము నైనఁ జేయకుఁడని భావము. "కామమన్యుపరీతాత్మా" కామవిషయకమన్యువనఁగా నాకోరిక యింకను నెఱవేఱలేదన్న కోపము నిండినయాత్మ గలవాఁడు అని యర్థము. జానకిని రావణుఁడు భయపెట్టుట నిందాస్తుతివంటిదని యెఱింగిన నేబాధ లుండవు.

"ఉపగమ్య తతః క్షిప్రం రాక్షసీ ధాన్యమాలినీ. 39
పరిష్వజ్య దశగ్రీవ మిదం వచనమబ్రవీత్,
మయా క్రీడ మహారాజ సీతయా కిం తవానయా. 40
వివర్ణయా కృపణయా మానుష్యా రాక్షసేశ్వర,
నూనమస్యా మహారాజ న దివ్యాన్ భోగసత్తమాన్. 41
విదధాత్యమరశ్రేష్ఠస్తవ బాహుబలార్జితాన్,
అకామాం కామయానస్య శరీర ముపతప్యతే. 42

ఇచ్ఛంతీం కామయానస్య ప్రీతిర్భవతి శోభనా,
ఏవముక్తస్తు రాక్షస్యా సముత్క్షిప్తస్తతో బలీ. ౮౩
ప్రహసన్ మేఘసంకాశో రాక్షసస్సన్యవర్తత,"

అని మూలము. ఈభాగమును జక్కఁగాఁ బరిశీలింతము. పైన వ్రాసినదంతయు సిద్ధాంత మగును. క్రోధావిలచిత్తుఁ డగు దశకంధరుని ధాన్యమాలిని యనునొక ప్రియభార్య కౌఁగి లించుకొని యాకోపము నాపినది. ఈభాగ మాశ్చర్యమును గలిగింపక మానదు. మహాసౌందర్యముఁగల యొకజవ్వనిని భర్త కోరఁగా నామె యాకోరికను దిరస్కరింపఁగా నతని పూర్వపత్ని భర్తకోపము నిసుమడింపఁజేయఁ బ్రయత్నించుట లోకాచారము కాని యామె నేమియు దండింపకుమని బోధించునాచారము క్రొత్తదియే యగు సపత్నియందుఁ గని కరము స్త్రీసహజ మగునా? అట్టితఱి నాధాన్యమాలిని సీతపైఁ బ్రీతిచూపనేల? అని విచారింపవలయును. సీతాదర్శన మాత్ర మున నామెకు నూత్నాశయ ముదయించెను. హనుమ కీవిష యము తెలుపుట కదా కర్మముకోరిక. తటాలున నందఱనడుమ నతనిఁ గౌఁగిలించుకొనియెను. అంతతోనుండక మయాక్రీడ = నాతో విహరింపుము. వివర్ణయా=విగతజాతి గలది. అనఁగా నేజాతికిని జేరనిదని యర్థము. సకలజాతులు తానైనదని భావము. కృపణయా = దీనురాలు. అనఁగా భగవంతునెడఁ బాసి దీనురాలుగాఁ గనఁబడుచున్నదని భావము. మాను ష్యా=మనుష్యజాతి కలది. మానవకాంతగాఁ గనఁబడు చున్నది. రాక్షసేశ్వర = నీవు రాక్షసజాతి కలవాఁడవు. ఆమె మానవజాతిపురంధ్రి. ఈరూపమున నీవామె కటాక్ష

పాత్రుఁడవు కాఁజాలవనుభావము. మానుష్యా రాక్ష
సేశ్వర = అనుపదములవరుస తోఁపఁజేయుచున్నది. బ్రహ్మ
దేవుఁడు నీవు బాహుబలమున నార్జించిన భోగముల ననుభ
వించునదృష్ట మీమెకు లేకయుండఁ జేసినాఁడు. అనఁగా
భావమేమి? నీభోగ్యవస్తువులకు నీమె రాలేదు. వచ్చినపని
వేఱనుభావము మహాకవి యిచ్చోట సూచించెను. కోరిక
లేనిదానిని గోరుట శరీరతాపముకొఱకే. తన్నుఁ గోరినదానిని
గోరుటయే శుభము. అనునీతి ధాన్యమాలిని తెలుపఁగా విని
మహాబలశాలియయ్యు నారావణుఁడు నవ్వుచు వెనుకకు మర
లెను. అనఁగా భావమేమి? ఇతరుల కేలాటిశంకలు గలుగక
యుండ ననఁగా సీత యిన్నిదురుక్తులాడిన నేమియుఁ జేయఁ
జాలక పోయెనన్నయూహలు గలుగకయుండ నన్నీ ధాన్య
మాలిని మరలించెఁ గదా. ఇదియే భగవతి యద్భుతశక్తి.
ఇఁక నాకోరిక తీఱును. సనత్కుమారుని హితము ఫలించు
నన్నసంతోషమున నవ్వుచుం బోయెననియే కదా దీనిభావ
మని మనము గ్రహింపవలయును. ఇందు ధాన్యమాలినియని
చెప్పుటచేత మందోదరియు వచ్చియున్నట్లే గ్రహింపవలయు
నని గోవిందరాజులు.

## రాక్షసస్త్రీలు సీతను బెదరించుట.

* రావణుఁడు వెడలిపోవఁగా భయంకరాకారముగల
రాక్షసస్త్రీలందఱు సీతను జుట్టుకొని కోపావేశమున నొడలు
తెలియక పరుషవాక్కుల నిట్లు భయపెట్టసాగిరి. సీతా! రావ

* ఇది యిరువదిమూఁడవ సర్గమునఁ గలదు.

ణుఁడు పులస్త్యబ్రహ్మవంశమున జన్మించినవాఁడు. కులము
లోనగువిషయములఁ బ్రసిద్ధుఁడు. దశకంధరుఁడు. అట్టివానికి
భార్యగానుండుట మంచిదని నీకుఁ దోఁచకున్నదే. ఏల? అనిరి.
ఏకజట యనునది కోపారుణనేత్ర యగుచు మరీచి లోనగు
బ్రహ్మలాఱుగురిలో నాల్గవబ్రహ్మ పులస్త్యుఁడు. బ్రహ్మమానస
పుత్త్రుఁ డగునతనికి మానసపుత్త్రుఁ డగువాఁడు విశ్రవసుఁడు.
ఆ మహానుభావునికుమారుఁడే యీరావణుఁడు. ఇతనికి భార్య
గానుండుట మేలను నామాట యేల యంగీకరింపవని యడి
గెను. హరిజట యనునొకరక్కసి క్రోధమునఁ గన్నులు
త్రిప్పుచు సీతా! దేవతలు వారిప్రభువు మాప్రభువుచే నోడిం
పఁబడిరి. అట్టి మహావీరునకుఁ బత్ని వగుట మంచిదనియె. ప్రఘస
లోనగువారెల్ల నీవిధముగనే రావణుని వర్ణించి పరాక్రమా
దులం బేర్కొని యైశ్వర్యమును బెంపొందించి చెప్పిరి.

ఈసర్గమునను బూర్వసర్గమునను భార్య యనుదానికి
భరింపఁదగినదనియు భార్యాత్వమ్మనుదానికి భరింప నర్హముగ
నుండుట యనియు నర్థమును గ్రహింపఁదగినది. ఇంతకంటె
రాక్షసస్త్రీలమాటలయందు గ్రహింపఁదగిన విశేషార్థములు
లేవు. తరువాతికథఁ బఠింపఁ బ్రయత్నింతము.

## రాక్షసస్త్రీలు పరుషము లాడఁగా వానికై సీత వగచుట.

* పిమ్మట భీకరాకారమున నొప్పు నారాక్షసస్త్రీలు
జానకిచెంతఁ జేరి పరుషభాషణముల నిట్లనిరి. సీతా! సకల

* ఇది ఇరువదినాల్గవ సర్గమునఁ గలకథ.

భోగ్యవస్తువుల విలసిల్లు నంతఃపురమున నుండుమని కోరఁగా సమ్మతింపవే. ఏల? మనుష్యస్త్రీవి గావున మానవుఁడగు రాము నకు భార్యగానుండుట మేలని తలంచెదవు. కాని యిది మంచి యోజన కాదు. వదలుము. నీమనస్సు రామునినుండి త్రిప్పు ము. నీవు రామునకుఁ దక్కఁజాలవు సుమా. త్రిలోకగతసుఖ ములనెల్ల ననుభవించు రావణుని భర్తగా నొంది సుఖవిహార ములఁ దేలుచుండుము. ఓకళ్యాణీ! సుందరాంగివి. ఐనను మానవకాంతవౌట మర్త్యునే కోరెదవు. ఆరాముఁడు రాజ్య భ్రష్టుఁడు. వాంఛాసిద్ధులఁ బడయఁజాలనివాఁడు. దీనుఁడు. అయినను రామునే వాంఛించుచున్నదానవు. రాక్షసప్రభువగు రావణుఁ డెంత ప్రార్థించినను వాంఛింపక యున్నదాన వనిరి. తామరసాక్షియగు నా సీతాదేవి యాపలుకుల నాలకించి బాష్పములు ధారలుఁ బ్రవహించుచుండ నో దానవకాంత లారా! అంద ఱొక్కమాటగాఁ జెప్పుచున్నారే. ఇది పాప విషయమని మీకుఁ దోఁపకయున్నది కాఁబోలు. మనుష్య కాంత రాక్షసభార్యయగుట సుంతయుఁ దగదు. కనుక మీ కిచ్చగలదేని నన్ను భక్షించిన భక్షింపుఁడు. నాకిష్ట మదియైన నగుం గాని నాకెవఁడు భర్తయో యామహానుభావుఁడు దీనుఁడైన రాజ్యహీనుఁడైన నతఁడే గురువు. సువర్చల సూర్యునియం దనురాగము కలిగియున్నయట్లు నేనా శ్రీరాము నందే ప్రేమము గలిగియుందును. శచీదేవి, అరుంధతి, రోహి ణి, లోపాముద్ర, సుకన్య, సావిత్రి, శ్రీమతి, మదయంతి, కేశిని, దమయంతి యనువారివలె నాభర్తను శ్రీరామునే యనుసరించి యుందును.

సీత యట్లు పలుకఁగా విని యా రాక్షసస్త్రీలందఱు నిర్భరకోపమున నామెను బెదరింపసాగిరి. శింశుపాతరువున దాఁగియుండుహనుమ యేమియుఁ బలుకక యాభీషణభాషణముల నాలించుచుండెను. ఆస్త్రీలు సీత భయమున వడఁకుచుండఁగాఁ జుట్టుముట్టి పరశువులం గైకొని యీసీత రాక్షసేశ్వరునకు భార్యగా నుండఁదగదనిరి. ఆమె వారిపల్కులకు వగచుచుఁ గన్నీటిని దుడుచుకొనుచు హనుమంతుఁడున్న యా శింశుపావృక్షముకడకుఁ బోయెను. వారు నాసీతఁ జుట్టుకొనిరి. అందాజానకి వగచుచుండెను. వారెల్ల బెదరించుచునే యుండిరి. వినతయను నొకదనుజకాంత కోపమున నామెంగని పతియందలినెయ్యము నింతదనుకం గనఁబఱచితివి. ఇఁకఁ జాలు. ఎక్కువగా దేనిని జేసినను దుఃఖమే కలుగును. సుఖము రవంతయుఁ గల్గదు. మానవజాత్యుచితపాతివ్రత్యమును బ్రదర్శించితివి కదా. ఇఁక దానిం జాలింపుము. నేనద్దానికిఁ దృప్తినొందితిని. నీకు భద్రమగుం గాక. ఒక్కహితముఁ దెలిపెద. దానిం జేయుము. ఇంద్రాదుల నన్నింట మించి చతురుఁడు నగురావణుని భర్తగా గ్రహింపుము. మానవుని వదలి రావణునే యాశ్రయింపుము. సీతా! దివ్యచందన మలంది యనేక దివ్యభూషణముల ధరించి యగ్నికి స్వాహాదేవివలె రావణునకు భార్యవై నేఁడుమొదలు సకలభోగముల నొందుచు సకలలోకేశ్వరివై యుండుము. రాముఁడు నిన్నెడఁ బాసి జీవింపఁజాలఁడు. ఆతనితో నింకేమిపని? నామాట విని యట్లు చేయవేని యిపుడ నిన్ను మేమెల్లరము భక్షింతుము. వికట యనునది కోపమునఁ బిడికిలియెత్తి పట్టుకొని యెంతదుర్బుద్ధివే సీతా! నీవేమన్న నతఁ డోర్చుకొనెను. తగినట్లు హితము

చెప్పితిమి. నీవు వినకున్నదానవు. సముద్రమున కీవలనున్న లంకకుఁ దేఁబడితివి. ఏరికి నిందు రా శక్యముకాదు. భయంకర రావణాంతఃపురమును జేరితివి. మావంటివారు నిన్నుఁ గాపాడుచున్నారు. నిన్నింక నిందుండి కొనిపోవ నింద్రున కశక్యము. నీమేలుగోరి చెప్పుచున్నాను. నాచెప్పినట్లు చేయుము. బాష్పములవదలి యింక లాభములేదు. రావణునియెడ స్నేహముగలిగి యానందముతో నుండుము. సదా దుఃఖించి లాభమేమి? భీరూ! స్త్రీలజవ్వన మతిచపలము. ఆప్రాయము గడువకమునుపే రావణునిం గూడి సుఖింపుము. క్రీడాపర్వతారామాదులయందు విహరింపుము. ఏడువేల సంఖ్యగలకాంతలు నీకు సేవచేయుచుందురు. రాక్షసభర్తను భర్తగా గ్రహింపుము. నామాట వినకున్న నీహృదయమును భక్షింతును. చండోదరి యనురక్కసి కన్నులం ద్రిప్పుచు హరిణాక్షియగు నీసీతను రావణుఁడు తెచ్చినదిమొదలు నాకొక్కవాంఛ కలిగినది. ఈమెను జంపి కుక్షి దక్షిణభాగముననున్న యకృత్ప్లీహ్నములను, వామపార్శ్వమునసుండు గుల్మమను మాంసపిండమును, దానికిఁ బయినుండుమాంసమును, పద్మకోశమువలెఁ గనంబడు గుండెకాయను, దానిక్రిందిమాంసమును బ్రేగులను శిరస్సును భక్షింపవలయునని కోరుచున్నాను. ప్రఘుస యను నది సీతంజూపి యందఱ కిట్లనియె. ఈక్రూరురాలి కంఠమును లిమి పనితెచ్చెదను. ఊరక యుండరాదు.మానవకాంత మృతినొందెనని రావణునకుఁ జెప్పుదము. భక్షింపుఁడని యాతఁడు పలుకు. నిస్సంశయము. అజాముఖి యంత మీరందఱు దీనిని ఖండించి రెండుభాగములు చేయుఁడు. మనము వానిం బంచుకొందము. కలహముమాట నా కిష్టపడదు. అనేకపానీయవస్త్ర

వులు లేహ్యాపదార్థములు నంజుకొనుటకుఁ దెచ్చియుండు. అనఁగా శూర్పణఖ యనునది లేచి యజాముఖి చెప్పిన దంతయు నాకిష్టము. నిశ్చింతముగా మద్యము గొనిరండు. మానవమాంసమును దిని మద్యముంగ్రోలి లంకానగర పశ్చిమ భాగమున నున్న నికుంభిల యనుదేవికిఁ బ్రీతిగా నర్తనము చేయుదము. ఇట్టు లందఱు భీకరముగా మాటలాడఁగా విని యాసీత మిగుల వగచెను.

ఆర్యులారా! ఇందుఁ గొన్ని భాగములు పరిశీలనార్హములు గలవు.

> "మానుషీ మానుషస్యైవ భార్యాత్వం బహుమన్యసే,
> ప్రత్యాహర మనో రామాన్న త్వం జాతు భవిష్యసి." 3

అని మూలము. విశేషార్థము. తల్లీ! నీవు మనుష్యావతార మెత్తితివి. కావున మనుజాకారతం గాంచిన పరమేశ్వరుని భర్తనే కోరుచున్నావు. అది న్యాయ్యము. కావున రామాత్ మనో న ప్రత్యాహర=రామునినుండి మనస్సును మరల్పకుము. జాతు త్వం భవిష్యసి = మరల నొక్క కాలమున నతనికడఁ జేరఁగలవు. అని. ఈయర్థ మాక్రూర రాక్షసాంగనకు నిష్టమే యగునా యందు రేని వినుఁడు. దైవికముగా దానినోటనుండి యట్టి యర్థము గలపదములే వెడలెను. అది యట్లు చెప్ప వలెనని చెప్పలేదనియు భగవతి సంకల్పబలమున నట్టియర్థమును బోషఁజేయుపదములే దొరలెననియు మన మెఱుంగందగు. వాల్మీకిమహాముని యిందొక్క నీతిని లోకుల కెఱుంగఁ జేసెను. మనుష్యకాంత మనుష్యజాతిపురుషునే మిక్కిలి యంగీకరించును. అనఁగా భావమేమి? భిన్నజాతిపురుషులఁ గోరరా

దనియే కదా. మనుజులలోఁ గూడ ననేకభేదము లగుజాతు లున్నవి. అందు నేజాతిస్త్రీ ఆజాతిపురుషునే మిక్కిలి గారవింపందగు. అసవర్ణజాతి పురుషుని గారణాంతరమున నంగీకరించిన నాప్రేమాదికము శీఘ్రమున నశించును. కావున నసవర్ణవివాహము యోగ్యముకాదని తేలెడిని. ఈవిషయమునే స్మృతు లుద్ఘోషించుచున్నవి. ధనమునుగాని సౌందర్యయౌవనములఁగాని గాంచి యట్టివివాహమునకు స్త్రీగాని పురుషుఁడుగాని సమ్మతించిన నాదాంపత్య మనేకకష్టముల కాలవాలమై కడు వడిం జెడునని మన మెఱుంగవలయు. ఆంగ్లేయమహాకవి అధిలబింబము (ఒథెల్లో) అనునాటకమున నీవిషయమునే తెలిపెను. ఆనాటకమెల్లఁ జదివినఁ దేలెడు సారమిదియే యని మన మూహింపఁ గల్గుదుము. వాల్మీకిమహర్షియు నీభావమునే తెలిపెను. దీని నాధారముచేసికొని యెల్లరు తమభావములఁ దెలిపి దీనినే దృఢపఱచిరని మన మీభాగమునుండి గ్రహింపవలయును. సదాచారములన్నియు నీరామాయణమునఁ గలవని సారము.

> "త్రైలోక్యవసుభోక్తారం రావణం రాక్షసేశ్వరం,
> భర్తార ముపసంగమ్య విహరస్వ యథాసుఖం. ౪
> మానుషీ మానుషం తం తు రామమిచ్ఛసి శోభనే,
> రాజ్యాద్భ్రష్టమసిద్ధార్థం విక్లబం త్వమనిందితే." ౫

అని మూలము. ముల్లోకముల జయించిన రావణుని,భర్తారమ్=భృత్యునిగా, ఉపసంగమ్య=అంగీకరించి, యథాసుఖం విహరస్వ = ఇష్టానుసారముగాఁ గ్రీడింపుము, రాజ్యాద్భ్రష్టమ్=పితృవాక్యపరిపాలనార్థము రాజ్యమునుగూడ వదలినవాఁడని

యర్థము. అసిద్ధార్థమ్=అశ్చాసౌ సిద్ధార్థశ్చ = అని సమాసము. సిద్ధార్థుఁ డగువిష్ణుమూర్తి, విక్లబమ్=దయాళువు. అట్టి శ్రీపర మేశ్వరుని, శోభనే అనిందితే = మంగళస్వరూపవు, స్తుతిపాత్రు రాలవు నగు నోసీతా నీవు మానుషావతార మెత్తినదానవు గాన, మానుషం తం తు=మర్త్యావతార మెత్తిన శ్రీరాముని, ఇచ్ఛసి=కోరుచున్నావు. ఇది యుక్తమే అని భావము. అసిద్ధార్థ మ్మనుచోట నీయర్థము సమంజసముగా నున్నదా యందురేని భాష్యకర్తలే కొన్నితావుల నిట్టియర్థములు చెప్పిరి. లలితా సహస్రనామస్తోత్రమునందు నిట్టినామములే యున్నవి. కాన నిది యసమంజస మనరాదని యాస్తికు లందురు.

"న మానుషీ రాక్షసస్య భార్యా భవితుమర్హతి,
కామం ఖాదత మాం సర్వా న కరిష్యామి వో వచః." ౮

అని మూలము. లోపలవ్రాసినభావము నీయది దృఢపఱచు చున్నది. మానవజాతికాంత రాక్షసునకు భార్య కాఁదగదు. నరమాంసమును గోరుదురేని మీరు నన్ను భక్షింపుఁడు. మీమాటప్రకారము చేయను. శరీరము పోయినఁ బోవుఁ గాక. నిశ్చితార్థమును వదలరాదనునీతి యీభాగమునందుఁ బ్రతిపాదితము. అసవర్ణవివాహ మనర్థదాయక మనువిషయ మీభాగమున సిద్ధాంతము చేయఁబడినది.

"దీనో వా రాజ్యహీనో వా యో మే భర్తా స మే గురుః,
తం నిత్య మనురక్తాస్మి యథా సూర్యం సువర్చలా." ౯

అని మూలము. సాధ్వీధర్మములను సీత యీభాగమునఁ దెలుపుచున్నది. పతివ్రతే తనభర్త యెట్టికష్టములపాలైనను వదలక గురువుగాఁ దలంచి సేవించుచుండవలయుఁ గాని

సుఖకాలమున సేవించి కష్టకాలమున వదలరాదనుభావమును దెలుపుచున్నది.

"రావణం భజ భర్తారం భర్తారం సర్వరక్షసాం. ౨౩
విక్రాంతం రూపవంతం చ సురేశమివ వాసవం,
దక్షిణం త్యాగశీలం చ సర్వస్య ప్రియదర్శనం. ౨౪
మానుషం కృపణం రామం త్యక్త్వా రావణమాశ్రయ,"

అని మూలము. విశేషార్థ మిట్లు గ్రహింపం దగు. మానుషం= మానవసహజమైనభయమును, త్యక్త్వా = వదలి, రావణమ్= దశాననుని, కృపణం=దీనుని, భర్తారమ్=భృత్యునిగా,ఆశ్రయ= అంగీకరింపుము. విక్రాంతం......రామం చ భజ=శ్రీరాముని సమాశ్రయింపుము. "భ్రియతే శుశ్రూషాదినా స్వామిన మితి భర్తా భృత్యః" అని సమాసము. ఈయర్థము వినత యనుక్రూర రాక్షసి చెప్ప నుద్యమించునా యనుదురేమో. పరమేశ్వరి పరమేశ్వరులసందర్శన మపూర్వబుద్ధిప్రతిభను గల్పించును. రావణునికర్మమే వారల నట్లు పలుకఁజేయుననియుఁ జెప్ప వచ్చును. అట్టియర్థముల నిచ్చుపదముల నేల యిట్టిఘట్టముల మహాకవి ప్రయోగించెనని మన మూహింపవలదా! ఎల్లరు కర్మబద్ధులు. ఆగామి కర్మఫలములు తదనురూపముగా నెల్లరఁ బ్రవర్తింపఁజేసినఁ గాని తాము వారిని బొందునవకాశ మొదవదు. కావున నీయర్థము గ్రహించుట మంచిది.

"దివ్యాంగరాగా వైదేహీ దివ్యాభరణభూషితా. ౨౫
అద్యప్రభృతి సర్వేషాం లోకానా మీశ్వరీ భవ,
అగ్నేస్స్వాహా యథా దేవీ శచీవేంద్రస్య శోభనే. ౨౬
కిం తే రామేణ వైదేహీ కృపణేన గతాయుషా,,

ఏతదుక్తం చ మే వాక్యం యది త్వం న కరిష్యసి." ౨౭
అస్మిన్ముహూర్తే సర్వాస్త్వాం భక్షయిష్యామహే వయం,"

అని మూలము. "వైదేహి" అనునది సాభిప్రాయవిశేషణము. విదేహరాజనందనా అని యర్థము. అయోనిజ యని ధ్వని. దివ్యాంగరాగా దివ్యాభరణభూషితా=దివ్యచందనచర్చలచే దివ్యాభరణములచే నలంకృతవై, గతాయుషా = పోయిందు నాయుస్సుగలవాఁడు. అనఁగా నీమర్త్యలోకమునఁ బెక్కువేలయేండ్లుండ సంకల్పించిన అని భావము. రామేణ = శ్రీరామునితో: మునిమానసపద నివాససంతుష్టునితో నని భావము. సంబంధము గలదానవగుచు నవఁగా విరూపుని సరూపునిగానొనర్చి యతనింకూడిన దానవగుదువని సారము. నీవు మహాప్రకృతివి. నీరూపమునఁ బరబ్రహ్మము రూపవంతుఁడగునని దీనిహృదయము. తే కార్పణ్యేన = నీ కార్పణ్యము చేత, కిం=ఏమి, అనఁగా నిద్దానివదలుమా యని తాత్పర్యము. శోభనే = మంగళస్వరూపిణీ! లోకజననీ. అగ్నేస్స్వాహా ఇంద్రస్య శచీ యథా తథా = అగ్నికి స్వాహాదేవి, ఇంద్రునకు శచీదేవియు నెట్లో యట్లని యర్థము. అద్యప్రభృతి = ఇదిమొదలుకొని, సర్వేషామ్=అస్మదీయులకు, లోకానామ్= సకలలోకములకు, ఈశ్వరీ భవ = ప్రభుత్వముకల దానవు కమ్మా. (మాయీప్రార్థన మంగీకరింపకయున్న) త్వామ్ = నిన్నుద్దేశించి అనఁగా మాప్రార్థన మంగీకరింపవైతివి కదా యని నిన్నుఁగూర్చి, అస్మిన్ముహూర్తే=ఇప్పుడే, సర్వా వయమ్=భక్షయిష్యామహే=భక్షింతుము. విషమునదది యథాన్వయము. సందర్భమునననుసరించి నీ వంగీకరింపకయున్న మేము భక్షింతుమనఁగా విషము దిని మృతినొందువారమనుట స్త్రీజనసహజము

గాన నిది యసంగతము కాదు. దీనిచే శ్రీరాముఁడు భగవంతుఁడనియు, స్వమాయచే రూపవంతుఁ డయ్యెననియు, నిర్లిప్తుఁడు కాన సర్వమూ ప్రకృతిమూలముననే సాగుననియు, నట్టి నిన్నాశ్రయించితిమనియు,మాప్రార్థన నంగీకరించి,యలంకరించుకొని సంతుష్టురాలవుగా మాకుఁ గనంబడుచు మాకధీశ్వరివి కమ్మాయనియు, దాని కంగీకారముం జూపకయున్న నిన్నుద్దేశించి మృతినొందుదుమనియు, నారాక్షసి పూర్వకర్మవశమున భగవతీసందర్శనభాగ్యము లభించుటం జేసి యొడలెఱుంగక యిట్లు పలికెననియు మనము గ్రహింపవలయును. దీని నుండి మనము నేర్చుకొనఁదగిన దేది? నిర్గుణబ్రహ్మ ముపాస్యము కానేరదు. అనఁగా సర్వసామాన్యము కాదని భావము. లోకులెల్లరు నందులకు నర్హులు కారు.

"సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః."

అను గీతావాక్యమున సమదర్శను లగుయోగులే దానినుపాసింప నర్హులని తాత్పర్యము. సర్వదర్శనత్వమే భగవదారాధనమని సారము. అట్టివా రెవరు ? యోగులనియే శ్రీకృష్ణాభిప్రాయము. చచ్చువేదాంతము నుపదేశించువారు కారని కదా సారము. ఎల్లరకుఁ దగినమార్గ మేది యనునదియే యిటుఁ గలప్రశ్నము. సగుణబ్రహ్మము నుపాసించుట యనునదియే సదుత్తరము. సగుణబ్రహ్మ మనఁగాఁ బ్రకృతిమహత్త్వమున రూపవంతుఁడనియే భావము. ప్రకృతిపురుషైక్యమే సగుణబ్రహ్మమని దీనిహృదయము. దాని నుపాసించుట కనేక మార్గము లున్నవి. వారివారియోగ్యతానుసార మనఁగాఁ గర్మానుసారము దాని నారాధింపవచ్చును. అందు విగ్రహా

సాధనము అధమాధమము. మానసమున నిష్టదేవతారూప మును ధ్యానించుట. ఇదియు మధ్యమము. మానసమునఁ దేజోరూపమున నిష్టదేవతను ధ్యానించు టుత్తమము. ఇదియే శాక్త మనంబడును.

"మహీం మూలాధారే కమపి మణిపూరే హుతవహం
స్థితం స్వాధిష్ఠానే హృది మరుతమాకాశముపరి,
మనోఽపి భ్రూమధ్యే సకలమపి భిత్వా కులపథం
సహస్రారే పద్మే సహ రహసి పత్యా విహరసి."

అను షట్చక్రగత సగుణబ్రహ్మోపాధనమే శాక్తమని యెఱుంగ వలయు. దీని నెఱింగినవారు శాక్తేతరమతములే లేవనియు నన్నియు నామాంతరవిశిష్టశాక్తములే యనియు నెఱుంగక పోరు. మత మెట్టిదని విమర్శింపక యన్యమతముల దూషించుట కంటెఁ బాపకార్య మింకొకటి కానరాదు. కావున మతి మంతులై మతస్వరూప మెద్ది? దానియందుఁ బ్రతిపాద్యమగు విషయ మెద్ది? అని విమర్శించి తెలియకయున్నచోఁ దదుపాస కుల నడిగి తెలిసికొని యట్టు లాశయముల మార్చుకొనవల యును. పట్టుదలయనునది పరమార్థవిషయమునఁ బనికిరాదు. అనఁగా "బాలాదపి సుభాషిత"మ్మనుసూక్తి ననుసరించి చక్కని యర్థముగ్రహించిదాని ననుభవమునకుఁ దెచ్చుకొనవలయును. ఇదియే యీభాగమునఁ గలవిశేషముగా నెఱుంగవలయును.

"బహూన్యప్రియరూపాణి వచనాని సుదుర్మతే. ౨౯
అనుక్రోశాన్మృదుత్వాచ్చ సోఢాని తవ మైథిలి,"

అని మూలము. విశేషార్థ మేమన. సుదుర్మతే=మిగులదుష్టుల యందును మతిగల సీతాదేవీ! అనఁగా దుర్మార్గులయందును

గనికరము గలదానా యని భావము. బహూన్యప్రియరూ
పాణి = అప్రియములుగాఁ దోఁచునట్టి, వచనాని = మాపలు
కులను, తవానుక్రోశా న్మృదుత్వాచ్చ=నీదయామార్దవముల
వలన, సోఢాని=ఓర్చుకొనఁబడినవి. (నీచేత) అనఁగా మావంటి
క్రూరదానవస్త్రీలయందుం గూడఁ గనికరము కలదానవు. కను
కనే మాఘోరవాక్కుల నోర్చుకొంటివి. దయామార్దవ
ములు నీస్వరూపములనుట కిది యొక్క యుదాహరణమని
భావము. ఇంచలివిశేష మేమి ? వినుఁడు. దురాత్ములగువా
రుందురు. సాధువులు వారిని దూరముచేయరాదు. వారిపైఁ
దమ దయారసమును వ్యాపింపఁజేయవలయు. అనఁగా వారిం
గలసి యుండవలయునని యభిప్రాయము కాదు. వారివిషయ
మున మనస్సులఁ జక్కఁగాఁ జింతింపవలయును. ఆచింతయే
వారిమనస్సులం గలదుర్గుణముల నడంపఁబూనును. నిరంతర
మిట్లు చేయుటంజేసి వారిమనస్సులు నిలుకడగలిగి దుర్వాస
నలకు దూరము లగును. అట్లు చేయుటయే సాధువులధర్మ
మనువిషయము నిందుండి మనము నేర్చుకొనవలయును.

"సీతే రాక్షసరాజేన సహ క్రీడ యథాసుఖమ్." 38

అని మూలము. రాక్షసరాజేన యదుక్తం తత్ సహ. సహస్వ
యథాసుఖం క్రీడ = రావణాసురుఁడు తెలియక యేది యేఁ
బలికినచో దానిని క్షమింపుము. నీకేది సమ్మతమని తోఁచునో
యట్లే ప్రవర్తింపుమని విశేషార్థము.

"ఉద్యానాని చ రమ్యాణి పర్వతోపవనాని చ,
సహ రాక్షసరాజేన చర త్వ మసితేక్షణే. 39
స్త్రీసహస్రాణి తే సప్త వశే స్థాస్యంతి సుందరి,

రావణం భజ భర్తారం భర్తారం సర్వరాక్షసామ్. 3౭
ఉత్పాట్య వా తే హృదయం భక్షయిష్యామి మైథిలి,
యది మే వ్యాహృతం వాక్యం న యథావత్కరిష్యసి." 3౮

అని మూలము. అనేకోద్యానాదులు రావణుని చేతను బెంపఁబడినవి. అందు నీకుఁ బ్రీతిగల్గినచోట విహరింపుము. జననీ! రావణుని భృత్యునిగా గ్రహింపుము. నాయీవాక్కు నాదరింపవేని, మే హృదయముత్పాట్య భక్షయిష్యామి=నాహృదయమును బ్రద్దలుచేసి యందలిమాంసమును భక్షింతును. అనఁగా నీయెదుట నాజీవితమును బాపుకొనియెదనని భావము.

"తతశ్చండోదరీ నామ రాక్షసీ క్రోధమూర్ఛితా,
భ్రామయంతీ మహచ్ఛూలమిదం వచనమబ్రవీత్. 3౯
ఇమాం హరిణలోలాక్షీం త్రాసోత్కంపిపయోధరాం,
రావణేన హృతాం దృష్ట్వా దౌహృదో మే మహానభూత్. ౪౦
యకృత్ప్లీహమథోత్పీడం హృదయం చ సబంధనం,
ఆంత్రాణ్యపి తథా శీర్షం ఖాదేయమితి మే మతిః." ౪౧

అని మూలము. వికట చెప్పినపలుకుల వాస్తవార్థ మారయఁజాలక క్రోధమున మాటలాడినదని తలంచి చండోదరి శూలము ద్రిప్పుచుఁ గోపమున నోడలు వఱచి యిట్లు పలుకుచున్నది. హరిణాక్షియు వడఁకుచున్న హృదయభాగముగలదియు రావణునిచే నిచటికిఁ దేఁబడినదియు నగు నీజానకిం గాంచిన నాకు మిక్కిలి ప్రీతి గలుగుచున్నది. అట్టి యీసీతను గఠినముగా మాటలాడి భయపెట్టిన యీవికట మాంసవిశేషములను దినఁదగునని నా యాశయము.

"తతస్తు ప్రఘసా నామ రాక్షసీ వాక్యమబ్రవీత్,
కంఠమస్యా నృశంసాయాః పీడయామ కిమాస్యతే. ౪౨

నివేద్యతాం తతో రాజ్ఞే మానుషీ సా మృతేతి హ,
నాత్ర కశ్చన సందేహః ఖాదతేతి స వక్ష్యతి." ౪౩

అని మూలము. ఈ సీతాదేవింగూర్చి క్రూరముగా మాట లాడిన యీవికట యనుదానికంతము నులుముదము. "రాజ్ఞే అమానుషీ" అని పదవిభాగము. వికట మృతిచెందెనని రాజు నకు విన్నవింతము. ఆయన దాని భక్షింపుఁ డనును. అని ప్రఘుస పల్కెను.

"సురా చానీయతాం క్షిప్రం సర్వశోకవినాశినీ,
మానుషం మాంసమాస్వాద్య నృత్యామోఽథ నికుంభిలాం." ౪౪

అని మూలము. యథాపూర్వముగా నిందు నర్థము గ్రహించు నది. ఇందుఁ గలవిశేషము వినుఁడు. నికుంభిల యనుదేవత రాక్షససమారాధ్య. రావణాదు లామెకడనే యాభిచారిక హోమముం జేయుదురు. ఆవిధమును ముందు వ్రాయుదును. "నికుంభిలా నామ లంకాయాః పశ్చిమద్వారప్రదేశవాసినీ భద్రకాళీ" అని గోవిందరాజులు వ్రాసిరి. అది పొరపాటన వచ్చును. భద్రకాళికి నికుంభిల యనుపేరు లేదు. నగరనిర్మాణ సమయమునఁ గొందఱుదేవతలను నగరరక్షణార్థము నిర్మించుట సాంప్రదాయము. ఇది రాక్షసులచే నారాధ్యయగు నొక దేవత, ఘోరరూపిణి, సంతతబలిప్రియ. అట్టిదేవతలకు నరబలి యిత్తురని యెల్లరకుఁ దెలిసినదియే కాని క్రొత్తది కాదు. నర మాంసమున నాదేవత సంతృప్తినొందునని విశ్వాసము. శాస్త్ర మట్లు బోధింపదు. ఆభిచారిక హోమములన్నియు నస్త్రవిద్యా తంత్రములలోనివి. అవి క్షుద్రదేవతలనారాధించు క్షుద్రుల కుగా నియమింపఁబడినవి. అల్పబుద్ధులు నిరంతరహింసారతులు

నగువారలకు సద్బుద్ధిని గలిగింపఁ గోరి మహాత్ములు హింస
చేయువారు దేవతాప్రీతికొఱకని చేయుట మంచిదని బోధిం
చిరి. వారితాత్పర్య మేమనఁగా దేవతోద్దేశమున హింసచేయు
చుండఁగా మంచిబుద్ధి యలవడుననియే కాని వేఱుగాదు.
మహర్షులతాత్పర్యము హింసాకర్మమునుండి విముక్తులఁ జేయు
నదియే కాని తత్కార్యప్రవృత్తిని గల్గించునది కాదు. సదు
ద్దేశమైన నుండినచో సద్దాన బుద్ధి దుష్కర్మములనుండి విము
ఖతగాంచుననియే మహర్షుల నిశ్చయము. రాక్షసులు కార్యా
ర్థమై మానవమాంసము నాదేవతకు నివేదింపవలయుననఁగా
నితరకాలములయందు మానవవధ మొనరింపరాదనియే కదా
భావము. అనవరతస్థిత నరమాంసరతికి సంకోచత్వమును గల్గిం
చుటయే యేతచ్ఛాస్త్రప్రవృత్తి ఫలమని మన మెఱుంగ
వలయు. సురామాంసపరిగ్రహము బుద్ధిభ్రంశకరము గాన
సద్దానికి ముందే దేవతాసాన్నిధ్యమున నృత్తముచేయుట
మంచిదనుభావమును గల్పించిన మేలని యట్లు తెలిపిరి. నికుం
భిల యను క్రూరదేవత (అనఁగాఁ గ్రూరులారాధించు దేవత
యనియే కాని క్రూరస్వభావముగల దేవతయని కాదు)
కడకుం బోయి నరమాంసమును భక్షించి సురాపానము చేసి
నృత్యముచేయుదమని యొక రాక్షసస్త్రీ పలికెనని మన
మూహింపం దగు ఇందు సీత దుఃఖించుట ("రాక్షసీభి స్సుఘో
రాభి ర్ధైర్యముత్సృజ్య రోదితి") భర్తృవియోగము దుస్స
హము పతివ్రతలకని తేటపఱచుటకే యని యెఱుంగునది.

### సీత యశోకవృక్షశాఖఁ బట్టుకొని వగచుట.

* రాక్షసస్త్రీలు భీతికొలుపునట్లు పలుకుచుండఁగా సీత భీరువయ్యును పాతివ్రత్యమున నిశ్చితమగు మనస్సుగలది గావున వారింగని యేకాలమునందు మానవస్త్రీ రాక్షసుని భార్య కాఁదగదు. నేను నాయాచారమునే పాటించుదానను. మీరు తోఁచినట్లు నన్ను భక్షింపుఁడు. మీరు చెప్పినయట్లు నే నెప్పుడును జేయను. అని గట్టిగాఁ బలికెను. ఆసీత వారలం గని వడంకుచు శింశుపావృక్షముకడ నిండుగాఁ బుష్పించి యున్న యొకపెనుఁగొమ్మం బట్టుకొని నాథుఁడగు శ్రీరాముని ధ్యానించెను. పెనువగఁ గుందెను. నేలంబడి లేచి వారివలని భీతిని గాంతిహీన యయ్యెను. అశ్రుకణములు జాఱఁ బలవించెను. శ్రీరాముని సౌమిత్రిని, అత్తలను బేర్కొనుచు, శ్రీరామునెడఁబాసి ముహూర్తమైనను బ్రాణములు నిలుపుకొనియున్నదాననే. కావున స్త్రీకిఁగాని పురుషునకుఁ గాని యీశ్వరేచ్ఛ లేనపుడు మృతి సంభవింపదు. అని పండితులు పలుకుమాట సత్యముగానే యున్నది. వస్తుసమృద్ధ మగునోడ సాగరాంతరమున మహావాతాహతమై కూలుచందమున నల్పపుణ్యము గల నేను ననాథయుం బోలె నాశము నొందనున్నదానను. ప్రాణనాథుని జూడఁజాలక యీక్రూరదానవస్త్రీలకుం జిక్కి జలపూరనిహతింగూలు నేటిదరివలె నాశము నొందఁగలను. సర్వాంగసుందరుఁ డగునాపతి నిపుడు పుణ్యాత్ములు చూచుచుందురు. పాపాత్మురాలనగు నేనందులకు నోఁచనైతిని. విదితాత్ముని శ్రీరామునిం బాసి నేన్ను దీక్ష్ణవిషముం ద్రాగి

* ఇది యిరువదైదవ సర్గమునఁ గలకథ.

నదియుం బోలె నించుకంతయు జీవింపఁజాలను. భయంకర దుఃఖము ననుభవించుచున్నాను గదా. ఇంతదుఃఖానుభవము నకుఁ బూర్వజన్మమున నెంతటిపాపము చేసితినో. ఇట్టి దారుణ దుఃఖము ననుభవించుచు నుండఁజాలను. ప్రాణములు విడువం గోరెద. ఈస్త్రీలు కావలియున్నారు. కాన శ్రీరాముని నేఁ జేరఁజాలను. మానవులకుఁ గోరినతఱి మృతికలుగదు కదా. కనుక నాయిచ్ఛానుసారము మృతి రాదు. అగ్నిపతనాదిరూప మున మరణము కలిగించుకొనవచ్చునన్న యెడల నాథున కధీను రాలనగుట వారియానతి లేక ప్రాణత్యాగమునకు నాకధి కారము లేదు. కనుక నక్కటా! యీమానవత్వ మేటికి? ఒక రికి లోనై యుండుటయు నొకబ్రదుకా. అని బిట్టు విలపించెను.

మహాత్ములారా! ఇందలివిశేషముల నాలకింపుఁడు.

"సాత్వశోకస్య విపులాం శాఖామాలంబ్య పుష్పితాం,
చింతయామాస శోకేన భర్తారం భగ్నమానసా."

అని మూలము.

"హనుమదధిష్ఠితశింశుపామూలం ప్రాప్తాయాస్సీతాయా అశోక శాఖాలంబనాభిధానాత్ అశోకశాఖాశ్శింశుపాశాఖాశ్చ సమ్మిళితా వర్తం త ఇత్యవగమ్యతే."

అని వ్యాఖ్య. హనుమయుండు తరుశాఖ వేఱనియు, సీతయుం డు తరుమూలము వేఱనియు, వానికొమ్మలు కలిసికొనియున్న ట్లూహ్యమనియు దీని యర్థము. సీత మెల్లఁగా దానవస్త్రీలను సమాధానముచెప్పుచు హనుమంతుని కించుక చెంతకరిగెనని కథాసారము. హనుమంతున కింక మాటలాడుమా యని తెల్పుటకే యచటి కరిగెననియు రాక్షసస్త్రీలకు విసుగు దోఁచె ననియు నిందలిభావము.

"హా రామేతి చ దుఃఖార్తా హా పున ర్లక్ష్మణేతి చ,
హా శ్వశ్రు మమ కౌసల్యే హా సుమిత్రేతి భామినీ. ౧౧
లోకప్రవాదస్సత్యోఽయం పండితైః సముదాహృతః.
అకాలే దుర్లభో మృత్యుస్స్త్రియా వా పురుషస్య వా. ౧౨
యత్రాయమేవం క్రూరాభి రాక్షసీభి రిహార్దితా,
జీవామి హీనా రామేణ ముహూర్తమపి దుఃఖితా." ౧౩

అని మూలము. శ్రీరామసౌమిత్రులను వారితల్లులను స్మరించుట హనుమంతునకుఁ గలశంకలు నశించుటకేని యెఱుంగంబగు. ఇఁకఁ ద్వరపడి మాటలాడుము. ఇందుఁగలరాక్షసులకుఁ గొందఱకు మరణ మాసన్నమగుచున్నది. అది నీనెపమున సాగవలయును. కాన శంకలు మాని నన్నే సీతగా నిశ్చయించుకొని మాటలాడఁ బ్రయత్నింపుమని సీతయాశయమని మన మెఱుంగఁదగు విశేషము. ఈనెపమున సీతాదేవి లోకుల కొక కర్మసిద్ధాంతవిశేషమును దెలుపుచున్నది. లోకులమాటలలోఁ గొన్ని యనృతము లుండినను బండితులు పల్కుమాటలు సత్యములని సీతాదేవి తెల్పుచున్నది. పండితులనఁగా

"విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ పండితా స్సమదర్శినః."

అన్న గీతాశాస్త్రము ననుసరించి సమదృష్టిగలవారని యర్థము గాని పాఠశాలల పండితులనిగాని బిరుదములు గలవారని కాని యర్థము గాదు. భేదభావము లేనివారని సారము. లోకమునందు స్త్రీలకుఁగాని పురుషులకుఁగాని కోరినతఱి మృత్యువు రాదనునదియే లోకప్రవాదము. కర్మానుసారమూ కాలమున కానిమిత్తమున మృతి గల్గును గాని విసుగు తోఁచినపుడు రావలెనని కోరిన రాదని భావము. ఉద్గ్రంథ

నాదులచే నది కలుగవచ్చుఁ గదా యని కొందఱు అలసు లం దురు. అవి మిక్కిలి పొరపాటు. ప్రాక్కర్మ మారూపమున వృతి గలుగఁజేయును. ఆకస్మికముగ నట్టిబుద్ధి వానికిం గల్గును. తనమరణమున లోకమునకో తనవారికో తనకో గొప్పహాని యో నష్టమో మహాకీర్తియో కలుగునని యతఁ డూహిం చును. ఆయూహ కల్గుటయుఁ గర్మవశమున నే యన్న నే చిక్కులు నుండవు. దీనిచేఁ గర్మసిద్ధాంతము బలవత్తరమని తేటపడును. ఏదిగాని కర్మాధీనమే కాని తద్విరుద్ధ మగునది సాగదనునదియే యీ భాగమునుండి మనము నేర్చుకొనఁ దగినవిషయము. ఇది సత్యమని సీత స్వానుభవమునఁ దెలుపు చున్నది. మనుష్యభక్షకులు రాక్షసులు. వారిస్త్రీలు నట్టివారు. వారింతగా నన్ను బాధించుచున్నను నాప్రాణనాథుని బాసి ముహూర్తమైన జీవింపఁజాలనని యెంచు నేను జీవించి యున్నదానను. కానఁ జావుకూడ దానియిష్టమురీతి వచ్చును గాని మనము కోరినతఱి రాదు. అని ఈరామాయణమున సీతారాములు వగచే సంతోషముచేఁ దమయనుభవము నే తెల్పుదురు. అదియంతయుఁ గర్మసిద్ధాంతము ననుసరించియే యుండునని మన మెఱుంగవలయును.

"ఏషాల్పపుణ్యా కృపణా వినశిష్యామ్యనాథవత్,
సముద్రమధ్యే నౌః పూర్ణా వాయువేగై రివాహతా.　　౧౪
భర్తారం తమపశ్యంతీ రాక్షసీవశమాగతా,
సీదామి ఖలు శోకేన కూలం తోయహతం యథా.　　౧౫
తం పద్మదళపత్రాక్షం సింహవిక్రాంతగామినం,
ధన్యాః పశ్యంతి మే నాథం కృతజ్ఞం ప్రియవాదినం.　　౧౬
సర్వథా తేన హీనాయా రామేణ విదితాత్మనా,

తీక్ష్ణం విషమివాస్వాద్య దుర్లభం మమ జీవితం. ౧౭
కీదృశం తు మయా పాపం పురా జన్మాంతరే కృతం,
యేనేదం ప్రాప్యతే దుఃఖం మయా ఘోరం సుదారుణం.” ౧౮

అని మూలము. సీతాదేవి పూర్వము తెలిపిన కర్మసిద్ధాంతమునే దృఢపఱచుచున్నది. సకలవస్తుపూర్ణమగు నౌక పెనుగాలి తాఁకున సముద్రమునడుమఁ బడునట్టు లల్పపుణ్యము చేసి యనఁగా నధికపాపమొనర్చిన దీనురాలను నే ననాథవలె నశింప నున్నాను. అనాథవలె నన: గా నే ననాథను గానని యే కదా యర్థము. స్వల్పపుణ్యము మిక్కిలి పాపమొనర్చినవారు రక్షించువారు లేక నశింతురని తాత్పర్యము పద్మదళపత్రాక్షమ్=ఇందు దళపత్రశబ్దములు సమానార్థబోధకములు. “దళతీతి దళ” మ్మని వ్యుత్పత్తిని జెప్పి, “వికసితపద్మాక్ష మిత్యర్థః” అని వ్యాఖ్యాతలు వ్రాసిరి. పద్మముయొక్క వికసించిన పత్రమువంటి కన్నులుకలవాఁడని కదా యర్థము. వికసితపత్రమనఁగాఁ దత్పూర్వము దానికిఁ బత్రమను పేరెట్లు? షష్ఠీతత్పురుషసమాసము తప్ప గత్యంతరము కానరాదు. విశేషణోత్తరపదకర్మధారయసమాస మేల చెప్పరాదందురేమో. పతతీతి పత్రమ్ = పడిపోవుచున్న దళపద్మమని యేల యర్థము చెప్పరాదనువారికి సమాధాన మెట్లు? “ప్రమాదో ధీమతా మపి.” అనుసూక్తి ననుసరించిన దోషమేమో తెలియఁ జాలకయున్నాను. ఈ కావ్యమందే కొన్నితావుల నీవాక్యమున కుదాహరణములు వ్యాఖ్యాతలే చూపియున్నారు కదా. ఇందు నదే సమన్వయము చేయు టుత్తమము. శ్రీరాముని ధన్యులగువారే చూడఁ గలరు. అనఁగాఁ బూర్వజన్మమున •నత్యంతసుకృతాత్ములు చూడఁజాలుదురు. అనఁగా సుకృతఫల మనుభవించుకాలము

రాఁగా భగవద్దర్శన మగునని తాత్పర్యము. తొలిజన్మమునఁ బాపములు విశేషించి చేసినవారలకే భరింపరానిదుఃఖములు గల్గును. అను నీ సీతాదేవి వాక్యములంబట్టి కర్మఫలములు తప్పక యనుభవింపఁ దగిననని యు వాని ననుభవించువారిం గాంచి యట్టిపాపములఁ జేయక యుండవలయు ననియు నిం దుండి నేర్చుకొనవలయును. సీత తన కిట్టిదుఃఖములు కలుగు చున్నవనుట కేమి సమాధాన మందురేని యది నటనమే యనియు హనుమంతునకుఁ దనసంతాపమును దెలిపినఁగాని యతనిప్రవృత్తి సాగదనియు నామెయుద్దేశమని గ్రహింప వలయును.

"ధిగస్తు ఖలు మానుష్యం ధిగస్తు పరవశ్యతాం,
న శక్యం యత్పరిత్యక్తుమాత్మచ్ఛందేన జీవితం." ౨౦

అని మూలము. మనుజధర్మము నీచము పరవశత్వము నట్టిదే. ఏలయనఁగాఁ దనకుఁ గోర్కెకలిగినపుడు ప్రాణముల వదలు యోగ్యత కలిగినపుడే మానవత్వ ముత్తమమని తాత్పర్యము. అనఁగా నీశరీరము వదలవలయునని యెపుడు తోఁచునో (తన కర్మ ఫలానుభవము పూర్తియైనదని మదికిఁ దోఁపఁగనే) శరీ రమువదల సంకల్పింపవలయును. అట్టివిజ్ఞాన మెట్లు కలుగును? నిరంతరయోగాభ్యాసబలముచేఁ దప్ప వేఱొండుమార్గమునఁ గలుగదు. కావున యోగికావలయునని భావము.

"తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున."

అను గీతావాక్య మిట స్మర్తవ్యము. ఇఁకఁ దమవాలికథఁ బఠింతము.

## సీత ప్రాణపరిత్యాగము చేయఁ దలఁచుట.

* జనకరాజతనయ సీతాదేవి వారివాక్కులు విని వెఱ్ఱి యెత్తినదానివలెఁ, బరాకుపడినదానిరీతి, మనోవైకల్యము గల దానియట్లు, బడలికలుడుగఁ బొరలింపఁబడు నాఁడుగుఱ్ఱము కరణిఁ బొరలుచు నేడ్చుచుండెను. శ్రీరాముఁడు లేనితఱి నాదుఃఖముం బాటింపక రక్కసుఁడు నన్ను దెచ్చినాఁడు. ఇందలికష్టముల భరించుకొని ప్రాణముల నిలుపుకొనఁజాలను. రామునెడఁబాసిన నాకీ ప్రాణములతోఁ బనియేమి యున్నది? ధనభూషణాదులవేల? ఈదుఃఖములకు నాహృదయము బ్రద్దలు గాకున్నది. ఇది పాషాణమునకంటెఁ గఠినమైనది. నిజము. లేక జరామరణములు లేనిదిగా నున్న దేమో, కాదేని యిట్లుండఁ గలదా? రామునెడఁబాసి యీపాడుప్రాణముల నిలుపుకొన్నాను గదా. ఎంతటి పాపాత్మురాలను? నాదేటి బ్రదుకు? చతుస్సముద్రముద్రిత ధరావలయమునేలు ప్రియం వదుఁడు శ్రీరాముఁడు లేకుండఁగా నాకీప్రాణములతో నేమి పని? సుఖాసక్తి యేటికి? రాక్షసస్త్రీలారా! నాకీశరీరమునఁ బ్రీతి లేదు. మీభయముకూడ లేదు. కాన నీశరీరము నేమిచేసినఁ జేయుఁడు. భక్షించిన భక్షింపుఁడు. నాప్రియుం బాసి చాల కాలము నిలువఁజాల! రాక్షసు నీరావణుని సవ్యపాదముచే నైన స్పృశింపను. ఇతఁడు క్రూరస్వభావుఁడు గాన నన్నుఁ గోరుచున్నాఁడు. ఎంత చెప్పినను దెలిసికొన లేఁడు. తనస్వరూప మిట్టిదని కాని తనకుల మిట్టిదని కాని తెలియఁ జాలఁడు. తెలిసియున్న నన్నుఁ దనయింట నిలుపుకొనఁ గోరునా? నా

---

* ఇది యిరువదాఱవసర్గమునఁ గలదు.

శరీరమును వలసినట్లు మీరు చేయవచ్చు. నేనేమో మీరావ ణుని గౌరవింపను. మీరేమన్న నేమి? దోషులయందు గుణ ములే కనఁజాలు మహాప్రాజ్ఞుఁడు కదా శ్రీరాముఁడు. అల్పోప కారమును మహోపకారమని భావించువాఁడు. ఎవరు దుఃఖిం చినను జాలినొందు వాఁడు. అట్టి సకలకల్యాణగుణాభిరాముఁడు నాపై దయమాలియున్నాఁడు. ఆమహాత్ము ననేటికి? ఇది నా దురదృష్టమే కాఁబోలునని సంశయించుచున్నాను. ఒక్కఁడే జనస్థానమునఁ బదునాలుగువేలరక్కసులఁ జించి చెండాడెనో యట్టి వీరాగ్రేసరునకు నాయున్నచోటునకు రా నడ్డమేమి? ఏల వచ్చి నన్నుఁ గాపాడకున్నాఁడు? ఈరావణుఁ డా శ్రీ రామునకు లెక్కయా? విరాధుం బొలియించి నన్నుఁగాపాడిన రాముఁడేల యిపుడు వచ్చి నన్ను రక్షింపక యున్నాఁడు? సముద్రాంతర్వర్తి యీలంకయైన నేమి? శ్రీరాముబాణముల కడ్డ మేదియుండును? నేనారామునకుఁ బ్రాణసమానురాలను. అట్టి నన్ను రక్కసుఁ డపహరింపఁగా వచ్చి నన్నుద్ధరింపక యున్నవాఁ డేలొకో? నే నిక్కడనుండుట యెఱుంగక యున్నాఁడేమో. ఎఱింగియున్న నీయవమానము నోర్చి యూరక యుండునా? నావార్త నెఱింగింపఁజాలు జటాయువును గూడ నీరక్కసుఁడు వధించెను. జటాయువు జరాభరమునఁ గుందువాఁడైన నాకొఱకు నిలిచి వీనితోఁ బోరాడెను. ఎంత పుణ్యాత్ముఁడో. నాయునికి యెఱింగనేని రాముఁ డీదానవుల నీఱుచేయును. నావలెనే వీనిభార్యలు వగతురు. రామలక్ష్మణు లీలంకానగరమును శోధించి రక్కసులం జంపుదురు. ఇఁక శీఘ్రమ యీలంక కంకగృధ్రాదులపాలు కాఁగలదు. ఈ నాకోర్కి త్వరితముగా ఫలింపఁగలదు. మీయీదుష్ప్రవర్త

నమే యీ నగరనాశనమునకుఁ గారణ మగును. రావణుఁడు హతుఁడు కాఁగా నగరమిది పాడుపడి యుండఁగలదు. తప్పదు. నాయునికి తెలియఁగనే రామబాణము లీనగరమును నీఱు సేయక మానవు. ఈక్రూరుఁ డిచ్చిన సంవత్సరసమయమునఁ బదినెలలు చెల్లినవి. ఊరక బెదరించుచున్నాఁ డనుకొందునా అధర్మాత్మున కకార్య మిది యని తెలియదు. గడువుదాఁటఁగనే నన్ను భక్షింపఁగలఁడు. ఎవ్వఁడే నిందు నాకు విషమిచ్చునేని దానిం గ్రోలి జమునింటి కరుగుదు. ఇంతదనుక రామునకు నాయునికి యిందని తెలియకయున్నది. తెలిసియున్న నూరకుండునా? నాయునికి నెఱుంగక యావీరుఁడు నావిరహమునఁ గుంది స్వర్గము నొందియుండును. దేవతలు గంధర్వాదులు నచ్చట నారామునిం గాంచి ధన్యు లగుదురు. రాముఁడు ధర్మజ్ఞుఁ డగుట మహర్షితుల్యుఁ డగు. కావున విరక్తుఁ డయియుండు. నాతోఁ బనియేమి? ప్రీతిగలిగి యొకరిని జూచుచుండిననే వానియం దాప్రీతి చెడకయుండు. చూడకయుండిన నాప్రీతి నశించు. నన్నుఁ గానకయున్నాఁడు గాన నాయందతనికిఁ బ్రీతిలేకపోయినదో. కృతఘ్ను లగువారే యట్లు పూర్వప్రీతిని విస్మరింతురు గాని శ్రీరామునివంటి కరుణాసముద్రుఁ డట్లు ప్రీతి తప్పియుండఁడు. పూర్వజని నేవియేఁ బాపములు చేసితిని గాఁబోలు. రామునింబాసి జీవించుటకంటె నసువుల వదలుట మంచిది. ఒకవేళ నాదుఃఖమున నాయన్నదమ్ము లిరువు రాయుధముల వదలిరేమో. వీఁడు మోసమున వారిని వధించినాఁడేమో. ఇంతటిమహాదుఃఖము గలిగినను మరణము నాకు రాకున్నది. మహాత్ము లగుమునులకుఁ బ్రియాప్రియములు రెండును గలుగును. సుఖదుఃఖములఁ గలిగించు

ప్రియాప్రియములను విడిచియుండు నామహాత్ములకు నమస్కరించెదను. ప్రియాస్పదఁ డగురాము నెడఁబాసి యప్రియుఁడగు నీపాపాత్మునకుఁ జిక్కి బ్రదికియుండఁ జాలను. అని పలవించెను.

## త్రిజట తన స్వప్నవృత్తాంతమును రాక్షసస్త్రీలకుఁ దెల్పుట.

* సీతాదేవి యిట్లు పలుకఁగా నాప్రాణత్యాగవిషయమును జెప్ప రావణునికడకుఁ గొందఱరిగిరి. కొందఱు సీత చెంత కరుదెంచి పరుషవాక్కుల నోసీతా! నీవెంత యపూజ్యురాలవు. మృతినొందెదనని యెంతటిపాపమున కొడిగట్టితివి? ఇపుడే నిన్ను రాక్షసస్త్రీలు పట్టుకొని భక్షింపఁగలరు. అనిరి. ఇట్లు రాక్షసస్త్రీ లాసీతను బెదరించుచుండఁగా విని యపుడే నిదురనుండి మేలుకొనిన త్రిజట యనునది వారిం గని దుష్టాచారలారా! మీకు నించుకంతయేఁ బూజ్యత గలుగదు. జనకునిప్రియాత్మజ, దశరథునికోడలు నగుసీతను భక్షింపకుఁడు. అందులకుబదులు మిమ్మే మీరు భక్షించుకొనుట మంచిది ఏల యిట్లనుచున్నావందురేమో నేనిపుడే రాక్షసవినాశనమును శ్రీరామాభ్యుదయమును దెలుపునట్టికలఁ గాంచితిని. అది భీతిదాయకము. దాని స్మరించినంతనే మేను పులకరించుచున్నది. అనఁగానే వారెల్ల నాతురముగా నీవీరాత్రి గాంచిన స్వప్న మెట్టిది? మా కెఱిఁగింపుమని భయాతురలై యడిగిరి. త్రిజటయుఁ బ్రాతఃకాలమునఁ దాఁ గన్నకలను వారల కిట్లు తెల్పఁబూనెను.

---

* ఇది ఇరువదియేడవసర్గమునఁ గలదు.

రాముఁడు శ్వేతకుసుమమాలికలను వస్త్రములను ధరించి గజదంతనిర్మితశిబిక నాకాశమున సంచరించుదానిని దాను లక్ష్మణునితో నెక్కి యీలంక కరుదెంచెను. ఆపల్లకికి వేయి హంసలు పూన్పఁబడియుండెను. ఈసీతాదేవియు శ్వేతాంబర ధారిణియై సముద్రావృతశ్వేతాచలము నెక్కియున్నట్లు, నే నిప్పుడే కలం జూచితిని. వెలుతురు సూర్యునిం గూడినరీతి సీత రామచంద్రునిం జేరియుండెను. శ్రీరాముఁడు తమ్ముఁడు చతుర్దంతదంతావళమును బర్వతమంత దానినెక్కి సీతచెంతకు రాఁ జూచితి. అంత శ్వేతపుష్పమాలికలు వస్త్రములు ధరించి యుండు నాపురుషసింహు లిద్దఱును దేజోవిలసితులై సీతకడ కేతెంచిరి. అంత నా శ్వేతాచలశృంగముకడ సీత యాకాశ మున శ్రీరాముఁ డెక్కియుండు నాయేనుఁగుమిన్న మూఁపు పయి నెక్కెను. అపుడు పద్మదళాక్షియగు నీపతివ్రత భర్త యంకతలమునుండి నిక్కి హస్తముచేఁ జంద్రసూర్యులను దాఁకుచుండఁ గనినదాన నైతిని. ఆకుమారు లిద్దఱును సీతయు నెక్కియున్న యాదంతావళేంద్రము వ్యోమమున లంకకు మీఁదుగా నుండం గంటిని. రాముఁడు భార్యతో శ్వేతవృష భాష్టకము కట్టియుండు రథమునెక్కి యిచ్చటికి రాఁగాఁ జూచితిని. మహావీరుఁ డారాముఁడు సోదరుని భార్యను గూడి సూర్యప్రకాశమగు దివ్యపుష్పకవిమానము నెక్కి యుత్తర దిక్కున కరిగెను. నే నీచందమున విష్ణుపరాక్రముఁ డగు రాముని నతనితమ్ముని రామపత్నియగు నీసీతను స్వప్నమున నిట్లు చూచితిని. పాపాత్ములు స్వర్గమును జయింపఁ జాలనిరీతి మహాపరాక్రమోపేతుని శ్రీరాముని దేవాసురరాక్షసులు గాని తదితరులు గాని జయింపఁ జాలరనుట నిశ్చయము.

రావణుఁడు గన్నేఱుపూలమాలికను ధరించి శరీరము నిండఁ దైలమును బూసికొని రక్తాంబరములుగట్టి తైలపానము చేయుచుఁ గైపుగదుర నేలమీఁదనుండం గాంచితిని. రావణుఁ డత్తఱి మరలఁ బుష్పకమునుండి నేలఁబడి శిరము శిఖయు లేక నీలాంబరముల ధరించి యాఁడుదానిచే నీడువఁబడుచుండఁగాఁ గాంచితిని. మఱియు రావణుఁడు రక్తపుష్పమాలికలఁ దాల్చి రక్తచందనము పూసికొని నూనెఁ ద్రావుచు నవ్వుచు నృత్యము చేయుచుఁ జిత్తము తాఱుమాఱు కాఁగా నింద్రియములు కలఁతనొందఁగా గాడిదలుగట్టిన రథమునెక్కి పోవుచుండెను. అతఁడు మఱియు గార్దభమునెక్కి దక్షిణదిక్కును గూర్చి శీఘ్రముగాఁ బోయెను. మరల నారావణుఁడు భయమున నొడలు మఱచి గాడిదమీఁదినుండి తలక్రిందుగా నేలపయిం బడఁగాఁ గంటిని. అంత నతఁడు వేగమ లేచి తడఁబడుచు భయపీడితుఁడై మత్తుచే సంగకములు విరవిరపోవ నున్మత్తుని వలె దిగంబరుఁడై దుర్వాక్యములు పల్కుచు దుర్గంధము గలిగి సహింప భరింప నలవిగాక యంధకారపూర్ణమై నరకప్రాయమైన మలపంకమును జొచ్చి యందు మునింగెను. రక్తవస్త్రమును గట్టుకొని దేహమునిండ రొంపిని బూసికొని యొకనల్లనిస్త్రీ రావణునిమెడకుఁ ద్రాడుగట్టి దక్షిణదిక్కున కీడ్చుకొనిపోవుచుండెను. అచ్చట రాక్షసుఁడు కుంభకర్ణుఁడు నిట్లే యుండఁ గాంచితిని. రావణపుత్రులెల్లఁ దనువులనిండఁ దైల మలందుకొని యుండం గంటిని. రావణుఁడు వరాహమును, ఇంద్రజిత్తు మొసలిని, గుంభకర్ణుఁ డుష్ట్రము నెక్కి దక్షిణదిక్కునకుఁ జనిరి. అపుడు విభీషణుఁ డొక్కరుఁడే శ్వేతవస్త్రములు గట్టి శ్వేతచందనమును బూసికొని శంఖదుందుభినిస్వనములు చెల

రేఁగుచుండఁగా నృత్తగీతము లొప్పఁగా నాకాశమునఁ జరించువాఁడై దానును మంత్రులు నల్వురును దివ్యదంతావళము నెక్కి చక్కఁగాఁ గూరుచుండఁ గాంచితిని. ఆయేనుఁగు చతుర్దంతములు గలిగి సంచరించుపర్వతమో యన నొప్పుచు గర్జితప్రాయబృంహితములు గలిగియుండెను. మఱియుఁ దైల ముం ద్రావుచు రక్తపుష్పమాలికలం దాల్చి యరుణాంబరములం గట్టుకొని గుంపుగాఁ గూడి పాటలు పాడుచు వాద్యములు వాయించు రాక్షసులం గంటి. రమ్యమగు నీలంకానగరము గోపురాదులు గూలి గజహయస్యందనములతో సాగరమునఁ బడఁగాఁ జూచితిని. రావణపరిపాలితమగు నీలంకను రాముని దూతయు బలశాలియునగు నొకవానరుఁడు కాల్చినట్లు స్వప్నమునం గంటిని. రాక్షసాంగనలు తైలమును ద్రాఁగుచు మిగుల నర్తనము చేయుచుఁ గలకల నవ్వుచు మహాధ్వనితోఁ గాలి నీఱుగుటం జేసి ప్రవేశింప భయంకరముగా నుండులంకలోఁ ద్రిమ్మరుచుండిరి. కుంభకర్ణాది రాక్షసవర్యులు రక్తవస్త్రములం దాల్చి పేఁడ నిండియుండు గుంటలోఁ బడి మునిఁగిరి. మీరు తొలఁగి పొండు. పోవక యుందురేని నశింతురు. తప్పదు. రాముఁడు సీతను శీఘ్రము గైకొనును. ఆరాముఁడు మిక్కిలి రోషమున రక్కసులందఱం జంపి మిమ్ముం బొలియించును. శ్రీరాముఁడు ప్రియురాలు ననువ్రతయు నగుసీతను నిందించి నను బెదరించినను దా నించుకంతయు సహింపఁడు. కావున మీరందఱు పరుషవాక్కులఁ బల్కకుఁడు. మంచి యూఱడింపుమాటలచే నిరంతరము మా కభయదానము చేయుమా యని సీతను బ్రార్థింతము. ఇదియే నాకు యుక్తముగాఁ దోఁచుచున్నది. ఎవ్వతుఁకగాని దుఃఖము నొందియుండఁగా నిట్టి

స్వప్నము గనునేని ఆస్త్రీ దుఃఖముల నన్నింటిని బాసి మహా సంతోషము నొందును. అట్లే దుఃఖమునం దున్న సీతయు నిట్టి కలవలనఁ బరమసంతోషము నొందును. మన మీమెను గష్ట పెట్టితిమి. మనపై దయ యీమెకుఁ గల్గునాయనుకొన్న ఫల మేమి? శంక వలదు. ఈజానకి మీచే నింపింపఁబడినదయ్యేను మీరు ప్రార్థింపవచ్చును. వేగముగా నీక రాక్షసులకు రాముని వలన మహాభయము కలుగును. కావున నిప్పుడే సీతను బ్రార్థిం పుఁడు. ఈసాధ్వి ప్రార్థించినంతనే ప్రసన్నురా లగును. రా నున్న కష్టమునుండి మిమ్ముఁ గాపాడుశక్తి యీమెకుఁ గలదు. ఈమెయందు నీచస్త్రీలక్షణముల నొక్కటియుం గనంబడ లేదు. దుఃఖార్హురాలు కానేరదు? దివ్యభోగములకే యర్హు రాలు. ఈబిడ శరీరచ్ఛాయ నంత మాఱియుండుట యొక టియే నాకు విచారమును గల్గించుచున్నది. రావణుఁడు నశిం చుటయు రామునకు జయము కల్గుటయు నను నీసీతవాంఛలు వేగమ ఫలించునని తలంచుచున్నాను.

రాక్షసాంగనలారా! ఈదేవి కీస్వప్నము ప్రియ వృత్తాంతమును దెలుప నిమిత్తముగ నున్నది. ఈవిశాలాక్షి సవ్యనేత్ర మదరుచున్నట్లు కనఁబడుచున్నది. చూడుఁడు. అట్లే యీమె సవ్యభుజము కూడఁ గొంచెము స్పృశితమైన ట్లగపడు చున్నది. అకారణముగ నీగుఱుతులు కలుగుట శుభనిమి త్తము. మఱియు నీదేవి సవ్యోరువు కూడ వడఁకుచున్నది. అవి శ్రీరాముఁడు వచ్చి ముందున్నందులకు నిమిత్తముగా నున్నది. పింగళపక్షియు వృక్షశాఖపైఁ గూరుచుండి మిగులసంతుష్టితోఁ బలుసారులు మీఁదమీఁద మధురముగా సాంత్వనస్వరము గనంబడఁ బ్రియబంధువురాకను దెలుపుచు శ్రీరామాగమ

నము నత్యంతహర్షమునఁ జెప్పుచున్న ట్లున్నది. అని స్పష్ట ముగాఁ దెలిపెను.

మహాశయులారా! ఈభాగమునుండి తెలిసికొనఁదగిన విషయములు పెక్కు లున్నవి. పరిశీలింతము. స్వప్నవృత్తాంతమే యిందుఁ గలదు. స్వప్నములు నిష్ఫలములని కొందఱం దురు. కాని యన్నియు నట్లుగావని మన మెఱుంగవలయును. అవి మూఁడువిధములుగ నుండును. రోగజములు, చింతితములు, నైజములు నని వానిభేదములు. రోగజము లనఁగా పిత్తాదివికారమువలనఁ దోఁచునవి. చింతితము లనఁగా నిరంతర మేవోవిషయముల నాలోచించుచుండఁగా నవియెల్లఁ గాని యందుఁ గొన్ని కాని తోఁచునట్టివి. ఈరెండువిధములగుస్వప్నములు నిష్ఫలములే. నైజములనఁగా నాకస్మికముగా నశ్రుతాదృష్టపూర్వవిషయము గోచరించుటని యర్థము. అవియు మరల నిదురింపఁదగనిసమయమున ననఁగా నెల్లరు లేచి ప్రవృత్తి నవలంబింపఁ దగినతఱిసని యర్థము. అపుడు తోఁచునవి ఫలదములే యని ప్రాచీనులమతము. ప్రాచీనుల మతమనఁగా నెల్లభంగుల సిద్ధాంతమే యని మన మెఱుంగందగు. స్వానుభవమునఁ దెల్పుట ప్రాచీనులయాశయము. తెలియనివిషయములను దెలిసినట్లు నటించుట యిప్పటివారిలోఁ బెక్కండ్రయాచారము. ఇది నటనము, అది స్వానుభవము నని మన మూహించుట సముచితము. త్రిజటకుఁ దోఁచిన స్వప్నము ఫలప్రదమే. ఆగామి ఫలములను గర్మము పెక్కుమార్గములం దెలుపును. వాని నెఱింగియు మనము లెక్కింపక యథాపూర్వముగాఁ బ్రవర్తింతుము. అదియే మనయజ్ఞానము. కర్మము హెచ్చరించినపుడు మెలఁకువగలిగి వర్తించినఁ

బురోవృద్ధికడి మార్గమగును. దురహంకారమున మన మవ్వాని లెక్కింపక వర్తించితిమే నది యాత్మదోషమే గాక మఱే మగును ? కావునఁ గర్మము మనకు రాఁగల సుకృతదుష్కృత ఫలములఁ దెలియఁజేసినప్పు డిట్లుండఁ గలదు కదా యని యూహించి తదనురూపముగా వర్తించినచోఁ గొంత క్షేమే కలుగును. తప్పక యనుభవించువానికి మనమేమి ప్రతిక్రియ యుఁ జేయఁజాలము కదా యని కొందఱందురు. అది యల సుల యాశయము. కర్మఫలముల ననుభవింపక తప్పించుకొన వశముకాదనునది సిద్ధాంతమైనను అందుఁ గొంతభాగము తొలఁగింపఁ జేసికొనవచ్చును. ప్రాయశ్చిత్తాదు లందులకే యేర్పడినవి. భగవదారాధనము నందులకే కాక మఱెందు లకు? దృఢమూలములగు కర్మములకుఁ దగినఫలముల ననుభ వింపవలసినను గొంతభాగ మందు భగవదారాధనప్రభృతుల మూలమునఁ దొలఁగించుకొనవచ్చును. కావున బుద్ధిమంతులు స్వప్నములన్నియు నిష్ఫలములని తలంపరాదు.

తెల్లవారుజాముననే త్రిజట కలఁ గాంచెను. ఆమె కీచింతయే యంతకుముందు లేదు. రోగవికారములు గలది గాదు. ఇందఱు సీతను బెదరించుచుండ నా త్రిజట మాత్రము నిదురింపనేల? అని యడుగవచ్చును. సీతాహృదయతాపనివా రక మగువిషయము దుష్కర్మముల నాచరించినవారికి గోచ రించునా? అందుఁ గలవారిలో త్రిజట సాధుబుద్ధిగలది. ధర్మజ్ఞు రాలు. కావుననే రావణునాజ్ఞ ననుసరించి తదర్థమెఱుంగక యంద ఱన్నిభంగుల నామహాపతివ్రత నాదిశక్తిని బెదరించు చుండ నామె యాజోలికిఁ బోవకుండెను. సీతాదేవియుద్దేశమే యది. త్రిజటను శయనింపఁ బురికొలిపెను. రాఁగలవిషయము

లిట్టివని యీ మహాదేవియాశయమే కనఁబఱచెను. కర్మసిద్ధాంతము దురూహ మనువిషయమును మన మెఱుంగఁ దగుఁగదా. వాల్మీకియే యిట్లు కల్పించి వ్రాసెనని కొంద అందురు. కథ యంతయు నామహాకవి వ్రాసినదే. అంతయు నసత్యమే యేలకాదు? అనవచ్చును. కొంతభాగము విశ్వసించుట కొంత విశ్వాసార్హము కాదనుట తెలివితక్కువయే. నాస్తికులకు బదులు చెప్పఁబూనినవారిలో నే నొక్కఁడను గాఁజాలను. ఆస్తికులలో నాకంటెఁ బామరు లుండిన వారి కిది మంచిమార్గమని యిట్లు వర్తించుట శ్రేయోదాయకమని తెలుపఁ బూనితిని. ఇఁకఁ గథావిశేషసారమును వినుఁడు.

"ఇత్యుక్తాస్సీతయా ఘోరా రాక్షస్యః క్రోధమూర్ఛితాః,
కాశ్చిజ్జగ్ముస్తదాఖ్యాతుం రావణస్య తరస్వినః." ౧

అని మూలము. సీత చావఁబూనినదని తెలుపుటకుఁ గొందఱు రావణుకడ కరిగిరని కథాభాగము. మృతినొందకుండఁ గట్టివేయఁబూనక పరుగిడఁ గారణ మేమని యూహింతము. రావణునాశయము వారికి సంశయముగనే తోఁచినది. హింసింపఁ దగదనియు నెట్లో యభిముఖురాలినిగాఁ జేయవలయుననియు రావణునిభావమనియే గ్రహించిరి. కావునఁ బైకి భీకరముగా మాటలాడినను మనస్సుల నామె నేమనఁ బ్రయత్నింపరాదనునూహ వారికిం గలదనియే మన మెఱుంగం దగు. ఇందలి రహస్య మేమనఁగాః హనుమంతుఁడు మాటలాడుసమయ మాసన్న మగుచున్నది. వనభంగము మహాసంగరము సాగవలసియున్నది. మృత్యువాసన్నము కాఁగాఁ బెక్కంద్రు యమునింటికిఁ బోవనున్నవారు త్వరపడుచున్నవారు. కావునఁ గొందఱి నిందుండి సాగనంపినఁ గాని పనిసాగదు. అని తలఁ

చెను. సీతతలంపు ఫలింపక తప్పదు. ఆమె యుద్దేశింపఁగనే కొందఱు పరుగిడిరి. పరుగిడినవారు వచ్చినజాడ యిందుఁ గానరాదు. వాఁడేమిచెప్పినది తెలుపుభాగ మిందు లేదు. ఏమి దీని భావము? పోయినవా రాసమయమున రాలేదని, ఇంతలో సంగర మారంభమయ్యెనని యెఱింగిరని మన మూహింపవలసియుండును. ఎప్పుడో వత్తురు. భగవతీయూహా యెట్లో యట్లే పనులన్నియు సాగుననియే మన కీభాగము తెలుపుచున్నది.

"అద్యేదానీం తవానార్యే సీతే పాపవినిశ్చయే,
రాక్షస్యో భక్షయిష్యంతి మాంస మే తద్యథాసుఖం." ౨౩

అని మూలము. "సీతే. అనార్యే పాపవినిశ్చయే సతి. రాక్షస్యః తవ మాంసం భక్షయిష్యంతి అద్యేదానీమితి. ఏతద్యథా సుఖం నూనమ్." అని యన్వయక్రమము. నేఁ డీసమయమున పాపరూపమగు నిశ్చయముగల యపరాధము ఉండఁగా రాక్షసాంగనలు కొందఱు నీమాంసము తినుదురని కొందఱు పలికిరి. పాపాపరాధమున కొడిగట్టువారైన నీమాంసమును భక్షింతు మందురు. అని కొందఱు పలికిరని గ్రహింపవలయు. అట్టివారెవరు నిప్పుడు లేరు. వారు పరుగిడిరి. అనునది యిందుఁ గలవిశేషము. కర్మసిద్ధాంత మెంతయు నీభాగము మూలమున సువ్యక్త మగుచున్నది. దానిశక్తికి మించిన దేదియు లేదు కదా.

"ఉవాచ వచనం కాలే త్రిజటా స్వప్నసంశ్రితం." ౨

అని. "కాలే ఉషఃకాలే." అని వ్యాఖ్య. లంకోదయకాలమునకు ముం దైదుగడియలని యర్థము. ఆకాలమున రోగములు

చింతలు లేనివారలకు వచ్చినస్వప్నములు శీఘ్రకాలమున ఫలమునిచ్చును. త్రిజట యసత్యములాడునది కాదు. తనకుఁ గలయందుఁ గనఁబడిన విషయములనే తెల్పునది. కావున మనము కర్మము ప్రోత్సహింపఁగా భావిఫలములను దెలుపు స్వప్నము లుషఃకాలమునందు (తెల్లవారుజామున) దోఁచు స్వప్నములను బరిశీలించి వానికిం దగిన ప్రతిక్రియలను గావించుకొనఁ బ్రయత్నింపవలయును.

> "గజదంతమయీం దివ్యాం శిబికా మంతరిక్షగాం. ౯
> యుక్తాం హంససహస్రేణ స్వయమాస్థాయ రాఘవః,
> శుక్లమాల్యాంబరధరో లక్ష్మణేన సహాగతః. ౧౦
> స్వప్నే చాద్య మయా దృష్టా సీతా శుక్లాంబరావృతా,
> సాగరేణ పరిక్షిప్తం శ్వేతపర్వతమాస్థితా. ౧౧
> రామేణ సంగతా సీతా భాస్కరేణ ప్రభా యథా,"

అని మూలము ఈభాగమునఁ గలశ్లోకముల నుదాహరింపక వానిసారమును వ్రాయుదును. అంతరిక్షమునందు శ్వేతవర్ణ మగు పల్లకి యున్నట్లు దానికి వేయిహంసలను గట్టియున్నట్లు దాని శ్రీరాముఁ డెక్కియున్నట్లు సీత తెల్లనివస్త్రమును ధరించి శ్వేతపర్వతము నెక్కియున్నట్లు శ్రీరాముని గూడియున్నట్లు కనఁబడెను. దీనిభావ మేమి? శిబికయందు రాముఁడు లక్ష్మణుఁడు కూడియుండిరి. సీత శ్వేతాచలముపై నుండెను. క్షణ కాలమునకు శ్రీరామునికడ నుండెను. అనఁగాఁ దోలుత మహాప్రకృతి యగుసీత తెల్లనికొండపై నుండి రామునిం గూడి యున్న ట్లగపడకయుండుట సకలకార్యములు తాఁ జేయు చుండుటం దెలుపుట కనియు (అదియే రావణాపహరణకాల

ముం దెలుపును; మరల రామునిం గూడిన ట్లగపడుట భగ వంతునకుఁ దనకు నవినాభావసంబంధము కలిగియుండుటం దేటపఱచుట కనియు, శ్వేతాంబరాదిధారణము విజయానంతర రాజ్ఞీచిహ్నమని వివరించుటకనియు మన మెఱుంగఁదగు. భాస్కరుని ప్రభవలె ననుటయే యిందులకు సాక్ష్యము. భగ వంతు నెడఁబాసియున్న ట్లగపడుట బాహ్యదృష్టికని తెలియం దగును. అనఁగా సకలకార్యములుచేయుచు భగవంతుని సర్వ సాక్షిత్వనిర్లిప్తత్వములను దేటపఱచుచుఁ దానుండి మహాత్ము లకుఁ దెలిసియున్న నితరుల కది స్పష్టముగాఁ దెలుపుటకనియు క్షణమాత్రమునఁ దత్సంగతిని గనఁబఱచుట మహత్తర కార్యములన్నియు నొకక్షణకాలమున సాగును జుఁడీ యని తెలుపుటకనియు మనము తెలిసికొనవలయును. ఈవిషయ మునే శ్రీశంకరభగవత్పాదులు సౌందర్యలహరియందు

> "జగత్సూతే ధాతా హరిరవతి రుద్రః క్షపయతే
> తిరస్కుర్వన్నేతత్స్వమపి వపురీశ స్తిరయతి,
> సదా పూర్వస్సర్వం తదిదమనుగృహ్ణాతి చ శివ
> స్తవాజ్ఞామాలంబ్య క్షణచలితయోర్భ్రూలతికయోః." ౨౪

అని తెలిపిరి. అనఁగాఁ బ్రపంచనిర్మాణాదికార్యములన్నియు మూలప్రకృతిమూలముననే సాగుననియు, నిర్గుణతత్త్వము దీని సంబంధమును గల్పించుకొనక చూచుచు నుండుననియుఁ, దత్సంకల్పశక్తియే ప్రకృతి యనియు నెఱుంగవలయును. ఎఱుంగఁదగినవిషయ మిదియే. దీనిచేత శివవిష్ణ్వాదిభేదదుర్వా దము లెగిరిపోవును. ఈభాగమునుండి మనమేమి నేర్చుకొన వలయును? ప్రకృతిరూపములే హరిహర బ్రహ్మాదిరూపములు.

అందేది యభీష్టముగనుండునో దాని నుపాసింపవచ్చును. కాని వాంఛమాత్రము భగవంతుని జేర్పవలయుననియే యుండ వలయు. ఆయుపాసన చక్కఁగా సాగినఁ దత్ఫలముగా భగ వంతుని గనుఁగొను సమదర్శనత్వము తనయంతన గలుగును. అదియే నిర్గుణోపాసన యనఁగా, వేఱుగాదనియే మన మెఱుంగవలయును. ఈనీతి పర్వతాగ్రమునఁ దోఁచిన సీతాదేవి మరల భగవంతునికడ నున్న ట్లగపడెనను గాథ నుండి తేలుచున్నది. కనుక మనము సాంద్రభక్తిపూర్ణులమై యేరూపమును ధ్యానించినను భగవద్రూపమనియే నమ్మి సంసారసాగర సంతరణాభిలాషులమై యుండినచోఁ దత్ఫలము నదియే కల్పింపకపోదు. ఇదియే యుపాసకులకుఁ గావలసిన ముఖ్యవిషయము.

"ఆరోహణం గోవృషకుంజరాణాం ప్రాసాదశైలాగ్రవనస్పతీనాం,
విష్ఠానులేపో రుదితం మృతం చ స్వప్నేష్వగమ్యాగమనం చ ధన్యమ్."

అని స్వప్నశాస్త్రమునఁ గలదని వ్యాఖ్యాత లుదహరించిరి. శ్వేతవస్త్రచందనపుష్పమాలాదిధారణము స్వప్నమునఁ దోఁచిన శుభములు ముందుఁ గలుగుటకు హేతువులని యెఱుంగం దగు. ఇట్టిస్వప్నము లుషఃకాలమున నకారణముగాఁ దోఁచిన వానిఫలములు గలుగునని విశ్వసించిన నేబాధయు లేదు.

ఈఘట్టమున సీతారామసౌమిత్రుల యాభరణవస్త్రాంగ రాగాదులను విమర్శించిన రావణ సంహారానంతరము పుష్ప కాధిరూఢులై యయోధ్యకు సంతోషమున నరుగుదురనియు నెవ్వారివిషయమున నిట్టిస్వప్నములు వచ్చినను వారికి భావి

శుభములు గలుగునని విశ్వసింపవలయుననియు మన మూహింపఁ దగినవిషయములు.

"న హి రామో మహాతేజాశ్శక్యో జేతుం సురాసురైః,
రాక్షసైర్వాపి చాన్యైర్వా స్వర్గః పాపజనైరివ." ౨౧

అని మూలము. త్రిజట తనస్వప్నమునుబట్టి శ్రీరాముఁడు భగవంతుఁడనియో లోకాతీతపరాక్రమశాలి యనియో కనుఁగొన్నయట్లీభాగము మనకుఁ దెలుపుచున్నది. పాపాత్ములు స్వర్గమునకుఁ బోఁజాలనియట్లని దృష్టాంతము తెల్పుచున్నది. పాపులకు దుఃఖమే కాని యెందున్నను సుఖమనఁగా మన శ్శాంతము లేదని మన మెఱుంగఁదగు. కొందఱు దుఃఖఫలములగు దారిద్ర్యము లోనగువాని ననుభవింపకయున్నను నిరంతరపరితాపస్వరూప మగు దుఃఖఫలము ననుభవించుచుందురు. ఇతరుల కావిధము స్పష్టముగాఁ దెలియఁబడకయున్నను లోకజ్ఞానసంపత్తి గలవారల కది తేటపడక పోదు. ఆధివ్యాధులు రెండును బాపకర్మఫలములే. వ్యాధివలె నాధి యితరులకు స్పష్టము కాకయున్నను దదనుభవము చిహ్నములనుబట్టి మహాత్ము లెఱుంగఁజాలుదురు. ఈవిషయము స్వప్నమునఁ దనకుఁ దోఁచిన యనుభవముల ననుసరించి త్రిజట కనుఁగొన్నది కదా. అట్లే మనశ్శాంతికి భంగము కలిగించునవియెల్లఁ బాపకర్మఫలములే యని మన మూహించి యట్టికర్మముల నాచరింపక యుండవలయు ననువిషయ మీఘట్టమునుండి యెఱుంగవలయును.

"రావణశ్చ మయా దృష్టః క్షితౌ తైలసముక్షితః,
రక్తవాసాః పిబన్మత్తః కరవీరకృతస్రజః." ౨౨

విమానాత్పుష్పకాదద్య రావణః పతితో భువి,
కృష్యమాణ స్త్రియా దృష్టో ముండః కృష్ణాంబరః పునః. ౭౬

... ... ... ...

కంఠే బధ్వా దశగ్రీవం ప్రమదా రక్తవాసినీ. ౮౦
కాళీ కర్దమలిప్తాంగీ దిశం యామ్యాం ప్రకర్షతి."

అని మూలము. రామభద్రునకు రాఁగలఫలములను దెల్పి రావణునకు రాఁగలదుష్ఫలములను స్వప్నమునుబట్టి త్రిజట తెల్పుచున్నది. రక్తవస్త్రధారణము భీతికరము. ఖరవాహన మట్టిదే. గన్నేరుపూలహారము మృతికరము. ఈచిహ్నము లన్నియు రాఁగల యనిష్టఫలములను దేటపఱచుచున్నవి. శ్రీరాముని యభ్యుదయమును దెలుపునపుడు పద్మదళాయత నేత్ర సీత రామునంకమునుండి లేచి హస్తమునఁ జంద్రసూర్యు లను బట్టుచుండిన ట్లున్నది కదా. రావణువినాశము దెలుపు నపుడు రక్తవస్త్రధారిణి యగు ప్రమద యొకర్తు కర్దమలిప్తాం గియై రావణునికంఠమునం దొకపాశమును దగిలించి దక్షిణ దిక్కున కీడ్చుకొని పోవుచున్నట్లున్నది కదా. ఈరెండింటిని బరికింతము. వృద్ధిక్షయములకుఁ గారణము ప్రమద యని తేట పడుచున్నది.

"మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరమ్,"

అను గీతావాక్యము ననుసరించియుఁ బైన వ్రాసినదియే యుక్తమని తోఁచెడు. సృష్టిపాలనసంహారములు ప్రకృత్య ధీనములు. కాననే "సూయతే సచరాచరమ్" అని శ్రీకృష్ణ మూర్తి తెల్పెను. హరిహరబ్రహ్మలు మూవురు ప్రకృతికళ

లనియే యీగీతావాక్యమును బోధించును గదా. సర్వకారణ భూతమహాప్రకృతి యనువిషయమునే మన మెఱుంగందగు.

రావణుని భావిపతనము నీభాగము తెల్పుచున్నది. అది స్త్రీమూలముననే యగునని తేటపడును. "కాళీకర్దమలిప్తాంగీ దిశం యామ్యాం ప్రకర్షతి" అను మూలమునుండి పైని వ్రాసినది తేటపడును. ఈరామాయణమునందు సీతయం దతనికి భక్తియే కాని కామాసక్తి లేదని వ్రాసిన యర్థభాగము లన్నియు సముచితములే యని యీభాగము తెల్పుచున్నది. ఆతఁడు సీతాంబతో సంభాషించునపుడు వానిభావ మిదియని మహేశ్వరతీర్థులు వ్రాయుట న్యాయ్యమే యని తెలిసికొనుట బుద్ధిమంతుల లక్షణము. మహాప్రకృతియగు సీతాదేవియే శ్వేతాంబరధారిణియై రామునకును, నీలాంబరధారిణియై రావణునకును వృద్ధిక్షయములను గల్పించెనని మన కీభాగము తేటపఱుచుచున్నది. ఈయాశయమునే శ్రీశంకరభగవత్పాదులుగారు తెలిపిరని లోపల "జగత్సూతే ధాతా" అను సౌందర్యలహరిశ్లోకము నుదహరించియే యున్నాను.

> "లంకా దృష్టా మయా స్వప్నే రావణేనాభిరక్షితా. ౩౬
> దగ్ధా రామస్య దూతేన వానరేణ తరస్వినా,"

అని మూలము. హనుమంతుఁడు ఈత్రిజట స్వప్నవృత్తాంతమును జెప్పుచుండఁగా వినియెనా లేదా యనుశంక యుదయించును. వినియెనన్నచో సీతానుజ్ఞ నొంది మీఁది పని యేది? అని యతఁ డాలోచింప నక్కఱయే యుండదు. నగరదాహము సాగు టెట్టులనియే యాలోచింప నవకాశము కలదు. ఈవృత్తాంత మచటనుండు రాక్షసస్త్రీలు వినఁ ద్రిజట

చెప్పినదనియే మనము గ్రహింతము. దీనిని బాధించునవి ప్రాసంగినతటి విమర్శింతము.

> "యస్యాశ్చేవం విధస్స్వప్నో దుఃఖితాయాం ప్రదృశ్యతే. ౪౨
> సా దుఃఖైర్వివిధైర్ముక్తా ప్రియం ప్రాప్నోత్యనుత్తమం,
> భర్త్సితామపి యాచధ్వం రాక్షస్యః కిం వివక్షయా. ౪౩
> రాఘవాద్ధి భయం ఘోరం రాక్షసానా ముపస్థితం,
> ప్రణిపాతప్రసన్నా హి మైథిలీ జనకాత్మజా. ౪౪
> అలమేషా పరిత్రాతుం రాక్షస్యో మహతో భయాత్,"

అని మూలము. దుఃఖించుస్త్రీల కిట్టిస్వప్నము వచ్చిన నాదుఃఖములు తొలఁగి సుఖము చేకూరునని కదా దీనియర్థము. ఈకల సీతకు రాలేదు. త్రిజటకు వచ్చినది. కాన దుఃఖములు సీత కెట్లు తొలఁగును? అన్నశంక కలుగును. దుఃఖములపాలై యుండు స్త్రీలవిషయమున నెవరికైన నామెకు మేలుగలిగినట్లు కలవచ్చిన నామె దుఃఖములు తొలఁగ సుఖపడునని యర్థములు గ్రహింపం దగును. మన మీాజానకి నింతదనుక బెదరించితిమి. ఇపుడు మనము వేఁడిన నీమెకు మనయందు దయ కలుగునా యనుశంక వలదు. వేఁడికొనుఁడు. దయ చూపును. శ్రీరాముని మూలమున రాక్షసులకు ఘోరభయము సిద్ధించును. ఈసీత నమస్కరించి ప్రార్థించినఁ బ్రసన్నురాలగు. అట్టిస్వభావ మూమెకుం గలదని యర్థము. ఎట్టిభయములనుండియైన నీమె రక్షింప సమర్థురాలగునని త్రిజట తెల్పెను. ఇందు వాల్మీకి మన కెఱింగిన విశేషవిషయ మెద్ది? సాధువులు పరులదుఃఖము లకుఁ బరితపింతురు. కరుణార్ద్రహృదయులు గదా సాధువులు. వారిదుఃఖము తొలఁగు టెట్లు? ఎవరివిషయమున వారు

అనుతాపము నొందుదురో వారిసత్కర్మము కాలాంతరముల వారి కూలటం గల్గించును. దాన వారు నగపుడిగి రానున్న మంచికి సంతోషింతురు. దుఃఖితుల నూఱడింతురు. అను కర్మ తత్త్వమును మహాకవి యెఱింగించెను. రామునిమూలమున మహాభయము గల్గుననుట యేటికి? రాక్షసులపాపకర్మము వారికిఁ దగినఫలములఁ గల్పింపఁబూనినది. ఎవరిమూలమముననో కల్పింపవలయుఁ గదా.

"మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్."

అని శ్రీకృష్ణమూర్తి యుపదేశించినట్లు శ్రీరాముఁడు కారణమాత్రముగ నుండునే కాని వారివారికర్మమే వారికి మృతిని గల్పించును. లోకులాతత్త్వ మెఱుఁగక రాముఁడే రాక్షసుల వధించెనందురు. కర్మమేయేరూపముననో తత్ఫలముల ననుభవింపఁ జేయుననుటయే మన మెఱుంగఁదగునని మహర్షి యాశయము. ఈసీతాదేవి నమస్కారమునఁ బ్రసన్నురాలగును. మహాభయమునుండి రక్షింపఁజాలును. అను తావు నుండి మనమేమి గ్రహింపందగును? ఈసీత పరదేవి. సకల కారణభూతురాలు. ఏభయమునుండియైన నుద్ధరింపఁ గలదు. అనువిశేషము నిది మనకుఁ దెలుపుచున్నది.

"భయాత్త్రాతుం దాతుం ఫలమపి చ వాంఛాసమధికం
శరణ్యే లోకానాం తవ హి చరణావేవ నిపుణౌ,

అనియు,

అతస్త్వామారాధ్యాం హరిహరవిరించాదిభిరపి
ప్రణంతుం స్తోతుం వా కథమకృతపుణ్యః ప్రభవతి."

అనియును శ్రీశంకరభగవత్పాదులుగారు తేటపఱచిరి. ఆవిష

యమే యీరామాయణము కూడఁ దెలుపుచున్నది. నమస్కారముచేఁ దయగలదగుననఁగా భావమేమి? ఉపాసకుఁడు మంత్రజపముచేసి తత్ఫలము "నిష్టదేవతామాణిక్యమహః పాదుకార్పణమస్తు" అని పలుకుచు జలముల విడుచును. "ఇష్ట దేవతార్పణమస్తు" అని పలుకుట సాంప్రదాయసిద్ధమగు నాచారము కాదు. ఆవిషయమునే శంకరాచార్యులు తెలిపి రని పైశ్లోకమే యొఱింగించును.

"శ్రుతీనాం మూర్ధానో దధతి తవ యౌ శేఖరతయా
మమాప్యేతౌ మాతశ్శిరసి దయయా ధేహి చరణౌ,
యయోః పాద్యం పాథః పశుపతిజటాజూటతటినీ
యయోర్లాక్షా లక్ష్మీరరుణహరిచూడామణిరుచిః. ౮౪

నమోవాకం బ్రూమో నయనరమణీయాయ పదయో
స్తవాస్మై ద్వంద్వాయ స్ఫుటరుచిరసాలక్తకవతే,
అసూయత్యత్యంతం యదపి హననాయ స్పృహయతే
పశూనామీశానః ప్రమదవనకంకేళితరవే." ౮౫

అనియును శ్రీశంకరభగవత్పాదులే ప్రకృతి పాదద్వంద్వ నమస్కారప్రధానత్వమును దెలిపిరి. కనుకనే త్రిజట రాక్షస స్త్రీలారా! నమస్కారముచే నీసీతాదేవి ప్రసన్నురాలగునని బోధించెను. దీనింబట్టి మూలప్రకృతియే లంకావాసి రాక్షస వినాశనరూపమున వారికర్మఫలముల నీయఁబూనినదని మన మెఱుంగవలయును. ఈవిషయమును శ్రీరామానుజాచార్యులవా రెఱింగియే శ్రీప్రాధాన్యమును స్థాపించిరి. అట్టిశాక్తులు గలరా? పరమశాక్తులగు శ్రీరామానుజాచార్యులుగారు వంద్యులు గదా! ఇట్టు లీఘట్టమునఁ గర్మసిద్ధాంతము మిక్కిలి

చక్కఁగా బోధింపఁబడినది. భగవత్ప్రసాద లాభమార్గము తెలుపఁబడినది. రాఁగలఫలములను నిమిత్తములు తెలుపునను విషయము స్పష్టముగాఁ జెప్పఁబడినది.

"విభీషణస్తు రామస్య సన్నిధౌ హృష్టమానసః,
సేవాం కరోతి రామస్య పాదయోర్భక్తిసంయుతః,
సర్వథా రావణం రామో హత్వా సకులమంజసా,
విభీషణాయాధిపత్యం దత్వా సీతాం శుభాననాం,
అంకే నిధాయ స్వపురీం గమిష్యతి న సంశయః." సర్గము ౨.

అని యధ్యాత్మరామాయణమునఁ గలదు. స్వప్నసారము రెండింటియందు సమానమే.

"అపి చాస్యా విశాలాక్ష్యా న కించి దుపలక్షయే. ౪౫
విరూపమపి చాంగేషు సుసూక్ష్మమపి లక్షణం,
ఛాయావైగుణ్యమాత్రం తు శంకే దుఃఖముపస్థితం. ౪౬
అదుఃఖార్హామిమాం దేవీం వైహాయసముపస్థితాం,
రాక్షసేంద్రవినాశం చ విజయం రాఘవస్య చ. ౪౭
నిమిత్తభూత మేతత్తు శ్రోతుమస్యా మహత్ప్రియం,
దృశ్యతే చ స్ఫురచ్చక్షుః పద్మపత్త్రమివాయతం. ౪౮
ఈషచ్చ హృషితో వాస్యా దక్షిణాయా హ్యదక్షిణః,
అకస్మాదేవ వైదేహ్యా బాహురేకః ప్రకంపతే. ౪౯
కరేణుహస్తప్రతిమ స్సవ్యశ్చోరు రనుత్తమః,
వేపమాన స్సూచయతి రాఘవం పురతస్స్థితం." ౫౦

అని మూలము. ఈభాగము విశేషించి కర్మసిద్ధాంతము స్పష్టము చేయుచున్నది. రాఁగలఫలములను దేహభాగములు తెలుపును. ఇపు డ్శ్రీసీతాదేవి శరీర మెందెందుఁ గానియట్టి దుర్లక్షణ

ములు రవంతయుఁ గనఁబడలేదు. కాని శరీరచ్ఛాయయం దించుక మార్పు కనఁబడుచున్నది. అదియే యీదుఃఖమునకుఁ గారణమని తలంచుచున్నానని త్రిజట యనియె. ఇందలివిశేషము పరిశీలింపఁదగినదే. శరీరకాంతి తగ్గుట హెచ్చుట యనునవి కలవా యని యడుగువా రుందురు. కలదనియే సమాధానము. ఎట్లనఁగా, ప్రతివ్యక్తికి శరీరమునందంతట విశేషించి శిరస్సునుజుట్టి యొకతేజస్సుండును. అదియే యాత్మజ్యోతియని యెఱుంగవలయు. అయ్యదియే దేహమున కేదేనొకకష్టము సంభవించి స్మృతి తప్పినపుడు లోపలఁ బ్రవేశించి స్మృతి గలుగఁజేయును. విశేషించి శిరస్సును జుట్టియుండు తేజస్సు సత్కర్మానుష్ఠానముచేతను సచ్చింతలచేతను సత్కార్యోద్దేశముచేతను నిర్మలమై పెంపొందుచుండును. అట్టితఱి నాపురుషునిమోమునఁ గాంతిహెచ్చిన ట్లందఱు తలంతురు. తటాలున నొకానొకప్పుడు ముఖకాంతి మాఱును. చూచినవారెల్ల నేల ముఖమున మార్పుగల్గినదే యని ప్రశ్నింతురు. అది దుష్కర్మములమూలమున దురుద్దేశమున మలిన మగును. బుద్ధిమంతు లతనిమనోవ్యాపారము నపు డిట్లుండునని తెలిసికొందురు. కష్టములు రానున్నతఱి నది విశేషించి మార్పునొందును. మతిమంతు లీతనికిఁ గష్టములు రానున్నవని నిరూపింతురు. కావున సత్కర్మానుష్ఠానము సదుద్దేశము ననునివి మనమున నెలకొనియుండఁ జేసికొనుట యుత్తమము. దానభగవదనుగ్రహము తేజోరూపమున నతని నావరించి కాపాడుచుండును. దుష్కర్మనిరతి దురుద్దేశము తనకే హానిని గల్పించును. స్వనాశనమును గోరువా రుండరు. కాని దురుద్దేశమాత్మహానిం గల్గించుననిమాత్ర మెఱుంగువా రరుదు. పరు

లకు హానిగల్పింప నుద్దేశించుట స్వహానింగోరుట యని యాలో చించువారే మతిమంతులు. ప్రాయికముగా నట్టు లాలోచించు వా రుండరు గానఁ బెక్కం డ్రాత్మహానిం గోరువారే యన వచ్చును. కర్మసిద్ధాంతతత్త్వ మెద్దియని విమర్శించుటయే మిగుల మంచికార్యము. దానిచే నిట్టిచెడుగులు తొలఁగు. అను నీవిషయ మీభాగమునుండి మనము గ్రహింపవల యును. శిరస్సు నావరించియుండు తేజస్సు పరబ్రహ్మస్వరూప మని మంత్రతంత్రములచేఁ దెలిసినట్లు నటించుచున్నారము కాని యాలోచించి "యిదమిత్థ" మ్మని యెఱింగినవారము కాము. సంధ్యావందనము చేయునపుడు "అసావాదిత్యో బ్రహ్మ" అని మంత్రము నుచ్చరించుచు నీటిని గ్రహించి తల చుట్టును ద్రిప్పుట యొక సదాచారము. ఏల? ఆమంత్రమునఁ గలయర్థ మేమి? అసౌ ఆదిత్యః = ఈసూర్యుఁడు, అనఁగా నీ తేజస్సు, బ్రహ్మ = పరబ్రహ్మము, అనియే కదా. తేజోరూపము భగవద్ధ్యానమున ముఖ్యమని యెన్నిహోతావుల వ్రాసితిని. దానినే యీమంత్రముకూడఁ దెలుపుచున్నది. "యోఽర్థవిత్స కలం భద్రమశ్నుతే" అని కదా ప్రమాణము. ఏమి చెప్పు చున్నాఁడో దానియర్థ మేమని యెఱింగి యాకార్యము చేసిననే సంపూర్ణఫలము కలుగును. లేనిచో యత్కించి త్ఫలమే లభించును. కావున యథాశక్తిన్యాయమున నైన మంత్రతంత్రముల తాత్పర్య మేదియని తలంచి యాపని చేయ వలయు. దాన సంపూర్ణఫలము లభించును.

ఈదేవి సవ్యనేత్ర మదరుచున్న ట్లగపడుచున్నది. ఎడమభుజముకూడ నదరుచున్నది. సవ్యభాగమునఁ దొడయుఁ గంపించుచున్న ట్లున్నది. ఈగుఱుతులన్నియు శ్రీరాముని

యాగమనమును దెలుపుచున్నవని త్రిజట తెల్పెను. ఇఁక నెంతయూ యాలస్యము లేదు. శీఘ్రముగనే వచ్చుననునూహా నీమూఁడునిమిత్తములు తెల్పుచున్నవనియే త్రిజట తెల్పెను. శకునబహుత్వము శీఘ్రఫలాగమనము తెలుపును గదా. కావునఁ గర్మములు భావిఫలములను నిమిత్తరూపమునఁ దెలుపుననియు, సకాలస్వప్నములు దేహమునఁ దోఁచు కంపనాదులు పరిశీలింపఁదగినవనియు, వానిం బరికించి శుభాశుభ ఫలములు గలుగునని నిశ్చయించుకొనవలయుననియు నీభాగము మనకుఁ దెలుపుచున్నది.

"పక్షీ చ శాఖానిలయః ప్రహృష్టః పునఃపునశ్చోత్తమసాంత్వవాదీ,
సుస్వాగతాం వాచముదీరయానః పునఃపునశ్చోదయతీవ హృష్టః."

అని మూలము. ఇందు వ్రాయఁదగు విశేషమేదియు లేదుగాని యీభాగమునకు వలయునని తనిశ్లోకి యనువ్యాఖ్య తేటపఱచిన విషయమునఁగల పక్షపాతమును దేటపఱచుటకు నిందలి సార మేమి యని విమర్శించుటకుఁ బూని యీమూలమును వ్రాసితినని యెఱుంగవలయును. ఇందు గరుడాళ్వారుల ప్రస్తావనయు నాచార్యలక్షణములు భగవంతునికంటె నాచార్యున కతిశయత్వారోపణము కేవల మతాభిమానమునే సూచించును. ఈయర్థములేల యూహ్యములు కావని యడుగవచ్చును. ఊహ్యములే యనవలయును. ఇంతకుఁ బూర్వమున నున్న శ్లోకముల కేల యిట్టియర్థమును వచింపలేదని యడుగువారికి బదులేమి? సీతాదేవి సవ్యనేత్రమే యదురుటంజేసి ప్రకృతియే ప్రధానమని యేల యర్థము చెప్పరాదో తెలియఁజాలకున్నాను. తనిశ్లోకియాశయము భక్తుఁడు తనకున్న ధనమంతయు నాచార్యులపాదములకడఁ బెట్టి శరణాగతి నాశ్ర

యించిన ముక్తి దొరకుననియు లేకున్న లేదనియు, భగవంతుని కంటె నాచార్యుఁ డధికుఁడనియు, నాచార్యుఁడు చక్కఁగా ధనమిచ్చి దరిద్రశిఖామణియై తనయుచ్ఛిష్టాన్నమును దినుచున్న శిష్యుని మోక్షమునకుఁ బిలుచుకొనిపోయి సొంపుగా శీతపాషాణముల నమరించియున్న యాగృహద్వారమును బడఁదన్ని మెడఁబట్టి లోపలఁ ద్రోసి నిలువక యింటికి వచ్చుననియుఁ, గావున నాచార్యునకు నున్నంత ధనవస్త్రాదికమును మూఁడువేళలఁ బాలిచ్చు నావులను సమర్పించి వానిపోషణమునకుఁ దగినభూమి నేర్పఱచి సంపూర్ణదరిద్రుఁడై స్వామీ యేమి యాజ్ఞ యని యడుగుచుండవలయు ననియు, భగవంతుఁ డిండే కార్యము చేయఁజాలఁడుగాన నతని నాశ్రయించు టనవసరమనియు, నోరుగల భగవంతుఁడనఁగా నాచార్యుఁడే యనియు, నతనినే యాశ్రయించినఁగాని మోక్షగృహద్వారము నెగిరి తన్నువాఁడు దొరకఁడనియు నై యుండును. కొన్ని దేశములలోఁ బత్రికాధిపతులకు వలసినంత ధన మొసంగి తమ పేరు ప్రసిద్ధికిఁ దెమ్మని కోరుచుందురఁట. అట్లే ఆచార్యప్రాధాన్యము నీవ్యాఖ్య బోధించుచున్న ట్లూహింపవచ్చును. కావుననే దీని సారమును విమర్శింపఁ బూనవలసివచ్చెను. ఆచార్యుఁ డనఁగా.

"ఉపనీయ తు యశ్శిష్యం వేదమధ్యాపయేద్ద్విజః,
సకల్పం సరహస్యం చ తమాచార్యం ప్రచక్షతే." మనుస్మృతి.

"స గురుర్యః క్రియాస్సర్వా వేదమస్మై ప్రయచ్ఛతి,
ఉపనీయ దదద్వేద మాచార్యస్స ఉదాహృతః."

యాజ్ఞవల్క్యస్మృతి.

"పర్యవదాతశ్రుతం పరిదృష్టకర్మాణం దక్షం దక్షిణం శుచిం జితహస్తముపకరణవంతం సర్వేంద్రియోపపన్నం ప్రకృతిజ్ఞం ప్రతిపత్తిజ్ఞ

మనుపస్కృతవిద్యమనసూయకమకోపనం క్లేశక్షమం శిష్యవత్సలమధ్యాపకం జ్ఞానదానసమర్థమిత్యేవంగుణో హ్యాచార్యః సుక్షేత్రమార్తవో మేఘ ఇవ శస్యగుణైస్సుశిష్యమాశు వైద్యగుణైస్సంపాదయతి” అని చరకము.

“శ్రీగురుః పరమేశాని శుద్ధవేషో మనోహరః,
సర్వలక్షణసంపన్నస్సర్వావయవశోభితః,
అగ్రగణ్యో గభీరశ్చ పాత్రాపాత్రవిశేషవిత్,
శివవిష్ణుసమస్సాధుర్న చ పన్నదోషకః.
నిత్యే నైమిత్తికే కామ్యే రతః కర్మణ్యనిందితే,
యదృచ్ఛాలాభసంతుష్టో గుణదోషవిభేదకః,
ఇత్యాదిలక్షణోపేతశ్శ్రీగురుః కథితః ప్రియే.”

శక్తార్ణవతంత్రము.

“నాస్తికాన్ భిన్నమర్యాదాన్ కృతఘ్నాన్ వేదనిందకాన్,
మంత్రాక్షరోపదేశే తు దూరతః పరివర్జయేత్.”

నారదతంత్రము.

సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానాపమానయోః,
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగవివర్జితః. ౧౮
తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్,
అనికేతస్థిరమతి ర్భక్తిమాన్మే ప్రియో నరః.” ౧౯

గీత ౧౨-అధ్యా.

ఇట్టివన్నియుం ద్రోసిపైచి

“ఆచార్యో వేదసంపన్నో విష్ణుభక్తో విమత్సరః.”

అనుశ్లోకము నుదాహరించెను. శివభక్తి మంచిది కాదని దీని భావము.

"అహం త్వం సర్వగో దేవ త్వమేవాహం జనార్దన,
ఆవయోరంతరం నాస్తి శబ్దైరర్థైర్జగత్పతే,
నామాని తవ గోవింద యాని లోకే మహాంతి చ,
తాన్యేవ మమ నామాని నాత్ర కార్యా విచారణా." హరివంశము.

"అశక్తోఽహం గుణాన్వక్తుం మహాదేవస్య ధీమతః,
యోహి సర్వగతో దేవో నచ సర్వత్ర దృశ్యతే,
బ్రహ్మవిష్ణుసురేశానాం స్రష్టా చ ప్రభురేవ చ,
బ్రహ్మాదయః పిశాచాంతా యంహి దేవా ఉపాసతే,
ప్రకృతీనాం పరత్వేన పురుషస్య చ యః పరః,
... ... ... ...
కోహి శక్తో భవం జ్ఞాతుం మద్విధః పరమేశ్వరం,
ఋతే నారాయణాత్పుత్ర శంఖచక్రగదాధరాత్."
మహాభారతము. అనుశాసనిక ప. ౧౪ అధ్యా.

అను నిట్టిప్రమాణములు దీనికి రుచింపవనుట నిక్కము.

"పునఃపునరిత్యనేన కర్షకః కదాచిన్న ఫలిత మిత్యేతావతా యథా కృషిం న పరిత్యజ్యతి పునఃపునస్తత్రైవ ప్రవర్తతే. తథాచార్యోఽపి కదాచిత్ స్వవచనాశ్రవణేఽపి న నివర్తత ఇత్యుక్తం. అనేనాచార్యస్య భగవతోఽప్యతిశయ ఉక్తః."

అని వ్రాసిన యీవ్యాఖ్య తాత్పర్యమేమని గ్రహింపం దగునో. "పునఃపునశ్చోత్తమసాంత్వవాదీ" అనుటచే శిష్యుఁ డొకప్పుడు తనమాట వినకపోయిన నుపదేశమును మానక మాటిమాటికి దానినే చేయుచుండుననియు నీయర్థమునుబట్టి భగవంతుని కంటె నాచార్యున కతిశయము చెప్పఁబడిన దయ్యెననుభావము "పృష్ఠతాడనాద్దంతభంగః" అనున్యాయము ననుసరింపక పోదు..

ఈభావమును వెలిపుచ్చుటకుఁ గారణ మేమనఁగా "నూన మశ్రద్ధధానోఽపి దుర్మేధాశ్చాసి పాండవ." అని యాశ్వమేధికమున శ్రీకృష్ణుఁ డర్జునుని దండించినవాక్యము. ఆచార్యుఁ డట్లనఁడఁట. భగవంతుఁడు కరుణాళువనుట న్యాయ్యము. అట్టివాఁడే యట్లన్నపుడు శిష్యవిత్తహారణపటువగు నాచార్యుఁ డెన్నిసారులు శిష్యుఁ డడిగినను, అతఁ డెన్నిసారులపరాధములు చేసినను క్షమించుననీ దీని కెవ్వఁడు చెప్పెనో తెలియకున్నది. "సుస్వాగతాం వాచ ముదీరయానః, సుష్ఠు సంప్రదాయావిచ్ఛేదో యథా తథా ఆచార్యపరంపరయా స్వస్మై ఆగతాం వాచం అష్టాక్షరాది మంత్రరాజరూపాం నిర్హేతుకైవ దయయా సముదీరయన్" అను వాక్యజాలము విచిత్రముగాఁ దోఁచకమానదు. ఆచార్యపరంపరయా=ఒకయాచార్యుఁ డింకొకయాచార్యునకు నాతఁ డింకొక్కరికి నను వరుసప్రకారము శిష్యులకుఁ జెప్పఁదగినయర్థము వచ్చుచుండును గాఁబోలు. అదియే ముఖ్యము కాఁబోలు. ఒకయాచార్యుఁడు "శ్రియం వాసయ మే కులే" అను శ్రీసూక్తమంత్రముం జదివి శిష్యునకు మేకులు గురువునకుఁ దెచ్చియిమ్మని రహస్యార్థ మాచార్యపరంపరాగతముగ నున్నది. ముందు వానిం దెమ్ము. వస్త్రము లెండ వేసికొని కూరుచుండి మంత్ర ముపదేశింతునని చెప్పినట్లే యిదియు నుండునేమో. శిష్యుల నేకరించుపంచకు లిట్లే యర్థముం జెప్పుచు నిది రహస్యార్థమనియు నితరులకు దీనిం దెలుపరాదనియు మనసాంప్రదాయమున నిది ముఖ్యధర్మమనియు బోధింతురు. కొన్నియేండ్లక్రిందట నేనొకగ్రామమునకుఁ బోయియుంటిని. బలిజకొలమువారు నన్నాశ్రేంగినవా రం దుండిరి. వారిన్నిఁ జూచుటకే

నాగమనము నయియుండెను. అంతకుముందే వారిగురువు లయ్యంగారు విజయంచేసి యుండిరి. వా రేవిప్రునింట విడి. సిరో వారియింటనే నాకు భుక్తిసాగెను. తాంబూలచర్వణానం తరము వారికడ నేఁ గూరుచుంటిని. పెట్టెలు సవరించుకొనుచు రజకధౌళితవస్త్రముల ముట్టుకొనిన యాగురువులవారు శిష్యుల రాక చెవిసోఁకఁగనే రత్నకంబళముపై సవ్యోరుపై నపసవ్య పాదముంజేర్చి శ్రీపాదరేణువను పరిమళవస్తువు పళ్లెరమున నున్న జలములం గలిపి నిష్ఠ నభినయించుచుం గూరుచుండెను. శిష్యులు దూరమునుండి చేతులు జోడించి దాసానుదాసులై వచ్చి వంగివంగి వారిచ్చుతీర్థముం బుచ్చుకొనిరి. పాదములపై వ్రాలిరి. అభయహస్తముం జూపి యయ్యంగారు దీవించుచు వారిచ్చుధనమును బ్రేమపూర్వకముగాఁ గటాక్షముల నంగీక రించిరి. ఒకగడియ కాఁగా శిష్యులకు మంత్రరహస్యముల నుపదేశింపవలయును. "శర్మగారూ! మరల రండు." అని నన్నుం గటాక్షించిరి. అట్టితతి వా రుపదేశించునదియే కాఁబోలు గురు పరంపరాగతమగు రహస్యార్థము. "అనేకగురవస్సంతి శిష్య విత్తాపహారకాః." అన్న వా రెట్టివారో పాఠకమహాశయు లెఱుంగఁ జాలుదురు. ఇట్టిరహస్యార్థములను బోధించువారే మతద్వేషోత్పాదనదక్షు లనవలయును. అష్టాక్షరద్వాదశాక్షర మంత్రరాజేతరమంత్రరాజము లన్నియు నిరర్థకము లనియే యిట్టివారిమతము. అట్టి దేవానాంప్రియుల నమ్మతింపఁజేయు టెట్లు? ఇట్టి కువాదముల నవ్వలం ద్రోసిపుచ్చి యిందలిసార మేమని పరికింతము. ఆకాలము నాలవజాము. ఉషఃకాలమని యింతకుముందే మీరు పఠించియుందురు. సంతసమునఁ గొమ్మపైఁ గూరుచుండి చల్లనిపలుకులం గురియించుచుఁ బ్రియబంధువు

రాకను బలుమాఱు దెలుపుచు నిదిగో యదిగో శ్రీరాముఁడు వచ్చుచున్నాఁడని చెప్పుచున్న ట్లున్నదని త్రిజట తెల్పెను. శుభాశుభ ఫలజ్ఞానము కొఱకుగా నుపశ్రుతి యనుమంత్రము గలదు. మున్ను బృహస్పతి దానిమూలముననే బ్రహ్మహత్యా భయాతిరేకమున నెందో సరోవరమునఁ గమలనాళాంతర్గతుఁ డగునింద్రునిం గనుంగొనియెను. దానివిధి యిట్టులని తెలియం దగు. ఉద్దిష్టకార్యము ఫలించునా ఫలింపదా యనుసంకల్పము కలుగఁగా రాత్రి ద్వితీయయామ మారంభము కాఁగా నేదే నొకధాన్య మామంత్రమున నభిమంత్రించి యొక యింటిపై వానిం జల్లి యాచేరువ నొదిగి యాదేవతను ధ్యానించుచు నాయింటివా రేమి మాటలాడుచుందురో యని వినుచుండవలయును. వా రేది మాటలాడుదురో దానింబట్టి ఫల మిట్లుండునని తెలిసికొని మగిడి రావలయును. అనునర్థ మునే త్రిజట తెల్పుచున్నది. ఈవృత్తాంతమును రాక్షసాంగ నలకుఁ ద్రిజట తెలుపుచుండఁగా నొకపక్షి సుస్వరమునఁ గూసెను. ఉపశ్రుతిప్రకార మిది సత్ఫలదాయకమని త్రిజట తెల్పెనని మన మెఱుంగవలయును.

"ఉపశ్రుతి మహాదేవి బ్రాహ్మణాగారవాసిని!
సత్యం వద సుకల్యాణి శక్రరాజ్యాభిషేచని."

అని ధ్యానించుతఱిఁ బఠింపవలయునని కొందఱు చెప్పుదురు. ఇది యొక శకునము. దీనికొక కథ గలదని పెద్దలు చెప్పుదురు. ఒక బ్రాహ్మణుఁడు తనసోదరుఁడు దేశాంతరమున కరిగి చాల వత్సరములు రాకపోఁగాఁ బరితపించుచు నుషఃకాలమున లేచి ధౌతకరపాదుఁడై యుపశ్రుతిని ధ్యానించి నిలువఁబడియెనఁట. వేఱొకయింట శిష్యులకు వేదము చెప్పుచుండఁగా నందు

"అధోధర్మిరో హరతి, ప్రాణాన్ విచ్ఛింద్యాత్" అనువాక్యములు వినఁబడెనఁట. అంత నాపాలుఁడు భార్యను బిలిచి సోదరుఁడు మృతుఁ డయ్యెనని నిశ్చయించితి ననెనఁట. అమంగళవాక్కులు పలుకరాదు గదా. అని యాపె నుడివెనఁట. మఱుదినమే యట్టివార్తయే వినవచ్చెనఁట. ఇట్లు చెప్పెడుకథలు పెక్కు లుండును. అయిన నిది పురాణసంబంధము గలది గాన విశ్వసింపఁదగినదియే యని మన మెఱుంగుదము. ఈభాగము మన కనేకవిషయముల బోధించెడిని. స్వప్నాదులు సర్వథా విశ్వాసార్హములు కావనుమాటను ద్రోసిపుచ్చి, కర్మఫలాగమనమును దెల్పునిమిత్తములలో నవియు నొకవిధములని విశ్వసింపవలయును. దుర్నిమిత్తములు కలిగినపుడు భగవదారాధనము చేయవలయును. దృఢమూలకర్మఫలములే యవి యగునేని తప్పక యనుభవింపఁ దగినవైనను భగవదారాధనము వానియందుఁ గొంతభాగమును దగ్గించునన వచ్చును. "ప్రారబ్ధకర్మణాం భోగాదేవ క్షయః" అన్నసూక్తి కిది విరుద్ధము కాదా యన్నఁ గాదనియు భగవదారాధనఫలము వ్యర్థము కాదనియు,

> "అపి చేదసి పాపేభ్యస్సర్వేభ్యః పాపకృత్తమః,
> సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి. 36
> యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున,
> జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా. 37
> న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే,
> తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి."

3౮ గీత ౪ అధ్యా.

అను నీగీతావాక్యము లిచ్చట సంస్మర్తవ్యములు. దాన సంశయములు తొలంగును. ఇఁకఁ దరువాతిచరిత్రమును బఠింప నుద్యమింతము.

## —॥ సీతకు శుభనిమిత్తములు తోఁచుట. ॥—

* అంత నాజానకీదేవి రావణాప్రియవాక్యముల నాలించి యడవినడుమ సింగముబారింబడిన యాఁడుగజము భంగి భీతినొంది భీరువే యగుట రాక్షసాంగనలనడుమఁ జిక్కి పరుషవాక్కుల నాలకించుచు విజనవనమునఁ బరిత్యక్తయగు బాలికవలె విలపించెను. ఇట్టి యిక్కట్టులపాలయియుఁ బ్రాణముల వదలఁజాలక పుణ్యవిహీననై కుచ్ఛితముగ జీవించియున్న దానం గదా. అకాలమున మృతి యొవరికిని గలుగదను లోకప్రవాదము నిజమే యని తోఁచెడి. ఈశరీర మిప్పుడు గూడ నిలిచియున్నందున నత్యంత కఠినమైనదే. కుత్సితాకారుఁడగు నారావణుఁ డెట్టులైన నన్ను వధింపనున్నవాఁడు. అదియు దుర్మరణమే యగుంగదా.ఆత్మహత్యయు నట్టిదేయైన దానికన్న నిది శ్రేయమగుట నసువులఁ దొలఁగుట మంచిది. ఆత్మరక్షణము త్తమము.రక్కసు ననుసరించియేని వాని నిలుపుకొని నిర్దోషముగా నుండఁగూడదా యన్న విప్రుఁడు వేదమును శూద్రున కొసంగఁజాలనిరీతి శ్రీరాముని స్వత్త్వమగు నామనస్సును రావణున కేమాత్ర మీయంజాలను. రెండునెలలలోఁగా సర్వజగన్నాథుఁ డగునానాథుఁడు రాకున్న నంబష్ఠుఁడు గర్భమునుండి రా వలనుపడకయున్న శిశువును శకలములుగా ఖడ్గమున

---

* ఇది యిరువదెనిమిదవసర్గమునఁ గలకథ.

భేదించుచందమున నాయీశరీరము నాదుష్టుఁడు ఛేదించును. అపరాధమునకు రాజుచే మరణదండనము విధింపఁబడి మఱు దినమే చంపనున్నచోరునకుం బలె నాకు నీరెండునెలలు దాఁటఁగనే కీడు మూఁడును. హా రామచంద్రా! అక్కటా సౌమిత్రీ! అయ్యో సుమిత్రా! హా నాతల్లీ! రామభద్రునింగన్న కౌసల్యా! దురదృష్టవంతురాలనగు నేనిందే మృతినొంద నున్న దానను. ఆసోదరు లిరువురు మాయామృగరూపధారి రక్క సుచే హింసితులయి యుండురు. యముఁడే మృగరూపమున నాకాశఁ గల్పించియుండును. కనుకనే వారిని బొమ్మని పల్కి తిని. శ్రీరామా! సర్వప్రాణిహితుఁడవు కదా. నే నీతనిచేతిలోఁ జావఁబోవు టెఱుంగవా యేమి? నీకన్న నన్యదైవము నెఱుం గను. ఇచ్చటివారి పరుషవాక్కుల శ్రీరామునిమధురవాక్కుల నాలకింపఁ దలంచి యిన్నికష్టముల నోర్చుకొంటిని. శ్రీరామ చంద్రా! నీయంకమునఁ గూరుచుండు నదృష్ట మొకప్పుడైనఁ గలుగకయుండునా యనునాశచే భూమియే శయ్యగానుంటిని. ఈరావణుని భస్మముగాఁ జేయఁజాలియు నారక్షణము నీధర్మ మైయుండ నాకేల యాజోలి యని నిలుకడఁగా నాధర్మమున నిలిచియున్నదానను. సాధ్విని. ఈసాధ్వీత్వము రాముని సంగమము లభింపనందునఁ గృతఘ్నులకుఁ జేసినయుపకారము వలె వ్యర్థమే. అమోఘమగు సాధ్వీత్వ మిట్లు వ్యర్థమగుట నాయభాగ్యమే. నీదర్శనము లభించునన్న నాయాశ యిపుడు నశించుచున్నది. నాకావించినధర్మము వ్యర్థముగఁ జేసినట్లే యైనది. నాపాతివ్రత్యము నిరర్థకమైనది. నేనింతదనుక నుండక యపుడే ప్రాణములఁ బాసియున్న నింతకష్టము నాకుఁ గలుగక యుండును. నియమమురీతిగాఁ దండ్రియాజ్ఞను దీర్చి వ్రత

సమాప్తి కాఁగా వనమునుండి మరలి యయోధ్యకుఁ బోయి యించుకంతయు వనవాసభయము లేక నాకీరత్నములం గూడి క్రీడించుచుండఁ గలవని తలంచెదను. శ్రీరామచంద్రా! నేను మాత్రము నీయం దనురాగముఁగలదాననై తుదకు నశించు టకే నామనస్సు నిలిపి నిష్ఫలనియమములను బూని యుప వసించి యీనింద్యప్రాణముల విడుతును గాన నే నల్ప భాగ్యనని తలంతును. నే నిపుడు విషభక్షణము చేతఁగాని యాయుధము చేఁ గాని వేగమ యసువుల విడిచెదనన్న నిందవి రెండును దెచ్చియిచ్చువారు లేరు. అని విలపించుచు నా శింశుపావృక్షముఁ జేరెను. అంతఁ దనజడను మెడకుఁ జుట్టు కొని దీనిచేఁ బ్రాణములను వదలి యమపురి కరిగెదనని తలఁ చెను. ఆవృక్షశాఖను బట్టుకొని నిలువఁబడియెను. అట్లున్న యాజానకికి శుభమును దెలుపుటకు గుఱుతులును, ధైర్యముఁ గలిగించునవియు సుప్రసిద్ధములు నెందఱకో ఫలములను గల్గించినవియు నగునిమిత్తము లనేకములు చూపట్టెను.

మహాత్ములారా! ఈభాగమున నొకటిరెండువిషయ ములు విమర్శించి సారము గ్రహింపఁదగినవి కలవు. ఈదుఃఖ మంతయు నటనమని మున్నె వ్రాసితిం గదా. సీతాదేవివంటి పతివ్రతాశిరోమణికిఁ దనకు దుర్మరణము కల్గునా యనునది తెలియలేదన్న నించుక లజ్జాకరమే యదగును. కావున నిది యంతయు నటనమే. ఈవిచారకాలమున మహాకవి వ్రాసిన భాగముల నేయేవిశేషములు గలవని విమర్శింతము.

"కాంతారమధ్యే విజనే విసృష్టా బాలేవ కన్యా విలలాప సీతా." అని మూలము. "విసృష్టా బాలా కన్యేవ మహాదుర్భిక్షక్షోభ

వశాత్ బాలకన్యాయాః పరిత్యాగః." అని వ్యాఖ్య. పూర్వము ద్వాదశవర్ష క్షామములు వచ్చుచుండెననియు క్షత్రియసమయముల నన్నము పెట్టి పోషింపఁజాలక యడవుల నాహారమునకేదేని వస్తువు లుండునన్నయాశ వంపు మానవులుండుట సంభవించుచుండుటం జేసి యెల్లరు వినఁగా నెవరుగాని యీబాలను బ్రదికించుకొనఁగల్గినఁ బరిగ్రహింపుఁడు. మేము వదలుచున్నారము. అని గట్టిగాఁ బలికి విలపించుచుఁ దలిదండ్రులు పోవు వారనియుఁ గావలసినవారు గ్రహించి పోషించుచుండు రనియుఁ బెద్దలు పల్కుదురు. ఏజాతివారైన నాబాలికను గొని పోవచ్చును. వయస్సు రాఁగాఁ బెండ్లియాడవచ్చును. అనంత తికే మనవారు ప్రతిలోమజాతులను మొదలగుపేరులం బెట్టిరి. అట్టికష్టకాలము లిపుడు రానికతమున నాచేదు లేల యని యిప్పటివారిలోఁ గొంద ఱాక్షేపింతురు. క్షత్రజాతు లేల యుండెనని యోజించిన నిట్టిశంకలు కలుగకయుండును గదా.

"నైవాస్తి దోషం మమ నూనమత్ర
వధ్యాహమస్యాప్రియదర్శనస్య,
భావం న చాస్యాహమనుప్రదాతు
మలం ద్విజో మంత్రమివాద్విజాయ." ౫

అని మూలము. "అహం భావం అస్య అనుప్రదాతుం నాలం. ద్విజః అద్విజాయ మంత్రమివ." అని. అప్రియదర్శనుఁడగు నీ రావణునకు నాహృదయము నర్పింపఁజాలను. అనఁగా రెండు నెలలకు మృతినొందనున్న యీ రాక్షసరాజునకు నాభావ మనఁగా నామూలమున నీకీజన్మమున శుభము కలుగదను నభిప్రాయమును దెలుపఁజాలను. ఎట్లనఁగా ద్విజుఁడు మంత్రమును

ద్విజేతరుఁ డనఁగా శూద్రున కీయఁజాలనట్లని యుదాహర
ణము. కర్మగతి ననుసరించి ప్రకృతిపురుషులలో నెవరిమూల
మున శుభము కలుగవలయునో వారిమూలముననే యది
లభించును. రెండవవారు ప్రసన్నులైనను వరము లొసంగరు.
ఒకరి విషయము నొకరెఱుంగక కాదు. ఆరెండు నొక్కటియే
యైనను భక్తునివాంఛ ననుసరించి యేరూపమున నేఫలము
నెట్లీవలయునో యట్లే యనుగ్రహింతురు. కాన శ్రీరాముని
మూలమున నొకఫలము కలుగవలసియుండ జానకి యిది
యిట్లని తెలుపఁబూనలేదని భావమును గ్రహింపవలయును.
"ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా." అన్న
ప్రమాణము నిది దృఢపఱచుచున్నది. వేదమును శూద్రున
కీయఁబూననియట్లని యుదాహరణము చెప్పఁబడినది. వేద
మునకేల శూద్రు లనర్హులు? అనువిషయము నించుక విచా
రించి కరుణాసముద్రు లగుమునులభావ మెట్టిదని కనుఁగొం
దము. ద్విజులనఁగా బ్రహ్మక్షత్రియవైశ్యులు. వీరికి నుపనయన
సంస్కారము కలదు. శూద్రునకు వివాహసంస్కారమే
కలదు గాని యుపనయనసంస్కారము లేదు. ఏల యను
నదియే ప్రశ్నము. జాతివృత్తులు నిర్ణయింపఁబడునపుడు,

"శమో దమస్తపశ్శౌచం క్షాంతిరార్జవమేవ చ,
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజం. ౪౨
శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనం,
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజం. ౪౩
కృషి గౌరక్ష్యవాణిజ్యం వైశ్యకర్మ స్వభావజం,
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజం. ౪౪
స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః,

స్వకర్మనిరతస్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు.          ౪౫
యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతం,
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః.          ౪౬
శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషం."          ౪౭

భగవద్గీత ౧౮ అధ్యా.

అనురీతి నిర్ణయింపఁబడియె. ఇది పక్షపాతమునఁ గాఁజా యన రాదు. శక్త్యాశక్త్యముల ననుసరించియే యనవలయును. పుణ్యము వీరికెల్లరకు స్వకర్మాచరణమున సమానమా యన్న సమానమే యనవలయునని యీగీతాశాస్త్రమే తెల్పుచున్నది. సర్వవ్యాపకుఁడగు నీశ్వరుని. స్వకర్మణా తమభ్యర్చ్య = స్వజాత్యర్హకర్మమున నాయీశ్వరుని బూజించి, "కేవలం జ్ఞాననిష్ఠా యోగ్యతాలక్షణాం సిద్ధిం విందతి మానవః మనుష్యః" అని భాష్యము. ఏజాతిగలవాఁ డాజాతి కర్హమగు కర్మమూల మున నారాధించిన జ్ఞానసిద్ధి కలుగును. అని గీతాహృదయము. "విగుణః స్వధర్మః శ్రేయాన్.కస్మాత్ ? స్వనుష్ఠితాత్పరధర్మాత్." విగుణముగాఁ దోఁచినను స్వధర్మమే మేలు. చక్కఁగా నాచరించినను బరధర్మము మేలు కాదు. అనఁగా నితరజాతి ధర్మములను జక్కఁగా నాచరించుటకంటె విగుణమని తోఁచినను స్వధర్మము నవలంబించుట యనఁగాఁ దదుక్తప్రకార మాచరించుటయే యుత్తమము. అనికదా దీనిభావము. ఏజాతిమూలమున నేయేకార్యములు కావలయునో ఆకార్యము లితరజాతి మూలమున సిద్ధింపవనియే యిట్లు నిర్ణయింపఁబడియెను. ఈ నిర్ణయమూలమున నెవరికేఁగాని నష్టకష్టములు గలుగకయుండఁ దనజాతిధర్మముల ననుసరించి భగవంతు నారాధించిన నా

ఫలము సిద్ధించుననియు జ్ఞానమెల్లరకు సమానముగా లభించి తన్మూలమునఁ గావలసినముక్తి లభించుననియు గీత బోధించు చున్నది. భగవత్సేవావిషయమునఁ గాని ఫలసిద్ధివిషయమునఁ గాని భేదము లేనియపుడు తనజాతిధర్మములు నీచములని యితరజాతిధర్మము లుత్కృష్టములని యేల భావింపవలయునో తోఁపకయున్నది. పౌండరీకముచే విప్రుఁడు, అశ్వమేధముచే రాజు, కృషిగోరక్షణవాణిజ్యములచే వైశ్యుఁడు, ఖలయజ్ఞముచే శూద్రుఁడు, భక్తిచే భగవంతు నారాధించిన సమాన ఫలము గలుగుచుండ నిందేది యుత్తమమని, ఏది మధ్యమమని, ఏది యధమమని తలంపవచ్చును? ఇందుఁ జూపిన పక్షపాత మేది? వ్యవసాయవృత్తి నున్నశూద్రుఁడు కళ్లమునందు ధాన్యరాశినుండి భగవదర్పణబుద్ధిచే శక్తికిందగినట్లు యాచకులకు దానమిచ్చిన సర్వపాపములు తొలంగునని శాస్త్రము విధించుచుండ, మేము పౌండరీక మేల చేయరాదని వారడుగనేల? దానిచే స్వకార్యము సాగదు. దాన లోకమునకుఁ గీడు మూఁడును. యజ్ఞములుచేసి బ్రాహ్మణుఁడు సకాల వృష్టి ననుగ్రహింపుఁడీ యని దేవతలఁ బ్రార్థించును. ఉండిన భాగ్యమును గ్రొత్తరాజు లపహరింపకయుండ దుష్టులు చెలరేఁగకుండ రాజు కాపాడును. కృషి కర్మములకు వృషభములం బెంచి కర్షకులకు ధనమునొసంగి పండినధాన్యమునమ్మి కర్షకులకు మేలుచేయుచు వైశ్యుఁ డుపకరించును. శూద్రుఁడు సస్యరక్షణాదికార్యములఁ జేయుచు నెల్లరకు నాహారవస్తువులం బండించును. ఇం దెవ్వరుగాని తమకుగా నుపకారము చేసికొనువారు కానరారు. ఎల్లర కుపకరించువారే యగుదురు. ఇట్లుండ నొకజాతిధర్మము లుత్కృష్టములని యెట్లనవచ్చును?

ఇందు మహర్షులకుఁ గలపక్షపాత మెద్దియో కానరాకున్నది. లేనిసందియములను గల్గించుకొనుట న్యాయము కాదు. కావున నితరజాతిధర్మ ముత్తమము లనునూహ దురూహయే యగును. ఈభాగము మనకు స్వజాత్యుచితకర్మములమూలముననే భగవంతు నారాధింపవలయునని బోధించుచున్నది.

> "నూనం స కాలో మృగరూపధారీ మామల్పభాగ్యాం లులు భేశదాసీం,
> యత్రార్యపుత్త్రం విససర్జ మూఢా రామానుజం లక్ష్మణపూర్వజం చ."

అని మూలము. సీతాదేవి యీభాగమునఁ గర్మసిద్ధాంతమును స్పష్టము చేయుచున్నది. కాలుఁ డనఁగా లయకర్త. అతఁడే మృగరూపమును దాల్చి నాకాశఁ గల్పించెను? అవివేకమున నేనారామలక్ష్మణులఁ బొమ్మంటిని. అట్టియూహ నాకుఁ గల్గించెను. కాలుఁడేల మృగరూపధారి యయ్యెను? అనఁగా నాకర్మ మాతనిం బ్రోత్సహించి మృగరూపము ధరింపఁజేసి తన్మూలమున నన్ను మోసపుచ్చెను. ఇది నిశ్చయము. అనఁగా సర్వము కర్మాధీనమనియు నాదుష్కర్మము నన్ను వంచించెననియుఁ గదా దీనిభావము. "రామానుజం లక్ష్మణపూర్వజం చ" అనుతావున నేవేవో చమత్కృతిజనకములుగాఁ గొంద ఱర్థము చెప్పుదురు. కాని యేయుపకారమును జేయఁజాల నిదియే. కాన నట్టివానికి నీపుస్తకమునఁ జోటు కల్పింపనైతిని. భావికర్మఫలముల ననుభవింప నేయేమార్గము లుండవలయునో ఆమార్గముల నన్నింటిని గర్మమే కల్పించుననియు దాని నూహింపఁ దరముగాదనియు మన మెఱుంగవలయు. "గహనా కర్మణో గతిః" అనువాక్యమును మాత్ర మేనాఁడును మఱువరాదు

''అనన్యదైవత్వమియం క్షమా చ భూమా చ శయ్యా నియమశ్చ ధర్మే,
పతివ్రతాత్వం విఫలం మమేదం కృతం కృతఘ్నేష్వివ మానుషాణాం.''

అని మూలము. కష్టఫలానుభవముతఱి నెట్టియూహాలు ప్రాయికముగా నెల్లరకును గలుగునో వానినే సీతాదేవి తేటపఱచుచున్నది. ఎట్టినియమములఁ బూనినను దుష్కాలమున ఫలింపవనునదియే యిటఁ గలనీతి. ఉపాసకుఁడు ఇష్టదేవతను సర్వదేవతాస్వరూపముగా ధ్యానించుట, శీతవాతాదుల సహించుట, భూమిపై శయనించుట, పట్టినధర్మమును స్థిరత్వమును గనుట యనునివి నియమములు. వీని నవలంబించినను ఫలము గలుగకపోవును. ఏలయనఁగా నాకాలమున నద్దానిఫలముల నొందుసత్కర్మము నతఁ డాచరింపలేదని తాత్పర్యము. చేసిన మేలు మఱచువారు కృతఘ్ను లనంబడుదురు. వారికి నొనరించునుపకారము ఫలింపనట్లు నియమములు ఫలింపవు. నియమములఁ బాటించునంతకర్మము నాచరించి దానికి మించినఫలముల నొందఁబూనిన లభించుటెట్లు? కృతఘ్నుల కుపకారము చేయరాదా? అని యడుగువా రున్నారు. అవి సత్ఫలముల నీఁజాలవని భావము. దీనిసార మేమి? కొందఱు యథాశాస్త్రముగా నొకదేవత నారాధింతురు. వ్రతము సాంగముగా ముగియును. కాని దేవతానుగ్రహము కలుగదు. ఏల? అనఁగా నాసమయమున నాదేవతానుగ్రహఫలము నొందుసత్కర్మములఁ బూర్వజన్మమున నాచరింపలేదు. కాన నాఫలము కలుగలేదు. అంతమాత్రమున నతఁ డకార్యమును వదలరాదు. మరల నట్లే చేయుచుండవలయును. ఒకప్పు డాజన్మమున నాఫలానుభవము లేకుండును. జన్మాంతరమున నది కలుగును. ''మా భూదేవం మమ పశుపతే జన్మజన్మాంతరేషు'' అనఁగా

నిదియే కదా భావము. ఏజన్మమునందైనఁ గలుగవచ్చును. దుష్కర్మము లెట్లో సత్కర్మములు నట్లే జన్మాంతరములందు ఫలదాయకము లగును. అట్టిసమయములందు వాన దుఃఖము కలుగరాదనియే శ్రీకృష్ణపరమాత్మ,

"కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన,
మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి.
యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ,
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే.
దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ,
బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః."

అని బోధించెను. ఫలతృష్ణ దుఃఖహేతు వగుననియు దాని మాని సత్కర్ములనాచరించుట నుత్తమమనియు భగవంతు నాశయము. ఈయర్థమునే మహాకవి వాల్మీకి సీతావాక్యరూపమునఁ బోధించెను. శ్రీరామావతారము కర్మసిద్ధాంతము లోకులకుఁ దనయాచరణరూపమునఁ దెలుపుటకే యని మన మెఱింగిననే రామాయణపారాయణఫలము సంపూర్ణముగాఁ గాంతుము. లేక యున్న యత్కించిన్న్యాయము ననుసరించి కందుము.

"పితుర్నిదేశం నియమేన కృత్వా వనాన్నివృత్తశ్చరితవ్రతశ్చ,
స్త్రీభిస్తు మన్యే విపులేక్షణాభిస్త్వం రంస్యసే వీతభయః కృతార్థః." ౧౮

అని మూలము. ఈశ్లోకము నాధారముగాఁ జేసికొని కొందఱు పండితమ్మన్యులు రాముఁడు పెక్కండ్రుభార్యలు గలవాఁడనియుఁ గనుకనే జానకి యీమాటి పలికెననియు నింక నీవే వో పలుకులు తోఁచినట్లెల్లఁ బలుకుదురు. వారియూహాల నా

వలం బంపివైచి యామెయాశయ మేమని విమర్శింతము. శ్రీరాముఁడు భరతునితో నావచ్చుదనుక రాజ్యమును బాలింపుమా యని యాజ్ఞాపించెను. శ్రీరామునకే దశరథుఁడు పట్టాభిషేకప్రయత్నము చేసెను. ఈవార్తలు సీతకుం దెలియనివి కావు. పట్టాభిషేకము భార్యావిహీనునకుఁ జేయునాచారము లేదు. కావున లోకసామాన్య మగునాచారము ననుసరించి భార్య తనకు జీవిత మీయిలపై లేదని తోఁచినపు డేమనుకొనును? ఏయేస్త్రీలకు నీయైశ్వర్య మనుభవించు నదృష్టము కలదో వా రనుభవింతురు. నాస్థితి యిట్లున్నది కదా యని యనును. ఇది యంద తెలియఁగినదియే కాని నాకల్పించినది కాదు. ఆమాటలయందుఁ గలబహువచనము వాడుకవలన వచ్చినదే కాని పెక్కండ్రు భార్య లుండవలయునని కాదు. "మద్వినాశేన పునః బహ్వీరారాధ్వా రంస్యస ఇతి భావః" అని గోవిందరాజులు వ్రాసిరి. ఆమె దుఃఖార్ణవమున మునింగినట్లు నటించుచు లోకస్వభావమును విశేషించి స్త్రీజనస్వభావమును దెలిపెనని వారిభావమైనట్లు కనుపట్టు. అంతియకాని పండితమ్మన్యులు సిద్ధాంతము చేసినట్లు రామునకుఁ బెక్కండ్రు భార్యలు కలరని కాదు. ఎన్నియోతావుల శ్రీరాముని యేకపత్నీత్వము దృఢమగుచుండఁగా నెందో యొక్కతావుననున్న యిట్టిలేశమును గొండంతలుగాఁ జేసి వ్యాఖ్య చేయుట స్వాల్పత్వమునే వెల్లడించుకొన్న ట్లగుంగాని సిద్ధాంత మది కాఁబోదు.

"తస్యాస్తు రామం ప్రవిచింతయంత్యా రామానుజంస్వం చ కులం శుభాంగ్యాః-

శోకానిమిత్తాని తథా బహూని ధైర్యార్జితాని ప్రవరాణి లోకే,
ప్రాదుర్నిమిత్తాని తదా బభూవుః పురాపి సిద్ధాన్యుపలక్షితాని." ౨౦

అని మూలము. ఇట్లు శ్రీరాముని ధ్యానించుచున్న యా సీతకు శోకాపనోదక్షమములు ధైర్యజనకములు నగుశుభనిమిత్తము లనేకములు తోఁచెను. అవి మున్నెందఱకో తోఁచి ఫలము లొసంగినయవియే. అనఁగా నిష్ఫలములు గాక శుభ ఫలములను దెలుపునవియే యని భావము. పరమేశ్వరి భావము ఫలవంతము గాకపోదు గదా. వేణ్యుద్గ్రథనము సీత యత్యంతశోకావేశమునఁ జావ సిద్ధపడుచున్నదని హనుమంతునకుఁ దోఁచునట్లు చేయుటకే యనియుఁ గర్మసిద్ధాంత తత్త్వ మిట్లే యుండుననియు మన మెఱుంగఁదగు.

## సీతకు శుభనిమిత్తములు తోఁచుట.

* ఇట్లు నిర్భరశోకార్ణవనిమగ్నయై మరణమునకు సిద్ధపడి యుండఁగా నాశుభాంగికి శుభశకునములు పెక్కులు తోఁచినవి. ఆదేవి సవ్యనేత్రము మత్స్యములతాఁకునఁ గదలు పద్మమువలెఁ జలించెను. శ్రీరామునకానందమును గల్గింపఁజాలిన యాదేవి సవ్యబాహువు వడంకెను. సవ్యమగునూరువుకూడఁ జక్కఁ జలించుచు నిదిగో శ్రీరాముఁడు నీసన్నిధి నున్నవాఁడని తెలిపెను. ఆకల్యాణి శరీరమున ధూళి బ్రుంగి కాంతి తగ్గి యుండువస్త్రము జాఱినది. ఇట్టి శుభనిమిత్తములు మఱియుం గొన్ని శుభశకునములును జూచినంతనే రామునివార్త వచ్చునను సంతోషము జానకికిఁ గల్గెను. సకల సులక్షణములుగల

---

* ఇది యిరువదితొమ్మిదవసర్గమునఁ గలదు.

మాదేవిముఖము రాహువిముక్తమగు చంద్రబింబమువలెఁ బ్రకాశించెను. పూజ్యురాలగు నాసీతాదేవి శుభనిమిత్తముల సంతోష ముదయింపఁ బ్రకాశించు నెమ్మొగము గలిగి శుక్లపక్షమున రాత్రి శీతాంశునిచేఁ బ్రకాశించునట్లు వెలుంగుచుండెను.

ఆపృయలారా! ఇందలివిశేషముల నరయుదము.

తథాగతాం తాం వ్యథితామనిందితాం
వ్యపేతహర్షాం పరిదీనమానసాం,
శుభాం నిమిత్తాని శుభాని భేజిరే
నరం శ్రియాజుష్టమివోపజీవినః." ౧

అని మూలము. భగవతిసంకల్పము ఫలించునట్లున్నది. హనుమంతుఁడు సంభాషించుసమయము సమాసన్న మగుచున్నది. దానికనుగుణము లగుచిహ్నములు లుండక తప్పదు గదా. నిమిత్తములన్నియు భావిఫలములను సూచించును. తదనురూపములుగనే యవి యుండును గదా. హనుమత్సంభాషణపూర్వకముగా రావణవధాదిరూపమగు జగన్మంగళము సాగవలసియున్నది. కనుకనే యాకాలమున శుభనిమిత్తము లా జగదంబకుఁ దోఁచినవి. ధనవంతుని ధనార్థు లాశ్రయించునట్లు సీతాదేవిని శుభనిమిత్తము లాశ్రయించినవి. అనుటంజేసి అనుజీవులందఱు ధనమున్నంతదనుక నుందురనియు నవ్వల వానిని వదలి వేఱొకధనవంతు నాశ్రయింతురనియు "ధనమూలమిదం జగ" త్తనుసామెత యీ రామాయణమునుండియే యేర్పడినదనియు మన మెఱుంగవలయును. ప్రాయికముగా మనుష్యులు గుణలుబ్ధులు కారనియు ధనలుబ్ధులేయనియు నీభాగము మనకు నీతిని దెల్పుచున్నది. ఎట్టికష్టము లున్నను గర్మఫలములు శుభరూపములు రాఁదగునేని ముందే

నిమిత్తములమూలమున శుభకర్మము తెలుపునని మనము నిశ్చ యించుకొనవచ్చును. ఎడమకన్ను, భుజము, ఊరువు కంపించుట వస్త్రము సుంత జారుట స్త్రీలకు శుభనిమిత్తములని సారము. ఈనిమిత్తముల నూహించి యాదేవి సంతోషించెనని కథాసారము.

"వక్త్రం బభాసే సితశుక్లదంష్ట్రం
రాహోర్ముఖాచ్చంద్ర ఇవ ప్రముక్తః." ౫౭

అని మూలము. భూచ్ఛాయనుండి విడివడిన చంద్రబింబము వలె సంతకుముందున్న రాక్షసాంగనల మూఢవాక్కులనుండి దూరముగ సీత యుండఁజాలినదనియు శుభనిమిత్తముల మూలమున సంతుష్టురా లయ్యెననియు గ్రహింపఁదగిన విషయము. భూచ్ఛాయ మనదృక్సూత్రమున కడ్డపడును. చంద్రునకు మన దృక్సూత్రమునకు నడ్డముగాఁ దోఁచునని భావము. చంద్రుని రాహువు మ్రింగెనని పామరులు తలంతురు. ఆనీడ దాఁటగనే దేదీప్యమానముగా నాశీతాంశుబింబము ప్రకాశించును. అట్లే కష్టములు ఆమె నలయించినట్లు తోఁచెననియు నిజమాలోచింప నామహాదేవి కేకష్టములు గలుగలేదనియుఁ గలిగిన ట్లామె నటించెననియు నీయుపమానమే మనకుఁ దెలుపుచున్నది. మహాకవి వాల్మీకి యిట్టి యుపమానాదిరూపమున స్వాభిప్రాయమును దెలుపుచుండునని మన మెఱింగిన నాసీతాదేవిమహత్త్వము మన మెఱింగిన ట్లగును. ఆమె నారాధించుభక్తి యుదయించును.

"సా వీతశోకా వ్యపనీతతంద్రీ శాంతజ్వరా హర్షవివృద్ధసత్త్వా,
అశోభతార్యా వదనేన శుక్లే శీతాంశునా రాత్రిరివోదితేన." ౫

అని మూలము. ఈమూలము వాల్మీకియే చెప్పెనని మన మంగీకరించిన సీతాశోక మెట్టిదని విమర్శించి తెలిసికొన్నవార మగుదుము. అన్నికష్టములనడుమఁ జిక్కి మరణోద్యమ మున నున్నసీత యీనిమిత్తములచేత మహానందసాగరమున నోలలాడెనన్న నెంత విశ్వాసపాత్రమో నే వచింపఁజాల కున్నాను. మొలబంటిదుఃఖములో మోఁకాలిబంటి సంతోష మన్నసామెత క్రొత్తది కాదు. సహజసంతోషము ననుభవించు నామహాదేవి మహామాయ దుఃఖము నభినయించెననియు రాఁగలశుభముల నెఱింగెననియు మన మాలోచింపకయున్న నేటిరామాయణపారాయణమో, దానిఫలానుభవ మెంత మాత్రమో యూహింపఁ దరముగాదు. మనమామె పరదేవి యనియు శ్రీరాముఁడు పరమేశ్వరుఁడనియు నంగీకరించినపు డీదుఃఖములు వారిని బాధింపలేదనియు నదియెల్ల నటనమే యనియు నమ్మి యుండవలయును. తరువాతికథను బరికింతము.

## హనుమంతుఁడు రామగుణకీర్తనము చేయ నిశ్చయించుకొనుట.

* అంత శింశుపావృక్షము నధిరోహించియున్న హను మంతుఁడు సీతావృత్తాంతమును త్రిజట చెప్పినవృత్తాంత మును రాక్షసస్త్రీలు బెదరించినమాటలుఁ జక్కఁగా విన్నవాఁ డయ్యె. హనుమయు నందనవనముననుండు దేవతయుం బోలె నశోకవనముననుండు సీతాదేవిని జూచుచు నెన్నియోభం గులఁ దనలో నాలోచింపసాగెను. వానరు లెందఱో సకల

* ఇది ముప్పదియవసర్గ యనఁ గలదు.

దిక్కుల నెవ్వతుక వెదకుచున్నారో యాదేవి నిందే కన్న
వాఁడనైతిని. నేను జాగరూకతగలిగి గూఢచారినై లంక
యంతయు నితరు లెఱుఁగక యుండఁ దిరిగి విషయముం
జక్కఁగాఁ దెలిసికొంటిని. రాక్షసులవిషయముం గంటిని. ఈ
నగరవిషయమును దెలిసికొంటిని. రావణునిమహాత్మ్యము నెఱిం
గితిని. శ్రీరాముదేవి సకలకష్టముల ననుభవించుచున్నది. ఇట్టి
యీసాధ్వికి శ్రీరామవృత్తాంతముం దెలిపి యూఱడిల్లఁజేయుట
యుక్తము. ఈదేవి యింతకుంబూర్వము దుఃఖముల ననుభ
వించినది కాదు. కాని యిప్పుడు మితిమీఱినదుఃఖముల ననుభ
వించుచున్నది. పూర్ణచంద్రనిభాస్యయగు నీమెను శ్రీరామ
వార్తలం దెలిపి యూఱడిల్లం జేసెదను. ఊఱడింపక సీత
యిందున్నదని తెలుప శ్రీరామునొద్దకుం బోయిన నది
దోషమే యగును. ఇపుడు నేఁబోయిన నీయమ్మ కాపాడు
వారు లేరన్నవెతంజేసి యసువులను వదలును. ఈమెంజూడ
నువ్విళ్లూరుచుండు రామునకు శుభవార్తం దెలిపి సంతో
షము గల్గించుటయు న్యాయ్యము. కాన నీమెతో నేవిధమున
నాలోచించినను మాటలాడుటయే యుక్తమని తోఁచు
చున్నది. ఈరాక్షసస్త్రీలు చక్కఁగాఁ గాపాడుచున్నారు. వీరి
యెదుట మాటలాడరాదుగదా. విషయ మిట్లున్నది. ఇఁక నెట్లు
మాటలాడి యీసీతకు సంతసముం గల్గింతును? మాటాడక
పోరాదు. మాటలాడుట శక్యము గాదు. ఈరాత్రి శేషము
ముగియులోపల నూఱడింపకయున్న నీమె జీవింపదనుట
నిక్కము. ఊరకపోయిన నాసీత నాతో నేమి చెప్పుమన్నదని
శ్రీరాముఁ డడిగిన నేమని బదులిత్తును? త్వరపడిపోయి నేనా
మెతో మాటలాడలేదని చెప్పుదునేని క్రుద్ధుండై నన్నుం

క్రోధారుణితనేత్రముల దహించును. నేనూరకపోయి సుగ్రీవాదులం దోడితెచ్చినను సీత యంతదనుక నింతదుఃఖముతో నసువుల నిలుపుకొనియుండఁ జాలదు. కాన వారిం దోడితెచ్చుటయు వ్యర్థమే యగును. ఇందేయుండి యవకాశము దొరకినంతనే మాటలాడి యూఱడింతును. సూక్ష్మరూపమున నున్నాను. వానరుఁడను. కనుక నన్ను వీరెవరుగాని గనిపెట్టఁజాలరు. ఈయూహ కనుకూలముగా మానవులు మాటాడునట్లు సంస్కృతభాష నవలంబించి పల్కెదను. ఈయంగనలకాభాష తెలియదు నేను బ్రాహ్మణునివలె సంస్కృతభాషను మాటలాడుదునేని ఈజానకి వానరమెక్కడ. విశేషించి సంస్కృతభాషతో మాటాడుటెక్కడ? అని యనుమానించి రావణునిగా నన్ను భ్రమించి భయముపడును. కానఁ దప్పక సాధారణమయిన మానవభాష నవలంబించియే యర్థవంతముగా మాటాడవలయుం గాని సంస్కృతభాషను భాషింపరాదు. వేఱుమార్గమున నీమె నాశ్వాసింప శక్యము కాదు. నేను వానరుఁడఁ గాన మానవులవలె మాటలాడుటంజేసి మున్ను రక్కసులవేషములం గాంచి భయపడినది గాన మఱింత భయమునొందును. అంత నీసాధ్వి రావణుఁడు కామరూపియగు టెఱింగినదియే గాన నావిధము చూడఁగనే భీతి గట్టిగా నఱచును. వెంటనే యీరాక్షసాంగనలు గుంపులుగాఁ గూడి యాయుధములంగొని మృత్యుదేవతలం బోలి నాపయికి వత్తురు. వికృతాస్యలగు నీస్త్రీలు నన్నుంజుట్టుకొని తమచేత నైనయంతదనుక నన్ను వధించుటకేని పట్టుకొనుటకేని ప్రయత్నింతురు. వృక్షశాఖాదులం గొని నేను బరువెత్తుచుండఁగాఁ గాంచి భయంపడుదురు. నామహారూపముం గని

బెదరుదురు. అంత వీరు పోయి రాక్షసేంద్రుఁడు గృహమునఁ గావలిగానుంచిన రక్కసులం బిలువ భయంకరాయుధములం గొని నాపైకి నడరుదురు. వారు నన్నడ్డగింపఁగా వారలతోఁ బోరాడి యలసి సాగరము నవ్వలిగట్టును జేరఁజాలను. వేగవంతు లగురక్కసులు సాగరమును దాఁటుతఱి బట్టుకొనఁ బ్రయత్నింతురు. అట్టిసమయము తటస్థింపఁగా రామవృత్తాంతము నీమె యెఱుంగఁజాలక పోవును. నేను రక్కసులకుఁ జిక్కినను జిక్కుదు. హింసాపరాయణు లగుట రక్కసు లీసాధ్విని జంపనుగూడ యత్నింతురు. అట్లు కాఁగలదు గాన శ్రీరామసుగ్రీవులు చేయఁబూనిన యీకార్యము విఫలమగు. ఇతరుల కెఱుఁగఁ దరముగానిచోట సీత యున్నది. రక్కసులచే నేను జచ్చినను వారికిం జిక్కినను వానరులలో నింకెవఁడు గాని సీతాన్వేషణమున ధన్యుఁడు కాఁదగినవాఁ డున్నట్లు నాకుం దోఁపదు. నేను నాపదలపాలు కాఁగా సాగరముదాఁటువాఁడు మఱెవ్వఁడు లేఁడు. ఒకప్పుడు వీరినెల్లఁ జంపుదుం గాక. సమరముచేసి యలసిన నేను సాగరము నవలిగట్టున కెగిరిపోవఁ జాలను. జయాపజయములు యుద్ధమున ముందు నిశ్చయింప వలనుపడదు. నా కపజయము కల్గినను గలుగవచ్చును. సందేహాసంయుతమగు కార్యముచేయుట నాకు సమ్మతము కాదు. ప్రాజ్ఞుఁడు ముందువెనుక లాలోచింపక సందియముతోఁ గూడినకార్యమును జేయఁ బూనునా ? సీతతో మాటాడకపోయిన రక్షించువారు లేక యామె ప్రాణత్యాగము చేయును; మాటాడినను ఇప్పు డూహించినట్లు నాకు మహాదోషము సంభవించును.

ఫలింపనున్న కార్యము లవివేకులగు దూతలపాలం బడిన, నవి దేశకాలోచితముగఁ జేయఁబడనందున నాదేశ కాలములే వారికి విరోధులగును గాన సూర్యుఁ డుదయింప నంధకారము నశించునట్లు నశించును. ప్రభువు మంత్రులం గూడి కార్యాకార్యముల రీతులెఱఁగి మంచియూహ చేఁ జేయఁదగిన దిట్లని నిశ్చయించినను వాని నవివేకి యగుదూత కప్పగించినయెడల నవి యించుకయైన ఫలింపకపోవును. అట్టి దూతలేమియుఁ దమకుఁ దెలియకయున్నను బండితమానులై యహంకరించి యాకార్యములం బాడుచేయుదురు. స్వామి కార్య మేరీతిఁ జెడకయుండునో నే నవివేకినని యెట్లు పేరు రాకుండునో సాగరలంఘన మెట్లు వ్యర్థముగాకుండునో యట్లు చేయవలయును. ఎట్లు చేయవలయును ? ఎట్లు నేను బలికిన నీదేవి యాలకించునో భయంపడకయుండునో యని చాల దూర మాలోచించి బుద్ధిమంతుఁడు గానఁ దత్కాలకర్తవ్య మిట్టిదని నిశ్చయించుకొని నేనీమెకుఁ బ్రాణబంధువై యెవ్వ రికి బాధకలిగింపక కార్యములుచేయు నాశ్రీరామచంద్రునిఁ దొలుతఁ గీర్తించెద. తదేకాయత్తచిత్తయగుట నీమె నామాట లకు భయంపడకయుండును. శ్రీరాముఁడు సీతకుం దెలుపు మన్నసూక్తుల మెల్లఁగా వినిపించుచు వరుసగా నారాముని మాటలనెల్ల వినిపింతును. నామాటలపై విశ్వాసముంచి విను నట్లు పల్కెదనని నిశ్చయించెను. అంత నాహనుమంతుఁడు కొమ్మలనడుమనుండి శ్రీరామునిభార్యను గాంచుచు సార్థక మధురవచనముల నిట్లు పలుక నారంభించెను.

మహామతులారా! ఈభాగమునఁ గల విశేషముల నర యుదము.

> "హనుమానపి విక్రాంతస్సర్వం శుశ్రావ తత్త్వతః,
> సీతాయాస్త్రిజటాయాశ్చ రాక్షసీనాంచ తర్జనం. ౧
> అవేక్షమాణస్తాం దేవీం దేవతామివ నందనే,
> తతో బహువిధాం చింతాం చింతయామాస వానరః." ౨

అని మూలము. అందు జరిగినవిషయములన్నింటిని హను
మంతుఁ డాలకించెను. త్రిజటకడ స్వప్నవృత్తాంత మాల
కించుచుఁ గొందఱు రాక్షసాంగన లున్నారు. కొందఱు సీతా
మరణోద్యమమును దెలుప రావణాసురునికడకుం బోయిరి.
సీతాదేవి వారికి నించుకదూరమున శింశుపావృక్షశాఖను
బట్టుకొని యున్నది. శుభనిమిత్తము లనేకములు తోఁచుటం
జేసి యూఱడిల్లిన మనస్సుగలదిగా నాదేవి యున్నది. ఈ
నిమిత్తము లాదేవికిం దోఁచుట హనుమంతునకుఁ దెలియ
వలనుపడుటెట్లు? త్రిజట సీతయందుఁ దోఁచు శుభనిమిత్త
ములఁ గొన్నింటిని రాక్షసాంగనలకుం దెలుపుచుండఁగా
నాంజనేయుఁ డాలకించియున్నవాఁడు. నాల్గవయామ మారం
భమైనది. ఇంక నాలసింపక మాటలాడవలయునని హనుమ
తలంచుటెంతయు సముచితమే కాని యసంగతము కాదు
కదా. కావున ననేకభంగుల నాలోచింపఁ బూనెను. ఇది విష
యసారము. ఇందలివిశేష మేమనఁగా మహాముని వాల్మీకి
"దేవతా మివ నందనే" అని ప్రయోగించెను. వారిభావ
మేమి? సీత దుఃఖపడుచు నిజముగాఁ జావ నుద్యుక్తురా
లయ్యెనా? ఆప్రయత్నము నటనమా యని యాలోచింపఁ
దగియున్నది. నందనవనమున నున్న దేవతవలె సీత యుండఁగా
నతఁడు చూచెనని కదా యర్థము. నందనవనమున నొకతుక

నెవఁడు నిర్బంధింపఁడు కదా. సంతోషమున నందనోద్యాన మున దేవతయుండును గాని దుఃఖపడుటకుగా నుద్యానముల నెవరుగాని నెలకొలుపరు. ఈయుపమానముచేత మహర్షి భావము సీత పరదేవతయనియు నామె దుఃఖము నటించు చున్నదనియు నైయున్నదని మన మూహింపవలయును. రావ ణుఁడు కూడ నత్యంత కామాతురుఁ డైనపక్షమున నాసీత నంతఃపురమున నునిచి తాఁ బెక్కుసారులు చూచుచుండవల సినవాఁడు. అట్లు చేయక మనోహరోద్యానమున నామె నుంచెను. ఇదియు సీత దుఃఖముభంగి నటనమనియే తోఁచు చున్నది. ఇది యుత్తరకాండమునఁ గలకథ కనురూపమే యగు. ఈవిషయ మెఱుఁగని హనుమంతుఁడు చేయఁదగినపనిం గూర్చి యాలోచించుట యుక్తమే కదా.

"నిశాచరీణాం ప్రత్యక్షమనర్హం చాపి భాషణం,
కథన్ను ఖలు కర్తవ్యమిదం కృచ్ఛ్రగతో హ్యహం. ౧౧
అనేన రాత్రిశేషేణ యది నాశ్వాస్యతే మయా,
సర్వథా నాస్తి సందేహః పరిత్యక్ష్యతి జీవితం." ౧౨

అని మూలము. హనుమంతునకుఁ గల్గిన యీసందేహములు న్యాయ్యము లైనవియే. రాక్షసాంగన లప్పటికి మేలుకొనియే యున్న ట్లూహింపవలయును. వారియెదుట మాటలాడుట యనర్హ మనుచున్నాఁడు. ఈజామున మాటలాడకున్నచో సీత బ్రదుకదనియే యతనివిశ్వాసము.

"అంతరం త్వహమాసాద్య రాక్షసీనామిహస్థితః,
శనైరాశ్వాసయిష్యామి సంతాపబహుళామిమాం. ౧౬
అహం త్వతితనుశ్చైవ వానరశ్చ విశేషతః,

వాచం చోదాహరిష్యామి మానుషీమిహ సంస్కృతాం. ౧౭
యది వాచం ప్రదాస్యామి ద్విజాతిరివ సంస్కృతాం,
రావణం మన్యమానా మాం సీతా భీతా భవిష్యతి. ౧౮
వానరస్య విశేషేణ కథం స్యాదభిభాషణం."

అని మూలము. రాక్షసాంగనలు నిద్రించిరో సీతకు దూర
ముగానుండిరో యుండుసమయమున నీసీత నూఱడింతును.
అనుటంజేసి సీతకు సుంతదూరమునఁ ద్రిజటకడ వార లున్న
వారు. నిద్ర నొందలేదని తేలెడిని. ఇపుడు నాశరీర మత్యంత
సూక్ష్మముగ నున్నది. అందును వానరజాతిఁ జేరినవాఁడను.
కనుక నన్ను నీరాక్షసాంగనలు కనిపెట్టఁ జాలరు. కనుక నిం
చుకయవకాశము దొరకఁగనే మానవులు మాటలాడునట్టి
సంస్కృతభాషతో సీత నాశ్వాసింతును. "సంస్కృతాం =
ప్రయోగసౌష్ఠవలక్షణసంస్కారయుక్తామ్" అని గోవింద
రాజులు, "సంస్కృతాం=గీర్వాణాం"అని మహేశ్వరతీర్థులును
వ్రాసిరి. సాధారణముగా మానవులు మాటలాడుభాష కా
దనియు నంతకంటె నుత్తమమగు భాషయనియు మన
మూహింపవలయును. అనఁగా విద్యావంతులు మాటలాడు
నుత్తమభాష యని కదా భావము. ఆభాష రాక్షసస్త్రీలకుఁ
దెలియదనియు దీనిభావ మనవచ్చును. ఆకాలమునఁ జదువు
కొనినవారు లక్షణవంతముగానుండు నొకభాషను మాటలా
డుచుండిరని తెలియఁదగు. రాక్షసస్త్రీలకుఁ దెలియకయుండు
నట్లు మాటలాడఁ దలఁచుటంజేసి మానవులతో సంగతిగల
రాక్షసులకుఁ దెలిసియుండు మానవభాష యొకటి యుండవల
యును. విద్యావంతులకందఱకు నలవాటు పడఁదగినభాష
యాకాలమున లక్షణయుక్తమైనది యుండెనని మన మీ

భాగమునుండి తెలిసికొనవలయును. మఱియొకశంక హను
మంతునకుం గలిగెను. "ద్విజాతిరివ"అనుటం జేసి బ్రాహ్మణుఁడు
మాటలాడు సంస్కృతభాషతో మాటలాడినయెడల జానకి
వానరుఁ డిట్లు మాటలాడఁ జాలఁడు. కాన నితఁడు రావణుఁడే
యని సంశయించి భయంపడును. కాన సంస్కృతము మాట
లాడుట యంత మంచిదికాదని యతఁ డూహించెను. అనఁగా
బ్రాహ్మణులు క్షత్రియవైశ్యులు విద్యావంతు లగుశూద్రులు
లక్షణయుక్తమగుభాషను మాటలాడుచుండిరనియు నది యిత
రులకుఁ దెలియకయుండునట్టిదిగ నుండుననియు మన మూహిం
పవచ్చును. సంస్కృతభాష దేశభాషగా నుండక విద్వాంసులు
మాత్రము మాటలాడునదిగా నుండెననియే మన మీభాగ
మునుండి యెఱుంగవలయు. ఈభాష హనుమంతున కెట్లు
వచ్చెనని మనము ప్రశ్నించుకొందము. పక్షులు వానరులు
మానవులు పరస్పరస్నేహము గలవారుగా నున్నయట్లు
పెక్కు లుదాహరణములు గలవు. స్నేహమునకు భాష
ప్రధానము కదా. అది సామాన్యభాషగా నుండవలయును.
హనుమంతుఁడు వేదవేదాంగవేత్తయని యీవఱకే చెప్పఁబడి
నది. కాన నాశంకల కవకాశము కల్గించుకొనరాదు.

"అవశ్యమేవ వక్తవ్యం మానుషం వాక్యమర్థవత్. ౧౯
మయా సాంత్వయితుం శక్యా నాన్యథేయమనిందితా,"

అని మూలము. మానవభాష నవలంబించియే యర్థవంతముగా
మాటలాడవలయుఁ గాని సంస్కృతభాషతో మాటలాడ
రాదు. ఇదితప్పు వేఱుమార్గమున నాశ్వాసించుట శక్యము
కాదు. "అత్ర వాక్యస్య మానుషత్వం కోసలదేశవర్తి మను

ష్యసంబంధిత్వం వివక్షితమ్, తాదృగ్వాక్యస్యైవ దేవీ పరిచితత్వాత్" అని గోవిందరాజులు వ్రాసిరి. ఇంకొక్కసంశయము గలుగవచ్చును. కోసలదేశభాషయే సీతకుఁ బరిచితమైనపుడు విదేహదేశభాషయుఁ గోసలదేశభాషయు నొక్కటియే యనవలయును. వేఱుమార్గము కానరాదు. రావణుఁడు సంభాషించినదియు నాభాషతో ననియే యూహింపవలయు. రాక్షసాంగనలు పలికినపలుకులు సీతకుఁ దెలిసి బదులు తెల్పినందున వారలకుంగూడ నాభాషయే తెలిసియుండునని యంగీకరింపవలయును.

> "వాచం చోదాహరిష్యామి మానుషీమిహ సంస్కృతాం,
> యది వాచం ప్రదాస్యామి ద్విజాతిరివ సంస్కృతాం,
> రావణం మన్యమానా సా సీతా భీతా భవిష్యతి."

అని యింతకుముందు హనుమంతుఁ డూహించినప్రకారము మానుషి యనఁబడు సంస్కృతభాషయొకటి యుండవలయును. ఆభాష రావణుం డెఱుంగునని యంగీకరింపక తప్పదుగదా. ఇప్పు డూహించినప్రకారము మానవభాష వేఱొకటి యుండవలయు. ఇందుఁ గోసలదేశభాష యొకటియగు ననవలయునా. వేఱనవలయునా. రాక్షసాంగనల కాభాష తెలిసియే యుండవలయుఁ గదా. లేకయున్నఁ బ్రశ్నప్రతివచనము లెట్లు సీతకు వారికి సాగఁగలవు? ఇవన్నియుఁ దలంచిచూడఁగా నీభాషతో మాటలాడిరని సిద్ధాంతము చేయునవకాశమే కలుగదు. సంస్కృతము విద్యావంతులు మాటలాడుభాషయనియుఁ దక్కినవారందఱు నొక్కభాష మాటలాడువారనియు నిర్ణయింపఁ గూడదా యని కొంద ఱందురు.

"అంతరం త్వహమాసాద్య రాక్షసీనామిహస్థితః,
శనై రాశ్వాసయిష్యామి సంతాపబహుళామిమాం.
అహం త్వతితనుశ్చైవ వానరశ్చ విశేషతః,
వాచం చోదాహరిష్యామి మానుషీమిహ సంస్కృతామ్."

అని హనుమంతుఁ డూహించినందున నాయుక్తి పొసఁగ నేరదు. వారికిఁ దెలియకయుండుభాషతోఁ గదా మాటలాడవల యును. రాక్షసస్త్రీలకుఁ దెలియనిదియు సీతకుఁ దెలిసినదియు నగుభాషతో స్వాగమనముం దెలుపవలయుకని కదా హను మంతు నాశయమై యుండవయును. ఆవాక్యులవలన సీత సంశయింపకయుండునని హనుమ తలంపం దగియుండును. అట్టి భాష కోసలదేశభాషయై యుండుననుట మంచిదియా, భారత వర్షమునకంతటికి నొక్కభాష యుండెననుట సమంజసమా యని వితర్కింపవలయును. ఒక్కవిషయము నాకుం దోఁచి నది. హనుమంతుఁడు వేదవేదాంగవేత్తయగుట దేశభాష లన్నియుఁ దెలిసినవాఁడే యన్న నీచిక్కులు రాకయుండును గదా యని. అది యంత యుక్తముగాఁ గొందఱకుఁ దోఁపదన వచ్చును. అంతకంటె సమంచితమగు విషయము తోఁచినంత దనుక మనమట్లే గ్రహింతము. ఈచర్చవలన సాధింపఁగలపురు షార్థ మెద్దియు నుండదు. కొందఱ కదియే పరమపురుషార్థ మనియుం దోఁపవచ్చును. విషయ మిదియని సిద్ధాంతము చేయు మార్గములు కానరాకయున్నవి.

"సేయమాలోక్య మే రూపం జానకీ భాషితం తథా. .౨౦
రక్షోభిస్త్రాసితా పూర్వం భూయస్త్రాసం గమిష్యతి,"

అని మూలము. ఇది మఱియొకసందియమున కవకాశ మిచ్చు

చున్నది. నేను వానరుఁడను. నాభాష మానవభాష. ఈరెం డును సీతకు భీతిని గలిగించునవియే. ఇంతకుముందే భయంపడి యుండు సీత నాయీరూపమును, రూపమునకు విరుద్ధమగు భాషను గని విని మఱింత భయంపడక మానదు. అను నీ యూహ హనుమంతునకుం గల్గెను. దీనింబట్టి వానరభాష మాటలాడఁ దగునుగాని మానుషభాష తగదని హనుమ యూహించినట్లు మనము తలంచుట తప్పుగాదు కదా. ఇన్ని సంశయములలో నతనియుద్దేశ మేభాషతో మాటలాడ వలయుననియో నిర్ణయింప నవకాశము కలుగకున్నది.

> "ప్రాణత్యాగశ్చ వైదేహ్యా భవేదనభిభాషణే. 36
> ఏష దోషో మహాన్ హి స్యాన్మమ సీతాభిభాషణే,"

అని మూలము. ఇది పైదానికి మెఱుఁగుపెట్టుచున్నది. మాట లాడి శ్రీరామవార్తలఁ దెలుపకయున్న సీత మృతినొందును. ఈరూపమున మానవభాషతో మాటలాడిన నామె యను మానించి యఱచుట రాక్షసాగమనయుద్ధప్రముఖములు నగు నాపదలు గలుగును. కావున నేమిచేయవలయునని హనుమం తునివిచారము. ఇదియు నీభాషతో మాటలాడ నుద్దేశించె నని తెలుపకున్నది.

> "భూతాశ్చార్థా వినశ్యంతి దేశకాలవిరోధితాః. 37
> విక్లబం దూతమాసాద్య తమస్సూర్యోదయే యథా,"

అని మూలము. భాషాసంశయములను వదలి దూత విషయ మును దలంచుచున్నాఁడు. దేశకాలముల ననుసరించి దూతలు కార్యము నడిపింపవలయును. సిద్ధింపనున్న కార్యములు కూడ వివేకముచ్చాలని దూతపాలంబడిన నవి తగినట్లు చేయఁబడక

పోవుటం జేసి ఫలింపక నశించును. అనఁగా దేశకాలపరి
జ్ఞానము గలిగినదూతలు కార్యము నెఱవేర్పఁగలరనియు నవి
లేనివారు కార్యము ఫలింపకయుండఁ జేయుదురనియు దీని
భావము.

> "అర్థానర్థాంతరే బుద్ధి ర్నిశ్చితాపి న శోభతే. ౩౮
> ఘాతయంతి హి కార్యాణి దూతాః పండితమానినః."

అని మూలము. రాజు మంత్రులు కలిసి విమర్శించి యిది
యిట్లు చేయఁదగునని నిశ్చయించినను దూత లవివేకులయిన
యెడల నది ఫలింపదు. పండితులము మేమే యనుకొను
దూతలు స్వామికార్యములం బాడుచేయుదురు. దీనఁ గల
విశేష మేమి? పండితమాను లనఁగా నపండితులు, మూర్ఖులన
వచ్చును. వా రెట్టికార్యముల నైనఁ జెఱుపఁగలరు. అనఁగా
నహంకారము కార్యవిఘాతకారి. భగవత్సహాయమును గోరక
తనయత్నముననే కార్యము ఫలించునన్నవిశ్వాసమునకే య
హంకార మనుపేరు పెట్టవచ్చును. కేవల దైవపరుఁడు
కారాదు గాని పౌరుషమాత్రుఁడు కావచ్చునా? కారాదను
టయే సిద్ధాంతము. అట్టియహంకారము కలవారే పండిత
మాను లనఁబడుదురు. కర్మగతులు దురూహములని యెఱుం
గమికంటె నజ్ఞానము వేఱుగ నేముండును? అట్టివారు కార్య
విఘాతము చేయుదురనుట యచ్చెరువేల? కావునఁ గర్మగతి
దురూహమగుట యెఱింగి దానిని భగవత్స్వరూపముగా
భావించుచుండిన నహంకారము పొడసూపుట కవకాశము
లేకయుండుననువిషయ మీభాగము మనకుఁ దెల్పుచున్నది.

> "ఇక్ష్వాకూణాం వరిష్ఠస్య రామస్య విదితాత్మనః. ౪౨

శుభాని ధర్మయుక్తాని వచనాని సమర్పయన్,
శ్రావయిష్యామి సర్వాణి మధురాం ప్రబ్రువన్ గిరం. 43
శ్రద్ధాస్యతి యథాహీయం తథా సర్వం సమాదధే. 435
ఇతి స బహువిధం మహానుభావో
జగతిపతేః ప్రమదామవేక్షమాణః,
మధురమవితథం జగాద వాక్యం
ద్రుమవిటపాంతరమాస్థితో హనుమాన్." 44

అని మూలము. నావానరరూపమును దద్విరుద్ధమగు మానుష భాషను బరికించి సీత భయంపడునన్న సంశయమును హనుమంతుఁడు తొలఁగించుకొన నెంచెను. ఈ కొమ్మలచాటుననే యుండి శ్రీరామునిచరిత్రమును మధురవాక్కుల వినిపించెదను. శ్రీరామైకాసక్తచిత్తయగు సీసీతాదేవి శ్రద్ధగా నా వాక్కుల నాలకించును. ఆమీఁద రూపదర్శనవిషయ మాలోచింతు ననుకొనియెను. దీనిచేత ద్విజాతికర్హమగు సంస్కృత భాషను వదలి సలక్షణమగు మానవభాషతో శ్రీరామ వృత్తాంతమును వినిపింప హనుమంతుఁడు తలంచెనని మన మూహింప నవకాశము కల్గుచున్నది. ఆభాష కోసలదేశమున మాటలాడునదియుఁ గావచ్చును. ఆదేశభాష వేఱుగనుండ సర్వదేశసామాన్యభాషయు నందలివా రెఱింగియు నుండ వచ్చును. మొత్తముమీఁద దేశములకు భాషలు వేఱుగ నున్నవో లేవో నిర్ణయింప నవకాశము దీనింబట్టి లేదుగాని దేశసామాన్యభాష యొక్కటి యుండవలయునని తోఁచుచున్నది. అది ద్విజాత్యుచిత సంస్కృతభాష మాత్రము కాదనియుఁ దోఁచెడిని.

## హనుమంతుఁడు శ్రీరామవృత్తాంతమును జెప్పుట.

* ఆ హనుమంతుఁ డిట్టు లూహించి సీతకు నించుక చెంతనుండి యామెకు మాత్రమే వినఁబడునట్లు శ్రుతిహితముగా నిట్లు పలుక నారంభించెను. దశరథుఁ డనుమహారాజుండెను. కపటమెఱుఁగక పుణ్యస్వభావము గలిగి రాజర్షి యనఁబరఁగుచు నతఁ డుండెను. సకలసద్గుణములు గలిగియుండు నామహారాజునకు రాముఁడు జ్యేష్ఠపుత్త్రుఁడు. ఆతనిమోము చంద్రబింబమే. కోదండదీక్షితులలో నతఁడు మేటి. క్షత్రధర్మమును సకలప్రాణిధర్మమును రక్షించువాఁడు. సత్యసంధుఁడగు దశరథుఁడు మాట తప్పలేక రాము నడవికిఁ బొమ్మన నావీరాగ్రేసరుఁడు భార్యయుఁ దమ్ముఁడు వెంబడిరా నడవికిం బోయి కామరూపు లగురక్కసులఁ బెక్కండ్ర నుక్కడించి జనస్థానవాసులగు ఖరదూషణాదులగు మహావీరుల దానవులం ద్రుంపఁగా నాలకించి రావణాసురుఁడు రోషమున మాయామృగరూపమున శ్రీరాముని వంచించి సీతాదేవి నెత్తుకొని పోయెను. ఆరాముఁ డాసాధ్విని వెదకుచుఁ బోవఁగా వానరపతి సుగ్రీవుఁడు మిత్త్రుఁ డయ్యెను. మహాబలశాలియగు వాలిని జంపి యారాజ్యమును సుగ్రీవునకు నారాముఁ డిచ్చెను. సుగ్రీవుఁడు కృతజ్ఞుఁడై యాజ్ఞాపింపఁ గామరూపులగు ననేకవానరవీరులు సకలదిక్కుల నాదేవిని వెదకుచున్నారు నేను సంపాతియను పక్షిరాజునానుమతి నాసాధ్వికొఱకే సాగరమును దాఁటి వేగమే వచ్చితిని. శ్రీరాముఁ డనువదించిన చిహ్నములన్నియు నీయెయందుఁ గనఁబడి

---

* ఇది ముప్పదియొకటవసర్గమునఁ గలదు.

నందున నామెయే యీమె యనుకొని దర్శించితిని. అని యింత దనుకఁ బలికి యూఱకుండెను.

సీతయు దానినంతయు నాలకించి యిత్తఱి నిట్టి మాటలు తెలుపువాఁ డెవ్వఁడని మిగుల నచ్చెరువొందెను. భీరువు గాన నుద్బంధనార్థము శిరోరుహములఁ గట్టఁబడుటం జేసి వెండ్రుకలు గ్రమ్మియున్న యామోమును బయికెత్తి శింశుపావృక్షముం గాంచెను. ఆమాటలు విని యన్ని దిక్కులు కలయం గాంచి యెవ్వరు నందుఁ గనఁబడకపోఁగా శ్రీరాముని యందుఁ జిత్తము నిలిపి ధ్యానించుచుఁ బరమానందము నొందెను. మఱియు నాచెట్టు నెల్లయెడల వెదకి యంబోక్క-చో హనుమంతుని జూచెను.

మహనీయులారా! ఇందు విశేషించి విమర్శింపఁదగిన వేవియు లేవు. తనిశ్లోకి తెలిపినవిశేషము లెట్టివని మాత్రము విమర్శించి తెలిసికొందము.

"సా తిర్యగూర్ధ్వం చ తథాప్యధస్తా
న్నిరీక్ష్యమాణా తమచింత్యబుద్ధిం,
దదర్శ పింగాధిపతేరమాత్యం
వాతాత్మజం సూర్యమివోదయస్థమ్." ౧౯

అని మూలము. "తమచింత్యబుద్ధిం దదర్శ. తదప్పురవలోకనాత్పూర్వం తస్యాహృదయమేవం పరిచ్ఛిత్తి స్మ ఇహ లంకాయాం ప్రవిశ్య అవరోధారామమధ్యప్రవేశేనాయం నిపుణతరమతిరితి నిశ్చితవతీత్యర్థః." అని తనిశ్లోకి వ్రాయుటం జూడఁగా (లంకలోఁ బ్రవేశించి యంతఃపురము తోఁటనడుమ ప్రవేశించుటచే నితఁడు మిగుల నిపుణమతియైనవాఁడని నిశ్చయిం

చినది.) సీత యతనిం జూడకముందే నిశ్చయించినదని తేలును గాన సీత పరదేవి యని నే మున్ను వ్రాసినయర్థమే దృఢపడు చున్నది. ఆమె మహాప్రకృతి యైనపుడు మహాదుఃఖ మనుభ వించుట నటనమే గాక మఱే మగును? ఈచోట నీవ్యాఖ్యా యేమో వ్రాయఁబూన నింకేమో యైనది. ప్రమాదమున వ్రాసి నను మంచివిషయమునే వ్రాసినదని మన మానందింపవల యును.

## సీత దేవతలఁ బ్రార్థించుట.

* అంత నాసీత వృక్షాంతరమున దాఁగియున్న హను మంతుని సామాన్యముగాఁ గని పిదప భయంపడి చక్కఁగాఁ జూడఁగాఁ దెల్లనివస్త్రమును గట్టి పింగళవర్ణము గలిగి ప్రియ ములు పలుకుచు నశోకపుష్పకాంతివలెఁ బ్రకాశించుచు బంగా రురంగుగల కన్నుగలిగియుండు వానరుని గాంచెను. సీత యంతఁ దనలో నచ్చెరువంది యీవానరరూప మెంతయో భీతిగొలుపుచున్నది. ఇది చేరరానిది. చూడఁదగనిది. ఇదేల వచ్చెను? అని మరల దుఃఖాతిరేకమున నేమియుఁ దెలియక యుండెను. ఆమె భీతిచే వగచుచు శ్రీరామా రామా యని లక్ష్మణా యని పలుకుచు శ్రోతలకు వాత్సల్యము గలిగించు నట్లు పలవించెను. సీత రాక్షసాంగనలు వినినఁ గీడుమూఁడు నన్న భయమున నల్పస్వరమున దుఃఖ మాపుకొన లేక యేడ్చెను. మఱియు వినీతుఁడై తనకుఁ జెంత వృక్షముమీఁదనున్న యా మారుతిం గాంచి లంక యెక్కడ? శ్రీరామకుశలవార్తఁ జెప్పుట

* ఇది ముప్పదిరెండవసర్గమునఁ గలకథ.

యెక్కడ? ఇది స్వప్నమే కాని వేఱొకటి కాదని తలంచెను. ఆమె నలువైపులం జూచుచుఁ గుటిలవక్త్రము గలిగినయాతని ననుకూలుఁ డగునో యనుభావమును పరలం జూచెను. చూచిన యంత వికృతమగు శాఖామృగవేషమునను మూర్ఛిల్లి కొంతవడికిఁ దెప్పిఱిల్లి యిట్లు చింతించెను. ఇపుడు స్వప్నమున వికృతమగు వానరముం గాంచితిని. శాస్త్రములయందుఁ గల యందుఁ గోఁతి కనఁబడరాదని నిషేధమున్నది. కనఁబడినఁ గష్టములు కల్గును. కనుక దీనిచే శ్రీరామాదుల కేమి కష్టము వచ్చునో? శ్రీరామలక్ష్మణులకు నాతండ్రి జనకమహారాజునకు మంగళము కలుగుం గాక. ఇది స్వప్నము కూడఁ గాదు. నిద్ర పోయినఁ గదా స్వప్నము. శోకాతిరేకపీడిత నగు నాకు నిద్ర యెట్లుపట్టును? సుఖమునకైన నిద్ర గలుగునని యూహింతునా పూర్ణచంద్రాననుని శ్రీరామునిఁ బాసిన నాకు సుఖము కలుగు ననుట కల్ల. శ్రీరామనామపారాయణము చేయుచు దానికను గుణముగాఁ దత్కథను వినుచున్నాను. ఆకథనే యీ చెప్పిన రీతిగా వినుచున్నాను. ఇంక నేదియుఁ గాదు. శ్రీరాము నెడఁ బాసినదినమునుండి పరితాపమున నలంగి యతనినే ధ్యానించు చున్నందున నామనస్సునఁ జింతిల్లినట్లే నాకన్నులకుఁ గనఁబడు చున్నది. చెవులకు నదియే యట్లే వినఁబడుచున్నది. అంతియ కాని వేఱుగా నేదియుఁ గాదు. ఇదిగో శ్రీరామనామముం బలుకువాని నొక్కని గనుచున్నాను. శ్రీరామునియందుఁ గల నామనోరథమే కనఁబడునట్లు కావచ్చును. బుద్ధిచే విచారిం పఁగా నిది మనోరథము కాదని తోఁచెడు. మనోరథమునకు రూపము లేదు. కాన-నది యిట్లు పరిణమించెనన వలనుపడదు. మనస్సునకే వినఁబడునట్లుగాఁ దోఁపవలయు. ఈకపిరూపము

స్పష్టముగా నాకుఁ గనఁబడుచున్నది. ఇతఁడు పలుకుచుండఁగా నితనికంఠము వినవచ్చుచున్నది. ఎవఁడో వచ్చి యిచట నిట్లు చెప్పినవాఁడే కాని వేఱొండు కాదు. ఇంద్రబృహస్పతులకు బ్రహ్మాగ్నిహోత్రులకు నమస్కరించెద. నాయెదుట నీకపి పల్కినవాక్యములన్నియు సత్యము లగుంగాక. మఱొకరీతిగా స్వప్నములో నగునవి కాకయుండుఁ గాక. అని ప్రార్థించెను.

ఆర్యులారా! ఈభాగమునుండి నేర్చుకొనఁదగినవిశేషములు కొన్ని గలవు. అవేవియని పరికింతము.

"అహో భీషమిదం రూపం వానరస్య దురాసదం. 3
దుర్నిరీక్షమితి జ్ఞాత్వా పునరేవ ముమోహ సా,"

అని మూలము. వానరరూపము దుఃఖసమయములయం దగపడుట భావిపీడాకరము. విశేషించి స్వప్నమునందుఁ జూడరాదు. అని యెఱింగినది కాన మరల నాసీత మూర్ఛిల్లెనని కథాభాగము ప్రాయికముగా వికృతరూపదర్శనము భావిదుఃఖహేతువని పెద్దలమతము. సహేతుకమా యని యడుగువా రుందురు. కొన్ని నిమిత్తములు తప్పక ఫలముల నొసంగును. ఈనిమిత్తమునకు నాఫలప్రాప్తి కేమి సంబంధమనినఁ గారణము వచింపఁజాలము కాని ఫలానుభవమే ప్రమాణ మనవలసియుండును. ఆమాటను హేతువాదులు నమ్మరు. కాని వా రొక్కవిషయ మెఱింగిన బాగుండును. మనకు సర్వము తెలియదనియు మనబుద్ధి కగోచరమగుచున్నవిషయములే పెక్కు లుండుననియు నవి యూరకపోవక ఫలముల నొసంగుచుండుననియు నను నీవిషయ మెఱింగిన హేతువాదులు ధన్యు లగుదురు. అతీంద్రియవిషయములు వేనవే లున్నవి. ఈకారణమున నివి

కల్గునన వలనుపడక యుండును. ఉత్పాతాదు లట్టివే కనఁ బడినపిదప ఫలములఁ జెప్పఁదగి యువి యుండును.

"ఉదయాస్తమనం కేతోర్గణితేనైవ దృశ్యతే,
ఆకాశే దృష్టమాత్రత్వాత్ఫలం తస్య వదామ్యహం.
దర్శనమస్తమయో వా న గణితవిధినా శక్యతే జ్ఞాతుం,
దివ్యాంతరిక్షభౌమాస్త్రివిధాః స్యుః కేతవో యస్మాత్."

అని మయూరచిత్రకమునఁ గలదు. ఉత్కర్మమున కిదియని సహేతుకముగాఁ జెప్ప నసుపపడదు కదా. కుక్షిబాధ కలుగఁగా మందున్నది. ఈకారణమున నీగడియకు రాఁగలదని వచింపఁ దరమా? హేతువాదు లోకవిషయముగా నాలోచింప వెఱ్ఱివారిలోఁ జేర్పఁ దగుదురు. సర్వకారణములం బరిశీలింప నెవ్వరికేని శక్యమా? అందును భగవద్విషయమున హేతువాదము పనికిరాదు. బుద్ధ్యతీతుని బుద్ధికి లోఁబడిన హేతువులెట్లు కనఁబఱుపఁగలవు? భగవంతుఁడే లేఁడనవలసి వచ్చును. అట్టి మూర్ఖులజోలికిం బోవకయుండు టుత్తమము. కర్మసిద్ధాంతముమ్రోల హేతువాదము నిలువఁజాలదనుట నిర్వివాదము.

"సా తం సమీక్ష్యైవ భృశం విసంజ్ఞా గతాసుకల్పేవ బభూవ సీతా,
చిరేణసంజ్ఞాం ప్రతిలభ్య భూయో విచింతయామాస విశాలనేత్రా.౧
స్వప్నే మయాయం వికృతోఽద్య దృష్ట
శ్శాఖామృగశ్శాస్త్రగణైర్నిషిద్ధః,
స్వస్త్యస్తు రామాయ సలక్ష్మణాయ
తథా పితుర్మే జనకస్య రాజ్ఞః." ౯

అని మూలము. మనుష్యబుద్ధియే సకలకార్యముల నిర్వహింపఁ జాలదనియు, మహాత్ములు నిర్మించినశాస్త్రములను బరిశీలించి వాని ననుసరింపవలయుననియు,

"తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి."

అన్నగీతావాక్యము స్మర్తవ్యమనియు మనకీభాగము తెలుపుచు హేతువాదమును దిరస్కరించుచున్నది. స్వప్నమున వానరదర్శనము పీడాకరమని మన మెఱుఁగందగు. అట్టి దుస్స్వప్నములు కాఁగా నిష్టదేవతలకు నమస్కరించి తద్దోషము దొలఁగింపుఁడీ యని వేఁడుకొనవలయును. ఈయాచారము ననుసరించి సీతాదేవి తొలుత విభుఁడగు శ్రీరామునకుఁ దరువాత సేవచేయుచుఁ దనమేలుగోరిన లక్ష్మణునకు నామీఁదఁ దన్నుఁబెంచిన జనకరాజునకు మేలుగలుగవలయునని యామె కోరెను. ఈమూవురే తనతత్త్వ మెఱింగినవారని సీత యెఱుంగును. మనము కూడ దుస్స్వప్నములు తోఁచఁగా నిష్టదేవతలం బ్రార్థించి మనమేలు కోరియున్నవారికిని మనకును గీడుమూఁడకయుండఁ జేయవలయునని వాంఛింపవలయును. ఇట్టి సదాచారములు మానిపోవరాదు. సర్వదా తలంచుచుండవలయును.

"స్వప్నోఽపి నాయం న హి మేఽస్తి నిద్రా
శోకేన దుఃఖేన చ పీడితాయాః,
సుఖం హి మే నాస్తి యతోఽస్మి హీనా
తేనేందుపూర్ణప్రతిమాననేన." ౧౦

అని మూలము. ఇందు "పూర్ణప్రతిమాననేన" అనుచో "ఇందోః పూర్ణం పూర్ణబింబం తేన ప్రతిమా సామ్యం ఆననం యస్య" అని సమాసము. శ్రీరామచంద్రు నెడఁబాసియుండు నాకు సుఖమెట్లు గలుగునని సీత తర్కించుకొనెను. భర్త నెడఁబాసి

యుండు పురంధ్రీమణులకు నానందము లేదని తాత్పర్యము. ఇందలివిశేష మేమి? ప్రకృతిపురుషులలో భేదములేక యుపాసకుఁ డుండవలయును. వారిరువురకభేదమనియే భావింపవలయునని దీనిభావము. చంద్రచంద్రికలకువలెఁ బ్రకృతిపురుషులకు నవినాభావసంబంధము శాశ్వతమని నమ్మవలయును. ఈ యర్థమునే శ్రీశంకరాచార్యులు సమయమతము ననుసరించి,

"మనోఽపి భ్రూమధ్యే సకలమపి భిత్త్వా కులపథం,
సహస్రారే పద్మే సహ రహసి పత్యా విహరసి."

అని తెలిపిరి. అనఁగా భక్తుఁ డుపాసించుతనయిష్టదైవమునే ప్రకృతిపురుషులనుగా భావింపవలయు. వేఱువేఱు రూపములు వారికి లేవు. ఒక్కరూపమే. సహస్రధా మారుపొందుట కార్యార్థమని యెఱుంగవలయును. "కామేశ్వరముఖాలోకకల్పితశ్రీగణేశ్వరా" అను సహస్రనామస్తోత్రవాక్యము ప్రకృతి పరమపురుషునిచ్ఛాశక్తి యని తేటపఱచుచున్నది. తత్సాన్నిధ్యబలమున సకలలోకముల నిర్మించి పాలించి సంహరించును. తత్సాన్నిధ్యము లేకయున్న నేపనియుఁ జేయఁజాలదు కదాయని కొందఱందురు. అది మిగులఁ బొరపాటు. తత్సాన్నిధ్యము లేకయుండు టెట్లు? భగవంతుఁడు నామరూపక్రియావంతుఁ డగుట. ప్రకృతి సర్వకార్యనిర్వహణచాతుర్యము గలదగుట సంబంధమవినాభావ మనంబడుటం జేసియే యని తెలిసికొనందగును. ఎడఁబాటు సర్వథా అసంభవమనియే మనము విశ్వసింపవలయును. అట్లు విశ్వసింపకయున్న నుపాసకుఁడు సంపూర్ణఫలమును గాంచనేరఁడు.

"రామేతి రామేతి సదైవ బుద్ధ్యా విచింత్య వాచా బ్రువతీ తమేవ,
తస్యానురూపాం చ కథాం తమర్థమేవం ప్రపశ్యామి తథాశృణోమి.

అహం హి తస్యాద్య మనోభవేన సంపీడితా తద్గతసర్వభావా,
విచింతయంతీ సతతం తమేవ తథైవ పశ్యామి తథాశృణోమి. ౧౨
మనోరథస్స్యాదితి చింతయామి తథాపి బుద్ధ్యా చ వితర్కయామి,
కిం కారణం తస్య హి నాస్తి రూపం సువ్యక్తరూపశ్చ వదత్యయం
మాం." ౧౩

అని మూలము. మర్కటకిశోరన్యాయము, మార్జారకిశోరన్యాయము, భ్రమరకీటన్యాయము ననున్యాయములు మూఁడు జగత్ప్రసిద్ధములు. మొదటి రెండును గురుశిష్యులకృత్యములం దెల్పునవి. మూఁడవది యుపాసకునిస్థితిని దెలుపునది. సీత యీ విషయమునే యిటుఁ దేటపఱచుచున్నది. సదా రామరూప నామములను దలంచుచుఁ బలుకుచున్నందున నాతనికథనే వినుచున్నాను. ఇది నిరంతరభావనాబలఫలమే గాని వేఱుగాదు. నే నీరూపమును ధరించినదిమొదలు మనస్సు బాధింపఁబడుచుండఁగా సర్వభావములు పరమాత్మయందే కలదాననై యాభగవంతునే నిరంతరము తలంచుచున్నందున నాచింతయే కన్నుల కగపడుచున్నది. అట్లే నాకు వినఁబడుచున్నది. అనఁగా భావ మేమి? ఉపాసకుఁ డిష్టదేవత నేరూపము గలదానినిగా ధ్యానించునో నిరంతరధ్యానబలమున నారూపమే కనఁబడును. "భావనామాత్రసంతుష్టహృదయః పరమేశ్వరః" అన్న సూక్తికి రామాయణమే యాధారమో, ఆసూక్తియే రామాయణమున కాధారమో వచింప వలనుపడదు. కాని యీభాగ ముపాసకునిభావన ననుసరించి యిష్టదేవతామూర్తి యుండునని మాత్రము తెలుపుచున్నది. సర్వరూపము లా భగవంతునివే యగుట రూపభేదము ననుసరించి యుత్తమ మధ్యమాధమ

భేదములు కల్పించుకొని మతద్వేష మూనుట యవివేకమని యీభాగము సిద్ధాంతము చేయుచున్నది. మతదూషణమే పరమపురుషార్థమనియు మతస్థాపకనిందయే యుత్తమకార్యమని భావించుదాసులు స్వాములు నెంత మూర్ఖులు? వంచకులే యనవలయు. పాపము! వా రేమిచేయుదురు? వారెధనాశ యూచియూచి వైచుచుండఁగా దానికొఱకు వేషములు వేసిన యాపశువు లేమిచేయును? మనోరథమునకు రూపమే లేదు. కాన నిది మనోరథము కాదనియు నొకరూపధారి సువ్యక్తముగాఁ బల్కుచున్నవాఁడనియు నామె తలంచెను. ఇంక నీ తర్కములతోఁ గాలముగడుపు నవకాశ మామెకు లేదు. హనుమంతునిచే మృతినొందవలసినవారిని మృత్యు వీడ్చుకొని వచ్చుచున్నది. సంభాషించుకాల మాసన్నమగుచున్నది. కానఁ దీనరమున నామె యూహాప మేదియో యొకప్రాణి యనియుఁ గేవలమనోరథము కాదని భావించెను.

"నమోఽస్తు వాచస్పతయే సవజ్రిణే
స్వయంభువే చైవ హుతాశనాయ,
అనేన చోక్తం యదిదం మమాగ్రతో
వనౌకసా తచ్చ తథాస్తు నాన్యథా." ౧౮

అని మూలము. మున్ను గోవిందరాజులు. "రుద్రస్యాపూజ్యత్వమాహ" అని దేవతలపేరులలో శంకరునిపేరు లేనందున వ్రాసిరి. ఇపుడు విష్ణువుపేరు లేనందున "విష్ణోరప్యపూజ్యత్వమాహ." అని యేల వ్రాయరాదో తోఁచకయున్నది. ఎంత వారినైనఁ గుమతాభిమానము తాలుమాలుచేయక మానదు కదా. బృహస్పతి, ఇంద్రుఁడు, బ్రహ్మ, అగ్ని యను నలువురు

దేవతలు నిటుఁ బేర్కొనఁబడిరి.ఏల? బుద్ధిబలమునొసంగ బృహస్పతిని, ఐశ్వర్యభంగము కాకయుండఁజేయ నింద్రుని, జ్ఞానబలమునొసంగ బ్రహ్మను, సర్వదేవతానుగ్రహము నొసంగ నగ్నిని బ్రార్థించెను. ఈకనఁబడిన వానరము చెప్పినదంతయు మిథ్య కాక సత్యమగున ట్లనుగ్రహింపుఁడీ యని కోరెనని కథాసారము. ఎంతవాఁడుకాని కష్టములు తన్నలముకొనఁగా దేవతలను బ్రార్థింపవలయుననియు స్వబలమునే నమ్మియుండఁ రాదనియు నిందలినీతి.

## హనుమంతునకు సీత తనవృత్తాంతముం దెల్పుట.

* అంత మతిమంతుఁడగు నాహనుమంతుఁడు శింశుపా తరువునుండి దిగి ఆదేవిదుఃఖమునకు వగచి నమస్కరించి కొంత చెంతకరిగి తలపైఁ జేతులు జోడించి మంచిమాటలతో నిట్లు ప్రశ్నించెను. పద్మదళాయతాక్షీ! మాసినచీరగట్టి యీ వృక్షశాఖ నవలంబించి నిలిచియున్నావు. నీ వెవతుకవు? తవంగములు వ్యాపింపఁ దెల్లఁ దామరపత్రములనుండి జలము వెడలుచందమున హర్షాశ్రువులకుం దగు నీనయనములనుండి దుఃఖాశ్రువులు స్రవించుచున్నవి. ఏల? ఎవనివంశము నశింపఁ జేయుటకు? మది నేమి యూహించితివో? కళ్యాణీ! సురాసుర నాగగంధర్వరాక్షసయక్షకిన్నరకాంతలయం దేతెగకుఁ జేరిన దానవు? రుద్రవాయువసుగణములకు సంబంధించినదానవా? తల్లీ! నీవు దేవతాస్త్రీనని నాకుం దోఁచుచున్నది. చంద్రుని బాసివచ్చిన రోహిణివా? ఎవ్వతవో తెల్పుము. కోపమున

* ఇయ్యది ముప్పదిమూఁడవసర్గమునఁ గలదు.

నొండె తెలియమినొండె వసిష్ఠునకుం గోపము జనింపఁజేసి స్వర్గ
మును వదలివచ్చిన యరుంధతివా యేమి ? పరలోకమునకేగిన
పుత్త్రపితృసోదరులగూర్చియో ప్రాణేశుంగూర్చియో వగచు
చున్నట్లు తోఁచెదవు. గతించిన నీపుత్త్రుఁ డెవఁడు? అక్షితంత్రి
సోదరులు భర్త యెవ్వరో? దుఃఖించుట నిశ్వాసముల విడుచుట
భూమి స్పృశించుట యనువానిమూలముగ రాజలక్షణములు
నిశ్చయముగా నేర్పడుటం జేసి నీవు దేవతాస్త్రీవి కావని తలం
తును. రాజస్త్రీవిగా నుండఁదగుదువు. నీశరీరమునఁగల యం
గకములవిధమును మంగళమును గలిగించు సాముద్రికలక్షణ
ములం బరికించి చూడఁగా నీవు రాజదేవేరివని క్షత్త్రియపు
త్త్రికవని నాకుం దోఁచెడు. రావణుఁడు జనస్థానమునుండి యప
హరించితెచ్చిన సీతాదేవివగుదువే నావిషయము నిన్నడిగె
దను. తల్లీ! నీకు శుభంబగుఁ గాక. నాయూహనుగూర్చి
తెల్పుము. నీకిపుడు గలిగినదైన్యము అతిమానవమగు నీరూ
పము తాపసివేషము నెట్టివో యట్లే నీవు శ్రీరామపత్నివే.
నిస్సంశయము అని యడిగెను.

సీతాదేవియు దానినంతయు నాలకించి సంతోషించి
వృక్షముక్రిందనున్న హనుమంతుం జూచి యార్యా! భూతల
మున రాజసింహుఁడగు దశరథునికోడలను. విదేహదేశాధి
పతిపుత్త్రికను. సీతయని నన్నుం బిలుతురు. బుద్ధిమంతుఁడగు
శ్రీరామునిభార్యను. వివాహానంతరము పండ్రెండుసంవత్సర
ములు మానవభోగముల ననుభవించుచు దశరథునింట నుం
టిని. పదుమూఁడవయేట మామామ వసిష్ఠునింగూడి కులవర్ధ
నుఁడగు రామచంద్రునకుఁ బట్టాభిషేకము చేయఁబూనెను.
దానికై సంభారములు నేకరించుచుండఁగా నాతనిభార్య కైక

భర్తతో రామునకుఁ బట్టాభిషేకము చేయఁబడునేని జలము త్రాగను,భుజింపను.-ఈయుత్సవము నాప్రాణాంతకరమే. మున్ను నాకు వరము లిచ్చితివి. వాని నసత్యరూపములుగాఁ జేయవేని రాముఁ డిపుడే యడవులకుఁ బోవలయుఁ జుమీ" అనెను. రాజు వరదానమును స్మరించి రాము నడవికిం బంపుమన్న దారుణవాక్యమును విని సత్యవాది గావున నూరకుండెను. అంత నారాజు సత్యప్రతిజ్ఞుఁడుగాన నిచ్చునట్లు పల్కిన రాజ్యమును మరల నిమ్మని రాముని యాచించెను. ఆమహోత్సవమున కంటెఁ బ్రియమైనది పితృసత్యవాక్యమని భావించి యట్లే యంగీకరించెను. శ్రీరాముఁ డిచ్చుటయే గాని కైకొను టెఱుంగఁడు. అప్రియమగుమాట నొక్కడానిం బల్కఁడు.అట్టి యాశ్రాముఁ డమూల్యవస్త్రములం బరిత్యజించి వల్కలములం గట్టుకొని రాజ్యకాంక్ష యనుదాని మాని వనముల కనుగువాఁడై నన్నుఁ దనతల్లికడ నుండుమనఁగా నతనికంటె ముందే యడవుల నుండఁగోరి పయనమైతిని. రాముఁడులేని స్వర్గవాసము కూడ నాకు నిష్టపడదు. సుమిత్రానందవర్ధనుఁడు రామసేవాసక్తమతి లక్ష్మణుఁడు ముందే పయనమయ్యెను. నారచీరలం దాల్చెను. మే మట్లు ముఫ్పూరము రాజశాసనమురీతి నియమమూని ప్రయాణము సాగించి క్రొత్తయడవిం జొచ్చితిమి. మహాతేజుఁ డగురాముఁడు దండకాటవి నుండఁగా నతని దారనగు నన్ను దురాత్ముఁ డగురావణుఁడు వంచించి తెచ్చినాఁడు. నన్నుఁ బ్రాణములతో నుండనీయ రెండునెలలే గడువొసంగినాఁడు. ఆరెండునెలలమీఁద నేఁబ్రాణముల వదలఁగలనని పలికెను.

ఆర్యులారా! ఈభాగమును బరికింపక వదలవచ్చునా?

"కాను పద్మవిశాలాక్షి క్లిష్టకౌశేయవాసిని,

... ... ... ...

వసూనాం చ వరారోహే దేవతా ప్రతిభాసి మే. ౬

కిన్ను చన్ద్రమసా హీనా పతితా విబుధాలయాత్,
రోహిణీ జ్యోతిషాం శ్రేష్ఠా శ్రేష్ఠసర్వగుణాన్వితా. ౭

కా త్వం భవసి కల్యాణి త్వమనిందితలోచనే,
కోపాద్వా యదివా మోహాద్భర్తారమసితేక్షణే. ౮

వసిష్ఠం కోపయిత్వా త్వం నాసి కళ్యాణ్యరుంధతీ,"

అని మూలము. కొం దనేకసంశయములు గలుగుచున్నవి. రావణాగమనమునకు మున్నే హనుమంతుఁ డచ్చటం జేరెను. సీతాశోకము నాలకించెను. రాక్షసాంగనలపలుకు లాలకించెను. రావణుఁడు వచ్చి మాటలాడుట, సీత బదులిచ్చుట లోనగు చరితములనెల్లఁ బూసగ్రుచ్చినరీతి వినియెను. పిదప రావణాజ్ఞ ననుసరించి యందలిస్త్రీలు పలికినపలుకులు సీత యిచ్చినబదులు వినియెను. తుదకు సీత మరణింప సిద్ధమగుట చూచెను. త్రిజట స్వప్నవృత్తాంతముం జెలుపుట ఆస్త్రీలు దానికి భయంపడుట యెఱింగెను. పిదప సీత నాశ్వాసించుపద్ధతి యెట్టిదని తనలోఁ దర్కించుకొనెను. తుదకు సంభాషింపక చూచివచ్చితి నని చెప్పఁ గిష్కింధకుఁ బోరాదనియు నిశ్చయించెను. ఏ భాషతో శ్రీరామోదంతముఁ దెలుపఁదగునా యని యెన్నియోవిధముల నాలోచించెను. అందందు రాక్షసాంగన లలసి దూరముగాఁ బండుకొని నిదురించుచుండఁగా శ్రీరామోదంతమును మధురవాక్కుల సంగ్రహముగాఁ దెలిపెను. సీత

తన్నుఁ జూడఁగా దిగివచ్చెను. ఇన్ని కార్యము లొనరించిన హనుమంతుఁడు నీవెవతుకవని, దేవతాదికాంతలలో నే తెగకుఁ జేరినదానవని ప్రశ్నించుట న్యాయ్యమా? ఆతనియభి ప్రాయ మేమి? ఈప్రశ్నములంబట్టి చూడఁగా నామె నపుడే చూచినట్లు, ఎవరైనది తెలిసికొనఁజాలనట్లు కనుపట్టు. ఈయది వంచకలక్షణము కాదా యని యెవ్వెవ్వరో సంశయములఁ గొందఱు వెలిపుత్తురు.

కొంద ఱిది మహాకావ్యము గాన నిందనేకార్థము లిమిడియున్నవనియు, వానిని రహస్యముగాఁ దెలుపవలసినదే గాని వ్రాయరాదనియు, శ్రీవైష్ణవులకొఱకే వ్రాయఁబడిన దనియు, నిందు శరణాగతి పరమధర్మముగాఁ జెప్పఁబడినదనియు నాచార్యులను బూజించి తమకున్నంతధనమును వారి కర్పించి వారియుచ్ఛిష్టము మహాప్రసాదమని సంభావించి దానిం గొను చున్నభక్తులే ముక్తికిం బోవ నర్హులనియు, వారు ముక్తికిం బోవుచుండఁగాఁ ద్రోవలో దేవతలు చలిపందిరులు పెట్టించి మంచిమజ్జిగ, వేయించినసెనగలు, పెరుఁగువడలు, దధ్యో దనము, చక్కెరపొంగలి మొదలగు మంచియాహారవస్తువుల నుంచుకొని మంచిగందమున ననేకపరిమళద్రవ్యములం గలిపి సిద్ధము చేసియుంచి, దివ్యవస్తుసంయుతముగాఁ దాంబూలము మఱియుఁ బెక్కుపదార్థముల నునిచి "స్వాములారా! దయ చేయుఁడు.వీనిం బరిగ్రహింపుఁడు. తమదాసీ యిదిగో వేచియు న్నది. సేవలంగైకొని వృద్ధినొందింపుఁ"డని ప్రార్థింతురనియు, నందందు దిట్టముగా భుజించుచు నుపహారములఁ గైకొనుచు శ్రీచందనపంకమును దేహమునకు మెత్తుచుఁ దాంబూలచర్వ ణమున నానంద మనుభవించుచు దాసీకలను బ్రేమార్ద్రవీక్ష

ణాదుల నానందపరవశులనుగాఁ జేయుచుఁ బోయి వైకుంఠ ద్వారకవాటమును వామపాదమునఁ దన్ని యాచార్యులవారు తమ్ము లోపలికి నెట్టగాఁ బోయి యందుఁబడి హాయిగానుందు రనియు నుపన్యసింతురు. ఏతాదృశగుణమణులు వైకుంఠము నకుం బోవఁగా దివ్యమగుమంచముపైఁ గూర్చున్న భగవం తుఁడు వీరిని జేరఁబిలుచును. అందలివిశేషము లగణ్యములు, అప్రమేయములు. అని యతీంద్రమతదీపిక యను శ్రీవైష్ణవ ప్రాణరూపగ్రంథము తెలుపుచున్నది. అందు సప్తమావతార మున ముక్తస్వరూపము. ముక్తునకు బ్రహ్మసామ్యము ననునది యు, నవమావతారమున ఈశ్వరునకు విభుత్వము. అను లోనగువానిం జూచిన విచిత్రవిషయములు తేలఁగలవు.

"అయమీశ్వరో ఒండసృష్ట్యనంతరం చతుర్ముఖవత్సకాలాపిష్వంతర్యా మితయా స్థిత్వా సృష్టిం కరోతి. విష్ణ్వవతారరూపేణ మనుకాలాద్యంత ర్యామిస్వరూపేణ స్థిత్వా రక్షకో భవతి. రుద్రకాలాంతకాదీనా మంత ర్యామితయా సంహారమపి కరోతి. అతః సృష్టిస్థితిసంహారకర్తా భవతి."

నవమావతారము. ౮౩ పత్రమునఁ గలదు.

"సూర్యకిరణద్వారాగ్నిలోకం గత్వా దినపూర్వపక్షోత్తరాయణ సంవత్సరాభిమానిదేవతాభిర్వాయునా చ పథి సత్కృతః సూర్యమండలం భిత్వా నభోరంధ్రద్వారా సూర్యలోకం గత్వా అనంతరం చంద్రవిద్యు ద్వరుణేంద్రప్రజాపతిభిర్మార్గప్రదర్శిభిరాతివాహికగణైః సోపచారైః సహ తత్తల్లోకానతీత్య ప్రకృతివైకుంఠసీమాపరిచ్ఛేదికాం విరజాం తీర్త్వా సూక్ష్మశరీరం విహాయామానవకరస్పర్శాదప్రాకృతదివ్యవిగ్రహయుక్తశ్చతు ర్భుజో బ్రహ్మాలంకారేణాలంకృత ఇంద్రప్రజాపతిసంజ్ఞక నగరద్వారపా లకాభ్యనుజ్ఞాయా శ్రీవైకుంఠాఖ్యం దివ్యనగరం ప్రవిశ్య."

అష్టమావతారము. ౨౨ పుట.

ఈభాగముం బరిశీలించిన శ్రీవైష్ణవసంప్రదాయతత్త్వము బోధపడును. ఇంకొక్కవిశేషము కనుపట్టెడు. ఈగ్రంథము కేవలపామరులకొఱ కేర్పడినదన్న శిరసా వహింపవలసినదే. ముముక్షువులకుం గూడ నన్నఁ ద్యజింపవలసినదే. పురాణగాథలు కూడ నింతకంటె వేయిమడుంగు లుత్తమము లనవచ్చును. ముక్తియనున దొకలోకమని, దానికిం ద్రోవలు నడుమనడుమ సత్కరించువారు, ఆలోకమున నొక దివ్యమందిరము. అందొకవ్యక్తి కూరుచుండి వీరినాహ్వానించుట యనునీమొదలగునవి యెంతమాత్రము విశ్వాసపాత్రములు గావు. ఆముక్తి స్వర్గసుఖములని చెప్పఁబడువానికంటె నింక నసంగతముగా నున్నది. అట్టిముక్తి యేనగరమునందైన దొరకవచ్చును. ముక్తి లోకమనునది యున్నదన్న వాదమునకంటెఁ దుచ్ఛవాదము లేదు. ఈగ్రంథము కేవలపామరులకు భక్తిని గలిగింప నేర్పడినదనియే నే నూహించువాఁడను. కావున నీగ్రంథమును గూర్చి చర్చింపను. మఱొక్కవిశేష మిందుఁ గలదు. ఈశ్వరుఁడు సృష్టిరక్షణసంహారకార్యములు చేయుటకొఱకు బ్రహ్మ విష్ణు రుద్రరూపముల నెత్తునని యనఁగా నంతర్యామిత్వమున నాయాకార్యములు చేయునని యాశ్రీవైష్ణవశిఖామణి వ్రాసెను. బ్రహ్మరుద్రులపేరులు వ్రాయునపు డంతర్యామిత్వమున నని, విష్ణువుపేరు వ్రాయునపుడు అవతారరూపమున నని వ్రాసెను. ఎట్లు వ్రాసిన నొకటియే భావము. ఈశ్వరుఁ డీమూర్తులయందు నున్నవాఁడని యర్థము కాకమానదు. అద్వైతమతవాద మిదియే. శాక్తులభావ మిదియే. భగవంతుఁ డొక్కఁడే సర్వాంతర్యామి యని, ప్రకృతివిశిష్టుఁడై సగుణబ్రహ్మ మనఁబడునని, తదవినాభావసంబంధము గలమహా

ప్రకృతి సకలకార్యములు తత్సాన్నిధ్యబలమునఁ జేయుననియు మన మెఱుంగవలయును. ఈయర్థం బ్రస్తుతపద్యమునం దీయభిప్రాయము తెలిపెను.

"ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయంస్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా."

అను గీతావాక్య మీయర్థమునే బోధించుచున్నదనియు,

"కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః,
ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః."

అనునదియు,

"వృష్ణీనాం వాసుదేవోఽస్మి, మునీనామప్యహం వ్యాసః,
మృత్యుస్సర్వహరశ్చాహం, రుద్రాణాం శంకరశ్చాస్మి,
రామశ్శస్త్రభృతామహమ్, ధాతాహమ్ విశ్వతోముఖః,
యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున,
న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరమ్."

అను నీగీతావాక్యములును బైనవ్రాసినయర్థమునే సిద్ధాంతీకరించుచున్నవి. కావున నీశ్వరుఁ డొక్కఁడే కార్యార్థ మాయాయధికారి పురుషులుగా నవతరించి యాయాయికార్యములు చేయుననియుఁ దద్వ్యతిరిక్తమగునది యేదియు లేదనియు దీనిసారము.

ఈమహాకావ్య మొక్కతెగవారికొఱకు నిర్మింపఁబడ లేదనియు భగవదవతార మొక్కతెగవారికొఱకనుట కేవ

లాసంగతమనియుఁ దోఁచుత మన మెఱుంగవలయు. భగవదవతారము సత్యసంరక్షణార్థ మనఁగా శిష్టులనుద్ధరించుటకే కాని యొకతెగవారికొఱకుఁ గాదు. కావునఁ దద్వ్యర్తనము మానవుల కుదాహరణభూతము. దానిననుసరించి మానవులు వర్తింపవలయునని దీనితాత్పర్యము. అట్టిమహాకావ్యమగు నీరామాయణమునందు సంశయము లుండరాదు. ఈఘట్టమున ననేక సంశయము లున్నట్లు తోఁచును. కాని నిపుణముగా నాలోచించిన శంకలు లేవనియే తోఁచును. పైన వ్రాసిన సందియములు తొలఁగునట్టి సమాధాన మెద్దియని యడుగుదురు. వినుఁడు. సమాధానమే యుండదను గుడ్డినమ్మకమును వదలించుకొనుఁడు. అపుడే యీసమాధానము మీమనస్సునకు నచ్చును.

హనుమంతుఁడు తాను రామదూతగా సీతను నమ్మింపనెంచెను గదా. ఆమెయో రాక్షసులు మాయావులని నమ్మియున్నది. వారిమూలమునఁ బెక్కుకడగండ్లను బొందినది. విసిగియున్నది. హనుమ యెపుడు వచ్చి యాచెట్టుమీఁదఁ గూరుచుండెనో యామె యెఱుంగదు (మూలప్రకృతికదా ఏల యెఱుంగదు? అనకుఁడు. కథ ననుసరించి వ్రాయుచున్నాఁడను. ఇదంతయు నటనమని వ్రాసితిఁ గదా. దానిని స్మరించుచుండుఁడు. ఈసందియము మీ డెందముల నలముకొనదు.) శ్రీరామనామ సంకీర్తనాదులమూలమున నాతఁడున్నట్లామె కనుఁగొనెను. హనుమ తోఁచుతనే తల్లీ! నీకష్టములం గంటి నన్నుచో నామె నాతోడ రావణుఁడు మాటలాడినదంతయు నాలకించెను గదా. కామాతిరేకమున, వాఁడు మాటలాడినట్లు (రావణునిమన స్సెఱుంగక) యీదూత గ్రహించెఁ

గాఁబోలును. ఇస్సీ! రామునితో నీమాటలన్నియుం జెప్పిన
నారాముఁ డేమి యనుమానపడునో యని లజ్జించునని హను
మంతుఁ డూహించుట న్యాయ్యము గదా. కావునఁ దానేమి
యు నెఱుంగనట్లు మాటలాడిన నామెయే తనకథను జెప్పును.
క్షణకాలము మాటలాడినపిదప నామెకు భీతి కొంతయడం
గును. ఊఱటయుఁ గల్గును. పిదపఁ జెప్పవచ్చునని యూహిం
చుట పొరపాటు కాదు. తాను క్రొత్తగా వచ్చి యడిగినట్లు
ప్రశ్నించుచుఁ బదిమాటలు కాఁగా, నింపుక యూఱట
యామెకుఁ దోఁచుననియు, నంతట శ్రీరామునిపత్నివని నాకుం
దోఁచెడునని చెప్పవచ్చుననియు, దాన నామెయుఁ దంత
మెఱుంగునవకాశ మొదవుననియు నావాయుకుమారుని
యూహయని మనము గ్రహించిన నెక్కుడుచిక్కు లుండవు.
ఎట్టివారలైనను క్షణకాలము మాటలాడినపిదపఁ దొలుత
నున్నంత యనుమానము నుంచుకొనరు. సఖ్యము సాప్తపదీన
మన వినమే. అనఁగా క్షణకాలము కలిసి నడిచిన మాటలాడిన
సజ్జనులతోటిమైత్రి కుదురునని కదా దానిభావము. హనుమ
యడుగు ధోరణింబట్టి యితఁడు సజ్జనుఁడే యని జానకియు
నమ్మునవకాశము గలదియగును. మఱియు నతఁడు మాట
లాడఁదగినభాష యేదనువిషయమున నెన్నియోశంకలం గాం
చెను. తుదకేదోవిధముగా వానిం దొలఁగించుకొని సమ
యము దొరకినది. దీనిని వ్యర్థపుచ్చరాదు. తెల్లవాఱును. ఆవలఁ
గార్యభంగమునకు నాయాలస్యము కారణమగునేమో యని
త్వరపడి చెంతకుఁ బోయి మాటలాడునట్లు చేసికొనంబూని
దేవతాదిభేదములం జెప్పి వారిలో నెవరికన్యకవని ప్రశ్నించె
నని మనము గ్రహించుట మంచిది. లేనిపోనిశంకలం గల్పిం

చుకొనరాదు. దాన సాధించు నుత్తమపురుషార్థ మెద్దియు లేదు. ఇంతమాత్ర మెఱుంగనివాఁడా వాల్మీకిమహాముని? అతీంద్రియజ్ఞానసంపన్నుఁడు గదా! పూర్వాపరవైషమ్యములు స్వోక్తివ్యాఘాతములు రాకుండ వ్రాయఁగలఁడని మనము తెలిసికొనుట శ్రేయస్కరము.

"కోను పుత్త్రః పితా భ్రాతా భర్తావా తే సుమధ్యమే. ౯
అస్మాల్లోకాదముం లోకం గతం త్వమనుశోచసి."

అని మూలము. ఇది కొంతదనుక నసంగతముగా నుండలేదా యని కొంద అందురు. కుమారుఁడు తండ్రి సోదరుఁడు భర్త యనువారు మరణించిన లోకులు విశేషించి దుఃఖింతురు. ఇం దెవరినిగూర్చి దుఃఖించుచున్నదానవని హనుమ ప్రశ్నించెను. ఇట్టివారు పోయినపు డెట్లు దుఃఖింతురో యట్లు దుఃఖించు చున్నదానవే. ఏల? అని హనుమంతునాశయము.

"రోదనాదతినిశ్వాసాద్భూమిసంస్పర్శనా దపి. ౧౦
న త్వాం దేవీమహం మన్యే రాజ్ఞస్సంజ్ఞావధారణాత్,
వ్యంజనాని చ తే యాని లక్షణాని చ లక్షయే. ౧౧
మహిషీ భూమిపాలస్య రాజకన్యాసి మే మతా,
రావణేన జనస్థానాద్బలాదపహృతా యది. ౧౨
సీతా త్వమసి భద్రం తే తన్మమాచక్ష్వ పృచ్ఛతః,

అని మూలము. ఇంతకుముందు మాటలాడినందునఁ గలిగినపరి చయమును బట్టి జంకువదలి హనుమంతుఁడు జనస్థానమునుండి రావణుఁడు బలవంతముగాఁ దెచ్చినసీతవే నీవగుదు వన్నాఁ డు. వెంటనే "భద్రం తే" అనియె. నీకు మేలు గలుగుఁ గాక. అని యూఱడించి నీవార్తలం దెల్పుము. అడుగుచున్నవాఁడ

నని మెల్ల మెల్లగ నా మెమనస్సు రంజిల్లఁ బలికెను. ఈమాటల ధోరణిం బరికింపఁగా నా మెకుఁ దనవిషయమున శంక లుదయింపకుండఁ జేయుటకై న్యాయ్యముగా మాటలాడెనని తేలెడిని. పండితమానులు గాని దూతలలక్షణము లెవియేయనియుఁ గా ర్యానుకూలము లనఁగా నిట్టులుండవలయుననియు మన మెఱుంగవలయును.

"దూతం చైవ ప్రకుర్వీత సర్వశాస్త్రవిశారదం,
ఇంగితాకారచేష్టజ్ఞం శుచిం దక్షం కులోద్గతం. ౬౩
అనురక్తశ్శుచిర్దక్షస్స్మృతిమాన్ దేశకాలవిత్,
వపుష్మాన్ వీతభీర్వాగ్మీ దూతో రాజ్ఞః ప్రశస్యతే. ౬౪
అమాత్యే దండ ఆయత్తో దండే వైనయికీ క్రియా,
నృపతౌ కోశరాష్ట్రే చ దూతే సంధివిపర్యయౌ. ౬౫
దూత ఏవ హి సంధత్తే భినత్త్యేవ చ సంహతాన్,
దూతస్తత్కురుతే కర్మ భిద్యంతే యేన మానవాః. ౬౬
సవిద్యాదస్య కృత్యేషు నిగూఢేంగితచేష్టితైః,
ఆకారమింగితం చేష్టాం భృత్యేషు చ చికీర్షితం." ౬౭

మనుస్మృతి. ౭ అధ్యాయము.

అను నీస్మృతిప్రతిపాదితార్థమునకుఁ దగినవాఁడే భృత్యుఁ డనఁ దగువాఁడు. అట్టియోగ్యతలన్నియు నిట నీహనుమంతుని యందుఁ గానవచ్చుననుట పాఠకమహాశయులకుం గ్రొత్తది కాదు. దేవతాకాంతయని యేల యనుమానింపరాదని తానే శంకించుకొని భూస్పర్శము లోనగుకారణములఁబట్టి మానవకాంత యని భావించితి నని సీతకుం దెలిపి తర్వాత సీతవా యేమి యని ప్రశ్నించెను. దీనింబట్టి యాతనిసంభాషణముల

నాలకించినంతనే యాజానకి నిస్సంశయయై బదులుచెప్ప నుంకించునని మన మూహింపఁగలము.

"యథా హి తవ వై దైన్యం రూపం చాప్యతిమానుషం. ౧౩
తపసా చాన్వితో వేషస్త్వం రామమహిషీ ధ్రువం,"

అని మూలము. దైన్యము రూపము వేషము ననువానిం బరి కింపఁగా నీవు తల్లీ! శ్రీరామభద్రుని ధర్మపత్నివే. సత్యము. అని పలికెను. ఈమాటల వరుసంబట్టి హనుమంతునిసౌజన్యము కార్యదక్షత్వము తేటపడును. తొలుతనే యీమాట యేల పలుకరాదన్న "శుష్కే వృక్షే స్తిష్ఠత్యగ్రే" యనుట యెంత సమంజసమో యట్లే ముందేపల్కియుండిన నుండును. నే విన్న లక్షణములం బట్టి చూడఁగా నీవు శ్రీరామునిధర్మపత్నివే యని దృఢమగుచున్నదని హనుమద్వాక్యసారము.

"దుహితా జనకస్యాహం వైదేహస్య మహాత్మనః. ౧౬
సీతా చ నామ నామ్నాహం భార్యా రామస్య ధీమతః,
సమా ద్వాదశ తత్రాహం రాఘవస్య నివేశనే. ౧౭
భుంజానా మానుషాన్ భోగాన్ సర్వకామసమృద్ధినీ,"

అని మూలము. సీత తనచరిత్రమును దెలుపుచు మహాప్రకృతి ననియు నీదుఃఖము నటనమే యని గూఢముగా నుండునట్లు తెల్పుచున్నది. "మహాత్మనః వైదేహస్య జనకస్యాహం దుహితా నామ్నా నామ సీతా చ." అని యన్వయక్రమము. మహాత్మనః వైదేహస్య=అను నీరెండువిశేషణములు సాభి ప్రాయములు. గొప్పపుణ్యము చేసినవాఁడు జ్ఞాననిధియునగు జనకునకు దుహితను. పేరుచేఁ బ్రసిద్ధముగా సీత యనఁబడు దానను. అనఁగా భావమేమి? ఆత్మజనక దుహితననియోఁ

గదా. "దోగ్ధిధనహరణేన రిక్తీకరోతి పితరావితిదుహితా." అని వ్యుత్పత్తి. ధనహరణముచే జనకులను దరిద్రులనుగాఁ జేయునది. అని యర్థము. నామూలమున నెంతధనము వ్యయము కావలయునో అంతయు వ్యయమగునట్లు చేయు నాతనికి దుహిత ననిపించుకొంటినని భావము. ఆరాజునకు నాకుంగల బాంధవ మంతయే యనునర్థమును సీతాశబ్దమువలనఁ దెలుపుచున్నది. నాఁగటిచాలున దొరకినదానను. అయోనిజననిభావము. మహాప్రకృతినని సారము. ధీమతః రామస్య భార్యా = జ్ఞానవంతుఁడగు భగవంతునకు భార్యను. అనఁగా నన్ను భరించువాఁ డొక్కభగవంతుఁడే యని భావము. అయోనిజనై సీతయనుపేరఁ బిల్వఁబడుచు జ్ఞానియు నుదారాశయుఁడు నగుజనకునింట నేయే సంస్కారముల నందవలయునని కర్మసిద్ధాంతమో దానిని బాలించుచు నున్నదానను. పరమేశ్వరుఁడగు రామునకు భార్యను. నన్ను భరింపఁగలవాఁ డొక్కసర్వేశ్వరుఁడే. ఇతరులు లేరని భావము. ఈయర్థమునే క్రిందివాక్యలు సిద్ధాంతము చేయుచున్నవి."తత్ర రాఘవస్య నివేశనే ద్వాదశసమా అహం మానుషాన్ భోగాన్ భుంజానా సర్వకామసమృద్ధినీ సతీ (అభవమ్)" అని శేషము. రఘువంశమునందు నసరణ్యుని తపఃఫలముగా నవతరించిన శ్రీరామచంద్రుని నివాసమగు నయోధ్యాపురమునఁ గల మందిరమునందు మానవు లనుభవించుసుఖముల ననుభవించుచు సర్వకామసమృద్ధి గలదాననై పండ్రెండువత్సరము లుంటిని. మానవభోగముల ననుభవించుచు ననఁగా భావమేమి? మానవస్త్రీని గాదనియే గాక మఱి యేమగును? "మానుషానిత్యనేనాత్మనో ఽమానుషత్వం స్వాభావిక మితి

సూచ్యతే” అని వ్యాఖ్యాతయు వ్రాసెను. సీత యయోనిజ యని యొప్పుకొననివారిమాట చెప్పఁజాలను గాని యొప్పుకొనువార లిట్టిపరదేవి భర్తనెడఁబాసి దుఃఖములపాలయ్యె నని రక్షకాంతరము నపేక్షించెనని యభిప్రాయపడుట యనుచితమే. అట్టివా రీతత్త్వమున వ్రాసినవిశేషార్థముల నంగీకరింపక తప్పదు గదా. పండ్రెండువత్సరములే యేల యుండవలయును? అని యొకరు నన్నడిగిరి. దశరథునితపస్సునకు ఫలమాకాలమే. పుత్రప్రేమమున శ్రీసీతారాములను జూచునంతటి పుణ్యముచేసినవాఁడు గానఁ దత్ఫలమును గలిగింపనంతకాలమే యుండిరని భావము. వారికిదియే సమాధానము. “న హి కారణం వినా కార్యస్యోత్పత్తిః” అన్నన్యాయము ననుసరించి వనగమనమునకుఁ దొలికారణముగాఁ బట్టాభిషేకము చేయు నుద్యమమున నాతని కాదరము గల్గెను. కర్మసిద్ధాంతమెంతబలవత్తరమో యీభాగ మెంతచక్కఁగాఁ దెలుపుచున్నదో యెఱుంగఁ బ్రయత్నింపం దగుంగదా.

“న పిబేయం న ఖాదేయం ప్రత్యహం మమ భోజనం. ౨౦

ఏష మే జీవితస్యాంతో రామో యద్యభిషిచ్యతే,

యత్తదుక్తం త్వయా వాక్యం ప్రీత్యా నృపతిసత్తమ. ౨౧

తచ్చేన్న వితథం కార్యం వనం గచ్ఛతు రాఘవః,”

అని మూలము. పట్టాభిషేకప్రయత్నము చేయుచుండఁగాఁ గైక చెప్పినమాట లివి. ఇపుడు రాముఁ డభిషిక్తుఁ డయ్యెనేని ఆయభిషేకమే నాజీవితాంతము. అనఁగా భావమేమి? శాశ్వతముగా భరతునకు రాజ్యమిమ్మని యడిగినదా కైక? పదునాలుగేండ్లే యడిగినది. ఏల? కైకనుగూర్చి యయోధ్యా

కాండముననే వ్రాసితిని. ఇపుడు పట్టాభిషేకమహోత్సవము సాగిన నేను జీవించి ఫలములేదని కదా కైక యనియెను. ఏల? తనజన్మ మెందులకో యాకాంక్ష విూపట్టాభిషేకము సాగిన నెఱవేఱదు. కావుననే గట్టిగా నడిగినది. రాజా! నీవాక్యము సత్యమయే నిపుడే రాముఁ డడవికిం బోవుఁగాక. అనఁగా నాలసింపక పోవలయునని కదా భావము. అభిషేక విఘ్నమే జగన్మంగళహేతు వని తాత్పర్యము.

"దద్యాన్న ప్రతిగృహ్ణీయాన్న బ్రూయాత్కించిదప్రియం. ౨౫
అపి జీవితహేతోర్వా రామస్సత్యపరాక్రమః,"

అని మూలము. రామునిమహత్త్వమును సీత యాంజనేయు నకుఁ జెలుపుచున్నది. ఇచ్చువాఁడు గాని ప్రతిగ్రహించు వాఁడు కాఁడు. అనఁగా సర్వభూతవాంఛితప్రదాత గాని యెవరిమూలమున నేదియు గ్రహింపఁడు. అనుటంజేసి రామున కిచ్చువాఁడే లేఁడని తాత్పర్యము. అప్రియము నించుకయేఁ బలుకఁడు. విరోధమున్నఁ గదా యప్రియములు పల్కుట. సర్వభూతసముఁడని భావము. ఎట్టియాపత్తునందుఁగూడ నొరుల సాయ మపేక్షింపఁ డనఁగా నితరు లేసాయ మాతనికిం జేయఁ జాలువారు లేరని తాత్పర్యము. సర్వభూతాధిపతి యని భావము. "సత్యపరాక్రమః సత్యే విషయే పరాక్రమో యస్య స సత్యపరాక్రమః." అని సమాసము. సత్యవిషయమునఁ బరా క్రమముం బూనువాఁడని యర్థము. సత్యసంరక్షణమే పౌరుష ప్రదర్శనఫలమని భావము. శ్రీరామావతారము సత్యసంరక్ష ణార్థమే కదా. అని సీత పలుకుటంజేసి శ్రీరాముఁడు సర్వేశ్వ రుఁడని స్పష్టము. తాను సర్వేశ్వరి యనియుఁ దేటపఱచెను.

"విసృజ్య మనసా రాజ్యం జనన్యై మాం సమాదిశత్,
సాహం తస్యాగ్రతస్తూర్ణం ప్రస్థితా వనచారిణీ. ౨౭
న హి మే తేన హీనాయా వాసస్స్వర్గేఽపి రోచతే,"

అని మూలము. హనుమంతా! నన్నుఁ గౌసల్యకడ నుండుమని రాముఁడు తెల్పెను. రామునిం గూడియుండఁగోరిన నే నతనికి ముందే ప్రయాణముచేసితి. ఏల? రాముని వదలి సుఖస్థానమగు స్వర్గమున నుండుటకుంగూడ నిష్టపడను గదా. అనఁగా నా రాము నెడఁబాసి యేసుఖము నొందఁగోరనని భావము. తద్విరహమును గోరనని సారము.

"ద్వౌ మాసౌ తేన మే కాలో జీవితానుగ్రహః కృతః. ౩౧
ఊర్ధ్వం ద్వాభ్యాం తు మాసాభ్యాం తతస్త్యక్ష్యామి జీవితం,"

అని మూలము. రెండునెలలుగడువు రావణుఁడు నాకొసంగెను. పిదప జీవితమును వదలుదును. రెండునెలలదనుక నోర్చువాఁడ ననియె. అనఁగా నంతయే యీదేహమున వాఁ డుండఁగలఁడని యామెభావము. ఆగడువు దాఁటఁగా నిట జీవితము వదలుదునని రామునకుం దెల్పుము. దానిభావ మా శ్రీరాముఁడే యెఱుంగును. రెండునెలలకుఁబైన నిం దుండరాదు. భక్తానుగ్రహార్థము నందిగ్రామమునకుఁ బోవలయునని సీత యాశయము.

## —సీత హనుమంతుని శ్రీరామునిగుణముల నడుగుట.—

* ఇట్లు లాభూతనయ దీనయై పలుకఁగా నాపావని యాలకించి యూఱడింపఁబూని యిట్లు పలికెను. తల్లీ! శ్రీరాము

* ఇది ముప్పదినాల్గవసర్గమునఁ గలదు.

ననుమతి దూతనై వచ్చితిని. శ్రీరామభద్రుఁడు కుశలియై తన కుశలము నీకుం దెల్పుమనియెను. బ్రహ్మాస్త్రము వేదముల నెఱింగి దశరథకుమారుఁడగు రామచంద్రమూర్తి సీతాఁ దన కుశలమును జెప్పుమన్నాఁడు. రామునకుఁ బ్రియుఁడై యతని ననుసరించుచుండు సౌమిత్రి శోకాతిరేకమునఁ దలవంచి నమస్కారము గావించెద ననియెను. ఆమాట లాలకించి ప్రేమము మితిమీఱఁగా రోమాంచములు కలుగఁగా హనుమం గాంచి మానవుఁడు బ్రదికియుండిన శతవత్సరములకైనఁ దప్పక మహానంద మనుభవించునని ప్రసిద్ధముగానున్న యీవార్త నా విషయమున నన్వర్థముగాఁ దోఁచుచున్నది. అంత నారామదూతయందు జానకి కత్యంతప్రీతి గలిగినది. వారిరువురు నిట్లు సందేహము మాని మాటలాడఁ బూనిరి. హనుమయు నామెపలుకు లాలకించి చెంతకుఁ బోవ నారంభించెను. ఎంతయెంత చెంతకుఁ బోవఁజొచ్చెనో యంతయంత ఆమెకు రావణుఁడే యావేషమున వచ్చెనేమో యనుసందియము కలుగఁ జొచ్చెను. అపుడు జానకి హా! వీనిముం దేమేమో పల్కితిని. ఇట్లనవచ్చునా? ఉచితము కాదు కదా. అక్కటా! వెనుక ముందులాలోచింపక యిట్లు మాటలాడితిని గదా. ఆదుష్టుఁడే యీరూపమున వచ్చియున్నాఁ డనియె. ఇట్లు పలికి దీనయై యాయశోకశాఖను వదలి క్రిందఁ గూరుచుండెను. దుఃఖపీడిత యగు నాదేవిం గాంచి పావని నమస్కరించెను. ఆమె భీతయై మరల నాతనిం జూడకుండెను. ఇట్లు నమస్కరించియున్న యాతనింగని రావణుఁడు స్వభావముననే మాయావి. ఇంతకు ముందే వచ్చి నన్నెంతయో శ్రమపఱచినాఁడు. వంచకత్వమున నాకు సంతోషముగలిగింప నాతఁడే నీరూపమున వచ్చెనా?

ఇట్లు నాకుఁ బాపముం గలిగించుట ధర్మము గాదు. తన సాధారణరూపమును వదలి సన్న్యాసిరూపమున జనస్థానమున నాకుం గనఁబడిన యారావణుఁడవే నీవు. రాక్షసా! నీవు కామరూపుఁడవు. నేనో సంతాపములచేఁ గృశించియున్నదానను. మహాదుఃఖముల నింతకుముందే యనుభవించితిని. ఇంకను నన్నలయించుట నీకు మంచిది కాదు. ఇప్పటి నాయనుమానము సరియైనది కాదు. ఏలనఁగా నిన్నుం జూడఁగా మనస్సున సంతోష ముదయించుచున్నది. రామదూతవుగనే వచ్చియుంట నిశ్చయమేయైన నీకు శుభము గలుగుం గాక. వానరవర్యా! శ్రీరామకథలు నాకెంతయుఁ బ్రియములగుం జుమీ. కనుక నిన్నడిగెదను. నా శ్రీరామునిగుణములఁ దెల్పుము. నీవు నామనస్సు నాకర్షించుచున్నావు. చాలకాలము క్రింద రామునినుండి యపహరింపఁబడిన నేను స్వప్నమం దొకకపిని రామదూతను జూచుచున్నాను గదా. ఆహా! స్వప్న మెంత సుఖముగా నున్నది? కలయందైన నా రామలక్ష్మణులజాడఁ గందునేని కృశించిపోవక యుందుఁగదా. శ్రీరామునకుంబలె స్వప్నమునకుంగూడ నాపై నీసుగలదు గదా. ఏమిచేయుదును? ఇది నాకుఁ గలగాఁ దోఁపలేదు. కలలో వానరముం గాంచిన మేలించుకయుం గలుగదు. నాకేమో యిపుడు సంతోషము కలుగుచున్నది. సర్వదా శ్రీరామకుశలము వినఁ గోరుచునే యున్నాను. ఆవాంఛయే యీకపిరూపముగా మాఱి భ్రాంతి నొంద నన్నుఁ జేయుచున్నదో. లేక యున్మాదమా? లేక యెండమావులుంబోలె నొకదానిని వేఱొకదానినిగాఁ జూచునట్లు చేయుచున్నదియా? ఉన్మాదముగాని క్రొత్తచిత్తవిభ్రాంతి

గాని కాదు. తక్కిన రెండును గావు. నేను నన్ను నీకపిని జక్కఁగాఁ దెలిసికొనుచున్నాను. అనియెను.

ఇట్లు లాజానకి పెక్కువిధముల నూహాపోహలా? దను జూఁడా కాఁడా అని యీపక్షముల బలాబలములం బోల్చి యోజించుచుండఁగా రక్కసులు కామరూపు లగుదురని తలంచుకొని యాకపిని రావణుఁడనియే తలంచెను. ఇట్లు తలంచి యతనితో నేమియు భాషింపఁ బూనక యుండెను. హనుమంతుఁడు సీతయాశయము నూహించి యామెకు నుల్లాసము గలిగించుపలుకుల నిట్లు శ్రీరామగుణములం దెల్పఁ బూనెను. సూర్యతేజము గలిగి చంద్రునివలె నెల్లరకు నింపు గలిగించుచుఁ గుబేరునిం బోలి సర్వలోకములకు రాజరాజయి, మహావిష్ణువుంబోలి పరాక్రమము గలిగి, కీర్తియలరార, బృహస్పతివలె సత్యమునూని మధురవాక్కులు వెలయుచుండ శరీరముందాల్చిన మన్మథునివలె సుందరాకారుఁడై మనోహరుఁడై కాంతిమంతుఁడై, కోపమును యుక్తవిషయములయందే చూపుచుఁ గోపము వ్యర్థముగాకయుండ దుష్టులనుశిక్షించుచు నెల్లరకంటె మిన్న యనంబరఁగి మహారథుఁడై సర్వలోకాశ్రయుఁడై యెవ్వఁడు వెలయునో యట్టిశ్రీరాముని మృగరూపమున దూరమునకుం బోవునట్లు చేసి యతఁడు లేనితఱి నిన్నపహరించితెచ్చిన రావణునకుం గలుగఁబోవుఫలమును దల్లీ! కన్నులారఁ జూడంగలవు. కొలఁదిదినములలోఁ గోపంబున మండుచున్న నిప్పులంబోని శరములఁ బఱఁగించి యప్రతిహత పరాక్రమశాలి రావణుని వధింపనున్న యాశ్రీరాముఁడు పనుప దూతనై నీకడ కరుదెంచితిని. శ్రీరాముఁడు నిన్నెడఁ బాసి పగలుఁ బొగులుచు నీక్షేమము నడుగుమనెను. సామి

త్రియు నమస్కరించి నీక్షేమ మడుగుమనియెను. తల్లీ! శ్రీరామునకు సఖుఁడు, వానరనాయకుఁడునగు సుగ్రీవుఁడు నీకుశల మడుగుమనియె. శ్రీరామలక్ష్మణసుగ్రీవులు ప్రతి దినము నిన్నే తలంచుచున్నవారు. దేవీ! రక్కసులకుం జిక్కియు భాగ్యవశమునఁ బ్రాణములతో నున్నావు కాని యితరము కాదు. నీవు శ్రీరామసౌమిత్రులను, వానరచమూ సమన్వితుఁడగు సుగ్రీవుని శీఘ్రము చూడఁగలవు. నేను సుగ్రీవ మంత్రిని. హనుమన్నామక వానరుఁడను సాగరమును దాఁటి లంకానగరముం బ్రవేశించితిని. నేను శౌర్యము నాశ్రయించి యీదురాత్మునిశిరమునఁ బాదమునిచి నిన్నుం జూడ నిచ్చోటికి వచ్చితిని. తల్లీ! నన్నెట్టివానినిగా భ్రమించెదవో యట్టివాఁడఁ గాను. ఏశంకల నొందకుము. నామాటయందు శ్రద్ధనునుపుమా యని వేఁడెను.

మహాత్ములారా! భాగమున నిందు విమర్శనార్హము లగు విషయముల నెమకుదము.

"యో బ్రాహ్మమస్త్రం వేదాంశ్చ వేద వేదవిదాంవరః,
స త్వాం దాశరథీ రామో దేవి కౌశలమబ్రవీత్." 3

అని మూలము. "బ్రాహ్మమస్త్రం యో వేద. అనేన సర్వాస్త్ర పారగత్వముక్తం. తదస్త్రస్వామినః బ్రహ్మణః సర్వజగత్సమష్టిత్వ వత్ తదస్త్రస్యాపి సర్వాస్త్రసమష్టిత్వాత్. వేదాంశ్చేత్యనేన సర్వకర్మమార్గపారగత్వం వేదవిదాంవర ఇత్యనేన జ్ఞానమార్గ పారగత్వ ముక్తమ్." అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి. ఇందు శరణాగతికి, భగవంతునికంటె నాచార్యుఁడు శ్రేష్ఠుఁడనుటకు నవకాశము లేదు గాన గోవిందరాజు లేమియు వ్రాయరైరి. బ్రహ్మాస్త్ర మెఱింగినవాఁ డనుటంజేసి సకలాస్త్రముల నెఱింగిన

వాఁడనియు, వేదముల నెఱింగినవాఁ డనుటంజేసి సర్వకర్మ మార్గముల నెఱింగినవాఁడనఁగా నాచరించువాఁడనియు, "వేద విదాంవరః" అనుటంజేసి వేదములతత్త్వము నెఱింగినవాఁ డనఁగా జ్ఞానమార్గముల నెఱింగినవాఁడనియు నర్థములని వ్యాఖ్యయాశయము. బ్రహ్మాస్త్రము, ప్రధానముగా నేల చెప్పఁబడెనని విచారింతము. వేదమంత్రముల నాగమనియ మము ననుసరించి ఋషిచ్ఛందోదేవతాబీజశక్తి కీలకములను షడ్విధములు గలవానినిగా నొనరించి కాని యుపాసింప నవ కాశము లేదు. అట్టిమంత్రములు కోలఁదిగా నున్నవి. వేదార్థ మును గ్రహించి కార్యోద్దేశమును దెలుపు బీజాక్షరములను జేర్చి దాని నాగమమంత్రమని విధించి యుపాసింతురు. అట్టివే వేనవేలుగా నున్నవి. బ్రహ్మమనఁగా వేదము. తత్సారమంత్ర మనఁగా గాయత్రి. తద్దేవతాక మగునదియే బ్రహ్మాస్త్రము. దాననే బ్రహ్మ యింద్రజిత్తున కొసంగెను. దానినే యుద్ధ సమయమున శ్రీరాముఁడు గౌరవింపఁదగునని చెప్పెను. ముందు దానిం బఠింపఁగలదు. కనుక వేదమంత్రసమన్విత మగుట బ్రహ్మాస్త్రము ప్రధానముగా నిటఁ జెప్పఁబడినదని యెఱుంగందగు. వేదముల నెఱింగినవాఁ డనఁగా దా నవత రించినది మానవులకు సత్యధర్మముల నేర్పుటకుఁ గాన సర్వ సత్కర్మములను జక్కఁగాఁ దా నాచరించువాఁడని యర్థము. కేవలోపదేశమునఁ గాక సత్కర్మముల నాచరించి యితరులకు మార్గదర్శకుఁ డగుటయే ముఖ్యమని శ్రీరామునిభావము.

"కళ్యాణీం బత గాథేయం లౌకికీ ప్రతిభాతి మా,
ఏతి జీవంతమానందో నరం వర్ష శతాదపి."

అని మూలము. ఈ రామాయణార్థమునుండియే కాఁబోలు "బ్రదికియుండిన శుభములు పడయవచ్చు" నన్న కింవదంతి గలిగినది. మానవులు బ్రదికియుండినయెడల నూఱేండ్లకయినను దప్పక యానందము నొందును. అను నీజనప్రవాదము నాయందు సార్థకమయ్యెను. దీనిచే నెట్టివానికైన నొకప్పుడే నానందము కలుగకపోదు. ఒక్కసత్కార్యమైనను జేసియుండక పోఁడని భావము. తత్కార్యఫల మెప్పటికైనఁ గలుగును. ఇందులకే "శరీరమాద్యం ఖలు ధర్మసాధన"మ్మని న్యాయము వర్తిల్లినది. శరీరమును గాపాడుకొనవలయు. ఎందులకు? ధర్మమును సాధించుటకొఱకు. ఈనీతిని దృఢపఱచుటకే ఆత్మహత్య మహాపాతకమని చెప్పఁబడినది. ఎన్నిశ్రమములకు నోర్చియైన శరీరమును గాపాడుకొనవలయు, దానిచే ధర్మము నార్జింపవలయు నన్నన్యాయమును సీత సందర్భము ననుసరించి మనకు బోధించుచున్నది. భగవత్సేవకై దేహమును గాపాడు కొనవలయునని సారము.

> "యథా యథా సమీపం స హనూమానుపసర్పతి,
> తథా తథా రావణం సా తం సీతా పరిశంకతే." ౯

అని మూలము. సీతాదేవి యీమూలమున స్త్రీలకొక సదాచారమును దెల్పుచున్నది. ఎంతమంచిమాటలఁ జెప్పుచున్నను బరపురుషుని దూరముగనే యుంచవలయు. వానిసమీపమున నుండరాదు. ఆతనిశీలము బాగుగాఁ దెలిసినంతవఱక దగ్గఱకుఁ జేరనీయరాదు అని. కలిసియుండిన దుర్వృత్తులు తొలఁగుననుట యెంతహేయమో దీనినుండి కనుఁగొనవచ్చును. ఈనీతిని దృఢపఱచుటకే సీత తనయూహలఁ దెల్పుచున్నది. ఇట్టు లందఱు ననుమానించి పరిశీలింపవలయునని

స్త్రీలకు నీతిని దెల్పుచున్నదని భావము. కపటాత్ములు మంచి మాటలు పలికి వంచింపఁ బూనుదురని తెలుసుకొని యూహింప వలయు. బుద్ధిబలము నుపయోగించి పరీక్షింపవలయునని యీ హితోపదేశతాత్పర్యము. మహాప్రకృతి వచ్చినవాఁ డెవఁడని తెలిసికొనలేదనిన ననుచితము కదా.

> "అహో ధిగ్దుష్కృతమిదం కథితం హి యదస్య మే,
> రూపాంతరముపాగమ్య స ఏవాయం హి రావణః." ౧౦

అని మూలము. ఈయూహా ననుసరించి బుద్ధిబలముకొలఁది మెలఁగవలయుననియు, ముందువెనుక లాలోచింపక యెవ్వానిని విశ్వసింపరాదనియు దీనిసారము. సీతారాములు తమయూహాల ననుసరించియుఁ బ్రవృత్తిని దెలిపియు లోకులకు సదాచార మును బోధింతురనియు, వారియవతార ముపదేశమునకంటెఁ దమ ప్రవర్తనరూపమునఁ దెలుపుటకే యనియు మన మెఱుంగవలయు.

> "తామశోకస్య శాఖాం సా విముక్త్వా శోకకర్శితా,
> తస్యామేవానవద్యాంగీ ధరణ్యాం సముపావిశత్." ౧౧

అని మూలము. "యద్యపి పూర్వం శింశుపాశాఖావలంబన ముక్తం. తథాపి శింశుపాశాఖా అశోకసంవళితేతిక్వచిచ్ఛింశుపే త్యుచ్యతే. క్వచిదశోక ఇతి. అతోన కశ్చిద్దోషః." అని గోవింద రాజులు. "అశోకస్య అశోకవనస్థశింశుపావృక్షస్యేత్యర్థః." అని మహేశ్వరతీర్థులును వ్రాసిరి. శింశుపాశోకములు కలిసి యున్నవని యింతకుంబూర్వమే వ్రాయఁబడినది. కావున నిట స్వోక్తివ్యాఘాతదోషశంక నిరస్తమే యని యెఱుంగందగు.

> "మాయయాం ప్రవిష్టో మాయావీ యది త్వం రావణస్స్వయం. ౧౪

ఉత్పాదయతి మే భూయస్సంతాపం తన్న శోభనం,

... ... ... ...

ఉపవాసకృశాం దీనాం కామరూప నిశాచర. ౧౬

సంతాపయసి మాం భూయస్సంతప్తాం తన్న శోభనం,"

అని మూలము. ఇందు సీత భావమేమి? రావణా! పూర్వము మోసమున నన్నుం దెచ్చితివి. మరల నీవు నాకు సంతాపమును గల్గింతువేని నీకు శుభము లేదు. అనఁగా నపుడు శాపానలజ్వాలల దగ్ధముచేయక వదలితిని. మరల నట్లే మోసముచేయఁబూనితివే నింక బ్రదుకఁజాలవు. మఱియు నోరి దుష్టాత్మా! ఉపవాసములచేఁ గృశించినదానను. అనఁగా శాపమీయ సిద్ధముగనున్నానని యిది సూచించును. దీనురాలను. ఇంక నిన్ను క్షమింపఁజాలనను నర్థము నిది తెల్పును. "కామరూప" అనునది నీవేరూపముననున్న నాశాపము తగులును జుమీ యనుభావమును బోధించును. ఇపుడు విశేషించి దుఃఖమున నున్నదానను. ఇట్టి నన్ను వంచింపఁ బూనుదువేని యోర్పు నిలువదు. శపింపక వదలనను హెచ్చరికను దెల్పును. అనఁగా దుఃఖము లోర్పును రూపుమాపుననియు నట్టివారలకు మఱేంత బాధకల్గించుట మిక్కిలి హానికరమనియుఁ దాత్పర్యము.

"మనసోఽపి మమ ప్రీతిరుత్పన్నా తవ దర్శనాత్,

యది రామస్య దూతస్త్వమాగతో భద్రమస్తు తే." ౧౮

అని మూలము. ఈభాగము మనకు

"సతాం హి సందేహపదేషు వస్తుషు

ప్రమాణమంతఃకరణప్రవృత్తయః,"

అనునీతిని బోధించుచున్నది. ముందు మేలు కలుగఁబోవునేని అపుడెంత కష్టములలోనుండిన నుత్సాహ ముదయించును. కర్మసిద్ధాంతతత్త్వ మదియే కదా. కర్మఫలములు శుభము లగుచో నుత్సాహము, లేకయున్న విచారము తటాలున గలుగుటకుం గలకారణ మేమి? కర్మమే యందులకుం గారణ మని సీతాదేవి తెలుపుచుండుపలుకులు మనకుఁ దెలుపుచున్నవి. ఆర్యా! నీవు రామదూతవే యైన శుభముగలుగుఁ గాక. అని సీత యనియెఁ గదా. నీచరిత్రము సర్వజనస్తోత్రపాత్ర మగును గాక యనియే కదా యాజగజ్జనని యాశీర్వదించెను. ఆ యాశీస్సుబలమే సుందరకాండ పారాయణఫలముగా హను మంతునకు శాశ్వతయశస్సు నెలకొనియెనని మన మూహింప వలయును. లేకయున్నఁ దక్కిన కాండములకంటె సుందరకాండ మునఁ గలవిశేష మేమి? సత్కార్యనిరతు లగువారికి భగవ దనుగ్రహము తనయంతన తానే కలుగునని యీభాగము నందు సారమని మనము గ్రహింపవలయును.

"కిన్ను స్యాచ్చిత్తమోహోఽయం భవేద్వాతగతి స్త్వియం. ౨౩
ఉన్మాదజో వికారో వా స్యాదియం మృగతృష్ణికా,
అథవా నాయమున్మాదో మోహోఽప్యున్మాదలక్షణః. ౨౪
సంబుధ్యే చాహమాత్మానమిమం చాపి వనౌకసం,
ఇత్యేవం బహుధా సీతా సంప్రధార్య బలాబలం. ౨౫
రక్షసాం కామరూపత్వాన్మేనే తం రాక్షసాధిపం,"

అని మూలము. స్వప్నము లనేకకారణముల ననుసరించి వచ్చును. వానిని మతిబలముననుసరించి చక్కఁగా విమర్శించి

యొట్టిదోషములు లేనితటి వచ్చినస్వప్న మే ఫలమునొసంగునని తలంపవలయుననియు, వచ్చినస్వప్నమెల్ల ఫలము నీఁజాల దనియు నీభాగము మనకుఁ దెల్పుచున్నవి. సీతయు నిట్లే విత ర్కించివితర్కించి రక్కసులు కామరూపులగుట నితఁడు రావ ణుఁడే యని తలంచెను. ఒకరు చెప్పునదియే నమ్మక బుద్ధిబల మున నాలోచించి యిదమిత్థమ్మని నిశ్చయింపవలయుననియే యిందలిసారము.

"దిష్ట్యా జీవసి వైదేహి రాక్షసీవశమాగతా." 32

అని మూలము. వైదేహి=విదేహదేశపురాజునకుఁ బుత్త్రివి. జ్ఞాని యగురాజు నిన్నుఁ గూఁతుగా భావించెను. కనుక నే రాక్షసులచేతం జిక్కియు మాయదృష్టమున జీవించియున్న దానవు. అని హనుమంతుఁ డనియె. భావమేమి? ఎన్నికష్టము లలముకొన్నను గర్మఫలానుభవమున కీలోకమున నవకాశ ముండునే నట్టివారికిఁ గీడుగలుగదనుట సిద్ధాంతము. మనుష్య భక్షకులగు రాక్షసులుగాని వ్యాఘ్రాదిక్రూరమృగములుకాని చుట్టుకొన్నను గర్మమే వానికిఁ జంపుబుద్ధిని బుట్టింపక యేదో యొకనెపమున వానినుండి కాపాడును. దైవమనఁగాఁ గర్మమే గాని వేఱుగాదు. కనుక సత్కర్మముల నాచరించుట ముఖ్య మని పెద్దలందురు. కర్మ బ్రహ్మములకు భేదములేదని మన మెఱుంగవలయును. ఇట్టు లీభాగమునఁ గలవిశేషవిషయ ములం దెలిసికొంటిమి. పిదప సాగిన కథను బఠింతము. అధ్యాత్మరామాయణమునందు నీవిషయమున విశేషమేమియు నగపడలేదు.

## సీతకు హనుమ శ్రీరామలక్షణములం జెల్పుట.

* హనుమ తెలిపినపలుకు లాలకించి యాజానకి మధుర సాంత్వనవచనముల నిట్లు ప్రశ్నించెను. ఆర్యా! నీ కెందు శ్రీరామునితో సంసర్గము కలిగినది? లక్ష్మణు నెట్లు తెలిసి కొంటివి? వానరులకు సమాగమ మెట్లు కలిగెను? శ్రీరాముని లక్షణము లెవ్వి? సౌమిత్రిగుణుతు లెవ్వి? వానిని మరల విస్తరించి నాకుం జెల్పుము. వాని వినిన నాకు దుఃఖము బాధింపదు. ఆరాముని యవయవముల తీరెట్టిది? రూప మెట్టిది? లక్ష్మణునియూరువు లెట్లుండును? హస్తములరీతి యెట్టిది? నాకుం దెలియంజెప్పుము అని సీత ప్రశ్నింపంగా నాహావని శ్రీరామ చిహ్నములను యథార్థముగాం జెప్ప నారంభించెను. తల్లీ! జానకీ! శ్రీరామదూతనుగా నన్ను నీవెఱింగియు నాయదృష్ట వశమున నీప్రాణేశుని శరీరసన్ని వేశ మడిగితివి? సౌమిత్రిగుణు తుల నట్లే యడిగితివి? ఔరా! నాకు నేంటికి శ్రీరామలక్ష్మణ సంకీర్తనపుణ్యము లభించినది. తల్లీ! నీవు వా రియపురియందు నేయేగుణుతులం గాంచితివో వానిం దెల్పెద ఆకర్ణింపుము.

శ్రీరాముండు సర్వాంగసుందరుండు, పద్మపత్త్రాయత నేత్రుండు, సర్వప్రాణిమనోహరుండు, సౌందర్యదాక్షిణ్య సం భరితజన్ముండు, సూర్యతేజము, భూమికున్నదంతయోర్పు, బృహస్పతికుండునంతబుద్ధి, దేవేంద్రునకున్నంతకీర్తి యాతనికిం గలదు. ప్రాణితతినంతయు రక్షించువాండు. విశేషించి బంధు సంరక్షకుండు. క్షత్త్రియోచిత వృత్తిగలవాండు. వర్ణాశ్రమ

* ఇది ముప్పదిమైదవసర్గ మునం గలదు.

ధర్మరక్షకుఁడు. శత్రుజనసంతాపకుఁడు. జానకీ! శ్రీరాముఁడు లోకమునంగల నాలుగువర్ణములను గాచుచుండు. ఆయాయి మర్యాదలను దా నాచరించుటయే గాక ప్రజలచే నాచరింపఁ జేయువాఁడు. సురుచిరకాంతిమంతుఁడు. విశేషించి సత్పురుష పూజితుఁడు. బ్రహ్మచర్యవ్రతైకపరాయణుఁడు. సాధుజనులకు వలయునుపకారములఁ దానుగా నెఱింగి చేయువాఁడు. ఏయే కర్మము లెందులకు హేతువులో వానికి ఫలమెద్దియో యని కర్మగతుల నెఱింగినవాఁడు. అన్వీక్షికి, త్రయి, వార్త, దండనీతి,యను నాల్గురాజవిద్యలయం దాఱితేఱినవాఁడు. బ్రాహ్మణులను సేవించువాఁడు. సర్వవిద్యల నెఱింగినవాఁడు. సదాచారసంపత్సంపన్నుఁడు. పెద్దలఁజూచిన వినయముగలవాఁడే. కాని పగతురఁ దపింపఁజేయును. యజుర్వేదవినీతుఁడు. వేదవిత్పూజితుఁడు. ధనుర్వేదము, తక్కిన వేదములను దదంగములను జదివి యందుఁ బండితుఁడైనవాఁడు. దేవీ! రామునిమూఁపులు పెద్దవి. బాహువులు దీర్ఘములు. కంఠము శంఖము వంటిది. మోము నందమునకు స్థానము. నేత్రాంతము లెఱ్ఱనై యుండును. సర్వజనవిదితుఁడు. కంఠధ్వని భేరీధ్వనివలె నుండును. స్వచ్ఛమైన వర్ణముగలిగి యతఁ డుండు. పరాక్రమ మత్యద్భుతము. శరీరము నాతిదీర్ఘము నాతిహ్రస్వము గాక సమముగా నుండును. అవయవములన్నియుఁ బరస్పరము న్యూనాధిక్యములులేక సమతం గాంచి వయోభరమున నివ్వటిల్లుచుండును. దేహచ్ఛాయ శ్యామము.

మఱియు నాతనివక్షము, మనికట్టు, పిడికిలి,యనుమూఁడును స్థిరములుగా నుండును కనుబొమలు,. అండకోశములు, బాహువులు పొడవులుగా నుండును. సురులు, ముష్కములు,

మోఁకాళ్లు సమానములుగ నుండును. క్రిందికుక్షియు నాభి యు వక్షము పొడవుగా నుండును. శ్రీఁగన్నులు నఖములు హస్తపాదతలములు రక్తవర్ణముగా నుండును. పాదరేఖలు కురులు మగగుఱియు నునుపుగలిగి యుండును. కంఠధ్వనియు గమనము బొడ్డు గంభీరముగ నుండును. ఆరామునికంఠ మందు మూఁడురేఖ లున్నవి. వక్షమున కిరుప్రక్కలనుండు నెత్తుభాగములు వానిచివరభాగములు పాదరేఖలు లోఁతు గలిగియుండు. కంఠలింగనితంబములు జంఘలు హ్రస్వములుగ నుండు. శిరస్సు మూఁడుసుడులుగలిగి సమముగా గుండ్రనై ఛత్రాకారముగ విశాలముగఁ గనఁబడుచుండును. అంగుష్ఠ మూలమున నాలుగురేఖ లున్నవి. నొసట నలుకాళ్లను నలు చేతులను నాలుగురేఖలు గనంబడు. ఒడ్డుపొడువు తొంబది యా అంగుళములు. బాహువులుమోఁకాళ్లు తొడలు పిక్కలు సమములుగా నుండును. కనుబొమలు నాసాపుటములు కన్నులు చెవులు పెదవులు చనుమొనలు మోఁచేతులు మనికట్టులు మోఁకాళ్లు, అండకోశములు కటిస్థలము చేతులు పాదములు పిఱుఁదులు సమానములుగా నుండును. శ్రీరాముఁడు సింహ వ్యాఘ్రగజవృషేంద్రములవడువున గంభీరముగా నడచును. దొండపండువంటి వర్ణముగలిగి పెదవులు కండబలుపుగలిగిన చెక్కిలిమీఁదిభాగములు నున్నతముగా నుండును. నేత్ర ములు దంతపంక్తియు, చర్మము పాదములును వెండ్రుకలును మిక్కిలి స్నిగ్ధములుగా నుండును. వీఁపు శరీరము కరపాదనఖ ములు చేతులు ముక్కు కన్నులు చెవులు మగగుఱి యను నీయెనిమిదియు దీర్ఘములుగా నుండును. శ్రీరాముని ముఖ నయనవక్త్రజిహ్వోష్ఠగండవక్షోరుహానఖకరపాదములు కమల

ములం బోలియుండును. అతనిశీర్షలలాటములు శ్రోత్రకంఠములు హృదయము ఱొమ్ము కుక్షి కరపాదములు పిఱుఁదులు పెద్దవిగా నుండును. మఱియు దాశరథి తేజోయశస్సంపత్తులు నలుదెసలఁ బర్వ ఖ్యాతిఁగాంచినవాఁడు. పలువరుస కన్నులుఁ దెల్లగానుండును. కక్షయుఁ గడుపు ఱొమ్ము ముక్కు మూఁపు లలాటము నను నివి యెత్తుగానుండును. అంగుళిపర్వములు కురులు వెండ్రుకలు గోళ్లు చర్మము లింగము మీసములు దృష్టి బుద్ధియు సూక్ష్మములు. పూర్వాహ్ణమధ్యాహ్నపరాహ్ణములయందుఁ గ్రమముతప్పక ధర్మార్థకామముల ననుష్ఠించుచుండును. మఱియు రాముఁడు సత్యధర్మపరాయణుఁడు. శ్రీమంతుఁడు సర్వదా ధనాదులనార్జించుచు యాచకులకు నొసంగును. ఆయా దేశకాలభేదములలక్షణము లెఱింగియుండును. ఎల్లరతోఁ బ్రియముగనే మాటలాడును.

శ్రీరామునితమ్ముఁడు సౌమిత్రి యనురాగరూపములయందుఁ దక్కినగుణములయందును రామునివంటివాఁడే. ఆ పురుషసింహులిరువురును నిన్నుఁజూడ నాతురపడుచు భూమినెల్లయెడల వెదకుచుండఁగా మాకును వారికిని సమాగమము కలిగినది. వారట్లు నిన్ను వెదకుటకై భూమియంతయుఁ దిరుగుచుఁ బోయి ప్రియదర్శనుఁడగు నొకవానరేశ్వరుం గాంచిరి. అతఁడు తనయన్నచే రాజ్యమునుండి వెడల నడువంబడి తద్భయమునఁ బీడితుఁడగుచు ఋశ్యమూకపర్వతము నడుమ చెట్లసందున డాగియుండెను. మేమా వానరేంద్రునకు సేవకులము. అంత వల్కలములం గట్టుకొని మహాధనుస్సుల ధరించి యారామలక్ష్మణులు ఋశ్యమూకాద్రికి వచ్చిరి. సుగ్రీవుఁ డవ్వారిం గాంచి భయంపడి విషయ మిదికదా యని

తెలియమి వాలి తన్నుం జంపఁబంపెనోకో యని తలంచి యా
కొండపైకి దుమికెను. అందుండి నన్నే శ్రీరాఘవులకడకుం
బంపెను. నేఁ దదాజ్ఞచొప్పునఁ బోయి దోసిలొగ్గి నిల్చితిని.
వారివృత్తాంతమంతయు విని వీఁపున నెక్కించుకొని సుగ్రీవుని
చెంతకుం జేర్చితి. వారల కత్యంతప్రీతి కలిగినది. పరస్పర
వృత్తాంతకథనమున నూఱడిల్లిరి. మారాజునకుం గల్గినపరా
భవాదులు విని వాలివధాదిరూపప్రతిజ్ఞలు చేసి యోదార్చి
రామచంద్రుఁ డుండెను. తనదుఃఖమును మారాజునకుం దెలి
పెను. లక్ష్మణునిమూలమున సర్వవృత్తాంతముం దెలిసికొని
మారాజు పరమదైన్యము నొందెను. రావణుఁడు నిన్నుం
గొనిపోవునపుడు సొమ్ములం గొన్నింటిం గ్రింద వైచితివి
కదా. వానినెల్ల మావారు రామునకుం జూపిరి. మీరు
న్నచోటు తెలియనందునఁ జెప్పఁజాలరైరి. ఆసొమ్ము లాకాశ
మునుండి ధ్వనిచేయుచుఁ గ్రిందఁ బడఁగానే నే తీసికొని
పోయి మారాజున కిచ్చితిని. వానిని మారాజు రామునకీ
యఁగాఁ గాంచి మూర్ఛిల్లెను. ఆయాభరణములఁ దొడపై
నునుచుకొని పలవించెను. సౌమిత్రియు మారాజు నూఱడిం
చిరి. వానినా శ్రీరాముఁడు మారాజుచేతి కిచ్చెను. నీవు
కానరామికి నతఁ డెంతయుఁ దపించుచున్నాఁడు. నిద్రాహార
ములు మానియున్నాఁడు. రమణీయారామాదులయందుఁ
దిరుగుచున్నను నీవు లేమికి నించుకయు సంతుష్టినొందఁడు.
కల్యాణీ! ఆశ్రీరాముఁడు కొలఁదికాలమున రావణు ససైన్య
ముగఁ బొలియించి నిన్నుఁ బొందఁగలఁడు. శ్రీరామసుగ్రీ
వులు మైత్రిం జేసికొనిరి. రాముఁడు వాలిని జంపునట్లు, సుగ్రీ
వుఁడు నిన్ను వెదకించునట్లు శపథములు చేసికొనిరి. అంత

రామసుగ్రీవు లిరువురు కిష్కింధ కరిగిరి. యుద్ధమున వాలిం జంపి వానరరాజ్యమునకు సుగ్రీవుని రాముఁ డభిషిక్తుని జేసెను. తల్లీ! రామసుగ్రీవుల కిట్లు సమాగమము ఘటిల్లినవి.

సీతా! నేను హనుమంతుఁ డనువాఁడను. శ్రీరామ సుగ్రీవులు పనుప దూతనై వచ్చితిని. పట్టభద్రుఁడై మారాజు వానరకోటులం బిలిపించి నిన్ను వెదక నన్నిదిక్కులకుం బంపించెను. మేము గొందఱము వెదకుచు వచ్చితిమి. మూఁడవభాగము సేనంగొని యువరాజగు నంగదుఁడు వెడలెను. మే మతనింగూడి నిన్ను వెదకుచు వింధ్యపర్వతమున నొకబిలమును బ్రవేశించి వెడలి రాఁజాలక యందుఁ జిక్కి కొంతకాల మందే గడపితిమి. కార్యమును సాధింతుమన్న యాశలేక యూరకపోయిన రాజు దండించునని భయంపడి యందే మృతినొంద నిశ్చయించుకొంటిమి. మాయువరాజు నీవు కనఁబడకుండుట వాలి మరణమొందుట మేమెల్లరము ప్రాయోపవిష్టుల మగుట జటాయువు మృతినొందుట లోనగు వానిం జేర్కొని పలవించెను. నెలలోఁగా రాకయున్నం జంపుదుమని మారాజు శాసించినందున నాకాలము మాకందే మీఱినందున నిరాశుల మైయున్న మాకుఁ గార్యసిద్ధియే వచ్చెనన్నట్లొక పెద్దపక్షి యచ్చటికి వచ్చెను. ఆతఁడు జటాయువునకుఁ దోఁబుట్టువు. సంపాతి యనువేరు కలవాఁడు. తన సోదరుఁడు చంపఁబడుట విని ఎవ్వఁ డాతనిం జంపినాఁడు? ఎచ్చటఁ గూల్చినాఁడు. నాతమ్మునివార్తలఁ దెలుపఁగోరెదనని మ మ్మడిగెను. అంగదుఁ డతనికి నీనిమిత్తమై యతఁడు చచ్చిన వార్తనంతయుం దెలిపెను. అరుణునికొడుకగు సంపాతి సోద

రుఁడగు జటాయువు మరణమును విని దుఃఖించి నీవు రావణు
నింటనుండుట మాకుం దెలిపెను. ఆవార్తకు ముదమంది
యందఱము ప్రయాణము సాగించితిమి. సముద్రముకడకు
వచ్చితిమి. దానిం జూచి యెల్లరు భయంపడిరి. వారిభయముడిపి
నేనీసాగరమును దాఁటి రాత్రి యీపురిం బరికింపం దగునని
చొచ్చితిని. రావణునింగూడఁ గంటిని. దుఃఖసాగరనిమగ్న
వగు నిన్నును దర్శించితిని. తల్లీ! నావృత్తాంతమంతయు నున్న
దున్నయట్లుగా విన్నవించితిని. నేను రామదూతను గాని
యితరుఁడను గాను. కనుక నాతోఁ బల్కుము. నీకొఱకుగా
వచ్చినవాఁడను. సుగ్రీవుని మంత్రిని. వాయుపుత్త్రుఁడను. నీ
విపు డూహించినట్లు మాయావిని గాను. అస్త్రధారులలో
మేటి శ్రీరాముఁడు క్షేమముగ నున్నవాఁడు. సౌమిత్రి
యన్నకు సేవలొనరించుచు క్షేమముగా నున్నాఁడు. రాము
నం దాసక్తిచే సుగ్రీవునియానతిచే నేనొక్కఁడనే యిచ్చటికి
వచ్చితిని. నాభాగ్యమున నిన్నుం గాంచితి. వగచుచుండువాన
రులకు నిన్నుఁ గాంచినరీతిఁ జెప్పి వారిదుఃఖమును బోఁగొట్టఁ
జాలుదును. నారాక వ్యర్థము గాదయ్యెను. నీదర్శనమున
మహాకీర్తిం బొందితిని. వేగముగా రాముఁడు రావణుని సబం
ధుమిత్త్రునిగా వధియించి నిన్నుఁ జేకొనును.

ఇఁక నావృత్తాంతము నాలకింపుము. మాల్యవంతమను
నుత్తమపర్వతమునందుఁ గేసరి యనువానరుఁడుండి దానివదలి
గోకర్ణమను పర్వతమునకుం బోయెను. ఆకపియే నాతండ్రి.
అందు నతఁడు శంబసాదనుఁ డనురాక్షసుని దేవతలపంపున
వధించెను. కేసరి గోకర్ణమునకుం బోయినపుడు నే నాతని
భార్యయందు వాయుదేవునివలనఁ గల్గినవాఁడను. నాచేసిన

కార్యముచేత నందులకు గుఱుతుగా నాకు హనుమన్నా మము గల్గినది. జానకీ! నీకు విశ్వాసము గలుగవలయునని శ్రీరామునిగుణములం దెల్పితిని. రాముఁ డిఁక వేగముగా నిందుండి నిన్నుఁ గొనిపోవఁ గలఁడు. అని తెలిపెను. ఆతని పలుకుల విని యాగుఱుతులు సరియైనవి యగుటం జేసి యతని రామునిదూతగా నమ్మెను. మహానందమునొంది యానంద బాష్పముల వదలెను. అత్తఱి నాదేవిముఖము రాహు విముక్త చంద్రబింబముపగిదిఁ దేజరిల్లెను. ఆతఁడు వానరుఁడే కాని మాయావి కాఁడని తలంచెను. అంత నాపావని తల్లీ! వృత్తాంతమంతయుం దెల్పితిని. ఇఁక నూఱడిల్లుము. నేనిపు డేమిచేయవలయు? నీయిష్ట మెద్ది? ఆనతిమ్ము. నేను మరలు చున్నాను. నన్ను వాయుపుత్త్రునిగా శ్రీరామునిదూతగా నమ్ముమని తెలిపి యూరకుండెను.

మహాశయులారా! ఈఘట్టమున ననేకవిషయములు పరిశీలింప నర్హములు గలవు. వానిని వదల నయితి గాదు. ఒక్కవిషయమును దొలుత వ్రాసి పిదప విశేషములను గనుఁ గొనఁ బ్రయత్నింతును. ఈరామాయణ ముత్తమకావ్యము. అనేకార్థము లిమిడియున్నవి. ఏకావ్యమునైన వ్యాఖ్యానార్థ ములఁ జేర్చి తెనిఁగించినఁ దెలిఁగింపవచ్చును గాని ధ్వన్యర్థ గుంభితమైన శ్రీమద్రామాయణము నట్లురచింప సాధ్యపడదు. వ్యాఖ్యానములలో నుండువిషయములు వ్యాఖ్యాతల యభి ప్రాయములే కాని వాల్మీకివైనఁ గావచ్చును. అనేకశ్లోకము లకు ధ్వన్యర్థములు రహస్యార్థములు గలవు. కొన్నిటియందు మంత్రార్థములు గలవు. నలువురిలో నిలిచియుండు నొకనికి నొకరహస్యార్థమును బోధించుమాటలు చెప్పిన షాఁ డారహ

స్వార్థమును వానే వెంటనే వెలిపుచుచు మాటలాడెనేని యంతకంటెను బరిహాస్యము వేఱొకటి యుండునా? వ్యాఖ్యానము కలిపి వ్రాయుటచేఁ గలుగునసందర్భములు పెక్కులు గలవు. శ్రీమద్రామాయణమునకుఁ గావ్యత్వహానియే సంభవించును. వ్యాఖ్యానవిషయములు గలిపి వ్రాసినఁ గలుగురసభంగము సమయభంగము లోనగుదోషము లెట్లు గలుగునో, యట్లుచేయుటకును గొన్నియెడల నెట్లు సాధ్యపడదో తెలుపుటకై యొకటిరెం డుదాహరణము లిచ్చుచున్నాము. వీని వలనఁ బ్రత్యేకవ్యాఖ్యానమునఁ దెలియఁగలవిషయములు వ్యాఖ్యానముకలిపి వ్రాయఁబడినగ్రంథము లుండెనేని వాని వలనఁ దెలియరాదనుట స్పష్టము. అని వావిలికొలను సుబ్బరావుగారు 1924 సంవత్సరమున నొకపత్త్రమున వ్రాసి మఱి కొందఱిపేరఁ బ్రకటించిరి. దానియందలివిషయముల నీసర్గముననే విమర్శించి సమాధాన మీయఁదగియున్నది. నారచించిన యాంధ్రశ్రీమద్రామాయణమునఁ దగినట్లు సమాధానమును సంగ్రహముగ వ్రాసితిని. కాని యిందు విపులముగ వ్రాయుదును. ఆనాఁటి కరపత్త్రము నన్నుఁగూర్చి వ్రాసినదని యే నెఱుంగుదును. కొందఱని వారు వ్రాసిరి. కొందఱని నేను సమాధానము వ్రాసితిని. ఒక్కశ్లోకమునకు వ్యాఖ్యాతలు వేఱువే ఱర్థములు వ్రాయుదురు. అవి వాల్మీకివైనఁ గావచ్చును. కాకపోవచ్చును. అను నీవ్రాఁత కర్థమే లేదు. ఈ రామాయణమునకుమాత్ర మేమి? అన్నింటికి నంతియే కదా. ఏదివ్రాసినను అది మూలకర్తదని యెవఁడు నిశ్చయింపఁగలఁడు? భాష్యములు నంతియ గదా. వేదభాష్యమునఁ గలయర్థము వేదములదైనఁ గావచ్చును. కాకపోవచ్చును గదా. ఐన దాని

యర్థ మిదియని తత్కర్తయే వచ్చి చెప్పవలసివచ్చును. ఒకప్పు డిట్టిదాసులయెదుటఁ జెప్పెననుకొందము. ఎల్లరు వినఁజాలరు కదా. ఎపుడు కోరిన నపుడు వచ్చి చెప్పుచుండవలయును. అనఁగా గ్రంథకర్త యశ్వత్థామవలె సర్వకాలము బ్రదికి యుండి యెవరుపఠింతురో వారియెదుటఁ బ్రత్యక్షమై నాయర్థ మిది నాయనా యని చెప్పుచు నుండవలయును. ఏవరేయర్థము చెప్పిన నీయాక్షేపము రాక తప్పదు. కావున నీవ్రాఁత నిస్సారము, అసూయాఫలము నగుననవలెను. ఈరామాయణము నందుఁ "కొన్నింటియందు మంత్రార్థములు గలవు." అని వ్రాసిరి కదా. ఈశ్లోకములయందు మంత్రార్థము లున్నవని వీరి కెవరు చెప్పిరి? వాల్మీకి తొలుత నీకాండమున నీసర్గమున నీశ్లోకములకు నీమంత్రము నర్థముల నిమిడించితినని వ్రాయ లేదు కదా. మరెట్లు చెప్పవచ్చును? వ్యాఖ్యాత వ్రాసెనని. ఆతనియర్థము మూలకర్తదే యని యెట్లు నిశ్చయింపవచ్చును? మంత్రార్థములే లేవన్నఁ గలవనుటెట్లు? ఇట్టి వ్రాఁతలకంటె నసంగతపువ్రాఁత లుండవు. వీరు వ్రాయు వ్యాఖ్యానములోని యర్థములెల్ల మూలకర్తవి కావన్న నౌనని యెట్లు చెప్పఁ గలరు? చెప్పిన నది స్వోక్తివ్యాఘాతము గాక యెట్లుండును? కావున నిట్టివ్రాఁతల కెక్కుడుగ సమాధానము వ్రాయఁ బూనరాదని వదలవలయును. ఒక్కవిషయమును మాత్ర మాలకింపుఁడు.

రామావతార మెందులకని విమర్శింపవలయును. వారి చర్య లెట్టివని పరికింపవలయును. ఆచరిత్రమునం దిట్టివిష యము లుండవలయుఁ గదా యని యూహింపవలయును. తదనుగుణములుగా వ్యాఖ్యాతలు వ్రాయుదురని యెఱుంగ

వలయును. గ్రహించువారు తమయోగ్యతకు ననురూప
ముగా గ్రహింతురు. మహాత్ములు ఇది దీనియర్థమని తెలుపు
దురు. సమ్మతించువారే దాని నాదరింతురు. సమ్మతించనివా
రింకొకరీతిగా దానియర్థమును గ్రహింతురు. ఇందేది మూల
కర్తదని చెప్పనగును? అన్న ప్రశ్న మసూయాగ్రస్తులే
యగును. మంత్రార్థము లున్నవని గాయత్రీమంత్రాక్షరము
లిందున్నవనియుఁ దెలిపినవారు వ్యాఖ్యాతలే కాని యిత
రులు కారు. వారిమూలముననే రామాయణకావ్యమహి
మము ప్రకాశ మయ్యెను. అందేయర్థ మెవరికి సమ్మతమో
వారు దానిని గ్రహింతురు. కాకయున్న మానుదురు. మేము
చెప్పినయర్థమే వాల్మీకిదని యెవ్వరును జెప్పి సిద్ధాంతము
చేయఁజాలరు. మఱియు నిట్టివ్రాతల కాయాశ్లోకములకు
విశేషార్థములు వ్రాయునపుడు విమర్శింతును. సామాన్యముగా
వ్రాసితిని. ఇఁక విమర్శింతము.

"తాం తు రామకథాం శ్రుత్వా వైదేహీ వానరర్షభాత్,
ఉవాచ వచనం సాంత్వమిదం మధురయా గిరా. ౧
క్వ తే రామేణ సంసర్గః కథం జానాసి లక్ష్మణం,
వానరాణాం నరాణాం చ కథమాసీత్సమాగమః." ౨

అని మూలము. "గురుకులవాసాయోగ్యానాం వానరాణాం
వసిష్ఠశిష్యాణాం చ ఈదృశస్సమాగమః కథం జాతం జాతః
శాస్త్రవశ్యానామేవ గురుకులవాసయోగ్యత్వాత్." అని తని
శ్లోకి వ్రాసెను. సీత కీయభిప్రాయ ముండునా యని మన
మూహింతము. దండకారణ్యమున నున్నపుడే జటాయువుతో
రామలక్ష్మణులకు మైత్రి కలిగియుండుట సీతకుఁ దెలియక

పోలేదు. ఆసమాగమమున నీవ్యాఖ్య యీశంకను గనఁబఱుప లేదు. ఇపు డేల కలిగెనో? పశులకు గురుకులవాసయోగ్యత యున్నట్లు శాస్త్రము కలదా? వానరుల కేల యుండదు? ఈ రెండుజాతులకును గురుకులవాసయోగ్యత లేనపు డీశంక యిపుడేల? ఇట్టిశంకలం గల్పించుకొనుట సమంజసము కాదని తోఁచెడిని. ఎచ్చట రామునకు నీకును సమాగమము గలిగెను? లక్ష్మణు నెటు లెఱింగితివి? వానరులకు నరులకు నెట్లు సమాగమము కుదిరెను? అను నీప్రశ్నములు సీత యడుగుట సహజమే. తనిశ్లోకి క్రొత్తశంకను సీతకుఁ గల్గియున్నట్లు కల్పించుటే యసంగతము.

> "యాని రామస్య లింగాని లక్ష్మణస్య చ వానర,
> తాని భూయస్సమాచక్ష్వ న మాం శోకస్సమావిశేత్. 3
> కీదృశం తస్య సంస్థానం రూపం రామస్య కీదృశం,
> కథమూరూ కథం బాహూ లక్ష్మణస్య చ శంస మే." ౪

అని మూలము. రామలక్ష్మణులగుఱుతులం గొన్నింటిం జెప్పుము. నీవు మాయావియగు రావణుఁడ వన్న వంకయు దుఃఖము నాకు లేకుండును. అనఁగా వానింబట్టి నిన్ను నిక్కముగా శ్రీరామునిదూతవే యని నమ్ముదును. శ్రీరాముని యవయవసన్నివేశ మెట్టిది? రూపమనఁగా నాకారము వర్ణము నెట్టివి? ఇంతదనుకఁ బ్రశ్న మసంగతము గాలేదు. లక్ష్మణునితొడలు బాహువులు నెట్టివి? నాకుం జెప్పుమా యని సీత యడిగెను? "వ్యాఖ్యానము కలిపి వ్రాయుటచేఁ గలుగునసందర్భములు పెక్కులు గలవు. శ్రీమద్రామాయణమునకుఁ గావ్యత్వహానియే సంభవించును." అని వా. సుబ్బరావుగారు వ్రాయించిరి.

ఇపు డేమియందురో యనియే ప్రశ్నించుచున్నాఁడను. మున్ను లక్ష్మణుఁడు సీతాదేవి పాదభూషణములు తప్ప వేఱొండు నే నెఱుంగననియెఁ గదా. దానిభావ మేమి? సీతపాదవన్దనము చేసినవాఁడనే గాని యామెను జూడలేదనియే కాక మఱేమి యుండును? అట్టిమర్యాదగలవాఁడు లక్ష్మణుఁడని మన మెఱింగితిమి. శ్రీరామునవయవసన్నివేశము నాకారవర్ణము లెవ్వి యని ప్రశ్నించి లక్ష్మణునితోడ లెట్టివి? బాహువు లెట్టివి? అని ప్రశ్నించుట యేటికి? అనుప్రశ్న మేల రాఁగూడదు?

"నాహం జానామి కేయూరే నాహం జానామి కుండలే నూపురే."

అన్న సౌమిత్రిశీలమునకు,

"కథమూరూ కథం బాహూ లక్ష్మణస్య చ శంస మే."

అన్న జానకీశీలమునకు భేదము కలదా లేదా యన్నప్రశ్నమునకు సమాధాన మేమి? "అనేకశతశ్లోకములకు ధ్వన్యర్థములు రహస్యార్థములు గలవు. కొన్నింటియందు మంత్రార్థములు గలవు." అని వా. సుబ్బరావుగారు వ్రాయించిరి. ఇది యందు నెందుఁ జేసనో! ధ్వన్యర్థమునందా? రహస్యార్థమునందా? మంత్రార్థమునందా? వారే చెప్పవలయును. రహస్యార్థధ్వన్యర్థమంత్రార్థము లున్నట్లు వాల్మీకిమహర్షి వ్రాసెనా? ఎందు? వ్యాఖ్యాతలవ్రాఁతలే కదా యివి. వ్యాఖ్యాతలభావము వాల్మీకిది కావచ్చును. కాకపోవచ్చునన్నందుల కర్థ మేమి? ఎవరి దిందు స్వోక్తివ్యాఘాత మగువ్రాఁతయో యెఱుంగఁ జాలకయున్నాను. సకలవేదములు రామాయణమున నిమిడి యున్నవనియు, మంత్రప్రయోగము లిందుఁ గలవనియు, నిది శ్రీవైష్ణవులకొఱకే యేర్పడినగ్రంథమనియు, నితరుల కనఁగా

శ్రీవైష్ణవచిహ్నములు ధరింపనివారికి శ్రీరామునకరుణ కలుగ దనియు, భస్మధారణాదు లపవిత్రములనియు వ్రాయు మధ్య వైష్ణవపాషండులవ్రాతలయందు నెన్నియో స్వోక్తివ్యాఘాతము లుండును. కాని మహర్షివ్రాతయం దుండవు. లేని భక్తియున్నట్లు నటించిన లాభమేమి? చిహ్నముల నెన్నియేఁ గనఁబఱచిన ఫలమేమి ? "అంతమునఁ జూడవలయు నా యయ్యసుఖము" అని అడిదము సూరకవిగారు వ్రాసినట్లు జగద్వంచకులకుఁ గలుగుఫలములు పరమేశ్వరుఁడే నిర్ణయించును. కొందఱు సన్న్యాసులు యోగులు దాసులు అవధూతలు ననునామములఁ దాల్చి ధనసంగ్రహామునకై పాటు పడుచు శిష్యులం జేరఁదీసి చెంపలువాయించి ధనము లాఁగి మోక్ష మనుగ్రహింతుమని వాగ్దానము చేయుచుఁ దిరుగుచుందురు. అట్టివారికొఱకే సూరకవిగా రాపద్యమును వ్రాసిరన వచ్చును. "అంతః ప్రచ్ఛన్నపాపానాం శాస్తా వైవస్వతో యమః" అని పెద్దలు తెలిపియే యున్నారు. అన్నదానమునకని భగవదుత్సవములకని దేవాలయోద్ధరణమునకని తటాకనిర్మాణమునకని ధనము నార్జించి దాని నాయాకార్యముల కుపయోగింపక యంతరంగభక్తులకు బంధువుల కొసంగు వారిని గనిపెట్టువాఁ డొక్కయముఁడే కాక యనేకులున్నారు వారి కెఱుకపడకయుండ మన మేపుణ్యపాపములను జేయఁజాలము.

"ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయంత్సర్వభూతాని యంత్రా రూఢాని మాయయా."

అన్న గీతోక్తి క్రొత్తది కాదు. ఆమహాత్మునకుం దెలియకయుండ మన మేదియుఁ జేయఁజాలము. ఇచ్చో సమాధాన మెద్ది?

అన్న ప్రశ్నము గలదు. "కథమూరూ కథం బాహూ" అను ప్రశ్నములు రామునకే యన్వయింపవచ్చునని కొంద ఱందురు. "లక్ష్మణస్య చ" అనుచోటనున్న చకారము వారికిఁ గంఠపాశ మగును. అది పాదపూరణార్థ మందురేని ప్రశ్నమే వ్యర్థ మగును. కాన నాయుక్తి పొసఁగదు. కాన నిప్పట్టున నిట్లు గ్రహించుటొప్పు. సీత లోకాచారము ననుసరించుచున్నది. మాయావియగు రావణుఁడే యీకపిరూపమున వచ్చి శ్రీరామ సంకీర్తనవ్యాజమున నన్ను వంచించెనా యని సంశయించెను. శ్రీరాము నీనడుమ నేరూపముననైనఁ బోయి చూచి యుండ వచ్చును. ఐనను జూచినంతమాత్రమున నన్నిగుఱుతులు చెప్పఁజాలరనియు నూహించెను. కనుక నాప్రశ్నములకు సమాధానము చెప్పినయెడల రామునిదూతయే యని నమ్మ వచ్చును. లేనియెడల రావణుఁడని నమ్మవచ్చును అని చక్క నాలోచించి శ్రీరామునిచిహ్నము లెట్టివి? లక్ష్మణుని యంగ మచ్చము లెట్టివని ప్రశ్నించెను. అట్టిఘట్టమున వాల్మీకిమహా ముని యీప్రశ్నముల నడిగెను. వాల్మీకి యంతయనుచితజ్ఞుఁడు కాఁడా యని కొంద ఱడుగుదురేమో. వా రుచితజ్ఞులే కాని మన ముచితజ్ఞులము కాము. ప్రాయికముగా మహాత్ములు సమ దర్శనులు. మృత్సువర్ణములు సమానములుగనే. వారలకుం గన్పట్టును. ఊరువులు బాహువులు నితరావయవములు వేఱు వేఱుగాఁ గన్పట్టుట. అం దుత్తమమధ్యమాధమత్వకల్పనయు నస్మదాదులకే యనవలయును. సమదర్శనులగు మహామునుల దృష్టికి నీప్రశ్నమున ననుచితజ్ఞత కలదని వారికిం దోఁపదు. అస్మదాదులకున్నంత భేదభావము వారలకు నుండదు. కావున నిట్టితావుల నిట్టికుశంకలం గల్పించుకొనరాదు. ఇట్టిఘట్టములు

ముందును గలవు. అందందు నీవిషయమునకే సమాధానము వ్రాయవలసియుండును. అన్నింటినిగాంచిన సమాధానము వ్రాసినట్లగునని భావింతును గాక.

"జానంతీ బత దిష్ట్యా మాం వైదేహి పరిపృచ్ఛసి,
భర్తుః కమలపత్రాక్షి సంస్థానం లక్ష్మణస్య చ. ౬
యాని రామస్య చిహ్నాని లక్ష్మణస్య చ యాని వై,
లక్షితాని విశాలాక్షి వదతశ్శృణు తాని మే." ౭

అని మూలము. హనుమంతుఁ డుచితజ్ఞుఁ డనఁదగినట్లు సమాధానము చెప్ప నారంభించెను. నన్ను శ్రీరామునిదూతగా నెఱింగియు నాయదృష్టమునఁ నడుగుచున్నావు. అనఁగా నామె మాటలాడుటయే పరమానందమని యాతనిభావము. తల్లీ! శ్రీరామలక్ష్మణులగుణములు వచింతును. అవి నీ వెఱింగినవి గనే యుండును. వానినే నేను వర్ణింతును. ఆలకింపుము. అని యెను. అనఁగా శ్రీరామలక్ష్మణులసంకీర్తనము నాతపఃఫలము. దాని ననుభవించు నవకాశమును గల్పించితివి. అదియే చాలు నని యీ హనుమంతునిభావమని మన మెఱుంగవలయు. ఉపాసకుఁ డిష్టదేవతామంత్రోపాసన చేసి జపానంతరము తన కున్నయవకాశమును వ్యర్థముచేయక స్తోత్రములం బఠింప వలయు. అవి తన్మహత్త్వమును దెల్పును గదా. దానిని స్మరించుటం జేసి భక్తిదృఢతం గాంచును. ఈవిషయమే వాల్మీకి మహాముని హనుమద్వాక్యములమూలమున మనకుం దెల్పెనని మన మీభాగమునుండి గ్రహింపవలయును. ఇఁకఁ జెప్పఁబోవు నవి శ్రీరామునిచిహ్నములు. వాని నన్నింటి నిట వ్రాయుటసంగతముగ నుండును. కొన్నింటిని వ్రాసెదను.

"రక్షితా జీవలోకస్య స్వజనస్యాభిరక్షితా,
రక్షితా స్వస్య వృత్తస్య ధర్మస్య చ పరంతపః.    ౧౦
రామో భామిని లోకస్య చాతుర్వర్ణ్యస్య రక్షితా,
మర్యాదానాం చ లోకస్య కర్తా కారయితా చ సః.    ౧౧
అర్చిష్మానర్చితోఽత్యర్థం బ్రహ్మచర్యవ్రతే స్థితః,
యజుర్వేదవినీతశ్చ వేదవిద్భిస్సుపూజితః,
ధనుర్వేదే చ వేదేషు వేదాంగేషు చ నిష్ఠితః."    ౧౪

అని మూలము. రక్షితా జీవలోకస్య=ఇది సర్వజగన్నాయకత్వ మును, స్వజనస్యాభిరక్షితా=ఇది భక్తపరిపాలనదక్షత్వమును దెలుపును. స్వజనపరజనభేదము శ్రీరాములకుం గలదా యని ప్రశ్నించువా రుందురు.

"సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః."

అన్న గీతావాక్యమునఁ గలయర్థము ననుసరించి వర్తించు వారే స్వజను లనఁబడుదురనియు, నట్టిభక్తులను జక్కఁగా రక్షించువాఁడనియు,

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం."

అన్న ప్రతిజ్ఞను సార్థకము చేయువాఁడనియు గ్రహించిన, సందియము గలుగదు. స్వస్య వృత్తస్య రక్షితా = తనవర్తనమును గాపాడుకొనువాఁడు. అనఁగా

"యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహం,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః.

యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే.''

అన్న భగవద్గీతావాక్యార్థము ననుసరించి సజ్జనుల కుదాహరణ భూతముగ నుండునట్టి వృత్తమున నలర నవతరించినవాఁడు గాన దానిని గాపాడువాఁడని యర్థము. దీనింబట్టి యన్నింటి కంటె నెక్కుడుగఁ బ్రవర్తనమును గాపాడుకొనవలయు ననియు నుత్కృష్టత్వాపకృష్టత్వముల కాధారము వర్తనమే యనియు మన మెఱింగి బద్ధాదరులము గావలయును. ధర్మస్య చ రక్షితా=ధర్మమును స్థాపింప నవతరించినవాఁడని భావము.

''ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే,''

అన్నమాటను సార్థకముచేయువాఁడని తాత్పర్యము. చాతుర్వర్ణ్యస్య లోకస్య రక్షితా = శాస్త్రసిద్ధాచారవంతము జాతి చతుష్టయము. దానిమూలమునఁ బ్రపంచమున ధర్మములు సాగునని భావము. కనుకనే

''చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః,
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్.''

అను గీతావాక్యము కలదు. సత్త్వరజస్తమోగుణములు వాని కర్మములు నను వాని ననుసరించి నాలుగుజాతులు నాచే సృజింపఁబడినవి. ఆకర్మమునకు మాయాసంవ్యవహారమున నన్నుఁ గర్తగను, పారమార్థికమున నకర్తగను నన్ను సజ్జనులు తలంతురు. నీవు నర్జునా యట్లే తలంపుమని కృష్ణుఁ డనియెఁ గదా. ఈయర్థమే యిచ్చో రామాయణము తెల్పుచున్నది. సత్త్వరజస్తమోగుణములలో నొకొక్కటి ప్రధానముగా నితరము లప్రధానములుగా నుండుగుణములు కర్మములు నాచ

రించునట్లు దాన లోకప్రవృత్తి నిరాతంకముగా సాగునట్లు భగవంతుఁ డాలోచించి యీనాలుగుజాతుల నేర్పఱచెనని తోఁపక మానదు. లోకవ్యవహారము చక్కఁగా సాగుట ధర్మము నిలువ చోటుండుట యనునవియే జాతులనిర్మించుటకుం గలకారణము. ఈనాలుగుజాతులు నన్యోన్యసహకారములు. తపస్సుచేయుచుండువారలు కొందఱు, వారికిఁ గష్టములు గలుగకుండ ధర్మధ్వంసకుల నడంచువారు కొందఱు, వారి కాహారములను గల్పించువానిని రక్షించువారు కొందఱు, వారలకందఱకు నాహారమును గల్పించు కృషిచేయువారు కొందఱు నుండినఁగాని చక్కఁగా న్యాయ్యముగా లోకవర్తనము సాగదు. ఇందేది లోపించిన నంతయు లోపించినట్లే. కావున నీజాతి నిర్మాణము ముఖ్యమని తాత్పర్యము. గరళకంఠులు కొంద ఱీకల్పన భగవంతునిదే కాదందురు. వారికి మనస్సే ప్రమాణము కాని శాస్త్రము ప్రమాణము కాదు. వారియూహాప్రకారముగా నాలోచించిన నేదియు సాగదనుట వాస్తవము. ఇతరదేశములయం దెట్లు లిది సాగుచున్నది? అందు జాతిభేదములు లేవే యందురు. అది చాల పొరపాటు. లేవనువారల కాదేశప్రవృత్తియే తెలియదనుట మంచిది. ఈ పేరులు లేకున్న నీలక్షణములు మాత్రము కలవు. వ్యవహార మట్లే సాగును. వేఱొకరీతి సాగ నవకాశమే యుండదు. వ్యవహారమున సిద్ధమయి నామధేయమున విసంవాది యైనంతమాత్రమునఁ గలుగు నష్టమేదియో తెలియఁజాలకున్నాఁడను. జాతినిర్ణయము మార్పరాదని భగవంతుని యాశయమని మన శ్రీభాగము బోధించుచున్నది. లోకస్య మర్యాదానాం చ కర్తా కారయితా చ=లోకమునఁ గలమర్యా

సల నవలంబించువాఁడు. ఇతరు లవ్వానిని వదలకయుండ నాచరింపఁజేయువాఁడని యర్థము.

"స్వే స్వే ధర్మే నివిష్టానాం సర్వేషామనుపూర్వశః,
వర్ణానామాశ్రమాణాం చ రాజా సృష్టోఽభిరక్షితా."

అన్న మనుస్మృతివాక్య మిట నుదాహార్యము. అర్చిష్మాన్=మహాతేజస్వియని యర్థము. యోగు లీతేజోరూపమునే ధ్యానింతురు. అందుఁ గొందఱ అర్థానికి నవయవములు కూడఁ గల్పింతురు. "ధన్యానాం గిరికందరే నివసతాం తేజః పరం ధ్యాయతామ్." అని భర్తృహరి. "ధ్యేయస్సదా సవితృమండలమధ్యవర్తీ నారాయణస్సరసిజాసనసన్నివిష్టః." అని మంత్రఖండము. "జ్యోతిషాం రవిరంశుమాన్." అని గీతావాక్యము కూడఁ గలదు. అర్చితోఽత్యర్థమ్=విశేషించి పూజింపఁబడువాఁడు. మహానిధ్యేయుఁడని తాత్పర్యము. బ్రహ్మచర్యవ్రతే స్థితః=గృహస్థునకు బ్రహ్మచర్యవ్రతస్థితి యెట్లు? అను ప్రశ్నము న్యాయ్యమే. ఏయాశ్రమమునందుండువాఁ డాయాశ్రమధర్మముల నాచరించుచుండునేని పరిశుద్ధుఁడే. ఆవిధులను శిరసా వహించుటయే తపస్సని భావము. శాస్త్రమందు గౌరవమును చుట యుత్తమపద్ధతి యని సారము. ఆశ్రమోచితధర్మప్రవర్తకుఁడు పరిశుద్ధుఁడనియే గదా దీని యాశయము? శ్రీరామచంద్రుఁడు గృహస్థువైనను దన్నియమములఁ దప్పక వర్తించువాఁడు కావున బ్రహ్మచర్యవ్రతుఁడే యగునని వాల్మీకిహృదయము.

"షోడశర్తునిశాః స్త్రీణాం తస్మిన్ యుగ్మాసు సంవిశేత్,
బ్రహ్మచార్యేవ పర్వాణ్యాద్యాశ్చతస్రస్తు వర్జయేత్." ౭౯

యాజ్ఞవల్క్యస్మృతి.

"ఏవం గచ్ఛన్ బ్రహ్మచార్యేవ భవతి. అతో యత్ర బ్రహ్మచర్యం శ్రాద్ధాదౌ చోదితం తత్ర గచ్ఛతోఽపి న బ్రహ్మచర్యస్ఖలనదోషోఽస్తి. కించ పర్వాణ్యాద్యాశ్చతస్రస్తు వర్జయేత్." అని మితాక్షర.

"ఋతుస్స్వాభావికస్త్రీణాం రాత్రయష్షోడశస్మృతాః,
చతుర్భిరితరైస్సార్ధ మహోభిస్సద్విగర్హితైః. ౪౬
తాసామాద్యాశ్చతస్రస్తు నిందితైకాదశీ చ యా,
త్రయోదశీ చ శేషాస్తు ప్రశస్తా దశరాత్రయః. ౪౭
నింద్యాస్వష్టాసు చాన్యాసు స్త్రియో రాత్రిషు వర్జయన్,
బ్రహ్మచార్యేవ భవతి యత్రతత్రాశ్రమే వసన్." ౫౦

మనుస్మృతి. 3 అధ్యాయము.

"అవశిష్టే పర్వవర్జితే వ్రజన్నఖండితబ్రహ్మచార్యేవ భవతి."

అని కుల్లూకభట్టు.

అను మనుయాజ్ఞవల్క్యస్మృతు లీవిషయము నే దెల్పుచున్నవి. "యజుర్వేదవినీతశ్చ=అనేన స్వస్య యజుర్వేదత్వం సూచితమ్." అని వ్యాఖ్య. అనఁగా శుక్లయజుర్వేదమని యర్థము. ఈవిషయము దశరథు నశ్వమేధఘట్టమున వ్రాయఁబడినది. యజుర్వేద మనఁగా, "ఇజ్యతేఽనేనేతి యజుః."అని వ్యుత్పత్తి. "శేషా వా యజుశ్శబ్దః శేషే ఋక్సామభిన్నే మంత్రజాతే తతశ్చయన్మంత్రజాతం ప్రశ్లిష్యపఠితం గానాదివిచ్ఛేదరహితం తద్యజురితి. ఇతి తిథ్యాదితత్త్వం." అని జైమిని.

"యజుర్వేదస్య విజ్ఞేయో ఽన్యే శాఖాంతరాస్స్మృతాః."

"యజుర్వేదస్య ధనుర్వేద ఉపవేదః. యజుర్వేదస్య భారద్వాజగోత్రం రుద్రదైవత్యం, త్రైష్టుభం ఛందః. యజుర్వేదః కృశః, దీర్ఘః,

కపాలీ, తామ్రవర్ణః, కాంచననయనః, ఆదిత్యవర్ణః వర్ణేన. పంచారత్ని మాత్రః. అస్యధ్యానం.—

'వందే రౌద్రం త్రైష్టుభం తామ్రవర్ణం
భారద్వాజం రుక్మనేత్రం కృశాంగం,
యజుర్వేదం దీర్ఘమాదిత్యవర్ణం
కాపాలీనం పంచ చారత్నిమాత్రమ్,'

య ఇదం దైవతం రూపం గోత్రం ప్రమాణం ఛందోవర్ణం వర్ణయతి స విద్యాం లభతే స విద్యాం లభతే. జన్మజన్మని వేదపారో భవతి, జన్మజన్మని వేదదారో భవతి, అవ్రతోవ్రతీ భవతి, అప్రయతః ప్రయతో భవతి, అబ్రహ్మచారీ బ్రహ్మచారీ భవతి, జాతిస్మరో జాయతే. ఇతి చరణవ్యూహమ్. యజుర్వేదాధిపశ్శుక్రః. అస్య వక్తా వైశంపాయనః.

'ఏక ఆసీద్యజుర్వేదస్తం చతుర్థా వ్యకల్పయత్,
చాతుర్హోత్రమభూద్యస్మిం స్తేన యజ్ఞమథాకరోత్,
అధ్వర్యవం యజుర్భిస్సాన్యద్దృగ్భిర్హోత్రం ద్విజోత్తమాః.
ఉద్గాత్రం సామభిశ్చక్రే బ్రహ్మత్వం చాప్యథర్వభిః,' ”

కూర్మపురాణము.

అని వేదారాధనక్రమము చెప్పఁబడినది. వేదపారాయణము సకలపాపనాశనక్షమ మనఁగా వేదమంత్రము నిట్లుపాసించుట యనియు దాననే పాపము లడంగుననియు నర్థము. కేవల వేద పారాయణమున విధివిహితసంపూర్ణఫలములు గలుగవు. ఉపాసకుఁడు కావలయుననియే యిందలిసారము. అదియు నేకాగ్రచిత్తునకే సఫలము. ఏకాగ్రచిత్తత యోగసాధ్యము. యోగికానివానికి నేయుపాసనయు ఫలింపదనియే భావము.

“తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభిశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున.”

అన్న భగవద్గీతావాక్యము పైన వ్రాసినయర్థమునే బోధించు చున్నది. శ్రీరాముఁడు లోకానుగ్రహార్థము యజుర్వేదము ని ట్లుపాసించెనని తేలుచున్నది. ఏ వేదశాఖకుఁ జేరినవా రా వేదమును సక్రమముగా నుపాసించినఁగాని తత్ఫలము గలుగఁ జాలదని నేర్చుకొనవలయును. శ్రీరామున కేయుపాసన యక్కఱలేకున్నను దన ప్రవృత్తిం గాంచి లోకులు నేర్చుకొన వలయునని యూహించి య ట్లుపాసించెననియు, మనము నల్లే స్వవేదము నుపాసింపవలయుననియు నేర్చుకొనవలయును. వే దేషు వేదాంగేషు చ నిష్ఠితః=తక్కిన వేదములను వేదాంగము లగు శిక్షావ్యాకరణాదుల నెఱింగినవాఁడని యర్థము. అను నీ గుణములన్నియుం దెల్పుటం జేసి మహాపురుషలక్షణలక్షితుఁడు శ్రీరాముఁడని యేర్పడినది. ఇవన్నియుఁ జిరపరిచయము గల వానికిం గాని తెలియవు. ఇన్నియుఁ జెప్పినందున సీత యతని రామునిదూతయే యని నమ్మదగియుండును గదా.

"సమస్సమవిభక్తాంగో వర్ణం శ్యామం సమాశ్రితః. ౧౬
త్రిస్థిరస్త్రిప్రలంబశ్చ త్రిసమస్త్రిషు చోన్నతః,
త్రితామ్రస్త్రిషు చ స్నిగ్ధో గంభీరస్త్రిషు నిత్యశః. ౧౭
త్రివళీవాంస్త్ర్యవనతశ్చతుర్వ్యంగస్త్రిశీర్షవాన్,
చతుష్కలశ్చతుర్లేఖశ్చతుష్కిష్కుశ్చతుస్సమః. ౧౮
చతుర్దశసమద్వంద్వశ్చతుర్దంష్ట్రశ్చతుర్గతిః,
మహోష్ఠహనునాసశ్చ పంచస్నిగ్ధోష్టవంశవాన్. ౧౯
దశపద్మో దశబృహత్త్రిభిర్వ్యాప్తో ద్విశుక్లవాన్,
షడున్నతో నవతనుస్త్రిభిర్వ్యాప్నోతి రాఘవః." ౨౦

అని మూలము. "వ్యాఖ్యానము కలిపి వ్రాయుటచేఁ గలుగు నసర్థమున కొకదృష్టాంతముఁ గనుఁడు. హనుమంతుఁడు తన

మగఁడుపంపిన దూతయగునో కాదో తెలియఁగోరి సీతాదేవి నామగనిలక్షణము లెట్టివి నామఱఁదిలక్షణము లెట్టివని యా యనను బ్రశ్నించెను. దానికిఁ బ్రత్యుత్తరముగ హనుమంతుఁడు రామలక్ష్మణుల సాముద్రికలక్షణములను గూఢముగఁ జెప్పెను. అట్లు చెప్పుటలోఁ ద్రిసముఁడు లోనగు గూఢపదములు ప్రయోగింపఁబడినవి. చెప్పెడువాఁడు పండితుఁడు. వినునది పండితురాలు. ఉభయులు శాస్త్రజ్ఞానము గలవారే. అట్టివారట్లు సంభాషింపక పామరులవలె మాటలాడుదురా? నీ మగనిము క్కింతపొడుగు. పిఱ్ఱ లింతలావని హనుమంతుని వంటివాఁడు చెప్పునా? ఇంతయైన మేలే. త్రిసమములలో వృషణములు చేరుచున్నవి. ఇట్లు చెప్పక "నీమగనివృషణములు రెండు సమానముగ నున్న"వని హనుమంతుఁడు చెప్పియే యుండిన, నౌచిత్యజ్ఞానహీనుఁడగు నిట్టివానిని రాముఁడు నా యొద్దకుఁ బంపియుండఁడని సీతాదేవి హనుమంతునితో మాటలాడుట చాలించి యుండును. రామునియొద్దకుఁ గొనిపోయెదరమ్మని చెప్పినమాటకే నీక్రోఁతిబుద్ధి మానవైతివని యాక్షేపించిన సీత తనమగని రహస్యాంగములను దనకు వర్ణించి చెప్పువానిని బవిసార్పక విడుచునా ? భాష పాత్రోచితముగ నుండవలయు. రహస్యములు రహస్యముగనే యుండవలయు." అని వావిలికొలను సుబ్బరావుగారు వ్రాయించిరి. పిఱ్ఱలు, వృషణములు నని వ్రాయుటంజేసి వీరిభాషాకౌశల మెట్టిదో విశేషించి వ్రాయ నక్కఱలేదు. నారామావతారతత్త్వమును విమర్శించుచు వీరు వ్రాసిన రామావతారతత్త్వములోనిభాష వేనోళ్లఁ గొనియాడఁదగియున్నది. దీని వదలి విషయమునే విమర్శింతము. నారచించిన యాంధ్రశ్రీమద్రామాయణము

ముద్రింపఁబడుచున్నపుడే వీరిపత్త్రమును బ్రకటించిరి. సుందరకాండ మప్పుడు ముద్రింపఁబడుచుండఁగనే నా కిది యందెను. బదు లాచోటనే వ్రాసితిని. సంగ్రహముగ నది యుండుటంజేసి యిట నింకఁ గొంచెము పెంచి వ్రాయుదును. ఈశంకలు పాఠకులకుఁ దోఁచుటయే దీనికి ఫలముగాని వేఱొండు ఫలము లేదు. వచ్చినవాఁడు రామునిదూతయే యగునా? మాయావియగుట దానవుఁ డీకపిరూపమున వచ్చి వంచింపఁ బూనినవాఁడా? అనునదియే కదా సీతాదేవికిం గలిగినశంక. దానిం బోఁగొట్టుకొనఁ గోరి నా మగనిచిహ్నము లెట్టివి? నామఱఁదిలక్షణము లెట్టివి? అని యామె ప్రశ్నించెను. దానికి సదుత్తరముగా హనుమంతుఁడు వారిగుఱుతులం దెలిపెను. ఇంతవఱకు నెవరికి నే సందేహము లుండవు. "దానికిఁ బ్రత్యుత్తరముగ హనుమంతుఁడు రామలక్ష్మణుల సాముద్రికలక్షణములను గూఢముగఁ జెప్పెను" అనునదియే యసంగతవాక్యము. గూఢముగాఁ జెప్పినచో నామె యెట్లు కనుఁగొనఁగలదు? కనుఁగొన సాధ్య మెట్లగును?

> "అట్లు చెప్పుటలోఁ ద్రిసముఁడు లోనగుగూఢపదములు ప్రయోగింపఁబడినవి. చెప్పెడువాఁడు పండితుఁడు. వినునది పండితురాలు. ఉభయులు శాస్త్రజ్ఞానము కలవారలే. అట్టివా రట్లు సంభాషింపక పామరులవలె నూటలాడుదురా?"

అనువాక్యములే యుచితజ్ఞతలేమిని వెల్లడించుచున్నవి. హనుమంతుఁడు సీతదృష్టికిం గ్రొత్తవాఁడు. ఎన్ని వేదములు, ఎన్ని

శాస్త్రములు హనుమంతునకు వచ్చునో సీతకుఁ దెలియుటెట్లు? సీత మూలప్రకృతి యనునాయాశయము వీరికిం గిట్టదు. కాన నాభావమున వీరు వ్రాయలేదు. నేను నాభావమున సమాధానము వ్రాయలేదు. లోకదృష్టింజేసి వారు వ్రాసిరి. నా సమాధాన మట్టిదియే యైయుండును. "వినునది పండితురాలు" అని వీరు వ్రాయుట యసహ్యాముగ నున్నది. మోటుకు వ్రాఁతగా నున్నది. వినునామె పండితురాలన్న బాగుండును. అది యటుంటనిండు. ఉభయులు శాస్త్రజ్ఞానము కలవారే యని యెఱింగినవా రెవరు ? వాల్మీకిమహాముని యు, వారికావ్యమును బఠించినవారునుగాని సంభాషించు నాయిరువురు గారు. "త్రిస్థిరస్త్రిప్రలంబశ్చ త్రిసమస్త్రిషు చోన్నతః." అని హనుమంతుఁ డాదేవికి సమాధానము చెప్పెననుటకంటె నవివేకిత వేఱొండు లేదు. "యాని రామస్య లింగాని లక్ష్మణస్య చ వానర" అని యామె శ్లోకరూపముననే యడిగినదందురా యేమి? సంస్కృతముననే వారిరువురు మాటలాడిరందురేని

"యది వాచం ప్రదాస్యామి ద్విజాతిరివ సంస్కృతాం,
రావణం మన్యమానా మాం సీతా భీతా భవిష్యతి. ౧౮
వానరస్య విశేషేణ కథం స్యాదభిభాషణం,
అవశ్యమేవ వక్తవ్యం మానుషం వాక్యమర్థవత్. ౧౯
మయా సాంత్వయితుం శక్యా నాన్యథేయ మనిందితా,
... ... ... ...
శుభాని ధర్మయుక్తాని వచనాని సమర్పయన్,
శ్రావయిష్యామి సర్వాణి మధురాం ప్రబ్రువన్ గిరం." ४३

సర్గము. 33

అను నీశ్లోకములగతి యేమగును? వీనింబట్టి యాలోచింప సంస్కృతభాషతో వారు సంభాషింపలేదనియు మానవసామాన్యభాషనే వా రుపయోగించిరనియు స్పష్టము. అపుడు త్రిసముఁడు లోనగు గూఢపదములు ప్రయోగించు టెట్లు? అవి మూఁడు పాదవులు. ఆనాలుఁగు పొట్టివి. అని యిట్లే యతఁడు సీతకుం దెలిపియే యుండిన నవి యనఁగా నేవని యామె గ్రహింపఁజాలును? అతఁడు సాముద్రికశాస్త్రము ననుసరించి చెప్పుచున్నాఁడని యామె యె ట్లెఱుంగఁ గలదు? ఆమెకు సాముద్రికశాస్త్రము తెలియునని యతఁ డె ట్లెఱుంగును? సర్వథా యీయాక్షేప మసంగతప్రసంగమునకుఁ దోఁబుట్టువే. అంతకుముందు వీరిరువు రొక్కచోటనే చదువుకొన్నవారుగ నుండిన నల్లవి యంతయే. ఇల్లయివి యింతయేయన్న నొక్కపు డర్థమగునేమో! అదృష్టపూర్వులయం దది యెట్లు పొసఁగును? ఈవ్రాఁతయే యసంగతమనినఁ జాల బాగుండును. ఇచ్చోఁ బాఠకమహాశయు లిట్లు గ్రహింపవలయును.

సీతాదేవి రావణుఁడేమో యని సంశయించి రాముని సంగతి నుండినఁగాని యతనిచిహ్నములు స్వభావము తెలియ దని యడిగెను. హనుమంతుఁడు తనకుఁ దెలిసినవిషయము లన్నియుం దేటపఱచెను. గూఢపదములచేఁ జెప్పియుండఁడు. ఆయిరువురప్రశ్నోత్తరములు తెలుపుఘట్టమున వాల్మీకిమహాముని మహాపురుషలక్షణముల నన్నింటిని దేటపఱచెను. అంతియకాని మూఁడు పొట్టివి. మూఁడు పొడుగుగా నుండునవి యని హనుమ చెప్పియుండునని కాని యవి యివిగదా యని యాసీత యెఱింగెనని కాని యూహింప నవకాశము లేదు. అట్లూహించితి మనుటకంటెఁ బొరపాటు వేఱొకటి లేదు.

మఱియు నిట్టిగూఢపదములతో సంస్కృతభాషతో ననుష్టు ప్ఛందస్సునఁ జెప్పెననుటకంటె నౌచిత్యజ్ఞానహీనత వేఱొకటి యుండదు. కనుక నిప్పట్టున నిట్టిశంకలం గల్పించి యందేమో రహస్యార్థము లెఱింగినట్లు నటింపరాదు.

> "రామునియొద్దకుం గొనిపోయెద రమ్మని చెప్పిన మాటకే నీక్రోధబుద్ధి మానవైతివని యాక్షేపించిన సీత తనమగని రహస్యాంగములను దనకు వర్ణించి చెప్పువానిని బవిసావ్వక విడుచునా? భాష పాత్రోచితముగ నుండవలయు. రహస్యములు రహస్యములుగానే యుండవలయు."

అని సుబ్బారావుగారు వ్రాయించిరి. ఇంతకంటె నసంగతపు వ్రాంత వేఱొకటి యుండదు. భాష పాత్రోచితముగా నుండవలయునని వ్రాసినవారే పిట్లులని వ్రాయవచ్చును గాఁబోలు. రహస్యములు రహస్యములుగానే యుండవలయు ననఁగా నర్థమేమి? ఆశ్లోకములు తెలుఁగున వ్రాయరాదు కాఁబోలు. రహస్యార్థము లున్నట్లెవరు వీరికిఁ జెప్పిరి ? రామలక్ష్మణులా ? వాల్మీకియా? వ్యాఖ్యాతల వ్రాఁతలవలననే కదా తెలిసినది. "వ్యాఖ్యాతయర్థము వాల్మీకిదైనఁ గావచ్చును. కాకున్నఁ గాకపోవచ్చు"నన్న వీరివ్రాఁత కర్థమేమి? వీ రూహించినరహస్యార్థములు వాల్మీకిమహర్షికి సమ్మతములని యెట్లు చెప్పఁగలరో! స్వప్నమున రాముఁడు చెప్పునుగాఁబోలు. వేఱొకరికీరహస్యములు తప్పు. నాకు సమ్మతములుగావని చెప్పిన గతియేమి ?

వాల్మీకిమహాముని యాశయమును దెనిఁగించునపుడు "మూఁడు సమములుగా నుండు. మూఁడు పొట్టి వగును" అని తెనిఁగించుటకంటె విరసము వేఱొకఁ డుండునా? శ్రుతికటువు లగు. "పిఱ్ఱలు" లోనగుపదముల వాడక కవి కడుహెచ్చరిక గలిగి యాయర్థమును దెలుపవలెను. అంతియకాని శ్రుతికటువులగుపదములను వీరివలె వాడరాదు. "బండపైనఁ బండఁ బెట్టి" అనుటకంటె విరసమగునది యేమియుండును? వీరు మఱి కొన్నిమాటలు వ్రాసిరి. ముందుముందు సమాధానము వ్రాయుదును. రహస్యములు రహస్యములుగనే యుంచఁదగిన వని వ్రాసిన వీరే తమపద్యములు తామే యర్థమువ్రాయుచు నేలవ్రాసిరి? అపుడు రహస్యము బయట పడదు కాఁబోలు? ఇట్టి నిస్సారములగునాక్షేపముల నసూయ వెల్లడించిన లాభమేమి?

ఇందు మహాపురుషలక్షణములు వాల్మీకిమహర్షి హనుమంతుఁడు సీతకుం దెల్పినట్లు తెలిపెను. ఇట్టి యవయవసంస్థానము కలవారు మహాపురుషులని శాస్త్రము తెల్పుచున్నది. ఇన్నియు నెవ్వరియం దుండవు. ఇందు రెండుమూఁడున్నను మహాఫలములు చెప్పఁబడియున్నవి. ఇన్నియునున్న శ్రీరామున కజస్రసుఖము కలుగకుండుటయు విశేషించి మహాపదలు కలుగుటయు నేల యని కొందఱు శంకింప నవకాశము కలదు. ఈచిహ్నములు మానవులకు మంచివని తెలుపుటయే మహర్షి యాశయము. భగవంతున కివియన్ని యున్నవన్నను గొప్పయేమి? ఏదియు లేకున్నను హానియేమి? ఇట్టిచిహ్నములు మహాపురుషులయం దుండుననియు వానిం గాంచినయంతనే సాధువు లీతఁడు మహారాజని గ్రహింతురనియుఁ గావున వీని నెఱుంగుట మంచిదనియు వాల్మీకి తెలిపెనని మనము గ్రహిం

చిన యాశంకలు గలుగవు. ఇట్టితావుల నెన్నియర్థములు చెప్పినను లాభము లేదు. ఇందుండి గ్రహింపఁదగిన తత్త్వ మెద్దియును లేదు. దుర్వాదనిర్వాపణార్థమే యీవ్రాఁత యని పెద్ద లెఱుంగకపోరు. ఈశ్లోకములఫలము లిట్టివని తెలుపుట యనవసరమనియు దాన మహాఫలము లేదనియు వదలితిని.

"సత్యధర్మపరశ్శ్రీమాన్ సంగ్రహానుగ్రహే రతః,
దేశకాలవిభాగజ్ఞ స్సర్వలోకప్రియంవదః."

అని మూలము. సత్యధర్మరతః=సత్యమునందు ధర్మమునందు నాసక్తిగలవాఁడు. ఇందు ధర్మమనఁగా సదాచారము గ్రహింపఁదగు. సజ్జనాచరితమార్గము తప్పనివాఁ డనుట. సంగ్రహమనఁగా నార్జనము. అనుగ్రహమనఁగా ఫలదానము నని యర్థము. ఇవియన్నియు శ్రీరామునకుం గలలక్షణములని హనుమంతుఁడు తెలిపెను పరమేశ్వరునకు నుండులక్షణము లన్నియు రామునియం దుండుటంజేసి భగవంతు నవతార మనియు సదారాధ్యమనియు గ్రహింపవలయును.

"భ్రాతా చ తస్య ద్వైమాత్రస్సౌమిత్రిరపరాజితః,
అనురాగేణ రూపేణ గుణైశ్చైవ తథావిధః." ౨౨

అని మూలము. "కథమూరూ కథం బాహూ లక్ష్మణస్య చ శంస మే." అను సీతాప్రశ్నమునకు నుత్తర మిందుఁ గాన రాదు. కావున వా. సు. రావుగారి యభిప్రాయము ననుసరించి వాల్మీకిమహాముని యౌచిత్యజ్ఞానశూన్యుఁ డనవలయుఁ గదా. అట్టి గొప్పమాటను మన మనకున్నఁ జాలును. "వర్ణం శ్యామం సమాశ్రితః"అని రామునివర్ణనమునందుఁ గలదు. లక్ష్మణుని మేని కాంతియు రామునివంటిదే యగునా? "అనురాగేణ రూపేణ

"గుణైశ్చైవ తథావిధః" అనుచో వర్ణము తెలుపఁబడ లేదుకదా. ఇపుడేమని వా. సు. రావుగారు వ్రాయుదురో! రహస్యములు రహస్యముగనే యుంచవలయు ననుట యిందులకే యేమో. ఇట్టివే కాఁబోలు రహస్యములు. అవి యట్లే యుండుఁగాక. లక్ష్మణునివర్ణము తెలుపుట యంతముఖ్యము గాదని హనుమంతుఁడు దాని వదలెనని మనము గ్రహింతము. మంత్రరహస్యార్థములు వదలుదము. ఇందు లక్ష్మణునకు వైమాత్ర శబ్దము చెప్పఁబడినది. జన్మము మొదలు రామునివలెఁ గౌసల్య పెంచినందున నిద్దఱుతల్లులముద్దుబిడ్డఁ డయ్యెనని వాల్మీకి యాశయమని వ్యాఖ్యాత వ్రాసెను. వాల్మీకిదైన నగును. కాకున్నఁ గాక యుండవచ్చునని వా. సు. రావుగారిభావము గదా. వాల్మీకిభావ మేమైయుండునో! వేఱొకయర్థ మేశబ్దమునకుఁ గానరాదు. వ్యాఖ్యానము నర్థమే గ్రహింపవలయు నని మన మూహింతము.

"తత స్త్వన్నాశజం శోకం రామస్యాక్లిష్టకర్మణః,
లక్ష్మణో వానరేంద్రాయ సుగ్రీవాయ న్యవేదయత్." 3౫

అని మూలము. నాశమనఁగా నదర్శనమని యర్థము. భాష పాత్రోచితముగా నుండవలయునని కదా వా. సు. రాయని భావము. సీతా! నీనాశమువలని శోకమని హనుమంతుఁడు చెప్పినట్లున్నది గదా. ఆమాట విని సీత హనుమంతుని బవి సార్పక యూరకున్నదే. ఏల? వా. సు. గారికే తెలియును. ఈశబ్దమును హనుమ యుచ్చరింపలేదనియు నీవగపడకుండుటం గూర్చి లక్ష్మణుఁడు సుగ్రీవునకుం దెలిపెనని దేశభాషతోఁ దెలిపెననియు సంస్కృతభాషను వ్రాయుతఱి నీశబ్దమును వాల్మీకి యుచ్చరించెనని వారు గ్రహింతురుగాక.

"స తవాదర్శనాదార్యే రాఘవః పరితప్యతే,
మహతా జ్వలతా నిత్య మగ్ని నేవాగ్ని పర్వతః." ౪౪

అని మూలము. భూగర్భమునుండి యగ్ని ప్రజ్వరిల్లి పర్వతముం గాల్చునట్లు దుఃఖము నీవగపడమిం గలిగినది పర్వతమువంటి రాముని బీడించుచున్నదని తాత్పర్యము. భారతవర్షమునం గూడ నగ్నిపర్వతము లాకాలమున నుండెనని యూహింప వచ్చును గదా. క్రొత్తగాఁ గనిపెట్టినవి కావనియు నివి యున్నట్లు మనవారే కనిపెట్టిరనియు మనకీభాగము తెలుపు చున్నది. నెల్లూరుమండలమునఁ గొన్నియేండ్ల క్రిందట రామ గిరి యనునది పడిపోవసాగెను. దానికిం గారణముం గనిపెట్ట నెంధలో వచ్చి చూచిరి. కొంతకాలమున కిది మండుననియు, సమీపగ్రామములకు హానిగల్గుననియు వారు చెప్పిరని యిప్ప టివా రనుచున్నారు. ఉదయగిరి యను నుపమండలమున (తాలూకా)నాకొండ గలదు. ఎంతవఱకు నిది నిజమో యుండు గాని తెలియదు. ద్వీపాంతరములలో నగ్నిపర్వతములు కల వనియు మనఖండమున లేవనియుఁ గొందఱందురు. కనుక నే యిది యన్నింటికంటెఁ బ్రాచీనభూభాగమనియు వారు పలుకు దురు. ఇపుడు కానరాలేదనవలయుం గాని లేవనుట కవకా శమే లేదనవలయును. "స్థితస్య గతిశ్చింతనీయా" అనునది సువిదితమే కదా.

"మాల్యవాన్నామ వైదేహి గిరీణాముత్తమో గిరిః,
తతో గచ్ఛతి గోకర్ణం పర్వతం కేసరీ హరిః. ౮౦
స చ దేవర్షిభిర్దిష్టః పితా మమ మహాకపిః,
తీర్థే నదీపతేః పుణ్యే శంబసాదనముద్ధరత్. ౮౧

తస్యాహం హరిణః క్షేత్రే జాతో వాతేన మైథిలి,
హనుమానితి విఖ్యాతో లోకే స్వేనైవ కర్మణా. ౧౨

విశ్వాసార్థం తు వైదేహి భర్తురుక్తా మయా గుణాః,
అచిరాద్రాఘవో దేవి త్వామితో నయితానఘే." ౧౩

అని మూలము. అప్రస్తుతప్రశంసోదాహరణముగా నీచరితము చెప్ప నేటి కనుసంధియము గలుగవచ్చును. సాగరలంఘన కార్యము నమ్మింపఁజేయఁ బవనాత్మజత్వము చెప్పఁబడినది. వాయుపుత్త్రునకు వానరత్వ మెట్టులనుశంకను దొలఁగింప నీ వార్త హనుమంతుఁడు తెల్పెనని మన మెఱుంగవలయును. మాల్యవంతమను పర్వతమునుండి కేసరి గోకర్ణపర్వతమునకుం బోయి యందుఁ దీర్థోపద్రవకరుఁడగు శంబసాదనుని వధించెను. అత్తఱి నే నంజనాదేవికి వాయుదేవునను గ్రహమునఁ గల్గితిని. భర్త లేనికాలమునఁ గల్గెనన్న శంక కవకాశము లేదు. వాయుదేవునను గ్రహమున గర్భవతియగు నంజనాదేవి నింట వదలి కేసరి ఋషికార్యార్థ మరిగెను. అపుడు పుట్టితినని కదా హనుమ తెల్పెను. ఇందు శంక కవకాశ మెక్కడిది? నాకార్యమున నే హనుమంతుఁ డన్న పేరు గల్గెనన్నందులకు నుత్తర కాండమునఁ జరిత్రము కలదు. కాన నిపుడు వ్రాయ మానితిని. వాయుదేవునివరమునఁ బుట్టినవాఁడ నగుటం జేసి సముద్రలంఘనమునకుఁ దగినశక్తి నాకలవడియెననియు వానరజాతికిం బుట్టినవాఁడఁ గాన వానరుఁడనే నైతిననియుఁ దెల్పి సీతాదేవి శంకల నివారించెనని మన మూహింపందగు.

"పితత్తే సర్వమాఖ్యాతం సమాశ్వసిహి మైథిలి,
కిం కరోమి కథం వా తే రోచతే ప్రతియామ్యహం." ౧౧

అని మూలము. తనపలుకులకు సీతాదేవిభావము మాఱినదా. యథాపూర్వముగ నున్నదా యనుశంక తొలఁగించుకొన నీ మాటలు హనుమ పలికెను. ఏమి చేయుదు? నీకెట్లు తోఁచును? మరలి పోవుదును?అనఁగా నింక నేమని యాజ్ఞాపింతువో యట్లు చేయుదునని కదా దీనిభావము. దూతకార్యము నెఱవేర్చితిని. శిష్టకార్య మామెయుత్తరువుం గొని చేయవలయునని యతఁ డూహించెను. ప్రతివచన మేమని యిందలిసారము. ఇట్లు లీసర్గమునఁ గలవిషయము విమర్శించితిని. పాఠకమహాశయులు వాల్మీకియాశయ మెట్టిదని గ్రహింతురో! రామాయణమున స్వోక్తివ్యాఘాతములు లేవనవచ్చును. ప్రమాదము లుండకపోవు. మహాత్ములకే ప్రమాదములు. అస్మదాదుల కపరాధములే యుండును. ఈసర్గమునందే "ధనుః ప్రవరపాణినో"అని. "హారిణః క్షేత్రే" అని వాల్మీకిమహాకవి ప్రయోగించెను. అపశబ్దములే యివి. ఇంతమాత్ర మామహామునికిం దెలియదనవలయునా, ప్రమాద మనవలయునా. ఇట్లే "కథ మూరూ కథం బాహూ" అనుచో సీత యట్లు ప్రశ్నించి యుండదనియు వాల్మీకియే యిట్టు లడిగినదని తెల్పెననియు మనము గ్రహించిన నామహాకవికి లోపమేమి? ఔచిత్యజ్ఞానము లేదనుట మహాపాపము కాదా. విషయ మెద్దియని గ్రహించి యందు సారమేదియని విమర్శించి తెలిసికొని భగవదారాధనము చేసి తరించుటయే రామాయణపారాయణమునకుఁ బ్రధానకార్యములు. అవి మాని యిది మాకొఱ కేర్పడిన గ్రంథమని, ఈచిహ్నములు లేకయున్న భగవదనుగ్రహము కలుగదని వాదించుటకంటె వెఱ్ఱితనము వేఱెద్ది కలదు? అట్టి దుర్వాదముల నాలకింపక శ్రీరాముని భగవంతుఁడనియు,

సీతాదేవి మహాప్రకృతియనియు, వారి కెప్పటికిని విరహము కలుగదనియుఁ, గలిగినట్లుండుట నటనమే యనియు మన మెఱింగి, వారిచరిత్ర మొక్కకులము వారికే కాక యెల్లరకుఁ బరిగ్రాహ్యమనియు విశ్వసించి, వారిని సేవింపవలయు. అదియే శరణోపాయము. ఇంకఁ దరువాతికథను బఠింతము.

## శ్రీరామాంగుళీయకప్రదానము.

* ఆహావని సీతాదేవికి విశేషించి విశ్వాసము కలిగించు నాశయమున వినయభాషణముల నామె కిట్లు తెలిపెను. మహా దేవీ! వానరుఁడనే గాని రక్కసుఁడను గాను. శ్రీరాము దూతను. తల్లీ! ఇదిగో శ్రీరామనామచిహ్నితమగు నంగుళీ యకమును దెచ్చియున్నాఁడను. చూడుము. ఆమహాత్ముఁడు నీకు విశ్వాసము గల్గునిమిత్తమే దీని నీయఁగాఁ దెచ్చితిని. ఇఁక నూఱడిల్లుము. నీకు భద్రము గలుగుం గాక. దుఃఖము లన్నియు నింతతో నంతమొందినట్లే. అనఁగా నాజనకరాజ తనూభవ ప్రాణేశ్వరు హస్తవిభూషణమగు నుంగరమును దీసి కొని పెక్కుసారులు పరికించుచు నాథునిం గాంచినట్లే సంతు ష్టాంతఃకరణ యయ్యెను. సంతోషాతిరేకవిశాలమనోహర నయనములతోఁ జెలువారు నామీనన్రేత నెమ్మొగము రాహునిర్ముక్తచంద్రబింబముం బోలి వెలింగెను. ఆదేవి ప్రాణ విభుని కుశలవార్త విన్నందులకై సంతోషించి పులకాంకు రము లెగయ నించుక లజ్జించియుఁ బెంపొందుసంతోషమున నామహాకపి నాదరించి వినుతింపఁబూని యిట్లనియె. కపిశేఖరా!

---

* ఇది ముప్పదియాఱవసర్గమునఁ గలకథ.

ఒక్కఁడవే దుర్గమమగు నీ రాక్షసావాసముం జొచ్చితివే. భవద్విక్రమ సామర్థ్యప్రజ్ఞలు వర్ణనాతీతములు. యాదోభీకర శతయోజనవిస్తీర్ణ సాగరమును గోష్పాదముగా నెంచి లంఘించితివి కదా. ప్రాణిభయంకరుఁడగు రావణునివలన నీకు భయములేదు. ఇంచుకయైనఁ గలంతయు లేదు. కనుక సామాన్యవానరుఁడవని నాకుం దోఁపదు. శ్రీరామదూతవు గావున నాతో మాటలాడుటకు నర్హుఁడవు కావున మాట్లాడ వచ్చును. శ్రీరాముఁడు మహాప్రతిభాశాలి కావునఁ బరీక్షింపక యెవ్వరినైనఁ బంపఁడు. విశేషించి నాకడకుఁ బంపఁడు. నిన్ను నాకడకుఁ బంపినందున నీవు సామాన్యుఁడవు కావు. నాభాగ్యవశమున శ్రీరామలక్ష్మణు లిరువురు కుశలముగా నున్నారు. ఆ రాముఁడు తనభార్యను రక్కసుఁడు కొనిపోయి నందులకుఁ గోపము నొంది ప్రళయకాలాగ్నివలెఁ జెలరేఁగి భూమండలమునంతయు దహించుచున్నాఁడా? దహింపలేదే. ఏల? నాదుఃఖమున కంతము లేదు కాఁబోలు. కనుకనే వా రూరకయున్నారు. విశేషించి నన్నుఁగూర్చి పరితపింపక యున్నారు కదా. ఆమహాత్ముఁడు తానిఁకఁ జేయవలసినపనులఁ జేయుచున్నాఁడు కదా? దైన్యమొందకయున్నాఁడు కదా? తొందఱపడి కార్యములయందు నేర్పుతప్పకున్నాఁడు కదా? స్నిగ్ధులయెడ మంచిమనస్సుగలిగి సామదానోపాయములనే యుపయోగించుచుండుం గదా? వైరులయందు దానభేద దండోపాయములు ప్రయోగించుచుండుం గదా? మిత్రోపకారమున జాగరూకుఁడై యుండుం గదా? ఆమిత్రులు శ్రీరాముని విశ్వసించియుందురు గదా? శ్రీరాముఁడు దేవతల ననుగ్రహింపుఁడని వేఁడుచుండుం గదా? తా నుదాసీనుఁడుగ యుండక

ష్వబలమును నమ్మి ప్రయత్నములు చేయుచుం డైవానుకూలత
నొందుచుండును గదా? ఈరీతి మేమిరువురము దూరముగా
నుండుటవలన నాయందు స్నేహ మారాముని కధిక మున్నది
కదా. మహాత్మా! నాదుఃఖము నానాథునకు పోఁగొట్టుం గాదే.
సర్వదా సుఖార్హుఁడు కదా శ్రీరాముఁడు. మిగుల సుకుమా
రుఁడు గావున దుఃఖములనొంది సహింపఁజాలఁడు గాఁడు.
అట్టిమహాత్ముఁ డిత్తఱి నాదుఃఖమూలమునఁ గృశించుఁడు
కదా? కౌసల్యాదులకుశలవార్త లప్పుడప్పుడు వినఁబడు
చుండునా? నాకార్యమును విస్మరించి కార్యాంతరాసక్తి కలిగి
యుండఁడు కదా? నన్నీమహాకష్టమునుండి యుద్ధరించునా?
భరతుఁడు సోదరప్రీతి గలవాఁడు కావున నాకొఱకుగా భీక
రాక్షౌహిణీసేనను మంత్రులరక్షణము కలదానిని బంపునా
యేమి? వానరేంద్రుఁడు సుగ్రీవుఁడు నిజబలములంగూడి నా
కొఱకు నిచ్చటికి కదలెంచును గదా? సుమిత్రానందవర్ధనుఁడు
లక్ష్మణుఁడు బాణజాలముల రాక్షసులఁ జెండాడుం గాదే.
శ్రీరామప్రయుక్తాప్రతిహతాస్త్రసంతానముల రావణుఁడు
సంగరమునఁ బడఁగాఁ జూతును గదా. శ్రీరాముని నెమ్మోము
నావిరహమునఁ గందియున్నది కదా? ఏ శ్రీరాముఁడు ధర్మము
కొఱకు రాజ్యమును బరిత్యజించినపుడు, నడవిఁ జరించునపుడు
నన్నడవికిఁ గాలినడకతోఁ దోడ్కొనిపోయినపుడు విచా
రము నొందకుండెనో ఆమహాధీరుఁ డిపుడు నావియోగమున
ధైర్యము వదలకున్నాఁడు కదా? అట్టి శ్రీరాము నెడఁబాసి
బ్రదికియున్నానని నన్ను నిందింపకుము. రామునకు జనకాదుల
యం దెవరిమీఁదను నాయందుండు ప్రేమమునకన్న నెక్కుడు
ప్రీతి కలుగదు. ఆతనిప్రీతికి నాధారము నేనే. కనుక నిట్టి

శ్రీరామప్రేమాస్పదప్రాణములను వదలితినేని రామచంద్రుఁ డించుకసేపు కూడ జీవింపఁడు గాన నానాథుఁడు నన్నుఁ గొని పోవ నుద్యోగించువార్త తెలియవచ్చుదనుక శ్రీరఘురామ దూతవగు నో హనుమంతా! బ్రదికియుండ వాంఛించు చున్నాను.

అని యిట్లు జానకి యావానరవరునితో నర్థవంతములు మనోజ్ఞములు నగుపలుకులు పలికి నాథునింగూర్చినయుత్తర మాతనివలన విన(గోరినదై యందుల కవకాశమును గల్గింపఁ గోరి యూరకయుండెను. పావనియు సీతావాక్యముల నాల కించి దోసిలొగ్గి యిట్లు పలికెను. దేవీ! నీవిందుండుట రాముఁ డెఱుఁగఁడు. నిన్ను వదలి శ్రీరాముఁ డుండఁజాలునా? శచీ దేవి యనుహ్లాదునొద్ద నుండుటెఱుంగక యింద్రుఁ డామెను గొనిపోవనిరీతిగా నిన్నును దీసికొనిపోవక యున్నాఁడు. ఉన్నతా వెఱింగినంతన శచి నింద్రుఁడు కొనిపోయినట్లు నా మూలమున నీయునికి తెలిసినంతన వచ్చి నిన్నుఁ గొంపోవం గలఁడు. నీకుశలవార్త నేఁ దెలుపఁగనే కపి భల్లూకసంభృత మహాసైన్యముం గొని వేగమ యిచ్చటికి వచ్చును. అలంఘ్య సాగరమును దాఁటి వచ్చి యీలంకను రూపుమాపును. ఎవ్వ రడ్డుపడినను వధింపక మానఁడు. జానకీ! రాముఁడు నిన్నుం గానక దుఃఖాంబుధి మునింగి సుఖము గాంచకయున్నాఁడు. అచిరకాలముననే శ్రీరామునెమ్మొగమును జూడఁగలవు. అను నీమాట నాకు సుఖనివాసములగు మలయవింధ్యమేరు మందరదర్దురపర్వతములమీఁదను, నా యాహారములగు కందమూలఫలములమీఁదను, శపథము చేయుచున్నాను. తల్లీ! వేగమ నాకపృష్ఠముపైఁ గూరుచున్న యింద్రునివలెఁ

బ్రస్రవణాద్రిం గూరుచున్న శ్రీరామునిఁ జూడఁగలవు. నీవియోగదుఃఖమున శ్రీరాముఁడు మాంసముం దినఁడు. మధువు నానఁడు. ప్రతిదినము సాయంకాలమునం దొక్కసారి వానప్రస్థుల కర్హములై తగువన్యఫలమూలములను శరీరభరణమునకుఁ దగినన్ని భుజించుచున్నాఁడు. ఆతనిమనస్సు నీయందే యిమిడియుండుటం జేసి దేహముపై వ్రాలిన వనమక్షికాదులం దోలఁగింపక యుండును. శ్రీరాముఁడు నీయందలిప్రేమమునని న్నే ధ్యానించుచు ననవరతము నిన్నే పేర్కొని నవయుచున్నాఁడు. నిన్నుఁదప్ప దేనిని దలంపఁడు. నీవిషయమునఁగలదుఃఖమున నిదురింపఁడు. ఇంచుక నిదురించినను సీతాయను మధురోక్తిఁ బలుకుచునే మేలుకొనును. మనోజ్ఞములగు ఫలమూలాదులం గాంచెనేని నిన్ను వెంటనే స్మరించి హా ప్రేయసీ! యని పేర్కొని నిట్టూర్పులు పుచ్చును. తల్లీ! తండ్రియానతిచేత వనవాసవ్రతముం బూని సర్వకాలములందు నిన్నే తలంచుకొని పొక్కుచు సీతా! యని పిలుచుచు నిన్నుఁ దెచ్చుటకే ప్రయత్నించుచున్నాఁడు. అనఁగా నావైదేహి శ్రీరామకుశలవార్తాశ్రవణమునఁ బూర్వపుశోకమును వదలెను. కాని శ్రీరామవియోగవ్యథను మాత్రము వదలఁజాలక యుండెను. ఆమె మోహమునందము సుంత తఱిగెను.

మహాత్ములారా! ఈభాగమునఁగల విశేషవిషయములఁ బరిశీలింతము.

"వానరోఽహం మహాభాగే దూతో రామస్య ధీమతః,
రామనామాంకితం చేదం పశ్య దేవ్యంగుళీయకం. ౨
ప్రత్యయార్థం తవానీతం తేన దత్తం మహాత్మనా,
సమాశ్వసిహి భద్రం తే క్షీణదుఃఖఫలా హ్యసి." 3

అని మూలము. హనుమంతుఁడు సాగించిన సంభాషణము ననుసరించి సీతకు రామదూతయే యని విశ్వాసము కలిగినట్లు కథయే తెలుఁపుచున్నది. హనుమయు నీవిషయ మెఱిఁగెను. కనుక నింక శ్రీరామదత్తమగు నంగుళీయకఁ మీయఁదగు సమయ మిది యని యెఱింగి దేవీ! మహాదృష్టవంతురాలా! నేను వానరుఁడను. శ్రీరామదూతను. ఈయుంగరము శ్రీరామ నామాంకితము. దీనిం జూడుము. రాముఁ డొసంగెను. నా యందు నీకు విశ్వాసము కలుగుటకొఱకే తెచ్చితిని. ఇఁక నూఱ డిల్లుము. నీకు మేలుగలుగును. దుఃఖఫలము క్షీణించినది. అని ప్రతీతికార్థము. రామాయణకాలమున నక్షరములే లేవనియుఁ గనుక నేకమ్మవ్రాసియీయక వార్త పంపెననియు నీకారణమున వ్రాఁత లేదని యేర్పడుననియు నొకవాదము కలదు. వీరే రామాయణమునకంటె భారతము నుందు జరగినదనియు నందురు. వీరి బుద్ధిమాంద్యమునకు మనము దుఃఖింపవలయునో, సంతోషింపవలయునో తెలియకున్నది. స్వోక్తివ్యాఘాత మనియు వా రెఱుంగరు. భారతకథ సాగినకాలమునకు వ్రాఁత లేదని వీ రనఁజాలరు. రామాయణకథ జరగినపుడు లేదందురు. ఏది ప్రాచీనమో యేది యర్వాచీనమో యీవ్రాఁతయే తెల్పును గదా. ఇట్టులుండ వీరివాద మెంత నిస్సారమో మనము కనుగొనఁ గష్టమేమున్నది? వ్రాఁతలేనికాలము ప్రాచీనమే యనక తప్పదు గదా. రామాయణమే యసత్యమన్న వారుండినచో వారికి నమస్కారమే సమాధానము. రామాయణము ననుసరించి చూచినను లేదనువారికే సమాధానము చెప్పవలసియుండును. పై వాదము చేయువారు కూడ వీరలే కదా. "రామనామాంకితం చేదమ్" అన నర్థమేమి? ఇదం=ఇది,

రామనామాంకితం = రామ అనుచిహ్నము కలది. అనఁగా రామయనుగుఱు తిందుఁ గలదు. ఇతరులకుఁ దెలియకయుండ రత్నశకలముల నక్షరాకృతిగ నలరింతురు. క్రొత్తవారి కా గుఱుతు తెలియదు. విమర్శించుతఱి నివి యీయక్షరములని తేటపడును. ఇతురు లిది మాదియనునపు డీయక్షరచిహ్నము పనికివచ్చును. అని దీనియర్థము. అక్షరములు లేవని యెట్లు చెప్పవచ్చునో దీనిమూలమున నెట్లు వారి యసంగతసిద్ధాంత ముం జేయుచున్నారో తెలియఁజాలకున్నాఁడను. ఇప్పటికి నందందు నట్టియంగుళీయకములు గలవు.

క్రీ. ౧౮౯౦ర సం॥ మున విశాఖపురమున శ్రీరాణీ నర సింహాచయనులుగారికడఁ జదువుకొన నుంటిని. వారు శ్రీశ్రీ రాజా అంకితము జగ్గారావు జమీందారుగారి డాబాతోఁ టలో నుండువారు. వారియింటనే నే నుండువాఁడను. నా రచించిన హాలాస్యమాహాత్మ్యమును శ్రీశ్రీ రాజావారొకసారి వినిరి. అందు రత్నపరీక్ష యనుభాగము కలదు. ఆపద్యముల వినునపుడు రత్నములం గాంచి గుణదోషములఁ దెలిపెదరా యని నన్నడిగిరి. చెప్పఁజాలనంటిని. ఎట్లు వ్రాసితిరని ప్రశ్నిం చిరి. సంస్కృతమున నున్నదానిని మార్చితినంటిని. నవ్వి తమ యింటఁ గలరత్నముల నాకుఁ జూపిరి. అందిట్టియంగుళీయక మగపడియెను. దాని నేఁ జూచితిఁగాని రత్నశకలఖచితమనియే గ్రహించితిని. వారితండ్రిగారిపే రందుఁ జిహ్నిత మైయుం డెను. అం. న. అని. అంకితము నరసింగరావుగారని వారిపేరు. వారు తెల్పినపిదపఁ జక్కఁగా గుఱుతింపఁ గల్గితిని. అప్పు డిది యెఱింగినవారిపుడు కొంద ఱున్నారు. కావున రామనామము చెక్కియున్నయుంగర మిది యని హనుమంతుఁడు చెప్పుట

యసంగతము కాదు. ప్రాచీనగ్రంథములఁ దూలనాడుటయే యొకతపస్సను భావముగల పెద్దల కిట్టివే కనఁబడును. అదియే పాండిత్యమనుకొని వారు వ్రాయుదురు. మహార్థమును దాము కనుఁగొనినారమని యానందింతురు. ఆనందింతురు గాక. అంత కంటె నిస్సారవాదము లేదని మనము నానందింతము. "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" అని కదా శ్రుతి కలదు. ఎట్లో యానందించుట యుత్తమము. మన మీవిషయములందుఁ జెవి యునుపరాదు. దాన సాధించుపురుషార్థ మెద్దియును లేదు. హనుమ దాని నొసఁగి "సమాశ్వసిహి భద్రం తే క్షీణదుఃఖ ఫలా హ్యసి" అనియెను. ఇంకఁ బొందఁదగా రాముఁ డరుదెంచును. అంతకంటె శుభమెద్ది? నేఁటితో నీదుఃఖము లంత మొందెనని యాహనుమానుఁడు తేటపఱచెను. కావున రామాయణకాలమున కక్షరములే లేవని యసందర్భసిద్ధాంత మును బరిత్యజించి రామాయణమును బఠించి యానందింతము.

"గృహీత్వా ప్రేక్షమాణా సా భర్తుః కరవిభూషణం,
భర్తారమివ సంప్రాప్తా జానకీ ముదితాభవత్." ౪

అని మూలము. ఆయక్షరములం జూడఁగనే శ్రీరామునికడఁ జేరినట్లే యానందించెను. భగవంతుఁ డక్షరుఁడు. నాశరహితుఁడని యర్థము. అక్షరములు నట్టివే. కార్యార్థము రూపము మాఱినట్లు దేశభేదమున నక్షరరూపము మాఱును. కాని యన్నిరూపములు దానికిం గలవు. భగవంతుఁ డక్షరుఁడే కదా. రూపభేదమున వస్తుభేదము లేనియట్లు భాషాభేద మున నక్షరతత్త్వభేదము కలుగదు దానిం గాంచఁగనే సీతాదేవియుఁ దనకార్యము ఫలించినట్లే యానందించెను. ప్రియవస్తుదర్శన మానందజనకమగుం గదా.

"శతయోజనవిస్తీర్ణస్సాగరో మకరాలయః,
విక్రమశ్లాఘనీయేన క్రమతా గోష్పదీకృతః. ౮
న హి త్వాం ప్రాకృతం మన్యే వానరం వానరర్షభ,
యస్య తే నాస్తి సంత్రాసో రావణాన్నాపి సంభ్రమః. ౯
అర్హసే చ కపిశ్రేష్ఠ మయా సమభిభాషితుం,
యద్యపి ప్రేషితస్తేన రామేణ విదితాత్మనా. ౧౦
ప్రేషయిష్యతి దుర్ధర్షో రామో నహ్యపరీక్షితం,
పరాక్రమమవిజ్ఞాయ మత్సకాశం విశేషతః." ౧౧

అని మూలము. విశాలసాగరము దుస్తరము. భయంకరజంతు సంతానసాంద్రము. దానిని గోవుపాదమంతదిగాఁ జేయఁబడినది. కాన నీవు సామాన్యవానరుఁడవు గావని తలంచెదను. అని సీత పల్కెను. అనఁగా నీతఁడు మహాయోగి యని 'యా దేవి యెఱింగియే పొగడెను. ఇందలిసార మేమి?

సూ. "దేశబంధశ్చిత్తస్య ధారణా." ౧

ధారణాధ్యానసమాధులు త్రయ మనంబడును. ధారణయనఁగా నాభిచక్రహృత్పుండరీకమూర్ధజ్యోతిర్నాసికాగ్రజిహ్వాగ్రాదిస్థానములయందు బాహ్యవిషయమునందును జిత్తము నకు వృత్తిమాత్రమున బంధమని యర్థము. నిశ్చలముగా నిల్పుటయని భావము.

"ప్రాణాయామేన పవనం ప్రత్యాహారేణ చేంద్రియం,
వశీకృత్య తతః కుర్యాచ్చిత్తస్థానం శుభాశ్రయే."

అని విష్ణుపురాణవచనము గలదు.

"మూర్తం భగవతో రూపం సర్వోపాశ్రయనిస్పృహం,
ఏషా వై ధారణా జ్ఞేయా యచ్చిత్తం తత్ర ధార్యతే."

అనియు నందే కలదు. ధ్యానమనఁగా

సూ. "తత్ర ప్రత్యయైకతానతా ధ్యానం." ౨

ధారణాస్థలమునందు ధ్యానేతరవస్తువులను జిత్తమునందు రానీయక నిల్పుట ధ్యానమగును.

"తద్రూపప్రత్యయైకాగ్ర్యసంతతిశ్చాన్యనిస్పృహా,
తద్ధ్యానం ప్రథమైరంగైః షడ్భిర్నిష్పాద్యతే నృప."

అని పురాణవచనము కలదు కదా. ధారణయందు బుద్ధినునిచి మఱువకయుండుట యని యిందలిసారము.

సూ. "తదేవార్థమాత్రనిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః." 3

ధ్యానించు వస్తువులస్వరూపమై ఆధ్యానము లేకుండుటయే సమాధి యని యర్థము. ఏవస్తువును ధ్యానించుచున్నాఁడో యదిగానే పరిణమించి నేను ధ్యానించుచున్నాననునది కూడ మఱచిపోవుటయే సమాధి యనంబడునని సారము.

సూ. "త్రయమేకత్రసంయమః." ౪

ఒక్కవిషయమునందు ధారణాధ్యానసమాధులను నీమూఁడిం టిని గూడియుండుట సంయమమని భావము.

సూ. "తజ్జయాత్ప్రజ్ఞాలోకః." ౫

సూ. "కాయాకాశయోస్సంబంధసంయమాల్లఘుతూలసమాపత్తే శ్చాకాశగమనమ్." ౪౨

పాతంజలయోగసూత్రము. 3 పాదము.

అను నీసూత్రముల ననుసరించి శరీరాకాశసంబంధమునందు సంయమము చేయుటచే శరీరము దూదివలెఁ దేలికయై యాధారము లేని యాకాశమున సంచరించును. హనుమంతుఁ డిట్టులు యోగము నభ్యసించి సిద్ధుఁడయ్యెను. కనుక శతయోజన విస్తీర్ణసముద్రమును గోష్పాదమును దాఁటినట్లు దాఁటెనని

సీత కనుఁగొనెను. దూరదేశప్రయాణమునకుంగూడ యోగా భ్యాస ముపకరించును. కాని యది దానికి ఫలముకాదు. చిత్తై కతానత యోగఫలము. దాన నఖిలార్థములు సిద్ధించును. యోగి సమదర్శనుఁడు కావలయుం గాని భిన్నదర్శనుఁడు కారాదు. అది యోగసిద్ధికి ఫలము గాదు. ఆకాశగమ నము కూడ నట్టిదే. భగవత్కార్యమున కుపయోగించు తపః ఫల మక్షయమగును. కావున మహాయోగి యగు హనుమం తుఁడు శ్రీరామకార్యార్థ ముపయోగించిన యోగఫల మనంతఫలప్రదమయ్యెనని మన మెఱుంగవలయు. శిష్యులను శిష్యురాండ్రను జేర్చుకొని వికారముగ భాయాపటములఁ దీయించుకొనుట యోగఫలమని భావించువారు కపట యోగులు; ధనార్జనతత్పరులు. హనుమంతుని యోగవిద్య ధర్మరక్షణతత్పరము. అట్టి మహాకార్యములకు నుపయోగించు నది యేదియైన నుత్తమఫలదమే యగుననుట నిర్వివాదాం శము.

హనుమంతా! నీవు వానరమాత్రుఁడవని యూహింపఁ జాలను. ఏనీకు రావణునివలన భయము నుంతయు లేకున్నదో యని సీత ప్రశంసించెను. అనఁగా

> "ప్రశాంతాత్మా విగతభీర్బ్రహ్మచారివ్రతే స్థితః,
> మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః. ౧౪
> యుంజన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః,
> శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి." అ ౬. ౧౫

అన్న భగవద్గీతావాక్యముల ననుసరించి యోగికి భయమెట్లు వచ్చును?

> "ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్రసమదర్శనః,"

అని కదా భగవద్వాక్యము. స్వకర్మానుసార మాతనిపై నితరుఁడు ద్వేషముగలవాఁడైన నతఁ డెల్లయెడల సమదర్శనుఁడే కదా. కనుకనే సీతాదేవి రావణునివలన నేభయము నీకుఁ గలుగలేదు కావున నీవు కపిమాత్రుఁడవు కావనియె. సర్వభూతహితుఁడుగా యోగి యుండవలయునని దీనిసారము. ఓ మారుతీ! నీవు నాతో సంభాషింప నర్హుఁడవు. శ్రీరాముని చేఁ బంపఁబడితివి. పరీక్షింపక శ్రీరాముఁ డెవ్వరి నేకార్యమునందు నియమింపఁడు. విశేషించి నాకడకుం బంపఁడు. అని సీత పలికెను. దీనిభావ మేమి? పండ్రెండుసంవత్సరములు పరీక్షించి కాని గురువు మంత్రోపదేశము చేయరాదని యొక నియమము కలదు. "దేయం వత్సరవాసినే" అని వేఱొక నియమము కలదు. చెంత నివసించినఁగాని యతనిస్వభావము సకలవిధములఁ దెలియఁ దరముగాదు. ఇది యందఱకు నేర్పడినవిధి. భగవంతుఁ డగురామున కిది యనవసరమైనను మానవాకృతిఁ దాల్చుటంజేసి లోకాచారము ననుసరించి పరీక్షించునని మన మెన్నవలయును. విశేషించి నాకడకుం బంపఁడనఁగాఁ బరమభక్తుఁడైనఁగాని నాకడకు రాఁదగఁడని భావము. నీ వేకాంతభక్తుఁడవు. కావున నీవు సంభాషణార్హుఁడవని దీనిభావసారము. భర్త భార్యకడకు విశ్వాసపాత్రుఁడు పుత్రతుల్యుఁడు నగువానిమూలమునఁ దనహృదయభావము తెలియఁజేయవలయు ననుసదాచారము మన కీభాగము తెలుపుచున్నది. పూర్వాచారములన్నియు సదాచారములే యని తలంపవలయును. ముఖ్యముగా స్త్రీలకడకు వార్తం బంపవలయునన్న విశ్వాసపాత్రుఁడే కావలయుననుట యిందలి

సారము. దూతలక్షణవ్యాజమున లోకులకు మంచియాచార ములు వాల్మీకిమహాముని మనకుఁ దెల్పెను.

"అథ వా శక్తిమంతౌ తౌ సురాణామపి నిగ్రహే,
మమైవ తు న దుఃఖానామస్తి మన్యే విపర్యయః." ౧౪

అని మూలము. కార్యము నెఱవేర్పఁగలవా రుండినను దత్ఫలము లభింపకయుండుట దుష్కర్మఫలానుభవకాలము ముగియకుండుటంజేసి యను కర్మసిద్ధాంత మిందుఁ బ్రతిపాదింపఁబడినది. ప్రారబ్ధకర్మము ననుభవింపక నశింపదనునది యీ భాగమునం దేలెడిని. లేకున్న శ్రీరామలక్ష్మణులు వచ్చి సీత నేల విడిపించికొనిపోవరు? రావణునకు మృతికాలము రావలయు. అంతదనుక భగవంతుఁడు కూడ వేచియుండవలసినదే. ఇదియే యప్రతిహతకర్మసిద్ధాంతము. దీనిఁ జక్కఁగా నెఱింగినఁ దన కితరు లపకారముచేసిరని భావింపకుండుదురు. ఇంత కంటె మహాఫలము మానవునకు నేమి కావలయును? సకల ప్రవృత్తులకుఁ గర్మమే ప్రధానమని మన మెఱుంగవల యును. అదియే రామాయణపారాయణఫలము.

"కచ్చిదాశాస్తి దేవానాం ప్రసాదం పార్థివాత్మజః,
కచ్చిత్పురుషకారం చ దైవం చ ప్రతిపద్యతే." ౧౫

అని మూలము. మానవులకు నుపాస్యులు దేవతలు. (నేను బాహ్యదృష్టికిఁ జెంతలేనట్టు లున్నాను.) కావున దేవతలయను గ్రహమును శ్రీరాముఁడు కోరుచున్నాఁడు కదా యని సీత ప్రశ్నించుచున్నది. కర్మసిద్ధాంతానుసారము శుభఫలాదులు లభియించును. కాన, దేవతల నారాధింప నేల యనుదుర్వాదము నడఁగింపఁబూని యీప్రశ్నము సీత యడుగుచున్నది.

దేవతాప్రార్థనమువలనఁ గర్మమునఁ గొంచెముభాగము తొలఁగ వచ్చును. పామరులకు మంచిదారిచూపిన మహాపుణ్యము కలుగును. కావునఁ గర్మములవలనఁ గలుగుఫలములు దేవతారాధనమున వృద్ధిక్షయములం గాంచును. శుభములు వృద్ధియగుట దుఃఖము లడంగుటయు నగునని భావము. పురుషప్రయత్నముననే కార్యములు ఫలించునని కొందఱు, దైవముననే కార్యఫలము లొనఁగూడునని కొందఱు పల్కుదురు. వాల్మీకిమహర్షి యీరెండు నుండవలయునని తెలుపుచున్నాఁడు. పురుషప్రయత్నము చేయుచు దైవము నమ్మవలయుననియు, నీరెండును సంపూర్ణములుగా నుండినఁ గాని కార్యము ఫలింపదని సీతావాక్యమూలమునఁ దెలుపుచున్నాఁడు. పురుషకార మెంతప్రబలమైనను దైవానుకూలత లేక ఫలింపదనియు, దైవము పురుషకారవిరహితముగా ఫలప్రదము కాదనియుఁ, గావున నహంకారములేక ప్రయత్నము చేయుచు దైవముమీఁద భారము వైచియుండుట లగ్గని మన మెఱుంగఁదగు.

"ఉద్యోగినం పురుషసింహముపైతి లక్ష్మీ
ర్దైవేన దేయమితి కాపురుషా వదంతి,
దైవం నిహత్య కురు పౌరుషమాత్మశక్త్యా
యత్నే కృతే యది న సిద్ధ్యతి కోఽత్ర దోషః."

అన్నసూక్తి క్రొత్తది కాదు.

"యోగస్థః కురుకర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ,
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే." ౪౮ అ. ౨

అను గీతావాక్యము ఫలాభిసంధిరహితకర్మముల నాచరింపు

మని బోధించుచున్నది. అనఁగా దైవమును నమ్మి పురుషకార
మును మానక ప్రవర్తింపఁ దగునని కదా భావము. ఈభాగము
మనకుఁ బౌరుషదైవములుకలిసి ఫలమును గల్గించునను న్యాయ
మును దెలుపుచున్నదని యెఱుంగవలయును.

"రౌద్రేణ కచ్చిదస్త్రేణ జ్వలతా నిహతం రణే,
ద్రక్ష్యామ్యల్పేన కాలేన రావణం ససుహృజ్జనం." ౨౯

అని మూలము. శ్రీరాముఁడు శంకరభక్తుఁడు కదా. శంక
రుఁడు రామభక్తుఁడు అనఁగాఁ బరస్పరధ్యానతత్పరులు.
ఒక్కతత్త్వమే యిరువురముగాఁ గార్యార్థము వెలసితిమని
వా రెఱుఁగుదురు. అట్టిజ్ఞానము మనకుమాత్రము లేదు.

"శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే,
సహస్రనామతత్తుల్యం రామనామ వరాననే"

అన్నశ్లోక మత్యంతప్రమాణమనియు, నది శంకరోక్తమనియు
నుద్ఘోషించు మధ్వవైష్ణవులు,

"ఇతి సంచింత్య మనసా పురాణం రుద్రమీశ్వరం,
పుత్రార్థమారాధితవానహమాత్మానమాత్మనా
న హి విష్ణుః ప్రణమతి కస్మైచిద్విబుధాయ చ,
యత ఆత్మానమేవేతి తతో రుద్రం భజామ్యహం." ౩౦

శాంతిపర్వము. ౩౪౨ అధ్యా.

అన్న మహాభారతప్రతిపాదితకృష్ణవాక్యము నేల స్మరింపరో!
వారి దుష్కర్మమనక మతేమనవచ్చును? పరమశివభక్తుఁడగు
శ్రీరామమూర్తి రౌద్రాస్త్ర మనఁగా రుద్రదేవతాక మగు
నస్త్రముం బ్రయోగించి రావణుం జంపఁగా నచిరకాలమునఁ
జూడఁగలను గదా యని సీత ప్రశ్నించెను. ఈచోట గోవింద
రాజులు చల్లగా దాఁటిపోయిరి. వారికిఁ బైనవ్రాసిన మహా

భారతశ్లోకము కంఠపాశము గాక మఱేమగును? విష్ణుపురాణము శ్రీభాగవతము హరివంశము ప్రమాణములని వారంగీకరించినను అవియు శివకేశవాభేదమునే ప్రతిపాదించుచున్నవి. పాపము! ఇపుడేమందురో!

"ధర్మాపదేశాత్త్యజతశ్చ రాజ్యం మాం చాప్యరణ్యం నయతః పదాతిం,
నాసీద్వ్యథా యస్య న భీర్న శోకః కశ్చిచ్చ ధైర్యం హృదయే కరోతి."

అని మూలము. పితృపాలనరూపధర్మవ్యాజమున రాజ్యమును ద్యజించి నన్ను నడిపించుకొని యడవికి వచ్చెను. అని సీతయే తెల్పెను. తండ్రిమాట యొకవ్యాజమే కాని యవతారఫలముఁదీర్ప వనగమనము విధియనియే కదా దీనిభావము. "మాం పదాతిం అరణ్యం నయతః యస్య న భీర్న శోకశ్చ." నన్ను నడిపించుకొని యడవికి వచ్చెను గదా. అనఁగా నన్ను నడిపింపకున్నఁ దా నడువఁజాలఁడని యామె యాశయము. ప్రకృతివిశిష్టుఁడని భావము. నన్నుం బిలుచుకొనిరానియెడల రామావతారమే వ్యర్థమని సారము. ఇట్టి మాకు నవినాభావసంబంధముగాక వియోగము కల్గుట తత్త్వము కాదు సుమీ యని యామె గూఢముగాఁ దెలుపుచున్నదని మన మూహింపవలయును.

"న చాస్య మాతా న పితా చ నాన్య
స్స్నేహాద్విశిష్టోఽస్తి మయా సమో వా,
తావత్త్వహం దూతజిజీవిషేయం
యావత్ప్రవృత్తిం శృణుయాం ప్రియస్య." 30

అని మూలము. ఇందు గూఢముగా సీతాదేవి తనతత్త్వమును హనుమంతునకుఁ దెలుపుచున్నది. హనుమంతా! తల్లిదండ్రులుగాని మఱెవ్వరుగాని నాతో సమానులు కూడ శ్రీరామునకు

లేరు. శ్రీరామునకుఁ బ్రేమింపఁదగినవస్తువును నేనే. కాఁబట్టి యారాముని ప్రవృత్తి విన్నంతదనుక జీవించియుందును. అని భావసారము.

"మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరం,
హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే."

అన్న గీతావాక్యమునఁ గలభావ మిదియే గాక మఱేమగును? శ్రీరామప్రవృత్తిని విన్నంతదనుక జీవించియుండఁ గోరెదను. ఆభగవంతుఁడు ప్రవృత్తిరహితుఁడు కాఁగానే నాతనియందే లీనమగుదును. సంకల్పరహితుఁడు భగవంతుఁ డెపుడగునో యపుడే ప్రకృతి యాభగవంతునియందు లీనమగును. సంకల్పము కలుగఁగా నుదయించును. అనఁగాఁ దత్సంకల్పమే ప్రకృతియనికదా సారము. అట్టిప్రకృతి రామునివదలి లంకలో నుండు టెట్లు సంభవించునో తోఁపకున్నది. అట్లుండుట నటనము గాక వేఱేమున్నది? సర్వకారణము మహాప్రకృతి యనియు భగవంతుఁడు నిర్లిప్తుఁడు సర్వసాక్షియు నగుననియు దీనిహృదయము. ఈవిషయమునే శ్రీశంకరభగవత్పాదులు,

"త్వదన్యః పాణిభ్యామభయవరదో దైవతగణ
స్త్వమేకా నైవాసి ప్రకటితవరాభీత్యభినయా,
భయాత్త్రాతుం దాతుం ఫలమపి చ వాంఛాసమధికం
శరణ్యే లోకానాం తవ హి చరణావేవ నిపుణౌ." ४

అను నీశ్లోకమునఁ దెల్పిరి. ఎంతదనుక శ్రీరాముఁడు ప్రవృత్తిమార్గము నవలంబించునో యంతదనుక నే జీవింతును. అది యతఁడు మానిన నందే లీనమగుదునని సీతాదేవి తత్త్వమును హనుమంతునకు గూఢముగా నుపదేశించెనని మనము గ్రహింపవలయును.

"మలయేన చ వింధ్యేన మేరుణా మందరేణ చ,
దర్దురేణ చ తే దేవి శపే మూలఫలేన చ." ౩౮

అని మూలము. దేహస్వభావము ననుసరించి వస్తుప్రీతి కలుగు నను నర్థము నీభాగము మనకుఁ దెల్పుచున్నది. శ్రీరాముఁడు నీవియోగమున దుఃఖించుచున్నాఁడు. ఈపర్వతములసాక్షిగా, నాకాహారములగు మూలఫలములసాక్షిగా నని ప్రమాణము చేయుచున్నాను. అనునదియే ప్రమాణము. ఇందే మాత్ర మసత్యము దోఁచిన నీవస్తువులు నాకు లేకుండుఁగాక. యని దానియర్థము. అసత్యదోషము నాకు సుఖకరములగు వస్తువులు లేకుండఁజేసి నన్ను శ్రమంపఁజేయుఁగాక యని దీని యర్థసారము. పూర్వకాలము సత్యభీరుత్వ మధికముగా నెల్లరకుండెను. కాన నిట్టిప్రమాణములు చేయఁగనే నమ్ముచుండిరి.

"న మాం సంరాఘవో భుంక్తే న చాపి మధు సేవతే,
వన్యం సువిహితం నిత్యం భక్తమశ్నాతి పంచమం." ४౧

అని మూలము. బ్రాహ్మణేతరుల కాకాలమున మాంసభక్షణము విధివిహితమే.

"స్త్రియశ్శూద్రాస్తథా మాంసమాదద్యుర్బ్రాహ్మణీం వినా. ౬४
ఆపత్సు బ్రాహ్మణీ వాపి భక్షయేద్గుర్వనుజ్ఞయా,"

అని పురాణవచనము.

సీతాదేవీ! నీవు చెంతలేనికతన నీదుఃఖమున రాముఁడు మాంసమును భక్షింపఁడు. మధువు సేవింపఁడు. వన్యమగు ఫలమూలాదికమును యథావిధిగ నైదుభాగములుచేసి దేవ పిత్రతిథిభూతములకొఱకు నాలుఁగుభాగము లొసఁగి పరిశిష్టమగు పంచమభాగమును భక్షించును అనఁగాఁ బ్రాణధారణ

మాత్రమగు నాహారమును గైకొనుచున్నాఁడని తాత్పర్యము. మాంసభక్షణము మధుపానము మానినాఁడని తెలుపుట సీపైఁ గలవిచారముచేతనే యను నర్థపోషణముకొఱకని భావము. మేధ్యపశుమాంసము యుగానుసారముగ నుండును. కలియుగమున నది నిషేధింపఁబడినది. మధుపానము సంభోగాంగముగా బ్రాహ్మణేతరుల కందఱకు విధింపఁబడినది. అంతియగాని యాహారముగా నది విధింపఁబడలేదని యెఱుంగవలయును.

"దృష్ట్వా ఫలం వా పుష్పం వా యద్వాన్యత్సుమనోహరం,
బహుశో హా ప్రియేత్యేవం శ్వసంస్త్వామభిభాషతే." ౪౫

అని మూలము. మంచివస్తువును దేనింగాంచినను హా ప్రేయసీ! యని నిన్నుఁ దలంచును. నీవు చెంతలేని కారణమున నేదియుఁ దనకిష్టముగాలేదని చింతించునని రామునాశయమని హనుమ తెలిపెను. సుమహితవస్తువు నెద్దానిం బడసినను ఇష్టదేవతకు నివేదింపక తా ననుభవించిన నది సంతాపకారణమగునని గ్రహింపందగు. భగవంతునకు నివేదించుట కృతజ్ఞతకు నుదాహరణమని భావము.

"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః."

అన్న భగవద్వచనము ప్రసిద్ధమే కదా. భగవంతునకు మన మొసంగుపదార్థము సంతృప్తి గలిగింపఁజాలకయున్నను గృతజ్ఞత యనుసద్గుణమున కానందించి యామహాత్ముఁ డద్దానిని బరిగ్రహించి మనలఁ గృతార్థులనుగా నొనరించును. కావున మనము పరమేశ్వరునకు నివేదింపక దేని ననుభవింపరాదను విషయమును గ్రహింపవలయును. ఇదియే సదాచారము. ఈ సదాచారము తరణోపాయమును జూపించును. అనఁగా

సర్వము భగవన్మయమనియు నామూనితాత్మునకు సమర్పింపక దేనినైన ననుభవింపరాదనియు దీనిసారము. ఇట్లు భక్తిభావమునకే ఆనందించి ఘోరాపారసంసారసాగరమునుండి భక్తులను దరింపంజేయుభగవంతుని నిర్మలభక్తి నారాధింపవలయుననియు, నాతనియారాధనమునకు వస్తువుల సేకరించి శ్రమంపడ నక్కఱలేదనియు, నవ్యాజప్రీతి యొక్కఁడుండినం జాలుననియు, బాహ్యపూజ యల్పఫలదమే యగుననియు, మానసికారాధన మనంతఫలప్రద మగుననియు, విగ్రహారాధనము ననే సర్వకాలము తృప్తినొందక దాని వదలి యంతరర్చనసేయు నలవాటునకుఁ బాలుపడవలయుననియు, నదియే మహాతపస్సనియు మన మెఱుంగు టుత్తమము. బాహ్యచిహ్నములు ప్రధానములు కావనియు వానికాభగవంతుఁడు సంతృప్తుఁడు కాఁడనియు గ్రహింపవలయును. బాహ్యచిహ్నములే ప్రధానములనియు వానిం జూచికాని యాపరమేశుఁడు వరము లొసంగఁడని పలుకు నల్పబుద్ధులు ధనలుబ్ధులే యని మన మెఱుంగవలయును. దాసులమని యోగులమని సన్న్యాసులమని యింక నెన్నియో పేరులం బెట్టుకొని యనేకధర్మవ్యాజముల నెందఱో ధనము నార్జించి తమబంధువుల కిచ్చి కృతార్థులమైతిమని భావించువా రధన్యులే కాని ధన్యు లెన్నిజన్మములకుం గాఁజాలరు. మనము వంచించితిమనియు మనగుట్టు లోకు లెఱుంగఁజాలరనియుఁ దలంచువారికంటె మూర్ఖులు లేరు. సర్వస్వము భగవంతున కర్పించితిమని పలుకువారే జగద్వంచకు లగుదురు. భక్తుఁడు సంగపరిత్యాగము చేయవలయు. శిష్యులను బ్రార్థించి ప్రార్థించి కూర్చుకొని ముక్తిమార్గముం జూపుదుమనువారికంటె నీచు లెవ్వరుందురు?

తరణోపాయమును దెలుపుటకు ధనమెందులకు? దేవాలయ ములఁ గట్టింపనేల?

"దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవస్సనాతనః,
త్యజేదజ్ఞాననిర్మాల్యం సోఽహంభావేన పూజయేత్."

అనునది క్రొత్తది కాదు కదా. దేవాలయాదివ్యాజమున ధన మార్జించుచు దానిని బంధువుల కొసంగుచు భక్తి నభినయించు వార లెందఱో కలరు. వారిమాటలకుం జేలుపోవక భగ వంతు నవ్యాజభక్తి నారాధింపవలయును. అదియే తరణో పాయమునకు దారిచూపును. కనుక మనమెల్ల దుర్మతాభి మానము మాని పరమతధర్మముల నాదరించుచు శక్తికను రూపముగా యోగము నభ్యసించుచు మనస్సు నిష్టదేవతా పాదారవిందములయందు లయింపఁజేసి కృతార్థులము కావల యును. యజ్ఞములయం దుత్తమోత్తమము జపయజ్ఞము; దానిసారమే ధ్యానము. అది నిర్వ్యాజము కావలయును. భూతదయాదిసుగుణము లద్దానికి సాధనములు. భగవంతుని సర్వతోగతునిగాఁ దలంచుటయే దానిఫలము. సమదర్శన త్వమే యోగమునకు ఫలము. మంత్రజపమునకు ఫలము ధ్యానము. దానికి సాధనము యోగము. అను నీసంబంధ మును దొలుత నెఱుంగవలయును. సద్గురువులు దొరకరను భయ మక్కఱలేదు. శ్రద్ధయొక్కటి కుదిరినఁ జాలును. దానిచేఁ దృప్తుఁడై భగవంతుఁడే గురువులం బురికొలిపి వారి కడకుం బంపును. సర్వసత్కర్మఫలము శ్రద్ధయే. ఫలములఁ గోరక సత్కర్మముల నాచరించుచుండిన జ్ఞానము తనంతన లభించును. అదియే నిర్మలముక్తిని గల్గించును. కావున మహా శయులారా! మనము శ్రీరాముని భగవంతునిగా సీతాంబను

మహాప్రకృతినిగా భావించి యారాధింతము. కృతకృత్యుల మగుదుము. నిస్సంశయము. మతద్వేషములం బాఱందోలి సర్వమతస్థులకు నాపరాత్పరుఁడే దిక్కని నమ్మి యారాధింతము. ఇదియే యుత్తమమార్గము. దీని ననుసరించి ప్రయాణము సల్పితిమేని గమ్యస్థానమును జేరుదుము. ఇది సత్యము. సత్యము. సత్యము. మన మీ ప్రకరణమును ముగించుచు శ్రీసీతారాముల నిట్లు ధ్యానింతము.

"బ్రహ్మాదియోగిమునిపూజితసిద్ధమంత్రం
దారిద్ర్యదుఃఖభవరోగవినాశమంత్రం,
సంసారసాగరసముత్తరణైకమంత్రం
వందే మహాభయహరం రఘురామమంత్రం.

మందారమూలే మణిపీఠసంస్థం
సుధాప్లుతం దివ్యవిరాట్స్వరూపం,
సబిందునాదాంతకళాంతతుర్య
మూర్తిం భజేఽహం రఘువంశరత్నమ్.

వేద్యం వేదగురుం విరించిజనకం వేదాంతమూర్తిం స్ఫుర
ద్వేదం వేదకలాపమూలమహిమాధారాంతకందాంకురం,
వేదశృంగసమానశేషశయనం వేదాంతవేద్యాత్మకం
వేదారాధితపాదపంకజమహం రామం భజే తారకమ్."

శ్రీరామకర్ణామృతము.

నిజభక్తయశఃప్రఖ్యాపనమను తొమ్మిదవప్రకరణము
సంపూర్ణము.

శ్రీ. శ్రీ. శ్రీ.

చెన్నపురి: శ్రీరామ ప్రెస్సున ముద్రితము. 1936—1000.

శ్రీః.

# శ్రీరామావతారతత్త్వము

## ప ది య వ ప్ర క ర ణ ము

ఇ య్య ది

కళాప్రపూర్ణ కావ్యస్మృతితీర్థ:

జనమంచి శేషాద్రిశర్మ విరచితము.



చె న్న పు రి:

శ్రీ 'రామ' ముద్రాక్షరశాలయందు

ము ద్రి త ము.

1938.

# అభ్యర్థన.

మహాశయులారా!

మిక్కిలి యాలస్యముగావించి దశమప్రకరణమును మీ కర్పింపఁ గల్గితిని. ఈవిషయము వ్రాయుటకే లజ్జించుచున్నాఁడను. పత్త్రములు లభింపక కొంత యాలస్యమైనది. తక్కిన కారణములు పూర్వము వ్రాసినవే కాన వదలితిని. సుందర కాండము పూర్తిచేసితిని. పోషకమహాశయులు పదిరూప్యము లిచ్చియున్నారు. పదిసంపుటము లర్పింపఁ గంటిని. ఏడుసంపుట ములలో నీతత్త్వము ముగియుననుకొంటిని. సుందరకాండము పూర్తియగుదనుకఁ గల గ్రంథమునకే పదిసంపుటము లైనవి. ఇఁక నాల్గు ప్రకరణములకుఁ దక్కువ గాదు. కావున మహా త్ములు నాపయి ననుగ్రహ మునిచి ప్రకరణమున కొక్కొక్క దాని కొక్కరూప్యమువంతున ననుగ్రహింపవలయు. ఇష్టము లేనివారు తెలుపఁ బ్రార్థితులు. నిర్వాహకు లేమియు నింక నెక్కువఁగా నీయ నక్కఱ లేదు. విశేషించి యిందుఁ దెలుపఁ దగువిషయములు లేవు. నాకృతజ్ఞతకు భాషోద్ధారకులు కరు ణోదారమనస్కులు మ. రా. రా. శ్రీ, వావిళ్ల వేంకటేశ్వర

శాస్త్రులుగారు పాత్రులు. నాలోపములు మన్నింపఁదగువారు పండితాఖండలులు. ఇఁక వ్రాయఁదగిన దేమున్నది? ఇది సత్కార్యమైనఁ గొనసాగు ననువిశ్వాసము నాకు గలదు. ఇఁకఁ గోరుదువ దేమి?

ఇట్లు ప్రార్థించు భక్తభక్తుఁడు,
జనమంచి శేషాద్రిశర్మ.
శ్రీ. శ్రీ. శ్రీ.

# వి ష య సూ చి క.

విషయము. | పుట.

శ్రీః

# శ్రీరామావతారతత్త్వము

## సుందరకాండము.

### దశమప్రకరణము.

శ్లో. కస్తూరీఘనసారకుంకుమలసచ్ఛ్రీచందనాలంకృతం
కందర్పాధికసుందరం ఘననిభం కాకుత్స్థవంశధ్వజం,
కళ్యాణాంబరవేష్టితం కమలయా యుక్తం కళావల్లభం
కళ్యాణాచలకార్ముకప్రియసఖం కల్యాణరామం భజే. ౧

మజ్జీవం మదనుగ్రహం మదధిపం మద్భావనం మత్సుఖం
మత్త్రాతం మమ సద్గురుం మమ వరం మోహాంధవిచ్ఛేదనం,
మత్పుణ్యం మదనేకబాంధవజనం మజ్జీవనం మన్నిధిం
మత్సిద్ధిం మమ సర్వకర్మసుకృతం రామం భజే తారకం. ౨

నిత్యం నీరజలోచనం నిరుపమం నీవారశూకోపమం
నిర్భేదానుభవం నిరంతరగుణం నీలాంగరాజోజ్జ్వలం,
నిష్పాపం నిగమాగమార్చితపదం నిత్యాత్మకం నిర్మలం
నిష్పుణ్యం నిఖిలం నిరంజనపదం రామం భజే తారకం. ౩

ధ్యాయే త్వాం హృదయాంబుజే రఘుపతిం విజ్ఞానదీపాంకురం
హంసో హంసపరం పరాదిమహిమాధారం జగన్మోహనం,
హస్తాంభోజగదాబ్జచక్రమతులం పీతాంబరం కౌస్తుభం
శ్రీవత్సం పురుషోత్తమం మణినిభం రామం భజే తారకం. ౪

రామం రాక్షసవంశనాశనకరం రాకేందుబింబాననం
రక్షోరిం రఘువంశవర్ధనకరం రక్తాధరం రాఘవమ్,
రాధాయాత్మనివాసినం రవినిభం రమ్యం రమానాయకం
రంధ్రాంతర్గతశేషశాయినమహం రామం భజే తారకం. ౫

జ్ఞానరత్నాకరులారా! రామావతారతత్త్వజిజ్ఞాసువులారా!

శ్రీరామావతారతత్త్వమునందు నవమప్రకరణమును బఠించి యందుఁ గలరహస్యముల నెఱింగితిరి. అందుఁగల శ్రీరామభక్తునిచరిత్రమును బరిశీలించి యుందురని భావింతును. భక్తుఁ డిష్టదేవతయం దెట్టిదృఢభావన కలవాఁడో యాప్రకరణమే తెలుపును. ఈ సుందరకాండమంతయు భక్తిరసార్ణవనిమగ్నుఁ డగుహనుమంతునిమహత్త్వమునే తెలుపునట్టిదని పెద్దలన మనము విందుము కదా. ఆకాండమునఁ బ్రథమభాగము ముగిసినది. ఇది రెండవభాగము కద. రావణుఁడు కామోద్రేకమున జానకిని హరించెనని వాదము పామరజనసమ్మతమనియుఁ దత్త్వజ్ఞు లతని మహాభక్తునిగా నెఱింగిరని యాతనిచర్యలందుఁ గలసారమును విమర్శింపక తూలనాడఁ దగదని యా ప్రథమభాగమే తేటపఱచును. రావణుని హృదయ మెట్టిదో యరయుఁడని వాల్మీకివాక్కులఁ గలసారమిది యని వెల్లడించితిని. సీతాదేవి యనఁగా మహాప్రకృతి యగు శ్రీరామచంద్రుఁడు పరమేశ్వరుఁడని చాటితిని. వారి నిరువురను జననీజనకులనుగా భావించి రావణుఁడు మెలఁగెనని తేటపఱచితిని. పూజయన నెట్టిదో భక్తునిభావ మెట్లుండునో అందందు వివరించితిని. హనుమంతుని చరిత్ర మెట్టిదో పరికింపుఁడని హెచ్చరించితిని. ఆతఁడు మహాభక్తుఁడనియు సమయజ్ఞుఁడనియు విన్నవించుచు దాని నిరూపించితిని. సీతాదేవి తనయాశయము నెంత కోమలభణితి రావణునకితరులకుఁ దెలియకయుండునట్లు తెలిపెనో విస్తరించితిని. ఆయాయితావుల వ్యాఖ్యాతృమహాశయుల ధోరణి యెట్టిదో

విస్తరించితిని. హనుమంతుఁడు రూపము సంకుచితముగ నొనర్పఁగల్గుటకు యోగసిద్ధియే కారణమని యందందు వ్రాసితిని. భగవదారాధన మనఁగా ననంత ఫలప్రదంబగు మానసికమనందగు ధ్యానమే కాని యత్యల్పఫలప్రదంబగు బాహ్యపూజ కాదని యొత్తి పల్కితి. ఎల్లరు శాక్తులే యనియు వీర వైష్ణవులు దూషించుపద్ధతి యజ్ఞానమూలమనియు వైష్ణవ మనఁగా శాక్తమతమున నంతర్భూతమే యనియు శివకేశవ భేదమును వైష్ణవులు పూర్వులు పాటించువారు కాకయుండిరనియు వారు స్తుతించినపద్యములఁ గనిన తేటపడునని యు వాని నుదహరించుచుఁ జాటి చెప్పితిని. "మధ్యవైష్ణవులకు నామముల్ బలుబెద్ద" యన్నట్లు మధ్యవైష్ణవులు కొందఱు బయలువెడలి వైష్ణవమతతత్త్వ మిదియని తెలివితక్కువచేనపసిద్ధాంతముల బోధించుచుఁ దిరుగుచుందురనియు, వారి పల్కుల నాదరింపక పెద్ద లనువదించినచొప్పున మెలంగిన మేలు పొసంగునని యెన్ని యో తావుల వివరించితిని. దాసుల మని కొందఱు ధనార్జనముచేయ వేషధారులై తిరుగుచు మంత్రోపదేశమూలమునఁ బామరుల వశమునం దుంచుకొని ధనము నేకరించుచు దుర్మతముల బోధించి బాహ్యచిహ్నములు ముఖ్యములనియు శివచిహ్నధారులకు భగవదనుగ్రహమే కలుగదనియు భగవంతుఁడన విష్ణువే యనియును నూర్ధ్వపుండ్రము ధరింపనివారికి ముక్తియే లేదనియుఁ దెలుపుచుందురు. కాన వారి వెడఁగుమాటలకు లోఁబడక భక్తిచేఁ దన కేరూపనామములయం దిష్టముండునో యవి గలవానిగా భగవంతుం దలంచి హృదయపద్మంబున నిలిపికొని ధ్యానిం

చినయెడల ననంతఫలము కలుగునని పెక్కుసారులు నొక్కి చెప్పితి. శాక్తమతమనఁగా నిట్టిదియే యనియు సురాపానము మాంసభక్షణాద్యనాచారములు శాక్తమతమున లేవనియు నట్టివి వారి దుష్కర్మవశమునఁ గల్గుననియు నెల్లవారికిఁ దరణోపాయముఁ జూపుమార్గము లిందే కలవనియు. శాక్త మనఁగా సగుణబ్రహ్మోపాసనయే యనియు నుత్తమ మధ్యమాధమకర్మముల నాచరించినవారికిఁ దగిన దేవతోపాసనలన్నియు నిందే కలవనియు సిద్ధాంతమన నిదియే యనియు నానేర్చినంత దనుక విన్నవించితిని. మతములన్నియు మానవుల కర్మముల ననుసరించి యేర్పఱుపఁబడినవనియు మతస్థాపకులంద అద్వైతులే యనియు నందందుఁ బొందుపఱచితిని. మతదూషణము మహాపాపకార్యమనియు దానిని వదలి

> "సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని,
> ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః."

అను భగవద్గీతావాక్యము నర్థము ననుసరించి భగవంతుని ధ్యానింపవలయుననియు నక్కార్యమునకుం జాలనివారల కొఱకుఁ బూజాపద్ధతు లనేకభేదములుగా నుండునట్లు మతస్థాపకు లేర్పఱచిరనియు వానిని దూలనాడుట వారియాశయమిట్టిదని యెఱుఁగకయే యనియు విస్తరించితిని. భక్షణార్హపదార్థముల ననుసరించి బుద్ధి మాఱుచుండుననియు సాత్వికాహారములం గొనుట మంచిదనుభావము తేటపడ వ్రాసితిని. హనుమత్పవిత్రచరిత్రము స్మర్తవ్యమనియు నట్టిదృఢభక్తి గలవారగుటకుఁ బ్రయత్నింపఁదగునను భావసారముఁ దెలియ వ్రాసితిని. ప్రకృతిపురుషుల కవినాభావ సంబంధమనియుఁ

గావున సీతారాముల కెడఁబాటు బాహ్యదృష్టికిం గనఁబడు నదియే కాని సత్యముకాదనియు నగ్నినుండి యుష్ణగుణమును వేఱుచేయ శక్యముగానియట్లు సీతారాముల కెడఁబాటు సాధ్యమే కాదనియే వాల్మీకిహృదయమని విపులముగా నందందు వ్రాసితిని. స్వప్నములు నిమిత్తములు శకునములు భావికర్మఫలానుభవములఁ దెలుపుచిహ్నము లనుదానిని విశదీకరించితిని. హనుమంతుఁ డీశ్వరాంశసంభూతుఁడనియు శివ కేశవు లొండొరులకుఁ దోడుపడుట సహజమనియుఁ దెల్పితిని. రామాయణకాలమున నక్షరములే లేవనియు నెల్లరు విద్యలఁ గంఠపాఠము చేయువారనియుఁ గావనే శ్రీరాముఁడు పత్రిక వ్రాసియీయక మరున్నందనునిమూలమున వార్తఁ బంపె ననియుఁ బల్కువారివాక్కులు వ్యర్థములనియు వ్రాయు నాచారము కలదనియు శ్రీరామనామాంగుళీయక కథ వ్రాయుపట్టున విమర్శించితిని. పక్షులకు వానరులకు మానవుల తోడి సంబంధము గలదనియు నెల్లరకుఁ దెలియుభాష యొక్కఁడు గలదనియుఁ దెల్పితిని. ఇవి యన్నియు నాస్తికుల దుర్వాదములఁ దూలింపఁజాలి యుండును. కాని కపిముష్టి న్యాయము ననుసరించి మేము పట్టినదేపట్టని వాదించుమహా త్ముల కివ్వి బోధించి యంగీకరింపఁజేయ బ్రహ్మకే నశక్యమనఁగా నిఁక నావంటి యనభిజ్ఞున కెట్లు శక్యమగును? వారల మర లింపఁ బూనకుండుటయే శ్లాఘ్య మగుమార్గము.

ఇక్కాలమునందు వేదము లసత్యములనువా రుండఁ గాఁ బురాణాదుల లెక్కఁగొననివా రుందురనుట కచ్చెరు వొందనేల? అనేకులు గలరనవలయు. అట్టివారిమూలమున

నించుక భక్తిగలవారు చెడుచున్నవా రనుట నిస్సంశయము. వారివి సహేతుకవాదములయ్యు భగవద్విషయమున నవి పనికిరానివగుననవలసి యుండును. ప్రత్యక్షప్రమాణము ఇంద్రియాతీతవిషయములఁ బనికిరాదని యంద అంగీకరింప వలసియే యుండును. ఆగమానుమానప్రత్యక్షోపపత్తులను ప్రమాణచతుష్టయము లోకాతీతవిషయములందు సమగ్రముగాఁ బనికిరాదు. ఆగమమే యద్దానికి ముఖ్యము. గజములఁ దన్నుకొనిపోవు గండభేరుండపక్షి యొకఁడుండు ననఁగా ననుమానప్రత్యక్షోపపత్తు లనుమూఁడును దాని నంగీకరింపవలదనియే బోధించును. ఒక్కవస్తువుండిన దానిం గాంచి యిట్టిపుండునని యూహింపవచ్చును లేనిదాని ననుమానింప నశక్యమే యగు. కనఁబడనిదానిని లేదనఁజేయునది ప్రత్యక్షప్రమాణము. ఉన్న దిట్లేల యుండవలయు నన్నపుడు హేతువును గల్పించునది యుపపత్తి. ఈమూఁడును లోకాంతరవిషయములనుగూర్చి విచారించునపుడు పనికిరావు. శాస్త్ర మన్నింటికిం బనికివచ్చును. కనుకనే గీతాశాస్త్రమునందు

> "యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
> న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్. ౨౩
> తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
> జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి." ౨౪
>
> గీత. ౧౬ అధ్యా.

అని శ్రీకృష్ణపరమాత్మయే నిర్వచించెను. కనుకఁ బ్రత్యక్ష ప్రమాణము భగవజ్జిజ్ఞాసావిషయమునఁ బనికిరాదని యెఱుంగుట తెఱంగు. కుడ్యాంతరితవస్తువు చక్షుర్గోచరము కా

నపుడు రూపమే లేక యెల్లరూపములు తానే యగు పరా త్పరు నెట్లు కనుఁగొనవచ్చును? శాస్త్రము నాశ్రయించి పెద్దల యనుభవము నెంచి యుపాసనాశక్తి నించుక తెలియంజాలి బుద్ధిబలమున నెఱింగినవానిని దృఢపఱచుకొని సంతత యోగా భ్యాసమున నానందమయుని దేజస్స్వరూపునిఁ గొంచెముగనో గొప్పగనో తెలిసికొనవలయును. అంతియగాని యుక్తులచే నను మానములచే నాతత్త్వమును గనుఁగొనఁ బూనుట భూమిని జుట్టి చంకలో నుంచుకొనఁ దలంచుట యెట్టిదో యట్టిది. సర్వరూపములు తానైనవాని నెట్లు తెలియ శక్యమగునని ప్ర శ్నింపరాదు. దానికి నుపాసనయే ప్రధానము. ఇతరమార్గము లద్దానితత్త్వమును జూపంజాలవని శతధా సహస్రధా యుప నిషత్తులే ఘోషించును. అట్లు కాఁగా నుపాసన యనునది భగవత్తత్త్వజిజ్ఞాసయందుఁ బ్రధానపదమున నిలువఁదగిన దయ్యెఁ గదా. శాస్త్రమునఁ బ్రయోజన మేమనరాదు. సకల సంశయనిరాకరణక్షమము శాస్త్రమే. తజ్జన్యజ్ఞాన ముపాసకు నకు మిగులఁ దోడ్పడును అదిలేనిచోఁ దా నెఱుంగఁజాలును గాని యొరులకు బోధింపఁజాలఁడు. విద్వాంసున కధీతి బోధా చరణప్రచారణము లనునాల్గు నుండవలయుననియు దాననే లోకోపకారము చేయ వలంతి యగుననియుఁ బ్రాచీనమహర్షుల యాశయము. అట్లు చేయనికతమున నే మనలో రసపాదు కాంజనాదిసిద్ధులు నశించి నామమాత్రావశిష్టములై ప్రశ్నించు వారికి బదులిడఁజాలకయుండఁ జేయుచున్నవి. యోగవిద్యలు నశించినట్లే యని కొందఱు ప్రశ్నించిరి. "Naked ascetic by Victor-dane" అను నొక యాంగ్లేయకృతగ్రంథమునుజూచిన

నీ సందియ మంతయుండునని బదులిచ్చితిని. హిమాలయపర్వత గుహాలయం దనేక పుణ్యాశ్రమములు కలవనియు వానియం దుండు స్త్రీపురుషు లభినవయౌవనమున భాసిల్లుచు దుర్విజ్ఞేయ ప్రభావమున నలరుచు, నోషధీప్రభావమున మానవుని పశు రూపునిగా మార్పఁజాలి, వలసినతఱి యథా పూర్వరూపు నిగా నొనరించు నేర్పుగలిగి క్షుత్తును దృష్ణను మూలికా ప్రభావమున నగపడకుండఁ జేయుచు భగవంతుని జ్యోతి ర్మయస్వరూపమును నిరంతరము స్వానుభవమున నెఱుంగఁ జాలియుండువారు గలరని యాగ్రంథమే తెల్పును. ఆమహా భక్తుఁడు మరల నీభారతభూమికి నీసంవత్సరమున రానున్న వాఁడు. ఏ హిమాలయభాగమున యోగినులం గాంచెనో తనబంధువు నర్ధపశుదేహుని తృణాహారునిగాఁ జూడఁజాలెనో యందుఁగల యోగినులమహాప్రభావమున నందుండి నిమేష మాత్రమున బహుయోజనములదూరమున నుండఁగల్గెనో వారిని సందర్శింప నరుదెంచును. పాశ్చాత్త్యులయందుఁ గొందఱు యోగప్రభావజిజ్ఞాసువు లిట్లు వ్రాయుచుండ భారత భూమివాసు లివి దబ్బఱలని దూఱుటకంటె నపహాస్యపాత్ర మగువిషయ మేదియుండును ?

భగవంతు నించుకయే నెఱుంగఁగోరు బుద్ధిమంతులు శాస్త్రశరణులు గావలయు. వేదోక్తమార్గము కానరా దనుట సిద్ధాంతము. దాన నించుక సద్బుద్ధి భగవద్విశ్వాసము ననునవి పొడసూపును. దాన శ్రద్ధ యుదయించును. సకల సాధనసంపదల నదియే చేకూర్చును. శ్రద్ధలేనియుపాసన నిష్ఫల మగును. ఉపాసన యనఁగాఁ గొందఱు మధ్యవైష్ణ

వులు భగవత్కైంకర్య మనిరి. అనఁగా దేవాలయమున సేవలు చేయుటని వారి యాశయము. అది నిరర్థకమనియు నేకాంతమునఁ గూరుచుండి సద్గురు ప్రయుక్తమార్గమున నిష్ట దేవతారూపమును మదిని నెలకొల్పి తద్దివ్య తేజఃపుంజమును దర్శించుటయే యని యెఱుంగవలయు. ఈవిషయమునఁ గపట నాటకసూత్రధారులు, దేవద్రవ్యాపహర్తలు, చోరయోగులు, చిబుక కేశవిభూషితులు, కౌపీనసమాకర్షితపామరజనులు నగు తుచ్ఛదాసులు వచించు మోసపుఁబల్కులఁ గొనరాదు. మానసికారాధనమే ముఖ్యమనియుఁ దేజోమయము భగవద్రూపమనియు నీ క్రిందిశ్లోకము తెల్పుచున్నది.

> "తటిల్లేఖాతన్వీం తపనశశివైశ్వానరమయీం
> నిషణ్ణాం షణ్ణామప్యుపరి కమలానాం తవ కలాం,
> మహాపద్మాటవ్యాం మృదితమలమాయేన మనసా
> మహాంతః పశ్యంతో దధతి పరమానందలహరీమ్." ౨౧

శ్రీశంకరభగవత్పాదకృతసౌందర్యలహరి.

ఎట్టిశ్రమముల నొంది ద్రవ్యముల నార్జింపక పెక్కుదినము లభ్యసించిన యోగమహత్త్వమున నిశ్చలచిత్తమున బ్రహ్మ రంధ్రమున మహాత్ములు స్వేష్టదేవతారూపమగు తేజోగోళ మును గాంచి మహానంద ప్రవాహమున నోలలాడునట్లు భక్తుఁడానంద మనుభవింపవచ్చు. పాషాణదారు లోహనిర్మి తములగు విగ్రహముల నారాధించినఁ గలుగు ఫలమెద్దియు నుండఁబోదు. ధ్యానసాధనములుగా వానిని దొలుత నాశ్ర యించి పిదప వానిని వదలి యారూపమునే హృద్గతముగా స్మరించుకొని అహింసాదిపుష్పములచే నర్చించి యజ్ఞానమల

మును దీసివైచి విజ్ఞానసంపత్ప్రాభవమగు మహానందము నను భవింపఁ బ్రయత్నింపవలయుననియే యిందలిసారము. రామాయణకావ్యపారాయణమాత్రమున నేకార్యములుఁ సిద్ధింపఁ బోవు. సంస్కృతభాషాగ్రంథములను ద్వారగాఁ జదువు నేర్పొకటియే దొరకు మహాఫలము. తదర్థము నెఱింగి దానిరీతిఁ బ్రవర్తింప నేర్చుకొనిననే యభీష్టఫలములు గలుగును. బిచ్చగాండ్రు రామా యని పాటతుదను జేర్చిన దానిఫలము స్పష్టమే కద. అంతియేగాని భగవన్నామపారాయణఫలము గల్గఁబోదు. భక్తిచే దాని నెఱింగి స్మరించిన నదియే తారకమంత్రముఁగూడ నగును. నారాయణా యని యన్నంతన సకలపాపములు పోవఁగా వైకుంఠమునకు నజామిళుఁడు పోయెనను కథగతి యేమని యడుగువా రుందురు. అట్టి కథలు పామరులకు భగవద్భక్తిని బోధింపఁ గల్పింపఁబడినవని వా రెఱుంగుదురు గాక.

> "అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరం,
> యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః. ౫
> యంయం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరం,
> తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః." ౬
>
> గీత. ౮ అధ్యా.

అను గీతావాక్యములు ప్రమాణములు కావా యని కొంద అడిగిరి. వారు వాని సాకల్యార్థము గ్రహింపకయే ప్రశ్నించిరి. "హే కౌంతేయ సదా సర్వదా తద్భావస్తస్మిన్ భావః తద్భావః స భావితః స్మర్యమాణతయా అభ్యస్తః యేన సః తద్భావభావితస్సన్." అని శంకరభాష్యము. ఈవాక్యమునఁ

గలయర్థము వా రెఱింగిన నడుగరని నా నిశ్చయము. సర్వ కాల మాపరాత్మనే భావింప నెవ్వ రభ్యసింతురో వారు మర ణకాలమున నేయేభావము నొందఁగోరుదురో వారు దాని దానిం బొందుదురు. అనవరత మాపరాత్పరుని ధ్యానించు వారేమి వాంఛింతురు? పరమపదమునే వాంఛింతురు. లేక భగవద్దాస్యమును గోరుదురు. వారి కది లభించుట కేమిలో పము? పాపాత్ములు ముక్తి మరణకాలమునఁ గోరినచో రాదా యన్న నావాంఛయే వారికిఁ గలుగదని నమ్మవలయు. వానికిం గలిగినదని దృఢపఱచువారుగాని లేదని సిద్ధాంతము చేయు వారుగాని యుండరు. కావున నీవాదము కర్మసిద్ధాంతమునఁ దీర్పు నొందఁదగినది. దుష్కార్మాచరణమునకుఁ బ్రతిఫలము లేదనువా రుండరనుకొందును. ఉండిరేని నాస్తికులో నాస్తి కాభాసులో వారు కావలయు. శాస్త్రము ప్రమాణముగా నంగీకరింపవలయు. లేకున్న భగవద్గీతావాక్య మప్పు డేటఁ గలి యవలసినదే. కావున భగవన్నామస్మరణము తదర్థావబోధపూ ర్వముగా నుచ్చరించిననే మహాఫలము గలుగును. లేనిచో 'సద్యః ఫలం సంగీత' మ్మన్నట్లు రవంత బిచ్చమే దొరకు మహా ఫలము. శాస్త్రమునాశ్రయించి భక్తిభరమున భగవంతునాశ్ర యించి చేయుచుండు సత్కార్మములఫలము నాశింపక భగవం తున కర్పించుచునుండిననే తదనుగ్రహమునకుఁ బాత్రుఁ డగు ననియు లేనిచో దధ్యోదనాదిరూపమగు భగవత్ప్రసాదము తాత్కాలికక్షున్నివృత్తిక్షమము దొరకుననియు విగ్రహపూజన మత్యల్పఫలదమనియు మానసికారాధనమే ప్రధానమనియు నీవిషయమునుండి తేలుసారమని యెఱుంగవలయు. ఇఁక నీ

సుందరకాండమునఁ గలకథను బఠించి తత్సారమును గ్రహింపఁ బ్రయత్నింతము.

### సీత హనుమతో రావణుఁడు తనకొసఁగిన గడువును దెల్పుట.

* నిండుచందురునిబోలు మోముగల యాజానకి హనుమదుక్తులు విని ధర్మార్థయుక్తముగా నిట్లు బదులు చెప్పెను. బుద్ధిమంతుఁడా! సంతతము నన్నే రాముఁడు తలంచుకొను నన్న సద్వార్తను, నన్నుంగూర్చియే దుఃఖించుచున్నాఁడను విచారవార్తను చెప్పితివి. అవి అమృతమయములు విషయుక్తములుగా నున్నవి. రామవిరహము బుద్ధిపూర్వము గాదు. విస్తారైశ్వర్యభయవ్యసనములు ప్రాప్తించినపుడు పురుషుఁడు స్వతంత్రుఁడు కాఁడు. దైవము వానిని త్రాఁటఁగట్టి లాగుకొని పోవుచున్నది. ఏ ప్రాణులకుఁగాని దైవమును నివారింప శక్యమే కాదు. ఇది సిద్ధాంతము సౌమిత్రియు నేను శ్రీరాముఁడును మహావ్యసనమోహితులమై యున్నారము. చూచితివి కదా. సాగరమున నౌకాభంగము కాఁగా జలంబులంబడి యీదులాడి మిగుల బడలి యున్నవానివలె దుఃఖాబ్ధింబడి శ్రమములపా లగుచున్న రాముఁ డెప్పుడు దరి చేరఁ గలఁడు? నానాథుఁడు రాక్షసవధ మొనరించి తత్పతియగు రావణు నని మొనఁ బొలియించి యీ నగరము నిర్మూలముఁ గావించి నన్నెపుడు చూడఁగలఁడు? ఈ వత్సరపుగడువు గడచుటకు మున్నే త్వరపడి యిచ్చుటికి రావలయునని

* ఇయ్యది సుందరకాండమున ముప్పదియేడవసర్గమునఁ గలదు.

రామున కెఱింగింపుము. ఏల యందువో. అంతవఱకే నాకు జీవిత ముండును. ఆమీఁద రావణుఁడు నన్ను వధింపఁ గలఁడు. క్రూరుఁడు రక్షఃపతి నా కేర్పఱచిన గడువులో పదియవనెల ముగియ నున్నది. రెండునెలలే మిగిలియున్నవి. ఇవి ముగియకమునుపే శ్రీరాముఁడు వచ్చునట్లు చేయవలయును. విభీషణుఁడు నన్ను శ్రీరామున కర్పించువిషయమున నెంతో శ్రమంపడి తనయగ్రజునకు సమాధానము చెప్పెను. ఆబుద్ధి యతనికి రుచింపదయ్యె. తమ్ముని హితవాక్యనకు నతఁ డొల్లకున్నవాఁడు. అతఁడు కాలవశంగతుఁడు కావున వానిని సంగరమున కీడ్చుకొనిపోవ మృత్యువు వెదకుచున్నది.విభీషణుని జ్యేష్ఠపుత్రిక నలయను నంగనామణి తనతల్లి పంపఁగా నాకడకు వచ్చి యీవార్తఁ దెల్పినది. నాపతి వేగమ నన్నుఁ గాంచఁగలఁడు. నిస్సంశయము. ఏలయన నా యంతరాత్మ నిర్మలముగా నున్నది. అంతియగాక శ్రీరామునియం దనేక శుభగుణములు కలవు. బృహత్కార్యములయందు శ్రద్ధలో నగునవియే యీసుగుణములు. జనస్థానమున నందఱరక్కసుల నొక్కఁడ యుక్కడంచిన రామునితోఁ బగగొని యెవఁడు వగలపాలు గాకుండును? ఎట్టికష్టములకైన నించుకే చలింపఁడను రాముని ప్రభావము నే నెఱుంగుదు.

అని యనేక ప్రకారములఁ బలుకుచుఁ బట్టరానిశోకమున నశ్రుధారలఁ గురియించుచున్న యాజానకిం గాంచి హనుమంతుఁ డిట్లు పల్కెను. తల్లీ! నేనరిగి నీవార్తఁ దెలియఁజేసినంతన సకల సేనాసమన్వితుఁడై శ్రీరాముఁడు రాఁగలఁడు. అంతకు సైఁపఁజాలవేని యీకష్టము నిప్పుడే పోఁగొట్టెద. నీవు

నావీఁపుపయిం గూరుచుండుము. ఇపుడే శ్రీరామునొద్దకుం గొనిపోవుదు. నిన్నుఁ దీసికొనియే సముద్రమును దాఁటెదను. ఈలంకను రావణునితోఁగూడ మోసికొని పోవఁజాలుదును. అట్టిశక్తి కలదా యని యనుమానింపకుము. అగ్ని తనయందు వేల్వఁబడుహవిస్సు నింద్రున కిచ్చునట్లు నిన్నుఁ గొనిపోయి ప్రస్రవణాద్రియందుండు శ్రీరామున కర్పించెద. సకలపరివారముం గొల్వ శత్రువధోద్యోగముననుండు శ్రీరాము నిప్పుడ చూడఁగలవు. నాకొఱకు వేచియుండు మహాత్ముని గాంచఁగలవు. తల్లీ! నా వీఁపుపై నెక్కుము. ఉపేక్ష యేల? రక్కసు లడ్డుపడుదురేమో యని సంశయించెదవా? ఇందుఁ గలవాఁ డెవఁడుగాని నావెంటఁ బరుగిడఁ జాలఁడు. అశ్రమమున సాగరము దాఁటి యెట్లు వచ్చితినో యట్లే పోవఁగలను. అని వినయమునఁ బలికెను.

జానకీదేవియు హనుమపల్కుల నాలకించి సంతోషమున నో కపివీరా! నన్ను చాలదూరము మోసికొనిపోవఁ దలంచుచున్నాఁడవే. దీనింబట్టియే నీవు కేవలవానరుఁడవే యని తలంచుచున్నాను. నాపతియుండుతా విచ్చటనుండి బహుయోజనము లున్నది కదా. అనఁగా హనుమంతుఁడు సీతాదేవి పరిహాసముగాఁ బల్కినవాక్కుల విని నూత్నపరిభవమునుగూర్చి తనలో నిట్లు చింతించెను. ఈసాధ్వి నాబల ప్రభావముల నించుకంతయే నెఱుంగదు. కనుకనే యిట్లు పల్కెను. నారూపమును యథేచ్ఛముగా నీమె చూచుఁగాక అని యోజించి తనరూపమును జూపెను. వృక్షమునుండి మరలఁ గ్రిందికి దుమికి దేహము పెంప నారంభించెను. మిక్కిలి

పెరిఁగి మేరుమందరతుల్యముగఁ గనఁబడుచుఁ బ్రజ్వలించు నగ్నివలె సీతమ్రోల వృక్షమూలమున నిలువఁబడియెను. భయంకరాకారమునఁ గనంబడుచు నాహనుమ జానకిని గాంచి అమ్మా! యీలంకయంతయు రావణునితో నొక్కసారి లేవఁదీసి తీసికొనిపోవుశక్తి నాకుఁ గలదు. కాన భయపడకుము. స్థిరచిత్తవు కమ్ము. ఉపేక్షఁ బూనకుము. శ్రీరామలక్ష్మణుల దుఃఖరహితులనుగా నొనర్పుము.

అనఁగా విని జానకి అట్టిరూపమునఁ గనఁబడు పావనిం గాంచి కపీశ్వరా! ఇంతదనుక నీధీరత్వమును బలము నెఱుంగనైతిని. వాయువువలె నతిజవము గలవాఁడవు. అగ్ని సదృశతేజశ్శాలివి. అట్లుగాకున్న నిచ్చటికెట్లు రాఁజాలుదువు. రక్కసులకుఁ జిక్కక నన్నుఁ గొనిపోవఁగలవని తెలిసినది. అయినను శ్రీరామకార్యము నిర్విఘ్నముగా ఫలించునట్లాలోచింపవలయు. కపీంద్రా! నీతోడ నేనువచ్చుట శుభోదర్కము గాదు. ఏలయందువో. నీ వతివేగముగాఁ బోవునపుడు నేను భరింపఁజాలక సొమ్మసిల్లుదు. వీఁపుమీఁదఁ గూరుచుండి యించుకమీఁదుగాఁ బోవుచుండ సాగరమును గని భయమునఁ బడుదును జుమీ. జలజంతువుల కాహారముం గూడ నగుదును. శత్రుహంతవే. ఐన నీతోడ నే రాఁజాలను. ఎంతవీరుఁడైన తాను గాపాడఁ దగినవస్తువు మఱొక్కదానిం గూడిన దానింబట్టి తా నాపదపాలు గావచ్చునని సందేహమొందవలసి యున్నది. నీకును నన్నుంబట్టి యాపద రావచ్చుననుశంక యుదయించుచున్నది. నీవు నన్నుఁ గొనిపోవుచుండఁగా దురాత్ముఁ డగురావణుఁడు భయంకరరాక్షసులం బంపును.

వా రాయుధములం గొని నిన్నుఁ జుట్టుముట్టుదురు. అపుడు నిన్నును నన్నును రక్షింపవలసినవాఁడవగుట నాపదల పాలు గావలసివచ్చునేమో యన్నసందియము కలుగుచున్నది. పోవు మార్గ మాకాశము. నన్ను గాపాడుచు వారితో నెట్లు పో రాడఁ గలుగుదువు? నీవు గట్టిగా వారితోఁ బోరాడుచుండ భయంపడి నేను గ్రిందఁబడుదును. నామాట యటుండఁగా భయంకరయాతుధానులు నిన్నోడించిన నోడింపవచ్చును. పరవశుఁడవై నీవుండఁగా నేను బడగనే వారు నన్నుఁ గొని పోవుదురు. జయపరాజయములు రణమున నిలుకడలేనివి గదా. నీ కపజయము కూడఁ గలుగవచ్చును. అపుడు నన్నుఁ గొనిపోవుటయో ఛేదించుటయో యొకపని సాగు. నీవోడ కున్నను వారి భయంకరధ్వనులకే నాకు విపత్తు గలుగ వచ్చును. అపుడు నీపడిన మహాశ్రమ మీయది వ్యర్థమే యగుంగదా. నీచేతనే రక్కసులందఱు చంపఁబడుదురేని శ్రీరామునికీర్తికి హాని గల్గును. నన్ను వారు గొనిపోయి యెందో దాఁచినను దాఁచిపెట్టుదురు.అపుడు గూడ నీప్రయా సము పాల్గగును. ఆలోచింప నిన్నిశంకలు గలుగుచున్నవి. కాన నీవు పోయి నాయవస్థల విన్నవించి శ్రీరామాదులం గూడి వచ్చితివేని నా కత్యంతలాభము కలుగును. శ్రీరామ లక్ష్మణ సుగ్రీవాదులప్రాణములు న న్నాశ్రయించి నిలిచియు న్నవి. ఇట్టి నాకుఁ బ్రాణభయమే కలిగెనా యందఱప్రాణ ములు పోవును. ఆసోదరు లిరువురు నాకొఱకే శోకించి కృశించి యున్నారు. నాకించుక కీడుమూఁడునే నపుడ చత్తురు.

నేను భర్తయందుఁ గలభక్తి ప్రధానముగా రాముని దప్ప నన్యపురుషుని స్పృశియింపను. రావణుఁడు ముట్టుకొన లేదా యని యడుగుదువేమో. దుఃఖపరవశురాలనై యుంటిని గదా. దానికేమి చేయవచ్చును ? శ్రీరాముఁడు వచ్చి శత్రుకులం దునిమి నన్నుఁ గొనిపోవునేని యదియె తాదృశులకుఁ దగియుండును. శ్రీరాముని పరాక్రమశతంబులు విని యున్నదానను. చూచియు నున్నాను. దేవతలు లోనగువారని మొన నతనికిఁ జాలరు. వాయుసహాయుఁడయి యగ్నివలె వెలుంగుచున్న యామహావీరు నని మొనఁ దేఱిచూడఁ గలవాఁ డుండునే? మహాత్మా! నీ వానోదరులఁ బిలుచుకొని రమ్ము. రామునిగూర్చి దుఃఖించు నాకు సంతోషముం గలిగింపుము. అని పలికెను.

మహాశయులారా! ఈభాగమున విమర్శింపఁదగు వానిం బరికించి యంపలిసారమును గ్రహింతము.

"అమృతం విషసంస్పృష్టం త్వయా వానర భాషితం,
యచ్చ నాన్యమనా రామో యచ్చ శోకపరాయణః. ౨
ఐశ్వర్యే వా సువిస్తీర్ణే వ్యసనే వా సుదారుణే,
రజ్జ్వేవ పురుషం బద్ధ్వా కృతాంతః పరికర్షతి. ౩
విధిర్నూనమసంహార్యః ప్రాణినాం ప్లవగోత్తమ,
సౌమిత్రిం మాం చ రామం చ వ్యసనైః పశ్య మోహితాన్." ౪

అని మూలము హనుమంతునివాక్కుల విని సీత యిట్లు బదులు చెప్పుచున్నది. కుశలవార్తాశ్రవణ మమృతమువంటిది. కష్టవార్తాశ్రవణము విషమువంటిది. నన్నుం దలంచుచున్నాఁడను నది యమృతతుల్యము. నన్ను గుఱించి వగచుచున్నాఁడనునది

విషతుల్యము. ఇవి రెండును గలమాటలం బల్కితివని సామా న్యార్థము. పావనియయ్యు శ్రీరాముఁ డనన్యమనస్కుఁడే యని నిశ్చయింపఁజాలక విషమువంటి దుఃఖించుచున్నాఁ డనుమాట పల్కితివే. ఆమహాపురుషునకు దుఃఖ మెక్కడిది? అన్యమన స్కుఁ డగుట యెట్లు? కావున నీకు మేమిరువురు మను భావము గలదు. దాని వదలుమని సీత సూచించెను. అంత మానక కర్మము బలీయమనియుఁ బ్రాణి స్వతంత్రుఁడు కాఁడనియుఁ దేటపఱచుచున్నది. మహావిభవము రానున్నతఱిఁగాని,భయం కరవిపత్తు చేరనున్నయపుడుగాని యదృశ్యపాశములను గంఠ మునకుఁ దగిలించి విధి యీడ్చుకొనిపోవుచున్నది. అనఁగాఁ దా నూహింపనికార్యమును విధియే చేయించుచున్నది. పురు షుఁడు తనశక్తి నా కార్యమును సాధించితి ననుకొనుచున్నాఁడు. తన ప్రయత్నమునఁ గష్టములు తొలఁగక పైఁగ్రమ్మఁగా విధిని దూఱుచున్నాఁడు. ఈసంపద్విపత్ప్రాప్తికి స్వీయకర్మమే కారణ మని తలంచినయెడల సుఖదుఃఖానుభవమం దానందక్లేశములు గలుగకపోవుటయె కాక యహంకారముకూడ నశించును. ఇది యెఱుంగుటయే తెఱంగని సీతాంబ హనుమకు నుపదేశించు చున్నది. దీనిచే సాగరలంఘనాదులయం దహంకారము నొంద కుమా యనునర్థము సూచింపఁబడుచున్నది.

> "దుఃఖేష్వనుద్విగ్నమనాస్సుఖేషు విగతస్పృహః,
> వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే. ౫౬ అ. ౨.
> యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః,
> సమస్సిద్ధావసిద్ధౌ చ కృత్వాఽపి న నిబధ్యతే." ౨౨ అ. ౪.

అను గీతావాక్యముల యర్థమే యిం దిమిడియున్నదని మన

మెఱుంగవలయు. దైవమును మీఱ నేరికిం దరము కాదు. లక్ష్మణుని మాదంపతులను గనుము. ఎట్లు లజ్ఞానమున వర్తించు చున్నవారమో యని సీత పలికెను. మా కీదుఃఖములు లేవనియు నున్నయట్లు నటించుచున్నామనియు సారము. మావంటివార మిట్లు కర్మబద్ధులముగా నుండుటం గాంచియైన మానవయత్నము దైవమును మించఁజాలదని యెఱుంగ వలయునని సీత బోధించెను.

“స వాచ్యస్సంత్వరస్వేతి యావదేవ న పూర్యతే,
అయం సంవత్సరః కాలస్తావద్ధి మమ జీవితం. ౭
వర్తతే దశమో మాసో ద్వౌతు శేషా ప్లవంగమ,
రావణేన నృశంసేన సమయో యః కృతో మమ.” ౮

అనునివి సీతాంబికావాక్కులు. ప్రాతీతికార్థము స్పష్టము కదా. మా యిరువురకు బహిస్సంబంధములేని దొకసంవత్సరము. అదియు ముగియనై యున్నది. త్వరపడునట్లు చేయుము ఈ వత్సరమే నాకిట బ్రదుకు. అనఁగా నేమి? ఇందు శిష్యపరీక్ష చెప్పఁబడినది. రావణునకుఁ గలవాంఛ యీ తనుముక్తియే దానికి నన్నారాధించుచున్నాఁడు. శిష్యహృదయము తక్కువ పక్ష మొకసంవత్సరము పరీక్షింపవలయును. “దేయం వత్సర వాసినే” అని ప్రమాణము కలదు. పండ్రెండువత్సరములనియు నియమములు కలవు. ఈ వ్రాసిన వాక్యముంబట్టి యొకసంవ త్సరమని తేలును. ఈసంవత్సరకాలమే నే నిందుండఁ దలంచు కొన్నాను. అందుఁ బదవమాసము గడువనున్నది. రెండు నెలలు తక్కువ. పరిశీలించినంతదనుక సర్వవిధముల యోగ్యుఁ డనియే తేలినది. తరువాత నేనిట నుండరాదు. అంతలోఁగా

నావాంఛ ఫలింపఁజేయకున్న నశింతునని రావణుఁడు శపథ మొనరించెను. కాన నిఁక నీపరిపక్వాంతఃకరణునకు ననుగ్రహ వరదానము చేయవలయు. కాన సత్వరమ దయచేయవలయు నని సీతాదేవి హెచ్చరించెను. సీత మహాప్రకృతి యైనయెడల నామెకుఁ దెలియదా ఏల యీపరీక్ష అని ప్రశ్నించువా రుందురు. భగవంతుఁ డవతరింపనేల ? సంకల్పమాత్రమున సర్వకార్యములు నెఱవేఱుచుండ రూపమొందనేల యను ప్రశ్నమున కిది తోఁబుట్టువనవలయును. లోకులకు నీతి గఱపుటకే యీప్రయత్నమనియుఁ బామరుల కిట్టివిషయములు తెలుపుట కిట్టిప్రయత్నములు చాలకున్నవనియు నెన్ని యో తెఱంగులఁ దెలిపినను దెలిసికొనలేనివా రెందఱో కలరనియు నిన్నింటికిఁ గారణము కర్మభేదమే యనియు మన మెఱింగిన నిట్టిప్రశ్నములే యుండవు.

> "విభీషణేన చ భ్రాత్రా మమ నిర్యాతనం ప్రతి,
> అనునీతః ప్రయత్నేన న చ తత్కురుతే మతిం. ౯
> మమ ప్రతిప్రదానం హి రావణస్య న రోచతే,
> రావణం మార్గతే సంఖ్యే మృత్యుః కాలవశం గతం." ౧౦

అని మూలము. ప్రాతీతికార్థము సుస్పష్టము. రావణుఁడు జ్ఞాని యని మహాభక్తుఁడగు విభీషణుఁ డెఱుంగఁడా? ఏల సీతనిమ్మని నీతి గఱపెను ? అతఁడేల తిరస్కరించెను ? అనువానికే యిట సమాధానము చెప్పవలయును. రావణకుంభకర్ణుల కర్మము నకు విభీషణునికర్మమునకుఁ జాలభేదము కలదు. వా రిరు వురు కారణాంతరోపాత్తజన్ములు. వారికి వైరముననే ముక్తి. ఇరువురకు వైరతత్త్వము తెలిసినపుడు ప్రణయకలహామువలె

నది నటనమే యగును గాని వేఱుగాదు. శాపము ఫలవం
తము కాకపోదు. తద్రూపముననే కర్మము ఫలము నీయఁ
బూనినది. అది విభీషణునకుం గాదు. ఎవ్వరికే నెఱుంగఁ దరము
గాదు. ప్రకృతిపురుషులకేనుగమ్యము. లోకధర్మప్రకార
మాతఁ డన్నకు నీతిని గఱపెను. పరమభక్తుఁడు కాన
రావణుఁ డప్పని తనకుపకరించునది గామింజేసి యందుల కంగీక
రింపఁడయ్యె. అది వ్యాజముగాఁ దనయాశయము హను
మంతునకుం దెలియకయుండ సీతాదేవి రామునకుం దెల్పు
చున్నది. మమ = నాయొక్క, ప్రతిప్రదానం = దాఁచిపెట్టి
నిచ్చినదానిని మరల నర్పించుట యని యర్థము. రావణస్య న
రోచతే=రావణున కొప్పిదము కాదు. నారాకపర్యంతము
నీయింట నునుచుకొనుమని శ్రీరాముఁడు సంకల్పింపఁగా లభిం
చిన సీతాంబారూప పరమవస్తువును వారియాజ్ఞను మీఱి
యేల యిచ్చును ? అను నీకాకూర్థ మిట సూచితము. హను
మంతా ! మృత్యుదేవత యుద్ధరంగ మెపుడు ? రావణుఁ
డెపుడు శ్రీరాముని మాఱొ్కనును ? శ్రీరామాస్త్రరూపమున
నెపుడు వానిపాంచభౌతికశరీరముం బడవైతును ? అని వెదకు
చున్నది. దానికే రెండునెల లింకను వ్యవధిగలదు. అందు
లకే త్వరపెట్టి రాము నిటకుం దోడుకొని రమ్ము. అని సీత
గూఢముగా స్వాశయమును దెలిపెను. దీనిచే "గహనా
కర్మణో గతిః" అన్న భగవద్గీతార్థము తేటపడునని యెఱుంగు
నది. ఈయర్థమునే యీక్రిందిశ్లోకము దృఢపఱచుచున్నది.

> "అసంశయం హరిశ్రేష్ఠ క్షిప్రం మాం ప్రాప్స్యతే పతిః,
> అంతరాత్మా హి మే శుద్ధస్తస్మింశ్చ బహవో గుణాః. ౧౨

ఉత్సాహః పౌరుషం సత్త్వమానృశంస్యం కృతజ్ఞతా,
విక్రమశ్చ ప్రభావశ్చ సంతి వానర రాఘవే. ౧౩

... ... ... ...

అహం తస్య ప్రభావజ్ఞా శక్రస్యేవ పులోమజా." ౧౪

అని మూలము. అంతకుముందు మెడబిగించుకొని చావనున్న సీత యిపు డీమాట యెట్లు పల్కఁజాలెనని బుద్ధిమంతు లూహింపవలయును. హనుమంతునకుఁ దనచారిత్రమున శంకలు గలుగకయుండఁజేయుటకే యట్లు పూర్వముద్బంధనము గావించుకొన సిద్ధపడియెననియు నిపు డాశంకలులేని హనుమకు స్వప్రభావము నెఱింగించెననియు మనమూహింపక తప్పునా? సత్త్వరమ నాపతియగు శ్రీరాముఁడు నన్నుఁ బడయఁ గలఁడు. నా యంతరాత్మ శుద్ధమైనది. శ్రీరామునియందుఁ బెక్కుసుగుణము లున్నవి. నాయంతరాత్మ యనఁగా బ్రహ్మమని భావము. అది పరిశుద్ధమైనది. అనఁగా దివ్యతేజోమయమైన దది. దానియం దనేకగుణము లున్నవి. అవియే నేనని సారము.

"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా."

అని కదా గీతావాక్య మున్నది. గుణాతీతుఁడు భగవంతుఁడు. గుణమయి ప్రకృతి. ప్రకృతివికారితుఁడు శ్రీ రాముఁడు. సగుణ బ్రహ్మమని భావము ఇదియే శాక్తమతసారము.

"విరించిః పంచత్వం వ్రజతి హరిరాప్నోతి విరతిం
వినాశం కీనాశో భజతి ధనదో యాతి నిధనం,
వితంద్రీ మాహేంద్రీ వితతిరపి సమ్మీలితదృశా
మహాసంహారేఽస్మిన్ విహరతి సతి త్వత్పతిరసౌ." ౨౬

అను నీ శ్రీశంకరభగవత్పాదాచార్యోక్తియే పై విషయమును దృఢపఱచుచున్నది.

హనుమంతా! శ్రీరాముని వ్యసనము లేవియుఁ బరిభవింపఁ జాలవు. ఆ మహాత్ముని ప్రభావము నెఱిఁగినదానను నేను. శచీదేవియే యింద్ర ప్రభావము నెఱింగినది. అనఁగా సార మేది? నీవూహించినట్లు నానాథుఁడు వగవ లేదు. అది నటనమని తలంపుము. భగవత్ప్రభావము నితరు లేమెఱుంగుదురు? శచీదేవియే దేవతాధిపతిభాగ్యము. నేనే శ్రీరాముని భాగ్యదేవతను. నానుండియే యతఁడు కదలఁగలఁడు. లేకయున్న నిర్గుణుఁడు నరూపుఁడు నగు. అట్టిరాముఁడు వగచుచున్నాఁ డంటివే యెంతటి యవివేకము? అని సీత యచ్చెరువొందుచున్నది. మునులు త్రిమూర్తులు లోనగువారు భగవచ్ఛక్తి యిట్టిదని యేకోట్యంశమో యెఱుంగఁజాలుదురు. అవినాభావసంబంధము గలజానకి మహాప్రకృతి యాటఁ జక్కఁగా నెఱుంగఁగలదని సారము. ఇట్లుండఁగాఁ ద్రిమూర్తులలో నొకఁడగు విష్ణువే పరమాత్మయని, శంకరుఁడు తత్సేవకుఁడని వాదించు మధ్వవైష్ణవులు కపటనాటకసూత్రధారు లెంత యజ్ఞానులో తెలియరాకున్నది.

> "త్రయాణాం దేవానాం త్రిగుణజనితానాం తవ శివే
> భవేత్పూజా పూజా తవ చరణయోర్యా విరచితా,
> తథా హి త్వత్పాదోద్వహనమణిపీఠస్య నికటే
> స్థితా హ్యేతే శశ్వన్ముకుళితకరోత్తంసమకుటాః." ౨౫

అను నీ శంకరభగవత్పాదాచార్యోక్తి పై భావమును సూచించుచున్నది ఉదారాశయములు లేక సాపాటురామన్నలు

పలుకు తుచ్ఛవాక్కుల కర్థమేమి యుండును ? సూర్యబింబ మెల్లరకు నభిముఖముగానే యుండునట్లు పరాత్పరుఁ డెల్లరకుఁ దదిష్టదేవతామూర్తిని ధరించి యభీష్టదాత యగుచుండఁగా నం దొకమూర్తి యుత్కృష్టమనియు, నింకొకఁడు నీచుఁ డనుటకంటె మహాపాపకార్య మేమున్నది ?

"అథ వా మోచయిష్యామి త్వామద్యైవ వరాననే,
అస్మాద్దుఃఖాదుపారోహ మమ పృష్ఠమనిందితే." ౧౯

అని మూలము. స్వభావము మాఱదనుట కిదియొక యుదాహరణము. సీతాదేవి తెల్పినవాక్యములసార మెఱుంగక సామాన్యోక్తులుగా వానిని భావించి యామె యప్రతిమాన శక్తి నెఱుంగఁ జాలనంత మౌర్ఖ్యమున నహంభావమును బూని నాపీఁ పెక్కుము. నీదుఃఖము నిపుడే మాయఁ జేసెద ననుచున్నాఁడు. భగవతీసందర్శనమున వినిర్మలజ్ఞానము కలుగవలసియుండఁగాఁ బ్రాకృతజ్ఞానమే నిలిచియుండఁ గారణమే మని యడుగవచ్చును. అదియే పరమేశ్వరిచిత్రచరిత్రము. యశోదాదేవికి దివ్యరూపమును జూపిన శ్రీకృష్ణమూర్తి యుత్తరక్షణమున మాయఁ గప్పనేల ? అదియే ప్రాక్పుణ్య ఫలము. చేసినవారికిఁ జేసినంతయే పుణ్యపాపఫలము లభించును గాని యధికము లభింపదు. హనుమంతునకుఁ జక్కని జ్ఞానోదయమున కది కాలము కాదు. అదియే కర్మసిద్ధాంత మని యెఱుంగవలయు. ఏకాలమున నెవరిమూలమున సుఖదుఃఖానుభవము గలుగవలయునో యపుడే వారిమూలమునఁ గలుగును గాని యితరులమూలమునఁ గలుగదని మనము

చక్కఁగా నిశ్చయించుకొనవలయును. పావనికింగల యహంకారము నీక్రిందిమూలమే తెల్పుచున్నది.

"న హి మే సంప్రయాతస్య త్వామితో నయతోఽంగనే,
అనుగంతుం గతిం శక్తాస్సర్వే లంకానివాసినః." ౨౯

అని మూలము. ఇయ్యది

"అథ చేత్త్వమహంకారాన్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి. ౫౮
యద్యహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి. ౫౯
స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్." ౬౦

అను నీ భగవద్గీతావాక్యములసారమునే బోధించుచున్నది. ప్రాణి స్వశక్తిని బురస్కరించుకొని కార్యమును సాధింపఁ బూనును. అది న్యాయ్యమే. సుఖము లభింప గర్వించుటయు దుఃఖము లభింప దైవముపై వైచుటయు ననునివియే యవివేకికార్యములు. ఆకార్యములకే యహంకార మందురు. హనుమ సీతాదేవి నిర్భయత్వాది సద్గుణములం గాంచియు నామె జగన్మాతయని యెఱుంగఁజాలక నీదుఃఖము నెడఁబాపుదు ననుట తెలివితక్కువ కుదాహరణము కాక మఱేమి? అదియే స్వభావజంబగు కర్మమని యెఱుంగుటయే తెఱంగు. అంతవానినే కర్మము బాధించునపుడిఁక నస్మాదృశులమాట తడవనేల? ఈ యర్థమునే సీతాదేవి స్పష్టముగాఁ దెలుపుచున్నది.

"హనుమన్ దూరమధ్వానం కథం మాం వోఢుమిచ్ఛసి,
తదేవ ఖలు తే మన్యే కపిత్వం హరియూథప." ౨౯

అని మూలము. నన్నొక నిమేషమాత్రము చరాచరములు మోయఁజాలవన నీవెట్లు దూరమార్గమును మోసికొని పోఁ గల నంటివి. వానరధర్మ మనఁగా నతిచాపల్య మిదియే కదా. అని పరిహాసించెను. కాని మానసమున నాతని ధర్మమున కానందించె యూఱడించెను. మనస్సు నొచ్చునేమో యని యాశ్వాసించిన ట్లాభావము తోఁపఁజేయును జగన్మాత చెప్పి నట్లు నైజచాపల్యము నీక్రిందిశ్లోకములు దృఢపఱచును.

"సీతాయా వచనం శ్రుత్వా హనుమాన్మారుతాత్మజః,
చింతయామాస లక్ష్మీవాన్నవం పరిభవం కృతమ్. ౩౧
న మే జానాతి సత్వం వా ప్రభావం వాసితేక్షణా,
తస్మాత్పశ్యతు వైదేహీ యద్రూపం మమ కామతః. ౩౨
ఇతి సంచిత్య హనుమాంస్తదా ప్లవగసత్తమః,
దర్శయామాస వైదేహ్యా స్స్వరూప మరిమర్దనః. ౩౩
స తస్మా త్పాదపాద్ధీమా నాప్లుత్య ప్లవగర్షభః,
తతో వర్ధితుమారేభే సీతాప్రత్యయకారణాత్. ౩౪
మేరుమందరసంకాశో బభౌ దీప్తానలప్రభః,
అగ్రతో వ్యవతస్థే చ సీతాయా వానరోత్తమః. ౩౫
... ... ... ...
తదవస్థాప్యతాం బుద్ధిరలం దేవి వికాంక్షయా,
విశోకం కురు వైదేహి రాఘవం సహలక్ష్మణం." ౩౮

అని మూలము. సామాన్యార్థము స్పష్టము. అశోకవృక్షము నుండిదిగి సీతతో మాటలాడినట్లు ముందే చెప్పఁబడినది. పాద పాత్తస్మాదాప్లుత్య=అనఁగా నర్థమేమి? "అయంశ్లోకః వర్ధనార్థం వృక్షాదవరోహణం దర్శయతి స్మ. అనేన సోఽవతీర్య. ద్రుమా.

దితి పూర్వం ద్రుమాగ్రాత్సితాసమీపస్థశాఖాయా మవతరణ ముక్తం. అత్ర భూమావితి బోధ్యమ్." అని గోవిందరాజులు వ్రాసిరి. "పాదపాత్పాదపమూలాదవప్లుత్య శరీరవర్ధనవేగకృత శాఖాభంగధ్వనినా రాక్షసో జ్ఞాస్యంతీతి మత్వా అన్యత్రా పసృతవా నిత్యర్థః." అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి. ఇందు రెండవది యుక్తమని తోఁచకమానదు. హనుమ తస్య బల శక్తులను సీత తెలిసికొనలేదని తలంచి యామెకు విశ్వాస మును బుట్టింపఁదలంచి పెరిఁగెనని భావము మేరుమందరపర్వత సంకాశాదు లారూపమును దెల్పు విశేషణములు. దేహమును విశాలభాగము నావరింపఁ బెంచుట శక్యమా యనున దొక సందేహము. ఇట్టి సందేహములు యోగశాస్త్ర మెఱుంగని వారికే తఱుచుగాఁ గల్గుచుండును.

సూ. "స్థూలస్వరూపసూక్ష్మాన్వయార్థవత్త్వసంయమాద్భూతజయః. ४४
తతోఽణిమాదిప్రాదుర్భావః కార్యసంపత్తద్ధర్మానభిఘాతశ్చ." ४५
పాతంజలయోగసూత్రము విభూతిపాదము.

"తత్రాణిమా భవత్యణుః, లఘిమా లఘుర్భవతి, మహిమా మహాన్ భవతి, ప్రాప్తిరంగుళ్యగ్రేణాపి స్పృశతి చంద్రమసం, ప్రాకామ్యమిచ్ఛానభి ఘాతః, భూమావున్మజ్జతి, నిమజ్జతి యథోదకే, వశిత్వం భూతభౌతికేషు వశీభవత్యవశ్యశ్చాన్యేషాం, ఈశిత్వం తేషాం ప్రభవాప్యయవ్యూహానా మీష్టే. యత్ర కామావసాయిత్వం సత్యసంకల్పతా యథాసంకల్ప స్తథాభూత ప్రకృతీనామవస్థానం, న చ శక్తోఽపి పదార్థవిపర్యాసం కరోతి, కస్మాత్ అన్యస్య యత్ర కామావసాయినః పూర్వసిద్ధస్య తథా భూతేషు సంకల్పా దితి, ఏతాన్యష్టావైశ్వర్యాణి. కాయసంపద్వక్ష్యమాణా, తద్ధర్మానభిఘాతశ్చ పృథ్వీ మూర్త్యా న నిరుణద్ధి యోగినశ్శరీరాదిక్రియా, శిలామప్యనువిశతీతి,

నాऽऽపస్స్నిగ్ధాః క్లేదయంతి నాగ్నిరుష్ణో దహతి న వాయుః ప్రణామీవ హంతి, అనావరణాత్మకేऽప్యాకాశే భవత్యావృతకాయః సిద్ధానామప్యదృశ్యో భవతి."

వ్యాసభాష్యము.

యోగశాస్త్రము క్షీణప్రాయమగుట నెన్నియో శంకలు గల్గ నవకాశ మిప్పుడు కనంబడుచున్నది. సిద్ధులలో నణిమాదు లెని మిదియు మహాభూతులని ప్రతీతి కలదు. యోగుల కవి సులభములే. అనఁగా నిష్కామయోగులు కానివారల కవియే పరమపురుషార్థతుల్యములని తోఁచును. ఆ యష్టసిద్ధులలోనిది మూఁడవది. చూచువారలకు మాత్రమే యారూప మట్లు కనఁబడును. పరమాణువులందుఁ బ్రవేశించుటం జేసి యితరుల కారూపమే కనఁబడకయుండును. కావున మేరుమందరపర్వతము లా రూపమున నల్పభాగములుగనే తోఁచును. అంత రూపమును హనుమంతుఁడు చూపఁగా సీతయు రాక్షసాంగనలు లంకయు నెందున్నవను ప్రశ్నము సర్వథా అసంగతమని తోఁపకమానదు. యోగవిద్య నెఱుంగనివా రీ యభ్యాసము గాకడమని పల్కుదురు. వారి యోగ్యత యంతకుమించిన యూహలను గాంచఁజాలదనియే నిశ్చయింపవలయును.

హనుమ యహంకారవిశిష్టుఁ డగుట కీయుదాహరణమే చాలును. ప్రకృతిముందు హరిహరధాతృప్రముఖులు బాలకులగుచుండఁగా నీక నీ వానరుని దేపాటిశక్తి? తనశక్తి యా జగజ్జననికిఁ దెలియదని యూహించి యద్దానికిం దగిన రూపమును జూపనెంచుటయే యహంకారము. దీనిచే సీత తన యద్భుతసత్త్వము నెఱింగి తనవీఁపుపై నెక్కి రాఘవులం

జూడవచ్చునని తలంచుటయే యాతని యజ్ఞానము. "మహిమఁ జూపువాఁడు మధ్యముండు" అని వేమనయోగి తెల్పెను. పలుమాఱు లిట్టి యహంకారము సదుపదేశ శ్రవణమునఁగాని నశింపదు. ఇది తొలుతటి యుపదేశము.

"తం దృష్ట్వా భీమసంకాశ మువాచ జనకాత్మజా,
పద్మపత్త్రవిశాలాక్షీ మారుతస్యౌరసం సుతమ్. 39
తవ సత్త్వం బలం చైవ విజానామి మహాకపే,
వాయోరివ గతిం చాపి తేజశ్చాగ్నేరివాద్భుతం. 40
ప్రాకృతోఽన్యః కథం చేమాం భూమిమాగంతుమర్హతి,
ఉదధేరప్రమేయస్య పారం వానరపుంగవ." 41

అని మూలము. ప్రాతీతికార్థము సువ్యక్తము. భీమసంకాశమ్= భయము గలిగించువంటిదని భావము. అనఁగా నా మెదృష్టికా రూపము భయమును గల్గింపఁజాలునా? కనుక నే యింతభయం కరరూపుఁడను గాన నిన్నుఁ గొనిపోవఁజాలనా యను నహం కారము గల యావ్యక్తిని గని నవ్వెనన్న భావము తోఁపఁ జేయఁ బూని మహాకవి వాల్మీకిమహర్షి "పద్మపత్త్రవిశాలాక్షీ, జనకాత్మజా",అను విశేషణమును జేర్చెను. లేకున్న నీవిశేషణ మిచ్చోఁ ననర్థకమే. మారుతస్యౌరసం సుతం తం దృష్ట్వా ఉవాచ = గాలికొమరుఁడనుట చంచలమనస్సు గలవాఁడను భావ మును దెల్పుటకని గ్రహింపవలయును. తన కించుకంతయు భయము గలిగింపకున్నను జంచలాత్ము నాతనిం దలంచి కన్నుల సంతోషము గురియించుచు నిట్లు పలికెనని సారము. "మహా కపే"అని సంబోధించెను. సామాన్యవానరుల నీచాపల్యమున మించినవాఁడని పరిహాసించెనని భావము. పొగడెఁగదా ఏలన

మహోపకారము చేయఁబూనిన భర్తదూత మనస్సు నొప్పింప రాదని తలంచియే యని భావమును జేకొనందగు. వానరో త్తమా నీసత్వబలముల నెఱుంగుదు ననక చక్కఁగా నెఱుం గుదుననియె. నీవు తప్ప సామాన్యుల కీసాగరలంఘనము శక్యమా యనియె. ఇది కేవలస్తుతియే యనవలయు. రాక్ష సాంగనలు ప్రతిదినము దాఁటుచుండు సాగరమును వాయు పుత్త్రుఁడవగు నీవు దాఁటఁ గలిగితివనుట భావ మేదాని సమ కూర్చును? వానరజాతి కిది శక్యము గాదనియు నీవందు త్త మోత్తముఁడవనియుఁ జెప్పెను. దీనిచే స్తుతించెనని మనము గ్రహింపందగు. ఇది కూరిమిఁ దేటపఱచును.

"అయుక్తం తు కపిశ్రేష్ఠ మమ గంతుం త్వయానఘ,
వాయువేగసవేగస్య వేగో మాం మోహయేత్తవ." ౪౨౩

అని మూలము. పైశ్లోకము స్తుతి వాస్తవము గాదను భావము నీశ్లోకము దృఢపఱచుచున్నది. "కపిశ్రేష్ఠ" అనునది సాభి ప్రాయ విశేషణము. "తే మన్యే కపిత్వం హరియూథప" అను భావమునే తెలుపును. లేకున్న నో వానరశ్రేష్ఠా! నీతోడ నారాక యుక్తము గాదనుట యెట్లు పొసఁగును? ఈవిశేష ణమునకుఁ దోడు "అనఘ" అనునదియుఁ గలదు. దోషరహి తుఁడవే యైనను గపివర్యుఁడవు కదా. కాన నిది తగునిది తగ దని యోజింపలేక నన్ను మోసికొని పోవుదునంటి వనుభావ మును జానకి సూచించెను. నన్ను నీగమనము భ్రాంతినొందిం చును. దాన నీకు లాభము గలదు. ఇది యతనికి హితముగఁ దోఁచునట్లు పలుకు వాక్యము. వాయుసమానవేగము గల వాఁడ వనునది దీనిం దెలుపును.

"అవ్యవస్థా హి దృశ్యేతే యుద్ధే జయపరాజయౌ." ౫౩

అని మూలము. ఇంతటి భయంకరాకారమును జూపినను నన్ను నీమె తెలిసికొనఁజాలకున్నదే యను సందియమడంప నీవాక్యము సీత చెప్పుచున్నది జయపరాజయములు నిలుకడ లేనివి. బలవంతుఁ డోడుటయు దుర్బలుఁడు గెలుచుటయుఁ గలదు. కావున నవి నిలుకడలేనివి. అనఁగా బలపరాక్రమములు కర్మమునకుఁ జాలవు. దాని తోడ్పాటు గలిగినపుడే ఫలించు. లేకున్న నశించును. కర్మమెట్టిఫలముల నొసంగునని ముందుఁ దెలిసికొనఁ ద్రిమూర్తులకేఁ దరంబుగాదని శ్రీకృష్ణమూర్తియే

"కిం కర్మ కిమకర్మేతి కవయో ఒప్యత్ర మోహితాః,
తత్తే కర్మ ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వా మోక్ష్యసే ఒశుభాత్. ౧౬
కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః,
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః." ౧౭

"కవయో మేధావినః." అని భాష్యము. గీత. ౪ అ.

అని గీతాశాస్త్రమునఁ దెల్పెను. కర్మము భగవంతునకుం దక్క నితరులకుఁ దెలియఁ దరముకానిదని కదా దీని భావము. ఈ యర్థమునే కాళిదాసమహాకవి

"అథవా మృదువస్తు హింసితుం మృదునైవారభతే ప్రజాంతకః,
హిమసేకవిపత్తిరత్ర మే నళినీ పూర్వనిదర్శనం మతా. ౪౬
స్రగియం యది జీవితాపహా హృదయే కిం నిహితా న హంతిమాం,
విషమప్యమృతం క్వచిద్భవేదమృతం వా విషమీశ్వరేచ్ఛయా. ౪౭

రఘు. ౮ సర్గము.

ఎవ్వానిచే నైనఁ గర్మమేపనినైనఁ జేయింపఁగలదనియు దాని మరలించువారు లేరని కదా భావము. కనుకనే యింతమహా ప్రాకారముగల నేను రక్కసుల నడంచి నిన్నుఁ గైకొని పోయి శ్రీరామునిం జేర్పఁజాలనా యన్నయూహ నడంపఁ బూనియే జానకి యుద్ధమున జయపరాజయములు నిలుకడ లేనివిగ నుండునని, కనుకనే స్వబలాదుల నమ్మరాదనియుఁ దెల్పి బుద్ధి చెప్పెను. అట్టి కర్మమును దేవాలయముల సేవించి జయింతుమని పల్కువారలతెలివి యెంతయల్పమో యోజింప వచ్చును. కర్మానుష్ఠానమును మానినవారి కధోగతియే యను భావము నీవాల్మీకివాక్కు తెల్పుచున్నది.

"యదహం గాత్రసంస్పర్శం రావణస్య బలాద్గతా,
అనీశా కిం కరిష్యామి వినాథా వివశా సతీ. ౬౧.
యది రామో దశగ్రీవమిహ హత్వా సబాంధవం,
మామితో గృహ్య గచ్ఛేత తత్తస్య సదృశం భవేత్." ౬౨.

అని మూలము. సీత యీ వాక్కులమూలమునఁ బతివ్రతా ధర్మములను దెలుపుచుఁ దన్నుఁ దోడ్కొని పోవఁదగువాఁ డొక్క రాముఁడే యని యుక్తముగా నెఱిఁగించుచు హను మంతుని విచారదూరునిగాఁ జేయుచున్నది. పరపురుష స్పర్శము పతివ్రతలకు సర్వదా సర్వథా దూష్యమనియే యెఱుంగవలయును. ఆపద్విషయమున నయ్యది పాపహేతువు కాదనియు నిందుఁ గలభావము. దేహసంస్పర్శము దుర్వాంఛా సంజనకమని పూర్వులభావము. సత్పురుషులు పతివ్రతలకు నమస్కారము చేయుచుఁ బాదములను స్పృశింపరాదని స్మృతులు తెలుపుచున్నవి.

"గురుపత్నీతిపూజ్యాస్స్యుస్సవర్ణా గురుయోషితః,
అసవర్ణాస్తు సంపూజ్యాః ప్రత్యుత్థానాభివాదనైః. ౨౧౦
అభ్యంజనం స్నాపనం చ గాత్రోత్సాదనమేవ చ,
గురుపత్న్యా న కార్యాణి కేశానాం చ ప్రసాధనమ్. ౨౧౧
గురుపత్నీ తు యువతిర్నాభివాద్యేహ పాదయోః,
పూర్ణవింశతివర్షేణ గుణదోషౌ విజానతా. ౨౧౨
స్వభావ ఏష నారీణాం నరాణామిహ దూషణం,
అతోఽర్థాన్న ప్రమాద్యంతి ప్రమదాసు విపశ్చితః. ౨౧౩
అవిద్వాంసమలం లోకే విద్వాంసమపి వా పునః,
ప్రమదా హ్యుత్పథం నేతుం కామక్రోధవశానుగం. ౨౧౪
మాత్రా స్వస్రా దుహిత్రా వా న వివిక్తాసనో భవేత్,
బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి. ౨౧౫
కామంతు గురుపత్నీనాం యువతీనాం యువా భువి,
విధివద్వందనం కుర్యాదసావహమితి బ్రువన్. ౨౧౬
విప్రోష్య పాదగ్రహణ మన్వహం చాభివాదనం,
గురుదారేషు కుర్వీత సతాం ధర్మమనుస్మరన్." ౨౧౭

మను. ౨ అధ్యా.

"ప్రవాసాదాగత్య సవ్యేన సవ్యం దక్షిణేన దక్షిణమిత్యుక్త విధినా పాదగ్రహణం ప్రత్యహం భూమావభివాదనం గురుపత్నీషు యువా కుర్యాత్. శిష్టానామయ మాచార ఇతి జానంతు." అని కుల్లూకభట్టు. ఇందుఁగల కోమలభావ మెఱుంగందగినది. గురుపత్ని మాతయే యను భావము గలిగిన శిష్టుఁడగు శిష్యుఁడు కూడ భూతలమునఁ బాదముల చెంత వందనము చేయవలయునని స్మృతి శాసించుచు బల

వంతమగునది యింద్రియగ్రామమనియు నది జ్ఞానులను గూడ నవశులనుగాఁ జేయుననియు హెచ్చరించుచున్నది. ఈవిషయమున సీతయాశయమున నేమని విచారింతము.

రావణస్య గాత్రసంస్పర్శమహాం (యత్ కారణాత్) బలాద్గతా అని యన్వయక్రమము. "బలాత్తత్కృత పూజోపాసనాదిజనిత పుణ్యబలాత్కృతా" అని యర్థము. మహాభక్తుఁడు పుణ్యాత్ముఁడు నని యొఱింగి యీ కల్పితరూపమున నతని గాత్ర సంస్పర్శము చేసితిని. అనీశా=ఈశ్వరసాన్నిధ్యము లేనిదాననై నారూప మాతని వదలి రాలేదు కదా. ఈకల్పిత రూప మాపరమాత్మసాన్నిధ్యము కలది కాదని భావము. వినాథా = అసమర్థురాలను. వివశా = విశేషించి భక్తులకు లోఁబడుదానను అని సారము. శక్తిసాన్నిధ్యము లేక పరమేశ్వరుఁడును, పరమేశ్వరసాన్నిధ్యము లేక శక్తియు నేకార్యమును జేయఁజాలరు. కనుకనే వారి కెడఁబాటు లేదని యెఱుంగందగు. హేతుహేతుమద్వస్తువునకు భేద మెట్లు పొసఁగును? అసంభవమే యది. కావున వానిభక్తి యంత దృఢతం గాంచినను ఈశ్వరసన్నిధానమును గాంచని యీ రూపమున లోఁబడితినని సీత భావసారము. దీనిచేతఁ బతివ్రతలు పరవశలై యుండుతఱిఁ బరపురుషస్పర్శము గలిగిన నది బుద్ధిపూర్వము గామింజేసి దోషము నాపాదింపఁజాలదనియు, నది బుద్ధిపూర్వకమే యైన మహాదోషమనియుఁ దాత్పర్యము. నిరంతర పరపురుషసంగతి చాల మంచిదనువారి భావము గ్రహింపఁ దరము గాకున్నది. దేహకృతదోషము లాత్మ నంటఁజాలవని వారిభావమై యుండునో క్షణికము

లగునవి పాపహేతువులే కావనియో నాయీ యల్పమతికిఁ దోఁపకున్నది. తరువాతివృత్తాంతమును బలింపి తృప్తినొందుదము.

## హనుమంతునకు సీత చూడామణి నొసంగుట.

* అంత నాపావని సీతవాక్కుల నాలకించి వాగ్విశారదుఁడు కాన ధర్మయుక్తమగు నాపలుకుల కలరి యిట్లనియె. తల్లీ నిన్ను దర్శించిన శుభములు గల్గును. నీవాక్కులు స్త్రీస్వభావమునకును, వినయవృత్తికిని దగినదిగను, ధర్మయుక్తముగ నున్నది. నావీఁపెక్కి యీ మహాసాగరమును దాఁట స్త్రీలకెంతమాత్రము శక్యము కానిదే. జానకీ! కడు వినయభూషితురాలవు. రామేతరపురుషుఁడు నన్ను స్పృశింపరాదని నీవు పల్కిన రెండవహేతువు ఆమహాత్ముని ధర్మపత్నివగు నీకెంతయుఁ దగియున్నది. జననీ! నీవు తప్ప నింకెవ్వతుక యిట్లీ యాపత్సమయమునం జెప్పును? దేవీ! శ్రీరామవిరహము నోర్వక యుద్బంధనము మొదలగు వ్యాపారములు గావించిన నీవ్యాపారములు రావణుని దూలనాడినవాక్యములు నున్నదున్నట్లు శ్రీరాఘవునిమ్రోల వినిపింపఁ గలను. నీదుఃఖము నోర్వఁజాలక యెట్లైనఁ బ్రియముచేయవలయునని నామనస్సు కరఁగి నిలువఁజాలక పలికితిఁగాని వేఱుగాదు. సాగరలంఘన లంకాప్రవేశాదులు సామాన్యములు కావనియు నవి నాకు సాధ్యములగుట నాసామర్థ్యముం దెలుపం దెలిపితినిగాని యింకొకటి గాదు. ఇపుడే రామునికడ నిన్నుఁ జేర్పఁ గుతూ

---

* ఇది ముప్పదెనిమిదవసర్గమునఁ గలదు.

హాలముగా నున్నది. అదియుఁ బ్రీతియు భక్తియు నుప్పొం గఁగా నట్లు పలికితిని గాని యన్యము కాదు. నాతోడ రా సమ్మతింపవేని నేను నిన్నుఁ గాంచినట్లుగా నేదే నానవా లిమ్ము. దానింబట్టి శ్రీరాముఁ డెఱుంగును.

ఆమాట లాలకించి దేవకన్యంబోలు నాజానకి యొక యానవా లియ్యఁబూని శ్రీరామునితో నేకాంతమున సాగిన యొకవార్త తలంపునకు రాఁగా నశ్రుకణములు కన్నులం గ్రమ్మ నక్షరములు తడఁబడుచుండ నిట్లు చెప్పెను. పూర్వ మొకపరి చిత్రకూటపర్వతమునకుఁ జెంతనుండు నొకకొండ నీశాన్యపుదిక్కున మందాకినీనదీపరిసరమున సిద్ధాశ్రయము ఫలమూలాదిసమృద్ధమునగు ప్రదేశమునందు నివసించియుం డఁగా నొకకార్యము సాగినది. అదియే మంచిగుఱుతు కాఁ గలదు. దానిం జెప్పెద. శ్రీరామున కెఱిఁగింపుము. నేనందం దుపవనముల విహరించి యలసి స్వేదోదకములం దడిసి నీయంక మునఁ గూరుచుంటిని. ఒక్కకాకి మాంసాశ నావక్షస్థలమును ముక్కుతోఁ బొడిచెను. నేను లగుడమువైచి దానిం దోలితిని. అది పోవక మరలమరలఁ బొడువ దాఁగియుండెను. మరల నది రాఁగా మొలనూలు బిగించుకొనుచు దానిపై నాగ్రహము గలిగియుండఁగా నీవే చూచితివి. నేనంత నీయొడినుండి లేచి దానిం దఱుమఁబోయి పాఱఁదోలం జాలకయుండ నన్ను నీవు పరిహాసించితివి. సిగ్గుపడి దాని నేమియుఁ జేయఁజాలక వచ్చి నీ యంకమునఁ గూరుచుండి కోపముగొనియుండ సంతసమున నన్ను బుజ్జగించితివి. ప్రాణేశ్వరా! ఆపని కాగ్రహించి కన్నీరు గాఱఁ దుడుచుకొనుచుండఁ గాంచితివి. అని తెలిపి హను

మంతునిం గూర్చి చెప్పుచున్నది. హనుమంతా! అంత నలసి యున్న నేను శ్రీరామునితొడపైఁ బరుండి చాలసేపు సుఖనిద్ర ననుభవించితిని నేను నిదురనుండి మేలుకొనఁగా నా నాథుఁడు నాయొడిలోఁ బరుండి నిదురించెను. ఆసమయమున నాకాకి మరల వచ్చి యందే పొడువసాగెను. మరల మరల నది పొడువ రక్తపుబొట్లు రాల రాముముఖము తడిసెను. విధిలేక నానాథుని మేలుకొలిపితిని. లేచి యావీరాగ్రేసరుఁడు తత్కార్య మెఱింగి కాలాహిం బోలి నూర్పులు పుచ్చుచుఁ బ్రాణనాయికా! ఏదుష్టుఁ డిచ్చట నిట్లు చీల్చెను? ఏయజ్ఞానుఁడు రోషము నొందియుండు నయిదుతలలపాముతో నిట్లు క్రీడించుచున్నాఁడు? అని యడిగెను. అంతతో నూరకయుండక నలుప్రక్కలం జూచుచు రక్తసిక్త ఖరనఖరములతో నా యెదుటం దోఁచిన యాకాకముం గాంచెను.

ఆవాయస మింద్రపుత్త్రుఁడఁట పక్షీంద్రుఁడఁట. అపుడే భూమికి వచ్చెనఁట. మహావేగమున వాయువుం బురడించువాఁడఁట. ఆకాకిని మహావీరుఁడగు శ్రీరాముఁడు చూచి దాని వధింపఁగోరి దర్భాసనమునుండి యొకపోఁచను గైకొని బ్రహ్మాస్త్రమంత్రమున నభిమంత్రించి యద్దాన నది యస్త్రరూపమున మండఁగా దానిపయిం బ్రయోగించెను. అది దానిం దఱుముకొనిపోయెను ఆయస్త్రముం గాంచి యది భయంపడి పరుగెత్తి యనేకస్థలములం దిరిగి యెందఱినో రక్షింపఁ గోరెను. ఇంద్రుఁడు లోనగు దేవవర్యులును మహర్షులును రక్షింపఁ జాలమనిరి. ముల్లోకములం గ్రుమ్మరి రక్షకాంతరము నెచటను గానక వచ్చి శ్రీరామునే శరణుసొచ్చినది. సర్వ

శరణ్యుండగు రామచంద్రుఁడు హంతవ్యమగు నావాయస మును దయారసము మెఱయఁ గాపాడెను. దానింగాంచి, "నా బ్రహ్మాస్త్రము వ్యర్థమగునట్లు మరల్ప నెవ్వారికే శక్యముగాదు. దీని కేమిచేయవచ్చు" నని యడుగ, నాకాకి "నీయస్త్రమునా దక్షిణనేత్రమును హరించి తృప్తినొందును గాక." అని యనెను.

అంత నాదర్భరూపబ్రహ్మాస్త్ర మావాయసదక్షిణాక్షిని హరియించి శాంతించెను. వాయసము కూడ స్వర్గమునందున్న మిత్రుఁడగు దశరథునకుఁ దొలుత రామునకు నమస్కరించి తనలోకమునకుఁ బోయెను. అని తెల్పి శ్రీరాము నుద్దే శించి యో రాజచంద్రమా! పూర్వము నాకొఱ కాకాకి యంతటి యల్పజంతువుపై బ్రహ్మాస్త్రము నే వైచితివే నన్నప హరించికొనిపోయిన మహాపరాధిని క్షమించుచున్నావేమి? దయానిధివగు నీ వూరకుండక నాయెడఁ గరుణఁ బొలయిం పుము. నీవు నాథుఁడవుగానుండు నే ననాథ యగురీతిఁ గనఁ బడుచున్న దే. ఇది న్యాయ్యమా? దయగలిగియుండుటయే పరమధర్మమని నీవే చెప్పఁగా వింటిని. నీవే యద్దాని మానిన నెట్లు? నీశౌర్యాదుల నే నెఱుంగుదును. అని పలికి మరల హనుమంజూచి యార్యా! అట్టి మహానుభావుఁడయ్యు నన్ను బాధించు రక్కసులపై మహాస్త్రముల వైవకున్నాఁ డేటికో? యుద్ధమున గంధర్వాదిదేవత లారాము నెదిరింపఁజాలరు. నన్నుఁ గొనిపోవవలయు ననుత్వరయే పూనియున్న నీదుష్టుల నాశముచేయఁ డేటికి? మహాబలశాలియగు సౌమిత్రి భ్రాతృ నానతిం గొనివచ్చి యీయల్పుల వధింపకున్నాఁడే? ఏల? ఆసోదరు లిరువురు కలిసియుండియు నన్నుఁ గొనిపోవ రాక

యాలస్యము చేయనేల? వారు రాకుండుటకుం గలకారణము నాచేసికొన్న మహాపాపమే యయియుండును. సందియము లేదు.

జానకీదేవి యీరీతి నశ్రుకణకలితనేత్రయై పలుక విని మహాతేజుండగు నాపావని దేవీ! నిన్నుఁగూర్చిన మహావ్యసనమున శ్రీరాముఁడు ఖిన్నుఁడై యున్నవాఁడని ప్రమాణము చేసెద. లక్ష్మణుఁడు నతివిషణ్ణుఁడై యున్నవాఁడు. నిన్నెట్లో దర్శింపఁజాలితి. ఈముహూర్తమున నీ దుఃఖములన్నియుఁ దొలఁగెనని నమ్ముము. ఆమహానుభావు లిరువురు శత్రువుల భస్మము చేయఁగలరు రావణుం జంపి శ్రీరాముఁడు నిన్నుం దోడ్కొనిపోవఁ గలఁడు. శ్రీరామలక్ష్మణులకు సుగ్రీవాదులకు నేమిచెప్పవలయునో చెప్పుము. అని యడుగఁగా నాసీత వగచుచు నతనిం గాంచి సద్బుద్ధిగల కౌసల్య లోకనాథు నెవ్వని గన నోచెనో యాశ్రీరాముని నాకొఱకు నీవు సుఖప్రశ్నము చేసి నమస్కరింపుము. సకలైశ్వర్యముల వదలి సుమిత్రానందవర్ధనుఁడు లక్ష్మణుఁడు తలిదండ్రుల నడిగి రామునివెంట నరణ్యమునకు వచ్చెఁ గదా. నన్నుఁ దల్లినిగాఁ దలంచు నా మహాత్ముని నాకుమాఱుగా నీవనామయం బడుగుము. వా రిచ్చటికి వచ్చునట్లు ప్రయత్నము చేయవలసినవాఁడవు నీవే. కాన నీవు చక్కఁగాఁ బాటుపడవలయుం జుమీ నానాథునితో ""నేనిఁక నొకమాస మెట్టులో ప్రాణములు నిలుపుకొని యుందును. పిదప జీవించియుండను. సత్యముమీఁద శపథము చేసి చెప్పుచున్నాను. రావణుఁ డిచ్చిన రెండునెలల పరిమితిదనుక నోర్చియుందును. మహాత్మా! పూర్వమింద్రుని లక్ష్మి పాతాళ

మును బ్రవేశింపఁగా దేవతలు ప్రార్థింప శ్రీమహావిష్ణువు దానిని గాపాడి తెచ్చియిచ్చినచందమున నీ రావణునుండి నన్ను రక్షింపవలయును" అని చెప్పితినని తెలియఁ జెప్పుము.

అని తెలిపి యా పతివ్రతాశిరోమణి దివ్యమై సుందరమై కనుపట్టు చూడామణిని దీసెను. అది చేలాంచలమున ముడిచి యుంచఁబడియుండెను. దానిని విప్పి "దీనిని శ్రీరామచంద్రున కిమ్ము" అని పలికి హనుమంతున కొసంగెను. ఆభక్తుఁడాయమూల్యసమానచూడామణి నందుకొని తనవ్రేలికం బెట్టుకొనియెను. అత్తఱి నతఁ డల్పశరీరుఁడై యుండినందున నతనిహస్తము నల్పముగానుండెను. అంత నాసీతకు వలగొని మ్రొక్కి వినీతుఁడై పార్శ్వమున నిలువంబడియెను ఆతని తనువే యందుండెను గాని మనస్సు శ్రీరామునికడకుఁ బోయి యుండెను. స్వస్థమనస్కుఁడై ప్రయాణముచేయ నుద్యుక్తుఁడయ్యెను.

మహామనీషులారా! ఈభాగమున నేయేవిశేషముల మహాకవి పొందుపఱచెనో పరిశీలింతము.

> "యుక్తరూపం త్వయా దేవి భాషితం శుభదర్శనే,
> సదృశం స్త్రీస్వభావస్య సాధ్వీనాం వినయస్య చ. ౨
> స్త్రీత్వం న తు సమర్థం హి సాగరం వ్యతివర్తితుం,
> మామధిష్ఠాయ విస్తీర్ణం శతయోజనమాయతం." 3

అని మూలము. సీత తన్నుఁ గపి యని పరిహసించినందులకు బదులు చెప్పుచున్నాఁడు. శుభదర్శనే = శుభములొసంగు దర్శనము కలదానా. అనఁగా పరదేవి యని కదా యర్థము.

దర్శనమున శుభములు గలుగుటయే కదా భగవన్మహాత్త్వము. నీమాటలు స్త్రీస్వభావమునకుఁ దగినవియే. నైజముగా స్త్రీలు భీరువులు. కాన నైజము వదలదు కదా. అని బదులునకు బదులు చెప్పి యామెయాశయమును బ్రశంసించుచున్నాఁడు. సాధ్వీనాం వినయస్య చ సదృశమ్=పతివ్రతల విశేషన్యాయము నకుఁ దగినదే అని. వినయస్య = విశేషనయస్య అని యర్థము. "నయో నీతిః విశేషశ్చాసౌ నయశ్చ = వినయః తస్య" అని సమాసము. పతివ్రతలు పరపురుషస్పర్శనాదులకు దూరముగా నుండవలయునన్న స్మృత్యుక్త ధర్మరూపన్యాయమునకుఁ దుల్యమైనదని ప్రశంస స్త్రీలకు నూఱుయోజనముల వెడ ల్పుగల సాగరమును నావఁ నెక్కి దాఁటఁదలంచుట శక్యము కాదు. స్త్రీలు భీరువులని పురుషులు ధీరులని సామాన్యవిషయ మును బ్రధానముగాఁ జేసికొని పలుకుచున్నాఁడు. రాక్ష సాంగనలు ప్రతిదినము సాగరము దాఁటుట యప్పుడు హను మకు స్మృతిగోచరము కాలేదని తోఁచెడిని. మానవస్త్రీలకని యిట నాతనిభావమై యుండనోపు. స్త్రీస్వభావస్య=అనుపద మును బరిశీలింప సామాన్యస్త్రీవాచకమనియే తెలును గాని మానవస్త్రీ లనునర్థము కానేరదు. దీనిచే నింతదనుక నామె పరదేవి యనుభావము హనుమకు లేదని యూహింపఁ దగి యున్నది. అది కల్గుట సామాన్యమా పాతివ్రత్యప్రశంసయే యనందగియుండు

"ద్వితీయం కారణం యచ్చ బ్రవీషి వినయాన్వితే,
రామాదన్యస్య నార్హామి సంస్పర్శమితి జానకి. ८

ఏతత్తే దేవి సదృశం పత్న్యాస్తస్య మహాత్మనః,
కా హ్యన్యా త్వామృతే దేవి బ్రూయాద్వచనమీదృశం." ౫

అని మూలము. భర్తకంటె నితరపురుషునితనుసంస్పర్శము తగదను రెండవవాక్యమా శ్రీరామభద్రునిభార్యవగు నీకుఁ దగినదే యని పొగడుచున్నాఁడు. నీవు తప్ప నిట్టి మహావిపత్కాలమున రక్షించువాఁ డుండఁగా నేస్త్రీకూడఁ జెప్ప సాహసింపదను హనుమంతునిమాటలలో పురుషులలో శ్రీరాముఁడు, స్త్రీలలో నీవు ధర్మమును దప్పనివార లనుభావము వ్యంగ్యము. మీరిరువు రనన్యాదృశులని తాత్పర్యము.

"విపది ధైర్య మథాభ్యుదయే క్షమా సదసి వాక్పటుతా యుధి విక్రమః,
యశసి చాభిరతిర్వ్యసనం శ్రుతౌ ప్రకృతిసిద్ధమిదం హి మహాత్మనాం."౬౩
నీతిశతకము.

అని భర్తృహరి తెల్పినట్టు మహాత్ముల కిది నైజము. విపత్కాలమున భక్తియు సంపత్సమయమున గర్వము దుర్జనులకు నైజము. ఈన్యాయము రామాయణమునం గానఁబడును. అనేకనీతులు రామాయణమునుండి గ్రహింపఁబడియె నని యెఱుంగందగు.

"చేష్టితం యత్త్వయా దేవి భాషితం మమ చాగ్రతః. ౬
కారణై ర్బహుభిర్దేవి రామప్రియచికీర్షయా,"

అని మూలము. మహాకవి హనుమంతునినోట సత్యమును బలికించెను. మమ చాగ్రతః భాషితం=నాయెదుట నీవు రావణునితో మాటలాడుట యని వ్యాఖ్యాతలు వ్రాసిరి ఇది సత్యమా యని యడుగుదురేని కాదనవలయుఁ గదా. హనుమ

యున్నట్లు లా మె యెఱుంగదు. ఇపుడు గోవిందరాజులు "భాషితం రావణాం తృణీకృత్య షణితం" అని వ్రాసినదాని నెట్లు సమర్థింతురు ? సర్వజ్ఞురాలని యొప్పక తప్పదు. తల్లీ ! నీచేత నెట్లెట్లు వింతచర్యలు చూపఁబడినవో నేనున్నట్లెఱింగి యెట్లు రావణునకుఁ దప్ప నితరుల కందలిభావము తేటపడు నట్లు పల్కితివో యవన్నియుఁ జూచితిని. వింటిని. తెలిసినది. అనఁగా నీనటనము నెఱింగితినని భావము. ఈవిషయమును మహాకవి హనుమనోటఁ జెప్పించెను

"అభిజ్ఞానం ప్రయచ్ఛ త్వం జానీయాద్రాఘవో హి తత్." ౧౦.

అని మూలము. రానొల్లవైతివి గాన నామాట శ్రీరాముఁడు నమ్ముట కొక యానవా లిమ్మని ప్రశ్నించెను. అనునది సామా న్యార్థము. "అభిజ్ఞానమ్" అనఁగా తెలివి నని భావము. ఏజ్ఞాన ముండుటం జేసి నన్ను దృఢభక్తిభరితునిగా శ్రీరాముఁ డెఱుంగునో యని భావసారము. అనఁగా

"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే."

అను నీ గీతావాక్యమునఁ గలయర్థమే యిందుఁ గలదు. నా మాయ త్రిగుణస్వరూపిణి. మీఱరానిది. నన్నెవ్వరు సేవింతురో వా రద్దానినుండి విముక్తు లగుదురు. అనఁగా నెట్లు ? మాయావృతుఁడు పరమాత్మ. మాయ యనఁగా మహా ప్రకృతి ఆమెకరుణకుఁ బాత్రుఁడు కాక భగవంతు నొందు టెట్లు ? ప్రకృత్యుపాసనాఫలము భగవద్దర్శనము నిరాలంబు నుపాసించు టెట్లు ? అవయవిగా నతనిఁ జేయునది ప్రకృతి.

ఆస్థితియందే యుపాసింపఁ దగును. అనఁగాఁ బ్రకృతిమయుని బూజించి యద్దానివలనఁ గలిగిసజ్ఞానమున భగవంతు నెఱుంగ వలయు ననుభావ మియ్యది సూచించును. అట్టి యభిజ్ఞానము నా కొసంగుమని హనుమంతునిచే మహాకవి పలికించెను. అనఁగా

"క్వణత్కాంచీదామా కరికలభకుంభస్తననతా
పరిక్షీణా మధ్యే పరిణతశరచ్చంద్రవదనా,
ధనుర్బాణాన్ పాశం సృణిమపి దధానా కరతలైః
పురస్తాదాస్తాం నః పురమథితురాహోపురుషికా."

అని శ్రీశంకరభగవత్పాదులు చెప్పినట్లు సమయమతము ననుసరించి బాహ్యపూజజోలికిం బోవక షట్చక్రములయందాయారూపముల దేవి నారాధించుచు దానింగూడ వదలి సదా ధ్యానించుచుండుటయే యీ ప్రకృత్యుపాసనయనియు దానికి ఫలము భగవత్తత్త్వ మెఱుంగుటయే కాన నాస్థితి యందు,

"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః."

అన్నట్లు సర్వవస్తువులను భగవంతునిగాఁ గాంచుటయే మహాఫలమని సారము. ఇట్లుండఁగా మాయ తుచ్ఛమనియు దానినుపాసింపరాదనియు వాగుటకంటె నజ్ఞానము వేఱుగ నేమున్నది? అట్టి స్వచ్ఛమగుజ్ఞానమును బ్రసాదింపుమా యని హనుమంతునివంటి భక్తుఁడు కోరక మఱెద్దానిం గోరును ?

"విహృత్య సలిలక్లిన్నా తవాంకే సముపావిశం. ౧౪

తతో మాంససమాయుక్తో వాయసః పర్యతుండయత్,
తమహం లోష్టముద్యమ్య వారయామి స్మ వాయసమ్." ౧౫

అని మూలము. హనుమంతుఁడు శ్రీరాముఁడు తనయుంగరము నిచ్చినట్లే నీవేదియైన నొకగుఱుతు నిచ్చిన దానిని శ్రీరామున కొసంగి సంతుష్టుం జేయుదునని సీతాదేవి నడిగెను. దానికి బదులుగా ఆమె యీకథ చెప్పుచున్నది. తెల్లవాఱుజామది. రక్కసులు మేలుకొన్న నవకాశము గలుగునన్న భయ మిరువురకుఁ గలదు. అట్టియెడ సీత యీవృత్తాంతముం జెప్పుట యసంగతప్రసంగమని తోఁపకమానదు. మహాకవి వాల్మీకి యంత తెలివితక్కువవాఁడా యనియు నించుక యాలోచింప వలసినదే. సమయానుసారము కవి యించుక విస్తారముగఁ దోఁచిన నది పాఠకులకుఁ గ్రొత్తవిషయములను దెలుపుటకై యైన నత్తఱిఁ జొప్పింపఁ దగియుండును. ఈ యితిహాసము వలన ననేక రహస్యవిషయములు తెలియఁగలవు. కావున నసంగతమని తలంపక యిద్దానినుండి నేర్చుకొనఁ దగుధర్మము లేవి యని విచారింపవలయును.

ఒక్కతఱిఁ జిత్రకూటమున నివసించుకాలమందే సీతారాము లోకపవిత్ర మనోహరారణ్యభాగమున మందాకినికిఁ జెంత విహరించిరి. అలసి సీత చెమటగాత్రమునిండ గ్రమ్మ సొమ్మసిల్లి శ్రీరామునంకభాగమ్మున శయనించెను. మాంసార్థి యగువాయస మొకఁడామెవక్షోభాగముఁ జీల్చెను. అను నది కథ. ఈవిషయము సామాన్యముగాఁ బరపురుషులకుఁ జెప్పఁదగినదియే కాదు. అట్లుండఁగా మహాకవి సీతనోట

హనుమ వినునట్లు చెప్పించెను గదా. ఏదే నొకమహార్థము తేలకపోదు. ఇంక సీత చెప్పినట్లే వ్రాసెదను.

> "నను హనుమంతముద్దిశ్యాభిజ్ఞానం వక్తుముపక్రాంతా దేవీ రామం సంబోధ్య కిమర్థం కథయతీతి చేత్, సత్యం మహ్యామభిజ్ఞానం వక్తుముపక్రాంతా త్వామేవాభిముఖీకృత్య ఏవముత్తరం ప్రాదాదితి హనుమతా రామాయ వాచయితుమితి న దోషః."

అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి. సామాన్యదృష్టిగలవారి కిట్టి సమాధానము సరిపోవు ననవచ్చు. ఈకథామూలమున సీతాదేవి తెలుపఁదగినవిషయము లివి కావనియు నవి రహస్యవిషయములనియుఁ బాఠకు లెఱుంగఁగలరు. ఇందుఁ గర్మసిద్ధాంతము విరివిగాఁ జెప్పఁబడినది. ఆవిధము ముందు వ్రాయఁదగి యుండు.

సీత శ్రీరామునితొడపై శయనించియుండఁగా కాకి వచ్చి నిర్భయముగా వక్షముం బొడుచునా ? సీత మృత్తికాఖండములఁ గొని దానిం గొట్టఁబోవ శ్రీరాముఁడు చూచుచుండునా ? తనచెంతను కాకి వచ్చి భార్యవక్షమును బొడుచుచుండఁగాఁ జూచుచుండఁగా రాముఁ డద్దానిం దోలక నవ్వుచు నూరక యుండఁగలఁడా యనుసందియము లుదయింపక మానవు. దీనిం జదివినప్పు డిది యడవిమానవులకొఱకు వ్రాయఁబడిన కథగాని ప్రపంచజ్ఞాన మిసుమంత కలిగియున్న వారలకొఱకుఁ గాదనియుఁ దోఁచును. ఇట్టిదానిని సర్వజ్ఞుఁ డగువాల్మీకి యేమిరహస్య మిందున్నదని యెల్లరు నానందాబ్ధి

నోలలాడుదురని చెర్చెను? అని యించుక యాలోచింపవల
యును. అంతియకాని విన్నంతమాత్రముననే చప్పరింపఁగాదు.

శ్రీరామావతారము తనమూలమున నేవారు పరి
శుద్ధులు కావలయునో ఏవారు సుఖమొందవలయునో
ఏవారు మృతినొంది స్వర్గసుఖముల నొందవలయునో వారికిఁ
గర్మానుసారముగా నాకాలమున నాఫలములఁ గల్పింపఁగల్గె
నని తెలుత మన మెఱుంగవలయును. అరణ్యమునఁ బెద్దపులి
యున్నదన్నమాట వినఁబడఁగా నెల్లరు భయపడుదురు.
దానఁ బోవఁదగినచోట్లకుఁ బోకయుండరు. ఏభాగమున
నుండునో యని కొందఱు, మనము పోవునపు డది నిద్రపోఁ
గూడదా యని కొందఱు, దానిచేతనే మృతిగల్గ బ్రహ్మ వ్రాసి
యే యున్న నెందున్నను దప్పించుకొందుమా యని కొంద
ఱును, నలువురము పోవుచుండ నది భయపడి పోవకుండునా
యని కొందఱు నూహించి నిలుపక యాత్రోవనే ప్రయాణము
చేయుదురు. ఒంటరిగాఁ బోవువాని జోలి మాని నలువురు
పోవుచుండ నడుమ నెవనినో యెత్తుకొనిపోవును. లేక
యెవ్వరిజోలికి రాకుండనుండును. ఒక్కనినే యది చంపనేల ?
అనరాదు. తన్మూలమున నెవ్వని కేసమయమున నేచోట మృతి
కలుగవలయునని కర్మము తలంచునో ఆచోట నాకార్యము
సాగును. కొన్నియేండ్లక్రిందట కడపమండలమునఁ గల బద్వే
లను నుపమండలమునందు కోడూరునకు చెంత మిరప
కాయలతోఁటలో మధ్యాహ్నకాలమున నెచ్చటనుండియో
యొక బెబ్బులి వచ్చి దాఁగియుండెను. అం దాముదపుఁజెట్లుండి
నవి. ఎండబడలిక కది యందుండెను. ఆ తొలిదినమే నీరు పాఱి

యున్నందునఁ జల్లఁగా నుండెను. సమీపమున మూఁడుక్రోసులలోఁ బశ్చిమభాగమున శేషాచలమనఁబడు నల్లమల కలదు. ఈభాగమునకు నాకొండకునడుమ ననేకగ్రామము లున్నవి. ఆ తోఁటకుఁ బడమరగా నొకకొండ కలదుగాని యందు గడ్డియు దొరకదు. శిలాసమూహమే. అట్టితావున కదియెట్లు వచ్చెనను శంక కలుగక మానదు. ఆసమయమున నొక పెండ్లికుమారుఁడు దేహబాధానివారణార్థము పోయి దానికంచెదగ్గర నాయామునపుఁ జెట్లనీడయందుఁ గూరుచుండెను. అంతలో నాపులి చెంగున నెగిరి గొంతు కొఱికి రక్తము త్రావి పరువెత్తెను. దగ్గరగా నెందఱో యుండిరి. కొంద అది పోవుమార్గమున నే యుండి పడిపోయిరి. వారి నేమనక యది పరువెత్తిపోయెను. ఆతనికంఠమును గొఱికినంతన నాలుగుబిందెలరక్తము పాఱదు కద. ఈకథ యసత్యమనువారలకు జ్ఞానమే లేదని తలంపవలసినదే యని కొందఱు తలంపవచ్చును. జరిగినదే యిది. ఇపుడు మన మేమి యూహింపవలయును? ఆనూత్నవరున కారూపమున మృత్యువు కల్గునని వ్రాయఁబడియెను. కావుననే మృత్యు వా రూపమునఁ దోఁచెను. పెద్దపులి రాఁదగినచోటది యేనాఁటికిం గాదు. ఎదురుగా వచ్చినవా రద్దానిం గని భయంపడి క్రిందఁబడి పొరలాడవలసినంతపాపము చేసినవారే కాన వారి నేమనకపోయెను. పిదప నది యెవ్వారికిం గానరాలేదు. ఏలయన నది పెద్దపులియే కాదు ఆతనిం జంపవచ్చినకాలమే యారూపమునఁ గనఁబడియెను. వేఱుగాదు. ఆవధువు విధవ యప్పుడే కావలసినదుష్కర్మము చేసియుండెను. ఆమె దుఃఖములో భాగముం గొనవలసినవా రా పెండ్లికిం బోయియుండిరి. ఎవరెవ్వ

రెంతయెంత భాగముం గొనఁదగునో యంతంత భాగముం గొని తమతమ నెలవుల కరిగిరి.

"ఐశ్వర్యే వా సువిస్తీర్ణే వ్యసనే వా సుదారుణే,
రజ్జ్వేవ పురుషం బధ్వా కృతాంతః పరికర్షతి." 3 స. 32

అని సీతాదేవి చెప్పియే యుండెఁ గదా. దానికిదియే ప్రత్యక్షోదాహరణము. మృత్యుదేవత యదృశ్యపాశములం దగిలించి ప్రాణికోటిని ఫలానుభవము గల్గుచోటికి కీడ్చుకొని పోవును దాని నెఱుంగఁజాలక యా ప్రాణిసముదాయము దానెందులకో పోవుచున్న ట్లెంచును. ఇదికదా కర్మసిద్ధాంతము.

"య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతం,
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే. ౧౮ అ. ౨
ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః,
అహంకారవిమూఢాత్మా కర్తాహమితి మన్యతే." ౨౭ అ. 3

అను నీగీతావాక్యములయర్థ మాలోచింపఁగా సారము పైదియే యని తోఁపక మానదు. కావునఁ గాకము సీతోపస్థలముఁ జీల్పఁ బ్రయత్నించెను. బ్రహ్మాస్త్రప్రయోగమున కది సుసమయము గామి శ్రీరాముఁ డఖిలజ్ఞుఁ డౌట నూరకుండెననియు సీతాప్రయత్నములు ఫలింపకపోఁగాఁ దుదకు దాని దురుద్దేశమును గాంచి కోపమున శ్రీరాముఁడు బ్రహ్మాస్త్రమును బ్రయోగించెననియు దానిచే నది స్వకీయపాపఫలము ననుభవించెననియు మన మెఱుంగవలయును. కర్మఫలానుభవకాలము సమీపింపనిదే యేప్రయత్నము కూడ ఫలింపదని యీకథ నీతిని బోధించెడిని. ఇఁక నాయాయిపట్టులు పరిశీలింపఁ గడంగుదము.

"త్వయాపహాసితా చాహం క్రుద్ధా సంలజ్జితా తదా,
భక్షగృధ్నేన కాకేన దారితా త్వా ముపాగతా. ౧౮
ఆసీనస్య చ తే శ్రాంతా పునరుత్సంగ మావిశం,
క్రుద్ధ్యంతీ చ ప్రహృష్టేన త్వయాహం పరిసాంత్వితా." ౧౯

అని మూలము. ప్రాతీతికార్థము సుగమము. రామచంద్రా! కాకమును దోలఁజాలక పోతివి కదా యని నీవు నన్నుఁ బరిహసించితివి. కోపము నాకుఁ బొడసూపెను. అపుడు లజ్జించితిని. అనఁగా భావ మేమి? ఈస్వల్పకార్యము చేయఁజాలక పోతివి కదా యని రాముఁడు పరిహాసించెను. దాన స్వభావమునుబట్టి కోపము గంటిని. కాని యంతలోఁ దత్త్వము గోచరింప లజ్జించితిని. భగవత్సాన్నిధ్యబలమున భగవతి సర్వకార్యములు చేయఁజాలు. సీత కాకమును బ్రహరింపఁగా నది పాఱిపోవ దయ్యెను. అది చూచి రామచంద్రుఁడు పరిహాసించెను. ఏమి యిట్లు తత్కార్యమారయక తోలుచున్నదానవనియే శ్రీరాముని నవ్వునకుఁ గారణము. స్త్రీస్వభావము ననుసరించి కోపము సీతకుఁ గల్గెను. అంతలో నామె తత్త్వ మెద్ది యని యాలోచించెను. మానవ స్త్రీస్వభావ మింత యల్పమా యని లజ్జించెను. అనఁగా దాని కెవరిచే నవమానము కలుగవలయునో అట్లే కలుగవలయును గాని వేఱువిధమునఁ గలుగరాదనునూహ కలిగెనని సారము. కర్మఫలములు ఎవరిమూలమున రావలయునో యట్లే రావలయుననియు నితరుల ప్రయత్నములు ఫలింపవనియు నిందుఁగల నీతిసారము. కర్మసిద్ధాంతమును మార్పఁగలవారలయ్యు వా రట్లు మార్పఁబూనరు. స్వోక్తివ్యాఘాతము పనికిరాదు కదా.

"తతస్సుప్తప్రబుద్ధాం మాం రామస్యాంకాత్సముత్థితాం. ౨౨
వాయసస్సహసాగమ్య విదదార స్తనాంతరే,
పునఃపునరథోత్పత్య విదదార స మాం భృశం. ౨౩
తతస్సముత్థితో రామో ముక్తైశ్శోణితబిందుభిః,
వాయసేన తతస్తేన బలవత్క్లిశ్యమానయా. ౨౪
స మయా బోధితశ్శ్రీమాన్ సుఖసుప్తః పరంతపః,"

అని మూలము. రాముఁడు నిదురనుండి లేచిన సీతయంకమున శయనింప మరల నావాయస మరుదెంచి వక్షోమధ్యభాగమును జీల్పఁగా రక్తబిందువులు రామునిపై రాలినవి. విధిలేక రాముని లేపవలసి వచ్చెను. అనునది కథాసారము. పలుమారులు తోలఁబడిన నావాయసము దుష్కర్మప్రేరితమై మరల వచ్చి యెదనడుమ చీల్చెను. అనఁగా మేలుకొనియుండు మానవులఁ జీల్చుట కాకమునకు నైజము కాకున్నను బుద్ధుఁడు చెంతనున్నంగూడ నది కినుకమెయిఁ బైకొని వజ్రతుండమున హృదయవిదారణము గావించె ననునది కర్మ మెంత బలవత్తమమో తెలియఁజేయుచున్నది. "ప్రాయస్సమాపన్న విపత్తికాలే ధియోఽపి పుంసాం మలినా భవంతి" అన్నసూక్తి కిది యుదాహరణమే యగును గదా. మానవప్రయత్నము కర్మాధీనమే యనియు బుద్ధివైభవము నిమిత్తమాత్రమే యనియు దైవము బలవత్తరమనియు మన మీభాగమునుండి యెఱుంగందగు.

"స మాం దృష్ట్వా మహాబాహుర్వితున్నాం స్తనయోస్తదా. ౨౫
ఆశీవిష ఇవ క్రుద్ధశ్శ్వసన్ వాక్యమభాషత,
కేన తే నాగనాసోరు విక్షతం వై స్తనాంతరం. ౨౬

కః క్రీడతి సరోషేణ పంచవక్త్రేణ భోగినా,
వీక్షమాణస్తతస్తం వై వాయసం సముదైక్షత. ౨౭
నఖైస్సరుధిరైస్తీక్ష్ణైర్మామేవాభిముఖం స్థితం."

అని మూలము. కరుణాశరధి యగు దాశరథి నాపక్షోమధ్య భాగమును గాంచి సర్పమువలెఁ గోపముగలిగి బుసకొట్టుచు నిట్లు పలికెను. ఈభాగమందలి విశేష మేమి?

ఐదుతలలపాముతో నెవ్వఁ డాడుకొనుచున్నాఁడు. అనఁగా మరణకాలమునఁ గొందఱకుఁ బంచభోగములు గల సర్పముగా మృత్యువు తోఁచును. వారికి శీఘ్రమరణము తప్ప దనియు దుర్మరణము సంభవించుననియుఁ బెద్దలు చెప్పుదురు. కోపముగల త్రాచుఁబాముతో నాడుకొనఁ జూచుట యనఁగా మరణమును గోరుట యని తాత్పర్యము. నిన్నెవఁడు శ్రమ పెట్టి చావనున్నాఁడని ప్రశ్నము. నీకు శ్రమ మొదవింపఁ జాలకున్నను బ్రయత్నమునైనఁ జేసినవాఁడు బ్రదుకఁడని భావసారము. పంచవక్త్రములసర్ప మున్నదా యని యొకరు నాకు వ్రాసిరి. "యతో విచిత్రా బత వస్తు శక్తయః" అని భాస్కరాచార్యులు వ్రాసిరి. మానవులు చూచిన వస్తువుల కంటెఁ జూడని వనేకము లున్నవని నూతనపరిశోధకులే తెల్పుచున్నారు. హిమాలయమున నత్యున్నతశిఖరమును బరి శీలింపఁ బోవఁగా నందుఁ బెక్కుడంగులు గలయుడతలు గనం బడియెననియు వానిలోఁ గొన్నింటికి ఱెక్కలు గలవనియు నవి పక్షులంబోలి యెగురుచుండుననియు వ్రాసిరి. పూర్వము గుఱ్ఱములకు ఱెక్కలుండినట్లు పురాణములలోఁ గనఁబడఁగాఁ గొందఱు చప్పరించిరి. ఉడుతలకుఁ బక్షము లున్నవని

వ్రాయఁగా నోరు మూసిరి. ఏమి చేయవచ్చును? పురాణములఁ గలకథలన్నియు సత్యములని తోఁచుచున్నవి. పాపము! ఇపు డామహాత్ములు నోరుకదలింప వలనుపడదు. గండభేరుండములు ఏనుఁగులఁ దన్నుకొనిపోవునను పురాణకథ నాలకించి పండ్లిగిలించిన పండితు లిపుడు ఎనుబదియాఱడుగుల పాద భాగము గల పక్షియున్నట్లును దానిపాదభాగము దొరకినదని వ్రాయఁగా ముక్కుమీఁద వ్రేలుంచుకొనవలసినవారైరి. అగ్ని నాహారించుపక్షిని గన్నులారఁ జూడఁగల్గితిమి. రెండుతలలపామును గన్నులారఁ గాంచుచున్నాము. వలసిన తఱి మనుష్యునిగను, ఇతరకాలమునందుఁ బశువుగా నొనరించియుండఁ గన్నులారఁ గాంచితిననియు నతఁడు నాబంధువనియు విక్టర్ డేక్ అనువారు వ్రాయఁగా మరల హిమాలయమునకు నీసంవత్సరము వత్తుననియు వ్రాయఁగాఁ జదువు భాగ్యము గలవార మైతిమి. ఈవార్తయే పురాణములు తెల్పిన పక్కున నవ్వియుండక వదలుదురా? ఇపుడేమియు ననఁజాలక యుండవలసినవారై రనవచ్చును. ఇట్లే కొంతకాలమునకై దుతలలపాము లున్నవని యెవరేనొక యాంగ్లపండితుఁడు వ్రాయునే నపుడు రామాయణమునఁ గూడఁ గలదనియు వాల్మీకికాలమున నట్టి వెల్లతావులనుండి యుండుననియుఁ జెప్పుదు రనుకొందును. లోకమున లేనివస్తువునకు నామకరణము చేయువాఁ డుండఁడు. మనము లేవన్నవన్నియు లేనివి గావు అది మన తెలివిలేమినే బోధించును. ఉండి యవాంతరకాలమున నశించియుండు ననుకొన్నయెడల నిట్టియూహాలు పుట్టనోపవు. సృష్టి యమేయము. మఱియు దుర్జ్ఞేయము. అతేం

క్రియజ్ఞానము కలవార లవ్వాని నెఱుంగం జాలుదురు. మన కట్టి జ్ఞాననేత్రము లేనపు డూరకుండుట మంచిది గాని సర్వ జ్ఞుల యాక్షేపించుట మంచిది గాదు. శాపానుగ్రహశక్తి లేనివారల కవి యున్నట్లు బోధించుగాథ లసత్యములుగాఁ దోఁచు. ప్రాచీనాచారపరాయణతాశూన్యులఁగా స్త్రీల నొన రింపఁ గంకణము కట్టుకొన్న పురుషాభాసులకు సూక్తులు దురుక్తులుగాఁ దోఁపకమానవు. కొంతకాలమునకు వారలకే భగవంతుఁడు జ్ఞాననేత్రమును సంపాదించునాసక్తి గలుగఁ జేయుననియు నత్తఱి వారే యపరాధస్తోత్రముం బఠించి మన వంటిపామరులకు మార్గదర్శకులు కాఁగలరనియు నాకెంతయో విశ్వాసము కలదు. ఇపుడు వారికి బదులు చెప్పఁబూనుట కంటె ముందు మీరే యెఱుంగుదురు గాక యని మంచి మాటలు చెప్పు టుచితమని తలంచుచున్నాఁడను.

హనుమంతునితో జానకి శ్రీరాముఁ డీకథ సాగుచున్న కాలమునఁ దన్నుం జూచి కాకకృతవ్రణమున కాగ్రహిం చియు "నాగనాసోరు" ఏనుఁగుతొండమువంటి యూరువులు కలదానా యని సంబోధించినట్లు చెప్పెనని రామాయణమునఁ గలదు. ఆ శ్లోకమం దుదాహరింపఁబడియున్నదియే. ఈమాట భర్త తనతో నేకాంతమున నన్నను గ్రొత్తవాఁడగు హనుమం తునకుఁ దెలుపవలసినంత యవసర మేమి వచ్చినది? ఈమాట వలనఁ దనకు వచ్చు లాభ మేమి? అని యాక్షేపించువారు గలరు. వాసుదాసుగారు రామాయణమునఁ గల రహస్య ములఁ దెలుపరాదనియు నట్లు తెలిపినఁ గావ్యత్వమునకే హాని గల్గుననియు వ్రాసిరి. వాల్మీకి యీమాట సీతనోటఁ

బల్కించెను గదా. ఔచిత్యభంగమును గావించినవాఁడే యగును గదా. అని సమాధానము వ్రాసితిని. మరల నిచ్చో నించుక వ్రాయకతప్పదని తోఁచినది. హనుమంతునితో శ్లోక రూపమున మాటలాడియుండదు. వారిసంభాషణముల సార మును మహాకవి కావ్యరూపమునఁ దెలిపెను. నన్ను "నాగ నాసోరు" అని నా భర్త పిలిచెనని జానకి తెల్పియుండదు. ఈ విశేషణము ఔచిత్యభంగకరము కాదా యందురేమో కాదు. భక్తులకు నిట్టిహానియందుఁ గల లోపములు తోఁపవు. వారి దృష్టి సమతం గాంచియుండు. మాతృసౌందర్యము కొడుకున కుద్దీపకముగా నుండనట్లు మహాత్ములు నేత్రశ్రోత్రములు పరమ పావనములు గాన నిట్టివానిం జూడవు, వినవు. భక్తిశూన్యు లకే యివియన్నియుఁ దోఁచుచుండునని మనమెఱింగిన నేబా ధలు నుండవు. స్తనోరుప్రముఖశబ్దములు శ్రవణమాత్రమున మనస్సును బాడుచేయునని యూహించువారల దుస్థితికి విచారింపవలసియే యుండును.

"పుత్రః కిల స శక్రస్య వాయసః పతతాం వరః. ౨౨
ధరాంతరగతశ్శీఘ్రం పవనస్య గతౌ సమః,
తత స్తస్మిన్ మహాబాహుః కోపసంవర్తితేక్షణః. ౨౫
వాయసే కృతవాన్ క్రూరాం మతిం మతిమతాం వరః,"

అని మూలము. సీతవక్షముం జీల్చిన కాక మింద్రునికుమా రుఁడు కదా. "ఇంద్రపుత్రత్వేన ప్రసిద్ధో జయంత ఏవ వాయస రూపేణాగత ఇత్యాహుః; వాయసరూపోఽన్యః పుత్ర ఇత్యా ప్యాహుః." అని గోవిందరాజులు వ్రాసిరి. పురాణములయం దీవిషయ మింతదనుక నాకుం గానరాలేదు. దొరకినఁ

జాతము. జయంతుఁడు కాక మఱొకకుమారుఁ డింద్రున
కున్నయట్లు వినఁబడుట లేదు.

"అనపత్యానథామర్త్యాన్ బహుభార్యాం చ మేదినీం,
అకరోదంబికాకోపః పుత్త్రాలాభసముద్భవః.

అన్నసూక్తి ననుసరించి దేవతలకు పార్వతీశాపకారణమున
సంతానము లేదని తోఁచెడిని. ఈశాపమునకంటె మున్నే
కలిగియున్న నుండవచ్చును. శాపకారణమున జయంతుఁడే
యీ వాయసరూపమున వచ్చెనన్నది యుక్తముగాఁ దోఁప
కున్నది. ఏమనఁగా నారూపమున నపకారము గావించి శాప
మోక్ష మా రామునినుండి పొందుమా యని యుండునే నట్లు
కాలేదు కాన సరిగాలేదు. నేత్రదానమున నస్త్రము పరిహ
రింపఁబడినది. జయంతునకు శాపముక్తి యెచ్చట నున్నదో
యందురేని భగవంతునిచే శిక్ష విధింపఁబడుట యనఁగా నా
పాపనిర్ముక్తి యగుటయే అని గ్రహింపంజనుఁ గాని వేఱు విధ
ముగా గ్రహింపరాదు. ఇఁక నెట్లిది సుసంగతమగుననఁగా. దేవ
యోనులలో గరుడులు గలరు. వారు పక్షిరూపమున నుండు
వారు. వినతకు పక్షిద్వయము కద్రువకు సర్పములు పుట్టినపుడు
పక్షిజాతికాంత కామరూపిణి యగు శక్తిగలది కావున
నింద్రుని గామించి యతనిదయవలన నీ వాయసమును బడసి
యుండుననవచ్చును. ఇంద్రసంతానము కావున నది గర్వమున
విఱ్ఱవీఁగి ప్రాగ్దుష్కర్మము ప్రేరేపఁగా సీతాదేవి కపకారము
చేయఁబూని తత్కారణమున శ్రీరామునాగ్రహమునకుం
బాత్రమయ్యెనన్న నొకయుక్తముగా నుండును. అట్టి సృష్టి
యుండరాదను వాదము దుర్వాదమే కాని మంచి వాదము

కానేరదు. జాతకశాస్త్రమున వియోనిజన్మాధ్యాయమును జూడవచ్చును. పాపఫలముగా నెన్నియో జన్మములు రావచ్చును. అట్లు రాదగదనునది కేవలము హఠవాదము. నాస్తికుల యాదృతి కది పాత్రము కావచ్చును. ఆస్తికులద్దాని నంగీకరింపక తప్పిపోవ వలనుపడదు.

అతివేగమున నతఁడు సీతను బొడువ రాఁగాఁ గాంచి శ్రీరాముఁడు కోపమున నరుణనేత్రుఁడయ్యెను. దాని వధింపఁ బూనెను. అనఁగా విశేషక్రోధము గలవాఁడయ్యెనని భావము. ఇంతకుముందది వక్షమును జీల్పఁగా నామె దానిం దోలుటయు నది మరల రాఁగా నామె కోపవతి యగుడు శ్రీరాముఁడు పరిహసించుటయు జరిగెను గదా. దానికి శిక్ష విధించు సమయ మదికాదని భగవంతుఁ డెఱుంగును. కాన దానివలన నెంతబాధ సీత యనుభవింపవలయునో అంతయుఁ గానిచ్చి అది పాపఫల మనుభవించుకాలము రాఁగా నిర్భరక్రోధవివశుఁ డయ్యెనని మన మూహింపఁదగును. ఇది యనుభవసిద్ధము. ఒక్కవాక్యమే యెన్నిసారులో విందుము. దానివలన నాగ్రహము రాకుండును. ఒక్కసమయమున నా వాక్యము విన్న యంతనే యొడలెఱుంగని కోపము పొడసూపును. ఏల? ఒకరితోఁ గలహించు కాలము కానియపుడది బాధాకరముగాఁ దోఁపకుండును. ఆకాలము రాఁగా నామాటయే మహాపరాధముగాఁ దోఁచును. కావునఁ గర్మఫలము ననుభవింపఁదగు కాలముననే దానికిం దగునట్లు కార్యములు సాగునని మనము ముఖ్యముగా యెఱుంగఁదగును. శ్రీరామునకుఁ గ్రూరమతి

గలిగెననఁగా దానికి శిక్ష యనుభవించుకాల మాసన్నమయ్యె
నని భావము

“స దర్భం సంస్తరాద్గృహ్య బ్రాహ్మేణాస్త్రేణ యోజయత్. 30
స దీప్త ఇవ కాలాగ్నిర్జజ్వాలాభిముఖో ద్విజం,
స తం ప్రదీప్తం చిక్షేప దర్భం తం వాయసం ప్రతి. 31
తతస్తం వాయసం దర్భస్సోంబరేఽనుజగామ హ.

అని మూలము. దర్భపోఁచను గూరుచున్న యాస్తరణము
నుండి లాగి దానియందు బ్రహ్మాస్త్రమంత్రము నభిమంత్రిం
చెను. ఆశక్తి దానిం బ్రవేశింపఁగా నది మండెను. సంకల్పము
చేయవలయుఁ గాన నీయస్త్ర మావాయసము నడంచుం
గాక యని ప్రయోగించెను. అది మండుచుఁ గాకమును
సమీపించెను. అది భయంపడి పాఱసాగెను. అస్త్రము దాని
వెనుకొనియెను.

ఇం దొక్క విశేషము కలదు. మంత్ర మొకఁడైనను
దంత్రము వేఱుగా నుండును. ఉపాసనకు మంత్రము వేఱు.
అస్త్రవిద్యకు మంత్రము వేఱు. అస్త్రమంత్రమునందు బీజ
ములు తదనురూపముగాఁ జేర్పఁబడియుండును. కార్యము
ననుసరించి యవి మాఱుచుండును. క్షత్రియవృత్తి స్వీకరించిన
విప్రులు కూడ నొకబాణమును జేయించి దానినే యామంత్ర
మున నభిమంత్రించుచుఁ బూజింతురు. ఆశక్తి దానియందు
మూర్తీభవించును. తఱచుగా నాయుధములు మారణప్రయో
గార్హములే యనవలయు. ఉపాసనయందును షట్ప్రయోగ
ములు గలవు అది సంకల్పమాత్రమున నదృశ్యరూపమునఁ

బోయి వైరినడంచుటయో యితరవిధములకుఁ బాత్రునిగా నొనరించుటయో చేయునని రహస్యము తొలుదొలుత నుపాసకుఁడు శాంతిప్రయోగము ననుసరించి షట్ప్రయోగమునకు వలయుబీజములఁ జేర్పక మంత్రము నుపాసించును. మంత్రసిద్ధి కాఁగా నవసరమని తోఁచినపు డాకార్యముననుసరించి బీజము నామంత్రమున సంపుటీకరణము గావించి యిష్టము నముకస్థానమునఁ జేర్చి తదుచితసంకల్పము నొనరించి యుపాసించును. తత్ఫల మాతఁ డాసమయమున నొందఁదగునని కర్మసిద్ధాంత మంగీకరించిననే యాసంకల్పము నెఱవేఱును. లేనిచో నడుమ నంతరాయములు గలిగి యది నెఱవేఱదు.

తంత్రోక్తగాథ నిం దుదహరించుచున్నాఁడను. శివుఁ డఖిల మంత్రరహస్యముల మునులకుఁ దెలిపెను. వా రుపాసించి సిద్ధిం బడసిరి. గురువుం జూడ రాఁగా నందుఁ గొందఱు పరిపక్వజీవులుగా నుండుటెఱింగి శంకరుఁ డామునులం జూచి మంత్రసిద్ధిని గాంచితిరా యని ప్రశ్నించెను. పొందితిమని బదులిడిరి. ఆకర్షణ విద్వేషముల రెండింటి నొకసారి ప్రయోగమునం జూపుఁడని యీశ్వరుఁడు ప్రశ్నించెను. నాఁడు శుక్రవారము గావున నుమాదేవి యభ్యంగస్నానము చేయుచుండెను. గణపతికుమారులు శివునిచెంత నుండిరి పార్వతిపై నాకర్షణప్రయోగము ఈసోదరులపై విద్వేషప్రయోగము నేకకాలమునఁ జేయుఁడీ చూచి యానందింతునని శంకరుఁ డానతిచ్చెను. సిద్ధులు గాన నొకమంత్రముననే ప్రయోగద్వయమునకు వలయుబీజములఁ జేర్చి సంకల్పించి యాదేవతఁ బ్రయోగించిరి. ఆ యుత్తరక్షణమున దూరమందున్న కుమార

స్వామి సోదరుఁడగు గణపతిం జేరి తుండమునఁ దనతర్జనిం జొనిపెను. దురద గలుగఁగా నతఁడు సోదరుఁడు తన్నవమానించె నను కోపమునఁ దుండ మెత్తి మొత్తెను. నేను బరిహాసమున కుఁ జేసిన కార్యమును దప్పుగా భావించి నన్నుఁ గొట్టెదవా యని కుమారస్వామి నాలుగుదెబ్బలు కానుకగా నిచ్చెను. కదియఁబడి యిరువురు పోరాడ సాగిరి. శివుఁడు నవ్వుచుం జూచుచుండెను. కొడుకు లిరువురు పోరుచు రక్తసిక్తాంగు లైరని స్త్రీలు చెప్పఁగాఁ దనయునికి నెఱుంగక స్నానము చేయు నప్పటి స్త్రీలయాచారమును బాటించుచున్న పార్వతీదేవి తండ్రి యూరకుండ నేల ? కొడుకులు తన్నుకొనుట యేమి ? ఇదేమి యన్యాయమని తలంచి పరువెత్తుచు వచ్చెను. శివుఁడు పక్కున నవ్వెను. ఆమెయు దాని నెఱింగి తటాలున లోనికిం బోయి ధౌతవస్త్రములఁ దాల్చి వచ్చెను. జ్ఞానదృష్టి నంతయు నెఱింగెను. ఈప్రయోగములు ఫలింపకయుండుఁ గాక యని శపించెను. మును లార్తులై యంబను బ్రార్థించి శివునాజ్ఞం దెలిపి వేఁడుకొనిరి. మహాసంకటములఁ బ్రతికార్యము చేయుతఱి నుపయోగించుననియు శాంతిప్రయోగము తప్పఁ దక్కినవి పరాపకారమునకుఁ బనికి రావనియుఁ గట్టడ చేసెను. శంకరుఁ డిదియే లోకోపకార్యమని నీచేత నీవిషయము చెప్పింపఁ బూని నేనే యిట్లు చేయించితి ననెను. మును లాయంత రార్థము నెఱింగి సంతోషించి సెలవు గైకొని పోయిరి. ఇది యస్త్రవిద్యావిషయము కాదని యెఱుంగవలయును. కొన్ని మంత్రము లుపదేశమాత్రముననే సిద్ధించునవి కలవు. అవి శూద్రులకుగా శంకరుఁ డాదేశించినవి. శాబరము లనఁబడు

నవి. మహామంత్రము లెన్నిగలవో అన్నివిధము లగుభేదము లందును గలవు. ప్రయోగవిషయమున వానికిని విధులు గలవు. జపహోమతర్పణ మార్జన బ్రాహ్మణభోజనము లనఁ బడు పంచాంగములు వాని కక్కఱలేదని శంకరునాజ్ఞ. పరాప కారమందు విధు లెక్కువగ నుండుటయు ధర్మమే కదా.

"ఆత్మానం హంతుమారబ్ధం బ్రాహ్మణం క్షత్రియం విశం,
గాం వా తురంగమన్యం వా హత్వా దోషైర్న లిప్యతే."

అన్నట్లు గత్యంతరాభావమందు స్వనాశనమున కంగీకరించుట మహామునిధర్మము కావచ్చుఁ గాని గృహస్థధర్మము గామిం జేసి యాప్రయోగమున వైరి నడంపవలయుననియే ప్రయోగ విద్యారహస్యము. కావున భగవంతుఁడగు రాముఁడు బ్రహ్మాస్త్ర మంత్రమును దర్భశకలమున సంయోగము గలుగఁజేసి దాని శిక్షింప వైచెననియు శ్రీరామునాశయము దానిం జంపుమని కాదనియు మన మెఱుంగవలయును.

"అనుసృష్టస్తదా కాకో జగామ వివిధాం గతిం. 32
లోకకామ ఇమం లోకం సర్వం వై విచచార హ,
స పిత్రా చ పరిత్యక్తస్సురైశ్చ సమహర్షిభిః. 33
త్రీఁల్లోకాన్ సంపరిక్రమ్య తమేవ శరణం గతః,"

అని మూలము. వాయస మాభీకరాస్త్రము గాంచి పాఱఁగా నదియు శ్రీరామునిసంకల్పానుసారము వెంటనంటఁగా రక్షించువారు గలరా యని వెదకుచుఁ బోయి తిరిగి యింద్రా దులు మాసుండి యీాపని కాదనఁగా మునులు నట్లే తెల్పఁగాఁ దుదకు శ్రీరామునే శరణుచొచ్చెనని కథాసంగ్రహము. ఇంతదనుక నాయస్త్రము చంపక వదలెనా యనుప్రశ్నము.

రాఁగలదు. ప్రయోగించువారిసంకల్పము ననుసరించియే యుండును. కాన బాధింపుమని మాత్రమే శ్రీరామునిసంకల్పమని యూహింపం దగు. ఆకాకము తొలుతనే శ్రీరాముని శరణుచొరక తిరుగనేలయని యడుగువా రుండవచ్చు. అల్పమతులకుఁ బట్టుదల చివరవఱకు నుండును. ప్రాణాంతము కావచ్చునని తోఁచినపుడు మధురమునకన్న మధురము ప్రాణము గాన నపుడే యాబుద్ధి పొడమును. ఇది లోకమున నెందఱకో యనుభవమునఁ గలదు. కావున గత్యంతరము లేనితఱి శత్రువునైనఁ బ్రార్థించి ప్రాణములు నిలుపుకొనఁ గోరెననియు నంతదనుక శ్రమములు పాలుగాఁదగిన కర్మఫలము శేషించి నందున నది తిరిగెననియు నా దుష్కర్మఫలము తీఱఁగా బుద్ధి గలిగి భగవంతునిగా భావించి శరణుచొచ్చెననియు నిందుఁ గలసారము.

"స తం నిపతితం భూమౌ శరణ్యశ్శరణాగతం. 38

వధార్హమపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్,

న శర్మ లబ్ధ్వా లోకేషు తమేవ శరణం గతః." 39

అని మూలము. శరణ్యుఁ డనఁగా

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,

తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్."

అన్న భగవంతుఁడు, "శరణాగతమ్" అనఁగాఁ దొలుత నజ్ఞానాంధతమస్సున దృష్టిపాటవము పోఁగా రక్షకాంతరమును వెదకి తిరిగి వేసరి తుదకు సర్వలోకశరణ్యుఁడు శ్రీరాముఁడే యని యెఱింగి వచ్చినవానినని భావము. "భూమౌ నిపతితమ్" ఇఁక నాశరీరము భూమిం గలియును. దయచేఁ గాపాడు

మా యీదీనునని నమస్కరించినవానినని తాత్పర్యము. "వధార్హమపి" అంతఃపురద్రోహికి వధదండమే తగిన దను స్మృతివాక్యము ననుసరించి చంపఁదగినవాఁడే యైననని భావ సారము. కాకుత్థ్సః కకుత్థ్సరాజవంశసంభూతుఁడు. అనఁగా నెద్దుమూఁపుపైఁ గూరుచుండి యుద్ధముచేయువాఁ డనునది సామాన్య మగునర్థము. "వృషో హి భగవాన్ ధర్మః." అన్న స్మృతివాక్యము ననుసరించి ధర్మము నొక్కదానినే యాశ్ర యించి సహాయాంతరమును గోరక యుద్ధముచేయువాఁడని విశేషార్థము. ఆకులమున జనించినవాఁ డనఁగా ధర్మమునే యాధారముగాఁ జేసికొని స్వపక్షపరపక్షవిభేదమును బాటిం పక శిక్షించుట రక్షించుట యనుకార్యముల నొనరించువాఁ డని సాభిప్రాయవిశేషణము. "వధార్హమపి శరణాగతం భూమౌ నిపతితం తం శరణ్యస్సః కృపయా పర్యపాలయత్." అని యన్వయక్రమము. వధింపఁదగినంత యపరాధ మొనరిం చినను బాదములపైఁబడి శరణు వేఁడినవానిని శరణ్యుఁ డగు రామమూర్తి దయచేఁ గాపాడెనని భావము. శరణాగతరక్ష ణము శ్రీరామునిసద్గుణములలో నొకటి. దీనిసార మేమనఁగా. ఎన్నిపాపము లొనరించినను దుదకు సేవ్యుఁడు తానని నమ్మి యెవరు సమాశ్రయింతురో వారిని భగవంతుఁడు పూర్వాప రాధములు పాటింపక కాపాడుననునదియే. కర్మసిద్ధాంతము మాట యేమని యడుగుదురు కాఁబోలు. కర్మఫలము లనుభ వించినఁగాని యాజ్ఞానము కలుగదు. ఆ యనుభవఫలమే యాజ్ఞానము. పూర్వసత్కర్మఫల మాదుష్కర్మానుభవము చివరభాగమునఁ బొడసూపును అపుడు సేవ్యుఁ డొక్కభగ

వంతుఁడే యన్న జ్ఞాన ముదయించును. జ్ఞానోదయము గదా సత్కర్మైకఫలము అది కలుగఁగా శిష్టకర్మములు ఫలింపక క్రమముగా నశించును.

"యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున,
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా. 37
న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే,
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి. 38
శ్రద్ధావా౯ లభతే జ్ఞానం తత్పరస్సంయతేంద్రియః,
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతిమచిరేణాధిగచ్ఛతి." 39

గీత. 4 అ.

అను నీగీతావాక్యము లీయర్థమునే సూచించుచున్నవి. "సర్వకర్మాణి జ్ఞానాగ్నిర్భస్మసాత్కురుతే" అన్నదానింబట్టి సర్వకర్మములు జ్ఞానమున నశించునని సారము కానఁ గర్మసిద్ధాంతము నిలువదని యలసు లందురు. అది పొరపాటు. జ్ఞానము యోగసిద్ధికి ఫలము. యోగనిరతి సత్కర్మైకఫలము. నిరవధికఫలాభిసంధిరహితసత్కర్మానుష్ఠానమున మనోమలము తొలంగఁగా యోగాభ్యాసనిరతి యుదయింపదాన మనశ్చాంచల్యము లయింప శాంతిస్థానమగు జ్ఞానోదయము కలుగును. మూల మేది? అని యోజింపుఁడు. తెలియఁ దగును. సర్వాధారము కర్మసిద్ధాంతము. అది సర్వథా సర్వదా అనిర్భేద్యము కావున దానిని బాధించుసిద్ధాంత మపసిద్ధాంతమే యనఁదగు.

"పరిద్యూనం విషణ్ణం చ స తమాయాంతమబ్రవీత్,
మోఘం కర్తుం న శక్యం తు బ్రాహ్మమస్త్రం తదుచ్యతామ్. 36
హినస్తు దక్షిణాక్షి త్వచ్ఛర ఇత్యథ సోఽబ్రవీత్,"

గ్రహింపక భార్య నపహరించెనన్నకోపమున రాముఁడు రావణుం జంపెనని మనము తలంచుచో శ్రీరామునియందుఁ గల గొప్పతన మేమున్నది? కర్మములఫలముల నొసంగుచు రక్షించుటయే భగవన్నైజము కాని వేఱుగాదు కదా.

> ''సురాణామపి దుర్ధర్షౌ కిమర్థం మా ముపేక్షతః,
> మమైవ దుష్కృతం కించి న్మహదస్తి న సంశయః. ౪౮
> సమర్థావపి తౌ యన్మాం నావేక్షేతే పరంతపౌ,''

అని మూలము. సీత హనుమంతునకుఁ గర్మఫల మనుభవింపక తప్పించుకొన సాధ్యము కాదని స్పష్టపఱచుచున్నది. దేవాదులకుం గూడ నోడింప నలవిగాని శ్రీరామలక్ష్మణులు నన్నేల యుపేక్షించిరని తెలుపుచుఁ గర్మము బలవత్తర మనుచున్నది. హనుమంతా! ఇది వారియుపేక్ష కాదు. నా దుష్కర్మమే. ఇంతకుముం దనుభవించినది కొంచెము. అనుభవింపవలసినది మిక్కిలిగా నున్నది సందియమే లేదు. ఏలయనఁగా సమర్థులయ్యును బరంతపులయ్యు నేటికి నన్ను రక్షింపరాక యుపేక్షించిరో. దీనింబట్టి యూహింపఁగా నాదుష్కర్మమే మిక్కిలిగా ఫలమును గుడుపఁ దలంచుచున్నదని తోఁచెడి ననుచున్నది. విశేషకష్టము లనుభవించు యోగ మున్నపుడు సాయము చేయఁ దలంచువారు నుపేక్షింతురు. అల్పముగా నున్నపుడు తమయంతన తోడుపడ నరుదెంతురు. ఇది యనుభవముననే యెల్లరు కనుఁగొనవచ్చును. ఈవిషయమే సీతావాక్యలనుండి గ్రహింపవచ్చును. కర్మము బలీయమనుట కింకేమి యుదాహరణము కావలయును?

శ్రీః.

# శ్రీరామావతారతత్త్వము

## పదునొకండవ ప్రకరణము

ఇయ్యది

కళాప్రపూర్ణ కావ్యస్మృతితీర్థ:

జనమంచి శేషాద్రిశర్మ విరచితము.

చెన్నపురి:

శ్రీ 'రామ' ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1939

# భద్రవాక్యము.

మహానుభావులారా !

శ్రీరామావతారతత్త్వమునందుఁ బదునొకండవ ప్రకరణము తమసన్నిధి సనుచుభాగ్యము గల్గినది. యుద్ధకాండమునం దర్ధభాగ మీ ప్రకరణమునఁ గలదు. ఇంకొక ప్రకరణమున యుద్ధకాండము ముగియును. శ్రీరామపట్టాభిషేకము రాజ్యపాలనము సనువిషయములతో నీ కాండషట్కము ముగియును. పిదప నుత్తరకాండము వ్రాయవలసి యుండును. మహాశయులసాయము మఱింత కల్గినఁగాని దాని ముద్రింపఁజాలనేమో యనుసందియ ముదయించెడిని. ఇంతదనుక నెట్లో ప్రకటింపఁ గల్గితిని. సర్వేశ్వరునను గ్రహ ముండిన నదియుఁ బూర్తి కాకపోవునా యను నమ్మకము నుదయించుచున్నది. ఏది యెట్లున్నను భాషోద్ధారకులగు మ॥ రా॥ రా॥ శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారితోడ్పాడున నింతవఱకైనఁ బూర్తిచేయఁ గల్గితిని. వారిసాయ మపారము. నాకృతజ్ఞతకుం బాత్రులు శాస్త్రులుగారని మఱిమఱి వ్రాయ నేల? నాయభివృద్ధికి సర్వదా సర్వథా వారే ప్రధానులు. వారి నీశ్వరుఁడు

రక్షించుఁగాక. అచిరకాలముననే పండ్రెండవభాగమును బాఠకమహాశయులు చూడఁగలరని విశ్వసించుచున్నాఁడను. ఇందలి విశేషాంశములు పండితాఖండలులు విమర్శించి నాయాశయము సర్వమతసమ్మతమని యనుగ్రహింతురను నమ్మకము నాకున్నది. శ్రీరామాయణము వైష్ణవులకొఱకే యేర్పడినదనువాదము కాని విశిష్టాద్వైతమునే యది బోధించునని వచించుట పాపకార్య మనువారలలో నేఁ బ్రథముఁడను. భగవంతుఁ డెల్లర సమానముగాఁ గాంచును. భక్తి ధనముగల్గినవారిని బ్రేమించును. భక్తి సర్వమతములకు సమానము. కావున విశిష్టాద్వైతమునే బోధించుననుట రామాయణమునకే కళంకము. భగవచ్చరిత్ర మట్టికళంకపాత్రము కారాదు గదా. కావున సర్వమతశరణ్య మీరామాయణ మనవలయును. ఈవిషయము నందందు విమర్శించితిని. నాకుఁ దెలిసినంతవట్టు వ్రాసితిని. ప్రమాదములు క్షంతవ్యములు. ఇంతకన్నఁ బెంపొందించి వ్రాయఁదగినవిషయములు లేవు.

ఇట్లు ప్రార్థించు బుధజనవిధేయుఁడు,

జనమంచి శేషాద్రిశర్మ.

శ్రీ. శ్రీ. శ్రీ.

# విషయసూచిక.

విషయము.

•

శ్రీః

# శ్రీ రామావతారతత్త్వము

## యుద్ధకాండము.

## ఏకాదశ ప్రకరణము.

శ్లో. "హృదయకుహరమధ్యద్యోతితన్మంత్రసారం
నిగమనియమగమ్యం వేదశాస్త్రైరచింత్యం,
హరిహరవిధివంద్యం హంసమంత్రాంతరస్థం
దశరథసుతమీశే దైవతం దేవతానామ్.

దేవేంద్రనీలనవమేఘవినిర్జితాంగం
పూర్ణేందుబింబవదనం శరచాపహస్తమ్,
సీతాసమేతమనిశం శరణం శరణ్యం
చేతో మదీయ మభివాంఛతి రామచంద్రమ్.

కోదండదీక్షాగురు మాదిమూలం
గుణాశ్రయం చందనకుంకుమాంకమ్,
స లక్ష్మణం సర్వజనాంతరస్థం
పరాత్పరం రామమహం నమామి.

విలోలమణికుండలం విమలచంద్రబింబాననం
విఖండితదశాననం వితతచాపబాణోజ్జ్వలం

విమోహితజగత్త్రయం వికచపద్మపత్రేక్షణం
విభీషణం సురక్షకం విజయరామమీళే హరిమ్. ४

రామం రాక్షసమర్దనం రఘువరం దైతేయవిధ్వంసినం
సుగ్రీవేప్సితరాజ్యదం సురపతేర్భృత్యాంతకం శార్జ్గిణం,
భక్తానామభయప్రదం భయహరం పాపౌఘవిధ్వంసినం
స్వామిరిస్తుతపాదపద్మయుగళం సీతాసమేతం భజే." ೫

భగవత్పాదపద్మసేవాపరాయణులారా! మహాశయులారా!

శ్రీరామావతారతత్త్వమునందుఁ బదియవప్రకరణమును జదివి తత్సారామృతమును గ్రోలి యానందపరవశుల రైతి రని సంభావింతును. ఆప్రకరణమునఁ గల కథారహస్యముల నెమకి పరితృప్తి నొందియుందు రనుకొందును. హనుమచ్ఛీలము దానఁ దేటపడియే యుండును. ఆమహాత్ముఁడు భక్తజనాగ్రణి యనుభావము మీకు దృఢముగ నెలకొనియుండు. జానకి శ్రీరామచంద్రున కానవాలుగాఁ దనచూడామణి నొసంగుభాగముం జదువఁగా రత్నములశక్తి నెట్టిదో పూర్వులవ్వాని నెంతశ్రద్ధగా ధరించుచుండిరో తన్మహత్త్వము వారి కెంత చక్కఁగాఁ దెలిసియుండెనో మీకు గోచరించి యుండునని నావిశ్వాసము. సీతాదేవి మహాప్రకృతి యని యూహింపక యామె వెతలపాలయ్యెననియు హనుమ యాదేవి కెంతయో యుపకరించి కష్టములం దీర్చెననియుఁ బలుకు వార లెంతపామరులో తెలిసికొనియే యుందురు. జనకతనూజాత యేరీతి నటించి తన యనంతశక్తి నెవ్వార లెఱుంగకుండఁజేసి స్త్రీజనసామాన్యమునకుఁ బాతివ్రత్యమహత్త్వము

నెఱింగించెనో యించుక యోజించినఁ దేటపడఁ గలదు. శాప వశమున రాక్షసత్వము నొంది సకల వేదవేదాంగవేత్తయై యొప్పు రావణాసురునిఁ దూలనాడక తూలనాడినట్లు తేటపడఁ జేయుభాషణముల నాప్రకృతి పలికి తనభావ మాపరాత్పరుఁడు శ్రీరామచంద్రమూర్తి తప్ప నితరు లెఱుంగకయుండఁ జేసెనో సుంత విమర్శించిన మహానంద ముదయింపకపోవదని నా నమ్మకము. మహాముని వాల్మీకి యాయాఘట్టములయందట్టిభావము సూచించుపదముల నేల యుపయోగించెనో యించుక యోజింపవలసి యుండును. శాపాంత మెట్లుండ వలయునో యందుల కనురూపముగా వర్తించి యక్కార్యము నెఱవేర్చి తనభక్తునెట్లుద్ధరించెనో యని సీతాచరిత్రమును బఠించి మన మెఱుంగుటయే తెఱంగు. అట్లుగాక కేవల కథా పఠనమున నానందించినఁ గలుగులాభము కాలక్షేపరూపమే గాని వేఱొకటి కానేరదు. మతము లనువేరఁ బెద్ద లాకాలపువారి యోగ్యతల ననుసరించి కొన్నిధర్మముల నెఱిఁగించి తన్మూలమునఁ దరింపుఁడని తెలిపిరి కాని పరమతముల దూషింపుఁడనికాని తన్మతావలంబకులతో ద్వేషింపుఁ డనికాని బోధించినవా రొక్కరైన నిక్కము విచారింపఁ గానరారనక తప్పదు. దేశకాలానురూపముగ మతధర్మములు మార్పఁబడినవి. హిమాలయమున నుండువారలు జపము జేయునప్పటి కవచధారణాదులు మద్రపురప్రాంతవాసుల కేవగింపును గల్గించును. కాని వీరే యాత్రాపురులకుం బోయినప్పు డట్లే యాచరింతురు. అప్పటి తమవర్తనము దూష్యమని నిష్ఫలమని భావింతురా? భావించుచో నాయాత్ర నిరర్థకమే యగుంగదా.

ఆభావమున యాత్ర కరుగరు కదా. దీనింబట్టి శీతోష్ణాది భేదముల ననుసరించి యాచారములు మాఱుచుండుననియు భక్తిజ్ఞానవైరాగ్యములు మార్పునొందనివనియు నవి కుదిరిన నీబాహ్యాచారము లెట్లున్నను బాధ లేదనియుఁ దెలుగదా. కావునఁ బరమతముల దూషించుట యజ్ఞానమూలముననే కాని వేఱుగాదని సిద్ధాంత మేర్పడుచున్నది.

ఏమతమునఁగాని మధ్యభాగమునఁ జేరినవారలే త్ర[illegible]చుగాఁ బరమతముల దూషించువారు. మధ్యవైష్ణవులే విశేషించి శివుని దూషింతురు. తక్కినవారి కింతవెఱ్ఱి యెత్తదు. మతాంతరప్రవిష్టులా రెండుమతములకుం గాక రేవణావలెఁ జెడుదురు. మతస్వరూపము తెలిసియున్న వార లట్లు దూషింపఁ జాలరు. తెలియనివ్రాత్యులే తెగించి దూఱుచుందు రనవలసినదే. దానఁ బామరులు శిష్యులై ధనమిత్తురు. వారికి వలసిన దదియే కదా. కావున నట్టియజ్ఞులదూషణముల నాలకింపక వీటిఁబుచ్చి సాధువులబోధముల నాలకించి బాగుపడవలయు ననుటయే సమంజసము. కొంద ఱిన్నిమతము లేలయుందురు. వారికంటె వింతమానవులు సృష్టినుండరని నే నూహింతును. అట్లనువారికిఁ గర్మసిద్ధాంతమే తెలియదు. స్వప్రౌఢిమఁ గార్యములు సాధింతుమని వారితలంపు. అట్టివారినే యజ్ఞులని పూర్వులు తెలిపిరి. వారిని విజ్ఞులనుగా నొసర్పఁ బూనరాదా యని కొంద ఱందురు. అది కారానిపని. శక్యమే కాదని యీక్రిందిసూక్తిం జదివిన గ్రహింపఁ గలుగుదురు.

"శక్యో వారయితుం జలేన హుతభుక్ఛత్త్రేణ సూర్యాతపో
నాగేంద్రో నిశితాంకుశేన సమదో దండేన గోగర్దభౌ,

వ్యాధి ర్భేషజసంగ్రహైశ్చ వివిధై ర్మంత్రప్రయోగై ర్విషం
సర్వ స్యౌషధ మస్తి శాస్త్రవిహితం మూర్ఖస్య నాస్త్యౌషధమ్." ౧౧

భర్తృహరి. నీతిశతకము.

మూర్ఖసంగతియు ననిష్టదాయకమే యని యీనీతి తెల్పెడిని.

"వరం పర్వతదుర్గేషు భ్రాంతం వనచరై స్సహ,
న మూర్ఖజనసంపర్కః స్సురేంద్రభవనే ష్వపి." ౧౪

భర్తృ. నీతిశతకము.

మనకంటెఁ బామరులను బాగుచేయవలదా యనుప్రశ్నము న్యాయమేకాని యది మూర్ఖులవిషయమున సమన్వయము కాదు. అజ్ఞులను బోధించుట మూర్ఖులను ద్యజించుట సాధుసమ్మతసిద్ధాంతము.

ఎంతటివాఁడు నైజమును మార్చుకోనఁజాలఁడని యొక సూక్తి కలదు. హనుమంతుఁ డింతభక్తుఁడైనను వనభంగమును జానకియానతిలేక యొనరించె ననుఘట్టము మనకుఁ దేటపఱచును. భగవతి జానకి యెంత బోధించి పంపినను దానిని మఱచి నైజగుణమును జూపఁబూనెను గదా.

"యద్ధాత్రా నిజఫాలపట్టలిఖితం స్తోకం మహద్వా ధనం
తత్ప్రాప్నోతి మరుస్థలేఽపి నితరాం మేరౌ తతో నాధికం,
తద్ధీరో భవ విత్తవత్సు కృపణాం వృత్తిం వృథా మా కృథాః
కూపే పశ్య పయోనిధా వపి ఘటో గృహ్ణాతి తుల్యం ధనం." ౪౯

భర్తృ. నీతి.

అను నీసూక్తి కర్మసిద్ధాంతతత్త్వమునే తెలుపుచున్నది. హనుమచే మృతినొందవలసినవారి కదియదను. కనుక నతఁ

డాకార్యమునకుం గడంగెననునది యొక సమాధానము. హనుమన్నైజము కూడ దాన స్పష్టము గాకపోలేదు. పావని బ్రహ్మాస్త్రముచేఁ గట్టుపడుటయు దానికిఁ గారణములు నను వానిని విమర్శింతుమేని యెట్టివారికింగూడ నిరంకుశత్వము లేదనియు నొకటి మనకన్న మిన్నగలదనియే నిశ్చయించుకొని ప్రవర్తింపవలయుననియుఁ దేటపడును. దీనిచే స్వాతంత్ర్య మెవ్వారికి లేదనియుఁ గలదనుకొనుట భ్రాంతివలననే కాని యితరకారణమునఁ గాదనియు స్పష్టము కాకమానదు. కర్మ గతులతత్త్వ మెఱుంగనివారే స్వాతంత్ర్యము కలదని వాదించువారని యెఱుంగందగు. చేసినకృషి తగినదయ్యును ఫలింపకయుండుటయు స్వల్పప్రయత్న మధికఫలము నొసంగు చుండుటయుఁ బరికింపఁగా మానవప్రయత్నమునకు దైవము తోడుపడినపుడే ఫలము గలుగుననియు నది యొదవనిచో నిష్ఫలమగుననియుఁ దోఁపకమానదు. అట్లు తోఁచినను బోధ్ధ్వస జన్మిదము దోఁపి వాదించువారు మూర్ఖులే కాక మఱెవ్వ రగుదురు! నాస్తికులు ఆస్తికాభాసులు గూడ స్వాతంత్ర్యము గలదనియే వాదింతురు. అట్టిమాన్యులతో వాదింపక నమస్క రించి తొలంగుట సాధువుల కుచితమగునని.

"ప్రోక్తం యైస్తు దశాదిలగ్నజఫలం తేభ్యోతిదృగ్భ్యో నమః."

అన్న కేశవదైవజ్ఞసూక్తి యీభావమునే స్పష్టపఱచుచున్నది.

పవమానసూనుఁడు రావణుని తేజోవిశేషములం గాంచి యచ్చెరువందెనని వాల్మీకిమహర్షి తెలిపెను.

"అహోరూపమహో ధైర్యమహో సత్త్వమహో ద్యుతిః,
అహో! రాక్షసరాజస్య సర్వలక్షణయుక్తతా." సు. స. ౪౯.

అని మూలమునఁ గలదు. ప్రత్యేకఫలము తేజస్సు. భగవ త్స్వరూపము. అది కలుగుట పుణ్యాత్ములకే కాక పాపాత్ము లకుఁ గాదుకదా. మహాక్రూరుఁడు పాపాత్ముఁడును రావణుఁ డగునేని హనుమంతునంతభక్తుఁడు మెచ్చుకొనఁదగినంత తేజోవిశేషము రావణునకు లభించియుండఁగా నాతఁడు పాపాత్ముఁ డెట్లగును? మహాక్రూరమతి యెట్టులగు? ఇట్టిఘట్టము లను విమర్శింపక వదలుట దానితత్త్వ మెఱుంగఁగోరక కథా మాత్రము చాలుననుకొనుటయే యని మన మూహింప వచ్చును గదా.

> "నాంతో ఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప,
> ఏషతూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా. ౪౦
> యద్యద్విభూతిమత్సర్వం శ్రీమదూర్జిత మేవ వా,
> త త్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంశసంభవమ్." ౪౧

అను నీ గీతోక్తభగవద్వాక్యములు తేజోవిశేషము గల వారలయందు నావ్యాప్తి యధికముగా నుండునని యెఱుంగ వలయునని భగవానుఁడు తెల్పెననియే కదా బోధించును. భగవదంశము విశేషించి లేనిచో నందుఁ దేజోవ్యాప్తి విశే షించియుండు టెట్లు? అదియుండునపు డతఁడు పాపాత్ముఁ డెట్టు లగును? కావున రావణుఁడు పరమేశ్వరభక్తుఁ డనియు శాప వశమునఁ దద్వంశమునఁ బుట్టినను రాక్షసస్వభావము లేక మెలఁగు మహాజ్ఞానియనియు మనమెఱింగిన రామాయణ తత్త్వ మెఱుంగఁగోరువార మగుదుము. లేనిచో వ్యర్థకాల క్షేపము చేసినవార మగుదుము.

లంకాదహనప్రకారమును బరిశీలించితిమేని నగర నిర్మాణచమత్కృతి తేటపడును. నలుప్రక్కల నారామములు నడుమ గేహావర్యములు గలిగియుండు నాపురవరము వాస్తు శాస్త్రము ననుసరించి కట్టఁబడినదనియుఁ గావుననే రోగ హీనులై యందలివారు దృఢగాత్రులై సమ్మోదసాగరమున నోలలాడుచుండిరని స్పష్టము గాకపోదు. గృహనిర్మాణము మొదలుకొని సకలవిషయములు పూర్వు లుదాహరణభూతు లుగా నున్నవా రనువిషయమును మనము మఱచిపోవ రాదు. వారియలవాట్లుల వదలి యిష్టానుసారము వర్తించుటం జేసియే యాయుఃపరిమాణ మిక్కాలమున నింత తగ్గినదని యూహింప వలసి యున్నది. నవనాగరికతయనునది యెన్ని యోముప్పులఁ దెచ్చిపెట్టుచున్నట్లు తెలిసికొనియు నింకను బ్రాచీనాచార ములఁ దూలనాడు టెంతటి యజ్ఞానమో యూహింపఁ దర ముగాకున్నది.

మధువనచరిత్రమును బఠించుతఱి నించుకశ్రద్ధ యుద్యాన సునిచితిమేని యుద్యానసంరక్షణమున నప్పటివారలెంత బద్ధా దరులో తేటపడకపోవునా? ఉద్యానపోషణమునఁ గలుగు లాభము లవ్వారలకుఁ దెలిసియే యుండును. దోహదక్రియ యవ్వారల కుగ్గుతోఁ బెట్టినవిద్య. భూరుహములు లతలు పొదలు లోనగువానిమూలమున దేశమున కెంత మహోప కారము కలదో వా రెఱుంగుదురు.

"అంతస్సంజ్ఞా భవం త్యేతే సుఖదుఃఖసమన్వితాః."

అని ప్రాచీనసూక్తి.

"ప్రాతచ్ఛాయావినిర్ముక్తా న మనోజ్ఞా జలాశయాః,

యస్మాదతో జలప్రాంతేష్వారామాన్ వినివేశయేత్. ౧
శుచిర్భూత్వా తరోః పూజాం కృత్వా స్నానానులేపనైః,
రోపయేద్రోపితశ్చైవ పత్రైస్తైరేవ జాయతే. ౨

... ... ... ... ...

కృత్వా ప్రభూతం సలిల మారామా న్వినివేశ్య చ,
దేవతాయతనం కుర్యాద్యశోధర్మాభివృద్ధయే. ౧
సలిలోద్యానయుక్తేషు కృతేష్వకృతకేషు చ,
స్థానేష్వేతేషు సాన్నిధ్య ముపగచ్ఛంతి దేవతాః." 3

బృహత్సంహిత.

"ఘనానామపి వృక్షాణామాకాశోఽస్తి న సంశయః,
తేషాం పుష్పఫలవ్యక్తి ర్నిత్యం సముపపద్యతే.
ఉష్మతో మ్లాయతే పర్ణం త్వక్ఫలం పుష్పమేవ చ,
మ్లాయతే శీర్యతే చాపి స్పర్శ స్తేనాత్ర విద్యతే.

... ... ... ... ...

వక్త్రే ణోత్పలనాళేన యథోర్ధ్వం జలమాదదేత్,
తథా పవనసంయుక్తః పాదైః పిబతి పాదపః.
సుఖదుఃఖయోశ్చ గ్రహణాచ్ఛిన్నస్య చ విరోహణాత్,
జీవం పశ్యామి వృక్షాణా మచైతన్యం న విద్యతే,
తేన తజ్జలమాదత్తం జరయ త్యగ్నిమారుతౌ,
ఆహారపరిణామాచ్చ స్నేహో వృద్ధిశ్చ జాయతే."

మహాభారతము, శాంతిపర్వము.

"బహుభి ర్బత! కిం జాతైః పుత్రై ర్ధర్మార్థవర్జితైః
వరమేకః పథి తరు ర్యత్ర విశ్రమతే జనః,

దశకూపసమావాపీ దశవాపీసమో హ్రదః
దశహ్రదసమః పుత్త్రో దశపుత్త్రసమో ద్రుమః.
క్రీడారామం తు యః కుర్యా ద్ద్రామఫలసంయుతః,
స గచ్ఛే చ్ఛంకరపురం వసే త్తత్ర యుగే యుగే.

## గృహాశ్రమతరు శుభాశుభలక్షణములు.

గృహస్య పూర్వదిగ్భాగే న్యగ్రోధస్సర్వకామదః,
ఔదుంబరస్తథా యామ్యే వారుణ్యాం పిప్పలశ్శుభః.
ప్లక్ష శ్చోత్తరతో ధన్యః విపరీతస్తు వర్జయేత్,
వర్జయే త్పూర్వతోఽశ్వత్థం ప్లక్షం దక్షిణతో గృహాత్.
న్యగ్రోధః పశ్చిమే వర్జ్య స్తథోదుంబర ముత్తరే,
దేవదానవగంధర్వాః కిన్నరోరగరాక్షసాః,
పశుపక్షిమనుష్యాశ్చ సంశ్రయంతి సదా తరూన్,
సర్వేషాం వృక్షజాతీనాం ఛాయా వర్జ్యా గృహే సదా,
అపి సౌవర్ణికం వృక్షం గృహద్వారే న రోపయేత్.
బదరీ కదళీ చైవ దాడిమా బీజపూరకం,
యస్య గేహే ప్రరోహంతి తద్గృహీ న ప్రరోహతి.
పలాశాః కాంచనారాశ్చ తథా శ్లేష్మాతకార్జునాః,
కరంజః పంచమావృక్షాః నారోప్యాస్సుఖినో గృహే.

## వృక్షరక్షణము.

నీహారాచ్చండవాతాచ్చ ధూమాద్వైశ్వానరాదపి,
బాలపాదా త్ప్రయత్నేన రక్షణీయా క్షమారుహాః.

(బాలపాదము = బొత్తు. హంస

పంక్తిమధ్యే సుపుష్పేషు ఫలబాహ్యే తతోపరే,
వృక్షాః కార్యాయుతావృత్యా సా చాపి పరిఘావృతా.

విద్యుద్దాహతవృక్షస్య భూతిమాదాయ సర్వతః,
రక్షార్థం వికిరే దేషాం తయా న హిమబాధనమ్,
దీప్తో ప్యగ్ని శ్శమం యాతి వజ్రదగ్ధద్రుభస్మసా
సితశాల్యోదనం దధ్నా సైంధవేన యుతం వసే
క్షేపణీయం చ పరితో గరాణాం వృష్టివారణం.”

అను నీ ప్రమాణములను దిలకించిన వృక్షాయుర్వేదమునఁ బూర్వులకుఁ గల యభిమానము తేటపడును. ఆరామాదులను స్థాపించుట వృక్షములకుఁ గష్టములు రాకయుండఁగాఁ బాడుటలో నగుకార్యములయందు మనవారలకుఁ గలప్రీతి యపారమనియు, వానిమూలమున లోకమునకుం గలయుపకారము వా రెఱింగినంత యిప్పటివా రెఱుంగరనియుఁ దేటపడకమానదు. వృక్షలతాదుల తత్త్వమును జక్కఁగా వా రెఱుంగుటంబట్టియే వానికి బాధకల్గింపఁగూడదని తెలిపిరి. పచ్చిచెట్లను ఛేదించిన పాపమనియు వ్రాసిరి.

“ఇంధనార్థం ద్రుమచ్ఛేదః స్త్రీహింసౌషధజీవనమ్.”

యాజ్ఞవల్క్యస్మృతి.

“ఇంధనార్థ మశుష్కాణాం ద్రుమాణా మవపాతనం.”

మనుస్మృతి.

స్వల్పపాపమని మాత్రమే కాక యుపపాతకములలో నొకదానినిగాఁ బరిగణించిరి. వృక్షరక్షణ ముపవనాదుల నిర్మించుట మహోత్తమకార్యములుగా భావించుట యనునవి పూర్వకాలపు టాచారములు.

“ఫలదానాం తు వృక్షాణాం ఛేదనే జప్యమృక్ఛతమ్,
గుల్మవల్లీలతానాం చ పుష్పితానాం చ వీరుధామ్.”

అని మనుస్మృతి ఫలవృక్షాదుల ఛేదించినచోఁ బ్రాయశ్చిత్తము చెప్పఁబడినది కదా? దీనింబట్టి వారి కీవిషయమునఁ గలకరుణ స్పష్టము కాకపోవునా? పుష్పఫలములు లేనివానిం బెంచుట యిప్పటియాచారము. కాని పుష్పధారణాదులయందుఁ బూర్వాచారమే యనుసరింపఁ బడుచున్నది. లతామహత్త్వమునుగుఱించి యచ్చటచ్చట వ్రాసితిని. కాన నిచట విస్తరింపఁబూనక వదలితిని.

పవనతనయునిభక్తి దృఢతమ మైనది. అది జలోపరి భాగమువలె సమానమైనది. శివవిష్ణ్వాదిభేదమును బాటించునట్టి యల్పభక్తి కాదు. కనుకనే ప్రకృతిపురుషుల కరుణకుం బాత్రుఁడు కాఁజాలెను.

"ఆత్మమాయాం సమావిశ్య సోఽహం గుణమయీం ద్విజ,
సృజన్ రక్షన్ హరన్ విశ్వం దధ్రే సంజ్ఞాం క్రియోచితాం.౫౦
తస్మిన్ బ్రహ్మ ణ్యద్వితీయే కేవలే పరమాత్మని,
బ్రహ్మరుద్రౌ చ భూతాని భేదే నాజ్ఞోఽనుపశ్యతి. ౫౧

... ... ... ... ...

త్రయాణా మేకభావానాం యో న పశ్యతి వై భిదాం,
సర్వభూతాత్మనాం బ్రహ్మన్ స శాంతిమధిగచ్ఛతి." ౫౪

శ్రీభాగవతము ౪ స్కం. ౭ అధ్యా.

"భవానర్ధశరీరం మే త్వహం తవ తథైవ చ. ౨౩
వామపార్శ్వమహం మహ్యం శ్యామం శ్రీవత్సలక్షణం,
త్వం చ వామేతరం పార్శ్వం త్వహం వై నీలలోహితః. ౨౪

త్వం చ మే హృదయం విష్ణో తవ చాహం హృది స్థితః,
భవాన్ సర్వస్య కార్యస్య కర్తాహం మధిదైవతమ్." ౨౫.
వాయుపురాణము, ౨౫ అధ్యా.

"న తే మ య్యచ్యుతేఽజే చ భిదా మణ్వపి చక్షతే,
నాత్మనశ్చ పరస్యాపి తద్వ్యష్మాన్వయిమామహి." ౨౨.
శ్రీభాగ. ౧౨ స్కం. ౧౦ అధ్యా.

"పుత్రార్థ మారాధితవానహం మాత్మాన మాత్మనా,
నహి విష్ణుః ప్రణమితి కస్మైచిద్విబుధాయ చ. ౨౯
యత ఆత్మాన మేవేతి తతో రుద్రం భజామ్యహం."
మహాభారతము, శాంతిప. ౩౪౨ అధ్యా.

అను నీప్రమాణములు త్రిమూర్త్యభేదమే ప్రధానమని చాటుచున్నవి. మధ్యవైష్ణవులు శివుని నీచుఁడని పల్కుట యజ్ఞానమూలముననే యని తోఁపకపోవునా? వేషధారులు స్వర్ణాకర్షణభైరవు నారాధించుచు శిష్యులగు పామరులకు శివునికంటె హరి యుత్కృష్టుఁడని బోధించుచు శివునిచిహ్నము లగు భస్మప్రముఖములను దూషించుచు నవిగలవారు పాషండులని నిందించుచుఁ దిరుగుచుందురు. వారికంటె వే ఱొకరు పాషండు లనఁదగినవా రుండరని పైనవ్రాసిన శ్రీ భాగవతాది ప్రతిపాదితవాక్యములే సిద్ధాంతము చేయు చున్నవి. కావున సట్టివారి యపవిత్రవాక్యముల నాలించి భగవత్కృపకు దూరస్థులు గాక యిష్టదేవతను సర్వదేవతా స్వరూపుఁ డగుభగవంతునిగా భావించి సేవించి తత్సేవాఫల ముగాఁ దత్కరుణకుం బాత్రులయి తరింతురు గాక. ఇంత.

కంటెం జెంచి వ్రాయనొల్లక శ్రీరామాయణమునందలి తదు_
పాతి కథాభాగమును వ్రాయఁబూనెదను.

### లంకానగరమును జేర రాముఁడు లూహించుట.

* అంతట శ్రీరామచంద్రుఁడు సీతా కుశలప్రాప్తాంత
మును జూచినదంతయు దాఁపక హనుమంతుఁడు వినిపింపఁగా
నాలకించి ప్రియము చెలఁగ నా హనుమను గుఱించి సుగ్రీ
వునితో నిట్లు పలికెను. సూర్యపుత్త్రా! యీ మరుస్సునందసుం
డొనర్చిన కార్యము కడుగొప్పది. ఈలోకమున నిట్టిదానిం జేయ
నెవ్వరికి శక్యముకాదు. చేయఁగలమని తలంచుటయు శక్యము
కానిదే. వాయు వైనతేయులు చేరి సంద్రమును దాఁటుదురు.
ఈతఁ డొకఁడే దాఁటెను. వీరి ముప్పురకుఁ దప్ప నితరులకు
దాఁటఁగలసామర్థ్యము లేదు. దేవదానవాదులకు లంక
చూడనైన శక్యము కానిది. ఎదిరింపఁ దలంపను శక్యము
గానిదే. రావణసురక్షిత మగుదాని నెవ్వఁడైన నెట్లో చొచ్చి
నను బ్రాణములతో రాఁగలవాఁ డుండఁడు. హనుమంతుఁడో
తన యధికసత్త్వమునకుఁ దగురీతిగా నశోకవనభంగాదికార్య
మును బ్రభువగు నీ యాజ్ఞనొందకయే యాచరించి రాజాజ్ఞ
చొప్పునఁ జేయఁదగు సీతాదర్శనమునకంటె మిక్కిలియుగొప్ప పని
నొనరించియున్నాఁడు. లోకమున నేభృత్యుఁడు ప్రభువు నియ
మించినపని నొనరించి తదనుబంధముగా నియోగింపని కార్య
ముంగూడ నొనరించి ధన్యుఁడై వచ్చునో యతఁ డుత్తమ_

* యుద్ధకాండము తొలిసర్గమునఁ గలకథ.

భృత్యుఁ డగునందురు. ఉత్సాహవంతుఁడు సమర్థుఁడునగు స్వామి నియోగించిన పనిని మాత్రము చేసి దాని కనుకూల మగునదియుఁ దనరాజునకుఁ బ్రియమైనదియు నగుకార్యము నాజ్ఞ లేదని చేయకయుండునో వాఁడు మధ్యమభృత్యుఁడు. ఎవఁడు కార్యముతుది నవ్యగ్రుఁడుకాక శక్తిమంతుఁ డయ్యును రాజనియుక్తుఁడైనను దానిని సమగ్రముగా నొనరింపఁడో వాఁ డధమభృత్యుఁడని పెద్ద లందురు. ఈపావని యందుత్త మభృత్యలక్షణలక్షితుఁడు కావునఁ దనకు నుచితములగు నన్ని కార్యములు చక్కఁగా నెఱవేర్చినాఁడు. రక్కసులకు నోడనందున స్వలాఘవమును గలిగించుకొనలేదు. అంతియ గాక యెక్కువగాఁ గార్యమును సాధించి ప్రభువునకు సంతస మును గల్గించెను. ఈపావని సీతను జూచివచ్చుటంజేసి యస్మ దాదుల మాత్మహత్యయను నధర్మమునుండి తప్పించుకొం టిమి. ధర్మమున స్థిరముగా నిలువఁబడఁ గల్గితిమి. ప్రియతమ వార్తం దెలిపిన యీప్రియబంధువునకుఁ దగినట్లు ప్రియము చేయక యున్నానుగదా యను విషయము మాత్రము నన్ను వ్యాకులంపడఁ జేయుచున్నది. మాప్రాణముల సంరక్షించిన యీమహాత్మునకుఁ బ్రత్యుపకృతి నొనరింపఁదగు కాలమిప్పుడే వచ్చియున్నది. సర్వస్వ మొసంగినంగాని నా యనుతాపము చల్లారదు. నాయొసంగు నీ యాలింగనమే యీ సర్వస్వం బొసంగిన ట్లగుంగాక యని పలికి నంగవ్రాతము హర్షమున గగుర్పాటునొంద బిగ్గ హనుమం గౌఁగిలించుకొనియెను. శ్రీరాముఁ డంత క్షణ మూరకుండి యాలోచించి సుగ్రీవుఁడు వినుచుండఁగా సీకార్యము సమగ్రసిద్ధిం గాంచినది. కాని సము

ద్రలంఘనము శక్యము గానిదగుట దానిం దలంచుకొన్నంత మాత్రముననే సీతాకుశలవార్తాశ్రవణమున సంతుష్టమే యైయున్నను నామనస్సు మరల విషాదము నొందెడిని. సాగర దక్షిణతటము చేర రానిది. అది మిక్కిలి యగాధజలము గలది. కపులెల్ల నొక్కటిగాఁగూడి యపారాపారము నుత్తరించి దాని దక్కినపుగట్టు నెట్లు చేరఁగలరు? సీత కీవృత్తాంతము తెలుపఁబడియే యున్నది. కాని వీరెల్ల సాగరమును దాఁటుటకుఁ దగిన యత్న మిఁక మీఁదఁ జేయవలసియే యున్నది. అదెద్ది? తోఁపక యున్నదే? అని పలికి శోకవిషాదములు పెనఁగొన విచార సాగరనిమగ్నుఁ డయ్యెను.

మహాశయులారా! ఈభాగమునుండి తెలిసికొన విశేషముల నెఱుంగుదము. ఇందు శ్రీరాముఁడు మహోపకారియగు హనుమంతునెడఁ గృతజ్ఞతను జూపుట యనువిషయమే ముఖ్యమని తోఁచును. రాజగు సుగ్రీవునకుఁ దత్కృతకార్యములం దెలిపి యతనియెదుట వినుతించెను. దూతయనఁగా నెట్టివాఁడు? అతఁడు చేయఁదగునదెది? అనునది విచార్యము.

"దూతం చైవ ప్రకుర్వీత సర్వశాస్త్రవిశారదం,
ఇంగితాకారచేష్టజ్ఞం శుచిం దక్షం కులోద్భవమ్. ౬౩
అనురక్తశ్శుచి ర్దక్షస్స్మృతిమాన్ దేశకాలవిత్,
వపుష్మాన్ వీతభీర్వాగ్మీ దూతో రాజ్ఞః ప్రశస్యతే. ౬౪
అమాత్యేదండ ఆయత్తో దండే వైనయికీక్రియా,
నృపతౌ కోశరాష్ట్రే చ దూతే సంధివిపర్యయౌ. ౬౫
దూతఏవహి సంధత్తే భిన్నత్త్యేవచ సంహతాన్,
దూతస్తత్కురుతే కర్మ భిద్యంతే యేన మానవాః. ౬౬

స విద్యాదస్య కృత్యేషు నిగూఢేంగితచేష్టితైః,
ఆకారమింగితం చేష్టాం భృత్యేషు చ చికీర్షితం. ౬౭
బుధ్వా చ సర్వం తత్త్వేన పరరాజచికీర్షితం,
తథా ప్రయత్నమాతిష్ఠేద్యథాత్మానం న పీడయేత్." ౬౮

మనుస్మృతి. 7 అధ్యా.

"పశ్యేచ్చారాం స్తతో దూతాన్ ప్రేషయేన్మంత్రిసంగతః." 3౨౮

యాజ్ఞవల్క్యస్మృతి.

"తదనంతరం దూతాంశ్చ పశ్యేత్. దూతాశ్చయే ప్రకటమేవ రాజాంతరం ప్రతి గతాగతమాచరంతి. తే చ త్రివిధాః. నిసృష్టార్థాః. సందిష్టార్థాః. శాసనహరాశ్చేతి.తత్ర నిసృష్టార్థాః రాజకార్యాణి దేశకాలోచితాని స్వయమేవ కథయితుం క్షమాః. ఉక్తమాత్రం యే పరస్మై నివేదయంతి తే సందిష్టార్థాః. శాసనహరాస్తు రాజలేఖహారిణః. తాన్ పూర్వప్రేషితానాగతాన్ మంత్రిసంగతః పశ్యేత్. దృష్ట్వా తద్వార్తామాకలయ్య పునః పునః ప్రేషయేత్. యే పరరాజ్యే వృత్తాంతపరిజ్ఞానాయ పరివ్రాజకతాపసాదిరూపేణ గూఢచారిణః ప్రేషితాస్తాంశ్చారాన్ దృష్ట్వాక్వచిన్ని వేశయేత్."

అనిమితాక్షర.

ఇట్లు స్మృతులు చారదూతలక్షణములను దెలుపుచున్నవి. హనుమంతుఁడు చారుఁడా దూతయా యనువాద మిటఁ బనికిరాదు.

"దూతోఽహమితి విజ్ఞేయో రాఘవస్యామితౌజసః."

అని హనుమంతుఁడే చెప్పుకొనియెను. కావున దూతయే.

"కార్యే కర్మణి నిర్దిష్టే యో బహూన్యపి సాధయేత్,
పూర్వకార్యావిరోధేన స కార్యం కర్తుమర్హతి.

న హ్యేకస్సాధకో హేతుస్స్వల్పస్యాపీహ కర్మణః,
యో హ్యర్థం బహుధా వేద స సమర్థోఽర్థసాధనే.''

అని రామాయణమున దూత చేయఁదగినపనులు చెప్పఁబడినవి. స్మృతులకు దీనికి నభేదమే. ''నిసృష్టార్థాః.'' అన్న దూతలలో హనుమ చేరినవాఁడని యేర్పడుచున్నది.

''యోహి భృత్యో నియుక్తస్సన్ భర్త్రా కర్మణి దుష్కరే. 2
కుర్యాత్తదనురాగేణ తమాహుః పురుషోత్తమమ్,
నియుక్తో యః పరం కార్యం న కుర్యాన్నృపతేః ప్రియం. ౩
భృత్యో యుక్తస్సమర్థశ్చ తమాహుర్మధ్యమం నరం,
నియుక్తో నృపతేః కార్యం న కుర్యాద్యస్సమాహితః. ౯
భృత్యో యుక్తస్సమర్థశ్చ తమాహుః పురుషాధమం.''

అని మూలము. ఇందు స్మృతు లనువదించిన దూతలక్షణము లలో నుత్తమ మధ్యమాధమభేదములు చెప్పఁబడినవి. స్మృతులకును రామాయణ ప్రతిపాదితధర్మములకును భేదములేదని యేర్పడుచున్నది. హనుమంతుఁ డొనరించిన కృత్యములన్ని యుఁ బై నుదహరింపఁబడిన స్మృతుల ననుసరించి యాలోచిం పఁగా నర్థ్యములే యగునా యని విచారించి కొన్ని యన ర్థములని యధిక్షేపించువారు గలరు. కాని భగవత్కార్య నిర్వాహణమున ననర్థములు లేవనువారును గలరు. కర్మసిద్ధాం తము ననుసరించి యెవరెవ రాదినము తనచే మృతినొంద వలసినవారు గలరో వారిని జంపఁబూనక యతఁ డెట్లుండఁ గలఁడు? అట్టిస్వాతంత్ర్య మతనికే కాక మఱెవ్వరికైనఁ గలదా! దూతకృత్యము చక్కఁగా నెఱవేర్చిన పరమభక్త

శిఖామణి యని మన మెఱింగి యట్టి భక్తులమగుటకు యత్నింప వలయును. అట్టి పరాకాష్ఠ సత్కార్యముల నున్నఁగాని భగవత్కరుణకుఁ బాత్రుఁ డెవ్వాఁడును గాఁజాలఁడను విషయము మన కీఘట్టము బోధించుచున్నది.

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్."

అను భగవద్వాక్య మీ యర్థమునే కదా సూచించును. కనుక హనుమంతునకు రామేతరవస్తువు లోకమున ధ్యేయముగాఁ గనరానట్లు మన మారాధించుదేవతయే పరాత్పరుఁడని భావించిన భక్తుల మగుదుము. అట్లుగాక వానికంటె వీఁ డెక్కువ. వీనికంటె వాఁ డెక్కువ యనుకొనుచుండిన భక్తిబీజము లేని వారమే యగుదుము. భక్తునకు సర్వదేవతాసమానత్వము గలిగియుండవలయును. సర్వమతసహిష్ణుత యుండవలయును.

"తస్మిన్యోగే నియుక్తేన కృతం కృత్యం హనూమతా. ౧౦
న చాత్మా లఘుతాం నీతస్సుగ్రీవశ్చాపి తోషితః."

అని మూలము. హనుమయొనర్చిన యీ రెండుకార్యములను శ్రీరాముఁడు పొగడెను. తన కగౌరవమును గలిగించుకొనలేదు. రాజునకు సంతోషమును గల్గించెను. ఇవి రెండు దూతకుఁ బ్రధానములని శ్రీరామునాశయము. స్వావమానము దుష్కార్యము. ప్రభువున కవమానము కలుగునట్లు వర్తించుటయుఁ జేయరానిపని. ఈరెండును లేక హనుమ వర్తించినందున నుత్తమదూత యని మెచ్చుకొనియెను. ప్రభువున కెక్క వర్తించి స్వగౌరవము నార్జించుపురుషుఁ డుత్తముఁ డని యిందలి నీతి. స్వార్థపరత్వ మిద్దానిచే దూషింపఁబడినది.

"అహం చ రఘువంశశ్చ లక్ష్మణశ్చ మహాబలః. ౧౧
వైదేహ్యా దర్శనేనాద్య ధర్మతః పరిరక్షితాః."

అని మూలము. హనుమ వైదేహిం గాంచి వచ్చుటంజేసి రఘువంశము నేను లక్ష్మణుఁడు ధర్మమున నిలుపఁ గల్గితిని. అనఁగా నకృతార్థుఁడై హనుమ వచ్చియుండిన మే మిరు వురము మావెంటఁ దక్కినసోదరులు మృతినొందుదుము. అది మహాధర్మము. పాపవిశేషములలో మహాపాపము ఆత్మహత్య యని యెఱుంగవలయు. తన్నుఁ గాపాడుకొను మార్గాంత రము లేనిచో నితరుల వధింపవచ్చునని సూక్తి కనఁబడు చున్నది.

"ఆత్మానం హంతుమారబ్ధం బ్రాహ్మణం క్షత్త్రియం విశం,
గాం వా తురంగమన్యం వా హత్వా దోషైర్న లిప్యతే."

అన్న పురాణవాక్యము ననుసరించి యోజించిన నాత్మహత్య మహాపాపకర్మమనియు నాత్మరక్షణ ముత్తమకర్మమనియు నేర్పడుచున్నది. దీనిసార మేమి?

"జగత్సూతే ధాతా హరిరవతి రుద్రః క్షపయతే
తిరస్కుర్వన్నేతత్స్వమపి వపురీశస్తిరయతి,
సదా పూర్వస్సర్వం తదిదమనుగృహ్ణాతి చ శివ
స్తవాజ్ఞామాలంబ్య క్షణచలితయోర్భ్రూలతికయోః." ౨౪

అను నీశంకరభగవత్ప్రతిపాదిత సౌందర్యలహరీసూక్తి యిచట సమన్వయ మగుచున్నది. సీతను జూచి రాకయున్నఁ దాను మృతినందుదునని శ్రీరాముఁ డనియెను. ధీరోదాత్తనాయకుఁ డగు రామునినోటినుండి యిట్లు పలికించినందున గంభీరార్థ

మిం దిమిడియుండకపోదు. ప్రకృతిసాయము లేనిచోఁ దనకు రూపనామక్రియ లెక్కడివి? ప్రకృత్యదర్శనమునఁ దాను సంతర్ధాన మగుదునని యామూలమునఁ దన్నుఁ గొల్చువారు నశింతురని శ్రీరాముఁడు తెలిపెను. దీనిచే శ్రీరాముని సర్వ సాక్షిత్వము ప్రకృతిప్రియత్వము తేటపడియెడిని. ప్రకృతి నుపాసింపరాదను వాదమునకంటె నిర్మాల్యవాద మొక్కఁ డును లోకముల లేదని తెలిసికొనుట మంచిది.

"ఇదం తు మమ దీనస్య మనో భూయః ప్రకర్షతి.   ౧౨
యదిహాస్య ప్రియాఖ్యాతుర్న కుర్మి సదృశం ప్రియం."

అని మూలము. ఇట్టి మహోపకారికిఁ దగిన ప్రత్యుపకృతి నొన రింపలేక పోతిని గదా యని నామనస్సు వ్యాకులంపడుచున్న దని శ్రీరాముఁడు తెలిపెను. భగవంతుఁ డుపకరింపలేక పరిత పించెనని యిట సారము కాదు. దీనుఁ డెవ్వఁడనఁగాఁ దనకుప కార మొనర్చినవానికి శక్త్యనురూపముగఁ బరోపకారము చేయనివాఁడని యెఱుంగవలయు నను నదియే. ఏవిషయమునఁ బ్రతిచేయ వలనుగానిచోఁ బరితపింపవలసి యుండునుగాని తన గొప్పదనమును గాంచి యతఁ డప్పని నొనరించెనని తానూర కుండరాదు. అట్టి నీచమతియే దీనుఁడు. అని మనమెఱింగి యుపకర్తలకు నోపినంత ప్రత్యుపకారము చేయవలయు నను నీతి నీభాగమునుండి నేర్చుకొనవలయును.

"ఏష సర్వస్వభూతస్తు పరిష్వంగో హనూమతః.   ౧౩
మయా కాలమిమం ప్రాప్య దత్తస్తస్య మహాత్మనః,
ఇత్యుక్త్వా ప్రీతిహృష్టాంగో రామస్తం పరిషస్వజే.   ౧౪
హనూమంతం మహాత్మానం కృతకార్యముపాగతమ్."

అని మూలము. ఇదియే శ్రీరామానుగ్రహమని మన మెఱుంగ వలయును. కరుణాసన్వీస్వభూత మాలింగనము. సౌహార్ద రాశియే యాలింగనమని పెద్ద లందురు. భగవంతుఁ డాలింగన క్రియారూపమున హనుమంతు ననుగ్రహించెను. అనఁగా నాకరుణకుఁ బాత్రుఁడవై తివని తెలిపెననియే సారము. హస్త మస్తకసంయోగ ముపాసకులకు సిద్ధి. భక్తులకు భగవదను గ్రహ మాలింగనరూప మగుసిద్ధి. దీనిచే హనుమ జ్ఞాననిధి యయ్యెనని తేటపడియెడిని. ఈకాలమున నిది ప్రత్యుపకార మని శ్రీరాముఁడు తెలిపెను. సకలకష్టములు తొలంగి మహా తేజస్వివై నాకార్యమునకుం దోడ్పడి జయసిద్ధి నందుమా యని యిచ్చిన వరదానమని మన మూహింపవలయును. లోక మునం దుపకారికి బదులుచేయువా రరుదగుట వింతగాదు. అట్లు చేయఁగోరువారు కూడ నరుదనవలసి యున్నది. ఓహో! కలికాలమహత్త్వము? కృతఘ్నులకంటెఁ బాపాత్ములు, కృతజ్ఞులకంటె నుత్తములు లోకమున సామాన్యదృష్టిం బరిశీలింప లేరని మన మెఱుంగవలయునని యీఘట్టమున శ్రీరామ మూర్తి మనకు బోధించెనని తెలిసికొని యారీతి మెలంగ నభ్యసింపవలయును.

"ధ్యాత్వా పునరువాచేదం వచనం రఘునందనః. ౧౫

... ... ... ... ...

సర్వథా సుకృతం తావత్సీతాయాః పరిమార్గణం. ౧౬

సాగరం తు సమాసాద్య పునర్నష్టం మనో మమ,

... ... ... ... ...

యద్యప్యేష తు వృత్తాంతో వైదేహ్యా గదితో మమ. ౧౮

సముద్రపారగమనే హరీణాం కిమిహోత్తరమ్,
ఇత్యుక్త్వా శోకసంభ్రాంతో రామశ్శత్రునిబర్హణః. ౧౮
హనూమంతం మహాబాహుస్తతో ధ్యానముపాగతః."

అని మూలము. ఆలింగనము పావనికి హర్షదాయకమే. అంతతో నూరకయున్న నెట్లని ముహూర్తము ధ్యానించెను. సుగ్రీవాదులు వినుచుండ శ్రీరాముఁడు జరగిన హనుమత్ప్రయత్నమున కానందించుచుండఁగా సాగరము స్మృతిగోచరమైన యంతన మనస్సు కలఁతనొందుచున్నది. ఎట్లవ్వలిగట్టు వానరులు చేరఁగలరనునదియే విషమప్రశ్నము. దీనికి సదుత్తరమేమని విచారింపసాగెను. పని యిట్లు సాగునని తా నెఱింగియుండియు వారిమూలముననే యావిధము చెప్పింపఁ దలంచి యిట్లడిగెను. శ్రీరామమూర్తికి దుఃఖ మెక్కడిది? కల్పితము. లోకవిడంబనార్థము. తా నాజ్ఞాపించిన ట్లుండరాదు. వారంతన వారే యత్నించిన ట్లుండవలయును. దాన లాభమేమి? అనరాదు. స్వప్రయత్నము కష్టముగాఁ దోఁపదు. పరేచ్ఛననుసరించి చేయునది మహాకష్టముగ నుండును. అట్టికష్టములు గలుగకయుండఁ జేయుటకు భక్తులశ్రద్ధను బరీక్షించుటకు శ్రీరాముఁడు వగచినట్లు నటించెనని మన మూహింపవలయును.

## సుగ్రీవుఁడు శ్రీరాము నోదార్చుట.

* శ్రీరామమూర్తి సంతోషమున నుండియు వగచుటం దిలకించి సుగ్రీవుఁ డావిచారము నపనయింపఁ దలంచి యిట్లు

* ఇది రెండవసర్గమునఁ గలకథ.

పలికెను. మహావీరశేఖరా! పామరునిచందంబున నీవు కూడ దుఃఖించుచున్నావే? ఏల? ఇది న్యాయ్యము కాదు. కృతఘ్నుఁడు మైత్రిని వదలుచందంబున నీవు దుఃఖమును వదలుము. సీతాకుశలము శత్రునివాసము తెలిసినవి కదా. ఇఁకను దుఃఖము గలుగఁ గతమెద్ది? నా యెఱింగినంతదనుకఁ దోఁపకున్నది. మతిమంతుఁడవు గదా నీవు. నీతిశాస్త్రపండితుఁడవు. ఊహాపోహాలయందు నేర్పరివి. ఇదిట్లులగునని నిర్ణయించు జ్ఞానము కలవాఁడవు. కాన దుఃఖింపఁదగవు. యోగియుత్తమపురుషార్థ విఘాతుక మగుబుద్ధిని వదలురీతి నుత్సాహభంగకరమగు నీబుద్ధిని వదలవలయును. సంద్రము దుస్తరమే యనుసంతాప మొందవలదు. మహామకరాక్రాంతమగు సముద్రమును దాఁటి లంకానగరప్రాకారముల పైకెక్కి నీశత్రువగు రావణుని మేము వధింతుము. సాగరమును దరించుటెట్లు? లంక ముట్టడించుటెట్లు? శత్రువులఁ జంపుటెట్లు? అను సంతాపము వలదు. మనస్సు శోకమున వ్యాకులమగు. కాన నుత్సాహము తగ్గు దైన్యము గలుగ సమస్తప్రయోజనములు నశించును. దాన శోకము మాత్రమే కాక యట్టివానికి నాపదలును గలుగును. కాన దానిని వదలవలయును.

శ్రీరామచంద్రా! సహాయసంపద లేదనిఁగను శోకము వలదు. శూరులు సమర్థులునగు మన యూథనాథులందఱు నీ ప్రియంబునకై యగ్నిం బడుటకు నుత్సహించుచున్నారు. మిగిలినదానినిగూర్చి చెప్ప నేల? వనచరులయుత్సాహము తిలకింపఁగా నిట్లూహించునవకాశము కల్గినది. మహాత్మా! నేను బరాక్రమము నెఱపి సీతాపహరణపాపకృత్య మొనరించిన నీ

వైరిని జంపి సీతాంబను దెచ్చునట్లు నీవుత్సాహము చూప వలయును. అదెట్టిదనఁగా సాగరమునందు సేతువు నిర్మించు నట్లు, రావణుని లంకానగరమును మనము కాంచునట్లు నీ వుత్సాహము నెఱపందగు. త్రికూటశైలాగ్రగత లంకను జూచినం జాలు. దాన నతఁడు హతుఁడైనట్లే తలంపుము. భయంకరసాగరమున సేతువు నిర్మింపక దేవేంద్రాదులయిన లంకను గానఁజాలరు. లంకదనుక సేతువు నిర్మింపఁగనే యీ కపిబలము సాగరమును దాఁటి జయము గాంచినట్లే నిశ్చ యింపుము. వీరు రణశూరులు కామరూపులు నగుదురు. లం కను బెకలించి తేఁగలరు. కావున శోకమునఁ గుందఁజేయుచు సకలకార్యధ్వంసకమగు నీబుద్ధిని వదలుము. దుఃఖమొందిన పురుషునిశౌర్యము నశించును. శౌర్యప్రధానుఁ డగుమనుజుఁ డిట్టితఱి దేనిని నేకరింపవలయునో దాని నవలంబించి యుం డుము. మీవంటి యుత్తమోత్తమపురుషు లదృశ్యము నశిం చినదియు నగు నెట్టివిషయమందు నేమాత్రము దుఃఖము నొందరాదు. దుఃఖమొందిన సర్వకార్యములు చెడు. బుద్ధి మదగ్రగణ్యుఁడవు. సమస్త శ్రుతిశాస్త్రపారంగతుఁడవు. విశే షించి నావంటి సహాయులం గూడి పగవారిం జెండాడుము. మహావీరా! శరాసనము కేలఁబూని రణరంగమున నీవు నిలు వఁగా నెదుట నిల్వఁదగువాఁ డెందును నాకుఁ గానరాలేదు.

శ్రీరామా! ఇంక శీఘ్రము సాగర ముత్తరించి జానకి దేవిం గనఁజాలుదువు. కనుక నింతదనుక వగచినది చాలును. క్రోధమూనుము. క్షత్రియులు నిరుద్యోగు లగుదురేని యదృష్టహీను లగుదురు. మిగులఁ గోపమూనిన వానిఁగని

రెల్లరు భయంపడుదురు. మున్ముందటం గూడి భయంకరమూర్తి యగు నదీనాయకుని దాటఁదగునుపాయము నత్యంత సూక్ష్మ బుద్ధి నాలోచించి యుండే యిది యిట్లని నిశ్చయింపుము. నా బలములన్నియు నుదధి దాటునేని జయము కరగతమనియే తలంపుము. కనుకఁ దొలుత సేతునిర్మాణోపాయము నాలోచింపందగు. నాసైనికులు బలవంతులు కామరూపులు నగుట శిలావృక్షముల నాసారముగాఁ గురియించి రిపుల నాశనము చేయఁగలరు. మహావీరా ! నీవు సర్వకాలము యుద్ధోత్సుకుండవు కదా. ఏవిధముననైన సాగరమును దాటుదము. దాఁటి నంతన శత్రువు సంగరమునఁ బడినట్లే తలంతును. విశేషించి వచింపనేల? నీకు జయము సర్వథా సిద్ధించును. అని నానాసేక శుభనిమిత్తములు తోఁచుచున్నవి. మనస్సు నిర్భరానంద మగ్నమగుచున్నదని యూఱడిల్లఁ బలికెను.

మహానుభావులారా! ఈసర్గమునఁ గొన్ని విశేషములు గలవు. వాని నరయుదము. శ్రీరాముఁడు శోకావిష్టహృదయుఁడై యున్నయట్లు పామరులు భావింతురు. అది నటనమని జ్ఞానులే యెఱుంగఁ గల్గుదురు. ఇతరు లామహాత్ముని మాయా సమాచ్ఛాదిత హృదయులగుట దాని నెఱుంగఁజాలరు. కాన సుగ్రీవుఁడు రామమూర్తిని దుఃఖితునిగా భావించి మిత్ర లక్షణముల ననుసరించి తనపని నెఱవేర్పఁ బూనెను. కావున నేర్చుకొనఁదగిన విషయము లుండకపోవునా ?

"కిం త్వం సంతప్యసే వీర యథాన్యః ప్రాకృతస్తథా,
మైవం భూస్త్యజ సంతాపం కృతఘ్న ఇవ సౌహృదం." ౨

అని మూలము.

"విపది ధైర్యమథాభ్యుదయే క్షమా
సదసి వాక్పటుతా యుధి విక్రమః,
యశసి చాభిరుచిర్వ్యసనం శ్రుతౌ
ప్రకృతిసిద్ధమిదం హి మహాత్మనామ్." ౬౩

భర్తృహరి, నీతిశతకము.

అనుసూక్తి ననుసరించి ధైర్య మూనవలసిన సమయమునందు వగచుచున్నాఁ డనుకొన్న సుగ్రీవుఁడు తన్నడుగకున్నను దత్కాలోచితముగ శోకశాంతికరము లగుపలుకుల నూఱడించుచున్నాఁడు.

"ఆపద్యున్మార్గగమనే కార్యకాలాత్యయేఽపి చ,
అపృష్టోఽపి హితాన్వేషీ బ్రూయాత్కల్యాణభాషితమ్."

అని గోవిందరాజోదాహృత నీతిశాస్త్రము ననుసరించియు,

"శుచితా త్యాగితా శౌర్యం సమానసుఖదుఃఖతా,
అనురాగశ్చ దాక్షిణ్యం సత్యతా చ సుహృద్గుణాః."

అను కామందకసూక్తి ననుసంధించియు,

"సంపత్సు మహతాం చిత్తం భవత్యుత్పలకోమలం,
ఆపత్సు చ మహాశైలశిలాసంఘాతకర్కశమ్. ౬౬
పాపాన్నివారయతి యోజయతే హితాయ
గుహ్యం చ గూహతి గుణాన్ ప్రకటీకరోతి,
ఆపద్గతం చ న జహాతి దదాతి కాలే
సన్మిత్రలక్షణమిదం ప్రవదంతి సంతః." ౭౩

అను భర్తృహరియాశయముల ననుకరించియు సుగ్రీవుఁడు కృతజ్ఞుఁడు కావున శ్రీరాముని బుదికొల్ప యుద్ధసన్నద్ధునిగా

నొనరింపఁ దలంచుచున్నాఁడు. ఆపత్కాలమున భయమందుట నజ్ఞులలక్షణము. అట్టితఱి ధైర్యమూనుట మహాపురుషలక్షణము. కృతఘ్నుఁడు సుహృద్భావము వదలును. అట్లు నీవట్టి తఱి ధైర్యమును వదలుచున్నావేల యని హెచ్చరించుచున్నాఁడు. ఇది నీకుఁ దగదని మైత్రి ననుసరించి యాక్షేపించుచున్నాఁడు. సంతాపము వదలుమా యని వేఁడుకొనుచున్నాఁడు. ఈమూలమున వాల్మీకిమహర్షి లోకులకు ధీరుఁడాపత్కాలమున ధైర్యము వదలరాదనియు దుఃఖింపరాదనియుఁ గృతఘ్నత మహాదుష్కార్యమనియుఁ దేటపఱచుచున్నాఁడు. రామాయణమునఁ గలనీతులనే భర్తృహరి లోనగువారు గ్రహించిరేమో యని తోఁచెడిని. ఏది యెట్లున్నను పై నుదాహరింపఁబడిననీతులు శిరోధార్యములు. వాని ననుష్ఠానమునకుం దెచ్చుకొనినవారే వసిష్ఠాదిమహర్షితుల్యులనవచ్చుం గదా. యథాశక్తిన్యాయము ననుసరించియైనను వాని నలవాటుచేసికొనవలయును. అదియే యస్మదాదులకు విధి.

"మతిమాంఛ్ఛాస్త్రవిత్ప్రాజ్ఞః పండితశ్చాసి రాఘవ,
త్యజేమాం పాపికాం బుద్ధిం కృతాత్మేవార్థదూషణీం." ౪

అని మూలము. ఇందలి విశేషణములు విశేషార్థద్యోతకములు.

"స్మృతిర్వ్యతీతవిషయా మతిరాగామిగోచరా,
బుద్ధిస్తాత్కాలికీ జ్ఞేయా ప్రజ్ఞా త్రైకాల్యగోచరా."

అనుసూక్తి ననుసరించి సుగ్రీవుఁడు శ్రీరాముని హెచ్చరించుచున్నాఁడు. అంతటివిజ్ఞానము కలదా యతని కంచు రేమో!

పలికించెడివాఁడు వాల్మీకిమహర్షి. విజ్ఞాననిధి కదా. రాఘవా! రఘువంశమున భూభారహరణార్థ మవతరించిన భగవంతుఁడా యని యాశయము. నీవాగామి గోచరజ్ఞానవంతుఁడవు. రావణాదు లనిఁ బడుదురని యెఱుంగుదువే. ఏల యీశోక మని సారము. శాస్త్రవిత్ = పుణ్యపాప ఫలానుభవమును దెలుపుశాస్త్రము ననఁగాఁ గర్మసిద్ధాంతము నెఱింగినవాఁడవే. రావణాదులు స్వకర్మవశమున నీచేఁ జావనున్నారని యెఱింగియు నేల యీసంతాపమని తేటపఱచుచున్నాఁడు. ప్రాజ్ఞుఁడనఁగాఁ ద్రికాలజ్ఞానసంపన్నుఁడని భావము. భగవంతుఁడవని సారము. నీకేల యీదుఃఖమని నొక్కి చెప్పుచున్నాఁడు. పండితుఁడనఁగా:

"యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః,
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః." గీత. ౧౯

"పండితః—పండా శాస్త్రతాత్పర్యవతీ బుద్ధిః సంజాతా అస్య."

సర్వలక్షణసంగ్రహము.

"పండితః=పండా వేదోజ్జ్వలా తత్త్వవిషయిణీ వా బుద్ధిః. సా జాతా అస్య—యద్వా పండ్యతే తత్త్వజ్ఞానం ప్రాప్యతే అస్మాత్. శాస్త్రజ్ఞః. తల్లక్షణం యథా.—

నిషేవతే ప్రశస్తాని నిందితాని న సేవతే,
అనాస్తికశ్శ్రద్దధాన ఏతత్పండితలక్షణం."

చింతామణిః.

"పఠకాః పాఠకాశ్చైవ యే చాన్యే శాస్త్రచింతకాః,
సర్వే వ్యసనినో మూర్ఖా యః క్రియావాన్ స పండితః."

మహాభారతే, వనపర్వణి.

"విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ పండితాస్సమదర్శినః." గీతా.

అని శబ్దకల్పద్రుమము. శాస్త్రసార మెఱింగినవాఁడవు. కావున దుఃఖింపనగునే యని జ్ఞాపకము చేయుచున్నాఁడు. ఇమాం పాపికాం బుద్ధిమ్=అశుభాత్మికబుద్ధిని దీనిని, త్యజ=వదలుమా. అనఁగా ఉత్సాహభంగము గల్గించు నీయూహను వదలు కొనుమా యని వేఁడుచున్నాఁడు. అర్థదూషణీం బుద్ధిం కృత్వా త్మేవ = యోగి కృతాత్ముఁ డనంబడును. సఫలమనోరథుఁడని యర్థము. అనఁగా యోగాభ్యాసమూలమున స్వాధీనమున నుంచుకొన్న బుద్ధిగలవాఁడని భావము.

"యోగీ యుంజీత సతతమాత్మానం రహసి స్థితః,
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః,
యుంజన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః,
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి."

అన్న గీతావాక్యముల ననుసరించి యోగి సర్వోత్కృష్టుఁడని తేలెడిని. అట్టియోగి పరమపురుషార్థభ్రంసన శీలమగుబుద్ధిని వదలును. అట్లే నీవు కూడ మానవసంబంధ మగుబుద్ధిని వదలు మని వినయమున వేఁడెనని యీ శ్లోకాభిప్రాయము. వాల్మీకి యిట్టి విశేషార్థములు గలవాక్యములను సుగ్రీవునిమూలమునఁ జెప్పించెనని మన మెఱుంగుట సమంజసము.

"నిరుత్సాహస్య దీనస్య శోకపర్యాకులాత్మనః,
సర్వార్థా వ్యవసీదంతి వ్యసనం చాధిగచ్ఛతి." ౬

అని మూలము.

"ఆదానస్య ప్రదానస్య కర్తవ్యస్య చ కర్మణః,
క్షిప్రమక్రియమాణస్య కాలః పిబతి సంపదః."

అన్న ముంజరాజోక్తి దీనినే యనుకరించుచున్నది. ఇది రాజ
నీతిగాని సామాన్యజనోపయోగమగు నీతికాదని కొందఱు,
ఎల్లరకు నిది సమానమే యని మఱికొందఱు పలుకుదురు.
సాధారణదృష్టిచే నాలోచింప నుత్సాహశక్తి తగ్గిననే యుత్త
మాధమకార్యములు కూడ నెఱవేఱవు.

"ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః,
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే."

అను నీగీతావాక్యము దీనినే యనుకరించుచున్నది. కావున
నుత్సాహశక్తి యుండినఁగాని యేకార్యము సాధ్యము గానే
రదు. శోకముచే నెవరిమనస్సు కలఁతనొంది యుండునో వా
రేకార్యమును సాధింపఁజాలరు. ఉత్సాహముండుట శోకవిర
హితమయి మనస్సులరుట యివి కుదురకపోయిన సర్వకార్య
ములు నశించును. అంతియగాక వ్యసనము కూడఁ గలుగును.
అనఁగా నిర్మలమనస్సు కుదిరినఁగాని యుత్సాహము నెల
కొనదు. మనోనైర్మల్యమునకుఁ గారణము యోగాభ్యాసము.

"శనైశ్శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా,
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్.
యతో యతో నిశ్చరతి మనశ్చంచలమస్థిరం,
తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్.
ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్,
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూతమకల్మషమ్."

అను నీగీతావాక్యము లీపై వ్రాసినభావము స్థిరీకరించుచున్నవి.
యోగి కానివానికి శోకపర్యాకులాత్మత్వ మలవడదు. మాటల
వేదాంతుల కది శక్యమే కాదు. యోగికి మాత్రమే యది
శక్యమగును. కనుకఁ దొలుత యోగము నభ్యసించి పిదప
వేదాంతపఠనము చేసినఁ దరణోపాయము దొరకును.

"తదలం విక్లబా బుద్ధి రాజన్ సర్వార్థనాశినీ,
పురుషస్య హి లోకేఽస్మిన్ శోకస్సర్వాపకర్షణః. ౧౪
యత్తు కార్యం మనుష్యేణ శౌండీర్యమవలంబతా,
అస్మిన్కాలే మహాప్రాజ్ఞ స త్వమాతిష్ఠ తేజసా." ౧౫

అని మూలము.

మానవత్వము వదలి సర్వేశ్వరత్వ మవలంబింపుమా యని
సుగ్రీవుఁడు విన్నవించుచున్నాఁడు. తత్ విక్లబా బుద్ధి రలమ్=
కావున శోకాధీనమగుబుద్ధి చాలును. అనఁగా నిఁక మరల
నీనటన మానకుమని భావము. రాజన్=ఇది సాభిప్రాయము.
ప్రకాశింపుమని యాశయము. స్వరూపసంధానసక్తుఁడవు
కమ్మని సారము. సర్వార్థనాశినీ=ఇప్పుడు చేయఁదగు సర్వార్థ
ముల కిది తగినది కాదని యభిప్రాయము అస్మిన్ లోకే పురు
షస్య శోక స్సర్వాపకర్షణః = అని యన్వయక్రమము. ప్రకృతి
సంసర్గవిహీనావస్థ ననుసరించి వర్తించుట యని యిటఁ బురుష
శబ్దార్థము గ్రహింపవలయును. శౌండీర్య మవలంబతా మను
ష్యేణ యత్తు కార్యం అస్మిన్ కాలే మహాప్రాజ్ఞ! సః త్వం
తేజసా ఆతిష్ఠ=అని క్రమము. త్రికాలవేత్తవు. అనఁగాఁ గాల
స్వరూపుఁడవని యాశయము. వీర్యమునవలంబించు మనుష్యు
నిచే నేది యిక్కాలమునఁ జేయఁదగునో అట్టి నీవు తేజస్సుచే

నిలుపుము. శౌర్యము చూపినఁగాని సాధ్యముగాని కార్య మిదియని త్రికాలజ్ఞుఁడ వగుట నెఱుంగుదుము. మానవరూప మున నుండుగా నీవు అనఁగా ధర్మరక్షణార్థ మవతరించిన నీవని భావము. తేజసా ఆతిష్ఠ=పౌరుషము నాశ్రయింపుము. శాంతతేజస్వివుడు కార్యసిద్ధిక్షమము కాదు. రాజసతేజస్సు నవలంబింపుము. ఏల యనఁగా

"శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనం,
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్.
శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః."

అను నీగీతావాక్యముల ననుసరించి కులోచితధర్మానుష్ఠాన ముత్తమమనియుఁ బరధర్మానుష్ఠాన ముత్తమము గాకుండుటే గాక భయావహమనియుఁ దేలుచున్నది. కనుక క్షత్రి యత్వము నవలంబించిన నీవు తేజశ్శక్తినుపయోగించు సమయ మగుట శోకముడిగి పరాక్రమము నెఱపుమనియు సుగ్రీవుఁడు బోధించెను. దీనిచే జాతిధర్మము లుత్తమము లనియు వాని ననుసరించి ధర్మము తప్పక యాచరించిన నెల్లజాతులకు ఫలము సమానమనియు నేర్పడుచున్నది. సారమేమనఁగా జాత్యుక్త ధర్మాచరణమునందు ఫలాభిలాషము వదలుకొనినఁగాని భగ వత్కారుణ్య కలుగునవకాశము చేకూర దనునదియే.

"త్వం తు బుద్ధిమతాం శ్రేష్ఠస్సర్వశాస్త్రార్థకోవిదః,
మద్విధైస్సచివైస్సార్థ మరిం జేతుమిహార్హసి.                ౧౭
న హి పశ్యామ్యహం కంచిత్త్రిషు లోకేషు రాఘవ,
గృహీతధనుషో యస్తే తిష్ఠేదభిముఖో రణే.                ౧౮

వానరేషు సమాసక్తం న తే కార్యం విపత్స్యతే,
అచిరాద్ద్రక్ష్యసే సీతాం తీర్త్వా సాగరమక్షయం." ౧౯

అని మూలము. త్వం తు బుద్ధిమతాం శ్రేష్ఠః = బుద్ధిమంతుఁడనఁగా నప్పటికాలమునఁ జేయఁదగినకార్యము నాలోచించు బుద్ధిగలవాఁడని యర్థము. అంతియగాక సర్వశాస్త్రార్థకోవిదుఁడవు అనఁగా శాస్త్రార్థముల నాలోచించి తాత్కాలికముగ నేపని యెట్లు చేయఁదగునో యెఱింగినవాఁడవని భావము. అంతమాత్రమునఁ గార్యము సాధ్యము కాదు. మావంటి మంత్రులం గూడి యరియగురావణుని జయింపఁ దగుదువు. మావంటివా రనఁగా వానరములని యర్థము. నీవు మర్త్యరూపధారివి. మేము వానరరూపధరులమని యాశయము. మనము కలిసి పనిచేసినఁగాని రావణుఁడు చావఁడు. అదియే వరదానకాలపుఁ గట్టుబాటని సారము. భగవంతుఁడు శ్రీరాముఁడు. దేవతలు సుగ్రీవాదులని మనము గ్రహింపవలయును. రామా! నీవు ధనుర్ధారివయి రణభూమిని నిల్చిన నిన్నెదిరింపఁగలవాని నొక్కని నీ మూఁడులోకముల నెఱుంగనని సుగ్రీవుఁ డనియెఁ గదా. దీనిభావ మేమి?

"కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః,
ఋతేఽపి త్వా న భవిష్యంతి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః."

అన్న భగవద్వాక్యము ననుసరించి పరమేశ్వరుఁడే వధింపఁ దలంపనిలుచువాఁడు ముజ్జగముల నెవఁ డుండును? ఈభావమే యిందుఁ గలదని యెఱుంగందగు. వానరేషు సమాసక్తం తే

కార్యం న విపత్స్యతే = అనఁగా వానరులమూలమున సకల రాక్షససంహారము కావలయునని వారికర్మము ననుసరించిన నీశాసనము మార్పునొందునా? ఫలింపకపోవునా? రామా! శీఘ్రమున నపారసాగరమును దాఁటి జానకీదేవిని జూడఁ గలవు. అనఁగా నేండ్లుపూండ్లు కాక రెండునెలలలోపలఁ జూడఁగలవని భావిఫలమును దెలిసినట్లు ప్రకృతి ప్రోత్సాహమునఁ దేటపఱిచెను.

"నిశ్చేష్టాః క్షత్రియా మందాస్సర్వే చండస్య బిభ్యతి." ౨౦

అని మూలము. నిరుద్యోగు లగురాజులు అనఁగా స్వజాత్యుచితధర్మమును వదలినవారు. అట్టివారు అదృష్టహీనులని తాత్పర్యము. మిక్కిలి కోపమొందినరాజున కెల్లరు భయపడుదురు.

"యస్య ప్రసాదే పద్మా శ్రీర్విజయశ్చ పరాక్రమే,
మృత్యుశ్చ వసతి క్రోధే సర్వతేజోమయో హి సః.
దుష్యేయుస్సర్వవర్ణాశ్చ భిద్యేరన్ సర్వసేతవః,
సర్వలోకప్రకోపశ్చ భవేద్దండస్య విభ్రమాత్.
యత్ర శ్యామో లోహితాక్షో దండశ్చరతి పాపహా,
ప్రజాస్తత్ర న ముహ్యంతి నేతా చేత్సాధు పశ్యతి."

మను. ౭ అధ్యా.

అన్న మనుస్మృతివాక్యము లీయర్థమునే ప్రతిపాదించుచున్నవి.

"యద్యహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి."

అన్న గీతావాక్యార్థమునే యీభాగము తెలుపుచున్నది.

"నిమిత్తాని చ పశ్యామి మనో మే సంప్రహృష్యతి."                    -౨౪

అని మూలము. శుభశకునములు తోఁచుచున్నవి. నామనస్సు సంతోషభరితముగ నున్నది.

"సతాం హి సందేహపదేషు వస్తుషు
ప్రమాణమంతఃకరణప్రవృత్తయః."

అన్నసూక్తి నీభాగము దృఢపఱచుచున్నది. మనఃప్రవృత్తి కర్మానుభవము ననుసరించి మాఱుచుండును. భావిభాగ్యమును హర్షమే తెలుపును. ఆకస్మికహర్షము భావిశుభఫలసూచన మనియు, అట్టి దుఃఖము భావ్యశుభఫలసూచనమనియు నన మెఱుంగవలయు. ఈభాగమున నధ్యాత్మరామాయణమునఁ గలవిశేషములం బరికింతము.

"భృత్యకార్యం హనుమతా కృతం సర్వమశేషతః,
సుగ్రీవస్యేదృశో లోకే న భూతో న భవిష్యతి.          ౫
అహం చ రఘువంశశ్చ లక్ష్మణశ్చ కపీశ్వరః,
జానక్యా దర్శనేనాద్య రక్షితాస్స్మో హనూమతా.          ౬
సర్వథా సుకృతం కార్యం జానక్యాః పరిమార్గణం,
సముద్రం మనసా స్మృత్వా సీదతీవ మనో మమ.          ౭
కథం నక్రఝషాకీర్ణం సముద్రం శతయోజనమ్,
లంఘయిత్వా రిపుం హత్వా కథం ద్రక్ష్యామి జానకీం.          ౮
శ్రుత్వా తు రామవచనం సుగ్రీవః ప్రాహ రాఘవమ్,
చింతాం త్యజ రఘుశ్రేష్ఠ చింతా కార్యవినాశినీ.          ౯
ఏతాన్పశ్య మహాసత్త్వాన్ శూరాన్వానరపుంగవాన్,
మత్ప్రియార్థం సముద్యుక్తాన్ ప్రవేష్టుమపి పావకమ్.          ౧౦

సముద్రతరణే బుద్ధిం కురుష్వ ప్రథమం తతః,
న హి పశ్యామ్యహం కంచిత్త్రిషు లోకేషు రాఘవ. ౧౧
గృహీతధనుషో యస్తే తిష్ఠేదభిముఖో రణే,"

అనునవి కలవు. రామాయణభావమునే యివి యనుకరించు చున్నవి. కావునఁ బైన వ్రాసినయర్థము సుసంగతమే యని గ్రహింపందగు. దాన భగవత్తత్త్వము నెఱుంగ వలను పడును. ఇంకఁ దరువాతిభాగమును బఠింతము.

## శ్రీరామప్రశ్నములకు హనుమ బదులిచ్చుట.

* శ్రీరాముఁడు సారజ్ఞుఁడు గావున సుగ్రీవునిమాట లాలకించి యంగీకరించి హనుమంతు నిట్లు ప్రశ్నించెను. పావనీ! తపోవిశేషమునఁగాని సేతుబంధనముచేఁగాని, సాగరోదకముల నింకించిగాని యెట్లైన దీనిందాఁటు సమర్థుఁడ నగుదును. ఇందుల కేచింతయు లేదు. దుర్గమమగు లంకాపురమునకు దుర్గప్రాకారము లెన్ని కలవు? సైన్యపరిమాణము, ద్వారరక్షణక్రియలు, పురరక్షక ప్రాకారపరిఖాదులు, దానవగేహములు నీవలన వినఁగోరుచున్నాను. దానిమూలమున వానిం గన్నాఁ జూచినట్లు ఎఱుంగఁ గోరుచున్నాను. నీవు లంకనంతయుఁ గలయం గాంచితివి. దానితత్త్వ మెఱింగితివి. అట్లే నాకుం దెల్పుము. అనుటయు వాగ్విశారదుఁడగు నా యాంజనేయుఁడు కేల్మోడ్చి యిట్లనియె. మీ రడిగినవానిం దెలిసినంత విన్నవించెద. లంకానివాసులు సంతుష్టులు. మదగజములు

---

* ఇది మూఁడవసర్గమునఁ గల కథ.

నిండియుండు. అది విశాలమగు నగరము. రథవితతులు హయ ములు మిక్కిలిగ నుండు. రక్షస్సేనలు సందులేక యుండు. కాన నది శత్రుదుర్గమమే. విశాలద్వారములు నాలుగు గలవు. దృఢతమములు ననిర్భేద్యములు నగు. వానియందు ననేక రక్షకయంత్రాదులు గలవు. అచ్చట వీరదానవులు భయంకర ములు శతవీరుల నొక్కసారి పొడవడంపఁగల యినుపగుది యలఁ బెక్కింటి నునిచియున్నారు. పురమునుజుట్టి స్వర్ణ ప్రాకారము గలదు. దానికి నెక్కుటరిది. దానిపై రత్నస్థగిత భాగము లందందుఁ గలవు. దానింజుట్టి యగాధజలసం భృతము లగుపరిఖలు గలవు. వానిజలముల మొసళ్లు లోనగు యాదస్సులు గలవు. అవ్వాని దాఁటఁగలసేతువులు నాలు గమర్పఁబడినవి. వలసినతఱి వాని నవ్వలం ద్రోయుటకుఁ దగిన యంత్రము లందున్నవి. అందుఁ గానలివారికిం బెక్కు గృహము లమర్పఁబడి యున్నవి. వా రాసేతువులం గాంచు చుందురు. ఆసేతువు లానగరిఁ గాపాడుచుండు. ఉత్తరద్వార మునఁ గల నీటికట్టు విశాలము దృఢతరమునయి యుండును. దానిం గదల్ప నలవికాదు. దాని కాధారముగా హిరణ్యస్తం భములు జలములందు నిలుపఁబడి యున్నవి. వానిం గాపాడు వారి కునికిపట్టులుగా ననేకవేదు లమర్పఁబడినవి.

మహాత్మా! రావణుఁడు ద్యూతాదివ్యసనకర్శితముగాని చిత్తమొప్పార జాగరూకత గలిగి సైన్యముల దినదినము పరి కించుచు యుద్ధమునకు సర్వదా సంసిద్ధుఁడుగ నుండు. పురమది త్రికూటాద్రిపై నుండుటంబట్టి దానినెక్కి పైకరుగుట కాధా రము లేదు. దేవతలకు నందుఁ జొర నలవియే కాదు. చూడ

నది భయముం గొలుపును. జలపర్వత వనదుర్గములు ప్రాకార పరిఖాదిక కృత్రిమమునను చతుర్విధదుర్గములు గలవు. నగర మది పెద్దదై సాగరమున కవ్వలితీరమున నున్నది. సముద్రమును దాఁట నౌకామార్గము లేదు. ఇచ్చటివారి కందలివార్త లెఱుంగునుపాయము లేదు. కాన లంకకు జలదుర్గ మున్నది. స్వర్గమునుమించిన యాలంక కొండపై నుండుటం జేసి చతు రంగబలాకీర్ణ మగుటం జేసియు నది పర్వతవనదుర్గములు కలది యయి యున్నయది. పరిఖలు, శత్రుమారణయంత్రములు ననేక ములు గలవు.

లంకాప్రాగ్ద్వారమున నయుతదానవు లున్నవారు. వారు శూరులు ఖడ్గపాణులు నగుదురు. దక్షిణద్వారమునఁ జతు రంగసేనలం గూడినవీరులు లక్షసంఖ్యగలవా రున్నారు. ప్రతీ చీద్వారమున దశలక్ష రక్షోవీరు లున్నారు. వారు చర్మకవచ ఖడ్గసమస్తాస్త్రధారులై యున్నారు. ఉత్తరద్వారమున న్యర్బు దముదానవు లున్నవారు. వా రభిజనగౌరవమున రావణునకు విశ్వాసపాత్రులై యున్నారు. నగరాంతర్భాగమున ననేకసహ స్రరాక్షసవీరు లున్నవారు. లంకానివాసు లొకకోటిసంఖ్య కుం దగియుందురు. నే నాసేతువుల భంజించితిని. పరిఖలం బూడ్చివేసితిని. నగరమంతయు దహించితిని. ప్రాకారములఁ బడఁద్రోసితిని. కాన నిపుడంతశ్రమ మక్కఱలేదు. బలమున నాల్గవభాగము నాచేఁ జంపఁబడినది. ఎట్లో సాగర ముత్తరిం తము. లంక నశించినట్లే తలంపుము. అంగద ద్వివిద మైంద జాంబవత్ప్రభృతులు సాగరము నెగురుదురు. లంకను బెక లించి తేఁగలరు. తక్కినబలములతో నీకుం బనిలేదు. నేనా

సర్వస్వభూతులగు నంగదాదుల కానతి యిమ్ము. మంచిమూరు తమున బయలువెడల సమ్మతింపుమని పలికి యూరకుండెను.

ప్రాజ్ఞులారా! యీభాగమునఁ గలవిశేషములఁ బరిశీలింతము.

"తపసా సేతుబంధేన సాగరోచ్ఛోషణేన వా,
సర్వథా సుసమర్థోఽస్మి సాగరస్యాస్య లంఘనే." ౨

అని మూలము. తపస్సనఁగాఁ గార్యసిద్ధిసంకల్పమని యర్థము. ఈకార్యము ఫలించుఁగాక యన్నసంకల్పము చేసిన నది ఫలించునని భావము.

"న మే పార్థాఽస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన,
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి."

అన్న గీతావాక్యమునఁ గలయర్థ మిట విస్తృతము. సంకల్పమాత్రమున లభింపనిది లేదని తాత్పర్యసారము. సేతుబంధేన=సాగరమును గట్టవచ్చును. ముల్లోకములయం దించుకంతయు నేఁ జేయఁదగినది లేదనఁగా సార మేమి? ఇచ్ఛాశక్తియగు ప్రకృతిని స్మరించుటచే నెవ్విగాని సిద్ధించుసనియే. సాగరోచ్ఛోషణేన వా=సాగరజలముల నింకునట్లు చేసికాని. అనఁగా సేతుబంధనము ప్రయాసమని తోఁచిన సాగరోదకము లే లేనట్లు చేయుదునని కదా యాశయము. సర్వథా= సర్వప్రకారములచేత. ఈమూఁడుగాని మఱేవిగాని కార్యము లొనరింపవచ్చునని భావము. అస్య సాగరస్య లంఘనే సమర్థోఽస్మి = ఈసముద్రమును దాఁట శక్తిగలవాఁడనే. అనఁగా నీవని కావలయునని యూహింపలేదు గాని తలంచినంతన ప్రకృతిమూలమున క్షణమున సిద్ధించునని సిద్ధాంతమే

యని సారము. సుగ్రీవుని మాటల మూలమున నప్పటికార్య మిది యని యూహించి ప్రోత్సహింపఁబూని స్వసంకల్పబలమును దెలుపుచున్నాఁడని మనము గ్రహింపవలయును. దీనిచే సర్వ శక్తిమత్త్వము ప్రకటితము.

"నాదేయం పార్వతం వాన్యం కృత్రిమం చ చతుర్విధం." ౨౦

అని మూలము. జలపర్వత వనకృత్రిమము లనుదుర్గములు నాలుగు గలవని యర్థము.

"జాంగలం సస్యసంపన్న మార్యప్రాయమనావిలం,
రమ్యమానతసామంతం స్వాజీవ్యం దేశమావసేత్. ౬౯
ధన్వదుర్గం మహీదుర్గ మబ్దుర్గం వార్క్ష మేవ వా,
నృదుర్గం గిరిదుర్గం చ సమాశ్రిత్య వసేత్పురం. ౭౦
సర్వేణ తు ప్రయత్నేన గిరిదుర్గం సమాశ్రయేత్,
ఏషాం హి బాహుగుణ్యేన గిరిదుర్గం విశిష్యతే. ౭౧
త్రీణ్యాద్యాన్యాశ్రితాస్త్వేషాం మృగగర్తాశ్రయాప్సరాః,
త్రీణ్యుత్తరాణి క్రమశః ప్లవంగమనరామరాః. ౭౨
యథా దుర్గాశ్రితానేతాన్నోపహింసంతి శత్రవః,
తథారయో న హింసంతి నృపం దుర్గసమాశ్రితం. ౭౩
ఏకశ్శతం యోధయతి ప్రాకారస్థో ధనుర్ధరః,
శతం దశసహస్రాణి తస్మాద్దుర్గం విధీయతే. ౭౪
తత్స్యాదాయుధసంపన్నం ధనధాన్యేన వాహనైః,
బ్రాహ్మణైశ్శిల్పిభిర్యంత్రైర్యవసేనోదకేన చ." ౭౫

మను. ౭ అధ్యా.

రాజు దుర్గాశ్రితుఁడు కావలయుననియు దుర్గభేదములు వాని వలనిలాభములు నవి యుండవలసినపద్ధతులు స్మృతియం దిందు

వర్ణింపఁబడినవి. ధర్మము తప్పనియుద్ధము గలయాకాలమున దుర్గనిర్మాణము ప్రధానమయ్యెను. ఎదిరింపనివారిపై నాయుధము వైవరాదను నియమ మాకాలమున నుండెను. ఎదిరించినవానిపై నాయుధము వైవరాదనునియమ మాకాలమున నున్నయట్లూహింప నవకాశము గలదు. బ్రహ్మాస్త్రాదులు వైచి జగమునే దహింపవచ్చునని ప్రమాణములు గనఁబడుచున్నవి కదా. దూరముననుండి యేల యాగ్నేయాద్యస్త్రములఁ బ్రయోగించి దుర్గరక్షితమగు శత్రుపురమును భస్మీకరింపరాదని యడుగుదురేమో. ఆకాలపుయుద్ధములు నియమయంత్రితములు. ధర్మ మణుమాత్రము కూడ మించరానివి. మించినవాని నెల్లరు దండింతురు. కావున నెదిరించినపుడే తప్ప నాగ్నేయాద్యస్త్రముల నిరపరాధులయెడం బ్రయోగింపరాదను కట్టుపాటు నాశ్రయించి పురములపై నస్త్రముల వైవకుండిరి. న్యాయ మెడలిన నామహాస్త్రదేవతలు విముఖు లగుదురు. పదార్థసంయోగసంభవము లగునాయుధము లాకాలమున లేవని యాక్షేపించువారలకుఁ దెలివితప్పునట్లుగా నిచ్చుతాంబూలము తొలుత నీవలయును. సంధ్యావందన కాలములయందు యుద్ధము చేయరాదనియు నిరాయుధుని హింసింపరాదనియు నింక నెన్నియోవిధములగు నియమములు గల యాకాలమున నిట్టివానితోఁ బనియే లేకుండెను. విషవాయువుల సాయము గోరకయే గాంధర్వాద్యస్త్రముల మహిమమున నరాతుల మూర్ఛితులనుగాఁ జేయుశక్తి గలవారుండిరి కదా. దాన వారు మృతినొందరు. తాత్కాలికపరాభవమునే పొందుదురు. ధర్మదేవత తాండవించు నాకాల

మున నిట్టి క్రూరాచారము లేల యుండును? ఒక్కయస్త్రమున నెన్నియోలక్షలు రిపులు దగ్ధమగుచుండిరి. విషవాయువు లధర్మదేవతాంగములు. అట్టిదేవతల స్వాధీనమున నుంచుకొనినవారల కీపాటి తుచ్ఛపుఁబనులుచేయ శక్యముగాదనుట హాస్యాస్పదము. ధర్మమును మాని యుద్ధముచేసినవారే యసురులు. నభస్సంచారము అదృశ్యత్వము లోనగు దుష్టశక్తులుగలవారు కాననే ధర్మదేవత విముఖతనొంద నశించిరి. కావున ధర్మమూనినవార లశక్తు లనరాదు. వారికిట్టి దుస్సంకల్పములు లేవనవలయు. అదియే బుద్ధిమల్లక్షణము.

"యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్."

అను గీతోక్తి యప్పుడుండునార్యుల కాధారము. ఇప్పటి యపూర్వార్యుల కది ప్రమాణ మెట్లగును? కనుకనే సుఖమన్నది గగనకుసుమాభ మగుచున్నది. సుఖమన మనశ్శాంతియే. అదెక్కడనున్నది? నిఘంటువులయం దున్నది. అప్పుడు స్వానుభవములయం దుండెను. ఇంతియ తదేతత్కాలములకుఁ గలభేదము.

"నాపథోఽపి చ నాస్త్యత్ర నిరాదేశశ్చ సర్వతః,
శైలాగ్రే రచితా దుర్గా సా పూర్దేవపురోపమా."    ౨-౨.

అని మూలము. "నిరాదేశశ్చ = సర్వదిగ్వార్తాసంచారరహితప్రదేశ ఇత్యర్థః. అనేన జలదుర్గత్వం సూచితమ్." అని వ్యాఖ్య. ఏప్రక్కఁజూచిన నౌకామార్గములు లేవు. సముద్రతరణసాధనము లాపురమున కేవైపునం గాంచినను లేవని భావము. సముద్రము నాకాలమున నౌకామూలమునఁ

దరించుచుండిరని సూచితము గదా. నౌకామార్గము లేర్ప
ఱుపఁబడియుండు టెట్టులని ప్రశ్నింతురేమో. నౌకలు నిరు
పాయముగాఁ జేరుటయే నౌకామార్గములని యాశయము.
లంక కట్లు పోవరాదని భావము. యంత్రములు నిర్మించి
యున్నారని యీసర్గమునఁ గలదు.

"తత్రేషూపలయంత్రాణి బలవంతి మహాంతి చ." ౧౨ శ్లో.

"ఇషూపలయంత్రాణి బాణశిలామోచనయంత్రాణి" అని వ్యా.
శత్రువులు రాఁగా వారిపై బాణములను గండోపలములను
విసరుటకు యంత్రము లమర్పఁబడియెనని కదా దీనిభావము.
బాణముల విసరుననఁగా నర్థమేమి? దూరమునుండియే శత్రు
వులు బాణశిలావర్షములకు భయపడి తిరిగిపోవుదురని
యూహించి యేర్పఱచినవారు లోహాదులచే నిర్మింపఁబడిన
సాధనములనియే తెలెడిని. ధనుస్సులనుండి విడుచుబాణములు
పోవఁజాలనంతదూరమునందే పగవారుండఁగా వారిని దగుల
నైవఁ బడునవియని తోఁచును. ఏసహాయమున నట్లు పోవునో
యని యూహింపవలసి యుండును. దానిని నిర్ణయించుట కిం
దాధారము గాన్పింపదు. యంత్రమనఁగా దారులోహాది వస్తు
నిర్మిత మనునది సిద్ధాంతము. అది బాణశిలాదుల విసరు
చుండును. ఏదోయొక వస్తుశక్తిచే నది యప్పని నొనర్పఁజాలి
యుండును. అట్టిదాని నప్పటివారు కనిపెట్టిరనియే స్పష్టము
కాకపోదు. మంత్రబలమున నుండఁగూడదా యందురేమో
అపుడు యంత్రము లేల? యంత్రము లనుటచేతనే వస్తు
సాధనమని యేర్పడును. బాష్పవాయువులమూలముననో మఱి
దేనిమూలముననో యవి కార్యము నిర్వహించును. అసియే

యంత్రము లనంబడును. దేవాలయాదులలో వేయుయంత్ర ములవంటి వవి కావు కదా. యంత్రనిర్మాణ మాకాలమున నున్నదియే కాని యీకాలముననే పుట్టినదనుమాట యసం గతప్రసంగములలో నొక్కటి యనవచ్చును గదా.

"అయుతం రక్షసామత్ర పూర్వద్వారం సమాశ్రితం,
నియుతం రక్షసామత్ర దక్షిణద్వారమాశ్రితం.
ప్రయుతం రక్షసామత్ర పశ్చిమద్వారమాశ్రితం,
న్యర్బుదం రక్షసామత్ర ఉత్తరద్వారమాశ్రితం.
శతశోఽథ సహస్రాణి మధ్యమం స్కంధమాశ్రితాః,
యాతుధానా దురాధర్షాస్సాగ్రకోటిశ్చ రక్షసాం." ౨౫

అని మూలము. నాల్గుద్వారములయందుఁ బ్రాగాదిగా పది వేలు లక్ష పదిలక్షలు పదియర్బుదములు సేనయున్నట్లు తేలును గదా. నగరమధ్యభాగమున వందలు వేలుగా సేన కలదు. సేనయంతయుఁ గొదువలేక కోటి గలదు. అని యర్థ మగుచున్నది. ఉత్తరద్వారముననే పదియర్బుదము లనఁగా వేయికోటులు సేన గలదు గదా. అంతయుఁ జేరి కోటియన నర్థమేమని ప్రశ్నింతురు. ఇంతసేన నాతొందఱలో హను మంతుఁ డెట్లు లెక్కిడఁజాలెననియుఁ గొందఱు ప్రశ్నింతురు. సమాధాన మెట్లు? బహుత్వే కోటిః అను నొకసామెత గలదు. అనేకు లుండఁగా కోటియనుట ప్రాచీనుల యలవాటు. హనుమకంటికి కాసేన యపారముగాఁ గనఁబడియుండు. ఉత్తర ద్వారమునఁ దొలుత హనుమ ప్రవేశింపఁగాఁ జూచిన దొక లంకయను రక్కసియే. తక్కినవారు వారిరువురు పోరాడు నపుడుకూడ నామెకుఁ దోడుపడినట్లు చెప్పఁబడలేదు. కావున

నీఘట్టమునఁ గలసంఖ్య బహుత్వమును దెల్పునని గ్రహింప వలయును. జ్ఞానదృష్టిగల వాల్మీకిమహర్షి తెలిసి చెప్పె ననఁ గూడదా యని కొందఱందురు. దీనికంటె నదియే యుత్తమ మనవచ్చునని నా యాశయము. ఈభాగమునఁ గల యధ్యాత్మ రామాయణప్రోక్తసంఖ్యయు దీనికి విసంవాదిగా నున్నది. ఇఁకఁ దరువాతికథాభాగమును బఠింతము.

## లంకాప్రయాణము, సముద్రతీర ప్రవేశము.

* సత్యపరాక్రముఁడగు నా రామచంద్రుఁడు హనుమ తెలిపినదంతయు నాలకించి నీవు వివరించిన దుష్టరాక్షస నగర మగులంకను శీఘ్రముగా ధ్వంసము చేసెదను. సత్యము నే వచింతును. అని యంత నిలువక సుగ్రీవునితో నిట్లనియె. ప్రయాణమున కిదియే ముహూర్తమని యెంచెద. సూర్యుఁడు మధ్యాహ్నసమయమును దెలుపుచున్నాఁడు. ఇది యభిజిన్ముహూర్త మనంబడు. ప్రస్థానార్హము. విశేషించి మన కనుకూలము, జయప్రదము నగు. ఇట్టి సుముహూర్తమునఁ బయనము చేయుదునేని సీతాపహారణకార్యదుష్టుఁ డెట్లు తప్పించుకొనిపోయి బ్రదుకఁగలఁడు? ఎందుఁ బోయిన వెంట నంటి హతము చేయుదును. విషపానమున నొకఁడు చావఁ బోవుతఱి నమృతస్పర్శమునఁ గొంతఁ బ్రదుకునట్లు సీత నా ప్రయాణవార్త విని కొంత జీవితాశ నొందఁగలదు

కపీంద్రా! నేఁ డుత్తరఫల్గునీ నక్షత్రము. పునర్వసువు నందు జన్మించిన నాకిది సాధనతార యనుబలము గలదగు.

---

* ఇది నాల్గవసర్గమునఁ గలదు.

రేపు హస్తతోఁ జంద్రుఁడు సంగతిం గాంచు. అది నైధనతార
నాకగు. కాని సేనలంగూడి నేఁడే పయనమయ్యెదము. శుభ
నిమిత్తములు పెక్కులు తోఁచుచున్నవి. తప్పక వైరిం బొలి
యించి జానకిం దేఁగలము. చూడుము. నాకన్ను మీఁదుగా
నదరుచున్నది. కానఁ దప్పక నామనోరథము సిద్ధించును. అని
శ్రీరాముఁడు తనపలుకుల నభినందించిన సుగ్రీవాదులం దిల
కించి సుగ్రీవా! నీలుఁడు బలశాలురగు లక్షవానరులు వెంట
రా మార్గప్రదర్శనార్థము సేనలకుముం దరుగుఁగాక. అని
చెప్పుచు సన్నిహితుఁడగు నీలునితో ఫలమూలసమృద్ధి గలిగి
చల్లనియడవులతో జలములు మిగుల దొరకుచుఁ దేనెయుఁ
దృప్తిగాఁ జిక్కుత్రోవన సేనలం దీసికొని పొమ్ము. దురాత్ము
లగుట రాక్షసులు పథమున విషాదులం గలిపి జలఫలాదుల
దుష్టములుగాఁ జేయుదురు. వార లట్లుచేయకయుండ నెచ్చ
రిక గలిగియుండవలయును. నీవానరులు పై కెగసి మనల నిరో
ధింప సేనల నుంచియుండుటఁ బరికింపవలయు. మన పూనిన
కార్యము కడుంగడు భయంకరము. కాన నందఱు హెచ్చరిక
గలిగి విక్రమింపవలయు. మహాశూరు లగువానరులు మహా
సాగరముం బోలు మనసేనకుముం దరుగుచు దానిని నడిపిం
చుకొని పోవలయును. గజగవయగవాక్షులు సేనాగ్రభాగము
నఁ బోవుచుందురు గాక. ప్లవగోత్తముఁ డనంబడు ఋషభుఁడు
సేనాదక్షిణభాగమును రక్షించుచు వచ్చుంగాక. గంధమాద
నుఁడు సేనాసవ్యభాగమును గాచుచు వచ్చుంగాక. నేనైరా
వతము నింద్రుఁ డెక్కినట్లు హనుమంతునిపైఁ గూరుచుండి
సేనలకు నుత్సాహమును గలిగించుచు నడువ వచ్చెద. సార్వ

భామనామకదిగ్గజమును కుబేరుఁ డెక్కి వచ్చునట్లు లక్ష్మణుఁ డంగదునిపై వచ్చుం గాక. జాంబవత్సుషేణ వేగదర్శులు ధూమ్రుఁడు సేనల వెనుకటిభాగమును గాపాడుదురు గాక. అని యాజ్ఞాపించెను.

కపినాయకుఁడు సుగ్రీవుఁడు రామచంద్రుఁడు చెప్పిన దానిని విని త్వరగ పయనము సాగింపుఁడని బలములకు నాన తిచ్చెను. వారందఱు నెగయుచు దుముకుచు గంతులు వైచిరి. శ్రీరాముఁడు లక్ష్మణసుగ్రీవులం గూడి దక్షిణపు దెసం బట్టి పోయెను. ఆమహాత్ముని నపారసేన చుట్టుకొని చనుచుండెను. కపిభల్లూకాదుల సంతోషచేష్టలకు మేరయే లేకుండెను. ఒకరి నొకరు పైకెత్తుచుఁ బడఁద్రోయుచు నింకనెన్నియో వింత చర్యలను గావించుచుఁ బోవుచుండిరి. ముందరుగు నీలాదివాన రేంద్రులు మార్గమును శోధించుచుండిరి. శ్రీరామాదులు సేనామధ్యభాగమునం బోవుచుండిరి. శతవలి మహావీరుఁడు గాన సేననంతయుఁ గాపాడుచుండెను. అట్లే తక్కిన సేనాపతులు స్వకార్యముల జాగరూకులై యుండిరి. త్రోవయందుఁ గల గ్రామములకు బాధ కలుగకయుండునట్లు రామాజ్ఞ నెల్లరుం బోయిరి. ఆ రామసౌమిత్రులు గురుశుక్రులం గూడిన రవి చంద్రులం బోలియుండిరి. నిమిత్తశాస్త్రకోవిదుఁ డగుసౌమిత్రి నీవు రావణుం జంపి జానకిం దోడుకొని వేగమ యయోధ్యకుఁ బోఁగలవని యభినందించెను. భూమ్యాకాశములయం దేమి గొప్పశుభనిమిత్తములో యవియన్నియు నిపుడు తోఁచు చున్నవి. వాయువు సుఖస్పర్శము కలదియై మందమందముగ వీచుచున్నది. మృగపక్షు లివిగో మధురరుతము లాన

రించుచున్నవి. దిక్కులు ప్రసన్నములై యున్నవి. రవి నిర్మలుఁడై వెలుఁగుచున్నాఁడు. శుక్రుఁడు నీవెనుకఁ బాప గ్రహసంగతి లేక ప్రకాశించుచున్నాఁడు మహాత్ముఁడగు త్రిశంకువు విశ్వామిత్రసృష్టిలోని వశిష్ఠునితో నల రారుచున్నాఁడు. ఇక్ష్వాకువంశ శుభదాయకమగు విశాఖ యను తారలు రెండును క్రూరగ్రహసంపర్కము లేక వెలయు చున్నవి. రాక్షసుల నక్షత్రమగు మూల ధూమకేతుసంస్పృష్టమై పీడితమగుచున్నది. ఇది రక్షోవినాశహేతువనుట నిస్సంశయము. జలములు నిర్మలములై రుచిగలిగి యున్నవి. ఫల పూర్ణములై వనము లున్నవి. వృక్షములు ఋతుమర్యాదల మీఱక పుష్పించి పరిమళముల వెదఁజల్లుచున్నవి. మన యీ సేన దేవసైన్యమువలెఁ గనఁబడుచున్నది. ఈ శుభనిమిత్తములు మనకు సంతోషమును గలిగించుచున్నవి.

వానరసేన లపుడు భూమండలమంతయు నావరించి పోవుచున్న ట్లుండెను. నదుల నావానరులు దాఁటునపుడు సందు లేక వా రడ్డుపడఁగా విపరీతగతిం దిరిగి పాఱఁజొచ్చెను. ఫల వృక్షనిబిడము లగుకొండలు త్రోవనుండఁగాఁ దిరిగి దాఁటి కపులు పోయిరి. ఫలవృక్షకాననములు కనఁబడఁగా వాని నందుకొని మెసవవచ్చునని చెట్లక్రిందుగాఁ బోయిరి పరాక్రమము తెలుపుచు నొకరినొకరు ప్రోత్సహించుచుఁ బోవు చుండిరి. వార లొనరించుచేష్టలు వర్ణనాతీతములుగా నుం డెను. రేయింబవళ్లు నిలువనిపయనమును సాగించుచుండెను. యుద్ధోత్సాహము సీతాసందర్శనలాలసత్వము వారినట్లు త్వర పెట్టుచుండెను. వారు పోయిపోయి మలయాద్రిం జేరిరి.

శ్రీరాముఁడు సహ్యమలయాద్రులయందు నానావన నదీనిర్ఝరములం గాంచుచుం బోయెను. వానియందుఁ గల భూరుహవిశేషము లసంఖ్యాకములై యుండెను. సరస్సుల జలపక్షులు నేత్రానందకరములుగ నుండెను. మృగజాతు లన్నియని యెన్న నశక్యమై యుండెను. అందలి తేనెపట్టులం బట్టి పిండుకొని తేనెద్రావి వానరు లానందించిరి. అంత మహేంద్రాచలము చెంతం దోఁచెను. దానినెక్కఁగ సాగరము మహాభయంకరకల్లోలమాలలచే దుస్తరముగా నున్నట్లు వారికిం గనంబడియె. శ్రీరామాదులు దానిందిగి సాగరముచెంత కరిగిరి. అంత శ్రీరాముఁడు సుగ్రీవుం గాంచి రాజా! మనము సాగరముచెంత కరుదెంచితిమి. పూర్వమనుకొన్న యాలోచనము మనమిపుడు చేయవలయు. ఇంక మన కవలితీరము గానరాదు సుమా. జలమయమగు సాగరరూపమే మనకుం గనంబడును. ఉపాయము లేక యిది దాఁటఁ దరముగాదు. కాన నిందు విడియుదము. సేన లవలిగట్టు చేర నాలోచింపవలయు. సుగ్రీవా! సేనల నీతీరమున విడియింపుము. దీనిం దరించువిషయము నాలోచించునవసర మిపుడు గలిగినది. ఈ సేననువదలి యెవఁడు నెక్కడికిం బోఁగూడదు. శూరవానరులు చుట్టు తిరుగుచుండవలయు. దాఁగియుండి శత్రువు లవకాశము నెమకుచుందురు గాన నట్టి భయకారణములం బరికించుచుండవలయును.

సుగ్రీవుఁడు రాముని యాజ్ఞచొప్పునఁ గార్యము నిర్వర్తించెను. వారిధ్వనుల ముందు సాగరనిర్ఘోష మల్పముగ నుండెను. సేనయంతయు మూఁడువలయములుగా నమర్పఁబడి

రామకార్యనిర్వహణాభిలాషను లుప్పొంగుచుండ నుండెను. అవ్వలిగట్టు వచింపరానంత దవ్వైనది. అందు రాక్షసు లుందురు. వరుణున కది నివాసభూతము. యాదోనివహము భయము గలిగించుచుండును. అందలి జంతువిశేషముల నిర్ణ యింప ననంతునకే నశక్యము. దానిం గాంచగనే దాటఁ గలమా యని భీతి వానరులకుం దోఁచెను. సముద్రాకాశము లకు భేదము గానరాకయుండెను. దానివిహారము విచిత్రము. అందుఁగల వస్తురాజము లసంఖ్యాకములు. కావున దానిం గాంచి కపు లచ్చెరువందసాగిరి.

మహాత్ములారా! ఇందలివిశేషముల నెఱుంగందగును.

"యాం నివేదయసే లంకాం పురీం భీమస్య రక్షసః,
క్షిప్రమేనాం మథిష్యామి సత్యమేతద్బ్రవీమి తే." ౨

అని మూలము. భయంకరరావణునిలంకాపురమును దేనిని దెలిపితివో దానిని శీఘ్రమే విదళించెదనని నిజముగాఁ జెప్పు చున్నానని కదా రాముఁడు తెలిపెను. ఆతనిభావ మేమి? రావణుఁడు భయంకరుఁడని నీవు భావించితివి. అంతియకాని యది వాస్తవము కాదు. ఆతని లంకాపురమును ద్రచ్చెదను. ఏల? సారమును దేల్చుటకు. సార మేది? చావఁదగిన వారిని బొలి యించి స్థిరాంశభూతుఁడగు విభీషణుని దేల్చుటకు. ఇది సూనృతమని నీకుఁ దెలుపుచున్నాను. నీ వెట్లు నావరమునఁ జిరకాలజీవిగా నుండఁగలవో యావిభీషణుఁడు నాయను గ్రహమున నుండఁగలఁడని శ్రీరాము నాశయమని మనసు గ్రహించుట సముచితము.

"అస్మిన్ ముహూర్తే సుగ్రీవ ప్రయాణమభిరోచయే,
యుక్తో ముహూర్తో విజయః ప్రాప్తో మధ్యం దివాకరః." 3

అని మూలము. రావణవధకాలము వానికి ముందుగాఁ జావఁ దగిన రాక్షసులమృతికాలము రెండునెల లున్నదని సీత తెలిపెను. కర్త తాను గావలసియున్నదనియు సీతోపదేశమూలమునఁ దెలిసికొనియెను. ఇఁకఁ దడవుచేయరాదని యెంచెను. మధ్యాహ్నముగ నక్కాల ముండెను. ఇదియే విజయనామకముహూర్తము. అభిజిన్ముహూర్తమనియుఁ జెప్పుదురు. అని రామమూర్తి సుగ్రీవునకుఁ దెలియురీతి హనుమకుం దెలిపెను.

"కావేరీముదయే రవేస్సురపతేర్దేశం తు మధ్యందినే
సాయం వారుణదేశమంతకదిశం యాతాఽర్ధరాత్రే వ్రజేత్,
గోధూళావభిజిత్యుషస్యపి గతిస్సర్వాసు దిక్ష్వర్థదా
మందావాహోషసి కిం పునశ్చ గమనే లగ్నాదిసిద్ధిం వినా."

అని కాలామృతము తెల్పెడిని. అభిజిత్సర్వదోషఘ్నమ్ ॥ అను నానుడి యంద తెలిపింగినదియే. దండయాత్రకు విజయముహూర్త ముత్తమమని స్మృతులు దెల్పెడిని. కావున విజయనామకముహూర్తము శ్రీరామునకు రుచించెను. సూర్యుఁడు మధ్యాహ్నమును దెల్పుచున్నాఁ డనిరి. ఇట్టి యభిజిన్ముహూర్తము శుభప్రదమని తెలిపెను. ఈవిషయము సుగ్రీవాదులను దృష్టిపఱచుటకుఁ గాని వేఱుగాదు. సంకల్పసిద్ధుల కేముహూర్తమైన నొకటియే లోకాచారపరిపాలనము కూడ శ్రీరాముని ప్రవర్తనమునం దొకభాగము. కనుక

దానిని దెలిపెనుగాని తత్త్వమది గాదనియు ముక్తినొసంగఁ గోరి పోవఁ దలంచెననియు మన మెఱుంగవలయును.

"సీతా శ్రుత్వాభియానం మే ఆశామేష్యతి జీవితే,
జీవితాంతేఽమృతం స్పృష్ట్వా పీత్వా విషమివాతురః." ౫

అని మూలము. విషపానమున జీవితాంతము కాఁగా నపు డమృతస్పర్శము దొరకిన జీవితాశనొందునట్లు నా ప్రయాణ మాలకించి సీత ఆశను బొంది జీవించియుండఁ గలదు. కావున వేవేగ ప్రయాణము చేయవలయును. దీనిచే సుగ్రీవాదులు త్వరపడి ప్రయాణము సాగింతురనియే యుద్దేశము.

"ఉత్తరా ఫల్గునీ హ్యద్య శ్వస్తు హస్తేన యోక్ష్యతే,
అభిప్రయామ సుగ్రీవ సర్వానీకసమావృతాః." ౬

అని మూలము. రామునిజన్మనక్షత్రము పునర్వసువు. దానికి నుత్తరఫల్గుని యాఱవదగును. సాధనతార యని తారాబల ప్రకరణమున దానికిం బేరు. "సాధనం కార్యసాధనే" అని ప్రమాణము. ఈముహూర్తమునఁ బ్రయాణము విజయావహము. కాన నందఱం గూడి పయనము సాగింతమని శ్రీరాముఁ డనియె. రామచంద్రుఁడు భగవంతుఁ డగుటఁ దారాబల మేల చూడ నవసరముగలవాఁ డయ్యెనని యడుగుదురేమో. శాస్త్రయుక్తముగఁ బ్రాచీనాచారముల కవిరుద్ధముగఁ గదా యతనిప్రవృత్తి యుండును. శాస్త్రవిశ్వాస మెల్లరకుఁ గలిగించుటకే శ్రీరామావతారమని యెఱుంగవలయును గదా. మఱియు యాత్రావిషయమునఁ దారాబలము ముఖ్యముగా నెఱుంగవలయుననియు శ్రీరాముని యభి

ప్రాయము. ఏప్రకరణమున నెట్టిబలము తెలుపఁబడియుండునో యది యవ్విషయమునఁ బ్రధానమని తాత్పర్యము. ఇతర విషయములయం దది పనికిరాదని కాదు. దానియం దద్దాని వదలరాదనియే యిందలిసారమని మన మెఱుంగవలయు. శ్రీరామునినుడులన్నియు నిట్లే సూత్రరూపమున నుండును. మనము వానిని శిరసావహింపవలసి యుండును.

"నిమిత్తాని చ ధన్యాని యాని ప్రాదుర్భవంతి చ,
నిహత్య రావణం సీతామానయిష్యామి జానకీం. ౭
ఉపరిష్టాద్ధి నయనం స్ఫురమాణమిదం మమ,
విజయం సమనుప్రాప్తం శంసతీవ మనోరథం." ౮

అని మూలము. నా కనేకశుభనిమిత్తములు గలుగుచున్నవి. కార్యము ఫలించునని కదా శ్రీరామానుగ్రహము. రోగజములు చింతితములు గాని నిమిత్తములు ఫలించును. అవియే కర్మఫలముల నెఱింగించును. వానింబట్టియే నిమిత్తము లగుపడుచుండునని మన మెఱుంగవలయును నిమిత్తములు నిరర్థకము లనరాదని మన కీ రామోక్తి తేటపఱచుచున్నది.

"ఫలమూలవతా నీలశీతకాననవారిణా,
పథా మధుమతా చాశు సేనాం సేనాపతే నయ. ౧౧
దూషయేయుర్దురాత్మానః పథి మూలఫలోదకం,
రాక్షసాః పరిరక్షేథా స్తేభ్యస్త్వం నిత్యముద్యతః." ౧౨

అని మూలము. ఇందలి సేనాప్రస్థాననియమ మెఱుంగఁ దగినదియే. దుర్మతు లగురక్కసులు త్రోవయందుండు మూలఫలోదకముల విషాదులసంబంధమునఁ బాడుచేయుదురు

ఎచ్చరికగలిగి పరీక్షించుచుండవలయును. జలాదుల విషము కలిపిన వానిం ద్రావి శత్రుసేన విలయమొందునని పగవారట్లు చేయుదురు. కనుక జాగ్రత్తగా నుండుమని శ్రీరామమూర్తి తెలిపెను. ఈయపవిత్రాచార మాకాలమునం గొంద అవలంబించిన ట్లేర్పడుచున్నది. అట్టివారు దురాత్ములని శ్రీరాముం డాక్షేపించెను శత్రుక్షపణమున కనేకదుష్పథముల నవలంబించువా రున్నవారనియే నమ్మవచ్చును. జలముల విషము కలుపుట యిప్పుడు కలదు. తక్కిన యిప్పటిదారుణాచారము లప్పుడుకూడ నుండునని యూహింపవచ్చును. ఫలములయందు విషమునుచుట యిప్పటియాచారముల నొక్కటిగా వినలేదు. విషవాయుప్రసార మప్పుడున్నట్లు కానరాదు. ఏవో యొకటి రెండు హెచ్చుతగ్గులుగా నున్నను దురాచారము లక్కాలమున నున్నట్లే భావింపవలసియున్నది. భేద మేమనంగా నపుడు సేనలు కానివారల నింతగా బాధించువా రక్కాలమున నున్నయట్లు మాత్రము కానరాదు. మఱియు దురాచారులను దూషించువా రపుడుండిరి. దానిచే వారికి సహాయము తక్కువగా నుండెను. ఇప్పు డదిమాత్రము లేదనవచ్చునేమో. ఇతర విశేషము లెవ్వియుం గానము.

> "నిమ్నేషు వనదుర్గేషు వనేషు చ వనౌకసః,
> అభిప్లుత్యాభిపశ్యేయుః పరేషాం నిహితం బలం. ౧౩
> యచ్చ ఫల్గు బలం కించిత్తదత్రైవోపయుజ్యతాం,
> ఏతద్ధి కృత్యం ఘోరం నో విక్రమేణ ప్రయుధ్యతాం." ౧౪

అని మూలము. పరసేనలు వనదుర్గాదుల దాఁగియుండి తటాలునఁ దమశత్రుబలములం జంపుట యిప్పటియాచారముల

యం బోకఁడు. ఇది యిప్పటియలవాటులలో సామాన్యము. అట్టివానిని గనుఁగొనఁదగు విమానము లిపుడున్నవి. వానరులు లోనగువా రాకాశగమనముచేయువా రపుడుండిరి. భేద మేమియుఁ గానరాదు. నిస్సారమగు బలమున్న నిందే యనువుమని శ్రీరాముఁ డనియె. బక్కకోఁతులు పోరాడఁ జాలవు కదా. తెగించి పోరాడఁ బ్రోత్సహించుట యప్పుడు నిప్పుడు నున్న యలవాటు లే. దీనింబట్టిచూడ రామాయణము భారతయుద్ధమునకంటె నత్యంతప్రాచీనమనియే యేప్పుడును గాని నిన్న గాక మొన్న యన్నట్టిది కాదు. ఈయలవాట్లు పెక్కు భారతయుద్ధకాలమునఁ గానరావు.

> "రామస్య శాసనం జ్ఞాత్వా భీమకోపస్య భీతవత్ ౩౯
> వర్జయన్ నగరాభ్యాశాం స్తథా జనపదానపి,
> సాగరౌఘనిభం భీమం తద్వానరబలం మహాత్." ౪౦

అని మూలము. ఇది యాకాలమునఁగల సదాచారము. త్రోవను జనుసేనలవలన నగరగ్రామాదుల కెట్టిపీడయుఁ గలుగరాదని రాజశాసన ముండెను.

> "ఉశనాశ్చ ప్రసన్నార్చిరను త్వాం భార్గవో గతః,
> బ్రహ్మరాశిర్విశుద్ధశ్చ సిద్ధాశ్చ పరమర్షయః. ౪౯
> అర్చిష్మంతః ప్రకాశంతే ధ్రువం సర్వే ప్రదక్షిణం,"

అని మూలము.

"భార్గవోగత ఇత్యనేనావతారకాలే జాతకఫలసూచనవద్రామస్యానుకూలగోచారఫలం దర్శయతి. విపరీతఫలం రాక్షసానాం చ. తథా హి.—— కిష్కింధాతః ఆగ్నేయదిగ్వర్తినీం లంకాం ప్రతి గచ్ఛతో రామస్యాను

కూల శ్శుక్ర ఇత్యుచ్యతే. సూర్యస్థరాశేః పురోరాశిస్థో హి భవతి శుక్రః. సూర్యశ్చ తదానీం మీనస్థః. 'ఉత్తరాఫల్గునీ హ్య'ద్యేతి ప్రయాణదినకథనాత్. ఫాల్గునపౌర్ణమాస్యాం హి రామస్య దండయాత్రేతి పూర్వముక్తం. తథా చ శుక్రో మేషస్థః. అతో రామస్య కర్కాటకరాశేర్దశమో హి దశమోఽనుకూలః. పూర్వోక్తదిగ్వర్తినీం లంకాం ప్రతి గచ్ఛతో రామస్య పశ్చాత్ స్థితత్వాచ్చ శుక్రోఽనుకూల ఏవ. శుక్రానుకూల్యోక్తిః బృహస్పత్యాద్యానుకూల్యోపలక్షణం. సహ్యావతారకాలే కర్కాటకస్థః. తదపేక్షయాష్టత్రింశద్వర్షం యుద్ధయాత్రాకాలః. తథా చ త్రిరావృత్త్యా షట్త్రింశద్వర్షేషు గతేషు రామస్యాష్టత్రింశద్వర్షే యుద్ధారంభే గురోస్సింహస్థితిస్సిద్ధా. గురుద్వితీయతా రామస్యానుకూలా. శనిశ్చావతారకాలే తులావర్గోత్తమస్థః. ద్వితీయావృత్తౌ తులావృశ్చికయోః పంచవర్షేణ గతయోస్సార్ధవర్షద్వయేనాతీతేన ధనురతీత్య తదానీం మకరస్థితియోగ్యోఽపి కథంచిద్ధనుర్వర్గోత్తమస్థ ఏవ శనిః. రాహుస్తు అవతారకాలే సింహస్థః. తతోఽష్టత్రింశద్వర్షేఽస్మిన్ కటకస్థితియోగ్యోఽప్యతిచారాదిభిర్మిథునస్థః. తతస్సప్తమే ధనుషి కేతుః. ఉక్తం చాత్రాపి.—'మూలో మూలపతేః స్పృష్ట్వా ధనుష్యతి ధూమకేతు'నేతి. ధూమాకారః కేతుర్ధూమకేతుః. తథా చ ధనుషి శనికేతూ రామస్య షష్ఠస్థావనుకూలౌ. అంగారకస్తు రామరావణయుద్ధప్రసంగే.—'ఆక్రమ్యాంగారకస్తస్థౌ విశాఖేఽపి చాంబర'ఇత్యుక్త్యా విశాఖాచతుర్థపాదే వృశ్చికరాశౌ తిష్ఠతి. రామస్య పంచమాంగారకత్వఫలమిదం. యదేతచ్ఛస్త్రబంధరుధిరమోహాది. బుధస్య ప్రతిమాసం రవిహితస్థత్వయోగేఽపి రామరావణయుద్ధప్రసంగే.—'ప్రాజాపత్యం చ నక్షత్రం రోహిణీం శశినః ప్రియాం, సమాక్రమ్య బుధస్తస్థౌ ప్రజానామశుభావహః' ఇత్యుక్తం. ప్రజానామశుభావహత్వమతిచారవశాదేవ. స చ రామస్య దశమస్థోఽనుకూలః. చంద్రశ్చ ఉత్తరఫల్గునీస్థత్వాత్కన్యాస్థః. అతస్స తృతీయచంద్రో రామస్యానుకూలః. సూర్యో నవమస్థో రామస్యానుకూలః. రాహుస్తు

మిథునస్థత్వాద్ద్వాదశస్థ ఇతి కించిద్బాధకః. రాక్షసానామిదం సర్వం విప
రీతం. తథాహి.—రాక్షసానాం హి నక్షత్రం మూలం.తథా చ ధనూరాశిః.
తదపేక్షయా పంచమస్థశ్శుక్రః ప్రతికూలః. జన్మరాశిస్థౌ శనికేతూ చ
ప్రతికూలౌ. రాహుస్తు సప్తమస్థః కించిదనుకూలః. ద్వాదశస్థోఽంగారకశ్చ
ప్రతికూలః. గురుస్తు నవమస్థోఽనుకూలః. చతుర్థస్థస్సూర్యః పంచమస్థో
బుధశ్చ నానుకూలౌ. దశమస్థశ్చంద్రః కించిదనుకూలః. ఏవం ప్రాయేణ
గ్రహగోచారఫలం రాక్షసానాం విపరీతమేవేతి."

అని గోవిందరాజులు వ్రాసిరి. విద్వద్వరేణ్యులు గోవిందరాజు
లనుటకు సంశయమే లేదు. కాని "న హి సర్వస్సర్వం జానాతి"
యను ప్రాచీనోక్తి నాలోచింప వీరికి జ్యోతిశ్శాస్త్రప్రవేశము
కించిత్తైన లేదని తేటపడును. అట్టిచో వీరిట్టు లసంగతప్రసంగ
మనునట్లు వ్రాయుట మంచిది కాదు. ఈ వ్రాఁతనుబట్టి
చూడఁగా గ్రహగతులను గూడ నెఱుంగందగిన యోగ్యత
కూడ వీరికి లేదని స్పష్టమగును. కాని దుర్మతాభిమానము
మెండు. తోఁచినట్లు వ్రాయుట యది యెట్టిదని యోజింపకుం
డుట వీరికి నైజములనక తప్పినది కాదు. విధిలేక యీమాట
యనవలసివచ్చినందులకు విచారించెదను. నీకేల యీ పరితాప
మందురేమో మతాంతరు లాక్షేపింతురన్న యనుతాపమే
యిట్లు వ్రాయఁ బురికొల్పినదనియు గోవిందరాజులయందు
నాకత్యంతప్రపత్తి గలదనియుఁ బాఠకులు తెలియవలయును.
ఏవో నాలుగుమాటలు వ్రాయక తెగించి బారెడు తోఁచి
నట్లెల్ల వ్రాసిరి. ఇంచుకంతయైన యోజించి వ్రాసిన ట్లగపడదు.
ఆవిధము మీకెఱింగింపం దలంచి నాలుగుమాటలు వ్రాసెద.
రామచంద్రునకు గోచారఫలము వాల్మీకి తెలిపినట్లు వ్రాసిరి.

శ్రీరామునకు జన్మనక్షత్రము పునర్వసు ననునది. అందు నాల్గవపాదమున రామావతారము. కర్కాటకరాశి గురుచంద్రు లున్నట్లు చెప్పఁబడినది కదా. యుద్ధయాత్రారంభము ఫాల్గుణ పూర్ణిమయందని తెల్పిరి. అది యించుకయుక్తమని యంగీకరింపవచ్చును. సూర్యుఁడు మీనమం దుండెను. శుక్రుఁడు మేషమం దుండెను. ఆగ్నేయభాగమున లంక యున్నది. కావునఁ బ్రతిభార్గవదోషము లేదు. దీనికే యీ పరిశ్రమము. పోనిండు. ఈఫలము శ్రీరామున కనుకూలము. రాక్షసులకుఁ బ్రతికూల మనిరి. ఇది యాకాశరామన్న పంచాంగములోనిది. ఆవిధమునఁ గలవిచిత్రమును దెల్పెదను. కర్కాటకరాశికి మేషరాశి పదియగును. అందున్న శుక్రుఁడు శుభుఁడు. అని నిర్ణయించిరి. గోచారమును విమర్శించునపుడు దశమమున శుక్రుఁడున్న పనికలుగునని యే చెప్పవలయును. వీరు అనుకూలమని తెల్పిరి. శాస్త్ర మెట్లున్నను వీరి యాశీర్వాదమునుబట్టి యట్లగునవలయుఁ గాని గత్యంతరము లేదు. రక్కసులను గోచారము వ్రాయునపుడు "పంచమస్థ శ్శుక్రః ప్రతికూలః" అనుకూలుఁడే యనవలయుఁ గాని ప్రతికూలుఁ డనరాదు. రాక్షసుల్పైఁ గోపమున్నను గుండ నిట్లసంగతముగ వ్రాయరాదు. శుక్రుఁడు మంచివాఁడనుట బృహస్పతి యొద లగుటా రిష్టి యనుటకు సుపలక్షణమఁట. ఈశాస్త్ర మందము. ఒక్కముఖ్యాంశమును వ్రాయుదును బరికింపుఁడు. శ్రీరామునకు జన్మనక్షత్రమును గ్రహించిరి. రాక్షసులకు నామనక్షత్రమునైన గ్రహింపక అసురదేవతాకమగు మూలానక్షత్రమును గ్రహించిరి. రామరావణులకు నామనక్షత్ర మొక్క

టియే గాని రెండు గావు. ఒకరికి జన్మనక్షత్రము రెండనవారి
కది తెలియకయున్న నామనక్షత్రమునైన గ్రహింపందగి
యుండు. అట్లుగాక మూలనక్షత్రమును గ్రహించుట యసం
గతము. దీనింబట్టియే వీరికి జ్యోతిశ్శాస్త్రమన నెద్దియో తెలి
యదని యేర్పడును.

శ్రీరాముని జన్మకాలము మొదలు ముప్పదెనిమిదవ
యేఁట యుద్ధయాత్రారంభమని తెలిపిరి. జన్మకాలమునఁ
గర్కాటకమందున్న బృహస్పతి ముప్పదాఱువత్సరములకు
మరలఁ గర్కాటకమునకు వచ్చును. ముప్పదెనిమిదవయేఁట
యుద్ధారంభము కాన సింహరాశియందు గురువున్నట్లు సిద్ధాంత
మనిరి. ముప్పదేడవసంవత్సరమును మార్గారము మ్రింగిన
దేమో. ద్వితీయస్థగురువు రామున కనుకూలుఁ డనుటకుఁ
బడినబాము లివి యని తేలెడిని. ఈ ముప్పదెనిమిదివత్సరము
లలో నతిచార వక్రస్తంభనాదులు కలుగలేదు కాఁబోలు.
వీరావిధమును శాస్త్రమునఁ గాక దివ్యజ్ఞానమున నెఱింగి
యుందురు. ఎట్లో సింహమునకు వచ్చెననియే యంగీకరింతము.
శని రామావతారకాలమున తులారాశి వర్గోత్తమాంశమున
నుండెనఁట. ముప్పదియేండ్లకు మరలఁ దులారాశిం జేరఁగా
రెండవతడవ తులావృశ్చికములలో నైదేండ్లు నివసింపఁగా
ధనూరాశియందు సార్ధవర్షద్వయము గడువ నాయుద్ధకాల
మున మకరరాశియందుండ నర్హుఁడే యైన నదెట్లొ ధనూరాశి
వర్గోత్తమస్థితి నొందెనఁట. సెబాస్. మెచ్చవచ్చు నీజ్యోస్యము.
ఇంతకంటె దైవవశమున నీ ముప్పదెనిమిది సంవత్సరములు
ధనుస్సునందే యుండెనన్న వీరిని దండించువా రెవరు? అనఁగా

శని శుభఫలము నిచ్చునని చెప్పుటకుం బడిన పాట్లివి. ఇంక నున్నది విచిత్రము. పాఠకు లరయుదురు గాక. రాహువు శ్రీరామ జననకాలమున సింహమం దుండెనంట. ముప్పదెని మిదివత్సరములకు మరల కర్కాటకమందుండ నర్హుండే యైన నతిచారాదులవలన మిథునమం దుండెనంట. అతిచారాదుల వలన నింకను వేగముగాం బరుగిడవలయును గదా. కన్య యందో తులారాశియందో యుండవలసినవాండు. ఇంతలో వక్రము హెచ్చుగా వచ్చి మిథునమునం గదలకయుండ బంధించెను. అయ్యో! వీరికి గ్రహగతులమాటయే తెలియదు. రాహుకేతువుల కతిచారాదు లెక్కడివి? ఇపుడుండుసృష్టిలో నట్టివి లేవు. వీరు జ్ఞానదృష్టివలనం బూర్వపుసృష్టి నెఱింగి రేమో. ఆసృష్టిలో రాహుకేతువు లుండి వక్రాతిచారములు గలవారలై యుండి రేమో. స్వామివారి దెంతటిపాండిత్యము? "విపరీతపుం బులుసుకూర విస్తరిమ్రింగెఁ" అన్నట్లున్నది. వెఱ్ఱి ముదిరినది. రోంకలి తలకుం జుట్టుమన్న వానికి వీరికి నెంత భేదమో? రాహువునకు సప్తమమునం గేతు వుండెను. ఇది యెట్లో పాకమునం బడినది.

అంగారకుండు రామరావణయుద్ధప్రసంగమునందు. విశాఖా చతుర్థపాదమున వృశ్చికరాశియం దుండెనంట. దాని ఫలమే బ్రహ్మాస్త్రబంధనాదులంట పై శుభగ్రహము లీయొక్క యశుభఫలమును రాకుండం జేయంజాలక పోయిరి గదా. ఔరా! ఎంతచిత్రము. బుధునకుం బ్రతిమాసమునందు రోహిణీ స్థత్వయోగ మున్నను రామరావణయుద్ధప్రసంగమందు "ప్రాజాపత్యం చ నక్షత్రం రోహిణీం శశినః ప్రియాం, సమా.

క్రమ్య బుధ స్తథా ప్రజానామశుభావహాః" అను ప్రమాణ మునుబట్టి యశుభావహుండే యఁట. ప్రజల కశుభావహత్వ మతిచారవశమువలననే యఁట. అతఁడు రామునకు దశమస్థుఁ డగుట ననుకూలుండఁట. చంద్రుఁడు కన్యారాశియం దుండె నఁట. తృతీయచంద్రుఁ డనుకూలుండే అఁట. తొమ్మిదింటనుండు సూర్యుఁడు రామున కనుకూలుఁ డఁట. రాహువు పండ్రెండవ యింట నుండుటం జేసి యిసుమంత బాధకుఁడఁట. ఇది రాక్షసుల కెంతయు విపరీతమఁట. రాక్షసులకు మూల నక్షత్రమఁట. అప్పుడు క్షత్రియులకు నేదో. ధనూరాశి వారలకుఁ జంద్ర రాశియఁట. పంచమస్థానమందున్న శుక్రుఁడు ప్రతికూలుఁడఁట. ఇదియు నసంగతమే. అత్యంతానుకూలుఁడే యనవలయు. జన్మ రాశియందుండు శనికేతువులు ప్రతికూలురే యఁట. సప్తమ మందున్న రాహువు రవంత యనుకూలుఁడఁట. ప్రతికూలుఁడే యనవలయు. పండ్రెండవ యింటనుండు నంగారకుఁడు ప్రతి కూలుఁడే. గురువు నవమస్థానమునం దుండుటచే ననుకూలుఁ డఁట. "గ్రుడ్డివాని చేతిరాయి" యన్నట్లు పడిన దీమాట. చతుర్థపంచమస్థితులగు రవిబుధులు ప్రతికూలురే యఁట. రామునకు గోచారఫలము చెప్పునపుడు రోహిణియందు బుధుఁ డతిచారమున నుండెననియుఁ బూర్వరాశియగు మేష మందే యతఁ డున్నట్లు గ్రహింపవలయుననియు నాచార్యుల యాశయము. దశమస్థితచంద్రుఁడు రవంత యనుకూలుఁడఁట. ఇది రామరాక్షస గోచారఫలమని గోవిందరాజులు వ్రాసిరి. ఉళక్కి సంతర్పణమునకుఁ బెద్ద యరఁటియాకులన్నట్టు లీబ్రాస్య మునకు ఫలము గలుగుననుటకన్న వే తెద్దియును దగదు.

ప్రవేశము లేని శాస్త్రములం జొచ్చి విమర్శించి వ్రాయుట పరిహాసాస్పదము. ఇందుఁ బ్రవేశము లేనంతమాత్రమున వీరి పాండిత్యమునకుఁ గొఱంతయా.

"నక్షత్ర తారాగ్రహసంకులాపి జ్యోతిష్మతీచంద్రమసైవ రాత్రిః."

అను రఘువంశషష్ఠసర్గగతశ్లోకమునకు మల్లినాథసూరి వ్యాఖ్య వ్రాయుచు. "నక్షత్రైరశ్విన్యాదిభిః తారాభిస్సాధారణైర్జ్యోతిర్భిః" అని వ్రాసిరి కాళిదాసమహాకవి తారావళి యను నొక సిద్ధాంతగ్రంథమును జ్యోతిశ్శాస్త్రమున వ్రాసెను. వారిభావ మెద్దియని యూహింపవలయును. సూరిగారికి జ్యోతిశ్శాస్త్ర ప్రవేశము శూన్యము. కావునఁ బునరుక్తితాదోషమును నివారింపఁదలఁచి దయపూని యట్లు వ్రాసిరి. కాళిదాసుభావ మదికాదు. నక్షత్రము లశ్విన్యాదులు. తారాగ్రహములు= అంగారక ప్రభృతులు. "తారాః కారాశ్చ తే గ్రహాశ్చ=తారాగ్రహాః" అని వ్యుత్పత్తి. పంచతారాగ్రహాస్పష్టీకరణమని సిద్ధాంతమున నొకఖండము కలదు. నక్షత్రములు కుజాదిపంచగ్రహములు ప్రకాశించుచున్నను జంద్రునిచేతనే రాత్రి జ్యోతిష్మతి యనఁబడునని భావము. ఇట్లే గోవిందరాజులును విమర్శించిరని మన మూహింపవలయును.

ఇందు శుక్రునకు బ్రహ్మారాశిః విశుద్ధశ్చ=అను రెండు విశేషణములు చేర్పఁబడినవి. సకలవేదవేత్తయనియుఁ బాపగ్రహసంబంధ రహితుఁడనియు వాని యర్థములు. తారాగ్రహములలో శుక్రుఁడు విశేషకిరణములు గలవాఁడు.

'ఉదక్స్థో దక్షిణస్థో వా భార్గవః ప్రాయశో జయీ."

అని సూర్యసిద్ధాంతమునఁ గలదు. గ్రహయుద్ధములు ప్రాయిక

ముగా జరుగును. అందు శుక్రుఁడు తఱచుగా విజయియే. కావునఁ గిరణబాహుళ్యము గలవాఁడని యేర్పడును. అట్టి శుక్రుఁడు రామున కనుకూలుఁడని చెప్పఁబడినది.

"యత్తు పురశ్శుక్రాభావో ధ్వనిత ఇతి తన్న. దక్షిణోత్తరగంతౄ ణాం పురశ్శుక్రప్రసక్తే రభావాత్."

అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి. పురశ్శుక్రదోషమే దక్షిణోత్తరదిక్కులకు వెడలువారలకుం గలుగదని. ఇది యెంతయు యుక్తమే.సప్తర్షులు ధ్రువునకుఁ బ్రదక్షిణము చేయుచున్నారు. ఈ విషయమునఁ జాల వ్రాయవలసి యుండును గ్రంథ విస్తరభీతి మానితిని.

"త్రిశంకుర్విమలో భాతి రాజర్షి స్సపురోహితః. ౫౦
పితామహవరోఽస్మాక మిక్ష్వాకూణాం మహాత్మనాం,"

అని మూలము విశ్వామిత్రుఁడు త్రిశంకుస్వర్గ మనుదాని నిర్మించెననియు, నందు సప్తర్షులు గలరనియు, నందు వసిష్ఠ మహర్షి యుఁ గలఁడనియు నెఱుంగందగు. మధ్యాహ్నకాల మునఁ బయనము సాగించి పోవుచుండఁగా నెపుడో లక్ష్మణుఁ డీనిమిత్తములం దెల్పి శ్రీరాము నానందింపఁ జేసెను.

"నైరృతం నైరృతానాం చ నక్షత్రమభిపీడ్యతే. ౫౨
మూలో మూలవతా స్పృష్టో ధూప్యతే ధూమకేతునా.
సర్వం చైతద్వినాశాయ రాక్షసానాముపస్థితం. ౫౩

అని మూలము.అసురవినాశ హేతు విదియని లక్ష్మణుఁడు తెల్పు చున్నాఁడు. పూర్వపువిషయమున కిది యన్వయింపదు. రామ రావణులకు బలాబలములు చూడవలయును గాని యొక్క

నికి వేఱొకజాతికి బలము చూడరాదు కదా. మూలనక్ష
త్రము చెంతనున్న యుత్పాతగ్రహముచే స్పృశింపఁబడి
తపింపఁ జేయఁబడుచున్నది. ఇదంతయు రాక్షసకులవినాశన
సూచకము. ఇవన్నియు యుద్ధోత్సాహమును వృద్ధిచేయునవి.
లక్ష్మణుఁడు శ్రీరామునకుం దెల్పెననియే మనము గ్రహింప
వలయు. ఇది విధిశాస్త్రము కాదనియు, నర్థవాదశాస్త్రమనియు
మన మెఱుంగందగు. ఏలయనఁగా :

"ప్రసన్నాస్సురసాశ్చాపో వనాని ఫలవంతి చ. ౫౪
ప్రవాంత్యభ్యధికం గంధాన్ యథర్తుకుసుమా ద్రుమాః,

అను నీమూలము విధిశాస్త్ర మనవచ్చునా? నిమిత్తములన్నియు
నిట్టివే. ఒకప్పుడు ఫలవంతము లగుటయుఁ గలదు. కాని శకు
నాదులన్నియు ఫలవంతములే యన వలనుపడదు.

"సహ్యాపర్వతమాసేదుర్మలయం చ మహీధరం." ౭౨

అని మూలము. "సహ్యమలయౌ నామ మార్గవర్తినౌ కౌచిత్ప
ర్వతౌ" అని గోవిందరాజులు. సహ్యాపర్వతము మలయపర్వ
తము దగ్గరఁ గలదా యనునది యొక ప్రశ్నము.

"స నిర్విశ్య యథాకామం తటేష్వాలీఢచందనౌ,
స్తనావివ దిశస్తస్యాశ్శైలౌ మలయదర్దురౌ. ౫౧
ఆసహ్యవిక్రమస్సహ్యం దూరాన్ముక్తముదన్వతా,
నితంబమివ మేదిన్యాస్స్రస్తాంశుకమలంఘయత్." ౫౨

రఘు. ౪ సర్గము.

దీనింబట్టి చూడఁగా మలయదర్దురములు సహ్యాపర్వతము

వరుసగా నుండినట్లు తేలుచున్నది. "సహ్యాః పర్వతవిశేషః. సతు పూనాఖ్యదేశస్య ఉత్తరపశ్చిమదిశి వర్తతే" అని శబ్దకల్పద్రుమమునఁ గలదు. పునానగరమునకు వాయవ్యభాగమునఁ గల యీకొండ దక్షిణసముద్రప్రాంతమున నుండుట యించుక విచిత్రముగనే తోఁచు. అందు నీ పేరుగలకొండ వేఱొండుండవచ్చు ననుకొనుట మంచిది. ఇఁకఁ దరువాతికథను బరిశీలింతము.

## శ్రీరాముఁడు సాగరదర్శనమున సీతం దలంచి వగచుట.

*నలుండు సేనలకు రక్షకుల నియమించి సాగరోత్తర తీరమున సేనల సుఖముగా విడియించెను. మైందద్వివిదాదు లగు వానరవర్యు లిరువురు సేనచుట్టు తిరుగుచుండిరి. సేనలు విడియఁగనే శ్రీరాముఁడు తన్ను సేవించుచుఁ బ్రక్కనున్న సౌమిత్రిం గని యిట్లనియె. సోదరా! కాలము గడువంగడువ శోకము కృశించునని లోకు లందురు. సీతావిషయకమగు నాశోక మట్టిది కాదు సుమా. ప్రతిక్షణము వృద్ధినొందు చున్నది. నాహృదయేశ్వరి దవ్వున నున్నదనుదుఃఖము నాకు లేదు. రాక్షసాపహృత యయ్యెఁ గదా యనియు దుఃఖము నాకుఁ గల్గదు. ఏలనఁగా నచ్చటి కరిగి వానిం జంపి తేఁగలను గదా. కాని యాకోమలాంగి నాచెంత నుండి సుఖింపఁజాలక పోయితింగదా యనియే వగచుచున్నాను. అని వాయువుం దిలకించి పవమానుఁడా! నాప్రాణేశ్వరి యుండుకడకుం జని

* ఇది యైదవసర్గమునఁ గల కథ.

వీవుమా. ఆమెను స్పృశించి వచ్చి నన్నును స్పృశింపుము. సీతాసంస్పర్శము వేఱొకవిధమున నాకుం గల్గదు. ఆదేవి శీతాంశుని జూడఁగా వాని నేనుం గాంచఁగా నామూలమున నాచెలువను నేఁ గాంచిన ట్లగును. నీవల్లె యామెను ముట్టఁగా నేను నిన్నుఁ దాఁకఁగా నామెం దాఁకినట్టులగు. ఇట్లు చంద్రవశమున మాకు దర్శనమున్నట్లు స్పర్శనము నీ వశమం దున్నది. సకలభోగముల వదలి యడవికి నావెంట వచ్చిన నాహృదయేశ్వరి దుష్టమతి యొకఁడు తన్నుఁ గొని పోవుచుండఁగాఁ దనపాతివ్రత్య హవ్యవహునిచేఁ గాల్పఁగల దయ్యు నాయందలి భక్తిం జేసి నన్నే పరమగతిగా నెన్ని నాథా యని విలపించుచుఁ బలికిన పలుకులు హృదయమున నాఁటి విషము ద్రాగినట్లు శరీరమును దహించుచున్నది. మన్మథాగ్నిహోత్రుఁడు ప్రియావియోగేంధనములుగా తచ్చింతయే జ్వాలగా నాశరీరమును రేయింబవళ్లు కాలభేదము లేక దహించుచున్నది. ఈ మన్మథతాపమో వేఱొకవిధమునఁ దీఱదు. నిన్నుఁ జూడఁగాఁ గొంత తలంపునకు వచ్చుచున్నది. కాన నిన్ను వదలి సాగరముం జొచ్చి శయనించెదను. జలముల శయనింతునేని యీమన్మథుఁ డత్తఱి నన్ను మిగులఁ గష్టముమీఁదఁగాని గాల్పలేక మందగించు. సీత బ్రదికి యున్నదని తెలిసెను గదా. నేను నాప్రేయసియు నొకభూమినే యాశ్రయించియున్న వారము కదా. ఇదియొక్కటియే దుఃఖాక్రాంతుఁడనైన నాకుఁ బ్రాణములు నిలుపుకొనుటకు నిత్తఱిని మంచిసాధన మైనది. ఈరీతిగా నాజానకి నాతోడ నేకశయ్యయం దుండునట్లు ఏకభూమియందు బ్రదికియున్నది కదా అను

నూఱట తోఁపఁగా నామెను వదలి బ్రదికియుండుటకు శక్య మైనది. కాని యదియే లేనిచో జీవింప శక్యమెట్టు లగును? సీతాకుశలవార్తాశ్రవణమున నీళ్లులేనిపాలము నీళ్లుపాఱిన పాలమునందలి తేమ సోఁకుటం జేసి యెండిపోవక యుండురీతి నేనును బ్రదికియున్నాఁడఁ జుమీ. లక్ష్మణా! రాక్షసుల గెలిచి యావిరిబోఁడి నెప్పుడు కాంతునో ఎపుడు తద్దర్శనమున నానం దింతునో. ఆసీత జనకమహారాజపుత్త్రిక యయ్యు నాకుఁ బ్రేయసి యయ్యు దశరథభూజాని కోడలయ్యు భీతికరరాక్షస స్త్రీలనడుమఁ జిక్కి కుందుచున్నదేల! ఆపురంధ్రీమణి యెప్పుడు నాముందు నిలువఁగా నేఁ జూడఁగలను? ఆమె నైజముగాఁ గోమలాంగి. దేశకాలములు వ్యత్యస్తములై విరుద్ధఫలప్రద ములు కాఁగా శోకోపవాసములచే మఱింత చిక్కియుండఁ గలదు. సౌమిత్రీ! యిది నిజమే సుమీ. రావణునివక్షమున నారాచము నాటి జానకిం బిలుచుకొని యీదుఃఖము నెప్పుడు వదలివేయఁ గలను? ఎప్పు డాపూజ్యురాలు నాచెంత నానంద బాష్పములఁ గురిపింపఁ గలదు? అని విలపించెను. అత్తఱి సూర్యుఁ డస్తాద్రిదరికిం బోయెను. సౌమిత్త్రి తగురీతి నాశ్వా సింపక సీతాగతహృదయుఁడై సంధ్యావందనము గావించెను.

మహాత్ములారా! ఈభాగమున ననేక హృదయంగమ విశేషము లున్నవి. వాని నెమకి తెలిసికొందము.

“శోకశ్చ కిల కాలేన గచ్ఛతా హ్యపగచ్ఛతి,
మమ చాపశ్యతః కాంతామహన్యహని వర్ధతే.” ౪

అని మూలము. దుఃఖ మెట్టిదైనను గాలము గడువఁగాఁ దగ్గి పోవును—అని లోకప్రవాదము కలదు. నా కట్లుగాక దిన

దినాభివృద్ధి నొందుచున్నది. అని రామచంద్రుఁ డనియె. లోక మున నన్యోన్యసంబంధము ధనాదికమునుబట్టి యుండును. ప్రకృతిపురుషుల కుండుసంబంధ మట్టిది కాదు. ఇది శాశ్వ తము. ధనాదిమూలకము గాదు. కావున నాకుఁ జింత హెచ్చుచున్నదనియెను. అనఁగా నెల్ల రెఱుంగునట్లు మేము సన్నిధి నుండినఁగాని యీశోకము పోవదు. రావణుని జంపి తచ్చాపఫలము నివర్తింపఁ జేయవలయునన్న చింతయని భావము. ఇందలితత్త్వమును శ్రీరామమూర్తి తెలుపు చున్నాఁడు.

"న మే దుఃఖం ప్రియా దూరే న మే దుఃఖం హృతేతి వా,
ఏతదేవానుశోచామి వయోఽస్యా హ్యతివర్తతే." ౫

అని మూలము. సీత దూరమం దున్నదను దుఃఖము నాకు లేదు. రావణుఁ డెత్తుకొనిపోయెనన్న దుఃఖము కూడ లేదు. అనఁగా భావ మేమి? వాస్తవమాలోచింప నాజానకి నాకడనే యున్నది. రావణాపహృత యగునది ఛాయ. కాన నాకా దుఃఖమే లేదు. దాంపత్యసుఖము లేదన్నదే దుఃఖము. ఎల్ల రెఱుంగ సీతారాము లిం దున్నవారనునది లేకపోయెఁ గదా యనియే నా కిపుడుండు వగపని శ్రీరాముఁడు తత్త్వముం దెలిపెను.

"వాహి వాత యతః కాంతా తాం స్పృష్ట్వా మామపి స్పృశ,
త్వయి మే గాత్రసంస్పర్శశ్చంద్రే దృష్టిసమాగమః." ౬

అని మూలము. సుఖదుఃఖములు మనోభావముల ననుసరించి యుండునని శ్రీరాముఁడు తెలుపుచున్నాఁడు. గాలి యిష్ట

మగువస్తువునుండి వచ్చినపుడే సుఖస్పర్శము కలదిగ నుండును. చంద్రుఁడుగూడ నిట్లే. ఎల్లవస్తువులు మనోభావము ననుసరించి సుఖదుఃఖదముగాఁ దోఁచుచుండునని భావము. ఇష్టజనతాడనము కూడఁ బ్రీతిపూర్వకమే యని భావించు టెల్లరెఱింగినదియే కాని క్రొత్తది కాదు.

"అవగాహ్యార్ణవం స్వప్స్యే సౌమిత్రే భవతా వినా,
కథంచిత్ప్రజ్వలన్కామస్సమాసుప్తం జలే దహేత్." ౯

అని మూలము. నిన్ను వదలి లక్ష్మణా! సముద్రజలములయందు శయనించెదను. నన్నపుడు కామాగ్ని మెల్లఁగాఁ గాల్చును. అనఁగా భావమేమి? నీవు చెంతనుండుటంబట్టి కాంతామణి లేదని వగతును. కాని వాస్తవ మది కాదు. సాగరమున శయనింతును. అది నాకు శయ్యయే. కేశవుఁ డనఁగా నర్థమేమి? ప్రకృతిని హృదయమున నిడుకొని శయనించుతఱి సాగరమే శయ్యయగునని భావము. ఇపుడు నీవు చెంత నున్నందున ననఁగా మానవజన్మసంబంధాదులచేత నది పొసఁగదు. కావున నందే శయనింతునని తన పరమపురుషత్వమును దేటపఱచెను.

"బహ్వేతత్కామయానస్య శక్యమేతేన జీవితుం,
యదహం సా చ వామోరూరేకాం ధరణిమాశ్రితౌ." ౧౦

అని మూలము. ప్రాతీతికార్థ ముక్తపూర్వము. దీనితాత్పర్య మేమి? ఆసీతయు నేను నొక్కభూమినే యాశ్రయించియున్నవార మనునదియే నే జీవింపఁ గారణము. అట్లులేకున్న నారూపమే యగపడదని కదా. అనఁగా లక్ష్మణా! నే నేభూమి నాశ్రయించి యున్నవాఁడనో ఆమెయు నాభూమినే యాశ్ర

యించి యున్నది. మేమిరువురమొక్కటావుననే యున్న వారము. కావుననే నేను జీవించియుండఁ గారణము. నే నున్నచోటనే యామె యున్నది. ఆమెయుండుచోట నే నున్నవాఁడను. లేనిచో నాబ్రదు కెక్కడిది? అని తమప్రకృతి పూరుషతత్త్వమును దెలియఁజేసెను. తద్వియోగ మత్యంతా సంభవమని సారము. విరహము నటనమని యాశయము.

"కేదారస్య చ కేదారస్సోదకస్య నిరూదకః,
ఉపస్నేహేన జీవామి జీవంతీం యచ్ఛృణోమి తాం." ౧౧

అని మూలము. విశేషార్థ మిట్లు గ్రహింపవలయు. జలములు గల భూమిచెంత నుండు నీరులేనిభూమి దానిమూలమున ననఁగా నందలిజలము నిందును ద్రవరూపమున వ్యాపించును కాన నిదియు జీవించును. అట్లే మేమిరువురు స్నేహాకర్షణశక్తి మూలమున నిబద్ధులమై యన్యోన్యాశ్రయబలము గలిగి యున్నారమని కదా.

"శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం,
న చేదేవం దేవో న ఖలు కుశలస్స్పందితుమపి."

అను శంకరాచార్యమహాశయాశయ మిదియే యని యీ భాగము మనకుఁ దేటపఱచుచున్నది. దీనింబట్టి కూడ మా యిరువుర కవినాభావసంబంధమే యని శ్రీరామమూర్తి తేట తెల్లముగ వెల్లడించెను.

"కదా ను ఖలు సుశ్రోణీం శతపత్రాయతేక్షణాం,
విజిత్య శత్రూన్ ద్రక్ష్యామి సీతాం స్ఫీతామివ శ్రియం." ౧౨

అను నీమూలము పైన వ్రాసినయర్థమునే దృఢపఱచుచున్నది.

వరేతి ననఁగా: స్ఫీతామివ శ్రియం = కొదువలేని రాజ్యలక్ష్మివలె ననఁగా సర్వసమృద్ధులు గలిగిన నాపాలిటి భాగ్యదేవతవలెనని భావము. శత్రువులజయించి యెపుడు సంతుష్టురాలైన నాజానకిని జూడఁగలననఁగా నామెమూలమున భక్తుఁడగు రావణునకు శాపమోక్షము ననుగ్రహించి తాఁ జెప్పినపని నేఁ జేయుటం జేసి మహానందమున వెల్లివిరియు నాజానకిని బాహ్యదృష్టుల ఫలముగాఁ జూడఁగలను? ఎల్లరు చూచుచుండఁగాఁ గాంచఁగల ననుభావ మిట సూచింపఁబడియె. దీనిచే భగవంతుని క్రియాశక్తియే మహాప్రకృతియని సారము.

"సా నూనమసితాపాంగీ రక్షోమధ్యగతా సతీ,
మన్నాథా నాథహీనేవ త్రాతారం నాధిగచ్ఛతి." ౧౫

అని మూలము. విశేష మిట్లు గ్రహింపందగు. మన్నాథా = అహం నాథో యస్యాస్సా=మన్నాథా అని వ్యుత్పత్తి. నేను నాథుఁడుగాఁ గలిగిన యా పతివ్రత. నాథహీనేవ = నాథుఁడు లేనిదానివలె, అనఁగా నేను జెంతలేనట్లు నటించుచున్నదని కదా శ్రీరామునాశయము. ఈభావమే మహాకవిమది లేకున్న "నాథహీనాహి" అని చెప్పియుండును. త్రాతారం = వేఱొకరక్షకునని యర్థత స్సిద్ధమగును. "నూనం" అనియు రాముఁడనెను. ఇది నిశ్చయము. అని. నే నామెయందే యున్నాఁడను. ఆమె నాయందే యున్నది. కారణాంతరమున వేఱుగా నున్నట్లు నటించుచున్నా మనుభావమును దేటపఱచెను. ఇంకను దనభావమును దృఢపఱచుచున్నాఁడు.

"కథం జనకరాజస్య దుహితా సా మమ ప్రియా,

> రాక్షసీమధ్యగా శేతే స్నుషా దశరథస్య చ." ౧౬

అని మూలము. "జ్ఞాననిధియగు జనకమహారాజునకు దుహిత యనిపించుకొని, నాకుఁ బ్రియురాలయి, దశరథునకుఁ గోడ లై" అని యంతనిలువక శ్రీరాముఁడు "సా" అనెను. తచ్ఛబ్దము ప్రసిద్ధార్థద్యోతకము. సర్వత్ర ప్రసిద్ధురాలగు. అనఁగా సకల లోకజనయిత్రి యని వేదవేదాంగగీయమానమహత్త్వము గల యామహామాయ యెట్లు రాక్షసాంగనలనడుమఁ జిక్కి యుండును? ఉన్నదే యందురే నదియే యామెసామర్థ్యమని భావము.

> "కదా విక్షోభ్య రక్షాంసి సా విధూయోత్పతిష్యతి,
> విధూయ జలదాన్నీలాన్ శశిరేఖా శరత్స్వివ." ౧౭

అని మూలము. దీనిచేత శ్రీరాముఁడు తన కెందును గర్తృత్వము లేనిదే సర్వకార్యసంపాదకురాలు ప్రకృతి యనియు దృఢపఱచుచున్నాఁడు. శరత్కాలమునఁ జంద్రరేఖ నల్లని మబ్బులను ద్రోసికొని బయలువెడలురీతి నోడింప నెబ్బంగిని సాధ్యముకాని రాక్షసులను జయించి యాప్రకృతి యెప్పుడు బయలువెడలఁ గలదు? నేను జంపఁగా రక్కసులబాధ తొలఁగఁగా నని శ్రీరాముఁ డనలేదు కదా. ఏల? సృష్టిస్థితిసంహారాదికార్యములు తదధీనములు. అట్టిజానకి వారినివధించి యన లేదు. త్రోసిపుచ్చి—అనఁగా స్వకర్మవశమున వారంతట వారే మృతినొందఁగాఁ దాను సాక్షిభూతురాలై యుండి యని కదా భావము. వారివారికర్మమున వారువారు మృతులు కాఁగాఁ దాను నిమిత్తభూతురాలుగా నుండి బయలుపడఁ గలదు.

అనఁగా మునిలోకప్రసిద్ధిని గాంచఁగలదు? అని రామచంద్రుఁడు కోరెను. ఎట్లీయర్థము తేలెను? అన్నచో చంద్రరేఖ మేఘములం ద్రోసికొని వచ్చునట్లును నుపమానమే యీయర్థమును దెలుపుచున్నది. వాయువశమున మేఘములు చెల్లాచెదరగును. చంద్రరేఖ యప్పని చేయలేదు కదా. అట్లే సీతయు నని తెలియందగు.

"స్వభావతనుకా నూనం శోకేనానశనేన చ,
భూయస్తనుతరా సీతా దేశకాలవిపర్యయాత్." ౧౮

అని మూలము.

"మహాశక్తిః కుండలినీ బిసతంతుతనీయసీ."

అని ప్రమాణము. "తటిల్లేఖాతన్వీమ్" అని శంకరభగవత్పాదులు.

"నీలతోయదమధ్యస్థాద్విద్యుల్లేఖేవ భాస్వరా,
నీవారశూకవత్తన్వీ పీతా భాస్వత్యణూపమా."

అని శ్రుతి. అను ప్రమాణముల ననుసరించి మహర్షి "స్వభావతనుకా" అని ప్రయోగించెను. దేశకాలవిపర్యయాత్ = దేశకాలవ్యత్యయమువలన మఱియు సూక్ష్మాంగి యగును.

"అణోరణీయాన్మహతో మహీయాన్."

అను ప్రమాణము క్రొత్తది గాదు కదా. అట్లే దేశకాలవిపర్యయమువలన మహత్త్వమును గూడ నొందును. అని శ్రీరాముఁడు తేటపఱచెను.

"కదా ను రాక్షసేంద్రస్య నిధాయోరసి సాయకాన్,
సీతాం ప్రత్యాహరిష్యామి శోకముత్సృజ్య మానసం." ౧౯

అని మూలము. రాక్షసేంద్రస్య ఉరసి సాయకాన్ నిధాయ = రావణుహృదయమున శరము లుంచి యని యర్థము.

"మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్."

అని గీతావాక్యముల ననుసరించి రావణుఁడు స్వకర్మముననే హతుఁడు కాఁగా నేను లోకవిడంబనార్థముగా బాణముల నుంతును. శ్రీరాముఁడు రావణునిం జంపెనను పేరువచ్చునని యాశయము. మానసం శోకముత్సృజ్య=మనోదుఃఖ మడంగి నట్లు నటించి సీతను దేఁగలను? అని తెలిపెను. ఈపట్టున నధ్యాత్మ రామాయణమును బరిశీలింతము.

"విలప్య జానకీం సీతాం బహుధా కార్యమానుషః. ४९
అద్వితీయశ్చిదాత్మైకః పరమాత్మా సనాతనః,
యస్తు జానాతి రామస్య స్వరూపం తత్త్వతో జనః. ५०
తం న స్పృశతి దుఃఖాది కిముతానందమవ్యయం,
దుఃఖహర్ష భయక్రోధలోభమోహమదాదయః. ५१.
అజ్ఞానలింగాన్యేతాని కుతస్సంతి చిదాత్మని,
దేహాభిమానినో దుఃఖం న దేహస్య చిదాత్మనః. ५२.
సంప్రాపాదేద్వయాభావాత్సుఖమాత్రం హి దృశ్యతే,
బుద్ధ్యాద్యభావాత్సంశుద్ధే దుఃఖం తత్ర న దృశ్యతే. ५३
అతో దుఃఖాదికం సర్వం బుద్ధేరేవ న సంశయః,
రామః పరాత్మా పురుషః పురాణో
నిత్యోదితో నిత్యసుఖో నిరీహః. ५४
తథాపి మాయాగుణసంగతోఽసౌ
సుఖీవ దుఃఖీవ విభావ్యతేఽబుధైః." యుద్ధ. ౧ స.

అని యున్నది. దీని యర్థసారమే వాల్మీకిమహర్షి తెలిపెనని వ్రాసితిని గదా. ఇఁకఁ దరువాతికథాసారముం బఠింతము.

## రావణుఁడు మంత్రులతో నాలోచించుట.

* అత్తఱి లంకయందు హనుమంతుఁ డొనరించిన యత్యద్భుతభయావహకార్యములం దలంచి రావణుఁడు సిగ్గుచేఁ దలవంచి రక్కసులం జీరి వారితో నిట్లుపలికె. హనుమ వానరమాత్రుఁడా కాఁడు. శత్రుదుర్జయుఁడు. దేవదుర్భేద్యమగు లంకంజొచ్చి జానకిం గాంచి చైత్యప్రాసాదముం గూల్చి వీరదనుజులం బొలియించి పోయినాఁడు. ఒక్కవానరుని చే నీపురి యాకులిత యయ్యెను. ఇఁక మనకుఁ గార్యమెద్ది? ఏ ప్రయత్నమునఁ గార్యము ఫలవంతమగునో యేది హితమో యట్టిదానిం దెల్పుఁడు. ఒనరింతును. మీకు శుభములగుఁ గాక. ఉదారమనస్సు గలపెద్దలు జయమునకు మూలము మంత్రమనియే చెప్పుదురు. కాన రామవిషయమున మంత్రమే ముఖ్యమని తలంచుచున్నాను.

లోకమం దుత్తమ మధ్యమాధములని పురుషులు ముత్తెఱంగుల నుందురు. వారెల్లఁ గలిసియుండుటం జేసి వీ రిట్టివారని తెలిసికొనుట ప్రయాసము. కాఁబట్టి నేను వారల గుణదోషములను దెలిపెద. ఆలకింపుఁడు. మంత్రనిపుణులు హితార్థులునగు మంత్రులతోఁగాని, తనసుఖదుఃఖములు తమ సుఖదుఃఖములుగాఁగల మిత్రులతోఁగాని, స్వహితముఁ గోరు

* ఇది యాఱవసర్గమునఁ గల కథాభాగము.

బంధువులతోఁగాని కూడి యాలోచించి, యారంభింపవలసిన పని నారంభించి సాగించుచు దైవముమీఁదను భారము వైచి యుండునో యాపురుషుఁ డుత్తముఁ డనఁబడు. ఏపురుషుఁడు మంచిసెబ్బరల నొరులతో నాలోచింపక యొక్కఁడే తా నాలోచించి మనస్సునందు దైవమును నమ్మి యతనిపై భార ముంచి పనిసాగించునో యతఁడు మధ్యముఁ డనఁబడును. మంచిసెబ్బరల నిశ్చయించుకొనక దైవమును దలంపక కర్తనని పనిఁబూనునో తుదముట్టంజేయక వదలునో యతఁ డధముఁ డనంబడును. ఇట్లే మంత్రములుకూడ నుత్తమమధ్యమాధమ సంజ్ఞల ముప్విధములుగ నుండు. మంత్రులందఱు శాస్త్రము నెఱింగి తద్దృష్టితో ఆసక్తితో నేమంత్రము చేయుదురో యది యుత్తమమంత్రమనియు, మొదట మంత్రు లన్యోన్యభేదము గలవారలై తుదకు నైక్యమునొందుదురో యది మధ్యమ మంత్రమనియు, ఏదానియందు మంత్రులందఱు తనయాశయ మునే ప్రధానముగాఁ జేసికొని పట్టుదలచే దానిని వదలక వాదముచేయుచు నైక్యమునొందునూహాయు లేకయుందురో యది యధమమంత్రమనియుఁ జెప్పంబడు. కావున బుద్ధిమద్వ ర్యులరగు మీరందఱు నైక్యమత్యముతో నూహించి యుక్త మేదియని నిశ్చయించుకొనుఁడు. అదియే కర్తవ్యమని నా యభిప్రాయము

రాముఁడు పెక్కువేలవానరులం గూడి మనల నిర్బం ధింప లంకకు రాఁగలఁడు. సోదరుఁడు సుగ్రీవాదులగు నను చరులు కూడ రాఁగా తనశక్తి మెఱసి సముద్రము నెండింపఁ జేసియో లేక సేతుబంధనాది మహాకార్యములమూలమునను

సుఖముగా దాఁటి రాఁగలఁడని నాకు స్పష్టముగాఁ దోఁచె డిని. అట్లే పనిసాగఁగా దాన వానరులకు మనకు విరోధము కలుగక మానదు. అప్పుడు మనసేనలకుఁ బురమునకు మేలు కలుగునుపాయముల నాలోచింపుఁడు. అనియెను.

మహాశయులారా! ఈభాగమునఁ గలవిశేషములఁ నరయుదము.

"ధర్షితా చ ప్రవిష్టా చ లంకా దుష్ప్రసహా పురీ. ౨
తేన వానరమాత్రేణ దృష్టా సీతా చ జానకీ,
ప్రాసాదో ధర్షితశ్చైత్యః ప్రవరా రాక్షసా హతాః. 3
ఆవిలా చ పురీ లంకా సర్వా హనుమతా కృతా,
కిం కరిష్యామి భద్రం వః కిం వా యుక్తమనంతరం. ४
ఉచ్యతాం నస్సమర్థం యత్కృతం చ సుకృతం భవేత్,"

అని మూలము. ఇవి రావణుఁడు మంత్రులకుం దెల్పువాక్యములు. ప్రభువు తనమంత్రుల నడుగునపుడు స్వపౌరుషస్తుతి పరపౌరుషనిరాసము కనఁబడునట్లు మాటలాడుట స్వభావము. ఇందుఁ బరునియుత్కృష్టత తేటపడుచున్నది. మదోన్మత్తుఁడు కదా రాక్షసాధిపతి. అట్టివాఁడయ్యు నిట్లు పలుకుట యేల? అని ప్రశ్నించుకొనవలయుఁ గదా. ఇప్పటి రావణుభావము విజ్ఞానమూలము గాని పౌరుషప్రధానము కాదు. వానరమాత్రేణ తేన=వానరమాత్రుఁడైన రామదూతచేత నని కదా దాని భావము. జానకీ సీతా చ దృష్టా=శ్లోకము కుదురక "జానకీ సీతా" అని వాల్మీకి ప్రయోగించెననుట యవివేకమూలము కాక పోదు. జనకమహారాజునకు దుహితగా నెన్నఁబడు నయోని

జనితయని యర్థము తేలును. ఆమెను వానరుఁడు చూచెను. "సర్వాలంకాపురీ హానుమతా ఆవిలాకృతా చ" అని క్రమము. నగరమంతయుఁ గలఁకఁబాఱినట్లు చేయఁబడినది. ఇఁక మనగతి యెట్టిదని సిద్ధాంతము తేలకయుండ సంశయించునట్లు చేయఁ బడినదని భావము. అనఁగా విక్రమాద్భుత్యాల నెందఱినో వధించి లంకను గాల్చి యాదూత పోవుటం జేసి రాక్షసులచిత్తములు స్థిరతం గాంచకున్నవని సాధారణముగా యోజింపఁ దేలును. రామదూత యింతపని చేసెను. శ్రీరాముఁ డెంతపని చేయఁబూనెనో యెట్లు తెలియఁగలదనువిచారమున మునింగి యున్నవారు లంకానివాసులని యాశయము. దూతనే జయింపఁజాలని మనమిఁకఁ దత్ప్రభువు నేమి జయింపఁగలమను సార మిట సూచింపఁబడుచున్నది. కనుకనే, కిం కరిష్యామి = నేనేమి చేయఁగలను ? అనునది పైదానికిఁ దోడ్పడుచున్నది. దాని కుపబలముగా భద్రంవః=అనువాక్యము గలదు. మీకు శుభము. అనఁగా దూతచేఁ జంపఁబడక మిగిలితిరి. భగవద్దర్శన మగును. అదియే కదా శుభము. అది మీకుం గల్గునని సూచించుచున్నాఁడు.-ఈభావమే "కిం వా యుక్త మనంతరమ్." అనువాక్యమును విమర్శింపఁ దేలును. ఇఁక నేది చేయుట యుక్తము. మనకుఁ దగినదెద్దియని కదా ప్రశ్నము. శీఘ్రముగా భగవంతుని లంకకు రప్పించుటయే గాక మఱేమి యున్నది? దానికిం బ్రయత్నించిన భద్రములు చేకూరునను నదియే యిటఁ గలసారము. మఱియు మనకు నేదిహితమో ఎట్లుచేసిన నది సుకృతమగునో యద్ది యోజించి తెల్పుఁడను నది ముఖ్యము. సీతనొసంగి పరాజితుల మగుట మంచిదియా,

యుద్ధముచేసి మృతినొందుట మంచిదియా. ఇందేది సుకృతము? రెండవదని రావణునాశయమని మన మూహింపవచ్చును.

"మంత్రమూలం హి విజయం ప్రాహురార్యా మనస్వినః. ౫
తస్మాద్వై రోచయేన్మంత్రం రామం ప్రతి మహాబలాః,"

అని మూలము. ప్రాతీతికార్థము స్పష్టము. మనస్వినః ఆర్యాః విజయం మంత్రమూలం హి ప్రాహుః=స్వాధీనమనస్కు లగు నార్యులు మనోజయము మంత్రమూలమని కదా పలుకుదురు. "మననాత్త్రాయత ఇతి మంత్రమ్." అని వ్యుత్పత్తి. దానినే తలం పఁగా రక్షించునది. నిరంతరజపమునఁ గడతేర్చునది యని భావము. దానఁ గలుగుఫల మెద్ది? విజయం = విశేష జయ మనఁగా మనోనిగ్రహమని యర్థము.

"అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలం,
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే." ౩౫

అను నీభగవద్వాక్యము విజయమనఁగా మనోనిగ్రహమే యనియు దానికంటె శ్రమ సాధ్యవిజయము మఱొక్కఁడు లేదనియుఁ దెల్పుచున్నది. అట్టిమంత్రము శ్రీరామునిగుఱించి యూహింపందగునని రావణుని యాశయము. భగవద్భక్తుఁడు గానఁ దనమృతి నెఱింగినప్రౌఢ గావునఁ దనభావము గూఢ ముగా నిర్దేశించెనని మన మెఱుంగవలయును.

"తస్మాత్సుమంత్రితం సాధు భవంతో మతిమత్తమాః. ౧౫
కార్యం సంప్రతిపద్యంతామేతత్కృత్యం మతం మమ,"

అని మూలము. తనయాశయము నిందు స్పష్టముగాఁ దెలి

పెను. మీరు మతిమంతులలో నుత్తములు. అనఁగా "అగామి గోచరా మతిః" అనున్యాయము ననుసరించి రాఁబోవుదానిని జక్కఁగా నెఱింగినవా రనియె. అట్టి మీరు చక్కఁగా నాలోచించి యేది చేయఁదగునని నిర్ణయింతురో యది నాకు సమ్మతము. అని పలికెను. దూతశక్తిం గంటిరి. భగవచ్ఛక్తి నెఱుంగ నక్కఱలేదు కదా. బలాబలముల నాలోచించి యేదిచేసిన భవిష్యచ్ఛుభము మనకుఁ గలుగునో యద్దానిం దెలిపిన నట్లే చేసెదననియె. వారినేల యడుగవలయును? తానే జ్ఞానియైనపు డొకరి నడుగనేల? అని ప్రశ్నింపరాదు. తనతోఁ గూడ ననఁగాఁ దనమూలమునఁ జావఁదగినవా రనేకులు గలరు. వారలకందఱికి ముక్తిని గల్పింపవలయును. అది గదా శరణ్యులలక్షణము. కాన నతఁడు వారిని బ్రశ్నించి వారియిష్టము ననుసరించి నడువ యత్నించెనని మన మూహింపవలయును.

> "వానరాణాం హి వీరాణాం సహస్రైః పరివారితః. ౧౬
> రామోఽభ్యేతి పురీం లంకా మస్మాకముపరోధకః,
> తరిష్యతి చ సువ్యక్తం రాఘవస్సాగరం సుఖం. ౧౭
> తరసా యుక్తరూపేణ సానుజస్సబలానుగః,
> సముద్రముచ్ఛోషయతి వీర్యేణాన్యత్కరోతి వా. ౧౮
> అస్మిన్నేవం గతే కార్యే విరుద్ధే వానరైస్సదా,
> హితం పురే చ సైన్యే చ సర్వం సమ్మంత్ర్యతాం మమ." ౧౯

అని మూలము. ఈవాక్యములధోరణి రావణునభిప్రాయ మిట్టి దని స్పష్టముచేయక మానదు. అది యెద్దియని విచారింపవల

యును. వీరవానరు లసంఖ్యులుగాఁ దన్నుఁగొలువ శ్రీరాముఁడు లంక కరుదెంచి మనల నరికట్టును. సులభముగా సంద్రమును దాఁటును. తలంచిన సాగరము నెండఁ జేయును. నల యున్న నది లేకయేయుండఁ జేయంగలఁడు. వానరులతో విరోధము పొసఁగినది. ఏమి యోజింతురో తలంపుఁడు—ఈ మాటలయందలి గూఢాశయం బెట్టిది? బ్రహ్మవరమున మనుజ వానరులను జయింపరాదని తా నెఱుంగును. వారిచేత నే మృతియనియు నెఱుంగును. లేకయున్న మంత్రులనుండ దఱఁ బగ వానిఁ బొగడ నేల? కష్టము లేక సాగరమును దాఁటును. కోరికయే కల్గిన జలవిహీనముగ నొనర్చును. ఇంక నేమిన్నైనఁ జేయఁగలఁడు. అనఁగా నర్థమేమి? భగవంతుఁడు శ్రీరాముఁడని కాక మఱేమి యగును? దేవతలతో విరోధము గల్గిన భయము లేదు. మనుజవానరులతోఁ గల్గినది. వారే తనకు మృత్యువులు. అన్నభావ మాతనికిం గలదని తేలకపోవునా? దుర్వారగర్వాంధుఁడగు రావణుఁడే యైన నిట్లనునా? మహా జ్ఞానియని తేలక మానదు. చక్కఁగా నాలోచింప నీమాటలు విజ్ఞానినోట వెడలునవి కాని గర్వినోట వెడలునవి కావని తోఁపకపోదని మన మెఱింగి కాముకుఁడు రావణుఁడు కాఁడని నిశ్చయించి పరమభక్తుఁడని భావింపవలయు. మఱియు సంభావింపవలయును. ఈవిషయమున నధ్యాత్మ రామాయణమున విశేషము లేవియుఁ గానరావు. తరువాతి కథను బఠింతము.

## మంత్రులు రావణునకుఁ బౌరుషమును గల్గించుట.

* లంకేశ్వరు పలుకు లాలకించి మంత్రులు నీతిబాహ్యులు హీనబుద్ధులు నగుటం జేసి ప్రభువాక్యములఁ గల గూఢభావము నెఱుంగంజాలక పౌరుషమూని యేలికం గాంచి యంజలింబట్టి యిట్లనిరి మహాప్రభూ! సకలాయుధములం దాల్చి పగవారి నుక్కడంచు సైన్యము మిక్కిలిగ నున్నది. విషాద పడనేల? సేనాసహాయ మెందులకు? నీవొక్కండవ చాలుదువే. పాతాళమున కరిగి యనిమొనఁ బన్నగవర్యులం గెల్చితివి. యక్షపరివేష్టితమగు కైలాసమున కరిగి కుబేరుని లోఁబఱచుకొంటివి. శివమిత్రుఁడని యతనికిం బ్రఖ్యాతి గలదు. వానిం గూడ జయించితివి కదా. పుష్పకవిమానమెల్ల యతులు చూడం దెచ్చితివి. దానవేంద్రుఁడు మయుఁడు నీ శక్తింగని భయపడి నీయంతవాని స్నేహముగల్గినం జాలునని కుమారిక మందోదరి నీ కొసంగెను. మహావీరుని మధుదానవుని లోఁబడఁ జేసితివి. రసాతలవాసులగు వాసుకి కర్కోటకాదుల నోడించితివి. కాలకేయులు దుర్జయులయ్యు వరగర్వితులయ్యు నీతోడ నొక్కయేఁడు పోరాడి తుదకు లోఁబడవలసినవారైరి. అనేకమాయల నభ్యసించితివి. దేవేంద్రు నోడించి కారాగారమున నుంచితివి. వరుణసుతుల గెల్చితివి. యముని సమరమున గెల్వఁగలవారు గలరే యను జనప్రవాదమును రిత్తచేసి యముని భంగపడం జేసితివి. ఇఁక రాముఁ డనఁగా మున్ను పేర్కొనినవారలలో నెవ్వారిని

* ఇది యేడవసర్గమునఁ గల కథ.

బోలఁడు. మహారాజుల వధించితివి కదా. ఈ రాముఁ డెంత?
ఇందే కుదురు కదలక యుండుము. మనయింద్రజిత్తు పోయి
వానరుల రూపుమాపి రాఁగలఁడు. మహేశ్వరవరములు గల
వాఁడు గదా మన యింద్రజిత్తు. ఇంద్రుని బంధించి తెచ్చిన
వాఁడు కదా. బ్రహ్మ వచ్చి గదా యింద్రబంధమును విడి
పించెను. ఆతనిం బంపుము. ఎల్లర వధించి యరుదెంచును.
ఒకానొక క్షుద్రునివలన నీయాపద తటాలునఁ గల్గినది. కనుకఁ
జెల్లినది. సంశయింపకుము. నీవు రామునినిఁ జంపఁగలవు. అని
గట్టిగాఁ బలికిరి.

### ప్రహస్తాదులు రావణుని బురికొల్పుట.

* అత్తఱి నీలమేఘాకారము గల ప్రహస్తుఁడు రావ
ణునితో దోసిలొగ్గి యిట్లు విన్నవించెను. దేవదానవులు నిన్ను
మార్కొనం జాలరనఁగా నిఁక వానరు లనఁగా నెంత?
ప్రమాదంపడి మనల నెవ్వరు మార్కొందురని నమ్మియుంటిమి.
కాన నాకోఁతి మనల వంచించి పోయెను. లేనిచో నే జీవించి
యుండ నాకోఁతి ప్రాణములతో నెట్లు పోఁజాలును? చతు
స్సముద్రముద్రితమగు నీ భూమండలమం దన్ని భాగముల
నుండు వానరులందఱ వధించి వానరజాతియే లేకయుండఁ
జేసెదను. ప్రభుశిరోమణులు నన్నాజ్ఞాపింపవలయును. దాన
వానరులవలన నీకేదుఃఖము కలుగకయుండుననియె.

అంతట దుర్ముఖుండను రక్షోవీరుఁడు మిగులఁ గోప
మొంది, వానరమాత్రునిమూలమున మనకుఁ గల్గిన తిరస్కా

* ఇది యెనిమిదవసర్గమునఁ గల కథ.

రము క్షంతవ్యము కాదు. అంత మానక లంకాపురము నంత పురము నవమానించెను. రాక్షసేంద్రుని దిరస్కరించెను. ఇంచుకంతయే నిది క్షమింపఁ దగదు. ఇపుడే నే నద్వితీయుఁ డనై పోయి వానరులందఱు సాగరమును జొచ్చిన సంబర మున కెగిరినను బాతాళమునఁ దూఱినను వదలక చంపివచ్చెద నని ప్రల్లదము లాడె. వజ్రదంష్ట్రుఁ డట్లే పట్టరానిక్రోధమున హుంకరించుచు రక్తమాంసచర్బులఁ జూడరానిదగు నినుప గుదియం బట్టుకొని రాముఁడు లక్ష్మణసుగ్రీవాదులం గూడి యెదిరింపరానివాఁడై యుండఁగా భయమున రాత్రియం దొంటరిగవచ్చి పోయిన చచ్చుహనుమంతుఁడు కనికరింపఁదగిన వాఁడే కాన వానితో మీ కేమిపని యున్నది? నేనే పోయి రామసుగ్రీవాదుల నీపరిఘంబునఁ బడఁగొట్టి వానరబలము సీఱుగావించి వచ్చెదను. మహాప్రభూ! మఱొక్కమాట విన్నవింతు. అవధరింపవలయును. ఉపాయజ్ఞుఁడే పగవారి జయించు. ప్రమాదమనునది లేక యుపాయములఁ బన్ని నేర్పున నరుల జయింపవలయును. కామరూపులు వీరులు నగు రక్కసులు నిశ్చయించుకొని వేలకువేలుగా మానవులం బోలి రామునికడ కరిగి తొట్రుపాటు లేక యాతనిం గాంచి మేము నీతమ్ముఁడు భరతుఁడు పంప వచ్చితిమని చెప్పుదురు గాక. వెంటనే రాముఁడు సేనలవదలి వారితోడం బోఁగలఁడు. అంత మే మిచ్చటనుండి శూలాద్యాయుధములం బాల్చి పోయి యాకసమునుండి యస్త్రపాషాణవర్షమును గురియించి యాసేసం జంపుదుము. రాముఁ డీమనకపటమును గనుఁగొన

లేక మనవారిని దనవా రనుకొని పోవునేని మేము వాని నశ్రమంబునం జంపుదుము. అని పౌరుషములు పల్కెను.

అంతటఁ గుంభకర్ణునికుమారుఁడు నికుంభుఁడు క్రుద్ధుఁడై రావణుం గాంచి రాక్షసశూరులారా! మీరందఱు ప్రభువు కడ నుండుఁడు. నేనొక్కఁడనే పోయి రామలక్ష్మణ సుగ్రీవ హనుమదాదుల నెల్లర వధించి వచ్చెదనని బీరము లాడెను. పర్వతాకారము గల వజ్రహననామరాక్షసవీరుఁ డపు డాహారము స్మృతికిం దగుల నోట నీరూరుచుండఁగా నాలుకచే నోరంతయు నాకుచు మీరేల యీయాలోచన మొనరించెదరు. ఊరక యుండుఁడు. ఒక్కఁడనే నేఁ బోయి యా వానరులనందఱం దిని వత్తును. మీరొక్క చింతయును లేక మధుపానము చేయుచు స్వస్థులై విహరించుచుందురు గాక. సుగ్రీవాంగదాదులను రామలక్ష్మణులను మార్కొని యమపురమునకు సాగనంపి వత్తునని యొడలెఱుంగక ప్రేలెను.

## మంత్రులు యుద్ధమునకుయత్నింప విభీషణుఁడు వలదని హితముచెప్పుట.

* అత్తఱి నికుంభ, రభస, సూర్యశత్రు, సుప్తఘ్న, యజ్ఞహార, మహాపార్శ్వ, మహోదర, దుర్ధర్షా, గ్నికేతు రశ్మికేతువులు, నింద్రజిత్ప్రహస్త, విరూపాక్ష, వజ్రదంష్ట్ర, ధూమ్రాతికాయ, దుర్ముఖులగు రాక్షసవీరులు పరిఘాది సకలాయుధధారులై పట్టరానికోపమునఁ బరవశతం గాంచి దిగ్గన పీఠ

* ఇది తొమ్మిదవ సర్గమునఁ గల కథ.

ములనుండి లేచి పౌరుషము రూపొందినట్లు రావణుం గాంచి ప్రభూ! మనమిపుడే యరిగి రామసుగ్రీవాదులను, లంకను దొంగతనమునఁ బ్రవేశించి కలంచిన హనుమంతుని జంపివత్త మనిరి.

ఆయుధధారులై పయనము చేయనున్న యారక్షశ్శూరులను గని వినయభూషణుఁ డవినీతిదూషణుఁడు విభీషణుఁడు నివారించి దోసిలొగ్గి యన్నంగని పలికెను. మహారాజా! సామదానభేదము లనఁబడు నుపాయముల మూఁడింట నేది సాధించి పొందశక్యమో దానికొఱకు విక్రమము నాశ్రయింపరాదు. దండోపాయప్రయోగకాలము లివ్వి యని నీతిశాస్త్రములందుఁ జెప్పఁబడినవి. మన మింతదనుక సామాదులం బ్రయోగింపలేదు. కాన దండోపాయము నుపయోగింపరాదు. ఇది కాలము కూడఁ గాదు. మఱియు వైరి దండింపఁదగినవాఁడు కాఁడు. విషయసుఖాసక్తిం గలిగి ప్రమాదం పడినవారియందు, విరక్తులై జ్ఞానులగువారియందు, సామంతులాక్రమింప వగఁ గుందువారియందు, దైవప్రతికూలతచే క్షీణించుచుండువారియందు, బాలవృద్ధాదులయందు, నీతిశాస్త్రజ్ఞు లగుమంత్రులం గూడి విచారించి ప్రయోగింపఁబడు దండోపాయములే సిద్ధినొందును. లేనిచో సిద్ధింపవు.

అని విన్నవించి యారాక్షసులం జూచి శ్రీరాముఁ డట్టి వాఁడు కాఁడు. విషయాసక్తిం బ్రమాదము పడియుండు వాఁడు గాఁడు. జయింపవలయునని యూఁగుచుండువాఁడు. స్థిరవిక్రమబలుఁడు. అసమయమున రోషము కొనితెచ్చుకొను వాఁడు కాఁడు. కావున నతని నెదిరింపఁ దరముకాదు. మీ

రాతని మార్కొనఁ గోరుచున్నారు కదా. హనుమ దుస్తర సాగరము నశ్రమంబున లంఘించి మహాకార్యముల నొనరించెఁ గదా. ఇది యిట్లగునని యెవ్వఁడైనఁ దలంచెనా ? కనుకనే రామునకు దైవప్రాతికూల్యము లేదు. రక్కసులారా ! వైరుల బలపరాక్రమము లపారములు కావునఁ బూర్వాపర సంబంధముల నాలోచింపక త్వరపడి యవినీచములు పలుకరాదు. రాముని దండించుట శక్యముకాదని హనుమ కార్యములే తెల్పెను గద. శ్రీరామపత్నిని సీతను రావణుఁడు జనస్థానమునుండి తెచ్చినాఁడు. దానికి ముందు రాముఁడు మనకే యపకార మొనరించియున్నాఁడు. ఖరవధము కారణము కాదా యందురేమో. అతఁడు తనయంతన తానే ప్రైకిఁ బోవఁగా నతఁడు పాలియించెను. దాన దోషమేమి ? స్వసంరక్షణ మెల్లవారికి ధర్మమే యగు. కావున రాముఁడు దండోపాయప్రయోగమున కర్హుఁడు కాఁడు. ఒకవేళ మనకపకారమతఁడు చేసియున్నంగూడ నాతనిభార్య నపహరించుట న్యాయ్యమే కాదు. పరదారాపహారణ మపకీర్తిని గల్గించును. ఆయువు నశింపఁజేయు. ధననాశప్రదము. మహాఘోరమైనది. పాపమున కది యపరస్వరూపమే. ఈనిమిత్తముల ననుసరించి చూడఁగా సీతవంక మనకు మహాసాధ్వసము గల్గును. సీతాపహారణమైనది. ఇంక నామె వుచ్చువలసినపని మిగిలియున్నది. ఎట్టి మేలిమివస్తువైనను విపత్కారణమగునేని వదలవలసినదే. వైరి మహాపరాక్రమధర్మాశ్రయుఁడు. అట్టి మహాత్మునితో వ్యర్థవైరమును గల్గించుకొనుట యుక్తము కాదు. సీత నార్యమున కిచ్చివేసి యీలంక శత్రుబాణాగ్నిదగ్ధము కాకముందె

కాపాడుకొనఁ బ్రయత్నించుట మంచిది. ప్రచండవిక్రమో పేతమగు వానరబలము లంకం జుట్టుముట్టి నిర్బంధింపకముందే సీతనిచ్చు టుత్తమము. ఆజానకిం గొనిపోయి శ్రీరామునకు మనమే సమర్పింపకయుందుమేని లంక నశించు. రక్షశ్శూరులు నశింతురు.

అని యన్నం గాంచి నాకు నీవు జ్యేష్ఠుఁ డగుటంజేసి బాంధవమునన్నైన నిన్నుం బ్రసన్నునిగాఁజేయ నిట్లు వేఁడు చున్నాను. నావాక్కుల నాలకించి పని సాగింపుము. నీకు హితము గల్గించుదానిని యథార్థము నగుదానిం బలుకు చున్నాను. సోదరా! జానకి నిచ్చివేయుము. శ్రీరాముఁ డమోఘసాయకంబులం బ్రయోగించి రక్కసుల నుక్కడంపఁ గలఁడు. కోపము సుఖధర్మవినాశకము. కనుక నట్టిదానిం బరిత్యజింపుము. సుఖయశస్సంపదలం బెంపొందించుధర్మము నాశ్రయింపుము. ప్రసన్నుఁడవై నాపలుకుల నాదరింపుము. నీవట్టులొనరించిన సంతానములతో మనము బ్రదుకుదుము. సీత నొసంగుమా యని విభీషణుఁడు చెప్పఁగా విని సభ్యులనెల్లరం బోవం బంచి తా నంతఃపురమునకుం బోయెను.

మహామతులారా! ఏడెనిమిదిసర్గములయందు నెమక దగిన వంతగా లేవు. ఈభాగమును జక్కఁగా విమర్శింతము.

> "తాన్ గృహీతాయుధాన్ సర్వాన్ వారయిత్వా విభీషణః,
> అబ్రవీత్ప్రాంజలిర్వాక్యం పునః ప్రత్యుపవేశ్య తాన్.    ౭

అని మూలము. ప్రహస్తాదులు రామునిపై కడర నుద్యమించిరి. రావణుఁ డంగీకరించినట్లే. అప్రయాణమే సాగిన వీరికెల్లఁ

గిష్కింధానగరప్రాంతమున మరణము చేకుటియే యుండు. మృతి యందు వీరికిఁ గలుగవలసినవిధి లేదు. కావునఁ గర్మము విభీషణునిఁ బురికొలిపి బోధింప నుద్యమింపఁ జేసి రావణు నుద్యమమునుండి నిష్ఫలహతిఁ గాంచఁ జేసెను. "గహనా కర్మణో గతిః" అన్న భగవదుక్తికి మాఱు గలదా! అంపల కిదియే తార్కాణము. రావణున కీనీతులు తెలియకపోలేదు. ముందు స్వాశయమును స్పష్టపఱచెను. రామునిశక్తిని పొలి పుచ్చెను. అట్టిరావణుఁ డేల వారికి బదులియ్యలేదు? పిలువని పేరంటమనునట్లు విభీషణుఁ డేల లేచి యొత్తిపలికెను? ఇదియే కర్మసిద్ధాంతతత్త్వము. దైవమన నిదియే. దానిగతి కడ్డమనునది లేనే లేదు. సంకల్పించుటయే యాలస్యము. కార్యమట్లు సాగక మానదు. అని మన మెఱింగి విభీషణునినీతిసార మెద్దియని విమర్శింతము. సామదానాదులవిషయ మిట ననవసరము.

"అప్రమత్తం కథం తం తు విజిగీషుం బలే స్థితం,
జితరోషం దురాధర్షం ప్రధర్షయితుమిచ్ఛథ." ౧౦

అని మూలము. విభీషణుఁ డింతదనుక రాముని జూడలేదు. హనుమద్వాక్యములమూలమున నాలకించెను. రసగ్రహణపారీ ణుఁడు కాన నెఱుంగఁ జాలెను. ధర్మనిరతబుద్ధి వరప్రభాన జనితమే కదా. అదృశ్యరూపమున వాంఛాతంతు వొకఁ డిష్ట దేవతాహృదయమును జేరి యావార్త నెఱింగించును. ధ్యాన ఫల మిదియే యని యెఱుంగం దగును. యోగుల కీవిషయ మనుభవసిద్ధము. తపస్సుల కిదియే గతి గల్గించును. ఉపాసకుని సంకల్పమునుండి యొకసూత్రము పోయి యిష్టదేవతాహృదయ మును గల్గించును. దాననే యాదేవత త న్నుపాసించుచున్న

యట్లు తలంచును. ఆసూత్ర మెంత బలముకొలఁది కదలించునో యంత త్వరపడి యాదేవత భక్తునకుం దోఁచును. దీనికే ఆగమశాస్త్రమున నాకర్షణప్రయోగమని పేరు. ఇది యోగి జనసమ్మతము. సీతాంబికాసంకల్ప మాతనిం బురికొల్పెను. అదియే కర్మసిద్ధాంతతత్త్వమని ముందు వ్రాసితిని. ఆమహా ప్రకృతిసంకల్ప మావిభీషణుని నిర్మలహృదయమును గదలించెను. శ్రీరామభక్తి యాతనికిం బెరిఁగెను. తొలుతనే న్యాయ దృష్టిగల మాననీయచరిత్రుఁడు కావున నతని హృదయ సుక్షేత్రమున నాటిన సంకల్పబీజము పాదుకొని మొలకయెత్తి చిగురించి పెరిఁగి పెద్దదై వాక్కుసుమసంతతులఁ బరిమళించి ఫలసంయుతిం గ్రాలఁజాలెను. కనుకఁ గర్మప్రేరితుఁడై విభీష ణుఁడు భగవద్గుణవర్ణనము చేయుట న్యాయ్యమే యని మన మెఱుంగవలయును. అప్రమత్తం=ప్రమాదరహితుఁడు. తెలిసియే కార్య మొనర్చువాఁడని యర్థము. విజిగీషుం=జయింప నిచ్ఛయించువాఁడు. తనకంటె నధికుఁడులేమి నెల్లతఱి జయింతు నను నిచ్ఛయేకాని సంశయ మావిషయమున లేనివాఁడని భావము. బలే స్థితం=బలమందుండువాఁడు. బలములేమి లేని వాఁడని తాత్పర్యము. జితరోషమ్=రోషమును జయించిన వాఁడు. అరిషడ్వర్గము లాతనికడ నిరర్థకములని యభిప్రాయము. దురాధర్షం = ప్రతారింప నెదిరింపఁ దరముగానివాఁడని యర్థము. మహాతేజశ్శాలి యని భావము. అట్టి శ్రీరాముఁడు మారొక్కని యుక్కడంపఁ దలంచుచున్నవారే యని తాత్పర్యము. ఈమాటలు భగవంతుఁడు శ్రీరాముఁడే యని తోఁపఁ

జేయక మానునా? ఎఱుఁగనివాని నిట్లు పొగడుటకు మున్ను వ్రాసినకారణము గాక మఱేదే నుండునా?

> "సముద్రం లంఘయిత్వా తు ఘోరం నదనదీపతిం,
> కృతం హనుమతా కర్మ దుష్కరం తర్క్యతే త్వయా. ౧౧
> బలాన్యపరిమేయాని వీర్యాణి చ నిశాచరాః,
> పరేషాం సహసావజ్ఞా న కర్తవ్యా కథంచన." ౧౨

అని మూలము. భావికర్మఫలానురూపముగా విభీషణుఁడు మాటలాడుచున్నవాఁడని యీవాక్యములే తెలుపుచు చున్నవి. దుస్తరము కదా సాగరము. అట్టిదానిని లంఘించి లంకం జొచ్చి హనుమ చేసినకార్య మేరికేని దుష్కరమే. అట్లు చేయునని తలంప నవకాశము కల్గినదా. అనఁగా మన మూహింపని కార్యము లెన్నియో దైవవశమున సాగు. వానికిం బ్రతీకారము చేయ వలంతులగువా రెవ్వరు? లేరని భావము. ఒక్కవానరుఁ డింత దుష్కరకార్య మొనరించినపు డాపఁజాలక పరితపించి చూచుచు లంకఁ గాల్పఁగాఁ గన్ను లారఁ గాంచుచున్న మీరిపు డెట్టు లాతని సతని ప్రభువును మార్కొనఁ దలంతురని ప్రశ్నించెను. విభీషణుఁడని యెఱుఁగ వలయును. మఱియు శ్రీరామునిబలము లిన్నియని యొన్న నెన్నటికేఁ దరంబు గాదు. వీర్యసంపన్నములే యవి. కావునఁ ద్వరపడి శత్రువుల నవమానింపఁ దలంపరాదని విభీషణుఁడు తెల్పెను. రామసేన లట్టివని యతఁడె శ్లాఘించె ననరాదు. త్రైకాల్యాలోచనమగు ప్రజ్ఞ గలుగఁగాఁ గనుఁగొనరాని దేది యుండును?

"అయశస్యమనాయుష్యం పరదారాభిమర్శనం,
అర్థక్షయకరం ఘోరం పాపస్య చ పునర్భవం. ౧౫
ఏతన్నిమిత్తం వైదేహీ భయం నస్సుమహద్భవేత్,
ఆహృతా సా పరిత్యాజ్యా కలహార్థే కృతేన కిం." ౧౬

అని మూలము.

"పరదారాభిమర్శేషు ప్రవృత్తాన్నౄన్ మహీపతిః,
ఉద్వేజనకరైర్దండైశ్ఛిన్నయిత్వా ప్రవాసయేత్." ౩౫౨

మను. ౮ అ.

పరదారాభిమర్శము మహాపాపమని యట్టిదోషము గలవాదిని రాజు తనదేశమున నుండకయుండ వెడల నడుపవలయు ననియు స్మృతులు చెప్పుచున్నవి. వాల్మీకివాక్యః స్మృతుల ననుసరించియే యున్నవి. కావున నట్టిపాపము చేసినందున మన కెల్ల సీతామూలమున మహాభయ మనఁగా మృత్యువు సంభ వించును. కావున నామె వదలుటయే మేలు. ఏదానిమూల మున మహాభయము గలుగునో దానిని వదలవలయును గదా అనియె. సీతామూలమున దనుజులకెల్లఁ గీడు గల్గునని విభీషణునాశయము. ఇది నీతిశాస్త్రవేత్త యగుట నతఁడు విమర్శించి చెప్పినాఁ డనువారు కలరు. కాని యాధోరణి వేఱు ఈధోరణి వేఱు. భగవంతునిగా శ్రీరాముని భావిం చియే విభీషణుఁ డిపుడు పల్కెనని మన మెఱుంగవలయును. లేకయున్న హనుమద్రావణసంవాదకాలముననే యీనీతి నేల యితఁడు చెప్పలేదు. సమయ మాసన్నమైనది. శ్రీరా ముని యాశ్రయణము దొరకుతరుణము చెంతనున్నది. కావు ననే కలవరపెట్టుచుండువిషయమును గ్రక్కెను.

"వినశ్యేద్ధి పురీ లంకా శూరాస్సర్వే చ రాక్షసాః,
రామస్య దయితా పత్నీ స్వయం న యది దీయతే." ౨౦

అని మూలము. ఇది జ్యోతిశ్శాస్త్రప్రశ్నఫలము గాదు. మనస్సు కర్మప్రోత్సాహితము కాఁగాఁ బలికినపలుకు లివి. సత్య పూతములు కాని రిత్తమాటలు కావు. సీతను రావణుఁడు స్వాపరాధప్రదర్శనపూర్వక శరణాగతిమార్గమున శ్రీరాముని నకు సమర్పింపకపోయిన సకలరాక్షససహితముగా లంక నశించును. అని స్పష్టపఱచెను.

## ఏకాంతమున విభీషణుఁ డన్నకు హితముఁ దెల్పుట, అతఁ డంగీకరింపకుండుట.

* అంతఁ దెల్లవాఱెను. విభీషణుఁడు ధర్మాధర్మంబుల నిశ్చయించుకొనఁ జాలినవాఁడు కాన నన్నకు నుపదేశింపఁ బూనెను. అది మహాభయంకరకార్యమే యగు. ఐనను పెను దీయక యన్నయింటికిం బోయెను. ఆప్రాసాదము మనోహరమై సర్వసద్వస్తుపరిపూర్ణంబై యుత్తమాలంకారాలంకృతంబై యసదృశమై వెలయుచుండెను. వీరుఁడు తేజశ్శాలియు నగు నవ్విభీషణుఁ డాప్రాసాదమును బ్రవేశించి ప్రభుక్షేమాభిలాష ముల రాక్షసు లుచ్చరించు పుణ్యాహమంత్రములధ్వనుల నాలకించెను. మంత్రబ్రాహ్మణవేత్త లగుబ్రాహ్మణులు పెరుఁగు పాత్రములు ఘృతపుష్పాక్షతాదులఁ బూజితులై యుండం దిలకించెను. సింహాసనాసీనుండగు రావణుని చేరంజని భక్తిచే

* ఇది పదియవసర్గమునఁ గల కథ.

నన్నును నమస్కరించి సాంప్రదాయాచారముల నెఱింగిన ప్రోఢ గావునఁ దశాకాలోచితముగ జయశబ్దప్రయోగమును గావించి రావణుఁడు కనుసన్నం దెల్పిన యాసనమునఁ గూరుచుండి మంత్రులుతప్ప మఱియొకరు లేకయుండుసమయ మది గావున రావణునితో నిట్లు పలికెను. దేశకాలజ్ఞుఁడు యుక్తి నెఱింగినవాఁడు గావునఁ దనయన్న చేసిన యధర్మకార్యమని యెఱింగియు హితవచనములఁ బ్రసన్నుని గావించి యిట్లు మాటలాడెను.

మహాప్రభూ! సీత మనలంకఁ బ్రవేశించినదిమొదలనేక దుర్నిమిత్తములు కనఁబడుచున్నవి మంత్రయుక్తముగా హవిస్సులతో వేల్చినను జ్వలనుఁడు ధూమావృతుఁడై చల్లారుచునుండుచుండునే గాని యథాపూర్వముగా మండఁజాడ లేదు. అధిశ్రయణులయందు (ప్రొయ్యి) అగ్నిహోత్రశాలలయందు వేదాధ్యయనస్థలములయందు సర్పములు సంచరించుచున్నవి. వేల్వనుంచిన హవిస్సులకుఁ జీమలు పట్టుచున్నవి. ఆవుల పొదుగు లెండిపోవుచున్నవి. ఏనుఁగులమదము నశించుచున్నది. హయములు దీనత్వము నహించి హేషారవములఁ గావించుచు నాహారమును విధిలేక తినుచున్నవి. గార్దభోష్ట్రాశ్వతరములు రోమము లూడిపోవ నశ్రుజలంబులఁ గురియించుచున్నవి. ఎట్టి మంచిచికిత్సలు చేయించినను యథాపూర్వస్థితికి రాకున్నవి. వాయసములు క్రూరగతుల నొందుఁ జూచినఁ దాముగఁ గనఁబడుచుఁ గూయుచు విమానశిఖరములందు గుంపులుగాఁ గూయుచుండ నలవాటుపడుచున్నవి. గృధ్రలిండ్ల పై మండలక్రమమునఁ గూరుచుండుచున్నవి. నక్కలు సంధ్యా

కాలములయందు లంకదాపునకు వచ్చి యశుభనాదములు చేయుచున్నవి. మాంసముం దిను శునకములు లోనగు క్రూర జంతువులు నగరద్వారములందు గుంపులుగాఁ బిడుగులుపడి నట్లు భయముగలిగించునట్లు కూయుచున్నవి.

దానవేంద్రా! ఇట్టి దుర్నిమిత్తము లనేకములు పొడ కట్టుటయు, నివి తెలుపు నపజయము లంకంగాల్చుట లోనగు వానిమూలమునఁ దెలియుటయుఁ గారణములుగాఁ దగిన ప్రాయశ్చిత్తము వీని కెద్దియని విచారింప సీతను రాముస కర్పించుటయే యుక్తమని తోఁచినది. నేను గార్యసార మెఱుంగక యో, జీవితముపైఁగల దురాశచేతనో యిట్లు చెప్పినంగూడ నదియొక యపరాధముగా గ్రహింపందగదు. మనవీట దుర్నిమిత్తము లనేకములు పొడకట్టుచున్నవి కదా. వానివలని దుష్ఫల మొక్కరికిం గాక యెల్లదానవసంతతికి నని దెలిసియే యున్నది. మంత్రులేల యీవార్తలఁ దెలుప లేదని ప్రశ్నింతువేమో మంత్రు లెపుడును మీమనస్సు నను సరించి వర్తించుచుందురు. మోమోటమిం జేసి తెలుపంగూడ సాహసింపక యుందురు. నీకింతసాహస మెందుల కనెదవేమో. నీసహాజన్ముఁడ నగుటం జేసి చూచినది వినినది యంతయు వచింపఁబూనుట నాకుఁ బరమధర్మము. నీవీవిషయమంతయు న్యాయ్యముగా నెమ్మనమున నాలోచించి కార్యము చేయం దగునని నొక్కి చెప్పెను.

సోదరుఁడగు విభీషణుఁడు న్యాయ్యము హితము సూనృతము సర్వక్షేమకరము నగువాక్యమును బలుకఁగా విని రావణుఁడు నిర్భరకోపసమాక్రాంతుఁడై తనపట్టుదల మాను

కొనఁ బూనక తమ్మునితో నిట్లు పలికెను సహజన్మా! ఎవనిమూలమునను నాకు భయము కలుగదు. నావశమున నున్న సీత రామున కెన్నటికిని మరల దక్కదు. దేవేంద్రుఁడు దేవతలం గూడి రామునకుఁ దోడుపడినను రాముఁడు నాయెదుట యుద్ధమున నిలువఁబడఁ జాలఁడు. ఇఁక గెలుచు టెట్లు? సీతఁ దక్కించుకొను టెట్లు? అని దేవతాభయంకరుఁడగు రావణుఁ డిట్లు పలికి తమ్మునిం బొమ్మని సాగనంపెను.

మహాశయులారా! ఈఘట్టమునఁ గల సారమును గ్రహింప యత్నింతము. విభీషణుఁడు తనయన్నకుఁ గలిగిన దుర్నిమిత్తములను గలుగఁబోవు వానిఫలములను దెల్పెను. వానికి నతఁడు బదు లేరీతిగాఁ దెల్పెనో చూతము.

"అగ్రజస్యాలయం వీరః ప్రవివేశ మహాద్యుతిః." 2

అని మూలము. వాల్మీకిమహర్షిప్రోక్తత్వ మిందుఁ గనఁబడుచున్నది. "వీరః మహాద్యుతిః" అను రెండువిశేషణములు విభీషణునకుగా నీఁబడినవి. ఇవి సార్థకములే గాని పాదపూరణకల్లోలపరంపరలు గావు. భయంపడి రావణునిపాదములు పట్టుకొని బ్రదుకుపైఁ గలనాసచే నరిగినవాఁడు కాఁడు. భావి లంకాప్రభువై పరాక్రమమున రక్షింపఁగలవాఁడు కావున నాయర్థమును సూచింప నీవిశేషణము చేర్పఁబడినది. మహాద్యుతిః=

"యద్యద్విభూతిమత్సర్వం శ్రీమదూర్జితమేవ వా,
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంశసంభవమ్."

అను భగవదుక్తిప్రకారము మహాభక్తుఁడు తపస్వి శాంతాది సుగుణమణిగణభూషితహృదయుఁడు విభీషణుఁడు కావున

నీవిశేషణము చేర్పఁబడినదని మన మెఱుంగవలయును. ఈ వాక్యము భావి విభీషణాంతఃపురప్రవేశము సూచించుచున్న దని కొందఱందురు.

"పుణ్యాన్ పుణ్యాహఘోషాంశ్చ వేదవిద్భిరుదాహృతాన్,
శుశ్రావ సుమహాతేజా భ్రాతుర్విజయసంశ్రితాన్." ౭

అని మూలము. రావణాంతఃపురమున వేదవేత్తలు తద్విజయమును గోరుచుఁ దత్సిద్ధికై పుణ్యాహమంత్రములు పఠించుచుండఁగా నా వేదనాదములను విభీషణుఁడు వినెనని కదా దీని తాత్పర్యము. లంకయందు బ్రాహ్మణులు వేదవేత్తలు కలరని యిది తెల్పుచున్నది. విప్రులనుమాట యిట లేదే యందురేమో. తరువాతిశ్లోకమునఁ గలదు. వేదములయందు విశ్వాసము, వానిపఠనము మహాఫలప్రదమనువిజ్ఞానము, లంకావాసులకుం గలదనియు, నది విశేషించి రావణునకుం గలదనియు స్పష్టమగుచున్నది. అట్టి వేదవేదాంగపారంగతుఁడు పరమశివభక్తుఁడు నగు రావణుఁడు జ్ఞానహీనుఁడు విశేషకామాకులచిత్తుఁడు నగుననుట యెంత యుక్తమో తెలియఁజాలకున్నాఁడను. వేదవేదాంగపారంగతత్వమే నిరర్థక మనవలయుఁ గాని వేఱొకసమాధాన మొసంగ నలనుపడకున్నది.

"పూజితాన్ దధిపాత్రైశ్చ సర్పిర్భిస్సుమనోక్షతైః,
మంత్రవేదవిదో విప్రాన్ దదర్శ సుమహాబలః." ౮

అని మూలము. "కర్మణి వినియుక్తో వేదభాగో మంత్రః. కర్మచోదనా బ్రాహ్మణాని."అని వ్యాఖ్య. మంత్రవేదవేత్తలకు దధిపాత్రములు ఆజ్యావేక్షణపాత్రములు దానము లిచ్చినట్లు

పుష్పాపుకుతలచే వారిని బూజించినట్లు తెలియవచ్చెడిని. ఈ రాక్షసు లెవరు? బ్రాహ్మణులా. దేవతలు కూడ బ్రాహ్మణులే యగుదురు కదా. విప్రశబ్ద మేల వాల్మీకి యుపయోగించెను. వేదవేత్తలగురక్కసులు ద్విజు లనఁబడుదురనియు, నిట్లే క్షత్రియాదిసంజ్ఞలు గలవనియుఁ గొంద ఱందురు. రజకాంబష్ఠాదులు కూడ రక్కసులే యనవలయును. సారమేమి? రాక్షసు లోకజాతికిం జేరినవారు కారు. దేవతాభేదములు. ఈజాతినిర్ణయము మర్త్యులకే. రాక్షసు లమర్త్యులా యందురేమో. అమర్త్యత్వ మొక్క సురలకే అమృతపానశక్తిం గలిగినది. కాని వియద్గమనాదులు వారలకందఱకు సమానము. మర్త్యులకది శూన్యము. లంకానగరమున బ్రాహ్మణు లుండుట. ఆకాలమున దీర్ఘాయుర్దాయము సాధారణముగా నెల్లరకుఁ గల్గుసదియే. మూఁడువందలయేండ్లు త్రేతాయుగమునఁ గలిగియుండెను. శతవత్సరనియమము కలియుగమునందే. విప్రపూజాదులు రాక్షసులకు నలవడియే యుండును. తపోయజ్ఞాదులు మానవుల కెట్లో రాక్షసులకు నట్లే. మానవమాంసాహారము సర్వదానవసామాన్య మనుట పొరపాటు. అట్టివారు కొందఱుండిరనవలయు. మునులకుం గూడ మాంసాహారము గలదు. మానవమాంసము హేయమగుట నదిగొనువారు మహాక్రూరులనుచు దూషించువారలని యూహింపం దగును. దానప్రతిగ్రహములు లంకలో నున్నట్లు పాపపరిహారార్థము శుభాగమననిమిత్తముగ దానము లిఁబడుచుండునని యూహింపవచ్చును. పుణ్యపాపవివేకము గలవారు దానవులనియుఁ దేలెడిని. అందుఁ గ్రూరసౌమ్యస్వభావు లుండవచ్చుఁ గదా.

జాతిశ్రవణముననే క్రూరజాతియనుట పొరపాటు. వారిస్మృతి ననుసరించి యది యుండును.

"జగామ సముదాచారం ప్రయుజ్యాచారకోవిదః." ౧౧

అని మూలము. ఆచారపండితుఁడు గాన విభీషణుఁడు రాఘవునకు జయశబ్దప్రయోగాదిమర్యాద లర్పించెనని సామాన్యార్థము. ఆచారమనఁగా నేమి? అని ప్రశ్నము. మంచియలవాటు. అని సాధారణముగా నంద తెలిసికొనుదురే కాని యది యిది కాదు.

"ఆచారః ప్రథమో ధర్మశ్శ్రుత్యుక్తస్స్మార్త ఏవ చ,
తస్మాదస్మిన్ సదా యుక్తో నిత్యం స్యాదాత్మవాన్ ద్విజః. ౧౦౮
ఆచారాద్విచ్యుతో విప్రో న వేదఫలమశ్నుతే,
ఆచారేణ తు సంయుక్తస్సంపూర్ణఫలభాగ్భవేత్. ౧౦౯
ఏవమాచారతో దృష్ట్వా ధర్మస్య మునయో గతిం,
సర్వస్య తపసో మూలమాచారం జగృహుః పరం." ౧౧౦

మను. ౧ అధ్యా.

"ఆచారమగ్నికార్యం చ సంధ్యోపాసనమేవ చ." ౬౯

మను. ౨ అ.

"స్నానాచమనాద్యాచారమ్" అని కుల్లూకభట్టు. స్నానాది నియతకార్యము లెప్పుడెట్లు చేయవలయునో యది యెఱింగి యట్లు వర్తించుట ఆచారమని యెఱుంగందగు. అది శ్రుతిస్మృతిప్రతిపాదిక మగునది యని తెలియుట మంచిది. అట్టి యాచారమే ప్రథమధర్మమని మనువు శాసించెను. ఆచారము

వదలిన వేదపాఠము నిష్ఫలము. సదాచారవంతుఁడైనచో
వేదము ఫలించునని యర్థము. సదాచారమనఁగా స్నానానంత
రము సంధ్యోపాసనక్రియ. దురాచారమనఁగా సంధ్యోపాసనా
నంతరము స్నానము. సర్వతపోమూల మాచారమని యెఱింగి
మును లద్దాని నంగీకరించిరి. ఆచారము దేవతాప్రీతికరమగు
టొకటి. ఆరోగ్యప్రదమగు టొకటి ఈరెండుఫలములు గలు
గును. యోగులై పర్వతగుహాగృహాంతరములయందు నిరంత
రాత్మానుసంధానపరాయణుల కీయాచారము పనికిరాదు. ఎల్లరు
నట్టివారైనఁ గదా యాచారము అక్కఱలేకపోవును. మన
శ్శాంతి కాచారమే ముఖ్యమని పెద్ద లనువదించిరి. స్మార్త
మనఁగా స్మృతిప్రతిపాదితమని యర్థము. అదియు లోకాచా
రానుకూలమే. దానిని వదలరాదు. ఆయుస్సు క్షీణించును.
ఆరోగ్యాశ్రయ మాయుస్సు. ఆరోగ్య మాచారాధీనము.
ఆచారము శాస్త్రాధీనము. కావున సదాచారము లావశ్యక
ములే యనక యూరకుండరాదు. ఆచారములు మానఁదగు
నన్నవారి కద్దానిమహిమ యెఱుంగ వలనుపడినది కాదనవల
యును. ఆచారము భక్తికి మూలాధారము. మర్యాదయు
నాచారాధీనమే. మర్యాద లేనివా రేమనఁబడుదురు? అట్టివా
రుండుచో నెట్లుండును? మర్యాద ననుసరించియే యీప్రపం
చము శాంతిమంతముగా నున్నది. అది లేనిచో స్వేచ్ఛాప్రవర్త
కులచే నిండి గొప్పదనమును గోలుపోయి క్షీణించును.
ఎప్పుడుగాని యైకమత్యమే చేకూరదు. అదిలేనిరాజ్య మెట్లుం
డునో వ్రాయనేల? కొంద ఱిక్కాలమునఁ దారతమ్యమే వల
దందురు. అదియే లేనిచో నాస్తికభూయిష్ఠమై భరతఖండమే

పోడవడంగుననక తప్పదు. అట్టిదుష్కాల మీభారతఖండము నకు రాకయుండుఁ గాక. రాజభక్తిపూర్ణమై దైవభక్తి సంపూర్ణమై సదాచారభూయిష్ఠమై యీఖండ మఖండతప స్సంపత్సమున్నతిం గాంచుఁగాక.

"ఉవాచ హితమత్యర్థం వచనం హేతునిశ్చితం. ౧౨
ప్రసాద్య భ్రాతరం జ్యేష్ఠం సాంత్వేనోపస్థితక్రమః,
దేశకాలార్థసంవాదీ దృష్టలోకపరావరః." ౧౩

అని మూలము. విభీషణుని యోగ్యతను వాల్మీకిమహర్షి యిందుఁ బేర్కొనుచున్నాఁడు. దేశకాలార్థసంవాదీ = దేశ మును గాలమునెఱింగి తదనుకూలశుభములు గలుగునట్లు మాటలాడువాఁడని యర్థము. దేశమునెఱింగి మాటలాడ వలయును. హిమాలయప్రాంతముల నున్నయట్టి రామేశ్వర మున నున్న యాచారములను దెలుపరాదు. ఆస్థలమున కను రూపముగా నవి యుండవలెను. లేకున్న నవి యాచరింప శక్యములే కాకపోవును. అట్లే కాలముననుసరించి యుండును. హేమంతసమయమునఁ బంచాగ్ని మధ్యభాగమున నెల్లరు కూరుచుండి తపస్సు చేయఁగలరు. గ్రీష్మమున శీతలసలిలము లం దుండుటయుఁ గష్టము గలిగింపదు. కావునఁ గాలానుసార ముగాఁ గొన్నిధర్మములే యుండును. వాని నెఱింగి పల్కుట గాని హితము నాచరణార్హమును బ్రియముగ నుండదు. బుద్ధిమంతులన నీవిషయము నెఱింగినవారే. దృష్టలోకపరా వరః=ఇది శ్రేష్ఠమని యిది నీచమని యతఁ డెఱుంగును. హేతు వినిశ్చితం=యుక్తులచే నిర్ణయింపఁ బడినది. అనేక యుక్తులు

పన్నినను, సదుత్తర మిదియే యని తోఁపఁజేయునది. అత్యర్థం హితం వచనం = మిక్కిలి హితమనఁగా మేలుకలిగించునదియు నగుమాటను బల్కెను సాంత్వేన భ్రాతరం ప్రసాద్య = మంచి మాటలచే నన్నమనస్సు సంతోషమును గూడియుండున ట్లొనరించి యని యర్థము. ఉపస్థితక్రమః=వాక్యముల వరుసయెఱింగి యిట్లు పలికెనని యాశయము. దీనిమూలమున వాల్మీకి మనకు నేర్పినదేమి ?

> "సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాన్న బ్రూయాత్సత్యమప్రియం,
> ప్రియం చ నానృతం బ్రూయాదేష ధర్మస్సనాతనః."

అన్న మనువచనార్థము గాక మఱే మగును ? వినువానికి హితమగునట్లు సత్యేతరము గానియట్లు దేశకాలహితమగునట్లు మాటలాడవలయును. కానిచోఁ గార్యము నిష్ఫలమగునను విషయ మీభాగమునుండి నేర్చుకొనవలయును.

> "తదేవం ప్రస్తుతే కార్యే ప్రాయశ్చిత్తమిదం క్షమం,
> రోచతే యది వైదేహీ రాఘవాయ ప్రదీయతాం. ౨౭
> అయం చ దోషస్సర్వస్య జనస్యాస్యోపలక్ష్యతే,
> రక్షసాం రాక్షసీనాం చ పురస్యాంతఃపురస్య చ." ౨౮

అని మూలము. ఈ జరగినకార్యమందుఁ జేయఁదగిన ప్రాయశ్చిత్త మిదొకటియే. మనస్సునకు సమ్మతమగునేని రాఘవునకు వైదేహి నర్పింపుము. ఈచేసినదోష మొక్కనిది కాదు. రక్కసులకుఁ దదంగనలకుఁ బురమునకు నంతిపురమునకుం గలదు. అనఁగా రావణా! జరగినది జరగినదే. దాని విచారించి లాభము లేదు. రఘువంశమునఁ బుట్టిన భగవంతునకు విదేహాసంబం

ధము కలది వైదేహి. అనఁగా నయోనిజాత భగవతి నర్పింపు. అనఁగా శరణు చొరవలయు. రోచతే=అని యున్నది. ఇది నీకు మంచిదని తోఁచిన నని యర్థము. బ్రదుకఁ దలఁచిన నని సారము. ఈపాపము ననుభవించువా రనేకులు గలరనియేఁ గదా విభీషణుఁడు. సంఘాతదుష్కర్మము. ఆయుద్ధమున నెవ్వ రెవ్వ రెవ్వ రెవ్వరిచేత నెందెందుఁ జావఁదగుదురో వారెల్ల లంకలో జన్మించిరి. సాంఘాతమరణమని దీనికిం బేరు. ఇట్లు విభీషణుఁడు పలికెను. విజ్ఞానధనుఁడు గావున నిమిత్తములం దిలకించి తత్తత్ఫలములఁ బరిశీలించి పెద్దలవలన విన్నదానిని వానియందు సమన్వయించుకొని సారాంశ మిదియని నిశ్చయించుకొని తేటమాటలఁ దెల్పెనని మన మెఱుంగవలయును.

> "శ్రావణే చాస్య మంత్రస్య నివృత్తాస్సర్వమంత్రిణః,
> అవశ్యం చ మయా వాచ్యం యద్దృష్టమపి వా శ్రుతం. ౨౫
> సంప్రధార్య యథాన్యాయం తద్భవాన్ కర్తుమర్హసి."

అని మూలము. మంత్రులు మోమోటమి నీ విషయ మెఱింగియు వినిపింపరు. తప్పక నేను విన్నది కన్నది వచింపవలసినదే. మంత్రులు నీమేలు కోరినవారు కారు. తమమేలునే కోరెడువారు. నేనో నీమేలు కోరినవాఁడను. కావున వదలక తెల్పితిని. ఏది చూచితినో ఏద్దాని వింటినో దాని నిర్వచించితిని. నా విన్నపమును మది విమర్శించి యేది న్యాయమని నీకుఁ దోఁచునో యద్దాని నాచరింపుము. అని విభీషణుఁడు హితముపదేశించెను. యథాన్యాయం = అనఁగా న్యాయము వదలక యని యర్థము. యథాయోగ్యమనియు నర్థము. ఏది తగినదని తోఁచునో యది నీవే యోజించుకొమ్మనునర్థము ధ్వనించుచున్నది.

నీవు మహాపండితుఁడవు. ఇప్పట్టున భగవద్వైరము మంచిదని తోఁచిన నట్లు వర్తింపుము. శరణాగతి మంచిదని తోఁచిన న ట్లాసర్పుము. అనఁగాఁ బరోపదేశము ప్రధానము కాదనియుఁ దాను యోజించుకొనుటయే మంచిదనియుఁ దాత్పర్యము తేలెడిని.

"ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్,
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపురాత్మనః." ౫

అన్న గీతావాక్యమునర్థమే యిందును బ్రతిపాదింపఁబడినది.

"హితం మహార్థం మృదు హేతుసంహితం
వ్యతీతకాలాయతిసంప్రతిక్షమం,
నిశమ్య తద్వాక్యముపస్థితజ్వరః
ప్రసంగవానుత్తరమేతదబ్రవీత్." ౨౭

అని మూలము. ఇందు మహర్షి మహత్త్వము తేటపడుచున్నది. హితమనఁగా శ్రుతిపేయమైనది. మహార్థమ్=ఎంత విమర్శించిన నంతయర్థము గలది. మృదు = సులలితవాగ్గుంభితము. తనకొఱ కుగాఁ జెప్పఁబడినదని భావము. స్వప్రయోజన ముద్దేశింపక పరైకప్రయోజనమునే యుద్దేశించి చెప్పఁబడినదని యర్థము. హేతుసంహితమ్ = యుక్తి కనుకూలమైనది. ఎంత యోజించి నను యుక్తికి విరుద్ధముగాఁ దోఁపనిదని తాత్పర్యము. వ్యతీత కాలాయతి సంప్రతిక్షమం=భూతభవిష్యద్వర్తమానకాలము లకుఁ దగినది. జరగినదాని కపకీర్తిరాకుండ, నిప్పటి కనుకూ లమై భావిశుభోదయమగునదని భావము. అట్టివాక్యము వినఁ గానే. ఉపస్థితజ్వరః=శోకము గలవాఁడై. ఇట్టివాక్యము నాల

కింపఁగా నిష్టములేనిచో నాగ్రహము రావలయుఁ గదా. దాని చోట శోకము పొడకొననేల? అనఁగా రావణునకు నీవిభీషణునిమాటలు శోకదాయకములు. ఎప్పుడెప్పుడు శరీరభారము తగ్గునా యని నేనుండఁగా నీతఁ డిట్లు దీర్ఘకాలజీవితహేతువు లగుమాటలు పలుకుచున్నవాఁడే యని శోకము గల్గెను. దానిచేత నిట్లు బదులు చెప్పెనని మనమిచ్చో వాల్మీకిమహర్షి భావమును గ్రహింపందగు.

"భయం న పశ్యామి కుతశ్చిదప్యహం
న రాఘవః ప్రాప్స్యతి జాతు మైథిలీం,
సురైస్సహేంద్రైరపి సంగతః కథం
మమాగ్రత స్థాస్యతి లక్ష్మణాగ్రజః." ౨౮

అని మూలము. ప్రతీతికార్థము స్పష్టము. విభీషణునకు గూఢముగా స్వాభిప్రాయమును రావణుఁడు దెల్పుచున్నాఁడు. సోదరా! ఏవిషయమునందు నేప్రక్కనుండియు నాకు భయము గల్గదు భయంపడకుము. ఎంత శ్రమంపడిన నది నాకుఁ గలుగదు. రాఘవః మైథిలీం జాతు న ప్రాప్స్యతి=శ్రీరాముఁడు సీత నొకానొకప్పుడు పొందఁజాలఁడు. సర్వకాలము జానకి దగ్గర నుండునని సారము. ఇంద్రాదులతోడ సకలత్రిదశులు తోడు వచ్చినను నాయెదుట శ్రీరాముఁడు నిలువఁజాలఁడు. వానరులు తోడుపడిననే నిల్చునని యాశయము. అనఁగా నాకు నేప్రక్కనుండియు భయము రాదు. భయమనుదాని నే నెఱుఁగనని భావము. ప్రాణమునం దాశ లేనందున భయము లేదని సారము. అని రావణుఁడు తెలిపెనని మన మెఱుంగ వలయును. ఇఁకఁ దరువాతికథను బఠింతము.

## రావణుఁడు మరల మంత్రులతో నాలోచించుట.

* అంత రావణాసురుఁడు పాపమతిం బూని కామమోహితుఁడయి మిత్రులగువారు తనకు హితము బోధింపమానఁగా సీతాపహరణరూపపాపకర్మము తన్నుఁ దొందరింపఁగాఁ జింతాకులస్వాంతుఁ డయ్యెను. మంత్రమున కది కాలము కాక యుద్ధమున కది యర్హమైనను రావణుఁడు మరల నాలోచింపఁ దలంచెను. వెంటనే కొలువుకూటమున కరిగి పాపాత్ములు తన్నుం బరివేష్టించి యుండఁగా రాక్షసాంగనలు సేవింపఁ గొలువుకూటము చేరెను. సింహాసనముపయిం గూరుచుండెను. దూతలం గాంచి శీఘ్రుంబ లంకయందలి రక్షోనాయకుల నాలోచింపఁ దోడుకొనిరండని యానతి యొసంగెను. వేవేగ వారలరిగి యాయాయిచోటుల నుండువారి నెల్లఁ బిలుచుకొని వచ్చిరి. వారెల్ల నమస్కరించి యుచితాసనములయం దుపవిష్టులైరి. మంత్రు లర్హస్థలంబులం గూరుచుండిరి విభీషణుఁడును శ్వేతహయంబులం బూన్చిన స్యందన మెక్కి సభకుం బోయెను. జ్యేష్ఠభ్రాతకు నమస్కరించి యుచితాసనమునం గూరుచుండెను. నిశ్శబ్దముగా నా సభాభవన మొప్పియుండెను. ఎవ్వఁడు నసత్యమాడువాఁడు లేఁడు. ఎల్లరును రావణునిమోము చూచుచుండిరి.

## కుంభకర్ణుఁడు రావణున కనుకూలముగా మాటలాడుట.

* అంత రావణుఁడు సేనాధిపతియగు ప్రహస్తునిం గని, సేనాధ్యక్షా! నగరరక్షణమున కనువగు చతురంగబలముల

---

* ఇది పదునొకండవ సర్గమునఁ గల కథ.

* ఇది పండ్రెండవ సర్గమునఁ గలదు.

నియమింపుము. అనఁగా నతనికి విశ్వాసపాత్రుఁ డగు నా ప్రహస్తుఁడు రాజాజ్ఞను శిరసావహించి యాయాబలముల నాయాచోట్ల నుండున ట్లాజ్ఞాపించెను. తనపని నెఱవేఱఁగా రాక్షసేశ్వరునిం గని యోధవీరుల వెలుపల లోపల రక్షింప నాజ్ఞాపించితి. వా రప్రమత్తులై యున్నవారు. ఇఁక మనస్సు స్థిరతం గాంచం జేసికొని చేయఁదగుదాని నాలోచింపందగు. అది సిద్ధించుఁగాతమని విన్నవించెను. రాజ్యహితైకకాంక్షి యగు రావణుఁ డా ప్రహస్తునిపలుకు లాలకించి విజయము నాశింపక కామసిద్ధిం గాంక్షించి సుహృదయులగు రక్షోవీరులం గాంచి ధర్మార్థకామములలో దేనిని సేవింపందగునను శ్రమము గలిగిన తఱి మీరయ్యెదాని ననుష్ఠించుటం జేసి దానిమూలమునఁ గలుగు శుభాశుభములను, ప్రియాప్రియములను సుఖదుఃఖముల నింకనుంగల ద్వంద్వములం దెలియ సమర్థులరు గాన వానింబట్టి యేది సేవ్యమో యద్దానిం దెలిపి శంకలం బోఁగొట్టఁ గలరు. చక్కఁగా నాలోచించి నిశ్చయించి యారంభించిన కార్యములం దేదిగాని నాకు విఫలమైనది లేదు. ప్రతి కార్యము సఫలమే యైనది. మీమూలమున నేను జయలక్ష్మి నొందెదను.

వీరవర్యులారా! ఈవిషయము ముందే మీకెల్లఁ జెప్పందలంచితిని. కాని నా ప్రియసోదరుఁడు కుంభకర్ణుఁ డపుడు నిద్రించుచు నుండెను. కావునఁ జెప్పనైతిని. ఆయుధధారులలో నగ్రగణ్యుఁడగు నీకుంభకర్ణుఁ డాఱునెలలనుండి శయనించియుండెను గదా. ఆతఁ డిపుడే నిదుర లేచియున్నాఁడు. కనుక నే మున్ను తెలుపకపోతిని. అని పలికి కుంభకర్ణుం గని

రాముని ప్రియపత్నిని సీతను జనస్థానమునుండి తెచ్చితిని. నా ప్రార్థన మంగీకరించి నాపొందుఁ గోరకున్నది. ఒల్లకున్న వదలి పెట్ట రాదా యందురేని త్రిలోకములయందు సీతాసమానురా లొక్కతెయుఁ గానరాదు. ఆమె యవయవసౌందర్య మేమని వర్ణింతుము? అత్యంతారుణములైన పాదములు గలిగి కోమల తమములు సమతలములునై యొఱ్ఱని గోళ్లుగలిగియున్న యా జానకిపాదములం జూడంజూడ నావాంఛ లుప్పొంగుచున్నవి. మదనుఁడు నన్ను వదలక బాధించుచున్నాఁడు. నామనస్సు కలఁతనొందియున్నది. ఆ మీనాక్షి పెనిమిటి రాముఁడు వచ్చు నేమో యని యావిభురాక నిరీక్షించుచు సంవత్సరములో రాముఁడు రానిచో నీవు చెప్పినచొప్పున వర్తింతునని నన్నొక సంవత్సరకాలము వ్యవధి యాచించెను. కానిమ్మని దాని కంగీక రించితిని. ఆతాపమునఁ గడుంగడుం బడలియున్నాఁడ. వారు సేనాసహితులై రానుండఁగా నీకానితంబిని యెట్లు వశంగత యగునని యడుగుదురేమో వినుండు. దుస్తరము సముద్రము. మహాయాదస్సులు నిండియుండును. దానినెట్లు వానరు లుత్త రింతురు? రామలక్ష్మణులు మాత్ర మెట్లు దాఁటఁగలరు? దాఁ టుదురనియే యంగీకరింతము. ఒక్కకోఁతి మనతో మహా ఘోరసంగ్రామము చేసెను గదా. ఇఁకఁ గార్యము లెట్లెట్లు సాగునో యెఱుంగుట కనుపడకున్నది. మీయందఱ కేది యెట్లు తోఁచునో దాఁపక తెల్పుఁడు.

మున్ను మీసాయమున దేవతలను గెల్చితిని. అప్పుడు గెలుపొందిన మీరే యుత్తఱిని నాకుఁ దోడుగానున్నారు. ఇంద్రుసంతటివానిం గెలిచిన నాకు విభీషణుఁడు చెప్పినట్లు మాన

వునివంక భయము కలుగుననుట వట్టిది. ఒక్కదానిని విమర్శించి చూతము సాగరమున కవ్వలితటమున సీతయుండు తావెఱింగి సుగ్రీవాదులం గూడి రామలక్ష్మణు లున్నవారు. మీరు విమర్శింపఁదగిన దేదనఁగా సీత నర్పింపకయుండ నాయన్నదమ్ములఁ జంపునట్లు మీ రూహింపవలయు. అట్టియుపాయ మొక్కఁడేగా నిశ్చయించి నాకుఁ దెల్పుఁడు. కోఁతుల సాయముగానొనర్చుకొని సాగరమును లంఘించి యిటఁ జేరుటకు రామునకు మాత్రమే కాదు జగంబున నెవ్వరికి సాధ్యము కాదు. కావున నిశ్చయముగా నాకే జయము కలుగును.

అని రావణుఁడు మనశ్చాంచల్యమునఁ బలుకఁగాఁ గుంభకర్ణుఁ డాలకించి కోపము హెచ్చఁగా నిట్లు బదులు పల్కెను. రాజా! నీలో నీవే తలపోసికొని రామలక్ష్మణుల ప్రాపుగల సీతను బలవంతముగా నిచ్చటికిఁ బట్టి తెచ్చితివి కదా. తెచ్చునపుడే మాతో నాలోచించి యుండిన నీమదికి నింత సందియ ముండదు గదా. అదియ మాతో యోజింపందగు కాలము. ఇపుడాలోచించుట వ్యర్థమే కాన నీమనసు కలఁత మానకున్నది. ఇప్పటి యాలోచనమంతయు సీతను దెచ్చుటకుఁ బూర్వమే మాతోఁ జేసియుందువేని చాల బాగుండెను. ఏవాఁడు తొలుతనే యాలోచించి న్యాయము తెలిసికొని పిమ్మటఁ గార్యము చేయునో యతఁడు నీవలెఁ బశ్చాత్తాపము నొందఁడు. విపరీతమగునేని కార్యము నిష్ఫలమగుటయ గాక యపాత్రులకుఁ బెట్టఁబడు హవిస్సువలె దోషము గలుగఁజేయును. తొలుతనే చేయవలసినది పిదపను, ఆలోచనమునకుఁ బిదపఁ జేయఁదగు కార్యము ముందును జేయు నెవ్వాఁడు పూనునో

వాఁడు మేలుగీ ల్లెఱిఁగినవాఁడు కాఁడు. క్రౌంచపర్వతము నెగిరి దాఁటరాని హంసలు కుమారస్వామి దాని రంధ్రము చేయఁగా నామార్గమున దాఁటిపోవునట్లు శత్రువులు బలవంతులగునపుడు గెలువరాని నెఱింగి యాలోచించి పనిచేయని చపలమతియగునేని వానిలోపము నెఱింగి హఠాత్తుగాఁ బైఁబడి పగవారు వానిం గెలుతురు. కనుక సీతాపహరణకార్య మపాయకరమే యగు. ఆలోచింపక చేసితివి. ఈలోపము నీయందుండియు నదృష్టవశమున విషయుక్తమాంసమువలె రాముఁ డెవ్వరికిఁ దెలియక యుండురీతి నింతదనుక వధింపక యున్నాఁడు. నీవిట్లనర్హ కార్యము నొనర్చితివి కావున నేను దప్పనది యితరులచే సరిపఱుప నలవి కాదు. నేను నీ పగవారి వధించి సరిపఱచెద. వా రింద్రాదులతో సరిపోలువారైన నేను మార్కొని సంగ్రామ మొనరింతును. నేను భూరితరంబగు నినుప గుదియం బట్టుకొని సింహనాద మొనరించుచు మార్కొన నింద్రుఁడు కూడ నిలువఁజాలక పరువెత్తును గదా. ఇతరులనఁగా నెంత ? ఆరాముఁ డొక్క శరమేసి రెండవశరమున నన్నుఁ బ్రహరించులోపల నే నతనిరక్తముఁ ద్రావుదును.. నీవిఁక నూఱడిల్లి యుండుము. నేనా రాముని జంపి నీక శ్రమమున జయము కలిగింపఁ బ్రయత్నింతును. ఆసోదరులం జంపి వానరుల భక్షింతును. నీవు యథేచ్ఛముగా విహరింపుము. చక్కని మద్యముం ద్రావుము. కలఁతనొందక నీయిష్టకార్యముల నొనరించుచుండుము. రాముని యమపురికనిపెదను. పిదప సీత నీ వశమునఁ జాలకాలము నిలిచియుండఁగలదని తెలిపెను.

మహాశయులారా! ఇందనేకవిషయములు విమర్శింపఁ దగియున్నవి. వాని విమర్శించి తెలిసికొందము.

"భవద్భిరహమత్యర్థం వృతశ్శ్రియమవాప్నుయాం." ౯

అని మూలము. మహాసభలో రాక్షసవర్గ్యులం గాంచి రావణుఁడు తెల్పినమాట యిది. మిమ్ముంగూడి మిక్కిలి శ్రీ నొందఁగలను. అనఁగా నర్థమేమి? మీరందఱు తోడుపడినఁ గాని సంగరము గాదు. అందు మిమ్ముంగూడి స్థిరసుఖము ననఁగా వీరస్వర్గ సుఖము నొందుదుననియే కదా. తన్ను నాశ్రయించువారలకు సుఖమును గల్పించుట విధి గనుక యుద్ధమునకుఁ బ్రోత్సహించెనని మన మెఱుంగవలయును.

"ఇయం చ దండకారణ్యాద్రామస్య మహిషీ ప్రియా,
రక్షోభిశ్చరితాద్దేశా దానీతా జనకాత్మజా. ౧౨
సా మే న శయ్యామారోఢుమిచ్ఛత్యలసగామినీ,
త్రిషు లోకేషు చాన్యా మే న సీతా సదృశీ మతా." ౧౩

అని మూలము. ప్రాతీతికార్థము విస్పష్టమే. విశేషార్థ మిట్లు తెలియందగు. "రామస్య ప్రియామహిషీ జనకాత్మజా ఇయం" అని క్రమము. శ్రీరామునకుఁ బ్రియపత్ని పట్టపురాణి. అంత మాత్రమే కాదు. జనకాత్మజా = జనకరాజకుమారిక. ఆమెను రాక్షసులు తిరుగుచుండు దండకారణ్యమునుండి పిలుచుకొని వచ్చితిని. ఆమె అలసగామిని. మందగమనము గలది. అనఁగా సత్వరముగనే పనిచేయక యాలోచించి పనిచేయునదని భావము. ఆమె నే సమర్పించు శయ్యనెక్క నిష్టపడకున్నది. లోకత్రయమున వేఱొకతుక జానకితో సమానురాలు లేదని

నాభాసము. సీత నాయుపచారముల నంగీకరింపకున్నది. కాని యీలోకమునందు నిట్టి పురంధ్రి లేదని నా యభిప్రాయము. నన్నుఁ బెండ్లియాడకున్నది. విహారమున నన్ను నలరింప కున్నది. అనఁగా నాశయ్య నంగీకరింపకున్నదనఁగా నానగరమున నుండ నిష్టపడకున్నదని గదా భావము. త్రిలోకపూజ్యురాలని సారము. ఆమె రూపమహత్త్వమును వినుతించుచున్నాఁడు.

"హేమబింబనిభా సౌమ్యా మాయేవ మయనిర్మితా. ౧౮
సులోహితతలౌ శ్లక్ష్ణౌ చరణౌ సుప్రతిష్ఠితౌ,
దృష్ట్వా తామ్రనఖౌ తస్యా దీప్యతే మే శరీరజః. ౧౯

అని మూలము. "హిరణ్యవర్ణాం హరిణీమ్." అన్న శ్రుత్యర్థ మిట నునుపదింపఁ బడినది. సౌమ్యా = శుభదర్శన యని యర్థము. మయనిర్మితా మాయేవ స్థితా=మయుఁడు దానవశిల్పి. చిత్ర కర్మనిపుణుఁడు. అతఁడు సృజించిన మాయవలె. మాయ యనఁగా లేని దున్నట్లు చేయుట యని యర్థము. ప్రకృతి కిప్పటిరూప మట్టిదే యని తాత్పర్యము. అట్టి జగజ్జనని యరుణ పాదములు చూడఁగానే. మే శరీరజః దీప్యతే = మనస్సునం దలి వాంఛ ప్రకాశించుచున్నది. అనఁగా జానకి యరుణ పాదారవిందములు చూచినంతనే నామనోవాంఛ వెలయు చున్నదని రావణుఁడు చెప్పుచున్నాఁడు. పాదదర్శనము కామోద్రేకహేతు వగునా? అత్యంతభక్తుఁడు రావణుఁ డనుటకు సందియముండునా?

"త్వదన్యః పాణిభ్యామభయవరదో దైవతగణ
స్త్వమేకా నైవాసి ప్రకటితవరాభీత్యభినయా,

భయాత్త్రాతుం దాతుం ఫలమపి చ వాంఛాసమధికం
శరణ్యే లోకానాం తవ హి చరణావేవ నిపుణౌ." ౪

అని శ్రీశంకరభగవత్పాదాచార్యులు సౌందర్యలహరియందుఁ జెప్పిరి. భక్తుఁ డిష్టదేవతాపాదారవిందముల సేవించును. అట్లే రావణుఁడు జానకీపాదములు చూడఁగా శరీరగత వాంఛాసముదాయ ముద్దీపించుచున్నదని గూఢముగా స్వాభిప్రాయమును దెలిపెనని మన మూహింపవలయును. ముఖాదులు కామోద్దీపకము లనుట విందుము. పాదములు భక్త్యుద్దీపకము లనియు విందుము. కాన నిందు రావణుఁడు భక్తినే తెలిపెనుగాని కామవికారమును దెలుపలేదని మనము విశ్వసించుట యుక్తము.

"హుతాగ్నే రర్చిసంకాశా మేనాం సౌరీమివ ప్రభాం." ౧౫.

అని మూలము. ఈ యుపమానములు సీతానిర్మలతేజస్సును దెలుపుచున్నవి. కాముకుఁడు నాయిక నిట్లు వర్ణించుట యెందును గానము వేల్వఁబడిన యగ్నిజ్వాలవలెను సూర్యరశ్మివలెనుండు సీతాదేవిని జూడఁగా శరీరజమగు నభిలాషముప్పొంగె ననఁగా నతనిభావ మెద్దిగా నుండవచ్చునని యూహింపఁదగునో సహృదయు లెఱుంగుదురు గాక.

"ఉన్నసం వదనం వల్గు విపులం చారులోచనం. ౧౬
పశ్యంస్తదా వశస్తస్యాః కామస్య వశమేయివాన్,
క్రోధహర్షసమానేన దుర్వర్ణకరణేన చ. ౧౭
శోకసంతాపనిత్యేన కామేన కలుషీకృతః." ౧౭౫

అని మూలము. క్రోధహర్షసమానత్వాదిగుణములు గలది సంసారకామము. దానిచేఁ గలవిలపా టొందింపఁబడినవాఁడ

నైనను జానకీ ముఖదర్శనము చేతనే యాదేవీ వాంఛావశుఁడ నౌదునా? సంసార కామము వదలిపోయినదని భావము.

"సా తు సంవత్సరం కాలం మామయాచత భామినీ. ౧౮
ప్రతీక్షమాణా భర్తారం రామమాయతలోచనా,"

అని మూలము. పరాశక్తి నీయింట నుండఁగా నీకేల యీపరి తాపమని ప్రశ్నింతురేమో యని తానే సమాధానము చెప్పుచున్నాఁడు. ఆమెయు నొకసంవత్సరమే వ్యవధి నన్నుఁ గోరినది. అంతలో శ్రీరాముఁ డరుదెంచునన్న యాశయము గలది గాన నట్లడిగెను. కావున నాకాలము కూడ నించుమించుగా ముగియవచ్చినదే యని విచారించుచున్నాఁడనని తేటపడుచె నని మన మెఱుంగవలయును.

"తన్మయా చారునేత్రాయాః ప్రతిజ్ఞాతం వచశ్శుభం. ౧౯
శ్రాంతోఽహం సహసా కామాద్యాతో హాయ ఇవాధ్వని,"

అని మూలము. భర్తృత్రాణపరాయణములగు నేత్రములుగల యాసీతాదేవి యడిగిన గడువు నంగీకరించితిని. నేనుఁగా దూరము నడచిన గుఱ్ఱమువలె సంసారవాంఛలం జేసి కష్టు బడలియున్నాను. అనఁగా నీ బడలిక లుడుగ నిం కెంతకాలము పట్టునో యెఱుంగరాకున్నదని భావసారము.

"అథ వా కపినైకేన కృతం నః కదనం మహత్. ౨౧
దుర్జ్ఞేయాః కార్యగతయో బ్రూత యస్య యథామతి,
మానుషాన్మే భయం నాస్తి తథాపి తు విమృశ్యతాం." ౨౨

అని మూలము. కాముకుఁడు రావణుఁడు కాదనియు నెప్పుడెప్పు డీతనువు వదలుదునా యని యువ్విళ్లూరుచుండువాఁడనియు

నీమూలము తేటపడుచును. ధీరులారా! ఒక్కవిషయమును యోజింపుఁడు. ఒక్కకోఁతి వచ్చి మనతో ఘోరముగాఁ బోరాడెను. తప్పించుకొని పోయెను దీనినిబట్టి యోజింపఁగాఁ గార్యము లెట్లు ప్రవర్తించునో తెలియుట మిక్కిలి కష్టము. కావునఁ గడచినదాని నాధారము చేసికొని ముందేమి సాగునని తోఁచునో యోజింపుఁడు. ఒక్కకోఁతి చేసినపనులు మన శక్తియుక్తులు చక్కఁగా విమర్శింపుఁడు. తోఁచినట్లు పలుకుఁడు. ప్రత్యేకముగా నూహింపుఁడు. అని పలికెను. ఈ భావము మూలమునఁ గలదా యని సందియమందకుఁడు. మతి అనునది జరగినవిషయము నెఱుంగు మనస్సునర్థ మిచ్చును. "మతిర్వ్యతీతవిషయా" అని ప్రమాణము. యథామతి=[illegible]గా తోఁచినట్లని సామాన్యార్థము. జరగినదాని నాధారముగాఁ జేసికొని స్వపరబలముల నాలోచించి యనునది యవయవార్థము రావణువిభావ మేమి? వానరమాత్రునే యోడింపఁజాలక నగరము కాల్చుచుండ వాని నాపఁజాలక యుంటిమి. ఇఁక నట్టివానరుల ననేకులం గూడి రామలక్ష్మణులు వచ్చిన నెంతమాత్రము వారి నోడింపఁగలమో యోజించి తెలుపఁదగినయాశయమును దెలుపుఁడని కదా తదాశయ మనవలయును. వీనింబట్టి యాతని వివేకిత్వము తేటపడలేదా? [illegible] యూహా లేనిచో నొక్కకోఁతి యెట్టికార్య మొనరించెనో కార్యగతుల నెఱుంగుట కష్టముగా నున్నదని విన్నవారల కుత్సాహభంగమగున ట్లేల పలుకును? సామాన్యదృష్టి నూహించినచో మంత్రు లిద్దాని విన్నంతనే నిరాశ గలవారలగుట్కేమి సందియ ముండును? కావున రావణునిభావము పైన వ్రాసి

నదే యని నిశ్చయింపవచ్చును. ఈవాక్యము కర్మతత్త్వమును దేటపఱచుచున్నది.

> "కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః,
> తత్తే కర్మ ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. ౧౬
> కర్మణోఽహ్యాపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః,
> అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణోగతిః. ౧౭
> కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః,
> స బుద్ధిమాన్ మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్. ౧౮

అన్న గీతావాక్యములయర్థమునే యీ రావణాభిప్రాయ మనుసరించుచున్నది కదా. "దుర్జ్ఞేయాః కార్యగతయః" అన్నది "గహనా కర్మణో గతిః" అనునది సమానార్థబోధకములే యగుం గదా. పైనుడి తరువాతి రావణువాక్య మిది. మనుష్యునివలన నాకు భయము కలుగదు. ఐనను విమర్శింపుఁడు. అనియేఁ గదా. దీనిభావ మేమి? వరబలము ననుసరించి చూచిన మానవునుండి భయము నాకు నుంతయుఁ గలుగదు. ఐనను దర్కించి చూడుఁడు. అనఁగా నేను గోరిన వరమునఁ జేరిన నరులలో నీరాముఁడు చేరఁడు. నరరూపమాత్రుఁడగు పరమపురుషుఁడు మే = నాకు, మానుషాత్ = మనుజరూపుఁడగు రామునివలన, భయం నాస్తి = మరణభయము లేదు. అనఁగా శ్రీరామునిచేతఁ జత్తునన్నది భయహేతువు కాదని భావము. అది యభయహేతువు. అభయదాత భయదాత కాఁదగఁడు. అగుననుట లోకజ్ఞానశూన్యత కుదాహరణము కాకపోదు. రామునివలన మరణభయము గలుగునని భయంపడకుఁడు. భయము లేదు. ఐనను విమర్శింపుఁడు. నాకు మానవునినుండి

భయము లేదనఁగా నాకది క్షేమహేతు వగును. మీాకో భయహేతువే యగును. అనఁగా నాకన్న ముందు మీారు రణమునఁ బడుదురని రావణుఁడు సూచించెనని మన మెఱుంగవలయును. ఐనను విమర్శింపుఁ డనఁగా నాకు మానవునినుండి భయము కలుగవచ్చునని యూహించి యిప్పటికృత్యము నిద్ది యిట్లని నిర్ణయింపుఁ డనునభిప్రాయ మూహాకుఁ దగులక మానదు.

"అదేయా చ యథా సీతా వధ్యౌ దశరథాత్మజౌ,
భవద్భిర్మంత్ర్యతాం మంత్రస్సునీతం చాభిధీయతాం. ౨౫

అని మూలము. ప్రాతీతికార్థము స్పష్టము. "అవధ్యౌ రామలక్ష్మణౌ. సీతా అదేయా చ యథా (స్యాత్తథా) భవద్భిర్మంత్రః మంత్ర్యతాం సునీతం చ అభిధీయతామ్" అని యన్వయక్రమము. రామలక్ష్మణు లవధ్యులు. యుద్ధమున గెలుతుమను నాశ వదలుకొనుఁడని హెచ్చరిక. సీతా అదేయా చ=సీత నీయఁదగదు. సీతనిమ్మని చెప్పకుఁడని హెచ్చరించెను. యథా స్యాత్తథా=ఈ రెండు సత్యములు కాఁగా కార్యమెట్లు కావలయునో యట్లు. ఆలోచించి మీారు నాకు నిశ్చయించినదానిం దెల్పుఁడని భావము. అనఁగా అవధ్యులగు రామలక్ష్మణులు నేను సీత నీయకపోవఁగా నెట్లు కార్యము సాగింతురో యట్టులాలోచించి నిశ్చయించి దానిని నా కెఱిఁగింపుఁడని సారము. దీనిచే రావణుఁడు సీతాకారణమున భగవంతునిచే మృతిఁ గాంచి యీా స్థూలశరీరమును విడువఁగోరినవాఁడనియు నించుకంతయుఁ గామాసక్తుఁడు కాఁడనియు మహాభక్తుఁడనియు మన మెఱుంగవలయును.

"న హి శక్తిం ప్రపశ్యామి జగత్యన్యస్య కస్యచిత్,
సాగరం వానరై స్తీర్త్వా నిశ్చయేన జయో మమ." ౨౯

అని మూలము. విశేషార్థ మిట్లు గ్రహింపందగు. సాగరలంఘన మితరున కెవ్వనికిని శక్యముకాదు. అట్టిశక్తి యెవ్వనియందున్నట్లు కానను. అనునర్థమును గ్రహించుచో వాల్మీకిమహర్షి కే యపయశస్సు పొసఁగును. అంతకుముందే హనుమ దాఁటి వచ్చుట యెఱింగియున్నాఁడు కదా. కనుక నిట్లనుట యసంగతమే యగు. అట్టు లగుటంబట్టి యింక నేదియో యతనిభావమున్న యట్లు తలంపవచ్చును. వానరులం గూడి అనఁగాఁ జంచలాత్ములంగూడి భవసాగరమును దాఁటఁగలశక్తి నాకుందప్ప వేఱొక్కనియందు నా యెఱింగినంతవట్టు కనుపట్టదు. కావున జయము నాకు నిశ్చయమే. శ్రీరామునివలన మృతింగని యుత్తమపదమును జంచలమతులగు మిమ్ముంగూడి పొందఁగలనని సారము. అన్యస్య కస్యచిత్=రామునకుఁ దప్ప నితరునకు సాగరము దాఁటుశక్తిలేదని వ్రాసి జయము నాకుఁ గలుగదు. అనఁగా మృతియే కలుగునని రావణునాశయమని మహేశ్వరతీర్థులు వ్రాసిరి.

"తస్య కామపరీతస్య నిశమ్య పరిదేవితం,
కుంభకర్ణః ప్రచుక్రోధ వచనం చేదమబ్రవీత్." ౨౭

అని మూలము. "కామపరీతస్య తస్య పరిదేవితం నిశమ్య" అని యన్వయక్రమము. కామపరీతుఁడగు రావణునిదుఃఖముతోడి మాటను దానిని విని యని యర్థము కదా. లోపలి సందర్భము నాలోచించిన దుఃఖమునకు హేతువే కానరాదు. కనుక నిది నీరసశ్లోక మనవలసి వచ్చును. మహర్షిభావము ప్రాతీతికార్థ

పరముకాదనియే యిది తెల్పుచున్నది. కామపరీతస్య=(మరణ) వాంఛచేఁ జుట్టుకొనఁబడిన యారావణుని దుఃఖవాక్య మనఁగా నెప్పుడెప్పుడు తల్లాభము కలుగునా యని తహతహ పాటునఁ బలుకు మాట నాలకించి యాగ్రహమునఁ గుంభకర్ణుఁ డిట్లు పలికెనని యాశయము.

"రమస్వ కామం పిబ చాగ్ర్యవారుణీం
కురుష్వ కార్యాణి హితాని విజ్వరః,
మయాతు రామే గమితే యమక్షయం
చిరాయ సీతా వశగా భవిష్యతి." ౪౦

అని మూలము. ఇది కుంభకర్ణుఁడు రావణునకుం దెల్పిన హిత వచనము.

"అత్రాప్యర్థాంతరం. మయా రామే విషయే అక్షయం యథా భవతి తథా గమితా ప్రాపితా సీతా రామస్య వశగా భవిష్యతి. రమస్వేత్యాదా కాకుః."

అని గోవిందరాజులు వ్రాసిరి.

"మయా రామే విషయే మమక్షయం గమితే సతి సీతా అవశం అస్య విష్ణురూప రామస్య వశమాగమిష్యతీతి సంబంధః."

అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి. రావణుఁడు సీతను గామ పరీతాత్ముఁడై చేకొని పోలేదని మహేశ్వరతీర్థులు వ్రాయఁగా నది క్లిష్టకల్పన యని యాక్షేపించు మధ్యవైష్ణవశిఖా మణు లిచ్చోట గోవిందరాజులు వ్రాసినయర్థమును గాంచి విభ్రాంతి నొందకపోరు. ఆక్షేపించువా రల్పులనుట సార్వ

జనీనమే కదా. కుంభకర్ణునినోట మహాకవి వాల్మీకిమహర్షి యిట్లు పలికించెను. ఆతనిమనస్సులో నట్లు చెప్పవలయునన్న తలం పుండినను లేకున్నను గర్మవశమున నట్టి యర్థము లిచ్చుమాటలం బల్కెనని మన మూహించుటమంచిది. రామచంద్రుని మార్కొని నేఁ జూపఁగా సీతాదేవి శ్రీరామ వశమున నుండఁగలదు. నీకు విహారపానాదు లెక్కడివి! యుద్ధము తప్పదు. శ్రీరాముఁడు నన్నుం జంపును. పిదప సీతారాముల కేకస్థలమున వాసము సంభవించును. నీ యిప్పటి యాశలు ఫలింపవని కుంభకర్ణునిమాటలలోఁ గలసారము. ఇదియే రావణుని భానము. అయిన నిది యన్నతలంపని కుంభ కర్ణుఁ డెఱుఁగఁడు. రావణున కన్నియుఁ దెలిసినవియే. ఎవ్వారు గాని కర్మవశమునఁ దమ కదివఱకు లేనిభావమున వశులై వెలిపుత్తురు. కర్మము బలవత్తరమనియే కదా దీనినుండి తేలెడిని.

"స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్."

అన్న గీతోపదేశ మీయర్థమునే వివరించును గదా.

ఈభాగమున నధ్యాత్మరామాయణమునఁ గలవిశేష ములఁ బరికింతము.

"కుంభకర్ణస్తదా ప్రాహ రావణం రాక్షసేశ్వరం. ౧౩
ఆరబ్ధం యత్త్వయా కర్మ స్వాత్మనాశాయ కేవలం,
న దృష్టోఽసి తథా భాగ్యాత్త్వం రామేణ మహాత్మనా. ౧౪
యది పశ్యతి రామస్త్వాం జీవన్నాయాసి రావణ,
రామో న మానుషో దేవస్సాక్షాన్నారాయణోఽవ్యయః. ౧౫

సీతా భగవతీ లక్ష్మీ రామపత్నీ యశస్వినీ,
రాక్షసానాం వినాశాయ త్వయానీతా సుమధ్యమా. ౧౫
విషపిండమివాగీర్య మహామానో యథా ...థా,
అసీతా జానకీ పశ్చాత్త్వయా కిం వా భవిష్యతి. ౧౬
యద్యప్యనుచితం కర్మ త్వయా కృ...మజానతా,
సర్వం సమం కరిష్యామి స్వస్థచిత్తో భవ ప్రభో." ౧౭

అని. ఈయర్థమే వాల్మీకి గూఢముగా ననువదించెను. ఇదియే వీనికిం గలభేదమని మన మెఱుంగందగు. ఇంకం దరువాతికథం బఠింతము.

## మహాపార్శ్వునితో రావణుఁడు తనకుఁ గల శాపముం దెలుపుట.

* అంత రావణుఁ డా కుంభకర్ణుని హితవచనములకుఁ గ్రుద్ధుఁడౌట మహాపార్శ్వుఁ డెఱింగి నుంత ప్రసన్నునిగాఁ జేయునుపాయ మాలోచించి యంజలిం బట్టి యిట్లులనియె. మహారాజా! తేనెఁ గోలఁ గోరి మహాసత్త్వభూయిష్ఠమగు నడవి కరిగి దానిని శ్రమంపడి సంపాదించి త్రాగక యెవఁ డుండునో వాఁడే మూఢుఁ డనఁదగినవాఁడు. అట్లే కోరి సీతం దెచ్చియు ననుభవింపక యూరక యుండనేల? నీవు పరవీర హంతవు. సర్వము నియమించువాఁడవు నిన్నిఁక నియమించు వాఁ డెవ్వఁ డుండును? కనుక ధర్మభయము వదలుము. శత్రు శిరస్సులందుఁ గాలిడి జానకిం గూడి విహరింపుము. బలశాలు రయం దగ్రగణ్యుఁడవగు నీవు సీత యంగీకరింపకున్నను వంచ

* ఇది పదుమూఁడవ సర్గమునఁ గల కథ.

నచేఁ బెంటి నాక్రమించు కోడిపుంజువలె నామెఁ బైకొని బలిమి మెఱయించి యనుభవింపుము. దాన శాంతి చేకూర సుఖం బుండుము. నీవు కామము తీర్చుకొన్నమీఁద భయ మేదే నొదవునే నది వచ్చినను రానిమ్ము. మఱి కొంతకాలము నకు రానిమ్ము. అవోక లెక్కయా? నీ వింటే యుండుము. కుంభకర్ణుఁడు నింద్రజిత్తు నను వీరియవు రే మమ్ముం గూడి వజ్రి యేతెంచిన నిలిచి వారి నోర్వఁజాలుదురు. యుద్ధమున శక్తి లేనివారలే దాన సామభేదముల నేర్పఱచిరి. విభీషణుఁడు తెలిపినచందమున వాని వదలి దండోపాయమున నీకార్యము నీదేర్చుకొనుము. నికుంభుఁడు చెప్పినరీతిగా రాముఁడు లెం దున్న వారో అచటికిఁ బోవవలదు. నీవు బలవత్ప్రముఖుఁడవు కదా. వారు మనపురిచెంతకు రాఁగానే మేము నిగ్రహింపఁ గలము. శంక లిందులకు లేవు.

అని మహాపార్శ్వుఁడు పలుకఁగా రావణుఁడు తనకను గుణముగాఁ జెప్పినాఁడని ప్రశంసించుచు వానిం గాంచి. మహాపార్శ్వుఁడా! నీనుడులు సంతసము నిడఁజాలెను. ఒక్క రహస్యము వచింతు. అది నీకుఁ దెలిసియుండుట మంచిది. అది. సాగి చాలకాల మైనది. ప్రాఁత కతయైనం జెప్పెద. ఒకప్పుడు. పుంజికస్థల యనునచ్చర ఆకసమునఁ బోవుచు నన్నుం జూచి భయమున నొదిగియొదిగి యగ్నిశిఖవలె వెలుంగుచు బ్రహ్మను సేవింపఁ బోవుచుండఁగా దానిం గంటిని. వెంటనే నేనా చెలువ వలువనూడ్చి బలిమిమైఁ గ్రమ్మి నిర్బంధించి సుఖించితిని. అది తనయందము దూల బ్రహ్మచెంత కరిగినది. ఆమెను నిర్బంధిం చుట నమ్మహాత్ముఁ డెఱింగి కోపము నొంది యిది మొదలు పర

కాంత నిట్లు బలాత్కారమున రావణుఁడు పొందునేని శిరస్సు శతశకలములై పగులఁ గలదు. నిస్సంశయము. అని శాప మొసఁగెను. ఇట్లు బ్రహ్మ శపించినందులకు మిక్కిలి భీతి నొందితిం జుమీ. పరకాంతయగు సీతను, విశేషించి విదేహ సత్కులంబున జనించినసుశీలను బలాత్కారమున నాసెజ్జపై నెక్కింపఁజాలక యున్నాను. నాకు వేఱొక్కరితోఁ బనియే లేదు. అనేకశక్తులు నాకుం గలవు. ఈవిషయము మా రాముఁ డెఱుఁగఁడు. కనుకనే నాపైకి సేనలం గూడి వచ్చుచున్న వాఁడు గుహాయందు నిదురించుసింగమును మేలుకొలుపు చందమున, నిద్రపోవుమృత్యువును లేపినకరణి నూరకయుండును నన్ను రాముఁడు కావలయునని కయ్యమునకుఁ జీరుచున్నాఁడు కదా. ఎంతటి తెలివితక్కువవాఁడు? నాపరాక్రమము నెఱుంగ కున్న మానె రాముఁడు ద్విజిహ్వాల నల్లాడ్చు క్రూరభుజంగం బులం బోలు నా వాఁడిశరములరుచి యెఱుంగఁడు. కనుకనే వచ్చుచున్నాఁడు. వేగమ తీవ్రశరపరంపరల నాతని నొంచెద. ఆతఁడు పాఱిపోవఁగా నుదయభానుఁడు దిక్కులవెలుఁగును గొల్లఁగొనునట్లు భూరిసేనలం గూడి నేనా రామునిసేనలం జెండాడెద. ఇంద్రవరుణులు నన్నుం గెలువఁజాలరైరి. కుబేరు నోడించితి. ఆతని లంకానగరము నాక్రమించితిని. ఇఁక మను ష్యుఁడే యగురాముఁ డనఁగా నాకెంత? అని బీరములు పలికెను.

మహాత్ములారా! ఇందలివిశేషముల నెమకుదము.

"రావణం క్రుద్ధమాజ్ఞాయ మహాపార్శ్వో మహాబలః,
ముహూర్త మనుసంచింత్య ప్రాంజలిర్వాక్యమబ్రవీత్." ౧

అని మూలము. మహాపార్శ్వుఁడు రావణుఁడు క్రుద్ధుఁడని తెలిసికొని ముహూర్తమాత్ర మాలోచించి అనఁగా నెట్లు లీకోపము నాపనచ్చును. ప్రసన్నునిగాఁ జేయవచ్చును. అని యూహించి యని యర్థము. దీనిచే వానికిఁ దాఁ జెప్పఁబోవు పలుకులు సత్యములు కావని బుద్ధిపూర్వకముగాఁ జెప్పినవి. కావని తెలియును. అనఁగా నాకోపము నాపవలయునను టొక్కటియే యాతనిలక్ష్యము. కాని యందు శక్యాశక్య విచార మతఁడు చేయలేదని తేలును. బుద్ధిబలమున యుక్తా యుక్తముల నాలోచించి పలుకలేదని సారము. అప్పటికి రాజును మెప్పింపఁబూని పలికెనని గ్రహింపవలయును. వీని మాట లెవ్విధముగ నుండునో ఉత్తరముకూడ నట్లే యుండును గదా. తన పరివారమునకు రణమరణమున వీరస్వర్గమును గల్పింపనున్న రావణుఁడు శ్రీరామునితత్త్వ మెఱింగిన మహా జ్ఞాని బదులెట్లు పలుకవలెనో యట్లే పలుకునని మన మెఱింగిన విషయము చక్కఁగా బోధపడును.

> "ఈశ్వరస్యేశ్వరః కో స్త్యాత్తవ శత్రునిబర్హణ,
> రమస్వ సహ వైదేహ్యా శత్రూనాక్రమ్య మూర్ధసు." 3

అని మూలము. గోవిందరాజులయాశయ మిం దిట్లు గ్రహింపందగును. శ్రీరామున కీశ్వరుఁ డనఁగాఁ బ్రభువు లేఁడు. శత్రూన్ రామం = పూజ్యభావమున బహువచనము. శత్రుం రామం అని గ్రహింపవలయును. మూర్ధస్వాక్రమ్య = పదిశిరములయం దునిచి. అనఁగా మ్రొక్కి. వైదేహ్యా సహ రమస్వ. వైదేహ్యా యథా భర్తా రమతే తథా త్వమపి సదా రేషు. రమస్వ = సీతతో శ్రీరాముఁడు విహరించునట్లు నీభార్యలం

గూడి విహరింపుము. అనఁగా శ్రీరాముని గానంబోయి యతని శిరోదశకమున పందనముల నలరించి సుఖింపుము. లేచేని మృతి తప్పదని భావము. "శత్రూన్ రామం" అని యుండఁగా "శత్రూన్" అనుదానికి బహువచనము పూజ్యత్వమున నని పలికి యెట్లో మంచి యర్థమును గ్రహించిరి "రామాన్" అని యేల కవివర్యుఁడు చెప్పలేదని ప్రశ్నించుచో నుత్తరము మౌనమే అనవలయు. ఏది యెట్లున్నను మంచియర్థమును దెచ్చినందు లకు సంతసింపవలయు. ఇచ్చో నిన్ని చిక్కులకు లోఁబడి తేల్చిన గోవిందరాజులయాశయము నంగీకరించిన పాషండులు మధ్య వైష్ణవు లిట్లే మఱికొన్ని తావుల మహేశ్వరతీర్థులు తెల్పిన సదర్థము నేల యాక్షేపింపవలయునో యెఱుంగఁ దగంబుగా నున్నది. మతాభిమాన మెవ్వరి నెన్నితిప్పలకు లోను జేయు చున్నదో యోజింపుఁడు. అది మానిన నన్యమతదూషణమునఁ గలుగుపాపము లేకయుండును గదా. దేవతాంతరదూషణ మెంత పాపమో యోజింప వారి కీశ్వరుఁడు బుద్ధి నొసంగ లేదేమో.

"బలాత్కుక్కుటవృత్తేన వర్తస్వ సుమహాబల,
ఆక్రమ్యాక్రమ్య సీతాం వై తథా భుంక్ష్వ రమస్వ చ." ౪

అని మూలము.

"మునిహృదయం తు. కుక్కుటవృత్తేనాన్యత్ర వర్తస్వ. సీతాం తు బలాత్ భుంక్ష్వ రక్ష. భుజ పరిపాలనాభ్యవహారయోరితి ధాతుః. అత్ర నేపదమార్షమ్."

అని గోవిందరాజులు. రావణుఁడు పరమదుష్టుఁడని తేల్చిన గోవిందరాజు లిచ్చో నిట్లు వ్రాయుట ప్రాక్పుణ్యమున నని

తలంపంజను. ఇట్లే సీతను రావణుఁడు మాతగా భావించెనని యాయాయి ఘట్టములయందు వ్రాసిన మహేశ్వరతీర్థులను మధ్యవైష్ణవబ్రువు లాక్షేపింప నేటికో తెలియఁజాలకున్నాఁడను.

“వాస్తవార్థస్తు. కుక్కుటవృత్తే నేత్యత్ర కుక్కుటవృత్తే - న - ఇతి చ్ఛేదః. హే మహాబల రావణ ! వైదేహ్యా కిం ఆప ఆక్రమ్యాక్రమ్య వా ప్రకారాంతరేణ వా తాం వైదేహీం సీతాం న భుంక్ష్వ న రమస్వచ. కుక్కుటవృత్తే కుక్కుటవ్యాపారే చాపల్య ఇతి యావత్ న వర్తస్వ. కిం తు బలాచ్ఛత్రూన్ మూర్ధస్వాక్రమ్య రమస్వేతి సంబంధః.”

అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి. ఇచ్చో నిరువురు వ్యాఖ్యాతలేకాభిప్రాయసారమునే వెలిపుచ్చిరి. ఓ రావణా! సీతను వదలి అనఁగా రామచంద్రున కర్పించి లోకత్రయమునఁ గలవిరోధుల శిరస్సులపైఁ బాదము లుంచి ఆక్రమించి యథేచ్ఛముగా సకలరాజ్యభోగముల ననుభవింపుము లేనిచో నీ కిహలోకసుఖములు తీఱినవని వానియాశయము. మహాక్రూరుఁడగు మహాపార్శ్వుఁడు నీతి నిట్లు బోధించునా యని యడుగ సాహసింతురేమో. ప్రకృతిసంకల్పబల మది యని తెలిసికొనిన నీ సందియము లుండవు. ఈరావణుఁడే జరగఁబోవు రణరంగమున శ్రీరామునిం బొగడును. అపు డేమందురు? అది వాల్మీకి యాశయము గాదందురా? కాలగతులు దురూహ్యములు. ఎవరి మన స్సెట్లెట్లు మార్పునొందునో యది యెఱుంగ బ్రహ్మాదులకేఁ దరంబుగాదన నిఁక నస్మదాదులవిషయమై ప్రశ్న మేల? ప్రకృతియూహల నెఱుంగ నొకపరమాత్మ తప్ప నర్హు లెవరు ?

ఆదిశక్తిశక్తి యిట్టిదని శ్రుతులు వచింపఁజాలకయుండఁ దక్కిన యల్పమతులమాట యిట నేటికి?

శ్లో. "తనీయాంసం పాంసుం తవ చరణపంకేరుహభవం
విరించిస్సంచిన్వన్ విరచయతి లోకానవికలం,
వహత్యేనం శౌరిః కథమపి సహస్రేణ శిరసాం
హరస్సంక్షుద్యైనం భజతి భసితోద్ధూళనవిధిం. ౨
త్వదన్యః పాణిభ్యామభయవరదో దైవతగణ
స్త్వమేకా నైవాసి ప్రకటితవరాభీత్యభినయా,
భయాత్త్రాతుం దాతుం ఫలమపి చ వాంఛాసమధికం
శరణ్యే లోకానాం తవ హి చరణావేవ నిపుణౌ. ౪

అను శ్రీ శంకరభగవత్పాదాచార్యకృత సౌందరీలహరిశ్లోక ద్వయము సంస్మర్తవ్యము. తన్మహిమ మపారమని దుర్జ్ఞేయ మని తేలును. కావున మహాపార్శ్వునినోట యిట్టి నీతివాక్యలు వెలువడవని శంకించుట దుష్కర్మవశమున నే యనవలసి వచ్చినది.

"ఏవముక్తస్తదా రాజా మహాపార్శ్వేన రావణః,
తస్య సంపూజయన్ వాక్యమిదం వచనమబ్రవీత్." ౯

అని మూలము. ఈమూలము పైన వ్రాసినయభిప్రాయమును దృఢపఱచుచున్నది. ఆమాటలు విని రావణుఁ డతని గారవించి యిట్లు పలికెను. అనఁగాఁ దనయాశయమున కనురూపముగాఁ బలికిన యారక్కసుని హితతత్త్వవచనముల కలరి యతని గారవించెను

"సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాన్న బ్రూయాత్సత్యమప్రియం,
ప్రియం చ నానృతం బ్రూయాదేషధర్మస్సనాతనః,
భద్రం భద్రమితి బ్రూయాద్భద్రమిత్యేవ వా వదేత్.
శుష్కవైరం వివాదం చ న కుర్యాత్కేనచిత్సహ." ౧౩౯

అధ్యాయము. ౪

అన్న మనువాక్యము లిట నుదాహరణార్హములు గదా. దీని ననుసరించియే మహాపార్శ్వుఁడు రావణుని హితమును గోరి పలుకఁగాఁ గర్మవశమున నవి రావణుని సదాశయమువై పునకే వ్రాలినవని మనము గ్రహింపవలయును.

"మహాపార్శ్వ నిబోధ త్వం రహస్యం కించిదాత్మనః,
చిరవృత్తం తదాఖ్యాస్యే యదవాప్తం మయా పురా." ౧౦

అని మూలము. ఈ రహస్యవృత్తాంతము నింతకుముం దెవ్వరికిం దెల్పక రావణుఁడు దాఁచియుంచెనని కనుపట్టెడు. అందఱకంటె నీతని నుత్కృష్టునిగా భావించి తెల్పనేల యందురేమో. తన మనోభావమును బ్రోత్సహించుచు శ్రీరాముని మహాత్మునిగా భావించి తెలిపినందున మహాపార్శ్వుఁడు భక్తుఁడని యెఱింగి యతనితోఁ దనమనంబునఁ దాఁచియున్న భావమును వెలిపుచ్చెనని మన మెఱుంగవలయును.

"పితామహస్య భవనం గచ్ఛంతీం పుంజికస్థలాం,
చంచూర్యమాణామద్రాక్షమాకాశేఽగ్నిశిఖామివ. ౧౧
సా ప్రసహ్య మయా భుక్తా కృతా వివసనా తతః,
స్వయంభూభవనం ప్రాప్తా లోళితా నలినీ యథా. ౧౨
తస్య తచ్చ తదా మన్యే జ్ఞాతమాసీన్మహాత్మనః,
అథ సంకుపితో దేవో మామిదం వాక్యమబ్రవీత్. ౧౩

అద్యప్రభృతి యామన్యాం బలాన్నారీం గమిష్యసి,
తదా తే శతధా మూర్ధా ఫలిష్యతి న సంశయః. ౧౪

అని మూలము.

"అనేన రావణవిషయే రంభానిర్బంధననలకూబరశాపే విస్మయమానేఽపి తస్య ప్రాకృతదేవత్వాత్తత్పుత్రత్వాచ్చ తచ్ఛాపమనాదృత్య పుంజికస్థలాయామపి ప్రవృత్తం రావణం పశ్చాచ్ఛప్తవాన్ మహాశ్శ్వసప్తవాన్. అతఏవ రావణోఽప్యనుల్లంఘనీయం పితామహవాక్యమేవోక్త వానిత్యవగమ్యతే."

అని గోవిందరాజులు వ్రాసిరి. నలకూబరుఁడు ప్రాకృతదేవతయు రావణునకుఁ బుత్త్రుఁడు నగుటవలన నతనిశాపము లెక్కింపక పోయెననుటయు, మరల బ్రహ్మ శపించె ననుటయు యుక్తియుక్తములుగా నున్నట్లు తోఁపదు. ప్రాకృతదేవతలు పుత్త్రులు నొసంగిన శాపము ఫలింపవనుట విచిత్రమే. అట్లగుచో నింద్రాదు లొసంగు వరంబులు గూడ నట్టివే యగు. ఆశాపము విన్నపుడే రావణుఁ డిది నిష్ఫలమే యనవలసి యుండెను. ఆ శాపము విని జంకెనని యున్నది. కాన నిది యుక్తముగాఁ దోఁపదు. నలకూబరుఁడు తన్నొల్లని పరకాంతను బలిమిమైఁ బట్టిన మృతినొందును గాక యని శపించియుండు. అచ్చరలు పరకాంత లనుపేరునకుఁ దగరు గావునఁ బుంజికస్థలను బట్టుకొని యుండును. బ్రహ్మ యీభావ మెఱిఁగి "యామన్యాం నారీం రావణ! బలాద్గమిష్యసే" అని స్పష్టముగా ఇతరస్త్రీ యనఁగా నీభార్య కానిదాని నెవ్వతనుగాని బలవంతముగాఁ బట్టి సుఖింతువేని చత్తువని శపించియుండునని సమాధానము చెప్పిన బాగుండునని తోఁచెడిని. ఇఁకఁ దరువాతివృత్తాంతము మును బఠింతము.

## విభీషణుఁడు రావణునకు మరల హితముఁ దెల్పుట.

* అంతట విభీషణుఁడు రావణునుడుల నాలకించి కుంభ కర్ణుని వికత్థనములను విని యన్నతోఁ గర్తవ్యాంశమును దెలుపుమాటలతో నిట్లనియె. రాజేంద్రా! సీత నొసంగకయే శ్రీరాముని జంపునుపాయ మడిగితివి కదా. సీత యనఁగా స్పృశించినంతన మృతినొసంగు మహాసర్పము సుమా. ఆసర్పము నకు వక్షమే దేహము విరివి. చింతయే విరోధి ప్రాణవాయు వుల హరించునది. కనుక నాలకింపుము. జానకి నైదుతలలసర్ప ముగాఁ దలంపుము. అట్టిదాని నేమని కోరితివి? ఇది నీకొక్క నికే కలుగునవర్థము కాదు. పర్వతశిఖరాకారములు గలవాన రులు లంకపైనెత్తి రాక మునుపే జానకీదేవిని శ్రీరామున కర్పిం పుము. ఆరఘువీరుఁడు తీవ్రతరశరపరంపరలఁ బ్రయోగించి రక్కసుల మేటిశిరంబుల భూమిం బడఁజేయకముందే సీతాంబ నర్పింపుము. అని పలికి యంత నిలువక ప్రహస్తునిం గని యిట్లనియె. మంత్రీ! ప్రాణాంతకరములగు శ్రీరామునారా చము లింకను నీశరీరమును జీల్చుకొని పోవకున్నవి. కనుక నే నిన్నిట్లు నీవే పొగడుకొంటివి. కుంభకర్ణేంద్రజిత్తులుగాని రాక్షసేశ్వరుఁడుగాని, మహాపార్శ్వాదులుగాని రామునెదుట నిలువఁజాలరు. సూర్యుఁడు దేవతలు నీకుఁ దోడుపడినను దేవేంద్రునంకమునఁ జిన్నిబిడ్డవలె నీవున్నను మృత్యువుతొడ మీఁదఁ గూరుచున్న మతెందుఁజొచ్చినను రాముఁడు నిన్నుం జంపక వదలఁడు.

---

* ఇది పదునాల్గవ సర్గమునఁ గలదు.

అని విభీషణుఁడు పేరోలగమున నిట్లు మోమోటమి దక్కి నొక్కి పలుకఁగా విని ప్రహస్తుఁడు విభీషణా! మాకు నిర్జరాదులవలన భయములేదు. ఇఁక నొకరాజశిశువునలన నది గలుగునే? అనఁగా విభీషణుఁడు మహామతిమంతుఁడు స్వామిహితార్థియుఁ గాన రాజునకుఁ గీడుగలిగించుమాటల నతఁడు పలుకనాలకించి ప్రహస్తా! మీరెల్ల రేమేమి చేయుదు మని చెప్పితిరో యది యెంతమాత్రము శక్యము కాదు. దాఁటుటకు దారువైనఁ దోడులేనివానికి సముద్రము తరింప నలవిగానియట్లు నాకు నీకు నీరాక్షసులకును మహాసమర్థుఁ డగు రాముని వధింప నెట్లు శక్యమగును? శక్యమనునది సున్న. కాన రామాదు లవధ్యులే. రాముఁ డనఁగా ధర్మనిరతుఁడు. తన్ను సారథిని రక్షించుకొనుచు రణమున శత్రువులవధించు మహారథుఁడు. ఇక్ష్వాకుమహావంశసంభూతుఁ డగుట నైజ పరాక్రమశాలి. ఇట్టి సకలసద్గుణగరిష్ఠుఁ డగురాముని సంగర నైపుణమును దేవత లెఱుంగఁజాలరన మీబోటు లెంత? ప్రహస్తా! భయంకరములు దురాసదములు నగు రాముని బాణములు నీమేను భేదింపఁగలవు. కనుకనే ని స్సింతగాఁ బొగడుకొనుచున్నావు. నీవు మొదలగు వీరులెవ్వరు నాతని కడ నిలువంజాలరు.

ఈరావణుఁడు మనకుఁ బ్రభువు. విమర్శించి కార్యము చేయువాఁడు కాఁడు. విశేషించి వ్యసననిమగ్నుఁడు. అని యోజించి యతనికి హితము తెల్పక పేరునకు మాత్రము

మిత్రులై కార్యములందు శత్రుతుల్యులరై యుగ్రస్వభావుఁడు మనకేలయని తలంచి యతఁడు పోయినమార్గముననే పోవుచున్నారు. దాన సర్వరాక్షసనాశనము చేయఁగలరే కాని మఱెద్దియుఁ జేయంజాలరు. ఇది మీరెఱుఁగరు. మనరాజును రామద్వేషరూప మహాభయంకర భుజంగము చుట్టుకొని యున్నది. మీరంద ఱా మహాకాలసర్పమును బాఱఁదోలి రాజును గాపాడుఁడు. రాజు దుష్పథమును జొచ్చునేని బలవంతపఱచియైనను సుహృదులు సత్పథమునకుఁ దేవలయును. మీకెల్ల సుఖములం జేకూర్చిన యీరాజు లక్ష్మణనామక మహాసంహారిసాగరమున మునుంగుచు రామబడబానలముఖమునఁ బడ సిద్ధముగా నున్నాఁడు. కావున నిత్తఱి సుహృదులగు మీరెల్ల నూఁతయై యతని గట్టునకుఁ దేవలయును. రాజు జానకినీయక యుండనిండు. నాయీ హితవచనము లంకాపురమునకు మీకును సర్వవిధముల హితమైనది. నామతసారము నాలకింపుఁడు. శ్రీరామునకు సీతను రావణాసురుఁ డీకున్నను మనమైన నిత్తము. మంత్రి శత్రుబలమును స్వవిభుబలమును బరిశీలించి వృద్ధిక్షయాదుల సూక్ష్మబుద్ధి నాలోచించి యుక్తము స్వామిహితము నగుదానిని బ్రభువునకు నచ్చఁ జెప్పవలయును. అని నిర్దాక్షిణ్యముగా నుడివెను.

ఇందలివిశేషము లీవఱకు విమర్శించినవే కావున విభీషణుఁడు భగవద్భక్తుఁ డనుట సర్వజనవిదితము గాన నిందలి విశేషముల నెమకక తరువాతికథం బఠించి యందలివిశేషములఁ దెలియఁ బ్రయత్నింతము.

## విభీషణమతము నింద్రజిత్తు ఖండింప నెంచిన దుర్బుద్ధిని విభీషణుఁడు ఖండించుట.

* అంతట సభలోనున్న మహాబలశాలి యింద్రజిత్తు విభీషణునిహితోక్తుల నెంతయో కష్టముతో విని యిట్లు బదులు చెప్పెను. పితృవ్యా! నీవు కడపట వచించిన మాట యెవనరికి నంగీకారము కాదు కావున వ్యర్థమే. ఈ పులస్త్యవంశమున జన్మింపక మఱొక వంశమునఁ బుట్టినవాఁడుకూడ నిట్టిమాట వచింపఁడు. మఱి చేయఁడు. ఇఁక నిందు జన్మించిన నీకుఁ జెప్పఁదగినదేనా? అని రావణుం గాంచి యీవంశమందు నాపిన తండ్రి యీవిభీషణుఁ డొక్కఁడుమాత్రమే బలప్రభావప్రయత్నసాహసశ్రద్ధామానముల వదలియున్నవాఁడు. అని పలికి మరల విభీషణునిం గాంచి రాక్షసా! ఆరాజశిశువు లతిదుర్బలులు. మాలో నల్పతరుఁడగు నొక్క రక్కసుఁడుకూడ వారిం జంపంజాలు. భీతుఁడా! నీవు భయపడుట చాలక మమ్మేల యూరక భీతులనుజేసెదవు? ఓయీ! ఇంద్రునైశ్వర్యము త్రిలోకసంబంధము గాన దానిం జెప్పనేల? దేవతానేత గాన నతని సైన్యసామగ్రియు వచింపనేల? అట్టియింద్రుని భూమిం బడఁజేసితిని. దేవతలెల్ల భయంపడి పాఱిపోయిరి. నేఁ బట్టితెచ్చియుఁగా నైరావతము వికారముగా నార్చుచు నేలం బడుండెను. దానిదంతముల రెండింటిని లాగి వానిచే దేవతలం బ్రహరించి పాఱఁదోలితిని. అట్టి నేను మానవుల దుర్బలుల నిరువుర గెలువఁజాలనా? ఏల యూరక భయపెట్టెదవు?

---

* ఇది పదునైదవ సర్గమునఁ గల కథాభాగము.

అని యతండు పలుక విని విభీషణుఁడు శతమఖశత్రు పున కెఱుంగం దరంబుగాని మంచి యర్థముగలమాటల నిట్లు ముచ్చటించెను. వత్సా! నీవీ లోపలివాఁడవు. ఆలోచించి యుక్తాయుక్తముల నెఱుంగఁదగినశక్తి నీకు లేదు. పిన్నవాఁడవు. నీబుద్ధి యింకను బరిపక్వము కాలేదు. కనుకనే స్వవినాశకరంబగు పనికిమాలినవాగ్జాలము నిట్లు వెడలించుచున్నావు. రక్షశ్శిశువా! రాముని మూలమున రావణునకుఁ బుత్త్రమిత్ర సహితముగా వినాశము కలుగునని చెప్పఁగా వినియు నజ్ఞానమున నితరులమాటలకు సమ్మతించుచున్నాఁడ వేల? కనుక నీవు పుత్త్రుఁడను పేర నొప్పు శత్రుఁడవు. పితృవినాశనమునకు సమ్మతించు దుర్బుద్ధిని నిన్నే దండింపవలయునా? బాలుఁడవని యెఱింగి యిట్టి సభకుఁ బిలుచుకొనివచ్చినవానినే వధింపవలయును. మంచిసెబ్బరల నెఱుంగుపాటివివేకము నీకు లేదు. సర్వజ్ఞునివలె విఱ్ఱవీఁగుదువు. గురుజనశిక్షితుఁడవును గావు. క్రూరస్వభావుఁడవు. అల్పబుద్ధివి. ఆలోచించి యేదియుఁ జేయువాఁడవు గావు. బాల్యమున నేదియుఁ దెలియక వదరుచున్నావు. యుద్ధమున నిలిచి రాముఁడు వజ్రమయబాణములం బ్రయోగింపఁగా నెవ్వఁడు సహింపఁగలఁడు? అని పలికి యంత నిలువక రావణుం గాంచి ధనకనకభూషణాంబరముల రత్నములం గైకొని జానకిం బిలుచుకొనిపోయి శ్రీరామున కర్పించి దుఃఖరహితులమై మనమిందు సుఖముందము. అని పలికెను.

## రావణుఁ డవమానింప విభీషణుఁడు మంత్రులతో సంబరమున కెగసి నీతిం దెల్పుట.

* తన మనసునకు నెక్కునట్లు తెల్లముగా హితము బోధించిన సహజన్ముని విభీషణుని గాంచి రావణుఁడు దాని కాతనిం బ్రశంసించి పశ్చాత్తాపము నొందవలసినవాఁడయ్యు మృత్యుప్రేరితుఁ డగుటం జేసి కఠినవాక్కులఁ బగవానినివలె దూషించువాఁ డయ్యెను. సోదరా! బాహ్యశత్రువులతోఁ గాని కోపసంభరితచిత్తమగు క్రూరఫణితోఁగాని సావాసము చేయవచ్చును. కాని మిత్రరూపమునఁ గనంబడుచు శత్రు పక్షావలంబియగు సోదరవైరితో మాత్రము సహవాసము చేయరాదు. సర్వజనులలో జ్ఞాతిస్వభావము నాకుఁ జక్కఁగాఁ దెలియును. వారు తమ జ్ఞాతులకు వ్యసనములు కలుగఁగా నానందించుచుందురు. నీవును జ్ఞాతివగుటం జేసి నావ్యసనమునకు సంతోషించి యిట్లు వదరుచున్నాఁడవు. జ్ఞాతులు తమలో మిన్నయగువానిని, దక్షుని, విద్వాంసుని, ధర్మశీలుని, శూరుని సమయము గనిపెట్టి పరిభవింతురు. వారికి జ్ఞాతివ్యసనమునందు సంతోషము, నుత్కర్షమునం దసూయయుఁ గలిగి యుండుట మాత్రమే గాక మఱొక్కశీలము కూడఁ గలదు. వారు స్వీయాశయముల వెలిపుచ్చక గూఢముగా నుంచుకొని పైకి పరస్పరస్నేహము గలవారివలె నభినయించుచుఁ గ్రూర కార్యము లొనరించుచుందురు. వ్యసనములందు ద్రోహమును గావింతురు. కాన వారు భయంకరులే యగుదురు. ఒక్కపుడు

* ఇది పదునాఱవసర్గమునం గలదు.

గజములు తమ్ముం బట్టవచ్చిన పాశధారులం గాంచి కొన్ని శ్లోకములు చెప్పెనని వింద్దు. వానిం జెప్పెద. మన కగ్నివలనఁగాని దానికంటె వేగమ నాశనముచేయు నితరాయుధములవలనఁ గాని భయము లేదు. మృతికన్న నతిదుస్సహామయి పరవశత్వమును గలిగించి బాధించు పాశములవలనఁగాని భయము లేదు. ఏమనఁగా దయమాలి తమకార్యమునే చూచుకొనుచు మనల బంధింపనున్న పూరుషులకడనుండు మనజాతిగజముల వలననే మనకు భయము కలుగుచున్నది. ఈజ్ఞాతులే వీరికి మనలం బట్టునుపాయముల నెఱిఁగించుచున్నవి. నిస్సంశయము. అగ్నిలోనగువానివలనఁ గలుగు భయంబునకన్న జ్ఞాతుల వలనఁ గలుగుభయమే మిక్కిలి యధికము. ఇది మనకు విదితమే కదా. గోవులయందు సంపద కలదు. బ్రాహ్మణులయందింద్రియనిగ్రహము గలదు. స్త్రీలయందుఁ జపలత్వము గలదు. అట్లే జ్ఞాతులవలనఁ దప్పక భయము గలదు. అని యీశ్లోకముల నవి పఠించినవఁట.

విభీషణా! సౌమ్యుఁడవు. అట్లయ్యు జ్ఞాతివి గాన నే నిట్లు లోకపూజితుఁడనై మహత్తరైశ్వర్యము నొంది జ్ఞాతులలో మిన్నగా నుండుట నీ కిష్టము గాదు. కమలపత్త్రములందుఁబడిన జలబిందువులు పరస్పరసంయుక్తి నొందనట్లు దుష్టులతో నెంతకాలము సహవాసము చేసినను స్నేహ మలవడదు. భ్రమరము పూఁదేనియ మిక్కిలి యాశతోఁ ద్రావి పిదప నా పూవునందుఁ దేనియనిచ్చిన యుపకారమును దలఁచి యించుక సేపు కూడ నిలువదు కదా. అట్లే నీవు కూడ నావలన సకల సౌఖ్యముల నంది నామేలు కోరకయున్నావు. మంచిమనస్సు

దురాత్ములకుఁ దమ్ముఁ రక్షించువారియందుఁ గలుగదు. ఏనుఁగు తొలుత స్నానముచేసి పిదపఁ దనతొండముచేత ధూళినెత్తి తనశరీరమును మలినముగాఁ జేసికొనునట్లు దురాత్ములు తొలుత స్నేహముచేసినను పిదపఁ దమరే దానిని బాడుచేసి కొందురు. శరదృతువునందు మేఘములు కొలఁదిగఁ జినుకులు కురియుచు నెంత యుఱిమినను భూమి చక్కఁగాఁ దడియక యుండునట్లు దురాత్ములతో నెంత స్నేహముచేసినను వారివలన నుపకారము గలుగదు. రాక్షసా! నీవుగాక వేఱొకఁ డిట్టి పలుకులాడునేని వాఁ డీక్షణములోనే ప్రాణములతో నుండి యుండఁడు. నీవో కులపాంసనుఁడవు. ఛీ! ఛీ! దూరముగాఁ బొమ్ము. అనెను.

విభీషణుఁడు న్యాయ్యమే చెప్పినను వానిం జేకొనక పరుషము లాడఁగా నట నిలువ నిష్టపడక గద చేతం బూని నలువురు రాక్షసులతోఁ దా నాకాశమున కుద్గమించెను. విభీషణుం డట్లు క్రుద్ధుఁడై యంబరమున నిలిచి ప్రతికూలమగు రావణునిసావాసమును బరిత్యజించి యనుకూలమగు శ్రీరాముని సమాశ్రయణమున కభిముఖుఁడై కలిగిన తేజోవిశేషమున వెలుఁగొందుచుఁ దనకు జ్యేష్ఠుఁడగు రావణుని జూచి యింతకును మంచిబుద్ధి కలుగదా యను నూహచే నిట్లు పలికెను. రాజా! నాకు నీవు జ్యేష్ఠభ్రాతవు. కాన నాకేమి చెప్పఁగోరెదవో తెల్పుము. నేను బదులాడరాదు. తండ్రివలెఁ బూజ్యుఁడవు అయినను ధర్మమార్గమున నిలిచినవాఁడవు కాకపోతివి. అంతియగాక నాపై లేనిదోష మారోపించి పరుషోక్తు లాడితివి. దీని సహింపఁజాలను. రావణా! నీమేలు గోరి యనర్థాన

మున నిశ్చయించి హితమగుమాటం దెలిపితిని. బుద్ధిహీనులు మృత్యువశగతులు నగువారు హితమును గైకొనరు. ప్రియముగ నుండుమాటల వచించువారు వినువారు నెల్లప్పుడును బెక్కండ్రు దొరకుదురు. అప్రియముగా నున్నను హితమగు దానిం జెప్పువాఁడును వినువాఁడు నొక్కఁడైన దొరకుట యరుదు. భూతవ్రాతసంహారకమై దయమాలిన కాలపాశమున బంధింపఁబడి నాశమునొందనున్న నిన్ను మండుగృహముం బోలెఁ గాంచి యూరకయుండఁజాలక యింతదూరము నొక్కి పల్కితిని. తీవ్రజ్వాలల వెడలఁగ్రక్కుచు నిశితములగు శ్రీరాముని బాణములు నిన్నుఁ దగులఁగాఁ జూడ నామన స్సంగీకరింపకున్నయది. రణశూరులందఱు కాలగ్రస్తు లగునపుడు సైకతసేతువులవలె నిముసమున నశింతురు. అన్నవనుకారణమున నీక్షేమమును గోరి నేనేమి వచించితినో దాని నీవు సహింపవలయు. నీవెల్లవిధముల నిన్ను రక్షించుకొనుము. ఈ రక్షశ్శూరుల నీలంకానగరమును రక్షించుకొనుము. నీకు శుభంబగుఁ గాక. నేనికఁ బోయెద. నేను లేను గాన నీక సుఖంబుండుము. ఈరక్కసులలో నొక్కఁడైన హితముఁ దెలిపి యాలోచనము చెప్పి యీయఘమునుండి తానుగ ముందునకు వచ్చి నిన్ను వారింపఁగల సుహృదుఁడుగాని స్నిగ్ధుఁడుగాని నీకొక్కఁడైన లేఁడు. ఇది నిశ్చయము. రావణా! నీమేలు గోరి యిది వలదని యెంతచెప్పుచున్నను నా పలుకు నీమది కెక్కకున్నది. మృత్యువు చెంతకు రాఁగా వారు చచ్చినట్లే తలంపవలయు. మృతులవలె వారును సుహృదుల పలుకు లాలకింపరు. అని గట్టిగాఁ బలికెను.

మహాశయులారా! ఇందలి విశేషముల నెఱుకుదము. ఇందు విభీషణుఁడు నీతిఁ దెల్పఁగా నింద్రజిత్తు దానితత్త్వ మెఱుంగఁజాలక యతని దూఱఁగా నతఁ డతనికి బుద్ధిచెప్పి రావణునకుఁ డుదిహితము సీతాసమర్పణముగాఁ దెలిపెను. దాని కతఁడు కోపగించి తూలనాడెను. దాన నతఁ డింక నుండ రాదని మంత్రులంగూడి వెడలుచు సౌభ్రాత్రృత కనంబడ హిత ముపదేశించును. ఇది యిందలి కథాసారము. ఇందు రావణుని భావము తేటపడవలయు. నీతిమంతుఁడని విభీషణు నెఱింగియు నేల తూలనాడెననియు మనము యోజింపవలసి యుండును. విభీషణునిహితము విహితమని రావణుఁ డెఱుంగఁ డనుట రామాయణతత్త్వ మెఱుంగనివారి నుడి. ఎఱింగియు నతని నేల యవమానించెననియు నడుగవచ్చును. కాని విభీషణుని పై రావణున కెట్టిభావముకలదో ముందు విశదము కాఁగలదు. అట్టివిషయములనే మన మరయంజనుం గదా.

"సునివిష్టం హితం వాక్యముక్తవంతం విభీషణం,
అబ్రవీత్పరుషం వాక్యం రావణః కాలచోదితః. ౧

అని మూలము. నీతిహితమగుమాట చెప్పుచుండు విభీషణు ననఁగా నామాటలన్నియు ముగియకముందే యని యూహింప వలయును. నాకుఁ దెలియదని పొరపడి యీతఁడు నా మేలు గోరి చెప్పుచున్నవాఁడు. ఇది నాకు మేలు గాదు. కీడే. నాకుఁ గలుగఁగల మేలెట్టిదని యితఁ డెఱుంగఁడని రావణునాశయ మని తలంపంజను. ఎట్లీయర్థము చెప్పవచ్చునందురేమో. "కాల చోదితః" అన్న పదమును మహాముని ప్రయోగించెను. కాలము పురికొలుపుచున్నది. ఏమని యీతనిం ద్వరితముగా శ్రీరాము

నికడ కనుపుము. దానఁ గాని నీకు శ్రీరామానుగ్రహము
కలుగదు. అతనికి మేలుకలిగించినఁగాని నీకీ మహాసంగ్రామము
కలుగదు. అది కలిగినఁగాని రావణునిసహావాసమున స్వర్గము
నొందఁగల రక్కసులకుఁ గర్మఫలము లభింపదు. ఇట్లు కావల
సినకార్యములన్నియు ఫలింప రావణుని గాలస్వరూపిణియగు
భగవతి పరాంబ సీతారూపిణి మహాప్రకృతి ప్రోత్సహించెను.
కనుకనే సకలవేదవేదాంగవిద్వర్యుఁ డగురావణుఁడు నయజ్ఞుఁ
డని యెఱింగియుంకూడ విభీషణుని బరుషవాక్కుల నలయిం
పఁబూనెనని భావము. తన తపఃఫలము ఫలింపనున్నదని సోద
రుఁ డెఱుఁగఁజాలని కతన నిట్టి యుపదేశము చేయుచున్నాఁడే
యని యూహించి యిఁక నితనితో సామము పనికిరాదనియుఁ
ద్వరపడి వీనిని శ్రీరామునికడకుఁ బంపినఁగాని తనపని సాగ
దనియు భావించియే రావణుఁ డాగ్రహమును నటించి పరు
షోక్తులాడెననియు మనస్సునఁ దమ్ముని గారవించి ప్రశంసించె
ననియు మన మెఱుంగు టుత్తమము.

"వసేత్సహ సపత్నేన క్రుద్ధే నాశీవిషేణ వా,
న తు మిత్రప్రవాదేన సంవసేచ్ఛత్రుసేవినా. ౨.
జానామి శీలం జ్ఞాతీనాం సర్వలోకేషు రాక్షస,
హృష్యంతి వ్యసనేష్వేతే జ్ఞాతీనాం జ్ఞాతయస్సదా. ౩.
ప్రధానం సాధనం వైద్యం ధర్మశీలం చ రాక్షస,
జ్ఞాతయో హ్యవమన్యంతే శూరం పరిభవంతి చ. ౪.
నిత్యమన్యోన్యసంహృష్టా వ్యసనేష్వాతతాయినః,
ప్రచ్ఛన్నహృదయా ఘోరా జ్ఞాతయస్తు భయావహాః. ౫

అని మూలము. ఈఘట్టమున వాల్మీకిమహర్షి లోకులకు నీతిని దెలుపుచున్నాఁడు. సమయోచితముగా ధర్మములు తెలుపుటయే మహర్షిభావమని మన మెఱుంగవలయును. పరస్పరశ్రేయస్సంపాదనము బంధుధర్మము జ్ఞాతిధర్మము తద్విరుద్ధము. తమ కులమున కలంకారభూతుఁడై యొకఁ డుండునేని జ్ఞాతు లాసందించినట్లు నటింతురు గాని సమయము ననుసరించి యతని నవమానింపఁ దలంతురు. తమప్రయత్నము సాగకయున్న నూరక యుందురుగాని సాగినచో నవమానింపక మానరు. ఏల? అసూయయే యందులకుం గారణము.

"అయుక్తః ప్రాకృతస్స్తబ్ధశ్శఠో నైకృతికోఽలసః,
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే.

అను గీతోక్తిననుసరించి తామసులు జ్ఞాతు లనవచ్చును. దీనికిం గారణము జ్ఞానహైన్యము. ఇన్నిటికి మూలకారణము సంసారము శాశ్వతమనుభావము. అది యేల కలుగును? కర్మసిద్ధాంతము తెలియనికారణమునఁ గలుగు. అది తెలిసియే యున్న మన సుఖదుఃఖములకుఁ గారణభూతులము మనమే యను భావ మేర్పడును. అది కుదిరినయెడల నహంకారము నశించును. అది నశించినఁ బరుల ధిక్కరించుట లోనగు దుర్గుణములు రూపుమాయును. అదియే సత్కర్మానుష్ఠానమునకు ఫలము. సత్కర్మము లాచరించినం గూడ నది నశింపనిచో నా యనుష్ఠానము ఫలాభిసంధిసహితమని మనము గ్రహింపవలయును. అది ఫలకారి కానేరదు. భగవదర్పణబుద్ధిచేఁ గర్మముల నాచరించిననే యనుగ్రహదృష్టి భగవంతుఁడు కాంచు ననుట యిందలిసారము. అపకారము నొంది ప్రత్యుపకారము

చేయవలయునని కోపముగల సర్పముతోఁడ నొకచో నివ సింపవచ్చును గాని జ్ఞాతితోఁడ నివసింపరా దనఁగా భావ మేమి? దానికి ధనకాంక్ష లేదు. తన్నుఁ గొట్టినందున వానిం జంపవలయుననియే యది యెంచును. జ్ఞాతికన్నఁ గ్రూరసర్పము మేలనఁగా నర్థమిది. అది యొకసారి యపకరించి మఱి యట్టి పనిచేయఁ దలంపదు. జ్ఞాతి సర్వకాల మపకరింప వేచియుం డును. క్షుద్రబుద్ధులగు మానవులకంటెఁ గ్రూరసర్పములు కూడ శ్రేష్ఠములే యని యిందుఁ దేలుభావము. ధర్మ మెఱుం గని నరపశువుకంటెఁ బశు కీటాదు లుత్తమములని కదా వాల్మీకిమహర్షి యాశయము. మానవత్త్వము జ్ఞానముచేతనే ప్రకాశిత మగునుగాని అది లేకయున్న నిది నామమాత్రమే యని మన మీభాగమునుండి నేర్చుకొనవలయును.

"శ్రూయంతే హస్తిభిర్గీతాశ్లోకాః పద్మవనే క్వచిత్,
పాశహస్తాన్నరాన్ దృష్ట్వా శ్రుణు తాన్గదతో మమ. ౬
నాగ్నిర్నాన్యాని శస్త్రాణి న నః పాశా భయావహాః,
ఘోరాస్స్వార్థప్రయుక్తాస్తు జ్ఞాతయో నో భయావహాః. ౭
ఉపాయమేతే వక్ష్యంతి గ్రహణే నాత్ర సంశయః,
కృత్స్నాద్భయాత్ జ్ఞాతిభయం సుకష్టం విదితం చ నః. ౮
విద్యతే గోషు సంపన్నం విద్యతే బ్రాహ్మణే దమః,
విద్యతే స్త్రీషు చాపల్యం విద్యతే జ్ఞాతితో భయం." ౯

అని మూలము. పైన వ్రాసినభావము నీశ్లోకములమూలమున మహర్షి దృఢపఱచుచున్నాఁడు. మానవు లల్పలాభముం గోరి పరులకుఁ దమవారిం జంపునుపాయమును బోధింతురు. అట్టి నీచమానవులకంటె నగ్నియు, పాశములు నుత్తమములు. తా

మొకకార్యము జేయునే కాని యొకరి కిట్లు చేయుమని దుష్కా ర్యమును బోధింపవు. నీచు లట్లుగాక తమరు చేయుచు నొకరి చేతఁ జేయింతురు. తమవా రాపద లొందుచుండఁ గాంచి యానందింతురు. ఎల్లవిధములగు భయములకంటె జ్ఞాతిభయ మెక్కుడనఁగా భావమేమి? ఎన్నిసారులు తమవారి కపకారము గలిగినను సంతృప్తి లేక మరల మరలఁ జేయుచుందురు. గోవుల యందు సంపత్తి కలదు. అనఁగా గోవులు సంపద్ధేతువులని భావము. బ్రాహ్మణులయందు దమము (అంతరింద్రియనిగ్ర హము) గలదు. స్త్రీలయందుఁ జాపల్యము గలదు. స్థిరతఁ గాంచనిమనస్సు. అనఁగా లోలత్వమని భావము. ఇవి సహజములు. అట్లే జ్ఞాతులయందు భయము కలదు. అది జ్ఞాతిస్వభావము. అనిష్టకరులు జ్ఞాతులని సారము. స్త్రీలు చప లాత్మకలనుట అనాదిసిద్ధముగా నున్నది. కాని యిటీవలఁ గల్పిం చినది కాదు.

"పౌంశ్చల్యాచ్చలచిత్తాచ్చ నైస్నేహాచ్చ స్వభావతః,
రక్షితా యత్నతోఽపీహ భర్తృష్వేతా వికుర్వతే."

అన్న మనుస్మృతివాక్యముకూడ రామాయణార్థమునే తెలుపు చున్నది కదా. సకలధర్మములకు నాచారములకు రామాయ ణము ప్రధానమని తోఁచెడిని.

"యథా పుష్కరపత్త్రేషు పతితాస్తోయబిందవః,
న శ్లేషముపగచ్ఛంతి తథా నార్యేషు సంగతమ్." ౧౧

అని మూలము. పద్మపత్త్రమునం దుండుజలము సంశ్లేషము నొందన ట్లనార్యులపొం దెంతకాల ముండిన నేకత్వము నొంద దని భావము. ఎంతగాఁ బరిశీలించి పదార్థవిజ్ఞానశాస్త్రమునఁ

పాండిత్యమును మన పూర్వులు గ్రహించిరో కనుఁగొనఁ దగును. పరిశీలించుస్వభావము పూర్వులకు లేదన్న దుర్వాద మెంత నిస్సారమో యోజింపుఁడు.

"యథా మధుకరస్తర్షాద్రసం విందన్న విద్యతే,
తథా త్వమపి తత్రైవ తథానార్యేషు సౌహృదం. ౧౨
యథా పూర్వం గజస్స్నాత్వా గృహ్య హస్తేన వై రజః,
దూషయత్యాత్మనో దేహం తథానార్యేషు సౌహృదం. ౧౩
యథా శరది మేఘానాం సించతామపి గర్జతాం,
న భవత్యంబుసంక్లేదస్తథానార్యేషు సౌహృదం." ౧౪

అని మూలము. దుష్టసంగతి పనికిరాదని మూఁ డుదాహరణములచే మహర్షి తేటపఱచెను. దుష్కార్యానుష్ఠానదుష్టసహవాసములు పనికిరావని వాల్మీకిమహర్షి స్పష్టపఱచెను.

"దుర్జనః పరిహర్తవ్యో విద్యయా భూషితోఽపి సన్,
మణినా భూషితస్సర్పః కిమసౌ న భయంకరః."

అన్నసూక్తికి శ్రీరామాయణమే నిదానమని మన మెఱుంగం దగు.

"అన్యస్త్వేవంవిధం బ్రూయాద్వాక్యమేతన్నిశాచర,
అస్మిన్ముహూర్తే న భవేత్త్వాం తు ధిక్కులపాంసనం." ౧౫

అని మూలము. రావణుఁడు స్వాభిప్రాయమును దేటపఱచుచున్నాఁడు. విభీషణా! నీవు కాక మఱొక్కఁడే యిట్లు పలికెనేని జీవించి యింతసేపు నిలువఁజాలఁడు. ధిక్కులపాంసనం= నీచకులధ్వంసకుఁడవగు, త్వాంతు=నిన్నునైన, క్షమించి విడిచితినని భావమని గ్రహింపవలయు. ఇఁక నిన్ను నీయోలగ

మునఁ జూచునదృష్టము నాకు లేదని తేటపఱచుచున్నాఁడు. త్వరగాఁ బొమ్ము. శ్రీరామునికడం జేరుము. అనియే రావణు హృదయమని మన మెఱుంగుట యుక్తము.

"ఇత్యుక్తః పరుషం వాక్యం న్యాయవాదీ విభీషణః,
ఉత్పపాత గదాపాణిశ్చతుర్భిస్సహ రాక్షసైః. ౧౬
అబ్రవీచ్చ తదా వాక్యం జాతక్రోధో విభీషణః,
అంతరిక్షగతశ్శ్రీమాన్ భ్రాతరం రాక్షసాధిపం." ౧౭

అని మూలము. విభీషణుఁడు న్యాయవాది. ధర్మవిరుద్ధముగ మాటలాడువాఁడు కాఁడని భావము. తాఁజెప్పిన లోకధర్మమును వినక పరుషవాక్యమన్న చెప్పఁగా వెంటనే గదాపాణియై యాకసమున కెగిరెను. నలువురు రక్కసులు వెంటనంటిరి. అంబరమున నుండియే యన్నకు నిట్లు తెలిపెనని భావసారము. ఇచ్చో "శ్రీమాన్"అని మహాకవి ప్రయోగించెను. సమయమునుసరించి యిది యసంగతమే యననలయును. కాని మహర్షి యసంబద్ధముగాఁ బ్రయోగించునా? జ్ఞానవంతుఁడని యర్థము. ఇఁక శరణ్యుఁడు శ్రీరాముఁడే యన్నజ్ఞాన మాతనికిఁ బొడకట్టెను. తనపయనమునకుముందు నన్నకుఁ దెల్పఁదగిన నీతిని జెప్పఁ దలంచెనని తాత్పర్యము. ఈభావము కవివర్యనకుఁ గలదని యిందలి భ్రాతృపదము తెల్పుచున్నది. జన్మవాసన నశింపదనుట జనవిదితము కదా.

"స త్వం భ్రాతాసి మే రాజన్ బ్రూహి మాం యద్యదిచ్ఛసి." ౧౭

అని మూలము. విభీషణుఁడు రావణుఁ డింక బ్రతుకఁజాలఁడని తలంచి యిట్లు పలుకుచున్నాఁడు. సత్వం=ఆ నీవు. అనఁగా నా

హితమును విని శ్రీరాముని శరణుచొరని నీవని భావము. మే భ్రాతాసి=నాకన్నవైతివి. జన్మసంబంధమే కాని కర్మసంబంధము నీకు నాకు నించుకంతయు ననుకూలము లేదనుట. యద్వ్యదిచ్ఛసి మాం బ్రూహి = చెప్పఁదలఁచుకొనినదంతయుం జెప్పుము. ఇఁక నీవుచెప్పుట నేనాలకించుట సాగవని హృదయ సిద్ధాంతము. ఇది యిరువురకుఁ గలిగినదియే కాని యొకరికి మాత్రమే కలిగినది కాదని యెఱుంగందగు.

"జ్యేష్ఠో మాన్యః పితృసమో న చ ధర్మపథే స్థితః. ౧౭
ఇదం తు పరుషం వాక్యం న క్షమామ్యనృతం తవ,
సునీతం హితకామేన వాక్యముక్తం దశానన. ౧౯
న గృహ్ణంత్యకృతాత్మానః కాలస్య వశమాగతాః."

అని మూలము. "పితృసమో జ్యేష్ఠః" అన్నసూక్తి కీరామాయణమే నిదానము. తండ్రివంటివాఁడవే. తండ్రిమాట వినవలపాయందు లేని ధర్మమున నిలువకపోయితివి. కాన నది గ్రాహ్యము కాదని భావము.

"పితాచార్యస్సుహృన్మాతా భార్యా పుత్రః పురోహితః,
నాదండ్యో నామ రాజ్ఞోఽస్తి యస్స్వధర్మే న తిష్ఠతి." ౩౩౫
అ. ౮ మను.

"ఋత్విక్పురోహితామాత్యపుత్రసంబంధిబాంధవాః,
ధర్మాద్విచలితా దండ్యా నిర్వాస్యా రాజహింసకాః.
అపి భ్రాతా సుతోఽర్ఘ్యో వా శ్వశురో మాతులోఽపి వా,
నాదండ్యో నామ రాజ్ఞోఽస్తి ధర్మాద్విచలితస్స్వకాత్."
యాజ్ఞవల్క్యస్మృతిః.

"అదండ్యా మాతాపితరౌ స్నాతకపురోహితౌ పరివ్రాజకవానప్రస్థౌ జన్మకర్మశ్రుత శీలశౌచాచారవంతశ్చ ఏతే హి ధర్మప్రతికరా రాజ్ఞః స్త్రీబాల వృద్ధాస్తపస్వినస్తేభ్యః క్రోధం నియచ్ఛేత్."

అని శంఖలిఖితులు.

"ఆచార్యస్య పితుర్మాతుర్బాంధవానాం తథైవ చ,
ఏతేషామపరాధే తు దండో నైవ విధీయతే."

కాత్యాయనస్మృతి.

"గురూన్ పురోహితాన్ పూజ్యాన్ వాగ్దండేనైవ దండయేత్,
వివాదినో నరాంశ్చాన్యాన్ దోషిణోఽర్థేన దండయేత్,
మహాపరాధయుక్తాంశ్చ వధదండేన దండయేత్."

బృహస్పతి.

"మిత్రాదిషు ప్రయుంజీతం వాగ్దండం ధిక్తపస్విని,
యథోక్తం తస్య తత్కుర్యాదనుక్తం సాధు కల్పితం."

కాత్యాయనస్మృతి.

అను నీప్రమాణములంబట్టి పరిశీలింపఁగా ధర్మము తప్పినవారు తండ్రి లోనగువారైనను దండార్హులు కారనరాదనియుఁ, దక్కినవారివలెఁ గాక వాగ్దండాదులు విధింపవలయుననియుఁ దేలెడిని. పెద్దలమాట మీఱరాదనుట న్యాయమార్గము ననుసరించి యది యున్ననే. కాని యధర్మమార్గమున నది యుండినఁ గాదని భావసారము. కొన్ని ప్రమాణములు పెద్దల మాట యెట్టిదియైన గ్రాహ్యమే యనియు, దానివలన నెన్నికష్టములు కల్గినను సహించియుండిన ముందు మేలు కలుగు ననియుఁ, గావున గురువులోనగువారినుడు లవశ్యము శిరోధార్యములనియుఁ దెలుపుచున్నవి. కాని యవి సామాన్య

విధులలోఁ బరిగణింపఁదగినవనియు, నివి విశేషవిధులలోఁ బరిగణింపఁదగినవనియు, ధర్మమార్గమును దాఁటుటకు భగవంతునకే న్యాయ్యము కానపుడు తక్కినవారల కది యుక్తమే యనుట పాడిగాదనియు, నీమార్గముననే ప్రహ్లాదాదు లనుసరించిరనియు, మనమూహించి స్థిరీకరింపఁదగు. విభీషణుఁడుకూడ నామార్గముననే యనుసరించెను. కనుకనే "న చ ధర్మపథే స్థితః" యని చెప్ప సాహసించెను. అంతతో మానక న్యాయసమ్మతముగఁ దెల్పిన నాలకింపలేదే యన్న కోపము, చావనున్నాఁడే యన్న పరితాపము,లోకమున నింతమూర్ఖుఁ డుండునా యన్న యచ్చెరువు ముప్పిరిగొనఁగా, "న గృహ్ణాంత్యకృతాత్మానః కాలస్య వశమాగతాః" అనియుఁ బల్కెను. కాలునివశమునన్న యశిక్షితమనస్కులు నీతివాక్యమును గ్రహింపరు. అని. అనఁగా శ్రీరాముని మార్కొనుట మృత్యువు సమీపించినపుడే. కావున వాఁడు చావక మానఁడు. అని విభీషణునిభావము. ధర్మవిరుద్ధమార్గమునఁ బ్రవర్తించువారలకు శ్రేయస్సు లేకుండుటయె గాక విపత్తియుఁ గల్గుననునీతి మన కీభాగము తెల్పుచున్నది.

"సులభాః పురుషా రాజన్ సతతం ప్రియవాదినః,
అప్రియస్య తు వాక్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః." ౨౦

అని మూలము. లోకమున హితవాదులు పెక్కండ్రుందురు. దాన మేలు కలుగవలయు ననుతలంపు వారలకు నుండదు. స్వకార్యార్థమై ప్రియముగా మాటలాడి వాని సంతోషింపఁ జేసి లాభమునొందువా రనేకు లుందురని భావము. అప్పటి కప్రియముగ నున్నను మీఁదటికి మేలు కలిగించునట్టి మాటను

జెప్పువారు దుర్లభులు. వినువారును దుర్లభులు. ప్రియవాదులు శ్రోతలు సులభులని తాత్పర్యము. మేలుగోరువారు దుర్లభులనియు, కీడుగోరు పెక్కండ్రు గలరనియు సారము. మేలుగోరువారిమాటలు హితములు గాకుండును. తక్కిన వారివి హితములుగా నుండును. కాన సామాన్యులు ప్రియముగాఁ బల్కువా రెట్టివారని యెఱుంగక వారిమాటలనే విని నిచ్ఛగింతురని భావసారము. మంత్రులు పల్కినవి మేలు గలిగించుమాటలు కావు. కాన వానిని వినుచున్నావు. నా మాటలు మేలుగలిగించునవి. కావున వినవైతివని కథాభాగ సమన్వయము.

ఈభాగమున నధ్యాత్మరామాయణమునఁ గలవిశేషములఁ బరికింతము.

"కాలేన నోదితో దైత్యో విభీషణమథాబ్రవీత్,
మద్దత్తభోగైః పుష్టాంగో మత్సమీపే వసన్నసి. ౨౮
ప్రతీపమాచరత్యేష మమైవ హితకారిణః,
మిత్రభావేన శత్రుర్మే జాతో నాస్త్యత్ర సంశయః. ౨౯
అనార్యేణ కృతఘ్నేన సంగతిర్మే న యుజ్యతే,
వినాశమభికాంక్షంతి జ్ఞాతీనాం జ్ఞాతయస్సదా. ౩౦
యోఽన్యస్త్వేవం విధం బ్రూయాద్వాక్యమేవం నిశాచరః,
హన్మి తం తత్క్షణేనైవ ధిక్త్వాం రక్షఃకులాధమమ్. ౩౧
రావణేనైవముక్తస్సన్ పరుషం స విభీషణః,
ఉత్పపాత సభామధ్యాద్గదాపాణిర్మహాబలః." ౩౨

అని మాత్రమే కలదు. సవ్యపాదమునఁ దన్నెననియు, దాన విభీషణుఁడాగ్రహించి పోయెనను ప్రవాదము విలాసార్థమే

యని యీభాగము తెల్పుచున్నది. ఇఁకఁ దరువాతిభాగమును బఠించి తత్త్వ మరయుదము.

## విభీషణుఁడు శ్రీరాముని శరణుచొచ్చుట.

* విభీషణుఁ డీరీతి నన్నతోఁ బరుషము లాడి యంత ముహూర్తమాత్రమున శ్రీరామలక్ష్మణు లుండుతావును జేరెను. అగ్నినుండి శీతలసరస్సులోఁ బడుటకుంబోలె నతిత్వరితముగ వచ్చుచున్నవాఁడును, రత్నాభరణములచే మేరుభూధరశృంగమువలె నున్నవాఁడును, ప్రతిపక్షులను వదలి తన పక్షమును బొందుటంబట్టి మేరుశృంగమువలె స్థైర్యము నొందిన వాఁడును, మిగులఁ బ్రకాశముతో నాకసమున సంచరించుటం జేసి రామభక్తులు కపులు రాముచెంతకుం జననిత్తురో లేదో యని భయమునఁ గంపించుటంజేసి మెఱపువలె నున్న వాఁడు నంబరగతుండు నగునా విభీషణుని లంకానగరమునుండి యభ్రమున కుద్గమించినపుడే వానరులు చూచిరి. దుర్భరశక్తిగల సుగ్రీవుఁడు మంత్రిచతుష్కముతోఁ దా నైదవవాఁడుగ వచ్చుచున్న విభీషణుని గాంచి మతిమంతుఁడు గావున వానరులతో నాలోచించెను. ముహూర్తకాల మాలోచించి హనుమదాదులం గని యుత్తమవాక్కుల నిట్లు పలికెను. ఈ రక్కసుఁడు సకలాయుధధరుండై రాక్షసులు నలువురు కూడ రాఁగా నెదురుగా వచ్చుచున్నాఁడు. చూడుఁడీ! మనల వధింపనే యరుదెంచుచున్నాఁడు. సంశయమే లేదు. అనఁగా నా

---

* ఇది పదునేడవ సర్గమునఁ గల కథాభాగము.

మాటల విని వారెల్ల వెంటనే యిది యిట్లని తలంపక చేతికి దొరకిన వృక్షపర్వతాదులం దాల్చి రాజా! ఆజ్ఞ దయచేయుము. ప్రభువునానతి లేక మేమేదియు నొనరింపరాదు. మఱెందులకుం గాదు. వీరిని వధించుటకే వేవేగమ యనుజ్ఞ నిమ్ము. మరల నంబరమున కెగురనట్లు భూమిం ద్రెళ్లెదురు. జయము గలుగునా యని శంకింపవలదు. వీరల్పతేజులు. కనుక విజయము గలుగుట సిద్ధము. అనిరి. ఇట్లు వానరులు మాటలాడుచుండునంతలో విభీషణుం డెవ్వరేమన్నను శ్రీరాముఁడు రక్షింపక మానఁడన్న విశ్వాసమున నాపలుకుల లెక్కింపక సాగరోత్తరతటమున కరుదెంచి యంబరమునందె కంపమనునది లేక నిలిచియుండెను.

విభీషణుఁడు మహాప్రాజ్ఞుఁడు కనుక నందే యుండి వానరులను రాజగు సుగ్రీవుని గాంచి యెల్లరు నాలకించునట్లు మహాస్వనమున నిట్లు పలికెను. అహారనిద్రాభయమైథునముల యందు నియమ మనుదానిం బాటింపక దుష్పథమున వర్తించు రావణుఁ డను నొక్కరక్కసుఁడు కలఁడు రాక్షసాధిపతి. అతని సహజుఁడను నేను. విభీషణుఁడని నన్నుం బిలుతురు. దురాత్ముఁడగు నారావణుఁడు సీత జనస్థానమునను వచ్చియుండఁగా నందుండి యపహరించుకొని యడ్డుపడిన జటాయువును వధించి యాసాధ్విని జెఱఁబెట్టినాఁడు. ఆమె వివశయై దుఃఖితయై రక్షస్స్త్రీలచేఁ గాపాడఁబడుచున్నది. నేనాతనికి సీతను రామునకు మరల నర్పింపుము. అని హేతుమంతము లగువాక్కులం బెక్కుసారులు బోధించితిని. మృతిగోరువాఁ డౌషధము వలదనురీతిగా నాయన్న కాలవశంగతుఁడై నాహితవాక్కుల

నంగీకరింపక పరుషములు పలికి దాసునింబోలె నవమానముఁ గూర్పఁగాఁ బుత్త్రాదులను వదలి రామునే శరణుచొచ్చితిని. సకలలోకశరణ్యుఁడగు రాఘవునకు విభీషణుఁడు వచ్చియున్నాఁడని వేగమ తెల్పుఁడు. అని తెలిపెను.

ఇట్లు విభీషణుఁడు రాముని శరణుచొచ్చితినని తెలిపిన నుడి నాలకించి సుగ్రీవుఁడు రామునికడకు వేగముగాఁ బరుగిడి తనవంటిహృదయముగల లక్ష్మణుని యెదుట నత్యంతప్రేమమునఁ దడఁబడునక్షరములు గలమాటలతో రావణుని తమ్ముఁడగు విభీషణుఁ డనువాఁడు నలువురురక్కసులతో నిన్ను శరణుగోరి వచ్చినాఁడు. పరంతపా! కార్యాకార్యవిచారము చేయు మంత్రమందును, సేనలందీర్పు వ్యూహమందును, విచారము చే నిశ్చయించినయుపాయముల నయ్యైవిషయములందుఁ బ్రయోగించు నీతియందును, శత్రురహస్యముల నెఱుంగుటకు గూఢముగా వేగులవారిం బంపు చారమందును, వానరులవిషయమందైన శత్రువులవిషయమందైన నీవు కడు హెచ్చరికతో నుండవలయును. కపులకు మంత్రాదులం బ్రయోగించుచుఁ బగవారిమంత్రాదుల నెఱుంగుచు జాగ్రత్త గలిగి యుండవలయును. ఇట్లున్న నీకు భద్రములు గలుగును. ఈరాక్షసులు కామరూపులు గానఁ గోరినట్లు కనఁబడకయే చరించుచుందురు. కావున నీకనఁబడువారే కాక పెక్కురు కనఁబడక వచ్చియుందురు. వీరెల్లఁ గపటోపాయతత్పరులు. అట్టి వీరియందు నొకప్పుడైన విశ్వాస మునుపరాదు. వీఁడు మన కనుకూలుఁడు కాఁడు. వీఁడు రావణుని గూఢచారిగా నుండును. వేఱునామమును జెప్పుకొని మంచివానివలె నటించి మనలోఁ బ్రవేశించి

సమయము కనిపెట్టి మనలో మనకు మిత్రభేదమును గలిగించును. సంశయమే దీనికి లేదు. వీఁడు ప్రతికూలుఁడై వచ్చినవాఁడే. ఒకవేళ మనకు బుద్ధిభేదమును గల్పింపఁజాలకపోయినను మనము విశ్వాసము చూపుదనుక నీరక్షీరన్యాయము ననుసరించి యుండి మనము విశ్వాసము చక్కఁగాఁ జూపఁగనే సూక్ష్మబుద్ధిగలవాఁడు కావునఁ బరాకున మనముండుతఱిని గనిపెట్టి వీఁడు తానే మనలఁ బ్రహరించినం బ్రహరించును.

శ్రీరామా! మిత్రులను సంబంధిబలమును ఆటవికుల బలమును పరంపరగా నేర్పడియుండు మూలబలమును వేతనములను దీసికొనుచుండు భృత్యులబలమును, ఇట్టి యీబలముల నన్నింటిని బరిగ్రహింపవచ్చును గాని శత్రుసంబంధియైన బలమును మాత్రము పరిగ్రహింపఁ దలంపక పరిత్యజింపవలయును. ఈ వచ్చినవాఁడు శత్రుబలాంతర్భూతుఁడు గాన పరిత్యజింపఁ దగినవాఁడే. ప్రభూ! వీఁడు శత్రుబలసంబంధిమాత్రమే కాఁడు. జాతియందును రాక్షసుఁడు. అంతియగాక మనవిరోధికి సోదరుఁడు. నావలె సోదరునిచేఁ బాఱఁదోలఁబడి రాలేదు. పగవానికొలువునుండియే వచ్చినాఁడు. కనుక వీనిం బరిగ్రహింపరాదనుట కనేకకారణము లుండఁగా వీనియందు నెట్లు విశ్వాస మునుపవచ్చును? ఈవిభీషణుఁడు రావణునిచేత చారకర్మమునందు నియోగింపఁబడి వచ్చినాఁడు. కాఁబట్టి వీని శరణాగతి నటనమని యెఱుంగవలయును. రామచంద్రా! నీవు యుక్తవ్యాపారములు గలవారిలోనెల్ల శ్రేష్ఠుఁడవు. కనుక నీ వెఱుంగని యుక్తకార్యమే లేదు. అట్టి మాయావిని పరిగ్రహింపక నిగ్రహింపవలయునుగాని పరిగ్రహింపరాదు. చారుల

వధించుట న్యాయమా యని విచారింపరాదు. వీఁడు చారుఁడు
మాత్రమే కాఁడు. ఇచ్చటివార్తలు తెలిసికొనిపోవుటకు వచ్చిన
వాఁడు కాఁడు. రావణుఁడు పంపఁగా వక్రబుద్ధిగలిగి శరణా
గతునివలెఁ గనఁబడుచు మాయారూపము నూని తన రహ
స్యము బయలుపఱుపక, అతనిమన స్సెఱుఁగక మాటమాత్ర
మునకే విశ్వాసము నీవు చూపఁగానే నిన్ను లక్ష్మణాదులను
సమయము కనిపెట్టి ప్రహరించుటకై దాపున కేతెంచినాఁడు.
కపటవిప్రియము మనకుఁ గానరాఁగా నపుడే వధింతమందు
వేమో. అది కనఁబడదు. శత్రువు ప్రాజ్ఞుఁడగుటం జేసియు
మనల వధింపవచ్చుటం జేసియుఁ దనకార్యము పగవారికిం
దోఁపకయుండునట్లుగా నటించి సేనలం బ్రవేశించి సమయ
మును గనిపెట్టి వారిం జంపును. ఒక్కకాకియే గుడ్లగూబలం
బెక్కింటిని దనకు సమయమగు పగటిపూట చంపునట్లు వీఁడును
వధించును. కావున వానిపూన్కి మనకుఁ గనఁబడదు. ఇపుడు
వీనిం జంపుటయే మనకుం గర్తవ్యము. తీవ్రదండనమున వీని
మంత్రుల శిరములు ఖండించి వీనిముందుంచి వారితోడ వీనిం
జంపవలయును. వీఁడు క్రూరాత్ముఁడగు రావణానుజుఁడు కదా.
అని యిట్లు వానరాధిపతియై వాక్యజ్ఞుఁడై మాటలాడు నేర్పు
గలిగి రాముని యిష్టముచొప్పునం బోవక ప్రేమాతిశయమునఁ
బట్టుపట్టి సుగ్రీవుఁ డిట్లు స్వాభిప్రాయమును దెలిపి యంత
శ్రీరాముని యభిప్రాయమును విని బదులుచెప్ప నూహగలిగి
మిన్నకుండెను.

అంతట శ్రీరాముఁడు మహాధైర్యము కలవాఁడు
కావున సుగ్రీవుని పలుకు లాలకించియు మనస్సునఁ గలంక

నొందక చెంతనుండు హనుమదాదులం గాంచి మీరెల్ల విభీషణునిగూర్చి సుగ్రీవుఁడు చెప్పినది వింటిరి గదా. అది యుక్తియుక్తము నర్థవంతము నగును. అయిన మీరెల్ల మా యిరువురకుఁ బరతంత్రు లగుటం జేసి యెవరిపక్షమున మాట లాడం దగుననుసందియమును వదలి సుహృదుఁ డొక్కటి చెప్పఁగా విని యితరుఁ డేమియుఁ బల్కరాదను తలంపును మాని బుద్ధిబలమున మీకు న్యాయ్యమని తోఁచినదానిం జెప్పుఁడు. అని యిట్లు సాంత్వనోక్తుల శ్రీరాముఁ డడుగఁగాఁ దత్కార్యమును నెఱవేర్ప బద్ధకంకణు లగుటవలన సతనికి హితము చేయంగోరి శ్రీరాముని మతమును గొనియాడుచుఁ దమకుఁ దోఁచినదానిని జెప్పఁ దలఁచి యిట్లనిరి. శ్రీరాఘవా! త్రిలోకములయందు నీకుఁ దెలియనిది లేదు. తెలిసియు మా పేరు లోకమునఁ బ్రసిద్ధము చేయనెంచియే యడుగుచున్నావు. శరణాగతరక్షణవ్రతపరాయణుఁడవు. దాని కెన్ని యాటంక ములు కలిగినను వాని రూపుమాపు పరాక్రమము గలవాఁ డవు. మహాధార్మికుఁడవు. నీ వొనరించుకార్యము లత్యంతదృఢ ములు. ఏపనియు విమర్శింపక చేయువాఁడవు గావు. నీమం త్రులు సమర్థులు గావున వరుసగా నొక్కొక్కఁడుగాఁ దమకుఁ దోఁచినదాని వచింతురు గాక. అనిరి.

మంత్రు లిట్లు పలుకఁగా విని యువరాజగు నంగదుఁడు విభీషణునివిషయమై పరీక్ష గావించుటకుఁ దన మతమును దొలుతనే చెప్పఁబూని యిట్లనియె. శ్రీరామా! వీఁడు శరణా గతుఁడే యైనను శత్రుపక్షమునుండి వచ్చినవాఁడగుట నను కూలుఁ డగునా కాఁడా యని శంకింపవలసినదియే. కనుక వీనిం

బరిశీలింపక వెంటనే విశ్వాసపాత్రుఁడని తలంపరాదు. ఇపుడే విశ్వసించితిమే నరిష్టమే కలుగును. కుటిలమతులు తాము చేయఁబూనిన క్రూరకార్యమును దాఁచి, తమయాశయమును సూచించు నింగితాదులంగూడఁ గప్పిపుచ్చి యంతరము దొరకు దాఁకఁ దిరుగుచుందురు. మనము హెచ్చరిక లేక యుండఁగాఁ గనిపెట్టి పైఁబడి హింసింతురు. త్వరపడి చేరఁదీసిన నిట్టి యనర్థము లెన్నియో పొసంగుచుండును. వీనిం బరిగ్రహించితి. మేని వీఁడు చేయుప్రయోజనము విని నిశ్చయించి తరువాతఁ ద్యజించుటయో పరిగ్రహించుటయో నిశ్చయించుకొందము. పూర్వాపరము లరయక కైకొను టుత్తమము గాదు. గుణమున్నదను నిశ్చయముగల్గిన గ్రహింపవచ్చు. దోష మున్నట్లు తోఁచిన వదలవచ్చును. లోకమున సర్వగుణభూయిష్ఠుఁడు గాని సర్వదోషసంపన్నుఁడు గాని కలుగఁడు. మహాత్మా! ఆ విభీషణునందు దోషమున్నట్లు తోఁచినఁ బరిత్యజింపవచ్చు. గుణములే వెక్కుడున్నట్లు తోఁచిన గ్రహింపవచ్చు. ఇదియే నాయాశయమని పలికెను.

అంత శరభుఁడు యువరాజుమతము చేయ సాధ్యము గాదని తలంచి యనుకూలముగాఁ జేయఁదగినట్లు తెల్పువాఁడయి శ్రీరామచంద్రా! వీని తీరెఱుంగ నొకచారుని ముందుఁగాఁ బంపుదురు గాక. ఆతనిమూలమున నావిభీషణుని గుణదోషములం బరికించి, పిదప ననుకూలుఁడే యైన గ్రహింపవచ్చును. అనఁగా జాంబవంతుఁడు చక్కనివాక్యములఁ దెల్పంబూని మహానుభావా! మన కత్యంతశత్రువుఁడు క్రూరుఁడు మహాపాపమతియునగు రావణునికడనుండి వీఁడు వచ్చినాఁడు. వచ్చిన

దేశకాలములు యుక్తములు కావు. కాన సర్వప్రకారముల మనము వీనిని శంకింపవలసినదే. అనఁగా విని మైందుఁడు పండితుఁడు వచనసంపత్తియుఁ గలవాఁడు కావున సహేతుక వాక్కులతో శ్రీరామా! ఆరావణుఁడు మనవిషయమై యేమి చేయుచున్నాఁడని యీ విభీషణుని, తెలియని యొకనిమూలముగా వాని కనుమానము కలుగకుండునట్లుగా తొందరపడక మెల్లఁగా మంచిమాటల నడుగవలయును. ఈరీతి దుష్టుఁడో కాఁడో పరిశీలించి వీని భావమును లెస్సఁగా నెఱింగి దుష్టుఁడే నైనఁ దదనుకూలముగను, అట్లు గాకున్న నందులకుఁ దగినట్లు నీ బుద్ధికిం దోఁచినట్లు చేయుము. ఒకరి నడుగనేల? శరణు అనుట మాత్రమే యెంచెదవుగాని నీమహత్త్వము నరయవలదా యని పలికెను. అంత హనుమంతుఁడు శబ్దార్థసంయుక్తమై శుభమయి శ్రావ్యమై యుండునట్లు మహాప్రభూ! ఏవిషయము నను నిన్ను మించఁగలవాఁడు లేఁడు. ఇతర కారణము లేవియు లేక మీ రడిగినపుడు చెప్పవలయును. మంత్రులు కొందఱు తమ మతములం దెల్పిరి గదా. వానియందు దోషము నాకుఁ గనఁబడుచున్నది. వారు చెప్పినట్లు పరీక్షించు కార్యము ఫలవంతము కాదు. ఒకనిని రాజకార్యమున నియోగింపకయుండిన వానివలనఁ గలుగుప్రయోజనము గాని గుణముగాని తెలియుట శక్యముకానిదియే. వాని రెండింటిని దెలియక త్వరపడి నియోగించుట దోషమని నామదికిం దోఁచెడిని. గుణదోషములను బరిశీలించియే నియోగింపవలయుననియు, నియోగించియే గుణదోషపరిశీలనము చేయవలయుననియు నన్యోన్యాశ్రయ ముండుటంజేసి, యీమతము సమంచితము కాదు. చారుని

బంపి రహస్యముగా నతనివిధము పరికింపవలయునని కొం
దఱు చెప్పిరి గదా. అదియు యుక్తము గాదు. దూరమం
దున్నవానికడకుఁ జారుఁడు పోయి మఱుగున నుండి కదా
వాని తీరిది యని తెలిసికొనవచ్చును. మనచెంతనే కన్నుల
యెదుట మాటులేని యాకాశాంతరమున నున్నవానియెడ
చారునిపనియే యుపయోగింపదు కావున నీయుపాయము
పనికిరాదు. ఈతఁ డకాలమున నయుక్తమైన దేశమునను
వచ్చినాఁడనియుఁ బలికిరి గదా. వాస్తవముగా నిదియే తగిన
దేశమని తగినకాలమని నాబుద్ధికిం దోఁచుచున్నది. దానిం
జెప్పవలయునని కోరిక యున్నది. ఈవిభీషణుఁ డధముఁడగు
రావణుని, సర్వోత్తముఁడవగు నిన్నును మదిం బరి
శీలించి, వానియందు మీయందును గల దోషగుణములను
విమర్శించి, యన్నయందు సీతాపహరణాదిదోషములు మరల
నిమ్మనిన నమ్మాట వినకుండుట లోనగు స్వేచ్ఛాదికమును
దెలిసికొని, నీయందు ఖరదూషణాది దానవవధము వాలిసం
హారణము సుగ్రీవరాజ్యప్రదానము మొదలగు పరాక్రమం
బును గాంచి, వాని వదలి నీయొద్దకు వచ్చుట తగియున్నది.
రాజేంద్రా! విభీషణున కెవరిరూపాదు లపరిచితములో యట్టి
తెలియనిచారులం బంపి వాని నడుగవలయునని కొందఱు
తెలిపిరి గదా. ఆవిషయము నీతివిరుద్ధమని నే నిరూపించుట
కుపక్రమింపఁగా నాకొకయుక్తి తోఁచెడిని. ఆతనిని స్వీకరించు
టకు ముందే రావణునివార్తలను దటాలునఁ బ్రశ్నించిన బుద్ధి
సంపన్నుఁడగు నతఁడు తన్ను స్వీకరించినపిదప నవి కార్య
విచారసమయంబున నడుగవలసినవి కదా యని యెఱింగి విన

యమున మనము శరణుచొర రాఁగా మనల శత్రువులనుగాఁ దలంచిరో యని మిగుల ననుమానపడినవాఁ డగు. దాన ననాయాసముగా వచ్చినమిత్రుని బోఁగొట్టుకొనువార మగుదుము. శత్రువు దుస్స్వభావమున స్వార్థైకతత్పరుఁడుగ నుండునేని తనభావమును వెలిపుచ్చక దాఁచుకొనువాఁడుగా నుండును గాన నతనినుండి మన మెఱుంగఁ దగినది తెలియ శక్యము గాకయే యుండును. అట్టిది చిరపరిచయము మూలముననే తెలియఁ దగియుండును. కనుక మిత్రుని బోఁగొట్టుకొనుటయు వానిభావ మెఱుంగకపోవుటయు ననునవి కలుగుచుండును. ఈవిభీషణుఁడు పెక్కుమాట లాడుచున్నను ముఖవికారము స్వేదము భ్రంశము లోనగునవి యించుకయుఁ గనరాక యున్నవి. మఱియు విశేషించి శుద్ధుఁ డీతఁడనుటకు గుఱుతుగా ముఖము ప్రసన్నముగ నున్నది. కావున నితరులకు శంకింప నర్హుఁడు వీఁడని తోఁచినట్లు నాకు సందేహ మెద్దియుఁ దోఁపలేదు. వానరులు వృథావాదులు చేకొని తలపడం జూచి నను ఇతఁడు ప్రతికూలుఁడని సంశయింపకయే వచ్చినవాఁడు. రహస్యముగా దురభిప్రాయముగలవాఁ డెవఁడు నిట్లు జంకు లేక నెమ్మదితో నెదుర్కొని రాఁడు. విశేషించి యీతని మాటలు తొట్రుపడుట మొదలగు దోషములు లేక నిర్దుష్టముగా నున్నవి. కనుక నాకు మాత్రమే కాక యితరులకును సందేహింపవలసిన దేదియు లేదు. రామా! ముఖవికార మెంత దాఁచినను దాఁగియుండఁ జాలదు. హృదయగతభావము దానిని మించి యావికారము బలవంతముగా బయలుపడియే తీఱును. సర్వజ్ఞుఁడవగు నీ వాలోచించి యుక్తమిది యని

నిర్ణయించి చేసినచో దాన సత్ఫలము గలుగును. బంధువు లను భాగ్యమును బరిత్యజించి మనమైత్రి నూరక కోరి వచ్చునా? ఖరదూషణాదులను ముహూర్తమాత్రమున వధించి యుద్ధముసేయుకోర్కె సేనలతో సముద్రతీరమున దిగియుండు నీయుద్యమముం గాంచి, నీశత్రువగు రావణుని కపటవ్యాపారమును జూచి యతనికన్న మహత్తరపరాక్రమశాలి వాలి నొక బాణముననే నిన్నాశ్రయించిన సుగ్రీవునిహితార్థము కూల్చుటయు, రాజ్యాభిలాషము లేక వాలిసోదరున కది యొసంగుటయు విని యట్లే రావణుం జంపి యారాజ్యము నాశింపక తన్ను నభిషేకింతువని తలంచి బుద్ధిపూర్వకముగా రాజ్యాభిలాషముననే వచ్చినాఁడు. కనుకఁ బ్రయోజనమును గోరియే వచ్చినాఁడు. కానఁ బరిగ్రహింపవచ్చును. ఇకార్యమున కీహేతువులే చాలియున్నవి. రాక్షసుఁడని కొందఱు శంకించినను విభీషణుని ఋజుత్వమును గూర్చియే నాశక్తి కొలఁది తోఁచినంత వక్కాణించితిని. రామా! నాయాశయము నాలకించితివి. ఇఁక నిదమిత్థమని నీవే నిర్ణయింపుము. అని విన్నవించి యూరకుండెను.

మహాశయులారా! ఇందనేకవిషయములు విమర్శనార్హములు గలవు. అందు ముఖ్యవిషయముల విమర్శించి వాని తత్త్వ మెఱుంగుదము.

> "ఇత్యుక్త్వా పరుషం వాక్యం రావణం రావణానుజః,
> ఆజగామ ముహూర్తేన యత్ర రామస్సలక్ష్మణః." ౧

అని మూలము. రావణం రావణానుజః పరుషం వాక్యమిత్యుక్త్వా పితృసముఁడగు జ్యేష్ఠభ్రాతను గఠినముగ నున్నవాక్య

మున నలయించి యని యర్థము. ఇది తమ్మునకుఁ దగునా యన్న,

"గురోరప్యవలిప్తస్య కార్యాకార్య మజానతః,
ఉత్పథం ప్రతిపన్నస్య పరిత్యాగో విధీయతే."

అన్న ప్రమాణము ననుసరించి వదలిపెట్టెనని యెఱుంగందగు. యత్ర రామస్సలక్ష్మణః ఆజగామ ముహూర్తేన = అలసింపక లక్ష్మణసహితుఁడగు రామచంద్రుఁ డెందున్న వాఁడో యచ్చటి కరిగెనని భావము. రావణుఁడు సోపాధిక గురువు. శ్రీరామ మూర్తి నిరుపాధికాఖిల జగద్గురువు. స్మరణమాత్రమున సకల కలుషహరణప్రవీణ శ్రీరామ నామధేయ కౌసలేయుని శరణు వేఁడఁబోయెనని భావము. దీనిచేత సత్సహవాసముఁ గోరఁ దగినదనియు, దుస్సహవాసము త్యజింపఁదగుననియుఁ దేలెడిని. విభీషణుఁడు రావణు నాశనమును దనకు రాజ్యప్రాప్తియు ననువాంఛితములు కలిగి పోయినాఁడు. కాన నిది విభీషణునకు ననర్హములు. అనువారు కొంద ఱుందురు. కాని వార లిట్లు భావించిన నాశంక లుండవు. తపస్సాచరించుతఱి బ్రహ్మ ప్రత్యక్షము కాఁగాఁ దక్కిన భ్రాత లిరువురు కోరిన కోరికలకు విభీషణుఁడు వాంఛించినదానికి హస్తిమశకాంతరము కలదు. ధర్మనిరతి సర్వదా తనమనస్సున నుండునట్లు కోరుటయే యిందులకు నుదాహరణము. ధర్మనిత్యత్వము గలవారు యదృచ్ఛాలాభసంతుష్టులు గావలయును గాని దురాశాభూయిష్ఠస్వాంతులు కారాదు.

"న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః,
మాయయాపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః. ౧౫

చతుర్విధా భజంతే మాం జనాస్సుకృతినోఽర్జున,
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ. ౧౬
తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే,
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం సచ మమ ప్రియః. ౧౭
ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీత్వాత్మైవ మే మతం,
ఆస్థితస్సహి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిం. ౧౮
బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే,
వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః." ౧౯

అధ్యా ౭.

అను నీ భగవద్వాక్యములు తన్నాశ్రయించువారలెవ్వరెవ్వరో తెల్పుచు నందుత్తముఁ డగువాఁడు జ్ఞానియే యని తేటపఱచుచున్నవి. ఆజన్మ ధర్మనిరతుఁడు విభీషణుఁ డనుట స్పష్టము కదా. అట్టి విభీషణుఁ డర్థార్థియై రాము నాశ్రయింపఁ బోయెననికాని యన్నమృతిని గోరెననిగాని మన మూహింపరాదు. ఒకప్పు డట్టు లాశ్రయింపఁ బోయినను సర్వజ్ఞుఁడగు పరమేశ్వరుఁ డట్టివానిని భక్తవర్యునిగా భావింపఁడు. భగవంతుని గూడ మోసపుచ్చఁగలవాఁ డుండఁడు గదా.

"ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయంత్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా."

అన్న భగవద్గీతావాక్య మిందుల కుదాహరణము.

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్."

అనియు,

"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే."

అనియు వచించిన భగవద్వాక్యములే యిట స్మర్తవ్యములు. ఆశ్రితుఁ డెట్టివాఁడని తెలిసికొనఁ జాలనివాఁడు భగవచ్ఛబ్ద వాచ్యుఁ డగునా? కావున విభీషణుఁడు ధర్మనిరతుఁడనియు, సత్యసంధుఁడనియు నన్నకు ధర్మమునే బోధించి యతఁ డద్దాని నంగీకరింపకపోఁగా దుష్టసంగతి వదలఁదగునన్న స్మృతివాక్య ముల స్మరించి తాను భగవంతుని పాదసేవకుఁ బోయెననియు మన మెఱుంగుట మంచిది. కర్మానుసారముగా భగవదనుగ్రహ రూపమున లభించుదానిని దృణీకరించుటయు ధర్మవిరుద్ధము గాన నట్టిఫలము తత్ప్రసాదమని భక్తుఁడు భావించి దానిని బొందుటయు నసంగతము కానేరదు.

క. "గతమునకుఁ బగవక నా
గతమునకుఁ గోరు తెఱచి • కడుఁగోరక దీ
నత నొందక దైవం బే
గతిఁ బంచిన నట్ల పోదు • గాకనవలయున్."

అన్న భారతపద్య మిచ్చో నుదాహార్యము. విభీషణుఁడు పితృ సముఁడగు భ్రాతకుఁ గీడుకోరినవాఁడు కాఁడనియు ధర్మనిష్ఠ నుండి తప్పిన యన్నకడ నుండరాదని తలంచి పరమేశ్వరుఁడు శ్రీరాముఁడని నమ్మి తదాశ్రయణ మనంతసుఖదాయకమని విశ్వసించి శరణు చొరఁబోయెనని మన మీభాగమునుండి గ్రహింపవలయును. "యత్ర రామస్సలక్ష్మణః" అనుచోట లక్ష్మణుఁడు పురుషకారభూతుఁడను లోనగువిషయములు గోవిందరాజులు వ్రాసిరి. శ్రీవైష్ణవులకిదియే ముఖ్యతమస్థలము

గాన నిందుఁ దమశిష్యులకుఁ జెప్పఁదగు విషయములు వారి
మనస్సు చెదరక యుండ దిట్టపఱచి వారికడఁ దమగురుతత్త్వ
మును వెలయింపఁ దెల్పుట కనేకభంగుల వెలయించిరి. తత్త్వ
జిజ్ఞాసువుల కవి పనికివచ్చునవి కావు. కావున వాని నిటఁ
జేర్పక మానితినని యెఱుంగందగు.

శేషశేషిన్యాయము వైష్ణవశిఖామణులకుఁ బ్రాణతుల్య
ము. ఏలయన నది యుండినఁగాని భగవత్ప్రసాదమునకంటె
గురుప్రసాదము ముఖ్యమను నుపదేశము సాగదు. అది సాగి
నఁగాని నాలుగుడబ్బులు రాలవు. అవి రాలినఁగాని సంసార
యాత్ర జరగదు. కావునఁ గొన్ని కట్టుబాటులు కల్పించినఁగాని
శిష్యులు కదలకయుండ నిలువఁజాలరు. భగవంతుఁడు కర్మ
ములోఁ బడవేయుననియు, నాచార్యుఁడు కర్మమునుండి పైకిఁ
దేల్చుననియుఁ జెప్పునీచోక్తులు స్మర్తవ్యములు కావు. అవి
కపటనాటకసూత్రధారులు ధర్మసంగ్రహాపరాయణులు దుర్మత
పిశాచావేశనిరతిశయాజ్ఞానమోహితులు నగు వైష్ణవశిరో
మణు లనఁబడు వావదూకులపలుకులు. వానిని దత్త్వజిజ్ఞాసు
వులు పరిగ్రహింపక విషమిశ్రితాన్నమునువలెఁ బరిత్య
జింతురు.

"ఆజగామ ముహూర్తేన" అనుచో నొక్కవిశేషము
కలదు. ఏముహూర్తమున విభీషణునిమది కన్నపట్టుదల నీచ
మని తోఁచినదో యాముహూర్తముననే బయలుదేఱెనని
యర్థము. ఇంచుక యాలసించినను గర్మసిద్ధాంత మోర్వఁ
జాలదు. ఏక్షణమున నేకార్యము కావలయునో అప్పుడే
యప్పని సాగక నిలువరాదు. కనుక నేనిమేషమున విభీషణు

నకు శ్రీరామపాదసేవాభాగ్యము దొరకవలయునో ఆక్షణ
ము తప్పరాదు కదా. కాన నప్పుడే పోయెనని భావసారము.
ఏకాక్షసుఁడు కాని విభీషణుఁ డన్ను నువదలి శత్రువగు రాముని
కడ కరుగునని భావించెనా? దీనిచేఁ గర్మగతి దురూహమని
తేలెడిని. కనుకనే గదా "గహనా కర్మణో గతిః" అని గీత
తేటపఱచెను. దీని నెఱుంగక యహంకారమునఁ దన పౌరుష
మున నాపనిని సాధించితినని నీచమానవుఁ డూహించును.
ప్రాజ్ఞుఁ డట్టివిషయములందు నిరహంకారుఁడై భగవంతుని
సత్కర్మానుష్ఠానాదిరూపముల సేవించుచుఁ దరించును.

"ఉవాచ చ మహాప్రాజ్ఞస్స్వరేణ మహతా మహాన్,
సుగ్రీవం తాంశ్చ సంప్రేక్ష్య సర్వాన్ వానరయూథపాన్." ౯

అని మూలము. మహాప్రాజ్ఞః- ప్రజ్ఞా త్రైకాల్యగోచరా = అను
ప్రమాణము ననుసరించి త్రికాలవిషయముల నెఱుంగఁజాలు
బుద్ధిగలవాఁడని తోఁచెడిని. అట్టివారలయందుఁ గూడ నుత్త
ముఁడని "మహాప్రాజ్ఞః" అని మహర్షి ప్రయోగించెను. జరగిన
విషయములను జరగుచున్నవానిని జరగఁబోవువానిని గూడ
నాలోచించియే యితరాశ్రయణము నిరుపయోగమని
యెఱింగి సర్వాతిశయాశ్రయణము శ్రీరామసన్నిధానమని
నిశ్చయించెనని భావము. మహతా స్వరేణ=గంభీరధ్వనిచేత
నని యర్థము. ఇయ్యది నిష్కపటత్వమును వెల్లడించుచున్నది.
తా వచ్చినకార్యము శ్రేష్ఠము కావున నందు దాఁపఁదగిన
దేదియే లేనికతన స్పష్టముగాఁ జెప్పఁదలంచె ననుభావ మిం
దిమిడియున్నదని యెఱుంగవలయు. ఎల్లవారు వినునట్లుగా

ననుటం జేసి సర్వశరణ్యుని శరణుగోరుట సత్సమ్మతమని సూచింపఁబడినది.

"ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనం,
రక్షిష్యతీతి విశ్వాసో గోప్తృత్వ వరణం తథా.
ఆత్మనిక్షేప కార్పణ్యే షడ్విధా శరణాగతిః."

అని భగవచ్ఛాస్త్రోక్తషడంగములు గలది శరణాగతి యని వ్యాఖ్యాతలు వ్రాసిరి. "శృణాతి దుఃఖాదికమితి శరణమ్. శౄ-హింసాయామ్." అన్న వ్యుత్పత్తి ననుసరించి దుఃఖాదులఁ జెఱచువాఁడు అని యర్థము. ఆతఁడు గతియని పోవుట శరణాగతియని భావము. మహారవము దైన్యముఁ దెలుపును. దైన్యమనన్యగతికత్వమును సూచించును. కావుననే మహాస్వరమున నెల్లవారు విన విభీషణుఁడు స్వాభిప్రాయము నీవిధముగాఁ దెల్పఁబూనెనని మన మెఱుంగందగు.

"రావణో నామ దుర్వృత్తో రాక్షసో రాక్షసేశ్వరః,
తస్యాహ మనుజో భ్రాతా విభీషణ ఇతి శ్రుతః." ౧౦

అని మూలము. రాక్షసః = జాతిచేతనే క్రూరుఁడని భావము. అంత చాలక దుర్వృత్తః = దుష్ప్రవర్తకుఁడు. అదియుఁ గాక రాక్షసేశ్వరః=క్రూరస్వభావులకుఁ బ్రభువు. ఇఁకఁ జెప్పవలసిన దేమి? "మర్కటస్య సురాపానం మధ్యే వృశ్చికదంశనమ్" అన్నట్టు సర్వాంగములు కుదిరినవని భావము. రావణుఁడని యతనిపేరు. విలపింపఁ జేయువాఁడు. ఈపేరుచేతనే లోకకంటకుఁడని యేర్పడుచున్నది. ఈపదములన్నియు నతని వదలిపెట్టుటకుఁ గారణము లనుభావమును దేటపడఁజేయక మానవు. తస్యాహమ్ = అట్టివానికి నేను. అనుట చేతనే సకల దోష

సాంద్రత్వము తేటపడును. అనుజో భ్రాతా = వెనుకఁ బుట్టిన సోదరుఁడను. కుబేరునివలెఁ గాక ఒకతల్లి కడుపునఁ బుట్టిన వారమే మే మిరువురమనియు, నందు నేనతనివెనుకఁ బుట్టిన వాఁడ ననియుఁ దేలుచున్నవి. నా పేరు విభీషణుఁ డందురు. విశేషముగ భయమును గల్గించువాఁడని యర్థము. విగతభీష ణుఁడనియు నొకయర్థముఁ గలదు.

"ఉపాయేనైవ సిద్ధ్యంతి హ్యపాయా వివిధా స్తథా,
ఇతి యా గర్వహాని స్తద్దైన్యం కార్పణ్యముచ్యతే."

అను ప్రాక్తనసూక్తి ననుసరించి గర్వహానియు దైన్యము సూచింపఁబడినవి. దీని సారమేమి? శరణాగతియందు మోసము కూడదు. కనుక నున్నదున్నట్లు చెప్పఁదలఁచి యెల్లరకు విశద పఱచుచున్నవాఁడు. సంబంధము నా కున్నదిది. సకలవిధము లం దలంచినఁ బరిహార్తవ్యమే. కాని గుణదోషముల విచా రము చేయఁదగినదియే కదా. పరికింపుఁడు. అన్నభావమున విభీషణుఁడు గంభీరస్వరమునఁ బలికెనని మన మూహింప వలయుననుటయే యిటఁ గలసారము. కర్మసిద్ధాంతము నాలో చింపుఁడనియే యీ మొత్తి. జాతిసంబంధాదులచేత నే యొక నిని శిష్టుఁడనిగాని దుష్టుఁడనికాని మనము భావింపరాదు. ప్రాక్కర్మము ననుసరించి జాత్యాదులకు సంబంధింపని సద్గుణాదు ర్గుణము లుండవచ్చును. మంచికులమునఁ బుట్టినను, స్వకర్మము ననుసరించి దుర్గుణములు పట్టుపడుటయు, దుష్టవంశమునఁ బుట్టి నను, సద్గుణములు లభించుటయుఁ గలదు. కర్మానుసారమే మానవాదులప్రవృత్తి యమరియుండును గాని జాత్యాదుల ననుసరించి యుండదు. సహవాసమున లభించు సద్గుణాదుర్గుణ

ములు కర్మానుసారములే యని యెఱుంగవలయు. అనఁగా నట్టిసహవాసము కర్మఫలముల ననుభవించుటకుఁ దగినట్లుగనే కుదురును. ప్రహ్లాదవిదురాదు లిందుల కుదాహరణభూతులు.

"కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః,
ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః
అహంకారవిమూఢాత్మా కర్తాహమితి మన్యతే."

అన్న గీతావాక్యముల ననుసరించి యోజింపఁగాఁ గర్మము మానవు నవశునింజేసి సర్వకార్యములు ఫలానుభవమున కను కూలించునట్లు చేయించుచున్నదని తేలుచున్నది. కావున నా జాతిసంబంధాదుల ననుసరించి నన్నుఁ గ్రూరునిగా భావింప వలదనియు, నాప్రవృత్తి నెఱింగియే పరిగ్రహింపుఁడనియుఁ దెలుపుటకే యీవార్తల విభీషణుఁడు తెలిపెనని యిందుండి సారమును గ్రహింపవలయును.

"తదహం హేతుభిర్వాక్యైర్వివిధైశ్చ న్యదర్శయం,
సాధు నిర్యాత్యతాం సీతా రామాయేతి పునఃపునః. ౧౨
స చ న ప్రతిజగ్రాహ రావణః కాలచోదితః,
ఉచ్యమానం హితం వాక్యం విపరీత ఇవౌషధమ్. ౧౩
సోఽహం పరుషిత స్తేన దాసవచ్చావమానితః,
త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణం గతః. ౧౪

అని మూలము. స్వాభిప్రాయమును దేటపఱచుచున్నాఁడు.

"చరాచరాణి భూతాని సర్వాణి భగవద్వపుః,
తత స్తదానుకూల్యం మే కర్తవ్యమితి నిశ్చయః."

అన్నసూక్తి ననుసరించి యానుకూల్యసంకల్పరూప మగు

సంగము ప్రదర్శింపఁబడినది. నాచెప్పిన నీతివాక్యములు ఆ రావణుఁడు కాలచోదితుఁడై గ్రహింపక పోయెను. కాల చోదితుఁ డనుటం జేసి రావణుఁడు స్వబుద్ధి ననుసరించి చేసిన వాఁడు కాఁడనియుఁ గాలగతి నెఱింగి శరీరాభిమానము మాని పరమగతిం గోరి యొనరించెననియుఁ దోఁచెడు. అట్టి రావణుఁడు నన్ను దాసునివలె నవమానింపఁగా సర్వమును మాని రఘువంశజనితుఁడగు పరమేశ్వరుని శరణము గోరివచ్చి తిని. భగవంతునిశరణము గోరునపుడు సంసారకాంక్ష మాన వలయు ననుభావ మిట సూచింపఁబడినది. అన్నచే నవమా నింపఁబడుటయే భగవచ్ఛరణసేవాదృతికి మూలమను విభీషణు భావము గ్రాహ్యామే. "రాఘవం శరణం గతః" అనుటంజేసి శరణాగతత్రాణపరాయణత్వము రాజులకు ధర్మమనుభావ మూహ్యము.

"శస్త్రహీనం చ భీతం చ దీనం చ శరణాగతం,
యో న రక్షత్యధర్మిష్ఠః కుంభీపాకే వసేద్యుగం.
రాజసూయశతానాం చ రక్షితా లభతే ఫలం,
పరమైశ్వర్యయుక్తశ్చ ధర్మేణ స భవేదిహ."

బ్రహ్మవైవర్తము. ప్రకృతిఖండము ౫౫ అధ్యా.

"శరణాగతరక్షాం యః ప్రాణైరపి ధనైరపి,
కురుతే మానవో జ్ఞానీ తస్య పుణ్యాం నిశామయ.
సర్వపాపవినిర్ముక్తో బ్రహ్మహత్యాముఖైరపి,
ఆయుషోఽంతే వ్రజేన్మోక్షం యోగినామపి దుర్లభం."

పాద్మ్యము. ౮ అధ్యా.

అను నీప్రమాణముల ననుసరించి శరణాగతత్రాణము తక్కిన వారికన్న రాజులకుఁ బ్రధానకార్యమనుట స్మృతిసమ్మతము.

"సర్వలోకశరణ్యాయ రాఘవాయ మహాత్మనే,
నివేదయత మాం క్షిప్రం విభీషణ ముపస్థితమ్." ౧౪

అని మూలము. శరణ్యుఁడగు శ్రీరాముని భగవంతుఁ డను భావమున విభీషణుఁడు వినుతించుచున్నాఁడు. చక్రవర్తియై నను సర్వలోకశరణ్యుఁడు కాఁడు కదా. మహాత్మనే=మహాత్ముఁడు కూడఁ గాఁడు శ్రీరాముఁడో సకలలోకరక్షకుఁడు మహాత్ముఁడు. రఘువంశమున రామనామధారియగు పరమేశ్వరుఁడు. ఆ పరాత్పరునకు వచ్చిన శరణార్థిని నన్ను విన్నవింపుఁడు. సర్వజ్ఞునకు విన్నవించు టెలయనిన.

"తదను ప్రధానద్వారా రాజదర్శనం కర్తవ్యమ్."

అన్న న్యాయము ననుసరించి నియోగివర్యునిద్వారా దర్శింపఁ గోరెనని యెఱుంగఁదగు.

"అంతర్ధానగతా హ్యేతే రాక్షసాః కామరూపిణః,
శూరాశ్చ నికృతిజ్ఞాశ్చ తేషు జాతు న విశ్వసేత్." ౧౯

అని మూలము. కామరూపులు రక్కసులు. అంతియగాక యదృశ్యముగా నుండువారు. కపటోపాయముల నెఱింగిన వారు. కావున నట్టివారియెడల విశ్వాస మొకప్పుడైన నునుపరాదు.

"ధర్మధ్వజీ సదాలుబ్ధ శ్ఛాద్మికో లోకదంభకః,
బైడాలవ్రతికో జ్ఞేయో హింస్రస్సర్వాభిసంధకః. ౧౯౪

అధోదృష్టిర్నైష్కృతికస్స్వార్థసాధనతత్పరః,
శఠో మిథ్యావినీతశ్చ బకవ్రతచరో ద్విజః. ౧౯౬
యే బకవ్రతినో విప్రా యేచ మార్జారలింగినః,
తే పతంత్యంధతామిస్రే తేన పాపేన కర్మణా. ౧౯౭
న ధర్మస్యాపదేశేన పాపం కృత్వా వ్రతం చరేత్,
వ్రతేన పాపం ప్రచ్ఛాద్య కుర్వన్ స్త్రీశూద్రదంభనమ్." ౧౯౮

అని మనువు తెల్పెను. వేషమున నొరుల మోసపుచ్చుట మహా పాపమనియు, దంభకర్మమునఁ దనపాపమును గప్పిపుచ్చుచు స్త్రీశూద్రుల వంచించి ధనము సంగ్రహించుట నిరయహేతు వని మనుస్మృతి తెలుపుచున్నది. శిష్యుల సంపాదించి మంత్రోప దేశము చేసి ధనములాగుచుఁ దనవేషము ముముక్షువులది కాఁగా సంచరించువారు దేవద్రోహులు మహాపాపులు నగుదు రనుట నిస్సంశయము కదా. అట్టివారు తప్పక యంధతామిస్ర నరకమున యుగములకొలఁది నివసించి తమ పాపకృత్యములం దలంచుకొనుచు దుఃఖించుచుందురనుట కొంతయు శంక లుండవు ఇట్టులుండ దేవతాకార్యార్థ మార్జించిన ధనము దాఁచి దాని కుపయోగించిన రహస్యబంధువుల కిచ్చుట దేవ ద్రోహముగాక మఱే మగును! అట్టివాఁడు దేవద్రోహి యనఁ బడక మఱేపేరునఁ బిలువఁబడ నర్హుఁ డగును! వేషము భూష ణము కాదనియు, వృత్తి భూషణమనియు దీనిసారము. అంత ర్థానము కామరూపము ననునివి సిద్ధులు.

"రససిద్ధిర్లోకసిద్ధి ర్బలసిద్ధి స్తథైవ చ. ౫౬
ఖడ్గసిద్ధిః పాదుకాయాస్సిద్ధిరంజనసిద్ధికా,
వాక్సిద్ధిర్లోహసిద్ధిశ్చ దేహసిద్ధి రనంతరం. ౫౭
ఏతాదృశ్యస్సిద్ధయస్తు బహ్వోన్యా యోగిసమ్మతాః,

అత్రాంతు రేతు పరితస్సేవంతే పరమేశ్వరీం. ౫౮

కోటిశస్సిద్ధయ స్తస్మిన్నణిమాద్యంతరే శుభే,
నవలావణ్యసంపూర్ణాస్స్మయమానముఖాంబుజాః. ౫౯

జ్వలచ్చింతామణికరాస్సదా షోడశవార్షికాః,
అత్యుదారప్రకృతయః ఖేలంతి మదవిహ్వలాః." ౬౦

అధ్యాయము. ౪౦ లలితోపాఖ్యానము.

ఇవి యోగశాస్త్రమునఁ గలసిద్ధులు. ఉపాసకునకు మంత్రజప సిద్ధిమూలమునను గలుగును. ఈసిద్ధుల కధిదేవతలు గలరు. యోగికానివాఁ డుపాసకుఁడు కాఁజాలఁడు ఈరెండింటి కవినాభావసంబంధము కలదు. ఒక్కొక్కదేవత నుపాసించినఁ దత్సిద్ధి గలుగును. అంతర్ధానసిద్ధి కధిదేవత తిరస్కరణి యను నది. ఆదేవత నుపాసించుచో వలయునెడల నితరులకుఁ గనఁ బడకయుండ నుండుచుఁ దా నితరులం గాంచుచుండును. స్పృశింపకుండ నుండ వలనుపడదు. ఇతరులఁ దా స్పృశింపక యుండఁ దిరుగుచుండవలయును. వియద్గమనాదులు మంత్ర సిద్ధులే యనవలయును. ఒక్కొక్కఁడు కొన్ని దేవతలనే యుపా సింపఁజాలి తత్సిద్ధులఁ బడయఁదగియుండును అస్త్రమంత్రముల కెట్టినియమములో వీనికి నట్టివే యని మన మెఱుంగవల యును. ఈసిద్ధుల రాక్షసులలోఁ బెక్కండ్రు సంపాదించిరి. దేవతల నుపాసనలో పట్టుదల తక్కువ. కాఁబట్టి యిట్టిసిద్ధులు లేవనియు, ఖేచరత్వము మాత్రము కలదనియు నూహింపం దగును. ఇన్నిసిద్ధులు గలిగినను వృత్తి క్రూరమగుటవలన వార లకు భగవదనుగ్రహము కలుగలేదని సారము.

ఇఁక సుగ్రీవాదులభావములు సామాన్యదృష్టిం బరికిం చిన నర్థశాస్త్రవిరుద్ధములు కావు. హనుమంతుని యాశయము

శాస్త్రీయమే. కాని యిం దెవరిభావ మశాస్త్రమన వలను పడదు. సమయానుసారముగా నొకొక్కభావము ఫలవంత మగుచుండును. కనుక వారివారిభావముల నిటఁ బేర్కొన వలసినయవసర మీగ్రంథమునకుఁ గలుగదు. ఇఁక శ్రీరాము నాశయ మెట్టిదని యాభాగమును బరిశీలింతము.

## శ్రీరాముఁడు శరణాగతరక్షణము పరమ ధర్మమని తెల్పుట.

* తర్వాత శ్రీరామచంద్రుఁడు మారుతి మనోభావము నెఱింగి సుగ్రీవునిమాటలచేఁ గలఁగినమనస్సు నిర్మలము కాఁగా వసిష్ఠాదిమహర్షులమూలమునఁ గపోతకండూపాఖ్యా నాదులు వినియున్నవాఁడు గనుకఁ బూర్వపక్షములచే బుద్ధి కలవిలపాటొందక తనమనస్సున నున్నమతమును విప్పి చెప్పం బూని యిట్లనియె. వానరోత్తములారా! నాకు నీవిభీషణుని గుఱించి యించుక చెప్పవలయునని వాంఛ యున్నది. నా శ్రేయస్సునే మీరు కోరువారలు కనుక నా చెప్పువిషయము నంతయుఁ జక్కఁగా వినవలయునని కోరుచున్నవాఁడను. శరణాగతుని ఆతనియం దెన్నిదోషము లున్నంగూడ నెంత మాత్రము వదలిపెట్టను. ఇట్టు లొనరించుట సత్పురుషులకు మర్యాదయే గాని నిందితమేమాత్రము కాదు.

అంత సుగ్రీవుఁడు శ్రీరామునిమాటను విని దాని ననువదించి విమర్శించుచు నీతిశాస్త్రసారమైనదియు స్వామి

* ఇది పదునెనిమిద సర్గమునఁ గలదు.

ప్రేమాతిశయమున నిండినదియు నగు శుభవాక్యము చెప్పఁ దలఁచినవాఁడై యిట్టులనియె. శ్రీరామచంద్రా! దోషములే పెక్కు లుండువాఁడుగానీ, నిర్దోషుఁడుగానీ యీరక్కసుఁడు మనకేల? వీనిమూలమున మనకుం గల్గు ప్రయోజన మేమి? లంకానగరము కాలి యన్నపుత్త్రులు హతులై శత్రువులవ్వాలి గట్టున యుద్ధముచేయ వచ్చి దిగియుండఁగా నిట్టి మహావ్యసనము కలిగినపుడు భ్రాత నెవ్వఁడు త్యజించునో యతఁ డందఱిని త్యజించుటకు సందియ మేమి యుండును? కనుక వీఁడు కృతఘ్నుఁడే యగును. అనఁగానే సత్యపరాక్రముఁడగు రామభద్రుఁడు వానరేంద్రుని నుడు లాలకించి యందుఁ గలవారి నెల్లరం గాంచి యిట్లు పలికెను. ఆశ్రితరక్షణవ్రతమే నాకుఁ బరమశక్తి. ఇది యెఱుంగక యేమో పలుకుచున్నాఁడు వానరేశ్వరుఁడని చిఱునవ్వు నవ్వి రాజరీతి నాశ్రయించి యుత్తరము పల్కువాఁడై పుణ్యలక్షణసంపన్నుఁడు గాన లక్ష్మణుం గాంచి నుడివెను.

సుగ్రీవుఁడు పలికినది శాస్త్రములఁ బఠింపక పెద్దల సేవింపకయు నుండువానికి వచింప శక్యమే గాదు. సకలశాస్త్రవేత్తయై సాధుసంసేవ లొనరించి యాఱితేఱినవానికే చెప్ప సాధ్యంబగు అన్నను బరిత్యజించి వచ్చినవిషయమునందు నీతిశాస్త్రమున కనుకూలమైన రాజధర్మ మొకటి కలదు. లేదన రాదు. అది ప్రత్యక్షముగాఁ గనఁబడుచు లోకవ్యవహారసిద్ధమైనదియే. రాజులకెల్లరకు నది కలిగినదే. నాకు నదియే తోఁచుచున్నది. ఏదది యందువేని వినుము. జ్ఞాతులు ప్రక్క

రాజులు వ్యసనములు రాఁగాఁ గ్రమ్ముకొని ప్రహరించువారలే. కనుక వారు శత్రువులనియే చెప్పఁ దగుదురు. ఈవచ్చిన విభీషణుఁడు కష్టకాలమునఁ బ్రహరించుస్వభావము గలజ్ఞాతియే కావున నిపుడన్నకుఁ గల్గిన విపత్తునందు వానిం బ్రహరించుటకై యిచ్చటికి వచ్చినాఁడు ఒకవేళ యిప్పటి విపత్తునందుఁ దన్నాతఁడు కొట్టునని భయంపడివచ్చినను వచ్చియుండును. ఏవిధముగాఁ జూచినను వీఁడు మనకుఁ బరిగ్రహింపఁదగినవాఁడే. జ్ఞాతికులమున జన్మించిన పాపాత్ములు గాకయుండురాజులు తమకు మేలు చేయఁదలఁచు జ్ఞాతులను తప్పక గౌరవింతురు. అట్టి మంచిమనస్సుగల రాజులకుం గూడ లోకులు పాపస్వాంతులుగానుండుటంబట్టి గుణవంతుఁ డగుజ్ఞాతిని సైతము శంకింతురుగాని నమ్మరు. ఇట్టులుండఁ బాపాత్ముఁ డగురాజున కట్టిజ్ఞాతి శంకింపందగినవాఁడని చెప్పనేల? కనుకఁ బాపాత్ముఁడగు రావణుఁడు తన్నుఁగూర్చి యనుమానపడఁగా వానితోఁటి పగగలిగియే వచ్చినాఁడు. శత్రుబలమగు నీవిభీషణుని గ్రహించువిషయమై శత్రుబలము వర్జింపఁదగునను గొప్పదోషమును జెప్పితివి గదా. ఆదోషములోనే యట్టివానిని బరిగ్రహించుటకు నీతిశాస్త్రము ననుసరించిన హేతువు కలదు సుగ్రీవా! దానిం జెప్పెద నాలకింపుము. అది నీమనస్సున కెక్కును జుమీ. మనము వీనివంశమునకుఁ జేరినవారము కాము. కాన వీని రాజ్యమునకు మనము దగినవారము కాము. దానిం గోరకుండుటం జేసి తనయన్నయందు వలె వీనియందు మనకు శత్రువను ననుమానము గలుగనేరదు. కావున వీఁడు మనల విడువఁడు గదా. వీనికిఁ బ్రక్కరాజులము కూడఁ గాము. కనుక

వీఁడు సమయముకనిపెట్టి మనలం గొట్టఁ దలంపఁడు. ఇంకొక్క మాట. ఈవిభీషణుఁడు రక్కసుఁడు కాన రాజ్యకాంక్షచే వచ్చినవాఁడౌట మనచేఁ దనయన్నను జంపింపనున్నాఁడు. కనుక నీకార్యము చెడునన్న భయమునుబట్టియు మనకపకారము చేయం దలంపఁడు. రక్కసులు మూర్ఖులు గదా యింత యాలోచన లుండునా యని సంశయింతువేమో వినుము. రక్కసులందు మహావిద్వాంసులు గలరు. కాన వీనిని గ్రహించుట యుక్తము. అట్టి జ్ఞాతులు సర్వకాలము పరస్పరము కలఁతలులేక సంతుష్టులుగనే యుందురుగాని యన్యోన్యము కలిసి మాత్రము నివసింపరు. ఇక్కారణము ననుసరించి యవసరము కలిగినపుడు పరస్పరము వేఱుపడుదురు. వీని కంఠనాదము పరికింపఁగా భయంకరముగా వినఁబడియెడిని. దానింబట్టి భయంకరుఁడగు నన్నవలన వీనికి భయము కలిగియే యున్నది దానం జేసి యాత్మసంరక్షణ వాంఛచేత వచ్చినవాఁ డగును. కనుక వీనిని జేకొనుటయే తగినపని. ఎట్టివాఁడైన నన్ననుసరించుటయే తగినదందువేమో. వత్సా! లోకమునందుఁ దోఁబుట్టువులందఱు భరతునివంటివారు గారు సుమీ. తండ్రికిం గుమారులందఱు నావంటివారు కూడఁ గలుగరు. సుహృదులు మీబోంట్లు కాని కలుగఁజాలరు. ఇట్టి ధర్మాత్ములు లోకమునం దరుదు. కావున రావణుని తోడఁబుట్టువని యూహింపక వీనిని బాధింపఁజూడఁగా వాని వదలి వీఁడు రావచ్చును గనుక పరిగ్రహింపఁ దగినవాఁడే యని చెప్పెను.

శ్రీరాముఁ డిట్లు తేటపఱుపఁగా మిక్కిలి ప్రాజ్ఞుఁడగు సుగ్రీవుఁడు లక్ష్మణుఁడు దానును లేచి నమస్కరించి శరణా

గతిపూర్వకముగా రామచంద్రునితో నిట్లు పల్కెరి. ఈరక్క సుఁడు రావణునిచే రహస్యముగాఁ బంపింపఁబడినవాఁడని నమ్ముము. ఉచితజ్ఞులలో నీ వుత్తమోత్తముఁడవు. నీకుఁ దెలియనిదేదియు లేదు. వానిని గ్రహించుటయే యుక్తకార్యమని నాకుఁ దోఁచుచున్నది. మహాత్మా! రక్కసుఁ డాతఁడు కుటిలమతిచే రావణుఁడు పంపించఁగా వచ్చి తన రూపము దాఁచి విశ్వాసము మనకెల్లఁ గలిగించి దానిచే నేమఱియుండఁగా నిన్నో నన్నో లక్ష్మణునినో ప్రహరింపనున్నాఁడు కాన మనము మంత్రులతోడ నట్లు చచ్చుటకు పాలుగావలసి వచ్చును జుమీ. వీఁడు మహాక్రూరుఁడగు రావణుని సోదరుఁడు గదా. వీనినెట్లు నమ్మవచ్చు ననెను. వాగ్విశారదుఁడగు సుగ్రీవుఁ డిట్లు శ్రీరామునకుం దెల్పి యంత ప్రణయరోషమునఁ బలుకక యూరకే యుండెను. శ్రీరాముఁ డామాటల నాలకించి వానికిం బరిహార మేమిచెప్పవలయునా యని చింతించి చక్కఁగాఁ బరిశీలించి బహుశుభప్రదంబగువాక్కున నిట్లు పలికెను. వానరేంద్రా! వీఁడు చాల దుష్టుఁడే కాని దుష్టుఁడే కాకపోనిమ్ము. వీఁడేమి మనలఁ జేయఁగలఁడు. నాకు నాయాశ్రితులు లోనగు వారి కిసుమంతయు వీఁ డపకార మేవిధమునను జేయఁ జాలఁడు. కపికులాధిపా! ఈజాతి యొకటియే గాదు. క్రూర జాతులని పేరుగాంచిన పిశాచులును దానవయక్షులును లంక లోనివారు గాక భూమియందుఁ గలరాక్షసులును గలిసి యొక్కసారిగా మనపై కెత్తివచ్చినను నాకిష్టము గలిగినయెడల వీరినెల్ల శస్త్రాదులతోఁ బనిలేకయే చరణాంగుళితో నశ్రమంబుగఁ జంపివైతును. పూర్వకాలమున నొకప్పుడు ధర్మాధి

కారము లేని తిర్యక్కగు కపోత మొక్కండు తనకు విరోధి యగువ్యాధుఁడు తాను గాఁపురముండు వృక్షముకడకు రాఁగా శీతబాధానివారణము మొదలగు నుపచారములచేత వానిని దేవతం బోలె నారాధించి న్యాయమురీతిఁ దనశరీరమునఁ గల మాంసము లొసంగి భక్షింపుమా యని వేఁడెను. ఇది యంద అెఱింగినవిషయమే కాని క్రొత్తది గాదు గదా. కపీంద్రా! పావురమువంటిదే తనపెండ్లామును జంపిన యావ్యాధుఁడు తనకడకు రాఁగానే గ్రహించి యాదరించినదే. ఇంక నావంటి వాఁ డేమిచేయవలయునో వచింపవలయునే? కణ్వమునికుమారుఁడు మహర్షి సత్యమునే పలుకువాఁడు నగు కండుఁడు మున్ను శరణాగతి పరమధర్మబోధకమగు గాథ నొక్కదానిం జెప్పెను. విను. దోసిలొగ్గి శరణు వేఁడు శరణాగతుని క్రూరుఁడని తనకు లోకమున నింద కలుగకుండుటకు వాఁడు పగ వాఁడే యైనను సుంతయు వధింపఁ దలంపఁగూడదు. భయంపడి గాని భీతుఁడైనట్లు నటించుచుఁగాని శత్రువులనుండి యొకపగ వాఁడు విరోధమును మాత్రము మదినుంచుకొని పైకి శరణు అని నుడువుచు శరణుచొచ్చినయెడల గురుకులవాస శిక్షితుండగుచు శాస్త్రములయందు విశ్వాసముకలవాఁడు తనయసువుల వదలియైన వానిని గాపాడందగు. శరణన్నవానిని గాపాడినయెడలఁ బరమగతి గలుగును. వానివలనఁ దనకుఁ బ్రాణ హాని కలుగునేమో యన్నభీతిచేఁగాని శాస్త్రములు తెలియమిం గాని, వానివలన నేదియో లాభమును గోరియో స్వేచ్ఛా వర్తనమును బట్టియో కాని తనకుఁగల్గిన శక్తికిఁ దగినచందమున మఱియేకారణమున మోసపుచ్చక రక్షింపవలయును. లేనిచో

మహాత్తర ప్రత్యవాయము కలుగును. మఱియు లోకాప వాదము గలుగక మానదు. ఒకఁడు వేఱొకరిని రక్షింపుమని శరణు చొరఁగా రక్షింప శక్తుఁడయ్యును వానిని రక్షింపక యూరకయుండునేని దానంజేసి వాఁడు పగవానిచేఁ జంపఁ బడునేని అట్లు రక్షింపనివాఁడు సమార్జించిన పుణ్యమునంతయు గ్రహించి దానికిఁ బ్రతిఫలముగా నొందవలసిన యుత్తమ లోకములను దానే పొందును. శరణాగతుని సంరక్షింపని యెడల గొప్పదగుపాపము కలుగును. మఱియు నరకముకల్గును. పూర్వము పెక్కండ్రను గాపాడి సమార్జించిన విఖ్యాతి నంతయు నాపాపము నశింపఁజేయఁ గలదు. తనువున రక్షింపఁ దగు బలపౌరుషము లుండియుఁ గాపాడనియెడల నాపాప మాబలపౌరుషముల నశింపఁజేయును. కనుక నాకందుమహర్షి-సకలలోకసమ్మతముగా ప్రశంసాదులు లేకయే సత్యపూత ముగాఁ దెల్పిన యాపవిత్రవాక్కును జేసెదను. ఎందుల కనఁగా నది పాపముల నివర్తింపఁజేయునది. ఆనృశంస్యమను పరమధర్మముతోఁ గూడినది లోకమున సర్వసమ్మద మగు ఖ్యాతిని గల్గించునది. ఫలదానసమయమున స్వర్గము నిచ్చునది. ఈకరణి నైహికాముష్మికశుభముల రెండునిచ్చునది కాఁబట్టి చేయఁదగినదియే యగు. ఒక్కపర్యాయము శరణని చెంతఁ జేరి నీవాఁడనని చెప్పి యాచించినయెడల వానికి సకల భూత ములవలనను భీతి లేకుండునట్టు లభయ మొసంగుదును. ఇది నావ్రతము. వానరోత్తమా! నిన్నే పలుకరించిన యావిభీష ణుని బిలుచుకొని రమ్ము. "శరణు" అని యన్నపుడే యభయ మిచ్చితిని. ఆ కార్యము చెల్లినది. వచ్చినవాఁడు విభీషణుఁడైనఁ

గాని విభీషణ వేషమున రావణుఁడు తానే వచ్చిన రానీ. విభీష ణుఁడు కాఁడు రావణుఁడని నాకుఁ జెప్పుటకొఱకై యూరక రాక యెవ్వఁడైనం బిలుచుకొనియే రమ్ము.

అని పలుకఁగా శ్రీరామునివాక్యముల నాలకించి రావణుఁ డైనఁ గానిమ్ము తోడుకొనిరమ్ము. అని యెంతటిదుష్టుఁడైనను శరణాగతునియం దారాముఁడు చూపిన సౌహార్దమునకు అభయదాన మొనర్చి తన్నే పోయి పిలుచుకొని రమ్మనుట చేతఁ దాను సమ్మతించినంగాని విభీషణుని స్వీకరించునట్లు తనపైఁ గనఁబఱచిన సౌహార్దమునకు, నెంతయో యచ్చెరువొంది యా శ్రీరామునిం గాంచి రామచంద్రా! ధర్మసూక్ష్మవిదుఁడవు. లోక రక్షకుఁడవు. స్వామివి. పరులకు సుఖసంపాదనార్థమే జన్మించిన వాఁడవు. నీప్రయత్నము ప్రశంసాపాత్రము. సర్వశక్తిమంతుఁ డవు. ధర్మసంస్థాపన రూపసన్మార్గమందు సుస్థిరుఁడవు. ఇట్టి నీ వీరీతిఁ బలుకుటలో నచ్చెరు వేమున్నది? నీయంతరాత్మకే కాక తీవ్రదండనమున వధింపుమన్న యీనా యంతరాత్మకుంగూడ విభీషణుఁడు పరిశుద్ధుఁడే యని విదితమగుచున్నది. మఱియు హనుమంతుఁడు నీవును జూపిన యుక్తులను, మనస్సును దేట పఱచు ముఖవికాసాదిచిహ్నములను గొని యనుమానించుటం బట్టియు, వీని యార్తనాదముచేఁ బ్రకాశితమగు మార్దవ స్వభావమునుబట్టియు, నేను వీని వధింపుమన్నపుడు, నీవు దిగవిడువనన్నపుడు నొక్కరీతిగా నున్న యీతని యునికిని బురస్కరించుకొనియు, బాహ్యాభ్యంతరములందు వీనిం బరీ క్షించితిని. కావున శ్రీరామచంద్రా! ప్రాజ్ఞుఁడగు విభీషణుఁడు వేవేగ మాతో సమానముగా నొక్కఁడై యుండుఁ గాక.

మాకెల్ల మిత్త్రుఁడగుంగాక అనియెను. ఈమాటల నాలకించి శ్రీరామభద్రుఁడు విభీషణుని సుగ్రీవుఁడు శ్రీరాముఁడభయ మిచ్చెనన్నమాటం దెల్పి తోడ్కొని రాఁగా నిర్జరేంద్రుఁడు పక్షీంద్రునితోడంబోలె రామచంద్రుఁడు విభీషణునితోఁ గలిసి కొనియెను.

మహాశయులారా! శ్రీరామావతార సంపూర్ణఫల మును దెల్పు నీఘట్టమునఁ గలవి శేషముల సరయుదము. వైష్ణవ చిహ్నములు లేనిచో భగవంతునికృప గలుగదను నీచుల మాటల కీభాగము పరమశత్త్రువై యున్నదని తేటపడఁగా నానందింతము. మధ్వవైష్ణవులు సర్వథా పామంసు లగుటం జేసి వారి రహస్యార్థములు సాంప్రదాయికములని కల్పించు నీచార్థములు మనకు వలదు. సార మీభాగమున నేమి తేలు ననియే పరిశీలింతము.

"అథ రామః ప్రసన్నాత్మా శ్రుత్వా వాయుసుతస్య హ,
ప్రత్యభాషత దుర్ధర్షః శ్రుతవానాత్మని స్థితం." ౧

అని మూలము. "వాయుసుతస్య (వాక్యం) శ్రుత్వా ప్రస న్నాత్మా రామః దుర్ధర్షః శ్రుతవానాత్మని స్థితం ప్రత్యభాషత" అని యన్వయక్రమము. వాయుతనయునివాక్యమును "త్వాం ప్రమాణాం తు శేషస్య" అన్నదానిని విని ప్రసన్నాత్ముఁడై అనఁగా నంతకు మున్ను చాలకాలము తనచెంత నుండియు స్వమతము నించుకయే నెఱుంగఁజాలక సుగ్రీవుఁ డిట్లు ధర్మ సూక్ష్మవ్యతిరేకముగాఁ బలుకుచున్నవాఁడే యని యాలో చించుచు మహాభక్తుఁడు శాస్త్రవిద్వర్యుఁడు నగుహానుమం తుఁడు తెల్పిన నీతియు "మేముచెప్పఁగా మిగిలినదానికంతయు

నీవే ప్రమాణము"న్న తత్త్వసారము నెఱింగి దయాసాంద్రుఁడై మనసున నున్నదాని నిట్లు తెల్పెను. సుగ్రీవునిమాటలలో నిన్నో నన్నో లక్ష్మణునినో చంపును. ఆదుర్గతికి మనము పాలు గావలసి వచ్చును. అన్నయర్థము నాలోచించియుఁ బ్రసన్నాత్ముఁడే యయ్యెను. ఏల? దుర్ధర్షః=ఎవ్వారిచేతను దిరస్కరింపఁ దగనివాఁడు. ఏకాలమునం దేలోకంబునం దెవ్వారును జెనకఁ దరంబుగానివాఁడని భావము. కావుననే ప్రసన్నాత్ముఁ డగుట. అనఁగా రావణగూఢచారుఁడు నన్నుఁ జంపునని భీతి నొందుచున్నాఁడే? ఎంత యజ్ఞానమోహావృతుఁడు సుగ్రీవుఁడని యూహించి యట్టి యనుమానములే లేనివాఁడు కావున సంతోషించెనని భావసారము. శ్రుతవాన్=శాస్త్రముల నెఱింగినవాఁడు. అనఁగా శాస్త్రములన్నియుఁ దన్నే తెల్పుచున్నవన్న విజ్ఞానసంపన్నుఁడని భావము. కనుకనే ఆత్మని స్థితం=మనస్సునం దున్నదానిని. అనఁగాఁ దాఁ దెల్పకున్న నెవ్వార లెఱుంగఁ జాలరు.

> "ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
> భ్రామయంత్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా."

అన్న గీతావాక్యము ననుసరించి తన మాయచేతనే యందఱం గప్పుకే యెఱుంగుం గాని తాఁ గప్పఁబడు టెఱుంగఁడని తాత్పర్యము. ఇంతదనుక నెల్లరభావములం గనుంగొనం గోరితా నూరకయుండి తుదకు హనుమ స్వాశయమును దెల్పఁగా నంతకంటె యుక్తియుక్తముగాఁ దెల్పఁజాలువా రందు లేమి నెఱింగి యత్తఱి స్వాశయమును దెల్పఁబూనెనని భావసారము.

"మమాపి తు వివక్షాస్తి కాచిత్ప్రతి విభీషణం,
శ్రోతుమిచ్ఛామి తత్సర్వం భవద్భిశ్శ్రేయసి స్థితైః."

అని మూలము. భగవంతుఁ డీశ్లోకమునఁ దనకు వసిష్ఠాది మహర్షు లిడిన రామనామమును సార్థకము చేయుచున్నాఁడు. "రమంత ఇతి రామః."అను వ్యుత్పత్తిననుసరించి యీరూపము కనఁబడఁగా నెల్లరు మోదమానమానసు లగుదురు. కాన రాముఁడను పేరు వచ్చెనని వ్యుత్పత్త్యర్థము. తన ప్రశ్నమునకు సుగ్రీవాదులు చెప్పినయభిప్రాయములకు విరుద్ధముగాఁ దాఁ జెప్పఁబూని దానం జేసి వారలనెల్ల నానందింపఁ జేయుందలంచి పల్కుచున్నాఁడని భావము. తనవాక్కులను శిరసావహింపఁ జేయునంతటి యామోదమును గల్పింపం దలంచెనని సారము. విభీషణం ప్రతి కాచిద్వివక్షా తు మమాప్యస్తి = విభీషణుని గూర్చి యించుక తెల్పవలయుననునిచ్ఛ నాకును గలదు. అనఁగా విభీషణుని లక్ష్యముగా నుంచుకొని మీకుఁ గొంత విజ్ఞానము కలుగఁ జెప్పవలయు నన్నతలంపు నాకును గల్గినదని భావము. అది ముందే తెల్పఁ గూడదా యనువా రుందురు. ఏదిగాని యప్రస్తుతప్రశంసగాఁ దెలుపరాదు. వినువారలకు శ్రద్ధగలిగియున్నను దెలుపఁబూనినఁ గల్గునని తోఁచినను బెద్దలావిషయము తడయక చెప్పవలయును. అంతియకాని పాత్రముగాఁ దోఁపనితఱి వచింపక యుండుటే యుత్తమము. త్వరపడి చెప్పినను దాన గౌరవహానియే కాని ఫలమేదియుఁ గలుగఁబోదు.

"న శఠాయ న దుష్టాయ నావిశ్వాసాయ కర్హిచిత్,

... ... ... ... ...

తస్మై కుప్యంతి యోగిన్యస్సోఽనర్థస్సుమహాన్మనే.”

అని సూక్తి కలదు గదా. పాత్ర మెఱిఁగి చేసినదానమే ఫలిం
చును. అపాత్రదాన మనర్థదాయకము. జ్ఞానవిషయ మంతయు
నిట్లే యుపదేశింపఁ దగును. ప్రస్తుతము శ్రీరామునకు ధర్మ
సూక్ష్మములను దెలుపు సమయము దొరకినది. సుగ్రీవాదులు
పాత్రులే. జిజ్ఞాసువులు. భక్తిపరాయణులు. శ్రీరామునం దత్యం
తాదరము గలవారు. కాని యెట్టివారలకును సమయోచిత
ముగాఁ దెలుపఁదగునే కాని వేఱువిధముగ నది పనికిరాదు.
దానికి నర్హ మగుకాలమునందుఁ గర్మమే యుపదేశకులను
జెంతకుం జేర్చును. లేక శ్రోతల వారికడ కీడ్చుకొనిపోవును.
దానిశక్తియే వీరిశక్తి యించుకంతయు లేదు. కాన నాకాలము
సుకాలమని తోఁచినందున రామచంద్రుఁడు నాకును దెలుప
వలయుననునిచ్ఛ కలదనియె. అంతమాత్రమున మానక
శ్రేయసి స్థితైర్భవద్భిః శ్రోతుమిచ్ఛామి= మాశ్రేయస్సునం దా
సక్తి గలవారుగాన మీచే నాపలుకులు వినఁదగినవి. మాకుఁ
బ్రాణముల నిచ్చియైన మేలుచేయఁ బూనినవారలు గాన నట్టి
మీరు నాపలుకుల నాలకింపవలయునని భావము. గురుశిష్య
మర్యాద యిందు సూచింపఁబడినది. తమయాశయముల నెల్ల
గురువుకడ విన్నవించి వానికిఁ దగినట్లు శిష్యులసంశయములఁ
దొలఁగించి మేలు గలుగునట్లు గురువు వచింపవలయుననియు,
నాయుపదేశమును శిష్యులు దలలఁ దాల్పవలయుననియు
సారము. ఇదియే గురుశిష్యులకుఁ బరస్పరమర్యాద యని మన
మెఱుంగవలయును. శిష్యుఁడు కోరినట్లు గురు వుపదేశింపరా
దనియు నతని కెద్దాన మేలు గలుగునో యతని యోగ్యత

యెంతయో వానినెఱింగి తదుచితముగాఁ దెలిపి కృతకృత్యు నిగ నొనరింపవలయుననియు భావము. స్వర్ణదానము సచ్ఛిష్యులగుటయుఁ దదభావమున వారయోగ్యు లగుటయు నిప్పటికాలపు టాచారములని గ్రహించి వాని నీటఁబుచ్చి ప్రాచీనమర్యాదల నాదరించి సద్గురువుల నాశ్రయించి తదుపదేశమున భగవంతు నారాధించుపద్ధతిని జక్కనెఱింగి యట్లు లొనరించి తరింపవలయు నను నీతి నిద్దానినుండి మనము నేర్చుకొనందగు.

"మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన,
దోషో యద్యపి తస్య స్యాత్సతామేతదగర్హితం." 3

అని మూలము. మిత్రభావేన సంప్రాప్తం=మనస్సున మిత్రభావములేక శత్రుభావమే యున్నను మిత్రత్వము నభినయించి వచ్చినను, అని యర్థము. అట్టివానిని గ్రహింపవచ్చునా యన్న నట్టివానిని శరణాగతుని వదలిపెట్టను ఇదియె నా నియమము. దుష్టనిగ్రహము శిష్టపరిపాలనము రాజధర్మములు. దుష్టులందఱు శిక్షించుకాలమున శరణాగతులే యైనచో వారిని గాపాడవలసియుండును. అపుడు రాజ్యపాలన మెట్లు సాగునని ప్రశ్నింపవచ్చును అని తానే శంకించుకొని సమాధానము చెప్పుచున్నాఁడు. వానియం దెంత దోషముండినను గ్రహింపఁదగినవాఁడే. అట్టివానిని గాపాడుట సాధుసమ్మతమే గాని విరుద్ధము గాదు. ఆపక్షమున దుర్మార్గశిక్షణమునకు బదులు రక్షణమే యగును గదా యనవచ్చును. ఇఁక ధర్మమునకు స్థల మెక్కడనున్నది? అనఁగా సమాధాన మిట్లు గ్రహింపవలసి యుండును. శరణాగతిని గోరవలయు ననుబుద్ధి పొడము

టయే యొక పుణ్యవిశేషము. ప్రాయికముగా నెల్లర కది పొడ
మదు. దౌష్ట్యము తొలఁగుట కది యొక త్రోవ. శత్రువును
శరణాగతి నెందుకు కోరిరని యూహించిన నది తేటపడఁగలదు.
విరోధము మనసునఁ బాదుకొని మఱింత వానిం గుమార్గ
మునఁ బ్రవర్తింపఁజేయఁ దలంచుచుండును. దానిని దొలఁ
గించు సత్కర్మఫలములు రానున్న తఱి నది యించుక విరళ
మగును. అపుడు సత్కర్మవాసనలు పైపయిం గ్రమ్మును. ఇవి
రాఁగా నసత్కర్మవాసనలు తొలఁగిపోవ నారంభించును. ఆస్థితి
యం దుండువాఁడే శరణాగతి రూపధర్మము నాశ్రయించును.
ఆధర్మము తుదముట్ట నహంకారము నడఁచును. దాన వాఁడు
బాగుపడును. కొంద ఱద్దాని నభినయించువా రుందురను
టయు నిజమే అట్టివారిని ధర్మమునే యాశ్రయించి రక్షించి
నచో నతనికి హానిగలుగదు. వానికపటమే హాని గల్గించును.

"మయైవైతే నిహతాః పూర్వమేవ,
ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్,
ఆత్మైవ హ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః,
బంధురాత్మాత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః,
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్."

అనువాక్యములే వీనికి శరణములు. శ్రీరామమూర్తి యీవిష
యమునే స్పష్టపఱచెను. "సతామేతదగర్హితమ్" అని. శ్రీరా
మునివ్రతమెట్టిది? గుణదోషములు పరిశీలింపక శరణాగతుఁడు
శత్రుత్వమును దాఁచి మిత్రత్వము నభినయించి వచ్చినను
గాపాడవలయుననియే.

"తస్మాదపి వధ్యం ప్రపన్నం న ప్రతిప్రయచ్ఛంతి."

అని శ్రుతి విధించుచున్నది కదా. కనుక శ్రీరామునాశ్రయమే శ్రుతియని మనము నమ్మవలయును. ఈఘట్టమునుండి తెలిసికొనదగినవిషయ మేది? ఎట్టిశత్రుత్వము మది నెలకొనియున్నను గర్మానుసారము మిత్రత్వము పొడసూపునేని యట్టివాఁడు రక్ష్యుఁడే కాని పరిత్యాజ్యుఁడు కాఁడు. మిత్రత్వమున సత్కర్మ ఫలానుభవసమయము సమీపించినదనియుఁ బ్రారబ్ధకర్మ ఫలము నశింపనున్నదనియు సారము.

> "సుదుష్టో వాప్యదుష్టో వా కి మేష రజనీచరః,
> ఈదృశం వ్యసనం ప్రాప్తం భ్రాతరం యః పరిత్యజేత్. ౫
> కో నామ స భవేత్తస్య య మేష న పరిత్యజేత్,"

అని మూలము. ఇవి సుగ్రీవునివాక్యములు. ఇవి లోకసామాన్య ధర్మబోధకము లనవలయును. వీనియం దొక్కనీతి కలదు. అది పరిగ్రాహ్యమే. వ్యసనములందు నెవ్వారిని వదలఁగూడదు. అందును విశేషించి భ్రాతృజనముల వదలరాదు. అట్టితఱి వారిని వదలువాఁ డెవ్వానినే వదలును. వానిని నమ్మరాదు. అనునదియే యిందలి నీతి.

> "వానరాధిపతేర్వాక్యం శ్రుత్వా సర్వానుదీక్ష్య చ. ౬
> ఈషదుత్స్మయమానస్తు లక్ష్మణం పుణ్యలక్షణం,
> ఇతి హోవాచ కాకుత్స్థో వాక్యం సత్యపరాక్రమః." ౭

అని మూలము. తన వాక్యమునకుఁ బ్రతికూలముగా సుగ్రీవుఁడు ధర్మము తెలుపఁగా విని శ్రీరాముఁ డందున్న మంత్రులలోనగు పెద్దలం గాంచి చిఱునవ్వు మోమునం గానఁబడం జేసి లక్ష్మణుని గాంచి యిట్లు పలికెనని తాత్పర్యము ప్రాయికముగాఁ

ప్రభువులకుఁ దమమాట కడ్డము చెప్పిన మహత్తరకోపము గల్గును. అది వారికి నైజము. స్మితపూర్వాభిభాషియగు శ్రీరామున కపుడు నవ్వువచ్చెను. ఏల? నాకుంగల యనుపమ పరమశక్తిని శరణాగతరక్షణప్రవర్తనమును సుంతయేఁ దెలియక పలికినాఁడు. అంతియగాని నామాటను బూర్వపక్షము చేయ వలయుననుతలంపునఁ గాదు. కావున నీతనికి నాశక్తిని దెలిపి, ధర్మసూక్ష్మముల నెఱింగింతునని సంతసించి దానిని జిఱునవ్వునఁ గనఁబడఁజేసి యెల్లరు విన లక్ష్మణునితో నిట్లు పలికెను. "మమ పరమశక్తిం శరణాగతసంరక్షణవ్రతం చ సమ్యగపరిజ్ఞాయ" అని గోవిందరాజులును, "మమ పరమాం శక్తిం శరణాగత సంరక్షణవృత్తం చ సమ్యగపరిజ్ఞాయ" అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి. దీని సారమేమి?

> "త్రిభిర్గుణమయైర్భావై రేభిస్సర్వమిదం జగత్,
> మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయం. ౧౩.
>
> దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
> మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే." ౧౪

అధ్యాయము. ౭

> "ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి,
> వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్. ౧౯
>
> పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్,
> కారణం గుణసంగోస్య సదసద్యోనిజన్మసు." ౨౧.

అధ్యాయము. ౧౩.

"యద్యహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి." ౫౯
అధ్యాయము. ౧౮.

అను నీగీతావాక్యములు,

"త్రయాణాం దేవానాం త్రిగుణజనితానాం తవ శివే
భవేత్పూజా పూజా తవ చరణయోర్యా విరచితా,
తథాహి త్వత్పాదోద్వహనమణిపీఠస్య నికటే
స్థితా హ్యేతే శశ్వన్ముకుళితకరోత్తంసమకుటాః. ౨౫
సుధామప్యాస్వాద్య ప్రతిభయజరామృత్యుహారిణీం,
విపద్యంతే విశ్వే విధిశతమఖాద్యా దివిషదః,
కరాళం యత్క్ష్వేళం కబళితవతః కాలకలనా,
న శంభోస్తన్మూలం తవ జనని తాటంకమహిమా." ౨౮

అను నీ శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్య ప్రతిపాదితసౌందర్య లహరీప్రసాద భూతశ్లోకములు పరిశీలించిన నేది తేలునో ఆభావమునే వ్యాఖ్యాతలు తెల్పిరని మన మూహింపవల యును. ఏమని యాయూహ? అనఁగా వినుఁడు. రావణుఁడు మహాపాపి యని విభీషణుఁడు తలఁచెను. విభీషణుఁడు శత్రు పక్షమువాఁడని సుగ్రీవుఁడు తలంచెను. మఱికొందఱు నట్లే తలంచిరి. నిక్కమగునూహ యొవరికి నిందుఁ బొడకట్టలేదు. నాదగు పరమశక్తి లంకానగరమునందు సీతారూపము గలదిగ నటించుచున్నది. ఆదేవితలంపులే ఫలించును. నేననఁగా నిమిత్త మాత్రుఁడనే. విభీషణుఁడు వచ్చినఁగాని కొన్నిపనులు కానే రవు కాననే యాదేవి పురికొల్పి యిటువురను వేఱుచేసినది.

ప్రకృతిని మీఱువాఁడుగాని మీఱఁగల నన్యవాఁడుగాని యేకాలమున నేలోకమున నుండఁడు. తదతీతుఁడ ననఁగా నే నొక్కఁడనే. అతీతుఁ డనఁగా నాయందా ప్రకృతి యవస్థాంత రమున లీనమగును. ఇపుడు నేనా మహాప్రకృతికి లోఁబడియే యున్నాఁడను. ఈవిషయము నేమాత్రము నీవానరు లెఱుం గరు గదా! ఇది తెలుపరాదు. తెలుపఁ దగినదానినే తెల్పెద. దాన నీతి పట్టుపడం జేసెదనని తలంచి చిఱునవ్వు గనఁబఱచె నని సారము.

> "అనధీత్య చ శాస్త్రాణి వృద్ధాననుపసేవ్య చ,
> న శక్యమీదృశం వక్తుం యదువాచ హరీశ్వరః. ౨
> అస్తి సూక్ష్మతరం కించిద్యదత్ర ప్రతిభాతి మే,
> ప్రత్యక్షం లౌకికం వాపి విద్యతే సర్వరాజసు." ౯

అని మూలము. సుగ్రీవునినుడులఁ బ్రశంసించి దానినిమించిన విశేషశాస్త్రమును జెప్పఁబూనెను.

> "సమోహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
> యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహం.
> అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్,
> సాధురేవ స మంతవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః."

అను నీగీతావాక్యములు శ్రీరామవాక్కుల సారములే యన వలయును. తాను సర్వసముఁడు గాన దాని నెల్లరకుఁ దెలుపఁ బూని సర్వసమ్మతమగునట్లు తెలుపఁబూనెను. సుగ్రీవునిమాటలు శాస్త్రజ్ఞులు చెప్పఁదగినవియే. పెద్దల సేవింపనివాఁడు చెప్పఁ జాలఁడు. సాంప్రదాయకము లనునర్థములు కొన్ని గలవు.

అవి కల్పితములు గావు. శాస్త్రమర్యాదల ననుసరించి చెప్పఁ బడుచుండునవి, సమయోచితములు నగు. "సైంధవమానయ" అని భోజనసమయమున నొకపండితుఁడడుగఁగాఁ జెంతఁగూరు చున్న గృహస్థువు లేచిపోయి గుఱ్ఱమును దెచ్చెనఁట. దానిం గాంచి పంక్తిం గూరుచుండి భుజింపనున్న వేఱొకబ్రాహ్మణుఁడు గుఱ్ఱమును జూచి నవ్వి పాండిత్యమున కానందించి లవణము తెచ్చి వడ్డింపుమని గృహిణికిం దెల్పఁగా నట్లు చేయ నాపండిత గృహస్థువు సిగ్గుపడియెనఁట. అట్టిదానికే సాంప్రదాయికార్థ మందురు. అంతియకాని శిష్యవిత్తాపహర్తలు చెప్పునట్టివి కావు. మఱియు నొక్కొక్క శాస్త్రమం దొక్కొక్కపదమున కొక్క యర్థముండును. అది తత్ప్రవిష్టునకుఁదప్ప నితరులకుఁ దెలియదు. ఆగమశాస్త్రమునందు "శిరసాహోమః"అని యున్నది. శిరస్సుచేఁ హోమమని యర్థము చెప్పరాదు గదా. అందు నొకయర్థము విధింపఁబడియుండును. దానినే చెప్పవలయు. అట్టివానినే సాంప్రదాయకార్థము లందురు. ఆవిషయమునే శ్రీరాముఁడు పెద్దలసేవింపనివాఁడు తెలుపఁజాలఁడని తేటపఱచెను. ఇట్లు రాముఁడు పలుకఁగనే సుగ్రీవాదులకు మహాసంతోషము గలిగియుండుననుటకు సందియములు లేవు. వానిని రాముఁ డంగీకరించునను భావము కూడఁ దోఁచియుండును. స్వాశయ మును రాముఁడు తెలుపఁగా వారిమనస్సులు సంతోషించిన వగుటంబట్టి యంతకంటె నీరామవాక్యము విశేషవిధి ననుస రించి నీతిసారమని వారు గ్రహింప ననువుపడును. కనుకనే "సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాత్" అని మనువు విధిం చెను. భగవద్వాక్యములు శ్రవణసుభగములు మనోరంజక

ములు నగునట్టివి గదా. ఏలయనఁగా నామహాత్మునకు ద్వేష్యుఁడు ప్రియుఁడును వేరు. సమబుద్ధిగలవాఁడు కదా. ఇట్లు సుగ్రీవు వాక్యములఁ బ్రశంసించి యెల్లర సంతుష్టులఁ గావించి స్వాభిప్రాయమును దెల్పి యందఱ నంగీకరింపఁజేయఁ బూనెను. సుగ్రీవప్రోక్తము సూక్ష్మధర్మమే. కాని సూక్ష్మతరధర్మము మఱొక్కటి కలదు. అది క్రొత్తదియుఁ గాదు. అనుభవసిద్ధము. ప్రత్యక్షముగాఁ గనఁబడునదియు నయి యున్నది. అట్టిది రాజధర్మములలో నొకటిగఁ బరిగణింపఁబడునని తెల్పెను. సుగ్రీవుఁడు తెల్పినదియు సూక్ష్మధర్మమే. దానికి మించిన సూక్ష్మతరధర్మ మున్నదనుటం జేసి యద్దాని వినవలయునను కుతూహలము కల్గును గాని నామాట యేటిపాలుచేసి తనమతమును సిద్ధాంతము చేయఁబూనినాఁడు కదా యను భావము తోఁపదు. ఇదియే రామునియందుఁ గల గొప్పశక్తి. ఏమి వచించునో వినవలయునను కుతూహలము కలవారయి సుగ్రీవాదు లుండఁజేసి శ్రీరాముఁ డిట్లు పల్కుచున్నాఁడు.

"అమిత్రాస్తత్కులీనాశ్చ ప్రాతివేశ్యాశ్చ కీర్తితాః,
వ్యసనేషు ప్రహర్తార స్తస్మాదయ మిహాగతః. ౧౦
అపాపా స్తత్కులీనాశ్చ మానయంతి స్వకాన్ హితాన్,
ఏవ ప్రాయో నరేంద్రాణాం శంకనీయస్తు శోభనః." ౧౧

అని మూలము. ఈయుపదేశసార మేమి? శత్రుత్వమిత్రత్వములు నైసర్గికములు గావు ధనమూలములు. వాని నెఱింగినవాఁడే ప్రాజ్ఞుఁ డనంబడు. ఎవనిధనము తనకు లభించుననునాశ యెవ్వానికి లేదో వాఁ డాతని ద్వేషింపఁడు కదా. అదికలవాఁడే వానిపై ద్వేష మూనును. దీనిభావ మేమి? ధన

మూలము శత్రుత్వమనియే తేలినది. అట్టిధనము తుచ్ఛమని భావించువాఁడే కదా జ్ఞాని యనంబడు. పక్షులయందు దారే షణము పశువులయందుఁ బుత్త్రేషణము మానవులయందు ధనే షణము తాండవమాడుచుండునని పెద్ద లందురు. "భార్యా దుఃఖం పునర్భార్యా" అని కొందఱు. భార్య మృతి కాఁగాఁ నావగపు మరల భార్య వచ్చినంతదనుకనని దాని యర్థము. అనఁగాఁ బక్షుల కెట్లు దారేషణము కలదో మానవుల కట్టు లది లేదని భావము. ధనముం గోరి భార్యను ప్రేమింతురని దానిసారము. కనుకనే మానవులు ధనము గోరి మఱొకరితో ద్వేషింతురు. దాని నాశించియే ప్రేమింతురు. ఇది ప్రధాన గుణము. ధనము గోరనివారు లేరని కాదు. బాహుళ్యమున నది తాండవించుచుండునని తాత్పర్యము. రాజులకమిత్త్రులు జ్ఞాతులు, ప్రక్కనున్న దేశములఁ బాలించువారు నగుదురు. వీరు సమయము గనిపెట్టియుండి వ్యసనములు రాఁగా వారిని బైఁబడి ప్రహరింతురు. ఇందులకుం గారణము ధనమే కాని వేఱుగాదు. కావుననే శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులు గారు"అర్థమనర్థం భావయ నిత్యం నాస్తితతస్సుఖలేశస్సత్యమ్, పుత్త్రాదపి ధనభాజాం ప్రీతిస్సర్వత్రైషా విహితా రీతిః." అని బోధించిరి. ఇవ్విభీషణుఁడు వ్యసనమునందుఁ బ్రహరించు జ్ఞాతి యగుటంజేసి వ్యసనగ్రస్తుఁ డగు రావణుని బ్రహరించుటకై మనచెంతకు వచ్చినాఁడు. కానఁ బరిగ్రాహ్యుఁడే. జ్ఞాతులైనను బాపాత్ములు కానిరాజులు తమకు విహితు లగుజ్ఞాతులను గార వింతురు. అట్టి నిష్కల్మషాత్ములంగూడఁ బాపభూయిష్ఠ మగు టంజేసి లోకము శంకించుచుండును. అని రాముఁడు తెలి

వెను. పాపులగువారే గుణాగుణములం బరిశీలింపక యంద ఱిని శంకింతురనియు సాధుమతు లట్లుగాక శరణాగతులఁ బరి గ్రహింతురని స్వాశయమును దేటపఱచెనని మనము గ్రహింప వలయును. లోకము పాపైకదృష్టి గలదియేగాని గుణైకదృష్టి కలది గాకున్నను గుణదృష్టియుఁ గాదనునీతిని నేర్చుకొన వలయును.

"యస్తు దోషస్త్వయా ప్రోక్తో హ్యాదానేఽరిబలస్య చ,
తత్ర తే కీర్తయిష్యామి యథాశాస్త్రమిదం శృణు. ౧౨
న వయం తత్కులీనాశ్చ రాజ్యకాంక్షీ చ రాక్షసః,
పండితా హి భవిష్యంతి తస్మాద్గ్రాహ్యో విభీషణః. ౧౩
అవ్యగ్రాశ్చ ప్రహృష్టాశ్చ న భవిష్యంతి సంగతాః,
ప్రవాదశ్చ మహానేష తతోఽస్య భయమాగతం. ౧౪
ఇతి భేదం గమిష్యంతి తస్మాద్గ్రాహ్యో విభీషణః,"

అని మూలము. శత్రుపక్షము పరిగ్రాహ్యమే కాదని వచించిన సుగ్రీవోక్తికి శాస్త్రహితముగా సమాధానము చెప్పుచుఁ బూని శ్రీరాముఁ డాతని సంతుష్టుని జేయుచున్నాఁడు. సుగ్రీవా! నీవుచూపిన దోషములోనే గుణమున్నది. శాస్త్రదృష్టిం బరి కించిననే యది కనఁబడును. అద్దానిని దృష్టియగునట్లు విని పింతు. మనము రాక్షసవంశజనితులము గాము కదా. పార్శ్వ దేశములవారము కూడఁ గాము. కనుక వీఁడు మనల సమ యముఁ గనిపెట్టి కొట్టువాఁ డెట్లగును? అంతియ గాదు. రాజ్య కాంక్షి కదా వీఁడు. మన సాయమున దానిం బడయఁ గోరు వాఁడు మన కెట్లపకార మొనర్చును? రక్కసులు మూర్ఖులు కాన నింత విమర్శింపఁగలరా యని యందువేమో వానరేంద్రా!

అది పొరపాటు సుమీ. అనేకులు పండితులు రాక్షసులం దున్నారు. కనుక వీఁడు పండితుఁడే. పరిగ్రాహ్యుఁడే యగును. రక్కసులందఱు క్రూరులు గారు. అందుఁ గొందఱే ప్రాక్కర్మమున ననుసరించి క్రూరులుగా మార్పు నొందుదురు. జన్మమునఁ క్రూరత యలవడదనియుఁ,గర్మసంగతినే యది యలవడదనియు భావము. కొంతకాలము మహాక్రూరులుగా నుండి మఱల మహాసాధువు లగువారును గలరు. ఎట్లది సంగత మనరాదు. దుష్కర్మము నశింపఁగా సత్కర్మము ఫలమీయఁ బూనఁగా మనస్సు మార్పునొందును. అది యుపదేశాదులు లేకయే మాఱును. ఒకప్పు డవి యున్నను మాఱదు. కావుననే ప్రయత్నసాధ్య మదికాదనియుఁ గర్మముననే కలుగఁదగినదనియు సారము ఎప్పుడట్టిమార్పు గలుగునన వలనుపడదు. బ్రహ్మాదులకే నది యగోచరము. కావుననే "గహనా కర్మణో గతిః" అన్నమాట భగవత్ప్రతిపాదిత మయ్యెను. ఇందలిసార మిది. మనదృష్టి కెయ్యది దోషముగాఁ గనఁబడునో యది వాస్తవముగా దోషము కాక యుండవచ్చును. అట్టిదానిని బెద్దలు గుణముగాఁ దెల్పినపుడు గ్రహింపవలయు. జాతినిబట్టి క్రూరత్వ సౌమ్యత్వములు నిశ్చయింపరాదు. వారివారి కర్మము ననుసరించి యవి యలవడును. మనకు నొకనిధనముపై నాశ లేని యెడల వాఁడు మనల ద్వేషింపక మైత్రి నెఱపును. ద్వేషబుద్ధి లేనివారు కలిసియుండఁ గోరుదురు. ఆసంగతి స్థిరమైనది. అనునీతు లీఘట్టమునుండి గ్రహింపఁదగినవి.

"న సర్వే భ్రాతరస్తాత భవంతి భరతోపమాః. ౧౫

మద్విధా వా పితుః పుత్త్రాస్సుహృదో వా భవద్విధాః,

ఏవముక్తస్తు రామేణ సుగ్రీవస్సహలక్ష్మణః." ౧౬

అని మూలము. "అనృతం నోక్తపూర్వం" అన్న ప్రతిజ్ఞను శ్రీరాముఁడు చెల్లించుచున్నాఁడు ఆత్మప్రశంసాదోష మిందు లేదు. ఆత్మప్రశంస సత్యమే యగునేని దానఫలమొందు నాశలేదేని, దాన నితరులకు గుణపాఠము చెప్పుతలంపు గలుగునేని దోష మదికాదు.

"స్వగుణావిష్క్రియా దోషో నాత్ర భూతార్థశంసినః,
అపిత్వనియమో దృష్టస్తథాత్వన్యైరుదీరణాత్." అని వండి.

సుగ్రీవా! ఎందఱికో తమ్ములు గలరుగాని వారు భరతుని వంటివారు కారు సుమీ. ఎందఱికో తనయులు కలరుగాని నావంటివారు కారు సుమీ. సుహృదు లెందఱికో కలరు గాని నీవంటివా రుండరు సుమీ. అనఁగాఁ దండ్రి యిచ్చిన రాజ్యము లభింపఁగా దానిని వదలుకొని వనములనున్న నాకడ కరుదెంచి యిది నీది నాదిగాదు. రమ్ము చేకొనుమని భరతుఁడు ప్రార్థించెను అట్టిసోదరుఁ డెందైన నుండునా? పదునాలుగు వర్షములు కొలఁదినెలలు తక్కువఁగా నిద్రాహారములు లేక పాదసేవ చేయు లక్ష్మణునేల పేర్కొనలేదనరాదు. రాజ్య ప్రాప్తి యనుపరీక్ష సౌమిత్రికి లేదు కదా. అట్టి స్థితియం దెట్లుండునని పరీక్షింపవలయుఁ గాని యితరకాలములఁ బరీ క్షించి లాభమేమి? జ్యేష్ఠునకే రాఁదగినది రాజ్యము. అట్టిది రానున్నపుడు తండ్రిమాటవలన దాని మాని నిరంతరకష్టా లయములగు నడవులనుండ వచ్చు నావంటి కొడుకులును లేరని యెను. చిరకాలత్యక్త రాజ్యసుఖముల వదలి యెంత కఠి నోక్తుల లక్ష్మణుఁడు తూలనాడినను బరిగణింపక మాకుఁ

ప్రాణము లర్పింప వచ్చితివి. నీవంటిసుహృదు లుందురా యని తెలియఁజెప్పెను. విషమకాలముననే గుణాగుణపరీక్ష తేటపడును. ఆట్టితఱి నిర్మలుండైనఁగాని ప్రశంసాపాత్రుఁడు కాఁడని భావము.

"సుదుష్టో వాప్యదుష్టో వా కిమేష రజనీచరః. ౨౨
సూక్ష్మమప్యహితం కర్తుం మమాశక్తః కథంచన,
పిశాచాన్ దానవాన్ యక్షాన్ పృథివ్యాం చైవ రాక్షసాన్.౨3
అంగుళ్యగ్రేణ తాన్ హన్యామిచ్ఛన్ హరిగణేశ్వర,"

అని మూలము. సుగ్రీవుఁడు మరలఁ దనకు హితముఁ దెలుపుచు విభీషణుని వదలిపెట్టుమనఁగా రాముఁ డాతని భీతిని మాన్పఁ దలఁచి తనశక్తిని దేటపఱచుచున్నాఁడు. వానరేంద్రా! ఈవిభీషణుఁడు మహాదుష్టుఁడు గాని యదుష్టుఁడే కాని మనకేల? నాకు నావారలకు రవంతయే నపకారము చేయఁజాలఁడు. పిశాచాదులు క్రూరజాతులు గలరు. వారినెల్ల నంగుళ్యగ్రమున నొక్కక్షణముననే గోరుదునేఁ జంపుదును. అనఁగా శ్రీరాముని భావమేమి?

"కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః,
ఋతేఽపి త్వా న భవిష్యంతి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః."

అను గీతావాక్యము ననుసరించి సంకల్పమాత్రమున వీరినెల్ల వధింతునని భావము.

"జగత్సూతే ధాతా హరిరవతి రుద్రః క్షపయతే
తిరస్కుర్వన్నేతత్స్వమపి వపురీశ స్తిరయతి,

సదా పూర్వస్సర్వం తదిదమనుగృహ్ణాతి చ శివ
స్తవాజ్ఞామాలంబ్య క్షణచలితయోర్భ్రూలతికయోః." ౨౮

అని శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులుగా రనుగ్రహించి యున్నారు. కనుబొమలు కదలించినమాత్రమున సృష్టి స్థితి లయ కార్యములు సాగుచుండును. అట్టి పరాశక్తి నాయందు అభేద రూపమున నున్నది. కాన నితఁడు కాఁడు. ఎవ్వరైన నన్ను ననవేల? నా యాశ్రితులను గూడ నేమియుఁ జేయఁజాలరు. కనుక నిర్భయుఁడవు కమ్మని సుగ్రీవుని భీతిఁబాప బీరములు పలికెను. అంగుళ్యగ్రమున వారి వధింతుననుటం జేసి శస్త్రాస్త్రాదు లక్కఱలేక వధింతునన్న భావము సూచితము. "కరాంగుళి నఖోత్పన్న నారాయణ దశాకృతిః" అన్న ప్రమాణము లున్నవి కదా. భగవంతునియిచ్ఛయే సకలబ్రహ్మాండముల సృజించుచుండ నీతుచ్ఛరాక్షసుల వధించుట యేపాటిపని? ఇదియు నాత్మస్తుతి కాదనియు, సుగ్రీవమనస్సంశయవిచ్ఛేదనార్థము చెప్పఁబడిన పలుకులని యెఱుంగందగు.

"శ్రూయతే హి కపోతేన శత్రుశ్శరణమాగతః. ౨౮
అర్చితశ్చ యథాన్యాయం స్వైశ్చ మాంసైర్నిమంత్రితః,
సహితం ప్రతిజగ్రాహ భార్యాహర్తారమాగతం. ౨౯
కపోతో వానరశ్రేష్ఠ కింపునర్మద్విధో జనః,

అని మూలము. మున్నొకబోయ చలిచే బాధింపఁబడి యొక వనస్పతి కడకు రాఁగా నందున్న పావుర మాతనికి శీతబాధా నివారణము లోనగుకార్యములచే నుపకార మొనర్చెను. న్యాయమురీతి నతిథిసత్కారముల నొనర్చెను. క్షుద్బాధకలిగిన దని తెలుపఁగాఁ దనమాంసముల నొసంగి సుగతికిం బోయెను.

వాఁడెవఁడని ప్రశ్నింతువో దానికి నుపకారి గాఁడు. ఆ పావురము భార్యను హరించినవాఁడు. అది తెలిసియు ననఁగా వానివలలోఁ జిక్కి తనభార్య యున్నదని యెఱింగియు శరణాగతుఁ డన్న కారణమున నాపక్షి వానిం జేకొని యంతటియుపకార మొనరించినదే. ఇఁక నావంటిమానవుఁ డద్దాని మానినచో వచింపవలసిన దేమి? అని కథాసారము. అతిథిపూజయే గాక శరణాగతునియందుఁగల గుణాగుణములను బరిశీలింపక యాదరింపవలయుననియు, నయ్యది యనంతపుణ్య మొసంగు ననియు నిందలి నీతి. పక్షులకు ధర్మము లెవ్వి? యని ప్రశ్నించిన బదులువచింప వలనుపడదు. సామాన్యధర్మములే యెల్ల ప్రాణుల కుపయోగించుననియే వచింపవలయును. పాపాత్ముల నిల్లు చేర్పరాదనియు, వారి నతిథులనుగా భావింపరాదనియుఁ బ్రమాణములు గలవు. తనకుటుంబమునకు నునుచుకొని మిగిలినదానినే ధర్మము చేయవలయునని మఱికొన్ని ప్రమాణములు తెలుపుచున్నవి. ఇందు ననుష్ఠేయ మెద్ది? అను ప్రశ్నముచేయువా రుండకపోవుదురా? సమాధాన మేమి? ధర్మములు బహువిధములు. అందఱకు నన్నియు ననుష్ఠేయములు గావు. అనఁగా శక్యములు గావని భావము. ఒక్కని కొక్కధర్మమునందే యతిశయప్రీతి యుండును. ఎన్నికష్టములు కలిగినను లెక్కింపక వాఁ డద్దాని నాశ్రయించి వదలక యుండును. దాన శాశ్వతకీర్తి కలుగును. వేఱొకఁ డద్దాని నంగీకరింపక యింక నొకధర్మము నాశ్రయించును. ఇతరధర్మాశ్రయణము వారికి ననువుపడదు. తనశరీరము నిచ్చియైనం బరులను బోషించి యాపదనుండి తప్పించిన ముక్తి కలదన్నదియు

శాస్త్రము. "స్వయం తీర్ణః పరాన్ తారయతి" అన్నదియు శాస్త్రమే. ఆత్మహత్య మహాపాపమన్నదియు శాస్త్రవాక్యే. ఇందొక్కదానికి వేఱొకటి విరోధముగ నుండును. ఎవ్వరి కేది ప్రాక్కర్మానుసారము రుచించునో యది వారి కనుష్ఠేయమని తోఁచు. అతఁ డద్దాని నవలంబించి సాగించును. అతని యితర కార్యము లితరుల కన్యాయ్యములుగఁ దోఁచును. కాని యతఁ డప్పలుకుల లెక్కింపక తనపట్టినపట్టును వదలక యాచరించు చుండును. దాననే పరాత్పరుఁ డానందించి యాతనిశ్రద్ధను మెచ్చి ముక్తి ననుగ్రహించును. కనుక బహుద్వారములగు ధర్మములను సర్వజను లేకరీతి నాచరింపఁజాలరు. ఇతరుల కతని వృత్తి యధర్మముగాఁ దోఁచినను బాధ యుండదు. హరిశ్చంద్రునివర్తనమునందు భార్యావిక్రయణ మశాస్త్రమని యట్టి యధికార మారాజునకు లేదని యాక్షేపింతురు. అందులకుఁ గొన్నిప్రమాణములు చూపుదురు. కాని యామహారాజు సత్యశ్రద్ధచేతను దానినే భగవద్రూపముగా భావించి యారాధించుటం జేసియు శాశ్వతకీర్తియు నిరుపమానపరమ పదము లభించినట్లు పురాణములు వాకొనుచున్నవి. కావున నెవరి కేధర్మమున నిష్టము కలదో వాఁ డద్దానిని మాత్రమే యాశ్రయించి లోపములేకుండ నాచరించిన భగవదనుగ్రహ మునకుఁ బాత్రుఁ డగుననుట సముచితమార్గమనుట నిర్వివాదాంశము.

"ఋషేః కణ్వస్య పుత్రేణ కండునా పరమర్షిణా. ౨౬

శృణు గాథాం పురా గీతాం ధర్మిష్ఠాం సత్యవాదినీం,

బద్ధాంజలిపుటం దీనం యాచంతం శరణాగతం. ౨౭

స హన్యాద్దానృశంస్యార్థమపి శత్రుం పరంతప,
ఆర్తో వా యది వా దృప్తః పరేషాం శరణాగతః. ౨౮
అరిః ప్రాణాన్ పరిత్యజ్య రక్షితవ్యః కృతాత్మనా,"

అని మూలము. ఇందలి నీతిసార మేమి? దీనుఁడై కాని లేక వంచకుఁడై కాని వచ్చి చేతులు జోడించి శరణు వేఁడినయెడల వాఁ డంతకు ముందు శత్రువని మహాపకార మొనర్చెనని తలంచి వానిని వధింపరాదు. తనప్రాణముల నిచ్చియైన వానిం గాపాడవలయును. అట్లు గాపాడువానికే కృతాత్ముఁడను పేరు. సకలశాస్త్రముల నేర్చి ధన్యుఁడగువానికే కృతాత్ముఁ డను నామము కలుగు. అనునదియే యీగాథాసారము. శత్రు వెపుడు శరణాగతుఁ డనఁబడునో యపుడే యతని మిత్రునిగా భావింపవలయును. కుటిలత్వమున నట్లు వచ్చిన నెట్లని యోజింపరాదు. ఆకౌటిల్య మీసంరక్షకుని బాధింపదు. నిర్మలమనస్సే రక్షించును. ధర్మము నాశ్రయించి తోడుసూపి యొకని రక్షించినచో నతఁడు కౌటిల్యమున నపకృతి చేయఁబూనిన నపుడు ధర్మము రక్షింపఁబూనును. అధర్మము కుటిలాత్మునే హింసించును.

"ధర్మ ఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః,
తస్మాద్ధర్మో న హంతవ్యో మా నో ధర్మో హతోఽవధీత్. ౧౪
వృషో హి భగవాన్ ధర్మస్తస్య యః కురుతే హ్యలం,
వృషలం తం విదుర్దేవాస్తస్మాద్ధర్మం న లోపయేత్. ౧౬
ఏకఏవ సుహృద్ధర్మో నిధనేఽప్యనుయాతి యః,
శరీరేణ సమం నాశం సర్వమన్యద్ధి గచ్ఛతి." ౧౭

అధ్యాయము ౮.

"ధర్మం శనైస్సంచినుయాద్వల్మీకమివ పుత్తికాః,
పరలోకసహాయార్థం సర్వభూతాన్యపీడయన్." ౨౩ రా-
అధ్యాయము ౪.

"శరణాగతం పరిత్యజ్య వేదం విప్లావ్య చ ద్విజః,
సంవత్సరం యవాహారస్తత్పాపమపసేధతి." ౧౯ రా-
మను. ౧౧ అధ్యా.

"ధరతిలోకాన్ ధ్రియతేపుణ్యాత్మభిరితిధర్మః." అని వ్యుత్పత్తి. ఈ ప్రమాణముల నాలోచించిన శరణాగతరక్షణ రూపధర్మ మాతనిం గాపాడంజాలును. దుష్టుఁడై శరణాగతి నని నటించి నచో వాని నాతని యధర్మమే హింసించును. కనుకఁ బురుష ప్రయత్న మక్కఱలేకయే యట్టిపాపులు నశింతురు. తన ప్రాణ ముల నిచ్చియైన రక్షింపఁ దగుననఁగా భావమేమి? తన ప్రాణ ములనిచ్చి తాను వాని రక్షించుటెట్లు? అనఁగాఁ దనప్రాణ ముల కేదే నపాయ మాతనివలనఁగాని వాని వంశజులవలనఁ గాని కలుగునని యనుమానింపక వానిని రక్షింపవలయునని యీ వాక్యభావసారము వంచనాధికత నాశ్రయించి నమ్మించి రక్షించినవానిని హింసింపఁ బూనినపాపాత్ముని నతనిపాపమే నశింపఁజేయును. కావున శరణాగతుఁ డెట్టివాఁడని పరీక్షింప నక్కఱలేదని శ్రీరాము నుపదేశముగా మన కీగాథనుండి గ్రహింపందగును.

"స చేద్భయాద్వా మోహాద్వా కామాద్వాపి న రక్షతి. ౨౯
స్వయా శక్త్యా యథాసత్వం తత్పాపం లోకగర్హితం,
వినష్టః పశ్యతస్తస్యారక్షిణశ్శరణాగతః. ౩౦.

ఆదాయ సుకృతం తస్య సర్వం గచ్ఛేదరక్షితః,
ఏవం దోషో మహానత్ర ప్రపన్నానామరక్షణే. 31
అస్వర్గ్యం చాయశస్యం చ బలవీర్యవినాశనం,
కరిష్యామి యథార్థం తు కండోర్వచనముత్తమం. 32
ధర్మిష్ఠం చ యశస్యం చ స్వర్గ్యం స్యాత్తు ఫలోదయం,"

అని మూలము. శక్తి కలిగియు నేదో యొకనెపము పెట్టి రక్షింపక పోయినచో వాఁడు రక్షకుఁ డుండియు మృతినొంది శక్తుఁ డయ్యును రక్షింపనివాని సుకృతమునెల్లఁ దాను గైకొని పుణ్యలోకములకుం బోవును. రక్షింపక యుపేక్షించినవాఁడు యశస్సును బోఁగొట్టుకొని పుణ్యలోకములకు దూరుఁడై బల పరాక్రమములు తన్ను వదలఁగా నశించును. కావునఁ గండు మునివచనమును యథార్థముగ నొనరించెదను. అదియే సకల శుభముల నొసంగును. ఇంతటివిన యోక్తిక దంబమేల? మాట తప్పను. రక్షింతును అనరాదా యందురేని శ్రీరామునిమతము సర్వసమ్మతముగనే యుండఁజను. కాననే రామనామము సార్థక మయ్యెను. ప్రియోక్తులు కార్యఫలసిద్ధిక్షమములు. అప్రియోక్తులు సత్యయుతములైనను ఫలసిద్ధి నొసంగం జాలవు. లక్ష్యలక్షణపురస్సరముగాఁ దెలిపి యతని నంగీకరింపఁ జేసి యతనిమూలముననే విభీషణుని రావించి రక్షింపవలయు ననియే శ్రీరాము నాశయమని మన మూహింపవలయును. మఱియును శిష్యునకుఁగల సందేహముల నన్నింటి నుదాహరణ పూర్వకముగా శాస్త్రయుక్తముగా నివర్తింపఁజేసి యతని చిత్తవృత్తిని బాగుచేయఁగలమంత్రము నుపదేశింపవలయును. "రాజ్యం దేయం శిరో దేయం న దేయా షోడశాక్షరీ" అని

యున్నది కదా. ప్రాణమువంటి మంత్రమైనను సత్పాత్రమున. కేవలయుననియు, దాన నాతఁడు శుద్ధుఁడగుననియు నీభాగము నుండి ధ్వనించుచున్నది.

> "సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే. 33
> అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ,"

అని మూలము. స్వమనస్సిద్ధాంతమును శ్రీరామచంద్రుఁడు తేట. తెల్లముగఁ జాటుచున్నాఁడు. దీనుఁడను. నీవాఁడఁ జొచ్చితిని. అని యొక్కసారి నన్ను యాచించు నేనాతనికి సకల భూతములనుండి యభయము నిచ్చుచున్నాను. ఇదియే నా వ్రతము. ఏప్రాణి నాతత్త్వమెఱిఁగి దీనుఁడను. నీ వాపద్రక్షకుఁడవు. నిన్నే శరణంటిని. ఇఁక నారక్షణము నీభారము. రక్షకుఁడు వేఱొకఁడు నాకు లేఁడు. అని యెవ్వఁడొక్కసారి. యాచించునో అనఁగా భగవంతు నాశ్రయించినఁ దద్భిన్న భూతమే లేదు గాన నాశ్రయింపఁదగినవాఁ డొక్కభగవంతుఁడే యనుభావము గల్గిన నని భావము. వాని కేభూతముల నుండి భయము లేకయుండ రక్షింతును. ఇదియే నాకుఁ గల వ్రతమని శ్రీరాముఁడు చెప్పెను. శ్రీరామావతారమునకుఁ బ్రధానఫల మిదియే యని పెద్ద లందురు.

> "అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
> తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం. ౨౨
> మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
> మామేవైష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః. 34"

అన్న భగవద్గీతావాక్యములకు నిదాన మీశ్రీరామవాక్యము.

గాక మఱేమి గలదు? ఈరెండును భగవద్వాక్యములే. పౌర్వాపరవిచార మేల? ఈభావ మనాది యనవచ్చును. దుఃఖాకులుఁ డగుశిష్యు నభయప్రదానమున సద్గురువు రక్షించును. దుష్టగురువు తద్ధనాదికమును భక్షించును. భగవంతుఁడే సద్గురువు గదా. అట్టిభగవంతుని మహావిపత్పరంపర లలము కొనఁగా నాశ్రయించిన నా కరుణాశరధియే యుద్ధరించునను భావముగలిగి మనము వర్తింపవలయునని యీభాగమునుండి నేర్చుకొనవలయును.

> "ఆనయైనం హరిశ్రేష్ఠ దత్తమస్యాభయం మయా. 38
> విభీషణో వా సుగ్రీవ యది వా రావణస్స్వయం,"

అని మూలము. వేఱొకరిమూలమున నాశరణాగతుని బిలిపించిన సుగ్రీవునకుఁ గలయజ్ఞానము పోదనియుఁ దనవాక్కుల నాలకించినవెనుకఁ దనయాశ్రితుల కజ్ఞానము నిలువ రాదనియుఁ దలంచి యాజ్ఞాపించుచున్నాఁడు. హరిశ్రేష్ఠా! యని శ్రీరాముఁడు సంబోధించుచున్నాఁడు. చంచలాత్మకులలో మేటి వనుభావ మిట సూచితము. అట్టి నీవే పోయి యాతని పిలుచుకొని రమ్ము. తోడుకొనిరమ్మని యాజ్ఞ. వెంట నాతఁ డుండవలయునని భావము. మరల నేమైన మాటలాడు నేమో యని పలుకుచున్నాఁడు. వచ్చినవాఁడుగాని లేక రావణుఁడే రానీ పిలుచుకొని రమ్ము. అభయ మీఁబడినది. అడిగినవెంటనే యిచ్చినట్లే భావింపుమని తాత్పర్యము. శరణు చొచ్చినవానిని విడనాడుట యనునదియే యుండదని నమ్ముమని సూచింపఁబడినది.

శ్రీరాముని సువ్రతము లివి. శరణాగతరక్షణము. ఏక పత్నీవ్రతపరాయణత్వము. ధర్మసంరక్షణము పితృనానతి మెయి మెలఁగుట. సత్యవాక్యము. ప్రజానురంజనప్రవర్తనము. ఇవి ముఖ్యము లనవచ్చును సకలసద్గుణములు గలిగినపు డివి యన నేల? అనరాదు. శ్రీరామావతారమునకు ముందివి నశింపనుం డెను. వాని నుద్ధరించి ప్రజల మంచిమార్గమున నడిపించుటకై యవతరించెనని పెద్దల యూహ. అది పొరపా టెట్టులగును?

> "కిమత్ర చిత్రం ధర్మజ్ఞ లోకనాథ సుఖావహ. 3౬
> యత్త్వమార్యం ప్రభాషేథాస్సత్త్వవాన్ సత్పథేస్థితః,
> మమ చాప్యంతరాత్మాయం శుద్ధం వేత్తి విభీషణం. 3౭
> అనుమానాచ్చ భావాచ్చ సర్వతస్సుపరీక్షితః,
> తస్మాత్క్షిప్రం సహాస్మాభిస్తుల్యో భవతు రాఘవ. 3౮
> విభీషణో మహాప్రాజ్ఞస్సఖిత్వం చాభ్యుపైతు వః,"

అని మూలము. శ్రీరామునిసువ్రతము నాలకింపఁగనే సుగ్రీవునిభావము మార్పునొంది రజస్తమోగుణములు తగ్గి సత్వ గుణము పైకొనఁగా మనస్సు నిర్మలమయ్యెను. అత్తఱి విభీష ణుఁడు మహాప్రాజ్ఞుఁడనియు, సహవాసమునకు నర్హుఁడనియుఁ దోఁచెను. అదియే భగవత్సంగతికిఁ దగినఫలము. ఇంతదనుక సంగతి కలదు కదా. అప్పుడేటి కది కలుగ రాదనుశంక కలుగును. కాని సుసమయము కర్మసంగతి వచ్చినఁగాని యుపదేశింప వలనుపడదు. శిష్యచిత్తము పరిపక్వము కాఁగా గురువు మంత్ర రహస్యముల నుపదేశించును. అట్లే లోకగురువగు పరాత్పరుఁడు శ్రీరామచంద్రుఁడు శరణాగతరక్షణ మత్యుత్తమధర్మ మని తెలుపుచు దానిఫలము తేటపఱచి యదియే తనవ్రతమని

తెలియంజెప్పి శత్రువును గరుణించుమార్గము తెల్పెను. నిర్వై రత్వము పాదుకొన బోధించెను తదుపదేశమున నిర్మలాంతః కరణుఁడై సాధుసంగతిఫల మనుభవించెను.

"సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే,
అవిభక్తం విభక్తేషు తద్జ్ఞానం విద్ధి సాత్త్వికం."

అను నీగీతావాక్యమురీతి సాత్త్వికజ్ఞానవంతుఁ డయ్యెను. అది కుదురుచో నిర్వైరత్వము స్వతస్సిద్ధముగనే లభించును గదా. భగవదనుగ్రహ మిదియే. ఈభాగమున నధ్యాత్మరామాయణ మున విశేషములు లేవు. కావునఁ దర్వాతికథను బఠింపఁ గడంగుదుము.

## శ్రీరాముఁడు విభీషణుని లంకకుఁ బ్రభు వొనర్చుట.

* శ్రీరాఘవుఁ డభయమొసంగ మహాప్రాజ్ఞుఁడగు విభీషణుఁడు వాంఛాసిద్ధి కలిగినందులకు సంతుష్టుఁడై తన యందు భక్తిగల యనుచరులం గూడి పూర్వకాయమును మిక్కిలి వినయమున వంచి రాముని బరివేష్టించియుండు బల ములనడుమ తనకుగా నేర్పఱచినచోటునుజూచుచు నాకసము నుండి క్రిందికిం దిగెను. శరణాగతి రూపధర్మమున నిచ్చలు స్థిరతంగాంచిన యవ్విభీషణుఁడు శరణు గోరి యనుచరులతో రాముని చరణముల వ్రాలెను. ఆసభయందు విభీషణుఁడు శరణ్యుఁడగు శ్రీరామునే చక్కఁగాఁ బరికించి ధర్మయుక్తము యుక్తము హర్షదమునగు వాగ్వైతతితో నిట్లనియె. శ్రీ

* ఇది పందొమ్మిదవ సర్గమునఁ గలదు.

రామా! నేను రావణానుజుఁడను. ఆతఁడు నన్నవమానించి నాఁడు. కనుక సకల భూతరక్షకుఁడవగు నిన్ను శరణుచొచ్చి తిని. నేను నివాసభూతమగు లంకను మిత్రులను ధనములను వదలి నీవే గతియని వచ్చితిని. ఇఁక నారాజ్యము జీవితము సుఖములు నీయధీనములు.

విభీషణుఁ డిట్లు పలికిన మాటలు విని శరణన్నపుడే నిన్నుఁ బరిగ్రహింపవలయును. అట్లు సేయక యింతదనుక జాగు చేసినందులకు మన్నింపుము. అని మృదువాక్కుల నూఱడించి యతనిమనస్సు చల్లఁబఱచి యత్యాదరమున నాతనినే చూచుచు నాకు రాక్షసులబలాబలముల నున్నట్టు లెఱింగింపు మని యడిగెను. విభీషణుఁడు రావణబలము చెప్పఁ దొడంగి యిట్లనిగెు. రావణుఁడు బ్రహ్మవలన వరములం బడయుటం జేసి నిర్జరాదు లతని వధింప శక్యము కాదు. కుంభకర్ణుఁ డను బలశాలి తమ్ముఁ డతనికిం గలఁడు. అతఁడు నా కన్నయే. రావణునిసేనాపతి. ప్రహస్తుఁడు కైలాసమున సాగినయుద్ధమున మాణిభద్రుని జయించినవాఁడు. ఆతనివార్త హనుమంతుని వలన వినియే యుందువు. రావణునితనయుఁ డింద్రజిత్తు శర సంధాన కుశలుఁడు. ధనుర్బాణములం దాల్చి యుద్ధమున నిలిచిన నదృశ్యుఁడయి యుండును. అగ్ని నారాధించి హోమ మున సంతృప్తునిగాఁ జేసి తత్సమయమునఁ బన్నియుండు వ్యూహములయందు నాయగ్నిమాహాత్మ్యమువలన శత్రువు లకుం గానరాకయే వారిం జంపును. మహోదరమహాపార్శ్వు లిరువురు సేనాధిపతులు. లోకపాలతుల్యులు. లంకయందు

మహాబలవంతులు పెక్కండ్రు గలరు. రావణుఁ డింద్రాదిదేవతల నోర్చియున్నాఁడు.

శ్రీరాముఁ డాతనినుడుల విని మనంబునఁ జక్క నాలోచించి విభీషణా! రావణుఁ డేయే మహాకార్యములు పరాక్రమమునఁ జేసినట్లు చెప్పితివో వానినెల్ల నే లెక్కపెట్టను. నేను రావణాదుల వధించి నిన్ను రాజుగాఁ జేసెదను. సత్యముగా నీకు నిది తెలుపుచున్నాను. హాస్యమునకుఁ గాదు సుమా! రావణుఁడు భూవివరపాతాళములను జొచ్చినను, బ్రహ్మలోకమునకుఁ బోయినను, బ్రాణములతో నన్నుఁ దప్పించుకొని పోవఁజాలఁడు. నేను సపుత్త్రబాంధవముగా నాతని వధింపక యయోధ్యం బ్రవేశింపను. అని సుప్రసిద్ధులగు నా మూవురు సోదరులపై నొట్టుపెట్టుచున్నాను. అని శ్రీరాముఁడు పలుకఁగా నాలకించి విభీషణుఁడు శిరస్సు వంచి మ్రొక్కి పలుకఁ దొడంగెను. మహాత్మా! రాక్షసవధమునకు నీవు కడంగఁగా నేను దోడుపడియెదను. లంకానగరమును నాబలము కల్గినంత దనుక ముట్టడించెదను. శత్రుసేనల నెదిరించి పోరెదను. అనుచుండునంత శ్రీరామమూర్తి యాతనిఁ గౌఁగిటం జేర్చి సంతుష్టుఁడై సౌమిత్రిం గాంచి సముద్రజలముం దెమ్ము. దానిచే మహాప్రాజ్ఞుఁడగు నీవిభీషణుని రాక్షసరాజుగా నాతఁ డాశింపకపోయినను నాకే చేయవలయునని ప్రసాదము గల్గినది. కాన నభిషేకింపుము. నే ననుగ్రహింపఁగా దానికి నుచితములగు ఫలములఁ గల్పించువాఁడవు నీవే కదా. అని యాజ్ఞాపింపఁగా నాలక్ష్మణుఁడు వానరేంద్రులనడుమ విభీషణుని రాక్ష

సేంద్రునిగా నభిషేకించెను. దానిం జూచి వానరులెల్లఁ బరమానందమున శ్రీరాముని కార్యమును బ్రశంసించిరి.

అంతట నిష్టాగోష్ఠిప్రసంగములు సాగెను. ఒకప్పుడు సుగ్రీవుఁడు హనుమంతుఁడు విభీషణునిం గని సాగరమును దాఁటుదమన్న నెట్లును దరముగాకున్నది. అది వరుణదేవునకాలయము. మన మీసేనలతో దీని నెట్లు దాఁటఁగలము? ఆయుపాయ మింతదనుక మాకుం దోఁపలేదు. నీవే యోజించి వచింపవలయునని యడిగిరి. వారిమాటల నాలకించి యిట్లనియె. రాఘవుఁడు సాగరమును శరణు చొరవలయును. ఈజలరాశి శ్రీరాముని కూటస్థుఁడగు సగరుపుత్త్రులచేఁ ద్రవ్వఁబడి విస్తరింపఁజేయఁబడినవాఁడు. కావున నతఁ డాయుపకారమును బెద్దదిగా బుద్ధిం దలంచి శరణము నొకనెపముగా దానికిఁ బ్రతిగా రామకార్యమని తెలిసికొని తప్పక చేయును. ఇట్లు యుక్తియుక్తముగాఁ బల్కిన విభీషణునిసుడుల విని సుగ్రీవుఁడు రామలక్ష్మణు లున్నచోటి కరుదెంచి విభీషణునాశయముఁ దెల్పఁగా రాముఁడు ధర్మజ్ఞుఁడు కాన నందులకు సమ్మతించెను. తనయంతటఁ దానే యెట్టికార్యమునైనఁ జేయ సమర్థుఁడయ్యును రాముఁడు సుగ్రీవవిభీషణుల మాటలను గౌరవింపఁ దలంచి లక్ష్మణాదులం గని నవ్వుచు సౌమిత్రీ! యీ యాలోచనము నాకు సమ్మతముగానే యున్నది. మీకిరువురకు నిది యిష్టమగునేని తెల్పుఁడు. సుగ్రీవుఁడు సమర్థుఁడు. నీవును మంత్రరహస్యదక్షుఁడవు మీ కిరువుర కేది యిష్టమో దానిని దెల్పుఁడు. అని శ్రీరాముఁ డడుగఁగా వా రిరువురు నంజలిబంధముల మహాత్మా! వేఱొకయుపాయము తోఁపని యీ

కాలమున విభీషణుఁడు సులభముగాఁ గార్యము సాధించు నట్లు తెల్పిన యీయుపాయము మాకెందులకు సమ్మతము కాదు ? భయంకరాకారముఁగల యీసాగరమునకు సేతువు గట్టక దేవేంద్రాదులకుంగూడ లంకంజేర శక్యము కాదు. మన మాట యిఁక నేటికి? మంత్రవిద్వరుఁడగు విభీషణునిహితము యథార్థమే కావున నట్లు చేయుదము. ఆలస్యము వలదు. మనము సేనలతో లంకానగరము చేరునట్లు సాగరమును బ్రార్థింపుఁడు. అని వారు పలుకఁగా నట్లే చేయ సమ్మతించి నదీ నేతయగు సాగరతీరమునొడ్డున దర్భలు పఱచి దానిమీఁద వేదికయం దగ్నివలె శయనించెను.

మహామతులారా! యిందుఁ గలవిశేషముల నెఱుకుదము.

"ఖాత్పపాతావనీం హృష్టో భక్తైరనుచరైస్సహ,
స తు రామస్య ధర్మాత్మా నిపపాత విభీషణః.
పాదయోశ్శరణాన్వేషీ చతుర్భిస్సహ రాక్షసైః,"

అని మూలము. భక్తైః = సేవాకాంక్షులు, అనుచరైస్సహ= కూడనుండువారు నగురక్కసులతో నంబరమునుండి భూమిని జూచుచు వార్షించి రామసన్నిధిఁ జేరెనని యర్థము. మహా కార్యమును సాధింపఁ బూనునపుడు కూడ నుండువారు స్వకర్మానురూపకర్మములు గలవారు కావలయును. లేనిచో నాఫలము చేకూరదు. కనుకనే భక్తులు నలువు రనుచరులు విభీషణునివెంట నుండిరని యేర్పడును. సత్సంగతి గలిగినఁగాని సాధుసందర్శన మొదవదను సూక్తికిది యుదాహరణము. భగ

వంతుని శరణు వేఁడునపు డహంకారమమకారాదు లుండ రాదు. అవి యుండిన నది లభింపదు. పరమేశ్వరుఁ డవకాశ మును గల్పింపఁడు. కావుననే సత్కర్మనిరతులు సద్భావయు తులు నగురక్కసులతో విభీషణుఁడు వచ్చి శ్రీరామునిసన్ని ధిని భూమిం జేరెనని మహర్షి మనకుం దెల్పెను. ధర్మమెఱిం గినవాఁడు కావున శరణమును గోరుచుఁ బ్రపన్నపారిజాతమగు శ్రీరామచంద్రునిపాదములపైఁ బ్రాలెనని యర్థము.

"ఊర్ధ్వం ప్రాణా హ్యుత్క్రామంతి యూనస్థ్సవిర ఆయతి,
ప్రత్యుత్థానాభివాదాభ్యాం పునస్తాన్ ప్రతిపద్యతే. ౧౨౦
అభివాదనశీలస్య నిత్యం వృద్ధోపసేవినః,
చత్వారి తస్య వర్ధంతే ఆయుర్విద్యా యశో బలం." ౧౨౧
మను. ౨ అధ్యాయము.

పెద్దలకు నభివాదనము చేయుట ఆత్మలాభమునకే కాని వేఱుగాదని దీనిభావము. ఇఁక భగవత్పాదపద్మములకు నమ స్కరించినచో ఫలమిది చెప్పవలయునా?

"త్వదన్యః పాణిభ్యామభయవరదో దైవతగణ
స్త్వమేకా నైవాసి ప్రకటితవరాభీత్యభినయా
భయాత్త్రాతుం దాతుం ఫలమపి చ వాంఛాసమధికం
శరణ్యే లోకానాం తవ హి చరణావేవ నిపుణౌ." ౪

అని శ్రీశంకరభగవత్పాదాచార్యులుగారు ప్రతిపాదించిరి. భయమునుండి కాపాడుటకు వాంఛాసమధికఫలము నొసంగు టకుఁ బాదపద్మములే రక్షకములు. కనుకనే విభీషణుఁడు

భయమునుండి కాపాడి నన్నుద్ధరింపుమా యని వ్రాలెనని గ్రహింపవలయును.

"భవంతం సర్వభూతానాం శరణ్యం శరణాగతః,
పరిత్యక్తా మయా లంకా మిత్రాణి చ ధనాని వై. ౫
భవద్గతం మే రాజ్యం చ జీవితం చ సుఖాని చ."

అని మూలము. సర్వభూతశరణ్యుఁడవగు నిన్ననఁగా భగవంతు ననియే కదా యర్థము. భగవంతు నాశ్రయించువాఁడు,

"తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే,
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః."

అన్నవాఁడు కావలయును గాన సర్వము వదలితినని తెల్పెను. నా జీవరాజ్యసుఖములన్నియు నీ యధీనములు. అనఁగా నేయే ఫలములు నాకర్మఫలములుగాఁ బ్రసాదింపఁ దగునో వాని నొసంగునధికారము నీకే కాని నాకుఁ గోరునధికారము కూడ లేదని విన్నవించెను అనఁగా నాయోగక్షేమములు భవదధీనములనియు మిమ్ముఁ దప్ప నొరు నెఱుంగననియు సారము. దీనికే నద్వైతభక్తి యని పేరు. సమస్తము నీవే. రెండవది లేదని కదా తాత్పర్యము సర్వము శిష్యుఁ డాచార్యునకు సమర్పించి చేతులు జోడించి శరణు చొరవలయుననియు నా శిష్యుని ముక్తు నాతఁడు చేయుననియు నాచార్యుని నమ్మక భగవంతునే నమ్మినఁ గర్మమునఁ బడఁద్రోయుననియు నాచార్యుని నమ్మినఁ దరింపఁజేయుననియుఁ గావున నున్న ధనమంతయు నాచార్యుని వశముచేసి కౌపీనధారియై నిలుచుండినయెడల నాధనము వ్యయించి భార్యకు భూషణములను జేయించి

యామె సంతోషింపఁగా నీఁక దెబ్బలు తప్పినవని సంతోషించి యాయాచార్యుఁడు సర్వస్వమును బోఁగొట్టుకొని పంగనామములుంచుకొన్న దాసుని ముక్తిమంటపసోపానముల నెక్కించి తాను భార్యను సేవింప మరలునని కొందఱు వైష్ణవశిఖామణులు పలుకుదురు. కాని యంతకన్నఁ దులువలపలుకులు లేవని నమ్మి యట్టివారిని దగ్గరఁ జేరనీయక శిష్యహృత్తాపహారకులగు సద్గురువుల నాశ్రయించి భగవంతు నారాధించు పద్ధతుల నెఱింగి యారీతిగా పరాత్పరు నారాధించి తరింపవలయుఁగాని యీదాసరుల నాశ్రయించినఁ గలుగునది ధనముక్తియే కాని వేఱొకఁ డుండదు.

> "విభీషణవచశ్శ్రుత్వా రామో దృఢపరాక్రమః,
> అన్వీక్ష్య మనసా సర్వమిదం వచనమబ్రవీత్. ౧౭
> యాని కర్మాపదానాని రావణస్య విభీషణ,
> ఆఖ్యాతాని చ తత్త్వేన హ్యవగచ్ఛామి తాన్యహం. ౧౮
> అహం హత్వా దశగ్రీవం సప్రహస్తం సబాంధవం,
> రాజానం త్వాం కరిష్యామి సత్యమేతద్బ్రవీమి తే. ౧౯
> రసాతలం వా ప్రవిశేత్పాతాలం వాపి రావణః,
> పితామహసకాశం వా న మే జీవన్ విమోక్ష్యతే. ౨౦
> అహత్వా రావణం సంఖ్యే సపుత్త్రబలబాంధవం,
> అయోధ్యాం న ప్రవేక్ష్యామి త్రిభిస్తైర్భ్రాతృభిశ్శపే." ౨౧

అని మూలము. లంకలోని రాక్షసులబలములు వీరుల సంఖ్యయు విభీషణుఁడు దాఁపక తెలుపఁగా విని రాముఁడు పలికినమాట లివి. ఈఘట్టమునందు మహర్షి భగవత్తత్త్వమును దెల్లముచేసెను. అన్వీక్ష్య మనసా సర్వమ్=సర్వం వృత్తం

మనసా అన్వీక్ష్య. ఏది యెట్లు జరగునది అనఁగా నెవ రెవరి చేత నేయే రాక్షసుఁ డేయేదినమున నెచ్చోట నేరీతి మృతి నొందునదియుఁ బరికించి యని యర్థము. పిదప నిట్లు పలికెను. ఇంతయర్థ మిందుఁ గలదా యని ప్రశ్నింతురేమో. పదునెనిమి దవశ్లోకార్థముం బరికింపుఁడు. రావణుం డొనరించిన శౌర్య కార్యములనన్నింటిని నెఱుంగుదును. అనఁగా భావ మేమి? నీవు దాఁపక తెలుపుదువో లేదో యని పరికించితినిగాని నే నెఱుంగనివే లేవని కదా దాని తాత్పర్యము. సర్వజ్ఞత్వము నీమాట తేటపఱుపదా! ఇతరు ల ట్లనఁగలరా? సబంధుపుత్త్ర మిత్త్రయుతముగా రావణుని వధించి లంకకు నిన్ను రాజు నొనరింతును సూనృత మిది, అనెను. విభీషణుఁ డాశింపలేదు. శ్రీరాముఁ డేల యిట్లు సూనృతమని వచించెను. రావణుఁడు శర ణాగతుఁడు కాఁడనియు నాతఁడు నాచే మృతినే కోరియున్న వాఁడనియు నాతనివారు హతులగుదురనియు నెఱింగియే కదా సత్యముగా నిట్లు చేయుదునని చెప్పెను. ఈరీతిగా నన్యుఁ డెవఁడుగాని వచింప సాహసింపఁడు. ఇంతకుముందు "విభీషణో వా సుగ్రీవ యది వా రావణస్స్వయమ్" అని తెలిపిన రాముఁడే సత్యముగా నిట్లు చేయుదునని యేల తెల్పెననఁగా వారెల్ల నని మొనఁ బడుదురనియే కాని యందు నొకఁడైనను దన్ను శరణుగోరునని కాని జీవించునని కాని యనుమానింపకయే యున్నదున్నట్లు తెల్పెనని మన మెఱుంగందగు. ఏలోకము నకుఁ బోయినను దుదకు వరములిచ్చిన బ్రహ్మకడకరిగినను బోనీక వధింతునని చెప్పుట న్యాయవిరుద్ధము కదా. పాఱి పోయినవాని వధించుట రాజధర్మమా. ఎట్లు రాముఁ డిట్లు

పలికెనని ప్రశ్నింతురేమో. అస్మదాదులవలెఁగాక రాముఁడు పరాత్పరుఁ డగుటంజేసి రావణప్రవృత్తి నెఱుంగుం గావునను భక్తుఁడై తనచేఁ జావ వరముగొనియుండు రావణుని వధింతు ననుటలో. తప్పేమి యున్నదో యెఱుంగఁజాలకయున్నాను. ఈలోకములమాట యేటి కందురేమో. విభీషణునకు రావణునివంక భయము గలుగక ధైర్యము కుదురుపడుటకని గ్రహింపవలయును. ఈ కార్యములు చేయక యయోధ్యం బ్రవేశింపనని సోదరులపై నొట్టుపెట్టుచున్నాననఁగా మూఁటికి ముమ్మాటికి నమ్ముమనిగాని వేఱుగాదు. ఈఘట్టము సగుణ బ్రహ్మము కాన శ్రీరాముఁడు భావికార్యములనెల్ల విభీషణునకుఁ గరతలామలకములుగాఁ జెప్పనెంచి తేటపఱచెననియు నవి యించుకంతయుఁ దప్పక సాగెనుగాన సర్వజ్ఞత్వము నే మనము నమ్మవలయుననియుఁ దెలుపుచున్నది. పరాపరరహస్య యోగిని పరదేవి శ్రీరాముని రూపవంతునిగా నొనరించి సర్వ కార్యముల నానెపమునఁ దా నొనరించుచుండ నంపోకఁడు తప్పెననుటకంటెఁ దెలివితక్కువ వేఱుగా నుండునా?

"అబ్రవీల్లక్ష్మణం ప్రీతస్సముద్రాజ్జలమానయ. ౨౮
తేన చేమం మహాప్రాజ్ఞమభిషించ విభీషణం,
రాజానం రక్షసాం క్షిప్రం ప్రసన్నే మయి మానద." ౨౯

సాగరజలములం దెప్పించి రాక్షసులకు రాజుగా విభీషణు నభిషేకింపుము. ఆతఁడు మహాప్రాజ్ఞుఁడు. ప్రసన్నుఁడనై యున్నాను. మర్యాదల నెఱుంగుదువు. అనఁగా భావమేమి? ఈతనికి రాజ్యము రానైయున్నది. ఇపుడే యభిషేకింపుము. నేనందులకుఁ బ్రసన్నుఁడనై యున్నాను. అనఁగా నితఁ

డెప్పటికి సర్వప్రకారముల నర్హుఁడని యెఱుంగుదును. నీవు మర్యాదాభిజ్ఞుఁడవు కదా. కనుక నిపుడే యభిషేకింపుమని భావము. రాజ్యలక్ష్మి విభీషణునొందఁ నాశించుచున్నది. రావణుని వదలలేదు. రావణవధానంతర మిప్పనిచేయ నర్హము గాదు. భావిఫలముల సర్వజ్ఞుఁ డెఱుంగును గదా. ఆముహూర్తమున విభీషణు నదృష్టరూపమున లక్ష్మి యావేశించెను. దాని నితరు లెఱుంగరు భగవంతుఁ డెఱింగెను. అదృష్టము దురదృష్టము. ప్రవేశించుకాల మెఱుకపడదు. అది మహర్షులు జ్ఞానదృష్టి నెఱుంగఁగలరు. ప్రవేశించినతోడనే దానిచిహ్నము లాతనియం దగపడును. వానిని గుఱుతించుట యెల్లవారలకు శక్యమగుపని కాదు. ముఖవికాసాదులు భావములు మార్పు నొందును. సూక్ష్మదృష్టి కవి గోచరించును. యోగులకవి సులభములే కాని యితరులకు దుర్లభములు. కనుక సర్వజ్ఞుఁడగు శ్రీరాముఁ డావిధ మెఱింగి లక్ష్మణుని నభిషేకింపుమని పలికెనని మన మెఱుంగందగు.

> "సముద్రం రాఘవో రాజా శరణం గంతుమర్హతి,
> ఖానితస్సగరేణాయమప్రమేయో మహోదధిః. 3౧
> కర్తుమర్హతి రామస్య జ్ఞాత్వా కార్యం మహామతిః,"

అని మూలము. విభీషణునిమూలమున మహాప్రకృతి యుపాయమును సూచించుచున్నది. ఇందు సార మేమిగలదు? రఘువంశజనితుఁడగు నీరాముఁడు సముద్రుని శరణు వేఁడవలయును. ఏలయనఁగా నీరాజునకుఁ బూర్వుఁడగు సగరునికొడుకులు సముద్రమును విస్తరింపఁజేసిరి. ఆమేలు మదినిడుకొని కృతజ్ఞత చూపవలయును గదా. ఆతఁ డట్లే చేయును. అని విభీషణు

నాశయము. భగవంతుఁడు శరణు చొరవలయునా? సర్వేశర ణ్యుఁడు కదా. ఏల యిట్లు చేయవలయును? అని ప్రశ్నములు. సమాధాన మిట్లు.

"యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే. ౨౧.
ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహం,
సంకరస్య చ కర్తా స్యాముపహన్యామిమాః ప్రజాః." ౨౩

అను గీతావాక్యములు శరణములు. వీనిభావమే రాముని కార్యమని మన మెఱుంగవలయు. లోకమున నెవ్వారుగాని సకలకార్యములు చేయఁగలమని తలంపరాదు. మహాకార్యము సంభవింపఁగాఁ దగినవారిసాయము కోరవలయును. అట్లు కోర కుండుట యహంకారమే యగును. కావున నీసాయము కావ లయునని యితరులఁ గోరవలయును. దాన మదినలముకొన్న గర్వము కొంత తగ్గును. అన్యసహాయము కోరుట యనఁగాఁ దనకంటె నొకకార్యమందైన నధికుఁ డున్నాఁడని తలంచుట కదా. అదియే శరణాగతి. శరణు వేఁడఁగానే నీకంటెరక్షకుఁడు నాకింకొకఁడు లేఁడనియే కదా. ఇది మంచియాచారము. దీని నవలంబించువారు బాగుపడుదురు. సర్వకార్యనిర్వాహణశక్తి నాకే కలదనువారు చెడుదురు. శ్రీరాముఁ డట్టిసదాచార మును లోకులకుఁ దన ప్రవృత్తివలనఁ దెలుపుటకై శరణా గతుఁడై సముద్రునిఁ బ్రార్థించెను. మఱియుఁ గృతజ్ఞుఁడు కావలయునన్నందులకు నిది యుదాహరణము. సగరపుత్త్రులు కారణాంతరమున సముద్రమును వృద్ధిచేసిరి. నాటంగోలె సాగరమనుపేరు గలిగెను. హనుమద్గమనమున సాగరము

శ్రీరాముకార్యమునకుఁ దోడుపడియెను గదా. ఇపుడు కూడ శ్రీరాముఁడు తన్నుఁ దోడుపడ వేఁడఁగాఁ దప్పక తోడుపడు నని విభీషణునాశయము. ఎంతటివాఁడైనఁ దనకుఁ జేసినమేలు మఱువరాదనియు నయ్యదియే తనవృద్ధికిఁ గారణమనియు దీని సారము. ఇట్టు లీఘట్టమునుండి సారద్వయమును గ్రహించి యవ్వాని నాచరణమునందుఁ బెట్టుకొనఁ బ్రయత్నింపవల యును.

> "ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః,
> అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్."

అను భగవద్గీతావాక్య మిట సంస్మర్తవ్యము.

> "విభీషణస్య మన్త్రోఽయం మమ లక్ష్మణ రోచతే,
> బ్రూహి త్వం సహ సుగ్రీవస్తవాపి యది రోచతే. 38
> సుగ్రీవః పండితో నిత్యం భవాన్ మన్త్రవిచక్షణః,
> ఉభాభ్యాం సంప్రధార్యార్థం రోచతే యత్తదుచ్యతామ్. 39
> ... ... ... ...
> విభీషణేన యచ్చోక్తమస్మిన్ కాలే సుఖావహం. 39
> అబధ్వా సాగరే సేతుం ఘోరేఽస్మిన్ వరుణాలయే,
> లంకా నాసాదితుం శక్యా సేంద్రైరపి సురాసురైః. 40
> విభీషణస్య శూరస్య యథార్థం క్రియతాం వచః.
> అలం కాలాత్యయం కృత్వా సముద్రోఽయం నియుజ్యతాం. 41
> ... ... ... ...
> ఏవముక్తః కుశాస్తీర్ణే తీరే నదనదీపతేః. 42
> సంవివేశ తదా రామో వేద్యామివ హుతాశనః."

అని మూలము. శ్రీరాముని ప్రవర్తనము సర్వసమ్మతముగా నుండుననుట కిదియు నొక యుదాహరణము. లక్ష్మణా! విభీషణుని యాలోచనము నాకు రుచించుచున్నది. నీవు సుగ్రీవుఁడు, కలిసి కార్యదక్షులు గాన యోజించి చెప్పిన నట్లు చేసెద. అనఁగా మీకు నిది రుచించిన నొనరింతును. అనఁగా వారు సమ్మతిం దెలిపిరి "జనవాక్యం తు కర్తవ్యమ్" అనుసూక్తిని సార్థకముచేయఁ బ్రవర్తించువాఁడు శ్రీరాముఁడని మన మెఱుంగవలయు. జనసామాన్యమం దొక యద్భుతశక్తి కలదు. ప్రత్యేకవ్యక్తిగత మది కాదు. సంఘమునందే యది కలదు. దానిని సమ్మతింపఁజేయునట్లు వర్తించుటనఁగా భగవత్తేజము నారాధించుట యని భావము. సర్వత్ర వ్యాపించి యెవ్వారికే నెఱుంగరాక యనుపమానమై వెలయునది భగవత్తేజము గాన దానిని బ్రత్యేకముగా నారాధించుట యోగులకుఁ దప్ప నితరుల కశక్య మగుంగాన నద్దానిని సంఘశక్తిగా నెఱింగి యుపాసించిన "సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" అన్న న్యాయము ననుసరించియు,

> "యేఽప్యన్యదేవతా భక్తా యజంతే శ్రద్ధయాన్వితాః,
> తేఽపి మామేవ కౌంతేయ యజంత్యవిధిపూర్వకమ్."

అను గీతావాక్యము ననుసరించియు భగవంతు నారాధించినట్లే యగును. ఇంచుక చక్కనిమార్గము కాదనవచ్చును. అంతియ గాని యుపాసనకు ఫలము కలుగకపోదు. లోకులకు సదాచారమును నేర్పుటకు శ్రీరాముఁడు దర్భలు పఱచి దానిపై శయనించి సాగరమును బ్రార్థించునట్లు నటించుచుండెను. ఇఁకఁ దరువాతివృత్తాంతమును బఠింతము.

## రావణుని గూఢచారులఁ గపులు కొట్టఁగా రాముఁడు వలదనుట.

* అంత శార్దూలుఁ డను రాక్షసుఁ డొకఁడు లంకనుండి యరుదెంచి సుగ్రీవుని వశముననుండు వానరబలమును సముద్ర తీరమునఁ గనియెను. వాఁడు రావణుని గూఢచారుఁడు. వాఁడా కపిసేన నంతటం దిరిగి చూచి వేగముగా లంకఁ దిగిక ప్రభువును దర్శించి "అదిగో కపి భల్లూకబలము రెండవసముద్రము వలెఁ గనఁబడుచు మనపైకి వచ్చుచున్నది. ఆ రామలక్ష్మణు లిరువురు భయంకరాయుధధారులై సీతయుండుచోటికి రానై యున్నారు. మహాతేజమున వారు మెఱయుచున్నారు. వానర బలము నలుదెసల నెట్లుచూచినను దశయోజనవిస్తృతభూభాగము నావరించి యున్నది. నేను సాధారణముగాఁ గనివచ్చితిని. ఇంకను బరిశీలింపవలయునని విన్నవింతును. దూతల మూలమున వేవేగ దానివిధము కనుఁగొనవలయును. సామ దానభేదముల నుపయోగించి పరికింపవలయును. దండమున కవకాశ మున్నట్లు తోఁపదు." అని విన్నవించెను.

రావణుఁ డాశార్దూలునిమాటల నాలకించి యాలసింపక వెంటనే తా నేమిచేయవలయునో యని నిశ్చయించుకొని కార్యవిద్వర్యుఁడగు శుకుఁ డను రక్కసునిం బిలిపించి యిట్లనియె. నీవు పోయి సుగ్రీవునిం గాంచి పరుషముగాక మృదువు ప్రియముగా నుండునట్లు నామాటలుగా నిట్లు చెప్పుము. వానరేంద్రా! సద్వంశమునఁ బుట్టిన నీవు నిష్కా-

* ఇది యిరువదవ సర్గమునఁ గలదు.

రణవైరమూన ధర్మము కాదు. మహాబలుఁడవగుట నల్పబలుఁ డగురాము నాశ్రయింపఁ దగదు. బ్రహ్మపుత్రుఁడు ఋక్ష రజుఁడు. నీ వాతని కొడుకవు. కాన నాకు బంధువవు. నీవు రాము నాశ్రయించుటంజేసి కలుగు లాభ మేదియు లేదు. ఆశ్రయింపకయున్న నష్టము లేదు. కనుక నిష్ఫలమగువైర ముచితము కాదు. నాకు నీయన్నయగు వాలికిని మిక్కిలి స్నేహము. దానిచే నాకు నీవు సోదరతుల్యుఁడవు. కాన వానరేశ్వరా! రాముని వదలి నాతో స్నేహము గావింపఁదగు దువు. సీతాపహరణమహాపాపము చేసితివే యని యడుగుదు వేమో. నేను రాజపుత్త్రునిభార్య నపహరించి తెచ్చితినేని వానరపతివగు నీ కావిషయమునందు హానియేమి? బుద్ధి మంతుఁడవగుట యోజించుకొమ్ము. ఇపుడు నీవ్వూరక కిష్కింధ కుఁ బొమ్ము. ఈలంకానగరము నరవానరుల కెట్లును బ్రవే శింప నలవిగానిది. దేవదానవప్రభృతులకే దుర్గమమనఁగా నిఁక నితరులమాటఁ జెప్పనేటికి? అని నేనుజెప్పినట్లు చెప్పుము.

అని రావణుఁడు చెప్పి పంపించఁగా నాశుకుఁడు పక్షి రూపమును ధరించి వచ్చి యంబరమున నెగసి సుగ్రీవాదు లుండుచోటికి వచ్చెను. అట్లు శుకుఁడు వియత్పథమున బహు దూరము పోయి సుగ్రీవాదు లున్నకడంజేరి యంబరమున నుండియే సుగ్రీవునిం గాంచి దురాత్ముఁడు రావణుఁడు తనతోఁ జెప్పిపంపినమాటలుగా వదలక వరుసగాఁ జెప్పెను. వాఁడట్లు చెప్పుచుండఁగా వానరులు వానిని బిడికిళ్లం గొట్టి పక్షములు విఱుగఁగొట్టుటకై యెగసి వానిం బట్టుకొనిరి. వారు గట్టిగాఁ బట్టుకొని త్రోయఁగా నందుండి నేలపైఁ బడియెను వా రట్లు

పీడింపఁగా శుకుఁడు శ్రీరాముని జేరఁ్కొని రాఘవా! దూతల నెవ్వరు వధింపరు. నన్ను వీరలు చంపఁబూనిరి కావున వలదని వారింపుము. ఏదూత తనప్రభువు చెప్పినమాట చెప్పక తన మతమును జెప్పునో వాఁడు దుష్టదూత యగును. అట్టిదూతను వధింపఁదగు. శుకుం డట్లు విలపించుచుం బలికినపలుకు లాలించి శ్రీరాముఁడు కరుణించి వానరులం గని వీనిం జంపవలదని యాజ్ఞాపించెను. వారలు విడిచిరి. వాఁ డంతట భయము వదలి కొన్నియోఁకలు పోవుటంజేసి తేలికగా నున్నపక్షము లతో నంబరమున కెగసి సుగ్రీవునితో మరల నీవు మహా బలుఁడవు. రావణుఁడు దుష్టమతి. నేను నీవలన బదులు తీసి కొనకపోయిన నన్ను వధించును. నాయేలినవాని కేమి చెప్ప మందువు? అని యడుగఁగా వానరపతి యిట్లు చెప్పెను. "నీవు నాకు మిత్రుఁడవు కావు. కాన నీయెడ దయచూపవలసినది లేదు. నీవు నా కేయుపకారము చేసినవాఁడవు కావు. నాకుఁ బ్రియుఁడవు గావు. కావున సోదరతుల్యుఁడ వెట్లగుదువు? నాకు మిత్రుఁడగురామునకు నీవు నీవారందఱును శత్రువు లగుటంజేసి నాకు శత్రువవే. శత్రువైనవాలికి మిత్రుఁడవు గావున నాకును శత్రువవు. కనుక వాలివలె వధార్హుఁడవే. శ్రీరామపత్ని నపహరింపఁగా నీకేమి హాని యనకుము. నీయప రాధమున నిన్నును నీవారలను వధించెదను. ఈసేనతో వచ్చి లంకాపురమును నీఱుగాఁ జేసెదను. లంకలో నే నుండక యున్న నేమిచేయుదువందువేమో రాక్షసేంద్రా! నీవు మూర్ఖుఁడవు. ఇంద్రాదులు తోడుపడిన, నీ వదృశ్యతనొందిన, సూర్యద్వారమును జొచ్చినఁ బాతాళమున బ్రుంగిన రాము

నుండి తప్పించుకొనఁజాలవు. తప్పక చత్తువు. రామబాణముల నుండి నిన్నుఁ గాచువా రెవ్వరు గలరు? ముదుసలిజటాయువును జంపుటలో నీకేమి వీర్యము గలదు? నే నట్టివాఁడను గానుజుమీ. ఆజానకిని శ్రీరాముఁ డున్నపుడుగాని సౌమిత్రి యున్నపుడుగాని యపహరించితివా యేమి? ఎవరు లేనితఱి దొంగిలించి తెచ్చితివి. అట్లు తెచ్చి రాఁగల యనర్థమును దెలియఁజాలకున్నావు. దేవాజేయుఁడగు శ్రీరాముఁడు నీప్రాణములఁ దీయునని యెఱుంగవు. అని చెప్పితినని తెల్పుమని యెను.

అంత నంగదుఁడు సుగ్రీవునిం గాంచి మహారాజా! వీఁడు దూత గాఁడు. రావణునిచారుఁడని తోఁచెడిని. వీఁ డిందుండి మనసేనలపరిమితిని గనుఁగొన్నాఁడు. వీనిం బట్టుకొనుఁడు. లంకకుఁ బోనీయరాదు. నాయిష్ట మిదియే. అంత రాజగు సుగ్రీవునానతి వానరు లాకసమున కెగిరి దిక్కు లేని వానివలె నాశుకుని బంధించిరి. కఠినచిత్తులగు వానరులు తన్నుఁ బీడించుచుండఁగా శుకుండు రామునిం బిల్చి మహానుభావా! యని యార్చుచు నాపక్షముల నేఁచుచున్నారు. నా కన్నులు భేదించుచున్నారు. నే నపరాధి గాను దూతను. కాన వీరిమూలమునఁ బ్రాణములు వదలిన నే నింతదనుకఁ జేసిన పాపములన్నియు నన్నుఁ జంపించిన నిన్నుఁ బొందును. అని విలపించెను. శ్రీరాముఁ డాతని దీనాలాపముల నాలకించి వానిని వధింపవలదని హెచ్చరించి వీనికట్లు వదలించి పంపివేయుఁడని వానరులకుం దెల్పెను.

మహాత్ములారా! ఈఘట్టమున విమర్శింపఁదగినవాని గ్రహింతము. లోకాచారము ననుసరించి రావణుఁడు ప్రవర్తింపనిచో యుద్ధమే సాగదు. అది సాగకయున్న నారణరంగమున మృతినొంది వీరస్వర్గమునకుఁ జేరవలసినవారల గతి యెట్లు? కర్మఫలము లాలసింపక పొందుచుండవలయుఁ గదా. ఎన్నికోట్లరక్కసులో చావవలసినవా రున్నారు. ఎవరెవరిమూలమున నేయేసమయములందు నెవరెవరు మృతినొందవలయునో వారా కాలము తప్పక చావవలసినవారే కదా. అఘటికాయంత్రమునకుఁ బ్రోత్సహించుపద్ధతి యక్కఱ లేదు. ప్రయత్నములు తమయంతన లభించును. ఇతరు లెఱుఁగకయుండ నవి ఫలమొసంగును. ఊహల కవి యందవు. ప్రతిహతమార్గములే లేవు. శాంతులు వానికడఁ బనిచేయఁజాలవు. తనయంతనా యాయంత్రము తిరుగుచుండును. దానికి గతి యభంగము. ఏనాఁడును భంగము నది యెఱుఁగదు. ఒక్కొక్కపుడు త్రిమూర్తులు వెఱఁగందుచుందురనఁ దక్కినవారిమాట యిఁక లెక్క చేయ నేల? అట్టికాలగతి లంకానగరవాసుల సమీపించుచున్నది. రావణాదులు నిమిత్తమాత్రులు. పరాపరరహస్యయోగిని జానకి లంకానగరమునఁ దన ఛాయారూపము నెలకొల్పినది. ఆమె తలంచినదంతయు ఫలింపకపోదనుట యప్రతిహతసిద్ధాంతము. అడ్డమనుమాట దాని కేనాఁడును లేదు. పరాత్పరుఁడు సాక్షిమాత్రుఁడై నిరీహుఁడయ్యు నిరంజనుఁడయ్యు నపుడు సగుణుండగుటఁ గార్యనిరతిఁ బొందువానివలెఁ గనఁబడుచు నటించుచున్నాఁడు. ఇట్టిచోట రావణు నననేమియున్నది ?

"అహం యంత్రం భవాన్ యంత్రీ మమ దోషో న విద్యతే,"

యన్నట్లు ప్రాణులందఱుబొమ్మలు. త్రిప్పువాఁడు పరాత్పరుఁడు.

"భ్రామయంస్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా,"

అన్న గీతోక్తి వ్యర్థము కాదు కదా. ఈవిషయమును మది నునుచుకొని రామాయణమును బఠించి తత్సారమును గ్రహింతము.

"అహం యద్యహరం భార్యాం రాజపుత్రస్య ధీమతః. ౧౧
కిం తత్ర తవ సుగ్రీవ కిష్కింధాం ప్రతి గమ్యతాం,"

అని మూలము. రావణుఁడు శుకుఁడను చారునిమూలమున సుగ్రీవునకుఁ జెప్పిపంపెడుభావ మిది. భేదోపాయము పన్ని నాఁడని ప్రతీతికార్థము. రావణుని వాగ్ధోరణిం బరికింపుఁడు. రాజపుత్రస్య=అని మాత్రమే పలుకక ధీమతః=అనియెను. అట్టి విపత్కాలమున శత్రువును విశేషించి దండెత్తి వచ్చుచున్న వానిని బుద్ధిమంతుఁ డగురాముని నని పల్కునా? విశేష మేమనఁగా బుద్ధిసంపదగల శ్రీరామునిభార్యను గొనితెచ్చి తిని. దీన నీకేమి హానిగల్గును? కాన మరలిపొమ్ము. అని అనఁగా మహాత్ముఁడగు రామునిభార్యను దెచ్చితిని. దీన నీకేమియు హానిలేదే. అనఁగా నాకే హాని యగును. అందులకే తెచ్చితిని. ఇకార్యమున నీసహాయము శ్రీరామున కేల? మరలిపొమ్ము. భగవంతునకు నీసాయ మక్కఱలేదు. నీవు తోడ్పడి యికా ర్యము నెఱవేర్తుననుట గర్వము. అనుభావ మిట సూచింపఁ బడినది.

"యాం చ రాత్రిం మరిష్యామి జాయే రాత్రిం చ యామహం,
ఏతస్మిన్నంతరే కాలే యన్మయా హ్యశుభం కృతం. 3 శ్లో
సర్వం తదుపపద్యేథా జహ్యాం చేద్యది జీవితం,
నాఘాతయ త్తదా రామశ్ళ్రుత్వా తత్పరిదేవనం. 3౬
వానరాన్ర్బవీద్రామో ముచ్యతాం దూత ఆగతః,"

అని మూలము. సారమేమి? జన్మాదిగా మృతివఱకు నెవఁడు గాని తాఁ జేసినపాపములను దానే యనుభవింపవలయుఁ గదా. అట్టివానిని బలవంతముగా నెవఁడు వధించునో అనఁగా యుద్ధావసింగాక విరోధమున నసద్వృత్తి నెవ్వఁడు వధించునో వానిపాపములు వధించినవానిం జేరును. వధించినవానిపుణ్యములం గొని వాఁడు స్వర్గమునకుఁ బోవును. అనఁగా నిట్లు గ్రహింపంజను. పాపాత్ములను నిందించువారలు వానిపాపములలోఁ గొంత పంచుకొందురు. కనుకనే 'నాప్రియం బ్రూయాత్.' అని పెద్ద లందురు. పరదూషణము పనికిరాదని భావము. అట్టి పాపిని వధించుటం జేసి వానిపాపములను దాఁ బంచుకొనును. వాఁ డన్యాయమ్ముగాఁ జంపఁబడుటం జేసి చచ్చునపుడు వానిం తకునే స్మరించుచు నసువుల వదలు. కాన నాస్మరణమున నతని పుణ్యములఁ గైకొనఁజాలు. కాఁబట్టి పాపాత్ములను దూషింపకయుండు టుత్తమమని మహర్షి మనకుఁ దేటపఱచెను. ఈ విషయ మెఱింగియే వానినివదలుఁడు దూతగా వచ్చినవాఁడు కదా యనియె. ఆర్తత్రాణపరాయణత్వ మిప్పట్టునఁ గూడ రామచంద్రునివ్రతమని తేటపడుచున్నది.

## శ్రీరాముఁడు ప్రసన్నుఁడుగాని సముద్రునిపై బాణము వైవఁ బూనుట.

* అంత శ్రీరాముఁడు కఠినసాగరతటమున దర్భశయ్య నుండి యంజలింబట్టి దీర్ఘబాహువు నుపధానము గావించుకొని ప్రాగ్వదనముగా నప్రతర్క్యతేజోవిరాజమానుఁడై కనుపట్టుచుండెను. శ్రీరామునిదక్షిణబాహువు పూర్వమయోధ్యానగరమున నుండఁగా రత్నాభరణవిరాజమానమయి యుండినది. పురంధ్రీమణులగు సైరంధ్రులు వివిధవిధశృంగారముల నొనరింప వెలయుచుండునది. బాలభానుకరణి నెంతో ముచ్చటగా నుండునది. అట్టి బాహువును శ్రీరాముఁడు తలగడఁగా నొనర్చుకొని యిపుడు నాకు మరణమేని లేకున్న సాగరతరణమేని కలుగుఁ గాక యని దృఢసంకల్పము గలవాఁడై స్నానాదులచేఁ గాయికపరిశుద్ధిని జేసికొని వాఙ్నియతి గలిగి,మనోనియమము దృఢతం గాంచఁగా శాస్త్రమర్యాదల నతిక్రమింపక సాగరమున కెదురుగాఁ బండుకొనెను. నియమము వదలక శ్రీరాముఁడు కుశశయ్య నేలమీఁదఁ బవ్వళించియుండఁగా మూఁడురాత్రులు చెల్లెను. న్యాయధర్మములఁ జక్కఁగా నెఱింగినవాఁడు గాన రామమూర్తి యందట్లు త్రిరాత్రశయ్య నొనరించి నదీనాథు నారాధించుచుండెను. తెలివితక్కువవాఁడౌట నాసముద్రుఁడు పరిశుద్ధుఁడు సవిధిగాఁ దన్నారాధించుచు రాముఁ డుండినను దాను గనఁబడఁడయ్యెను.

---

* ఇది యిరువదొకఁడవ సర్గమునఁ గల కథ.

అంతట శ్రీరాముఁ డాజలరాశిపయి నించుక క్రుద్ధుఁడై నేత్రాంతములయందు రక్తిమ వ్యాపింపఁగాఁ జెంతఁ దన కోపము నెఱింగి స్మితమొనరించు సౌమిత్రిం గాంచి వత్సా! సాగరుఁ డింతవనుకఁ దనరూపమును గనఁబఱుపక యున్నాఁడు. ఇది వీని యహంకృతి యగు. కోపము లేకయుండుట, అపరాధమును క్షమించుట, కుటిలత్వము లేకుండుట, ప్రియముగా మాటలాడుట యను నీమొదలైన నీసత్పురుషులగుణములు నిర్గుణులకడఁ గనఁబఱచినచో వారు వారి నసమర్థులని తలంతురు. కావున లేని యసామర్థ్యమే ఫలితమగును జుమా. తెలివితక్కువవారు, ఆత్మస్తుతిపరాయణులు నిర్దయులు వంచకులు, ఎల్లవారిని బాఱఁదోలువారు, శిష్టాశిష్టవిచారము లేక యెల్లవారి నేకరీతిగా దండించువారు సమర్థులని వారు తలంతురు. వారినే గౌరవింతురు. శమదమాదులు గలవారలను నిర్గుణులు గారవింపరు. లక్ష్మణా! లోకమున సామముచే బలవంతుఁ డనుఖ్యాతి రాఁజాలదు. సామముచేఁ బరాక్రమవంతుఁ డనుయశస్సు రానేరదు. రణరంగమున సామము జయము నీఁజాలదు. దండమే వీనికెల్లఁ బ్రధానసాధనము. ఇప్పుడీ మకరాలయము నాశరములచేత మకరములు చచ్చి పయికిఁ దేలఁగా నుండఁగలదు. చూడుమా. మహాసర్పముల ఛేదించెదం గాంచుము. నాబాణములం బ్రయోగించి మహాసంగర మొనరించి శంఖములు శుక్తులు మత్స్యమకరములు తేలుచుండ నీసాగరమును శోషిల్లఁ జేయుదును. క్షమ ప్రధానులగు మీవంటివా రిట్లు చేయవచ్చునా యని యడుగుదువేమో. వినుము. క్షమగలిగి యే నుండుటం జేసియే యీజల

రాశి యన్యాపేక్ష లేక కార్యముల సాధించుకొనందగిన బలము
గల నన్ను నసమర్థునిగా భావించినాఁడు. ఛీ! ఛీ! ఇంకను
క్షమను బూనవచ్చునా? ఇక్ష్వాకువంశమువారు క్షమను వదల
రాదు గదా యని చెప్పుదువేమో యది యిట్టి నీచులవిష
యమై రాక్షససహవాసముగల వీనివిషయమై చూపఁ దగదు
సుమీ. కోపమే వీనియందుఁ జూపఁదగినది. సామ మెంత
చూపినను వీఁడు తనరూపమును నాకుం జూపలేదు గదా.

సౌమిత్రీ! చాపమును దెమ్ము, క్రూరసర్పములం బోలు
బాణములం దెచ్చి యిమ్ము. సాగరజలములు శోషిల్ల నొనరిం
చెద. ఇపుడు సాగరోదకము లప్రధృష్యములైనను క్రుద్ధుఁ
డనై వానిఁ గలంచివైచెదను. తరంగములచే నెంత విఱ్ఱవీఁగి
నను వేలను దాఁటరానిదిగ నిది యుండెను. ఇపుడు బాణ
ములఁ బ్రయోగించి వేలను జెండి భూమినంతటఁ బ్రవహింపఁ
జేసెదను. ఈసాగరమున నివసించియుండు దానవులతోడఁ
గలంచివుత్తుం జుమీ. అని కఠినముగా నుండుస్వరమునఁ బలికి
శ్రీరాముఁడు చాపముం దాల్చి నిర్భరకోపమునఁ గన్ను లెఱ్ఱఁ
బడఁగా గిఱగిఱం ద్రిప్పుచుఁ బ్రళయకాలాగ్నివలెఁ బ్రకా
శించుచు నెవ్వారికేఁ దేఱిచూడరానియట్లుండెను. అంతట
నారాజకుమారచూడామణి మహాధనువు మధ్యభాగమును
గట్టిగాఁ బట్టుకొని జంతుజాలంబెల్ల బాణములకుఁ గంపమొం
దఁగా నింద్రుఁడు పెక్కు వజ్రాయుధములం బ్రయోగించు
చందంబున నత్యుగ్రనారాచములఁ బ్రయోగించెను. ఆ
తీవ్రసాయకములు వేగముగా నత్యుగ్రతేజముం గ్రాల
సాగరాంబువులందు నందుండు సర్పములు భీతిల్లునట్లు ప్రవే

శించెను. అత్తఱి సాగరమున జలములు ధ్వనించుచుండెను. శంకుశుక్త్యాదులు పైకిఁ దేలుచు నుండెను. ఆబాణములు పాతాళముదనుకఁ జొరఁబడఁగా జలజంతువు లత్యంతార్తి నొందినవి. విశేషించి సర్పములు విషాగ్నులఁ గ్రక్కుచు భయము చెందెను. పాతాళవాసులగు దానవు లవ్వానిచేఁ బీడితులైరి. సాగరమునఁ గల్లోలములు చెలరేఁగినవి. అత్తఱి నాసాగరము జంతుమయమై యున్నట్లు కనుపట్టినది. మహాత్తరక్రోధావేశమునఁ జూడ నలవిగాకయుండు శ్రీరాముని గాంచి యిఁక నూరకున్న లోకాంతంబగునని తలంచి చెంతకుఁ జటాలున నరుదెంచి వలదువలదని ప్రార్థించి యద్దాన నా మహాత్ముఁ డప్పని మానకుండు టెఱింగి యామేటి శరాసనమును బట్టుకొనియెను.

మహాశయులారా! ఈఘట్టము విమర్శనీయాంశములు గలది కాన వాని నెఱుకుదము. ఈసర్గమంతయు,

"కాలో హి దురతిక్రమః" అనియు,

"గహనా కర్మణో గతిః" అనియు,

"కర్తుమకర్తుమన్యథా కర్తుం సమర్థః పరమేశ్వరః."

అనియును గలసూక్తుల కుదాహరణ మనందగియున్నది. పరమేశ్వరుఁడగు శ్రీరాముఁడు జలరాశిని బ్రార్థించుట కంగీకరించుట యచ్చెరువు పుట్టింపక మానదు. అందుండునవి జలములు. మకరాది భీకరజలజంతువులు. శంఖశుక్త్యాదివస్తువులు. ఇంచేవి శ్రీరామునకు బదులు చెప్పఁగలవు? వానికి నభిప్రాయము లున్నవి. ఆశ కలదు. ప్రేమ మున్నది. కాని యది మన కున్నయట్టిది గాదు. భాష లున్నవి కాని మనకు దుర్బోధక

ములు. మనకుం గల్గునట్లు జ్ఞానకర్మేంద్రియములు వానికి లేవు. దీర్ఘాలోచనములకు వానియదిఁ దావు లేదు. వస్తుసంగ్రహము నకు మనవలె వానికి నూహాలు లేవు. అహంకారమమకారము లందు మనకు వానికి హస్తిమశకన్యాయము సరిపోవును. అట్టి జలజంతువులు నిండియుండుసాగరమును బ్రార్థించుట శ్రీరాముని తెలివితక్కువనే తేటపడం జేయునుగాని వివేకిత్వమును దెలుపఁజాలదు. తాఁ బరమేశ్వరుం డయ్యు నిట్టికార్యము నకుం గడంగునా యని యాక్షేపించు పెద్దలు పెక్కండ్రుం దురు. కాని వార లిద్దాని రహస్యము నెఱుంగఁజాలరు. వారి కొఱకే యించుక వ్రాయవలసి వచ్చినది. ఈవిషయ మీవఱకే యీ గ్రంథమాలయందు వ్రాసితిని. ఐనను మరల వ్రాసెదను. స్పష్టార్థమునకే కాని వేఱొకకార్యమునకుఁ గాదని యెఱుంగ వలయును.

శ్రీరాముఁడు ప్రార్థింపఁబూనినది కనఁబడుజలములను, అందున్న క్రూరసౌమ్యజలజంతువులను గాదు. వాని కూడిక యగు సాగరమును గాదు. ప్రతిదానికి నధిదేవత యుండును.

"ఆపో వా ఇదగ్ం సర్వం విశ్వాభూతాన్యాపః."

అని శ్రుతి తెల్పుచున్నది. భగవత్స్వరూపములు జలములు. తక్కినవి కావా యనరాదు. ప్రస్తుత మిదియేకదా విషయము. జలాధిదేవత వరుణుఁడు. సాగరమున నీలగ్రీవులనఁబడు రుద్రు లుందురు.

"అస్మిన్మహత్యర్ణవేంతరిక్షే భవా అధి
నీలగ్రీవాశ్శితికంఠాశ్శర్వా అధః క్షమాచరాః"

అని శ్రుతి తెల్పుచున్నది కదా. జలాధిపతి వరుణుఁడు. జలాల యులు రుద్రులు. జలములను బాధింపఁగాఁ దన్నివాసులు పీడ నొందుదురు. వారిమూలమునఁ దదధిపతి యావిధ మెఱుంగఁ జాలును. అట్లే జలములఁ బ్రార్థింపఁగా నాతఁడు తుష్టుం డగును. అదియే జలోపాసన యనఁగా. జలాకృతి వెలయు భగవదుపాసనయని దాని యర్థము. మనకుం దోఁచురూపమని కాదు. "యేన కేనాపి రూపేణ" అనఁగా నిదియే యర్థము. శ్రీరాముఁడు తాఁ బరాత్పరుండయ్యు సర్వజ్ఞుఁడయ్యు లోక రక్షార్థము సదాచారపోషణార్థము ధర్మస్థాపనార్థము ప్రాకృతుండును బోలె సాగరు నారాధింపంబూనెనని మన మెఱుంగందగు. ఆయుపాసనావిధానమే యిందుఁ బ్రతిపాదింపఁ బడినది.

> "తతస్సాగరవేలాయాం దర్భానాస్తీర్య రాఘవః,
> అంజలిం ప్రాఙ్ముఖః కృత్వా ప్రతిశిశ్యే మహోదధేః. ౧
> బాహుం భుజగభోగాభముపధాయారిసూదనః,
> ... ... ... ... ...
> భుజైః పరమనారీణామభిమృష్టమనేకధా. ౩
> చందనాగరుభిశ్చైవ పురస్తాదధివాసితం,
> ... ... ... ... ...
> గోసహస్రప్రదాతారముపధాయ మహద్భుజం, ౭
> అద్య మే మరణం వాథ తరణం సాగరస్య వా. ౮
> ఇతి రామో మతిం కృత్వా మహాబాహుర్మహోదధిం,
> అధిశిశ్యే స విధివత్ప్రయతో నియతో మునిః." ౯

అని మూలము. సాగరతీరమున దర్భాసనమునఁ బ్రాఙ్ముఖుఁడై

దోసిలొగ్గి ప్రార్థించుచు శయనించెను. మారణక్రియయందు దక్షిణముఖుఁడు గావలయుననియు, పశ్వాదికర్మములయందుఁ బశ్చిమాభిముఖుఁడు కావలయు ననియు దేవతాకరుణావాప్తి ప్రభృతి సత్కర్మములందుఁ బ్రాగుదగ్గిగన్యతరముఖుఁడు కావలయుననియు విధులు తెలుపును. దోసిలొగ్గుట స్వకార్యాద్భృతి సూచనార్థము. నిన్నుపాసించుచున్నాను. నన్ననుగ్రహింపుమా యని వేఁడుటయే సంకల్పము. శయనించు టుపాసనా లక్షణమా యందురేమో. ఇది భక్తిపరాకాష్ఠను దెలుపును. ప్రాయోపవేశమువంటిదే యిది యని యెఱుంగందగు. ఈ కార్యము నెఱవేఱునంతకు లేవరాదనునదియే పరాకాష్ఠ యనఁబడును. దీనికే శ్రద్ధ యనియుఁ బేరు కలదు. పట్టుదల యని భావము. తావత్పర్యంతము లేవకుండుటయే వ్రతనియమము. నిరంతర మిష్టదేవతను దలంచుచుఁ దద్గతాంతరాత్ముఁడై యుండుటయే కార్యార్థశ్రద్ధ యనవలయు. అట్టి పట్టుదల యుండినఁగాని భక్తి దృఢత గాంచదు. అది కుదురనిచో ఫలసిద్ధి సంశయాస్పదమే. కావున లోకుల కిట్టి ప్రాచీనమర్యాదల బోధింపఁబూని రాముఁ డిట్టి మహత్తరవ్రతమును బూనెనని మన మెఱుంగవలయును. శ్రీరాముని బాహువులను వర్ణించుచు మహర్షి "పరమనారీణాం అభిమృష్టమనేకథా" యని పలికిరి. దీనింబట్టి సీతాంబ కాక వేఱుభార్యలు శ్రీరామున కుండినట్లు కొందఱు వ్యాఖ్యానము చేయసాగిరి. ఇట్లేల వ్రాసిరనియు మహర్షిభావ మేమైయుండుననియు మన మూహింపవలయును. పరమనారీణాం = అనఁగా సుందరాంగులని యర్థము కాదు. సుచరిత్ర లగుస్త్రీలని భావము. రాజాంతఃపుర

ములయందు సైరంధ్రు లుందురు. సుశీలలుగనే వా రుం
డురు. వార లలంకరింపఁగా నాబాహువు ప్రకాశించుచుం
డెడిదని గ్రహించిన దోషము వచ్చునా ? ప్రాయికముగా
వింజామరలు వీచువారలు మర్యాదననుసరించి పరికించిన నుత్త
మస్త్రీలే యని తలంపవలయు. దమయంతి ద్రౌపది రాజాంతః
పురములయందు సైరంధ్రులుగానే యుండి కాలము గడిపిరి
గదా. శ్రీరాముని బాల్యమునుండి పెంచినవార లట్టివారే.
మాతృసమానలుగా వా రుందురు. శ్రీరామునిచరిత్రము పరమ
పవిత్రము. శీలము దానిని మించినది. కావున నట్టి పురంధ్రు
లలంకరించిన బాహు వదియని మహర్షి వచించుటలో త
ప్పేమి గలదో యూహించి యెఱుంగఁజాలకున్నాను. ఏకపత్నీ
వ్రతపరాయణుఁడగు శ్రీరామునియం దట్టిదోష మారోపిం
చుటకంటె వేఱొక్కపాపము లేదని తలంతును. కావున నిట్టి
యాక్షేపములు చేయకుండుటే యుత్తమము. ఆబాహువర్ణన
మిచ్చో నేల యని కొంద ఱడుగుదురు. అట్టి యలంకృతమగు
బాహువును గఠినభూభాగమున దర్భలపైఁ బవ్వళించి తల
గడగా శ్రీరాముఁడు చేసికొని సాగరమును బ్రార్థించు
చున్నాఁడని మహర్షి చెప్పుట యసంగతము కాని యసందర్భము
గాని యనుచితముగాని కానేరదు. గోసహస్రప్రదాతార
ముపధాయ మహద్భుజమ్=అనుటంజేసి యాహస్త మంత
మహోపకార మొనర్చినదయ్యు నిత్తఱిఁ దలగడయయ్యెఁగదా
యని మహర్షి సంతప్తహృదయుఁడై తెల్పెను. "కాలో హి
దురతిక్రమః"అనున్యాయ ముదాహరణార్హమని కవితాత్పర్య
ముగా మనము గ్రహింపంజను.

ఇఁక శ్రీరామునిసంకల్ప మెట్టిదని విచారింతము. ఈ నియమము ఫలింపదేని మరణము కావలెను. ఫలించునేని సాగరతరణము కావలెను. ఇవి రెండు కాకయుండ నియమము మానననని సంకల్పించెను. ఏకార్యమునకుఁగాని సంకల్పము ముఖ్యము.

"హతో వా ప్రాప్స్యసే స్వర్గం జితో వా భోక్ష్యసే మహీం."

అని కదా శ్రీకృష్ణుఁ డర్జునునకు బోధించెను. ఏల? సంశయాత్మత్వము కార్యదీక్షాక్షమత్వము కానేరదు. వాశబ్ద ముచ్చరించుచు నేది సంకల్పించినను ఫలింపదు. దృఢవ్రతుఁడు కావలయును. కనుకనే "అనన్యాశ్చింతయంతో మామ్" అని శ్రీకృష్ణమూర్తి తెల్పెను. సమయానుకూలముగా నెల్లదేవతల నారాధించుచుండిన నొక్కతావున నిలుకడలేక యతఁ డెవ్వరియనుగ్రహమునకుఁ బాత్రుఁడు కాఁజాలఁడు. కనుకనే "ఏకభక్తిర్విశిష్యతే" యని భగవదనుశాసనము ప్రబలెను. కనుక దృఢసంకల్పుఁడు కానివాఁడు స్వేష్టసిద్ధిం బడయఁజాలఁ డనుభావమును లోకులకుం దెలుప శ్రీరాముఁ డిట్లు సంకల్పించెనని మనము నమ్మవలయును. రామావతార ముపదేశించుటకుఁ గాదు. కార్యము తానొనరించి లోకులకుఁ గనఁబఱచి తన్మూలమున సదాచారములు ధర్మములు సత్యము లోకమున స్థితి నొందఁజేయుటకే యని యార్యులనుట సత్యమేకాని వేఱు కానేరదు. ఈవిషయములఁ జక్కఁగా నెఱింగినయెడల రామాయణపారాయణము ఫలవంత మగును. లేనిచో నేదోఫలము రవంత గలుగును. సంస్కృతశ్లోకములఁ బఠించునే వ్వలవడును. నియతో మునిః=అని యున్నది. నిశ్చలాంతఃకరణుఁడు, ఈ

కార్యము తప్ప వేఱొకకార్యమున బుద్ధిఁ జొనుపననుతలంపు గలవాఁడును గావలయు. ఇదియే నియమ మనంబడును. మునిః= మౌనముగలవాఁడు కావలయును. ఏల యనఁగా మౌనమే పాపరో జపః=అని ప్రమాణము కలదు. మౌనముద్రాధారణ మొకవిధమగు తపస్సగును. అనఁగా వాగింద్రియమును జయించినవాఁడని యతఁడు చెప్పంబడును. విజితేంద్రియుఁ డనఁగా నిదియే కదా యర్థము. మనస్సును నిగ్రహించినవాఁడని కదా యర్థము. సకలేంద్రియముల వశమున నుంచుకొన్నవానినే విజితేంద్రియుఁ డందురు. అందు నిది యొక యవాంతరభేదమని గ్రహింపవలయును. జపకాలములయందు మౌనము ప్రధానమని తెలిపిన దిందులకే.

> "విధియజ్ఞాజ్జపయజ్ఞో విశిష్టో దశభిర్గుణైః,
> ఉపాంశుస్స్యాచ్ఛతగుణస్సహస్రో మానసస్స్మృతః. ౮౫
> యే పాకయజ్ఞాశ్చత్వారః విధియజ్ఞసమన్వితాః,
> సర్వే తే జపయజ్ఞస్య కలాం నార్హంతి షోడశీం. ౮౬
> జప్యేనైవ తు సంసిద్ధ్యేద్బ్రాహ్మణో నాత్ర సంశయః,
> కుర్యాదన్యన్న వా కుర్యాన్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే. ౮౭
> ఇంద్రియాణాం విచరతాం విషయేష్వపహారిషు,
> సంయమే యత్నమాతిష్ఠేద్విద్వాన్ యంతేవ వాజినాం. ౮౮
> ... ... ... ... ...
> ఇంద్రియాణాం ప్రసంగేన దోషమృచ్ఛత్యసంశయం,
> సన్నియమ్య తు తాన్యేవ తతస్సిద్ధిం నియచ్ఛతి." ౯౩
>
> మను. ౨ అ.

"విధివిషయో యజ్ఞో విధియజ్ఞః దర్శపౌర్ణమాసాదిః. తస్మా

త్సృరిక్రుతానాం ప్రణవాదీనాం జపయజ్ఞో దశగుణాధికః." అని కుల్లూకభట్టు.మానసికజప మన్నింటికంటె నుత్కృష్టము. విశేష ఫలప్రదమనుటకుం గారణమేమి? యజ్ఞములకంటె జపయజ్ఞ ముత్కృష్టమనుటకుం గలహేతు వేమి? జపయజ్ఞము మానసికమైనయెడల మనస్సు నియమింపఁ బడవలయును. లేకయున్న నది సాగదు. ప్రవృత్తిరహితమై యది యేకత్ర నిలిచియుండి ననే మానసికజపము సాగఁగలదు. కావున స్థిరమనస్సుగలవాఁ డగుటయే ఫలసిద్ధికిం గారణమయ్యెను. మంత్ర ముచ్చరించుచు జపించుట యత్యల్పఫలప్రదమనియు, పెదవుల కదలికకలిగి జపించుట దానికంటె నుత్తమమనియు మానసిక ముత్తమోత్తమమనియుఁ జెప్పుట యిందులకే యని గ్రహింపవలయును.

"యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి."

యను గీతావాక్య మీయర్థమునే బోధించును. మానసిక పుణ్యపాపము లిట్టులే యన్నింటికంటె నధికములని యెఱుంగ వలయు. కనుకనే శ్రీరామమూర్తి మౌనముద్రం దాల్చుట విధి నతిక్రమింపక సాగించుటకే యని యెఱుంగందగు. సమాహితమనస్కుఁడై శాస్త్రమునఁ జెప్పినరీతి మౌనమూని దృఢ సంకల్పము గలిగి యిష్టదేవతోపాసన నొనరించినఁగాని యభీష్ట ఫలము కర్మానురూపముగాఁ గలుగదని యిందలిసారము.

"తస్య రామస్య సుప్తస్య కుశాస్తీర్ణే మహీతలే,
నియమాదప్రమత్తస్య నిశాస్తిస్రోఽతిచక్రముః. ౧౦
స త్రిరాత్రోషితస్తత్ర నయజ్ఞో ధర్మవత్సలః,
ఉపాసత తదా రామస్సాగరం సరితాం పతిం. ౧౧

న దదర్శయతే మంద స్తదా రామస్య సాగరః,
ప్రయతేనాపి రామేణ యథార్హ మభిపూజితః.”

అని మూలము. దర్భాసనమున శయనించి సాగరు నుపాసించగా మూఁడురాత్రులు గడచినవి. నియతుఁడై విధిఁ దప్పక యథార్హముగా సాగరు నారాధించెను. కాని మందబుద్ధిగల వాఁడగుట నతఁడు దర్శన మీయకపోయెను. అని కథాసారము. ఉపాసత=ఏమని యుపాసించెను? ఉపాసనాభేదములందుఁ బ్రార్థనయు నొకఁడు. అదియే ధ్యాన మనంబడును.

“న హి ధ్యానేన సదృశం పవిత్ర మిహ విద్యతే,
శ్వపాకేష్వపి భుంజానో ధ్యానేనైవాత్ర లిప్యతే.
ధ్యానమేవ పరో ధర్మో ధ్యానమేవ పరం తపః,
ధ్యానమేవ పరం శౌచం తస్మాద్ధ్యానపరో భవేత్.
సర్వపాపప్రసక్తోఽపి ధ్యానం నియతమభ్యసేత్,
సర్వదా ధ్యానయుక్తశ్చ తపస్వీ పంక్తిపావనః.”

ఆత్రేయస్మృతి ४ అధ్యా.

ధ్యానమనఁగా నభీష్టదేవతారూపమును మనోవీథిం దిలకించుట. దానియందే మనస్సును నిలుపుట యని యర్థము. అదియే తపఃఫలము. దానంజేసి యిష్టదేవతాసాన్నిధ్యము కలుగును. ఆమార్గమునే శ్రీరాముఁ డవలంబించెను. కాని సాగరము దర్శన మీయలేదు. అనఁగా సముద్రాధిదేవత సాక్షాత్కరింపలేదు. ఏల? శ్రీరాముని నియమలోప మన రాదు. శ్రీరాముని బాణములఁ జావవలసినజంతువు లందున్నవి. కనఁబడిన నాకర్మఫల మేమగును? అది ముగియు

దాఁక దర్శనమిచ్చునూహా నా సాగరాధిదేవత కాంచదయ్యె నని మన మూహింపవలయును.

"అవలేపస్సముద్రస్య న దర్శయతి యత్స్వయం,
ప్రశమశ్చ క్షమా చైవ ఆర్జవం ప్రియవాదితా. ౧౪
అసామర్థ్యం ఫలం త్యేతే నిర్గుణేషు సతాం గుణాః,
ఆత్మప్రశంసినం దుష్టం ధృష్టం విపరిధావకం. ౧౫
సర్వత్రోత్సృష్టదండం చ లోకస్సత్కురుతే నరం,
న సామ్నా శక్యతే కీర్తిర్న సామ్నా శక్యతే యశః. ౧౬
ప్రాప్తుం లక్ష్మణ లోకేఽస్మిన్ జయో వా రణమూర్ధని,"

అని మూలము. ప్రాతీతికార్థము విస్పష్టమే. వాల్మీకి శ్రీరాముని వాక్కులమూలమున లోకులకు మంచినీతిని దెలుపుచున్నాఁడు. సాధువులయెడఁ గలసుగుణములు నిర్గుణులయెడ నిష్ఫలము లగును. అవి కలవారిని వా రసమర్థులని తలంతురు. ఆత్మస్తుతిపరాయణత్వము లోనగు దుర్గుణములు గల వారలనే లోకులు మన్నింతురు. కావున నాధ్యానాదులు సాగరుఁడు గర్వి యగుట లెక్కింపఁ బడలేదు. గుణగ్రహణపారీణులకడ సుగుణములు చెల్లును గాని నిర్గుణులకడ నవి పని చేయఁజాలవు. సామముచేఁ గీర్తి గల్గదు. సామముచే యశస్సు కల్గదు. రణమున విజయము కూడ సామమునఁ గలుగదు. అనఁగా మంచితనము నిష్ఫలమే యగును గాని సఫలము కానేరదు. అని రాముఁ డనియెను. ఈవాక్కులు ప్రాయికముగా లోకమునందు నాచారముం దెల్పును. సాగరుఁడు గర్వించెనని చెప్పుటకే యివి పనికివచ్చునని మన మూహింపవలయుఁ గాని సద్గుణములు నిరర్థకములని దుర్గుణ

ములు సార్థకములని కాదు. దుష్టులు సద్గుణప్రభావ మెఱుంగఁ జాలరనియు వారు దండోపాయసాధ్యులే యనియు నిందలి సారము. కీర్తియశశ్శబ్దము లిందుఁ బ్రయోగింపఁబడినవి. "బలకృతా ప్రథా యశః పరాక్రమకృతా కీర్తిః" అని గోవిందరాజులు. "కీర్తిః గుణవత్తాప్రథా, యశః దానజనితా ఖ్యాతిః" అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి.

"దానాదిప్రభవా కీర్తిశ్శౌర్యాదిప్రభవం యశః. ఇతి మాధవీ. అత ఏవ యశః కీర్త్యోర్భేదస్యాతి దర్శనాత్. యశఃకీర్తి ప్రవిభ్రష్టో జీవన్నపి న జీవతి. ఇతి కస్యచిత్ప్రయోగః."

అని శబ్దకల్పద్రుమము. ప్రాయికముగా నివి రెండును సమానార్థకములని యంద ఱూహించినను భేదము కలదని మన మెఱుంగవలయును.

> "క్షమయా హి సమాయుక్తం మామయం మకరాలయః. ౨౦
> అసమర్థం విజానాతి ధిక్ క్షమామీదృశే జనే,
> న దర్శయతి సామ్నా మే సాగరో రూపమాత్మనః. ౨౧
> చాపమానయ సౌమిత్రే శరాంశ్చాశీవిషోపమాన్,
> సాగరం శోషయిష్యామి పద్భ్యాం యాంతు ప్లవంగమాః. ౨౨
> అద్యాక్షోభ్యమపి క్రుద్ధః క్షోభయిష్యామి సాగరం."

అని మూలము. శ్రీరాముఁడు సర్వశక్తిమత్త్వమును బ్రకాశింపఁ జేయుచున్నాఁడు. సాగరము మకరాలయము. మకరములు మహాక్రూరజంతువులు. జలజంతువులయం దవి మహాక్రూరములని చెప్పంబడును. వానికి నివాస మీయది. సాధువులప్రార్థనల నాలకించునా? నన్ను నసమర్థునిగా భావించినది.

ఇట్టిమూర్ఖులయందు క్షమఁ బూనరాదు. అనఁగా సాధువుల కడ క్షమాగుణ మూనవలయు. దుష్టులకడ దానిం బూన రాదు—అనుట రాజధర్మము. మునుల ధర్మముగాదు. తమ్ముఁ జంపఁబూనినవారియందును దయచూపుట మునిధర్మము. వారి యందుఁ గోపముం జూపి శిక్షించుట రాజధర్మము. పరస్పర విరుద్ధములుగా నివి యుండును. ఇపుడు శ్రీరాముఁడు రాజ ధర్మ మూనవలసినదే కాని మౌనిధర్మము నవలంబింపరాదు గదా. కనుకనే లక్ష్మణా శరచాపములం దీయుమనెను. సాగ రము శోషిల్లఁ జేసెదను. వానరసేనలు నడిచిపోవుం గాక. అక్షోభ్యమైనను క్షోభింపఁజేసెదను. అనియెను. ఈకార్యము శక్యమా యనునదియే ప్రశ్నము. సముద్రజలముల నింకిపోవు నట్లు చేయుటెట్లు? మానవసామాన్యులకేని మహర్షులకేని శక్యము కాదనవచ్చును. కాని సర్వశక్తిసంపన్నుఁ డగుపరా త్పరున కిది యత్యల్పకార్యము. బడబాగ్నిని బ్రజ్వరిల్లఁజేసిన నీరింకుట యెంతపని? సృష్టిస్థితిసంహారములు తలంచినమాత్రన సాగఁజేయఁగలమహాప్రకృతి తనయిచ్ఛయం దిమిడియుండ సాగరజలశోషణ మెంతటిపని? మనశక్తిమెయి నూహించి యిద్ది మహత్తరకార్యము. సాధ్యముకాదని నిశ్చయింపరాదు. ప్రకృతిశక్తి దుర్జ్ఞేయము. త్రిమూర్తులకే నది యనూహ్య మగునపు డస్మాదృశుల కెట్లు సుజ్ఞేయమగును? ఇది సాధ్య మిది యసాధ్య మనువిషయము భగవంతునియెడల నన్వయింప రాదు. సర్వశక్తిసంపన్నుఁడు కదా.

"తతస్తు తం రాఘవముగ్రవేగం
ప్రకర్షమాణం ధనురప్రమేయం,

సౌమిత్రిరుత్పత్య సముచ్ఛ్వసంతం
మామేతి చోక్త్వా ధనురాలలంబే. 33౨

అని మూలము. రామబాణములు సాగరమును గలవిల పాటొందింపఁగా నిఁక బాణములు ప్రయోగింప వలదని సౌమిత్రి ధనుస్సును బట్టుకొనియెను. ఏల? ఎన్ని భూతములకు శ్రీరామబాణపాతపీడ గలుగవలయునో అవి గలిగినది. ఇఁకఁ దద్బాణపీడఁ గలుగవలసినకర్మ మొనరించినజంతువులు లేవు. కావుననే తత్కార్యము నిర్హేతుకముగా నిలుపరాదని సౌమిత్రిని బ్రకృతి ప్రోత్సహించెను. భగవంతున కీవిషయము తెలియదా యనరాదు. "నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్." అన్న వాక్యము క్రొత్తదిగాదు కదా. కర్త కారయిత యుండవలయుఁ గదా. లోకవ్యవహారము కొఱకుఁ గదా యీవిడంబన. అది సక్రమముగనే సాగింపఁదలఁచియే శ్రీరాముఁడు కార్యదీక్షుఁ డయ్యెనని మన మెఱుంగుట లెఱుఁగు. ఈఘట్టమున నధ్యాత్మరామాయణమును బరికింతము.

"తతస్సముద్రమావేక్ష్య రామో రక్తాంతలోచనః. ౬౦
పశ్య లక్ష్మణ దుష్టోఽసౌ వారిధిర్మాముపాగతం,
నాభినందతి దుష్టాత్మా దర్శనార్థం మమానఘ. ౬౧
జానాతి మానుషోఽయం మే కిం కరిష్యతి వానరైః,
అద్య పశ్య మహాబాహో శోషయిష్యామి వారిధిం. ౬౨
పాదేనైవ గమిష్యంతి వానరా విగతజ్వరాః,

... ... ... ... ...

పశ్యంతు సర్వభూతాని రామస్య శరవిక్రమం,
ఇదానీం భస్మసాత్కుర్యాం సముద్రం సరితాం పతిం. ౬౩

ఏవం బ్రువతి రామే తు సశైలవనకాననా.

... ... ... ... ...

ఏతస్మిన్నంతరే సాక్షాత్సాగరో దివ్యరూపధృక్." 3 సర్గము.

అని యున్నది. దర్భశయనము బాణప్రయోగము లక్ష్మణుఁడు దాని నిలుపుటయు నిందుఁ గానంబడవు. ఇదియే విశేషము.

## సేతుబంధనము.

* శ్రీరాఘవుం డంతటఁ బొడసూపని సాగరమును జూచి భయంకరవాక్యముల సాగరా! చూడు మిదిగో పాతాళముదనుక నిన్ను శోషిల్ల నొనర్చెద. నాబాణాగ్నుల జలమంతయు నింకఁగా భూగర్భజలము సైత మింకిపోవ జలజంతువులు మాడిపోవ ధూళి పైకి రేఁగునట్లు లొనర్తును. సముద్రుఁడా! నేను సేతువు నిర్మింప నక్కఱలేదు. దానికై శ్రమముల పాలుగాను ధనుర్విచ్యుతబాణములే సేతువగును. కానఁ బాదచారులై వానరవీరులు నిన్ను దాఁటిపోఁగలరు. అవ్వలిదరిఁ జేరఁగలరు. నీవు దానవులకు నునికిపట్టయినవాఁడవు తత్సంగతిచే నా బలపరాక్రమములఁ గనఁజాలకయున్నవాఁడవు. అని యారామమూర్తి బ్రహ్మదండతుల్యసాయకము నందుకొని బ్రహ్మాస్త్రమంత్రముచే నభిమంత్రించి ధనుర్వరమున సంధించి యాకర్ణాంతము లాగెను. అట్లు లాకర్షింపఁగానే భూమ్యాకాశములు వడంకిన ట్లుండెను కొండ లుఱ్ఱూతలూఁగెను. లోకమంతయు నంధకారావృత

* ఇది యిరువదిరెండవసర్గమునఁ గల కథ.

మయ్యెను. అనేకభయచిహ్నములు కనఁబడినవి. ఆబాణము చూడఁజాలనంత వెలుఁగుతోఁ బ్రకాశించెను. సకలభూతము లాకులతం గాంచినవి. అట్లు రామమూర్తి బ్రహ్మాస్త్రము తొడుగఁగనే సముద్రము జలజంతువులం గూడి కలవిలంపడి యెను. చెలియలికట్ట దాఁటి యామడదూరము పోయినది. పలాయనమగుటం గాంచి బాణప్రయోగము చేయ శ్రీరాముఁడు సాహసింపక పోయెను. అంతఁ బొడవుగా లేచిన జలముల నడుమనుండి సముద్రుఁడు లేచి మేరుపర్వతమున నుదయించుసూర్యునివలెఁ గనంబడియెను. అత్తఱి నాతఁడు భయంకరాస్యములుగల సర్పములతోఁ బొడకట్టెను. రక్తాంబరముం దాల్చి కనకభూషణభూషితుఁడై రక్తమాల్యములం దాల్చి సాక్షాత్కరించెను. శ్రీరామునిం జేర్కొని దోసిలొగ్గి శ్రీరామచంద్రా! మహాత్మా! నన్ను లోఁతుగాక యుండుమందువా? భూమ్యాదిపంచభూతములు శాశ్వతస్వీయమర్యాదనొంది తమస్వభావముల వదలక యుండును. అట్లే నేను లోఁతుగలిగి దాఁటరాకుండుట స్వభావమే. నే నిట్లే యుండందగు. దాఁటఁదగినట్లుండుట నాకు స్వభావము కాదు. ఉన్నదునట్లు విన్నవించితి. ఇక్కారణమునుబట్టియే నీకడ రాకయుంటిని. శ్రీరామా నీవు రాజపుత్త్రుఁడవు. కాన మర్యాదాస్థాపకుఁడవు. నేను ధనాశాలోభాదులవలన జలమును స్తంభింపఁజేసిన జంతువులకు భీతిగలుగును. కనుక జలమును స్తంభింపఁ జేయఁజాలను. ఐన నా కవకాశ మున్నంతవఱకుఁ దోడుపడియెదను. నీబలములు దాఁటువఱకు జలములం బోవుమార్గమున మకరాదిజంతువులు బాధింపకయుండును. ఇద్దాని నొనరింతును. వాన

రులు సేతుబంధనము చేయుతఱిఁ దదుచితవస్తువులు చెదఱి పోవకుండ సేతుపుమార్గ మొదఁగూడునట్లు చేయుదును. అని మనవి చేసెను.

అప్పుడు శ్రీరాముఁడు సాగరుం గని అట్లగునేని నాయీబాణ మమోఘము. దీని సంధించితిని. ఎచ్చటవైతును? చెప్పుమనఁగా నతఁడు బాణమును వీక్షించి యభిమతము నేఁటికి సిద్ధించినది కదా యనుకొనుచు నిచ్చటికిఁ జెంత నుత్తర భాగమునందు ద్రుమకుల్యనామకరమణీయప్రదేశము కలదు. అది నీవలె లోకమున ఖ్యాతి గాంచినది. అందుఁ బాపాత్ములు నాశత్రువు లనేకులు చూడ భయంకరాకారులు భయంకర కార్యముల నొనరించుచు నాజలమును ద్రావుచున్నారు. పాప కర్ము లగువారిసంస్పర్శము నాకు నోర్వరాకున్నది. కావున నమోఘమగు నీతీవ్రబాణమును వారలపై వైచి సార్థకముగా నొనరింపుము. అని సముద్రుఁడు విన్నవింపఁగా వీరుండగు నారా ముఁడు సాగరుని వాంఛచొప్పున వ్రేలం దానిం జూపఁగా దానిపై నాయస్త్రమును బ్రయోగించెను. దానిం బ్రయో గించిన స్థలము మరుకాంతారమని ప్రసిద్ధి నొందినది. ఆసాగర జలము పైకెగసెను. మహాధ్వని కలిగెను. అట్టు లాచోటును దహించి యంత దానికి వరం బొసంగెను. దానిచే నామరు కాంతారము పశువులకుఁ గావలసినతృణము లొనగునవి సమృద్ధ ముగాఁ గల్గి రోగము లారంభించునపుడే నశించునవియై ఫల మూలాదులతోఁ గులుకుచుండెను.

అంత శ్రీరాముని మహాద్భుతకార్యములం జూచి సాగ రుఁడు మహాప్రభూ! ఈనలుఁడు విశ్వకర్మకుమారుఁడు.

ఈతనితండ్రి నావంటి కుమారుఁడు నీకుం గలుగుం గాక యని భార్యకు వరమిచ్చెను. ఆమె యట్లే వీనిం గాంచెను. శిల్పవిద్యలందు వీఁడు తండ్రియంతవాఁడు. ఈతఁడు నాయందు సేతువు నిర్మించుం గాక. అది మునుఁగకయుండ నేను ధరించెదను అని విన్నవించి సాగరుఁ డదృశ్యుం డయ్యెను. అపుడు బలవంతుఁడగు నలుఁడు లేచి శ్రీరామునిం గాంచి నాతండ్రి యనుగ్రహించిన సామర్థ్యమువలన విశాల సాగరమునందు సేతువు నిర్మించెదను. సాగరుఁ డున్నమాట నే చెప్పినాఁడని యంత వానరవీరులం గాంచి లోకమందు మానవునకు దండమే మేలయినయుపాయమని నాయూహ. దయావిహీనునియందు క్షమగాని సామముగాని దానముగాని యుపాయము గాదు. భయంకరుఁడగు నీసముద్రుఁడు సగరుల వలన వృద్ధిచేయంబడినవాఁడు. ఐన నాయుపకారమునఁ గాక దండించునను భీతిచేతనే సేతువును గట్టఁగాఁ జూచుకోరికతో స్థలము నొసంగెను. విశ్వకర్మ నాతల్లికి మందరాచలమున వర మొసంగెను. నే నావిశ్వకర్మ కౌరసపుత్త్రుఁడను. శిల్పవిద్య నెఱుంగుదును. సాగరము దీనిని నాకు స్మృతికిఁ దెచ్చినాఁడు. అతఁడు చెప్పినది నిజమే. ఆత్మస్తుతి దోషమని యెఱుంగుదు. కాని చెప్పినట్లు సేతువును గట్టి చక్కఁగాఁ దీర్తును ఇచ్చుగల దేని వానరోత్తము లిపుడే పాషాణాదులం దెత్తురు గాక.

అనునంత రాముఁ డానతీయఁగా వానరులు పెల్లుబ్బి వందలకొలంది వేలకువేలుగాఁ గూడి నలుఁగడలకుం బరుగు లిడి యడవుల కరిగిరి. అందలి నానాతరువులం బెకలించి యీడ్చుకొని వచ్చిరి. కొండల నందుం బడవైచిరి. జలములు

పై కెగురుచుండెను. కొందఱు చక్కఁగా నా సేతువుండుటకై సూత్రములను బట్టుకొనిరి. నలుఁడాసాగరమునడుమ గొప్ప సేతువును గట్టెను. కపు లాతనికిం దోడుపడి కట్టసాగిరి. కొందఱు వనచరులఁ ద్వరపెట్టుచుండిరి. కొందఱు నిమ్నోన్నత ములఁ బరికించుచుండిరి. వానరులు పైభాగము మెత్తగాఁ జూచినచెట్లను వైచుచుండిరి. వారు తెచ్చిన గండోపలములు లోనగువానిని వైచుచుండ మహాధ్వని గలిగినది. మొదటి నాఁడు పదునాలుగు యోజనములదూరము సేతువు నిర్మించిరి. రెండవదిన మిరువది యోజనములు, మూఁడవదినమున నిరువదొక్క యోజనములు, నాల్గవదినమునందు నిరువది రెండు యోజనములు, పంచమదివసంబున నిరువదిమూఁడు యోజనములు కట్టి సేతువు పూర్తి నొందించిరి. నలుఁడు తండ్రియగు విశ్వకర్మ యంతటిశక్తికలవాఁడు గావున నట్లనుపమానపద్ధతిని సేతువు నిర్మించెను. అది యాకసమున ఛాయాపథము వలెఁ గనుపట్టుచుండెను. దేవగంధర్వాదు లాచిత్రమును జూడ వచ్చి యంబరమున నిల్చియుండిరి. పది యోజనముల వెడల్పు నూఱు యోజనముల నిడివి కలిగి దుష్కరమనందగి యది యుండెను. దానిం గాంచినదేవత లచ్చెరువందిరి. మున్నెవ్వ రెఱుంగనిదిగా నదియుండ భూతములెల్ల వింతగాఁ జూడసాగినవి అది సాగరమునఁ బాపటవలెఁ గనఁబడుచుండెను.

అంత విభీషణుఁడు గదాయుధము చేతంబూని మంత్రి చతుష్టయముం గూడి శత్రువులు పైఁబడినను వారల నడంచుటకై సాగరదక్షిణతీరమునఁ గాచియుండెను. సత్యపరాక్రముఁ

డగు రామునింగని వానరాధిపతి సుగ్రీవుఁడు నీవు హనుమంతుని నధిరోహింపుము. లక్ష్మణుఁ డంగదు నారోహించుంగాక. చాలదూరము గాన మీరు నడువఁజాలరు. వీరిరువురు మిమ్మాకాశగమనమునఁ దీసికొనిపోయి దాఁటింపఁగలరు. అంత శ్రీరాముఁడు ధనుర్ధారియై లక్ష్మణసుగ్రీవులం గూడి యాసేనకు ముందుగాఁ బోయెను. అత్తఱిఁ గొందఱు నడుమం బోయిరి. కొందఱు పార్శ్వములం బోయిరి. కొందఱు స్థలము లేమి జలములంబడి లేచి సేతువెక్కిరి. ఆప్రయాణపుఁజప్పుడు సాగరఘోషమును మించెను. బలములన్నియు సాగరదక్షిణ తటమును జేరినవి. దేవతాదులు వచ్చి శ్రీరాముని మంగళజలముల నభిషేకించి శ్రీరామా! శత్రువుల గెలువుము. భూమండలము నెల్లఁ బాలింపుము. అని వినుతించిరి.

మహామతులారా! ఈభాగమునఁ గలవిశేషములం బరికింతము. ఇందు సేతుబంధనము విషయము. రాముని యస్త్రములకు భయంపడి కనఁబడుట లోనగువిషయము లంగములుగా నిం దున్నవి. ఇప్పటివారి కివి యచ్చెరువుగాఁ దోఁపకమానవు. కారణ మేమనఁగా నాగరికవృద్ధి యగుకొలఁది దేవతాభక్తి తగ్గును. కాని సభావేదికలయందు భక్తి నభినయించుట వృద్ధి యగును. దేవతావిశ్వాసము శూన్యమైనఁ గదా భక్తి నశించును. కావున భగవచ్ఛక్తి యప్రమేయమనువిషయమును వారెఱుంగ రనవచ్చును. ప్రకృతిచిత్రములు పదార్థవిజ్ఞాన శాస్త్రమున లేనివి కనఁబడుచుండఁగాఁ గాంచుచుండియు మోసపోయి తమకుంగల యల్పజ్ఞానమునే నమ్మి భక్తినిధిని గోల్పోవుదురు. ఇదియే కడుంగడు విచిత్రము. అట్టివారు విశ్వ

సింపరని మనము భగవచ్ఛక్తిని బొగడక యుండవచ్చునా? భక్తినిధిని గోలుపోవచ్చునా? కావున విమర్శించి శక్తిఁ గొలఁది దానినెఱింగి తరింతము.

"విచిన్వన్ నాభిజానాసి పౌరుషం వాపి విక్రమం,
దానవాలయ సంతాపం మత్తో నాధిగమిష్యసి. ౪
బ్రాహ్మేణాస్త్రేణ సంయోజ్య బ్రహ్మదండనిభం శరం,
సంయోజ్య ధనుషి శ్రేష్ఠే విచకర్ష మహాబలః. ౫

అని మూలము. దానవాలయ = రాక్షసులకు నివాసభూతుఁడ వనుట. దుష్టజనసహవాసమున నాశక్తి నెఱుంగఁజాలక యున్నావు. సత్సంగతి శ్రేయోదాయకము. దుష్టసంగతి సంతాపదాయకము గాకపోవునా? కావున బ్రహ్మదండతుల్యమగు బ్రహ్మాస్త్రమును వైచి ని న్నలయించెద ననియె. శ్రీరామునికడనున్న యస్త్రములలో బ్రహ్మాస్త్ర ముత్తమోత్తమమని యేర్పడుచున్నది. బ్రహ్మదండమనఁగా,

"పితామహాత్మజః క్రూరస్త్రివర్ణశ్శిఖరాన్వితః,
బ్రహ్మదండాహ్వయః కేతుస్సర్వభూత వినాశనః."

అని నారదసంహితయం దున్నట్లు గోవిందరాజులు వ్రాసిరి. ఆగమశాస్త్రమునందు విశేషించి యస్త్రవిద్యయందు బ్రహ్మదండమనునస్త్ర మున్నది. అది యత్యంత తీవ్రమైనది. బ్రహ్మాస్త్రము బ్రహ్మదండము నను నివి రెండును బ్రహ్మదేవతాకములగు నస్త్రములే. ఈ రెండు నప్రతిహతములే. అనన్వయాలంకారముం బోలి యనన్యసామ్యమునకుఁ దగినవి గాక యసదృశశక్తివిరాజితములే. ఐన నత్యంతదారుణాకృతిం గలదని తెలుపుటకే యిట మహర్షి "బ్రహ్మదండనిభం శరమ్" అని ప్రయో

రించెనని యెఱుంగందగు. అట్టి మహనీయాస్త్రమును శ్రీరాముఁడు శరాసనమున సంధించి బ్రహ్మమంత్రమున నభిమంత్రించి నారి లాగెను. అనఁగా జలసృష్టి నశింపఁజేయ నగ్ని ప్రతిరూపశాస్త్రమును బ్రయోగింపఁబూనెనని భావము.

> "తతో మధ్యాత్సముద్రస్య సాగరస్య సముత్థితః,
> ఉదయం హి మహాశైలాన్మేరోరివ దివాకరః. ౧౭
> పన్నగైస్సహ దీప్తాస్యైస్సముద్రః ప్రత్యదృశ్యత,"

అని మూలము. జలసృష్టినే లయింపఁజేయఁబూని సృష్టికర్త మంత్రమునే యభిమంత్రించి ప్రయోగింపఁ బూనఁగా సముద్రుఁడు జలములనడుమ నెత్తుగా నుండు భాగమున నిలువంబడి శ్రీరామునకుఁ గనఁబడియెను. భయంకరము లగుసర్పములుకూడ నుండెను. అని యర్థసారము. జలాధిదేవతకు జలజంతువులే సేవకులు గదా. ఆదేవతకు భయంకరసర్పములు సౌమ్యములుగనే యుండును. స్థలసృష్టి నుండువారలకు నవి విరోధములు ప్రాణాంతకరములు నగు. వానికివియు నట్లే యని యెఱుంగవలయు. జలముల నుపాసింప జలాధిదేవత ప్రత్యక్షమగు. అగ్ని నుపాసింపఁగాఁ దదధిదేవతయుఁ గనంబడు. ఇట్లే సకలభూతములకు నధిదేవత లుండుట తెల్లము. ఉపాసకుఁడు తనమనోవాంఛానుకారిరూపమును దలంపఁగా నతనిభక్తి సాంద్రము కాఁగా దాన నలరి పరమేశ్వరుఁ డతని మనస్సునఁ గలరూపమునఁ గనంబడునని సారము. ఈవిషయము మది నాటియున్నయెడల నొకదేవతకంటె నింకొక్కదేవత హెచ్చు. అను దుర్భావ మెగిరిపోవును. మతాభినివే

శము తగ్గును. దాన మనశ్శాంతి చేకూరును. ఇంతకంటెం గావలసిన ఫలమేదియుం గానరాదు.

> "సాగరస్సముపక్రమ్య పూర్వమామంత్ర్య వీర్యవాన్. ౨3
> అబ్రవీత్ప్రాంజలిర్వాక్యం రాఘవం శరపాణినం,
> పృథివీవాయురాకాశమాపో జ్యోతిశ్చ రాఘవ. ౨౪
> స్వభావే సౌమ్య తిష్ఠంతి శాశ్వతం మార్గమాశ్రితాః,
> తత్స్వభావో మమాప్యేష యదగాధోఽహమప్లవః. ౨౫
> వికారస్తు భవేద్గాధ ఏతత్తే ప్రవదామ్యహమ్,"

అని మూలము. సాగరునివాక్యము లివి. భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము నను నీపంచమహాభూతములు మార్పునొందనిమార్గము నాశ్రయించి యుండును. వానివాని వృత్తులు మారనక యథాపూర్వముగా నుండును. సృష్టికర్త యిష్టమెద్దియో అదియే వానివృత్తి. ఇంచుకంతయు మార్పు నొందవు. అట్లే జలమయశరీరము నాది. ఇది యగాథము, తరింపరానిది, అగుట స్వభావము. వికారము నొందరాదు. వికారమునొందిన సృష్టికే హాని, కాన మార్పునొంద సాధ్యము కాదు. అని సముద్రుండు స్వాశయమును బోధించెను. మానవాదిసృష్టియందు మార్పు గలదు. ఏల ? కర్మముల ననుసరించి యనేకవికారములు గలుగుచుండును. అవి వలదనుకొన్నను మానునట్టివి కావు. మానవుం డవశుండు కదా.

> "స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా,
> కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్."

అన్న గీతావాక్యమే యిందులకుం బ్రమాణము. కర్మనిబద్ధులు.

స్వతంత్రులు గారు. స్వతంత్రుల మనుకొనుట కేవలాహం కారమే. కాని తత్త్వమున నది లేనే లేదు. సంకల్పములు ఫలింపకుండుట. సంకల్పరహితముగాఁ గొన్ని ఫలించుట యేల? కర్మాధీనముగా ఫలములు గలుగుచుండ మానవుఁడు తన స్వాతంత్ర్యమును బ్రకటించుకొనుట వెఱ్ఱితనము గాక మఱే మగును? ఈవిషయమును వాల్మీకిమహర్షి మనకు సాగరుని వాక్కులనుండి బోధించెనని మనము తెలిసికొనవలయును.

"న కామాన్న చ లోభాద్వా న భయాత్పార్థివాత్మజ. ౨౬

గ్రాహనక్రాకులజలం స్తంభయేయం కథంచన,

విధాస్యే రామ యేనాపి విషహిష్యే హ్యహం తథా. ౨౭

గ్రాహా న ప్రహరిష్యంతి యావత్సేనా తరిష్యతి,

హరీణాం తరణే రామ కరిష్యామి యథాస్థలం." ౨౮

అని మూలము. నాజలములను స్తంభింపఁజాలను. అట్లొనర్చిన జలగతజంతువుల కపాయము కలుగును. అప్పని నేఁజేయరాదు కదా. ఇంకొకసహాయము చేసెదను. నీసేనలు దాఁటినంతదనుక నాయందలి మకరాదులు బాధింపకయుండ స్తంభింతును. సేతువున కనుకూలముగనుండుదారి చూపుదును. ఇది నాచేత నగుసాయమని తెల్పెను. దీనిభావ మేమి? ప్రాయికముగా మనస్సు సంకల్పించిన ట్లింద్రియములు ప్రవర్తించును. ఒకవస్తువుపై మనస్సునం దేవగింపు గలిగిన నది జిహ్వకు నింపుగాదు. మనఃప్రవృత్తినింద్రియము లనుసరించి వర్తించుననికదా తేలిన సారము. జలాధిదేవత స్తంభించుట యనఁగాఁ బోవుచున్న యీజంతువుల భక్షింతమనుమాహ జంతువులకుఁ గల్గకయుండు

నట్లు సంకల్పించుట యని భావము. దాని సంకల్పబలమున జంతువులెల్ల నిరుద్యోగస్థితియం దుండును. అనఁగా నిరంతర ప్రవృత్తిని మాని యపుడుండునని తాత్పర్యము. వానికిఁ గల ప్రవృత్తి తున్నివృత్తియుఁ గాదాచిత్కమగు సంసారసుఖే చ్ఛయుఁ గదా. ధనాశాదులు వానికి లేవని విదితమే. జలముల ననువగుత్రోవ చూపింతుననఁగా నలలు మొదలగునవి లేక యుండ నిలుపుదునని భావము కావచ్చును.

"అమోఘోఽయం మహాబాణః కస్మిన్ దేశే నిపాత్యతాం.

... ... ... ... ...

ద్రుమకుల్య ఇతి ఖ్యాతో లోకే ఖ్యాతో యథా భవాన్. 3౧

ఉగ్రదర్శనకర్మాణో బహవస్తత్ర దస్యవః,
ఆభీరప్రముఖాః పాపాః పిబంతి సలిలం మమ. 3౨

తైస్తు సంస్పర్శనం పాపైర్న సహే పాపకర్మభిః,
అమోఘః క్రియతాం రామ తత్ర తేషు శరోత్తమః." 33

అని మూలము. రామబాణము వ్యర్థము కారాదు. కాన నీబాణము నెందు వైవఁదగునో తెల్పుమని రాముఁడడుగఁగా నెచ్చోటు వైవఁదగినదో దాని నతఁడు తెల్పెను ఇది సామాన్యదృష్టికి నసంగతముగాఁ దోఁచును. ఇట్లు దానిపద్ధతిని గ్రహింపందగు. జలస్తంభనాదు లత్యల్పసిద్ధులు. రక్కసులకవి విశేషించి తెలిసియుండును. మహాక్రూరకర్ము లవ్వాని నేర్చుకొని యభ్యసించి స్వాధీనమున దాని నునుచుకొని యుందురు. జలములందు దాఁగియుండి సమయమును గనిపెట్టి యొరుల హింసించుచుందురు. వారు మానవమాంసశోణితాభిలాషులు.

కావున మార్గస్థులను, దేశములకుం జని యందలివారిని హింసించుచుందురు. వారినిబట్ట నలవికాదు. కనంబడకయు నుందురు. అట్టి పాపాత్ములపైఁ బ్రయోగించి వధింపుమని ప్రార్థించెను ఇట్టిసిద్ధు లీకాలమున లేకుండుటంబట్టి యచ్చెరువుగాఁ దోఁచునేమో కాని పూర్వకాలమున నివి బహుళత్వముగాం జెడివియే యని యెఱుంగవలయు.

"అయం సౌమ్య నళో నామ తనుజో విశ్వకర్మణః. 43
పిత్రా దత్తవరశ్శ్రీమాన్ ప్రతిమో విశ్వకర్మణా,
ఏష సేతుం మహోత్సాహః కరోతు మయి వానరః. 44
తమహం ధారయిష్యామి తథా హ్యేష యథా పితా,"

అని మూలము. విశ్వకర్మకుమారుఁడు నళుఁడు. విశ్వకర్మ వానరుఁడు కాఁడు. దేవశిల్పి. అతనికొడుకెట్లు వానరుఁడయ్యె నని సందియమందకుఁడు. తిర్యగ్యోనులయందు రేతస్సు నునుచుట పూర్వకాలమున నున్న ట్లనేకదృష్టాంతములు కలవు. వానరులకు నరులకు సంభాషణాదు లాకాలమునఁ గలవు. అట్లే ఖగములకు మనుజులకు స్నేహసంబంధ ముండెడిది. తల్లి తన్నుఁ బ్రేమించినమహాత్ముని వరమడుగుట స్వభావవిరుద్ధము గాదు. తపశ్శక్తికి ఫలముగా నతఁ డాశీర్వదించుటయు విరుద్ధాచారము కాదు. అట్టివాఁడే నళుఁడు. అతఁడు నాపై సేతువు నిర్మించిన నది పడిపోవకయుండ ధరింతునని సముద్రుఁ డనెను. శిల్పవిద్యానిపుణుఁడు గాన నళుఁడు సేతునిర్మాణదక్షుఁడని భావము. ఈకాలపుశిల్పమునకు నాకాలపుశిల్పమునకు హస్తిమశకన్యాయము ననుసరించి తారతమ్యము కలదు. పాషాణదార్వాదులకు జాగ్రత్స్వప్నసుషుప్తు లనునవస్థలు గలవనియు,

సంతోషానుభవాదులుకూడఁ గలవనియు శాస్త్రములు గలవు. "అంతస్సంజ్ఞా భవంత్యేతే సుఖదుఃఖసమన్వితాః" అనువానిని నమ్మి తత్తదుచితసమయములనుగనిపెట్టి యాదేవతల నుపాసించి వానిని గ్రహించువారు. వారి కవియు ఫలము నిచ్చుచుండె డివి. నళున కావిధము తెలియును. అదియే శిల్పవిద్యానైపుణ్య మని యర్థము. వాని నారాధించి సమయమును గనిపెట్టి యెత్తిన నెంత గండోపలమైనను తేలికగా నుండును. యంత్రములు లేని యాకాలమున వారలెట్టు లట్టివాని నిలుపఁ గలిగిరి? తూలమువలె నది తేలికగా నుండును. వృక్షశాస్త్రవేత్తలిపు డావిషయమును దెలుపుచుఁ దమయనుభవమున దానిని సిద్ధాంతము చేయుచున్నారు. దాని గాంచి కొందఱు విచిత్రమిదియని వినుతించుచున్నారు. శిల్పశాస్త్రపండితుఁ డనఁగా వస్తుతత్త్వవేత్త కావలయును. కాని యేవో నాలుగుపనులు చేసి మెప్పు పొందుట కాదు. నళునికరస్పర్శము గలవస్తువు లన్నియుఁ దేలి జలములపైన నుండును. మునుఁగవు. అదియే యతనియందుఁ గల మహాద్భుతశక్తి. కావుననే సాగరుఁ డాతనిచే సేతువును నిర్మింపుమని రామునితో విన్నవించెను.

"సూత్రాణ్యన్యే ప్రగృహ్ణంతి వ్యాయతం శతయోజనం,
నళశ్చక్రే మహాసేతుం మధ్యే నదనదీపతేః." ౬౧

అని మూలము. సేతునిర్మాణమునందు నాసక్తిగల కొందఱు వానరులు కుటిలత నది గాంచకయుండ సూత్రములు పట్టుచుండిరి. అని యున్నది. శిల్పశాస్త్రము ననుసరించి యిట్లుండవలయు ననునియమములఁ బాటించి సూత్రములు కొందఱు పట్టి పరికించిరనఁగా భావమేమి? శాస్త్రజ్ఞులు వానరు లందుఁ

గొందఱు గలరనియే కదా భావము. ఇప్పటివలె సేతునిర్మాణ మప్పుడు లేకున్నను మంచిపద్ధతు లప్పటికిఁ దగినట్టులుగా నున్న వని యేర్పడియెడుఁ గదా. ఇప్పటికంటె నాకాలమునఁ జేసిన పనులు దృఢతమము లనవచ్చును. పురాతనశిల్పము లింతదనుక నుండుటయు నిప్పటి వప్పుడే జీర్ణదశను బొందుచుండుటయు నుదాహరణములు కాకపోవునా? పరీక్షయం దాఱితేఱినవా రప్పుడు లేకున్నను శాస్త్రజ్ఞులు కలరనియే మన మూహింపవలయు. క్షీరోపలస్వప్న మనుఖ్యాతిం గాంచిన యొక్క దివ్యసౌధరాజ మాగ్రానగరమున నిపుడున్నది. దానిదృఢత్వము రామణీయక మిప్పుడెందేని గలదా యని ప్రశ్నించుకొందము. సమాధాన మారకుండుటయే యనుకొందము. ఇట్టివెన్ని యేని చూపవచ్చును. ఇపుడు ప్రతిక్షణవిలక్షణములుగా నుండున ట్లపుడు లేవేమో యని నాడెందము సంశయాకుల మగుచున్నది. కాని పూర్వకాలమున శిల్పము లేదన్న యసంగతోక్తులకుఁ దలయొగ్గునంత యవివేకము నాకు లేదు.

"కృతాని ప్రథమేనాహ్న యోజనాని చతుర్దశ." ౬౬

అని మూలము. ఐదుదినములలో సేతునిర్మాణము పూర్తి యయ్యెనని మహర్షి తెలిపెను. పదునాలుగు, ఇరువది, ఇరువదొకటి, ఇరువదిరెండు, ఇరువదిమూఁడు యోజనములు వరుసఁగా నైదుదినములు కట్టిరి. సుధాలేపనాదు లట్టితొందరలో నుండ శక్యము కాదు. అపారసేనలు నడిచిపోవునట్లు నిర్మింపఁబడిన దని యూహింపవలయు. జలముల పైచిన పర్వతశిఖరములు మునుఁగకయుండుట యచ్చెరు విక్కాలపువారికిఁ గొలుపక పోదు. దైవశక్తి యెఱుంగకపోవుటయే యందులకుఁ గార

ణాము. వరము లిచ్చుట. అవి ఫలించుట యిక్కాలమున గగన కుసుమమైనది కదా. కావున వీరి కవియన్నియుఁ గ్రొత్తలుగనే తోఁచుటలో నచ్చెరు వేమున్నది? ఇప్పుడట్టి దేవారాధకులు లేరనుటయే యిందులకుఁ దార్కాణము. పదునాలుగు యోజనములు సేతు వొక్కదినమునఁ గట్ట సాధ్యమా యని సంశయింపఁ బనిలేదు. కోట్లకుమించిన వానరసేనలు చాల కొంచెముదూరమే కట్టిరే యనవలయునే గాని యింతదూరము కట్టిరా యనఁ బనియుండదు. ఆ సేతునిర్మాణము దేవతలకుం గూడ నచ్చెరువు గొలుపుచుండెనని మహర్షి పలికెను. భగవత్సంకల్ప మప్రతిమానమని దానికి సాధ్యముగానిపనులు లేవని నమ్ముట మంచిది.

ఈవిషయ మధ్యాత్మరామాయణమున నెట్లుండునని విచారింతము.

"త్రాహి త్రాహి జగన్నాథ రామ త్రైలోక్యరక్షక. ౨౦
జడోఽహం రామ తే సృష్టస్సృజతో నిఖిలం జగత్,
స్వభావమన్యథా కర్తుం కశ్శక్తో దేవనిర్మితం. ౨౧
స్థూలాని పంచభూతాని జడాన్యేవ స్వభావతః,
సృష్టాని భవతైతాని త్వదాజ్ఞాం లంఘయంతి న. ౨౨
తామసాదహమో రామ భూతాని ప్రభవంతి హి,
కారణానుగమాత్తేషాం జడత్వం తామసం స్వతః. ౨౩
నిర్గుణస్త్వం నిరాకారో యదా మాయాగుణాన్ ప్రభో,
లీలయాంగీకరోషి త్వం తదా వైరాజనామవాన్. ౨౪

... ... ... ...

శరణం తే ప్రజామీశ శరణ్యం భక్తవత్సలం,
అభయం దేహి మే రామ లంకామార్గం దదామి తే."

అని కలదు. శ్రీరాముని శరణుచొచ్చుటకు నాతనిమహత్త్వముగు వర్ణించెననుట తప్ప విశేష మిందేదియుఁ గానరాదు. తరువాతికథాంశమును బరింతము.

## మహోత్పాతములను రాముఁడు తమ్మునకుం జూపుట

* శ్రీరాముఁ డంత నిమిత్తతత్త్వజ్ఞుం డగుట నప్పటి నిమిత్తములం గొన్నింటిని గాంచి చిరకాలకాంక్షిత మగు యుద్ధము చెంతకు రాఁగా సంతోషించి యది లోనిముడక యుప్పొంగఁగా సౌమిత్రిని గౌఁగిలించుకొని వత్సా! మనము జలఫలాదులుగలతావు వాసస్థలముగా నేర్పఱచుకొని సేనలను విభజించి గరుడవ్యూహముగాఁ బన్ని సుఖముగా నుందము. క్షుద్రులకు నాశము కలిగించుచు వీరులకు వీరస్వర్గము నొసంగుచు నుండుసంగరము సమీపించుచున్నదని తోఁచెడిని. వాయువులు కలుషగతుల వీచుచున్నవి. భూమియుఁ గంపించుచున్నది. పర్వతోర్ధ్వభాగము లూఁగులాడుచున్నవి. తరువు లాకస్మికముగ పడిపోవుచున్నవి. తోఁడేలువంటి వన్నెగలిగిన మేఘములు దేగలు లోనగు పక్షులయాకారములు గలిగి చూడ శక్యముగాక కఠినధ్వనులతోఁ గూడుటంబట్టి రక్తయుక్తజలమును వర్షించుచున్నవి. సంధ్య రక్తచందనమువలె నొప్పు మొయిళులం గూడి భయము గొలుపుచున్నది.

* ఇది యిరువదిమూఁడవసర్గమునఁ గల కథ.

సూర్యుఁడు జ్వలించుచుండఁగా నతనిగోళమునుండి యగ్నిపిండములు పడుచున్నవి. సూర్యుఁడు నిప్పులుగురియునట్లు మండుచున్నాఁడు. మృగపక్షులు విన్నఁదనమున సూర్యుని జూచుచు గట్టిగా నార్చుచు భయమును దెలుపుచున్నవి. రాత్రియందుఁ జంద్రుఁడు కాంతి దూలి సంతాపము గలిగించుచున్నాఁడు. సూర్యబింబము చుట్టు చివరభాగమందు నల్లని కిరణమండలమును, దానికివెనుక నెంత రక్తకిరణమండలమును, నడుమ మిక్కిలి రక్తిమగలదియు హ్రస్వము భయంకరమునై యెన్నండును జూడనిదిగాఁ బ్రళయకాలపరివేషమువలెఁ బరివేషము చూపట్టుచున్నది. వత్సా! పరిశుద్ధమైన సూర్యమండలమున ఛిద్రమువలె నల్లని కళంక మగపడుచున్నది. చుక్కలు మిగుల ధూళిగ్రస్త మలినాకృతులం గన్పడుచున్నవి. అవి లోకప్రళయమును సూచించుచున్నవి. చూడుము. కాకులు డేగలు గృధ్రములు లోనగు బలముగల్గినపక్షులను క్షుద్రపక్షులు క్రిందు చేయుచున్నవి నక్కలు విశేషించి యమంగళస్వరములఁ గావించుచున్నవి. ఇఁక రక్షోవానరవీరులు పరస్పరము తీవ్రాయుధములచేత భూమిం గప్పుచు రక్తపాతమునఁ బంకము గల్గింపఁగలరు. ఆలస్యము వలదు. లంకకు వేగముగాఁ బోవుదము. అని తెల్పి యుద్ధమగునన్నసంతోషమున విల్లు దాల్చి లంకానగరాభిముఖుండై సేనలకు ముందుగాఁ బోయెను. విభీషణసుగ్రీవులు మున్నుగాఁగలవీరులు శత్రువధేచ్ఛలు పైకొన సింహనాదము లొనరించుచుం బోయిరి. వానరు లుత్సాహసూచకములుగా వాలచాలనాదు లొనరింపఁగా రాముఁడానందించెను.

## శుకుఁడు సీతను రామున కిమ్మని రావణునకు హితముఁ దెల్పుట.

* వానరబలములు రామరక్షితములై భయంకరముగా నుండినవి. నివాసస్థలముల నేర్పఱచుకొని యుండెను. లంకానగరమునుండి సైనికులసింహనాదములు వాద్యధ్వనులు వానరులకు వినవచ్చినవి. వానినిమించునట్లు వీరు నార్చిరి.రక్కసులుం గూడ వానరులధ్వనుల నాలకించిరి. రాముఁడు సకలాలంకార శోభితమగు లంకానగరమును జూచి మనసు కుందునొందఁగా నంతలో సీతంగూర్చి యయోధ్యయందు సకలరాజభోగముల ననుభవించుచుండు జానకి ఈలంకయందు నంగారకగ్రహపీడిత మగు రోహిణియుం బోలె రావణునిచే బందీకృత యయ్యెఁగదా. అని తలంచుకొనియెను. అంతట నాశూరుఁడు యుద్ధమును బయలువెడలుతఱిఁ బ్రియురాలిం దలుచుకొని శోకించుట మంచిది గాదు. కావున నాదుఃఖము నెట్లో యడంచుకొని నిట్టూర్పులుపుచ్చి సౌమిత్రిం గాంచి తత్కాలహితముగ నిట్లు పలికెను అన్నా! అత్యున్నత సౌధరాజివిరాజితంబగు నీలంకం గాంచుము. అనేక వనోపవనములు లోనగునవి యుండఁగా నెంతయో వింతగానున్నది. అని తెలిపి నీతిశాస్త్ర ప్రయోగకౌశలముల నేర్పఱి గాన వ్యూహము పన్నువాఁడై వనచరవరులం గాంచి యంగదనీలులు తమసేనలతో సేనలకు వక్షమున నుందురు గాక. ఋషభుఁడు తనబలములతో సేనా దక్షిణపార్శ్వమును గాచియుండం జను. గంధమాదనుఁడు తనరాణువతో వలపలిపార్శ్వమున నుండుంగాక. నేను సౌమిత్రి

* ఇది యిరువదినాల్గవసర్గమునఁ గల కథ.

త్రియు శిరస్సున నుండుదుము. జాంబవత్సుషేణులు వేగ దర్శియు నను నీభల్లుక వానరవర్యులు మూవురు సేనలతో కుక్షిస్థానమును గాపాడుదురు గాక. వానరేంద్రుఁడు సుగ్రీవుఁడు కపిసేనల పుచ్ఛభాగమును రక్షించుఁ గాక. అని యాజ్ఞాపింపఁగా వార లట్లే గరుడవ్యూహముగాఁ బన్ని యందం దుండిరి. తరుపాషాణ గండోపలశిఖరములం బట్టుకొని రక్షోమర్దనదక్షులై యాసమయమునకు వేచియుండిరి. పర్వతశిఖర ముష్టిఘాతాదులచేత రక్కసుల నుక్కడంప నిశ్చయించు కొనిరి. రాముఁడు సుగ్రీవుం జూచి వ్యూహమును జక్కఁగాఁ దీర్చుపని యైనది కదా. ఇఁక నీశుకుని విడిచిపుచ్చుము. అని పలికెను.

అని రాముఁ డాజ్ఞాపింప నాతఁ డాశుకుని విడిచి పుచ్చెను. మిక్కిలి భయపడు నాశుకుఁడు రామునానతిం జేసి విముక్తుఁడై వెంటనే తన ప్రభువునొద్దకుఁ బోయెను. రావణుఁడు వానింగని నీపక్షములు విఱిగిన ట్లగపడుచున్న వే. అవి బంధింపఁబడినవా యేమి? కపులు చపలచిత్తులు కాన దొరకిన వానిని గట్టివేయుచుందురు గాన నట్టివారికిం జిక్కలేదు గదా. అని ప్రశ్నించెను. అట్లడుగఁగా వాఁడు భయపడుచు స్వామిం గని తనవృత్తాంతమును జెప్పి మఱియు నిట్లనియె. విరాధ కబంధఖరాదులం జంపిన శ్రీరాముఁడు సుగ్రీవాదులం గూడి సీతయుండు నిచ్చోటికి వచ్చియున్న వాఁడు. ఆమహాబాహుఁడు సాగరమున సేతువుగట్టి సాగరమును దాఁటి రక్కసుల లెక్కింపక లంకాద్వారమున విడిసియున్నాఁడు. పర్వతములవలె మహావారిదములరీతిఁ గనంబడు భల్లూకవానరవీరులు లెక్కకు

మించి భూమినంతయు నావరించియున్నారు. దానవ వానర సేనలకు దేవదానవులకువలె సంధి యెంతమాత్రము కుదురదు. వారిదిగో లంకానగరప్రాకారముల లంఘించి రాఁబోవుచున్నారు. వేవేగ సీతను శ్రీరాముని కొసంగుము. యుద్ధమైనఁ జేయుము. ఇందేదియో వేగమ చేయుమనియెను. ఆతని మాటలు విని రాక్షసరాజు కోపరక్తనయనుఁడై కాల్చునట్లు వానిం గనుచు వానితో నోరీ దేవగంధర్వాదు లెత్తివచ్చినను సీతను మాత్ర మీయను. చాలకాలమునుండి యుద్ధము లేక త్రుప్పుపట్టియున్న నా బాణములు రాముదులఁ బీడించుఁ గాక. మహాబలములం గలిసి రామునిసేనల నెల్ల సూర్యుఁడు చంద్రతారలకాంతిఁ గుందఁజేయునట్లు క్రిందుపఱచెదను. నా శక్తిసాహసము లారామునకుఁ దెలియకున్నవి. కనుక నే సంగర మొనర్పవచ్చెను. రాముఁ డెప్పుడు క్రూరఫణులంబోలు నా బాణములరుచి చూచినవాఁడు కాఁడు. కనుక న న్నెదిరింపఁ గోరుచున్నాఁడు. నాపరాక్రమ మాతఁ డెఱుంగఁడు. యుద్ధమన్న నాకు విహారము. ఇంద్రాదులు మహాస్త్రములం బ్రయోగించియు నన్నుఁ జెనకలేకపోయిరే. ఇఁక నీరాముఁ డేమి చేయఁ గలఁడు. అని పలికెను.

## శుకసారణులు కపిసేనం గాంచి పోయి రావణునకుఁ దెల్పుట.

* అంత నారావణుఁడు రామునిరాక విని మంత్రులగు శుకసారణులం గాంచి, "వానరసేన సాగర ముత్తరించి వచ్చినది ఇది మున్ను విన్నది కన్నది నగువార్త గాదు. నమ్మనుగూడ

* ఇది యిరువదైదవసర్గమునఁ గల కథయని తెలియందగు.

నవకాశము లేదు. ఆసేన లుండువిధము నాకుఁ దెలియం దగుం గదా. మీరు వారికిం దెలియకుండురీతిని రహస్య ముగా నాసేనలం జొచ్చి తత్పరిమాణము బలవీర్యాదుల నందు ముఖ్యు లెవ్వరైనదియు నీలోనగు విషయముల నెల్లఁ గనుఁగొని రావలయును.” అని తెల్పెను. వీరలగు వా రిరువురు వానరాకృతులం దాల్చి యాసేనలం బ్రవేశిం చిరి. అప్రమేయమై పులకాంకురములఁ గలిగించుచున్న యాసేనం గాంచి యచ్చెరువందిరి. ఆబలములు శిఖర పర్వత సంధ్ర గుహాసాగరతీర వనోపవనములయందు నిండియుండుటం జేసియుఁ గొంత వచ్చియుఁ గొంత వచ్చుచుఁ గొంత విడి యుచుఁ గొంత విడిసియు నున్నందున లెక్కయిడ నశక్యమై యుండెను. మాఱువేషముల వారు తిరుగుచుఁ బరిశీలించు చుండఁగా, వారిని విభీషణుఁ డెఱింగి పట్టుకొని “శ్రీరామా! వీరు రావణునిమంత్రులు. శుకసారణులు. మనరహస్యముల నెఱుంగ వచ్చిన గూఢచారులు సుమా. యనెను.”

వార లంత బ్రదుకునం దాశమాని దోసిలొగ్గి మేము గూఢచారులమే. చూచిపోవ వచ్చితిమి. అని నిక్కముఁ దెలి పిరి. ఆమాటల విని రావణుని మందబుద్ధికి నవ్వరాఁగా వారితో మీ వచ్చినపనియంతయు నైనయెడల నిష్టాను సారము లంకకుం బోవచ్చు. అట్లుగాక చూడఁదగినది యింక నుండునేని దానిం గూడఁ జూచిపోవచ్చును. ఈవిభీషణుఁడే మీకీసేనలం జూపఁగలఁడు. మీరిట్లు చిక్కినందులకు భయం పడవలదు. ఆయుధవిహీనులను దూతలను వధింపందగదు. మీరు నిరాయుధులగుట వధమున కర్హులు గారు. అని విభీ

పఙుంగని వీరు చారులు. అయిన భయంపడుచున్న వారు. అభయ మడుగుచున్నారు. కాన వీరిని శత్రుపక్షమువారని సంశయింపక విడిచిపుచ్చుము. అని విధించి వారలం గాంచి మీ రిరువురు లంకకుం జని రావణుం గని నేనిపుడు పలికిన వన్నియు వదలక వినిపింపుఁడు. మఱియు "నీ వేబలమునునమ్మి నా దేవి నపహరించితివో ఆబలము నే నీవు నీసేనలు బంధువులు సమగ్రముగాఁ జూపవచ్చును. రేపు ప్రాతఃకాలమే నీనగర మును దానిప్రాకారాదులను నా బాణముల ధ్వంసముగా నొన రించెదను. చూడుము. రేపుదయ మింద్రుఁడు దనుజులపై వజ్రాయుధమును బ్రయోగించుచందమున నాక్రోధమును నీపై సేనలపైఁ బఱపుచున్నాను.కనుఁగొనుము. నీ సేనలం గూడి యుండు"మని పల్కుఁడు. అని యిట్లు బదులు సందేశమును-దెల్పఁగా వారు ధర్మవత్సలుండని జయశబ్దపూర్వకముగాఁ బొగడి లంకకరిగి తమరాజును దర్శించి తమ పోయివచ్చిన వార్తను దెల్పిరి. శ్రీరామ లక్ష్మణ విభీషణ సుగ్రీవులను నీ నలుగురే మనలంకను భస్మము చేయఁజాలియున్నారు. శ్రీరాము నాయుధములం బరికింపఁగా నతఁ డొక్కఁడే లంకను భస్మీకరింపఁ గలఁడు. ఇఁక లక్ష్మణసుగ్రీవాదులు తోడుగా నుండ నేమి చెప్పవలయును? దేవతలు మనకు సాయపడినను వారిని మార్కొనఁ దరముకాదు. వానరసేన. లాక్రమించిన తావును జూడఁగా దానిసంఖ్య యింతయని వచింప నలవిగా దనియే తోఁచును. ఆసేనలకుఁ గల్గునుత్సాహము వచింప నలవిగానిది. కాన వారితో విరోధము మాని సీతనర్పించుట యత్యుత్తమము. అని వా రిరువురు స్వాభిప్రాయములఁ దెలిపిరి.

ఆర్యులారా! ఇంతకుముం దొక్కఁడు శుకుఁ డను వాఁడు పోయి సుగ్రీవాదులు బంధింపఁగా సకలబాధలు పొంది శ్రీరామునియనుగ్రహమున విముక్తినొందినట్లు రావణునకు సేనాతత్త్వము శ్రీరామునను గ్రహమున ముక్తినొందుట తెలిపిపోయెను గదా. మరల నీశుకుఁడు క్రొత్తగా రావణుఁ డాజ్ఞాపింప సారణుం గూడి యరుదెంచిన ట్లున్నది. వాఁడే మరల వచ్చెననరాదు. ఒక్కసారి ప్రాయశ్చిత్తము దేహశుద్ధిరూపమున కాఁగా మరల వచ్చుటెట్లు? అనుప్రశ్న మిటఁ గలదు. ఈశుకుఁడు మంత్రులలో నొకఁడు. సారణుఁడు మంత్రియే. వీరురువురు మాయాకోవిదులు. కావున వీరినిరువురిని బంపి సేనలయందలి వివిధవిషయములు సుగ్రీవాదుల చిత్తవృత్తులు వారివారి యుద్ధపరికరములు కనుఁగొని రమ్మని రావణుఁడు పంపెను. కనుక నిందుఁ బేర్కొన్న శుకుఁడు ప్రాగుక్తశుకునికంటె నన్యుఁడని మన మెఱుంగుట మంచిది. ఈ సాగరతరణకాలముననే శ్రీరాముఁడు రామలింగేశ్వరునిఁ బ్రతిష్ఠించి తదనుగ్రహమున సేతువుదాఁటిపోయిన ట్లధ్యాత్మ రామాయణమునఁ గలదు. ఆవిషయము యుద్ధకాండాంతమున విమర్శింపఁదగియున్నది. కాన నిచ్చో వదలుదును.

## రావణునకు సారణుఁడు వానరవీరులం జూపి బలాబలములఁ దెల్పుట.

* సారణుఁడు గట్టిగాఁ దనకుఁ దోఁచిన విషయమును మోమోటమి మాని తెల్పఁగా విని రావణుఁడు వానిం

---

* ఇది యిరువదాఱవసర్గమున నున్నది.

మాలనాడుచు నింద్రాదు లెత్తివచ్చినను నన్ను జయింపలేరు. గాన సీత నీయనని తెల్పుచు సారణా! నీవు సౌమ్యుండవగుదువే కాని శూరుండవు కావు సుమీ. వానరులు బాధింపంగా మిగుల దిగులుపడియున్నావు. కనుక సీత నిచ్చివేయుమని తెలుపుచున్నావు. నన్ను రణరంగమున నోడింపంగలవాం డుండునా యని పలికెను. ఇట్లు పరసవచనములు పలికి వానర బలములను జూడంగోరి ప్రాసాదరాజము నెక్కెను. గర్వము మిగులంగా నాతం డాశుకసారణులం గూడి యాప్రాసాదాగ్రమునుండి సాగరపర్వతకాననములం గాంచుచుం ద్రికూటాద్రి క్రిందనుండు భూభాగమంతయు నావరించియున్న వనచరబలములం గాంచెను. రెండవ సముద్రమువలె నది కనంబడంగా సారణునింగని, "వీరిలో శ్రేష్ఠులెవ్వరు? శూరాగ్రణు లెవ్వరు? మహాబలవంతు లెవ్వరు? యుద్ధరంగమున నుత్సాహముప్పొంగ నందఱకు ముందు నిలుచువా రెవ్వరు? సుగ్రీవుండు వీరిలో నెవరిమాటల నాలకించును? వీరిలో మేటిసేనాధీశు లెవ్వరు? అన్నియు నున్నరూపునం దెల్పుమా" యని యడిగెను. సారణుం డప్పలుకుల విని శత్రుసేనారహస్యముల నెఱిగినవాఁడు గావున నతనితో నిట్లు విన్నవించెను.

రాక్షసేంద్రా! అల్లదిగో ఆచోట మహావానరుండు గనంబడును. లంకాపురాభిముఖుండై సింహనాదము చేయుచు లక్షయూథనాథులు కొలువంగా నున్నవాఁడు. చూడుము. వీని సింహనాదమునకే లంక సప్రాకారముగాం గంపించుచున్నది. ఈతని పేరు నీలుండు. బాహువులు పైకెత్తి నిలుచున్న యీ వానరవీరునిం • జూడుము. పర్వతాకారుండై

వాలము నేలకొట్టుచు నాశబ్దమునకు దెసలు ప్రతిధ్వని చేయఁగా నున్నవాఁడు. సుగ్రీవుఁడు వీనినే యువరాజుగా నభిషేకించెను. వీనిపే రంగదుఁడు. నిన్ను నీతఁడు యుద్ధమునకు రమ్మని జీరుచున్నాఁడు వాలికిం దగినకుమారుఁడు. సుగ్రీవునకు నిరంతర ప్రీతిని గొలుపువాఁడు వీఁడే. లంకకువచ్చిన హనుమంతునికార్యములకు మూలము వీనిబుద్ధియే. అపార సేన లీతనివశమం దున్నవి. అంగదునివెనుక మహాసేనాపరివృతుఁడై నళుఁ డున్నవాఁడు. వీఁడే సేతువు నిర్మించెను రాక్షసేంద్రా! దేహముల నిక్కించి సింహనాదములు చేయుచు లేచి కోపమున నొడలు విఱుచుకొనుచున్న యీవానరశ్రేష్ఠులం గనుఁగొనుము. వీరిని మార్కొని నిలుచుట మహాకష్టము. ఈ వానరబలములెల్ల నలుని వెంబడింతురు. ఈతఁ డొక్కఁడే సేనతో లంకను మర్దింపఁ గోరుచున్నాఁడు. శ్వేతాంగముగల యీవానరుఁడు శ్వేతుఁడు. యుద్ధములందు ముల్లోకములందు వాసిగాంచినవాఁడు వీఁడు యుద్ధచపలుఁడు గావున తానిప్పుడే లంకను ధ్వంసముచేయఁబూని సుగ్రీవుఁ డనునయింప మరలి పోవుచున్నాఁడు. అల్లదిగో యతఁడు కుముదుఁడను వానర సేనాపతి. మున్ను సంకోచనపర్వతముకడ రాజ్యమును బాలించుచుండెను. ఇపుడు సుగ్రీవునికడ నున్నాఁడు. పదికోటుల వానరులం గొనివచ్చుచున్నాఁడు వీని వాలాగ్రరోమములు పెక్కురంగులు గలిగియున్నవి. రావణాసురాధిపతీ! కపిల వర్ణుఁడై సింహమువలెఁ గనంబడుచు విశాలనయనములు గలిగి లంకాదహనోద్యముండును బోలెఁ గ్రూరదృష్టులం జూచుచున్నాఁడు. ఆతఁడు రంభుఁడను యూథపతి. వింధ్య, కృష్ణగిరి,

సహ్యాసుదర్శనములను పర్వతములం దెల్లపుడుండును. నూట ముప్పదిలక్షలవానరులు వీనివెంటఁ గలరు. లంకఁ జక్కఁగాఁ జూచు నావానరుఁడు శరభుఁడు. యూథనాథుఁడు. సాల్వేయ పర్వతవాసి. నలువదిలక్షలవానరు లితనికడ నున్నవారు. దేవేంద్రునివలె వెలయు నాతఁడు పనసుఁడు. యూథేశ్వరుఁడు. పారియాత్రాచల మీతనినివాసము. డెబదిలక్షలవనచరవీరులు వీని సేవింతురు. వినతాఖ్యుఁడు దర్దరపర్వతవాసి. అఱువదిలక్షలవనచరులు గలవాఁడు. అతఁడు క్రోధనుఁడు. నిన్ను సంగరమున కాహ్వానించుచున్నాఁడు. అతఁడు గవయుఁడు. మహాకోపమున నీపై కరుదెంచుచున్నాఁడు. ఈయూథనాథుల మార్గాని నిలుచుట కష్టము. అని తెలిపెను.

## సారణుఁ డుత్కృష్టప్రధానయూథనాథులఁ గనఁబఱచుట.

* రాక్షసరాజేంద్రా! పరాక్రమము నెఱపుచుఁ బ్రాణముల దాఁపకపోరు యూథనాథులం జెప్పెదను. కనుఁగొనుచుండుము. ఇతఁడు హరుఁడనఁబరఁగు యూథపతి. పలువన్నెలుగలవాలాగ్రరోమములు గలిగి వెలుఁగుచున్నాఁడు. అనేక వానరవీరు లీతనివెంట నున్నారు. ఎలుఁగుబంట్లను జూడుము. వారినడుమ ధూమ్రుఁడను యూథపాలుఁ డున్నాఁడు. ఇతఁడు భల్లూకనాథుఁడు. ఇతనితమ్ముఁడు జాంబవంతుఁ డతఁడో చూడుము. ఇతఁడు మేటి యూథపతులలో ముఖ్యుఁడు. రణముల రిపులఁ జెండాడక మానఁడు. మున్ను శతక్రతువునకు తోడుపడి

* ఇది యిరువదేడవసర్గమునఁ గలదు.

యసురులగెల్చిన మహాశూరుఁడు. వరములఁ బెక్కింటిని బడ
సినవాఁడు. ఈతనిబలము లసంఖ్యాకములు. కొండలఁ బిండి
చేయఁగలవు. మృత్యువన్నను భయంపడవు. ఆతఁడు రంభుఁడు
సేనాధిపతి. ఎల్లవా రాతనిం జూచుచున్నారు. చూడుము. తన
బలమున నింద్రుని మెప్పింపఁగలఁడు. అతఁడు సన్నాదుఁడను
యూథనాథుఁడు. ఇతఁ డొక్కయడుగు పెట్టిన యోజన
దూరము సాగును. ఇతనికంటెఁ బెద్దదేహముగలది చతుష్పా
త్తులలో నేదియు నుండదు. ఇంద్రునకు మున్ను తోడుపడి
యపజయమనుమాట యెఱుఁగక దానవులను గెల్చెను. అగ్ని
వరమువలన నీతఁ డుద్భవించెను. ప్రభూ! క్రథనుఁడను నా
వానరోత్తముఁడు హిమవంతమునఁ గాఁపుర ముండును పెక్కు
వానరవీరులం గూడి వచ్చినాఁడు. తానే యీలంకం బాడు
చేయఁ గోరుచున్న వాఁడు. అల్లదిగో కనఁబడు వాఁడు ప్రమాథి
యను యూథపతి. గంగానదిచెంగట మున్ను గజవానరము
లకుఁ బోరుగలుగఁగా గజముల నదలించి వానరములఁ గాచిన
వాఁడు. ఉశీరబీజమనుపర్వత మీతని నివాసము. గోలాంగూల
ములు లెక్కలేనియన్ని వీనికడ నున్నవి. వానితోఁ బోరా
డుట కష్టము. ఇందు గల వానరులలోఁ బెక్కండ్రు మేరు
పర్వతమున నుండువారు. నాలుగుకోఱల సింహములకంటె
భయంకరులుగా నున్నారు. శతవలి యందున్నాఁడు చూడు.
సూర్యారాధకుఁడు. ఈతఁడు శ్రీరామునకుఁ బ్రాణము లిచ్చి
యైన మేలుచేయఁగోరును. ఈబలముల లెక్కింప నాతరము
గాదు. మహాబలవంతులు వీరితనువులు కొండలవలె నుండును.
చూడుమా యనియెను.

## శుకుఁడు మఱి కొందఱ నుగ్గడించుట.

* అంత శుకుఁడనుమంత్రి చేతులు జోడించి యిట్లు తెల్పెను. రాజా! ఈవానరులు మహాబలవంతులు, కామరూపులు, యుద్ధములయందుఁ దాఁటితేఁటినవారు నగుదురు. వీరల మారొక్కని గెల్చుట సాధ్యము కాదు. వీరెల్ల సుగ్రీవునాజ్ఞ మెలఁగువారు. దేవగంధర్వజనితులు. ఆప్రక్కం జూడుము. వారిద్దఱు మైందద్వివిదులు. వారికి సాటిచెప్పఁదగు యుద్ధశూరులు లేరు. వీరు బ్రహ్మకరుణ నమృతపాన మొనర్చిరి. వీరిప్రక్కన సుముఖ దుర్ముఖులనువా రున్నారు. వారు మృత్యుతనయులు. తండ్రియగు మృత్యువువంటి పరాక్రమసంపన్నులు. రాక్షసేంద్రా! మత్తగజమువలెనుండు నావానరుం జూడుము. ఇతఁడు క్రుద్ధుఁడయ్యెనా సాగరమును గలంపఁజాలును. ఇతఁడే లంకకువచ్చి సీతను గాంచి సీతతో మాటలాడి పోయినవాఁడు. మున్ను వీనిం జూచితివి గదా. మరల వచ్చియున్నాఁడు. వీఁడు కేసరిక్షేత్రజుఁడయిన జ్యేష్ఠపుత్త్రుఁడు. వాయు వరప్రసాదజనితుఁడు. హనుమంతుఁ డనఁబడువాఁడు. కామరూపము గలవాఁడు. అతిబలశాలి. వాయువలె నప్రతిహతగతి గలవాఁడు. పూర్వ మితఁడు ఆఁకలిగొని యుదయభానుని జూచి నాకాఁకలి తీఱ వీనింబట్టి భక్షించెదనని తలంచి మేరువునుండి క్రిందికి దిగి సూర్యునికడ కరుగందలంచి తత్తేజమున దగ్గరకుఁ బోవఁజాలక యుదయగిరిపయిం బడియె. పాషాణముపైఁ బడఁగా నొకచెక్కిలి భిన్నమైనది. కనుకనే

---

* ఇది యిరువదెనిమిదవసర్గమునఁ గల కథ.

హనుమంతుఁ డను పేరు ప్రసిద్ధమయ్యెను. విశ్వాసపాత్రుఁడగు నొక మిత్రునిమూలమున సీతనివార్త తెలిసినది. ఇది సత్యము. ఈతఁడొక్కఁడే లంకనుమర్దింప నూహించుచున్నవాఁడు. ఈతని మూఁపుపై నెక్కియుండు రాజకుమారునిం జూడుము. ఖరాదుల నొక్కఁడే యుక్కడంచి వాలి నొకకోలఁ గూల నేసిన యీతనిపౌరుషము లోకవిఖ్యాతము. సకలవిద్యాపారంగతుఁడు. ఏమని పొగడుదు. సకలగుణాభిరాముఁడు రాముఁడీతఁడే. భార్య నపహరించితివని నీపై నెత్తివచ్చుచున్నాఁడు. ఈతని దక్షిణభాగమున బంగారువంటి మేనిరంగుగలిగియున్న లక్ష్మణుని జూడుము. శ్రీరాముని తమ్ముఁడు. ప్రాణాధికుఁడై యన్న మేలు గోరువాఁడు. శత్రుదుర్జయుఁడు. తానొక్కఁడే యుత్తమరాక్షసులం జంపవలయునని కోరుచున్నవాఁడు. నలుగురు రాక్షసులు సేవింప రాముని యెడమప్రక్కనున్నవాఁడు విభీషణుఁడు. శ్రీరాముఁడే వీనిని లంకారాజ్యమున కభిషేకించెను. నీపైకి నెత్తివచ్చుచున్నాఁడు. వీరినడుమఁ గొండవలె నున్నాఁడు సుగ్రీవుఁడు చూడుము. పరాజయము నొందనివాఁడు. కిష్కింధాపురమున నుండును. ఈతనివక్షమున మెఱయుచున్న కాంచనమాలం గంటివే. దేవతలకు నది కోరఁదగినది. దానియందు వీరలక్ష్మి నెలకొనియుండును. దీనిం దాల్చినవాఁ డపజయము నొందఁడు. వాలిని జంపి శ్రీరాముఁడు తారను, కపిరాజ్యమును, కాంచనమాలను వీనికిం గల్గించెను. నూఱులక్షలు కోటి యని, నూఱుకోట్లు శంఖమని, నూఱుశంఖములు మహాశంఖమని, నూఱువేలశంఖములు బృందమని, నూఱువేలబృందములు మహాబృందమని, నూఱు

వేలవి పద్మమని, నూఱువేలవి మహాపద్మమని, అవి నూఱు ఖర్వమని, అవి నూఱువేలు మహాఖర్వమని, నూఱువేలవి సముద్రమని, నూఱువేలసముద్రము లోఘమని, అవి నూఱు వేలు మహౌఘమని పెద్దలు చెప్పుదురు. ఈసైన్య మీసంఖ్యను మీఱియున్నది. వీరినోర్చునట్టి గొప్పయత్నము గావింపుమని విన్నవించెను.

## రావణుఁడు శార్దూలాదులం బంపుట.

* అట్లు వారలు చెప్పఁగా వినియు వానరయోధులం జూచియు మదిఁగొంత బెదురుగదిరినను శత్రువుల స్తుతించుటం బట్టి యాగ్రహ మూని వారలఁ గఱకుభాషణముల బెదరించెను. మఱియు నిగ్రహానుగ్రహసమర్థుఁడగు రాజుమ్రోలఁ దదాశ్రితులయి జీవించుచుండు మంత్రు లిట్టుల ప్రియవార్తలం బల్కుట మంచిది కాదు. మనపైకి వారెత్తి రాఁగా రణము సేయనున్నతఱి శత్రుస్తుతి యుక్తమె ట్లగును? రాజనీతిసారమగు భృత్యకృత్య మిట్టిదని యెఱుఁగకయున్నారు. సమర్థులగు గురువుల మీ రారాధించియు వ్యర్థమే యయ్యెను. నీతిశాస్త్రము చదివినను దానియర్థమును దెలిసికొనినట్లు కానరాదు. అర్థ మెఱింగిన ననుష్ఠానమున నది లేనందున వ్యర్థమే యది యగును. ఇట్టి మూర్ఖమంత్రులతోఁ జేరియున్నందున నేనెంతకాలమునకుముందో శత్రుహతుఁడను గావలసినవాఁడనే, దైవవశమున నట్లు గాక నిలిచియున్నాను. నే నానతీయఁగా

* ఇది యిరువదితొమ్మిదవ సర్గమునఁ గలదు.

దాననే శుభాశుభములు గలుగుం గదా. ఇట్లు మీరు చెప్పు టకు మృత్యుభయము మీకుఁ గలుగకయుండుట విచిత్రమే. మీరు పూర్వ మొనర్చిన యుపకారము స్మృతిగోచర మగుటం బట్టి కోపము శాంతి నొందుటం జేసి బ్రదికితిరి. కానిచో నింతకు హతులరయియే యుందురు. స్థానభ్రష్టులు గండు. నిలువక పొండు. నాముం దుండవలదు.

అని పలికిన విని వారు రాజును జయజయ యని పొగడి వెడలిపోయిరి. అంత రావణుఁడు చెంతనున్న మహో దరుం గాంచి రాజనీతిజ్ఞులగు చారులం గొని వేగమ రమ్మని యానతిచ్చెను అంత నాతఁడు పిలిపింప చారు లరుదెంచి మర్యాదరీతి స్తుతించి నిలిచిరి. వారింగని రాక్షసపతి మీరు రామునొద్ద కరిగి యతఁడు చేయనిశ్చయించియున్న కార్య మేదియని పరికింపుఁడు. అది శిథిలమగుచో నతని భయపెట్టు దము. ఆంతరంగిక మంత్రులెవ్వరో పరిశీలింపుఁడు. అది శిథిల మగుచో వారిని వేఱుసేయుదము. అతఁ డెట్లు నిదురించును? ఏకాంతముననా? పెక్కండ్రం గూడియా? ఒంటిగ నిదురించు నేయుద్ధము నడపంజను. ఎట్లు మేలుకొని యుండును. చింతా కులమానసుఁ డయియా? నిరాకులుఁ డయియా? ఆకులుఁడే యైనఁ దటాలునఁ బైఁబడి కొట్టందగు. ఇంక నతఁ డేమేమి చేయుచుండును? మననగరమును గొంత యాలసించి ముట్టడి సల్పునా? ఇప్పుడే ముట్టడించునా? జాగు చేయునేని క్రమముగా ప్రవంచింపంజను. నా చెప్పినవిషయములన్నియు మీరు ప్రచ్ఛ న్నులరై గ్రహించి రాఁదగు. నిపుణు లగు ప్రభువులు చారుల

మూలమున నన్నియు నెఱింగి యుద్ధమున నల్పయత్నమున వారిని జయింతురు. అని తెలిపెను.

వార లంత సంతుష్టులై వలగొని మ్రొక్కి సెలవుగొని రామలక్ష్మణు లుండుతావున కరిగి వేషాంతరముల విభీషణ సుగ్రీవాదులం గూడియుండు శ్రీరామునిం గాంచిరి ఆసేనను వారిని గాంచగనే భయమునఁ గంపించిరి. ధర్మజ్ఞుఁడగు విభీషణుఁడు వారాసేనలఁ దిరుగుట యెఱింగి తర్జించెను. శార్దూలుండు దుష్టుఁడని వనచరులకుం బట్టియిచ్చెను. కపులా చారణుని జావఁ గొట్టుచుండఁగా రామచంద్రుఁడు వానిని విడిచిపుచ్చెను. తత్సహచరులం గూడ దండింపవలదని పంపెను. వారు బ్రదికితిమిరా తండ్రీ! యని యెట్లో లంకకుం జేరిరి. వారు తమతేనితో రాముని బలపౌరుషాదులను సేనల పరాక్రమాదులను దెలియం జేసిరి.

## శార్దూలాదులు రాముఁడు సేనలతో సువేలాద్రిచెంత విడియుటఁ దెల్పుట.

* అంత శార్దూలాదులు రాముఁడు మహాసైన్యముతో సువేలాద్రియొద్ద విడిసియున్నాఁడని చెప్పిరి. అవ్వేల రామునిరాక విని రావణుఁడు భయంపడియు శార్దూలునిం గాంచి నీమోముకాంతి మున్నున్నట్లు లేదు. దీనుఁడవై యున్నావు. శత్రువులకుం జిక్కవు కదా. చిక్కుటచే వారి స్వరూప మిది యని తెలియదయ్యెనా? యని ప్రశ్నించెను.

* ఇది ముప్పదియవ సర్గమునఁ గల కథ.

వాఁడు తాను వానరులచేఁ బడినపాట్లు తలంపునకు రాఁగా వడంకుచు మెల్లఁగ నిట్లనియె. రాక్షసేశ్వరా! వానరేంద్రుల రహస్యములఁ గనుఁగొనుట చారులకు శక్య మేమాత్రము కాదు. కపులు బలవంతులు, శ్రీరామరక్షితులు నగుట వార లతో మాటలాడుటయే శక్యము గాదు. ఇఁకఁ బరీక్షించు టెట్లు శక్యము? నలుదెసల వానరులు కాచుచున్నారు. ఎట్లో సేనలోఁ జొచ్చితిని. ఎందును జూడను లేదు. అంతలో నే నన్నుఁ గనుఁగొనిరి. విభీషణునిమంత్రులు బలాత్కారమునఁ బట్టుకొనిరి. పెక్కుసారులు నేలం బొరలించిరి. కపులు పైకొని పెక్కుతెఱంగుల బాధించి సేనలం జుట్టిరి. మమ్ముం గొట్టుచు రామునికడకుం దీసికొనిపోయిరి. నే నంజలింబట్టి రక్షింపవేఁడి -తిని. ఆ పురుషోత్తముఁడు నన్నుఁ గాపాడెను. అదృష్టవశమునఁ బ్రాణములఁ జేతనుంచుకొని వచ్చితిమి. ఆరాముఁడు రాజేంద్రా! కొండలు గండోపలములు వృక్షములు లోనగువానిచేత సాగరమును బంధించి దాఁటి యపారసేనలతో దివ్యాయుధ ముల ధరించి వచ్చియున్నాఁడు. వేగమే లంకాద్వారమునకు రాఁగలఁడు. గరుడవ్యూహముగాఁ బన్నియున్న వానరసైన్య ములు తన్నుఁ గొలువనున్న రాముఁడు లంక ముట్టడింప వచ్చు చున్నాఁడు. ప్రాకారమును దొలుత నాక్రమించును. ఆతనికి సీత నర్పింపుము. లేదేని సంగ్రామముచేయ సిద్ధముగ నుండుము. త్వరపడి యేదో ఒక్కదానిని జేయఁ దీర్మానించుకొనుమని తెలి పెను. ఆమాట లాలకించి యాలోచించి మంచిమాటలతో శార్దూలా! జానకిని దెమ్మనియెదవా! దేవతలు తోడుపడినను రామునకు భయంపడి సీత నొసంగను. నీవు వానరసేనలం

గాంచితివి కదా. అందుఁ దార్కొని వానరు లెవ్వరో వారి సత్త్వ మెట్టిదో చెప్పుము. నీమూలమున వారల బలాబలముల నెఱింగి వారివిషయమై చేయవలసిన దెద్దియని యూహింతును. యుద్ధార్థులు తప్పక శత్రుబలాబలముల నెఱుంగవలయు ననెను.

చారులలో నుత్తమోత్తముఁడగు శార్దూలుఁడు చేతులు జోడించి రాజేంద్రా! వానరపతి సుగ్రీవుఁడు దుర్జయుఁడు. జాంబవంతుఁడు ధూమ్రుఁడు ననువా రిరువురు దుర్జయులు. సుషేణుఁడు దధిముఖుఁడు సుముఖదుర్ముఖులు దేవదర్శియు ననువార లొక్కొక్కరు సంగరావని నోర్వరాని బలవంతులు. నిశ్చయము. అగ్నికొడుకగు నీలుఁడు హనుమంతుఁడు యువరాజగు నంగదుఁడు మైందద్వివిదులు గజగవయ గంధమాదన శరభు లనువారును బ్రళయకాలాంతకునకు నీడు చేయఁదగినవారలు. దేవాంశసంభూతులు పరాక్రమసంపన్నులు నగు వానరేంద్రులు పదికోటు లున్నవారు. వీరి యుత్పత్తి లోనగువానిం జెప్ప నా కలవిగాదు. ఖరదూషణత్రిశిరుల వధించిన రాముఁడు బలశాలి సుందరాంగుఁడు జవ్వనమున విఱ్ఱవీఁగువాఁడు. విరాధునిం గబంధుని జంపిన రామునకుఁ బరాక్రమమున సాటియగువాఁ డెవ్వఁ డీలోకమునఁ గలఁడు? జనస్థానమునఁ గలరక్కసుల నొక్కఁడే యుక్కడంచిన రామునిగుణముల వర్ణింప నెవ్వారికిం గాని యలవి కాదు. రామునిసోదరుఁడు లక్ష్మణుఁడు మేటి విలుకాఁడు. ఆతని బాణములు సోఁక నింద్రుఁడైన జీవింపఁజాలఁడు. సూర్యపుత్త్రులగు శ్వేతజ్యోతిర్ముఖులును, వరుణపుత్త్రుండగు హేమకూటుఁడు

విశ్వకర్మకుమారుఁడగు నలుఁడు, వసుపుత్త్రుఁడగు సుదుర్ధరుఁడు పరాక్రమమున నసమానులు. సువేలాచలమున విడిసియున్న యీ వానరసేనలబలాదుల నెఱింగించితిని. ఇఁక మిగిలినకార్యమునకు దేవరయే ప్రమాణమని తేటపఱచి యూరకుండెను.

మహాత్ములారా! ఈసర్గములలో విమర్శింపఁ దగినవిశేషములు లేవు. రావణుఁడు పంపినగూఢచారులు మాయారూపములఁ బ్రవేశించి తిరిగినంతమాత్రముననే వారివారి పేరులు బలాబలములు కనుఁగొన నెట్లు వలనుపడును. ఉన్నదున్నట్లు తెలిపిరి గదా యని సందియమొందఁ బనిలేదు. వారివారి సంభాషణములు సేనల వీరాలాపములు లోనగువానివలనఁ దెలిసికొన శక్యమే యగును. సేనలపరిమాణము గుఱికి బారెడు హెచ్చుతగ్గను నట్టులుండును. ఇందుఁ బేర్కొనఁబడిన వనచర వీరుల జననాదులు గూఢచారుల మాటలమూలమున వాల్మీకి మనకుఁ దెలిపెనని గ్రహింపందగు. గూఢచారుల శిక్షింపవలయునని వనచరబలముల యాశయము. యుద్ధశూరులు కాని వారల శిక్షింపరాదని రాముని మతము. నిరాయుధులు శిక్షార్హులు గారని నీతిశాస్త్రము తెల్పుచున్నది. శాస్త్రమర్యాదల నతిక్రమింపకుండుటయే రామావతారఫలము కదా. స్వప్రవృత్తి

"యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిం.
తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి."

అన్నగీతావాక్యముల ననుసరించునదిగా శాస్త్రైకహితముగా

నుండునదియే శ్రీరామునాశయమని తోఁపకపోదు. రావణుఁ
డేల యిందఱమూలమునఁ బరీక్షించెనని ప్రశ్నింపవచ్చును.
వానరబలములశక్తి తెలియక కాని శ్రీరామునిమహత్త్వ మెఱుం
గక కాని యిట్లు పరిశీలింపలేదనియు, తనమంత్రుల మెప్పించు
టకు, యుక్తముగా యుద్ధప్రయత్నములు చేయలేదను
లోకాపవాదము పోవుటకు నిట్టిప్రయత్నము లిన్నిసారులు
చేసెననియు, నతనికి శ్రీరామాగమన మత్యంత సంతోషదాయ
కమే యనియు మన మెఱింగి తరువాతికథను బఠించి తత్సా
రమును గ్రహింతము, వానరజననాదివృత్తాంతములు పూర్వో
క్తవిరుద్ధము లగుట నీసర్గము కల్పితమని కొంద ఱందురు.
తెల్పిన వారివిషయగ్రహణభేదమే యని మఱికొంద ఱందురు.

## విద్యుజ్జిహ్వుఁడు రామునిశిరస్సును జూడామణిని సీతకుఁ జూపుట.

* అంతట శార్దూలాదిచారులు తమపని నిర్వహించి
పనివినఁగా విని రావణుఁడు సుంత భీతిల్లి మంత్రులం గని మన
మాలోచింపఁదగుకాలముగ నిది యున్నది. కనుక మంత్రులు
నీతిజ్ఞులగు రాక్షసప్రవరులు వత్తురు గాక. అని యాజ్ఞాపింప
నంద ఱచ్చటికి కేతెంచిరి. అందఱు రాఁగా నపుడు చేయఁదగిన
దేదియో చక్కఁగా నాలోచించి యంతఃపురమున కరిగెను.
మాయలయం దాఱితేఱిన రావణుఁడు శంబరాసురునివలె
మాయాదక్షుఁడగు విద్యుజ్జిహ్వుని బిలిపించి యతఁడు తన
వెంట రాఁగా సీతయుండుతావునకుఁ బోవుచుఁ ద్రోవలో

* ఇది ముప్పదొకఁడవ సర్గమునఁ గల కథ.

విద్యుజ్జిహ్వా! మనము మాయపన్ని సీతను వంచింతము. నీవు మాయాబలమున రాముని తలనొనర్చి దానిని శరయుక్త చాపమును దీసికొని నాకడకు రమ్ము. అనిన నతఁడు వల్లెయనిన నందులకు నొక యమూల్యాభరణము పారితోషికముగా నొసంగి సీతయుండుకడకు సంతోషమునఁ బోయెను. రక్షస్స్త్రీ పరివృతయై దుఃఖించుచు రామునే ధ్యానించుచున్న సీతం జూచెను. చెంత కరిగి ప్రియవార్తను దెలుపునట్లు నటించుచు నామెతోఁ గల్యాణీ! ఎన్నిమంచిమాటల వేఁడుచున్న నెవ్వని యాధారమున నన్ననరాని నిష్ఠురము లాడితివో ఖరాదులం జంపితినని నాతో విరోధముగొన్న నీభర్త యుద్ధమునఁ జంపఁబడియెను. నీయాధారము నిర్మూలము చేసితిని. నీగర్వము పోవఁ జేసితిని. ఇఁక నాప్రార్థనయే యక్కఱలేక వ్యసనమున గత్యంతరము గానక నాకు భార్య వగుదువు. మూఢురాలా! ఇంక నీబుద్ధి విడువుము. మృతునితోఁ బనియేమి? నాభార్యల కెల్ల నీశ్వరివి కమ్ము. అల్పపుణ్యురాలవు కాన నింతదనుక పురుషార్థము మానియున్నదానవు. ఏమియు నెఱుంగకున్నను సర్వజ్ఞత్వము నభినయింతువు. సీతా! వృత్రాసురుఁడు చచ్చినట్లు దారుణముగా నీభర్త మృతినొందెను. ఎట్లనఁగా నాలకింపుము. నన్నుఁ జంపుకోరిక సుగ్రీవునిసేనను దీసికొని సాగరతీరమునకు వచ్చినాఁడఁట. అస్తమయసమయమున సేనలతో విడిసెను. అలసినందున నెల్లరు నిద్రపోవుచుండిరి. చారుల మూలమున వార్తలన్నియు నెఱింగితిమి నాసేనాధిపతి ప్రహస్తుఁడు వానరసేనను హతము చేసెను. రాక్షసు లనేకాయుధములఁ గపివీరులఁ జంపుచుండ నాప్రహస్తుఁడు మహాఖడ్గమున

రామునితలఁ ద్రెంచివైచెను. విభీషణుఁ డాకసమున కెగురఁగా మావారు పట్టుకొనిరి. లక్ష్మణాదులు పసవెత్తిరి. సుగ్రీవుఁ డిపుడు కంఠము తెగి పడియున్నాఁడు. జాంబవంతునిమోఁకాళ్లను విఱుగఁగొట్టి మాభటులు పోవకుండఁ జేసిరి. అంతట విడువక కత్తిపోటుల నలయింపఁ జావనున్నాఁడు. సేనాధిపతులగు వానరులు మృతప్రాయులై యున్నారు. మిగిలినవా రెక్కడికిఁబోయినవా రక్కడనే చంపఁబడిరి. అని తెలిపి యొక రాక్షసాంగనం బిల్చి రణరంగమున రామునితల పడియున్నది. దానిని వీరుఁడగు విద్యుజ్జిహ్వుని దీసికొని పిలుచుకొని రమ్ము. అదిపోయి తెలుపఁగా నావిద్యుజ్జిహ్వుఁడు రామునిశిరస్సును శరాసనమును దెచ్చి రావణునకు మ్రొక్కి తలవంచి యెదుట నిలుచుండెను. విద్యుజ్జిహ్వా! శిరస్సును ధనుస్సును సీతయెదుట నునుపుము. ఆపెనిమిటియవస్థ నీనిర్భాగ్యురాలు చూచుఁగాక యనునంత నాతఁడు దాని నచ్చటఁ బెట్టి యవ్వలికిఁ దొలఁగి యుండెను. రావణుఁ డాధనుస్సు నతనిచేతినుండి లాగి యిది నీరామునిశరాసనము. చూడు మిదిగో. కనుఁగొనుము. అనుచు నిఁక సీతా! నావశము కమ్మనియెను.

మహాశయులారా! ఇందలివిశేషముల నెఱుకుదము.

"మంత్రయిత్వా స దుర్ధర్షః క్షమం యత్సమనంతరం,
విసర్జయిత్వా సచివాన్ ప్రవివేశ స్వమాలయం." ౫

అని మూలము. యోజించి తరువాతికార్య మిది యని నిశ్చయించి మంత్రులు లోనగువారి నిండ్లకుం బంపి యతఃపురము నకుఁ బోయెను. అని కథానురూపార్థము. "దుర్ధర్షస్సః యత్సమనంతరం క్షమం తత్ మంత్రయిత్వా" అని యన్వయము.

అటుతర్వాతఁ జేయఁదగినదేదో దాని నాలోచించెను. ఆతఁడు దుర్ధర్షుఁడు. అనఁగాఁ దిరస్కరింపఁ దగనివాఁడు. కనుకనే శ్రీరామాగమనమునకుఁ బిదపఁ జేయఁదగున దేయుపాయ మని యూహించి మంత్రుల నడిగి వారిభావమును గనుఁగొని యంతిపురి కేగెను. తనవాంఛలు ఫలించుకాల మాసన్నమైన దని యెఱింగియు లోకాపవాదమునకు భయంపడి యుద్ధయత్న ముల కనురూపము లగు మాటలాడి తన మనోరథమును దెలుపకయే యంతిపురి కేగె నను భావ మిందుండి తెలిసికొనం దగును.

"తతో రాక్షసమాహూయ విద్యుజ్జిహ్వం మహాబలం,
మాయావిదం మహామాయః ప్రావిశద్యత్ర మైథిలీ. ౬
విద్యుజ్జిహ్వం చ మాయాజ్ఞమబ్రవీద్రాక్షసాధిపః,
మోహయిష్యామహే సీతాం మాయయా జనకాత్మజాం. ౭
శిరో మాయామయం గృహ్య రాఘవస్య నిశాచర,
త్వం మాం సముపతిష్ఠస్వ మహచ్చ సశరం ధనుః. ౮
ఏవముక్తస్తథేత్యాహ విద్యుజ్జిహ్వో నిశాచరః,
తస్య తుష్టోఽభవద్రాజా ప్రదదౌ చ విభూషణం." ౯

అని మూలము. మహామాయః రావణః = మహతీ మాయా యస్య స మహామాయః=అని వ్యుత్పత్తి. ఆదిమాయగలవాఁడు. మూలప్రకృతి యెవనికిఁ గలదో అనఁగా నెవఁడు మూల ప్రకృతి నెఱింగినవాఁడో యని భావము. ప్రకృత్యుపాసకుఁ డగు మహాభక్తుఁడని తాత్పర్యము. మాయావిదమ్=మాయల నెఱిఁగినవాఁడని యర్థము. ఇంద్రజాలాదుల నెఱింగినవాఁడని తాత్పర్యము. జగత్సర్గపాలన సంహారకర్త్రి యగు భగవతి

నుపాసించుభక్తుఁడు రావణుఁడు విద్యుజ్జిహ్వుని బిలిచెను. వాఁ డింద్రజాలముల నెఱింగినవాఁడని భావము. సీతకడ కరిగెనని కథాసంగతి. సీతకడ కేల పోవలె ననుదురేమో. శ్రీరామాగమనము దూతలద్వారా తెలుపుటకంటె నీయను గ్రహమున భక్తుని హృదయవాంఛలు ఫలింపనున్నవని తానే తెలుపుటకే పోయెనను విషయము మన మెఱుంగవలయును. తనభావ మితరు లెఱుంగకయుండునట్లు, వారికి సంశయము కూడఁ దోఁపకయుండునట్లు మహాప్రయత్నము లొనరించిన ట్లుపాయము పన్నెను. ఆసంగరమునఁ జావవలసిన రక్కసులకు ననుకూలపరిస్థితులు కల్పింపవలయును గాన నట్టిప్రయత్నము చేయఁబూనెననియు మన మెఱుంగవలయును. ఆవిద్యుజ్జిహ్వుఁ డద్దాని నమ్మి యట్లే శ్రీరామునిశిరమును బాణముతోడిగిన ధనుస్సు తెచ్చెద ననఁగా నొకభూషణమునుగూడ నొసంగెను.

ఇంద్రజాలమని మహేంద్రజాలమని రెండువిద్యలు గలవు. ఇంద్రజాలమనునది భూలోకమునఁ గల సకలవస్తువుల నాకర్షించునది. మహేంద్రజాలము లోకాంతరాంతర్గతవస్తు వుల నాకర్షించునది. వాని నాకర్షించు ననఁగా నట్టివస్తువులం గనఁబఱచునని తాత్పర్యము. ఈవిద్యలకే దేవశాబరములని పేరు. ఇవెవ్వరికొఱకు? అని ప్రశ్నము కలదు. ఒకానొకప్పుడు లోకానుగ్రహార్థము భవాని శంకరుం గని మీా రుపదేశించిన మంత్రములు వేదాధికారముగల విప్ర క్షత్రియ వైశ్యులకే గాని యితరులకుఁ బనికిరానివని తేలెడిని. వేదోక్తకర్మాధి కారము లేనివారిగతి యేమి? అని ప్రశ్నించెను. పరమానంద భరితుఁడై శంకరుఁడు పార్వతీ! నీ ప్రశ్నమునకు ముందే నేనా

విషయ మాలోచించి యుపాసించి సిద్ధమంత్రముల నిర్మించి
తిని. ఉపదేశమాత్రమున నవి సిద్ధించును. అనఁగా ద్విజుల
కుండునంత జపహోమ తర్పణ మార్జన బ్రాహ్మణభోజనము
లనఁబడు పంచాంగము లక్కఱలేదు. ఏకొంచెము జపముచేసి
నను ఫలించును. భక్తి యున్నం జాలును. జితేంద్రియత్వాదు
లందఱకు నుండవలసినవే యని తెలిపెను. అవి శంకరుఁడు
శబరవేషమును ధరించినప్పటివి. వానిలోఁ గొన్నింటికి సిద్ధు
లివి. వీని దేవతలకే యక్షిణి యని పేరు. లేనివాని నున్నయట్లు
కనఁబఱచుటే వానివలనిఫలము. వేదమంత్రములవిధి ననుస
రించి యుపాసించిన ద్విజులకు శాబరములనియమమున నుపా
సించిన శూద్రుఁడు లోనగువారలకు ఫలము సమానమే గాని
వేఱు గాదు. కావున జాతిధర్మముల ననుసరించు టుత్తమము.
ఈమంత్రములకంటె నవి యెక్కుఁడని పొరపడి వాని లవలం
బింపఁబూనుట శ్రేయోదాయకము గాదు.

"శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః." 3౫

అధ్యాయము. ౩

"బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ పరంతప,
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః. ౪౧
శమోదమ స్తపశ్శౌచం క్షాంతిరార్జవమేవ చ,
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజం. ౪౨
శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనం,
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజం. ౪3.
కృషిగోరక్ష్యవాణిజ్యం వైశ్యకర్మ స్వభావజం,

పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజం. ४४
స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మనిరతస్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు. ४५
యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతం,
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః. ४६
శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషం. ४७
సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్,
సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః."  ४८

అధ్యాయము. ౧౮.

అను నీగీతావాక్యములను విమర్శించినయెడల వేఱొకజాతి ధర్మము లుత్తమములని యంగీకరించుట నిష్ఫలమని తోఁచెఁ డిని. పరధర్మానుష్ఠాన తత్పరత్వము స్వధర్మపరిత్యాగము నను నీరెండు ననర్థావహములే. స్వధర్మము నిష్ఫలమనుబుద్ధి గలుగుటయే దుష్కర్మఫలమని మన మెఱుంగవలయు. పరజాతి ధర్మావలంబనము ఫలసిద్ధి నొసంగదని గీతావాక్యములు వెల్లడి చేయుచున్నవి. రామకృష్ణపరమహంసవంటి మహాత్ములు కూడ నీవిషయ మనుభవమున నెఱింగి తెల్పియున్నారు. ఉపాసకుఁడు ముఖ్యముగా నీవిషయ మెఱుంగవలయును. అత్యల్పఫలదములు పరమున కపకారము చేయునవియునగు నింద్రజాలమంత్రముల నుపాసించి చెడఁగూడదు. స్వజాతిస్వభావకర్మము నాచరించి ఫలసిద్ధి నొందుటే యుత్తమము. మఱొక్కవిషయ మిట తెలుపక తప్పినది కాదు. ఆగమములందుఁ గొన్నిమంత్రములు

గలవు. అవి కేవల మోహకములు. యామమాత్ర సిద్ధిప్రద ములు. అవియు శాబరమంత్రములే. ఒక్కయామమున సకల రత్నాభరణభూషితురాలగు యక్షాంగనం గాంచి శ్రమం తుఁడు భోగియు నగుటయో లేక యందే పడి భస్మప్రాయుఁ డగుటయో కలుగును. అతిక్రూరకర్మ మనఁదగును గదా. అంతలో సిద్ధించునది యాపదలం గల్పింపక పోవునా? అట్టి మంత్రముల నేల శంకరుఁడు చెప్పవలెనని ప్రశ్నింపరాదు. జితేంద్రియత్వపరీక్షకనియే పార్వతికిం దెల్పెను. అట్టి నిబ్బరము లేనివా డాశపడి యుపాసించిన నంతమే కాని యైశ్వర్య మబ్బ దనుట నిశ్చయము. ఇట్టి విషయములను బాగుగ నెఱింగి మం త్రముల సద్గురువులనుండి యుపదేశరూపమున సంగ్రహించి తనజాతికిఁ జెప్పఁబడినధర్మముల వదలక భక్తిభావమున నుపా సించినఁ గృతకృత్యులగుట కేయభ్యంతరము లుండవు. విద్యు జ్జిహ్వుం డప్పు డింద్రజాలమున రామునిశిరమును నంతయే భేదము లేక నిర్మింప నంగీకరించెనని ప్రకృతవిషయమునకు సమన్వయము.

"ఉపసృత్య తపస్వినీం ప్రహర్షం నామ కీర్తయన్,
ఇదం చ వచనం ధృష్టమువాచ జనకాత్మజాం. ౧౩
సాంత్వ్యమానా మయా భద్రే యముపాశ్రిత్య వల్గసే,
ఖరహంతా స తే భర్తా రాఘవస్సమరే హతః. ౧౪
ఛిన్నం తే సర్వతో మూలం దర్పస్తే విహతో మయా,
వ్యసనేనాత్మనస్సీతే మమ భార్యా భవిష్యసి. ౧౫
విసృజేమాం మతిం మూఢే కిం మృతేన కరిష్యసి,
భవస్వ భద్రే భార్యాణాం సర్వాసామీశ్వరీ మమ. ౧౬

అల్పపుణ్యే నివృత్తార్థే మూఢే పండితమానిని,

శృణు భర్తృవధం సీతే ఘోరం వృత్రవధం యథా." ౧౭

అని మూలము. "ప్రహర్షం యథా తథా సీతామితి నామ కీర్త యన్ ధృష్టమితరేషామితి శేషః. జనకాత్మజామిదం వచన మబ్రవీత్" అని యన్వయము. ప్రకృతి యని జగన్మాత యని సీత నెఱింగియు, శ్రీరాముని చేత మృతిని గోరియు నితర రాక్షసుల మోసపుచ్చి యుద్ధము చేయఁ బురికొల్పం దలంచి యత్యద్భుతసాగరలంఘనాది మహత్తరకర్మములం గాంచి భీతినొందుదురేమో యనుసంశయము వోఁగొట్ట నెంచి మాయచే రామునితల నిర్మింపుమని పంచి యందలిసత్యమును సీత కెఱింగింపం దలంచి సీతాదేవిం గానంబోయి నీయనుగ్రహమున భగవంతునిచే మృతి గల్గనున్నది. కృతార్థుఁడ నగుదునమ్మా యని చెప్పందలంచి యాప్రహర్షమున సీతాదేవీనామమును గీర్తించుచుఁ దక్కిన యక్కడిరక్కసులకుఁ దెంపు గానుండు నట్లుగా నిట్లు పలికెను. ఈయర్థ మెట్లు తేలునందురా? రామునిసేనలం గాంచి వారిపౌరుషాదుల విని భయంపడియె నని ముందు చెప్పంబడినది కదా. ఇంతలో ప్రహర్ష మెట్లు కలిగెను? నామమును గీర్తించు టెట్లు? సీత తన్నుఁ దిరస్కరించుటయు నంతియగాక రాముఁడు లంక ముట్టడించుటయు జరగఁగా నట్టిదేవిని గీర్తించు టెట్లు సంగతమగును? దీనితరువాతి శ్లోకము దీనిని సమర్థించుచున్నది. శుకసారణశార్దూలాదులా రాముని శక్తిం దెల్పఁగా సేన లపారములని విన్నవింపఁగా సాగరమున సేతువు గట్టి యంతసేనతో వచ్చి తన నగరమును ముట్టడించుట కనఁబడుచుండఁగా "భద్రే" యని సీతను సంబో

ధించు టెట్లు? ఈమెమూలమున నిట్టియాపదలు గల్గెనని యాగ్రహమునఁ గొట్టుట సాగవలసినకార్యముగా నుండఁగా భద్రే! యని మహాభక్తినొండె మహత్తరప్రీతినొండె పల్కఁ దగినట్లు పలుకుటెట్లు సుసంగత మగును? సాంత్వ్యమానా రామస్య న కాపి హానిరితి శేషః=శ్రీరామున కేహానియు లేదని నే నూఱడించుచుండఁగా, యముపాశ్రిత్య వల్గసే=ఎవ్వని మది నిడుకొని వగచుచున్నావో, ఖరహంతా స తే భర్తా = ఖరా దులసంహరించిన యానీభర్త, సమరే హతః=యుద్ధమునఁ జంపఁ బడెనా? అని కాకువు. చంపఁబడ లేదని భావము. మహాగ్రహ మున నుండు రావణుఁడు తన శత్రువును సీతయెదుట తనవా రగు ఖరాదులను వధించినవాఁడని పొగడునా? కావున రావ ణునియాశయ మిదియే యనవచ్చును. సీతే=ఆత్మనః=నీయొక్క, వ్యసనేన=వ్యసనకారణముచేత, తే=త్వయా, అని విభక్తి విపరి ణామము. నీచేత, తే మమ = నీభృత్యుఁడ నగు నాయొక్క, దర్పః=గర్వము, మయా = మాశబ్దతృతీయైకవచనము—లక్ష్మి తోడ, సర్వతోహతః=ఏవిధమునఁ జూచినను బోయినదని య ర్థము. మూలమ్=లక్ష్మివచ్చుటకు నిమిత్తమైనదియు, ఛిన్నమ్ = ఛిన్నమైనది. కావున భార్యా భవిష్యసి = రామేణైవ = అని శేషము—రామునిచేతనే భరింపఁ దగినదానవు. నీమూలమున నాగర్వము సంపదయు నశించినవి. ఇఁక శ్రీరామునికడకుఁ బొమ్ము. నిన్ను భరింపఁదగినవాఁ డతఁడే కదా యని భావమని యెఱుంగవలయు.

భద్రే=ఓకల్యాణీ, ఇమాం మతిమ్=రామునకేమే నాపద గల్గునన్నబుద్ధిని, విసృజ=వదలుము. మూఢే మృతే (మయీతి

శేషః) కిం న కరిష్యసి = ఏమిచేయకుండఁ గలవు? ఏమిచేసినఁ జేయఁగలవు. భార్యాణాం సర్వాసామ్ మమేతి శేషః. ఈశ్వరీ భవ=నాభార్యలకెల్ల నీశ్వరివి గమ్ము నియమించుదానవు కమ్ము. నాతరువాత నాపత్నులు దిక్కులేకుందురు. వారికెల్ల నీవే పాలకురాలవు కమ్మని భావము. అల్పపుణ్యే నివృత్తార్థే మూఢే పండితమానిని మయీతి శేషః. భర్తృవధం శృణు = ఇట్టి యవివేకినగు నాయందు భర్తృవధ మాలకింపు మనఁగా నావంటివానిచేత నీభర్త కపకారము గలుగునని విందువా యని తాత్పర్యము. ఘోరం వృత్రవధం యథా=వృత్రాసుర వధమువలె ననఁగా వృత్రుని శతమఖుఁడు చంపినట్లు నాయందు భర్తృకృతవధమును వినుము. శుభవార్త నాలకింతువని భావము. రాక్షసాంగనలు రామవధమును దెలుపఁగా వ్యసన పడవలదని వారిమాటలుగా రావణుఁడు చెప్పి శిరమును జూపె నని మన మూహింపవలయును. ఇఁకఁ దరువాతికథను బఠింతము.

## సీత దుఃఖించుట.

* సీత యాశిరోధనుస్సులం గాంచి మిక్కిలి దుఃఖితయై కురరీవిధమున విలపించెను. కైకంగూర్చి నిందించునదియై కేకయరాజదుహితా! కృతకృత్యురాలవు గమ్ము. రఘుకులాలంకారభూతుఁ డిదిగో హతుఁ డయ్యెను. నావాంఛితము ఫలించినది కదా. కలహప్రయోజనముగా నింత లొనర్చితివి. అయోధ్యనుండి వెడలఁగొట్టువ్యాజమున రాముని జంపఁ దలంచితివి!

* ఇది ముప్పదిరెండవసర్గమునఁ గలదు.

తుదకు కులమునంతయు హతము చేసితివి. నీ తలంచినదానికి విపరీతముగా శుష్కకలహమే వంశనాశనప్రయోజనముగా ఫలించినది. కైకా! వల్కలములం గట్టుకొనం జేసి శ్రీరాముని నాతోడ నడవులకుం బంపితివే. సర్వజనప్రియకరుఁ డారామ చంద్రుఁడు నీకంత యప్రియము చేసెనా యని నిందించెను. ఎంతయో జాలి గొలుపునట్లుగా నిందించి దుఃఖవేగమునఁ గ్రిందఁబడియెను. కొంతసేపటికి స్పృహ రాఁగా నాశిరస్సును మూర్కొని కన్నీరు గ్రమ్మఁ జక్కఁగాఁ జూచుటకు బలవంత ముగా నయనముల విచ్చుచు అక్కటా! చచ్చితినే. మహా బాహూ! శత్రువును వధింపక మరలనను నీ వీరవ్రతమును బూనితివే. అట్టి నీవ్రతమిప్పుడు విఫలమయ్యెనా? ఇట్టియవస్థ నీవొందఁగాఁ గనఁజాలనైతినేఁ విధవనైతినే. భర్తకుముందుగా భార్య మృతి నొందినయెడల నందులకు భార్యయందు గుణము లేమియే హేతువని పల్కుదురు. నేను జీవించియుండ నాకు ముందుగా నీవు మృతినొందితివి. ఇట్లగుటకుం గారణము నాయందు గుణములేకుండుటయే కాని సత్ప్రివర్తనముగల నీయందు దోషముః గాదు. నాగుణహీనతకు నిదర్శనము వల యునా? నేను దుఃఖముపై దుఃఖము నొందుచు వచ్చితిని. ఇత్తటి శోకమహాసముద్రమున నే మునింగిపోయితినే. నన్నుఁ గావఁబూనిన నీవే హతుఁడవైతివే. మునిఁగితిని ఇఁకేమి చేయు దును? శ్రీరామా! నాయత్తగారు ఆకౌసల్యాదేవి దూడపైఁ బ్రీతిగలయావు దూడను బోఁగొట్టుకొని దుఃఖమునొందునట్లు పుత్త్రుఁడవగు నిన్నుఁ బోఁగొట్టుకొని పరమదుఃఖము నొందఁ గలదు. అమేయపరాక్రమా! మున్ను దీర్ఘాయువై యుందువన్న

కార్తాంతికులమాట యిపుడనృతమే యైనది. నీ వల్పాయువ వై తివి. అసత్యము పల్కరని పెద్దల నననేల? సకలభూతములకుఁ గారణభూతమగు నీకాలము నీదుష్కర్మములను బక్వమొనరించు రీతికిందగినట్లు భావ్యర్థములఁ దెలియఁజాలు సత్పురుషునకు నిన్నుఁగూర్చిన ప్రజ్ఞయే నశించును గాన ననృతవాది యతఁ డగుచున్నాఁడు. వ్యసననివారణదక్షుఁడవు. నీతిశాస్త్రవిద్వర్యుఁడవు. ఇట్లు నిద్రచేఁ జూడరానిమృత్యువు నేమఱుపాటున నెట్టు లొందితివి? సాగరతటమున విడిసిన యారాత్రి క్రూరమగు నాకాళరాత్రి తామరసాక్షుఁడవగు నిన్నుఁ గాంచి మోహించి కౌఁగిలించి నాకడ నుండనీయరాదని యపహరించి కొనిపోయినది కాఁబోలు. దిక్కుమాలిన దాననై జాలిని గల్గించుచు నన్ను వదలి భూదేవిని నాకంటెఁ బ్రియురాలింబోలె నాలింగనము చేసికొని శయనించియున్నావే! పురుషలలాముఁడవగు నీకిది తగునా? గంధమాల్యాద్యర్చితమగు నీధనువు, నాకత్యంతప్రియమగు నీధనువు ఇపుడిట్లయినదే. నీవు స్వర్గమున నామామగారగు దశరథమహారాజుతోఁ గూడియున్నవాఁడవు. నిశ్చయమే యిది. మహాత్ములు నీపూర్వు లిక్ష్వాకుప్రముఖరాజర్షులను నీవు విమానస్థుఁడవై చూచుచు నుందువు. మహారాజా! పనిదానను గదా. నిన్నుఁ జిన్నప్పుడే కరగ్రహణము చేసినదానను. నీకే భరింపఁ దగినదానను, నీజాయను. నిన్నెడఁబాయక యుండుదానను. ఇట్టి నన్నీ దురవస్థలపాలుగానుండఁగాఁ గన్నెత్తి చూడవేల? మఱి మాటలాడవేల? నీవు వివాహమున నాకరమును గ్రహించుతఱి నాతోఁగూడ సంచరించునట్లు ప్రతినచేసితివే. దాని

నిత్తఱి స్మరించుకొమ్ము,నన్ను నీదుగఖముఁవాయ నీకడకుం గొని పొమ్ము. నీవు త్తమోత్తముఁడవు.నన్ను విడనాడి పరలోకమునకుం బోయితివి. నాయొక్కదానినే కౌఁగిలించుకొను నీశరీరమిపుడు కంకగృధ్రాదులు పట్టియీడ్వఁగాఁ బొరలుచున్నదే. వనవాస వ్రతము పూర్ణము కాఁగా ననేకయజ్ఞము లొనరించి యగ్ని హోత్రముచే సంస్కారము నేల పొందవైతివి? అయోధ్య వెడలి వనములకరిగిన మువ్వురిలో లక్ష్మణుఁ డొక్కఁడే మరలి పోవఁగాఁ గౌసల్యనుజూచి శోకమునఁ గుంది సీతయు రాముఁ డెక్కడ! అని యడుగఁగలదు. అట్లడుగఁగా సౌమిత్రి రాత్రి వేళ రక్కసులు నిన్ను నీమిత్రుల సైన్యమును వధించిపోయి రని చెప్పఁగలఁడు. నీవార్త నావార్తను విని గుండియలువగుల నింక జీవించియుండదు. అట్టి మహనీయుఁడవగు నీవు దుష్టునిచే హతుఁడవైతివే. ఏమందును? నేను బ్రాగ్జననమున నెవరో కన్యాదానము చేయుచుండఁగా విఘ్నము గావించియుందును. కనుకనే రామునకు భార్యనయ్యు నిట్టిదుఃఖముల పాలగు చున్నాను రావణా! నన్నింక వేగము శ్రీరాముని చితిపైఁ బడవైవుము. మంచిపని. పతిని భార్యతోఁ గూర్పుము. రావణా! రామునిశిరస్సుతో నాశిరస్సును, అతనిశరీరముతో నాశరీర మును జేర్పుము. భర్తృసంగతి గమనింతును. పతిని వదలి బ్రదికియుండ నొల్లను. పుట్టినయింట నేనుండుతఱి బ్రాహ్మణులు కొందఱేస్త్రీలు భర్తను ప్రేమింతురో వారికి శ్రేయస్కరము లగు నుత్తమలోకములు కలుగునని వచింపఁగా వింటిని. క్షమ, యింద్రియనిగ్రహము, దానము, సత్యము, ధర్మము, కృతజ్ఞత, భూతదయ యెవ్వని నెడఁబాయక యుండునో యట్టిపతిని

బాసినయెడల వేఱుగతి యెద్ది గల్గును? అని యిట్లు లాజానకి పతిశిరస్సు ధనుస్సుం గాంచి విలపించుచుండునంతలో దౌవా రికుం డొకం డచ్చటికి వచ్చెను. జయజయనినాదమునం బ్రహ స్తుఁడు వచ్చియున్నాఁడని విన్నవించెను. మఱియు గొప్ప రాజ కార్యమున్నదని దర్శన మొసంగఁగోరుచున్నాఁడనియుం దేట పఱచెను. ఆమాటలు విని యశోకవనమునుండి రావణుఁడు మంత్రులం జూడఁబోయెను. సభలోఁ బ్రవేశించి కార్యముల వారిఁగూడి యాలోచించి వలయుదాని నొనరింపఁ బూనెను. రావణుఁడు వెడలిపోవఁగనే యాతలయు నాధనుస్సు నదృ శ్యములయ్యెను. అచ్చట రావణుఁడు రణభేరుల వాయింప నాజ్ఞాపించెను. ఆరీతిగా రణవాద్యముల మ్రోయించిరి. సైన్య ములు సన్నద్ధము లయ్యెనని ప్రభువునకు మంత్రులు విన్న వించిరి.

మహామతులారా! యింద్రజాలప్రభావము వ్రాసి యుంటిని గదా. దానిం గాంచి సీత దుఃఖించుటయు నీసర్గ మునం గానఁబడును. రావణునిసంభాషణ మెట్లు నటనమని తెలిపితినో యిదియు నట్టిదే యని మన మూహింపందగును. ప్రకృతిపురుషులవిలాసము లిట్లుండును రావణుఁడు తొలఁగి నంతనే యాశిరోధనువు లదృశ్యము లయ్యెను ఏల? యక్షి ణీమంత్రప్రభావము యామమాత్రము. పిదపఁ దనయంతన యదృశ్య మగును. దీనినే గారడి యందురు. ఈ యల్పసిద్ధు లం గోరి పాపార్జనప్రయత్నము లొనరించి యుభయలోక భ్రష్టు లగుటకంటె నుత్తమసిద్ధుల నొసంగుమంత్రముల నుపా

సించి యైహికాముష్మికఫలముల నొందద యత్నించు టుత్త మము కదా.

> "కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః,
> లోకసంగ్రహ మేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి."

అన్న గీతావాక్యమును సంస్మరించి సత్కర్మానుష్ఠానమున ననఁగా జాత్యుక్తకర్మావలంబనమున ధన్యులమగుటకుఁ బ్రయత్నింతము.

## సరమ సీత నూఱడించుట.

* రావణుఁ డచ్చోటు వాయఁగా విభీషణునిభార్య సరమ యనుసాధ్వి రామునింగూర్చి మోహితయై విపరీతముగా భ్రమించుచున్న జానకిం గాంచి తనయం దామెకు విశ్వాసము గలదని యెఱుంగుటం జేసి చెంతకుం జని మెల్లన నిట్లనియె. ఆ యంగనయందు రావణానుమతి సీతారక్షణార్థముగ నుండెను. దయాస్వరూపిణి. కావున నామెను సీత చెలికత్తియగా భావించుకొనియెను. మఱియు నాసరమ శ్రద్ధావతి గాన నామెచెలిమికిఁ బాత్రురాలై విడువకయుండెను. సీత ధూళిం బొరలాడియుంటం గాంచి సరమ తల్లీ ఊఱడిల్లుము. మనశ్చింత వదలుము. పిఱికితనమున భీతి నొందకుము. రావణుఁడు చెప్పినది నీ వతనికిం దెల్పినదియు వింటిని. పైనఁ గామరూపమున వృక్షరంధ్రమున నడఁగియుండితి. వానికిం దెలిసినఁ గీడు గలుగదా మనకు. నీమీఁది ప్రీతిం జేసి యెట్టివిపత్తులకును భయంపడను.

---

* ఇది ముప్పదిమూఁడవసర్గమునఁ గల కథ.

వాఁడెందుల కిటనుండి వెడలిపోయెనో యద్దానిం దెలిసికొం టిని. శ్రీరాముం జంపుటకుఁ గారణమే లేదు. రాముని వానరులం జంపుటయే పొసఁగదు రామరక్షితులం జంప శక్యమా? రామలక్ష్మణులయందుఁగల శౌర్యధైర్యాదిగుణములే కాక సౌభాగ్యలక్షణము లనేకములు గనుపట్టుటం జేసి వారిని వధింపఁ దరంబుగాదు. రావణుఁడు మాయాకోవిదుఁడు. నిన్ను మోహపెట్టం దలంచి యీమాయఁ గనఁబఱచినాఁడు. నీదుఃఖము నశించినది. సుఖము నిన్నుఁ బొందవచ్చుచున్నది. లక్ష్మి తప్పక నిన్ను నాశ్రయించును. రామాదులు లంకదాపునకుం జేరిరనువార్త నిత్తరుణమున భటులు తెచ్చిరి. ఆవార్తవినియే మంత్రులతోఁ జేయఁదగుకార్యము నాలోచింప వెడలిపోయినాఁడు. ఇట్లు చెప్పుచుండఁగనే సైన్యముల కోలాహలధ్వనులు సీతకు వినఁబడియెను. రణభేరికా ధ్వనుల నాలకించి యాసరమ జానకీ! ఆధ్వనుల విని భయమందకుము. చతురంగబలములు యుద్ధసన్నద్ధము లగుచున్నవి. విజయలక్ష్మి మిమ్ము వరించును. రక్కసులకు భయము కలుగును. వేగమ నీపతి రావణుని మార్కొని తనపౌరుషమును గనఁబఱుపం గలఁడు. నీవు శీఘ్రము శ్రీరామునికడకు విజయలక్ష్మీభూషితవై వెళ్లుచుండఁగాఁ జూడఁగలను. అదియే నాకు సుఫలము. శ్రీరామదర్శనమున నీశోకము నశింపఁగలదు. లోకబాంధవుఁ డగుసూర్యుని శరణము నొందుము. దాన సకలశుభముల నొసంగును అని పలికెను.

మహామతులారా! ఈభాగమున విశేషములు లేవు గాని యొక్కవిషయ మెఱుంగం దగియున్నది. రావణునకు

విభీషణునియం దత్యంత ప్రీతివిశ్వాసములు కలవు. అతఁడు భక్తుఁడని సాధుమతి యని నీతిశాస్త్రపారంగతుఁడని జ్ఞాని యని యతఁ డెఱుంగును. తుట్టతుదకు వెడలనంపెనుగాని యంతకుముం దాతనిపై నాగ్రహమే లేనివాఁడుగ నుండెను. అట్టిరావణుఁడు తనసోదరునిభార్యను సీతకడఁ గావలిగా నునుపఁ గారణమేమి? ఏకజట లోనగు వికృతాకృతులు రక్షస్త్రీలు కావలియుండ నియోగించి తనయంత వానిభార్యనేల కావలియుంచెను? అని మన మూహించుట ప్రమాదకార్యము కాదు. సీతయం దాతనికి మాతృభక్తి కలదు. కనుకనే తత్సంరక్షణార్థము రక్షస్త్రీలబుద్ధియు వృత్తియు లేనిసరమ నందుండ నియోగించెను.ఆమె మిక్కిలి ప్రీతిగలదియై వర్తించుచు సీతకు నెచ్చెలియై యుండినదని మనము భావింపవలయు. మఱియు సంభావింపవలయును. "విభీషణ భార్యాయాః రావణేన నియోగోఽనుచిత ఇవ ప్రతిభాతి. రావణనియుక్తత్వే తద్భయాద్గూఢావస్థాన మనుపపన్నమితి ప్రతీయతే. అత్ర పరిహారో విద్వద్భిశ్చింతనీయః" అను రామానుజీయవిషయద్వయమే యయుక్తిక మని గ్రహించు టుచితము.

## సరమ రావణునభిప్రాయ మెఱింగి సీతకుం దెల్పుట.

* దుఃఖితురాలగు నాసీతను సరమ చెప్పినమాట లించుక శాంతచిత్తనుగాఁ జేయఁగల్గెను. ఎత్తఱి నేది చేయవలయునో యెఱింగిన యాసరమ సీతకు హిత మొనఁగూర్పఁ

* ఇది ముప్పదినాల్గవసర్గమునఁ గల కథ.

బూని తల్లీ! ఇతరు లెఱుంగకుండ రామునొద్దకుం బోయి నీ క్షేమవార్తలం దెల్పి మరలిరావలయునని కోరెదను. ఇక్కార్యమున సమర్థురాలను. నిరాధారమగునంబరమున నేనరుగుచుండ నావెంట నడువ గరుడానిలులు సమర్థులుగారు సుమీ. అనెను ఆమాటల నాలకించినజానకి సుస్మితమొనరించి మధురభాషణముల నోనెచ్చెలీ నీ వాకాశమునఁగాని పాతాళమునఁగాని యరుగం జాలుదువు సందియమే లేదు. అశక్యకార్యము నావిషయమున నీ వొనరింపఁగలవని నే నెఱుంగుదును. నాకుఁ బ్రియముసేయవలయునను నీతలంపు స్థిరమగునేని రావణుఁ డిపుడేమిచేయుచున్నాఁడో తెలిసికొని రమ్ము. వాఁడు మాయాబలుఁడు క్రూరుఁడు గాన నన్నుఁ బలుసారులు మోసపుచ్చుచున్నాఁడు. వానివలనఁ గలుగుభయమే నన్నుద్విగ్నగాఁ జేయుచున్నది. కాన వార్త నెఱింగి రమ్ము. దాని నాకుం జెప్పుము. నాకెంతో యుపకారముచేసిన ట్లగును.

ఆపలుకు లాలించి జానకీ! యిపుడే పోయెదను. తెలిసికొని వత్తునని యపుడే పోయి యన్నింటి నెఱింగి వచ్చి తన రాకకై వేచియుండు సీతం గాంచి యామె కౌఁగిలించి యాసన మొసంగం బ్రీతి నొంది తల్లీ! జననియగు కైకేసియు వృద్ధమంత్రియగు నవిద్ధుఁడు నిన్ను విడిచిపుచ్చుమని మిక్కిలి బోధించిరి. వారతనితో నీవు రామునకు మర్యాదగా సీతం గొని పోయి యిమ్ము. ఇయ్యకున్న రామునిపరాక్రమ మట్లుండఁగా హనుమదాదులపరాక్రమము ఫలించునని బోధించిరి. కాని యతఁడు తనపట్టుదల వదలఁ డయ్యెను. యుద్ధమున మృతుఁడైనఁగాని నిన్ను విడువనొల్లఁడు. మృతినొందుకాలము దాపు

నకు వచ్చినది. రాముఁడు తప్పక రక్కసుల నందఱిం జంపి నిన్నుఁ దోడ్కొని యయోధ్యకు వేగమ పోఁగలఁడు. ఇట్లు తెలుపుచుండఁగా వానరవీరులసింహనాదములు వినంబడియెను.

## మాల్యవంతుఁడు రావణునకు హితముం దెల్పుట.

* అత్తఱి శ్రీరాముఁడు తూర్యధ్వనులొప్ప లంకపై నెత్తివచ్చెను. రావణుఁ డాధ్వనుల విని యించుక యాలోచించి మంత్రులం గాంచెను. మహావిక్రమశాలి రావణుఁడు మంత్రులం బిల్చి సభయంతయు మాఱుమ్రోయునట్లు వారితో నిందాత్మకవచనముల మీఱు రామాగమనాదులు తెల్పితిరి. వింటిని. రణశూరులయ్యు వైరిపరాక్రమమును విని పరస్పరము చూచుకొనుచు నుత్సాహములు మాని యుండుటయు నెఱుంగుదును. అనఁగా రావణునితల్లికిఁ బితృవ్యుఁడు ప్రాజ్ఞుఁడునగు మాల్యవంతుఁడు రాక్షసవర్యుఁడు రావణువచనముల నాలకించి రాజా! ఏరాజు ఆన్వీక్షకి, త్రయి, వార్త, దండనీతి యను నాలుగువిద్యలయందు సుశిక్షితుఁడై నీతిశాస్త్రము ననుసరించి నడుచుకొనునో యతఁడే చిరకాలము రాజ్యమును పాలించును, శత్రువుల జయించును. అట్టిరాజు స్వబలము క్షీణింపఁగా సంధి చేసికొనుచు స్వబలము వృద్ధియగునపుడు దానికి ఫలముగా మహావైభవము ననుభవించును. ఒకఁడు స్వబలము శత్రుబలముకంటెఁ దక్కువ యగుచున్నను దత్తుల్యబలము గలవాఁడయినను శత్రువులతో సంధితప్పక చేసికొనవలయును. ఆరాజు శత్రుబలముమించిన బలముగలవాఁడగు నేని వాని

* ఇది ముప్పదైదవసర్గమునఁ గల కథ.

నుపేక్షించి యుండక వైరము పెట్టుకొనవలయును. రావణా! నీతిశాస్త్రమార్గ మిట్టిది. బలము క్షీణించుచున్న నీకు బలవంతుఁడగు రామునితో సంధి చేసికొనుట నా కిష్టముగా నున్నది. బలవంతునితో సంధి దానములేక పొసఁగదు. మీయిరువుర కెవ తుకకొఱకు వైరముగల్గినదో యాసీత నతని కిచ్చివేయందగు. దేవాదులు రామునకు జయముగలుగఁ గోరుచున్నారు. కాన బలవంతుఁ డగును. కావున విరోధ మతనితోఁ గైకొనవలదు. సంధి చేసికొనుము. బ్రహ్మ సురాసురులకు ధర్మాధర్మము లవలంబముగా సృజించెను. వానిని వారవలంబించిరి. దేవతలు చేపట్టినది ధర్మ మనఁబడుచున్నది. అసురావలంబ మధర్మ మనంబడుచున్నది. దేవతలు రామపక్షావలంబులు గాన నతఁడు బలవంతుఁడే యగును. ఎపుడధర్మమును ధర్మము క్రిందుపఱచునో యపుడు కృతయుగము ప్రవర్తించుచున్నది. ఎపుడు ధర్మము నధర్మము క్రిందుపఱచునో యపుడు కలి ప్రవర్తించుచున్నది. దిగ్విజయార్థము నీవు లోకములం గ్రుమ్మరుతఱిఁ బరదార పరిగ్రహాదులచేత ధర్మమును మీఱి యధర్మమును గ్రహించితివి. అధర్మప్రవర్తకమగు కలిక కృతము బలవత్తరమైనది. అధర్మమును ముందువెనుక లాలోచింపక వృద్ధి గావించుకొంటివి. అది సమామూలముగా మ్రింగుచున్నది. దేవతల కనుకూలమై వారలపక్షమును వృద్ధిచేయుచున్నది. అధర్మము మనకే హానికరముగాని దేవతలకుం గాదు. రావణా! నీవు కాముకుఁడవై దేవాదికన్యకలను భార్యలను బట్టుకొనుట లోనగుకృత్యముల విచ్చలవిడి నొనరించి పరమపావను లగుమహర్షులకు మనస్తాపము గల్గించితివి. వారి

ధర్మకార్యములే దేవతలయభివృద్ధికిఁ గారణములగు. వారి సత్కర్మములవలన రాక్షసులు పరితపించుచున్నారు. ఋషుల మనస్తాపముచే మనకే యధర్మము నాశము గల్గించుచున్నది. దేవతలు వృద్ధియగుచున్నారు. దేవాదులచేఁ జావకయుండ వరములఁ బడిసితివి. ఇపుడు మానవులు వానరభల్లూకాదులు వచ్చి ముట్టడించిరి. వీరివలన మృతినొందకుండ వరము నీకు లేదుగదా. దివ్యాంతరిక్షభౌమములగు నానావిధోత్పాతములం బరికింప రాక్షసవినాశము కల్గుననియే తోఁచెడు. ఉత్పాతము లిట్టివని చెప్ప నలవిగాక యున్నవి. కావున రామునితో సంధి గావించుకొనుము. ఇట్లు మాల్యవంతుఁడు తెలిపి రావణుని యిం గితాకారములం బరికించి యతనిమనస్సు మార్పునొందకుంటఁ దెలిసికొని యిఁక లాభము లేదని మాని యూరకుండెను.

మహామతులారా! రక్కసులలో మహాపండితులున్న వారని శ్రీరాముఁడు విభీషణునాగమనకాలమున సుగ్రీవుని ప్రశ్నములకు నుత్తరము లిచ్చునపుడు చెప్పియుండెను గదా. ఈసంభాషణమున నామాట సత్యమే యని తేలఁ గలదు మాల్యవంతుఁడు రావణుని మేలు కోరినవాఁడు. ఆతని తల్లికిం బినతండ్రి. కావున రావణుని ద్వేషించువాఁడు కాఁడు. అందును గడుంగడుం బెద్దవాఁడు. ఆతనియుపదేశముం బరిశీ లించిన,

> "యత్ర ధర్మో హ్యధర్మేణ సత్యం యత్రానృతేన చ,
> హన్యతే ప్రేక్షమాణానాం హతాస్తత్ర సభాసదః."

అను మనుస్మృతివాక్యము స్మృతిగోచరము కాకపోదు. ఏకాల మున ధర్మమునకంటె నధర్మము మించియుండునో ఆకాలమున

నా దేశము హతమగును. సత్యధర్మములకు హాని అసత్యా ధర్మములనుండి కలుగకయుండఁ జూచుకొనుటయే ప్రజల యొక్కయు, ప్రభువులయొక్కయు విధియై యున్నది. ఆవిషయమునే వాల్మీకిమహర్షి మాల్యవంతునియుపదేశమూలము మనకు వెల్లడించెనని యెఱుంగందగు.

"అసృజద్భగవాన్ పక్షౌ ద్వావేవ హి పితామహః. ౧౨
సురాణా మసురాణాం చ ధర్మాధర్మౌ తదాశ్రయౌ,
ధర్మో హి శ్రూయతే పక్షో హ్యమరాణాం మహాత్మనాం. ౧౩
అధర్మో రక్షసాం పక్షో హ్యసురాణాం చ రావణ,
ధర్మో వై గ్రసతేఽధర్మం తతః కృతమభూద్యుగం. ౧౪
అధర్మో గ్రసతే ధర్మం తతస్తిష్యః ప్రవర్తతే,"

అని మూలము. దేవదానవులవృత్తుల ననుసరించి ధర్మాధర్మములాశ్రయము లయ్యెను. అనఁగా ధర్మమునే యాశ్రయించి మెలంగుట దేవతలస్వభావము. స్వేచ్ఛగావర్తించుట రాక్షసుల స్వభావము. అదియే యధర్మము. అనఁగా భావమేమి? విహిత కృత్యముల మాని యవిహితకృత్యముల నాచరించుచు శాస్త్ర విహితము లగునాచారముల వదలి తమకుఁ దోఁచినట్లు వర్తించుచు నుండువారే రాక్షసులని తేలినది. అధర్మమనఁగా నద్దియే. ఎవరి కెట్లు తోఁచునో యట్లు మెలఁగరాదని విధించు నదియే శాస్త్రము. అభివృద్ధి దేనివలన నగునో యామార్గము నకే సదాచారమని పేరు. ఈరెండింటిని మానినవాఁడే రాక్షసుఁడు అట్టివానికి భగవంతునితోడ్పాటు కలుగదని భావము. విహితకర్మముల నాచరించుచు నవిహితకృత్యములకు భయపడి శాస్త్రమును మీఱక ప్రవర్తించువారే దేవతలు. అట్టి

వారికే భగవదనుగ్రహము గలుగునని తాత్పర్యము. దేవ రాక్షసభేద మీరీతి నెఱుంగందగు. ఒకతెగవారు స్వర్గమునం దును బాతాళమునందు నుండవచ్చును. కాని యొకజాతిగాక వృత్తినిబట్టి వచ్చిన పేరులని మన మెఱుంగుట మంచిది. కలియుగ మనఁగా ధర్మము నధర్మము మించుకాలమని, కృతయుగమనఁ గా నధర్మమును ధర్మముమించి వెలయుకాలమని యీభాగము మనకుఁ దెల్పుచున్నది. ఔరా! మహర్షి యెంతటిప్రాజ్ఞుఁడు.

"లౌకికానాం హి సాధూనామర్థం వాగనువర్తతే,
ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి."

అన్న భవభూతివాక్య మెంత సారవంతము. ఇక్కాలపుఁ బరిస్థితుల నాలోచింపఁగా నన్నియు నీరామాయణమునఁ జెప్పఁబడినట్లు జరగుచున్నవి. ఇపుడు ధర్మ మధర్మముచేఁ గీడ్ప బడుచున్నది కదా. ఉండినధర్మము నిర్మలముగాక యెట్లో యున్నది. రామాయణమునందుఁ బేర్కొనఁబడి యుండు విషయములన్నియుఁ బ్రత్యక్షప్రమాణము లన వలయుఁ గదా! అధర్మాభివృద్ధి యగుటంజేసియే మానవుల యాయువు తఱుగుచున్నది ఎన్నికష్టములు కలిగినను మానవులు స్వేచ్ఛావర్తనమును మాత్రము మానఁ దలంచుటయే లేదు. "కాలోఽపి దురతిక్రమః" అనుసూక్తి సత్యమే యగుచున్నది.

"తత్త్వయా చరతా లోకాన్ ధర్మో వినిహతో మహాన్. ౧౫
అధర్మః ప్రగృహీతశ్చ తేనాస్మద్బలినః పరే,
స ప్రమాదాద్వివృద్ధస్తే ధర్మోఽభిగ్రసతే హి నః. ౧౬
వివర్ధయతి పక్షం చ సురాణాం సురభావనః,"

అని మూలము. రక్కసులలోఁ బెక్కండ్రు పండితు లున్నా

రన్న రామోక్తి నీతఁడు సార్థకము చేయుచున్నాఁడు. దిగ్విజయకాలమునందు నీవు ధర్మమును బాడుచేసితివి. అనఁగా దుష్కార్యముల నాచరించితివని భావము. అధర్మమును జేపట్టితివనఁగా స్వేచ్ఛాప్రవర్తనపరాయణుఁడవైతివని తాత్పర్యము. ఆయధర్మము నీ ప్రమాదమువలన వృద్ధినొంది మనల మ్రింగుచున్నది. అంతమాత్రమునఁ దృప్తినొందలేదు. మనకు శత్రువు లగు దేవతల వృద్ధినొందించుచున్నది. ఒకఁ డొకయధర్మకార్య మొనరింప నది యభివృద్ధినొంది వానిశత్రువునకు వృద్ధింగూర్చి వానిమూలమున వీనిం జంపించునని సారము. అధర్మరూపకర్మము తా నొక్కకార్యము చేయదు. ఇతరులచేఁ జేయించునని మన మెఱుంగుట మంచిది. కనుకనే దానిగతి దుర్జ్ఞేయమని భగవద్గీత తేటపఱచెను. దాని నెఱుంగఁజాలక బ్రహ్మాదులే తికమకపడుచుండఁగా నిఁక నస్మదాదులమాట తలపెట్టనేల? దీనింబట్టి యధర్మము నవలంబించుట మన క్షేమమునకే హానికరమని యెఱింగిన నించుక తదాచరణనిరతి తగ్గునని యూహింప నవకాశము కలుగును.

"విషయేషు ప్రసక్తేన యత్కించిత్కారిణా త్వయా. ౧౭
ఋషీణామగ్నికల్పానాముద్వేగో జనితో మహాన్,
తేషాం ప్రభావో దుర్ధర్షః ప్రదీప్త ఇవ పావకః. ౧౮
తపసా భావితాత్మానో ధర్మస్యానుగ్రహే రతాః,
ముఖ్యైర్యజ్ఞైర్యజంత్యేతే నిత్యం తైస్తైర్ద్విజాతయః. ౧౯
జుహ్వత్యగ్నీంశ్చ విధివద్వేదాంశ్చోచ్చైరధీయతే,
అభిభూయ చ రక్షాంసి బ్రహ్మఘోషానుదైరయన్. ౨౦

దిశోఽపి విద్రుతాస్సర్వాః స్తనయిత్నురివోష్ణగే,
ఋషీణామగ్నికల్పానామగ్నిహోత్రసముత్థితః." ౨౧

అని మూలము. ఋషులకు హాని గూర్చితివి. కాన వారి యాగ్రహమే మనలఁ గాల్చుచున్నదని సందర్భార్థము. ఇందలి విశేషమిది. మహర్షులు శస్త్రధరులు గారు. కావున మనల నేమియుఁ జేయఁజాలరని భావింపరాదు. అదృశ్యరూపములగు నస్త్రములు దుష్టవంశములను రూపుమాపును. శస్త్ర మొక్కని జంపును. ఋషులవాక్శస్త్ర మాతనివంశమునే హత మొన ర్చును. దీనికే మారణప్రయోగమని పేరు. ఇది మహాపాప కార్యము కాదా యనవచ్చును. పాపకార్యమే యగునుగాని యొకప్పు డది మహాపుణ్యకార్య మగును. మహాపాపకార్య రతుఁ డొకఁడు విచ్చలవిడి సంచరించుచు సాధ్వుల నవమా నించుచు నెన్నియో నకార్యము లొనరించుచుండు. అట్టితఱి ఋషి నెల్ల రాశ్రయింతురనుకొందము. ఆయుపాసకుఁ డేమి చేయవలయును? మనకేల యని యూరకుండవలయునా? ధర్మ రక్షణార్థ మాపాపాత్ముని బొలియింపవలయునా? లోకము లోని నరులందఱు శుకశమీకమహర్షులవంటివారు కారుగదా. ఆయుపాసకుఁ డొకమంత్రము నుపాసించి విధివిహితముగా సం కల్పఫలానురూప మగుకుండము నిర్మించి హోమము చేయును. పూర్ణాహుతికాలమున సాధ్యనామము నుచ్చరించి హోమము చేయును. దాన నాదేవత ప్రసన్నయై యదృశ్యరూపమున నాతనిం బొలియించును. పిదపఁ దక్కినయంగములు నిర్వర్తించి యయతఁడు సిద్ధసంకల్పుఁ డగును. ఇది ధర్మరక్షణార్థమే యైనఁ బుణ్యకార్యమే యనందగు. స్వార్థప్రయోజనమున కెంత

మాత్రముతో డప్పుడునదియైన వంశక్షయ హేతుభూత మగును. ఇదియే సూక్ష్మతమధర్మమని మన మెఱుంగందగు. ఋషు లిట్లే యొనరించిరి. దానికే శాపమని పేరు గల్గినది. ఉపాసకుఁడు కానిచో నది సుంతయు ఫలింపదు. శాపమిచ్చుటచేఁ దన తపస్సు నశించునని కొందఱప్పని కంగీకరింపరు. కొందఱు ధర్మరక్షణము మహాపుణ్యకార్యమగుట నద్దానఁ దమయుపాసన నశింపదని తలంతురు. ఈ రెండును యుక్తియుక్తములే.

> "దేవదానవయక్షేభ్యో గృహీతశ్చ వరస్త్వయా. ౨౩
>
> మానుషా వానరా ఋక్షా గోలాంగూలమహాబలాః,
>
> బలవంత ఇహాగమ్య గర్జంతి దృఢవిక్రమాః." ౨౪

అని మూలము. కర్మమును మోసగింపఁ దలంచుటకంటె వెఱ్ఱిపని వేఱొకఁడు కానరాదు. బ్రహ్మాండములు, క్షణమున నిర్మింపఁబడుచుండ నొకతుచ్ఛునిం బోలియింప సృష్ట్యంతరము చేయఁబడకుండునా? హయగ్రీవుఁ డసురక్కసుఁడు తానేట్లట్టి రూపమునొందెనో యనిదైన నూహింపక యిపుడుండు సృష్టిలో నెద్దాని చేతను మృతి గల్గకుండునట్లు వరము గోరెను. విష్ణుమూర్తి హయగ్రీవుఁడై వానిం జంపెను. తనకట్టిరూపమును గల్పించిన బ్రహ్మ యట్టి వేఱొకదాని నిర్మింపఁజాలఁడని పొరపడుటకంటెఁ గుమతిత్వ మింకెద్ది యుండును? మన మీ భాగమునుండి నేర్చుకొనఁదగిన దేది? మనము మనస్సుచేతఁ జేయునకార్యములు కనుఁగొనువారు లేరనుకొనరాదు. అవి యెఱింగియే కర్మము తదనురూపము లగుఫలముల నొసంగుచునే యుండును. కాన మనస్సంకల్పములు దుష్టములు గాకయుండఁ జూచుకొనవలయును.

"ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి."

యన్న గీతార్థము మఱచిపోవరాదు అనునదియే. ఇఁకఁ దర్వాతి కథను బఠింతము.

## లంకారక్షణార్థము రావణుఁ డాదృతిం గాంచుట.

* దుష్టాత్ముఁ డగు రావణుఁడు మాల్యవంతుఁడు హితముగాఁ జెప్పినమాటలు విని సహింపఁ డయ్యె. అతఁడు క్రోధావిష్టుఁడై బొమలుముడిచి యమ్మాటను సయింపఁజాలక కన్నులు గిరగిరం ద్రిప్పుచు నాతనిం గని నీవు శత్రుపక్షము ననుసరించియే వారికనుకూలముగా హితముగా నేను దలంతుననునభిప్రాయముతో నహితంబగు పరుషవచనముం జెప్పితివి. శ్రుతికటువుగా నున్నది. రాముఁడు మానవుఁడే కాక జాతిచేతనే దుర్బలుఁడు. దీనుఁడు కావున స్వభావముచేతనే బలహీనుఁడు. ఒక్కఁడు. కపులే సహాయులు. శూరులు సేనలో లేరు. తండ్రి పాఱఁదోలఁగా వచ్చినవాఁడు. కనుక రాజ్యము కూడ లేదు. అడవులఁ దిరుగుచుండు రాముని సమర్థుఁ డనుచున్నావే. ఏల? నేననఁగా రాక్షసాధీశుఁడను. దేవభయంకరుఁడను. సకలవిధపరాక్రమ సమగ్రుఁడను. ఇట్టి నన్నుఁ దక్కువవానిగా నెన్నితివే. కారణమేమి? నీవారిలో నీకుఁ డొక్కఁడున్నాఁడన్న ద్వేషముచేతనో శత్రువులయందుఁ గల పక్షపాతముచేతనో, శత్రువులు నిన్నుఁ బురికొల్పిన హేతువు

---

* ఇది ముప్పదాఱవసర్గమునఁ గలదు.

చేతనో నీవిట్లు నన్ను వచింపరానట్టి కఠినోక్తులాడితివని నా కనుమానము కలుగుచున్నది. అట్టి ప్రోత్సాహమే లేకయున్న నెవ్వఁడైన సమర్థుని నన్నిట్లు తూలనాడునా? నీవన్నదే యథార్థ మనుకొందము. అయిననుంగూడఁ దామరసపీఠము లేని లక్ష్మీ దేవివలె నుండుజానకిని వనమునుండి తెచ్చి రామునకు భయంపడి యేల యిత్తును? దుర్లభవస్తువు నార్జించి విడుచువా రుందురే? ఇంక నా రాముఁడు బలములతో హతుండగుట కొలఁదిదినములలోనే చూడఁగలవు? ద్వంద్వాహవమున దేవతలఁ బాఱఁదోలిన రావణుఁడు రామున కేల భయంపడును? అని పరుషముగా నాతనితోఁ బలికి వెంటనే యనుతాపమున తాతా! ఏది యెట్లైనఁగానీ యెవ్వానికినైన నేను లొంగను. నీతివిరుద్ధమైనను స్వభావసిద్ధమగుదోషము. స్వభావము నతిక్ర మింప శక్యమే కాదు. వేఁపచెట్టు మధురముగాదు సుమా. సేతుబంధనము గదా నీ కింతభయమును గల్గించినది. అహో! కయద్భుతకార్యమా? దానికై భయము వలదు. సేనలతో సాగరమును దాఁటివచ్చినరాముఁడు ప్రాణములతో మరలఁ బోవుట కల్ల. సత్యమిది. శపథము చేయుచున్నాఁడను.

అని పలుకఁగా నహంకారమునఁ గుపితుఁడయి యున్న వాఁడని తెలిసికొని తనయుపదేశము నిష్ఫలమని నిశ్చయించి లజ్జనొంది యేమియుం బలుకక యూరకయుండెను. మరల నప్ప టికిఁ దగినట్లుగా నతనికి జయము గలుగవలయునని దీవించి సెలవంది యింటికిం బోయెను. రావణుఁడు మంత్రులంగూడి యాలోచించి లంకానగరరక్షణము చక్కఁగా నేర్పఱచెను. తూర్పునఁ బ్రహస్తుఁడు, దక్షిణద్వారమున మహోదర మహా

పార్శ్వములు, పడమటిద్వారముకడ మహామాయుఁడు నింద్ర జిత్తు, నుత్తరద్వారమునందు శుకసారణుల నుండ నియమిం చెను. తాను నందేయుందునని మంత్రులకుం దెల్పెను. పురాంత ర్భాగమునందు విరూపాక్షుని నుండ నియమించెను. ఇట్లు పురవరసంరక్షణ మొనర్చి మృత్యువు పురికొల్పుచుండఁగాఁ దన్ను ధన్యునిగాఁ దలంచుచుండెను. రక్షణ కేర్పడినవారెల్లఁ దమకార్యములయం దప్రమత్తులై యుండిరి. రావణుఁడు కార్యములనెల్ల నిర్వహించి యంతిపురి కరిగెను.

మహామతిమంతులారా! ఈభాగమున విమర్శనీయాంశ ములు గలవు. వానిం బరికింతము. మాల్యవంతునితో రావ ణుఁడు తెల్పిన యుత్తరములధోరణి యెట్టిదని యించుక విమ ర్శింపుఁడు.

"మానుషం కృపణం దీనమేకం శాఖామృగాశ్రయం,
సమర్థం మన్యసే కేన త్యక్తం పిత్రా వనాలయం." ౪

అని మూలము. ప్రాతీతికార్థము స్పష్టము. వనాలయం=వన మనఁగా నిట సాగరమర్థము. అది శయనముగాఁ గలవాఁడు. నారాయణమూర్తి యని భావము కనుకనే పిత్రా త్యక్తమ్= జన్మాదిరహితుఁడని భావము. అక్కారణముననే పితృప్రము ఖులు లేనివాఁడని సారము. కాఁబట్టియే ఏకం=అద్వితీయుఁ డని యర్థము. శాఖామృగాశ్రయం = శాఖాభిర్వేదశాఖాభి ర్మృగ్యత ఇతి శాఖామృగః వేదవేద్యః సచాసావాశ్రయశ్చ= తమ్— వేదవేద్యుఁడు సర్వాశ్రయుఁడునని యర్థము. అయిన నొకానొకకారణముచేత, మానుషమ్ = మనుష్యరూపమున నవతరించినవాఁడని యర్థము. కనుకనే కృపణమ్=కృపాళువని

భావము. రామం సమర్థం మన్యసే=తలంచుచున్నావు. రావణుని వాగ్ధోరణిఁ బరికింపుఁడు. రెండవయర్థము హృదయగతాభిప్రాయమును సూచించునదిగా నుండనేల? మహాభక్తుఁడు పండితోత్తముఁడు నగుట నితరులకు స్వాభిప్రాయము తెలియకయుండఁ జెప్పెను. దాని నెఱుంగక రాక్షసులు మృత్యుప్రేరితులగుట రావణునాశయము యుద్ధకాంక్ష గలదియే యని పొరపడి రణయత్నమున నిమగ్నులై సాహసమును జూపఁ బూనిరని మన మూహింపవలయు.

"ఆనీయ చ వనాత్సీతాం పద్మహీనామివ శ్రియం,
కిమర్థం ప్రతిదాస్యామి రాఘవస్య భయాదహం. ౮
కృతం వానరకోటీభిస్ససుగ్రీవం సలక్ష్మణం,
పశ్య కైశ్చిదహోభిస్త్వం రాఘవం నిహతం మయా. ౯

అని మూలము. మాటల పరిపాటిం బరికింపుఁడు. పద్మహీనామ్ శ్రియమివ (స్థితాం) సీతాం వనాదానీయ రాఘవస్య కిమర్థం భయాత్ప్రతిదాస్యామి=పద్మసింహాసన మొక్కటి తక్కువగా శ్రీదేవి యగుసీతను వనమునుండి అనఁగా వనముననుండక నగరమున నుండుమా యని వేఁడి తెచ్చితినని భావము. "అపహృత్య" అనక "ఆనీయ" యనుటయుఁ బరిశీలింపందగు. రాఘవస్య భయాత్=భయమువలన రామున కీయను. తత్కారమృతినే గోరు నేను చంపునేమో యని భయంపడుదునా? ప్రాణములకై యాదేవి నొసంగుదునా ? ఏయుద్దేశమున నిత్తును? అనఁగా బ్రదుకునుద్దేశములేని నేనింకేల యిత్తునని సారము. కైశ్చిదహోభిర్నిహతం రాఘవం పశ్య. మయా=హేతునా నాకారణముచేత ననఁగా నన్ను వధింపఁగోరి యవతరించిన

కతనని యర్థము. నిహతమ్మనఁగా వచ్చినవానినని యర్థము. మాల్యవంతా! కొలఁదిదినములలో రామచంద్రునే చూడఁగల వని తాత్పర్యము. శ్రీరామునిమూలమున మృతినిగోరు నన్ను మరల సీతను రామునకిమ్మని యుపదేశింపఁ గలుగులాభమే లేదని రావణునాశయము.

"ద్విధా భజ్యేయమప్యేవం న నమేయం తు కస్యచిత్,
ఏష మే సహజో దోషస్స్వభావో దురతిక్రమః. ౧౧
యది తావత్సముద్రే తు సేతుర్బద్ధో యదృచ్ఛయా,
రామేణ విస్మయః కోఽత్ర యేన తే భయమాగతమ్. ౧౨
స తు తీర్త్వార్ణవం రామస్సహ వానరసేనయా,
ప్రతిజానామి తే సత్యం న జీవన్ ప్రతియాస్యతి." ౧౩

అని మూలము. నేనొకరికి లొంగను. ఇది నైజదోషము. స్వభావము దాఁట శక్యము కాదు. అని మహర్షి రావణునిమూలమున మనకుఁ దెల్పెను. ఎంతటివాఁడైనను స్వభావము మార్చుకొనఁజాలఁడు. ఏల? అది స్వకర్మవశమైనది. కర్మ మనతిక్రమణీయము. కావుననే స్వభావము దురతిక్రమ మయ్యెను.

"మిథ్యైవ వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి
స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్."

అను నీ గీతావాక్యములు కూడ నీయర్థమునే తేటపఱచుచున్నవి. రామాయణాభిప్రాయములే తఱచుగా గీతలయందుఁ గలవని మన మెఱుంగందగు. అనఁగా నాస్వభావము రావణునిచే మృతినే కోరును. దాని నెట్లు మార్చుకొనఁగలను? సారము. స్వేచ్ఛగా సాగరమున సేతువు గట్టి వచ్చెను గ

యని యనుదువేమో. దానికి భయంపడకుము. ఇది యేమి గొప్పకార్యమా? సకలబ్రహ్మాండముల సంకల్పమాత్రమున నిర్మించు ప్రకృతివిశిష్టునకుఁ బరాత్పరున కీకార్య మొక్కతృణ ప్రాయమని భావము. రాముఁడు సేనలతో మరలి పోవునని ప్రమాణము చేసెదను. న = సందియమే లేదని తాత్పర్యము. నన్ను వధించి జానకింగూడి బలములతో శ్రీరాముఁడు మరల సముద్రమును దాఁటిపోవఁ గలఁడు. ఇందులకు సందియమే లేదని యిందుఁగల భావసారము ఇఁకఁ దరువాతికథ నాల కింపుఁడు.

## రాముఁడు సేనారక్షణయత్న మొనరించుట.

* అచ్చట శ్రీరామలక్ష్మణులు సుగ్రీవాదివానరవర్యు లంద ఱొకచోటఁ జేరి రావణపాలితమగు లంకాపుర మిదిగో కనఁబడుచున్నది. ఇది దేవాదులకు భేదింప నలవిగానిది. కావున జయసిద్ధిఁ గోరి వలయుకార్యముల నిర్ణయించుటకై యోజించిరి. విభీషణుఁ డత్తఱి నెల్లరకు స్పష్టముగాఁ దెలియుటకొఱకు స్వదేశభాషాపదముల వదలి యగ్రామ్యములగు సంస్కృతపద ములతో విశేషార్థబృంహితమగునట్లుగా నామంత్రు లీనలువురు లంకకరిగి యిపుడే వచ్చినారు. పక్షిరూపములం గొని నగర రక్షణ ప్రయత్నములం గని వచ్చినారు. అని ప్రహస్తాదులఁ బ్రాగాదిచతుర్ద్వారములఁ గావ నియమించువార్తలం దెల్పి రావణునికడనుండు మహారథికులం బేర్కొని యం దొక్కొక్క నికిఁ బదిలక్షలమంది పరిజనులు రణముచేయఁ దొడఁగుదురు,

* ఇది ముప్పదేడవసర్గమునఁ గల కథాభాగము.

అని పలికెను. ఆతనిమంత్రులును దమ చూచినవార్తలను శ్రీరామునకుఁ దెల్పిరి. రావణునితమ్ముఁడు రామునితో రావణు బలము లపారములు. ఐన నీకడ వానిలెక్కయేల? మనసేనలం గూడ నాల్గుగా విభజించి వానిసేనలం బొలియింపుము. ఆమాటలు విని రాముఁ డవ్విభీషణునితో నీలుఁడు బలములం గూడి ప్రహస్తునితోఁ బోరాడును. అంగదుఁడు మహాబలములం గూడి దక్షిణద్వారమునఁగల మహాపార్శ్వప్రభృతులతోనని చేయును. హనుమంతుఁ డపారబలపరాక్రమవంతుఁడు కావున నింద్రజిత్తునితోఁ బోరాడుఁగాక. రావణుని వరదానగర్వితుని జంపఁదలంచితిని గాన నుత్తరద్వారమున నున్నవానితో లక్ష్మణునితో నేనే పోరాడెదను వానరాధిపతి సుగ్రీవుఁడు జాంబవంతుఁడు నీవు నుత్తరపశ్చిమములకు నడుమ సేనగా నుండవలయును. వానరులు మానవరూపముల నిపుడున్నయట్లుండ రాదు. ఇది సంకేతముగా నుండవలయును. మనలో మనకుఁ దెలియుటకు వానరులుగా నుండుటయే చిహ్నము. మే మిరువురము విభీషణుఁడు నతనిమంత్రులు నల్వురు నీనేడుగురమే మానవాకృతుల సంగర మొనరింపందగు. ఇట్టు నియమముల నొనరించి సువేలాచలమున నుండ నిచ్ఛయించెను. పరిచరులం గూడి సోదరునితో రావణుని వధించునిచ్ఛ దృఢముగానుండ సువేలాచలమునకుం బోయెను.

## లంకఁ జూడ రాముఁడు సువేలాద్రి నెక్కుట.

* శ్రీరాముఁడు సుగ్రీవవిభీషణులం గాంచి తమ్ముఁడు వినుచుండ మనమందఱము పర్వతమును దీనినెక్కి యీరాత్రి

---

* ఇది ముప్పదియెనిమిదవసర్గమునఁ గలదు.

యంతయు నిం దుందము. దుర్మతియగు రావణునివాసమగు నీ లంకానగరమును జూతము. వాఁడు నీచమతిగానఁ గులాచారములం గాంచక నిందితమగు నీపరదారాపహరణ నిందితకార్యమును జేసినాఁడు. వానిపే రుచ్చరించినంతనే నాకుఁ బట్టరానిరోషము పుట్టుచున్నది. వానియపరాధమున ననేక రాక్షసులను వధింపవలసి యున్నది. పాపకార్యము నొక్కఁడే చేయును. వానిసంగతిచే వానివారందఱు నశింతురు. అని రావణునిపైఁ గలకోపమున శ్రీరాముఁడు పల్కఁగా విని వారందఱు పర్వతము నెక్కిరి. వారిననుసరించి హనుమదాది వానరవరు లనేకు లెక్కిరి. అందుండి లంకానగరమును గాంచిరి. ప్రాకారాగ్రముల నల్లనిరక్కసులు మఱొకప్రాకారమువలె నుండఁగా వారు కనుఁగొనిరి. సింహనాదములుచేసి కపులందఱు తమయుత్సాహమును శ్రీరామునకుం దెల్పిరి. అంతలో సూర్యుఁ డస్తమించెను. ఆరాత్రియంతయు వారందఱాపర్వతాగ్రమునందే యుండిరి.

## రాముఁడు లంకానగరముం గాంచుట.

* శ్రీరాముఁడు లారాత్రియంతయు నాపర్వతమునందే యుండిరి. తెలవాఱఁగా లేచి లంకయందుఁగల యుద్యానములం దిలకించిరి. సమములై క్రూరమృగాకీర్ణములు గాక నేత్రపర్వమొనర్చుచు నవి యుండెను. వార లాశ్చర్యము నొంది మఱియుం గాంచుచుండిరి. పెక్కుభూరుహములు లతావిశేష

* ఇది ముప్పదితొమ్మిదవసర్గమునఁ గల కథాభాగము.

ములు సర్వర్తు కుసుమఫలభరితములై గంధవహునకు నిరంత రము పనిని గల్పించుచుండెను. ఆవనములు నందనాదుల గేలి సేయుచుండును. విహంగములు మధురరుతముల నెల్లవారల సమ్మోదసాగరనిమగ్నమానసుల నొనర్చుచుండెను. ఆవాన రులు వీరులగుట నేమియు భీతి నొందక కామరూపులు గాన నాయాతావులం బ్రవేశింపందగినట్లు రూపముల ధరించి వానిలోఁ బ్రవేశించిరి. మఱికొందఱు సుగ్రీవునానతింగొని పయనము సాగించి భయంకరసింహనాదము లొనరించుచు లంకకుం బోయిరి. వారి కాలిత్రొక్కుళ్లచే దుమ్మురేఁగి యాక సము నావరించినది. మృగములు భయంపడి పాఱిపోయినవి. నూఱుయోజనములపొడవు ముప్పదియోజనముల వెడలు పును గలిగి యాలంకానగర మొప్పియుండెను. ఆనగరనిర్మాణ మత్యంతమనోజ్ఞము స్తుతిపాత్రమై యెవ్వారికేఁ జూడ నాసఁ గొలుపుచుండెను. క్రీడాపర్వతములు లోనగు విహారయోగ్య స్థానము లనేకము లుండెను. ఆపురము నచ్చటనుండి శ్రీరామ చంద్రుఁడు లక్ష్మణసహితుఁడై చూచెను. అత్యంతాశ్చర్యము నొందెను.యుద్ధయంత్రము లనేకము లందమర్పఁబడియుండెను సేనలసంఖ్య వచింప నలవిగాకయే యుండెను. అట్టి లంకానగ రము నా పర్వతాగ్రమునుండి యారామచంద్రుఁడు చక్కఁగాఁ గాంచెను.

మహోదారులారా! ఇందు విమర్శనీయాంశము లెవ్వియు లేవుగాని యొక్కవిషయమునఁ గొంద ఱడుగు ప్రశ్నము గలదు. సంఖ్యాతీతములగు వానరబలములు కొండల నిండి యుండెనని రామాయణము తెల్పుచున్నది కదా. కోటులకు

మించి గణితశాస్త్రమునఁగల సంఖ్యాస్థానములను దాఁటినట్లు రామాయణమే తెల్పును. ఇందఱకు వసతిస్థానము లెట్లు లభించె నను నదొక ప్రశ్నము. ఆహారము లెట్టులని రెండవ ప్రశ్నము. సముద్రము నుత్తరించి యిన్నికోటులు వచ్చుచుండఁగా గూఢ చారులమూలమున వారిరాక నెఱింగిన రావణుఁ డేల సేనలం బంపి యందే మార్గాటకఁజేయలేదనున దొక ప్రశ్నము. నగరమును సమీపించి గృహము లేర్పఱచుకొనునంతదనుక రావణుఁడు చూచుచుండ నంత తెలివితక్కువవాఁడా యను నదియు వేఱొక ప్రశ్నము. వీనికి సమాధానము లిట్లు గ్రహిం చుట మేలు. పర్వతములు విశాలములని వానియం దాకాల మున వర్షవృద్ధిం జేసి సర్వర్తుఫలము లుండునని మన మంగీక రింపవలయును. ఇక్కాలమునం గూడ శేషాచలము లోనగు సామాన్యపర్వతములయందుండు గోలాంగూలముల కెవ్వ రన్నములు పెట్టినారు? చలిపందిరు లెవ్వ రుంచినారు? అనేక జంతువులు వేలకువేలుగా జీవించుచున్న విసృష్టివైచిత్ర్య మపా రము. అవాఙ్మానసగోచరము. జంతువు పుట్టుటకుముందే యాహా రము సృజింపంబడియుండునని యెల్ల రెఱుంగుదురు. ఆయా తావుల నుండుజంతువులు లోనగుప్రాణుల కందం దాహారమ మరియే యుండును. మానవులు నట్టితావులం దున్నను దదు చితాహారమం దలపడకపోదనుట సిద్ధాంతము అనుభవమునను గూడ నీవిషయ మెఱుంగం దరంబే యగును. కావున నచ్చటఁ జేరినవానరులు లోనగువారల కందాహార మలవడుటయం దతివిచిత్ర మేమియు నుండదు. విశాలపర్వతములయందుఁ దరు గుల్మశిలాంతరాళములందు గుహలయందు నివసించువారలకు

గృహావరములతోఁ బనిలేదు. ఇతరపరికరములు వారి కవ
సరము లేదు. సముద్రము దాఁటి వచ్చుచుండఁగా రావణుఁడు
చూచుచుండెనా యనునది ప్రశ్నమే కాదు. ఏలన రావ
ణుఁడు మరణార్థియని యంగీకరింపక తప్పదు. రెండవజన్మ మిది.
భగవంతునిచేత మృతినొందవలసినవాఁడే. వేదవేదాంగవేత్త
యగుట తావన్మాత్రజ్ఞాన మాతనికి లేదనుట యసంగతప్రసం
గములలో నగ్రస్థానమున నలంకరింపఁ దగినది. మరణమునే
గోరి సీతాదేవి నుపాసింపఁ గొనివచ్చి యావ్యాజమున శ్రీరా
ముఁడు తన్నుఁ జంపునని మహాజ్ఞానులగు సనకాదులమూల
మున నెఱింగి తత్ప్రయత్నమున బద్ధాదరుఁడై యుండుట వారి
రాకకు మహానంద మొందుచుఁ దనుఁ గూడి మృతినొందఁదగిన
యనేక రాక్షసులకు సుగతి కల్పింపఁ బౌరుషము నభినయించు
చుండువాఁ డగుట నేల యరికట్టఁ బంపును? ఎప్పుడెప్పు డికార్యా
ర్యము సాగునా భగవత్సాన్నిధ్యమున నెప్పుడుందునా యని
పరితపించువాని కిందు దుఃఖింపఁదగినది విచారింపఁదగినదియు
నేముండును? కావున నీశంకలు భగవచ్ఛక్తి నెఱింగియో
యెఱుంగకయో వినోదముగాఁ జేయు ప్రశ్నావళియే కాని
వేఱుగాదు. ఇఁకఁ దర్వాతివిషయమును బఠింతము.

## సుగ్రీవరావణుల ద్వంద్వయుద్ధము.

* అంత శ్రీరాముఁడు సుగ్రీవునితోడ యూథనాథులు
పరివేష్టించి వచ్చుచుండఁగా రెండామడల పొడవుగల సువేలా
చలశిఖరము నెక్కెను. అందుండి దెసలనన్నింటిం జూచుచుఁ

* ఇది నలుబదియవ సర్గమునఁ గల కథాభాగము.

త్రికూటపర్వతశిఖరమున విశ్వకర్మనిర్మితమగు లంకానగరమును జూచెను. ఆపురవరగోపురశిఖరమున రాక్షసరాజు రావణుఁ డుండఁగాఁ జూచెను. రాజచిహ్నము లన్నియు నాతనికపు డొప్పియుండెను. ఆతనియాకృతి భయంకరముగాఁ బౌరుషము రూపొందినట్లు కనఁబడుచుండెను. అంతట సుగ్రీవుఁడా రావణుని గాంచినంతనే యీదురాత్ముఁడు నాస్వామియగు శ్రీరామునెదుట నిట్లుండవచ్చునా యని కోప మాపరానిది కాఁగా రామమూర్తి చూచుచుండఁగనే అందుండి చెంగున నెగిరి యా వైరియుండుతావు చేరెను. మనమున నేమియు భయములేక యించుకసేపు చూచుచుండి రాక్షసుని లెక్క చేయక పరుషవాక్కులతో నోరీ యధమాధమా! నేను శ్రీరామమిత్త్రుఁడను. ఆ జగన్నాథదాసుఁడను. అమహనీయుని తేజోబలమున నిన్నిపుడు వదలను. అని చెప్పి హఠాత్తుగా నతనిపైఁబడి విచిత్రరత్నఖచితకిరీటమును లాగి నేలం బడ వైచి తానును గ్రిందికి వ్రాలెను. మరల జవమునఁ దనపైకి వచ్చుసుగ్రీవు నారావణుఁడు చూచి యోరీ! నేఁజూడనితావున సుగ్రీవుఁడవై యుంటివి. నాయొద్దకే వచ్చితివి కావునఁ గంఠహీనుఁడ వగుదువు. అని పలుకుచు లేచి వానింబట్టి నేలం బడ వైచెను. కపినాథుఁడు కందుకమువలెఁ దటాలున లేచి రావణుని రెండుచేతులంబట్టి పడవైచెను. ఇట్లిరువు రన్యోన్యఘాతముల స్వేదము పిదప రక్తము స్రవించుచుండఁగా నుండిరి. ముష్టిఘాతములు లోనగువానిచే నిరువురును బోరాడిరి. అనేకరీతులం బోరాడి పోరాడి తుదకు నొకరినొకరు బట్టుకొనియే ప్రాకారపరిఖాంతర్భాగమునఁ బడిరి. వెంటనే మరల పై కెగిరి

ద్వంద్వయుద్ధము గావించుచుఁ గొంతసే పూరకుండి మరలఁ బోరాడుచు నేలంబడిరి. వారిరువురు సంగరములం దాఱి తేఱినవారౌట సవ్యాపసవ్యములు లోనగు గతివిశేషములఁ బోరాడుచుండిరి. రావణుఁ డలసి యనేక రావణులు కనంబడు నట్లు మాయాయుద్ధము చేయ నారంభించెను. సుగ్రీవుఁ డది యెఱింగి తటాలున నాకసమున కెగిరెను. రావణుఁడు వాఁడు మరల వచ్చునని యందే యుండెను. అంతలో నాసుగ్రీవుఁ డచ్చోటు వదలి శ్రీరామునిదగ్గర వ్రాలెను. శ్రీరామున కుత్సాహము గల్గించుచుఁ దనసేనల కుబ్బు పుట్టించుచుఁ దన బలములను జొచ్చెను.

## అంగదుని రాయబారము.

* అంతట నాశ్రీరాముఁ డాసుగ్రీవునియందు యుద్ధ చిహ్నములం గని బిగియారఁ గౌఁగిటం జేర్చి నాతో నాలో చింపకయే నీవిట్లు మహాసాహసము చేసితివి. రాజులు మావంటి పరిజనులుండఁగా నీరీతి సాహసకార్యముల నొన రింపఁబూనరు. వీరాగ్రణీ! సాహసప్రియుఁడవు. మమ్మందఱ సందేహమున ముంచి మహాకష్టమగుకార్య మొనరించితివి. నీవిట్లు సాహసమునకుఁ బూనినయెడల మావంటివారికి బ్రతు కుటయే దుర్లభము సుమీ. ఇఁక నిదిమొదలుగనైనఁ బూర్వా పరముల నాలోచింపక యిట్టిసాహసము నొనరింపకుము. మహా వైరికులాంతకుఁడవగు నీకేదైన హాని కలుగునెడల నాకు సీతతోఁ గాని భరతునితోఁ గాని పిన్నతమ్ముఁడగు లక్ష్మణు

* ఇది నలువదియొకఁడవసర్గమునఁ గల కథాభాగము.

నితోఁ గాని శత్రుఘ్ఞునితోఁ గాని కొఱకు నాదేహముతోఁ గాని పని యుండదు. నీ వింద్రునిం బోలినవాఁడవు. నీకేదేని అపాయము కల్గిన ప్రతినచొప్పున రావణాదులం బొలియించి విభీషణునకుఁ బట్టముగట్టి యయోధ్యకుం జని భరతుని రాజ్యమందు నిలిపి పిదప దేహము వదలవలయునని యుంటిని. అనఁగా సుగ్రీవుఁడు వినయమున శ్రీరామా! నీకు సేవ చేయుట ధర్మమని యెఱింగి నీపత్ని నపహరించినదురాత్మునిం గని యెట్లు లోర్చుకొందును ? ఇది సేవకునిధర్మమే యగును గాని సాహసము కాదు. అని పలుకఁగా శాంతధనుఁడగు లక్ష్మణునిం గని తగినతావుల సేనలను గరుడాదివ్యూహములుగా నిల్పి యని కాయత్తముగ నుందము. అతిదారుణభయహేతువొకఁడు కనంబడునని నాకుఁ దోఁచుచున్నది. అది లోకక్షయమునే తోఁపింపఁ జేయుచున్నది. ఋక్షవానరరక్షోవీరులకు నాశమును దోఁపఁజేయుచున్నది. అనేక దుర్లక్షణములు కనఁబడుచున్నవి. ఇఁక మనము సేనాసమేతులమై లంకాపురికిం బోవుదము. అని తెలిపి తాను సువేలాద్రిశిఖరమునుండి దిగి యెను.

అంత శ్రీరామునాశయ మెఱింగిన సుగ్రీవుఁడు సేనలకెల్ల యుద్ధమునకు సిద్ధముగా నుండ నాజ్ఞాపించెను. అవ్వేలఁ బ్రాతఃకాలమున శ్రీరాముఁడు చాపముం దాల్చి సేనలు నలుఁగడలఁ గొలిచి రాఁగా లంకకుం బయనము సాగించెను. విభీషణాదులు రాముని వెంబడించిరి. సేనలన్నియు నాభూభాగము నావరించిపోయెను. అందఱు లంకను సమీపించిరి. సకలాలంకారశోభితమగు నాపురమును శ్రీరాము నానతిచొప్పునఁ దమ

కేర్పఱచిన స్థానములను ముట్టడించిరి. సోదరునితో రాముఁ డుత్తరద్వారమును ముట్టడించెను. ఆద్వారమే మహాత్తర మైనది. దానిని ముట్టడింప శ్రీరామునకుఁ దక్క మ తెవ్వరికి శక్యమే కాదు. అందున్న దివ్యాయుధవిశేషములం గనియెను. నీలుఁడు బలములతోఁ దూర్పుద్వారమును ముట్టడించి యుం డెను. అంగదుఁడు మహావీరులం గూడి దక్షిణద్వారమును ముట్టడించెను. హనుమంతుఁ డనేక వానరవీరులం గూడి పడ మటిద్వారమును ముట్టడించి యుండెను. సుగ్రీవుఁడు మహా యోధులతో నెవరు కోరినను సాయపడుటకు పశ్చిమోత్తర ములనడుమ నుండెను. ముప్పదికోటులు వనచరులు లంకను ముట్టడించిరి. సుగ్రీవజాంబవంతులు రాముని సమీపమందే యుండిరి. శిలాతరుగిరిశిఖరాదులం బట్టుకొని వారనిసేయ సిద్ధ ముగ నుండిరి. ఆచోటు లన్నియు వానరమయములుగా నుండెను. ఆవానరు లనేకరూపముల వర్ణముల భయము గొలుపుచుండిరి. మహాధ్వని కలిగెను. లంకయంతయు నాధ్వనికి మాఱుమ్రోసెను.

అంత నరాతివధాయత్తుఁడై శ్రీరాముఁ డెల్లవీరులతో నాలోచించి దూతను బంపవలయునని నిశ్చయించి యంగ దుఁడే తగినవాఁడని తీర్మానించి విభీషణుం డందులకు సమ్మతిం పఁగా నంగదుని బిలిచి సౌమ్యా! నీవు కపివి కాన శ్రమము లేక లంకాప్రాకారమును దాఁటి భయము వదలి రావణు నొద్దకుం బోయి నామాటలుగా ని ట్లనుము. ఓరాక్షసా! నీసంపదయంతయుఁ దూలినట్లే. నీనియంతృత్వ మట్టిదే. మృతి నొందనున్నాఁడవుగాన బ్రదుకునం దాశయు లేదు. నీ తెలివియు

నశించినది. గర్వ మతిశయించి తలకెక్కఁగా మహర్షులకు దేవ దానవు లాదిగాఁ గలవారల కేయే ద్రోహము లొనరించితివో దానికంతయు నాధారమగు బ్రహ్మావరము కూడ నిప్పుడు నశించినట్లే. దండించు నియంతనగు నేను నాభార్య నపహరించుటం జేసి క్రుద్ధుఁడనై నిన్ను దండింప లంకాద్వారముకడ నున్నాఁడను గదా. నీవు నాచే హతుఁడవై పాపముల వీడి మహర్షులు లోనగు పరమపావనులు పొందఁదగుపదము నొందుదువు. తగినట్లు దండింతును గాన నీకుఁ బాపము లుండవు. కనుక వేవేగ రమ్ము. మారీచునిమాయచే నన్నందుండి తొలఁగించి యేబలమును నమ్మి సీతాపహరణ మొనరించితివో ఆబలమంతయు నిపుడు కనఁబడఁజేయుము. నీవు సీతనర్పించి శరణు చొరకపోయిన నిశితశరముల నీలోకమున రాక్షసులు లేకుండునట్లు గావింతును. ధర్మమతియగు విభీషణుఁడు నన్ను శరణు చొచ్చెను. నిష్కంటకమగు లంకాధిపత్యము నుత్తరక్షణమున నే పొందఁగలఁడు. సందేహము లేదు. మూర్ఖపరివృతుఁడవు. పాపివి. చంచలచిత్తుఁడవు. ఇట్టి నీకు రాజ్యసుఖము లనుభవింపఁ దరముగాదు. శరణుచొరవేని రణము చేయ రమ్ము. నాబాణములచేఁ జచ్చి పాపములు పోవఁ బరిశుద్ధుఁడవగుదువు. కాదేని నీవు పక్షివై ముజ్జగంబుల కేగినను బ్రాణములతో నుండఁజాలవు. ఒక్క హితము వచింతును రాక్షసులే యిఁక నుండరు గాన నీకుఁ బారలౌకికక్రియలు చేయువారే యుండరు. కాన నిప్పుడు నీవే వానిని గావించుకొనుము. ఇఁకఁ జూడఁబోవున దేదియు లేదు గాన నిపుడే

లంకను జూచుకొనుము. నీప్రాణములు నాచేతిలో నున్నవి. అని నామాటలుగా నతనికిం జెప్పుము.

అంగదుఁడు శ్రీరామభాషితముల నాలకించి వియన్మార్గమున నగ్ని రూపధారియైనట్లు వెలుంగుచు ముహూర్తకాలమున రావణునికడ కరిగి మంత్రియుతుం డగునతనిం గాంచెను. మొదట పేరు తానే తెలిపి రామచంద్రుని హితవచనము లన్నియు నమ్యూనాధికముగా నిట్లు తేటపఱచెను. అంగదుఁ డిట్లు పరుషభాషణములఁ బల్కుచుండఁగా రావణుఁడు క్రుద్ధుఁడై మంత్రులం గని యీదుర్మతిని బట్టుకొనుఁడు. వధింపుఁడు వధింపుఁడు. అని మరల మరల నాజ్ఞచేసెను. అంత నలువురు రక్కసు లంగదుని బట్టుకొనిరి. అత్తఱి వీరుఁ డా యంగదుఁడు పట్టుకొన్నవారిని బక్షులవలె నిఱికించుకొని పర్వతాకారమగు నాప్రాసాదమునుండి యెగసెను. ఆవేగమున వారు క్రిందఁ బడిరి. ప్రాసాదశిఖరముం గాంచి పదఘాతమున రావణుఁడు చూచుచుండఁగనే బ్రద్దలుగా నొనరించి దనుజులు వగవ వానరు లార్వ శ్రీరామునిపార్శ్వమును జేరెను. ఆ ప్రాసాదము భగ్నము కాఁగా వగచెను. వానరులట్టు లంగదుఁడు సుఖముగా వచ్చినందుల కానందించిరి. పొగడిరి. రక్కసులు హెచ్చరికమీఱ వివిధాయుధధారులై లంకను గాచుచుండిరి.

మహామతులారా! యీభాగమునందుఁ బ్రధాన మంగదరాయబారము. దీనిచేత శ్రీరాముని ధర్మపరత్వము తేటపడియెడు. ఎట్టి యపరాధములనైన క్షమించి మేలుచేకూర్పఁ దగుబుద్ధి నేర్పుటయే కదా భగవదాశయము. విహితుఁడని

విరోధియనియు నీ భేదము లా పరతత్త్వమునకు నుండవు. ఇన్ని శ్రమములకు లోనై సాగరమును దాటి వచ్చి లంకను ముట్టడించియుం గూడ యుద్ధమునకుముందు మఱొకసారి బుద్ధి చెప్పి చూతమని భార్యాపహారకుని భావించుటకంటె నత్యుత్తమ శాంతిదాంతు లేక నేమియుండును? భార్యాపహారణము సూనృతము గాదని యెఱింగినను లోకాచారము ననుసరించి జరపఁదగు తంత్రములనెల్ల జరపి తుదకు నేయుపాయమునకు లొంగకపోయిన దండోపాయమునఁ బ్రవర్తింపఁదగునను రాజనీతి నెల్లరాజులకు స్వానుష్ఠానముచే నెఱిఁగింపం దలంచి శ్రీరామచంద్రుఁ డంగదుని బంపెనని యిందుండి యెఱుంగం దగినవిషయము. ఇందలి నీతులన్నియు నింతకుముందే చర్చింపఁబడినవి. కాన మరల వానిం ద్రవ్వనేల యని వదలితిని.

## యుద్ధారంభము.

* తరువాత రక్షకులుగాని యమితులగు రాక్షసులు రావణునిగృహావర్యమున కరిగి రాముఁడు వానరులం గూడి లంకను ముట్టడించెనని విన్నవించిరి. దానికి మిగుల నాగ్రహించి నగరరక్షణకృత్యము ద్విగుణముగా నొనరించి ప్రాసాదముపయి కెక్కెను. అతఁ డందుండి లెక్కింప నెక్కరణినైన దెవ్వరికి నలవిగానట్టు లుండిన వానరసేనాసమూహములను యుద్ధార్థులై గిరికాననాదుల నావరించి యుండం గాంచెను. ఆతఁడు హృదయమున వీరల నెట్లు నాశముచేయవచ్చునని చింతనొందెను. కాని ధైర్యము నవలంబించి కన్నుల విచ్చి

* ఇది నలువదిరెండవసర్గమునఁ గల కథ యని యెఱుంగందగు.

రామునిసేనలం గనియెను. సంతుష్టుండై శ్రీరాముఁడు పూర్వ
మున్న చోటు విడిచి ప్రాకారము దాపలిభాగమున కరిగి లంక
యెల్లతావుల రక్షస్సంవృతమై కాపాడఁబడుటం గాంచెను.
అంతలో సీత తలంపునకు రాఁగా నాభీతహరిణాక్షి రక్కసులు
పీడింప నాకొఱకు శోకమునఁ గృశించి భూమి శయ్యగా
నుండఁగా శ్రమములపా లగుచున్న దే యని వగచెను. అంత
వానరులంగని వేగమ శత్రువధము గావింపుఁడని యాజ్ఞాపిం
చెను. అహమహమికల నావానరులు సింహనాదము లొనరించు
చు నీలంకను దరుపాషాణపర్వతశృంగముల ధ్వంసము గావింత
మనుతలంపులు గలవార లైరి. రావణుఁడు ప్రాసాదాగ్రమున
నుండి చూచుచుండఁగా వేలువేలుగా గుంపులుగఁ జేరి
రామునకు సంతోషమును గల్గింపఁ గోరి ప్రాకారము నెక్కిరి.
ప్రాణముల నర్పించియైన రామహితము చేయఁబూని యెక్కిరి.
పాషాణాదులం బ్రయోగించి వనోపవనములఁ గలంచి పైప
సాగిరి. అగడ్తలం బూడ్చిరి. కొందఱు లంకపయికిం బోయిరి.
రామలక్ష్మణసుగ్రీవులు సర్వోత్కృష్టులని కేకలువేయుచుఁ దిరి
గిరి. నల వీరబాహు సుబాహువులను వానరయూథపతులు
ప్రాకారమును ముట్టడించుచు నందే విడిసిరి. ఈయంతరమున
సేనలు విడియుటకుం దగినతావుల నేర్పఱచిరి. కుముదుఁడను
యూథపతి తనబలములతో నీశానకోణమునుండి ప్రాగ్ద్వారము
దనుక నావరించి యుండెను. ప్రఘుసపనసు లనువారు కుము
దునకుఁ దోడుసూపఁ బ్రాగ్ద్వారమునందే యుండిరి. శతవలి
బలములతో నాగ్నేయకోణమునుండి దక్షిణద్వారముదనుక
నావరించి యుండెను. తారాజనకుఁడగు సుషేణుఁడు నైరృత

కోణమునుండి పడమటిద్వారమువఱకు నాక్రమించి సేనలతో విడిసెను. శ్రీరాముఁడు సౌమిత్రిం గూడి యుత్తరద్వారమున నిలిచి ముట్టడి సలిపెను. సుగ్రీవుఁడు వాయువిదిక్కునుండి యా యుత్తరద్వారమువఱకు నాక్రమించి యుండెను. గవాక్షుఁడు గోలాంగూలకోటులతో శ్రీరాముని పార్శ్వభాగమున నిలిచెను. ధూమ్రుఁడు భల్లూకకోటులతో రామునకు బాసటగా నుండెను. విభీషణుఁడు కవచధారియై గద కేలం దాల్చి మిత్ర చతుష్టయముం గూడి శ్రీరామభద్రునితోడ నుండెను. గజ గవయాదులు తిరుగుచు వానరులం గాపాడుచుండిరి.

అంత రావణుఁడు వానరసేనాసన్నివేశముం గాంచి కోపగించి తనసేనల నన్నింటి నపుడే యుద్ధముచేయ నాజ్ఞాపించెను. ఆనతి కాఁగానే రక్కసులందఱు సింహనాదము లొనరించుచు రణభేరికాధ్వనుల నాకసమును బ్రద్దలుచేయుచుఁ బ్రయాణము చేసిరి. వానరులు సింహనాదములు చెలంగ నడచిరి. దేవాసురులకుంబోలె వారలకు సంగ్రామ మారంభమయ్యెను. పాషాణాదులచే వానరులును శూలాదులచే రాక్షసులును బగవారిఁ జంప నారంభించిరి. పరస్పర విజయేచ్ఛల వారు పోరాడసాగిరి. రాముని గెలిపింప వనచరులు రావణుని గెలిపింప రాక్షసులు నూహించి తమతమ శక్తులం గనంబఱచుచు నని చేయసాగిరి. రక్తము నదులై ప్రవహింపసాగెను. ఆతుములసంగ్రామము భయానకరసమున కుదాహరణమై చూచువారలగుండెల నవియఁజేయఁజాలి యుండెను. ఇం దధ్యాత్మరామాయణమునఁ గలవిశేషముం బరికింతము.

"ప్రాసాదాగ్రే సమాసీనః పశ్యన్వానరసైనికాన్,
యుద్ధాయాయోజయత్సర్వం రాక్షసాన్ సముపస్థితాన్. ౪౧
రామోఽపి ధనురాదాయ లక్ష్మణేన సమాహృతం,
దృష్ట్వా రావణమాసీనం కోపేన కలుషీకృతః. ౪౨
కిరీటినం సమాసీనం మన్త్రిభిః పరివేష్టితం,
శశాంకార్ధనిభేనైవ బాణేనైకేన రాఘవః. ౪౩
శ్వేతచ్ఛత్రసహస్రాణి కిరీటదశకం తథా,
చిచ్ఛేద నిమిషార్ధేన తదద్భుతమివాభవత్. ౪౪
లజ్జితో రావణస్తూర్ణం వివేశ భవనం స్వకం,
ఆహూయ రాక్షసాన్ సర్వాన్ ప్రహస్తప్రముఖాన్ ఖలః." ౪౫

అని యున్నది. రావణుఁడు మంత్రులం గూడి ప్రాసాదాగ్రమున నుండఁగాఁగాంచి శ్రీరాముఁ డొక్కశరమున నర్ధచంద్రాకృతిగ మించుదానిం బ్రయోగించి శ్వేతచ్ఛత్రచామరకిరీటాదులం దెగ నేసెననియు, దాన సిగ్గుపడి రావణుఁ డింటికిం బోయెననియు దీని భావము. విశేషము లిద్దానినిమించిన వీభాగమున లేవు.

## రక్షోవానరవీరుల ద్వంద్వయుద్ధము.

* వనచరవీరు లుక్కుమిగిలి పోరాడఁగాఁ గని యోర్వఁ జాలక రాక్షసవీరులును మార్కొనిరి. ద్వంద్వయుద్ధ మపు డారంభమయ్యెను. ఇంద్రజిత్తు విశేషపరాక్రమము మెఱయ నంగదునితోఁ బోరెను. విభీషణసచివుఁడగు సంపాతి ప్రజంఘునితోఁ బోరుసల్పెను. హనుమంతుఁడు జంబుమాలిని యమసదనమునకుఁ బంప సమకట్టెను. విభీషణుఁడు మిత్రఘ్నుఁడను

* ఇది నలువదిమూఁడవసర్గమునఁ గల కథాభాగమని తెలియందగు.

రక్షోవీరునితోఁ బోరాడెను. సుగ్రీవుఁడు ప్రఘసునిపైఁ గవిసెను. లక్ష్మణుఁడు విరూపాక్షుని దార్కొని యనిచేసెను. ఇట్టు లాయసురవీరులు కపివీరులం దార్కొనిఘోర నదిఘోర భంగిగ నుండెను. ఇంద్రజిత్తు మహాకోపమున గద కేలంబట్టి యంగదుని మోఁదెను. అంగదుఁడును బరాక్రమము మెఱయ నాతనిరథమును సారథితోడఁ జూర్ణము గావించెను. సంపాతి ప్రజంఘుని జంపెను. సుగ్రీవుఁడు ప్రఘసునిం బరిమార్చెను. అగ్నికేతువు లోనగువారు రామమూర్తిని శరములం గప్పిరి. వారితలలను రాముఁడు నాలుగమ్ములం ద్రుంచెను. ఆతుముల సంగ్రామమున నిరుదెగలలోఁ గొందఱు హతులైరి. దేవతలకుంగూడ నాయుద్ధము చూడఁ దగనియంత భయంకర మయ్యెను.

## రాత్రి యుద్ధము.

* ఆవానరులు రక్కసులు యుద్ధ మారీతిగా నొనరించుచుండఁగనే సూర్యుఁ డస్తంగతుండయ్యె. వనచరులప్రాణములం దీయురాత్రి వచ్చెను అన్యోన్యబద్ధవైరులై యొండొరుల నోడింపంగోరువారల కిరుదెగలవారలకు రాత్రియుద్ధము సాగెను. . భయదాంధకారమునందు వానరులు రక్కసుఁడని వానరుని, రాక్షసుని వానరుండని రాక్షసులును దెలిసికొనఁజాలక ప్రహరించుకొనసాగిరి. చంపుము. చీల్చివేయుము. ఇటురమ్ము. ఏల పఱుగెత్తెదవు? అని యాయంధకారమునందు

* ఇది నలువదినాలుగవసర్గమునం గల కథాంశము.

మహాధ్వని వినఁబడసాగెను. క్రోధపరవశులై రక్కసులు వానరుల భక్షించుచు విహరింపసాగిరి. వానరులు చెలరేఁగి నఖముఖముల గుఱ్ఱములు లోనగువానిని జీల్చివేయుచుండిరి. రాక్షసబలములఁ జికాకుపఱచిరి. రామలక్ష్మణులు సుంతయే కనఁబడుచుండు రాక్షసవీరులను వాఁడిశరములఁ జంపివైచిరి. వీరులహుంకారములు భయంకరములుగా వినఁబడినవి. శవనివహములు కుప్పలుగాఁ గూలినవి. ఆరాత్రియందు రక్కసులు బాణములం గురియించుచుండ వారల మార్గ్గాని చించి చెండాడుచుండఁగా వారు తిరుగఁబడఁగా మహాధ్వని వినఁబడినది. వజ్రదంష్ట్రాదు లాహ్వయుసు రామునిమార్గ్గాని యా బాణజ్వాలలకోర్వక ప్రాణముల నఱచేతులం బెట్టుకొని పాఱిపోయిరి. నిలిచి పోరినవారు మృతినే పొందిరి. రాక్షసులను గొండముచ్చులు భక్షింపసాగెను. అంగదుఁ డింద్రజిత్తును వధింపఁబూని సారథిని రథమును హతముచేసెను. ఆయసురుఁ డంతర్ధాన మొందెను. అంగదు నెల్లరుఁ గొనియాడిరి. శ్రీరాముఁడు వానరులం గని మీరెల్ల సుగ్రీవుని హెచ్చరికం గూడియుండుఁడు. ఇంద్రజిత్తు బ్రహ్మవలన వరముల సంపాదించి త్రిజగంబుల నేఁచుచున్నాఁడు. వీనికి మరణ మాసన్నమైనది. ఇత్తఱి మీరెల్ల నాకుగా నోర్చి యుండుఁడు. కలఁత నొందవలదు. అని యనెను. ఆయింద్రజి త్తంతర్ధానవిద్యచే నదృశ్యుఁడై యశనికల్పములగు నారాచములం బ్రయోగించెను. రామలక్ష్మణుల సర్పరూపములై భీతిదములు నగుబాణముల నొప్పించెను. కపటసంగ్రామపరాయణుఁ డౌట మాయ నవలంబించి

భూతాదృశ్యుఁడై రామసౌమిత్రుల మోహపరవశులంగా నొన రించుచు నాయన్నదమ్ముల బాణములచే బంధించెను. ఆసర్ప శరములు పాశములవలెఁ దమ్ము బంధింపఁగా వారు పరవశు లైరి. వానరు లవ్విధిం గాంచిరి. రావణపుత్త్రుఁ డంతట నెదుట నిలిచి వారిని బాధింప నశక్తుఁడై బుద్ధిమంతుఁడు గాన మాయను బ్రయోగింపఁ దొడంగెను. చక్కఁగా వారి నిరువు రను బంధించెను.

## రామలక్ష్మణుల నింద్రజిత్తు నాగపాశముల బంధించుట.

* అంతట శ్రీరాముఁ డా యింద్రజిత్తుండుచో వెఱుం గంగోరి వనచరయూథనాథులం బదుగుర నాజ్ఞాపించెను. వారు మిగుల సంతుష్టులై వృక్షములం గైకొని దశదిశల వెదుక నాకస మున కెగసిరి. సకలాస్త్రవేత్త గాన నారావణి వారివేగము నస్త్రములచే నరికట్టెను. వారెంత ప్రయత్నించినను ఫలము గలు గదయ్యెను. వాఁడనేకాశుగముల వారలపైఁ బ్రయోగిం చెను. బాణరూపము లగుసర్పములం బ్రయోగింపఁగా వారి తనువులు రవంతయైన సందులేకుండెను. వారితనువులనుండి రక్తము ప్రవహించెను. ఆరావణునికొడు కాగ్రహంబున నే నదృశ్యత వహించి సంగరము చేయ నింద్రుఁడే నాదగ్గరకు రాఁజాలఁడన మానవులగు మీా రిద్దఱమాట చెప్పనేల? రామ లక్ష్మణులారా! క్రుద్ధుఁడనై యున్న నేను గంకపక్షి తెక్కలు

* ఇది నలువదియైదవ సర్గమునందలి కథ.

గట్టిన యీ బాణముల నిపుడే మిమ్ముం జంపెదను. నాకోపము వ్యర్థము కాదు. అని హెచ్చరించెను.

ఆసోదరు లిరువురు ధర్మజ్ఞులు గావున శబ్దమును విని గుఱిపెట్టి శరములవైచువారు గారు. వా రూరకుండ నతఁడు సింహానాదము చేసెను. వారిపయి మఱియు ఖరశరములఁ బ్రయోగించెను. వారు కట్టఁబడి కన్నెత్తియైనఁ జూడఁజాల కుండిరి. వార లించుకంతయు శక్తిలేకపోఁగా నేలంబడిరి. వన చరులు వారియవస్థలం గాంచి దురపిల్లిరి. బాణవిద్ధము గాని చోటు వారిశరీరములందుఁ గానరాకుండెను. తొలుత రాముఁ డును పిదప లక్ష్మణుఁడును నేలంబడిరి. రాముఁ డిట్లు భూమి పయిం బడియుండ లక్ష్మణుఁడు దుఃఖించెను. వనచరులందఱు వారల పాటుగాంచి నగలఁ బొగిలిరి.

మహాశయులారా! తొలుతటిసంగరముననే రామ లక్ష్మణు లింద్రజిత్తుచే నాగపాశ ప్రయోగముల బంధింపఁబడిరి. నాగపాశము లనఁగా నేవి? శ్రీరామలక్ష్మణులు బంధింపఁబడు టేల? అనువిషయమునే విచారింతము. ఇంద్రజిత్తు మాయా కోవిదుఁడని తెలిసినదియే. తిరస్కారిణి యనుదేవి నారాధించి సర్వభూతములకుఁ గనంబడకుండ నుండుసిద్ధి నార్జించెను. సర్పమంత్రముల నుపాసించెను. అది సిద్ధింపఁగా నామంత్ర మున స్తంభనబీజములం జేర్చి శత్రుస్తంభనము చేయఁ జాలెను అస్త్రవిద్యలయం దీచమత్కృతి గనంబడుచుండును. ఒకఁ డీప్రయోగముచేయ రెండవవాఁ డీయస్త్రమునకు వైరి.

యగు గారుడాస్త్రముం బ్రయోగింప నిది యడంగును. ఇపుడు రావణునికొడుకు ప్రాకృతులనుగా భావించి శ్రీరామలక్ష్మణులను నాగపాశములచే బంధించెను. వారు పరవశులై ధరణిఁ బడిరి. అనఁగాఁ గదలమెదలలేకుండుటయే గాని మనోబలము తగ్గదు.

"ఏతస్మిన్నంతరే రామో వానరాన్ వాక్యమబ్రవీత్,
సర్వే భవంతస్తిష్ఠంతు కపిరాజేన సంగతాః. 35
స బ్రహ్మణా దత్తవరస్త్రైలోక్యం బాధతే భృశం,
భవతామర్థసిద్ధ్యర్థం కాలేన స సమాగతః. 36
అద్యైవ క్షమితవ్యం మే భవంతో విగతజ్వరాః,"

అని పూర్వసర్గమునఁ గలదు. రామమూర్తి బ్రహ్మవరమునఁ వీఁడు బలవంతుఁ డౌట నెఱింగెను. దానిని మన్నింపవలయు ననుమర్యాద నవలంబించి యూరకయుండెను. అంతియకాని దానికిం బ్రతిహతమగు గారుడాస్త్రమును దెలియక కాదు. భగవంతునకు స్వోక్తివ్యాఘాతదోషమే కలుగరాదు. కావుననే లోకుల కుపాసనానియమమున బుద్ధి సడలరాదని యెంచి యాయస్త్రప్రభావము తన్నుంగూడ బంధింపంజాలినదని లోకులకుం దెలుపం బూని బద్ధుఁ డయ్యెనని తెలిసికొనుట మంచిది కదా. జృంభకాది సకలాస్త్రముల నెఱింగిన రామమూర్తికి నీక్షుద్రశరబాధ మాన్పఁజాలుశక్తి లేదనుట మిక్కిలి యవివేకము కదా. కర్మఫలములు తప్పక యెంతవానినే నొందునను నీతి కిది యుదాహరణ మనుకొనుటయే మనకు నర్హము.

## సుగ్రీవాదులు నాగపాశబద్ధు లగు సోదరులం గని వగచుట.

* అంతట వానరులు భూమ్యాకాశములం జూచుచు బాణమయశరీరులై పడియుండు నారామలక్ష్మణులం గని బాణవృష్టి వర్షించి శత్రువుపోవఁగా వా రుండుతావునకుం బోయిరి. విభీషణసూర్యపుత్రులు నరుదెంచిరి. వీరికంటె ముందే హనుమదాదులు పోయి చూచి వగచుచుండిరి. రామసౌమిత్రు లపారబాధల ననుభవించుచుండిరి. అందెవ్వరు నాయింద్రజిత్తును జూడఁజాలకపోయిరి. విభీషణుఁడు మాత్రము మాయాచ్ఛాదితదేహుఁడై యుండ నొకచోఁ గాంచెను. ఇంద్రజిత్తు తనయసురులకు వారిం జూపి తన పౌరుషమును దెలిపెను. వారు మృతినొందినట్లే యాతఁడు తలంచి తెలిపెను. సుగ్రీవాదివానరులం గూడ బాణముల నొప్పించెను. అందఱు నొవ్వఁగా సింహనాద మొనరించి వారలనెల్లఁ దనబలములకుం జూపెను. ఇరువురుసోదరులు కదలక యుండఁగా మృతినొందిరనియే నమ్మెను. సేనలంగూడి లంకం బ్రవేశించెను.

రామలక్ష్మణులయవస్థలం గని సుగ్రీవాదులు భయంపడిరి. విభీషణుఁడు సుగ్రీవునితో భయపడకుము. యుద్ధములన్నియు నిట్టివే సుమీ. మనయదృష్టము బాగున్న వీరు మూర్ఛనుండి మరలుదురు. ధైర్యం బవలంబింపుము. సత్యధర్మా

* ఇది నలువదాఱవ సర్గమునఁ గల కథ.

శ్రయుల కెప్పటికి నపమృత్యుభయము కలుగదు. అని తెలిపి యతనికన్నిటిని జలములతోఁ దుడిచెను. మరల జలంబులం దీసికొని మాయామోహనివారక మగువిద్యచే నభిమంత్రించి దానిచే సుగ్రీవునినయనములం దుడిచెను. మరల వానరేంద్రా! అతిస్నేహమున కిది యకాలము. ఇత్తఱి నది మృతికారక మగును. ఎల్లకార్యములందును ధైర్యము నవలంబించి వానరు లకు హితమగుదాని నూహింపుము. రాముని మూర్ఛ తెలిసి సంతసనుక రక్షింపుము. వారు తెలిసినంతనే మనభయమును బోఁగొట్టఁగలరు. ఈ నాగపాశబంధము రామునేమియుఁ జేయఁజాలదు. మృతినొందును రాముఁడనుశంక వదలుము. మోముకాంతి రాముని వదలకున్నది. చూడుము. కావున నీవు ధైర్యమూని యిందుండి వీరలఁ గాపాడుము. ఈవాన రులు నన్నింద్రజిత్తునిగా భావించి తమలోఁ దారు గుసగుస లాడుచున్నవారు. వీరిని బరువెత్తకుండ నాపుటకై నేను బోవుచున్నాను.

సుగ్రీవు నీరీతి నాశ్వాసించి విభీషణుఁడు పరువెత్తఁ దలంచు వనచరులం గని నేనింద్రజిత్తును గాను విభీషణుఁడను. అని యూఱడించి వారిభీతిని మాన్పెను. అట నింద్రజిత్తు లంక కరిగి తండ్రిని గానఁబోయి సభయం దాసీనుఁడై యుండు రావ ణునకు నమస్కరించి దోసిలొగ్గి రామలక్ష్మణుల వధించితినని వార్తం దెల్పెను. ఆమాట విన్నంతనే లేచి బిగ్గఁ గౌఁగిలించు కొని శిరము మూర్కొని తద్వధ వృత్తాంతము నడిగి యతని వలన నావృత్తాంతము నెఱింగి కొడుకును వినుతించెను.

## సీతకు రక్షస్స్త్రీలు నాగపాశబద్ధులగు రామలక్ష్మణులం జూపుట.

* ఇంద్రజిత్తు లంక కరుగఁగా హనుమదాదులు రామలక్ష్మణులను గాపాడుచుండిరి. తక్కినవా రాయుధహస్తులై రక్కసు లరుదెంతురేమో యని జాగరూకులై యుండిరి. రావణుఁడు కొడుకునంపి సీతకుఁ గావలియుండు రక్షఃకాంతల రావించి యింద్రజిత్తుచేఁ జంపఁబడిన రామలక్ష్మణులను సీతకుం జూపుఁడు. ఆయాశ మాని సంతసమున నన్ను నొందఁగల దనఁగా వారట్లే చేయుదుమని పుష్పకముం గొనిపోయి దాని నెక్కించి త్రిజటయు నెక్కఁగా రణరంగమునకుఁ దీసికొని పోయిరి. లంకానగరము నలంకరింప రావణుఁ డాజ్ఞాపించెను. ఇంద్రజిత్తు జయమును జాటించెను. సీత త్రిజటయుఁ దనచెంత నుండఁ బోయి పడియుండు రామలక్ష్మణులం గాంచెను. రాక్షసులసంతోషమును వానరులదుఃఖమును గనుఁగొనియెను. తనువులు బాణవిద్ధములై యుండఁగా సొమ్మసిల్లి భూమిం బడియుండు నారాఘవులం గాంచెను. మిగుల వగలఁబొగులుచుఁ జాలసేపు విలపించెను. తుదకు వారిని జక్కఁగాఁ గాంచి మృతులైనట్లే తలంచుచుఁ బరమదుఃఖమున నిట్లు పలుకఁజొచ్చెను.

## సీత రామలక్ష్మణులం గని పలవించుట.

† జానకి పరమదుఃఖమునఁ బలవించుచు సాముద్రికశాస్త్రవేత్తలందఱు నన్నుఁ బుత్త్రవతియనియు,విధవగాదనియుఁ

* ఇది నలువదియేడవ సర్గము.

† ఇది నలువదియెనిమిదవసర్గమునఁ గల కథాభాగము.

జెప్పిరి కదా. వారెల్ల నిపుడు రాముఁడు హతుఁడగుటంజేసి యసత్యవాదులే యైరి. నాపతి యశ్వమేధాదియాగములు చేయువాఁడని చెప్పినవా రిపు డసత్యవాదులే యైరనవచ్చుం గదా. మహాహస్తార్తికులగు బ్రాహ్మణులు నన్ను మాంగల్యవతి యని పల్కిరో ఆ జ్ఞానులందఱు ననృతము చెప్పినవారైరి కదా. లక్షణములం దెలుపువారు శ్రీరామునిలక్షణముల నెఱింగి యేవేవో పరమైశ్వర్యాదులు గలుగుననిరి. వారిమాట లనృతములయ్యెం గదా. నాతనువునఁగల యవయవసంస్థాన విశేషములం గని పలికిన శుభఫలములన్నియు నేటఁ గలిసినవి. ఈసోదరులు నాకొఱకు నక్షోభ్యమగు సాగరమును దాఁటి వచ్చి యల్పుఁడగు నింద్రజిత్తుచేఁ జచ్చిరి. ఈరాఘవులు దివ్యాస్త్రములం బెక్కింటి నొందియుండిరి కదా. ఆయస్త్రము లిపుడేమైనవి? అరివరుల నుక్కడంచు రాముఁ డరిహతుఁడై పడియున్నాఁడే. కానఁ గాలమునకు భారమగునది యేదియు లేదు. నాయత్తను గౌసల్యను దలంచుకొన్నం గలుగుదుఃఖము రామలక్ష్మణులను నన్నుం దలంచుకొన్నను గలుగదు. పదు నాలుగేండ్లు వనవాసమును గడపి రాముఁడు వచ్చునని వేచి యున్నది నాయత్త యిఁక నేమగునో యని ప్రలాపించెను.

ఇట్లు విలపించు జానకిం గని త్రిజట తల్లీ! దుఃఖింప కుము. నీపతి బ్రతికియున్నవాఁడు. అందులకుం దగినకారణ ములు స్పష్టముగా నాకుఁ గనవచ్చుచున్నవి. వినుము వాని నెఱింగింతును. హతులగు యోధులమోము లిట్లు కోపా వేగము కలవిగను సుప్రసన్నములుగ నుండఁజాలవు. జానకీ! వీరు హతులే యైన దివ్యంబగు నీపుష్పకము నిన్నిట్లు వహించి

యుండఁజాలదు సుమీ. ప్రధానవీరుఁడు హతుఁడు కాఁగా సేనలిట్టులు యుద్ధయత్నముల నుండరు. వీరెల్ల రామలక్ష్మణు లను జాగరూకతతోఁ గాపాడుచున్నారు. ఈలక్షణముల నన్నింటిం గాంచి యీరాఘవులు బ్రదికియున్నారని విశ్వ సింపుము. అంబా! నీయందలి ప్రీతివిశేషమున నింతదూరము చెప్పుచున్నాను. నేనింతదనుక నబద్ధము చెప్పినదే లేదు సుమీ. ఇఁక నెప్పటికిని బల్కను. నీవు పాతివ్రత్యగుణవిశేషమున నుల్లాసముం గల్గించుదానవు గాన నీయందు నాకింత కూరిమి గలిగినది. ఇంద్రాదులు తోడుపడినంగూడ నీ రామలక్ష్మణులం గెలువఁ దరంబు గాదు. జీవించియుండుటకుఁ దగిన సైన్యముఖ ప్రసాదాదిలక్షణములం గాంచి యట్టి కలను గని నీకుం దెల్పి తిని. జానకీ! యిది మిక్కిలి గొప్పగుఱుతు. దీని మెల్లఁగాఁ జూడుము. మూర్ఛనొందియున్నను ముఖవర్చస్సేమాత్రము వదలకున్నది. ప్రాణములు వదలినవారిమోములు వికారము లుగ నుండును. ఇంక వీరివిషయమై శోకము నొందకుము. హతులైరని భ్రాంతిని బూనకుము. మనశ్చింత మానుము. బ్రదికియుండుట సాధ్యమే గాని యసాధ్యమేమాత్రము కాదు. అని యిట్టు లా త్రిజట చెప్పినమాట లాలకించి యం జలింబట్టి త్రిజటా! నీవు చెప్పినట్లే వీరు జీవించియుందురు గాక. అంత నావిమానమును మరలించి లంకకుఁ దీసికొని పోయిరి. సీత యశోకవనమును బ్రవేశించి రాఘవులం గూర్చి పరిపరివిధములఁ జింతింపసాగెను.

బుద్ధిమద్వర్యులారా! ఈభాగమునఁ గలసార మిదియని మన మెఱుంగఁ దగుంగదా. రామలక్ష్మణులు నాగపాశ

బద్ధులై రణభూమిం బడఁగా నది మృతియని భావించి యింద్రజిత్తు లంకకరుగుట వానరు లుక్కడక్కి యెక్కడివా రక్కడ నిలువంబడుట కననగు. ఎట్టిధీరులైనను విపత్కాలంబున మలిన మతు లగుదురు.

"అసంభవం హేమమృగస్య జన్మ తథాపి రామో లులుభే మృగాయ,
ప్రాయస్సమాపన్నవిపత్తికాలే ధియోఽపి పుంసాం మలినా భవంతి."

అన్న ప్రాక్తనసూక్తి క్రొత్తది గాదు కదా. హనుమదాదులు విభీషణుఁడు తప్పఁ దక్కఁగలవారందఱును భీతిల్లిరి. అనఁగా విపత్తునందు ధైర్యము మహాపురుషులకుం దప్పఁ దక్కినవారల కసాధ్యమని తెల్లమయ్యెడిని. ఎట్టివారలకుంగూడ కర్మఫలము లనుభవింపకఁ దప్పవను సిద్ధాంతమున కీభాగ ముదాహరణము కావచ్చును గదా. రాముఁడు పరమాత్మ యయ్యును మానవదేహధారియయి కనఁబడుచుండుటం జేసి తదుచితకర్మఫలము లనుభవింపవలసినదే కాని తప్పించుకొన నెవ్వారి కేకాలము నందును దరంబుగాదని యెఱింగింప నిట్లు పాశబద్ధుఁ డయ్యె నని కాని బద్ధుఁడైనట్లు నటించెనని కాని యెఱుంగందగు. మఱియు నింద్రజిత్తొనరించిన మంత్రోపాసన సిద్ధించినదియే కాన నది ఫలదాయకము కాకపోరాదు కదా. తపస్సిద్ధి తప్పక తోడ్పడునని తెలుపుటకుగాఁ దద్బద్ధుఁడైనట్లు కనుపట్టెను.

త్రేతాయుగమున మంత్రవిధులప్రచార మెక్కువ. ఆకాలమునందు దేవతలయం దనాస్థ యెట్టిదో యప్పు డాస్థ యట్టిది. ప్రతిమానవుఁడు భూమియందుఁ గలరక్కసులు లోనగువారు గూడఁ దమకభీష్టదేవత నుపాసించి తత్ప్రసాద సమాసాదితవరంబులఁ బ్రఖ్యాతిం గాంచుచుండువారు. వృశ్చిక

ములకుఁ దోఁకయందలి విషము, సర్పములకు ఫణమందు గర
ళము, శునకములకు నఖదంష్ట్రలు స్వసంరక్షణార్థ మెట్టు లేర్పడి
నవో మానవులు గావించు దేవతాప్రసాదసంపాదనమునట్టిదియ.
దేహబలము కార్యసిద్ధి సంపాదనక్షమము గాదు. పురుషప్రయ
త్నము దైవానుగ్రహము కలిగిననే ఫలవంత మగును. ఈనియ
మము ప్రాణికోటి కెల్ల సమానమే కదా యందురేని సమానమే
యైనను మానవులు గర్వయుక్తు లగుటంజేసి తమప్రయత్నము
దృఢతమమైన నెఱవేఱునన్న విశ్వాసముకలవార లగుటచేత
నది వీరియందు ముఖ్యమని చెప్పవలసివచ్చును. తరించుటకు
మానవజన్మము ప్రధానమని సాధారణ శాస్త్రనియమములు
కనఁబడును. కావున దైవమనునది మానవులగర్వ మడంపఁజాలి
యుండును. కనుక మానవులు దేవతోపాసనామూలమున
నొకశక్తి నార్జింపవలయును. దానిమూలమునఁగాని సద్యశస్సు
నార్జింపఁజాలరు. మఱియు విశేషించి కార్యములం బ్రవర్తిల్లి
లోకోపకార మొనరింపఁజాలరు.కనుక నవశ్యము దేవతోపాసన
చేయవలసినదే. తన్మూలమున నలౌకికశక్తి నార్జింపవలయును.
దాననే జగద్గీతకీర్తు లగుదురు. వేఱొండుకారణమునఁ గాఁ
జాలరనుట సిద్ధాంతము. దీనిననుసరించే త్రేతాయుగమున
స్వకార్యార్థమో పరోపకారార్థమో యేదే నొకదేవత నుపా
సించి తత్ప్రసాదపాత్రులై తల్లబ్ధసిద్ధి నాధారముగాఁ గొని యిష్ట
కార్యములం బ్రవర్తిల్లువారు. దేవతానుగ్రహములమూల
మున దుష్కార్యములుకూడఁ జేయ ననువుపడుం గదా యందు
రేమో క్రూరదేవతల నుపాసించి శత్రుపీడనాదికార్యముల
కుపయోగించుసిద్ధుల నందువా రల్పసంఖ్యాకులే. ఉత్తమ

సిద్ధుల నార్జించువారు బహుళసంఖ్యాకులు. ఆసిద్ధి శరీరమన శ్శ్రీమైకసాధ్యము. దానికై యాకాలమునఁ బ్రాణములను ధారవోయువారు. శరీరచ్ఛేదమునకైన దేవతను మెప్పింపఁ బూనువారు. ఆతపస్సునకే షట్ప్రయోగములలో నాకర్షణ ప్రయోగమని పేరు. రావణాసురుఁడు బ్రహ్మనుగూర్చి తపం బొనర్చె ననఁగా రావణునినుండి యాదేవత యుండుదాఁక నొకసంకల్పధ్యానరూపమగు తంతువొండు సాగి యాదేవతా హృదయమును బ్రవేశించి భక్తునికడకుం బోవలయు నను సంకల్పమును బుట్టించును. దాన నతఁ డతనికడ కరుదెంచును. స్నేహలత యని ప్రేమలత యని మనవారు పల్కుదురు. అదియే యిది యని మన మెఱుంగవలయును. కనుక నే యుపాసకుఁడు స్మరింపఁగనే యాదేవత సాక్షాత్కరించును.

"యత్ర యత్ర రఘునాథకీర్తనం తత్ర తత్ర కృతమస్తకాంజలిం
బాష్పవారిపరిపూర్ణలోచనం మారుతిం నమత రాక్షసాంతకం.
యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువానీతి మతిర్మమ."

అను నీసూక్తులు పైన వ్రాసినవిషయమునే దృఢపఱచుచున్నవి. అట్టివిశ్వాస మీకాలమున వరుసగ క్షీణించి యత్కించిచ్ఛిష్ట ముగ నున్నది. అట్టి సిద్ధులలో నొకటి యీ నాగపాశబంధన మని యెఱుంగవలయును. విభీషణుఁ డీవిషయ మెఱుంగును గాన నిది మృతి కాదని తెలిపెను. తత్కుమారికయగు త్రిజ టయు నీమాటనే సీత కెఱింగించి మనశ్చింతను మాన్పెను. ఈసిద్ధు లల్పములు కాన సామాన్యులప్రాణములు తీయఁగలవు. కాని మహాత్ములను వారి యుపేక్షవలన బాధింపఁజాలును కాని

ప్రతిహతకృత్యమున బాధింపఁజాలవు. శ్రీరాముఁడు మానవు లకు మానవత్వసిద్ధి యిట్టిదని తెలుపఁబూని యవతరించుటం జేసి యా శ్రమముల కోర్చువాఁడయ్యెనని మన మూహింప వలయును. ఇఁకఁ దరువాతివృత్తాంతమును బఠింతము.

## శ్రీరాముఁడు లక్ష్మణుని జూచి వగచుట.

* సుగ్రీవుఁడు లోనగు మహాబలశాలురందఱు నాగ పాశబద్ధులగు నాసోదరులం గని శోకసాగరనిమగ్నులైరి. అంతలో శ్రీరాముఁడు నాగపాశబద్ధుఁ డయ్యును సుంత మూర్ఛనుండి తెలివిగాంచి దీనుఁడై పడియుండు తమ్మునిం గాంచి దుఃఖము నాపుకొనలేక నాప్రియానుజుఁడు నేలం బడియుండఁ గాంచితినే. ఇఁక సీతతో నాకేమి పని? ప్రాణముల నిలుపుకొని జీవింపనేల! భూలోకమున వెదకిన సీతవంటిపడఁతిని సంపా దించుకొనవచ్చును గాని సహాయుఁడు యుద్ధవీరుఁడు నగు లక్ష్మణునివంటి యనుజన్ముని మాత్రము సంపాదింప నలవి యెప్ప టికిని గాదు. సుమిత్రానయనాంబుజముల కానందము పెం పొందఁజేయు లక్ష్మణుఁడు మృతినొందె నేని వీరందఱు చూచు చుండఁగనే నేను బ్రాణములను వదలుదును. అయోధ్యకుం బోయి తల్లి కేమని తెల్పుదు? కైక కేమని తెల్పుదును? సుమిత్ర నాకొడుకేడి శ్రీరామా యని యడుగ నేమని తెల్పుదును? శత్రుఘ్నభరతుల కేమని చెప్పుదును? నాకు జీవింప నిష్టము లేదు. ఇందే యసువుల వదలెదను. సౌమిత్రి నడవికిఁ దోడ్కొని వచ్చు దుష్కార్యమునకుఁ బాత్రుఁడ నైతినే. అక్కటా! ఎంతటి

---

* ఇది నలువదితొమ్మిదవ సర్గమునఁ గలదు.

యపవిత్రుఁడను? అని విలపించి విలపించి లక్ష్మణు నుద్దేశించి. సోదరా! నాకు దుఃఖములు గలుగఁగా నూఱడిల్లఁ బల్కుదువే. ఇపుడేల పలుకకున్నాఁడవు? నా కష్టములభరించు నా చిన్నారి తమ్ముఁడవు కదా! వత్సా! ఏల మాట్లాడవు? అని పెక్కుభంగుల వగచెను.

వానరరాజా! వేవేగ కిష్కింధకుం బొమ్ము. నేను లేకున్న వార్త నెఱిఁగి బలవంతుఁడగు రావణుఁడు నిన్నుఁ బ్రహరించును. అంగదుని దోడుకొని సేనలం గూడి సాగరమును దాఁటుము. హనుమదాదు లొనరించిన మహాకార్యము లనంత సంతోషమును గల్గించినవి. ఎందఱెన్ని యత్నములు చేసినను దుదను దైవము నతిక్రమింప మానవులకు నలవికాదు కదా. మిత్రుఁడు శ్రేయస్సును గోరువాఁడు నగుసాధు వెంతమాత్రము సాయ మొనర్పందగునో యంతమాత్రపుసాయము ధర్మవిదుఁడవు గానఁ జేసితివి. అని పలికి కపివీరులం గని వానరవర్యులారా! శరీరమును దాఁపక మిత్రకార్యము నొనరించితిరి. ఇఁక మీకుఁ జననునుజ్ఞ యొసంగితిని. స్వేచ్ఛగాఁ బోవందగును. అని రాముఁడు పలవింప నావనచరు లందఱు నశ్రువుల వదలిరి. అంత విభీషణుఁడు గదాపాణియై రాముని చెంత కరుదెంచెను. ఇంద్రజిత్తని యతనిం గాంచఁగనే కపులు భీతిల్లిరి. విభీషణుఁడు రామునిం గాంచెను.

మహాశయులారా! ఈఘట్టమున విశేషములు గలవేమో విమర్శింతము. శ్రీరాముఁడు సుంత మూర్ఛనుండి తెలిసి సోదరునిపాటు గాంచి దురపిల్లుటయే యిందలి కథ. ఆకాలమునఁగల సౌభ్రాతృత్వమును దిలకింపుఁడు. రాముఁ డేల

శోకించెనని ప్రశ్నింపకుఁడు. ఎన్నిసారులో నీప్రశ్నము దత్తో త్తరము ప్రాణాధికురాలగు భార్యకంటె సోదరుఁ డెక్కుఁడను నీతి శ్రీరాముని సంతాపసారము.

"భ్రాతరం దీనవదనం పర్యదేవయదాతురః. ౪
కిం ను మే సీతయా కార్యం కిం కార్యం జీవితేన వా
శయానం యోఽద్య పశ్యామి భ్రాతరం యుధి నిర్జితం. ౫
శక్యా సీతాసమా నారీ మర్త్యలోకే విచిన్వతా,
న లక్ష్మణసమో భ్రాతా సచివస్సాంపరాయికః. ౬
పరిత్యక్ష్యామ్యహం ప్రాణాం వానరాణాం తు పశ్యతాం,
యది పంచత్వమాపన్నస్సుమిత్రానందవర్ధనః." ౭

అని మూలము. లోకులకు శ్రీరాముఁడు తెల్పినధర్మ మిది. తనయంతవాఁడు సోదరుఁడు. అతని నెందు నెంత ప్రయత్నించి నను సంపాదింపఁ దరముకాదు. అందును యుద్ధమునఁ దన కుగాఁ బ్రాణము లీయఁబూనిన తోడఁబుట్టువువంటివాఁ డెవఁ డుండును? కావునఁ బ్రేమింపఁదగినవస్తువులలో ముఖ్యముఖ్య తమము సోదరవస్తువు. కావున సోదరప్రీతియుండుట మనుష్య సంతతికి ముఖ్యము. ఇక్కాలమున నాధర్మ మెంత విపరీతమై నదో పరికింపుఁడు. "జ్ఞాతిశ్చేదనలేన కిమ్." అనుసూక్తి కూడఁ గలిగినది. ఏల? ధన మిందులకు మూలము. దీనింబట్టి పూర్వ కాలమునకు నధునాతనసమయమునకుఁ గలభేద మేల కల్గినది. లోభ మిక్కాలమున వృద్ధియైనది. ఆకాలమున నాత్మ తుల్యుఁడు సోదరుఁడను నాశయ మెల్లరకు నుండెను. ఇప్పటి వారలం దీ యాశయ మెట్లు మార్పు నొందినదో పరికింపుఁడు. భార్యయు నామెవంకవారు బంధువులని సోదరుఁడు తద్బంధు

వులు మహాశత్రువులని కదా యిప్పటియాచారము. ఎంత విప
రీత మిది? ఇంతకు మూలకారణము లోభముగాక మతేమి
కలదు? ఒక్కధనాశ మానిన మానవసామాన్యజీవిత మెంత
సుఖదాయకముగ నుండునో యోజించినఁ దెలకుండునా?

## గరుత్మంతుఁ డరుదేర నాగపాశము వదలుట.

* అత్తఱి వానరులు పాఱిపోవుచుండుటం గని సుగ్రీ
వుఁ డందులకుం గలకారణ మెఱుంగఁజాలక యంగదునితో
నేల సేనలిట్లగుచున్నవని యడిగెను. దాశరథులు బద్ధులై పడి
యుండుట చూడలేదా. అదియే సేనల కలవిలపాటునకుం
గారణమని తెలుపుచు దుఃఖించుచు నాయుధములఁ బాఱవైచి
మోములు వెలవెలపోవఁగా నొకరినొక రీడ్చుకొనుచుఁ బోవు
చున్నారు చూడుమని తెలిపెను. అంతలో విభీషణుఁడు గదా
యుధధారియై వచ్చి సుగ్రీవు నాశీర్వదించి శ్రీరాముని దర్శిం
చెను. సుగ్రీవుఁ డావిభీషణుం గాంచి వానరులు భయంపడిరని
తెలిసికొని జాంబవంతునితో నీవిభీషణుని గాంచియే వనచరులు
భయంపడుచున్నవారు. కాన వీరిని నిలువరించి యింద్రజిత్తు
కాదనియు వచ్చినవాఁడు విభీషణుఁడే యనియుఁ దెల్పు
మనఁగాఁ ద్వరగఁ జని యతఁడు వారల నిల్వరించి వారల
నూఱడించెను. వారెల్లఁ బరువెత్త మాని నిలిచిరి. రావణునను
జుఁడు జలములను గ్రహించి రామలక్ష్మణుల కన్నులు తుడిచి
విలపించుచు మహాత్ములగు నీయిరువురు కపటసంగరమున నిట్టి
కష్టములపాలయిరి. ఎవరిసాయమున నేను బ్రతిష్ఠ గాంచ

---

* ఇది యేఁబదియవసర్గమునఁ గల కథాభాగము.

వలయుననుకొంటినో వార లిట్లు పడియున్నారు. నాకు రాజ్యప్రాప్తియందలి వాంఛ పోయినది. ఇఁక బ్రదికియున్న ఘోరవిపత్తులు గలుగు. నాశత్రువు తనప్రతిన దీర్చుకొని యెను. వాని కోర్కెయే ఫలించినది. అని యిట్లు వాపోయెను. ఆతనిం గని సుగ్రీవుఁడు కౌఁగిలించుకొని ధర్మజ్ఞా! నీవు లంకా రాజ్యము నొందఁగలవు. సందియము లేదు. రావణేంద్ర జిత్తుల కింతమాత్రముననే కోరిక ఫలించినట్లు కాదు. దీన రామలక్ష్మణులకు విపత్తు కలుగదు. మూర్ఛ పోవఁగా శ్రీరాముఁడు రావణుం జంపఁ గలఁడు. అని విభీషణు నూఱడించి ప్రక్కన నిలుచున్న మామయగు సుషేణునిం గని వీరు మూర్ఛనుండి తెప్పిఱిల్లఁగా వీరలం బిల్చుకొని శూరు లగువానరులం గొందఱం దోడుకొని కిష్కింధకుం బొమ్ము. నేను రావణాదులం జంపి సీతాదేవిం దెచ్చెదను. అనఁగా విని యాసుషేణుఁడు వానరేంద్రా! పూర్వము దేవదానవయుద్ధము భయంకరముగా సాగఁగా మాయాకోవిదు లగునసురులు దేవతలను మాటిమాటికిఁ బ్రహరించిరి. మూర్ఛితులయి దేవ తలు పడియుండఁగా బృహస్పతి మృతసంజీవనివిద్యచేతను మూలికలచేతను జికిత్స చేసెను. అట్టియౌషధములను దెచ్చు టకు సంపాతి పనసుఁడు మున్నగువార లతివేగమున క్షీర సముద్రమునకుఁ బోవుదురు గాక. వారల కాచోటు తెలి యును. క్షీరసాగరమున మున్ను సుర లమృతమును మథించి నపుడు చంద్రద్రోణపర్వతము లుండినవి. ఆకొండలయం దౌషధు లున్నవి. ఆమూలికల నాపర్వతములయందే దేవత లునిచిరి. సంజీవకరణి విశల్యకరణి యనునవియే యా

మూలికలు. వాయుకుమారుఁ డగుహానుమంతుఁ డచ్చోటికిం బోవుఁగాక.

ఇట్లు మాటలాడుచుండఁగనే విద్యుల్లతలతోఁ గూడ మేఘముల నెగురఁగొట్టుచు సముద్రమున జలములఁ జల్లివైచుచు భూభాగమంతయుఁ గంపించునట్లు పెనుగాలి వీచెను. అది గరుత్మంతునిపక్షములగాలి. ఆగాలిచేతనే లంకాద్వీపమందలి మహామహీరుహములన్నియు విఱిగి సాగరమునందుఁ బడియెను. పెనుబాములన్నియు వడంకినవి. జలజంతువులు భీతిల్లి సాగరమును జొచ్చెను. కొంతసేపటి కగ్నిప్రభల వెలుంగుచు వచ్చుగరుత్మంతుని వానరులు చూడఁజాలిరి. రామలక్ష్మణులను బంధించియుండు నాసర్పములన్నియు భీతిల్లి పాఱిపోయినవి గరుడుం డంత రామలక్ష్మణులం గని వారు సమ్మానింపఁ దనచేతులతో వారిమోములం దడవెను. గరుత్మంతుని హస్తస్పర్శము కాఁగానే వారితనువుల నున్న బాణఘాతవ్రణములన్నియుఁ బోయినవి. యథాపూర్వదేహము లలవడెను. బలశౌర్యాదులు యథాపూర్వముగా నలవడెను. సూక్ష్మార్థపరిజ్ఞానము వివేకము స్మృతియు ద్విగుణముగాఁ గలిగెను. సుపర్ణుఁడు వారిని లేవనెత్తి పరమసంతోషమునఁ దేలు వారిని గౌఁగిలించుకొనియెను. శ్రీరాముఁ డత్తఱి నాగరుత్మంతునితో మీదయవలన నీయాపదఁ గడచితిమి. బలసంపన్నుల మైతిమి. నిన్నుంజూడఁగనే నాతండ్రి దశరథమహారాజును దాతయగు నజమహారాజును జూచినంత సంతోషము గలిగినది. సకలాలంకారశోభితాంగముగల నీవెవ్వఁడవు? అని యడుగఁగా నానందబాష్పములు గ్రమ్మ నాసుపర్ణుఁడు శ్రీరామా!

నీకు సఖుఁడను, ప్రియుఁడను, బహిఃప్రాణమను, గరుత్మంతుఁడను. మీయిరువురకు సాహాయ్యము చేయఁబూని యిచ్చటికి వచ్చితిని. క్రూరకర్ముఁడగు నింద్రజిత్తు మాయాబలమున నిర్మించిన యీ నాగపాశబంధమును విడిపింప దేవాదులకు శక్తి చాలదు. ఘోరసర్పము లీయవి కద్రువకుఁ బుట్టినవి. మాయాబలమున బాణరూపములై ని న్నొందినవి. శ్రీరామా! ధర్మాత్ములగు మీ కేభయములు నింక నుండవు. మీపాశబంధన వృత్తాంత మెఱింగి మిత్రకార్యనిర్వాహణమునకై వచ్చితిని. వానిని విడిపించితిని. మీర లెత్తఱినైనఁ బ్రమాదంపడక యాయాయియస్త్రములకుఁ బ్రత్యస్త్రములం బ్రయోగించుచు నుండవలయును. రక్కసులు మాయాయుద్ధకోవిదులు. వీరు నిష్కపటులు. రక్షస్సంతతి నమ్మరానిది. అని పలికి శ్రీరామునిం గౌఁగిలించుకొని సెలవడిగి నీవు ధర్మవేత్తవు. పగవారిదోషములంగూడఁ బాటింపక ప్రేమించువాఁడవు. నా కనుజ్ఞ యిమ్ము. మనస్నేహ మెట్టిదనుకౌతుకమున కిది యదనుగాదు. యుద్ధము కాఁగా విజయలక్ష్మి నిన్ను వరింపఁగా నపు డెఱింగెదవు. బాణజ్వాలల రాక్షసులం గాల్చి సీతను గ్రహింపఁగలవు. అని తెలిపి వారిబాధల మాన్పి ప్రదక్షిణము గావించి కౌఁగిలించుకొని వియన్మార్గమునం బోయెను. రామలక్ష్మణులు స్వాస్థ్యము నొందఁగా వానరులు సింహనాదము లెసఁగ వాలము లల్లార్చుచు నెగురసాగిరి. తరుపాషాణాదులం బట్టుకొని రణమునకు సిద్ధపడిరి. అర్ధరాత్రమున వానరులు సింహనాదములు చేయ లంకాపురవాసు లులికిపడిరి.

మహాశయులారా! ఈభాగమునఁ గలవిశేషముల నెనుకుదము. విభీషణుఁడు వగచుట. గరుత్మంతుని యాగమనము సర్పపాశవిముక్తి గరుత్మద్రామసంభాషణము ననునివి యిందలి విశేషాంశములు.

"యయోర్వీర్యముపాశ్రిత్య ప్రతిష్ఠా కాంక్షితా మయా,
తావుభౌ దేహనాశాయ ప్రసుప్తౌ పురుషర్షభౌ." ౧౮

అని మూలము. ఇది విభీషణునాశయము. కార్యార్థులకు స్వలాభమే ప్రధానముగాఁ గనంబడు ననునీతికిది యుదాహరణము. ఇది నైజము. "స్వభావో దురతిక్రమః" అనున్యాయము తప్పునది కాదు. ఏకాలమునందైన నది మార్పునొందనిది. కాలానుసారముగా మాఱుచుండునవి మార్పఁగలయవి స్వభావములు గాని విషయములే కాని నైజము మార్పునొందనిది. దానిని మార్చుటకు శక్తుఁడు భగవంతుఁడే కాని యన్యులు కారని నమ్మవలయును. ఎన్నియుపదేశములఁ గాంచినను స్వభావము మాఱదనియే మనము నమ్మవలయును.

"దైవాసురం మహద్యుద్ధమనుభూతం సుదారుణం. ౨౬

... ... ... ... ...

తానార్తాన్నష్టసంజ్ఞాంశ్చ పరాసూంశ్చ బృహస్పతిః,
విద్యాభిర్మంత్రయుక్తాభిరోషధీభిశ్చికిత్సితః. ౨౮
తాన్యౌషధాన్యానయితుం క్షీరోదం యాంతు సాగరం,
జవేన వానరాశ్శీఘ్రం సంపాతిపనసాదయః. ౨౯
హరయస్తు విజానంతి పార్వతీస్తా మహౌషధీః,
సంజీవకరణీం దివ్యాం విశల్యాం దేవనిర్మితాం. ౩౦

చంద్రశ్చ నామ ద్రోణశ్చ క్షీరోదే సాగరోత్తమే,
అమృతం యత్ర మథితం తత్ర తే పరమౌషధీః. ౩౧.
తే తత్ర నిహితే దేవైః పర్వతే పరమౌషధీ,
అయం వాయుసుతో రాజన్ హనూమాంస్తత్ర గచ్ఛతు." ౩౨

అని మూలము. సుగ్రీవునకు సుషేణుఁడు చెప్పినమాట లివి. ఇందలివి శేషము లివ్వియని మనము గ్రహింపవలయును. అస్త్రవిద్యయు, నోషధుల నారాధించువిద్యయు నాకాలమున విశేషించి యుండెను. షట్ప్రయోగభూయిష్ఠముగ నస్త్రవిద్య యలరుచుండెడిది. దానినే యారాధించువారు తఱచుగా నుండిరి మునులు కూడఁ దపోవిఘ్నములఁ బోఁగొట్ట నాయస్త్రవిద్య నభ్యసించెడివారు. అసురులు పైఁబడ రాఁగా వాని నుపయోగించి యాయాపదలను దప్పించుకొనెడివారు. కొందఱు శాపములమూలమున దుష్టుల నిగ్రహించెడివారు. కొందఱోషధుల నుపయోగించి శత్రువులను స్తంభించువారు. అనేక రోగములను వానిమూలమునఁ బోఁగొట్టువారు. అనేకసిద్ధులవ్వానిమూలమునఁ గలుగుచుండెడివి. ఓషధుల నుపాసించు పద్ధతియుఁ గలదు. ఓషధిగ్రహణమునకే యది యుపయోగించును. ఇంద్రజాలవిద్యాతంత్రము లోనగునవి యావిషయములను దేటపఱచును. తిథి వారము నక్షత్రము కొన్నింటికి నివ్వి యివ్వియని యేర్పడియుండును. అవి కవిసినపుడా యోషధిని బూజించి యంతకుముందుఁ దదుక్తసంఖ్యాక్రమమున నుపాసించియుండు తదధిదేవతామంత్రమును దదుక్తసంఖ్యను దప్పకయుండ నభిమంత్రించి యోషధిని గ్రహింపవలయును. తఱచుగా నవి యర్ధరాత్రమునందే తీయఁదగియుండును.

ఆమంత్ర ముచ్చరించుచు నాలతను బూజింపఁగా నది భీషణా కారముల ననేకములఁ గనఁబఱచునఁట. వానికి జంకక తొలఁగి పోవక చెంతకుఁ బోయి స్పృశించినంతన యథాపూర్వరూప మున నది యుండును. అపుడది యభీష్టసిద్ధి నొసంగునని విధి కనంబడు. ఏయోషధియైన నుపాసకుని మనోవాంఛల నను సరించి బాధించుటయో శాంతరూపమున నుండుటయో జర గును. క్రూరకార్యములకు నుపయోగించు తలంపుగలవారల కవి చిక్కకయుండ నెన్నియో భీమరూపముల భయపెట్టు ననుట యప్రతిహతసిద్ధాంతము. వృత్తి కర్మానుసారముగ నుండును. నీచోచ్చఫలసిద్ధులు తదనురూపములై యుండును. ఈవిషయములన్నియు నీకాలమున మాటలలో నున్నయట్టు లాకాలమున నాచరణమున నుండెనని మన మెఱుంగవల యును. ఓషధులమహాత్త్వమును నమ్మనివారు కొందఱు గలరు. వారి నెటులైన నమ్మునట్లు చేయుట మనపనిగాదు. విశ్వాసముగలవారలకుఁ దెల్పుటయే మనపని

భగవత్కార్యమునఁ గల్గినవిఘ్నమును గరుత్మంతుఁ డెట్లు లెఱిఁగెనని ప్రశ్నించువా రుందురు గదా. పాఠకమహా శయు లొక్కవిషయము నూహింపవలసియుండును. దృఢ మైత్రిగలవారల కెచ్చోటనైన గొప్ప యాపదగాని గొప్ప లాభముగాని కలిగినచో దూరముగానుండినను వారిమేలు గోరు సన్మతులకు మనోవికారముగాని మానసోత్సాహముగాని కలుగును. అది యప్పుడే తెలియకపోయిన నుభయులు గలిసి నపు డది తేటపడును. ఏల యట్లగునని సంశయింపవలదు. స్నేహారసతంతువే యుభయులమనస్సుల సోఁకియుండును గాన

నది చలింపఁగా నిరుపురిమనస్సులు నొక్కసారియే సంతోష ముననొంపె విపత్తుననొంపె మార్పునొందును. ఇది యనుభవ సిద్ధము. కావున గరుత్మంతున కీవిషయ మెట్లు తెలిసెనన్న ప్రశ్నము కేవలపామరులు చేయునట్టిదే.

నాగాస్త్రమునకు వైరి గారుడాస్త్రము. నాగజాతికి వైరి గరుత్మంతుఁడు. అస్త్రమంత్రప్రభావమున సర్పములవలెఁ గనంబడుచు బుసలుకొట్టుచుండు నాపాశములు గరుత్మత్సం దర్శనమునఁ బాఱిపోవుట చిత్ర మనరాదు. ఇందుఁ జిత్ర మేమున్నది? తత్కరసంస్పర్శమున నాయన్నదమ్ములు హృష్ట పుష్టాంగు లగుటయు వింతకాదు. కృత్రిమాస్త్రపాశబద్ధులౌట న ట్లుండిరి. గరుత్మత్సందర్శన సంస్పర్శనసల్లాపముల నాయస్త్ర పీడ తొలఁగఁగా వారిరువురు యథాపూర్వముగ నుండుట నైజమే కాక విచిత్ర మేమున్నది?

"యథా తాతం దశరథం యథాజం చ పితామహం,
తథా భవంతమాసాద్య హృదయం మే ప్రసీదతి. ౪౩
కో భవాన్ రూపసంపన్నో దివ్యస్రగనులేపనః,
వసానో విరజే వస్త్రే దివ్యాభరణభూషితః. ౪౪
తమువాచ మహాతేజా వైనతేయో మహాబలః,
పతత్రిరాజః ప్రీతాత్మా హర్ష పర్యాకులేక్షణః. ౪౫
అహం సఖా తే కాకుత్స్థ ప్రియః ప్రాణో బహిశ్చరః,
గరుత్మానిహ సంప్రాప్తో యువాభ్యాం సాహ్యకారణాత్. ౪౬

... ... ... ...

న చ కౌతూహలం కార్యం సఖిత్వం ప్రతి రాఘవ,
కృతకర్మా రణే వీర సఖిత్వమనువేత్స్యసి. ౫౭

అని మూలము. రాముఁడు గరుత్మంతు నెఱుంగఁడని తెల్ల మగును. పక్షములను జూచియైన గుఱుతింపవచ్చును. సర్పపాశ ములు తొలఁగుటయు నాతనిచరిత్రము చెప్పక చెప్పును. నాతండ్రిని జూచినట్లైనదని ప్రీతిగ రాముఁ డనెను. ఇదేల? అనువా రుండకపోరు. మర్త్యావతారమున రాముఁడు భూప కుమారుఁడే యన్నట్లు వర్తించెను. స్వప్రవర్తనమే సకలోప దేశముల నొసంగునది యని నమ్మెను. కావున నీనాటకమునఁ దాదాత్మ్యమే ముఖ్యము. అనుకరణమును మించినది. కావునఁ గేవలమానవుఁ డెట్టిచర్యలఁ జూపఁదగునో యవియే యిప్పుడు గనఁబఱచెనని మన మూహింపవలయును. గరుడుఁడుకూడ నీతఁ డెప్పుడు సఖుఁడయ్యెనని యూహింపవలదు. కావలసినపనులు కాఁగా నవి తేటపడునని విన్నవించెను. అనఁగా నర్థమేమి? ఏల యీ యభినయము. తెలియఁదగినసమయమున నది యెఱుక పడు టుత్తమమని కదా యాతనిభావము. గరుడుని యాగమన మున నాగపాశబంధనము వీడినది. వానరుల మనోరుజ వదలి నది. రాక్షసులయానందము నశించినది. మహాప్రకృతి సీత తలంచినపని సాగనున్నది.

## ధూమ్రాక్షుని యుద్ధము.

* బలవంతు లగువానరు లిట్లు సింహనాదము లొనరింపఁగా విని రావణుఁడు మంత్రిముఖ్యులం గాంచి సింహనాద ములు చెలరేఁగుట చూడఁగా వారలకు సంతోషము మిక్కిలి కలిగిన ట్లున్నది. రామలక్ష్మణులు బద్ధులై యున్నవారు. వానః

* ఇది యేఁబదియొకఁడవసర్గమునఁ గల కథాంశము.

రులు సింహనాదముల సముద్రమును ఘూర్ణిల్లఁ జేయు చున్నారు ఇవి రెండును బరస్పరవిరుద్ధము లైయున్నవి. ఈ ధ్వనులం బట్టిచూడఁగా వారికి శరబంధములు వీడిన ట్లున్నవి. అని మంత్రులం గాంచి యిద్దానికిం గలకారణ మెఱింగి రండని యాజ్ఞాపించెను. వెంటనే రాక్షసులు కొందఱు ప్రాసాదాగ్రము నెక్కి శరబంధములు వీడి తిరుగు రామలక్ష్మణులను సుగ్రీవాదులను బరాక్రమము నెఱప సిద్ధులనుగాఁ గని యుత్సాహము తఱుగ విచారించిరి. రావణుం గాననేగి యావార్తలం దెలిపిరి. ఆమాటలు విచారశోకములు గల్గింప నింద్రజిత్తుప్రయత్నమిట్లు విఫలమగుటం జింతింపఁగా రాక్షసబలమునకుఁ బ్రాణసందేహము గలుగున ట్లున్నది. భయంకరములగు నాగపాశములు వ్యర్థములైనవి కదా యనియెను. ఇట్లు పలికి ధూమ్రాక్షుఁడను రాక్షసేంద్రుని గని రాముని వానరులను వధించి పౌరుషము నెఱపి రమ్మని పనిచెను. ఆతఁడు సంతోషించి బలంబులం గూడి రావణునకు నమస్కరించి వెడలెను. భయంకరాయుధములం దాల్చి సేనలు నడువ నరదం బెక్కి పశ్చిమభాగద్వారమునుండి యాధూమ్రాక్షుఁ డనికిఁ బోయెను. ఆరీతిగా వాఁ డనిసేయఁబోవఁగా దుర్నిమిత్తము లనేకములు కలిగెను. వానింగాంచియు లెక్కింపక పోయి రామపాలిత మగుసేనలం గాంచెను.

## ధూమ్రాక్షుని హనుమంతుఁడు వధించుట.

* ధూమ్రాక్షుఁడు రాఁగా వానరులు సింహనాదము నొనరించిరి. ఇరుఁదెగలవారును బోరాడసాగిరి. ఆపోరు

---

* ఇది యేఁబదిరెండవసర్గమునఁ గలదు.

ఘోరముగా నుండెను. బాణములచే రక్కసులు తరుపాషాణములచే వానరులు పరస్పరము కొట్టుకొనిరి. కొంతసేపటికి వానరులపరాక్రమము దుస్సహమై రక్కసులు పాఱిపోవఁ జేసినదయ్యెను. ధూమ్రాక్షుఁ డిట్లు తమసేనలు పాఱుచుండుటం గాంచి బాణపరంపరలఁ బరఁగించి వానరులం జంపఁ దెంపు సేసెను. వనచరులు వానిపౌరుషమునకు నిలువఁజాలకపోయిరి. కొందఱు మృతి నొందిరి. పీనుఁగులపెంట యయ్యెను. వాఁడంతకంతకుఁ జెలరేఁగి దివ్యాయుధములం బ్రయోగించి వానరుల జమునింటికిం బంపసాగెను. వానరు లార్తనాదములు చేయసాగిరి. వారిపాటుగాంచి హనుమంతుఁడు కోపోద్దీపితుఁడై వానిపైకిఁ బోయెను. గండోపలమును ద్రిప్పి వానియరదముపైఁ బడవేసెను. దాని రాకంగని యాయసురవీరుఁడు గదాపాణియై క్రింద నిలువఁబడెను. ఆగండోపల మారథమును సమగ్రముగాఁ జూర్ణము చేసినది. అంత వృక్షముంగొని ధూమ్రాక్షునితోఁ బవనాత్మజుఁడు పోరెను. ఇరువురు ఘోరముగఁ బోరాడిరి. గదను గిరగిరం ద్రిప్పి హనుమంతునిపై వైచెను. ఆవ్రేటును లెక్కింపక వానిందలపడి పర్వతశిఖరమును వైచెను. ఆవ్రేటున నాతఁడు సకలాంగములు కంపింప నేలం గూలెను. హతశేషులు లంకకుం బాఱిపోయిరి. వానరులందఱు నా హనుమంతునిపరాక్రమమును శ్లాఘించి జయజయనినాదములు గావింప సంతోషమున ద్వారమున నుండెను.

## వజ్రదంష్ట్రుఁ డంగదునితో రణము చేయుట.

* ధూమ్రాక్షునిపాటు విని రావణుఁడు ఖిన్నుఁడై

* ఇది యేఁబదిమూఁడవ సర్గమునందుఁ గల కథాభాగము.

కోపావేశము గదుర వజ్రదంష్ట్రుని జూచి వీరాగ్రణీ ! త్వరిత ముగఁ గదలి బలములం గూడి పోయి రామసుగ్రీవాదుల వధించి రమ్ము. అని యానతీయఁగా మాయావియగు నా దానవ వీరుఁడు బలములంగూడి నగరము వెడలిపోయెను. వీరులగు భటులు సకలాయుధములం దాల్చి ప్రకాశించుచుండిరి. అనేక వాహనముల నారోహించి దక్షిణద్వారమునుండి వెడలిరి. అందంగదుం డుండెను. భయంకరోత్పాతములు రక్కసులకుం దోఁచెను. వానరులు దానవులం దలపడిరి. రక్తము ప్రవాహ ముగాఁ బాఱసాగెను. ఆయుధముల వైచి దానవవీరులువాన రులం బొలియింప వారు పాషాణాదులం జరఁగించి దానవులఁ బొలియించిరి. బలవంతులు మాయావులు నగుట దానవులు విజృభించి కోఁతిమూకల నుగ్గుగా నొనరించిరి. అట్లుచెలరేఁగు దానవులం గని యంగదుఁడు మహాకోపమునఁ దేఱిచూడ రాక వృక్షమొకండు పెకలించుకొని వారిపైఁ గవిసి చక్కా డెను. అంగదుని ప్రేటులకుఁ బడినచతురంగబలములు భూమి నిండియుండెను. ఆసంగరమున నాతనియురవడికిఁ దాళఁజాలక వీరులగుదానవులు పాఱిరి. కొందఱు గూలిరి. కొంద ఱూరక చూచుచుండిరి. సేనయంతయు నించుమించుగా నంగదునిచే హతమైనట్లు సేనాధిపతి తలంచెను.

మహనీయులారా ! రామాయణము భారతకథకుఁ దర్వాత జరగినకథ యని కొందఱందురు. భారతయుద్ధము జరగినవిధము నరయుఁడు. ఈయుద్ధవిధము నరయుఁడు. దాని పోలికలు వేఱు. దీనిపోలికలు వేఱు. సేనాసన్నివేశములు, యుద్ధక్రమము, దీనియం దున్న ట్లందు నున్నవా ? అతిప్రాచీన

ముగా నీరామాయణయుద్ధము తోఁచును. సైన్యము
లన్నియు నొకసారి వచ్చుట వ్యూహములుగా తీర్చుట. నియ
మానుసారముగా సంగర మొనర్చుట మధ్యాహ్నకాలమున
విడుమర. సాయంకాలము కాఁగానే యుద్ధము మానుట
లోనగునియమము లిందు లేవు. ఒక్కవీరుఁడు వచ్చుట. తనసేన
లతో సంగరము చేయుట యీ యుద్ధక్రమము. ధర్మమను
మాటయే యీ సంగరరంగమునఁ గానరాదు. అధర్మమార్గము
ప్రధానముగా నిందుఁ దాండవమాడుచుండును. మాయా
యుద్ధమే యిందు విశేషించి సాగును. రాత్రిందివము లను
భేదమే లేదు. తోఁచినప్పు డరుదెంచి యుద్ధముచేయుట,కృత్రి
మాస్త్రప్రయోగము తఱచుగా నిందుఁ గాననగును. ఇట్టివి
లెక్కలేనన్ని కారణము లున్నవి. వీనింబట్టి చూడఁగా రామా
యణయుద్ధము నియమవిరహితమై సాగినట్లు కనుపట్టకపోదు.
పాషాణములు గిరిశృంగములు చెట్లు గోళ్లు దంష్ట్రలు ఆయుధ
ముగా ననిసేయువారు కొందఱు, ఘోరసాధనములం బూని
సంగరము చేయువారు గొందఱు నిది రామాయణయుద్ధపద్ధతి.
ఒకరి నొకరు భక్షించుటయు నొకయుద్ధముగా జరగుట రామా
యణక్రమము. శత్రువధము భారతక్రమము. వనచరుల దాన
వులు దానవులవనచరులును భక్షించినట్లు రామాయణమునఁ
గానఁబడును. భారతమున నిది కనఁబడునా? రాజు బలవంతు నొ
క్కనిం బిలిచి నీవుపోయి శత్రువులనెల్లరం జంపిరమ్మని పంపుట
రామాయణసంగరమునందుఁ గనంబడును. ఎల్లరు నొక్కసారి
వెడలుట సర్వసేనాపతి మాటప్రకారము వ్యూహముతీఱి యఁగ్ర
వీరుల మార్కొనుట భారతమునఁ గల రణమువరుస. శస్త్ర

ధారి కానిచో విరథుఁడైనచో పూరిగఱచినచో బాహువులు పైకెత్తినచోఁ గొట్టరాదనునది భారతరణక్రమము. నిరా యుధులైన మఱింత పౌరుషమునఁ గనంబడకయుండి చంపుట రామాయణసంగ్రామరీతి. ఇట్లెన్నియో కనఁబఱుపవచ్చును. ఏవిధమున నాలోచించినను రామాయణయుద్ధ మత్యంతప్రాచీన కాలమున జరగినదనియే తేలును గాని భారతముతర్వాత మూఁడువేలయేండ్లకో నాలుగువేల మూఁడువందలయేండ్లకో లేక రెండువేల తొమ్మిదివందలయేండ్లకో జరగినదని తేలదు. కావున వెఱ్ఱిమొఱ్ఱి సిద్ధాంతములచేఁ బామరులమనస్సులను బాలుమాలుచేయక యూరకయుండుటే విమర్శకాగ్రగణ్యు లకుఁ గర్తవ్యము.

## వజ్రదంష్ట్రుఁ డంగదునిచే హతుఁ డగుట.

* అంత బలశాలియగు నావజ్రదంష్ట్రుఁడు తనబలములు పొలియుటయుఁ బాఱుటయు నిశ్చేష్టము లగుటయుం గాంచి వైరియగు నంగదుఁడు చెలరేఁగి శత్రుధ్వంసన మొనరించు టయుఁ దిలకించి క్రోధావేశము నొంది నారి సారించి వనచర వరులపై శరవర్షమును గురియించెను. అత్తఱి శూరులగు నామేటిరాక్షసులు వజ్రదంష్ట్రుని గూడి నానావిధ బాణజాల ములఁ వానరవరులం దార్కొని పోరిరి. వానరవీరులును వారిం దలపడి నఖదంష్ట్రాద్యాయుధములతోఁ బోరాడిరి. పర స్పర మాయుధప్రయోగమున వెనుదీయక పోరాడుట విచిత్ర ముగనే తోఁచుచుండెను. వారి తనువులనుండి పాఱెడిరక్తము

* ఇది యేఁబదినాల్గవసర్గమునఁ గల కథాసారమని తెలియఁగఁదగు.

నమల మించియుండెను. మీఁదమీఁద నెక్కొనుపౌరుషముల వానరులు దానవులం దలపడి యమసదనమున కనుపసాగిరి. వారిరీతిం గాంచి పెనురోషంబునఁ గన్నులెఱ్ఱవాఱఁగా వజ్రదంష్ట్రుఁడు చాపంబు సారించి వానరులు భీతిల్లం దలపడి యశనిసమ మహాశుగంబులం బ్రయోగించి వారిని భేదించెను. ఏచినకీనుక నొక్కబాణంబునం బెక్కండ్ర నుక్కడంచెను. ఆ యేటుల కాగఁజాలక వానరులు గుంపులుగుంపులుగాఁ బరువెత్తి యంగదు నాశ్రయించిరి.

అంగదుండు నంత వారి నాశ్వాసించి పౌరుషము పెంపొంద వజ్రదంష్ట్రుని మార్కొనియె. దానవేంద్రుఁడు మహాకోపమున సహస్రబాణముల నా వాలికుమారు నొప్పించెను. అంగదుఁ డాబాణఘాతముల నంగములెల్ల రక్తసిక్తములు కాఁగా నా పగవానిపై నొకవృక్షమును బ్రయోగించెను. బాణముల దాని నతఁడు ఖండఖండములుగా నొనరించెను. వాలితనయుం డాతనిపౌరుషమును గాంచి విశాల పర్వతశృంగ మొండు పెకలించి తెచ్చి వానిపై వైచి యార్చెను. దానిరాకం గాంచి వజ్రదంష్ట్రుఁడు గదఁ దాల్చి రథము దిగి నేల నుండెను. అంగదుఁ డాతని చేరఁబోయి యాగదను గరములం బట్టి లాగెను. ఆశృంగ మాయసుర రథమును జూర్ణమును గావించెను. అంతలో వేఱొకశృంగమును గొనివచ్చి దానవునిశిరస్సుపై వైచెను. దాన నాతఁడు మూర్ఛమునింగి తెప్పిఱిల్లి వేఱొకగదను గైకొని యంగదుని వక్షము నొప్పించెను. ఇరువురు ముష్టియుద్ధమునకుం గడంగిరి. మరల నిద్దఱును వృక్షములం బట్టుకొని నిలువంబడిరి.

కొంతవడికి డాలును గత్తిని బట్టుకొని పోరాడిరి. అంగదుఁడు నొచ్చియుఁ బెనురోషంబునఁ దళతళలాడుఖడ్గమున వజ్ర దంష్ట్రునిశిరమును ఖండించెను. వాఁడు రక్తముం గ్రక్కుచు నేలంబడి తన్నుకొనుచుఁ బ్రాణముల వదలెను. హతశేషులు దానవులు లంకకుం బరువెత్తి రావణున కావార్త నెఱింగించిరి. అంగదుఁడు శత్రునాశన మొనరించి సంతోషమున నొప్పుచుండెను.

మహామతులారా! ఈయుద్ధభాగమును బఠించితిరి కదా. భారతయుద్ధమునఁ బాషాణములు చెట్లు ఆయుధములుగా నిరువురు యుద్ధముగావించినట్లు వింటిరా? ఱాళ్లు వైచినట్లు తల బ్రద్దలై చచ్చినట్లు విన్నారా? ఎందును గానరాదు. ఘటోత్కచుఁడు అలంబసుఁడు నను నిరువురు రాక్షసులు యుద్ధరంగమున నున్నట్లు గానవగును. తద్బలములు విశేషించియున్నట్లు గానరాదు. అందందు బక హిడింబాదిరాక్షసులున్నయట్లు కినంబడును. వారు మానవులను భక్షించువారైనను సమాధానము చేసికొని వంతుప్రకారము పంపుచుండుట వారంతట తృప్తిపడుచుండుట యాచారమైనట్లు కనుపట్టును. కావున దానవులకుండు నైజక్రౌర్యము తగ్గియున్నట్లు స్పష్టము. రామాయణములో నొక్కచోటనైన నిట్టివి కానరావు కదా. ఏది ప్రాచీనమో యేది నవీనమో విచారించినఁ దేలకపోదు. నిష్పక్షపాతబుద్ధిని విచారింపవలయును గాని యొకవాదమును సాధింపఁబూని యసత్యవాదమును బయలు చేఱఁ దీయరాదు. ఇంకఁ దరువాతికథాభాగమును బఠింతము.

## అకంపనుని యుద్ధము.

* వజ్రదంష్ట్రునంగదుఁడు పొలియించుట యాలకించి రావణుఁడు ప్రహస్తుని గాంచి అకంపనుఁడు సేనలం గూడిపోయి యుద్ధమునఁ బగవారిని మ్రందించుఁ గాక. ఆతఁడు యుద్ధవిశారదుఁడు, నామేలు గోరువాఁడు, పరవీరహంత. కావున రామాదుల వధింపఁగలఁడు. అని యానతీయఁగాఁ బ్రహస్తుఁ డకంపనుని బురికొల్పి బలములఁ గూడఁ బంపఁగా దేవతలకుం గూడ ననిమొనఁ గంపింపఁజేయఁ దగనివాఁడు గాన నకంపనుఁడను పేరుపొంది వెలయుచుండు నాధీరుఁడు గాన ననికి వెడలుతఱిం దోఁచు దుర్నిమిత్తములను గమనింపక పయనము సాగించెను. ఆసేనల సింహనాదములకు సముద్రములు కంపించెను. దాని నాలకించి వనచరులు పాషాణాదులం గొని యనికి నాయత్తపడిరి. అప్పుడు లేచిన ధూళివలన నొండొరులఁ గనఁజాలక యుండిరి. పడమటిద్వారమున నున్నబలములు దానవులం దలపడి పోరెను. ఇతరేతరప్రహారములు దేవతలకుంగూడ నచ్చెరువుదయింపఁ జేయఁజాలెను. వారిదేహములు రక్తప్రవాహముల వెడలించెను. రక్కసు లుక్కుమిగిలి సమస్తాయుధముల వైచి వానరులం బడఁగూల్చిరి. వానరులు విజృంభించి దానవులచేతులలోని యాయుధముల లాగుకొని వానిచే వారలం గొట్టి తుదముట్టించిరి. అంత నలకుముదమైందద్వివిదులు సలువురు చెలరేఁగి రక్కసులపైఁ బడి తమపౌరుషము కనంబడునట్లు పోరాడి యసంఖ్యాకుల దానవులం గూల్చిరి.

---

* ఇది యేఁబదియైదవ సర్గమునఁ గలదు.

## హనుమంతుఁ డకంపనునిం జంపుట.

* అట్లవ్వనచరపుంగవులు మహాకార్యము చేయుచుం డుటం గాంచి యాయకంపనుఁడు భరింపరాని కోపమునొంది నారి సారించుచు సారథిం గాంచి మహాదైత్యులు వనచరులచే హతులైరి. ఆమేటివానరు లుండుతావునకే రథముఁ దోలుము. చూడుము. నాయెదుట వృక్షపర్వతముల నాయుధములనుగా ధరించియున్న వానరులం జంపఁ గోరియున్నాను. కానఁ ద్వరగ రథముం దోలుము. నావు డాతఁడు రథమును జిత్రగతుల నడపెను. క్రోధావేశమున నాయకంపనుఁడు బాణములు వరఁ గించుచు వానరులఁ జీకాకుపఱచెను. వానరు లోర్వలేక పరు గెత్తిరి. హనుమంతుఁడు వారిపాటు గాంచి యకంపనుని దార సించెను. హనుమ తమకు సాయపడుట చూచి వనచరులు సంతుష్టులైరి. దానవేంద్రుఁడు వర్షముగ బాణములఁ గురిపిం చెను. వానికి భయపడక హనుమ వానిం జంప నిశ్చయించు కొనియెను. వెంటనే తన యురవడి కనఁబడ వానిపైకిఁ గలి సెను. ఒకకొండను పెకలించి సింహనాదము చేయుచు దానిం ద్రిప్పివైవఁ బూనునంతలో వాఁ డద్దాని నర్ధచంద్రాకారము లగుబాణముల వైచి శకలములు గావింప నది ధరఁ వ్రాఁ గెను. దానికి మిక్కిలి కోపగించి చెంతనున్న మద్దిచెట్టును జూచి పెకలించి దాని గిఱగిఱం ద్రిప్పుచు దిక్కు లద్రువ నార్చి దానివ్రేటున నేనుంగులను రథములను బదాతులను వధించెను. యమునివలె సేనలంజంపు నా హనుమంతునిం గని రక్క

* ఇది యేఁబదియాఱవసర్గమునఁ గల కథ.

సులు నలుదిక్కులకుం బరుగులిడిరి. ఆ యకంపనుం డాగ్ర హించి మర్మభేదకము లగుబాణముల గాలికొడుకు నొప్పించెను. దానం గినుకపొడమ వేఱొకవృక్షమును లాగి వాని నెత్తి పగులంగొట్టెను. దాని దెబ్బచెడి నేలంబడి యసువులం బాసెను. వానిబలములలో మిగిలియుండువారు భయముగొని పాఱంగా వానరులు వెంటంబడి తోలంగా బ్రదికితిమిరా యని లంకం జొచ్చి తిరిగి చూచిరి. వానరు లాహనుమను బ్రశంసించిరి. ఆవార్త విని శ్రీరామ లక్ష్మణ సుగ్రీవ విభీషణాదులు హనుమంతుని బ్రశంసించిరి.

## ప్రహస్తుఁడు రణమునకు వచ్చుట.

* రావణుం డకంపనునివధ మాలకించి క్రోధావేశమునఁ గన్నుఁగానక మోమున సుంత దైన్యముకదుర మంత్రులం గాంచెను. మంత్రులంగూడి యాలోచించి దినపూర్వభాగమున సేనలం గలయంగాంచ లంకయంతయుం దిరిగెను. వానరుల ముట్టడిని జూచి యోర్వఁజాలక ప్రహస్తునిం గని సంగరముల నీవెఱుంగని నైపుణ్యములు లేవు. పగవారి రాణువ నగరమును ముట్టడించునపుడు దానిం దొలఁగించుటకు యుద్ధముతప్ప నింక నొకయుపాయము నాకుఁ దోఁపలేదు. ఆపని నేనో కుంభకర్ణుఁడో నీవో యింద్రజిత్తో నికుంభుఁడో నిర్వహింపవలయుఁ గాని యితరులు వహింపఁ జాలరు. కనుక నీవు మహాత్తరబల సమన్వితుఁడవై వెడలి వానరుల ముట్టడిని దొలఁగించి రమ్ము. యుద్ధము చేయకుము. నీవు వెడలినంతనే రాక్షసులసింహనాద

* ఇది యేఁబదియేడవసర్గమునఁ గల కథాభాగమని యెఱుంగునది.

ములకు నాచపలాత్ముఁ లగు వానరులు భయమునఁ బరువెత్తఁ గలరు. వానరసేన పాఱిపోఁగా రామలక్ష్మణులు తమమాటవిను వారు లేమింజేసి నీచేతం జిక్కుదురు. మనము యుద్ధము చేయక యూరకుందుమేని శత్రువులు వదలరు గదా. వారు మనలఁ జంపుట నిశ్చయము. యుద్ధమునొనరించిన మృతియే కల్గునో జయమే కల్గునో నిశ్చయింపరాదు. కాన మృతిగల్గుట సందియము. యుద్ధముమానిన సందేహము లేకయే కల్గుమరణమునకంటె నని చేసిన సందేహముగాఁ గల్గుమరణమే మంచిది. కనుక సంగర మొనరించుటయే మేలు. ఇది నాయాశయము దీనికిఁ బ్రతికూలానుకూలములలో నెద్దాని నూహించుచున్నావో దానిం జెప్పుము. అదియే మాకును హితమని పలికెను.

ఆమాటల విని సేనాధిపతియగు ప్రహస్తుఁడు రాజేంద్రా! పూర్వము విభీషణాదులగు మంత్రులతో నిపుణముగా నాలోచించినదియే గాని యిది క్రొత్తదికాదు కదా. ఒక్కఁడొక్కఁడు తనమతమును దెలుపుచుండఁగాఁ గలహము కూడఁ గల్గినది. దానఁ గదా విభీషణుఁడు వెడలిపోయెను. సీత నీయనిచో రణముగలుగుట తప్పదని నిశ్చయించి యుంటిమి. నామాట యుండనీ! నన్ను నిరంతరము బహువిధముల సత్కరించియే యున్నవాఁడవు. అట్టినేను సకాలమునఁ బ్రియమగుదాని నేల చేయకుందును? ఎట్టిదిగాని చేసి నీమెప్పు వడయుదు. ప్రాణములు కూడ రక్షించుకొనవలసిన యవసరము నాకు లేదు. తక్కినవానిమాట యిఁక నేల? మహారాజా! ఇపుడే నీకొఱకు సంగరమునకు వెడలుచున్నాను. యుద్ధాగ్నియందు నాప్రాణములను గూడ వేల్చెద. చూడుమని తెలిపి ముందున్న బలాధ్య

క్షులం గాంచి మహారాక్షసవీరసైన్యమును సిద్ధముచేసి తెండు. యుద్ధరంగమున నాబాణములు వానరులపలలమును గ్రోలఁ గలవు.దాన సంతృప్తములు కాఁగలవు. అని యానతీయ వానరసురవీరులనెల్ల ననికి నాయత్తులఁజేసి శాంతిహోమాదులు సలిపి ప్రహస్తునిం బరివేష్టించిరి. ఆతఁడు రథారోహణ మొనరించెను. లంక వెడలిపోవుచుండఁగా రణభేరీశంఖకాహళాదుల నిస్వనములు మిన్నుముట్టినవి. నరాంతక కుంభ వాహన మహానాద సమున్నతులను నలువురుమంత్రు లాతనిం బరివేష్టించిరి. తూర్పుద్వారమునుండి ప్రహస్తునిరథము వెడలెను. అనేక దుర్నిమిత్తము లాతనికిం దోఁచినవి. వానిని లెక్కింపకయే యతఁడు రథము సాగనిచ్చెను. తటాలున మోముకాంతి దూలెను. దాన నతఁడు వివర్ణుఁడై నిరుత్సాహుఁ డయ్యెను. వానరసేన లాతని కట్టెదుటం దోఁచినవి. ఒండొరులం బోరికిం జీరుచున్న యుభయబలముల సింహనాదములు చెలరేఁగినవి. దుర్బుద్ధియగు నాప్రహస్తుఁడు జయేచ్ఛలు మించ సుగ్రీవుని సేనలకెదురుగఁ బోయి దానిం బ్రవేశించెను.

## నీలుఁడు ప్రహస్తుని బొలియించుట.

* అంత రామమూర్తి ప్రహస్తునిరాక విని విభీషణునితో వీఁ డెవఁడు? మహాసేనతో నరుదెంచుచున్నాఁడే? మహావీర్యవంతుఁడని తోఁచుచున్నది? వీనిం దెలుపుము. అనఁగా విభీషణుఁడు శ్రీరామా! రావణుని సర్వసేనాధిపతి వీఁడు. ప్రహస్తుఁడనువాఁడు. సైన్యమునందు మూఁడవభాగము వీని

* ఇది యేఁబదియెనిమిదవ సర్గమునఁ గల కథాభాగము.

వశమం దున్నది. మహాబలుఁడు. సకలాస్త్రవేత్త. సుప్రసిద్ధ పరాక్రమశాలి. అని తెలిపెను. అంత నా ప్రహస్తునిం గని వానరసేనలు మార్కొన సిద్ధముగా నుండెను. తళతళలాడు రాక్షసుల యాయుధములం గని పుష్పవృక్షములను గండ శిలలం గొని వానరులు సంసిద్ధులైరి. రెండుసేనలు దారసిల్లి పోర నారంభించిరి. ఆపోరు ఘోరముగా నుండెను. రక్క సులు పేరుక్కన వానరవీరులఁ బొలియింపఁగాఁ గపివీరు లేచినకినుక రక్షశ్శూరుల వధించి పగ దీర్చుకొనిరి. గదాద్యా యుధములచే రక్కసులు వానరులతలలఁ బగులింప గండోప లాదులచే వానరులు దానవులశీర్షముల శకలములుగా నొనర్చి యార్చిరి. ఒకప్పుడు దానవులు నొకప్పుడు వానరులు దమజయమును దెలుపు సింహనాదములు చేయసాగిరి. అత్తఱిఁ బ్రహస్తమంత్రులు నలువురు చెలరేఁగి వానరులం జంపు చుండం గాంచి ద్వివిదుఁడు నరాంతకుని మార్కొని పర్వత శృంగముచేఁ గొట్టి చంపెను. దుర్ముఖుఁడు హస్తలాఘవము గలవాఁడౌటఁ బెనువృక్షమును బెకలించి సమున్నతుఁ డను మంత్రిని దాన మోఁది వధించెను. వేగవంతుఁడగు జాంబ వంతుఁడు నిర్భరక్రోధమున నొక గండోపలమును మహా నాదునివక్షమునందుఁ బడవేయఁగా నాతఁ డసువులం బాసి పడియెను. తారుఁడను వానరేంద్రుఁడు భూరిభూరుహమునఁ గుంభహనుఁడను దానవేంద్రునిం గొట్టి నేలఁ బడఁజేసెను.

తనమంత్రులు నలువురు నిట్లు మృతినొందం గని ప్రహస్తుఁ డోర్వఁజాలక విల్లుగొని బాణవర్షముం గురియిం చుచు ఘోరసంగ్రామ మొనరించెను. సేనాద్వయసింహనా

దము లంబరమును బగులఁగొట్టెను. ఆయుద్ధరంగము రక్తనదులచే నిండియుండెను. రథమందుండి ప్రహస్తుఁడు బాణములవైవ నవి పరుగిడి వానరులం జంపుచుండఁగా నీలుఁడు చూచెను. ప్రహస్తుని మార్కొనం బోవఁగా నీలుఁడు తనపై కదరుచున్నాఁడని రాక్షసప్రభుసేనాధిపతి యెఱింగి వానిం దాఁక రథముం దోలించెను. నారి యాకర్ణముగలాగి వజ్రసఖములగు విశిఖములఁ బ్రయోగించెను. అవి నీలునిదేహమును భేదించుకొని భూమిం బ్రవేశించినవి. బాన నాగ్రహించి యానీలుఁ డొక్క భూరుహమును బెఱికి ప్రహస్తుని మోఁదెను. దానిచేఁ గొట్టఁబడి మహాగ్రహమున సింహనాద మొనరించుచు నీలునిపై శరవర్షమును గురియించెను. వాని నివారింపఁజాలక యానీలుఁడు కన్నులు మూసికొని యోర్చుకొనియుండెను. క్షణమాత్ర మట్లుండి తటాలున నొక్క వృక్షమును బెకలించి ప్రహస్తుని గుఱ్ఱములం గొట్టి వధించెను. అంత మానక యెగిరి హఠాత్తుగాఁ బ్రహస్తుని చేతిధనుస్సు లాగి ఖండములుచేసి సింహనాదము గావించెను. విరథుఁడై ముసలముం గైకొని పోరాడఁ బూనెను. ఇరువురు మహాహవ మొనరించిరి. దానవపతి ముసలమున నీలుని లలాటమును గొట్టఁగా రక్తముద్భవిల్లి పాఱసాగెను. నీలుఁ డొక్క చెట్టు ప్రహస్తునివక్షమునందు వైచెను. దానిని లెక్కింపక నీలునిపైకిఁ బరుగువాఱ నతం డొక గండోపలమును గైకొని వచ్చుచున్న ప్రహస్తునిశిరమునఁ బడవైచెను. ఆవ్రేటున వానిశిరస్సు బ్రద్దలయ్యెను. వాఁడు తన్నుకొనుచు నేలం గూలెను. మిగిలిన దానవసేన యాతని పాటుగాంచి లంకకుం బోవఁజొచ్చెను.

వానరులు తఱుముసాగ నిలువఁజాలక పరుగిడి రావణున కా వార్తం దెలిపిరి. వానరు లానీలునిఁ బరివేష్టించి సంతసమున గంతులు వైవసాగిరి.

## రావణుని ప్రథమయుద్ధము.

* నీలుఁడు ప్రహస్తుని వధించెననుమాట శ్రుతిపథమునఁ జొరఁబడఁగా నిరాశుఁడై యారావణుఁడు శత్రువులు బలాధికులని యెఱింగి శోకమునఁ గంది క్రోధము మది నుప్పతిల్లఁగా వీరాగ్రణులం గాంచి మనశత్రువగు రామునివిషయమున నుపేక్షింపఁ జనదు. ఇంద్రునిసేనను బాఱఁదోలు నాసేనాధిపతి ప్రహస్తుఁడు మృతినొందెను. వానరులు గదా యని వారలనూహించి యూరక యుండ రాదు. నేనిఁక యుద్ధమునకు వెళ్లెదను. అల్పులచే నధికులు వధింపఁబడుటయే యద్భుతముగాఁ దోఁచుచున్నది. ఇప్పుడే దావాగ్ని యడవులం గాల్చునట్లు నాబాణానలంబున వానరసేనాశుష్కారణ్యమును దహించి భస్మముగాఁ గావింతును. అని తెలిపి మహాసేనలం గూడి మహారథము నెక్కెను. ఆతనిసింహనాద భుజాస్ఫాలధ్వనులు శంఖభేర్యాదివాద్యనిస్వనములు వందిమాగధాదుల స్తవనిస్వానములు నలుదెసల నావరించెను. ఆతనివెనుకొని రాక్షసవీరులనికి నడచిరి. పురము వెలువడి తరుపాషాణాదు లాయుధములుగా నున్నవానరులం గాంచెను.

శ్రీరాముఁడు యుద్ధకౌతుకము తన్నుఁ బురికొలుప నదను వేచియున్నవాఁడు గాన నాదానవసేనాసాగరముం దిలకించి

* ఇది యేఁబదితొమ్మిదవసర్గమునఁ గలదు.

యీభయంకరసేన యెవ్వనిదని విభీషణు నడిగెను. విభీషణుఁడు శ్రీరామా! ఆవచ్చువాఁడు రావణపుత్త్రుఁ డకంపనుఁడు. మహారథము నెక్కి సింహధ్వజము వెలయ నారి సారించుచు వచ్చువాఁ డింద్రజిత్తు. మహాకాయము గలిగి భీతికరుండగుచు నరదంబుపై వెలుఁగుచున్నవాఁడు మహోదరుఁడు. అశ్వముపైఁ గూరుచున్న యావీరుఁడు పిశాచుఁడు. మేటివృషభముమీఁద నలరుచుండువాఁడు త్రిశిరుఁడు. ఆతఁడు కుంభుఁడు. అల్లవాఁడు నికుంభుఁడు. ఆరథముపై వెలయువాఁడు నరాంతకుఁడు. ఆదివ్యరథముపైఁ గూరుచుండినవాఁడే దిక్పాలకుల మదమునడంచిన రావణుఁడు. ఈతఁడే దిగ్విజయము నెన్నిసారులో చేసిన మహాశూరుఁడు. చూడుమని తెలుపఁగా విభీషణునిం గని ఔరా! రావణుఁ డెంత తేజశ్శాలి! ఎంతటి ప్రతాపవంతుఁడు? సూర్యతేజస్సును మించినతేజ స్సీతని యందుఁ గనఁబడుచున్నది. తేజస్సంపిహితమై యీతని రూపము స్పష్టముగాఁ గనఁబడుచున్నది. ఇట్టి దివ్యతేజస్సు దేవదానవులలో నెవ్వారియందును గానరాదు. భయంకర భూతము లీతని నావరించి యుండుటంజేసి యమునివలెఁ గనఁబడుచున్నాఁడు. దైవవశమునఁ బాపమతి యీతఁడు నాకంటఁబడినాఁడు. ఇప్పుడు సీతాపహరణజనితాస్మత్క్రోధాటోపము నీతనిపై వ్యాపింపఁ జేసెదను. అని పలికి శరాసనాక్షయతూణీరములం దాల్చి లక్ష్మణుఁడు తన్ననుసరించి యుండ యుద్ధమునకు సిద్ధముగా నుండెను.

అంత రావణాసురుఁడు ద్వారాదులయం దేమఱుపాటు లేక కాచియుండ భటుల నియోగించి, మీరు నాతోడ వచ్చు

ంటం జూచి పురమున భటులు లేరని వానరులు నగరధ్వంసన
మునఁ బ్రయత్న మొనరింతురు. కాన మీ రప్రమత్తులరై
యుండుఁడని హెచ్చరించి తిమితిమింగిలములు సాగరమును
గలఁచిపుచ్చుచందమున నా వానరసేనల నుఱుమాడసాగెను.
రావణుఁడు వనచరులం దోలుచుండఁ గని సుగ్రీవుఁ డొక నగ
శృంగమును గైకొని యాతనిపై కడరెను. దానిని విసకి యత
నిపైఁ బడవైచెను. రావణుఁడు దాని నడుమనే బాణములచే
ఖండఖండములై యిలఁ బడఁజేసెను. అది క్రిందఁ బడఁగా
మహాసర్పముంబోలు నారసమును వింట సంధించి వధించు
కోర్కె సుగ్రీవునిపై వైచెను. అది సుగ్రీవుని దాఁకి సోలఁ
జేసెను. ఆతఁ డార్చుచు నేలంబడెను. మూర్ఛిల్లిన సుగ్రీవుని
గని రాక్షసులు సింహనాదములు గావించిరి. గవాక్షాదివాన
రేంద్రులు శిఖరములం గైకొని రావణుని దలఁపడిరి. రావ
ణుఁడు వానినెల్ల బాణములం ద్రుంచి వారల నశాతవిశిఖముల
నొప్పించెను. ఆవానరు లా ప్రేటులకుఁ దాళఁజాలక మూర్ఛి
ల్లిరి. పంక్తిముఖుఁ డంతం బోక బాణవర్షముం గురియించుచు
వానరులఁ జించి చెండాడఁగా వారు పరువిడి శ్రీరాముని
శరణుచొచ్చిరి. అంతట శ్రీరాముఁడు శరాసనముం గొని
నారింగూర్చి దాని సారించి వానరులం గావం బోయెను.
లక్ష్మణుఁ డారాముకడకుం బోయి వినయ ముట్టిపడఁగా
మహాత్మా! పరదార నపహరించిన దుర్మతిని వధింప నార్యులు
చాలియే యున్నారు. అయిన నీనీచునితో మీరు పోరాఁ
డుట న్యాయము కాదు. నేను వీనిం జంపఁజాలి యున్నాఁ
డను. నా కనుజ్ఞయిమ్మని వేఁడువాఁడ. తమ యనుమతి లేక

పోరాడుట. నాకుఁ దగినది కాదు. అని వేఁడిన సుస్మిత ముఖుఁడై శ్రీరాముఁడు వత్సా! పామ్ముఁ నీచుఁడని లెక్క పెట్టకయుండక హెచ్చరికతో నుండుము. ఎందుల కందువా? కపటాత్ముఁడగు వీఁడొకయస్త్రమును దొడుగునట్లు నటించి వేఱొకయస్త్రమును దొడుగును. ఇట్టిమోసము లెన్నియో చేయును. ముల్లోకముల నొక్కటు నాపఁగలఁడు. సందియ మిందులకుఁ గానరాదు. కాన సకలవిధముల జాగరూకుఁడ వై యుండుము. నిన్ను రక్షించుకొనుచు సంగర మొన రింపుము. రామచంద్రుని నుడుల నాలకించి కౌఁగిలించుకొని రామునకుఁ బ్రదక్షిణము గావించి మ్రొక్కి యుద్ధము నకుం బోయెను. భూరిసారశరాసనముం గొని వానరులం ద్రుంచురావణునిం గాంచెను. వాయునందనుఁడు లక్ష్మణుఁడు యుద్ధమునకు వచ్చుటం జూచి భృత్యుండనగు నేనుండఁగా నితనికేల యీకష్టమని రావణునిబాణముల నాపుచు వానిపై కడరెను. అరదముకడ కేగి కుడిబుజమెత్తి యాతని నద లించుచు నీవు దేవదానవాదుల నోడించినది వాస్తవమే. వాన రులవలన నట్లుగాక నీకు భయమే ప్రాప్తించినది. ఇదిగో యీ నాకుడిబుజము నిన్నుఁ బొలియించి నీయసువులం బాపఁగలదు. చూడుమా యని గట్టిగాఁ బలికెను. ఆమాటలు విని రావ ణుఁడు కోపరక్తాక్షుఁడై వానరా! ఆలసింపక జంకులేక వేగ ప్రహారింపుము. హనుమంతుఁడు రావణునిదగ్గరకుం బోయి కొట్టినన్ను స్థిరకీర్తి నొందుదువు. పిదప నేను నీపరాక్రమ మెఱింగి నాశనమొనర్తు ననియెను. హనుమంతుఁ డదివిని రావణా! నాదెబ్బ ముందే యెఱుంగుదువు. నీకుమారుఁడగు

నక్షకుమారునిం దలంచుకొనుము. అనుటయు నారాక్షసరా జాగ్రహించి హనుమంతుని వక్షమును గరతలప్రహారమున నొప్పించెను. దానఁ బలుమాఱు హనుమ చలనమొందెను గాని మహాతేజస్వి గాన మరల దిటవు తెచ్చుకొని క్రుద్ధుఁడై తనయఱచేత రావణుని బ్రహరించెను. దాన మిక్కిలియు రావణుఁడు చలించెను. దానింగని యెల్లరు సంతోషమునఁ గోలాహల మొనరించిరి. అంతటఁ దెప్పిఱిల్లి రావణుఁడు హనుమంతునిం గాంచి యోహరా! పావనీ! శత్రువవైనను నీపరాక్రమమును మెచ్చుకొన్నాను. అనఁగా హనుమంతుఁ డిస్సీ! నా శౌర్యము నశించుఁ గాక. దగ్ధమగుం గాక. ఇఁక నాపౌరుషము కాల్పనా? దుర్మతీ! మఱొక్కమాఱు ప్రహరింపుము. ఊరక యాత్మస్తుతి చేసికొనెదవేల? పిదప నేనొకపోటున నిన్ను యమసదనమున కనిపెదను. అను నాహనుమంతుని పలుకుల కెంతయు నాగ్రహించి మండిపడి పిడికిట పావనిం బొడిచెను. దానికి హనుమ మిక్కిలి చలించెను. హనుమ మూర్ఛిల్లినను గ్రిందు పడనియ ట్లుండుటంగని యాతఁడు తెలిసినఁ గష్టము గలుగునని రథమెక్కి నీలునిమీఁదికిం బోయెను. బాణాగ్ని జ్వాలలాతనిం గ్రమ్మంజేసెను. వాఁడొకచేత నాబాణముల నాపుచు వేఱొకచే శిఖరము నెత్తి వానిపై వైచెను. అంతలో హనుమ లేచి నీలునితో ననిచేయు రావణునిం జూచి రోషమున రావణా! వేఱొకనితో సంగర మొనరించుచున్న నిన్నుఁ దలపడుట మంచిది కాదు కావున నిన్ను వదలితి ననియెను.

ఆ నీలుఁడు వైచిన పర్వతశిఖరమును రావణుఁడు బాణముల శకలములుగా నొనరించెను. దానఁ గోపించి నానావిధ

వృక్షములం బ్రహరించెను. రావణుఁడు వానిని ఖండించి బాణవర్షము నీలునిపైఁ గురియింప నతఁ డాకారము నల్ప ముగాఁ జేసికొని ధ్వజాగ్రముపై కెగిరెను. దానికి దానవపతి మండిపడ వానరపతి సింహనాద మొనరించెను. రావణునకు దొరకకయుండ ధ్వజాగ్రమునను ధనుస్సునందును గిరీటము నందును జరింప సాగెను. దానిం గని రామలక్ష్మణాదులు మిక్కిలి యాశ్చర్యము నొందిరి. రావణుఁడును విస్మయము నొంది యాగ్నేయాస్త్రమును సంగ్రహించియుండ వానరు లా లాఘవమునకుఁ గోలాహల మొనరింప నంతట దానియం దగ్నిమంత్రము నభిమంత్రించి నీలునిం గాంచెను. వానరా ధమా! లాఘవమునఁ దిరుగుచున్నాఁడవు. శక్తిగల్గిన నీప్రాణ మును గాపాడుకొనుమా. ఇది నీ యసువులను దీయఁగలదు. అని పలికి దాని నానీలునిపైఁ బ్రయోగించెను. దాని మంటలు చుట్టుకొని ధ్వజాగ్రమునుండి నీలుఁడు నేలఁ బడియెను. అగ్ని యతనికిం దండ్రి గాన నతని ప్రాణముల నది తీయఁజాలక పోయెను. రావణుఁ డంత వానిపాటుం గని లక్ష్మణునిమీఁది కడరెను. అడ్డపడిన సుగ్రీవాదుల వారించి నారి సారించెను. లక్ష్మణుఁ డారావణుం గాంచి రాక్షసేంద్రా! వానరులతో నని సల్పఁ బాడిగాదు. నాపైకి రమ్ము. అనఁగాఁ గోపంబున లక్ష్మణా! నీవు నశింప వాంఛించుచున్నవాఁడవు. కాన నాబారిం బడితివి. నాబాణములచేఁ బీడితుండవై యమపురి కరుగఁగలవు. అనఁగా నాతనిం దృణముగ భావించి లక్ష్మణుఁడు ప్రభావాన్వితులు నీవలె గర్జింపరు. మహాపాపాత్ముఁడవు. కనుక నాత్మస్తుతి చేసి కొనుచున్నావు. నిర్జనప్రదేశమున యతివేషమున సీత నపహ

...ంచి తెచ్చిన నీబలము ప్రతాపము నే నెఱుంగుదును. నేను ధనుర్బాణధారినై యున్నాఁడను. యుద్ధమునకు రమ్ము. రిక్త మాట లేల? అనఁగా నాతనిపై వాడిబాణముల నైదింటిం బ్రయోగించెను. సౌమిత్రి వానినడుమనే ఖడించినఁ బట్టరాని కోపమున దానవనేత మహోగ్రబాణములం బ్రయోగించెను. సౌమిత్రియు వాఁడిబాణములవృష్టి నతని ముంచెను. రావణుని బాణములనన్నింటిని నడుమనే త్రుంచుచునుండెను గాని వాని కీషన్మాత్రమైనఁ గలంగినవాఁడు కాఁడు. సౌమిత్రి బాణలాఘవ మునకు రాక్షసరాజు మెచ్చి మరలఁ దీవ్రవిశిఖముల నైచెను. లక్ష్మణుఁ డాతనిం బొలియింపం దలంపుగొని వజ్రము నీసడించి శరములఁ గూర్చి విడిచెను. దశకంఠుఁడు వానిం దునిమెను. అంతట మాసక బ్రహ్మ తనకు నొసంగినట్టి కాలాగ్నితుల్య ప్రకాశము గలబాణమును శరాసనమునం గూర్చి లక్ష్మణుని ఫాలభాగమున నాటెను. దాన నతఁడు మూర్ఛిల్లి యెట్టకేలకుఁ దెలివొంది కోపమున నతనిచాపమును ఖండించెను. వెంటనే వాఁడిమొనలుగల మూఁడునారాచముల రావణు నొప్పించెను. వానికి మూర్ఛమునింగి దానవరా జెట్టకేలకుఁ దెలివినొందఁ గల్గెను. రక్తసిక్తాంగుఁడై రావణుఁడు ధనుస్సుపోవ బాణములు నాటి బాధింపఁగాఁ జేయునదిలేక బ్రహ్మదత్త మగుశక్తిని జేకొనియెను. విధూమానలునివలెమండు నాశక్తిని లక్ష్మణు నిపైఁ బ్రయోగించెను. దానిని ద్రుంప లక్ష్మణుఁ డెన్నియో బాణముల నైచెను గాని వానిని భేదించి యాశక్తి యతని వక్షముం జొచ్చెను. దాన వివశుఁడై పడియెను. అట్టిలక్ష్మణుని జూచి తటాలున రావణుఁడు వచ్చి చేతులం బట్టుకొనియెను.

కైలాసాదిపర్వతముల నెత్తవచ్చును గాని లక్ష్మణు నెత్తుట సాధ్యమగునదియా? లక్ష్మణుఁ డాశక్తి యురమున గాఢఁగా నచింత్యమగు విష్ణువునంశము నాపత్పరిహారార్థము స్మరించెను. అట్టితఱి రావణుఁ డాతనిశరీరమును గదలింపఁజాలక పోయెను. అంతలో హనుమంతుఁడు కుపితుఁడై రావణునిపై కడఁగి పిడికిట నతనివక్షముం బొడిచెను. దాన నతఁడు సోలి భూమిం బడియెను. వక్త్రశ్రోత్రనేత్రములనుండి రక్తము ప్రవహించెను. రావణుఁడు మూర్ఛిల్లుటం గని వానరు లార్చిరి. హనుమంతుఁడు మూర్ఛమునింగిన లక్ష్మణునెత్తుకొని రాముని చెంతకు వచ్చెను. రావణుఁడు కదలింపఁజాలని లక్ష్మణునిశరీరము హనుమంతునకుఁ దేలిక యయ్యెను. అంత లక్ష్మణుఁడు మూర్ఛదేఱి గాయములు మానినవాఁ డయ్యెను. రావణుం డును స్మృతిరాఁగా ధనుస్సును బట్టెను.

శ్రీరాముఁడు వీరులు పడుటంజేసి పాఱిపోవుచున్న వానరసేనలంగాంచి తాను రావణుని మార్కొనఁ బోయెను. హనుమంతుఁడు వచ్చి రామా! నీవు నన్నారోహించి యుద్ధము చేయుమనఁగా విష్ణువు గరుత్మంతు నెక్కినట్లు హనుమంతునిపై నెక్కి రథస్థుఁడగు రావణుం జూచెను. కోపావేశమున శరాసన మెక్కుపెట్టి విష్ణువు బలిచక్రవర్తిమీఁదికిం బోవునట్లు రావణునిపై కడరెను. నారిసారించుఁడు వజ్రనిర్ఘోషమువలె ధ్వని చెలఁగెను. అంత రావణునిం గని గంభీరవాక్యమున నిలునిలు రావణా! నాకింత యప్రియము గావించి యెచ్చటికిం బోయి తప్పించుకొనఁ గలవు ? ఎవ్వాని శరణు చొచ్చినను నాబారింబడిన నీవు తప్పించుకొనఁ జాలవు సుమీ!

ఇప్పు డెవ్వనిశక్తిచేఁ బ్రహరించితివో యతఁ డిప్పుడే నీకును బుత్త్రకళత్త్రాదులకును మృత్యుప్రాయుఁడై రాఁగలఁడు. వాఁడే నేనై వచ్చితిని. లక్ష్మణుని బ్రహరించితినని విఱ్ఱవీఁగకుము. ఇప్పుడు నీముందు నిలిచియున్నవాఁడు బలపరాక్రమసమగ్రులగు పదునాల్గువేలరక్కసుల నొక్కండె తునిమినవాఁడు సుమీ. అని పలికెను. రావణుండు మున్నుఁ దన్నుఁ బిడికిటిపోటున నలయించుటయె కాక యిపుడు రామునకు వాహనమైయున్న హనుమంతునిం గని యాగ్రహించి ప్రళయాగ్నిం బోలు మార్గణములం గ్రుచ్చెను. దాన మహాతేజశ్శాలియగుట నతఁడు పీడితుఁడు కాఁడయ్యెను. రాముఁ డాతనిపాటు గాంచి క్రోధావిష్టుఁడై వైరిరథమును సమీపించి దానిచక్రములను వాజులను ధ్వజఛత్త్రపతాకలను సారథిని వజ్రశూలాద్యాయుధములను దీవ్రబాణముల ఖండించెను. మహత్తరనిశాతనారాచమున రావణునివక్షము నొప్పించెను. వజ్రాయుధప్రహారణములకుఁ జలింపని యారావణుఁడు రామబాణములకుఁ గలంగి చలించి యార్తుఁడై ధనుస్సును వదలెను. మహామతి కరుణాళువు నగురాముఁడు మూర్ఛిల్లు రావణుని గని యర్ధచంద్రబాణముం గైకొని యతనికిరీటములను భేదించి మానభంగము గావించెను. అంతలోఁ దెప్పిఱిలి నిర్వీర్యహీవలె నున్న రావణునిం గాంచి రాక్షసా! నీవు భయంకరకృత్యము గావించితివి. నాప్రక్కనుండు వీరవానరులం గొట్టితివి. కాన బడలియున్నాఁడవని యెఱింగి నిన్నుఁ జంపక వదలితిని అలసితివి కాన సెలవొసంగెదను, పొమ్ము. లంకకరిగి కొంత విశ్రాంతి గైకొని మరల రథికుఁడవై శరశరాసనములఁ దాల్చి రమ్ము.

అత్తఱి నాబలమును గనంబఱచెదను. చూడుమనెను. ఆ మాటలు విని పౌరుషము దూలి సిగ్గుపడి వేగ లంకాపురముం జొచ్చెను. శత్రువుతొలఁగిపోయినపిమ్మట రాముఁడు సౌమిత్రిం గూడి వానరులతనువుల నాటియుండు బాణములఁ దీయించి వారికి శాంతి చేకూర్చెను. రావణపరాజయమున కెల్లభూతములు సంతోషించిన వయ్యెను.

మహాశయులారా! రామరావణుల తొలిసంగర మిది. ఎవ్వాని దర్శింపఁగోరి సీతను గైకొనివచ్చి యుద్యానవనమున నుంచెనో యారాముఁడే యిపుడు తొలియుద్ధ మొనరించెను. ఈభాగమున నేమేని విశేషము లుండకపోవు. పరికింతము.

> "కామమార్యస్సుపర్యాప్తో వధాయాస్య దురాత్మనః,
> విధమిష్యామ్యహం నీచమనుజానీహి మాం ప్రభో." ౪౭

అని మూలము. సుగ్రీవాదుల నోడించిన రావణునిమీఁదికి రాముఁడుయుద్ధమునకుఁ బోవుచున్న, రామునిం గూర్చి లక్ష్మణుఁడు పల్కినభాగ మిది. అహం నీచం విధమిష్యామి=అని సౌమిత్రి రావణుని దూలనాడెను. కనుక నే భక్తుఁడని తెలియక తూలనాడినను దత్ఫలమును లక్ష్మణుఁడు యుద్ధమున ననుభవించెను. తెలిసియుండె తెలియకయుండె సాధువుల నిందించిన నాదుష్ఫలము తప్పక యనుభవింపవలసి వచ్చును. అనునదియే యిచ్చోటనుండి గ్రహింపం దగును.

> "హిమవాన్మందరో మేరుస్త్రైలోక్యంవా సహామరైః,
> శక్యం భుజాభ్యాముద్ధర్తుం న సంఖ్యే భరతానుజః." ౧౧౧

అని మూలము. హిమాలయాదిపర్వతములు దేవతలతోడ ముల్లోకములు నెత్త శక్యములే కాని లక్ష్మణుఁ డెత్త శక్యుఁడు కాఁడని శ్లోకార్థము. రావణుఁడు లక్ష్మణునెత్తఁ బ్రయత్నించి విఫలుఁ డయ్యెననుట యిటఁ గవియాశయము. అతిశయోక్త్య లంకారమున కిది యుదాహరణము. ఇచ్చోట నేదో మహార్థ మున్నయట్లు వ్రాయుట పామరుల వంచించుటకే కాని వేఱు ఫలము కానరాదు.

> "శక్త్యా బ్రాహ్మ్యాపి సౌమిత్రిస్తాడితస్తు స్తనాంతరే,
> విష్ణోరచింత్యం స్వం భాగమాత్మానం ప్రత్యనుస్మరత్.　　౧౧౨
> తతో దానవదర్పఘ్నం సౌమిత్రిం దేవకంటకః,
> తం పీడయిత్వా బాహుభ్యామప్రభుర్లంఘనే ఽభవత్.　　౧౧౩
> అథైనం వైష్ణవం భాగం మానుషం దేహమాస్థితం,"

కని మూలము. బ్రహ్మదత్తమగుశక్తి తనవక్షమును బాధించు నపుడు సర్వవ్యాపకుఁడగు భగవంతుని స్మరించెననియు, దాన నొరులకుఁ గదల్ప నశక్యుఁ డయ్యెననియు భావము. ఇందు సార మేమనఁగా శక్తి తనయురమున నాటగనే లక్ష్మణుఁడు తాను దానిబాధను భరింపఁజాలనని యెఱింగెను. ఆపత్పరి హారముగా నాపదుద్ధారకుఁ డగుభగవంతుని ధ్యానించెనని సామాన్యార్థము. ప్రతిప్రాణికిని శిరస్సును బరివేష్టించి యొక తేజస్సుండును. అదియే దివ్యజ్యోతి యనునది. మూర్ఛలో నగు విస్మృతులు తొడరఁగా వివశతనొంది పడఁగా నాతేజస్సు లోనఁ బ్రవేశించును. దాని ప్రవేశమున స్మృతి కలుగును. అది ధ్యానింపకయున్నను నైజముగాఁ బ్రవేశించును. యోగియగు వాఁడు దానికల తెఱంగెఱుంగును గాన దానిని భగవత్తేజ

ముగాఁ భావించి ధ్యానించిన నతివేగముగాఁ బ్రవాహరీతిగాఁ బ్రవేశించి స్మృతిమంతునిగా నొనరించును. "అసావాదిత్యో బ్రహ్మ" అనుశ్రుతి యీవిషయమునే తెలుపుచున్నది. ఈమంత్రమును బఠించుచుఁ దలచుట్టు జలములం ద్రిప్పుదురు. ఏల? ఈదివ్యతేజస్సే బ్రహ్మమని తెలుపుటకే యీయాచారము పుట్టి యుండును. లక్ష్మణుఁడు భగవత్సంగతి నుండువాఁడు కావున యోగియై తద్రహస్యముల నెఱింగియుండువాఁ డగుట నీశక్తి పీడ నన్ను బాధింపక యుండఁజేయుమా పరమేశ్వరా! యని భావించెననియు, నంతలోఁ దెలివితప్పెననియు, నా దివ్యతేజస్సు వేగముగా లోనఁ బ్రవేశించెననియు, దాన స్మృతివచ్చె ననియు మన మూహింపవలయును. మఱొక్కవిషయము. సత్కార్యానుష్ఠానతత్పరుల కాతేజస్సు వృద్ధినొందుచు నపూర్వ వికాసమును మోమునకుం గూర్చుచుండును. దుష్కార్యాసక్తుల కది క్షీణించుచుండును. ఒకరిమోమునఁ గొంతకాలము తేజస్సుండుటయుఁ గొంతకాలమది తగ్గుటయుఁ గాంచుచున్నారము. కారణ మేమి? దురుద్దేశములు కలవారైనచో వారిమోములు వికాసము లేనివగును. సదుద్దేశము లుండిన నది పెరుఁగును. ఈ రెండును మన యనుభవమునఁ దెలిసికొనవచ్చును. ఆపన్నిర్హరణక్షమ మా పరాత్పరు దివ్యతేజస్సే యనియు, వేఱొక్కఁడు తత్తుల్యము లేదనియు మనమెఱింగి, యద్దానిని వృద్ధినొందఁ జేయుప్రయత్నము లొనరింపవలయును.

"గిరా గంభీరయా రామో రాక్షసేంద్ర ముపాచ హ. ౧౨౯
తిష్ఠ తిష్ఠ మమ త్వం హి కృత్వా విప్రియమీదృశం,
క్వ ను రాక్షసశార్దూల గతో మోక్షమవాప్స్యసి. ౧౩౦

యదీంద్రవైవస్వతభాస్కరాన్వా స్వయంభువైశ్వానరశంకరాన్వా,
గమిష్యసి త్వం దశవా దిశోఽథవా తథాపి మే నాద్య గతో విమోక్ష్యసే.

... ... ... ...

ఏతేన చాప్యద్భుతదర్శనాని శరైర్జనస్థానకృతాలయాని,
చతుర్దశాన్యాత్తవరాయుధాని రక్షస్సహస్రాణి నిషూదితాని." ౧౩౩

అని మూలము. రావణుం గాంచి శ్రీరాముఁడు చెప్పినమాట లివి. గంభీరయా గిరా=భార్య నపహరించి తనతమ్ముని మూర్ఛితుని జేసిన రావణుఁడు కనఁబడఁగానే తనపౌరుషమంతయుం దేటపడఁగా దివ్యాస్త్రములం బడఁగొట్టుట లోకస్వభావ మగుచుండ గంభీరవాక్యములతో భాషించు టేలయని యూహింపవలసి యుండును. స్వభావ మితరులకుఁ దెలియకయుండునట్టి యర్థము గలమాట యని గదా దానియర్థము. మహాకవి, యిట్లు ప్రయోగించినందున నిందేదో విశేషము గలదనియే మన మూహింపవలసియుండును. "రాక్షసశార్దూల" అని సంబోధించెను. ఈసమయమున కిది యనురూపమగునదియేనా? "రాక్షసశ్రేష్ఠుఁడా" అని కదా దాని యర్థము. తిష్ఠ తిష్ఠ=నిలువుము నిలువుము. పాఱిపోయినఁ గదా యిది వచింపఁ దగును? అనఁగాఁ ద్వరపడకుము. ఈదినము నీకు మోక్షము కలుగదని యర్థము. ఇంకను గొన్నిదినము లుండవలయునని భావము. నీకంటెముందు నీమూలమునఁ జావఁదగినవా రెందఱో కలరు. తజ్జనితదుఃఖ మనుభవింపవలయును. కావునఁ ద్వరపడకుము. ఉండుముండుమని సారము. ఈదృశం విప్రియం మమ త్వం కృత్వా=ఇట్టి విశేషప్రియము నొనర్చి అనఁగా నాయిచ్ఛాశక్తి నారాధించి యని భావము. తదాశ్రయణము మదాశ్రయణమే.

కాన నాకదియే మహాప్రియమని సారము. క్వను గతః మోక్ష మవాప్స్యసి=ఎందుఁ బోయిన మోక్షము కలుగును? నామూల ముననే నీకీశరీరముక్తి కావలయునని హృదయము. బ్రహ్మ శంకరేంద్రాదుల నాశ్రయించినను ముక్తి లేదు. నామూలము ననే నీకది కావలయునని కదా వరము నావలనఁ బూర్వము పడసితివి? ఏదేవత నుపాసించినఁ దరణోపాయము గలుగునని పూర్వకర్మము శాసించునో యట్లే యది కలుగును గాని తద్విప రీతముగాఁ గలుగఁజాలదని భావము. జనస్థాననివాసులు పదు నాలుగువేలరక్కసులు నాచేతనే ముక్తిం గాంచిరి. నీవును వారివలె నది గాంచఁగలవని హెచ్చరించెను. ఈయర్థమే యిట ననువదింపకయున్న "గంభీరయా వాచా" అన్న ఋషివరు వాక్యము వ్యర్థమే యగును. "ఋషీణాం పునరాద్యానాం వాచ మర్థోనుధావతి" అన్నసూక్తి యిట విస్తరింపఁబడినది.

"కృతం త్వయా కర్మ మహత్సుభీమం
హతప్రవీరశ్చ కృతస్త్వయాహం. ౧౪౨
తస్మాత్పరిశ్రాంత ఇవ వ్యవస్య
న త్వాం శరైర్మృత్యువశం నయామి,
గచ్ఛానుజానామి రణార్దితస్త్వం
ప్రవిశ్య రాత్రించరరాజ లంకాం. ౧౪౩
ఆశ్వాస్య నిర్యాహి రథీ చ ధన్వీ
తదా బలం ద్రక్ష్యసి మే రథస్థః,"

అని మూలము. రామచంద్ర భావసారసంగ్రథిత మీభాగము. నీచేఁ బడఁదగిన వానరవీరులు పడిరి. గొప్పకార్య మొనరించి

తివి. కాన నలసితివి. నిన్నిపుడు బాణముల వధింపను. అనఁగా నిది నీకు మృతికాలము కాదని గదా భావము. అనుమతి. యిచ్చితిని. లంక కరుగుము. అలసటలడఁగనుండి రథమెక్కి రమ్ము.. అపుడును జంపను. నాబలము చూడఁగలవు. రెండవ సారి యుద్ధమునందును నీకు మరణము లేదని హెచ్చరించు చున్నాఁడు. ఏదిన మేస్థలమున నెవనిమూలమున నెట్టు లెవఁడు మృతినొందవలయునో వాఁ డట్లే మృతినొందవలయునే కాని కర్మసిద్ధాంతము నవంతయు మార్పు కలుగనీయదు. ఆభావమునే శ్రీరాముఁడు కూడఁ దేటపఱచెనని మన మెఱుంగం దగు. కర్మసిద్ధాంతమునకు మార్పు కలిగింప భగవంతుఁడే యిచ్ఛ గింపఁడని, "కర్మ బ్రహ్మోద్భవం విద్ధి" అన్న గీతావాక్యమునం దీయర్థ మిమిడియున్నదనియు మనము చక్కఁగా నెఱింగి దానిని విధిమీఱ ననుసరింపవలయు. అధ్యాత్మరామాయణమున నీభాగమునం దణుమాత్రమైన భేదము కానరాదు. ఇట్టి సంభాషణమే కలదని యెఱుంగునది.

## కుంభకర్ణుఁ డనిసేయవచ్చుట.

* ఇట్లు రావణుఁడు లంకానగరముం జొచ్చి రామబాణభయము తన్ను నెంతయుఁ బీడింప గర్వముడిగి కలవిలపాటొందెను. ఆబాణములు తలంపునకు రాఁగాఁ గళవళించెను. రావణుఁడు సింహాసనాసీనుఁడై రాక్షసులం గాంచి యింద్రుని నించిన నేనొక మనుష్యమాత్రునిచేఁ బరాజితుండ నైతిఁ

* ఇది యఱువదవసర్గమునఁ గలదు.

గదా. నామహాతపస్సంతయు వ్యర్థమే కదా. మనుష్యులవలన నీకు భయముగలుగునని బ్రహ్మ చెప్పినమాట యిత్తఱి నాకు ఫలించినది. అది వ్యర్థమేమియుఁ గాదు. దేవదానవాదుల వలనఁ జావు రాకయుండ వర మడిగితిని గాని మానవులవలన నది లేకుండ నడుగనైతిని. పూర్వము ఇక్ష్వాకువంశమునఁ బుట్టిన యనరణ్యమహీపాలుఁడు నాచేఁ జచ్చునపుడు దుర్మతీ! నిన్ను సపుత్రమిత్రబాంధవముగాఁ జంపువాఁడు నావంశమునఁ బుట్టఁగలఁడు. సత్యమని ప్రతిన చేసెను. ఆరీతిగానే దశరథునకుఁ గుమారుఁడుగా రాముఁడు పుట్టెనని తలంతును. మఱియుఁ బూర్వము వేదవతిని బలవంతపెట్టి తిరస్కరించితిని. ఆమె నన్ను శపించెను ఆమెయే సీతగా నవతరించినది. పార్వతి నందీశ్వరుఁడు రంభయుఁ బుంజికస్థలయుఁ దపఃప్రభావమునం జేసి తమరు ము న్నెట్లు చెప్పిరో యట్లే యయినది. ఋషివచన మెప్పటికి వ్యర్థము కాదు. రక్కసులారా! మీరీ శాపస్వరూపము నాద్యంత మెఱింగి శత్రువిజయమున జాగరూకులరై యుండవలయు. నగరరక్షణమునఁ గడుంగడు జాగ్రత్తగలిగి యుందురు గాక. దేవదానవాదుల నశ్రమంబున నోడించు కుంభకర్ణుఁడు బ్రహ్మశాపమున నిద్రాపరవశుఁడై యున్నవాఁడు. ఆతని నిద్రనుండి మేలుకొలుపుఁడు. అని పలికి ప్రహస్తాదుల మృతిని స్మరించి తనపరాజయమును దలపోసి కుంభకర్ణుని బలపరాక్రమము లనంతములని యూహించి రక్కసులతో నవాంతరద్వారములందుఁ గాపుండుఁడు. వానరులు నగరమునఁ జొరకయుండఁ జేయుఁడు. కుంభకర్ణుని

మేల్కొలుపుఁడు. నాదుఃఖమును విచారింపక సుఖముగాఁ దాను నిదురించుచున్నాఁడు. పూర్వము గూడఁ దొమ్మిది, ఆఱు, ఏడు, ఎనిమది యగు నెలలు నియతిలేక నిదురించుచున్నాఁడు. నేఁటికిఁ దొమ్మిదవనాఁడు నిదురించినాఁడు. అంతకు ముందు దినమే సభలో నాలోచించెను. కావునఁ జాలదినములు కానందున సులువుగా మేలుకొలుపవచ్చును. వేగమ వాని మేలుకొలుపుఁడు. ఆతఁడు నావలె శాపముగలవాఁడు కాఁడు. అని మొనఁ దేలికగా రామలక్ష్మణులను వానరుల వధింపఁగలఁడు. రాక్షసులయందు మేటియయ్యుఁ మూఢుఁడై గ్రామ్యసుఖములం దాసక్తుఁడై నిద్ర పోవుచున్నాఁడు. రామునివలనఁ బరాజయమొందిన నాకు నిత్తఱి నతని మేలుకొలిపినందున నేదుఃఖము కూడఁ గలుగదు. అసమయమున మేలుకొలుపరాదని మానుకొన్న నిట్టి యాపత్కాలమునఁ బనికిరాకయున్న మహాపరాక్రమశాలియయ్యు నతఁడుండి నా కేమి ప్రయోజనము?

రావణుఁ డిట్లు పలుకఁగా నకాలమున లేపవలసివచ్చెనే యని తలఁచుచు నారాక్షసులు కుంభకర్ణునియింటికిం బోయిరి. ఆతని నసమయమున మేలుకొలుపుటకుఁ దగినశక్తి గలుగుటకై మాంసాదుల భుజించి యాతఁడు లేవఁగనే యాఁకలి యార్పఁదగుపదార్థములను దీసికొనిపోయిరి. ఆగృహ మత్యంతవిశాలమై సువాసనలు గుబాళింప నెంతో మెచ్చఁదగియుండెను. ఆతనినిట్టూర్పుల వేగముచేత వెనుకకుఁ జిమ్మఁబడియు నెంతయో కష్టమున వాని నెదుర్కొనిపోవుచు మహాత్తరయత్నమునఁ బ్రవేశించిరి. అట్టులాగుహం బ్రవేశించి భయంకరాకారుఁడై శయనించియున్న రాక్షససింహునిం గనిరి. మేలుకొలుప నలవి

గానియట్లు పర్వతాకారమునఁ బండుకొనియున్న కుంభకర్ణునిం గని యంద ఱొక్కటిగాఁ జేరి మేల్కొలుపసాగిరి. ఆతని యాకారము వారలకుంగూడ భయము నొదవించునదిగ నుండుటంజేసి చూచుచునే కొంతసే పుండిరి. వానిముందు మాంసములను రాసులుగాఁ బోసి రక్తభాండముల నిలిపిరి. చందనము నొడలునిండఁ బూసిరి. సువాసనలు గలవస్తువులఁ దనువెల్ల నిండించిరి. శంఖములం బూరించియు నార్చియుఁ గొట్టియు నిటునటు కదలించియు నిట్టు లెన్నియో ప్రయత్న ములఁ గావించిరి. చేయవలసినయత్నముల నెన్నింటి నొనరిం చిన నతఁడు మేలుకొనఁడయ్యె. పర్వతశృంగములు ముసలా ద్యాయుధములు లోనగు వానిచేఁ బ్రహరించిరి. కాని యాతని నిట్టూర్పువాయువులచే నెగురఁగొట్టఁబడుచుండిరి. శంఖకాహ ళాదు లెన్నివిధముల వాయించిన నాతఁడు చలింపక నిద్ర పోవుచుండెను. అశ్వములను గార్దభాదులను గొట్టి వానిపైకిఁ దోలిరి. వెంట్రుకలం బెఱికియుఁ జెవులం గొఱికియు నిట్టు లెన్నియోవిధముల బాధించిరి కాని యతఁ డిసుమంతయుఁ గద లక యుండెను. సమ్మెటలు లోనగువానిపోటులఁ గొందఱతని నలయించిరి. వేయియేనుంగుల నెక్కించిరి. అప్పటి కాతఁడు మేలుకొనెను ఆఁకలిపెల్లున నొడలు విఱుచుకొనుచుఁ దటా లున లేచెను. భయంకరముగా నావులించెను. రాక్షసు లాతని కామాంసపురాసుల నందిచ్చిరి. వానినెల్ల భక్షించెను. రక్త మును ద్రావెను. మద్యముం గ్రోలెను. చాటుననున్న యా రక్కసు లతఁడు తృప్తుఁడయ్యెనని తెలిసికొని యెదుటికివచ్చి నిలిచిరి. వాఁడు నలుదెసలఁ జూచుచు వారిం గాంచెను. వారు

తన్ను మేలుకొలుపుట కచ్చెరువంది యేల మీరు నన్ను మేలుకొలిపితిరి? రాక్షసేంద్రునకు క్షేమమే కదా? ఆతనికి భయమేదియుఁ గలుగదు కదా. అట్లు కాదేని యితరులమూల మున నాయన్నకు మహాభీతి కలిగియుండవలయును. నిశ్చ యము. దానిం దొలఁగింపనే నన్నిట్లు లేపితిరి. నే నాతనిభీతి నిర్మూలింతును. ఏదియైన నొనర్తును. కారణ మిదమిత్థమని నాకు నెఱింగింపుఁడని యడిగెను.

కుంభకర్ణుఁ డిట్లు గట్టిగా నడుగఁగా మంత్రియగు యూపాక్షుఁడు చేతులు జోడించి జరగినదంతయు సవిస్తర ముగా నివేదించిరి. రావణుఁడు సంగరమునఁ బరాజితుఁ డయ్యె నని విన్నంతనే కన్ను లెఱ్ఱవాఱఁగా గిరగిరం ద్రిప్పుచు యూపాక్షా! నేనిప్పుడే వానరసేనలను రామలక్ష్మణులను రణ మున వధించి పిదప రావణుం జూచెద. వానరుల మాంసరక్త ములచేత రక్కసులం దృప్తినొందించెద. రామలక్ష్మణుల రక్తము నేనే త్రావుదు. అని గర్వించి పలుకు నాకుంభకర్ణుని మాటల విని మహోదరుఁడను రాక్షసవీరుఁడు మహాబాహూ! ముందు రావణుని జూడవచ్చి యాయన చెప్పునది విని గుణ దోషముల విమర్శించి పిదప యుద్ధమున వారిం జంపవచ్చును. అనఁగా విని యన్ననుజూడఁ బయనముచేయ నెంచెను. రాక్ష సులు పరివేష్టించి రావణునియింటికిం బిలుచుకొని పోయిరి. కొందఱు ముందుగాఁ జని రావణునిం గని మహాబాహూ! కుంభకర్ణుఁడు మేలుకని యున్నాఁడు. ఆతని రమ్మందువా? నీ వాతనికడకు వత్తువా? అని యడిగిరి. సోదరుఁడు మేలుకొ నిన వార్త విని సంతుష్టుఁడై వారితో నేఁ గుంభకర్ణు నిచ్చటఁ

జూడఁ గోరెదను. కాన మర్యాదగాఁ బిలుచుకొని రండు. అని యానతీయ వారేగి యావార్త నతనికిం దెల్పిన నతఁడు వడివడి నడువ నెంచి స్నానాదికృత్యములు కాఁగా నింకను గలమాంస ముల మెక్కి రక్తముం ద్రావి భూమి యద్రువ నడుగులిడుచు సేవకులు మ్రొక్క నన్నయుండుచోటికిం బోయెను. రాజమార్గ మునఁ బోవు నా కుంభకర్ణునిం గని వానరు లదరిపడి రాముని శరణుచొచ్చిరి. పర్వతశిఖరమువలె నతఁడు వారికిం గనంబడి భయకారణుం డయ్యెను. మఱికొందఱు భీతిచే భూతలమునఁ బడిరి. కొందఱు వ్యథితులైరి. కొందఱు భయార్తులై దిక్కు లకుం బాఱిరి.

మహాశయులారా! ఈభాగము విమర్శనార్హము. కానఁ బరిశీలింతము. కుంభకర్ణునివిషయ మీసర్గమునఁ గలదు. అతని యాకారము వికృతము. అత్యంతోన్నతము. క్రొత్తగాఁ జూచు వారు పర్వతమో యనుకొందురు. సార్ధయోజనవిశాల మాతని శయనాగారమని చెప్పఁబడినందున నతని యాకార మందు నేమాత్రము తక్కువయో కాని యెంతయో గొప్పగా నున్నయట్లు తోఁచును. ఇంతదేహము గలవా రుందురా? ఆతఁడు నివసించుగృహ మెంతయెత్తుండునట్లు కట్టవలయును? అన్న ప్రశ్నపరంపరలు గురియించువా రుందురు. మన మూ హించుయోజన మీస్థలమునఁ బొసఁగదు. పురాణములోఁ బ్రాయికముగా యోజనములు వేలు పొడవు ఎత్తు నున్నట్లు పర్వతములు వర్ణింపఁబడి యుండును. వానికి వేఱర్థము కలిగియుండవలయును. ఇంక లంకలోనుండురాక్షసులే మాన వులకంటె నెన్నియోమడుంగులు పెద్దగ నుందురు. వారిలో

నీతఁడు కఱుంగడుం బెద్దవాఁడని యేర్పడును. హిమాలయ ప్రాంతముల నుండువారిం గని మన మెంతయెత్తుగ నున్నా రనుకొందుము కదా. అట్లే వనచరు లంతవాని నిజవఱకుఁ జూడమిం జేసి విస్మయంపడి భీతిల్లిరనుట శంకాస్పదము కాదు. ఇంతనిద్ర యతనికిం గల్గుట స్వభావవిరుద్ధము కాదా యనున దియు నొకప్రశ్నము. ఆస్తికులు కానివారల కిది యచ్చెరువు పుట్టింపక మానదు. తపస్సు దేవతానుగ్రహము ననువిషయ ముల నమ్మినవారల కిది విచిత్రముగాఁ దోఁపదు. కాయకల్ప చికిత్సచే శరీరము ముదిమివాసి యిరువదేండ్లక్రింద నున్నట్లుం డుట వినుటయే గాక చూచుచున్నారము కదా. లతావిశేష ములచేత నిట్టి యద్భుతకార్యము సాగఁగాఁ దపోవిశేషమున నిది సాగఁదగదనుట సమంజసము కానేరదు. యోగమహత్త్వ మెఱుంగనివారలకే యిట్టి వచ్చెరువుగాఁ దోఁచును. అది యెఱింగినవారల కిట్టివి సులభసాధ్యములుగాఁ దోఁచును. కావున నట్టివిషయము లెఱుంగకయుండ నిట్టి మహత్తరబుద్ధి గ్రాహ్యవిషయములందుఁ బ్రవేశించి మహాత్ముల నాక్షేపింప రాదు.

వరమిచ్చునపుడు సరస్వతి నాతనివదనమున నుండఁజేసి నిద్రనే యడిగించుట బ్రహ్మకు దేవతలకు మంచికార్య మగునా యనుప్రశ్న మొకఁడు కలదు. ఇది దేవతలయందుఁ గల పక్ష పాతమున నిట్టిమోసము చేయఁబడిన దనరాదు. కుంభకర్ణుని మహాభూతములు జగదపకారకములు. తపస్సునకు వరమీా యక తప్పదు. వరగర్వమున ధర్మమునే నశింపఁజేయుదురు. అట్టిచో భగవంతుఁ డేమిచేయవలయును? వారిష్ఘాలమున

లోకములకు నిర్నిమిత్తకోపద్రవములు రాకుండఁ జేయవల యును గదా. లేనిచో,

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే."

అన్న భగవంతునిశపథమే వ్యర్థ మగును. అధర్మమునకుఁ దోడుపడినట్లు కూడ నగును. కావునఁ దపస్సువలన నాతని కప కారము కలుగకయుండఁ దన్మూలమున నిర్నిమిత్తముగ నిరప రాధులగు లోకుల కపకారము కలుగకయుండఁ గాపాడుటయే ధర్మమగును. కుంభకర్ణునకు నిద్రయే లేనిచో లోకము లొక్క నాఁటియాహారమునకుఁ జాలియుండవు. కనుకనే వానికి సుఖ ముగా నిదుర వచ్చునట్లు తత్కాలమున క్షుత్పిపాసలు బాధిం పకయుండునట్లు వర మనుగ్రహింపఁబడినది. నిద్రనుండి నైజ ముగా మేలుకొనినచో నాఁటియుద్ధమున నపజయమే కలు గకయుండున ట్లనుగ్రహింపఁబడినది. కావున నెవరిమూల మునఁగాని నిరపరాధులకు హాని గలుగకూడదన్న భగవంతు నాశయమున కిది యర్థ్యమే గాని యనర్థ్యము అకృత్యము గాదని మన మెఱుంగవలయును. రావణుఁ డంతకుము న్నీవిషయమును స్మరింపకయుండి తనయోటమికి దిగులుపడి కుంభకర్ణుని మేలుకొలుపరాదని యెఱింగియుండియు మేలు కొలుపఁ బంచుట యతనికర్మము తన్నుఁ బురికొల్పుటచేతనే యని మన మూహింపవలయును. "కాలస్సృజతి భూతాని కాలస్సంహరతి ప్రజాః" అన్నసూక్తి వ్యర్థము కాదు కదా. కాల మాసన్నము కాఁగా నెంత బుద్ధిమంతులకైన గుణదోష

విచారము కలుగదనుట సార్వజనీనము. కాని నూత్న విషయము కాదు.

## కుంభకర్ణునివృత్తాంతము రామునకు విభీషణుఁడు తెల్పుట.

* శ్రీరాముఁ డాకుంభకర్ణుని గిరీటాలంకృతునిం గని మహాకాయుఁడగు వీఁ డెవ్వఁడని యూహించి ధనుర్ధారియై నిలువంబడి వానిం గాంచి నలుదెసలకుం బాఱు వానరసేనలం జూచుచు నచ్చెరువు తోఁప విభీషణునితో వత్సా! లంక యందుఁ బర్వతాకారుఁడై కిరీటాదివిభూషితుఁడై యుండు వీఁ డెవఁడు? వీనిం జూచి వానరులు పరుగెత్తుచున్నారు. రాక్షసుఁడా? అసురుఁడా? ఇంతదనుక నిట్టిమహాభూతము నొకప్పుడైనఁ జూచినది లేదు. అని యడుగ విభీషణుఁ డిట్లనియెను. ఈతఁడు విశ్రవసుని తనయుఁడగు కుంభకర్ణుఁడు. సంగరముల శతక్రతుని యముని జయించిన పరాక్రమశాలి. ఎత్తున లావున నింతటి రాక్షసుఁ డెందును లేఁడు. శ్రీరామా! ఈతనిమూలమున దేవదానవాదు లెన్నిపర్యాయములో ఓడిపోయిరి. ఈతఁడు శూలపాణియై వికటాత్ముఁడై యుద్ధమున నిలువంబడినయెడల దేవతలు వీనిం బ్రహరింపఁజాలక యితఁడు త్రిలోకసంహారకుండగు కాలుఁడే యని భ్రమించిరి. రావణాదులకు బలము వరప్రదానసంభవమే. ఇతఁడు పుట్టినంతనే యాబలము కలిగినది. ఆఁకటికిఁ దాళఁజాలక యెన్నియో లక్షలప్రాణుల నీతఁడు భక్షించెను. ప్రజల భక్షించుచుండ

* ఇది యఱువదియొకఁడవ సర్గమునఁ గలదు.

వారు భయభ్రాంతులై యింద్రుని శరణుచొచ్చి యావిషయ
మాతనికి నివేదించిరి. కోపమున నింద్రుఁడు వజ్రాయుధమునఁ
గుంభకర్ణుని గొట్టెను. దానఁ జలనము నొంది నిభీషణముగా
ధ్వని చేసెను. ఎల్లరు మఱింత భయంపడిరి. అంత నీతఁ
డాగ్రహమున నైరావతము దంతము పెఱికి దాన నింద్రుని
వక్షము నొంచెను. దాన నాగ్రహముచే మండిపడి యింద్రుఁడు
చేయునది లేక బ్రహ్మకడ కరిగి మునులతోఁ గుంభకర్ణునిదురం
తము నాయజునకుం దెల్పెను. ఈరీతిగా వాఁడు ప్రజల
భక్షించునెడల శీఘ్రకాలమున సృష్టియే నశించుననియె. ఇంద్రా
దుల నుడులనాలకించి బ్రహ్మ రాక్షసులనెల్ల రావించి వారిలోఁ
గుంభకర్ణునిం గాంచెను. బ్రహ్మయు బెదరెను. చేరఁ బిలిచి
వత్సా! విశ్రవసుఁడు లోకవినాశనమునకై నిన్నుఁ బుట్టించి
నాఁడు. కావున నిది మొదలు నీవు మృతునివలె నిద్రించుచుఁ
బడియుండుమనియె. ఆశాపమునఁ గొట్టుపడి రావణునిముందటఁ
బడియెను. రావణుఁ డాసోదరునకుఁ బాటిల్లిన విపత్తునకుఁ
దత్తరంపడి బ్రహ్మనుగని మహాప్రభూ! చక్కఁగా వృద్ధినొందిన
వృక్షమున ఫలించుకాలమున ఛేదించునట్లు లైనది. నీ కితఁడు
మనుమనికుమారుఁడే కదా. ఇట్లు శపించుట న్యాయము కాదు.
నీమాట యసత్యము కాఁజాలదు. కాన నీతఁడు నిదురించియే
యుండు. ఐన నిదురించుటకు మేలుకొనుటకు నొకకాలనియ
మము గలుగవలయును. అనఁగా విని బ్రహ్మ వీఁ డాఱునెల
లకుఁ దక్కువలేకుండ నిద్రించుచు నాఱునెలల కొకదినమున
మేల్కొనుచు నుండును. నిద్ర లేచి యాఁకలిపెంపున నోఱు
తెఱచుకొని లోకముల భక్షింపఁ గలఁడు. అని పలికెను.

రామభద్రా! రావణుఁడు నీపరాక్రమమునకు భయంపడి నిదు రించు సీతని మేలుకొలిపెను. ఈవీరుఁడు నిజగృహమునుండి వెడలి వానరుల భక్షించుకొఱకు వేగమ వచ్చును. ఇపుడే భయంపడి పరుగెత్తుచున్నారే ఇఁక నూరొక్కని యెట్లు పోరాడఁ గలరు? ఇది యొక యంత్రము. పై కెత్తఁబడినది. అని వానరులకుఁ జెప్పవలయును. ఇది యెఱింగిన నిశ్చయులై యుందురు. అని విభీషణుఁడు యుక్తియుక్తముగాఁ దెలుపఁగా విని రామమూర్తి సేనాపతియగు నీలునిం గని నీవు పోయి సేనల వ్యూహములుగాఁ దీర్చి లంకానగరముచుట్టు నిలుపుము. ఆయుధధారులై యుద్ధమునకు సిద్ధముగా నుందురు గాక. అనఁగా నానీలుఁ డాయాజ్ఞ నెల్లరకుఁ దెలియఁజేసెను. వానరేంద్రు లారీతిగా నాయుధధారులై నిలిచియుండిరి. రామాజ్ఞచే వానరులు నగరరక్షణార్థము వెలుపలం దిరుగురాక్షసులను మర్దించిరి. నగరమునుండి వచ్చురక్కసుల నుక్కడంప నెల్లరు సిద్ధముగా నుండిరి.

## రావణుఁడు కుంభకర్ణునకుఁ గర్తవ్య మెఱిఁగించుట.

* అంత నా కుంభకర్ణుఁడు తన్ను నసమయమున మేలుకొలుపుటం జేసి నిద్దురచొక్కును మద్యపుమత్తును గనంబడ రాజమార్గమునఁ బోవుచుఁ దన్ను గారవించువారలం జూచుచు రావణునిగృహమున కరిగెను. అందుఁ బ్రవేశించి సింహాసనాసీనుఁడై యుండు రాక్షసరాజును గనియెను. ఆతఁడు పుష్పకవిమానమున నాసీనుఁడై దుఃఖాక్రాంతుఁడై

* ఇది యఱువదిరెండవసర్గమునఁ గల కథ.

యుండెను. ఆరావణుఁడు కుంభకర్ణుని రాకం గాంచి సంతుష్టుఁడై యాసనము డిగి యెదుర్కొని పిలుచుకొని పోయి తాను గూర్చుండ నాచెంతఁ గుంభకర్ణుఁడును గూరుచుండెను. అన్నకు నమస్కరించి నేఁ జేయఁదగిన దేమి ? అని కుంభకర్ణుఁ డడుగ నాతనిఁ గౌఁగిలించుకొనఁగాఁ గన్నుఁ లెత్తఁబడఁగా నిద్రపోవు నన్ను నింతయక్కఱతో నేల మేలుకొలిపితివి? ఎవ్వనివలన నీకిపుడు భయము కలిగినది? ఇపుడెవఁడు మృతినొంద నున్నాఁడు? చెప్పుమా యని మరల నడిగెను. రావణుఁడు కోపమున నరుణాక్షుఁడై బలవంతా! నీవు శయనించి తొమ్మిదిదినము లైనది. సుఖముగా నిద్రించుటం జేసి రామునివలనిభయము నెఱుంగకయున్నావు. రాముఁడు సుగ్రీవాదులం గూడి వచ్చి మనలనెల్ల మిగులకుండఁ జంపుచున్నాఁడు. మూలబలమును ఖండించుచున్నాఁడు. సాగరమును దాఁటివచ్చి నా లంకావనములను వానరమయములుగా నొనరించుచున్నాఁడు. మనలో మేటిరక్కసులు హతులైరి. యుద్ధమున వనచరులలో నొక్కఁడైనఁ జచ్చి సేన క్షీణించినట్లు నేఁ జూడలేదు. వనచరు లోటమి నెఱుఁగకున్నారు. ఇపుడిట్టిభయము కల్గియున్నది. ఇందులకై నిన్ను లేపితిని. నాయైశ్వర్యము నశించినది. లంకలోని వీరులు నశించి బాలురు వృద్ధులు మిగిలియున్నారు. లంక యిట్లుండుట నే నిట్టులగుటఁ దెలిసికొని రక్షింపుము. నీయన్నకొఱకు నీమహాకార్యము నిర్వహింపుము. ఇంతదనుక నీతో నిట్టిమాట చెప్పి యెఱుఁగను. నీపై నాకెంతయో స్నేహము విశ్వాసము కలదు. యుద్ధములనెన్నిమాఱులో దేవతల నోడించియున్నాఁడవు. ఆవీర్యము

నిపుడు కనఁబఱచి రక్షింపుము. యుద్ధప్రియుఁడవు కాన నీవీ సంగరమున జయముపడసి మమ్ముఁ గాపాడుము.

## కుంభకర్ణుఁడు నీతి బోధించుట.

* రావణుఁ డార్తుఁడై చెప్పినమాటలు విని కుంభకర్ణుఁడు నవ్వి మనసు మున్నాలోచించునపు డేదోషము కలుగుననుకొంటిమో అది హితవాక్యులు విననికతన నిన్నుఁ జెందినది. అనుకొనినవిపత్తే దాపరించినది. మహాపాపులకు నరకమునందే పాపము తప్పక చెందునట్లు సీతాపహరణ పాపకార్యఫలము వేవేగ నిన్నుఁ బొందినది సుమీ. రాజేంద్రా! నీవు వీర్యగర్వమున సీత నపహరించితివి. దానికిఁ బూర్వమే యిది మంచిదో కాదో యని యాలోచింప వైతివి. దానివలనఁగలుగు దోషమును విచారింప వైతివి. ఎవఁడు ముందుగాఁ జేయఁదగు నాలోచనాదుల వెనుకను, వెనుక విచారింపఁదగు కార్యములను ముందుగ నొనరించునో వాఁడు తెలియనివాఁడగు. దేశకాలములకుఁ దగకయుండఁ జేయుపనులు నిష్ఫలము లగును. మంత్రులం గలిసి యాలోచించి యిదమిత్థమని సిద్ధాంతము చేసికొని యుత్తమ మధ్యమాధమములను త్రివిధకర్మములను, వాని మొదలుపెట్టఁదగు నుపాయమును, ద్రవ్యసంపత్తిని, దగు దేశకాలవిశేషములను, గలుగఁగల యంతరాయములకుఁ బ్రతీకారము, వానిసిద్ధి యను నీ పంచప్రకారములను బొందుపఱచువిషయమున జాగ్రత్త గలిగి యెవఁడు కావించునో యతఁడే నీతిమార్గమునందు వర్తించువాఁ డగుచు మంచిఫల

---

* ఇది యఱువదిమూఁడవసర్గమునఁ గల కథాభాగము.

మును బొందును. నీతి నతిక్రమింపక వర్తించువాఁడే సుఖ రాజేంద్రా! పురుషుఁడు శాస్త్రపద్ధతి ననుసరించి ప్రాతఃకాలమున ధర్మమును మధ్యాహ్నకాలమున నర్థమును సాయంకాలమునఁ గామమును సేవింపవలయును. ఒక్కొక్కకాలమున రెండేసిగాఁ గాని సేవింపవలయు. కాని యకాలమున వీనిని సేవింపరాదు. కేవల కామమునే సర్వకాలము సేవించువాఁ డధముఁ డనంబడు. ఈ మూఁడింటియందు శ్రేష్ఠమని యెఱింగి యెవ్వఁ డట్టిధర్మము నాచరింపఁడో వాని కేకార్యము ఫలింపదు. సామాద్యుపాయములు తగుకాలమునందు ననువగురీతుల ననుష్ఠింపవలయును. అని యి ట్లనేకప్రకారముల రాజధర్మములను జక్కఁగా బోధించెను. మంత్రవ్యవహారములచేతఁ దనకు వంచకుఁ డగువానిం దెలియక దానిచే దుర్మంత్రులం బోలం గించుట లోనగుకార్యములను జేయకయుండునో యతఁ డనర్థముల నొందుటయ కాని పదభ్రష్టుఁడు నగు. ఈవిషయమునందు విభీషణుఁ డేమి చెప్పెనో దానిని గావింపుము. ఇపుడు మన కదియే హితమైనది.

అని యిట్లు కుంభకర్ణుఁడు పలుకఁగా విని రావణుఁడు కనుబొమలు ముడివడ నతనితోఁ గుంభకర్ణా! నాకంటె నీవు చిన్నవాఁడవు. పూజ్యుఁడగు పెద్దవానివలె నన్ను శిక్షించుచున్నావా యేమి ? నీతికాలము గడచిపోయినది. కాన నీమాటలవలనఁ బ్రయోజనమేదియు లేదు. పరాక్రమ మిత్తఱి నెఱపుము. అవినీతిని నీతిగా భ్రమించియో మనస్సునఁ దెలివి పుట్టుటం జేసియో బలవీర్యగర్వముననో చేయవలసినది చేయకపోయితివి. ఇప్పటి కేది యుక్తమో యద్దాని నొనరిం

పుము. గతమునకు బుద్ధిశాలురు వగవరు. గతము గతమే? నీ
మఱలి రాదు. నాయందు నీకు స్నేహము గలదేని నీపరాక్ర
మము నీకుఁ దెలిసియున్న దేని యీయుద్ధమునఁ దోడ్పడఁ
దగునని నీకుఁ దోఁచునేని నా యవివేకమునఁ గలుగుదోష
మును సరిపెట్టుము. మనస్సు గలఁగి దీనుఁడవై యుండువానికిఁ
జెంతనే యుండి విచారించుచుండు మిత్త్రుఁడే మిత్త్రుఁడు. నీతి
వదలి పరిభ్రమించువానికి సాహాయ్యమొనర్పు నేర్పఁబంధువే
బంధువు.

అని యిట్లు నిష్ఠురముగా మాటలాడుచుండు రావ
ణునిం గాంచి యీతఁడు క్రుద్ధుఁడయ్యెనని తెలిసికొని మృదువ
చనముల మెల్లన నన్నుపైఁ గలమైత్త్రిం బురస్కరించుకొని
యూఱడించుచు రాక్షసేంద్రా! ఏల సంతాపపడియెదవు? కోప
మును వదలి స్వస్థుఁడవై యుండుము. నేను జీవించియుండఁగాఁ
దోడుపడ లేదన్న యూహను వదలిపెట్టుము. ఎవనిమూలమున
నీకీపరితాపము కలిగినదో యారాముని వధించెదను. ఇంత
దనుక నేల యిట్లుపదేశించితినన్న హితము చెప్పుట శాస్త్రమ
ర్యాద గావునఁ దెల్పితిని. స్నేహము గలబాంధవున కిట్టియాప
త్సమయమునందు నొనర్పఁదగినసాయము శత్త్రువధము. దానిని
యుద్ధమునందుఁ గావింతును. నీవే చూడుము. రామలక్ష్మణుల
యుద్ధభూమిని వధింపఁగా వానరులు పాఱిపోవఁగా నీవే
చూతువు. నేనిఁక యుద్ధమున రామునిశిరస్సు దేఁగా నీవు
గాంచి సుఖము నొందుము. సీత దుఃఖిత యగుంగాక. బంధు
వధజనితదుఃఖమునఁ బోక్కురక్కసు లింక హాయి నొందు
దురు గాక. పర్వతాకారుఁడగు సుగ్రీవుఁడు రక్తసిక్తాంగుఁడై

భూమిం బడియుండఁగాఁ జూడుము. ఈరాక్షసులు నేను నిన్ను రక్షించుచుండఁగా రాముఁ డెట్లు నిన్ను వధింపఁగలఁడు? నన్ను ముందు వధించిననే నిన్నుఁ బిమ్మట వధింపం గలఁడు. నాకనఁగా బ్రదికియుండఁగా శత్రువునుండి పరితాప మేనాఁడును గలుగదు. నన్నొకఁడు చంపఁజాలఁడు. నేను జావకుండిన భయము నీ కెక్కడిది? పరంతపా! యథేచ్ఛముగా యుద్ధము నకుఁ బోవ నా కనుజ్ఞనిమ్ము. నాకంటె నింకొకఁ డి త్తఱి యుద్ధమునకుఁ బంపఁదగినవాఁడు నీకు లేఁడు. నీశత్రువుల వధించి పుత్తును. ఇంద్రాదిదిక్పాలకు లరుగుదెంచినను యుద్ధ మొనరింతును. భయంకరాకారము మెఱయ శూలము హస్తము నందుఁ గ్రాల నేను సింహనాద మొనరించుచుఁ దలఁపడఁగా నింద్రాదులు పరువెత్తుదురే. నే నాయుధముం బూనక బాహుబలమున శత్రువులఁ జంపఁగా బ్రదుకుపై నాశగలవాఁ డెవ్వఁడు నాయెదుట నిలువఁగలఁడు? శక్త్యాద్యాయుధము లేవియు నా కక్కఱలేదు. కోపముగలిగిన బాహువులచేతనే యింద్రునైనఁ జంపుదు. ఆరాముఁడు నా పిడికిటిపోటునకుఁ దాళఁగలఁడేని చూతము. నారక్తము నా రామునిబాణము లెట్లు త్రాగఁగలవు. రావణా! నేనుండ నీవేల వగఁ గుందెదవు? నీపగవానిం జంప నిదిగో పోవుచున్నాఁడను. రామలక్ష్మణసుగ్రీవులను మనలంకఁ గాల్చిన హనుమంతుని వధించెదను. తక్కినవానరు లొకలెక్కయే. ఎవ్వారికిం బడయ శక్యముగానియశస్సు నీకుం గలిగింపఁ గోరినాను. అని యిట్లు పచింపఁ దరముగాని బీరము లాడెను. మఱియు రాక్షసేంద్రా! ఈ మూఁడులోకములు నా కొక్కవేళ కాహారమునకుం

జాలవు. ఇంక నాతో యుద్ధ మెవ్వఁ డెట్లు చేయఁగలఁడు? నీ కత్యంతసుఖ మొనఁగూర్పఁ బోవుచున్నాను. రామలక్ష్మణులఁ జంపి వానరుల భక్షించెదను. ఇఁక నీయిచ్ఛకొలఁదిని విహరింపుము. మంచిమద్యము త్రాగుము. త్వరమానుము. రాముని వధింపఁగా సీత నీకుఁ జిరకాలము వశమై యుండఁగలదని యెను.

మహాశయులారా! ఈభాగమునఁ గలవిషయములఁ బరిశీలింతము. మహామూర్ఖుఁడు కుంభకర్ణుఁడని యెల్లరు తలంతురు. ఆతనికి భగవంతునిచే మృతి గల్గనుండఁగా మనస్సు మార్పు నొందవలయును. మృత్యువు చెంతకు రాఁగా ప్రాయికముగా చిత్తము సుంతయే మాఱునని పెద్ద లందురు. ఆరీతిగా నీ కుంభకర్ణునకు మార్పునొందుట సహజము. విశేషించి ముక్తి కరుగువానికిఁ జక్కఁగా మాఱవలయును. అట్లు మార్పునొందినదా లేదా యని విమర్శింతము.

> "శీఘ్రం ఖల్వభ్యుపేతం త్వాం ఫలం పాపస్య కర్మణః,
> నిరయేష్వేవ పతనం యథా దుష్కృతకర్మణః." 3

అని మూలము. ఇంత మదోన్మత్తున కిట్టిసాధూక్తులు దొరలునా యని శంకింపవలదు. రాఁగల కర్మము ననుసరించి యూహలు మాఱుననుసిద్ధాంతము కదల్పరానిది. సీతాపహారణము పాపమనియు, దానిఫలము నిన్నొందెననియు నాతఁడు వచించెను. అంతియ గాక దుష్కృతకర్మ మొనరించినవానికి నాపదలు కల్గునట్టులని లోకజ్ఞానతత్వమును గూడ వెల్లడించెను.

"యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్,
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియం." ౧౦

అను గీతావాక్యముచొప్పునఁ దామసాహారములు నింతకంటె నత్యంతజుగుప్సితము లగువానిని భక్షించినను దీనింబట్టియే బుద్ధితత్త్వము మాఱదనియుఁ, గర్మానుగుణముగ మాఱు ననియు నీ కుంభకర్ణునినీతియే మనకుఁ జెప్పక చెప్పుచున్నది. కొంద ఱాహారానుగతముగా నూహ లుండుననియు సాత్త్వికాహారముం గొన్నయెడల మంచి యూహలు గలుగునందురు. సాత్త్వికాహారము గొనుట ముఖ్యమే యనవచ్చును గాని దానిచే సద్బుద్ధి గలుగుననుట మాత్ర మసంగతప్రసంగమునఁ బ్రథమతాంబూలార్హమగు నాశయమే యదగును. కర్మము ప్రాణివర్తనమును మార్చుచుండును గాని యాహారము మార్పఁ జాలదు. మాంసాద్యాహారము గలవారందఱు తామసు లనవలసివచ్చును. ఆహారము మంచిదిగానున్న యారోగ్యము గల్గించునన్న ననవచ్చుంగాని బుద్ధికి నాహారము నకు సంబంధము లేదు. సాత్త్వికాహారముం గొనువారెందఱో దుష్కృతకర్మముల నాచరించువారు గలరు. కాన నది కర్మముపై నాధారపడి యుండును. అంతియగాని యాహారముపై నాధారపడి యుండదు. అని కుంభకర్ణునివచనములే మనకు నీవిషయమును దెలుపుచున్నవి.

"ప్రథమం వై మహారాజ కృత్యమేతదచింతితం,
కేవలం వీర్యదర్పేణ నానుబంధో విచారితః." ౪

అని మూలము. ఈనీతి నీతిశాస్త్రానభిజ్ఞునకుఁ దెలుప శక్యమా?

పరాక్రమము గలదన్న పొగరుచేత దీనితరువాతఁ గలుగు దోషము విచారింపవైతివనియోఁ గదా. ఇట్లనుటంజేసి త్రొలుత నీకార్య మొనరించిన నిట్టిదోషము కలుగవచ్చునని యోజింపకుండుట యవివేకమని కదా యతనిభావము. వీర్య గర్వము మంచిది కాదనికదా కుంభకర్ణుఁ డనియె. దీనిచేతనే కుంభకర్ణునకు నీతిశాస్త్రజ్ఞానము కలదనియు, వీర్యగర్వము మంచిదికాదను నుద్దేశ మున్నదనియు స్పష్టము. మదోన్మత్తుఁడు కుంభకర్ణుఁ డన్నవాద మెగిరిపోవక నిలువఁగలదా ? మఱియు నాతఁడు భక్తుఁడనియుఁ బ్రాక్కర్మఫలానుభవముకొఱకుఁ దగిన రూప మలవడగా దానినే నమ్మక యెపుడీతనువు పడిపోవునా యని యూహించుచుండువాఁడని యూహింప నవకాశము లేకపో లేదు.

"దేశకాలవిహీనాని కర్మాణి విపరీతవత్,
క్రియమాణాని దుష్యంతి హవీంష్య ప్రయతేష్వివ." ౬

అని మూలము. కర్మములకు దేశకాలము లను నియమము కలదు. ఏప్రదేశమున నేకర్మము చేయవలయునో ఏకాలమున నది చేయవలయునో అట్టు లయ్యది చేయవలయునే కాని చేసినఁ జాలదా యనరాదు. మంత్రవిహీనముగా హోమము చేసిన నెట్లు నిష్ఫలములో మఱియు దుష్ఫలములో యట్టు లవియు దుష్ఫలములు నగును. ఒక్కొక్కకర్మమునకు నొక్కొక్కదేశము కాలము నియమింపఁబడి యున్నవి. స్త్రీపురుషులవిహారమున కేర్పఱచినతావుల దేవతలఁ బూజించుటయు, దేవతాపూజలకై నియమించినతావులఁ గాముక

స్త్రీపురుషులు విహారములు సల్పుటయు సముచితము లగునా యేమి? "అవిధినా కృతమకృత" మ్మనుశాస్త్రము గలదు కదా. కావున దేశకాలముల కనురూపముగా నాచరించుకర్మములే ఫలదము లగునని భావము. అట్లు కానిచో నిష్ఫలములే యని కదా సారము. మంత్రము లేక చేసినహోమము ఫలింపదు కదా. కనుకనే శాస్త్ర మావశ్యకమైనది. పగలు పని యుండి మాని రాత్రి భక్తిపురస్సరముగా శ్రాద్ధముసల్పిన సత్ఫలముల నొసంగునా? యనిన దుష్ఫలము నొసంగునని సమాధానము చెప్పవలయును. మంత్రవిరహితముగఁ జేయఁబడు హోమమువలె. అనఁగా జాత్యుచితక్రియలు విధివిహితములుగ నున్నవి. దానిని విడనాడరాదు. విడనాడిన దానమేలు చేకూరదని యీ రామాయణమే తెల్పుచున్నది. అందును గుంభకర్ణునివంటి దారుణచిత్తుఁడు తెల్పుటంజేసి మఱింత గట్టిగా సిద్ధాంతము లగుచున్నవి. అట్టివారికే యివి యిట్లు తోఁచినపు డితరులకుఁ దోఁచుననుట చెప్పవలసిన దేమి! జాతికి నిర్ణయింపఁబడినకర్మములు పక్షపాతమును సూచించు ననుటకంటె విపరీతసంభాషణ మింకొకటి యుండదు. మంత్రము లుపాసనార్హములుగా నిర్ణయింపఁబడినను జాత్యుచితములుగ నవియు నిర్ణయింపఁబడియే యున్నవి. వేదాధికారము లేనివారలకు శాబరమంత్రములు నియమింపఁబడినవి. ఫలములు సమానములే. ఎపుడు? భక్తి సమానమైనపుడు. అట్టులుండ వాని మాని యధికార మేలలేదని మహామంత్రముల గ్రహించుట చేటునకే కాక మఱెందుల కగును? కావునఁ దమకుఁ దగినమంత్రముల నర్హరీతి నుపాసింపవలసినదే

కాని యధిక ప్రసంగమును జేయఁ బూనరాదు. దాన మేలు లేదు. అదృష్టఫలముల విషయమునందు శాస్త్రమే ప్రమాణము కాని యుక్తి ప్రమాణము కాదు. ఈభావము నీక్రింది మూలమే తెల్పుచున్నది.

> "అనభిజ్ఞాయ శాస్త్రార్థాన్ పురుషాః పశుబుద్ధయః,
> ప్రాగల్భ్యాద్వక్తుమిచ్ఛంతి మంత్రేష్వభ్యంతరీకృతాః." ౧౪

అని మూలము. పశుబుద్ధయః=అనఁగాఁ దోఁచినట్లు లాలోచించువారని యర్థము. అనఁగా నాహారవ్యవహారాదుల విషయమునందుమాత్రమే యూహలు చేయువారని భావము. శాస్త్రము నెఱుంగనివారని సారము. అట్టివారు శాస్త్రార్థాన్ అనభిజ్ఞాయ=నీతిశాస్త్రముల యర్థమెఱుంగక యని భావము. ప్రాగల్భ్యాత్=ప్రతిభ గల్గుటచేత, వక్తుమిచ్ఛంతి=జల్పములాడుదురో వారని భావము. శాస్త్రములయందుఁ గలయర్థమును గురువులమూలమున నెఱింగి వచింపవలయునే కాని తన కెట్లు తోఁచునో యట్లు వచింపరాదని భావము. అట్టివారలే పశుబుద్ధులని సిద్ధాంతము. అట్టివారి వాక్యలమూలమున హాని కల్గుటయె కాక ఫలము కలుగదని మన మెఱుంగవలయును. ఇట్టి వాక్యలు పలికిన కుంభకర్ణుఁడు మూర్ఖుఁడనుటకన్న నవివేకము వేఱుగ నేముండును?

> "తమత్యైవం బ్రువాణం తు వచనం ధీరదారుణం. ౨౮
> రుష్టోఽయమితి విజ్ఞాయ శనైశ్శ్లక్ష్ణమువాచ హ.
> అతీవ హి సమాలక్ష్య భ్రాతరం క్షుభితేంద్రియం. ౨౯

కుంభకర్ణశ్శనైర్వాక్యం బభాషే పరిసాంత్వయన్,
అలం రాక్షసరాజేంద్ర సంతాపముపపద్యతే. 30
రోషం చ సంపరిత్యజ్య స్వస్థో భవితుమర్హసి.''

అని మూలము. సీతాపహారణదోషము నిన్ను బాధింపక వదల దని యుక్తియుక్తముగా నీతిశాస్త్రసమ్మతముగాఁ దాను జెప్పిన మాటలకు రావణుఁడు క్రోధయుక్తుఁడై తన్నుఁ బ్రార్థించుట విని యిఁక నీతి యుపయోగింపదనియు దానవవినాశనకాలము వచ్చెననియు నెఱింగి "పితృసమో జ్యేష్ఠః" అను న్యాయము ననుసరించి గౌరవము గనఁబఱచి పోయి యాతుచ్ఛదేహమును శ్రీరామబాణముల కర్పించి శాశ్వతపదము నొందఁ గోరి యన్న నూఱడించుచు నిట్లు పల్కెనని మనము గ్రహింపవలయును. అంతియకాని యుక్తాయుక్తములు పూర్వాపరము లాలోచింపక యతని పౌరుషోక్తులను మాత్రము తెలిపి తన్మూలమున నతనిమూర్ఖత్వము వెల్లడింపఁ బూనుట మిక్కిలి యసంగతము. తొలుత నీతిని దుష్కర్మఫలములు తప్పక పొందె దనియును దెలిపియుండఁగా వానిని విమర్శింపక విధిలేక పలికినపలుకులను విమర్శించు టుత్తమపద్ధతి యెంతమాత్రము కాదు. ఈవిషయము వాల్మీకి యీరీతిగాఁ దెలిపినాఁడని తెలుపుటకే యామూలము లుదాహరింపఁబడినవి. ఇఁక నిత్తఱి నన్నకుఁ గుంభకర్ణుఁడు పలికినమాటల సారమేమని విమర్శింతము.

"నైతన్మనసి కర్తవ్యం మయి జీవతి పార్థివ. 31
తమహం నాశయిష్యామి యత్కృతే పరితప్యసే,

అవశ్యం తు హితం వాచ్యం సర్వావస్థం మయా తవ. 32
బంధుభావాదభిహితం భ్రాతుస్స్నేహాచ్చ పార్థివ."

అని మూలము. రావణునాశయ మెఱుంగక యతఁడు మూర్ఖత వహించెనని తలఁచి నీతిం దెలిపి యతఁడు కోపమును నటింపఁగా మరలఁ దద్ధితముగ మాటలాడుచు స్వాభిప్రాయమును గూఢముగాఁ దెలుపుచున్నాఁడు. "మయి జీవతి సతి" అనియె. నేను జీవించియుండఁగా విచారింపకుండుము. నామృతికిం బిదప విచారింపుమా యని కదా భావము. నీతి యేల బోధింపవలసివచ్చెనో యతఁడే తెలిపెను గదా. "సర్వావస్థం తవ మయా అవశ్యం తు హితం వాచ్యం భ్రాతుస్స్నేహాద్బంధుభావాదభిప్రేతం" అని కదా యతఁడు పలికెను. సర్వకాలము తనకుఁ దెలిసిననీతి నొరులకుఁ దెల్పుటయే పెద్దవారలకు విహితము. అన్నయను స్నేహముగలవాఁ డెట్లు తెలుపవలయునో యట్లు విహిత మిదియని తెలిపితిని. అంతియ కాని యిదియే నా యాశయమని నీవు తలంపం జనదు. కుంభకర్ణుని యీమాటల ధోరణింబట్టి యూహించిన నీకు హితముగాఁ దెల్పినమాట లన్నియు బంధుభావమును మది నూహించి చెప్పినవే యని తేటపడును.

"శత్రూణాం కదనం పశ్య క్రియమాణం మయా రణే,
అద్య పశ్య మహాబాహో మయా సమరమూర్ధని. 34
హతే రామే సహ భ్రాత్రా ద్రవంతీం హరివాహినీం,
అద్య రామస్య తద్దృష్ట్వా మయా నీతం రణాచ్ఛిరః. 35
సుఖీ భవ మహాబాహో సీతా భవతు దుఃఖితా,

అద్య రామస్య పశ్యంతు నిధనం సుమహాత్ప్రియం. 36
లంకాయాం రాక్షసాస్సర్వే యేతే నిహతబాంధవాః,"

అని మూలము. రామే సహ భ్రాత్రా హతే సతి=అనఁగా 'హతో ఽత్ర కశాఘాతకః.' అని వివాదరత్నాకరమున వ్రాయఁబడినట్లు లిట నాచేఁ గొట్టఁబడినవాఁ డగుచుండఁగా ననియే యర్థము గాని చంపఁబడినవాఁడగుచుండఁగా నని కాదు. మయా సహ రామస్య రణాత్=నాతోడ రామునకు యుద్ధము గలుగఁగా, ఆనీతం=దూరముగాఁ జిమ్మఁబడిన, శిరః=నాతలను, దృష్ట్వా=కని, సుఖీ భవ=అని యర్థము. సీతా=లోకజనని, దుఃఖితా భవతు= భర్తుఁడనగు నామృతికి దుఃఖించుఁ గాకయని యర్థము. "అద్య రామస్య సుమహాత్ప్రియం నిధనం మమ మరణం" అని యన్వ యము. ఇపుడు రామునిమూలమునఁ గలిగిన నామృతి నాల కించి లంకావాసులు తమబంధువులు మృతినొందిన దుఃఖమును గూడ మఱతురని భావము. కుంభకర్ణుని తాత్పర్య మిది యని యెట్లు చెప్పవచ్చునందు రేని ఇట్టి యర్థమగునట్లు వాల్మీకి యేల చెప్పవలెను ? ఈయర్థమగునట్టి పదములకూర్పే యిది యతని భావమని తోఁపింపఁజేయునని యెఱుంగందగు.

"అద్య శోకపరీతానాం స్వబంధువధకారణాత్. 37
శత్రోర్యుధి వినాశేన కరోమ్యస్రప్రమార్జనమ్,
అద్య పర్వతసంకాశం ససూర్యమివ తోయదం,
వికీర్ణం పశ్య సమరే సుగ్రీవం ప్లవగోత్తమం." 38

అని మూలము. శత్రువగు రామునివలన యుద్ధమృతి గల్గుటం జేసి దుఃఖములపాలగు నావారిశోకము నామృతివలనఁ దొలఁగి పోవును.

"అథ పూర్వం హతే తేన మయి త్వాం హంతి రాఘవః. ౪౦
నాహమాత్మని సంతాపం గచ్ఛేయం రాక్షసాధిప,"

అని మూలము. నేను రామునిచే హతుఁడనగుటకు దుఃఖింపను జుమీ. నేను హతుఁడను గాఁగాఁ బిదప నిన్ను వధించు ననియే దుఃఖించుచున్నాఁడనని తాత్పర్యము.

"యది మే ముష్టివేగం స రాఘవోఽద్య సహిష్యతే,
తతః పాస్యంతి బాణౌఘా రుధిరం రాఘవస్య తు. ౪౭
చింతయా బాధ్యసే రాజన్ కిమర్థం మయి తిష్ఠతి,
సోఽహం శత్రువినాశాయ తవ నిర్యాతుముద్యతః. ౪౮
ముంచ రామాద్భయం రాజన్ హనిష్యామీహ సంయుగే,
రాఘవం లక్ష్మణం చైవ సుగ్రీవం చ మహాబలం. ౪౯
హనుమంతం చ రక్షోఘ్నం లంకా యేన ప్రదీపితా,
హరీంశ్చాపి హరిష్యామి సంయుగే సమవస్థితాన్. ౫౦
అసాధారణమిచ్ఛామి తవ దాతుం మహద్యశః."

అని మూలము. నాముష్టివేగమును రాముఁడు సహించునేని రాముని బాణములు నారక్తమును ద్రావఁగలవు. నేనుండఁగా నీకుఁ జింత యెందులకు? అనఁగా నేను బ్రదికియుండుదాఁక నిర్విచారమున నుండుము. పిదప విచారింపవచ్చును. నాతర్వాతనే నీకు మృతిగాని ముందు లేదని భావము. "రామాత్ భయం వర్తత ఇతి శేషః. హనిష్యామీతి ముంచ." అని యన్వయము. మనకు రామునివలన భయము కలదు. చంపుదు నన్న వాంఛను వదలుమని యాశయము. అనఁగా దీనిభావ మేమని యూహింతము. ఇట్లన్వయించుట సమంజసము కాదని యందు

రేని భాష్యములన్నియు నెగిరిపోవును. ఇట్టిత్రావుల మాత్రమే రెండువిధములుగా నన్వయింపఁదగిన శ్లోల వాల్మీకి వ్రాయ వలయునని యూహించుట పొరపాటు కానేరదు. కావున నిట్లే గ్రహింపవలయును. తవ మహత్ యశః దాతుమసాధారణ మిచ్ఛామి = నీకు గొప్పయశస్సు నిచ్చుటకు సాధారణము గాదని తలంతుననియె. అనఁగా విజయలక్ష్మి నీకొసంగుట శక్యముకాదనియే కుంభకర్ణునాశయమని నమ్మవలయును. ఈ యుపదేశము ననుసరించి యూహించినయెడలఁ, గుంభకర్ణుఁడు నీతిశాస్త్రపండితుఁడనియు, మోమోటమి మాని న్యాయ్యము నే తెల్పువాఁడనియు, రాముని భగవంతునిగా నెఱింగిన వాఁడనియుఁ దోఁపక మానదు.

ఈవిషయమున నధ్యాత్మరామాయణమును బరిశీలింతము. రావణునిశక్తిచే లక్ష్మణుఁడు మూర్ఛ నొందుటం గని హనుమంతుఁడు దివ్యౌషధులం దెచ్చి బ్రదికించినట్లు గలదు. అదియే విశేషము. కుంభకర్ణునిచరిత్రమునందు నతఁడి ట్లుపదేశించిన ట్లున్నది.

"పూర్వమేవ మయా ప్రోక్తో రామో నారాయణః పరః,
సీతా చ యోగమాయేతి బోధితోఽపి న బుధ్యసే. ౫౧
ఏకదాహం వనే సానౌ విశాలాయాం స్థితో నిశి,
దృష్టో మయా మునిస్సాక్షాన్నారదో దివ్యదర్శనః. ౫౨
తమబ్రువం మహాభాగ కుతో గంతాసి మే వద,
ఇత్యుక్తో నారదః ప్రాహ దేవానాం మంత్రణే స్థితః.

... ... ... ...

అతస్త్వం మానుషో భూత్వా జహి రావణకంటకం,
ఇత్యేత్యాహ మహావిష్ణుస్సత్యసంకల్ప ఈశ్వరః."

అని కలదు. ఈరామాయణమునందుఁ గనఁబడు విశేషములే యిందు స్పష్టముగాఁ దెల్పఁబడినవని యెఱుంగునది. వాల్మీకి మహర్షి యందందుఁ దత్త్వజిజ్ఞాసువులకుఁ దెలియఁదగునట్లు స్వహృదయము నెఱింగించెననియు సామాన్యులకు శ్రీరామ చరిత్రమునంతటను దెల్పెననియు మన మెఱింగిన భాగుపడు దుము. ఇఁకఁ దరువాతిచరిత్రమును బఠింతము.

## మహోదరుఁడు కుంభకర్ణుని దిరస్కరించుట.

* ఇట్లు కుంభకర్ణుఁడు పలుకఁగా విని మహోదరుఁడను రక్షోనాయకుఁడు వాని కోర్వఁజాలక యిట్లు పలికెను. కుంభకర్ణా! గొప్పవంశమునఁ బుట్టిన నీకు బుద్ధి యల్పముగా నున్నది. కేవల శూరుఁడవే కాని శాస్త్రవేత్తవు కావు. గర్వివి. కానఁ జేయఁదగిన దిట్టులని తెలియఁజాలవు. రాజు శౌర్యగర్వమున రాఁబోవుదోషమును విచారింపఁ డయ్యెనంటివి. నయానయముల నెఱుంగఁ డంటివి. కుంభకర్ణా! రాక్షసేంద్రునకు నయానయములు తెలియనివి కావు. బాలత్వమున వివేకము చాలక యిట్లు పలుకుచున్నావు కాని శాస్త్రజ్ఞానమునఁ గాదు. రావణుఁడు వివిక్తాదిమంత్రములకుఁ దగు దేశకాలములను, వానికిం దగని దేశకాలములను వేఱువేఱ తెలిసినవాఁడు. కావున శత్రువులకుఁ గల వృద్ధిక్షయములను సమత్వమును జక్కఁగా నెఱింగినవాఁడే. అట్టివాని నవి యెఱుఁగనివాఁ

* ఇది యఱువదినాల్గవసర్గమునఁ గలదు.

డనుట యుక్తము కాదు. నీవలెఁ బండితుఁ డెవ్వఁడును బలు కఁడు. ధర్మార్థకామములకు నొక్కొక్కదానికిఁ బ్రత్యేకఫల ములు నియమముగాఁ గలవనియు, ధర్మాధర్మములకు శుభా శుభఫలములు నియతములు కావున సీతాహరణరూపాధర్మ కార్యమునకు నిట్టిఫలము గలిగెననియు నీవు నిరూపించితివే. ధర్మార్థకామములకుఁ బ్రత్యేకముగ నాయాఫలమే నియతమని కలదా పెలుంగుటకు నీకుఁ బ్రమాణ మేమున్నది? స్వర్గనరక రూపములగు సమస్తఫలకర్మములకును గర్మములే సాధన ములు. కాని యీకర్మసముదాయములోఁ బుణ్యకర్మములకే శుభఫలములనియుఁ, బాపకర్మములకే యశుభఫలములనియు లేదు. మహాపాపకర్మములకుంగూడ శుభఫలమే కలుగుచున్నది. ధర్మార్థములు, అధర్మానర్థము లనునీనాలుగు శ్రేయస్సునే కలిగిం చునవి. అయిన నధర్మానర్థములకు నొకప్పు డశుభఫలము కలు గుటయుఁ గలదు. ఈరెండింటికి మంచిసెబ్బరలు కలుగు నన వలయును గాని యశుభఫలమే కలుగు ననరాదు. ధర్మాధర్మ ములకు ఫలనియతి లేకుండుట యెటుండనిమ్ము. లోకమునఁ బురుషు లిహలోకమునకుఁ బరలోకమునకును నుపయోగించు విహితకర్మములను జేయుచున్నారు. తత్ఫలముల ననుభవించు చున్నారు. ఆరీతిగనే విహితకర్మముల నొనరింపక యథేచ్ఛ ముగాఁ గర్మముల నొనరించువాఁడు కూడ శుభఫలములనే నొందుచున్నాఁడు. దీనింబట్టి విహితకర్మమే శుభప్రదమనియు, నవిహితకర్మ మశుభప్రదమనియు నియమము లేదనియుఁ, గామ మునకు నట్లే ఫలనియమము కానరాదనియుఁ దోఁచెడిని

ఇట్లు ధర్మాధర్మములకు ఫలనియమ మనునది లేక సర్వము ఫలమైయుండు మతము ననుసరించి మనయేలిక కామము సేవించువాఁడును సుఖాభిలాషమున సీతాపహరణమను నీ కార్యము చక్కఁగా నాలోచించియే చేసెను. కావున నది కర్తవ్యమే యని సమ్మతించితిమి శత్రువు విషయమున నాలోచింపక సాహసము నూని చేసిన దిం దేమి యున్నది? కనఁబఱుపుము. నేనొక్కండనే యుద్ధమునకుఁ బోయెదనని యందులకు హేతువులుగఁ బౌరుషాదులను దెల్పితివి కదా. ఆవిషయమున నయుక్తము నహితము గలదని చూపెదను చూడుము. ఎవ్వండు జనస్థానమునఁగల మహాబలుల రక్కసుల ఖరాదుల నొక్కఁడే చంపెనో యట్టి మహావీరుని నీవొక్కఁడవే యెట్లు మార్కొనఁ గలవు? కనుక నీపలు కయుక్తము. జనస్థానవాసుల చుట్టము లిప్పటికి రాముని పేరు విన్న వడంకుట నిజమని నీవు నెఱింగియుండవచ్చును. కనుక నీమాట యహితముకూడ నగు. రాముని మిగుల శూరుఁడని తెలియక నిద్రించు మహాకాలాహిని లేపునట్లు యుద్ధమునకుఁ బిల్వఁగోరుచున్నాఁడవు. కోపము వచ్చినంతనే చెనకఁ దరముగాక మృత్యువునా సహింపరాకయు నుండురాము నెవ్వఁడు తాఁకసింపఁ గలఁడు? ఆ రాముని యెదుట నిలువఁబడుటకే మన రక్కసులబలమంతయుఁ బ్రాణసంశయము నొందుచున్నది. ఇట్టులుండ నీవొక్కఁడవే రణమునకుఁ బోవుట యిష్టమనరాదు. తనకుమించిన బలపరాక్రమోపేతుఁ డగుశత్రు నెవఁడు మార్కొనఁ బూనును? ప్రాణముల వదలఁగోరినచో రాముని మార్కొనఁ బొమ్ము.

మహోదరుఁ డిట్లు సంరంభించి పలికి రావణుం గాంచి నీవు సీతను బొందియు మరల నిట్టు లనేకరీతుల మాటలాడు చున్నావు. నీవు కోరినప్పుడే జానకి వశురా లగును. సీత తన యంతన నీకడ కరుదెంచుట కొక యుపాయమును గనుఁగొంటిని. అది ప్రియమైనచో నాబుద్ధి నాలకింపుము. పరబుద్ధి ననుసరింపకుము. నేను, ద్విజిహ్వుఁడు, సంహ్రాదియుఁ, గుంభకర్ణుండును, వితర్దనుఁడు, నను మే మైదుగురము రాముని జంపఁ బోవలయునని చాటింపుము. మేమరిగి యెట్లో రామునితో యుద్ధ మొనరింతుము. మేము శత్రువుల నోడింతుమేని మనకు నుపాయముతో నవసరమే లేదు. సంగర మొనరించినను దుర్జయుఁడై రాముఁడు జీవించియుండునేని మనస్సున మే మాలోచించినట్లు గావింతుము. రాముని బాణములు మా దేహముల నిండ నాటియున్నట్లు చేసికొని రక్తమునఁ దడిసి రామునితో రణము చేసితిమని సీత నమ్ముటకై రామనామాంకితములగు తీవ్రబాణములతో యుద్ధరంగమునుండి యిచ్చోటి కేతెంతుము. మేము రామలక్ష్మణుల భక్షించివైచితిమని చెప్పుచు నీపాదములకు మ్రొక్కెదుము. అత్తఱి నీవు మాకోర్కె నిండింపవలయు. అంత నీవొకని నేనుంగుపై నెక్కించి రామలక్ష్మణులు వానరులు హతులైరని చాటింపవలయు. అంత నీవు సంతసించినట్లు భృత్యులకు యథేష్టముగా భోజనాదు లొసంగుము. వీరభటులకుఁ బారితోషికము లిమ్ము. మేము రామలక్ష్మణుల భక్షించితి మనువార్త యెల్లయెడల వ్యాపించినపిదప నీవు సీతకడ కరిగి యామెకు రామవియోగజనితశోకమును బోఁగొట్టి నన్నేలుకొమ్మని యేకాంతమున మంచిమాటలాడి

యమూల్యవస్తువు లొసంగి యాసను గల్పింపుము. రాజేంద్రా!
యీ కపటోపాయమున నామె దుఃఖమును వదలి నీకు వశురా
లగును. వేఱొకయాశ లేకపోవుటం జేసియు స్త్రీస్వాభావిక
చాపల్యమునను నీకు లోఁబడును. సుఖార్హురాలగుట దుఃఖ
ముల ననుభవింపఁజాలక విసికి సుఖ మిఁక నీమూలముననే కల్గు
నన్న యూహ నిన్నే యాశ్రయించును. ఈయుపాయ
ముత్తమముగా నూహించి నిర్ణయించితిని. నీవు రాముసకుం
గనఁబడిన ననర్థమే కలుగును. నాయీయుపాయము నాలకించి
సమ్మతింపుము. నీకు మేలగునని చక్కఁగా స్వాభిప్రాయమును
దెలిపి యూరకుండెను.

మహామతులారా! ఈభాగమును బరిశీలించినపుడు
కొన్ని విషయములు పొడకట్టక మానవు. సుగ్రీవునితో
శ్రీరాముఁ డింతకుమును పే రాక్షసులలోఁ బండితు లున్నవా
రని తెలిపెను గదా. మహోదరుఁడు తెల్పినవిషయములం బరి
శీలించిన నామాట స్పష్టము గాకపోదు. మంచిది కాకున్నను
స్వమతమును సిద్ధాంతము చేయుటకుంగూడఁ బాండిత్య మా
వశ్యమే. మహోదరుఁడు ధర్మాధర్మములకు శుభాశుభ ఫలములు
నియతములు కావనియెఁ గదా. ఇదియుఁ బాండిత్యమేనా
యందురేమో. అదియుఁ బాండిత్యసాపేక్షకమే యగు. లోక
మునఁ బుణ్యకర్మముల నొనరించువారలకు విశేషించి యాప
దలు కలుగుటయుఁ, బాపకర్మముల నాచరించువారలకు సుఖ
సంపదలు పొలయుటయుం గానఁబడును. దానికిఁ గారణము
ప్రాక్కర్మమే యైనను విపరీతముగాఁ దోఁచుట నైజము. పండి
తులు కూడఁ దమరు పట్టినకుందేటికి మూఁడే కాళ్లని వాదించు

వారలే. ప్రాయికముగా నట్టివారే యుందురు. క్వాచిత్క
ముగాఁ దత్త్వాన్వేషణతత్పరు లుందురు. కనుక మహోదరుఁడు
శాస్త్రజ్ఞుఁడయ్యు నపసవ్యమార్గము నూని తన యాశయమును
నిలువఁబెట్టుకొనియెనని మన మూహింపవచ్చును. పామరు
లిట్లు నిర్ధారణ మొనర్పఁజాలరు కదా ? పాండిత్యము చక్కని
మార్గము నాశ్రయింప లేదనవచ్చును గాని శాస్త్రజ్ఞత లేదన
వలనుపడదు కదా ? మఱొక్కవిషయము. ప్రతివ్యక్తియుఁ
దానొకయుక్తి నేర్చినట్లు, అది యితరులకుఁ దెలియదనియు
నమ్మి మాటలాడును. అంతకంటె నెక్కుడుపాయ మెఱింగినట్లు
మఱొక్కఁడు తలంచును. ఆనంద మనేకవిధములు. అందు
నిదియు నొకవిధమని మనము తలంపవలయును. మహోదరుని
యుపాయ మందొక్క యానందలేశ మనందగు. సకలలోక
జనయిత్రి సీత యీవిషయము లన్నియు నూహించి యానం
దింపక పోదు. మహోదరాదులకుఁ గాలమింకను సమీపము
నకు రాలేదు. కావున ననేకోపాయములు తెల్పి రాజాను
గ్రహము పొంది దానిమూలమున సుఖింపఁ బూనిరి. కాని
యాయుశ్శేష మెంతయని యెఱుంగమిం గల్గిన యజ్ఞానగర్వ
మిది యని మన మెన్నవలయును. శ్రీరామబాణవిద్ధుఁడై
బ్రదుకువాఁడును గలఁడా యని యాలోచింపకపోవుటయే
యిందులకు నిదర్శనము. ఖరదూషణాదిమహావీరుల నొక
ముహూర్తమాత్రమునఁ బొలియించెనని తెలిసియుఁ గుంభ
కర్ణున కావిధముం దెలిపియు నట్టిమహాత్ముని మూర్ఖుని మనలి
వత్తుమని భావించుటకంటె నజ్ఞానము వేఱొకఁ డుండునా?
ఇఁకఁ దరువాతిగాథ నరయుదము.

## కుంభకర్ణుఁడు యుద్ధమునకు వెడలుట.

* మహోదరుఁ డిట్లు పల్కిన విని కుంభకర్ణుఁ డోయీ! యిఁక నిట్టిపలుకు లాడకుము. జాగ్రత్త యని భీతినొందఁ బలికి రావణునిం గని నాపరాక్రమ మెఱింగినదే కదా. ఇపుడే వైరిని వధించి నీకిపుడే భయమును బోఁగొట్టుదును. సుఖముగా నుండుమని తెలిపి నాసింహనాదము నాలించి పరవీరులు బెదరుదురు గాక యని పలికి యంత మరల మహోదరుం గాంచి, "యల్పమతులరగు మీవంటివారిమూలమున రా జిట్టివిపత్తు నొందెను. భీతులై మీవంటివారు సర్వకాల మిచ్చకము లాడుచు రాజు చెప్పినమార్గములనే యనుసరించుచు నింతటి కార్యమును గల్గించుచుందురు. మీరి రాజేంద్రునకు మిత్రుల వలెఁ గనఁబడుచు నిట్టికార్యములకుఁ దోడుపడుచు లంకాపురమునందు రా జొక్కఁడే శేషించునట్లు చేసితిరి. ధనాగారమంతయు శూన్యముగా నొనరించితిరి సేనలు హతములైనవి. మీదుర్నయమున నింతలు పుట్టినవి. వీనిని సరిచేయ నిపుడే సంగరరంగమున కరుగుచున్నాఁడను." అని కుంభకర్ణుఁడు పలుకఁగా నాలకించి పకపక నవ్వుచు రావణుఁడు, "వత్సా! నీ వజేయుఁడవు. నేను భయంపడియే యున్నాను కనుక నే యుద్ధము మాని యున్నాను. నాయందు నీకుఁ గల్గిన ప్రీతి యనుపమానము నీవు శూలము కేలఁ దాల్చిన యమునివలెఁ గనఁబడుదువు. అనికిం బోయి వనచరుల రామలక్ష్మణుల భక్షింపుము. నీరూపము చూచినంతనే వారు భయంపడి పాఱిపోవుదురు."

---

* ఇది యఱువదియైదవ సర్గమునఁ గల కథ.

అని రావణుఁడు పలికి సోదరవాక్యములను నమ్మి మరలఁ బుట్టినట్లు తన్నుం దలంచుకొనుచు సంతుష్టుఁడై యుండెను. అన్నమాటల కాకుంభకర్ణుఁడు సంతోషించి యుద్ధమునకరుగ సన్నద్ధుఁ డయ్యెను. పగవారి నిర్మూలింపఁజాలిన భీకరశూల మును గేలనంది యన్నతో నేనొక్కఁడనే పోయెదను. నా సేన యుండే యుండుఁగాక. నన్నుంగని భయంపడు వానరుల నెల్ల భక్షించి వచ్చెద. అనఁగా వత్సా! ఒంటిగాఁ బోనవలదు. శూలముద్గరధారు లగుసైనికులు బలసి రాఁ బొమ్ము. ఏలనఁగా వానరు లెంతయు బుద్ధిమంతులు. జవము గలవారు. తేజోవం తులు. ఒంటరిగానున్న నేమఱుపాటున నున్న దంతములఁ బొడవడంతురు. కావున సేనలం గూడి పొమ్ము. రక్కసులకు శత్రువు లెవ్వరో వారినెల్ల రూపుమాపుము. అని తెలిపి రత్నహార మొసంగి వివిధహారముల మేనెల్ల నలంకరింప సున ర్ణకవచమును దొడిగి మిగుల వెలుంగుచు నన్నకు మ్రొక్కి యతనిం గౌఁగిలించుకొని యుద్ధమునకుఁ బోయెను. జయజయ ధ్వనులు శంఖకాహళాది నిస్వనములు చెలంగ సేన లాతని వెంబడించి పోయెను. ఆతని యప్పటిరూప మత్యంతభయంకర ముగా నుండెను. భీరములు పల్కుచు వానరులన నాకెంత యని పలుకుచు వైరుల వధించికాని రానని వాగ్దాన మొసం గుచుం బోయెను.

ఇట్లతఁడు ప్రయాణము సాగించుతఱి ననేకదుర్నిమిత్త ము లాతనికే పొడకట్టెను. కాలప్రేరితుం డగుట నాతఁడు వాని నెల్ల లెక్కింపఁ బూనఁడయ్యెను. మహత్తరవానరసేన లాతని కిం గనఁబడియె. వానరులు పర్వతసమానదేహముగల యా

రాక్షసునిం గాంచి భీతిల్లి గాలిత్రాఁకునఁ దూలిన మేఘశకల ములవలెఁ బాఱిపోయిరి. కోపావేశమున నోడలెఱుంగక విజృంభించు నాకుంభకర్ణుఁడు వానరులు భీతిల్లి పాఱిపోవుటం జూచి సంతోషమున మాటిమాటికి సింహనాదము చేయ సాగెను. ఆకసమంతయుఁ బగులునట్లు చేసిన యాసింహనాదము నాలకించి వానరులలోఁ బెక్కండ్రు మూలములు తెగిన వృక్ష ములవలె నేలం బడిరి. విశాలపరిఘాయుధమును హస్తము నందు ధరించి కోఁతులకు విశేషభయముం బుట్టించుచుఁ బ్రళయకాలాంతకుఁడా యనునట్లు పగవారలం జంపుకుతూ హలము పైకొన బలములం గూడి పోయెను.

## కుంభకర్ణుఁడు యుద్ధముచేయుట.

* మహాబలశాలి కుంభకర్ణుఁడు ప్రాకారమును లంఘించి లంకం దాఁటి యుద్ధరంగమును బ్రవేశించెను. సముద్రము మాఱుమ్రోఁగ్రయురీతి సింహనాదము చేసెను. కోఁతులు నలు దిక్కులకుం బరుగులిడసాగిరి. అంగదుఁడు వారిగతిం గాంచి నలనీలగవాక్షకుముదులం గాంచి మీరు స్వభావసిద్ధములగు పరాక్రమాదులను మఱచి సామాన్యకపులం బోలి బెదరి పాఱిపోయెదరు. ఎచ్చటి కరుగుదురు? మరలుఁడు. ప్రాణముల రక్షించుకొనెదరే ఏల? ఈరాక్షసుఁడు యుద్ధమునకు రాలేదు. మనకు భయముగలిగింపఁ జేయఁబడిన పురుషాకారమగు నొక పెద్దబొమ్మ. మనకొఱకై నిర్మించి పగవాఁడు పంపిన దీని నాశ నము చేయుదము. మరలుఁడని హెచ్చరించెను. వారెట్లో

* ఇది యఱువదియాఱవ సర్గమునందుఁ గలదు.

దిటవు తెచ్చుకొని యంద ఱొకచోటం జేరి యుద్ధము చేయఁ గడంగిరి. మదగజమువలెనుండు నాకుంభకర్ణుని దమయాయుధ ములఁ బ్రహారించిరి. పర్వతశిఖరాదులచేఁ గొట్టఁబడుచున్నను వాఁడు చలింపకయుండెను. వారు వైచిన శిఖరాదు లాతనిశరీర మునకుఁ దగిలి యెగిరి క్రిందఁ బడసాగెను. మహాకోపమున నా కుంభకర్ణుఁడు వనచరులఁ గాల్పఁ బూనుకొనెను.ఆతనిశరీర మునఁ జిమ్మఁబడి కొందఱు కోఁతులు నేలం బడిరి. కొందఱు వెనుకనైనఁ జూడక కాలికి బుద్ధిచెప్పిరి ఆబలశాలి చంపుచుం డఁగాఁ గనుఁగొనఁజాలక కొందఱు సాగరజలములం బడిరి. కొందఱు పైకెగిరిపోయిరి. కొందఱు సేతువుమీఁదఁ బరుగిడ సాగిరి. భల్లూకములు చెట్లెక్కి ప్రాణముల రక్షించుకొనియెను.

అంగదుం డట్లు భంగమునొంది పాఱువారిం గని వన చరులారా! పాఱకుఁడు. నిలువుఁడు. యుద్ధము గావింతము. ఎంతపరుగెత్తిన నుండుచోటు దొరకదని తలంతును. మీ రస మానపరాక్రమసంపన్నులరు గదా. ఆయుధములఁ బాఱవైచి పరుగెత్తిన మీ యాఁడువారే మిమ్ముఁ బరిహాసింతురు. మాన మూని బ్రదుకు పరాక్రమవంతుల కది మరణసమాన మగును గదా. గొప్పవంశములఁ బుట్టి క్షుద్రులవలె బెదరిపోవుట మంచిదియా? ఇట్లు పాఱిన మీ రపూజ్యులే యగుదురు. పగ వారి నడంతుమని యాత్మప్రశంసలు చేసికొంటిరి గదా. ఆ పరాక్రమము లిపు డెచటికిఁ బోయినవి? పరాజితుఁ డగువానిని బిఱికిపంద యని జను లాడుకొందురు సుఁడీ! పాఱిపోయినను ఆయు వల్పమే కావున బహుకాలము జీవింపఁజాలము. కాన సంగరమునఁ బోరాడి భూమిపైఁ బడిపోవుదము. యుద్ధహతు

లకు బ్రహ్మలోకమున నివాసము లభించును. పగతుఱం జంపితి
మేని కీర్తి కలుగును. మంచునగ్నింగని మిడుత ప్రాణములతో
నశుగఁజాలనట్లు కుంభకర్ణుఁడు రామభద్రుని బారింబడి మరలి
పోవలేఁడు. ఇంతదనుక మంచిపేరు పొందితిమి. ఇట్టి మన
మందఱము నొక్క కుంభకర్ణునిచే నోడింపఁబడి పాఱిపోయిన
నిన్నిదినములు గడించిన కీర్తియంతయు నశించును అనియెను.

అంగదుఁ డిట్లు పిఱికితనము పోవఁ బలుకుచుండఁగా
భయమున మునింగి పాఱిపోవు నావానరు లీ కుంభకర్ణుఁడు
మమ్ము మర్దించుచున్నాఁడు. నిలువఁజాలము. ఇది సమయము
గాదు. పోయెదము. మాకెల్లఁ బ్రాణములపైఁ గదా యాశ
అనిరి. వారా యంగదున కింతమాత్రము బదులుచెప్పి తమపై
కేతెంచు కుంభకర్ణుని గని భయమున మఱేమియుఁ బలుకనోడి
యఖిలదిక్కులకుం బాఱిపోయిరి. అంగదుఁ డట్లు పాఱుచున్న
వానరుల మంచిమాటలచేత శ్రీరాముఁ డేర్పఱచిన సాలపర్వత
భేదాది సంకేతనామములచేతను వారల నెట్లో మరలించెను.
బుద్ధిమదగ్రగణ్యుఁడగు నాయంగదుఁ డిట్లుత్సాహమును గలి
గింపఁగా న వ్వానరయూథనాథులందఱు సుగ్రీవాదుల
యాజ్ఞకు నెదురుచూచుచు యుద్ధసన్నద్ధులై యుండిరి. అంత
ఋషభ, శరభ, మైంద, ధూమ్ర, నీల, కుముద, సుషేణ,
గవాక్ష, రంభ, తార, ద్వివిద, పనస, హనుమదాదు లతివేగ
ముగా యుద్ధాభిముఖులై యరిగిరి.

## శ్రీరాముఁడు కుంభకర్ణుం జంపుట.

* ఆవానరులందఱు నంగదునిమాట లాలకించి మరణము

---

* ఇది యఱువదియేడవ సర్గమునఁ గలదు.

నకు సాహసించిన బుద్ధిగలిగి యుద్ధము చేయ మరలివచ్చిరి. తొల్లి
చెప్పిన బీరములం దలంచుకొనుచు వచ్చి ప్రాణములపై నాశ
మాని తుములముగా యుద్ధము చేయసాగిరి మహాకాయులగు
నా వానరులందఱు వృక్షపాషాణాదులం దాల్చి కుంభకర్ణుని
దాఁకిరి బలవంతుఁ డగు నా రాక్షసుఁడు క్రుద్ధుఁడై గద నెత్తు
కొని శత్రువులం దలపడి దాన మోఁది నేలం గూల్చెను. ఒక్క
దెబ్బకే తాళఁజాలక నలుదెసలకుఁ జెదఱి పోవఁజాలక యందే
నేలం గూలిరి. మఱియు నాదనుజుఁడు కోపమూని గరుత్మం
తుఁడు సర్పముల భక్షించునట్లు వానరుల నెనమండ్రం బదుగు
రను బదునాల్గురను ఇరువదిమంది ముప్పదిమంది యిట్లు
చేతులం బట్టుకొని నోట వైచుకొని నమలుచు రణాంగమున
విహరించుచుండెను. ఎట్టకేలకు ధైర్యముం దెచ్చుకొని యా
యుధములం బట్టుకొని వనచరులు నిలిచిరి. ద్వివిదుఁ డొకపర్వత
మును విసరివైచెను. అది లక్ష్యము తప్పి వానిపయిం బడక
యతనిసేనపయిం బడియెను. ఆకొండ వారినెల్ల ముద్దగా నొన
రించెను. అంతటం బోవక యాద్వివిదుఁడు మఱొక కొండను
గుంభకర్ణునిపై వైచెను. అది యాసేనం జంపి రక్తప్రవాహ
ములఁ గల్పించెను. రక్కసులు చెలరేఁగి వనచరవరులఁ దును
మాడసాగిరి. కోఁతులు పిఱిందికిం బోవక తలపడి శస్త్రముల
లాగికొనియు భూరుహముల భూధరముల మోఁదియు వారలం
బొలియించి యార్చిరి. హనుమంతుఁ డాకాశగతుఁడై పర్వత
శిలలను భూరిభూరుహముల నాకుంభకర్ణుని శిరముపై వర్షిం
చెను. ఆతఁ డావృక్షాదులను మేటిశూలమున భేదించి వర్ష
ముగాఁ గురియుచున్న యావృక్షములఁ దట్టి వేయుచుండెను.

మఱియు నతఁడు శూలముం గొని వానరులం దఱుమ హను
మానుఁడు కొండశృంగమును బెకలించుకొని యాతనిముందట
నడ్డపడి నిలిచెను. వెంటనే దానిచే నాదనుజుని మోఁదెను.
దానఁ జలించి మేదస్సు రక్తము కాఱఁగా క్షోభించెను.
మెఱయుచుండు శూలమును ద్రిప్పి హనుమంతునిఱొమ్మునఁ
గొట్టెను. హనుమ యావ్రేటున వక్షము భగ్నము కాఁగా
రక్తసిక్తాంగుఁడై యార్చుచు నేలఁ గూలెను. రక్కసు లట్టె
సింహనాదము లొనరించిరి. వనచరులు భయంపడి పరువెత్తిరి.
నీలుఁడు వారి నిలువరించి కుంభకర్ణునిపై నొక శిఖరము
వైచెను. వాఁడు దానిని బిడికిటం దట్టెను. అది దాన శకల
ములై ధరఁ దొరఁగెను. ఋషభ శరభ నీల గవాక్ష గంధ
మాదనులను నైదుగురు కుంభకర్ణునిపై కడరిరి. అతనిం జుట్టు
ముట్టి పర్వతములు లోనగువానిచేతఁ బ్రహరింపసాగిరి. ఆ
దెబ్బలెల్ల నాతనిశరీరమునకు సుఖముఁ గల్గింపఁజాలెను గాని
కష్టము నొసంగఁ జాలవయ్యెను. కుంభకర్ణుఁ డంత ఋషభుని
రెండుచేతులఁ గౌఁగిలించుకొనినట్టులు నొక్కెను. దాన
నతఁడు నెత్తురుగ్రక్కుచు నేలఁ బడియెను. శరభుని నట్లే పిడి
కిటిపోటునఁ గొట్టి నీలుని మోఁకాలం గ్రుమ్మి గవాక్షుని గర
తలమునఁ బ్రహరించి గంధమాదనుని బాదప్రహారమున
నొప్పించి విజృంభించెను. వారా దెబ్బలకు నార్తులై రక్త
మును వెడలించుచు మూర్ఛమునింగి నేలపైఁ ద్రెళ్లిరి. వారి
పాటు గాంచి తక్కినవానరు లా రక్కసునిపై కడరిరి. వార
లాతనిపై కెక్కి దంతములం గొఱికి నఖంబులం గీఱి పిడికిళ్లం
బొడిచి మోఁకాలం గ్రుమ్మి బాధించిరి. వేలకొలఁదివానరులు

పయి కెక్కియుండఁగా నాతఁడు వృక్షములు గలపర్వతమువలె నుండెను. గరుత్మంతుఁడు సర్పములం దినునట్లు లాకుంభకర్ణుఁడు వానరులం బట్టుకొని తినసాగెను. పాతాళబిలముంబోలు నోట వేసికొనుచుండఁగా వారు వానినాసికావివరములనుండియుఁ జెవులనుండియు వెడలి రా సాగిరి. ఆవిధ మెఱింగి కోపమున విఱిచి తినసాగెను. ప్రళయకాలాగ్నివలె భయంకరాకారుఁడై యాకుంభకర్ణుఁ డొడలుతెలియక భూతలమును రక్తమాంస ములం దడుపుచు విహరించుచుండెను. వజ్రపాశధరు లగు నింద్రయములవలె శూలపాణియై యతఁడు వెలుంగుచు వనచర సేనాశుష్కకాననమును గాల్చుచుండెను. వానరు లనాథులై వికృతముగా ధ్వనింపసాగిరి. వార లపుడు శ్రీరాముని శరణు చొచ్చిరి.

వానరులు పాఱుటం గని మహాకోపమున నంగదుఁడు శిఖరమును బెకలించి రక్కసులు భయంపడునట్లు కుంభకర్ణుని శిరము పగులవైచెను. ఆదెబ్బ దుర్భరము కాఁగా మహా కోపమున మండిపడి యారక్షశ్శూరుఁడు మహాధ్వని యడర నంగదునిమీఁదికిం బరువిడెను. శూలమును వైచెను. యుద్ధ రీతులఁ జక్కఁగా నెఱింగిన యాయంగదుఁడు లాఘవంబున దానిం దప్పించుకొనియెను. అంత మానక దగ్గఱి యఱచేత నావైరివక్షము బాధింపఁబూని యడచెను. దాన నతఁడు మూర్ఛిల్లెను. కొంతసేపటికి తెప్పిఱిల్లి పిడికిలిం ద్రిప్పి యంగదుని బొడిచెను. దాన నంగదుఁడు మూర్ఛిల్లి నేలఁ బడియెను. అంతఁ గుంభకర్ణుఁడు శూలముం గొని సుగ్రీవునిపైకిం బోయెను. మహాశూరుఁడగు నాసుగ్రీవుఁడు

తనపైకిఁ గుంభకర్ణుఁడు రాఁగానే యుద్ధోత్సాహమున గంతు వేసెను. ఆమహాకపి పర్వతశిఖరము నెత్తుకొని గిరగిరం ద్రిప్పుచుఁ గుంభకర్ణునిపై కడరెను. వాఁడు వికారముగా నవయవములు కనంబడ నిలిచెను. వానరరక్తమునఁ దడిసిన దేహముగల యారక్కసుం గని సుగ్రీవుఁడు నీవు గొప్ప వీరులఁ జంపితివి. ఇతరాసాధ్యకార్య మొనరించితివి. వానరులం దింటివి. యశస్సు నార్జించితివి. ఇఁక వానరుల వదలుము. వా కల్పులు. వారితో నీకేల? నాపైకి రమ్ము. ఈపర్వతము నీపయిఁ బడవైతును. దీనిపాటు సహింపుము. అని యనెను.

ఆపలుకు లాలకించి కుంభకర్ణుఁడు నీవు బ్రహ్మ మనుమఁడవు. బ్రహ్మపుత్త్రుఁడగు ఋక్షరజుని కొడుకవు. పరాక్రమ ప్రఖ్యాతి గలవాఁడవు. ఇదంతయు మే మెఱింగినదియే. నీ వేల గర్జించెదవు. అనఁగా సుగ్రీవుఁడు మండిపడి వజ్రముపోని పర్వతమును గిరగిరం ద్రిప్పి వైచి యతనివక్షమునఁ బడవైచెను. అది వక్షమును దాఁకి చూర్ణమైనది. వానరులందఱు విషాదము నొందిరి. రక్కసులు సింహనాదములు చేసిరి. శిఖర స్పర్శమునకుఁ గోపించి నోరు దెఱచి యార్చుచు శూలముం ద్రిప్పి సుగ్రీవుని జంపువాంఛ వైచెను. హనుమంతుఁ డప్పుడే యచటికి వచ్చినవాఁడు గావున నాశూలమును వేగముగాఁ బట్టుకొని రెండుచేతుల విఱిచెను. శూలమట్లు విఱిగిపోవుటం గాంచి వానరు లార్చిరి. దాన మహాకోపమున లంకామలయ పర్వతమునుండి శిఖరమును బెకలించి సుగ్రీవుని సమీపించి దానిని వైచెను. ఆ యభిఘాతమునకు సుగ్రీవుఁడు సోలి భూమిపైఁ బడియెను. దానికి సంతసించి రక్కసు లార్చిరి.

అంత నారాక్షసవీరుఁడు పడియున్న సుగ్రీవునిచెంత కరిగి యాతనిం బట్టికొనిపోయెను. అట్లెత్తుకొనిపోవుచు నతఁడు చిక్కుటకచ్చెరువంది మింటఁజేయు దేవతాధ్వనుల నాలకించుచుం బోయెను అట్లు పోవుచు వీనిం బట్టుకొని పోయినయెడల రామలక్ష్మణులతో వనచరబలముల నెల్లం బట్టికొనిపోయిన ట్లగును. అనుకొనుచుం బోవుచుండ హనుమంతుఁ డందులకు వగచి యిఁక నేనేమి చేయవచ్చును ? ఏది న్యాయ్యమో యది చేయందగు పర్వతాకారుఁడనై వీనిం బొలియించెద వీనిం బిడికిటం బొడిచి దేహమును శకలములుగాఁ గావించి వధించి సుగ్రీవుని వదలింపఁగా వానరు లానందింతురు గాక. అంతియ కాదు, సుగ్రీవుఁడు దేవతలెల్ల నొక్కుమ్మడిగావచ్చి పట్టుకొన్నను విడిపించుకొన సమర్థుఁడు. పర్వతముల్రేటుసకుఁ దన్నుఁ దాఁ దెలిసికొనఁ జాలకున్నాఁడు. ఇంతలోఁ దెప్పిఱిల్లి, తనకుఁ గపులకు హితమెద్దియో దానిం జేయును. స్వామి కష్టములం జిక్కుపడఁగా భృత్యుఁడు విడిపింపవచ్చును గాని యట్లు నే నీతని నిపుడు విడిపింతునేని మహాశూరుండగు నీతనికిఁ గలుగు సంతుష్టికిఁ గొఱంతగా నుండును. శాశ్వతకీర్తియుం దొలంగును. ఆతనిపరాక్రమముపై భారము వైచియుందును. అతఁడు వచ్చుదాఁక వీరి నాశ్వాసించుచుందును. అని యూహించెను.

అని యాలోచించి యాహనుమంతుఁడు సేనలం బొఱ సీయక నిలిపెను. అంత నాకుంభకర్ణుఁ డిట్టట్టు కదలు నాసుగ్రీవు నెత్తుకొని లంకానగరమును బ్రవేశించెను. అత్తఱిఁ గపిరాజు మెల్లమెల్లన తెప్పిఱిల్లెను. అతికష్టముమీఁద మూర్ఛదేఱి

మహాబలశాలి వక్షమునందుండి నగరమార్గములం గాంచుచుఁ
దనలో నిట్లు పడియున్నాఁడనే. దీనికిం బ్రతీకార మెట్లు
చేయందగును ? ఎట్లు చేసిన వనచరులకు హితమో యట్లు
గావింతును. అని యూహించి తటాలునఁ దన తీక్ష్ణనఖరముల
నాకుంభకర్ణుని చెవులను గిల్లి దంతముల నాతనినాసికను
గొఱికి ప్రక్కలందు చెక్కలను మూఁపులను బాదముల
విదారించెను. ఆకుంభకర్ణుఁడు ముక్కు చెవులు పోయి
ప్రక్కలు విదారింపఁబడఁగాఁ గ్రుద్ధుఁడై తనువునం దెల్లకడల
రక్తము ప్రవహింప సుగ్రీవుని గిరగిరం ద్రిప్పి నేలపై వైచి
నలిపెను. వాఁ డెంత బాధించినను లెక్కింపక సూర్యపుత్త్రుఁడు
వియన్మార్గమున కెగిరి మరల శ్రీరామునికడకు వచ్చెను
ముక్కుచెవులు పోవఁగా నాకుంభకర్ణుఁడు మరల యుద్ధము
చేయఁ బోయెను. వైరి తప్పించుకొని పోవఁగాఁ గ్రుద్ధుఁడై
రణభూమికిం బరుగెత్తుచు నాయుధములు లేవని తలంచి భూరి
తరముద్గరము నొకదానిం గైకొని వానరబలములం జొరఁబడి
వారిని దినసాగెను. క్రోధావేశమునఁ దెలియక వానరుల
తోడ రక్కసులంగూడఁ దినసాగెను. తన్నుఁ బ్రహరించు
చున్నను వానిని లెక్కింపక యొక్కసారికి రెండుమూఁడు
నాల్గుగాఁ గపివ్రజమును దినసాగెను. వానిబాధల కోర్వఁ
జాలక కపులు రాముని శరణు చొచ్చిరి. పాఱుచున్నను వెంటఁ
దగిలి భక్షించుచుండెను. పరవీరహంతయగు నాసౌమిత్రి కుపి
తుఁడై కుంభకర్ణుని మాఱ్కొని యతనిమేన నేడుబాణములు
నాటించి మరల ననేకమార్గణముల వైచెను. వాని నారక్క
సుఁడు సరకుసేయక లక్ష్మణుని మీఱి యడుగులిడుతఱి భూమి

యద్రువ రామునిపైకిఁ గవిసెను. దాశరథి యాతని మిట్టిపాటు గాంచి భయదాస్త్రమును సంధించి యతనివక్షము గాడ నేసెను. అశ్లే పెక్కమ్ములం గ్రుచ్చెను. అవియన్నియు నాటుకొనఁగాఁ గ్రోధియై త్వరపడి రామునిపైకిఁ బరువెత్తివచ్చుచున్న యా రక్కసునినోటినుండి జ్వాలలు వెడలెను. రామాస్త్రవిద్ధుఁడై పరమక్రుద్ధుఁడై తన్నుం గాంచి వానరులు పాటిపోవుచుండఁగా సింహనాద మొనరించుచు వచ్చెను. మయూరపత్త్రాంకసాయకములను గుంభకర్ణునిఱొమ్మున నుచ్చిపోవ నేయఁగా నాతండు పరవశుం డగుటయు, నాతని చేతనున్నగదయు జాఱి నేలం బడియె. ఇతరములగు ఖడ్గాదిసాధనములన్నియు నేలం బడినవి.

అంతఁ గుంభకర్ణుఁడు తాను నిరాయుధుఁడనని యెఱింగి ముష్టిపాదఘాతముల సంగరము చేయఁబూనెను. అతనిశరీరమునుండి రక్తము కాలువలుగాఁ బ్రవహింపసాగెను. అతఁడు నిర్భరకోపమునఁ గపి భల్లూకముల భక్షించుచు సంగరరంగమునఁ గ్రుమ్మరుచుండెను. అత్తఱి నారక్కసుఁడు భయంకర పర్వతశిఖరమును లాగి త్రిప్పి రాముని లక్ష్యము చేసి వైచెను. అది తనచెంతకు రాకపూర్వమే కాంచనచిత్రితాతికఠోర నారాచపంచకమున దాని శకలములు గావించెను. కుంభకర్ణుఁడంత మండిపడుచు ద్విశత వానరవీరులపైకిం బరువిడఁగాఁ గని రాముఁడు సారసముల నాటి నేలఁబడ నొనరించెను. లక్ష్మణుఁ డతనిఁజంపు నాసక్తింగొని యందులకుం దగినయుపాయముల ననేకవిధముల నూహించుచు నన్నతో రామచంద్రా! వీఁడు రక్తగంధమున మత్తుఁడైయున్నవాఁడు. వానరులందఱు వీనిపైకినెక్కి నిలుతురుగాక. యూథనాథులు చుట్టు నిలిచి కదల

నీరయక పట్టియుందురు గాక. అత్తఱి వీఁడు దుర్భరభారపీడి తుఁడై కాలమున నేలంబడుటయే గాక మరల లేవఁజాలక మిగిలినవానరులం జంపక యుండును. అనఁగా విని వానరు లట్లే వానిపై కెక్కి నిలువఁబడిరి. వాఁడు వారెక్కుటకు మఱింత యాగ్రహించి వారినెల్లఁ జిమ్మివైచెను. రాముఁ డది చూచి వానిం జంపం దలంచి మేటి శరాసనము నందుకొని యతనిపైఁ గవిసెను. చూపుల నగ్నికణములఁ గురియించుచు నా రామమూర్తి భయంపడుకపులు సంతోషింప మహాసర్ప ముంబోని చాపమును సజ్యము చేసి వానరుల నూఱడించుచు లక్ష్మణుఁడు వెంట రాఁగా భయంకరాకారమునఁ గనంబడు నారావణానుజునిం జూచుచు నాతి సారించుచుండ నాధ్వనికి నోర్వఁజాలక కుపితుఁడై వేగముగాఁ దలపడియెను. రాముఁ డతనితో రాక్షసాధిపా! రమ్ము రమ్ము. విషాదము వదలుము. చాపమును ధరించియున్నాను. చూడుమా. ఇంద్రుని గెలి చితిననుకొందువేమో నే నింద్రుఁడను గాను. నన్ను రాము నిగా నెఱుంగుము. కొంచెకాలమున నసువుల విసర్జింతువు. చూడుమనియెను.

కుంభకర్ణుఁ డీతఁడే శ్రీరాముఁడని యెఱింగి వికారముగా నవ్వుచు రామునిపై కడరెను. రామా! నేను విరాధుఁడను గాను. కబంధుఁడను గాను. ఖరుఁడను గాను. వాలిని గాను. మారీచుఁడను గాను. నన్ను నట్టివారిలో నొక్కనిగాఁ దలఁప కుము. వారిం బోలియుంచితినని విఱ్ఱవీఁగకుము. కుంభకర్ణుఁడను. వచ్చితిని. ఈ భయంకరాయసముద్గరముం జూడుము. దీనిచే తనే పూర్వ మమరులం జెండాడితిని. ముక్కుచెవులు పోయి

నవానినిగాఁ దలంచి చులకఁగాఁ గనకుము. అవి పోవుటచే నాకు బాధలేదు. నాశరీరముపై నీపౌరుష మంతయుం జూపుము. పిదప నీశక్తి నెఱింగి.భక్షింతును అని యారాక్షస వర్యుఁడు పల్కఁగా విని రాముఁడు సుపుంఖనారాచములం బ్రయోగించెను. వానిచేఁ గొట్టఁబడియు నించుకంతయుం గలంగక దుఃఖితుఁడు కూడఁ గాక యుండెను సాలవృక్షము లేడు నేశరమున ఛేదింపఁబడినవో వానరపుంగవుఁ డగువాలియు హతుఁడయ్యెనో వజ్రములవంటి యాబాణము లిపుడుకుంభకర్ణునిశరీరమును గాసిపొందింపఁజాలక పోయినవి. రాముని బాణముల యుపవడిని ముద్గరము త్రిప్పుచు నాపుకొనుచు దానిచేత వానరబలమును బాఱఁదోలుచుండెను. అంతట శ్రీరాముఁడు వాయవ్యాస్త్రమును దీసి కుంభకర్ణునిపై వైచెను. అది వానిబాహువును ముద్గరాయుధసహితముగా ఖండించెను. బాహువు తెగి పడఁగా బ్రహ్మాండము బ్రద్దలగునట్లు ధ్వని చేసెను. పర్వతశిఖరమువంటి కుంభకర్ణునిబాహువు వానరుల పైఁబడి వారిం జంపివైచెను. చావఁగా మిగిలినవానరులు భయపడి దూరముగాఁ బరువెత్తిరి. ఆరక్కసుఁడు రెండవచేత నొకభూరుహమును బెట్టికి దానితో రణమొనరింప రామునిపై కడరెను. ఒకబాణమున నైంద్రాస్త్రమంత్రమును మంత్రించి సర్పశరీరాకారమై వృక్షముతోడఁ బయికెత్తఁబడియుండు కుంభకర్ణుని యా రెండవబాహువు నావృక్షముతోడ ఖండించెను. అది క్రిందఁబడి కదలి యనేక పాషాణవృక్షవానరుల నుగ్గు గావించెను. రెండుచేతులు తెగి యార్చుచుఁ దనపైకి రాఁగాఁ గాంచి యాకుంభకర్ణుని పాదములను దీక్ష్ణములగు

నర్ధచంద్ర బాణముల రెండింటిని దీసికొని నాఁ లాగివైచి ఖండించెను. పాదములు పడునప్పటి ధ్వని లంక నిండిపోయెను. కర పాదము లట్లు తెగఁగా బడబాముఖమువంటి నోరు తెఱచి గర్జించుచు మిగిలియున్న తొడలతో రామునిం దలపడెను. సువర్ణచిత్రిత బాణముల నాతనినోటినిండ వైచెను. కోయని యార్చి మూర్ఛిల్లెను. అంత రాముఁడు సూర్యకిరణములవలె వెలుంగు మహత్తర శక్తిసంపన్నమగు నైంద్ర బాణమును సంధించివైవఁగా నది కుంభకర్ణునిపై కడరి యతనిమస్తకమును ఖండించెను. రాత్రియం దుదయించి పునర్వసునక్షత్రముల రెండింటి నడుమనుండు చంద్రునివలె నాతనిశిరస్సు నభమున కెగిరినపుడు కనఁబడెను. అది కుండలాలంకృతము. ఆతని మొండెము క్రిందఁబడునపుడు వేలకువేలుగా వానరులు కూలిరి. దేవతలు సంతోషము పేర్మి సింహనాదము లొనరించిరి. అంబరముననుండి దేవాదులు శ్రీరామునిపౌరుషమును గొనియాడిరి. కుంభకర్ణుని వెంటనుండు రాక్షసులు భయంపడి వికృతారావములు గావించిరి. వానరులందఱు శ్రీరాముని బూజించిరి. ఆ రాముఁడు నాతనివధమునకు సంతుష్టి నొందెను.

మహామతులారా! ఈభాగమునఁ గలవిశేషముల వెదకుదము

> "ప్రజాపతేస్తు పౌత్రస్త్వం తథైవర్క్షరజస్సుతః. 
> శ్రుతపౌరుషసంపన్నస్తస్మాద్గర్జసి వానర," 

—అని మూలము. కుంభకర్ణుఁడు సుగ్రీవునితోఁ దెల్పువాక్య మిది. సూర్యపుత్త్రుఁడు సుగ్రీవుఁడని మన మింతకుముందు

రామాయణమునం జదివితిమి.

"చతుర్ముఖబ్రహ్మజృంభణ జనితఋక్షరజః పుత్రత్వా త్సుగ్రీవస్య బ్రహ్మపౌత్రత్వమ్."

అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి.

"పురాకిల బ్రహ్మణో జృంభమాణస్య వదనాత్ ఋక్షరజా నామ వానరో జాతః. స కదాచిత్ పర్యటన్ బ్రహ్మలోకే అప్సరోరూపకారిణి కస్మింశ్చిత్సరసి నిమజ్యాప్సరోరూప మభజత్. తాం దృష్ట్వా కామమోహితా వింద్రాదిత్యౌ హస్తేన యుగపద్గృహీతాం. తత్రాంతరే తయోః క్షుభితం రేతోऽపతత్. తత్ర ద్వౌ కుమారావభవతాం వాలే పతనాద్వాలీ, గ్రీవాయాం పతనాత్సుగ్రీవః. తం దృష్ట్వా ప్రహస్య బ్రహ్మా అప్సరోరూప ధారిణం ఋక్షరజసం యథా పూర్వరూపప్రాప్తయే కుమారౌ చ గృహీత్వా అన్యస్మిన్ వానరరూపకారిణి సరసి నిమజ్జేత్యభ్యధాత్. సోऽపి తథా కృత్వా కుమారాభ్యాం సహ వానరరూప మభజదృక్షరజాః. తత్పుత్రౌ వాలిసుగ్రీవావితి."

అని గోవిందరాజులు వ్రాసిరి. ఈవిషయ ముత్తరకాండమున విమర్శింపవలసి యుండును. దిఙ్మాత్ర మిందుఁ దెలిపెదను.

ఒకసరస్సున స్నానముచేసిన స్త్రీరూపము వచ్చునవనియు, నొకసరస్సున మునింగినఁ బురుషరూప మలవడుననియు నిందుఁ గనంబడును. ఇది యిక్కాలపు నాగరికులకు నవ్వుపుట్టింపక మానదు. అది యోగసిద్ధులలో వాక్సిద్ధి యని పిల్వఁబడునది. ఆసిద్ధి గలవారిశాపమే ఫలవంత మగును. అది లేనిచో శాపము నిష్ఫల మగును. ఒకానొక కారణమున నొకమహాత్ముఁ డొక సరస్సున కెవరిమూలముననేని పీడ సంభవింపఁగా నిందు మునింగినవారు స్త్రీ లగుదురని శపించి యుండవచ్చును. అది తెలియక యెవఁడే మునింగిన నా వాక్కుప్రకారము స్త్రీ

యగును. అట్లే పురుషుఁడును. వాక్సిద్ధి యెల్లర కనుభవమునఁ దెలిసియుండుకాలమున నిది యవిశ్వాసపాత్రము కాదు. ఇపు డాసిద్ధియే యున్న ట్లెవ్వరు నెఱుంగనికాలము కావున విశ్వాస మును గల్గఁజేయుట కష్టసాధ్యము. అంతియగాక యసాధ్యము కూడ నగును. రామాయణమున ఇలునివృత్తాంతమునందు నిది కనఁబడును. ఇట్టివిషయములు పామరులు మెచ్చునట్లు బోధిం చుట నమ్మునట్లు చేయుట శక్యముగానిపనియే యగును. భగవ ద్గీతలలో శ్రీకృష్ణునివిశ్వరూపదర్శనము కూడ నీపట్టికిలోఁ జేర్పఁదగినదియే యగును కనుక బుద్ధిమంతులు యోగవిషయ మునఁ జక్కనికృషి చేసినయెడల నిట్టివి సామాన్యములనియు, నిం దచ్చెరువనఁదగినదియే లేదనియు స్ఫురింపక మానదు.

"అతిచక్రమ్య చ సౌమిత్రిం కుంభకర్ణో మహాబలః,
రామ మేవాభిదుద్రావ దారయన్నివ మేదినీం." ౧౦౨

అని మూలము. లక్ష్మణుఁడు తన్ను బాణములఁ బీడించుచుండఁగా నాతనిం గొట్టక మాటలాడక రాముని గూర్చి పరువెత్తెను. తన శరీరమున లక్ష్మణబాణములు నాటినవి. వానిని లెక్కింపక పోయెననఁగా భావ మేమి? రామునిచే మృతినిఁగోరి తానున్నం దున నెపుడెపు డాపని ఫలించునా యని గోరి రామునిపై కడరెనని కదా యూహించు టుత్తమము. మన మాతని యప్పటి శరీరాహారములను బరికించి దూషింపరాదు. కారణో పాత్తదేహునిగా నాతని భావించి యందులకుఁ దగిననిదాన మాలోచించితిమేని తత్త్వము తెలియఁగలదు.

"ఆగచ్ఛ రక్షోధిప మా విషాద
మవస్థితోఽహం ప్రగృహీతచాపః,

అవేహి మాం శక్రసపత్న రామం
మయా ముహూర్తాద్భవితా విచేతాః." ౧౩౹

అని మూలము. ఇవి రామునివాక్కులు. విషాద మొందక కుము. రమ్ము. ధనుర్ధారినై యున్నాఁడను. నన్ను రామునిగా నెఱుంగుము. ముహూర్తమే నీకాయువు గలదు. పిదపఁ గూలఁగలవు. అని కదా యిందలి యర్థము దీనిసార మేమి? కుంభకర్ణా! మిమ్ము వధించుటకే పూర్వమిచ్చిన వాక్కననుస రించి యవతరించితిని. కేల ధనుస్సును బూనితిని. రమ్ము. రామునిగా నన్నెఱుంగుము. అనఁగా లక్ష్మణుఁడను కాను. నాచే మృతి గదా మీరు కోరితిరి. ఆవిష్ణుమూర్తియే నేనని నమ్ముము. అని రాముఁ డాతఁడు యుద్ధపారవశ్యమున నుండఁగా బోధించెనని కదా యూహింపం దగును? దీనింబట్టి పామరు లనుకొనునంత మూర్ఖుఁడు కుంభకర్ణుఁడు కాఁడని స్పష్టము. ఇఁకఁ దరువాతికథను బఠింతము.

### రావణుఁడు కుంభకర్ణనిమృతికై వగచుట.

* రాక్షసులు రామునిచేతఁ గుంభకర్ణుఁడు హతుఁడు కాఁగాఁ బరువెత్తి రావణునకుం దెల్పిరి. ఆతని పరాక్రమకా ర్యములు తెలిపి మృతిని గూడఁ దెల్పిరి. విన్నంతనే శోకసము ద్రమున మునింగి నేలంబడెను. పినతండ్రిమృతి నెఱింగిన నరాంతకత్రిశిరసులు నతికాయుఁడు రోదనము చేసిరి. మహో దరాదులు వగలఁ బొగిలిరి. రావణుఁ డెట్లో తెలివినొంది

* ఇది యఱువదెనిమిదవసర్గమునఁ గల కథ.

కీనుఁడై హా! వీరాగ్రగణ్యా! యని పేర్కొని యాతని యత్యా
ద్భుతకార్యములు తలంచుచు నిట్టి నీవొక మానవమాత్రునిచేఁ
జంపఁబడితివి కదా యని విలపించెను. నాయనా! నీవు పడఁగా
దేవతలు ఋషులు లోనగువారు సంతోషమున సింహానాద
ములు చేయుచున్నారు. నీవు లేని యీరాజ్యము నాకేల? సీత
యేల? నే నిఁక నాసోదరుం జంపిన రాముని వధింపనేని వ్యర్థ
మగు నీబ్రదుకు నా కించుకంతయు మేలు గాదు. మరణమే
యత్యుత్తమము. నాతమ్ముఁ డెపు డెచ్చటికిఁ బోయెనో నేను
నచ్చటికే పోవుదును. వానిని వదలి క్షణమైన బ్రదుకను.
ఇపుడు దేవతలు తమకు మున్నపకారముచేసిన నన్నుఁ గని
నవ్వుదురు. కుంభకర్ణా! నీవు హతుఁడ వైతివి ఇంద్రునింక
నేనెట్లు జయింపఁ గలను? మహాత్ముఁడగు విభీషణుఁడు నా
మేలుగోరి తెల్పినమాట యిపుడు యథార్థముగ నున్నది. అజ్ఞా
నమున నపుడు గ్రహింపనైతిని. ప్రహస్తకుంభకర్ణులు పడినదా
దిగా విభీషణోక్తి నన్నుఁ బీడించుచునే యున్నది. ఆమహాత్ముని
బాఱఁదోలితినే. ఆ యకార్యజనితపాపమే దుఃఖముగా నిపు
డనుభవమునకు వచ్చినది. అని విలపించుచు నిర్భరార్తిచే సోలి
నేలం బడియెను.

## రావణాజ్ఞచే మహోదరాదిరాక్షసులు యుద్ధమున కరుగుట.

* రావణుఁ డిట్లు శోకమునఁ బొక్కుచుండఁగాఁ ద్రిశి
రుఁడు రాజేంద్రా! కుంభకర్ణుఁ డపారబలశాలి యైనను దైవ

* ఇది యిఱువదితొమ్మిదవసర్గమునఁ గలదు.

వశమున హతుండయ్యెను. దానికి మీవంటిసత్పురుషులు విల పింపరు. ముల్లోకములకు నీవొక్కండవే చాలుదువు. అట్టి నీవు ప్రాకృతునిగా నిన్ను భావించుకొని దుఃఖింపనేల? నీకు నలువ యిచ్చినశక్తియుఁ గవచబాణకార్ముకములు సహస్రాశ్వ తరయుక్తమగు మహారథము గలవు. ఒకప్పు డాయుధములు లేకయే దేవదానవులం బాఱందోలియున్నావు. ఇఁక సర్వా యుధములం దాల్చిన రాముని నడంపఁ జాలుదువు. ఇందే యుండుము నేను రణమునకుం బోయెద. గరుత్మంతుఁడు పాములంబోలె నీశత్రువుల నిర్మూలింతును. ఇంద్రుఁడు శంబరా సురుని విష్ణువు నరకాసురుని గెల్చినట్లు రామునిం బడవైచి గెలుపంది వత్తును. ఆమాట లాలకించి కాలచోదితుం డగుటం జేసి రాముని గెలువ శక్యమా యనుకొనక శక్యమే యనుకొని యెను. అంత దేవాంతక నరాంతకులు నతికాయుఁడు నను రావణునికుమారులు నేను నేనని సింహనాదములు చేయుచు యుద్ధమునకుఁ బోవ నుద్యుక్తులైరి. రావణుఁ డత్తఱిఁ గొడు కులం గౌఁగిలించుకొని భూషణముల నలంకరించి యాశీర్వ దించి యుద్ధమునకుఁ బనిపెను. వారికిందోడుగాఁ దనసోదరుల మహోదర మహాపార్శ్వులం బంపెను. వారు తండ్రికి నమస్క రించి ప్రదక్షిణముగా రణమునకుఁ బయనమైరి. వారాఱుగురు నాయుధప్రహారముల బాధల నివారించునట్టి యోషధుల నట్టి నానావిధగంధములం బూసికొని సంగరోత్సాహ ముబ్బు చుండఁగా వెడలిరి. మహోదరుఁడు మహాగజము నెక్కెను. రావణాత్మజుఁడు త్రిశిరుఁ డుత్తమాశ్వయుక్తరథము నధిరో హించెను. మూఁడు శిరస్సులందు మూఁడు కిరీటములు వెల

యఁగా హిమవంతమువలెఁ బ్రకాశించెను మేటివిలుకాఁడగు నతికాయుఁడు మహారథము నధిష్ఠించెను. అందు సకలాయుధములు తళతళలాడుచుండెను. నరాంతకుఁ డుచ్చైశ్శ్రవము వంటి శ్వేతాశ్వము నెక్కెను. దేవాంతకుఁడు వజ్రభూషిత పరిఘమును గరమునఁ గీల్కొల్పి ప్రకాశించెను. మహాపార్శ్వుఁడు గదాయుధ భూషితకరుఁడై వెలింగెను. వారి వెంట ననేక యోధులు వాహనారూఢులై వెడలిరి. యుద్ధమున మదించియుండువారు గాన సింహనాదములు చెలంగ బాణముల వదలుచు లాఘవమున వానిని మరలఁ బట్టుకొనుచు భూమి యద్రువఁ బోయిరి. శిలాతరుహస్తులగు వానరులం గాంచిరి. వానరులు నీలమేఘప్రతీకాశులయి వచ్చు రక్షస్సైన్యమును గాంచి పరాక్రమము నెఱపునద నొదవెనని భూరిశైలముల నెత్తుకొని సింహనాదము లొనరించుచు రక్కసులం గాంచి యోర్వలేక గర్జించుచుండిరి. రక్కసులును వారిసంతోషము కినుకఁ గల్గింప మఱింతగా నార్చిరి. అన్యోన్యము తలపడ సిద్ధముగా నుండిరి వానరులు కొంద ఱంబరమున నిల్చియుఁ, గొందఱు క్రిందనుండియు రక్కసుల మార్కొనిరి. వారును దలపడఁగా నాపోరు ఘోరాకారముగాఁ గానంబడియెను బాణముల లెక్కింపక వృక్షశిలాదులఁ బ్రయోగించుచు వానరులును, వృక్షశిలాదుల లెక్కింపక బాణములఁ బ్రయోగించుచు రాక్షసవీరులు పోరాడసాగిరి. రథికులపై కెగిరి కొందఱు కపులు వారిం జంపిరి. రక్కసులు బాణముల వైచియు ఖడ్గప్రాసాదులఁ బొడిచియు, నస్త్రములం బ్రయోగించియు వానరుల వధించిరి. ఆసంగరము దేవాసుర

సంగ్రామమును మించి రక్తప్రవాహములు పాఱుచుండఁగాఁ జూడ దారుణముగా నుండెను. ఆ దొమ్మియుద్ధమునందు వానరు లుబ్బున రక్కసులం జంపుటం గాంచి దేవతలు ఋషులు సంతోషించిరి.

అంత నరాంతకుఁడు వాయువేగముగల గుఱ్ఱము నెక్కి శక్తిని గొని వానరసేనం జొచ్చెను. అతఁడు ప్రాసముచేత నేడువందలవానరులం బొలియించెను. తక్కసేనను గలఁత నొందఁ జేసెను. ఆతని మార్గణాసారమునకుఁ బర్వతాకారము గలవానరులు కూలిరి. మార్కొని తమపరాక్రమము చూపఁ దలంచునంతలో వారి నానరాంతకుఁడు చంపుచుండెను. వాఁడు ప్రాసమును ధరించి సేనలం గాల్చుచుండెను. కపులు వృక్షములు లోనగువానిని బెకలించునంతలో ప్రాసహతింబడి చచ్చుచుండిరి. తుదకు వాని మార్కొననైనఁ జాలకయుండిరి. కొందఱు మూర్ఛదేఱి సుగ్రీవు నాశ్రయించి యుద్ధవిముఖులై యుండిరి. సుగ్రీవుఁడు నలుదెసలఁ బరికించుచు భయమునం బాఱు వనచరులం గాంచెను. వారివెంటం బరుగిడు నశ్వారూఢుని నరాంతకునిం గని యంగదుం గాంచి కుమారా! నీవు పోయి యారాక్షసుని మార్కొని వధించి రమ్మని యాన తిచ్చెను. కేవల నఖదంతాయుధుఁ డయియే నరాంతకుని జేరంబోయి రాక్షసా! ఎందుఁ బాఱెదవు? నిలువుము. వజ్రసారమగు నీప్రాసమును నావక్షముపైఁ బ్రయోగింపుము అనఁగా నా నరాంతకుఁడు వాలితనయునిమాటల నాలకించి యాడుగఱచుచుఁ ద్రాఁచువలె బుసకొట్టుచు నిర్భరక్రోధా

పిష్టుఁ డయ్యెను. వెంటనే యతని సమీపించి జ్వాలామాలికల వెదఁజల్లుప్రాసమును ద్రిప్పి యతనిపై వైచెను. అది వజ్ర తుల్యమగు నాయంగదుని వక్షమును దాఁకి శకలములై నేల పయిం బడియె. అది పడుటం గాంచి కరతలంబెత్తి వాని యశ్వశిరమును జఱచెను. పర్వతాకారమగు నాగుఱ్ఱము రక్త ముం గ్రక్కుచుఁ బడి యసువులం బాసెను. దానికి మఱింత యాగ్రహించి పిడికిటఁ దలఁ బొడిచెను. అంగదుఁ డానరాం తకుని పిడికిటిపోటునకుఁ దల పగిలి వేఁడిరక్తము చిమ్మఁగా మండిపడి మూర్ఛిల్లి తుదకుఁ దెలివొంది నరాంతకునిబలమున కిచ్చెరువంది వజ్రముం బోని పిడికిట నరాంతకునివక్షము పగులఁ బొడిచెను. దాన రక్తము ప్రవాహములుగాఁ బాఱ నేలఁగూలెను. ఇట్టు లాదనుజుఁడు హతుఁడు కాఁగా దేవతలు వానరులుకూడ జయజయనినాదములు కావించిరి. ఆమహా కృత్యమునకు శ్రీరాముఁ డచ్చెరువు పడెను. దాన బలోత్సా హములు మిక్కిలి కాఁగా మరల నంగదుఁడు యుద్ధాభిముఖుఁ డయ్యెను.

మహనీయులారా! ఈభాగములనుండి గ్రహింపఁదగిన విషయము లంతగా లేవు. కాని దుష్టసిద్ధాంతముల నామో దింపవలదనుటకుగాఁ గొలఁది మాటలు వ్రాయుచున్నాను. కుంభకర్ణునియుద్ధమును జదివితిరి నరాంతకుని సంగరపద్ధతియుఁ బఠించితిరి. ఇట్టి యుద్ధమార్గములు భారతమునఁ గలవా? కోఁతులను భల్లూకములను గుంపులుగుంపులుగా భక్షించు వారు భారతమున నెందఱు కానరారు. ఒకరిద్ద ఱున్నను వారు

మానవమాత్రభక్షకులు. మనుష్యమాంసము దొరకిననాఁడు పండువని భావించువారు. రామాయణకాలమున సకల జంతు భక్షకులు లెక్కకు మించి యుండిరి. మూఁడుతలలు గలవాఁడు భారతకాలమునందుఁ గానరాఁడు. మునులు నిశ్చయముగా భారతకాలమునఁ దిరిగెడివారు. రామాయణకాలమునఁ గొండ గుహాలలో గండోపలములచాటున వృక్షములకు సడుమ నుండు రంధ్రములలో నుండెడివారు. అగస్త్యాదు లేకొలఁది సంఖ్యాకులో ఎట్టివారినైన వాఙ్మాత్రమున భస్మముచేయ సమర్థులగువారు తప్పఁ దక్కిన మునులు వనుల సంచరింపఁ జాలకుండిరి. విరాధుఁడు దను కబంధుఁడు మొదలగువారివంటి వికారరూపులు భారతకాలమునఁ బ్రసిద్ధముగాఁ గనరారు. లంకలో సీతాదేవికడఁ గావలియుండు స్త్రీలరూపము లబ్బురము గొలుపకపోవు. ఏకపాది లోనగువారు లక్షలకొలంది నున్నయట్లు కనుపట్టు. భారతకాలమున నట్టివార్తలు వినరావు. కావున మహాభారతము రామాయణకాలమునకంటె నెంతె కాలము వెనుకనో సాగినట్లు కనుపట్టక పోదు. ఏవిషయమును గాంచినను భారతకాల మర్వాచీనమని స్పష్టమగును. ఇఁకఁ దరువాతివిషయమునకుఁ గడంగుదము.

## దేవాంతకాదులు మృతినొందుట.

* నరాంతకుఁడు నిహతుఁడు కాఁగా రాక్షసవీరుఁడగు దేవాంతకుఁడు, పులస్త్యవంశజుఁడగు త్రిశిరుఁడు మహోద

* ఇది డెబ్బదియవసర్గమునఁ గల కథాభాగము.

రుఁడు వగచిరి. మహోదరుఁడు గజవర్యము నెక్కి యంగదుని
పై కడరెను. తోఁబుట్టువుచావునకుఁ బొక్కుచుఁ బరిఘమును
గొని యంగదునిపైకి దుమికెను. త్రిశిరుఁడు దివ్యరథము నారో
హించి యంగదునే మాఱొక్కొనియెను. అట్లు మేటిదానవు లంగ
దునిపైకిఁ దలపడఁగా నాయంగదుఁడు పెద్దవృక్షము నొకదానిం
బెకలించి వేగముగ దేవాంతునిపై విసరివేయఁగాఁ ద్రిశిరుఁడు
కృష్ణసర్పముం బోని బాణములచే నావృక్షమును భేదించెను.
దానిపాటు గాంచి వాలికొడుకు పైకెగరి వృక్షపర్వతములను
వర్షముగాఁ గుఱియించెను. త్రిశిరుఁడు మిక్కిలి క్రుద్ధుఁడై ఆ
వర్షము నాపెను. దేవాంతకుఁడు పరిఘాగ్రమున నావృక్షము
లను దట్టివేయుచుండెను. మఱియు నాత్రిశిరుఁడు మోహరించి
బాణములను గురిపించెను. మహోదరుఁ డాగ్రహించి గజము
నంగదునిపైకిఁ దోలించి తోమరముచే నంగదునివక్షమును
బాధించెను. దేవాంతకుఁడు వేగవంతుఁడు కావునఁ బరిఘమున
నాయంగదు నొప్పించి సందుదొరకుటకై వెనుకకుఁ బోయెను.
అంగదుఁ డట్లు మువ్వురు రాక్షసు లొక్కపెట్టునఁ దల
పడినను వ్యథనొందక పైకెగిరి మహోదరునిగజమును గట్టిగా
నఱచేతఁ జఱిచెను. అది దాన బిట్టుగూసెను. అంత నంగదుఁడు
దాని దంతమును లాగి దేవాంతకునిమీఁదికి దుమికి యాతనిం
గొట్టెను. అతఁడు దానిప్రేటును భరింపఁజాలక రక్తము
గ్రక్కెను. కష్టమునఁ దెప్పిఱిల్లి పరిఘముం ద్రిప్పి యంగదుని
గొట్టెను. ఆదెబ్బకు మోఁకాళ్లు నేలఁ దాఁక బోరగిలంబడి
వెంటనే లేచెను. త్రిశిరుఁ డంగదుఁడు లేవఁగాఁ గాంచి వాఁడి
బాణములు మూఁడు తొడిగి నొసటం గ్రుచ్చుకొన నేసెను

ముగ్గురొక్కనిఁ జుట్టుముట్టియుండం గాంచి హనుమంతుఁడు నీలుఁడును దోడుపడ వచ్చిరి. నీలుఁడు త్రిశిరునిపై నొక పర్వతశిఖరమును వైవఁగా రావణపుత్త్రుఁడు బాణముల వానిం ద్రుంచెను. అది శకలము లయ్యెను. దానికి నుబ్బి పరిఘమును గొని హనుమంతునిఁ దలపడియెను. తనపైకి దేవాంతకుఁడు రాఁగా వానిపై కెగిరి పిడికిట వానిశిరస్సు పొడిచి సింహనాద మొనర్చెను. ఆపోటునకుఁ దాళఁజాలక నేలం బడియెను. దేవాంతకుఁడు పరమదుర్జయుఁడయ్యు హతుఁడు కాఁగా నా త్రిశిరుఁడు నీలునివక్షముపై ననేకబాణములం గురియించెను. మహోదరుఁడు నాగ్రహమున మఱియొకగజము నెక్కి రణభూమి కరుగుదెంచెను. మేఘము వాన గురియునట్లు నీలుని వక్షమున బాణములపరంపరం గురియించెను. నీలుఁడు కదలఁ జాలక యట్టె యుండెను. కొంతవడికిఁ దెలివొంది వృక్షకదంబముగానుండు కొండను పెకలించి దానితో మహోదరునిశిరస్సును గొట్టెను. ఆవ్రేటునకుఁ దాళఁజాలక యాతఁ డసువుల వదలెను.

పినతండ్రియగు మహోదరుఁ డనిఁ బడఁగాఁ ద్రిశిరుఁడు మిక్కిలికోపమున ధనుస్సంది హనుమంతుని దీవ్రనారాచముల నొప్పించెను. ఆతఁ డాగ్రహించి పర్వతశిఖరమును బ్రయోగించెను. దానిం ద్రిశిరుఁడు తీక్ష్ణబాణముల ఖండించెను. హనుమ యాగ్రహించి వృక్షవర్షమును గురియించెను. దాని నడుమన త్రుంచి సింహనాద మొనర్చెను. ఆంజనేయుఁడు క్రుద్ధుఁడై పై కెగసి త్రిశిరునిగుఱ్ఱములను నఖంబులం జీల్చి

వైచెను. త్రిశిరుఁడంత యముఁడు కాళరాత్రింబోలె శక్తిని గైకొని హనుమపై వైచెను. అది వచ్చి తన్నుఁ దాఁకక మునుపే దాని నొడిసి పట్టుకొని సింహనాద మొనరించెను. ఆ శక్తి యట్లగుటకు వగచి ఖడ్గమును గైకొని హనుమంతుని ఱొమ్మును గుఱిచూచి వైచెను. దానిచేఁ గొట్టఁబడి త్రిశిరుని వక్షస్థ్సలమును గరతలప్రహారమున నొప్పింప మూర్ఛితుఁడై చేతనుండు నాయుధములు పడిపోవ భూమిం బడియెను. మూర్ఛిల్లి యతఁడు పడుచుండఁగా నతని చేతిఖడ్గమును వేగముగాఁ గైకొని రక్కసులు భీతిల్లునట్లు సింహనాద మొనరించెను. అంతలో స్మృతిరాఁగా నాత్రిశిరుఁడు సహింపఁజాలక హనుమపైకి లంఘించెను. వెంటనే యాహనుమంతుఁ డిడి కిటం బొడిచెను. దానికి మిగుల నాగ్రహించి త్రిశిరుని గిరీటముతోఁ బట్టుకొని తళతళలాడు నాఖడ్గముచే వానిశిరస్సుల మూఁడింటిని ఖండించెను. అవి మూఁడును భూమిపయిం బడినవి. వానరు లాచిత్రముం గని సింహనాదము లొనరించిరి. రక్కసు లన్నిదిక్కులకుం బాఱిపోయిరి.

ఇట్లు త్రిశిరఃప్రభృతులు హతులు కాఁగా మహాపార్శ్వుఁడు విశేషించి క్రుద్ధుఁడై మేటిగదాయుధముం గైకొని దిగ్గజములకుంగూడ భయమును గల్గించుచుండుదానిచే వానరులం బొలియింపం బూనెను. అంత ఋషభుఁడు మహాపార్శ్వునిం జేరి వానిముందు నిలువఁబడియెను. మహాపార్శ్వుఁ డాఋషభునిం గని కోపమున నాగదచే వక్షము నడఁచెను. దాన రక్తము స్రవించెను. చాలసేపటికిఁ దెలివొంది యాతని

గదపైకిఁ బరువెత్తెను. మహావేగమున దాని లాగుకొని గిర గిరం ద్రిప్పి యారక్కసునే గొట్టెను. దాన నొసలు పిండి కాఁగా నేలంబడియె. వానిపాటు గాంచి రక్కసులు పాఱి పోయిరి. ఉన్మత్తుఁ డనంబడు మహోదరుఁడు తనతోడఁబుట్టువు మహాపార్శ్వుఁడు చావఁగాఁ బెనుకోపము నొంది గదంగొని వానరులం బాఱఁదోలుచుండ గవాక్షుఁడు కొండ నొకదానిం బెకలించుకొని వానిని దానఁ జంపఁదలఁచి మూర్కొనిరొయెను. ఆతనిరాకం గాంచి గదచేత నాకొండను బిండిచేసెను. దాని కచ్చెరువంది యాగవాక్షుఁడు గర్జించెను. రాక్షసుఁ డోర్వఁ జాలక గదచే నాతనిఱొమ్మును బాధించెను. గవాక్షుఁడు మూర్ఛ మునింగిపడియెను. క్షణమున మూర్ఛదేఱి యున్మత్తు నెత్తిపై నఱచేతం గొట్టెను. దాన వాఁడు ప్రాణములు పోవం బడియెను. రాక్షసులు పాఱిపోయిరి.

## అతికాయునివధము.

* వారలపాటు గాంచి దేవాసురుల నెన్నియోసారు లోడించిన యతికాయుఁడు కోపము నొందెను. ఇంద్రశత్రు వగు నయ్యతికాయుఁడు సహస్ర సూర్యసంకాశంబగు నర దము నెక్కి వానరులపైకిఁ బోయెను. సర్వాలంకారశోభిత కాయుఁడై ధనుర్జ్యాఘోషము దిక్కులఁ బ్రతిధ్వనింపఁ జేయ సింహనాద మొనరించి వనచరవరులఁ గంపింపఁజేయుచు వీఁడు కుంభకర్ణుఁడే యగును. మరల నరుదెంచెడునని కోఁతులు

---

* ఇది డెబ్బదియొకఁడవసర్గమునఁ గలదు.

భయంపడి యొకరినొకరు నాశ్రయించి దాఁగియుండఁ గొందఱు పాఱ నందఱుం బరుగిడి శ్రీరాముని శరణుచొచ్చిరి. మహారథము నధిరోహించి భూరితరశరీరమున వచ్చు నతికాయుని శ్రీరాముఁడు చూచెను. ఆతని శరీరసౌష్ఠవమున కాశ్చర్యపడి రాముఁడు వానరుల నాశ్వాసించి విభీషణునిం గని పర్వతాకారుఁడై చాపమును దాల్చి సింహదృష్టిరాలనుండు నీతఁ డెవ్వఁడు? సహస్రాశ్వయుక్తస్యందనమునఁ గూరుచున్న వాఁడు? రథమున భయంకరములగు ప్రాస తోమరాద్యనేకాయుధములు మెఱయ నీశ్వరునివలె మెఱయుచున్నాఁడు. మృత్యుజిహ్వలం బోలె రాజిల్లు స్యందనశక్తులంగూడి విద్యుద్విరాజితమేఘమువలె వెలుంగుచున్నాఁడు. వీఁ డెవఁడు? చాపములెల్ల సజ్యములై యంబరమున నింద్రచాపములం బోలి దివ్యస్యందనమునఁ బ్రకాశింపఁ జేయుచున్నవి. ఈ రథికవర్యుఁడు భాస్కరుని మించి వెలుంగుచున్న రథముపై నధివసించి యుద్ధరంగమును వెలిఁగించుచు నరుదెంచుచున్నాఁడే? ఎవఁ డీయసురశ్రేష్ఠుఁడు? రవి కిరణములం గ్రిందుచేయఁజాలి నిగనిగలాడు బాణముల దశదిశల నలరించుచు ధ్వజాగ్రముననున్న రాహువుచే నెంతయు వింతగ నున్నవాఁడు. ఈతని చేతనుండు కోదండము ఆదిమధ్యాంతభాగముల వంగి గర్జితమువంటి జ్యానిస్వనమొప్పఁ గనంబడుచున్నది. సకలాయుధము లుచితస్థానముల నరదంబున నమర్పఁబడియున్నవి. మంచినేత్రములు గలిగి వీని ముఖము కుండలములఁ గొండాడఁబడుచు నుంటం జేసి పునర్వసునక్షత్రముల నడుమనుండు నిండుచందురుని బింబమువలె నున్నది. వీనింగని కపులు దెసలకు నొకరితో నొకరు భాషింప

కయే పరుగిడుచున్నవారు. ఇట్టి రాక్షసోత్తముఁ డెవ్వఁడో నాకుం జెప్పుము. అని ప్రశ్నించెను. విభీషణుఁ డామాటలు విని రావణునకు నీతఁడు కుమారుఁడు. రణరంగమునఁ బితృతుల్యుఁడు. వృద్ధుల సేవించి విద్యావంతుఁడై సకలాస్త్రవిదుత్తముఁడై గజహయరథారోహణదక్షుఁడై ఖడ్గవిద్యయందును ధనుర్విద్యయందును రాజనీతులయందును యుక్తిమంత్రాలోచనములయందును సమర్థుఁడు. ధాన్యమాలిని కుమారుఁడు. అతికాయుఁడని వీనిం బిలుతురు. వీని బాహుబలమున లంకాపురము నిర్భయముగా నుండును. ఈతఁడు తపస్సానరించి బ్రహ్మ నుపాసించి దివ్యాస్త్రములను సంపాదించి శత్రువులను జయించినాఁడు. వీనికి బ్రహ్మదేవాసురులచే మృతి కలుగకయుండునట్లు వరమిచ్చినాఁడు. మఱియు దివ్యమగు నీకవచము నీరథము ననుగ్రహించెను. పెక్కుసారులు వీఁడు దేవదానవుల నోడించి రాక్షసుల సంరక్షించియున్నాఁడు. యక్షులం జంపియున్నాఁడు. ఇంద్రునివజ్రాయుధమును యుద్ధమున స్తంభింపఁ జేసినాఁడు. వరుణపాశమును బ్రతిహతము గావించెను బుద్ధిమంతుఁడు. వీఁడు బాణములచే వానరులం గూల్పకముందే వీనింజంప యత్నింపుము.

అంతలో నాయతికాయుఁడు వానరులం బ్రవేశించి జ్యాఘోషము కలిగించుచు సింహనాద మొనరించెను. వానిం జూచి వానరవీరులు కొందఱు మూర్ఛనొందిరి. కుముద ద్వివిద మైంద నీలశరభులు వృక్షపర్వతశిఖరము లాయుధములుగా నెదిరించిరి. అస్త్రవేత్తలలో నుత్తముఁడగు నా యతికాయుఁడు

వారి నెదిరించి యుగ్రబాణముల నొప్పించెను. రక్తము కాఱు చుండఁగా వారా యతికాయు నేమియుఁ జేయఁజాలకపోయిరి. వానరసేనల నాతఁడు కలగుండుపడం జేసెను. తనను మార్కొ నని వాని నెవ్వని నొప్పింపక ధనుస్తూణీరములతో రాముని చెంతకుం జని సగర్వముగా ధనుర్బాణములం గొని రథికుఁ డనై యుద్ధమునకు సిద్ధముగ నున్నాఁడను. అల్పునితో నేఁ బోరను. యుద్ధమున కుత్సాహముగలవాఁ డెవ్వఁడో యతఁడు నాతోఁ బోరాడుఁ గాక. అని గర్వించి పల్కుచుండఁగా విని పరవీరహంతయగు లక్ష్మణుఁడు వాని కోర్వఁజాలక కోపించి ముందునకు వచ్చి నంతయైన లెక్కసేయక చాపముగ్రహించి బాణమును దీసి యతనిముందే ధనుస్సు నాకర్షించెను. దానిని విని యతికాయుఁడు మిగుల నచ్చెరువంది తనపైకి నడచిన యతనిం గాంచి కోపమునఁ దీవ్రనారాచమును గైకొని. లక్ష్మణా! నీవు చిన్నవాఁడవు. పరాక్రమకార్యములం దాఱితే ఱినవాఁడవు కావు. పొమ్ము. మృత్యువువంటి నాతో నేల పోరఁ గడంగెదవు? నా చేతులారవదలిన బాణములవేగమును భూమ్యంతరిక్షములు హిమవంతుఁడు కూడ సహింపఁజాలరు. సుఖముగానిద్రించు ప్రళయాగ్ని నేల ప్రజ్వరిల్ల నొనరింతువు? ధనుస్సు నందుంచి మరలిపొమ్ము.నన్నుఁదాఁకి యసువులు వదలఁ జనదు. లేక న న్నెదిరించి నిలిచి మరలిపోవ నిష్టపడకున్న నిలు వుము. ఇప్పుడే యసువుల వదలి యమలోకమున కరుగుదువు. నాయీ మేటిబాణములను జూడుము. ఈశ్వరుని త్రిశూలముం బోలి యివి యుండును ఇవి నీరక్తమును ద్రావఁగలవు. అని పలికి కోపమున బాణమును సంధించెను. రాజపుత్రుఁ డాయతి.

కాయుని గర్వోక్తుల నాలకించి కోపావేశమున మిగుల నన్వర్థము లగుపలుకుల నిట్లు బదులిచ్చెను.

దురాత్మా! మాటచేతనే ప్రసిద్ధుఁడవు కానేరవు. కార్యమునుబట్టియే శూరు లగుదురుగాని యాత్మప్రశంసచేఁ గారు. ధనుర్బాణములం దాల్చి నేను నిలిచియుండఁగా నీబలము గనఁబఱుపుము. కార్యము నిర్వహించి నీస్వరూపముం బ్రకటింపుము. ఊరకే పొగడుకొనుట యుక్తము కాదు. పౌరుషముగలవాఁడు శూరుఁ డగుంగాని తన్నుం దా వినుతించుకొనువాఁడు శూరుఁడు కాఁజాలఁడు. సర్వాయుధములు గల్గియున్నాఁడవు. రథికుఁడవయి ధనుస్సును బట్టియున్నాఁడవు. బాణములనొండె దివ్యాస్త్రములనొండె నీపరాక్రమముం గనంబఱుపుము పిదప వాయువు పరిపక్వతాళఫలమును బడఁద్రోయునట్లు నాబాణముల నీతలను భూమిం బడఁ గూల్చెదను. నా మేటినారసములు నీతనురక్తముం ద్రావఁగలవు. వీఁడు బాలుఁడని నన్ను సుంతయు హీనముగాఁ జూడవలదు. బాలుఁడనైన నేమి వృద్ధుడవయిన నేమి నీకు మృత్యుదేవతవంటివాఁడను. బాలుఁ డగువిష్ణువు త్రివిక్రమావతారమునఁ ద్రిజగముల మూఁడుపాదములఁ ద్రొక్కలేదా? అని సయుక్తికముగా మహార్థసమన్వితముగాఁ జెప్పిన లక్ష్మణునిమాటల నాలకించి యతికాయుఁడు తీవ్రాంబకముం గైకొనఁగా సభమును దేవతాదు లలంకరించి చూచుచుండిరి. ఆబాణము నాకర్ణాంతము లాగి లక్ష్మణునిపై విడిచెను. సౌమిత్రి యాసాయకము నర్ధచంద్రసాయకమున ఛేదించెను. దానికిం గోపించి రక్కసుఁ

డై దుబాణములు గ్రహించి సౌమిత్రి మేను గాఢనేయఁగా వానిని నడుమనే రామునితమ్ముఁడు ఖండించెను. వెంటనే వేఱొకబాణముం దొడిగి యతికాయునిపై వైచెను. అది వాని ఫాలభాగము నాటి రక్తసిక్త మయ్యెను. దానఁ బీడితుఁడై చలించెను. క్షణకాలమునఁ దెప్పిఱిల్లి యిఁకఁ జేయఁదగున దేదని యూహించి నీవు బాణమిట్లు ప్రయోగించుటం జేసి మెచ్చుకొనఁదగిన శత్రువ వైతివి. అని పలికి మోము వాంచి దిటవు తెచ్చుకొని చిత్రప్రచారముల రథము తిరుగ నొకటి, మూఁడు, అయిదు, ఏడు నని యిట్లు బాణములు తీసి వింట సంధించి జ్యావల్లి ధ్వనిచేయ లక్ష్మణునిపైఁ బ్రయోగించెను. అవి యాకసమును బ్రజ్వరిల్లఁ జేసెను. సౌమిత్రి యేమాత్రము తత్తఱపడక వాఁడి శరంబున ఖండించెను. అతికాయుఁడు తన బాణములు చెడుట యెఱింగి తీవ్రబాణము నొకదానిం దొడిగి వైచెను. అది రామానుజునివక్షమున నాటుకొనియె. అందుండి రక్తము గాఱెను. సమర్థుఁ డగుట నాలక్ష్మణుఁడు దానిని దటాలునఁబెఱికి తీవ్రనారాచమును గైకొని దివ్యాస్త్ర ముతోఁ గూర్చెను ఆగ్నేయమంత్రమున నభిమంత్రించెను. అది చాపమున సంధించునపుడే ప్రజ్వలించెను. అతికాయుఁ డును సౌరాస్త్రమంత్రము ననుసంధించి దానిచే సర్పసదృశంబను గాంచనపుంఖంబు నగుబాణము నభిమంత్రించెను. లక్ష్మణుఁ డాగ్నేయాస్త్రమును వానిపైఁ బ్రయోగించెను. దానిం గని యాసౌరాస్త్రమును రాక్షసరాజకుమారుఁడు వైచెను. అవి యొండొంటిం దాఁకి నేలఁబడినది. అంత నతికాయుఁడు క్రుద్ధుఁడై యైషీకాస్త్రముం బ్రయోగింప లక్ష్మణుఁ డైంద్రాస్త్ర

మున దాని నడంచెను. యామ్యాస్త్రము నభిమంత్రించి ప్రయోగింప సౌమిత్రి వాయవ్యాస్త్రమును వైచి దాని నడంచెను. అంత సౌమిత్రి కోపాటోపమున మేఘము వర్షించునట్లు బాణవృష్టి నతికాయునిపైఁ గురియించెను అవి వజ్రసారమగు నతనికవచమును స్పృశించి చివరభాగములు విఱుగ నేలఁబడియెను. మఱియు నట్టిబాణముల నతనిపైఁ గురియించెను. అభేద్యకవచమును ధరించియుండుట నతికాయుఁ డెంతమాత్రము వానిబాధ నొందఁడయ్యెను. లక్ష్మణునిపైఁ గ్రూరభుజంగాకారమగు బాణమును వైవ నది మర్మమును స్పృశించుటచే క్షణమాత్రము మూర్ఛనొందెను. అంతఁ దెలివొంది యమ్మహాబలుఁడు నాల్గుబాణములు వైచి గుఱ్ఱములను సారథిం జంపెను. మరల నారాచముల వైచి ధ్వజముఁ బడవైచి వానింజంప నొకబాణమును గుఱిపెట్టి వైచెను. కాని యాయతికాయు నేమాత్రము నొప్పింపఁజాలకుండెను.

అంతలో వాయుదేవుఁడు లక్ష్మణునికడకు వచ్చి వీఁడు బ్రహ్మవలన వరమొంది యభేద్యకవచమును బడసి దానిం దాల్చియున్నవాఁడు. కాన బ్రహ్మాస్త్రముచే వీనిని వధింపుము. వేఱొకశస్త్రవన వీనిం బొలియింపఁ దరంబుగాదు. ఇతరాస్త్రముల కీతఁ డవధ్యుఁడు. అని తెల్పెను. ఆవచనమును విని శీఘ్రమున బ్రహ్మాస్త్రమంత్రమును జపించి దాని వింట సంధించెను. దాని నభిమంత్రింపఁగనే చంద్రసూర్యాదిగ్రహములు భయము నొందెను. భక్తిపురస్సరముగా నాయస్త్రమును లక్ష్మణుఁ డతికాయునిపైఁ బ్రయోగించెను. అది యగ్నిమంటలు

గ్రక్కుచు రాఁగా నతికాయుఁడు చూచెను. అనేకశరముల దానిఁ గొట్టెను. కాని యాయస్త్రరాజ మవ్వానిని దూలించుచు నడరెను. దాని రాకకు సంశయింపక భయంపడక ద్విఫలపత్రాగ్రములగు శూలములచే దానిని గొట్టెను. అది వాని లెక్కింపక యరిగి కిరీటాలంకృతం బగు నాయతికాయునిశిరముం ద్రుంచెను. శిరస్సది నేలఁగూలెను. రాక్షసులందఱు వ్యధితులై కలఁగి పాఱిరి. అతికాయుఁడు పడఁగా వానరులందఱు సంతోషధ్వానముల దిక్కులఁ బగులించిరి. లక్ష్మణుఁడు సంతుష్టుఁడై వనచరవీరులం గూడి శ్రీరామచంద్రుని చెంత కరిగెను.

మహాశయులారా! ఈభాగమును విమర్శింతము.

"కోఽసౌ పర్వతసంకాశో ధనుష్మాన్ హరిలోచనః,
యుక్తే హయసహస్రేణ విశాలే స్యందనే స్థితః. ౧౨

... ... ... ...

క ఏష రక్షశ్శార్దూలో రణభూమిం విరాజయన్,
అభ్యేతి రథినాం శ్రేష్ఠో రథేనాదిత్యతేజసా. ౧౬

... ... ... ...

కాశః కాల మహావక్త్రో మేఘస్థ ఇవ భాస్కరః. ౨౨

... ... ... ...

కుండలాభ్యాం తు యస్యైతద్భాతి వక్త్రం శుభేక్షణం,
పునర్వస్వంతరగతం పూర్ణం బింబమివైందవం. ౨౪

ఆచక్ష్వ మే మహాబాహో త్వమేనం పురుషోత్తమం,
యం దృష్ట్వా వానరాస్సర్వే భయార్తా విద్రుతా దిశః." ౨౫

అని మూలము. అతికాయునిజూడఁగనే రాముఁడు విభీషణుని ప్రశ్నించినఘట్ట మిది. ఇంతకుముం దిట్లు రాముఁ డెవ్వని జూచి నపుడును ప్రశ్నించియుండ లేదు కదా. "మేఘస్థ ఇవ భాస్కరః. పురుషోత్తమః" అను నీ మొదలగుపదములు రామునినోటినుండి వెలువడినవే ఏల? అని ప్రశ్నింప వలనుపడును గదా. "రూపమే వాస్య మహిమానం వ్యాచష్టే" అని శ్రుతి గలదు. రూపమే యతనియోగ్యతను వెల్లడించునని సాధారణముగా నర్థ మగును తేజోవంత మగురూపము తద్వ్యక్తిమహత్త్వమును దెల్పును. అనఁగా నతనిమోమునఁగల దివ్యతేజస్సు కనఁబడఁ గనే యీతఁడు భగవంతు నారాధించినవాఁడని మహాత్ము లెఱుంగుదురు. అల్పు లాతనిం గని భయంపడుదురు. లేదా వితాకు నొందుదురు. ఆదివ్యతేజస్సు యోగిజనైకవేద్యము గాని సర్వజనసుబోధకము గాదు. శ్రీరాముఁ డేల కనఁబడెనని ప్రశ్నింప నవకాశము లేదు కదా. "మేఘస్థ ఇవ భాస్కరః." అనునది సాభిప్రాయవిశేషణము. సామాన్యుల కస్పష్టముగా నుండి యోగదృష్టిసంపన్నులగు మహాత్ములకు స్పష్టముగాఁ దోఁచు దివ్యతేజస్సుగలవాఁ డనునర్థమిచ్చు పదమిది. మేఘము లచాటున నున్నంతన సూర్యతేజస్సు తగ్గదు. చూచువారలకు యథాపూర్వముగాఁ గనంబడదని భావము. దాన నాభాస్క రునకు లోపము లేదు. రాక్షసశరీరమైనను దివ్యతేజ స్సమా వృతమని శ్రీరామచంద్రుఁడు తేటపఱిచెను. కనుకనే "పురుషో త్తమమ్"అని నుడివెను. ఇచ్చో సప్తమీతత్పురుషసమాసమే. సుందరాంగుఁడని యర్థము కాదు. తేజోవిరాజితుఁడనియే చెప్పక తప్పదు. "ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదా

హృతః" అను గీతావాక్యమునకు "ఉత్తమః ఉత్కృష్టతమః పురుషస్త్వన్యః అత్యంతవిలక్షణః ఆభ్యాం పరమాత్మేతి పరమ శ్చాసౌ దేహాద్యవిద్యాకృతాత్మభ్యః. ఆత్మా చ సర్వభూతానాం ప్రత్యక్చేతనః. ఇత్యతః పరమాత్మేత్యుదాహృతః." అని భాష్యము భగవత్పాదులవారు వ్రాసిరి. ఇచ్చో నీయర్థము తచ్ఛబ్దమునకుం జెప్పరాదు కదా. "కుండలాభ్యాం తు యస్యైవ తద్భాతి వక్త్రం శుభేక్షణమ్." అని శ్రీరాముఁడు వర్ణించెను. ఈసమయమున నీవర్ణన మసంగతమని క్షేమేంద్రుఁడు చెప్పక వదలునా? అతనికి ముక్తి నీయఁబూనెను. కానఁ బ్రసన్నుఁడై వర్ణించెనని మనము గ్రహింపక మానరాదు కదా. మఱియు "పునర్వస్వంతరగతం పూర్ణం బింబమివైందవమ్ "అనియు వినుతించెను. దీనితాత్పర్య మేమనఁగా నాతని కుండలములవలన నాతనిముఖము ప్రకాశింపలేదనియు, వానినిమించిన తేజస్సు ముఖమునఁ గలదనియు రామునాశయము. కావుననే పునర్వసు నక్షత్రముల నడుమనున్న పూర్ణచంద్రబింబమువలె నున్నదని పోల్చెను. పునర్వసునక్షత్రము ధనుస్సువలె దక్షిణోత్తరము లకు సాగియుండును. దక్షిణోత్తరములయం దుండునవియే యందున్నవానిలోఁ బెద్దవి. ఆ రెండింటినడుమ శారదరాకా శీతకరబింబము రాఁగా నెట్లుండును? అట్లే యిదియు ననికదా భావము. "రణభూమిం విరాజయన్" అనువాక్య మొండు కలదు. తన తేజోవిశేషమున సంగరాంగణమును బ్రకాశింపఁ జేయుచున్న వాఁడని కదా దీని యాశయము. ఆ తేజస్సితరు లకు గోచరింపదు. శ్రీరాముఁడే దాని నెఱుంగఁ జాలెను.

హనుమదాదుల కది గోచరింపదయ్యె. ఏల? యోగులకుఁ దప్ప నితరుల కది యగోచరము. భగవంతుఁడగు శ్రీరాముని కగ పడుట వింతకాదు. ఎవ్వానిం గాంచి యీవానరులు పరువెత్తు చున్నారో. అనఁగా నిట్టి దివ్యతేజోవంతుని గని వానరులు పాఱుచున్నారే. ఈతఁడు పురుషోత్తముఁడు పూర్ణచంద్ర నిభాననుఁడు మహోత్తమ తేజశ్శాలియు నగుంగదా యని రామభద్రుఁడు పల్కెను. ఇట్లు వర్ణింపనేల యనఁగా నింతకు ముందే విభీషణ శరణాగతివిషయమున సుగ్రీవునితో "పండితా హి భవిష్యంతి" అని పల్కెను. రాక్షసులయందును బండి తులు గలరు. అని. అతికాయుఁడు దుష్టుఁడు కాఁడు. బ్రహ్మ నుపాసించి యనుగ్రహపాత్రుఁడయ్యెను దానికి మెచ్చి బ్రహ్మ అభేద్యకవచము నొసంగెను. దివ్యరథము కూడ నిచ్చెను. దేవ దానవులచే మృతిలేకయుండ వరమిచ్చెను. రావణాదులకు నిట్టివరము లిచ్చియుండలేదు. అతికాయుఁడు రాక్షసస్వభా వము లేనివాఁడు. కనుకనే విధాతృ ననుగ్రహమునకుఁ బాత్రుఁ డయ్యెను. యుద్ధరంగమునఁ దన్ను మార్కొననికపుల నొక్కని నైనఁ గొట్టలేదని,

> "స రాక్షసేంద్రో హరిసైన్యమధ్యే
> నాయుధ్యమానం నిజఘాన కంచిత్."

అను రామాయణశ్లోకము తెల్పుచున్నది. అనఁగా రణధర్మము నతిక్రమింపని నీతిజ్ఞుఁడని యేర్పడుచున్నది. కావున నిన్ని యోగ్యత లాతనికడ నుండుటకుం గలకారణ మాతనికి దైవ బలమున లభించిన దివ్యతేజస్సే యని నిశ్చయింపకపోవుట

న్యాయ్యము కాదు. అట్టివాఁడు రక్కసులలో నొక్కఁడే నగ పడనికారణమున శ్రీరాముఁ డాతని నింతగా వర్ణించి సంతో షించి ప్రశ్నించెనని యేర్పడుచున్నది.

ఉపాసకుఁడు కానివాని శాస్త్రజ్ఞానము వ్యర్థమనుట కంటెఁ గుక్షిరక్షణదక్ష మనుట మంచిది. భగవదనుగ్రహ పాత్రుఁడు కావలెనన్న నేశాస్త్రము చదివినను గాఁజాలఁడు. మనస్సు తదంఘ్రుల నిలిపి యారాధించినంగాని యది కలు గదు. శాస్త్రము లాయారాధనపద్ధతిం దెలుప వలంతులు కావ చ్చును. తపోనియతి ముఖ్యము. అది మంత్రమూలము గాని శాస్త్రమూలము కాదు. మంత్రమును జపించుచు విషయాం తరశూన్యమనోవ్యాపారుఁడై తదంఘ్రుల ధ్యానింపవల యును. దాననే కాళిదాసాదులు పూర్వమహర్షులు తరించిరి. విఖ్యాతిం గాంచిరి. గురువులైరి. మహాత్ములునైరి అది గల్గిన వానినే భగవంతుఁ డాదరించును. ఆపదలం బాపి కాపా డును. ఉపన్యాసములఁజేయు వాగాడంబరము విఖ్యాతి మాత్రము కావచ్చును గాని భగవదనుగ్రహపాత్రుని జేయఁ జాలదనుట నమ్మకము. కావున భగవంతు నుపాసించి తదంఘ్రి యుగసంసేవనమునఁ దరింపవలయును. ఇట్లనుటంజేసి పాండి త్యము నిరర్థకమని కాదు. దానికిఫల ముపాసకుఁ డగుటయే యని. అది లేనినాఁ డది ఫలవంతము కాదని తెలుపుటకే యీ ప్రయత్నము. కావున సాధకబాధకముల నాలోచించి యేది యుత్కృష్టమని పాఠకమహాశయులు నిర్ణయించుకొందురు గాక.

## రావణుఁ డతికాయునిమృతికి శోకించుట.

* లక్ష్మణునిచే నతికాయుఁడు తెగినవార్త వినఁబడఁగా రావణుఁడు వికలమతియై నిర్భరశోకము తన్ను ముంపఁ దాను రణమునకుఁ బంపినవారిలో నొకఁడైన మిగులకుండ మృతి నొందుటయు,వారు మహాబలవంతులు దేవదానవులను గెల్చిన వారు నగుటయు నిందఱఁజంపుట నూనవమాత్రులకు శక్యము గానుండుటయు విశేషించి యొక్కరాముఁడే ఖరదూషణాదుల దుర్వారవిక్రమధుర్యుల ముహూర్తమాత్రమున వధించు టయు నూహించి మఱింత భయంపడెను. ఇంద్రజిత్తు నాగ పాశముల బంధింపఁగా వదలించుకొన నశక్యమైనను వాని బాధలం బొరయకుండఁ దప్పించుకొనినవిధము మఱింత పరి తాపమును గల్పింప నిశ్చేష్టుఁ డయ్యెను. ఇన్ని దుర్ఘటకార్య ములు తమ ప్రభావముచేతనో, మాయచేతనో చేయుట యెట్లో నాకుఁ దెలియరాకున్నది. లంకయందలి మేటిరక్కసు లను గపులు వధించిరే. రణమున నిత్తఱి రామలక్ష్మణ సుగ్రీవ విభీషణులను వానరబలమును జంపఁగలవాఁ డెవ్వఁడు నాకుఁ గనఁబడకున్నాఁడు. రాముఁ డెంత బలవంతుఁడు? ఆతని యస్త్ర బల మెట్టిది? వీరుఁడగు నారాముఁడు అనామయుండగు నారాయణుండే యని తలంచెదను. ఆతనిభయమువనే కదా లంకానగరము లోపలి వెలుపలిద్వారములన్నియు మూయఁ బడియున్నవి. అని రక్కసులం గలయం జూచి మీరెల్ల నేమఱుపాటులేక మిమ్ముం గాపాడుకొనుఁడు. ఈనగరమును

* ఇది డెబ్బదిరెండవసర్గమునఁ గల కథాభాగము.

జాగ్రత్తగా నలుఁగడల రక్షించుచుండుఁడు. సీతయుండు నశోకవనమందు నెవ్వానింగాని యేరీతినైన మాకుఁ దెలుపక లోపలికిఁ జొరవదలరాదు. సేనాసన్నివేశముల మెలఁకువ మీఱఁ గాపాడుచుండవలయును. సాయంకాలమునందుఁగాని యర్ధరాత్రమునందుఁగాని, ప్రాతఃకాలమునందుఁగాని యెప్పుడైన యావానరులు చేయఁదలఁచినకార్యములను జూచుచునే యుండవలయును. కపులని వారి నెప్పుడుగాని తక్కువఁగాఁ జూడఁబలదు పగవారిబలము యుద్ధమున కాయితమై యున్నదా, మనపైకి వచ్చుచున్నదా. ఊరక నిలిచియున్నదా? అని యేసమయమున నేవిధమునఁ గనుఁగొనవలయునో యట్లు తెలిసికొనుచుండవలయును. అని యాజ్ఞాపించెను. వారలా ప్రభువునానతిని శిరసావహించి యారీతిగా వర్తిల్ల సిద్ధముగ నుండిరి. ఇట్లు భృత్యవీరుల కాజ్ఞాపించి దుఃఖశల్యము తన్ను బాధింప దీనుఁడై యంతఃపురమునకుం బోయెను. పుత్రవ్యసనము తన్ను నగ్నివలె బాధింపఁగా దానినే స్మరించుకొనుచు నిట్టూర్పులు విడుచుచు నుండెను.

మహాశయులారా! ఈభాగమును విమర్శింతము. అతికాయాదిపుత్రులు సోదరులు ననింబడఁగా దుఃఖసముద్రమున మునింగియున్న రావణుఁ డేమి యూహింపవలసియుండునో యట్టు లూహించెనా లేక స్వస్థమనస్కుఁ డూహించునట్టు లూహించెనా యని మన మరయుదము.

> "అహోను బలవాన్ రామో మహదస్త్రబలం చ వై. ౧౦
> యస్య విక్రమమాసాద్య రాక్షసా నిధనం గతాః,
> తం మన్యే రాఘవం వీరం నారాయణమనామయం."

అని మూలము. దుఃఖసమయమునఁ గ్రోధముల్బణించుట పామరలక్షణము. తత్సమయమునఁ దత్త్వమును విమర్శింపఁబూనుటుత్తములలక్షణము. తనకొడుకులను దమ్ములం జంపినవానిఁ బొగడుట యేలొకో యని సందియమొందఁ బనిలేదు. శ్రీరామునిచే మృతిఁ గోరియే యింతయత్నము చేసెను. కానఁ దత్త్వమునరయ మొదలిడెను. శ్రీరామునిబల మెంతయని చెప్పవచ్చును. ఏల యీవితర్కము ? కుంభకర్ణునంతవానిం బొలియించెనే. దానిచే అస్త్రబల మెంత? నన్నుఁ బోఁడదోలెఁగదా. దానిచే. కాన రాఘవుని సాక్షాన్నారాయణమూర్తిగాఁ దలంతును. అనఁగా భావ మేమి? సనత్కుమారుఁడు మున్ను బోధార్థియై తా నరుగఁగాఁ దెల్పినవిషయము స్మరించెనని భావము. ఇట్టి రావణుఁడు కాముకుఁడని మూర్ఖుఁడని భాషించుటకంటె వెఱ్ఱితనము వే ఱేమున్నది ? ఇఁకఁ దరువాతికథకు మరలుదము.

### { ఇంద్రజిత్తు రామలక్ష్మణులను యూథపతులను మూర్ఛితులఁ జేయుట. }

* హతశేషులవలన దేవాంతకాదుల మరణవార్తల నాలకించి రావణుఁడు మిక్కిలి పొక్కుచుండఁగా నింద్రజిత్తు దీనుఁడై యుండు తండ్రిం గాంచి రాక్షసేంద్రా! యింద్రజిత్తు బ్రదికియుండునపుడు నీవిట్లు దుఃఖము నొందవలదు. రణమున నింద్రజిత్తు బాణములచేఁ గొట్టఁబడి యెవఁడుగాని ప్రాణముల

* ఇది డెబ్బదిమూఁడవ సర్గమునఁ గల కథాభాగము.

భరియింపఁ జాలఁడు ఇత్తఱి రామలక్ష్మణులు నానారాచముల విచ్ఛిన్నగాత్రులై తీవ్రశరపరంపరలు తనువుల నిండ నాటుకొనఁగాఁ బ్రాణముల వదలి నేలం బడియుండునట్లు లొనరించెదను. నీవు చూడఁగలవు. ఇంద్రజిత్తు చక్కఁగా నూహించి పౌరుషము దైవబలమునను నీరెండింటితోఁ గూడిన యీ ప్రతిజ్ఞను జేయుచున్నాఁడు. ఇపుడే రామలక్ష్మణులను, నమోఘబాణములఁ బూరించెద. ఇంద్ర యమ విష్ణు మిత్రసాధ్యాదులందఱు నా యమోఘపరాక్రమమును జూడఁగలరు. అని మహాబలశాలి యగుటఁ దండ్రితోఁ బలికి యింద్రజిత్తు రాజేంద్రుని సెలవంది వాయువేగవంతములగు గార్దభములంబూన్చినరథము నారోహించి యుద్ధరంగమునకు మేటివానరులు కూడ రాఁగాఁ బోయెను. వివిధవిధవాహనముల నారోహించి దనుజవీరులు లెక్కకుమించి వెనుకొనిరి. మహత్తరభేరికాహళనాదములు దిక్కులఁ బిక్కటిల్లఁ జేయుచుండఁగాఁ బోయెను.

అత్తఱి రావణుఁడు కుమారుం గని పుత్రా! నీకు నెదిరి లేఁడు. నీవెట్లును రాముని వధింపఁగలవు. అని యాశీర్వదించెను ఆదీవనలం గైకొని యుద్ధభూమిని జేరి దివ్యరథమును బడయుటకై హోమము చేయఁబూని చుట్టును మేటిరాక్షసులఁ గావలి యుంచి మంత్రపూతముగా వరుసతప్పక అగ్నిహోత్రమునందు హోమము గావించెను. ఆ రాక్షసరాజు గంధమాల్యములతోఁడ సంస్కరింపఁబడు హవిస్సును లాజలను వేల్చెను. ఆహోమమునందు తెల్లునకుఁ బ్రతినిధులుగా నాయు

ధములను అభిచారమునకుఁ బరిస్తరణములుగా నుంచఁదగు తెల్లు పత్త్రములుగాను, తాండ్ర చెట్టుపుల్లలు సమిధలుగను, గ్రహించి రక్తవస్త్రములను గట్టి యినుముతోఁ జేయఁబడిన నల్లనిస్రువమును గ్రహించెను. తోమరములతోను, తెల్లు రొుక్క యాకులతోను, అగ్ని పరిస్తరణము గావించి బ్రదికి యుండు నల్లనిమేఁకను బశువుగాఁ బట్టి హోమము చేసెను. ఒక్కమాఱు ప్రజ్వరిల్లఁజేయఁగనే యాయగ్ని దరికొని నిర్ధూమముగఁ బెద్దజ్వాలలతో రేఁగుట మొదలగు నాచిహ్నములు విజయసూచకము లైనవి. అగ్నిహోత్రుఁడు తానే పురుషరూపమునఁ బ్రదక్షిణముగాఁ జుట్టివచ్చు మంటలతోఁ గూడి హేమాంబరములు దాల్చి యా హవిస్సును గ్రహించెను. అత్తఱి నా యింద్రజిత్తు బ్రహ్మాస్త్రము నావాహ్వానించి మఱియు నందుఁ దనకు రథము ధనుస్సు లోనగుదానినెల్ల నభిమంత్రించెను. వేల్వఁబడుచుండు నాయగ్నినుండి బ్రహ్మాస్త్రము నావాహ్వానింపఁగనే సగ్రహనక్షత్రాంబరము కంపించెను. మహాతేజము గల యారావణి యట్లు హోమముచేసి ధనుర్బాణఖడ్గరథాశ్వసారథులం బడసి యాకసంబునఁ బా నంతర్హితత్వము నొందెను. రాక్షసులసేనయు సింహనాదముల బయలువెడలెను. వారు వానరులం బ్రహరింప సాగిరి. కుపితుఁడై యాయింద్రజిత్తు రక్షశ్శూరులం గని మీరు వానరుల వధించుపూన్కిఁ బోరాడుఁడు. అనఁగా వారు విజయమును గోరుచు వానరులపై బాణవర్షమును గురిపించిరి. నలుఁగడల రక్కసులు గ్రమ్మి యుండఁగా నింద్రజిత్తు వారినడుమ మీఁదుగానుండి తీవ్రశరముల గదాముసలాదుల వానరుల హింసించెను.

వృక్షాదిసాధనములం గొని రావణిం దాఁకిరి. వాఁడు క్రోధా వేశమున వారలనెల్ల శకలాకృతులుగాఁ జించి చెండాడెను. ఒక్కొక్కబాణమునకుఁ బెక్కండ్ర నాహుతిగా నొసంగెను. బాణములు పీడింప నావానరులు జయమునందుండు నాసక్తిని మాని నేలం బడిరి. వారిపాటు గాంచి మేటివానరులు కొంద ఱాగ్రహించి సూర్యునివలె మహాతేజమున వెలుంగుచుఁ జేరఁ దరముగాని యా రావణునికొడుకుపై కడగిరి. అతనిబాణ ములు సోఁకఁగ రక్తము ధారలుగాఁ గాఱఁగాఁ బలాయన పరాయణు లైరి. కాని మరలి పౌరుషమును దెచ్చుకొని శిలా వృక్షాదులం గైకొని యురవడించి పోరాడిరి. బాణముల నావానరుల యాయుధములగు వృక్షశిలాదుల నివారించెను. యుద్ధనిపుణుఁడు గాన నారావణి క్రూరసర్పతుల్యములగు విశి ఖములం బ్రయోగించి వానరవీరుల భేదించెను. పదునెనిమిది బాణముల గంధమాదను నొప్పించి దూరమందున్న నలుని తొమ్మిదిమార్గణముల నొప్పించెను. మైందప్రభృతులను జాంబవదాదులను వరలబ్ధతీవ్రబాణానలార్చుల బాధించెను. దాన వారు మూర్ఛ మునింగిరి. అత్తఱి నాయింద్రజిత్తు చెలరేఁగి ప్రళయాగ్నిం బోలి క్రుద్ధుఁడై ముఖ్యవానరుల నెందఱనో యనేక మార్గణాసారమున నొప్పించెను. ఆ మహాసంగ్రామమునందు సూర్యసంకాశము లైనబాణము లాకర్ణాంతముగా నాకర్షించి యతఁడు వైవఁగా నవి వాన రులశరీరములఁ గలంచి నొంచెను. రక్తసిక్తాంగులై మూర్ఛ మునింగిరి. కదలక మెదలక యావానరు లుండఁగాఁ గాంచి యింద్రజిత్తుబ్బుచు మరల ననేకశరఖడ్గాదులఁ గురియించి

మూర్ఛాయత్తులు కానివారల నొంచి యంతరిక్షగతుఁడై బాణాసారమున యుద్ధరంగమును ముంచఁగా వానరులు దీనధ్వను లొనరించుచు విశీర్ణగాత్రులై మేటిభూధరములం బోలి నేలఁ గూలిరి. కాని యింద్రజిత్తు నెచ్చటను గనఁ జాలక పోయిరి. పడియుఁ గొందఱు తలలెత్తి యాకాసమును జూచుచు నేత్రములయందును వాని తీక్ష్ణనారాచములు గ్రుచ్చుకొనఁగా నొకరిపై నొకరుగాఁ బడిపోయిరి. ఆయింద్రజిత్తు హనుమత్సుగ్రీవాంగద గంధమాదన జాంబవంతులను మఱియుంగల వానరయూథనాథులను బ్రహ్మాస్త్రాభిమంత్రితములగు ప్రాసశూలాదులచే నెంతయు నొప్పించెను. అంతట మానక రామలక్ష్మణులపై రవిరశ్మితుల్యము లగుబాణముల జడివానవలెఁ గురియించెను. శ్రీరాముఁడు మిగుల నాశ్చర్యకరమగు ధైర్యసంపత్సమన్వితుఁడై యింద్రజిత్తు బాణములఁ గురియించుచున్నను వానిని లెక్కింపక చుట్టునున్న సేనం గాంచుచు సౌమిత్రితో నిట్లు చెప్పెను.

వత్సా! మరల నీయింద్రజిత్తు బ్రహ్మాస్త్రమంత్రము నాశ్రయించి నొప్పించుచుఁ దత్ప్రభావమున భయంకర కపిబలముం గూల్చి మనల బాణముల నొంచుచున్నాఁడు. బ్రహ్మ యొసంగినవరముచేత నిత్తఱి నాకాశముననుండి తనశరీరము కనరాకయుండ మనల నొంచుచుండ వీని వధించుట యెట్లు సాధ్యము? బుద్ధిమంతా! ఇట్టి మహనీయాస్త్రమునకు దేవత గను, దీనియుత్పత్తికిఁ గారణముగనుండు భగవంతుఁడగు బ్రహ్మదేవునిమహిమ మచింత్యమని తలంచెదను. కావున నీవు

నన్నుంగూడి మనస్సునఁ గలఁతనొందక యీబాణపాతమున కోర్చియుండుము. బాణవర్షమున నీశూరుఁడు దిక్కులం గప్పుచున్నాఁడు. మేటిశూరులు పడిరి. తక్కినవారు దిగులుపడి యున్నారు. మనము యుద్ధముచేయ వలనుపడమిఁ దెలివితప్పి నేలం బడియుండుటం జూడఁగా వీఁడు జయలక్ష్మిని బడసి సంతోషమున లంకానగరమునకుఁ బోవఁగలఁడని తోఁచెడు. అంత నాయన్నదమ్ము లిరువురు నింద్రజిత్ప్రహితతీవ్రాశుగవ్రాతబాధితులై యట్లు పడియుండిరి. వారట్లు పడియుండుటం గాంచి యింద్రజిత్తు సింహనాద మొనర్చి యెల్లర జయించితి నన్నయుబ్బున లంకానగరమున కేఁగెను.

మహాశయులారా! ఈభాగమున విశేషములు గలవు. అరయుదము.

"తతస్తు హుతభోక్తారం హుతభుక్సదృశప్రభః,
జుహావ రాక్షసశ్రేష్ఠో మంత్రవద్విధివత్తదా. ౧౭
సహావిర్లాజసంస్కారై ర్మాల్యగంధపురస్కృతైః,
జుహువే పావకం తత్ర రాక్షసేంద్రః ప్రతాపవాన్. ౧౮
శస్త్రాణి శరపత్రాణి సమిధోఽథ విభీతకాః,
లోహితాని చ వాసాంసి స్రువం కార్ష్ణాయసం తదా. ౧౯
స తత్రాగ్నిం సమాస్తీర్య శరపత్రైస్సతోమరైః,
ఛాగస్య కృష్ణవర్ణస్య గళం జగ్రాహ జీవతః. ౨౦
సకృదేవ సమిద్ధస్య విధూమస్య మహార్చిషః,
బభూవుస్తాని లింగాని విజయం యాన్యదర్శయన్. ౨౧.
ప్రదక్షిణావర్తశిఖ స్తప్తకాంచనభూషణః,
హవి స్తత్ప్రతిజగ్రాహ పావకస్స్వయమాస్థితః. ౨౨.

సోఽస్త్రమాహారయామాస బ్రాహ్మమింద్రరిపుస్తదా,
ధనుశ్చాత్మరథం చైవ సర్వం తత్రాభ్యమంత్రయత్. ౨౩
తస్మిన్నాహూయమానేఽస్త్రే హూయమానే చ పావకే,
సార్థం గ్రహేందునక్షత్రైర్వితత్రాస నభస్థలః. ౨౪

స పావకం పావకదీప్తతేజా
హుత్వా మహేంద్రప్రతిమప్రభావః,
సచాపబాణాసిరథాశ్వసూతః
ఖేఽంతర్దధేఽత్మానమచింత్యరూపః." ౨౫

అని మూలము. దీనియర్థమును వ్రాయక యిందలివిషయ మెద్ది యని పాఠకమహాశయు లెఱింగినదే యైనను మరల జ్ఞప్తికిం దెచ్చుచున్నారము. ఇది యాకర్షణప్రయోగము. పరహింసాకరమగుట నభిచారహోమ మనంబడును. మారణోచ్చాటనాదిప్రయోగములం దీపే రీహోమమునకుఁ జెప్పంబడును. దేవత నాకర్షించుటచే నిది యాకర్షణ మనవచ్చును. ఉద్దేశము క్రూరమగుట మారణాదిక మనవలసియు నుండును.

"అభిచారః = మారణోచ్చాటనాదిఫలకతాంత్రికప్రయోగవిశేషః." అని సర్వలక్షణసంగ్రహము.

అభిచారః = అభిముఖ్యేన శత్రువధార్థం చారః కార్యకరణమ్. హింస్రాకర్మ ఇత్యమరః. అథర్వవేదోక్త మంత్రయంత్రాది నిష్పాదితమారణోచ్చాటనాదిహింసాత్మకకర్మ. ఇతి భరతః. మారణాదిఫలక తాంత్రికప్రయోగ విశేషః. స ద్వివిధః. మారణమ్, మోహనమ్, స్తంభనం, విద్వేషణం, ఉచ్చాటనం, వశీకరణం ఇతి తంత్రసారః. ఉపపాతకవిశేష ఇతి ప్రాయశ్చిత్త విశేషః. స తు శ్యేనాదియజ్ఞేనానపరాధస్య మారణమ్ ఇతి కుల్లూకభట్టః.

హింస్రౌషధీనాం స్త్ర్యాజీవోఽభిచారో మూలకర్మ చ మనుస్మృతిః. ఓం.
.........స్వాహా, ఇతి ఖడ్గమభిమంత్ర్య ఖడ్గమంత్రాంశ్చ పఠిత్వా ఖడ్గం
సంపూజ్య ఛాగాదికమముకోఽసి ఇతి వైరినామ్నాభిమంత్ర్య రక్తసూత్రేణ.
త్రిధా ముఖం బధ్వా వైరినామ్నా ప్రాణప్రతిష్ఠాం కృత్వా. ఓం......
ఇతి పఠిత్వా బలిశిరసి పుష్పం దత్వా బలిమంత్రం పఠిత్వా బలిం సంపూజ్య
అద్యాశ్వినే మాసి మహానవమ్యాం అముకగోత్రోఽముక దేవశర్మా అముక
శత్రునాశాయ ఇమం ఛాగం మహిషం వా అముక దైవతం భగవత్యై దుర్గా
యై తుభ్యమహం సంప్రదదే. ఇత్యుత్సృజ్య......ఇతి ఛిత్వా మూలం.
పఠిత్వా ఏతద్రుధిరం దుర్గాయై నమః. ఇతి రక్తం శిరశ్చ దత్వా అష్టాంగ
మాంసైర్హోమం మూలమంత్రేణ కుర్యాదితి తంత్రసారః.” ఇతి శబ్దకల్ప.
ద్రుమః.

దనిసార మిట్లు గ్రహింపందగు. సాధకుఁడు ఘోరకర్మమునకుం
బూని శ్మశానము తత్తుల్యము నగుస్థలమునఁ గూరుచుండి
మారణాదిఘోరకర్మముల కనువగుకుండము నేర్పఱచుకొని
సమాహితుఁడై కూరుచుండి ఆహోమమునకు విధింపఁబడు.
చంద్ర తాంద్రలోనగుసమిధలను బేలాలు ఆవాలు లోనగు.
వస్తువులను సేకరించి ఛాగమహిషాదిజంతువులలోఁ దదుచిత.
మగుదానిని గ్రహించి యగ్నిం బ్రణయించి తాంత్రికాగ్నిమఖ
మునఁ జెప్పఁబడినవిధా నమున నగ్ని నారాధించి యాయగ్ని
యందు నిష్టదేవత నావాహనము చేసి బలి జంతువును బూజించి
తాంత్రికసంస్కారముల సంస్కరించి యుద్దిష్టశత్రుగోత్రనామ
ముల నుచ్చరించి దేవతను ధ్యానించి యీ ప్రబలశత్రునాశార్థ.
మీసంస్కృతబలి నిచ్చుచున్నాఁడను. దీనిని గ్రహించి వానిం
జంపుమా యనుచు దానిని ఛేదించి యాం రక్తమాంసముల.

నివేదించి హోమము చేయవలయును. దీనికే పూర్ణాహుతి యని పేరు. తద్బలి జంతుమాంసములం దంత్రోక్తభాగములం డుండువాని నగ్నిలో వేల్వవలయును. ఇది హోమపద్ధతి. అంతకుముందే యాదేవత నుపాసించి యుండవలయును. ఆమంత్రము సిద్ధించియుండవలయును. ఆదేవత యాహోమమునం దృప్తినొంది యాశత్రువును జంపునని తంత్రములు చెప్పును. ఆహోమము కొనసాగకయున్నం గర్తకు మరణము తప్పదు. కాని హోమము సిద్ధించినను శత్రువు చావకయుండనచ్చును. అనంగా నతం డిట్టిదేవతనే యుపాసించియున్నను, దీనికంటె బలాధికురాలగు దేవత నుపాసించియున్నను, ఈరెండు లేక కేవల జ్ఞానధనుం డైనను వాని నీదేవత యేమియుం జేయం జాలదు గాని కర్తను మాత్ర మాహుతిగాం గైకొనక వదలదనుట మాత్రము సత్యము. ఇట్టిదానికే యాసురకృత్యమని పేరు.

ఈహోమమున సాధకుఁడు శత్రునాశార్థము కోరిన యుద్ధసాధనముల నాదేవత ప్రసాదించును. అగ్నిహోత్రుండొసంగఁడు. అగ్నిస్వరూపిణిగ భావింపఁబడిన యాదేవత యొసంగునని సారము. ఇది ఘోరకర్మము. ఇహాపరదుఃఖప్రదము. ఇది సాధారణప్రయోగమువలెం గాక ధనుర్వేదోక్తప్రకారము చేసి యస్త్రరథాదులను బడసి యుద్ధము చేసి గెలుపొందుట కుపయోగించును. సామాన్యప్రయోగములం దస్త్రముల నాహ్వానింపవలసినయవసరమే యుండదు. శత్రుగోత్రనామముల నుచ్చరించినం జాలును. ఇట్టి హోమములకే

యభిచారహోమములని పేరు. ఇట్టివి తంత్రములలో నేల చేర్పవలెనను ప్రశ్నము రావచ్చును. వినుఁడు.

రాజులకొఱకు నస్త్రవిద్య యేర్పడినది. శత్రువధము రాజులకుఁ బరమవిధి. ధర్మరక్షణధ్వంసకులే శత్రురాజులు. తన కపకారము చేయకయున్నను ధర్మధ్వంసనము చేయఁదలంచి నను వానిని వెదకి రాజు వధింపవలయునని స్మృతి హెచ్చరించు చున్నది. ఇతరుల కీమార్గ మాశ్రయణీయము కాదు. ఉపాస కులకు మారణాది షట్ప్రయోగములు గలవు కదా వాని వలని యుపయోగము లెవ్వియు లేవుకదా యనరాదు. వారి వారి యోగ్యత ననుసరించి యవి యుండును. మంత్రమహో దధి లోనగుతంత్రము లవ్వానింగూర్చి విశేషించి తెల్పును. అరిషడ్వర్గమునందు వీని నుపయోగింపవలయునని శాస్త్ర హృదయము.

ఇందు "హుత్వా మహేంద్రప్రతిమప్రభావః" అని యింద్రజిత్తునకు విశేషము చేర్పఁబడినది. దేవేంద్రు నోడించిన రావణపుత్త్రుని మహేంద్రసమానప్రభావము గలవాఁ డనుట బాగుండునా యని కొంద ఱాక్షేపించిరి.ఇట్టివి కవిసమయము లనంబడును. వానినే వాల్మీకిమహర్షియు ననుకరించెనని యూహింపం దగును.

"స్వయంభువా దత్తవరో మహాత్మా
ఖమాస్థితోఽంతర్హితభీమకాయః,
కథన్ను శక్యో యుధి నష్టదేహో
నిహంతుమద్యేంద్రజిదుద్యతాస్త్రః. ౭౫

మన్యే స్వయంభూర్భగవానచింత్యో
యస్యైతదస్త్రప్రభవశ్చ యోఽస్య,
బాణావపాతాంస్త్వమిహాద్య ధీమన్
మయా సహావ్యగ్రమనా సహస్వ." ౬౬

అని మూలము. అవయవార్థము ముందే వ్రాయఁబడినది. శ్రీరామునివాక్యము లివి. ఇంద్రజిత్తును రాముఁడు "మహాత్మా" యని వినుతించెను. ఏల? బ్రహ్మ నారాధించి తదనుగ్రహపాత్రుఁ డయ్యెను కనుక మహాత్ముఁడే యని యాశయము. కనఁబడనివానిని గొట్టరాదను ధర్మమును బా నాశ్రయించినవాఁడు గాన నెట్లు జయింపవచ్చునని ప్రశ్నించెను. అంతియ గాక బ్రహ్మదేవునిమాటను బాటింపవలయును గాన నా వలెనే వీనిబాధ నోర్చుకొని యుండుమని తమ్మునకు హితముపదేశించెను. దీనిభావ మేమి? తపశ్శక్తి దుర్నివారము. తపోమహిమమున లభించిన దివ్యాస్త్రములు కలవాఁడు రావణి. దానిప్రభావము నాపం దరము కాదు. అది ఫలింపవలసినదే. ఇదియు భగవదాజ్ఞయే కదా. త్రిమూర్తులలో నెవరు వరము లిచ్చినను వేఱొకరు దానిని త్రిప్పఁజాలరు. కర్మఫలములు వ్యర్థములు కాఁజాలవు. కావున వాని నడ్డరాదనుభావము రామునివాక్యములనుండి తేలెడిని.

"త్వయా యదభయం దత్తం తద్దత్తమఖిలం మయా,
మత్తో విభిన్నమాత్మానం ద్రష్టుమర్హసి శంకర. ౮౭
యోఽహం స త్వం జగచ్చేదం సదేవాసురమానుషం,
మత్తో నాన్యదశేషం యత్తత్త్వం జ్ఞాతుమిహార్హసి. ౮౮

అవిద్యామోహితాత్మానః పురుషా భిన్నదర్శినః,
వదంతి భేదం పశ్యంతి చావయోరంతరం హర." ౪౯

విష్ణుపురాణము. ౫ అం. 33 అధ్యా.

అని హరివంశము తెలుపుచున్నది. కావునఁ ద్రిమూర్తులు పరస్పరము వరముల గారవించువారలే యని యెఱుంగవలయును. ఇఁకఁ దరువాతికథను బఠింతము.

## హనుమంతుఁ డోషధిపర్వతము దెచ్చి యెల్లరబాధలు మాన్పుట.

* అత్తఱి రామలక్ష్మణులు పడియుండుటం గని వానరులు భీతిల్లి మూర్ఛిల్లిరి. సుగ్రీవుఁడు నీలాంగదజాంబవంతులేమి చేయఁదోఁపక యుండిరి. బుద్ధిమదగ్రగణ్యుండగు విభీషణుఁడు వానరులపాటు గాంచి మంచిమాటల నూఱడించుచు మీరు భయంపడకుఁడు. రామసౌమిత్రులు బాణపీడితులై పరవశులై దీనులై యున్నారని విచారింపఁ బనిలేదు. ఏల యనఁగా వారు బ్రహ్మవరమును గారవింప నింద్రజిత్తు బాణములఁ బీడింపఁబడినయట్లున్నవారుగాని వేఱు కాదు. కనుక విషాద మొంద నిది యదను కాదు. బ్రహ్మ యింద్రజిత్తున కీమహాస్త్రము నొసంగెను. రాఘవు లాయస్త్రమునందుఁ గలగౌరవము వేర్మి నేలం బడియున్నవారు. ఇందులకు వగవఁ దగుకారణ మేమి? అని యనెను. మతిమంతులలో మేటియగు హనుమంతుఁడు బ్రహ్మాస్త్రమును గౌరవింప క్షణకాలము బద్ధుఁడై యుండి యంతనాబాధ వదలిపోఁగా విభీషణునిం గని యిట్లనియె. బలవంతు

* ఇది డెబ్బదినాల్గవసర్గమునఁ గల కథాభాగము.

లగు నీకపులెల్ల హతులైరి. ఇంక నెవరెవరు సప్రాణులై యున్నా
వారో వారల నూఱడింతము. అని తెలిపెను ఆ రేయి వీరులగు
హనుమద్విభీషణులు కొఱవికట్టెలం బట్టుకొని రణరంగమునం
గపివర్యుల వెదకుచుం దిరుగసాగిరి. వాలములు హస్తములు
తొడలు లోనగు నవయవములు తెగంగఁగఁ గపులు రక్తసిక్తాం
గులై పర్వతములం బోలి యందుఁ బడియుండిరి. మహాఘోర
దర్శనముగానుండు నారణభూమిం దిరిగి తిరిగి చూచిరి. అందు
హతప్రాయులై పడియుండు సుగ్రీవాంగదాదులం గాంచిరి.
బ్రహ్మాస్త్రప్రభావమున నాలుగడియలలో నలువదేడుకోట్ల
వానరుల నింద్రజిత్తు వధించెను. వారిరువురు జాంబవంతుని
వెదకి వెదకి నైజముగా ముదుసలియై శతసంఖ్యలుగ బాణ
ములు మేన నాఁటియుండఁగాఁ జల్లారెడు నగ్నివలెనుండు
వీరుని జాంబవంతుని గాంచిరి. విభీషణుఁడు చెంతకుం జని
ఆర్యా! తీవ్రశరములు గ్రుచ్చుకొన్నందున నీప్రాణములు చెద
రకయున్నవి కదా యని ప్రశ్నించెను. ఆభల్లూకవల్లభుఁ డల్లన
విభీషణునిమాటల నాలకించి యెట్టకేలకు నెలుంగుదెచ్చుకొని
రాక్షసవర్యా! బాణములు నాఁటుటంజేసి కంటితో నిన్నుఁ
జూడఁజాలకున్నాను. కంఠధ్వనింబట్టి నిన్నెఱింగితిని. హను
మంతుఁడు ప్రాణములతో నున్నాఁడా? యని యడిగెను. జాం
బవంతుని యాప్రశ్నము నాలకించి విభీషణుఁడు రామలక్ష్మణు
లను గూడ వదలి హనుమంతు నడిగెద వేల? వాయునందను
నిపైఁ జూపినస్నేహము సుగ్రీవునియందు నంగదునియందును
రామునియందును జూపవైతివే. ఏల? అని యడిగెను. ఆమా
టల విని జాంబవంతుఁడు రాక్షసేశ్వరా! కారణము వినుము,

హనుమంతుఁ డొకఁడు మాత్రము బ్రదికియుండిన మిగిలినవా రెల్ల హతులైనను భయము కలుగదు. ఎల్లరు జీవించియున్న యట్లే. హనుమ యొక్కఁ డసువులంబాసిన మనమందఱము బ్రదికినను జచ్చినవారమే. వత్సా! వాయుతుల్యుఁడు హుతవహతుల్యవీర్యుఁడు నగు హనుమంతుఁడు ప్రాణములతోనున్న నంత మాకు బ్రదుకుపై నాశ గలుగును. అనియెను.

ఆమాటలు విని వాయుసూనుఁ డాజాంబవంతుని దగ్గఱకుఁ బోయి విధియుక్తముగాఁ జరణములను బట్టుకొని నమస్కరించెను. దేవా మహాశక్తిమై యున్నను హనుమంతుఁడను. నమస్కరించుచున్నాను. అను మాటలు విని తాను మరల జన్మించిన ట్లెంచి వానరసింహా! చెంతకు రమ్మని పిలిచి కౌఁగిలించుకొని, నీవిపుడు వానరుల నెల్ల రక్షింపవలయును. ఇక్కార్యమునందు నీకుంగలపరాక్రమ మితరుల కెవ్వారికిని లేదు. ఎల్లరకు మిత్రుఁడవు. కావున నీవే వీరిని గాపాడవలయును. పరాక్రమప్రదర్శనమున కిది తగినకాలము. వనచరులను రామలక్ష్మణులను విశల్యులఁ గావించి సుఖముం గూర్పుము. వాయుకుమారా! నీవు సాగరమునకు నించుకమీఁదుగా బహుదూరము పోయి పర్వతరాజమగు హిమవంతమును జేరవలయును. అందు మిక్కిలి పొడవై స్వర్ణమయమగు ఋషభపర్వతమును గైలాస శిఖరముం గూడఁ గాంచఁగలవు. ఆశిఖరముల రెండింటి నడుమ మహాదీప్తిమంతమై సర్వవిధౌషధీయుక్తమగు నోషధి పర్వతము గనంబడు. ఆపర్వతశిఖరమునం బుట్టి మహాతేజముల సకలదిక్కుల వెలిఁగించుచుండు. దివ్యౌషధులు నాలుగు గలవు. అవియె మృతసంజీవని, విశల్యకరణియు, సావర్ణ్యకరణియు,

సంధానకరణియు నను పేరుల నొప్పుచుండును. హనుమంతా! ఈయోషధుల నన్నింటిని గొని శీఘ్రముగ రావలయును. వచ్చి వానరులప్రాణములం గూర్చి యూఱట గలిగింపవలయును.

అని జాంబవంతుఁడు తెలుపఁగనే హనుమంతుఁడు సంతోషభరమున నుబ్బి సెలవంది పోయి త్రికూటాచలమునం గాలూది రెండవకొండయో యనఁ గనంబడుచు నందుండి లంకామలయపర్వతమునకు దాఁటి యందుండి యాకసమున కెగసి బాహువులు సాఁచి హిమాలయమును జూడఁ బోయెను. దారినడుమ ననేకారణ్యపర్వతగ్రామపట్టనములం గాంచుచుఁ బోయి పోయి హిమాలయమును జూచెను. అందలి విచిత్రశృంగముల నందుండు మహర్షులు లోనగువారిం గాంచుచు బ్రహ్మకోశము, కైలాసము, సిద్ధాశ్రమము, శివస్థానము, హయగ్రీవక్షేత్రము, వజ్రదానస్థానము, లోనగువానిం గాంచి ఋషభకైలాసములకు నడుమనుండు నోషధిపర్వతమును జూచెను. కాంచనపర్వతమును గాంచెను. సకలౌషధుల వెలుంగు నా యోషధిపర్వతమును గాంచి యగ్నికాంతులచే తవలె నోషధులచే వెలుంగు నాయోషధి పర్వతప్రభావమున కచ్చెరువంది దానినంతయుం జుట్టి యోషధులను వెదకెను. ఎంత శ్రమంపడి వెదకిన నవి గనఁబడక యుండెను. తమ్ముం గొనిపోవ నతఁడు వచ్చినాఁడని యెఱింగి యతనిదృష్టి కగోచరములై యుండెను. హనుమకుఁ గోప ముదయించెను. దాని నాపుకొనలేక పెడబొబ్బయిడి కన్నులెఱ్ఱఁబాఱఁగా నోపర్వతేంద్రా! శ్రీరామునియందును దయమాలి యున్నాఁడవే. ఇట్లే యుండ గట్టిగా నిశ్చయించుకొని యున్నాఁడవా యేమి?

అదియే సత్యమైన నాబాహుబలమున నిన్నుఁ జీకాకుపఱిచి నలుదెసలఁ బడఁగూల్చెదను. చూడుమనియెను. ఆతఁ డంతలో వేలకొలంది గైరికాదిధాతువులచేత నోషధులచేతను వెలుఁగొందు నాపర్వతశిఖరమును జూచెను. దానియందలి చిన్నశిఖరములు పగులునట్లుగా గట్టిగాఁ బట్టుకొని వేగము బలము కనంబడఁగాఁ బెల్లగించెను. దేవతలు భయంపడునట్టు లాపర్వతమును బెల్లగించి యంబరమున కెగిరి యతివేగమునఁ బరుగిడెను మహావేగమున నతఁడు రాఁగాఁ గాంచి వానరు లార్చిరి. హనుమయు వారింగని గర్జించెను. అంత వాయుతనయుఁడు కపులనడుమ వ్రాలి యచ్చటిపెద్దలకు శిరస్సువంచి నమస్కరించి విభీషణుం గౌఁగిలించుకొనియెను. శ్రీరామలక్ష్మణు లిరువురు నామహౌషధులగంధ మాఘ్రాణించి విశల్యులైరి. తక్కిన వానరులందఱు వానివాసన నాసికారంధ్రములం జొరఁబాఱినంతనే విశల్యులై లేచిరి. అంతకుఁ బూర్వమే నిహతులై పడియుండువానరులు కూడ వానిగంధము పయి వాయువశమున సోఁకఁగా సంజీవివలన వెంటనే లేచి విశల్యకరణివలన విశల్యులై, సంధానకరణివలన నొప్పులు మాయము కాఁగా సావర్ణ్యకరణివలన రాత్రి శయనించువారలు తెల్లవాఱఁగనే లేచున్నట్లు లేచి తిరుగ సాగిరి. అందు మృతరాక్షసదేహము లుండెను. చచ్చినవారిసంఖ్య తెలియకుండుటకై రావణునాజ్ఞవలన రాక్షసశవములు సాగరమున వేయఁబడుచుండెను. మరల నా యోషధిపర్వతమును యథాపూర్వస్థలమునఁ జేర్చి హనుమంతుఁడు వచ్చి వానరులం గలిసికొనియెను.

మహాశయులారా! ఈభాగ మతివిచిత్రముగ నుండును.

కాన దీనిని విమర్శించి విశేషములను గనుఁగొందము. ఇందు ఇంద్రజిత్తు హోమప్రభావ సంజనితాస్త్రవీర్యమున వానరుల నెల్లఁ బడఁగొట్టెను. రామలక్ష్మణులు బాణపీడితగాత్రులై నిశ్చేష్టులై పడిరి. హనుమద్విభీషణులు వెదకివెదకి తుదకు జాంబవంతుని గాంచిరి. ఇంద్రజిత్తు మూఁడుముహూర్తములలో ననఁగా నాలుగడియలలో నిందఱం ద్రుంచెనని చెప్పఁబడినది. ఇంతయు సాగునప్పటికి సగము రాత్రి గడిచియుండునని యూహింతము. తక్కినకాలము పదునైదుగడియలు మిగిలియుండునని నిశ్చయింతము. ఈకాలములో హనుమంతుఁడు హిమాలయమున కరిగి యందుఁ దిరిగి యోషధిపర్వతమును గని వానియం దెల్లతావుల నాయోషధుల వెదకి కానక యాగ్రహించి కొండశిఖరమునే పెఱికి తెచ్చి దానియోషధులమహాత్త్వమున నెల్లరు లేవఁగా మరల నాకొండను యథాపూర్వముగా నునిచివచ్చెనని యిందుఁగల కథాసారము.

౧. రెండుయామములలో నింతపని సాగుటకు శక్యమా ?

౨. ఓషధులవాసన ముక్కురంధ్రములం జొరఁగాఁ బోయినప్రాణము లఱువదియేడుకోట్లకపులకు వచ్చునా ?

3. ఇట్టి మహత్త్వ మోషధులకు నుండిన మరణమే లేకయుండ నెంతకాలమైన జీవింపవచ్చుఁ గదా !

అను నిట్టి ప్రశ్నపరంపరలు దొరలవచ్చును. కావున నీభాగము చక్కఁగా నెమకఁదగినదే.

> "సప్తషష్టిర్హతాః కోట్యో వానరాణాం తరస్వినాం,
> అహ్నః పంచమశేషేణ వల్లభేన స్వయంభువః." ౧౨

అని మూలము. పగటియం దైదవభాగమున ననఁగా లంకా

నగరము భూమధ్యమభాగస్థము గాన నాలుగడియలలో బ్రహ్మాస్త్రబలమున నలువదేడుకోట్లవానరులు మడిసిరి. అనఁగా సాయంకాలమున నాయుద్ధము సాగెనని తేలెడిని.

"శృణు నైరృతశార్దూల యస్మాత్పృచ్ఛామి మారుతిం. ౨౧
తస్మిన్ జీవతి వీరే తు హతమప్యహతం బలం,
హనుమత్యుజ్ఝితప్రాణే జీవంతోఽపి వయం హతాః. ౨౨
ధరతే మారుతిస్తాత మారుతప్రతిమో యది,
వైశ్వానరసమో వీర్యే జీవితాశా తతో భవేత్." ౨౩

అని మూలము. ఎవ్వాఁడు జీవించినఁ బెక్కండ్రు జీవింతురో వానికుశలమే యెల్లరు కోరఁదగినది. ఇతరుల కతనిమూలమున మేలు కలదు గదా. కావుననే యతనిక్షేమము నెల్లరు కోరుదురు. ఒరుల కుపకరింపనివానిజన్మము నిరర్థకమని దీని భావము. లోకమున నుపకారముచేయుటకే మానవజన్మము కల్గును. జన్మఫలము గాంచనివానిబ్రదుకు వ్యర్థముగాక మఱే మగును? భర్తృహరి నీతిసారమున శ్రీరామాయణమే నిదానమని మన మెఱుంగవలయు.

"కరే శ్లాఘ్యస్త్యాగః శిరసి గురుపాదప్రణయితా
ముఖే సత్యా వాణీ విజయి భుజయోర్వీర్యమతులం,
హృది స్వచ్ఛావృత్తిః శ్రుతిమధిగతైకవ్రతఫలం
వినాప్యైశ్వర్యేణ ప్రకృతిమహతాం మండనమిదం."

అను నీభావమును బరికింపుఁడు. ఒకయస్త్రము గలదని యంగీకరించినచో దానిమహత్త్వము కూడ నంగీకరింపవలసినదే. మంత్రప్రభావ మెఱింగినవారల కీ యాలుగడియలలోఁ గోట్లుగా దర్బుదములను వధింపవచ్చును.

"గత్వా పరమమధ్వాన ముపర్యుపరి సాగరం,
హిమవంతం నగశ్రేష్ఠం హనుమన్ గంతు మర్హసి. ౨౯
తతః కాంచన మత్యుచ్చ మృషభం పర్వతోత్తమం,
కైలాసశిఖరం చాపి ద్రక్ష్య స్యరినిషూదన. ౩౦
తయో శ్శిఖరయో ర్మధ్యే ప్రదీప్త మతులప్రభం,
సర్వౌషధియుతం వీర! ద్రక్ష్య స్యౌషధిపర్వతం. ౩౧
తస్య వానరశార్దూల! చత్వారో మూర్ధ్ని సంభవాః,
ద్రక్ష్య స్యోషధయో దీప్తా దీపయంత్యో దిశో దశ. ౩౨
మృతసంజీవనీం చైవ విశల్యకరణీ మపి,
సావర్ణ్యకరణీం చైవ సంధాన కరణీం తథా. ౩౩
తాస్సర్వా హనుమన్గృహ్య క్షిప్ర మాగంతు మర్హసి,
ఆశ్వాసయ హరీన్ ప్రాణై ర్యోజ్య గంధవహాత్మజ." ౩౪

అని మూలము. జాంబవంతుఁడు హనుమంతునకు సులువుగాఁ దెలిసికొనుటకు మార్గమును దెల్పెను. సాగరముమీఁదుగాఁ బోయి హిమాలయమును జూడుమని. సాగరమునకుఁ జాల దగ్గఱ నుండుననియో యీనడుమ దానినిమించినకొండలు లేవనియో యిట్లు తెల్పెనని సందియమొందఁ బనిలేదు. గరుడానిలవేగము గలవారలకీ నడుమనుండుభాగ మల్ప మనియే తోఁచును. ఒక్కక్షణమాత్రమునఁ బోవఁజాలినశక్తి యోగము నభ్యసించినఁ గలుగును. దివ్యదృష్టియుఁ గలుగు. అనఁగా నంధకారమునందుఁ దేజస్సునందువలె వారికి దృష్టి పాఱును. కావున నేది యెందుండునది గోచరించును. సంకల్ప కాలమున నీదిక్కుననుండు నిచ్చోటి కరుగవలయు ననునూహ గలిగినం జాలునని భావము. దీనికిఁ గాయసంయమనమని యోగ శాస్త్రమునఁ బేరు. ఒక్కొక్కచోట నాసంయమన మొనరించిన

నొకొక్కసిద్ధి గలుగుచుండును. ఈవలకే యీవిషయము వ్రాయఁబడినది. ఐనను సంగ్రహముగ నిందు వ్రాయుచున్నాను.

"సూ. కాయాకాశయోస్సంబంధసంయమా ల్లఘుతూల
సమాపత్తే శ్చాకాశగమనమ్. ౪౨." విభూతిపాదము.

"యత్ర కాయస్తత్రాకాశం తస్యావకాశదానాత్కాయస్య తేన సంబంధః ప్రాప్తిస్తత్ర కృతసంయమో జిత్వా తత్సంబంధం లఘుషువాతూలాదిషు వా పరమాణుభ్యః సమాపత్తిం లబ్ధ్వా జితసంబంధో లఘుర్భవతి. లఘుత్వాచ్చ జలే పాదాభ్యాం విహరతి. తతస్తూర్ణనాభితంతుమాత్రే విహృత్య రశ్మిషు విహరతి, తతో యథేష్టమాకాశగతిరస్య భవతీతి."వ్యాసభాష్యము.

పాంచభౌతికశరీరమును నిరాధారమగు నాకాశమును అయిన వీనిసంబంధమునందు (అనఁగాఁ దనశరీరము నాక్రమించుకొని యుండు నాకాశమునందని భావము.) చేయుసంయమమువలన శరీరము దూదివలెఁ దేలికయగును. అపుడు తన కెదియిష్టమో యాచోటికి ఆకాశమార్గమునఁ బోవచ్చునని తాత్పర్యము. సంయమ మనఁగా:

"సూ. త్రయమేకత్రసంయమః. ౪" విభూతిపాదము.

ధారణాధ్యానసమాధులను నీమూఁడు నొక్కవిషయమునందే కూడియుండుట సంయమ మనంబడును. అని పాతంజల యోగసూత్రములు తెల్పుచున్నవి. ముక్తికిఁ గాని యైహికఫలములకుఁ గాని యోగసాధనమే ఫలప్రదముగాని తక్కినవి కావని భావము. కనుకనే శ్రీ కృష్ణమూర్తి "తస్మాద్యోగీ భవార్జున" అని యాజ్ఞాపించెను. శ్రమముల పాలుగాక రిత్తమాటలచేఁ బరమపురుషార్థమును సాధింతుమనుట వెఱ్ఱితనమునఁ గాక మఱే మగును? ఈమార్గమున

ముహూర్తమాత్రమున నెంతదూరమునకైనఁ బోవచ్చును. కావున హిమాలయగమనము హనుమంతున కశక్యమనుట పొరపాటు. ఋషభకైలాసపర్వతములకు నడుమ నోషధిపర్వతము కలదనియు, దానిశిఖరమున నాలుగులతలు దిక్కులనన్నింటిని దమప్రకాశములచే వెలిఁగించుచున్నవనియుఁ జెప్పఁబడినది కదా. అట్టిలతలు కలవా? అనుప్రశ్నమునకు సమాధానము వినుఁడు.

"వనేచరాణాం వనితాసఖానాం దరీగృహోత్సంగనిషక్తభాసః,
భవంతి యత్రౌషధయో రజన్యా మతైలపూరాస్సురతప్రదీపాః." ౧౦
సర్గము. ౧.

అని కుమారసంభవమునఁ గాళిదాసు తెల్పెను. ఓషధులమహాత్త్వమసాధారణము, అగమ్యము. కొన్నితంత్రములయందు మయూరపారావతప్రముఖపక్షుల నోషధులమూలమునఁ గల్గింపవచ్చునని చెప్పఁబడినది. ఓషధులశక్తి యిల్లరకు నంతగాఁ దెలియకయున్న నొక్కింతగఁ దెలిసియే యున్నది ఒక్కమూలము నాఘ్రాణించిన మూర్ఛ పొడముచున్నది. ఒక్కమూలికను సేవించిన సర్పదష్టుఁడు నీరోగుఁ డగుచున్నాఁడు. ఒక్కమూలికను భక్షించినఁ బాషాణములు పిండి యగుచున్నవి. ఒక్కమూలికను ధరించిన నున్మత్తుఁడయి యెందో పరుగిడుచున్నాఁడు. ఇంతయేల? మూలికల సేవించిన వృద్ధులు వయోవంతులయిరని యిపుడే వినుచుఁ బత్రికలలోఁ జదువుచు నట్టిమాన్యులం గాంచఁ గల్గుచున్నాము. ముదుసలితనము పోఁగొట్టు శక్తి గల్గినపు డాయుస్సును బెంచునట్టిశక్తియు లక్షణావృత్తిచే నున్నట్లే కదా ఈవలకే యీతత్త్వభాగముల నీవిషయ

మును బెంచి వ్రాసియున్నాను. కాన మరల నిట దాని వెల్ల
డింపను వీనికే జ్యోతిర్లతలని పేరు. రాత్రులు విద్యుల్లతలభంగి
వెలుంగును. మనుష్యదర్శనమున దూరముగాఁ గనఁబడును.
అచ్చటికిఁ బోయిన మఱియు నంతదూరమునఁ గనఁబడును.
అవియే యిందుఁ బేర్కొనఁబడిన సంజీవని లోనగునవి యని
యెఱుంగవలయును. అవి మానవు లుండుతావుల నుండక
దుర్గమారణ్యములయం దుండును. దేవతలకు దీర్ఘాయుర్దా
యము కలదు గాన వారలకు వీనితోఁ బనియుండదు. కనుక
నివి మానవాగమ్యములని చెప్పఁబడినవని యెఱుంగునది. అట్టి
తావుల నవి యుండుటం జేసి యాపర్వతము తత్ప్రకాశముల
వెలింగెనని యెఱుంగవలయును. ఇట్టి తావులందుఁ గేవల
హేతువాదములు పనికిరావు. ఆస్తికత్వముగలిగి శాస్త్రములఁ
బరిశీలించి భగవదారాధనతత్పరత్వమున మెలఁగినఁగాని యిట్టి
దురూహావిషయములు స్పష్టములు కానేరవు. కావునఁ గుప్ర
శ్నములను వదలి హేతువాదములచేఁ గాలముం బుచ్చక
భగవదారాధనతత్పరులము గావలయు. కలియుగమున భక్తి
కంటె నిరపాయమైనమార్గము కానరాదు. అదియుఁ బరప్రతా
రణముకొఱకుగాఁ బూనరాదు. త్రికరణశుద్ధిగా నొకదైవమును
నమ్మి తదాకారమున నాపరాత్పరుని సర్వేశ్వరుని ధ్యానించుచు
బాహ్యపూజానిరతిఁ బామరోద్ధరణార్థమే పూని మానసిక
సమర్చనమున నాసర్వజ్ఞు నలరింపవలయును. అదియే మానవ
జన్మము గలిగినందులకు ఫలమని నమ్మవలయును. మనమీా
ప్రకరణాంతమున భగవంతుని శ్రీరామరూపవిలసితుని వినుతిం
తము.

